శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకి మహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# బాలకాండము

శ్రీ చెదలవాడ సుందరరామశాస్త్రులుగారి

పరమార్థచంద్రికావ్యాఖ్యానము తోడుగా

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన

బాలానందినీ వ్యాఖ్యతో కూడినది

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

1987

ప్రథమ ముద్రణ 1987
ప్రతులు 2000


ప్రతులకు :
శ్రీ ఎమిడిఘంటం శ్రీ రఘురామ్,
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1261, రోడ్ నం. 45
జుబిలీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు. 500 034.

మూల్యము రూ. 60/-
R.R. Rs. 80/-
A. V. Trust

ముద్రణ :
శివాజీ ప్రెస్
4-4-53, గంజ్ బజార్,
సికింద్రాబాదు-3.

SRI CHANDRAMOULEESWARAYA NAMAHA

Sri Sankara Bhagavatpadacharya Parampapagatha

His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi

# Jagadguru Sri Sankaracharya Swamigal

**Srimatham : : Samsthanam,**

Kancheepuram - 631 502

Camp : Gwaliar, (M. P.) Date : 13-11-86

శ్రీరామచరిత్రము ఎన్నిసారులు ఎవరు చెప్పినను వినినను చాలునని అనిపించదు. శ్రీమద్రామాయణములో ధర్మము, మాతృభక్తి, పితృభక్తి, ఆచార్యభక్తి, పతిభక్తి, సహోదరప్రేమ, ఆపత్కాలములలో సంరక్షణ యిటువంటి అనేక ధర్మసూక్ష్మములు చెప్పబడినవి. ఈ రామాయణము విదేశములలోను చదువబడుచున్నది. శ్రీమద్రామాయణము సాగరమునకు సమానమైనది. అట్టి శ్రీమద్వాల్మీకిరామాయణము బాలకాండము శ్రీ చెదలవాడ సుందరరామశాస్త్రిగారి పరమార్థచంద్రికావ్యాఖ్యానము తోడు పాటుతో శ్రీపుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన బాలానందినీవ్యాఖ్యతో తాత్పర్యముతో కూడియుండుట చూచి సంతోషపడుచున్నాము. ఈ గ్రంథము అందరును చదువుటచే సదుపయోగము కావలయునని ఆశీర్వదించుచున్నాము.

నారాయణస్మృతి

## ఆర్షవిజ్ఞాన ట్రస్టు

శ్రీరామసదనము

ప్లాట్ నం. 1861, రోడ్ నం. 45

జుబిలీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,

హైదరాబాదు-500 034.

# శ్రీమద్రామాయణమును గూర్చి

## ప్రముఖ పండితాభిప్రాయములు

౧

సీతారాముల పరిపూర్ణ పవిత్ర పాత్రలను ప్రదర్శించిన రామాయణమువంటి కావ్యము ప్రపంచమున నే యుగమునగాని, యే ప్రాంతమునగాని గల సారస్వతమున గలదా యని యెలుగెత్తి చాటనిమ్ము! నైతికప్రబోధము, భాషాభావ సారళ్యములు అహమహమికతో చిరునవ్వు లొలికించి, చిద్విలాసమును వెలార్చిన యిట్టి పవిత్ర కావ్యమును మరెచటను గాంచజాలము.

—ఆచార్య గ్రిఫిత్.

౨

రామాయణమువలె నానందమును చేకూర్చు కావ్యములు విస్తృత విశ్వ సాహిత్యమునం దరుదు. భాషాపవిత్రతను, హృదయస్పందనము నుజ్జ్వలింపజేయు కమనీయ కావ్యసన్నివేశములను, వీరవిక్రమ ప్రతిభా క్రమవర్ణనములను, పరస్పర వైరుధ్య ద్వంద్వప్రదర్శకము లగు స్వచ్ఛందావేశములను, నే కాలమునగాని, నే దేశమునగాని వెలువడిన సారస్వత ప్రపంచమున గాంచజాలము. కావ్యకళా శిల్పమున రామాయణము హోమరురచనముల దలదన్నుచున్నది. అగాధ మతభావ మూలములు రామాయణమునం దంతటను వ్యాప్తములై యున్నవి. ఇలియడ్, ఒడిసీలను రామాయణ మహాభారతములతో బోల్చుట అటికా, థీసలీనదులను సింధు గంగా నదులతో బోల్చుటయే.

—సర్ మోనియర్ విలియమ్స్.

౩

రామాయణము భారతీయుల సర్వసంపదగ విలసిల్లుచున్నది. ప్రపంచమున గల యే సారస్వతమునందునను యుగయుగములుగ, కవితను, భావమును మరి యే గ్రంథమును యిట్లు ప్రసరింపజేయలేదు.

—వింటర్ నిట్జ్.

౪

హోమరు రచించిన ఇలియడ్, రామాయణమునకు ప్రతిధ్వని మాత్రమే. రామాయణమున కది యొక దుర్బల స్మారకము. అద్దాని యనుకరణము విస్పష్టము. ఇయ్యది నిరాకరింప వీలులేనిది. అల్పవిషయములందునను అట్టి యనుకరణమును గాంతుము.

—యమ్. జల్లికోట్.

౫

రామాయణమునుండియే ఇలియడ్ రచింపబడినదని నా పరిపూర్ణ విశ్వాసము.

—హిపోలిట్ బౌష్

౬

ప్రపంచకావ్యములలో రామాయణము పవిత్రమైనది.

—స్క్లెజెల్.

౭

పందొమ్మిదవ శతాబ్ది ఆశ్చర్యకర విషయముల రెండింటి ననుభవమునకు దెచ్చెను. (1) క్రీస్తుమతమునకు సంబంధించిన పెక్కు విషయములు భారతదేశము నందే జననమొందినవి. గ్రీకు పురాణములు మౌళికములు, స్వతస్సిద్ధములుగావు, అనుకరణములు మాత్రమే. (2) ఒక సుందర స్త్రీ మానభంగము నెద పగను సాధించుటకై గ్రీకు దేవతలు, వీరులు దండయాత్రను సాగించిన గ్రీకుగాథ గంగాతీరవాసులైన సీతారాముల గాథ కనుకరణమే.

—ఎమిల్ బూమౌఫ్.

౮

క్రీ. పూ. 3000 సంవత్సరములనాటికే యున్నత నాగరికత కాలవాలములగు గొప్పరాజ్యములు గల వను సత్యమును నేను నిరాకరింపజాలను. ఆ కాలమునకుపైగనే రామాయణవీరుడగు రాముని కాలమును నే నన్వేషింతును.

—కెప్టెన్ ట్రాయ.

౯

మహాకవి దాంతే కవితకు ముగ్ధుల మగుదుము. హోమరుకవి విరచిత ఇలియడ్ పఠనమున పరితృప్తుల మగుదుము. పాశ్చాత్య సాహిత్యమునందు వా రసామాన్యులు. కాని కావ్యశిల్పమున వాల్మీకియే సర్వశ్రేష్ఠులు. రామాయణమును బోలిన మహా కావ్యము పృథ్విలో మరియొకటి లేదు.

-అరవిందయోగి.

౧౦

రామాయణ, భారతములు భారతదేశపు స్వత్వములు. కవి కావ్యమున గుప్తముగ నుండి, యీ రెండింటను భారతీయ పూర్ణసంస్కృతిని ప్రకటించెను.

8

రామాయణ సరళానుష్టుప్ గీతికలయందు భారతీయహృదయము యుగ యుగములుగ స్పందించు చున్నది. ఆ అఖండ సచ్చిదానందామృతమును ఆకాంక్షించి, అనుభవించిన మనపూర్వుల చిత్రపటమును రామాయణము సదా ప్రదర్శించుచున్నది. అందు వర్ణింపబడిన భ్రాతృత్వమును, సత్యానురాగమును, పతి భక్తిని, సేవ్య సేవకులయందలి భక్తి ప్రేమలయెడ మనకుగల సరళ పూజ్యభావమును, హృదయపూర్వకాదరణమును మనము సంరక్షించుకొనజాలినచో బాహ్యసముద్రము నుండి ప్రవహించు వినిర్మల మారుతము గవాక్షములనుండి మన గృహములందు వ్యాపించును.

—రవీంద్రనాథ ఠాకూర్.

3

ద్వంద్వములతో మిళితమైన భౌతిక ప్రపంచమునకు భిన్నమగు ఆనందానుభవావిష్కరణమును వాల్మీకి రామాయణమున కాంతుము. సుఖదుఃఖములతో కారాడు ఈ జగత్తుతోడి సంబంధమును సచ్చిదానందముతో బోల్చుకొనుటయే ప్రేమ, కరుణ. ఆ కరుణనుండియే రామాయణకావ్యము సముద్భవిల్లెను. విశ్వవిఖ్యాత రామాయణ జన్మగాథారహస్య మిదియే.

—కె. యస్. రామస్వామిశాస్త్రి.

# Opinions in English

The Ramayana like Gita interprets the universe as a battle field in which the ethical power wins its way through conflict with the unnatural nonethical. The epic poem contains precepts of the regulation of our conduct in all actions and conditions. It makes us alive to what we owe to our parents, to our friends, to mankind, to our country and what we are to do as children, as men, as citizens. It teaches us to love and practice virtues."

*Benjemin Khan*

This is the great, ancient epic of India. Rama and Sita are the ideals of the Indian nation.

Rama, the ancient idol of the heroic ages, the embodiment of truth, of morality, the ideal son, the ideal husband, the ideal father, and above all the ideal king, this Rama has been presented before us by the gerat sage Valmiki.

There is no other Pouranika story that has so permeated the whole nation, so entered its very life and has so tingled in every drop of blood of the race, as this ideal of Sita."

All children, especially girls worship Sita. The height of a girl's ambition is to be like Sita, the pure, the devoted, the all suffering."

In fact the Ramayana and Mahabharata are the two encyclopaedias of ancient Aryan life and wisdom, portraying an ideal civilization, which humanity as yet to aspire after.

*Swami Vivekananda*

"From the peasant in the field and the worker in the factory to the high-brow and the scholar, the story of Rama and Sita has been a living one. Among our great festivals which spread joy and comradeship amongst all our people, there is none which is so popular, more especially in northern India than the Celebration of the story of Rama and Sita. Valmiki wrote his immortal epic and in later days, Tulsidas, writing in homely language, made this story a part of the texture of the lives of our people. A story and a book which has had this powerful influence on millions of people, during some millenia of our changing history, must have peculiar virtue in it. I do not think any person can understand India or her people fully without possessing a knowledge of the two magnificient epics that are India's pride and treasure."

*Jawaharlal Nehru*

The Ramayana, I hold to be almost without a rival in the world's literature. Weather we judge by the grandeur of the theme, by the variety of the characters portrayed, by the tone of its idealism, or by the appeal that it makes to the devout heart, it ranks amongst the noblest monuments of poetic genius. Of the countless benefits -- one may call them blessings -- that the Ramayana can confer, the highest in the training of the emotions and of the spirit of the lessons it teaches, the highest seems to me to be the exaltation of DHARMA. On its alteer everything must be satisfied, reverently and cheerfully.

The author who conceived and delienated the character of Rama in such convincing detail as we have in the Ramayana is a supreme genius. Poet, prophet or seer has seldom presented to the mind of man so noble an apothesis of duty.

*Rt. Hon. V. S. Srinivasa Sastri*

Probably no work of world literature, secular in its origin has ever produced so profound an influence on the life and the thought of the people as the Ramayana"

*Macdonell.*

To me ...... Rama, described as the Lord of Sita, son of Dasharatha is the all-powerful essence whose name, inscribed in the heart, removes all suffering - mental, moral and physical.

*Mahathma Gandhi*

The Ramayana is not history or biography, it is a part of Hindu mythology. We cannot understand Greek life and Greek civilization without knowing all about Jews, Apollo, Hercules, Venus, Hector, Priam, Achilles, Ulysses and others. So also one cannot understand Hindu Dharma, unless one knows Rama and Sita, Bharata, Laxmana, Ravana, Kumbhakarna and Hanuman.

*C. Rajagopalachari*

Sri Rama is the pillar of Dharma for all time. It is his example and his inspiration that have been built into the edifice of our ancient culture. Dharma understood in terms of the twin concepts Satya and Tyaga so perfectly personified in one extolled as "Vigrahavan Dharmah", is the one unique constituent of the pattern of life handed down to us by our ancients which is valid for all time and for all peoples.

At the present day when amoral forces are making havoc of our lives, destorting our views and disrupting our foundations, we cannot do better than herken to the voice of Sri Rama, uttered through his several actions signifying the eternal ideals of our SANATANA DHARMA.

*K. M. Munshi*

Side by side with Maha Bharatha, Ramayana stands as the inspiror and the stimulus of the thoughts and the aspirations of India.

*Dr. C. P. Ramaswami Aiyer*

# ముందు మాట

ఆర్షసంస్కృతికి మూలకందమైన గ్రంథరాశిని టీకాతాత్పర్య విశేషసహితంగా ప్రకటించాలనే ప్రధానోద్దేశంతో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు, గౌరవ నీయులైన శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారి అధ్యక్షతను ఆర్ష విజ్ఞాన ట్రస్టు అనే పేరుతో ఒక ధర్మసంస్థ నెలకొల్పబడింది.

బ్రహ్మశ్రీ చెదలవాడ సుందరరామశాస్త్రిగారి 'పరమార్థచంద్రికా' వ్యాఖ్యానం తోడుపాటుతో విద్వల్లోకానికి సుపరిచితమైన శ్రీమద్వాల్మీకి రామాయణాన్ని ఆబాల గోపాలానికి అందుబాటులో ఉండే భాషలో ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులు శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు సంతరించిన బాలానందినీ వ్యాఖ్యా సహితంగా ఈ సంస్థ తొలిప్రచురణగా వెలువరించాలని కూడా నిర్ణయమైనది.

మా సంకల్పాన్ని విన్నవించడమే తడవుగా పరదేవతాస్వరూపులు, కంచి కామకోటి పరమాచార్యులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి యతీంద్రులు తమ ఆశీస్సులు అనుగ్రహించి మా ప్రయత్నాన్ని ప్రోత్సహించారు. శ్రీవారి ఆశీఃఫలితమే ఆంధ్రమహాజనుల కరకమలాలకు ఆనందోత్సాహాలతో నేడు మేము అందజేస్తున్న ఈ వాల్మీకి రామాయణ బాలకాండము.

మా సంస్థలో సభ్యులుగా నున్న ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు మొదటి నుండియు ఈ సంస్థకు సర్వవిధములుగా తోడ్పడిరి. వారు దివంగతులగుట ఈ సంస్థకు తీరని లోటుగా భావిస్తున్నాము.

ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును ఈ సంస్థలో సభ్యులే. ఈ గ్రంథ మింత సుందరముగా వెలువడుటకు వారి పర్య వేక్షణమే కారణము.

రామాయణం ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే సర్వోత్తమ జాతీయకావ్యం. దేశకాలాలకూ, కులమతాలకూ అతీతంగా మానవులకు ఉత్తమ జీవనాన్ని ప్రదర్శించే ఆదర్శ గ్రంథం. ఈనాడు కులమత విచక్షణ లేకుండా భారత దేశంలోనే కాదు విదేశాలలో కూడా రామాయణం ఆసక్తితో పఠింపబడుతున్నది. ఆస్తికులనేకుల కిది నిత్య పారాయణగ్రంథంగా విలసిల్లుతున్నది.

ప్రపంచ విఖ్యాత మేధావులు ఈ గ్రంథాన్ని గూర్చి వెలువరించిన అభిప్రాయాలు తెలిసికొనుట మన కర్తవ్యం. అందులో కొన్ని ఆంధ్రీకృత అభిప్రాయాలు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు వారి రామాయణ సుధాలహరిలో సేకరించినవే వారి సౌజన్యంతో మే మిందులో పొందుపరచాము.

ఈ గ్రంథముద్రణను గూర్చి తెలియగానే కొందరు అజ్ఞాతంగానే ఉంటూ, తమ పేర్లు వెల్లడిచేయకుండా మా సంస్థ ఎకౌంటులో డబ్బు జమచేసి పుణ్యం కట్టుకొన్నారు. వారికి మా సంస్థపక్షాన ధన్యవాదాలు తెలుపుకొనటం మా కర్తవ్యంగా భావిస్తున్నాము.

అచిరకాలంలోనే క్రమంగా తక్కిన రామాయణసంపుటాలు వెలువడగలవని మనవి చేస్తున్నాము. ఈ రామాయణాన్ని చదివినవా రందరికీ నైతిక విలువలు పెంపొందగలవనీ, ఆ అధ్యయనం వల్ల ఆర్షవిజ్ఞానవైభవం కొఱతపడకుండా తరతరాలుగా ఆచంద్రార్కం సముద్ధరించబడగలదనీ ఆశిస్తున్నాము.

నీలంరాజు వెంకట శేషయ్య

శ్రీ

# బాలకాండాంతర్గత విషయసూచిక

శ్రీః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః
బాలానన్దినీ సహితముగు

# శ్రీమద్రామాయణము : బాలకాండము

## ప్రథమ సర్గము

అవతరణిక :- చతుర్ముఖాంశసంభూతుడును, సర్వజ్ఞుడును, అయిన వాల్మీకి మహాముని—"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" (మహాపురుషులు ఏది ఆచరింతురో ఇతరజనులు కూడ దానినే ఆచరింతురు. వారు దేనిని ప్రమాణముగ గ్రహింతురో దానినే లోకు లందరును ప్రమాణముగ గ్రహింతురు.) అను న్యాయమును అనుసరించి, లోకు లందరును గురువు నాశ్రయించి తాపత్రయవిముక్తి పొందెదరు గాక అను అభిప్రాయముతో, తాను పరమజ్ఞానియే యైనను నారదుని ఆశ్రయించి, తాపత్రయమును తొలగించునదియు, అత్యుత్తమలక్ష్యమును అగు బ్రహ్మస్వరూపమును తెలిసికొనెను. ఆ పరమరహస్యమును అందరికిని తెలియునట్లు రామాయణ రూపమున ప్రచురింపదలచి అది నిర్విఘ్నముగ పరిసమాప్తి నొందుటకై మొదట మంగళాచరణము చేయుచున్నాడు. గురువు ఉపదేశించిన విషయమును స్మరించుచు గురుస్మరణము కూడ చేయుటయే ఇచట మంగళము.

మూ. తపఃస్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుఙ్గవమ్. 1

ప్ర. అ. తపస్వీ=తపస్సుగల, వాల్మీకిః=వాల్మీకిమహర్షి, తపః స్వాధ్యాయ నిరతమ్ = తపస్సునందును వేదాధ్యయనమునందును ఆసక్తి కలవాడును, వాగ్విదాం=వాక్కు తెలిసినవారిలో, వరమ్=శ్రేష్ఠుడును, ముని పుఙ్గవమ్=మునులలో గొప్పవాడును అగు, నారదమ్=నారదుని, పరిపప్రచ్ఛ=ప్రశ్నించెను.

తాత్పర్యము :— తపఃశాలియగు వాల్మీకి, తపస్సును, వేదాధ్యయనమును చేయుటయందు ఆసక్తికలవాడును, వాక్కులు తెలిసినవారిలో శ్రేష్ఠుడును, మునులలో గొప్పవాడును అగు నారదుని ప్రశ్నించెను.

విశేషార్థములు :— తపస్వీ — కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములను ఆచరించుచు నిత్యనైమిత్తికకర్మలను అనుష్ఠించుటయే తపస్సు. అట్టి తపస్సు కలవాడు తపస్వి.

'తపస్' అను పదమునకు 'విన్' అను మత్వర్థీయ (కలవాడు అను అర్థమును బోధించు) ప్రత్యయమును చేర్చగా 'తపస్వి' అని అయినది. ఇక్కడ 'విన్' ప్రత్యయమునకు ప్రాశస్త్యము అర్థము. తపస్సు జ్ఞానసాధనమని వేదము చెప్పుచున్నది. అట్టి తపస్సే సాధనచతుష్టయసంపత్తి. అది కలవాడే వేదాంతశాస్త్రము చదువుటకు అధికారి. అందుచే - తపస్వీ=అట్టి తపస్సుకలవారిలో ఉత్తముడని అర్థము.

తపఃస్వాధ్యాయనిరతమ్ :— 'తపః' అను పదము "తప ఆలోచనే" అను ధాతువునుండి నిష్పన్నమయినది. జ్ఞానము అని అర్థము. "స్వాధ్యాయః" అనగా వేదము. ఈ తపఃస్వాధ్యాయములందు మిక్కిలి ఆసక్తి కలవాడు. లేదా 'తపః' అనగా బ్రహ్మను ప్రతిపాదించునది. బ్రహ్మప్రతిపాదకములగు వేదములందు అనగా వేదాంతములందు ఆసక్తికలవాడు. లేదా 'తపః' అనగా కృచ్ఛ్రచాంద్రాయణాదులను ఆచరించుచు నిత్యనైమిత్తికకర్మలను అనుష్ఠించుట. 'స్వాధ్యాయః' అనగా అర్థజ్ఞానము కలుగువరకును వేదాధ్యయనము చేయుట. అట్టి తపః స్వాధ్యాయములందు ఆసక్తి కలవాడని అర్థము.

వాగ్విదామ్ :— వాక్ అనగా బ్రహ్మము. "బ్రహ్మను తెలిసికొనినవారిలో" లేదా, వాక్ అనగా శబ్దముల సాధుత్వమును బోధించు వ్యాకరణము. ఇది మిగిలిన ఐదు వేదాంగములకు ఉపలక్షణము. (ఉపలక్షణ మనగా చెప్పవలసిన వానిలో ఒక అంశమును మాత్రము చెప్పుట. దానిని బట్టి మిగిలిన వాటిని కూడ గ్రహించుకొనవలసి ఉండును). అందుచే 'వాగ్విదామ్' అనగా "శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనెడి వేదాంగములారును తెలిసినవారిలో" అని అర్థము. లేదా 'వాక్' అనగా పద్దెనిమిది విద్యలు- (ఋగ్యజుస్సామాథర్వవేదములు, శిక్షాదులైన ఆరు వేదాంగములు, మీమాంస,

న్యాయవిస్తరము, ధర్మశాస్త్రము, పురాణము, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అనునవి.) ఆ పద్దెనిమిది విద్యలు తెలిసినవారిలో.

మునిపుఙ్గవమ్ :— 'ముని' అనగా మననము చేయువాడు. అనగా బ్రహ్మాను సంధానము చేయువాడు. "మునులలో గొప్పవాడు."

వాల్మీకిః :— వల్మీకమునుండి, అనగా పుట్టనుండి, పుట్టినవాడు. "అథా బ్రవీన్మహాతేజా బ్రహ్మా లోకపితామహః, వల్మీకప్రభవో యస్మాత్ తస్మాద్వాల్మీకి రిత్యసౌ" ("ఈ ఋషుడు వల్మీకమునుండి పుట్టినాడు గాన వాల్మీకి" అని మహా తేజఃశాలియు, లోకము లన్నింటికి పితామహుడును అగు బ్రహ్మ చెప్పెను) అని బ్రహ్మకైవర్తమునందు వాల్మీకిశబ్దార్థము చెప్పబడి యున్నది. "ఋక్షోఽభూ ద్భార్గవ స్తస్మా ద్వాల్మీకి ర్యోఽభిధీయతే" (అతని వలన, అనగా ప్రచేతసుని వలన, వాల్మీకి అని ప్రసిద్ధుడైన భార్గవుడగు ఋక్షుడు పుట్టెను) అను విష్ణు పురాణవచనము వాల్మీకికే ఋక్షుడని మరియొక పేరు ఉన్నదనియు అతడు భృగువంశమునకు చెందిన ప్రచేతసుని కుమారుడనియు తెలుపుచున్నది. "చక్రే ప్రచేతసః పుత్రః" అను వచనము ఈ విషయమును బలపరచుచున్నది. దీని వలన వాల్మీకి భృగువంశమునకు చెందిన ప్రచేతసుని కుమారుడనియు, ఇతని అసలు పేరు ఋక్షుడనియు, శిలవలె కదలక మెదలక తపస్సు చేయుచుండగా అతని చుట్టు వల్మీకము (పుట్ట) మొలవగా దాని మధ్య కూర్చుండి తపస్సు చేయుటచే 'వాల్మీకి' అను పౌరుషనామముతో ప్రసిద్ధుడయ్యెననియు తెలియు చున్నది. 'ఋక్షుడు' మొదలగు పేర్లున్నను 'వాల్మీకి' అను పౌరుషనామధేయ ముతో నిర్దేశించుటచే ఈతనికి శమాదులును, మహాతపస్సును ఉన్నవని సూచింప బడుచున్నది. "తపస్వీ వాల్మీకిః" అను పదములచే ఈతనియందు వేదాంత శాస్త్రమునకు అధికారియగు వాని కుండవలసిన లక్షణము లున్నట్లు కూడ సూచింపబడినది.

"తపఃస్వాధ్యాయనిరతం వాగ్విదాం వరం, మునిపుఙ్గవం నారదం" అనునవి నారదునిలో గురువున కుండవలసిన లక్షణము లున్నట్లు సూచించుచున్నవి. "సాధనచతుష్టయ సంపన్నుడు బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకు, సమిధలను చేత గ్రహించి, శ్రోత్రియుడును, బ్రహ్మనిష్ఠుడును అయిన గురువువద్దకు వెళ్ళ వలెను" అని శ్రుతి చెప్పుచున్నది. గురువు అనగా శ్రోత్రియత్వము, బ్రహ్మనిష్ఠ

వి. 'ను' అను అవ్యయమును ప్రశ్నించుటయందును, 'ఇట్లా' 'అట్లా' అను వికల్పార్థమునందును ప్రయోగింతురు. "నుః పృచ్ఛాయాం వికల్పే చ" అని అమరము.

'చ' అను అవ్యయము (సముచ్చితార్థమును) చెప్పబడిన మరియొక అంశ మును కూడ చేర్చుట అను అర్థమును బోధించును. అనగా దీనికి 'మరియు' అని అర్థము. "గుణవంతుడును, వీర్యవంతుడును ఎవ్వడు" అని సముచ్చితార్థ మును బోధించును. ధర్మజ్ఞశ్చ—ధర్మ మనగా అలౌకికమగు, అనగా ఈలోక మునకు సంబంధించని, లేదా లౌకికప్రమాణములచే తెలియని, శ్రేయస్సాధనము. ఇక్కడ ఉన్న 'చ' కారముచే అనుక్తమగు అధర్మమును కూడ గ్రహింప వలెను. అనగా ధర్మమును అధర్మమును కూడ తెలిసికొనినవాడు అని అర్థము. 'కః' అనుదానిని ఒక్కమారు ప్రయోగించిననే చాలినను ఆదరాతిశయమును సూచించుటకై ఇది అనేక పర్యాయములు ప్రయోగింపబడినది. ఇది లేనిచోట్ల దీనిని అధ్యాహారము చేయవలెను. అనగా తెచ్చిపెట్టుకొని అర్థము చెప్పవలెను. సత్యవాక్యు డనగా అతి కష్టసమయములలో కూడ సత్యమునే పలుకువాడని అర్థము.

వైకుంఠాది లోకాంతరములలో ఇట్టి గుణములుగల నారాయణాదు లుండుట ప్రసిద్ధమే కావున ఆ లోకములను గూర్చి ప్రశ్నింపవలసిన పనిలేదు. అందుచే ఈ భూలోకమందు అని చెప్పబడినది. ఈ భూలోకములో కూడ కాలాం తరములందు నరసింహాద్యవతారము లున్నట్లు ప్రసిద్ధము గాన వాటిని కూర్చి ప్రశ్నింప పనిలేదు. అందుచే 'ఇప్పుడు' అని చెప్పబడినది. చకారములు ప్రయోగించుటవలన గుణవత్త్వము మొదలగు విశేషణములన్నియు కలిసి ఒకని యందే ఉండవలెనన్నట్లు సూచింపబడుచున్నది. అట్టి అనేక గుణ (విశేషణ) సముచ్చయమును బోధించుటకు ఒక్క చకారమే చాలును. అయినను అనేక చకారముల ప్రయోగము ఆదరాతిశయమును సూచించుచున్నది.

'గుణవాన్' ఇత్యాదిలక్షణములు వేదోక్తమహాపురుషలక్షణములను చెప్పు చున్నవి.

మూ. చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః,
విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః. 4

ప్ర. అ. కః=ఎవడు, చారిత్రేణ = మంచినడవడికతో, యుక్తః=కూడిన వాడు? కః=ఎవడు, సర్వభూతేషు=సమస్తప్రాణుల విషయమున, హితః=హిత మును చేయువాడు ? కః=ఎవడు, విద్వాన్=తెలిసికొనదగిన వాటినన్నింటిని తెలిసికొనినవాడు? కః=ఎవడు, సమర్థశ్చ=ఇతరులకు నిర్వహింపరాని కార్యము లనుకూడ నిర్వహించుటకు సమర్థుడు? కః=ఎవ్వడు, ఏకప్రియదర్శనః=ఒకే విధమున సంతోషజనకుడుగా కనబడువాడు ?

తా. మంచి నడవడి కలవాడును, సర్వప్రాణులకు హితము నాచరించు వాడును, విద్వాంసుడును, అసాధ్యములైన కార్యములను కూడ సాధించు సామర్థ్యము కలవాడును, చూచువారికి ఎల్లప్పుడును ఒకే విధముగ ఆనందము కలుగు విధమున కనబడువాడును అగు మహాపురుషుడు ఎవడు ?

వి. చరిత్రము అనగా కులక్రమాగత మగు ఆచారము. చరిత్రమే చారిత్రము. స్వార్థమున అణ్ ప్రత్యయము.

సర్వభూతేషు అనగా సాపరాధుల విషయమున గాని నిరపరాధుల విషయమున గాని, అందరి విషయమునను అని అర్థము. హితశబ్దమునకు "తత్కరోతి" అని ణిచ్ ప్రత్యయము; పచాద్యచ్, ణిలోపము చేయగా "హితః" అను పదము నిష్పన్నమై 'హితమును చేయువాడు' అను అర్థము వచ్చినది.

"ఏకప్రియదర్శనః" :— "క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవ రూపం రమణీయతాయాః" (క్షణ క్షణమునకును క్రొత్తగా కనబడుచుండుటయే సౌందర్య లక్షణము) అని చెప్పినట్లు ఎల్లప్పుడు చూచుచున్నను, ఎప్పటికప్పుడు అదే మొదటిసారి చూచినట్లు విస్మయమును కలుగచేయువాడు అని అర్థము. లేదా 'ఏక' శబ్దమునకు 'సాటిలేని' అని అర్థము. సాటిలేని సంతోషజనక మగు దర్శనము కలవాడు అని అర్థము. 3

మూ. ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః,
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే. 4

ప్ర. అ. ఆత్మవాన్=ధైర్యము కలవాడు, కః=ఎవడు? జితక్రోధః= జయింపబడిన కోపము కలవాడును, ద్యుతిమాన్=ప్రశస్తమైన కాంతి కల వాడును, అనసూయకః=అసూయలేనివాడును, కః=ఎవడు ? జాతరోషస్య=

పుట్టిన కోపము గల (కోపమువచ్చిన), కస్య=ఎవనికి, సంయుగే=యుద్ధము నందు, దేవాశ్చ=దేవతలు కూడ, బిభ్యతి=భయపడుదురు ?

తా. ధైర్యము కలవాడును, కోపమును జయించినవాడును, ప్రశస్తమైన కాంతి కలవాడును, అసూయ లేనివాడును ఎవడు ? యుద్ధములో కోపమువచ్చిన ఎవనిని చూచి దేవతలు కూడ భయపడుదురు ?

వి. 'ఆత్మ' శబ్దమున కిచట ధైర్యమని అర్థము. "ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని" అని అమరము.

'జితక్రోధః' అను చోట 'క్రోధ' శబ్దము కామాదులకు ఉపలక్షణము. అందుచేత కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యము లను అరిషడ్వర్గమును జయించిన వాడని అర్థము.

'అసూయ' అనగా గుణములను దోషములుగ చిత్రించు ప్రవృత్తి. "అసూయా తు దోషారోపో గుణేష్వపి" అని అమరము. అసూయ లేనివాడు అనసూయుడు.

'దేవాశ్చ' అనునపుడు చకారము అసురాదులను కూడ చేర్చుటకు ప్రయోగింపబడినది. అందుచే "దేవాసురాదులు" అని అర్థము. లేదా 'చ' అనుదానికి 'కూడ' అని అర్థము. అనగా "దేవాశ్చ" అనుదానికి 'మిత్రులైన దేవతలు కూడ అని యర్థము. మిత్రులకే భయము కలుగు ననగా శత్రువుల మాట చెప్పవలెనా అని తాత్పర్యము. 4

మూ. ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే,
మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవంవిధం నరమ్. 5

ప్ర. అ. ఏతత్=దీనిని, అహమ్=నేను, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను, మే=నా యొక్క, కౌతూహలమ్=వేడుక, పరం హి=అధికము కదా. మహర్షే = ఓ మహర్షీ! త్వమ్=నీవు, ఏవంవిధమ్=ఇట్టి గుణములుగల, నరమ్=మనుష్యుని, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, సమర్థః=సమర్థుడవై, అసి= ఉన్నావు.

తా. నే నీ విషయమును విన గోరుచున్నాను. నాకు ఎక్కువ కుతూహల

ముగా ఉన్నది. ఓ మహర్షీ! ఇట్టి గుణములుగల మనుష్యుని గూర్చి నీకు తెలియుటకు అవకాశ మున్నది.

వి. "ఋషతీతి ఋషిః" — "ఋష గతౌ" అను ధాతువునుండి నిష్పన్న మైనది. జ్ఞానము యొక్క పారమును చెందినవాడు ఋషి.

"శ్రోతుమ్" అనుటచే — ఇట్టి గుణములు కలవానిని గూర్చి తెలిసికొన గోరి, తాము చెప్పగా వినవలెనని అడుగుచున్నాను కాని ఇట్టి పురుష డుండుట అసంభావ్య మని ఆక్షేపించుటకు కాదు అను భావము సూచింపబడుచున్నది. 'ఇచ్ఛామి' అనుటచే — తా మనుగ్రహించి చెప్పినచో వినగోరుచున్నానే కాని తప్పక చెప్పవలెనని తమను నిర్బంధింపజాలను అని ద్యోతిత మగుచున్నది.

దీనియందు నాకు చాల కుతూహల మున్నదను విషయమును నా యింగితాకారములచే తా మీసరికి గ్రహించియే యుందురు అని సూచించుటకై 'హి' అను పదము ప్రయోగింపబడినది. మీరు జ్ఞానవంతులలో ఉత్తములు గావునను, ఇట్టి లోకోత్తరు డగు వ్యక్తిని గూర్చి తెలిసియుండుటకు మీకన్న సమర్థులు మరెవ్వరును ఉండరు కావునను, ఇంతవరకును మీ రాకకై నిరీక్షించి ఉంటిని అని ఉత్తరార్ధముచే సూచిత మగుచున్నది.

ఇచట వాల్మీకి ప్రశ్నించినది జనసామాన్యమునకు తెలిసిన రాముని గూర్చి కా దనియు, వేదాంతములును, నానావిధవిద్యలును ప్రతిపాదించిన సకల కల్యాణగుణములతో కూడియున్న పరతత్త్వమును గూర్చి ప్రశ్నించె ననియు, తెలియవలెను. నారదమహాముని కూడ ఈ ప్రశ్నముల అభిప్రాయము తెలిసికొని, అట్టి మంగళకరగుణములతో కూడిన పరతత్త్వమే రాము డని నిర్ణయించి, ఉత్తరము చెప్పెను. (గోవిందరాజు) 5

మూ. శ్రుత్వా చైతత్త్రిలోకజ్ఞో వాల్మీకేర్నారదో వచః,
శ్రూయతామితి చామన్త్ర్య ప్రహృష్టో వాక్యమబ్రవీత్. 6

ప్ర. అ. త్రిలోకజ్ఞః=మూడు లోకములను ఎరిగిన, నారదః=నారదుడు, వాల్మీకేః=వాల్మీకియొక్క, ఏతత్=ఈ, వచః=వాక్కును, శ్రుత్వా చ=విని(యు) "శ్రూయతామ్=వినబడుగాక", ఇతి=అని, ఆమన్త్ర్య చ=పిలిచి(యు), అనగా వాల్మీకిని అభిముఖునిగా చేసికొని, ప్రహృష్టః=సంతసించినవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మూడు లోకముల వృత్తాంతము తెలిసిన నారదుడు వాల్మీకి మాటలను విని, సంతసించినవాడై "చెప్పెదను వినుము" అని పలికి, ఇట్లు చెప్పెను.

వి. త్రిలోకజ్ఞః — మూడు లోకములను ఎరిగినవాడు. లేదా త్రిలోక మనగా భూః, భువః, సువః, అనెడు మూడులోకములు గల బ్రహ్మాండము. దానిని ఎరిగినవాడు. లేదా 'త్రిలోక' శబ్దమునకు బద్ధులు, ముక్తులు, నిత్యులు అను మూడు విధములగు జను లని అర్థము. "లోకస్తు భువనే జనే" అని అమరము.

ప్రహృష్టః — ఈ వాల్మీకి సమస్తగుణసంపన్నుడైన మనుష్యుని తెలిసికొన గోరెను. ఈ గుణములు సామాన్యసార్వభౌమునిలో లభింపవు. జగద్రక్షణార్థము మనుష్యరూపమున అవతరించిన సాక్షాన్నారాయణు డొక్కడే ఇట్టి గుణములు కలవాడు. కావున నా కిపుడు భగవద్గుణములను కీర్తించుటకు అవకాశము లభించినది అని సంతసించినవాడై. 6

మూ. బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః,
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరః. 7

ప్ర. అ. మునే = ఓ వాల్మీకిమునీ ! బహవః = అనేకములును, లేదా అనంతములును, దుర్లభాః చ ఏవ = సాధారణుల కెంతమాత్రమును పొంద శక్యము కానివియు అగు, యే గుణాః = ఏ గుణములు, త్వయా = నీచేత, కీర్తితాః = వర్ణింపబడినవో, తైః = ఆ గుణములతో, యుక్తః = కూడిన, నరః = మనుష్యుడు, శ్రూయతామ్ = వినబడుగాక, అహమ్ = నేను, బుద్ధ్వా = తెలిసికొని, వక్ష్యామి = చెప్పెదను.

తా. ఓ వాల్మీకిమునీ ! నీవు అడిగిన గుణములు అనంతములు. సాధారణ మానవులలో దొరకవు. అట్టి గుణములతో కూడిన మహాపురుషుని నిశ్చయించి చెప్పెదను. సావధానముగా వినుము.

వి. నారదముని బ్రహ్మదేవునివలన రాముని చరిత్రమును సాంతముగా విని వచ్చినాడు. అట్టి గుణములను వినవలెనను కుతూహలముతో వాల్మీకి ప్రశ్నింపగా తాను ఉపదేశించుటకై వచ్చిన విషయమును గూర్చియే ఈతడు ప్రశ్నించినాడు కదా అను ఆనందముతో — "నేను తెలిసికొని ఉన్నాను గాన చెప్పెదను వినుము" అని పలికి చెప్ప మొదలిడెను అని వ్యాఖ్యానసారాంశము. 7

మూ. ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః,
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ. 8

ప్ర. అ. ఇక్ష్వాకువంశప్రభవః = ఇక్ష్వాకుమహారాజుయొక్క వంశమే ఉత్పత్తి స్థానముగా గల (ఇక్ష్వాకువంశమునందు పుట్టిన), రామః నామ=రాము డనెడు మహాపురుషుడు, జనైః=జనులచేత, శ్రుతః=వినబడినవాడు, (అతడు) నియతాత్మా=నిశ్చిత మగు స్వభావము కలవాడు అనగా నిర్వికారస్వరూపుడు, మహావీర్యః=అచింత్యమైన శక్తి కలవాడు, ద్యుతిమాన్=ప్రశస్త మైన కాంతి కలవాడు, అనగా స్వయంప్రకాశస్వరూపుడు (పరాపేక్ష లేకుండ ప్రకాశించు చిత్స్వరూపుడు). ధృతిమాన్=ప్రశస్త మైన ధైర్యము కలవాడు, లేదా ప్రశస్త మైన ఆనందము కలవాడు. అనగా నిరతిశయానందస్వరూపుడు, వశీ=ఇంద్రియ నిగ్రహము కలవాడు, లేదా సమస్త ప్రపంచమును తన వశములో నుంచుకొనిన సర్వేశ్వరుడు.

తా. ఇక్ష్వాకువంశమునందు పుట్టిన రామునిగూర్చి జను లెల్లరును విని యున్నారు. ఇతడు నిశ్చిత మైన స్వభావము కలవాడు. గొప్ప పరాక్రమము కలవాడు. మంచి కాంతి కలవాడు. ధైర్యము కలవాడు. ఇంద్రియనిగ్రహ వంతుడు. లేదా ఇక్ష్వాకువంశమునందు పుట్టిన రాముడు సాక్షాన్నారాయణ స్వరూపు డని లోకులచేత నిశ్చయింపబడినవాడు. నిర్వికారుడు, అచింత్య మైన శక్తి కలవాడు, స్వయంప్రకాశస్వరూపుడు, నిరతిశయానందస్వరూపుడు, సమస్త ప్రపంచమును తన వశములో నుంచుకొనిన సర్వేశ్వరుడు.

వి. "రమయతీతి రామః" అను వ్యుత్పత్తిచే 'రామః' అనగా రమింపచేయు వాడని (ఆనందింపచేయువాడని) అర్థము. "రామో రమయతాం వరః" (రమింప చేయువారిలో రాముడు శ్రేష్ఠుడు) అని చెప్పబడినది. లేదా "రమన్తే యోగినోఽ నన్తే సత్యానన్దే చిదాత్మని, ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే" (అనంత సచ్చిదానందాత్మకు డైన ఇతనియందు యోగులు రమింతురు. ఇట్లు 'రామ' శబ్ద ముచే పరబ్రహ్మము చెప్పబడుచున్నది) అను అగస్త్యసంహితావచనానుసారము. "రమన్తే అస్మిన్ ఇతి రామః"—అనగా "వీనియందు యోగులు రమింతురు" అని రామశబ్దార్థము.

అనేక ప్రఖ్యాతవంశము లుండగా రాముడు ఇక్ష్వాకువంశమునందే అవత

రించుటకు కారణ మేమనగా — పూర్వము ఇక్ష్వాకు వను మహారాజు చిరకాలము శ్రీమన్నారాయణమూర్తిని ఆరాధించి తత్ఫలముగా రంగనాథుని పొందెను. ఆ రంగనాథుని ఆరాధించు అధికారము ఆ వంశమునందు పుట్టినవారికి సదాచారమై ఉండెను. ఆ పక్షపాతముచే శ్రీమహావిష్ణువు ఇక్ష్వాకువంశమునందే అవతరించెను (గోవిందరాజు). "ధ్యాయేత్సదా సవితృమణ్డల మధ్యవర్తీ నారాయణః సరసిజాసన సన్నివిష్టః" అను ప్రాచీనోక్తిని అనుసరించి సూర్యమండలాంతర్గత మగు తేజస్సే తన స్వరూపము గాన, శ్రీమహావిష్ణువు, సూర్యునిపై అభిమానముచే ఆతని వంశ మునందే జనించె నని ఉపాసకుల భావము. ఇది సాంప్రదాయికార్థము. 8

మూ. బుద్ధిమా న్నీతిమా న్వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః
విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవో మహాహనుః. 9

ప్ర. అ. (ఆ రాముడు) బుద్ధిమాన్=ప్రశస్తమైన బుద్ధికలవాడు, సర్వజ్ఞుడు, నీతిమాన్=ప్రశస్త మైన నీతి కలవాడు, లేదా, సృష్టిస్థితిలయరూప మర్యాదలు కలవాడు, వాగ్మీ=సమస్తవిద్యలు తెలిసినవాడు, శ్రీమాన్=అఖండైశ్వర్యము కల వాడు, శత్రునిబర్హణః=శత్రువులను నశింపచేయువాడు, విపులాంసః=ఎత్తైన మూపు కలవాడు, మహాబాహుః=బలిసిన బాహువులు కలవాడు, కమ్బుగ్రీవః= శంఖమువంటి కంఠము కలవాడు, మహాహనుః=ఎత్తైన చెక్కిళ్ల మీదిభాగము కలవాడు.

తా. ఆ రాముడు బుద్ధి, నీతి, సర్వశాస్త్ర పాండిత్యము, ఐశ్వర్యము కల వాడు. శత్రువులను నశింపచేయువాడు. ఆతని మూపులు ఉన్నత మైనవి; బాహు వులు బలిసినవి, కంఠము శంఖము వలె ఉండును. చెక్కిళ్ల పై భాగము ఉన్నత ముగ ఉండును.

వి. "విపులాంసః" — "కక్షః కుక్షిశ్చ వక్షశ్చ ఘ్రాణం స్కన్ధో లలాటికా, సర్వభూతేషు నిర్దిష్టా ఉన్నతాస్తు సుఖప్రదాః" (ఏ ప్రాణుల కైనను, చంక, కడుపు, రొమ్ము, ముక్కు, మూపు, నొసలు — ఇవి ఉన్నతము లైనచో సుఖప్రద ములు) అని సాముద్రికశాస్త్రములో చెప్పినట్లు ఉన్నతము లైన మూపులు కలవా డని అర్థము.

"కమ్బుగ్రీవః" — "కమ్బుగ్రీవశ్చ నృపతి ర్లమ్బకర్ణోఽతిభూషణః" (శంఖ మువంటి కంఠము కలవాడు రాజగును. వ్రేలాడు చెవులు కలవానికి ఎక్కువ

భూషణము లుండును) అని సాముద్రికశాస్త్రములో చెప్పినట్లు శంఖమువంటి కంఠము కలవాడు అని అర్థము.

"మహాహనుః" — "మాంసలే తు హనూ యస్య భవత స్త్వీషదున్నతే, స నరో మృష్టమశ్నాతి యావదాయుః సుఖాన్వితః" (ఎవని చెక్కిళ్ల పై భాగములు బలిసి యుండుటచే కొంచెము ఎత్తుగా ఉండునో ఆతడు జీవితకాలమంతయు సుఖ మనుభవించుచు, మృష్టాన్నమును భుజించుచుండును") అని చెప్పినట్లు ఉన్నతము లైన హనువులు కలవా డని అర్థము. 9

మూ. మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః,
ఆజానుబాహుః సుశిరాః సులలాటః సువిక్రమః. 10

ప్ర. అ. (ఆ రాముడు) మహోరస్కః=విశాల మైన వక్షఃస్థలము కలవాడు, మహేష్వాసః=గొప్ప ధనుస్సుకలవాడు, గూఢజత్రుః=పైకి కనబడని మూపుల సంధియెముకలు కలవాడు, అరిందమః=కామక్రోధాది శత్రువులను లేదా పాపములను పోగొట్టువాడు, ఆజానుబాహుః=మోకాళ్ల వరకును పొడవైన బాహువులు కలవాడు, సుశిరాః=సులక్షణములతో కూడిన శిరస్సు కలవాడు, సులలాటః=శుభలక్షణములు గల నుదురు కలవాడు, సువిక్రమః = అందమైన పాదవిన్యాసము (నడక) కలవాడు.

తా. ఆ రాముని వక్షఃస్థలము చాల విశాల మైనది. ధనుస్సు చాల గొప్పది. ఆతని మూపుల సంధి ఎముకలు పైకి కనబడవు. ఆతడు కామక్రోధాది శత్రువులను, పాపములను పోగొట్టువాడు. ఆతని బాహువులు మోకాళ్లవరకును వ్రేలాడుచుండును. ఆతని శిరస్సు, లలాటము కూడ మంచిలక్షణములతో ఒప్పుచుండును. నడక ఎంతో అందముగా ఉండును.

వి. "మహోరస్కః-""స్థిరం విశాలం కఠినమున్నతం మాంసలం సమమ్, వక్షో యస్య మహీపాల స్తత్సమో వా భవేన్నరః" (దృఢమై, విశాలమై, కఠినమై, ఉన్నతమై, బలిసి సమముగా ఉండు వక్షఃస్థలము కలవాడు రాజుగాని, రాజసముడు కాని అగును) అని శాస్త్రములో చెప్పిన లక్షణములు గల వక్షఃస్థలము కలవాడు.

"మహేష్వాసః" — ఈ శబ్దముచే "గొప్ప ధనుస్సును ధరింపతగినంత

దృఢ మైన శరీరము కలవాడు" అను అర్థము సూచింపబడుచున్నది. అందుచే ప్రక్రమభంగదోషము లేదు. — అనగా శరీరావయవములను వర్ణించు సందర్భమున ధనుస్సును గూర్చి వర్ణించుట ప్రారంభించినదానికి విరుద్ధముగా ఉన్నది గాన ఇది ప్రక్రమభంగదోషము కదా అను శంకకు అవకాశము లేదు.

"గూఢజత్రుః"—"విషమై ర్జత్రుభి ర్నిస్స్వా అతిసూక్ష్మైశ్చ మానవాః, ఉన్నతై ర్భోగినో నిమ్నై ర్నిస్స్వాః పీనై ర్నరాధిపాః" (మూపుల సంధి ఎముకలకు జత్రువులు అని పేరు. ఇవి ఎచ్చుతగ్గులుగ గాని, అతిసూక్ష్మములుగ గాని ఉన్నచో దరిద్రు లగుదురు. ఉన్నతముగ ఉన్నచో భోగు లగుదురు. లోతుగా ఉన్నచో బీదవా రగుదురు. బలిసి ఉన్నచో రాజు లగుదురు) అని చెప్పినట్లు మాంసాధిక్యముచే బలిసి యుండుటవలన పైకి కనబడని జత్రువులు కలవా డని అర్థము.

"అరిందమః"—కామక్రోధాది శత్రువర్గమును పోగొట్టువా డని అర్థము. కామక్రోధాదులు లేనిచో కర్మము చేయుట జరుగదు. కర్మము లేకపోయినచో శరీరపరిగ్రహము (జన్మ ఎత్తుట) జరుగదు. ఐతే ఇపుడు రాముడు గ్రహించిన మనుష్యశరీరము కర్మమూలకము కాదు; లోకానుగ్రహార్థమే అని ఈ పదము సూచించుచున్నది.

"ఆజానుబాహుః"—"ఆజానులమ్బినౌ బాహూ వృత్తపీనౌ మహేశ్వరః" (గుండ్రముగా బలిసి మోకాళ్లవరకును వ్రేలాడు బాహువులు కలవాడు సార్వభౌము డగును) అను సాముద్రిక వచనానుసారము. సార్వభౌమలక్షణ మగు దీర్ఘ బాహువులు కలవా డని అర్థము.

"సుశిరాః"—"సమవృత్తశిరాశ్చైవ ఛత్రాకారశిరా స్తథా, ఏకచ్ఛత్రాం మహీం భుక్త్వా దీర్ఘమాయుశ్చ జీవతి" (సమముగా గుండ్రముగా ఉండు శిరస్సు కలవాడును, గొడుగు వంటి శిరస్సు కలవాడును ఏకచ్ఛత్రాధిపత్యము చేయుచు దీర్ఘకాలము జీవించును) అని చెప్పినట్లు శుభలక్షణములు గల శిరస్సు కలవా డని అర్థము.

"సులలాటః"—"అర్ధచన్ద్రనిభం తుఙ్గం లలాటం యస్య స ప్రభుః" (అర్ధచంద్రాకారమై ఉన్నత మైన లలాటము కలవాడు రాజగును) అని చెప్పబడిన లక్షణములు గల లలాటము కలవా డని అర్థము.

"సువిక్రమః" — "సింహర్షభగజవ్యాఘ్రగతయో మనుజా మునే, సర్వత్ర సుఖమేధన్తే సర్వత్ర జయినః సదా" (సింహము, వృషభము, గజము, పెద్దపులి, వీటి నడకవంటి నడక గలవారు అంతటను జయమును పొందుచు సుఖముగా వృద్ధి పొందుదురు) అని జగద్వల్లభలో చెప్పినట్లు అంద మైన నడక కలవా డని అర్థము. 10

మూ. సమః సమవిభక్తాఙ్గః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః. 11

ప్ర. అ. (ఆ శ్రీరాముడు), సమః=అతిదీర్ఘము, లేదా అతిహ్రస్వము కానట్టి దేహముకలవాడు, సమవిభక్తాఙ్గః=హెచ్చుతగ్గులు లేకుండ విభజింపబడిన అవయవములు కలవాడు, స్నిగ్ధవర్ణః=ఇంపైన రంగు గలవాడు, ప్రతాపవాన్=ప్రశస్త మైన పరాక్రమము కలవాడు లేదా తేజస్సు కలవాడు, పీనవక్షాః=బలిసిన వక్షఃస్థలము కలవాడు, విశాలాక్షః=విశాల మైన నేత్రములు కలవాడు, లక్ష్మీవాన్=ప్రశస్త మైన అవయవకాంతి కలవాడు, శుభలక్షణః=మంగళకరములైన సాముద్రికశాస్త్రోక్త లక్షణములు కలవాడు.

తా. ఆ శ్రీరాముని శరీరము చాల పొట్టిగా కాని, పొడవైనదిగా కాని లేదు. ఆతని అవయవము లన్నియు హెచ్చుతగ్గులు లేక సరిగా విభజింపబడి ఉన్నవి. శరీరపు చాయ చాల చక్కనిది. తేజస్సు చాల ప్రశంసనీయ మైనది. వక్షఃస్థలము బలిసి ఉండును. నేత్రములు విశాలములు. అవయవముల శోభ ప్రశస్త మైనది. సాముద్రిక శాస్త్రములో చెప్పిన శుభలక్షణము లన్నియు ఆతని శరీరమునం దున్నవి.

వి. సమః — "షణ్ణవత్యఙ్గులోత్సేధః సార్వభౌమో భవేన్నృపః" (తొంబదియారు అంగుళముల పొడవు గల రాజు సార్వభౌము డగును) అని జగద్వల్లభలో చెప్పి నట్లు హెచ్చుతగ్గులు లేక తొంబదియారు అంగుళముల పొడవు ఉన్నవా డని అరము.

సమవిభక్తాఙ్గః — "భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణావోష్ఠే చ చూచుకే, కూర్పరౌ మణిబన్ధౌ చ జానునీ వృషణౌ కటీ, కరౌ పాదౌ స్ఫిజౌ యస్య సమౌ జ్ఞేయః స భూపతిః" (కనుబొమలు, నాసికారంధ్రములు, కన్నులు, చెవులు, పెదవులు, చనుమొనలు, మోచేతులు, మనికట్లు, మోకాళ్లు, వృషణములు, కటిప్రదేశములు,

హస్తములు, పాదములు, పిరుదులు — ఇవి హెచ్చుతగ్గులు లేక సమములుగా ఉన్నవాడు రాజు అగును) అని సాముద్రికశాస్త్రములో చెప్పిన ప్రకారము రాముని కనుబొమలు మొదలైన అవయవములు ఉన్న వని అర్థము.

స్నిగ్ధవర్ణః — "చక్షుః స్నేహేన సౌభాగ్యం దన్తస్నేహేన భోజనమ్, త్వచి స్నేహేన శయ్యా చ పాదస్నేహేన వాహనమ్" (స్నేహ మనగా మెరుగు. నేత్రములలో మెరు గున్నచో సౌభాగ్యము, దంతములపై మెరు గున్నచో మంచి భోజనము, శరీరమునందు మెరు గున్నచో సుఖశయ్యయు, పాదములందు మెరు గున్నచో వాహనసౌఖ్యము కలుగును) అని చెప్పి నట్లు రాముని నేత్రాదులలో మెరుగు ఉన్న దని భావము. 11

మూ. ధర్మజ్ఞః సత్యసన్ధశ్చ ప్రజానాం చ హితే రతః,
యశస్వీ జ్ఞానసంపన్నః శుచిర్వశ్యః సమాధిమాన్. 12

ప్ర. అ. ధర్మజ్ఞః=శరణాగతరక్షణాది ధర్మములను ఎరిగినవాడు, సత్యసన్ధః=సత్య మైన ప్రతిజ్ఞ కలవాడు, ప్రజానామ్=ప్రజలకు, హితే=హితము చేయుటయందు, రతః=ఆసక్తి కలవాడు, యశస్వీ=గొప్ప కీర్తి కలవాడు, జ్ఞానసంపన్నః=అన్ని విషయములకు సంబంధించిన జ్ఞానముతో సంపన్నుడు, శుచిః=పరిశుద్ధ మైనవాడు, వశ్యః=గురుజనులకు లొంగి ఉండువాడు, లేదా ఆశ్రితులకు అందుబాటులో ఉండువాడు, సమాధిమాన్=ఆశ్రితులను ఎట్లు రక్షించ వలెనో ఆలోచించువాడు.

తా. శ్రీరాముడు శరణాగతరక్షణాది ధర్మములు బాగుగా తెలిసినవాడు, చేసిన ప్రతిజ్ఞను నిలుపుకొనును. ప్రజల హితమునకై ఎక్కువ ఆసక్తి చూపును. అన్ని విషయములును తెలిసినవాడు, పరిశుద్ధ మైన వాడు, అనగా నిజాయితీ కలవాడు, గురుజనులకు లొంగి ఉండువాడు, ఆశ్రితులకు అందుబాటులో ఉండు వాడు, ఆశ్రితులను రక్షించుటకై దీక్ష వహించిన వాడు.

వి. "సత్యసన్ధశ్చ" ఇత్యాది స్థలములలో ప్రయోగించిన 'చ' అను దానికి విశేషార్థ మేమియు లేదు. కేవలము పాదపూరణమునకై ప్రయోగింపబడినది. "తు హి చ స్మ హ వై పాదపూరణే" అని అమరము. 12

మూ. ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా. 13

ప్ర. అ. (ఆ రాముడు) ప్రజాపతిసమః = బ్రహ్మతో సమాన మైనవాడు, శ్రీమాన్=సమస్తలోకమును అతిశయించినవాడు, ధాతా=సమస్త ప్రపంచమును పోషించువాడు, రిపునిషూదనః=శత్రువులను జయించువాడు, జీవలోకస్య=ప్రాణి సముదాయమునకు(ను), రక్షితా=పాలించువాడు, ధర్మస్య=ధర్మమునకు(ను), పరిరక్షితా=బాగుగ రక్షించువాడు.

తా. శ్రీరాముడు బ్రహ్మతో సమానుడు. అందరిని మించినవాడు. సర్వ లోకములను పోషించువాడు. శత్రువులను నశింపచేయువాడు. సమస్తప్రపంచమును రక్షించువాడు. ధర్మమును బాగుగా రక్షించువాడు.

వి. జీవలోకస్య రక్షితా — కేవలము సార్వభౌము డైనవాడు తనవారిని లేదా మనుష్యులను మాత్రమే రక్షించకలిగి ఉండును. శ్రీరాము డట్లు కాదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సకలప్రాణులను రక్షింపగలిగినవాడు. ఐతే పాపాత్ములను కూడ రక్షించునా ? అను ప్రశ్న ఉదయించును. దీనికి సమాధానము "ధర్మస్య పరిరక్షితా" అను మాటలో ఉన్నది. ధర్మమును రక్షించుటవలన పాపులను కూడ రక్షించువాడే అని సూచిత మగుచున్నది. అది ఎట్లనగా—చికిత్సకుడు శస్త్రచికిత్సాదులు చేయునపుడు తాత్కాలికముగ రోగికి చాల బాధకలిగించువాడే అయినను, రోగమును పోగొట్టి చివరకు మహోపకారము చేసినవాడే అగుచున్నాడు. అట్లే పాపులను శిక్షించు సమయమున వారిపట్ల, ఆ సమయమున, క్రూరుడుగా కనబడినను, అధర్మమార్గములో పడి పాపములు చేయుచున్న ఆ పాపాత్ములను శిక్షించి ఉద్ధరించుటచే, వాస్తవమున, వారికే విశేషరక్షకు డగుచున్నా డని భావము.

"రక్షితా జీవలోకస్య" అని ప్రారంభించి చెప్పిన ఈ విశేషణములు భగవంతుని అవతారలక్షణములను వర్ణించుచున్నవి (గోవిందరాజులు). ఇవన్నియు పరమేశ్వరున కుండదగిన లక్షణములే కాని ఇతరుల కెవ్వరికిని ఉండదగినవి కావు (మహేశ్వరతీర్థులు) 13

మూ. రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,
వేదవేదాఙ్గతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః. 14

ప్ర. అ. (ఆ రాముడు) స్వస్య = తనయొక్క, ధర్మస్య = శరణాగత రక్షణరూపధర్మమునకు లేదా క్షత్రియధర్మమునకు, రక్షితా=రక్షకుడు, స్వజనస్యచ=ఆశ్రయించిన బంధువులు మొదలైన తనవారికిని, రక్షితా=రక్షకుడు, వేదవేదాఙ్గతత్త్వజ్ఞః=వేదముల తత్త్వమును, వేదాంగముల తత్త్వమును తెలిసికొన్నవాడు, ధనుర్వేదే చ=ధనుర్వేదమునందు గూడ, నిష్ఠితః=పరిపూర్ణ మైన ప్రజ్ఞ కలవాడు.

తా. శ్రీరాముడు తన ధర్మమును చక్కగ పాటించుచు తనవారి నందరిని రక్షించుచుండును. వేదవేదాంగముల రహస్యము లన్నియు ఈతనికి తెలియును. ధనుర్వేదమునందు ఈతనికున్న జ్ఞానము అసాధారణ మైనది.

వి. ఋక్—యజుస్—సామ—అథర్వము లని వేదములు నాలుగు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అని వేదాంగములారు.

"ధనుర్వేదే చ" అనునపుడు 'చ' శబ్దముచే ఆయుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రము అను మిగిలిన మూడు ఉపవేదములను కూడ గ్రహించవలెను.

'రక్షితా స్వస్య ధర్మస్య'-
ధర్మోపదేశసమయే జనాః సర్వేఽపి పణ్డితాః,
తదనుష్ఠానసమయే మునయోఽపి న పణ్డితాః".

(ఇతరులకు ధర్మము ఉపదేశించుటకు అందరును పండితులే. ఆ ధర్మమును ఆచరించు నపుడు మాత్రము మునులు కూడ అపండితుల వలె ప్రవర్తింతురు) అని చెప్పినట్లు చాలమంది ధర్మోపదేశము చేయుచుందురు గాని తాము ఆచరించరు. శ్రీరాముడు మాత్రము అట్లు కాదని అర్థము.

లేదా ధర్మ మనగా ధనుస్సు. "స్వామ్య స్వభావసుకృతేష్వస్త్రీ ధర్మం తు కార్ముకే" అని బాణనిఘంటువు. అందుచే "రక్షితా స్వస్య ధర్మస్య" అనగా తన ధనుస్సును రక్షించుకొనువాడు అని అర్థము. ఇచట ధర్మ శబ్దము ఉపలక్షణచే రథాదులు అను అర్థమును కూడ బోధించును. యుద్ధరంగములో తన ధనుస్సును,

రథములను, సారథిని, గుఱ్ఱములను, ఛత్రమును, కేతనమును రక్షించుకొనగలిగిన అతిరథశ్రేష్ఠు డని అర్థము.

లేదా శివధనుర్భంగము, పరశురామపరాభవము మొదలగు లోకోత్తరములగు కార్యములు చేసి తన శ్రీనారాయణావతారత్వరూప ధర్మమును రక్షించుకొనిన వాడు అని అరము.

స్వజనస్య చ రక్షితా — "రక్షితా జీవలోకస్య" అని పూర్వశ్లోకములో చెప్పిన జీవలోకరక్షణములో స్వజనరక్షణము కూడ అంతర్గత మైనను, మరల "స్వజనస్య చ రక్షితా" అని చెప్పుట రామునకు స్వజనులపై ఉన్న కరుణాతిశయమును సూచించుచున్నది.

బాంధవాదులను తిరస్కరించుట ప్రభువునకు సహజము. రాముడు మాత్రము అట్లు కాదు. "అత్యాసన్నం పరిత్యజ్య మునేర్దత్తం తు నిష్ఫలమ్" (చాల దగ్గరగా ఉన్న ఆశ్రితుని లేదా బంధువును కాదని మునీశ్వరునకు దానము చేసినను అది నిష్ఫలమే) అను శాస్త్రము ననుసరించి ఆశ్రితబాంధవులను విశేషించి రక్షించువాడు అని అర్థము. 14

మూ. సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,
సర్వలోకప్రియః సాధు రదీనాత్మా విచక్షణః. 15

ప్ర. అ. (ఆ రాముడు), సర్వ శాస్త్రార్థతత్త్వజ్ఞః=సమస్త మైన శాస్త్రముల అర్థము, తత్త్వము తెలిసినవాడు, స్మృతిమాన్=జ్ఞప్తి కలవాడు, అనగా తెలిసిన విషయమును మరువనివాడు, ప్రతిభానవాన్=వ్యవహారమునందు ఉత్తరోత్తర యుక్తుల స్ఫూర్తి కలవాడు, సర్వలోకప్రియః=సమస్తజనులకును ఇష్టుడు. లేదా అందరు జనులును ఇష్టులుగా కలవాడు (అందరియందును ప్రీతి కలవాడు), సాధుః=తన కపకారము చేసినవారికి కూడ ఉపకారము చేయువాడు, అదీనాత్మా=అతిదుఃఖకాలమునందు కూడ కలత చెందని మనస్సు కలవాడు, విచక్షణః=వినువారికి హృదయానందము కలుగు నట్లు అనేకవిధములుగ మాటలాడువాడు. లేదా ఆ యా కాలములందు చేయదగిన పనులు చేయుటయందు చాతుర్యము కలవాడు.

తా. రాముడు వెనుక చెప్పిన వేదవేదాంగములే కాక మిగిలిన ధర్మశాస్త్ర—పురాణ—న్యాయ—మీమాంసా — సాంఖ్య—వైశేషిక—యోగశాస్త్రముల అభి

ప్రాయములను, సిద్ధాంతములను బాగుగా తెలిసికొనినవాడు. తెలిసికొన్న విషయములను ఎన్నడును మరువడు. లోకవ్యవహారములలో ఈతనికి గల ఉత్తరోత్తర యుక్తుల స్ఫురణము గొప్పది. సమస్తజనులయందును ఈతనికి ప్రేమ అధికము; ఆ జనులకు కూడ రాము డనిన ప్రాణము. ఎట్టి కష్టకాలములం దైనను ఈతని మనస్సు కలత చెందదు. వినువారికి ఆనందము కలుగు నట్లు సంభాషణ చేయుటయందును, సమయోచితము లగు కార్యములను నిర్వహించుటయందును గొప్ప నేర్పు కలవాడు. 15

మూ. సర్వదాభిగతః సద్భిః సముద్ర ఇవ సిన్ధుభిః,
ఆర్యః సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః. 16

ప్ర. అ. (ఆ రాముడు), సముద్రః=సముద్రము, సిన్ధుభిః ఇవ=నదుల చేత వలె, సద్భిః=సత్పురుషులచేత, సర్వదా=ఎల్లప్పుడును, అభిగతః=పొంద బడినవాడు, ఆర్యః=చేరదగినవాడు, లేదా పూజ్యుడు, సర్వసమః=అందరి విషయమునందును సమముగా ప్రవర్తించువాడు, సదైకప్రియదర్శనః = ఎల్లపుడును ఒకే విధముగ ప్రీతికర మగు దర్శనము కలవాడు.

తా. నదులు ఎల్లపుడును, అనగా మూడు కాలములందును, సముద్రమును చేరుచుండు నట్లు సత్పురుషులు ఎల్లవేళల రామునివద్దకు వచ్చుచుందురు. ఈతడు ప్రతి ఒక్కరును దగ్గరకు చేరవలసిన వ్యక్తి. పూజనీయుడు. అందరి విషయమునను సమముగా ప్రవర్తించువాడు. ఈతని దర్శనము ఎల్లప్పుడును ఒకే విధముగ ఆనందజనకముగా ఉండును.

వి. సర్వసమః — జాతివర్ణాదితారతమ్యము లేక సమస్త భూతముల విషయమునను సమాన మగు ప్రేమతో వ్యవహరించువాడు. జాతిగుణవృత్త్యాది తారతమ్యములు లేక అందరును ఈతనిని ఆశ్రయింతురు. 'ఏవ' కారము "దీనిలో ఎన్నడును మార్పు లేదు" అని సూచించుచున్నది (గోవిందరాజులు).

'సర్వదా' అనుటవలన — సముద్రుని సేవించుటకు నదులకు కాలనియమము ఏ విధముగ అక్కఱలేదో అట్లే రాముని సేవించుటయందు భక్తులకు కాలనియమము అక్కఱలే దని సూచింపబడినది.

"అభిగతః" అను శబ్దముచే "సత్పురుషులకు శ్రీరాముడే పరమప్రాప్య స్థానము" అని సూచితమగుచున్నది.

"సముద్రః సిన్ధుభిరివ" అను ఉపమానము, నదులకు సముద్రము తప్ప వేరు గతి లేనట్లు, సత్పురుషులకు రాముడు తప్ప గత్యంతరము లేదని సూచించు చున్నది. 16

మూ. స చ సర్వగుణోపేతః కౌసల్యానన్దవర్ధనః,
సముద్ర ఇవ గామ్భీర్యే ధైర్యేణ హిమవానివ. 17

ప్ర. అ. కౌసల్యానన్దవర్ధనః = కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించు, సః చ=ఆ రాముడే, సర్వగుణోపేతః=అన్ని గుణములతో కూడిన వాడు, గామ్భీర్యే=తన హృదయములో నున్నదానిని బైటికి తెలియకుండ చేయుటయందు, సముద్రః ఇవ=సముద్రమువంటివాడు, ధైర్యేణ=ధైర్యముచేత, హిమవానివ=హిమవత్పర్వతమువంటివాడు.

తా. కౌసల్యకు ఆనందమును వృద్ధిపొందించు ఆ రాముడే సకలగుణములతో కూడినవాడు. అతడు గాంభీర్యమునందు సముద్రము వంటివాడు. ధైర్యమునందు హిమవత్పర్వతము వంటివాడు.

వి. 'స చ' అనునపుడు 'చ' కారమునకు 'ఏవ' అని యర్థము—"అతడే".

కౌసల్యానందవర్ధనః—దశరథుడు కోసలరాజపుత్రి యగు కౌసల్యయందే రాముని పుత్రునిగ పొందకలిగెను. అందుచే "కౌసల్యకు ఆనందమును పెంచువాడు" అని చెప్పబడినది (గోవిందరాజులు).

గాంభీర్య మనగా తన హృదయములో ఉన్నదానిని బైటికి తెలియనీయకుండుట. సముద్రుడు తనలో నున్న రత్నాదులను పైకి తెలియకుండ చేయుచుండునట్లు హృదయములో ఉన్నదానిని పైకి తెలియ నీయనివాడు అని అర్థము.

దుఃఖకారణ మున్నను దుఃఖమును పొంద కుండుట ధైర్యము. ఆ విషయమున రాముడు హిమవత్పర్వతము వంటివాడు. "గిరయో వర్షధారాభిర్హన్యమానా న వివ్యధుః, అభిభూయమానా వ్యసనైర్యథాధోక్షజచేతసః" (ఎన్నియో వ్యసనములు వచ్చినను విష్ణుభక్తులు ఏ విధముగ దుఃఖింపరో, అట్లే పర్వతములు వర్షధారలచే కొట్టుబడుచున్నను దుఃఖింపలేదు) అని చెప్పినట్లు, వర్షములు కురియుట, పిడుగులు పడుట, మొదలగు దుఃఖకారణము లున్నను పర్వతములకు

వ్యథ కలుగదు. అట్టి పర్వతము లన్నిటికన్నను, పర్వతరా జగు హిమవంతుడు మిక్కిలి ధైర్యశాలి. రాముడు ధైర్యముచే అట్టి హిమవంతునితో సమాను డని అర్థము. 17

మూ. విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః,
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః. 18
ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః.

ప్ర. అ. (ఆ రాముడు) వీర్యే=పరాక్రమమునందు, విష్ణునా=విష్ణువుతో, సదృశః = సమాన మైనవాడు, సోమవత్ = చంద్రుడు వలె, ప్రియదర్శనః= ఆనందకర మైన దర్శనము కలవాడు, క్రోధే=కోపమునందు, కాలాగ్నిసదృశః= ప్రలయకాలాగ్నితో సమానుడు, క్షమయా = ఓర్పుచే, పృథివీసమః = భూమితో సమానుడు, త్యాగే=దానము చేయుటలో, ధనదేన = కుబేరునితో, సమః = సమానుడు, సత్యే = సత్యమునందు, అపరః = తనకంటె ఉత్కృష్ట మగు మరి ఎవరును లేని, ధర్మః ఇవ=ధర్మదేవత వంటివాడు.

తా. రాముడు పరాక్రమమునందు విష్ణువుతో సమానమైనవాడు. చంద్ర దర్శనము వలె ఈతని దర్శనము ఆనందకరము. కోపము వచ్చినప్పుడు ప్రలయకాలాగ్ని వలె చాల భయంకర మైనవాడు. ఓర్పులో భూమివంటి వాడు. ఇతరులకు దానము చేయుటలో కుబేరునివంటివాడు. సత్యమును సంరక్షించు విషయమున ధర్మదేవత వంటివాడు. ఈ విషయమున ఈతనిని మించినవా రెవరును లేరు.

వి. వీర్యే—తనకు క్షతి లేకుండ చూచుకొనుచు ఇతరులను జయింప గలిగిన సామర్థ్యమునకు వీర్య మని పేరు. రాముడు విష్ణువే అయినను అవతార రూప మగు ఉపాధి (భేదమునకు కారణము) ని పట్టి విష్ణువుకంటె భిన్నుడు గాన విష్ణువుతో పోల్చుట జరిగినది. లేదా "వీర్యము విషయమున విష్ణువైన తనతో సమానుడు" అని అర్థము. అనగా తనకు తానే సాటి కాని వేరెవ్వరును సాటి కారని భావము. విష్ణువునందలి సగము భాగము మాత్రమే రామునియం దుండుటచే విష్ణుసాదృశ్యము చెప్పబడినది (గోవిందరాజులు). మరి యొక ఉపమాన మేదియు లేనప్పుడు విష్ణువుతో సమాను డని చెప్పుటకన్న గత్యంతరము లేదు. (మహేశ్వరతీర్థులు).

క్షమయా పృథివీసమః—తనను జనులు తొక్కినను, తవ్వినను, మరి ఏమి చేసినను భూమి ఓర్పుతో సహించును. అట్లే తన కెంత అపకారము చేసినను అచేతన పదార్థము వలె మిన్నక ఉండువాడు అని అర్థము.

ధనదేన సమస్త్యాగే—ఇచట "ధనద" (ధనము నిచ్చువాడు) అను శబ్ద మును ప్రయోగించుటచే కుబేరుని త్యాగవిశేషము సూచింపబడుచున్నది. "అట్టి కుబేరునితో సమానుడు".

సత్యే ధర్మ ఇవాపరః—అపరః=తనకంటె ఇతరమైన ఉత్కృష్టవస్తువు లేని, ధర్మదేవత వంటివాడు (గోవిందరాజులు). అపరః = రెండవ, ధర్మ దేవతయా, అన్నట్లు ఉన్నాడు (మహేశ్వరతీర్థులు). 18

అవ. నారదుడు, మొదట "ఇక్ష్వాకువంశప్రభవః" అను పదముచేత రామా వతారమును చెప్పెను. "మహావీర్యః" "శత్రునిబర్హణః" అను పదములచేత తాటకామారీచవధ పరశురామపరాభవములను సూచించెను. "లక్ష్మీవాన్" "శ్రీమాన్" అను పదములచేత సీతాపరిణయమును తెలియజేసెను. "ధనుర్వేదే చ నిష్ఠితః" అను వాక్యముచేత కౌశికునివలన రామునికి కలిగిన సమస్తాస్త్రప్రాప్తిని తెలిపెను. ఇట్లు బాలకాండకథను చెప్పి ఇపుడు అయోధ్యాకాండకథను చెప్పు చున్నాడు (మహేశ్వరతీర్థ గోవిందరాజులు).

మూ. తమేవంగుణసమ్పన్నం రామం సత్యపరాక్రమమ్, 19
జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథస్సుతమ్.
ప్రకృతీనాం హితైర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా, 20
యౌవరాజ్యేన సంయోక్తుమైచ్ఛత్ప్రీత్యా మహీపతిః.

ప్ర. అ. మహీపతిః=భూమికి ప్రభువైన, దశరథః = దశరథుడు, ఏవం గుణసమ్పన్నమ్=ఇట్టి గుణములతో కూడినవాడును, సత్యపరాక్రమమ్=వ్యర్థము కాని పరాక్రమము కలవాడును, శ్రేష్ఠగుణైః = ఉత్తమములైన గుణములతో, యుక్తమ్=కూడినవాడును, ప్రియమ్=తనకు ప్రీతిపాత్రుడును, ప్రకృతీనామ్= ప్రజలకు, హితైః = సౌఖ్యమును కలిగించు కార్యములతో, యుక్తమ్ = కూడిన వాడును, జ్యేష్ఠం సుతమ్=జ్యేష్ఠకుమారుడును అగు, తమ్=ఆ, రామమ్=రాముని, ప్రకృతిప్రియకామ్యయా=ప్రజలకు ప్రియము చేయవలె ననెడు కోరికచేతను,

ప్రీత్యా=ప్రేమచేతను, యౌవరాజ్యేన=యౌవరాజ్యముతో, సంయోక్తుమ్=కూర్చుటకు, ఐచ్ఛత్=ఇచ్ఛయించెను.

తా. దశరథమహారాజు ప్రజలకు హితము చేయవలె నను కోరికతో, సమస్తసద్గుణసంపన్నుడును, అమోఘము లగు బలపరాక్రమములు కలవాడును, ఎల్లప్పుడును ప్రజల హితమునే కోరుచుండువాడును, తనకు ప్రీతిపాత్రుడును అగు జ్యేష్ఠకుమారు డైన రాముని యువరాజుగా చేయగోరెను. 19, 20.

మూ. తస్యాభిషేకసమ్భారాన్ దృష్ట్వా భార్యాథ కైకయీ, 21
పూర్వం దత్తవరా దేవీ వరమేనమయాచత,
వివాసనం చ రామస్య భరతస్యాభిషేచనమ్. 22

ప్ర. అ. అథ=పిమ్మట, తస్య=ఆ రామునియొక్క, అభిషేకసంభారాన్=యౌవరాజ్యాభిషేకముకొరకై తీసికొని వచ్చిన వస్తుసామగ్రిని, దృష్ట్వా=చూచి, పూర్వమ్=పూర్వము, దత్తవరా=ఇవ్వబడిన వరములు కలదియు, భార్యా=భార్యయు, దేవీ=రాణియు అయిన, కైకయీ=కైకయి, రామస్య=రాముని, వివాసనమ్=ప్రవాసమునకు పంపివేయుట, భరతస్య=భరతుని, అభిషేచనమ్=రాజ్యాభిషిక్తుని చేయుట అను, వరమ్ = వరమును, ఏనమ్=ఈ దశరథమహారాజును, అయాచత=యాచించెను.

తా. దశరథుని రాణులలో నొకతె యైన కైకయి రామాభిషేకమునకై సేకరించిన సాధనసామగ్రిని చూచి, దశరథుడు పూర్వము తనకు రెండు వరము లిచ్చి యుండుటచే, వాటిలో ఒక వరముగా రాముని అరణ్యమునకు పంపవలె ననియు, రెండవ వరముగా భరతుని రాజ్యాభిషిక్తుని చేయవలె ననియు, దశరథుని కోరెను. 21, 22.

మూ. స సత్యవచనాచ్చైవ ధర్మపాశేన సంయతః,
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్. 23

ప్ర. అ. సః=ఆ, దశరథః=దశరథుడు, సత్యవచనాత్=సత్యవచనము అనెడు కారణమువలన, ధర్మపాశేన=ధర్మ మనెడు త్రాడుచేత, సంయతః=కట్టబడినవాడై, ప్రియం సుతమ్ = ప్రియసుతు డైన, రామమ్ = రాముని, వివాసయామాస=అరణ్యమునకు పంపెను.

తా. సత్యవాక్యమును పరిపాలించవలె నను కారణముచే, ఆ దశరథుడు, ధర్మపాశముచే బంధింపబడినవాడై, తన ప్రియపుత్రు డైన రాముని వనమునకు పంపెను. 23

మూ. స జగామ వనం వీరః ప్రతిజ్ఞామనుపాలయన్,
పితుర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్. 24

ప్ర. అ. వీరః=వీరుడైన, సః = ఆ రాముడు, కైకేయ్యాః = కైకేయికి, ప్రియకారణాత్=ప్రీతికి హేతువైన, పితుః=తండ్రియొక్క, వచననిర్దేశాత్ = మాట అనెడు ఆజ్ఞవలన, ప్రతిజ్ఞామ్=తన ప్రతిజ్ఞను, అనుపాలయన్=పాలించు కొనుచు, వనమ్=అరణ్యమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. అతి పరాక్రమశాలి యైన రాముడు కైకేయికి సంతోషము కలిగించు టకై, తండ్రి మాట మాత్రము చెప్పినంతనే దానిని ఆజ్ఞగా గ్రహించి, తన ప్రతి జ్ఞను నిలుపుకొనుచు అరణ్యమునకు వెళ్లెను.

వి. "ప్రతిజ్ఞామనుపాలయన్"—రాముడు కైకేయితో—"తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే" (తల్లీ! రాజుగారికి ఏది ఇష్టమో, ఆ మాటను చెప్పుము. దానిని చేసెదను. ప్రతిజ్ఞ చేయుచున్నాను. రాముడు రెండుమాటలు మాటలాడువాడు కాడు) అని పలికి ప్రతిజ్ఞ చేసెను. ఆ ప్రతిజ్ఞను రక్షించుచు అని అర్థము. 24

మూ. తం వ్రజన్తం ప్రియో భ్రాతా లక్ష్మణోఽనుజగామ హ,
స్నేహాద్వినయసంపన్నః సుమిత్రానన్దవర్ధనః, 25
భ్రాతరం దయితో భ్రాతుః సౌభ్రాత్రమనుదర్శయన్.

ప్ర. అ. వినయసంపన్నః = వినయముతో కూడినవాడును, భ్రాతుః = సోదరుడైన రామునకు, దయితః=ఇష్టుడును, ప్రియః భ్రాతా=సహజప్రీతి గల సోదరుడును అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, సుమిత్రానన్దవర్ధనః = సుమిత్ర యొక్క ఆనందమును వృద్ధిపొందించుచున్నవాడై, సౌభ్రాత్రమ్=సోదరస్నేహ మును, అనుదర్శయన్ = చూపుచు, వ్రజన్తమ్ = అరణ్యమునకు వెళ్లుచున్న, తమ్=ఆ, భ్రాతరమ్ = సోదరు డైన రాముని, స్నేహాత్ = స్నేహమువలన, అనుజగామ హ=అనుసరించి వెళ్లెను.

తా. లక్ష్మణుడు రామునికి చాల ఇష్టుడైన తమ్ముడు. అతనియందు సహజమైన ప్రేమ కలవాడు. వినయసంపన్నుడు. అతడు తన భ్రాతృస్నేహమును చూపుచు అరణ్యమునకు పోవుచున్న ఆ రాముని వెంట వెళ్లెను. ఇట్లు ఉత్తమ కార్యము చేయుటచే తల్లి యగు సుమిత్రకు కూడ ఆనందమును వృద్ధి పొందించెను. 25.

మూ. రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా, 26
జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా,
సర్వలక్షణసంపన్నా నారీణాముత్తమా వధూః, 27
సీతా ప్యనుగతా రామం శశినం రోహిణీ యథా.

ప్ర. అ. రామస్య=రామునకు, దయితా=ఇష్టురాలును, భార్యా=భార్యయు, ప్రాణసమా=ప్రాణములతో సమానురాలును, నిత్యమ్=నిత్యమును, హితా = హితమును చేయునదియు, జనకస్య = జనకమహారాజుయొక్క, కులే = కులమునందు, జాతా=పుట్టినదియు, నిర్మితా=సుందోపసుందులను మోహింప చేయుటకై నిర్మింపబడిన, దేవమాయేవ=దేవమాయ వలె, (తిలోత్తమ వలె) లేదా అమృతమథనానంతరము రాక్షసులను మోహింపచేయుటకై సృజింపబడిన విష్ణువు యొక్క మాయామోహినీరూపము వలె ఉన్నదియు, సర్వలక్షణసంపన్నా = సాముద్రికశాస్త్రములో చెప్పిన అన్ని శుభలక్షణములతో కూడినదియు, నారీణామ్=స్త్రీలలో, ఉత్తమా=ఉత్తమురాలును, వధూః=దశరథుని కోడలు అగు, సీతాపి=సీత కూడ, రోహిణీ=రోహిణి, శశినం యథా=చంద్రుని వలె, రామమ్=రాముని, అనుగతా=అనుసరించి వెళ్లినది.

తా. జనకుని వంశమునందు పుట్టి, రాముని భార్యయై దశరథుని కోడలైన సీత రామునకు చాల ఇష్టురాలు. ప్రాణము వంటిది. ఆమె సర్వదా రామునకు హితమునే చేయుచుండును. రాక్షసులను మోహింపచేయుటకై సృజింపబడిన దేవమాయ వలె లోకోత్తర మైన సౌందర్యము కలది. సాముద్రికశాస్త్రములో చెప్పిన మంచి లక్షణము లన్నియు ఆమెయందు ఉన్నవి. స్త్రీలలో ఉత్తమురాలు. అట్టి సీత కూడ, రోహిణి చంద్రుని అనుసరించి నట్లు, ఆ రామచంద్రుని అనుసరించి వెళ్లెను. 26, 27

మూ. పౌరైరనుగతో దూరం పిత్రా దశరథేన చ, 28
శృఙ్గిబేరపురే సూతం గంగాకూలే వ్యసర్జయత్.
గుహమాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్, 29
గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా.

ప్ర. అ. (ఆ రాముడు) పౌరైః = అయోధ్యాపురమునందు నివసించువారి చేతను, పిత్రా=తండ్రియైన, దశరథేన చ=దశరథునిచేతను, దూరమ్=చాల దూరమువరకును, అనుగతః=అనుసరింపబడెను. ధర్మాత్మా=ఆశ్రితరక్షణాది ధర్మముచే స్వరూపముగా గల, రామః=రాముడు, గఙ్గాకూలే = గంగాతీరము నందు ఉన్న, శృఙ్గిబేరపురే=శృంగిబేర మనెడు పట్టణమునందు, నిషాదాధి పతిమ్=బోయవారికి అధిపతియైన, ప్రియమ్=తనయందు ప్రీతి గల, గుహమ్= గుహుని, ఆసాద్య=చేరి, గుహేన=గుహునితోడను, లక్ష్మణేన = లక్ష్మణుని తోడను, సీతయా చ=సీతాదేవితోడను, సహితః=కూడినవాడై, సూతమ్=సారథి యైన సుమంత్రుని, వ్యసర్జయత్=వెనుకకు పంపివేసెను.

తా. పౌరులును, దశరథుడును చాల దూరమువరకు రాముని వెంబ డించిరి. ధర్మాత్ముడైన ఆ రాముడు, గంగాతీరమునందు, శృంగిబేర మనెడు పట్టణములో, బోయల ప్రభు వైన గుహుని కలిసికొనెను. సీతాలక్ష్మణ గుహులతో కూడిన ఆ రాముడు తన సారథి యైన సూతుని వెనుకకు పంపివేసెను.

అర్థాంతరము — "గుహేన స హితో రామః" అనునపుడు "గుహేన, సః, హితః, రామః" అని పదచ్ఛేదము. సః రామః=ఆ రాముడు, గుహేన=గుహుని చేత, హితః=పంపబడెను, అనగా గంగను దాటింపబడెను.

తాత్పర్యము — ధర్మాత్ముడైన రాముడు గంగాతీరమునందు శృంగిబేర పురములో నున్న నిషాదాధిపతి యైన గుహుని చేరి, సారథిని వెనుకకు పంపి వేసెను. ఆ గుహుడు సీతాలక్ష్మణసమేతు డగు రాముని గంగానది దాటించెను.

వి. పౌరులు పరమభక్తి కలవా రగుటచే రాముని చాల దూరమువరకు అనుసరించి వెళ్లిరి. మరల ఎక్కడ వియోగము కలుగునో అను భయమునకు పరమభక్తి యని పేరు. "పునర్విశ్లేషభీరుత్వం పరమా భక్తి రుచ్యతే".

"శృఙ్గిబేరమ్" అనగా జింకలు మొదలగు కొమ్ములు గల జంతువుల

శరీరములు, అనగా ఆ ఆకారము గల బొమ్మలు ఉండెడు పట్టణము అని అర్థము. "శృఙ్గిణాం బేరాణి యస్మిన్ తత్ శృఙ్గిబేరమ్" అని విగ్రహవాక్యము. బేరమ్ అనగా శరీరము. ఆ పట్టణమునందు జింకలు మొదలగు మృగముల బొమ్మలు నిర్మించి అచ్చటచ్చట ఉండెడివారు. వాటిని చూచి జింకలు మొదలైన మృగములు తమ సజాతీయమృగము లను భ్రాంతిచే వాటి దగ్గరకు రాగా వాటిని పట్టుకొనెడి వారు. దీనిని పట్టి ఆ పట్టణములో నివసించువారి సాధారణవృత్తి జీవహింస యని సూచిత మగుచున్నది. "గూహతీతి గుహః". "గుహూ సంవరణే" అను ధాతువునుండి నిష్పన్న మైనది. "పరద్రవ్యాదులను దాచువాడు" అని అర్థము. పరులను హింసించి, వారి ధనాదులను లాగికొని దాచువాడు గుహుడు. ఈ విధముగ గుహుడు కులవృత్తిచేతను, స్వవృత్తిచేతను కూడ అతినీచు డైనను, తనయందు ప్రేమ కలిగి వర్తించినంతమాత్రముచేతనే రాముడు వానియందు కూడ సీతాలక్ష్మణులపై నున్నంత స్నేహము నుంచెను. దీనిని పట్టి ఆశ్రితు డెట్టివా డైనను అతనిని రాముడు రక్షించు నని సూచిత మగుచున్నది (గోవింద రాజులు). 28, 29

మూ. తే వనేన వనం గత్వా నదీస్తీర్త్వా బహూదకాః, 30
చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్,
రమ్యమావసథం కృత్వా రమమాణా వనే త్రయః, 31
దేవగన్ధర్వసంకాశా స్తత్ర తే న్యవసన్సుఖమ్.

ప్ర. అ. తే=ఆ సీతారామలక్ష్మణులు, వనేన=ఒక వనమునుండి, వనమ్=మరి యొక వనమును, గత్వా=పొంది (చేరుచు), బహూదకాః = అధిక మైన జలము గల, నదీః=నదులను, తీర్త్వా=దాటి, అను=అటుతరువాత, భరద్వాజస్య=భరద్వాజమహర్షియొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, చిత్రకూటమ్=చిత్రకూట పర్వతమును, ప్రాప్య=పొంది, రమ్యమ్=సుందరమైన, ఆవసథమ్=గృహమును, కృత్వా=నిర్మించుకొని, తే=అట్టి, అనగా అయోధ్యలో సమస్త సుఖములు అనుభవించిన, త్రయః=ముగ్గురును, తత్ర=ఆ చిత్రకూట పర్వతమునం దున్న వనే=వనమునందు, రమమాణాః=క్రీడించుచు, దేవగన్ధర్వసఙ్కాశాః=దేవతల తోను గంధర్వులతోను సమానులై, సుఖమ్=సుఖముగా, న్యవసన్=నివసించిరి.

తా. ఆ సీతారామలక్ష్మణులు ఒక వనమునుండి మరొక వనము చేరుచు,

గొప్ప గొప్ప నదులను దాటుచు, భరద్వాజమహర్షి ఆదేశము ప్రకారము చిత్ర కూటపర్వతమును చేరిరి. అచట ఒక పర్ణశాల నిర్మించుకొని దేవగంధర్వుల వలె సుఖముగా నివసించిరి.

అర్థాంతరములు —'తే+అవనేన' అని పదచ్ఛేదము. వారు, అవనేన= పరస్పర రక్షణముచేత—ఒకరి నొకరు రక్షించుకొనుచు, వనం గత్వా........ వనే=వనమునందు, తే=ఆ అయోధ్యలో ఉండువారుగానే, అయోధ్యలో ఉన్నట్లే, రమమాణాః = క్రీడారసము ననుభవించుచు, సీతారాములు వనవిహారాదిక్రీడా రసము ననుభవించిరి. లక్ష్మణుడు తత్సేవారసము ననుభవించెను. దేవగన్ధర్వ సఙ్కాశాః— దేవ=లక్ష్మీనారాయణులతోను (దేవీ చ దేవశ్చ దేవౌ. "పుమాన్ స్త్రియా" అని ఏకశేషము) గన్ధర్వ=జీవన్ముక్తునితోను (గానం ధారయతీతి గన్ధర్వః, గానమును ధరించుచుండును. అనగా పాడుచుండును అని అర్థము) సంకాశాః=సమానులై, సీతారాములు లక్ష్మీనారాయణులతోను, లక్ష్మణుడు సామ గానపరు డగు జీవన్ముక్తునితోను సమానులు అని అర్థము.

తా. ఆ సీతారామలక్ష్మణులు ముగ్గురును పరస్పరము రక్షించుకొనుచు, అరణ్యములో ప్రవేశించి, నదులు దాటుచు, భరద్వాజాజ్ఞవలన చిత్రకూటపర్వత మునకు వెళ్లిరి. అచట ఒక పర్ణశాల నిర్మించుకొని అయోధ్యలో ఎట్లు సుఖముగా ఉండిరో అట్లే సుఖముగా నుండిరి. సీతారాములు లక్ష్మీనారాయణుల వలెను, సాక్షాల్లక్ష్మీనారాయణస్వరూపు లైన ఆ సీతారాములను సేవించు లక్ష్మణుడు సామగానపరాయణు డగు జీవన్ముక్తుని వలెను ఆనందముతో ఉండిరి.

మరి యొక అర్థము —వారు మువ్వురును, అవనేన సహ=స్థలప్రదేశ ముతో గూడ, వనం గత్వా=అరణ్యమును పొంది, స్థలప్రదేశమును అరణ్యమును కూడ పొంది అని అర్థము. బహూదకాః, నదీః, అను, తీర్త్వా, భరద్వాజస్య శాసనాత్ చిత్రకూటం ప్రాప్య రమ్యమ్ ఆవసథం కృత్వా, తే=వనవాసులుగానే, అనగా నాగరికులుగా నుండి నూతనముగా వనవాసు లైనవారి కుండెడు వైలక్షణ్య మేమియు లేక యెప్పటికిని వనములోనే వాసముచేయుచుండు వారుగానే అని అర్థము. "తత్ర వనే రమమాణాః దేవగన్ధర్వసఙ్కాశాః సుఖం న్యవసన్."

తా. ఆ సీతారామలక్ష్మణులు ముగ్గురును స్థలప్రదేశములలోను, వనప్రదేశ ములలోను సంచరించుచు, భరద్వాజాజ్ఞవలన చిత్రకూటపర్వతము చేరి, అచట

పర్ణశాల నిర్మించుకొని, నగరములో సుఖ మనుభవించినవారము అనెడు భేద మెంతమాత్రము లేక, మొదటినుండియు వనములోనే ఉండువారు ఎట్లు సంతోష ముతో ఉందురో అట్లే సంతోషముతో నున్నవారై, ఆ చిత్రకూటవనములో విహరించుచు, దేవగంధర్వుల వలె సుఖముగా నుండిరి.

మరి యొక అర్థము :— తే త్రయః, తేవనేన=క్రీడచేత, "తేవృ దేవనే" అను ధాతువునుండి నిష్పన్న మైనది. మిగిలినది పైన చెప్పినట్లే.

తా. ఆ సీతారామలక్ష్మణులు క్రీడించుచున్నట్లు సుఖముగా అరణ్యము ప్రవేశించి............మొ.

మరి యొక అర్థము :— తే త్రయః, తేవనేన=కాలినడకచేత,....శేషము పై విధముగానే.

తా. ఆ సీతారామలక్ష్మణులు కాలినడకచేత అరణ్యమును ప్రవేశించి....మొ.

భరద్వాజః :— బిభ్రత్ వాజః=భరద్వాజః, 'వాజః' అనగా 'ప్రజ' అని వేదములో చెప్పబడినది. "ప్రజలను భరించువాడు" అని అర్థము. లేదా—'వాజః' అనగా "రేతస్సు" అని వేదమునందు చెప్పబడినది. రేతస్సును ధరించినవాడు, అనగా నిత్యబ్రహ్మచారి అని అర్థము (ఇవి తనిశ్లోకిలో చెప్పిన అర్థములు). 30, 31

మూ. చిత్రకూటం గతే రామే పుత్రశోకాతుర స్తథా, 32
రాజా దశరథః స్వర్గం జగామ విలపన్ సుతమ్.

ప్ర. అ. రామే=రాముడు, తథా (ఇది గోవిందరాజపాఠము) = అట్లు, చిత్రకూటం గతే = చిత్రకూటమునకు వెళ్లగా, పుత్రశోకాతురః = కుమారుని గూర్చిన దుఃఖముచేత పీడింపబడిన, రాజా దశరథః = దశరథమహారాజు, సుతమ్=కుమారుని గూర్చి, విలపన్=ఏడ్చుచు, స్వర్గమ్=స్వర్గమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. రాముడు చిత్రకూటమునకు వెళ్లిన పిమ్మట దశరథుడు పుత్రశోకము చేత పీడితుడై, పుత్రుని గూర్చి ఏడ్చుచు స్వర్గస్థు డయ్యెను.

వి. "తథా"కు బదులు 'తదా' అని మహేశ్వరతీర్థపాఠము. తదా= అప్పుడు. 32

మూ. మృతే తు తస్మిన్ భరతో వసిష్ఠప్రముఖైర్ద్విజైః, 33
నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛద్రాజ్యం మహాబలః.

ప్ర. అ. తస్మిన్=దశరథుడు, మృతే=మరణింపగా, మహాబలః=గొప్ప శక్తిగల, భరతః తు=భరతుడు కూడ, వసిష్ఠప్రముఖైః=వసిష్ఠుడు మొదలైన, ద్విజైః=బ్రాహ్మణులచేత, రాజ్యాయ=రాజ్యము చేయుటకు, నియుజ్యమానః=ఆజ్ఞాపింపబడిన వాడైనను, రాజ్యమ్=రాజ్యమును, నైచ్ఛత్=అంగీకరించలేదు.

తా. దశరథుడు మరణించిన పిదప వసిష్ఠాదులు రాజ్యము చేయు మని భరతుని ఆజ్ఞాపించిరి. అయినను, తనకు రాజ్యము చేయు సామర్థ్య మున్నను, భరతుడు రామునిపై తన కున్న గౌరవముచే, రాజ్యమునకు ఒప్పుకొనలేదు.

వి. ఇచట 'తు' అనుదానికి 'అపి' (కూడ) అని అర్థము. 33

మూ. స జగామ వనం వీరో రామపాదప్రసాదకః.

ప్ర.అ. వీరః=రాగద్వేషాదులను జయించిన, సః=ఆ భరతుడు, రామపాద ప్రసాదకః=పూజ్యుడైన రాముని ప్రసన్నునిగా చేసికొనువాడై, లేదా, రాముని పాదములను ప్రసన్నములుగా చేసికొనువాడై, వనమ్=అరణ్యమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా రాగద్వేషాదులు జయించిన ఆ భరతుడు రాముని అనుగ్రహింప చేసికొనుటకై అరణ్యమునకు వెళ్లెను.

వి. "పాద" శబ్దమునకు 'పూజనీయము' అని అర్థము. "పూజ్యే తు పాదనామాఙ్కః" అని అమరము. 34

మూ. గత్వా తు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
అయాచద్భ్రాతరం రామమార్యభావపురస్కృతః. 35

ప్ర. అ. ఆర్యభావపురస్కృతః = వినయముచే పూజింపబడిన, లేదా పూజింపబడిన వినయము గల ఆ భరతుడు, సుమహాత్మానమ్ = మిక్కిలి పూజ్యమైన హృదయము కలవాడును, సత్యపరాక్రమమ్=సత్యమునందు దృఢవ్రతము కలవాడును అగు, రామమ్=రాముని, గత్వా=చేరి, భ్రాతరమ్=సోదరుడైన, రామమ్=ఆ రాముని, అయాచత్=ప్రార్థించెను.

తా. భరతుడు వినయముతో సుమహాత్ముడును, సత్యవ్రతుడును, తన సోదరుడును అగు, రాముని చేరి ప్రార్థించెను.

వి. ఒక 'రామమ్' అను పదమునకు "సంతోషమును కలిగించువాడు" అని అర్థము చెప్పవచ్చును. రామం రామమ్=సంతోషముకలిగించు రాముని. 'తు' అనునది పాదపూరణార్థము.

మూ. త్వమేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్.

ప్ర. అ. ధర్మజ్ఞః=ధర్మముల నెరిగిన, త్వమేవ=నీవే, రాజా=రాజువు; ఇతి=అని, రామమ్=రాముని గూర్చి, వచః=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. "నీవు సమస్తధర్మములు తెలిసినవాడవు. అన్నగా రుండగా తమ్ముడు రాజ్యము చేయరాదు అను ధర్మము నీకు తెలియనిది కాదు. అందుచేత నీవే రాజు కావలెను" అని భరతుడు రామునితో చెప్పెను. 35

మూ. రామోఽపి పరమోదారః సుముఖః సుమహాయశాః,
న చైచ్ఛత్పితురాదేశాద్రాజ్యం రామో మహాబలః. 36

ప్ర. అ. రామోఽపి=సమస్తజనులను ఆనందింపచేయువాడైనను, పరమోదారోఽపి=స్వసాయుజ్యము మొదలైన అన్ని కోరికలను తీర్చువాడైనను, సుముఖోఽపి = యాచకులు లభించుటచే ప్రసన్నమైన ముఖము కలవాడైనను, సుమహాయశాః = దానాతిశయముచే కలిగిన గొప్ప కీర్తి కలవాడైనను, మహాబలః = ఒక బాణముచేత సమస్తరాక్షసులను సంహరించు నంత బలము కలవాడైనను, లేదా ఆశ్రితుల కోరికలను తీర్చు సామర్థ్యము కలవాడైనను, రామః=రాముడు, పితుః=తండ్రియొక్క, ఆదేశాత్=ఆజ్ఞవలన, రాజ్యమ్=రాజ్యమును, నైచ్ఛత్=కోరలేదు.

తా. రాముడు అందరికిని సంతోషమునే కలిగించును. తనను ఆశ్రయించిన వారికి సాయుజ్యము మొదలైన సకలాభీష్టములను ఇచ్చును. ఎవరైన యాచించినంతమాత్రముననే "యాచకుల మనోరథమును తీర్చు భాగ్యము నాకబ్బినది కదా" అని సంతోషించును. "న హ్యర్థినః కార్యవశాదుపేతాః కకుత్స్థవంశే విముఖాః ప్రయాన్తి" (ఏదైన కార్యమును కోరి కకుత్స్థవంశమువారివద్దకు వచ్చిన యాచకులు ఎన్నడును నిరాశులై వెళ్లరు) అని విష్ణుపురాణములో చెప్పినట్లు

ప్రసిద్ధ మైన దానజనితకీర్తికలవాడు. ఆశ్రయించినవారి అభీష్టములను నెరవేర్చుటకు సమర్థుడు. ఇంతటి మృదుస్వభావు డైనను రాముడు, తండ్రి యాజ్ఞను అనుసరింపవలెనను దీక్షచే, భరతుడు ఎంత ప్రార్థించినను రాజ్యమును స్వీకరించుటకు అంగీకరించలేదు.

వి. "న చ ఐచ్ఛత్" అని 'చ'కారమును ప్రయోగించుటచే తండ్రి చెప్పిన గడువు తరువాత రాజ్యమును గ్రహించుటకు అంగీకరించెను అని సూచితము. 36

మూ. పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్వా పునః పునః, 37
నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః.

ప్ర. అ. భరతాగ్రజః=రాముడు, రాజ్యాయ=రాజ్యముచేయుటకు, అస్య=ఈ భరతునకు, పాదుకే=(తన) పాదుకలను, న్యాసమ్=న్యాసమునుగా (ఇల్లడగా), దత్వా=ఇచ్చి, తతః=అటుపిమ్మట, పునః పునః=మాటిమాటికిని, భరతమ్=భరతుని, నివర్తయామాస=మరలించెను.

తా. "నేను వచ్చునంతవరకును నా పాదుకలను నా ప్రతినిధిగా రాజ్యము చేయుటకై ఉంచుకొనుము" అని చెప్పి, తన పాదుకలను భరతున కిచ్చి, రాముడు ఆతనికి అనేకవిధముల బోధించి అయోధ్యకు పంపెను. 37

మూ. స కామమనవాప్యైవ రామపాదావుపస్పృశన్, 38
నన్దిగ్రామేఽకరోద్రాజ్యం రామాగమనకాఙ్క్షయా.

ప్ర.అ. సః=ఆ భరతుడు, కామమ్=కోరికను, అనవాప్యైవ=పొందకయే, రామపాదౌ = రాముని పాదుకలను, ఉపస్పృశన్ = సేవించుచు, రామాగమన కాఙ్క్షయా=రాముడు తిరిగి రాగల డను కోరికతో, నన్దిగ్రామే = నందిగ్రామము నందు, రాజ్యమ్ అకరోత్=రాజ్యము చేసెను.

తా. రాముని తిరిగి తీసికొనివెళ్లవలె నన్న కోరిక తీరని భరతుడు ఆ రామపాదుకలనే సేవించుచు, రాముడు సుఖముగా తిరిగి రావలె నని మనస్సులో కోరుకొనుచు, అయోధ్యాసమీపమున నున్న నందిగ్రామ మనెడు గ్రామములో నివసించి, రాజ్యము చేసెను. 38

మూ. గతే తు భరతే శ్రీమాన్ సత్యసన్ధో జితేన్ద్రియః, 39
రామస్తు పునరాలక్ష్య నాగరస్య జనస్య చ,
తత్రాగమనమేకాగ్రో దణ్డకాన్ ప్రవివేశ హ. 40

ప్ర. అ. భరతే=భరతుడు, గతే తు=వెళ్లినవాడగుచుండగా, శ్రీమాన్=భరతాగమనముచే కలిగిన ప్రతిజ్ఞాభంగభయము పోవుటచే ప్రశస్తమైన కాంతి కలవాడును, సత్యసన్ధః=భరతుడు నిర్బంధించినను ఎంతమాత్రము చలింపని ప్రతిజ్ఞ కలవాడును, జితేన్ద్రియః=జయింపబడిన ఇంద్రియములు కలవాడును, అనగా భరతాదుల ప్రార్థనలు వ్యాజముగా గొని తాను తిరిగి పోయి భోగములను అనుభవింపవచ్చును. ఐనను అట్టి భోగచాపలము లేనివాడు అని అర్థము. రామః తు=రాముడు, నాగరస్య జనస్య చ=నగరజనముయొక్కయు,(చకారముచే భరతునియొక్కయు అని సూచన), పునః=మరల, తత్ర=ఆ చిత్రకూట పర్వతమునందు, ఆగమనమ్=రాకను, ఆలక్ష్య=ఊహించి, ఏకాగ్రః=(తండ్రియాజ్ఞను నిర్వర్తించుటకు) ఏకాగ్రచిత్తుడై, లేదా (విరోధులైనరాక్షసు లుండుటచే) సావధానుడై, దణ్డకాన్=దండకారణ్యమును, ప్రవివేశ హ=ప్రవేశించెను.

తా. భరతుడు వెళ్లగానే రాముడు, ఆతడు వచ్చుటచే తనకు కలిగిన ప్రతిజ్ఞాభంగభయము పోవుటచే సర్వాతిశాయి యగు కాంతి కలవాడై, భరతుడెంత నిర్బంధించినను తన ప్రతిజ్ఞనుండి చలింపక, కౌసల్యాభరతాదులు చేసిన ప్రార్థనలు వ్యాజముగా తీసికొని తాను మరల రాజ్యము నంగీకరించుటకు అవకాశ మున్నను, రాజ్యభోగములపై ఎంతమాత్రము చాపలము చూపక, అయోధ్యాపౌరులును భరతాదులును మాటిమాటికి ఆ చిత్రకూటపర్వతమునకు వచ్చుచుందురు అని ఊహించి, పితాజ్ఞాపాలనమునందు సావధానుడై దండకావనమును ప్రవేశించెను. 39–40

అవ :— ఇపుడు అరణ్యకాండకథను చెప్పుచున్నాడు —

మూ. ప్రవిశ్య తు మహారణ్యం రామో రాజీవలోచనః,
విరాధం రాక్షసం హత్వా శరభఙ్గం దదర్శ హ. 41
సుతీక్ష్ణం చాప్యగస్త్యం చ అగస్త్యభ్రాతరం తథా.

ప్ర. అ. రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు గల, రామః =

రాముడు, మహారణ్యమ్=దండకారణ్యమును, ప్రవిశ్య తు=ప్రవేశించగనే, విరాధమ్=విరాధు డను, రాక్షసమ్=రాక్షసుని, హత్వా=చంపి, శరభఙ్గమ్=శరభంగమహర్షిని, సుతీక్ష్ణం చ=సుతీక్ష్ణమహర్షిని, అగస్త్యం చ = అగస్త్యుని, తథా = మరియు, అగస్త్యభ్రాతరం చ=అగస్త్యుని సోదరుని, దదర్శ హ=చూచెను.

తా. పద్మములవంటి నేత్రములు గల రాముడు, దండకారణ్యమును ప్రవేశించిన వెనువెంటనే విరాధు డను రాక్షసుని చంపి, శరభంగ – సుతీక్ష్ణ – అగస్త్యమహర్షులను, అగస్త్యుని సోదరుని చూచెను. 41

మూ. అగస్త్యవచనాచ్చైవ జగ్రాహైన్ద్రం శరాసనమ్, 42
ఖడ్గం చ పరమప్రీతస్తూణీ చాక్షయసాయకౌ.

ప్ర. అ. అగస్త్యవచనాత్ చ ఏవ=అగస్త్యుని మాటప్రకారమే, ఐన్ద్రమ్=ఇంద్రునిచే ఇవ్వబడిన, శరాసనమ్=ధనుస్సును, ఖడ్గం చ =కత్తిని, అక్షయసాయకౌ=అక్షయము లైన బాణములు గల, తూణీ చ = అమ్ముల పొదులను, పరమప్రీతః=చాల సంతసించినవాడై, జగ్రాహ=స్వీకరించెను.

తా. అగస్త్యుడు తన కింద్రు డిచ్చిన ధనుస్సును, కత్తిని, తరగని బాణములు గల అమ్ములపొదులను తీసికొను మని రామున కీయగా ఆతడు తనకు తగిన ఆయుధములు దొరకినందులకు చాల సంతసించి, వానిని గ్రహించెను. 42

మూ. వసతస్తస్య రామస్య వనే వనచరైః సహ,
ఋషయోఽభ్యాగమన్సర్వే వధా యాసురరక్షసామ్. 43

ప్ర. అ. తస్య రామస్య=ఆ రాముడు, వనే=శరభంగమహర్షి ఆశ్రమమునందు, వసతః=నివసించుచుండగా, సర్వే=అందరు, ఋషయః=ఋషులును, వనచరైః సహ = వానప్రస్థులైన మునులతో గూడ, అసురరక్షసాం వధాయ = అసురులను రాక్షసులను చంపు మని కోరుటకు, అభ్యాగమన్=వచ్చిరి.

తా. రాముడు శరభంగమహర్షి తపోవనములో వాసము చేయుచుండగా ఆ చుట్టు ప్రక్కల నున్న ఋషు లందరును, "అసురులను, రాక్షసులను సంహరింపుము" అని ప్రార్థించుటకై రామునివద్దకు వచ్చిరి.

**అర్థాంతరము :— వనచరైః సహ వసతః తస్య రామస్య = మునులతో**

కలిసి నివసించుచున్న ఆ రామునకు, ఋషులందరును, అసురరక్షసామ్ = (అసు+ర=ప్రాణములను గ్రహించువారు) తమను హింసించుచున్న రాక్షసుల యొక్క, వధకొరకై, అభ్యాగమన్=శరణాగతులైరి.

తా. శరభంగతపోవనమునందు మునులతో కూడి నివసించుచున్న ఆ రామునకు, దండకావనములో నివసించు ఋషు లందరును, తమను హింసించు చున్న రాక్షసులను చంపించుటకై, శరణాగతులైరి (గోవిందరాజులు). 43

మూ. స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథా వనే, 44
ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధః సంయతి రక్షసామ్,
ఋషీణామగ్నికల్పానాం దణ్డకారణ్యవాసినామ్. 45

ప్ర. అ. సః=రాముడు, రాక్షసానామ్= రాక్షసుల (నివాసమైన), వనే= వనమునందు, తేషామ్=ఆ ఋషుల, తథా=ఆ ప్రార్థనను, ప్రతిశుశ్రావ=అంగీక రించెను, రామేణ=రామునిచేత, అగ్నికల్పానామ్=అగ్నితో సమానులైన, దణ్డ కారణ్యవాసినామ్=దండకారణ్యమునందు నివసించుచున్న, ఋషీణామ్ = ఋషు లకు, సంయతి=యుద్ధమునందు, రక్షసామ్=రాక్షసులయొక్క, వధశ్చ=చంపు టయు, ప్రతిజ్ఞాతః=ప్రతిజ్ఞచేయబడినది.

తా. రాక్షసనివాస మైన ఆ వనములో ఆ ఋషులు చేసిన ప్రార్థనను రాముడు అంగీకరించెను. "యుద్ధములో రాక్షసులను సంహరించెదను" అని అగ్నితుల్యతేజస్కు లగు ఆ దండకారణ్యవాసిమునులకు మాట ఇచ్చెను. 44_45

మూ. తేన తత్రైవ వసతా జనస్థాననివాసినీ,
విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ. 46

ప్ర. అ. తత్రైవ=ఆ దండకారణ్యమునందు, వసతా = నివసించుచున్న, తేన=ఆ రామునిచేత, కామరూపిణీ=ఇష్టమువచ్చిన రూపము ధరింప సమర్థురా లును, జనస్థాననివాసినీ=జనస్థాన మను పేరు గల, దండకారణ్యమునకు సంబం ధించిన ఒక ప్రదేశమునందు వాసము చేయుచుండు నదియు అగు, శూర్పణఖా= శూర్పణఖ యనెడు, రాక్షసీ = రాక్షసస్త్రీ, విరూపితా = వికృత మైన రూపము కలదిగా చేయబడెను.

తా. రాము డా దండకారణ్యములోనే నివసించుచు, ఆ దండకారణ్యము నందు, రావణుని సేనానివేశస్థాన మగు జనస్థానమునందు వాసము చేయు, కామ రూపిణి యగు శూర్పణఖ యను రక్కసిని ముక్కుచెవులు కోసి విరూపిణిగా చేసెను.

వి. "శూర్పతుల్యాః నఖాః యస్యాః సా శూర్పణఖా"—చేటలవంటి గోళ్లు గల స్త్రీ. శూర్పణఖను విరూపిణిగా చేసినది లక్ష్మణుడు కాని రాముడు కాదు. అయినను—"రామస్య దక్షిణో బాహుః" అని లక్ష్మణుడు రాముని కుడిచెయ్యి వంటి వాడని చెప్పబడుటచేతను, లక్ష్మణుడు రామాజ్ఞచేతనే అట్లు చేసినందు వలనను రాముడే శూర్పణఖను విరూపిణిగా చేసినట్లు చెప్పబడినది (గోవింద రాజులు). 46

మూ. తతః శూర్పణఖావాక్యాదుద్యుక్తాన్ సర్వరాక్షసాన్,
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్, 47
నిజఘాన రణే రామస్తేషాం చైవ పదానుగాన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శూర్పణఖావాక్యాత్=శూర్పణఖయొక్క మాటవలన, ఉద్యుక్తాన్ = యుద్ధముచేయుటకు సన్నద్ధులైన, సర్వరాక్షసాన్ = అందరు రాక్షసులను, ఖరమ్=ఖరుని, త్రిశిరసం చైవ=త్రిశిరసుని, దూషణమ్= దూషణు డను, రాక్షసం చైవ = రాక్షసుని, తేషామ్ = వారియొక్క, పదాను గాన్+చ+ఏవ = అనుచరులను, రామః = రాముడు, రణే=యుద్ధమునందు, నిజఘాన=చంపెను.

తా. శూర్పణఖ విరూపిత యైన పిమ్మట ఆ శూర్పణఖ మాట విని యుద్ధ మునకు వచ్చిన ఖరుని, త్రిశిరసుని, దూషణుని, వారి అనుచరు లైన సకల రాక్ష సులను రాముడు యుద్ధమునందు సంహరించెను. 47

మూ. వనే తస్మిన్నివసతా జనస్థాననివాసినామ్, 48
రక్షసాం నిహతాన్యాసన్ సహస్రాణి చతుర్దశ.

ప్ర. అ. తస్మిన్=ఆ, వనే=వనమునందు, నివసతా=నివసించుచున్న ఆ రామునిచేత, జనస్థాననివాసినామ్=జనస్థానమునందు నివసించుచున్న, రక్షసామ్=

రాక్షసులయొక్క, చతుర్దశ=పదునాలుగు, సహస్రాణి=వేలు, నిహతాని=చంప బడినవి, ఆసన్=అయినవి.

తా. దండకారణ్యమునందు నివసించు నపుడు రాముడు జనస్థానములో నివసించు రాక్షసులలో పదునాలుగు వేలమందిని సంహరించెను. 48

మూ. తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః, 49
సహాయం వరయామాస మారీచం నామ రాక్షసమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణః=రావణుడు, జ్ఞాతివధమ్=జ్ఞాతుల వధను, శ్రుత్వా=విని, క్రోధమూర్ఛితః=కోపముతో నిండినవాడై, మారీచం నామ=మారీచు డనెడు, రాక్షసమ్ = రాక్షసుని, సహాయమ్ = సహాయునిగా, వరయామాస=కోరెను.

తా. పిమ్మట రావణుడు జ్ఞాతుల మరణవార్త విని, మిక్కిలి కోపించిన వాడై, తనకు సాహాయ్యము చేయు మని మారీచు డను రాక్షసుని కోరెను.

వి. "రావయతీతి రావణః"—"లోకముచే రోదనధ్వని చేయించువాడు" అని అర్థము. "రు శబ్దే" అను ధాతువునుండి నిష్పన్న మైనది. "విశ్రవసో విశ్ర వణ రవణౌ" అను ప్రమాణమును పట్టి "విశ్రవసః అపత్యం పుమాన్ రావణః" అను విగ్రహముచే 'రావణః' అనగా విశ్రవసుని కుమారు డని అర్థము (గోవింద రాజులు). 49

మూ. వార్యమాణః సుబహుశో మారీచేన స రావణః, 50
న విరోధో బలవతా క్షమో రావణ తేన తే.

ప్ర. అ. సః=ఆ, రావణః=రావణుడు, "రావణ=ఓ రావణా! బలవతా= ఖరాదిరాక్షసులను చంపుటచే ప్రసిద్ధ మైన బలము గల, తేన = ఆ రామునితో, విరోధః=విరోధము, తే=నీకు, న క్షమః=తగినది కాదు, అని, సుబహుశః = అనేకపర్యాయములు, వార్యమాణః=అడ్డగింపబడినవాడు, (అభూత్=ఆయెను).

తా. "ఓ రావణా! మహాబలవంతులైన ఖరుడు మొదలగు పదునాలుగు వేల రాక్షసులను చంపి నట్టి బలవంతు డైన రామునితో వైరము పెట్టుకొనకుము" అని మారీచుడు రావణుని అనేకపర్యాయములు వారించెను. 50

మూ. అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః, 51
జగామ సహమారీచ స్తస్యాశ్రమపదం తదా.

ప్ర. అ. రావణః=రావణుడు, కాలచోదితః = మృత్యువుచే ప్రేరితుడై, తద్వాక్యమ్=ఆ వాక్యమును, అనాదృత్య తు=ఆదరింపకయే, సహమారీచః = మారీచునితో కూడినవాడై, తదా=అప్పుడు, తస్య=ఆ రాముని యొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమస్థానమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. మృత్యువు సమీపించుటచే రావణుడు మారీచుని మాటలు వినలేదు. అతనిని వెంటబెట్టుకొని రాముని ఆశ్రమమునకు వెళ్లెను. 51

మూ. తేన మాయావినా దూరమపవాహ్య నృపాత్మజౌ, 52
జహార భార్యాం రామస్య గృధ్రం హత్వా జటాయుషమ్.

ప్ర. అ. మాయావినా=మాయావియైన, తేన=ఆ మారీచునిచేత, నృపాత్మజౌ = రాజకుమారు లైన ఆ రామలక్ష్మణులను, దూరమ్ = దూరముగా, అపవాహ్య = తొలగిపోవు నట్లు చేయించి, జటాయుషమ్ = జటాయు వను, గృధ్రమ్=గ్రద్దను, హత్వా=చంపి, రామస్య = రామునియొక్క, భార్యామ్= భార్య యైన సీతను, జహార=అపహరించెను.

తా. మాయావి యైన మారీచుని ద్వారా రామలక్ష్మణులు పర్ణశాలనుండి చాల దూరము వెళ్లిపోవునట్లు చేసి, రాముని భార్య యగు సీతను అపహరించెను. ఆమెను విడిపించుటకై వచ్చిన జటాయువును చంపెను. 52

మూ. గృధ్రం చ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వా చ మైథిలీమ్,
రాఘవః శోకసన్తప్తో విలలాపాకులేన్ద్రియః. 53

ప్ర. అ. రాఘవః=రాముడు, నిహతమ్=పడగొట్టబడిన, గృధ్రమ్=జటాయువును, దృష్ట్వా=చూచి, మైథిలీమ్=సీతను, హృతామ్ = హరింపబడిన దానినిగా, శ్రుత్వా చ=విని, శోకసన్తప్తః = దుఃఖముచే మిక్కిలి తపింపబడిన వాడై, ఆకులేన్ద్రియః = వ్యాకుల మైన ఇంద్రియములు కలవాడై, విలలాప= విలపించెను.

తా. రాముడు, చచ్చుటకు సిద్ధమై పడియున్న జటాయువును చూచి, ఆ

జటాయువువలన సీతాదేవిని రావణు డపహరించినట్లు విని, మిక్కిలి దుఃఖితుడై, ఇంద్రియములను వశములో ఉంచుకొనజాలక విలపించెను. 53

మూ. తత స్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్, 54
మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శ హ.
కబన్ధం నామ రూపేణ వికృతం ఘోరదర్శనమ్. 55

ప్ర. అ. తేన=ఆ, శోకేనైవ = దుఃఖముచేతనే, తతః=వ్యాపింపబడిన ఆ రాముడు, గృధ్రమ్=గ్రద్ద యైన, జటాయుషమ్=జటాయువును, దగ్ధ్వా=దహించి, వనే=అరణ్యమందు, సీతామ్=సీతాదేవిని, మార్గమాణః=వెదకుచు, రూపేణ=ఆకారముచే, వికృతమ్ = వికారముగా నున్న, ఘోరదర్శనమ్=భయంకర మైన దర్శనముగల, కబన్ధం నామ=కబంధు డనెడు, రాక్షసమ్=రాక్షసుని, సందదర్శ హ=చూచెను.

తా. అత్యధిక మైన దుఃఖముతో రాముడు జటాయువునకు దహనసంస్కారము చేసి, సీతకై వెదకుచు, ఆ వనములో వికృత మైన ఆకారముతో, భయంకరముగా ఉన్న కబంధు డనెడి రాక్షసుని చూచెను. 54–55

మూ. తం నిహత్య మహాబాహుర్దదాహ స్వర్గతశ్చ సః,
స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్, 56
శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, ఆ రాముడు, తమ్=ఆ కబంధుని, నిహత్య=చంపి, దదాహ=కాల్చివేసెను, సః=ఆతడు, స్వర్గతశ్చ=స్వర్గమును పొందెను, స చ = స్వర్గమునకు వెళ్లుచున్న ఆ కబంధుడు, రాఘవ=ఓ రామా !, ధర్మచారిణీమ్ = ధర్మములను ఆచరించుచున్నదియు, ధర్మనిపుణామ్=ధర్మములయందు సమర్థురాలును, శ్రమణీమ్=సన్న్యాసాశ్రమమును స్వీకరించి ఉన్నదియు అగు, శబరీమ్ = శబరజాతిస్త్రీని గూర్చి, అభిగచ్ఛ=వెళ్లుము, ఇతి=అని, అస్య=ఈ రామునకు, కథయామాస=చెప్పెను.

తా. బలిష్ఠము లైన బాహువులు గల ఆ రాముడు ఆ కబంధుని చంపి, దహనసంస్కారము చేయగా, అతడు స్వర్గమునకు వెళ్లెను. అతడు స్వర్గమునకు

పోవుటకు ముందు—"ఓ రామా! ధర్మమును ఆచరించుటయందు నేర్పు కలదియు, ధర్మమును ఆచరించునదియు, అగు ఒక శబరస్త్రీ సన్న్యాసాశ్రమ మును స్వీకరించియున్నది. ఆమె వద్దకు వెళ్లుము" అని చెప్పెను.

విశేషార్థము :—"చతుర్థమాశ్రమం ప్రాప్తాః శ్రమణా నామ తే స్మృతాః" (నాల్గవ ఆశ్రమమును స్వీకరించినవారు శ్రమణులు) అని చెప్పుటచే శ్రమణు లనగా సన్న్యాసులు. కావున "శ్రమణీ" అని చెప్పబడినది.

జితేంద్రియురాలై మోక్షోపయుక్తాచారనిష్ఠ యగు స్త్రీ శ్రమణి; (మహే శ్వ

"నృపాయాం వైశ్యతో జాతః శబరః పరికీర్తితః, మధూని వృక్షాదానీయ విక్రీణీతే స్వవృత్తయే" (క్షత్రియస్త్రీకి వైశ్యునివలన పుట్టినవాడు శబరుడు. వృక్ష ములనుండి తేనెను తీసి, విక్రయించుట ఆతని జీవిక) అను నారదీయవచనాను సారముగా క్షత్రియస్త్రీకిని వైశ్యునకును పుట్టినది శబరి (గోవిందరాజులు).

బౌద్ధ సన్న్యాసులకు శ్రమణు లను నామము కలదు. ఇచట శ్రమణీశబ్ద మున్నది గాన రామాయణము బుద్ధుని తరువాత వ్రాయబడిన దని కొందరు చెప్పుచుందురు. కాని, నాస్తికులకు బౌద్ధు లను పేరు ప్రాచీనకాలముననే ఉన్నది. శ్రమణశబ్దము స్మృతులలో ప్రయుక్త మైయున్నది. అందుచే పై వాదము యుక్తము కాదని మరికొందరు సమాధానము చెప్పుదురు. 56

మూ. సోఽభ్యగచ్ఛన్మహాతేజాః శబరీం శత్రుసూదనః, 57
శబర్యా పూజితః సమ్యగ్రామో దశరథాత్మజః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును, శత్రుసూదనః=శత్రు సంహారకుడును అయిన, సః=ఆ రాముడు, శబరీమ్=శబరిని గూర్చి, అభ్య గచ్ఛత్=వెళ్లెను, దశరథాత్మజః రామః = దశరథుని కుమారు డైన రాముడు, శబర్యా=శబరిచేత, సమ్యక్=బాగుగా, పూజితః=పూజింపబడెను.

తా. మహాతేజశ్శాలియు, శత్రుసంహారకుడును అయిన రాముడు భక్త పరాధీనుడు గాన తానే స్వయముగ శబరి దగ్గరకు వెళ్లెను. శబరి ఆ రాముని చక్కగ పూజించెను.

వి. "దశరథాత్మజః" అను విశేషణము—అరువదివేల సంవత్సరములు, సంతానములేకయుండి తరువాత మహాప్రయత్నము చేసి సంతానము పొందిన దశరథుడు, తన ప్రియపుత్రుడగు రామునకిచ్చు భోజనము కంటెను ఆ శబరస్త్రీ ఇపుడిచ్చిన వన్యాహారముతో కూడిన ఆతిథ్యము రామునకు హెచ్చుగా ప్రీతి కలిగించినదని సూచించుచున్నది (గోవిందరాజులు). 57

అవ. ఇపుడు కిష్కింధాకాండ కథ చెప్పబడుచున్నది—

మూ. పమ్పాతీరే హనుమతా సఙ్గతో వానరేణ హ, 58
హనుమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః.

ప్ర. అ. పమ్పాతీరే=పంపాసరస్తీరమునందు, హనుమతా = హనుమంతుడనెడు, వానరేణ=వానరునితో, సఙ్గతః హ=చేరెను, హనుమద్వచనాత్=హనుమంతుని మాటవలన, సుగ్రీవేణ చైవ=సుగ్రీవునితోగూడ, సమాగతః=చేరెను.

తా. రాముడు పంపాసరస్తీరమున హనుమంతునితో పరిచయ మేర్పరచుకొని పిదప ఆతని మాట ప్రకారము సుగ్రీవునితో స్నేహము చేసికొనెను.

వి. హనుమాన్=ప్రశస్తమైన చెక్కిళ్ల మీది భాగము కలవాడు. పూర్వము హనుమంతుడు పుట్టుచునే సూర్యుని చూచి "ఇది ఒక ఫలము; దీనిని భక్షించెదను" అని తలచి అతనిపై కెగిరెను. ఇట్లు సూర్యుని వేడిని ఎంతమాత్రము లెక్కింపక మూడువందల యోజనముల వరకు పైకి లంఘింపగా, ఇంద్రుడు చూచి, కోపించి, హనుమంతునిపై వజ్రాయుధమును వేసెను. వజ్రము దెబ్బ తగిలి హనుమంతుడు ఒక కొండపై పడిపోగా అతని వామహనువు భగ్నమయ్యెను. అందుచే అతనికి హనుమంతు డను పేరు వచ్చెను. ఈ శబ్దముచే మహాపరాక్రమశాలి యని సూచింపబడుచున్నది.

"సీతను పోగొట్టుకొని దుఃఖితుడై అరణ్యములో సంచరించుచున్న రామునకు, మహాపరాక్రమశాలియైన హనుమంతుని స్నేహము ఘటిల్లెను. సంతోషము!" అని ఈ శ్లోకమునందు కవితాత్పర్యము (గోవిందరాజులు). 58

మూ. సుగ్రీవాయ చ తత్సర్వం శంసద్రామో మహాబలః, 59
ఆదితస్తద్యథావృత్తం సీతాయాశ్చ విశేషతః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రామః=రాముడు, ఆదితః=మొదటినుండియు, తత్=ఆ, సర్వమ్=సమస్తమైన, (వృత్తమ్=వృత్తాంతమును), విశేషతః=ప్రధానముగా, సీతాయాశ్చ=సీతయొక్క వృత్తాంతమును, యథావృత్తమ్=జరిగినది జరిగినట్లుగా, సుగ్రీవాయ చ = సుగ్రీవునకును, హనుమంతునకును కూడ, శంసత్=చెప్పెను.

తా. మహాబలు డగు రాముడు తనవృత్తాంతము నంతను, మొదటినుండియు సుగ్రీవహనుమంతులకు చెప్పి, విశేషించి సీతావృత్తాంతమును వారికి తెలిపెను. 59

మూ. సుగ్రీవశ్చాపి తత్సర్వం శ్రుత్వా రామస్య వానరః,
చకార సఖ్యం రామేణ ప్రీతశ్చైవాగ్నిసాక్షికమ్. 60

ప్ర. అ. వానరః=వానరుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామస్య=రామునియొక్క, తత్ సర్వమ్=ఆ వృత్తాంతము నంతను, శ్రుత్వా=విని, ప్రీతః=సంతోషించినవాడై, అగ్నిసాక్షికం చైవ=అగ్ని సాక్షిగా ఉండగా, రామేణ=రామునితో, సఖ్యమ్=స్నేహమును, చకార=చేసెను.

తా. సుగ్రీవుడు రాముని వృత్తాంత మంతయు విని, తనవలెనే దుఃఖితుడైన మహాబలునితో పరిచయము కలిగినందుకు సంతోషించి, అగ్నిసాక్షికముగా రామునితో మైత్రి చేసికొనెను. 60

మూ. తతో వానరరాజేన వైరానుకథనం ప్రతి,
రామాయావేదితం సర్వం ప్రణయాద్దుఃఖితేన చ 61

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దుఃఖితేన=దుఃఖితుడైన, వానరరాజేన=సుగ్రీవునిచేత, వైరానుకథనం ప్రతి = వాలితో కలిగిన వైరమును గూర్చిన ప్రశ్నకు సమాధానముగా, రామాయ = రామునకు, సర్వమ్ = అంతయు, ప్రణయాత్= స్నేహమువలన, ఆవేదితమ్=తెలుపబడెను.

తా. "నీకును వాలికిని విరోధ మెట్లు ఏర్పడినది?" అని రాముడు ప్రశ్నింపగా, సుగ్రీవుడు, దుఃఖించుచు, స్నేహముతో రామునకు ఆ వృత్తాంతము అంతయు తెలిపెను. 61

మూ. ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి, 62
వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః.

ప్ర. అ. తదా=అప్పుడు, రామేణ=రామునిచేత, వాలివధం ప్రతి=వాలిని చంపుటను గూర్చి, ప్రతిజ్ఞాతమ్=ప్రతిజ్ఞ చేయబడినది, తత్ర=అచట, వానరః=సుగ్రీవుడు, వాలినః=వాలియొక్క, బలమ్=బలమును, కథయామాస=వర్ణించి చెప్పెను.

తా. వాలిని చంపెద నని రాముడు ప్రతిజ్ఞచేసెను. సుగ్రీవుడు కూడ రామునకు — అరుణోదయము మొదలు సూర్యోదయము లోపల నాలుగు సముద్రములందును అర్ఘ్యములు విడుచుట మొదలగు వాలియొక్క బలవిశేషములను గూర్చి చెప్పెను. 62

మూ. సుగ్రీవః శఙ్కితశ్చాసీన్నిత్యం వీర్యేణ రాఘవే, 63
రాఘవప్రత్యయార్థం తు దున్దుభేః కాయముత్తమమ్,
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్. 64

ప్ర.అ. సుగ్రీవశ్చ=సుగ్రీవుడు, రాఘవే=రామునివిషయమున, వీర్యేణ=పరాక్రమముచేత, నిత్యమ్=ఎల్లప్పుడును, శఙ్కితః = సందేహము కలవాడై, ఆసీత్=ఉండెను, సుగ్రీవః=సుగ్రీవుడు, రాఘవప్రత్యయార్థమ్=రామునియందు తనకు నమ్మకము ఏర్పడుటకై, దున్దుభేః=దుందుభి యను రాక్షసునియొక్క, ఉత్తమమ్=శ్రేష్ఠమైన, మహాపర్వతసన్నిభమ్=గొప్ప పర్వతముతో సమానమైన, కాయమ్=కళేబరమును, దర్శయామాస=చూపెను.

తా. సుగ్రీవుడు రాముని చూచినది మొదలు "ఇతడు వాలిని చంప సమర్థుడో, కాడో" అని సందేహించుచుండెను. ఆతడు రామునివిషయమున తనకు నమ్మకము కలుగుటకై, కొండవలె నున్న, దుందుభి యను రాక్షసుని కళేబరమును రామునకు చూపెను. పూర్వ మొకప్పుడు దానిని వాలి చాలదూరముగ విసరివేసెను. 63—64

మూ. ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః,
పాదాఙ్గుష్ఠేన చిక్షేప సమ్పూర్ణం దశయోజనమ్. 65

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడును, మహాబలః = గొప్ప బలము కలవాడును అగు రాముడు, అస్థి=ఎముకను, ప్రేక్ష్య=చూచి, ఉత్స్మయిత్వా = గంభీరముగా కొంచెము నవ్వి, పాదాఙ్గుష్ఠేన = కాలి బొటన వ్రేలితో, సంపూర్ణం దశయోజనమ్=పూర్తి పదియోజనముల దూరము, చిక్షేప= చిమ్మెను.

తా. అంగుళ్యగ్రమాత్రముచే రాక్షసాది సమస్తలోకవిరోధులను వధించుటకు సమర్థములైన బాహువులును, లెక్కింపరాని వీర్యమును గల రాముడు—"నా విషయమై జ్ఞానులు కూడ మోహము పొందుచుందురు. అరణ్యములోని ఈ వానరుడు మోహము నొందుటలో ఏమి ఆశ్చర్యము" అని గంభీరముగా చిరునవ్వు నవ్వి, అస్థిమయమై పడి యున్న ఆ దుందుభి కళేబరమును చూచి, కొంచెమైనను తక్కువ కాకుండ పది యోజనముల దూరములో పడు నట్లు, దానిని తన పాదాంగుష్ఠముతో చిమ్మెను (మహేశ్వరతీర్థుల వ్యాఖ్యానము).

"ఉత్స్మయిత్వా" అను పదములో ఉన్న "ఉత్" అను ఉపసర్గను, 'చిక్షేప' అను క్రియాపదముతో కలిపి—"ఉచ్చిక్షేప=ఎత్తి విసరెను" అని గోవింద రాజులు అర్థము చెప్పిరి.

తా. ఊహింపరాని బలము కలవాడును, ఆ బలమునకు తగి నట్లు కార్యము చేయ సమర్థములైన బాహువులు కలవాడును అగు రాముడు అస్థిమయమైన ఆ దుందుభికళేబరమును చూచి, "ఇది ఎంత ?" అని నవ్వి, కొంచెమైనను తక్కువ లేకుండ పది యోజనముల దూరములో పడునట్లు, దానిని తన పాదాంగుష్ఠముతో ఎత్తి విసరెను. 65

మూ. బిభేద చ పునః సాలాన్ సప్తైకేన మహేషుణా,
గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయం తదా. 66

ప్ర. అ. తదా=అప్పుడు, పునశ్చ=మరల, ప్రత్యయమ్=నమ్మకమును, జనయన్=పుట్టించుచు, ఏకేన=ఒక, మహేషుణా=గొప్పబాణముచేత, సప్త= ఏడు, సాలాన్=మద్దిచెట్లను, గిరిమ్=పర్వతమును, రసాతలం చైవ=పాతాళమును, బిభేద=భేదించెను.

తా. అప్పుడా రాముడు, సుగ్రీవున కింకను నమ్మకము కలుగుటకై ఒక్క బాణముచే ఏడు మద్దిచెట్లను, పర్వతమును, పాతాళమును భేదించెను. 66

మూ. తతః ప్రీతమనాశ్చైవ విశ్వస్తశ్చ మహాకపిః,
కిష్కిన్ధాం రామసహితో జగామ చ గుహాం తదా. 67

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేన=దానిచేత, ప్రీతమనాః=సంతసించిన మనస్సు గల, సః=ఆ, మహాకపిః=సుగ్రీవుడు, విశ్వస్తశ్చ=నమ్మకము కూడ కుదిరినవాడై, తదా=అప్పుడు, రామసహితః=రామునితో కూడినవాడై, గుహామ్=గుహవలె నున్న, కిష్కిన్ధామ్=కిష్కింధానగరమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. రాముడు ఆ సప్తసాలాది భేదనము చేసిన పిమ్మట సుగ్రీవునకు నమ్మిక కుదిరెను. తనకు రాజ్యము లభించు నని అతడు సంతసించి, రాముని వెంటబెట్టుకొని గుహవలె నున్న కిష్కింధాపట్టణమునకు వెళ్లెను. 67

మూ. తతోఽ గర్జద్ధరివరః సుగ్రీవో హేమపిఙ్గళః,
తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః. 68

ప్ర. అ. తతః = అటుపిమ్మట, హరివరః = వానరశ్రేష్ఠుడును, హేమపిఙ్గలః=బంగారము వలె పచ్చని రంగు గలవాడును అగు, సుగ్రీవః=సుగ్రీవుడు, అగర్జత్=గర్జించెను, తేన=ఆ, మహతా = గొప్పదైన, నాదేన = ధ్వనిచేత, హరీశ్వరః=వానరరాజైన వాలి, నిర్జగామ=బైటకువచ్చెను.

తా. కిష్కింధ ప్రవేశించి, బంగారువంటి వన్నె గల వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు గర్జించెను. ఆ మహానాదమును విని వాలి గృహమునుండి బైటకు వచ్చెను. 68

మూ. అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః,
నిజఘాన చ తత్రైనం శరేణైకేన రాఘవః. 69

ప్ర. అ. తదా=అప్పుడు, తారామ్=భార్యయైన తారను, అనుమాన్య = ఒప్పించి, సుగ్రీవేణ= సుగ్రీవునితో, సమాగతః=చేరెను, రాఘవః చ=రాముడు, తత్ర=అచట, ఏనమ్ = ఈ వాలిని, ఏకేన = ఒక, శరేణ = బాణముచేత, నిజఘాన=చంపెను.

తా. వాలి, యుద్ధమునకు వెళ్లవద్దని నివారించుచున్న తారను ఒప్పించి

సుగ్రీవునితో యుద్ధమునకు తలపడెను. అచట రాముడు ఒక్క బాణముతో వాలిని చంపెను. 69

మూ. తతః సుగ్రీవవచనాద్ధత్వా వాలిన మాహవే,
సుగ్రీవమేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్. 70

ప్ర.అ. రాఘవః=రాముడు, సుగ్రీవవచనాత్=సుగ్రీవుని మాటప్రకారము, ఆహవే=యుద్ధమునందు, వాలినమ్=వాలిని, హత్వా=చంపి, తతః = అటు పిమ్మట, తద్రాజ్యే=ఆ వాలియొక్క రాజ్యమునందు, సుగ్రీవమేవ=సుగ్రీవునే, ప్రత్యపాదయత్=ప్రతిష్ఠించెను.

తా. రాముడు సుగ్రీవుని ప్రార్థనప్రకారము వాలిని సంహరించి, ఆతని రాజ్యమునందు సుగ్రీవునే పట్టాభిషిక్తుని చేసెను. 70

మూ. స చ సర్వాన్ సమానీయ వానరాన్ వానరర్షభః,
దిశః ప్రస్థాపయామాస దిదృక్షుర్జనకాత్మజామ్. 71

ప్ర. అ. సః=ఆ, వానరర్షభశ్చ=సుగ్రీవుడును, జనకాత్మజామ్ = సీతాదేవిని, దిదృక్షుః=చూడ ఇచ్ఛ కలవాడై, సర్వాన్=సమస్తమైన, వానరాన్=వానరులను, సమానీయ = రప్పించి, దిశః=దిక్కులను గూర్చి, ప్రస్థాపయామాస=పంపెను.

తా. వానరశ్రేష్ఠు డగు సుగ్రీవుడు వానరు లందరిని రప్పించి, సీతాదేవిని అన్వేషించుటకై అన్ని దిక్కులకు పంపెను. 71

అవ. ఇపుడు సుందరకాండకథను చెప్పుచున్నాడు—

మూ. తతో గృధ్రస్య వచనాత్సంపాతేర్హనుమాన్ బలీ,
శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్. 72

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బలీ=బలశాలి యైన, హనుమాన్=హనుమంతుడు, సంపాతేః=సంపాతి యను పేరు గల, గృధ్రస్య=గ్రద్దయొక్క, వచనాత్=మాటవలన, శతయోజనవిస్తీర్ణమ్=నూరు యోజనముల వెడల్పు గల, లవణార్ణవమ్=లవణసముద్రమును, పుప్లువే=దాటెను.

తా. మహాబలశాలి యగు హనుమంతుడు సంపాతి యనెడు గ్రద్దచెప్పిన ప్రకారము నూరు యోజనముల వెడల్పు గల లవణసముద్రమును దాటెను. 72

మూ. తత్ర లఙ్కాం సమాసాద్య పురీం రావణపాలితామ్,
దదర్శ సీతాం ధ్యాయన్తీమశోకవనికాం గతామ్. 73

ప్ర. అ. రావణపాలితామ్=రావణునిచే పాలింపబడిన, లఙ్కామ్=లంక అనెడు, పురీమ్=పట్టణమును, సమాసాద్య=చేరి, తత్ర=ఆ లంకాపురియందు, అశోకవనికాం గతామ్ = అశోకవనములో నున్న, ధ్యాయన్తీమ్ = (రామునే) ధ్యానము చేయుచున్న, సీతామ్=సీతను, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు రావణుడు పాలించుచున్న లంకాపురము చేరి, అచట అశోకవనములో రామునే ధ్యానించుచు ఉన్న సీతాదేవిని చూచెను. 73

మూ. నివేదయిత్వాభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ,
సమాశ్వాస్య చ వైదేహీం మర్దయామాస తోరణమ్. 74

ప్ర.అ. అభిజ్ఞానమ్=గుర్తును, నివేదయిత్వా=సమర్పించి, ప్రవృత్తిం చ= వృత్తాంతమును, నివేద్య చ=విన్నవించి, వైదేహీమ్=సీతాదేవిని, సమాశ్వాస్య= ఓదార్చి, తోరణమ్=బహిర్ద్వారమును, మర్దయామాస=చూర్ణము చేసెను.

తా. హనుమంతుడు, తన చేతికి రాము డిచ్చిన అంగుళీయకమును సీతాదేవికి గుర్తుగా ఇచ్చి, సుగ్రీవునితో రామునకు మైత్రి కలుగుట మొదలగు వృత్తాంతమును విన్నవించి, ఆమెను ఊరడించి, అశోకవనబహిర్ద్వారమును చూర్ణము చేసెను. 74

మూ. పఞ్చ సేనాగ్రగాన్ హత్వా సప్త మన్త్రిసుతానపి,
శూరమక్షం చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్. 75

ప్ర. అ. పఞ్చ=ఐదుగురు, సేనాగ్రగాన్ = సేనానాయకులను, సప్త= ఏడుగురు, మన్త్రిసుతానపి=మంత్రికుమారులను, హత్వా=చంపి, శూరమ్= శూరు డైన, అక్షం చ=అక్షుని, నిష్పిష్య=ముద్దచేసి, గ్రహణమ్=బంధనమును, సముపాగమత్=పొందెను.

తా. హనుమంతుడు సేనాపతుల నైదుగురిని, మంత్రిపుత్రులను ఏడుగురిని చంపి, శూరు డైన అక్షకుమారుని వధించి, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునకు కట్టువడెను. 75

మూ. అస్త్రేణోన్ముక్తమాత్మానం జ్ఞాత్వా పైతామహాద్వరాత్,
మర్షయన్రాక్షసాన్వీరో యన్త్రిణస్తాన్యదృచ్ఛయా, 76
తతో దగ్ధ్వా పురీం లఙ్కామృతే సీతాం చ మైథిలీమ్,
రామాయ ప్రియమాఖ్యాతుం పునరాయాన్మహాకపిః. 77

ప్ర. అ. వీరః=వీరుడైన, మహాకపిః=హనుమంతుడు, పైతామహాత్=బ్రహ్మ ఇచ్చిన, వరాత్ = వరమువలన, ఆత్మానమ్ = తనను, అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచే, ఉన్ముక్తమ్ = విడువబడినవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, యదృచ్ఛయా=మరి యొక కార్యమునందలి అపేక్షచేత, యన్త్రిణః = తనను త్రాటిచే కట్టిన, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, మర్షయన్=సహించుచు, తతః=ఆ కార్య మైన తరువాత, మైథిలీమ్ సీతామ్ ఋతే=సీత తప్ప మిగిలిన, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, దగ్ధ్వా=కాల్చి, రామాయ = రామునకు, ప్రియం = సంతోషవార్తను, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, పునః = మరల, ఆయాత్=వచ్చెను.

తా. పరాక్రమశాలి యగు హనుమంతుడు, పూర్వము బ్రహ్మదేవుడు తన కిచ్చిన వరముల ప్రభావమువలన, తనను బ్రహ్మాస్త్రబంధము వదలిపోయి నట్లు తెలిసినను, తనను త్రాళ్లచే కట్టి ఈడ్చుకొని పోవుచున్న రాక్షసులను వధించుటకు సమర్థు డైనను, రావణుని చూడ గోరి, ఆ రాక్షసుల బాధలను సహించెను. రావణునితో మాట లాడిన పిమ్మట సీతాదేవి నివసించు ప్రదేశము తప్ప లంకాపురి నంతయు కాల్చి, రామున కీ సంతోషవార్త చెప్పుటకై మరల రాముని సమీపమునకు వెళ్లెను. 76-77

మూ. సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్,
న్యవేదయదమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః. 78

ప్ర. అ. అమేయాత్మా=లెక్కింపరాని బుద్ధి గల, సః=ఆ హనుమంతుడు,

మహాత్మానమ్=గొప్ప ధైర్యము గల, రామమ్=రాముని, అభిగమ్య=పొంది, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము, కృత్వా = చేసి, సీతా=సీతాదేవి, దృష్టా=చూడ బడినది, ఇతి=ఇట్లని, తత్త్వతః=యథార్థముగా, న్యవేదయత్=తెలిపెను.

తా. అతిబుద్ధిశాలి యగు హనుమంతుడు, సీతావియోగము కలిగినను ఎంతమాత్రము ధైర్యము తగ్గని రామునివద్దకు వెళ్లి, అతనికి ప్రదక్షిణ నమస్కారము చేసి, "చూచితిని సీతను" అని యథార్థముగా విన్నవించెను.

వి. "సీతా దృష్టా" (సీతాదేవి చూడబడినది) అని చెప్పదగి ఉన్నను అట్లు చెప్పక "దృష్టా సీతా" (చూడబడినది సీత) అని చెప్పెను. 'సీతా' అని ఉచ్చరించినంత మాత్రముననే, పై పదము నుచ్చరించుటకు ముందు "సీత బ్రతికి యున్నదో లేదో; చూడబడినదో లేదో" అను అమంగళకర మగు శంక రామునకు కలుగకుండవలె నని అట్లు చెప్పెను. 78

అవ. యుద్ధకాండకథ చెప్పబడుచున్నది—

మూ. తతః సుగ్రీవసహితో గత్వా తీరం మహోదధేః,
సముద్రం క్షోభయామాస శరైరాదిత్యసన్నిభైః. 79

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుగ్రీవసహితః=సుగ్రీవునితో కూడినవాడై, మహోదధేః = మహాసముద్రముయొక్క, తీరమ్ = తీరమును, గత్వా=చేరి, ఆదిత్యసన్నిభైః=సూర్యునితో సమాన మైన, శరైః=బాణములచే, సముద్రమ్= సముద్రుని, క్షోభయామాస=క్షోభింపచేసెను.

తా. సుగ్రీవునితో కలిసి రాముడు సముద్రతీరము చేరి, సముద్రుడు తనకు వశము కానందులకు కోపించి, సూర్యుని వలె తీక్షము లైన బాణములచే సముద్రుని క్షోభింపచేసెను. 79

మూ. దర్శయామాస చాత్మానం సముద్రః సరితాం పతిః,
సముద్రవచనాచ్చైవ నలం సేతుమకారయత్. 80

ప్ర. అ. సరితాం పతిః=నదులకు ప్రభు వైన, సముద్రః=సముద్రుడు, ఆత్మానమ్=తనరూపమును, దర్శయామాస=చూపించెను. (రాముడు), సముద్ర

వచనాచ్చైవ=సముద్రుని మాటప్రకారమే, నలమ్=నలుని (చేత), సేతుమ్ = సేతువును, అకారయత్=చేయించెను.

తా. నదులకు పతి యైన సముద్రుడు రాముని కోపమునకు భయపడి నిజ రూపముతో కనబడి చెప్పగా, ఆతని మాటలప్రకారము రాముడు నీలునిచే సేతువు కట్టించెను. 80

మూ. తేన గత్వా పురీం లఙ్కాం హత్వా రావణమాహవే,
రామః సీతా మనుప్రాప్య పరాం వ్రీడాముపాగమత్. 81

ప్ర. అ. రామః=రాముడు, తేన=ఆ సేతువుచే, లఙ్కాం పురీమ్=లంకా పట్టణమును, గత్వా=పొంది, ఆహవే=యుద్ధమునందు, రావణమ్=రావణుని, హత్వా = చంపి, సీతామ్ = సీతను, ప్రాప్య = పొంది, అను = అటుపిమ్మట, పరామ్=అధికమైన, వ్రీడామ్=సిగ్గును, ఉపాగమత్=పొందెను.

తా. రాముడు ఆ సేతుమార్గమున లంకలోనికి ప్రవేశించెను. యుద్ధము నందు రావణుని సంహరించెను. సీతను పొంది, "పరగృహములో చాలకాలము వసించిన భార్యను ఎట్లు పరిగ్రహింతును ?" అని చాల సిగ్గుపడెను. 81

మూ. తామువాచ తతో రామః పరుషం జనసంసది,
అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ. 82

ప్ర. అ. తతః = ఆకారణమువలన, రామః = రాముడు, జనసంసది= జనుల సమూహములో, తామ్=ఆ సీతనుగూర్చి (తో), పరుషమ్=పరుషముగా, ఉవాచ=పలికెను, సతీ=పతివ్రతయైన, సా సీతా=ఆ సీతాదేవి, అమృష్యమాణా= సహింపజాలనిదై, జ్వలనమ్=అగ్నిని, వివేశ=ప్రవేశించెను.

తా. ఆ కారణమువలన రాముడు జను లందరిలోను, సీతతో పరుషముగా మాటలాడెను. మహాపతివ్రత యగు ఆ సీతాదేవి ఆ మాటలను సహింపజాలక అగ్నిలో ప్రవేశించెను. 82

మూ. తతోఽగ్నివచనాత్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్,
బభౌ రామః సంప్రహృష్టః పూజితః సర్వదైవతైః. 83

ప్ర. అ. తతః=పిమ్మట, రామః=రాముడు, అగ్నివచనాత్=అగ్ని మాట వలన, సీతామ్=సీతను, విగతకల్మషామ్=పాపములు లేనిదానినిగా, జ్ఞాత్వా= తెలిసికొని, సంప్రహృష్టః=సంతసించినవాడై, సర్వదైవతైః = సమస్తదేవతల చేతను, పూజితః=పూజింపబడినవాడై, బభౌ=ప్రకాశించెను.

తా. "సీత ఎట్టిపాపమును లేనిది" అని అగ్ని చెప్పగా రాముడు చాల సంతసించెను. దేవతలు పూజింపగా ప్రకాశించెను. 83

మూ. కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్,
సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః. 84

ప్ర. అ. మహాత్మనః = గొప్ప ధైర్యము గల, రాఘవస్య = రాముని యొక్క, మహతా=గొప్పదైన, తేన కర్మణా=ఆ పనిచేత, సచరాచరమ్ = జంగమస్థావరములతో కూడినదియు, సదేవర్షిగణమ్ = దేవగణములతోడను మహర్షిగణములతోడను కూడిన, త్రైలోక్యమ్=లోకత్రయము, తుష్టమ్=సంత సించినది.

తా. మహాత్ము డైన రాముడు లోకకంటకు డైన రావణుని చంపుటచే స్థావరజంగమాత్మకము లైన మూడు లోకములును, దేవతాఋషిగణ సహితముగా సంతోషించినవి.

వి. "అన్తఃసంజ్ఞా భవన్త్యేతే" (స్థావరము లైన ఈ వృక్షాదులకు కూడ సూక్ష్మమైన సంజ్ఞ ఉండును) అని విష్ణుపురాణమునందు చెప్పి నట్లు వృక్షాదిస్థావర ములు కూడ తమ సంతోషమును చిగిరించుట మొదలగు వానిచే సూచించును. (తిలకవ్యాఖ్య). 84

మూ. అభిషిచ్య చ లఙ్కాయాం రాక్షసేన్ద్రం విభీషణమ్,
కృతకృత్య స్తతో రామో విజ్వరః ప్రముమోద హ. 85

ప్ర. అ. రామః=రాముడు, విభీషణమ్ = విభీషణుని, రాక్షసేన్ద్రమ్= రాక్షసరాజునుగా, లఙ్కాయామ్=లంకయందు, అభిషిచ్య=అభిషేకముచేసి, తదా = అప్పుడు, కృతకృత్యః = ప్రతిజ్ఞారూపకార్యమును నిర్వర్తించినవాడై,

విగతజ్వరః=పోయిన సంతాపముగలవాడై, ప్రముమోద=సంతోషించెను, హ= ఆశ్చర్యము.

తా. రాముడు పూర్వము విభీషణుని సముద్రతీరమున అభిషిక్తుని చేసెను. ఇపుడు లంకాపురిలో కూడ విభీషణుని రాక్షసరాజునుగా అభిషిక్తుని చేసి, కృత కృత్యు డయ్యెను. తన ప్రతిజ్ఞ నెరవేరునో లేదో అను చింత తొలగిపోయెను. రాముని సత్యవ్రత మత్యాశ్చర్యకరము కదా!

అర్థాంతరము — విజ్వరః=పక్షి యైన జటాయువు విషయమునందు మాత్రమే సంతాపముకలవాడై, సంతోషించెను.

రాముడు తన ప్రతిజ్ఞ ప్రకారము విభీషణుని లంకాపురిలో అభిషిక్తుని చేసెను. కాని ఒక కొడుకు చనిపోయిన తండ్రి మరి యొక కొడుకునకు జరుగు ఉత్సవకాలమునందు సంతోషముతో నిండియున్నను చనిపోయిన కొడుకును తలచుకొని దుఃఖించు నట్లు రాజ్యాభిషేకము పొందకుండగనే చనిపోయిన జటాయువును తలచుకొని దుఃఖించుచు, ప్రతిజ్ఞ నెరవేరినందులకు సంతసించెను. 85

మూ. దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్,
అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః. 86

ప్ర. అ. రామః = రాముడు, దేవతాభ్యః = దేవతలనుండి, వరమ్ = వరమును, ప్రాప్య = పొంది, వానరాన్ = వానరులను, సముత్థాప్య చ = లేపి, సుహృద్వృతః=మిత్రులతో కూడినవాడై, పుష్పకేణ=పుష్పక మను విమానముచే, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, ప్రస్థితః=ప్రయాణ మాయెను.

తా. రాముడు తనను చూడ వచ్చిన దేవతలనుండి వరమును పొందెను. దాని ప్రకారము మృతు లైన వానరుల నందరిని బ్రతికించుకొనెను. స్నేహితులతో కూడి, పుష్పక విమానారూఢుడై అయోధ్యకు బయలుదేరెను. 86

మూ. భరద్వాజాశ్రమం గత్వా రామః సత్యపరాక్రమః,
భరతస్యాన్తికం రామో హనూమన్తం వ్యసర్జయత్. 87

ప్ర. అ. సత్యపరాక్రమః = సత్యమునందు స్థిరత్వము గల, రామః= సకలజనమనోహరు డైన, రామః=రాముడు, భరద్వాజాశ్రమమ్ = భరద్వాజుని

ఆశ్రమమును గూర్చి, గత్వా=వెళ్లి, హనూమన్తమ్=హనుమంతుని, భరతస్యాన్తి కమ్=భరతుని దగ్గరకు, వ్యసర్జయత్=పంపెను.

తా. సత్యమునందు స్థిరముగ నిలచువాడును, లోకాభిరాముడును అగు రాముడు భరద్వాజాశ్రమమునకు వెళ్లెను. హనుమంతుని భరతుని వద్దకు పంపెను. 87

మూ. పునరాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః,
పుష్పకం తత్సమారుహ్య నన్దిగ్రామం యయౌ తదా. 88

ప్ర. అ. పునః=మరల, సుగ్రీవసహితః=సుగ్రీవునితో కూడిన, సః=ఆ రాముడు, ఆఖ్యాయికామ్ = పూర్వవృత్తాంతమును, జల్పన్=చెప్పుచు, తదా= అప్పుడు, నన్దిగ్రామమ్=నందిగ్రామమును, యయౌ=పొందెను.

తా. ఆ రాముడు సుగ్రీవవిభీషణాదులతో కూడి, పూర్వవృత్తాంతములను చెప్పుకొనుచు నందిగ్రామమునకు వెళ్లెను. 88

మూ. నన్దిగ్రామే జటాం హిత్వా భ్రాతృభిః సహితోఽనఘః,
రామః సీతామనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్. 89

ప్ర. అ. అనఘః=పాపరహితుడైన, రామః=రాముడు, నన్దిగ్రామే= నందిగ్రామమునందు, భ్రాతృభిః = సోదరులతో, సహితః = కూడినవాడై, జటామ్=జడను, హిత్వా=విడచి, సీతామ్ = సీతాదేవిని, అనుప్రాప్య = పొంది, పునః=తిరిగి, రాజ్యమ్=రాజ్యమును, అవాప్తవాన్=పొందెను.

తా. ఎట్టి పాపములును లేని ఆ రాముడు నందిగ్రామమున సోదరుల నంద రిని కలిసెను. వారందరును జటలను విడచిరి. మునివేషమును విడచుటచే సీతతో గార్హస్థ్యమును అవలంబించెను. మరల రాజ్యమును పొందెను. 89

మూ. ప్రహృష్టముదితో లోకస్తుష్టః పుష్టః సుధార్మికః,
నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః. 90

ప్ర. అ. లోకః = లోకము, ప్రహృష్టముదితః = గగుర్పాటు కలిగి సంత సించినది, తుష్టః=కోరిక తీరుటచే ప్రీతి చెందినది. పుష్టః=సంతోషముచే వృద్ధి

పొందిన శరీరము కలదైనది. సుధార్మికః=ధర్మతత్పరమై ఉన్నది. నిరామయః= పీడలులేని దైనది. అరోగః=వ్యాధులులేని దైనది. దుర్భిక్షభయవర్జితః = క్షామము వలన కలుగు భయము లేనిదిగా అయినది.

తా. రాముడు రాజ్యాభిషిక్తుడు కాగా, లోక మంతయు సంతోషాతిశయ ముచే గగుర్పాటు చెందెను. రాముడు రాజు కావలె ననెడు తమ కోరిక తీరుటచే ప్రజ లెల్లరు ప్రీతి చెందిరి. ఆనందాతిశయముచే స్థావర జంగమాత్మక మగు లోకము యొక్క శరీరము వృద్ధి చెందినది. ప్రజలందరును చక్కగా ధర్మము నాచరించుచుండిరి. లోకమందు పీడలు, వ్యాధులు, దుర్భిక్షముల భయము తొలగి పోయెను. 90

అ వ. ఉత్తరకాండకథను చెప్పుచున్నాడు—

మూ. న పుత్రమరణం కించిద్ద్రక్ష్యన్తి పురుషాః క్వచిత్,
నార్యశ్చావిధవా నిత్యం భవిష్యన్తి పతివ్రతాః. 91

ప్ర. అ. పురుషాః=పురుషులు, క్వచిత్=ఎక్కడను, కించిత్ = కొంచెమైనను, పుత్రమరణమ్=పుత్రమరణమును, న ద్రక్ష్యన్తి = చూడరు. నార్యశ్చ = స్త్రీలు కూడ, అవిధవాః=వైధవ్యము లేనివారై, నిత్యమ్=నిత్యము, పతివ్రతాః= పతివ్రతలు, భవిష్యన్తి=కాగలరు.

తా. రాముడు రాజ్యము చేయుచున్నపుడు తండ్రి యుండగా పుత్రుడు మరణించడు. స్త్రీలకు వైధవ్యదుఃఖము ఉండదు. వారు సర్వదా పతివ్రతలై యుందురు. 91

మూ. న చాగ్నిజం భయం కించిన్నాప్సు మజ్జన్తి జన్తవః,
న వాతజం భయం కించిన్నాపి జ్వరకృతం తథా, 92
న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా.

ప్ర. అ. తత్ర=ఆ రామరాజ్యమందు, అగ్నిజమ్=అగ్నివలన కలిగిన భయమ్=భయము, కించిత్ = కొంచెమైనను, న = లేదు, జన్తవః = ప్రాణులు, అప్సు = నీటిలో, న మజ్జన్తి = మునిగి మరణించవు. వాతజమ్ = వాయువువలన కలుగు, భయమ్ = భయము, కించిత్ = కొంచెమైనను, న = లేదు. తథా = మరియు, జ్వరకృతమ్ అపి = జ్వరము వలన కలుగు భయము కూడ, న = లేదు.

క్షుద్భయమ్ అపి = ఆకలివలన భయము కూడ, న = లేదు. తథా = మరియు, తస్కరభయమ్ = దొంగల భయము, న = లేదు.

తా. రాముని రాజ్యములో అగ్ని భయము కాని, జల భయము కాని, వాత భయము కాని, జ్వర భయము కాని, క్షుద్బాధ కాని, చోరభయము కాని లేదు. 92

మూ. నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ,
నిత్యం ప్రముదితాః సర్వే యథా కృతయుగే తథా. 93

ప్ర. అ. నగరాణి చ = నగరములును, రాష్ట్రాణి చ = రాష్ట్రములును, ధన ధాన్యయుతాని = ధన ధాన్యములతో నిండినవి. సర్వే = అందరును, కృత యుగే = కృతయుగమునందు, యథా = ఎట్లో, తథా = అట్లే, నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రముదితాః = సంతోషముతో నున్నారు.

తా. నగరములు, దేశములు కూడ, ధనధాన్యసమృద్ధములై ఉన్నవి. కృతయుగములో వలెనే ప్రజ లందరును సంతోషవంతులై యున్నారు. 93

మూ. అశ్వమేధశతైరిష్ట్వా తథా బహుసువర్ణకైః, 94
గవాం కోట్యయుతం దత్త్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి.
అసంఖ్యేయం ధనం దత్త్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః. 95

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల రాముడు, అశ్వమేధశతైః = వందలాది అశ్వమేధయాగములచేతను, తథా = మరియు, బహుసువర్ణకైః = బహుసువర్ణకము లనెడు యాగములచేతను, ఇష్ట్వా = దేవతలను తృప్తి పొందించి, గవామ్ = గోవులయొక్క, కోట్యయుతమ్ = పదివేల కోట్లను, అసంఖ్యేయమ్ = లెక్కింపరాని, ధనమ్ = ధనమును, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, దత్త్వా = ఇచ్చి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి (బ్రహ్మయగు తన స్థానము నకు), ప్రయాస్యతి = వెళ్లగలడు.

తా. గొప్ప కీర్తి గల రాముడు వందల కొలది అశ్వమేధయాగముల చేతను, అనేక 'బహుసువర్ణక' యాగములచేతను దేవతలను పూజించి, పదివేల కోట్లగోవులను, లెక్కింప రానంత ధనమును బ్రాహ్మణుల కిచ్చి, శాశ్వత మగు తన స్థానమును పొందగలడు.

వి. "సుబహూని సువర్ణాని యత్రోపకరణత్వతః, విద్యన్తే స క్రతుః సద్భిః స్మృతో బహుసువర్ణకః". (ఏ యాగమునందు మిక్కిలి అధిక మైన సువర్ణము ఉపకరణముగా అనగా సాధనముగా ఉండునో దానికి బహుసువర్ణక మని పేరు) అను ప్రమాణమును బట్టి బహుసువర్ణక మనగా అధికముగా బంగారము దానము చేయు యాగ మని అర్థము.

"మహాయశాః" అను పదముచే స్వల్ప మగు అపవాదమునకై సీతాదేవిని విడిచి పెట్టుట సూచిత మగుచున్నది (గోవిందరాజులు). 94_95

మూ. రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః,
చాతుర్వర్ణ్యం చ లోకేఽస్మిన్ స్వే స్వే ధర్మే నియోక్ష్యతి. 96

ప్ర. అ. రాఘవః = రాముడు, అస్మిన్ లోకే = ఈ లోకమునందు, శత గుణాన్ = వందరెట్లు, రాజవంశాన్ = రాజవంశములను, స్థాపయిష్యతి = స్థాపింపగలడు, చాతుర్వర్ణ్యమ్ = నాలుగు వర్ణములను, స్వే స్వే ధర్మే = తమ తమ ధర్మమునందు, నియోక్ష్యతి = ప్రవర్తింపచేయగలడు.

తా. రాముడు క్షత్రియులకు రాజ్యము లిచ్చి నూరింతలుగా వారి వంశము లను వృద్ధి పొందింపగలడు. నాలుగు వర్ణములవారిని వారి వారి ధర్మము లాచరించు నట్లు నియమించగలడు. 96

మూ. దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ.
రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి. 97

ప్ర. అ. రామః = రాముడు, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సర ములు, దశవర్షశతాని చ = పదివందల సంవత్సరములు, రాజ్యమ్ = రాజ్యమును, ఉపాసిత్వా = సేవించి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మయైన విష్ణువుయొక్క లోకమును, గమిష్యతి = పొందగలడు.

తా. రాముడు పదకొండు వేల సంవత్సరముల పాటు రాజ్యమును ప్రజ లకు సుఖము కలుగు నట్లు పాలించి, బ్రహ్మలోకమును చేరగలడు. 97

మూ. ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్,
యః పఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే. 98

ప్ర. అ. పవిత్రమ్ = పరిశుద్ధిని కలిగించు నదియు, పాపఘ్నమ్ = పాపములను నశింపచేయునదియు, పుణ్యమ్ = పుణ్యమును చేయునదియు, వేదైః = వేదములతో, సమ్మితం చ = సమాన మైనదియు, అగు, రామచరితమ్ = రామచరితమును, యః = ఎవడు, పఠేత్ = చదువునో, అతడు, సర్వపాపైః = సమస్తపాపములచే, ప్రముచ్యతే = విముక్తు డగును.

తా. రామచరిత్ర పరిశుద్ధిని కలిగించును. పాపములను నశింపచేయును. పుణ్యములను ఇచ్చును. ఇది వేదముతో సమానము. దీనిని చదువువాని సర్వ పాపములును తొలగిపోవును. 98

మూ. ఏతదాఖ్యానమాయుష్యం పఠన్రామాయణం నరః,
సపుత్రపౌత్రః సగణః ప్రేత్య స్వర్గే మహీయతే. 99

ప్ర. అ. ఆయుష్యమ్ = ఆయుర్దాయమును వృద్ధి పొందించు నదియు, ఆఖ్యానమ్ = వాస్తవార్థము కలదియు అగు, ఏతత్ = ఈ, రామాయణమ్ = రామచరిత్రమును, పఠన్ = చదువుచున్న, నరః = మనుష్యుడు, సపుత్రపౌత్రః = పుత్రపౌత్రులతో కూడినవాడై, సగణః = భృత్యబంధుసమూహముతో కూడిన వాడై, భోగములను అనుభవించి, ప్రేత్య = మరణించి (మరణానంతరము), స్వర్గే = స్వర్గమునందు, మహీయతే = పూజింపబడును.

తా. రామాయణ మనెడు ఈ ఆఖ్యానము ఆయుర్దాయమును వృద్ధి పొందించును. దీనిని చదువువాడు పుత్రపౌత్రాదులతోను, భృత్యబంధుగణములతోను కూడి సర్వసౌఖ్యములను అనుభవించి, మరణానంతరము స్వర్గమునందు దేవతల చేత పూజింపబడును.

వి. "రామాయణమ్" రామస్య అయనమ్ = రాముని చరిత్రము. 'అయనమ్" అనునది "అయ గతౌ" అను ధాతువునుండి నిష్పన్న మైనది. 99

మూ. పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్,
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వమీయాత్,
వణిగ్జనః పణ్యఫలత్వమీయాత్
జనశ్చ శూద్రోఽపి మహత్త్వమీయాత్. 100

ప్ర. అ. పఠన్ = ఈ రామాయణము చదువు, జనః = మనుష్యుడు, ద్విజః స్యాత్ = బ్రాహ్మణు డైనట్లైతే, వాగృషభత్వమ్ = అష్టాదశ విద్యలచే శ్రేష్ఠత్వమును, ఈయాత్ = పొందును. క్షత్రియః = క్షత్రియు డైనట్లైతే, భూమి పతిత్వమ్ = భూమండలమునకు ఆధిపత్యమును, ఈయాత్ = పొందును. వణిగ్జనః = వైశ్యు డైనట్లైతే, పణ్యఫలత్వమ్ = అమ్మెడి వస్తువుల నుండి లాభమును, ఈయాత్ = పొందును, శూద్రోఽపి చ = శూద్రు డైనట్లైతే, మహత్త్వమ్ = గొప్ప తనమును, ఈయాత్ = పొందును.

తా. ఈ రామాయణమును బ్రాహ్మణుడు పఠించినచో అష్టాదశవిద్య లందును ప్రావీణ్యమును పొందును. క్షత్రియుడు పఠించినచో భూమండలాధిపతి యగును. వైశ్యుడు పఠించినచో వ్యాపారమునందు లాభమును పొందును. శూద్రుడు పఠించినచో గొప్పవా డగును. 100

మూ. ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే,
సంక్షేపో నామ ప్రథమః సర్గః

ప్ర. అ. ఇట్లు, ఆర్షే = ఋషిప్రోక్తమైన, రామాయణే = రామాయణ మనెడు, ఆదికావ్యే = ఆదికావ్యమునందలి, బాలకాణ్డే = బాలకాండమునందు, సంక్షేపో నామ = సంక్షేప మని ప్రసిద్ధి గల, ప్రథమః=మొదటి, సర్గః = సర్గ, (సమాప్తః = సమాప్తము).

తా. ఇట్లు ఋషి ప్రోక్త మైన, రామాయణ మను ఆదికావ్యమునందలి బాలకాండమునందు, రామాయణ కథాసంక్షేపరూపమైన ప్రథమసర్గము ముగిసినది.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు, బాల కాండలో ప్రథమసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

మూ. నారదస్య తు తద్వాక్యం శ్రుత్వా వాక్యవిశారదః,
పూజయామాస ధర్మాత్మా సహశిష్యో మహామునిః. 1

ప్ర. అ. నారదస్య = నారదునియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా తు = వినినంతనే, వాక్యవిశారదః = వాక్యములయందు పండితుడును, ధర్మాత్మా = ధర్మమందు బుద్ధి గలవాడును అగు, మహామునిః = వాల్మీకి మహాముని, సహశిష్యః = శిష్యులతో కూడినవాడై, పూజయామాస = పూజించెను.

తా. వాల్మీకిమహాముని ధర్మబుద్ధి కలవాడు; వాక్యముల విశేషము తెలిసినవాడు. అందుచే నారదుడు చెప్పిన సంక్షేపరామాయణ రూప మగు వాక్యమును వినినంతనే దానిని శ్లాఘించెను. ఆయన శిష్యులు కూడ శ్లాఘించిరి.

విశేషార్థము — వాక్యవిశారదః = వాక్యరూపము లగు సమస్తశాస్త్రములందును పండితుడును, ధర్మాత్ముడును అగు వాల్మీకి, నారదస్య—"నరతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః" (సనాతను డగు పరమాత్మ ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములను నడిపించును గాన నరు డని చెప్పబడుచున్నాడు) అను ప్రమాణమును పట్టి 'నరః' అనగా పరమాత్మ, "నరసంబన్ధి నారమ్"—పరమాత్మకు సంబంధించిన జ్ఞానము నారము. "నారం దదాతీతి నారదః—పరమాత్మకు సంబంధించిన జ్ఞానమును ఇచ్చువాడు నారదుడు. ఆశ్రితులకు బ్రహ్మోపదేశము చేయు అట్టి నారదుని యొక్క, తత్ = ఆ వేదాంత ప్రసిద్ధ మైన, వాక్యమును, వినినంతనే, మహామునిః = గొప్ప బ్రహ్మానుసంధానము చేయువాడై, శిష్యులతో కూడిన వాడై, పూజయామాస = శ్లాఘించెను (అని ప్రాచీనులు).

తా. సమస్త శాస్త్రార్థములు తెలిసికొని జ్ఞానమును కలిగించు కర్మల అనుష్ఠానము చేయుచున్న వాల్మీకి మహర్షి, బ్రహ్మోపదేశాచార్యు డైన నారద మహర్షి ఉపదేశించిన వేదాంతార్థములు వినినంతనే తాను బ్రహ్మానుభవమును పొందుటయే కాక శిష్యులకు కూడ ఆ అర్థమును ఉపదేశించి శిష్యులతో కూడినవాడై యెల్లప్పుడును ఆ వేదాంతపరమార్థానందమునే అనుభవించుచుండెను. 1

మూ. యథావత్పూజితస్తేన దేవర్షిర్నారద స్తథా,
ఆపృష్ట్వైవాభ్యనుజ్ఞాతస్స జగామ విహాయసమ్. 2

ప్ర. అ. దేవర్షిః = దేవతయును ఋషియును అయిన, సః = ఆ, నారదః = నారదుడు, తేన = ఆ వాల్మీకిచేత, తథా=అట్లు, యథావత్ = యథాయోగ్యముగ, పూజితః = పూజింపబడినవాడై, ఆపృష్ట్వైవ = ఆ వాల్మీకిని సంతోషపరచియే, అభ్యనుజ్ఞాతః = అనుజ్ఞను పొందినవాడై, విహాయసమ్ = ఆకాశమును, జగామ = పొందెను.

తా. దేవర్షి యైన నారదుడు వాల్మీకిచే యథోచితముగా పూజింపబడినవాడై, ఆ వాల్మీకిని ఆలింగనాదులచే సంతోషపరచి, వారి అనుజ్ఞ పొంది, ఆకాశ మార్గమున దేవలోకమునకు వెళ్లెను.

విశేషార్థము :— దేవర్షిః = దేవతలలో జ్ఞానపారంగతు డైన, ('ఋషి' శబ్దము "ఋషీ గతౌ" అను ధాతువునుండి నిష్పన్న మైనది). సః = ఆ (వాల్మీకికి జ్ఞానోపదేశము చేసిన), నారదః = జ్ఞానప్రదాత యగు నారదముని, తేన = శిష్యు డైన ఆ వాల్మీకమునిచేత, యథావత్ = గురువును పూజింపవలసిన రీతిలో, పూజితః = పూజింపబడినవాడై, ఆపృష్ట్వా = సంశయముల నన్నింటిని తీర్చుటచే సంతోషపరచి, అభ్యనుజ్ఞాత ఏవ = అనుజ్ఞ పొందినవాడై యే, విహాయసమ్ = ఆకాశ మగుటను (భావప్రధాననిర్దేశము), జగామ = పొందెను.

తా. దేవతలలో జ్ఞానపారంగతుడును, ఆశ్రితులకు జ్ఞానము ఇచ్చు వాడును అగు నారదమహాముని, వాల్మీకికి వేదాంత పరమార్థోపదేశము చేసి, ఆ వాల్మీకినుండి గురుపూజను పొంది, అతనికి గల సమస్త సంశయములను తీర్చి, సంతోషపరచెను. వాల్మీకికి పరమార్థోపదేశము చేయుటకు మాత్రమే నారదుడు గురుత్వాభిమానమును కల్పించుకున్నవాడు గాన ఆ యభిమానము కల్పితము. ఉపదేశానంతరము శాశ్వత మగు నిరభిమానత్వమే సిద్ధము. జ్ఞానోప దేశానంతరము వాల్మీకికి గల శిష్యత్వాభిమానము, నారదుని కున్న గురుత్వాభి మానము రెండును నశించుటవలన, మరల ఆకాశమువలె నిర్వికల్ప మగు తన స్వరూపమును పొందెను. 2

మూ. స ముహూర్తం గతే తస్మిన్ దేవలోకం మునిస్తదా,
జగామ తమసాతీరం జాహ్నవ్యాస్త్వవిదూరతః. 3

ప్ర. అ. తస్మిన్= ఆ నారదుడు, ముహూర్తమ్ = అల్పకాలములో, దేవలోకమ్=బ్రహ్మలోకమును, గతే=పొందగా, తదా=అప్పుడు, మునిః తు = వాల్మీకిమహాముని, జాహ్నవ్యాః = గంగానదికి, అవిదూరతః = సమీపమున నున్న, తమసాతీరమ్=తమసానది గట్టును, జగామ=పొందెను.

విశేషార్థములు :— తస్మిన్ = తన గురు వైన నారద మహాముని, ముహూర్తమ్=అల్పకాలమునందే, దేవలోకమ్=పరబ్రహ్మయొక్క స్థానమును, అనగా పరబ్రహ్మ స్వరూపమును, గతే=పొందగా, తదా=అప్పుడు, మునిః = బ్రహ్మానుసంధానము చేయు జ్ఞాని యైన వాల్మీకి, జాహ్నవ్యాః.... (ఇది వ్యాఖ్యాత్రయసారము).

తా. ఆ నారద మహాముని, వాల్మీకికి ఉపదేశించిన వెంటనే, వాల్మీకికి ఉపదేశము చేయుటకొరకు కల్పించుకొనిన గురుత్వము మొదలైన అభిమానమును వదలెను. తన యథార్థరూప మగు బ్రహ్మత్వమును పొందెను. పిదప, వాల్మీకి మహర్షి తాను బ్రహ్మవేత్త అగుటచే తనకు కర్మానుష్ఠానావశ్యకత లేకపోయినను —"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరే జనాః, స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే" (శ్రేష్ఠుడు ఏది ఆచరించునో దానినే ఇతర జనులును ఆచరింతురు. ఆ శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగా గ్రహించునో దానినే లోక మంతయు అనువర్తించును) అని గీతలో చెప్పినట్లు, ఉత్తమ మగు భృగువంశమునందు పుట్టిన వాడును, బ్రహ్మపుత్రు డైన నారదుని శిష్యుడును, జితేంద్రియు డగుటచే 'వాల్మీకి' అను సార్థక మైన నామధేయముతో ప్రసిద్ధుడును అగు తానే కర్మానుష్ఠానము చేయకున్నచో, కర్మానుష్ఠానము తప్ప మరి యొక మార్గము లేని సామాన్యజనులు కూడ కర్మానుష్ఠానమును విడచి వేయుదురు. అట్టివారు ఇటు చేయవలసిన కర్మానుష్ఠానము లేక, జ్ఞానమార్గమును అనుసరింపజాలక ఉభయభ్రష్టు లగుదురు. అందుచే అట్టి వారికి మార్గము చూపుటకై తాను కర్మానుష్ఠానమును విడువక, మాధ్యాహ్నికస్నానము చేయుటకై తమసాతీరమునకు వెళ్లెను. 3

మూ. స తు తీరం సమాసాద్య తమసాయా మహామునిః,
శిష్యమాహ స్థితం పార్శ్వే దృష్ట్వా తీర్థమకర్దమమ్. 4

ప్ర. అ. సః=ఆ, మహామునిః = వాల్మీకి, తమసాయాః=తమసానది యొక్క, తీరమ్=తీరమును, సమాసాద్య=చేరి, అకర్దమమ్=బురదలేని, తీర్థమ్=రేవును, దృష్ట్వా=చూచి, పార్శ్వే=ప్రక్కనే, స్థితమ్ = ఉన్న, శిష్యమ్=శిష్యుని గూర్చి, ఆహ=పలికెను.

తా. వాల్మీకిమహర్షి తమసానదీతీరము చేరి, బురద లేని రేవును చూచి, ప్రక్క నున్న శిష్యునితో ఇట్లు అనెను. 4

మూ. అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ,
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా. 5

ప్ర. అ. భరద్వాజ=భరద్వాజుడా, సన్మనుష్యమనో యథా=సత్పురుషుని హృదయమువలె, అకర్దమమ్=బురద లేనిదియు, (హృదయపక్షమున "పాపము లేనిది" అని అర్థము), ప్రసన్నాంబు=నిర్మల మైన జలము కలదియు ("జలము వలె నిర్మల మైనదియు" అని హృదయపక్షమున అర్థము), రమణీయమ్= సుందరమైన, ఇదమ్=ఈ, తీర్థమ్=రేవును, నిశామయ=చూడుము.

తా. ఓ భరద్వాజుడా ! సత్పురుషుని హృదయము వలె నిష్పంకమై, నిర్మలజలమై, మనోహరమై ఉండు ఈ రేవును చూడుము.

విశేషార్థము — ఇచట ఉపమేయము తీర్థము. ఉపమానము సత్పురుషుని హృదయము. ఈ రెండింటికిని సాదృశ్యము అకర్దమత్వము, ప్రసన్నాంబుత్వము అను సమానధర్మములను పట్టి ఏర్పడినది. అయితే ఉపమేయపక్షమున ఈ పదములకు "బురద లేకుండుట" "నీరు నిర్మలముగ ఉండుట" యని అర్థములు. ఉపమానపక్షమున "పాపము లేకుండుట" "నీరువలె నిర్మలముగ ఉండుట" అని అర్థములు. ఈ విధముగ అర్థములో సామ్యము లేకపోయినను శబ్దసామ్యమును పట్టి—అనగా తీర్థమును అకర్దమమే, సన్మనుష్యమనస్సును అకర్దమమే; తీర్థము విమలాంబువే, సన్మనుష్యమనస్సును విమలాంబువే, అను సామ్యమును బట్టి తీర్థమును సన్మనుష్యమనస్సుతో పోల్చుట జరిగినది.

"అర్థతః శబ్దతో వాపి మనాక్కావ్యార్థసూచనమ్" (గ్రంథాదియందు అర్థమువలన గాని, శబ్దమువలన గాని కొంచెము కావ్యకథను సూచించవలెను).

అను ఆలంకారికసరణిని అనుసరించి వాల్మీకిచే "అకర్దమమిదం తీర్థమ్" ఇత్యాదిగ్రంథ సందర్భమందు ఈ ఆదికావ్యముయొక్క కథ సూచింపబడి నది. అందు "అకర్దమమిదం తీర్థమ్" అనుటచే పరిశుద్ధ మగు సముద్ర సేతుస్థలము జ్ఞాపిత మైనది. (ఇది వ్యాఖ్యాత్రయసారము). 5

మూ. న్యస్యతాం కలశస్తాత దీయతాం వల్కలం మమ,
ఇదమేవావగాహిష్యే తమసాతీర్థముత్తమమ్. 6

ప్ర. అ. తాత=నాయనా! కలశః=జలపాత్రము, న్యస్యతామ్=క్రింద ఉంచబడుగాక, మమ=నాకు, వల్కలమ్=నారచీర, దీయతామ్=ఇవ్వబడుగాక, ఉత్తమమ్=శ్రేష్ఠమైన, ఇదమ్=ఈ, తమసాతీర్థమేవ=తమసానది రేవునే, అవ గాహిష్యే=ప్రవేశించెదను.

తా. నాయనా! జలపాత్రను క్రింద నుంచుము. నాకు నారచీర ఇమ్ము. శ్రేష్ఠ మైన ఈ తమసాతీర్థమునందే స్నానము చేసెదను. 6

మూ. ఏవముక్తో భరద్వాజో వాల్మీకేన మహాత్మనా,
ప్రాయచ్ఛత మునేస్తస్య వల్కలం నియతో గురోః. 7

ప్ర. అ. మహాత్మనా=పూజ్యమైన మనస్సు గల, వాల్మీకేన=వాల్మీకి చేత, ఏవమ్ = ఈవిధముగా, ఉక్తః = పలుకబడిన, గురోః = గురువునకు, నియతః=విధేయు డైన, భరద్వాజః=భరద్వాజుడు, తస్య=ఆ, మునేః= వాల్మీకి మహామునికి, వల్కలమ్=నారచీరను, ప్రాయచ్ఛత=ఇచ్చెను.

తా. ఈ ప్రకారము, మహాత్ము డగు వాల్మీకి అడుగగా, గురు విధేయు డైన భరద్వాజుడు ఆ వాల్మీకికి నారచీర ఇచ్చెను. 7

మూ. స శిష్యహస్తాదాదాయ వల్కలం నియతేన్ద్రియః,
విచచార హ పశ్యంస్తత్సర్వతో విపులం వనమ్. 8

ప్ర. అ. నియతేన్ద్రియః=నిగ్రహింపబడిన ఇంద్రియములు గల, సః= ఆ వాల్మీకి, శిష్యహస్తాత్ = శిష్యుని చేతి నుండి, వల్కలమ్ = నారచీరను, ఆదాయ=తీసికొని, విపులమ్=విశాలమైన, తత్ = ఆ, వనమ్ = వనమును, సర్వతః=అంతటను, పశ్యన్=చూచుచు, విచచార హ=సంచరించెను.

తా. ఇంద్రియనిగ్రహము గల ఆ వాల్మీకి శిష్యుని చేతినుండి ఆ నార చీరను తీసికొని విశాల మైన ఆ వనమునంతను చూచుచు సంచరించెను. 8

మూ. తస్యాభ్యాశే తు మిథునం చర న్తమనపాయినమ్,
దదర్శ భగవాం స్తత్ర క్రౌఞ్చయోశ్చారునిస్వనమ్. 9

ప్ర. అ. భగవాన్=మాహాత్మ్యము గల ఆ వాల్మీకి, తత్ర = ఆ వనమునందు, తస్య=ఆ రేవునకు, అభ్యాశే=సమీపమునందు, అనపాయినమ్=ఎడబాటు లేనిదై, చర న్తమ్ = తిరుగుచున్న, చారునిస్వనమ్ = మంచి ధ్వని గల, క్రౌఞ్చయోః=క్రౌంచపక్షులయొక్క, మిథునమ్=జంటను, దదర్శ = చూచెను.

తా. శాపానుగ్రహాది మాహాత్మ్యము గల వాల్మీకి మహర్షి, ఆ వనములో, తమసాతీర్థమునకు సమీపముననే ఎడబాటు లేకుండ తిరుగుచున్న, మనోహరముగ కూయుచున్న క్రౌంచపక్షుల జంటను చూచెను.

వి. ఇచట కావ్యకథ సూచింపబడినది :—

భగవాన్=మాహాత్మ్యము గల, అనగా త్రికాలజ్ఞానము గల, వాల్మీకి మహర్షి, తస్య=ఆ సముద్రమునకు, అభ్యాశే=సమీపమునందు, తత్ర=ఆ లంకాపురియందు, చర న్తమ్=భోగములను అనుభవించుచున్నదియు, ("చర గతి భక్షణయోః" అను ధాతువునుండి నిష్పన్న మైనది), అనపాయినమ్=బ్రహ్మ వరమువలన చాలకాలమునుండి అపాయము లేనిదియు, చారునిస్వనమ్=మనోహర మైన వీణానాదము కలదియు అగు, క్రౌఞ్చయోః=కుటిలు లగు రాక్షసుల ("క్రుఞ్చ గతికౌటిల్యాల్పీభావయోః" అను ధాతువునుండి నిష్పన్న మైనది), మిథునమ్=జంటను, దదర్శ = తెలిసికొనెను (గోవిందరాజులు).

తా. సముద్రతీరమునం దున్న లంకాపురిలో సమ స్తభోగములను అనుభవించుచు, బ్రహ్మదేవుని వరముచేత దీర్ఘకాలమునుండి అపాయము లేక, మనోహర మగు వీణానాదము మొదలగు క్రీడారసములందు తేలుచున్న రాక్షసదంపతులను గూర్చి, భూతభవద్భవిష్యకాలముల జ్ఞానము గల ఆ వాల్మీకిమహర్షి తెలిసికొనెను. 9

మూ. తస్మాత్తు మిథునాదేకం పుమాంసం పాపనిశ్చయః,
జఘాన వైరనిలయో నిషాదస్తస్య పశ్యతః. 10

ప్ర. అ. పాపనిశ్చయః = పాపమైన నిర్ణయము కలవాడును, వైర నిలయః = వైరమునకు స్థానమైన వాడును అగు, నిషాదః = ఒక బోయవాడు, తస్మాత్=ఆ, మిథునాత్=మిథునమునుండి, ఏకమ్ = ఒకటైన, పుమాంసం తు= పురుషపక్షిని మాత్రము, తస్య పశ్యతః=ఆ వాల్మీకమహర్షి చూచుచుండగనే ఏ మాత్రము సంకోచము లేక, జఘాన=చంపెను.

తా. క్రూరమైన నిర్ణయము కలవాడును, పశుపక్ష్యాదుల విషయమున నిష్కారణముగ ద్వేషముతో ప్రవర్తించువాడును అగు ఒక బోయవాడు, ఆ మహర్షి చూచుచున్నా డనెడు సంకోచమైనను లేక, ఆ జంటలో ఒక టగు మగ పక్షిని చంపెను.

వి. ఈ శ్లోకము కూడ కావ్యకథను సూచించుచున్నది :—

పాపనిశ్చయః = దుష్టు డను నిశ్చయము గల, అనగా రావణుడు దుష్టు డని నిశ్చయించిన, వైరనిలయః = దుష్టులతో వైరమునకు స్థానమైన, నిషాదః = సమస్త జగములకును ఆధారభూతు డైన విష్ణువు ("నిషీదన్తి అత్ర సర్వాణి జగన్తి ఇతి నిషాదః" —వీనియందు సమస్తజగత్తులును ఉండును గాన నిషాదుడు), తస్మాత్ మిథునాత్ = ఆ రాక్షసుల జంటనుండి, ఏకమ్ = ఒక డైన, పుమాంసమ్ = పురుషు డగు రావణుని, తస్య = ఆ జంటలో రెండవది యగు మండోదరి, పశ్యతః=చూచుచుండగా ఆమెను ఆదరింపక, అనగా ఆమెను చంపక, జఘాన = చంపెను. (గోవిందరాజులు).

తా. దుష్టుల విషయమున వైరము గల, సకల జగదాధారభూతు డగు శ్రీమహావిష్ణువు రావణుడు దుష్టు డని నిశ్చయించి, ఆ రాక్షసదంపతులలో ఒక డైన రావణుని మాత్రము చంపెను. మండోదరి దుష్టురాలు కాదు గాన ఆమెను చంపలేదు. 10

మూ. తం శోణితపరీతాఙ్గం వేష్టమానం మహీతలే,
భార్యా తు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్. 11

మూ. వియుక్తా పతినా తేన ద్విజేన సహచారిణా,
తామ్రశీర్షేణ మత్తేన పత్రిణా సహితేన వై. 12

ప్ర. అ. పతినా = భర్తయు, సహచారిణా = కూడ తిరుగు నదియు, తామ్రశీర్షేణ=ఎఱ్ఱని తల గలదియు, మత్తేన=మదించినదియు, పత్రిణా=మంచి రెక్కలు గలదియు, సహితేన = మనస్సాంగత్యము కలదియు అగు, తేన = ఆ, ద్విజేన=మగ పక్షితో, వియుక్తా=వియోగము పొందిన, భార్యా తు=భార్య యైన ఆడపక్షి యైతే, నిహతమ్ = కొట్టబడినదై, మహీతలే = భూమిపై, వేష్టమానమ్= పొరలుచున్నదియు, శోణితపరీతాఙ్గమ్=రక్తముచే కప్పబడిన శరీరము గలదియు అగు, తమ్ = ఆ మగ పక్షిని, దృష్ట్వా = చూచి, కరుణామ్ = కనికరమును పుట్టించు, గిరమ్ = వాక్కును, రురావ = పలికెను.

తా. ఆ నిషాదునిచే కొట్టబడి నేలపై పొరలుచు, రక్తముతో నిండిన ఆ మగ పక్షిని భార్య యైన ఆడ క్రౌంచపక్షి చూచినది. తనపై ఎంతో ప్రేమ కలిగి ఎల్లప్పుడును తనతో సంచరించు, అందమైన రెక్కలు, ఎఱ్ఱని తలయు గల, కామముచే మదించిన, భర్తతో వియోగము చెందిన ఆ క్రౌంచి అతిదీనముగ ఏడ్వ సాగినది.

వి. ఈ శ్లోకమునందు మండోదరీ ప్రలాపము సూచిత మైనది. భార్యా తు= మండోదరియు,........తామ్రశీర్షేణ = రత్నమయకిరీటముచే ఎర్రగా నుండు తల గలవాడును, పత్రిణా = వాహనాదులతో కూడినవాడును, మత్తేన = బ్రహ్మవరములచే మదించినవాడును, సహితేన = ఇంద్రజిత్కుంభకర్ణాదులతో కూడినవాడును అయిన, తేన=ఆ, ద్విజేన = బ్రాహ్మణు డగు రావణునిచే, వియుక్తా, నిహతం, మహీతలే, వేష్టమానం, శోణితపరీతాఙ్గం, తం, దృష్ట్వా, కరుణాం, గిరం, రురావ. (గోవిందరాజులు).

తా. పులస్త్యవంశమునందు పుట్టి, బ్రహ్మదేవునివలన వరములు పొంది, ఎదురు లేక గర్వించి, కుంభకర్ణాదులతో కూడి, మణిమయకిరీటాలంకృత శిరస్కుడై వెలిగిన తన ప్రియు డైన పెనిమిటిచే మండోదరి విడువబడెను. విష్ణువుచే చంపబడి నేలపై పొరలుచు నెత్తురుతో తడిసి పడి యున్న భర్త యగు రావణుని చూచి ఆమె కనికరము పుట్టునట్లు ఏడ్చెను. 11, 12

మూ. తదా తు తం ద్విజం దృష్ట్వా నిషాదేన నిపాతితమ్,
ఋషేర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత. 13

ప్ర. అ. తదా = అప్పుడు, నిషాదేన = బోయవానిచేత, నిపాతితమ్ = పడ గొట్టబడిన, ద్విజమ్ = పక్షిని, దృష్ట్వా = చూచి, ధర్మాత్మనః = ధర్మస్వభావు డైన, తస్య=ఆ, ఋషేః=ఋషికి, కారుణ్యమ్=జాలి, సమపద్యత=కలిగెను.

తా. అపుడు ఆ బోయవానిచే పడగొట్టబడిన ఆ పక్షిని చూడగనే, ధర్మాత్ము డైన ఆ వాల్మీకిమహర్షికి జాలి కలిగెను.

వి. కావ్యార్థసూచనము ఈ శ్లోకములో కూడ ఉన్నది. తదా, నిషాదేన = విష్ణువుచేత, నిపాతితం, తం, ద్విజమ్ = బ్రాహ్మణు డైన రావణుని, దృష్ట్వా, ధర్మాత్మనః, తస్య, ఋషేః, కారుణ్యమ్ = జుగుప్స, సమపద్యత (గోవింద రాజులు).

తా. ఆ రావణుని విష్ణురూపు డగు రాముడు చంపగా చూచుచున్న ధర్మ స్వభావు డైన ఆ వాల్మీకిమహర్షికి—"అధర్మాత్ముని స్మరణము కూడ అమంగళ కరము" అని జుగుప్స కలిగినది. 13

మూ. తతః కరుణవేదిత్వాదధర్మో௨యమితి ద్విజః,
నిశామ్య రుదతీం క్రౌఞ్చీమిదం వచనమబ్రవీత్. 14

ప్ర. అ. తతః=పిమ్మట, ద్విజః=వాల్మీకిమహర్షి, రుదతీమ్=ఏడ్చుచున్న, క్రౌఞ్చీమ్ = ఆడుక్రౌంచపక్షిని, నిశామ్య = చూచి, కరుణవేదిత్వాత్ = కరుణ కలవా డగుటవలన, అయమ్ = ఈ రతికాలవధము, అధర్మః ఇతి = ధర్మము కాదు అని (తలచి), ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ వాల్మీకిమహర్షి ఏడ్చుచున్న క్రౌంచిని చూచి, దయ గలవాడై, 'రతి కాలమందు చంపుట ధర్మము కాదు' అని తలచుచు ఇట్లని చెప్పెను.

వి. తతః, .... క్రౌఞ్చీమ్ = రాక్షసస్త్రీ యగు మందోదరిని, నిశామ్య, .... అయమ్ = ఈ పరభార్యాపహారము, అధర్మ ఇతి ....కరుణవేదిత్వాత్=జుగుప్స పొందినవా డగుటవలన, ఇదం, .... (గోవిందరాజులు).

తా. అటు పిమ్మట వాల్మీకిమహర్షి ఏడ్చుచున్న మండోదరిని చూచి, 'పరభార్య నపహరించిన ఈ రావణు డిప్పుడు ఇట్టి స్థితిని పొందినాడు కాబట్టి పరభార్య నపహరించుట ఎంతమాత్రము ధర్మము కాదు' అని తలచి జుగుప్స పొందినవాడై యిట్లని చెప్పెను. 14

మూ. మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః,
యత్ క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్. 15

ప్ర. అ. అమ = నిర్భాగ్యు డైన, నిషాద = బోయవాడా ! త్వమ్=నీవు, యత్ = ఏ కారణమువలన, క్రౌఞ్చమిథునాత్ = క్రౌంచపక్షుల జంటనుండి, కామమోహితమ్ = కామముచే మోహము చెందియున్న, ఏకమ్ = ఒకదానిని, అవధీః=చంపితివో, (తత్=ఆకారణమువలన), శాశ్వతీః=స్థిరములైన, సమాః= సంవత్సరములపాటు, ప్రతిష్ఠాం తు=ఉండుటను, మా గమః=పొందకపోవుదువు గాక.

తా. నిర్భాగ్యుడ వైన ఓ బోయవాడా ! నీవు క్రౌంచపక్షిదంపతులనుండి మన్మథపరవశ మైన ఒక దానిని చంపితివి. అందుచే నీవు చాలకాలము జీవించకుందువు గాక.

వి. 'త్వమగమః' అను నపుడు 'తు, అమ, గమః' అని పదచ్ఛేదము చేయబడినది.

'ఇది బ్రహ్మనుగ్రహముచే శ్రీమద్వాల్మీకిమహర్షి ముఖమునుండి మొట్టమొదట నిర్గమించిన శ్లోకము గాన ఇది కేవల శాపరూపము కాకూడదు. ఇది ఈ గ్రంథమునకు మంగళము' అని పూర్వాచార్యులు చెప్పిరి.

మానిషాద = లక్ష్మికి నివాసస్థాన మైన విష్ణువా ! త్వమ్ = నీవు, యత్= ఏ కారణమువలన, క్రౌఞ్చమిథునాత్ = రాక్షసదంపతు లైన రావణమండోదరుల నుండి, కామమోహితమ్ = కామపరవశ మగు, ఏకమ్ = ఒక డైన రావణుని, అవధీః,....శాశ్వతీః=స్థిరములైన, సమాః=సంవత్సరములయందు, ప్రతిష్ఠామ్= మాహాత్మ్యమును, అగమః = పొందితివి.

తా. ఓ శ్రీనివాసుడా! రావణమండోదరులను రాక్షసదంపతులవద్దకు వెళ్లి, వారిలో ఒకడును, మన్మథపరవశుడై సీతాదేవి నపహరించినవాడును అగు రావణుని చంపితివి గాన నీవు శాశ్వతకాలము మాహాత్మ్యము పొందితివి.

"కావ్యార్థసూచనం కైశ్చిన్మాన్ద్యామేవ నిరూప్యతే" (మంగళశ్లోకమునందే కొందరు కావ్యార్థసూచనము చేయుదురు) అను ఆలంకారికవచనమును అనుసరించి ఇచట రామాయణకథ అంతయు సంక్షేపముగా సూచింపబడినది. "మా నిషాద" అను శబ్దముచే సీతావివాహపర్యంత మైన బాలకాండకథ సంగ్రహింపబడినది. "ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః" అనుటచే పితృవచన పరిపాలన మనెడు మాహాత్మ్యమును పొందుటను తెలుపు అయోధ్యాకాండకథ అంతయు సూచింపబడినది. ఈ వాక్యముచేతనే అరణ్యకాండకథ కూడ చూపబడినది. "క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్" —ఈ వాక్యముచే కుటిలు లగు వానరదంపతు లైన తారావాలులలో ఒకరును, సుగ్రీవభార్య నపహరించిన వాడును అగు వాలిని చంపితివి అను అర్థముచే కిష్కింధాకాండకథ కూడ సూచిత మైనది. క్రౌఞ్చౌ = అల్పీభూతులు; అనగా కృశించినవారు. ఈ వాక్యముచేతనే కృశించిన సీతారాములలో ఒకతె యగు సీతాదేవి నపహరించి మిక్కిలి పీడించితివి అని సీతాదేవి విరహదుఃఖమును వర్ణించెడు సుందరకాండకథయును తెల్పబడినది. దీనిచేతనే రాక్షసదంపతు లగు రావణమండోదరులలో ఒక డైన రావణుని చంపితివి అని యుద్ధకాండకథయు గ్రథిత మైనది. మానిషాద = ఓ శ్రీనివాసుడా, అనగా ఓ దైవమా! అని యర్థము. ఓ దైవమా! పూర్వ మరణ్యావాసమునందు వియోగ దుఃఖమును అనుభవించుటచే అత్యంతకృశు లైన సీతారాములలో ఒకతె యైన సీతాదేవిని మరల అరణ్యములో చేర్చి మిక్కిలి పీడించితివి అను ఉత్తరకాండ కథయును చెప్పబడినది. (అందరు వ్యాఖ్యాతల మతము).

మూ. తస్యైవం బ్రువతశ్చిన్తా బభూవ హృది వీక్షతః,
శోకార్తేనాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా. 16

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, బ్రువతః = పలికిన, వీక్షతః = పరిశీలించుచున్న, తస్య = ఆ వాల్మీకిమహర్షియొక్క, హృది = హృదయమునందు, శకునేః = పక్షియొక్క, శోకార్తేన = శోకముచేత ఆర్తుడనైన, మయా = నాచేత, వ్యాహృతమ్ = పలుకబడిన, ఇదమ్ = ఈ వాక్యము, కిమ్ = ఏమి? అని, చిన్తా = ఆలోచన, బభూవ = కలిగెను.

తా. ఈ విధముగ పలికి పరిశీలించుకొనిన, ఆ వాల్మీకిమహర్షి మనస్సులో —"ఈ పక్షియొక్క శోకముచేత దుఃఖితుడ నైన నా నోటినుండి ఏమి యిది! ఈ విధముగా వెలువడినది?" అను ఆలోచన కలిగెను. 16

మూ. చిన్తయన్ స మహాప్రాజ్ఞశ్చకార మతిమాన్ మతిమ్,
శిష్యం చైవాబ్రవీద్వాక్యమిదం స మునిపుఙ్గవః. 17

ప్ర. అ. మహాప్రాజ్ఞః = గొప్ప పండితుడును, మతిమాన్ = బుద్ధిమంతుడును అయిన, సః = ఆ వాల్మీకి, మతిం చకార = (ఇట్లు) నిశ్చయించెను. సః మునిపుఙ్గవః = ఆ మునిశ్రేష్ఠుడు, శిష్యమ్ = శిష్యునిగూర్చి, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. మహాపండితుడును, బుద్ధిమంతుడును అయిన ఆ మునిపుంగవుడు ఒక నిశ్చయము చేసికొని శిష్యునితో ఇట్లు పలికెను. 17

మూ. పాదబద్ధోఽక్షరసమస్తన్త్రీలయసమన్వితః,
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా. 18

ప్ర. అ. మే శోకార్తస్య=నేను శోకపీడితుడనై యుండగా, ప్రవృత్తః = అప్రయత్నముగా బయలువెడలినదియు, పాదబద్ధః = నాలుగు పాదములతో కూర్చబడినదియు, అక్షరసమః=ప్రతిపాదమునందును సమానమైన అక్షరములు కలదియు, తన్త్రీలయసమన్వితః = వీణాతంత్రులపై కూర్చుటకు తగిన లయతో కూడినదియు అగు ఈ వాక్యము, శ్లోకః = శ్లోకముగా, భవతు = అగుగాక; అన్యథా = మరొక విధముగా, న = కాదు.

తా. నేను శోకార్తుడనై ఉండగా నా నోటినుండి బయలుదేరిన ఈ వాక్యము సమానమైన అక్షరములు గల నాలుగు పాదములలో కూర్చబడినది. వీణపై కూర్చి నృత్తగీతవాద్యములతో పాడుటకు అనుకూలముగా ఉన్నది. కావున దీనికి శ్లోక మను పేరుతో ప్రసిద్ధి రావలెను. మరొక పేరుతో కాదు. 18

మూ. శిష్యస్తు తస్య బ్రువతో మునేర్వాక్యమనుత్తమమ్,
ప్రతిజగ్రాహ సన్తుష్టస్తస్య తుష్టోఽభవద్గురుః. 19

ప్ర. అ. శిష్యస్తు = శిష్యుడును, బ్రువతః = ఈ విధముగా పలుకుచున్న, తస్య = ఆ, మునేః = వాల్మీకిమునియొక్క, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, వాక్యమ్ = 'మానిషాద' ఇత్యాది వాక్యమును, ప్రతిజగ్రాహ = స్వీకరించెను. గురుః = గురువు, తస్య = అతని విషయమున, తుష్టః అభవత్ = సంతోషించెను.

తా. వాల్మీకి మాటలను విని శిష్యుడు అత్యుత్తమమైన "మా నిషాద" ఇత్యాది వాక్యమును స్వీకరించెను, అనగా దానిని కంఠస్థము చేసికొనెను. వాల్మీకి అందులకు సంతసించెను. 19

మూ. సోఽభిషేకం తతః కృత్వా తీర్థే తస్మిన్ యథావిధి,
తమేవ చిన్తయన్నర్థముపావర్తత వై మునిః. 20

తతః = అటు పిమ్మట, సః మునిః = ఆ వాల్మీకి మహర్షి, తస్మిన్ తీర్థే = ఆ తీర్థమునందు, యథావిధి = యథాశాస్త్రముగా, అభిషేకమ్ = స్నానమును, కృత్వా = చేసి, తమ్ = ఆ, అర్థమేవ = విషయమునే, చిన్తయన్ = ఆలోచించుచు, ఉపావర్తత వై = ఆశ్రమము వైపు మరలెను.

తా. పిమ్మట వాల్మీకిమహాముని ఆ తీర్థమునందు యథావిధిగా స్నానము చేసి, అక్కడ జరిగిన సంఘటనను గూర్చియే ఆలోచించుచు ఆశ్రమము వైపు మరలెను. 20

మూ. భరద్వాజస్తతః శిష్యో వినీతః శ్రుతవాన్ మునిః,
కలశం పూర్ణమాదాయ పృష్ఠతోఽనుజగామ హ. 21

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శిష్యః = శిష్యుడును, వినీతః = వినయవంతుడును, శ్రుతవాన్ = శాస్త్రములు తెలిసినవాడును, మునిః = బ్రహ్మానుసంధానము చేయువాడును అగు, భరద్వాజః = భరద్వాజుడు, పూర్ణమ్ = నిండిన, కలశమ్ = కలశమును, ఆదాయ = గ్రహించి, పృష్ఠతః = వెనుక, అనుజగామ = వాల్మీకిని అనుసరించి వెళ్లెను.

తా. అప్పుడు, శాస్త్రపారంగతుడును, మననశీలుడును, వినయవంతుడును అగు శిష్యుడైన భరద్వాజుడు, జలపూర్ణమైన కలశమును తీసికొని వాల్మీకిని వెంబడించెను. 21

మూ. స ప్రవిశ్యాశ్రమపదం శిష్యేణ సహ ధర్మవిత్,
ఉపవిష్టః కథాశ్చాన్యాశ్చకార ధ్యానమాస్థితః. 22

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మములు తెలిసిన, సః = ఆ వాల్మీకి, శిష్యేణ సహ = శిష్యునితో కూడ, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, ప్రవిశ్య = ప్రవేశించి, ధ్యానమ్ = ఆలోచనను, అనగా, అంతకు ముందు జరిగిన సంఘటనలను గూర్చి

ఆలోచనను, ఆస్థితః = పొందినవాడై, ఉపవిష్టః = కూర్చున్న వాడై, అన్యాః = ఇతరము లైన, కథాశ్చ = కథలను కూడ, చకార = చేసెను.

తా. ధర్మవేత్త యైన ఆ వాల్మీకి మహర్షి, శిష్యునితో గూడ ఆశ్రమము ప్రవేశించి, కూర్చున్నవాడై, అంతకు ముందు జరిగిన పక్షివృత్తాంతాదులనే స్మరించుచు, ఆ యా విషయములను గూర్చి ముచ్చటించెను.

మూ. ఆజగామ తతో బ్రహ్మా లోకకర్తా స్వయం ప్రభుః,
చతుర్ముఖో మహాతేజా ద్రష్టుం తం మునిపుఙ్గవమ్. 23

ప్ర. అ. తతః = అటు పిమ్మట, లోకకర్తా = లోకములను సృజించువాడును, ప్రభుః = లోకములకు అధిపతియు, చతుర్ముఖః = నాలుగు ముఖములు కలవాడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును అగు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు, మునిపుఙ్గవమ్ = మునులలో శ్రేష్ఠుడైన, తమ్ = ఆ వాల్మీకిని, ద్రష్టుమ్ = చూచుటకు, స్వయమ్ = స్వయముగ, ఆజగామ = వచ్చెను.

తా. అప్పుడు, లోకములను సృజించిన వాడును, లోకముల కధిపతియు, నాలుగు ముఖములు కలవాడును, గొప్ప తేజస్సు కలవాడును అగు బ్రహ్మదేవుడు ఆ మునిపుంగవుని చూచుటకై స్వయముగ వచ్చెను.

మూ. వాల్మీకిరథ తం దృష్ట్వా సహసోత్థాయ వాగ్యతః,
ప్రాఞ్జలిః ప్రయతో భూత్వా తస్థౌ పరమవిస్మితః. 24

ప్ర. అ. అథ = పిమ్మట, ప్రయతః = పరిశుద్ధుడైన, వాల్మీకిః = వాల్మీకి, తమ్ = ఆబ్రహ్మదేవుని, దృష్ట్వా = చూచి, పరమవిస్మితః = మిక్కిలి ఆశ్చర్యము చెందినవాడై, సహసా = వెంటనే, ఉత్థాయ = లేచి, వాగ్యతః = మౌనము వహించిన వాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, తస్థౌ = నిలబడెను.

తా. పరిశుద్ధుడైన ఆ వాల్మీకి బ్రహ్మను చూడగనే ఆశ్చర్యచకితుడై, వెంటనే లేచి, దోసిలి కట్టి మౌనముగా నిలబడెను.

వి. ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామన్తి యూనః స్థవిర ఆగతే,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే''

(పెద్దవారు సమీపమునకు వచ్చుచుండగనే యువకుని ప్రాణములు పైకి లేచిపోవజూచును. ఎదురుగా వెళ్లి, వంగి నమస్కారము చేయుటచే ఆ ప్రాణములను మరల పొందును) అని ధర్మశాస్త్రములో చెప్పిన రీతిని బ్రహ్మదేవుని చూడగనే సవినయముగ లేచి నిలబడెనని అర్థము. 24

మూ. పూజయామాస తం దేవం పాద్యార్ఘ్యాసనవన్దనైః,
ప్రణమ్య విధివచ్చైనం పృష్ట్వానామయ మవ్యయమ్. 25

ప్ర. అ. తమ్ ఏనం దేవమ్ = అట్టి ఈ బ్రహ్మదేవుని, విధివత్ = యథాశాస్త్రముగా, ప్రణమ్య=నమస్కరించి, అవ్యయమ్=అవిచ్ఛిన్నమైన, అనామయం చ=కుశలమును, పృష్ట్వా=అడిగి, పాద్యార్ఘ్యాసనవన్దనైః = పాద్యము, అర్ఘ్యము, ఆసనము, నమస్కారము — వీటిచే, పూజయామాస = పూజించెను.

తా. వాల్మీకి బ్రహ్మదేవుని యథాశాస్త్రముగా నమస్కరించి, అవిచ్ఛిన్నమగు కుశలమును ప్రశ్నించి, పాద్యము, అర్ఘ్యము, ఆసనము, వందనము సమర్పించి పూజించెను. 25

మూ. అథోపవిశ్య భగవానాసనే పరమార్చితే,
వాల్మీకయే మహర్షయే సన్దిదేశాసనం తతః. 26

ప్ర. అ. అథ = అటు పిమ్మట, భగవాన్ = మాహాత్మ్యములుగల బ్రహ్మదేవుడు, పరమార్చితే=మిక్కిలి పూజింపబడిన, ఆసనే = ఆసనమునందు, ఉపవిశ్య = కూర్చుండి, మహర్షయే=మహర్షియైన, వాల్మీకయే = వాల్మీకి కొరకు, ఆసనమ్ = ఆసనమును, సందిదేశ = చూపెను.

తా. భగవంతుడైన బ్రహ్మదేవుడు పరమపూజిత మగు ఉత్తమాసనముపై కూర్చుండి "నీవు కూడ ఆసనముపై కూర్చుండుము"అని వాల్మీకితో చెప్పెను. 26

మూ. బ్రహ్మణా సమనుజ్ఞాతః సోఽప్యుపావిశదాసనే,
ఉపవిష్టే తదా తస్మిన్ సాక్షాల్లోకపితామహే,
తద్గతేనైవ మనసా వాల్మీకిర్ధ్యానమాస్థితః. 27

ప్ర. అ. సోఽపి=ఆ వాల్మీకికూడ, బ్రహ్మణా = బ్రహ్మచేత, సమనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడినవాడై, ఆసనే = ఆసనమునందు, ఉపావిశత్ =

కూర్చుండెను. తదా = అప్పుడు, లోకపితామహే = లోకములకు పితామహు డైన, తస్మిన్ = ఆ బ్రహ్మదేవుడు, సాక్షాత్ = ప్రత్యక్షముగా, ఉపవిష్టే = కూర్చున్న వా డగుచుండగా, వాల్మీకిః = వాల్మీకి, తద్గతేనైవ = ఆ క్రౌంచపక్షినే పొందిన, మనసా = మనస్సుతో, ధ్యానమ్ = చింతను, ఆస్థితః = అవలంబించెను.

తా. వాల్మీకి బ్రహ్మదేవుని అనుజ్ఞ పొంది ఆసనముపై కూర్చుండెను. లోకములకు పితామహు డైన ఆ బ్రహ్మదేవుడు ఎదురుగా కూర్చొనియుండగా, వాల్మీకి, మనస్సులో ఆ క్రౌంచపక్షినిగూర్చి మాత్రమే ఆలోచించుచుండెను. 27

మూ. పాపాత్మనా కృతం కర్మ వైరగ్రహణబుద్ధినా,
యస్తాదృశం చారురవం క్రౌఞ్చం హన్యాదకారణాత్. 28

ప్ర. అ. యః = ఏ బోయవాడు, తాదృశమ్ = అట్టి, చారురవమ్ = మధుర మైన ధ్వని గల, క్రౌఞ్చమ్ = క్రౌంచపక్షిని, అకారణాత్ = కారణము లేకుండగా, హన్యాత్ = చంపునో (చంపెనో), వైరగ్రహణబుద్ధినా = వైరముచే ఆ పక్షిని పట్టుకొనవలె నను బుద్ధి గల, పాపాత్మనా=ఆ పాపాత్మునిచే, కష్టమ్= భయంకర మగు కార్యము, కృతమ్ = చేయబడినది.

తా. "అట్టి మధురధ్వని గల క్రౌంచపక్షిని నిష్కారణముగా, ఆ బోయ వాడు చంపినాడు కదా! ఆ పాపాత్ముడు వైరముచే దానిని పట్టుకొనవలె నను బుద్ధితో ఎంతటి ఘోరకార్యము చేసినాడు!" అని ఆలోచించుచుండెను. 28

మూ. శోచన్నేవ ముహుః క్రౌఞ్చీ ముపశ్లోకమిమం పునః,
జగావ న్తర్గతమనా భూత్వా శోకపరాయణః. 29

ప్ర. అ. శోకపరాయణః = దుఃఖపరవశుడై, అన్తర్గతమనాః భూత్వా = లోలోపలనే ఏదియో ఆలోచించుకొనుచున్న మనస్సు కలవాడై, ముహుః = మాటి మాటికి, క్రౌఞ్చీమేవ = ఆడుక్రౌంచపక్షిని గూర్చియే, శోచన్ = దుఃఖించుచు, పునః = మరల, ఇమం శ్లోకమ్ = ఈ శ్లోకమును, ఉపజగౌ = గానము చేసెను.

తా. వాల్మీకి దుఃఖపరవశుడై, బాహ్యవిషయములపై ప్రవర్తించని మన స్సుతో, ఆ క్రౌంచిని గూర్చియే విచారించుచు, మానిషాదేత్యాది శ్లోకమును మరల మరల చదివెను. 29

మూ. తమువాచ తతో బ్రహ్మా ప్రహసన్మునిపుఙ్గవమ్,
శ్లోక ఏవ త్వయా బద్ధో నాత్ర కార్యా విచారణా. 30

ప్ర. అ. తతః = పిమ్మట, బ్రహ్మా = బ్రహ్మ, ప్రహసన్ = నవ్వుచు, తం మునిపుఙ్గవమ్ = ఆ మునిశ్రేష్ఠుని గూర్చి, ఉవాచ = పలికెను, త్వయా = నీచేత, బద్ధః = కూర్చబడినది, శ్లోకః ఏవ = శ్లోకమే, అత్ర = ఈ విషయమునందు, విచారణా = ఆలోచన, న కార్యా = చేయదగినది కాదు.

తా. బ్రహ్మదేవుడు నవ్వుచు వాల్మీకితో ఇట్లనెను—"నీవు కూర్చినది శ్లోకమే. ఈ విషయమున సందేహము లేదు." 30

మూ. మచ్ఛన్దాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ,
రామస్య చరితం సర్వం కురు త్వమృషిసత్తమ. 31

ప్ర. అ. బ్రహ్మన్=ఓ బ్రహ్మర్షీ, తే=నీయొక్క, ఇయమ్=ఈ, సరస్వతీ= వాక్కు, మచ్ఛన్దాదేవ = నాయొక్క ఇచ్ఛ ప్రకారమే, ప్రవృత్తా=పుట్టినది. ఋషి సత్తమ = ఓ ఋషిశ్రేష్ఠుడా ! రామస్య = రామునియొక్క, సర్వమ్=సమస్తమైన, చరితమ్ = చరితమును, త్వమ్ = నీవు, కురు = రచించుము.

తా. ఓ బ్రహ్మర్షీ ! నా ఇచ్ఛనే అనుసరించి ఈ వాక్కు నీయందు ఆవిర్భవించినది. ఓ ఋషిశ్రేష్ఠుడా ! నీవు రాముని చరితము నంతను కావ్యరూపమున రచింపుము.

వి. "బ్రహ్మన్" అని సంబోధించుటచే "నీవును బ్రహ్మ యగు నా అంశమున పుట్టినవాడ వగుటచే నీ ముఖమునుండి నా ఇచ్ఛ ప్రకారము సరస్వతి వెడలినది" అని సూచిత మగుచున్నది. "ఋషిసత్తమ" అనుటచే "నానృషిః కురుతే కావ్యమ్" (ఋషి కానివాడు కావ్యము వ్రాయజాలడు) అను న్యాయము ననుసరించి "నీవు కావ్యము చేయ శక్తి కలవారిలో శ్రేష్ఠుడవు కాబట్టి నీవు రచించిన కావ్యము అన్నింటి కన్నను శ్రేష్ఠ మగును" అని తెల్పబడుచున్నది (గోవిందరాజులు). 31

మూ. ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః,
వృత్తం కథయ ధీరస్య యథా తే నారదాచ్ఛ్రుతమ్. 32

ప్ర. అ. ధర్మాత్మనః = ధర్మస్వభావుడును, లోకే = లోకమందు, గుణవతః = ప్రశస్తగుణములు కలవాడును, ధీమతః = బుద్ధిమంతుడును, ధీరస్య = ధైర్యశాలియు అగు, రామస్య = రామునియొక్క, వృత్తమ్ = చరిత్రమును, తే = నీచేత, నారదాత్ = నారదునివలన, యథా = ఏవిధముగా, శ్రుతమ్ = వినబడెనో, (ఆ విధముగా) కథయ = చెప్పుము.

తా. రాముడు ధర్మస్వభావుడు. లోకములో ప్రశస్తములైన గుణములు కలవాడు. పండితుడు. అట్టి రాముని చరిత్రమును నారదునినుండి నీవు వినినది వినినట్లుగ చెప్పుము. 32

మూ. రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః,
రామస్య సహసౌమిత్రే రాక్షసానాం చ సర్వశః, 33
వైదేహ్యాశ్చాపి యద్వృత్తం ప్రకాశం యది వా రహః,
తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి. 34

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతుడైన, సహసౌమిత్రేః = లక్ష్మణునితో కూడిన, తస్య రామస్య = ఆ రామునియొక్కయు, రాక్షసానాం చ = రాక్షసుల యొక్కయు, రహస్యం చ = రహస్యమైనదియు, ప్రకాశం చ = అందరికిని తెలిసినదియు, సర్వశః = సర్వప్రకారము నైన, యత్ = ఏ, వృత్తమ్ = చరిత్రము కలదో, వైదేహ్యాశ్చాపి = సీతాదేవియొక్కయు (అపి శబ్దముచే భరతాదులయొక్కయు అని గ్రహింపవలెను) ప్రకాశం యది వా = అందరకును తెలిసినది గాని, రహో వా=రహస్యము గాని, యత్ వృత్తమ్ = ఏ చరిత్ర కలదో, తచ్చ = అదియు, అవిదితమపి = తెలియని దైనను, తే = నీకు, విదితమ్ = తెలిసినదిగా, భవిష్యతి = కాగలదు.

తా. లక్ష్మణసహితు డైన రాముడు, సీత, భరతాదులు, రాక్షసులు —వీరందరి చరిత్రము, రహస్య మైన దైనను, ప్రకాశ మైన దైనను, నీకింత వరకును తెలియనిది కూడ ఇపుడు స్పష్టముగా తెలియగలదు. 33, 34

మూ. న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి,
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్. 35

ప్ర. అ. అత్ర=ఈ, కావ్యే = కావ్యమునందు, తే = నీయొక్క, వాక్ = వాక్కు, కాచిత్=ఒక్కటియు, అనృతా=అసత్యమైనది, న భవిష్యతి=కానేరదు, పుణ్యామ్ = పుణ్యమైనదియు, మనోరమామ్ = మనోహరమైనదియు అగు, రామ కథామ్ = రాముని కథను, శ్లోకబద్ధామ్ = శ్లోకబద్ధ మైనదానినిగా, కురు = చేయుము.

తా. ఈ కావ్యములో నీవు చెప్పిన ఒక్క మాట యైనను అసత్యము కానేరదు. పుణ్యము, మనోహరము అయిన రామకథను శ్లోకబద్ధము చేయుము. 35

మూ. యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే,
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి. 36

ప్ర. అ. గిరయః = పర్వతములును, సరితః చ = నదులును, మహీతలే= భూతలమునందు, యావత్ = ఎంతవరకును, స్థాస్యన్తి = ఉండగలవో, తావత్ = అంతవరకును, రామాయణకథా = రామాయణకథ, లోకేషు = లోకములయందు, ప్రచరిష్యతి = ప్రవర్తింపగలదు.

తా. పర్వతములును, నదులును భూతలమునం దున్నంతవరకును రామాయణకథ లోకములలో వ్యాపించి ఉండును. 36

మూ. యావద్రామాయణకథా త్వత్కృతా ప్రచరిష్యతి,
తావదూర్ధ్వమధశ్చ త్వం మల్లోకేషు నివత్స్యసి. 37

ప్ర. అ. త్వత్కృతా = నీచేత రచింపబడిన, రామాయణకథా = రామాయణకథ, యావత్ = ఎంతవరకు, ప్రచరిష్యతి = ప్రచారములో నుండునో, తావత్ = అంతవరకును, త్వమ్ = నీవు, ఊర్ధ్వమ్ = పైన, అధశ్చ = క్రిందను, మల్లోకేషు = నా లోకములలో, నివత్స్యసి = నివసించగలవు.

తా. నీవు రచించిన రామాయణకథ ప్రచారములో నున్నంత కాలము, నీవు నేను సృజించిన ఊర్ధ్వలోకములలోను, అధోలోకములలోను స్వేచ్ఛగ సంచరించుచు ఉండగలవు. 37

మూ. ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మా తత్రైవాన్తరధీయత,
తతః సశిష్యో భగవాన్మునిర్విస్మయమాయయౌ. 38

ప్ర. అ. భగవాన్ = మాహాత్మ్యముగల, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, ఇతి= ఈ విధముగా, ఉక్త్వా = పలికి, తత్రైవ = అచటనే, అన్తరధీయత = అంతర్ధానము పొందెను, తతః = అటు పిమ్మట, సశిష్యః = శిష్యులతో కూడిన, భగవాన్ = మాహాత్మ్యము గల, మునిః = వాల్మీకి మహాముని, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆయయౌ = పొందెను.

తా. భగవంతు డైన బ్రహ్మదేవుడు ఈ విధముగ పలికి అచటనే అంతర్ధానము పొందెను. వాల్మీకి మహామునియు, శిష్యులును చాల ఆశ్చర్యము చెందిరి. 38

మూ. తస్య శిష్యా స్తతః సర్వే జగుః శ్లోకమిమం పునః,
ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః. 39

ప్ర. అ. తతః = పిమ్మట, తస్య = ఆతని, శిష్యాః = శిష్యులు, సర్వే = అందరును, ముహుర్ముహుః = మాటిమాటికిని, ప్రీయమాణాః = సంతోషించుచున్నవారై, పునః=మరల, ఇమం శ్లోకమ్ = ఈ శ్లోకమును, జగుః = గానము చేసిరి. భృశవిస్మితాః = మిక్కిలి ఆశ్చర్యపడినవారై, ప్రాహుశ్చ = పరస్పరము చెప్పుకొనిరి.

తా. పిమ్మట వాల్మీకిశిష్యు లందరును మాటి మాటికి సంతోషించుచు మరల ఈ శ్లోకమును పఠించి ఒకరి కొకరు చెప్పుకొనిరి. 39

మూ. సమాక్షరై శ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా,
సోనువ్యాహరణాద్భూయః శ్లోకః శ్లోకత్వమాగతః. 40

ప్ర. అ. యః=ఏది, సమాక్షరైః=సమానమైన సంఖ్యగల అక్షరములతో కూడిన, చతుర్భిః=నాలుగు, పాదైః=పాదములతో, మహర్షిణా=మహర్షిచే, గీతః= చెప్పబడినదో, సః = ఆ, శ్లోకః = శ్లోకము, అనువ్యాహరణాత్ = మాటిమాటికి పఠించుట వలన, భూయః=మరల, అనగా ఇంకను, శ్లోకత్వమ్=శ్లోకత్వమును, ఆగతః = పొందినది.

తా. సమసంఖ్యాకము లగు అక్షరములతో, నాలుగు పాదములతో, కూడినదై, మహర్షి గానము చేసిన ఈ శ్లోకము, మాటి మాటికిని గానము చేయుటచే ఇంకను శ్లోకత్వము ను పొందినది.

వి. శ్లోక శబ్దమునకు యశస్సు అని కూడ అర్థము. వాల్మీకి ముఖము నుండి వెలువడిన ఈ శ్లోకము, శిష్యు లందరును అత్యానందముతో మరల మరల పఠించుటచే అతనికి కీర్తిపతాక మైన దని భావము.

మూ. తస్య బుద్ధిరియం జాతా మహర్షేర్భావితాత్మనః,
కృత్స్నం రామాయణం కావ్యమీదృశైః కరవాణ్యహమ్. 41

ప్ర. అ. అహమ్ = నేను, కృత్స్నమ్ = సమ స్తమైన, రామాయణమ్ = రామాయణ మనెడు, కావ్యమ్ = కావ్యమును, ఈదృశైః = ఇట్టి శ్లోకములతో, కరవాణి=చేసెదను అని, ఇయమ్=ఈ, బుద్ధిః=బుద్ధి, భావితాత్మనః=ధ్యానింపబడిన పరమాత్మగల, తస్య = ఆ, మహర్షేః = వాల్మీకిమహర్షికి, జాతా=కలిగెను.

తా. "రామాయణము నంతను ఈ శ్లోకవృత్తములో రచించెదను" అని పరమాత్మధ్యానపరాయణు డగు వాల్మీకిమహర్షి నిశ్చయించుకొనెను. 41

మూ. ఉదారవృత్తార్థపదైర్మనోరమై
స్తదాస్య రామస్య చకార కీర్తిమాన్,
సమాక్షరైః శ్లోకశతైర్యశస్వినో
యశస్కరం కావ్యముదారధీర్మునిః. 42

ప్ర. అ. కీర్తిమాన్ = కీర్తి కలవాడును, ఉదారధీః = గొప్ప బుద్ధి కలవాడును, మునిః=మననశీలుడును అగు వాల్మీకి, తదా=అప్పుడు, యశస్వినః = కీర్తిమంతుడైన, అస్య రామస్య = ఈ రామునియొక్క, యశస్కరమ్ = కీర్తిని కలిగించు, కావ్యమ్ = కావ్యమును, ఉదారవృత్తార్థపదైః = ఉత్తమ మైన పద్యములును, అర్థములును, శబ్దములును గల, మనోరమైః=మనోహరములైన, సమాక్షరైః= సమములైన అక్షరములు గల, శ్లోకశతైః = వందలకొలది శ్లోకముల చేత, చకార = రచించెను.

తా. కీర్తిమంతుడును, మహాబుద్ధిమంతుడును అగు వాల్మీకి యశశ్శాలి యగు ఆ రాముని మాహాత్మ్యమును తెలుపునట్టి కావ్యమును, మనోహరము లైన వియు, ఉత్తమము లైన వృత్తములతోడను, శబ్దార్థములతోడను ప్రకాశించు నవియు, సమాక్షరములు కలిగినవియు అగు శ్లోకశతములతో నిర్మించెను.

మూ. తదుపగత సమాససన్ధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 43

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాణ్డే ద్వితీయః సర్గః.

ప్ర. అ. ఉపగతసమాససన్ధియోగం = సమానసంధివ్యుత్పత్తులతో కూడిన దియు, సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్=సమానములును, మధురములును అర్థ వంతములును అగు వాక్యములతో కూర్చబడినదియు, మునిప్రణీతమ్= వాల్మీకిచే రచింపబడినదియు అగు, తత్ = ఆ, రఘువరచరితమ్ = రామచరితమును, దశ శిరసః = రావణుని, వధం చ = వధను, నిశామయధ్వమ్=చూడండి (వినండి).

తా. వాల్మీకిముని రచించిన ఈ "రామచరితము"లో, "రావణవధ"లో సమాసములు నాతిదీర్ఘములు. సంధులు శ్రావ్యములు. శబ్దవ్యుత్పత్తి శాస్త్రసం మత మైనది. ఇందలి వాక్యములు సమములై, మధురములై, అర్థభరితములై ఉన్నవి. అట్టి ఈ కావ్యమును వినండి. 43

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు,
బాల కాండలో ద్వితీయసర్గ సమాప్తము.

శ్రీః

# అథ తృతీయః సర్గః

మూ. శ్రుత్వా వస్తు సమగ్రం తద్ధర్మాత్మా ధర్మసంహితమ్,
వ్యక్తమన్వేషతే భూయో యద్వృత్తం తస్య ధీమతః. 1

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మస్వభావుడైన వాల్మీకి, ధర్మసంహితమ్=ధర్మముతో కూడిన, సమగ్రమ్ =సమస్తమైన, తత్ =ఆ, వస్తు=రామకథను, శ్రుత్వా=విని, ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య=ఆ రామునియొక్క, వృత్తమ్=చరిత్రము, యత్ =ఏది కలదో, దానిని, వ్యక్తమ్ =స్పష్టమగునట్లు, భూయః=ఇంకను, అన్వేషతే =వెదకెను.

తా. ధర్మస్వభావుడైన వాల్మీకి, తనకు నారదుడు చెప్పిన ధర్మసహితమగు ఆ రామకథకంటె అధికముగ ఇంకను ఏమైన రామచరిత మున్నదా అని పరిశీలించెను. 1

మూ. ఉపస్పృశ్యోదకం సమ్యఙ్మునిః స్థిత్వా కృతాఞ్జలిః,
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేషతే గతిమ్. 2

ప్ర. అ. మునిః =వాల్మీకి, ఉదకమ్ =ఉదకమును, ఉపస్పృశ్య =ఆచమనము చేసి, ప్రాచీనాగ్రేషు=తూర్పువైపునకు కొనలు గల, దర్భేషు=దర్భలపై, స్థిత్వా =కూర్చుండి, కృతాఞ్జలిః =కట్టబడిన దోసిలి కలవాడై, ధర్మేణ =తపోబలముచేత, గతిమ్ =రామచరిత్రముయొక్క రీతిని, సమ్యక్ =బాగుగా, అన్వేషతే =అన్వేషించెను.

తా. వాల్మీకి ఆచమనము చేసి, తూర్పుగా అగ్రభాగము లుండునట్లు పరచిన దర్భలపై కూర్చుండి, దోసిలి కట్టి, దివ్యదృష్టిచే రామచరితమును గూర్చి చక్కగా ఆలోచించెను. 2

మూ. రామలక్ష్మణసీతాభీ రాజ్ఞా దశరథేన చ,
సభార్యేణ సరాష్ట్రేణ యత్ప్రాప్తం తత్ర తత్త్వతః, 3

హసితం భాషితం చైవ గతిర్యా యచ్చ చేష్టితమ్,
తత్సర్వం ధర్మవీర్యేణ యథావత్సంప్రపశ్యతి. 4

ప్ర. అ. రామలక్ష్మణసీతాభిః=రామలక్ష్మణసీతలచేతను, రాజ్ఞా=రాజైన, దశరథేన చ =దశరథునిచేతను, సభార్యేణ=భార్యతో కూడిన రామునిచేతను, సరాష్ట్రేణ = రాష్ట్రముతో కూడిన రామునిచేతను, యత్ = ఏది, ప్రాప్తమ్ = పొందబడినదో, తత్ర = ఆ విషయమునందును, యా = ఏ, గతిః = గమనము కలదో దానిని, యత్ = ఏ, చేష్టితమ్ = చేష్టకలదో దానిని, హసితమ్ = వారి నవ్వును, భాషితం చైవ = వారి సంభాషణను, తత్సర్వమ్ = దాని నంతను, తత్త్వతః=యథార్థముగ, యథావత్=నడచినట్లుగ, ధర్మవీర్యేణ=తపోబలము చేత, లేదా బ్రహ్మనుగ్రహప్రభావముచేత, సంప్రపశ్యతి = చూచెను.

తా. వాల్మీకి తపఃప్రభావముచే, రామలక్ష్మణసీతలును, దశరథమహారాజును ఏమి చేసిరో, రాముడు భార్యాసహితుడై ఉన్నప్పుడును, రాజ్యముతో ఉన్నప్పుడును ఏమేమి పొందెనో ఆ విషయముల నన్నింటినీ యథార్థముగా తెలిసికొనెను. మరియు వారందరును ఎట్లు నవ్విరో, ఎట్లు మాటలాడిరో, ఎట్లు నడచిరో, ఇంకను ఏయే పనులు చేసిరో ఆ విషయముల నన్నింటిని కూడ తెలుసుకొనెను. 3, 4

మూ. స్త్రీతృతీయేన చ తదా యత్ప్రాప్తం చరతా వనే,
సత్యసన్ధేన రామేణ తత్సర్వం చాన్వవేక్షితమ్. 5

ప్ర. అ. స్త్రీతృతీయేన = భార్య మూడవదిగా గల, వనే చరతా=వనమునందు సంచరించుచున్న, సత్యసన్ధేన=సత్య మైన ప్రతిజ్ఞ గల, రామేణ=రాముని చేత, తదా = అప్పుడు, యత్ = ఏది, ప్రాప్తమ్ = పొందబడెనో, తత్సర్వమ్= అది యంతయు, అన్వవేక్షితమ్ = చూడబడెను.

తా. సత్యసంధు డైన రాముడు సీతాలక్ష్మణులతో కలిసి అరణ్యములో సంచరించు నపుడు ఏమేమి జరిగెనో అవి యన్నియు తెలుసుకొనెను. 5

మూ. తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగమాస్థితః,
పురా యత్తత్ర నిర్వృత్తం పాణావామలకం యథా. 6

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధర్మాత్మా = ధర్మాత్ము డైన వాల్మీకి,

యోగమ్ = యోగమును, ఆస్థితః = పొందినవాడై, పురా = పూర్వము, తత్ర = అచట, యత్ = ఏది, నిర్వృత్తమ్ = జరిగినదో, తత్ సర్వమ్ = దానినంతను, పాణౌ = అరచేతియందు, ఆమలకం యథా = ఉసిరికాయను వలె, పశ్యతి = చూచెను.

తా. ధర్మాత్ము డైన వాల్మీకి, రామాదులకు సంబంధించిన వృత్తాంతము నంతను, యోగదృష్టిచే, అరచేతిలోని ఉసిరికాయను వలె స్పష్టముగా కను గొనెను. 6

మూ. తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ స మహాద్యుతిః,
అభిరామస్య రామస్య చరితం కర్తు ముద్యతః. 7

కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తరమ్,
సముద్రమివ రత్నాఢ్యం సర్వశ్రుతిమనోహరమ్. 8

ప్ర. అ. మహాద్యుతిః = గొప్పకాంతిగల, సః = వాల్మీకి, తత్ సర్వమ్ = ఆ చరిత్రమునంతను, తత్త్వతః = ఉన్నదున్నట్లుగా, ధర్మేణ=తపోబలముచేత, దృష్ట్వా = చూచి, కామార్థగుణసంయుక్తమ్ = కామము అర్థము అనెడు గుణములతో కూడినదియు, ధర్మార్థగుణవిస్తరమ్ = ధర్మమే ప్రయోజనముగా గల గుణములతో విస్తృత మైనదియును, రత్నాఢ్యమ్ = రత్నములతో నిండిన, సముద్రమివ=సముద్రము వలె ఉన్నదియును, సర్వశ్రుతిమనోహరమ్=అందరి చెవులను హృదయములను ఆకర్షించునదియు, లేదా సకలవేదముల హృదయమును సంగ్రహించునదియు అగు, అభిరామస్య=లోకాభిరాము డైన, రామస్య=రాముని యొక్క, చరితమ్ = చరిత్రను, కర్తుమ్ = రచించుటకు, ఉద్యతః = ఉద్యుక్తు డయ్యెను.

తా. మహాతేజఃశాలి యైన వాల్మీకి తపఃప్రభావముచే విషయముల నన్నింటిని తెలిసికొని, కామార్థము లనెడు పురుషార్థములతో సంబంధించి, ధర్మప్రధాన మైన గుణములు అధికముగా కలదియు, రత్నములతో సమృద్ధ మైన సముద్రము వలె నున్నదియు, అందరి చెవులను మనస్సులను ఆకర్షించునదియు, సకల వేదసారసంగ్రహరూపమును అగు, లోకాభిరాముడైన రాముని చరిత్రమును రచించుటకు ఉపక్రమించెను. 7, 8

మూ. స యథాకథితం పూర్వం నారదేన మహర్షిణా,
రఘువంశస్య చరితం చకార భగవానృషిః. 9

ప్ర. అ. భగవాన్=మాహాత్మ్యముగల, సః ఋషిః=ఆ వాల్మీకిమహర్షి, నారదేన మహర్షిణా=నారదమహర్షిచేత, పూర్వమ్=పూర్వము, యథా=ఏ విధముగా, కథితమ్ = చెప్పబడినదో, ఆ విధముగ, రఘువంశస్య = రఘువంశమునందు పుట్టిన రామునియొక్క, చరితమ్ = చరిత్రను, చకార = నిర్మించెను.

తా. భగవంతు డైన వాల్మీకి పూర్వము నారదమహర్షి తనకు చెప్పిన విధముగ రాముని చరిత్రమును రచించెను. 9

మూ. జన్మ రామస్య సుమహద్వీర్యం సర్వానుకూలతామ్,
లోకస్య ప్రియతాం క్షాన్తిం సౌమ్యతాం సత్యశీలతామ్. 10

ప్ర. అ. రామస్య=రామునియొక్క, జన్మ=అవతారమును, సుమహత్=మిక్కిలి గొప్పదైన, వీర్యమ్ = పరాక్రమమును, సర్వానుకూలతామ్=అందరికిని అనుకూలముగా ఉండుటను, లోకస్య = ప్రపంచమునకు, ప్రియతామ్ = ప్రేమ పాత్రుడై ఉండుటను, క్షాన్తిమ్ = ఓర్పును, సౌమ్యతామ్=సౌందర్యమును, సత్యశీలతామ్ = సత్యశీలమును (వర్ణించెను).

తా. రాముని అవతారమును, ఆతని మహాపరాక్రమమును, అందరికిని అనుకూలుడుగాను ఇష్టుడుగాను ఉండుటను, ఓర్పును, సౌందర్యమును, సత్యశీలమును వర్ణించెను. 10

మూ. నానాచిత్రకథాశ్చాన్యా విశ్వామిత్రసమాగమే,
జానక్యాశ్చ వివాహం చ ధనుషశ్చ విభేదనమ్. 11

ప్ర. అ. విశ్వామిత్రసమాగమే=విశ్వామిత్రునితో చేరినపుడు, అన్యాః = ఇతరము లైన, నానాచిత్రకథాః = అనేకవిధము లైన విచిత్రము లైన కథలను, జానక్యాః = జానకియొక్క, వివాహం చ = వివాహమును, ధనుషః = ధనస్సుయొక్క, విభేదనం చ = భేదనమును (వర్ణించెను).

తా. విశ్వామిత్రుని కలిసి నప్పుడు జరిగిన విచిత్రము లైన అనేకకథలను, శివధనుర్భంగమును, జానకీపరిణయమును వర్ణించెను. 11

మూ. రామరామవివాదం చ గుణాన్దాశరథే స్తథా,
తథాభిషేకం రామస్య కైకేయ్యా దుష్టభావతామ్. 12

ప్ర. అ. రామరామవివాదం చ = పరశురామ దశరథరాముల వివాదమును, తథా = మరియు, దాశరథేః = రామునియొక్క, గుణాన్ = గుణములను, తథా = మరియు, రామస్య = రామునియొక్క, అభిషేకమ్ = అభిషేకమును, కైకేయ్యాః = కైకేయియొక్క, దుష్టభావతామ్ = దుష్టభావమును (వర్ణించెను).

తా. పరశురామునితో దశరథరాముని వివాదమును, రాముని సద్గుణములను, రాముని యౌవరాజ్యపట్టాభిషేకమునకై ప్రయత్నమును, కైకేయియొక్క దుష్టచింతనమును వర్ణించెను. 12

మూ. విఘాతం చాభిషేకస్య రాఘవస్య వివాసనమ్,
రాజ్ఞః శోకవిలాపం చ పరలోకస్య చాశ్రయమ్. 13

ప్ర. అ. అభిషేకస్య=రామాభిషేకమునకు, విఘాతం చ=విఘ్నమును, రామస్య = రామునియొక్క (ని), వివాసనమ్=అరణ్యమునకు పంపుటను, రాజ్ఞః= దశరథునియొక్క, శోకవిలాపం చ=దుఃఖముతో విలపించుటను, పరలోకస్య= స్వర్గలోకముయొక్క, ఆశ్రయం చ = ఆశ్రయించుటను (వర్ణించెను).

తా. రాముని యౌవరాజ్యపట్టాభిషేకమునకు విఘ్నము కలుగుట, రాముని అరణ్యవాసమునకు పంపుట, దశరథుడు దుఃఖార్తుడై విలపించుట, అతడు స్వర్గస్థు డగుట — ఈ విషయములను వర్ణించెను. 13

మూ. ప్రకృతీనాం విషాదం చ ప్రకృతీనాం విసర్జనమ్,
నిషాదాధిపసంవాదం సూతోపావర్తనం తథా. 14

ప్ర. అ. ప్రకృతీనామ్=ప్రజల, విషాదమ్=దుఃఖమును, ప్రకృతీనామ్= ప్రజల(ను), విసర్జనమ్ = విడచుటను, నిషాదాధిపసంవాదమ్ = గుహునితో సంభాషణమును, తథా = మరియు, సూతోపావర్తనమ్ = సారథి తిరిగి వచ్చుటను (వర్ణించెను).

తా. ప్రజలు దుఃఖించుటను, రాముడు వారిని విడచిపెట్టుటను, గుహు

నితో సంభాషణమును, సారథి యైన సుమంత్రుడు రాముని అరణ్యప్రాంతములో విడచి తిరిగి వచ్చుటను వర్ణించెను.

మూ. గఙ్గాయాశ్చాపి సంతారం భరద్వాజస్య దర్శనమ్,
భరద్వాజాభ్యనుజ్ఞానాచ్చిత్రకూటస్య దర్శనమ్. 15

ప్ర. అ. గఙ్గాయాః = గంగానదియొక్క (నదిని), సన్తారం చాపి = దాటుటను, భరద్వాజస్య = భరద్వాజుని, దర్శనమ్ = దర్శనమును, భరద్వాజాభ్యనుజ్ఞానాత్ = భరద్వాజుని ఆజ్ఞవలన, చిత్రకూటస్య=చిత్రకూటపర్వతముయొక్క, దర్శనమ్ = చూచుటను (వర్ణించెను).

తా. సీతారామలక్ష్మణులు గంగానదిని దాటుటను, భరద్వాజుని చూచుటను, భరద్వాజుని ఆజ్ఞ ప్రకారము వారు చిత్రకూటమునకు వెళ్లుటను వర్ణించెను. 15

మూ. వాస్తుకర్మ నివేశం చ భరతాగమనం తథా,
ప్రసాదనం చ రామస్య పితుశ్చ సలిలక్రియామ్. 16

ప్ర. అ. వాస్తుకర్మ = గృహనిర్మాణమును, నివేశం చ=ఆ గృహములో నివసించుటను, భరతాగమనమ్ = భరతుని ఆగమనమును, రామస్య = రామునియొక్క, ప్రసాదనం చ=అనుగ్రహింపచేసుకొనుటను, తథా=మరియు, పితుః= తండ్రికి, సలిలక్రియామ్ = తర్పణము లిచ్చుటను (వర్ణించెను).

తా. రామాదులు చిత్రకూటమున గృహము నిర్మించుకొని దానిలో నివసించుటను, భరతుడు వచ్చి రాముని బ్రతిమాలుటను, రాముడు తండ్రికి ఔర్ధ్వదేహికక్రియలు చేయుటను వర్ణించెను. 16

మూ. పాదుకాగ్ర్యాభిషేకం చ నన్దిగ్రామనివాసనమ్,
దణ్డకారణ్యగమనం విరాధస్య వధం తథా. 17

ప్ర. అ. పాదుకాగ్ర్యాభిషేకం చ = శ్రేష్ఠము లైన పాదుకలకు రాజ్యాభిషేకమును, నన్దిగ్రామనివాసనమ్ = నందిగ్రామములో నివాసమును, దణ్డకారణ్యగమనమ్ = దండకారణ్యములోనికి వెళ్లుటను, తథా = మరియు, విరాధస్య= విరాధునియొక్క, వధమ్=వధను (వర్ణించెను).

తా. భరతుడు రామపాదుకలకు పట్టాభిషేకము చేసి నందిగ్రామములో నివసించుటను, రాముడు దండకారణ్యములోనికి ప్రవేశించుటను, అచట విరాధుని చంపుటను వర్ణించెను. 17

మూ. దర్శనం శరభఙ్గస్య సుతీక్ష్ణేన సమాగమమ్,
అనసూయాసహాస్యామప్యఙ్గరాగస్య చార్పణమ్. 18

ప్ర. అ. శరభఙ్గస్య=శరభంగమహర్షియొక్క, దర్శనమ్=దర్శనమును, సుతీక్ష్ణేన = సుతీక్ష్ణమహర్షితో, సమాగమమ్ = సమాగమమును, అనసూయాసహాస్యామ్ అపి=అనసూయతో కలిసి కూర్చుండుటను, అఙ్గరాగస్య = అంగరాగముయొక్క, అర్పణం చ = ఇచ్చుటను (వర్ణించెను).

తా. రాముడు శరభంగసుతీక్ష్ణమహర్షుల దర్శనము చేయుటను, సీత అనసూయ దగ్గర కూర్చుండి, సంభాషణాదికము చేయుటను, అనసూయ సీతకు శరీరమునకు పూసికొనెడు అంగరాగమును ఇచ్చుటను వర్ణించెను. 18

మూ. అగస్త్యదర్శనం చైవ జటాయోరభిసఙ్గమమ్,
పఞ్చవట్యాశ్చ గమనం శూర్పణఖ్యాశ్చ దర్శనమ్. 19

ప్ర. అ. అగస్త్యదర్శనం చైవ = అగస్త్యమహామునిని చూచుటను, జటాయోః = జటాయువుయొక్క, అభిసంగమమ్=సమాగమమును, పఞ్చవట్యాః గమనమ్ = పంచవటికి వెళ్లుటను, శూర్పణఖ్యాః = శూర్పణఖయొక్క, దర్శనం చ = దర్శనమును (వర్ణించెను).

తా. రాముడు అగస్త్యుని దర్శనము చేయుటను, జటాయువును కలియుటను, పంచవటికి వెళ్లుటను, అచట శూర్పణఖను చూచుటను వర్ణించెను. 19

మూ. శూర్పణఖ్యాశ్చ సంవాదం విరూపకరణం తథా,
వధం ఖరత్రిశిరసోరుత్థానం రావణస్య చ. 20

ప్ర. అ. శూర్పణఖ్యాః=శూర్పణఖయొక్క, సంవాదమ్ = సంభాషణను, తథా = మరియు, విరూపకరణమ్ = ఆమెను విరూపముకలదానినిగా చేయుటను, ఖరత్రిశిరసోః = ఖరత్రిశిరస్కుల, వధమ్ = వధను, రావణస్య = రావణుని యొక్క, ఉత్థానం చ = ప్రయత్నప్రారంభమును (వర్ణించెను).

తా. శూర్పణఖతో జరిగిన సంభాషణమును, ఆమెకు రూపవికారము కలిగించుటను, ఖరుడు త్రిశిరస్కుడు అను రాక్షసులను రాముడు సంహరింపగా రావణుడు రామునకు అపకారము చేయుటకై ప్రయత్నము ప్రారంభించుటను వర్ణించెను. 20

మూ. మారీచస్య వధం చైవ వైదేహ్యా హరణం తథా,
రాఘవస్య విలాపం చ గృధ్రరాజనిబర్హణమ్. 21

ప్ర. అ. మారీచస్య = మారీచునియొక్క, వధం చైవ = వధను, తథా= మరియు, వైదేహ్యాః = సీతయొక్క, హరణమ్ = హరణమును, రాఘవస్య = రామునియొక్క, విలాపం చ = విలాపమును, గృధ్రరాజనిబర్హణమ్ = జటాయువును చంపుటను (వర్ణించెను).

తా. రాముడు మారీచుని చంపుటను, రావణుడు సీతను హరించుటను, జటాయువును చంపుటను రాముడు సీతకై విలపించుటను వర్ణించెను. 21

మూ. కబన్ధదర్శనం చైవ పమ్పాయాశ్చాపి దర్శనమ్,
శబర్యా దర్శనం చైవ హనూమద్దర్శనం తథా. 22

కబన్ధదర్శనం చైవ = కబంధుని దర్శనమును, పమ్పాయాశ్చాపి = పంపానదియొక్క కూడ, దర్శనమ్=దర్శనమును, శబర్యాః=శబరియొక్క, దర్శనం చైవ = దర్శనమును, తథా=మరియు, హనూమద్దర్శనమ్=హనుమంతునియొక్క దర్శనమును (వర్ణించెను).

తా. రాముడు కబంధుని, పంపాసరస్సును, శబరిని, హనుమంతుని చూచుటను వర్ణించెను. 22

మూ. ఋశ్యమూకస్య గమనం సుగ్రీవేణ సమాగమమ్,
ప్రత్యయోత్పాదనం సఖ్యం వాలిసుగ్రీవవిగ్రహమ్. 23

ప్ర. అ. ఋశ్యమూకస్య = ఋశ్యమూకపర్వతమునకు, గమనమ్ = వెళ్లుటను, సుగ్రీవేణ = సుగ్రీవునితో, సమాగమమ్ = సమాగమమును, ప్రత్యయోత్పాదనమ్ = నమ్మకమును పుట్టించుటను, సఖ్యమ్ = స్నేహమును, వాలిసుగ్రీవవిగ్రహమ్ = వాలిసుగ్రీవుల యుద్ధమును (వర్ణించెను).

**తా.** రాముడు ఋశ్యమూకపర్వతమునకు వెళ్లి, సుగ్రీవుని కలిసికొని ఆతనితో స్నేహము చేసికొనుటను, అతనికి నమ్మకము కలిగించుటను, వాలి సుగ్రీవుల యుద్ధమును వర్ణించెను. 23

**మూ.** వాలిప్రమథనం చైవ సుగ్రీవప్రతిపాదనమ్,
తారావిలాపం సమయం వర్షరాత్రనివాసనమ్. 24

**ప్ర. అ.** వాలిప్రమథనం చైవ = వాలిని సంహరించుటను, సుగ్రీవప్రతిపాదనమ్=సుగ్రీవునకు రాజ్యము నిచ్చుటను, తారావిలాపమ్=తారయొక్క విలాపమును, సమయమ్=రామసుగ్రీవులు ఏర్పరచుకొనిన ఒడంబడికను, వర్షరాత్రనివాసనం = వర్షర్తురాత్రులందు నివసించుటను (వర్ణించెను).

**తా.** రాముడు వాలిని సంహరించుటను, తార విలపించుటను, రాముడు సుగ్రీవునకు రాజ్యము నిచ్చుటను, రామసుగ్రీవులమధ్య సీతాన్వేషణమును గూర్చి జరిగిన ఒప్పందమును, రాముడు వర్షర్తురాత్రులందు, యుద్ధమునకై తగు కాలము వచ్చువరకును వేచి యుండుటను వర్ణించెను. 24

**మూ.** కోపం రాఘవసింహస్య బలానాముపసఙ్గ్రహమ్,
దిశః ప్రస్థాపనం చైవ పృథివ్యాశ్చ నివేదనమ్. 25

**ప్ర. అ.** రాఘవసింహస్య = రఘువంశమునందు జనించినవారిలో శ్రేష్ఠుడైన రామునియొక్క, కోపమ్=కోపమును, బలానామ్=వానరసైన్యములయొక్క, ఉపసఙ్గ్రహమ్=చేర్చుటను, దిశః = దిక్కులనుగూర్చి, ప్రస్థాపనం చైవ=పంపుటను, పృథివ్యాః=భూమియొక్క, నివేదనమ్=వర్ణించి చెప్పుటను(వర్ణించెను).

**తా.** సుగ్రీవుడు ఆలస్యము చేయుటచే రామునకు కోపము కలుగుటను, సుగ్రీవుడు వానరసేనలను పిలిపించుటను, వారిని నాల్గు దిక్కులకు పంపుటను, సుగ్రీవుడు వారికి పృథివిపై నున్న వివిధప్రదేశములను గూర్చి వర్ణించి చెప్పుటను (వర్ణించెను). 25

**మూ.** అఙ్గులీయకదానం చ ఋక్షస్య బిలదర్శనమ్,
ప్రాయోపవేశనం చాపి సమ్పాతేశ్చాపి దర్శనమ్. 26

ప్ర. అ. అఙ్గులీయకదానం చ = హనుమంతునకు రాముడు తన ఉంగరమును ఇచ్చుటను, ఋక్షస్య బిలదర్శనమ్ = వానరులు ఋక్షుని బిలమును చూచుటను, ప్రాయోపవేశనం చాపి=ప్రాయోపవేశనమును, సమ్పాతేః=సంపాతియొక్క, దర్శనం చాపి = దర్శనమును (వర్ణించెను).

తా. రాముడు హనుమంతుని చేతికి తన ఉంగరమును ఇచ్చుటను, వానరులు ఋక్షబిలములో ప్రవేశించుటను, వారు సీతను కానక నిరాశులై ప్రాయోపవేశము చేయుటను, వారు సంపాతిని చూచుటను (వర్ణించెను). 26

మూ. పర్వతారోహణం చాపి సాగరస్య చ లఙ్ఘనమ్,
సముద్రవచనాచ్చైవ మైనాకస్య చ దర్శనమ్. 27

ప్ర. అ. పర్వతారోహణం చాపి = హనుమంతుడు మహేంద్రపర్వతమును ఎక్కుటను, సాగరస్య = సముద్రముయొక్క, లఙ్ఘనమ్ = దాటుటను, సముద్రవచనాత్ = సముద్రునిమాటవలన, మైనాకస్య = మైనాకపర్వతముయొక్క, దర్శనమ్ = దర్శనమును (వర్ణించెను).

తా. హనుమంతుడు మహేంద్రపర్వతము నెక్కి దానినుండి ఎగిరి సముద్రమును దాటుటను, సముద్రుడు ప్రేరేపింపగా వచ్చిన మైనాకపర్వతముయొక్క దర్శనమును వర్ణించెను. 27

మూ. సింహికాయాశ్చ నిధనం లఙ్కామలయదర్శనమ్,
రాత్రౌ లఙ్కాప్రవేశం చ ఏకస్యాథ విచిన్తనమ్. 28

ప్ర. అ. సింహికాయాః=సింహికయొక్క, నిధనమ్=మరణమును, లఙ్కామలయదర్శనమ్ = లంకలో నున్న పర్వతముయొక్క ఒక భాగమును చూచుటను, రాత్రౌ = రాత్రియందు, లఙ్కాప్రవేశం చ = లంకలో ప్రవేశించుటను, అథ = అటుపిమ్మట, ఏకస్య = ఒకడైన హనుమంతునియొక్క, విచిన్తనమ్ = ఆలోచించుటను వర్ణించెను. ("మలయః పర్వతాన్తరే, పర్వతాఙ్కే ప్రియోద్యానే" అని రత్నమాల).

తా. సింహికయొక్క మరణమును, హనుమంతుడు లంకలో ఉన్న పర్వతముయొక్క ఒక భాగమును చూచుటను (చేరుటను), రాత్రియందు లంకలో ప్రవేశించుటను, ఒంటరిగా ఉన్న ఆతడు ఆలోచన చేయుటను వర్ణించెను. 28

మూ. దర్శనం రావణస్యాపి పుష్పకస్య చ దర్శనమ్,
ఆపానభూమిగమనమవరోధస్య దర్శనమ్. 29

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, దర్శనమపి = దర్శనమును, పుష్పకస్య = పుష్పకముయొక్క, దర్శనమ్ = దర్శనమును, ఆపానభూమిగమనమ్ = మద్యపానము చేయు ప్రదేశమునకు వెళ్లుటను, అవరోధస్య = అంతఃపురముయొక్క, దర్శనమ్ = దర్శనమును (వర్ణించెను).

తా. హనుమంతుడు రావణుని, అతని పుష్పకమును చూచుటను, మద్యపానభూమికి వెళ్లి అచట రావణాంతఃపురస్త్రీలను చూచుటను వర్ణించెను. 29

మూ. అశోకవనికాయానం సీతాయాశ్చాపి దర్శనమ్,
అభిజ్ఞానప్రదానం చ రావణస్య చ దర్శనమ్. 30

ప్ర. అ. అశోకవనికాయానమ్=అశోకవనములోనికి వెళ్లుటను, సీతాయాః= సీతయొక్క, దర్శనం చాపి = దర్శనమును, అభిజ్ఞానప్రదానం చ = సీతకు ఆనవాలును ఇచ్చుటను, రావణస్య=రావణునియొక్క, దర్శనం చ = దర్శనమును (వర్ణించెను).

తా. హనుమంతుడు అశోకవనములో ప్రవేశించి అచట సీతను చూచుటను, ఆమెకు రాముని ఉంగరమును ఆనవాలుగా ఇచ్చుటను, పిమ్మట రావణుని చూచుటను (వర్ణించెను). 30

మూ. రాక్షసీతర్జనం చైవ త్రిజటాస్వప్నదర్శనమ్,
మణిప్రదానం సీతాయా వృక్షభఙ్గం తథైవ చ. 31

ప్ర. అ. రాక్షసీతర్జనం చైవ = రాక్షసస్త్రీలయొక్క తర్జనమును, త్రిజటాస్వప్నదర్శనమ్ = త్రిజటయొక్క స్వప్నదర్శనమును, సీతాయాః = సీతయొక్క, మణిప్రదానమ్ = మణిని ఇచ్చుటను, తథైవ చ = మరియు, వృక్షభఙ్గమ్ = వృక్షములను విరచుటను (వర్ణించెను).

తా. రాక్షసస్త్రీలు సీతను భయపెట్టుటను, త్రిజటాస్వప్నమును, సీత హనుమంతునకు చూడామణి ఇచ్చుటను, హనుమంతుడు అశోకవనములోని వృక్షములను విరచుటను వర్ణించెను. 31

మూ. రాక్షసీవిద్రవం చైవ కింకరాణాం నిబర్హణమ్,
గ్రహణం వాయుసూనోశ్చ లఙ్కాదాహాభిగర్జనమ్. 32

ప్ర. అ. రాక్షసీవిద్రవం చైవ=రాక్షసస్త్రీలు పారిపోవుటను, కిఙ్కరాణామ్=రావణుని భటులయొక్క, నిబర్హణమ్ = వధను, వాయుసూనోః=హనుమంతుని యొక్క, గ్రహణమ్ = గ్రహణమును, లఙ్కాదాహాభిగర్జనమ్ = లంకయొక్క దహనమును గర్జనమును (వర్ణించెను).

తా. రాక్షసస్త్రీలు పారిపోవుటను, హనుమంతుడు రావణుని భటులను చంపుటను, వాయునందనుడు ఇంద్రజిత్తు చేత పట్టువడుటను, అతడు లంకను దహించుచు గరించుటను వర్ణించెను. 32

మూ ప్రతిప్లవనమేవాథ మధూనాం హరణం తథా,
రాఘవాశ్వాసనం చాపి మణినిర్యాతనం తథా. 33

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ప్రతిప్లవనమ్=మరల సముద్రమును దాటుటను, తథా = మరియు, మధూనామ్ = తేనెలయొక్క, హరణమ్=హరించుటను, రాఘవాశ్వాసనం చాపి = రాముని ఓదార్చుటను, తథా = మరియు, మణినిర్యాతనమ్ = మాణిక్యమును ఇచ్చుటను (వర్ణించెను).

తా. హనుమంతుడు మరల సముద్రము దాటి వెనుకకు వచ్చుటను, వానరులు మధువనములో మధువును త్రాగుటను, హనుమంతుడు సీత వార్త తెలిపి, రాముని ఓదార్చి, అతనికి సీత ఇచ్చిన చూడామణిని సమర్పించుటను వర్ణించెను. 33

మూ. సంగమం చ సముద్రేణ నలసేతోశ్చ బన్ధనమ్,
ప్రతారం చ సముద్రస్య రాత్రౌ లఙ్కావరోధనమ్. 34

ప్ర. అ. సముద్రేణ=సముద్రముతో, సంగమమ్=కలియుటను, నలసేతోః బన్ధనం చ = నలునిచే సేతువుయొక్క బంధనమును, సముద్రస్య = సముద్రుని యొక్క, ప్రతారం చ = దాటుటను, రాత్రౌ=రాత్రియందు, లఙ్కావరోధనమ్= లంకను ముట్టడించుటను (వర్ణించెను).

తా. రాముడు సైన్యముతో సముద్రము చేరుటను, నలుడు సేతువు బంధించుటను, రాత్రి లంకను ముట్టడించుటను వర్ణించెను. 34

మూ. విభీషణేన సంసర్గం వధోపాయనివేదనమ్,
కుమ్భకర్ణస్య నిధనం మేఘనాదనిబర్హణమ్. 35

ప్ర.అ. విభీషణేన = విభీషణునితో, సంసర్గమ్ = సంబంధమును, వధోపాయనివేదనమ్ = అతడు రావణవధోపాయమును చెప్పుటను, కుమ్భకర్ణస్య = కుంభకర్ణునియొక్క, నిధనమ్ = వధను, మేఘనాదనిబర్హణమ్ = మేఘనాదుని సంహారమును (వర్ణించెను).

తా. విభీషణునితో సంబంధమును, అతడు రామునకు రావణవధోపాయమును చెప్పుటను, కుమ్భకర్ణమేఘనాదుల సంహారమును వర్ణించెను. 35

మూ. రావణస్య వినాశం చ సీతావాప్తిమరేః పురే,
విభీషణాభిషేకం చ పుష్పకస్య చ దర్శనమ్. 36

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, వినాశం చ = వినాశమును, సీతావాప్తిమ్ = సీతాప్రాప్తిని, అరేః పురే = శత్రువుయొక్క పురమైన లంకలో, విభీషణాభిషేకం చ = విభీషణుని అభిషేకమును, పుష్పకస్య = పుష్పకముయొక్క, దర్శనం చ = దర్శనమును (వర్ణించెను).

తా. రావణవధను, సీతాప్రాప్తిని, లంకలో విభీషణరాజ్యాభిషేకమును, పుష్పకదర్శనమును వర్ణించెను. 36

మూ. అయోధ్యాయాశ్చ గమనం భరతేన సమాగమమ్,
రామాభిషేకాభ్యుదయం సర్వసైన్యవిసర్జనమ్,
స్వరాష్ట్రరఞ్జనం చైవ వైదేహ్యాశ్చ విసర్జనమ్. 37

ప్ర. అ. అయోధ్యాయాః గమనమ్ = అయోధ్యాపట్టణమునకు వెళ్లుటను, భరతేన = భరతునితో, సమాగమమ్ = సమాగమమును, రామాభిషేకాభ్యుదయమ్ = రామరాజ్యాభిషేకోత్సవమును, సర్వసైన్యవిసర్జనమ్ = సకలసైన్యమును వెనుకకు పంపివేయుటను, స్వరాష్ట్రరఞ్జనం చైవ = తన రాష్ట్రమును ఆనందింపచేయుటను, వైదేహ్యాః విసర్జనం చ = సీతను విడచుటను (వర్ణించెను).

తా. రాముడు అయోధ్య చేరి భరతుని కలియుటను, రాముని పట్టాభిషేకోత్సవమును, రాముడు వానరసైన్యము నంతను వెనుకను పంపివేయుటను,

దేశములోని ప్రజ లందరును సంతోషించువిధమున రాముడు రాజ్యపాలనము చేయుటను, సీతను త్యజించుటను వర్ణించెను. 37

మూ. అనాగతం చ యత్కించి ద్రామస్య వసుధాతలే,
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకిర్భగవానృషిః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
తృతీయః సర్గః

ప్ర. అ. భగవాన్=మాహాత్మ్యము కల, వాల్మీకిః ఋషిః=వాల్మీకిమహర్షి, రామస్య=రామునకుసంబంధించిన, యత్కిఞ్చిత్=ఏ ఏ విషయము, వసుధా తలే=ఈ భూతలమునందు, అనాగతం చ=మున్ముందు జరుగవలసి ఉన్నదో, తత్=దానిని, ఉత్తరే=ఉత్తరకథాప్రతిపాదకమగు, కావ్యే=కావ్యమునందు, చకార=రచించెను.

తా. భగవంతుడైన వాల్మీకి మున్ముందు జరుగ నున్న రాముని చరిత్రము నంతను ఉత్తరకాండలో రచించెను. 38

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాల కాండలో తృతీయసర్గ సమాప్తము.

# అథ చతుర్థః సర్గః

మూ. ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకిర్భగవానృషిః,
చకార చరితం కృత్స్నం విచిత్రపదమాత్మవాన్. 1

ప్ర. అ. భగవాన్=మాహాత్మ్యము కలవాడును, ఆత్మవాన్=బుద్ధిశాలియు, ఋషిః=కావ్యము చేయ సమర్థుడును అగు, వాల్మీకిః=వాల్మీకి, ప్రాప్తరాజ్యస్య=పొందబడిన రాజ్యము గల, రామస్య=రామునియొక్క, విచిత్రపదమ్=ఆశ్చర్య జనకము లగు శబ్దములు గల, కృత్స్నమ్=సమస్తమైన, చరితమ్=చరిత్రమును, చకార = రచించెను.

తా. భగవంతుడును, ఋషి యగుటచే కావ్యము చేయ సమర్థుడును అగు వాల్మీకి, రాముడు రాజ్యమును పాలించుచుండగా, అతని చరిత్రము నంతను విచిత్రములైన శబ్దములతో రచించెను.

వి. "ప్రాప్తరాజ్యస్య రామస్య చరితం భగవాన్ ఋషిః చకార" అనుటచే రాముడు రాజ్యము చేయుచున్న కాలమునందే వాల్మీకి రామాయణమును రచించె నని సూచిత మగుచున్నది. (గోవిందరాజులు). "తే వయం భవతా రక్ష్యా భవ ద్విషయవాసినః" (నీ రాజ్యములో ఉన్న మమ్ములను నీవే రక్షింపవలెను) అని ఋషులు చెప్పుటచే, వాల్మీకి రామరాజ్యమునందే నివసించి ఆతని పవిత్రచరిత్ర మును రచించెను (మహేశ్వరతీర్థులు). 1

మూ. చతుర్వింశత్సహస్రాణి శ్లోకానాముక్తవాన్ ఋషిః,
తథా సర్గశతాన్ పఞ్చ షట్కాణ్డాని తథోత్తరమ్. 2

ప్ర. అ. ఋషిః = వాల్మీకిమహర్షి, శ్లోకానాం చతుర్వింశత్సహస్రాణి = ఇరువదినాలుగువేల శ్లోకములను, తథా = మరియు, పఞ్చ = ఐదు, సర్గశతాన్= వందలసర్గలను, షట్కాణ్డాని = ఆరుకాండలను, తథా = మరియు, ఉత్తరమ్= ఉత్తరకాండను, ఉక్తవాన్ = చెప్పెను.

తా. వాల్మీకిమహర్షి రామాయణమును ఏడు కాండములలో, ఐదు వందల సర్గలలో, ఇరువదినాలుగు వేల శ్లోకములలో రచించెను. 2

మూ. కృత్వాపి తన్మహాప్రాజ్ఞః సభవిష్యం సహోత్తరమ్,
చిన్తయామాస కోన్వేత త్ప్రయుఞ్జీయాదితి ప్రభుః. 3

ప్ర. అ. మహాప్రాజ్ఞః = మహాబుద్ధిశాలియు, ప్రభుః = సమర్థుడును అగు వాల్మీకి, సహోత్తరమ్ = రామపట్టాభిషేకము తరువాత జరిగిన కథతో కూడినదియు, సభవిష్యమ్=అశ్వమేధము తరువాత జరిగిన కథతో కూడినదియు అగు, తత్ = రామాయణమును, కృత్వా=రచించి, ఏతత్=దీనిని, కః ను=ఎవడు, ప్రయుఞ్జీయాత్ = ప్రయోగించును, ఇతి = అని, చిన్తయామాస = ఆలోచించెను.

తా. మహాబుద్ధిశాలియు, సమర్థుడును అగు వాల్మీకి రామపట్టాభిషేకానంతరము జరిగిన కథతోడను, అశ్వమేధానంతరము జరిగిన కథతోడను రామాయణమును రచించి "దీనిని యుక్తరీతిలో పఠింపగలవారు ఎవ రున్నారా ?" అని ఆలోచించెను. 3

మూ. తస్య చిన్తయమానస్య మహర్షేర్భావితాత్మనః,
అగృహ్ణీతాం తతః పాదౌ మునివేషౌ కుశీలవౌ. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మునివేషౌ=మునులవేషములను ధరించిన, కుశీలవౌ = గాయకులైన కుశలవులు, చిన్తయానస్య = ఆలోచించుచున్న, భావితాత్మనః = పరిశుద్ధ మైన హృదయముగల, తస్య మహర్షేః = ఆ వాల్మీకమహర్షి యొక్క, పాదౌ = పాదములను, అగృహ్ణీతామ్ = గ్రహించిరి.

తా. పవిత్రహృదయు డగు వాల్మీకమహర్షి ఈ విధముగా ఆలోచించుచుండగా మునివేషధారులైన గాయకులగు కుశలవులు ఆయనకు పాదప్రణామము చేసిరి. 4

మూ. కుశీలవౌ తు ధర్మజ్ఞౌ రాజపుత్రౌ యశస్వినౌ,
భ్రాతరౌ స్వరసమ్పన్నౌ దదర్శాశ్రమవాసినౌ. 5

ప్ర. అ. ధర్మజ్ఞౌ = ధర్మముతెలిసినవారును, రాజపుత్రౌ = రాజకుమారులును, యశస్వినౌ = కీర్తి కలవారును, భ్రాతరౌ=సోదరులును, స్వరసంపన్నౌ =

మధురస్వరముకలవారును, ఆశ్రమవాసినౌ=ఆశ్రమములో నివసించువారునుఅగు, కుశీలవౌ = గాయకులు అగు (కుశలవులను) దదర్శ = చూచెను.

తా. వాల్మీకిమహర్షి ధర్మజ్ఞులు, కీర్తిమంతులు, మధురస్వరవంతులు, ఆశ్రమనివాసులు, సోదరులు, గాయకులు అగు కుశలవులను చూచెను. 5

మూ. స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ,
వేదోపబ్రృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః. 6

ప్ర. అ. ప్రభుః = స్వతంత్రుడైన, సః = ఆ వాల్మీకి, మేధావినౌ=మేధావంతులును, వేదేషు=వేదములలో, పరినిష్ఠితౌ=దృఢ మైన జ్ఞానము కలవారును అగు వారిని, దృష్ట్వా=చూచి, వేదోపబ్రృంహణార్థాయ=వేదములను పరిపుష్టము చేయుటకై రచింపబడిన రామాయణమును, తౌ = వారిని, అగ్రాహయత = గ్రహింపచేసెను.

తా. స్వతంత్రుడైన వాల్మీకి, సాంగవేదాధ్యయనము చేసిన, మేధావంతులైన ఆ ఇరువురిని చూచి, వేదార్థమునకు పరిపుష్టి కూర్చుటకై తాను రచించిన రామాయణమును వారికి ఉపదేశించెను. 6

మూ. కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్,
పౌలస్త్యవధమిత్యేవ చకార చరితవ్రతః. 7

ప్ర. అ. చరితవ్రతః = ఆచరింపబడిన ఉత్తమవ్రతములు గల వాల్మీకి, కృత్స్నమ్=సమస్తమైన, కావ్యమ్=ఆ కావ్యమును, రామాయణమ్=రామాయణమనియు, సీతాయాః మహత్ చరితమ్ = సీతయొక్క గొప్ప చరిత్ర అనియు, పౌలస్త్యవధమ్ ఇత్యేవ = పౌలస్త్యవధ మనియు పేర్లతో, చకార = రచించెను.

తా. సకలవ్రతములను ఆచరించిన వాల్మీకి ఆ కావ్యమును "రామాయణము" "సీతాచరితము" "పౌలస్త్యవధము" అను పేర్లతో రచించి ఉండెను. 7

మూ. పాఠ్యే గేయే చ మధురం ప్రమాణైస్త్రిభిరన్వితమ్,
జాతిభిః సప్తభిర్బద్ధం తన్త్రీలయసమన్వితమ్. 8

రసైః శృఙ్గారకారుణ్య హాస్యవీరభయానకైః,
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేతదగాయతామ్. 9

తౌ తు గాన్ధర్వతత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థానకోవిదౌ,
భ్రాతరౌ స్వరసమ్పన్నౌ గన్ధర్వావివ రూపిణౌ. 10

రూపలక్షణసంపన్నౌ మధురస్వరభాషిణౌ,
బిమ్బాదివోద్ధృతౌ బిమ్బౌ రామదేహాత్తథాపరౌ. 11

ప్ర. అ. గాన్ధర్వతత్త్వజ్ఞౌ = సంగీతశాస్త్రముయొక్క యథార్థస్వరూపము తెలిసినవారును, మూర్ఛనాస్థానకోవిదౌ = స్వరమూర్ఛనల స్థానములు తెలిసిన వారును, భ్రాతరౌ = సోదరులును, స్వరసమ్పన్నౌ = మంచికంఠస్వరము కల వారును, రూపిణౌ = మనుష్యరూపము దాల్చిన, గన్ధర్వావివ = గంధర్వుల వలె ఉన్న వారును, రూపలక్షణసంపన్నౌ = మంచిరూపముతో మంచి లక్షణములతో కూడినవారును, మధురస్వరభాషిణౌ = మధుర మైన స్వరముతో మాటలాడు వారును, బిమ్బాత్ = మూలబింబ మైన, రామదేహాత్ = రాముని దేహమునుండి, ఉద్ధృతౌ = తీయబడిన, అపరౌ బిమ్బౌ ఇవ = వేరైన ప్రతిబింబములవలె ఉన్న వారును అగు, తౌ తు=ఆ కుశలవులు, పాఠ్యే=పఠింపదగిన అంశమునందును, గేయే చ=గానముచేయదగిన అంశమునందును, మధురమ్=మధుర మైనదియు, త్రిభిః ప్రమాణైః = ద్రుత-మధ్య-విలంబితము లనెడు మూడు ప్రమాణములతో, అన్వితమ్=కూడినదియు, సప్తభిః జాతిభిః = షడ్జ-మధ్యమ-గాంధార-నిషాద-ఋషభ-ధైవత-పంచమము లనెడు జాతులతో, బద్ధమ్ = కూర్చబడినదియు, తన్త్రీలయసమన్వితమ్=వీణాతంత్రుల లయముతో కూడినదియు, శృఙ్గారకారుణ్యహాస్యవీరభయానకైః = శృంగార-కరుణ-హాస్య-వీర-భయానకరసములతోడను, రౌద్రాదిభిశ్చ = రౌద్రము మొదలైన, రసైః=రసములతోడను, సంయుక్తమ్= కూడిన, ఏతత్ = ఈ, కావ్యమ్ = కావ్యమును, అగాయతామ్ = గానముచేసిరి.

తా. కుశలవులు ఆ కావ్యమును చక్కగా గానము చేసిరి. ఆ కావ్యములోని చదువదగిన అంశము (సాహిత్యము), గానము చేయు అంశము (సంగీతము) కూడ మధురముగా ఉన్నవి. అనగా ఈ కావ్యములోని భాషార్థాది విషయములు మధురముగా నుండుటయే గాక, ఇది గానమునకు కూడ అనువుగా ఉండుటచే

దీని గానము కూడ మధురముగనే ఉన్నది. ద్రుత—మధ్య—విలంబితము లను మూడు ప్రమాణములను, షడ్జాదిసప్తస్వరములను కూడ ఇందు చక్కగ నిర్వహించుటకు వీలున్నది. ఇది వీణాతంత్రులపై లయ కలిపి పాడుటకు అనువుగ ఉన్నది. ఆ యా స్థానములలో ప్రసంగానుగుణముగా శృంగార—హాస్య—కరుణ—రౌద్ర—వీర—భయానక—బీభత్స — అద్భుత—శాంతరసములు నిర్వహింపబడినవి. దీనిని పాడిన కుశలవు లను సోదరులు కూడ సంగీతశాస్త్రరహస్యములు తెలిసినవారు. మూర్ఛనాస్థానములను గుర్తించకలిగినవారు. వీరి కంఠస్వరము అతిమధురము. మనుష్యరూపము ధరించిన గంధర్వుల వలె ఉన్నారు. అపూర్వసౌందర్యముతో, ఉత్తమలక్షణములతో అలరారుచున్న వారు మాటలాడు నపుడు కూడ వారి కంఠస్వరము ఎంతగానో ముచ్చట గొల్పుచు ఉండును. వారు రాముని శరీర మనెడు మూలబింబమునుండి వెలికి తీసిన రెండు ప్రతిబింబములా అన్నట్లు ఉండిరి. 8-11

మూ. తౌ రాజపుత్రౌ కార్త్స్న్యేన ధర్మ్యమాఖ్యానముత్తమమ్,
వాచోవిధేయం తత్సర్వం కృత్వా కావ్యమనిన్దితౌ. 12

ఋషీణాం చ ద్విజాతీనాం సాధూనాం చ సమాగమే,
యథోపదేశం తత్త్వజ్ఞౌ జగతుః సుసమాహితౌ. 13

ప్ర. అ. తౌ = ఆ, రాజపుత్రౌ = రాజపుత్రులు, ధర్మ్యమ్ = ధర్మప్రతిపాదకమును, ఉత్తమమ్ = ఉత్తమ మైనదియు అగు, తత్ సర్వమ్ ఆఖ్యానమ్= ఆ ఆఖ్యానమునంతను, కార్త్స్న్యేన = పూర్తిగా, వాచోవిధేయమ్ = కంఠస్థ మైనదానినిగా, కృత్వా = చేసి, అనిన్దితౌ = ఏ విధముగను తప్పు పట్టుటకు వీలులేనివారై, తత్త్వజ్ఞౌ = ఆ ఆఖ్యానమునకు సంబంధించిన తత్త్వమును బాగుగా తెలిసికొనినవారై, సుసమాహితౌ = బాగుగా సావధానచిత్తులై, యథోపదేశమ్= వాల్మీకిమహర్షి తమకు ఎట్లు ఉపదేశించెనో అదే విధమున, ఋషీణామ్=ఋషులయొక్కయు, ద్విజాతీనామ్ = ద్విజులయొక్కయు, సాధూనాం చ=సత్పురుషులయొక్కయు, సమాగమే = సమావేశములయందు, జగతుః = గానముచేసిరి.

తా. ఆ రాజకుమారులు ధర్మప్రతిపాదక మైన ఆ ఉత్తమకావ్యమును పూర్తిగా కంఠస్థము చేసికొని, దాని నెట్లు గానము చేయవలెనో ఆ రహస్యమును

బాగుగా తెలిసికొని, సావధానచిత్తులై, ఋషులు, ద్విజులు, సత్పురుషులు మొదలైన వారి సమావేశములలో, ఎవ్వరును తప్పు పట్టుటకు వీలు కాని విధమున గానము చేసిరి. 12, 13

మూ. మహాత్మానౌ మహాభాగౌ సర్వలక్షణలక్షితౌ,
తౌ కదాచిత్సమేతానామృషీణాం భావితాత్మనామ్,
ఆసీనానాం సమీపస్థావిదం కావ్యమగాయతామ్. 14

ప్ర. అ. మహాత్మానౌ = గొప్ప బుద్ధి కలవారును, మహాభాగౌ = గొప్ప భాగ్యము కలవారును, సర్వలక్షణలక్షితౌ = సమస్తమైన ఉత్తమలక్షణములతో కూడినవారును అగు, తౌ = వారు, కదాచిత్ = ఒకనాడు, సమేతానామ్ = ఒక చోట కలిసి ఉన్న, భావితాత్మనామ్ = పవిత్ర మైన హృదయము గల, ఆసీనానామ్ = కూర్చున్న, ఋషీణామ్ = ఋషులయొక్క, సమీపస్థౌ = సమీపమునందున్న వారై, ఇదమ్ = ఈ, కావ్యమ్ = కావ్యమును, అగాయతామ్ = గానముచేసిరి.

తా. మహాబుద్ధిశాలులును, మహాభాగ్యవంతులును, సర్వలక్షణసంపన్నులును అగు ఆ కుశలవులు, ఒకనాడు, పవిత్రహృదయు లగు కొందరు ఋషీశ్వరులు కలిసి ఒక చోట కూర్చుని యుండగా, వారి ఎదుట ఈ కావ్యమును గానము చేసిరి. 14

మూ. తచ్ఛ్రుత్వా మునయః సర్వే బాష్పపర్యాకులేక్షణాః,
సాధు సాధ్వితి తావూచుః పరం విస్మయమాగతాః. 15

ప్ర. అ. సర్వే = సమస్తమైన, మునయః = మునులు, తత్ = ఆ కావ్యమును, శ్రుత్వా = విని, పరమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగతాః = పొందినవారై, బాష్పపర్యాకులేక్షణాః = కన్నీటిచే వ్యాకుల మైన చూపు కలవారై, సాధు సాధు ఇతి = "బాగు బాగు" అని, తౌ = కుశలవులను గూర్చి, ఊచుః = పలికిరి.

తా. వారి కావ్యగానమును విన్న మును లందరును మిక్కిలి ఆశ్చర్యము చెంది, ఆనందబాష్పము కార్చుచు, "బాగు! బాగు!" అని వారిని మెచ్చుకొనిరి. 15

మూ. తే ప్రీతమనసః సర్వే మునయో ధర్మవత్సలాః,
ప్రశశంసుః ప్రశస్తవ్యౌ గాయమానౌ కుశీలవౌ. 16

ప్ర. అ. ధర్మవత్సలాః = ధర్మమునందు ఆసక్తిగల, తే = ఆ, సర్వే = సమస్తమైన, మునయః = మునులు, ప్రీతమనసః = సంతసించిన మనస్సులు కల వారై, ప్రశస్తవ్యౌ = ప్రశంసార్హులైన, గాయమానౌ = గానము చేయుచున్న, కుశీలవౌ = గాయకులను (కుశలవులను), ప్రశశంసుః = ప్రశంసించిరి.

తా. ధర్మమునందు ఆసక్తి గల ఆ మును లందరును సంతోషించిన హృదయము కలవారై ప్రశంసార్హులైన, గానము చేయుచున్న ఆ కుశలవులను ప్రశంసించిరి. 16

మూ. అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం చ విశేషతః,
చిరనిర్వృత్తమప్యేతత్ప్రత్యక్షమివ దర్శితమ్. 17

ప్ర. అ. గీతస్య=గానముయొక్క, మాధుర్యమ్=మాధుర్యము, అహో= ఎంత ఆశ్చర్యకరముగా ఉన్నది. విశేషతః = ప్రధానముగా, శ్లోకానాం తు = శ్లోకముల (మాధుర్యము, ఎంత ఆశ్చర్యకరముగా ఉన్నది!). ఏతత్ = ఈ చరిత్రము, చిరనిర్వృత్తమపి = చాలకాలము క్రితము జరిగిన దైనను, ప్రత్యక్షమివ = ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు, దర్శితమ్ = చూపబడినది.

తా. గీతము చాల మధురముగా ఉన్నది. శ్లోకములు ఇంకను మధురములుగా ఉన్నవి. పూర్వ మేనాడో జరిగిన కథ ఇపుడు కండ్లకు కట్టి నట్లు వర్ణింపబడినది. 17

మూ. ప్రవిశ్య తావుభౌ సుష్ఠు భావం సమ్యగగాయతామ్,
సహితౌ మధురం రక్తం సంపన్నం స్వరసమ్పదా. 18

ప్ర. అ. తౌ ఉభౌ=వారిరువురును, సహితౌ=కలిసినవారై, అనగా లయ తప్పనివారై గొంతుకలు కలిపి, భావమ్= అభిప్రాయమును, సుష్ఠు = బాగుగా, ప్రవిశ్య = ప్రవేశించి, మధురమ్=మధురముగాను, రక్తమ్=మనోహరముగాను, స్వరసమ్పదా=షడ్జాదిస్వరసంపదతో, సంపన్నమ్=కూడునట్లుగాను, సమ్యక్= బాగుగా, అగాయతామ్ = గానముచేసిరి.

తా. వారిద్దరును కంఠములు చక్కగా కలిపి, భావావేశముతో, మధురముగాను, మనోహరముగాను, షడ్జాది స్వరములు చెడకుండగను, పాడిరి. 18

మూ. ఏవం ప్రశస్యమానౌ తౌ తపఃశ్లాఘ్యైర్మహాత్మభిః,
సంరక్తతరమత్యర్థం మధురం తావగాయతామ్. 19

ప్ర. అ. తపఃశ్లాఘ్యైః = తపస్సుచే కొనియాడదగిన, మహాత్మభిః = మహాత్ములచేత, ఏవమ్ = ఈ విధముగా, ప్రశస్యమానౌ = ప్రశంసింపబడుచున్న, తౌ = వారు, సంరక్తతరమ్ = మిక్కిలి మనోహరముగా ఉండునట్లును, అత్యర్థమ్ = మిక్కిలి, మధురమ్ = మధురముగాను, అగాయతామ్ = గానముచేసిరి.

మహాతపఃశాలు లగు ఆ మహాత్ము లీవిధముగా కొనియాడగా కుశలవులు అతిమధురముగాను, మనోహరముగాను గానము చేసిరి. 19

మూ. ప్రీతః కశ్చిన్మునిస్తాభ్యాం సంస్థితః కలశం దదౌ,
ప్రసన్నో వల్కలం కశ్చిద్దదౌ తాభ్యాం మహాయశాః. 20

ప్ర. అ. కశ్చిత్ = ఒకానొక, మునిః = ముని, ప్రీతః = సంతసించినవాడై, సంస్థితః = లేచినవాడై, తాభ్యామ్ = ఆ కుశలవులకు, కలశమ్ = కలశమును, దదౌ = ఇచ్చెను. మహాయశాః = గొప్పకీర్తిగల, కశ్చిత్ = ఒకానొకముని, ప్రసన్నః = సంతసించినవాడై, వల్కలమ్ = నారచీరను, దదౌ = ఇచ్చెను.

తా. ఒకానొక మహర్షి సంతోషించినవాడై లేచి వారికి ఒక కలశమును బహూకరించెను. మరి యొక మహర్షి సంతసించి నారచీరను బహూకరించెను. 20

మూ. ఆశ్చర్యమిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్,
పరం కవీనా మాధారం సమాప్తం చ యథాక్రమమ్. 21

ప్ర. అ. మునినా = వాల్మీకిమునిచేత, సంప్రకీర్తితమ్ = చెప్పబడిన, ఇదమ్ = ఈ, ఆఖ్యానమ్ = ఆఖ్యానము, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యకర మైనది, కవీనామ్ = కవులకు, పరమ్ = అత్యంతము, ఆధారమ్ = ఆధార మైనది, యథాక్రమమ్ = క్రమము ననుసరించి, సమాప్తం చ = సమాప్తము చేయబడినది.

తా. వాల్మీకి రచించిన ఈ రామాయణము చాల ఆశ్చర్యకర మైనది. రాబోవు కవు లందరికిని ఆధార మైనది. క్రమము ప్రకారము పూర్తి చేయ బడినది. 21

మూ. అభిగీతమిదం గీతం సర్వగీతేషు కోవిదౌ,
ఆయుష్యం పుష్టిజనకం సర్వశ్రుతిమనోహరమ్, 22

ప్రశస్యమానౌ సర్వత్ర కదాచిత్తత్ర గాయకౌ,
రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః. 23

ప్ర. అ. ఆయుష్యమ్ = ఆయుస్సును పెంచునదియు, పుష్టిజనకమ్ = పుష్టిని కలిగించునదియు, సర్వశ్రుతిమనోహరమ్ = అందరి చెవులకును ఇంపుగా నుండునదియు, అభిగీతమ్ = చక్కగా పాడబడినదియు అగు, ఇదమ్ = ఈ, గీతమ్ = గీతమును గూర్చి, ప్రశస్యమానౌ = ప్రశంసించబడుచున్నవారును, రథ్యాసు = వీధులందును, రాజమార్గేషు = రాజమార్గములందును, సర్వత్ర = అంతటను, గాయకౌ=గానముచేయుచున్నవారును, సర్వగీతేషు = సమస్తవిధము లగు గానములందును, కోవిదౌ = సమర్థులును అగు ఆ కుశలవులను, కదాచిత్= ఒకానొకప్పుడు, భరతాగ్రజః = రాముడు, తత్ర = అచట, దదర్శ = చూచెను.

తా. ఆయుస్సును వృద్ధిపొందించునదియు, పుష్టిని కలిగించునదియు, అందరి చెవులకును ఇంపుగా నుండునదియు అగు ఆ గీతమును చక్కగా పాడుటచే అందరును ఆ కుశలవులను ప్రశంసించుచుండిరి. వారు వీధులందును, రాజమార్గములందును, ఇతరప్రదేశములందును గానము చేయుచుండగా ఒకనాడు రాముడు వారిని చూచుట సంభవించెను. 22, 23

మూ. స్వవేశ్మ చానీయ తతో భ్రాతరౌ స కుశీలవౌ,
పూజయామాస పూజార్హౌ రామః శత్రునిబర్హణః. 24

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శత్రునిబర్హణః = శత్రువులను సంహరించు, సః=ఆ, రామః=రాముడు, పూజార్హౌ=గౌరవమునకు తగిన, భ్రాతరౌ= సోదరులైన, కుశీలవౌ = గాయకులను (కుశలవులను), స్వవేశ్మ = తన గృహమును గూర్చి, ఆనీయ = తీసుకొనివచ్చి, పూజయామాస = గౌరవించెను.

తా. రాముడు గౌరవార్హులైన ఆ కుశలవులను తన ఇంటికి రప్పించి గౌరవించెను. 24

మూ. ఆసీనః కాఞ్చనే దివ్యే స చ సింహాసనే ప్రభుః,
ఉపోపవిష్టః సచివైర్భ్రాతృభిశ్చ పరన్తపః. 25

ప్ర. అ. పరన్తపః = శత్రువులను పీడించు, సః ప్రభుః = ఆ రాముడు, సచివైః = మంత్రులచేతను, భ్రాతృభిశ్చ = సోదరులచేతను, ఉపోపవిష్టః = చుట్టబడినవాడై, దివ్యే = దివ్యమైన, కాఞ్చనే = బంగారువికారమైన, సింహాసనే = సింహాసనమునందు, ఆసీనః = కూర్చుండెను.

తా. (శత్రుభయంకరు డగు ఆ) రాముడు, మంత్రులును, సోదరులును సమీపమున కూర్చొని యుండగా, దివ్య మైన కనకసింహాసనమును అలంకరించి ఉండెను. 25

మూ. దృష్ట్వా తు రూపసమ్పన్నౌ తావుభౌ నియతస్తదా,
ఉవాచ లక్ష్మణం రామః శత్రుఘ్నం భరతం తథా. 26

ప్ర. అ. నియతః = నియమవంతుడైన, రామః = రాముడు, తదా = అప్పుడు, రూపసమ్పన్నౌ = మంచిరూపముతో కూడిన, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరిని, దృష్ట్వా = చూచి, లక్ష్మణమ్ = లక్ష్మణుని, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని, తథా = మరియు, భరతమ్ = భరతునిగూర్చి, ఉవాచ = పలికెను.

తా. అప్పు డా రాముడు, మంచి రూపముతో ప్రకాశించుచున్న వారిరువురిని చూచి భరత లక్ష్మణ శత్రుఘ్నులతో ఇట్లనెను. 26

మూ. శ్రూయతామిద మాఖ్యానమనయోర్దేవవర్చసోః,
విచిత్రార్థపదం సమ్యగ్గాయకౌ తావచోదయత్. 27

ప్ర. అ. దేవవర్చసోః = దేవతలవంటి కాంతిగల, అనయోః = వీరిద్దరియొక్క, విచిత్రార్థపదమ్ = విచిత్ర మైన అర్థములును పదములును గల, ఇదమ్ = ఈ, ఆఖ్యానమ్ = ఆఖ్యానము, సమ్యక్ = బాగుగా, శ్రూయతామ్ = వినబడుగాక, (ఇట్లు పలికి) తౌ గాయకౌ = ఆ గాయకులను, అచోదయత్ = ప్రేరేపించెను.

తా. "దేవతల వంటి తేజస్సు గల వీరిద్దరు పాడ నున్న, విచిత్ర మైన పదములును, అర్థములును గల ఈ ఆఖ్యానమును శ్రద్ధగా వినుడు" అని వారితో పలికి, కుశలవులను పాడు డని నియోగించెను. 27

మూ. తౌ చాపి మధురం రక్తం స్వంచితాయతనిస్వనమ్,
తన్త్రీలయవదత్యర్థం విశ్రుతార్థమగాయతామ్. 28

ప్ర. అ. తౌ చ = వారిరువురు, మధురమ్ = మధురముగాను, రక్తమ్ = రాగయుక్తము గాను, స్వంచితాయతనిస్వనమ్=బాగుగా ఒప్పుచున్న దీర్ఘ మైన ధ్వని కలుగునట్లుగాను, తన్త్రీలయవత్ = వీణాతంత్రుల లయకు సరిపడు నట్లుగాను, అత్యర్థమ్=మిక్కిలి, విశ్రుతార్థమ్=స్పష్ట మైన అర్థము కలుగు నట్లుగాను, అగాయతామ్ = గానముచేసిరి.

తా. ఆ కుశలవులు మధురముగాను, రాగయుక్తముగాను గానము చేసిరి. వారి కంఠధ్వని చాల చక్కగ దీర్ఘముగ ఉండెను. వారి పాట వీణాతంత్రుల లయమునకు సరిపడి ఉండెను. అర్థము స్పష్టముగ తెలియుచుండెను. 28

మూ. హ్లాదయత్సర్వగాత్రాణి మనాంసి హృదయాని చ,
శ్రోత్రాశ్రయసుఖం గేయం తద్బభౌ జనసంసది. 29

ప్ర. అ. శ్రోత్రాశ్రయసుఖమ్ = శ్రవణేంద్రియమునకు సుఖకరముగా ఉన్న, తత్ = ఆ, గేయమ్ = పాట, జనసంసది = జనసమూహమునందు, సర్వగాత్రాణి = అన్ని అవయవములను, మనాంసి=మనస్సులను, హృదయాని చ = మనస్సులకు స్థానములైన హృదయములను, హ్లాదయత్ = సంతోషింపచేయుచున్నదై, బభౌ = ప్రకాశించెను.

తా. జనసమూహములో ఆ కుశలవుల గానము వీనులకు విందుగా నుండి, వినువారి సర్వేంద్రియములను, మనస్సులను, హృదయములను ఆనందింప చేసెను. 29

మూ. ఇమౌ మునీ పార్థివలక్షణాన్వితౌ
కుశీలవౌ చైవ మహాతపస్వినౌ,

మమాపి తద్భూతికరం ప్రవక్ష్యతే
మహానుభావం చరితం నిబోధత. 30

ప్ర. అ. ఇమౌ = ఈ, మునీ = మునులు, పార్థివలక్షణాన్వితౌ = రాజలక్షణములతో కూడి యున్నారు. కుశీలవౌ చైవ = గాయకులైనను, మహాతపస్వినౌ=గొప్ప తపఃశాలులు. మమాపి=నాకు కూడ, భూతికరమ్=శ్రేయస్కరమగు, మహానుభావమ్ = గొప్ప శక్తి గల, తత్ చరితమ్ = ఆ సీతాచరిత్రము, ప్రవక్ష్యతే = చెప్పబడును, నిబోధత = సావధానచిత్తులై వినండి.

తా. ఓ జనులారా! వీరిరువురు మునులే అయినను రాజలక్షణములతో ప్రకాశించుచున్నారు. గాయకులే అయినను గొప్ప తపస్సు కలవారు. వీరు గానము చేయనున్న సీతాచరితము నాకు కూడ ఊరట కలిగించున దగుటచే శ్రేయస్కరము. సావధానచిత్తులై వినుడు (అని శ్రీరాముడు అక్కడ నున్న వారితో పలికెను). 30

మూ. తతస్తు తౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధానసమ్పదా,
స చాపి రామః పరిషద్గతః శనై
ర్బుభూషయా సక్తమనా బభూవహ. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే చతుర్థః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తౌ=ఆ కుశలవులు, రామవచఃప్రచోదితౌ= రాముని వాక్కుచే ప్రేరేపింపబడిన వారై, మార్గవిధానసమ్పదా = మార్గ మనెడి గానవిధానసంపదతో, అగాయతామ్ = గానము చేసిరి. పరిషద్గతః = పరిషత్తులో ఉన్న, సః = ఆ, రామః అపి = రాముడు కూడ, శనైర్బుభూషయా = శాంతచిత్తుడు కావలె నను ఇచ్ఛతో, సక్తమనాః=ఆ గానమునందు ఆసక్తమైన మనస్సు కలవాడు, బభూవ = అయ్యెను.

తా. రాముడు ప్రేరేపించగా, ఆ కుశలవులు, మార్గదేశిపద్ధతు లనెడు రెండు గానపద్ధతులలో మార్గపద్ధతినే చక్కగా అవలంబించి గానము చేసిరి. పరిషత్తులో నున్న రాముడు కూడ మనఃశాంతి పొంద వలె ననెడు అభిలాషచే ఆ గానమునందు ఆసక్తచిత్తు డయ్యెను. 31

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో చతుర్థసర్గ సమాప్తము.

## అథ పఞ్చమః సర్గః

మూ. సర్వా పూర్వమియం యేషామాసీత్కృత్స్నా వసుంధరా,
ప్రజాపతిముపాదాయ నృపాణాం జయశాలినామ్. 1

ప్ర. అ. సర్వా = సకలద్వీపాత్మక మైన, కృత్స్నా = సమస్త మైన, ఇయం వసుధా = ఈ భూమి, ప్రజాపతిమ్ ఉపాదాయ = మనుప్రజాపతి మొదలుకొని, జయశాలినామ్ = విజయవంతు లైన, యేషామ్ = ఏ, నృపాణామ్ = రాజులకు సంబంధించినదిగా, పూర్వమ్ = పూర్వము, ఆసీత్ = ఉండెనో.

తా. అష్టాదశద్వీప పరిమిత యైన ఈ భూమి యంతయు, పూర్వము, మనుచక్రవర్తి మొదలుకొని, విజయవంతు లైన ఏ రాజుల వశములో ఉండెడిదో.

ఈ శ్లోకమునకు మూడవ శ్లోకముతో అన్వయము.

'సర్వా' 'కృత్స్నా' శబ్దములకు అర్థములో భేదము లేదు. రెండు పదములను ప్రయోగించుటచే 'సర్వా' అనుదానికి 'అన్ని ద్వీపభేదములు కలది' అనియు, 'కృత్స్నా' అనుదానికి "సమస్త మైనది" అనియు అర్థము చెప్పబడినది.

రామాయణ భారత పురాణాదిప్రాచీన గ్రంథాలలో ఇలాంటి పునరుక్తులు, పాద పూరణానికి మాత్రమే ఉపయోగించే "చ, వా, తు, హ, వై," మొదలైన పదాలు అత్యధికముగా ఉండును. వాటిని ఆ విధముగానే గ్రహించుట మంచిది. ఏదో అపూర్వార్థము కల్పించుట హృదయంగమముగా ఉండదు. ప్రకరణాదులను పట్టి భాషకు స్వభావసిద్ధముగా ఉన్న అర్థమును మాత్రమే గ్రహించుట యుక్తము. 1

మూ. యేషాం స సగరో నామ సాగరో యేన ఖానితః,
షష్టిః పుత్రసహస్రాణి యం యాన్తం పర్యవారయన్. 2

ప్ర. అ. యేన = ఎవనిచేత, సాగరః = సముద్రము, ఖానితః = త్రవ్వించబడినదో, యాన్తమ్ = యుద్ధమునకు వెళ్లుచున్న, యమ్ = ఎవనిని, షష్టిః పుత్రసహస్రాణి = అరువది వేలమంది కుమారులు, పర్యవారయన్ = చుట్టుకొని ఉండెడివారో, సః = అట్టి, సగరో నామ = సగరు డనే రాజు, యేషామ్ = ఏ రాజులలో ఉండెడివాడో.

తా. ఏ రాజులలో సగరు డనెడు చక్రవర్తి ఉండెడివాడో—ఆ సగరచక్రవర్తి ఈ సాగరమును త్రవ్వించగా అది వైశాల్యమును పొందినది. ఆతడు యుద్ధయాత్రకై బయలుదేరి నపుడు అతనితో కూడ అరువదివేలమంది కుమారులు వెళ్లెడివారు. 2

మూ. ఇక్ష్వాకూణామిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనామ్,
మహదుత్పన్నమాఖ్యానం రామాయణమితి శ్రుతమ్. 3

ప్ర. అ. తేషామ్ = అట్టి, మహాత్మనామ్ = మహాత్ములైన, ఇక్ష్వాకూణాం రాజ్ఞామ్ = ఇక్ష్వాకువంశమునందు పుట్టిన రాజులయొక్క, వంశే = వంశమునందు, రామాయణమితి=రామాయణ మని, శ్రుతమ్=ప్రసిద్ధి కాంచిన, మహత్= పూజ్య మైన, ఇదమ్ = ఈ, ఆఖ్యానమ్=ఆఖ్యానము, ఉత్పన్నమ్ = పుట్టినది.

తా. రామాయణ మని ప్రసిద్ధి చెందిన ఈ పవిత్ర మైన ఆఖ్యానము అట్టి మహాత్ము లైన ఇక్ష్వాకువంశరాజుల వంశములో పుట్టినది. 3

మూ. తదిదం వర్తయిష్యామి సర్వం నిఖిలమాదితః,
ధర్మకామార్థసహితం శ్రోతవ్యమనసూయయా. 4

ప్ర. అ. తత్ = అట్టి, ఇదమ్ = ఈ రామాయణమును, సర్వమ్ = సమస్త మైన దానిని, వర్తయిష్యామి = లోకములో ప్రవర్తింపచేసెదను. ధర్మకామార్థ సహితమ్ = ధర్మార్థకామము లనెడు పురుషార్థములతో కూడిన, నిఖిలమ్ = ఈ రామాయణ మంతయును, ఆదితః = ప్రారంభము నుండియు, అనసూయయా= అసూయ లేకుండగా, శ్రోతవ్యమ్ = వినదగినది.

తా. అట్టి ఈ రామాయణము నంతను లోకములో ప్రవర్తింపచేసెదను. ధర్మార్థ కామము లనెడు పురుషార్థములను ప్రతిపాదించు ఈ రామాయణమును పూర్తిగ మొదటినుండియు అసూయాభావము లేనివారై వినుడు. 4

మూ. కోసలో నామ ముదితస్స్ఫీతో జనపదో మహాన్,
నివిష్టః సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్. 5

ప్ర. అ. ప్రభూతధనధాన్యవాన్=అధిక మైన ధనధాన్యములు కలదియు,

ముదితః=సంతోషముతో కూడినదియు, స్ఫీతః=విశాలమైనదియు అగు, కోసలో నామ = కోసల మనెడు, మహాన్ = గొప్పదైన, జనపదః = దేశము, సరయూ తీరే = సరయూనదీతీరమునందు, నివిష్టః = నెలకొని యున్నది.

తా. ధనధాన్యములతో తులతూగుచు నిత్యసంతుష్టులైన ప్రజలు గల, విశాల మైన కోసల మనెడు ఒక గొప్ప దేశము సరయూతీరమున నెలకొని యున్నది. 5

మూ. అయోధ్యా నామ నగరీ తత్రాసీల్లోకవిశ్రుతా,
మనునా మానవేన్ద్రేణ యా పురీ నిర్మితా స్వయమ్. 6

ప్ర. అ. తత్ర = ఆ కోసలదేశమునందు, యా పురీ = ఏ పట్టణము, మానవేన్ద్రేణ=మానవులకు ప్రభు వైన, మనునా=మనుచక్రవర్తిచేత, స్వయమ్= స్వయముగా, నిర్మితా = నిర్మింపబడినదో అట్టి, అయోధ్యా నామ = అయోధ్య యను పేరు గల, విశ్రుతా = ప్రసిద్ధ మైన, నగరీ = నగరి, ఆసీత్=ఉండెను.

తా. ఆ కోసలదేశములో అయోధ్యయను ఒక ప్రసిద్ధ మైన పట్టణము ఉండెను; సకలమానవులకును ప్రభు వైన మనుచక్రవర్తి స్వయముగ దానిని సంకల్పబలముచే నిర్మించెను. 6

మూ. ఆయతా దశ చ ద్వే చ యోజనాని మహాపురీ,
శ్రీమతీ త్రీణి విస్తీర్ణా సువిభక్తమహాపథా. 7

ప్ర. అ. శ్రీమతీ=శోభాయుత మైనదియు, సువిభక్తమహాపథా=చక్కగా ఏర్పరుపబడిన విశాల మైన మార్గములు గల, మహాపురీ = మహానగర మైన ఆ అయోధ్య, దశ చ ద్వే చ = పండ్రెండు, యోజనాని = యోజనములను, ఆయతా = దీర్ఘమైనది, త్రీణి = మూడు యోజనములను, విస్తీర్ణా=వెడల్పైనది.

తా. చక్కగా ఏర్పరుపబడిన విశాలము లైన మార్గములతో శోభాయుత ముగా ఉన్న ఆ అయోధ్యానగరము పండ్రెండు యోజనముల పొడవు, మూడు యోజనముల వెడల్పు కలదై ఉండెను. 7

మూ. రాజమార్గేణ మహతా సువిభక్తేన శోభితా,
ముక్తపుష్పావకీర్ణేన జలసిక్తేన నిత్యశః. 8

ప్ర. అ. సువిభక్తేన = చక్కగా ఏర్పరుపబడినదియు, ముక్తపుష్పావకీర్ణేన = చల్లబడిన పుష్పములతో వ్యాప్త మైనదియు, నిత్యశః = ఎల్లప్పుడును, జలసిక్తేన = నీటితో తడపబడిన, మహతా = విశాల మైన, రాజమార్గేణ = రాజమార్గముచే, శోభితా = ప్రకాశింపచేయబడినది.

తా. అయోధ్యానగరము, చక్కగా ఏర్పరచిన, విశాల మైన రాజమార్గముతో ఒప్పారుచుండెను. దానియందంతటను పుష్పములు చల్లుచుండెడివారు. నిత్యము నీరు చల్లి తడుపుచుండెడివారు. 8

మూ. తాం తు రాజా దశరథో మహారాష్ట్రవివర్ధనః,
పురీమావాసయామాస దివం దేవపతిర్యథా. 9

ప్ర. అ. మహారాష్ట్రవివర్ధనః = గొప్ప రాజ్యమును వృద్ధి పొందించు, దశరథః = దశరథు డనెడు, రాజా = రాజు, దేవపతిః = దేవేంద్రుడు, దివం యథా = స్వర్గమును వలె, తాం పురీమ్ = ఆ అయోధ్యాపట్టణమును, ఆవాసయామాస = నివాసముగా చేసికొనెను.

తా. విశాల మైన రాజ్యమును పరిపాలింప సమర్థు డైన దశరథు డను రాజు, దేవేంద్రుడు స్వర్గములో నివసించి నట్లు, ఆ పట్టణములో నివసించెను. 9

మూ. కవాటతోరణవతీం సువిభక్తాన్తరాపణామ్,
సర్వయన్త్రాయుధవతీముపేతాం సర్వశిల్పిభిః. 10

ప్ర. అ. కవాటతోరణవతీమ్ = ప్రశస్తము లైన నగరము వెలుపలి తలుపులను దారుబంధములును కలదియు, సువిభక్తాన్తరాపణామ్ = చక్కగా తీర్చి దిద్దిన మధ్య ప్రదేశములు గల అంగళ్లు కలదియు, సర్వయన్త్రాయుధవతీమ్ = సమస్త మైన యంత్రములు ఆయుధములు కలదియు, సర్వశిల్పిభిః = సమస్తశిల్పులతో, ఉపేతామ్ = కూడినదియు అగు, "పురీం దశరథః ఆవాసయామాస" అను 22వ శ్లోకములో ఉన్న వాక్యముతో ఈ శ్లోకము మొదలు అన్ని శ్లోకములకును అన్వయము.

తా. ఆ అయోధ్యానగరమునకు వెలుపల నున్న తలుపులును, దారుబంధములును, చాల దృఢ మైనవి. అంగడి వీథులన్నియు మధ్యలో చక్కగా తీర్చి

దిద్దబడి యున్నవి. అచ్చటచ్చట అనేక విధము లైన యంత్రములును, ఆయుధ ములును నెలకొల్పబడి ఉన్నవి. ఎందరో శిల్పులు ఈ నగరములో నివసించు చుండిరి 10

మూ. సూతమాగధసంబాధాం శ్రీమతీమతులప్రభామ్,
ఉచ్చాట్టాలధ్వజవతీం శతఘ్నిశతసఙ్కులామ్. 11

ప్ర. అ. సూతమాగధసంబాధామ్ = స్తోత్రములు చేయు సూతులచేతను, కులవంశములను పొగడు మాగధులచేతను ఇరుకుగా ఉన్నదియు, శ్రీమతీమ్ = సమృద్ధి కలదియు, అతులప్రభామ్ = సాటి లేని కాంతి కలదియు, ఉచ్చాట్టాల ధ్వజవతీమ్ = ఉన్నతము లైన కోటబురుజులును ధ్వజములును కలదియు, శతఘ్నిశతసఙ్కులామ్ = వందలకొలది శతఘ్ను లనెడు ఆయుధములతో (నూరుగురిని ఒక్కమారుగా చంపు ఆయుధము) నిండినదియును....

తా. ఆ నగరమందు ఎందరో సూతులును, మాగధులును నివసించు చుండిరి. అది అత్యధిక సమృద్ధితో, సాటిలేని శోభతో, ప్రకాశించుచుండెను. ఇందలి కోట బురుజులును, ధ్వజములును చాల ఉన్నతముగ ఉండెను. వందలాది శతఘ్నులు అచ్చటచ్చట అమర్చబడి ఉండెను. 11

మూ. వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్,
ఉద్యానామ్రవణోపేతాం మహతీం సాలమేఖలామ్. 12

ప్ర. అ. వధూనాటకసంఘైశ్చ = స్త్రీల (నాట్యకత్తెల) యొక్కయు నటులయొక్కయు సంఘములతో, సంయుక్తామ్ = కూడినదియు, సర్వతః పురీమ్ = నలువైపుల శాఖానగరములు గలదియు, ఉద్యానామ్రవణోపేతామ్= ఉద్యానవనములతోడను, మామిడి తోపులతోడను కూడినదియు, మహతీమ్ = విశాల మైనదియు, సాలమేఖలామ్ = ప్రాకారమే వడ్డాణముగా కలదియు....

తా. ఈ నగరములో ఎన్నియో నటీనటసంఘము లుండెడివి. నలు వైపుల శాఖానగరములు ఉండెను. అచ్చటచ్చట ఉద్యానవనములును, మామిడితోపులును ఉండెను. అతివిశాలమైన ఈ నగరమునకు చుట్టును ఉన్న ఉన్నత మైన ప్రాకారము దీనికి వడ్డాణము వలె ఉండెను. 12

మూ. దుర్గగమ్భీరపరిఘాం దుర్గామన్యైర్దురాసదామ్,
వాజివారణసంపూర్ణాం గోభిరుష్ట్రైః ఖరై స్తథా. 13

ప్ర. అ. దుర్గగమ్భీరపరిఘామ్ = ప్రవేశింప శక్యము కాని అగాధ మైన అగడ్త కలదియును, దుర్గామ్ = ప్రవేశింప శక్యము కానిదియు, అన్యైః=శత్రువుల చేత, దురాసదామ్ = ఆక్రమింప శక్యము కానిదియు, వాజివారణసంపూర్ణామ్ = గుఱ్ఱములతోడను ఏనుగులతోడను నిండినదియు, తథా = మరియు, గోభిః = గోవులతోడను, ఉష్ట్రైః = ఒంటెలతోడను, ఖరైః = గాడిదలతోడను (నిండినదియు)........

తా. ఆ నగరము చుట్టును ప్రవేశింప శక్యము కాని, అగాధ మైన అగడ్త ఉండెను. ఎవ్వరును ఆ నగరములో ప్రవేశించి దానిని ఆక్రమింపజాలరు. అది గుఱ్ఱములు, ఏనుగలు, గోవులు, ఒంటెలు, గాడిదలు మొదలైనవాటితో నిండియుండెను. 13

మూ. సామన్తరాజసంఘైశ్చ బలికర్మభిరావృతామ్,
నానాదేశనివాసైశ్చ వణిగ్భిరుపశోభితామ్. 14

ప్ర. అ. బలికర్మభిః = కప్పము కట్టునట్టి, సామన్తరాజసంఘైశ్చ = సామంతరాజుల సమూహములచే, ఆవృతామ్ = నిండి యున్నదియు, నానాదేశనివాసైః = అనేకదేశములందు నివసించువారైన, వణిగ్భిః చ = వర్తకులచే గూడ, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినదియు....

తా. ఆ నగరము కప్పముకట్టుటకై వచ్చిన సామంతరాజులచేతను, నానాదేశములనుండి వచ్చిన వర్తకులచేతను వ్యాప్తమై యుండెడిది. 14

మూ. ప్రాసాదై రత్నవికృతైః పర్వతై రుపశోభితామ్,
కూటాగారైశ్చ సంపూర్ణామిన్ద్రస్యేవామరావతీమ్. 15

ప్ర. అ. రత్నవికృతైః = రత్నములతో విశేషరూపమున అలంకరింపబడిన, ప్రాసాదైః = మేడలతోడను, పర్వతైః = క్రీడాపర్వతములతోడను, ఉప

శోభితామ్=ప్రకాశింపచేయబడినదియు, కూటాగారైః చ=మేడలపై మేడలతోడను, సంపూర్ణామ్ = నిండినదియును, ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, అమరావతీమివ = అమరావతీ నగరము వలె నున్నదియు, ....

తా. ఆ నగరము రత్నములతో అలంకరించిన రాజగృహములతోడను, క్రీడాపర్వతములతోడను ప్రకాశించుచుండెను. మేడలపై కట్టిన మేడలతో నిండి ఇంద్రుని రాజధాని యగు అమరావతివలె ఉండెను. 15

మూ. చిత్రామష్టాపదాకారాం వరనారీగణైర్యుతామ్,
సర్వరత్నసమాకీర్ణాం విమానగృహశోభితామ్. 16

ప్ర. అ. చిత్రామ్ = ఆశ్చర్యకర మైనదియు, లేదా, వివిధవర్ణములు కలదియు, అష్టాపదాకారామ్ = జూద మాడెడి పీటయొక్క ఆకారమువంటి ఆకారము కలదియు, వరనారీగణైః = సుందరు లైన స్త్రీల గణములతో, యుతామ్ = కూడినదియు, సర్వరత్నసమాకీర్ణామ్ = సమస్త మైన రత్నములతో వ్యాప్త మైనదియు, విమానగృహశోభితామ్ = ఏడంతస్తుల భవనములతో ప్రకాశించునదియు.

తా. జూదమాడు పీటవంటి ఆకారము గల ఆ నగరము చాల ఆశ్చర్య జనకమై సుందరు లగు స్త్రీలతో నిండి యుండెను. అన్ని విధము లైన రత్నములును ఇచట ఉండెను. ఏడంతస్తుల విశాలభవనములతో ప్రకాశించుచుండెను. 16

మూ. గృహగాఢా మవిచ్ఛిద్రాం సమభూమౌ నివేశితామ్,
శాలితణ్డులసంపూర్ణామిక్షుకాణ్డరసోదకామ్. 17

ప్ర. అ. గృహగాఢామ్ = ఇండ్లతో దట్ట మైనదియు, అవిచ్ఛిద్రామ్ = ఏదో ఒక విధముగ ఉపయోగింపక విడచిన చోటు లేనిదియు, సమభూమౌ = మిట్టపల్లములు లేని భూమిపై, నివేశితామ్ = నిర్మింపబడినదియు, శాలితణ్డుల సంపూర్ణామ్ = వరిబియ్యముతో నిండినదియు, ఇక్షుకాణ్డరసోదకామ్ = చెఱకు కఱ్ఱరసము వంటి ఉదకము కలదియు....

తా. ఆ నగరములో దట్టముగ ఇండ్లు కట్టబడెను. అనుపయుక్త మైన స్థల మేదియు లేకుండెను. అది మిట్ట పల్లములు లేని భూమిపై నిర్మింపబడెను.

పరిబియ్యము సమృద్ధిగ లభించుచుండెడివి. ఉదకము చెఱకురసము వలె మధుర ముగ నుండెను. 17

మూ. దున్దుభీభిర్మృదఙ్గైశ్చ వీణాభిః పణవైస్తథా,
నాదితాం భృశమత్యర్థం పృథివ్యాం తామనుత్తమామ్. 18

ప్ర. అ. దున్దుభీభిః = దుందుభులచేతను, మృదఙ్గైశ్చ = మృదంగములచే తను, వీణాభిః = వీణలచేతను, తథా = మరియు, పణవైః = తమ్మటముల చేతను, భృశమ్ = మిక్కిలి, నాదితామ్ = ధ్వనింప చేయబడినదియు, పృథి వ్యామ్=భూమియందు, అత్యర్థమ్ = మిక్కిలి, అనుత్తమామ్ = శ్రేష్ఠ మైనదియు, తామ్ = ప్రసిద్ధ మైనదియు....

తా. ఆ నగరమునందు దుందుభి మృదంగ వీణా పణవాది మంగళ వాద్య ముల ధ్వనులు ఎల్లప్పుడును మిన్ను ముట్టుచుండెడివి. భూమిలో దీనికంటె ఉత్తమ మైన పట్టణము మరొకటి లేదు. 18

మూ. విమానమివ సిద్ధానాం తపసాధిగతం దివి,
సునివేశితవేశ్మాన్తాం నరోత్తమసమావృతామ్. 19

ప్ర. అ. దివి = స్వర్గమునందు, తపసా = తపస్సుచేత, అధిగతమ్ = పొందబడిన, సిద్ధానామ్ = సిద్ధులయొక్క, విమానమివ = విమానము వలె నున్నదియు, సునివేశిత వేశ్మాన్తామ్ = చక్కగా ఏర్పరుపబడిన గృహప్రదేశ ములు కలదియు, నరోత్తమసమావృతామ్ = ఉత్తము లగు మనుష్యులతో నిండినదియు, ....

తా. సిద్ధులు తపఃశక్తిచే స్వర్గమునందు నిర్మించుకొనిన విమానము వలె ఉన్న ఆ అయోధ్యలో గృహములు బారులు దీర్చి చక్కగ నిర్మింపబడినవి. ఉత్తము లైన మనుష్యులు అచట నివసించెడివారు. 19

మూ. యే చ బాణైర్న విధ్యన్తి వివిక్తమపరాపరమ్,
శబ్దవేధ్యం చ వితతం లఘుహస్తా విశారదాః. 20

సింహవ్యాఘ్రవరాహాణాం మత్తానాం నర్దతాం వనే,
హన్తారో నిశితైః శస్త్రైర్బలాద్బాహుబలైరపి. 21

తాదృశానాం సహస్రైస్తామభిపూర్ణాం మహారథైః,
పురీమావాసయామాస రాజా దశరథ స్తదా. 22

ప్ర. అ. లఘుహస్తాః = చేతిచురుకు గల, విశారదాః = నేర్పరు లైన, యే = ఎవరు, వివిక్తమ్ = ఒంటరిగా ఉన్నవానిని, అపరాపరమ్ = ముందు వెనుక లేనివానిని, అనగా తండ్రి గాని కుమారుడు గాని లేనివానిని, శబ్దవేధ్యమ్= శబ్దమును పట్టి కొట్టుటకు అనువుగా ఉన్నవానిని, వితతం చ = పారిపోవుచున్న వానిని, బాణైః = బాణములచే, న విధ్యన్తి = కొట్టరో, వనే = వనమునందు, నర్దతామ్ = గర్జించుచున్న, మత్తానామ్ = మదించిన, సింహవ్యాఘ్రవరాహాణామ్= సింహవ్యాఘ్రవరాహములకు (ను), నిశితైః = వాడియైన, శస్త్రైః = ఆయుధములచే, బలాత్ = ఆయుధబలమువలనను, బాహుబలైరపి=బాహుబలములచేతను, హన్తారః = చంపువారో, తాదృశానామ్ = అట్టి వారి యొక్క, మహారథైః = మహారథులైన, సహస్రైః = సహస్రములతో, అభిపూర్ణామ్ = నిండిన, తామ్ = ఆ, పురీమ్ = అయోధ్యానగరమును, తదా = అప్పుడు, రాజా దశరథః = దశరథమహారాజు, ఆవాసయామాస = నివాసముగా చేసికొనెను.

తా. ఈ నగరములో వేలకొలది మహారథు లైన వీరు లుండిరి. వారు బాణప్రయోగమునందు హస్తలాఘవము గలవారు. ఒంటరిగా ఉన్న వానిని, తండ్రి గాని కుమారుడు గాని (వెనుక ముందు) లేనివానిని, శబ్దమును పట్టి కొట్టుటకు వీలుగా ఉన్నవానిని, పారిపోవుచున్న వానిని ఎన్నడును బాణములచే కొట్టెడి వారు కారు. మదించి వనములలో గర్జించు చున్న సింహవ్యాఘ్రవరాహాది క్రూరమృగములను తీక్ష్ణము లైన ఆయుధములచేత గాని, ఆయుధములు లేకుండ కేవల బాహుబలముచేత గాని చంపెడివారు. అట్టి అయోధ్యానగరమును దశరథ మహారాజు నివాసముగా చేసికొని రాజ్యము పాలించెను. 21, 22

మూ. తామగ్నిమద్భిర్గుణవద్భిరావృతాం,
ద్విజోత్తమైర్వేదషడఙ్గపారగైః,

సహస్రదైః సత్యరతైర్మహాత్మభి
ర్మహర్షికల్పై ఋషిభిశ్చ కేవలైః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పఞ్చమః సర్గః.

ప్ర. అ. అగ్నిమద్భిః = ఆహితాగ్నులును, గుణవద్భిః = గుణవంతులును, వేదషడఙ్గపారగైః = ఋగ్యజుస్సామాథర్వవేదములందును శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తజ్యోతిషకల్పము లనెడు ఆరు వేదాంగములందును పూర్ణ మైన పాండిత్యము కలవారును, సహస్రదైః = వేలకొలది దానము చేయువారును, సత్యరతైః = సత్య నిరతులును, మహాత్మభిః = గొప్ప బుద్ధి కలవారును, మహర్షికల్పైః = మహర్షు లతో సమానులును, కేవలైః ఋషిభిః చ = కేవలఋషులును అగు, ద్విజోత్తమైః = ఉత్తము లైన బ్రాహ్మణక్షత్రియ వైశ్యులచేత, ఆవృతామ్ = నిండి యున్న, తామ్ = ఆ అయోధ్యను, (దశరథుడు వాసముగ చేసికొనెను).

తా. ఈ అయోధ్యానగరములోని ద్విజు లందరును, అనగా బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యులు ఆహితాగ్నులు, సద్గుణవంతులు, వేదవేదాంగనిష్ణాతులు, అనంత దానము చేయువారు, సత్యనిరతులు, మహాబుద్ధిశాలులు. వీరిలో కొందరు మహ ర్షులవంటి వారై ఉండగా మరి కొందరు సాక్షాత్తు ఋషులే.

"బాలానన్దిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
బాలకాండలో పంచమ సర్గ సమాప్తము.

# అథ షష్ఠః సర్గః

మూ. తస్యాం పుర్యామయోధ్యాయాం వేదవిత్సర్వసఙ్గ్రహః,
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః, 1

ఇక్ష్వాకూణామతిరథో యజ్వా ధర్మరతో వశీ,
మహర్షికల్పో రాజర్షిస్త్రిషు లోకేషు విశ్రుతః. 2

బలవాన్నిహతామిత్రో మిత్రవాన్విజితేన్ద్రియః,
ధనైశ్చ సంగ్రహైశ్చాన్యైః శక్రవైశ్రవణోపమః. 3

యథా మనుర్మహాతేజా లోకస్య పరిరక్షితా,
తథా దశరథో రాజా వసన్ జగదపాలయత్. 4

ప్ర. అ. వేదవిత్=వేదములు తెలిసినవాడును, సర్వసంగ్రహః=శూరులు పండితులు మొదలైన సర్వజనులను దానాదులచే వశములో నుంచుకొనెడువాడును, దీర్ఘదర్శీ=చాలకాలము తరువాత జరుగబోవు విషయములను ఇప్పుడే తెలుసుకొనెడు శక్తి కలవాడును, మహాతేజాః=గొప్ప పరాక్రమము కలవాడును, పౌరజానపదప్రియః = పట్టణాలలో నివసించు వారికిని గ్రామాలలో నివసించు వారికిని ఇష్టుడును, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజులలో, అతిరథః = చాలమంది మహారథులతో ఒంటరిగా యుద్ధము చేయ గల రథికశ్రేష్ఠుడును, యజ్వా = యజ్ఞములు చేసినవాడును, ధర్మరతః = ధర్మమునందు ఆసక్తి కలవాడును, వశీ = జనులను అదుపులో ఉంచగలిగినవాడును, మహర్షికల్పః = మహర్షితో సమానుడును, రాజర్షిః = రాజును ఋషియు ఐనవాడును, త్రిషు లోకేషు = భూలోకభువర్లోకసువర్లోకములయందు, విశ్రుతః = ప్రసిద్ధుడును, బలవాన్ = అధికమైన సైన్యము కలవాడును, నిహతామిత్రః=చంపబడిన శత్రువులు కలవాడును, మిత్రవాన్ = మంచి మిత్రులు కలవాడును, విజితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడును, ధనైశ్చ=ధనములచేతను, అన్యైః=ఇతరములైన, సఙ్గ్రహైశ్చ = కూడబెట్టబడిన వస్తువులచేతను, శక్రవైశ్రవణోపమః=దేవేంద్రుని

తోడను కుబేరునితోడను సమానుడును అగు, రాజా దశరథః = దశరథమహారాజు, తస్యామ్ = ఆ, అయోధ్యాయాం పుర్యామ్ = అయోధ్యాపురియందు, వసన్ = నివసించుచు, లోకస్య = లోకమునకు, పరిరక్షితా = రక్షకుడును, మహాతేజాః = గొప్పపరాక్రమశాలియు అగు, మనుః = మనువు, యథా = ఎట్లో, తథా = అట్లు, జగత్ = జగత్తును, అపాలయత్ = పాలించెను.

తా. దశరథమహారాజు ఆ అయోధ్యాపురిలో నివసించుచు, సర్వలోక రక్షకుడును, మహాతేజఃశాలియు అగు మను వెట్లు పరిపాలించెనో, అట్లు జగత్తు నంతను పరిపాలించెను. ఆ దశరథుడు వేదవేత్త. శూరపండితాదులను దానాదులచే వశము చేసికొనెను. ఎప్పుడో జరుగ బోవు విషయములను గ్రహింపగలవాడు. గొప్ప పరాక్రమము కలవాడు. పౌరులకును జానపదులకును ఇష్టుడు. ఇక్ష్వాకువంశరాజులలో అతిరథుడు. ఎన్నో యాగములు చేసినవాడు. ధర్మమునం దాసక్తి కలవాడు. సర్వజనులను వశమునం దుంచుకొనువాడు. మహర్షితో సమానుడు; రాజుగా ఉండియు ఋషి యైనవాడు. మూడు లోకములందును ప్రసిద్ధుడు. గొప్ప సైన్యము కలవాడు. శత్రువుల నందరిని నశింపచేసినవాడు. మంచి మిత్రసంపద గలవాడు. ఇంద్రియములను జయించినవాడు. ధనములచేతను, ఇతరవస్తుసంగ్రహముచేతను ఇంద్రకుబేరతుల్యుడు. 1-4

మూ. తేన సత్యాభిసంధేన త్రివర్గమనుతిష్ఠతా,
పాలితా సా పురీ శ్రేష్ఠా ఇన్ద్రేణేవామరావతీ. 5

ప్ర. అ. సత్యాభిసందేన = సత్యమునందు పట్టుదలకలవాడును, త్రివర్గమ్ = ధర్మార్థకామము లనెడు మూడు పురుషార్థములను, అనుతిష్ఠతా = అనుసరించువాడును అగు, తేన = ఆ దశరథునిచేత, శ్రేష్ఠా = శ్రేష్ఠ మైన, సా పురీ = ఆ అయోధ్య, ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, అమరావతీవ = అమరావతి వలె, పాలితా = పాలింపబడెను.

తా. సత్యమునందు పట్టుదల కలిగి ధర్మార్థ కామము లనెడు మూడు పురుషార్థములకును సమప్రాధాన్య మిచ్చి వాటి ననుసరించుచున్న ఆ దశరథుడు, ఇంద్రుడు అమరావతిని వలె, అయోధ్యను పాలించెను.

మూ. తస్మిన్ పురవరే హృష్టా ధర్మాత్మానో బహుశ్రుతాః,
నరాస్తుష్టా ధనైః స్వైః స్వైరలుబ్ధాః సత్యవాదినః. 6

ప్ర. అ. తస్మిన్ = ఆ, పురవరే = అయోధ్యాపురమునందు (నివసించు), నరాః = మనుష్యులు, హృష్టాః = సంతోషముకలవారు, ధర్మాత్మానః = ధర్మ స్వభావులు, బహుశ్రుతాః = అధికముగ శాస్త్రాధ్యయనము చేసినవారు, స్వైః స్వైః = తమ తమ, ధనైః = ధనములతో, తుష్టాః = సంతృప్తి చెందినవారు, అలుబ్ధాః=దురాశ లేనివారు, సత్యవాదినః = సత్యమునే మాటలాడువారు.

తా. అయోధ్యాపురములో నివసించు నరు లందరును సంతోషవంతులు, ధర్మాత్ములు, చక్కగ శాస్త్రాభ్యాసము చేసినవారు, తమ కున్నదానితో తృప్తి చెందినవారు. ఆశ లేనివారు. సత్యమునే పలుకువారు. 6

మూ. నాల్పసన్నిచయః కశ్చిదాసీత్తస్మిన్ పురోత్తమే,
కుటుమ్బీ యో హ్యసిద్ధార్థోఽగవాశ్వధనధాన్యవాన్. 7

ప్ర. అ. తస్మిన్ = ఆ, పురోత్తమే = శ్రేష్ఠనగర మైన అయోధ్యయందు, యః = ఎవడు, అల్పసన్నిచయః = అల్ప మైన కూడబెట్టిన ధనము కలవాడో, అసిద్ధార్థః=ధర్మార్థకామము లనెడు మూడు పురుషార్థములు సిద్ధించనివాడో, అగవాశ్వధనధాన్యవాన్ = గోవులు, అశ్వములు, ధనధాన్యములు లేనివాడో, అట్టి, కుటుమ్బీ = కుటుంబవంతుడు, కశ్చిత్ = ఒక్కడును, నాసీత్ = లేకుండెను.

తా. ఆ నగరములో తక్కువ ధనమును మాత్రమే సంపాదించినవాడు గాని, ధర్మార్థకామము లనెడు పురుషార్థములను సాధించనివాడు గాని, గవాశ్వ ధనధాన్యములు లేనివాడు గాని అయిన కుటుంబి ఒక్కడును లేకుండెను.

వి. కుటుంబి అనగా—తల్లిదండ్రులు, ఇద్దరు కుమారులు, ఇద్దరు కోడళ్లు, కుమార్తె, భార్య, అతిథి, తాను కలిసి మొత్తము పదిమంది పోష్యవర్గము కలవాడు. 7

మూ. కామీ వా న కదర్యో వా నృశంసః పురుషః క్వచిత్,
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నావిద్వాన్న చ నాస్తికః. 8

ప్ర. అ. కామీ వా = కాముకుడు గాని, కదర్యో వా = లోభముచేత ధర్మ కార్యాలను, కొడుకులను, భార్యను, తల్లిదండ్రులను, తోడబుట్టువులను పీడించు వాడు గాని, నృశంసః=క్రూరుడు కాని అయిన, పురుషః=పురుషుడు, అయోధ్యా

యామ్ = అయోధ్యలో, క్వచిత్ = ఎక్కడను, ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యమ్ = శక్యముకాదు, అవిద్వాన్ = విద్వాంసుడు కానివాడు, న=చూచుటకు శక్యముకాదు, నాస్తికః = నాస్తికుడును, న = చూచుటకు శక్యము కాదు.

తా. కాముకుడు గాని, లోభి కాని, క్రూరుడు కాని, విద్యావిహీనుడు కాని, నాస్తికుడు కాని, ఆ అయోధ్యలో వెదకినను కానరాడు. 8

మూ. సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలాః సుసంయతాః,
ఉదితాః శీలవృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః. 9

ప్ర. అ. సర్వే=సమస్తమైన, నరాశ్చ=నరులును, నార్యశ్చ=స్త్రీలును, ధర్మశీలాః = ధర్మస్వభావము కలవారు, సుసంయతాః = మంచి ఇంద్రియనిగ్రహము కలవారు. శీలవృత్తాభ్యామ్ = మంచి స్వభావముతోడను, మంచి నడవడికతోడను, ఉదితాః = అభివృద్ధి పొందువారు, మహర్షయః ఇవ=మహర్షులు వలె, అమలాః = నిర్మలమైనవారు.

తా. ఆ నగరములోని స్త్రీలు, పురుషులు కూడ, ధర్మశీలులు. మంచి ఇంద్రియనిగ్రహము కలవారు. మంచి స్వభావముతో, మంచి నడవడికతో ఒప్పుచున్నవారు. మహర్షుల వలె పరిశుద్ధమైనవారు. 9

మూ. నాకుణ్డలీ నామకుటీ నాస్రగ్వీ నాల్పభోగవాన్,
నామృష్టో నానులిప్తాఙ్గో నాసుగన్ధశ్చ విద్యతే. 10

ప్ర. అ. అకుణ్డలీ = కర్ణభూషణములు లేనివాడు, న విద్యతే = లేడు, అమకుటీ = శిరోభూషణము లేనివాడు, న = లేడు, అస్రగ్వీ = పుష్పమాలలు ధరించనివాడు, న = లేడు, అల్పభోగవాన్ = అల్పమైన భోగములు కలవాడు, న=లేడు, అమృష్టః=అభ్యంగస్నానము చేయనివాడు, న=లేడు, నానులిప్తాఙ్గః= పైపూత లేని శరీరము కలవాడు, (న = లేడు), అసుగన్ధశ్చ = సుగంధము లేనివాడును, న = లేడు.

తా. ఆ నగరములో కర్ణభూషణములు లేనివాడు గాని, శిరోభూషణము లేనివాడు గాని, పుష్పమాలలు ధరించనివాడు గాని, భోగములలో కొరత ఉన్నవాడు గాని, అభ్యంగస్నానము చేయనివాడు గాని, శరీరమునకు అంగరాగమును

పూసికొననివాడు గాని, మంచి సుగంధద్రవ్యములను సేవించనివాడు గాని లేడు. 10

మూ. నామృష్టభోజీ నాదాతా నాప్యనఙ్గదనిష్కధృక్,
నాహస్తాభరణో వాపి దృశ్యతే నాప్యనాత్మవాన్. 11

ప్ర. అ. అమృష్టభోజీ=కడుపునిండ భోజనము చేయనివాడు, న దృశ్యతే = కనబడడు, అదాతా = దానగుణము లేనివాడు, న = కనబడడు, అనఙ్గదనిష్కధృక్ అపి = బాహుపురులను కంఠాభరణములను ధరించనివాడు కూడ, న = కనబడడు, అహస్తాభరణో వాపి = కడియములు లేనివాడును, న = కనబడడు, అనాత్మవానపి = జితేంద్రియుడు కానివాడు కాని, న = కనబడడు.

తా. ఆ నగరములో, కడుపునిండ తిండి లేనివాడు గాని, దానము చేయనివాడు గాని, బాహుపురులను, కంఠాభరణములను ధరించనివాడు గాని, ముంజేతికి అలంకారము లేనివాడు గాని, ఇంద్రియనిగ్రహము లేనివాడు గాని ఒక్కడును కనబడడు. 11

మూ. నానాహితాగ్నిర్నాయజ్వా న క్షుద్రో వా న తస్కరః,
కశ్చిదాసీదయోధ్యాయాం న చ నిర్వృత్తసంకరః. 12

ప్ర. అ. అయోధ్యాయామ్=అయోధ్యాపట్టణమునందు, అనాహితాగ్నిః= ఆహితాగ్ని కానివాడు, న ఆసీత్ = లేకుండెను, అయజ్వా = యాగము చేయనివాడు, న = లేకుండెను, క్షుద్రః=నీచుడు, న = లేకుండెను, తస్కరః=దొంగ, న = లేకుండెను, నిర్వృత్తసంకరః = వర్ణసంకరము చేసినవాడు, కశ్చిత్ = ఒక్కడును, న = లేకుండెను.

తా. అయోధ్యలో ఆహితాగ్ని కానివాడు కాని, యాగము చేయనివాడు కాని, నీచుడు కాని, దొంగ గాని, వర్ణసంకరము చేసినవాడు గాని ఒక్కడును లేకుండెను. 12

మూ. స్వకర్మనిరతా నిత్యం బ్రాహ్మణా విజితేన్ద్రియాః,
దానాధ్యయనశీలాశ్చ సంయతాశ్చ పరిగ్రహే. 13

ప్ర. అ. బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, నిత్యమ్ = ఎల్లప్పుడును, స్వకర్మ నిరతాః = తమ కర్మలయందు ఆసక్తికలవారై, విజితేన్ద్రియాః = జయింపబడిన ఇంద్రియములు కలవారై, దానాధ్యయనశీలాః చ=దానముచేయుట అధ్యయనము చేయుట స్వభావముగా కలవారై, పరిగ్రహే = దానముపట్టుటయందు, సంయతాశ్చ = సంకోచముకలవారై, (గోవిందరాజులు) పరిగ్రహే = భార్యయందు, సంయతాశ్చ = నియమము కలవారై (మహేశ్వరతీర్థులు) (ఉండిరి).

తా. బ్రాహ్మణు లెల్లప్పుడును తమ కర్మలయం దాసక్తులై, ఇంద్రియ నిగ్రహవంతులై, దానము చేయుట, వేదాధ్యయనము చేయుట అను స్వాభావిక గుణములతో ఒప్పుచు, తప్పనిసరియైనపుడు మాత్రమే దానము పట్టుచు, స్వభార్యా మాత్రగాములై, పరభార్యావిముఖులై ఉండెడివారు. 13

మూ. న నాస్తికో నానృతకో న కశ్చిదబహుశ్రుతః,
నాసూయకో న చాశక్తో నావిద్వాన్ విద్యతే తదా. 14

ప్ర. అ. తదా = దశరథుడు రాజ్యముచేయు కాలమున, కశ్చిత్ = ఒక్కడును, నాస్తికః = నాస్తికుడు, న = లేడు, అనృతకః = అసత్య మాడువాడు, న = లేడు, అబహుశ్రుతః = ఎక్కువ శాస్త్రాభ్యాసము చేయనివాడు, న = లేడు, అసూయకః = గుణములందు దోషములను ఆరోపించువాడు, న = లేడు. అశక్తః = అసమర్థుడు, న = లేడు, అవిద్వాన్ = జ్ఞానము లేనివాడు, న = లేడు.

తా. దశరథుడు రాజ్యము పాలించు కాలమున రాజధాని యైన అయోధ్య లోనే కాక, రాజ్యమునం దెచ్చటను (గోవిందరాజులు), నాస్తికుడు గాని, అసత్య వాది కాని, శాస్త్రాభ్యాసము చేయనివాడు గాని, అసూయ కలవాడు గాని, అసమర్థుడు కాని, వివిధ విషయజ్ఞానము లేనివాడు గాని లేకుండెను. 14

మూ. నాషడఙ్గవిదత్రాసీన్నావ్రతో నాసహస్రదః,
న దీనః క్షిప్తచిత్తో వా వ్యథితో వాపి కశ్చన. 15

ప్ర. అ. అత్ర = ఈ అయోధ్యయందు, అషడఙ్గవిత్ = శిక్షా-వ్యాకరణ-చ్ఛందో-నిరుక్త-జ్యోతిష-కల్పము లనెడు ఆరు వేదాంగములు తెలియనివాడు, నాసీత్ = లేకుండెను. అవ్రతః = చాంద్రాయణాదివ్రతముల నాచరించనివాడు,

న = లేకుండెను, అసహస్రదః = వేలకొలది దానముచేయనివాడు, న = లేకుండెను, దీనః = దీనుడు, న = లేకుండెను, క్షిప్తచిత్తో వా = కలతచెందిన చిత్తముకలవాడు, న = లేకుండెను, వ్యథితః = బాధలకు గురి యైనవాడును, కశ్చన = ఒక్కడును, న = లేకుండెను.

తా. అయోధ్యలో ఏ ఒక్కడును, షడంగవేత్త కానివాడు కాని, వ్రతానుష్ఠానము లేనివాడు కాని, వేలకొలది ద్రవ్యము దానము చేయనివాడు కాని, దీనుడు కాని, కలతచెందిన మనస్సు కలవాడు కాని, బాధలకు గురి యైనవాడు గాని లేకుండెను. 15

మూ. కశ్చిన్నరో వా నారీ వా నాశ్రీమాన్ నాప్యరూపవాన్,
ద్రష్టుం శక్యమయోధ్యాయాం నాపి రాజన్యభక్తిమాన్. 16.

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యలో, నరో వా = పురుషుడు గాని, నారీ వా = స్త్రీ కాని, కశ్చిత్ = ఒక్కరును, అశ్రీమాన్ = ఐశ్వర్యము లేనివాడు, ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యమ్ = శక్యము కాదు. అరూపవాన్ అపి = సౌందర్యము లేనివాడు, న = చూడ శక్యము కాదు. రాజని = రాజునందు, అభక్తిమాన్ = భక్తి లేనివాడును, న = చూడ శక్యము కాదు.

తా. అయోధ్యానగరిలో ఐశ్వర్యము, సౌందర్యము, రాజభక్తి లేని పురుషుడు కాని స్త్రీ కాని మచ్చునకైనను కానరారు. 16

మూ. వర్ణేష్వగ్ర్యచతుర్థేషు దేవతాతిథిపూజకాః,
కృతజ్ఞాశ్చ వదాన్యాశ్చ శూరా విక్రమసంయుతాః, 17

దీర్ఘాయుషో నరాస్సర్వే ధర్మం సత్యం చ సంశ్రితాః,
సహితాః పుత్రపౌత్రైశ్చ నిత్యం స్త్రీభిః పురోత్తమే. 18

ప్ర. అ. పురోత్తమే = ఆ అయోధ్యలో, అగ్ర్యచతుర్థేషు = మొదటిదైన బ్రాహ్మణవర్ణము నాల్గవదిగా గల, వర్ణేషు = క్షత్రియ-వైశ్య-శూద్రవర్ణముల యందు, సర్వే = సమస్తమైన, నరాః = పురుషులు, దేవతాతిథిపూజకాః = దేవతలను అతిథులను పూజించువారు. కృతజ్ఞాః చ = చేసిన మేలును మరువని వారు వదాన్యాశ్చ = దాతృత్వము కలవారు, శూరాః = శూరులు, విక్రమసంయుతాః =

పరాక్రమముతో కూడినవారు, దీర్ఘాయుషః = దీర్ఘాయుర్దాయము కలవారు, నిత్యమ్ = ఎల్లప్పుడును, పుత్రపౌత్రైః = పుత్రపౌత్రులతోడను, స్త్రీభిశ్చ = స్త్రీలతోడను, సహితాః = కూడి యుండువారు. ధర్మమ్ = ధర్మమును, సత్యం చ = సత్యమును, సంశ్రితాః = ఆశ్రయించినవారు.

తా. అయోధ్యానగరములో నాలుగువర్ణములకును చెందిన పురుషు లందరును దేవతాతిథిపూజ చేయువారు, కృతజ్ఞులు, ఉదారులు, శూరులు, పరాక్రమవంతులు. దీర్ఘాయుర్దాయవంతులై, సత్యధర్మపరులై, ఎల్లప్పుడును దారపుత్ర పౌత్రాదులతో కలసి ఆనందించెడివారు. 17, 18

మూ. క్షత్రం బ్రహ్మముఖం చాసీద్వైశ్యాః క్షత్రమనువ్రతాః,
శూద్రాః స్వధర్మనిరతాస్త్రీన్ వర్ణానుపచారిణః. 19

ప్ర. అ. క్షత్రమ్ = క్షత్రియజాతి, బ్రహ్మముఖమ్ = బ్రాహ్మణులను అనుసరించునదై, ఆసీత్ = ఉండెను, వైశ్యాః = వైశ్యులు, క్షత్రమ్ = క్షత్రియ జాతిని, అనువ్రతాః = అనుసరించి యుండెడివారు, శూద్రాః = శూద్రులు, త్రీన్ వర్ణాన్ = మూడు వర్ణములను, ఉపచారిణః = ఉపచారము చేయువారై, స్వధర్మ నిరతాః = తమ ధర్మమునందు ఆసక్తులై యుండిరి.

తా. క్షత్రియులు బ్రాహ్మణులను, వైశ్యులు క్షత్రియులను అనుసరించి ఉండెడివారు. శూద్రులు మూడు వర్ణములవారికిని ఉపచారము చేయుచు స్వధర్మ నిరతులై యుండెడి వారు. 19

మూ. సా తేనేక్ష్వాకునాథేన పురీ సుపరిరక్షితా,
యథా పురస్తాన్మనునా మానవేన్ద్రేణ ధీమతా. 20

ప్ర. అ. సా పురీ = ఆ అయోధ్య, పురస్తాత్ = పూర్వమునందు, మానవేన్ద్రేణ = మానవులందరికి ప్రభువును, ధీమతా = బుద్ధిమంతుడును అగు, మనునా = మనుచక్రవర్తిచేత, యథా = ఎట్లుపాలింపబడెనో అట్లే, తేన = ఆ, ఇక్ష్వాకునాథేన = దశరథునిచేత, సుపరిరక్షితా = బాగుగా రక్షింపబడినది.

తా. మానవేంద్రుడును, బుద్ధిశాలియు అగు మనుచక్రవర్తి పూర్వ మెట్లు పాలించెనో అట్లే ఆ దశరథుడు ఆ అయోధ్యను చక్కగ పరిరక్షించెను. 20

మూ. యోధానామగ్నికల్పానాం పేశలానామమర్షిణామ్,
సంపూర్ణా కృతవిద్యానాం గుహా కేసరిణామివ. 21

ప్ర. అ. అగ్నికల్పానామ్=అగ్నితో సమానులును, పేశలానామ్=నేర్పు కలవారును, అమర్షిణామ్ = = పౌరుషము కలవారును, కృతవిద్యానామ్=అభ్య సింపబడిన విద్యలు కలవారును అగు, యోధానామ్ = యోధుల సమూహము లతో, కేసరిణామ్ = సింహముల సమూహముతో, గుహా ఇవ = గుహ వలె, సం పూర్ణా = నిండి యున్నది.

• తా. ఆ అయోధ్య, అగ్నితుల్యులు, నేర్పుకలవారు, పౌరుషవంతులు, శస్త్రవిద్యానిపుణులు అగు యోధులతో పర్వతగుహ వలె నిండి యుండెను. 21

మూ. కామ్భోజవిషయే జాతైర్బాహ్లికైశ్చ హయోత్తమైః,
వనాయుజైర్నదీజైశ్చ పూర్ణా హరిహయోత్తమైః. 22

ప్ర. అ. కామ్భోజవిషయే = కాంభోజదేశమునందు, జాతైః = పుట్టినవి, బాహ్లికైః=బాహ్లికదేశమునందు పుట్టినవియు, వనాయుజైః=వనాయుదేశమునందు పుట్టినవియు, నదీజైశ్చ = సింధుదేశమునందు పుట్టినవియు, హరిహయోత్తమైః= ఇంద్రుని అశ్వ మైన ఉచ్చైఃశ్రవము వలె ఉత్తమ మైనవియు అగు, హయో త్తమైః = ఉత్తమము లైన అశ్వములతో, పూర్ణా = నిండినది.

తా. కాంభోజ—బాహ్లిక— వనాయు—సింధుదేశములలో పుట్టిన, ఉచ్చైశ్శ్రవ స్తుల్యములగు ఉత్తమాశ్వములతో ఆ అయోధ్య నిండి యుండెను. 22

మూ. విన్ధ్యపర్వతజైర్మత్తైః పూర్ణా హైమవతైరపి,
మదాన్వితైరతిబలైర్మాతఙ్గైః పర్వతోపమైః. 23

ఐరావతకులీనైశ్చ మహాపద్మకులైస్తథా,
అఞ్జనాదపి నిష్పన్నైర్వామనాదపి చ ద్విపైః. 24

ప్ర. అ. మత్తైః = మదించిన, విన్ధ్యపర్వతజైః = వింధ్యపర్వతమునందు పుట్టిన, మాతఙ్గైః = ఏనుగులచేతను, మదాన్వితైః = మదముతో కూడిన, అతి బలైః = గొప్ప బలము గల, పర్వతోపమైః = పర్వతముతో సమాన మైన,

హైమవతై రపి = హిమవత్పర్వతమునందు పుట్టిన ఏనుగులచేతను, ఐరావతకులీనైశ్చ=ఇంద్రుని ఏను గైన ఐరావతముయొక్క కులమునందు పుట్టిన, ద్విపైశ్చ= ఏనుగులచేతను, తథా = మరియు, మహాపద్మకులైః=పుండరీక మనెడు దిగ్గజము యొక్క కులమునందు పుట్టిన ఏనుగులచేతను, అఞ్జనాత్ = వరుణ దిగ్గజ మైన అంజన మను ఏనుగనుండి (వంశమందు), నిష్పన్నైః = పుట్టిన ఏనుగులచేతను, వామనాదపి = యమదిగ్గజ మైన వామనమువలన బుట్టిన ఏనుగులచేతను, పూర్ణా= నిండినది.

తా. వింధ్యపర్వతమునందు పుట్టిన మత్తగజములతోను, గొప్ప బలము గలవియు, పర్వతముతో సమాన మైనవియు, మదముతో కూడినవియు అగు హిమవత్పర్వతజన్యము లైన ఏనుగులతోను, ఐరావతకులమునందు, మహాపద్మకులమునందు, అంజనకులమునందు, వామనకులమునందు పుట్టిన ఏనుగులతోను అయోధ్య నిండియుండెను. 23, 24

మూ. భద్రైర్మన్ద్రైర్మృగైశ్చైవ భద్రమన్ద్రమృగై స్తథా,
భద్రమన్ద్రైర్భద్రమృగైర్మృగమన్ద్రైశ్చ సా పురీ,
నిత్యమత్తైస్సదా పూర్ణా నాగైరచలసన్నిభైః. 25

ప్ర. అ. సా పురీ=ఆ అయోధ్యాపట్టణము, భద్రైః=భద్రజాతీయములును, మన్ద్రైః = మంద్రజాతీయములును, మృగైశ్చైవ = మృగజాతీయములును, భద్రమన్ద్రమృగైః = భద్రమంద్రమృగము లనెడు మూడు జాతుల సంకీర్ణ లక్షణములు కలవియు, భద్రమన్ద్రైః = భద్రమంద్రము లనెడు రెండు జాతుల సంకీర్ణలక్షణములు కలవియు, భద్రమృగైః = భద్రమృగము లనెడు రెండు జాతుల సంకీర్ణలక్షణములు కలవియు, మృగమన్ద్రైశ్చ=మృగమంద్రము లనెడు రెండు జాతుల సంకీర్ణలక్షణములు కలవియు, నిత్యమత్తైః=నిత్యము మదించి యున్న, అచలసన్నిభైః=పర్వతములతో సమానము లైన, నాగైః=ఏనుగులతో, సదా=ఎల్లప్పుడును, పూర్ణా = నిండియుండెను.

తా. భద్రజాతీయములు, మంద్రజాతీయములు, మృగజాతీయములు, భద్రమంద్రమృగజాతీయములు, భద్రమంద్రజాతీయములు, భద్రమృగజాతీయములు, మృగమంద్రజాతీయములు, ఎల్లప్పుడును మదించి యున్నవియు, పర్వతములతో సమానములును అగు ఏనుగులతో ఆ నగరము ఎల్లప్పుడును నిండియుండెను. 25

మూ. సా యోజనే చ ద్వే భూయః సత్యనామా ప్రకాశతే,
యస్యాం దశరథో రాజా వసన్ రాజ్యమపాలయత్. 26

ప్ర. అ. దశరథః రాజా = దశరథమహారాజు, యస్యామ్ = ఏ అయోధ్య యందు, వసన్ = నివసించుచు, జగత్ = జగత్తును, అపాలయత్ = పాలించెనో, సా = ఆ అయోధ్య, భూయః = ఇంకను, బైటకూడ, ద్వే యోజనే = రెండు యోజనముల దూరమున గూడ, సత్యనామా = యథార్థమైన పేరు కలదై, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తా. ప్రపంచము నంతను పాలించుచున్న దశరథమహారాజునకు నివాసస్థాన మైన అయోధ్య బైట కూడ రెండు యోజనముల వరకును శత్రువులచే ఎదిరింప శక్యము కానిదై, అయోధ్య యను తన నామదేయమును సార్థకము చేసికొని ప్రకాశించుచుండెను. 26

మూ. తాం పురీం స మహాతేజా రాజా దశరథో మహాన్,
శశాస శమితామిత్రో నక్షత్రాణీవ చన్ద్రమాః. 27

ప్ర. అ. మహాతేజాః = గొప్పపరాక్రమము గలవాడును, మహాన్ = పూజింపదగినవాడును అగు, దశరథః = దశరథమహారాజు, శమితామిత్రః = శాంతింపచేయబడిన శత్రువులు కలవాడై, తామ్ = ఆ, పురీమ్ = అయోధ్యా పట్టణమును, చన్ద్రమాః = చంద్రుడు, నక్షత్రాణీవ = నక్షత్రములను వలె, శశాస = పరిపాలించెను.

తా. మహాతేజఃశాలియు, పూజ్యుడును అయిన దశరథమహారాజు శత్రువుల నందరిని అణచి, అయోధ్యానగరమును, చంద్రుడు నక్షత్రములను పాలించినట్లు పాలించెను. 27

మూ. తాం సత్యనామాం దృఢతోరణార్గలాం
గృహైర్విచిత్రైరుపశోభితాం శివామ్,
పురీమయోధ్యాం నృసహస్రసంకులాం
శశాస వై శక్రసమో మహీపతిః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే షష్ఠః సర్గః.

ప్ర. అ. దృఢతోరణార్గలామ్ = దృఢమైన తోరణములును (ద్వారములును) గడియలును కలదియు, విచిత్రైః = విచిత్రములైన, గృహైః = గృహములచేత, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినదియు, శివామ్ = మంగళకరమైనదియు, నృసహస్రసంకులామ్ = వేలకొలది మనుష్యులతో నిండినదియు, సత్యనామామ్ = యథార్థమైన పేరుగలదియు అగు, అయోధ్యాం పురీమ్ = అయోధ్యానగరమును, శక్రసమః = దేవేంద్రునితో సమానుడైన, మహీపతిః = దశరథమహారాజు, శశాస వై = పరిపాలించెను.

తా. ఇంద్రునితో సమానుడైన ఆ దశరథుడు దృఢమైన తోరణములును, గడియలును కలదియు, విచిత్రములైన గృహములతో ప్రకాశించునదియు, మంగళకరమైనదియు, వేలకొలది జనులతో నిండినదియు, యథార్థమైన పేరుగలదియు, అగు ఆ అయోధ్యను పరిపాలించెను. 28

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో షష్ఠసర్గ సమాప్తము.

# అథ స ప్తమః సర్గః

మూ. తస్యామాత్యా గుణై రాసన్నిక్ష్వాకోస్తు మహాత్మనః,
మన్త్రజ్ఞాశ్చేఙ్గితజ్ఞాశ్చ నిత్యం ప్రియహితే రతాః. 1

ప్ర. అ. మహాత్మనః=గొప్పబుద్ధి గల, తస్య = ఆ, ఇక్ష్వాకోః=ఇక్ష్వాకు వంశమునందు పుట్టిన దశరథునకు, గుణైః = మంత్రుల కుండవలసిన ప్రజ్ఞాది గుణములచేత, మన్త్రజ్ఞాశ్చ = ఆలోచన తెలిసినవారును, ఇఙ్గితజ్ఞాశ్చ = ఇతరుల అభిప్రాయములను వారి ముఖాదులనుపట్టి తెలుసుకొనువారును, నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రియహితే = రాజునకు ఇష్టము లాభకరము అయిన కార్యము నందు, రతాః = ఆసక్తికలవారును అగు, అమాత్యాః = మంత్రులు, ఆసన్ = ఉండిరి.

తా. మహాత్ముడైన దశరథునకు, ప్రజ్ఞాదిగుణములచే మంత్రణమునందు సమర్థులును, ఇతరుల ఆకారాదులను పట్టి వారి మనస్సులోని అభిప్రాయమును తెలిసికొనగలవారును, ఎల్లప్పుడును తమ ప్రభువునకు ఇష్టము, హితము అగు కార్యమును చేయుటయందు ఆసక్తి కలవారును అగు మంత్రులు ఉండిరి. 1

మూ. అష్టౌ బభూవుర్వీరస్య తస్యామాత్యా యశస్వినః,
శుచయశ్చానురక్తాశ్చ రాజకృత్యేషు నిత్యశః. 2

ప్ర. అ. వీరస్య=వీరుడును, యశస్వినః=కీర్తిమంతుడును అగు, తస్య= ఆ దశరథునకు, శుచయః = వ్యవహారములందు పరిశుద్ధులును, నిత్యమ్ = ఎల్లప్పుడును, రాజకృత్యేషు = రాజకార్యములయందు, అనురక్తాశ్చ = ఆసక్తి కలవారును అగు, అష్టౌ=ఎనమండుగురు, అమాత్యాః=మంత్రులు, బభూవుః= = ఉండిరి.

తా. మహావీరుడును, యశశ్శాలియు అగు ఆ దశరథునకు లంచములు తీసికొనుట మొదలగు దోషములు లేక వ్యవహారశుద్ధి కలవారును, ఎల్లప్పుడు రాజకార్యవ్యాపృతులును అగు ఎనమండుగురు మంత్రులు ఉండిరి. 2

మూ. ధృష్టిర్జయన్తో విజయః సిద్ధార్థో హ్యర్థసాధకః,
అశోకో మన్త్రిపాలశ్చ సుమన్త్రశ్చాష్టమోఽభవత్. 3

ప్ర. అ. ధృష్టిః=ధృష్టి, జయన్తః=జయంతుడు, విజయః = విజయుడు, సిద్ధార్థః = సిద్ధార్థుడు, అర్థసాధకః = అర్థసాధకుడు, అశోకః = అశోకుడు, మన్త్రిపాలశ్చ = మంత్రపాలుడు, అను మంత్రు లుండిరి. సుమన్త్రః=సుమంత్రుడను, అష్టమః = ఎనిమిదవ మంత్రి, అభవత్ = ఉండెను.

తా. ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు అని ఈ ఎనమండుగురు మంత్రుల పేర్లు. 3

మూ. ఋత్విజౌ ద్వావభిమతౌ తస్యాస్తామృషిసత్తమౌ,
వసిష్ఠో వామదేవశ్చ మన్త్రిణశ్చ తథాపరే. 4

ప్ర. అ. తస్య = ఆ దశరథునకు, వసిష్ఠః=వసిష్ఠుడును, వామదేవశ్చ= వామదేవుడును అను, ద్వౌ=ఇద్దరు, ఋషిసత్తమౌ=ఋషిశ్రేష్ఠులు, అభిమతౌ= ఎక్కువగా ఇష్ట లైన, ఋత్విజౌ=ఋత్విక్కులుగా, ఆస్తామ్=ఉండిరి. తథా= మరియు, అపరే = మరికొందరు, మన్త్రిణశ్చ = మంత్రులును, ఉండిరి.

తా. వసిష్ఠుడు, వామదేవుడు అను ఇద్దరు ఋషిసత్తములు దశరథునకు ప్రధాను లైన ఋత్విక్కులుగా ఉండిరి. మరి కొందరు మంత్రులు కూడ ఉండిరి. 4

మూ. విద్యావినీతా హ్రీమన్తః కుశలా నియతేన్ద్రియాః,
శ్రీమన్తశ్చ మహాత్మానః శాస్త్రజ్ఞా దృఢవిక్రమాః. 5

కీర్తిమన్తః ప్రణిహితా యథావచనకారిణః,
తేజఃక్షమాయశఃప్రాప్తాః స్మితపూర్వాభిభాషిణః. 6

ప్ర. అ. (వారు), విద్యావినీతాః = అన్ని విద్యలందును శిక్షితులు, హ్రీమంతః = అకార్యముచేయుటకు సిగ్గుపడువారు, కుశలాః = నేర్పరులు, నియ యాః = నిగ్రహించుకొనబడిన ఇంద్రియములు కలవారు. శ్రీమన్తశ్చ =

ఐశ్వర్యవంతులు, మహాత్మానః = గొప్ప బుద్ధిమంతులు, శాస్త్రజ్ఞాః=శాస్త్రములు తెలిసినవారు. దృఢవిక్రమాః=దృఢ మైన పరాక్రమము కలవారు, కీర్తిమన్తః= కీర్తి కలవారు, ప్రణిహితాః = సావధానమైన చిత్తముకలవారు. యథావచన కారిణః = చెప్పిన విధముగా చేయువారు, తేజఃక్షమాయశః ప్రాప్తాః = తేజస్సును, ఓర్పును, కీర్తిని పొందినవారు, స్మితపూర్వాభిభాషిణః = చిరునవ్వు నవ్వుచు మాటలాడువారు.

తా. ఆ మంత్రులు సమస్తవిద్యలు నేర్చినవారు, అకార్యములను చేయుటకు సిగ్గుచెందువారు. నేర్పు కలవారు, ఇంద్రియనిగ్రహవంతులు, ఐశ్వర్యవంతులు, మహాబుద్ధిశాలులు, శాస్త్రజ్ఞానము కలవారు. దృఢమైన పరాక్రమము కలవారు, కీర్తిమంతులు. కార్యములు చేయు నపుడు ఏకాగ్రచిత్తము కలవారు, చెప్పిన విధముగ చేయువారు, తేజస్సు, ఓర్పు, కీర్తి కలవారు, చిరునవ్వు నవ్వుచూ మాటలాడువారు. 5, 6

మూ. క్రోధాత్కామార్థహేతోర్వా న బ్రూయురనృతం వచః,
తేషామవిదితం కించిత్స్వేషు నాస్తి పరేషు వా,
క్రియమాణం కృతం వాపి చారేణాపి చికీర్షితమ్. 7

ప్ర.అ. క్రోధాత్ = కోపమువలనగాని, కామార్థహేతోర్వా = కామమువలన గాని, ధనముకొరకుగాని, అనృతమ్ = అసత్య మైన, వచః = వాక్యమును, న బ్రూయుః = పలకరు. స్వేషు = తమవారిలో గాని, పరేషు వా = శత్రువులలో గాని, క్రియమాణమ్ = చేయబడుచున్నది గాని, కృతం వాపి = చేయబడినది గాని, చికీర్షితమ్ = చేయ తలపెట్టినది గాని, తేషామ్ = వారికి, చారేణ = గూఢ చారుల ద్వారా, అవిదితమ్ = తెలియనిది, కించిత్=ఏమియు, నాస్తి=లేదు.

తా. కోపమువలన గాని, కామముచేత గాని, ధనముకొరకు గాని వారెన్నడు అసత్య మాడెడివారు కాదు. స్వపరరాష్ట్రములలో చేయబడినది కాని, చేయబడుచున్నది కాని, చేయబడ నున్నది గాని, వారికి గూఢచారుల ద్వారా తెలియనిది ఏదియు లేకుండెను. 7

మూ. కుశలా వ్యవహారేషు సౌహృదేషు పరీక్షితాః,
ప్రాప్తకాలం తు తే దణ్డం ధారయేయుః సుతేష్వపి. 8

ప్ర. అ. తే = ఆ మంత్రులు, వ్యవహారేషు = వ్యవహారములయందు, కుశలాః = సమర్థులు, సౌహృదేషు = స్నేహములవిషయమున, పరీక్షితాః= పరీక్షింపబడినవారు, సుతేష్వపి = కుమారుల విషయమునందు కూడ, ప్రాప్త కాలమ్ = సరి యైన, దణ్డమ్ = దండమును, ధారయేయుః = విధించెడివారు.

తా. ఆ మంత్రులు వ్యవహారదక్షులు. వీరికి ఎట్టి స్నేహితు లున్నారో (రాజుచేత) పరీక్షించబడినవారు. కుమారులకు కూడ, అవశ్యక మైనపుడు సరి యైన దండమును విధించెడివారు. 8

మూ. కోశసఙ్గ్రహణే యుక్తా బలస్య చ పరిగ్రహే,
అహితం చాపి పురుషం న విహింస్యురదూషకమ్. 9

ప్ర. అ. కోశసంగ్రహణే = ధనాగారమును నింపుటయందును, బలస్య= సైన్యముయొక్క, పరిగ్రహే చ = సమకూర్చుటయందును, యుక్తాః = మిక్కిలి శ్రద్ధ చూపెడివారు. అదూషకమ్ = అపరాధముచేయని, అహితం పురుషమపి= శత్రువును కూడ, న విహింస్యుః = బాధించరు.

తా. ఆ మంత్రులు రాజ్యధనాగారమును నింపుట, సైన్యమును సమ కూర్చుట మొదలైన రాజ్యకార్యములందు సర్వదా ఆసక్తి చూపెడివారు. అప రాధము చేయనిచో శత్రువు నైనను హింసించరు. 9

మూ. వీరాశ్చ నియతోత్సాహా రాజశాస్త్రమనుష్ఠితాః,
శుచీనాం రక్షితారశ్చ నిత్యం విషయవాసినామ్. 10

ప్ర. అ. వీరాశ్చ = వీరులు, నియతోత్సాహాః = స్థిర మైన ఉత్సాహము కలవారు, రాజశాస్త్రమ్ = రాజశాస్త్రమును, అనుష్ఠితాః=అనుసరించి ప్రవర్తించు వారు, విషయవాసినామ్ = దేశములో నివసించు, శుచీనామ్ = సత్పురుషులకు, నిత్యమ్ = ఎల్లప్పుడును, రక్షితారశ్చ = రక్షకులు.

తా. ఆ మంత్రులు వీరులు, చలించని ఉత్సాహము కలవారు, రాజశా స్త్రప్రకారము కార్యములను అనుష్ఠించువారు, దేశములో నున్న సత్పురుషులకు ఎట్టి ఉపద్రవములు కలుగకుండ ఎల్లప్పుడును కాపాడుచుండెడివారు. 10

మూ. బ్రహ్మక్షత్రమహింసన్తస్తే కోశం సమపూరయన్,
సుతీక్ష్ణదణ్డాః సంప్రేక్ష్య పురుషస్య బలాబలమ్. 11

ప్ర. అ. బ్రహ్మ = బ్రాహ్మణజాతిని, క్షత్రమ్ = క్షత్రియజాతిని, అహింసన్తః = హింసించనివారై, తే = వారు, కోశమ్ = ధనాగారమును, సమపూరయన్ = నింపిరి, పురుషస్య = అపరాధి యైన పురుషునియొక్క, బలాబలమ్= బలాబలములను, సంప్రేక్ష్య= చూచి, సుతీక్ష్ణదణ్డాః = చాలతీక్ష్ణ మైన దండము ఇచ్చెడివారు.

తా. ఆ మంత్రులు బ్రాహ్మణక్షత్రియులకు బాధ కలుగకుండ చూచుచు కోశమును నింపెడివారు. అపరాధియొక్క బలాబలములను పరీక్షించి, తగు విధముగ తీక్ష్ణ మైన దండమును విధించెడివారు, (బలవంతుడైనచో అధికదండము దుర్బలుడైనచో అల్పదండము ఇచ్చెడివారు. లేదా అపరాధము యొక్క బలాబలములను పరీక్షించి శిక్షించెడివారు). 11

మూ. శుచీనామేకబుద్ధీనాం సర్వేషాం సంప్రజానతామ్,
నాసీత్పురే వా రాష్ట్రే వా మృషావాదీ నరః క్వచిత్. 12

ప్ర. అ. శుచీనామ్ = పరిశుద్ధ మైన నడవడిక గలవారును, ఏకబుద్ధీనామ్ = ఐకమత్యముతో ప్రవర్తించువారును అగు, సర్వేషామ్ = ఆ అందరు మంత్రులును, సంప్రజానతామ్ = రాజ్యతంత్రమును విచారించుచుండగా, పురే వా = పట్టణమునందు గాని, రాజ్యే వా = రాజ్యమునందు గాని, క్వచిత్ = ఎక్కడను, మృషావాదీ=అసత్యమును పలికెడి, నరః=మనుష్యుడు, నాసీత్= లేకుండెను.

తా. పరిశుద్ధ మైన నడవడిక గల ఆ మంత్రు లందరును ఐకమత్యముతో రాజకార్యములను చక్కబెట్టుచుండగా, నగరములో గాని, రాజ్యములో గాని, ఎచ్చటను, అసత్యమాడువాడు ఒక్కడును ఉండెడివాడు కాదు. 12

మూ. కశ్చిన్న దుష్టస్తత్రాసీత్పరదారరతో నరః,
ప్రశాన్తం సర్వమేవాసీద్రాష్ట్రం పురవరం చ తత్. 13

ప్ర. అ. తత్ర = ఆ రాజ్యమునందు, దుష్టః = దుష్టుడు కాని, పరదార రతః = పరభార్యలయందు ఆసక్తి కలవాడు గాని అయిన, నరః = మనుష్యుడు, కశ్చిత్=ఒక్కడును, నాసీత్=లేకుండెను, సర్వమ్=సమస్త మైన, రాష్ట్రమ్ = రాష్ట్రము, తత్=ఆ, పురవరం చ=పట్టణశ్రేష్ఠ మైన అయోధ్యయు, ప్రశాన్తమ్= శాంతిపూర్ణ మై, ఆసీత్ = ఉండెను.

తా. ఆ రాజ్యములో దుష్టుడు గాని, పరభార్యానక్తుడు కాని లేకుండెను. ఆ రాష్ట్రమునం దంతటను, అయోధ్యయందును శాంతి నెలకొని ఉండెను. 13

మూ. సువాససస్సువేషాశ్చ తే చ సర్వే సుశీలినః,
హితార్థం చ నరేన్ద్రస్య జాగ్రతో నయచక్షుషా. 14

ప్ర. అ. తే సర్వే = ఆ మంత్రులందరును, సువాససః = మంచి వస్త్రము లను ధరించెడివారు, సువేషాశ్చ = మంచి వేషము కలవారు, సుశీలినః = మంచి శీలము కలవారు, నరేన్ద్రస్య = రాజుయొక్క, హితార్థమ్ = హితముకొరకు, నయచక్షుషా=నీతి యనెడు నేత్రముతో, జాగ్రతః= మేల్కొని యుండెడివారు.

తా. ఆ మంత్రు లందరును మంచి వస్త్రములు, వేషములు ధరించెడివారు. మంచి శీలము కలవారు. నీతినేత్రములతో సర్వదా మేల్కొని యుండి రాజు యొక్క హితముకొరకు పాటుపడెడి వారు. 14

మూ. గురౌ గుణగృహీతాశ్చ ప్రఖ్యాతాశ్చ పరాక్రమే,
విదేశేష్వపి విఖ్యాతాస్సర్వతో బుద్ధినిశ్చయాత్. 15

ప్ర. అ. గురౌ = మాతాపిత్రాది గురుజనమునందు, గుణగృహీతాః = గుణములను మాత్రమే గ్రహించువారు, పరాక్రమే = పరాక్రమమువిషయమున, ప్రఖ్యాతాః = ప్రసిద్ధి పొందినవారు, సర్వతః= అన్ని విషయములందును, బుద్ధి నిశ్చయాత్=బుద్ధియొక్క నిశ్చయమువలన, విదేశేష్వపి=విదేశములలో కూడ, విఖ్యాతాః = ప్రసిద్ధులు.

తా. ఆ మంత్రులు మాతాపిత్రాదు లగు పెద్దలలో ఉన్న గుణములను మాత్రమే గ్రహించెడివారు. పరాక్రమముచే ప్రసిద్ధులు, అన్ని విషయములను గ్రహింప గలిగిన బుద్ధిబలమును బట్టి విదేశములలో కూడ ప్రఖ్యాతి గడించినవారు. 15

మూ. సన్ధివిగ్రహతత్త్వజ్ఞాః ప్రకృత్యా సమ్పదాన్వితాః, 16
మన్త్రసంవరణే శక్తాః శక్తాః సూక్ష్మాసు బుద్ధిషు,
నీతిశాస్త్రవిశేషజ్ఞాః సతతం ప్రియవాదినః. 17

ప్ర. అ. సన్ధివిగ్రహతత్త్వజ్ఞాః=సంధివిగ్రహముల తత్త్వము నెరిగినవారు. ప్రకృత్యా = స్వభావముచేత, సమ్పదా = సంపదతో, అన్వితాః = కూడినవారు, మన్త్రసంవరణే=మంత్రమును దాచుటయందు, శక్తాః=సమర్థులు, సూక్ష్మాసు= సూక్ష్మము లైన, బుద్ధిషు = బుద్ధులయందు, శక్తాః = సమర్థులు, నీతిశాస్త్ర విశేషజ్ఞాః=నీతిశాస్త్రములోని విశేషములు తెలిసినవారు, సతతమ్=ఎల్లప్పుడును, ప్రియవాదినః = ప్రియ మైన మాటలు పలుకువారు.

తా. ఆ మంత్రులందరును శత్రువులతో ఎప్పుడు ఎట్లు సంధిచేసికొన వలెనో, ఎప్పుడు వారితో యుద్ధము చేయవలెనో బాగుగ తెలిసినవారు. సహజ ముగ ఐశ్వర్యవంతులు. ఆలోచనలను రహస్యముగ ఉంచుటయందును, సూక్ష్మ విషయములను గ్రహించి నిర్ణయములు చేయుటయందును సమర్థులు. నీతిశాస్త్ర ములోని విశేషము లన్నియు తెలిసినవారు. ఇతరుల మనస్సును నొప్పింపని విధమున మాటలాడువారు. 16, 17

మూ. ఈదృశైస్తైరమాత్యైస్తు రాజా దశరథోఽనఘః,
ఉపపన్నో గుణోపేతైరన్వశాసద్వసున్ధరామ్. 18

ప్ర. అ. అనఘః = ఎట్టిదోషములును లేని, దశరథః రాజా = దశరథ మహారాజు, గుణోపేతైః = సద్గుణములు గల, ఈదృశైః=ఇట్టి, అమాత్యైః= మంత్రులతో, ఉపేతః = కూడినవాడై, వసున్ధరామ్ = భూమిని, అన్వశాసత్ = పరిపాలించెను.

తా. ఎట్టిదోషములును లేని దశరథమహారాజు, ఇట్టి సద్గుణోపేతు లైన మంత్రుల సాహాయ్యముతో భూమిని పరిపాలించెను. 18

మూ. అవేక్షమాణశ్చారేణ ప్రజా ధర్మేణ రఞ్జయన్,
ప్రజానాం పాలనం కుర్వన్ అధర్మాన్ పరివర్జయన్. 19

విశ్రుతస్త్రిషు లోకేషు వదాన్యః సత్యసఙ్గరః,
స తత్ర పురుషవ్యాఘ్రః శశాస పృథివీమిమామ్. 20

ప్ర. అ. పురుషవ్యాఘ్రః = పురుషులలో శ్రేష్ఠుడైన, సః = ఆ దశరథ మహారాజు, చారేణ = గూఢచారిచేత, అవేక్షమాణః = చూచుచు, ప్రజాః = ప్రజలను, రఞ్జయన్ = సంతోషపెట్టుచు, ప్రజానామ్ = ప్రజలయొక్క, పాలనమ్ = రక్షణను, కుర్వన్ = చేయుచు, అధర్మాన్ = అధర్మములను, పరివర్జయన్ = విసర్జించుచు, వదాన్యః = ఉదారుడనియు, సత్యసఙ్గరః = సత్యమైన ప్రతిజ్ఞకలవాడనియు, త్రిషు లోకేషు = మూడు లోకములలో, విశ్రుతః = ప్రసిద్ధుడై, ఇమామ్ = ఈ, పృథివీమ్ = భూమిని, ధర్మేణ = ధర్మముచేత, శశాస = పరిపాలించెను.

తా. ఔదార్యవంతుడనియు, ప్రజ్ఞను నిలుపుకొనువాడనియు మూడు లోకములలో ప్రసిద్ధి గాంచిన, పురుషశ్రేష్ఠుడైన ఆ దశరథుడు, రాజ్యములోని విషయముల నన్నింటిని గూఢచారుల ద్వారా తెలిసికొనుచు, ప్రజలను ఆనందింపచేసి, వారిని రక్షించుచు, అధర్మములను తొలగించుచు, ఈ భూమి నంతను ధర్మముతో పరిపాలించెను. 19, 20

మూ. నాధ్యగచ్ఛద్విశిష్టం వా తుల్యం వా శత్రుమాత్మనః,
మిత్రవాన్నతసామన్తః ప్రతాపహతకణ్టకః,
స శశాస జగద్రాజా దివం దేవపతిర్యథా. 21

ప్ర. అ. మిత్రవాన్ = స్నేహితులు కలవాడును, నతసామన్తః = లొంగి ఉన్న సామంతులు కలవాడును, ప్రతాపహతకణ్టకః=ప్రతాపముచేత చంపబడిన శత్రువులుగలవాడును అగు, ఆ దశరథుడు, ఆత్మనః=తనకంటె, విశిష్టం వా= గొప్పవాడైన, లేదా, తుల్యం వా=సమానుడైన, శత్రుమ్ = శత్రువును, నాధ్యగచ్ఛత్ = పొందలేదు, సః రాజా = ఆ రాజు, దేవపతిః = దేవేంద్రుడు, దివం యథా = స్వర్గమును వలె, జగత్ = జగత్తును, శశాస = పరిపాలించెను.

తా. ఆ దశరథునకు ఎందరో మిత్రులుండిరి. సామంతరాజు లందరును లొంగి ఉండిరి. అతడు తనకు బాధ కలిగించువారి నందరిని ప్రతాపముచేత సంహరించెను. అందుచే అతనిని మించినవాడుగాని, అతనితో సమానుడు

గాని అయిన శత్రు వొక్కడును లేకుండెను. అతడు, దేవేంద్రుడు స్వర్గమును పాలించి నట్లు ఈ జగత్తు నంతను పాలించెను. 21

మూ. తైర్మన్త్రిభిర్మన్త్రహితే నివిష్టైః
వృతోఽనురక్తైః కుశలైః సమర్థైః,
స పార్థివో దీప్తిమవాప యుక్త
స్తేజోమయైర్గోభిరివోదితోఽర్కః. 22

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, బాలకాణ్డే సప్తమః సర్గః.

ప్ర. అ. మన్త్రహితే = ఆలోచనయందును తన హితమునందును, నివిష్టైః=ఆసక్తి కలవారును, అనురక్తైః=అనురాగము కలవారును, కుశలైః= నేర్పరులును, సమర్థైః = సమర్థులును అయిన, తైః మన్త్రిభిః = ఆ మంత్రులతో, వృతః = కూడిన, సః పార్థివః = ఆ రాజు, తేజోమయైః=తేజోరూపము లైన, గోభిః = కిరణములతో, యుక్తః = కూడిన, ఉదితః = ఉదయించిన, అర్కః ఇవ = సూర్యుడు వలె, దీప్తిమ్ = కాంతిని, అవాప = పొందెను.

తా. ఆలోచనలయందును, తనకు మేలు చేయుటయందును ఆసక్తి గలవారును, అనురక్తులును, సమర్థులును, నేర్పు కలవారును అగు ఆ మంత్రులతో, దశరథమహారాజు, తేజోరూపము లైన కిరణములతో కూడిన ఉదయించుచున్న సూర్యుడు వలె ప్రకాశించెను.

వి. "మన్త్రహితే నియుక్తైః" అని గోవిందరాజసంమతపాఠము. "మంత్ర హితములందు నియమింపబడినవారు" అని అర్థము. 22

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
బాలకాండలో సప్తమసర్గ సమాప్తము.

# అథ అష్టమః సర్గః

మూ. తస్య త్వేవం ప్రభావస్య ధర్మజ్ఞస్య మహాత్మనః,
సుతార్థం తప్యమానస్య నాసీద్వంశకరః సుతః. 1

ప్ర. అ. ఏవంప్రభావస్య = ఇట్టి ప్రభావము కలవాడును, ధర్మజ్ఞస్య = ధర్మము తెలిసినవాడును, మహాత్మనః = గొప్ప బుద్ధి కలవాడును, సుతార్థమ్ = కుమారులకొరకు, తప్యమానస్య = పరితపించుచున్నవాడును అగు, తస్య = ఆ దశరథునకు, వంశకరః = వంశమును నిలుపునట్టి, సుతః = కుమారుడు, నాసీత్ = కలుగలేదు.

తా. ఇట్టి ప్రభావము గల, ధర్మజ్ఞు డైన, మహానుభావు డైన ఆ దశరథునకు చాల కాలము వరకును, వంశమును నిలబెట్టు కుమారుడు కలుగలేదు. అందుచే అతడు పరితపించుచుండెను. 1

మూ. చిన్తయానస్య తస్యైవం బుద్ధిరాసీన్మహాత్మనః,
సుతార్థం హయమేధేన కిమర్థం న యజామ్యహమ్. 2

ప్ర. అ. చిన్తయానస్య = పుత్రులకొరకై చింతించుచున్న, తస్య = ఆ, మహాత్మనః = మహాత్మునకు, ఏవమ్ = ఈ విధముగ, బుద్ధిః = బుద్ధి, ఆసీత్ = కలిగెను, "అహమ్ = నేను, సుతార్థమ్ = కుమారులకొరకై, హయమేధేన = అశ్వమేధయాగముచేత, కిమర్థమ్ = ఎందువలన, న యజామి = దేవతల నారాధింప కూడదు ?"

తా. పుత్రులు జనించలే దని చింతించుచున్న ఆ మహాత్ముని మనస్సులో "నేను సుతులను పొందుటకై అశ్వమేధయాగము చేయవచ్చును కదా ?" అను అభిప్రాయము కలిగెను. 2

మూ. స నిశ్చితాం మతిం కృత్వా యష్టవ్యమితి బుద్ధిమాన్,
మన్త్రిభిః సహ ధర్మాత్మా సర్వైరేవ కృతాత్మభిః. 3

తతో౽బ్రవీదిదం రాజా సుమన్త్రం మన్త్రిసత్తమమ్,
శీఘ్రమానయ మే సర్వాన్ గురూంస్తాన్ సపురోహితాన్. 4

ప్ర. అ. బుద్ధిమాన్ = బుద్ధిమంతు డైన, ధర్మాత్మా = ధర్మాత్ము డైన, సః రాజా = ఆ రాజు, కృతాత్మభిః = పరిశుద్ధ మైన బుద్ధి గల, సర్వైరేవ = సమస్తమైన, మన్త్రిభిః = మంత్రులతో కూడ కలసి, యష్టవ్యమితి = యాగము చేయవలెను అని, నిశ్చితామ్ = నిశ్చిత మైన, మతిం కృత్వా = ఆలోచన చేసి, తతః = అటుపిమ్మట, మన్త్రిసత్తమమ్ = మంత్రిశ్రేష్ఠ డైన, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సపురోహితాన్ = పురోహితులతో గూడిన, తాన్ = ఆ, సర్వాన్ = సమస్త మైన, మే గురూన్ = నా గురువులను, ఆనయ = తీసికొని రమ్ము.

తా. బుద్ధిమంతుడును, ధర్మాత్ముడును అయిన ఆ రాజు, పరిశుద్ధ మైన బుద్ధి గల మంత్రు లందరితో సంప్రదించి, యాగము చేయవలెనని గట్టిగా నిశ్చయించి—"పురోహితులతో కూడ, నా గురువుల నందరిని తీసికొని రమ్ము" అని మంత్రిసత్తము డైన సుమంత్రుని ఆదేశించెను. 4, 3

మూ. తతః సుమన్త్రస్త్వరితం గత్వా త్వరితవిక్రమః,
సమానయత్స తాన్ సర్వాన్ సమస్తాన్వేదపారగాన్. 5

సుయజ్ఞం వామదేవం చ జాబాలిమథ కాశ్యపమ్,
పురోహితం వసిష్ఠం చ యే చాన్యే ద్విజసత్తమాః. 6

ప్ర. అ. తతః = పిమ్మట, త్వరితవిక్రమః = శ్రేష్ఠ మైన గమనము గల, సః సుమన్త్రః = ఆ సుమంత్రుడు, త్వరితమ్ = శీఘ్రముగా, గత్వా = వెళ్లి, సుయజ్ఞమ్ = సుయజ్ఞుని, వామదేవం చ = వామదేవుని, అథ = మరియు, జాబాలిమ్ = జాబాలిని, కాశ్యపమ్ = కాశ్యపుని, పురోహితమ్ = పురోహితు డైన, వసిష్ఠం చ = వసిష్ఠుని, అన్యే = ఇతరు లైన, యే ద్విజసత్తమాః = ఏ బ్రాహ్మణోత్తములు కలరో, వేదపారగాన్ = వేదముల అంతమును చూచిన, సమస్తాన్ = ఒకచోట చేర్చబడిన, తాన్ సర్వాన్ = వారి నందరిని, సమానయత్ = తీసికొనివచ్చెను.

తా. సుమంత్రుడు శీఘ్రముగా వెళ్లి, సుయజ్ఞుని, వామదేవుని, జాబాలిని,

కాశ్యపుని, పురోహితుడైన వసిష్ఠుని, తదితరులైన బ్రాహ్మణోత్తములను, సర్వ వేదములు తెలిసిన వీరందరిని ఒక్కసారిగ తీసికొని వచ్చెను. 5, 6

మూ. తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథ స్తదా,
ఇదం ధర్మార్థసహితం శ్లక్ష్ణం వచనమబ్రవీత్. 7

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డైన, దశరథః రాజా=దశరథమహారాజు, తదా=అప్పుడు, తాన్ = వారిని, పూజయిత్వా = పూజించి, ధర్మార్థసహితమ్ = ధర్మార్థములతో కూడిన, శ్లక్ష్ణమ్ = మృదు వైన, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మాత్ము డైన ఆ దశరథమహారాజు వారిని ఆదరించి, ధర్మార్థములతో కూడిన, మధుర మైన వచనమును పలికెను. 7

మూ. మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్,
తదహం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. 8

ప్ర. అ. పుత్రార్థమ్=పుత్రులకొరకు, లాలప్యమానస్య=బాధపడుచున్న, మమ = నాకు, సుఖమ్ = సుఖము, నాస్తి వై=లేదు. తత్=ఆ కారణమువలన, అహమ్=నేను, హయమేధేన యక్ష్యామి=అశ్వమేధయాగము చేయుదును, ఇతి= అని, మమ = నాకు, మతిః = అభిప్రాయము.

తా. పుత్రులు లేరని బాధపడుచున్న నాకు సుఖ మనునది లేదు. అందుచే అశ్వమేధయాగము చేయ వలె నని నాకు అభిలాష కలిగినది. 8

మూ. తదహం యష్టుమిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా,
కథం ప్రాప్స్యామ్యహం కామం బుద్ధిరత్ర విచార్యతామ్. 9

ప్ర. అ. తత్ = ఆకారణమువలన, అహమ్ = నేను, శాస్త్రదృష్టేన = శాస్త్రోక్త మైన, కర్మణా = కర్మచేత, యష్టుమ్=అశ్వమేధయాగము చేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. కామమ్=కోరికను, కథమ్ = ఎట్లు, అహమ్=నేను, ప్రాప్స్యామి = పొందగలనో, అత్ర = ఈ విషయమున, బుద్ధిః = ఉపాయము, విచార్యతామ్ = ఆలోచింపబడుగాక,

తా. అందుచే నేను యథాశాస్త్రముగ యజ్ఞము చేయదలచుచున్నాను. నా కోరిక ఎట్లు తీరునో ఉపాయము ఆలోచింపుడు. 9

మూ. తతః సాధ్వితి తద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్,
వసిష్ఠప్రముఖాస్సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వసిష్ఠప్రముఖాః=వసిష్ఠుడు మొదలైన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, సర్వే = అందరును, పార్థివస్య = రాజుయొక్క, ముఖాత్=ముఖమునుండి, చ్యుతమ్=వెలువడిన, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, సాధు ఇతి = చాల బాగున్న దని, ప్రత్యపూజయన్ = అభినందించిరి.

తా. వసిష్ఠుడు మొద లైన ఆ బ్రాహ్మణు లందరును దశరథుని నిర్ణయము చాల బాగున్నదని అభినందించిరి. 10

మూ. ఊచుశ్చ పరమప్రీతాః సర్వే దశరథం వచః,
సమ్భారాః సమ్భ్రియన్తాం తే తురగశ్చ విముచ్యతామ్. 11

ప్ర. అ. సర్వే = వారందరును, పరమప్రీతాః = మిక్కిలి సంతసించిన వారై, దశరథమ్ = దశరథుని గూర్చి, వచః=వాక్కును, ఊచుశ్చ=పలికిరి కూడ, సంభారాః = ఉపకరణములు, సంభ్రియన్తామ్ = కూర్చబడుగాక, తే = నీయొక్క, తురగశ్చ = గుఱ్ఱముకూడ, విముచ్యతామ్ = విడువబడుగాక.

తా. వారందరును చాల సంతసించి దశరథునితో "కావలసిన వస్తుసామగ్రిని సమకూర్చి అశ్వమును విడువుము," అని పలికిరి. 11

మూ. సర్వథా ప్రాప్స్యసే పుత్రానభిప్రేతాంశ్చ పార్థివ,
యస్య తే ధార్మికీ బుద్ధిరియం పుత్రార్థమాగతా. 12

ప్ర. అ. పార్థివ = ఓ రాజా !, యస్య = ఏ, తే = నీకు, పుత్రార్థమ్ = పుత్రులకొరకై, ఇయమ్ = ఈ, ధార్మికీ = ధర్మసంమత మైన, బుద్ధిః = బుద్ధి, ఆగతా = కలిగినదో, అట్టి నీవు, అభిప్రేతాన్=ఇష్టులైన, పుత్రాన్=పుత్రులను, సర్వథా = తప్పక, ప్రాప్స్యసే = పొందగలవు.

తా. "ఓ రాజా! పుత్రులు కావలెనని నీకు కలిగిన ఈ బుద్ధి చాల ధర్మ సంమత మైనది. నీకు తప్పక, ఇష్టు లైన పుత్రులు కలుగుదురు. 12

మూ. తతః ప్రీతోఽభవద్రాజా శ్రుత్వా తద్ద్విజభాషితమ్,
అమాత్యాంశ్చాబ్రవీద్రాజా హర్షపర్యాకులేక్షణః. 13

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాజా = రాజు, తత్ ద్విజభాషితమ్ = ఆ బ్రాహ్మణుల వాక్యమును, శ్రుత్వా = విని, ప్రీతః = సంతసించినవాడు, అభవత్ = ఆయెను. రాజా = రాజు, హర్షపర్యాకులేక్షణః = ఆనందముతో వ్యాకుల మైన చూపులు కలవాడై, అమాత్యాన్ = మంత్రులను గూర్చి, అబ్రవీత్ చ = పలికెను.

తా. రాజు బ్రాహ్మణుల మాటలకు సంతసించి, ఆనందము తొణికిసలాడు చున్న చూపులతో, మంత్రులతో ఇట్లు పలికెను. 13

మూ. సంభారాః సంభ్రియన్తాం మే గురూణాం వచనాదిహ,
సమర్థాధిష్ఠితశ్చాశ్వస్సోపాధ్యాయో విముచ్యతామ్. 14

ప్ర. అ. ఇహ = ఇచట, మే గురూణామ్ = నా గురువుల, వచనాత్ = మాటప్రకారము, సంభారాః = యజ్ఞమునకు కావలసిన వస్తుసామగ్రి, సంభ్రియన్తామ్ = సమకూర్చబడుగాక, సమార్థాధిష్ఠితః = సమర్థు లైన వీరులచే రక్షింపబడిన, సోపాధ్యాయః = ఉపాధ్యాయులతో కూడిన, అశ్వః = అశ్వము, విముచ్యతామ్ = విడువబడుగాక.

తా. నా గురువులు చెప్పిన విధముగ యజ్ఞసంభారములను సమకూర్చి, సమర్థు లైన వీరులచే రక్షింపబడుచున్న అశ్వమును విడచి, దాని వెంట ఉపాధ్యాయులను కూడ పంపుడు. 14

మూ. సరయ్వాశ్చోత్తరే తీరే యజ్ఞభూమిర్విధీయతామ్,
శాన్తయశ్చాభివర్ధన్తాం యథాకల్పం యథావిధి. 15

ప్ర. అ. సరయ్వాః = సరయూనదియొక్క, ఉత్తరే తీరే = ఉత్తరతీరము నందు, యజ్ఞభూమిః = యజ్ఞశాల, విధీయతామ్ = నిర్మింపబడుగాక, యథా

కల్పమ్ = పద్ధతిప్రకారముగా, యథావిధి = శాస్త్రప్రకారముగా, శాన్తయశ్చ = శాంతులు కూడ, అభివర్ధన్తామ్ = వృద్ధిపొందుగాక.

తా. సరయూనది ఉత్తరతీరమున యజ్ఞభూమిని ఏర్పాటు చేయుడు. శాస్త్రోక్తప్రకారముగ, నియమబద్ధముగ శాంతికార్యములను జరిపించుడు. 15

మూ. శక్యః ప్రాప్తుమయం యజ్ఞః సర్వేణాపి మహీక్షితా,
నాపరాధో భవేత్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. 16

ప్ర. అ. అస్మిన్ = ఈ, క్రతుసత్తమే = శ్రేష్ఠ మైన యజ్ఞమునందు, కష్టః = కష్ట మైన, అపరాధః = పొరబాటు, న భవేత్ యది = జరుగకపోయిన పక్షమున, అయం యజ్ఞః = ఈ యజ్ఞము, సర్వేణాపి మహీక్షితా = ప్రతిరాజుచేతను, ప్రాప్తుమ్ = పొందుటకు, శక్యః = శక్యమైనది.

తా. ఈ అశ్వమేధయాగములో అపాయకర మైన అపచార మేమియు కలుగని పక్షాన అందరు రాజులును దీనిని చేయ గలిగియుండెడివారు. 16

మూ. ఛిద్రం హి మృగయన్తేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః,
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. 17

ప్ర. అ. అత్ర = ఈ అశ్వమేధయాగమునందు, విద్వాంసః = పండితు లైన, బ్రహ్మరాక్షసాః = బ్రహ్మరాక్షసులు, ఛిద్రమ్ = అపచారమును, మృగయన్తే హి = వెదకుచుందురు కదా, నిహతస్య = కొట్టువడిన, యజ్ఞస్య = యాగముయొక్క, కర్తా చ = కర్త, సద్యః = వెంటనే, వినశ్యతి = నశించును.

తా. అశ్వమేధయాగములో ఏమైన ప్రమాదము కలుగునా యని పండితు లైన బ్రహ్మరాక్షసులు చూచుచు వేచియుందురు. యజ్ఞమునకు భంగము వాటిల్లినచో యజమానుడు వెంటనే నశించును. 17

వి. యాగములు చేయు నపుడు ఏదైన అపచారము చేసిన బ్రాహ్మణులు మరణాంతరము బ్రహ్మరాక్షసు లగుదు రని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

మూ. తద్యథా విధిపూర్వం మే క్రతురేష సమాప్యతే,
తథా విధానం క్రియతాం సమర్థాః కరణేష్విహ. 18

ప్ర. అ. **తత్** = ఆ కారణమువలన, **మే** = నాయొక్క, **ఏషః క్రతుః** = ఈ యజ్ఞము, **విధిపూర్వమ్** = యథాశాస్త్రముగ, **యథా** = ఎట్లు, **సమాప్యతే** = సమాప్తి పొందింపబడునో, **తథా** = అట్లు, **విధానమ్** = ఏర్పాటు, **క్రియతామ్** = చేయబడుగాక, (మీరు), **ఇహ** = ఇచట, **కరణేషు** = కార్యములయందు, **సమర్థాః** = సమర్థులు.

తా. అందుచే, ఈ క్రతువు శాస్త్రప్రకారము పూర్తి యగునట్లు చూడుడు. మీరందరును కార్యములయందు ఆరితేరినవారే కదా. 18

మూ. తథేతి చాబ్రువన్ సర్వే మన్త్రిణః ప్రత్యపూజయన్,
పార్థివేన్ద్రస్య తద్వాక్యం యథాజ్ఞప్తం నిశమ్య తే. 19

ప్ర. అ. **తే మన్త్రిణః**=ఆ మంత్రులు, **సర్వే**=అందరును, **పార్థివేన్ద్రస్య**= దశరథునియొక్క, **తత్ వాక్యమ్** = ఆ వాక్యమును, **నిశమ్య** = విని, **ప్రత్యపూజయన్** = అభినందించిరి, **యథా** = ఎట్లు, **ఆజ్ఞప్తమ్** = ఆజ్ఞాపింపబడినదో, **తథా ఇతి** = అటులనే చేసెదము అని, **అబ్రువన్ చ** = పలికిరి కూడ.

తా. ఆ మంత్రులందరును దశరథుని మాటలు విని, ఆయనను అభినందించి, "తాము ఆజ్ఞాపించిన విధముననే చేసెదము" అని పలికిరి. 19

మూ. తథా ద్విజాస్తే ధర్మజ్ఞా వర్ధయన్తో నృపోత్తమమ్,
అనుజ్ఞాతాస్తతస్సర్వే పునర్జగ్ముర్యథాగతమ్. 20

ప్ర. అ. **ధర్మజ్ఞాః** = ధర్మములు తెలిసిన, **తే ద్విజాః**=ఆ బ్రాహ్మణులు, **తథా**=ఆవిధముగా, **నృపోత్తమమ్**=దశరథుని, **వర్ధయన్తః**=వృద్ధిపొందించుచు, **అనుజ్ఞాతాః** = అనుజ్ఞ పొందినవారై, **తతః** = అటుపిమ్మట, **సర్వే** = అందరును, **యథాగతమ్** = వచ్చినట్లు, **పునః** = తిరిగి, **జగ్ముః** = వెళ్లిరి.

తా. ఆ బ్రాహ్మణు లందరును ఈ విధముగ దశరథుని ఉత్సాహమును వృద్ధిపొందించి, అనుజ్ఞ తీసికొని, తిరిగి వెళ్లిరి. 20

మూ. విసర్జయిత్వా తాన్ విప్రాన్ సచివానిదమబ్రవీత్,
ఋత్విగ్భిరుపదిష్టోఽయం యథావత్క్రతురాప్యతామ్. 21

ప్ర. అ. (దశరథుడు), తాన్ విప్రాన్ = ఆ బ్రాహ్మణులను, విసర్జయిత్వా = పంపివేసి, సచివాన్ = మంత్రులనుగూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఋత్విగ్భిః = ఋత్విక్కులచేత, ఉపదిష్టః = ఉపదేశించబడిన, అయమ్ = ఈ, క్రతుః = యాగము, యథావత్ = యథాశాస్త్రముగ, ఆప్యతామ్ = పొందబడుగాక.

తా. దశరథుడు ఆ బ్రాహ్మణులు వెడలిపోయిన తరువాత, మంత్రులతో, "ఋత్విక్కులు చెప్పిన ఈ యాగము యథాశాస్త్రముగ జరుగునట్లు చూడుడు" అని పలికెను. 21

మూ. ఇత్యుక్త్వా నృపశార్దూలః సచివాన్ సముపస్థితాన్,
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. 22

ప్ర. అ. మహాద్యుతిః = గొప్ప కాంతి గల, నృపశార్దూలః = ఆ రాజశ్రేష్ఠుడు, సముపస్థితాన్=దగ్గర ఉన్న, సచివాన్=మంత్రులను గూర్చి, ఇతి= ఈ విధముగా, ఉక్త్వా = పలికి, విసర్జయిత్వా = వారినందరిని పంపివేసి, స్వమ్= తన సంబంధ మైన, వేశ్మ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. గొప్ప కాంతి గల ఆ రాజశ్రేష్ఠుడు సమీపమున నున్న సచివులను ఈ విధముగ ఆజ్ఞాపించి, వారిని పంపివేసి, ఇంటిలోనికి ప్రవేశించెను. 22

మూ. తతః స గత్వా తాః పత్నీర్నరేన్ద్రో హృదయప్రియాః,
ఉవాచ దీక్షాం విశత యక్ష్యేఽహం సుతకారణాత్. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః నరేన్ద్రః=ఆ నరేంద్రుడు, హృదయప్రియాః = తన హృదయమునకు ప్రియ లైన, తాః పత్నీః = ఆ భార్యలను, గత్వా = సమీపించి, అహమ్ = నేను, సుతకారణాత్=పుత్రులకొరకై, యక్ష్యే= యాగము చేయగలను, దీక్షామ్=దీక్షను, విశత = ప్రవేశించండి, అని, ఉవాచ= పలికెను.

తా. దశరథుడు తన మనస్సునకు చాల ఇష్టలైన పత్నుల దగ్గరకు వెళ్లి, "నేను యాగము చేయనున్నాను; అందుచే మీరు కూడ దీక్ష వహింపుడు" అని పలికెను.

వి. భర్తతో కలిసి యజ్ఞయాగాదులు చేయు అర్హత గల భార్య "పత్ని". 23

మూ. తాసాం తేనాతికాన్తేన వచనేన సువర్చసామ్,
ముఖపద్మాన్యశోభన్త పద్మనీవ హిమాత్యయే. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర. అ. అతికాన్తేన = మిక్కిలి మనోహర మైన, తేన వచనేన = ఆ వాక్కు చేత, సువర్చసామ్ = మంచికాంతిగల, తాసామ్ = ఆ దశరథపత్నులయొక్క, ముఖపద్మాని = ముఖపద్మములు, హిమాత్యయే = హేమంతఋతువుయొక్క అంతమునందు, పద్మానీవ = పద్మములు వలె, అశోభన్త = ప్రకాశించినవి.

తా. అతి మనోహర మైన ఆ మాట వినగానే మంచి తేజస్సు గల ఆ దశరథపత్నుల ముఖపద్మములు, మంచు తొలగినపుడు పద్మములు ప్రకాశించి నట్లు ప్రకాశించినవి. 24

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలోని అష్టమసర్గ సమాప్తము.

# అథ నవమః సర్గః

మూ. ఏతచ్ఛ్రుత్వా రహః సూతో రాజానమిదమబ్రవీత్,
ఋత్విగ్భిరుపదిష్టోఽయం పురా వృత్తో మయా శ్రుతః. 1

ప్ర. అ. ఏతత్ = ఈ విషయమును, శ్రుత్వా=విని, సూతః=సారథియైన సుమంత్రుడు, రాజానమ్ = రాజును గూర్చి, రహః = రహస్యమునందు, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఋత్విగ్భిః = ఋత్విక్కులచేత, ఉపదిష్టః = ఉపదేశింపబడిన, అయమ్ = ఈ ఉపాయము, పురా = పూర్వము, వృత్తః=జరిగినది, అనగా చర్చింపబడినది. మయా=నాచేత, శ్రుతః=వినబడినది.

తా. ఈ విషయమును విన్న సుమంత్రుడు రహస్యముగ దశరథునితో ఇట్లు పలికెను. ఋత్విక్కులు చెప్పిన ఈ ఉపాయము పూర్వము చర్చింపబడగా నేను వింటిని. 1

మూ. సనత్కుమారో భగవాన్ పూర్వం కథితవాన్ కథామ్,
ఋషీణాం సన్నిధౌ రాజన్ తవ పుత్రాగమం ప్రతి. 2

ప్ర. అ. రాజన్ = రాజా! భగవాన్ = మాహాత్మ్యము గల, సనత్కుమారః = సనత్కుమారుడు, తవ = నీ యొక్క, పుత్రాగమం ప్రతి = పుత్రప్రాప్తిని గూర్చి, కథామ్ = కథను, ఋషీణామ్ = ఋషులయొక్క, సన్నిధౌ= సమీపమునందు, పూర్వమ్ = పూర్వమున, కథితవాన్ = చెప్పినాడు.

తా. ఓ రాజా! నీ పుత్రప్రాప్తిని గూర్చిన కథను, పూర్వ మొకప్పుడు, సనత్కుమారుడు ఋషులతో చెప్పినాడు. 2

మూ. కాశ్యపస్య తు పుత్రోఽస్తి విభణ్డక ఇతి శ్రుతః,
ఋష్యశృఙ్గ ఇతి ఖ్యాతస్తస్య పుత్రో భవిష్యతి. 3

ప్ర. అ. కాశ్యపస్య = కాశ్యపునకు, విభణ్డకః ఇతి = విభండకు డని, శ్రుతః = ప్రసిద్ధు డైన, పుత్రః = కుమారుడు, అస్తి=ఉన్నాడు, తస్య = అతనికి,

ఋష్యశృఙ్గః ఇతి = ఋష్య శృంగు డని, ఖ్యాతః = ప్రసిద్ధు డైన, పుత్రః = పుత్రుడు, భవిష్యతి = పుట్టగలడు.

తా. "కాశ్యపునకు విభండకు డను కుమారుడు కలడు. ఆతనికి ఋష్య శృంగు డను పుత్రుడు కలుగును. 3

మూ. స వనే నిత్యసంవృద్ధో మునిర్వనచరః సదా,
నాన్యం జానాతి విప్రేన్ద్రో నిత్యం పిత్రనువర్తనాత్. 4

ప్ర. అ. వనే = వనమునందు, నిత్యసంవృద్ధః = నిత్యము పెరిగిన వాడై, సదా = ఎల్లప్పుడును, వనచరః = వనమునందే సంచరించు, విప్రేన్ద్రః = బ్రాహ్మణశ్రేష్ఠుడైన, సః మునిః = ఆ ఋష్యశృంగముని, నిత్యమ్ = ఎల్లపుడును, పిత్రనువర్తనాత్ = తండ్రినే అనుసరించి ఉండుట వలన, అన్యమ్ = ఇతరుల నెవ్వరిని, న జానాతి = ఎరుగడు.

తా. వనములోనే పెరిగి, నిత్యము వనములోనే సంచరించుచు, సర్వదా తండ్రితోడనే ఉండు ఆ ఋశ్యశృంగుడు తండ్రిని తప్ప వేరే ఎవ్వరిని ఎరుగడు. 4

మూ. ద్వైవిధ్యం బ్రహ్మచర్యస్య భవిష్యతి మహాత్మనః,
లోకేషు ప్రథితం రాజన్ విప్రైశ్చ కథితం సదా. 5

ప్ర. అ. రాజన్ = ఓ రాజా! మహాత్మనః = మహాత్ము డైన ఆ ఋశ్య శృంగునకు, లోకేషు = లోకములయందు, ప్రథితమ్ = ప్రసిద్ధ మైనదియు, సదా = ఎల్లప్పుడును, విప్రైః = బ్రాహ్మణులచేత, కథితమ్ = కొనియాడబడి నదియు అగు, బ్రహ్మచర్యస్య = బ్రహ్మచర్యముయొక్క, ద్వైవిధ్యమ్ = ద్వివిధత్వము, అనగా రెండువిధము లైన బ్రహ్మచర్యము, భవిష్యతి = కాగలదు, లేదా, బ్రహ్మచర్యమునకు, ద్వైవిధ్యమ్ = విఘాతము, రాగలదు.

తా. రాజా! ఆ ఋష్యశృంగుడు, లోకములలో ప్రసిద్ధ మైనదియు, బ్రాహ్మణులచే సర్వదా కొనియాడబడునదియు అగు, వ్రతిత్వము, ప్రాజాపత్యము అని రెండు విధము లైన బ్రహ్మచర్యమును అవలంబింపగలడు. లేదా ఆతని బ్రహ్మచర్యమునకు విఘాతము రాగలదు. 5

మూ. తస్యైవం వర్తమానస్య కాలః సమభివర్తత,
అగ్నిం శుశ్రూషమాణస్య పితరం చ యశస్వినమ్. 6

ప్ర. అ. అగ్నిమ్ = అగ్నిని, యశస్వినమ్ = యశఃశాలి యగు, పితరం చ = తండ్రిని, శుశ్రూషమాణస్య = సేవించుచున్న, ఏవమ్ = ఈ విధముగ, వర్తమానస్య = ఉంటూన్న, తస్య = ఆతనికి, కాలః = కాలము, సమభివర్తత = గడవగలదు.

తా. అగ్నిని, యశఃశాలి యైన తన తండ్రిని సేవించుచు అతడు బ్రతిత్వమను బ్రహ్మచర్యమున కొంత కాలము గడుపగలడు. 6

మూ. ఏతస్మిన్నేవ కాలే తు రోమపాదః ప్రతాపవాన్,
అఙ్గేషు ప్రథితో రాజా భవిష్యతి మహాబలః. 7

ప్ర. అ. ఏతస్మిన్నేవ కాలే = ఈ కాలమునందే, అఙ్గేషు = అంగదేశమునందు, ప్రతాపవాన్ = ప్రతాపము కలవాడును, మహాబలః = గొప్ప బలము కలవాడును అగు, ప్రథితః = ప్రసిద్ధుడైన, రోమపాదః రాజా = రోమపాదు డనెడు రాజు, భవిష్యతి = ఉండగలడు.

తా. ఈ కాలమునందే, అంగదేశములో, ప్రతాపశాలియు, ప్రసిద్ధుడును, మహాబలుడును అగు రోమపాదు డను రాజు ఉండగలడు. 7

మూ. తస్య వ్యతిక్రమాద్రాజ్ఞో భవిష్యతి సుదారుణా,
అనావృష్టిః సుఘోరా వై సర్వభూతభయావహా. 8

ప్ర. అ. తస్య = ఆ, రాజ్ఞః = రాజుయొక్క, వ్యతిక్రమాత్ = ధర్మాతిక్రమము వలన, సుదారుణా = చాల దారుణ మైనదియు, సుఘోరా = చాల ఘోర మైనదియు, సర్వభూతభయావహా = సమస్త ప్రాణులకును భయమును కలిగించునదియు అగు, అనావృష్టిః = అనావృష్టి, భవిష్యతి = కాగలదు.

తా. ఆ రాజు ధర్మాతిక్రమము చేయుటచే ఆతని రాజ్యములో సర్వ ప్రాణులకును భయంకర మైన తీవ్ర మైన అనావృష్టి కలుగును. 8

మూ. అనావృష్ట్యాం తు వృత్తాయాం రాజా దుఃఖసమన్వితః,
బ్రాహ్మణాన్ శ్రుతవృద్ధాంశ్చ సమానీయ ప్రవక్ష్యతి. 9

ప్ర. అ. అనావృష్ట్యామ్ = అనావృష్టి, వృత్తాయామ్ = ఏర్పడిన దగుచుండగా, రాజా = రాజు, దుఃఖసమన్వితః = దుఃఖముతో కూడినవాడై, శ్రుతవృద్ధాన్ = శాస్త్రాభ్యాసము చేత వృద్ధు లైన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, సమానీయ = పిలిపించి, ప్రవక్ష్యతి = ఇట్లు పలుకును.

తా. అనావృష్టి కలిగినందులకు మిక్కిలి దుఃఖించుచు, ఆ రాజు, విద్యావృద్ధు లైన బ్రాహ్మణులను పిలిపించి ఇట్లు చెప్పును. 9

మూ. భవన్తః శ్రుతధర్మాణో లోకచారిత్రవేదినః,
సమాదిశన్తు నియమం ప్రాయశ్చిత్తం యథా భవేత్. 10

ప్ర. అ. భవన్తః = మీరందరును, శ్రుతధర్మాణః = వినబడిన ధర్మములు కలవారు, లోకచారిత్రవేదినః = లోకముయొక్క చరిత్రను ఎరిగినవారు, యథా = ఏ విధముగ, ప్రాయశ్చిత్తమ్ = ప్రాయశ్చిత్తము, భవేత్ = అగునో, (ఆ విధముగ), నియమమ్ = నియమమును, సమాదిశత = ఉపదేశించండి.

తా. "మీరు సమస్తధర్మములు, లోకాచారములు తెలిసినవారు. ఈ అనావృష్టికి కారణ మైన పాపము తొలగిపోవుటకై ఏదైన నియమమును ఉపదేశింపుడు." 10

మూ. వక్ష్యన్తి తే మహీపాలం బ్రాహ్మణా వేదపారగాః,
విభణ్డకసుతం రాజన్ సర్వోపాయైరిహానయ. 11

ప్ర. అ. వేదపారగాః = సకల వేదముల అధ్యయనము చేసిన, తే బ్రాహ్మణాః = ఆ బ్రాహ్మణులు, మహీపాలమ్ = రాజును గూర్చి, వక్ష్యన్తి = ఇట్లు చెప్పగలరు, రాజన్ = ఓ రాజా! విభణ్డకసుతమ్ = విభండకుని కుమారుడైన ఋశ్యశృంగుని, సర్వోపాయైః = అన్ని ఉపాయములచేతను, ఇహ = ఇచటికి, ఆనయ = తీసికొని రమ్ము.

తా. వేదములలో ప్రవీణు లైన ఆ బ్రాహ్మణులు ఆ రాజుతో ఇట్లు చెప్ప

గలరు— "రాజా ! అన్ని ఉపాయములను ప్రయోగించి, ఋశ్యశృంగుని ఇచటకు రప్పింపుము." 11

మూ. ఆనాయ్య చ మహీపాల ఋశ్యశృఙ్గం సుసత్కృతమ్,
ప్రయచ్ఛ కన్యాం శాన్తాం వై విధినా సుసమాహితః. 12

ప్ర. అ. మహీపాల = ఓ రాజా !, సుసత్కృతమ్ = బాగుగా సత్కరింప బడిన, ఋశ్యశృఙ్గమ్=ఋశ్యశృంగుని, ఆనాయ్య=రప్పించి, సుసమాహితః= బాగుగా శ్రద్ధకలవాడవై, కన్యామ్=నీ కన్య యైన, శాన్తామ్=శాంతను, విధినా= యథాశాస్త్రముగా, ప్రయచ్ఛ = ఇమ్ము.

తా. ఓ రాజా ! ఋశ్యశృంగుని రప్పించి, ఆతనిని బాగుగా సత్కరించి, శ్రద్ధాయుక్తుడవై శాంతను ఆతని కిచ్చి, యథాశాస్త్రముగ వివాహము చేయుము. 12

మూ తేషాం తు వచనం శ్రుత్వా రాజా చిన్తాం ప్రపత్స్యతే,
కేనోపాయేన వై శక్య ఇహానేతుం స వీర్యవాన్. 13

ప్ర. అ. తేషామ్ = వారియొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, రాజా = రాజు, వీర్యవాన్ = ఇంద్రియనిగ్రహము గల, సః = ఆతడు, ఇహ = ఇచటకు, ఆనేతుమ్ = తీసికొని వచ్చుటకు, కేన ఉపాయేన = ఏ ఉపాయముచే, శక్యః = శక్య మైనవాడు, అని, చిన్తామ్ = చింతను, ప్రపత్స్యతే = పొందగలడు.

తా. వారి మాటలను విని, రాజు, "జితేంద్రియు డైన ఆ ఋశ్యశృంగుని తీసికొని వచ్చుటకు ఉపాయమేమి ?" అని ఆలోచింపగలడు. 13

మూ. తతో రాజా వినిశ్చిత్య సహ మన్త్రిభిరాత్మవాన్,
పురోహితమమాత్యాంశ్చ తతః ప్రేష్యతి సత్కృతాన్. 14

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఆత్మవాన్ = బుద్ధిశాలి యగు, రాజా= రాజు, మన్త్రిభిః సహ = మంత్రులతో కూడ కలిసి, వినిశ్చిత్య = నిశ్చయించి, తతః = అటు పిమ్మట, సత్కృతాన్ = సత్కరింపబడిన, పురోహితమ్ = పురోహితుని, అమాత్యాంశ్చ = మంత్రులను, ప్రేష్యతి = ప్రేరేపింపగలడు.

తా. అంత ధీమంతు డగు ఆ రాజు మంత్రులతో ఆలోచించి, నిశ్చయము చేసి, ఋశ్యశృంగుని తీసికొని వచ్చుటకై పురోహితుని, అమాత్యులను ప్రేరేపింప గలడు. 14

మూ. తే తు రాజ్ఞో వచః శ్రుత్వా వ్యథితా వినతాననాః,
న గచ్ఛేమ ఋషేర్భీతా అనునేష్యన్తి తం నృపమ్. 15

ప్ర. అ. తే=వారు, రాజ్ఞః=రాజుయొక్క, వచః = మాటను, శ్రుత్వా= విని, ఋషేః = విభాండకఋషి నుండి, భీతాః = భయపడినవారై, వ్యథితాః= బాధపడుచున్నవారై, వినతాననాః = వంచబడిన ముఖములు కలవారై, న గచ్ఛేమ = వెళ్లము, అని, తమ్ = ఆ, నృపమ్ = రాజును, అనునేష్యన్తి = ప్రతిమాలుకొనగలరు.

తా. వారు రాజు మాటలు విని, విభండకమునికి భయపడి, బాధతో తలలు వంచి, "మేము అచటికి వెళ్లజాలము" అని ఆ రాజును ప్రతిమాలెదరు. 15

మూ. వక్ష్యన్తి చిన్తయిత్వా తే తస్యోపాయాంశ్చ తత్క్షమాన్,
ఆనేష్యామో వయం విప్రం న చ దోషో భవిష్యతి. 16

ప్ర. అ. తే = వారు, చిన్తయిత్వా = ఆలోచించి, తత్క్షమాన్ = ఆతనిని తీసికొని వచ్చుటకు ఉపయోగించు, ఉపాయాన్ = ఉపాయములను, తస్య = ఆ రాజునకు, వక్ష్యన్తి = చెప్పగలరు, వయమ్ = మేము, విప్రమ్ = ఆ ఋశ్యశృంగుని, ఆనేష్యామః = తీసికొని వచ్చెదము. దోషః = దోష మేమియు, న భవిష్యతి చ = ఉండదు కూడ.

తా. పిమ్మట వారు ఆలోచించి, అందుకు తగిన ఉపాయములను కనుగొని "మేము దోష మేమియు కలుగకుండ ఆ ఋషిని తీసికొని వచ్చెదము" అని ఆ రాజుతో చెప్పెదరు. 16

మూ. ఏవమఙ్గాధిపేనైవ గణికాభిః ఋషేః సుతః,
ఆనీతోఽవర్షయద్దేవశ్శాన్తా చాస్మై ప్రదీయతే. 17

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, అఙ్గాధిపేన = అంగదేశరాజైన రోమపాదునిచేత, గణికాభిః = వేశ్యల సాహాయ్యముతో, ఋషేః సుతః = ఋషి

కుమారుడు, ఆనీతః = తీసికొని రాబడును, దేవః = దేవుడు, అవర్షయత్ = వర్షింపగలడు, అస్మై = ఋశ్యశృంగునకు, శాన్తా = శాంత, ప్రదీయతే చ = ఇవ్వబడును.

తా. రోమపాదుడు గణికల సాహాయ్యముతో ఋశ్యశృంగుని తీసికొని రాగలడు. వర్షములు కురియును. శాంతను ఆతని కిత్తురు. 17

మూ. ఋశ్యశృఙ్గస్తు జామాతా పుత్రాం స్తవ విధాస్యతి,
సనత్కుమారకథితమేతావద్వ్యాహృతం మయా. 18

ప్ర. అ. జామాతా = అల్లు డైన, ఋశ్యశృఙ్గస్తు = ఋశ్యశృంగుడు, తవ = నీకు, పుత్రాన్ = పుత్రులను, విధాస్యతి = కలుగు నట్లు చేయును. ఏతావత్ = ఇంత వరకును, సనత్కుమార కథితమ్ = సనత్కుమారునిచే చెప్పబడినది, మయా = నాచేత, వ్యాహృతమ్ = నీకు చెప్పబడినది.

తా. జామాత యైన ఋశ్యశృంగుడు నీకు పుత్రులు కలుగు విధానము చేయగలడు. ఈ విషయమును సనత్కుమారుడు చెప్పగా విని నేను నీకు చెప్పుచున్నాను. 18

మూ. అథ హృష్టో దశరథః సుమన్త్రం ప్రత్యభాషత,
యథర్శ్యశృఙ్గస్త్వానీతో విస్తరేణ త్వయోచ్యతామ్. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
నవమః సర్గః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, హృష్టః = సంతసించిన, దశరథః = దశరథుడు, సుమన్త్రం ప్రతి = సుమంత్రుని గూర్చి, అభాషత = పలికెను. ఋశ్యశృఙ్గః = ఋశ్యశృంగుడు, యథా = ఏ విధముగా, ఆనీతః = తీసికొని రాబడెనో, ఆ విషయమంతయు, త్వయా = నీచేత, విస్తరేణ = సవిస్తరముగ, ఉచ్యతామ్ = చెప్పబడుగాక.

తా. దశరథుడు సంతోషించి, ఆ ఋశ్యశృంగుని ఎట్లు తీసుకొని వచ్చిరో సవిస్తరముగ చెప్పు మని సుమంత్రునితో పలికెను. 19

(ఇచట సర్గసమాప్తి యుక్తముగ లేదు. ఇది లేఖకుల దోషమై ఉండును అని గోవిందరాజుల అభిప్రాయము).

"బాలానన్దిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
బాలకాండలో నవమసర్గ సమాప్తము.

## అథ దశమః సర్గః

మూ. సుమన్త్రశ్చోదితో రాజ్ఞా ప్రోవాచేదం వచ స్తదా,
యథర్శ్యశృఙ్గస్త్వానీతః శృణు మే మన్త్రిభిః సహ. 1

ప్ర. అ. రాజ్ఞా = రాజుచేత, చోదితః = ప్రేరితు డైన, సుమన్త్రః = సుమంత్రుడు, తదా = అప్పుడు, ఇదమ్ = ఈ వాక్యమును, ప్రోవాచ = పలికెను, సః = ఆ, ఋశ్యశృఙ్గః = ఋశ్యశృంగుడు, మన్త్రిభిః=మంత్రులచేత, యథా= ఏ విధముగా, ఆనీతః = తీసికొని రాబడెనో, మే=నానుండి, శృణు = వినుము, ('హ' కు అర్థము లేదు).

తా. ఈ విధముగ దశరథుడు ప్రశ్నింపగా సుమంత్రుడు ఇట్లు పలికెను. మంత్రులు ఋశ్యశృంగుని ఎట్లు తీసికొని వచ్చిరో చెప్పెదను; వినుము. 1

మూ. రోమపాదమువాచేదం సహామాత్యః పురోహితః,
ఉపాయో నిరపాయోఽయమస్మాభిరభిచిన్తితః. 2

ప్ర. అ. సహామాత్యః=అమాత్యులతో కూడిన, పురోహితః=పురోహితుడు, రోమపాదమ్ = రోమపాదునిగూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను, అస్మాభిః = మాచేత, నిరపాయః = అపాయము లేని, అయమ్ = ఈ, ఉపాయః = ఉపాయము, అభిచిన్తితః = ఆలోచింపబడినది.

తా. అమాత్యులును పురోహితుడును, రోమపాదునితో ఇట్లు పలికిరి మేము అపాయము లేని ఒక ఉపాయము ఆలోచించినాము. 2

మూ. ఋశ్యశృఙ్గో వనచర స్తపఃస్వాధ్యాయసంయుతః,
అనభిజ్ఞః స నారీణాం విషయాణాం సుఖస్య చ. 3

ఋశ్యశృఙ్గః = ఋశ్యశృంగుడు, వనచరః = వనమునందే తిరుగుచున్న వాడై, తపః స్వాధ్యాయ సంయుతః = తపస్సుతోడను స్వాధ్యాయాధ్యయనము తోడను కూడినవాడు. సః = అతడు, నారీణామ్ = స్త్రీలకును (ను), విష

యాణామ్ = భోగములకును, సుఖస్య చ = సుఖమునకును, అనభిజ్ఞః = ఎరుగని వాడు.

తా. ఋశ్యశృంగుడు అడవులలోనే సంచరించుచు, తపః స్వాధ్యాయ నిరతుడై ఉన్నాడు. ఆతడు స్త్రీ సుఖమును గాని, ఇతర విషయ సుఖములను గాని అనుభవించి ఎరుగడు. 3

మూ. ఇన్ద్రియార్థైరభిమతైర్నరచిత్తప్రమాథిభిః,
పురమానాయయిష్యామః క్షిప్రం చాధ్యవసీయతామ్. 4

ప్ర. అ. నరచిత్త ప్రమాథిభిః = మానవుల చిత్తములను క్షోభపెట్టు, అభిమతైః = ఇష్ట మైన, ఇన్ద్రియార్థైః = ఇంద్రియములచే అనుభవించ దగు భోగములచేత, పురమ్=పట్టణమును గూర్చి, ఆనాయయిష్యామః=రప్పించెదము, క్షిప్రమ్ = శీఘ్రముగా, అధ్యవసీయతామ్ = నిర్ణయము చేయబడుగాక.

తా. మానవులకు అభిమతములును, వారి మనస్సులను క్షోభపెట్టునవియు అగు ఇంద్రియార్థములచే ఆతనిని లోభపెట్టి పట్టణమునకు తీసికొని వచ్చెదము. శీఘ్రముగ నిశ్చయింపుము. 4

మూ. గణికాస్తత్ర గచ్ఛన్తు రూపవత్యః స్వలఙ్కృతాః,
ప్రలోభ్య వివిధోపాయైరానేష్యన్తీహ సత్కృతాః. 5

ప్ర. అ. రూపవత్యః = సౌందర్యము కలవారును, స్వలఙ్కృతాః = బాగుగా అలంకరింపబడివారును అయిన, గణికాః = వేశ్యలు, సత్కృతాః = నీచే సత్కరింపబడినవారై, తత్ర =అచటకు, గచ్ఛన్తు=వెళ్లెదరుగాక, వివిధోపాయైః= అనేక విధము లైన ఉపాయములచేత, ప్రలోభ్య = లోభపెట్టి, ఇహ=ఇచటికి, ఆనేష్యన్తి = తీసికొనిరాగలరు.

తా. సౌందర్యవతు లైన, చక్కగ అలంకరించుకొనిన గణికలను సత్కరించి అచటికి పంపుము. వారు అనేకవిధము లైన ఉపాయములచే ఆతనిని లోభపెట్టి తీసికొనిరాగలరు. 5

మూ. శ్రుత్వా తథేతి రాజా చ ప్రత్యువాచ పురోహితమ్,
పురోహితో మన్త్రిణశ్చ తథా చక్రుశ్చ తే తదా. 6

ప్ర. అ. రాజా చ = రాజు, శ్రుత్వా = విని, తథా = అటులనే చేయుడు, ఇతి = అని, పురోహితమ్=పురోహితుని గూర్చి, ప్రత్యువాచ=పలికెను, తదా= అప్పుడు, పురోహితః = పురోహితుడును, తే = ఆ, మన్త్రిణశ్చ = మంత్రులును, తథా = అట్లు, చక్రుః = చేసిరి.

తా. రాజు ఆ మాటలు విని "అటులనే చేయుడు" అని అనుమతించగా పురోహితుడును, మంత్రులును ఆ విధముగ చేసిరి. 6

మూ. వారముఖ్యాశ్చ తచ్ఛ్రుత్వా వనం ప్రవివిశుర్మహత్.
ఆశ్రమస్యావిదూరేఽస్మిన్ యత్నం కుర్వన్తి దర్శనే, 7
ఋషిపుత్రస్య ధీరస్య నిత్యమాశ్రమవాసినః.

ప్ర. అ. తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా=విని, వారముఖ్యాః=సౌందర్య వతులైన వేశ్యలు, మహత్ = గొప్పదైన, వనమ్ = వనమును, ప్రవివిశుః = ప్రవేశించిరి, ఆశ్రమస్య = ఆశ్రమముయొక్క, అస్మిన్=ఈ, అవిదూరే=సమీప ప్రదేశమునందు, ధీరస్య = ఇంద్రియనిగ్రహముకలవాడుకు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ఆశ్రమవాసినః = ఆశ్రమమునందే నివసించువాడును అగు, ఋషి పుత్రస్య = ఋషికుమారునియొక్క, దర్శనే = దర్శనమునందు, యత్నమ్ = ప్రయత్నమును, కుర్వన్తి = చేయుచుండిరి.

తా. ఆ వాక్యమును విని, ఉత్తమ సౌందర్యవతులైన వేశ్యాస్త్రీలు ఆ అరణ్యమును ప్రవేశించి, ఆశ్రమమునకు సమీపమున నివాస మేర్పరచుకొని, ఎల్లప్పుడును ఆశ్రమమునందే నివసించు, ఇంద్రియనిగ్రహవంతుడైన ఆ ఋశ్యశృంగుని దర్శనమునకై ప్రయత్నము చేయుచుండిరి. 7

మూ. పితుః స నిత్యసన్తుష్టో నాతిచక్రామ చాశ్రమాత్,
న తేన జన్మప్రభృతి దృష్టపూర్వం తపస్వినా, 8
స్త్రీ వా పుమాన్వా యచ్చాన్యత్సర్వం నగరరాష్ట్రజమ్.

ప్ర. అ. నిత్యసంతుష్టః=నిత్యము సంతుష్టుడైన, సః=ఆ ఋశ్యశృంగుడు, పితుః = తండ్రియొక్క, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, నాతిచక్రామ = బైటకు వెళ్లలేదు, తపస్వినా=తపశ్శాలి యైన, తేన= ఆతనిచేత, జన్మప్రభృతి=పుట్టినది

మొదలు, స్త్రీ వా = స్త్రీకాని, పుమాన్వా = పురుషుడు కాని, నగరరాష్ట్రజమ్ = నగరములందును, ఇతరరాష్ట్రప్రదేశమునందును పుట్టిన, సర్వమ్ = సమస్తమైన, యత్ = ఏ, అన్యత్ = ఇతరవస్తువు గలదో అది గాని, న దృష్టపూర్వమ్ = పూర్వ మెన్నడును చూడబడలేదు.

తా. ఏ కోరికలును లేక నిత్యసంతుష్టుడుగా ఉన్న ఆ ఋశ్యశృంగుడు తన తండ్రి ఆశ్రమము దాటి ఎన్నడును బైటకు వెళ్లలేదు. పుట్టినది మొదలు ఆతడు, పురుషుని గాని, స్త్రీని గాని, నగరగ్రామాదులలోని ఏ ఇతర వస్తువును గాని చూచి ఉండలేదు. 8

మూ. తతః కదాచిత్తం దేశమాజగామ యదృచ్ఛయా,
విభణ్డకసుతస్తత్ర తాశ్చాపశ్యద్వరాఙ్గనాః. 9

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కదాచిత్ = ఒక రోజున, విభణ్డకసుతః = ఋశ్యశృంగుడు, యదృచ్ఛయా = దైవవశముచేత, తం దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, ఆజగామ = వచ్చెను, తత్ర = అచట, తాః = ఆ, వరాఙ్గనాః = ఉత్తమవేశ్యాస్త్రీలను, అపశ్యత్ చ = చూచెను.

తా. ఒకనాడు ఋశ్యశృంగుడు దైవవశమున ఆ ప్రదేశమునకు వెళ్లి ఆ స్త్రీలను చూచెను. 9

మూ. తాశ్చిత్రవేషాః ప్రమదా గాయన్త్యో మధురస్వరాః,
ఋషిపుత్రముపాగమ్య సర్వా వచనమబ్రువన్. 10

ప్ర. అ. చిత్రవేషాః = చిత్ర మైన వేషము కలవారును, మధురస్వరాః = మధుర మైన కంఠస్వరము కలవారును, గాయన్త్యః = గానము చేయుచున్నవారును అగు, తాః = ఆ, ప్రమదాః = స్త్రీలు, సర్వాః = అందరును, ఋషిపుత్రమ్ = ఋషికుమారుని, ఉపాగమ్య = సమీపించి, అబ్రువన్ = పలికిరి.

తా. చిత్రవేషములు ధరించి మదముతో కూడిన ఆ స్త్రీలు మధురస్వరముతో గానము చేయుచుండిరి. ఋశ్యశృంగుని చూడగనే వారందరును ఆతనిని సమీపించి ఇట్లు పలికిరి. 10

మూ. కస్త్వం కిం వర్తసే బ్రహ్మన్ జ్ఞాతుమిచ్ఛామహే వయమ్,
ఏకస్త్వం విజనే ఘోరే వనే చరసి శంస నః. 11

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణుడా! త్వమ్ = నీవు, కః = ఎవ్వడవు? కిం వర్తసే = ఏ విధముగ ప్రవర్తించుచున్నావు? త్వమ్ = నీవు, ఏకః = ఒక్కడవే, విజనే = జనశూన్య మైన, ఘోరే = భయంకరమైన, వనే=వనమునందు, (కిం) చరసి = ఎందుకు సంచరించుచున్నావు. వయమ్ = మేము, జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము, నః = మాకు, శంస = చెప్పుము.

తా. ఓ బ్రాహ్మణుడా! నీ వెవ్వడవు! నీ జీవన విధాన మేమి? జనశూన్య మైన ఈ ఘోరవనములో ఏల సంచరించుచున్నావు? తెలిసికొనవలె నని కోరుచున్నాము, చెప్పుము. 11

మూ. అదృష్టరూపాస్తాస్తేన కామ్యరూపా వనే స్త్రియః,
హార్దాత్తస్య మతిర్జాతా వ్యాఖ్యాతుం పితరం స్వకమ్. 12

ప్ర. అ. కామ్యరూపాః = కోరదగిన రూపములు గల, తాః స్త్రియః = ఆ స్త్రీలు, తేన = ఆతనిచేత, వనే = వనమునందు, అదృష్టరూపాః = పూర్వ మెన్నడును చూడబడని రూపములు కలవారు. హార్దాత్ = ఆ కారణముచే కలిగిన స్నేహమువలన, తస్య = ఆతనికి, స్వకం పితరమ్ = తన తండ్రిని గూర్చి, వ్యాఖ్యాతుమ్ = చెప్పుటకు, మతిః = అభిప్రాయము, జాతా = కలిగినది.

తా. ఆ స్త్రీల సౌందర్యము చాల మనోహరముగ నుండెను. ఆత డట్టి సౌందర్యవతులను పూర్వ మెన్నడును ఆ వనములో చూడలేదు. అందుచే వారిపై స్నేహము కలిగి ఆతడు తన తండ్రిని గూర్చి చెప్పవలెనని నిశ్చయించుకొనెను. 12

మూ. పితా విభణ్డకోస్మాకం తస్యాహం సుత ఔరసః,
ఋశ్యశృఙ్గ ఇతి ఖ్యాతం నామ కర్మ చ మే భువి. 13

ప్ర. అ. విభణ్డకః = విభండకుడు, అస్మాకమ్ = మాయొక్క, పితా = తండ్రి, అహం=నేను, తస్య = ఆతనియొక్క, ఔరసః సుతః = ఔరసు డైన

కుమారుడను, మే = నాయొక్క, ఋశ్యశృఙ్గ ఇతి = ఋశ్యశృంగు డను, నామ=పేరు, కర్మ చ=పనియు, భువి=భూమియందు, ఖ్యాతమ్=ప్రసిద్ధ మైనది.

తా. నేను విభండకుని ఔరసపుత్రుడను. ఋష్యశృంగు డని నా పేరు, కర్మయు లోకమున ప్రసిద్ధములు.

వి. "నా కర్మ కూడ ప్రసిద్ధము" అనగా—ఋశ్యశృంగునకు ఆ పేరు తలపై ఒక కొమ్ము ఉండుటచే వచ్చినది గాన 'కర్మ' అనునది "అట్టి విశేషము" అను నర్థమున ప్రయోగింపబడినది. 14

మూ. ఇహాశ్రమపదోఽస్మాకం సమీపే శుభదర్శనాః,
కరిష్యే వోఽత్ర పూజాం వై సర్వేషాం విధిపూర్వకమ్. 15

ప్ర. అ. శుభదర్శనాః = మంగళప్రద మైన దర్శనము కలవారలారా! అస్మాకమ్ = మాయొక్క, ఆశ్రమపదః = ఆశ్రమము, ఇహ=ఇచట, సమీపే = సమీపముననే ఉన్నది, అత్ర = ఇచట, వః సర్వేషామ్ = మీ అందరియొక్క, పూజామ్ = పూజను, విధిపూర్వకమ్=యథాశాస్త్రముగా, కరిష్యే=చేయగలను.

తా. ఓ శుభదర్శనులారా! మా ఆశ్రమము, ఇచట సమీపముననే ఉన్నది. మీ అందరికిని మా ఆశ్రమములో, యథాశాస్త్రముగ అతిథిసత్కారము చేసెదను.

వి. స్త్రీలతో మాటలాడు నపుడు "సర్వేషామ్" అని పుంలింగప్రయోగ మును చేయుటచే ఋశ్యశృంగునకు స్త్రీపుంభేదము తెలియ దని సూచిత మగు చున్నది. 15

మూ. ఋషిపుత్రవచః శ్రుత్వా సర్వాసాం మతిరాస వై,
తదాశ్రమపదం ద్రష్టుం జగ్ముస్సర్వాశ్చ తేన తాః. 16

ప్ర. అ. ఋషిపుత్రవచః = ఋషికుమారుని వాక్యమును, శ్రుత్వా=విని, సర్వాసామ్ = ఆ వేశ్యాస్త్రీల కందరికిని, తత్ ఆశ్రమపదమ్ = ఆ ఆశ్రమమును, ద్రష్టుమ్ = చూచుటకు, మతిః = కోరిక, ఆస వై = కలిగినది. సర్వాః=వారంద రును, తేన = వానితో కూడ, జగ్ముః చ = వెళ్లిరి కూడ.

తా. ఋశ్యశృంగుని మాట విన్న పిదప ఆ వేశ్యలకు ఆ ఆశ్రమమును చూడ వలె నను కోరిక కలిగినది. వారందరును ఆతనితో కలిసి వెళ్లిరి. 16

మూ. ఆగతానాం తతః పూజామృషిపుత్రశ్చకార హ,
ఇదమర్ఘ్యమిదం పాద్యమిదం మూలం ఫలం చ నః. 17

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఋషిపుత్రః = ఋషికుమారుడు, ఇదమ్ = ఇది, నః = మాయొక్క (మేము సమర్పించు) అర్ఘ్యమ్ = అర్ఘ్యము, ఇదమ్ = ఇది, పాద్యమ్ = పాద్యము, ఇదమ్ = ఇది, మూలమ్ = మూలము, ఫలం చ = ఫలము, అని చెప్పుచు, ఆగతానామ్ = ఆశ్రమమునకు వచ్చిన ఆ స్త్రీల యొక్క, పూజామ్ = పూజను, చకార హ = చేసెను.

తా. పిదప ఆ ఋశ్యశృంగుడు "ఇది మేము సమర్పించు అర్ఘ్యము, ఇది పాద్యము, ఇవి కందమూలఫలములు" అని పలుకుచు వారి పూజ చేసెను. 17

మూ. ప్రతిగృహ్య చ తాం పూజాం సర్వా ఏవ సముత్సుకాః,
ఋషేర్భీతాశ్చ శీఘ్రం తా గమనాయ మతిం దధుః. 18

ప్ర. అ. తాః సర్వాః = ఆ వేశ్యలందరును, సముత్సుకాః = ఉత్సాహము కలవారై, తాం పూజామ్ = ఆ పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, ఋషేః = విభండకమహర్షివలన, భీతాః = భయపడినవారై, శీఘ్రమ్ = శీఘ్రముగా, గమనాయ = తిరిగి వెళ్లుటకు, మతిమ్ = బుద్ధిని, దధుః = ధరించిరి (నిశ్చయించిరి).

తా. ఆ వేశ్యలు ఉత్సాహముతో ఆ పూజ నందికొని, విభండక మహర్షి ఎక్కడ వచ్చునో అని భయపడుచు, శీఘ్రముగ మరలి పోవలె నని నిశ్చయించిరి. 18

మూ. అస్మాకమపి ముఖ్యాని ఫలానీమాని వై ద్విజ,
గృహాణ ప్రతి భద్రం తే ప్రభక్షయస్వ చ మా చిరమ్. 19

ప్ర. అ. ద్విజ = ఓ బ్రాహ్మణుడా! అస్మాకమ్ = మాయొక్క, ముఖ్యాని = ప్రధానమైన, ఇమాని ఫలాన్యపి = ఈ ఫలములను కూడ, ప్రతి

గృహాణ = తీసికొనుము, తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక, భక్షయస్వ = భక్షించుము, చిరమ్ = ఆలస్యము, మా = చేయవద్దు.

తా. ఓ బ్రాహ్మణా! ఇవి మేము భుజించు ఫలములలో శ్రేష్ఠ మైనవి. తీసికొనుము. నీకు క్షేమ మగును. శీఘ్రముగ భక్షించుము. 19

మూ. తతస్తాస్తం సమాలిఙ్గ్య సర్వా హర్షసమన్వితాః,
మోదకాన్ ప్రదదు స్తస్మై భక్ష్యాంశ్చ వివిధాన్ బహూన్. 20

ప్ర. అ. తతః = పిమ్మట, తాః సర్వాః = వారందరును, తమ్ = వానిని, సమాలిఙ్గ్య = కౌగలించుకొని, హర్షసమన్వితాః = ఆనందముతో కూడినవారై, తస్మై = అతనికి, బహూన్ = అనేక మైన, మోదకాన్ = మధుర పదార్థములను, వివిధాన్ = అనేక విధము లైన, భక్ష్యాంశ్చ = ఇతర భక్ష్యములను, ప్రదదుః = ఇచ్చిరి.

తా. అంతట ఆ వేశ్యలందరును ఋశ్యశృంగుని ఆనందముతో కౌగలించుకొని, అతనికి అనేక మైన మధురపదార్థములను, ఇతరము లైన వివిధభక్ష్యములను ఇచ్చిరి. 20

మూ. తాని చాస్వాద్య తేజస్వీ ఫలానీతి స్మ మన్యతే,
అనాస్వాదితపూర్వాణి వనే నిత్యనివాసినామ్. 21

ప్ర. అ. తేజస్వీ = బ్రహ్మతేజము గల ఆ ఋశ్యశృంగుడు, వనే = వనమునందు, నిత్యనివాసినామ్ = నిత్యము నివసించువారికి (చే), అనాస్వాదితపూర్వాణి = పూర్వ మెన్నడును రుచిచూడబడని, తాని = వాటిని, ఆస్వాద్య = తిని, ఫలాని ఇతి = ఫలములే అని, మన్యతే స్మ = తలచెను.

తా. బ్రహ్మతేజముతో ఒప్పు ఆ ఋశ్యశృంగుడు, సర్వదా వనమునందే నివసించువారు పూర్వ మెన్నడును రుచి చూచి ఎరుగని వాటిని తిని, అవి ఫలములే అని అనుకొనెను. 21

మూ. ఆపృచ్ఛ్య చ తదా విప్రం వ్రతచర్యాం నివేద్య చ,
గచ్ఛన్తి స్మాపదేశాత్తా భీతా స్తస్య పితు స్స్త్రియః. 22

ప్ర. అ. తదా = అప్పుడు, తాః స్త్రియః = ఆ స్త్రీలు, విప్రమ్ = ఋశ్యశృంగుని, ఆపృచ్ఛ్య = అడిగి, వ్రతచర్యామ్ = నిత్యకర్మానుష్ఠానమును, నివేద్య = తెలిపి, తస్య = ఆతని, పితుః = తండ్రివలన, భీతాః = భయపడిన వారై, అపదేశాత్ = కర్మానుష్ఠాన మనే వంకతో, గచ్ఛన్తి స్మ = వెళ్లిపోయిరి.

తా. ఆతని తండ్రి వచ్చి ఏమి శపించునో అని భయపడిన ఆ స్త్రీలు, ఆతనివద్ద సెలవు గైకొని, కర్మానుష్ఠానము చేసికొనవలె నను నెపముతో వెళ్లిపోయిరి. 22

మూ. గతాసు తాసు సర్వాసు కాశ్యపస్యాత్మజో ద్విజః,
అస్వస్థహృదయశ్చాసీ ద్దుఃఖాత్ స్మ పరివర్తతే. 23

ప్ర. అ. తాసు సర్వాసు = ఆ వేశ్య లందరును, గతాసు సతీషు = వెళ్లిపోయిన వారగుచుండగా, కాశ్యపస్య = కాశ్యపకుమారుడైన విభండకుని, ఆత్మజః = కుమారు డైన, ద్విజః = ఆ బ్రాహ్మణుడు, అస్వస్థహృదయః = అస్వస్థమైన మనస్సు కలవాడు, ఆసీత్ = ఆయెను. దుఃఖాత్ = దుఃఖమువలన, పరివర్తతే స్మ = తిరుగాడుచుండెను.

తా. వేశ్యలు వెళ్లిపోయిన పిదప, ఋశ్యశృంగుడు మనస్సునందు స్వాస్థ్యము చెడి, దుఃఖముతో తిరుగాడుచుండెను. 23

మూ. తతోఽపరేద్యుస్తం దేశమాజగామ స వీర్యవాన్,
మనోజ్ఞా యత్ర తా దృష్టా రూపవత్యస్స్వలఙ్కృతాః. 24

ప్ర. అ. తతః = పిమ్మట, వీర్యవాన్ = తపఃశక్తిగల, సః = ఆతడు, అపరేద్యుః = మరునాడు, మనోజ్ఞాః=మనస్సుకు ఇంపైనవారును, రూపవత్యః= సౌందర్యవతులును, స్వలఙ్కృతాః = చక్కగా అలంకరించుకొన్నవారును అగు, తాః = ఆ వేశ్యలు, యత్ర = ఎచట, దృష్టాః=చూడబడిరో, తం దేశమ్= ఆ ప్రదేశమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. తపశ్శాలి యగు ఆ ఋశ్యశృంగుడు మరునాడు బయలుదేరి, మనోహర రూపవతులును, సర్వాలంకారభూషితలును అగు ఆవేశ్యలను తాను పూర్వము చూచిన ప్రదేశమునకు వచ్చెను. 24

మూ. దృష్ట్వైవ తా స్తదా విప్రమాయా న్తం హృష్టమానసాః,
ఉపసృత్య తతః సర్వాస్తాస్తమూచురిదం వచః. 25

ప్ర. అ. తదా = అప్పుడు, తాః = ఆ స్త్రీలు, ఆయాన్తమ్ = వచ్చుచున్న, తమ్ = ఆ, విప్రమ్ = బ్రాహ్మణుని, దృష్ట్వా ఏవ=చూడగనే, హృష్టమానసాః= సంతోషించిన మనస్సు కలవారై రి, తాః సర్వాః=వారందరును, తతః = పిమ్మట, ఉపసృత్య=సమీపించి, తమ్ = ఆతనిని గూర్చి, ఇదం వచః = ఈ వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. ఆతడు తమ వద్దకు వచ్చుచున్నట్లు చూడగనే సంతసించి, ఆ వేశ్య లందరును ఆతని దగ్గరకు వెళ్లి ఇట్లు పలికిరి. 25

మూ. ఏహ్యాశ్రమపదం సౌమ్య హ్యాస్మాకమితి చాబ్రువన్,
తత్రాప్యేష విధిః శ్రీమాన్ విశేషేణ భవిష్యతి. 26

ప్ర. అ. హే సౌమ్య = ఓ సౌమ్యుడా! అస్మాకమ్ = మాయొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమమును గూర్చి, ఏహి=రమ్ము. తత్ర=అచట, శ్రీమాన్= శోభాయుక్త మైన, ఏషః విధిః = ఈ అతిథిసత్కారము, విశేషేణ = విశేష రూపమున, భవిష్యతి = జరుగగలదు, ఇతి చ = అనియు, అబ్రువన్ =పలికిరి.

తా. "ఓ సౌమ్యుడా! మా ఆశ్రమమునకు రమ్ము, అచట నీకు విశేష రూపమున చక్కని అతిథిసత్కారము చేయగలము" అని పలికిరి. 26

మూ. శ్రుత్వా తు వచనం తాసాం సర్వాసాం హృదయఙ్గమమ్,
గమనాయ మతిం చక్రే తం చ నిన్యు స్తదా స్త్రియః. 27

ప్ర. అ. తాసాం సర్వాసామ్ = వారందరియొక్క, హృదయఙ్గమమ్ = మనోహర మైన, వచనం=వాక్యమును, శ్రుత్వా = వినిః, గమనాయ=వెళ్లుటకు, మతిమ్ = బుద్ధిని, చక్రే = చేసెను. తదా = అప్పుడు, స్త్రియః = ఆ వేశ్యలు, తమ్ = ఆతనిని, నిన్యుః = తీసికొని వెళ్లిరి.

తా. వాళ్లు పలికిన మనోహర మైన మాటలు విని ఆతడు వారితో వెళ్లు టకు ఇచ్చగించెను. వారు ఆతనిని తీసికొని వెళ్లిరి. 27

మూ. తత్ర చానీయమానే తు విప్రే తస్మిన్ మహాత్మని,
వవర్ష సహసా దేవో జగత్ప్రహ్లాదయంస్తదా. 28

ప్ర. అ. మహాత్మని = మహాత్ముడైన, తస్మిన్ = ఆ, విప్రే = బ్రాహ్మణుడు, ఆనీయమానే = తీసికొని రాబడుచుండగా, తదా = అప్పుడు, దేవః = వర్షాధిష్ఠాన దేవత యైన పర్జన్యుడు, జగత్ = జగత్తును, ప్రహ్లాదయన్ = సంతోషింపచేయుచు, సహసా = వెంటనే, తత్ర = ఆ అంగదేశమునందు, వవర్ష = వర్షించెను.

తా. మహాత్ముడైన ఆ ఋశ్యశృంగుడు అంగదేశములో ప్రవేశించెనో లేదో, వెంటనే, పర్జన్యుడు, జగత్తుకు ఆహ్లాదము కలుగునట్లు వర్షించెను. 28

మూ. వర్షేణైవాగతం విప్రం విషయం స్వం నరాధిపః,
ప్రత్యుద్గమ్య మునిం ప్రహ్వః శిరసా చ మహీం గతః. 29

ప్ర. అ. నరాధిపః = రాజు, వర్షేణైవ = వర్షముతో కూడ, స్వమ్ = తన, విషయం = దేశమును, ఆగతమ్ = చేరిన, మునిమ్ = ముని యైన, విప్రమ్ = బ్రాహ్మణుని, ప్రత్యుద్గమ్య = ఎదురు వెళ్లి, ప్రహ్వః=వంగినవాడై; శిరసా = శిరస్సుతో, మహీమ్ = భూమిని, గతః = పొందెను.

తా. తన వెంట వర్షమును కూడ తీసికొని వచ్చిన ఆ ఋశ్యశృంగునికి ఎదురేగి, నమ్రుడై, రోమపాదుడు సాష్టాంగప్రణామ మాచరించెను. 29

మూ. అర్ఘ్యం చ ప్రదదౌ తస్మై న్యాయతః సుసమాహితః,
వవ్రే ప్రసాదం విప్రేన్ద్రాన్మా విప్రం మన్యురావిశత్. 30

ప్ర. అ. సుసమాహితః = ఏకాగ్రచిత్తుడై, తస్మై = ఆతనికి, అర్ఘ్యం చ = అర్ఘ్యమును, న్యాయతః = శాస్త్రప్రకారము, ప్రదదౌ = ఇచ్చెను, విప్రేన్ద్రాత్ = ఆ ఋశ్యశృంగుని వలన, ప్రసాదమ్ = అనుగ్రహమును, వవ్రే = కోరెను, విప్రమ్ = ఆ ఋశ్యశృంగుని, మన్యుః = కోపము, మా ఆవిశత్ = ప్రవేశించలేదు, లేదా విప్రమ్=విభండకమహర్షిని, మన్యుఃకో=పము, మావిశత్ = ప్రవేశించకుండుగాక, అని, విప్రేన్ద్రమ్ = ఋశ్యశృంగుని, ప్రసాదమ్ = అనుగ్రహమును, వవ్రే = కోరెను.

తా. రోమపాదుడు శ్రద్ధాపూర్వకముగ ఆతనిని అర్ఘ్యపాద్యాదులతో సత్కరించెను. ఆతని అనుగ్రహమును కోరెను. ఋశ్యశృంగునకు కోప మేమియు కలుగలేదు. లేదా నిన్ను ఇచటికి తీసికొని వచ్చినందులకు నీ తండ్రికి కోపము రాకుండు నట్లు అనుగ్రహింపు మని వేడెను. 30

మూ. అన్తఃపురం ప్రవిశ్యాస్మై కన్యాం దత్వా యథావిధి,
శాన్తాం శా న్తేన మనసా రాజా హర్షమవాప సః. 31

ప్ర. అ. సఃరాజా = ఆ రాజు, అన్తఃపురమ్=అంతపురమును, ప్రవిశ్య= ప్రవేశించి, లేదా పురములోనికి ప్రవేశించి, కన్యామ్ = కన్యయైన, శాన్తామ్ = శాంతను, అస్మై = ఈతనికి, యథావిధి = యథాశాస్త్రముగ, దత్వా = ఇచ్చి, శాన్తేన = శాంత మైన, మనసా=మనస్సుతో, హర్షమ్=ఆనందమును, అవాప= పొందెను.

తా. ఆ రాజు ఋశ్యశృంగునితో పురములో ప్రవేశించి, ఆతనికి శాంత నిచ్చి యథావిధిగ వివాహము చేసి, మనస్సు కుదుటపడి ఆనందించెను. 31

మూ. ఏవం స న్యవసత్తత్ర సర్వకామైః సుపూజితః.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే బాలకాణ్డే
దశమః సర్గః.

ప్ర. అ. సః = ఋశ్యశృంగుడు, ఏవమ్ = ఈ విధముగ, సర్వకామైః= సమస్త భోగములచే, సుపూజితః=బాగుగా పూజింపబడిన వాడై, తత్ర=అచటనే, న్యవసత్ = నివసించెను.

తా. ఈ విధముగ సమస్త భోగములును సమకూర్చి పూజింపబడిన ఋశ్యశృంగుడు ఆ అంగరాజ్యమునందే నివసించెను.

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలోని దశమ సర్గ సమాప్తము.

## అథ ఏకాదశః సర్గః

మూ. భూయ ఏవ హి రాజేన్ద్ర శ్రుణు మే వచనం హితమ్,
యథా స దేవప్రవరః కథాయామేవమబ్రవీత్. 1

ప్ర. అ. రాజేన్ద్ర=ఓ మహారాజా! సః=ఆ, దేవప్రవరః = దేవతలలో శ్రేష్ఠు డైన సనత్కుమారుడు, యథా = ఏ విధముగా, కథాయామ్=కథయందు, అబ్రవీత్ = చెప్పెనో, ఏవమ్ = ఈ విధముగ, మే = నాయొక్క, హితమ్ = హిత మైన, వచనమ్ = వచనమును, భూయః ఏవ=మరల, శ్రుణు=వినుము.

తా. మహారాజా! సనత్కుమారుడు కథలో ఇంక ఏమని చెప్పినాడో చెప్పెదను. హితకర మగు ఆ విషయమును వినుము. 1

మూ. ఇక్ష్వాకూణాం కులే జాతో భవిష్యతి సుధార్మికః,
నామ్నా దశరథో నామ శ్రీమాన్ సత్యప్రతిశ్రవః. 2

ప్ర. అ. శ్రీమాన్ = కాంతి కలవాడును, సత్యప్రతిశ్రవః = సత్య మైన ప్రతిజ్ఞ కలవాడును, నామ్నా = పేరుచేత, దశరథో నామ = దశరథు డను ప్రసిద్ధి కలవాడును, సుధార్మికః=గొప్ప ధార్మికుడును అయిన రాజు, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజుల, కులే = కులమునందు, జాతః భవిష్యతి=పుట్టగలడు.

తా. శ్రీమంతుడును, సత్యప్రతిజ్ఞుడును, పరమధార్మికు డును అగు దశరథు డను పేరు గల రాజు ఇక్ష్వాకువంశములో పుట్టగలడు. 2

మూ. అఙ్గరాజేన సఖ్యం చ తస్య రాజ్ఞో భవిష్యతి,
కన్యా చాస్య మహాభాగా శాన్తా నామ భవిష్యతి. 3

ప్ర. అ. తస్య రాజ్ఞః = ఆ రాజునకు, అఙ్గరాజేన=అంగరాజుతో, సఖ్యం చ = స్నేహముకూడ, భవిష్యతి = కాగలదు. అస్య = ఈ అంగరాజుయొక్క, మహాభాగా=పూజ్య మైన భాగ్యముగల, శాన్తా నామ=శాంత యనెడు, కన్యా= కుమార్తె, భవిష్యతి = పుట్టగలదు.

ఆ దశరథునకు అంగరాజుతో స్నేహ మేర్పడును. ఆ అంగరాజునకు శాంత యనెడు మహాభాగ్యవతి యగు కుమార్తె పుట్టగలదు. 3

మూ. పుత్రస్తు సోఽఙ్గరాజస్య రోమపాద ఇతి శ్రుతః,
తం స రాజా దశరథో గమిష్యతి మహాయశాః. 4

ప్ర. అ. సః = ఆ, అఙ్గరాజస్య పుత్రస్తు = అంగరాజు పుత్రు డైతే, రోమపాద ఇతి=రోమపాదు డని, శ్రుతః=ప్రసిద్ధుడు (కాగలడు). మహాయశాః= గొప్ప కీర్తి గల, సః = ఆ, దశరథః రాజా = దశరథమహారాజు, తమ్ = ఆ రోమపాదుని గూర్చి, గమిష్యతి = వెళ్లగలడు.

తా. ఆ అంగరాజకుమారుని పేరు రోమపాదుడు. గొప్ప కీర్తి గల ఆ దశరథమహారాజు ఆతనివద్దకు వెళ్లగలడు.

వి. పై శ్లోకములో అంగరా జనగా రోమపాదుడు. ఈ శ్లోకములో అంగరా జనగా రోమపాదుని తండ్రి. 4

మూ. అనపత్యోఽస్మి ధర్మాత్మన్ శాన్తాభర్తా మమ క్రతుమ్,
ఆహరేత త్వయాజ్ఞప్తస్సన్తానార్థం కులస్య చ. 5

ప్ర. అ. ధర్మాత్మన్ = ఓ ధర్మాత్ముడా ! అనపత్యః = సంతానములేని వాడనై, అస్మి = ఉన్నాను. శాన్తాభర్తా = శాంతయొక్క భర్త, త్వయా = నీచేత, ఆజ్ఞప్తః = ఆజ్ఞాపింపబడినవాడై, మమ = నాయొక్క, కులస్య=కులము యొక్క, సంతానార్థమ్ = అవిచ్ఛిన్నత్వమునకై, క్రతుమ్ = యజ్ఞమును, ఆహరేత = నిర్వహించుగాక,

తా. "ఓ ధర్మాత్ముడా ! నాకు పుత్రులు కలుగలేదు, అందుచేత ఋష్యశృంగుని నీవు పంపి, నాకు పుత్రులు కలుగుట ద్వారా నా వంశము అవిచ్ఛిన్నముగ ఉండుటకై క్రతువును చేయుటలో సాహాయ్యము చేయుము. 5

మూ. శ్రుత్వా రాజ్ఞోఽథ తద్వాక్యం మనసా స విచిన్త్య చ,
ప్రదాస్యతే పుత్రవన్తం శాన్తాభర్తారమాత్మవాన్. 6

ప్ర. అ. ఆత్మవాన్=బుద్ధిశాలి యగు ఆ రోమపాదుడు, రాజ్ఞః=ఆ రాజు యొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, అథ=అటుపిమ్మట,

మనసా = మనస్సుతో, సంవిచిన్త్య చ=ఆలోచించి, పుత్రవన్తమ్=పుత్రులు గల, శాన్తాభర్తారమ్ = శాంతయొక్క భర్తను, ప్రదాస్యతే = ఇవ్వగలడు.

తా. రోమపాదుడు దశరథుని మాటలు విని, బాగుగా ఆలోచించి, పుత్రులు గల — అనగా తపోమహిమచే ఇతరులకు పుత్రులను అనుగ్రహింపగల, ఋశ్యశృంగుని పంపగలడు. 6

మూ. ప్రతిగృహ్య చ తం విప్రం స రాజా విగతజ్వరః,
ఆహరిష్యతి తం యజ్ఞం ప్రహృష్టేనాన్తరాత్మనా. 7

ప్ర. అ. సః రాజా = ఆ దశరథమహారాజు, తమ్ = ఆ, విప్రమ్ = బ్రాహ్మణుని, ప్రతిగృహ్య చ=స్వీకరించి (తన వెంటబెట్టుకొని), విగతజ్వరః= తొలగిపోయిన మనోవ్యథ కలవాడై, ప్రహృష్టేన = సంతోషించిన, అన్త రాత్మనా = హృదయముతో, తం యజ్ఞమ్ = ఆ యజ్ఞమును, ఆహరిష్యతి = అనుష్ఠింపగలడు.

తా. దశరథుడు ఋశ్యశృంగుని తోడ్కొని వచ్చి, మనోవ్యథ శాంతింపగా, సంతోషించిన మనస్సుతో యజ్ఞము చేయగలడు. 7

మూ. తం చ రాజా దశరథో యష్టుకామః కృతాఞ్జలిః,
ఋశ్యశృఙ్గం ద్విజశ్రేష్ఠం వరయిష్యతి ధర్మవిత్. 8

యజ్ఞార్థం ప్రసవార్థం చ స్వర్గార్థం చ నరేశ్వరః,
లభతే చ స తం కామం ద్విజముఖ్యాద్విశాంపతిః. 9

ప్ర. అ. యష్టుకామః = యాగముచేయవలె నను కోరిక కలవాడును, ధర్మవిత్ = ధర్మముల నెరిగినవాడును, నరేశ్వరః = నరులకు ప్రభువును అయిన, దశరథః రాజా = దశరథమహారాజు, కృతాఞ్జలిః = కట్టబడినదోసిలి కలవాడై, ద్విజశ్రేష్ఠమ్=ద్విజులలో శ్రేష్ఠుడైన, ఋశ్యశృఙ్గమ్=ఋశ్యశృంగుని, యజ్ఞార్థమ్ = యజ్ఞముకొరకును, ప్రసవార్థం చ=సంతానముకొరకును, స్వర్గార్థం చ = స్వర్గముకొరకును, వరయిష్యతి = కోరగలడు; సః విశాంపతిః=ఆ రాజు, ద్విజముఖ్యాత్ = ఆ బ్రాహ్మణశ్రేష్ఠునివలన, తం కామమ్ = ఆ కోరికను, లభతే చ=పొందునుకూడ.

తా. ధర్మవేత్త యైన ఆ దశరథుడు, దోసిలి ఒగ్గి నాకు సంతానము, స్వర్గము కూడ కలుగు నట్లు యజ్ఞము చేయించు మని ఆ ఋశ్యశృంగుని ప్రార్థించ గలడు. ఆ బ్రాహ్మణోత్తమునివలన ఆ కోరికలను పొందగలడు. 9

మూ. పుత్రాశ్చాస్య భవిష్యన్తి చత్వారోఽమితవిక్రమాః,
వంశప్రతిష్ఠానకరా స్సర్వలోకేషు విశ్రుతాః. 10

ప్ర. అ. అస్య = ఈతనికి, అమితవిక్రమాః = అమిత మైన పరాక్రమము కలవారును, వంశప్రతిష్ఠానకరాః = వంశమునకు ప్రతిష్ఠ కలిగించువారును, సర్వలోకేషు = సమస్తలోకములందును, విశ్రుతాః = ప్రసిద్ధులును అగు, చత్వారః = నలుగురు, పుత్రాః = పుత్రులు, భవిష్యన్తి = పుట్టగలరు.

తా. ఆ దశరథునకు అమితపరాక్రమము కలవారును, వంశప్రతిష్ఠకు కారణ మైనవారును, సర్వలోకములందు ప్రసిద్ధులును అగు నలుగురు పుత్రులు జనింపగలరు. 10

మూ. ఏవం స దేవప్రవరః పూర్వం కథితవాన్ కథామ్,
సనత్కుమారో భగవాన్ పురా దేవయుగే ప్రభుః. 11

ప్ర. అ. దేవప్రవరః = దేవతలలో శ్రేష్ఠుడును, భగవాన్=మాహాత్మ్యము కలవాడును, ప్రభుః = సమర్థుడును అగు, సః = ఆ, సనత్కుమారః = సనత్కుమారుడు, పురా = పూర్వమునందు, దేవయుగే=కృతయుగమునందు, కథామ్= కథను, ఏవమ్ = ఈ విధముగా, కథితవాన్ = చెప్పినాడు.

తా. పూర్వము కృతయుగములో దేవతాశ్రేష్ఠు డైన సనత్కుమారుడు కథను ఈ విధముగా చెప్పెను. 11

మూ. స త్వం పురుషశార్దూల తమానయ సుసత్కృతమ్,
స్వయమేవ మహారాజ గత్వా సబలవాహనః. 12

ప్ర. అ. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడ వైన, మహారాజ = ఓ మహారాజా! సః త్వమ్ = అట్టి, నీవు, సబలవాహనః = సైన్యముతోడను వాహనములతోడను కూడినవాడవై, స్వయమేవ = స్వయముగానే, గత్వా = వెళ్లి, సుసత్కృతమ్ = బాగుగా సత్కరింపబడిన, తమ్ = ఆతనిని, ఆనయ = తీసికొనిరమ్ము.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ మహారాజా! నీవే స్వయముగ సైన్యవాహనాదులతో వెళ్లి ఆదరపూర్వకముగా ఋశ్యశృంగుని తీసికొని రమ్ము. 12

మూ. అనుమాన్య వసిష్ఠం చ సూతవాక్యం నిశమ్య చ,
సాన్తఃపురః సహామాత్యః ప్రయయౌ యత్ర స ద్విజః. 13

ప్ర. అ. సూతవాక్యమ్=సుమంత్రుని వాక్యమును, నిశమ్య=విని, వసిష్ఠం చ = వసిష్ఠుని కూడ, అనుమాన్య = అంగీకరింపచేసి, సాన్తఃపురః = అంతఃపురముతో కూడినవాడై, సహామాత్యః = అమాత్యులతో కూడినవాడై, సః ద్విజః= ఆ బ్రాహ్మణుడు, యత్ర = ఎచట నున్నాడో అచటికి, ప్రయయౌ = వెళ్లెను.

తా. దశరథుడు సుమంత్రుని మాటలు విని, వసిష్ఠుని అనుమతి కూడ గైకొని, అంతఃపురామాత్యాదులతో కలిసి ఆ ఋశ్యశృంగుడున్న దేశమునకు వెళెను. 13

మూ. వనాని సరితశ్చైవ వ్యతిక్రమ్య శనైః శనైః,
అభిచక్రామ తం దేశం యత్ర వై మునిపుఙ్గవః. 14

ప్ర. అ. శనైః శనైః=మెల్లమెల్లగా, వనాని=వనములను, సరితశ్చైవ= నదులను, వ్యతిక్రమ్య = దాటి, మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడు, యత్ర = ఎచట నుండెనో, తం దేశమ్ = ఆ దేశమును, అభిచక్రామ = ప్రవేశించెను.

తా. వనములను, నదులను, మెల్లమెల్లగ దాటుచు, ఆ ఋశ్యశృంగుడున్న దేశమును చేరెను. 14

మూ. ఆసాద్య తం ద్విజశ్రేష్ఠం రోమపాదసమీపగమ్,
ఋషిపుత్రం దదర్శాదౌ దీప్యమానమివానలమ్. 15

ప్ర. అ. ఆసాద్య = సమీపించి, రోమపాదసమీపగమ్ = రోమపాదుని సమీపమునం దున్నవాడును, దీప్యమానమ్ = ప్రజ్వలించుచున్న, అనలమివ = అగ్ని వలె నున్నవాడును, ద్విజశ్రేష్ఠమ్ = బ్రాహ్మణశ్రేష్ఠుడును అగు, తం ఋషిపుత్రమ్ = ఆ ఋషికుమారుని, ఆదౌ = ముందుగనే, దదర్శ = చూచెను.

తా. ఆ నగరము చేరగనే దశరథుడు, రోమపాదుని సమీపమున ఉన్న ద్విజశ్రేష్ఠుడైన ఋశ్యశృంగుని చూచెను, అతడు ప్రజ్వలించుచున్న అగ్ని వలె ప్రకాశించుచుండెను. 15

మూ. తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః,
సఖిత్వాత్తస్య వై రాజ్ఞః ప్రహృష్టేనాన్తరాత్మనా. 16

ప్ర. అ. తతః = పిమ్మట, రాజా = రోమపాదుడు, ప్రహృష్టేన = సంతసించిన, అన్తరాత్మనా = హృదయముతో, యథాన్యాయమ్=శాస్త్రానుసారముగ, సఖిత్వాత్ = స్నేహితు డగుటవలన, విశేషతః = అధికముగను, తస్య = ఆ, రాజ్ఞః = దశరథునియొక్క, పూజామ్ = పూజను, చక్రే = చేసెను.

తా. దశరథుని రాకచే సంతోషించిన రోమపాదుడు, యథాశాస్త్రముగను, మిత్రు డగుటచే విశేషముగను, దశరథునికి ఆదరసత్కారములు చేసెను. 16

మూ. రోమపాదేన చాఖ్యాతమృషిపుత్రాయ ధీమతే,
సఖ్యం సంబన్ధకం చైవ తదా తం ప్రత్యపూజయత్. 17

ప్ర. అ. రోమపాదేన = రోమపాదునిచేత, సఖ్యమ్ = స్నేహము, సంబన్ధకం చైవ= సంబంధము, ధీమతే = బుద్ధిమంతుడైన, ఋషిపుత్రాయ = ఋషికుమారునకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది. తదా = అప్పుడు, తమ్ = ఆ దశరథుని, ప్రత్యపూజయత్ = పూజించెను.

తా. రోమపాదుడు తనకు దశరథునితో ఉన్న స్నేహబాంధవ్యములను గూర్చి ఋశ్యశృంగునకు చెప్పగా ఆతడు దశరథుని పూజించెను. 17

మూ. ఏవం సుసత్కృతస్తేన సహోషిత్వా నరర్షభః,
సప్తాష్ట దివసాన్ రాజా రాజానమిదమబ్రవీత్. 18

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సత్కృతః = సత్కరింపబడిన, నరర్షభః = నరశ్రేష్ఠుడైన, రాజా = దశరథుడు, తేన సహ = ఆతనితో కూడ, సప్తాష్ట=ఏడెనిమిది, దివసాన్=దివసములపాటు, ఉషిత్వా=ఉండి, రాజానమ్= రోమపాదుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగ నరశ్రేష్ఠు డగు దశరథుడు రోమపాదుడు చేసిన సత్కారముల నందికొని, ఏడెనిమిది దివసములు ఆతని అతిథిగా ఉండి, ఆతనితో ఇట్లనెను. 19

మూ. శాన్తా తవ సుతా రాజన్ సహ భర్త్రా విశాంపతే,
మదీయనగరం యాతు కార్యం హి మహదుద్యతమ్. 19

ప్ర. అ. విశాంపతే = ప్రజలకు ప్రభువైన, రాజన్ = రాజా ! తవ సుతా = నీ కుమార్తె యైన, శాన్తా = శాంత, సహభర్త్రా = భర్తతో కూడ, మదీయ నగరమ్ = నా పట్టణమును గూర్చి, యాతు = వెళ్ళుగాక. మహత్ = గొప్ప, కార్యమ్ = పని, ఉద్యతమ్ = ప్రారంభింప నిశ్చయింపబడినది.

తా. ఓ రాజా ! నే నొక గొప్ప కార్యము తలపెట్టితిని. నీ కుమార్తె యైన శాంతను, భర్తతో కూడ, నా నగరమునకు పంపుము. 19

మూ. తథేతి రాజా సంశ్రుత్య గమనం తస్య ధీమతః,
ఉవాచ వచనం విప్రం గచ్ఛ త్వం సహ భార్యయా. 20

ప్ర. అ. రాజా = రోమపాదుడు, తథా ఇతి = అటులనే అని, ధీమతః = బుద్ధిశాలి యైన, తస్య = ఆ ఋశ్యశృంగుని యొక్క, గమనమ్ = గమనమును, సంశ్రుత్య = అంగీకరించి, త్వమ్ = నీవు, భార్యయా సహ = భార్యతో కలిసి, గచ్ఛ = వెళ్లుము, అని, విప్రమ్ = బ్రాహ్మణుని గూర్చి, వచనమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రోమపాదుడు, ధీమంతు డైన ఋశ్యశృంగుని అయోధ్యాగమనమునకు అంగీకరించి "నీవు భార్యతో అయోధ్యకు వెళ్లుము" అని ఋశ్యశృంగునితో పలికెను. 20

మూ. ఋషిపుత్రః ప్రతిశ్రుత్య తథేత్యాహ నృపం తదా,
స నృపేణాభ్యనుజ్ఞాతః ప్రయయౌ సహ భార్యయా. 21

ప్ర. అ. తదా = అప్పుడు, ఋషిపుత్రః = ఋషికుమారుడు, ప్రతిశ్రుత్య = అంగీకరించి, నృపమ్ = రాజును గూర్చి, తథా ఇతి = "అటులనే చేసెదను" అని,

ఆహ = పలికెను. నృపేణ = రాజుచేత, అభ్యనుజ్ఞాతః = ఇవ్వబడిన అనుజ్ఞ కలవాడై, భార్యయా సహ = భార్యతో కూడ, ప్రయయౌ = వెళ్లెను.

తా. ఋశ్యశృంగుడు అందులకు అంగీకరించి, అటులనే చేసెద నని పలికి, రోమపాదుని అనుజ్ఞ గైకొని భార్యాసమేతుడై వెళ్లెను. 21

మూ. తావన్యోన్యాఞ్జలిం కృత్వా స్నేహాత్సంశ్లిష్య చోరసా,
నన్దతుర్దశరథో రోమపాదశ్చ వీర్యవాన్. 22

ప్ర. అ. తౌ = ఆ, దశరథః = దశరథుడును, వీర్యవాన్ = పరాక్రమ శాలియగు, రోమపాదశ్చ = రోమపాదుడును, అన్యోన్యాఞ్జలిమ్ = పరస్పరము దోసిలిని, కృత్వా = చేసి, స్నేహాత్ = స్నేహమువలన, ఉరసా = వక్షస్థలముచే, సంశ్లిష్య = కౌగలించుకొని, నన్దతుః = సంతోషించిరి.

తా. దశరథరోమపాదు లిద్దరును ఒకరి కొకరు దోసిలి ఒగ్గి నమస్కారము చేసికొని, వక్షస్థలములు కలియు నట్లు కౌగలించుకొని, సంతోషించిరి. 22

మూ. తతః సుహృదమాపృచ్ఛ్య ప్రస్థితో రఘునన్దనః,
పౌరేభ్యః ప్రేషయామాస దూతాన్వై శీఘ్రగామినః. 23

ప్ర. అ. తతః = పిమ్మట, రఘునన్దనః = దశరథుడు, సుహృదమ్ = మిత్రుని, ఆపృచ్ఛ్య=వీడ్కొని, ప్రస్థితః=ప్రయాణమైనవాడై, శీఘ్రగామినః= శీఘ్రముగా వెళ్లగలిగిన, దూతాన్ = దూతలను, పౌరేభ్యః = పౌరులకు, ప్రేష యామాస = పంపెను.

తా. మిత్రునివద్ద సెలవు గైకొని బయలుదేరిన దశరథుడు, శీఘ్రముగా వెళ్లగలిగిన దూతలను అయోధ్యాపౌరులకు తమ రాక తెలుపుటకై పంపెను. 23

మూ. క్రియతాం నగరం సర్వం క్షిప్రమేవ స్వలఙ్కృతమ్,
ధూపితం సిక్తసంమృష్టం పతాకాభిరలఙ్కృతమ్. 24

ప్ర. అ. సర్వమ్ = సమస్తమైన, నగరమ్ = నగరము, క్షిప్రమేవ = శీఘ్రముగ, స్వలఙ్కృతమ్ = బాగుగా అలంకరింపబడినదిగాను, ధూపితమ్ =

ధూపము వేయబడినదిగాను, సిక్తసంమృష్టమ్ = తడిపి తుడవబడినదిగాను, పతాకాభిః = జండాలచేత, అలఙ్కృతమ్ = అలంకరింపబడినదిగాను, క్రియతామ్= చేయబడుగాక.

తా. దశరథుడు అయోధ్యాపౌరుల కీ విధముగ కబురు పంపెను. "నగరము నంతను వెంటనే చక్కగా అలంకరింపుడు. ధూపసుగంధములను వ్యాపింప చేయుడు. మార్గములు తుడిచి నీళ్ల చల్లుడు. పతాకలు ఎగురవేయుడు." 24

మూ. తతః ప్రహృష్టాః పౌరాస్తే శ్రుత్వా రాజానమాగతమ్,
తథా ప్రచక్రుస్తత్సర్వం రాజ్ఞా యత్ప్రేషితం యథా. 25

ప్ర. అ. తతః = పిమ్మట, తే పౌరాః = ఆ పౌరులు, రాజానమ్ = రాజును, ఆగతమ్ = వచ్చిన వానినిగా, శ్రుత్వా = విని, ప్రహృష్టాః = సంతసించినవారై, రాజ్ఞా = రాజుచేత, యత్ = ఏది, యథా = ఎట్లు, ప్రేషితమ్ = పంపబడెనో, తత్ = దానిని, సర్వమ్ = అంతను, తథా = అట్లు, ప్రచక్రుః = చేసిరి.

తా. రాజు వచ్చుచున్నట్లు వినిన పౌరులు చాల సంతసించి, ఆయన ఆజ్ఞాపించిన విధమున నగరాలంకారములు చేసిరి. 25

మూ. తతః స్వలంకృతం రాజా నగరం ప్రవివేశ హ,
శఙ్ఖదున్దుభినిర్ఘోషైః పురస్కృత్య ద్విజర్షభమ్. 26

ప్ర. అ. తతః = పిమ్మట, రాజా = దశరథుడు, ద్విజర్షభమ్ = ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, స్వలంకృతమ్ = బాగుగా అలంకరింపబడిన, తత్ = ఆ, నగరమ్ = నగరమును, శఙ్ఖదున్దుభినిర్ఘోషైః = శంఖదుందుభుల ధ్వనులతో, ప్రవివేశ హ = ప్రవేశించెను.

తా. దశరథుడు ఆ ఋశ్యశృంగుని ఎదుట ఉంచుకొని, చక్కగ అలంకరింపబడిన అయోధ్యానగరమును శంఖదుందుభిమంగళధ్వనులతో ప్రవేశించెను. 26

మూ. తతః ప్రముదితాః సర్వే దృష్ట్వా తం నాగరా ద్విజమ్,
ప్రవేశ్యమానం సత్కృత్య నరేన్ద్రేణేన్ద్రకర్మణా. 27

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వే = సమస్త మైన, నాగరాః = పౌరులు, ఇన్ద్రకర్మణా = ఇంద్రుని వంటి కర్మ గల, నరేన్ద్రేణ=రాజుచేత, సత్కృత్య= సత్కరించి, ప్రవేశ్యమానమ్ = ప్రవేశ పెట్టబడుచున్న, తమ్ = ఆ, ద్విజమ్ = బ్రాహ్మణుని, దృష్ట్వా = చూచి, ప్రముదితాః = సంతోషించిరి.

తా. దేవేంద్రునితో సమాను డైన ఆ నరేంద్రునిచే సత్కృతుడై అయోధ్యలో ప్రవేశించుచున్న ఋష్యశృంగుని చూచి పౌరు లెల్లరు సంతోషించిరి. 27

మూ. అన్తఃపురం ప్రవేశ్యైనం పూజాం కృత్వా చ శాస్త్రతః,
కృతకృత్యం తదాత్మానం మేనే తస్యోపవాహనాత్. 28

ప్ర. అ. ఏనమ్ = ఋశ్యశృంగుని, అన్తఃపురం ప్రవేశ్య = అంతఃపురములో ప్రవేశ పెట్టి, శాస్త్రతః = శాస్త్రానుసారముగా, పూజాం చ = పూజను, కృత్వా = చేసి, తదా = అప్పుడు, తస్య=అతనియొక్క (ని), ఉపవాహనాత్= తీసికొని వచ్చుటవలన, ఆత్మానమ్=తనను, కృతతకృత్యమ్=కృతకృత్యునిగా, మేనే = తలచెను.

తా. దశరథు డా ఋశ్యశృంగుని అంతఃపురములోనికి తీసికొని వెళ్లి, యథాశాస్త్రముగ పూజించెను. ఆతనిని తీసికొనివచ్చుటచే, తన కర్తవ్యము పూర్తి యైనట్లు సంతసించెను. 28

మూ. అన్తఃపురస్త్రియః సర్వాః శాన్తాం దృష్ట్వా తథాగతామ్,
సహ భర్త్రా విశాలాక్షీం ప్రీత్యానన్దముపాగమన్. 29

ప్ర. అ. అన్తఃపురస్త్రియః = అంతఃపురములోని స్త్రీలు, సర్వాః = అందరును, తథా = ఆ విధముగా, భర్త్రా సహ = భర్తతో కూడ, ఆగతామ్=వచ్చిన, విశాలాక్షీమ్ = విశాలము లైన నేత్రములు గల, శాన్తామ్ = శాంతను, దృష్ట్వా= చూచి, ప్రీత్యా = ప్రేమతో, ఆనన్దమ్ = ఆనందమును, ఉపాగమన్ = పొందిరి.

తా. భర్తతో కలిసి వచ్చిన, విశాలాక్షి యైన శాంతను చూచి, అంతఃపురస్త్రీ లందరును ప్రేమతో ఆనందభరిత లైరి. 29

మూ. పూజ్యమానా చ తాభిః సా రాజ్ఞా చైవ విశేషతః,
ఉవాస తత్ర సుఖితా కంచిత్కాలం సహర్త్విజా. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర. అ. సా = ఆమె, తాభిః = వారిచేతను, విశేషతః = విశేషముగా, రాజ్ఞా చైవ = రాజుచేతను, పూజ్యమానా = పూజింపబడుచున్నదై, సుఖితా = సుఖవంతురాలై, ఋత్విజా సహ = ఋత్విక్కుతో కూడ, కంచిత్కాలమ్ = కొంతకాలము, తత్ర = అచట, ఉవాస = నివసించెను.

తా. అంతఃపురస్త్రీలును, విశేషముగ దశరథుడును, ఆదరింపగా, ఆ శాంత, ఋష్యశృంగునితో, సుఖముగ కొంతకాలము అయోధ్యలో ఉండెను. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో
ఏకాదశసర్గ సమాప్తము.

# అథ ద్వాదశః సర్గః

మూ. తతః కాలే బహుతిథే కస్మింశ్చిత్సుమనోహరే,
వసన్తే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనోఽభవత్. 1

ప్ర. అ. తతః = పిమ్మట, బహుతిథే కాలే = చాలకాలము గడచినదగుచుండగా, సుమనోహరే = బాగుగా మనోహర మైన, కస్మింశ్చిత్ = ఒకానొక, వసన్తే = వసంతము, సమనుప్రాప్తే = వచ్చినదగుచుండగా, రాజ్ఞః = రాజునకు, యష్టుమ్ = యాగముచేయుటకు, మనః అభవత్ = కోరిక కలిగెను.

**తా.** ఈ విధముగ చాలకాలము గడచిన పిదప, ఒక మనోహర మగు వసంతఋతువు వచ్చెను. అపుడు యజ్ఞము చేయవలె నని దశరథునకు అభిలాష కలిగెను. 1

మూ. తతః ప్రసాద్య శిరసా తం విప్రం దేవవర్ణినమ్,
యజ్ఞాయ వరయామాస సన్తానార్థం కులస్య వై. 2

ప్ర. అ. తతః=పిమ్మట, దేవవర్ణినమ్=దేవతుల్యు డైన, తం విప్రమ్= ఆ బ్రాహ్మణుని, శిరసా = శిరస్సు వంచి నమస్కరించుటచే, ప్రసాద్య = అనుగ్రహింపచేసికొని, కులస్య = కులముయొక్క, సన్తానార్థమ్ = అవిచ్ఛిన్నత్వము కొరకు, అనగా పుత్రపౌత్రాదిపారంపర్యసిద్ధి కొరకు, యజ్ఞాయ = యజ్ఞము చేయించుటకై, వరయామాస = వరించెను.

**తా.** అంతట దశరథుడు దేవతుల్యు డైన ఋష్యశృంగునికి నమస్కరించి, అనుగ్రహింపచేసుకొని, "నా వంశము పుత్రపౌత్రాద్యభివృద్ధితో అవిచ్ఛిన్నముగా ఉండునట్లు యజ్ఞము చేయింపుము" అని పలికి, ఆతనిని ఋత్విక్కుగా వరించెను. 2

మూ. తథేతి చ స రాజానమువాచ చ సుసత్కృతః,
సంభారాః సంభ్రియన్తాం తే తురగశ్చ విముచ్యతామ్. 3

ప్ర. అ. సునత్కృతః = బాగుగా నత్కరింపబడిన, సః = ఋశ్యశృంగుడు, తథేతి = అటులనే చేయించెదను అని, రాజానమ్ = రాజును గూర్చి, ఉవాచ = పలికెను. సంభారాః=సంభారములు, సంభ్రియన్తామ్ = ఏర్పరుపబడుగాక. తే = నీయొక్క, తురగః = అశ్వము, విముచ్యతాం చ = విడువబడుగాక.

తా. బాగుగా ఆదరింపబడిన ఋష్యశృంగుడు "అటులనే చేయించెదను; యజ్ఞసంభారము లన్నియు ప్రోగు చేయించుము. యజ్ఞాశ్వమును విడువుము" అని పలికెను. 3

మూ. తతో రాజాబ్రవీద్వాక్యం సుమన్త్రం మన్త్రిసత్తమమ్,
సుమన్త్రావాహయ క్షిప్రం ఋత్విజో బ్రహ్మవాదినః. 4

సుయజ్ఞం వామదేవం చ జాబాలి మథ కాశ్యపమ్,
పురోహితం వసిష్ఠం చ యే చాన్యే ద్విజసత్తమాః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాజా = రాజు, మన్త్రిసత్తమమ్ = మంత్రిశ్రేష్ఠుడైన, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సుమన్త్ర = ఓ సుమంత్రుడా ! క్షిప్రమ్ = శీఘ్రముగా, బ్రహ్మవాదినః = వేదవిదులైన, ఋత్విజః = ఋత్విక్కులను, సుయజ్ఞమ్ = సుయజ్ఞుని, వామదేవం చ=వామదేవుని, జాబాలిమ్=జాబాలిని, అథ=మరియు, కాశ్యపమ్=కాశ్యపుని, పురోహితమ్=పురోహితుడైన, వసిష్ఠం చ=వసిష్ఠుని, యే= ఏ, అన్యే=ఇతరులైన, ద్విజోత్తమాః=బ్రాహ్మణోత్తములు గలరో వారిని, ఆవాహయ=రప్పింపుము.

తా. అంత దశరథుడు మంత్రిశ్రేష్ఠుడైన సుమంత్రునితో — "సుమంత్రా! బ్రహ్మవాదులైన ఋత్విక్కులను, సుయజ్ఞుడు మొదలగువారిని, పురోహితుడైన వసిష్ఠుని, ఇతరులైన బ్రాహ్మణోత్తములను శీఘ్రముగా రప్పింపుము" అని పలికెను. 4, 5

మూ. తతః సుమన్త్రస్త్వరితం గత్వా త్వరితవిక్రమః,
సమానయత్స తాన్ సర్వాన్ సమస్తాన్ వేదపారగాన్. 6

ప్ర. అ. తా. చూ. శ్లో. 6. సర్గ, 8. (సుమంత్రుడు వారి నందరిని తీసి కొనివచ్చెను.) 6

మూ. తాన్ పూజయిత్వా ధర్మాత్మా రాజా దశరథ స్తదా,
ధర్మార్థసహితం యుక్తం శ్లక్ష్ణం వచనమబ్రవీత్. 7

మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్,
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. 8

ప్ర. అ. తా. చూ. శ్లో. 7, 8. సర్గ. 8. (దశరథుడు వారిని పూజించి "సంతానముకొరకై అశ్వమేధము చేయగోరుచున్నాను" అని పలికెను.) 7, 8

మూ. తదహం యష్టుమిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా,
ఋషిపుత్రప్రభావేన కామాన్ ప్రాప్స్యామి చాప్యహమ్. 9

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, శాస్త్రదృష్టేన=శాస్త్రవిహిత మైన, కర్మణా=విధానముచే, యష్టుమ్ ఇచ్ఛామి=యాగము చేయవలెనని కోరుచున్నాను. ఋషిపుత్రప్రభావేన=ఋషికుమారుని ప్రభావముచే, అహమ్=నేను, కామాన్=కోరికలను, ప్రాప్స్యామి చ=పొందగలను కూడ.

తా. అందుచే యథావిధిగ యాగము చేయగోరుచున్నాను. ఋశ్యశృంగుని ప్రభావముచే నా కోరికలు తీరును. 9

మూ. తతః సాధ్వితి తద్వాక్యం బ్రాహ్మణాః ప్రత్యపూజయన్,
వసిష్ఠప్రముఖాః సర్వే పార్థివస్య ముఖాచ్చ్యుతమ్. 10

ప్ర. అ. తా. చూ. శ్లో. 10. సర్గ. 8. 10

మూ. ఋశ్యశృఙ్గపురోగాశ్చ ప్రత్యూచుర్నృపతిం తదా,
సంభారాః సంభ్రియన్తాం తే తురగశ్చ విముచ్యతామ్. 11

ప్ర. అ. ఋశ్యశృఙ్గపురోగాః=ఋష్యశృంగుడు మొదలైనవారు, తదా=అప్పుడు, నృపతిమ్=రాజును గూర్చి, ప్రత్యూచుః=పలికిరి. సంభారాః=యజ్ఞ

సంభారములు, సంభ్రియన్తామ్=సమకూర్చబడుగాక, తే=నీయొక్క, తురగః=అశ్వము, విముచ్యతాం చ=విడువబడుగాక.

తా. ఋశ్యశృంగాదులు రాజుతో ఇట్లనిరి—"యజ్ఞసంభారములను సమకూర్చుము. అశ్వమును విడువుము." 11

మూ. సర్వథా ప్రాప్స్యసే పుత్రాంశ్చత్వారోఽమితవిక్రమాన్,
యస్య తే ధార్మికీ బుద్ధిరియం పుత్రార్థమాగతా. 12

ప్ర. అ. యస్య తే=ఏ నీకు, పుత్రార్థమ్=పుత్రులకొరకై, ఇయమ్=ఈ, ధార్మికీ బుద్ధిః=ధర్మసంమత మైన బుద్ధి, ఆగతా=కలిగినదో, అట్టి నీవు, సర్వథా=తప్పక, అమితవిక్రమాన్=అనంతపరాక్రమవంతు లైన, చత్వారః=నలుగురు, పుత్రాన్=పుత్రులను, ప్రాప్స్యసే=పొందగలవు.

తా. నీకు పుత్రులకొరకై ధర్మసంమత మైన బుద్ధి జనించినందులకు, నీకు తప్పక అనంతపరాక్రమవంతు లగు నలుగురు పుత్రులు జనింపగలరు. 12

మూ. తతః ప్రీతోఽభవద్రాజా శ్రుత్వా తద్ద్విజభాషితమ్,
అమాత్యాంశ్చాబ్రవీద్రాజా హర్షేణేదం శుభాక్షరమ్. 13

ప్ర. అ. తా. చూ. శ్లో. 13. సర్గ. 8. (హర్షేణ=సంతోషముతో, శుభాక్షరమ్=మంచి అక్షరములుగల, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్), ఈ మాటలకు సంతసించిన దశరథుడు అమాత్యులతో ఇట్లు పలికెను. 13

మూ. గురూణాం వచనాచ్ఛీఘ్రం సంభారాః సంభ్రియన్తు మే,
సమర్థాధిష్ఠితశ్చాశ్వః సోపాధ్యాయో విముచ్యతామ్. 14

ప్ర. అ. తా. చూ. శ్లో. 14. సర్గ. 8. 14

మూ. సరయ్వాశ్చోత్తరే తీరే యజ్ఞభూమిర్విధీయతామ్,
శాన్తయశ్చాభివర్ధన్తాం యథాకల్పం యథావిధి. 15

శక్యః ప్రాప్తుమయం యజ్ఞః సర్వేణాపి మహీక్షితా,
నాపరాధో భవేత్కష్టో యద్యస్మిన్ క్రతుసత్తమే. 16

ఛిద్రం హి మృగయన్తేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః,
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి. 17

తద్యథా విధిపూర్వం మే క్రతురేష సమాప్యతే,
తథా విధానం క్రియతాం సమర్థాః కరణేష్విహ. 18

ప్ర. అ. తా. చూ. శ్లో. 15, 16, 17, 18. సర్గ. 8. 15-18

తథేతి చ తతః సర్వే మన్త్రిణః ప్రత్యపూజయన్,
పార్థివేన్ద్రస్య తద్వాక్యం యథాజ్ఞప్తమకుర్వత. 19

ప్ర. అ. తతః=పిమ్మట, మన్త్రిణః=మంత్రులు, సర్వే=అందరును, పార్థివేన్ద్రస్య=రాజశ్రేష్ఠునియొక్క, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, తథేతి=అటులనే చేయగలము అని, ప్రత్యపూజయన్ = అభినందించిరి. యథాజ్ఞప్తమ్ = ఆజ్ఞాపించిన ప్రకారము, అకుర్వత=చేసిరి.

తా. మంత్రు లందరును దశరథుని మాటలను అభినందించి, అతడు ఆజ్ఞాపించిన విధముగ చేసిరి. 19

మూ. తతో ద్విజాస్తే ధర్మజ్ఞమస్తువన్ పార్థివర్షభమ్,
అనుజ్ఞాతాస్తతస్సర్వే పునర్జగ్ముర్యథాగతమ్. 20

ప్ర. అ. తతః=పిమ్మట, తే ద్విజాః = ఆ బ్రాహ్మణులు, ధర్మజ్ఞమ్ = ధర్మము నెరిగిన, పార్థివర్షభమ్=రాజశ్రేష్ఠుని, అస్తువన్=స్తుతించిరి, అనుజ్ఞాతాః= అనుజ్ఞ ఈయబడినవారై, తతః = అచటినుండి, పునః = మరల, యథా గతమ్=వచ్చిన విధముననే, జగ్ముః=వెళ్లిరి.

తా. పిమ్మట ఆ బ్రాహ్మణులు ధర్మజ్ఞు డైన దశరథుని కొనియాడి, అతని అనుజ్ఞ గైకొని, స్వస్థానములకు తిరిగి వెళ్లిరి. 20

మూ. గతేష్వథ ద్విజాగ్ర్యేషు మన్త్రిణస్తాన్నరాధిపః,
విసర్జయిత్వా స్వం వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః. 21

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే ద్వాదశః సర్గః.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, ద్విజాగ్ర్యేషు=బ్రాహ్మణశ్రేష్ఠులు, గతేషు నత్సు=వెళ్లినవా రగుచుండగా, మహాద్యుతిః = గొప్ప కాంతి గల, నరాధిపః= రాజు, తాన్ మన్త్రిణః=ఆ మంత్రులను, విసర్జయిత్వా=పంపివేసి, స్వం వేశ్మ= తన=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. బ్రాహ్మణులు వెడలిపోయిన పిమ్మట, తేజశ్శాలి యగు దశరథుడు మంత్రులను కూడ పంపివేసి తన గృహమును ప్రవేశించెను. 21

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో పండ్రెండవసర్గ సమాప్తము.

# అథ త్రయోదశః సర్గః

మూ. పునః ప్రాప్తే వసన్తే తు పూర్ణస్సంవత్సరోఽభవత్,
ప్రసవార్థం గతో యష్టుం హయమేధేన వీర్యవాన్. 1

ప్ర. అ. పునః=మరల, వసన్తే=వసంతర్తువు, ప్రాప్తే సతి=వచ్చినదగు చుండగా, సంవత్సరః=సంవత్సరము, పూర్ణః అభవత్=నిండెను. వీర్యవాన్=పరాక్రమవంతుడైన దశరథుడు, ప్రసవార్థమ్ = సంతానము కొరకు, హయమేధేన=అశ్వమేధముచే, యష్టుమ్ = దేవతల పూజచేయటకు, గతః = యజ్ఞశాలలో ప్రవేశించెను.

తా. సంవత్సరము పూర్తియై తిరిగి వసంతఋతువు వచ్చినది. దశరథుడు సంతానముకొరకై అశ్వమేధయాగము చేయు సంకల్పముతో యజ్ఞశాలలో ప్రవేశించెను. 1

వి. 'మొదటి వసంతఋతువునందు, చిత్రాపూర్ణిమయందు సాంగ్రహణేష్టి చేసి, ప్రతిపత్తునందు బ్రహ్మోదన మేధ్యాశ్వబంధన స్నాపన ప్రోక్షణ విమోచనాదులు చేయవలెను. అట్లు చేసి నలుగురు ఋత్విక్కులు సిద్ధముగా ఉండవలెను' అని శ్రౌతసూత్రములో చెప్పిన విధముగ "సావిత్రమష్టాకపాలం ప్రాతర్నిర్వపతి" అనునియమము ననుసరించి ప్రతిదినము సావిత్రాదికర్మములు చేయుచుండవలెను. ఈ విధముగ ఒక సంవత్సరము పూర్తియైన తరువాత మరల ప్రధానదీక్ష ప్రారంభ మగును.

మూ. అభివాద్య వసిష్ఠం చ న్యాయతః ప్రతిపూజ్య చ,
అబ్రవీత్ ప్రశ్రితం వాక్యం ప్రసవార్థం ద్విజోత్తమమ్. 2

ప్ర. అ. ద్విజోత్తమమ్=బ్రాహ్మణశ్రేష్ఠుడైన, వసిష్ఠమ్=వసిష్ఠుని, అభివాద్య = నమస్కరించి, న్యాయతః = శాస్త్రానుసారముగా, ప్రతిపూజ్య చ = పూజించి, ప్రసవార్థమ్=సంతానము కొరకు, ప్రశ్రితమ్ = వినయముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథుడు బ్రాహ్మణశ్రేష్ఠుడైన వసిష్ఠుని నమస్కరించి, యథాశాస్త్రముగ పూజించి, పుత్రార్థియై, వినయపూర్వకముగ ఇట్లు పలికెను. 2

మూ. యజ్ఞో మే క్రియతాం బ్రహ్మన్ యథోక్తం మునిపుఙ్గవ,
యథా న విఘ్నః క్రియతే యజ్ఞాఙ్గేషు విధీయతామ్. 3

ప్ర. అ. మునిపుఙ్గవ=మునిశ్రేష్ఠుడవైన, బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా! మే = నాయొక్క, యజ్ఞః=యజ్ఞము, యథోక్తమ్=శాస్త్రోక్తరీతిగా, క్రియతామ్= చేయబడుగాక, యజ్ఞాఙ్గేషు = యజ్ఞముయొక్క అంగములయందు, విఘ్నః = విఘ్నము, యథా = ఏ విధముగ, న క్రియతే = చేయబడదో, ఆ విధముగ, విధీయతామ్ = చేయబడుగాక.

తా. ఓ మునిసత్తమా! నా యజ్ఞము యథాశాస్త్రముగ జరుగునట్లును, యజ్ఞాంగములలో ఎట్టి విఘ్నములు కలుగకుండునట్లును చూడుము. 3

మూ. భవాన్ స్నిగ్ధః సుహృన్మహ్యం గురుశ్చ పరమో మతః,
వోఢవ్యో భవతా చైవ భారో యజ్ఞస్య చోద్యతః. 4

ప్ర. అ. భవాన్ = నీవు, మహ్యమ్=నాకు, స్నిగ్ధః = స్నేహము గల, సుహృత్=మిత్రుడవు. పరమః=గొప్పవాడును, మహాన్ = పూజ్యుడును అగు, గురుః = పురోహితుడవు. యజ్ఞస్య=ఈ యజ్ఞముయొక్క, ఉద్యతః=ప్రారంభింపబడిన, భారః=భారము, భవతైవ=నీ చేతనే, వోఢవ్యః=వహింపదగినది.

తా. నీవు నా విషయమున స్నేహము గల మిత్రుడవు; పూజ్యుడవైన ఉత్తమ పురోహితుడవు; ప్రారంభింపబడిన ఈ యజ్ఞకార్యభారమును నీవే వహింపవలెను. 4

మూ. తథేతి చ స రాజానమబ్రవీద్ద్విజసత్తమః,
కరిష్యే సర్వమేవైతద్భవతా యత్సమర్థితమ్. 5

ప్ర. అ. ద్విజసత్తమః = బ్రాహ్మణోత్తముడైన, సః = ఆవసిష్ఠుడు, భవతా = నీ చేత, యత్ = ఏది, సమర్థితమ్=ప్రార్థింపబడినదో, లేదా నిర్ణయింపబడినదో, ఏతత్ = దీనిని, సర్వమ్=సమస్తమును, తథా = ఆ విధముగనే,

కరిష్యే=చేయగలను, ఇతి=అని, రాజానమ్=రాజును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అంతయు నీవు కోరి నట్లే చేసెదను అని ఆ బ్రాహ్మణోత్తముడు దశరథునితో పలికెను. 5

మూ. తతోఽబ్రవీద్ద్విజాన్వృద్ధాన్యజ్ఞకర్మసు నిష్ఠితాన్,
స్థాపత్యే నిష్ఠితాంశ్చైవ వృద్ధాన్ పరమధార్మికాన్. 6

కర్మాన్తికాన్ శిల్పకరాన్ వర్ధకీన్ ఖనకానపి,
గణకాన్ శిల్పినశ్చైవ తథైవ నటనర్తకాన్. 7

తథా శుచీన్ శాస్త్రవిదః పురుషాన్ సుబహుశ్రుతాన్,
యజ్ఞకర్మ సమీహన్తాం భవన్తో రాజశాసనాత్. 8

ఇష్టకా బహుసాహస్రీ శీఘ్రమానీయతామితి,
ఔపకార్యాః క్రియన్తాం చ రాజ్ఞాం బహుగుణాన్వితాః. 9

ప్ర. అ. తతః = పిమ్మట, యజ్ఞకర్మసు = యజ్ఞమునకు సంబంధించిన పనులందు, నిష్ఠితాన్ = సమర్థులైన, వృద్ధాన్ = వృద్ధులైన, ద్విజాన్ = బ్రాహ్మణులను, వృద్ధాన్ = వృద్ధులును, పరమధార్మికాన్ = చాలధార్మికులైన, స్థాపత్యే = వాస్తుకర్మయందు, నిష్ఠితాంశ్చైవ=సమర్థులను, కర్మాన్తికాన్=కార్య నిర్వాహకులను, శిల్పకరాన్ = ఇటికలు మొదలైనవి నిర్మించువారిని, వర్ధకీన్= వడ్రంగులను, ఖనకానపి = త్రవ్వువారిని, గణకాన్ = లెక్కలు కట్టువారిని, శిల్పినశ్చైవ=చిత్రాదులను నిర్మించు శిల్పులను, తథైవ = మరియు, నటనర్తకాన్ = నటులను, నర్తకులను (రసము నభినయించువారు నటులు, భావము లభినయించువారు నర్తకులు), తథా=మరియు, శుచీన్ = పరిశుద్ధమైన చరిత్ర గల, శాస్త్రవిదః=శాస్త్రవేత్తలను, సుబహుశ్రుతాన్ = చాల విషయములను విని తెలిసికొనిన, పురుషాన్ = పురుషులను గూర్చి, భవన్తః=మీరు, రాజశాసనాత్= రాజాజ్ఞవలన, యజ్ఞకర్మ = యజ్ఞమునకు కర్మను, సమీహన్తామ్ = చేయుటకు నిర్ణయింతురుగాక. బహుసాహస్రీ=అనేకసహస్రముల సంఖ్యలో ఉన్న, ఇష్టకా=

ఇటుక, శీఘ్రమ్=శీఘ్రముగా. ఆనీయతామ్=తీసికొని రాబడుగాక, రాజ్ఞామ్=రాజులకు, బహుగుణాన్వితాః=అనేకగుణములతో కూడిన, ఔపకార్యాః=తాత్కాలికనివాసభవనములు, క్రియన్తామ్=చేయబడుగాక. అని, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట వసిష్ఠుడు యజ్ఞకర్మలయందు ఆరితేరిన వృద్ధు లైన బ్రాహ్మణులను, వాస్తుకర్మయందు ప్రజ్ఞ గల పరమధార్మికు లైన వృద్ధులను, వివిధకర్మచారులను, ఇటికలు మొదలగువాటిని నిర్మించు శిల్పకారులను, వడ్రంగులను, త్రవ్వువారిని, లెక్కలుకట్టువారిని, చిత్రలేఖనాదినిపుణు లైన శిల్పులను, నటులను, నర్తకులను, పరిశుద్ధ మైన చరిత్ర గల శాస్త్రవేత్తలను అనేకవిషయముల అనుభవము గల పురుషులను, పిలిపించి ఇట్లా జ్ఞాపించెను— "మీరందరును రాజాజ్ఞానుసారముగా యజ్ఞమునకు సంబంధించిన పనులు చేయుటకు పూనుకొనుడు. అనేక సహస్రముల ఇటికను తెప్పింపుడు. అతిథులుగా రాబోవు రాజుల నివాసము నకై వివిధవస్తుసామాగ్రితో కూడిన తాత్కాలికభవనములను నిర్మింపుడు." 6-9

మూ. బ్రాహ్మణావసథాశ్చైవ కర్తావ్యాః శతశః శుభాః,
భక్ష్యాన్నపానైర్బహుభిః సముపేతాః సునిష్ఠితాః. 10

ప్ర. అ. శుభాః = మంగళకర మైనవియు, బహుభిః = అనేక మైన, భక్ష్యాన్నపానైః=భక్ష్యములతోడను, పానీయములతోడను; సముపేతాః=కూడినవియు, సునిష్ఠితాః=చక్కగ నెలకొల్పబడినవియు అగు, బ్రాహ్మణావసథాః చైవ=బ్రాహ్మణుల కొరకైన గృహములు కూడ, శతశః=వందలకొలది, కర్తవ్యాః=నిర్మింపదగినవి.

తా "బ్రాహ్మణుల నివాసముకొరకై వందలకొలది అంద మైన గృహములను నిర్మించి, అనేకవిధముల భక్ష్య-అన్న-పానాదులను సమకూర్చుడు". 10

మూ. తథా పౌరజనస్యాపి కర్తవ్యా బహువిస్తరాః,
ఆవాసా బహుభక్ష్యా వై సర్వకామైరుపస్థితాః. 11

ప్ర. అ. తథా = అట్లే, పౌరజనస్యాపి = పౌరజనులకొరకై, బహువిస్తరాః=చాల వైశాల్యము గలవియు, బహుభక్ష్యాః=అనేకము లైన భక్ష్యములు కలవియు, సర్వకామైః=సమస్తభోగ్యవస్తువులతో, ఉపస్థితాః=కూడిన, ఆవాసాః=నివాసగృహములు, కర్తవ్యాః=చేయదగినవి.

తా. "పౌరజనులకొరకు గూడ, అతివిశాలములును, వివిధభక్ష్యభోగాదులతో కూడినవియు అగు నివాస గృహములను నిర్మింపుడు." 11

మూ. తథా జానపదస్యాపి జనస్య బహుశోభనమ్,
దాతవ్యమన్నం విధివత్సత్కృత్య న తు లీలయా. 12

ప్ర. అ. తథా=అట్లే, జానపదస్య=గ్రామములకు సంబంధించిన, జనస్యాపి=జనులకు కూడ, బహుశోభనమ్=చాల మంచి దైన, అన్నమ్=అన్నము, విధివత్=యథోచితముగ, సత్కృత్య=సత్కరించి, దాతవ్యమ్=ఇవ్వదగినది. లీలయా తు=అనాదరముతో మాత్రము, న=కాదు.

తా. "అట్లే గ్రామములనుండి వచ్చిన జనులను యథోచితరీతిని సత్కరించి, వారికి మంచి ఆహారమును ఇవ్వవలెను. అనాదరముగా ఇవ్వకూడదు." 12

మూ. సర్వే వర్ణా యథా పూజాం ప్రాప్నువన్తి సుసత్కృతాః,
న చావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశాదపి. 13

ప్ర. అ. సర్వే = అన్ని, వర్ణాః=వర్ణములవారును, సుసత్కృతాః = బాగుగా సత్కరింపబడినవారై, యథా=ఏ విధముగా, పూజామ్=పూజను, ప్రాప్నువన్తి=పొందెదరో, అట్లు చేయవలెను. కామక్రోధవశాదపి=కామమువలన గాని క్రోధమువలన గాని, అవజ్ఞా=అనాదరము, న ప్రయోక్తవ్యా=చేయదగినది కాదు.

తా. "అన్ని వర్ణములవారును బాగుగా సత్కరింపబడినవారై పూజ లందుకొను నట్లు చూడవలెను, వారిలో ఎవరైన కామక్రోధాదులను చూపినను వారిని అవమానింపరాదు." 13

మూ. యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషాః శిల్పినస్తథా,
తేషామపి విశేషేణ పూజా కార్యా యథాక్రమమ్.
తే చ స్యుః సంభృతాః సర్వే వసుభిర్భోజనేన చ. 14

ప్ర. అ. యే పురుషాః=ఏ పురుషులును, తథా=మరియు, శిల్పినః=శిల్పులును, యజ్ఞకర్మసు=యజ్ఞకర్మలయందు, వ్యగ్రాః=నిమగ్నులై యుందురో

తేషామపి=వారికి కూడ, విశేషేణ=ప్రధానముగ, యథాక్రమమ్=క్రమానుసారముగ, అనగా యథోచితముగ, పూజా=పూజ, కార్యా=చేయదగినది, తే సర్వే=వారందరును, వసుభిః=ధనములచేతను, భోజనేన చ=భోజనముచేతను, సంభృతాః=నింపబడినవారు, స్యుః=అగుదురుగాక.

తా. "యజ్ఞమునకు సంబంధించిన పనులు నిర్వహించుచున్న పురుషులను, శిల్పులను విశేషరీతిని, వారి వారి అర్హతల ననుసరించి సత్కరించవలెను. వారికి వలసి నంత ధనము నిచ్చి భోజనము పెట్టవలెను." 14

మూ. యథా సర్వం సువిహితం న కించిత్ పరిహీయతే,
తథా భవన్తః కుర్వన్తు ప్రీతిస్నిగ్ధేన చేతసా. 15

ప్ర. అ. సర్వమ్ = అంతయు, యథా = ఎట్లు, సువిహితమ్ = చక్కగా నిర్వహింపబడినదై అగునో, కించిత్ = ఏమియు, న పరిహీయతే=విడువబడదో, తథా = ఆ విధముగ, భవన్తః = మీరు, ప్రీతిస్నిగ్ధేన = ప్రేమతో ఆర్ద్రమైన, చేతసా = చిత్తముతో, కుర్వన్తు = చేయుదురుగాక.

తా. "అన్ని పనులును సరిగా జరుగు నట్లును, ఏమియు లోటు రానట్లును, మీరు, ప్రేమార్ద్రమైన మనస్సుతో, ఏర్పరుపవలెను." 15

మూ. తతః సర్వే సమాగమ్య వసిష్ఠ మిదమబ్రువన్. 16
యథోక్తం తత్సువిహితం న కించి త్పరిహీయతే,
యథోక్తం తత్కరిష్యామో న కించిత్ పరిహాస్యతే. 17

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వే = అందరును, సమాగమ్య = వచ్చి, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రువన్ = పలికిరి, యథా = ఏ విధముగా, ఉక్తమ్ = చెప్పబడినదో, తత్ = అది, ఆ విధముగ, సువిహితమ్ = బాగుగా ఏర్పరుపబడినది. కించిత్ = ఏదియు, న పరిహీయతే = విడువబడుటలేదు, యథోక్తమ్=ఏ విధముగా చెప్పబడినదో, తత్ = దానిని, ఆ విధముగ, కరిష్యామః = చేయగలము, కించిత్ = ఏమియు, న పరిహాస్యతే = విడువబడదు.

తా. పిమ్మట వారందరును వచ్చి వసిష్ఠునితో ఇట్లు చెప్పిరి. "తాము చెప్పిన విధమున గృహనిర్మాణాదికము జరుగుచున్నది. ఏ లోటును లేదు. తాము చెప్పిన విధమున అన్నదానాదికము కూడ ఏ లోటును లేకుండ, చేయ గలము" 16, 17

మూ. తతః సుమన్త్రమానీయ వసిష్ఠో వాక్యమబ్రవీత్,
నిమన్త్రయస్వ నృపతీన్ పృథివ్యాం యే చ ధార్మికాః. 18

ప్ర. అ. తతః = పిమ్మట, వసిష్ఠః = వసిష్ఠుడు, సుమన్త్రమ్=సుమంత్రుని, ఆనీయ = పిలిపించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్=పలికెను, పృథివ్యామ్= భూమియందు, ధార్మికాః = ధార్మికులైన, యే = ఏ రాజు లున్నారో, అట్టి, నృపతీన్ = రాజులను, నిమన్త్రయస్వ = ఆహ్వానించుము.

తా. పిదప వసిష్ఠుడు సుమంత్రుని పిలిపించి ఇట్లు చెప్పెను. "ఈ భూమండలములో నున్న ధార్మికులైన రాజుల నందరిని ఆహ్వానింపుము". 18

మూ. బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాంశ్చైవ సహస్రశః,
సమానయస్వ సత్కృత్య సర్వదేశేషు మానవాన్. 19

ప్ర. అ. సర్వదేశేషు = సమస్తదేశములందు ఉన్న, మానవాన్ = మానవులను, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, క్షత్రియాన్ = క్షత్రియులను, వైశ్యాన్ = వైశ్యులను, శూద్రాంశ్చైవ=శూద్రులను, సహస్రశః = వేలకొలది, సత్కృత్య= సత్కరించి, సమానయస్వ=తీసికొనిరమ్ము.

తా. "మన రాజ్యములోనివారినే కాక, సమస్తదేశములలో ఉన్న వేలకొలది బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను కూడ గౌరవపూర్వకముగా తీసికొని రమ్ము." 19

మూ. మిథిలాధిపతిం శూరం జనకం సత్యవిక్రమమ్,
నిష్ఠితం సర్వశాస్త్రేషు తథా వేదేషు నిష్ఠితమ్. 20

తమానయ మహాభాగం స్వయమేవ సుసత్కృతమ్,
పూర్వసంబన్ధినం జ్ఞాత్వా తతః పూర్వం బ్రవీమి తే. 21

ప్ర. అ. మిథిలాధిపతిమ్=మిథిలకు ప్రభువును, శూరమ్ = శూరుడును, సత్యవిక్రమమ్ = యథార్థ మైన పరాక్రమము కలవాడును, సర్వశాస్త్రేషు = సకలశాస్త్రములందును, నిష్ఠితమ్=సమర్థుడును, తథా=మరియు, వేదేషు=వేదము లందు, నిష్ఠితమ్ = సమర్థుడును, మహాభాగమ్ = గొప్ప భాగ్యము కలవాడును అగు, తం జనకమ్=ఆ జనకమహారాజును, పూర్వసంబన్ధినమ్=పూర్వసంబంధము కలవానినిగా, జ్ఞాత్వా=తెలుసుకొని, సుసత్కృతమ్=బాగుగా సత్కరింపబడిన వానినిగా చేసి, స్వయమేవ=స్వయముగనే, ఆనయ=తీసుకొని రమ్ము, తతః= ఆ కారణమువలననే, పూర్వమ్=ముందుగా, తే=నీకు, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. "శూరుడును, సత్యపరాక్రమవంతుడును, సర్వవేదశాస్త్రములలో నిష్ణాతుడును, మహాభాగ్యవంతుడును అగు, మిథిలాధిపతి యైన జనకుడు, మనకు పూర్వసంబంధి యను విషయమును గుర్తు ఉంచుకొని, తగు విధములగు సత్కారములతో, స్వయముగ తీసికొని రమ్ము. మనకు పూర్వసంబంధి యగుటచే ఆయన విషయమును నీకు ముందుగా చెప్పుచున్నాను." 20, 21

మూ. తథా కాశీపతిం స్నిగ్ధం సతతం ప్రియవాదినమ్,
వయస్యం రాజసింహస్య స్వయమేవానయస్వ హ. 22

ప్ర. అ. తథా=మరియు, స్నిగ్ధమ్=స్నేహశీలుడును, సతతమ్=ఎల్లప్పుడు, ప్రియవాదినమ్=ప్రియముగా మాటలాడువాడును, రాజసింహస్య=రాజశ్రేష్ఠ డైన దశరథునియొక్క, వయస్యమ్=మిత్రుడును అగు, కాశీపతిమ్=కాశీరాజును, స్వమేవ=స్వయముగనే, ఆనయస్వ హ=తీసికొనిరమ్ము.

తా. "స్నేహశీలుడును, ఎల్లప్పుడును ప్రియముగపలుకువాడును, మన మహారాజుకు మిత్రుడును అగు కాశీరాజును కూడ నీవు స్వయముగ వెళ్లి పిలచి, తీసికొని రమ్ము." 22

మూ. తథా కేకయరాజానం వృద్ధం పరమధార్మికమ్,
శ్వశురం రాజసింహస్య సపుత్రం త్వమిహానయ. 23

ప్ర. అ. తథా=మరియు, పరమధార్మికమ్=చాల ధార్మికుడును, రాజసింహస్య=దశరథునియొక్క, శ్వశురమ్=మామగారును అగు, వృద్ధమ్=వృద్ధు

డైన, కేకయరాజానం=కేకయరాజును, సపుత్రమ్=పుత్రసమేతముగా, త్వమ్=నీవే స్వయముగ, ఇహ=ఇచటకు, ఆనయ=తీసికొని రమ్ము.

తా. పరమధార్మికుడును, మన మహారాజుగారి మామగారును అగు వృద్ధుడైన కేకయదేశరాజును కూడ, పుత్రసమేతముగ తీసికొని రమ్ము. 23

మూ. అఙ్గేశ్వరం మహాభాగం రోమపాదం సుసత్కృతమ్,
వయస్యం రాజసింహస్య సమానయ యశస్వినమ్. 24

ప్ర. అ. అఙ్గేశ్వరమ్=అంగదేశమునకు ప్రభు వైనవాడును, మహాభాగమ్=మహాభాగ్యవంతుడును, రాజసింహస్య=రాజశ్రేష్ఠుడైన దశరథుని యొక్క, వయస్యమ్=మిత్రుడును, యశస్వినమ్=యశఃశాలియు అగు, రోమపాదమ్=రోమపాదుని, సుసత్కృతమ్=బాగుగా సత్కరింపబడినవానినిగా చేసి, సమానయ=తీసికొనిరమ్ము.

తా. అంగదేశాధిపతియు, మహాభాగ్యవంతుడును అయిన రోమపాదుడు, మన మహారాజునకు మిత్రుడు. ఆ యశఃశాలిని గూడ బాగుగా సత్కరించి తీసికొనిరమ్ము. 24

మూ. ప్రాచీనాన్ సిన్ధుసౌవీరాన్ సౌరాష్ట్రేయాంశ్చ పార్థివాన్,
దాక్షిణాత్యాన్నరేన్ద్రాంశ్చ సమస్తానానయస్వ హ. 25

ప్ర. అ. ప్రాచీనాన్=తూర్పుదిక్కున ఉన్న దేశాల రాజులను, సిన్ధుసౌవీరాన్=సింధుసౌవీరదేశరాజులను, సౌరాష్ట్రేయాన్=సురాష్ట్రదేశమునకు సంబంధించిన, పార్థివాన్=రాజులను, దాక్షిణాత్యాన్=దక్షిణదేశమునకు సంబంధించిన, నరేన్ద్రాంశ్చ=రాజులను, సమస్తాన్=అందరిని, ఆనయస్వ హ=తీసికొని రమ్ము (ఆహ్వానింపుము).

తా. తూర్పుదేశాలరాజులను, సింధుసౌవీరసౌరాష్ట్రదేశాలరాజులను, దక్షిణదేశరాజులను, అందరిని తీసికొనిరమ్ము. 25

మూ. సన్తి స్నిగ్ధాశ్చ యే చాన్యే రాజానః పృథివీతలే,
తానానయ యథాక్షిప్రం సానుగాన్ సహబాన్ధవాన్. 26

ప్ర. అ. పృథివీతలే=భూమండలమునందు, స్నిగ్ధాః=మిత్రు లైన, యే చ=ఏ, అన్యే=ఇతరు లైన, రాజానః=రాజులు గలరో, తాన్=వారిని, సానుగాన్=అనుచరసహితముగా, సహబాన్ధవాన్=బంధుసమేతముగా, యథాక్షిప్రమ్=వీలగునంత తొందరగా, ఆనయ=తీసికొనిరమ్ము.

తా. మన రాజ్యముతో స్నేహసంబంధము గల భూతలమునందలి ఇతర రాజుల నందరిని గూడ, వారి పరివారబంధువులతో సహ, వీలైనంత త్వరగా తీసికొనిరమ్ము (ఆహ్వానింపుము). 26

మూ. వసిష్ఠవాక్యం తచ్ఛ్రుత్వా సుమన్త్రిస్త్వరిత స్తదా,
వ్యాదిశత్పురుషాం స్తత్ర రాజ్ఞామానయనే శుభాన్. 27

ప్ర. అ. తత్=ఆ, వసిష్ఠవాక్యమ్=వసిష్ఠుని వాక్యమును, శ్రుత్వా=విని, సుమన్త్రిః=సుమంత్రుడు, తదా=అప్పుడు, త్వరితః=తొందరవడుచున్నవాడై, తత్ర=అచటికి, రాజ్ఞామ్=రాజులయొక్క, ఆనయనే=తీసికొనివచ్చుట యందు (కొరకు), శుభాన్=సద్గుణవంతు లైన, పురుషాన్=పురుషులను, వ్యాదిశత్=ఆజ్ఞాపించెను.

తా. వసిష్ఠుని ఆజ్ఞప్రకారము, సుమంత్రుడు రాజులను తీసికొని వచ్చుటకై సద్గుణవంతు లగు పురుషులను వెంటనే పంపెను. 27

మూ. స్వయమేవ హి ధర్మాత్మా ప్రయయౌ మునిశాసనాత్,
సుమన్త్రిస్త్వరితో భూత్వా సమానేతుం మహీక్షితః. 28

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డగు, సుమన్త్రిః=సుమంత్రుడు, మునిశాసనాత్=మునియొక్క శాసనమువలన, త్వరితః భూత్వా=తొందరకలవాడై, మహీక్షితః=రాజులను, సమానేతుమ్=తీసికొనివచ్చుటకు, స్వయమేవ=స్వయముగానే, ప్రయయౌ=వెళ్లెను.

తా. వసిష్ఠుని ఆజ్ఞ ప్రకారము, ధర్మాత్ము డైన సుమంత్రుడు జనక కేకయ రాజాదులను స్వయముగ తీసికొనివచ్చుటకై శీఘ్రముగా వెళ్లెను. 28

మూ. తే చ కర్మాన్తికాస్సర్వే వసిష్ఠాయ చ ధీమతే,
సర్వం నివేదయన్తి స్మ యజ్ఞే యదుపకల్పితమ్. 29

ప్ర. అ. తే=ఆ, కర్మాన్తికాః=కర్మకారులు, సర్వే=అందరును, యజ్ఞే=యజ్ఞముకొరకై, యత్=ఏది, ఉపకల్పితమ్=చేయబడినదో, సర్వమ్=దాని నంతను, ధీమతే=బుద్ధిమంతుడైన, వసిష్ఠాయ=వసిష్ఠునకు, నివేదయన్తి స్మ=తెలిపిరి.

తా. ఆ యా కార్యములందు నియుక్తులైన కర్మకారు లందరును తాము యజ్ఞము విషయమున చేసిన పనుల నన్నింటిని వసిష్ఠునకు విన్నవించిరి. 29

మూ. తతః ప్రీతో ద్విజశ్రేష్ఠస్తాన్ సర్వానిదమబ్రవీత్,
అవజ్ఞయా న దాతవ్యం కస్య చిల్లీలయాపి వా. 30
అవజ్ఞయా కృతం హన్యాద్దాతారం నాత్ర సంశయః.

ప్ర. అ. తతః=పిమ్మట, ప్రీతః=సంతోషించిన, ద్విజశ్రేష్ఠః=బ్రాహ్మణశ్రేష్ఠుడు, తాన్ సర్వాన్=వారి నందరిని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. కస్య చిత్=ఎవనికిని, అవజ్ఞయా=అనాదరముతో గాని, లీలయాపి వా=అశ్రద్ధతో గాని, న దాతవ్యమ్=ఇవ్వకూడదు. అవజ్ఞయా=అనాదరముతో, కృతమ్=చేయబడిన దానము, దాతారమ్=దాతను, హన్యాత్=చంపును. అత్ర=ఈ విషయమున, సంశయః=సంశయము, న=లేదు.

తా. అది విని సంతోషించిన వసిష్ఠుడు వారితో ఇట్లనెను. "ఎవ్వరికైన ఏదైన ఇచ్చు నపుడు, అనాదరముగ గాని, అశ్రద్ధగ గాని ఇవ్వకూడదు. అనాదరముతో చేసిన దానమునకు ఫలితముగ దాత నశించును." 30

మూ. తతః కైశ్చిదహోరాత్రైరుపయాతా మహీక్షితః, 31
బహూని రత్నాన్యాదాయ రాజ్ఞో దశరథస్య వై.

ప్ర. అ. తతః=పిమ్మట, మహీక్షితః=రాజులు, రాజ్ఞః దశరథస్య=దశరథమహారాజునకు, బహూని = అనేకమైన, రత్నాని = రత్నములను, ఆదాయ=తీసికొని, కైశ్చిత్=కొన్ని, అహోరాత్రైః=దినములలో, ఉపయాతాః=వచ్చిరి.

తా. అంతట కొన్ని దివసములలో, నానాదేశములకు చెందిన రాజులు, దశరథమహారాజునకు ఉపాయనముగా అనేకరత్నములను తీసికొని, అయోధ్యానగరము చేరిరి. 31

మూ. తతో వసిష్ఠః సుప్రీతో రాజానమిదమబ్రవీత్. 32
ఉపయాతా నరవ్యాఘ్ర రాజానస్తవ శాసనాత్,
మయాపి సత్కృతాః సర్వే యథార్హం రాజసత్తమాః. 33

ప్ర. అ. తతః=పిమ్మట, సుప్రీతః=మిక్కిలి సంతసించిన, వసిష్ఠః=వసిష్ఠుడు. రాజానమ్=దశరథుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను, నరవ్యాఘ్ర=ఓ నరశ్రేష్ఠుడా! తవ=నీ యొక్క, శాసనాత్=శాసనము వలన, రాజానః=రాజులు, ఉపయాతాః=వచ్చినారు. రాజసత్తమాః=రాజశ్రేష్ఠులైన, సర్వే = వారందరును, యథార్హమ్=యోగ్యతానుసారముగా, మయా = నాచేత, సత్కృతాః అపి=సత్కరింపబడినవారు కూడ.

తా. అపుడు వసిష్ఠుడు సంతోషించి దశరథునితో ఇట్లనెను :— "ఓ! నరశ్రేష్ఠుడా! నీ ఆజ్ఞ ప్రకారము రాజు లందరును వచ్చినారు. నేను వారి నందరిని తగు రీతిని సత్కరించినాను. 32, 33

మూ. యజ్ఞీయం చ కృతం రాజన్ పురుషైః సుసమాహితైః,
నిర్యాతు చ భవాన్యష్టుం యజ్ఞాయతనమన్తికాత్. 34

ప్ర. అ. రాజన్ = ఓ రాజా! సుసమాహితైః = మిక్కిలి సావధానచిత్తులైన, పురుషైః = పురుషులచేత, యజ్ఞీయమ్ = యజ్ఞమునకై కావలసిన కార్యమంతయు, కృతమ్ = చేయబడినది. భవాన్ = నీవు, యష్టుమ్=యాగము చేయుటకై, అన్తికాత్ = సమీపమున నున్న, యజ్ఞాయతనమ్ = యజ్ఞశాలను గూర్చి, నిర్యాతు = బయలువెడలెదవుగాక.

తా. రాజా! కర్మచారులు సావధానచిత్తులై యజ్ఞమునకై కావలసిన సాధన సామగ్రిని సమకూర్చినారు. ఇంక నీవు యజ్ఞము ప్రారంభించుటకై, సమీపముననే ఉన్న యాగశాలకు బయలుదేరుము. 34

మూ. సర్వకామైరుపహృతైరుపేతం వై సమన్తతః,
ద్రష్టుమర్హసి రాజేన్ద్ర మనసేవ వినిర్మితమ్. 35

ప్ర. అ. రాజేన్ద్ర=ఓ రాజశ్రేష్ఠుడా! ఉపహృతైః = చేర్చబడిన, సర్వకామైః = సమస్తభోగ్యవస్తువులతోడను, సమన్తతః = అంతటను, ఉపేతమ్ =

కూడినదియు, మనసా = మనస్సుచే, వినిర్మితమ్ ఇవ = నిర్మించబడినట్లున్న ఈ యాగశాలను, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ రాజేంద్రా! సమకూర్చిన సమస్తభోగ్యవస్తువులతో అంతటను నిండి, మనస్సుచే నిర్మించబడినదా అన్నట్లు ఆశ్చర్యకర మగు ఈ యాగశాలను చూడుము." 35

మూ. తథా వసిష్ఠవచనా దృశ్యశృఙ్గస్య చోభయోః,
శుభే దివసనక్షత్రే నిర్యాతో జగతీపతిః. 36

ప్ర. అ. తథా=అట్లు, వసిష్ఠవచనాత్=వసిష్ఠుని వాక్యమువలనను, ఋశ్యశృఙ్గస్య చ=ఋశ్యశృంగుని వాక్యమువలనను, ఉభయోః = వారిద్దరియొక్క వచనమువలన, జగతీపతిః = భూభర్త, శుభే = శుభ మైన, దివసనక్షత్రే = దివసమునందు, నక్షత్రమునందు, నిర్యాతః = బయలువెడలెను.

తా. (ఋశ్యశృంగుడు కూడ వసిష్ఠుడు చెప్పినవిధముననే చెప్పెను). ఆ వసిష్ఠఋశ్యశృంగుల వచనము ననుసరించి, దశరథుడు శుభనక్షత్రముతో కూడిన శుభదివసమునందు, యాగశాలలో ప్రవేశించుటకై బయలుదేరెను. 36

వి. రామాయణకాలమువారికి వారములు తెలియవు. అందుచే శుభవారము చేర్చుట అసంగతము.

మూ. తతో వసిష్ఠప్రముఖాస్సర్వ ఏవ ద్విజోత్తమాః,
ఋశ్యశృఙ్గం పురస్కృత్య యజ్ఞకర్మారభం స్తదా. 37
యజ్ఞవాటగతాః సర్వే యథాశాస్త్రం యథావిధి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర అ. తతః=పిమ్మట, వసిష్ఠప్రముఖాః = వసిష్ఠుడు మొదలైన, సర్వే ఏవ=సమస్తమైన ఋత్విక్కులును, సర్వే=సమస్తమైన, ద్విజోత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులును, యజ్ఞవాటగతాః = యజ్ఞవాటమును చేరినవారై, యథాశాస్త్రమ్ =

శాస్త్రానుసారముగాను, యథావిధి = విధిప్రకారముగాను, తదా = అప్పుడు, ఋశ్యశృఙ్గమ్ = ఋశ్యశృంగుని, పురస్కృత్య = ముందు ఉంచుకొని, యజ్ఞకర్మ = యజ్ఞకర్మను, ఆరభన్ = ప్రారంభించిరి.

తా. పిమ్మట వసిష్ఠుడు మొదలైన వారందరును యాగశాలలో ప్రవేశించి, ఋశ్యశృంగుని ముందు ఉంచుకొని, యథాశాస్త్రముగ, కల్పోక్తప్రకారమున యాగమును చేయ ప్రారంభించిరి. 37

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు

బాలకాండలో పదమూడవసర్గ సమాప్తము.

# అథ చతుర్దశః సర్గః

మూ. అథ సంవత్సరే పూర్ణే తస్మిన్ ప్రాప్తే తురఙ్గమే,
సరయ్వాశ్చోత్తరే తీరే రాజ్ఞో యజ్ఞోఽభ్యవర్తత. 1

ప్ర. అ. అథ = అటు పిమ్మట, సంవత్సరే=సంవత్సరము, పూర్ణే సతి= నిండిన దగుచుండగా, తస్మిన్=ఆ, తురఙ్గమే=అశ్వము, ప్రాప్తే సతి = వచ్చిన దగుచుండగా, సరయ్వాః=సరయూనది యొక్క, ఉత్తరే తీరే=ఉత్తరపు టొడ్డు నందు, రాజ్ఞః=రాజుయొక్క, యజ్ఞశ్చ=యాగము, అభ్యవర్తత=ప్రారంభమైనది.

తా. సంవత్సరము పూర్తియై అశ్వము తిరిగి వచ్చినది. అపుడు సరయూ నది ఉత్తరతీరమునందు, దశరథుని యజ్ఞము ప్రారంభ మయ్యెను. 1

మూ. ఋశ్యశృఙ్గం పురస్కృత్య కర్మ చక్రుర్ద్విజర్షభాః,
అశ్వమేధే మహాయజ్ఞే రాజ్ఞోఽస్య సుమహాత్మనః. 2

ప్ర. అ. సుమహాత్మనః = మిక్కిలి పూజింపదగిన బుద్ధి గల, అస్య రాజ్ఞః=ఈ రాజుయొక్క, అశ్వమేధే మహాయజ్ఞే = అశ్వమేధ యాగమునందు, ద్విజర్షభాః=బ్రాహ్మణశ్రేష్ఠులు, ఋశ్యశృఙ్గమ్=ఋశ్యశృంగుని, పురస్కృత్య= ముందు ఉంచుకొని, కర్మ=కార్యమును, చక్రుః=చేసిరి.

తా. మహాత్ముడైన ఆ దశరథుని అశ్వమేధయాగమునందు, బ్రాహ్మణ శ్రేష్ఠులు ఋశ్యశృంగుని ముందు ఉంచుకొని, కార్యములు చేసిరి. 2

మూ. కర్మ కుర్వన్తి విధివద్యాజకా వేదపారగాః,
యథావిధి యథాన్యాయం పరిక్రామన్తి శాస్త్రతః. 3

ప్ర. అ. వేదపారగాః = వేదముల పారమును చూచిన, యాజకాః = ఋత్విక్కులు, విధివత్=యథాశాస్త్రముగ, కర్మ=కార్యమును, కుర్వన్తి=చేసిరి, యథావిధి=వేదములలో ఉన్న విధివాక్యముల ననుసరించి, యథాన్యాయమ్= న్యాయమును అనుసరించి, శాస్త్రతః=శాస్త్రములో చెప్పిన విధమున, పరిక్రామన్తి= సంచరించిరి.

తా. వేదములలో మహాపండితులైన ఋత్విక్కులు కర్మలన్నియు యథా శాస్త్రముగ ఆచరించిరి. వారు వేదవిధుల ప్రకారము, న్యాయానుసారము నంచరించిరి. 3

మూ. ప్రవర్గ్యం శాస్త్రతః కృత్వా తథైవోపసదం ద్విజాః,
చక్రుశ్చ విధివత్సర్వమధికం కర్మ శాస్త్రతః. 4

ప్ర. అ. ద్విజాః=బ్రాహ్మణులు, ప్రవర్గ్యమ్=ప్రవర్గ్యమును, శాస్త్రతః=శాస్త్రానుసారముగా, కృత్వా=చేసి, తథైవ=మరియు, ఉపసదమ్=ఉపసదమును కూడ, విధివత్ = యథావిధిగా చేసి, అధికమ్ = ఇంకను ఇతర మైన, సర్వం కర్మ=కర్మ నంతను, శాస్త్రతః=శాస్త్రప్రకారముగా, చక్రుః=చేసిరి.

తా. బ్రాహ్మణులు అశ్వమేధాంగము లగు ప్రవర్గ్యమును, ఉపసదమును, తదితరకర్మలను శాస్త్రానుసారము నిర్వర్తించిరి. 4

మూ. అభిపూజ్య తతో హృష్టాః సర్వే చక్రుర్యథావిధి,
ప్రాతఃసవనపూర్వాణి కర్మాణి మునిపుఙ్గవాః. 5

ప్ర. అ. తతః=పిమ్మట, మునిపుఙ్గవాః=మునిశ్రేష్ఠులు, సర్వే=అందరును, హృష్టాః=సంతోషముకలవారై, అభిపూజ్య=ఆ యా దేవతలను పూజించి, ప్రాతఃసవనపూర్వాణి = ప్రాతఃసవనము మొదలైన, కర్మాణి=కర్మలను, యథావిధి=యథాశాస్త్రముగా, చక్రుః=చేసిరి.

తా. ఆ మునిశ్రేష్ఠ లందరును సంతుష్టాంతరంగులై, ఆహూతులైన దేవతలను పూజించి, ప్రాతఃసవనాదికర్మలను యథావిధిగ చేసిరి. 5

మూ. ఐన్ద్రశ్చ విధివద్దత్తో రాజా చాభిషుతోఽనఘః,
మాధ్యన్దినం చ సవనం ప్రావర్తత యథాక్రమమ్. 6

ప్ర. అ. ఐన్ద్రశ్చ = ఇంద్రదేవతను ఉద్దేశించిన హవిస్సు, విధివత్ = యథాశాస్త్రముగా, దత్తః=ఇవ్వబడినది, అనఘః=దోషరహితమైన, రాజా చ=సోమలత కూడ, అభిషుతః=నలగగొట్టి రసము తీయబడినది, మాధ్యన్దినమ్=మాధ్యందిన మైన, (మధ్యాహ్నము చేయదగిన) సవనమ్ = సవనము, యథాక్రమమ్=క్రమానుసారముగ, ప్రావర్తత=జరిగెను.

**తా.** ఇంద్రునకు హవిర్భాగములను సమర్పించి నిర్దుష్ట మైన సోమలతను నలగకొట్టి రసము తీసిరి. ఈ విధముగ మాధ్యందిన సవనము యథాశాస్త్రముగ చేయబడెను. 6

మూ. తృతీయసవనం చైవ రాజ్ఞోఽస్య సుమహాత్మనః,
చక్రుస్తే శాస్త్రతో దృష్ట్వా తథా బ్రాహ్మణపుఙ్గవాః. 7

ప్ర. అ. తథా=అట్లే, తే బ్రాహ్మణపుఙ్గవాః=ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు, శాస్త్రతః=శాస్త్రమునుండి, దృష్ట్వా=చూచి, సుమహాత్మనః = చాల పూజ్య మైన బుద్ధిగల, అస్య రాజ్ఞః=ఈ దశరథమహారాజు యొక్క, తృతీయసవనం చైవ=తృతీయ సవనమును కూడ, చక్రుః=చేసిరి.

**తా.** ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు, బుద్ధిశాలి యగు ఆ దశరథుని తృతీయసవనమును కూడ యథాశాస్త్రముగ పూర్తిచేసిరి. 7

మూ. న చాహుతమభూత్తత్ర స్ఖలితం వాపి కించన.
దృశ్యతే బ్రహ్మవత్సర్వం క్షేమయుక్తం హి చక్రిరే. 8

ప్ర. అ. తత్ర=ఆ యజ్ఞమునందు, అహుతమ్ = దోషములతో కూడిన హోమము, నాభూత్=జరుగలేదు. కించన=ఏదియు, స్ఖలితమ్=పొరబాటుకూడ, నాభూత్=జరుగలేదు. సర్వమ్=అంతయు, బ్రహ్మవత్=మంత్రయుక్తముగానే, దృశ్యతే=కనబడుచున్నది. క్షేమయుక్తమ్=క్షేమముతో కూడిన విధముననే, చక్రిరే హి=చేసిరి కదా.

**తా.** ఆ యజ్ఞములో హోమములను చేయుటలో కాని, మరి ఏ ఇతర కర్మలలో గాని, ఒక్క పొరబాటు కూడ జరుగలేదు. అంతయు మంత్రపూర్వకముగ జరిగెను. అన్నియు క్షేమకరములుగా ఉండునట్లు చేసిరి. 8

మూ. న తేష్వహస్సు శ్రాన్తో వా క్షుధితో వాపి దృశ్యతే,
నావిద్వాన్ బ్రాహ్మణస్తత్ర నాశతానుచరస్తథా. 9

ప్ర. అ. తేషు=ఆ, అహస్సు=దినములలో, శ్రాన్తః=అలసినవాడు, న దృశ్యతే=కనబడడు. క్షుధితో వాపి=లేదా ఆకలిగొన్నవాడు, న=కనబడడు,

తత్ర=అచట, అవిద్వాన్=విద్వాంసుడుకాని, బ్రాహ్మణః=బ్రాహ్మణుడు, న=కనబడడు. తథా=అట్లే, అశతానుచరః=నూర్గురు అనుచరులు లేనివాడు (అనగా కూడా నూర్గురు శిష్యులు లేని బ్రాహ్మణుడు), న=కనబడడు.

తా. ఆ దివసములలో అలసినవాడు గాని, ఆకలిగొన్నవాడు గాని, విద్యావిహీనుడైన బ్రాహ్మణుడు గాని, నూరుగురు శిష్యులు కూడ లేని బ్రాహ్మణుడు కాని, కనబడలేదు. 9

మూ. బ్రాహ్మణా భుఞ్జతే నిత్యం నాథవన్తశ్చ భుఞ్జతే,
తాపసా భుఞ్జతే చాపి శ్రమణా భుఞ్జతే తథా. 10

ప్ర. అ. నిత్యమ్=నిత్యము, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, భుఞ్జతే=భుజించుచుండిరి. నాథవన్తశ్చ=ప్రభువులు కలవారును, అనగా దాసులును, భుఞ్జతే=భుజించుచుండిరి. తాపసాశ్చాపి=మునులు కూడ, భుఞ్జతే=భుజించుచుండిరి. తథా=మరియు, శ్రమణాః=సంన్యాసులును, భుఞ్జతే=భుజించుచుండిరి.

తా. ఆ యాగము జరిగినన్నాళ్ళును, బ్రాహ్మణులు, దాసులు, మునులు, సంన్యాసులు అందరును తృప్తిగా భుజించుచుండిరి. 10

వి. శ్రమణులనగా— "చతుర్థమాశ్రమం ప్రాప్తాః శ్రమణా నామ తే స్మృతాః" అను స్మృతివాక్యము ననుసరించి సంన్యాసు లని అర్థము. అందుచే దీనికి బౌద్ధసంన్యాసు లని అర్థము చెప్పి, రామాయణము బౌద్ధమతావిర్భావానంతరము వ్రాయబడినది అని చెప్పుట అయుక్త మని కొందరి అభిప్రాయము.

మూ. వృద్ధాశ్చ వ్యాధితాశ్చైవ స్త్రియో బాలాస్తథైవ చ,
అనిశం భుఞ్జమానానాం న తృప్తిరుపలభ్యతే. 11

ప్ర. అ. వృద్ధాః=ముసలివారును, వ్యాధితాశ్చైవ=రోగపీడితులును, స్త్రియః=స్త్రీలును, తథైవ చ=మరియు, బాలాః=బాలులును, (భుఞ్జతే=తినుచుండిరి), అనిశమ్=ఎల్లప్పుడును, భుఞ్జమానానామ్=తినుచున్న వీరికి, తృప్తిః=తృప్తి, న ఉపలభ్యతే=పొందబడుటలేదు.

తా. వృద్ధులును, రోగములతో బాధపడుచున్నవారును, స్త్రీలును, బాలురును తినుచుండిరి. ఈ విధముగ నిరంతరము భుజించుచున్నను వారికి తృప్తి

కలుగుటలేదు. భోజనము అంత మధురముగా ఉన్నదని భావము. లేదా—ఇంత మంది ఈ విధముగ నిరంతరము భుజించుచున్నను వడ్డించువారికిని, దశరథునకును, తృప్తి కలుగుట లేదు అని భావము. 11

మూ. దీయతాం దీయతామన్నం వాసాంసి వివిధాని చ,
ఇతి సంచోదితా స్తత్ర తథా చక్రురనేకశః. 12

ప్ర. అ. అన్నమ్=అన్నము, దీయతాం, దీయతామ్ = ఇవ్వబడుగాక, ఇవ్వబడుగాక. వివిధాని=అనేకవిధము లైన, వాసాంసి చ=వస్త్రములును, ఇవ్వబడుగాక. ఇతి=ఈ విధముగా, తత్ర=ఆ యాగభూమియందు, సంచోదితాః=ప్రేరేపింపబడినవారై, అనేకశః=అనేకవిధములుగ, తథా=ఆ విధముగ, చక్రుః=చేసిరి.

తా. "అన్నము పెట్టండి పెట్టండి; అనేకవిధము లైన వస్త్రాలు కూడ పంచిపెట్టండి, పంచిపెట్టండి", అని దశరథమంత్ర్యాద్యులచే ప్రేరితులై, అచటివారు ఆ విధముగ చేసిరి. 12

మూ. అన్నకూటాశ్చ బహవో దృశ్యన్తే పర్వతోపమాః,
దివసే దివసే తత్ర సిద్ధస్య విధివత్తదా. 13

ప్ర. అ. తత్ర=అచట, తదా=అప్పుడు, విధివత్=తగురీతిని, సిద్ధస్య=సిద్ధ మైన, అన్నకూటాః=భోజ్యపదార్థముల రాసులు, బహవః=అనేకము, పర్వతోపమాః = పర్వతముల వలె, దివసే దివసే = ప్రతిదివసమునందు, దృశ్యన్తే=కనబడు చుండెను.

తా. అచట ప్రతిదినమునందు, శ్రద్ధగా వండిన భోజ్యపదార్థముల రాసులు అనేకములు పర్వతము వలె కనబడు చుండెను. 13

మూ. నానాదేశా దనుప్రాప్తాః పురుషాః స్త్రీగణా స్తథా,
అన్నపానైః సువిహితా స్తస్మిన్యజ్ఞే మహాత్మనః. 14

ప్ర. అ. మహాత్మనః=ఆ మహాత్మునియొక్క, తస్మిన్ యజ్ఞే=ఆ యజ్ఞమునందు, నానాదేశాత్=అనేకదేశములనుండి, అనుప్రాప్తాః=వచ్చిన, పురుషాః=

పురుషులును, తథా=మరియు, స్త్రీగణాః=స్త్రీసముదాయములును, అన్నపానైః=అన్నపానములచే, సువిహితాః=బాగుగా తృప్తిపొందింపబడిరి.

తా. దశరథుని యజ్ఞమునందు నానాదేశములనుండి వచ్చిన స్త్రీపురుషులు, అన్నపానములచే తృప్తి పొందింపబడిరి. 14

మూ. అన్నం హి విధివత్స్వాదు ప్రశంసన్తి ద్విజర్షభాః,
అహో తృప్తాః స్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః 15

ప్ర. అ. ద్విజర్షభాః=బ్రాహ్మణశ్రేష్ఠులు, విధివత్=వండవలసిన పద్ధతిలో వండిన, స్వాదు=మధుర మైన, అన్నమ్=అన్నమును, ప్రశంసన్తి=ప్రశంసించిరి, రాఘవః=దశరథుడు,—"అహో=ఆహా! తృప్తాః స్మః=సంతృప్తుల మైనాము; తే=నీకు, భద్రమ్=భద్ర మగుగాక," ఇతి=ఈ విధమగు మాటలను, శుశ్రావ=వినెను.

తా. యథావిధిగ వండిన, మధుర మైన అన్నమును భుజించిన బ్రాహ్మణశ్రేష్ఠులు, "ఆహా! తృప్తి చెందినాము. నీకు మంగళ మగుగాక" అని పలుకుచుండగా, దశరథుడు విని ఆనందించెను. 15

మూ. స్వలఙ్కృతాశ్చ పురుషా బ్రాహ్మణాన్ పర్యవేషయన్,
ఉపాసతే చ తానన్యే సుమృష్టమణికుణ్డలాః. 16

ప్ర. అ. స్వలఙ్కృతాః = బాగుగా అలంకరించుకొనిన, పురుషాః=పురుషులు, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులకు, పర్యవేషయన్=వడ్డించిరి. సుమృష్టమణికుణ్డలాః=మంచి కాంతి గల మణులతో కూడిన కుండలములు గల, అన్యే చ=మరి కొందరు, తాన్=వారిని, ఉపాసతే చ=సేవించిరి.

తా. చక్కగా అలంకరించుకొనిన పురుషులు బ్రాహ్మణులకు వడ్డించుచున్నప్పుడు, మంచి మణికుండలములు ధరించిన మరి కొందరు ఆ వడ్డించువారికి సాహాయ్యము చేసిరి. 16

మూ. కర్మాన్తరే తదా విప్రా హేతువాదాన్ బహూనపి,
ప్రాహుశ్చ వాగ్మినో ధీరాః పరస్పరజిగీషయా. 17

ప్ర. అ. తదా=అప్పుడు, వాగ్మినః=వాక్చాతుర్యము కల, ధీరాః=బుద్ధిశాలు లైన, విప్రాః=బ్రాహ్మణులు, తదా=అప్పుడు, కర్మాన్తరే=కర్మల మధ్య యందు, పరస్పరజిగీషయా=పరస్పరము జయించవలె నను కోరికతో, బహూన్=అనేక మైన, హేతువాదాన్=యుక్తివాదములను, ప్రాహుః చ=పలికిరి కూడ.

తా. కర్మకును కర్మకును మధ్య అవకాశము లభించినపుడు, వాక్చాతుర్యము కలవారును, బుద్ధిశాలులును అగు బ్రాహ్మణులు, ఒండొరులను జయించవలె నను అభిలాషతో అనేకశాస్త్రములకు సంబంధించిన వాగ్వాదములను చేసిరి. 17

మూ. దివసే దివసే తత్ర సంస్తరే కుశలా ద్విజాః,
సర్వకర్మాణి చక్రుస్తే యథాశాస్త్రం ప్రచోదితాః. 18

ప్ర. అ. సంస్తరే=యజ్ఞమునందు, కుశలాః=నేర్పరు లైన, ద్విజాః=బ్రాహ్మణులు, దివసే దివసే = ప్రతిదినమునందును, తత్ర = అచట, ప్రచోదితాః=వసిష్ఠాదులచే ప్రేరేపింపబడినవారై, స్వకర్మాణి=స్వకర్మలను, యథాశాస్త్రమ్=శాస్త్రానుసారముగ, చక్రుః=చేసిరి.

తా. అచట, యజ్ఞకర్మలలో నేర్పు గల బ్రాహ్మణులు, ప్రతిదినమునందును, సర్వకర్మలను, వసిష్ఠాదుల పర్యవేక్షణములో, యథాశాస్త్రముగ నిర్వర్తించిరి. 18

మూ. నాషడఙ్గవిదత్రాసీన్నావ్రతో నాబహుశ్రుతః,
సదస్యాస్తస్య వై రాజ్ఞో నావాదకుశలా ద్విజాః. 19

ప్ర. అ. అత్ర=ఈ యాగశాలలో, అషడఙ్గవిత్=ఆరు వేదాంగములు తెలియని వాడు, నాసీత్=లేకుండెను. అవ్రతః=వ్రతానుష్ఠానము చేయని వాడు, న = లేకుండెను. అబహుశ్రుతః = అధికశాస్త్రపరిచయము లేనివాడు, న = లేకుండెను. తస్య=ఆ, రాజ్ఞః=రాజుయొక్క, సదస్యాః=సదస్యులు, అవాదకుశలాః=శాస్త్రవాదములో కుశలులు కానివారు, న వై=లేకుండిరి.

తా. అచట షడంగవేత్త కానివాడు కాని, వ్రతానుష్ఠానము చేయనివాడు

గాని, బహుశాస్త్రపరిచయము లేనివాడు గాని లేకుండెను. దశరథుని యజ్ఞ సదస్సులో శాస్త్రవాదకౌశలము లేని బ్రాహ్మణు లెవ్వరును సదస్యులుగా లేకుండిరి. 19

మూ. ప్రాప్తే యూపోచ్ఛ్రయే తస్మిన్ షడ్బైల్వాః ఖాదిరా స్తథా,
తావన్తో బిల్వసహితాః పర్ణినశ్చ తథాపరే. 20

శ్లేష్మాతకమయ స్త్వేకో దేవదారుమయ స్తథా,
ద్వావేవ విహితౌ తత్ర బాహువ్య స్తపరిగ్రహౌ. 21

ప్ర. అ. తస్మిన్=ఆ యజ్ఞమునందు, యూపోచ్ఛ్రయే=యూపస్తంభములను ఎత్తవలసిన సమయము, ప్రాప్తే సతి=వచ్చిన దగుచుండగా, బైల్వాః=బిల్వదారువుతో చేసిన, షట్=ఆరు యూపస్తంభములును, తథా=మరియు, బిల్వ సహితాః=బిల్వస్తంభములకు దగ్గరగా ఉండు, తావన్తః=అంత సంఖ్యయే గల, ఖాదిరాః=చంద్రకఱ్ఱతో చేసిన స్తంభములును, తథా=మరియు, పర్ణినః చ=పలాశదండనిర్మితము లగు, అపరే=మరి కొన్ని స్తంభములును, ఏకః=ఒక, శ్లేష్మాతకమయః=శ్లేష్మాతకదారువుతో చేసిన స్తంభము, తథా=మరియు, దేవ దారుమయః=దేవదారువు కఱ్ఱతో చేసిన రెండు స్తంభములును, (శాస్త్రానుసారము దేవదారు స్తంభములు రెండు గాన ఏకవచన మున్నను ద్వివచనార్థము చెప్ప బడినది). నిలుపబడినవి. తత్ర=అచట, ద్వౌ=రెండు స్తంభములు, బాహు వ్యస్తపరిగ్రహౌ ఏవ=చాపిన రెండు బాహువులచే స్పృశింపదగినవిగా, విహితౌ=నిర్మింపబడినవి.

తా. ఆ యజ్ఞములో యూపస్తంభములను నిలుపవలసిన సమయము వచ్చినది. ఆరు మారేడుకఱ్ఱతో చేసిన యూపములు, ఆరు చంద్రకఱ్ఱతో చేసిన యూపములును, మోదుగ కఱ్ఱతో చేసిన యూపములు ఆరును, శ్లేష్మాతకవృక్షము కఱ్ఱతో చేసిన ఒక యూపము, దేవదారుచెట్టు కఱ్ఱతో చేసిన యూపములు రెండును నిలుపబడినవి. ఒక యూపమునకును యూపమునకును మధ్య బారెడు దూరము ఉండు నట్లు నిలుపబడినవి. 20, 21

మూ. కారితాః సర్వ ఏవైతే శాస్త్రజ్ఞైర్యజ్ఞకోవిదైః,
శోభార్థం తస్య యజ్ఞస్య కాఞ్చనాలఙ్కృతా భవన్. 22

ప్ర. అ. శాస్త్రజ్ఞైః=శాస్త్రము నెరిగిన, యజ్ఞకోవిదైః=యజ్ఞమును గూర్చి బాగుగా తెలిసిన వారిచేత, కారితాః=చేయించబడిన, తే సర్వే ఏవ=ఆ యూప స్తంభము లన్నియు, తస్య యజ్ఞస్య=ఆ యజ్ఞముయొక్క, శోభార్థమ్=శోభ కొరకు, కాఞ్చనాలఙ్కృతాః=బంగారముచే అలంకరింపబడినవై, అభవన్= అయినవి.

తా. యజ్ఞప్రవీణులు యథాశాస్త్రముగ చేయించిన ఆ యూపస్తంభములను, యజ్ఞములో శోభగా ఉండుటకై బంగారముతో అలంకరించిరి. 22

మూ. ఏకవింశతియూపాస్తే ఏకవింశత్యరత్నయః,
వాసోభిరేకవింశద్భిరేకైకం సమలఙ్కృతాః. 23

ప్ర. అ. ఏకవింశత్యరత్నయః=ఇరువదియొక్క అరత్నుల ఎత్తు గల, తే=ఆ, ఏకవింశతియూపాః=ఇరువదియొక్క యూపములు, ఏకవింశద్భిః= ఇరువదియొక్క, వాసోభిః=వస్త్రములచే, ఏకైకమ్=ఒక యూపమునకు ఒక వస్త్రము చొప్పున, సమలఙ్కృతాః=అలంకరింపబడినవి.

తా. ఇరువదియొక్క అరత్నుల ఎత్తు ఉన్న అ ఇరువదియొక్క యూప స్తంభములను ఇరువదియొక్క వస్త్రములు చుట్టి అలంకరించిరి. 23

వి. 'అరత్ని' అనగా మోచేయినుండి చిటికెన వ్రేలి చివరి వరకును ఉన్న హస్తభాగము. మూర.

మూ. విన్యస్తా విధివత్సర్వే శిల్పిభిః సుకృతా దృఢాః,
అష్టాశ్రయః సర్వ ఏవ శ్లక్ష్ణరూపసమన్వితాః. 24

ప్ర. అ. సర్వే=అవి అన్నియు, శిల్పిభిః=శిల్పులచేత, సుకృతాః= బాగుగా చేయబడినవి, దృఢాః=దృఢముగా నున్నవి, అష్టాశ్రయః=ఎనిమిది అంచులు కలవి, శ్లక్ష్ణరూపసమన్వితాః=నున్నని రూపము కలవి. సర్వే ఏవ= ఆ స్తంభము లన్నియు, విధివత్=యథాశాస్త్రముగా, విన్యస్తాః=నిలుపబడినవి.

తా. ఆ స్తంభములు నున్నగా, దృఢముగా, ఎనిమిది అంచులు ఉండు నట్లుగా శిల్పులచే చక్కగ నిర్మింపబడినవి. వాటి నన్నింటిని యథాశాస్త్రముగ నిలిపిరి. 24

మూ. ఆచ్ఛాదితాస్తే వాసోభిః పుష్పైర్గన్ధైశ్చ భూషితాః,
సప్తర్షయో దీప్తిమన్తో విరాజన్తే యథా దివి. 25

ప్ర. అ. వాసోభిః=వస్త్రములచేత, ఆచ్ఛాదితాః=అచ్ఛాదింపబడినవియు, పుష్పైః=పుష్పములచేతను, గన్ధైశ్చ=గంధములచేతను, భూషితాః=అలంకరింపబడినవియు అగు, తే=ఆ యూపములు, దీప్తిమన్తః=కాంతిగలవై, దివి=ఆకాశమునందు, సప్తర్షయః యథా=సప్తర్షుల వలె, విరాజన్తే=ప్రకాశించుచున్నవి.

తా. వస్త్రములు కప్పి, పుష్పసుగంధాదులతో అలంకరించిన ఆ యూపస్తంభములు, ఆకాశమునందు సప్తర్షుల వలె, దీప్తిమంతములై ప్రకాశించినవి. 25

మూ. ఇష్టకాశ్చ యథాన్యాయం కారితాశ్చ ప్రమాణతః,
చితోఽగ్నిర్బ్రాహ్మణైస్తత్ర కుశలైః శుల్బకర్మణి. 26

ప్ర. అ. తత్ర=అచట, యథాన్యాయమ్=శాస్త్రానుసారముగా, ప్రమాణతః=కావలసిన కొలత ప్రకారము, ఇష్టకాః=ఇటికలు, కారితాః=చేయించబడినవి. తత్ర=అచట, శుల్బకర్మణి=ఒంటిపేట త్రాడులో కొలతలు వేయుట అను పనియందు, కుశలైః=నేర్పరులైన, బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత, అగ్నిః=అగ్నివేదిక, చితః=ఇటుకలను పేర్చి కట్టబడినది.

తా. శాస్త్రములో చెప్పిన కొలత ప్రకారము నిర్మించిన ఇటికలు పేర్చి, శుల్బకర్మయందు నిపుణులైన బ్రాహ్మణులు అగ్నివేదికలు కట్టిరి. 26

వి. ఒంటిపేట త్రాడుకు శుల్బ మని పేరు. వేరువేరు యజ్ఞములలో వేరువేరు కొలతలతో, వేరు వేరు ఆకారములలో వేదికలు కట్టవలెను. అందుచే ఈ శుల్బము సహాయముతో జ్యామితి (జ్యా=భూమి, మితి=కొలత) చేసి వేదికలు కట్టెడివారు.

మూ. సచిత్యో రాజసింహస్య సంచితః కుశలైర్ద్విజైః,
గరుడో రుక్మపక్షో వై త్రిగుణోఽష్టాదశాత్మకః. 27

ప్ర. అ. కుశలైః=నేర్పరులైన, ద్విజైః=బ్రాహ్మణులచేత, రుక్మపక్షః=బంగారు రెక్కలు కలదియు, త్రిగుణః = మూడు రెట్లు కలదియు, అష్టా

దశాత్మకః=పదునెనిమిది అను సంఖ్యలో ఉన్నదియు అగు, గరుడః=గరుడాకార మైన వేది, రాజసింహస్య=రాజశ్రేష్ఠు డైన దశరథునియొక్క, నచిత్యః=నిత్యాగ్నితో కూడినది, సంచితః=పేర్చబడినది.

తా. దశరథుని చిత్యాగ్నిని ఉంచుటకు వీలుగా, నేర్పు గల బ్రాహ్మణులు గరుడాకార మైన వేదికను నిర్మించిరి. దీనిని ఇతరవేదికలకంటె మూడు రెట్లు ఇటికలు ఎక్కువగా ఉంచి కట్టుటచే మొత్తము పద్దెనిమిది వరుస లైనవి.

వి. అశ్వమేధములో అగ్నిని ఉంచవలసిన వేదికచుట్టూ గరుడాకారములో నిర్మింతురు. ఆ గరుత్మంతుడు తూర్పుదిశకు అభిముఖముగా ఉండి, రెక్కలను, పుచ్ఛమును విస్తృతము చేసి క్రిందికి తలవంచి చూచుచున్నట్లు ఉండును. ఇటికలను పేర్చుటకు 'చయనము' అని పేరు. వాజసనేయశాఖ (శుక్లయజుర్వేద శాఖ)కు చెందినవారు చేయు ఇతరయజ్ఞములలో ఈ వేదిక కట్టు నపుడు ఆరు వరసలు (ప్రస్తారములు) వేయుదురు. అశ్వమేధములో దానికి మూడు రెట్లు (6 3 = 18) వేయుదురు. అందుచే "అష్టాదశాత్మకః" అని చెప్పబడినది. కృష్ణయజుశ్శాఖకు చెందినవారు ఇతరయజ్ఞములలో ఐదు ప్రస్తారములను, అశ్వమేధములో (5×3 = 15) పదిహేను ప్రస్తారములను వేయుదురు. దశరథుడు శుక్లయజుశ్శాఖకు చెందినవా డని దీనిని పట్టి తెలియుచున్నది. 'చిత్యః' అనగా ఈ విధముగా చయనము చేసిన వేదికపై నెలకొల్పబడిన అగ్ని అని యర్థము. 27

మూ. నియుకా స్తత్ర పశవ స్తత్తదుద్దిశ్య దైవతమ్,
ఉరగాః పక్షిణశ్చైవ యథాశాస్త్రం ప్రచోదితాః. 28

ప్ర. అ. తత్ర=అచట, యథాశాస్త్రమ్=శాస్త్రానుసారముగా, ప్రచోదితాః=విహితము లైన, పశవః=పశువులును, ఉరగాః=సర్పములును, పక్షిణశ్చైవ=పక్షులును, తత్తత్=ఆ యా, దైవతమ్ ఉద్దిశ్య=దేవతను ఉద్దేశించి, నియుక్తాః=కట్టబడినవి.

తా. శాస్త్రములో చెప్పిన విధానము ననుసరించి, ఆ యా దేవతలకొరకై, పశువులును, సర్పములును కట్టబడినవి. 28

మూ. శామిత్రే తు హయస్తత్ర తథా జలచరాశ్చ యే,
ఋత్విగ్భిః సర్వమేవైతన్నియుక్తం శాస్త్రతస్తదా 29

ప్ర. అ. శామిత్రే తు=పశువిశసనకర్మయందు (పశువులను చంపి చేయు కర్మయందు) మాత్రము, తత్ర=అచట, హయః=అశ్వము, తథా=మరియు, యే=ఏ, జలచరాః=కూర్మాదిజలచరము లున్నవో అవియు, ఏతత్సర్వమ్=ఇది యంతయు (ఇవి అన్నియు), ఋత్విగ్భిః=ఋత్విక్కులచేత, శాస్త్రతః=శాస్త్రానుసారముగా, నియుక్తమ్=కట్టబడెను.

తా. ఇంతలో పశువిశసనము చేయు సమయము వచ్చినపుడు, అశ్వమును, కొన్ని జలచరములను, ఋత్విక్కులు శాస్త్రానుసారముగా యూపములకు బంధించిరి. 29

వి. అశ్వమేధమున అనేకములైన అరణ్యమృగములను, గ్రామ్యమృగములను బలియిచ్చెదరు. వాటిలో ఆరణ్యమృగాదులను కొన్నింటిని అగ్నికి ప్రదక్షిణము చేయించి విడిచివేయుదురు. గ్రామ్యమృగములను మాత్రమే చంపుదురు.

మూ. పశూనాం త్రిశతం తత్ర యూపేషు నియతం తదా,
అశ్వరత్నోత్తమం తస్య రాజ్ఞో దశరథస్య చ. 30

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అచట, పశూనామ్=పశువులయొక్క, త్రిశతమ్=మూడుశతములును, తస్య=ఆ, దశరథస్య రాజ్ఞః=దశరథమహారాజుయొక్క, అశ్వరత్నోత్తమమ్ = రత్నముల వంటి అశ్వములలో శ్రేష్ఠమైన అశ్వము, యూపేషు=యూపస్తంభములయందు, నియతమ్=కట్టబడెను.

తా. మూడువందల పశువులను, దశరథుని ఉత్తమాశ్వమును యూపస్తంభములకు కట్టిరి. 30

మూ. కౌసల్యా తం హయం తత్ర పరిచర్య సమన్తతః,
కృపాణైర్విశశాసైనం త్రిభిః పరమయా ముదా. 31

ప్ర. అ. తత్ర=అచట, కౌసల్యా=కౌసల్య, తమ్=ఆ, హయమ్=అశ్వమును, సమన్తతః=అంతటను, పరిచర్య=ప్రదక్షిణము చేసి, పరమయా=గొప్ప

ధైన, ముదా=సంతోషముతో, త్రిభిః=మూడు, కృపాణైః=కత్తులచేత, ఏనమ్=దీనిని, విశశాస=చంపెను.

తా. కౌసల్య ఆ అశ్వమునకు ప్రదక్షిణము చేసి, దానిని మూడు కత్తులతో చంపెను.

వి. "యజమానుని భార్యలు బంగారు సూదులతో అశ్వమును గ్రుచ్చవలెను" అని శాస్త్ర ముండుటచే కౌసల్యయే కాక సుమిత్రా కైకేయిలు కూడ బంగారు సూదులతో (కృపాణైః) అంతకు పూర్వమే చంపబడిన అశ్వమును గ్రుచ్చిరి, అని గోవిందరాజులు. 31

మూ. పతత్రిణా తదా సార్ధం సుస్థితేన చ చేతసా,
అవసద్రజనీమేకాం కౌసల్యా ధర్మకామ్యయా. 32

ప్ర. అ. తదా=అప్పుడు, కౌసల్యా = కౌసల్య, సుస్థితేన = స్థిర మైన, చేతసా=చిత్తముతో, ధర్మకామ్యయా=ధర్మాచరణ శ్రద్ధతో, పతత్రిణా సార్ధమ్=గుఱ్ఱముతో కూడ, ఏకామ్=ఒక, రజనీమ్=రాత్రి, అవసత్=నివసించెను.

తా. ధర్మశ్రద్ధావతి యగు కౌసల్య స్థిర మైన చిత్తముతో, ఒక రాత్రి ఆ అశ్వసమీపమున శాస్త్రోక్తరీతిని నివసించెను. 32

మూ. హోతాధ్వర్యుస్తథోద్గాతా హస్తేన సమయోజయన్,
మహిష్యా పరివృత్త్యా చ వావాతాం చ తథాపరామ్. 33

ప్ర. అ. హోతా=హోతయు, అధ్వర్యుః=అధ్వర్యుడు, తథా=మరియు, ఉద్గాతా= ఉద్గాతయు, మహిష్యా=పట్టమహిషితోను, పరివృత్త్యా చ=పరివృత్తితోను, వావాతామ్ = వావాత అనెడు, అపరామ్ = మరియొకతెను, హస్తేన=హస్తముతో, సమయోజయన్=కూర్చిరి, అనగా గ్రహించిరి.

తా. హోత, అధ్వర్యువు, ఉద్గాత అను ఋత్విక్కులు, రాజమహిషిని, పరివృత్తిని, వావాతను, గ్రహించిరి.

వి. రాజుతోపాటు రాజ్యాభిషేకమును పొందిన భార్య మహిషి. ఉపేక్షిత భార్య పరివృత్తి, భోగినీస్త్రీ (ఉంపుడుకత్తె) వావాత. రాజుకు పాత్ర అందించు

నది పాలాకలి. "కృతాభిషేకా మహిషీ పరివృత్తిరుపేక్షితా, వావాతా భోగినీ పాత్రప్రదా పాలాకలీ మతా" (వైజయంతి). అశ్వమేధములో యజమానుడు ఈ నలుగురు స్త్రీలను నలుగురు ఋత్విక్కులకును దక్షిణగా ఇవ్వవలె నట. వారు వాళ్లను పరిగ్రహించి, వారికి బదులుగా మరొక వస్తువు నేదైన తీసికొని, వారిని తిరిగి యజమానునకు ఇచ్చివేయుదురు. ఈ శ్లోకములో బ్రహ్మ అనే ఋత్విక్కునూ, పాలాకలిని చెప్పకపోయినను వారిని గూడ చెప్పి నట్లు గ్రహించవలె నని గోవిందరాజులు వ్రాసిరి. 33

మూ. పతత్త్రిణ స్తస్య వపాముద్ధృత్య నియతేన్ద్రియః,
ఋత్విక్పరమసంపన్నః శ్రపయామాస శాస్త్రతః. 34

ప్ర. అ. నియతేన్ద్రియః=నిగ్రహింపబడిన ఇంద్రియములు కలవాడును, పరమసంపన్నః=మిక్కిలి శాస్త్రజ్ఞానసంపన్నుడును అగు, ఋత్విక్=ఋత్విక్కు, తస్య=ఆ, పతత్త్రిణః=అశ్వముయొక్క, వపామ్=వపను, ఉద్ధృత్య=తీసి, శాస్త్రతః=శాస్త్రానుసారముగా, శ్రపయామాస=పక్వముచేసెను.

తా. ఇంద్రియనిగ్రహవంతుడును, ఉత్తమజ్ఞానసంపన్నుడును అగు ఋత్విక్కు, ఆ అశ్వముయొక్క వపను తీసి, యథాశాస్త్రముగ పక్వము చేసెను. 34

మూ. ధూమగన్ధం వపాయాస్తు జిఘ్రతి స్మ నరాధిపః,
యథాకాలం యథాన్యాయం నిర్ణుదన్ పాపమాత్మనః. 35

ప్ర. అ. నరాధిపః=రాజు, యథాకాలమ్=కాలానుసారముగా, యథాన్యాయమ్=శాస్త్రానుసారముగా, ఆత్మనః=తనయొక్క, పాపమ్=పాపమును, నిర్ణుదన్=తొలగించుకొనుచు, వపాయాః=వపయొక్క, ధూమగన్ధమ్=ధూమముయొక్క గంధమును, జిఘ్రతి స్మ=వాసన చూచెను.

తా. దశరథుడు, తగిన సమయమున, శాస్త్రానుసారముగ, తన పాపమును తొలగించుకొనుటకై వపాధూమగంధమును వాసనచూచెను. 35

మూ. హయస్య యాని చాఙ్గాని తాని సర్వాణి బ్రాహ్మణాః,
అగ్నౌ ప్రాస్యంతి విధివత్సమన్త్రాః షోడశర్త్విజః. 36

ప్ర. అ. హయస్య=అశ్వముయొక్క, యాని=ఏ, అఙ్గాని=వివిధము లైన అవయవములు గలవో, తాని సర్వాణి=వాటిని అన్నింటిని, సమన్త్రైః= మంత్రములతో కూడిన, ఋత్విజః=ఋత్విక్కు లైన, షోడశ=పదహారుగురు, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, అగ్నౌ=అగ్నియందు, ప్రాస్యన్తి=హోమము చేసిరి.

తా. పదహారుగురు ఋత్విక్కులు, అశ్వముయొక్క వివిధాంగములను, సమంత్రకముగ అగ్నిలో హోమము చేసిరి. 36

మూ. ప్లక్షశాఖాసు యజ్ఞానామన్యేషాం క్రియతే హవిః,
అశ్వమేధస్య యజ్ఞస్య వైతసో భాగ ఇష్యతే. 37

ప్ర. అ. అన్యేషామ్=ఇతరములైన, యజ్ఞానామ్= యజ్ఞములయొక్క, హవిః=హవిస్సు, ప్లక్షశాఖాసు=జువ్వికొమ్మలయందు, క్రియతే=ఉంచబడును. అశ్వమేధస్య యజ్ఞస్య=అశ్వమేధ యజ్ఞముయొక్క, భాగః=హవిర్భాగము, వై తసః=ప్రబ్బలితీగయందు సంస్కరింపబడునదిగ, ఇష్యతే=విధింపబడుచున్నది.

తా. ఇతరయజ్ఞములలో హవిస్సును జువ్వికొమ్మలపై ఉంచి సంస్కరింప వలెను. అశ్వమేధమునందు మాత్రము ప్రబ్బలితీగపై ఉంచి సంస్కరించ వలెను. 37

మూ. త్ర్యహోఽశ్వమేధః సంఖ్యాతః కల్పసూత్రేణ బ్రాహ్మణైః,
చతుష్టోమమహస్తస్య ప్రథమం పరికల్పితమ్. 38

ప్ర. అ. బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత, కల్పసూత్రేణ=కల్పసూత్రము ప్రకారము, అశ్వమేధః=అశ్వమేధము, త్ర్యహః=మూడురోజుల పాటు చేయ వలసినదిగా, సంఖ్యాతః=చెప్పబడినది. తస్య=దానియొక్క, ప్రథమమ్= మొదటిదైన, అహః=దివసము, చతుష్టోమః=చతుష్టోమ మని, పరికల్పితమ్= ఏర్పరుపబడినది.

తా. కల్పసూత్రానుసారముగా అశ్వమేధము మూడు దినములలో చేయ వలసిన యజ్ఞము, మొదటి దివసమునకు చతుష్టోమ మని పేరు. 38

మూ. ఉక్థ్యం ద్వితీయం సంఖ్యాతమతిరాత్రం తథోత్తరమ్,
కారితాస్తత్ర బహవో విహితాః శాస్త్రదర్శనాత్. 39

ప్ర. అ. ద్వితీయమ్=రెండవది, ఉక్థ్యమ్=ఉక్థ్యమనియు, తథా= మరియు, ఉత్తరమ్=తరువాతిది, అతిరాత్రమ్=అతిరాత్ర మనియు, సంఖ్యాతమ్=చెప్పబడినది. తత్ర=ఆ అశ్వమేధమునందు, శాస్త్రదర్శనాత్=శాస్త్రము యొక్క దర్శనమువలన, విహితాః=విధింపబడిన, బహవః=అనేకక్రతువులు, కారితాః=చేయింపబడినవి.

తా. రెండవ దివసమునకు ఉక్థ్య మనియు, మూడవదానికి అతిరాత్ర మనియు పేర్లు. శాస్త్రానుసారముగా విహితము లగు అనేకము లైన ఇతర క్రతువులను కూడ దశరథుడు ఆ సమయమున చేయించెను. 39

మూ. జ్యోతిష్టోమాయుషీ చైవమతిరాత్రౌ వినిర్మితౌ,
అభిజిద్విశ్వజిచ్చైవమప్తోర్యామో మహాక్రతుః. 40

ప్ర. అ. జ్యోతిష్టోమాయుషీ = జ్యోతిష్టోమాయుర్యాగములు, ఏవమ్ = మరియు, అతిరాత్రౌ=అతిరాత్రయాగములును, నిర్మితౌ=వినిర్మింపబడినవి. అభిజిత్=అభిజిద్యాగము, విశ్వజిత్=విశ్వజిద్యాగము, ఏవమ్=మరియు, అప్తోర్యామః=అప్తోర్యామ మను పేరు గల, మహాక్రతుః=మహాక్రతువు, చేయబడినవి.

తా. జ్యోతిష్టోమ ఆయుర్యాగములు, రెండు అతిరాత్రములు, అభిజిద్యాగ విశ్వజిద్యాగములు, అప్తోర్యామ మను మహాక్రతువు చేయబడినవి. 40

మూ. ప్రాచీం హోత్రే దదౌ రాజా దిశం స్వకులవర్ధనః,
అధ్వర్యవే ప్రతీచీం తు బ్రహ్మణే దక్షిణాం దిశమ్. 41

ఉద్గాత్రే చ తథోదీచీం దక్షిణైషా వినిర్మితా,
అశ్వమేధే మహాయజ్ఞే స్వయంభూవిహితే పురా. 42

ప్ర. అ. స్వకులవర్ధనః = తన వంశమును వృద్ధి పొందించు, రాజా = దశరథమహారాజు, హోత్రే = హోతకు, ప్రాచీం దిశమ్ = తూర్పు దిక్కును, దదౌ = ఇచ్చెను. అధ్వర్యవే = అధ్వర్యునకు, ప్రతీచీమ్ = పశ్చిమదిక్కును, బ్రహ్మణే = బ్రహ్మకు, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును, తథా = మరియు, ఉద్గాత్రే = ఉద్గాతకు, ఉదీచీమ్ = ఉత్తరదిక్కును, ఇచ్చెను. పురా = పూర్వము, స్వయంభూవిహితే = బ్రహ్మచేత విధింపబడిన, అశ్వమేధే మహాయజ్ఞే=అశ్వమేధ యజ్ఞమునందు, ఏషా = ఈ, దక్షిణా=దక్షిణ, వినిర్మితా = నిర్మింపబడినది.

తా. తన వంశమునకు అభివృద్ధి చేకూర్చు దశరథమహారాజు తూర్పు దిక్కునందున్న దేశమును హోతకును, పశ్చిమదిక్కునందున్న దేశమును అధ్వర్యునకును, దక్షిణదిక్కునందున్న దేశమును బ్రహ్మకును, ఉత్తరదిక్కునం దున్న దేశమును ఉద్గాతకును ఇచ్చివేసెను. పూర్వము బ్రహ్మ విధించిన అశ్వమేధ యాగములో ఈ విధముగ దక్షిణ ఈయవలె నని నిర్ణయింపబడినది. 41, 42

మూ. క్రతుం సమాప్య తు తదా న్యాయతః పురుషర్షభః,
ఋత్విగ్భ్యో హి దదౌ రాజా తాం ధరాం క్రతువర్ధనః. 43

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠు డైన, రాజా=రాజు, క్రతువర్ధనః= క్రతువును వృద్ధి పొందించుచు, క్రతుమ్ = క్రతువును, సమాప్య = పూర్తి చేసి, తదా = అప్పుడు, న్యాయతః=శాస్త్రానుసారముగా, తాం ధరామ్ = ఆ భూమిని, ఋత్విగ్భ్యః=ఋత్విక్కులకు, దదౌ = ఇచ్చెను.

తా. పురుషశ్రేష్ఠు డైన దశరథుడు ఆ క్రతువును పూర్తిచేసి, దాని ఫలము పరిపూర్ణముగ లభించుటకై, ఈ భూమి నంతను ఋత్విక్కులకు దానము చేసెను. 43

మూ. ఋత్విజస్త్వబ్రువన్ సర్వే రాజానం గతకల్మషమ్,
భవానేవ మహీం కృత్స్నామేకో రక్షితుమర్హతి. 44

ప్ర. అ. సర్వే=సమస్త మైన, ఋత్విజస్తు=ఋత్విక్కు లైతే, గతకల్మషమ్ = పాపరహితు డైన, రాజానమ్ = రాజునుగూర్చి, అబ్రువన్=పలికిరి. భవాన్=నీవు, ఏకః ఏవ=ఒక్కడవే, కృత్స్నామ్=సమస్త మైన, మహీమ్= భూమిని, రక్షితుమ్=రక్షించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. కాని, ఆ ఋత్విక్కు లందరును, పాపరహితు డైన ఆ దశరథునితో ఇట్లనిరి :— "ఈ భూమి నంతను రక్షింప గలవాడవు నీవొక్కడవే". 44

మూ. న భూమ్యా కార్యమస్మాకం న హి శక్తాః స్మ పాలనే,
రతాః స్వాధ్యాయకరణే వయం నిత్యం హి భూమిప. 45
నిష్క్రయం కించిదేవేహ ప్రయచ్ఛతు భవానితి.

ప్ర. అ. భూమిప=ఓరాజా !, భూమ్యా=భూమిచేత, అస్మాకమ్=మాకు, కార్యమ్=పని, న=లేదు. పాలనే=పాలించుటయందు, శక్తాః=సమర్థులము, న హి=కాము. వయమ్=మేము, నిత్యమ్=ఎల్లప్పుడును, స్వాధ్యాయకరణే=స్వాధ్యాయాధ్యయనమునందు, రతాః హి=ఆసక్తులము కదా ! భవాన్ = నీవు, ఇహ=ఈ భూమివిషయమున, కించిత్=ఏదైన, నిష్క్రియమ్=మూల్యమును, ప్రయచ్ఛతు=ఇచ్చెదవుగాక.

తా. "భూమిని పరిపాలించు ఓ దశరథమహారాజా ! ఎల్లప్పుడు స్వాధ్యాయాధ్యయనము చేసికొనుచుండు మాకు భూమితో పని లేదు. ఈ భూమికి బదులుగ, స్వల్పముగ, ఏదైన ధనము నిమ్ము."

వి. నిష్క్రియమ్=ఏదైన ఒకదానికి బదులు ఇచ్చు ధనము మొ. 45

మూ. మణిరత్నం సువర్ణం వా గావో యద్వా సముద్యతమ్, 46
తత్ప్రయచ్ఛ నరశ్రేష్ఠ ధరణ్యా న ప్రయోజనమ్.

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా ! మణిరత్నమ్=శ్రేష్ఠమైన మాణిక్యము గాని, సువర్ణం వా=బంగారము గాని, గావః=గోవులు గాని, యద్వా=ఏది, సముద్యతమ్=సిద్ధముగా నున్నదో, తత్=అది గాని, ప్రయచ్ఛ=ఇమ్ము. ధరణ్యా=భూమితో, ప్రయోజనమ్=ప్రయోజనము, న=లేదు.

తా. "శ్రేష్ఠమైన మాణిక్యము గాని, బంగారము గాని, గోవులు గాని, ఏ వస్తువు లభ్యమో అది గాని ఇమ్ము. మాకు భూమితో ప్రయోజనము లేదు." 46

మూ. ఏవముక్తో నరపతిర్బ్రాహ్మణైర్వేదపారగైః, 47
గవాం శతసహస్రాణి దశ తేభ్యో దదౌ నృపః,
శతకోటీః సువర్ణస్య రజతస్య చతుర్గుణమ్. 48

ప్ర. అ. నరపతిః=నరులకు ప్రభువైన, నృపః=రాజు, వేదపారగైః=వేదముల పారమును చూచిన, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన వాడై, తేభ్యః = వారికి, గవామ్ = గోవుల యొక్క, దశ శతసహస్రాణి=పది లక్షలను, సువర్ణస్య = బంగారముయొక్క,

శతకోటీః=నూరు కోట్లను, రజతస్య = వెండియొక్క, చతుర్గుణమ్ = నాలుగు రెట్లను, దదౌ = ఇచ్చెను.

తా. వేదములలో నిష్ణాతులైన ఆ బ్రాహ్మణులు ఇట్లు చెప్పగా, దశరథుడు వారికి పది లక్షల గోవులను, వంద కోట్ల బంగారునాణెములను, నాలుగు వందల కోట్ల వెండినాణెములను ఇచ్చెను. 48

మూ. ఋత్విజశ్చ తతః సర్వే ప్రదదుః సహితా వసు,
ఋశ్యశృఙ్గాయ మునయే వసిష్ఠాయ చ ధీమతే. 49

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఋత్విజః = ఋత్విక్కులు, సర్వే = అందరును, సహితాః = కలిసినవారై, వసు = ఆ ధనమును, ఋశ్యశృఙ్గాయ మునయే=ఋశ్యశృంగమునికిని, ధీమతే = బుద్ధిమంతుడైన, వసిష్ఠాయ చ = వసిష్ఠునకును, ప్రదదుః = ఇచ్చిరి.

తా. ఆ ఋత్విక్కు లందరును కలిసి ఆ ధనమును ఋశ్యశృంగునకును, ధీమంతుడైన వసిష్ఠునకును ఇచ్చిరి. 49

మూ. తతస్తే న్యాయతః కృత్వా ప్రవిభాగం ద్విజోత్తమాః,
సుప్రీతమనసః సర్వే ప్రత్యూచుర్ముదితా భృశమ్. 50

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుప్రీతమనసః = బాగుగా సంతోషించిన మనస్సులు గల, తే = ఆ, ద్విజోత్తమాః = బ్రాహ్మణోత్తములు, సర్వే = అందరును, న్యాయతః = న్యాయముగా, ప్రవిభాగమ్ = పంపకమును, కృత్వా = చేసి, భృశమ్ = మిక్కిలి, ముదితాః = సంతోషించినాము అని, ప్రత్యూచుః = తిరిగి పలికిరి.

తా. అంతట సంతోషించిన మనస్సులు గల ఆ బ్రాహ్మణోత్తము లందరును న్యాయానుసారముగ ఆ ధనమును పంచుకొని, "చాల ఆనందించితిమి" అని రాజుతో పలికిరి. 50

మూ. తతః ప్రసర్పకేభ్యస్తు హిరణ్యం సుసమాహితః,
జామ్బూనదం కోటిసంఖ్యం బ్రాహ్మణేభ్యో దదౌ తదా. 51

ప్ర. అ. **తతః = అటు పిమ్మట, తదా = అప్పుడు, సుసమాహితః =** చాల శ్రద్ధకలవాడై, ప్రసర్పకేభ్యః = యాగము చూచుటకై వచ్చిన, బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులకు, కోటిసంఖ్యమ్ = కోటి సంఖ్య గల, జాంబూనదమ్ = బంగారమును, దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట, దశరథుడు శ్రద్ధాయుక్తుడై యాగమును చూచుటకై వచ్చిన బ్రాహ్మణులకు, కోటి బంగారు నాణెము లిచ్చెను. 51

మూ. దరిద్రాయ ద్విజాయాథ హస్తాభరణముత్తమమ్,
కస్మై చిద్యాచమానాయ దదౌ రాఘవనన్దనః. 52

ప్ర. అ. అథ=అటు పిమ్మట, రాఘవనన్దనః = దశరథుడు, యాచమానాయ=యాచించుచున్న, కస్మైచిత్ = ఒకానొక, దరిద్రాయ = దరిద్రుడైన, బ్రాహ్మణాయ=బ్రాహ్మణునకు, ఉత్తమమ్ = ఉత్తమమైన, హస్తాభరణమ్ = హస్తాభరణమును, దదౌ=ఇచ్చివేసెను.

తా. ఇంతలో ఒక దరిద్రబ్రాహ్మణుడు వచ్చి యాచింపగా, దశరథుడాతనికి తన చేత నున్న ఆభరణమును ఇచ్చివేసెను. 52

మూ. తతః ప్రీతేషు నృపతిః ద్విజేషు ద్విజవత్సలః,
ప్రణామమకరోత్తేషాం హర్షపర్యాకులేక్షణః. 53

ప్ర. అ. తతః=పిమ్మట, ద్విజవత్సలః=బ్రాహ్మణులయందు ప్రేమగల, నృపతిః=రాజు, ద్విజేషు=బ్రాహ్మణులు, ప్రీతేషు సత్సు=సంతసించినవారగుచుండగా, హర్షపర్యాకులేక్షణః=ఆనందముతో వ్యాకులమైన చూపులుకలవాడై, తేషామ్=వారియొక్క (వారికి), ప్రణామమ్=నమస్కారమును, అకరోత్=చేసెను.

తా. బ్రాహ్మణులయందు అధికప్రేమ గల దశరథుడు, వారందరును సంతృప్తిపొంది నట్లు చూచి, ఆనందముచే వ్యాకులము లైన చూపులతో, వారికి నమస్కరించెను. 53

మూ. తస్యాశిషోఽథ విధివద్బ్రాహ్మణైః సముదీరితాః,
ఉదారస్య నృవీరస్య ధరణ్యాం ప్రణతస్య చ. 54

ప్ర. అ. అథ=అనంతరము, ఉదారస్య = దానశీలుడును, నృవీరస్య= మానవులలో గొప్ప వీరుడును, ధరణ్యామ్ = భూమిపై, ప్రణతస్య = వంగి నమస్కరించుచున్నవాడును అగు, తస్య=ఆతనికి, బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత, విధివత్ = యథాశాస్త్రముగా, ఆశిషః = ఆశీర్వచనములు, సముదీరితాః = పలకబడినవి.

తా. సాష్టాంగప్రణామము చేయుచున్న, ఆ మహాదాత యైన దశరథుని బ్రాహ్మణులు యథాశాస్త్రముగ ఆశీర్వదించిరి. 54

మూ. తతః ప్రీతమనా రాజా ప్రాప్య యజ్ఞమనుత్తమమ్,
పాపాపహం స్వర్నయనం దుష్కరం పార్థివర్షభైః. 55

ప్ర. అ. తతః=పిమ్మట, రాజా=రాజు, పాపాపహమ్=పాపములను తొలగించునదియు, స్వర్నయనమ్ = స్వర్గమును చేర్చునదియు, పార్థివర్షభైః = శ్రేష్ఠులైన రాజులచేతకూడ, దుష్కరమ్=చేయ శక్యము కానిదియు, అనుత్తమమ్= అత్యుత్తమ మైనదియు అగు, యజ్ఞమ్=యజ్ఞమును, ప్రాప్య=పొంది, ప్రీత మనాః=సంతోషించిన మనస్సు కలవా డయ్యెను.

తా. అశ్వమేధయాగము సర్వపాపములను తొలగించును. స్వర్గమునకు తీసికొని వెళ్లును. గొప్ప రాజులు కూడ దీనిని చేయజాలరు. అట్టి అత్యుత్తమ మైన అశ్వమేధయాగము పూర్తిచేసికొని దశరథుడు చాల సంతసించెను. 55

మూ. తతోఽబ్రవీదృశ్యశృఙ్గం రాజా దశరథ స్తదా,
కులస్య వర్ధనం త్వం తు కర్తుమర్హసి సువ్రత. 56

ప్ర. అ. తతః = పిమ్మట, దశరథః రాజా=దశరథమహారాజు, తదా = అప్పుడు, ఋశ్యశృఙ్గమ్=ఋశ్యశృంగుని గూర్చి, అబ్రవీత్=పలికెను. సువ్రత= మంచి వ్రతము కలవాడా ! కులస్య = కులమునకు, వర్ధనమ్ = వృద్ధి కలిగించు కర్మను, కర్తుమ్ = చేయుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. పిమ్మట దశరథుడు "ఓ! మహామునీ ! నా వంశముయొక్క వృద్ధికి హేతు వగు కర్మను చేయుము" అని ఋశ్యశృంగుని ప్రార్థించెను. 56

మూ. తథేతి చ స రాజానమువాచ ద్విజసత్తమః,
భవిష్యన్తి సుతా రాజంశ్చత్వారస్తే కులోద్వహాః. 57

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే బాలకాణ్డే చతుర్దశః సర్గః.

ప్ర. అ. ద్విజసత్తమః=ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు, తథేతి=అటులనే చేయించెదను అని, రాజానమ్ = రాజును గూర్చి, ఉవాచ=పలికెను, రాజన్ = ఓ రాజా! తే = నీకు, కులోద్వహాః = కులము నుద్ధరించు, చత్వారః=నలుగురు, సుతాః = కుమారులు, భవిష్యన్తి = పుట్టగలరు.

తా. "ఓ రాజా! అటులనే చేయించెదను. నీకు వంశోద్ధారకులైన నలుగురు కుమారులు పుట్టగలరు" అని ఋశ్యశృంగుడు పలికెను. 57

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
బాలకాండలో చతుర్దశసర్గ (14) సమాప్తము.

# అథ పఞ్చదశః సర్గః

మూ. మేధావీ తు తతో ధ్యాత్వా స కించిదిదముత్తరమ్,
లబ్ధసంజ్ఞస్తతస్తం తు వేదజ్ఞో నృపమబ్రవీత్. 1

ప్ర. అ. **తతః**=పిమ్మట, **మేధావీ**=మేధావంతుడును, **వేదజ్ఞః**=వేదములు ఎరిగినవాడును అగు, **సః**=అతడు, **కించిత్**=కొంచెము, **ధ్యాత్వా**=ఆలోచించి, **తతః**=పిమ్మట, **లబ్ధసంజ్ఞః**=పొందబడిన స్మృతికలవాడై, **తమ్**=ఆ, **నృపమ్**=రాజును గూర్చి, **అబ్రవీత్**=పలికెను.

**తా.** మేధావంతుడును, సకలవేదనిష్ణాతుడును అగు ఋశ్యశృంగుడు కొంచెము ఆలోచించి, ఏ కర్మ చేసిన బాగుండునో గుర్తు చేసికొని దశరథునితో ఇట్లనెను. 1

మూ. ఇష్టిం తేఽహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్,
అథర్వశిరసి ప్రోక్తైర్మన్త్రైః సిద్ధాం విధానతః. 2

ప్ర. అ. **అహమ్**=నేను, **తే**=నీకు, **పుత్రకారణాత్**=పుత్రులు కలుగుటకై, **అథర్వశిరసి**=అథర్వశిరస్సు అను వేదభాగమునందు, **ప్రోక్తైః**=చెప్పబడిన, **మన్త్రైః**=మంత్రములచేత, **సిద్ధామ్**=ఏర్పడునదియు (చేయబడునదియు), **పుత్రీయామ్**=పుత్రులను ఇవ్వగలదియు అగు, **ఇష్టిమ్**=యాగమును, **విధానతః**=శాస్త్రానుసారముగ, **కరిష్యామి**=చేయగలను.

**తా.** "నీకు పుత్రులు కలుగుటకై, పుత్రీయేష్టిని చేయించెదను. దీనిని అథర్వశిరస్సు అనెడు వేదభాగములో నున్న మంత్రములచే చేయించవలెను." 2

మూ. తతః ప్రాక్రమ్య తామిష్టిం పుత్రీయాం పుత్రకారణాత్,
జుహావ చాగ్నౌ తేజస్వీ మన్త్రదృష్టేన కర్మణా. 3

ప్ర. అ. **తతః** = పిమ్మట, **పుత్రకారణాత్** = పుత్రులకొరకై, పు యామ్ = పుత్రులను కలిగించు, **తామ్** **ఇష్టిమ్**=ఆ ఇష్టిని, **ప్రాక్రమ్య**=ప్రారం

భించి, తేజస్వీ = బ్రహ్మతేజస్సు గల ఆ ఋశ్యశృంగుడు, మంత్రదృష్టేన = మంత్రోక్తమైన, కర్మణా = కర్మచేత, అగ్నౌ = అగ్నియందు, జుహావ చ = హోమము చేసెను.

తా. బ్రహ్మతేజోవంతు డగు ఋశ్యశృంగుడు, దశరథునకు పుత్రులు కలుగుటకై, పుత్రియేష్టిని ప్రారంభించి, మంత్రోక్తవిధానముతో అగ్నిలో హోమము చేసెను. 3

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
భాగప్రతిగ్రహార్థం వై సమవేతా యథావిధి. 4

ప్ర. అ. తతః = పిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలును, సిద్ధాశ్చ = సిద్ధులును, పరమర్షయః = గొప్ప ఋషులును, యథావిధి = యథాశాస్త్రముగా, భాగప్రతిగ్రహార్థం = యజ్ఞభాగములను స్వీకరించుటకు, సమవేతాః వై = కలసిరి.

తా. అంతట, దేవతలును, గంధర్వులును, సిద్ధులును, పరమర్షులును, శాస్త్రాను సారముగా తమ తమ యజ్ఞభాగములను స్వీకరించుటకై అచట కలిసిరి. 4

మూ. తాః సమేత్య యథాన్యాయం తస్మిన్ సదసి దేవతాః,
అబ్రువన్ లోకకర్తారం బ్రహ్మాణం వచనం మహత్. 5

ప్ర. అ. తాః = ఆ, దేవతాః = దేవతలు, యథాన్యాయమ్ = న్యాయాను సారముగా, తస్మిన్ = ఆ, సదసి = సదస్సునందు, సమేత్య = కలిసి, లోక కర్తారమ్ = లోకములను సృజించు, బ్రహ్మాణమ్ = బ్రహ్మదేవుని గూర్చి, మహత్ = పూజ్య మైన, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ దేవతలందరును శాస్త్రానుసారముగ ఆ సదస్సులో చేరి, సకల లోకస్రష్ట యగు బ్రహ్మదేవుని సమీపించి, పూజ్య మైన వాక్యములు పలికిరి. 5

మూ. భగవన్ త్వత్ప్రసాదేన రావణో నామ రాక్షసః,
సర్వాన్నో బాధతే వీర్యా చ్ఛాసితుం తం న శక్నుమః. 6

ప్ర. అ. భగవన్=ఓ భగవంతుడా! రావణో నామ=రావణు డనెడు, రాక్షసః = రాక్షసుడు, త్వత్ప్రసాదేన = నీ అనుగ్రహముచేత, వీర్యాత్ = పరాక్రమము వలన, నః = మమ్ములను, సర్వాన్=అందరిని, బాధతే = బాధించుచున్నాడు. తమ్=వానిని, శాసితుమ్=శిక్షించుటకు, న శక్నుమః=సమర్థులము కాజాలకున్నాము.

తా. ఓ! భగవంతుడా! రావణు డనెడు రాక్షసుడు, నీ వరప్రసాదము వలన కలిగిన పరాక్రమముతో మమ్ముల నందరిని బాధించుచున్నాడు. ఆతనిని శిక్షింపజాలకున్నాము. 6

మూ. త్వయా తస్మై వరో దత్తః ప్రీతేన భగవన్ పురా,
మానయన్తశ్చ తం నిత్యం సర్వం తస్య క్షమామహే. 7

ప్ర. అ. భగవన్=భగవంతుడా! పురా = పూర్వము, ప్రీతేన=సంతోషించిన, త్వయా=నీచేత, తస్మై=వానికి, వరః=వరము, దత్తః=ఇవ్వబడినది. తమ్=ఆ వరమును, మానయన్తః=గౌరవించుచు, తస్య=ఆతనియొక్క, సర్వమ్=సమస్తమైన దుష్టత్వమును, నిత్యమ్ = ఎల్లప్పుడును, క్షమామహే = క్షమించుచున్నాము.

తా. భగవంతుడా! పూర్వ మాతని తపస్సుకు సంతసించిన నీవు ఆతనికి వర మిచ్చితివి. ఆ వరమును గౌరవించుచు మేము ఆతడు చేయు అపకారమును సర్వదా క్షమించుచున్నాము. 7

మూ. ఉద్వేజయతి లోకాంస్త్రీనుచ్ఛ్రితాన్ ద్వేష్టి దుర్మతిః,
శక్రం త్రిదశరాజానం ప్రధర్షయితుమిచ్ఛతి. 8

ప్ర. అ. దుర్మతిః=ఆ దుర్మతి, త్రీన్=మూడు, లోకాన్=లోకములను, ఉద్వేజయతి=పీడించుచున్నాడు. ఉచ్ఛ్రితాన్=ఉన్నతపదములలో ఉన్నవారిని, ద్వేష్టి=ద్వేషించుచున్నాడు. త్రిదశరాజానమ్=దేవరాజైన, శక్రమ్=ఇంద్రుని, ప్రధర్షయితుమ్=అవమానించుటకు, ఇచ్ఛతి=ఇచ్ఛయించుచున్నాడు.

తా. దుర్బుద్ధి యైన ఆ రావణుడు మూడు లోకములను పీడించుచున్నాడు. లోకపాలులతో ద్వేషము వహించుచున్నాడు. దేవాధీశు డైన ఇంద్రుని కూడ అవమానింప చూచుచున్నాడు. 8

మూ. ఋషీన్యక్షాన్సగన్ధర్వానసురా న్బ్రాహ్మణాం స్తథా,
అతిక్రామతి దుర్ధర్షో వరదానేన మోహితః. 9

ప్ర. అ. దుర్ధర్షః = ఎదిరింప శక్యము కాని అతడు, వరదానేన = వర దానముచేత, మోహితః = గర్వితుడై, ఋషీన్ = ఋషులను, యక్షాన్ = యక్షులను, సగన్ధర్వాన్=గంధర్వులతో కూడిన, అసురాన్ = అసురులను, తథా = మరియు, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, అతిక్రామతి = అవమానించుచున్నాడు.

తా. వరముచే కన్ను గానక, ఆ రావణుడు, ఋషులను, గంధర్వులను, అసురులను, బ్రాహ్మణులను అవమానించుచున్నాడు. వాని నెవ్వరును, జయింప జాలకున్నారు. 9

మూ. నైనం సూర్యః ప్రతపతి పార్శ్వే వాతి న మారుతః,
చలోర్మిమాలీ తం దృష్ట్వా సముద్రోఽపి న కమ్పతే. 10

ప్ర. అ. ఏనమ్ = వీనిని, సూర్యః = సూర్యుడు, న ప్రతపతి = తపింప చేయుటలేదు. మారుతః = గాలి, పార్శ్వే = దగ్గర, న వాతి = వీచుటలేదు. చలోర్మిమాలీ=చంచలము లైన తరంగపంక్తులు గల, సముద్రోఽపి=సముద్రుడు కూడ, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, న కమ్పతే=కదలుటలేదు.

తా. సూర్యుడు ఈతనికి వేడి కలిగించడు. వాయువు ఇతని ప్రక్క మసలుటకు భయపడును. ఎల్లప్పుడును చలించు తరంగపంక్తులు గల సముద్రుడు కూడ ఈతనిని చూడగనే స్తంభించిపోవును. 10

మూ. తన్మహన్నో భయం తస్మాద్రాక్షసాద్ఘోరదర్శనాత్,
వధార్థం తస్య భగవన్నుపాయం కర్తుమర్హసి. 11

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, ఘోరదర్శనాత్=ఘోర మైన దర్శనము గల, తస్మాత్=ఆ, రాక్షసాత్=రాక్షసునినుండి, నః=మాకు, మహత్= గొప్ప, భయమ్=భయము. భగవన్=భగవంతుడా! తస్య=వానియొక్క, వధార్థమ్= వధకొరకై, ఉపాయమ్=ఉపాయమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి=తగుదువు.

తా. వాని దర్శనమే చాల ఘోర మైనది. అట్టి వానినుండి మాకు గొప్ప భయము వచ్చిపడినది. భగవంతుడా! వానిని చంపుటకై ఏదైన ఒక ఉపాయ మును చేయుము. 11

మూ. ఏవముక్తః సురైః సర్వైశ్చిన్తయిత్వా తతోఽబ్రవీత్,
హన్తాయం విదిత స్తస్య వధోపాయో దురాత్మనః. 12

ప్ర. అ. సర్వైః=సమస్త మైన, సురైః=దేవతలచేత, ఏవమ్=ఈవిధ ముగా, ఉక్తః=పలకబడిన బ్రహ్మదేవుడు, చిన్తయిత్వా=ఆలోచించి, తతః= అటుపిమ్మట, అబ్రవీత్=పలికెను. తస్య=ఆ, దురాత్మనః=దురాత్మునియొక్క, అయమ్=ఈ, వధోపాయః = చంపుటకు ఉపాయము, విదితః = తెలిసినది. హన్త=ఆహా!

తా. దేవతల మాటలు విని బ్రహ్మదేవుడు ఆలోచించి, ఇట్లు పలికెను. "ఆహా! ఈ దురాత్ముని చంపుటకు ఒక ఉపాయము తోచినది." 12

మూ. తేన గన్ధర్వయక్షాణాం దేవదానవరక్షసామ్,
అవధ్యోఽస్మీతి వాగుక్తా తథేత్యుక్తం చ తన్మయా. 13

ప్ర. అ. తేన=వానిచేత, గన్ధర్వయక్షాణామ్=గంధర్వులకు యక్షులకు, దేవదానవరక్షసామ్=దేవతలకు దానవులకు రాక్షసులకు, అవధ్యః=చంపశక్యము కానివాడను, అస్మి=అగుదును గాక, ఇతి=అని, వాక్=వాక్కు, ఉక్తా=పలక బడినది. మయా చ=నా చేత కూడ, తత్=అది, తథా=అట్లే అగుగాక అని, ఉక్తమ్=చెప్పబడినది.

తా. దేవదానవరాక్షసగంధర్వయక్షుల చేతిలో నాకు చావు లేకుండు గాక అని అతడు పలుకగా, అట్లే అగుగాక అని నే నంటిని. 13

మూ. నాకీర్తయదవజ్ఞానాత్తద్రక్షో మానుషాం సదా,
తస్మాత్స మానుషాద్వధ్యో మృత్యుర్నాన్యోఽస్య విద్యతే. 14

ప్ర. అ. తత్ రక్షః=ఆ రాక్షసుడు, అవజ్ఞానాత్ = అనాదరమువలన, తదా = అప్పుడు, మానుషాన్ = మనుష్యులను, న అకీర్తయత్ = చెప్పలేదు.

తస్మాత్ = ఆ కారణమువలన, సః = ఆతడు, మానుషాత్ = మనుష్యునివలన, వధ్యః=చంపదగినవాడు. అన్య = వానికి, అన్యః = మరియొక, మృత్యుః= మరణహేతువు, న విద్యతే = లేదు.

తా. అప్పుడా రాక్షసుడు మనుష్యుల విషయమై అనాదరముచే వారిని పేర్కొనలేదు. కావున ఆ రాక్షసుడు మనుష్యుని చేతిలో చచ్చుటకు అవకాశ మున్నది. మరొక మరణోపాయము లేదు. 14

మూ. ఏతచ్ఛ్రుత్వా ప్రియం వాక్యం బ్రహ్మణా సముదాహృతమ్,
దేవా మహర్షయః సర్వే ప్రహృష్టాస్తేఽభవం స్తదా. 15

ప్ర. అ. తదా = అప్పుడు, బ్రహ్మణా = బ్రహ్మచేత, సముదాహృతమ్= చెప్పబడిన, ఏతత్ = ఈ, ప్రియమ్ = ప్రియమైన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తే దేవాః=ఆ దేవతలును, మహర్షయః = మహర్షులును, సర్వే= అందరును, ప్రహృష్టాః అభవన్=సంతసించిరి.

తా. బ్రహ్మదేవుడు పల్కిన ఈ ప్రియవాక్యమును విని, దేవతలును, మహర్షులును, అందరును చాల సంతసించిరి. 15

మూ. ఏతస్మిన్నన్తరే విష్ణురుపయాతో మహాద్యుతిః,
శఙ్ఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః. 16

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=అవకాశమునందు, మహాద్యుతిః= గొప్ప కాంతికలవాడును, శఙ్ఖచక్రగదాపాణిః=శంఖచక్రగదలు హస్తములందు కలవాడును, పీతవాసాః=పచ్చని వస్త్రమును ధరించినవాడును, జగత్పతిః = జగత్తుకు ప్రభువును అయిన, విష్ణుః=విష్ణువు, ఉపయాతః = వచ్చెను.

తా. ఇంతలో, గొప్ప కాంతి కలవాడును జగత్తునకంతకును ప్రభువును అయిన విష్ణువు శంఖచక్రగదాహస్తుడై, పీతాంబరధారియై అచటికి వచ్చెను. 16

మూ. బ్రహ్మణా చ సమాగమ్య తత్ర తస్థౌ సమాహితః,
తమబ్రువన్ సురాస్సర్వే సమభిష్టూయ సన్నతాః. 17

ప్ర. అ. బ్రహ్మణా=బ్రహ్మతో, సమాగమ్య=కలిసి, తత్ర = అచట, సమాహితః=ఏకాగ్రచిత్తుడై, తస్థౌ=ఉండెను. సురాః=దేవతలు, సర్వే=అంద రును, సన్నతాః=నమస్కరించుచున్నవారై, తమ్ = ఆతనిని, సమభిష్టూయ = స్తుతించి, అబ్రువన్=ఇట్లు పలికిరి.

తా. విష్ణువు బ్రహ్మను కలిసి, మౌనముగా నిలబడెను. అంతట దేవత లందరును నమస్కరించి స్తుతించుచు ఆ విష్ణువుతో ఇట్లనిరి. 17

మూ. త్వాం నియోక్ష్యామహే విష్ణో లోకానాం హితకామ్యయా,
రాజ్ఞో దశరథస్య త్వమయోధ్యాధిపతేః ప్రభోః. 18

ధర్మజ్ఞస్య వదాన్యస్య మహర్షిసమతేజసః,
తస్య భార్యాసు తిసృషు హ్రీశ్రీకీర్త్యుపమాసు చ. 19
విష్ణో పుత్రత్వమాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్.

ప్ర. అ. విష్ణో=ఓ విష్ణూ! లోకానామ్=లోకములయొక్క, హితకామ్యయా= హితమునందు కోరికచేత, త్వామ్= నిన్ను, నియోక్ష్యామహే = నియమించు చున్నాము. విష్ణో=ఓ! విష్ణూ! త్వమ్=నీవు, అయోధ్యాధిపతేః = అయోధ్యకు అధిపతియు, ప్రభోః=ప్రభువును, ధర్మజ్ఞస్య=ధర్మముల నెరిగినవాడును, వదా న్యస్య=ఔదార్యవంతుడును, మహర్షిసమతేజసః=మహర్షితో సమాన మైన తేజస్సు కలవాడును అగు, తస్య దశరథస్య రాజ్ఞః=ఆ దశరథమహారాజుయొక్క, హ్రీశ్రీ కీర్త్యుపమాసు=హ్రీ, శ్రీ, కీర్తి అను దక్షపుత్రికలతో సమానులైన, తిసృషు = ముగ్గురు, భార్యాసు=భార్యలయందు, ఆత్మానమ్=తనను, చతుర్విధమ్=నాలుగు విధము లైనవానినిగా, కృత్వా=చేసి, పుత్రత్వమ్=పుత్రత్వమును, ఆగచ్ఛ= పొందుము.

తా. ఓ విష్ణూ! లోకముల హితముకొరకై నిన్ను ఒక కార్యము చేయు టకై వేడుచున్నాము. అయోధ్యాధిపతి యైన దశరథుడు ధర్మజ్ఞుడు. ఔదార్య వంతుడు, మహర్షి వంటి తేజస్సు కలవాడు, సత్ప్రభువు. నీవు నాలుగు విధము లుగా ఏర్పడి హ్రీ-శ్రీ-కీర్తుల వంటి ఆతని ముగ్గురి భార్యలలో పుత్రులుగా ఆవిర్భవింపుము. 18, 19

మూ. తత్ర త్వం మానుషో భూత్వా ప్రవృద్ధం లోకకణ్టకమ్, 20
అవధ్యం దైవతైర్విష్ణో సమరే జహి రావణమ్.

ప్ర. అ. విష్ణో=ఓ విష్ణూ, త్వమ్=నీవు, తత్ర=దశరథభార్యలయందు, మానుషః = మనుష్యుడుగా, భూత్వా=జనించి, ప్రవృద్ధమ్ = పెచ్చుపెరిగి పోవుచున్నవాడును, లోకకణ్టకమ్=లోకములకు కంటకము వంటి వాడును, దైవతైః= దేవతలచేత, అవధ్యమ్=చంప శక్యము కానివాడును అగు, రావణమ్ = రావణుని, సమరే = యుద్ధమునందు, జహి=చంపుము.

తా. ఓ విష్ణూ ! నీవు ఆ దశరథభార్యలయందు మనుష్యుడుగా జన్మించి, మితిమీరిపోవుచున్నవాడును, లోకములకు కంటకము వలె నున్నవాడును, దేవతలచే చంప శక్యముకానివాడును అగు రావణుని యుద్ధమునందు సంహరించుము. 20

మూ. స హి దేవాంశ్చ గన్ధర్వాన్ సిద్ధాంశ్చ మునిసత్తమాన్, 21
రాక్షసో రావణో మూర్ఖో వీర్యోత్సేకేన బాధతే.

ప్ర. అ. సః = ఆ, మూర్ఖః = మూర్ఖుడైన, రాక్షసః = రాక్షసుడైన, రావణః = రావణుడు, దేవాంశ్చ = దేవతలను, గన్ధర్వాన్ = గంధర్వులను, సిద్ధాంశ్చ=సిద్ధులను, మునిసత్తమాన్ = మునిశ్రేష్ఠులను, వీర్యోత్సేకేన = వీర్యగర్వముచే, బాధతే హి = బాధించుచున్నాడు కదా.

తా. మూర్ఖుడైన రాక్షసుడు, ఆ రావణుడు, వీర్యమదముచే, దేవతలను, గంధర్వులను, సిద్ధులను, మునిశ్రేష్ఠులను బాధించుచున్నాడు. 21

మూ. ఋషయశ్చ తతస్తేన గన్ధర్వాప్సరసస్తథా, 22
క్రీడన్తో నన్దనవనే క్రూరేణ కిల హింసితాః.

ప్ర. అ. తతః = ఆ పరాక్రమగర్వమువలన, తేన=ఆ, క్రూరేణ = క్రూరునిచేత, ఋషయశ్చ = ఋషులును, తథా = మరియు, నన్దనవనే = నందనవనమునందు, క్రీడన్తః = క్రీడించుచున్న, గన్ధర్వాప్సరసః = గంధర్వులు, అప్సరసలును, హింసితాః కిల=హింసింపబడినారుకదా.

**తా.** ఆ కూ్రరుడు, ఎందరో ఋషులను, నందనవనములో విహరించు చున్న గంధర్వులను, అప్సరసలను హింసించినాడు కదా ! 22

మూ. వధార్థం వయమాయాతా స్తస్య వై మునిభిః సహ, 23
సిద్ధగన్ధర్వయక్షాశ్చ తతస్త్వాం శరణం గతాః.

ప్ర. అ. వయమ్=మేము, సిద్ధగన్ధర్వయక్షాశ్చ=సిద్ధులు, గంధర్వులు, యక్షులును, మునిభిః సహ=మునులతో, తస్య=వానియొక్క, వధార్థమ్=వధ కొరకై, ఆయాతాః=వచ్చిఉన్నాము. తతః=ఆ కారణమువలన, (మేమందర మును), త్వామ్=నిన్ను, శరణం గతాః=శరణు పొందినాము.

**తా.** కావున, సిద్ధగంధర్వయక్షులును, మేమును, మునులతో కలిసి నిన్ను వేడుకొనుటకై ఇచటికి వచ్చినాము. మేమందరము నిన్ను శరణు పొందు చున్నాము. 23

మూ. త్వం గతిః పరమా దేవ సర్వేషాం నః పరంతప, 24
వధాయ దేవశత్రూణాం నృణాం లోకే మనః కురు

ప్ర. అ. పరంతప = శత్రువులను బాధించు, దేవ = ఓ విష్ణుదేవుడా ! త్వమ్=నీవే, నః సర్వేషామ్=మాకందరికిని, పరమా=శ్రేష్ఠమైన, గతిః=గతి యైనవాడవు, దేవశత్రూణామ్=రాక్షసులయొక్క, వధాయ=సంహారముకొరకు, నృణాం లోకే=మనుష్యలోకమునందు, మనః=మనస్సును, కురు=చేయుము.

**తా.** ఓ ! శత్రువినాశకా ! నీవే మాకు అందరికిని అత్యుత్తమ మైన గతివి. రాక్షససంహారము చేయుటకై నరలోకమున జనింప నిశ్చయము చేయుము. 24

మూ. ఏవముక్తస్తు దేవేశో విష్ణుస్త్రిదశపుఙ్గవః, 25
పితామహపురోగాంస్తాన్ సర్వలోకనమస్కృతః,
అబ్రవీత్త్రిదశాన్ సర్వాన్ సమేతాన్ ధర్మసంహితాన్. 26

ప్ర. అ. త్రిదశపుఙ్గవః=దేవతలలో శ్రేష్ఠుడును, సర్వలోకనమస్కృతః= సర్వలోకములచే నమస్కరింపబడినవాడును, దేవేశః=దేవతల ప్రభువును అగు, విష్ణుః=విష్ణువు, ఏవమ్=ఈ విధముగా, ఉక్తః=పలకబడినవాడై, సమేతాన్= అచట కలిసినవారును, ధర్మసంహితాన్=ధర్మముతో కూడినవారును, పితామహ

పురోగాన్=బ్రహ్మ మొద లైన, తాన్=ఆ, సర్వాన్=సమస్త మైన, త్రిదశాన్=దేవతలను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. దేవతల ప్రభువును, దేవశ్రేష్ఠుడును, సర్వలోకములచే నమస్కరింపబడినవాడును, అగు విష్ణువు, ఈ విధముగా ప్రార్థింపబడినవాడై, ధర్మమును అనుసరించువారగు అచటికి చేరిన బ్రహ్మాది దేవతల నందరిని ఉద్దేశించి ఇట్లు పలికెను. 25, 26

మూ. భయం త్యజత భద్రం వో హితార్థం యుధి రావణమ్,
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతిబాన్ధవమ్, 27

హత్వా క్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహమ్,
దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ,
వత్స్యామి మానుషే లోకే పాలయన్ పృథివీమిమామ్. 28

ప్ర. అ. భయమ్=భయమును, త్యజత=విడవండి, భద్రమ్=క్షేమమగు గాక. వః=మీయొక్క, హితార్థమ్=హితముకొరకు, సపుత్రపౌత్రమ్ = పుత్రపౌత్రాదులతో కూడినవాడును, సామాత్యమ్ = అమాత్యులతో కూడినవాడును, సమిత్రజ్ఞాతిబాన్ధవమ్ = మిత్రులతో జ్ఞాతులతో బంధువులతో కూడినవాడును, క్రూరమ్ = క్రూరుడును, దురాత్మానమ్ = దుష్టస్వభావము కలవాడును, దేవర్షీణామ్=దేవతలకును ఋషులకును, భయావహమ్ = భయము కలిగించువాడును అగు, రావణమ్ = రావణుని, యుధి=యుద్ధమునందు, హత్వా=చంపి, ఇమామ్ = ఈ, పృథివీమ్ = భూమిని, పాలయన్ = పాలించుచు, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సరములును, దశవర్షశతాని చ = పది వందల సంవత్సరములును, మానుషే లోకే = మనుష్యలోకమునందు, వత్స్యామి = నివసింపగలను.

తా. "భయము విడిచిపెట్టుడు. మీకు క్షేమ మగును. మీ హితము కొరకై, నేను, క్రూరుడును, దురాత్ముడును, దేవతలకు (మీకును) ఋషులకు భయము కలిగించువాడును అగు రావణుని, వాని పుత్ర-పౌత్ర-అమాత్య-మిత్ర-జ్ఞాతి-బాంధవులను, యుద్ధమునందు సంహరించి, పదకొండువేల సంవత్సరములు మర్త్యలోకములో నివసించి, ఈ భూమిని పాలింపగలను." 27, 28

మూ. ఏవం దత్వా వరం దేవో దేవానాం విష్ణురాత్మవాన్, 29
మానుషే చిన్తయామాస జన్మభూమిమథాత్మనః.

ప్ర. అ. ఆత్మవాన్=ఉత్తమబుద్ధికలవాడగు, విష్ణుః దేవః=విష్ణుదేవుడు, దేవానామ్=దేవతలకు, ఏవమ్=ఈవిధముగా, వరమ్=వరమును, దత్వా=ఇచ్చి, అథ=పిమ్మట, ఆత్మనః=తనకు, మానుషే=మనుష్యలోకమునందు, జన్మ భూమిమ్=అవతరించుటకు తగిన స్థానమును గూర్చి, చిన్తయామాస=ఆలోచించెను.

తా. బుద్ధిమంతు డగు విష్ణుదేవుడు దేవతలకు ఈ విధముగా వరము నిచ్చి, తాను మనుష్యలోకములో అవతరించుటకు తగిన స్థానమును గూర్చి ఆలోచించెను. 29

మూ. తతః పద్మపలాశాక్షః కృత్వాత్మానం చతుర్విధమ్, 30
పితరం రోచయామాస తదా దశరథం నృపమ్.

ప్ర. అ. తతః = పిమ్మట, పద్మపలాశాక్షః = పద్మపు రేకుల వంటి కన్నులు గల విష్ణువు, తదా = అప్పుడు, ఆత్మానమ్ = తనను, చతుర్విధమ్ = నాలుగు విధములుగా, కృత్వా = చేసి, దశరథం నృపమ్=దశరథమహారాజును, పితరమ్ = తండ్రినిగా, రోచయామాస = ఇష్టపడెను.

తా. అంత, పద్మము రేకుల వంటి నేత్రములు గల ఆ విష్ణువు, అప్పుడు, తనను నాలుగు విధములుగా చేసి, దశరథుని తన తండ్రిగా చేసికొనుటకు ఇష్ట పడెను. 30

మూ. తతో దేవాః సగన్ధర్వాస్సరుద్రాః సాప్సరోగణాః,
స్తుతిభిర్దివ్యరూపాభిస్తుష్టువుర్మధుసూదనమ్. 31

ప్ర. అ. తతః=పిమ్మట, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, సరుద్రాః= రుద్రులతో కూడిన, సాప్సరోగణాః = అప్సరఃస్త్రీల సముదాయములో కూడిన, దేవాః=దేవతలు, దివ్యరూపాభిః=దివ్యమైన రూపము గల, స్తుతిభిః=స్తోత్రముల చేత, మధుసూదనమ్=మధువు అను రాక్షసుని చంపిన విష్ణువును, తుష్టువుః = స్తుతించిరి.

తా. అంతట దేవతలును, గంధర్వులును, రుద్రులును అప్సరస్త్రీ గణములును దివ్యము లగు స్తోత్రములతో ఆ విష్ణువును స్తుతించిరి. 31

మూ. తముద్ధతం రావణముగ్రతేజసం
ప్రవృద్ధదర్పం త్రిదశేశ్వరద్విషమ్,
విరావణం సాధు తపస్వికణ్టకం
తపస్వినాముద్ధర తం భయావహమ్. 32

ప్ర. అ. ఉద్ధతమ్ = విజృంభించినవాడును, ఉగ్రతేజసమ్ = భయంకరమైన పరాక్రమము కలవాడును, ప్రవృద్ధ దర్పమ్ = వృద్ధిపొందిన దర్పము కలవాడును, త్రిదశేశ్వరద్విషమ్ = దేవేంద్రుని ద్వేషించుచున్నవాడును, తపస్వికణ్టకమ్ = మహర్షులకు కంటకము వంటివాడును, తపస్వినామ్ = మహర్షులకు, భయావహమ్ = భయము కలిగించువాడును, అగు, తమ్ = ప్రసిద్ధుడైన, తమ్ = ఆ, రావణమ్=రావణుని, సాధు = చక్కగా, ఉద్ధర = ఉన్మూలించుము.

తా. భయంకరమైన పరాక్రమము గల ఆ రావణుడు వృద్ధిపొందిన గర్వముతో విజృంభించుచున్నాడు. ఇంద్రుని ద్వేషించుచున్నాడు. లోకములను ఏడ్పించుచున్నాడు. మునులను బాధించుచు సర్వదా వారికి భయహేతు వగుచున్నాడు. అట్టివానిని పూర్తిగ ఉన్మూలించుము. 32

మూ. తమేవ హత్వా సబలం సబాన్ధవం
విరావణం రావణమగ్ర్యపౌరుషమ్
స్వర్లోకమాగచ్ఛ గతజ్వరశ్చిరం
సురేన్ద్రగుప్తం గతదోషకల్మషమ్. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పంచదశః సర్గః.

ప్ర. అ. సబలమ్ = సైన్యముతో కూడినవాడును, సబాన్ధవమ్ = బంధువులతో కూడినవాడును, విరావణమ్ = లోకములను ఏడ్పించువాడును, అగ్ర్యపౌరుషమ్ = శ్రేష్ఠమైన పౌరుషము కలవాడును అగు, తమ్ ఏవ = ఆ,

రావణమ్ = రావణుని, హత్వా = చంపి, చిరమ్ = చిరకాలము, గతజ్వరః = పోయిన వ్యథ కలవాడవై, సురేన్ద్రగుప్తమ్ = దేవేంద్రునిచే రక్షింపబడినదియు, గతదోషకల్మషమ్ = పోయిన దోషములును కల్మషములును గల, స్వర్లోకమ్= స్వర్గలోకమును గూర్చి, ఆగచ్ఛ = రమ్ము.

తా. గొప్ప పౌరుషము కలవాడును, లోకములను ఏడ్పించువాడును అగు ఆ రావణుని, సైన్యబాంధవాదిసహితముగ చంపి, చాలకాలము పాటు ఏ చింతలు లేనివాడవై, దేవేంద్రునిచే రక్షింపబడినదియు, దోషములు కాని, పాపములు కాని లేనిదియు అగు స్వర్గలోకమునకు తిరిగి రమ్ము. 33

వి. "సురేన్ద్రగుప్తమ్" అనుదానిని సురేన్ద్ర+గుప్తమ్ అని విడదీసి, సురేంద్ర = ఓ సురశ్రేష్ఠుడా, గుప్తమ్ = రహస్యమైనదియు, చిరమ్ = పురాతనమైనదియు అగు, స్వర్లోకమ్ = వైకుంఠమును, ఆగచ్ఛ = చేరుము — అని కొందరి వ్యాఖ్య. విష్ణువు వైకుంఠనివాసి అని ఈ ఘట్టములో రామాయణములో ఎక్కడను లేదు. ఈ అర్థము లన్నియు అర్వాచీనములైన సంప్రదాయములను పట్టి చెప్పునవి.

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలోని పదునైదవసర్గ సమాప్తము.

# అథ షోడశః సర్గః

మూ. తతో నారాయణో దేవో నియుక్తః సురసత్తమైః,
జానన్నపి సురానేవం శ్లక్ష్ణం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. తతః = పిమ్మట, సురసత్తమైః = దేవతాశ్రేష్ఠులచేత, నియుక్తః = ఈ విధముగా నియమింపబడిన, నారాయణః దేవః = విష్ణువు, జానన్నపి = తెలిసినవాడే అయినను, సురాన్ = దేవతలను గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, శ్లక్ష్ణమ్ = మృదువైన, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగ దేవతలచే నియుక్తు డైన విష్ణువు, తెలిసినవాడే యైనను, తెలియనట్లు దేవతలతో, మధురముగా ఇట్లనెను. 1

మూ. ఉపాయః కో వధే తస్య రావణస్య దురాత్మనః,
యమహం తం సమాస్థాయ నిహన్యామృషికణ్టకమ్. 2

ప్ర. అ. దురాత్మనః = దురాత్ముడైన, తస్య రావణస్య = ఆ రావణుని యొక్క, వధే = వధవిషయమున, ఉపాయః = ఉపాయము, కః = ఏమి? యమ్ = ఏ ఉపాయమును, ఆస్థాయ = అవలంబించి, ఋషికణ్టకమ్ = ఋషులకు బాధను కలిగించుచున్న, తమ్ = వానిని, అహమ్ = నేను, నిహన్యామ్ = చంపుదునో.

తా. ఋషులకు బాధలను కలిగించుచున్న, దురాత్ము డైన రావణుని వధించుటకు ఉపాయమేమి? ఆ ఉపాయముచే నేను రావణుని వధించెదను. 2

మూ. ఏవముక్తాస్సురాః సర్వే ప్రత్యూచుర్విష్ణుమవ్యయమ్,
మానుషీం తనుమాస్థాయ రావణం జహి సంయుగే. 3

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తాః = పలకబడిన, సురాః = దేవతలు, సర్వే = అందరును, అవ్యయమ్ = నాశరహితు డైన, విష్ణుమ్ = విష్ణువును గూర్చి, ప్రత్యూచుః = తిరిగి పలికిరి. మానుషీమ్ = మనుష్యసంబంధ మైన,

తనుమ్ = శరీరమును, ఆస్థాయ = అవలంబించి, సంయుగే = యుద్ధమునందు, రావణమ్ = రావణుని, జహి = సంహరించుము.

తా. "మనుష్యశరీరమును ధరించి, యుద్ధరంగమున రావణుని వధింపుము" అని దేవతలు ప్రత్యుత్తర మిచ్చిరి. 3

మూ. స హి తేపే తపస్తీవ్రం దీర్ఘకాలమరిన్దమ,
యేన తుష్టోఽభవద్బ్రహ్మా లోకకృల్లోకపూర్వజః. 4

ప్ర. అ. అరిందమ = ఓ శత్రువినాశకుడా ! సః=ఆతడు, దీర్ఘకాలమ్= చాలకాలము, తీవ్రమ్ = తీవ్రమైన, తపః = తపస్సును, తేపే = చేసెను (తపించెను). యేన = దేనిచేత, లోకకృత్ = లోకములను సృజించినవాడును, లోకపూర్వజః = లోకములకు ముందు పుట్టినవాడును అగు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు, తుష్టః = సంతోషించినవాడై, అభవత్ = ఆయెనో.

తా. "ఓ ! శత్రువినాశకా ! ఆ రావణుడు చాలకాలము తీవ్రమైన తపస్సు చేయగా, సర్వలోకములకంటెను పూర్వము జనించిన వాడును, సకలలోకస్రష్టయు అగు బ్రహ్మదేవుడు ఆ తపస్సునకు సంతోషించెను." 4

మూ. సంతుష్టః ప్రదదౌ తస్మై రాక్షసాయ వరం ప్రభుః.
నానావిధేభ్యో భూతేభ్యో భయం నాన్యత్ర మానుషాత్. 5
అవజ్ఞాతాః పురా తేన వరదానే హి మానవాః.

ప్ర. అ. సంతుష్టః = సంతోషించిన, ప్రభుః=ఆ సర్వసమర్థుడు, తస్మై= ఆ, రాక్షసాయ = రాక్షసునకు, మానుషాత్ అన్యత్ర = మనుష్యుడు తప్ప, నానావిధేభ్యః = అనేకవిధములైన, భూతేభ్యః = ప్రాణులనుండి, భయమ్ = భయము, న = లేదు, అని, వరమ్ = వరమును, ప్రదదౌ = ఇచ్చెను. పురా = పూర్వము, వరదానే = వరదానసమయమునందు, తేన = వానిచేత, మానవాః = మానవులు, అవజ్ఞాతాః = అనాదరము చేయబడినారు.

తా. "సంతోషించిన ఆ బ్రహ్మదేవుడు— "మనుష్యులు తప్ప మరి ఏ ఇతరప్రాణులనుండియు నీకు భయము లేకుండుగాక" అని ఆ రాక్షసునకు

వరము నిచ్చెను, ఎందువల్ల ననగా, వరదానసమయమున ఆతడు (రావణుడు) మానవుల విషయమున అనాదరమును చూపెను." 5

మూ. ఏవం పితామహా త్తస్మాద్వరం ప్రాప్య స దర్పితః, 6
ఉత్సాదయతి లోకాం స్త్రీన్ స్త్రియశ్చాప్యపకర్షతి,
తస్మా త్తస్య వధో దృష్టో మానుషేభ్యః పరంతప. 7

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, తస్మాత్ = ఆ, పితామహాత్ = బ్రహ్మ దేవునినుండి, వరమ్ = వరమును, ప్రాప్య = పొంది, సః = ఆతడు, దర్పితః = గర్వించినవాడై, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, ఉత్సాదయతి = పీడించు చున్నాడు, స్త్రియః = స్త్రీలను, అపకర్షతి చ = బలాత్కరించుచున్నాడు కూడా. తస్మాత్ = ఆకారణమువలన, పరంతప = ఓ శత్రుసంహారకుడా ! తస్య = వానియొక్క, వధః = వధ, మానుషేభ్యః = మనుష్యులనుండి, దృష్టః = చూడ బడినది.

తా. "ఈ విధముగ బ్రహ్మదేవునినుండి వరమును పొంది, ఆతడు దృప్తుడై మూడు లోకాలను పీడించుచున్నాడు. స్త్రీలను బలాత్కరించుచున్నాడు. వానిని సంహరింపగలవారు మనుష్యులు మాత్రమే." 6, 7

మూ. ఇత్యేతద్వచనం శ్రుత్వా సురాణాం విష్ణురాత్మవాన్,
పితరం రోచయామాస తదా దశరథం నృపమ్. 8

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, సురాణామ్ = దేవతలయొక్క, ఏతత్ = ఈ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, విష్ణుః = విష్ణువు, తదా = అప్పుడు, దశరథం నృపమ్ = దశరథమహారాజును, పితరమ్ = తండ్రినిగా, రోచయామాస = ఇష్టపడెను.

తా. బుద్ధిమంతుడైన విష్ణువు దేవతల ఈ వాక్యమును విని, అప్పుడు, దశ రథుని తండ్రిగా చేసికొనవలె నని ఇచ్ఛయించెను. 8

మూ. స చాప్యపుత్రో నృపతి స్తస్మిన్ కాలే మహాద్యుతిః,
అయజత్పుత్రియామిష్టిం పుత్రేప్సురరిసూదనః. 9

ప్ర. అ. తస్మిన్ కాలే=ఆ సమయమునందు, మహాద్యుతిః=గొప్ప కాంతి కలవాడును, అరిసూదనః=శత్రువులను నశింపచేయువాడును అగు, సః నృపతిః= ఆ రాజు, అపుత్రః=పుత్రులు లేనివాడై, పుత్రేప్సుః=పుత్రులను పొందదలచినవాడై, పుత్రియామ్ ఇష్టిమ్ = పుత్రులను కలిగించు ఇష్టిని, అయజత్ = యజించెను (చేసెను).

తా. గొప్ప తేజస్సు కలవాడును, శత్రుసంహారకుడును అగు దశరథుడు, పుత్రులు లేక పోవుటచే, అదే సమయమున, పుత్రులను ఇచ్చు ఒక యాగమును చేయుచుండెను. 9

మూ. స కృత్వా నిశ్చయం విష్ణురామన్త్ర్య చ పితామహమ్,
అన్తర్ధానం గతో దేవైః పూజ్యమానో మహర్షిభిః. 10

ప్ర. అ. సః = ఆ, విష్ణుః = విష్ణువు, నిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, పితామహమ్ = బ్రహ్మదేవుని, ఆమన్త్ర్య = వీడ్కొని, దేవైః = దేవతలచేతను, మహర్షిభిః = మహర్షులచేతను, పూజ్యమానః = పూజింపబడుచున్న వాడై, అన్తర్ధానం గతః = అంతర్ధానము పొందెను.

తా. విష్ణువు ఈ విధముగా నిశ్చయించుకొని, బ్రహ్మదేవుని వీడ్కొని, దేవతలచేతను, మహర్షులచేతను పూజింపబడుచున్నవాడై అంతర్ధానము పొందెను. 10

మూ. తతో వై యజమానస్య పావకాదతులప్రభమ్,
ప్రాదుర్భూతం మహద్భూతం మహావీర్యం మహాబలమ్. 11

కృష్ణరక్తామ్బరధరం రక్తాస్యం దున్దుభిస్వనమ్,
స్నిగ్ధహర్యక్షతనుజశ్మశ్రుప్రవరమూర్ధజమ్. 12

శుభలక్షణసమ్పన్నం దివ్యాభరణభూషితమ్,
శైలశృంగసముత్సేధం దృప్తశార్దూలవిక్రమమ్. 13

దివాకరసమాకారం దీప్తానలశిఖోపమమ్,
తప్తజామ్బూనదమయీం రాజతాంతపరిచ్ఛదామ్. 14

దివ్యపాయససంపూర్ణాం పాత్రీం పత్నీమివ ప్రియామ్,
ప్రగృహ్య విపులాం దోర్భ్యాం స్వయం మాయామయీమివ. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యజమానస్య = యాగము చేయుచున్న ఆ దశరథునియొక్క, పావకాత్ = అగ్నినుండి, అతులప్రభమ్ = సాటిలేని కాంతి కలదియు, మహావీర్యమ్ = గొప్ప వీర్యము కలదియు, మహాబలమ్ = గొప్ప బలము గలదియు, కృష్ణరక్తామ్బర ధరమ్ = నల్లని ఎఱ్ఱని వస్త్రములను ధరించినదియు, రక్తాస్యమ్ = ఎఱ్ఱని ముఖము కలదియు, దున్దుభి స్వనమ్ = దుందుభిధ్వని వంటి ధ్వని కలదియు, స్నిగ్ధహర్యక్షతనుజ శ్మశ్రుప్రవరమూర్ధజమ్ = మెత్తగా నున్న సింహరోమసదృశము లైన మీసములును శ్రేష్ఠము లైన కేశములును కలదియు, శుభలక్షణసంపన్నమ్ = శుభ లక్షణములతో కూడినదియు, దివ్యాభరణభూషితమ్=దివ్యములైన ఆభరణములచే అలంకరింపబడినదియు, శైలశృఙ్గసముత్సేధమ్ = పర్వతశిఖరము వంటి ఔన్నత్యము కలదియు, దృప్తశార్దూలవిక్రమమ్ = గర్వించిన పెద్దపులి వంటి నడక గలదియు, దివాకరసమాకారమ్=సూర్యునితో సమాన మైన ఆకారము కలదియు, దీప్తానలశిఖోపమమ్ = ప్రజ్వలించుచున్న అగ్నిశిఖతో సమాన మైనదియు అగు, మహత్ = గొప్ప, భూతమ్ = భూతము, తప్తజామ్బూనదమయీమ్ = కరిగిన బంగారముతో చేయబడిన, రాజతాన్తపరిచ్ఛదామ్ = వెండితో చేయబడిన మూత కల, దివ్యపాయససంపూర్ణామ్=దివ్యపాయసముతో నిండిన, మాయామయీమివ= మాయానిర్మితమా అన్నట్లున్న, విపులామ్ = పెద్దదైన, పాత్రీమ్ = పాత్రను, ప్రియామ్ = ప్రియురాలైన, పత్నీమివ = భార్యనువలె, స్వయమ్=స్వయముగ, దోర్భ్యామ్=రెండుచేతులతో, ప్రగృహ్య=గ్రహించి, ప్రాదుర్భూతమ్=ఆవిర్భవించెను.

తా. దశరథుడు యజ్ఞము చేయుచుండగా ఆ అగ్నికుండమునుండి సాటి లేని కాంతి గల ఒక మహాభూతము ఆవిర్భవించెను. దాని బలపరాక్రమములు అసాధారణములు. అది నలుపు—ఎరుపురంగులు గల వస్త్రమును ధరించెను. ముఖము ఎఱ్ఱగ నుండెను. దాని కంఠధ్వని దుందుభిధ్వని వలె గంభీరముగ నుండెను. మెత్తగా నున్న దాని రోమములును, మీసములును, వెండ్రుకలును సింహముజూలు రంగులో ఉండెను. పర్వతశిఖరము వంటి ఔన్నత్యము గల ఆ

భూతముయొక్క నడక దర్పముతో కూడిన పెద్దపులి నడక వలె నుండెను. దాని ఆకారము సూర్యుని ఆకారమువలెను, అది ప్రజ్వలించుచున్న అగ్నిశిఖవలెను ఉండెను. ఆ భూతము తన రెండు చేతులతో ఒక మేలిమి బంగారు పాత్రను, ప్రియురాలైన భార్యను వలె, అత్యాదరముతో తీసికొనివచ్చెను. దివ్యపాయసముతో నిండి యున్న ఆ బంగారుపాత్రపై వెండి మూత యుండెను. అది మాయచే నిర్మింపబడినదా అన్నట్లు అత్యద్భుతముగ నుండెను. 11-15

మూ. సమవేక్ష్యాబ్రవీద్వాక్యమిదం దశరథం నృపమ్,
ప్రాజాపత్యం నరం విద్ధి మామిహాభ్యాగతం నృప. 16

ప్ర. అ. దశరథం నృపమ్ = దశరథమహారాజును, సమవేక్ష్య = చూచి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. నృప = ఓ రాజా! ఇహ = ఇచటికి, అభ్యాగతమ్ = వచ్చిన నన్ను, ప్రాజాపత్యం = ప్రజాపతి నుండి వచ్చిన, (ప్రజాపతికి సంబంధించిన), నరమ్ = పురుషునిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. ఆ భూతము దశరథమహారాజును చూచి ఇట్లు పలికెను. "ఓ రాజా! నేను ప్రజాపతి పంపగా ఇచటకు వచ్చినాను". 16

మూ. తతః పరం తదా రాజా ప్రత్యువాచ కృతాఞ్జలిః,
భగవన్ స్వాగతం తేఽస్తు కిమహం కరవాణి తే. 17

ప్ర. అ. తతః పరమ్ = అటుపిమ్మట, తదా = అప్పుడు, రాజా = రాజు, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ప్రత్యువాచ = తిరిగి పలికెను. భగవన్ = ఓ పూజ్యుడా! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము, అస్తు = అగుగాక. అహమ్ = నేను, తే = నీకు, కిమ్ = ఏమి, కరవాణి = చేయుదును.

తా. పిదప ఆ రాజు చేతులు జోడించి — "పూజ్యుడా! నీకు స్వాగతము. నీ కొరకు నేనేమి చేయుదును?" అని పలికెను. 17

మూ. అథో పునరిదం వాక్యం ప్రాజాపత్యో నరోఽబ్రవీత్,
రాజన్నర్చయతా దేవానద్య ప్రాప్తమిదం త్వయా. 18

ప్ర. అ. అథో = అటుపిమ్మట, ప్రాజాపత్యః నరః = ప్రజాపతి పంపగా వచ్చిన ఆ పురుషుడు, పునః = మరల, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రాజన్ = ఓరాజా ! దేవాన్ = దేవతలను, అర్చయతా = పూజించుచున్న, త్వయా = నీచేత, అద్య = ఈ రోజున, ఇదమ్ = ఇది, ప్రాప్తమ్ = పొందబడినది.

తా. ఆ ప్రాజాపత్యపురుషుడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "రాజా ! నీవు దేవతలను అర్చించుచున్నందుకు ఫలితముగా నేడు ఇది నీకు లభించినది." 18

మూ. ఇదం తు నృపశార్దూల పాయసం దేవనిర్మితమ్,
ప్రజాకరం గృహాణ త్వం ధన్యమారోగ్యవర్ధనమ్. 19

ప్ర. అ. నృపశార్దూల = ఓ రాజశ్రేష్ఠుడా ! దేవనిర్మితమ్ = దేవతల చేత నిర్మింపబడినదియు, ప్రజాకరమ్ = సంతానమును ఇచ్చునదియు, ధన్యమ్ = ధనము నిచ్చునదియు, ఆరోగ్యవర్ధనమ్ = ఆరోగ్యమును వృద్ధి పొందించునదియు అగు, ఇదమ్ = ఈ, పాయనమ్ = పాయసమును, త్వమ్ = నీవు, గృహాణ = గ్రహించుము.

తా. "ఓ రాజశ్రేష్ఠుడా! ఈ పాయసము దేవతలు నిర్మించినది. సంతానము నిచ్చును; ధనమును ఇచ్చును; ఆరోగ్యమును పెంచును; దీనిని తీసికొనుము." 19

మూ. భార్యాణామనురూపాణామశ్నీతేతి ప్రయచ్ఛ వై,
తాసు త్వం ప్రాప్స్యసే పుత్రాన్ యదర్థం యజసే నృప. 20

ప్ర. అ. నృప = ఓరాజా ! అశ్నీత = భుజింపుడు, ఇతి = అని చెప్పి, అనురూపాణామ్ = తగిన, భార్యాణామ్ = భార్యలకు, ప్రయచ్ఛ వై = ఇమ్ము. యదర్థమ్ = ఏ పుత్రులకొరకై, యజసే = యాగము చేయుచున్నావో, పుత్రాన్ = అట్టి పుత్రులను, తాసు = వారియందు, త్వమ్ = నీవు, లప్స్యసే = పొందగలవు.

తా. "రాజా! 'తినుడు' అని చెప్పి ఈ పాయసమును తగిన భార్యల కిమ్ము, నీవు పుత్రులకొరకై యాగము చేయుచున్నావు కదా. ఆ భార్యలయందు నీకు పుత్రులు జనించగలరు." 20

మూ. తథేతి నృపతిః ప్రీతః శిరసా ప్రతిగృహ్య తామ్,
పాత్రీం దేవాన్నసంపూర్ణాం దేవదత్తాం హిరణ్మయీమ్. 21

ప్ర. అ. నృపతిః = రాజు, తథేతి = అటులనే చేసెదను అని పలికి, తామ్ = ఆ, దేవాన్నసంపూర్ణామ్ = దేవతలచే వండబడిన అన్నముతో నిండినదియు, దేవదత్తామ్ = దేవతలచేత ఇవ్వబడినదియు, హిరణ్మయీమ్ = బంగారు వికారమైనదియు అగు, పాత్రీమ్ = పాత్రను, శిరసా = శిరస్సుతో, ప్రతిగృహ్య = స్వీకరించి, ప్రీతః = సంతోషించెను.

తా. దశరథుడు, దేవతలు వండిన అన్నముతో నిండిన, దేవతలు పంపిన, ఆ బంగారు పాత్రను శిరస్సు వంచి, సవినయముగ అందికొని సంతోషించెను. 21

మూ. అభివాద్య చ తద్భూతమద్భుతం ప్రియదర్శనమ్,
ముదా పరమయా యుక్తశ్చకారాభిప్రదక్షిణమ్. 22

ప్ర. అ. పరమయా = గొప్పదైన, ముదా = సంతోషముతో, యుక్తః = కూడినవాడై, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు, ప్రియదర్శనమ్ = సంతోషజనకమైన దర్శనము కలదియు అగు, తత్ భూతమ్ = ఆ భూతమును, అభివాద్య = నమస్కరించి, అభిప్రదక్షిణమ్ = ప్రదక్షిణమును, చకార = చేసెను.

తా. మిక్కిలి సంతోషించిన దశరథుడు, చూచెడివారికి సంతోషము కలిగించు, ఆ అద్భుతమైన భూతమునకు ప్రదక్షిణము చేసి నమస్కరించెను. 22

మూ. తతో దశరథః ప్రాప్య పాయసం దేవనిర్మితమ్,
బభూవ పరమప్రీతః ప్రాప్య విత్తమివాధనః. 23

ప్ర. అ. తతః = పిమ్మట, దశరథః = దశరథుడు, దేవనిర్మితమ్ = దేవతలచే నిర్మింపబడిన, పాయసమ్ = పాయసమును, ప్రాప్య = పొంది, విత్తమ్ = ధనమును, ప్రాప్య = పొంది, అధనః ఇవ = దరిద్రుడు వలె, పరమప్రీతః = మిక్కిలి సంతసించినవాడు, బభూవ = అయెను.

తా. దశరథుడు దేవతలు నిర్మించిన ఆ పాయసము లభించుటచే, ధనము లభించిన నిరుపేద వలె చాల సంతసించెను. 23

మూ. తత స్తదద్భుతప్రఖ్యం భూతం పరమభాస్వరమ్,
సంవర్తయిత్వా తత్ కర్మ తత్రైవా న్తరధీయత. 24

ప్ర. అ. తతః=పిమ్మట, అద్భుతప్రఖ్యమ్ = అద్భుత మైన ఆకారము కలదియు, పరమభాస్వరమ్ = మిక్కిలి ప్రకాశించునదియు అగు, తత్ భూతమ్= ఆ భూతము, తత్ = ఆ, కర్మ = పనిని, సంవర్తయిత్వా = చేసి, తత్రైవ = అచటనే, అంతరధీయత=అంతర్ధానము చెందెను.

తా. అద్భుత మైన ఆకారముతో పరమతేజోవంత మగు ఆ భూతము, ఆ పని చేసి, అచటనే అంతర్ధానము చెందెను. 24

మూ. హర్షరశ్మిభిరుద్ద్యోతం తస్యాన్తఃపురమాబభౌ,
శారదస్యాభిరామస్య చంద్రస్యేవ నభోఽంశుభిః 25

ప్ర. అ. హర్షరశ్మిభిః=ఆనందకిరణములచేత, ఉద్ద్యోతమ్=వెలుగొందుచున్న, తస్య=అతనియొక్క, అన్తఃపురమ్ = అంతఃపురము, అభిరామస్య= మనోహరుడైన, శారదస్య = శరత్కాలమునకు సంబంధించిన, చన్ద్రస్య = చంద్రునియొక్క, అంశుభిః=కిరణములచేత, నభః ఇవ=ఆకాశము వలె, ఆబభౌ= ప్రకాశించెను.

తా. సంతోషకాంతులతో వెలుగొందుచున్న దశరథాంతఃపురము, మనోహరు డైన శరచ్చంద్రుని కిరణములచే ఆకాశము వలె ప్రకాశించెను. 25

మూ. సోఽన్తఃపురం ప్రవిశ్యైవ కౌసల్యామిదమబ్రవీత్,
పాయసం ప్రతిగృహ్ణీష్వ పుత్రియం త్విదమాత్మనః. 26

ప్ర. అ. సః=అతడు, అన్తఃపురమ్ = అంతఃపురమును, ప్రవిశ్యైవ= ప్రవేశించగనే, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. ఆత్మనః=నీకు, పుత్రియమ్ = పుత్రులను కలుగజేయు, ఇదమ్=ఈ, పాయసమ్=పాయసమును, ప్రతిగృహ్ణీష్వ=స్వీకరించుము.

తా. ఆతడు అంతఃపురములో ప్రవేశించి— "నీకు పుత్రులను కలిగించు ఈ పాయసమును తీసికొనుము" అని కౌసల్యతో పలికెను. 26

మూ. కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా,
అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః. 27

కై కేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్,
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్. 28

అనుచిన్త్య సుమిత్రాయై పునరేవ మహీపతిః,
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్. 29

ప్ర. అ. తదా=అప్పుడు, నరపతిః=రాజు, కౌసల్యాయై = కౌసల్యకు, పాయసార్ధమ్=పాయసములో సగమును, దదౌ=ఇచ్చెను. నరాధిపః = రాజు, అర్ధాత్=మిగిలిన సగమునుండి, అర్ధమ్ = సగభాగమును, సుమిత్రాయై అపి= సుమిత్రకు కూడ, దదౌ = ఇచ్చెను. అవశిష్టార్ధమ్ = మిగిలిన దానిలో సగమును, పుత్రార్థకారణాత్=పుత్రప్రయోజన మనే కారణము వలన, కైకేయ్యై= కైకేయికి, దదౌ=ఇచ్చెను. మహీపతిః = రాజు, అనుచిన్త్య = ఆలోచించి, పాయసస్య=పాయసముయొక్క, అమృతోపమమ్=అమృతముతో సమాన మైన, అవశిష్టార్ధమ్=మిగిలిన సగమును, పునరేవ=మరల, సుమిత్రాయై=సుమిత్రకు, ప్రదదౌ=ఇచ్చెను. ఏవమ్=ఈ విధముగా, రాజా=రాజు, తాసాం భార్యాణామ్=ఆ భార్యలకు, పృథక్=వేరు వేరుగా, పాయసమ్=పాయసమును, దదౌ = ఇచ్చెను.

తా. దశరథుడు అప్పుడు పాయసములో సగముభాగమును కౌసల్య కిచ్చెను. మిగిలిన సగము భాగములోని సగము భాగమును (అనగా నాల్గవ భాగమును) సుమిత్ర కిచ్చెను. మిగిలిన దానిలో సగము భాగమును అనగా ఎనిమిదవ భాగమును కైకేయికి ఇచ్చెను. మిగిలిన ఎనిమిదవ భాగమును మరల ఆలోచించి, సుమిత్రకు ఇచ్చెను. ఈ విధముగా రాజు భార్యలు ముగ్గురికిని వేరు వేరుగా పాయసము నిచ్చెను.

వి. ఈ శ్లోకాలకు ఈ అర్థమే పదానుసారి యైన అర్థము. కొందరు వ్యాఖ్యాతలు ఈ అర్థాలను ఇటు లాగి అటు లాగి వేరువేరుగా చెప్పి ఉన్నారు. అధ్యాత్మ రామాయణాదులలో ఉన్న విషయాలను సమన్వయించుటకొరకు, అట్లే విష్ణువు నాలుగు భాగాలు అయి దశరథుని నలుగురు కుమారులుగా జనింప నిశ్చయించెను అని వెనుక చెప్పిన దానిని పట్టి పాయసము కూడా ఏ భార్యకు ఎంత భాగము వచ్చినది, నాల్గవభాగమా, ఎనిమిదవభాగమా— ఇలాంటి ప్రశ్నలు వేసుకొని వేరు వేరు విధాల వ్యాఖ్యానాలు చేసినారు. స్పష్టముగ ఉన్న శ్లోకాల అర్థాలను

మన ఇచ్చ వచ్చి నట్లు మార్పుచేయుట సమంజసము కాదు. ఇట్టి వ్యాఖ్యానాలు కేవలము అల్పజ్ఞులకు దిగ్భ్రాంతి కలిగించుటకు మాత్రమే ఉపయోగించును.

"విష్ణో పుత్రత్వమాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్" "తతః పద్మపలాశాక్షః కృత్వాత్మానం చతుర్విధమ్" ఇత్యాదివాక్యాలకు—విష్ణువు నాలుగు ముక్కలుగా అయిపోయి రామాదిరూపాలలో జనించినా డని కాదు. అనంతస్వరూపానికి భాగము లనగా ఏమి? విష్ణువు రామాద్యవతారము లెత్తినపుడు వైకుంఠము ఖాళీగా ఉండెనా? రాముని రూపములో విష్ణువు వచ్చెను కదా; పరశురాముని విషయమేమైనట్లు. అతడు కూడ విష్ణ్వవతారమే కదా? శ్రీకృష్ణుడు విష్ణ్వవతారమే. మరి బలరాముడు కూడ విష్ణ్వవతారమే అని చెప్పుట కూడ ఉన్నది కదా? రూపరహితుడు, దేశకాలాదిపరిచ్ఛేదాతీతుడు అయిన పరమాత్మ నామరూపాలతో దేశకాలపరిచ్ఛిన్నుడుగా కనబడుటయే అవతారము. అనంతస్వరూపునకు, అప్రమేయునకు భాగకల్పనయే అసంగతము. ఆ పారమేశ్వరశక్తియే వివిధరూపములలో అవతరించినది అని చెప్పుట యుక్తము. రాముడు విష్ణువులో అర్ధభాగ మనీ, లక్ష్మణుడు చతుర్థభాగ మనీ, భరతుడు అష్టమభాగ మనీ, శత్రుఘ్నుడు కూడ అష్టమభాగ మనీ ముందుగా నిర్ణయించుకొని, పాయసము కూడ ఆ విధముగా పంచిననే కుదురు నని అనుకొని ఇష్టము వచ్చి నట్లు చేసిన వ్యాఖ్యలు, ఆ వ్యాఖ్యాతలు ఎంతటి ప్రాచీను లైనను, ఆమోదకరములు కావు. లక్ష్మణుడు ఆదిశేషావతారమని కూడ సంప్రదాయ మున్నది కదా. దాని సమన్వయము చేయుట ఎట్లు? శ్రీరాముడు అర్ధావతార మని చెప్పుట "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే" అని విశ్వసించినవారికి అంతగా అంగీకారయోగ్యము కాదు. వారికి శ్రీరాముడు పూర్ణావతారము. 27, 28, 29

మూ. తాస్త్వేతత్పాయసం ప్రాప్య నరేన్ద్రస్యోత్తమాః స్త్రియః,
సంమానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః. 30

ప్ర. అ. నరేన్ద్రస్య = రాజుయొక్క, ఉత్తమాః=ఉత్తమలైన, తాః=ఆ, స్త్రియః = భార్యలు, సర్వాః = అందరును, ఏతత్ = ఈ, పాయసమ్ = పాయసమును, ప్రాప్య = పొంది, ప్రహర్షోదితచేతసః=పుట్టిన సంతోషము గల మనస్సులు కలవారై, సంమానమ్ = బహుమానమునుగా, మేనిరే = భావించిరి.

తా. ఉత్తమగుణవతు లగు ఆ రాజభార్య లందరును ఆ పాయసము

లభించినందులకు చాల సంతోషించిన మనస్సులతో దానిని గొప్ప బహుమాన ముగా భావించిరి. 30

మూ. తతస్తు తాః ప్రాశ్య తదుత్తమస్త్రియో
మహీపతేరుత్తమపాయసం పృథక్,
హుతాశనాదిత్యసమానతేజస
శ్చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా. 31

ప్ర. అ. తతః = పిమ్మట, మహీపతేః = రాజుయొక్క, తాః ఉత్తమ స్త్రియః = ఆ ఉత్తమభార్యలు, తత్ = ఆ, ఉత్తమపాయసమ్ = ఉత్తమ మైన పాయసమును, పృథక్ = వేరుగా, ప్రాశ్య = భుజించి, హుతాశనాదిత్యసమాన తేజసః = అగ్నితోడను సూర్యునితోడను సమానమైన తేజస్సుకలవారై, చిరేణ = చాల కాలమునకు, తదా = అప్పుడు, గర్భాన్ = గర్భములను, ప్రతిపేదిరే = పొందిరి.

తా. ఉత్తమగుణవతు లగు ఆ దశరథుని భార్యలు ఆ ఉత్తమ మైన పాయసమును భుజించి, అగ్న్యాదిత్యుల వంటి తేజస్సుతో ఒప్పుచు, చాలకాలము తరువాత, అప్పుడు గర్భములను ధరించిరి.

వి. 'చిరేణ' అనగా ఎప్పుడో పుత్రవతులు కావలసిన వారు. ఇంతకాలము నకు ఇపుడు గర్భవతు లైరి అని భావము. 31

మూ. తతస్తు రాజా ప్రసమీక్ష్య తాః స్త్రియః
ప్రరూఢగర్భాః ప్రతిలబ్ధమానసః,
బభూవ హృష్టస్త్రిదివే యథా హరిః
సురేన్ద్రసిద్ధర్షి గణాభిపూజితః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షోడశః సర్గః.

ప్ర. అ. తతః = పిమ్మట, రాజా = రాజు, ప్రరూఢగర్భాః = ఆవిర్భ వించిన గర్భములు గల, తాః స్త్రియః = ఆ భార్యలను, ప్రసమీక్ష్య = చూచి,

ప్రతిలబ్ధమానసః = మరల పొందబడిన మనస్సు కలవాడై, త్రిదివే = స్వర్గము నందు, సురేన్ద్రసిద్ధర్షిగణాభిపూజితః = దేవేంద్రునిచేతను, సిద్ధులచేతను, ఋషి గణములచేతను పూజింపబడిన, హరిః యథా = విష్ణువు వలె, హృష్టః = సంత సించినవాడు, బభూవ = ఆయెను.

తా. దశరథుడు గర్భవతులైన భార్యలను చూచి స్వస్థచిత్తుడై, స్వర్గము నందు దేవేంద్రసిద్ధఋష్యాదులచే పూజింపబడిన విష్ణువు వలె సంతసించెను.

వి. కొందరు వ్యాఖ్యాతలు 'హరిః' అనగా ఇంద్రు డనియు, "సురేన్ద్ర" అనగా దేవతాశ్రేష్ఠులనియు అర్థము వ్రాసిరి. విష్ణువు వైకుంఠములో నుండును గాని స్వర్గములో ఎట్లుండు నని వారి ఆశయము. వాల్మీకి ఎచ్చటను వైకుంఠ మును పేర్కొనలేదు. హరిబ్రహ్మాదులందరును స్వర్గనివాసులే. 32

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలోని పదియారవ సర్గ సమాప్తము.

## అథ సప్తదశః సర్గః

మూ. పుత్రత్వం తు గతే విష్ణౌ రాజ్ఞస్తస్య మహాత్మనః,
ఉవాచ దేవతాః సర్వాః స్వయమ్భూర్భగవానిదమ్. 1

ప్ర. అ. విష్ణౌ = విష్ణువు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాజ్ఞః = ఆ రాజుయొక్క (నకు), పుత్రత్వమ్=పుత్రత్వమును, గతే సతి=పొందినవాడగు చుండగా, భగవాన్=భగవంతుడైన, స్వయంభూః = బ్రహ్మదేవుడు, సర్వాః = సమస్త మైన, దేవతాః = దేవతలను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ= పలికెను.

తా. విష్ణువు దశరథమహారాజునకు పుత్రుడగుటకు నిర్ణయించుకొనిన పిమ్మట బ్రహ్మదేవుడు దేవత లందరితో ఇట్లు చెప్పెను. 1

మూ. సత్యసంధస్య వీరస్య సర్వేషాం నో హితైషిణః,
విష్ణోః సహాయాన్ బలినః సృజధ్వం కామరూపిణః. 2

ప్ర. అ. సత్యసంధస్య = సత్య మైన ప్రతిజ్ఞకలవాడును, వీరస్య = వీరుడును, నః సర్వేషామ్ = మన అందరియొక్క, హితైషిణః = హితమును కోరువాడును అగు, విష్ణోః=విష్ణువునకు, సహాయాన్=సహాయభూతు లైన, బలినః= బలవంతు లైన, కామరూపిణః = కోరిన రూపములు ధరించ గలిగిన పుత్రులను, సృజధ్వమ్ = సృష్టించుడు.

తా. సత్యసంధుడును, మహావీరుడును, మన అందరి హితమును కోరువాడును అగు విష్ణువునకు సహాయులుగ ఉండుటకై, బలవంతులును, కామరూపులును అగు పుత్రులను సృజింపుడు. 2

మూ. మాయావిదశ్చ శూరాంశ్చ వాయువేగసమాన్ జవే,
నయజ్ఞాన్ బుద్ధిసంపన్నాన్ విష్ణుతుల్యపరాక్రమాన్, 3

అసంహార్యానుపాయజ్ఞాన్ దివ్యసంహననాన్వితాన్,
సర్వాస్త్రగుణసంపన్నాన్ అమృతప్రాశనానివ. 4

అప్సరస్సు చ ముఖ్యాసు గన్ధర్వాణాం తనూషు చ,
సృజధ్వం హరిరూపేణ పుత్రాంస్తుల్యపరాక్రమాన్. ౫

ప్ర. అ. మాయావిదః చ = మాయల నెరిగిన వారును, శూరాన్ చ = శూరులును, జవే = వేగమునందు, వాయువేగసమాన్=వాయువేగముతో సమానులును, నయజ్ఞాన్ = నీతి తెలిసినవారును, బుద్ధిసంపన్నాన్ = బుద్ధితో కూడిన వారును, విష్ణుతుల్యపరాక్రమాన్ = విష్ణువుతో సమానమైన పరాక్రమము కల వారును, అసంహార్యాన్ = సంహరింప శక్యము కానివారును, ఉపాయజ్ఞాన్ = ఉపాయము తెలిసినవారును, దివ్యసంహననాన్వితాన్ = దివ్యమైన శరీరములతో కూడిన వారును, సర్వాస్త్రగుణసంపన్నాన్=సమస్తమైన అస్త్రగుణములతో కూడిన వారును, అమృతప్రాశనానివ=అమృతమును భుజించిన వారితో సమానులును, తుల్యపరాక్రమాన్ = మీతో సమాన మైన పరాక్రమము కలవారును అగు, పుత్రాన్ = పుత్రులను, ముఖ్యాసు = ముఖ్యలైన, అప్సరస్సు చ = అప్సరసల యందును, గన్ధర్వీణామ్ = గంధర్వస్త్రీల, తనూషు చ = శరీరములందును, హరిరూపేణ=వానరరూపమున, సృజధ్వమ్ = సృష్టింపుడు.

తా. అన్ని మాయలు తెలిసినవారు, శూరులు, వాయువేగముతో సమానమైన వేగము కలవారు, నీతిజ్ఞులు, బుద్ధిసంపన్నులు, విష్ణువుతో సమాన మైన పరాక్రమము కలవారు, చంప శక్యము కానివారు, వివిధోపాయజ్ఞులు, దివ్య శరీరములు కలవారు, సర్వాస్త్రముల శక్తివంటి శక్తి కలవారు, అమృతమును భుజించినవారు వలె క్షుత్పిపాసాదులు లేనివారు, మీతో సమాన మైన పరాక్రమము కలవారు అగు పుత్రులను, ఉత్తమాప్సరస్త్రీలయందును, గంధర్వస్త్రీలయందును, వానరరూపమున సృజింపుడు.

వి. పార్వతి శపించుటచే దేవతలు తమ భార్యలయందు సంతానమును పొందజాలరు. అందుచే "అప్సరసలందును, గంధర్వస్త్రీలయందును" అని చెప్ప బడినది. "నీకు వానరులవలన భయము కలుగు గాక" అని నందికేశ్వరుడు రావణుని శపించెను. అందుచే "వానరరూపులైన పుత్రులను కనుడు" అని చెప్ప బడినది (గోవిందరాజ మహేశ్వరతీర్థులు). 3-5

మూ. పూర్వమేవ మయా సృష్టో జామ్బవానృక్షపుఙ్గవః,
జృమ్భమాణస్య సహసా మమ వక్త్రాదజాయత. 6

ప్ర. అ. జామ్బవాన్=జాంబవంతు డనెడు, ఋక్షపుఙ్గవః=ఋక్షశ్రేష్ఠుడు, పూర్వమేవ = పూర్వమునందే, మయా = నాచేత, సృష్టః = సృజింపబడినాడు. జృమ్భమాణస్య = ఆవులించుచున్న, మమ = నాయొక్క, వక్త్రాత్=ముఖము నుండి, సహసా = హటాత్తుగా, అజాయత = పుట్టెను.

తా. ఎలుగుబంటులలో శ్రేష్ఠుడైన జాంబవంతుని నేను చాలకాలము క్రితమే సృజించి ఉన్నాను. నేను ఆవులించినపుడు అతడు నా ముఖమునుండి హటాత్తుగా ఆవిర్భవించినాడు. 6

మూ. తే తథోక్తా భగవతా తత్ప్రతిశ్రుత్య శాసనమ్,
జనయామాసురేవం తే పుత్రాన్వానరరూపిణః. 7

ప్ర. అ. భగవతా = బ్రహ్మదేవునిచేత, తథా = ఆవిధముగా, ఉక్తాః = పలకబడిన, తే = వారు, తత్ = ఆ, శాసనమ్ = ఆజ్ఞను, ప్రతిశ్రుత్య=అంగీకరించి, ఏవమ్= ఈ విధముగా, వానరరూపిణః=వానరరూపములుగల, పుత్రాన్= పుత్రులను, జనయామాసుః = పుట్టించిరి.

తా. బ్రహ్మదేవుని ఆజ్ఞప్రకారము ఆ దేవతలు వానరరూపములలో ఉన్న పుత్రులను సృజించిరి. 7

మూ. ఋషయశ్చ మహాత్మానః సిద్ధవిద్యాధరోరగాః.
చారణాశ్చ సుతాన్వీరాన్ ససృజుర్వనచారిణః. 8

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, ఋషయశ్చ = ఋషీశ్వరులును, సిద్ధవిద్యాధరోరగాః = సిద్ధ-విద్యాధర-ఉరగులును, చారణాః చ = చారణులును, వీరాన్ = వీరులైన, వనచారిణః = వానరరూపులగు, సుతాన్ = కుమారులను, ససృజుః = సృజించిరి.

తా. మహావీర్యవంతు లగు ఋషులు, సిద్ధులు, విద్యాధరులు, ఉరగులు, చారణులు కూడ వీరులైన కుమారులను వానరరూపములలో సృజించిరి. 8

మూ. వానరేన్ద్రం మహేన్ద్రాభమిన్ద్రో వాలినమూర్జితమ్,
సుగ్రీవం జనయామాస తపనస్తపతాం వరః. 9

ప్ర. అ. ఇన్ద్రః = ఇంద్రుడు, మహేన్ద్రభమ్ = మహేంద్రపర్వతముతో సమానుడును, ఊర్జితమ్ = దృఢ మైన దేహము కలవాడును అగు, వాలినమ్ = వాలి యను పేరు గల, వానరేన్ద్రమ్=వానరరాజును, జనయామాన=పుట్టించెను. తపతామ్ = వేడిమిని కలిగించువారిలో, వరః = శ్రేష్ఠ డైన, తపనః=సూర్యుడు, సుగ్రీవమ్ = సుగ్రీవుని, (పుట్టించెను).

తా. దేవేంద్రుడు మహేంద్రపర్వతము వంటి శరీరము కలవాడును, మహాబలవంతుడును అగు వాలి యనెడు వానరేంద్రుని పుట్టించెను. తేజశ్శాలులలో గొప్పవా డైన సూర్యుడు సుగ్రీవుని పుట్టించెను. 9

మూ. బృహస్పతి స్త్వజనయత్తారం నామ మహాహరిమ్,
సర్వవానరముఖ్యానాం బుద్ధిమ న్తమను త్తమమ్. 10

ప్ర. అ. బృహస్పతిస్తు = బృహస్పతి యైతే, సర్వవానరముఖ్యానామ్= సమస్త మైన వానరశ్రేష్ఠులలో, అను త్తమమ్ = తనను మించినవారు లేని, బుద్ధిమ న్తమ్ = బుద్ధిమంతు డైన, తారం నామ = తారుడను పేరు గల, మహాహరిమ్ = గొప్ప వానరుని, అజనయత్ = పుట్టించెను.

తా. బృహస్పతి, వానరశ్రేష్ఠు లందరిలోను మహాబుద్ధిమంతు డైన తారుడనే గొప్ప వానరుని సృజించెను. 10

మూ. ధనదస్య సుతః శ్రీమాన్ వానరో గంధమాదనః,
విశ్వకర్మా త్వజనయన్నలం నామ మహాహరిమ్. 11

ప్ర. అ. శ్రీమాన్ = కాంతి గల, గన్ధమాదనః = గంధమాదను డనెడు, వానరః = వానరుడు, ధనదస్య = కుబేరునియొక్క, సుతః = కుమారుడు. విశ్వకర్మా తు = విశ్వకర్మయైతే, నలం నామ = నలుడనెడు, మహాహరిమ్ = గొప్ప వానరుని, అజనయత్ = పుట్టించెను.

తా. కుబేరుడు శ్రీమంతు డగు గంధమాదను డనెడు కుమారుని సృజించెను. విశ్వకర్మ నలుడనెడు పేరు గల గొప్ప వానరుని పుట్టించెను. 11

మూ. పావకస్య సుతః శ్రీమాన్ నీలోఽగ్నిసదృశప్రభః,
తేజసా యశసా వీర్యాదత్యరిచ్యత వానరాన్. 12

ప్ర. అ. పావకస్య=అగ్నియొక్క, సుతః = కుమారుడును, శ్రీమాన్= శ్రీమంతుడును, అగ్నిసదృశప్రభః = అగ్నితో సమాన మైన కాంతి కలవాడును అగు, నీలః = నీలుడు, తేజసా=తేజస్సుచేతను, యశసా=కీర్తిచేతను, వీర్యాత్= పరాక్రమమువలనను, వానరాన్=ఇతరవానరులను, అత్యరిచ్యత = అతిశయించి ఉండెను.

తా. శ్రీమంతుడును, అగ్నితో సమాన మైన తేజస్సు కలవాడును, అగ్ని కుమారుడును అగు నీలుడు తేజఃకీర్తివీర్యములచే ఇతరవానరుల నందరిని మించి ఉండెను. 12

మూ. రూపద్రవిణసంపన్నావశ్వినౌ రూపసమ్మతౌ,
మైన్దం చ ద్వివిదం చైవ జనయామాసతుః స్వయమ్. 13

ప్ర. అ. రూపద్రవిణసంపన్నౌ=రూప మనెడు ధనముచే సమృద్ధు లైన, అశ్వినౌ = అశ్వినీదేవతలు, స్వయమ్ = తాము, రూపసమ్మతౌ = రూపముచే గౌరవింపబడిన, మైన్దం చ = మైందుని, ద్వివిదం చైవ = ద్వివిదుని, జనయామాసతుః = పుట్టించిరి.

తా. సౌందర్య మనెడు ధనము గల అశ్వినీదేవతలు, ప్రశస్త సౌందర్యవంతు లగు మైందుడు, ద్వివిదుడు అను వానరులను పుట్టించిరి. 13

మూ. వరుణో జనయామాస సుషేణం వానరర్షభమ్,
శరభం జనయామాస పర్జన్యస్తు మహాబలమ్. 14

ప్ర. అ. వరుణః = వరుణుడు, సుషేణమ్ = సుషేణు డనెడు, వానరర్షభమ్ = వానరశ్రేష్ఠుని, జనయామాస = పుట్టించెను, పర్జన్యస్తు = పర్జన్యుడైతే, మహాబలమ్=గొప్ప బలము గల, శరభమ్=శరభుని, జనయామాస = పుట్టించెను.

తా. వరుణుడు సుషేణు డనెడు వానరశ్రేష్ఠుని, పర్జన్యుడు మహాబలశాలి యగు శరభుని పుట్టించిరి. 14

మూ. మారుతస్యాత్మజః శ్రీమాన్ హనుమాన్నామ వీర్యవాన్,
వజ్రసంహననోపేతో వైనతేయసమో జవే. 15

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడును, వీర్యవాన్ = పరాక్రమశాలియు, వజ్రసంహననోపేతః=వజ్రమువంటి దేహము కలవాడును, జవే=వేగమునందు, వైనతేయసమః = గరుత్మంతునితో సమానుడును అగు, హనుమాన్ నామ = హనుమంతు డను పేరు గల వానరుడు, మారుతస్య = వాయుదేవునియొక్క, ఆత్మజః = కుమారుడు.

తా. వాయుదేవునకు శ్రీమంతుడును, వీర్యవంతుడును, వజ్రము వంటి దేహము కలవాడును, వేగమునందు గరుత్మంతునితో సమానుడును అగు హనుమంతుడు కుమారుడుగ జనించెను. 15

మూ. తే సృష్టా బహుసాహస్రా దశగ్రీవవధే రతాః,
అప్రమేయబలా వీరా విక్రాన్తాః కామరూపిణః. 16

ప్ర. అ. దశగ్రీవవధే = రావణుని వధించుటయందు, రతాః = ఆసక్తి కలవారును, అప్రమేయబలాః = కొలువ శక్యము కాని బలము కలవారును, విక్రాన్తాః = పరాక్రమవంతులును, కామరూపిణః = స్వేచ్ఛానుసారముగా వివిధ రూపములను ధరించకలవారును, బహుసాహస్రాః=అనేకవేలసంఖ్య కలవారును అగు, తే వీరాః = ఆ వీరులు, సృష్టాః = సృజింపబడినారు.

తా. అమేయ మైన బలపరాక్రమములు గలవారును, కామరూపులును అగు వేలకొలది వీరులు దశగ్రీవుని వధకొరకై సృష్టింపబడిరి. 16

మూ. మేరుమన్దరసంకాశా వపుష్మన్తో మహాబలాః,
ఋక్షవానరగోపుచ్ఛాః క్షిప్రమేవాభిజజ్ఞిరే. 17

ప్ర. అ. మేరుమన్దరసంకాశాః = మేరుమందరపర్వతములతో సమానులును, వపుష్మన్తః = మంచిదేహములు కలవారును, మహాబలాః=గొప్ప బలము కలవారును అగు, ఋక్షవానరగోపుచ్ఛాః = ఎలుగుబంటులు, వానరులు, కొండముచ్చులు, క్షిప్రమేవ = శీఘ్రముగనే, అభిజజ్ఞిరే = పుట్టిరి.

తా. మేరుమందరపర్వతముల వలె మహోన్నతము లైన దేహములుగల, మహాబలవంతు లగు ఋక్ష—వానర—గోపుచ్ఛులు శీఘ్రముగనే జనించిరి. 17

మూ. యస్య దేవస్య యద్రూపం వేషో యశ్చ పరాక్రమః,
అజాయత సమస్తేన తస్య తస్య సుతః పృథక్. 18

ప్ర. అ. యస్య = ఏ, దేవస్య = దేవునకు, యత్ = ఏ, రూపమ్ = రూపమో, వేషః = ఏ వేషమో, పరాక్రమశ్చ = పరాక్రమము కూడ, యః = ఏదియో, తస్య తస్య = ఆ యా దేవునియొక్క, సుతః = కుమారుడు, పృథక్ = వేరుగా, తేన = ఆ దేవునితో, సమః = సమానుడై, అజాయత = పుట్టెను.

తా. ఏ దేవునకు ఏ రూపము, ఏ వేషము, ఏ పరాక్రమము ఉండెనో ఆ దేవుని కుమారుడు కూడ అదే రూపము, అదే వేషము, అదే పరాక్రమము కలిగి ఉండెను. 18

మూ. గోలాఙ్గూలీషు చోత్పన్నాః కేచిత్సంమతవిక్రమాః,
ఋక్షీషు చ తథా జాతా వానరాః కిన్నరీషు చ. 19

ప్ర. అ. సంమతవిక్రమాః = బహుమానింపబడిన పరాక్రమము గల, కేచిత్ = కొందరు, వానరాః = వానరులు, గోలాఙ్గూలీషు = ఆడ కొండముచ్చుల యందు, ఉత్పన్నాః = పుట్టినారు. తథా = అట్లే, (మరికొందరు వానరులు), ఋక్షీషు = ఆడ ఎలుగుబంటులయందును, కిన్నరీషు చ = కిన్నరస్త్రీలయందును, జాతాః = పుట్టినారు.

తా. కొనియాడదగిన పరాక్రమము గల కొందరు గోలాంగూలస్త్రీల యందును, కొందరు ఋక్షస్త్రీలయందును, కిన్నరస్త్రీలయందును జనించిరి. 19

మూ. దేవా మహర్షిగన్ధర్వాస్తార్క్ష్యా యక్షా యశస్వినః,
నాగాః కింపురుషాశ్చైవ సిద్ధవిద్యాధరోరగాః. 20

బహవో జనయామాసుర్హృష్టాస్తత్ర సహస్రశః,
వానరాన్ సుమహాకాయాన్ సర్వాన్వై వనచారిణః. 21

అప్సరస్సు చ ముఖ్యాసు తథా విద్యాధరీషు చ,
నాగకన్యాసు చ తథా గన్ధర్వీణాం తనూషు చ. 22

ప్ర. అ. దేవాః = దేవతలు, మహర్షిగన్ధర్వాః = మహర్షులు గంధర్వులు,

తార్క్ష్యాః=గరుడులు, యక్షాః = యక్షులు, యశస్వినః = కీర్తి గల, నాగాః = నాగులు, కింపురుషాశ్చైవ = కింపురుషులును, సిద్ధవిద్యాధరోరగాః = సిద్ధులు, విద్యాధరులు ఉరగులు, బహవః = అనేకులు, హృష్టాః = సంతసించినవారై, తత్ర = ఆ సమయమున, ముఖ్యాసు = ప్రధానలైన, అప్సరస్సు = అప్సరసల యందును, తథా = మరియు, విద్యాధరీషు చ = విద్యాధరస్త్రీలయందును, నాగ కన్యాసు = నాగకన్యలయందు, తథా = మరియు, గన్ధర్వీనామ్ = గంధర్వస్త్రీల, తనూషు చ = శరీరములయందును, సుమహాకాయాన్ = గొప్పదేహములు కల వారును, వనచారిణః = వనములయందు సంచరించువారును అగు, సర్వాన్ = సమస్తమైన, వానరాన్ = వానరులను, సహస్రశః = వేలకొలది, జనయామాసుః= పుట్టించిరి.

తా. ఆ సమయమున దేవ—మహర్షి—గంధర్వ—తార్క్ష్య—యక్ష—నాగ—కింపురుష—సిద్ధ,—విద్యాధర—ఉరగులు అనేకులు చాల సంతసించినవారై ప్రధాన లైన అప్సరసలందును, విద్యాధర—నాగ—గంధర్వస్త్రీలయందును, గొప్ప దేహములు కలవారును, వనములలో సంచరించువారును అగు వానరులను వేలకొలది సృజించిరి. 20, 21, 22

మూ. కామరూపబలోపేతా యథాకామం విచారిణః,
సింహశార్దూలసదృశా దర్పేణ చ బలేన చ. 23

ప్ర. అ. (అ వానరులు), కామరూపబలోపేతాః = స్వేచ్ఛానుసారము లభించు రూపము కలవారు, బలవంతులు. యథాకామమ్=స్వేచ్ఛగా, విచారిణః= నంచరించువారు. దర్పేణ చ = దర్పముచేతను, బలేన చ=బలముచేతను, సింహ శార్దూలసదృశాః = సింహములతోడను, పులులతోడను నమానులు.

తా. ఆ వానరు లందరును ఇచ్ఛవచ్చిన రూపము ధరించగలరు. బలాఢ్యులు, స్వేచ్ఛగా నంచరించువారు, దర్పబలములచే సింహశార్దూలములతో నమానులు. 23

మూ. శిలాప్రహరణాః సర్వే సర్వే పాదపయోధినః,
నఖదంష్ట్రాయుధాః సర్వే సర్వే సర్వాస్త్రకోవిదాః. 24

ప్ర. అ. సర్వే=అందరును, శిలాప్రహరణాః = శిలలే ఆయుధములుగా కలవారు. సర్వే = అందరును, పాదపయోధినః = వృక్షములతో యుద్ధము చేయువారు. సర్వే = అందరును, నఖదంష్ట్రాయుధాః=గోళ్ళు, కోరలు ఆయుధములుగా కలవారు. సర్వే=అందరును, సర్వాస్త్రకోవిదాః = అన్ని అస్త్రములను గూర్చి తెలిసినవారు.

తా. ఆ వానరులందరును యుద్ధములలో శిలలు, వృక్షములు, గోళ్ళు, కోరలు—వీటిని ఆయుధములుగా ఉపయోగించెడివారు. వారికి అన్ని అస్త్రములను గూర్చియు తెలియును. 24

మూ. విచాలయేయుః శైలేన్ద్రాన్ భేదయేయుః స్థిరాన్ ద్రుమాన్,
క్షోభయేయుశ్చ వేగేన సముద్రం సరితాం పతిమ్. 25

ప్ర. అ. శైలేన్ద్రాన్=పర్వతశ్రేష్ఠములను, విచాలయేయుః=కదల్చివేయగలరు. స్థిరాన్=స్థిరముగా నున్న, ద్రుమాన్ = వృక్షములను, భేదయేయుః = బ్రద్దలుకొట్టగలరు. వేగేన=వేగముచేత, సరితాం పతిమ్ = నదుల పతి యైన, సముద్రమ్=సముద్రమును, క్షోభయేయుః=క్షోభింపచేయగలరు.

తా. ఆ వానరు లందరును మహాపర్వతములను ఊపివేయగలరు. స్థిరములైన మహావృక్షములను పెకిలించగలరు. వేగముచే, సకలనదులకును గమ్యస్థానమైన సముద్రమును కూడ కలతపెట్టగలరు. 25

మూ. దారయేయుః క్షితిం పద్భ్యామాప్లవేయుర్మహార్ణవమ్,
నభస్స్థలం విశేయుశ్చ గృహ్ణీయురపి తోయదాన్. 26

ప్ర. అ. పద్భ్యామ్=పాదములచేత, క్షితిమ్=భూమిని, దారయేయుః= చీల్చివేయగలరు. మహార్ణవమ్ = మహాసముద్రమును, ఆప్లవేయుః = దుమికి దాటగలరు. నభస్స్థలమ్=ఆకాశమును, విశేయుశ్చ = ప్రవేశింపగలరు. తోయదానపి=మేఘములను కూడ, గృహ్ణీయుః=గ్రహింపగలరు.

తా. వారు పాదములచేత భూమిని చీల్చివేయగలరు. సముద్రమును దాటగలరు. ఆకాశములో ప్రవేశించి మేఘాలను కూడ గ్రహింపగలరు. 26

మూ. గృహ్ణీయు రపి మాతఙ్గాన్మత్తాన్ ప్రవ్రజతో వనే,
నర్దమానాశ్చ నాదేన పాతయేయుర్విహఙ్గమాన్. 27

ప్ర. అ. వనే = అరణ్యమునందు, పరిపరిజతః = సంచరించుచున్న, మత్తాన్ = మదించిన, మాతఙ్గాన్ అపి = ఏనుగులను గూడ, గృహ్ణీయుః = పట్టుకొనగలరు. నర్దమానాః = ధ్వనిచేయుచున్నవారై, నాదేన=ధ్వనిచేత, విహఙ్గమాన్ = పక్షులను, పాతయేయుః = పడిపోవునట్లు చేయగలరు.

తా. అరణ్యములలో సంచరించు మత్తగజములను కూడ పటుకొనగలరు. వానరుల అరపులు విని పక్షులు క్రిందకు పడిపోవును కూడ. 27

మూ. ఈదృశానాం ప్రసూతాని హరీణాం కామరూపిణామ్,
శతం శతసహస్రాణి యూథపానాం మహాత్మనామ్. 28

ప్ర. అ. కామరూపిణామ్ = ఇష్టమైన రూపములను ధరింప గలిగిన వారును, యూథపానామ్ = సేనానాయకులును, మహాత్మనామ్ = అధికధైర్యవంతులును, అగు, ఈదృశానామ్ = ఇట్టి, హరీణామ్ = వానరులయొక్క, శతమ్ = నూరు, శతసహస్రాణి = లక్షలు, ప్రసూతాని = పుట్టింపబడినవి.

తా. కామరూపులును, సేనానాయకులును, మహాత్ములును, అగు ఇట్టి వానరులు నూరులక్షలు (కోటిమంది) సృజింపబడిరి. 28

మూ. తే ప్రధానేషు యూథేషు హరీణాం హరియూథపాః,
బభూవుర్యూథపశ్రేష్ఠా వీరాంశ్చాజనయన్ హరీన్. 29

ప్ర. అ. తే=ఆ, హరియూథపాః=వానరసేనానాయకులు, హరీణామ్=వానరులయొక్క, ప్రధానేషు = ప్రధానములైన, యూథేషు = సేనలయందు, యూథపశ్రేష్ఠాః=సేనానాయకులలో ముఖ్యులుగా, బభూవుః=అయిరి. వీరాన్=వీరులైన, హరీన్ = వానరులను, అజనయన్ చ = పుట్టించిరి.

తా. ఆ వానరసేనానాయకులు వానరుల ముఖ్యసేనలకు నాయకులై, వీరులగు వానరులను పుట్టించిరి. 29

మూ. అన్యే ఋక్షవతః ప్రస్థానవతస్థుస్సహస్రశః,
అన్యే నానావిధాన్ శైలాన్ భేజిరే కాననాని చ. 30

ప్ర. అ. అన్యే = కొందరు వానరులు, సహస్రశః = వేలకొలది, ఋశ్య వతః = ఋశ్యవత్పర్వతముయొక్క, ప్రస్థాన్ = చరియలను, అవతస్థుః = ఆశ్రయించి యుండిరి. అన్యే = మరి కొందరు, నానావిధాన్ = అనేకవిధములైన, శైలాన్ = పర్వతములను, కాననాని చ = అడవులను, భేజిరే = పొందిరి.

తా. వేలకొలది వానరులు కొందరు ఋశ్యవత్పర్వతము పైన నివసించిరి. మరి కొందరు అనేక పర్వతములపైనను, అడవులందును నివసించిరి. 30

మూ. సూర్యపుత్రం చ సుగ్రీవం శక్రపుత్రం చ వాలినమ్,
భ్రాతరావుపతస్థుస్తే సర్వ ఏవ హరీశ్వరాః, 31
నలం నీలం హనూమన్తమన్యాంశ్చ హరియూథపాన్.

ప్ర. అ. తే = ఆ, హరీశ్వరాః = వానరులు, సర్వే = అందరును, భ్రాతరౌ = సోదరులైన, సూర్యపుత్రమ్ = సూర్యుని కుమారుడైన, సుగ్రీవమ్ = సుగ్రీవుని, శక్రపుత్రమ్ = ఇంద్రుని పుత్రుడైన, వాలినం చ = వాలిని, నలమ్ = నలుని, నీలమ్ = నీలుని, హనూమన్తమ్ = హనుమంతుని, అన్యాన్ = ఇతరులైన, హరియూథపాంశ్చ = వానర సేనానాయకులను, ఉపతస్థుః = సేవించిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులందరు, ఇంద్రసూర్యుల కుమారులును సోదరులును అగు వాలిసుగ్రీవులను, నలుని, నీలుని, హనుమంతుని, తదితరవానరసేనానాయకులను సేవించుచుండిరి. 31

మూ. తే తార్క్ష్యబలసంపన్నాః సర్వే యుద్ధవిశారదాః. 32
విచరన్తోఽర్దయన్ దర్పాత్సింహవ్యాఘ్రమహోరగాన్,

ప్ర. అ. తార్క్ష్యబలసంపన్నాః = గరుత్మంతుని వంటి బలము కలవారును, యుద్ధవిశారదాః = యుద్ధమునందు సమర్థులును అగు, తే సర్వే = వారందరును, విచరన్తః = సంచరించుచు, దర్పాత్ = గర్వము వలన, సింహవ్యాఘ్రమహోరగాన్ = సింహములను, వ్యాఘ్రములను, మహాసర్పములను, అర్దయన్ = పీడించిరి.

తా. గరుత్మంతుని వంటి బలము కలవారును, యుద్ధసమర్థులును అగు

ఆ వానరు లందరును సంచరించుచు, దర్పముచేత, సింహవ్యాఘ్రమహోరగము లను పీడించిరి. అనగా వాటికి కూడ భయము కలుగు నట్లు సంచరించిరి. 32

మూ. తాంశ్చ సర్వాన్ మహాబాహుర్వాలీ విపులవిక్రమః,
జుగోప భుజవీర్యేణ ఋక్షగోపుచ్ఛవానరాన్. 33

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడును, విపులవిక్రమః= గొప్ప పరాక్రమము కలవాడును అయిన, వాలీ=వాలి, తాన్=ఆ, సర్వాన్= సమస్త మైన, ఋక్షగోపుచ్ఛవానరాన్=ఋక్ష-గోపుచ్ఛ (కొండముచ్చు) వానరు లను, భుజవీర్యేణ=భుజపరాక్రమముచేత, జుగోప=రక్షించెను.

తా. గొప్ప బాహువులుగల, అధికపరాక్రమవంతు డైన వాలి తన భుజ బలముచేత ఆ ఋక్షగోపుచ్ఛవానరులను రక్షించెను. 33

మూ. తైరియం పృథివీ శూరైః సపర్వతవనార్ణవా,
కీర్ణా వివిధసంస్థానైర్నానావ్యఞ్జనలక్షణైః. 34

ప్ర. అ. శూరైః=శూరులును, వివిధసంస్థానైః=అనేకవిధము లైన శరీర ములు కలవారును, నానావ్యఞ్జనలక్షణైః=నానావిధము లైన దేహములకు సంబం ధించిన గుర్తులును, జాతికి సంబంధించిన గుర్తులును కలవారును అగు, తైః= వారిచేత, సపర్వతవనార్ణవా=పర్వత-వన-సముద్రములతో కూడిన, ఇయమ్= ఈ, పృథివీ=భూమి, కీర్ణా=వ్యాప్త మైనది.

తా. అనేకవిధము లైన శారీరనిర్మాణములును, అనేక విధము లైన దేహ, జాత్యాదిచిహ్నములును గల ఆ శూరు లైన వానరులు, పర్వత-వన-సముద్ర సహిత మగు ఈ భూమిని ఆవరించి ఉండిరి. 34

మూ. తైర్మేఘబృన్దాచలకూటకల్పై
ర్మహాబలైర్వానరయూథపాలైః,
బభూవ భూర్భీమశరీరరూపై
స్సమావృతా రామసహాయహేతోః. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే
సప్తదశః సర్గః.

ప్ర. అ. మేఘబృన్దాచలకూటకల్పైః = మేఘసముదాయములతోడను పర్వతశిఖరములతోడను సమానులైన, మహాబలైః=గొప్ప బలము గల, భీమ శరీరరూపైః=భయంకర మైన శరీరములు ఆకారములు గల, తైః=ఆ, వానర యూథపాలైః=వానర సేనానాయకులచేత, భూః=భూమి, రామసహాయ హేతోః= రామునకు సహాయము చేయుటకై, సమావృతా=ఆవరింపబడినది, బభూవ= ఆయెను.

తా. మేఘముల గుంపులతోడను పర్వతశిఖరములతోడను సమానులును, మహాబలవంతులును, భయంకరము లైన శరీరములు కలవారును, రామునికి సాహాయ్యము చేయుటకై ఆవిర్భవించినవారును అగు ఆ వానర సేనానాయకులచే ఈ భూమి యంతయు ఆవరింపబడి యుండెను. 35

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
బాలకాండలో సప్తదశసర్గ సమాప్తము.

# అథ అష్టాదశః సర్గః

మూ. నివృత్తే తు క్రతౌ తస్మిన్ హయమేధే మహాత్మనః,
ప్రతిగృహ్య సురా భాగాన్ ప్రతిజగ్ముర్యథాగతమ్. 1

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన దశరథునియొక్క, తస్మిన్ = ఆ, హయమేధే = అశ్వమేధ మనెడు, క్రతౌ = యాగము, నివృత్తే సతి = పూర్తి కాగా, సురాః = దేవతలు, భాగాన్ = భాగములను, ప్రతిగృహ్య = స్వీకరించి, యథాగతమ్ = వచ్చినట్లుగానే, ప్రతిజగ్ముః = తిరిగి వెళ్లిరి.

తా. మహాత్ముడైన దశరథుడు ప్రారంభించిన అశ్వమేధపుత్రకామేష్టులు పూర్తియైనవి. దేవతలు హవిర్భాగములను తీసికొని తమ తమ స్థానములకు వెడలిపోయిరి. 1

మూ. సమాప్తదీక్షానియమః పత్నీగణసమన్వితః,
ప్రవివేశ పురీం రాజా సభృత్యబలవాహనః. 2

ప్ర. అ. పత్నీగణసమన్వితః = భార్యల సముదాయముతో కూడిన, రాజా = రాజు, సమాప్తదీక్షానియమః = సమాప్తమైన దీక్షానియమములు కలవాడై, సభృత్యబలవాహనః = భృత్యులతో, సేనలతో, వాహనములతో కూడినవాడై, పురీమ్ = పట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పత్నీసమేతుడైన దశరథుడు యాగదీక్షానియమములను పూర్తి చేసికొని, భృత్య-బల-వాహనాదులతో అయోధ్యానగరమును ప్రవేశించెను. 2

మూ. యథార్హం పూజితాస్తేన రాజ్ఞా వై పృథివీశ్వరాః,
ముదితాః ప్రయయుర్దేశాన్ ప్రణమ్య మునిపుఙ్గవమ్. 3

ప్ర. అ. పృథివీశ్వరాః = రాజులు, తేన రాజ్ఞా = ఆ రాజుచేత, యథార్హమ్ = తగు విధముగా, పూజితాః = పూజింపబడినవారై, ముదితాః = సంతోషించినవారై, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠుని, ప్రణమ్య = నమస్కరించి, దేశాన్ = తమదేశములను గూర్చి, ప్రయయుః = వెళ్లిరి.

**తా.** యాగమునకు ఆహూతులై వచ్చిన రాజు లందరును, తగు విధముగ దశరథునిచేత పూజింపబడినవారై, వసిష్ఠునకు నమస్కారము చేసి, సంతోషముతో స్వదేశములకు వెళ్లిరి. 3

మూ. శ్రీమతాం గచ్ఛతాం తేషాం స్వపురాణి పురాత్తతః,
బలాని రాజ్ఞాం శుభ్రాణి ప్రహృష్టాని చకాశిరే. 4

ప్ర. అ. **తతః పురాత్**=ఆ పట్టణమునుండి, **స్వపురాణి**=తమ పురములను గూర్చి, **గచ్ఛతామ్**=వెళ్లుచున్న, **శ్రీమతామ్** = శ్రీమంతులైన, **తేషామ్** = ఆ, **రాజ్ఞామ్** = రాజులయొక్క, **శుభ్రాణి** = శుభ్రముగా నున్న, **ప్రహృష్టాని** = సంతసించిన, **బలాని**=సైన్యములు, **చకాశిరే**=ప్రకాశించినవి.

**తా.** అయోధ్యాపురినుండి తమ పురములకు బయలుదేరిన ఆ రాజుల సైన్యములు, శుభ్రములై ఆనందముకలవై ప్రకాశించినవి.

వి. 'శుభ్రాణి' అనుదానికి దశరథు డిచ్చిన వస్త్రాదులచే తెల్లగా నున్నవి అని కొందరివ్యాఖ్య. అంతకంటె—సైనికులు అందరును ఒక నియమిత మగు వేషమును (Uniform) ధరింతురు గాన వారు ప్రయాణముచేసి పోవుచున్నప్పుడు చాల అందముగా కనబడి రనియు, అదియే శుభ్రత్వ మనియు చెప్పుట యుక్తము. 4

మూ. గతేషు పృథివీశేషు రాజా దశరథస్తదా,
ప్రవివేశ పురీం శ్రీమాన్ పురస్కృత్య ద్విజోత్తమాన్. 5

ప్ర. అ. **పృథివీశేషు**=రాజులు, **గతేషు సత్సు**=తిరిగి వెళ్లిపోయినవారగుచుండగా, **తదా** = అప్పుడు, **శ్రీమాన్** = శోభాయుక్తుడైన, **రాజా దశరథః** = దశరథమహారాజు, **ద్విజోత్తమాన్** = బ్రాహ్మణశ్రేష్ఠులను, **పురస్కృత్య**=ఎదుట ఉంచుకొని, **పురీమ్** = నగరమును, **ప్రవివేశ**=ప్రవేశించెను.

**తా.** రాజులు వెడలిపోయినపిదప శ్రీమంతు డగు దశరథమహారాజు, సద్బ్రాహ్మణులను ముందిడుకొని నగరము ప్రవేశించెను. 5

మూ శాన్తయా ప్రయయౌ సార్ధం ఋశ్యశృఙ్గః సుపూజితః,
అన్వీయమానో రాజ్ఞాథ సానుయాత్రేణ ధీమతా. 6

ప్ర. అ. అథ=పిమ్మట, ఋశ్యశృఙ్గః=ఋశ్యశృంగుడు, సుపూజితః= బాగుగా పూజింపబడినవాడై, సానుయాత్రేణ=అనుచరులతో కూడిన, ధీమతా = ధీమంతుడైన, రాజ్ఞా=రోమపాదునిచేత, అన్వీయమానః=అనుసరింపబడుచున్న వాడై, శాన్తయా సార్ధమ్=శాంతతోకూడ, ప్రయయౌ = వెళ్లెను.

తా. దశరథుని నుండి బాగుగా పూజల నందుకొనిన ఋశ్యశృంగుడు కూడ, పరివారసమేతుడైన రోమపాదుడు అనుసరింప, శాంతతో కూడ తిరిగి స్వస్థానమునకు వెళ్లెను. 6

మూ. ఏవం విసృజ్య తాన్సర్వా న్రాజా సంపూర్ణమానసః,
ఉవాస సుఖిత స్తత్ర పుత్రోత్పత్తిం విచిన్తయన్. 7

ప్ర. అ. రాజా=దశరథుడు, ఏవమ్ = ఈ విధముగా, తాన్ సర్వాన్= వారినందరిని, విసృజ్య=పంపివేసి, సంపూర్ణమానసః = నిండిన మనస్సు కల వాడై, పుత్రోత్పత్తిమ్=పుత్రుల ఉత్పత్తిని గూర్చి, విచిన్తయన్=ఆలోచించుచు, తత్ర=అచట, సుఖితః = సుఖవంతుడై, ఉవాస=నివసించెను.

తా. దశరథుడు ఈ విధముగా వారి నందరిని పంపివేసి, ఆనందముతో నిండిన మనస్సు కలవాడై, కుమారుల ఉత్పత్తికై ఎదురు చూచుచు, సుఖముగా నుండెను. 7

మూ. తతో యజ్ఞే సమాప్తే తు ఋతూనాం షట్సమత్యయుః,
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ, 8

నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పఞ్చసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిన్దునా సహ, 9

ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్,
కౌసల్యాజనయ ద్రామం సర్వలక్షణసంయుతమ్, 10
విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనమ్.

ప్ర. అ. తతః=పిమ్మట, యజ్ఞే = యజ్ఞము, సమాప్తే = సమాప్తమైన తరువాత, ఋతునామ్ = ఋతువులయొక్క, షట్ = ఆరు (ఆరుఋతువులు),

సమత్యయుః = గడిచినవి, తతః = పిమ్మట, ద్వాదశే మాసే = పండ్రెండవ మాసమునందు, చైత్రే=చైత్రమునందు, నావమికే తిథౌ = నవమితిథియందు, అదితిదైవత్యే = అదితి దేవతగా గల, నక్షత్రే = నక్షత్రమునందు, పఞ్చసు = ఐదు, గ్రహేషు = గ్రహములు, స్వోచ్చసంస్థేషు=తమ తమ ఉచ్చస్థానములందు ఉండగా, కర్కటే లగ్నే = కర్కటలగ్నమునందు, వాక్పతౌ=బృహస్పతి, ఇన్దునా సహ=చంద్రునితోకూడ, ప్రోద్యమానే=ఉదయించుచుండగా, కౌసల్యా= కౌసల్య, జగన్నాథమ్=సకలజగత్తులకును ప్రభు వైనవాడును, సర్వలోకనమస్కృతమ్ = సర్వలోకములచే నమస్కరింపబడినవాడును, సర్వలక్షణసంయుతమ్=సకలలక్షణములతో కూడినవాడును, విష్ణోః = విష్ణువుయొక్క, అర్ధమ్= అంశయైనవాడును, మహాభాగమ్ = గొప్పభాగ్యము కలవాడును, ఇక్ష్వాకవర్ధనమ్ = ఇక్ష్వాకువంశీయులను వృద్ధిపొందించువాడును అగు, రామమ్ = రాముని, పుత్రమ్=పుత్రునిగా, అజనయత్ = కనెను.

తా. యజ్ఞము పూర్తి యైన తరువాత ఆరు ఋతువులు గడచినవి. అనగా ఒక సంవత్సరము చాలవరకు పూర్తి యైనది. తరువాత వచ్చిన పండ్రెండవ మాస మగు చైత్రమాసమునందు, పునర్వసునక్షత్రయుక్తనవమీతిథియందు, ఐదు గ్రహములు తమ తమ ఉచ్చస్థానములం దుండగా—అనగా సూర్య-కుజ-గురు-శుక్ర-శనులు-తమ ఉచ్చస్థానములగు మేష-మకర-కర్కటక-మీన-తులా-రాసులందుండగా-గురుడు చంద్రునితో కలసి యున్న కర్కటలగ్నమునందు, కౌసల్య, సకలజగన్నాథుడును, సర్వలోకనమస్కృతుడును, సర్వలక్షణసంపన్నుడును, విష్ణువు యొక్క అంశ యైనవాడును, మహాభాగ్యవంతుడును, ఇక్ష్వాకువంశవర్ధనుడును అగు రాముని పుత్రునిగా కనెను.

వి. విష్ణువునకు అంశకల్పన వ్యావహారికము. విష్ణ్వర్ధాంశభూతుడు సకలజగన్నాథుడు కాజాలడు. సకలజగన్నాథుడైనచో అర్ధాంశత్వ మయుక్తము. శ్రీరాముడు మహావిష్ణువుయొక్క పూర్ణావతారము. 10

మూ. కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా, 11
యథా పరేణ దేవానా మదితిర్వజ్రపాణినా.

ప్ర. అ. కౌసల్యా=కౌసల్య, అమితతేజసా = అమితమైన తేజస్సు గల,

తేన పుత్రేణ = ఆ పుత్రునిచేత, దేవానామ్ = దేవతలలో, వరేణ=శ్రేష్ఠుడైన, వజ్రపాణినా=దేవేంద్రునిచేత, అదితిః యథా=అదితివలె, శుశుభే=ప్రకాశించెను.

తా. అమితమైన తేజస్సు గల ఆ కుమారునితో కౌసల్య, దేవతలలో శ్రేష్ఠుడైన దేవేంద్రునితో అతని తల్లియైన అదితివలె ప్రకాశించెను.

మూ. భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః, 12
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః సర్వైః సముదితో గుణైః.

ప్ర. అ. సత్యపరాక్రమః = సత్య మైన పరాక్రమము కలవాడును, సాక్షాత్=సాక్షాత్తు, విష్ణోః=విష్ణువుయొక్క, చతుర్భాగః=నాల్గవ భాగ మైన వాడును, సర్వైః = సమస్త మైన, గుణైః = గుణములతో, సముదితః = కూడిన వాడును అగు, భరతో నామ = భరతు డనెడు పుత్రుడు, కైకేయ్యామ్ = కైకేయియందు, జజ్ఞే = పుట్టెను.

తా. సత్యపరాక్రముడును, సాక్షాత్తు విష్ణువుయొక్క నాల్గవభాగ మైన వాడును, సమస్త సద్గుణ సంపన్నుడును అగు భరతు డను పుత్రుడు కైకేయి యందు జనించెను. 12

మూ. అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ, 13
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ.

ప్ర. అ. అథ = పిమ్మట, సుమిత్రా = సుమిత్ర, వీరౌ = వీరులును, సర్వాస్త్రకుశలౌ=సకలాస్త్రములందును నేర్పుకలవారును, విష్ణోః=విష్ణువుయొక్క, అర్ధసమన్వితౌ = అంశములతో కూడినవారును అగు, లక్ష్మణశత్రుఘ్నౌ = లక్ష్మణశత్రుఘ్ను లనెడు, సుతౌ = కుమారులను, అజనయత్ = కనెను.

తా. పిమ్మట సుమిత్ర, సకలాస్త్రములందును నేర్పు కలవారును, విష్ణువు యొక్క అంశతో కూడినవారును, వీరులును అగు లక్ష్మణశత్రుఘ్ను లను సుతులను కనెను.

మూ. పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః, 14
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ.

ప్ర. అ. ప్రసన్నధీః = ప్రసన్న మైన బుద్ధి గల, భరతః = భరతుడు, పుష్యే = పుష్యమీనక్షత్రమునందు, మీనలగ్నే = మీనలగ్నమునందు, జాతః = పుట్టెను, సౌమిత్రీ = సుమిత్రాకుమారులు, సార్పే = ఆశ్రేషానక్షత్రమునందు, కుళీరే = కర్కాటకలగ్నమునందు, రవౌ = సూర్యుడు, అభ్యుదితే= ఉదయించిన వాడగుచుండగా, అనగా మరునాడు అని అర్థము (కొందరు వ్రాసి నట్లు మధ్యాహ్న సమయమున అని కాదు) జాతౌ = పుట్టిరి.

తా. నిర్మల మైన బుద్ధి గల భరతుడు పుష్యమీనక్షత్రమునందు, మీన లగ్నమున పుట్టెను. మరునాడు లక్ష్మణశత్రుఘ్నులు, ఆశ్రేషానక్షత్రమునందు, కర్కాటకలగ్నమున మధ్యాహ్నసమయమున పుట్టిరి. 14

మూ. రాజ్ఞః పుత్రా మహాత్మానశ్చత్వారో జజ్ఞిరే పృథక్, 15
గుణవన్తోఽనురూపాశ్చ రుచ్యా ప్రోష్ఠపదోపమాః.

ప్ర. అ. గుణవన్తః=గుణములు కలవారును, అనురూపాః=తగినవారును, రుచ్యా = కాంతిచేత, ప్రోష్ఠపదోపమాః = పూర్వాభాద్రోత్తరాభాద్రనక్షత్రములతో సమానులును, మహాత్మానః = గొప్ప బుద్ధి కలవారును అగు, రాజ్ఞః = రాజు యొక్క, చత్వారః=నలుగురు, పుత్రాః = పుత్రులు, పృథక్ = వేరు వేరుగా, జజ్ఞిరే = పుట్టిరి.

తా. ఈ విధముగ దశరథునకు, గుణవంతులును, అనురూపులును, పూర్వాభాద్రోత్తరాభాద్రములు అను నాలుగు నక్షత్రముల వంటి కాంతి కల వారును, బుద్ధిమంతులును అగు నలుగురు పుత్రులు జనించిరి. 15

మూ. జగుః కలం చ గన్ధర్వా ననృతుశ్చాప్సరోగణాః, 16
దేవదున్దుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా,
ఉత్సవశ్చ మహానాసీదయోధ్యాయాం జనాకులః. 17

ప్ర. అ. గన్ధర్వాః = గంధర్వులు, కలమ్ = మధురముగా, జగుః = గానముచేసిరి. అప్సరోగణాః=అప్సరఃస్త్రీసమూహములు, ననృతుః = నాట్యము చేసినవి. దేవదున్దుభయః = దేవతల దుందుభులు, నేదుః = మ్రోగినవి, ఖాత్ = ఆకాశమునుండి, పుష్పవృష్టిశ్చ=పుష్పవర్షము కూడ, చ్యుతా=పడినది, అయో

ధ్యాయామ్=అయోధ్యలో, జనాకులః=జనులచే వ్యాకుల మైన, మహాన్=గొప్ప, ఉత్సవశ్చ = ఉత్సవము కూడ, ఆసీత్ = ఆయెను.

తా. ఆ సమయమున గంధర్వులు మధురముగా గానము చేసిరి. అప్స రసలు నాట్యము చేసిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశమునుండి పుష్ప వర్షము కురిసినది. అయోధ్యలో ఎందరో జనులు పాల్గొనిన గొప్ప ఉత్సవము జరిగినది. 17

మూ. రథ్యాశ్చ జనసంబాధా నటనర్తకసంకులాః,
గాయనైశ్చ విరావిణ్యో వాదనైశ్చ తథాపరైః. 18

ప్ర. అ. రథ్యాః = వీధులు, జనసంబాధాః = జనులచేత ఇరుకైనవిగాను, నటనర్తకసంకులాః=నటులతోడను నర్తకులతోడను వ్యాప్త మైనవి గాను, గాయనైశ్చ = గానముచేయువారిచేతను, వాదనైః = వాద్యములు మ్రోగించువారిచేతను, తథా=మరియు, అపరైః = ఇతరులైన వందిమాగధాదులచేతను, విరావిణ్యః = బాగుగా ధ్వని చేయుచున్నవిగాను, అయినవి.

తా. జనులతో కిక్కిరిసి ఉన్న వీధు లన్నియు నటనర్తకాదులతో నిండి పోయినవి. గాయకుల ధ్వనులు, వాద్యధ్వనులు వందిమాగధాదులు చేయు ధ్వనులును మిన్ను ముట్టినవి. 18

మూ. ప్రదేయాంశ్చ దదౌ రాజా సూతమాగధవన్దినామ్,
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం గోధనాని సహస్రశః. 19

ప్ర. అ. రాజా=రాజు, సూతమాగధవన్దినామ్=పౌరాణికులకును, వంశా వళిని కీర్తించువారికిని, స్తోత్రపాఠము చేయువారికిని, ప్రదేయాన్ చ=ఇవ్వదగిన పారితోషికములను, దదౌ = ఇచ్చెను, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకొరకు, విత్తమ్=ధనమును, సహస్రశః=వేలకొలది, గోధనాని=గోవు లనెడు ధనము లను, దదౌ=ఇచ్చెను.

తా. దశరథుడు సూత-మాగధ-వందులకు పారితోషికములను పంచి పెట్టెను. బ్రాహ్మణులకు అధికసంఖ్యాకము లగు గోవులను, తదితరవస్తువులను దానము చేసెను. 19

మూ. అతీత్యైకాదశాహం తు నామకర్మ తథాకరోత్,
జ్యేష్ఠం రామం మహాత్మానం భరతం కైకయీసుతమ్. 20

సౌమిత్రిం లక్ష్మణమితి శత్రుఘ్న మపరం తథా,
వసిష్ఠః పరమప్రీతో నామాని కురుతే తదా. 21

ప్ర. అ. తథా=మరియు, ఏకాదశాహమ్=పదకొండు రోజులు, అతీత్య=దాటి, నామకర్మ = నామకరణమును, అకరోత్ = చేసెను, మహాత్మానమ్=మహాత్ముడైన, జ్యేష్ఠమ్=పెద్దకుమారుని, రామమ్=రామునిగాను, కైకయీసుతమ్ = కైకయీపుత్రుని, భరతమ్=భరతునిగాను, సౌమిత్రిమ్ = ఒక సుమిత్రాకుమారుని, లక్ష్మణమితి=లక్ష్మణుని గాను, అపరమ్=రెండవ సుమిత్రాకుమారుని, శత్రుఘ్నమ్=శత్రుఘ్నుని గాను, పరమప్రీతః=మిక్కిలి సంతోషించిన, వసిష్ఠః=వసిష్ఠుడు, తదా = అప్పుడు, నామాని = పేర్లను, కురుతే = చేసెను.

తా. పదకొండు దినముల తరువాత నామకరణము జరిగెను. ఆనంద భరితహృదయుడైన వసిష్ఠుడు జ్యేష్ఠ డగు కౌసల్యాపుత్రునకు రాము డనియు, కైకేయీపుత్రునకు భరతు డనియు, సుమిత్రాపుత్రులకు లక్ష్మణశత్రుఘ్ను లనియు నామధేయములు చేసెను.

వి. "రమన్తే సర్వే జనాః గుణైః అస్మిన్ ఇతి రామః". అను వ్యుత్పత్తి చేత, "సర్వజనులును సద్గుణములను బట్టి ఎవని విషయమున అనందవంతు లగుదురో అతడు రాముడు" అని "రామ" శబ్దార్థము. లక్ష్మీః అస్య అస్తీతి లక్ష్మణః"—సంపద, శోభ కలవాడు లక్ష్మణుడు. "బిభర్తీతి భరతః"—రాజ్యమును భరించినవాడు కావున భరతుడు. "శత్రూన్ హన్తీతి శత్రుఘ్నః"—శత్రువులను చంపువాడు శత్రుఘ్నుడు.

క్షత్రియులకు జాతాశౌచము పంద్రెండు దినము లని శ్రుతులలో ఉన్నది. క్షత్రియులకు నామకరణము పదమూడవ దినమున చేయవలె నని స్మృతులలో నున్నది. అందుచే "ఏకాదశాహమ్" అను పదమునకు లక్ష్మణ శత్రుఘ్నులు పుట్టిన తరువాత పదకొండు రోజులు దాటిన తరువాత అని అర్థము చెప్పుకొనవలె నని గోవిందరాజుల వ్యాఖ్య. అట్లైనను రామభరతులు పుట్టిన పదమూడవ దివసమైనను సౌమిత్రులు పుట్టిన పంద్రెండవ దివసమే కదా? వారి జన్మాశౌచ

మట్లే ఉన్నది కదా. స్మృతికర్త యైన వసిష్ఠుడు ఏకాదశదివసానంతరము నామ కరణము చేసినా డని చెప్పినపుడు మనకు ఈవికల్పము లెందులకు ? రామభరతు లకు ఒకనాడు, సౌమిత్రులకు మరొకనాడు నామకరణములు చేసి ఉండవచ్చును కదా ? జాతకర్మకు వలె నామకరణమునకు కూడ సూతక నిషేధము ఆనాడు లేదేమో ? మన భావాలు, సంప్రదాయాలు, ఆచారాలు ప్రాచీనగ్రంథాలలో చేర్చి వ్యాఖ్యానించుట యుక్తము కాదు. వాక్యార్థమును యథాతథముగా గ్రహించి ఇది అనాటి పరిస్థితి కదా అని అనుకొనుట యుక్తము. 32

మూ. బ్రాహ్మణాన్ భోజయామాస పౌరాన్ జానపదానపి,
అదదాద్బ్రాహ్మణానాం చ రత్నౌఘమమితం బహు. 22
తేషాం జన్మక్రియాదీని సర్వకర్మాణ్యకారయత్.

ప్ర. అ. బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, పౌరాన్ = నగరములలో ఉన్న వారిని, జానపదానపి=గ్రామీణులను, భోజయామాస=భుజింపచేసెను, బ్రాహ్మ ణానాం = బ్రాహ్మణులకు, అమితమ్ = అమితమైన, బహు = అత్యధిక మైన, రత్నౌఘమ్=రత్నసముదాయమును, అదదాత్ = ఇచ్చెను, తేషాం = ఆ పుత్రు లకు, జన్మక్రియాదీని = జన్మక్రియమొదలైన, సర్వకర్మాణి=సమస్తకర్మలను, అకారయత్ = చేయించెను.

తా. దశరథుడు బ్రాహ్మణులకును, పౌరులకును, జానపదులకును సంత ర్పణములు చేసి బ్రాహ్మణులకు అత్యధిక మగు రత్నసముదాయమును దానము చేసెను. ఈ విధముగ దశరథుడు కుమారులకు జాతకర్మ-నామకరణ-అన్న ప్రాశన-చౌలోపనయనాదిసంస్కారము లన్నియు యథాకాలముగ చేయించెను. 22

మూ. తేషాం కేతురివ జ్యేష్ఠో రామో రతికరః పితుః, 23
బభూవ భూయో భూతానాం స్వయంభూరివ సంమతః.

ప్ర. అ. తేషామ్ = వారిలో, జ్యేష్ఠః = పెద్దవాడైన, రామః = రాముడు, కేతురివ = ధ్వజము వలె, పితుః=తండ్రికి, భూయః = మిక్కిలి, రతికరః= ప్రీతిజనకుడై, స్వయంభూరివ=బ్రహ్మదేవుడు వలె, భూతానామ్=సకలప్రాణుల కును, సంమతః = ఆదరపాత్రుడు, బభూవ = ఆయెను.

తా. వారిలో పెద్దవాడైన రాముడు ధ్వజము వలె సర్వోన్నతుడై, తండ్రికి చాల ప్రీతిని కలిగించెను. బ్రహ్మదేవుడు వలె సమస్తప్రాణుల ఆదరమును చూరకొనెను. 23

మూ. సర్వే వేదవిదః శూరాస్సర్వే లోకహితే రతాః, 24
సర్వే జ్ఞానోపసంపన్నాః సర్వే సముదితా గుణైః.

ప్ర. అ. సర్వే=అందరును, వేదవిదః = వేదవేత్తలే, శూరాః=శూరులే, సర్వే=అందరును, లోకహితే = లోకక్షేమమునందు, రతాః = ఆసక్తి కలవారే, సర్వే = అందరును, జ్ఞానోపసంపన్నాః = జ్ఞానముతో కూడినవారే, సర్వే= అందరును, గుణైః = సద్గుణములతో, సముదితాః = కూడినవారే.

తా. ఆ దశరథపుత్రులందరును వేదవేత్తలే, అందరును శూరులే, అందరును జ్ఞానసంపన్నులే. అందరును సద్గుణశోభితులే. అందరును లోకక్షేమమునందు ఆసక్తి కలవారే. 24

మూ. తేషామపి మహాతేజా రామః సత్యపరాక్రమః, 25
ఇష్టః సర్వస్య లోకస్య శశాఙ్క ఇవ నిర్మలః.

ప్ర. అ. తేషామపి = వారందరిలోకిని, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, సత్యపరాక్రమః = వ్యర్థము కాని పరాక్రమము కలవాడును, అగు, రామః = రాముడు, నిర్మలః = కలంకరహితు డగు, శశాఙ్కః ఇవ = చంద్రుడు వలె, సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకమునకు, ఇష్టః = ఇష్టమైనవాడు.

తా. వారందరిలో కూడ, మహాతేజఃశాలియు, సత్యపరాక్రముడును అగు రాముడు, నిర్మలుడైన చంద్రుడు వలె సకలలోకమునకు ఇష్టుడై ఉండెను. 25

మూ. గజస్కన్ధేఽశ్వపృష్ఠే చ రథచర్యాసు సమ్మతః, 26
ధనుర్వేదే చ నిరతః పితృశుశ్రూషణే రతః.

ప్ర. అ. గజస్కన్ధే=ఏనుగ మూపు నెక్కుటయందును, అశ్వపృష్ఠే చ= గుఱ్ఱము వీపుపై ఎక్కి ప్రయాణములు చేయుటయందును, రథచర్యాసు=రథము యొక్క నడకలయందును, సంమతః = సమర్థు డని అందరిచేతను అంగీకరింప

బడినవాడు, ధనుర్వేదే చ=ధనుర్వేదమునందు కూడ, నిరతః=ఆసక్తి కలవాడు, పితృశుశ్రూషణే = తలిదండ్రుల సేవ చేయుటయందు, రతః = ఆసక్తి కలవాడు.

తా. రాముడు గజాశ్వరథములపై నెక్కి యుద్ధము చేయుటయందు సమర్థుడని పేరెన్నిక గనెను. అతడు ధనుర్వేదమునందు శ్రద్ధ కలవాడు. పితృసేవచేయుటయందు ఆసక్తి కలవాడు. 26

మూ. బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః, 27
రామస్య లోకరామస్య భ్రాతుర్జ్యేష్ఠస్య నిత్యశః.

ప్ర. అ. లక్ష్మివర్ధనః = సంపదను వృద్ధిపొందించు, లక్ష్మణః = లక్ష్మణుడు, బాల్యాత్ ప్రభృతి = బాల్యమునుండియు, లోకరామస్య = లోకమునకు మనోహరుడును, జ్యేష్ఠస్య భ్రాతుః = జ్యేష్ఠసోదరుడును అగు, రామస్య = రాముని విషయమున, నిత్యశః=ఎల్లప్పుడును, సుస్నిగ్ధః = బాగుగా స్నేహము కలవాడై, ఉండెను.

తా. సంపదలను వృద్ధిపొందించు లక్ష్మణుడు, చిన్నతనము నుండియు, లోకములకు మనోహరుడును, జ్యేష్ఠసోదరుడును అగు రాముని విషయమున సర్వదా అత్యధిక స్నేహము కలవాడై ఉండెను. 27

మూ. సర్వప్రియకరస్తస్య రామస్యాపి శరీరతః, 28
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః.

ప్ర. అ. లక్ష్మిసంపన్నః=శోభాసంపన్నుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, శరీరతః అపి=శరీరమును కూడ అర్పించి, సర్వప్రియకరః = సమస్తవిధములగు ప్రియములను చేయుచు, తస్య = ఆ, రామస్య = రామునకు, అపరః = రెండవ, బహిఃప్రాణ ఇవ = బైట సంచరించు ప్రాణము వలె ఉండెను.

తా. రామునకు సకలప్రియములను చేకూర్చుటకై శరీరమును కూడ అర్పించుటకు వెనుతీయని లక్ష్మిసంపన్నుడైన లక్ష్మణుడు రామునకు, బైట సంచరించు చున్న మరి యొక ప్రాణమా అన్నట్లు అపారస్నేహాస్పదుడయ్యెను. 28

మూ. న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః, 29
మృష్టమన్న ముపానీత మశ్నాతి న చ తం వినా.

ప్ర. అ. పురుషోత్తమః = పురుషశ్రేష్ఠు డైన రాముడు, తేన వినా = ఆ లక్ష్మణుడు లేకుండ, నిద్రామ్ = నిద్రను, న లభతే = పొందడు, ఉపానీతమ్ = తీసికొనిరాబడిన, మృష్టమ్ = శ్రేష్ఠ మైన, అన్నం చ = అన్నమును కూడ, తం వినా = అతడు లేకుండ, న అశ్నాతి = భుజింపడు.

తా. లక్ష్మణుడు ప్రక్కన లేకున్నచో శ్రీరాముడు నిద్రపోయెడివాడు కాదు. అతడు లేనిచో మధుర మైన ఆహారమును కూడ భుజించెడివాడు కాదు.

మూ. యదా హి హయమారూఢో మృగయాం యాతి రాఘవః, 30
తదైనం పృష్ఠతోఽన్వేతి సధనుః పరిపాలయన్.

ప్ర. అ. రాఘవః = రాముడు, హయమ్ = అశ్వమును, అరుహ్య = ఎక్కి, యదా = ఎప్పుడు, మృగయాం = వేటనుగూర్చి, యాతి = వెళ్లెనో, తదా = అప్పుడు, సః = ఆ లక్ష్మణుడు, ధనుః = ధనుస్సును, పరిపాలయన్ = ధరించిన వాడై, ఏనమ్ = ఈ రాముని, పృష్ఠతః = వెనుకనే, అన్వేతి = అనుసరించి వెళ్లును.

తా. రాముడు అశ్వము నెక్కి వేటకై బయల్వెడలినపుడు లక్ష్మణుడు ధనుస్సు చేత బూని అతని వెనుకనే వెళ్లెడివాడు. 30

మూ. భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణావరజో హి సః, 31
ప్రాణైః ప్రియతరో నిత్యం తస్య చాసీత్తథా ప్రియః.

ప్ర. అ. లక్ష్మణావరజః = లక్ష్మణుని తమ్ముడైన, సః = ఆ, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, భరతస్యాపి = భరతునకు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రాణైః = ప్రాణములచేత, ప్రియతరః = ఎక్కువ ఇష్టు డయ్యెను, (భరతుడు, తస్య చ = ఆ శత్రుఘ్ననకు కూడ, తథా = ఆ విధముగనే, ప్రియః = ఇష్టుడు, ఆసీత్ = ఆయెను.

తా. అట్లే లక్ష్మణుని తమ్ము డైన శత్రుఘ్నుడు భరతునకు ప్రాణముల

కంటె ఎక్కువ ప్రియ డయ్యెను. శత్రుఘ్నునకు భరతుడును అట్లే ప్రియు డయ్యెను. 31

మూ. స చతుర్భిర్మహాభాగైః పుత్రైర్దశరథః ప్రియైః, 32
బభూవ పరమప్రీతో దేవైరివ పితామహః.

ప్ర. అ. సః = ఆ దశరథుడు, మహాభాగైః = మహాభాగ్యవంతులైన, చతుర్భిః=నలుగురు, పుత్రైః = పుత్రులతో, పితామహః=బ్రహ్మదేవుడు, దేవైః ఇవ=దేవతలతో వలె, పరమప్రీతః=చాల సంతసించినవాడు, బభూవ=అయెను.

తా. భాగ్యశాలులును, ప్రియులును అగు ఆ నలుగురు కుమారులతో దశరథుడు, దేవతలతో బ్రహ్మదేవుడు వలె చాల సంతోషించెను. 33

మూ. తే యదా జ్ఞానసంపన్నాః సర్వైః సముదితా గుణైః,
హ్రీమన్తః కీర్తిమన్తశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః. 33

తేషామేవంప్రభావానాం సర్వేషాం దీప్తతేజసామ్,
పితా దశరథో హృష్టో బ్రహ్మా లోకాధిపో యథా. 34

ప్ర. అ. తే = వారు, యదా = ఎప్పుడు, జ్ఞానసంపన్నాః = జ్ఞానముతో కూడినవారుగాను, సర్వైః = సమస్తమైన, గుణైః=గుణములతో, సముదితాః= కూడినవారుగాను, హ్రీమన్తః=లజ్జ కలవారుగను, కీర్తిమన్తశ్చ = కీర్తి కలవారు గాను, సర్వజ్ఞాః=అన్నియు తెలిసిన వారుగాను, దీర్ఘదర్శినః=దూరముగా ఆలోచించ గలవారుగాను, (అయిరో, అప్పుడు), ఏవంప్రభావానామ్=ఇట్టి ప్రభావము గల, దీప్తతేజసామ్=ప్రకాశించుచున్న తేజస్సు గల, తేషాం సర్వేషామ్ = వారు అందరి విషయమునను, పితా=తండ్రి యైన, దశరథః=దశరథుడు, లోకాధిపః= లోకాధిపతి యైన, బ్రహ్మ యథా=బ్రహ్మదేవుడు వలె, హృష్టః=సంతోషించెను.

తా. ఆ కుమారు లందరును జ్ఞానసంపన్నులు, సర్వగుణభూషితులు, తప్పు పనులు చేయుటకు సిగ్గుపడెడువారు, కీర్తిని సంపాదించినవారు, అన్ని విషయము లందును జ్ఞానము సంపాదించినవారు, దీర్ఘాలోచన చేయ సమర్థులై యుండిరి. ఇట్టి ప్రభావము గల తేజశ్శాలు లగు ఆ పుత్రులను చూచుకొని దశరథమహారాజు సకలలోకప్రభు వగు ప్రజాపతి వలె సంతుష్టాంతరంగు డయ్యెను. 34

మూ. తే చాపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనే రతాః, 35
పితృశుశ్రూషణరతా ధనుర్వేదే చ నిష్ఠితాః.

ప్ర. అ. తే = ఆ, మనుజవ్యాఘ్రాః అపి = మనుష్యశ్రేష్ఠులు కూడ, వైదికాధ్యయనే=వేదాధ్యయనమునందు, రతాః=శ్రద్ధావంతులుగను, పితృశుశ్రూషణరతాః = తలిదండ్రులకు శుశ్రూష చేయుటయందు ఆసక్తి కలవారుగాను, ధనుర్వేదే = ధనుర్వేదమునందు, నిష్ఠితాశ్చ = నిష్ణాతులుగను ఉండిరి.

తా. ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నులు వేదాధ్యయనమందు శ్రద్ధావంతులై, తలిదండ్రులను సేవించుటయందు ఆసక్తి కలవారై, ధనుర్వేదమునందు కూడ నైపుణ్యమును సంపాదించిరి. 35

మూ. అథ రాజా దశరథస్తేషాం దారక్రియాం ప్రతి, 36
చిన్తయామాస ధర్మాత్మా సోపాధ్యాయః సబాన్ధవః.

ప్ర. అ. అథ = పిమ్మట, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాజా దశరథః= దశరథమహారాజు, సోపాధ్యాయః = పురోహితునితో కూడినవాడై, సబాన్ధవః = బంధువులతో కూడినవాడై, తేషామ్=ఆ కుమారులయొక్క, దారక్రియాం ప్రతి= వివాహమును గూర్చి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. ఒకనాడు, దశరథమహారాజు. పురోహితునితోడను, బంధువులతోడను కలిసి ఆ కుమారుల వివాహమును గూర్చి ఆలోచించుచుండెను. 36

మూ. తస్య చిన్తయమానస్య మన్త్రిమధ్యే మహాత్మనః,
అభ్యగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహామునిః. 37

ప్ర. అ. మహాత్మనః = పూజ్యమైన బుద్ధి గల, తస్య = ఆ దశరథుడు, మన్త్రిమధ్యే=మంత్రుల మధ్యయందు, చిన్తయమానస్య =ఆలోచించుచుండగా, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః మహామునిః = మహాముని యైన విశ్వామిత్రుడు, అభ్యగచ్ఛత్=వచ్చెను.

తా. బుద్ధిశాలి యగు దశరథుడు మంత్రులతో ఆలోచించుచుండగా, మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రమహాముని అచటకు వచ్చెను. 37

మూ. స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షానువాచ హ. 38
శీఘ్రమాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధినః సుతమ్.

ప్ర. అ. సః = అతడు, రాజ్ఞః = రాజుయొక్క, దర్శనాకాంక్షీ = దర్శనమును కోరుచున్నవాడై, ద్వారాధ్యక్షాన్ = ద్వారపాలకులను గూర్చి, ఉవాచ హ=పలికెను. "గాధినః=గాధియొక్క, సుతమ్=కుమారుడును, కౌశికమ్ = కుశికవంశమునందు పుట్టినవాడును అగు, మామ్=నన్ను, ప్రాప్తమ్ = వచ్చిన వానినిగా, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆఖ్యాత = చెప్పుడు."

తా. రాజదర్శనమును కోరుచున్న ఆతడు, ద్వారపాలకులతో "కుశికవంశీయుడును, గాధికుమారుడును అగు విశ్వామిత్రుడు వచ్చినాడు అని శీఘ్రముగ చెప్పుడు" అని పలికెను. 38

మూ. తచ్ఛ్రుత్వా వచనం త్రాసాద్రాజ్ఞో వేశ్మ ప్రదుద్రువుః, 39
సంభ్రాన్తమనసః సర్వే తేన వాక్యేన చోదితాః.

ప్ర. అ. తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, సర్వే = వారందరును, సంభ్రాన్తమనసః=కలతపడినమనస్సుకలవారై, తేన=ఆ, వాక్యేన= వాక్యముచేత, చోదితాః = ప్రేరేపింపబడినవారై, రాజ్ఞః = రాజుయొక్క, వేశ్మ = గృహమునుగూర్చి, ప్రదుద్రువుః = పరుగెత్తిరి.

తా. ఆ మాట వినగనే ద్వారపాలకు లందరును, ఆ వాక్యముచే ప్రేరేపింపబడినవారై, భయపడిన చిత్తముతో, రాజగృహమునకు పరుగెత్తి వెళ్లిరి. 39

మూ. తే గత్వా రాజభవనం విశ్వామిత్రమృషిం తదా,
ప్రాప్తమావేదయామాసుర్నృపాయైక్ష్వాకవే తదా. 40

ప్ర. అ. తదా = అప్పుడు, తే = వారు, రాజభవనమ్ = రాజగృహమును గూర్చి, గత్వా = వెళ్లి, తదా = అప్పుడు, విశ్వామిత్రమ్ ఋషిమ్ = విశ్వామిత్ర మహర్షిని, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, ఐక్ష్వాకవే = ఇక్ష్వాకువంశీయుడైన, నృపాయ = దశరథునకు, ఆవేదయామాసుః = తెలిపిరి.

తా. వారు రాజప్రాసాదము చేరి విశ్వామిత్రమహర్షి వచ్చినా డని దశరథు నకు తెలిపిరి. 40

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా సపురోధాః సమాహితః, 41
ప్రత్యుజ్జగామ తం హృష్టో బ్రహ్మాణమివ వాసవః.

ప్ర. అ. తేషామ్ = ఆ ద్వారపాలకులయొక్క, తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, హృష్టః=సంతసించిన ఆ దశరథుడు, సపురోధాః= పురోహితులతో కూడినవాడై, సమాహితః = సావధానచిత్తుడై, తమ్ = ఆతనిని, వాసవః = దేవేంద్రుడు, బ్రహ్మాణమివ = బ్రహ్మను వలె, ప్రత్యుజ్జగామ = ఎదుర్కొనెను.

తా. వారి మాటలు విన్న దశరథుడు, సంతసించి, పురోహితసమేతుడై, సావధానచిత్తుడై, దేవేంద్రుడు బ్రహ్మకు వలె, ఆతనికి ఎదురేగెను. 41

మూ. తం దృష్ట్వా జ్వలితం దీప్తతపసం సంశితవ్రతమ్, 42
ప్రహృష్టవదనో రాజా తతోఽర్ఘ్యముపహారయత్.

ప్ర. అ. తతః=పిమ్మట, రాజా = రాజు, జ్వలితమ్ = ప్రకాశించుచున్న వాడును, దీప్తతపసమ్=ప్రకాశించుచున్న తపస్సు కలవాడును, సంశితవ్రతమ్= తీవ్రము లైన నియమములు కలవాడును అగు, తమ్ = ఆతనిని, దృష్ట్వా=చూచి, ప్రహృష్టవదనః=వికసించిన ముఖముకలవాడై, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, ఉప హారయత్=ఇచ్చెను.

తా. గొప్పతపఃశక్తితో ప్రజ్వలించుచున్నవాడును, కఠినవ్రతములను ఆచరించువాడును అగు ఆ విశ్వామిత్రుని చూచి దశరథుడు ఆనందముచే వికసించిన ముఖము కలవాడై, అర్ఘ్యము సమర్పించెను. 42

మూ. స రాజ్ఞః ప్రతిగృహ్యార్ఘ్యం శాస్త్రదృష్టేన కర్మణా, 43
కుశలం చావ్యయం చైవ పర్యపృచ్ఛన్నరాధిపమ్.

ప్ర. అ. సః = ఆతడు, శాస్త్రదృష్టేన = శాస్త్రమునందు చూడబడిన, కర్మణా=విధానముచేత, రాజ్ఞః = రాజునుండి, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, ప్రతి

గృహ్య=స్వీకరించి, నరాధిపమ్=రాజును, కుశలం చ=కుశలమును, అవ్యయం చైవ=ఎట్టి లోటు లేకపోవుటను గూర్చి, పర్యపృచ్ఛత్ = ప్రశ్నించెను.

తా. విశ్వామిత్రుడు శాస్త్రోక్తరీతిని దశరథమహారాజు సమర్పించిన అర్ఘ్యము స్వీకరించి, "ఎట్టి ఆపదలును లేక కుశలముగా నున్నావా ?" అని ఆతనిని ప్రశ్నించెను. 43

మూ. పురే కోశే జనపదే బాన్ధవేషు సుహృత్సు చ, 44
కుశలం కౌశికో రాజ్ఞః పర్యపృచ్ఛత్సుధార్మికః.

ప్ర. అ. సుధార్మికః = మంచి ధార్మికు డైన, కౌశికః = విశ్వామిత్రుడు, రాజ్ఞః = రాజుయొక్క, పురే = పట్టణములందును, కోశే = ధనాగారమునందును, జనపదే = గ్రామములందును, బాన్ధవేషు = బంధువులందును, సుహృత్సు చ = మిత్రులందును, కుశలమ్ = కుశలమును, పర్యపృచ్ఛత్ = ప్రశ్నించెను.

తా. మిక్కిలి ధార్మికు డైన విశ్వామిత్రుడు — "నీ రాజ్యములోని నగరములందును, గ్రామములందును, అందరును క్షేమముగా ఉన్నారా ? ధనాగారము సమృద్ధముగా ఉన్నదా ? నీ సుహృద్బాంధవు లందరును క్షేమమే కదా !" అని దశరథుని ప్రశ్నించెను. 44

మూ. అపి తే సన్నతాః సర్వే సామన్తా రిపవో జితాః, 45
దైవం చ మానుషం చాపి కర్మ తే సాధ్వనుష్ఠితమ్.

ప్ర. అ. సామన్తాః = సామంతరాజులు, సర్వే = అందరును, తే = నీకు, అపి సన్నతాః = వంగి ఉన్నారా ? రిపవః = శత్రువులు, జితాః = జయింపబడినారా ? తే = నీయొక్క, దైవతం = దేవతానుగ్రహముకొరకు చేయు, కర్మ = కర్మయు, మానుషం చాపి = మనుష్యప్రయత్నసాధ్య మగు కర్మయు, సాధు = చక్కగా, అనుష్ఠితమ్ = చేయబడినదా ?

తా. నీకు సామంతరాజు లందరును లొంగి ఉన్నారా? శత్రువుల నందరిని జయించినావా ? దేవతాప్రీతికర మైన యజ్ఞయాగాదులను, మానవప్రయత్నసాధ్య మైన సామదానభేదదండాద్యుపాయములను చక్కగ అనుష్ఠించుచున్నావా ? 45

మూ. వసిష్ఠం చ సమాగమ్య కుశలం మునిపుఙ్గవః, 46
ఋషీంశ్చ తాన్ యథాన్యాయం మహాభాగానువాచ హ.

ప్ర. అ. మునిపుఙ్గవః=మునిశ్రేష్ఠుడు, వసిష్ఠం చ=వసిష్ఠుని, తాన్=ఆ, మహాభాగాన్ = మహానుభావులైన, ఋషీంశ్చ=ఋషులను, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, సమాగమ్య=సమీపించి, కుశలమ్=క్షేమమును, ఉవాచ= పలికెను. (ప్రశ్నించెను).

తా. ఆ మునిపుంగవుడు, వసిష్ఠుని, అచట నున్న మహానుభావు లగు ఇతర ఋషులను సమీపించి, న్యాయానుసారముగా వారి కుశల మడిగెను. 46

మూ. తే సర్వే హృష్టమనస స్తస్య రాజ్ఞో నివేశనమ్, 47
వివిశుః పూజితా స్తత్ర నిషేదుశ్చ యథార్హతః.

ప్ర. అ. తే సర్వే = వారందరును, హృష్టమనసః=సంతోషించిన మనస్సు కలవారై, తస్య=ఆ, రాజ్ఞః=రాజుయొక్క, నివేశనమ్=గృహమును, వివిశుః= ప్రవేశించిరి, తత్ర = అచట, యథార్హతః=యోగ్యతానుసారముగా, పూజితాః= పూజింపబడినవారై, నిషేదుశ్చ = కూర్చుండిరి.

తా. ఆ ఋషులందరును సంతసించి దశరథుని గృహమును ప్రవేశించిరి. అచట యోగ్యతానుసారముగా పూజింపబడినవారై కూర్చుండిరి. 47

మూ. అథ హృష్టమనా రాజా విశ్వామిత్రం మహామునిమ్, 48
ఉవాచ పరమోదారో హృష్టస్తమభిపూజయన్.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, పరమోదారః = మిక్కిలి ఔదార్యవంతుడైన, రాజా=రాజు, హృష్టమనాః=సంతోషించిన మనస్సు కలవాడై, తమ్=ఆ, మహామునిమ్=మహాముని యైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, అభిపూజయన్= పూజించుచున్నవాడై, హృష్టః=సంతసించినవాడై, ఉవాచ = పలికెను.

తా. గొప్పదాత యైన దశరథుడు విశ్వామిత్రుని రాకచే సంతోషించిన మనస్సు కలవాడై, ఆ విశ్వామిత్రమహామునిని పూజించి, సంతోషముతో ఇట్లనెను. 48

మూ. యథాఽమృతస్య సంప్రాప్తిర్యథా వర్షమనూదకే 49
యథా సదృశదారేషు పుత్రజన్మాప్రజస్య చ,
ప్రణష్టస్య యథా లాభో యథా హర్షో మహోదయే, 50
తథైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే.

ప్ర. అ. మహామునే = ఓ మహామునీ ! అమృతస్య=అమృతముయొక్క, సంప్రాప్తిః = ప్రాప్తి, యథా = ఎట్లో, అనూదకే = నీళ్లులేని ప్రదేశమునందు, వర్షమ్=వర్షము, యథా = ఎట్లో, అప్రజస్య=సంతానములేనివానికి, సదృశదారేషు=తగిన భార్యయందు, పుత్రజన్మ=పుత్రోత్పత్తి, యథా=ఎట్లో, ప్రణష్టస్య= పోగొట్టుకొనిన వస్తువుయొక్క, లాభః=లాభము, యథా = ఎట్లో, మహోదయే= గొప్ప అభివృద్ధి కలిగినపుడు, హర్షః=సంతోషము, యథా=ఎట్లో, తే=నీయొక్క, ఆగమనమ్=రాక, తథా ఏవ=అట్లే అని, మన్యే=తలచుచున్నాను, స్వాగతమ్= నీకు స్వాగత మగుగాక.

తా. ఓ మహామునీ ! నీ రాక అమృతప్రాప్తి వంటిది. నీళ్లు లేనిచోట వానలు కురియుట వంటిది. సంతానము లేనివానికి అనుకూల యగు భార్యయందు పుత్రుడు జనించుటవంటిది. పోగొట్టుకొనిన వస్తువు మరల దొరకుట వంటిది. గొప్ప అభివృద్ధి లభించినపుడు కలుగు హర్షము వంటిది. నీకు స్వాగతము అగు గాక. 49, 50

మూ. కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః, 51
పాత్రభూతోఽసి మే బ్రహ్మన్ దిష్ట్యా ప్రాప్తోఽసి కౌశిక,
అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్. 52

ప్ర. అ. బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా ! హర్షితః=సంతోషించిన నేను, తే=నీకు, పరమమ్=ఉత్తమ మైన, కం కామమ్=ఏ కోరికను, కిము=ఏ విధముగా, కరోమి=చేయుదును, మే=నాకు, పాత్రభూతః = సత్పాత్రగా, అసి = అయి ఉన్నావు, కౌశిక=ఓ విశ్వామిత్రుడా, దిష్ట్యా = దైవవశముచేత, ప్రాప్తః అసి=వచ్చినావు, అద్య=ఈనాడు, మే=నాయొక్క, జన్మ=జన్మ, సఫలమ్= సఫల మైనది, జీవితం చ=జీవితము కూడ, సుజీవితమ్=మంచి జీవితము.

తా. ఓ విశ్వామిత్రుడా! సంతోషించిన నేను నీకు ఏ కోరికను, ఎట్లు తీర్చవలెనో చెప్పుము. నీవు సత్పాత్రవు, నా అదృష్టముచే వచ్చినావు, ఈనాడు నా జన్మ సఫల మైనది. జీవితము సుజీవిత మైనది. 52

మూ. పూర్వం రాజర్షి శబ్దేన తపసా ద్యోతిత ప్రభః,
బ్రహ్మర్షిత్వమనుప్రాప్తః పూజ్యోసి బహుధా మయా. 53

ప్ర. పూర్వమ్=పూర్వము, రాజర్షి శబ్దేన=రాజర్షి అనే శబ్దముచే, ద్యోతిత ప్రభః=సూచింపబడిన శక్తి గల నీవు, అను = అనంతరమునందు, తపసా= తపస్సుచేత, బ్రహ్మర్షిత్వమ్ = బ్రహ్మర్షిత్వమును, ప్రాప్తః=పొందినావు, మయా= నాచేత, బహుధా=అనేక విధములుగా, పూజ్యః=పూజింపదగినవాడవు, అసి= అయి ఉన్నావు.

తా. మొదట నీకు రాజర్షి అను బిరుదము ఉండెడిది. అది నీ శక్తిని సూచించునది. పిదప తపస్సుచేత బ్రహ్మర్షిత్వమును పొందినావు. నీవు నాకు సర్వథా పూజ్యుడవు. 54

మూ. తదద్భుతమిదం బ్రహ్మన్ పవిత్రం వరమం మమ,
శుభక్షేత్రగతశ్చాహం తవ సందర్శనాత్ప్రభో. 54

ప్ర. అ. బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా! తత్=ఆ కారణము వలన, ఇదమ్=ఈ నీ యాగమనము, అద్భుతమ్ = చాల ఆశ్చర్యజనక మైనది, మమ= నాకు, పరమమ్ = గొప్ప, పవిత్రమ్=పవిత్ర మైనది, ప్రభో = ఓ ప్రభూ! తవ=నీ యొక్క, సందర్శనాత్=దర్శనమువలన, అహమ్=నేను, శుభక్షేత్ర గతశ్చ=పుణ్యక్షేత్రములో నున్నవాడను.

తా. నీవు వచ్చుట చాల ఆశ్చర్యజనకము. నాకు చాల పవిత్రత్వమును చేకూర్చుచున్నది. నీ దర్శనమువలన నేను పుణ్యక్షేత్రములో నివసించి నట్లున్నది. 54

మూ. బ్రూహి యత్ప్రార్థితం తుభ్యం కార్యమాగమనం ప్రతి,
ఇచ్ఛామ్యనుగృహీతోఽహం త్వదర్థపరివృద్ధయే. 55

ప్ర. అ. ఆగమనం ప్రతి = ఇచటికి వచ్చుటను గూర్చి, తుభ్యమ్=నీకు, ప్రార్థితమ్=కోరబడిన, యత్=ఏ, కార్యమ్=కార్యమున్నదో, దానిని, బ్రూహి= చెప్పుము, అహమ్ = నేను, అనుగృహీతః=అనుగ్రహింపబడినవాడనై, త్వదర్థ పరివృద్ధయే = నీ కార్యము యొక్క వృద్ధికొరకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. నీవు ఏ కార్యమును కోరి ఇచటకు వచ్చితివో చెప్పుము. ఆజ్ఞారూప మగు అనుగ్రహము చేయుము. నీ కార్యమును సాధించుటకు సిద్ధముగా నున్నాను. 55

మూ. కార్యస్య న విమర్శం చ గన్తుమర్హసి కౌశిక,
కర్తా చాహమశేషేణ దైవతం హి భవాన్మమ. 56

ప్ర. అ. కౌశిక = విశ్వామిత్రుడా ! కార్యస్య = కార్యము విషయమున, విమర్శమ్=ఆలోచనను, గన్తుమ్=పొందుటకు, న అర్హసి = తగవు, అహమ్= నేను, విశేషేణ=పూర్తిగా, కర్తా చ = ఆ కార్యము చేయగలవాడను. భవాన్= నీవు, మమ=నాకు, దైవతం హి=దేవతవు కదా.

తా. విశ్వామిత్రా ! నీవు వచ్చిన కార్యము చాల గొప్పది కావచ్చును. అయినను సందేహింపకుము. నేను దానిని పూర్తిగ నెరవేర్చెదను. నీవు నాకు దైవతము వంటి వాడవు. 56

మూ. మమ చాయమనుప్రాప్తో మహానభ్యుదయో ద్విజ,
తవాగమనజః కృత్స్నో ధర్మశ్చానుత్తమో మమ. 57

ప్ర. అ. ద్విజ = ఓ బ్రాహ్మణోత్తమా ! మమ = నాకు, అయమ్ = ఈ, మహాన్=గొప్ప, అభ్యుదయః = అభివృద్ధి, అనుప్రాప్తః = లభించినది. మమ = నాకు, తవ ఆగమనజః=నీ రాకవల్ల కలిగిన, కృత్స్నః=సమస్తమైన, ధర్మః= ధర్మము, అనుత్తమః = చాల గొప్పది.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! ఈనాడు నాకు గొప్ప అభ్యుదయము లభించి నది. నీ రాకవలన నాకు కలిగిన ఈ ధర్మము చాల గొప్పది. 57

మూ. ఇతి హృదయసుఖం నిశమ్య వాక్యం.
శ్రుతిసుఖమాత్మవతా వినీతముక్తమ్,

ప్రథితగుణయశా గుణైర్విశిష్టః
పరమఋషిః పరమం జగామ హర్షమ్. 58

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టాదశః సర్గః.

ప్ర. అ. ఆత్మవతా = బుద్ధిమంతు డగు దశరథునిచేత, ఇతి = ఈ విధముగా, వినీతమ్ = వినయపూర్వకముగా, ఉక్తమ్ = పలకబడిన, హృదయసుఖమ్ = హృదయమునకు సుఖకర మైన, శ్రుతిసుఖమ్=చెవులకు సుఖకర మైన, వాక్యమ్ = వాక్యమును, నిశమ్య = విని, ప్రథితగుణయశాః = ప్రసిద్ధ మైన గుణములును కీర్తియు కలవాడును, గుణైః = సద్గుణములచే, విశిష్టః = శ్రేష్ఠుడును అయిన, పరమఋషిః = గొప్పవా డైన ఋషి, పరమమ్ = గొప్ప, హర్షమ్ = సంతోషమును, జగామ = పొందెను.

తా. బుద్ధిమంతు డగు దశరథుడు వినయపూర్వకముగా పలికిన, శ్రోత్రములకును, హృదయమునకును సుఖమును కలిగించువాక్యములను విని, ప్రసిద్ధము లైన గుణములు కీర్తి కలవాడును, సద్గుణములచే శ్రేష్ఠుడును అగు విశ్వామిత్రుడు చాల ఆనందించెను. 58

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో పదునెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనవింశః సర్గః

మూ. తచ్ఛ్రుత్వా రాజసింహస్య వాక్యమద్భుతవిస్తరమ్,
హృష్టరోమా మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత. 1

ప్ర. అ. రాజసింహస్య = రాజశ్రేష్ఠునియొక్క, తత్ = ఆ, అద్భుతవిస్తరమ్=ఆశ్చర్యకరమును విస్తృతమును అగు, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా= విని, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, హృష్టరోమాః = గగుర్పొడిచిన రోమములు కలవాడై, అభ్యభాషత = పలికెను.

తా. ఆ రాజశ్రేష్ఠుని ఆశ్చర్యకరములును, విస్తృతములును అగుమాటలు విని, మహాతేజఃశాలి యగు విశ్వామిత్రుడు ఆనందముచే గగుర్పాటు కలిగిన శరీరముకలవాడై, ఇట్లు పలికెను. 1

మూ. సదృశం రాజశార్దూల తవైతద్భువి నాన్యథా,
మహావంశప్రసూతస్య వసిష్ఠవ్యపదేశినః. 2

ప్ర. అ. రాజశార్దూల = ఓ రాజశ్రేష్ఠుడా! భువి = భూమియందు, మహావంశప్రసూతస్య = గొప్పవంశమునందు పుట్టినవాడును, వసిష్ఠవ్యపదేశినః = వసిష్ఠుని ఉపదేశములను పొందినవాడును అగు, తవ = నీకు, ఏతత్ = ఇదియే, సదృశమ్=తగియున్నది. అన్యథా=మరి యొక విధముగా నైనచో, న=కాదు.

తా. ఓ రాజశ్రేష్ఠుడా! మహావంశమునందు పుట్టి వసిష్ఠుని ఉపదేశములను పొందుచున్న నీవు ఈ విధముగ మాటలాడుటయే యుక్తము. మరొక విధముగ మాటలాడుట అసంభావ్యము. 2

మూ. యత్తు మే హృద్గతం వాక్యం తస్య కార్యస్య నిశ్చయమ్,
కురుష్వ రాజశార్దూల భవ సత్యప్రతిశ్రవాః. 3

ప్ర. అ. రాజశార్దూల = రాజశ్రేష్ఠుడా, మే=నా యొక్క, హృద్గతమ్= మనస్సులో ఉన్న, యత్=ఏ కార్యము, వాక్యమ్=చెప్పదగియున్నదో, తస్య=ఆ,

కార్యస్య=కార్యము యొక్క, నిశ్చయమ్ = నిశ్చయమును, కురుష్వ = చేయుము, సత్యప్రతిశ్రవాః=సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు, భవ=అగుము.

తా. ఓ రాజశ్రేష్ఠా! నా మనస్సులో నున్న కార్యమును చెప్పెదను. దానిని తప్పక చేయుము. ప్రతిజ్ఞను నిలబెట్టుకొనుము. 3

మూ. అహం నియమమాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ,
తస్య విఘ్నకరౌ ద్వౌ తు రాక్షసౌ కామరూపిణౌ. 4

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! అహమ్=నేను, సిద్ధ్యర్థమ్ = సిద్ధికొరకు, నియమమ్=నియమమును, ఆతిష్ఠే=అవలంబించి ఉన్నాను. తు= కాని, కామరూపిణౌ= స్వేచ్ఛారూపము గల, ద్వౌ=ఇద్దరు, రాక్షసౌ=రాక్షసులు, తస్య = దానికి, విఘ్నకరౌ=విఘ్నము చేయువారుగా ఉన్నారు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! నేను ఒక సిద్ధికొరకై ఒక నియమమును అవలంబించి ఉన్నాను. కాని కామరూపవంతు లగు ఇద్దరు రాక్షసులు దానికి విఘ్నము చేయుచున్నారు. 4

మూ. వ్రతే మే బహుశశ్చీర్ణే సమాప్త్యాం రాక్షసావిమౌ,
మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవంతౌ సుశిక్షితౌ, 5
సమాంసరుధిరౌఘేణ వేదిం తామభ్యవర్షతామ్.

ప్ర. అ. బహుశః = చాలవరకు, చీర్ణే = చేయబడిన, మే=నాయొక్క, వ్రతే = వ్రతమునందు, సమాప్త్యామ్ = సమాప్తిసమయమునందు, వీర్యవన్తౌ = పరాక్రమవంతులును, సుశిక్షితౌ = బాగుగా అభ్యాసము చేసినవారును అగు, మారీచశ్చ = మారీచుడును, సుబాహుశ్చ = సుబాహువు, సమాంసరుధిరౌఘేణ = మాంసముతో కూడిన రక్తప్రవాహముతో, తామ్=ఆ, వేదిమ్ = వేదిని, అభ్యవర్షతామ్ = వర్షించిరి.

తా. నా వ్రతము సమాప్తి చెందు సమయమునకు, వీర్యవంతులును, సుశిక్షితులును అగు మారీచసుబాహువులు వచ్చి, మాంసముతో కూడిన రక్తప్రవాహముతో యజ్ఞవేదికను వర్షించుచుండిరి. 5

మూ. అవధూతే యథా భూతే తస్మిన్ని యమనిశ్చయే, 6
కృతశ్రమో నిరుత్సాహ స్తస్మాద్దేశాదపాక్రమే.

ప్ర. అ. తస్మిన్ = ఆ, నియమనిశ్చయే=దీక్షాసంకల్పము, అవధూతే= పాడుచేయబడినదై, తథా భూతే=ఆ విధముగా అయిపోగా, కృతశ్రమః = అంత శ్రమ చేసిన నేను, నిరుత్సాహః = భగ్నోత్సాహుడనై, తస్మాత్ = ఆ, దేశాత్= దేశమునుండి, అపాక్రమే = తొలగివచ్చినాను.

**తా.** ఆ వ్రతసంకల్పము విఘ్నితమై అట్లయిపోయినది. దానికై ఇంత శ్రమపడిన నేను భగ్నోత్సాహుడనై ఆ దేశమును వదలి వచ్చితిని. 6

మూ. న చ మే క్రోధముత్స్రష్టుం బుద్ధిర్భవతి పార్థివ, 7
తథాభూతా హి సా చర్యా న శాప స్తత్ర ముచ్యతే.

ప్ర. అ. పార్థివ = ఓరాజా ! క్రోధమ్ = కోపమును, ఉత్స్రష్టుమ్ = విడచుటకు (చూపుటకు), మే = నాకు, బుద్ధిః = బుద్ధి, న భవతి=కలుగుటలేదు. సా = ఆ, చర్యా = వ్రతచర్య, తథా భూతా హి = అట్టిదికదా, తత్ర = ఆ యాగ సమయమునందు, శాపః = శాపము, న ముచ్యతే = విడువబడదు.

**తా.** ఓ రాజా ! ఆ సమయమున కోపము చూపుటకు బుద్ధి కలుగుటలేదు. ఆ యజ్ఞము అట్టిది. అట్టి యజ్ఞములలో శాపము ఇవ్వకూడదు. 7

మూ. స్వపుత్రం రాజశార్దూల రామం సత్యపరాక్రమమ్, 8
కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతుమర్హసి.

ప్ర. అ. రాజశార్దూల=ఓ రాజశ్రేష్ఠుడా ! సత్యపరాక్రమమ్ = సత్యమైన పరాక్రమము కలవాడును, కాకపక్షధరమ్ = జూనవములను ధరించుచున్నవాడును, శూరమ్=శూరుడును, స్వపుత్రమ్=నీ కుమారుడైన, జ్యేష్ఠమ్=పెద్దవాడైన, రామమ్=రాముని, మే = నాకు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగియున్నావు.

**తా.** ఓ రాజశ్రేష్ఠుడా ! శూరుడును, సత్యమైన పరాక్రమము కలవాడును, జూనవములు ధరించు కౌమారవయస్సులో నున్నవాడు అగు, నీ జ్యేష్ఠకుమారుడైన రాముని నా కిమ్ము. 8

మూ. శక్తో హ్యేష మయా గుప్తో దివ్యేన స్వేన తేజసా, 9
రాక్షసా యే వికర్తారస్తేషామపి వినాశనే.

ప్ర. అ. మయా = నాచేత, గుప్తః = రక్షించబడిన, ఏషః = ఈతడు, దివ్యేన = దివ్యమైన, స్వేన = తనసంబంధ మైన, తేజసా = తేజస్సుచేత, యే = ఏ, వికర్తారః = విఘ్నము చేయు, రాక్షసాః = రాక్షసులు కలరో, తేషామపి = వారియొక్క కూడ, వినాశనే = నశింపచేయుటయందు, శక్తః = సమర్థుడు కదా.

తా. నాచే రక్షింపబడిన ఈ రాముడు, తన సహజదివ్యతేజస్సుచేత, విఘ్నకారు లగు రాక్షసులను సంహరింప సమర్థుడు. 9

మూ. శ్రేయశ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః, 10
త్రయాణామపి లోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి.

ప్ర. అ. అస్మై = ఈతనికి, బహురూపమ్ = అనేకవిధము లైన, శ్రేయశ్చ = శ్రేయస్సును కూడ, ప్రదాస్యామి = ఇచ్చెదను. సంశయః = సంశయము, న = లేదు, యేన = దేనిచేత, త్రయాణామ్ = మూడు, లోకానామపి = లోకములలో, ఖ్యాతిమ్ = ప్రసిద్ధిని, గమిష్యతి = పొందగలడో.

తా. రామునకు అనేకవిధము లైన శ్రేయస్సును ఇవ్వగలను. దానిచే ఇతడు మూడు లోకములలో కీర్తిని పొందగలడు. సందేహము లేదు. 10

మూ. న చ తౌ రామమాసాద్య శక్తౌ స్థాతుం కథం చన, 11
న చ తౌ రాఘవాదన్యో హన్తుముత్సహతే పుమాన్.

ప్ర. అ. తౌ = ఆ మారీచసుబాహులు, రామమ్ = రాముని, ఆసాద్య = పొంది, కథం చన = ఏ విధముగను, స్థాతుమ్ = నిలుచుటకు, న శక్తౌ = సమర్థులు కారు. రాఘవాత్ = రామునికంటె, అన్యః = ఇతరుడైన, పుమాన్ = పురుషుడు, తౌ = వారిని, హన్తుమ్ = చంపుటకు, న ఉత్సహతే = సమర్థుడు కాడు.

తా. ఆ మారీచసుబాహువులు రాముని ఎదుట ఏ విధముగను నిలువజాలరు. రాముడు తప్ప మరెవ్వరును వారిని చంపజాలరు. 11

మూ. వీర్యోత్సిక్తౌ హి తౌ పాపౌ కాలపాశవశం గతౌ. 12
రామస్య రాజశార్దూల న పర్యాప్తౌ మహాత్మనః.

ప్ర. అ. వీర్యోత్సిక్తౌ=వీర్యముచేత గర్వించిన, తౌ = ఆ, పాపౌ=పాపాత్ములు, కాలపాశవశం=యమపాశముయొక్క వశమును, గతౌ = పొందినారు, రాజశార్దూల = ఓ రాజశ్రేష్ఠుడా! మహాత్మనః=మహాత్ముడైన, రామస్య=రామునను, న పర్యాప్తౌ=సరిపడువారు కారు.

తా. ఓ రాజశ్రేష్ఠుడా ! పరాక్రమముచే గర్వించిన ఆ మారీచసుబాహువులు యముని పాశములకు వశులు కావలసి యున్నది. వారు మహాత్ములైన రామునకు యుద్ధమునందు చాలరు. 12

మూ. న చ పుత్రకృతస్నేహం కర్తుమర్హసి పార్థివ, 13
అహం తే ప్రతిజానామి హతౌ తౌ విద్ధి రాక్షసౌ.

ప్ర. అ. పార్థివ = ఓరాజా ! పుత్రకృతమ్=పుత్రునియందు చేయబడు, స్నేహమ్ = స్నేహమును, కర్తుమ్ = చేయుటకు, న అర్హసి = తగవు. తౌ=ఆ, రాక్షసౌ = రాక్షసులను, హతౌ = చంపబడినవారినిగా, విద్ధి = తెలుసుకొనుము. అహమ్ = నేను, తే = నీకు, ప్రతిజానామి = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. ఓ రాజా ! రామునియం దున్న పుత్రస్నేహముచే వెనుదీయకుము. ఆ రాక్షసులు రామునిచే సంహరింపబడినారనియే నిశ్చయించుకొనుము. నేను నీకు ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

మూ. అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, 14
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః.

ప్ర. అ. మహాత్మానమ్ = మహాత్ముడును, సత్యపరాక్రమమ్=సత్యమైన పరాక్రమము కలవాడును అగు, రామమ్ = రాముని గూర్చి, అహమ్ = నేను, వేద్మి=ఎరుగుదును, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వసిష్ఠోఽపి=వసిష్ఠుడును, యే=ఏ, తపసి స్థితాః=తపస్సులో నున్న, ఇమే=ఈ మహర్షులు గలరో, వీరును (ఎరుగుదురు).

తా. మహాత్ముడును, సత్యపరాక్రముడును అగు రాము డెట్టివాడో నాకు తెలియును, వసిష్ఠునకు తెలియును. ఈ మహర్షులకు తెలియును. రాముడు నీ

కుమారు డగుటచే నీవాతనిని సామాన్యునిగ తలపపచ్చును. ఆతని యథార్థ స్వరూపము మావంటి తపోధనులకు మాత్రమే తెలియును. 14

మూ. యది తే ధర్మలాభం చ యశశ్చ పరమం భువి, 15
స్థితమిచ్ఛసి రాజేన్ద్ర రామం మే దాతుమర్హసి.

ప్ర. అ. రాజేన్ద్ర=ఓ రాజశ్రేష్ఠుడా! తే=నీకు, ధర్మలాభమ్=ధర్మము యొక్క లాభమును, ఇచ్ఛసి యది = కోరినట్లైతే, పరమమ్ = గొప్పదైన, యశశ్చ=కీర్తిని కూడ, భువి = భూమియందు, స్థితమ్ = ఉండుదానినిగా, (ఇచ్ఛసి యది = కోరినట్లైతే), రామమ్ = రాముని, మే = నాకు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ రాజేంద్రా! నీవు ధర్మము కావలె నని కోరినట్లైతే, నీ గొప్ప కీర్తి భూలోకమున స్థిరముగా నుండ వలె నని నీకు అభిలాష ఉన్నట్లైతే, రాముని నా కిమ్ము. 15

మూ. యది హ్యనుజ్ఞాం కాకుత్స్థ దదతే తవ మన్త్రిణః, 16
వసిష్ఠప్రముఖాః సర్వే తతో రామం విసర్జయ.

ప్ర. అ. కాకుత్స్థ = ఓ కకుత్స్థవంశీయుడా! తవ = నీ యొక్క, మన్త్రిణః = మంత్రులును, వసిష్ఠప్రముఖాః=వసిష్ఠుడు మొదలుగా గల, సర్వే= అందరును, అనుజ్ఞామ్=అనుజ్ఞను, దదతే యది = ఇచ్చినట్లైతే, తతః = అటు పిమ్మట, రామమ్=రాముని, విసర్జయ = ఇమ్ము.

తా. దశరథమహారాజా! నీ మంత్రులును వసిష్ఠాదులును అనుజ్ఞ ఇచ్చిననే రాముని పంపుము. 16

మూ. అభిప్రేతమసంసక్తమాత్మజం దాతుమర్హసి, 17
దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనమ్.

ప్ర. అ. అభిప్రేతమ్=ఇష్టుడైన, ఆత్మజమ్ = కుమారుడును, రాజీవలోచనమ్ = పద్మములవంటి నేత్రములు కలవాడును అగు, రామమ్ = రాముని,

అనంనక్తమ్ = ఆలస్యము లేకుండగా, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, దశరాత్రమ్ = పదిదినములు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. పద్మపత్రవిశాలాక్షు డైన, నీ ప్రియపుత్రు డైన రాముని పది దినములు జరుగు యాగమును రక్షించుటకై, ఆలస్యము చేయక నా కిమ్ము. 17

మూ. నాత్యేతి కాలో యజ్ఞస్య యథాయం మమ రాఘవ, 18
తథా కురుష్వ భద్రం తే మా చ శోకే మనః కృథాః.

ప్ర. అ. రాఘవ=ఓ దశరథమహారాజా ! మమ=నాయొక్క, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అయం కాలః = ఈ సమయము, యథా = ఎట్లు, నాత్యేతి = దాటిపోకుండ ఉండునో, తథా = ఆ విధముగా, కురుష్వ = చేయుము, శోకే = దుఃఖమునందు, మనః = మనస్సును, మా కృథాః = చేయకుము.

తా. దశరథమహారాజా! నా యజ్ఞసమయము దాటిపోకుండునట్లు చూడుము. నీకు క్షేమ మగును. దుఃఖింపకుము. 18

మూ. ఇత్యేవముక్త్వా ధర్మాత్మా ధర్మార్థసహితం వచః, 19
విరరామ మహాతేజాః విశ్వామిత్రో మహామునిః.

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడును, మహాతేజాః = గొప్ప తేజస్సుకలవాడును, మహామునిః = మహామునియు అగు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, ఇత్యేవమ్ = ఈ విధముగా, ధర్మార్థసహితమ్ = ధర్మార్థములతో కూడిన, వచః = వాక్కును, ఉక్త్వా = పలికి, విరరామ = విరమించెను.

తా. ధర్మాత్ముడును, మహాతేజఃశాలియు అగు విశ్వామిత్ర మహాముని, ఈ విధముగ ధర్మార్థసహిత మగు వాక్యము పలికి ఊరకుండెను. 19

మూ. స తన్నిశమ్య రాజేన్ద్రో విశ్వామిత్రవచః శుభమ్, 20
శోకమభ్యగమత్తీవ్రం వ్యషీదత భయాన్వితః.

ప్ర. అ. సః = ఆ, రాజేన్ద్రః=రాజశ్రేష్ఠుడు, శుభమ్ = శుభకర మైన, తత్=ఆ, విశ్వామిత్రవచః=విశ్వామిత్రుని వాక్యమును, నిశమ్య=విని, తీవ్రమ్=

తీ్రవ మైన, శోకమ్=శోకమును, అభ్యగమత్=పొందెను. భయాన్వితః = భయముతో కూడినవాడై, వ్యషీదత=క్రుంగిపోయెను.

తా. దశరథుడు విశ్వామిత్రుడు పలికిన ఆ శుభకర మగు వాక్కును విని, తీవ్ర మైన శోకమును పొంది భయముతో క్రుంగిపోయెను. 20

మూ. ఇతి హృదయమనోవిదారణం
మునివచనం తదతీవ శుశ్రువాన్,
నరపతిరభవన్మహాం స్తదా
వ్యథితమనాః ప్రచచాల చాసనాత్. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, హృదయమనోవిదారణమ్ = హృదయమును మనస్సును చీల్చివేయు, తత్ = ఆ, మునివచనమ్ = మునివాక్యమును, శుశ్రువాన్ = వినిన, మహాన్ = పూజ్యుడైన, నరపతిః = రాజు, తదా=అప్పుడు, వ్యథితమనాః=వ్యథ చెందిన మనస్సు కలవాడు, అభవత్=ఆయెను, ఆసనాత్= ఆసనమునుండి, చచాల చ = చలించిపోయెను కూడ.

తా. విశ్వామిత్రుడు పలికిన ఆ మాటలు దశరథుని హృదయమును మనస్సును చీల్చివేసినవి. ఆ మాటలు విన్న ఆ రాజు మనస్సులో వ్యథ చెందెను. ఆసనమునుండి చలించెను. 21

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో పందొమ్మిదవసర్గ సమాప్తము.

# అథ వింశః సర్గః

మూ. తచ్ఛ్రుత్వా రాజశార్దూలో విశ్వామిత్రస్య భాషితమ్,
ముహూర్తమివ నిస్సంజ్ఞః సంజ్ఞావానిదమబ్రవీత్. 1

ప్ర. అ. రాజశార్దూలః = ఆ రాజశ్రేష్ఠుడు, విశ్వామిత్రస్య = విశ్వామిత్రుని యొక్క, తత్ భాషితమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, ముహూర్తమివ = క్షణకాలముపాటు, నిస్సంజ్ఞః = సంజ్ఞ కోల్పోయినవాడై, సంజ్ఞావాన్ = మరల సంజ్ఞ పొంది, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. విశ్వామిత్రుని మాటలు వినగానే దశరథుడు క్షణకాలముపాటు నిశ్చేష్టు డయ్యెను. మరల సంజ్ఞ పొంది ఇట్లు పలికెను. 1

మూ. ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః,
న యుద్ధయోగ్యతామస్య పశ్యామి సహ రాక్షసైః. 2

ప్ర. అ. రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు గల, మే = నా యొక్క, రామః = రాముడు, ఊనషోడశవర్షః = పదహారు సంవత్సరములకంటె తక్కువ వయస్సువాడు. అస్య = ఈతనికి, రాక్షసైః సహ = రాక్షసులతో కూడ, యుద్ధయోగ్యతామ్ = యుద్ధము చేయు యోగ్యతను, న పశ్యామి = చూడను.

తా. రాజీవలోచను డైన నా రామునకు పదహారు సంవత్సరములు కూడ నిండ లేదు. ఈతనికి రాక్షసులతో యుద్ధము చేయు యోగ్యత ఉన్న దని నేను భావింపను.

వి. ఆరణ్యకాండములో మారీచుడు రాముని గూర్చి రావణునితో—"విశ్వామిత్రయాగ రక్షణకాలమునాటికి రామునకు పండ్రెండు ఏండ్ల వయస్సు" అని చెప్పనున్నాడు—"బాలో ద్వాదశవర్షోయమకృతాస్త్రశ్చ రాఘవః". దానిని పట్టి ఇచట "ఊనషోడశవర్షః" అనగా "పండ్రెండేండ్ల వయస్సువాడు" అని యర్థము. (గోవిందరాజులు). 2

మూ. ఇయమక్షౌహిణీ పూర్ణా యస్యాహం పతిరీశ్వరః,
అనయా సంవృతో గత్వా యోద్ధాహం తైర్నిశాచరైః. 3

ప్ర. అ. పూర్ణా=నిండిన, ఇయమ్=ఈ, అక్షౌహిణీ=అక్షౌహిణి ఉన్నది. యస్యాః=దేనికి, అహమ్=నేను, పతిః=అధిపతినో; ఈశ్వరః=నియమించు వాడనో. అనయా=ఈ అక్షౌహిణితో, సంవృతః=కూడినవాడనై, గత్వా=వెళ్లి, అహమ్=నేను, తైః=ఆ, నిశాచరైః=రాక్షసులతో, యోద్ధా=యుద్ధము చేయ గలను.

తా. ఇదిగో; ఈ అక్షౌహిణి పూర్ణముగ సున్నది. దీనికి నేను అధిపతిని; నియామకుడను. దీనితో వెళి నేను రాక్షసులతో యుద్ధము చేయగలను. 3

మూ. ఇమే శూరాశ్చ విక్రాన్తా భృత్యా మేఽస్త్రవిశారదాః,
యోగ్యా రక్షోగణైర్యోద్ధుం న రామం నేతుమర్హసి. 4

ప్ర. అ. మే=నాయొక్క, భృత్యాః=భృత్యులైన, ఇమే=ఈ సైనికులు, శూరాశ్చ=శూరులు; విక్రాన్తాః=పరాక్రమము కలవారు; అస్త్రవిశారదాః=అస్త్రము లందు నేర్పు గలవారు; రక్షోగణైః=రాక్షసగణములతో, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, యోగ్యాః=తగినవారు. రామమ్=రాముని, నేతుమ్=తీసికొనివెళ్లు టకు, నార్హసి=తగవు.

తా. నా పోషణలో నున్న ఈ సైనికులు శూరులు; విక్రమవంతులు; అస్త్ర ములయందు సమర్థులు. వీరు రాక్షసులతో యుద్ధము చేయుటకు యోగ్యులు. నీవు రాముని తీసికొని వెళ్లవలదు. 4

మూ. అహమేవ ధనుష్పాణిర్గోప్తా సమరమూర్ధని,
యావత్ప్రాణాన్ ధరిష్యామి తావద్యోత్స్యే నిశాచరైః. 5

ప్ర. అ. అహమేవ=నేనే, ధనుష్పాణిః=ధనుస్సు హస్తమునందు కల వాడనై, గోప్తా=రక్షించగలవాడను. యావత్=ఎంతవరకు, ప్రాణాన్=ప్రాణ ములను, ధరిష్యామి=ధరింతునో, తావత్=అంతవరకు, సమరమూర్ధని= యుద్ధముయొక్క అగ్రభూమియందు, నిశాచరైః = రాక్షసులతో, యోత్స్యే = యుద్ధము చేయగలను.

తా. ధనుర్ధారినై నేనే యాగమును రక్షించెదను. నా ప్రాణము లున్నంత వరకును యుద్ధాగ్రమునందు రాక్షసులతో యుద్ధము చేసెదను. 5

మూ. నిర్విఘ్నా వ్రతచర్యా సా భవిష్యతి సురక్షితా,
అహం తత్రాగమిష్యామి న రామం నేతుమర్హసి. 6

ప్ర. అ. అహమ్=నేను, తత్ర=అచటికి, ఆగమిష్యామి=వచ్చెదను, సా=ఆ, వ్రతచర్యా=వ్రతానుష్ఠానము, సురక్షితా=బాగుగా రక్షింపబడినదై, నిర్విఘ్నా=విఘ్నములు లేనిది, భవిష్యతి=కాగలదు. రామమ్=రాముని, నేతుమ్=తీసికొని వెళ్లుటకు, నార్హసి=తగవు.

తా. నేనే అచటికి వచ్చి, యాగమును రక్షించి అది నిర్విఘ్నముగ కొనసాగునట్లు చేసెదను. రాముని తీసికొనివెళ్లవలదు. 6

మూ. బాలో హ్యకృతవిద్యశ్చ న చ వేత్తి బలాబలమ్,
న చాస్త్రబలసంయుక్తో న చ యుద్ధవిశారదః. 7
న చాసౌ రక్షసాం యోగ్యః కూటయుద్ధా హి తే ధ్రువమ్.

ప్ర. అ. హి=ఏలననగా, (రాముడు), బాలః=బాలుడు; అకృతవిద్యశ్చ=బాగుగా నేర్వబడని విద్యలు కలవాడు; బలాబలమ్=బలాబలములను, న వేత్తి=ఎరుగడు; అస్త్రబలసంయుక్తః చ=అస్త్రబలముతో కూడినవాడు కూడ, న=కాడు; యుద్ధవిశారదః చ=యుద్ధమునందు నేర్పు కలవాడు కూడ, న=కాడు; అసౌ=ఇతడు, రక్షసామ్=రాక్షసులకు, యోగ్యః=తగినవాడు, న=కాడు; తే=వారు, ధ్రువమ్=నిశ్చయముగా, కూటయుద్ధాః హి=కపటయుద్ధము కలవారు కదా!

తా. నా రాముడు చిన్నవాడు; పూర్తిగ విద్యలను నేర్వలేదు; శత్రువుల బలాబలములను గుర్తింపజాలడు; ఇంకను అస్త్రబలమును సంపాదింపలేదు. యుద్ధమునందు నేర్పు లేని వాడు. రాక్షసులు తప్పక కపటయుద్ధము చేయుదురు. అందుచే వారితో యుద్ధముచేయుటకు రాముడు తగినవాడు కాడు. 7

మూ. విప్రయుక్తో హి రామేణ ముహూర్తమపి నోత్సహే, 8
జీవితుం మునిశార్దూల న రామం నేతుమర్హసి.

ప్ర. అ. రామేణ=రామునితో, విప్రయుక్తః=వియోగము పొందినవాడనై, ముహూర్తమపి=క్షణకాలమైనను, జీవితుమ్=జీవించుటకు, నోత్సహే=సమర్థు

దను కాను. మునిశార్దూల=మునిశ్రేష్ఠుడా ! రామమ్=రాముని, నేతుమ్=తీసికొని వెళ్లుటకు, నార్హసి=తగవు.

తా. ఓ మునిశ్రేష్ఠా ! రాముడు లేనిచో క్షణకాల మైనను జీవింపజాలను. రాముని తీసికొనివెళ్లవలదు. 8

మూ. యది వా రాఘవం బ్రహ్మన్ నేతుమిచ్ఛసి సువ్రత, 9
చతురఙ్గసమాయుక్తం మయా చ సహితం నయ.

ప్ర. అ. సువ్రత = మంచి వ్రతము కలవాడా ! బ్రహ్మన్=ఓ బ్రాహ్మణుడా! వా=లేక, రామమ్=రాముని, నేతుమ్=తీసికొనివెళ్లుటకు, ఇచ్ఛసి యది=ఇచ్ఛయించుచున్నట్లైతే, చతురఙ్గసమాయుక్తమ్=చతురంగబలముతో కూడిన వానిని, మయా చ=నాతో కూడ, సహితమ్=కూడినవానిని, నయ=తీసికొని వెళ్లుము.

తా. ఉత్తమవ్రతవంతుడవైన ఓ విశ్వామిత్రా ! రామునే తీసికొని వెళ్ల వలె నని నీకు ఇచ్ఛ ఉన్నచో, అతనితో పాటు చతురంగబలమును, నన్ను కూడ తీసికొనివెళ్లుము. 9

మూ. షష్టిర్వర్షసహస్రాణి మమ జాతస్య కౌశిక, 10
దుఃఖేనోత్పాదితశ్చాయం న రామం నేతుమర్హసి.

ప్ర. అ. కౌశిక=ఓ విశ్వామిత్రుడా! జాతస్య=పుట్టిన, మమ=నాకు, షష్టిః=అరువది, వర్షసహస్రాణి=సంవత్సరముల సహస్రములు, కడచినవి. అయమ్=ఈతడు, దుఃఖేన=అతిశ్రమచేత, ఉత్పాదితః=కనబడినాడు. రామమ్=రాముని, నేతుమ్=తీసికొనివెళ్లుటకు, న అర్హసి=తగవు.

తా. విశ్వామిత్రా ! అరవైవేల సంవత్సరముల వయస్సునందు, ఎంతో శ్రమపడి ఈతనిని కన్నాను. రాముని తీసికొని వెళ్లవలదు. 10

మూ. చతుర్ణామాత్మజానాం హి ప్రీతిః పరమికా మమ, 11
జ్యేష్ఠం ధర్మప్రధానం చ న రామం నేతుమర్హసి.

ప్ర. అ. చతుర్ణామ్=నలుగురు, ఆత్మజానామ్=కుమారులవిషయమున, మమ=నాకు, పరమికా=గొప్ప, ప్రీతిః హి=ప్రేమ ఉన్నది కదా. జ్యేష్ఠమ్=పెద్దవాడును, ధర్మప్రధానం చ=ధర్మవిషయమున ప్రధానుడును అగు, రామమ్=రాముని, నేతుమ్=తీసికొని వెళ్లుటకు, నార్హసి=తగవు.

తా. నలుగురు కుమారుల విషయమునందును నాకు గొప్ప ప్రేమ ఉన్నది. కాని జ్యేష్ఠుడును, అందుచే ధర్మవిషయమున ప్రధానుడును అగు రాముని తీసికొనివెళవలదు. 11

మూ. కింవీర్యా రాక్షసాస్తే చ కస్య పుత్రాశ్చ కే చ తే, 12
కథంప్రమాణాః కే చైతాన్ రక్షన్తి మునిపుఙ్గవ.

ప్ర. అ. మునిపుఙ్గవ=మునిశ్రేష్ఠుడా! తే రాక్షసాః=ఆ రాక్షసులు, కింవీర్యాః=ఎట్టి వీర్యము కలవారు? కస్య=ఎవనియొక్క, పుత్రాః=పుత్రులు? తే=వారు, కే = ఎవరు? కథంప్రమాణాః=ఎంతటిప్రమాణము కలవారు? ఏతాన్=వీరిని, కే=ఎవరు, రక్షన్తి=రక్షించుచున్నారు?

తా. ఓ మునిశ్రేష్ఠుడా! ఆ రాక్షసుల పరాక్రమ మెట్టిది? వారు ఎవరు? ఎవరి కుమారులు? వారి ప్రమాణము ఎంత? వారిని ఎవరు రక్షించుచున్నారు? 12

మూ. కథం చ ప్రతికర్తవ్యం తేషాం రామేణ రక్షసామ్, 13
మామకైర్వా బలైర్బ్రహ్మన్ మయా వా కూటయోధినామ్.

ప్ర. అ. బ్రహ్మన్=బ్రాహ్మణుడా! కూటయోధినామ్=కపటయుద్ధము చేయు, తేషాం రక్షసామ్=ఆ రాక్షసుల విషయమున, రామేణ=రామునిచేత కాని, మామకైః=నా సంబంధమైన, బలైః వా=సైన్యములచేత గాని, మయా వా=నాచేత కాని, కథమ్=ఎట్లు, ప్రతికర్తవ్యమ్=ప్రతిక్రియ చేయదగినది?

తా. ఓ విశ్వామిత్రా! కపటయుద్ధము చేయు ఆ రాక్షసుల విషయమున రాముడు కాని, నా సైన్యములు కాని, నేను కాని ఎట్లు ప్రతిక్రియ చేయవలసియుండును? 13

మూ. సర్వం మే శంస భగవన్ కథం తేషాం మయా రణే, 14
స్థాతవ్యం దుష్టభావానాం వీర్యోత్సిక్తా హి రాక్షసాః.
తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రోఽభ్యభాషత. 15

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా! దుష్టభావానామ్ = దుష్టస్వభావులైన, తేషామ్=వారియెదుట, మయా=నాచేత, రణే=యుద్ధమునందు, కథమ్=ఎట్లు, స్థాతవ్యమ్=ఉండదగినది? సర్వమ్=ఈ విషయమునంతను, మే = నాకు, శంస = చెప్పుము, రాక్షసాః = రాక్షసులు, వీర్యోత్సిక్తాః హి=వీర్యముచేత గర్వితులు కదా. తస్య=ఆతనియొక్క, తత్=ఆ, వచనమ్=వాక్యమును, శ్రుత్వా=విని, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, అభ్యభాషత=పలికెను.

తా. దుష్టస్వభావులైన ఆ రాక్షసులతో యుద్ధమునందు నే నెట్లు మెలగవలెను? ఈ విషయము లన్నియు చెప్పుము. రాక్షసులు పరాక్రమముచే గర్వించుచుందురు కదా? దశరథుని మాటలు విని విశ్వామిత్రుడు ఇట్లు పలికెను. 15

మూ. పౌలస్త్యవంశప్రభవో రావణో నామ రాక్షసః,
స బ్రహ్మణా దత్తవరస్త్రైలోక్యం బాధతే భృశమ్, 16
మహాబలో మహావీర్యో రాక్షసైర్బహుభిర్వృతః.

ప్ర. అ. పౌలస్త్యవంశప్రభవః=పౌలస్త్యుని వంశమునందు పుట్టుక గల, రావణో నామ=రావణు డను పేరు గల, రాక్షసః=రాక్షసుడు (ఉన్నాడు). మహాబలః=గొప్ప బలము కలవాడును, మహావీర్యః=గొప్ప పరాక్రమము కలవాడును అగు, సః=అతడు, బ్రహ్మణా=బ్రహ్మచేత, దత్తవరః=ఇవ్వబడిన వరముగలవాడై, బహుభిః=అనేకులైన, రాక్షసైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, త్రైలోక్యమ్=మూడులోకములను, భృశమ్=మిక్కిలి, బాధతే=బాధించుచున్నాడు.

తా. పౌలస్త్యవంశమునందు జనించిన రావణుడను రాక్షసు డున్నాడు. మహాబలవంతుడును, మహావీర్యవంతుడును అగు ఆతడు బ్రహ్మనుండి వరమును పొంది, చాలమంది రాక్షసులతో కలిసి, మూడు లోకములను మిక్కిలి పీడించుచున్నాడు. 16

మూ. శ్రూయతే హి మహావీర్యో రావణో రాక్షసాధిపః, 17
సాక్షాద్వైశ్రవణభ్రాతా పుత్రో విశ్రవసో మునేః.

ప్ర. అ. సాక్షాత్=సాక్షాత్తు, వైశ్రవణభ్రాతా=కుబేరుని సోదరుడును, విశ్రవసః=విశ్రవసు డనే, మునేః=మునియొక్క, పుత్రః=పుత్రుడును, రాక్షసాధిపః=రాక్షసుల ప్రభువును ఐన, రావణః=రావణుడు, మహావీర్యః=గొప్ప పరాక్రమము కలవాడుగా, శ్రూయతే=వినబడుచున్నాడు.

తా. రాక్షసరా జైన ఆ రావణుడు విశ్రవసు డను మునియొక్క పుత్రుడు. సాక్షాత్తు కుబేరుని సోదరుడు. ఆతడు గొప్ప పరాక్రమము కలవా డని వినుచున్నాము. 17

మూ. యదా స్వయం న యజ్ఞస్య విఘ్నకర్తా మహాబలః, 18
తేన సంచోదితౌ ద్వౌ తు రాక్షసౌ సుమహాబలౌ,
మారీచశ్చ సుబాహుశ్చ యజ్ఞవిఘ్నం కరిష్యతః. 19

ప్ర. అ. మహాబలః=గొప్పబలముగల ఆ రావణుడు, యదా=ఎప్పుడు, స్వయమ్=స్వయముగా, యజ్ఞస్య=యజ్ఞమునకు, విఘ్నకర్తా=విఘ్నముచేయువాడు, న=కాడో, తేన=వానిచేత, సంచోదితౌ=ప్రేరేపించబడిన, మారీచశ్చ=మారీచుడును, సుబాహుశ్చ=సుబాహువు అనెడు, ద్వౌ=ఇద్దరు, రాక్షసౌ=రాక్షసులు, విఘ్నమ్=విఘ్నమును, కరిష్యతః=చేయగలరు.

తా. మహాబలు డైన ఆతడు స్వయముగా యజ్ఞమునకు విఘ్నము చేయడు కాని, ఆతనిచే ప్రేరేపింపబడిన మారీచసుబాహువు లనెడు ఇద్దరు రాక్షసులు యజ్ఞవిఘ్నము చేయుచుందురు. 18-19

మూ. ఇత్యుక్తో మునినా తేన రాజోవాచ మునిం తదా,
న హి శక్తోఽస్మి సంగ్రామే స్థాతుం తస్య దురాత్మనః. 20

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, తేన మునినా=ఆ మునిచేత, ఉక్తః=పలకబడిన, రాజా=రాజు, తదా=అప్పుడు, మునిమ్=మునినిగూర్చి, ఉవాచ=పలికెను. సంగ్రామే=యుద్ధమునందు, తస్య=ఆ, దురాత్మనః=దురాత్ముని ఎదుట, స్థాతుమ్=నిలుచుటకు, శక్తః న అస్మి=సమర్థుడను కాను.

తా. విశ్వామిత్రుడు ఇట్లు చెప్పగా విని దశరథుడు ఆతనితో ఇట్లనెను. నేను యుద్ధమునందు ఆ దురాత్ముని ఎదుట నిలువజాలను. 20

మూ. స త్వం ప్రసాదం ధర్మజ్ఞ కురుష్వ మమ పుత్రకే,
మమ చైవాల్పభాగ్యస్య దైవతం హి భవాన్ గురుః. 21

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసినవాడా! సః త్వమ్= అట్టి, నీవు, మమ=నాయొక్క, పుత్రకే=చిన్ని కుమారునియందును, అల్పభాగ్యస్య=అల్పమైన భాగ్యము గల, మమ చ=నా విషయమునందును, ప్రసాదమ్=అనుగ్రహమును, కురుష్వ=చేయుము. గురుః=గురువైన, భవాన్=నీవు, దైవతం హి=దైవతము కదా?

తా. సర్వధర్మములును తెలిసిన ఓ విశ్వామిత్రా! నీవు నా చిన్నికొమరునియందును, అల్పభాగ్యుడనైన నాయందును అనుగ్రహము చూపుము. గురువైన నీవు దైవము కదా. 21

మూ. దేవదానవగన్ధర్వా యక్షాః పతగపన్నగాః,
న శక్తా రావణం సోఢుం కిం పునర్మానవా యుధి. 22

ప్ర. అ. దేవదానవగన్ధర్వాః = దేవదానవగంధర్వులు కాని, యక్షాః = యక్షులు కాని, పతగపన్నగాః=పక్షులును సర్పములును గాని, యుధి=యుద్ధమునందు, రావణమ్=రావణుని, సోఢుమ్=సహించుటకు, న శక్తాః = సమర్థులు కారు. మానవాః=మానవులు, కిం పునః=చెప్పనేల?

తా. దేవదానవగంధర్వయక్షపతగపన్నగులు కూడ ఎదుట నిలిచి రావణునితో యుద్ధము చేయజాలరు. మానవుల మాట చెప్పవలెనా? 22

మూ. స హి వీర్యవతాం వీర్యమాదత్తే యుధి రాక్షసః,
తేన చాహం న శక్తోఽస్మి సంయోద్ధుం తస్య వా బలైః. 23
సబలో వా మునిశ్రేష్ఠ సహితో వా మమాత్మజైః.

ప్ర. అ. సః రాక్షసః=ఆ రాక్షసుడు, యుధి = యుద్ధమునందు, వీర్యవ

తామ్=వీర్యవంతులయొక్క, వీర్యమ్=వీర్యమును, ఆదత్తే హి=గ్రహించి వేయునుకదా? మునిశ్రేష్ఠ=ఓమునిశ్రేష్ఠుడా! సబలో వా=సైన్యముతో కూడిన వాడనైనను, మమ=నాయొక్క, ఆత్మజైః=కుమారులతో, సహితో వా=కూడిన వాడనైనను, అహమ్=నేను, తేన=వానితో గాని, తస్య=ఆతనియొక్క, బలైః వా=సైన్యముతో గాని, సంయోద్ధుమ్=యుద్ధముచేయుటకు, శక్తః=సమర్థుడను, నాస్మి=కాను.

తా. ఆ రాక్షసుడు యుద్ధములో వీర్యవంతుల వీర్యమును గ్రహించి వేయును. ఓ మునిశ్రేష్ఠా! సైన్యముతో కూడినవాడనై గాని, నా కుమారులతో కలిసి గాని, నేను, ఆతనితో గాని, ఆతని సైన్యముతో గాని యుద్ధము చేయ జాలను. 23

మూ. కథమప్యమరప్రఖ్యం సంగ్రామాణామకోవిదమ్, 24
బాలం మే తనయం బ్రహ్మన్ నైవ దాస్యామి పుత్రకమ్.

ప్ర. అ. బ్రహ్మన్=ఓబ్రాహ్మణోత్తమా! అమరప్రఖ్యమ్= దేవతలతో సమానుడును, సంగ్రామాణామ్=యుద్ధములకు, అకోవిదమ్=ఎరుగనివాడును, బాలమ్=బాలుడును, పుత్రకమ్=పుంనామనరకమునుండి రక్షించువాడును అగు, మే=నాయొక్క, తనయమ్=కుమారుని, కథమపి=ఏ విధముగను, నైవ దాస్యామి=ఇవ్వనే ఇవ్వను.

తా. విశ్వామిత్రా! బాలుడైన నా కుమారుడు దేవతలతో సమానుడు. యుద్ధపరిచయము లేనివాడు. పున్నామనరకమునుండి నన్ను ఉద్ధరించువాడు. వీనిని ఏమైనను నీ కీయజాలను. 24

మూ. అథ కాలోపమౌ యుద్ధే సుతౌ సున్దోపసున్దయోః, 25
యజ్ఞవిఘ్నకరౌ తౌ తే నైవ దాస్యామి పుత్రకమ్.

ప్ర. అ. అథ=మరియు, తే=నీయొక్క, యజ్ఞవిఘ్నకరౌ=యజ్ఞమునకు విఘ్నము చేయు, సున్దోపసున్దయోః సుతౌ=సుందోపసుందుల కుమారులు, యుద్ధే=యుద్ధమునందు, కాలోపమౌ=యమునితో సమానులు. పుత్రకమ్=నా కుమారుని, నైవ దాస్యామి=ఇవ్వను.

తా. నీకు యజ్ఞవిఘ్నము చేయు ఆ సుందోపసుందకుమారులైన మారీచ సుబాహువులు యుద్ధమునందు యమునివంటివారు. అందుచే నా కుమారుని నీకు ఇవ్వజాలను. 25

మూ. మారీచశ్చ సుబాహుశ్చ వీర్యవన్తౌ సుశిక్షితౌ, 26
తయోరన్యతరేణాహం యోద్ధా స్యాం ససుహృద్గణః.

ప్ర. అ. మారీచశ్చ=మారీచుడును, సుబాహుశ్చ=సుబాహువును, వీర్యవన్తౌ=పరాక్రమవంతులు. సుశిక్షితౌ=బాగుగా అభ్యాసము చేసినవారు. అహమ్=నేను, ససుహృద్గణః=మిత్రగణముతో కూడినవాడనై, తయోః=వారిలో, అన్యతరేణ=ఒకనితో, యోద్ధా=యుద్ధముచేయువాడను, స్యామ్=అగుదును.

తా. మారీచసుబాహువులు పరాక్రమవంతులు మాత్రమే కాదు; మంచి నేర్పుకలవారు కూడ. స్నేహితులతో సహితుడనైన నేను వారిలో ఒకరితో మాత్రమే యుద్ధము చేయగలను. 26

మూ. ఇతి నరపతిజల్పనాద్ద్విజేన్ద్రం
కుశికసుతం సుమహాన్ వివేశ మన్యుః,
సుహుత ఇవ మఖేఽగ్నిరాజ్యసిక్తః
సమభవదుజ్జ్వలితో మహర్షివహ్నిః. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
వింశః సర్గః.

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, నరపతిజల్పనాత్=దశరథుని అసంబద్ధ ప్రలాపమువలన, ద్విజేన్ద్రమ్=ద్విజశ్రేష్ఠుడైన, కుశికసుతమ్=విశ్వామిత్రుని, సుమహాన్=చాల గొప్పదైన, మన్యుః=కోపము, వివేశ=ఆవహించెను. మహర్షి వహ్నిః=మహర్షి యనెడు అగ్ని, మఖే=యజ్ఞమునందు, సుహుతః = బాగుగా హోమము చేయబడిన, ఆజ్యసిక్తః=నేతిచే తడుపబడిన, అగ్నిరివ=అగ్ని వలె, ఉజ్జ్వలితః=ప్రజ్వలించినది, సమభవత్=ఆయెను.

తా. దశరథుని అసంబద్ధప్రలాపములు వినగనే ద్విజశ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు మిక్కిలి క్రోధావిష్టుడయ్యెను. యజ్ఞమునందు బాగుగా హోమము చేసి, నేతిచే తడుపబడిన అగ్ని వలె, విశ్వామిత్రాగ్ని ప్రజ్వలించెను. 27

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో ఇరువదవ సర్గ సమాప్తము.

# అథ ఏకవింశః సర్గః

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య స్నేహపర్యాకులాక్షరమ్,
సమన్యుః కౌశికో వాక్యం ప్రత్యువాచ మహీపతిమ్. 1

ప్ర. అ. తస్య=ఆతనియొక్క, స్నేహపర్యాకులాక్షరమ్=పుత్రస్నేహముచే తడబడుచున్న అక్షరములు గల, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, కౌశికః=విశ్వామిత్రుడు, సమన్యుః=క్రోధముతో కూడినవాడై, మహీపతిమ్=రాజును గూర్చి, వాక్యమ్=వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. పుత్రస్నేహముచే తడబడుచున్న అక్షరములు గల దశరథుని మాటలు విని, విశ్వామిత్రుడు కు్రద్ధుడై ఆతనితో ఇట్లనెను. 1

మూ. పూర్వమర్థం ప్రతిశ్రుత్య ప్రతిజ్ఞాం హాతుమిచ్ఛసి,
రాఘవాణామయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః. 2

ప్ర. అ. పూర్వమ్=మొదట, అర్థమ్=వస్తువును, ప్రతిశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, హాతుమ్=విడచుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు. అయమ్=ఈ, విపర్యయః=ప్రతిజ్ఞాభంగము, రాఘవాణామ్=రఘువంశరాజుల, అస్య=ఈ, కులస్య=కులమునకు, అయుక్తః=తగినది కాదు.

తా. అడిగినది ఇచ్చెద నని మొదట ప్రతిజ్ఞ చేసి ఇప్పుడు ప్రతిజ్ఞను విడువవలె ననుకొనుచున్నావు. ఇది రఘువంశరాజులు చేయవలసినది కాదు. 2

మూ. యదీదం తే క్షమం రాజన్ గమిష్యామి యథాగతమ్,
మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖీ భవ సబాన్ధవః 3

ప్ర. అ. రాజన్=ఓ రాజా! ఇదమ్=ఇది, తే=నీకు, క్షమం యది=తగినదైతే, యథాగతమ్=వచ్చినట్లే, గమిష్యామి=వెళ్లెదను. కాకుత్స్థ=ఓ కకుత్స్థ

వంశమునందు జనించినవాడా! మిథ్యాప్రతిజ్ఞః=అసత్య మైన ప్రతిజ్ఞకల నీవు, సబాన్ధవః=బంధునమేతుడ వై, సుఖీ=సుఖవంతుడ వై, భవ=ఉండుము.

తా. ఓ రాజా! నీకు ఇదే యుక్త మని తోచినచో నేను వచ్చినట్లే తిరిగి వెళ్లెదను. ఓ కాకుత్థ్సా! చేసిన ప్రతిజ్ఞను నిలుపుకొనజాలని నీవు, బంధుసహితు డవై సుఖముగా నుండుము. 3

మూ. తస్య రోషపరీతస్య విశ్వామిత్రస్య ధీమతః,
చచాల వసుధా కృత్స్నా వివేశ చ భయం సురాన్. 4

ప్ర. అ. ధీమతః=ధీమంతుడైన, తస్య=ఆ, విశ్వామిత్రస్య = విశ్వామిత్రుడు, రోషపరీతస్య=రోషముచే ఆవహింపబడి యుండగా, కృత్స్నా= సమస్త మైన, వసుధా=భూమి, చచాల=చలించెను, సురాన్=దేవతలను, భయమ్=భయము, వివేశ=ప్రవేశించెను.

తా. ధీమంతు డైన ఆ విశ్వామిత్రుడు క్రోధావిష్టుడు కాగానే, భూమి యంతయు కంపించెను. దేవతలు కూడ భయపడిరి. 4

మూ. త్రస్తరూపం తు విజ్ఞాయ జగత్సర్వం మహానృషిః,
నృపతిం సువ్రతో ధీరో వసిష్ఠో వాక్యమబ్రవీత్. 5

ప్ర. అ. సువ్రతః=మంచివ్రతము కలవాడును, ధీరః=ధీరుడును, మహాన్ ఋషిః = మహర్షియు అయిన, వసిష్ఠః = వసిష్ఠుడు, సర్వమ్ = సమస్త మైన, జగత్=జగత్తును, త్రస్తరూపమ్=మిక్కిలి భయపడినదానినిగా, విజ్ఞాయ=తెలిసికొని, నృపతిమ్=రాజును గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఉత్తమవ్రతుడును, ధీరుడును అగు వసిష్ఠమహర్షి జగత్తు అంతయు మిక్కిలి భయపడిన దను విషయమును గ్రహించి రాజుతో ఇట్లు పలికెను. 5

మూ. ఇక్ష్వాకూణాం కులే జాతః సాక్షాద్ధర్మ ఇవాపరః,
ధృతిమాన్ సువ్రతః శ్రీమాన్న ధర్మం హాతుమర్హసి. 6

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయుల, కులే = వంశమునందు,

జాతః = పుట్టినవాడవును, సాక్షాత్ = సాక్షాత్తుగా, అపరః = రెండవ, ధర్మః ఇవ=ధర్మదేవతవంటివాడవును, ధృతిమాన్=ధైర్యవంతుడవును, సువ్రతః= ఉత్తమమైన వ్రతము కలవాడవును, శ్రీమాన్ = శ్రీమంతుడవును అగు నీవు, ధర్మమ్ = ధర్మమును, హాతుమ్=విడచుటకు, న అర్హసి=తగవు.

తా. రాజా! నీవు ఇక్ష్వాకువంశములో పుట్టినావు. సాక్షాత్తు, అపర ధర్మ దేవత వంటివాడవు, ధైర్యవంతుడవు. ఉత్తమవ్రతము కలవాడవు. శ్రీమంతుడవు. నీ విట్లు ధర్మమును విడచుట తగదు. 6

మూ. త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ,
స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢుమర్హసి. 7

ప్ర. అ. రాఘవ=ఓ దశరథా! ధర్మాత్మా ఇతి = ధర్మాత్ముడవు అని, త్రిషు లోకేషు = మూడులోకములందును, విఖ్యాతః = ప్రసిద్ధిపొందినావు. స్వధర్మమ్ = స్వధర్మమును, ప్రతిపద్యస్వ=పొందుము. అధర్మమ్ = అధర్మ మును, వోఢుమ్=వహించుటకు, న అర్హసి=తగవు.

తా. దశరథా! ధర్మాత్ముడ వని మూడు లోకములందును ప్రసిద్ధి పొంది యున్నావు. స్వధర్మమును ఆచరింపుము. అధర్మము చేయకుము. 7

మూ. సంశ్రుత్యైవం కరిష్యామీత్యకుర్వాణస్య రాఘవ,
ఇష్టాపూర్తవధో భూయాత్తస్మాద్రామం విసర్జయ. 8

ప్ర. అ. రాఘవ=దశరథా! ఏవం కరిష్యామి=ఇట్లు చేసెదను, ఇతి=అని, సంశ్రుత్య = ప్రతిజ్ఞ చేసి, అకుర్వాణస్య = చేయనివానికి, ఇష్టాపూర్తవధః = యజ్ఞాదులయొక్కయు, వాపీకూపతటాకాదులయొక్కయు వినాశము, భూయాత్ = అగును. తస్మాత్=ఆ కారణమువలన, రామమ్=రాముని, విసర్జయ=పంపుము.

తా. దశరథా! ఇట్లు చేసెదను అని మొదట చెప్పి, పిమ్మట అట్లు చేయని వానికి ఇష్టాపూర్తములు చేసిన వచ్చు పుణ్యము నశించును. కావున విశ్వామిత్రు నితో రాముని పంపుము. 8

మూ. కృతాస్త్రమకృతాస్త్రం వా నైనం శక్ష్యన్తి రాక్షసాః,
గుప్తం కుశికపుత్రేణ జ్వలనేనామృతం యథా. 9

ప్ర. అ. కృతాస్త్రమ్=అస్త్రములు నేర్చినవాడైనను, అకృతాస్త్రం వా= అస్త్రములు నేర్వనివాడైనను, కుశికపుత్రేణ = విశ్వామిత్రునిచే, గుప్తమ్ = రక్షింపబడిన, ఏనమ్=ఈ రాముని, జ్వలనేన=అగ్నిచే రక్షింపబడిన, అమృతం యథా=అమృతమును వలె, రాక్షసాః=రాక్షసులు, న శక్ష్యన్తి=ఏమియు చేయ జాలరు.

తా. రాముడు అస్త్రములు నేర్చినను, నేర్వకపోయినను, విశ్వామిత్రుని రక్షణములో నున్నంతవరకు, అగ్నిచే రక్షింపబడిన అమృతమును వలె రాక్షసులు ఇతనిని ఏమియు చేయజాలరు. 9

మూ. ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః,
ఏష బుద్ధ్యాఽధికో లోకే తపసశ్చ పరాయణమ్. 10

ప్ర. అ. ఏషః=ఇతడు, విగ్రహవాన్=శరీరము దాల్చిన, ధర్మః = ధర్మము. ఏషః=ఇతడు, వీర్యవతామ్=వీర్యవంతులలో, వరః=శ్రేష్ఠుడు. ఏషః=ఇతడు, బుద్ధ్యా=బుద్ధిచేత, లోకే=లోకమునందు, అధికః=అందరికంటెను గొప్పవాడు, తపసః=తపస్సుకు, పరాయణమ్=అత్యుత్తమస్థానము.

తా. ఈ విశ్వామిత్రుడు మూర్తీభవించిన ధర్మము. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడు. ఇతడు బుద్ధిచే అందరికంటె గొప్పవాడు. తపస్సుకు గొప్ప నిధి. 10

మూ. ఏషోఽస్త్రాన్ వివిధాన్వేత్తి త్రైలోక్యే సచరాచరే,
నైవమన్యః పుమాన్వేత్తి న చ వేత్స్యన్తి కేచన. 11

ప్ర. అ. ఏషః=ఇతడు, వివిధాన్=అనేకవిధములైన, అస్త్రాన్=అస్త్రములను, వేత్తి = తెలిసికొనియున్నాడు. ఏవమ్=ఈవిధముగ, సచరాచరే=చరాచరములతో కూడిన, త్రైలోక్యే=లోకత్రయమునందు, అన్యః పుమాన్=ఇతర పురుషుడు, న వేత్తి = ఎరుగడు. కేచన=ఎవరును. న వేత్స్యన్తి చ=ఎరుగబోరు కూడ.

తా. ఈతడు అనేకవిధములైన అస్త్రములు తెలిసినవాడు; చరాచరాత్మకమైన మూడు లోకములందును ఈతనికి తెలిసిన విధమున మరి ఎవ్వరికిని తెలియవు. భవిష్యత్తులో కూడ ఎవ్వరును తెలియజాలరు. 11

మూ. న దేవా నర్షయః కే చిన్నాసురా న చ రాక్షసాః,
గన్ధర్వయక్షప్రవరాః సకిన్నరమహోరగాః. 12

ప్ర. అ. దేవాః=దేవతలు, న(వేత్స్యన్తి)=తెలిసికొనజాలరు. ఋషయః=ఋషులు, కేచిత్=ఎవరును, న=తెలియజాలరు. అసురాః=అసురులు, న=తెలియజాలరు. రాక్షసాః=రాక్షసులు, న=తెలియజాలరు. సకిన్నరమహోరగాః=కిన్నరులతోడను మహోరగులతోడను కూడిన, గన్ధర్వయక్షప్రవరాః=గంధర్వులును యక్షశ్రేష్ఠులును, (తెలియజాలరు).

తా. ఈ విశ్వామిత్రునకు తెలిసిన యస్త్రములు దేవతలకు గాని, ఋషులకు గాని, అసురులకు గాని, రాక్షసులకు గాని, గంధర్వయక్షకిన్నరమహోరగులకు గాని తెలియవు. 12

మూ. సర్వాస్త్రాణి భృశాశ్వస్య పుత్రాః పరమధార్మికాః,
కౌశికాయ పురా దత్తా యదా రాజ్యం ప్రశాసతి. 13

ప్ర. అ. భృశాశ్వస్య = భృశాశ్వునియొక్క, పరమధార్మికాః = పరమధార్మికు లైన, పుత్రాః=పుత్రు లైన, సర్వాస్త్రాణి=సకలాస్త్రములును, యదా=ఎప్పుడు, పురా=పూర్వము, రాజ్యమ్=రాజ్యమును, ప్రశాసతి=శాసించుచుండెనో, అపుడు, కౌశికాయ=విశ్వామిత్రునకు, దత్తాః=ఇవ్వఁబడినవి. 13

తా. పరమధార్మికు లైన భృశాశ్వపుత్రు లగు అస్త్రము లన్నియు, విశ్వామిత్రుడు పూర్వము రాజ్యము చేయుచున్నపుడు, ఆతనికి ఈయబడినవి. 13

మూ. తేఽపి పుత్రా భృశాశ్వస్య ప్రజాపతిసుతాసుతాః,
నైకరూపా మహావీర్యా దీప్తిమన్తో జయావహాః. 14

ప్ర. అ. ప్రజాపతిసుతాసుతాః=దక్షప్రజాపతి కుమార్తెల సుతులైన, భృశాశ్వస్య=భృశాశ్వుని, పుత్రాః=పుత్రులైన, తేఽపి=ఆ అస్త్రములు కూడ, నైకరూపాః=అనేకమైన రూపములు కలవి, మహావీర్యాః=గొప్ప వీర్యము కలవి, దీప్తిమన్తః=కాంతిగలవి. జయావహాః=జయమును ఇచ్చునవి.

తా. భృశాశ్వునకును, దక్షప్రజాపతియొక్క కుమార్తెలకును పుత్రులుగా ఉదయించిన ఆ అస్త్రములు, అనేకరూపములు కలవి; గొప్ప పరాక్రమము గలవి. కాంతి గలవి, జయమును చేకూర్చునవి. 14

మూ. జయా చ సుప్రభా చైవ దక్షకన్యే సుమధ్యమే,
తే సువాతేఽస్త్రశస్త్రాణి(ణాం)శతం పరమభాస్వరమ్. 15

ప్ర. అ. జయా చ = జయయు, సుప్రభా చ=సుప్రభయు అనెడు, సుమధ్యమే=(మంచినడుములుగల) స్త్రీలు, దక్షకన్యే=దక్షుని కన్యలు, తే= వారు, అస్త్రశస్త్రాణామ్=అస్త్రశస్త్రములయొక్క, పరమభాస్వరమ్=మిక్కిలి ప్రకాశించుచున్న, శతమ్=శతమును, సువాతే=కనిరి.

తా. జయ, సుప్రభ అనెడు ఇరువురు దక్షప్రజాపతియొక్క కుమార్తెలు. వారు చాల ప్రకాశించు నూరు అస్త్రములను కనిరి.

వి. శస్త్రమనగా హింసించునది. అస్త్ర మనగా ఇతరులపై విసరునది. అస్త్రశస్త్రము లనగా ఇచట శత్రువులను హింసించుటకై ఉపయుక్తము లగు అస్త్రము లని అర్థము. 15

మూ. పంచాశతం సుతాన్ లేభే జయా నామ వరాన్ పురా,
వధాయాసురసైన్యానామమేయాన్ కామరూపిణః. 16

ప్ర. అ. పురా=పూర్వము, జయా నామ=జయ అను నామె, అసుర సైన్యానామ్=అసురసైన్యములయొక్క, వధాయ=వధకొరకు, అమేయాన్= ఇంత అని చెప్పశక్యముకాని పరాక్రమముకల, కామరూపిణః = స్వేచ్ఛా రూపము గల, వరాన్=శ్రేష్ఠులైన, పఞ్చాశతమ్ = ఏబదిమంది, సుతాన్=పుత్రు లను, లేభే=పొందెను.

తా. పూర్వము, జయ, అసురసైన్యములను సంహరించుటకై, ఏబది మంది పుత్రులను కనెను. వారు అప్రమేయ మైన పరాక్రమము కలవారు. శ్రేష్ఠులు. స్వేచ్ఛప్రకారము రూపములను ధరింప సమర్థులు. 16

మూ. సుప్రభాజనయచ్చాపి పుత్రాన్ పఞ్చాశతం పునః,
సంహారాన్నామ దుర్ధర్షాన్ దురాక్రామాన్ బలీయసః. 17

ప్ర. అ. సుప్రభాపి=సుప్రభ కూడ, దుర్ధర్షాన్=ఎదిరింపశక్యము కాని వారును,దురాక్రామాన్=ఆక్రమింప శక్యము కానివారును, బలీయసః=ఎక్కువ బలముకలవారును అగు, పునః=ఇంకను, పఞ్చాశతమ్=ఏబదిమంది, పుత్రాన్=పుత్రులను, అజనయత్=కనెను.

తా. సుప్రభకూడ, సంహారులను పేరు గల మరి యేబదిమంది పుత్రులను కనెను. వారు చాల బలవంతులు. ఎదిరించి జయింప శక్యము కానివారు. 17

మూ. తాని చాస్త్రాణి వేత్త్యేష యథావత్ కుశికాత్మజః,
అపూర్వాణాం చ జననే శక్తో భూయః స ధర్మవిత్. 18

ప్ర. అ. ఏషః=ఈ, కుశికాత్మజః=విశ్వామిత్రుడు, తాని=ఆ, అస్త్రాణి=అస్త్రములను, యథావత్=చక్కగా, వేత్తి=ఎరుగును, ధర్మవిత్=ధర్మ వేత్తయైన, సః=ఆతడు, భూయః=ఇంకను, అపూర్వాణామ్=కొ్రత్త అస్త్రముల యొక్క, జననే చ=పుట్టించుటయందు గూడ, శక్తః=సమర్థుడు.

తా. ఆ అస్త్రము లన్నియు ఈ కుశికనందనునకు చక్కగ తెలియును. ధర్మవేత్త యగు ఈతడు క్రొత్త అస్త్రములను పుట్టించుటకు కూడ సమర్థుడు. 18

మూ. ఏవంవీర్యో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః,
న రామగమనే రాజన్ సంశయం కర్తుమర్హసి. 19

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును, మహాయశాః=గొప్ప కీర్తికలవాడును అగు, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, ఏవంవీర్యః=ఇట్టి వీర్యము కలవాడు. రాజన్=ఓ రాజా! రామగమనే=రాముని గమనము విషయమున, సంశయమ్=సంశయమును, కర్తుమ్=చేయుటకు, నార్హసి=తగవు.

తా. ఓ దశరథమహారాజా! గొప్పతేజస్సు, కీర్తియు గల విశ్వామిత్రు డింతటి ప్రభావశాలి. కావున రాముని పంపుట విషయమున సందేహింపకుము. 19

మూ. తేషాం నిగ్రహణే శక్తః స్వయం చ కుశికాత్మజః,
తవ పుత్రహితార్థాయ త్వాము పేత్యాభియాచతే. 20

ప్ర. అ. కుశికాత్మజః = విశ్వామిత్రుడు, స్వయం చ = స్వయముగనే, తేషామ్ = వారియొక్క, నిగ్రహణే = నిగ్రహించుటయందు, శక్తః = సమర్థుడు. తవ = నీయొక్క, పుత్రహితార్థాయ = పుత్రుల హితముకొరకై, త్వామ్ = నిన్ను, ఉపేత్య = పొంది, యాచతే = యాచించుచున్నాడు.

తా. విశ్వామిత్రుడు ఆ రాక్షసులను స్వయముగనే నిగ్రహింపగల్గినను, నీ కుమారునకు మేలు చేయుటకై నీవద్దకు వచ్చి యాచించుచున్నాడు. 20

మూ. ఇతి మునివచనాత్ప్రసన్నచిత్తో
రఘువృషభస్తు ముమోద భాస్వరాఙ్గః,
గమనమభిరురోచ రాఘవస్య
ప్రథితయశాః కుశికాత్మజాయ బుద్ధ్యా. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. రఘుపుఙ్గవః = దశరథుడు, ఇతి = ఈ విధముగా, మునివచనాత్ = మునివాక్యమువలన, ప్రసన్నచిత్తః = ప్రసన్నమైన చిత్తము కలవాడై, భాస్వరాఙ్గః = ప్రకాశించుచున్న శరీరముకలవాడై, ముమోద = సంతసించెను. ప్రథితయశాః = ప్రసిద్ధమైన కీర్తి గల ఆ దశరథుడు, కుశికాత్మజాయ = విశ్వామిత్రునికొరకై, రాఘవస్య = రామునియొక్క, గమనమ్ = గమనమును, బుద్ధ్యా = బుద్ధిచేత, అభిరురోచ = అంగీకరించెను.

తా. ప్రసిద్ధమైన కీర్తి గల దశరథుడు వసిష్ఠుని మాటలచే ప్రసన్నమైన చిత్తముకలవా డయ్యెను. సంతోషముతో ఆతని శరీర ముప్పొంగెను. రాముని విశ్వామిత్రునితో పంపుటకు అంగీకరించెను. 21

"బాలానన్దిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండములో
ఇరువదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వావింశః సర్గః

మూ. తథా వసిష్ఠే బ్రువతి రాజా దశరథః స్వయమ్,
ప్రహృష్టవదనో రామమాజుహావ సలక్ష్మణమ్. 1

ప్ర. అ. వసిష్ఠే=వసిష్ఠుడు, తథా=ఆ విధముగా, బ్రువతి=చెప్పగా, రాజా దశరథః = దశరథమహారాజు, ప్రహృష్టవదనః = వికసించిన ముఖము కలవాడై, స్వయమ్=స్వయముగ, సలక్ష్మణమ్=లక్ష్మణసమేతు డైన, రామమ్=రాముని, ఆజుహావ=పిలిచెను.

తా. వసిష్ఠుడు అట్లు పలుకగా, దశరథుడు సంతసించి, లక్ష్మణసమేతు డైన శ్రీరాముని స్వయముగ పిలచుకొనివచ్చెను. 1

మూ. కృతస్వస్త్యయనం మాత్రా పిత్రా దశరథేన చ,
పురోధసా వసిష్ఠేన మఙ్గళై రభిమన్త్రితమ్. 2

స పుత్రం మూర్ధ్న్యుపాఘ్రాయ రాజా దశరథః ప్రియమ్,
దదౌ కుశికపుత్రాయ సుప్రీతేనాన్తరాత్మనా. 3

ప్ర. అ. సః=ఆ, దశరథః రాజా=దశరథమహారాజు, మాత్రా=తల్లి చేతను, పిత్రా=తండ్రియైన, దశరథేన చ=దశరథునిచేతను (తనచేతను), కృత స్వస్త్యయనమ్=చేయబడిన స్వస్త్యయనము కలిగినవాడును, పురోధసా=పురోహితు డైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, మఙ్గళైః=మంగళకరము లగు మంత్రములచే, అభిమన్త్రితమ్ = అభిమంత్రింపబడినవాడును, ప్రియమ్ = ప్రియుడును అగు, పుత్రమ్=పుత్రుని, మూర్ధ్ని=శిరస్సుపై, ఉపాఘ్రాయ=వాసన చూచి, సుప్రీతేన=చాల సంతసించిన, అన్తరాత్మనా= హృదయముతో, కుశికపుత్రాయ= విశ్వామిత్రునకు, దదౌ=ఇచ్చెను.

తా. కౌసల్యయు దశరథుడును రామునకు స్వస్త్యయనము చేసిరి. వసిష్ఠుడు మంగళకరము లగు మంత్రోదకాదులతో రాముని అభిమంత్రించెను.

దశరథుడు ఆ ప్రియపుత్రుని శిరస్సుపై వాసన చూచి, (ముద్దిడికొని), చాల సంతసించిన అంతరాత్మతో విశ్వామిత్రున కిచ్చెను. 2, 3

మూ. తతో వాయుః సుఖస్పర్శో నీరజస్కో వవౌ తదా,
విశ్వామిత్రగతం దృష్ట్వా రామం రాజీవలోచనమ్. 4

ప్ర. అ. తతః=పిమ్మట, రాజీవలోచనమ్=పద్మముల వంటి నేత్రములు గల, రామమ్=రాముని, విశ్వామిత్రగతమ్=విశ్వామిత్రుని అనుసరించినవానినిగా, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, వాయుః=వాయువు, సుఖస్పర్శః=సుఖకరమైన స్పర్శగలదై, నీరజస్కః=పరాగములేనిదై, వవౌ=వీచెను.

తా. కమలలోచను డగు రాముడు విశ్వామిత్రుని అనుసరింపగనే వాయువు పరాగము లేక, సుఖస్పర్శకరమై వీచెను. 4

మూ. పుష్పవృష్టిర్మహత్యాసీద్దేవదున్దుభినిస్వనైః,
శఙ్ఖదున్దుభినిర్ఘోషః ప్రయాతే తు మహాత్మని. 5

ప్ర. అ. మహాత్మని=మహాత్ముడైన విశ్వామిత్రుడు, ప్రయాతే తు=బయలుదేరగనే, మహతీ=గొప్ప, పుష్పవృష్టిః=పుష్పవృష్టియు, దేవదున్దుభినిస్స్వనైః=దేవదుందుభుల ధ్వనులతో కలిసిన, శఙ్ఖదున్దుభినిర్ఘోషః = శంఖములయొక్కయు దుందుభుల యొక్కయు ధ్వని, ఆసీత్ = ఆయెను.

తా. మహాత్ముడైన విశ్వామిత్రుడు బయలుదేరగనే గొప్ప పుష్పవర్షము కురిసెను. దేవతలు దుందుభులు మ్రోయించిరి. దశరథుని ప్రాసాదములో కూడ శంఖదుందుభిధ్వనులు మిన్ను ముట్టెను. 5

మూ. విశ్వామిత్రో యయావగ్రే పతతో రామో ధనుర్ధరః,
కాకపక్షధరో ధన్వీ తం చ సౌమిత్రిరన్వగాత్. 6

ప్ర. అ. విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, అగ్రే = ముందు, యయౌ= నడచెను. తతః=అతనివెనుక, ధనుర్ధరః = ధనుస్సును ధరించిన, రామః = రాముడు, (నడచెను). కాకపక్షధరః=జునపములను ధరించిన, ధన్వీ=ధనుస్సు గల, సౌమిత్రిః=లక్ష్మణుడు, తమ్=ఆ రాముని, అన్వగాత్=అనుసరించి నడచెను.

**తా.** విశ్వామిత్రుడు ముందు నడువగా, ఆతని వెనుక ధనుర్ధరు డైన రాముడును, ఆతని వెనుక కాకపక్షధారియు, ధనుర్ధరుడును అగు లక్ష్మణుడును వెళ్లిరి. 6

మూ. కలాపినౌ ధనుష్పాణీ శోభయానౌ దిశో దశ,
విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షావివ పన్నగౌ, 7
అనుజగ్మతురక్షుద్రౌ పితామహమివాశ్వినౌ.

ప్ర. అ. కలాపినౌ = అంబులపొదులను ధరించినవారును, ధనుష్పాణీ = ధనుస్సులు హస్తములందు కలవారును, దశ = పది, దిశః = దిక్కులను, శోభయానౌ = ప్రకాశింపచేయుచున్న వారును, అక్షుద్రౌ = అనల్ప మైన రూపవీర్యాది ప్రభావము కలవారును, త్రిశీర్షౌ = మూడు శిరస్సులు గల, పన్నగౌ ఇవ = సర్పములు వలె ఉన్న రామలక్ష్మణులు, మహాత్మానమ్ = మహాత్ము డైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, అశ్వినౌ = అశ్వినీదేవతలు, పితామహమివ = బ్రహ్మదేవుని వలె, అనుజగ్మతుః = అనుసరించి వెళ్లిరి.

**తా.** రెండేసి అమ్ములపొదులను, ధనుస్సును ధరించిన ఆ రామలక్ష్మణులు మూడేసి తలలు గల సర్పముల వలె ఉండిరి. వారు నడచుచుండగా పది దిక్కులును ప్రకాశించినవి. అట్టి అనల్పరూపవీర్యాదిప్రభావు లగు రామలక్ష్మణులు విశ్వామిత్రుని అనుసరించి వెళ్లనపుడు ఇద్దరు అశ్వినీదేవతలు బ్రహ్మదేవుని వెనుక నడచిపోవుచున్నట్లుండెను. 7

మూ. తదా కుశికపుత్రం తు ధనుష్పాణీ స్వలంకృతౌ, 8
బద్ధగోధాఙ్గులిత్రాణౌ ఖడ్గవంతౌ మహాద్యుతీ.
కుమారౌ చారువపుషౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ, 9

అనుయాతౌ శ్రియా దీప్తౌ శోభయేతామనిన్దితౌ,
స్థాణుం దేవమివాచిన్త్యం కుమారావివ పావకీ. 10

ప్ర. అ. తదా = అప్పుడు, ధనుష్పాణీ = ధనస్సులు హస్తములందు కలవారును, స్వలఙ్కృతౌ = చక్కగా అలంకరించబడినవారును, బద్ధగోధా

**జ్గలిత్రాణౌ** = కట్టబడిన ఉడుముతోలుతో చేసిన వ్రేళ్లతొడుగులు కలవారును, **ఖడ్గవన్తౌ** = ఖడ్గములు కలవారును, **మహాద్యుతీ** = గొప్పకాంతి కలవారును, **కుమారౌ** = బాలురును, **చారువపుషౌ** = అందమైన శరీరములు కలవారును, **శ్రియా** = శోభతో, **దీప్తౌ** = ప్రకాశించుచున్నవారును, **అనిన్దితౌ** = దోషములు లేనివారును అగు, **భ్రాతరౌ** = సోదరులైన, **రామలక్ష్మణౌ** = రామలక్ష్మణులు, **అనుయాతౌ** = అనుసరించి వెళ్లుచున్నవారై, **పావకీ** = అగ్నివలన జనించిన, **కుమారౌ** = స్కందవిశాఖులు, **అచిన్త్యమ్** = ఊహింపరానిప్రభావముగల, **దేవమ్**=దేవుడైన, **స్థాణుమ్ ఇవ**=ఈశ్వరుని వలె, **కుశికపుత్రమ్**=విశ్వామిత్రుని, **శోభయేతామ్** = ప్రకాశింపచేసిరి.

తా. బాలురైన ఆ రామలక్ష్మణులు, ధనుస్సులు ధరించి యుండిరి. చక్కగ అలంకరింపబడిరి. వ్రేళ్లకు ఉడుముతోలుతో చేసిన తొడుగులను ధరించిరి. ఖడ్గములు ధరించి యుండిరి. గొప్ప కాంతితో ప్రకాశించుచుండిరి. చక్కని ఆకారముతో, అపూర్వసౌందర్యముతో ఒప్పారుచుండిరి. ఎట్టి దోషములును లేక యుండిరి. వారు అనుసరించి వెళ్లుచు, అగ్నినుండి జనించిన స్కందవిశాఖులు అచింత్యప్రభావు డగు ఈశ్వరుని అనుసరించి ఆతనిని ప్రకాశింపచేసి నట్లు, విశ్వామిత్రుని ప్రకాశింపచేసిరి. 8-10

వి. "తతోఽభవచ్చతుర్మూర్తిః క్షణేన భగవాన్ ప్రభుః, స్కన్దో విశాఖః శాకశ్చ నైగమేషశ్చ పృష్ఠతః" (అంత భగవంతు డగు కుమారస్వామి స్కందుడు, విశాఖుడు, శాకుడు, నైగమేషుడు అను నాలుగు రూపములు ధరించెను) అని భారతమున చెప్పబడినది. ఇచట రామలక్ష్మణులు స్కందవిశాఖులతో పోల్చ బడినారు (గోవిందరాజులు).

మూ. అధ్యర్ధయోజనం గత్వా సరయ్వా దక్షిణే తటే,
రామేతి మధురాం వాణీం విశ్వామిత్రోఽభ్యభాషత.

ప్ర. అ. అధ్యర్ధయోజనమ్=ఒకటిన్నర యోజనముల దూరము, గత్వా= వెళ్లి, సరయ్వాః=సరయూనదియొక్క, దక్షిణే తటే=దక్షిణమువైపున నున్న తీరమునందు, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, రామ ఇతి='ఓ రామా'అని, మధురామ్=మధుర మైన, వాణీమ్=వాక్కును, అభ్యభాషత=పలికెను.

తా. ఒకటిన్నర యోజనముల దూరము నడచి సరయూదక్షిణతీరము

చేరిన పిమ్మట విశ్వామిత్రుడు—"ఓ రామా!" అని మధురముగ పిలిచి ఇట్లనెను. 11

మూ. గృహాణ వత్స సలిలం మా భూత్కాలస్య పర్యయః,
మన్త్రగ్రామం గృహాణ త్వం బలామతిబలాం తథా. 12

వత్స=ఓ వత్సా! సలిలమ్=ఉదకమును, గృహాణ=గ్రహించుము. కాలస్య=కాలముయొక్క, పర్యయః=కడచిపోవుట, మాభూత్=కాకుండుగాక. త్వమ్=నీవు, మన్త్రగ్రామమ్=మంత్రముల సముదాయమును, తథా=మరియు, బలామ్=బలను, అతిబలామ్=అతిబలను, గృహాణ=గ్రహింపుము.

తా. వత్సా! ఆచమనము చేయుము. మంత్రముల సముదాయమును, బల, అతిబల అనెడు విద్యలను ఇచ్చెదను, తీసికొనుము. 12

మూ. న శ్రమో న జ్వరో వా తే న రూపస్య విపర్యయః,
న చ సుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యన్తి నైరృతాః. 13

ప్ర. అ. తే = నీకు, శ్రమః = శ్రమ, న=కలుగదు. జ్వరో వా = జ్వరముకూడ, న=కలుగదు. రూపస్య=రూపముయొక్క, విపర్యయః=మార్పు, న=కలుగదు. సుప్తమ్=నిద్రపోవుచున్నవాడవైనా, ప్రమత్తం వా=ఏమరుపాటుతో ఉన్నవాడవైనా నిన్ను, నైరృతాః=రాక్షసులు, న ధర్షయిష్యన్తి=బాధింపజాలరు.

ఈ విద్యలు గ్రహించినచో, నీకు శ్రమ కాని, జ్వరము కాని, రూపములో మార్పు గాని కలుగదు. నీవు నిద్రపోవుచున్నను, ఏమరి యున్నను రాక్షసులు నిన్నేమియు చేయజాలరు. 13

మూ. న బాహ్వోః సదృశో వీర్యే పృథివ్యామస్తి కశ్చన,
త్రిషు లోకేషు వై రామ న భవేత్సదృశస్తవ. 14

ప్ర. అ. రామ=ఓ రామా! బాహ్వోః=బాహువులయొక్క, వీర్యే=వీర్యమునందు, సదృశః=నీతో సమానమైనవాడు, కశ్చన=ఎవ్వడును, పృథివ్యామ్=భూమియందు, నాస్తి=లేడు. త్రిషు=మూడు, లోకేషు=లోకములందు, తవ=నీకు, సదృశః=సమానుడు, న భవేత్=ఉండడు.

తా. రామా! బాహువీర్యములో నీతో సమానుడు ఈ పృథివిలో ఎవ్వ డును లేడు. నీతో సమానుడు మూడు లోకములలో కూడ ఉండబోడు. 14

మూ. న సౌభాగ్యే న దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధినిశ్చయే,
నోత్తరే ప్రతివక్తవ్యే సమో లోకే తవానఘ. 15

ప్ర. అ. అనఘ = ఓ దోషరహితుడా! సౌభాగ్యే = సౌందర్యమునందు, తవ = నీకు, సమః = సమానుడు, లోకే = లోకమునందు, న = ఉండడు. దాక్షిణ్యే = సామర్థ్యమునందు, న = ఉండడు. జ్ఞానే = జ్ఞానమునందు గాని, బుద్ధి నిశ్చయే = బుద్ధిచేత నిశ్చయింపవలసినపుడు గాని, న = ఉండడు. ఉత్తరే = ప్రత్యుత్తరము, ప్రతివక్తవ్యే = చెప్పవలసి వచ్చినపుడు, న = ఉండడు.

తా. దోషరహితుడ వగు ఓ రామా! సౌందర్యమునందు గాని, సామర్థ్యమునందు గాని, జ్ఞానమునందు గాని, బుద్ధిచే నిశ్చయింపవలసినపుడు గాని, సమాధానము చెప్పవలసినప్పుడు గాని, నీకు సరివచ్చువాడు ఈ లోక ములో ఉండడు. 15

మూ. ఏతద్విద్యాద్వయే లబ్ధే భవితా నాస్తి తే సమః,
బలా త్వతిబలా చైవ సర్వజ్ఞానస్య మాతరౌ. 16

ప్ర. అ. ఏతద్విద్యాద్వయే = ఈ విద్యాద్వయము, లబ్ధే సతి = పొంద బడగా, తే = నీకు, సమః=సమానుడు, నాస్తి = లేడు. న భవితా = ఉండబోడు. బలా = బలయు, అతిబలా చైవ = అతిబలయు, సర్వజ్ఞానస్య = సమస్త జ్ఞానమునకును, మాతరౌ = తల్లులు.

తా. ఈ విద్యాద్వయము లభించిన పిమ్మట నీకు సముడు ఇపుడు లేడు. భవిష్యత్తులో కూడ ఉండడు. ఈ బలాతిబలలు సకలజ్ఞానమును కలుగ జేయును. 16

మూ. క్షుత్పిపాసే న తే రామ భవిష్యేతే నరోత్తమ,
బలామతిబలాం చైవ పఠతః పథి రాఘవ. 17

ప్ర. అ. నరోత్తమ = నరులలో ఉత్తముడా, రాఘవ = రఘువంశోద్భ వుడా! రామ = ఓ రామా! పథి = మార్గమునందు, బలామ్ = బలను, అతి

బలాం చైవ = అతిబలను, పఠతః = జపించుచున్న, తే = నీకు, క్షుత్పిపాసే= ఆకలిదప్పులు, న భవిష్యేతే = కలుగవు.

తా. ఓ నరోత్తమా ! రాఘవా ! నీవు మార్గమునందు ఈ బలాతిబలలను జపించినచో నీకు ఆకలిదప్పికలు కలుగవు. 17

మూ. విద్యాద్వయమధీయానే యశశ్చాప్యతులం త్వయి,
పితామహసుతే హ్యేతే విద్యే తేజస్సమన్వితే. 18
ప్రదాతుం తవ కాకుత్స్థ సదృశ స్త్వం హి ధార్మిక.

ప్ర. అ. విద్యాద్వయమ్=విద్యాద్వయమును, అధీయానే=జపించిన (అభ్యసించిన) త్వయి=నీయందు, అతులమ్=సాటిలేని, యశశ్చ=కీర్తికూడ, (కలుగును). కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు పుట్టిన, ధార్మిక = ధార్మికుడవైన ఓ రామా! తేజస్సమన్వితే = తేజస్సుతోకూడిన, పితామహసుతే = పితామహుని కుమార్తెలైన, ఏతే విద్యే=ఈ విద్యలను, తవ = నీకు, ప్రదాతుమ్=ఇచ్చుటకు, త్వమ్=నీవే, సదృశః=తగినవాడవు.

తా. ఈ విద్యాద్వయమును జపించినచో నీకు సాటి లేని కీర్తి కూడ లభించును. ధార్మికుడ వైన ఓ రామా ! తేజోవంతము లైన ఈ విద్యలు బ్రహ్మదేవుని పుత్రికలు. వీటిని ఇచ్చుటకు నీవే తగినవాడవు. 18

మూ. కామం బహుగుణాః సర్వే త్వయ్యేతే నాత్ర సంశయః, 19
తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః.

ప్ర. అ. ఏతే=ఈ, బహుగుణాః=అనేకగుణములు, సర్వే=అన్నియు, కామమ్ = అధికముగా, త్వయి = నీయందున్నవి. అత్ర = ఈ విషయమున, సంశయః=సంశయము, న=లేదు. తపసా=తపస్సుచే, సంభృతే=పోషింపబడినవై, ఏతే=ఈవిద్యలు, బహురూపే = అనేకరూపములుకలవి, భవిష్యతః = కాగలవు.

తా. ఉత్తమగుణము లన్నియు నీయందు అధికముగా నున్నవి. సందేహము లేదు. ఈ విద్యలను తపస్సుచే పోషించినచో వివిధఫలములను ఇవ్వగలవు. 19

మూ. తతో రామో జలం స్పృష్ట్వా ప్రహృష్టవదనః శుచిః, 20
ప్రతిజగ్రాహ తే విద్యే మహర్షేర్భావితాత్మనః.

ప్ర. అ. **తతః** = పిమ్మట, **రామః** = రాముడు, **జలమ్** = ఉదకమును, స్పృష్ట్వా=స్పృశించి, **శుచిః**=పవిత్రుడై, ప్రహృష్టవదనః=వికసించిన ముఖము కలవాడై, భావితాత్మనః=పరిశుద్ధమైన మనస్సుగల, మహర్షేః=మహర్షినుండి, **తే**=ఆ, విద్యే=విద్యలను, ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

**తా.** రాముడు ఆచమనము చేసి, శుచియై, ఆనందముచే వికసించిన ముఖము కలవాడై, పరిశుద్ధమనస్కుడైన ఆ మహర్షినుండి ఆ రెండు విద్యలను స్వీకరించెను. 20

మూ. విద్యాసముదితో రామః శుశుభే భూరివిక్రమః, 21
సహస్రరశ్మిర్భగవాన్ శరదీవ దివాకరః.

గురుకార్యాణి సర్వాణి నియుజ్య కుశికాత్మజే, 22
ఊషుస్తాం రజనీం తత్ర సరయ్వాం సుసుఖం త్రయః.

ప్ర. అ. **భూరివిక్రమః** = గొప్ప పరాక్రమము గల, రామః = రాముడు, విద్యాసముదితః = విద్యలతో కూడినవాడై, కుశికాత్మజే = విశ్వామిత్రుని విషయమున, సర్వాణి = సమస్తమైన, గురుకార్యాణి = గురువు విషయమున చేయవలసిన కార్యములను, నియుజ్య = చేసి, శరది = శరత్కాలమునందు, సహస్రరశ్మిః = వేయి కిరణములు గల, భగవాన్ = భగవంతుడైన, దివాకరః ఇవ = సూర్యుడు వలె, శుశుభే = ప్రకాశించెను. త్రయః = వారు ముగ్గురును, **తత్ర** = అచట, సరయ్వామ్ = సరయూతీరమునందు, సుసుఖమ్ = చాల సుఖముగా, **తాం** రజనీమ్ = ఆ రాత్రి, ఊషుః = ఉండిరి.

**తా.** అధికపరాక్రమశాలి యగు రాముడు, విద్యలను గ్రహించిన పిమ్మట, విశ్వామిత్రుని విషయమున మంత్రాచార్యుని విషయమున ప్రవర్తించవలసిన విధముగ ప్రవర్తించుచు, శరత్కాలమునందు సూర్యుడు వలె ప్రకాశించెను. వారు ముగ్గురును ఆ రాత్రి సరయూతీరమున సుఖముగా నివాసము చేసిరి. 21, 22

మూ. దశరథ నృపసూనుసత్తమాభ్యాం
తృణశయనేఽనుచితే సహోషితాభ్యామ్,
కుశికసుతవచోఽనులాలితాభ్యాం
సుఖమివ సా విబభౌ విభావరీ చ. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్వావింశః సర్గః.

ప్ర. అ. అనుచితే = అలవాటు లేని, తృణశయనే = గడ్డిపక్క పైన, సహోషితాభ్యామ్ = కలిసి శయనించిన, కుశికసుతవచోనులాలితాభ్యామ్ = విశ్వామిత్రుని వాక్కులచే లాలనచేయబడిన, దశరథసూనుసత్తమాభ్యామ్ = దశరథ పుత్రశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులకు, సా = ఆ, విభావరీ చ = రాత్రి కూడ, సుఖమివ = సుఖముగానే, విబభౌ = తోచినది.

తా. రామలక్ష్మణులు పూర్వ మెన్నడును అలవాటు లేని తృణశయనము పై కలిసి శయనించిరి. విశ్వామిత్రుని బుజ్జగింపుమాటలచే వారికి ఆ రాత్రి కూడ సుఖముగనే ఉండెను. 23

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండములో
ఇరువది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయోవింశః సర్గః

మూ. ప్రభాతాయాం తు శర్వర్యాం విశ్వామిత్రో మహామునిః,
అభ్యభాషత కాకుత్స్థౌ శయానౌ పర్ణసంస్తరే. 1

ప్ర. అ. శర్వర్యామ్ = రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారగా, మహా మునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, పర్ణసంస్తరే = పర్ణ శయనమునందు, శయానౌ = శయనించుచున్న, కాకుత్స్థౌ = రామలక్ష్మణులను గూర్చి, అభ్యభాషత = పలికెను.

తా. రాత్రి గడచి తెల్లవారుచున్నది. అపుడు విశ్వామిత్రమహర్షి పర్ణ శయనముపై శయనించి యున్న రామలక్ష్మణులతో ఇట్లు పలికెను. 1

మూ. కౌసల్యా సుప్రజా రామ పూర్వా సన్ధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్. 2

ప్ర. అ. కౌసల్యాసుప్రజాః = కౌసల్యయొక్క ఉత్తమసంతానమైన, రామ=ఓరామా! పూర్వా సంధ్యా=పూర్వసంధ్య, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది. నరశార్దూల = ఓ నరశ్రేష్ఠుడా! ఉత్తిష్ఠ = లెమ్ము, దైవమ్=దేవతాసంబంధి యైన, ఆహ్నికమ్ = ప్రతిదినము చేయతగిన కర్మ, కర్తవ్యమ్ = చేయదగినది.

తా. కౌసల్యా సత్పుత్రుడ వైన ఓ రామా! ప్రాతఃకాలసంధ్య వచ్చినది. ఓ నరశ్రేష్ఠుడా ! లెమ్ము. సంధ్యావన్దనాదినిత్యకర్మ చేయవలసి యున్నది. 2

మూ. తస్యర్షేః పరమోదారం వచః శ్రుత్వా నృపాత్మజౌ,
స్నాత్వా కృతోదకౌ వీరౌ జేపతుః పరమం జపమ్. 3

ప్ర. అ. వీరౌ=వీరులైన, నృపాత్మజౌ=రాజకుమారులు, తస్య ఋషేః= ఆ ఋషీశ్వరునియొక్క, పరమోదారమ్ = మిక్కిలి అంద మైన, వచః=వాక్కును, శ్రుత్వా = విని, స్నాత్వా = స్నానము చేసి, కృతోదకౌ = అర్ఘ్యప్రదానము చేసిన వారై, పరమమ్ = గొప్పదైన, జపమ్ = గాయత్రీజపమును, జేపతుః=జపించిరి.

తా. వీరులైన ఆ రామలక్ష్మణులు విశ్వామిత్రుని ఆ మధురవాక్యము విని, లేచి, స్నానము చేసి, సూర్యునకు అర్ఘ్యప్రదానము చేసి, అత్యుత్తమమగు, గాయత్రీ మంత్రమును జపించిరి. 3

మూ. కృతాహ్నికౌ మహావీర్యౌ విశ్వామిత్రం తపోధనమ్,
అభివాద్యాభిసంహృష్టౌ గమనాయాభితస్థతుః. 4

ప్ర. అ. మహావీర్యౌ = గొప్ప పరాక్రమము గల ఆ రామలక్ష్మణులు, కృతాహ్నికౌ = చేయబడిన నిత్యకర్మలు కలవారై, అభిసంహృష్టౌ = ఉత్సాహవంతులై, తపోధనమ్ = తపస్సే ధనముగా గల, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, అభివాద్య=నమస్కరించి, గమనాయ=ప్రయాణమునకు, అభితస్థతుః = సన్నద్ధులైరి.

తా. రామలక్ష్మణులు సంధ్యావందనాదినిత్యకర్మలను పూర్తి చేసికొని, విశ్వామిత్రమహర్షికి నమస్కరించి, ఉత్సాహముతో ప్రయాణోన్ముఖు లయిరి. 4

మూ. తౌ ప్రయాతౌ మహావీర్యౌ దివ్యాం త్రిపథగాం నదీమ్,
దదృశాతే తతస్తత్ర సరయ్వాః సఙ్గమే శుభే. 5

ప్ర. అ. తతః = పిమ్మట, మహావీర్యౌ = మహావీర్యవంతులగు ఆ రామలక్ష్మణులు, ప్రయాతౌ = కొంతదూరమువెళ్లినవారై, తత్ర = అచట, శుభే = పవిత్ర మైన, సరయ్వాః = సరయూనదియొక్క, సంగమే = సంగమమునందు, త్రిపథగామ్ = మూడు మార్గములలో ప్రవహించు, దివ్యామ్ = స్వర్గమునందు పుట్టిన, నదీమ్ = నదిని, దదృశాతే = చూచిరి.

తా. మహావీర్యు లగు రామలక్ష్మణులు కొంత దూరము ప్రయాణము చేసిన పిమ్మట పవిత్ర మగు సరయూనదీ సంగమస్థానమునందు గంగానదిని చూచిరి. 5

మూ. తత్రాశ్రమపదం పుణ్యమ్ ఋషీణాముగ్రతేజసామ్,
బహువర్షసహస్రాణి తప్యతాం పరమం తపః. 6

ప్ర. అ. తత్ర = అచట, బహువర్షసహస్రాణి = ఎన్నో వేలసంవత్సరములు, పరమమ్ = గొప్ప, తపః = తపస్సును, తప్యతామ్ = చేయుచున్న,

అగ్ర్యతేజసామ్ = గొప్ప తేజస్సు గల, ఋషీణామ్ = ఋషీశ్వరుల, పుణ్యమ్ = పవిత్రమైన, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, (చూచిరి).

తా. అచట కొన్ని వేల సంవత్సరములనుండి గొప్ప తపస్సు చేయుచున్న, శ్రేష్ఠమైన తేజస్సు గల ఋషుల ఆశ్రమమును చూచిరి. 6

మూ. తం దృష్ట్వా పరమప్రీతౌ రాఘవౌ పుణ్యమాశ్రమమ్,
ఊచతుస్తం మహాత్మానం విశ్వామిత్రమిదం వచః. 7

ప్ర. అ. తమ్ = ఆ, పుణ్యమ్ = పవిత్ర మైన, ఆశ్రమమ్=ఆశ్రమమును, దృష్ట్వా = చూచి, పరమప్రీతౌ = చాల సంతసించిన, రాఘవౌ = రామలక్ష్మణులు, మహాత్మానమ్ = మహాత్ముడైన, తం విశ్వామిత్రమ్ = ఆ విశ్వామిత్రుని గూర్చి, ఇదమ్ = ఈ, వచః = వాక్కును, ఊచతుః = పలికిరి.

తా. ఆ పుణ్యాశ్రమమును చూడగనే సంతుష్టాంతరంగులైన రామలక్ష్మణులు విశ్వామిత్రునితో ఇట్లు పలికిరి. 7

మూ. కస్యాయమాశ్రమః పుణ్యః కోన్వస్మిన్వసతే పుమాన్,
భగవన్ శ్రోతుమిచ్ఛావః పరం కౌతూహలం హి నౌ. 8

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా! అయమ్ = ఈ, పుణ్యః=పవిత్ర మైన, ఆశ్రమః = ఆశ్రమము, కస్య = ఎవనిది? అస్మిన్ = దీనియందు, కః ను = ఏ, పుమాన్ = పురుషుడు, వసతే = నివసించుచున్నాడు? శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛావః = ఇచ్ఛయించుచున్నాము. నౌ = మాకు, పరమ్ = గొప్ప, కౌతూహలం హి = వేడుక ఉన్నది కదా.

తా. ఓ పూజ్యుడా! పవిత్ర మైన ఈ ఆశ్రమము ఎవ్వనిది? దీనిలో ఎవ్వడు నివసించుచున్నాడు? మాకు విన వేడుకగా నున్నది. 8

మూ. తయోస్తద్వచనం శ్రుత్వా ప్రహస్య మునిపుఙ్గవః,
అబ్రవీచ్ఛ్రూయతాం రామ యస్యాయం పూర్వ ఆశ్రమః. 9

ప్ర. అ. మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడు, తయోః = వారియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, ప్రహస్య = నవ్వి, అబ్రవీత్ = పలి

కెను, పూర్వే = పూర్వకాలమునందు, అయమ్ ఆశ్రమః = ఈ ఆశ్రమము, యస్య = ఎవనిదో, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. వారి మాటలు విని, విశ్వామిత్రుడు నవ్వి, పూర్వము ఈ ఆశ్రమమెవ్వరిదో చెప్పెదను, వినుడు" అని పలికెను. 9

మూ. కన్దర్పో మూర్తిమానాసీత్ కామ ఇత్యుచ్యతే బుధైః,
తపస్యన్తమిహ స్థాణుం నియమేన సమాహితమ్. 10

కృతోద్వాహం తు దేవేశం గచ్ఛన్తం సమరుద్గణమ్,
ధర్షయామాస దుర్మేధా హుంకృతశ్చ మహాత్మనా. 11

ప్ర. అ. కన్దర్పః = మన్మథుడు, మూర్తిమాన్ = దేహముకలవాడై, ఆసీత్ = ఉండెను. బుధైః = పండితులచేత, కామః ఇతి = కాముడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు. దుర్మేధాః = చెడ్డ బుద్ధి గల ఆ మన్మథుడు, ఇహ = ఇచట, తపస్యన్తమ్ = తపస్సుచేయుచున్నవాడును, నియమేన = నియమముచే, సమాహితమ్ = ఏకాగ్రచిత్తుడై ఉన్నవాడును, కృతోద్వాహమ్ = చేయబడిన వివాహము కలవాడై, సమరుద్గణమ్ = దేవతాసమూహసమేతముగా, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్నవాడును, దేవేశమ్ = దేవతాప్రభువును అగు, స్థాణుమ్ = శివుని, ధర్షయామాస = ఎదిరించెను. మహాత్మనా = మహాత్ముడైన ఆ శివునిచేత, హుంకృతశ్చ = హుంకరించబడెను.

తా. మన్మథుడు మూర్తిమంతుడై ఉండెడివాడు. ఆతనికి కాముడని పేరు. నియమముచే సమాహితచిత్తుడై ఇచట తపస్సు చేయుచున్నవాడును, వివాహము చేసికొని దేవతాసమేతుడై వెళ్లుచున్నవాడును, సకలదేవతలకు ప్రభువును అగు శివుని, దుష్టబుద్ధి యగు ఆ మన్మథుడు ఎదిరించెను. అపుడు శివుడు హుంకరించి కోపముగా చూచెను. 10, 11

వి. మన్మథుడు శివుని తపస్సు చేయుచుండగా ఎదిరించినాడు కాని వివాహము చేసికొని దేవతలతో కలిసి వెళ్లుచున్నప్పుడు కాదు. అందుచేత "కృతోద్వాహమ్" ఇత్యాదిపాదమునకు "వివాహము చేసికొనబోవువాడును, దేవతాగణ

ముతో కలిసి వెళ్లబోవువాడును" అని కొందరు వ్యాఖ్యానము వ్రాసిరి. కాని ఇచట నున్న పదములకు ఆ అర్థము రాదు. మరికొందరు లేని పోని అర్థాలు కల్పించి "ప్రాణవాయువును నిగ్రహించి తపస్సు చేయుచున్నవాడు" అని మరొక అర్థము చెప్పి ఉన్నారు. అది అంతకంటె అసంగతము. ఇట్టి అర్థములు చెప్పుట వాల్మీకి హృదయమును గ్రహించుటకాదు. మన హృదయమును చూపుటమాత్రమే అగును. శివుడు హిమాచలముపై తపస్సు చేయుచుండగా మన్మథుడు తపో విఘ్నము చేయ నెంచినా డని పురాణాంతరప్రసిద్ధము. ఇచట అంగదేశములో శివుడు తపస్సు చేసినట్లు వర్ణింపబడినది. ఈ విరోధము ఉండనే ఉన్నది. దీనికి సమాధానముగా కల్పాంతరములో అట్లు జరిగే ఉండవచ్చును అని ఒక వ్యాఖ్యాత వ్రాసినాడు. వాస్తవమున అన్ని కల్పములందును రామాయణ భారతపురాణ కథలు అనేకపర్యాయములు జరిగిన వని చెప్పు వాదము అర్థరహితము. అప్పుడు శాస్త్ర పురుషకారములకు వైయర్థ్య మాపాదించినట్లగును. అన్ని కల్పాలలోను జగ త్సృష్టి ఒకే విధముగ జరుగు పక్షమున ఈ పాపపుణ్యాదిచింత ఎందులకు ? ఈ పురుషకారప్రబోధ మెందులకు ? ఒక సినెమాను అనేకపర్యాయములు చూపినట్లు ఈ జగత్ప్రవృత్తి అని కదా ఈ వాదములోని ఆశయము. కృత్వాచింతచే ఈ వాదమును అంగీకరించినను అన్ని కల్పాలలోను శివుడు ఒకే చోట తపస్సు చేయవలెను. అన్నియు ఒకే విధముగా జరుగవలెను. ఈ మార్పులు ఎట్లు వచ్చును ? అందుచేత ఈ శ్లోకమున అక్షరార్థ మెట్లు ఉన్నదో అట్లే చెప్పుకొన వలెను. రామాయణము ప్రకారము—శివుడు ఈ ప్రాంతములో తపస్సు చేసె ననియు, వివాహము చేసికొనిన పిమ్మట దేవతలతో కలిసి వెళ్లుచుండగా మన్మథుడు బహుశా తన ప్రభావముచేతనే శివుడు వివాహము చేసికొనె నని బీరములు పలుకగా అతనిని శివుడు భస్మము చేసె ననియు చెప్పవలెను. గ్రంథము ఎట్లున్నదో అట్లు వ్యాఖ్య వ్రాయుట ఉచితము. అతి ప్రాచీనములై, చాలకాలము శ్రుతాను శ్రవికముగ వచ్చు రామాయణాదిగ్రంథములలో పాఠకాదుల ప్రమాదముచే అనేక నూత్నశ్లోకపాదాదులు ప్రవేశించుటతో సమన్వయము కుదరకపోవచ్చును. పూర్వదేశరామాయణాదులలో సర్గసంఖ్యాకాండవిభాగాదులే మారిపోయినవి కదా ! అందుచే శ్రమపడి గ్రంథార్థమును మార్చుట అనావశ్యకము. ఆ సమన్వయ మేదైన ఉన్నచో అది గ్రంథమునకు బైట చెప్పుకొనవచ్చును. వాస్తవమున "కృతోద్వా హమ్" ఇత్యాదిపాదము ప్రక్షిప్తమని అంగీకరించినచో అర్థము చక్కగ కుదురును.

మూ. అవదగ్ధస్య రౌద్రేణ చక్షుషా రఘునన్దన,
వ్యశీర్యన్త శరీరాత్స్వాత్సర్వగాత్రాణి దుర్మతేః. 12

ప్ర. అ. రఘునన్దన = ఓ రామా ! రౌద్రేణ = రుద్రునికి సంబంధించిన, చక్షుషా = నేత్రముచే, అవదగ్ధస్య = కాల్చివేయబడిన, దుర్మతేః = దుర్మతి యైన మన్మథునియొక్క, స్వాత్ = తనయొక్క, శరీరాత్ = శరీరమునుండి, సర్వ గాత్రాణి = అన్ని అవయవములును, వ్యశీర్యన్త = రాలిపోయినవి.

తా. శివుని నేత్రముచే కాల్చివేయబడిన ఆ దుర్మతి అవయవము లన్నియు ఆతని శరీరమునుండి జారిపోయినవి. 12

మూ. తస్య గాత్రం హతం తత్ర నిర్దగ్ధస్య మహాత్మనా,
అశరీరః కృతః కామః క్రోధాద్దేవేశ్వరేణ హి. 13

ప్ర. అ. మహాత్మనా = మహాత్ము డైన శివునిచేత, నిర్దగ్ధస్య=కాల్చివేయ బడిన, తస్య = ఆతనియొక్క, గాత్రమ్ = శరీరము, తత్ర = అచట, హతమ్ = నశించిపోయినది. దేవేశ్వరేణ = ఆ దేవతాధీశునిచేత, క్రోధాత్ = కోపమువలన, కామః = మన్మథుడు, అశరీరః = శరీరము లేనివాడుగా, కృతః = చేయ బడినాడు.

తా. శివునిచే కాల్చివేయబడిన మన్మథుని శరీరము నశించినది. ఈ విధముగ శివుడు కోపించి మన్మథుని శరీరము లేనివానినిగా చేసెను. 13

మూ. అనఙ్గ ఇతి విఖ్యాత స్తదాప్రభృతి రాఘవ,
స చాఙ్గవిషయః శ్రీమాన్ యత్రాఙ్గం ప్రముమోచ హ. 14

ప్ర. అ. రాఘవ = ఓ రామా ! తదాప్రభృతి = అది మొదలు, అనఙ్గః ఇతి = అనంగుడు (శరీరములేనివాడు) అని, విఖ్యాతః = ప్రసిద్ధు డయ్యెను. యత్ర = ఎచట, అఙ్గమ్ = శరీరమును, ప్రముమోచ హ = విడచెనో, సః చ = ఆ దేశము, శ్రీమాన్ = శ్రీయుత మైన, అఙ్గవిషయః = అంగదేశము అని, విఖ్యాతః = ప్రసిద్ధ మైనది.

తా. అది మొదలు మన్మథునికి అనంగు డని ప్రసిద్ధి వచ్చినది. ఆతడు దేహమును (అంగమును) విడచిన దేశమునకు అంగదేశ మని పేరు వచ్చినది. 14

మూ. తస్యాయమాశ్రమః పుణ్య స్తస్యేమే మునయః పురా,
శిష్యా ధర్మపరా నిత్యం తేషాం పాపం న విద్యతే. 15

ప్ర. అ. అయమ్ = ఇది, తస్య = ఆ శివునియొక్క, పుణ్యః = పుణ్యమైన, ఆశ్రమః = ఆశ్రమము. పురా = పూర్వము, తస్య = ఆ శివునియొక్క, శిష్యాః = శిష్యు లైన, ఇమే = ఈ, మునయః = మునులు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ధర్మపరాః = ధర్మపరాయణులు. తేషామ్ = వారికి, పాపమ్ = పాపము, న విద్యతే = లేదు.

తా. ఇది శివుడు తపస్సు చేసిన పుణ్య మైన ఆశ్రమము. ఈ మును లందరును పూర్వము. అనగా శివుడు ఇచట నున్నపుడు, ఆ శివుని శిష్యులుగా నుండెడివారు. నిత్యము ధర్మపరాయణులు. వీరికి పాపము అనునది లేదు. 15

వి. "తస్య కామస్య స్థాణోర్వా" — అనగా మన్మథునియొక్క లేదా స్థాణువు యొక్క ఆశ్రమము. "పురా పూర్వకాలమారభ్య" = పూర్వకాలమునుండియు, వీరు "సంతానపరమ్పరయా శిష్యాః" -- సంతానపరంపరాక్రమమున శిష్యులు. ప్రత్యక్షముగ శిష్యులు కారు. చాల కాలమునకు పూర్వము వీరి పూర్వపురుషులు ఆయనకు శిష్యులు. "అత ఏవ ధర్మపరాః" —అనగా వారి పూర్వపురుషులనుంచి వీరు ఇంత దూర మైనారు గాన ధర్మపరులు. "అత ఏవ పాపం తేషాం న విద్యతే. పూర్వం రుద్రశిష్యా అపి సంప్రతి తచ్ఛిష్యత్వకృతం పాపం న విద్యతే ఇత్యర్థః" —కావుననే వారిలో పాపము లేదు. అనగా పూర్వము వీరి ప్రాచీను లెవరో రుద్రునకు శిష్యులైనను, ఇపుడు వీరికి రుద్రులకు శిష్యు లగుటవలన కలుగు పాపము లేదు అనియర్థము." ఇది గోవిందరాజులు విశదీకరించిన వాల్మీకి భావము : మన్మథుని ఆశ్రమము కావున ఇది పుణ్యాశ్రమము కావచ్చును కాని స్థాణువు ఆశ్రమమునకు పుణ్యత్వ మేమిటి అని మొదట 'తస్య' అనగా 'కామస్య' అని వ్యాఖ్యానించినారు. తప్పనిసరిమీద "స్థాణోర్వా" అన్నారు. 'పురా శిష్యాః' 'ధర్మపరాః' "తేషాం పాపం న విద్యతే" అను పదాలకు వారు చెప్పిన అర్థము స్పష్టమే. పురాణమిత్యేవ న సాధు సర్వమ్" అనే దృష్టితో ప్రాచీన మైనంత మాత్రాన ప్రమాణము లని

మనవారు భావించు వ్యాఖ్యానాలు ఎట్లున్నవో చూపుటకై అప్రస్తుతప్రసంగము చేయవలసివచ్చినది.

మూ. ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన,
పుణ్యయోః సరితోర్మధ్యే శ్వస్తరిష్యామహే వయమ్. 16

ప్ర. అ. శుభదర్శన = శుభకరమైన దర్శనము గల, రామ=రాముడా! వయమ్ = మనము, అద్య = ఈనాడు, రజనీమ్ = రాత్రి, ఇహ = ఇచట, పుణ్యయోః = పుణ్యము లైన, సరితోః = నదులయొక్క, మధ్యే = మధ్యమందు, వసేమ = నివసించెదము. శ్వః = రేపు, తరిష్యామహే = దాటెదము.

తా. శుభకరదర్శనుడ వైన ఓ రామా! ఈ రాత్రి, పవిత్రములైన గంగా సరయూనదుల మధ్య, ఇచట ఉండి రేపు గంగానదిని దాటెదము. 16

మూ. అభిగచ్ఛామహే సర్వే శుచయః పుణ్యమాశ్రమమ్,
స్నాతాశ్చ కృతజప్యాశ్చ హుతహవ్యా నరోత్తమ. 17

ప్ర. అ. నరోత్తమ = ఓ నరశ్రేష్ఠుడా! సర్వే = మన మందరము, స్నాతాశ్చ=స్నానము చేసినవారమై, కృతజప్యాశ్చ=జపము చేసినవారమై, హుతహవ్యాః = హోమము చేయబడిన హవ్యము కలవారమై, శుచయః = పవిత్రులమై, పుణ్యమ్=పుణ్యమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అభిగచ్ఛామహే = ప్రవేశించెదము.

తా. ఓ నరోత్తమా! మన మందరము స్నానజపహోమాదులు చేసికొని, పరిశుద్ధులమై ఈ పుణ్యాశ్రమమును ప్రవేశింతము. 17

మూ. తేషాం సంవదతాం తత్ర తపోదీర్ఘేణ చక్షుషా,
విజ్ఞాయ పరమప్రీతా మునయో హర్షమాగమన్. 18

ప్ర. అ. తత్ర = అచట, తేషామ్ = వారు, సంవదతామ్=సంభాషించుకొనుచుండగా, మునయః=మునులు, తపోదీర్ఘేణ=తపస్సుచేత దీర్ఘమైన, చక్షుషా= నేత్రముచే, విజ్ఞాయ = తెలిసికొని, పరమప్రీతాః = మిక్కిలి సంతసించినవారై, హర్షమ్ = ఆనందమును, ఆగమన్ = పొందిరి.

తా. రామలక్ష్మణవిశ్వామిత్రులు మాటలాడుచుండగా, ఆ ఆశ్రమములోని మునులు తపస్సుచే ఎంత దూర మైనను ప్రసరించు దృష్టిచే (జ్ఞానముచే) తెలిసికొని, చాల సంతసించినవారై, ఆనందము పొందిరి. 18

మూ. అర్ఘ్యం పాద్యం తథాతిథ్యం నివేద్య కుశికాత్మజే,
రామలక్ష్మణయోః పశ్చాదకుర్వన్నతిథిక్రియామ్. 19

ప్ర. అ. అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, పాద్యమ్ = పాదోదకమును, తథా = మరియు, ఆతిథ్యమ్ = అతిథిసత్కారమును, కుశికాత్మజే = విశ్వామిత్రునియందు, నివేద్య = సమర్పించి, పశ్చాత్ = పిమ్మట, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులకు, అతిథిక్రియామ్ = అతిథిసత్కారమును, అకుర్వన్ = చేసిరి.

తా. వారు ముందుగా విశ్వామిత్రునకు అర్ఘ్యపాద్యములను, ఆతిథ్యమును సమర్పించి, పిమ్మట రామలక్ష్మణులకు అతిథిసత్కారము చేసిరి. 19

మూ. సత్కారం సమనుప్రాప్య కథాభిరభిరఞ్జయన్,
యథార్హమజపన్ సన్ధ్యామృషయస్తే సమాహితాః. 20

ప్ర. అ. సత్కారమ్ = సత్కారమును, సమనుప్రాప్య = పొంది, కథాభిః = కథలచేత, అభిరఞ్జయన్ = ఆనందింపచేసిరి. తే ఋషయః = ఆ ఋషులు, సమాహితాః = సావధానచిత్తము కలవారై, యథార్హమ్ = తగు విధమున, సన్ధ్యామ్ = సంధ్యను, అజపన్ = జపించిరి.

తా. రామలక్ష్మణవిశ్వామిత్రులు వారినుండి సత్కారములు గైకొని కథలచే ఆనందింపచేసిరి. పిదప ఆ ఋషు లందరును ఏకాగ్రచిత్తులై, తగు విధమున సంధ్యోపాసన చేసిరి. 20

మూ. తత్ర వాసిభిరానీతా మునిభిః సువ్రతైః సహ,
న్యవసన్ సుసుఖం తత్ర కామాశ్రమపదే తదా. 21

ప్ర. అ. తత్ర = అచట, వాసిభిః = నివసించు, సువ్రతైః = ఉత్తమవ్రతముగల, మునిభిః = మునులచే, సహ = తమతో కూడ, ఆనీతాః = తీసికొని

వెళ్లబడినవారై, తదా = అప్పుడు, తత్ర = ఆ, కామాశ్రమపదే = కామాశ్రమము నందు, సుసుఖమ్ = చాలసుఖముగా, న్యవసన్ = నివసించిరి.

తా. ఆ ఆశ్రమములో నివసించు సువ్రతు లగు మునులు రామలక్ష్మణ విశ్వామిత్రులను తమతో ఆశ్రమములోనికి తీసికొనివెళ్లిరి. వారు అచట సుఖముగా నివసించిరి. 21

మూ. కథాభిరభిరామాభిరభిరామౌ నృపాత్మజౌ,
రమయామాస ధర్మాత్మా కౌశికో మునిపుఙ్గవః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రయోవింశః సర్గః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడును, మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడును అగు, కౌశికః = విశ్వామిత్రుడు, అభిరామౌ = మనోహరులైన, నృపాత్మజౌ = రాజకుమారులను, అభిరామాభిః = మనోహరములైన, కథాభిః = కథలచేత, రమయామాస = ఆనందింపచేసెను.

తా. విశ్వామిత్రమహాముని, మనోహరు లగు ఆ రాజకుమారులకు మనోహరము లగు కథలు చెప్పుచు ఆనందింపచేసెను. 22

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో
ఇరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుర్వింశః సర్గః

మూ. తతః ప్రభాతే విమలే కృతాహ్నికమరిన్దమౌ,
విశ్వామిత్రం పురస్కృత్య నద్యాస్తీరముపాగతౌ. 1

ప్ర. అ. తతః = పిమ్మట, అరిన్దమౌ = శత్రుసంహారకు లైన, ఆ రామ లక్ష్మణులు, విమలే = పరిశుద్ధ మైన, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, కృతాహ్నికమ్ = చేయబడిన ఆహ్నికక్రియలు గల, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, నద్యాః = గంగానదియొక్క, తీరమ్ = తీరమును, ఉపాగతౌ = చేరిరి.

తా. శత్రుమర్దను లగు ఆ రామలక్ష్మణులు, పవిత్ర మైన ప్రాతః కాలమునందు ప్రాతఃకాలకృత్యములు తీర్చుకొని ప్రయాణమునకు సిద్ధముగా ఉన్న విశ్వామిత్రుడు బయలుదేరి ముందు నడవగా గంగానదీతీరము చేరిరి. 1

మూ. తే చ సర్వే మహాత్మానో మునయః సంశితవ్రతాః,
ఉపస్థాప్య శుభాం నావం విశ్వామిత్రమథాబ్రువన్. 2

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములును, సంశితవ్రతాః = తీవ్రమైన తపశ్చర్య కలవారును అగు, తే = ఆ, సర్వే = సమస్త మైన, మునయః = మునులు, శుభామ్ = శుభకర మైన, నావమ్ = నావను, ఉపస్థాప్య = తీసికొనివచ్చి, అథ = అటుపిమ్మట, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రునిగూర్చి, అబ్రువన్ = పలికిరి.

తా. తీవ్రతపశ్చర్య గల మహాత్ము లైన ఆ ముని లందరును మంగళకర మైన నావనొకదానిని తీసికొని వచ్చి విశ్వామిత్రునితో ఇట్లనిరి. 2

మూ. ఆరోహతు భవాన్నావం రాజపుత్రపురస్కృతః,
అరిష్టం గచ్ఛ పన్థానం మా భూత్కాలవిపర్యయః. 3

ప్ర. అ. భవాన్ = నీవు, రాజపుత్రపురస్కృతః = రాజపుత్రులచే ముందు ఉంచుకొనబడినవాడవై, నావమ్ = నావను, ఆరోహతు = ఎక్కెదవు

గాక. అరిష్టమ్ = శుభము కలుగు నట్లుగా, పన్థానమ్ = మార్గమును, గచ్ఛ = పొందుము. కాలవిపర్యయః = కాలమునందు మార్పు, మా భూత్=కాకపోవుగాక.

తా. రామలక్ష్మణులను వెంటబెట్టుకొని నీవు నావను అధిరోహింపుము. శుభముగా కాలవిలంబము జరుగకుండగా, ప్రయాణము చేయుము. 3

మూ. విశ్వామిత్ర స్తథేత్యుక్త్వా తానృషీనభిపూజ్య చ,
తతార సహితస్తాభ్యాం సరితం సాగరంగమామ్. 4

ప్ర. అ. విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, తథేతి="అటులనే" అని, ఉక్త్వా= పలికి, తాన్ = ఆ, ఋషీన్ = ఋషులను, అభిపూజ్య చ=పూజించి, తాభ్యామ్= రామలక్ష్మణులతో, సహితః = కూడినవాడై, సాగరంగమామ్=సముద్రములోనికి ప్రవహించు, సరితమ్ = నదిని, తతార = దాటెను.

తా. విశ్వామిత్రుడు 'అలాగే' అని చెప్పి, ఆ ఋషీశ్వరులను పూజించి, రామలక్ష్మణులతో గంగానదిని దాటెను. 4

మూ. తతః శుశ్రావ వై శబ్దమతిసంరమ్భవర్ధితమ్,
మధ్యమాగమ్య తోయస్య సహ రామః కనీయసా. 5

ప్ర. అ. తతః = పిమ్మట, రామః = రాముడు, తోయస్య=జలముయొక్క, మధ్యమ్ = మధ్యమును, ఆగమ్య = పొంది, అతిసంరమ్భవర్ధితమ్ = మిక్కిలి వేగముచే వృద్ధి పొందింపబడిన, శబ్దమ్=శబ్దమును, కనీయసా సహ=తమ్మునితో కూడ, శుశ్రావ = వినెను.

తా. నదీమధ్యమును చేరిన పిమ్మట రామలక్ష్మణులు, మిక్కిలి వేగముచే వృద్ధిపొందింపబడిన ఒక శబ్దమును వినిరి. 5

మూ. అథ రామః సరిన్మధ్యే పప్రచ్ఛ మునిపుఙ్గవమ్,
వారిణో భిద్యమానస్య కిమయం తుములో ధ్వనిః. 6

ప్ర. అ. అథ = పిమ్మట, రామః = రాముడు, సరిన్మధ్యే = నదీమధ్యమునందు, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠుని, పప్రచ్ఛ = ప్రశ్నించెను. భిద్యమానస్య=

భేదింపబడుచున్న, వారిణః = ఉదకముయొక్క, అయమ్ = ఈ, తుములః = వ్యాకులమైన, ధ్వనిః = ధ్వని, కిమ్ = ఏమి?

తా. నదీమధ్యమున రాముడు "నీరు బ్రద్ద లగుచున్నట్లు గంభీర మైన ధ్వని వచ్చుచున్నది; ఇది ఏమి?" అని విశ్వామిత్రుని ప్రశ్నించెను. 6

మూ. రాఘవస్య వచః శ్రుత్వా కౌతూహలసమన్వితః (తమ్),
కథయామాస ధర్మాత్మా తస్య శబ్దస్య నిశ్చయమ్. 7

ప్ర. అ. కౌతూహలసమన్వితమ్=వేడుకతో కూడిన, రాఘవస్య=రాముని యొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, ధర్మాత్మా = ఆ ధర్మాత్ముడు, తస్య శబ్దస్య = ఆ శబ్దమునకు సంబంధించిన, నిశ్చయమ్ = తత్త్వమును, కథయామాస = చెప్పెను.

తా. వేడుకతో కూడిన రామవాక్యమును విని విశ్వామిత్రుడు ఆ శబ్దము యొక్క తత్త్వమును విశదీకరించెను. 7

మూ. కైలాసపర్వతే రామ మనసా నిర్మితం సరః,
బ్రహ్మణా నరశార్దూల తేనేదం మానసం సరః. 8

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా! రామ = రాముడా, కైలాసపర్వతే= కైలాసపర్వతమునందు, బ్రహ్మణా = బ్రహ్మదేవునిచేత, సరః = సరస్సు, మనసా = మనస్సుచే, నిర్మితమ్ = నిర్మింపబడినది. తేన=ఆకారణముచేత, ఇదం సరః = ఈసరస్సు, మానసమ్ = మానస మనిచెప్పబడుచున్నది. 8

తా. రామా! బ్రహ్మదేవుడు కైలాసపర్వతముపై, తన మనఃసంకల్ప మాత్రముచే ఒక సరస్సును నిర్మించెను. మనస్సుచే నిర్మింపబడుటచే దానికి మానస మని పేరు.

మూ. తస్మాత్సుస్రావ సరసః సాయోధ్యాముపగూహతే,
సరఃప్రవృత్తా సరయూః పుణ్యా బ్రహ్మసరశ్చ్యుతా. 9

ప్ర. అ. (యా = ఏ నది), తస్మాత్ = ఆ, సరసః = సరస్సునుండి, సుస్రావ=ప్రవహించినదో, సా = ఆ నది, అయోధ్యామ్=అయోధ్యాపట్టణమును,

ఉపగూహతే = చుట్టుకొనియున్నది. సరఃప్రవృత్తా = సరస్సునుండి ప్రవహించిన దగుటచే, సరయూః=సరయూనది అని చెప్పబడుచున్నది. బ్రహ్మసరశ్చ్యుతా= బ్రహ్మయొక్క సరస్సునుండి ప్రవహించుటచేత, పుణ్యా = పుణ్య మైన ఆ నది (ఉత్తరశ్లోకముతో అన్వయము).

తా. ఆ సరస్సునుండి పుట్టుటచే "సరయు" అను పేరు గల నది అయోధ్యను చుట్టి ఉన్నది. బ్రహ్మ సృజించిన మానససరస్సునుండి జనించిన దగుటచే చాల పవిత్ర మైన ఆ నది— 9

మూ. తస్యాయమతులః శబ్దో జాహ్నవీమభివర్తతే,
వారిసంక్షోభజో రామ ప్రణామం నియతః కురు. 10

ప్ర. అ. జాహ్నవీమ్ = గంగను, అభివర్తతే = ప్రవేశించుచున్నది. అయమ్ = ఈ, అతులః = గొప్ప, శబ్దః = శబ్దము, తస్యాః = ఆ నదియొక్క, వారిసంక్షోభజః = జలముయొక్క సంక్షోభమువలన కలిగినది. రామ = రామా! నియతః = భక్తికలవాడవై, ప్రణామమ్ = నమస్కారమును, కురు = చేయుము.

తా. గంగలో ప్రవేశించుచున్నది. ఈ గంభీరధ్వని జలసంక్షోభము వలన కలిగినది. రామా! శ్రద్ధాభక్తియుక్తుడవై ఈ నదీద్వయసంగమమునకు నమస్కారము చేయుము. 10

మూ. తాభ్యాం తు తావుభౌ కృత్వా ప్రణామమతిధార్మికౌ,
తీరం దక్షిణమాసాద్య జగ్మతుర్లఘువిక్రమౌ. 11

ప్ర. అ. అతిధార్మికౌ = మిక్కిలిధార్మికు లైన, తౌ ఉభౌ = వారిరువురును, తాభ్యామ్ = ఆ నదులకు, ప్రణామమ్ = నమస్కారము, కృత్వా = చేసి, దక్షిణం తీరమ్ = దక్షిణతీరమును, ఆసాద్య = పొంది, లఘువిక్రమౌ = శీఘ్రముగ నడచుచున్నవారై, జగ్మతుః = వెళ్లిరి.

తా. అతిధార్మికు లైన ఆ రామలక్ష్మణులు ఆ రెండు నదులకును నమస్కారము చేసిరి. గంగానది దక్షిణతీరమును చేరి శీఘ్రగమనముతో ప్రయాణము చేసిరి. 11

మూ. స వనం ఘోరసంకాశం దృష్ట్వా నృపవరాత్మజః,
అవిప్రహతమైక్ష్వాకః పప్రచ్ఛమునిపుఙ్గవమ్. 12

ప్ర. అ. ఐక్ష్వాకః = ఇక్ష్వాకువంశమునందు పుట్టిన, నృపవరాత్మజః = రాజశ్రేష్ఠుని కుమారు డైన, సః = ఆతడు, ఘోరసంకాశమ్ = భయంకరమైన దియు, అవిప్రహతమ్ = త్రొక్కబడనిదియు అగు, వనమ్ = అరణ్యమును, దృష్ట్వా = చూచి, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠుని, పప్రచ్ఛ = అడిగెను.

తా. రాము డచట మానవ సంచారము లేని, భయంకర మైన ఒక అరణ్యమును చూచి విశ్వామిత్రుని ప్రశ్నించెను. 12

మూ. అహో వనమిదం దుర్గం ఝిల్లికాగణనాదితమ్,
భైరవైః శ్వాపదైః పూర్ణం శకునైర్దారుణారుతైః. 13

ప్ర. అ. ఝిల్లికాగణనాదితమ్ = ఈల పురుగుల సముదాయముచేత ధ్వనింపచేయబడినదియు, భైరవైః = భయంకరము లైన, శ్వాపదైః = ఘాతుకమృగములతోను, దారుణారుతైః = భయంకర మైన కూతలు గల, శకునైః = భాసపక్షులతోను, పూర్ణమ్ = నిండి యున్న, ఇదమ్ = ఈ, వనమ్ = వనము, దుర్గమ్ = ప్రవేశింపశక్యము కాక ఉన్నది. అహో = ఏమి ఆశ్చర్యము.

తా. ఓహో ! ఈ వనము ప్రవేశింప శక్యము కాక ఉన్నది. ఈల పురుగుల రొజచే ధ్వనింపచేయబడినది. భయంకరము లైన ఘాతుకమృగములతోను, భయమును కలిగించు నట్లు కూయుచున్న భాసపక్షులలోను నిండి యున్నది. 13

మూ. నానాప్రకారైః శకునైర్వాశ్యద్భిర్భైరవస్వనైః,
సింహవ్యాఘ్రవరాహైశ్చ వారణైశ్చోపశోభితమ్. 14

ప్ర. అ. వాశ్యద్భిః = కూయుచున్న, భైరవస్వనైః = భయంకర మైన ధ్వనులు గల, నానాప్రకారైః = అనేకవిధము లైన, శకునైః = పక్షులచేతను, సింహవ్యాఘ్రవరాహైః చ = సింహ-వ్యాఘ్ర-వరాహములచేతను, వారణైః చ = గజములచేతను, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడినది.

తా. ఈ వనమున అతిభయంకర మైన స్వరములతో కూయుచున్న అనేకవిధము లైన పక్షులు, సింహములు, పెద్దపులులు, అడవిపందులు, ఏనుగులు సంచరించుచున్నవి. 14

మూ. ధవాశ్వకర్ణకకుభై ర్బిల్వతిన్దుకపాటలైః,
సంకీర్ణం బదరీభిశ్చ కిం న్వేతద్దారుణం వనమ్. 15

ప్ర. అ. ధవాశ్వకర్ణకకుభైః = చండ్ర ఇనుమద్ది ఏరుమద్ది చెట్లచేతను, బిల్వతిన్దుకపాటలైః = మారేడు తుమ్మికి కలిగొట్టు చెట్లచేతను, బదరీభిశ్చ = రేగు చెట్లచేతను, సంకీర్ణమ్ = వ్యాకులమై యున్నది. ఏతత్ = ఈ, దారుణమ్ = భయంకర మైన, వనమ్ = వనము, కిం ను = ఏది ?

తా. ఈ వనము చండ్ర, ఇనుమద్ది, ఏరుమద్ది, మారేడు, తుమ్మికి, కలిగొట్టు, రేగుచెట్లతో దట్టముగ నున్నది. ఈ భయంకర మైన వనము ఏమి ? 15

మూ. తమువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః,
శ్రూయతాం వత్స కాకుత్స్థ యస్యైతద్దారుణం వనమ్. 16

ప్ర. అ. మహాతేజాః = మహాతేజస్సు గల, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను. వత్స = వత్సా, కాకుత్స్థ = రామా, ఏతత్ = ఈ, దారుణమ్ = భయంకర మైన, వనమ్ = వనము, యస్య = ఎవనిదో, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. మహాతేజశ్శాలి యైన విశ్వామిత్రమహాముని రామునితో — "వత్సా ! రామా ! భయంకర మైన ఈ వనము ఎవ్వరిదో చెప్పెదను; వినుము" అని పలికెను. 16

మూ. ఏతౌ జనపదౌ స్ఫీతౌ పూర్వమాస్తాం నరోత్తమ,
మలదాశ్చ కరూశాశ్చ దేవనిర్మాణనిర్మితౌ. 17

ప్ర. అ. నరోత్తమ = ఓ నరశ్రేష్ఠుడా ! పూర్వమ్ = పూర్వము, దేవనిర్మాణనిర్మితౌ = దేవతల నిర్మాణముచేత నిర్మితము లైన, మలదాః చ = మలదము,

**కరూశాః చ** = కరూశము అనెడు, **స్ఫీతౌ** = విశాలము లైన, **ఏతౌ** = ఈ, **జన పదౌ** = దేశములు, **ఆస్తామ్** = ఉండెడివి.

**తా.** రామా! పూర్వము దేవతలు నిర్మించిన మలదము, కరూశము అనెడు రెండు విశాలము లైన, సమృద్ధము లైన దేశములు ఈ ప్రాంతమునందు ఉండెడివి. 17

మూ. పురా వృత్రవధే రామ మలేన సమభిప్లుతమ్,
క్షుధా చైవ సహస్రాక్షం బ్రహ్మహత్యా సమావిశత్. 18

ప్ర. అ. **రామ** = ఓరామా! **పురా** = పూర్వము, **వృత్రవధే** = వృత్రాసురుని చంపినపుడు, **మలేన** = అశుచిత్వముచేతను, **క్షుధా చైవ** = ఆకలిచేతను, **సమభిప్లుతమ్** = నిండిన, **సహస్రాక్షమ్** = దేవేంద్రుని, **బ్రహ్మహత్యా** = బ్రహ్మహత్యా పాపము, **సమావిశత్** = ప్రవేశించెను.

**తా.** రామా! పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని చంపుటచే అతనిని బ్రహ్మహత్యాపాపము ఆవహించెను. అపు డాతనిని అశుచిత్వము, ఆకలి పీడింప దొడగినవి. 18

మూ. తమిన్ద్రం స్నాపయన్ దేవా ఋషయశ్చ తపోధనాః,
కలశైః స్నాపయామాసుర్మలం చాస్య ప్రమోచయన్. 19

ప్ర. అ. **తమ్** = ఆ, **ఇన్ద్రమ్** = ఇంద్రుని, **దేవాః** = దేవతలు, **స్నాపయన్** = స్నానము చేయించిరి. **తపోధనాః** = తపస్సే ధనముగా గల, **ఋషయశ్చ** = ఋషులును, **కలశైః** = కలశములచేత, **స్నాపయామాసుః** = స్నానము చేయించిరి. **అస్య** = ఇతనియొక్క, **మలమ్** = అశుచిత్వమును, **ప్రమోచయన్** = తొలగింపచేసిరి.

**తా.** దేవతలును, తపశ్శాలు లగు మహర్షులును ఆ ఇంద్రుని తీర్థోదకముల చేతను, కలశములతో అభిమంత్రితము లైన ఉదకములచేతను, స్నానము చేయించి ఆతని అశుచిత్వమును తొలగించిరి. 19

మూ. ఇహ భూమ్యాం మలం దత్త్వా దత్త్వా కారూశమేవ చ
శరీరజం మహేన్ద్రస్య తతో హర్షం ప్రపేదిరే. 20

ప్ర. అ. మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, శరీరజమ్ = శరీరము నుండి పుట్టిన, మలమ్ = అశుచిత్వమును, ఇహ = ఈ, భూమ్యామ్ = భూమి యందు, దత్వా = ఇచ్చి, కారూశమేవ చ = ఆకలిని కూడ, దత్వా = ఇచ్చి, తతః = పిమ్మట, హర్షమ్ = ఆనందమును, ప్రపేదిరే = పొందిరి.

తా. మహేంద్రుని శరీరమున కున్న అశుచిత్వమును, ఆతని ఆకలిని ఈ ప్రదేశమునకు ఇచ్చివేసి సంతోషించిరి. 20

మూ. నిర్మలో నిష్కరూషశ్చ శుచిరిన్ద్రో యదాఽభవత్,
దదౌ దేశస్య సుప్రీతో వరం ప్రభురనుత్తమమ్. 21

ప్ర. అ. ఇన్ద్రః = ఇంద్రుడు, యదా = ఎపుడు, నిర్మలః = అశుచిత్వము తొలగిపోయినవాడై, నిష్కరూషశ్చ = ఆకలి తొలగిపోయినవాడై, శుచిః = పవిత్రుడు, అభవత్ = ఆయెనో, అప్పుడు, ప్రభుః = సర్వసమర్థుడైన ఆతడు, సుప్రీతః = చాల సంతోషించినవాడై, దేశస్య = ఈ దేశమునకు, అనుత్తమమ్ = చాల ఉత్తమమైన, వరమ్ = వరమును, దదౌ = ఇచ్చెను.

తా. అశుచిత్వము, ఆకలి, తొలగిపోయి శుచియైన పిమ్మట సర్వసమర్థుడగు ఇంద్రుడు ఈ దేశము విషయమున చాల సంతసించినవాడై ఒక వరమిచ్చెను. 21

మూ. ఇమౌ జనపదౌ స్ఫీతౌ ఖ్యాతిం లోకే గమిష్యతః,
మలదాశ్చ కరూశాశ్చ మమాఙ్గమలధారిణౌ. 22

ప్ర. అ. మమ = నా యొక్క, అఙ్గమలధారిణౌ = శరీరమలమును ధరించిన, ఇమౌ = ఈ, జనపదౌ = దేశములు, స్ఫీతౌ = సమృద్ధములైనవై, మలదాశ్చ = మలద మనియు, కరూశాశ్చ = కరూశ మనియు, లోకే = లోకము నందు, ఖ్యాతిమ్ = ప్రసిద్ధిని, గమిష్యతః = పొందగలవు.

తా. నా శరీరమునందలి అశుచిత్వమును ఆకలిని గైకొనిన ఈ దేశములు, సర్వసమృద్ధములై, మలదము, కరూశము అను నామధేయములతో లోకమునందు ఖ్యాతిని పొందగలవు. 22

మూ. సాధు సాధ్వితి తం దేవాః పాకశాసనమబ్రువన్,
దేశస్య పూజాం తాం దృష్ట్వా కృతాం శక్రేణ ధీమతా. 23

ప్ర. అ. ధీమతా=బుద్ధిమంతు డైన, శక్రేణ=దేవేంద్రునిచేత, కృతామ్=చేయబడిన, తామ్=ఆ, దేశస్య=దేశముయొక్క, పూజామ్=పూజను, దృష్ట్వా=చూచి, దేవాః = దేవతలు, సాధు సాధు ఇతి = బాగున్నది బాగున్నది అని, తం పాకశాసనమ్ = ఆ ఇంద్రుని గూర్చి, అబ్రువన్ = పలికిరి.

తా. ధీమంతు డగు దేవేంద్రుడు ఆ దేశమునకు చేసిన గౌరవమును చూచి దేవతలు "బాగున్నది, బాగున్నది" అని అనుచు దేవేంద్రుని మెచ్చుకొనిరి. 23

మూ. ఏతౌ జనపదౌ స్ఫీతౌ దీర్ఘకాలమరిన్దమ,
మలదాశ్చ కరూశాశ్చ ముదితౌ ధనధాన్యతః. 24

ప్ర. అ. అరిన్దమ = ఓ శత్రుసంహారకుడా! మలదాశ్చ = మలదము, కరూశాశ్చ = కరూశము అనెడు, స్ఫీతౌ = విశాలము లైన, ఏతౌ = ఈ, జనపదౌ = దేశములు, దీర్ఘకాలం=చాలకాలము, ధనధాన్యతః = ధనధాన్యములతో, ముదితౌ = ఆనందముకలవై ఉండెడివి.

తా. రామా! విశాలము లైన ఈ మలదకరూశదేశములు చాల కాలము ధనధాన్యసమృద్ధములై ఉండెడివి. 24

మూ. కస్య చిత్త్వథ కాలస్య యక్షీ వై కామరూపిణీ,
బలం నాగసహస్రస్య ధారయన్తీ తదా హ్యభూత్. 25

తాటకా నామ భద్రం తే భార్యా సున్దస్య ధీమతః,
మారీచో రాక్షసః పుత్రో యస్యాః శక్రపరాక్రమః. 26

ప్ర. అ. అథ = పిమ్మట, కస్య చిత్ కాలస్య = కొంత కాలమునకు, తదా=అపుడు, కామరూపిణీ=స్వేచ్ఛాధీన రూపము కలదియు, నాగసహస్రస్య=వేయి ఏనుగుల యొక్క, బలమ్ = బలమును, ధారయన్తీ=ధరించుచున్నదియు, ధీమతః = బుద్ధిమంతుడైన, సున్దస్య = సుందునియొక్క, భార్యా = భార్యయు, శక్రపరాక్రమః = దేవేంద్రులవంటి పరాక్రమము గల, మారీచః = మారీచుడనే

రాక్షసుడు, యస్యాః = ఎవ్వతె యొక్క, పుత్రః = పుత్రుడో, అట్టి, తాటకా నామ = తాటక యనెడు, యక్షీ = యక్షిణి, అభూత్ = ఉండెను, తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక.

తా. కొంత కాలమునకు స్వేచ్ఛారూపధారిణి యగు ఒక యక్షిణి ఆవిర్భవించినది. ఆమెకు వేయి ఏనుగుల బల మున్నది. ఆమె ధీమంతు డైన సుందుని భార్య. ఇంద్రునితో సమాన మైన పరాక్రమము గల మారీచు డనే రాక్షసుడు ఆమె కుమారుడు. నీకు క్షేమ మగుగాక. 25, 26

మూ॥ వృత్తబాహుర్మహావీర్యో విపులాస్యతనుర్మహాన్,
రాక్షసో భైరవాకారో నిత్యం త్రాసయతే ప్రజాః. 27

ప్ర. అ. వృత్తబాహుః = వర్తులాకార మైన బాహువులు కలవాడును, మహావీర్యః = గొప్ప పరాక్రమము కలవాడును, విపులాస్యతనుః = విశాల మైన ముఖము శరీరము కలవాడును, మహాన్ = పెద్ద ప్రమాణము కలవాడును, భైరవాకారః = భయంకర మైన ఆకారము కలవాడును అగు, రాక్షసః = ఆ రాక్షసుడు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రజాః = ప్రజలను, త్రాసయతే = భయపెట్టుచున్నాడు.

తా. ఆ మారీచుని బాహువులు బలిసి ఉన్నవి. అతడు గొప్ప పరాక్రమము కలవాడు. విశాల మైన ముఖము శరీరము కలవాడు. గొప్ప ప్రమాణము కలవాడు. భయంకరాకారుడు. అట్టి మారీచుడు ఎల్లప్పుడును ప్రజలను బాధించుచున్నాడు. 27

మూ. ఇమౌ జనపదౌ నిత్యం వినాశయతి రాఘవ,
మలదాంశ్చ కరూశాంశ్చ తాటకా దుష్టచారిణీ. 28

ప్ర. అ. రాఘవ = రామా! దుష్టచారిణీ = దుష్ట మైన ప్రవృత్తి గల, తాటకా = తాటక, మలదాంశ్చ = మలదము, కరూశాంశ్చ = కరూశము అనెడు, ఇమౌ = ఈ, జనపదౌ = దేశములను, నిత్యమ్ = ఎల్లప్పుడును, వినాశయతి = నశింపచేయుచున్నది.

తా. రామా! దుర్మార్గురా లగు తాటక, నిత్యము, ఈ మలదకరూశదేశము లను నశింపచేయుచున్నది.

మూ. సేయం పన్థానమావృత్య వసత్యధ్యర్ధయోజనే,
అత ఏవ న గన్తవ్యం తాటకాయా వనం యతః. 29

ప్ర. అ. సా = అట్టి, ఇయమ్ = ఈ తాటక, పన్థానమ్ = మార్గమును, ఆవృత్య=అడ్డగించి, అధ్యర్ధయోజనే=ఒకటిన్నర ఆమడల దూరమున, వసతి= నివసించుచున్నది. యతః = ఏ కారణమువలన, తాటకాయాః = తాటకయొక్క, వనమ్ = వనమో, అత ఏవ = ఆ కారణమువలననే, న గన్తవ్యమ్ = వెళ్ల దగినది కాదు.

తా. అట్టి ఈ తాటక మార్గమును అడ్డగించి, ఒకటిన్నర ఆమడల దూరములో నివసించుచున్నది. ఇది తాటకవనము గాన ఈ వనములోనికి ఎవ్వరును పోజాలరు. 29

మూ. స్వబాహుబలమాశ్రిత్య జహీమాం దుష్టచారిణీమ్,
మన్నియోగాదిమం దేశం కురు నిష్కణ్టకం పునః. 30

ప్ర. అ. స్వబాహుబలమ్ = నీ బాహుబలమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, దుష్టచారిణీమ్ = దుర్మార్గురా లైన, ఇమామ్=ఈమెను, జహి = చంపుము. మన్నియోగాత్ = నా యాజ్ఞవలన, ఇమమ్ = ఈ, దేశమ్ = దేశమును, పునః=మరల, నిష్కణ్టకమ్ = బాధలు లేనిదానినిగా, కురు = చేయుము.

తా. నీ బాహుబలముచేత ఈ దుర్మార్గురాలిని వధింపుము. నా ఆజ్ఞను పాలించి ఈ దేశమును, మరల, ఏ బాధలు లేనిదానినిగ చేయుము. 30

మూ. న హి కశ్చిదిమం దేశం శక్నోత్యాగన్తుమీదృశమ్,
యక్షిణ్యా ఘోరయా రామ ఉత్సాదితమసహ్యయా. 31

ప్ర. అ. రామ=ఓ రామా! ఘోరయా=భయంకరురా లైన,అసహ్యయా= ఎదిరింప శక్యము కాని, యక్షిణ్యా = తాటకచేత, ఉత్సాదితమ్ = నశింపచేయ

బడిన, ఈదృశమ్ = ఇట్టి, ఇమమ్=ఈ, దేశమ్=దేశమునుగూర్చి, ఆగన్తుమ్= వచ్చుటకు, కశ్చిత్ = ఎవ్వడును, న శక్నోతి = సమర్థుడు కాడు.

తా. రామా ! ఎవ్వరును ఎదిరింపలేని క్రూరురాలైన తాటకచే ఈ వన మంతయు పాడు పడినట్లు చేయబడినది. ఎవ్వడును ఈ ప్రదేశమునకు రాజాలడు. 31

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం యథైతద్దారుణం వనమ్,
యక్ష్యా చోత్సాదితం సర్వమద్యాపి న నివర్తతే. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే చతుర్వింశస్సర్గః.

ప్ర. అ. ఏతత్ = ఈ, వనమ్ = వనము, సర్వమ్ = అంతయు, దారుణమ్ = భయంకరముగా, యక్ష్యా = తాటకచేత, యథా = ఏ విధముగా, ఉత్సాదితమ్ = పాడుపడి పోవునట్లు చేయబడినదో, అద్యాపి = ఇప్పటికిని, యథా = ఏ విధముగా, న నివర్తతే = మరలిపోకున్నదో, ఏతత్ సర్వమ్ = ఇది అంతయు, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. తాటక ఈ వనమును ఏ విధముగ పాడుబరచి భయంకర మగు నట్లు చేసినదో, ఈ వనము నింకను ఎట్లు విడువకున్నదో అంతయు నీకు చెప్పినాను. 32

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలోని ఇరువది నాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చవింశః సర్గః.

మూ. అథ తస్యాప్రమేయస్య మునేర్వచనముత్తమమ్,
శ్రుత్వా పురుషశార్దూలః ప్రత్యువాచ శుభాం గిరమ్.

ప్ర. అ. అప్రమేయస్య = ఊహింప శక్యము కాని ప్రభావము గల, తస్య మునేః = ఆ మునియొక్క, ఉత్తమమ్ = ఉత్తమ మైన, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, పురుషశార్దూలః = పురుషశ్రేష్ఠుడైన రాముడు, శుభామ్ = శుభ మైన, గిరమ్ = వాక్కును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. అమేయప్రభావు డగు విశ్వామిత్రుని ఉత్తమము లగు మాటలు విని పురుషశ్రేష్ఠు డైన రాముడు శుభ మైన వాక్కు పలికెను. 1

మూ. అల్పవీర్యా యదా యక్షాః శ్రూయన్తే మునిపుఙ్గవ,
కథం నాగసహస్రస్య ధారయత్యబలా బలమ్. 2

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠుడా, యక్షాః=యక్షులు, అల్పవీర్యాః= అల్ప మైన పరాక్రమము కలవారుగా, యదా శ్రూయన్తే = వినబడుచుండగా, అబలా = ఆ స్త్రీ, నాగసహస్రస్య = వేయి ఏనుగులయొక్క, బలమ్ = బలమును, కథమ్ = ఎట్లు, ధారయతి = ధరించుచున్నది ?

తా. ఓ మునిపుంగవా! యక్షులు అల్పపరాక్రమవంతు లని వినుచుందుము కదా— ఈ అబలకు నాగసహస్రబలము ఎట్లు వచ్చినది ? 2

మూ. విశ్వామిత్రోఽబ్రవీద్వాక్యం శృణు యేన బలోత్తరా,
వరదానకృతం వీర్యం ధారయత్యబలా బలమ్. 3

ప్ర. అ. విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను, అబలా=ఆ అబల, యేన=ఏ కారణముచేత, బలోత్తరా= బలముచేత గొప్పదో, శృణు = వినుము, (ఆమె) వరదానకృతమ్ = వరదానము

వలన లభించిన, వీర్యమ్ = పరాక్రమమును, బలమ్ = బలమును, ధారయతి = ధరించుచున్నది.

తా. విశ్వామిత్రుడు ఇట్లు పలికెను— ఆ అబల ఏ కారణముచేత బలమునందు చాల గొప్పదో వినుము. ఆమె వరదానమువలన లభించిన వీర్యమును, బలమును ధరించుచున్నది. 3

మూ. పూర్వమాసీన్మహాయక్షః సుకేతుర్నామ వీర్యవాన్,
అనపత్యః శుభాచారః స చ తేపే మహత్తపః. 4

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, సుకేతుర్నామ=సుకేతు వను పేరు గల, వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, మహాయక్షః = గొప్ప యక్షుడు, ఆసీత్ = ఉండెను, అనపత్యః = సంతానము లేని, సః = అతడు, శుభాచారః = శుభ మైన ఆచారముకలవాడై, మహత్ = గొప్ప, తపః = తపస్సు, తేపే = చేసెను.

తా. పూర్వము సుకేతు వనే పరాక్రమవంతు డగు గొప్ప యక్షు డొకడుండెను. సంతానము లేకపోవుటచే, ఆతడు సదాచారవంతుడై గొప్ప తపస్సు చేసెను. 4

మూ. పితామహస్తు సుప్రీత స్తస్య యక్షపతే స్తదా,
కన్యారత్నం దదౌ రామ తాటకాం నామ నామతః. 5

ప్ర. అ. రామ = రామా, తదా = అపుడు, పితామహః = బ్రహ్మదేవుడు, సుప్రీతః = చాల సంతోషించినవాడై, తస్య = ఆ, యక్షపతేః = యక్షరాజునకు, నామతః = పేరుచే, తాటకాం నామ = తాటక అను ప్రసిద్ధి గల, కన్యారత్నమ్= శ్రేష్ఠ యైన కన్యను, దదౌ = ఇచ్చెను.

తా. రామా ! అపుడు బ్రహ్మదేవుడు ఆతని తపస్సునకు చాల సంతోషించి, ఆ యక్షాధిపతికి తాటక యను కన్యారత్నమును ప్రసాదించెను. 5

మూ. దదౌ నాగసహస్రస్య బలం చాస్యాః పితామహః,
న త్వేవ పుత్రం యక్షాయ దదౌ బ్రహ్మ మహాయశాః. 6

ప్ర. అ. పితామహః=బ్రహ్మదేవుడు, అస్యాః=ఈమెకు, నాగసహస్రస్య= వేయి ఏనుగులయొక్క, బలమ్ = బలమును, దదౌ = ఇచ్చెను, మహాయశాః = గొప్ప కీర్తి గల, బ్రహ్మ=ఆ బ్రహ్మదేవుడు, యక్షాయ=యక్షునకు, పుత్రం తు= పుత్రుని, న దదౌ = ఇవ్వలేదు.

తా. గొప్ప కీర్తి గల బ్రహ్మదేవుడు ఆ తాటకకు వేయి ఏనుగుల బలము ఇచ్చినాడు కాని, ఆ సుకేతునకు పుత్రుని మాత్రము ఇవ్వలేదు. 6

మూ. తాం తు జాతాం వివర్ధన్తీం రూపయౌవనశాలినీమ్,
ఝర్ఝపుత్రాయ సున్దాయ దదౌ భార్యాం యశస్వినీమ్. 7

ప్ర. అ. జాతామ్ = పుట్టినదై, వివర్ధన్తీమ్ = పెరుగుచున్న, రూపయౌవన శాలినీమ్ = రూపయౌవనములతో ప్రకాశించుచున్న, యశస్వినీమ్ = కీర్తిగల, తామ్ = ఆమెను, ఝర్ఝపుత్రాయ = ఝర్ఝునికుమారుడైన, సున్దాయ=సుందునకు, భార్యామ్ = భార్యనుగా, దదౌ = ఇచ్చెను.

తా. సహస్రనాగబలముతో జనించిన ఆ తాటక పెరిగి, రూపయౌవనములతో ప్రకాశించుచుండెను. సుకేతువు, కీర్తిమంతురాలగు ఆమెను ఝర్ఝుని పుత్రుడైన సుందున కిచ్చి వివాహము చేసెను. 7

మూ. కస్యచిత్త్వథ కాలస్య యక్షీ పుత్రమజాయత,
మారీచం నామ దుర్ధర్షం యశ్శాపాద్రాక్షసోఽభవత్. 8

ప్ర. అ. అథ = పిమ్మట, కస్యచిత్ కాలస్య=కొంత కాలమునకు, యక్షీ= తాటక, మారీచం నామ = మారీచు డను పేరు గల, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని, పుత్రమ్ = కుమారుని, అజాయత = కనెను, యః = ఎవడు, శాపాత్ = శాపమువలన, రాక్షసః = రాక్షసుడుగా, అభవత్ = ఆయెనో.

తా. కొంతకాలమునకు ఆ తాటక మారీచు డనే మహాబలవంతు డగు కుమారుని కనెను. అతడు శాపవశముచేత రాక్షసు డయ్యెను. 8

మూ. సున్దే తు నిహతే రామ సాగస్త్యమృషిసత్తమమ్,
తాటకా సహ పుత్రేణ ప్రధర్షయితుమిచ్ఛతి. 9

ప్ర. అ. రామ = రామా ! సున్దే = సుందుడు, నిహతే = చంపబడినవా డగుచుండగా, సా తాటకా = ఆ తాటక, పుత్రేణ సహ = పుత్రునితో కూడి, ఋషిసత్తమమ్ = ఋషిశ్రేష్ఠు డైన, అగస్త్యమ్ = అగస్త్యుని, ప్రధర్షయితుమ్ = ఎదిరించుటకు, ఇచ్ఛతి = కోరెను.

తా. అగస్త్యుడు సుందుని శపించి చంపగా, తాటకయు మారీచుడును, ఆ ఋషిశ్రేష్ఠుని ఎదిరించుటకై ప్రయత్నించిరి. 9

మూ. భక్షార్థం జాతసంరంభా గర్జన్తీ సాభ్యధావత,
ఆపతన్తీం తు తాం దృష్ట్వా అగస్త్యో భగవాన్ ఋషిః, 10
రాక్షసత్వం భజస్వేతి మారీచం వ్యాజహార సః.

ప్ర. అ. సా = ఆమె, గర్జన్తీ = గర్జించుచున్నదై, జాతసంరంభా = పుట్టిన తొందరకలదై, భక్షార్థమ్ = భక్షించుటకై, అభ్యధావత = అగస్త్యునిమీదికి వెళ్లెను, భగవాన్ = పూజ్యుడైన, సః అగస్త్యః ఋషిః = ఆ అగస్త్య మహర్షి, ఆపతన్తీమ్ = మీదికి వచ్చుచున్న, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, రాక్షసత్వమ్ = రాక్షసత్వమును, భజస్వ = పొందుము, ఇతి = అని, మారీచమ్ = మారీచుని, వ్యాజహార = పలికెను.

తా. ఆమె గర్జించుచు, భక్షించుటకై తొందరగ అగస్త్యుని మీదికి వెళ్లెను. భగవంతు డైన అగస్త్యమహర్షి మీదికి వచ్చుచున్న ఆమెను చూచి, "రాక్షసుడ వగుదువు గాక" అని మారీచుని శపించెను. 10

మూ. అగస్త్యః పరమక్రుద్ధ స్తాటకామపి శప్తవాన్. 11
పురుషాదీ మహాయక్షీ విరూపా వికృతాననా,
ఇదం రూపం విహాయాథ దారుణం రూపమస్తు తే. 12

ప్ర. అ. పరమక్రుద్ధః = మిక్కిలి కోపించిన, అగస్త్యః = అగస్త్యుడు, తాటకామపి = తాటకను కూడ, శప్తవాన్ = శపించెను, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపమును, విహాయ = విడచి, అథ = పిమ్మట, విరూపా = వికృతరూపముకల దానవై, వికృతాననా = వికృత మైన ముఖము కలదానవై, పురుషాదీ = మనుష్య

లను భక్షించు, మహాయక్షీ = మహాయక్షిణివిగ అగుదువు గాక, తే = నీకు, దారుణమ్ = భయంకరమైన, రూపమ్ = రూపము, అస్తు = అగుగాక.

తా. అగస్త్యుడు చాల కోపించి — నీవు ఈ రూపమును విడచి, వికృతమైన రూపము, భయంకర మైన ముఖము కలదానవై, మనుష్యులను భక్షించు మహాయక్షిణివి అగుదువు గాక. నీకు అతిభయంకర మగు ఆకారము కలుగుగాక" అని తాటకను కూడ శపించెను. 12

మూ. సైషా శాపకృతామర్షా తాటకా క్రోధమూర్ఛితా,
దేశముత్సాదయత్యేనమగస్త్యచరితం శుభమ్. 13

ప్ర. అ. శాపకృతామర్షా = శాపముచేత చేయబడిన కోపము గల, సా= అట్టి, ఏషా = ఈ, తాటకా = తాటక, క్రోధమూర్ఛితా = క్రోధముచేత వ్యాపింపబడినదై, అగస్త్యచరితమ్ = అగస్త్యునిచేత సంచరింపబడిన, శుభమ్=శుభ మైన, ఏనం దేశమ్ = ఈ దేశమును, ఉత్సాదయతి = నశింపచేయుచున్నది.

తా. ఈ శాపముచే తాటకకు కోపము కలిగినది. అత్యధిక మైన కోపముతో ఈమె పూర్వము అగస్త్యుడు సంచరించిన ఈ దేశమును నశింపచేయుచున్నది. 13

మూ. ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమదారుణామ్,
గోబ్రాహ్మణహితార్థాయ జహి దుష్టపరాక్రమామ్. 14

ప్ర. అ. రామ = రామా ! దుర్వృత్తామ్ = దుర్మార్గురాలైన, పరమదారుణామ్ = మిక్కిలి క్రూరురాలైన, దుష్టపరాక్రమామ్ = చెడ్డ పరాక్రమము గల, ఏనామ్ = ఈ, యక్షీమ్ = యక్షిణిని, గోబ్రాహ్మణహితార్థాయ=గోవులయొక్క బ్రాహ్మణులయొక్క హితముకొరకు, జహి=చంపుము.

తా. రామా ! దుర్మార్గురాలు, క్రూరురాలు, దుష్టపరాక్రమవంతురాలు అగు ఈ యక్షిణిని గోబ్రాహ్మణుల హితముకొరకై సంహరించుము. 14

మూ. న హ్యేనాం శాపసంస్పృష్టాం కశ్చిదుత్సహతే పుమాన్,
నిహన్తుం త్రిషు లోకేషు త్వామృతే రఘునన్దన. 15

ప్ర. అ. రఘునన్దన = రామా ! శాపసంస్పృష్టామ్=శాపముచే స్పృశింప బడిన, ఏనామ్ = ఈమెను, నిహన్తుమ్ = చంపుటకు, త్వామ్ ఋతే = నీవు తప్ప, కశ్చిత్ పుమాన్ = ఏ పురుషుడును, త్రిషు లోకేషు = మూడు లోకములందు, న ఉత్సహతే హి = సమర్థుడు కాడు కదా.

తా. రామా ! నీవు తప్ప, మూడు లోకములలో మరెవ్వడును శపింప బడిన ఈమెను చంపుటకు సమర్థుడు కాడు. 15

మూ. న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ,
చాతుర్వర్ణ్యహితార్థాయ కర్తవ్యం రాజసూనునా. 16

ప్ర. అ. నరోత్తమ = నరశ్రేష్ఠుడా ! స్త్రీవధకృతే = స్త్రీవధను గూర్చి, తే=నీకు, ఘృణా=జాలి, న కార్యా = చేయతగినది కాదు. రాజసూనునా = రాజకుమారునిచేత, చాతుర్వర్ణ్యహితార్థాయ=నాలుగు వర్ణముల హితము కొరకై, కర్తవ్యమ్=కార్యము చేయదగినది.

తా. ఓ నరశ్రేష్ఠుడా ! స్త్రీని వధించుటయా అని సంకోచింపకుము. రాజకుమారుడు చాతుర్వర్ణ్యము వారి హితముకొరకై ఏ పని యైనను చేయ వలయును. 16

మూ. నృశంసమనృశంసం వా ప్రజారక్షణకారణాత్,
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా. 17

ప్ర. అ. రక్షతా=రక్షించు, సతా=సత్పురుషుడైన రాజుచేత, ప్రజా రక్షణకారణాత్ = ప్రజారక్షణము కొరకై, నృశంసం వా = క్రూరమైనను, అనృశంసం వా = క్రూరము కాకపోయినను, పాతకం వా = పాపమైనను, సదోషం వా = దోషములతో కూడినదైనను, కార్యము, కర్తవ్యమ్ = చేయ దగినదే.

తా. ధర్మాత్ముడైన రాజు, ప్రజారక్షణముకొరకై ఉపయోగించు, కార్యము, క్రూర మైనను కాకపోయినను, పాపమైనను దోషములతో కూడిన దైనను చేయదగినదే. 17

మూ. రాజ్యభారనియుక్తానామేష ధర్మస్సనాతనః,
అధర్మ్యాం జహి కాకుత్స్థ ధర్మో హ్యస్యా న విద్యతే. 18

ప్ర. అ. రాజ్యభారనియుక్తానామ్=రాజ్యభారమునందు నియుక్తులైనవారికి, ఏషః=ఇది, సనాతనః=అతిప్రాచీన మైన, ధర్మః=ధర్మము. కాకుత్స్థ=రామా! అధర్మ్యామ్ = అధర్మము గల తాటకను, జహి = చంపుము, అస్యాః=ఈమెకు, ధర్మః = ధర్మము, న విద్యతే హి=లేదు కదా.

తా. ఇది రాజ్యపాలనభారమును వహించువారు పాటించవలసిన అతిప్రాచీన మైన ధర్మము. రామా! ధర్మవిరుద్ధాచరణము గల ఈమెను సంహరించుము. ఈమెయందు ధర్మ మనునదియే లేదు కదా.

మూ. శ్రూయతే హి పురా శక్రో విరోచనసుతాం నృప,
పృథివీం హన్తుమిచ్ఛన్తీం మంథరామభ్యసూదయత్. 19

ప్ర. అ. నృప = రాజా! పురా = పూర్వము, పృథివీమ్ = భూమిని, హన్తుమ్ = చంపుటకు, ఇచ్ఛన్తీమ్ = కోరుచున్న, విరోచనసుతామ్ = విరోచనుని కుమార్తె యైన, మంథరామ్=మంథరను, శక్రః=దేవేంద్రుడు, అభ్యసూదయత్= సంహరించెను, అని, శ్రూయతే హి=వినబడుచున్నదికదా?

తా. పూర్వము విరోచనుని కుమార్తె యగు మంథర భూమిని చంపగోరినప్పుడు దేవేంద్రుడు ఆమెను చంపె నని వినుచున్నాము కదా? 19

మూ. విష్ణునాపి పురా రామ భృగుపత్నీ దృఢవ్రతా,
అనిన్ద్రం లోకమిచ్ఛన్తీ కావ్యమాతా నిషూదితా. 20

ప్ర. అ. రామ = రామా! పురా = పూర్వము, లోకమ్ = లోకమును, అనిన్ద్రమ్ = ఇంద్రుడు లేనిదానినిగా, ఇచ్ఛన్తీ=కోరుచున్న, దృఢవ్రతా=దృఢమైన నియమమును అవలంబించిన, కావ్యమాతా=శుక్రుని తల్లి యైన, భృగుపత్నీ అపి=భృగుమహర్షియొక్క భార్య కూడ, విష్ణునా=విష్ణువుచేత, నిషూదితా=సంహరింపబడినది.

తా. పూర్వము విష్ణువు కూడ, లోకములో ఇంద్రుడు ఉండకూడ దను కోరికతో తీవ్రవ్రతము నాచరించుచున్న, శుక్రాచార్యజనని యైన భృగుమహర్షి భార్యను చంపెను. 20

మూ. ఏతైశ్చాన్యైశ్చ బహుభీ రాజపుత్ర మహాత్మభిః,
అధర్మసహితా నార్యో హతాః పురుషసత్తమైః. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పంచవింశః సర్గః.

ప్ర. అ. రాజపుత్ర=ఓ రాజకుమారా! మహాత్మభిః = మహాత్ము లైన, ఏతైశ్చ=వీరిచేతను, అన్యైః = ఇతరులైన, పురుషసత్తమైశ్చ = పురుషశ్రేష్ఠుల చేతను, బహుభిః=అనేకులచేత, అధర్మసహితాః=అధర్మవతు లగు, నార్యః= స్త్రీలు, హతాః=చంపబడినారు.

తా. ఓ రాజపుత్రా! మహాత్ములైన వీరును, ఇంకను ఎందరో పురుష శ్రేష్ఠులును ధర్మవిరుద్ధముగ ప్రవర్తించు స్త్రీలను చంపినారు. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
ఇరువది ఐదవ సర్గ సమాప్తము.

## అథ షడ్వింశః సర్గః

మూ. మునేర్వచనమక్లీబం శ్రుత్వా నరవరాత్మజః,
రాఘవః ప్రాఞ్జలిర్భూత్వా ప్రత్యువాచ దృఢవ్రతః. 1

ప్ర. అ. దృఢవ్రతః = దృఢమైన నియమములు గల, నరవరాత్మజః = రాజశ్రేష్ఠుని కుమారు డైన, రాఘవః = రాముడు, అక్లీబమ్ = దృఢనిశ్చయ పూర్వక మైన, మునేః = మునియొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. నిశ్చయపూర్వకముగ పలికిన విశ్వామిత్రుని మాటలు విని, దృఢ మైన నియమము కలవాడును, రాజశ్రేష్ఠుని కుమారుడును అగు రాముడు, అంజలి ఘటించి పలికెను. 1

మూ. పితుర్వచననిర్దేశాత్పితుర్వచనగౌరవాత్,
వచనం కౌశికస్యేతి కర్తవ్యమవిశఙ్కయా. 2

ప్ర. అ. పితుః = తండ్రిగారియొక్క, వచననిర్దేశాత్ = ఆజ్ఞావచనము వలనను, పితుః = తండ్రిగారియొక్క, వచనగౌరవాత్ = మాటయందు గౌరవము వలనను, కౌశికస్య = విశ్వామిత్రునియొక్క, వచనమ్ ఇతి = వాక్య మనెడు కారణమువలనను, అవిశఙ్కయా = సందేహము లేకుండగ, కర్తవ్యమ్ = చేయ దగినదే.

తా. మా తండ్రిగారి ఆజ్ఞవలనను, ఆయన వాక్యమునందు నా కున్న గౌరవమువలనను, నీ వాక్య మగుటవలనను ఈ కార్యము నిస్సందేహముగ చేయదగినది.

మూ. అనుశిష్టోఽస్మ్యయోధ్యాయాం గురుమధ్యే మహాత్మనా,
పిత్రా దశరథేనాహం నావజ్ఞేయం హి తద్వచః. 3

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యలో, గురుమద్యే = పెద్దల మధ్య యందు, మహాత్మనా = మహాత్ముడైన, పిత్రా = తండ్రి యైన, దశరథేన = దశరథునిచేత, అహమ్ = నేను, అనుశిష్టః అస్మి = ఆజ్ఞాపింపబడితిని, తద్వచః = ఆయనవాక్యము, నావజ్ఞేయం హి = ఉల్లంఘింపదగినది కాదు కదా?

తా. అయోధ్యానగరములో, వసిష్ఠాదిగురుజనుల మధ్య, మహాత్ము డైన మా తండ్రి దశరథమహారాజు "విశ్వామిత్రుడు చెప్పినట్లు చేయుము" అని ఆజ్ఞాపించినాడు. ఆయన మాటను ఉల్లఘింపరాదు కదా? 3

మూ. సోఽహం పితుర్వచః శ్రుత్వా శాసనాద్బ్రహ్మవాదినః,
కరిష్యామి న సన్దేహ స్తాటకావధముత్తమమ్. 4

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, పితుః = తండ్రియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, బ్రహ్మవాదినః = వేదాధ్యయనసంపన్నుడ వైన నీయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, ఉత్తమమ్ = ఉత్తమ మైన, తాటకావధమ్ = తాటకయొక్క వధను, కరిష్యామి = చేయగలను; సన్దేహః = సందేహము, న = లేదు.

తా. నేను తండ్రిగారి ఆజ్ఞప్రకారము, బ్రహ్మవాది వైన నీ మాట పాటించి తప్పక తాటకను సంహరించెదను. 4

గోబ్రాహ్మణహితార్థాయ దేశస్యాస్య సుఖాయ చ,
తవ చైవాప్రమేయస్య వచనం కర్తుముద్యతః. 5

ప్ర. అ. గోబ్రాహ్మణహితార్థాయ = గోబ్రాహ్మణుల హితముకొరకును, అస్య = ఈ, దేశస్య = దేశముయొక్క, సుఖాయ చ = సుఖముకొరకును, అప్రమేయస్య = అమేయమైన శక్తి గల, తవ = నీయొక్క, వచనమ్ = వాక్యమును, కర్తుమ్ = చేయుటకు, ఉద్యతః = సిద్ధముగ నున్నాను.

తా. గోబ్రాహ్మణుల సుఖము కొరకును, ఈ దేశముయొక్క సుఖము కొరకును, అప్రమేయప్రభావుడ వగు నీ ఆజ్ఞప్రకారము చేయుటకు సిద్ధముగా నున్నాను. 5

మూ. ఏవముక్త్వా ధనుర్మధ్యే బద్ధ్వా ముష్టిమరిన్దమః,
జ్యాశబ్దమకరోత్తీవ్రం దిశశ్శబ్దేన నాదయన్. 6

ప్ర. అ. అరిందమః = శత్రువులను నశింపచేయు రాముడు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, ధనుర్మధ్యే = ధనుస్సుయొక్క మధ్యమునందు, ముష్టిమ్ = పిడికిలిని, బద్ధ్వా = బంధించి, శబ్దేన = శబ్దముచేత, దిశః = దిక్కులను, నాదయన్ = ధ్వనింపచేయుచు, తీవ్రమ్ = తీవ్రమైన, జ్యాశబ్దమ్ = నారి యొక్క శబ్దమును, అకరోత్ = చేసెను.

తా. శత్రుసంహారకు డగు రాముడు ఈ విధముగ పలికి, పిడికిలితో ధనుర్మధ్యమునందు గట్టిగా పట్టి, దిక్కులు ప్రతిధ్వనించునట్లు తీవ్రమైన టంకార ధ్వనిని చేసెను. 6

మూ. తేన శబ్దేన విత్రస్తాస్తాటకావనవాసినః,
తాటకా చ సుసంక్రుద్ధా తేన శబ్దేన మోహితా. 7

ప్ర. అ. తాటకావనవాసినః = తాటకయొక్క అరణ్యములో నివసించు సర్వప్రాణులును, తేన శబ్దేన = ఆ ధ్వనిచేత, విత్రస్తాః = భయపడినవి, తాటకా చ = తాటక కూడ, తేన శబ్దేన = ఆ శబ్దముచేత, సుసంక్రుద్ధా = చాల కోపించినదై, మోహితా = మోహింపచేయబడినది.

తా. తాటకావనములో అన్ని ప్రాణులును ఆ ధ్వనికి భయపడినవి. తాటక కూడ ఆ శబ్దముచేత మిక్కిలి కోపించి దిగ్భ్రాంతి చెందెను. 7

మూ. తం శబ్దమభినిధ్యాయ రాక్షసీ క్రోధమూర్ఛితా,
శ్రుత్వా చాభ్యద్రవద్వేగాద్యతః శబ్దో వినిస్సృతః. 8

ప్ర. అ. రాక్షసీ = ఆ రాక్షసి, తం శబ్దమ్ = ఆ శబ్దమును, శ్రుత్వా = విని, క్రోధమూర్ఛితా = క్రోధావిష్టురాలై, అభినిధ్యాయ = ఆలోచించి, యతః = ఏ వైపు నుండి, శబ్దః = శబ్దము, వినిస్సృతః = బయలుదేరినదో, ఆ వైపునకు, వేగాత్ = వేగమువలన, అభ్యద్రవత్ = పరుగెత్తెను.

తా. ఆ శబ్దము వినగనే కోపావిష్టురాలైన తాటక, క్షణకాల మాలోచించి ఆ శబ్దమువచ్చిన వైపు శీఘ్రముగ పరుగెత్తెను. 8

మూ. తాం దృష్ట్వా రాఘవః క్రుద్ధాం వికృతాం వికృతాననామ్,
ప్రమాణేనాతివృద్ధాం చ లక్ష్మణం సోఽభ్యభాషత. 9

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, క్రుద్ధామ్ = కోపగించినదియు, వికృతామ్ = వికారముగా ఉన్నదియు, వికృతాననామ్ = వికృత మైన ముఖము కలదియు, ప్రమాణేన = ప్రమాణముచేత, అతివృద్ధాం చ = చాల పెద్దదియు అగు, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి, అభ్యభాషత = పలికెను.

తా. వికారముగా ఉన్నముఖముతో, పెద్ద దేహముతో నున్న కోపించిన ఆమెను చూచి రాముడు లక్ష్మణునితో ఇట్లనెను. 9

మూ. పశ్య లక్ష్మణ యక్షిణ్యా భైరవం దారుణం వపుః,
భిద్యేరన్ దర్శనాదస్యా భీరూణాం హృదయాని చ. 10

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! యక్షిణ్యాః = ఈ యక్షిణియొక్క, భైరవమ్ = భయంకర మైన, దారుణమ్ = క్రూర మైన, వపుః = శరీరమును, పశ్య = చూడుము, అస్యాః = ఈమెయొక్క, దర్శనాత్ = దర్శనమువలన, భీరూణామ్ = పిరికివారియొక్క, హృదయాని = హృదయములు, భిద్యేరన్ = పగిలిపోవును.

తా. లక్ష్మణా ! ఈ యక్షిణి ఆకారము ఎంత భయంకరముగను క్రూరముగను ఉన్నదో చూడుము. ఈమెను చూడగనే పిరికివాళ్ల గుండెలు పగిలిపోవును. 10

మూ. ఏనాం పశ్య దురాధర్షాం మాయాబలసమన్వితామ్,
వినివృత్తాం కరోమ్యద్య హృతకర్ణాగ్రనాసికామ్. 11

ప్ర. అ. దురాధర్షామ్ = ఎదిరింప శక్యము కానిదియు, మాయాబలసమన్వితామ్ = మాయాబలముతో కూడినదియు అగు, ఏనామ్ = ఈమెను, హృతకర్ణాగ్రనాసికామ్ = హరింపబడిన చెవులు నాసికాగ్రము కలిగి, వినివృత్తామ్ = మరలిపోవుదానినిగా, అద్య = ఇప్పుడు, కరోమి = చేయుదును, పశ్య = చూడుము.

తా. మాయాబలముచే ఎదిరింప శక్యము కాక ఉన్న ఈమెను,

చెవులును నాసాగ్రమును ఖండించి వెనుకకు మరలిపోవు నట్లు చేసెదను చూడుము. 11

మూ. న హ్యేనాముత్సహే హన్తుం స్త్రీస్వభావేన రక్షితామ్,
వీర్యం చాస్యాం గతిం చాపి హనిష్యామీతి మే మతిః. 12

స్త్రీస్వభావేన = స్త్రీఅగుటచే, రక్షితామ్=రక్షింపబడిన, ఏనామ్= ఈమెను, హన్తుమ్=చంపుటకు, న ఉత్సహే=యత్నించను. అస్యామ్=ఈమెయందలి, వీర్యమ్=పరాక్రమమును, గతిం చాపి=గమనశక్తిని, హనిష్యామీతి = తొలగించెదను అని, మే=నాయొక్క, మతిః=అభిప్రాయము.

తా. ఆడు దగుటయే ఈమెను రక్షించుచున్నది. ఈమెను చంపుటకు యత్నింపక ఈమె పరాక్రమమును, గమనశక్తిని నశింపచేయ వలె నని అనుకొనుచున్నాను.

మూ. ఏవం బ్రువాణే రామే తు తాటకా క్రోధమూర్ఛితా,
ఉద్యమ్య బాహూ గర్జన్తీ రామమేవాభ్యధావత. 13

ప్ర. అ. రామే=రాముడు, ఏవమ్=ఈ విధముగా, బ్రువాణే=పలుకుచుండగనే, తాటకా = తాటక, క్రోధమూర్ఛితా = కోపముచే వ్యాపింపబడినదై, బాహూ=బాహువులను, ఉద్యమ్య=ఎత్తి, రామమేవ=రాముని గూర్చియే, అభ్యధావత=పరుగెత్తెను.

తా. రాముడు ఇట్లు పలుకుచుండగనే తాటక క్రోధావిష్టురాలై, చేతులు ఎత్తి, గర్జించుచు, రామునిమీదికే పరుగెత్తెను. 13

మూ. విశ్వామిత్రస్తు బ్రహ్మర్షిర్హుంకారేణాభిభర్త్స్య తామ్,
స్వస్తి రాఘవయోరస్తు జయం చైవాభ్యభాషత. 14

ప్ర. అ. బ్రహ్మర్షిః = బ్రహ్మర్షియైన, విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుడైతే, తామ్ = ఆమెను, హుంకారేణ = హుంకారముచేత, అభిభర్త్స్య = భయపెట్టి, రాఘవయోః = రామలక్ష్మణులకు, స్వస్తి = క్షేమము, అస్తు=అగుగాక అనియు, జయం చైవ = విజయమును, అభ్యభాషత = పలికెను.

**తా.** బ్రహ్మర్షి యైన విశ్వామిత్రుడు హుంకారముచేత ఆమెను అదలించి, "రామలక్ష్మణులకు స్వస్తి అగుగాక" అని పలికి "జయము కలుగు గాక" అని కూడ పలికెను. 14

మూ. ఉద్ధూన్వానా రజో ఘోరం తాటకా రాఘవావుభౌ,
రజోమోహేన మహతా ముహూర్తం సా వ్యమోహయత్. 15

ప్ర. అ. సా తాటకా = ఆ తాటక, ఘోరమ్ = భయంకర మైన, రజః = పరాగమును, ఉద్ధూనానా = చిమ్ముచు, రాఘవౌ = రామలక్ష్మణులను, ఉభౌ = ఇద్దరిని, ముహూర్తమ్ = క్షణకాలము పాటు, మహతా = గొప్ప, రజోమోహేన = పరాగముచే కలిగిన మోహముచే, వ్యమోహయత్ = మోహింపచేసెను.

**తా.** ఆ తాటక భయంకర మైన పరాగమును చిమ్ముచు, ఆ రామలక్ష్మణులను, క్షణకాలము పాటు, ఆ పరాగములో ఏమియు తోచకుండ చేసెను. 15

మూ. తతో మాయాం సమాస్థాయ శిలావర్షేణ రాఘవౌ,
అవాకిరత్సుమహతా తతశ్చుక్రోధ రాఘవః. 16

ప్ర. అ. తతః = పిమ్మట, మాయామ్ = మాయను, సమాస్థాయ = అవలంబించి, సుమహతా = చాల గొప్పదైన, శిలావర్షేణ = రాళ్ల వర్షముచేత, రాఘవౌ = రామలక్ష్మణులను, అవాకిరత్ = వెదజల్లెను, తతః = అటు పిమ్మట, రాఘవః = రాముడు, చుక్రోధ = కోపించెను.

తా. పిమ్మట మాయాప్రభావముచే రామలక్ష్మణులపై గొప్ప శిలావర్షమును కురిపించెను. దానితో రామునకు కోపము వచ్చెను. 16

మూ. శిలావర్షం మహత్తస్యాః శరవర్షేణ రాఘవః,
ప్రతిహత్యోపధావన్త్యాః కరౌ చిచ్ఛేద పత్రిభిః. 17

ప్ర. అ. రాఘవః = రాముడు, తస్యాః = ఆమెయొక్క, మహత్ = గొప్పదైన, శిలావర్షమ్ = శిలావర్షమును, శరవర్షేణ = బాణవర్షముచేత, ప్రతిహత్య = కొట్టి

వేసి, ఉపధావన్త్యాః = పరుగెత్తి మీదికి వచ్చుచున్న ఆమెయొక్క, కరౌ = హస్తములను, పత్రిభిః = బాణములచేత, చిచ్ఛేద = ఛేదించెను.

తా. రాముడు, ఆమె కురిపించిన శిలావర్షమును బాణవర్షముచేత వారించెను. ఆమె మీదికి వచ్చుచుండగా ఆమె హస్తములను బాణములచే ఛేదించెను. 17

మూ. తతశ్ఛిన్నభుజాం శ్రాన్తామభ్యాశే పరిగర్జతీమ్,
సౌమిత్రిరకరోత్క్రోధాద్ధృతకర్ణాగ్రనాసికామ్. 18

ప్ర. అ. తతః = పిమ్మట, ఛిన్నభుజామ్ = ఛేదింపబడిన భుజములు కలదియు, శ్రాన్తామ్ = అలసిపోయినదియు, అభ్యాశే = సమీపమునందు, పరిగర్జతీమ్ = గర్జించుచున్న ఆమెను, సౌమిత్రిః = లక్ష్మణుడు, క్రోధాత్ = క్రోధమువలన, హృతకర్ణాగ్రనాసికామ్ = ఛేదింపబడిన కర్ణములు, నాసికాగ్రము కలదానినిగా, అకరోత్ = చేసెను.

తా. చేతులు తెగి, అలసిపోయి, సమీపమునందు గర్జించుచున్న ఆ తాటక చెవులను, ముక్కును, లక్ష్మణుడు క్రోధముతో ఛేదించివేసెను. 18

మూ. కామరూపధరా సద్యః కృత్వా రూపాణ్యనేకశః,
అన్తర్ధానం గతా యక్షీ మోహయన్తీవ మాయయా, 19
అశ్మవర్షం విముఞ్చన్తీ భైరవం విచచార హ.

ప్ర. అ. కామరూపధరా = ఇచ్ఛానుసారముగ రూపములను ధరించు ఆ తాటక, సద్యః = వెంటనే, అనేకశః = అనేక విధములుగ, రూపాణి = రూపములను, కృత్వా = చేసి, అశ్మవర్షమ్ = శిలావర్షమును, విముఞ్చన్తీ = విడచుచు, భైరవమ్ = భయంకరముగా, విచచార హ = సంచరించెను.

తా. ఇష్టము ప్రకారము రూపములను ధరింపగల ఆ తాటక అనేక విధములైన రూపములను ధరించుచు, రాళ్లవాన కురిపించుచు, అతిభయంకరముగ సంచరించెను. 19

మూ. తతస్తావశ్మవర్షేణ కీర్యమాణౌ సమన్తతః,
దృష్ట్వా గాధిసుతః శ్రీమానిదం వచనమబ్రవీత్. 20

ప్ర. అ. తతః = పిమ్మట, సమన్తతః = అంతటను, అశ్మవర్షేణ = రాళ్ల వానచేత, కీర్యమాణౌ = కప్పబడుచున్న, తౌ = ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా= చూచి, శ్రీమాన్ = కాంతి గల, గాధిసుతః=విశ్వామిత్రుడు, ఇదం వచనమ్ = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. నలువైపులనుండి రాళ్లవానచే కొట్టబడుచున్న ఆ రామలక్ష్మణులను చూచి విశ్వామిత్రుడు ఇట్లు పలికెను. 20

మూ. అలం తే ఘృణయా రామ పాపైషా దుష్టచారిణీ, 21
యజ్ఞవిఘ్నకరీ యక్షీ పురావర్ధతి మాయయా.

ప్ర. అ. రామ = రామా ! తే = నీకు, ఘృణయా = జాలిచేత, అలమ్= చాలును, పాపా = పాపాత్మురాలును, దుష్టచారిణీ = దుర్మార్గురాలును, యజ్ఞ విఘ్నకరీ = యజ్ఞములకు విఘ్నము చేయునదియు అగు, ఏషా యక్షీ = ఈ యక్షిణి, మాయయా = మాయచేత, పురావర్ధతి = వృద్ధి పొందగలదు.

తా. "రామా ! ఈమెపై జాలి చూపకుము. యజ్ఞములకు విఘ్నము చేయు, పాపాత్మురాలు, దుర్మార్గురాలు అయిన ఈ యక్షిణి మాయాబలముచే వృద్ధి పొందగలదు. 21

మూ. వధ్యతాం తావదేవైషా పురా సన్ధ్యా ప్రవర్తతే. 22
రక్షాంసి సన్ధ్యాకాలేషు దుర్ధర్షాణి భవన్తి వై.

ప్ర. అ. సన్ధ్యా = సంధ్య, పురా ప్రవర్తతే = ప్రవర్తింప నున్నది, తావ దేవ = అంతలోనే, ఏషా = ఈమె, వధ్యతామ్ = చంపబడుగాక, సన్ధ్యాకాలేషు= సంధ్యాకాలములయందు, రక్షాంసి=రాక్షసులు, దుర్ధర్షాణి = ఎదిరింప శక్యము కానివారు, భవన్తి వై = అగుదురు.

తా. సంధ్యాకాలము రాబోవుచున్నది. ఈ లోపుగనే ఈమెను చంపి వేయుము. సంధ్యాకాలమునందు రాక్షసులను ఎదిరింప శక్యము కాదు. 22

మూ. ఇత్యుక్తస్తు తదా యక్షిమశ్మవృష్ట్యాభివర్షతీమ్, 23
దర్శయన్ శబ్దవేధిత్వం తాం రురోధ స సాయకైః.

ప్ర. అ. ఇతి = ఈ విధముగ, ఉక్తః = పలుకబడిన, సః = ఆ రాముడు, తదా = అప్పుడు, శబ్దవేధిత్వమ్ = శబ్దవేధిత్వమును, దర్శయన్ = చూపుచున్న వాడై, అశ్మవృష్ట్యా = రాళ్ల వానచే, అభివర్షతీమ్ = వర్షించుచున్న, తామ్ = ఆ, యక్షీమ్ = తాటకను, సాయకైః = బాణములచే, రురోధ = అడ్డగించెను.

తా. విశ్వామిత్రు డిట్లు చెప్పగా రాముడు తన శబ్దవేధిత్వ సామర్థ్యమును చూపుచు, రాళ్లవాన కురిపించుచున్న ఆ తాటకను బాణములచే అడ్డు పెట్టెను. 23

వి. శబ్ద మెచటినుండి వచ్చుచున్నదో దానినిబట్టి ఆ శబ్దము చేయు వ్యక్తి కనబడకున్నను ఆతనిని కొట్టగల సామర్థ్యము శబ్దవేధిత్వము.

మూ. సా రుద్ధా శరజాలేన మాయాబలసమన్వితా, 24
అభిదుద్రావ కాకుత్స్థం లక్ష్మణం చ వినేదుషీ.

ప్ర. అ. శరజాలేన = బాణసముదాయముచేత, రుద్ధా = అడ్డుకొనబడిన, మాయాబలసమన్వితా = మాయాబలము గల, సా = ఆమె, వినేదుషీ = గర్జించుచు, కాకుత్స్థమ్ = రాముని, లక్ష్మణం చ = లక్ష్మణుని గూర్చి, అభిదుద్రావ = పరుగెత్తెను.

తా. మాయాబలము గల ఆ తాటక బాణజాలముచే అడ్డుకొనబడినదై, గర్జించుచు రామలక్ష్మణుల మీదికి పరుగెత్తికొని వచ్చెను. 24

మూ. తామాపతన్తీం వేగేన విక్రాన్తామశనీమివ, 25
శరేణోరసి వివ్యాధ సా పపాత మమార చ.

ప్ర. అ. విక్రాన్తామ్ = పరాక్రమము చూపుచు, అశనీమివ = పిడుగు వలె, వేగేన = వేగముతో, ఆపతన్తీమ్ = వచ్చి మీద పడుచున్న, తామ్ = ఆమెను, శరేణ = బాణముతో, ఉరసి = వక్షఃస్థలమునందు, వివ్యాధ = కొట్టెను, సా = ఆమె, పపాత = క్రిందపడిపోయెను, మమార చ = మరణించెను కూడ.

తా. పరాక్రమము చూపుచు పిడుగు వలె వేగముగ వచ్చి మీద పడుచున్న ఆమెను రాముడు, బాణముచే, వక్షఃస్థలమునందు కొట్టెను. ఆమె క్రింద పడి చనిపోయెను. 25

మూ. తాం హతాం భీమసఙ్కాశాం దృష్ట్వా సురపతిస్తదా, 26
సాధు సాధ్వితి కాకుత్థ్సం సురాశ్చ సమపూజయన్.

ప్ర. అ. తదా = అప్పుడు, సురపతిః = దేవేంద్రుడును, సురాశ్చ = దేవతలును, హతామ్ = చంపబడిన, భీమసఙ్కాశామ్ = భయంకరురాలుగా ఉన్న, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, సాధు సాధు, ఇతి = "బాగు బాగు" అని, కాకుత్థ్సమ్ = రాముని, సమపూజయన్ = పూజించిరి.

తా. భయంకరురాలైన ఆ తాటక మరణమును చూచి, దేవతలును, దేవేంద్రుడును, "బాగు బాగు" అని రాముని ప్రశంసించిరి. 26

మూ. ఉవాచ పరమప్రీతః సహస్రాక్షః పురన్దరః, 27
సురాశ్చ సర్వే సంహృష్టా విశ్వామిత్రమథాబ్రువన్.

ప్ర. అ. అథ=పిమ్మట, సహస్రాక్షః=వేయి నేత్రములు గల, పురన్దరః= దేవేంద్రుడు, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, ఉవాచ = పలికెను, సర్వే=సమస్తమైన, సురాశ్చ=దేవతలును, సంహృష్టాః = సంతోషించినవారై, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. సహస్రాక్షుడైన దేవేంద్రుడు దేవత లందరును కూడ సంతసించి విశ్వామిత్రునితో ఇట్లు పలికిరి. 27

మూ. మునే కౌశిక భద్రం తే సేన్ద్రాస్సర్వే మరుద్గణాః, 28
తోషితాః కర్మణానేన స్నేహం దర్శయ రాఘవే.

ప్ర. అ. కౌశికమునే = ఓ విశ్వామిత్రమహామునీ, తే=నీకు, భద్రమ్= క్షేమ మగుగాక, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, సర్వే = సమస్తమైన, మరుద్గణాః = దేవతలు, అనేన = ఈ, కర్మణా = కర్మచేత, తోషితాః = సంతోషింప చేయబడినారు, రాఘవే = రాముని విషయమున, స్నేహమ్ = స్నేహమును, దర్శయ = చూపుము.

తా. విశ్వామిత్రమహర్షీ! నీకు క్షేమ మగుగాక. ఈ పనిచేత సకల దేవతలును, ఇంద్రుడును చాల సంతోషింపచేయబడినారు. రామునియందు ప్రేమను చూపుము. 28

మూ. ప్రజాపతేర్భృశాశ్వస్య పుత్రాన్ సత్యపరాక్రమాన్,
తపోబలభృతాన్ బ్రహ్మన్ రాఘవాయ నివేదయ. 29

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రహ్మర్షీ ! ప్రజాపతేః = ప్రజాపతియైన, భృశాశ్వస్య = భృశాశ్వునియొక్క, పుత్రాన్ = పుత్రులును, సత్యపరాక్రమాన్ = సత్యమైన పరాక్రమము కలవియు, తపోబలభృతాన్ = తపోబలముచే పోషింపబడినవియు, అగు అస్త్రములను, రాఘవాయ = రామునకు, నివేదయ = ఇమ్ము.

తా. ఓ మహర్షీ ! ప్రజాపతి యైన భృశాశ్వుని పుత్రులును, సత్య మైన పరాక్రమము కలవియు, తపోబలముచే పోషింపబడినవియు అగు అస్త్రములను రామునకు ఉపదేశింపుము. 29

మూ. పాత్రభూతశ్చ తే బ్రహ్మం స్తవానుగమనే ధృతః, 30
కర్తవ్యం చ మహత్కర్మ సురాణాం రాజసూనునా.

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రహ్మర్షీ ! తవ = నీ యొక్క, అనుగమనే = అనుసరించి వెళ్లుటయందు, ధృతః=స్థిరు డైన ఈ రాముడు, తే = నీకు, పాత్రభూతః చ = సత్పాత్ర మైనవాడు, రాజసూనునా = ఈ రాజకుమారునిచే, సురాణామ్ = దేవతలయొక్క, మహత్ = గొప్ప, కర్మ = పని, కర్తవ్యం చ = చేయతగి యున్నది కూడ.

తా. ఓ విశ్వామిత్రా ! భక్తితో, స్థిరచిత్తముతో నిన్ను అనుసరించి వచ్చుచున్న ఈ రాముడు అస్త్రములను ఉపదేశించుటకు తగిన సత్పాత్రము. ఈ రాముడు గొప్ప దేవకార్యమును చేయవలసి యున్నది. 30

మూ. ఏవముక్త్వా సురాః సర్వే హృష్టా జగ్ముర్యథాగతమ్, 31
విశ్వామిత్రం పురస్కృత్య తతః సన్ధ్యా ప్రవర్తతే.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, సురాః = దేవతలు, సర్వే = అందరును, హృష్టాః = సంతసించినవారై, విశ్వామిత్రం = విశ్వామిత్రుని, పురస్కృత్య = పూజించి, యథాగతమ్ = వచ్చినట్లు, జగ్ముః = వెళ్లిరి, తతః = పిమ్మట, సన్ధ్యా = సంధ్య, ప్రవర్తతే = ప్రవర్తించెను.

తా. ఈ విధముగ పలికి, దేవత లందరును సంతసించినవారై, విశ్వామిత్రుని పూజించి తమ తమ స్థానములకు వెళ్లిపోయిరి. పిమ్మట సంధ్యానమయ మయ్యెను. 31

మూ. తతో మునివరః ప్రీత స్తాటకావధతోషితః, 32
మూర్ధ్ని రామముపాఘ్రాయ ఇదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తతః = పిమ్మట, మునివరః = మునిశ్రేష్ఠుడు, ప్రీతః = ప్రీతి యుక్తుడై, తాటకావధతోషితః = తాటకయొక్క సంహారముచేత సంతోషింప చేయబడినవాడై, రామమ్ = రాముని, మూర్ధ్ని = శిరస్సుపై, ఉపాఘ్రాయ = వాసన చూచి, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట తాటకాసంహారముచే సంతోషించిన విశ్వామిత్రుడు రాముని శిరస్సుపై వాసన చూచి ఇట్లు పలికెను. 32

మూ. ఇహాద్య రజనీం రామ వసేమ శుభదర్శన, 33
శ్వః ప్రభాతే గమిష్యామ స్తదాశ్రమపదం మమ.

ప్ర. అ. శుభదర్శన=శుభమైన దర్శనము గల, రామ=రామా, అద్య= ఈనాడు, రజనీమ్ = ఈ రాత్రి, ఇహ = ఇచట, వసేమ = నివసించెదము, శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలమున, మమ = నా యొక్క, తత్ = ఆ, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును గూర్చి, గమిష్యామః = వెళ్లెదము.

ప్ర. అ. దర్శనమాత్రమున శుభముల నిచ్చు ఓ రామా! ఈ రాత్రి ఇచటనే నివసించి రేపు ప్రాతఃకాలమున నా ఆశ్రమమునకు వెళ్లెదము. 33

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా హృష్టో దశరథాత్మజః, 34
ఉవాస రజనీం తత్ర తాటకాయా వనే సుఖమ్.

ప్ర. అ. విశ్వామిత్రవచః = విశ్వామిత్రుని మాటలను, శ్రుత్వా = విని, దశరథాత్మజః = రాముడు, హృష్టః = సంతసించినవాడై, తత్ర = ఆ, తాటకాయాః వనే = తాటకయొక్క వనమునందు, సుఖమ్ = సుఖముగా, రజనీమ్ = ఆ రాత్రి, ఉవాస = నివసించెను.

తా. రాముడు విశ్వామిత్రుని మాటలు విని సంతోషించి, ఆ రాత్రి తాటకావనములో సుఖముగా నివసించెను. 34

మూ. ముక్తశాపం వనం తచ్చ తస్మిన్నేవ తదాహని,
రమణీయం విబభ్రాజ యథా చైత్రరథం వనమ్. 35

ప్ర. అ. తదా = అప్పుడు, తస్మిన్ = ఆ, అహని ఏవ = దినమునందే, తత్ = ఆ, వనం చ = వనము కూడ, ముక్తశాపమ్ = విడువబడిన శాపము కలదై, చైత్రరథమ్ = చైత్రరథ మనెడు, వనమ్ = వనము, యథా = ఎట్లో, అట్లే, రమణీయమ్ = సుందర మైనదై, విబభ్రాజ = ప్రకాశించెను.

తా. ఆ వనముకూడ, ఆ దినమునందే శాపమునుండి విముక్తమై కుబేరుని చైత్రరథోద్యానము వలె సుందరమై ప్రకాశించెను. 35

మూ. నిహత్య తాం యక్షసుతాం స రామః
ప్రశస్యమానః సురసిద్ధ సంఘైః,
ఉవాస తస్మిన్మునినా సహైవ,
ప్రభాతవేలాం ప్రతిబోధ్యమానః. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షడ్వింశః సర్గః.

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, తామ్ = ఆ, యక్షసుతామ్ = యక్షుని కుమార్తెను, నిహత్య = చంపి, సురసిద్ధసంఘైః = దేవతలయొక్కయు సిద్ధుల యొక్కయు సంఘములచేత, ప్రశస్యమానః = ప్రశంసింపబడు చున్నవాడై, మునినా సహ = విశ్వామిత్రునితో కూడ, తస్మిన్నేవ = ఆ వనమునందే, ప్రభాతవేళామ్ = ప్రాతఃకాలమున, ప్రతిబోధ్యమానః = మేల్కొలుపబడు చున్నవాడై, ఉవాస = నివసించెను.

తా. రాముడు తాటకను చంపి, దేవతలు సిద్ధులు మొదలగు వారిచే ప్రశంసింపబడుచు, విశ్వామిత్రునితో ఆ రాత్రి, ఆ వనమునందే వసించెను. ప్రభాతసమయమున విశ్వామిత్రుడు అతనిని మేల్కొలిపెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యయందు బాలకాండలో
ఇరువది యారవ సర్గ సమాప్తము.

# అథ సప్తవింశః సర్గః

మూ. అథ తాం రజనీముష్య విశ్వామిత్రో మహాయశాః,
ప్రహస్య రాఘవం వాక్యమువాచ మధురాక్షరమ్. 1

ప్ర. అ. అథ = పిమ్మట, మహాయశాః=గొప్ప కీర్తి గల, విశ్వామిత్రః= విశ్వామిత్రుడు, తాం రజనీమ్ = ఆ రాత్రి, ఉష్య = ఉండి, ప్రహస్య=నవ్వి, రాఘవమ్=రాముని గూర్చి, మధురాక్షరమ్ = మధురమైన అక్షరములు కలిగిన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మహాయశస్సుగల విశ్వామిత్రుడు ఆ రాత్రి అచట నివసించి, మరు నాడు, చిరునవ్వు నవ్వుచు, రామునితో, మధురముగ ఇట్లనెను.

పరితుష్టోఽస్మి భద్రం తే రాజపుత్ర మహాయశః,
ప్రీత్యా పరమయా యుక్తో దదామ్యస్త్రాణి సర్వశః. 2

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర=రామా, పరితుష్టః = సంతోషించినవాడను, అస్మి = అయినాను, తే = నీకు, భద్రమ్ = క్షేమము అగు గాక. పరమయా = గొప్ప, ప్రీత్యా = ప్రేమతో, యుక్తః = కూడినవాడనై, అస్త్రాణి=అస్త్రములను, సర్వశః=పూర్తిగా, దదామి=ఇచ్చెదను.

తా. గొప్ప కీర్తి గల రామా! నాకు చాల సంతోషము కలిగినది. నీకు క్షేమ మగుగాక. నీకు ప్రేమపూర్వకముగా అస్త్రములను పూర్తిగ ఇచ్చెదను. 2

మూ. దేవాసురగణాన్వాపి సగన్ధర్వోరగానపి,
యైరమిత్రాన్ ప్రసహ్యాజౌ వశీకృత్య జయిష్యసి, 3
తాని దివ్యాని భద్రం తే దదామ్యస్త్రాణి సర్వశః.

ప్ర. అ. యైః=ఏ అస్త్రములచేత, దేవాసురగణాన్వాపి=దేవాసురసముదాయము నైనను, సగన్ధర్వోరగానపి = గంధర్వులతో కూడిన ఉరగులనైనను, అమిత్రాన్ = శత్రువులను, ఆజౌ = యుద్ధమునందు, ప్రసహ్య = బలాత్కారముగ,

వశీకృత్య = వశము చేసికొని, జయిష్యసి = జయింపగలవో, తాని = అట్టి, దివ్యాని=దివ్యములైన, అస్త్రాణి=అస్త్రములను, సర్వశః = పూర్తిగా, దదామి = ఇచ్చెదను. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక.

తా. దేవ-అసుర-గంధర్వ ఉరగాదులు ఎవ్వరు శత్రువులుగా వచ్చినను యుద్ధరంగమునందు, వేటి సాహాయ్యముచే, వారిని బలాత్కారముగ వశము చేసికొని జయింపగలవో, అట్టి, దివ్యాస్త్రములను పరిపూర్ణముగ నీకివ్వగలను. నీకు క్షేమ మగుగాక. 3

మూ. దణ్డచక్రం మహద్దివ్యం తవ దాస్యామి రాఘవ, 4
ధర్మచక్రం తతో వీర కాలచక్రం తథైవ చ,
విష్ణుచక్రం తథాత్యుగ్రమైన్ద్రమస్త్రం తథైవ చ. 5
వజ్రమస్త్రం నరశ్రేష్ఠ శైవం శూలవరం తథా,
అస్త్రం బ్రహ్మశిరశ్చైవ ఐషీకమపి రాఘవ. 6
దదామి తే మహాబాహో బ్రాహ్మమస్త్రమనుత్తమమ్.

ప్ర. అ. రాఘవ=రామా! మహత్=గొప్పదైన, దివ్యమ్=దివ్య మైన, దణ్డచక్రమ్=దండచక్రమును, తవ=నీకు, దాస్యామి=ఇవ్వగలను. నరశ్రేష్ఠ= నరులలో శ్రేష్ఠుడా, మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! వీర=ఓవీరుడా, రాఘవ = రామా ! తతః = పిమ్మట, ధర్మచక్రమ్ = ధర్మచక్రమును, తథైవ చ=మరియు, కాలచక్రమ్ = కాలచక్రమును, తథా = మరియు, విష్ణుచక్రమ్ = విష్ణుచక్రమును, తథైవ చ = మరియు, ఐన్ద్రమ్ అస్త్రమ్ = ఐంద్రాస్త్రమును, వజ్రమ్ అస్త్రమ్=వజ్రాస్త్రమును, తథా=మరియు, శైవమ్=శివుని సంబంధమైన, శూలవరమ్ = శ్రేష్ఠ మైన శూలమును, బ్రహ్మశిరః = బ్రహ్మశిరస్సు అనెడు, అస్త్రమ్=అస్త్రమును, ఐషీకమపి=ఐషీకాస్త్రమును, అనుత్తమమ్=అతిశ్రేష్ఠమైన, బ్రాహ్మమ్ అస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, తే=నీకు, దదామి=ఇచ్చెదను.

తా. నరశ్రేష్ఠుడవు, మహాబాహుడవు అయిన ఓ రామా ! నీకు-ధర్మచక్ర-కాలచక్ర-విష్ణుచక్రములను, అత్యుగ్ర మైన ఇంద్రాస్త్రమును, వజ్రాస్త్రమును, శివుని శ్రేష్ఠ మైన శూలమును, బ్రహ్మశిరోస్త్రమును, ఐషీకాస్త్రమును, అత్యుత్తమ మైన బ్రహ్మాస్త్రమును ఇచ్చెదను.

మూ. గదే ద్వే చైవ కాకుత్స్థ మోదకీ శిఖరీ ఉభే,
ప్రదీప్తే నరశార్దూల ప్రయచ్ఛామి నృపాత్మజ. 7

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు జన్మించిన నరశార్దూల = నరశ్రేష్ఠు డైన, నృపాత్మజ=రామా! ప్రదీప్తే=ప్రజ్వలించుచున్న, ద్వే=రెండు, మోదకీ శిఖరీ = మోదకి శిఖరి అనెడు, గదే = గదలను, ఉభే=రెండింటినీ, ప్రయచ్ఛామి=ఇచ్చెదను.

తా. నరశ్రేష్ఠుడ వైన రామా! మోదకి, శిఖరి అనెడు ప్రజ్వరిల్లు చున్న రెండు గదలను కూడ ఇచ్చెదను. 7

మూ. ధర్మపాశమహం రామ కాలపాశం తథైవ చ, 8
పాశం వారుణమస్త్రం చ దదామ్యహమనుత్తమమ్.

ప్ర. అ. రామ=రామా! అహమ్=నేను, ధర్మపాశమ్=ధర్మపాశమును, తథైవ చ = మరియు, కాలపాశమ్ = కాలపాశమును, వారుణమ్ = వరుణునికి సంబంధించిన, పాశమ్ = పాశమును, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, అస్త్రం చ=అస్త్రమును దదామి=ఇచ్చెదను.

తా. రామా! నేను ధర్మపాశమును, కాలపాశమును, వారుణపాశమును, గొప్ప దైన వారుణాస్త్రమును ఇచ్చెదను.

మూ. అశనీ ద్వే ప్రయచ్ఛామి శుష్కార్ద్రే రఘునన్దన,
దదామి చాస్త్రం పైనాకమస్త్రం నారాయణం తథా. 9

ప్ర. అ. రఘునన్దన = రామా, శుష్కార్ద్రే = శుష్కము (ఎండుది), ఆర్ద్రము (తడిది) అనెడు, ద్వే = రెండు, అశనీ = పిడుగులను, పైనాకమ్ అస్త్రమ్ = పైనాకాస్త్రమును, తథా = మరియు, నారాయణమ్ అస్త్రమ్= నారాయణాస్త్రమును, దదామి=ఇచ్చెదను.

తా. రామా! శుష్కము, ఆర్ద్రము అనెడు రెండు పిడుగులను, పైనాకాస్త్రమును, నారాయణాస్త్రమును ఇచ్చెదను. 9

మూ. ఆగ్నేయమస్త్రం దయితం శిఖరం నామ నామతః, 10
వాయవ్యం ప్రథనం నామ దదామి చ తవానఘ.

ప్ర. అ. అనఘ=దోషరహితుడా, నామతః=పేరుచేత, శిఖరం నామ=శిఖర మను పేరుగల, దయితమ్=అగ్నికి ఇష్టమైన, అగ్నేయమ్ అస్త్రమ్=అగ్నిదేవతాక మైన అస్త్రమును, ప్రథనం నామ=ప్రథన మను పేరు గల, వాయవ్యమ్=వాయవ్యాస్త్రమును, తవ=నీకు, దదామి=ఇచ్చెదను. 10

తా. దోషరహితుడ వైన రామా! శిఖర మను పేరు గలదియు, అగ్నికి చాల ఇష్ట మైనదియు అగు ఆగ్నేయాస్త్రమును, ప్రథన మను పేరు గల వాయవ్యాస్త్రమును ఇచ్చెదను.

మూ. అస్త్రం హయశిరో నామ క్రౌఞ్చమస్త్రం తథైవ చ. 11
శక్తిద్వయం చ కాకుత్స్థ దదామి తవ రాఘవ.

ప్ర. అ. కాకుత్స్థ=కకుత్స్థవంశోద్భవుడ వైన, రాఘవ = రామా, హయశిరో నామ=హయశిరస్సు అను పేరు గల, అస్త్రమ్=అస్త్రమును, తథైవ చ=మరియు, క్రౌఞ్చమ్ అస్త్రమ్ = క్రౌంచాస్త్రమును, శక్తిద్వయం చ=రెండు శక్తులను, తవ=నీకు, దదామి=ఇచ్చెదను.

తా. కకుత్స్థవంశోద్భవుడ వైన రామా! హయశిరస్సు అను అస్త్రమును, క్రౌంచాస్త్రమును, రెండు శక్తులను ఇచ్చెదను. 11

మూ. కఙ్కాళం ముసలం ఘోరం కాపాలమథ కఙ్కణమ్,
ధారయన్త్యసురా యాని దదామ్యేతాని సర్వశః. 12

ప్ర. అ. ఘోరమ్=భయంకర మైన, కఙ్కాళమ్=కంకాళ మనెడు, ముసలమ్=రోకలిని, కాపాలమ్=కాపాల మనెడు ముసలమును, అథ=మరియు, కఙ్కణమ్=కంకణ మనెడు ముసలమును, యాని=వేటిని, అసురాః=అసురులు, ధారయన్తి=ధరింతురో, ఏతాని=అట్టి, ఈ ముసలములను, సర్వశః=పూర్తిగా, దదామి=ఇచ్చెదను.

తా. అసురులు ధరించు కంకాళము, కాపాలము, కంకణము అను ముసలములను గూడ పూర్తిగ ఇచ్చెదను. 12

మూ. వైద్యాధరం మహాస్త్రం చ నన్దనం నామ నామతః,
అసిరత్నం మహాబాహో దదామి చ నృపాత్మజ. 13

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, నృపాత్మజ = ఓరాజ కుమారా! వైద్యాధరమ్=వైద్యాధరమనెడు, మహాస్త్రం చ=మహాస్త్రమును, నామతః=పేరుచేత, నన్దనం నామ=నందన మనెడు, అసిరత్నమ్=శ్రేష్ఠ మైన ఖడ్గమును, దదామి=ఇచ్చెదను.

తా. వైద్యాధర మనెడు మహాస్త్రమును నందన మనెడు శ్రేష్ఠమైన ఖడ్గమును ఇచ్చెదను. 13

మూ. గాన్ధర్వమస్త్రం దయితం మానవం నామ నామతః,
ప్రస్వాపనప్రశమనే దద్మి సౌరం చ రాఘవ. 14

ప్ర. అ. రాఘవ = రామా! గాన్ధర్వమ్=గాన్ధర్వ మనెడు, అస్త్రమ్ = అస్త్రమును, నామతః=పేరుచేత, మానవం నామ=మానవ మనెడు, దయితమ్= ఇష్టమైన అస్త్రమును, ప్రస్వాపన ప్రశమనే = నిద్రకలిగించునదియు నిద్ర తొలగించునదియు అగు రెండు (గాంధర్వమానవ) అస్త్రములను, సౌరం చ = సౌరాస్త్రమును, దద్మి=ఇచ్చెదను.

తా. రామా! నిద్ర కలిగించునదియు, నిద్ర తొలగించునదియు అగు గాంధర్వమానవాస్త్రములను సౌరాస్త్రమును ఇచ్చెదను. 14

మూ. దర్పణం శోషణం చైవ సన్తాపనవిలాపనే, 15
మదనం చైవ దుర్ధర్షం కందర్పదయితం తథా,

పైశాచమస్త్రం దయితం మోహనం నామ నామతః, 16
ప్రతీచ్ఛ నరశార్దూల రాజపుత్ర మహాయశః.

ప్ర. అ. మహాయశః=గొప్ప యశస్సు కలవాడా, నరశార్దూల = నరశ్రేష్ఠుడా, రాజపుత్ర = రామా! దర్పణమ్ = గర్వింపచేయు దర్పణాస్త్రమును, శోషణం చైవ=ఎండింపచేయు శోషణాస్త్రమును, సంతాపన విలాపనే = తాప

మును కలిగించు సంతాపనాస్త్రమును విలపింపచేయు విలాపనాస్త్రమును, తథా= మరియు, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని, కన్దర్పదయితమ్ = మన్మథునికి ఇష్టమైన, మదనం చ=మదనాస్త్రమును, నామతః= పేరుచేత, మోహనం నామ= మోహనమను ప్రసిద్ధి గల, దయితమ్ = పిశాచములకు ఇష్టమైన, పైశాచమ్ అస్త్రమ్=పిశాచములకు సంబంధించిన అస్త్రమును, ప్రతీచ్ఛ = తీసికొనుము.

తా. నరశ్రేష్ఠుడవును, కీర్తిమంతుడవును, అగు రామా ! దర్పణ-శోషణ-సంతాపన-విలాపనాస్త్రములను, మన్మథునకు ఇష్ట మైనదియు ఎదిరింప శక్యము కానిదియు అగు మదనాస్త్రమును, పిశాచములకు సంబంధించినదియు, వారికి ఇష్టమైనదియు అగు మోహనాస్త్రమును, గ్రహింపుము. 16

మూ. తామసం నరశార్దూల సౌమనం చ మహాబల, 17
సంవర్ధం చైవ దుర్ధర్షం మౌసలం చ నృపాత్మజ,
సత్యమస్త్రం మహాబాహో తథా మాయాధరం పరమ్, 18
ఘోరం తేజఃప్రభం నామ త్వష్టురస్త్రం సుదామనమ్,
దారుణం చ భగస్యాపి శితేషుమథ మానవమ్.

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా, మహాబల=గొప్ప బలము కలవాడా, నృపాత్మజ=రామా, తామసమ్=తామసాస్త్రమును, సౌమనం చైవ = సౌమనాస్త్రమును, దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము కాని, సంవర్ధం చైవ=సంవర్ధాస్త్రమును, మౌసలమ్=మౌసలాస్త్రమును, సత్యమ్ అస్త్రమ్=సత్యాస్త్రమును, పరమ్=శ్రేష్ఠ మైన, మాయాధరమ్=మాయాధరాస్త్రమును, పరతేజోప కర్షణమ్=పరుల తేజస్సును లాగివేయు, ఘోరమ్=భయంకర మైన, తేజః ప్రభం నామ = తేజః ప్రభ మనెడి అస్త్రమును, శిశిరం నామ=శిశిరమనెడి పేరు గల, సౌమ్యాస్త్రమ్=సోమదేవతాకమైన అస్త్రమును, సుదామనమ్= సుదామన మను పేరు గల, త్వష్టుః=త్వష్టయొక్క, అస్త్రమ్=అస్త్రమును, భగస్య = భగునియొక్క, దారుణమ్ = భయంకర మైన, శితేషుమ్=వాడి యైన బాణ రూపములో నున్న శితేష్వస్త్రమును, అథ=మరియు, మానవమ్= మానవాస్త్రమును, ప్రతీచ్ఛస్వ=గ్రహింపుము.

తా. ఓ నరశ్రేష్ఠుడా, మహాబలశాలీ! రామా! తామససౌమనాస్త్రములను, ఎదిరింప శక్యము కాని సంవర్ధాస్త్రమును, మౌసలాస్త్రమును, సత్యాస్త్రమును,

మాయాధరాస్త్రమును, ఇతరుల తేజస్సును ఆకర్షించు ఘోర మైన తేజః ప్రభాస్త్రమును, సోమదేవతాక మైన శిశిరాస్త్రమును, త్వష్టృదేవతాకమైన సుదామనాస్త్రమును, భగునియొక్క దారుణ మైన శితేషువు (బాణము)ను, మరియు మానవాస్త్రమును గ్రహింపుము.

మూ. ఏతాన్ రామ మహాబాహో కామరూపాన్ మహాబలాన్, 20
గృహాణ పరమోదారాన్ క్షిప్రమేవ నృపాత్మజ.

ప్ర. అ. మహాబాహో = గొప్పబాహువులు కలవాడా ! నృపాత్మజ= రాజకుమారా ! రామ=రామా ! కామరూపాన్=స్వేచ్ఛాధీన రూపములుగల, మహాబలాన్=గొప్పబలముగల, పరమోదారాన్=చాల గొప్ప వైన, ఏతాన్= ఈ అస్త్రములను, క్షిప్రమేవ=శీఘ్రముగ, గృహాణ=తీసికొనుము.

తా. మహాబాహూ ! రాజకుమారా ! రామా ! ఇష్టము వచ్చిన రూప ములు ధరింపగలవియు, చాల గొప్పవియు, గొప్ప బలము కలవియు అగు ఈ అస్త్రములను వెంటనే గ్రహింపుము. 20

మూ. స్థితస్తు ప్రాఙ్ముఖో భూత్వా శుచిర్మునివరస్తదా, 21
దదౌ రామాయ సుప్రీతో మన్త్రగ్రామమనుత్తమమ్.

ప్ర. అ. తదా = అపుడు, మునివరః = మునిశ్రేష్ఠుడు, శుచిః = పరి శుద్ధుడై, ప్రాఙ్ముఖః=తూర్పువైపు ముఖము కలవాడుగా, స్థితః=ఉన్నవాడు, భూత్వా=అయి, సుప్రీతః=చాల ప్రసన్నుడై, రామాయ=రామునకు, అను త్తమమ్=చాల ఉత్తమ మైన, మన్త్రగ్రామమ్=మంత్రసముదాయమును, దదౌ= ఇచ్చెను.

తా. అపుడు మునిశ్రేష్ఠు డైన విశ్వామిత్రుడు శుచియై ప్రసన్నచిత్తుడై, పూర్వాభిముఖుడై అత్యుత్తమ మగు అస్త్రసముదాయమును రామున కిచ్చెను.

మూ. సర్వసంగ్రహణం తేషాం దైవతైరపి దుర్లభమ్, 22
తాన్యస్త్రాణి తదా విప్రో రాఘవాయ న్యవేదయత్.

ప్ర. అ. తేషామ్=ఏ అస్త్రముల యొక్క, సర్వసంగ్రహణమ్=పరిపూర్ణస్వీకారము, దైవతైరపి=దేవతలచేత కూడ, దుర్లభమ్=దుర్లభ మైనదో, తాని=అట్టి, అస్త్రాణి=అస్త్రములను, తదా=అప్పుడు, విప్రః=విశ్వామిత్రుడు, రాఘవాయ=రామునకు, న్యవేదయత్=తెలిపెను.

ప్ర. అ. ఏ అస్త్రములను సాంగోపాంగములుగ పరిపూర్ణముగ స్వీకరించుట అనునది దేవతలకు కూడ దుర్లభమో అట్టి అస్త్రములను విశ్వామిత్రుడు రామునకు ఇచ్చెను. 22

మూ. జపతస్తు మునేస్తస్య విశ్వామిత్రస్య ధీమతః, 23
ఉపతస్థుర్మహార్హాణి సర్వాణ్యస్త్రాణి రాఘవమ్.

ప్ర. అ. ధీమతః=బుద్ధిశాలి యైన, తస్య=ఆ, విశ్వామిత్రస్య మునేః=విశ్వామిత్రమహాముని, జపతః=జపము చేయుచుండగా, మహార్హాణి=పూజ్యములైన, అస్త్రాణి=అస్త్రములు, సర్వాణి=అన్నియు, రాఘవమ్=రాముని, ఉపతస్థుః=(చేరినవి) సేవించినవి.

తా. ధీమంతుడైన ఆ విశ్వామిత్రుడు జపించు చుండగా, పూజనీయములైన అస్త్రము లన్నియు రాముని సేవించినవి.

మూ. ఊచుశ్చ ముదితాః సర్వే రామం ప్రాఞ్జలయస్తదా, 24
ఇమే స్మః పరమోదారాః కింకరాస్తవ రాఘవ.

ప్ర. అ. పరమోదారాః=మిక్కిలి ఉదారులైన, సర్వే=ఆ అస్త్ర దేవతలందరును, తదా=అప్పుడు, ప్రాఞ్జలయః=దోసిలి కట్టినవారై, ఊచుశ్చ=పలికిరి కూడ. రాఘవ=రామా, ఇమే=ఈ మేము, తవ=నీయొక్క, కింకరాః=కింకరులముగా, స్మః=అయి ఉన్నాము.

తా. పరమోదారులైన ఆ అస్త్రదేవత లందరును, అపుడు, నమస్కరించుచు, "రామా ! మేమందరము నీ కింకరులము" అని పలికిరి.

మూ. ప్రతిగృహ్య చ కాకుత్స్థః సమాలభ్య చ పాణినా, 25
మానసా మే భవిష్యధ్వమితి తానభ్యచోదయత్.

ప్ర. అ. కాకుత్థ్సః=రాముడు, ప్రతిగృహ్యా=స్వీకరించి, పాణినా=హస్తముతో, సమాలభ్య=స్పృశించి, మే=నాయొక్క, మానసాః=మనస్సునందు సంచరించువారుగా, భవిష్యధ్వమ్=అగుదురుగాక, ఇతి=అని, తాన్=వారిని, అభ్యచోదయత్=ఆజ్ఞాపించెను.

తా. రాముడు ఆ అస్త్రములను స్వీకరించి, హస్తముచే ఆ అస్త్రదేవతలను స్పృశించి—"నా మనస్సులో సంచరించుచుందురు గాక" అని ఆ దేవతలను ఆజ్ఞాపించెను.

మూ. తతః ప్రీతమనా రామో విశ్వామిత్రం మహామునిమ్, 26
అభివాద్య మహాతేజాః గమనాయోపచక్రమే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
సప్తవింశః సర్గః.

ప్ర. అ. తతః = పిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, ప్రీతమనాః = సంతోషించిన మనస్సు కలవాడై, విశ్వామిత్రం మహామునిమ్=విశ్వామిత్రమహర్షిని, అభివాద్య = నమస్కరించి, గమనాయ=ప్రయాణము చేయుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. అటుపిమ్మట మహాతేజఃశాలి యగు రాముడు సంతోషించి, విశ్వామిత్రమహర్షికి నమస్కరించి ప్రయాణ మయ్యెను.

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో ఇరువదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశః సర్గః

మూ. ప్రతిగృహ్య తతోఽస్త్రాణి ప్రహృష్టవదనః శుచిః,
గచ్ఛన్నేవ చ కాకుత్స్థో విశ్వామిత్రమథాబ్రవీత్. 1

ప్ర. అ. కాకుత్స్థః=రాముడు, శుచిః=పవిత్రుడై, అస్త్రాణి=అస్త్రములను, ప్రతిగృహ్య=స్వీకరించి, తతః=పిమ్మట, ప్రహృష్టవదనః=వికసించిన ముఖము కలవాడై, గచ్ఛన్నేవ=నడచి వెళ్లుచునే, అథ = అటుపిమ్మట, విశ్వామిత్రమ్= విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు పవిత్రుడై అస్త్రములను గ్రహించి, ఆనందించి, నడచి వెళ్లుచునే విశ్వామిత్రునితో ఇట్లనెను. 1

మూ. గృహీతాస్త్రోఽస్మి భగవన్ దురాధర్షః సురైరపి,
అస్త్రాణాం త్వహమిచ్ఛామి సంహారం మునిపుఙ్గవ. 2

ప్ర. అ. భగవన్=పూజ్యుడా, గృహీతాస్త్రః=గ్రహింపబడిన అస్త్రములు గల నేను, సురైరపి = దేవతలచేత కూడ, దురాధర్షః = ఎదిరింపశక్యముకాని వాడనుగా, అస్మి = అయిఉన్నాను. మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠుడా! అహమ్= నేను, అస్త్రాణామ్ = అస్త్రములయొక్క, సంహారమ్ = ఉపసంహారమును కూడ, ఇచ్ఛామి=తెలుసుకొనగోరుచున్నాను.

తా. పూజ్యుడా, అస్త్రములను స్వీకరించి ఇపుడు నేను దేవతలచేత గూడ ఎదిరింపశక్యముకానివాడనైతిని. మునిశ్రేష్ఠా! అస్త్రముల ఉపసంహారమును కూడ తెలిసికొనగోరుచున్నాను. 2

మూ. ఏవం బ్రువతి కాకుత్స్థే విశ్వామిత్రో మహామునిః,
సంహారం వ్యాజహారాథ ధృతిమాన్ సువ్రతః శుచిః. 3

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువతి=పలుకగా, అథ=పిమ్మట, ధృతిమాన్=ధైర్యవంతుడును, సువ్రతః=మంచి వ్రతము

కలవాడును, శుచిః=పరిశుద్ధుడును అగు, విశ్వామిత్రః మహామునిః=విశ్వామిత్ర మహర్షి, సంహారమ్=ఉపసంహారమును, వ్యాజహార=చెప్పెను.

తా. రాముని మాటలను అంగీకరించి విశ్వామిత్రమహర్షి అస్త్రముల ఉపసంహారమును కూడ ఉపదేశించెను. 3

మూ. సత్యవన్తం సత్యకీర్తిం ధృష్టం రభసమేవ చ,
ప్రతిహారతరం నామ పరాఙ్ముఖమవాఙ్ముఖమ్. 4

లక్షాక్షవిషమౌ చైవ దృఢనాభసునాభకౌ,
దశాక్షశతవక్త్రౌ చ దశశీర్షశతోదరౌ. 5

పద్మనాభమహానాభౌ దున్దునాభసునాభకౌ,
జ్యోతిషం కృశనం చైవ నైరాశ్యవిమలావుభౌ. 6

యోగన్ధరహరిద్రౌ చ దైత్యప్రశమనౌ తథా,
సార్చిర్మాలీ ధృతిర్మాలీ వృత్తిమాన్ రుచిరస్తథా. 7

పితృసౌమనసం చైవ విధూతమకరావుభౌ,
కరవీరకరం చైవ ధనధాన్యౌ చ రాఘవ. 8

కామరూపం కామరుచిం మోహమావరణం తథా,
జృమ్భకం సర్వనాభం చ సన్తానవరణౌ తథా. 9

భృశాశ్వతనయాన్ రామ భాస్వరాన్కామరూపిణః,
ప్రతీచ్ఛ మమ భద్రం తే పాత్రభూతోఽసి రాఘవ. 10

ప్ర. అ. రాఘవ=రఘువంశమునందు పుట్టిన, రామ=రామా, సత్యవన్తమ్=సత్యవంతమును, సత్యకీర్తిమ్ = సత్యకీర్తిని, ధృష్టమ్=ధృష్టమును, రభసమ్=రభసమును, ప్రతిహారతరమ్=ప్రతిహారతరమును, పరాఙ్ముఖమ్ = పరాఙ్ముఖమును, అవాఙ్ముఖమ్=అవాఙ్ముఖమును, లక్షాక్షవిషమౌ=లక్షాక్షమును, విషమమును, దృఢనాభసునాభకౌ=ధృఢనాభమును, సునాభమును, దశాక్షశతవక్త్రౌ చ=దశాక్షమును, శతవక్త్రమును, దశశీర్షశతోదరౌ=దశశీర్ష-శతోదరములను,

పద్మనాభమహానాభౌ=పద్మనాభమును, మహానాభమును, దున్దునాభసునాభకౌ= దుందునాభమును, సునాభమును, జ్యోతిషమ్=జ్యోతిషమును, కృశనం చైవ = కృశనమును, ఉభౌ=రెండు, నైరాశ్యవిమలౌ=నైరాశ్యవిమలములను, యోగంధరహరిద్రౌ చ=యోగంధరమును హరిద్రమును, దైత్యప్రశమనౌ=దైత్యమును, ప్రశమనమును, సార్చిర్మాలీ=సార్చిర్మాలి యనుదానిని, ధృతిః=ధృతిని, మాలీ= మాలిని, వృత్తిమాన్=వృత్తిమంతమును, తథా=మరియు, రుచిరః=రుచిర మను దానిని, పితృసౌమనసం చైవ = పితృసౌమనసమును, ఉభౌ = రెండు, విధూతమకరౌ = విధూతమకరములను, కరవీరకరం చైవ = కరవీరకరమును, ధనధాన్యౌ = ధనధాన్యములను, కామరూపమ్ = కామరూపమును, కామరుచిమ్ = కామరుచిని, మోహమ్ = మోహమును, తథా = మరియు, ఆవరణమ్ = ఆవరణమును, జృమ్భకమ్ = జృంభకమును, సర్వనాభం చ = సర్వనాభమును, తథా=మరియు, సన్తానవరణౌ=సంతానవరణములను, భాస్వరాన్= ప్రకాశించునట్టియు, కామరూపిణః = కామరూపము గల, భృశాశ్వతనయాన్= భృశాశ్వుని కుమారు లైన అస్త్రములను, మమ = నానుండి, ప్రతీచ్ఛ=గ్రహించుము. తే=నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక. పాత్రభూతః = సత్పాత్రవుగా, అసి = అయి ఉన్నావు.

తా. రామా! భృశాశ్వుని కుమారులును, ప్రకాశించునవియు, కామరూపము కలవియు అగు—సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతి, మాలి, వృత్తిమంతము, రుచిరము. పితృ సౌమనసము, విధూతము, మకరము, కరవీర కరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము, అను అస్త్రములను నా వద్ద నుండి స్వీకరించుము. నీకు క్షేమ మగునుగాక, నీవు సత్పాత్ర మైనవాడవు.

మూ. బాఢమిత్యేవ కాకుత్స్థః ప్రహృష్టేనాన్తరాత్మనా,
దివ్యభాస్వరదేహాశ్చ మూర్తిమన్తః సుఖప్రదాః. 11

మూ. కేచిదఙ్గారసదృశాః కేచిద్ధూమోపమా స్తథా,
చన్ద్రార్కసదృశాః కేచి త్ప్రహ్వాఞ్జలిపుటా స్తథా. 12

రామం ప్రాఞ్జలయో భూత్వాఽబ్రువన్ మధురభాషిణః,
ఇమే స్మ నరశార్దూల శాధి కిం కరవామ తే. 13

ప్ర. అ. కాకుత్థ్సః = రాముడు, ప్రహృష్టేన = సంతసించిన, అన్త రాత్మనా = హృదయముతో, "బాఢమ్"=తప్పక (అట్లు చేసెదను)ఇత్యేవ = అని, పలికి, (ఆ అస్త్రములను గ్రహించెను). దివ్యభాస్వరదేహాః చ = దివ్యము లైన ప్రకాశించుచున్న దేహములు కలవారును, మూర్తిమన్తః = మూర్తిని ధరించిన వారును, సుఖప్రదాః = సుఖము నిచ్చువారును, కేచిత్ = కొందరు, అఙ్గార సదృశాః = బొగ్గు వలె నున్నవారును, తథా=మరియు, కేచిత్ = కొందరు, ధూమోపమాః = ధూమము వలె ఉన్నవారును, కేచిత్ = కొందరు, చన్ద్రార్క సదృశాః=చంద్రునితోడను సూర్యునితోడను సమానులును, తథా = మరియు, ప్రహ్వాఞ్జలిపుటాః=వంగిన దోసిళ్లు కలవారును అగు అస్త్రదేవతలు, ప్రాం జలయః భూత్వా = కట్టబడిన దోసిలికలవారయి, మధురభాషిణః=మధురముగా మాటలాడుచున్నవారై, రామమ్=రాముని గూర్చి, అబ్రువన్=పలికిరి. నర శార్దూల=ఓ నరశ్రేష్ఠుడా ! ఇమే స్మః=ఇదిగో, ఇచట నున్నాము. శాధి = అజ్ఞాపించుము. తే=నీకు, కిమ్ = ఏమి, కరవామ = చేయుదుము.

తా. రాముడు సంతసించిన హృదయముతో "అటులనే గ్రహించెదను" అని పలికి ఆ అస్త్రములను గ్రహించెను. ఆ అస్త్రదేవతలలో కొందరు ఎఱ్ఱగా కాలిన బొగ్గునిప్పుల వలె నుండిరి. కొందరు ధూమమువలెను, కొందరు చంద్ర సూర్యుల వలెను ఉండిరి. దివ్యము లైన ప్రకాశించుచున్న దేహములు దాల్చి సుఖమును కలిగించు ఆ అస్త్రదేవతలు, వినయముతో చేతులు కట్టి మధుర ముగా మాటలాడుచు రామునితో ఇట్లనిరి. "ఓ నరశ్రేష్ఠుడా ! ఇదిగో మే మిచట ఉన్నాము. ఏమి చేయవలెనో ఆజ్ఞాపింపుము"

మూ. మానసాః కార్యకాలేషు సాహాయ్యం మే కరిష్యథ,
గమ్యతామితి తానాహ యథేష్టం రఘునన్దనః. 14

ప్ర. అ. మానసాః = నా మనస్సులో నున్నవారలై, కార్యకాలేషు = కార్యసమయములయందు, మే=నాకు, సాహాయ్యమ్=సాహాయ్యమును, కరిష్యథ=చేయగలరు. యథేష్టమ్ = ఇష్టము వచ్చినట్లుగా, గమ్యతామ్=వెళ్లుడు, ఇతి = అని, రఘునన్దనః = రాముడు, తాన్ = ఆ అస్త్రదేవతలను గూర్చి, ఆహ= పలికెను.

తా. "మీరు నా మనస్సులో మెదలుచు పనిపడునప్పుడు నాకు సాహాయ్యము చేయుడు. యథేష్టముగ వెళ్లుడు" అని రాముడు ఆ అస్త్రములతో పలికెను.

మూ. అథ తే రామమామన్త్ర్య కృత్వా చాపి ప్రదక్షిణమ్,
ఏవమస్త్వితి కాకుత్స్థముక్త్వా జగ్ముర్యథాగతమ్. 15

ప్ర. అ. అథ = పిమ్మట, తే = ఆ దేవతలు, ఏవమ్ అస్తు=అటులనే అగుగాక, ఇతి=అని, కాకుత్స్థమ్=రాముని గూర్చి, ఉక్త్వా=పలికి, ప్రదక్షిణమ్=ప్రదక్షిణ నమస్కారమును, కృత్వా = చేసి, రామమ్ = రాముని, ఆమన్త్ర్య = అడిగి, యథాగతమ్=వచ్చినట్లుగనే, జగ్ముః=వెళ్లిరి.

తా. ఆ దేవతలు—"అటులనే చేసెదము" అని పలికి, రామునికి ప్రదక్షిణనమస్కారము చేసి, సెలవు గైకొని, వచ్చినట్లుగనే వెళ్లిపోయిరి. 15

మూ. స చ తాన్ రాఘవో జ్ఞాత్వా విశ్వామిత్రం మహామునిమ్,
గచ్ఛన్నేవాథ మధురం శ్లక్ష్ణం వచనమబ్రవీత్. 16

ప్ర. అ. సః రాఘవః=ఆ రాముడు, తాన్=ఆ ఉపసంహారమంత్రములను, జ్ఞాత్వా=తెలిసికొని, అథ=పిమ్మట, గచ్ఛన్నేవ=నడచుచునే, విశ్వామిత్రం మహామునిమ్ = విశ్వామిత్రమహర్షిని గూర్చి, మధురమ్ = మధురము, శ్లక్ష్ణమ్=మృదువు అయిన, వచనమ్=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు ఉపసంహారమంత్రములను తెలిసికొని, నడచుచునే, విశ్వామిత్రమహర్షితో మధురము, మృదువు అయిన వచనమును పలికెను. 16

మూ. కిం న్వేత న్మేఘసంకాశం పర్వతస్యావిదూరతః,
వృక్షషణ్డమితో భాతి పరం కౌతూహలం హి మే. 17

దర్శనీయం మృగాకీర్ణం మనో రమయతీవ చ,
నానాప్రకారైః శకునైర్వల్గునాదైరలఙ్కృతమ్. 18

ప్ర. అ. ఇతః=ఇటువైపు, పర్వతస్య = పర్వతమునకు, అవిదూరతః = సమీపమున,- మేఘసఙ్కాశమ్=మేఘముతో సమానమైనదియు, దర్శనీయమ్= అందమైనదియు, మృగాకీర్ణమ్=మృగములచే వ్యాప్తమైనదియు, అతీవ= మిక్కిలి, మనోరమమ్ = మనస్సుకు ఆనందము కలిగించునదియు, వల్గునాదైః=మనోహరమైన ధ్వని గల, నానాప్రకారైః = అనేక విధములైన, శకునైః=పక్షులచేత, అలఙ్కృతమ్ = అలంకరించబడినదియు అగు, వృక్షషణ్డమ్=వృక్షసముదాయము, భాతి=ప్రకాశించుచున్నది. ఏతత్=ఇది, కిం ను=ఏమి? మే=నాకు, పరమ్=గొప్ప, కౌతూహలం హి=వేడుక ఉన్నది కదా?

తా. ఇటు వైపు, పర్వతమునకు కొంచెము దూరమున ఒక వృక్షముల గుంపు మేఘమువలె చూడ ముచ్చటగా నున్నది. ఇది మృగములతో నిండియున్నది. చాల మనోరంజకముగ నున్నది. మధురనాదములు గల నానా విధపక్షులు ఇందు సంచరించుచున్నవి. ఇది ఏమి? నాకు వినుటకు చాల కుతూహలముగ నున్నది. 17, 18

మూ. నిస్సృతాః స్మ మునిశ్రేష్ఠ కాన్తారాద్రోమహర్షణాత్,
అనయా త్వవగచ్ఛామి దేశస్య సుఖవత్తయా, 19
సర్వం మే శంస భగవన్ కస్యాశ్రమపదం త్విదమ్.

ప్ర. అ. మునిశ్రేష్ఠ = ఓ మునిశ్రేష్ఠుడా, అనయా = ఈ, దేశస్య = దేశముయొక్క, సుఖవత్తయా=సుఖవంతముగా ఉండుటచేత, రోమహర్షణాత్= గగుర్పాటు కలిగించు, కాన్తారాత్ = అడవినుండి, నిస్సృతాః=బైటకు వచ్చినాము అని, అవగచ్ఛామి=తెలిసికొనుచున్నాను. ఇదమ్=ఇది, కస్య=ఎవనియొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమము? భగవన్=పూజ్యుడా, సర్వమ్=సమస్తమును, మే= నాకు, శంస=చెప్పుము.

తా. ఓ మునిసత్తమా! ఈ ప్రదేశము సుఖకరముగా నుండుటచే

భయంకర మైన ఆ అరణ్యమునుండి బైటకు వచ్చినా మని అనుకొనుచున్నాను. ఈ ఆశ్రమ మెవరిది ? ఓ పూజ్యుడా ! అంతయు నాకు తెలుపుము.

మూ. సంప్రాప్తా యత్ర తే పాపా బ్రహ్మఘ్నా దుష్టచారిణః, 20
తవ యజ్ఞస్య విఘ్నాయ దురాత్మానో మహామునే.
భగవన్ తస్య కో దేశః సా యత్ర తవ యాజ్ఞికీ, 21
రక్షితవ్యా క్రియా బ్రహ్మన్మయా వధ్యాశ్చ రాక్షసాః,
ఏతత్సర్వం మునిశ్రేష్ఠ శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టావింశః సర్గః.

ప్ర. అ. మహామునే=ఓ మహామునీ, భగవన్=ఓ పూజ్యుడా ! బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా ! బ్రహ్మఘ్నాః=బ్రహ్మహత్య చేయువారును, దుష్టచారిణః=దుర్మార్గులును, దురాత్మానః=దుష్టస్వభావులును అగు, తే పాపాః= ఆ పాపాత్ములు, యత్ర=ఎచటికి, తవ=నీయొక్క, యజ్ఞస్య=యజ్ఞము యొక్క, విఘ్నాయ=విఘ్నముకొరకు, సంప్రాప్తాః=వచ్చినారో, తవ=నీ యొక్క, యాజ్ఞికీ=యజ్ఞసంబంధ మైన, క్రియా = క్రియ, మయా = నాచేత, రక్షితవ్యా=రక్షింపదగియున్నదో, రాక్షసాః చ = రాక్షసులు కూడ, వధ్యాః = చంపదగి యున్నారో, తస్య దేశః = ఆ యజ్ఞముయొక్క ప్రదేశము, కః=ఏది? మునిశ్రేష్ఠ = ఓ మునిశ్రేష్ఠుడా ! ప్రభో = ఓ సర్వసమర్థుడా ! అహమ్ = నేను, ఏతత్సర్వమ్ = ఇది అంతయు, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి=కోరు చున్నాను.

తా. పూజ్యుడ వైన ఓ మహామునీ ! బ్రహ్మహత్య చేయువారును, దుర్మార్గులును, దుష్టస్వభావులును అగు ఆ పాపాత్ములు ఎక్కడకు వచ్చి నీ యజ్ఞమునకు విఘ్నము చేయుచుందురు ? నేను నీ యాగమును సంరక్షింప వలసిన ప్రదేశ మేది ? నేను రాక్షసుల నెక్కడ చంపవలసి యున్నది ? సర్వసమర్థుడ వగు ఓ మునిశ్రేష్ఠా ! ఇది యంతయు వినవలె నని కోరుచున్నాను. 20, 21, 22

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
ఇరువదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనత్రింశః సర్గః

మూ. అథ తస్యాప్రమేయస్య తద్వనం పరిపృచ్ఛతః,
విశ్వామిత్రో మహాతేజా వ్యాఖ్యాతుముపచక్రమే. 1

ప్ర. అ. అథ = పిమ్మట, తత్ = ఆ, వనమ్ = వనమును గూర్చి, పరిపృచ్ఛతః = ప్రశ్నించుచున్న, అప్రమేయస్య = అప్రమేయ ప్రభావుడైన, తస్య = ఆ రామునకు, మహాతేజాః = గొప్పతేజస్సుగల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వ్యాఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. ఆ వనమును గూర్చి, అప్రమేయప్రభావు డగు రాముడు ప్రశ్నింపగా, మహాతేజఃశాలి యగు విశ్వామిత్రుడు చెప్పుట కుపక్రమించెను. 1

మూ. ఇహ రామ మహాబాహో విష్ణుర్దేవవరః ప్రభుః,
వర్షాణి సుబహూనీహ తథా యుగశతాని చ, 2
తపశ్చరణయోగార్థమువాస సుమహాతపాః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, రామ = ఓ రామా, ఇహ = ఇచట, దేవవరః = దేవతలలో శ్రేష్ఠుడును, ప్రభుః = సర్వసమర్థుడును, సుమహాతపాః = గొప్ప తపస్సు గలవాడును అగు, విష్ణుః = విష్ణువు, సుబహూని = అనేకమైన, వర్షాణి = సంవత్సరములను, యుగశతాని చ = వందలకొలది యుగములను, తపశ్చరణయోగార్థమ్ = తపస్సు చేయుటకై, ఉవాస = నివసించెను.

తా. మహాబాహువులు గల ఓరామా! దేవతాశ్రేష్ఠుడును, సర్వశక్తుడును అగు విష్ణువు, చాల సంవత్సరముల పాటు, వందలకొలది యుగముల పాటు, మహాతపస్సు చేయుచు ఈ వనములో నివసించెను. 2

మూ. ఏష పూర్వాశ్రమో రామ వామనస్య మహాత్మనః, 3
సిద్ధాశ్రమ ఇతి ఖ్యాతః సిద్ధో హ్యత్ర మహాతపాః.

ప్ర. అ. రామ = రామా, ఏషః = ఇది, మహాత్మనః = మహాత్ముడైన, వామనస్య = వామనునియొక్క, పూర్వాశ్రమః = పూర్వాశ్రమము, సిద్ధాశ్రమః ఇతి=సిద్ధాశ్రమము అని, ఖ్యాతః=ప్రసిద్ధ మైనది. హి=ఏలననగా, మహాతపాః= గొప్ప తపస్సు గల కాశ్యపుడు, అత్ర=ఇచట, సిద్ధః = తపస్సిద్ధిని పొందెను.

తా. రామా! ఇది వామనావతారమునకు పూర్వము వామనుడు (విష్ణువు) నివసించిన ఆశ్రమము. ఇచట కాశ్యపుడు తపస్సిద్ధి పొందుటచే దీనికి సిద్ధాశ్రమ మని పేరు.

మూ. ఏతస్మిన్నేవ కాలే తు రాజా వైరోచనిర్బలిః, 4
నిర్జిత్య దైవతగణాన్ సేన్ద్రాంశ్చ సమరుద్గణాన్,
కారయామాస తద్రాజ్యం త్రిషు లోకేషు విశ్రుతః. 5

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, కాలే ఏవ = కాలమునందే, వైరోచనిః=విరోచనునికుమారు డైన, రాజా = రాజైన, బలిః = బలి, సేన్ద్రాన్=ఇంద్రునితో కూడిన, సమరుద్గణాన్=మరుత్తుల గణములతో కూడిన, దైవతగణాన్=దేవతా సముదాయములను, నిర్జిత్య = జయించి, త్రిషు = మూడు, లోకేషు=లోకముల యందు, విశ్రుతః=ప్రసిద్ధుడై, తత్=ఆ, రాజ్యమ్=రాజ్యమును, కారయామాస= చేసెను.

తా. విష్ణువు ఈ ఆశ్రమములో తపస్సు చేయుచున్న కాలమున, విరోచనుని కుమారు డైన బలిచక్రవర్తి ఇంద్ర-మరుద్గణాదిసహితముగా దేవతలను జయించి, మూడు లోకములలో ప్రసిద్ధుడై, రాజ్య మేలెను. 4, 5

మూ. బలేస్తు యజమానస్య దేవాః సాగ్నిపురోగమాః,
సమాగమ్య స్వయం చైవ విష్ణుమూచురిహాశ్రమే. 6

ప్ర. అ. బలేః=బలిచక్రవర్తి, యజమానస్య=యాగము చేయుచుండగా, సాగ్నిపురోగమాః = అగ్నిదేవుడు ముందు గల, దేవాః=దేవతలు, ఇహ=ఈ, ఆశ్రమే = ఆశ్రమమునందు, విష్ణుమ్=విష్ణువును, స్వయమ్=స్వయముగ, సమాగమ్య=సమీపించి, ఊచుః=పలికిరి.

తా. బలిచక్రవర్తి యాగము చేయుచుండగా అగ్ని మొదలైన దేవతలు ఈ ఆశ్రమములో నున్న విష్ణువును సమీపించి ఇట్లు పలికిరి. 6

మూ. బలిర్వైరోచనిర్విష్ణో యజతే యజ్ఞముత్తమమ్,
అసమాప్తే క్రతౌ తస్మిన్స్వకార్యమభిపద్యతామ్. 7

ప్ర. అ. విష్ణో=ఓ విష్ణూ, వైరోచనిః = విరోచని కుమారుడైన, బలిః = బలిచక్రవర్తి, ఉత్తమమ్ = గొప్ప, యజ్ఞమ్ = యజ్ఞమును, యజతే = చేయుచున్నాడు. తస్మిన్ = ఆ, క్రతౌ = యజ్ఞము, అసమాప్తే = సమాప్తము కాకుండగనే, స్వకార్యమ్=స్వకార్యము, అభిపద్యతామ్ = సంపాదింపబడుగాక.

తా. ఓవిష్ణూ, విరోచనుని పుత్రుడైన బలి గొప్ప యజ్ఞము చేయుచున్నాడు. ఆ యజ్ఞము పూర్తి కాక మునుపే స్వకార్యమును, అనగా నీవార మగు మా కార్యమును, సంపాదింపుము. 7

మూ. యే చైనమభివాఞ్ఛన్తి యాచితార ఇతస్తతః,
యచ్చ యత్ర యథావచ్చ సర్వం తేభ్యః ప్రయచ్ఛతి. 8

ప్ర. అ. యే = ఏ, యాచితారః = యాచకులు, ఇతస్తతః=ఇటునుంచి అటునుంచి, ఏనమ్ = ఈతనిని, అభివాఞ్ఛన్తి = కోరుచున్నారో, యచ్చ = ఏది, యత్ర = ఎచట, యథావచ్చ=ఏ విధముగ ఉన్నదో, సర్వమ్=దాని నంతను, తేభ్యః = వారలకు, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాడు.

తా. నలుమూలలనుండి వచ్చిన యాచకులు, ఇతనిని యాచించినచో, ఏది ఎచట, ఏ విధముగ నున్నదో దాని నంతను అచట ఆ విధముగనే ఇచ్చివేయుచున్నాడు. 8

మూ. స త్వం సురహితార్థాయ మాయాయోగముపాగతః,
వామనత్వం గతో విష్ణో కురు కల్యాణముత్తమమ్. 9

ప్ర. అ. విష్ణో = ఓ విష్ణూ, సః త్వమ్ = అట్టి నీవు, సురహితార్థాయ= దేవతల హితముకొరకై, మాయాయోగమ్=మాయాసంబంధమును, ఉపాగతః=

పొందినవాడవై, వామనత్వమ్=వామనత్వమును, గతః=పొందినవాడవై, ఉత్తమమ్ = ఉత్తమ మైన, కల్యాణమ్=కల్యాణమును, కురు = చేయుము.

తా. ఓ విష్ణూ! నీవు దేవతల హితముకొరకై మాయచే వామనరూపము దాల్చి, ఉత్తమ మైన కల్యాణకరకార్యమును చేయుము. 9

మూ. ఏతస్మిన్నన్తరే రామ కాశ్యపోఽగ్నిసమప్రభః,
అదిత్యా సహితో రామ దీప్యమాన ఇవౌజసా. 10

దేవీసహాయో భగవాన్ దివ్యం వర్షసహస్రకమ్,
వ్రతం సమాప్య వరదం తుష్టావ మధుసూదనమ్. 11

ప్ర. అ. రామ=రామా! ఏతస్మిన్ అన్తరే=ఈ మధ్య, అగ్నిసమప్రభః= అగ్నితో సమాన మైన కాంతి గలవాడును, అదిత్యా=అదితితో, సహితః=కూడినవాడును, ఓజసా=కాంతిచేత, దీప్యమానః ఇవ = మండుచున్నవాడువలె ఉన్నవాడును, భగవాన్ = భగవంతుడును అగు, కాశ్యపః = కాశ్యపుడు, అదిత్యా= అదితితో, సహితః=కూడినవాడై, దివ్యం వర్షసహస్రకమ్ = వేయి దేవతా సంవత్సరములు, వ్రతమ్ = వ్రతమును, సమాప్య = పూర్తిచేసికొని, వరదమ్ = వరములనిచ్చు, మధుసూదనమ్=విష్ణువును, తుష్టావ=స్తుతించెను.

తా. రామా! ఇంతలో, అగ్నితో సమాన మైన కాంతికలవాడు, అదితితో కూడినవాడు, తేజస్సుతో దేదీప్యమానుడు, మాహాత్మ్యము కలవాడును అయిన కాశ్యపుడు వేయి దివ్యవర్షములు చేసిన వ్రతమును భార్యాసాహాయ్యముతో పూర్తి చేసికొని, వరదు డైన మహావిష్ణువును స్తుతించెను. 10, 11

మూ. తపోమయం తపోరాశిం తపోమూర్తిం తపాత్మకమ్,
తపసా త్వాం సుతప్తేన పశ్యామి పురుషోత్తమమ్. 12

ప్ర. అ. తపోమయమ్ = అత్యధిక మగు తపస్సు కలవాడవు, తపోరాశిమ్=తపస్సుయొక్క రాశివి, తపోమూర్తిమ్ = తపస్సే మూర్తిగా కలవాడవు, తపాత్మకమ్ = తపఃస్వరూపుడవు, పురుషోత్తమమ్ = పురుషశ్రేష్ఠుడవు అయిన, త్వామ్ = నిన్ను, సుతప్తేన = బాగుగా చేయబడిన, తపసా = తపస్సుచేత, పశ్యామి=చూచుచున్నాను.

తా. ఓ పురుషోత్తమా! నీవు తపోమయుడవు. తపస్సుయొక్క రాశివి. తపస్సు నీ మూర్తి. నీవు తపః స్వరూపుడవు. అట్టి నిన్ను బాగుగ తపస్సు చేసి నేడు నేను చూడగలుగుచున్నాను. 12

వి. 'తపః' శబ్దమునకు జ్ఞాన మని అర్థము గ్రహించి విష్ణువు జ్ఞానమయుడు, జ్ఞానరాశి, జ్ఞానమూర్తి, జ్ఞానస్వరూపుడు అని కొందరు అర్థము చెప్పిరి.

మూ. శరీరే తవ పశ్యామి జగత్సర్వమిదం ప్రభో,
త్వమనాదిరనిర్దేశ్యస్త్వామహం శరణం గతః. 13

ప్ర. అ. ప్రభో=ఓ ప్రభూ! తవ = నీయొక్క, శరీరే = శరీరమునందు, ఇదమ్ = ఈ, సర్వం జగత్ = సకలజగత్తును, పశ్యామి = చూచుచున్నాను. త్వమ్ = నీవు, అనాదిః = ఆదిలేనివాడవు; అనిర్దేశ్యః = వర్ణింపశక్యముకాని వాడవు. అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, శరణం గతః = శరణు పొందినాను.

తా. ఓ ప్రభూ, ఈ ప్రపంచము నంతను నీ శరీరములో చూచుచున్నాను. నీకు ఆది లేదు. నీ విట్టివాడ వని వర్ణింప శక్యము కాదు. నిన్ను నేను శరణు జొచ్చుచున్నాను. 13

మూ. తమువాచ హరిః ప్రీతః కాశ్యపం ధూతకల్మషమ్,
వరం వరయ భద్రం తే వరార్హోఽసి మతో మమ. 14

ప్ర. అ. హరిః = విష్ణువు, ప్రీతః=సంతసించినవాడై, ధూతకల్మషమ్= తొలగింపబడిన పాపములు గల, తమ్ = ఆ, కాశ్యపమ్ = కాశ్యపుని గూర్చి, ఉవాచ = పలికెను. వరమ్ = వరమును, వరయ = కోరుము, తే = నీకు, భద్రమ్ = క్షేమము అగుగాక. వరార్హః = వరమునకు తగినవాడవుగా, మమ = నాకు, మతః = ఇష్టుడవు, అసి = అయి ఉన్నావు.

తా. విష్ణువు సంతోషించి ఎట్టి పాపములును లేని ఆ కాశ్యపునితో ఇట్లనెను. వరమును కోరుకొనుము. నీకు క్షేమ మగుగాక. నీవు వరము నీయ దగిన వాడవని నేను నమ్ముచున్నాను. 14

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య మారీచః కాశ్యపోఽబ్రవీత్,
అదిత్యా దేవతానాం చ మమ చైవానుయాచతః, 15
వరం వరద సుప్రీతో దాతుమర్హసి సువ్రత.

ప్ర. అ. తస్య = విష్ణువుయొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, మారీచః = మరీచుని కుమారుడైన, కాశ్యపః = కాశ్యపుడు, అబ్రవీత్=పలికెను. వరద=వరములనిచ్చువాడా, సువ్రత = మంచి వ్రతము కలవాడా, అదిత్యాః = అదితికిని, దేవతానాం చ = దేవతలకును, అనుయాచతః = వారందరిని అనుసరించి యాచించుచున్న, మమ చ = నాకును, సుప్రీతః = బాగుగ అనుగ్రహించినవాడవై, వరమ్ = వరమును, దాతుమ్= ఇచ్చుటకు, అర్హసి=తగియున్నావు.

తా. మరీచుని కుమారుడైన కాశ్యపుడు విష్ణువు మాటలు విని ఇట్లు పలికెను. ఓ వరదుడా, మంచి వ్రతము కలవాడా, నీవు అనుగ్రహించి, అదితికిని, దేవతలకును, వారితో పాటు నిన్ను ప్రార్థించుచున్న నాకును వరము నిమ్ము. 15

మూ. పుత్రత్వం గచ్ఛ భగవన్నదిత్యా మమ చానఘ. 16
భ్రాతా భవ యవీయాంస్త్వం శక్రస్యాసురసూదన,
శోకార్తానాం తు దేవానాం సాహాయ్యం కర్తుమర్హసి. 17

ప్ర. అ. భగవన్=భగవంతుడా, అనఘ = దోషములు లేనివాడా, అదిత్యాః = అదితికిని, మమ చ=నాకును, పుత్రత్వమ్ = పుత్రత్వమును, గచ్ఛ= పొందుము. అసురసూదన=అసురసంహారము చేయువాడా, త్వమ్ = నీవు, శక్రస్య=దేవేంద్రునకు, యవీయాన్=చిన్నవాడైన, భ్రాతా=సోదరుడవుగా, భవ=అగుము. శోకార్తానామ్ = శోకముచే ఆర్తులైన, దేవానామ్=దేవతలకు, సాహాయ్యమ్=సాహాయ్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. ఓ భగవంతుడా, దోషరహితుడా, అదితికిని, నాకును పుత్రుడవగుము. ఓ శత్రుసూదనా, దేవేంద్రునకు తమ్ముడవగుము. శోకపీడితులైన దేవతలకు సాహాయ్యము చేయుము. 16, 17

మూ. అయం సిద్ధాశ్రమో నామ ప్రసాదాత్తే భవిష్యతి,
సిద్ధే కర్మణి దేవేశ ఉత్తిష్ఠ భగవన్నితః. 18

ప్ర. అ. దేవేశ=ఓదేవతాప్రభూ, కర్మణి = నా తపస్సు, సిద్ధే = సఫలమైన దగుచుండగా, అయమ్ = ఇది, తే = నీయొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, సిద్ధాశ్రమో నామ=సిద్ధాశ్రమ మను పేరు గలది, భవిష్యతి= కాగలదు. భగవన్=ఓ భగవంతుడా, ఇతః = ఇచటినుండి, ఉత్తిష్ఠ=లెమ్ము.

తా. నీవు నాకు పుత్రుడవుగ జనించుటచే నా తపస్సు సఫలము కాగానే ఇది నీ అనుగ్రహమువలన సిద్ధాశ్రమ మను పేరు గలది కాగలదు. భగవంతుడా! ఇచటినుండి లెమ్ము. నా పుత్రుడవు అగుము. 18

మూ. అథ విష్ణుర్మహాతేజా అదిత్యాం సమజాయత,
వామనం రూపమాస్థాయ వైరోచనిముపాగమత్. 19

ప్ర. అ. అథ = పిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, విష్ణుః= విష్ణువు, అదిత్యామ్ = అదితియందు, సమజాయత = పుట్టెను. వామనం రూపమ్=వామనరూపమును, ఆస్థాయ=ధరించి, వైరోచనిమ్=బలిచక్రవర్తిని, ఉపాగమత్=సమీపించెను.

తా. అంత విష్ణువు అదితిపుత్రుడుగ జనించి, వామనరూపము ధరించి, బలిచక్రవర్తివద్దకు వెళ్లెను. 19

మూ. త్రీన్ క్రమానథ భిక్షిత్వా ప్రతిగృహ్య చ మానదః,
ఆక్రమ్య లోకాన్ లోకాత్మా సర్వభూతహితే రతః. 20

మహేన్ద్రాయ పునః ప్రాదాన్నియమ్య బలిమోజసా,
త్రైలోక్యం స మహాతేజాశ్చక్రే శక్రవశం పునః. 21

ప్ర. అ. అథ = పిమ్మట, మానదః=మానమును ఇచ్చువాడును, లేదా అభిమానమును తొలగించువాడును, లోకాత్మా = లోకస్వరూపుడును, సర్వభూతహితే=సమస్తభూతముల హితమునందు, రతః = ఆసక్తి కలవాడును

అగు విష్ణువు, త్రీన్=మూడు, క్రమాన్=అడుగులను, భిక్షిత్వా=యాచించి, ప్రతిగృహ్య చ=స్వీకరించి, లోకాన్ = లోకములను, ఆక్రమ్య = ఆక్రమించి, బలిమ్ = బలిని, ఓజసా = తేజస్సుచేత, నియమ్య = బంధించి, మహేన్ద్రాయ= మహేంద్రునకు, పునః=మరల, ప్రాదాత్ = ఇచ్చెను. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః=ఆ విష్ణువు, త్రైలోక్యమ్ = మూడు లోకములను, పునః= మరల, శక్రవశమ్ = ఇంద్రునికి వశ మైనదానినిగా, చక్రే = చేసెను.

తా. గౌరవమును ఇచ్చువాడును, లేదా అభిమానమును తొలగించు వాడును, సర్వలోకస్వరూపుడును, సర్వభూతములకును హితమును చేయుట యందు ఆసక్తి కలవాడును అగు ఆ విష్ణువు, మూడు అడుగులు యాచించి, వాటిని ప్రతిగ్రహించి, మూడు లోకములను ఆక్రమించి, పరాక్రమముచే బలిని బంధించి, మరల మహేంద్రునకు ఇచ్చెను. ఈ విధముగ మహాతేజఃశాలి యగు ఆ విష్ణువు, త్రైలోక్యమును మరల దేవేంద్రుని వశ మగు నట్లు చేసెను. 20, 21

మూ. తేనైష పూర్వమాక్రాన్త ఆశ్రమః శ్రమనాశనః,
మయాపి భక్త్యా తస్యైష వామనస్యోపభుజ్యతే. 22

ప్ర. అ. శ్రమనాశనః=శ్రమను తొలగించు, ఏషః = ఈ, ఆశ్రమః = ఆశ్రమము, తేన = ఆ వామనునిచేత, పూర్వమ్ = పూర్వము, ఆక్రాన్తః = అధిష్ఠింప బడినది. తస్య = ఆ, వామనస్య = వామనుని యొక్క, భక్త్యా = భక్తిచేత, మయాపి = నాచేత కూడ, ఏషః = ఈ ఆశ్రమము, ఉపభుజ్యతే = అనుభవింపబడు చున్నది.

తా. పూర్వము వామనుడు శ్రమను తొలగించు ఈ ఆశ్రమములో ఉండెడివాడు. వామనునిపై నున్న భక్తిచేత నేను కూడ ఈ ఆశ్రమములో నివసించు చున్నాను. 22

మూ. ఏతమాశ్రమమాయాన్తి రాక్షసా విఘ్నకారిణః,
అత్రైవ పురుషవ్యాఘ్ర హన్తవ్యా దుష్టచారిణః. 23

ప్ర. అ. పురుషవ్యాఘ్ర=ఓపురుషశ్రేష్ఠుడా, విఘ్నకారిణః=విఘ్నములు చేయు, రాక్షసాః = రాక్షసులు, ఏతమ్=ఈ, ఆశ్రమమ్=ఆశ్రమమును గూర్చి,

ఆయాన్తి=వచ్చుచున్నారు. దుష్టచారిణః = ఆ దుర్మార్గులు, అత్రైవ=ఇచటనే, హన్తవ్యాః=చంపదగినవారు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా ! యజ్ఞమునకు విఘ్నము చేయు రాక్షసులు ఈ ఆశ్రమమునకే వచ్చుచున్నారు. వారిని ఇక్కడనే చంపవలసి యున్నది.

మూ. అద్య గచ్ఛామహే రామ సిద్ధాశ్రమమనుత్తమమ్,
తదాశ్రమపదం తాత తవాప్యేతద్యథా మమ. 24

ప్ర. అ. రామ=రామా ! అద్య = ఇపుడు, అనుత్తమమ్ = అత్యుత్తమ మైన, సిద్ధాశ్రమమ్=సిద్ధాశ్రమమును గూర్చి, గచ్ఛామహే = వెళ్లుదము. తాత= నాయనా ! తత్ = ఆ, ఏతత్ = ఈ, ఆశ్రమపదమ్ = ఆశ్రమము, మమ = నాకు, యథా = ఎట్లో, తవాపి = నీకును, తథా = అట్లే.

తా. రామా ! ఇపుడు ఆ అత్యుత్తమ మైన సిద్ధాశ్రమములో ప్రవేశించెదము. నాయనా ! ఈ ఆశ్రమము నాకెట్లో నీకును అట్లే.

వి. ఇపుడు నేనిచట నుండి తపస్సు చేయుటచే ఇది నాకు సొంత మైనది. వామనావతారమునకు పూర్వము నీవు కూడ తపస్సు చేసిన ఆశ్రమమే కాన ఇది నీకును సొంతమే అని భావము (తిలకవ్యాఖ్య). 24

మూ. ప్రవిశన్నాశ్రమపదం వ్యరోచత మహామునిః,
శశీవ గతనీహారః పునర్వసుసమన్వితః. 25

ప్ర. అ. ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, ప్రవిశన్ = ప్రవేశించుచున్న, మహామునిః = మహాముని, గతనీహారః=మంచు తొలగిపోయిన, పునర్వసు సమన్వితః = పునర్వసునక్షత్రములతో కూడిన, శశీవ = చంద్రుడు వలె, వ్యరోచత = ప్రకాశించెను.

తా. రామలక్ష్మణులతో ఆశ్రమములోనికి ప్రవేశించుచున్న విశ్వామిత్ర మహాముని, మంచు తొలగి పునర్వసు నక్షత్రములతో కూడిన చంద్రుడు వలె ప్రకాశించెను. 25

మూ. తం దృష్ట్వా మునయః సర్వే సిద్ధాశ్రమనివాసినః,
ఉత్పత్యోత్పత్య సహసా విశ్వామిత్రమపూజయన్. 26

ప్ర. అ. సిద్ధాశ్రమనివాసినః = సిద్ధాశ్రమమునందు నివసించుచున్న, మునయః=మునులు, సర్వే = అందరును, తమ్=ఆతనిని, దృష్ట్వా = చూచి, ఉత్పత్య ఉత్పత్య=ఎగిరి ఎగిరి, సహసా = శీఘ్రముగా, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, అపూజయన్=పూజించిరి.

తా. సిద్ధాశ్రమములో నివసించు మును లందరును విశ్వామిత్రుని చూచి, తొందరగా పరుగెత్తి వెళ్లి ఆతనిని పూజించిరి. 26

మూ. యథార్హం చక్రిరే పూజాం విశ్వామిత్రాయ ధీమతే,
తథైవ రాజపుత్రాభ్యామకుర్వన్నతిథిక్రియామ్. 27

ప్ర. అ. ధీమతే = బుద్ధిమంతుడైన, విశ్వామిత్రాయ = విశ్వామిత్రునకు, యథార్హమ్ = తగు విధముగా, పూజామ్ = పూజను, చక్రిరే=చేసిరి. తథైవ= అట్లే, రాజపుత్రాభ్యామ్=రాజపుత్రులకు, అతిథిక్రియామ్=అతిథిసత్కారమును, అకుర్వన్=చేసిరి.

తా. ధీమంతు డగు విశ్వామిత్రునకు తగు విధముగ పూజ చేసిరి. అట్లే రాజపుత్రులకు కూడ అతిథిపూజ చేసిరి. 27

మూ. ముహూర్తమథ విశ్రాన్తౌ రాజపుత్రావరిన్దమౌ,
ప్రాఞ్జలీ మునిశార్దూలమూచతూ రఘునన్దనౌ. 28

ప్ర. అ. అథ = పిమ్మట, అరిన్దమౌ = శత్రువులను పీడించువారును, రాజపుత్రౌ = దశరథమహారాజపుత్రులును అగు, రఘునన్దనౌ = రామలక్ష్మణులు, ముహూర్తమ్=క్షణకాలముపాటు, విశ్రాన్తౌ=విశ్రమించినవారై, ప్రాఞ్జలీ = కట్టబడిన దోసిళ్లు కలవారై, మునిశార్దూలమ్=మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రునిగూర్చి, ఊచతుః=పలికిరి.

తా. పిమ్మట, శత్రుసంహారకులైన రామలక్ష్మణులు క్షణకాలము విశ్రాంతి తీసికొని విశ్వామిత్రునకు నమస్కరించి ఇట్లు పలికిరి. 28

మూ. అద్యైవ దీక్షాం ప్రవిశ భద్రం తే మునిపుఙ్గవ,
సిద్ధాశ్రమోఽయం సిద్ధః స్యాత్సత్యమస్తు వచస్తవ. 29

ప్ర. అ. మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠా, అద్యైవ=ఈ నాడే, దీక్షామ్= దీక్షను, ప్రవిశ=ప్రవేశించుము. తే=నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. అయమ్= ఈ, సిద్ధాశ్రమః=సిద్ధాశ్రమము, సిద్ధః = సిద్ధికలది, స్యాత్=అగుగాక. తవ = నీయొక్క, వచః = వాక్యము, సత్యమ్ అస్తు = సత్య మగుగాక.

తా. ఓ! మునిశ్రేష్ఠా! ఈ రోజుననే యజ్ఞదీక్షలో ప్రవేశింపుము. నీకు క్షేమ మగుగాక. ఈ సిద్ధాశ్రమము సిద్ధిప్రదమై సార్థకనామధేయ మగుగాక. నీ వచనము సత్య మగుగాక. 29

మూ. ఏవముక్తో మహాతేజా విశ్వామిత్రో మహాన్ ఋషిః,
ప్రవివేశ తదా దీక్షాం నియతో సీయతేన్ద్రియః. 30

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, మహాతేజాః = గొప్పతేజస్సుగల. విశ్వామిత్రః మహాన్ ఋషిః = విశ్వామిత్రమహర్షి, తదా = అప్పుడు, నియతః = నియమము అవలంబించినవాడై, నియతేన్ద్రియః = నిగ్రహింపబడిన ఇంద్రియములు కలవాడై, దీక్షామ్ = దీక్షను, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మహాతేజఃశాలి యైన విశ్వామిత్రమహర్షి వారి వాక్యము విని, నియమము నవలంబించి, ఇంద్రియములను నిగ్రహించి యజ్ఞదీక్షలో ప్రవేశించెను. 30

మూ. కుమారావపి తాం రాత్రిముషిత్వా సుసమాహితౌ,
ప్రభాతకాలే చోత్థాయ పూర్వాం సన్ధ్యాముపాస్య చ, . 31
స్పృష్టోదకౌ శుచీ జప్యం సమాప్య నియమేన చ.
హుతాగ్నిహోత్ర మాసీనం విశ్వామిత్ర మవన్దతామ్. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే,
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. కుమారౌ అపి=రామలక్ష్మణులు కూడ, తామ్ = ఆ, రాత్రిమ్ = రాత్రి, సుసమాహితౌ=చాల సావధానచిత్తులుగ, ఉషిత్వా = ఉండి, ప్రభాతకాలే= ప్రాతఃకాలమునందు, ఉత్థాయ=లేచి, స్పృష్టోదకౌ=స్పృశింపబడిన ఉదకము కలవారై, శుచీ=పవిత్రులై, పూర్వాం సన్ధ్యామ్=ప్రాతఃకాలసంధ్యను, ఉపాస్య= ఉపాసించి, నియమేన = నియమపూర్వకముగ, జప్యమ్ = మంత్రజపమును, సమాప్య=పూర్తిచేసి, హుతాగ్నిహోత్రమ్ = అగ్నిహోత్రమును చేసిన, ఆసీనమ్= కూర్చున్న, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, అవన్దతామ్ = నమస్కరించిరి.

తా. రామలక్ష్మణులు ఆ రాత్రి యంతయు సావధానచిత్తులై ఉండి, ప్రాతఃకాలమున లేచి, ఆచమనము చేసి, ప్రాతఃకాలసంధ్య నుపాసించి, నియమ పూర్వకముగ గాయత్ర్యాదిమంత్రముల జపము చేసి, అగ్నిహోత్రము చేసికొని ఉపవిష్టుడై యున్న విశ్వామిత్రుని సమీపించి నమస్కరించిరి. 31, 32

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో ఇరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ త్రింశః సర్గః

మూ. అథ తౌ దేశకాలజ్ఞౌ రాజపుత్రావరిన్దమౌ,
దేశే కాలే చ వాక్యజ్ఞావబ్రూతాం కౌశికం వచః. 1

ప్ర. అ. అథ = పిమ్మట, దేశకాలజ్ఞౌ = దేశకాలములను ఎరిగినవారును, అరిన్దమౌ = శత్రుసంహారకులును, దేశే = దేశమునందును, కాలే చ = కాలము నందును, వాక్యజ్ఞౌ = వాక్యములను ఎరిగినవారును అగు, తౌ = ఆ, రాజపుత్రౌ = రామలక్ష్మణులు, కౌశికమ్ = విశ్వామిత్రునిగూర్చి, వచః = వాక్యమును, అబ్రూతామ్ = పలికిరి.

తా. పిమ్మట, ఏ దేశమునందు ఏ కాలమునందు ఎట్లు మసలుకొనవలెనో తెలిసినవారును, శత్రుసంహారసమర్థులును, ఏ దేశమునందు, ఏ కాలమునందు ఎట్లు మాటలాడవలెనో తెలిసినవారును అగు రామలక్ష్మణులు విశ్వామిత్రునితో ఇట్లు పలికిరి. 1

మూ. భగవన్ శ్రోతుమిచ్ఛావో యస్మిన్ కాలే నిశాచరౌ,
సంరక్షణీయౌ తౌ బ్రహ్మన్ నాతివర్తేత తత్ క్షణమ్. 2

ప్ర. అ. భగవన్ = మాహాత్మ్యముగల, బ్రహ్మన్ = ఓ బ్రహ్మర్షీ, తౌ = ఆ, నిశాచరౌ = రాక్షసులు, యస్మిన్ కాలే = ఏకాలమునందు, సంరక్షణీయౌ = రక్షింపదగినవారో, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛావః = ఇచ్ఛయించుచున్నాము. తత్ = ఆ, క్షణమ్ = క్షణము, నాతివర్తేత = దాటిపోగూడదు.

తా. మహామహిమ గల ఓ బ్రహ్మర్షీ! ఆ రాక్షసులనుండి ఎపుడు రక్షింపవలెనో వినగోరుచున్నాము. ఆ కాలము దాటిపోగూడదు కదా?

వి. "సంరక్షణీయౌ" అను పదమునకు రక్షింపదగినవారు అని అర్థము. రాక్షసులు సంరక్షణీయులు కాదు. అందుచేత కొందరు వ్యాఖ్యాతలు విపరీత లక్షణచేత "చంపదగినవారు" అని గాని, రక్షణ మనగా ఇష్టప్రాప్తి అనిష్టనివృత్తి గాన ఇచట అనిష్టనివృత్తి అను అర్థమును గాని గ్రహింపవలె నని చెప్పినారు

(గోవిందరాజులు). తిలకవ్యాఖ్యలో "యజ్ఞరక్షణమునకై నివారింపదగినవారు" అను అర్థము చెప్పబడినది. కాని "కృత్యల్యుటో బహులమ్" అను సూత్రముచే "స్నాన్త్యనేనేతి స్నానీయం చూర్ణమ్" "దీయతే అస్మై దానీయః విప్రః" ఇత్యాదులలో కరణసంప్రదానార్థాలలో "అనీయర్" ప్రత్యయము వచ్చినట్లు, "రక్షన్తి అభ్యామితి రక్షణీయౌ" అనగా "ఎవరినుండి రక్షింతురో వారు" అను అపాదానార్థములో అనీయర్ ప్రత్యయము వచ్చిన దని సమర్థింపవచ్చును. 2

మూ. ఏవం బ్రువాణౌ కాకుత్స్థౌ త్వరమాణౌ యుయుత్సయా,
సర్వే తే మునయః ప్రీతాః ప్రశశంసుర్నృపాత్మజౌ. 3

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణౌ = పలుకుచున్న, యుయుత్సయా = యుద్ధముచేయవలె ననెడు ఇచ్ఛచేత, త్వరమాణౌ = తొందరపడుచున్న, నృపాత్మజౌ = రాజకుమారులను, తే = ఆ, మునయః = మునులు, సర్వే = అందరును, ప్రీతాః = సంతసించినవారై, ప్రశశంసుః = ప్రశంసించిరి.

తా. ఈ విధముగ పలుకుచు, యుద్ధము చేయుటకై తొందరపడుచున్న ఆ రామలక్ష్మణులను ఆ మును లందరును సంతసించిన వారై ప్రశంసించిరి. 3

మూ. అద్యప్రభృతి షడ్రాత్రం రక్షతం రాఘవౌ యువామ్,
దీక్షాం గతో హ్యేష ముని ర్మౌనిత్వం చ గమిష్యతి. 4

ప్ర. అ. రాఘవౌ = రామలక్ష్మణులారా ! యువామ్ = మీరు, అద్యప్రభృతి = నేడు మొదలు, షడ్రాత్రమ్ = ఆరు రాత్రులు, రక్షతమ్ = రక్షించుడు. ఏషః = ఈ, మునిః = ముని, దీక్షామ్ = దీక్షను, గతః = పొందినాడు. మౌనిత్వం చ = మౌనమును కూడ, గమిష్యతి = పొందగలడు.

తా. రామలక్ష్మణులారా ! నేడు మొదలు ఆరు రాత్రులు మీరు యాగరక్షణము చేయుడు. విశ్వామిత్రమహర్షి దీక్ష వహించినాడు గాన మౌనమును పాటించును. 4

మూ. తౌ తు తద్వచనం శ్రుత్వా రాజపుత్రౌ యశస్వినౌ,
అనిద్రౌ షడహోరాత్రం తపోవనమరక్షతామ్. 5

ప్ర. అ. యశస్వినౌ=కీర్తిగల, తౌ = ఆ, రాజపుత్రౌ=రాజకుమారులు, తత్=ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, షడహోరాత్రమ్ = ఆరు రేయింబవళ్లు, అనిద్రౌ = నిద్ర లేనివారై, తపోవనమ్=తపోవనమును, అరక్షతామ్=రక్షించిరి.

తా. కీర్తిమంతులైన రామలక్ష్మణులు వారి వాక్యము విని, ఆరు రేయింబవళ్లు, నిద్ర లేని వారై, ఆ తపోవనమును రక్షించిరి. 5

మూ. ఉపాసాఞ్చక్రతుర్వీరౌ యత్తౌ పరమధన్వినౌ,
రరక్షతుర్మునివరం విశ్వామిత్రమరిన్దమౌ. 6

ప్ర. అ. పరమధన్వినౌ = గొప్ప ధనుర్ధరులైన, వీరౌ=ఆ వీరులు, యత్తౌ=సన్నద్ధులై ఉపాసాఞ్చక్రతుః = సమీపముననే ఉండిరి. అరిన్దమౌ = శత్రుసంహారకులైన వారు, విశ్వామిత్రం మునివరమ్ = విశ్వామిత్రమహర్షిని, రరక్షతుః=రక్షించిరి.

తా. ధనుర్ధరులైన ఆ వీరులు సన్నద్ధులై ఆ విశ్వామిత్రుని సమీపముననే ఉండి ఆ మునిశ్రేష్ఠుని రక్షించిరి. 6

మూ. అథ కాలే గతే తస్మిన్ షష్ఠేఽహని సమాగతే,
సౌమిత్రిమబ్రవీద్రామో యత్తో భవ సమాహితః. 7

ప్ర. అ. అథ = పిమ్మట, తస్మిన్=ఆ, కాలే=కాలము, గతే = కడచినదగుచుండగా, షష్ఠే=ఆరవ, అహని=దివసము, సమాగతే=వచ్చినదగుచుండగా, రామః = రాముడు, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, యత్తః = సన్నద్ధుడవై, సమాహితః=ఏమరిపాటు లేనివాడవై, భవ = ఉండుము, అని, ఉవాచ=పలికెను.

తా. అయిదు దివసములు కడచి ఆరవ దివసము వచ్చినది. అపుడు రాముడు లక్ష్మణునితో —"సన్నద్ధుడవై, అప్రమత్తుడవై ఉండుము" అని పలికెను. 7

మూ. రామస్యైవం బ్రువాణస్య త్వరితస్య యుయుత్సయా,
ప్రజజ్వాల తతో వేదిః సోపాధ్యాయపురోహితా. 8

ప్ర. అ. యుయుత్సయా = యుద్ధము చేయవలెనను అభిలాషచే, త్వరితస్య = తొందరపడుచున్న, రామస్య=రాముడు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణస్య=పలుకుచుండగా, తతః = పిమ్మట, సోపాధ్యాయ పురోహితా= ఋత్విక్కులతోను పురోహితునితోను కూడిన, వేదిః = వేది, ప్రజజ్వాల = ప్రజ్వలించెను.

తా. రాముడు యుద్ధాభిలాషతో తొందరపడుచు ఈ విధముగా పలుకుచుండగనే, ఋత్విక్కులతోను, పురోహితునితోను కూడిన యజ్ఞవేదిక భగ్గున మండెను. 8

మూ. సదర్భచమసస్రుక్కా ససమిత్కుసుమోచ్చయా,
విశ్వామిత్రేణ సహితా వేదిర్జజ్వాల సర్త్విజా. 9

ప్ర. అ. సదర్భచమనస్రుక్కా = దర్భలతోను, చమసములతోను (పానపాత్రలు) స్రుక్కులతోను (హోమము చేయు గరిటెలు) కూడినదియు, ససమిత్కుసుమోచ్చయా=సమిధలతోను పుష్పసముదాయముతోను కూడినదియు, విశ్వామిత్రేణ = విశ్వామిత్రునితో, సహితా = కూడినదియు, సర్త్విజా = ఋత్విక్కులతో కూడినదియు అగు, వేదిః = వేది, జజ్వాల = ప్రజ్వలించెను.

తా. దర్భలతో, చమసములతో, స్రుక్కులతో, సమిధలతో, పుష్పసముదాయముతో, విశ్వామిత్రునితో, ఋత్విక్కులతో కూడిన వేది జ్వలించినది.

వి. యాగవేది హటాత్తుగా జ్వలించుట ఉత్పాతము. అనగా రాబోవు ఆపదను సూచించునది. 9

మూ. మన్త్రవచ్చ యథాన్యాయం యజ్ఞోఽసౌ సంప్రవర్తతే,
ఆకాశే చ మహాన్ శబ్దః ప్రాదురాసీద్భయావహః. 10

ప్ర. అ. అసౌ=ఈ, యజ్ఞః=యజ్ఞము, మన్త్రవత్=మంత్రపూర్వకముగాను, యథాన్యాయమ్=శాస్త్రానుసారముగాను, సంప్రవర్తతే=జరుగుచుండెను. ఆకాశే= ఆకాశమునందు, భయావహః = భయమును కలిగించు, మహాన్ శబ్దః = గొప్ప ధ్వని, ప్రాదురాసీత్ = పుట్టెను.

తా. ఆ యజ్ఞము మంత్రపూర్వకముగాను, శాస్త్రానుసారముగాను జరుగుచుండెను. ఇంతలో, ఆకాశమునందు, భయంకర మైన ఒక శబ్దము వినబడెను. 10

మూ. ఆవార్య గగనం మేఘో యథా ప్రావృషి నిర్గతః,
తథా మాయాం వికుర్వాణౌ రాక్షసావభ్యధావతామ్. 11

ప్ర. అ. ప్రావృషి=వర్షాకాలమునందు, నిర్గతః=బయలుదేరిన, మేఘః=మేఘము, యథా=ఎట్లో, తథా=అట్లు, గగనమ్=అకాశమును, ఆవార్య=కప్పివేసి, రాక్షసౌ=రాక్షసులు, మాయామ్=మాయను, వికుర్వాణౌ=చేయుచు, అభ్యధావతామ్=పరుగెత్తివచ్చిరి.

తా. వర్షాకాలమున బయలుదేరిన మేఘము వలె ఆకాశమును ఆవరించి, మారీచసుబాహువులు, మాయావికారములను చూపుచు పరుగెత్తి వచ్చిరి. 11

మూ. మారీచశ్చ సుబాహుశ్చ తయోరనుచరాశ్చ యే,
ఆగమ్య భీమసఙ్కాశౌ రుధిరౌఘమవాసృజన్. 12

ప్ర. అ. భీమసఙ్కాశౌ = భయంకరులైన, మారీచశ్చ = మారీచుడును, సుబాహుశ్చ = సుబాహువు, తయోః=వారిద్దరియొక్క, యే=ఏ, అనుచరాః=అనుచరులుగలరో వారును, ఆగమ్య = వచ్చి, రుధిరౌఘమ్=రక్తప్రవాహమును, ఆవాసృజన్ = వర్షించిరి.

తా. భయంకరులైన మారీచసుబాహువులును, వారి అనుచరులును వచ్చి రక్తప్రవాహమును వర్షించిరి. 12

మూ. సా తేన రుధిరౌఘేణ వేదిర్జజ్వాల మణ్డితా,
సహసాభిద్రుతో రామస్తావపశ్యత్తతో దివి. 13

ప్ర. అ. తేన = అ, రుధిరౌఘేణ = రక్తప్రవాహముచేత, మణ్డితా=నింపబడిన, సా = ఆ, వేదిః = వేది, జజ్వాల=ప్రజ్వలించెను. తతః=పిమ్మట, సహసా=శీఘ్రముగా, అభిద్రుతః=ఎదురుగా పరుగెత్తి వచ్చిన, రామః=రాముడు, దివి = ఆకాశమునందు, తాన్ = వారిని, అపశ్యత్ = చూచెను.

తా. రక్తప్రవాహముచే నింపబడిన ఆ వేది ప్రజ్వరిల్లెను. అంతలో, శీఘ్రముగ పరుగెత్తి వచ్చిన రాముడు ఆకాశమునందు ఆ రాక్షసులను చూచెను.

మూ. తావాపతన్తౌ సహసా దృష్ట్వా రాజీవలోచనః,
లక్ష్మణం త్వభిసంప్రేక్ష్య రామో వచనమబ్రవీత్. 14

ప్ర. అ. రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు గల, రామః = రాముడు, సహసా = శీఘ్రముగా, ఆపతన్తౌ = వచ్చిపడుచున్న, తౌ = వారిని, దృష్ట్వా = చూచి, లక్ష్మణమ్ = లక్ష్మణుని, అభిసంప్రేక్ష్య = చూచి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. కమలలోచనుడైన రాముడు శీఘ్రముగ వచ్చి పడుచున్న ఆ మారీచ సుబాహువులను చూచి, లక్ష్మణునితో ఇట్లనెను. 14

మూ. పశ్య లక్ష్మణ దుర్వృత్తాన్ రాక్షసాన్ పిశితాశనాన్,
మానవాస్త్రసమాధూతాననిలేన యథా ఘనాన్. 15

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! దుర్వృత్తాన్ = చెడ్డ నడవడిక కలవారును, పిశితాశనాన్ = మాంసమే ఆహారముగా కలవారును అగు, రాక్షసాన్ = రాక్షసులను, అనిలేన = వాయువుచేత, ఘనాన్ యథా = మేఘములను వలె, మానవాస్త్ర సమాధూతాన్ = మానవాస్త్రముచే ఎగురగొట్టబడుచుండగా, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! దుర్మార్గులును, మాంస భక్షకులును అగు ఈ రాక్షసులను, వాయువు మేఘములను ఎగురగొట్టినట్లు, మానవాస్త్రముచే ఎగురగొట్టి వేయుచున్నాను; చూడుము. 15

మూ. మానవం పరమోదారమస్త్రం పరమభాస్వరమ్,
చిక్షేప పరమక్రుద్ధో మారీచోరసి రాఘవః. 16

ప్ర. అ. రాఘవః = రాముడు, పరమోదారమ్ = చాల గొప్పదియు, పరమ భాస్వరమ్=ఎక్కువ ప్రకాశించుచున్నదియు అగు, మానవమ్ అస్త్రమ్=

మానవాస్త్రమును, పరమక్రుద్ధః=చాల కోపగించినవాడై, మారీచోరసి=మారీచుని వక్షఃస్థలముపై, చిక్షేప = విసరెను.

తా. రాముడు చాల కోపించి, మంచి సామర్థ్యము కలదియు, మిక్కిలి ప్రకాశించుచున్నదియు అగు మానవాస్త్రమును మారీచుని వక్షఃస్థలముపై ప్రయోగించెను. 16

మూ. స తేన పరమాస్త్రేణ మానవేన సమాహతః,
సంపూర్ణం యోజనశతం క్షిప్తః సాగరసంప్లవే. 17

ప్ర. అ. తేన = ఆ, మానవేన = మానవ మనెడు, పరమాస్త్రేణ = గొప్ప అస్త్రముచేత, సమాహతః = కొట్టబడిన, సః = ఆ మారీచుడు, సంపూర్ణం = పూర్తిగా, యోజనశతమ్ = నూరు యోజనముల దూరము, సాగరసంప్లవే = పొర్లుచున్న సముద్రజలమునందు, క్షిప్తః = విసిరివేయబడెను.

తా. గొప్పదైన ఆ మానవాస్త్రముచేత కొట్టబడినవాడై ఆ మారీచుడు పూర్తిగ నూరు యోజనముల దూరములో సముద్రజలపూరమునందు పడవేయబడెను.

వి. "స తేన" అను చోట 'స' అనునది గాయత్రీమంత్ర ద్వితీయాక్షరము. వెయ్యి శ్లోకములు పూర్తియైన తరువాత ద్వితీయ సహస్ర ప్రారంభ శ్లోకమున నిక్షిప్తమైనది. 17

మూ. విచేతనం విఘూర్ణన్తం శీతేషుబలతాడితమ్,
నిరస్తం దృశ్య మారీచం రామో లక్ష్మణమబ్రవీత్. 18

ప్ర. అ. శీతేషుబలతాడితమ్ = ఆ చల్లని అస్త్రముచే కొట్టబడినవాడును, విచేతనమ్ = చైతన్యము కోల్పోయినవాడును, విఘూర్ణన్తమ్ = తిరిగి పోవుచున్న వాడును, నిరస్తమ్ = దూరమున పడవేయబడినవాడును అగు, మారీచమ్ = మారీచుని, దృశ్య = చూచి, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణునిగూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ చల్లని బాణముచేత కొట్టబడి, చైతన్యము కోల్పోయి, గిఱ్ఱున

తిరిగిపోవుచు దూరముగా పడవేయబడిన ఆ మారీచుని చూచి, రాముడు లక్ష్మణునితో ఇట్లనెను.

వి. మానవాస్త్రము సంధించిన బాణము శత్రువును చంపక, చైతన్య రహితుని చేయుటచే అది శీతేషు వని చెప్పబడినది. 18

మూ. పశ్య లక్ష్మణ శీతేషుం మానవం ధర్మసంహితమ్,
మోహయిత్వా నయత్యేనం న చ ప్రాణైర్వ్యయుజ్యత. 19

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! ధర్మసంహితమ్ = ధర్మముతోకూడిన, మానవం శీతేషుమ్=మానవాస్త్రము సంధించిన శీతబాణమును, పశ్య=చూడుము. ఏనమ్ = ఈతనిని, మోహయిత్వా = మోహముకలవానినిగా చేసి, నయతి = తీసికొనిపోవుచున్నది. ప్రాణైః = ప్రాణములతో, న వ్యయుజ్యత = వియుక్తుడు కాలేదు.

తా. లక్ష్మణా! ధర్మము ననుసరించి యున్న ఈ మానవాస్త్రము సంధించిన చల్లని బాణమును చూడుము. ఇది వీనికి మోహము కలుగజేసి తీసికొని పోవుచున్నది. కాని ఇతని ప్రాణములు తీయలేదు. 19

మూ. ఇమానపి వధిష్యామి నిర్ఘృణాన్ దుష్టచారిణః,
రాక్షసాన్ పాపకర్మస్థాన్ యజ్ఞఘ్నాన్ రుధిరాశనాన్. 20

ప్ర. అ. నిర్ఘృణాన్ = జాలిలేనివారును, దుష్టచారిణః = దుష్టముగా ప్రవర్తించువారును, పాపకర్మస్థాన్ = పాపకర్మ చేయువారును, యజ్ఞఘ్నాన్ = యజ్ఞములను నశింపచేయువారును, రుధిరాశనాన్ = రక్తమును భుజించువారును అగు, ఇమాన్=ఈ, రాక్షసానపి=రాక్షసులను కూడ, వధిష్యామి=వధించెదను.

తా. జాలి లేనివారు, దుర్మార్గులు, పాపములు చేయువారు, యజ్ఞములను చెరచువారు, రక్తమును త్రాగువారు అయిన ఈ రాక్షసులను కూడ చంపెదను. 20

మూ. సంగృహ్యాస్త్రం తతో రామో దివ్యమాగ్నేయమద్భుతమ్
సుబాహూరసి చిక్షేప స విద్ధః ప్రాపతద్భువి. 21

ప్ర. అ. తతః = పిమ్మట, రామః = రాముడు, దివ్యమ్ = దివ్య మైనదియు, అద్భుతమ్ = ఆశ్చర్యకర మగునదియు అగు, ఆగ్నేయమ్ అస్త్రమ్ = ఆగ్నేయాస్త్రమును, సంగృహ్య=గ్రహించి, సుబాహూరసి=సుబాహువు యొక్క వక్షఃస్థలమునందు, చిక్షేప = విసరెను. సః = అతడు, విద్ధః = కొట్టబడినవాడై, భువి = భూమిపై, ప్రాపతత్ = పడెను.

తా. పిమ్మట రాముడు దివ్యము, ఆశ్చర్యకరము అయిన ఆగ్నేయాస్త్రమును గ్రహించి, సుబాహువు వక్షస్థలముపై ప్రయోగించెను. అతడు దాని దెబ్బ తిని నేలపై కూలెను. 21

మూ. శేషాన్ వాయవ్యమాదాయ నిజఘాన మహాయశాః
రాఘవః పరమోదారో మునీనాం ముదమావహన్. 22

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తికలవాడును, పరమోదారః=మిక్కిలి ఉదారుడును అయిన, రాఘవః=రాముడు, మునీనామ్=మునులకు, ముదమ్ = ఆనందమును, ఆవహన్ = కలిగించుచు, వాయవ్యమ్ = వాయవ్యాస్త్రమును, ఆదాయ=గ్రహించి, శేషాన్=మిగిలిన రాక్షసులను, నిజఘాన=చంపెను.

తా. గొప్ప కీర్తి గల, పరమోదారుడైన రాముడు, మునులకు ఆనందము కలిగించుచు, మిగిలిన రాక్షసులను, వాయవ్యాస్త్రము ప్రయోగించి చంపెను. 22

మూ. స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునన్దనః,
ఋషిభిః పూజితస్తత్ర యథేన్ద్రో విజయే పురా. 23

ప్ర. అ. సః రఘునన్దనః=ఆ రాముడు, యజ్ఞఘ్నాన్=యజ్ఞములను చెరచు, రాక్షసాన్=రాక్షసులను, సర్వాన్=అందరిని, హత్వా=చంపి, పురా=పూర్వము, విజయే = విజయము కలిగినప్పుడు, ఇన్ద్రః యథా = ఇంద్రుడు వలె, తత్ర= అచట, ఋషిభిః=ఋషులచేత, పూజితః=పూజింపబడెను.

తా. యజ్ఞవిఘ్నకరులగు ఆ రాక్షసుల నందరిని సంహరించిన రాముని, పూర్వము విజయము కలిగినపుడు దేవేంద్రుని పూజించినట్లు ఋషు లందరును ప్రశంసించిరి. 23

మూ. అథ యజ్ఞే సమాప్తే తు విశ్వామిత్రో మహామునిః,
నిరీతికా దిశో దృష్ట్వా కాకుత్స్థ మిదమబ్రవీత్. 24

ప్ర. అ. అథ=పిమ్మట, యజ్ఞే=యజ్ఞము, సమాప్తే = సమాప్తమైనదగు చుండగా, విశ్వామిత్రః మహామునిః=విశ్వామిత్రమహర్షి, నిరీతికాః=ఈతిబాధలు లేని, దిశః=దిక్కులను, దృష్ట్వా=చూచి, కాకుత్స్థమ్=రాముని గూర్చి, ఇదమ్= ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. యజ్ఞము సమాప్త మైన పిమ్మట విశ్వామిత్రమహాముని ఈతిబాధ లన్నియు తొలగిపోయిన దిక్కులను చూచి, రామునితో ఇట్లనెను. 24

మూ. కృతార్థోఽస్మి మహాబాహో కృతం గురువచ స్త్వయా
సిద్ధాశ్రమమిదం సత్యం కృతం రామ మహాయశః. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రింశః సర్గః.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా, కృతార్థః=నెరవేరిన కార్యము కలవాడను, అస్మి=అయితిని. త్వయా=నీచేత, గురువచః=తండ్రి వాక్యము, కృతమ్=చేయబడినది, మహాయశః=గొప్ప కీర్తి గల, రామ=రామా, ఇదమ్=ఈ, సిద్ధాశ్రమమ్=సిద్ధాశ్రమము. సత్యమ్=సత్య మైనదిగా, కృతమ్= చేయబడినది.

తా. ఓ మహాబాహూ! నేను తలపెట్టిన పని పూర్తి యైనది. నీవు తండ్రి గారి ఆజ్ఞను నిర్వహించితివి. గొప్ప కీర్తిగల రామా ! ఈ సిద్ధాశ్రమమును సత్య మైన పేరు గల దానినిగా చేసితివి. 25

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో ముప్పదవసర్గ సమాప్తము.

## అథ ఏకత్రింశః సర్గః

మూ. అథ తాం రజనీం తత్ర కృతార్థౌ రామలక్ష్మణౌ,
ఊషతుర్ముదితౌ వీరౌ ప్రహృష్టేనాన్తరాత్మనా. 1

ప్ర. అ. అథ = పిమ్మట, కృతార్థౌ = చేయబడిన కార్యము కలవారును, ముదితౌ=సంతసించినవారును, వీరౌ=వీరులును అగు, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, తామ్=ఆ, రజనీమ్=రాత్రి, ప్రహృష్టేన = మిక్కిలి సంతోషించిన, అన్తరాత్మనా = మనస్సుతో, తత్ర = అచట, ఊషతుః = నివసించిరి.

తా. తమ కార్యమును పూర్తిచేసి ఆనందముతో కూడిన వీరులైన రామలక్ష్మణులు, ఆ రాత్రి, ఆనందముతో నిండిన మనస్సుతో, ఆ ఆశ్రమమునందు నివసించిరి. 1

మూ. ప్రభాతాయాం తు శర్వర్యాం కృతపౌర్వాహ్ణికక్రియౌ,
విశ్వామిత్రమృషీంశ్చాన్యాన్ సహితావభిజగ్మతుః. 2

ప్ర. అ. శర్వర్యామ్ = రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారగనే, కృతపౌర్వాహ్ణికక్రియౌ = పూర్వాహ్ణమునకు సంబంధించిన క్రియలను చేసికొన్నవారై, సహితౌ = కలిసినవారై, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, అన్యాన్ = ఇతరులైన, ఋషీంశ్చ = ఋషులను గూర్చి, అభిజగ్మతుః=వెళ్లిరి.

తా. రాత్రి తెల్లవారగనే ప్రాతఃకాలము చేయదగిన సంధ్యావందనాదులు పూర్తిచేసికొని, ఇద్దరును కలిసి, విశ్వామిత్రుని వద్దకును, ఇతరఋషులవద్దకును వెళ్లిరి.

మూ. అభివాద్య మునిశ్రేష్ఠం జ్వలన్తమివ పావకమ్,
ఊచతుర్మధురోదారం వాక్యం మధురభాషిణౌ. 3

ప్ర. అ. మధురభాషిణౌ = మధురముగా మాటలాడు ఆ రామలక్ష్మణులు, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, పావకమ్ ఇవ = అగ్ని వలె ఉన్న, ముని

శ్రేష్ఠమ్ = విశ్వామిత్రుని, అభివాద్య = నమస్కరించి, మధురోదారమ్ = మధురము ఉదారము అయిన, వాక్యమ్ = వాక్యమును, ఊచతుః = పలికిరి.

తా. మధురముగా మాటలాడు స్వభావముగల ఆ రామలక్ష్మణులు, ప్రజ్వలించు చున్న అగ్ని వలె ఉన్న విశ్వామిత్రునకు నమస్కరించి, మధురమును, ఉదారమును అగు వాక్యమును పలికిరి. 3

మూ. ఇమౌ స్మ మునిశార్దూల కిఙ్కరౌ సముపస్థితౌ,
ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్. 4

ప్ర. అ. మునిశార్దూల = మునిశ్రేష్ఠుడా, కిఙ్కరౌ = కింకరుల మైన, ఇమౌ = ఈ మేము, సముపస్థితౌ స్మ = వచ్చి ఉన్నాము. యథేష్టమ్ = నీకు ఇష్టము వచ్చిన విధముగ, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము. కిమ్ = ఏ, శాసనమ్ = శాసనమును, కరవామ = చేయుదుము.

తా. ఓ మునిశ్రేష్ఠా ! ఇదిగో కింకరులము వచ్చినాము. నీకు ఏది ఇష్టమో ఆజ్ఞాపింపుము. ఏ ఆజ్ఞను చేయవలెను ? 4

మూ. ఏవముక్తాస్తతస్తాభ్యాం సర్వ ఏవ మహర్షయః,
విశ్వామిత్రం పురస్కృత్య రామం వచనమబ్రువన్. 5

ప్ర. అ. తాభ్యామ్ = వారిరువురిచేత, ఏవమ్ = ఈ విధముగనే, ఉక్తాః = పలకబడిన, మహర్షయః = మహర్షులు, సర్వే ఏవ = అందరును, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = పురస్కరించుకొని, రామమ్ = రాముని గూర్చి, వచనమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. రామలక్ష్మణులు తమతో కూడ ఇట్లు పలుకగా ఆ మహర్షు లందరును, విశ్వామిత్రుని అనుజ్ఞను పొంది రామునితో ఇట్లనిరి. 5

మూ. మైథిలస్య నరశ్రేష్ఠ జనకస్య భవిష్యతి,
యజ్ఞః పరమధర్మిష్ఠస్తస్య యాస్యామహే వయమ్. 6

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! మైథిలస్య = మిథిలారాజైన, జనకస్య = జనకునియొక్క, పరమధర్మిష్ఠః = మిక్కిలి ధర్మముతోకూడిన, యజ్ఞః =

యజ్ఞము, భవిష్యతి=కాగలదు, వయమ్ = మేము, తస్య = ఆ యజ్ఞమునకు, యాస్యామహే=వెళ్లగలము.

తా. రామా! మిథిలాధిపతి యైన జనకుడు మిక్కిలి ధర్మ సంమత మైన యజ్ఞము చేయనున్నాడు. మేము ఆ యజ్ఞమునకు వెళ్ళెదము. 6

మూ. త్వం చైవ నరశార్దూలసహాఽస్మాభిర్గమిష్యసి,
అద్భుతం ధనురత్నం చ తత్ర తద్ద్రష్టుమర్హసి. 7

ప్ర. అ. నరశార్దూలః=నరశ్రేష్ఠుడ వైన, త్వం చ=నీవు కూడ, అస్మాభిః సహ=మాతోకూడ, గమిష్యసి=రాగలవు. తత్ర=అచట, అద్భుతమ్=ఆశ్చర్య కరమైన, తత్=ఆ, ధనురత్నం చ = శ్రేష్ఠ మైన ధనస్సును, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హసి=తగియున్నావు.

తా. నరశ్రేష్ఠుడ వైన నీవు కూడ మాతో అచటికి వచ్చినచో అచట, ఆశ్చర్యకర మైన శ్రేష్ఠ మైన ధనస్సును చూడగలవు. 7

మూ. తద్ధి పూర్వం నరశ్రేష్ఠ దత్తం సదసి దైవతైః,
అప్రమేయబలం ఘోరం మఖే పరమభాస్వరమ్. 8

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడ వైన రామా, అప్రమేయబలమ్= లెక్కింపరాని బలము గలదియు, ఘోరమ్=భయంకర మైనదియు, పరమ భాస్వరమ్=మిక్కిలి ప్రకాశించునదియు అగు, తత్=ఆ ధనస్సు, పూర్వమ్= పూర్వము, దైవతైః=దేవతలచేత, మఖే = యుద్ధమునందు, సదసి = సభలో, దత్తమ్=ఇవ్వబడినది.

తా. రామా! అప్రమేయ మైన బలముగల, భయంకర మైన, గొప్ప ప్రకాశముగల ఆ ధనస్సును పూర్వము దేవతలు యజ్ఞసదస్సులో ఇచ్చిరి. 8

మూ. నాస్య దేవా న గన్ధర్వా నాసురా న చ రాక్షసాః,
కర్తుమారోపణం శక్తా న కథం చన మానుషాః. 9

ప్ర. అ. అస్య=ధనస్సుయొక్క, ఆరోపణమ్ = ఆరోపణమును (నారి కట్టుటను) కర్తుమ్=చేయుటకు, దేవాః=దేవతలు, న శక్తాః = సమర్థులు కారు. గన్ధర్వాః=గంధర్వులు, న=సమర్థులు కారు. అసురాః = అసురులు, న=సమర్థులు కారు. రాక్షసాః చ = రాక్షసులును, న = సమర్థులు కారు. మానుషాః= మనుష్యులు, కథంచన=ఏ విధముగను, న=సమర్థులు కారు.

తా. దేవతలు గాని, గంధర్వులు గాని, అసురులు గాని, రాక్షసులు గాని ఆ ధనస్సును వంచి నారి కట్టజాలరు. మనుష్యుల మాట చెప్పవనియే లేదు. 9

మూ. ధనుషస్తస్య వీర్యం తు జిజ్ఞాసన్తో మహీక్షితః,
న శేకురారోపయితుం రాజపుత్రా మహాబలాః. 10

ప్ర. అ. రాజపుత్రాః = రాజవంశములందు జనించిన, మహాబలాః = మహాబలవంతులైన, మహీక్షితః=రాజులు, తస్య ధనుషః=ఆ ధనస్సు యొక్క, వీర్యమ్ = శక్తిని, జిజ్ఞాసన్తః = తెలియదలచినవారై, ఆరోపయితుమ్ = ఎక్కు పెట్టుటకు, న శేకుః = సమర్థులు కాలేదు.

తా. రాజవంశములందు పుట్టిన, మహాబలశాలు లగు ఎందరో రాజులు ఆ ధనస్సు శక్తిని పరీక్షింప గోరి, ప్రయత్నించి, ఎక్కుపెట్టలేక పోయిరి. 10

మూ. తద్ధనుర్నరశార్దూల మైథిలస్య మహాత్మనః,
తత్ర ద్రక్ష్యసి కాకుత్స్థ యజ్ఞం చాద్భుతదర్శనమ్. 11

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా, కాకుత్స్థ = రామా, మహాత్మనః= మహాత్ము డైన, మైథిలస్య = జనకునియొక్క, తత్ ధనుః = ఆ ధనస్సును, అద్భుతదర్శనమ్ = ఆశ్చర్యకర మైన దర్శనము గల, యజ్ఞం చ=యజ్ఞమును, తత్ర = అచట, ద్రక్ష్యసి= చూడగలవు.

తా. నరశ్రేష్ఠుడ వైన రామా! అచటికి వెళ్లి, మహాత్ము డైన దశరథుని ధనస్సును, ఆశ్చర్యకర మైన యజ్ఞమును చూడగలవు. 11

మూ. తద్ధి యజ్ఞఫలం తేన మైథిలేనోత్తమం ధనుః,
యాచితం నరశార్దూల సునాభం సర్వదైవతైః. 12

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా, సునాభమ్ = దృఢమైన మధ్య ప్రదేశము గల, తత్ = ఆ, ఉత్తమం ధనుః = ఉత్తమ మైన ధనస్సు, తేన = ఆ, మైథిలేన = మిథిలాధిపతి యైన దేవరాతునిచేత, సర్వైర్దైవతైః = సకలదేవతల నుండి, యజ్ఞఫలమ్ = యజ్ఞఫలముగా, యాచితం హి = యాచింపబడినది కదా.

తా. రామా ! మిథిలాధిపతి యైన దేవరాతుడు, దృఢ మైన మధ్యభాగము గల ఆ ధనస్సును, దేవతలనుండి, యజ్ఞమునకు ఫలమునుగా యాచించి గ్రహించెను. 12

మూ. ఆయాగభూతం నృపతేస్తస్య వేశ్మని రాఘవ,
అర్చితం వివిధైర్గన్ధైర్ధూపైశ్చాగురుగన్ధిభిః. 13

ప్ర. అ. రాఘవ = రామా ! తస్య = ఆ, నృపతేః = రాజుయొక్క, వేశ్మని = గృహమునందు, ఆయాగభూతమ్ = ధనురుత్సవములలో ప్రధానముగ పూజింపదగిన ధనస్సుగా అయిన ఆ ధనస్సు, వివిధైః = అనేక విధములైన, గన్ధైః = గంధములచేతను, అగురుగన్ధిభిః = అగురుగంధములతో గూడిన, ధూపైశ్చ = ధూపములచేతను, అర్చితమ్ = పూజింపబడినది.

తా. రామా ! ఆ ధనస్సు మిథిలాధిపతి గృహములో ప్రధానపూజ్య మగు ధనస్సుగా ఉండి, వివిధము లైన గంధములచేతను, అగరుధూపములచేతను పూజింపబడుచున్నది. 13

మూ. ఏవముక్త్వా మునివరః ప్రస్థానమకరోత్తదా,
సర్షిసంఘః సకాకుత్స్థ ఆమన్త్ర్య వనదేవతాః. 14

ప్ర. అ. మునివరః = మునిశ్రేష్ఠుడు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, సర్షిసంఘః = ఋషిసంఘముతో కూడినవాడై, సకాకుత్స్థః = రామలక్ష్మణులతో కూడినవాడై, వనదేవతాః = వనదేవతలను, ఆమన్త్ర్య = పలకరించి, తదా = అప్పుడు, ప్రస్థానమ్ = ప్రయాణమును, అకరోత్ = చేసెను.

తా. విశ్వామిత్రుడు ఈ విధముగ పలికి, ఋషిసంఘముతోను, రామలక్ష్మణులతోను కూడినవాడై, వనదేవతల సెలవు గైకొని బయలుదేరెను. 14

మూ. స్వస్తి వోఽస్తు గమిష్యామి సిద్ధః సిద్ధాశ్రమాదహమ్,
ఉత్తరే జాహ్నవీతీరే హిమవన్తం శిలోచ్చయమ్. 15

ప్ర. అ. (ఓ వనదేవతలారా), వః=మీకు, స్వస్తి=క్షేమము, అగుగాక. సిద్ధః=సిద్ధించిన కార్యముగల, అహమ్=నేను, సిద్ధాశ్రమాత్ = సిద్ధాశ్రమము నుండి, ఉత్తరే జాహ్నవీతీరే = గంగానదియొక్క ఉత్తరతీరమునందు, హిమవన్తమ్=హిమవంతు డనెడు, శిలోచ్చయమ్=పర్వతమును గూర్చి, గమిష్యామి= వెళ్లెదను.

తా. ఓ వనదేవతలారా! ఈ సిద్ధాశ్రమములో నాకు సంకల్పసిద్ధి కలిగినది. ఇచటి నుండి గంగానదికి ఉత్తరతీరమునం దున్న హిమవత్పర్వతమునకు వెళ్లెదను. మీకు క్షేమ మగుగాక. 15

మూ. ప్రదక్షిణం తతః కృత్వా సిద్ధాశ్రమమనుత్తమమ్,
ఉత్తరాం దిశముద్దిశ్య ప్రస్థాతుముపచక్రమే. 16

ప్ర. అ. తతః=పిమ్మట, అనుత్తమమ్ = మిక్కిలిశ్రేష్ఠ మైన, సిద్ధాశ్రమమ్ = సిద్ధాశ్రమమును, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, ఉత్తరాం దిశముద్దిశ్య = ఉత్తరదిక్కును గూర్చి, ప్రస్థాతుమ్ = ప్రయాణము చేయుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. పిమ్మట అత్యుత్తమ మైన ఆ సిద్ధాశ్రమమునకు ప్రదక్షిణముచేసి, ఉత్తరము వైపు ప్రయాణమై వెళ్లెను. 16

మూ. తం ప్రయాన్తం మునివరమన్వయాదనుసారిణామ్,
శకటీశతమాత్రం తు ప్రాయేణ బ్రహ్మవాదినామ్. 17

ప్ర. అ. ప్రయాన్తమ్ = వెళ్లుచున్న, తమ్=ఆ, మునివరమ్ = మునిశ్రేష్ఠుని, అనుసారిణామ్ = అనుసరించుచున్న, బ్రహ్మవాదినామ్ = వేదవిద్వాంసులయొక్క, ప్రాయేణ = దాదాపు, శకటీశతమాత్రమ్ = నూరుబండ్లు, అన్వయాత్ = అనుసరించి వెళ్లెను.

తా. విశ్వామిత్రుడు ప్రయాణమై వెళ్లుచుండగా, ఆతనిని అనుసరించు బ్రహ్మవాదుల దాదాపు నూరు శకటములు ఆతనిని వెంబడించినవి. 17

మూ. మృగపక్షిగణాశ్చైవ సిద్ధాశ్రమనివాసినః,
అనుజగ్ముర్మహాత్మానం విశ్వామిత్రం మహామునిమ్. 18
నివర్తయామాస తతః పక్షిసంఘాన్ మృగానపి.

ప్ర. అ. సిద్ధాశ్రమనివాసినః = సిద్ధాశ్రమములో నివసించు, మృగపక్షిగణాశ్చైవ = మృగపక్షిగణములు, మహాత్మానమ్ = మహాత్ముడైన, విశ్వామిత్రం మహామునిమ్ = విశ్వామిత్ర మహర్షిని, అనుజగ్ముః = అనుసరించి వెళ్లినవి. పక్షిసంఘాన్ = పక్షుల సముదాయములను, మృగానపి = మృగములను కూడ నివర్తయామాస = మరలిపోవునట్లు చేసెను.

తా. సిద్ధాశ్రమములో నున్న మృగపక్షులు కూడ మహాత్ముడగు ఆ విశ్వామిత్ర మహామునిని అనుసరించి వెళ్లినవి. విశ్వామిత్రుడు ఆ పక్షులను, మృగములను కూడ వెనుకకు పంపివేసెను. 18

మూ. తే గత్వా దూరమధ్వానం లమ్బమానే దివాకరే,
వాసం చక్రు ర్మునిగణాః శోణాకూలే సమాహితాః. 19

ప్ర. అ. తే = ఆ, మునిగణాః = మునిగణములు, దూరమ్ అధ్వానమ్ = దూరమార్గమును, గత్వా = వెళ్లి, దివాకరే = సూర్యుడు, లమ్బమానే = వ్రేలాడుచుండగా, సమాహితాః = అందరును కలిసి, శోణాకూలే = శోణమనెడు నదము యొక్క తీరమునందు, వాసమ్ = నివాసమును, చక్రుః = చేసిరి.

తా. ఆ మునులు చాల దూరము ప్రయాణము చేసి, సాయంకాలమున, శోణనదతీరమున అందరును కలిసి నివాసము చేసిరి. 19

మూ. తేఽస్తంగతే దినకరే స్నాత్వా హుతహుతాశనాః, 20
విశ్వామిత్రం పురస్కృత్య నిషేదురమితౌజసః.

ప్ర. అ. అమితౌజసః = గొప్ప తేజస్సు గల, తే = వారు, దినకరే = సూర్యుడు, అస్తం గతే = అస్తమించినవా డగుచుండగా, స్నాత్వా = స్నానము చేసి, హుతహుతాశనాః = హోమము చేయబడిన అగ్నులు కలవారై, విశ్వా

మిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = పురస్కరించుకొని, నిషేదుః = కూర్చుండిరి.

తా. గొప్ప తేజస్సు గల ఆ ఋషు లందరును, సూర్యాస్తమయానంతరము అగ్నిహోమములు చేసికొని, విశ్వామిత్రుని పురస్కరించుకొని కూర్చుండిరి. 20

మూ. రామోఽపి సహసౌమిత్రిర్మునీంస్తానభిపూజ్య చ,
అగ్రతో నిషసాదాథ విశ్వామిత్రస్య ధీమతః. 21

ప్ర. అ. సహసౌమిత్రిః=లక్ష్మణసమేతుడైన, రామః అపి = రాముడు కూడ, తాన్=ఆ, మునీన్=మునులను, అభిపూజ్య=పూజించి, అథ = పిమ్మట, ధీమతః = ధీమంతుడైన, విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క, అగ్రతః = ఎదుట, నిషసాద=కూర్చుండెను.

తా. లక్ష్మణసమేతు డైన రాముడు ఆ మునులను పూజించి, పిమ్మట, విశ్వామిత్రుని ఎదుట కూర్చుండెను. 21

మూ. అథ రామో మహాతేజాః విశ్వామిత్రం మహామునిమ్, 22
పప్రచ్ఛ నరశార్దూలః కౌతూహలసమన్వితః.

ప్ర. అ. అథ=పిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, నరశార్దూలః=నరశ్రేష్ఠు డైన, రామః = రాముడు, కౌతూహలసమన్వితః = వేడుకతో కూడినవాడై, మహామునిమ్=మహాముని యైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, పప్రచ్ఛ=అడిగెను.

తా. పిమ్మట, మహాతేజశ్శాలి యైన రాముడు, వినవేడుకతో, విశ్వామిత్ర మహామునిని ఇట్లు ప్రశ్నించెను. 22

మూ. భగవన్ కోన్వయం దేశః సమృద్ధవనశోభితః,
శ్రోతుమిచ్ఛామి భద్రం తే వక్తుమర్హసి తత్త్వతః. 23

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా, సమృద్ధవనశోభితః=సమృద్ధము లైన వనములతో శోభింపచేయబడిన, అయమ్=ఈ, దేశః=దేశము, కః ను=ఏది ?

శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. తే=నీకు, భద్రమ్=క్షేమ మగు గాక. తత్త్వతః=యథార్థముగ, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ పూజ్యుడా, ఫలపుష్పాదులతో సమృద్ధ మైన వనముచే శోభించు చున్న ఈ ప్రదేశము పేరేమి? నేను విన గోరుచున్నాను, దీనిగూర్చి చెప్పుము. 24

మూ. చోదితో రామవాక్యేన కథయామాస సువ్రతః, 24
తస్య దేశస్య నిఖిలమృషిమధ్యే మహాతపాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకత్రింశః సర్గః.

ప్ర. అ. సువ్రతః=ఉత్తమ మైన వ్రతము గల, మహాతపాః=గొప్ప తపస్సు గల విశ్వామిత్రుడు, రామవాక్యేన=రాముని వాక్యముచేత, చోదితః= ప్రేరేపింపబడినవాడై, ఋషిమధ్యే=ఋషుల మధ్యయందు, తస్య=ఆ, దేశస్య= దేశముయొక్క, నిఖిలమ్=నకలవృత్తాంతమును, కథయామాస=చెప్పెను.

తా. ఉత్తమవ్రతుడును, మహాతపఃశాలియు అగు ఆ విశ్వామిత్రుడు, రాముని వాక్యముచే ప్రేరేపింపబడి, ఆ దేశమునకు సంబంధించిన నకలవృత్తాంత మును ఋషుల మధ్య ఇట్లు చెప్పదొడగెను. 24

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు, బాలకాండలో ముప్పదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వాత్రింశః సర్గః

మూ. బ్రహ్మయోనిర్మహానాసీత్కుశో నామ మహాతపాః,
అక్లిష్టవ్రతధర్మజ్ఞః సజ్జనప్రతిపూజకః. 1

ప్ర. అ. బ్రహ్మయోనిః=బ్రహ్మ కారణముగా కలవాడును, మహాతపాః=గొప్ప తపస్సు కలవాడును, అక్లిష్టవ్రతధర్మజ్ఞః = బాధింపబడని వ్రతములు కలవాడును ధర్మములను ఎరిగినవాడును, సజ్జనప్రతిపూజకః = సజ్జనులను పూజించువాడును, మహాన్=గొప్పవాడును అగు, కుశో నామ=కుశు డను పేరు గల రాజు, ఆసీత్=ఉండెను.

తా. బ్రహ్మకుమారు డైన కుశు డను ఒక మహాపురుషుడు ఉండెను. అతడు గొప్ప తపస్సు కలవాడు, ఎన్నడును నియమములకు భంగము కలిగించని వాడు. ధర్మములను ఎరిగినవాడు. సజ్జనులను పూజించువాడు. 1

మూ. స మహాత్మా కులీనాయాం యుక్తాయాం సుగుణోల్బణాన్,
వైదర్భ్యాం జనయామాస చతురః సదృశాన్ సుతాన్. 2
కుశామ్బం కుశనాభం చ అధూర్తరజసం వసుమ్.

ప్ర. అ. సః మహాత్మా = ఆ మహాత్ముడు, కులీనాయామ్ = సత్కులమునందు పుట్టినదియు, యుక్తాయామ్ = తనకు తగినదియు అగు, వైదర్భ్యామ్ = విదర్భరాజకుమారి యందు, కుశామ్బమ్=కుశాంబుని, కుశనాభం చ = కుశనాభుని, అధూర్తరజసమ్ = అధూర్తరజసుని, వసుమ్ = వసువును, సుగుణోల్బణాన్=సుగుణములతో నిండిన, సదృశాన్=తనకు తగిన, చతురః=నలుగురు, సుతాన్=కుమారులను, జనయామాస=పుట్టించెను.

తా. ఆ మహాత్మునకు సత్కులసంజాతురాలును, తనకు తగినదియు అగు విదర్భరాజకుమారియందు కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజసుడు, వసువు అనెడు సుగుణవంతు లైన, తనతో సమాను లైన, నలుగురు కుమారులు జనించిరి. 2

మూ. దీప్తియుక్తాన్ మహోత్సాహాన్ క్షత్రధర్మచికీర్షయా,
తానువాచ కుశః పుత్రాన్ ధర్మిష్ఠాన్ సత్యవాదినః. 3

ప్ర. కుశః = కుశుడు, దీప్తియుక్తాన్=కాంతితో కూడినవారును, మహోత్సాహాన్=గొప్ప ఉత్సాహము కలవారును, ధర్మిష్ఠాన్ = ధర్మనిరతులును, సత్యవాదినః=సత్యము పలుకువారును అగు, తాన్=ఆ, పుత్రాన్=పుత్రులను గూర్చి, క్షత్రధర్మచికీర్షయా = క్షత్రియధర్మమును ఆచరింపవలె ననెడు అభిలాషచే, ఉవాచ=పలికెను.

తా. కుశమహారాజు, రాజధర్మమును అనుష్ఠింప వలె ననెడు అభిలాషచే, ప్రకాశవంతులును, గొప్ప ఉత్సాహము కలవారును, ధర్మనిరతులును, సత్యమునే పలుకువారును అగు ఆ పుత్రులతో ఇట్లు పలికెను. 3

మూ. క్రియతాం పాలనం పుత్రా ధర్మం ప్రాప్స్యథ పుష్కలమ్. 4
ఋషేస్తు వచనం శ్రుత్వా చత్వారో లోకసంమతాః,
నివేశం చక్రిరే సర్వే పురాణాం నృవరాస్తదా. 5

ప్ర. అ. పుత్రాః=పుత్రులారా, పాలనమ్=పాలనము, క్రియతామ్=చేయబడుగాక. పుష్కలమ్=అధికమైన, ధర్మం=ధర్మమును, ప్రాప్స్యథ=పొందగలరు. తదా=అప్పుడు, ఋషేః = ఆ ఋషియొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా=విని, లోకసంమతాః=లోకమునందు పూజ్యులైన, చత్వారః=నలుగురు, నృవరాః=నరశ్రేష్ఠులు, సర్వే = అందరును, పురాణామ్ = పట్టణములయొక్క, నివేశమ్=ఏర్పాటును, చక్రిరే=చేసిరి.

తా. "పుత్రులారా! పాలనము చేయుడు. అత్యధిక మైన ధర్మమును పొందెదరు." ఆ ఋషి మాటలు విని, లోకముచే పూజింపబడిన ఆ నరశ్రేష్ఠులు నలుగురును పటణముల నిర్మాణము చేసిరి. 4, 5

మూ. కుశామ్బస్తు మహాతేజాః కౌశామ్బీమకరోత్పురీమ్,
కుశనాభస్తు ధర్మాత్మా పురం చక్రే మహోదయమ్. 6

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, కుశామ్బస్తు=కుశాంబుడైతే, కౌశామ్బీమ్=కౌశాంబి యనెడు, పురీమ్=పట్టణమును, అకరోత్ = నిర్మించెను.

ధర్మాత్మా = ధర్మాత్ముడైన, కుశనాభస్తు = కుశనాభుడైతే, మహోదయమ్= మహోదయ మనే పేరు గల, పురమ్=పట్టణమును, చక్రే=నిర్మించెను.

తా. మహాతేజశ్శాలి యగు కుశాంబుడు కౌంశాబీనగరమును, ధర్మాత్ముడైన కుశనాభుడు మహోదయపురమును నిర్మించిరి. 6

మూ. అధూర్తరజసో రామ ధర్మారణ్యం మహీపతిః,
చక్రే పురవరం రాజా వసుశ్చక్రే మహోదయమ్. 7

ప్ర. అ. రామ=రామా, అధూర్తరజసః = అధూర్తరజసుడనే పేరుగల, మహీపతిః=రాజు, ధర్మారణ్యమ్=ధర్మారణ్య మనెడు, పురవరమ్=శ్రేష్ఠ మైన పురమును, చక్రే=నిర్మించెను. రాజా=రాజైన, వసుః=వసువు, మహోదయమ్= మహోదయ మనెడు పురమును, చక్రే=నిర్మించెను.

తా. రామా! అధూర్తరజసుడు ధర్మారణ్య మనెడు నగరశ్రేష్ఠమును, వసురాజు మహోదయపురమును నిర్మించిరి. 7

మూ. ఏషా వసుమతీ రామ వసోస్తస్య మహాత్మనః,
ఏతే శైలవరాః పఞ్చ ప్రకాశన్తే సమన్తతః. 8

ప్ర. అ. రామ = రామా, ఏషా = ఇది, మహాత్మనః = మహాత్ముడైన, తస్య వసోః=ఆ వసువుయొక్క, వసుమతీ=భూమి. సమన్తతః = దీనిచుట్టును, పఞ్చ=ఐదు, శైలవరాః = శ్రేష్ఠ మైన పర్వతములు, ప్రకాశన్తే = ప్రకాశించు చున్నవి.

తా. రామా! ఇది ఆ మహాత్ముడైన వసువు భూమి. దీని చుట్టును ఐదు ఉత్తమ పర్వతములు ప్రకాశించుచున్నవి. 8

మూ. సుమాగధీ నదీ రమ్యా మగధాన్ విశ్రుతా యయౌ,
పఞ్చానాం శైలముఖ్యానాం మధ్యే మాలేవ శోభతే. 9

ప్ర. అ. రమ్యా=సుందరమైన, విశ్రుతా=ప్రసిద్ధమైన, సుమాగధీ నదీ= మగధదేశమునందు పుట్టిన శోణనది, మగధాన్=మగధదేశమును, ఆయయౌ=

పొందినది. పఞ్చానామ్=ఐదు, శైలముఖ్యానామ్=ముఖ్యమైన శైలములయొక్క, మధ్యే=మధ్యయందు, మాలేవ=మాల వలె, రాజతే=ప్రకాశించుచున్నది.

తా. మగధదేశమునందు పుట్టిన, రమ్య మైన, ప్రసిద్ధ మైన శోణనది మగధదేశమును పొందినది. ఇది ఐదు శైలముల మధ్య పుష్పమాల వలె ప్రకాశించుచున్నది. 9

మూ. సైషా హి మాగధీ రామ వసోస్తస్య మహాత్మనః,
పూర్వాభిచరితా రామ సుక్షేత్రా సస్యమాలినీ. 10

ప్ర. అ. రామ=రామ, సా = ఆ, ఏషా = ఈ, మాగధీ = శోణనది, మహాత్మనః=మహాత్ము డైన, తస్య=ఆ, వసోః = వసువునకు సంబంధించినది. పూర్వాభిచరితా = తూర్పునుండి ప్రవహించుచున్నది. సుక్షేత్రా = మంచి క్షేత్రములు కలది. సస్యమాలినీ=సస్యపంక్తులు కలది.

తా. రామా! ఈ శోణనది ఆ వసువునకు సంబంధించినది. తూర్పునుండి పశ్చిమము వైపు ప్రవహించుచున్నది. దీని తీరప్రాంతములందు మంచి సస్యములతో నిండిన పొలము లున్నవి. 10

మూ. కుశనాభసు రాజర్షిః కన్యాశతమనుత్తమమ్,
జనయామాస ధర్మాత్మా ఘృతాచ్యాం రఘునన్దన. 11

ప్ర. అ. రఘునన్దన = రామా, ధర్మాత్మా = ధర్మాత్ముడును, రాజర్షిః= రాజర్షియు అయిన, కుశనాభస్తు=కుశనాభుడై తే, ఘృతాచ్యామ్=ఘృతాచియందు, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, కన్యాశతమ్ = కన్యాశతమును, జనయామాస= పుట్టించెను.

తా. రామా! ధర్మాత్ముడును, రాజర్షియు అగు కుశనాభుడు, ఘృతాచి యను అప్సరఃస్త్రీయందు అత్యుత్తమ లైన నూరుగురు కన్యలను కనెను. 11

మూ. తాస్తు యౌవనశాలిన్యో రూపవత్యః స్వలఙ్కృతాః,
ఉద్యానభూమిమాగమ్య ప్రావృషీవ శత హ్రదాః. 12

గాయన్త్యో నృత్యమానాశ్చ వాదయన్త్యశ్చ సర్వశః,
ఆమోదం పరమం జగ్ముర్వరాభరణభూషితాః. 13

ప్ర. అ. యౌవనశాలిన్యః = యౌవనముతో ప్రకాశించుచున్న, రూపవత్యః=సౌందర్యవతు లైన, తాః=ఆ కన్యకలు, స్వలఙ్కృతాః = బాగుగా అలంకరించుకున్నవారై, ఉద్యానభూమిమ్=ఉద్యానప్రదేశమును, ఆగమ్య=చేరి, ప్రావృషి=వర్షాకాలమునందు, శతహ్రదాః ఇవ=మెరుపుల వలె ప్రకాశించుచు, గాయన్త్యః=గానము చేయుచున్నవారై, నృత్యమానాశ్చ=నాట్యము చేయుచున్న వారై, వాదయన్త్యః=వీణాదులను ప్రయోగించుచున్నవారై, సర్వాభరణభూషితాః= సమస్తము లైన అలంకారములచే అలంకరింపబడినవారై, సర్వశః = అన్ని వైపుల తిరుగుచు, పరమమ్=గొప్ప, ఆమోదమ్ = ఆనందమును, జగ్ముః= పొందిరి.

తా. యౌవనముతో ప్రకాశించుచున్న, రూపవతు లగు ఆ కన్యలు సకలాభరణములతో చక్కగ అలంకరించుకొని, వర్షాకాలమునందు మెరుపు తీగలవలె ప్రకాశించుచు, ఉద్యానములో నలుమూలల విహరించుచు, గానము చేయుచు, నాట్య మాడుచు, వాద్యములను ప్రయోగించుచు గొప్ప ఆనందమును పొందిరి. 12, 13

మూ. అథ తాశ్చారుసర్వాఙ్గ్యో రూపేణాప్రతిమా భువి,
ఉద్యానభూమిమాగమ్య తారా ఇవ ఘనాన్తరే. 14

ప్ర. అ. అథ=పిమ్మట, చారుసర్వాఙ్గ్యః=సుందరమైన సకలావయవములు కల, రూపేణ=సౌందర్యముచేత, భువి=భూమియందు, అప్రతిమాః=సాటిలేని, తాః=ఆ కన్యలు, ఉద్యానభూమిమ్ = ఉద్యానప్రదేశమును, ఆగమ్య = పొంది, ఘనాన్తరే=మేఘముల మధ్య, తారాః ఇవ=నక్షత్రములవలె, (ప్రకాశించిరి).

తా. అందమైన సకలావయములు కలిగి భూలోకమునందు సాటి లేని రూపము గల ఆ కన్యకలు, ఉద్యానమును చేరి, మేఘమధ్యమునందు, నక్షత్రముల వలె ప్రకాశించిరి. 14

మూ. తాః సర్వగుణసంపన్నా రూపయౌవనసంయుతాః,
దృష్ట్వా సర్వాత్మకో వాయురిదం వచనమబ్రవీత్. 15

ప్ర. అ. సర్వాత్మకః=అంతటను సంచరించు, వాయుః=వాయుదేవుడు, సర్వగుణసంపన్నాః = అన్ని సద్గుణములతో కూడినవారును, రూపయౌవన సంయుతాః = రూపముతోడను యౌవనముతోడను కూడినవారును అగు, తాః= వారిని, దృష్ట్వా=చూచి, ఇదమ్ = ఈ, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. అంతటను సంచరించు వాయుదేవుడు, సర్వగుణసంపన్నలై, రూప యౌవనములతో ప్రకాశించుచున్న ఆ కన్యలను చూచి ఇట్లు పలికెను. 15

మూ. అహం వః కామయే సర్వా భార్యా మమ భవిష్యథ,
మానుష స్త్యజ్యతాం భావో దీర్ఘ మాయురవాప్స్యథ. 16

ప్ర. అ. అహమ్=నేను, వః=మిమ్ములను, సర్వాః=అందరిని, కామయే= కోరుచున్నాను. మమ=నా యొక్క, భార్యాః=భార్యలుగా, భవిష్యథ=కాగలరు. మానుషః=మనుష్యసంబంధ మైన, భావః=స్వభావము, త్యజ్యతామ్ = విడువ బడు గాక. దీర్ఘమ్=దీర్ఘ మైన, ఆయుః = ఆయుర్దాయమును, అవాప్స్యథ= పొందుదు.

తా. నేను మిమ్ముల నందరిని కోరుచున్నాను. నా భార్యలు కండు. నన్ను వివాహము చేసికొనినచో మనుష్యత్వము పోయి మీకు దీర్ఘాయువు లభించును. 16

మూ. చలం హి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః,
అక్షయ్యం యౌవనం ప్రాప్తా అమర్త్యాశ్చ భవిష్యథ. 17

ప్ర. అ. నిత్యమ్=ఎల్లపుడును, యౌవనమ్=యౌవనము, చలం హి= అస్థిర మైనది. మానుషేషు=మనుష్యులలో, విశేషతః = అధికముగ అస్థిరము. అక్షయ్యమ్=అంతు లేని, యౌవనమ్ = యౌవనమును, ప్రాప్తాః=పొందినవారై, అమర్త్యాః చ=దేవతాస్త్రీలుగాకూడ, భవిష్యథ=కాగలరు.

తా. యౌవన మనునది అస్థిరము. మనుష్యులలో ఇంకను అస్థిరము. నన్ను పెండ్లాడినచో శాశ్వత మైన యౌవనముతో దేవతాస్త్రీలుగా కాగలరు. 17

మూ. తస్య తద్వచనం శ్రుత్వా వాయోరక్లిష్టకర్మణః,
అపహాస్య తతో వాక్యం కన్యాశతమథాబ్రవీత్. 18

ప్ర. అ. తతః=పిమ్మట, అక్లిష్టకర్మణః = అడ్డు పెట్టబడని కర్మగల, తస్య వాయోః=ఆ వాయుదేవునియొక్క, తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా=విని, అపహాస్య=పరిహసించి, కన్యాశతమ్=కన్యకల శతము, అథ= అటుపిమ్మట, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఏ పనిచేయుటకైనను అడ్డు లేని ఆ వాయువు మాటలు విని, ఆ నూర్గురు కన్యలు పరిహాసపూర్వకముగా ఇట్లనిరి. 18

మూ. అన్తశ్చరసి భూతానాం సర్వేషాం త్వం సురోత్తమ,
ప్రభావజ్ఞాః స్మ తే సర్వాః కిమస్మానవమన్యసే. 19

ప్ర. అ. సురోత్తమ=ఓ దేవతాశ్రేష్ఠుడా, త్వమ్ = నీవు, సర్వేషామ్= సమస్త మైన, భూతానామ్=భూతములయొక్క, అన్తః=లోపల, చరసి=సంచరించుచున్నావు. సర్వాః=మేమందరము, తే=నీయొక్క, ప్రభావజ్ఞాః=ప్రభావమును ఎరిగిన వారముగా, స్మ = అయి ఉన్నాము. అస్మాన్ = మమ్ములను, కిమ్ అవమన్యసే=ఎందుకు అవమానము చేయుచున్నావు ?

తా. ఓ సురోత్తమా! నీవు సర్వప్రాణులలోపల సంచరించువాడవు. నీ ప్రభావము మాకందరకును తెలియును. మమ్ములను ఎందుకు ఇట్లు అవమానించుచున్నావు ? 19

మూ. కుశనాభసుతాః సర్వాస్సమర్థాస్త్వాం సురోత్తమ,
స్థానాచ్చ్యావయితుం దేవం రక్షామస్తు తపో వయమ్. 20

ప్ర. అ. సురోత్తమ=ఓ దేవతాశ్రేష్ఠుడా, సర్వాః వయం=మేమందరము, కుశనాభసుతాః = కుశనాభుని కుమార్తెలము. దేవమ్ = దేవత వైన, త్వామ్= నిన్ను, స్థానాత్ = నీఅధికారమునుండి, చ్యావయితుమ్ = తొలగించుటకు,

సమర్థాః=సామర్థ్యము కలవారము. తు=కాని, తపః = తపస్సును, రక్షామః= రక్షించుకొనుచున్నాము.

తా. ఓ సురోత్తమా! మే మందరమును కుశనాభుని కుమార్తెలము. నీవు దేవతవే యైనను నిన్ను నీ అధికారమునుండి తొలగించు సామర్థ్యము మా కున్నది గాని తపస్సును రక్షించుకొనుటకై అట్లు చేయుటలేదు. 20

మూ. మా భూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్,
అవమన్య స్వధర్మేణ స్వయం వరముపాస్మహే. 21

ప్ర. అ. దుర్మేధః=దుష్టబుద్ధి కలవాడా! సత్యవాదినమ్ = సత్యమునే పలికెడు, పితరమ్=తండ్రిని, అమమన్య=అవమానించి, స్వధర్మేణ=స్వేచ్ఛచేత, స్వయమ్=స్వయముగనే, వరమ్=వరుని, ఉపాస్మహే/= ఎపుడు సేవింతుమో, సః=ఆ, కాలః=కాలము, మాభూత్=రాక పోవుగాక.

తా. ఓ దుర్బుద్ధీ! సత్యవాది యైన తండ్రిని కాదని స్వేచ్ఛానుసారముగా, మేమే స్వయముగ వరుని పొందెడు కాలము ఎన్నటికిని రాకుండు గాక. 21

మూ. పితా హి ప్రభురస్మాకం పరమం దైవతం హి సః,
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి. 22

ప్ర. అ. అస్మాకమ్=మాకు, పితా=తండ్రియే, ప్రభుః హి = ప్రభువు కదా. సః=అతడే, పరమమ్=గొప్ప, దైవతమ్=దేవత. పితా = మా తండ్రి, నః=మమ్ములను, యస్య=ఎవనికి, దాస్యతి=ఇవ్వగలడో, సః=అతడే, నః= మాకు, భర్తా=భర్తగా, భవిష్యతి=కాగలడు.

తా. మాకు తండ్రియే ప్రభువు; తండ్రియే దేవత; మా తండ్రి మమ్ము లను ఎవరి కిచ్చునో ఆతడే మా భర్త కాగలడు. 22

మూ. తాసాం తద్వచనం శ్రుత్వా వాయుః పరమకోపనః,
ప్రవిశ్య సర్వగాత్రాణి బభఞ్జ భగవాన్ ప్రభుః. 23

ప్ర. అ. తాసామ్=ఆ కన్యలయొక్క, తత్ వచనమ్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, ప్రభుః = సమర్థుడైన, భగవాన్=మాహాత్మ్యముగల, వాయుః=

వాయువు, పరమకోపనః=మిక్కిలి కోపము కలవాడై, సర్వగాత్రాణి = అన్ని అవయములను, ప్రవిశ్య=ప్రవేశించి, బభఞ్జ=భగ్నము చేసెను.

తా. ఆ కన్యకల వాక్యము విని, సామర్థ్యవంతు డగు వాయువు చాల కోపించి, అవయవము లన్నింటిలోనికి ప్రవేశించి వాటిని దుర్బలములుగ చేసెను. 23

మూ. తాః కన్యా వాయునా భగ్నా వివిశుర్నృపతేర్గృహమ్,
ప్రాపతన్ భువి సంభ్రాన్తాః సలజ్జాః సాస్రలోచనాః. 24

ప్ర. అ. వాయునా = వాయువుచేత, భగ్నాః = బలవిహీనలుగా చేయబడిన, తాః కన్యాః=ఆ కన్యలు, నృపతేః=రాజుయొక్క, గృహమ్ = గృహమును, వివిశుః=ప్రవేశించిరి. సంభ్రాన్తాః = తొట్రుపడుచున్నవారై, సలజ్జాః= లజ్జతో కూడినవారై, సాస్రలోచనాః = కన్నీళ్లతో కూడిన నేత్రములు కలవారై, భువి=భూమిపై, ప్రాపతన్=పడిరి.

తా. వాయువుచేత ఆ విధముగ పీడింపబడిన ఆ కన్యకలు రాజగృహములోనికి ప్రవేశించి, తొట్రుపడుచు, కన్నీళ్లు కార్చుచు, సిగ్గుపడుచు నేలమీద పడిరి. 24

మూ. స చ తా దయితా దీనాః కన్యాః పరమశోభనాః,
దృష్ట్వా భగ్నాస్తదా రాజా సంభ్రాన్త ఇదమబ్రవీత్. 25

ప్ర. అ. సః రాజా=ఆ రాజు, తదా = అప్పుడు, దయితాః = ఇష్టమైనవారును, దీనాః=దీనలును, పరమశోభనాః = మిక్కిలి అందమైనవారును అగు, తాః కన్యాః=ఆ కన్యలను, భగ్నాః = ఆ విధముగ దుర్బలలుగ చేయబడినవారినిగా, దృష్ట్వా=చూచి, సంభ్రాన్తః=కలతచెందినవాడై, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడా కుశనాభుడు మిక్కిలి ప్రకాశించు తన ప్రియపుత్రికలు భగ్నలై, దైన్యముతో నుండుట చూచి ఇట్లు పలికెను. 25

మూ. కిమిదం కథ్యతాం పుత్ర్యః కో ధర్మమవమన్యతే,
కుబ్జాః కేన కృతాః సర్వా వేష్టన్త్యో నాభిభాషథ. 26
ఏవం రాజా వినిశ్వస్య సమాధిం సందధే తతః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్వాత్రింశః సర్గః.

ప్ర. అ. పుత్ర్యః = పుత్రికలారా! ఇదమ్ = ఇది, కిమ్=ఏమి ? కః= ఎవడు, ధర్మమ్ = ధర్మమును, అవమన్యతే = అవమానముచేయుచున్నాడు ? కథ్యతామ్=చెప్పబడుగాక. సర్వాః=మీరందరును, కుబ్జాః=గూనివారుగా, కేన= ఎవనిచే, కృతాః=చేయబడినారు? వేష్టన్త్యః=దొర్లుచు, నాభిభాషథ=మాటలాడ రేమి ? రాజా=రాజు, ఏవమ్ = ఈ విధముగా పలికి, వినిశ్వస్య=నిట్టూర్చి, తతః = పిమ్మట, సమాధిమ్ = సావధానత్వమును, సందధే = కూర్చుకొనెను.

తా. "పుత్రికలారా! ఇది యేమి! ఈ విధముగ ధర్మమును అవమానించు చున్నవాడు ఎవడు ? చెప్పుడు. మిమ్ముల నందరిని గూనివాళ్లనుగా చేసినది ఎవడు ? నేలపై దొర్లుచు మాటలాడకున్నా రేమి ?" రాజు ఈ విధముగ పలికి, నిట్టూర్చి, ఏమి చెప్పెదరో అని వినుటకై సావధానచిత్తుడై ఉండెను. 26

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండములో ముప్పది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయస్త్రింశః సర్గః

మూ. తస్య తద్వచనం శ్రుత్వా కుశనాభస్య ధీమతః
శిరోభిశ్చరణౌ స్పృష్ట్వా కన్యాశతమభాషత. 1

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతు డైన, తస్య కుశనాభస్య = ఆ కుశ నాభునియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, కన్యాశతమ్ = కన్యకలశతము, శిరోభిః = శిరస్సులచేత, చరణౌ = తండ్రిపాదములను, స్పృష్ట్వా = స్పృశించి, అభాషత = పలికెను.

తా. బుద్ధిమంతు డైన ఆ కుశనాభుని మాటలు విని, ఆ నూర్గురు కన్య లును తండ్రి పాదములకు నమస్కరించి ఇట్లు పలికిరి. 1

మూ. వాయుః సర్వాత్మకో రాజన్ ప్రధర్షయితుమిచ్ఛతి,
అశుభం మార్గమాస్థాయ న ధర్మం ప్రత్యవేక్షతే. 2

ప్ర. అ. రాజన్ = రాజా! సర్వాత్మకః = సర్వవ్యాపియైన, వాయుః = వాయువు, అశుభమ్ = అశుభమైన, మార్గమ్ = మార్గమును, ఆస్థాయ = అను సరించి, ప్రధర్షయితుమ్ = తిరస్కరించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. ధర్మమ్ = ధర్మమును, న ప్రత్యవేక్షతే = చూచుటలేదు.

తా. తండ్రీ! సర్వవ్యాపి యైన వాయువు చెడు మార్గము నవలంబించి మమ్ములను తిరస్కరించుటకు ప్రయత్నించుచున్నాడు. ధర్మమును లెక్క చేయుటలేదు. 2

మూ. పితృమత్యః స్మ భద్రం తే స్వచ్ఛన్దే న వయం స్థితాః,
పితరం నో వృణీష్వ త్వం యది నో దాస్యతే తవ. 3

ప్ర. అ. వయమ్ = మేము, పితృమత్యః = తండ్రికలవారముగా, స్మ = ఉన్నాము. తే = నీకు, భద్రమ్ = మంగళమగుకాక, స్వచ్ఛన్దే = స్వాతంత్ర్యము నందు, న స్థితాః = లేము. నః = మమ్ములను, తవ = నీకు, దాస్యతే యది =

ఇచ్చునేమో; త్వమ్ = నీవు, నః=మాయొక్క, పితరమ్=తండ్రిని, వృణీష్వ= కోరుము.

తా. "మా తండ్రిగా రున్నారు. నీకు భద్ర మగుగాక. మేము స్వతంత్ర లము కాము. మా తండ్రి మమ్ములను నీ కిచ్చు నేమో ఆయనను కోరుము." 3

మూ. తేన పాపానుబన్ధేన వచనం న ప్రతీచ్ఛతా,
ఏవం బ్రువన్త్యః సర్వాః స్మ వాయునా నిహతా భృశమ్. 4

ప్ర. అ. ఏవమ్ = ఈవిధముగా, బ్రువన్త్యః = పలుకుచున్న, సర్వాః = మేమందరము, పాపానుబన్ధేన = పాపసంబంధము గలవాడును, వచనమ్ = మా మాటను, నప్రతీచ్ఛతా = అంగీకరించని, తేన వాయునా = ఆ వాయువుచేత, భృశమ్ = మిక్కిలి, నిహతాః = కొట్టబడితిమి.

తా. పాపాశయు డైన ఆ వాయువు మేమిట్లు చెప్పగా మా మాటల నంగీ కరింపక మమ్ములను ఈ విధముగ పీడించినాడు. 4

మూ. తాసాం తద్వచనం శ్రుత్వా రాజా పరమధార్మికః,
ప్రత్యువాచ మహాతేజాః కన్యాశతమనుత్తమమ్. 5

ప్ర. అ. పరమధార్మికః = పరమధార్మికుడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును అగు, రాజా = రాజు, తాసామ్ = వారియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా=విని, అనుత్తమమ్ = అత్యుత్తమ మైన, కన్యాశతమ్ = కన్యాశతమును గూర్చి, ప్రత్యువాచ = తిరిగిపలికెను.

తా. పరమధార్మికుడును, మహాతేజఃశాలియు అగు కుశనాభుడు వారి మాటలు విని వారితో ఇట్లనెను. 5

మూ. క్షాన్తం క్షమావతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతమ్,
ఐకమత్యముపాగమ్య కులం చావేక్షితం మమ. 6

ప్ర. అ. పుత్ర్యః = పుత్రికలారా! క్షమావతామ్ = ఓర్పుకలవారియొక్క, కర్తవ్యమ్ = కర్తవ్యమైన, క్షాన్తమ్ = క్షమించుట, కృతమ్ = చేయబడినది.

సుమహత్ = ఇది గొప్పకార్యము. ఐకమత్యమ్=ఐకమత్యమును, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, మమ = నాయొక్క, కులం చ = కులము కూడ, అవేక్షితమ్ = చూడబడినది.

తా. పుత్రికలారా! ఓర్పు కలవారు. చేయతగిన క్షమించుట అను గొప్ప పని చేసినారు. ఇది చాల ప్రశంసనీయము. మీరందరును ఒకే విధమగు ఆలోచనతో నావంశగౌరవమును కాపాడినారు. 6

మూ. అలఙ్కారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా,
దుష్కరం తచ్చ యత్ క్షాన్తం త్రిదశేషు విశేషతః. 7
యాదృశీ వః క్షమా పుత్ర్యః సర్వాసామవిశేషతః.

ప్ర. అ. నారీణామ్ = స్త్రీలకు గాని, పురుషస్య వా = పురుషునకు గాని, క్షమా = ఓర్పు, అలఙ్కారో హి = అలంకారము కదా. క్షాన్తమ్ ఇతి యత్ = క్షమించుట అనునది ఏది కలదో, తత్ = అది, దుష్కరమ్ = చేయ శక్యము కానిది. త్రిదశేషు = దేవతలయందు, అనగా - దేవాంశసంభూతులయందు, విశేషతః = విశేషముగ దుష్కరము. పుత్ర్యః = పుత్రికలారా, వః = మీకు, సర్వాసామ్ = అందరికిని, అవిశేషతః = భేదము లేకుండగ, యాదృశీ = ఎట్టి, క్షమా = ఓర్పు ఉన్నదో, అది ఇంకను దుష్కర మైనది.

తా. స్త్రీల కైనను, పురుషుల కైనను ఓర్పు అనునది అలంకారము కదా? క్షమించుట అనునది చేయశక్యము కాని పని. రూపయౌవనాదులు గల దేవతలకు ఓర్పు ఉండుట ఇంకను కష్టము. మీరందరును ఒకే విధమున ఓర్పు చూపుట ఇంకను మెచ్చుకొనవలసిన విషయము. (తన కుమార్తెలు దేవతాస్త్రీల వంటివారు గాన దేవత లని చెప్పినాడు. వారి తల్లి ఘృతాచి అప్సరస కదా). 7

మూ. క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికాః, 8
క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్.

ప్ర. అ. క్షమా = ఓర్పు, దానమ్ = దానము. క్షమా = ఓర్పే, యజ్ఞః = యజ్ఞము. పుత్రికాః = పుత్రికలారా! క్షమా = ఓర్పే, సత్యం హి = సత్యము

కదా ? క్షమా = ఓర్పే, యశః = కీర్తి. క్షమా = ఓర్పే, ధర్మః = ధర్మము. జగత్ = జగత్తు, క్షమయా = ఓర్పుచేత, విష్ఠితమ్ = నిలచి ఉన్నది.

తా. పుత్రికలారా ! ఓర్పే దానము; ఓర్పే యజ్ఞము; ఓర్పే సత్యము; ఓర్పే కీర్తి; ఓర్పే ధర్మము. ఓర్పుమీదనే ఈ జగత్తు నిలచి ఉన్నది. 8

మూ. విసృజ్య కన్యాః కాకుత్స్థ రాజా త్రిదశవిక్రమః. 9
మన్త్రజ్ఞో మన్త్రయామాస ప్రధానం సహ మన్త్రిభిః,
దేశకాలౌ ప్రదానస్య సదృశే ప్రతిపాదనమ్. 10

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! త్రిదశవిక్రమః = దేవతల వంటి పరాక్రమము గల, మన్త్రజ్ఞః = ఆలోచనను ఎరిగిన, రాజా = రాజు, కన్యాః = కన్యకలను, విసృజ్య = విడచి, మన్త్రిభిః సహ=మంత్రులతో కూడ, ప్రదానమ్=(కన్యకల) దానమును గూర్చి, మన్త్రయామాస=ఆలోచించెను. ప్రదానస్య=కన్యాదానమునకు, దేశకాలౌ=తగినదేశకాలములను, సదృశే=తగినవానికి, ప్రతిపాదనమ్= ఇచ్చుటనుగూర్చి (ఆలోచించెను).

తా. రామా ! దేవతలవంటి పరాక్రమము కలవాడును, ఆలోచన చేయుటలో సమర్థుడును అగు ఆ కుశధ్వజుడు, కన్యకలను లోనికి పంపివేసి, వారి వివాహమును గూర్చి మంత్రులతో ఆలోచన చేసెను. కన్యాదానము చేయుటకు తగిన దేశకాలములను గూర్చియు, తగిన వరునకు ఇచ్చుట మొదలగు విషయములను గూర్చియు కూడ ఆలోచించెను. 9, 10

మూ. ఏతస్మిన్నేవ కాలే తు చూళీ నామ మహాతపాః,
ఊర్ధ్వరేతాః శుభాచారో బ్రాహ్మం తప ఉపాగమత్. 11

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, కాలే ఏవ=కాలమునందే, మహాతపాః=గొప్ప తపస్సుకలవాడును, ఊర్ధ్వరేతాః=పైకి ప్రసరించు రేతస్సు కలవాడును, అనగా రేతస్స్ఖలనము లేనివాడును, శుభాచారః=శుభమైన ఆచారము కలవాడును అగు, చూళీ నామ=చూళి అను మహర్షి, బ్రాహ్మమ్=వేదోక్తమైన, తపః=తపస్సును, ఉపాగమత్=పొందెను.

తా. ఆ కాలమునందే, మహాతపశ్శాలియు, ఊర్ధ్వరేతస్కుడును, శుభమైన ఆచారము కలవాడును అగు చూళి అను మహర్షి వేదోక్తరీతిని తపస్సు చేసెను. 11

మూ. తప్యన్తం తమృషిం తత్ర గన్ధర్వీ పర్యుపాసతే,
సోమదా నామ భద్రం తే ఊర్మిళాతనయా తదా. 12

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అచట, తప్యన్తమ్=తపస్సు చేయుచున్న, తమ్ ఋషిమ్=ఆ ఋషిని, ఊర్మిళాతనయా=ఊర్మిళయొక్క కుమార్తెయైన, సోమదా నామ=సోమద అను, గన్ధర్వీ = గంధర్వస్త్రీ, పర్యుపాసతే=సేవించెడిది. తే=నీకు, భద్రమ్=మంగళ మగుగాక.

తా. అక్కడ దాతడు తపస్సు చేయుచుండగా ఊర్మిళ కుమార్తె యైన సోమద అనెడు గంధర్వస్త్రీ ఆతనికి ఉపచారములు చేయుచుండెను. రామా ఈ పుణ్యకథను వినుటచే నీకు మంగళ మగుగాక. 12

మూ. సా చ తం ప్రణతా భూత్వా శుశ్రూషణపరాయణా,
ఉవాస కాలే ధర్మిష్ఠా తస్యాస్తుష్టోఽభవద్గురుః. 13

ప్ర. అ. సా చ=ఆమె, తమ్=ఆతని విషయమున, ప్రణతా=వినయవంతురాలై, శుశ్రూషణపరాయణా = శుశ్రూషచేయుటయందు శ్రద్ధావంతురాలై, ధర్మిష్ఠా=ధర్మమునాచరించునదై, ఉవాస=వసించెను. కాలే=కొంతకాలమునకు, గురుః=గురువు, తస్యాః = ఆమె విషయమున, తుష్టః = సంతసించినవాడు, అభవత్=ఆయెను.

తా. సోమద ఆ ఋషివిషయమున వినయవంతురాలై, శ్రద్ధాపూర్వకముగ శుశ్రూష చేయుచు, ధర్మమార్గము ననుసరించి అచట నివసించెను. కొంత కాలమునకు చూళికి ఆమెపై అనుగ్రహము కలిగెను. 13

మూ. స చ తాం కాలయోగేన ప్రోవాచ రఘునన్దన,
పరితుష్టోఽస్మి భద్రం తే కిం కరోమి తవ ప్రియమ్. 14

ప్ర. అ. సః చ=ఆ చూళిమహర్షి, కాలయోగేన = ఆమె చేసిన శుశ్రూష ఫలించు కాలము వచ్చుటచే, తామ్ = ఆమెను గూర్చి, ప్రోవాచ = పలికెను. పరితుష్టః=సంతసించినవాడను, అస్మి = అయినాను. తే = నీకు, భద్రమ్= మంగళము అగుగాక. తవ = నీకు, కిమ్ = ఏమి, ప్రియమ్ = ప్రియమును, కరోమి=చేయుదును ?

తా: రామా ! ఆమె చేసిన శుశ్రూష ఫలించు కాలము వచ్చినది. ఆ ఋషి సోమదతో- "నీ విషయమున సంతోషించితిని. నీకు క్షేమ మగుగాక, నీకు ఏమి ప్రియము చేయవలెను ?" అని పలికెను. 14

మూ. పరితుష్టం మునిం జ్ఞాత్వా గంధర్వీ మధురస్వరా,
ఉవాచ పరమప్రీతా వాక్యజ్ఞా వాక్యకోవిదమ్. 15

ప్ర. అ. మునిమ్ = మునిని, పరితుష్టమ్ = సంతోషించినవానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, మధురస్వరా=మధుర మైన స్వరముకలదియు, వాక్యజ్ఞా= వాక్యములను ఎరిగినదియు అగు; గంధర్వీ=ఆ గంధర్వాంగన, పరమప్రీతా= చాల సంతసించినదై, వాక్యకోవిదమ్=వాక్యములను ఎరిగిన ఆ మునిని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. మధుర మైన స్వరము కలదియు, మాటలాడుటలో నేర్పు కలదియు అగు ఆ గంధర్వస్త్రీ ముని అనుగ్రహించినా దని తెలిసి చాల సంతోషించినదై, మాటలలో నేర్పు గల ఆ మునితో ఇట్లనెను. 15

మూ. లక్ష్మ్యా సముదితో బ్రాహ్మ్యా బ్రహ్మభూతో మహాతపాః,
బ్రాహ్మేణ తపసా యుక్తం పుత్రమిచ్ఛామి ధార్మిక. 16

ప్ర. అ. మహాతపాః=గొప్ప తపస్సుగల నీవు, బ్రాహ్మ్యా = బ్రాహ్మణ సంబంధి యైన, లక్ష్మ్యా=శోభతో, సముదితః=కూడినవాడవై, బ్రహ్మభూతః= బ్రహ్మవంటివాడవై యున్నావు. ధార్మిక = ఓ ధార్మికుడా, బ్రాహ్మేణ = బ్రాహ్మణ సంబంధ మైన, తపసా=తపస్సుతో, యుక్తమ్=కూడిన, పుత్రమ్= పుత్రుని, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. మహాతపః శాలి వైన నీవు, బ్రాహ్మతేజస్సుచే బ్రహ్మదేవుని వంటి వాడవై ఉన్నావు. ఓ ధార్మికుడా! బ్రాహ్మమగు తపస్సుతో కూడిన పుత్రుని కోరుచున్నాను. 16.

మూ. అపతిశ్చాస్మి భద్రం తే భార్యా చాస్మి న కస్య చిత్,
బ్రాహ్మేణోపగతాయాశ్చ దాతుమర్హసి మే సుతమ్. 17

ప్ర. అ. అపతిః చ=భర్త లేనిదాననై, అస్మి = ఉన్నాను. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. కస్య చిత్=ఎవ్వనికిని, భార్యా=భార్యగా, నాస్మి= లేను. ఉపగతాయాః=నిన్ను ఆశ్రయించి ఉన్న, మే = నాకు, బ్రాహ్మేణ= తపస్సుచేత (తపోమహిమచేత), సుతమ్=కుమారుని, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి=తగియున్నావు.

తా. నాకు భర్త లేడు. నీకు క్షేమ మగుగాక. నే నెవ్వరికిని భార్యను కాను. నిన్ను ఆశ్రయించి ఉన్న నాకు నీ తపోబలముచే కుమారుని ఇమ్ము. 17

మూ. తస్యాః ప్రసన్నో బ్రహ్మర్షిర్దదౌ పుత్రమనుత్తమమ్,
బ్రహ్మదత్త ఇతి ఖ్యాతం మానసం చూళిన స్సుతమ్. 18

ప్ర. అ. తస్యాః=ఆమెకు, ప్రసన్నః = అనుగ్రహించిన, బ్రహ్మర్షిః= బ్రహ్మర్షి, చూళినః = చూళియొక్క, మానసమ్ = మనస్సంకల్పమువల్లపుట్టిన, సుతమ్=కుమారుడు గాను, బ్రహ్మదత్త ఇతి=బ్రహ్మదత్తు డనియు, ఖ్యాతమ్= ప్రసిద్ధు డైన, అనుత్తమమ్=అత్యుత్తము డైన, పుత్రమ్ = పుత్రుని, దదౌ= ఇచ్చెను.

తా. ప్రసన్ను డైన ఆ బ్రహ్మర్షి ఆమె కొక అత్యుత్తము డైన పుత్రుని ఇచ్చెను. ఆతడు బ్రహ్మదత్తు డనియు, చూళి మానసపుత్రు డనియు ప్రసిద్ధి పొందెను. 18

మూ. స రాజా సౌమదేయస్తు పురీమధ్యవసత్తదా,
కామ్పిల్యాం పరయా లక్ష్మ్యా దేవరాజో యథా దివమ్. 19

ప్ర. అ. సౌమదేయః=సోమద కుమారు డైన, సః=ఆ, రాజా=రాజు, తదా=అప్పుడు, దేవరాజః = దేవేంద్రుడు, దివం యథా = స్వర్గమును వలె,

కామ్పిల్యామ్=కాంపిల్య అను పేరు గల, పురీమ్ = పట్టణమును, పరయా= గొప్ప, లక్ష్మ్యా=ఐశ్వర్యముతో, అధ్యవసత్=అధిష్ఠించి ఉండెను.

తా. అపుడు, సోమదకుమారు డైన ఆ రాజు, దేవరాజు స్వర్గమునందు వలె, కాంపిల్యానగరమునందు అత్యధికైశ్వర్యముతో నివసించెను. 19

మూ. స బుద్ధిం కృతవాన్ రాజా కుశనాభః సుధార్మికః,
బ్రహ్మదత్తాయ కాకుత్థ్స దాతుం కన్యాశతం తదా. 20

ప్ర. అ. కాకుత్థ్స=రామా ! తదా=అప్పుడు, సుధార్మికః=మంచిధార్మికుడైన, రాజా = రాజైన, సః = ఆ, కుశనాభః = కుశనాభుడు, కన్యాశతమ్= కన్యాశతమును, బ్రహ్మదత్తాయ = బ్రహ్మదత్తునకు, దాతుమ్ = ఇచ్చుటకు, బుద్ధిమ్=ఆలోచనను, కృతవాన్=చేసినాడు.

తా. రామా ! సుధార్మికు డైన ఆ కుశనాభమహారాజు తన నూర్గురు కన్యలను బ్రహ్మదత్తున కీయవలె నని నిశ్చయించెను. 20

మూ. తమాహూయ మహాతేజా బ్రహ్మదత్తం మహీపతిః,
దదౌ కన్యాశతం రాజా సుప్రీతేనాన్తరాత్మనా. 21

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహీపతిః = భూమికి ప్రభువైన, రాజా = ఆ రాజు, తమ్=ఆ, బ్రహ్మదత్తమ్=బ్రహ్మదత్తుని, ఆహూయ= పిలచి, సుప్రీతేన=చాల సంతసించిన, అన్తరాత్మనా = హృదయముతో, కన్యాశతమ్ = కన్యాశతమును, దదౌ = ఇచ్చెను.

తా. మహాతేజఃశాలి యగు ఆ కుశనాభ మహారాజు, బ్రహ్మదత్తుని ఆహ్వానించి, ఆనందభరిత మైన హృదయముతో నూర్గురు కూతుళ్లను అతని కిచ్చి వివాహము చేసెను. 21

మూ. యథాక్రమం తతః పాణీన్ జగ్రాహ రఘునన్దన,
బ్రహ్మదత్తో మహీపాలస్తాసాం దేవపతిర్యథా. 22

ప్ర. అ. రఘునన్దన = రామా ! దేవపతిర్యథా=దేవేంద్రుని వంటివాడైన, బ్రహ్మదత్తః మహీపాలః = ఆ బ్రహ్మదత్తమహారాజు, తతః = పిమ్మట, యథాక్రమమ్ = క్రమానుసారముగా, తాసామ్ = ఆ కన్యలయొక్క, పాణీన్= హస్తములను, జగ్రాహ = పట్టుకొనెను.

తా. రామా ! దేవేంద్రునితో సమానుడైన బ్రహ్మదత్తమహారాజు, క్రమానుసారముగా ఆ కన్యల హస్తములను గ్రహించెను. 22

మూ. స్పృష్టమాత్రే తతః పాణౌ వికుబ్జా విగతజ్వరాః,
యుక్తాః పరమయా లక్ష్మ్యా బభుః కన్యాశతం తదా. 23

ప్ర. అ. తతః = పిమ్మట, పాణౌ = హస్తము, స్పృష్టమాత్రే = స్పృశింపబడినంతనే, తదా = అప్పుడు, కన్యాశతమ్ = నూరుగురు కన్యలును, వికుబ్జాః = పోయిన గూని కలవారై, విగతజ్వరాః = పోయిన జ్వరము కలవారై, పరమయా = గొప్పదైన, లక్ష్మ్యా = శోభతో, యుక్తాః = కూడినవారై, బభుః = ప్రకాశించిరి.

తా. అతడు హస్తములు స్పృశింపగనే, ఆ నూర్గురు కన్యలును, గూను తొలగి, జ్వరము శాంతించి, గొప్ప శోభతో ప్రకాశించిరి. 23

మూ. స దృష్ట్వా వాయునా ముక్తాః కుశనాభో మహీపతిః,
బభూవ పరమప్రీతో హర్షం లేభే పునః పునః. 24

ప్ర. అ. మహీపతిః = రాజైన, సః = ఆ, కుశనాభః = కుశనాభుడు, వాయునా = వాయువుచేత, ముక్తాః = విడవబడిన కుమార్తెలను, దృష్ట్వా = చూచి, పరమప్రీతః = చాల సంతోషించినవాడు, బభూవ = ఆయెను. పునః పునః = మాటిమాటికిని, హర్షమ్ = ఆనందమును, లేభే = పొందెను.

తా. ఆ కుశనాభమహారాజు వాయుదోషము తొలగిపోయిన కుమార్తెలను చూచి చాలా సంతోషించెను. మాటిమాటికిని ఆనందము పొందెను. 24

మూ. కృతోద్వాహం తు రాజానం బ్రహ్మదత్తం మహీపతిః,
సదారం ప్రేషయామాస సోపాధ్యాయగణం తదా. 25

ప్ర. అ. తదా = అప్పుడు, మహీపతిః = రాజు, కృతోద్వాహమ్ = చేసికొనబడిన వివాహము కలవాడును, సదారమ్ = భార్యలతో కూడినవాడును, సోపాధ్యాయగణమ్ = ఋత్విక్కుల సముదాయముతో కూడిన వాడును అగు, రాజానమ్ = రాజైన, బ్రహ్మదత్తమ్ = బ్రహ్మదత్తుని, ప్రేషయామాస = తన రాజ్యమునకు పంపెను.

తా. కుశనాభుడు వివాహము చేసికొనిన బ్రహ్మదత్తమహారాజును, భార్యా ఋత్విగాదిసమేతముగా ఆతని రాజ్యమునకు పంపెను. 25

మూ. సోమదా చ సుసంహృష్టా పుత్రస్య సదృశీం క్రియామ్,
యథాన్యాయం చ గన్ధర్వీ స్నుషాస్తాః ప్రత్యనన్దత. 26
స్పృష్ట్వా స్పృష్ట్వా చ తాః కన్యాః కుశనాభం ప్రశస్య చ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. గన్ధర్వీ=గంధర్వస్త్రీ యైన, సోమదాపి=సోమద కూడ, తాః= ఆ, కన్యాః=కన్యలను, స్పృష్ట్వా స్పృష్ట్వా=మాటిమాటికి స్పృశించి, కుశనాభమ్= కుశనాభుని, ప్రశస్య చ=ప్రశంసించి, పుత్రస్య=పుత్రుని యొక్క, సదృశీమ్= యుక్తమైన, క్రియామ్=క్రియను, తాః=ఆ, స్నుషాః=కోడళ్లను, ప్రత్యనన్దత= అభినందించెను.

తా. సోమద ఆ కన్యకలను మాటిమాటికి ఒక్కరొక్కరుగ స్పృశించి, వారి తండ్రి యైన కుశనాభుని ప్రశంసించి, పుత్రుడు చేసిన ఆ యుక్త మైన కార్యమును (ఆ కన్యల వైరూప్యమును తొలగించుటను, లేదా వివాహక్రియను) అ కోడళ్లను అభినందించెను. 26

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండములో ముప్పది మూడవ సర్గ సమాప్తము.

# అథ చతుస్త్రింశః సర్గః

మూ. కృతోద్వాహే గతే తస్మిన్ బ్రహ్మదత్తే చ రాఘవ,
అపుత్రః పుత్రలాభాయ పౌత్రీమిష్టిమకల్పయత్. 1

ప్ర. అ. రాఘవ=రామా ! తస్మిన్ = ఆ, బ్రహ్మదత్తే = బ్రహ్మదత్తుడు, కృతోద్వాహే = చేయబడిన వివాహము కలవాడై, గతే = వెళ్లినవాడగుచుండగా, అపుత్రః = పుత్రులు లేని ఆ రాజు, పుత్రలాభాయ = పుత్రులను పొందుట కొరకు, పౌత్రీమ్ ఇష్టిమ్ = పుత్రకామేష్టిని, అకల్పయత్ = చేసెను.

తా. రామా ! బ్రహ్మదత్తుడు వివాహము చేసికొని వెళ్లిన పిమ్మట, పుత్రులు లేని కుశనాభుడు, పుత్రుల కొరకై పుత్రకామేష్టిని చేసెను. 1

మూ. ఇష్ట్యాం తు వర్తమానాయాం కుశనాభం మహీపతిమ్,
ఉవాచ పరమోదారః కుశో బ్రహ్మసుతస్తదా. 2

ప్ర. అ. తదా = అప్పుడు, ఇష్ట్యామ్=పుత్రకామేష్టి, వర్తమానాయామ్= జరుగుచుండగా, పరమోదారః = మిక్కిలి ఉదారుడైన, బ్రహ్మసుతః = బ్రహ్మ పుత్రుడైన, కుశః = కుశుడు, కుశనాభమహీపతిమ్ = కుశనాభమహారాజును గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పుత్రకామేష్టి జరుగుచున్న సమయమున మిక్కిలి ఉదారుడును, బ్రహ్మ పుత్రుడును అగు కుశుడు కుశనాభునితో ఇట్లనెను. 2

మూ. పుత్రస్తే సదృశః పుత్ర భవిష్యతి సుధార్మికః,
గాధిం ప్రాప్స్యసి తేన త్వం కీర్తిం లోకే చ శాశ్వతామ్. 3

ప్ర. అ. పుత్ర = కుమారుడా ! తే = నీకు, సదృశః = తగినవాడును, సుధార్మికః = మిక్కిలి ధార్మికుడును అగు, పుత్రః = కుమారుడు, భవిష్యతి = పుట్టగలడు. గాధిమ్ = గాధి అనే కుమారుని, ప్రాప్స్యసి = పొందగలవు,

తేన = ఆతనిచే, త్వమ్ = నీవు, లోకే = లోకమునందు, శాశ్వతామ్ = శాశ్వత మైన, కీర్తిం చ = కీర్తిని కూడ, (పొందగలవు).

తా. కుమారా ! నీకు తగిన వాడును, మంచి ధార్మికుడును అగు కుమారుడు జనించగలడు. గాధి యను పేరు గల ఆ కుమారుని ద్వారా నీకు లోకమున శాశ్వత మగు కీర్తి లభింపగలదు. 3

మూ. ఏవముక్త్వా కుశో రామ కుశనాభం మహీపతిమ్,
జగామాకాశమావిశ్య బ్రహ్మలోకం సనాతనమ్. 4

ప్ర. అ. రామ = రామా, కుశః = కుశుడు, మహీపతిమ్ = రాజైన, కుశనాభమ్ = కుశనాభుని గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, సనాతనమ్ = శాశ్వత మైన, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. రామా ! కుశుడు కుశనాభునితో ఈ విధముగ చెప్పి, ఆకాశమార్గమున శాశ్వత మగు బ్రహ్మలోకమును చేరెను. 4

మూ. కస్యచిత్త్వథ కాలస్య కుశనాభస్య ధీమతః,
జజ్ఞే పరమధర్మిష్ఠో గాధిరిత్యేవ నామతః. 5

ప్ర. అ. అథ = పిమ్మట, కస్యచిత్ కాలస్య = కొంతకాలమునకు, ధీమతః = బుద్ధిమంతు డైన, కుశనాభస్య = కుశనాభునకు, పరమధర్మిష్ఠః = మిక్కిలి ధార్మికుడును, నామతః = పేరుచే, గాధిః ఇత్యేవ = గాధియను, కుమారుడు, జజ్ఞే = పుట్టెను.

తా. కొంత కాలమునకు, ధీమంతు డైన ఆ కుశనాభునకు, గాధి యను పేరు గల పరమధార్మికు డైన కుమారుడు జనించెను. 5

మూ. స పితా మమ కాకుత్స్థ గాధిః పరమధార్మికః,
కుశవంశప్రసూతోఽస్మి కౌశికో రఘునన్దన. 6

ప్ర. అ. కాకుత్స్థ = రామా! పరమధార్మికః = మిక్కిలిధార్మికు డైన సః = ఆ, గాధిః = గాధి, మమ = నా యొక్క, పితా = తండ్రి. రఘునన్దన = ఓ రామా! కుశవంశప్రసూతః = కుశుని వంశమునందు పుట్టిన నేను, కౌశికః = కౌశికు డను పేరు గలవాడనుగా, అస్మి = అయి ఉన్నాను.

తా. రామా! పరమధార్మికు డగు ఆ గాధి నా తండ్రి. కుశుని వంశమునందు పుట్టుటచే నాకు కౌశికు డను పేరు వచ్చినది. 6

మూ. పూర్వజా భగినీ చాపి మమ రాఘవ సువ్రతా,
నామ్నా సత్యవతీ నామ ఋచకే ప్రతిపాదితా. 7

ప్ర. అ. రాఘవ = రామా, సువ్రతా = మంచి నియమములు కలదియు, నామ్నా = పేరుచేత, సత్యవతీ నామ = సత్యవతి యని ప్రసిద్ధురాలును అగు, మమ = నా యొక్క, పూర్వజా భగినీ = జ్యేష్ఠసోదరి, ఋచకే = ఋచకునికి, ప్రతిపాదితా = ఇవ్వబడినది.

తా. రామా! సత్యవతి యను పేరు గల, ఉత్తమవ్రత యగు నా అక్కగారిని ఋచకున కిచ్చి వివాహము చేసిరి. 7

మూ. సశరీరా గతా స్వర్గం భర్తారమనువర్తినీ,
కౌశికీ పరమోదారా ప్రవృత్తా చ మహానదీ. 8

ప్ర. అ. (ఆమె) భర్తారమ్ = భర్తను, అనువర్తినీ=అనుసరించుచున్నదై, సశరీరా = సశరీరురాలుగ, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతా = వెళ్లినది. పరమోదారా = మిక్కిలి ఉదార మైన, కౌశికీ = కౌశికి అనెడు, మహానదీ = మహానదిగ, ప్రవృత్తా చ = ఏర్పడినది.

తా. ఆమె భర్తను అనుసరించి సశరీరముగ స్వర్గమునకు వెళ్లినది. అతిశ్రేష్ఠ యగు కౌశికీమహానదిగా కూడ ప్రవహించినది. 8

మూ. దివ్యా పుణ్యోదకా రమ్యా హిమవన్తముపాశ్రితా,
లోకస్య హితకామార్థం ప్రవృత్తా భగినీ మమ. 9

ప్ర. అ. లోకస్య = లోకముయొక్క, హితకామార్థమ్ = పారలౌకిక హితముకొరకును ఐహిక సుఖముకొరకును, ప్రవృత్తా = ప్రవహించిన, దివ్యా = దివ్యమైన, పుణ్యోదకా = పుణ్య మైన ఉదకములు గల, రమ్యా = రమ్యమైన, మమ భగినీ = నా సోదరి యైన కౌశికీనది, హిమవన్తమ్ = హిమవత్పర్వతమును, ఉపాశ్రితా = ఆశ్రయించినది.

తా. లోకమునకు ఐహికాముష్మిక సుఖములను ప్రసాదించుటకై ప్రవహించుచున్నదియు, దేవతాశక్తి కలదియు, పుణ్యోదకము కలదియు, సుందరమైనదియు, నా సోదరియు అగు ఈ కౌశికీనది హిమవత్పర్వతముమీద ప్రవహించుచున్నది. 9

మూ. తతోఽహం హిమవత్పార్శ్వే వసామి నిరతః సుఖమ్,
భగిన్యాం స్నేహసంయుక్తః కౌశిక్యాం రఘునన్దన. 10

ప్ర. అ. రఘునన్దన = రామా, తతః = ఆకారణమువలన, భగిన్యామ్ = సోదరియగు, కౌశిక్యామ్ = కౌశికియందు, స్నేహసంయుక్తః = స్నేహముతో కూడిన, అహమ్ = నేను, నిరతః = ఆసక్తికలవాడనై, హిమవత్పార్శ్వే = హిమవత్పర్వతము యొక్క పార్శ్వమునందు, సుఖమ్ = సుఖముగా, వసామి = నివసించుచున్నాను.

తా. రామా! ఆకారణముచే, సోదరి యగు కౌశికియందలి స్నేహముచే నేను హిమవత్ప్రాంతమునందు, ఎక్కువ ఆసక్తితో, సుఖముగా నివసించుచున్నాను. 10

మూ. సా తు సత్యవతీ పుణ్యా సత్యే ధర్మే ప్రతిష్ఠితా,
పతివ్రతా మహాభాగా కౌశికీ సరితాం వరా. 11

ప్ర. అ. సా = ఆ, సత్యవతీ = సత్యవతి, పుణ్యా = పుణ్యాత్మురాలు. సత్యే = సత్యమునందు, ధర్మే = ధర్మమునందును, ప్రతిష్ఠితా = స్థిరముగ నిలచినది. పతివ్రతా = పతివ్రత, మహాభాగా = పూజ్యురాలు. సరితాం వరా = నదులలో శ్రేష్ఠమైన, కౌశికీ = కౌశికిగా, (ఉన్నది).

తా. కౌశికి యను మహానదిగా ఏర్పడిన, ఆ సత్యవతి పుణ్యయైనది.

సత్యమునందును ధర్మమునందును స్థైర్యము కలది. పతివ్రత, గొప్ప భాగ్యము కలది. 11

మూ. అహం హి నియమాద్రామ హిత్వా తాం సముపాగతః,
సిద్ధాశ్రమమనుప్రాప్య సిద్ధోఽస్మి తవ తేజసా. 12

ప్ర. అ. రామ = రామా ! అహమ్ = నేను, నియమాత్ = నియమము వలన, తామ్ = ఆమెను, హిత్వా = విడచి, సముపాగతః = వచ్చినాను. సిద్ధాశ్రమమ్ = సిద్ధాశ్రమమును, అనుప్రాప్య = పొంది, తవ = నీ యొక్క, తేజసా = తేజస్సు చేత, సిద్ధః = కార్యసిద్ధిని పొందినవాడను, అస్మి = అయిఉన్నాను.

తా. రామా ! యాగనియమము పూర్తి చేసుకొనుటకై నే నామెను విడచి సిద్ధాశ్రమమునకు వచ్చితిని. నీ తేజస్సుచే కార్యసిద్ధి పొందితిని. 12

మూ. ఏషా రామ మమోత్పత్తిః స్వస్య వంశస్య కీర్తితా,
దేశస్య చ మహాబాహో యన్మాం త్వం పరిపృచ్ఛసి. 13

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా, రామ = రామా, ఏషా = ఈ, మమ = నా యొక్కయు, స్వస్య వంశస్య = నా వంశము యొక్కయు, దేశస్య చ = దేశముయొక్కయు, ఉత్పత్తిః = పుట్టుక, కీర్తితా = చెప్పబడినది. యత్ = దేనినిగూర్చి, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, పరిపృచ్ఛసి = అడుగుచున్నావో.

తా. ఓ మహాబాహూ ! రామా ! నీవు చెప్ప మని నన్ను అడిగితివి కదా; నేను ఎట్లు పుట్టితినో ! చెప్పినాను. 13

మూ. గతోర్ధరాత్రః కాకుత్స్థ కథాః కథయతో మమ,
నిద్రామభ్యేహి భద్రం తే మా భూద్విఘ్నోఽధ్వనీహ నః. 14

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! మమ = నేను, కథాః = కథలను, కథయతః = చెప్పుచుండగా, అర్ధరాత్రః = అర్ధరాత్రి, గతః = కడచినది. నిద్రామ్ = నిద్రను, అభ్యేహి = పొందుము, తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక, ఇహ =

ఇచట, నః = మనకు, అధ్వని = మార్గమునందు, విఘ్నః = విఘ్నము, మా భూత్ = కాకుండుగాక.

తా. రామా ! నేను ఈ కథలు చెప్పుటలో అర్ధరాత్రి గడచిపోయినది. ఇక నిద్రపొమ్ము. నీకు మంగళ మగుగాక. మనకు ఈ మార్గమధ్యమున ప్రయాణ విఘ్నము కాకుండుగాక. 14

మూ. నిష్పన్దా స్తరవః సర్వే నిలీనా మృగపక్షిణః,
నై శేన తమసా వ్యాప్తా దిశశ్చ రఘునన్దన. 15

ప్ర. అ. రఘునన్దన = రామా ! తరవః = వృక్షములు, నిష్పన్దాః = నిశ్చలముగా నున్నవి. మృగపక్షిణః = మృగములును పక్షులును, సర్వే = అన్నియు, నిలీనాః = అణగి యున్నవి. దిశశ్చ = దిక్కులు కూడ, నై శేన = రాత్రికి సంబంధించిన, తమసా = చీకటిచే, వ్యాప్తాః = వ్యాపింపబడినవి.

తా. రామా ! వృక్షములు నిశ్చలముగ ఉన్నవి. మృగపక్ష్యాదులు తమ తమ స్థానములలో కదలకుండ అణగి యున్నవి. రాత్రి చీకటి అన్ని దిక్కులందును వ్యాపించినది. 15

మూ. శనైర్వియుజ్యతే సన్ధ్యా నభో నేత్రై రివావృతమ్,
నక్షత్రతారాగహనం జ్యోతిర్భిరవభాసతే. 16

ప్ర. అ. సన్ధ్యా = సంధ్యాకాలము, శనైః = మెల్ల మెల్లగా, వియుజ్యతే = తొలగిపోయినది. నక్షత్రతారాగహనమ్ = నక్షత్రములతోడను తారలతోడను నిండిన, నభః = ఆకాశము, జ్యోతిర్భిః = ఈ నక్షత్రములతో, నేత్రైః = నేత్రములచే, ఆవృతమ్ ఇవ = కప్పబడినది వలె, భాసతే = ప్రకాశించుచున్నది.

తా. మెల్ల మెల్లగా సంధ్య తొలగిపోయినది. నక్షత్రములతోడను, అశ్విన్యాదితారాగణముతోడను నిండిన ఆకాశము, జ్యోతీరూపములైన వాటిచేత వ్యాప్తమై, నేత్రములతో నిండినట్లు ఉన్నది. 16

మూ. ఉత్తిష్ఠతి చ శీతాంశుః శశీ లోకతమోనుదః,
హ్లాదయన్ ప్రాణినాం లోకే మనాంసి ప్రభయా విభో. 17

ప్ర. అ. విభో = రామప్రభూ! శీతాంశుః = చల్లని కిరణములు గల, శశీ = చంద్రుడు, లోకతమోనుదః = లోకము యొక్క చీకటిని తొలగించుచు, ప్రభయా = కాంతిచేత, లోకే = లోకమునందలి, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, మనాంసి = మనస్సులను, హ్లాదయన్ = సంతోషపెట్టుచు, ఉత్తిష్ఠతి = పైకి వచ్చుచున్నాడు.

తా. చల్లని కిరణములు గల చంద్రుడు లోకమునందలి చీకటిని తొలగించుచు, కాంతిచేత ప్రాణుల మనస్సులను ఆనందింపచేయుచు పైకి వచ్చు చున్నాడు. 17

మూ. నైశాని సర్వభూతాని ప్రచరన్తి తతస్తతః,
యక్షరాక్షససంఘాశ్చ రౌద్రాశ్చ పిశితాశనాః. 18

ప్ర. అ. నైశాని = రాత్రి సంచరించు, సర్వభూతాని = సకలప్రాణులును, యక్షరాక్షససంఘాశ్చ = యక్షరాక్షస సంఘములును, రౌద్రాః = భయంకరు లైన, పిశితాశనాశ్చ = మనుష్యమాంస భక్షకులును, తతస్తతః = అక్కడక్కడ, ప్రచరన్తి = సంచరించుచున్నారు.

తా. రాత్రి సంచరించు సకలప్రాణులును, యక్షులు, రాక్షసులు, భయం కరులైన మనుష్యాశనులును అక్కడక్కడ తిరుగుచున్నారు. 18

మూ. ఏవముక్త్వా మహాతేజా విరరామ మహామునిః,
సాధు సాధ్వితి తం సర్వే మునయో హ్యభ్యపూజయన్. 19

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహామునిః = విశ్వామిత్రుడు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, విరరామ = విరమించెను. సర్వే = సమస్తమైన, మునయః = మునులు, సాధు సాధు ఇతి = బాగున్నది బాగున్నది అని, తమ్ = ఆతనిని, అభ్యపూజయన్ = పూజించిరి.

తా. మహాతేజఃశాలి యగు విశ్వామిత్రుడు ఈ విధముగ పలికి విరమించెను. "బాగున్నది బాగున్నది" అని అనుచు మును లందరును ఆయనను ఈ విధముగ మెచ్చుకొనిరి. 19

మూ. కుశికానామయం వంశో మహాన్ ధర్మపరస్సదా,
బ్రహ్మోపమా మహాత్మానః కుశవంశ్యా నరోత్తమాః. 20

ప్ర. అ. కుశికానామ్ = కుశునిసంతానమునకు చెందిన వారియొక్క, అయమ్ = ఈ, వంశః = వంశము, మహాన్ = పూజ్యమైనది. సదా = ఎల్లప్పుడును, ధర్మపరః = ధర్మమునం దాసక్తి కలది. కుశవంశ్యాః = కుశుని వంశమునకు చెందిన, నరోత్తమాః = నరోత్తములు, మహాత్మానః = పూజ్యమైన స్వభావము కలవారు. బ్రహ్మోపమాః = బ్రహ్మదేవునితో సమానులు.

తా. "ఈ కుశవంశము పూజ్యమైనది. సర్వదా ధర్మమునం దాసక్తి కలది. కుశవంశమునందు పుట్టిన మానవోత్తములు పూజింపదగిన స్వభావము కలవారు. బ్రహ్మదేవునితో సమానులు." 20

మూ. విశేషేణ భవానేవ విశ్వామిత్ర మహాయశః,
కౌశికీ సరితాం శ్రేష్ఠా కులోద్ద్యోతకరీ తవ. 21

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, విశ్వామిత్ర = విశ్వామిత్రుడా! భవానేవ = నీవే, విశేషేణ=విశేషముగా, (మహాత్ముడవు, బ్రహ్మసదృశుడవు). సరితామ్ = నదులలో, శ్రేష్ఠా = శ్రేష్ఠ యైన, కౌశికీ = కౌశికి, తవ = నీయొక్క, కులోద్ద్యోతకరీ = కులమును ప్రకాశింపచేయునది.

తా. "మహాయశఃశాలి వైన ఓ విశ్వామిత్రమహామునీ! కుశవంశములోని వారందరిలోను విశేషించి నీవు మహాత్ముడవు, బ్రహ్మతుల్యుడవు. నదులలో శ్రేష్ఠ యైన కౌశికి నీ వంశమునకు వన్నె తెచ్చి పెట్టినది." 21

మూ. ఇతి తైర్మునిశార్దూలైః ప్రశస్తః కుశికాత్మజః,
నిద్రాముపాగమచ్ఛ్రీమాన్ శ్రీమానస్తమివాంశుమాన్. 22

ప్ర. అ. ఇతి = ఈ విధముగ, తైః = ఆ, మునిశార్దూలైః = మునిశ్రేష్ఠులచేత, ప్రశస్తః = ప్రశంసింపబడిన, శ్రీమాన్ = తేజస్సు గల, కుశి

కాత్మజః = విశ్వామిత్రుడు, శ్రీమాన్ = కాంతిగల, అంశుమాన్ = సూర్యుడు, అస్తమివ = అస్తాద్రిని వలె, నిద్రామ్ = నిద్రను, ఉపాగమత్ = పొందెను.

తా. బ్రహ్మవర్చస్వి యగు విశ్వామిత్రుని ఆ మునిశ్రేష్ఠులు ఈ విధముగ ప్రశంసించిరి. పిమ్మట విశ్వామిత్రుడు, సూర్యుడు అస్తాద్రిని చేరినట్లు నిద్రను పొందెను. 22

మూ. రామోఽపి సహసౌమిత్రిః కించిదాగతవిస్మయః,
ప్రశస్య మునిశార్దూలం నిద్రాం సముపసేవతే. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
చతుస్త్రింశః సర్గః.

ప్ర. అ. సహసౌమిత్రిః = లక్ష్మణునితో కూడిన, రామోఽపి = రాముడు కూడ, కించిత్ = కొంచెము, ఆగతవిస్మయః = పొందబడిన ఆశ్చర్యము కలవాడై, మునిశార్దూలమ్ = మునిశ్రేష్ఠుని, ప్రశస్య = ప్రశంసించి, నిద్రామ్ = నిద్రను, సముపసేవతే = సేవించెను.

తా. లక్ష్మణసమేతు డగు రాముడు కూడ విశ్వామిత్రుడు చెప్పిన కథ వినుటచే కొంచెము ఆశ్చర్యము నొంది, ఆయనను ప్రశంసించి, నిద్రించెను. 23

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో ముప్పది నాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చత్రింశః సర్గః

మూ. ఉపాస్య రాత్రిశేషం తు శోణాకూలే మహర్షిభిః,
నిశాయాం సుప్రభాతాయాం విశ్వామిత్రోఽభ్యభాషత. 1

ప్ర. అ. విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, రాత్రిశేషం = మిగిలిన రాత్రి, మహర్షిభిః = మహర్షులతో కూడ, శోణాకూలే = శోణానదీతీరమున, ఉపాస్య = ఉండి, నిశాయామ్ = రాత్రి, సుప్రభాతాయామ్ = బాగుగా తెల్లవారగా, అభ్యభాషత = పలికెను.

తా. ఆ రాత్రి అంతయు మహర్షులతో శోణానదీతీరమున కడపి, విశ్వామిత్రుడు, తెల్లవారగనే, ఇట్లు పలికెను. 1

మూ. సుప్రభాతా నిశా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే గమనాయాభిరోచయ. 2

ప్ర. అ. రామ = రామా, నిశా = రాత్రి, సుప్రభాతా = బాగా తెల్లవారినది. పూర్వా సన్ధ్యా = ప్రాతఃకాలసంధ్య, ప్రవర్తతే = వచ్చుచున్నది. ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము. తే = నీకు, భద్రమ్ = శుభ మగుగాక. గమనాయ = ప్రయాణమునకు, అభిరోచయ = ఆసక్తి కలవాడవు అగుము.

తా. రామా : రాత్రి బాగుగా తెల్లవారినది. ప్రాతఃకాలసంధ్య ప్రారంభమైనది. లెమ్ము లెమ్ము. నీకు మంగళ మగుగాక. ప్రయాణమునకు సన్నద్ధుడవు అగుము. 2

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య కృత్వా పౌర్వాహ్ణికీం క్రియామ్,
గమనం రోచయామాస వాక్యం చేదముహాచ హ. 3

ప్ర. అ. తస్య = అతనియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, పౌర్వాహ్ణికీమ్ = పూర్వాహ్ణమునకు సంబంధించిన, క్రియామ్ = క్రియను, కృత్వా = చేసి, గమనమ్ = ప్రయాణము చేయుటకు, రోచయా

మాస = ఇష్టపడెను. ఇదమ్ = ఈ, వాక్యం చ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. విశ్వామిత్రుని మాట విని రాముడు, పూర్వాహ్ణమునందు చేయవలసిన సంధ్యావందనాదులను పూర్తి చేసికొని, ప్రయాణమునకు సిద్ధుడై, ఇట్లు పలికెను. 3.

మూ. అయం శోణః శుభజలో గాధః పులినమణ్డితః,
కతరేణ పథా బ్రహ్మన్ సంతరిష్యామహే వయమ్. 4.

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణోత్తమా! శుభజలః = శుభమైన ఉదకము గలదియు, పులినమణ్డితః = ఇసుకతిన్నెలచే అలంకరించబడిన, అయమ్ = ఈ, శోణః = శోణనదము, గాధః = లోతులేనిది. వయమ్ = మనము, కేన = ఏ, పథా = మార్గముచేత, సంతరిష్యామహే = దాటుదము.

తా. మునీంద్రా! శుభమైన జలము గల ఈ శోణనదము ఇసుకతిన్నెలతో ప్రకాశించుచు, లోతు తక్కువగ ఉన్నది. మనము దీనిని ఏ మార్గమున దాటవలెను? 4.

మూ. ఏవముక్తస్తు రామేణ విశ్వామిత్రోఽబ్రవీదిదమ్,
ఏష పన్థా మయోద్దిష్టో యేన యాన్తి మహర్షయః. 5.

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహర్షయః = మహర్షులు, యేన = ఏ మార్గముచేత, యాన్తి = వెళ్లుచున్నారో, ఏషః = ఈ, పన్థాః = మార్గము, మయా = నా చేత, ఉద్దిష్టః = నిశ్చయింపబడినది.

తా. రాముని మాటలు విని విశ్వామిత్రుడు ఇట్లు పలికెను. "మహర్షులు ఏ మార్గమున వెళ్లుచున్నారో ఆ మార్గముననే పోవుదము." 5

మూ. ఏవముక్తా మహర్షయో విశ్వామిత్రేణ ధీమతా,
పశ్యన్తస్తే ప్రయాతా వై వనాని వివిధాని చ. 6

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతుడైన, విశ్వామిత్రేణ = విశ్వామిత్రునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తాః = పలకబడిన, తే మహర్షయః = ఆ మహర్షులు, వివిధాని = అనేకవిధము లైన, వనాని = వనములను, పశ్యన్తః = చూచుచున్న వారై, ప్రయాతాః = వెళ్లినారు.

తా. విశ్వామిత్రుని మాటలు విన్న మహర్షులు వివిధము లైన వనములను చూచుచు, ప్రయాణము చేసిరి. 6

మూ. తే గత్వా దూరమధ్వానం గతేఽర్ధదివసే తదా,
జాహ్నవీం సరితాం శ్రేష్ఠాం దదృశుర్మునిసేవితామ్. 7

ప్ర. అ. తే = వారు, దూరమ్ = దూరమైన, అధ్వానమ్ = మార్గమును, గత్వా = వెళ్లి, తదా = అప్పుడు, అర్ధదివసే = దివసము యొక్క సగము భాగము, గతే = కడచినదగుచుండగా, మునిసేవితామ్ = మునులచే సేవింపబడి నదియు, సరితామ్ = నదులలో, శ్రేష్ఠామ్ = శ్రేష్ఠ మైనదియు అగు, జాహ్నవీమ్ = గంగను, దదృశుః = చూచిరి.

తా. వారు చాల దూరము ప్రయాణము చేసి, మధ్యాహ్నసమయమునందు, నదులలో శ్రేష్ఠ మైనదియు, మునులచే సేవింపబడినదియు అగు గంగను చూచిరి. 7

మూ. తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారససేవితామ్,
బభూవుర్ముదితాః సర్వే మునయః సహరాఘవాః. 8

ప్ర. అ. పుణ్యసలిలామ్ = పుణ్య మైన ఉదకము కలదియు, హంస సారససేవితామ్ = హంసలచేతను సారసపక్షులచేతను సేవింపబడిన, తామ్ = ఆ గంగానదిని, దృష్ట్వా = చూచి, సహరాఘవాః = రామునితో కూడిన, సర్వే మునయః = మునులందరును, ముదితాః = సంతసించినవారు, బభూవుః = అయిరి.

తా. పుణ్యమైన ఉదకము కలదియు, హంససారసపక్షులతో కూడినదియు అగు ఆ గంగను చూచి, రామలక్ష్మణులును, ఆ మునులును సంతోషించిరి. 8

మూ. తస్యాస్తీరే తతశ్చక్రు స్త ఆవాసపరిగ్రహమ్,
తతః స్నాత్వా యథాన్యాయం సంతర్ప్య పితృదేవతాః. 9

హుత్వా చైవాగ్నిహోత్రాణి ప్రాశ్య చామృతవద్ధవిః,
వివిశుర్జాహ్నవీతీరే శుచౌ ముదితమానసాః, 10
విశ్వామిత్రం మహాత్మానం పరివార్య సమన్తతః.

ప్ర. అ. తతః = పిమ్మట, తే = వారు, తస్యాః = ఆ గంగానదియొక్క, తీరే = తీరమునందు, ఆవాసపరిగ్రహమ్ = నివాసస్వీకారమును, చక్రుః = చేసిరి. తతః = పిమ్మట, స్నాత్వా = స్నానము చేసి, యథాన్యాయమ్ = యథాశాస్త్రముగా, పితృదేవతాః = పితృదేవతలను, సంతర్ప్య = తృప్తిపరచి, అగ్నిహోత్రాణి హుత్వా = అగ్నిహోత్రములు చేసి, అమృతవత్ = అమృతము వంటి, హవిః = హవిస్సును, ప్రాశ్య = భుజించి, ముదితమానసాః = ప్రశాంత మైన చిత్తములు కలవారై, మహాత్మానమ్ = మహాత్ము డైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, సమన్తతః = నలుప్రక్కల, పరివార్య = చుట్టి, శుచౌ = పవిత్ర మైన, జాహ్నవీతీరే = గంగానదీతీరమునందు, వివిశుః = కూర్చుండిరి.

తా. వారందరును గంగాతీరమున నివసించిరి. స్నానములు చేసి యథాశాస్త్రముగ పితృతర్పణములు చేసిరి. అగ్నిహోత్రములు చేసికొని అమృతతుల్యమగు హవిస్సును భుజించిరి. ప్రశాంతచిత్తులై, పవిత్ర మగు ఆ గంగాతీరమున మహాత్ము డైన విశ్వామిత్రుని పరివేష్టించి కూర్చుండిరి. 9-10

మూ. అథ తత్ర తదా రామో విశ్వామిత్రమథాబ్రవీత్. 11
భగవన్ శ్రోతుమిచ్ఛామి గఙ్గాం త్రిపథగాం నదీమ్,
త్రైలోక్యం కథమాక్రమ్య గతా నదనదీపతిమ్. 12

ప్ర. అ. అథ = పిమ్మట, రామః = రాముడు, తదా = అప్పుడు, తత్ర = అచట, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. భగవన్ = పూజ్యుడా, త్రిపథగామ్ = మూడు మార్గములలో ప్రవహించు, గఙ్గాం నదీమ్ = గంగానదిని గూర్చి, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

త్రైలోక్యమ్ = మూడు లోకములను, ఆక్రమ్య = ఆక్రమించి, నదనదీ పతిమ్ = సముద్రుని గూర్చి, కథమ్ = ఎట్లు, గతా = వెళ్లినది ?

తా. అంతట రాముడు అచట సుఖాసీనుడై యున్న విశ్వామిత్రునితో ఇట్లనెను. "పూజ్యుడా ! మూడు మార్గములందు ప్రవహించు గంగను గూర్చి తెలిసికొనదలచుచున్నాను. ఈ నది మూడు లోకములను ఎట్లు ఆక్రమించినది; ఎట్లు సముద్రములోనికి ప్రవేశించినది".

వి. తూర్పుగా ప్రవహించి తూర్పుసముద్రములో ప్రవేశించునవి నదులు. పశ్చిమముగా ప్రవహించి పశ్చిమసముద్రములో ప్రవేశించునవి నదములు. నదులకును నదములకును పతి సముద్రుడు. 12

మూ. చోదితో రామవాక్యేన విశ్వామిత్రో మహామునిః,
వృద్ధిం జన్మ చ గఙ్గాయా వక్తుమేవోపచక్రమే. 13

ప్ర. అ. రామవాక్యేన = రాముని వాక్యముచేత, చోదితః = ప్రేరేపింపబడిన, విశ్వామిత్రః మహామునిః = విశ్వామిత్రమహర్షి, గఙ్గాయాః = గంగయొక్క, జన్మ = పుట్టుకను, వృద్ధిం చ = వృద్ధిని, వక్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. రాము డిట్లు ప్రశ్నింపగా విశ్వామిత్రమహాముని గంగానది ఉత్పత్తి, వృద్ధి మొదలైన విషయములను చెప్ప మొదలిడెను. 13

మూ. శైలేన్ద్రో హిమవాన్నామ ధాతూనామాకరో మహాన్,
తస్య కన్యాద్వయం రామ రూపేణాప్రతిమం భువి. 14

ప్ర. అ. రామ = రామా ! ధాతూనామ్ = ధాతువులయొక్క, మహాన్ = గొప్ప, ఆకరః = గని యైన, హిమవాన్నామ = హిమవంతుడనెడు, శైలేన్ద్రః = పర్వతరాజు ఉన్నాడు. తస్య = ఆతనికి, రూపేణ = రూపముచేత, భువి = భూలోకమునందు, అప్రతిమమ్ = సాటిలేని, కన్యాద్వయమ్ = కన్యాద్వయము ఉన్నది.

తా. రామా ! హిమవంతు డనెడు పర్వతరాజు ఉన్నాడు. ఆతడు అనేక

విధము లగు ధాతువులకు గొప్ప నిధి. అతనికి ప్రపంచమునందు సాటిలేని సౌందర్యము గల ఇద్దరు కన్యకలు ఉన్నారు. 14

మూ. యా మేరుదుహితా రామ తయోర్మాతా సుమధ్యమా,
నామ్నా మనోరమా నామ పత్నీ హిమవతః ప్రియా. 15

ప్ర. అ. రామ = రామా! నామ్నా = పేరుచేత, మనోరమా నామ = మనోరమ అను ప్రసిద్ధి గల, యా = ఏ, మేరుదుహితా = మేరుపర్వతము యొక్క కుమార్తె ఉన్నదో, సుమధ్యమా = అందమైన నడుము గల ఆమె, హిమవతః = హిమవంతుని యొక్క, ప్రియా = భార్య. తయోః = ఆ కన్యకల యొక్క, మాతా = తల్లి.

తా. మేరుపర్వతము కుమార్తె యైన మనోరమ ఆ హిమవంతుని భార్య. ఆ కన్యకల తల్లి. 15

మూ. తస్యాం గఙ్గేయమభవజ్జ్యేష్ఠా హిమవతః సుతా,
ఉమా నామ ద్వితీయాభూన్నామ్నా తస్యైవ రాఘవ. 16

ప్ర. అ. రామ = రామా, ఇయమ్ = ఈ, గఙ్గా = గంగ, హిమవతః = హిమవంతునియొక్క, జ్యేష్ఠా = పెద్దదైన, సుతా = కుమార్తెగా, తస్యామ్ = మనోరమయందు, అభవత్ = జనించెను, తస్యైవ = అతనికే, నామ్నా = పేరు చేత, ఉమా నామ = ఉమ అను ప్రసిద్ధి గల, ద్వితీయా = రెండవ కుమార్తె, అభూత్ = జనించెను.

తా. రామా! ఈ గంగ హిమవంతునకు, మనోరమయందు పెద్ద కుమార్తెగా జనించినది. అతనికే ఉమ రెండవ కుమార్తెగా జనించినది. 16

మూ. అథ జ్యేష్ఠాం సురాః సర్వే దేవతార్థచికీర్షయా,
శైలేన్ద్రం వరయామాసుర్గఙ్గాం త్రిపథగాం నదీమ్. 17

ప్ర. అ. అథ = పిమ్మట, సర్వే సురాః = దేవత లందరును, దేవతార్థ చికీర్షయా = దేవతల ప్రయోజనమును చేయ నిచ్ఛతో, త్రిపథగామ్ = మూడు మార్గములలో ప్రవహించు, నదీమ్ = నదియైన, జ్యేష్ఠామ్ = పెద్ద కుమార్తె యైన, గఙ్గామ్ = గంగను, శైలేన్ద్రమ్ = పర్వతరాజును, వరయామాసుః = యాచించిరి.

తా. దేవత లందరును తమ ప్రయోజనమును సాధించుకొనుటకై, జ్యేష్ఠ పుత్రికయు, మూడు మార్గములలో ప్రవహించునదియు అగు గంగను తమ కిమ్మని హిమవంతుని కోరిరి. 17

మూ. దదౌ ధర్మేణ హిమవాన్ తనయాం లోకపావనీమ్,
స్వచ్ఛందపథగాం గఙ్గాం త్రైలోక్యహితకామ్యయా. 18

ప్ర. అ. హిమవాన్ = హిమవంతుడు, ధర్మేణ = ధర్మబుద్ధితో, త్రైలోక్యహితకామ్యయా = మూడు లోకములకు హితము చేయవలె ననెడు అభిలాషతో, లోకపావనీమ్ = లోకములను పవిత్రింపచేయునదియు, స్వచ్ఛన్ద పథగామ్ = తన కిష్ట మైన మార్గమున ప్రవహించునదియు అగు, తనయామ్ = కుమార్తె యైన, గఙ్గామ్ = గంగను, దదౌ = ఇచ్చెను.

తా. హిమవంతుడు ధర్మమును పాటించి, మూడులోకములకును హితము కలుగవలె ననెడు కోరికతో, లోకములను పవిత్రింపచేయునదియు, స్వేచ్ఛాను సారముగా ప్రవహింప సమర్థురాలును అగు తన జ్యేష్ఠపుత్రి యైన గంగను వారి కిచ్చెను. 18

మూ. ప్రతిగృహ్య తతో దేవాస్త్రిలోకహితకారిణః,
గఙ్గామాదాయ తేఽగచ్ఛన్ కృతార్థేనాన్తరాత్మనా. 19

ప్ర. అ. తతః = పిమ్మట, తే దేవాః = ఆ దేవతలు, త్రైలోక్యహిత కారిణః = మూడు లోకములకును హితము చేయబోవువారై, గఙ్గామ్ = గంగను, ప్రతిగృహ్య = స్వీకరించి, ఆదాయ = తీసికొని, కృతార్థేన = చరితార్థమైన, అన్తరాత్మనా = మనస్సుతో, అగచ్ఛన్ = వెళ్లిరి.

తా. దేవతలు గంగను హిమవంతుని నుండి ప్రతిగ్రహించి, సఫలమైన కోరిక గల మనస్సుతో, ఆమెను, మూడు లోకములకును హితము చేయబోవు వారై, తీసుకొని వెళ్ళిరి. 19

మూ. యా చాన్యా శైలదుహితా కన్యాసీద్రఘునన్దన,
ఉగ్రం సా వ్రతమాస్థాయ తపస్తేపే తపోధనా. 20

ప్ర. అ. రఘునన్దన = రామా ! అన్యా = మరియొక, శైలదుహితా = హిమవంతుని పుత్రి యైన, యా = ఏ, కన్యా = కన్య, ఆసీత్ = ఉండెనో, సా = ఆమె, తపోధనా = తపోధనురాలై, ఉగ్రమ్ = ఉగ్రమైన, వ్రతమ్ = వ్రతమును, ఆస్థాయ = అవలంబించి, తపః = తపస్సు, తేపే = చేసెను.

తా. రామా ! హిమవంతుని రెండవ కుమార్తె యైన ఉమ, తపోధనురాలై, ఉగ్ర మైన వ్రతమును అవలంబించి తపస్సు ఆచరించెను. 20

మూ. ఉగ్రేణ తపసా యుక్తాం దదౌ శైలవరః సుతామ్,
రుద్రాయాప్రతిరూపాయ ఉమాం లోకనమస్కృతామ్. 21

ప్ర. అ. శైలవరః = హిమవంతుడు, ఉగ్రేణ = ఉగ్రమైన, తపసా = తపస్సుతో, యుక్తామ్ = కూడినదియు, లోకనమస్కృతామ్ = లోకములచే నమస్కరింపబడినదియు అగు, సుతామ్ = కుమార్తె యైన, ఉమామ్ = ఉమను, అప్రతిరూపాయ = సాటిలేని, రుద్రాయ = రుద్రునకు, దదౌ = ఇచ్చెను.

తా. హిమవంతుడు ఉగ్ర మైన తపస్సు చేసిన, సర్వలోకనమస్కృత యైన కుమార్తె యగు ఉమను సాటి లేని రుద్రున కిచ్చి వివాహము చేసెను. 21

మూ. ఏతే తే శైలరాజస్య సుతే లోకనమస్కృతే,
గఙ్గా చ సరితాం శ్రేష్ఠా ఉమాదేవీ చ రాఘవ. 22

ప్ర. అ. రాఘవ = రామా, సరితామ్ = నదులలో, శ్రేష్ఠా = శ్రేష్ఠ మైన, గఙ్గా చ = గంగయు, ఉమాదేవీ చ = ఉమాదేవియు, ఏతే = వీరిద్దరును, శైల రాజస్య = శైలరాజుయొక్క, లోకనమస్కృతే = లోకములచే నమస్కరింప బడిన, తే = ప్రసిద్ధ లైన, సుతే = కుమార్తెలు.

తా. రామా ! నదులలో శ్రేష్ఠురాలైన గంగ, ఉమాదేవి, వీరిరువురును హిమ వంతుని పుత్రికలు, లోకములచే పూజింపబడిన వారు. 22

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం యథా త్రిపథగా నదీ,
ఖం గతా ప్రథమం తాత గతిం గతిమతాం వర. 23

ప్ర. అ. గతిమతామ్ = అందమైన నడకకలవారిలో, వర = శ్రేష్ఠుడా, తాత = నాయనా, రామా! త్రిపథగా నదీ = మూడు మార్గము లందు సంచరించు గంగానది, ప్రథమమ్ = ముందుగా, యథా = ఏ విధముగా, ఖమ్ = ఆకాశమును, గతా = పొందినదో, ఏతత్ = ఇది, సర్వమ్ = అంతయు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. అందమైన నడకగలవారిలో శ్రేష్ఠుడా! రామా! గంగానది మొదట ఆకాశమునకు ఎట్లు వెళ్ళినదో ఈ విషయ మంతయు చెప్పినాను. 23

మూ. సైషా సురనదీ రమ్యా శైలేంద్రస్య సుతా తదా,
సురలోకం సమారూఢా విపాపా జలవాహినీ. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షట్త్రింశః సర్గః

ప్ర. అ. రమ్యా = సుందరమైనదియు, విపాపా = పాపములు లేనిదియు, జలవాహినీ = జలరూపమున ప్రవహించునదియు అగు, సా ఏషా = అట్టి ఈ, శైలేన్ద్రస్య = హిమవంతుని యొక్క, సుతా = కుమార్తె, తదా = అప్పుడు, సురనదీ = సురనదిగా అయి, సురలోకమ్ = స్వర్గలోకమును, సమారూఢా = ఎక్కినది.

తా. రమ్యమైనదియు, పాపరహితయు అగు ఆ హిమవత్పుత్రిక జలరూపమున ప్రవహించుచు, అపుడు స్వర్గమును అధిరోహించి సురనది యైనది. 24

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో ముప్పదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్త్రింశః సర్గః

మూ. ఉక్తవాక్యే మునౌ తస్మిన్నుభౌ రాఘవలక్ష్మణౌ,
ప్రతినన్ద్య కథాం వీరావూచతుర్మునిపుఙ్గవమ్. 1

ప్ర. అ. తస్మిన్ = ఆ, మునౌ = ముని, ఉక్తవాక్యే=చెప్పబడిన వాక్యము కలవా డగుచుండగా, వీరౌ = వీరులైన, రాఘవలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉభౌ = ఇరువురును, కథామ్ = కథను, ప్రతినన్ద్య = అభినందించి, మునిపుఙ్గవమ్ = ఆ మునిశ్రేష్ఠుని గూర్చి, ఊచతుః = పలికిరి.

తా. విశ్వామిత్రుని వాక్యము విని రామలక్ష్మణులు ఆ కథను మెచ్చుకొని, ఆ మునిపుంగవునితో ఇట్లు పలికిరి. 1

మూ. ధర్మయుక్తమిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా,
దుహితుః శైలరాజస్య జ్యేష్ఠాయా వక్తుమర్హసి. 2
విస్తరం విస్తరజ్ఞోఽసి దివ్యమానుషసంభవమ్.

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రహ్మర్షీ! ధర్మయుక్తమ్ = ధర్మముతో కూడిన, పరమమ్ = ఉత్తమ మైన, ఇదమ్ = ఇది, త్వయా = నీచేత, కథితమ్ = చెప్పబడినది. శైలరాజస్య = హిమవంతునియొక్క, జ్యేష్ఠాయాః దుహితుః = పెద్ద కుమార్తెయొక్క, దివ్యమానుషసంభవమ్ = దేవలోకమునందును, మనుష్య లోకమునందును జరిగిన, విస్తరమ్=కథా, విస్తరమును వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి=తగిఉన్నావు. విస్తరజ్ఞః=కథా విస్తరములు తెలిసినవాడవుగా, అసి= అయిఉన్నావు.

తా. మునీంద్రా! ధర్మయుక్త మైన ఈ ఉత్తమకథను చెప్పినావు. హిమవంతుని పెద్ద కుమార్తెకు సంబంధించిన, దేవలోకమనుష్యలోకములలో జరిగిన కథను సవిస్తరముగ చెప్పుము. నీవు కథావిస్తరములు తెలిసినవాడవు కదా. 2

మూ. త్రీన్ పథో హేతునా కేన ప్లావయేల్లోకపావనీ. 3
కథం గఙ్గా త్రిపథగా విశ్రుతా సరిదుత్తమా,
త్రిషు లోకేషు ధర్మజ్ఞ కర్మభిః కైః సమన్వితా. 4

ప్ర. అ. లోకపావనీ = లోకములను పవిత్రింపచేయు గంగ, కేన హేతునా = ఏ కారణముచేత, త్రీన్ = మూడు, పథః = మార్గములను, ప్లావయేత్ = ఉదకముచే నింపినది ? ధర్మజ్ఞ = ధర్మములను ఎరిగినవాడా ! త్రిపథగా = మూడు మార్గములందు ప్రవహించు, గఙ్గా = గంగ, కైః = ఏ, కర్మభిః = కర్మలతో, అన్వితా = కూడినదై, త్రిషు లోకేషు = మూడు లోకములలో, సరిదుత్తమా = నదులలో ఉత్తమ మైనదిగా, విశ్రుతా = ప్రసిద్ధ మైనది ?

తా. లోకపావని యైన గంగ ఏ కారణముచేత మూడు మార్గములలో ప్రవహించుచున్నది ? ఓ ధర్మజ్ఞుడా ! త్రిపథగ యైన ఈ గంగ, ఏ కర్మలను పట్టి, మూడు లోకములలో ఉత్తమనది యని ప్రసిద్ధి పొందినది ? 4

మూ. తథా బ్రువతి కాకుత్స్థే విశ్వామిత్ర స్తపోధనః,
నిఖిలేన కథాం సర్వా మృషిమధ్యే న్యవేదయత్. 5

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, తథా = ఆ విధముగా, బ్రువతి = పలుకుచుండగా, తపోధనః = తపస్సే ధనముగా గల, విశ్వామిత్రుడు, సర్వామ్ = సమస్త మైన, కథామ్ = కథను, నిఖిలేన = పూర్తిగా, ఋషిమధ్యే = ఋషుల మధ్యయందు, న్యవేదయత్ = తెలిపెను.

తా. రాముని మాటలు విని విశ్వామిత్రమహర్షి ఆ కథ నంతను సంపూర్ణముగా, ఋషులమధ్యయందు చెప్పెను. 5

మూ. పురా రామ కృతోద్వాహో నీలకణ్ఠో మహాతపాః,
దృష్ట్వా చ స్పృహయా దేవీం మైథునాయోపచక్రమే. 6

ప్ర. అ. రామ = రామా ! పురా = పూర్వము, కృతోద్వాహః = చేసికొనబడిన వివాహము గల, మహాతపాః = మహాతపఃశాలి యైన, నీలకణ్ఠః = శివుడు, దేవీమ్ = దేవిని, దృష్ట్వా = చూచి, స్పృహయా = ఆసక్తితో, మైథునాయ = మైథునమునకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. రామా ! మహాతపఃశాలి యగు ఈశ్వరుడు పూర్వము వివాహము చేసికొని, దేవిని చూచి, అత్యాసక్తితో మైథునమునకు ఉపక్రమించెను. 6

మూ. శితికణ్ఠస్య దేవస్య దివ్యం వర్షశతం గతమ్,
న చాపి తనయో రామ తస్యామాసీత్పరంతప. 7

ప్ర. అ. పరంతప = శత్రువును పీడించు, రామ = రామా ! దేవస్య=దేవుడైన, శితికంఠస్య = ఈశ్వరునకు, దివ్యమ్ = దివ్యమైన, వర్షశతమ్ = సంవత్సరముల శతము, గతమ్ = కడచినది. అపిచ=అయినను, తస్యామ్ = ఆమె యందు, తనయః = కుమారుడు, న అసీత్ = పుట్టలేదు.

తా. ఈశ్వరు డీ విధముగ క్రీడించుచుండగా నూరు దివ్య వర్షములు కడచిపోయినవి. కాని ఆ దేవియందు కుమారుడు జనించలేదు. 7

మూ. తతో దేవాః సముద్విగ్నాః పితామహపురోగమాః,
యదిహోత్పద్యతే భూతం క స్తత్ప్రతిసహిష్యతే. 8

ప్ర. అ. తతః = పిమ్మట, పితామహపురోగమాః = బ్రహ్మ మొదలైన, దేవాః = దేవతలు, ఇహ = ఈ దేవియందు, యత్ = ఏ, భూతమ్ = ప్రాణి, ఉత్పద్యతే = పుట్టునో, తత్ = దానిని, కః = ఎవడు, ప్రతిసహిష్యతే = సహింపగలడు అని, సముద్విగ్నాః = కలత చెందిరి.

తా. "ఈ దేవియందు పుట్టబోవు భూతమును ఎవ్వడైన సహింపగలడా?" అని బ్రహ్మదేవుడు మొదలైన దేవత లందరును కలత చెందిరి. 8

మూ. అభిగమ్య సురాస్సర్వే ప్రణిపత్యేదమబ్రువన్,
దేవదేవ మహాదేవ లోకస్యాస్య హితే రత. 9
సురాణాం ప్రణిపాతేన ప్రసాదం కర్తుమర్హసి,

ప్ర. అ. సురాః = దేవతలు, సర్వే = అందరును, అభిగమ్య = ఈశ్వరుని వద్దకు వెళ్లి, ప్రణిపత్య = నమస్కరించి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రువన్ = పలికిరి. దేవదేవ = దేవతలకు దేవుడా, అస్య = ఈ, లోకస్య = లోకముయొక్క, హితే = హితమునందు, రత = ఆసక్తుడా ! మహాదేవ = మహాదేవుడా ! సురాణామ్ = దేవతల మైన మా యొక్క, ప్రణిపాతేన = నమస్కారముచేత, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఈ లోకమునకు హితము చేయుటయందు ఆసక్తి గల, దేవాధిదేవుడవైన మహాదేవా! దేవతలము మేము నమస్కరించుచున్నాము; అనుగ్రహింపుము. 9

మూ. న లోకా ధారయిష్యన్తి తవ తేజః సురోత్తమ. 10
బ్రాహ్మేణ తపసా యుక్తో దేవ్యా సహ తపశ్చర,
త్రైలోక్యహితకామార్థం తేజస్తేజసి ధారయ. 11

ప్ర. అ. సురోత్తమ = ఓ దేవతాశ్రేష్ఠుడా, తవ = నీయొక్క, తేజః = తేజస్సును, లోకాః = లోకములు, న ధారయిష్యన్తి = ధరింపజాలవు. బ్రాహ్మేణ = వేదోక్తమైన, తపసా = తపస్సుతో, యుక్తః = కూడినవాడవై, దేవ్యా సహ = పార్వతితో గూడ, తపః = తపస్సును, చర = చేయుము. త్రైలోక్యహితకామార్థమ్ = త్రైలోక్యము యొక్క, హితమునందు కోరికతో, తేజః = తేజస్సును, తేజసి = తేజస్సునందు, ధారయ = నిలుపుము.

తా. ఓ సురోత్తమా! నీ తేజస్సును లోకములు ధరింపజాలవు. దేవితో కూడ వేదోక్తప్రకారమున తపస్సు చేయుము. తేజస్సును నీ తేజస్సునందే ధరించి మూడు లోకములకును హితము చేకూర్చుము. 10, 11

మూ. దేవతానాం వచః శ్రుత్వా సర్వలోకమహేశ్వరః,
బాఢమిత్యబ్రవీత్సర్వాన్ పునశ్చేదమువాచ హ. 12

ప్ర. అ. సర్వలోకమహేశ్వరః = ఆ సర్వలోక ప్రభువు, దేవతానామ్ = దేవతలయొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, బాఢమ్ = తప్పక అట్లే అగుగాక, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను. పునశ్చ = మరల, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ సర్వలోకమహేశ్వరుడు దేవతల వాక్యము విని తప్పక అటులనే అగుగాక అని పలికి మరల ఇట్లనెను. 12

మూ. ధారయిష్యామ్యహం తేజస్తేజస్యేవ సహోమయా,
త్రిదశాః పృథివీ చైవ నిర్వాణమధిగచ్ఛతు. 13

ప్ర. అ. ఉమయా సహ = ఉమాదేవితో గూడ, అహమ్ = నేను, తేజః = తేజస్సును, తేజస్యేవ = తేజస్సునందే, ధారయిష్యామి = ధరించగలను. త్రిదశాః = దేవతలును, పృథివీ చైవ = భూమియు, నిర్వాణమ్ = సుఖమును, అధిగచ్ఛతు = పొందుగాక.

తా. ఉమాసహితుడ నైన నేను నా తేజస్సును (రేతస్సును) తేజస్సునందే (నా శరీరమునందే) ధరించెదను. దేవతలును, పృథివియు భయపడకుందురుగాక. 13

మూ. యదిదం క్షుభితం స్థానాన్మమ తేజో హ్యనుత్తమమ్,
ధారయిష్యతి కస్తన్మే బ్రువన్తు సురసత్తమాః. 14

ప్ర. అ. మమ = నా యొక్క, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైన, యత్ = ఏ, ఇదమ్ = ఈ, తేజః = తేజస్సు, స్థానాత్ = స్వస్థానము నుండి, క్షుభితమ్ = క్షోభింపచేయబడినదో, తత్ = దానిని, కః = ఎవడు, ధారయిష్యతి = ధరించగలడు? సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులారా, మే = నాకు, బ్రువన్తు = చెప్పుదురుగాక.

తా. దేవతలారా! స్వస్థానమునుండి చలించిన నా యీ శ్రేష్ఠ మైన తేజస్సును ఎవరు ధరింతురో చెప్పుడు. 14

మూ. ఏవముక్తాః సురాస్సర్వే ప్రత్యూచుర్వృషభధ్వజమ్,
యత్తేజః క్షుభితం హ్యేతత్తద్ధరా ధారయిష్యతి. 15

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తాః = పలకబడిన, సురాః = దేవతలు, సర్వే = అందరును, వృషభధ్వజమ్ = వృషభము ధ్వజమునందు గల ఈశ్వరుని గూర్చి, ప్రత్యూచుః = తిరిగి పలికిరి. యత్ = ఏ, తేజః = తేజస్సు, క్షుభితమ్ = చలించినదో, తత్ = దానిని, ధరా = భూమి, ధారయిష్యతి = ధరించగలదు.

తా. ఆ మాటలు విని దేవతలు ఈశ్వరునితో ఇట్లు అనిరి — "చలించిన తేజస్సును భూమి ధరించగలదు." 15

మూ. ఏవముక్తః సురపతిః ప్రముమోచ మహీతలే,
తేజసా పృథివీ యేన వ్యాప్తా సగిరికాననా. 16

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, ఉక్తః = పలకబడిన, సురపతిః = మహేశ్వరుడు, యేన = ఏ, తేజసా = తేజస్సుచేత, సగిరికాననా = పర్వతములతోడను అడవులతోడను గూడిన, పృథివీ = భూమి, వ్యాప్తా = వ్యాపింపబడినదో, అట్టి తేజస్సును, మహీతలే = భూమియందు, ప్రముమోచ = విడచెను.

తా. దేవతలు చెప్పిన విధముగ మహేశ్వరుడు తేజస్సును భూమిపై విడువగా అది పర్వతారణ్యాదులతో సహా భూమిపై అంతటను వ్యాపించెను. 16

మూ. తతో దేవాః పునరిదమూచుశ్చాథ హుతాశనమ్,
ప్రవిశ త్వం మహాతేజో రౌద్రం వాయుసమన్వితః. 17

ప్ర. అ. తతః = ఆ కారణమువలన, అథ = పిమ్మట, దేవాః = దేవతలు, పునః = మరల, హుతాశమ్ = అగ్నిని, ఇదమ్ = ఈ వాక్యమును, ఊచుః = పలికిరి. త్వమ్ = నీవు, వాయుసమన్వితః = వాయువుతో కూడినవాడవై, రౌద్రమ్ = రుద్రుని సంబంధ మైన, మహాతేజః = గొప్ప తేజస్సును, ప్రవిశ = ప్రవేశించుము.

తా. అది చూచి దేవతలు "వాయువుతో కూడినవాడవై ఈ ఈశ్వర తేజస్సులో ప్రవేశించుము" అని అగ్నిని ఆదేశించిరి. 17

మూ. తదగ్నినా పునర్వ్యాప్తం సంజాతః శ్వేతపర్వతః,
దివ్యం శరవణం చైవ పావకాదిత్యసంనిభమ్. 18
యత్ర జాతో మహాతేజాః కార్తికేయోఽగ్నిసంభవః.

ప్ర. అ. అగ్నినా = అగ్నిచేత, వ్యాప్తమ్ = వ్యాప్త మైన, తత్ = ఆ తేజస్సు, పునః = మరల, శ్వేతపర్వతః = తెల్లని పర్వతముగా, సంజాతః = అయినది. పావకాదిత్యసంనిభమ్ = అగ్నితోడను ఆదిత్యునితోడను సమానమైన, దివ్యమ్ = దివ్యమైన, శరవణం చైవ = తెల్లుగడ్డి వనము గాను, అయినది. యత్ర = దేనియందు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, అగ్ని

సంభవః = అగ్నినుండి పుట్టినవాడును అగు, కార్తికేయః = కృత్తికాకుమారు డైన కుమారస్వామి, జాతః = పుట్టెనో.

తా. ఆ తేజస్సు అగ్నిచేత వ్యాప్తమై శ్వేతపర్వతముగ అయినది. అచటనే అగ్న్యాదిత్యులతో సమాన మైన, దివ్య మైన, శరవణము కూడ బయలు దేరినది. దానియందే మహాతేజఃశాలియు, అగ్నినుండి పుట్టిన వాడును, కృత్తికల కుమాడురును అగు కుమారస్వామి జనించెను.

వి. కుమారస్వామి అగ్నిచే ధరింపబడిన మహేశ్వరతేజస్సు నుండి పుట్టుటచే 'అగ్నిసంభవః' అనియు, కృత్తికలు పెంచుటచే 'కార్తికేయః' అనియు చెప్పబడినాడు. 18

మూ. అథోమాం చ శివం చైవ దేవాః సర్షిగణాస్తదా,
పూజయామాసురత్యర్థం సుప్రీతమనస స్తతః. 19

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సర్షిగణాః = ఋషులగణములతో కూడిన, దేవాః = దేవతలు, తతః = అట్లు జరుగుటవలన, సుప్రీతమనసః = చాల సంతోషించిన మనస్సులు కలవారై, తదా = అప్పుడు, ఉమాం చ = ఉమాదేవిని, శివం చైవ = శివుని, అత్యర్థమ్ = మిక్కిలి, పూజయామాసుః = పూజించిరి.

తా. పిమ్మట దేవతలును, మహర్షులును చాల సంతసించినవారై ఉమాదేవిని, పరమేశ్వరుని ఎక్కువగా పూజించిరి. 19

మూ. అథ శైలసుతా రామ త్రిదశానిదమబ్రవీత్,
సమన్యురశపత్సర్వాన్ క్రోధసంరక్తలోచనా. 20

ప్ర. అ. రామ = రామా ! అథ = పిమ్మట, శైలసుతా = ఉమాదేవి, సమన్యుః = కోపముతో కూడినదై, త్రిదశాన్ = దేవతలను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. క్రోధసంరక్తలోచనా = క్రోధము చేత ఎఱ్ఱ నైన నేత్రములు కలదై, సర్వాన్ = అందరిని, అశపత్ = శపించెను.

తా. రామా ! ఉమాదేవి కోపించినదై, ఎఱ్ఱబడిన నేత్రములతో, దేవతల నందరిని శపించుచు ఇట్లు పలికెను. 20

మూ. యస్మాన్నివారితా చైవ సంగతిః పుత్రకామ్యయా,
అపత్యం స్వేషు దారేషు తస్మాన్నోత్పాదయిష్యథ. 21

ప్ర. అ. యస్మాత్ = ఎందువలన, పుత్రకామ్యయా = పుత్రుడు కావలె నను కోరికతో, సంగతిః = మేము చేయుచున్న సంగమము, నివారితా = నివారింప బడినదో, తస్మాత్ = ఆ కారణమువలన, స్వేషు = తమ, దారేషు = భార్యల యందు, అపత్యమ్ = సంతానమును, నోత్పాదయిష్యథ = పుట్టింపకుందురుగాక.

తా. "పుత్రుడు కావలె నను కోరికచే మేమిరువురము చేయుచున్న సంభోగము నకు అడ్డు తగిలినారు గాన మీకు మీ భార్యలయందు సంతానము కలుగకుండు గాక." 21

మూ. అద్యప్రభృతి యుష్మాకమప్రజాః సన్తు పత్నయః, 22
ఏవముక్త్వా సురాన్ సర్వాన్ శశాప పృథివీమపి.

ప్ర. అ. అద్యప్రభృతి = నేడు మొదలు, యుష్మాకమ్ = మీయొక్క, పత్నయః = భార్యలు, అప్రజాః = సంతానము లేనివారుగా, సన్తు = అగుదురు గాక. సర్వాన్ సురాన్ = అందరు దేవతలను, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, పృథివీమపి = భూమిని కూడ, శశాప = శపించెను.

తా. "నేడు మొదలు మీ భార్యలకు సంతానము కలుగకుండుగాక" దేవతల నందరిని ఈ విధముగ శపించి, ఉమాదేవి పృథివిని గూడ ఇట్లు శపించెను. 22

మూ. అవనే నైకరూపా త్వం బహుభార్యా భవిష్యసి. 23
న చ పుత్రకృతాం ప్రీతిం మత్క్రోధకలుషీకృతా,
ప్రాప్స్యసి త్వం సుదుర్మేధే మమ పుత్రమనిచ్ఛతీ. 24

ప్ర. అ. అవనే = ఓ భూమీ! త్వమ్ = నీవు, నైకరూపా = అనేక రూపములు గలదానవై, బహుభార్యా = చాలామందికి భార్యవు, భవిష్యసి = కాగలవు. సుదుర్మేధే = చాల చెడ్డబుద్ధి కలదానా! మమ = నాకు, పుత్రమ్ = పుత్రుడు కలుగుటకు, అనిచ్ఛతీ = ఇష్టపడని, త్వమ్ = నీవు, మత్క్రోధకలుషీ

కృతా = నా యొక్క క్రోధముచేత పీడితురాలవై, పుత్రకృతామ్ = పుత్రులవలన కలుగు, ప్రీతిం చ = ఆనందమును గూడ, న ప్రాప్స్యసి = పొందవు.

తా. "ఓ భూమీ! నీవు అనేక రూపములు కలదానవు గాను, అనేకులకు భార్యవుగాను అగుదువుగాక. చాల చెడ్డబుద్ధి గలదానా! నాకు పుత్రుడు జనించుటకు ఇష్టపడని నీవు నా కోపమునకు ఫలితముగా, పుత్రానందమును పొందకుందువుగాక." 24

మూ. తాన్ సర్వాన్ వ్రీళితాన్ దృష్ట్వా సురాన్ సురపతిస్తదా,
గమనాయోపచక్రామ దిశం వరుణపాలితామ్. 25

ప్ర. అ. సురపతిః = మహేశ్వరుడు, తదా = అప్పుడు, వ్రీడితాన్ = సిగ్గుచెందిన, తాన్ = ఆ, సర్వాన్ = సమస్తమైన, సురాన్ = దేవతలను, దృష్ట్వా = చూచి, వరుణపాలితామ్ = వరుణునిచే పాలింపబడిన, దిశమ్ = దిక్కును గూర్చి, గమనాయ = వెళ్లుటకు, ఉపచక్రామ = ఉపక్రమించెను.

తా. అపుడు మహేశ్వరుడు సిగ్గుచెందిన సురుల నందరిని చూచి, అచటి నుండి పశ్చిమదిక్కు వైపు వెళ్లుటకు బయలుదేరెను. 25

మూ. స గత్వా తప ఆతిష్ఠత్పార్శ్వే తస్యోత్తరే గిరేః,
హిమవత్ప్రభవే శృఙ్గే దేవ్యా సహ మహేశ్వరః. 26

ప్ర. అ. సః = ఆ, మహేశ్వరః = మహేశ్వరుడు, గత్వా = పశ్చిమము వైపు వెళ్లి, తస్య = ఆ, గిరేః = హిమవత్పర్వతముయొక్క, ఉత్తరే = ఉత్తరమునందున్న, పార్శ్వే = పార్శ్వమునందు, హిమవత్ప్రభవే = హిమవత్పర్వతమునందు పుట్టిన, శృఙ్గే = శిఖరమునందు, దేవ్యా సహ = ఉమాదేవితో గూడ, తపః = తపస్సును, ఆతిష్ఠత్ = చేసెను.

తా. మహేశ్వరుడు హిమవత్పర్వతమునందే పశ్చిమదిక్కుగా వెళ్లి, ఆ హిమవత్పర్వతము ఉత్తరపార్శ్వతమునం దున్న శిఖరముపై, ఉమాసమేతుడై తపస్సు చేసెను. 26

మూ. ఏష తే విస్తరో రామ శైలపుత్ర్యా నివేదితః,
గఙ్గాయాః ప్రభవం చైవ శృణు మే సహ లక్ష్మణః. 27

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
## షట్త్రింశః సర్గః.

ప్ర. అ. రామ = రామా! శైలపుత్ర్యాః = ఉమాదేవికి సంబంధించిన ఏషః = ఈ, విస్తరః = కథావిస్తరము, తే = నీకు, కథితః = చెప్పబడినది. గఙ్గాయాః = గంగయొక్క, ప్రభవం చైవ = ప్రభావమును కూడ, సహలక్ష్మణః = లక్ష్మణసహితుడ వైన నీవు, మే = నానుండి, శృణు = వినుము.

తా. రామా! ఉమాదేవికి సంబంధించిన కథ చెప్పితిని. ఇపుడు నీవును, లక్ష్మణుడును, గంగాప్రభావమును వినుడు. 27

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో ముప్పదిమూడవ సర్గ సమాప్తము.

# అథ సప్తత్రింశః సర్గః

మూ. తప్యమానే తపో దేవే దేవాః సర్షిగణాః పురా,
సేనాపతిమభీప్సన్తః పితామహముపాగమన్. 1

ప్ర. అ. పురా = పూర్వము, దేవే=పరమేశ్వరుడు, తపః తప్యమానే= తపస్సు చేయుచుండగా, సర్షిగణాః=ఋషిగణములతో కూడిన, దేవాః=దేవతలు, సేనాపతిమ్ = సేనాపతిని, అభీప్సన్తః=కోరుచున్నవారై, పితామహమ్=బ్రహ్మ దేవుని, ఉపాగమన్ = సమీపించిరి.

తా. పూర్వము ఈ విధముగ పరమేశ్వరుడు తపస్సు చేయుచుండగా, దేవతలును, ఋషులును, సేనానాయకుడు కావలె నని కోరుచు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లిరి. 1

మూ. తతోఽబ్రువన్ సురాః సర్వే భగవన్తం పితామహమ్,
ప్రణిపత్య సురాః సర్వే సేన్ద్రాః సాగ్నిపురోగమాః. 2

ప్ర. అ. తతః=పిమ్మట, సేన్ద్రాః=ఇంద్రునితో కూడినవారును, అగ్ని పురోగమాః=అగ్ని ఎదుట కలవారును అగు, సురాః=దేవతలు, సర్వే=అందరును, భగవన్తమ్ = భగవంతుడైన, పితామహమ్ = బ్రహ్మదేవుని, ప్రణిపత్య = నమస్కరించి, అబ్రువన్ = పలికిరి.

తా. అగ్నిని ముందు ఉంచుకొని వెళ్లిన ఆ ఇంద్రాదిదేవత లందరును బ్రహ్మదేవునకు నమస్కరించి ఇట్లు పలికిరి. 2

మూ. యో నః సేనాపతిర్దేవ దత్తో భగవతా పురా,
తపః పరమమాస్థాయ తప్యతే స్మ సహోమయా. 3

ప్ర. అ. దేవ = దేవా! భగవతా = భగవంతుడ వైన నీచేత, పురా= పూర్వము, నః=మాకు, యః=ఏ, సేనాపతిః=సేనాపతి, దత్తః=ఇవ్వబడినాడో, అతడు. ఉమయా సహ = ఉమాదేవితో కూడ, పరమమ్ = గొప్ప, తపః =

తపస్సును (నియమమును), ఆస్థాయ = అవలంబించి, తప్యతే = తపస్సు చేయుచున్నాడు.

తా. పూర్వము నీవు మాకు సేనాపతిగా ఇచ్చిన మహేశ్వరుడు ఉమాదేవితో కూడ గొప్పనియమము నవలంబించి తపస్సు చేయుచున్నాడు. 3

మూ. యదత్రానన్తరం కార్యం లోకానాం హితకామ్యయా,
సంవిధత్స్వ విధానజ్ఞ త్వం హి నః పరమా గతిః. 4

ప్ర. అ. విధానజ్ఞ = ఉపాయములు తెలిసిన ఓ పితామహా ! లోకానామ్ = లోకములయొక్క, హితకామ్యయా = హితమునందు కోరికచే, అత్ర = ఈ విషయమున, అనన్తరమ్ = దీని తరువాత, యత్ = ఏది, కార్యమ్ = చేయదగినదో, దానిని, సంవిధత్స్వ = చేయుము. త్వమ్ = నీవు, నః = మాకు, పరమా = గొప్పదైన, గతిః హి = గతి కదా.

తా. ఈ విషయమున లోకక్షేమముకొరకై ఇపు డేమి చేయవలెనో అది చేయుము. తగు ఉపాయములు నీకే తెలియును. మాకు శరణము నీవే గదా ? 4

మూ. దేవతానాం వచః శ్రుత్వా సర్వలోకపితామహః,
సాన్త్వయన్మధురైర్వాక్యైస్త్రిదశానిదమబ్రవీత్. 5

ప్ర. అ. సర్వలోకపితామహః = సమస్తలోకములకును పితామహుడైన బ్రహ్మదేవుడు, దేవతానామ్ = దేవతలయొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, మధురైః = మధురములైన, వాక్యైః = వాక్యములచేత, త్రిదశాన్ = ఆ దేవతలను, సాన్త్వయన్ = ఓదార్చుచు, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దేవతల వాక్యము విని పితామహుడు, వారిని మధురములైన మాటలచే ఓదార్చుచు ఇట్లు పలికెను. 5

మూ. శైలపుత్ర్యా యదుక్తం తన్న ప్రజాస్యథ పత్నిషు,
తస్యా వచనమక్లిష్టం సత్యమేతన్న సంశయః. 6

ప్ర. అ. యత్ = ఎందువలన, శైలపుత్ర్యా = ఉమాదేవిచేత, ఉక్తమ్= చెప్పబడినదో, తత్ = ఆ కారణమువలన, పత్నిషు = భార్యలయందు, న ప్రజాస్యథ = సంతానమును కనజాలరు. తస్యాః = ఆమెయొక్క, వచనమ్= వాక్యము, అక్లిష్టమ్ = బాధింపబడనిది. ఏతత్ = ఇది, సత్యమ్ = సత్యము. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఉమాదేవి చెప్పిన విధముగ మీకు మీ భార్యలయందు పుత్రులు పుట్టరు. ఆమె మాటకు అడ్డు లేదు. ఇది సత్యము. సందేహము లేదు. 6

మూ. ఇయమాకాశగా గఙ్గా యస్యాం పుత్రం హుతాశనః,
జనయిష్యతి దేవానాం సేనాపతిమరిన్దమమ్. 7

ప్ర. అ. యస్యామ్ = ఏ గంగయందు, హుతాశనః = అగ్ని, అరిందమమ్ = శత్రువును నశింపచేయు, దేవానామ్ = దేవతలయొక్క, సేనాపతిమ్= సేనాపతియైన, పుత్రమ్ = పుత్రుని, జనయిష్యతి = పుట్టింపగలడో, ఇయమ్= అట్టి, ఆకాశగా = ఆకాశమునందు ప్రవహించు చున్న, గఙ్గా = గంగ ఉన్నది.

తా. ఆకాశమునందు ప్రవహించు ఈ గంగ ఉన్నది కదా. ఈమె యందు అగ్నిదేవుడు, దేవతలకు సేనాపతియై శత్రుసంహారము చేయు పుత్రుని పుట్టించును.

మూ. జ్యేష్ఠా శైలేన్ద్రతనయా మానయిష్యతి తత్సుతమ్,
ఉమాయాస్తద్బహుమతం భవిష్యతి న సంశయః. 8

ప్ర. అ. జ్యేష్ఠా = పెద్దదైన, శైలేంద్రతనయా = శైలరాజదుహిత, తత్సుతమ్ = ఆ అగ్నియొక్క కుమారుని, మానయిష్యతి=అంగీకరింపగలదు. తత్ = అది, ఉమాయాః = ఉమకు, బహుమతమ్=చాల ఇష్టమైనది, భవిష్యతి= కాగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. హిమవంతుని జ్యేష్ఠపుత్రి యైన గంగ అగ్నిదేవునినుండి ఆ గర్భమును స్వీకరించును. ఇది యంతయు ఉమకు కూడ అంగీకారయోగ్య మగును. సందేహము లేదు. 8

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య కృతార్థా రఘునన్దన,
ప్రణిపత్య సురాః సర్వే పితామహమపూజయన్. 9

ప్ర. అ. రఘునన్దన = రామా ! సురాః = దేవతలు, సర్వే = అందరును, తస్య = ఆతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, కృతార్థాః = కృతార్థులై, పితామహమ్ = బ్రహ్మదేవుని, ప్రణిపత్య = నమస్కరించి, అపూజయన్ = పూజించిరి.

తా. రామా ! ఆ దేవత లందరును బ్రహ్మదేవుని వాక్యము విని, సఫలీకృతమనోరథులై, ఆయనకు నమస్కరించి పూజించిరి. 9

మూ. తే గత్వా పర్వతం రామ కైలాసం ధాతుమణ్డితమ్,
అగ్నిం నియోజయామాసుః పుత్రార్థం సర్వదేవతాః. 10

ప్ర. అ. తే = ఆ, సర్వదేవతాః = దేవతలందరును, ధాతుమణ్డితమ్ = ధాతువులచే అలకరింపబడిన, కైలాసం పర్వతమ్ = కైలాసపర్వతమును గూర్చి, గత్వా = వెళ్లి, పుత్రార్థమ్ = పుత్రునికొరకై, అగ్నిమ్ = అగ్నిదేవుని, నియోజయామాసుః = ఆజ్ఞాపించిరి.

తా. దేవతలందరును ధాతువులచే అలంకృత మగు కైలాసపర్వతమునకు పోయి, "పుత్రుని కనుము" అని అగ్నిదేవుని ఆజ్ఞాపించిరి. 10

మూ. దేవకార్యమిదం దేవ సంవిధత్స్వ హుతాశన,
శైలపుత్ర్యాం మహాతేజో గఙ్గాయాం తేజ ఉత్సృజ. 11

ప్ర. అ. దేవ = ప్రకాశమానుడ వగు, హుతాశన = అగ్నీ ! ఇదమ్ = ఈ, దేవకార్యమ్ = దేవతాకార్యమును, సంవిధత్స్వ = చేయుము. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా, తేజః = మహేశ్వరుని తేజస్సును. శైలపుత్ర్యామ్ = హిమవత్పుత్రి యగు, గఙ్గాయామ్ = గంగయందు, ఉత్సృజ = విడువుము.

తా. ఓ అగ్నిదేవా ! ఈ దేవతాకార్యమును చేయుము. నీయందున్న మహేశ్వరుని తేజస్సును హిమవంతుని పుత్రి యగు గంగయందుంచుము. 11

మూ. దేవతానాం ప్రతిజ్ఞాయ గఙ్గామభ్యేత్య పావకః,
గర్భం ధారయ వై దేవి దేవతానామిదం ప్రియమ్. 12

ప్ర. అ. పావకః = అగ్నిదేవుడు, దేవతానామ్ = దేవతలకు, ప్రతిజ్ఞాయ = మాట యిచ్చి, గఙ్గామ్ = గంగను, అభ్యేత్య = సమీపించి, దేవి = ఓ దేవీ! గర్భమ్ = గర్భమును, ధారయ వై = ధరింపుము. ఇదమ్ = ఈ కార్యము, దేవతానామ్ = దేవతలకు, ప్రియమ్ = ఇష్టమైనది (అని పలికెను).

తా. అగ్నిదేవుడు "అటులనే" అని దేవతలకు మాట యిచ్చి, గంగను సమీపించి-దేవీ! గర్భమును ధరింపుము. ఈ కార్యము దేవతలకు ప్రియ మైనది అని పలికెను. 12

మూ. తస్య తద్వచనం శ్రుత్వా దివ్యం రూపమధారయత్,
దృష్ట్వా తన్మహిమానం స సమన్తాదవకీర్యత. 13

ప్ర. అ. తస్య = అగ్నియొక్క, తద్ వచనమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, దివ్యమ్ = దివ్యమైన, రూపమ్ = రూపమును, అధారయత్ = ధరించెను. సః = ఆ అగ్ని, తన్మహిమానమ్ = ఆ గంగయొక్క మహిమను, దృష్ట్వా = చూచి, సమన్తాత్ = అంతటను, అవకీర్యత = వ్యాపించెను.

తా. అగ్నిదేవుని మాట విని గంగ దివ్య మైన రూపమును ధరించెను. ఆమె మహిమను చూచి అగ్నిదేవుడు తన దేహము ఆమెపై అంతటను వ్యాపించు నటు చేసెను. 13

మూ. సమన్తత స్తతో దేవీమభ్యషిఞ్చత పావకః,
సర్వస్రోతాంసి పూర్ణాని గఙ్గాయా రఘునన్దన. 14

ప్ర. అ. రఘునన్దన = రామా! తతః = పిమ్మట, పావకః = అగ్ని దేవుడు, దేవీమ్ = గంగాదేవిని, సమన్తతః = అంతటను, అభ్యషిఞ్చత = తనలో నున్న పరమేశ్వరుని వీర్యముచే తడిపెను. గఙ్గాయాః = గంగయొక్క, సర్వస్రోతాంసి = అవయవము లన్నియు, పూర్ణాని = నిండిపోయినవి.

తా. రామా! పిమ్మట ఆ అగ్నిదేవుడు తనలో నున్న పరమేశ్వరవీర్యము ఆమెయందు అంతటను వ్యాపించు నట్లు విడచెను. దానితో గంగ అవయవము లన్నియు నిండిపోయినవి. 14

మూ. తమువాచ తతో గఙ్గా సర్వదేవపురోహితమ్,
అశక్తా ధారణే దేవ తవ తేజస్సముద్ధతమ్. 15
దహ్యమానాగ్నినా తేన సంప్రవ్యథితచేతనా.

ప్ర. అ. **తతః** = పిమ్మట, గఙ్గా = గంగ, **సర్వదేవపురోహితమ్** = సమస్తదేవతలకును అగ్రమునందు నిలుపబడు, **తమ్** = ఆ, అగ్నిదేవుని గూర్చి, **ఉవాచ** = పలికెను. దేవ = ఓ అగ్నిదేవుడా! **సముద్ధతమ్** = విజృంభించిన, తవ = నీ యొక్క, **తేజః** = తేజస్సును, **ధారణే** = దరించుటయందు, **అశక్తా** = అసమర్థురాలను. తేన = ఆ, అగ్నినా = అగ్నిచేత, (రేతస్సుచేత), దహ్యమానా = కాల్చివేయబడుచున్న నేను, సంప్రవ్యథిచేతనా = మిక్కిలి క్షోభపెట్టబడిన చైతన్యము కలదానను.

తా. పిమ్మట ఆ గంగ సర్వదేవతలకును ముందుండెడు ఆ అగ్నిదేవునితో ఇట్లు పలికినది. "అగ్నిదేవా! విజృంభించిన నీ యొక్క ఈ తేజస్సును ధరింప జాలను. ఈ తేజస్సు నన్ను దహింపచేయుచున్నది. నాకు స్పృహతప్పిపోవు చున్నది." 15

మూ. అథాబ్రవీదిదం గఙ్గాం సర్వదేవహుతాశనః, 16
ఇహ హైమవతే పాదే గర్భోఽయం సంనివేశ్యతామ్.

ప్ర. అ. అథ = పిమ్మట, సర్వదేవహుతాశనః = దేవత లందరికొరకును హోమము చేయబడిన హోమద్రవ్యములను భుజించు అగ్నిదేవుడు, గఙ్గామ్ = గంగను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అయమ్ = ఈ, గర్భః = గర్భము, ఇహ = ఇచట, హైమవతే = హిమవత్పర్వతమునకు సంబంధించిన, పాదే = సమీపపర్వతమునందు, సంనివేశ్యతామ్ = ఉంచబడు గాక.

తా. అగ్నిదేవుడు గంగతో— "ఈ గర్భమును ఇచట, హిమవత్పర్వత సమీపమునందున్న చిన్న పర్వతముపై విడువుము" అని చెప్పెను. 16

మూ. శ్రుత్వా త్వగ్నివచో గఙ్గా తం గర్భమతిభాస్వరమ్,
ఉత్ససర్జ మహాతేజః స్రోతోభ్యో హి తదానఘ. 17

ప్ర. అ. మహాతేజః = గొప్పతేజస్సు గలవాడా, అనఘ = పాపరహితుడ వగు రామా ! అగ్నివచః = అగ్నియొక్క వాక్యమును, శ్రుత్వా = విని, గఙ్గా = గంగ, తదా = అప్పుడు, అతిభాస్వరమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న, తం గర్భమ్ = ఆగర్భమును, స్రోతోభ్యః = అవయవముల నుండి, ఉత్ససర్జ = విడచెను.

తా. దోషరహితుడవు, తేజఃశాలివి అగు రామా ! అపు డా గంగ అగ్ని దేవుడు చెప్పిన విధమున, మిక్కిలి ప్రకాశించుచున్న ఆ గర్భమును, తన అవయవములనుండి అచట విడచెను. 17

మూ. యదస్యా నిర్గతం తస్మాత్తప్తజామ్బూనదప్రభమ్,
కాఞ్చనం ధరణీం ప్రాప్తం హిరణ్యమమలం శుభమ్. 18

ప్ర. అ. అస్యాః = ఈ గంగానదినుండి, తప్తజామ్బూనదప్రభమ్ = కరిగిన బంగారమువంటి కాంతి గల, యత్ = ఏతేజస్సు, నిర్గతమ్ = బయలు దేరినదై, ధరణీమ్ = భూమిని, ప్రాప్తమ్ = పొందినదో, తస్మాత్ = దానినుండి, శుభమ్ = శుభ మైన, కాఞ్చనమ్ = బంగారము, అమలమ్ = తెల్లని, హిరణ్యమ్ = వెండియు, (అభవత్ = పుట్టెను).

తా. ఆ గంగ విదిలిపెట్టగా బయటకు వచ్చి భూమిపై పడిన, కరిగిన బంగారముతో సమాన మైన కాంతి గల, తేజస్సు నుండి, మంగళకర మైన బంగారము, పరిశుద్ధ మైన వెండియు పుట్టెను. 18

మూ. తామ్రం కార్ష్ణాయసం చైవ తైక్ష్ణ్యాదేవాభ్యజాయత, 19
మలం తస్యాభవత్తత్ర త్రపు సీసకమేవ చ.
తదేతద్ధరణీం ప్రాప్య నానాధాతురవర్ధత. 20

ప్ర. అ. తత్ర = అచట, తైక్ష్ణ్యాత్ = తీక్ష్ణత్వమునుండి (క్షారము నుండి), తామ్రమ్ = రాగియు, కార్ష్ణాయసం చైవ = ఇనుము, అభ్యజాయత = పుట్టెను. తస్య = ఆరేతస్సు యొక్క, మలమ్ = మలము, త్రపు = తగరము, సీసక మేవ చ = సీసము, అభవత్ = ఆయెను. తత్ ఏతత్ = ఆ

ధరణీమ్ = భూమిని, ప్రాప్య = పొంది, నానాధాతుః = అనేకవిధములైన ధాతువుగా, అవర్ధత = వృద్ధిచెందెను.

తా. అచట, రేతస్సులో నున్న క్షారము నుండి రాగి, ఇనుము పుట్టినవి. ఆ రేతస్సులోని మలము తగరముగాను, సీసము గాను అయినది. ఈ విధముగ ఆ వీర్యము నేలపై బడి అనేకధాతువుల రూపములలో వృద్ధి పొందినది. 19, 20

మూ. నిక్షిప్తమాత్రే గర్భే తు తేజోభిరభిరఞ్జితమ్,
సర్వం పర్వతసన్నద్ధం సౌవర్ణమభవద్వనమ్. 21

ప్ర. అ. గర్భే = గర్భము, నిక్షిప్తమాత్రే=ఉంచబడగానే, సర్వమ్ = నమస్తమైన, పర్వతసన్నద్ధమ్ = పర్వతమునందు మొలిచిన, వనమ్ = శర వణము, తేజోభిః = తేజస్సులచేత, అభిరఞ్జితమ్ = రంజింపచేయబడినదై, సౌవర్ణమ్ = సువర్ణమయముగా, అభవత్ = ఆయెను.

తా. ఆ గర్భమును అచట విడువగనే పర్వతముపై మొలిచిన శరవణ మంతయు కాంతులచే రంజింపబడినదై, సువర్ణమయ మైపోయినది. 21

మూ. జాతరూపమితి ఖ్యాతం తదా ప్రభృతి రాఘవ,
సువర్ణం పురుషవ్యాఘ్ర హుతాశనసమప్రభమ్. 22
తృణవృక్షలతాగుల్మం సర్వం భవతి కాఞ్చనమ్.

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషులలో శ్రేష్ఠుడా ! రాఘవ = రామా ! తదాప్రభృతి = అది మొదలు, హుతాశనసమప్రభమ్ = అగ్నితో సమాన మైన కాంతి గల, సువర్ణమ్ = బంగారము, జాతరూపమ్ ఇతి = పుట్టిన రూపము గలది అని, ఖ్యాతమ్ = ప్రసిద్ధ మైనది. సర్వమ్ = నమస్త మైన, తృణ వృక్షలతాగుల్మమ్ = తృణవృక్షలతాగుల్మాదికము, కాఞ్చనమ్ = బంగారముగా, భవతి = అయినది.

తా. పురుషశ్రేష్ఠుడా ! రామా ! అది మొదలు అగ్నితో సమాన మైన కాంతి గల బంగారము జాతరూపము (పుట్టిన రూపము కలది) అని ప్రసిద్ధి చెందినది. తృణము, వృక్షములు, లతలు, పొదలు, అన్నియు బంగారముగా మారిపోయినవి. 22

మూ. తం కుమారం తతో జాతం సేన్ద్రాః సహ మరుద్గణాః, 23
క్షీరసంభావనార్థాయ కృత్తికాః సమయోజయన్.

ప్ర. అ. తతః=పిమ్మట, జాతమ్ = పుట్టిన, తమ్ = ఆ, కుమారమ్ = కుమారుని, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, మరుద్గణాః = దేవతాగణములు, సహ = ఒకేకాలమునందు, క్షీరసంభావనాయ = క్షీరమునిచ్చి ఆదరించుటకై, కృత్తికాః = కృత్తికలను, సమయోజయన్ = ఏర్పరచిరి.

తా. అంతట కుమారుడు పుట్టెను. అతనికి కృత్తికలు అందరును కలిసి ఒకే కాలమునందు పాలు ఇచ్చి ఆదరించవలె నని, ఇంద్రసమేతులగు దేవతలు ఏర్పాటుచేసిరి. 23

మూ. తాః క్షీరం జాతమాత్రస్య కృత్వా సమయముత్తమమ్, 24
దదుః పుత్రోఽయమస్మాకం సర్వాసామితి నిశ్చితాః.

ప్ర. అ. తాః = ఆ కృత్తికలు, నిశ్చితాః = తమలో తాము నిశ్చయించుకొనినవారై, అయమ్ = ఇతడు, అస్మాకమ్ = మాకు, సర్వాసామ్ = అందరికిని, పుత్రః = పుత్రుడు, అగుగాక అని, ఉత్తమమ్ = గొప్పదైన, సమయమ్=కట్టుబాటును, కృత్వా=చేసి, జాతమాత్రస్య=అపుడే పుట్టిన ఆ పిల్లవానికి, క్షీరమ్= చనుబాలను, దదుః = ఇచ్చిరి.

తా. ఆ కృత్తికలు తమలో తాము నిర్ణయము చేసుకొని, "ఈ పిల్లవాడు మా కందరకును పుత్రుడు కావలెను" అని దేవతలతో ఒక ఉత్తమ మైన ఒప్పందమేర్పరచుకొని, అపుడే పుట్టిన ఆ పిల్లవానికి చనుబాలు ఇచ్చిరి. 24

మూ. తతస్తు దేవతాః సర్వాః కార్తికేయ ఇతి బ్రువన్, 25
పుత్రస్త్రైలోక్యవిఖ్యాతో భవిష్యతి న సంశయః.

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వాః = సమస్త మైన, దేవతాః=దేవతలు, పుత్రః = ఈ పుత్రుడు, కార్తికేయః ఇతి = కృత్తికల పుత్రుడు అని, త్రైలోక్య విఖ్యాతః=మూడు లోకములలో విఖ్యాతుడు, భవిష్యతి=కాగలడు, సంశయః= సంశయము, న = లేదు, ఇతి = అని, బ్రువన్ = పలికిరి.

**తా.** ఈ పుత్రుడు కార్తికేయుడు (కృత్తికల కుమారుడు) అని మూడు లోకములలో ప్రసిద్ధి పొందును; సందేహము లేదు" అని దేవత లందరును పలికిరి.

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా స్కన్నం గర్భపరిస్రవే, 26
స్నాపయన్ పరయా లక్ష్మ్యా దీప్యమానం యథానలమ్.

ప్ర. అ. **తేషామ్** = ఆ దేవతలయొక్క, **తత్** = ఆ, వచనమ్= వచనమును, శ్రుత్వా = విని, గర్భపరిస్రవే = గర్భస్రావమునందు, స్కన్నమ్ = జారిపడిన వాడును, అనలం యథా=అగ్ని వలె, పరయా=గొప్పదైన, **లక్ష్మ్యా**= సౌందర్యముతో, దీప్యమానమ్ = ప్రకాశించుచున్న వాడును అగు, ఆ పిల్లవానిని, స్నాపయన్ = స్నానము చేయించిరి.

**తా.** దేవత లిట్లు చెప్పగా, గర్భస్రావమునందు జారిపడి, అగ్ని వలె శోభతో ప్రకాశించుచున్న ఆ పిల్లవానికి కృత్తికలు స్నానము చేయించిరి. 26

మూ. స్కన్ద ఇత్యబ్రువన్ దేవాః స్కన్నం గర్భపరిస్రవాత్, 27
కార్తికేయం మహాభాగం కాకుత్స్థ జ్వలనోపమమ్.

ప్ర. అ. **కాకుత్స్థ** = రామా ! జ్వలనోపమమ్ = అగ్నితో సమానుడును, మహాభాగమ్ = గొప్ప భాగ్యము కలవాడును అగు, గర్భపరిస్రవాత్ = గర్భస్రావము వలన, స్కన్నమ్ = జారి పడిన, కార్తికేయమ్ = కార్తికేయుని, స్కన్దః ఇతి = స్కందుడు అని, అబ్రువన్ = పలికిరి.

**తా.** రామా ! మహాభాగ్యవంతుడును, అగ్నితుల్యుడును, గర్భస్రావము వలన జారి పడినవాడును అగు ఆ కార్తికేయునకు "స్కందుడు" (జారిపడినవాడు) అని కూడ పేరు పెట్టిరి. 27

మూ. ప్రాదుర్భూతం తతః క్షీరం కృత్తికానామనుత్తమమ్, 28
షణ్ణాం షడాననో భూత్వా జగ్రాహ స్తనజం పయః.

ప్ర. అ. **తతః** = పిమ్మట, **కృత్తికానామ్**=కృత్తికలకు, **అనుత్తమమ్**= అత్యుత్తమ మైన, క్షీరమ్ = క్షీరము, ప్రాదుర్భూతమ్ = పుట్టినది. షణ్ణామ్ =

ఆరుగురియొక్క, స్తనజమ్ = స్తనములందు పుట్టిన, పయః = పాలను, షడాననః=ఆరుముఖములుగలవాడు, భూత్వా=అయి, జగ్రాహ=గ్రహించెను.

తా. అంత ఆ కృత్తికల స్తనములలో అత్యుత్తమ మైన క్షీరము పుట్టినది. ఆ శిశువు ఆరు ముఖములు కలవాడై, ఆ ఆరుగురి స్తనములలో పుట్టిన క్షీరమును ఒక్క సమయముననే త్రాగెను. 28

మూ. గృహీత్వా క్షీరమేకాహ్నా సుకుమారవపుస్తదా, 29
అజయత్స్వేన వీర్యేణ దైత్యసేనాగణాన్విభుః.

ప్ర. అ. విభుః = సమర్థు డైన ఆ కుమారుడు, ఏకాహ్నా = ఒక దినము మాత్రమే, క్షీరమ్ = క్షీరమును, గృహీత్వా = గ్రహించి, తదా = అప్పుడు, సుకుమారవపుః = సుకుమార మైన శరీరముకలవా డైనను, స్వేన = తన సంబంధమైన, వీర్యేణ = పరాక్రమముచేత, దైత్యసేనాగణాన్ = దైత్యసేనా సముదాయములను, అజయత్ = జయించెను.

తా. సామర్థ్యశాలి యగు ఆ కుమారుడు ఒక్క దినమునందు మాత్రమే పాలు త్రాగి, సుకుమారశరీరవంతు డైనను, తన పరాక్రమముచే దైత్యసేనలను జయించెను. 29

మూ. సురసేనాగణపతిం తతస్తమతులద్యుతిమ్, 30
అభ్యషిఞ్చన్ సురగణాః సమేత్యాగ్నిపురోగమాః.

ప్ర. అ. తతః = పిమ్మట, అగ్నిపురోగమాః = అగ్ని మొదలైన, సురగణాః = దేవతాగణములు, సమేత్య = కలిసి, అతులద్యుతిమ్ = సాటి లేని కాంతి గల, తమ్ = ఆతనిని, సురసేనాగణపతిమ్ = దేవసేనాగణమునకు నాయకునిగా, అభ్యషిఞ్చన్ = అభిషేకించిరి.

తా. అగ్ని మొదలగు దేవత లందరును కలిసి సాటి లేని కాంతి గల ఆతనిని దేవసేనానాయకునిగా అభిషేకించిరి. 30

మూ. ఏష తే రామ గఙ్గాయా విస్తరోఽభిహితో మయా, 31
కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్యస్తథైవ చ.

ప్ర. అ. రామ = రామా ! మయా = నాచేత, తే = నీకు, గఙ్గాయాః = గంగయొక్క, ఏషః = ఈ, విస్తరః = కథావిస్తరము, తథైవ = మరియు, ధన్యః = ధన్యత్వమును కలిగించునదియు, పుణ్యః = పవిత్ర మైనదియు అగు, కుమారసంభవశ్చైవ = కుమారస్వామియొక్క పుట్టుకయు, అభిహితః = చెప్పబడినది.

తా. రామా ! గంగకు సంబంధించిన విస్తృతకథను, ధన్యత్వమును కలిగించునదియు, పుణ్యమును అయిన కుమారసంభవ వృత్తాంతమును చెప్పితిని. 31

మూ. భక్తశ్చ యః కార్తికేయే కాకుత్స్థ భువి మానవః, 32
ఆయుష్మాన్ పుత్రపౌత్రైశ్చ స్కన్దసాలోక్యతాం వ్రజేత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! భువి = భూలోకమునందు, యః = ఏ, మానవః = మానవుడు, కార్తికేయే = కుమారస్వామియందు, భక్తః చ = భక్తుడో, అతడు, ఆయుష్మాన్ = ఆయుర్దాయవంతుడై, పుత్రపౌత్రైః = పుత్రపౌత్రాదులతో కూడినవాడై, స్కన్దసాలోక్యతామ్ = స్కందునితో సాలోక్యమును, వ్రజేత్ = పొందును.

తా. రామా ! భూలోకమున, కుమారస్వామియందు భక్తి గల మానవుడు దీర్ఘాయుర్దాయవంతుడై, పుత్రపౌత్రాది సౌఖ్యము లనుభవించి మరణానంతరము స్కందునిలోకము చేరును. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యయందు బాలకాండలో
ముప్పది యేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టత్రింశః సర్గః

మూ. తాం కథాం కౌశికో రామే నివేద్య కుశికాత్మజః,
పునరేవాపరం వాక్యం కాకుత్స్థమిదమబ్రవీత్. 1

ప్ర. అ. కుశికాత్మజః=కుశవంశీయుడైన గాధి కుమారుడైన, కౌశికః=విశ్వామిత్రుడు, తాం కథామ్ = ఆ కథను, రామే = రామునియందు (నకు), నివేద్య = తెలిపి, పునరేవ = మరల, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, కాకుత్స్థమ్ = రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. విశ్వామిత్రుడు రామునకీ కథ చెప్పి మరల అతనితో ఇట్లనెను. 1

మూ. అయోధ్యాధిపతిః శూరః పూర్వమాసీన్నరాధిపః,
సగరో నామ ధర్మాత్మా ప్రజాకామస్స చాప్రజః. 2

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, అయోధ్యాధిపతిః = అయోధ్యకు అధిపతియు, శూరః=శూరుడును, ధర్మాత్మా=ధర్మాత్ముడును అగు, సగరో నామ=సగరుడను పేరు గల, నరాధిపః = రాజు, ఆసీత్ = ఉండెను. సః = అతడు, అప్రజః = సంతానము లేనివాడై, ప్రజాకామః=సంతానమునందు కోరిక గలవాడై ఉండెను.

తా. పూర్వము అయోధ్యాధిపతియు, శూరుడును, ధర్మాత్ముడును అగు సగరుడను రాజు ఉండెను. సంతానము కలుగకపోవుటచే అతడు సంతానమును కోరుచుండెను. 2

మూ. వైదర్భదుహితా రామ కేశినీ నామ నామతః,
జ్యేష్ఠా సగరపత్నీ సా ధర్మిష్ఠా సత్యవాదినీ. 3

ప్ర. అ. రామ = రామా! వైదర్భదుహితా = విదర్భదేశరాజుయొక్క కుమార్తెయు, నామతః=పేరువలన, కేశినీ నామ=కేశిని యను ప్రసిద్ధి కలదియు

అగు ఒక ఉత్తమురాలు, జ్యేష్ఠా=పెద్ద దైన, సగరపత్నిగా ఉండెను. సా=ఆమె, ధర్మిష్ఠా = చాల ధార్మికురాలు, సత్యవాదినీ = సత్యమే పలుకునది.

తా. రామా! విదర్భాధీశుని కూతు రగు కేశిని సగరుని పెద్ద భార్య. ఆమె మిక్కిలి ధార్మికురాలు. సత్యమునే పలికెడిది. 3

మూ. అరిష్టనేమేర్దుహితా రూపేణాప్రతిమా భువి,
ద్వితీయా సగరస్యాసీత్పత్నీ సుమతిసంజ్ఞికా. 4

ప్ర. అ. అరిష్టనేమేః = అరిష్టనేమియొక్క, దుహితా = కుమార్తెయు, రూపేణ=రూపముచేత, భువి=భూలోకమునందు, అప్రతిమా=సాటి లేనిదియు, అగు, సుమతిసంజ్ఞికా = సుమతి యను పేరు గలది, సగరస్య = సగరుని యొక్క, ద్వితీయా = రెండవ, పత్నీ = భార్యగా, ఆసీత్ = ఆయెను.

తా. అరిష్టనేమి కుమార్తెయు, రూపముచే భూలోకమునందు సాటి లేనిదియు అగు సుమతి సగరుని రెండవ భార్య. 4

మూ. తాభ్యాం స హి తదా రాజా పత్నీభ్యాం తప్తవాం స్తపః,
హిమవన్తం సమాసాద్య భృగుప్రస్రవణే గిరౌ. 5

ప్ర. అ. తదా = అప్పుడు, సః = ఆ, రాజా = రాజు, తాభ్యామ్ = ఆ, పత్నీభ్యామ్ = భార్యలతో, సహితః = కూడినవాడై, హిమవన్తమ్ = హిమవత్పర్వతమును, సమాసాద్య = చేరి, భృగుప్రస్రవణే = భృగుప్రస్రవణ మనెడు, గిరౌ = పర్వతమునందు, తపః తప్తవాన్ = తపస్సు చేసినాడు.

తా. అపు డా రాజు ఆ భార్య లిద్దరితో కలిసి, హిమవత్పర్వతమునకు పోయి, భృగుప్రస్రవణ మనెడు పర్వతమునందు తపస్సు చేసెను. 5

మూ. అథ వర్షశతే పూర్ణే తపసారాధితో మునిః,
సగరాయ వరం ప్రాదాద్భృగుః సత్యవతాం వరః. 6

ప్ర అ. అథ = అటుపిమ్మట, వర్షశతే = నూరు సంవత్సరముల కాలము, పూర్ణే = నిండిన దగుచుండగా, తపసా = తపస్సుచే, ఆరాధితః = సంతోషపెట్ట

బడిన, సత్యవతాం వరః = సత్యవంతులలో శ్రేష్ఠుడైన, భృగుః మునిః = భృగుమహర్షి, నగరాయ=నగరునకు, వరమ్=వరమును, ప్రాదాత్=ఇచ్చెను.

తా. ఇట్లు నూరు సంవత్సరములు గడచినవి. సత్యవంతులలో శ్రేష్ఠుడైన భృగుమహర్షి సగరుని తపస్సునకు సంతోషించి అతనికి వర మిచ్చెను. 6

మూ. అపత్యలాభః సుమహాన్ భవిష్యతి తవానఘ,
కీర్తిం చాప్రతిమాం లోకే ప్రాప్స్యసే పురుషర్షభ. 7

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! తవ = నీకు, సుమహాన్ = చాల గొప్పదైన, అపత్యలాభః = సంతానప్రాప్తి, భవిష్యతి = కాగలదు. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! లోకే = లోకమునందు, అప్రతిమామ్ = సాటి లేని, కీర్తిం చ=కీర్తిని కూడ, ప్రాప్స్యసి = పొందగలవు.

తా. ఓ పుణ్యాత్మా! నీకు అత్యధికసంతానప్రాప్తి కలుగును. లోకములో సాటి లేని కీర్తి కూడ లభించును. 7

మూ. ఏకా జనయితా తాత పుత్రం వంశకరం తవ,
షష్టిం పుత్రసహస్రాణి అపరా జనయిష్యతి. 8

ప్ర. అ. తాత = నాయనా! ఏకా = ఒక భార్య, తవ = నీయొక్క, వంశకరమ్=వంశమును నిలుపు, పుత్రమ్=పుత్రుని, జనయిష్యతి=కనగలదు, అపరా = మరియొకభార్య, షష్టిమ్ = అరువది, పుత్రసహస్రాణి=పుత్రసహస్రములను, జనయిష్యతి = కనగలదు.

తా. నాయనా! ఒక భార్య నీ వంశమును నిలుపు ఒక కుమారుని కనగలదు. మరియొక భార్య అరువదివేలమంది కుమారులను కనగలదు. 8

మూ. భాషమాణం మహాత్మానం రాజపుత్ర్యౌ ప్రసాద్య తమ్,
ఊచతుః పరమప్రీతే కృతాఞ్జలిపుటే తదా. 9

ప్ర. అ. తదా=అప్పుడు, పరమప్రీతే=చాల సంతసించిన, రాజపుత్ర్యౌ= రాజపుత్రికలు, కృతాఞ్జలిపుటే = కట్టబడిన దోసిలి కలవారై, భాషమాణమ్ =

ఆ విధముగ మాటలాడు చున్న, మహాత్మానమ్ = ఆ మహాత్ముని, ప్రసాద్య = అనుగ్రహింపచేసికొని, తమ్ = అతనిని గూర్చి, ఊచతుః = పలికిరి.

తా. అపుడా రాజపుత్రికలు చాల సంతసించి, చేతులు జోడించి, ఆ విధముగ పలికిన ఆ మహాత్ముని అనుగ్రహింపచేసికొని ఇట్లు పలికిరి. 9

మూ. ఏకః కస్యాః సుతో బ్రహ్మన్ కా బహూన్ జనయిష్యతి,
శ్రోతుమిచ్ఛామహే బ్రహ్మన్ సత్యమస్తు వచ స్తవ. 10

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రహ్మర్షీ! కస్యాః = ఎవతెకు, ఏకః = ఒక్క, సుతః = కుమారుడు పుట్టును? కా = ఎవతె, బహూన్ = చాల మందిని, జనయిష్యతి = కనును? బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా! శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము, తవ = నీ యొక్క, వచః = వాక్యము, సత్యమ్ అస్తు = సత్యమగుగాక.

తా. బ్రహ్మర్షీ! మా ఇద్దరిలో ఒక్క కుమారుడు ఎవతెకు కలుగును, చాలమంది ఎవతెకు కలుగుదురు. వినవలె నని కోరుచున్నాము. నీ వాక్యము సత్య మగు గాక. 10

మూ. తయో స్తద్వచనం శ్రుత్వా భృగుః పరమధార్మికః,
ఉవాచ పరమాం వాణీం స్వచ్ఛన్దోఽత్ర విధీయతామ్. 11

ప్ర. అ. పరమధార్మికః = మిక్కిలి ధార్మికు డైన, భృగుః = భృగువు, తయోః = వారియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, పరమామ్ = ఉత్తమ మైన, వాణీమ్ = వాక్కును, ఉవాచ = పలికెను. అత్ర = ఈ విషయమున, స్వచ్ఛన్దః = స్వేచ్ఛ, విధీయతామ్ = చేయబడుగాక.

తా. వారి మాటలు విని పరమధార్మికు డైన ఆ భృగుమహర్షి ఇట్లు పలికెను — "ఈ విషయమున మీరు కోరుకొనుడు". 11

మూ. ఏకో వంశకరో వాస్తు బహవో వా మహాబలాః,
కీర్తిమన్తో మహోత్సాహాః కా వా కం వరమిచ్ఛతి. 12

ప్ర. అ. వంశకరః = వంశమును నిలుపు, ఏకః = ఒక్క పుత్రుడు, అస్తు వా = కలుగవలెనా ? మహాబలాః = గొప్ప బలము కలవారును, కీర్తి మన్తః = కీర్తి కలవారును, మహోత్సాహాః = గొప్ప ఉత్సాహము కలవారును అగు, బహవో వా = చాలమంది కావలెనా ? కా వా = మీలో ఎవరు, కమ్ = ఏ, వరమ్ = వరమును, ఇచ్ఛతి = కోరుచున్నది ?

తా. వంశకరు డైన ఒక్క కుమారుడు కావలెనా, మహాబలవంతులును, కీర్తిమంతులును, మహోత్సాహవంతులును అగు చాలమంది పుత్రులు కావలెనా ? మీలో ఎవరికి ఏ వరము కావలెను ? 12

మూ. మునేస్తు వచనం శ్రుత్వా కేశినీ రఘునన్దన,
పుత్రం వంశకరం రామ జగ్రాహ నృపసన్నిధౌ. 13

ప్ర. అ. రఘునన్దన = రఘువంశీయులను ఆనందింపచేయువాడా, రామ = రామా ! మునేః = మునియొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, కేశినీ = కేశిని, వంశకరమ్ = వంశమును నిలబెట్టువాడైన, పుత్రమ్ = పుత్రుని, నృప సన్నిధౌ = రాజుయొక్క సంనిధియందు, జగ్రాహ = గ్రహించెను.

తా. ఓ రఘునందనా ! రామా ! కేశిని, ముని వాక్యమును విని, రాజు సన్నిధిలో, "నాకు వంశకరు డగు పుత్రుడు కావలెను" అని కోరుకొనెను. 13

మూ షష్టిం పుత్రసహస్రాణి సుపర్ణభగినీ తదా,
మహోత్సాహాన్ కీర్తిమతో జగ్రాహ సుమతిః సుతాన్. 14

ప్ర. అ. తదా = అప్పుడు, సుపర్ణభగినీ = గరుత్మంతుని సోదరి యైన, సుమతిః = సుమతి, మహోత్సాహాన్ = గొప్ప ఉత్సాహము కలవారును, కీర్తి మతః = కీర్తి కలవారును అగు, షష్టిమ్ = అరువది, పుత్రసహస్రాణి = పుత్రుల సహస్రములను, సుతాన్ = తన కుమారులనుగా, జగ్రాహ = గ్రహించెను.

తా. అపుడు, గరుత్మంతుని సోదరి యగు సుమతి మహోత్సాహవంతులును, కీర్తిమంతులును అగు అరువది వేలమంది పుత్రులను కోరెను. 14

మూ. ప్రదక్షిణమృషిం కృత్వా శిరసాభిప్రణమ్య చ,
జగామ స్వపురం రాజా సభార్యో రఘునన్దన. 15

ప్ర. అ. రఘునన్దన = రామా ! సభార్యః=భార్యాసహితు డగు, రాజా= రాజు, ఋషిమ్ = ఋషిని, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, శిరసా = శిరస్సుచేత, అభిప్రణమ్య = నమస్కరించి, స్వపురమ్ = తన పురమునుగూర్చి, జగామ = వెళ్లెను.

తా. రామా ! భార్యాసమేతు డైన నగరచక్రవర్తి, ఋషికి ప్రదక్షిణనమస్కారములు చేసి తన పురమునకు వెళ్లెను. 15

మూ. అథ కాలే గతే తస్మిన్ జ్యేష్ఠా పుత్రం వ్యజాయత,
అసమంజ ఇతి ఖ్యాతం కేశినీ సగరాత్మజమ్. 16

ప్ర. అ. అథ = పిమ్మట, తస్మిన్ కాలే గతే = కొంత కాలము గడచిన పిమ్మట, జ్యేష్ఠా = జ్యేష్ఠ భార్య యైన, కేశినీ = కేశిని, సగరాత్మజమ్ = సగరుని కుమారు డైన, అసమంజ ఇతి = అసమంజుడు అని, ఖ్యాతమ్ = ప్రసిద్ధు డైన, పుత్రమ్ = పుత్రుని, వ్యజాయత = కనెను.

తా. కొంతకాలము గడచిన పిమ్మట, జ్యేష్ఠభార్య యైన కేశిని యందు, నగరచక్రవర్తికి అసమంజు డను పేరు గల పుత్రుడు కలిగెను. 16

మూ. సుమతిస్తు నరవ్యాఘ్ర గర్భతుమ్బం వ్యజాయత,
షష్టిః పుత్రసహస్రాణి తుమ్బభేదాద్వినిఃసృతాః. 17

ప్ర. అ. నరవ్యాఘ్ర = ఓ నరశ్రేష్ఠా ! సుమతిస్తు = సుమతియైతే, గర్భతుమ్బమ్ = సొరకాయ వంటి గర్భపిండమును, వ్యజాయత = కనెను. తుమ్బభేదాత్ = ఆ సొరకాయ వంటి గర్భపిండము పగులుటవలన, షష్టిః = అరువది, పుత్రసహస్రాణి = పుత్రసహస్రములు, వినిస్సృతాః = బైటకువచ్చినవి.

తా. రామా ! సుమతి సొరకాయ వంటి గర్భపిండమును కనెను. ఆ గర్భపిండము పగులగా అరువది వేలమంది పుత్రులు బైటకు వచ్చిరి. 17

మూ. ఘృతపూర్ణేషు కుమ్భేషు ధాత్ర్యస్తాన్సమవర్ధయన్,
కాలేన మహతా సర్వే యౌవనం ప్రతిపేదిరే. 18

ప్ర. అ. ధాత్ర్యః = పెంపుడు తల్లులు, తాన్ = వారిని, ఘృతపూర్ణేషు = నేతితో నిండిన, పాత్రేషు = పాత్రలయందు, సమవర్ధయన్ = వృద్ధి పొందించిరి. సర్వే = వారందరును, మహతా కాలేన = చాల కాలమునకు, యౌవనమ్ = యౌవనమును, ప్రతిపేదిరే = పొందిరి.

తా. పెంపుడు తల్లులు వారిని నేతితో నింపిన పాత్రలలో ఉంచి పెంచిరి. చాల కాలమునకు వారు యౌవనవంతు లయిరి. 18

మూ. అథ దీర్ఘేణ కాలేన రూపయౌవనశాలినః,
షష్టిః పుత్రసహస్రాణి సగరస్యాభవం స్తదా. 19

ప్ర. అ. అథ = పిమ్మట, దీర్ఘేణ కాలేన = చాలకాలముచేత, సగరస్య = సగరునియొక్క, షష్టిః పుత్రసహస్రాణి = అరువది వేలమంది పుత్రులును, తదా = అప్పుడు, రూపయౌవనశాలినః = రూపయౌవనములతో ప్రకాశించుచున్న వారుగా, అభవన్ = అయిరి.

తా. సగరుని అరువది వేలమంది కుమారులును దీర్ఘకాలమునకు రూపయౌవనములతో ప్రకాశించుచు పెరిగిరి. 19

మూ. స చ జ్యేష్ఠో నరశ్రేష్ఠ సగరస్యాత్మసంభవః,
బాలాన్ గృహీత్వా తు జలే సరయ్వా రఘునన్దన, 20
ప్రక్షిప్య ప్రహసన్నిత్యం మజ్జతస్తాన్ సమీక్ష్య వై.

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! రఘునన్దన = రామా ! జ్యేష్ఠః = పెద్దవాడైన, సః = ఆ, సగరస్య ఆత్మసంభవః = సగరుని కుమారుడు, నిత్యమ్ = ప్రతిదినము, బాలాన్ = చిన్న పిల్లలను, గృహీత్వా = పట్టుకొని, సరయ్వాః = సరయూనదియొక్క, జలే = జలమునందు, ప్రక్షిప్య = పడవేసి, నిమజ్జతః = మునిగిపోవుచున్న, తాన్ = వాళ్లను, సమీక్ష్య = చూచి, ప్రహసన్ = నవ్వుచు, (ఆనందించుచుండెడివాడు).

తా. నరశ్రేష్ఠా ! రామా ! సగరుని జ్యేష్ఠకుమారుడు ప్రతిదినము, చిన్నపిల్లలను పట్టుకొని, సరయూనదీ జలములోనికి విసరివేసి, వాళ్లు మునకలు కొట్టుచుండగా చూచి ఆనందించుచుండెడి వాడు. 20

మూ. ఏవం పాపసమాచారః సజ్జనప్రతిబాధకః, 21
పౌరాణామహితే యుక్తః పుత్రో నిర్వాసితః పురాత్.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, పాపసమాచారః = పాపప్రవృత్తి కల వాడును, సజ్జనప్రతిబాధకః = సజ్జనులను బాధించువాడును, పౌరాణామ్ = పౌరులయొక్క, అహితే = హితముకాని కార్యమునందు, రతః = ఆసక్తి గల, పుత్రః = పుత్రుడు, పురాత్ = పురమునుండి, నిర్వాసితః = వెడలగొట్టబడెను.

తా. ఈ విధముగ పాపకార్యములు చేయుచు, సజ్జనులను బాధించుచు, పౌరులకు అహితము చేయుటలో ఆసక్తుడైన ఆ పుత్రుని, సగరుడు పట్టణము నుండి వెడలగొట్టెను. 21

మూ. తస్య పుత్రోంఽశుమాన్నామ అసమంజస్య వీర్యవాన్, 22
సంమతః సర్వలోకస్య సర్వస్యాపి ప్రియంవదః.

ప్ర. అ. తస్య = ఆ, అసమంజస్య = అసమంజుని యొక్క, పుత్రః = పుత్రుడును, వీర్యవాన్ = పరాక్రమవంతుడును అగు, అంశుమాన్ నామ = అంశుమంతుడు అనునతడు, సర్వలోకస్య = సమస్తలోకమునకును, సంమతః = ఇష్టుడు. సర్వస్యాపి = అందరికిని, ప్రియంవదః = ప్రియము మాటలాడువాడు.

తా. ఆ అసమంజుని కుమారుడు అంశుమంతుడు. అతడు పరాక్రమము కలవాడు. సకలలోకమునకును ఇష్టుడు. అందరితోను ప్రియముగా మాటలాడు వాడు. 22

మూ. తతః కాలేన మహతా మతిః సమభిజాయత, 23
సగరస్య నరశ్రేష్ఠ యజేయమితి నిశ్చితా.

ప్ర. అ. నరశ్రేష్ఠ = ఓ రామా ! తతః = పిమ్మట, మహతా కాలేన = చాల కాలము చేత, సగరస్య = సగరునకు, యజేయమ్ ఇతి = యాగము చేయుదును అని, నిశ్చితా = నిశ్చితమైన, మతిః = బుద్ధి, సమభిజాయత = పుట్టినది.

తా. పురుషశ్రేష్ఠా ! పిమ్మట చాలకాలమునకు, సగరునకు యజ్ఞము చేయవలె నని ఆలోచన కలిగెను. 23

మూ. స కృత్వా నిశ్చయం రామ సోపాధ్యాయగణ స్తదా, 24
యజ్ఞకర్మణి వేదజ్ఞో యష్టుం సముపచక్రమే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టత్రింశః సర్గః.

ప్ర. అ. రామ = రామా! తదా = అపుడు, వేదజ్ఞః = వేదముల నెరిగిన, సః = ఆతడు, సోపాధ్యాయగణః = ఉపాధ్యాయసహితుడై, యజ్ఞకర్మణి = యజ్ఞానుష్ఠానము విషయమున, నిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, యష్టుమ్ = యాగము చేయుటకు, సముపచక్రమే = ఉపక్రమించెను.

తా. రామా! అపుడు వేదజ్ఞు డైన ఆ సగరుడు ఉపాధ్యాయులతో కూడ యజ్ఞానుష్ఠానము విషయమున నిశ్చయించుకొని యాగము చేయ ప్రారంభించెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో
ముప్పది యెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనచత్వారింశః సర్గః

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా కథాన్తే రఘునన్దనః,
ఉవాచ పరమప్రీతో మునిం దీప్తమివానలమ్. 1

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, విశ్వామిత్రవచః = విశ్వామిత్రుని వాక్యమును, శ్రుత్వా = విని, పరమప్రీతః = చాల సంతసించినవాడై, కథాన్తే = కథయొక్క అంతమునందు, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, అనలమివ = అగ్ని వలె ఉన్న, మునిమ్ = విశ్వామిత్రుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు విశ్వామిత్రుని వచనమును విని, చాల సంతసించి, కథాంతమున, ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న అతనితో ఇట్లనెను. 1

మూ. శ్రోతుమిచ్ఛామి భద్రం తే విస్తరేణ కథామిమామ్,
పూర్వకో మే కథం బ్రహ్మన్ యజ్ఞం వై సముపాహరత్. 2

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఇమామ్ = ఈ, కథామ్ = కథను, విస్తరేణ = సవిస్తరముగ, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. మే = నా యొక్క, పూర్వకః = పూర్వీకుడు, యజ్ఞమ్ = యజ్ఞమును, కథమ్ = ఎట్లు, సముపాహరత్ = చేసెను?

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! మా పూర్వపురుషుడైన సగరచక్రవర్తి యజ్ఞము ఎట్లు చేసెనో సవిస్తరముగా విన గోరుచున్నాను. 2

మూ. విశ్వామిత్రస్తు కాకుత్స్థముమువాచ ప్రహసన్నివ,
శ్రూయతాం విస్తరో రామ సగరస్య మహాత్మనః. 3

ప్ర. అ. విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుడు, ప్రహసన్నివ = నవ్వుచు, కాకుత్స్థమ్ = రామునిగూర్చి, ఉవాచ = పలికెను, మహాత్మనః = మహాత్ముడైన,

నగరస్య = నగరునియొక్క, విస్తరః = కథావిస్తరము, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వి రామునితో ఇట్లు పలికెను. రామా! మహాత్ముడైన నగరుని కథావిస్తరమును చెప్పెదను, వినుము.

మూ. శఙ్కరశ్వశురో నామ హిమవానచలోత్తమః,
విన్ధ్యపర్వతమాసాద్య నిరీక్షేతే పరస్పరమ్. 4

ప్ర. అ. శంకరశ్వశురః = శివుని మామగారైన, హిమవాన్నామ = హిమవంతు డను పేరుగల, అచలోత్తమః = పర్వతశ్రేష్ఠము, విన్ధ్యపర్వతమ్= వింధ్యపర్వతమును, ఆసాద్య = పొంది ఉన్నది. ఆ రెండు పర్వతములును, పరస్పరమ్ = పరస్పరము, నిరీక్షేతే = చూచుకొనుచున్నవి.

తా. మహేశ్వరుని మామగారైన హిమవత్పర్వత మను పర్వతశ్రేష్ఠము వింధ్యపర్వతమును చూపుల ద్వారా పొంది ఉన్నది. అట్లే వింధ్యము దానిని పొంది యున్నది. ఆ రెండు పర్వతములును, పరస్పరము చూచుకొనుచుండును.

వి. హిమవద్వింధ్యపర్వతముల నడుమ మరే పర్వతమును అడ్డు లేక పోవుటచేతను, ఆ రెండును చాల ఎత్తైన వగుటచేతను హిమవత్పర్వతము వింధ్య పర్వతమును పొంది, వింధ్యము హిమవత్పర్వతమును పొంది ఉన్న దనియు, ఆ రెండును ఒకదాని నొకటి చూచుచు నిలబడి ఉన్న వనియు చెప్పబడిన దని వ్యాఖ్యాతలు. 4

మూ. తయోర్మధ్యే ప్రవృత్తోఽభూద్యజ్ఞ స్స పురుషోత్తమ,
స హి దేశో నరవ్యాఘ్ర ప్రశస్తో యజ్ఞకర్మణి. 5

ప్ర. అ. పురుషోత్తమ = ఓ పురుషశ్రేష్ఠుడా! సః = ఆ, యజ్ఞః = యజ్ఞము, తయోః= ఆ హిమవద్వింధ్యముల, మధ్యే=మధ్యయందు, ప్రవృత్తః= జరిగినది. నరవ్యాఘ్ర = నరశ్రేష్ఠుడా! సః = ఆ, దేశః = దేశము, యజ్ఞకర్మణి = యజ్ఞకర్మయందు, ప్రశస్తః హి = ప్రశస్త మైనది కదా?

తా. రామా! అ యజ్ఞము ఆ రెండు పర్వతముల మధ్య నున్న దేశము

నందు జరిగినది. ఏల నన, యజ్ఞము చేయుటకు ఆ దేశము చాల ప్రశస్త మైనది. 5

మూ. తస్యాశ్వచర్యాం కాకుత్స్థ దృఢధన్వా మహారథః,
అంశుమానకరోత్తాత సగరస్య మతే స్థితః. 6

ప్ర. అ. తాత = తండ్రీ ! కాకుత్స్థ = రామా ! దృఢధన్వా = దృఢ మైన ధనస్సు కలవాడును, మహారథః = మహారథుడును అగు, అంశుమాన్ = అంశుమంతుడు, సగరస్య = సగరునియొక్క, మతే = మతమునందు, స్థితః = ఉన్నవాడై, తస్య = ఆ యజ్ఞముయొక్క, అశ్వచర్యామ్ = అశ్వముయొక్క అనుసరణమును, అకరోత్ = చేసెను.

తా. రామా ! దృఢ మైన ధనస్సు కలవాడును, మహారథుడును అగు అంశుమంతుడు, సగరుని ఆజ్ఞ ప్రకారము యజ్ఞాశ్వమును రక్షించుచు దాని ననుసరించెను. 6

మూ. తస్య పర్వణి తం యజ్ఞం యజమానస్య వాసవః,
రాక్షసీం తనుమాస్థాయ యజ్ఞీయాశ్వమపాహరత్. 7

ప్ర. అ. వాసవః = ఇంద్రుడు, రాక్షసీమ్ = రాక్షససంబంధ మైన, తనుమ్ = శరీరమును, ఆస్థాయ = గ్రహించి, పర్వణి = ఉక్థ్యదివసమునందు, యజ్ఞం యజమానస్య = యజ్ఞము చేయుచున్న, తస్య = సగరునియొక్క, యజ్ఞీయాశ్వమ్ = యజ్ఞమునకు సంబంధించిన అశ్వమును, అపాహరత్ = అపహరించెను.

తా. దేవేంద్రుడు రాక్షసరూపమును ధరించి, ఉక్థ్యదివస మనుపర్వము నందు, సగరుని యజ్ఞాశ్వమును అపహరించెను. 7

మూ. హ్రియమాణే తు కాకుత్స్థ తస్మిన్నశ్వే మహాత్మనః,
ఉపాధ్యాయగణాః సర్వే యజమానమథాబ్రువన్. 8

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! మహాత్మనః = మహాత్ము డైన ఆ సగరుని యొక్క, తస్మిన్ అశ్వే = ఆ అశ్వము, హ్రియమాణే = హరింపబడుచుండగా,

అథ = పిమ్మట, సర్వే = సమస్తమైన, ఉపాధ్యాయగణాః = ఋత్విక్కులు, యజమానమ్ = యజమానుని గూర్చి, అబ్రువన్ = పలికిరి.

తా. రామా! మహాత్ముడైన సగరుని యజ్ఞీయాశ్వము అపహరింపబడు చుండగా ఋత్విక్కు లందరును యజమానునితో ఇట్లనిరి.

మూ. అయం పర్వణి వేగేన యజ్ఞీయాశ్వోఽపనీయతే,
హర్తారం జహి కాకుత్స్థ హయశ్చైవోపనీయతామ్. 9

ప్ర. అ. కాకుత్స్థ=ఓ సగరచక్రవర్తీ! పర్వణి=ఉక్థ్యాహపర్వమునందు, అయమ్ = ఈ, యజ్ఞీయాశ్వః = యజ్ఞాశ్వము, వేగేన = వేగముచేత, అవనీయతే = తీసికొనిపోబడుచున్నది. హర్తారమ్ = అనహరించువానిని, జహి=చంపుము. హయశ్చ=అశ్వము, ఉపనీయతామ్=తీసికొనిరాబడుగాక.

తా. సగరచక్రవర్తీ! పర్వమునందు ఈ యజ్ఞాశ్వమును ఎవ్వరో వేగముగ అపహరించి తీసికొనిపోవుచున్నారు. ఆపహరించువానిని సంహరించి యజ్ఞాశ్వమును తీసికొనిరమ్ము. 9

మూ. యజ్ఞచ్ఛిద్రం భవత్యేతత్సర్వేషామశివాయ నః,
తత్తథా క్రియతాం రాజన్ యథాఽచ్ఛిద్రః క్రతుర్భవేత్. 10

ప్ర. అ. ఏతత్ = ఈ, యజ్ఞచ్ఛిద్రమ్ = యజ్ఞాపరాధము, నః = మనకు, సర్వేషామ్ = అందరికిని, అశివాయ = అమంగళకరము, భవేత్ = అగును. తత్ = ఆకారణమువలన, రాజన్ = రాజా! క్రతుః = ఈక్రతువు, అచ్ఛిద్రః= అపరాధరహితమై, యథా = ఎట్లు, భవేత్ = అగునో, తథా = ఆప్రకారము, క్రియతామ్ = చేయబడుగాక.

తా. రాజా! ఈ యజ్ఞాపరాధము మన అందరికిని అమంగళకరము. అందువలన యజ్ఞములో అపచారము కలుగకుండు నట్లు చేయుము. 10

మూ. ఉపాధ్యాయవచః శ్రుత్వా తస్మిన్ సదసి పార్థివః,
షష్టిం పుత్రసహస్రాణి వాక్యమేతదువాచ హ. 11

ప్ర. అ. పార్థివః=ఆ రాజు, ఉపాధ్యాయవచః=ఋత్విక్కుల వాక్యమును, శ్రుత్వా=విని, తస్మిన్ సదసి = ఆ యజ్ఞసదస్సునందు, షష్టిం = అరువది, పుత్రసహస్రాణి = పుత్రుల సహస్రములను, ఏతత్ వాక్యమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. సగరుడు ఋత్విక్కుల వాక్యములు విని, ఆ యజ్ఞసదస్సులో, అరువదివేలమంది కుమారులతో ఇట్లనెను. 11

మూ. గతిం పుత్రా న పశ్యామి రక్షసాం పురుషర్షభాః,
మన్త్రపూతైర్మహాభాగైరాస్థితో హి మహాక్రతుః. 12

ప్ర.అ. పురుషర్షభాః = పురుషశ్రేష్ఠులైన, పుత్రాః = పుత్రులారా, రక్షసామ్ = రాక్షసులకు, గతిమ్ = ఇచట ప్రవేశమును, న పశ్యామి=చూడను. హి = ఏలననగా, మహాక్రతుః=ఈ మహాయజ్ఞము, మన్త్రపూతైః=మంత్రములచే పవిత్రులైన, మహాభాగైః = మహాత్ములచేత, ఆస్థితః=అధిష్ఠింపబడినది.

తా. పురుషశ్రేష్ఠులైన పుత్రులారా! ఇచటకు రాక్షసులు రాజాలరని నా విశ్వాసము. ఏలననగా ఈ క్రతువును జరిపించువారు మంత్రములచే పవిత్రులైన మహానుభావులు. 12

మూ. తద్గచ్ఛత విచిన్వధ్వం పుత్రకా భద్రమస్తు వః,
సముద్రమాలినీం సర్వాం పృథివీమనుగచ్ఛత. 13

ప్ర. అ. పుత్రకాః=కుమారులారా, తత్=ఆకారణము వలన, గచ్ఛత= వెళ్ళుడు. వః = మీకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక. సముద్ర మాలినీమ్=సముద్రము లనెడు మాల గల, సర్వామ్=సమస్తమైన, పృథివీమ్= భూమిని, అనుగచ్ఛత = వెదకుడు.

తా. పుత్రులారా! మీకు మంగళ మగుగాక. మీరందరును బయలుదేరుడు. సముద్రములచే చుట్టబడి యున్న భూమి నంతను వెదకుడు. 13

మూ. ఏకైకయోజనం పుత్రా విస్తారమధిగచ్ఛత,
యావత్తురగసన్దర్శస్తావత్ఖనత మేదినీమ్. 14
తం చైవ హయహర్తారం మార్గమాణా మమాజ్ఞయా.

ప్ర. అ. పుత్రాః = పుత్రులారా ! ఏకైకయోజనమ్ = ఒక్కొక్క యోజనము చొప్పున, విస్తారమ్=భూవైశాల్యమును, అధిగచ్ఛత=తీసికొనుడు. మమ = నాయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, తమ్ = ఆ, హయహర్తారమ్ = అశ్వమును హరించినవానిని, మార్గమాణాః = అన్వేషించుచున్నవారై, తురగ సందర్శః = అశ్వముయొక్క దర్శనము, యావత్ = ఎప్పటికి అగునో, తావత్ = అంతవరకును, మేదినీమ్ = భూమిని, ఖనత = త్రవ్వుడు.

తా. పుత్రులారా ! మీరు ఒక్కొక్కరు ఒక్కొక్క యోజనము చొప్పున భూమియొక్క విస్తారమును పంచుకొని, అశ్వమును హరించినవానిని వెదకుచు, గుఱ్ఱము కనబడు నంతవరకును భూమిని త్రవ్వుడు. ఇది నా యాజ్ఞ. 14

మూ. దీక్షితః పౌత్రసహితః సోపాధ్యాయగణో హ్యహమ్, 15
ఇహ స్థాస్యామి భద్రం వో యావత్తురగదర్శనమ్.

ప్ర. అ. దీక్షితః = దీక్ష వహించిన, అహమ్ = నేను, పౌత్రసహితః= పౌత్రునితో కూడినవాడనై, సోపాధ్యాయగణః=ఋత్విగ్గణముతో కూడినవాడనై, యావత్తురగదర్శనమ్ = గుఱ్ఱము కనబడు నంతవరకును, ఇహ = ఇచ్చటనే, స్థాస్యామి = ఉండగలను. వః = మీకు, భద్రమ్ = క్షేమ మగుగాక.

తా. గుఱ్ఱము కనబడువరకును, దీక్ష వహించిన నేను, ఋత్విక్కులును, పౌత్రుడును ఇచటనే ఉండగలము. 15

మూ. ఇత్యుక్తా హృష్టమనసో రాజపుత్రా మహాబలాః, 16
జగ్ముర్మహీతలం రామ పితుర్వచనయన్త్రితాః.

ప్ర. అ. రామ = రామా ! ఇతి = ఈ విధముగా, ఉక్తాః = పలకబడిన, మహాబలాః = మహాబలవంతులైన, రాజపుత్రాః = రాజపుత్రులు, హృష్ట

మనసః = సంతసించిన మనస్సు కలవారై, పితుః = తండ్రియొక్క, వచనయన్త్రితాః=వాక్కుచే నియమితులై, మహీతలమ్=భూతలమును గూర్చి, జగ్ముః = వెళ్లిరి.

తా. సగరుడు ఇట్లు పలుకగనే మహాబలశాలు లగు ఆ రాజపుత్రులు ఉత్సాహవంతులై, తండ్రి ఆజ్ఞ ప్రకారము భూమి నంతను వెదకుటకు వెళ్లిరి. 16

మూ. యోజనాయామవిస్తారమేకైకో ధరణీతలమ్, 17
బిభిదుః పురుషవ్యాఘ్ర వజ్రస్పర్శసమైర్నఖైః.

ప్ర. అ. పురుషవ్యాఘ్ర=ఓ పురుషశ్రేష్ఠుడా! ఏకైకః = ఒక్కొక్కడు, యోజనాయామవిస్తారమ్ = ఒక యోజనము పొడవు ఒక యోజనము వెడల్పు గల, ధరణీతలమ్ = భూప్రదేశమును, వజ్రస్పర్శసమైః = వజ్రముయొక్క స్పర్శతో సమానమైన, నఖైః = గోళ్లతో, బిభిదుః = బ్రద్దలు కొట్టిరి.

తా. రామా! ఒక్కొక్కడు ఒక నలుచదరపు యోజనము చొప్పున భూప్రదేశమును వజ్రము వంటి సారము గల నఖములతో బ్రద్దలుగొట్టిరి. 17

మూ. శూలైరశనికల్పైశ్చ హలైశ్చాపి సుదారుణైః, 18
భిద్యమానా వసుమతీ ననాద రఘునన్దన.

ప్ర. అ. రఘునన్దన = రామా! అశనికల్పైః=వజ్రాయుధముతో సమానమైన, శూలైః = శూలములతోడను, సుదారుణైః = చాల భయంకర మైన, హలైశ్చ = నాగళ్లతోడను, భిద్యమానా = భేదింపబడుచున్న, వసుమతీ = భూమి, ననాద = ధ్వనిచేసెను.

తా. వారీవిధముగ వజ్రముల వంటి శూలములచేతను, భయంకర మైన నాగళ్ల చేతను భూమిని భేదించుచుండగా గొప్ప ధ్వని బయలుదేరెను. 18

మూ. నాగానాం మథ్యమానానామసురాణాం చ రాఘవ, 19
రాక్షసానాం చ దుర్ధర్షః సత్త్వానాం నినదోఽభవత్.

ప్ర. అ. రాఘవ = రామా! మథ్యమానానామ్ = నలగగొట్టబడుచున్న, నాగానామ్ = సర్పములయొక్క, అసురాణాం చ = అసురులయొక్కయు, రాక్ష

సానాం చ=రాక్షసులయొక్కయు, సత్త్వానామ్ = ఇతరజంతువుల యొక్కయు, దుర్ధర్షః = సహింపరాని, నినదః = ధ్వని, అభవత్ = ఆయెను.

తా. రామా! వారు భూమిని త్రవ్వుచుండగా ఎన్నియో సర్పములు, అసురులు, రాక్షసులు, ఇతరజంతువులు నలిగిపోవుటచే సహింపరాని ఆర్తధ్వని బయలుదేరినది. 19

మూ. యోజనానాం సహస్రాణి షష్టిం తు రఘునన్దన, 20
బిభిదుర్ధరణీం వీరా రసాతలమనుత్తమమ్.

ప్ర. అ. రఘునన్దన = రామా! వీరాః = ఆ వీరులు, యోజనానామ్ = యోజనములయొక్క, షష్టిం సహస్రాణి = అరువది వేలు, ధరణీమ్ = భూమిని, అనుత్తమమ్ = గొప్పదైన, రసాతలమ్ = రసాతలమునుగా, బిభిదుః = త్రవ్విరి.

తా. రామా! ఆ వీరులు అరవైవేల యోజనముల భూమి పాతాళమై పోవునట్లుగా త్రవ్విరి. 20

మూ. ఏవం పర్వతసంబాధం జమ్బూద్వీపం నృపాత్మజాః, 21
ఖనన్తో నృపశార్దూల సర్వతః పరిచక్రముః.

ప్ర. అ. నృపశార్దూల = రాజశ్రేష్ఠుడా! నృపాత్మజాః = సగరుని కుమారులు, పర్వతసంబాధమ్ = పర్వతములచేత ఇరుకైన, జమ్బూద్వీపమ్ = జంబూద్వీపమును, ఏవమ్ = ఈ విధముగ, ఖనన్తః = త్రవ్వుచున్నవారై, సర్వతః = అంతటను, పరిచక్రముః = సంచరించిరి.

తా. రామా! సగరుని కుమారులు పర్వతములతో ఇరుకుగా ఉన్న జంబూద్వీపమును ఈ విధముగ త్రవ్వుచు అంతటను సంచరించిరి. 21

మూ. తతో దేవాః సగన్ధర్వాః సాసురాః సహపన్నగాః, 22
సంభ్రాన్తమనసః సర్వే పితామహముపాగమన్.

ప్ర. అ. తతః = పిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, సాసురాః=అసురులతో కూడిన, సహ పన్నగాః=సర్పములతో కూడిన, దేవాః=

దేవతలు, సర్వే = అందరును, సంభ్రాన్తమనసః = కలతచెందిన మనస్సు కల వారై, పితామహమ్=బ్రహ్మదేవుని, ఉపాగమన్ = చేరిరి.

**తా.** పిమ్మట దేవతలు, గంధర్వులు, అసురులు, పన్నగులు అందరును కలతచెంది బ్రహ్మదేవుని వద్దకు వెళ్లిరి. 22

మూ. తే ప్రసాద్య మహాత్మానం విషణ్ణవదనా స్తదా, 23
ఊచుః పరమసంత్రస్తాః పితామహమిదం వచః.

ప్ర. అ. పరమసంత్రస్తాః = మిక్కిలి భయపడిన వారును, విషణ్ణ వదనాః=దిగులు చెందిన ముఖము కలవారును అగు, తే=వారు, మహాత్మానమ్= మహాత్ముడైన, పితామహమ్ = బ్రహ్మదేవుని, ప్రసాద్య = అనుగ్రహింపచేసి కొని, ఇదం వచః = ఈ వాక్యమును, ఊచుః = పలికిరి.

**తా.** మిక్కిలి భయముతో దిగులుచెందిన ముఖములు గల వారందరును మహాత్ముడైన బ్రహ్మదేవుని అనుగ్రహింపచేసికొని ఇట్లు పలికిరి. 23

మూ. భగవన్ పృథివీ సర్వా ఖన్యతే సగరాత్మజైః, 24
బహవశ్చ మహాత్మానో హన్యన్తే తలవాసినః.

ప్ర. అ. భగవన్ = ఓ భగవంతుడా! సర్వా=సమస్తమైన, పృథివీ= భూమి, సగరాత్మజైః = సగరుని కుమారులచేత, ఖన్యతే = త్రవ్వబడుచున్నది. తలవాసినః = పాతాలములో నివసించు, బహవః = చాలమంది, మహాత్మానః= మహాత్ములు, హన్యన్తే=చంపబడుచున్నారు.

**తా.** భగవంతుడా! సగరకుమారులు భూమి నంతను త్రవ్వివేయు చున్నారు. పాతాలములో నివసించు ఎందరో మహాత్ములను చంపివేయు చున్నారు. 24

మూ. అయం యజ్ఞహనోఽస్మాకమనేనాశ్వోఽపనీయతే, 25
ఇతి తే సర్వభూతాని నిఘ్నన్తి సగరాత్మజాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. అయమ్=వీడు, నః=మనయొక్క, యజ్ఞహనః = యజ్ఞమును పాడుచేసినవాడు. అనేన=వీనిచేత, అశ్వః=అశ్వము, అపనీయతే=అపహరింపబడుచున్నది. ఇతి=అని అనుచు, తే సగరాత్మజాః=ఆ సగరకుమారులు, సర్వభూతాని=సమస్త భూతములను, నిఘ్నన్తి=చంపుచున్నారు.

తా. "వీడే మన అశ్వమును అపహరించుచున్నాడు. మన యజ్ఞమును చెరచినవాడు వీడే" అని అనుచు ఆ సగరకుమారులు కనబడిన ప్రతి ఒక్క ప్రాణిని చంపుచున్నారు. 25

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలోని ముప్పది తొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ చత్వారింశః సర్గః

మూ. దేవతానాం వచః శ్రుత్వా భగవాన్వై పితామహః,
ప్రత్యువాచ సుసంతప్తాన్ కృతాన్తబలమోహితాన్. 1

ప్ర. అ. భగవాన్=పూజ్యుడైన, పితామహః = బ్రహ్మదేవుడు, దేవతానామ్=దేవతలయొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, కృతాన్తబల మోహితాన్=దైవముయొక్క బలముచే మోహితులును, సుసంత్రస్తాన్ = చాల భయము చెందినవారును అగు వారిని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. దేవతల వాక్యము విని బ్రహ్మదేవుడు, దైవబలముచేత మోహము చెంది, మిక్కిలి భయపడిన వారితో ఇట్లనెను. 1

మూ. యస్యేయం వసుధా కృత్స్నా వాసుదేవస్య ధీమతః,
కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరామ్. 2
తస్య కోపాగ్నినా దగ్ధా భవిష్యన్తి నృపాత్మజాః.

ప్ర. అ. కృత్స్నా=సమస్తమైన, ఇయం వసుధా=ఈ భూమి, యస్య= ఏ, ధీమతః=ధీమంతుడైన, వాసుదేవస్య= వాసుదేవునకు సంబంధించినదో, ఆ వాసుదేవుడు, కాపిలం రూపమ్=కపిలు డను రూపమును, ఆస్థాయ = ధరించి, అనిశమ్=ఎల్లప్పుడును, ధరామ్ = భూమిని, ధారయతి = ధరించుచున్నాడు. నృపాత్మజాః=సగరుని కుమారులు, తస్య = అతని యొక్క, కోపాగ్నినా = కోపాగ్నిచేత, దగ్ధాః=కాల్చబడినవారు, భవిష్యన్తి=కాగలరు.

తా. ఈ సమస్తభూమియు ఏ వాసుదేవునకు చెందినదో అట్టి వాసుదేవుడు, కపిలావతారము నెత్తి సర్వదా ఈ భూమిని ధరించుచున్నాడు. ఈ సగరకుమారులు ఆ కపిలుని కోపాగ్నిచే భస్మము కాగలరు. 2

మూ. పృథివ్యాశ్చాపి నిర్భేదో దృష్ట ఏవ సనాతనః, 3
సగరస్య చ పుత్రాణాం వినాశోఽదీర్ఘజీవినామ్.

ప్ర. అ. పృథివ్యాః=భూమియొక్క, నిర్భేదః=భేదనము, అదీర్ఘజీవినామ్=అల్పాయుర్దాయవంతులైన, సగరస్య పుత్రాణామ్ = సగరపుత్రుల, వినాశశ్చ=వినాశము, సనాతనః=పురాతనముగా, దృష్ట ఏవ=చూడబడినదే.

తా. ఈ విధముగా భూమి త్రవ్వబడు ననియు, అల్పాయుర్దాయవంతులైన సగరకుమారులు నశించెద రనియు ఏ నాడో నిర్ణయింపబడినది. 3

మూ. పితామహవచః శ్రుత్వా త్రయస్త్రింశదరిందమ, 4
దేవాః పరమసంహృష్టాః పునర్జగ్ముర్యథాగతమ్.

ప్ర. అ. అరిందమ = శత్రువులను సంహరించువాడా ! పితామహవచః= బ్రహ్మదేవుని వాక్యమును, శ్రుత్వా = విని, త్రయస్త్రింశత్ దేవాః = ముప్పది ముగ్గురు దేవతలు, పరమసంహృష్టాః = మిక్కిలి సంతసించినవారై, యథాగతమ్ = వచ్చిన విధముగనే, పునః = మరల, జగ్ముః = వెళ్లిరి.

తా. రామా ! ముప్పదిముగ్గురు దేవతలును, ఇతరులును, బ్రహ్మదేవుని మాటలు విని, చాల సంతోషించి, తమ తమ స్థానములకు వెళ్లిపోయిరి. 4

వి. ఎనమండుగురు వసువులు, పదకొండుగురు రుద్రులు, పండ్రెండుగురు ఆదిత్యులు, ఇద్దరు అశ్వినులు కలిసి ముప్పదిముగ్గురు దేవతలు.

మూ. సగరస్య చ పుత్రాణాం ప్రాదురాసీన్మహాత్మనామ్, 5
పృథివ్యాం భిద్యమానాయాం నిర్ఘాతసమనిస్వనః.

ప్ర. అ. మహాత్మనామ్=మహాత్ములైన, సగరస్య పుత్రాణామ్=సగరుని కుమారులకు, పృథివ్యామ్ = భూమి, భిద్యమానాయామ్ = బ్రద్దలుకొట్టబడుచుండగా, నిర్ఘాతసమనిస్వనః = పిడుగు వంటి ధ్వని, ప్రాదురాసీత్ = పుట్టెను (వినబడెను).

తా. ఈ విధముగ భూమిని బ్రద్దలుకొట్టుచున్నప్పుడు నగరకుమారులకు పిడుగు వంటి ధ్వని, వారి వినాశమును సూచించుచు, వినబడెను.

మూ. తతో భిత్త్వా మహీం సర్వే కృత్వా చాభిప్రదక్షిణమ్, 6
సహితాః సగరాః సర్వే పితరం వాక్యమబ్రువన్.

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వే = అందరును, మహీమ్ = భూమిని, భిత్త్వా = భేదించి, అభిప్రదక్షిణమ్ = ప్రదక్షిణము, కృత్వా = చేసి, సర్వే నగరాః = ఆ నగరకుమారు లందరును, సహితాః = కలసినవారై, పితరమ్= తండ్రిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ సగరకుమారు లందరును భూమిని భేదించి ఒక చుట్టు తిరిగి వచ్చిరి. అశ్వము కనబడలేదు. అంత వారందరును కలిసి తండ్రి వద్దకు పోయి ఇట్లు చెప్పిరి. 6

మూ. పరిక్రాంతా మహీ సర్వా సత్త్వవన్తశ్చ సూదితాః, 7
దేవదానవరక్షాంసి పిశాచోరగకిన్నరాః,
న చ పశ్యామహేఽశ్వం తమశ్వహర్తారమేవ చ, 8
కిం కరిష్యామ భద్రం తే బుద్ధిరత్ర విచార్యతామ్.

ప్ర. అ. సర్వా = సమస్తమైన, మహీ=భూమి, పరిక్రాన్తా=సంచరింపబడినది,సత్త్వవన్తః చ = బలవంతులైన, దేవదానవరక్షాంసి=దేవతలు, దానవులు రాక్షసులు, పిశాచోరగకిన్నరాః = పిశాచములు, ఉరగులు, కిన్నరులు, సూదితాః = చంపబడినారు. అశ్వమ్ = అశ్వమును, అశ్వహర్తారమేవ చ= అశ్వమును అపహరించినవానిని, న పశ్యామహే చ = చూడజాలమైతిమి. కిమ్ = ఏమి, కరిష్యామ = చేయుదుము ? తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. అత్ర = ఈ విషయమున, బుద్ధిః=బుద్ధి, విచార్యతామ్=ఆలోచింపబడుగాక.

తా. భూమండల మంతయు తిరిగితిమి. బలవంతులైన ఎందరో దేవదానవరాక్షసపిశాచోరగకిన్నరులను పరిమార్చితిమి. ఆ గుఱ్ఱముగాని, దాని నపహరించినవాడు గాని కనబడలేదు. ఇపు డేమి చేయవలెనో ఆలోచించి చెప్పుము. నీకు భద్ర మగుగాక. 7, 8

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా పుత్రాణాం రాజసత్తమః, 9
సమన్యురబ్రవీద్వాక్యం సగరో రఘునన్దన.

ప్ర. అ. రఘునన్దన = రామా ! తేషామ్ = ఆ, పుత్రాణామ్ = పుత్రుల యొక్క, తద్వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, రాజసత్తమః = ఆ

రాజశ్రేష్ఠుడైన, సగరః = సగరుడు, సమన్యుః = కోపముతో కూడినవాడై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రామా ! పుత్రుల మాటలు విని, రాజశ్రేష్ఠుడైన సగరుడు కోపముతో కూడినవాడై ఇట్లు పలికెను. 9

మూ. భూయః ఖనత భద్రం వో నిర్భిద్య వసుధాతలమ్, 10
అశ్వహర్తారమాసాద్య కృతార్థాశ్చ నివర్తథ.

ప్ర. అ. వసుధాతలమ్=భూమిని, నిర్భిద్య=భేదించి, భూయః=మరల, ఖనత = త్రవ్వుడు. అశ్వహర్తారమ్ = అశ్వమును హరించినవానిని, ఆసాద్య = పొంది, కృతార్థాః = చరితార్థులై, నివర్తథ = మరలి రండు. వః = మీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. మరల త్రవ్వి భూతలమును భేదింపుడు. అశ్వమును హరించినవానిని పట్టుకొని, కార్యము పూర్తియైన పిమ్మటనే తిరిగి రండు. 10

మూ. పితుర్వచనమాసాద్య సగరస్య మహాత్మనః, 11
షష్టిః పుత్రసహస్రాణి రసాతలమభిద్రవన్.

ప్ర. అ. పితుః=తండ్రి యైన, మహాత్మనః=మహాత్ము డైన, సగరస్య=సగరునియొక్క, వచనమ్=వచనమును, ఆసాద్య=పొంది, షష్టిః=అరువది, పుత్రసహస్రాణి = పుత్రుల సహస్రములు, రసాతలమ్ = పాతాలమును గూర్చి, అభిద్రవన్ = శీఘ్రముగ పోయిరి.

తా. తండ్రియైన సగరుని ఆజ్ఞ ననుసరించి ఆ అరువదివేల మంది కుమారులును పాతాళలోకమునకు శీఘ్రముగ పోయిరి. 11

మూ. ఖన్యమానే తత స్తస్మిన్ దదృశుః పర్వతోపమమ్, 12
దిశాగజం విరూపాక్షం ధారయన్తం మహీతలమ్.

ప్ర. అ. తతః = పిమ్మట, తస్మిన్=ఆ ప్రదేశము, ఖన్యమానే=త్రవ్వబడుచుండగా, పర్వతోపమమ్=పర్వతముతో సమాన మైనదియు, మహీతలమ్=

భూతలమును, ధారయన్తమ్ = ధరించుచున్నదియు నగు, విరూపాక్షమ్ = విరూపాక్ష మను పేరు గల, దిశాగజమ్ = దిగ్గజమును, దదృశుః = చూచిరి.

తా. ఆ ప్రదేశమును త్రవ్వుచున్నపుడు వారికి అచట పర్వతమువంటి ప్రమాణము గల విరూపాక్ష మను దిగ్గజము కనబడెను. అది భూతలమును మోయుచుండెను.

మూ. సపర్వతవనాం కృత్స్నాం పృథివీం రఘునన్దన, 13
శిరసా ధారయామాస విరూపాక్షో మహాగజః.

ప్ర. అ. రఘునన్దన = రామా ! విరూపాక్షః = విరూపాక్ష మను పేరు గల, మహాగజః = ఆ మహాగజము, సపర్వతవనామ్ = పర్వతములతోడను వనములతోడను కూడిన, కృత్స్నామ్ = సమస్తమైన, మహీమ్ = భూమిని, శిరసా = శిరస్సుచేత, ధారయామాస = ధరించెను.

తా. రామా ! విరూపాక్ష మనెడు ఆ దిగ్గజము పర్వతవనాదిసహితముగా ఈ భూమి నంతను తన శిరస్సుపై మోయుచుండును. 13

మూ. యదా పర్వణి కాకుత్థ్స విశ్రమార్థం మహాగజః, 14
ఖేదాచ్చాలయతే శీర్షం భూమికంపస్తదా భవేత్.

ప్ర. అ. కాకుత్థ్స = రామా, మహాగజః = ఆ మహాగజము, పర్వణి = పర్వకాలమునందు, యదా = ఎప్పుడు, విశ్రమార్థమ్ = విశ్రాంతికొరకై, ఖేదాత్ = అలసటవలన, శీర్షమ్ = శిరస్సును, చాలయతే = కదల్చునో, తదా = అప్పుడు, భూమికమ్పః = భూకంపము, భవేత్ = అగును.

తా. రామా ! ఆ మహాగజము అలసట కలిగినపుడు అప్పుడప్పుడు, విశ్రాంతికొరకై శిరస్సును కదల్చుచుండును. అపుడు భూకంపము కలుగుచుండును. 14

మూ. తం తే ప్రదక్షిణం కృత్వా దిశాపాలం మహాగజమ్, 15
మానయన్తో హి తే రామ జగ్ముర్భిత్త్వా రసాతలమ్.

ప్ర. అ. రామ = రామా ! తే = వారు, తమ్ = ఆ, దిశాపాలం మహాగజమ్=దిగ్గజమును, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, మానయన్తః= పూజించుచున్నవారై, భిత్త్వా = భూమిని భేదించుకొని, రసాతలమ్ = పాతాలమును గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. రామా ! వారు ఆ దిగ్గజమునకు ప్రదక్షిణము చేసి, పూజించి, భూమిని భేదించుకొనుచు పాతాళమునకు పోయిరి. 15

మూ. తతః పూర్వాం దిశం భిత్త్వా దక్షిణాం బిభిదుః పునః. 16
దక్షిణస్యామపి దిశి దదృశుస్తే మహాగజమ్,
మహాపద్మం మహాత్మానం సుమహత్పర్వతోపమమ్, 17
శిరసా ధారయన్తం తే విస్మయం జగ్మురుత్తమమ్,

ప్ర. అ. తతః = పిమ్మట, పూర్వామ్ = తూర్పుదైన, దిశమ్=దిక్కును, భిత్త్వా = త్రవ్వి, పునః = మరల (పిమ్మట). దక్షిణామ్ = దక్షిణదిక్కును, బిభిదుః = భేదించిరి. తే=వారు, దక్షిణస్యాం దిశ్యపి=దక్షిణదిక్కునందు కూడ, సుమహత్పర్వతోపమమ్=గొప్పపర్వతముతో సమాన మైనదియు, శిరసా=శిరస్సు చేత, ధారయన్తమ్ = భూమిని ధరించుచున్నదియు, మహాత్మానమ్ = పూజ్యమైన స్వభావముకలదియు అగు, మహాపద్మమ్=మహాపద్మ మనే, మహాగజమ్= గొప్ప ఏనుగును, దదృశుః = చూచిరి. తే = వారు, ఉత్తమమ్ = గొప్ప, విస్మయమ్=ఆశ్చర్యమును, జగ్ముః = పొందిరి.

తా. పిమ్మట తూర్పుదిక్కును తరువాత దక్షిణ దిక్కును భేదించిరి. దక్షిణ దిక్కునందు కూడ వారు గొప్ప పర్వతముతో సమాన మైన మహాపద్మ మనెడు మహాగజమును చూచిరి. అది కూడ శిరస్సుపై భూమిని మోయుచుండెను. దానిని జూచి వారు చాల ఆశ్చర్యము చెందిరి. 16, 17

మూ. తతః ప్రదక్షిణం కృత్వా సగరస్య మహాత్మనః, 18
షష్టిః పుత్రసహస్రాణి పశ్చిమాం బిభిదుర్దిశమ్.

ప్ర. అ. తతః = పిమ్మట, మహాత్మనః = మహాత్ముడైన, సగరస్య= సగరుని యొక్క, షష్టిః పుత్రసహస్రాణి = అరవైవేలమంది పుత్రులు, ప్రదక్షిణం

కృత్వా = ప్రదక్షిణము చేసి, పశ్చిమాం దిశమ్ = పశ్చిమదిక్కును, బిభిదుః = భేదించిరి.

తా. పిమ్మట మహాత్ము లైన సగరుని అరువదివేలమంది కుమారులు, ఆ దిగ్గజమునకు ప్రదక్షిణము చేసి, పశ్చిమదిక్కునందు త్రవ్విరి. 18

మూ. పశ్చిమాయామపి దిశి మహాన్తమచలోపమమ్, 19
దిశాగజం సౌమనసం దదృశుస్తే మహాబలాః.

ప్ర. అ. మహాబలాః = గొప్ప బలముగల, తే = వారు, పశ్చిమాయాం దిశ్యపి=పశ్చిమదిక్కునందు గూడ, మహాన్తమ్=గొప్పదియు, అచలోపమమ్= పర్వతముతో సమాన మైనదియు అగు, సౌమనసమ్=సౌమనస మను పేరు గల, దిశాగజమ్ = దిగ్గజమును, దదృశుః = చూచిరి.

తా. మహాబలవంతు లైన ఆ సగరపుత్రులు పశ్చిమదిక్కునందు కూడ పర్వతసమాన మైన సౌమనసమనెడు దిగ్గజమును చూచిరి. 19

మూ. తం తే ప్రదక్షిణం కృత్వా పృష్ట్వా చాపి నిరామయమ్, 20
ఖనన్తః సముపక్రాన్తా దిశం హైమవతీం తతః.

ప్ర. అ. తే = వారు, తమ్=దానిని, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, నిరామయమ్ = ఆరోగ్యమును, పృష్ట్వా = అడిగి, ఖనన్తః = త్రవ్వుచున్నవారై, తతః=అక్కడినుండి, హైమవతీం దిశమ్=ఉత్తరదిక్కును గూర్చి సముపక్రాన్తాః = వెళ్లిరి.

తా. వారు ఆ దిగ్గజమునకు ప్రదక్షిణనమస్కారములు చేసి, కుశలప్రశ్న వేసి, అచటినుండి, భూమిని త్రవ్వుకొనుచు ఉత్తరము వైపు వెళ్లిరి.

మూ. ఉత్తరస్యాం రఘుశ్రేష్ఠ దదృశుర్హిమపాణ్డరమ్, 21
భద్రం భద్రేణ వపుషా ధారయన్తం మహీమిమామ్.

ప్ర. అ. రఘుశ్రేష్ఠ = రామా! ఉత్తరస్యామ్ = ఉత్తరదిక్కునందు, హిమపాణ్డరమ్=మంచు వలె తెల్లగా నున్నదియు, భద్రేణ వపుషా=మంగళకర

మైన శరీరముతో, ఇమామ్ = ఈ, మహీమ్ = భూమిని, ధారయన్తమ్ = ధరించుచున్నదియు అగు, భద్రమ్ = భద్రమనెడు దిగ్గజమును, దదృశుః = చూచిరి.

తా. రామా! ఉత్తరదిక్కునందు, వారు, మంగళకర మైన శరీరముతో ఈ భూమిని మోయుచున్న, మంచువలె తెల్లగా ఉన్న భద్రమనెడు దిగ్గజమును చూచిరి. 21

మూ. సమాలభ్య తతః సర్వే కృత్వా చైనం ప్రదక్షిణమ్, 22
షష్టిః పుత్రసహస్రాణి బిభిదుర్వసుధాతలమ్.

ప్ర. అ. తతః=పిమ్మట, సర్వే=సమస్త మైన, షష్టిః పుత్రసహస్రాణి= సగరుని అరువదివేలమంది పుత్రులు, ఏనమ్ = దీనిని, సమాలభ్య=స్పృశించి, ప్రదక్షిణం చ=ప్రదక్షిణము కూడ, కృత్వా=చేసి, వసుధాతలమ్=భూమిని, బిభిదుః = భేదించిరి.

తా. పిమ్మట ఆ సగరుని అరువదివేలమంది కుమారులును ఆ దిగ్గజమును స్పృశించి, ప్రదక్షిణనమస్కారములు చేసి భూమిని త్రవ్విరి. 22

మూ. తతః ప్రాగుత్తరాం గత్వా సాగరాః ప్రథితాం దిశమ్, 23
రోషాదభ్యఖనన్ సర్వే పృథివీం సగరాత్మజాః.

ప్ర. అ. తతః = పిమ్మట, సాగరాః = సగరకుమారులు, ప్రథితామ్ = ప్రసిద్ధ మైన, ప్రాగుత్తరాం దిశమ్ = ఈశాన్యదిక్కును గూర్చి, గత్వా = వెళ్లి, సర్వే = సమస్త మైన, సగరాత్మజాః=సగరుని కుమారులు, రోషాత్=కోపము వలన, పృథివీమ్ = భూమిని, అభ్యఖనన్ = త్రవ్విరి.

తా. పిమ్మట ఆ సగరకుమారు లందరును ప్రసిద్ధ మైన ఈశాన్యదిక్కునకు వెళ్లి, రోషముతో భూమిని త్రవ్విరి. 23

మూ. తే తు సర్వే మహాత్మానో భీమవేగా మహాబలాః, 24
దదృశుః కపిలం తత్ర వాసుదేవం సనాతనమ్.

హయం చ తస్య దేవస్య చరన్తమవిదూరతః, 25
ప్రహర్షమతులం ప్రాప్తాః సర్వే తే రఘునన్దన.

ప్ర. అ. మహాత్మానః = గొప్ప బుద్ధి గలవారును, భీమవేగాః = భయంకరమైన వేగము గలవారును, మహాబలాః = గొప్ప బలము కలవారునుఅగు, తే సర్వే=వారందరును, తత్ర=అచట, కపిలమ్ = కపిలావతారములో నున్న, సనాతనమ్=పురాణపురుషుడైన, వాసుదేవమ్ = వాసుదేవుని, తస్య దేవస్య = ఆ దేవునకు, అవిదూరతః = సమీపమున, చరన్తమ్ = మేయుచున్న, హయం చ=గుఱ్ఱమును, దదృశుః=చూచిరి. రఘునన్దన=రామా! తే సర్వే=వారందరును, అతులమ్=సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, ప్రాప్తాః = పొందినారు.

తా. రామా ! భయంకరమైన వేగము గొప్ప బలము గల ఆ మహాత్ములు అందరును అచట కపిలరూపములో నున్న సనాతనపురుషుడైన శ్రీమహావిష్ణువును, అతని సమీపమున గడ్డి మేయుచు తిరుగుచున్న అశ్వమును చూచిరి. ఆ అశ్వము కనబడగనే చాల సంతసించిరి. 24, 25

మూ. తే తం హయవరం జ్ఞాత్వా క్రోధపర్యాకులేక్షణాః, 26
ఖనిత్రలాంగలధరా నానావృక్షశిలాధరాః,
అభ్యధావన్త సంక్రుద్ధాస్తిష్ఠ తిష్ఠేతి చాబ్రువన్. 27

ప్ర. అ. తే=వారు, తమ్=ఆ, హయవరమ్=అశ్వశ్రేష్ఠమును, జ్ఞాత్వా=గుర్తించి, క్రోధపర్యాకులేక్షణాః=క్రోధముచే వ్యాకులమైన నేత్రములు కలవారై, ఖనిత్రలాంగలధరాః = గునపములను నాగళ్లను ధరించినవారై, నానావృక్షశిలాధరాః=అనేకవిధములైన వృక్షములను శిలలను ధరించినవారై, సంక్రుద్ధాః=కోపించినవారై, అభ్యధావన్త = అతని మీదికి పరుగెత్తిరి. తిష్ఠ తిష్ఠ = ఆగుము ఆగుము, ఇతి = అని, అబ్రువన్ చ = పలికిరి కూడ.

తా. వారు ఆ గుఱ్ఱమును గుర్తించిరి. వారి కళ్లు కోపముచే ఎఱ్ఱబారినవి. గునపములను, నాగళ్లను, వృక్షములను, శిలలను ధరించి ఆగు మాగుము అని పలుకుచు ఆ కపిలునిమీదికి పరుగెత్తి వెళ్లిరి. 26, 27

మూ. అస్మాకం త్వం హి తురగం యజ్ఞీయం హృతవానసి,
దుర్మేధస్త్వం హి సంప్రాప్తాన్ విద్ధి నః సగరాత్మజాన్. 28

ప్ర. అ. దుర్మేధః = ఓ దుర్బుద్ధీ, త్వమ్ = నీవు, అస్మాకమ్ = మా యొక్క, యజ్ఞీయమ్=యజ్ఞమునకు సంబంధించిన, తురగమ్=తురంగమును, హృతవాన్ అసి=హరించినావు. సంప్రాప్తాన్=ఇచటికి వచ్చిన, నః=మమ్ములను, నగరాత్మజాన్ = నగరుని కుమారులనుగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. దుర్బుద్ధీ! నీవు మా యజ్ఞాశ్వమును హరించినావు. మేము ఎవరను కొంటివి? నగరచక్రవర్తి కుమారులము. 28

మూ. శ్రుత్వా తు వచనం తేషాం కపిలో రఘునన్దన,
రోషేణ మహతావిష్టో హుంకారమకరోత్తదా. 29

ప్ర. అ. రఘునన్దన = రామా! కపిలః = కపిలుడు, తేషామ్ = వారి యొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తదా = అప్పుడు, మహతా= గొప్ప, రోషేణ=రోషముతో, ఆవిష్టః=కూడినవాడై, హుంకారమ్ = హుంకారమును, అకరోత్=చేసెను.

తా. రామా! కపిలుడు వారి మాటలు విని కోపావిష్టుడై హుంకారము చేసెను. 29

మూ. తతస్తేనాప్రమేయేన కపిలేన మహాత్మనా,
భస్మరాశీకృతాః సర్వే కాకుత్స్థ సగరాత్మజాః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
చత్వారింశః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! తతః = పిమ్మట, అప్రమేయేన=ఊహింపరాని ప్రభావము కల, మహాత్మనా=మహాత్ముడైన, తేన కపిలేన = ఆ కపిలుని చేత, సర్వే=సమస్తమైన, సగరాత్మజాః=నగరపుత్రులు, భస్మరాశీకృతాః = భస్మరాశిగా చేయబడినారు.

తా. రామా! అప్రమేయప్రభావశాలి యైన, మహాత్ముడైన ఆ కపిలుడు హుంకరించగనే ఆ నగరపుత్రు లందరును భస్మమై పోయిరి. 30

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
నలుబదియవ సర్గ సమాప్తము.

# అథ ఏకచత్వారింశః సర్గః

మూ. పుత్రాంశ్చిరగతాన్ జ్ఞాత్వా సగరో రఘునన్దన,
నప్తారమబ్రవీద్రాజా దీప్యమానం స్వతేజసా. 1

ప్ర. అ. రఘునన్దన = రామా! సగరః రాజా = సగరచక్రవర్తి, పుత్రాన్=పుత్రులను, చిరగతాన్=చిరకాలము క్రితము వెళ్లినవారినిగా, జ్ఞాత్వా= తెలుసుకొని, స్వతేజసా = సహజ మైన తేజస్సుతో, దీప్యమానమ్ = ప్రజ్వరిల్లు చున్న, నప్తారమ్=పౌత్రుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. రఘునందనా! తన కుమారులు వెళ్లి చాలకాల మైనదని గుర్తించిన సగరచక్రవర్తి సహజతేజస్సుతో ప్రకాశించుచున్న మనుమ డైన అంశుమంతునితో ఇట్లనెను. 1

మూ. శూరశ్చ కృతవిద్యశ్చ పూర్వైస్తుల్యోఽసి తేజసా,
పితౄణాం గతిమన్విచ్ఛ యేన చాశ్వోఽపహారితః. 2

ప్ర. అ. శూరశ్చ=శూరుడవును, కృతవిద్యశ్చ = నేర్వబడిన విద్యలు కలవాడవును అగు నీవు, తేజసా = తేజస్సుచేత, పూర్వైః = పూర్వపురుషులతో, తుల్యః=సమానుడవుగా, అసి=అయి ఉన్నావు. పితౄణామ్ = నీ తండ్రులయొక్క, గతిమ్=మార్గమును, అన్విచ్ఛ = వెదకుము. అశ్వః = అశ్వము, యేన = ఎవనిచేత, అపహారితః=అపహరింపబడినదో, (వాని మార్గమును గూడ వెదకుము).

తా. నీవు శూరుడవు. విద్య లన్నియు నేర్చినవాడవు. తేజస్సుచే పూర్వపురుషులతో సమానుడవు. నీవు వెళ్లి నీ పినతండ్రుల జాడను, అశ్వమును అపహరించినవాని జాడను తెలిసికొని రమ్ము. 2

మూ. అన్తర్భౌమాని సత్త్వాని వీర్యవన్తి మహాన్తి చ,
తేషాం త్వం ప్రతిఘాతార్థం సాస్త్రం గృహ్ణీష్వ కార్ముకమ్. 3

ప్ర. అ. అన్తర్భౌమాని = భూమిలోపలనుండు, సత్త్వాని = ప్రాణులు, వీర్యవన్తి = పరాక్రమముగలవి, మహాన్తి చ = చాల గొప్పవి కూడ. త్వమ్ = నీవు, తేషామ్=వాటియొక్క, ప్రతిఘాతార్థమ్=సంహారముకొరకు, సాస్త్రమ్= అస్త్రములతో కూడిన, కార్ముకమ్ = ధనస్సును, గృహ్ణీష్వ = గ్రహింపుము.

తా. భూమిలోపల నుండు ప్రాణులు పరాక్రమము, మహాప్రమాణము కలవై ఉండును. వాటిని చంపుటకై ధనస్సును, అస్త్రములను తీసికొని వెళ్లుము. 3

మూ. అభివాద్యాభివాద్యాంస్త్వం హత్వా విఘ్నకరానపి,
సిద్ధార్థః సంనివర్తస్వ మమ యజ్ఞస్య పారగః. 4

ప్ర. అ. త్వమ్ = నీవు, అభివాద్యాన్ = నమస్కరింపతగినవారిని, అభివాద్య=నమస్కరించి, విఘ్నకరాన్=విఘ్నము చేయువారిని, హత్వా అపి = చంపి, సిద్ధార్థః సన్=సిద్ధమైన కార్యము కలవాడవై, మమ=నాయొక్క, యజ్ఞస్య= యజ్ఞముయొక్క, పారగః=పారమును పొందిచువాడవై, నివర్తస్వ=తిరిగి రమ్ము.

తా. నీవు నమస్కరింపదగినవారికి నమస్కారము చేయుచు, విఘ్నమును చేసినవారిని చంపుచు, కార్యమును పూర్తి చేసికొని తిరిగి వచ్చి, నా యజ్ఞమును తుదముట్టింపుము. 4

మూ. ఏవముక్తోఽంశుమాన్ సమ్యక్సగరేణ మహాత్మనా,
ధనురాదాయ ఖడ్గం చ జగామ లఘువిక్రమః. 5

ప్ర. అ. అంశుమాన్ = అంశుమంతుడు, మహాత్మనా = మహాత్ముడైన, సగరేణ=సగరునిచేత, ఏవమ్=ఈ విధముగా, సమ్యక్ =బాగుగా, ఉక్తః= పలకబడినవాడై, ధనుః=ధనస్సును, ఖడ్గం చ=ఖడ్గమును, ఆదాయ=గ్రహించి, లఘువిక్రమః = శీఘ్రగమనముకలవాడై, జగామ = వెళ్లెను.

తా. మహాత్ముడైన సగరచక్రవర్తి ఈ విధముగ చక్కగా బోధింపగా, అంశుమంతుడు ధనస్సును ఖడ్గమును గ్రహించి శీఘ్రముగ వెళ్లెను. 5

మూ. స ఖాతం పితృభిర్మార్గమన్తర్భౌమం మహాత్మభిః,
ప్రాపద్యత నరశ్రేష్ఠ తేన రాజ్ఞాభిచోదితః. 6

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! సః=అతడు, రాజ్ఞా=రాజు చేత, అభిచోదితః = ప్రేరేపింపబడినవాడై, మహాత్మభిః = మహాత్ములైన, పితృభిః = తండ్రులచేత, అన్తర్భ్యామమ్ = భూ మిలోపల, ఖాతమ్=త్రవ్వబడిన, మార్గమ్ = మార్గమును, ప్రాపద్యత=పొందెను.

తా. ఓ నరోత్తమా ! సగరునిచే ఆజ్ఞప్తుడై ఆ అంశుమంతుడు భూమిలోపల తన పినతండ్రులు త్రవ్విన మార్గమును అనుసరించి వెళ్లెను. 6

మూ. దైత్యదానవరక్షోభిః పిశాచపతగోరగైః,
పూజ్యమానం మహాతేజా దిశాగజమపశ్యత. 7

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల అతడు, దైత్యదానవరక్షోభిః= దైత్యులచేత, దానవులచేత, రాక్షసులచేత, పిశాచపతగోరగైః=పిశాచములచేత, పక్షులచేత సర్పములచేత, పూజ్యమానమ్ = పూజింపబడుచున్న, దిశాగజమ్ = దిగ్గజమును, అపశ్యత = చూచెను.

తా. మహాతేజఃశాలి యగు అంశుమంతుడు దారిలో దిగ్గజమును చూచెను. దైత్యదానవరక్షఃపిశాచపతగోరగులు దానిని పూజించుచుండిరి. 7

మూ. స తం ప్రదక్షిణం కృత్వా పృష్ట్వా చాపి నిరామయమ్,
పితౄన్ స పరిపప్రచ్ఛ వాజిహర్తారమేవ చ. 8

ప్ర. అ సః=అతడు, తమ్=దానిని, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, నిరామయమ్ = ఆరోగ్యమును, పృష్ట్వా చాపి = అడిగి, సః = అతడు, పితౄన్=తండ్రులను గూర్చియు, వాజిహర్తారమేవ చ=అశ్వమును అపహరించిన వానిని గూర్చియు, పరిపప్రచ్ఛ = ప్రశ్నించెను.

తా. అతడు అ దిగ్గజమునకు ప్రదక్షిణనమస్కారములు చేసి, కుశల ప్రశ్న కూడ వేసి, తన పినతండ్రులను గూర్చియు, అశ్వమును అపహరించిన వానిని గూర్చియు అడిగెను. 8

మూ. దిశాగజస్తు తచ్ఛ్రుత్వా ప్రత్యాహాంశుమతో వచః,
అసమంజ కృతార్థస్త్వం సహాశ్వః శీఘ్రమేష్యసి. 9

ప్ర. అ. దిశాగజస్తు = ఆ దిగ్గజ మైతే, అంశుమతః = అంశుమంతుని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, ప్రత్యాహ = తిరిగి పలికెను. ఆసమంజ = అసమంజుని పుత్రుడా ! త్వమ్ = నీవు, కృతార్థః = కృతార్థుడవై, సహాశ్వః = అశ్వముతో కూడినవాడవై, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఏష్యసి = రాగలవు.

తా. అంశుమంతుని వచనము విని దిగ్గజము— "ఓ అంశుమంతా! నీవు కృతార్థుడవై, అశ్వముతో శీఘ్రముగ తిరిగి రాగలవు" అని చెప్పెను. 9

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సర్వానేవ దిశాగజాన్,
యథాక్రమం యథాన్యాయం ప్రష్టుం సముపచక్రమే. 10

ప్ర. అ. తస్య = దానియొక్క, తత్ వచనమ్ = ఆవాక్యమును, శ్రుత్వా = విని, సర్వానేవ = సమస్త మైన, దిశాగజాన్ = దిగ్గజములను, యథాక్రమమ్ = క్రమానుసారముగా, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ప్రష్టుమ్ = అడుగుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. అంశుమంతుడు ఆ దిగ్గజము మాట విని, మిగిలిన దిగ్గజములను కూడ ఒకదాని తరువాత ఒకదానిని, న్యాయానుసారముగ ప్రశ్నించుటకు ప్రారంభించెను. 10

మూ. తైశ్చ సర్వైర్దిశాపాలైర్వాక్యజ్ఞైర్వాక్యకోవిదైః,
పూజితస్సహయశ్చైవ గన్తాసీత్యభిచోదితః. 11

ప్ర. అ. వాక్యజ్ఞైః = వాక్యములను ఎరిగిన, వాక్యకోవిదైః = వాక్యములందు సమర్థములైన, సర్వైః = సమస్త మైన, తైః దిశాపాలైః = ఆ దిగ్గజముల చేత, పూజితః = పూజింపబడినవాడై, సహయః = అశ్వముతోకూడినవాడవై, గన్తాసి = వెళ్లగలవు, ఇతి = అని, అభిచోదితః = ప్రేరేపింపబడెను.

తా. ఆ దిగ్గజము లన్నియు మాటలలో సారమును గ్రహింపగల్గినవి. ఎట్లు మాటలాడవలెనో బాగుగ తెలిసినవి. అట్టి ఆ దిగ్గజములు అతనిని ఆదరించి, "అశ్వముతో తిరిగి వెళ్లెదవు" అని పలికి ప్రోత్సహించినవి. 11

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా జగామ లఘువిక్రమః,
భస్మరాశీకృతా యత్ర పితరస్తస్య సాగరాః. 12

ప్ర. అ. తేషామ్=వాటియొక్క, తద్వచనమ్=ఆ మాటను, శ్రుత్వా=విని, లఘువిక్రమః=శీఘ్ర మైన గమనము కలవాడై, తస్య=అతనియొక్క, పితరః=తండ్రులైన, సాగరాః=సగరకుమారులు, యత్ర=ఎచట, భస్మరాశీకృతాః=భస్మరాశిగా చేయబడినారో, అచటికి, జగామ=వెళ్లెను.

తా. ఆ దిగ్గజముల మాటలు విని, సగరకుమారు లైన తన పినతండ్రులు భస్మరాశిగా పడి ఉన్న చోటికి శీఘ్రముగా వెళ్లెను. 12

మూ. స దుఃఖవశమాపన్న స్త్వసమంజసుత స్తదా,
చుక్రోశ పరమార్తస్తు వధాత్తేషాం సుదుఃఖితః. 13

ప్ర. అ. తదా=అప్పుడు, సః=ఆ, అసమఞ్జసుతః=అసమంజుని కుమారుడు, దుఃఖవశమ్=దుఃఖమునకు వశత్వమును, ఆపన్నః=పొందినవాడై, పరమార్తః=మిక్కిలి పీడితుడై, తేషామ్=వారియొక్క, వధాత్=వధవలన, సుదుఃఖితః=చాల దుఃఖితుడై, చుక్రోశ=ఏడ్చెను.

తా. అప్పు డా అంశుమంతుడు దుఃఖపరవశుడై, వారు మరణించి నందులకు చాల బాధపడుచు ఏడ్చెను. 13

మూ. యజ్ఞీయం చ హయం తత్ర చర న్తమవిదూరతః,
దదర్శ పురుషవ్యాఘ్రో దుఃఖశోకసమన్వితః. 14

ప్ర. అ. దుఃఖశోకసమన్వితః=దుఃఖశోకములతో కూడిన, పురుషవ్యాఘ్రః=ఆ పురుషశ్రేష్ఠుడు, అవిదూరతః=సమీపమునందు, చరన్తమ్=మేయుచున్న, యజ్ఞీయం హయమ్=యజ్ఞాశ్వమును, దదర్శ=చూచెను.

తా. దుఃఖముతో ఏడ్చుచున్న ఆ అంశుమంతుడు అచట దగ్గరనే మేయుచు తిరుగు చున్న యజ్ఞాశ్వమును చూచెను. 14

మూ. స తేషాం రాజపుత్రాణాం కర్తుకామో జలక్రియామ్,
సలిలార్థీ మహాతేజా న చాపశ్యజ్జలాశయమ్. 15

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = ఆతడు, తేషామ్= ఆ, రాజపుత్రాణామ్ = రాజపుత్రులకు, జలక్రియామ్ = జలతర్పణములను, కర్తుకామః = చేయ కోరిక గలవాడై, సలిలార్థీ = ఉదకమును కోరుచు, జలాశయమ్ = జలస్థానమును, న చ అపశ్యత్ = చూడలేదు.

తా. ఆ అంశుమంతుడు నగరపుత్రులకు జలతర్పణము లివ్వవలె నని తలచెను. ఉదకమునకై అన్వేషింపగా అచట జలాశయ మేదియు కనబడలేదు. 15

మూ. విసార్య నిపుణాం దృష్టిం తతోఽపశ్యత్ఖగాధిపమ్,
పితౄణాం మాతులం రామ సుపర్ణమనిలోపమమ్. 16

ప్ర. అ. రామ = రామా ! తతః = పిమ్మట, నిపుణామ్ = సమర్థ మైన, దృష్టిమ్ = దృష్టిని, విసార్య = ప్రసరింపచేసి, పితౄణామ్ = పినతండ్రుల యొక్క, మాతులం = మేనమామయు, ఖగాధిపమ్=పక్షిరాజును, అనిలోపమమ్=వాయుసమానుడును అగు, సుపర్ణమ్ = గరుత్మంతుని, అపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట అతడు ప్రయత్నపూర్వకముగ దృష్టిని ప్రసరింపచేసి చూడగా, అచట పక్షిరాజు, వాయుసమానుడు, పినతండ్రుల మేనమామయు అయిన గరుత్మంతుడు కనబడెను. 16

మూ. స చైనమబ్రవీద్వాక్యం వైనతేయో మహాబలః,
మా శుచః పురుషవ్యాఘ్ర వధోఽయం లోకసంమతః. 17

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, సః = ఆ, వైనతేయః = గరుత్మంతుడు, ఏనమ్=ఈతనిని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా ! మా శుచః = దుఃఖింపకుము. అయం వధః = ఈ వధ, లోకసంమతః = లోకమునకు ఇష్టమైనదే.

తా. మహాబలశాలి యగు వైనతేయుడు ఇట్లు పలికెను. ఓ అంశుమంతుడా! దుఃఖింపకుము. మీ పినతండ్రుల మరణమునకు లోకు లందరును హర్షించుచున్నారు. 17

మూ. కపిలేనాప్రమేయేన దగ్ధా హీమే మహాబలాః,
సలిలం నార్హసి ప్రాజ్ఞ దాతుమేషాం హి లౌకికమ్. 18

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల, ఇమే=వీరు, అప్రమేయేన= అమేయ మైన ప్రభావము గల, కపిలేన = కపిలునిచేత, దగ్ధాః హి = కాల్చ బడినారుకదా. ప్రాజ్ఞ = ఓ బుద్ధిమంతుడా! లౌకికమ్ = లౌకికమైన, సలిలమ్ = ఉదకమును, దాతుమ్ = ఇచ్చుటకు, నార్హసి = తగవు.

తా. మహాబలవంతు లైన నీ పినతండ్రులను అప్రమేయ మైన ప్రభావము గల కపిలుడు కాల్చి వేసినాడుకదా. ఓ బుద్ధిమంతుడా ! వీరికి లౌకిక మైన ఉదకమును ఇచ్చుట యుక్తము కాదు.

వి. "చణ్డాలాదుదకాత్సర్పాద్వైద్యుతాద్బ్రాహ్మణాదపి,
దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ మరణం పాపకర్మణామ్,
ఉదకం పిణదానం చ ఏతేభ్యో యద్విధీయతే,
నోపతిష్ఠతి తత్సర్వమన్తరిక్షే వినశ్యతి."

(పాపాత్ములకు చండాలుడు, ఉదకము, పిడుగు, బ్రాహ్మణుడు, కోరలుగల జంతువులు, పశువులు, వీటివలన మరణము కలుగును. వారికి చేసిన జలతర్పణ పిండదానాదులు వారికి చెందక ఆకాశమునందే నశించును అని ధర్మశాస్త్రములలో చెప్పిన విధమున వీరు బ్రాహ్మణుని వలన మరణించినవా రగుటచే సాధారణజల తర్పణములు వీరికి ముట్ట వని భావము (గోవిందరాజులు). 18

మూ. గఙ్గా హిమవతో జ్యేష్ఠా దుహితా పురుషర్షభ,
తస్యాం కురు మహాబాహో పితౄణాం తు జలక్రియామ్. 19

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా, హిమవతః = హిమవంతుని యొక్క, జ్యేష్ఠా = పెద్ద కుమార్తె యైన, గఙ్గా = గంగ ఉన్నది. మహాబాహో= గొప్ప బాహువులు కలవాడా ! పితౄణామ్ = పినతండ్రులకు, జలక్రియామ్ = జలతర్పణమును, తస్యామ్ = ఆ గంగయందు, కురు = చేయుము.

తా. ఓ పురుషశ్రేష్ఠా ! హిమవంతుని జ్యేష్ఠపుత్రిక యగు గంగానదిలో నీ పినతండ్రులకు జలతర్పణము లిమ్ము. 19

మూ. భస్మరాశీకృతానేతాన్పావయేల్లోకపావనీ,
తయా క్లిన్నమిదం భస్మ గఙ్గయా లోకకాన్తయా, 20
షష్టిం పుత్రసహస్రాణి స్వర్గలోకం నయిష్యతి,

ప్ర. అ. లోకపావనీ = లోకములను పవిత్రము చేయు ఆ గంగ, రాశీకృతాన్=భస్మరాశిగా చేయబడిన, ఏతాన్ = వీరిని, పావయేత్=పవిత్రింప చేయును. లోకకాన్తయా=లోకమునకు ఇష్టురాలైన, తయా=ఆ, గఙ్గయా=గంగ చేత, క్లిన్నమ్ = తడపబడిన, ఇదం భస్మ=ఈ భస్మ, షష్టిం పుత్రసహస్రాణి = అరవైవేలమంది పుత్రులను, స్వర్గలోకం = స్వర్గలోకమును, నయిష్యతి = పొందించగలదు.

తా. ఆ లోకపావని భస్మరాశులుగా చేయబడిన వీరి నందరిని పవిత్రింప చేయును. లోకమునకు ఇష్టురాలైన ఆ గంగచే తడపబడిన ఈ భస్మము నగరుని అరువదివేలమంది కుమారులను స్వర్గలోకము చేర్చును. 20

మూ. గచ్ఛ చాశ్వం మహాభాగ తం గృహ్య పురుషర్షభ, 21
యజ్ఞం పైతామహం వీర సంవర్తయితుమర్హసి.

ప్ర. అ. మహాభాగ = గొప్ప భాగ్యము కలవాడా! పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! తమ్ = ఆ, అశ్వమ్ = అశ్వమును, గృహ్య = గ్రహించి, గచ్ఛ=వెళ్లుము. వీర=వీరుడా! పైతామహమ్=నీ పితామహుని సంబంధమైన, యజ్ఞమ్=యజ్ఞమును, సంవర్తయితుమ్=జరిగించుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. మహాభాగ్యశాలివైన ఓ పురుషశ్రేష్ఠుడా! ఈ గుఱ్ఱమును తీసికొని వెళ్లి నీ పితామహుడు ప్రారంభించిన యజ్ఞము జరిపింపుము. 21

మూ. సుపర్ణవచనం శ్రుత్వా సోఽంశుమానతివీర్యవాన్, 22
త్వరితం హయమాదాయ పునరాయాన్మహాయశాః.

ప్ర. అ. అతివీర్యవాన్ = మిక్కిలి పరాక్రమముగల, మహాయశాః = గొప్ప కీర్తిగల, సః=ఆ, అంశుమాన్ = అంశుమంతుడు, సుపర్ణవచనమ్ = గరుత్మంతుని వాక్యము, శ్రుత్వా=విని, త్వరితమ్ = శీఘ్రముగా, హయమ్ = గుఱ్ఱమును, ఆదాయ=గ్రహించి, పునః=తిరిగి, ఆయాత్=వచ్చెను.

**తా.** వీర్యవంతుడును, మహాయశశ్శాలియు అగు ఆ అంశుమంతుడు గరుత్మంతుడు చెప్పిన విధమున గుఱ్ఱమును తీసికొని తన పురము చేరెను. 22

మూ. తతో రాజానమాసాద్య దీక్షితం రఘునన్దన, 23
న్యవేదయద్యథావృత్తం సుపర్ణవచనం తథా.

ప్ర. అ. రఘునన్దన=రామా! **తతః**=పిమ్మట, దీక్షితమ్=దీక్షవహించి ఉన్న, రాజానమ్=రాజును, ఆసాద్య=పొంది, యథావృత్తమ్=ఎట్లు జరిగినదో అట్లు, తథా = మరియు, సుపర్ణవచనమ్ = గరుత్మంతుని వాక్యమును, న్యవేదయత్ = తెలిపెను.

**తా.** రామా! అంశుమంతుడు, యజ్ఞదీక్షితుడైన సగరచక్రవర్తి వద్దకు వెళ్లి జరిగిన విషయమును, గరుత్మంతుని మాటలను అతనికి తెలిపెను. 23

మూ. తచ్ఛ్రుత్వా ఘోరసంకాశం వాక్యమంశుమతో నృపః, 24
యజ్ఞం నిర్వర్తయామాస యథాకల్పం యథావిధి.

ప్ర. అ. నృపః=రాజు, అంశుమతః = అంశుమంతునియొక్క, ఘోర సఙ్కాశమ్ = ఘోరమైన, వాక్యమ్ = వాక్యము, శ్రుత్వా = విని, యథా కల్పమ్ = పద్ధతిప్రకారము, యథావిధి = శాస్త్రప్రకారము, యజ్ఞమ్ = యజ్ఞమును, నిర్వర్తయామాస=జరిపించెను.

**తా.** సగరచక్రవర్తి అంశుమంతుని నుండి ఆ ఘోరమైన వార్త విని చాల విచారించెను. యజ్ఞమును శాస్త్రోక్తప్రకారము, చేయవలసిన పద్ధతిలో పూర్తి చేసెను. 24

మూ. స్వపురం చాగమచ్ఛ్రీమానిష్టయజ్ఞో మహీపతిః, 25
గఙ్గాయాశ్చాగమే రాజా నిశ్చయం నాధ్యగచ్ఛత.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, మహీపతిః = రాజు, ఇష్టయజ్ఞః= యజింపడిన యాగము కలవాడై, స్వపురమ్ = తన పురమును, అగమత్ = చేరెను. రాజా=రాజు, గఙ్గాయాః=గంగయొక్క, ఆగమే=రాకవిషయమున, నిశ్చయమ్=నిశ్చయమును, నాధ్యగచ్ఛత=పొందలేదు.

తా. సగరచక్రవర్తి యజ్ఞము పూర్తి చేసికొని నగరములో ప్రవేశించెను. గంగను తీసికొనివచ్చుటకు ఉపాయ మేదియు అతడు కానజాలకపోయెను.

మూ. అకృత్వా నిశ్చయం రాజా కాలేన మహతా మహాన్, 26
త్రింశద్వర్షసహస్రాణి రాజ్యం కృత్వా దివం గతః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. మహాన్ = గొప్పవాడైన, రాజా = ఆ రాజు, మహతా కాలేన = చాలకాలముచేత కూడ, నిశ్చయమ్ = నిర్ణయమును, అకృత్వా = చేయకయే, త్రింశద్వర్షసహస్రాణి = ముప్పది వేల సంవత్సరములు, రాజ్యమ్ = రాజ్యము, కృత్వా = చేసి, దివమ్ = స్వర్గమునుగూర్చి, గతః = వెళ్లెను.

తా. గొప్పవాడైన ఆ సగరచక్రవర్తి చాలకాలమునకు గూడ గంగను తీసికొని వచ్చు ఉపాయము కానజాలక, ముప్పదివేల సంవత్సరములు రాజ్యము చేసి స్వర్గమునకు వెళ్లెను. 26

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో ఇరువదియేడవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

మూ. కాలధర్మం గతే రామ సగరే ప్రకృతీజనాః,
రాజానం రోచయామాసురంశుమన్తం సుధార్మికమ్. 1

ప్ర. అ. రామ = రామా ! సగరే = సగరచక్రవర్తి, కాలధర్మమ్ = మరణమును, గతే = పొందినవాడగుచుండగా, ప్రకృతీజనాః = మంత్రులును ప్రజలును, సుధార్మికమ్ = మిక్కిలి ధార్మికుడైన, అంశుమన్తమ్ = అంశుమంతుని, రాజానమ్ = రాజునుగా, రోచయామాసుః = అంగీకరించిరి.

తా. రామా ! సగరచక్రవర్తి మరణించిన పిమ్మట, మంత్రులును ప్రజలును, ధార్మికుడైన అంశుమంతుని రాజుగా చేసిరి. 1

మూ. స రాజా సుమహానాసీదంశుమాన్రఘునన్దన,
తస్య పుత్రో మహానాసీద్దిలీప ఇతి విశ్రుతః. 2

ప్ర. అ. రఘునన్దన = రామా ! సః = ఆ, అంశుమాన్ = అంశుమంతుడు, సుమహాన్ = చాల గొప్ప, రాజా = రాజుగా, ఆసీత్ = అయెను. తస్య = అతనికి, దిలీపః ఇతి = దిలీపుడని, విశ్రుతః = ప్రసిద్ధుడైన, మహాన్ = పూజ్యుడైన, పుత్రః = పుత్రుడు, ఆసీత్ = కలిగెను.

తా. రామా ! ఆ అంశుమంతుడు గొప్ప రాజుగా ఉండి రాజ్యము చేసెను. అతనికి దిలీపు డను పూజ్యుడైన కుమారుడు కలిగెను. 2

మూ. తస్మిన్ రాజ్యం సమావేశ్య దిలీపే రఘునన్దన,
హిమవచ్ఛిఖరే పుణ్యే తపస్తేపే సుదారుణమ్. 3

ప్ర. అ. రఘునన్దన = రామా ! తస్మిన్ = ఆ, దిలీపే = దిలీపునిమీద, రాజ్యమ్ = రాజ్యమును, సమావేశ్య = నిలిపి, పుణ్యే = పవిత్రమైన, హిమవచ్ఛిఖరే = హిమవత్పర్వతముయొక్క శిఖరమునందు, సుదారుణమ్ = మిక్కిలి తీవ్రమైన, తపః = తపస్సును, తేపే = చేసెను.

**తా.** రామా! అంశుమంతుడు రాజ్యభారమును దిలీపునకు అప్పచెప్పి, పుణ్య మైన హిమవత్పర్వతశిఖరముపై తీవ్ర మైన తపస్సు చేసెను. 3

**మూ.** ద్వాత్రింశచ్చ సహస్రాణి వర్షాణి సుమహాయశాః,
తపోవనం గతో రామ స్వర్గం లేభే తపోధనః. 4

**ప్ర. అ.** రామ = రామా! సుమహాయశాః = గొప్ప కీర్తి గల ఆ అంశుమంతుడు, ద్వాత్రింశత్ సహస్రాణి = ముప్పదిరెండువేల, వర్షాణి = సంవత్సరములు, తపోవనమ్ = తపోవనమును, గతః = పొందినవాడై, తపోధనః = తపస్సే ధనముగా కలవాడై, స్వర్గమ్ = స్వర్గమును, లేభే = పొందెను.

**తా.** రామా! గొప్ప తపస్సు గల ఆ అంశుమంతుడు ముప్పదిరెండువేల సంవత్సరములు తపోవనములో నివసించి, తపస్సు అనెడు ధనము నార్జించి, స్వర్గమును పొందెను. 4

**మూ.** దిలీపస్తు మహాతేజాః శ్రుత్వా పైతామహం వధమ్,
దుఃఖోపహతయా బుద్ధ్యా నిశ్చయం నాధ్యగచ్ఛత. 5

**ప్ర. అ.** మహాతేజాః = గొప్ప తేజస్సు కల, దిలీపస్తు = దిలీపుడైతే, పైతామహమ్ = పితామహుల సంబంధ మైన, వధమ్ = వధను, శ్రుత్వా = విని, దుఃఖోపహతయా = దుఃఖముచే పీడింపబడిన, బుద్ధ్యా = బుద్ధిలో, నిశ్చయమ్ = నిర్ణయమును, నాధ్యగచ్ఛత = పొందలేదు.

**తా.** మహాతేజఃశాలి యగు దిలీపుడు తన పితామహుల వధవృత్తాంతమును విని, చాల విచారించి, గంగను తీసికొనివచ్చుటకు ఉపాయమును నిర్ణయింపజాలకపోయెను. 5

**మూ.** కథం గఙ్గావతరణం కథం తేషాం జలక్రియా,
తారయేయం కథం చైనానితి చిన్తాపరోఽభవత్. 6

**ప్ర. అ.** గఙ్గావతరణమ్ = గంగయొక్క అవతరణము, కథమ్ = ఎట్లు చేయవలెను? తేషామ్ = వారికి, జలక్రియా = జలతర్పణము, కథమ్ = ఎట్లు? ఏనాన్ = వీరిని, కథమ్ = ఎట్లు, తారయేయమ్ = తరింపచేయుదును? ఇతి = ఇట్లు, చిన్తాపరః = విచారముతో నిండినవాడు, అభవత్ = ఆయెను.

తా. గంగను ఎట్లు తేవలెను? వీరికి జలతర్పణము లెట్లు ఈయవలెను? వీరిని ఎట్లు తరింపచేయవలెను? అను ఆలోచనలతో బాధపడెను. 6

మూ. తస్య చిన్తయతో నిత్యం ధర్మేణ విదితాత్మనః,
పుత్రో భగీరథో నామ జజ్ఞే పరమధార్మికః. 7

ప్ర. అ. విదితాత్మనః = ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడును, ధర్మేణ = ధర్మముచేత, నిత్యమ్ = నిత్యము, చిన్తయతః = గంగానయనమును గూర్చి ఆలోచించుచున్న, తస్య=అతనికి, భగీరథో నామ=భగీరథు డను పేరు గల, పరమధార్మికః=మిక్కిలి ధార్మికు డైన, పుత్రః=పుత్రుడు, జజ్ఞే=పుట్టెను.

తా. ధర్మమార్గమున గంగానయనమును గూర్చి నిత్యము ఆలోచించుచున్న, ప్రసిద్ధ మైన బుద్ధి గల ఆ దిలీపునకు, పరమధార్మికు డైన, భగీరథు డనెడు కుమారుడు జనించెను. 7

మూ. దిలీపస్తు మహాతేజా యజ్ఞైర్బహుభిరిష్టవాన్,
త్రింశద్వర్షసహస్రాణి రాజా రాజ్యమశాసయత్. 8

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, దిలీపస్తు = దిలీపుడు, బహుభిః=అనేక మైన, యజ్ఞైః = యజ్ఞములచేత, ఇష్టవాన్ = యజించినాడు. రాజా = ఆ రాజు, త్రింశద్వర్షసహస్రాణి = ముప్పదివేల సంవత్సరములు, రాజ్యమ్=రాజ్యమును, అశాసయత్=శాసించెను.

తా. మహాతేజఃశాలి యగు ఆ దిలీపుడు అనేకయజ్ఞములు చేసి, ముప్పది వేల సంవత్సరములు రాజ్యము పాలించెను. 8

మూ. అగత్వా నిశ్చయం రాజా తేషాముద్ధరణం ప్రతి,
వ్యాధినా నరశార్దూల కాలధర్మము పేయివాన్. 9

ప్ర. అ. నరశార్దూల=నరశ్రేష్ఠుడా! రాజా=దిలీపమహారాజు, తేషామ్= వారియొక్క, ఉద్ధరణం ప్రతి = ఉద్ధరణమును గూర్చి, నిశ్చయమ్ = నిశ్చయమును, అగత్వా = పొందజాలక, వ్యాధినా = మనోవ్యథతో, కాల ధర్మమ్=మరణమును, ఉపేయివాన్=పొందినాడు.

తా. రామా ! ఆ దిలీపుడు సగరపుత్రులను ఉద్ధరించు మార్గము తెలియక ఆ మనోవ్యథతోడనే మరణించెను. 9

మూ. ఇన్ద్రలోకం గతో రాజా స్వార్జితేనైవ కర్మణా,
రాజ్యే భగీరథం పుత్రమభిషిచ్య నరర్షభః. 10

ప్ర. అ. నరర్షభః = నరశ్రేష్ఠుడైన, రాజా = ఆ రాజు, పుత్రమ్ = పుత్రుడైన, భగీరథమ్=భగీరథుని, రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్య = అభిషేకించి, స్వార్జితేనైవ = తనచేతనే ఆర్జింపబడిన, కర్మణా = కర్మచేత, ఇన్ద్రలోకమ్=ఇంద్రలోకమును గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. దిలీపమహారాజు పుత్రుడైన భగీరథుని రాజ్యమునందు అభిషిక్తుని చేసి, స్వయముగ సంపాదించిన పుణ్యకర్మలచే స్వర్గము చేరెను. 10

మూ. భగీరథస్తు రాజర్షిర్ధార్మికో రఘునన్దన,
అనపత్యో మహాతేజాః ప్రజాకామః స చాప్రజః. 11

ప్ర. అ. రఘునన్దన=రామా, ధార్మికః=ధార్మికుడును, మహాతేజాః = గొప్పతేజస్సు కలవాడును, రాజర్షిః=రాజును ఋషియును అయిన, భగీరథస్తు= భగీరథుడైతే, అనపత్యః=సంతానములేనివాడు. సః=అతడు, ప్రజాకామః= సంతానమునందు కోరిక కలవాడైనను, అప్రజాః = సంతానము లేనివాడుగనే ఉండెను.

తా. రామా ! ధార్మికుడును, మహాతేజఃశాలియు, రాజర్షియు అగు భగీరథునకైతే సంతానము లేదు. అతనికి సంతానము కావలెనని కోరిక యుండెడిది గాని సంతానము మాత్రము కలుగలేదు. 11

మూ. మన్త్రిష్వాధాయ తద్రాజ్యం గఙ్గావతరణే రతః,
స తపో దీర్ఘమాతిష్ఠద్గోకర్ణే రఘునన్దన, 12
ఊర్ధ్వబాహుః పఞ్చతపా మాసాహారో జితేన్ద్రియః.

ప్ర. అ. రఘునన్దన=రామా ! సః=అతడు, గఙ్గావతరణే = గంగను దింపుటయందు, రతః = ఆసక్తి కలవాడై, తద్రాజ్యమ్ = ఆ రాజ్యమును,

మన్త్రిషు=మంత్రులయందు, ఆధాయ=ఉంచి, ఊర్ధ్వబాహుః = పైకి ఎత్తబడిన బాహువులు కలవాడై, పఞ్చతపాః = పంచాగ్నిమధ్య తపస్సు చేయుచున్నవాడై, మాసాహారః = మాసమున కొకసారి ఆహారము కలవాడై, జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు గలవాడై, గోకర్ణే = గోకర్ణ క్షేత్రమునందు, దీర్ఘమ్ = దీర్ఘ మైన, తపః=తపస్సును, అతిష్ఠత్=చేసెను.

తా. రామా ! ఆ భగీరథుడు గంగను స్వర్గమునుండి భూలోకమునకు తేవలె నను నిర్ణయముతో రాజ్యభారమును మంత్రులకు అప్పగించి గోకర్ణ క్షేత్రమునకు పోయెను. అచట చేతులను పైకెత్తి, జితేంద్రియుడై, మాసమున కొకసారి మాత్రమే ఆహారము భుజించుచు, గ్రీష్మమునందు పంచాగ్నిమధ్య చాలకాలము తపస్సు చేసెను.

వి. గ్రీష్మమునందు నాల్గు దిక్కులందు నాలుగు అగ్నులు ఉంచుకొని ఆకాశమున నున్న సూర్యుని వైపు చూచుచు చేయు తపస్సు పంచాగ్ని తపస్సు.

మూ. తస్య వర్షసహస్రాణి ఘోరే తపసి తిష్ఠతః, 13
అతీతాని మహాబాహో తస్య రాజ్ఞో మహాత్మనః,
సుప్రీతో భగవాన్ బ్రహ్మా ప్రజానాం పతిరీశ్వరః. 14

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల రామా ! తస్య=అతడు, ఘోరే తపసి= ఘోరమైన తపస్సులో, తిష్ఠతః=ఉండగా, వర్షసహస్రాణి = వేల కొలది సంవత్సరములు, అతీతాని = కడచిపోయినవి. ప్రజానామ్ = ప్రజలకు, పతిః = ప్రభువును, ఈశ్వరః = సమర్థుడును అగు, భగవాన్ బ్రహ్మా=భగవంతుడైన బ్రహ్మదేవుడు, తస్య = ఆ, మహాత్మనః = మహాత్ముడైన, రాజ్ఞః = రాజునకు, సుప్రీతః = చాల సంతసించినవాడు అయ్యెను.

తా. రామా ! భగీరథుడు ఘోర మైన తపస్సు చేయుచుండగా, వేలకొలది సంవత్సరములు కడచిపోయినవి. ప్రజలకు పతియు, సమర్థుడును అగు భగవంతుడైన బ్రహ్మదేవుడు మహాత్ముడైన ఆ రాజు విషయమున సంతోషించెను. 13, 14

మూ. తతః సురగణైః సార్ధముపాగమ్య పితామహః,
భగీరథం మహాత్మానం తప్యమానమథాబ్రవీత్. 15

ప్ర. అ. తతః = పిమ్మట, పితామహః = బ్రహ్మదేవుడు, సురగణైః = దేవతాగణములతో కూడ, ఉపాగమ్య = వచ్చి, అథ = పిమ్మట, తప్యమానమ్ = తపస్సు చేయుచున్న, మహాత్మానమ్ = మహాత్ముడైన, భగీరథమ్ = భగీరథుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. బ్రహ్మదేవుడు దేవతాగణములతో కలిసి వచ్చి తపస్సు చేయుచున్న మహాత్ముడైన ఆ భగీరథునితో ఇట్లు పలికెను. 15

మూ. భగీరథ మహాభాగ ప్రీతస్తేఽహం జనేశ్వర,
తపసా చ సుతప్తేన వరం వరయ సువ్రత. 16

ప్ర. అ. మహాభాగ = మహాభాగ్యవంతుడవైన, జనేశ్వర = మహారాజా! భగీరథ = భగీరథుడా! తే = నీయొక్క, సుతప్తేన = బాగుగా చేయబడిన, తపసా = తపస్సుచేత, అహమ్ = నేను, ప్రీతః = సంతసించినాను. సువ్రత = మంచి నియమము కలవాడా! వరమ్ = వరమును, వరయ = కోరుకొనుము.

తా. మహాభాగ్యవంతుడ వగు ఓ భగీరథ మహారాజా! నీవు చేసిన గొప్ప తపస్సుకు సంతసించినాను. ఓ సువ్రతుడా! వరమును కోరుకొనుము. 16

మూ. తమువాచ మహాతేజాః సర్వలోకపితామహమ్,
భగీరథో మహాభాగః కృతాఞ్జలిరుపస్థితః. 17

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సుగల, మహాభాగః = గొప్ప భాగ్యముగల, భగీరథః = భగీరథుడు, కృతాఞ్జలిః = దోసిలికట్టినవాడై, ఉపస్థితః = సమీపించిన వాడై, తమ్ = ఆ, సర్వలోకపితామహమ్ = సమస్తలోకములకును పితామహుడైన బ్రహ్మదేవుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. మహాతేజఃశాలియు, మహాభాగ్యవంతుడును అగు భగీరథుడు, బ్రహ్మదేవుని సమీపించి, చేతులు జోడించి, ఆతనితో ఇట్లనెను. 17

మూ. యది మే భగవన్ ప్రీతో యద్యస్తి తపసః ఫలమ్,
సగరస్యాత్మజాః సర్వే మత్తస్సలిలమాప్నుయుః. 18

ప్ర. అ. భగవన్ = భగవంతుడా! మే = నా విషయమున, ప్రీతః యది = సంతసించినట్లైతే, తపసః = తపస్సునకు, ఫలమ్ = ఫలము, అస్తి యది = ఉన్నట్లైతే, సగరస్య = సగరునియొక్క, ఆత్మజాః = కుమారులు, సర్వే = అందరును, మత్తః = నా నుండి, సలిలమ్ = ఉదకమును, అప్నుయుః = పొందుదురుగాక.

తా. భగవంతుడా! నీకు నాపై అనుగ్రహము కలిగినచో, తపస్సుకు ఫల మున్నచో, సగరుని కుమారు లందరికిని నేను జలతర్పణములు చేయగల్గుదును గాక. 18

మూ. గఙ్గాయాః సలిలక్లిన్నే భస్మన్యేషాం మహాత్మనామ్,
స్వర్గం గచ్ఛేయురత్యన్తం సర్వే మే ప్రపితామహాః. 19

ప్ర. అ. ఏషామ్ = ఈ, మహాత్మనామ్ = మహాత్ములయొక్క, భస్మని = భస్మము, గఙ్గాయాః = గంగయొక్క, సలిలక్లిన్నే = ఉదకముచేత తడుపబడిన దగుచుండగా, మే = నా యొక్క, సర్వే = సమస్తమైన, ప్రపితామహాః = ప్రపితామహులు, అత్యన్తమ్ = శాశ్వతముగా, స్వర్గమ్ = స్వర్గమునుగూర్చి, గచ్ఛేయుః = వెళ్లుదురుగాక.

తా. మహాత్ములైన మా ప్రపితామహు లందరును, వారి భస్మము గంగా జలముచే తడుపబడి నంతనే శాశ్వతముగ స్వర్గమును చేరుదురు గాక. 19

మూ. దేయా చ సన్తతిర్దేవ నావసీదేత్కులం చ నః,
ఇక్ష్వాకూణాం కులే దేవ ఏష మేఽస్తు వరః పరః. 20

ప్ర. అ. దేవ = దేవా! ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయులయొక్క, కులే = కులమునందు, సన్తతిః = సంతానము, దేయా = ఇవ్వదగినది. నః = మాయొక్క, కులమ్ = కులము, నావసీదేత్ = నశింపకుండుగాక. ఏషః = ఇది, మే = నాయొక్క, పరః = మరియొక, వరః = వరము, అస్తు = అగుగాక.

తా. దేవా! నా రెండవ వర మేమనగా— ఇక్ష్వాకు వంశీయుల మైన మా కులమునందు సంతానము కలుగవలెను. మా వంశ మెన్నటికిని నశించ కూడదు. 20

మూ. ఉక్తవాక్యం తు రాజానం సర్వలోకపితామహః,
ప్రత్యువాచ శుభాం వాణీం మధురాం మధురాక్షరామ్. 21

ప్ర. అ. సర్వలోకపితామహః = సమస్త లోకములకును పితామహు డైన బ్రహ్మదేవుడు, ఉక్తవాక్యమ్ = ఈ విధముగా పలకబడిన వాక్యము గల, రాజానమ్ = రాజును గూర్చి, శుభామ్ = శుభ మైన, మధురామ్ = మధురమైన, మధురాక్షరామ్ = మధురమైన అక్షరములు గల, వాణీమ్ = వాక్కును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. భగీరథుడు ఇట్లు పలుకగా విని, బ్రహ్మదేవుడు, భగీరథునితో, మంగళకరమైన, మధురాక్షర మైన, మధురమైన ఈ వచనము పలికెను. 21

మూ. మనోరథో మహానేష భగీరథ మహారథ,
ఏవం భవతు భద్రం తే ఇక్ష్వాకుకులవర్ధన. 22

ప్ర. అ. మహారథ=మహారథుడ వైన, భగీరథ=భగీరథుడా! ఏషః= ఈ, మనోరథః = కోరిక, మహాన్=చాల గొప్పది. ఇక్ష్వాకుకుల వర్ధన=ఇక్ష్వాకు కులమును వృద్ధి పొందించినవాడా! ఏవమ్ = ఇట్లు, భవతు = అగుగాక. తే= నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. మహారథుడ వైన భగీరథుడా, ఈ కోరిక చాల గొప్పది. దుర్లభ మైనది. ఓ! ఇక్ష్వాకుకులవర్ధనా! ఇట్లే అగుగాక. నీకు క్షేమ మగుగాక. 22

మూ. ఇయం హైమవతీ గఙ్గా జ్యేష్ఠా హిమవతః సుతా,
తాం వై ధారయితుం శక్తో హరస్తత్ర నియుజ్యతామ్. 23

ప్ర. అ. హైమవతీ = హిమవంతునినుండి పుట్టిన, ఇయమ్ = ఈ, గఙ్గా= గంగ, హిమవతః=హిమవంతునియొక్క, జ్యేష్ఠా సుతా=పెద్ద కూతురు. తామ్= ఆమెను, ధారయితుమ్ = ధరించుటకు, శక్తః = సమర్థు డైన, హరః = శివుడు, తత్ర = ఆ కార్యమునందు, నియుజ్యతామ్ = నియమింపబడు గాక.

తా. హిమవంతుని పెద్దకూతు రైన గంగను వహింప సమర్థుడు శివు డొక్కడే. అందుచే ఆతనిని ఆ కార్యమునందు నియోగింపవలెను. 23

మూ. గఙ్గాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి,
తాం వై ధారయితుం వీర నాన్యం పశ్యామి శూలినః. 24

ప్ర. అ. రాజన్ = రాజా ! గఙ్గాయాః = గంగ యొక్క, పతనమ్ = పతనమును, పృథివీ = భూమి, న సహిష్యతి = సహింపజాలదు. వీర = ఓ వీరుడా ! తామ్ = ఆమెను, ధారయితుమ్ = ధరించుటకు, శూలినః = ఈశ్వరుని కంటె, అన్యమ్ = అన్యుని, న పశ్యామి = చూడను.

తా. రాజా ! గంగ క్రిందికి పడుచున్నపుడు ఆ పడుటను భూమి సహింప జాలదు. ఓ వీరుడా ! ఆ గంగను ధరించుటకు ఈశ్వరుడు తప్ప మరెవ్వరును నాకు కనబడుటలేదు. 24

మూ. తమేవముక్త్వా రాజానం గఙ్గాం చాభాష్య లోకకృత్,
జగామ త్రిదివం దేవః సహ దేవైర్మరుద్గణైః. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. లోకకృత్ = బ్రహ్మదేవుడు, తమ్ = ఆ, రాజానమ్ = రాజును గూర్చి, ఏవమ్ = ఈవిధముగా, ఉక్త్వా = పలికి, గఙ్గాం చ = గంగను కూడ, ఆభాష్య = మాటలాడి, సహ దేవైః = దేవతలతో గూడిన, మరుద్గణైః = మరుద్గణములతో కూడ, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. బ్రహ్మదేవుడు భగీరథునితో ఇట్లు చెప్పి, గంగతో కూడ మాట లాడి, దేవతలతోడను, మరుద్గణములతోడను స్వర్గమునకు వెళ్లెను. 25

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో నలుబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిచత్వారింశః సర్గః

మూ. దేవదేవే గతే తస్మిన్ సోఽంగుష్ఠాగ్రనిపీడితామ్,
కృత్వా వసుమతీం రామ సంవత్సరముపాసత. 1

ప్ర. అ. రామ = రామా! తస్మిన్=ఆ, దేవదేవే = దేవతలకు దేవత యైన బ్రహ్మదేవుడు, గతే = వెళ్లినవాడగుచుండగా, సః = అతడు, వసుమతీమ్ = భూమిని, అఙ్గుష్ఠాగ్రనిపీడితామ్ = కాలి బొటనవ్రేలుచేత పీడింపబడిన దానినిగా, కృత్వా=చేసి, సంవత్సరమ్=సంవత్సరము కాలము, ఉపాసత= ఉపాసించెను.

తా. రామా! బ్రహ్మదేవుడు వెళ్లిన పిదప, ఆ భగీరథుడు సంవత్సర కాలము భూమిపై కాలి బొటనవ్రేలుతో నిలచి తపస్సు చేసెను. 1

మూ. అథ సంవత్సరే పూర్ణే సర్వలోకనమస్కృతః,
ఉమాపతిః పశుపతీ రాజానమిదమబ్రవీత్. 2

ప్ర. అ. అథ=పిమ్మట, సంవత్సరే = ఒక సంవత్సరము, పూర్ణే = నిండగా, సర్వలోకనమస్కృతః = సమస్తలోకములచేతను నమస్కరింపబడిన వాడును, ఉమాపతిః = ఉమయొక్క భర్తయు అగు, పశుపతిః = ఈశ్వరుడు, రాజానమ్=రాజును గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సంవత్సరకాలము పూర్తియైన పిమ్మట, సర్వలోకములకును పూజనీయుడగు ఉమాపతియైన, మహేశ్వరుడు రాజుతో ఇట్లు పలికెను. 2

మూ. ప్రీతస్తేఽహం నరశ్రేష్ఠ కరిష్యామి తవ ప్రియమ్,
శిరసా ధారయిష్యామి శైలరాజసుతామహమ్. 3

ప్ర. అ. నరశ్రేష్ఠ = ఓ నరశ్రేష్ఠుడా! అహమ్ = నేను, తే = నీకు, ప్రీతః = సంతసించినాను. తవ = నీకు, ప్రియమ్ = ప్రియమైన కార్యమును,

కరిష్యామి=చేయగలను. అహమ్ = నేను, శైలరాజసుతామ్ = హిమవంతుని కుమార్తె యైన గంగను, శిరసా=శిరస్సుచేత, ధారయిష్యామి=ధరించెదను.

తా. ఓ నరశ్రేష్ఠా! నీ తపస్సునకు సంతసించినాను. గంగను శిరస్సుచే వహించి నీకు ప్రియము చేకూర్చెదను. 3

మూ. తతో హైమవతీ గఙ్గా సర్వలోకనమస్కృతా,
తదా సాతిమహద్రూపం కృత్వా వేగం చ దుస్సహమ్, 4
ఆకాశాదపతద్రామ శివే శివశిరస్యుత.

ప్ర. అ. రామ=రామా! తతః=పిమ్మట, హైమవతీ = హిమవంతుని కుమార్తె యగు, సర్వలోకనమస్కృతా=సమస్తలోకములచేతను నమస్కరింపబడిన, గఙ్గా=గంగ, తదా=అప్పుడు, అతిమహత్=చాల గొప్ప దైన, రూపమ్=రూపమును, దుస్సహమ్ = సహింపశక్యము కాని, వేగం చ = వేగమును, కృత్వా=చేసి, ఆకాశాత్ = ఆకాశమునుండి, శివే=పవిత్రమైన, శివశిరసి=శివుని శిరస్సుపైన, అపతత్ ఉత = పడెను.

తా. రామా! పిమ్మట ఆ హిమవత్పుత్రియు, సర్వలోకములచే నమస్కరింపబడినదియు అగు గంగ, గొప్ప ఆకారమును, సహింప శక్యముకాని వేగమును వహించి ఆకాశమునుండి, పవిత్ర మైన శివుని శిరస్సుపై పడెను. 4

మూ. అచిన్తయచ్చ సా దేవీ గఙ్గా పరమదుర్ధరా, 5
విశామ్యహం హి పాతాలం స్రోతసా గృహ్య శఙ్కరమ్.

ప్ర. అ. పరమదుర్ధరా = ధరించుటకు చాల కష్ట మైన, సా = ఆ, దేవీ=దేవియైన, గఙ్గా=గంగ, అచిన్తయచ్చ=ఆలోచించెను కూడ. అహమ్=నేను, స్రోతసా = నాప్రవాహముచేత, శఙ్కరమ్ = శంకరుని, గృహ్య = గ్రహించి, పాతాలమ్ = పాతాలమును, విశామి = ప్రవేశింతును.

తా. ధరించుటకు చాలకష్ట మైన ఆ గంగాదేవి— "నా ప్రవాహమునందు శివుని గ్రహించి ఆతనితో సహా పాతాళమును ప్రవేశించెదను" అని తలచెను. 5

మూ. తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధస్తు భగవాన్ హరః, 6
తిరోభావయితుం బుద్ధిం చక్రే త్రిణయనస్తదా.

ప్ర. అ. త్రిణయనః=మూడు నేత్రములు గల, భగవాన్ = భగవంతు డైన, హరః=ఈశ్వరుడు, తస్యాః=ఆ గంగయొక్క, వలేపనమ్=గర్వమును, జ్ఞాత్వా = తెలుసుకొని, తదా = అప్పుడు, తిరోభావయితుమ్ = కనబడకుండ చేయుటకు, బుద్ధిమ్ = బుద్ధిని, చక్రే = చేసెను.

తా. అప్పుడు, మూడు నేత్రములు గల భగవంతు డైన ఈశ్వరుడు ఆమె గర్వమును తెలిసికొని, ఆమె కనబడకుండ చేయవలె నని నిశ్చయించు కొనెను. 6

మూ. సా తస్మిన్ పతితా పుణ్యా పుణ్యే రుద్రస్య మూర్ధని, 7
హిమవత్ప్రతిమే రామ జటామణ్డలగహ్వరే.

ప్ర. అ. రామ=రామా! సా = ఆ, పుణ్యా = పుణ్యనది యైన గంగ, హిమవత్ప్రతిమే = హిమవత్పర్వతముతో సమాన మైన, జటామణ్డలగహ్వరే = జటామండలముచే గుహ వలె నున్న, తస్మిన్=ఆ, రుద్రస్య = శివునియొక్క, పుణ్యే = పవిత్రమైన, మూర్ధని = శిరస్సుపై, పతితా = పడినది.

తా. రామా! పవిత్రమైన ఆ గంగ, హిమవత్పర్వతముతో సమాన మైనదియు, జటామండల మనెడు గుహలు కలదియు అగు, శివుని పవిత్ర మగు శిరస్సుపై పడినది. 7

మూ. సా కథంచిన్మహీం గన్తుం నాశక్నోద్యత్నమాస్థితా, 8
నైవ నిర్గమనం లేభే జటామణ్డలమోహితా.

ప్ర. అ. సా = ఆ గంగ, యత్నమ్ = ప్రయత్నమును, ఆస్థితా = అవలంబించినను, కథంచిత్ = ఏ విధముగను, మహీమ్ = భూమిని, గన్తుమ్= పొందుటకు, న అశక్నోత్ = సమర్థురాలు కాలేదు. జటామణ్డలమోహితా = జటామండలముచే మోహితురాలై, నిర్గమనమ్= బైటపడుటను, న లేభే=పొందలేదు.

**తా.** ఆ గంగ ఎంత ప్రయత్నించినను భూమిమీద పడలేకపోయెను. ఆ జటామండలములో చిక్కుకొని బైటకు రాజాలకపోయెను. 8

మూ. తత్రైవాబభ్రమద్దేవీ సంవత్సరగణాన్ బహూన్, 9
తామపశ్యన్ పునస్తత్ర తపః పరమమాస్థితః.

ప్ర. అ. దేవీ=ఆగంగ, బహూన్=అనేకము లైన, సంవత్సరగణాన్= సంవత్సరసముదాయములను, తత్రైవ = అచటనే, అబంభ్రమత్ = తిరిగెను. **తామ్** = ఆ గంగను, అపశ్యన్ = చూడనివాడై, (భగీరథుడు), పునః=మరల, తత్ర = అచట, పరమమ్ = గొప్ప, తపః = తపస్సును, ఆస్థితః = అవలంబించెను.

**తా.** ఆ గంగ ఎన్నో సంవత్సరములు ఆ జటాజూటమునందే తిరిగెను. ఆమె కనబడకపోవుటచే భగీరథుడు మరల తీవ్రతపస్సు చేసెను. 9

మూ. అనేన తోషితశ్చాసీదత్యర్థం రఘునన్దన, 10
విససర్జ తతో గఙ్గాం హరో బిన్దుసరః ప్రతి.

ప్ర. అ. రఘునన్దన = రామా! అనేన = ఈ తపస్సుచేత, హరః = **శివుడు**, అత్యర్థమ్ = మిక్కిలి, **తోషితః** చ = సంతోషపెట్టబడినవాడు, **అభూత్** = ఆయెను. **తతః** = పిమ్మట, గఙ్గామ్ = గంగను, బిన్దుసరః ప్రతి= బిందుసరస్సును గూర్చి, విససర్జ = విడచెను.

**తా.** రామా! దీనిచేత **శివుడు** చాల సంతసించినవాడై, బిందుసరః ప్రాంతమునందు గంగను విడచెను. 10

మూ. తస్యాం విసృజ్యమానాయాం సప్త స్రోతాంసి జజ్ఞిరే, 11
హ్లాదినీ పావనీ చైవ నళినీ చ తథాపరా,
తిస్రః ప్రాచీం దిశం జగ్ముర్గఙ్గాః శివజలాః శుభాః. 12

ప్ర. అ. తస్యామ్=ఆ గంగ, విసృజ్యమానాయామ్=విడవబడుచుండగా, **సప్త**=ఏడు, స్రోతాంసి=ప్రవాహములు, జజ్ఞిరే = పుట్టినవి, హ్లాదినీ=హ్లాదినియు,

పావనీ చైవ = పావనియు, తథా = మరియు, అపరా = మరియొక, నళినీ చ = నళినియు అను, శివజలాః = మంగళప్రద మైన జలము గల, తిస్రః = మూడు, శుభాః = శుభమైన, గఙ్గాః = గంగలు, ప్రాచీమ్ = తూర్పుదిక్కును గూర్చి, జగ్ముః = వెళ్లినవి.

తా. శివుడు గంగను విడచి నప్పుడు ఏడు ప్రవాహములు పుట్టినవి. వాటిలో హ్లాదిని, పావని, నళిని అను పవిత్రజలము గల శుభము లైన మూడు గంగలు తూర్పు వైపు ప్రవహించినవి. 11, 12

మూ. సుచక్షుశ్చైవ సీతా చ సిన్ధుశ్చైవ మహానదీ,
తిస్రస్త్వేతా దిశం జగ్ముః ప్రతీచీం తు శుభోదకాః. 13

ప్ర. అ. సుచక్షుః = సుచక్షువు, సీతా చ = సీతయు, సిన్ధుః = సింధు వనెడు, మహానదీ చ = మహానదియు, శుభోదకాః = శుభ మైన ఉదకము గల, ఏతాః = ఈ, తిస్రః = మూడును, ప్రతీచీం దిశమ్ = పశ్చిమదిక్కును గూర్చి, జగ్ముః = వెళ్లినవి.

తా. సుచక్షువు, సీత, సింధునది అనెడు శుభోదకములు గల మూడు నదులును పశ్చిమదిక్కునకు ప్రవహించినవి. 13

మూ. సప్తమీ చాన్వగా త్తాసాం భగీరథమథో నృపమ్,
భగీరథోఽపి రాజర్షిర్దివ్యం స్యన్దనమాస్థితః, 14
ప్రాయాదగ్రే మహాతేజా గఙ్గా తం చాప్యనువ్రజత్.

ప్ర. అ. అథో = మరియు, తాసామ్ = వాటిలో, సప్తమీ = ఏడవది, భగీరథం నృపమ్ = భగీరథమహారాజును, అన్వగాత్ = అనుసరించి వెళ్లెను. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రాజర్షిః = రాజర్షి యైన, భగీరథోఽపి = భగీరథుడుకూడ, దివ్యమ్ = దివ్యమైన, స్యన్దనమ్ = రథమును, ఆస్థితః = అధిష్ఠించినవాడై, అగ్రే = ఎదుట, ప్రాయాత్ = వెళ్లెను. గఙ్గా చ = గంగయు, తమ్ = ఆతనిని, అనువ్రజత్ = అనుసరించి వెళ్లెను.

తా. వాటిలో ఏడవ ప్రవాహము భగీరథుని అనుసరించెను. మహాతేజః

శాలియు, రాజర్షియు అగు భగీరథుడు దివ్య మైన రథము నెక్కి ముందు వెళ్లగా గంగ అతని వెనుక వెళ్లెను. 14

మూ. గగనాచ్ఛఙ్కరశిర స్తతో ధరణిమాశ్రితా, 15
వ్యసర్పత జలం తత్ర తీవ్రశబ్దపురస్కృతమ్.

ప్ర. అ. గగనాత్ = ఆకాశమునుండి, శంకరశిరః = శంకరుని శిరస్సును, తతః = అచటనుండి, ధరణిమ్ = భూమిని, ఆశ్రితా = ఆశ్రయించినది. తత్ర = అచట, జలమ్ = జలము, తీవ్రశబ్దపురస్కృతమ్=తీవ్ర మైన శబ్దముతో కూడినదై, వ్యసర్పత = వ్యాపించెను.

తా. గంగ ఆకాశమునుండి శివుని శిరస్సును, అచటనుండి భూమిని చేరినది. అచట జలము తీవ్రశబ్దముతో ప్రవహించెను. 15

మూ. మత్స్యకచ్ఛపసంఘైశ్చ శింశుమారగణై స్తదా, 16
పతద్భిః పతితై శ్చాన్యై ర్వ్యరోచత వసున్ధరా.

ప్ర. అ. తదా=అప్పుడు, వసుంధరా=భూమి, పతితైః=పడినవియు, పతద్భిశ్చ = పడుచున్నవియు అగు, మత్స్యకచ్ఛపసంఘైశ్చ = మత్స్యముల యొక్క తాబేళ్లయొక్క సముదాయములచేతను, శింశుమారగణైశ్చ = మొసళ్ల సముదాయములచేతను, అన్యైః = ఇతరమైన జల జంతువులచేతను, వ్యరోచత = ప్రకాశించెను.

తా. అపుడు భూమిపై కొన్ని మత్స్యములు, తాబేళ్లు, మొసళ్లు మొదలైనవి పడినవి, కొన్ని పడుచున్నవి. వాటితో భూమి ప్రకాశించెను. 16

మూ. తతో దేవర్షిగన్ధర్వా యక్షసిద్ధగణా స్తదా, 17
వ్యలోకయన్త తే తత్ర గగనాద్గాం గతాం తథా.

ప్ర. అ. తతః = పిమ్మట, దేవర్షిగన్ధర్వాః = దేవతలు, ఋషులు, గంధర్వులు, యక్షాః = యక్షులు, తే = ఆ, సిద్ధగణాః = సిద్ధుల గణములు, తదా=అప్పుడు, తథా = ఆవిధముగా, గగనాత్ = ఆకాశమునుండి, గామ్= భూమిని, గతామ్ = పొందిన గంగను, వ్యలోకయన్త = చూచిరి.

తా. అపుడా గంగ ఆకాశమునుండి భూమిపై పడుచుండగా, దేవ-ఋషి-గంధర్వ-యక్ష-సిద్ధాదులు ఆశ్చర్యముతో చూచిరి. 17

మూ. విమానైర్నగరాకారై ర్హయైర్గజవరై స్తదా, 18
పారిప్లవగతైశ్చాపి దేవతా స్తత్ర విష్ఠితాః.

ప్ర. అ. తదా = అప్పుడు, దేవతాః = దేవతలు, నగరాకారైః = నగరములవంటి, విమానైః=విమానములతోడను, పారిప్లవగతైః = వేగిరపాటు చెందిన, హయైః = గుఱ్ఱములతోడను, గజవరైః = శ్రేష్ఠము లైన ఏనుగుల తోడను, తత్ర=అచట, విష్ఠితాః=నిలచిరి.

తా. నగరములవంటి విమానములపైనను, తొందరగా నున్న గుఱ్ఱముల మీదను, ఏనుగులమీదను ఎక్కి వచ్చిన దేవతలు అచట నిలచి ఉండిరి. 18

మూ. తదద్భుతతమం లోకే గఙ్గాపతనముత్తమమ్, 19
దిదృక్షవో దేవగణాః సమీయురమితౌజసః.

ప్ర. అ. లోకే = లోకమునందు, అద్భుతతమమ్=అత్యాశ్చర్యకర మైన, ఉత్తమమ్ = ఉత్తమ మైన, గఙ్గాపతనమ్=గంగావతరణమును, దిదృక్షవః= చూడ అభిలాష కలవారై, అమితౌజసః = గొప్ప తేజస్సు గల, దేవగణాః = దేవగణములు, సమీయుః = వచ్చిరి.

తా. లోకములో అత్యాశ్చర్యకర మైన ఉత్తమ మైన ఆ గంగావతరణ మును చూచుటకై గొప్ప తేజస్సు గల దేవత లందరును వచ్చిరి. 19

మూ. సంపతద్భిః సురగణైస్తేషాం చాభరణౌజసా, 20
శతాదిత్యమివాభాతి గగనం గతతోయదమ్.

ప్ర. అ. గతతోయదమ్ = తొలగిన మేఘములు గల, గగనమ్ = ఆకాశము, సంపతద్భిః = వేగముగా వచ్చుచున్న, సురగణైః=దేవతాగణముల చేతను, తేషామ్ = వారియొక్క, ఆభరణౌజసా = ఆభరణముల కాంతిచేతను, శతాదిత్యమివ = నూర్గురు సూర్యులు కలది వలె, ఆభాతి = ప్రకాశించుచున్నది.

తా. మేఘములు లేని ఆకాశముమీద సురగణములు వచ్చి చేరగా వారి అలంకారముల కాంతిచేత నూర్గురు సూర్యు లున్నంత కాంతి కలిగెను. 20

మూ. శింశుమారోరగగణైర్మీనైరపి చ చఞ్చలైః, 21
విద్యుద్భిరివ విక్షిప్తమాకాశమభవత్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, శింశుమారోరగగణైః = మొసళ్లయొక్కయు, సర్పములయొక్కయు సముదాయములచేతను, చఞ్చలైః = చంచలము లైన, మీనైరపి చ = మీనములచేతను, ఆకాశమ్ = ఆకాశము, విద్యుద్భిః = మెరపుల చేత, విక్షిప్తమివ = వ్యాప్త మైనది వలె, అభవత్ = ఆయెను.

తా. అపుడు మొసళ్లు, సర్పములు. మీనములు కదలుచు పడుచుండగా ఆకాశము మెరపులచే వ్యాప్తమైన ట్లుండెను. 21

మూ. పాణ్డరైః సలిలోత్పీడైః కీర్యమాణైః సహస్రధా, 22
శారదాభ్రైరివాకీర్ణం గగనం హంససంప్లవైః.

ప్ర. అ. సహస్రధా = వేయివిధములుగా, కీర్యమాణైః=చిమ్మబడుచున్న, పాణ్డరైః = తెల్లని, సలిలోత్పీడైః = నీటినురుగులతో, గగనమ్ = ఆకాశము, హంససంప్లవైః = హంసలయొక్క గుంపులచేతను, శారదాభ్రైః = శరత్కాల మేఘములచేతను, ఆకీర్ణమివ = వ్యాప్త మైనది వలె ఉండెను.

తా. వేయి విధములుగా చిమ్మబడుచున్న నీటి నురుగులతో ఆకాశము, హంసల సముదాయములచేతను, శరత్కాలమేఘములచేతను వ్యాప్త మైనది వలె ఉండెను. 22

మూ. క్వచిద్ద్రుతతరం యాతి కుటిలం క్వచిదాయతమ్, 23
వినతం క్వచిదుద్ధూతం క్వచిద్యాతి శనైః శనైః.

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, ద్రుతతరమ్ = అతి శీఘ్రముగా, యాతి = ప్రవహించుచున్నది. క్వచిత్ = కొన్ని చోట్ల, కుటిలం యాతి = వంకరగా ప్రవహించుచున్నది. క్వచిత్ = కొన్నిచోట్ల, ఆయతమ్=పొడవుగా, ప్రవహించుచున్నది. క్వచిత్ = కొన్నిచోట్ల, వినతమ్ = వంగి ప్రవహించు

చున్నది. క్వచిత్ = కొన్ని చోట్ల, ఉద్ధూతమ్= పైకి లేచుచు ప్రవహించుచున్నది. క్వచిత్ = కొన్ని చోట్ల, శనైః శనైః = మెల్లిమెల్లిగా, యాతి = వెళ్లుచున్నది.

తా. ఆ గంగ కొన్ని చోట్ల శీఘ్రముగను, కొన్ని చోట్ల మెల్లగను, కొన్ని చోట్ల వంకరగను, కొన్ని చోట్ల పొడవుగను, కొన్ని చోట్ల క్రిందికిని, కొన్ని చోట్ల పైకిని ప్రవహించుచున్నది. 23

మూ. సలిలేనైవ సలిలం క్వచిదభ్యాహతం పునః, 24
ముహురూర్ధ్వముఖం గత్వా పపాత వసుధాతలమ్.

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, సలిలమ్ = నీరు, సలిలేనైవ = నీటి చేతనే, అభ్యాహతమ్ = కొట్టబడినదై, ముహుః = మాటి మాటికిని, ఊర్ధ్వముఖమ్= ఊర్ధ్వముఖముగా, గత్వా = వెళ్లి, పునః = మరల, వసుధాతలమ్ = భూమిని గూర్చి, పపాత = పడెను.

తా. కొన్ని చోట్ల నీటితో నీరు డీకొని, పైకెగసి, మరల భూమిపై పడుచుండెను. 24

మూ. తచ్ఛఙ్కరశిరోభ్రష్టం భ్రష్టం భూమితలే పునః, 25
వ్యరోచత తదా తోయం నిర్మలం గతకల్మషమ్.

ప్ర. అ. శఙ్కరశిరోభ్రష్టమ్=శంకరుని శిరస్సుపై పడినదియు, పునః= మరల, భూమితలే=భూమిపై, భ్రష్టమ్=పడిన, గతకల్మషమ్ = కాలుష్యము లేని, నిర్మలమ్= నిర్మల మైన, తత్=ఆ, తోయమ్ = ఉదకము, తదా = అప్పుడు, వ్యరోచత = ప్రకాశించెను.

తా. ఆకాశమునుండి శంకరుని శిరస్సుపై బడి, పిమ్మట భూమిపై బడిన ఆ కల్మషము లేని ఉదకము నిర్మలముగా ప్రకాశించెను. 25

మూ. తత్ర దేవర్షిగన్ధర్వా వసుధాతలవాసినః, 26
భవాఙ్గపతితం తోయం పవిత్రమితి పస్పృశుః.

ప్ర. అ. తత్ర = అచట, దేవర్షిగన్ధర్వాః = దేవతలు, ఋషులు, గంధర్వులు, వసుధాతలవాసినః=భూమిపై నివసించువారును, భవాఙ్గపతితమ్=

ఈశ్వరుని శరీరమునుండి జారిన, తోయమ్ = ఆ ఉదకము, పవిత్రమ్ ఇతి = పవిత్ర మైనది అని, పస్పృశుః=స్పృశించిరి.

తా. శివుని శరీరమునుండి పడిన దగుటచే ఆజలము పవిత్ర మైన దను అభిప్రాయముతో, అచట దేవఋషిగంధర్వులును, భూమిపై నివసించువారును దానిని స్పృశించిరి. 26

మూ. శాపాత్ప్రపతితా యే చ గగనాద్వసుధాతలమ్, 27
కృత్వా తత్రాభిషేకం తే బభూవుర్గతకల్మషాః.

ప్ర. అ. యే చ=ఎవరు, శాపాత్=శాపమువలన, గగనాత్=ఆకాశమునుండి, వసుధాతలమ్ = భూతలమునుగూర్చి, ప్రపతితాః = పడినారో, తే = వారు, తత్ర = దానియందు, అభిషేకమ్ = స్నానమును, కృత్వా = చేసి, గతకల్మషాః=తొలగిన కల్మషములు కలవారు, బభూవుః = అయిరి.

తా. శాపవశముచేత స్వర్గమునుండి భూలోకములో పడినవారు గంగలో స్నానము చేసి, పాపరహితు లైరి. 27

మూ. ధూతపాపాః పునస్తేన తోయేనాథ సుభాస్వతా, 28
పునరాకాశమావిశ్య స్వాన్ లోకాన్ ప్రతిపేదిరే.

ప్ర. అ. తేన=ఆ, సుభాస్వతా = బాగుగా ప్రకాశించుచున్న, తోయేన= జలముచేత, ధూతపాపాః = కడిగి వేయబడిన పాపములు కలవారై, పునః = మరల, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, అథ = పిమ్మట, పునః = మరల, స్వాన్ = తమ, లోకాన్ = లోకములను, ప్రతిపేదిరే = పొందిరి.

తా. ప్రకాశించుచున్న ఆ జలము పాపము లన్నింటిని కడిగివేయగా, వారు ఆకాశములోనికి ఎగిరి తమ లోకములు చేరిరి. 28

మూ. ముముదే ముదితో లోకస్తేన తోయేన భాస్వతా, 29
కృతాభిషేకో గఙ్గాయాం బభూవ విగతక్లమః.

ప్ర. అ. లోకః = జనము, భాస్వతా = ప్రకాశించుచున్న, తేన = ఆ, తోయేన=ఉదకముచేత, ముముదే = సంతసించెను, ముదితః = సంతసించినదై, గఙ్గాయామ్ = గంగయందు, కృతాభిషేకః = చేయబడిన స్నానము గలదై, విగతక్లమః = తొలగిన శ్రమ కలదై, బభూవ=ఆయెను.

తా. ప్రకాశించు చున్న ఆ జలమును చూచి జను లందరును చాల సంతసించి, ఆ గంగలో స్నానము చేసి శ్రమమును పోగొట్టుకొనిరి. 29

మూ. భగీరథోఽపి రాజర్షిర్దివ్యం స్యన్దనమాస్థితః, 30
ప్రాయాదగ్రే మహాతేజా గఙ్గా తం పృష్ఠతోఽన్వగాత్.

ప్ర. అ. తా. చూ. శ్లో. 14. గఙ్గా=గంగ, తమ్=వానిని, పృష్ఠతః= వెనుక, అన్వగాత్=అనుసరించెను. 30

మూ. దేవాః సర్షిగణాః సర్వే దైత్యదానవరాక్షసాః, 31
గన్ధర్వ యక్షప్రవరాః సకిన్నరమహోరగాః,
సర్వాశ్చాప్సరసో రామ భగీరథరథానుగామ్, 32
గఙ్గామన్వగమన్ ప్రీతాః సర్వే జలచరాశ్చ యే.

ప్ర. అ. రామ=రామా! సర్షిగణాః=ఋషిగణములతో కూడిన, దేవాః= దేవతలును, సర్వే = సమస్త మైన, దైత్యదానవరాక్షసాః = దైత్యదానవ రాక్షసులును, సకిన్నరమహోరగాః = కిన్నరులతోడను, మహోరగులతోడను కూడిన, గన్ధర్వయక్షప్రవరాః = గంధర్వులును శ్రేష్ఠులైన యక్షులును, సర్వాః=సమస్త మైన, అప్సరసః=అప్సరసలును, ప్రీతాః=సంతోషించినవారై, భగీరథరథానుగామ్=భగీరథుని రథమును అనుసరించి పోవుచున్న, గఙ్గామ్ = గంగను, అన్వగమన్ = అనుసరించిరి. యే=ఏ, జలచరాశ్చ = జలచరము లున్నవో, సర్వే=అవి అన్నియు, అనుసరించినవి.

తా. రామా! భగీరథుని అనుసరించి గంగ వెళ్లుచుండగా, జలచరములే కాక, దేవ-ఋషి-దైత్య-దానవ-రాక్షస-గంధర్వ-యక్ష-కిన్నర-మహోరగ- అప్సరసలు గూడ ఆ గంగ వెంట వెళ్లిరి. 31, 32

మూ. యతో భగీరథో రాజా తతో గఙ్గా యశస్వినీ, 33
జగామ సరితాం శ్రేష్ఠా సర్వపాపప్రణాశినీ.

ప్ర. అ. రాజా=రాజైన, భగీరథః=భగీరథుడు, యతః=ఎటు వైపు వెళ్లెనో, యశస్వినీ=యశఃశాలినియు, సరితాం శ్రేష్ఠా=నదులలో శ్రేష్ఠురాలును, సర్వపాపప్రణాశినీ = సమస్తపాపములను నశింపచేయునదియు అగు, గఙ్గా = గంగ, తతః=అటువైపునకే, జగామ=వెళ్లెను.

తా. భగీరథుడు ఎటు వైపు వెళ్లెనో, యశస్వినియు, నదీశ్రేష్ఠయు, సర్వపాపవినాశినియు అగు గంగ కూడ అటు వైపునకే ప్రవహించుచు వెళ్లెను. 33

మూ. తతో హి యజమానస్య జహ్నోరద్భుతకర్మణః, 34
గఙ్గా సంప్లావయామాస యజ్ఞవాటం మహాత్మనః.

ప్ర. అ. తతః = పిమ్మట, గఙ్గా = గంగ, యజమానస్య = యజ్ఞము చేయుచున్న, అద్భుతకర్మణః = అద్భుతమైన కర్మ గల, మహాత్మనః = మహాత్ముడైన, జహ్నోః = జహ్నుమహర్షియొక్క, యజ్ఞవాటమ్ = యజ్ఞశాలను, సంప్లావయామాస = నీటిలో ముంచె తివేసెను.

తా. ఆ విధముగ ప్రవహించుచు వెళ్లుచున్న గంగ మార్గమధ్యమున అద్భుత మైన కర్మ కలవాడును, మహాత్ముడును అగు జహ్నుమహర్షి యజ్ఞము చేయుచుండగా ఆ యజ్ఞవాటమును ముంచివేసెను. 34

మూ. తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధో యజ్వా తు రాఘవ, 35
అపిబచ్చ జలం సర్వం గఙ్గాయాః పరమాద్భుతమ్.

ప్ర. అ. రాఘవ = రామా ! యజ్వా = యాగముచేయుచున్న ఆ జహ్నుమహర్షి, తస్యాః = ఆమెయొక్క, వలేపనమ్ = గర్వమును, జ్ఞాత్వా = తెలుసుకొని, క్రుద్ధః = కోపగించినవాడై, గఙ్గాయాః=గంగయొక్క, సర్వమ్ = సమస్తమైన, జలమ్ = జలమును, పరమాద్భుతమ్ = చాల ఆశ్చర్యకర మగునట్లుగా, అపిబత్ = త్రాగివేసెను.

తా. రామా! యజ్ఞముచేయుచున్న ఆ జహ్నుమహర్షి గంగ గర్వమును చూచి, కోపించి ఆ గంగాజలము నంతను త్రాగివేసెను. అది చాల ఆశ్చర్య కరముగ నుండెను. 35

మూ. తతో దేవాః సగన్ధర్వా ఋషయశ్చ సువిస్మితాః, 36
పూజయన్తి మహాత్మానం జహ్నుం పురుషసత్తమమ్,
గఙ్గాం చాపి నయన్తి స్మ దుహితృత్వే మహాత్మనః. 37

ప్ర. అ. తతః = పిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః= దేవతలును, ఋషయశ్చ = ఋషులును, సువిస్మితాః = చాల ఆశ్చర్యపడినవారై, పురుషసత్తమమ్=పురుషశ్రేష్ఠుడైన, మహాత్మానమ్=మహాత్ముడైన, జహ్నుమ్= జహ్నుమహర్షిని, పూజయన్తి = పూజించుచున్నారు. గఙ్గాం చ = గంగను కూడ, మహాత్మనః = మహాత్ముడైన జహ్నుమహర్షియొక్క, దుహితృత్వే=దుహితగా అగుటను, నయన్తి = పొందించుచున్నారు.

తా. పిమ్మట, దేవతలును, గంధర్వులును, ఋషులును చాల ఆశ్చర్యము చెందినవారై, పురుషశ్రేష్ఠుడైన, మహాత్ముడైన, జహ్నుమహర్షిని పూజించిరి. గంగను ఆ మహాత్ముని కుమార్తెనుగా చేయ నిర్ణయించిరి. 36, 37

మూ. తతస్తుష్టో మహాతేజాః శ్రోత్రాభ్యామసృజత్పునః,
తస్మాజ్జహ్నుసుతా గఙ్గా ప్రోచ్యతే జాహ్నవీతి చ. 38

ప్ర. అ. తతః = పిమ్మట, తుష్టః = సంతసించిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల ఆ జహ్నుమహర్షి, పునః = మరల, శ్రోత్రాభ్యామ్ = చెవులనుండి, అసృజత్ = సృజించెను, తస్మాత్ = ఆ కారణమువలన, గఙ్గా = గంగ, జహ్నుసుతా = "జహ్నుసుత" అనియు, జాహ్నవీతి చ="జాహ్నవి" యనియు, ప్రోచ్యతే = చెప్పబడుచున్నది.

తా. పిమ్మట మహాతేజస్సు గల ఆ జహ్నుమహర్షి సంతసించినవాడై, మరల చెవులనుండి గంగను విడచెను. అందుచే గంగకు "జహ్నుసుత" అనియు, "జాహ్నవి" అనియు పేర్లు వచ్చినవి. 38

మూ. జగామ చ పునర్గఙ్గా భగీరథపథానుగా,
సాగరం చాపి సంప్రాప్తా సా సరిత్ప్రవరా తదా, 39
రసాతలముపాగచ్ఛత్సిద్ధ్యర్థం తస్య కర్మణః.

ప్ర. అ. గఙ్గా=గంగ, పునః = మరల, భగీరథపథానుగా=భగీరథుని మార్గమును అనుసరించినదై, జగామ = వెళ్లెను. తదా = అప్పుడు, సా = ఆ, సరిత్ప్రవరా=నదులలో శ్రేష్ఠ మైన గంగ, సాగరం = సముద్రమును, సంప్రాప్తాపి = పొందిన దైనను, తస్య=ఆ, కర్మణః = పనియొక్క, సిద్ధ్యర్థమ్ = సిద్ధి కొరకు, రసాతలమ్ = పాతాళమును, ఉపాగచ్ఛత్ = పొందెను.

తా. నదులలో శ్రేష్ఠ యైన ఆ గంగ మరల భగీరథుని అనుసరించి, వెళ్లి సముద్రములో ప్రవేశించి, సగరపుత్రులను తరింప చేయుట అను పని పూర్తి చేయుటకు పాతాళమునకు వెళెను. 39

మూ. భగీరథోఽపి రాజర్షిర్గఙ్గామాదాయ యత్నతః, 40
పితామహాన్ భస్మకృతానపశ్యద్దీనచేతనః.

ప్ర. అ. రాజర్షిః = రాజర్షి యైన, భగీరథోఽపి = భగీరథుడు కూడ, యత్నతః=ప్రయత్నమువలన, గఙ్గామ్ = గంగను, ఆదాయ = తీసికొని వెళ్లి, దీనచేతనః = దీన మైన మనస్సు కలవాడై, భస్మకృతాన్ = భస్మముగా చేయబడిన, పితామహాన్ = తాతలను, అపశ్యత్ = చూచెను.

తా. రాజర్షి యైన భగీరథుడు ఇంత ప్రయత్నము చేసి, గంగను తీసికొని వెళ్లెను. అచట భస్మమై పడి యున్న పితామహులను చూచి, దుఃఖితుడయ్యెను. 40

మూ. అథ తద్భస్మనాం రాశిం గఙ్గాసలిలముత్తమమ్, 41
ప్లావయద్ధూతపాప్మానః స్వర్గం ప్రాప్తా రఘూత్తమ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. రఘూత్తమ = రామా, అథ = పిమ్మట, ఉత్తమమ్ = ఉత్తమ మైన, గఙ్గాసలిలమ్ = గంగాజలము, తత్ = ఆ, భస్మనామ్ = భస్మలయొక్క, రాశిమ్ = రాశిని, ప్లావయత్ = ముంచెను. ధూతపాపాః = కడిగి వేయబడిన పాపములు కలవారై, స్వర్గమ్ = స్వర్గమును, ప్రాప్తాః = చేరినారు.

తా. రామా! ఉత్తమ మైన ఆ గంగోదకము ఆ భస్మరాశిని తడపగా సగరకుమారు లందరును, పాపములు నశించి, స్వర్గము చేరిరి. 41

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో నలుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుశ్చత్వారింశః సర్గః

మూ. స గత్వా సాగరం రాజా గఙ్గయానుగతస్తదా,
ప్రవివేశ తలం భూమేర్యత్ర తే భస్మసాత్కృతాః. 1

ప్ర. అ. సః = ఆ, రాజా = రాజు, తదా = అప్పుడు, గఙ్గయా = గంగ చేత, అనుగతః = అనుసరింపబడినవాడై, సాగరమ్ = సముద్రమును గూర్చి, గత్వా = వెళ్లి, యత్ర = ఎచట, తే = ఆ సగరకుమారులు, భస్మసాత్ = భస్మముగా, కృతాః = చేయబడినారో అక్కడ, భూమేః = భూమియొక్క, తలమ్ = అడుగు భాగమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. అపుడు, గంగానది తన వెనుకనే వచ్చుచుండగా, భగీరథుడు సముద్రమునకు వెళ్లి, అచటినుండి, సగరకుమారులు భస్మమై పడి ఉన్న పాతాళలోకములో ప్రవేశించెను. 1

మూ. భస్మన్యథాప్లుతే రామ గఙ్గాయాః సలిలేన వై,
సర్వలోకప్రభుర్బ్రహ్మా రాజానమిదమబ్రవీత్. 2

ప్ర. అ. అథ = పిమ్మట, భస్మని = భస్మము, గఙ్గాయాః = గంగ యొక్క, సలిలేన = నీటిచేత, ఆప్లుతే = ముంచబడగా, సర్వలోకప్రభుః = సమస్తలోకములకును ప్రభువైన, బ్రహ్మా = బ్రహ్మ, రాజానమ్ = రాజును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. గంగాజలము భస్మమును ముంచెత్తిన పిమ్మట, సకలలోక ప్రభువైన బ్రహ్మదేవుడు భగీరథునితో ఇట్లు పలికెను. 2

మూ. తారితా నరశార్దూల దివం యాతాశ్చ దేవవత్,
షష్టిః పుత్రసహస్రాణి సగరస్య మహాత్మనః. 3

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా! మహాత్మనః = మహాత్ముడైన, సగరస్య = సగరునియొక్క, షష్టిః పుత్రసహస్రాణి = అరవై వేలమంది

కుమారులు, తారితాః = తరింప చేయబడినారు. దేవవత్=దేవతలవలె, దివమ్= స్వర్గమును గూర్చి, యాతాః=వెళ్లినారు.

తా. మహాత్ముడైన సగరుని అరువదివేలమంది కుమారులును తరింప బడినవారై, దేవతల వలె స్వర్గమునకు వెళ్లినారు. 3.

మూ. సాగరస్య జలం లోకే యావత్ స్థాస్యతి పార్థివ,
సగరస్యాత్మజాస్తావత్స్వర్గే స్థాస్యన్తి దేవవత్. 4.

ప్ర. అ. పార్థివ=రాజా ! సాగరస్య = సముద్రముయొక్క, జలమ్ = జలము, లోకే=లోకమునందు, యావత్=ఎంతవరకు, స్థాస్యతి=ఉండగలదో, తావత్=అంతవరకును, సగరస్య ఆత్మజాః=సగరుని కుమారులు, దేవవత్= దేవతల వలె, స్వర్గే=స్వర్గమునందు, స్థాస్యన్తి=ఉండగలరు.

తా. రాజా ! లోకములో సాగరజల మున్నంతవరకును, సగరకుమారులు దేవతల వలె స్వర్గములో ఉండగలరు. 4.

మూ. ఇయం చ దుహితా జ్యేష్ఠా తవ గఙ్గా భవిష్యతి,
త్వత్కృతేన చ నామ్నాథ లోకే స్థాస్యతి విశ్రుతా. 5.

ప్ర. అ. ఇయమ్=ఈ, గఙ్గా=గంగ, తవ=నీ యొక్క, జ్యేష్ఠా=పెద్ద, దుహితా=కుమార్తెగా, భవిష్యతి=కాగలదు, అథ = ఇటు పిమ్మట, త్వత్కృ తేన=నీచే ఏర్పడిన, నామ్నా=పేరుతో, లోకే = లోకమునందు, విశ్రుతా = ప్రసిద్ధురాలై, స్థాస్యతి=ఉండగలదు.

తా. ఈ గంగ నీకు పెద్దకుమార్తె కాగలదు. నీ పేరుతో సంబంధించిన "భాగీరథి" అను పేరుతో లోకమునందు ప్రసిద్ధి పొందగలదు. 5.

మూ. గఙ్గా త్రిపథగా రాజన్ దివ్యా భాగీరథీతి చ,
త్రీన్ పథో భావయన్తీతి తతస్త్రిపథగా స్మృతా. 6.

ప్ర. అ. రాజన్=రాజా, దివ్యా=స్వర్గలోకమునకు సంబంధించిన, గఙ్గా= గంగ, త్రిపథగా = త్రిపథగ యనియు, భాగీరథీతి చ = భాగీరథి అనియు,

ప్రసిద్ధి చెందును. త్రీన్ = మూడు, పథః = మార్గములను, భావయన్తీ = పవిత్రము చేయుచు ప్రవహించుచున్నది, ఇతి=అని, తతః=ఆ కారణమువలన, త్రిపథగా='త్రిపథగ' అని, స్మృతా=చెప్పబడినది.

తా. రాజా! గంగ త్రిపథగ అనియు, భాగీరథి యనియు ప్రసిద్ధి పొందును. మూడు మార్గములను, అనగా, స్వర్గలోక–భూలోక–పాతాళలోక మార్గములను తన ప్రవాహముచే పవిత్రింపచేయుచున్నది గాన త్రిపథగ అని చెప్పబడుచున్నది. 6

మూ. పితామహానాం సర్వేషాం త్వమత్ర మనుజేశ్వర,
కురుష్వ సలిలం రాజన్ ప్రతిజ్ఞామపవర్జయ. 7

ప్ర. అ. మనుజేశ్వర=మనుజులకు ప్రభు లైన, రాజన్=రాజా! త్వమ్=నీవు, ఈ గంగయందు, సర్వేషామ్ = సమస్త మైన, పితామహానామ్ = పితామహులకు, సలిలం కురుష్వ=జలతర్పణము లిమ్ము. ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, అపవర్జయ=పూర్తి చేసికొనుము.

తా. భగీరథా, ఈ గంగాజలముతో నీ పితామహు లందరికిని తర్పణములు చేసి నీ ప్రతిజ్ఞను నిలుపుకొనుము. 7

మూ. పూర్వకేణ హి తే రాజంస్తేనాతియశసా తదా,
ధర్మిణాం ప్రవరేణాపి నైష ప్రాప్తో మనోరథః. 8

ప్ర. అ. రాజన్ = రాజా, తే = నీయొక్క, పూర్వకేణ = పూర్వ పురుషుడును, అతియశసా = గొప్ప కీర్తి కలవాడును, ధర్మిణామ్ = ధర్మవంతులలో, ప్రవరేణ = శ్రేష్ఠుడును అగు, తేనాపి = ఆ సగరచక్రవర్తిచేత కూడ, తదా = అప్పుడు, ఏషః = ఈ, మనోరథః = మనోరథము, న ప్రాప్తః=పొందబడలేదు.

తా. రాజా! గొప్ప కీర్తి గలవాడును, ధార్మికులలో శ్రేష్ఠుడును అయిన నీ పూర్వపురుషుడు సగరచక్రవర్తి కూడ ఆనాడు, ఈ కోరికను తీర్చుకొనజాలక పోయెను. 8

మూ. తథైవాంశుమతా తాత లోకేఽప్రతిమతేజసా,
గఙ్గాం ప్రార్థయతా నేతుం ప్రతిజ్ఞా నాపవర్జితా. 9

ప్ర. అ. తాత = నాయనా! తథైవ = అట్లే, లోకే = లోకమునందు, అప్రతిమతేజసా=సాటి లేని తేజస్సు కలవాడును, గఙ్గామ్=గంగను, ఆనేతుమ్= తీసికొనివచ్చుటకు, ప్రార్థయతా = కోరుచున్నవాడును అగు, అంశుమతా = అంశుమంతునిచేత కూడ, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, నాపవర్జితా=పూర్తిచేయబడలేదు.

తా. లోకములో సాటి లేని తేజస్సు గల అంశుమంతుడు గూడ గంగను తీసుకొని రావలె ననెడు ప్రతిజ్ఞను పూర్తిచేసికొనలేకపోయెను. 9

మూ. రాజర్షిణా గుణవతా మహర్షిసమతేజసా,
మత్తుల్యతపసా చైవ క్షత్రధర్మస్థితేన చ,
దిలీపేన మహాభాగా తవ పిత్రాతితేజసా,
పునర్న శకితాఽనేతుం గఙ్గాం ప్రార్థయతోఽనఘ. 11

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! రాజర్షిణా = రాజర్షియు, గుణవతా=గుణవంతుడును, మహర్షిసమతేజసా=మహర్షితో సమాన మైన తేజస్సు కలవాడును, మత్తుల్యతపసా = నాతో సమాన మైన తపస్సు కలవాడును, క్షత్రధర్మస్థితేన=క్షత్రియధర్మమునం దున్నవాడును, అతితేజసా=గొప్ప తేజస్సు కలవాడును, గఙ్గామ్ = గంగను, ప్రార్థయతా = ప్రార్థించినవాడును అగు, తవ పిత్రా = నీ తండ్రియైన, దిలీపేన = దిలీపునిచేత, ఆనేతుం పునః= తీసికొనివచ్చుటకైతే, న శకితా = శక్యము కాలేదు.

తా. ఓ పుణ్యాత్ముడా! రాజర్షియు, గుణవంతుడును, మహర్షులతో సమాన మైన తేజస్సు కలవాడును, నా వంటి తపస్సు కలవాడును, క్షత్రియ ధర్మమును అవలంబించినవాడును, మంచి తేజస్సు కలవాడును, అగు నీ తండ్రి దిలీపుడు గంగను తీసుకొని రావలె నని కోరెను గాని తీసికొనిరాలేక పోయెను. 10, 11

మూ. సా త్వయా సమతిక్రాన్తా ప్రతిజ్ఞా పురుషర్షభ,
ప్రాప్తోఽసి పరమం లోకే యశః పరమసంమతమ్. 12

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! సా = ఆ, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, త్వయా = నీచేత, సమతిక్రాన్తా = దాటబడినది, లోకే=లోకమునందు, పరమ

సంమతమ్ = మిక్కిలి పూజ్య మైన, పరమమ్ = గొప్ప, యశః = కీర్తిని, ప్రాప్తః అసి = పొందినావు.

తా. పురుషశ్రేష్ఠుడా! ఆ ప్రతిజ్ఞను నీవు దాట గలిగినావు. లోకములో చాల మెచ్చుకొన దగిన గొప్ప కీర్తిని సంపాదించుకొనినావు. 12

మూ. యచ్చ గఙ్గావతరణం త్వయా కృతమరిన్దమ,
అనేన చ భవాన్ ప్రాప్తో ధర్మస్యాయతనం మహత్. 13

ప్ర. అ. అరిన్దమ = ఓ శత్రువినాశకుడా, త్వయా = నీచేత, యత్ = ఏ, గఙ్గావతరణమ్ = గంగను దింపుట చేయబడినదో, అనేన = దీనిచేత, భవాన్ = నీవు, ధర్మస్య = ధర్మముయొక్క, మహత్ = గొప్ప, ఆయతనమ్ = ప్రతిష్ఠను, ప్రాప్తః = పొందినావు.

తా. భగీరథా! నీవు గంగను క్రిందికి దింపుటవలన గొప్ప ధర్మప్రతిష్ఠను చేసినవాడ వైనావు. 13

మూ. ప్లావయస్వ త్వమాత్మానం నరోత్తమ సదోచితే,
సలిలే పురుషవ్యాఘ్ర శుచిః పుణ్యఫలో భవ. 14

ప్ర. అ. నరోత్తమ = నరులలో ఉత్తముడా! పురుషవ్యాఘ్ర = పురుష శ్రేష్ఠుడా! ఉచితే = తగిన, సలిలే = గంగాజలమునందు, సదా = ఎల్లప్పుడును, త్వమ్ = నీవు, ఆత్మానమ్ = నిన్ను, ప్లావయస్వ = ముంచుకొనుము. శుచిః = పవిత్రుడవై, పుణ్యఫలః = పుణ్య మైన ఫలముకలవాడవు, భవ = అగుము.

తా. నరోత్తముడవైన భగీరథా! స్నానోచిత మైన ఈ గంగాజలము నందు నిత్యము స్నానము చేసి పవిత్రుడవై, పుణ్యాత్ముడవు అగుము. 14

మూ. పితామహానాం సర్వేషాం కురుష్వ సలిలక్రియామ్,
స్వస్తి తేఽస్తు గమిష్యామి స్వం లోకం గమ్యతాం నృప. 15

ప్ర. అ. సర్వేషామ్ = సమస్త మైన, పితామహానామ్ = పితామహులకు, సలిలక్రియామ్ = జలతర్పణమును, కురుష్వ = చేయుము. తే = నీకు, స్వస్తి =

క్షేమ మగుగాక. గమిష్యామి = నేను వెళ్లెదను, నృప = రాజా ! స్వం లోకమ్ = నీ లోకమును గూర్చి, గమ్యతామ్=వెళ్లెదవుగాక.

**తా.** రాజా ! నీ పితామహు లందరికిని జలతర్పణము చేయుము. నీకు క్షేమ మగుగాక. నేను వెళ్లెదను. నీవు కూడ నీ లోకమునకు వెళ్లుము. 15

మూ. ఇత్యేవముక్త్వా దేవేశః సర్వలోకపితామహః,
యథాగతం తథాగచ్ఛద్దేవలోకం మహాయశాః. 16

ప్ర. అ. సర్వలోకపితామహః = సమస్తలోకములకును పితామహుడును, మహాయశాః = గొప్ప కీర్తికలవాడును అగు, దేవేశః = దేవతలకు ప్రభు వైన బ్రహ్మదేవుడు, ఇత్యేవమ్=ఈ విధముగా, ఉక్త్వా = పలికి, యథాగతం తథా = వచ్చిన విధముననే, దేవలోకమ్=దేవలోకమును గూర్చి, అగచ్ఛత్=వెళ్లెను.

**తా.** సమస్తలోకములకును పితామహు డైన ఆ బ్రహ్మదేవుడు ఈ విధముగ పలికి స్వర్గలోకమునకు మరలి వెళ్లెను. 16

మూ. భగీరథోఽపి రాజర్షిః కృత్వా సలిలముత్తమమ్,
యథాక్రమం యథాన్యాయం సాగరాణాం మహాయశాః. 17

కృతోదకః శుచీ రాజా స్వపురం ప్రవివేశ హ,
సమృద్ధార్థో రఘుశ్రేష్ఠ స్వరాజ్యం ప్రశశాస హ. 18

ప్ర. అ. రాజర్షిః=రాజర్షియు, మహాయశాః = గొప్ప కీర్తి కలవాడును, రాజా=రాజును అగు, భగీరథోఽపి=భగీరథుడు కూడ, యథాక్రమమ్=క్రమానుసారముగాను, యథాన్యాయమ్=న్యాయానుసారముగాను, సాగరాణామ్ = సగరపుత్రులకు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, సలిలమ్ = ఉదకమును, కృత్వా = చేసి, కృతోదకః=పూర్తి చేయబడిన ఉదకక్రియ కలవాడై, శుచిః = పవిత్రుడై, స్వపురమ్=తనపట్టణమును, ప్రవివేశ హ = ప్రవేశించెను. రఘుశ్రేష్ఠ=రామా ! సమృద్ధార్థః=తీరిన కోరికగలవాడై, స్వరాజ్యమ్ = తన రాజ్యమును, ప్రశశాస హ = పరిపాలించెను.

**తా.** రామా ! గొప్ప కీర్తి గల భగీరథుడు సగరకుమారు లందరికిని క్రమానుసారముగా శాస్త్రము ననుసరించి జలతర్పణములు చేసి, పవిత్రుడై తన

పురమును ప్రవేశించెను. ఈ విధముగ చరితార్థుడై తన రాజ్యమును పరిపాలించెను. 17, 18

మూ. ప్రముమోద హ లోకస్తం నృపమాసాద్య రాఘవ,
నష్టశోకః సమృద్ధార్థో బభూవ విగతజ్వరః. 19

ప్ర. అ. రాఘవ=రామా! తమ్ = ఆతనిని, నృపమ్ = రాజునుగా, ఆసాద్య=పొంది, లోకః = లోకము, ప్రముమోద = సంతోషించెను. (అతడు) సమృద్ధార్థః=తీరిన కోరికగలవాడై, విగతజ్వరః=పోయిన మనస్తాపము గలవాడై, నష్టశోకః = నశించిన శోకముకలవాడు, బభూవ=ఆయెను.

తా. రామా! భగీరథుడు రాజుగా ఉండుటచే లోక మంతయు సంతోషించెను. భగీరథుడు కూడ కోరిక తీరుటచే శోకము, మనస్తాపము తొలగి సుఖముగా నుండెను. 19

మూ. ఏష తే రామ గఙ్గాయా విసరోఽభిహితో మయా,
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే సన్ధ్యాకాలోఽతివర్తతే. 20

ప్ర. అ. రామ=రామా! గఙ్గాయాః = గంగయొక్క, ఏషః = ఈ, విస్తరః = కథావిస్తరము, మయా = నాచేత, తే = నీకు, అభిహితః = చెప్పబడినది. స్వస్తి=మంగళమును, ప్రాప్నుహి = పొందుము, తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. సన్ధ్యాకాలః = సంధ్యా సమయము, అతివర్తతే = దాటి పోవుచున్నది.

తా. రామా! గంగను గూర్చి విస్తృత మైన కథను చెప్పినాను. దీనిని వినుటచే మంగళమును పొందుము. నీకు క్షేమ మగుగాక. సంధ్యాకాలము దాటి పోవుచున్నది. ఇక సంధ్యావందనాదికము చేసికొందము. 20

మూ. ధన్యం యశస్యమాయుష్యం పుత్ర్యం స్వర్గ్యమతీవ చ,
యః శ్రావయతి విప్రేషు క్షత్రియేష్వితరేషు చ, 21
ప్రీయన్తే పితరస్తస్య ప్రీయన్తే దైవతాని చ.

ప్ర. అ. ధన్యమ్ = ధనము నిచ్చునదియు, యశస్యమ్ = యశస్సును కలిగించునదియు, ఆయుష్యమ్=ఆయుస్సును పెంచునదియు, పుత్ర్యమ్=పుత్రులను ఇచ్చునదియు, అతీవ = మిక్కిలి, స్వర్గ్యమ్ = స్వర్గమును చేర్చునదియు అగు ఈ ఉపాఖ్యానమును, యః=ఎవడు, విప్రేషు = బ్రాహ్మణులకును, క్షత్రియేషు=క్షత్రియులకును, ఇతరేషు చ = ఇతరులకును, శ్రావయతి=వినిపించునో, తస్య=వానియొక్క, పితరః=పితృదేవతలు, ప్రీయన్తే = సంతోషింతురు, దైవతాని చ=దేవతలు కూడ, ప్రీయన్తే=సంతోషింతురు.

తా. ఈ గంగావతరణవృత్తాంతము ఐశ్వర్యమును, యశస్సును, ఆయుర్దాయమును, పుత్రులను, స్వర్గమును ఇచ్చును. దీనిని బ్రాహ్మణులకును, క్షత్రియులకును, ఇతరులకును వినిపించువాని విషయమున ఆతని పితృదేవతలును, దేవతలును సంతోషింతురు. 21

మూ. ఇదమాఖ్యానమవ్యగ్రో గఙ్గావతరణం శుభమ్, 22
యః శృణోతి చ కాకుత్స్థ సర్వాన్ కామానవాప్నుయాత్,
సర్వే పాపాః ప్రణశ్యన్తి ఆయుః కీర్తిశ్చ వర్ధతే. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ=రామా! ఇదమ్=ఈ. శుభమ్ = శుభ మైన, గఙ్గావతరణమ్=గంగావతరణ మనెడు, ఆఖ్యానమ్=ఆఖ్యానమును, యః = ఎవడు, అవ్యగ్రః=ఏకాగ్రచిత్తు డై, శృణోతి=వినునో, అతడు, సర్వాన్=సమస్త మైన, కామాన్=కామములను, అవాప్నుయాత్ = పొందును. సర్వే = సమస్త మైన, పాపాః = పాపములు, ప్రణశ్యన్తి = నశించును. ఆయుః = ఆయుర్దాయము, కీర్తిశ్చ=కీర్తియు, వర్ధతే=వృద్ధి పొందును.

తా. రామా! పవిత్ర మైన ఈ గంగావతరణ కథను వినువాడు సమస్త కామములను పొందగలడు. ఆతని పాపము లన్నియు నశించును. ఆయుర్దాయము, కీర్తి వృద్ధి పొందును. 22, 23

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు, బాలకాండలో
నలుబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చచత్వారింశః సర్గః

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా రాఘవః సహ లక్ష్మణః,
విస్మయం పరమం గత్వా విశ్వామిత్రమథాబ్రవీత్. 1

ప్ర. అ. సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రాఘవః = రాముడు, విశ్వామిత్రవచః=విశ్వామిత్రుని యొక్క వాక్యమును, శ్రుత్వా=విని, పరమమ్=గొప్ప, విస్మయమ్=ఆశ్చర్యమును, గత్వా = పొంది, అథ = పిమ్మట, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణసమేతు డైన రాముడు, విశ్వామిత్రుని మాటలను విని, చాల ఆశ్చర్యము చెంది అతనితో ఇట్లనెను. 1

మూ. అత్యద్భుతమిదం బ్రహ్మన్ కథితం పరమం త్వయా,
గఙ్గావతరణం పుణ్యం సాగరస్యాపి పూరణమ్. 2

ప్ర. అ. బ్రహ్మన్=బ్రాహ్మణశ్రేష్ఠుడా ! త్వయా = నీచేత, కథితమ్=చెప్పబడిన, పరమమ్=గొప్ప దైన, ఇదమ్=ఈ, గఙ్గావతరణమ్=గంగయొక్క అవతరణము, పుణ్యమ్ = పుణ్యమైన, సాగరస్య = సముద్రము యొక్క, పూరణమ్=నింపుటయు, అత్యద్భుతమ్=చాల ఆశ్చర్యకర మైనది.

తా. ఓ బ్రహ్మర్షీ, నీవు నీవు చెప్పిన ఈ గొప్ప దైన గంగావతరణము, సాగరమును నింపుటయు చాల ఆశ్చర్యకరములు. 2

మూ. తస్య సా శర్వరీ సర్వా సహ సౌమిత్రిణా తదా,
జగామ చిన్తయానస్య విశ్వామిత్రకథాం శుభామ్. 3

ప్ర. అ. తదా = అప్పుడు, తస్య = ఆరాముడు, సౌమిత్రిణా సహ= లక్ష్మణునితో, శుభామ్=శుభమైన, విశ్వామిత్రకథామ్ = విశ్వామిత్రుడు చెప్పిన కథను గూర్చి, చిన్తయానస్య=ముచ్చటించుచుండగా, సా=ఆ, సర్వా=సమస్త మైన, శర్వరీ=రాత్రి, గతా = కడచినది.

తా. విశ్వామిత్రుడు చెప్పిన కథను గూర్చి రామలక్ష్మణు లిరువురును ముచ్చటించుకొనుచుండగనే రాత్రి కడచిపోయినది. 3

మూ. తతః ప్రభాతే విమలే విశ్వామిత్రం మహామునిమ్,
ఉవాచ రాఘవో వాక్యం కృతాహ్నికమరిన్దమః. 4

ప్ర. అ. తతః = పిమ్మట, అరిన్దమః = శత్రువులను నశింపచేయు, రాఘవః=రాముడు, విమలే=స్వచ్ఛ మైన, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, కృతాహ్నికమ్ = చేయబడిన ఆహ్నికకృత్యములు గల, మహామునిమ్ = మహాముని యైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. అంతట, శత్రుసంహారదక్షు డగు రాముడు, ప్రశాంత మైన ప్రాతఃకాలమునందు, ఆహ్నికకృత్యము లన్నియు పూర్తి చేసికొని కూర్చున్న విశ్వామిత్రునితో ఇట్లనెను. 4

మూ. గతా భగవతీ రాత్రిః శ్రోతవ్యం పరమం శ్రుతమ్,
క్షణభూతేవ నౌ రాత్రిః సంవృత్తేయం మహాతపః. 5
ఇమాం చిన్తయతోః సర్వాం నిఖిలేన కథాం తవ.

ప్ర. అ. మహాతపః=గొప్ప తపస్సు కలవాడా ! పరమమ్=గొప్పదైన, శ్రోతవ్యమ్=వినదగినది, శ్రుతమ్ = వినబడినది. భగవతీ = పూజ్యురాలైన, రాత్రిః=రాత్రి, గతా=కడచినది. తవ=నీయొక్క, ఇమామ్=ఈ, సర్వామ్= సమస్త మైన, కథామ్=కథనుగూర్చి, చిన్తయతోః=ఆలోచించుచున్న, నౌ = మాఇద్దరికిని, ఇయమ్ = ఈ, రాత్రిః = రాత్రి, క్షణభూతేవ = ఒక్క క్షణ మాత్రము వలె, సంవృత్తా=కడచిపోయినది.

తా. ఓ మహాతపఃశాలీ ! వినదగిన గొప్ప ఉపాఖ్యానమును వింటిమి. పూజ్యురా లైన రాత్రి కడచినది. నీవు చెప్పిన ఈ కథ నంతను ఆలోచించు చుండగా, మా ఇద్దరికిని ఈ రాత్రి ఒక్క క్షణము వలె కడచిపోయినది. 5

మూ. తరామ సరితాం శ్రేష్ఠాం పుణ్యాం త్రిపథగాం నదీమ్, 6
నౌరేషా హి సుఖాస్తీర్ణా ఋషీణాం పుణ్యకర్మణామ్,
భగవన్తమిహ ప్రాప్తం జ్ఞాత్వా త్వరితమాగతా. 7

ప్ర. అ. సరితామ్ = నదులలో, శ్రేష్ఠామ్ = శ్రేష్ఠ మైన, పుణ్యామ్ = పుణ్యమైన, త్రిపథగామ్=మూడు మార్గములలో ప్రవహించు, నదీమ్=గంగా నదిని, తరామ=దాటుదము. సుఖాస్తీర్ణా=సుఖముగా కప్పబడిన, పుణ్యకర్మ ణామ్=పుణ్యకర్మ గల, ఋషీణామ్=ఋషులయొక్క, ఏషా=ఈ, నౌః=నావ, భగవన్తమ్ = పూజ్యుడ వైన నిన్ను, ఇహ = ఇచటికి, ప్రాప్తమ్ = వచ్చిన వానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, త్వరితమ్=శీఘ్రముగా, ఆగతా హి = వచ్చి యున్నది కదా.

తా. నదులలో శ్రేష్ఠ మైన, పుణ్య మైన, ఈ గంగానదిని దాటుదము. నీవు ఇచటికి వచ్చినట్లు తెలియగనే, ఈ పుణ్యాత్ము లైన ఋషీశ్వరుల నావను, చక్కగ మెత్తని చాప మొదలైనవాటిచే కప్పి తీసికొని వచ్చినారు. 6, 7

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
సంతారం కారయామాస సర్షిసంఘః సరాఘవః. 8

ప్ర. అ. తస్య=ఆ, మహాత్మనః=మహాత్ముడైన, రాఘవస్య=రాముని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, సర్షిసంఘః = ఋషిసంఘముతో కూడినవాడై, సరాఘవః = రామలక్ష్మణులతో కూడినవాడై, సంతారం=దాటుటను, కారయామాస=చేయించెను.

తా. విశ్వామిత్రుడు మహాత్ము డైన రాముని మాటలు విని ఋషులతోను, రామలక్ష్మణులతోను తాను నదిని దాటుటకు ఏర్పాటు చేయించెను. 8

మూ. ఉత్తరం తీరమాసాద్య సంపూజ్యర్షిగణం తదా,
గఙ్గాకూలే నివిష్టాస్తే విశాలాం దదృశుః పురీమ్. 9

ప్ర. అ. ఉత్తరం తీరమ్=ఉత్తరమున నున్న ఒడ్డును, ఆసాద్య=పొంది, తదా=అప్పుడు, ఋషిగణమ్ = ఋషిసముదాయమును, సంపూజ్య=పూజించి, గఙ్గాకూలే = గంగాతీరమునందు, నివిష్టాః = విడిదిచేసియున్న, తే = వారు, విశాలాం పురీమ్=విశాల అను పురమును, దదృశుః=చూచిరి.

తా. ఉత్తరతీరమును చేరి, నావచే తమను దాటించిన ఋషులను పూజించి గంగాకూలమున విడిసి యున్న వారు విశాలానగరమును చూచిరి. 9

మూ. తతో మునివరస్తూర్ణం జగామ సహ రాఘవః,
విశాలాం నగరీం రమ్యాం దివ్యాం స్వర్గోపమాం తదా. 10

ప్ర. అ. తతః=పిమ్మట, మునివరః=మహాముని, సహ రాఘవః = రామలక్ష్మణులతో కూడినవాడై, తదా=అప్పుడు, రమ్యామ్ = సుందర మైన దియు, దివ్యామ్=ప్రకాశించుచున్నదియు, స్వర్గోపమామ్ = స్వర్గముతో సమాన మైనదియు అగు, విశాలానగరీమ్ = విశాల యనెడు నగరమును గూర్చి, తూర్ణమ్ = శీఘ్రముగా, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట, విశ్వామిత్రుడు, రామలక్ష్మణసమేతుడై, రమ్యము, దివ్యము, స్వర్గతుల్యము అగు విశాలానగరమునకు శీఘ్రముగ వెళ్లెను. 10

మూ. అథ రామో మహాప్రాజ్ఞో విశ్వామిత్రం మహామునిమ్,
పప్రచ్ఛ ప్రాఞ్జలిర్భూత్వా విశాలాముత్తమాం పురీమ్. 11

ప్ర. అ. అథ = పిమ్మట, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధిమంతు డైన, రామః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడు, భూత్వా = అయి, మహామునిమ్=మహాముని యైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, ఉత్తమామ్ = ఉత్తమ మైన, విశాలాం పురీమ్=విశాలానగరమునుగూర్చి, పప్రచ్ఛ=అడిగెను.

తా. మహాబుద్ధిశాలి యగు రాముడు విశాలానగరమును గూర్చి విశ్వామిత్రుని సవినయముగ ప్రశ్నించెను. 11

మూ. కతరో రాజవంశోఽయం విశాలాయాం మహామునే,
శ్రోతుమిచ్ఛామి భద్రం తే పరం కౌతూహలం హి మే. 12

ప్ర. అ. మహామునే=ఓమహామునీ! విశాలాయామ్ = ఈవిశాలానగరమునందు, అయమ్=ఈ, రాజవంశః=రాజవంశము, కతరః=ఏది? శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించుచున్నాను, తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. మే=నాకు, పరమ్ = గొప్ప, కౌతూహలం హి=ఆసక్తి ఉన్నది కదా.

తా. మహామునీ! ఇపుడు ఈ విశాలానగరమును ఏ రాజవంశమునకు చెందిన వారు పాలించుచున్నారో వినగోరుచున్నాను. నాకు చాల వినవేడుకగా ఉన్నది. నీకు మంగళ మగుగాక. 12

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రామస్య మునిపుఙ్గవః,
ఆఖ్యాతుం తత్సమారేభే విశాలస్య పురాతనమ్. 13

ప్ర. అ. మునిపుఙ్గవః=మునిశ్రేష్ఠుడు, తస్య = ఆ, రామస్య = రాముని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, విశాలస్య = విశాలనగరముయొక్క, పురాతనమ్ = ప్రాచీన మైన, తత్ = ఆ ఆఖ్యానమును, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, సమారేభే=ప్రారంభించెను.

తా. విశ్వామిత్రుడు రాముని వచనము విని ప్రాచీన మైన విశాలాపుర వృత్తాంతమును చెప్పుటకు ప్రారంభించెను. 13

మూ. శ్రూయతాం రామ శక్రస్య కథాం కథయతః శుభామ్,
అస్మిన్ దేశే తు యద్వృత్తం తదపి శృణు రాఘవ. 14

ప్ర. అ. రాఘవ=రామా! శక్రస్య=దేవేంద్రునియొక్క, శుభామ్ = శుభ మైన, కథామ్ = కథను, కథయతః = చెప్పుచున్న నానుండి, శ్రూయతామ్=విన బడుగాక, అస్మిన్ దేశే=ఈ దేశమునందు, యత్=ఏది, వృత్తమ్=జరిగినదో, తదపి = దానిని కూడ, శృణు = వినుము.

తా. రామా ! శుభ మైన దేవేంద్రుని కథ చెప్పెదను, వినుము. ఈ ప్రదేశములో ఏమి జరిగినదో వినుము. 14

మూ. పూర్వం కృతయుగే రామ దితేః పుత్రా మహాబలాః,
అదితేశ్చ మహాభాగ వీర్యవన్తః సుధార్మికాః. 15

ప్ర. అ. మహాభాగ=మహాభాగ్యవంతుడా ! రామ=రామా ! పూర్వమ్= పూర్వము, కృతయుగే=కృతయుగమునందు, దితేః=దితియొక్క, పుత్రాః= పుత్రులును, అదితేశ్చ = అదితియొక్క పుత్రులును, మహాబలాః = గొప్ప బలము కలవారుగను, వీర్యవన్తః = వీర్యవంతులుగను, సుధార్మికాః = చాల ధార్మికులుగను, ఉండెడివారు.

తా. మహాభాగ్యశాలి వగు రామా ! పూర్వము కృతయుగమునందు దితిపుత్రులును, అదితిపుత్రులును మహాబలవంతులై, వీర్యవంతులై, వరమ ధార్మికులై ఉండెడి వారు. 15

మూ. తతస్తేషాం నరశ్రేష్ఠ బుద్ధిరాసీన్మహాత్మనామ్,
అమరా అజరాశ్చైవ కథం స్యామ నిరామయాః. 16

ప్ర. అ. తతః=పిమ్మట, నరశ్రేష్ఠ=ఓ నరశ్రేష్ఠుడా, మహాత్మనామ్=మహాత్ములైన, తేషామ్=వారికి, అజరాః = ముసలితనము లేనివారమై, అమరాశ్చైవ=మరణము లేనివారమై, నిరామయాః=రోగములు లేనివారము, కథమ్=ఎట్లు, స్యామ=అగుదుము అని, బుద్ధిః=బుద్ధి, ఆసీత్=ఆయెను.

తా. నరశ్రేష్ఠుడవైన రామా! "మనకు ముసలితనము, మరణము, రోగములు లేకుండ ఉండవలెను. ఇందుకు ఉపాయ మేమి" అని ఆ మహాత్ములు ఆలోచింపసాగిరి. 16

మూ. తేషాం చిన్తయతాం రామ బుద్ధిరాసీన్మహాత్మనామ్,
క్షీరోదమథనం కృత్వా రసం ప్రాప్స్యామ తత్ర వై. 17

ప్ర. అ. రామ=రామా! చిన్తయతామ్=ఈ విధముగా ఆలోచించుచున్న, తేషామ్=ఆ, మహాత్మనామ్=మహాత్ములకు, బుద్ధిః=బుద్ధి, ఆసీత్ = కలిగెను. క్షీరోదమథనమ్=క్షీరసముద్రమథనమును, కృత్వా=చేసి, తత్ర=దానియందు, రసమ్=అమృతమును, ప్రాప్స్యామ=పొందెదము.

తా. ఈ విధముగ ఆలోచింపగా ఆలోచింపగా, వారికి, మనము క్షీర సముద్రమును మథించి, అచట అమృతమును పొందెదము" అను అభిప్రాయము కలిగినది. 17

మూ. తతో నిశ్చిత్య మథనం యోక్త్రం కృత్వా చ వాసుకిమ్,
మన్థానం మన్దరం కృత్వా మమన్థురమితౌజసః. 18

ప్ర. అ. తతః=పిమ్మట, అమితౌజసః=గొప్ప తేజస్సు గల ఆ దైత్యాదిత్యులు, మథనమ్=మథించుటను, నిశ్చిత్య=నిశ్చయించి, వాసుకిమ్=వాసుకిని, యోక్త్రమ్=త్రాడునుగా, కృత్వా = చేసి, మన్దరమ్=మందర పర్వతమును, మన్థానమ్=కవ్వమునుగా, కృత్వా=చేసి, మమన్థుః=మథించిరి.

తా. పిమ్మట, అమిత మైన తేజస్సు గల వారందరును మథనము చేయవలె నని నిశ్చయించి, వాసుకిని త్రాడుగా చేసి, మందరపర్వతమును కవ్వముగా చేసి మథింపసాగిరి. 18

మూ. అథ వర్షసహస్రేణ యోక్త్రసర్పశిరాంసి చ,
వమన్త్యతివిషం తత్ర దదంశుర్దశనైః శిలాః. 19

ప్ర. అ. అథ = పిమ్మట, వర్షసహస్రేణ = వేయి సంవత్సరములకు, యోక్త్రసర్పశిరాంసి = త్రాడుగా ఉన్న సర్పముయొక్క శిరస్సులు, తత్ర= అచట, అతివిషమ్=అధిక మైన విషమును, వమన్తి=కక్కుచున్నవి. శిలాః= శిలలను, దశనైః=దంతములచేత, దదంశుః=కరచినవి.

తా. పిమ్మట వేయి సంవత్సరములు గడచినవి. అపుడు త్రాడుగా ఉన్న వాసుకి శిరస్సులు విషమును కక్కుచు దంతములచే శిలలను కరవ ప్రారంభించినవి. 19

మూ. ఉత్పపాతాగ్నిసంకాశం హాలాహలమహావిషమ్,
తేన దగ్ధం జగత్సర్వం సదేవాసురమానుషమ్. 20

ప్ర. అ. అగ్నిసంకాశమ్ = అగ్నితో సమానమైన, హాలాహలమహావిషమ్=హాలాహల మనెడు మహావిషము, ఉత్పపాత=బయలుదేరెను. తేన= దానిచేత, సదేవాసురమానుషమ్=దేవాసురమనుష్యసహిత మైన, సర్వం జగత్= జగత్తు అంతయు, దగ్ధమ్=కాల్చబడినది.

తా. అగ్నితో సమాన మైన హాలాహలమహావిషము బయలుదేరి దేవాసురమనుష్యసహితముగా జగత్తు నంతను కాల్చివేయ మొదలిడినది. 20

మూ. అథ దేవా మహాదేవం శఙ్కరం శరణార్థినః,
జగ్ముః పశుపతిం రుద్రం త్రాహి త్రాహీతి తుష్టువుః. 21

ప్ర. అ. అథ=పిమ్మట, దేవాః = దేవతలు, శరణార్థినః = శరణము కోరుచు, మహాదేవమ్=గొప్ప దేవుడును, శంకరమ్ = సుఖమును కలిగించు

వాడును, పశుపతిమ్=సమస్తజీవులకు ప్రభువైనవాడును అగు, రుద్రమ్=రుద్రుని గూర్చి, జగ్ముః=వెళ్లిరి. త్రాహి త్రాహి=రక్షింపుము రక్షింపుము, ఇతి = అని, తుష్టువుః=స్తుతించిరి.

తా. అంత దేవత లందరును శరణువేడుచు మహాదేవుడును, సర్వజీవులకును పతియు అగు శంకరుని దగ్గరకు వెళ్లి "రక్షింపుము రక్షింపుము" అని పల్కుచు స్తుతించిరి. 21

మూ. ఏవముక్తస్తతో దేవైర్దేవదేవేశ్వరః ప్రభుః,
ప్రాదురాసీత్తతోఽత్రైవ శంఖచక్రధరో హరిః. 22

ప్ర. అ. తతః=పిమ్మట, ప్రభుః = ప్రభువైన, దేవదేవేశ్వరః = దేవదేవేశ్వరుడు, దేవైః=దేవతలచేత, ఏనమ్=ఈ విధముగ, ఉక్తః=పలకబడెను. తతః=పిమ్మట, శంఖచక్రధరః=శంఖచక్రములను ధరించిన, హరిః=విష్ణువు, అత్రైవ=ఇచటనే, ప్రాదురాసీత్=ప్రత్యక్ష మాయెను.

తా. దేవత లందరును సర్వరక్షణసమర్థు డగు ఆ దేవదేవేశ్వరునితో ఈ విధముగ పలికిరి. ఇంతలో శంఖచక్రధారి యైన హరి అచటనే ప్రత్యక్ష మాయెను. 22

మూ. ఉవాచైనం స్మితం కృత్వా రుద్రం శూలభృతం హరిః,
దైవతైర్మథ్యమానే తు యత్పూర్వం సముపస్థితమ్. 23

త్వదీయం హి సురశ్రేష్ఠ సురాణామగ్రజోఽసి యత్,
అగ్రపూజామిమాం మత్వా గృహాణేదం విషం ప్రభో. 24

ప్ర. అ. హరిః=విష్ణుమూర్తి, స్మితం కృత్వా = చిరునవ్వు నవ్వి, శూలభృతమ్=శూలమును ధరించిన, ఏనమ్=ఈ, రుద్రమ్ = రుద్రుని గూర్చి, ఉవాచ=పలికెను. సురశ్రేష్ఠ=దేవతలలో శ్రేష్ఠుడా! దైవతైః = దేవతలచేత, మథ్యమానే=మథనము చేయబడుచుండగా, యత్=ఏది, పూర్వమ్=ముందుగా, సముపస్థితమ్=వచ్చినదో, అది, త్వదీయం హి=నీది కదా. యత్=ఏ కారణము వలన, సురాణామ్=దేవతలలో, అగ్రజః= ముందు పుట్టినవాడవుగా, అసి=అయి

ఉన్నావో. ప్రభో=ఓ సమర్థుడా, ఇమామ్ = దీనిని, అగ్రపూజామ్ = అగ్ర పూజనుగా, మత్వా=తలచి, ఇదమ్ = ఈ, విషమ్ = విషమును, గృహాణ = గ్రహించుము.

తా. హరి చిరునవ్వు నవ్వుచు, శూలపాణి యైన శివునితో ఇట్లనెను. "ఓ సురశ్రేష్ఠుడా! నీవు దేవత లందరికన్నను ముందు పుట్టినవాడవు. అందుచేత దేవతలు మథించుచున్నపుడు ముందుగ పుట్టినది నీకే చెందవలెను. కావున, ఓ సమర్థుడా! దీనిని అగ్రపూజగా ఎంచి ఈ విషమును గ్రహింపుము." 23, 24

మూ. ఇత్యుక్త్వా చ సురశ్రేష్ఠస్తత్రైవాన్తరధీయత,
దేవతానాం భయం దృష్ట్వా శ్రుత్వా వాక్యం తు శార్ఙ్గిణః,
హాలాహలవిషం ఘోరం స జగ్రాహామృతోపమమ్. 25

ప్ర. అ. సురశ్రేష్ఠః = దేవతాశ్రేష్ఠు డైన విష్ణువు, ఇతి = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, తత్రైవ = అచటనే, అన్తరధీయత = అంతర్ధానము చెందెను. సః = ఆ శివుడు, దేవతానామ్ = దేవతలయొక్క, భయమ్ = భయమును, దృష్ట్వా = చూచి, శార్ఙ్గిణః = విష్ణువుయొక్క, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా= విని, ఘోరమ్ = భయంకర మైన, హాలాహలవిషమ్ = హాలాహలవిషమును, అమృతోపమమ్ = అమృతతుల్యమునుగా, జగ్రాహ = గ్రహించెను.

తా. విష్ణువు ఈ విధముగా పలికి అచటనే అంతర్ధానము చెందెను. శివుడు దేవతలకు కలిగిన భయమును చూచి, విష్ణువు చెప్పిన ప్రకారము, ఘోర మైన ఆ హాలాహలమును అమృతమును వలె గ్రహించెను. 25

మూ. దేవాన్విసృజ్య దేవేశో జగామ భగవాన్ హరః,
తతో దేవాసురాస్సర్వే మమన్థూ రఘునన్దన. 26

ప్ర. అ. దేవేశః = దేవతాప్రభు వైన, భగవాన్ = భగవంతు డైన, హరః=శివుడు, దేవాన్=దేవతలను, విసృజ్య=విడచి, జగామ=వెళ్లెను. రఘునన్దన = రామా! తతః = పిమ్మట, సర్వే = సమస్త మైన, దేవాసురాః=దేవతలును అసురులును, మమన్థుః = మథించిరి.

తా. రామా ! దేవాధిపతియు, భగవంతుడును అయిన శివుడు, దేవతలను వీడ్కొని వెళ్లిపోగా దేవాసురు లందరును మరల మథింపమొదలిడిరి. 26

మూ. ప్రవివేశాథ పాతాళం మన్థానః పర్వతోనఘ,
తతో దేవాః సగన్ధర్వాస్తుష్టువుర్మధుసూదనమ్. 27

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా, అథ = పిమ్మట, మన్థానః పర్వతః = కవ్వముగా ఉన్న పర్వతము, పాతాళమ్ = పాతాళమును, ప్రవివేశ = ప్రవేశించెను. తతః = పిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, మధుసూదనమ్ = విష్ణువును, తుష్టువుః = స్తుతించిరి.

తా. ఎట్టి దోషములును లేని ఓ రామా ! కవ్వముగా ఉన్న ఆ పర్వతము పాతాళమును ప్రవేశించెను. పిమ్మట దేవతలును గంధర్వులును విష్ణువును స్తుతించిరి. 27

మూ. త్వం గతిః సర్వభూతానాం విశేషేణ దివౌకసామ్,
పాలయాస్మాన్మహాబాహో గిరిముద్ధర్తుమర్హసి. 28

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా ! త్వమ్ = నీవు, సర్వభూతానామ్ = అన్ని భూతములకును, గతిః = గతివి. విశేషేణ = ప్రధానముగా, దివౌకసామ్ = దేవతలకు గతివి. అస్మాన్ = మమ్ములను, పాలయ = పాలించుము. గిరిమ్ = పర్వతమును, ఉద్ధర్తుమ్ = ఎత్తుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ మహాబాహూ ! నీవే సర్వభూతములకును గతి యైనవాడవు. ప్రధానముగ దేవతలకు నీవే గతి. పర్వతము నెత్తి మమ్ము రక్షింపుము. 28

మూ. ఇతి శ్రుత్వా హృషీకేశః కామఠం రూపమాస్థితః,
పర్వతం పృష్ఠతః కృత్వా శిశ్యే తత్రోదధౌ హరిః. 29

ప్ర. అ. హృషీకేశః = ఇంద్రియములకు అధిపతి యైన (ప్రవర్తకు డైన), హరిః = విష్ణువు, ఇతి = ఈ వాక్యమును, శ్రుత్వా = విని, కామఠం రూపమ్ = తాబేలు రూపమును, ఆస్థితః = ధరించినవాడై, పర్వతమ్ = పర్వతమును,

పృష్ఠతః = వీపుపై, కృత్వా = ఉంచి, తత్ర = అచట, ఉదధౌ = సముద్రము నందు, శిశ్యే = శయనించెను.

తా. ఇంద్రియములకు శక్తిని కూర్చువాడగు హరి ఈ వాక్యమును విని, కూర్మరూపమును ధరించి, ఆ పర్వతమును వీపుపై మోయుచు సముద్రములో శయనించెను. 29

మూ. పర్వతాగ్రే తు లోకాత్మా హస్తేనాక్రమ్య కేశవః,
దేవానాం మధ్యతః స్థిత్వా మమన్థ పురుషోత్తమః. 30

ప్ర. అ. లోకాత్మా = సకలలోకస్వరూపుడైన; పురుషోత్తమః = పురుషులలో ఉత్తముడైన, కేశవః=విష్ణువు, దేవానామ్=దేవతలయొక్క, మధ్యతః= మధ్యయందు, స్థిత్వా = ఉండి, పర్వతాగ్రే = పర్వతముయొక్క అగ్రమునందు, హస్తేన = హస్తముచేత, ఆక్రమ్య = ఆక్రమించి, మమన్థ = మథించెను.

తా. సకలలోకాత్ముడును, పురుషోత్తముడును అగు ఆ కేశవుడు, తాను దేవతల మధ్య కూడ నిలచి, పర్వతాగ్రమును ఆన్చి పట్టుకొని మథించెను. 30

మూ. అథ వర్షసహస్రేణ సదణ్డః సకమణ్డలుః,
పూర్వం ధన్వన్తరిర్నామ అప్సరాశ్చ సువర్చసః. 31

ప్ర. అ. అథ = పిమ్మట, వర్షసహస్రేణ = వేయి సంవత్సరముల తరువాత, సదణ్డః = దండముతో కూడినవాడును, సకమణ్డలుః = కమండలముతో కూడినవాడును అగు, ధన్వన్తరిర్నామ = ధన్వంతరి అను నతడును, సువర్చసః = మంచి తేజస్సు గల, అప్సరాశ్చ = అప్సరలును, పూర్వమ్ = ముందుగా, (బైటకు వచ్చిరి).

తా. ఈ విధముగా వేయి సంవత్సరములు కడచినవి. అంతట ముందుగా, దండకమండలువులతో కూడిన ధన్వంతరియు, మంచి కాంతి గల అప్సరః స్త్రీలును బైటకు వచ్చిరి. 31

మూ. అప్సు నిర్మథనాదేవ రసాత్తస్మాద్వరస్త్రియః,
ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్. 32

ప్ర. అ. మనుజశ్రేష్ఠ = మనుష్యులలో శ్రేష్ఠుడ వైన రామా, అప్సు = ఉదకమునందు, నిర్మథనాత్ = మథించుటవలన, తస్మాత్ = ఆ, రసాత్ = రసమునుండి, వరస్త్రియః = ఉత్తమ మైన స్త్రీలు, ఉత్పేతుః = బయలువెడలిరి. తస్మాత్ = ఆ కారణమువలన, అప్సరసః = అప్సరసలుగా, అభవన్ = అయిరి.

తా. మనుజశ్రేష్ఠుడ వైన రామా! జలమును మథించగా ఆ రసమునుండి ఆవిర్భవించుటచే ఆస్త్రీలకు అప్సరసలను పేరు వచ్చినది. 32

మూ. షష్టిః కోట్యోఽభవంస్తాసామప్సరాణాం సువర్చసామ్,
అసంఖ్యేయాస్తు కాకుత్స్థ యాస్తాసాం పరిచారికాః. 33.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! సువర్చసామ్ = మంచి కాంతిగల, తాసామ్ = ఆ, అప్సరాణామ్ = అప్సరస్త్రీల, షష్టిః కోట్యః = అరువది కోట్లు, అభవన్ = అయిరి. తాసామ్ = వారియొక్క, యాః = ఏ, పరిచారికాః = పరిచారికలు గలరో వారు, అసంఖ్యేయాః = లెక్కింపశక్యము కానివారు.

తా. రామా! మంచి కాంతి గల అరువది కోట్లమంది అప్సరస్త్రీలు పుట్టిరి. వారికి లెక్కింపశక్యము కాని పరిచారిక లుండిరి. 33

మూ. న తాః స్మ పరిగృహ్ణన్తి సర్వే తే దేవదానవాః,
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వాః సాధారణాః స్మృతాః. 34

ప్ర. అ. సర్వే = సమస్త మైన, తే = ఆ, దేవదానవాః = దేవదానవులు, తాః = ఆ స్త్రీలను, న పరిగృహ్ణన్తి స్మ = వివాహమాడ రైరి. అప్రతిగ్రహణాత్ = వివాహమాడక పోవుటవలన, తాః = ఆ, సర్వాః = అందరును, సాధారణాః = సాధారణస్త్రీలుగా, స్మృతాః = చెప్పబడిరి.

తా. దేవదానవులలో ఎవ్వరును ఆ అప్సరసలను వివాహమాడ లేదు. అందుచే ఆ అప్సరసలు అందరికి సాధారణలు (వేశ్యలు) అని చెప్పబడుచున్నారు. 34

మూ. వరుణస్య తతః కన్యా వారుణీ రఘునన్దన,
ఉత్పపాత మహాభాగా మార్గమాణా పరిగ్రహమ్. 35.

ప్ర. అ. రఘునన్దన = రామా ! తతః = పిమ్మట, వరుణస్య = వరుణుని యొక్క, కన్యా = కన్యఅయిన, మహాభాగా = గొప్పభాగ్యము గల, వారుణీ= వారుణి (మదిర), పరిగ్రహమ్ = స్వీకారమును, మార్గమాణా = అన్వేషించుచు, ఉత్పపాత = బైటకువచ్చెను.

తా. రామా ! పిమ్మట వరుణుని కూతురును, మహాభాగ్యవతియు అగు వారుణి (మద్యదేవత) తనను ఎవరు స్వీకరించెదరా అని వెదకుకొనుచు బైటకు వచ్చెను. 35

మూ. దితేః పుత్రా న తాం రామ జగృహుర్వరుణాత్మజామ్,
అదితేస్తు సుతా వీర జగృహుస్తామనిన్దితామ్. 36

ప్ర. అ. రామ = రామా ! తామ్ = ఆ, వరుణాత్మజామ్ = వారుణిని, దితేః = దితియొక్క, పుత్రాః = పుత్రులు, న జగృహుః = స్వీకరించలేదు. వీర = ఓ వీరుడా ! అనిన్దితామ్ = దోషరహిత యైన, తామ్ = ఆమెను, అదితేః = అదితియొక్క, సుతాః తు = కుమారులైతే, జగృహుః = గ్రహించిరి.

తా. వీరుడ వైన రామా ! ఆ వారుణిని దైత్యులు స్వీకరించలేదు. కాని అనిందిత యగు ఆమెను అదితిపుత్రులు స్వీకరించిరి. 36

మూ. అసురాస్తేన దైతేయాః సురాస్తేనాదితేః సుతాః,
హృష్టాః ప్రముదితాశ్చాసన్ వారుణీగ్రహణాత్ సురాః. 37

ప్ర. అ. తేన=ఆ కారణముచేత, దైతేయాః=దితికుమారులు, అసురాః= అసురులు (సుర=మద్యము, లేనివారు) అయినారు. అదితేః = అదితియొక్క, సుతాః = కుమారులు, సురాః = సురులైనారు. సురాః = దేవతలు, వారుణీ గ్రహణాత్ = వారుణిని స్వీకరించుటవలన, హృష్టాః = సంతసించినవారుగను, ఆసన్ = అయిరి.

తా. సురను గ్రహింపకపోవుటచే దైత్యులు అసురులైనారు; గ్రహించుటచే దేవతలు సురులైనారు. వారుణిని గ్రహించి సురులు సంతసించిరి; చాల ఆనందించిరి. 37

మూ. ఉచ్చైఃశ్రవా హయశ్రేష్ఠో మణిరత్నం చ కౌస్తుభమ్,
ఉదతిష్ఠన్నరశ్రేష్ఠ తథైవామృతముత్తమమ్. 38

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా, ఉచ్చైఃశ్రవాః = ఉచ్చైః శ్రవమను, హయశ్రేష్ఠః = శ్రేష్ఠ మైన అశ్వము, కౌస్తుభమ్ = కౌస్తుభమనెడు, మణిరత్నం చ = శ్రేష్ఠ మైన మాణిక్యము, తథైవ = మరియు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, అమృతమ్=అమృతము, ఉదతిష్ఠన్ = బైటకు వచ్చినవి.

తా. రామా! ఉచ్చైఃశ్రవ మనెడు శ్రేష్ఠ మైన అశ్వము, కౌస్తుభ మనెడు శ్రేష్ఠ మైన మాణిక్యము, ఉత్తమ మైన అమృతము కూడ బైటకు వచ్చినవి. 38

మూ. అథ తస్య కృతే రామ మహానాసీత్కులక్షయః,
అదితేస్తు తతః పుత్రా దితేః పుత్రానసూదయన్. 39

ప్ర. అ. రామ = రామా! అథ = పిమ్మట, తస్య కృతే=ఆ అమృతము కొరకై, మహాన్ = గొప్ప, కులక్షయః=కులక్షయము, ఆసీత్=ఆయెను. తతః= పిమ్మట, అదితేః పుత్రాః=దేవతలు, దితేః పుత్రాన్=దైత్యులను, అసూదయన్= నశింపచేసిరి.

తా. రామా! ఆ అమృతముకొరకై గొప్ప కులక్షయము జరిగినది. దేవతలు దైత్యులను చంపివేసిరి. 39

మూ. ఏకతోఽభ్యాగమన్ సర్వే హ్యసురా రాక్షసైః సహ,
యుద్ధమాసీన్మహాఘోరం వీర త్రైలోక్యమోహనమ్. 40

ప్ర. అ. వీర = ఓ వీరుడా! సర్వే=సమస్త మైన, అసురాః=దైత్యులు, రాక్షసైః సహ = రాక్షసులతో కూడ, ఏకతః=ఒకవైపు, అభ్యాగమన్ = చేరిరి. త్రైలోక్యమోహనమ్ = మూడు లోకములను మోహపెట్టు, మహాఘోరమ్ = చాల భయంకర మైన, యుద్ధమ్ = యుద్ధము, ఆసీత్ = ఆయెను.

తా. దైత్యు లందరును, రాక్షసులును ఒక పక్షముగా చేరిరి. మూడు లోకములకు విభ్రాంతి కలిగించు అతిఘోర మైన యుద్ధము జరిగెను. 40

మూ. యదా క్షయం గతం సర్వం తదా విష్ణుర్మహాబలః,
అమృతం సోఽహరత్తూర్ణం మాయామాస్థాయ మోహినీమ్. 41

ప్ర. అ. యదా=ఎప్పుడు, సర్వమ్ = అంతయును, క్షయం గతమ్=క్షయమును పొందినదో, తదా=అప్పుడు, మహాబలః=గొప్ప బలము గల, సః విష్ణుః=ఆ విష్ణువు, మోహినీమ్=మోహినీరూప మగు, మాయామ్ = మాయను, ఆస్థాయ=అవలంబించి. తూర్ణమ్=శీఘ్రముగా, అమృతమ్ = అమృతమును, అహరత్=హరించెను.

తా. అంతయు క్షయ మైన తరువాత మహాబలు డైన విష్ణువు మాయా మోహినీరూపము ధరించి, శీఘ్రముగా అమృతమును హరించెను. 41

మూ. యే గతాభిముఖం విష్ణుమక్షయం పురుషోత్తమమ్,
సంపిష్టాస్తే తదా యుద్ధే విష్ణునా ప్రభవిష్ణునా. 42

ప్ర. అ. అక్షయమ్=నాశరహితుడును, పురుషోత్తమమ్=పురుషశ్రేష్ఠుడును అయిన, విష్ణుమ్=విష్ణువునుగూర్చి, యే=ఏ దైత్యులు, యుద్ధే=యుద్ధమునందు, అభిముఖమ్=ఎదురుగా, గతాః=వెళ్లినారో, తే = వారు, ప్రభవిష్ణునా = సమర్థుడైన, విష్ణునా=విష్ణువుచేత, సంపిష్టాః=నలిపివేయబడిరి.

తా. కొందరు దైత్యులు నాశరహితుడును, పురుషోత్తముడును అయిన విష్ణువును యుద్ధములో ఎదిరించగా వారి నందరిని సమర్థు డైన విష్ణువు సంహరించెను. 42

మూ. అదితేరాత్మజా వీరా దితేః పుత్రాన్నిజఘ్నిరే,
తస్మిన్ ఘోరే మహాయుద్ధే దైతేయాదిత్యయోర్భృశమ్. 43.

ప్ర. అ. దైతేయాదిత్యయోః = దైత్యులయొక్క దేవతలయొక్క, తస్మిన్=ఆ, ఘోరే=భయంకర మైన, మహాయుద్ధే = మహాయుద్ధమునందు, వీరాః=వీరు లైన, అదితేః ఆత్మజాః=అదితికుమారు లైన దేవతలు, దితేః పుత్రాన్=దితికుమారులను, నిజఘ్నిరే=చంపిరి.

తా. దైత్యులకును దేవతలకు జరిగిన ఆ ఘోరసంగ్రామమునందు వీరులైన దేవతలు దైత్యులను చంపిరి. 43.

మూ. నిహత్య దితిపుత్రాంశ్చ రాజ్యం ప్రాప్య పురందరః,
శశాస ముదితో లోకాన్ సర్షిసంఘాన్ సచారణాన్. 44.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పంచచత్వారింశః సర్గః.

ప్ర. అ. పురందరః=దేవేంద్రుడు, దితిపుత్రాన్=దైత్యులను, నిహత్య=చంపి, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్య=పొంది, ముదితః=సంతోషించిన వాడై, సర్షిసంఘాన్=ఋషి సంఘములతో కూడిన, సచారణాన్=చారణులతో కూడిన, లోకాన్=లోకములను, శశాస=పరిపాలించెను.

తా. దేవేంద్రుడు దైత్యులను సంహరించి, రాజ్యమును పొంది, సంతోషించినవాడై, ఋషులు, చారణులు మొదలైన వారితో కూడిన లోకాలను పరిపాలించెను. 44

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో నలభైయైదవ సర్గ సమాప్తము.

# అథ షట్చత్వారింశః సర్గః

మూ. హతేషు తేషు పుత్రేషు దితిః పరమదుఃఖితా,
మారీచం కాశ్యపం రామ భర్తారమిదమబ్రవీత్. 1

ప్ర. అ. రామ = రామా ! తేషు = ఆ, పుత్రేషు=పుత్రులు, హతేషు= చంపబడినవారగుచుండగా, దితిః=దితి, పరమదుఃఖితా=మిక్కిలి దుఃఖించినదై, భర్తారమ్ = భర్త యైన, మారీచమ్ = మరీచిపుత్రు డైన, కాశ్యపమ్ = కాశ్యపుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రామా ! ఈ విధముగ కుమారు లందరును చంపబడుట చూచి దితి చాల దుఃఖించుచు, మరీచి కుమారుడును, తన భర్తయు అగు కాశ్యపునితో ఇటనెను. 1

మూ. హతపుత్రాస్మి భగవంస్తవ పుత్రైర్మహాబలైః,
శక్రహన్తారమిచ్ఛామి పుత్రం దీర్ఘతపోర్జితమ్. 2

ప్ర. అ. భగవన్=పూజ్యుడా ! మహాబలైః = మహాబలు లైన, పుత్రైః = నీకుమారు లైన దేవతలచేత, హతపుత్రా = చంపబడిన పుత్రులు కలదానను, అస్మి = అయితిని. శక్రహన్తారమ్ = దేవేంద్రుని చంపగల, దీర్ఘతపోర్జితమ్ = దీర్ఘతపస్సుచేత బలము గల, పుత్రమ్ = పుత్రుని, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. భగవంతుడా ! మహాబలు లైన నీ కుమారు లైన దేవతలు నా పుత్రులను చంపివేసినారు. నాకు దీర్ఘతపస్సుచే బలము గలవాడును దేవేంద్రుని చంపగలవాడును అగు కుమారుడు కావలెను. 2

మూ. సాహం తపశ్చరిష్యామి గర్భం మే దాతుమర్హసి,
ఈశ్వరం శక్రహన్తారం త్వమనుజ్ఞాతుమర్హసి. 3

ప్ర. అ. సా అహమ్ = అట్టి నేను, తపః = తపస్సును, చరిష్యామి = ఆచరించెదను. త్వమ్ = నీవు, ఈశ్వరమ్ = లోకనాయకుడును, శక్రహ

న్తారమ్ = దేవేంద్రుని చంపువాడును అగు, గర్భమ్ = గర్భమును (పుత్రుని), మే = నాకు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగియున్నావు. అనుజ్ఞాతుమ్ = తపస్సుకై అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. నాకు లోకములకు నాయకుడును, ఇంద్రుని చంపువాడును అగు కుమారుని ఇమ్ము. నేను తపస్సు చేసెదను. అనుజ్ఞ ఇమ్ము. 3

మూ. తస్యా స్తద్వచనం శ్రుత్వా మారీచః కాశ్యప స్తదా,
ప్రత్యువాచ మహాతేజా దితిం పరమదుఃఖితామ్. 4

ప్ర. అ. తదా = అప్పుడు, మారీచః = మరీచియొక్క కుమారుడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును అగు, కాశ్యపః = కాశ్యపుడు, తస్యాః = ఆమెయొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, పరమదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖించిన, దితిమ్ = దితిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మహాతేజశ్శాలి, మరీచికుమారుడును అయిన కాశ్యపుడు ఆమె వచనమును విని, అతిదుఃఖితురాలగు ఆమెతో ఇట్లనెను. 4

మూ. ఏవం భవతు భద్రం తే శుచిర్భవ తపోధనే,
జనయిష్యసి పుత్రం త్వం శక్రహన్తారమాహవే. 5

ప్ర. అ. తపోధనే = ఓ తపోధనురాలా! ఏవమ్ = ఇట్లే, భవతు = అగుగాక. తే = నీకు, భద్రమ్ = క్షేమము (అగుగాక). శుచిః = పవిత్రురాలవు, భవ = అగుము. త్వమ్ = నీవు, ఆహవే = యుద్ధమునందు, శక్రహన్తారమ్ = దేవేంద్రుని చంప గల, పుత్రమ్ = పుత్రుని, జనయిష్యసి = కనగలవు.

తా. తపోధనురాలా! అట్లే అగుగాక. నీకు క్షేమ మగు గాక. యుద్ధములో దేవేంద్రుని చంపగల కుమారుని కనగలవు. 5

మూ. పూర్ణే వర్షసహస్రే తు శుచిర్యది భవిష్యసి,
పుత్రం త్రైలోక్యభర్తారం మత్త స్త్వం జనయిష్యసి. 6

ప్ర. అ. త్వమ్ = నీవు, శుచిః = పవిత్రురాలవుగా, భవిష్యసి యది = ఉన్నట్లయితే, వర్షసహస్రే = వేయి సంవత్సరముల కాలము, పూర్ణే = నిండిన దగుచుండగా, మత్తః=నావలన, త్రైలోక్యభర్తారమ్ = మూడు లోకములకును ప్రభువైన, పుత్రమ్ = పుత్రుని, జనయిష్యసి = కనగలవు.

తా. నీవు పవిత్రముగా ఉన్నచో, వేయి వర్షములు నిండగనే, మూడు లోకములకును ప్రభు వైన కుమారుని నావలన కనగలవు. 6

మూ. ఏవముక్త్వా మహాతేజాః పాణినా స మమార్జ తామ్,
సమాలభ్య తతః స్వస్తీత్యుక్త్వా స తపసే యయౌ. 7

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = ఆ కాశ్యపుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తామ్ = ఆమెను, పాణినా = హస్తముతో, మమార్జ = తుడిచెను. సమాలభ్య = స్పృశించి, తతః = పిమ్మట, స్వస్తి ఇతి = క్షేమ మగుగాక అని, ఉక్త్వా = పలికి, సః = అతడు, తపసే=తపస్సుకొరకు, యయౌ=వెళ్లెను.

తా. ఆ మహాతేజఃశాలి, ఈ విధముగా పలికి అదితిని హస్తముతో స్పృశించి, శరీర మంతయు తడవి క్షేమ మగుగాక అని పలికి తపస్సు చేసు కొనుటకై వెడలిపోయెను. 7

మూ. గతే తస్మిన్నరశ్రేష్ఠ దితిః పరమహర్షితా,
కుశప్లవనమాసాద్య తపస్తేపే సుదారుణమ్. 8

ప్ర. అ. నరశ్రేష్ఠ = ఓ నరశ్రేష్ఠుడా ! తస్మిన్ = ఆ కాశ్యపుడు, గతే సతి = వెళ్లగా, దితిః = దితి, పరమహర్షితా = చాల సంతోషించినదై, కుశప్లవనమ్ = కుశప్లవన మను క్షేత్రమును, ఆసాద్య=పొంది, సుదారుణమ్= చాల తీవ్ర మైన, తపః = తపస్సును, తేపే = చేసెను.

తా. రామా ! ఆ మహర్షి వెళ్లిన తరువాత, దితి చాల సంతసించి, కుశప్లవన మనెడు క్షేత్రము చేరి అతితీవ్ర మైన తపస్సు చేసెను. 8

మూ. తపస్తస్యాం హి కుర్వన్త్యాం పరిచర్యాం చకార హ,
సహస్రాక్షో నరశ్రేష్ఠ పరయా గుణసంపదా. 9

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! తస్యామ్ = ఆమె, తపః చరన్త్యామ్ = తపస్సు చేయుచుండగా, సహస్రాక్షః = దేవేంద్రుడు, పరయా = గొప్ప, గుణసంపదా = గుణసంపదతో, పరిచర్యామ్ = సేవను, చకార హ = చేసెను.

తా. రామా ! ఆమె తపస్సు చేయుచున్నప్పుడు దేవేంద్రుడు ఉత్తమమైన గుణసంపదతో సేవ చేసెను. 9

మూ. అగ్నిం కుశాన్ కాష్ఠమపః ఫలం మూలం తథైవ చ,
న్యవేదయత్సహస్రాక్షో యచ్చాన్యదపి కాంక్షితమ్. 10

ప్ర. అ. సహస్రాక్షః = దేవేంద్రుడు, అగ్నిమ్ = అగ్నిని, కుశాన్ = కుశలను, కాష్ఠమ్ = కట్టెలను, అపః = ఉదకమును, ఫలమ్ = ఫలమును, తథైవ చ = మరియు, మూలమ్ = దుంపలను, కాఙ్క్షితమ్ = కోరబడిన, అన్యత్ = ఇతర మైనది, యచ్చ = ఏది యుండునో, దానిని, న్యవేదయత్ = ఆమెకు సమకూర్చెను.

తా. దేవేంద్రుడు అగ్ని, కుశములు, సమిధలు, ఉదకము, ఫలములు, మూలములు, మొదలైన కావలసిన పదార్థముల నన్నింటిని ఆమెకు సమకూర్చుచు సేవ చేయుచుండెను. 10

మూ. గాత్రసంవహనైశ్చైవ శ్రమాపనయనైస్తథా,
శక్రః సర్వేషు కాలేషు దితిం పరిచచార హ. 11

ప్ర. అ. శక్రః = దేవేంద్రుడు, గాత్రసంవహనైః చ ఏవ = ఒళ్లు పట్టుట చేతను, తథా = మరియు, శ్రమాపనయనైః = శ్రమను తొలగించుటచేతను, సర్వేషు కాలేషు = సమస్తకాలములందును, దితిమ్ = దితిని, పరిచచార హ = ఉపచరించెను.

తా. ఒడలు పట్టుట, శ్రమ దీర్చుట మొదలగు పనులు చేయుచు దేవేంద్రుడు అన్ని కాలములందును దితికి ఉపచారములు చేసెను. 11

మూ. అథ వర్షసహస్రే తు దశోనే రఘునన్దన,
దితిః పరమసంప్రీతా సహస్రాక్షమథాబ్రవీత్. 12

ప్ర. అ. రఘునన్దన = రామా! అథ = పిమ్మట, వర్షసహస్రే=వేయి సంవత్సరముల కాలము, దశోనే=పది తక్కువగా ఉండగా, దితిః=దితి, పరమ సంప్రీతా=చాల సంతసించినదై, సహస్రాక్షమ్=దేవేంద్రుని గూర్చి, అబ్రవీత్= పలికెను.

తా. రామా! ఈ విధముగ తొమ్మిదివందలతొంభై సంవత్సరములు గడచినవి. అపుడు దితి చాల సంతసించినదై దేవేంద్రునితో ఇట్లు పలికెను. 12

మూ. యాచితేన సురశ్రేష్ఠ తవ పిత్రా మహాత్మనా,
వరో వర్షసహస్రాన్తే దత్తో మమ సుతం ప్రతి. 13

ప్ర. అ. సురశ్రేష్ఠ = ఓ దేవతాశ్రేష్ఠుడా! యాచితేన = కోరబడిన, మహాత్మనా = మహాత్ముడైన, తవ = నీయొక్క, పిత్రా = తండ్రిచేత, వర్షసహస్రాన్తే=వేయిసంవత్సరముల అంతమున, సుతం ప్రతి = కుమారుని గూర్చి, మమ = నాకు, వరః=వరము, దత్తః = ఇవ్వబడినది.

తా. దేవతలలో శ్రేష్ఠుడవైన ఓ ఇంద్రుడా! నేను కోరగా, నీ తండ్రి, వేయి సంవత్సరముల తరువాత కుమారుడు కలుగగలడని నాకొక వరము నిచ్చెను. 13

మూ. తపశ్చరన్త్యా వర్షాణి దశ వీర్యవతాం వర
అవశిష్టాని భద్రం తే భ్రాతరం ద్రక్ష్యసే తతః. 14

ప్ర. అ. వీర్యవతామ్ = పరాక్రమవంతులలో, వర=శ్రేష్ఠుడవైన ఓ ఇంద్రా! తపః=తపస్సు, చరన్త్యాః = ఆచరించుచున్న నాకు, దశ = పది, వర్షాణి = సంవత్సరములు, అవశిష్టాని = మిగిలినవి. తతః = అటుపిమ్మట, భ్రాతరమ్=సోదరుని, ద్రక్ష్యసే=చూడగలవు. తే=నీకు, భద్రమ్ = మంగళమగుగాక.

తా. వీర్యవంతులలో శ్రేష్ఠుడవైన ఓ దేవేంద్రా! నేను తపస్సు చేయ ప్రారంభించిన తరువాత వేయి సంవత్సరములు పూర్తి అగుటకు ఇంకను పది సంవత్సరములు ఉన్నవి. పది సంవత్సరముల తరువాత సోదరుని చూడగలవు. నీకు శుభమగుగాక. 14

మూ. తమహం త్వత్కృతే పుత్ర సమాధాస్యే జయోత్సుకమ్,
త్రైలోక్యవిజయం పుత్ర సహ భోక్ష్యసి విజ్వరః. 15

ప్ర. అ. పుత్ర=కుమారా ! తమ్=ఆతనిని, త్వత్కృతే = నీకొరకై, జయోత్సుకమ్ = జయమునందు వేడుక కలవానినిగా, సమాధాస్యే = చేయగలను. పుత్ర = కుమారా ! విజ్వరః = దుఃఖము లేని వాడవై, త్రైలోక్యవిజయమ్ = మూడు లోకముల విజయమును, సహ భోక్ష్యసి = కలిసి అనుభవింపగలవు.

తా. కుమారా ! నీకొరకై ఆతని యందు జయాభిలాషను కలిగించెదను. నీవు ఆతనితో కలిసి, ఎట్టి బాధలును లేక, మూడు లోకములను జయించి ఆ విజయానందమును అనుభవింపగలవు. 15

మూ. ఏవముక్త్వా దితిః శక్రం ప్రాప్తే మధ్యం దివాకరే,
నిద్రయాపహృతా దేవీ పాదౌ కృత్వాథ శీర్షతః. 16

ప్ర. అ. దితిః దేవీ=దితిదేవి, శక్రమ్=దేవేంద్రుని గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, దివాకరే = సూర్యుడు, మధ్యమ్ = ఆకాశమధ్యమును, ప్రాప్తే = పొందినవాడగుచుండగా, అథ = పిమ్మట, పాదౌ = పాదములను, శీర్షతః = శిరస్సు వైపు, కృత్వా = చేసి, (ఉంచి), నిద్రయా= నిద్రచేత, అవహృతా = అపహరింపబడినది.

తా. దితిదేవి దేవేంద్రునితో ఇట్లు పలికి మధ్యాహ్నసమయమునందు, తల వైపు పాదము లుంచుకొని నిద్రాపరవశ ఆయెను.

వి. ఎక్కువ నిద్ర రాగా ముందుకు వంగుటచే శిరస్సు పాదములకు తగిలి అపరిశుద్ధురాలయ్యె నని కొందరు వ్యాఖ్యాతలును, శయ్యపై తలవైపు కాళ్ల పెట్టుకొని నిద్రించుటచే అట్లయ్యె నని కొందరును, మధ్యాహ్నసమయమున వ్రతమును మరచి నిద్రించుటచే అట్లయ్యె నని కొందరును వ్యాఖ్యానించిరి. 16

మూ. దృష్ట్వా తామశుచిం శక్రః పాదతః కృతమూర్ధజామ్,
శిరఃస్థానే కృతౌ పాదౌ జహాస చ ముమోద చ. 17

ప్ర. అ. శక్రః = దేవేంద్రుడు, పాదతః = పాదముల వైపు, కృతమూర్ధజామ్ = ఉంచబడిన కేశములు గల, అశుచిమ్ = అపవిత్రురా లైన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, శిరఃస్థానే = శిరస్సు ఉంచు స్థానమునందు, కృతౌ = ఉంచబడిన, పాదౌ = పాదములను, (చూచి), జహాస = నవ్వెను. ముమోద చ = ఆనందించెను కూడ.

తా. శిరఃస్థానమునందు పాదము లుంచి, పాదములపై కేశములు పడునట్లు వంగి నిద్రించుచున్న అపరిశుద్ధురా లగు ఆమెను చూచి, దేవేంద్రుడు ఆనందముతో నవ్వుకొనెను. 17

మూ. తస్యాః శరీరవివరం వివేశ చ పురందరః,
గర్భం చ సప్తధా రామ బిభేద పరమాత్మవాన్. 18

ప్ర. అ. రామ = రామా ! పురన్దరః = ఇంద్రుడు, తస్యాః = ఆమెయొక్క, శరీరవివరమ్ = శరీరరంధ్రమును, వివేశ చ = ప్రవేశించెను. పరమ్ = మిక్కిలి, ఆత్మవాన్ = బుద్ధిగల (ధైర్యముగల) ఆతడు, గర్భమ్ = గర్భమును, సప్తధా = ఏడు విధములుగా, బిభేద = భేదించెను.

తా. రామా! మిక్కిలి ధైర్యము గల ఆ ఇంద్రుడు ఆమె శరీరవివరమును ప్రవేశించి, గర్భమును ఏడు ముక్కలుగ ఖండించెను. 18

మూ. భిద్యమానస్తతో గర్భో వజ్రేణ శతపర్వణా,
రురోద సుస్వరం రామ తతో దితిరబుధ్యత. 19

ప్ర. అ. రామ = రామా ! తతః = పిమ్మట, శతపర్వణా = నూరు అంచులు గల, వజ్రేణ = వజ్రముచేత, భిద్యమానః = ఖండింపబడుచున్న, గర్భః = గర్భము, సుస్వరమ్ = అధిక మైన స్వరము కలుగునట్లుగా, రురోద = ఏడ్చెను. తతః = పిమ్మట, దితిః = దితి, అబుధ్యత = లేచెను.

తా. రామా ! నూరంచులు గల వజ్రముచే ఖండింపబడిన ఆ గర్భము బిగ్గరగా ఏడ్చెను. దితి మేల్కొనెను. 19

మూ. మా రుదో మా రుదశ్చేతి గర్భం శక్రోఽభ్యభాషత,
బిభేద చ మహాతేజా రుదన్తమపి వాసవః. 20

ప్ర. అ. మా రుదః=ఏడవకుము, మా రుదః=ఏడవకుము, ఇతి=అని, శక్రః = దేవేంద్రుడు, గర్భమ్ = గర్భమును, అభ్యభాషత = పలికెను. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, వాసవః = దేవేంద్రుడు, రుదన్తమపి = ఏడ్చుచున్నను, బిభేద చ = భేదించెను కూడ.

తా. మహాతేజస్సు గల ఆ దేవేంద్రుడు ఏడ్చుచున్న ఆ గర్భమును "ఏడవకుము, ఏడవకుము" అని అనుచునే భేదించెను. 20

మూ. న హన్తవ్యో న హన్తవ్య ఇత్యేవం దితిరబ్రవీత్,
నిష్పపాత తతః శక్రో మాతుర్వచనగౌరవాత్. 21

ప్ర. అ. దితిః=దితి, న హన్తవ్యః న హన్తవ్యః = చంపదగదు చంపదగదు, ఇత్యేవమ్=అని, అబ్రవీత్=పలికెను. తతః = పిమ్మట, శక్రః = దేవేంద్రుడు, మాతుః వచనగౌరవాత్ = తల్లియొక్క వచనమునందు గౌరవము వలన, నిష్పపాత=బైటకు వచ్చెను.

తా. ''చంపవదు చంపవదు'' అని దితి పలుకగా, తల్లి మాటపై గౌరవముచే దేవేంద్రుడు బైటకు వచ్చెను. 21

మూ. ప్రాంజలిర్వజ్రసహితో దితిం శక్రోఽభ్యభాషత,
అశుచిర్దేవి సుప్తాసి పాదయోః కృతమూర్ధజా. 22

ప్ర. అ. వజ్రసహితః = వజ్రసహితుడైన, శక్రః=ఇంద్రుడు, ప్రాంజలిః = దోసిలి ఒగ్గినవాడై, దితిమ్ = దితిని గూర్చి, అభ్యభాషత = పలికెను. దేవి=ఓ దేవీ! పాదయోః=పాదములపై, కృతమూర్ధజా=ఉంచబడిన కేశములు కలదానవై, అశుచిః=అపవిత్రురాలవై, సుప్తా అసి=నిద్ర పోతివి.

తా. వజ్రమును ధరించిన ఇంద్రుడు దితితో ఇట్లు పలికెను. "ఓ దేవీ! నీవు కేశములు పాదములకు తగులునట్లుగా పరుండి నిద్రించితివి. 22

మూ. తదన్తరమహం లబ్ధ్వా శక్రహన్తారమాహవే,
అభిదం సప్తధా దేవి తన్మే త్వం క్షన్తుమర్హసి. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. అహమ్ = నేను, తత్ = ఆ, అన్తరమ్ = అవకాశమును, లబ్ధ్వా=పొంది, ఆహవే=యుద్ధమునందు, శక్రహన్తారమ్=ఇంద్రుని చంపనున్న వానిని, సప్తధా=ఏడు ఖండములుగా, అభిదమ్=భేదించితిని. దేవి=ఓ దేవీ ! మే=నాయొక్క, తత్=ఆ కార్యమును, త్వమ్=నీవు, క్షన్తుమ్=క్షమించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఆ అవకాశమును చూచుకొని నేను, యుద్ధములో నన్ను సంహరింపనున్న ఆ పిల్లవానిని ఏడు ముక్కలుగా ఖండించితిని. ఇందులకు నన్ను క్షమింపుము. 23

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండములో నలభైఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తచత్వారింశః సర్గః

మూ. సప్తధా తు కృతే గర్భే దితిః పరమదుఃఖితా,
సహస్రాక్షం దురాధర్షం వాక్యం సానునయాఽబ్రవీత్. 1

ప్ర. అ. గర్భే=గర్భము, సప్తధా=ఏడు ముక్కలుగా, కృతే=చేయబడిన దగుచుండగా, దితిః = దితి, పరమదుఃఖితా = మిక్కిలి దుఃఖించినదై, దురాధర్షమ్ = ఎదిరింప శక్యముకాని, సహస్రాక్షమ్ = దేవేంద్రుని గూర్చి, సానునయా = అనునయముతో కూడినదై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగ గర్భము ఏడు ముక్కలుగ ఖండింపబడినందులకు దుఃఖించుచు దితి, ఎదిరింప శక్యము కానివాడైన దేవేంద్రునితో అనునయపూర్వకముగా ఇట్లు పలికెను. 1

మూ. మమాపరాధాద్గర్భోఽయం సప్తధా విఫలీకృతః,
నాపరాధోఽస్తి దేవేశ తవాత్ర బలసూదన. 2

ప్ర. అ. బలసూదన = బలాసురుని సంహరించిన, దేవేశ = దేవేంద్రా ! మమ = నాయొక్క, అపరాధాత్ = అపరాధమువలన, అయమ్ = ఈ, గర్భః = గర్భము, సప్తధా = ఏడు భాగములుగా, విఫలీకృతః = వ్యర్థము చేయబడినది. అత్ర = ఈ విషయమున, తవ = నీయొక్క, అపరాధః = అపరాధము, నాస్తి = లేదు.

తా. బలాసురుని సంహరించిన ఓ దేవేంద్రా ! నా అపరాధముచేతనే నా గర్భము ఏడు ముక్కలు చేయబడి వ్యర్థ మైనది. ఇందులో నీ అపరాధము లేదు. 2

మూ. ప్రియం తు కర్తుమిచ్ఛామి మమ గర్భవిపర్యయే,
మరుతాం సప్త సప్తానాం స్థానపాలా భవన్త్విమే. 3

ప్ర. అ. గర్భవిపర్యయే=గర్భమునకు కలిగిన ఈ ఆపద విషయమున, మమ = నాకు, ప్రియమ్=ప్రియము, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. ఇమే = ఈ, సప్త=ఏడు ఖండములు, సప్తానామ్ = ఏడుగురైన, మరుతామ్=మరుత్తుల, స్థానపాలాః=స్థానపాలకులుగా, భవన్తు=అగుగాక.

తా. గర్భము విషయమున అనుకున్న దానికి వ్యతిరేకముగ జరిగినది. అందుచే నీవు నాకొక ప్రియమును చేయవలె నని కోరుచున్నాను. ఈ గర్భ ఖండములు ఏడును ఏడు మారుతస్థానములకు పాలకు లగు గాక.

వి. అంతరిక్షమునందు ఆవహ–ప్రవహ–సంవహ – ఉద్వహ–వివహ–పరివహ–పరావహము లనే ఏడు వాతస్కంధములున్న వనియు అవి నక్షత్ర మండలాదులకు ఆధారములై ఉన్న వనియు పౌరాణిక సంప్రదాయము. 3

మూ. వాతస్కంధా ఇమే సప్త చరన్తు దివి పుత్రక,
మారుతా ఇతి విఖ్యాతా దివ్యరూపా మమాత్మజాః. 4

ప్ర. అ. పుత్రక=కుమారుడా ! సప్త=ఏడుగురైన, ఇమే=ఈ, మమ=నాయొక్క, ఆత్మజాః=కుమారులు, దివ్యరూపాః = దివ్య రూపములు కలవారై, వాతస్కంధాః = వాతస్కంధములకు అధిష్ఠానదేవతలై, మారుతాః ఇతి = మారుతులు అని, విఖ్యాతాః=ప్రసిద్ధులై, దివి = అంతరిక్షమునందు, చరన్తు = సంచరింతురుగాక.

తా. కుమారా ! నా ఏడుగురు కుమారులును దివ్యరూపములు ధరించి, వాతస్కంధములకు అధిష్ఠానదేవతలై, మారుతు లను పేరుతో అంతరిక్షమునందు సంచరించెదరు గాక. 4

మూ. బ్రహ్మలోకం చరత్వేక ఇన్ద్రలోకం తథాపరః,
దివి వాయురితి ఖ్యాత స్తృతీయోఽపి మహాయశాః. 5

ప్ర. అ. ఏకః=ఒకడు, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును (నందు), చరతు=సంచరించుగాక. తథా=అట్లే, అపరః=మరియొకడు, ఇన్ద్రలోకమ్=ఇంద్రలోకమునందును, మహాయశాః=గొప్పకీర్తిగల, తృతీయోఽపి=మూడవ

వాడు కూడ, వాయురితి=వాయువు అని, ఖ్యాతః=ప్రసిద్ధుడై, దివి=అంతరిక్షము నందు, తిరుగుగాక.

తా. వీరిలో ఒకడు బ్రహ్మలోకమునందును, ఒకడు ఇంద్రలోకము నందును, మహాకీర్తిశాలి యగు మూడవవాడు వాయు వను పేరుతో అంతరిక్షము నందును సంచరించుగాక. 5

మూ. చత్వారస్తు సురశ్రేష్ఠ దిశో వై తవ శాసనాత్,
సంచరిష్యన్తి భద్రం తే దేవభూతా మమాత్మజాః. 6

ప్ర. అ. సురశ్రేష్ఠ=దేవతలలో శ్రేష్ఠుడ వైన ఇంద్రా ! చత్వారః= నలుగురు, మమ ఆత్మజాః=నా కుమారులు, తవ=నీయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, దేవభూతాః=దేవతలుగా అయి, దిశః=దిక్కులను, సంచరిష్యన్తి= సంచరింపగలరు.

తా. ఓ దేవేంద్రా ! మిగిలిన నా నలుగురు కుమారులు నీ ఆజ్ఞ ప్రకారము దేవతలై, నాలుగు దిక్కులందును సంచరింతురు గాక. 6

మూ. త్వత్కృతేనైవ నామ్నా చ మారుతా ఇతి విశ్రుతాః.

ప్ర. అ. త్వత్కృతేనైవ=నీచేతనే చేయబడిన, నామ్నా = పేరుతో, మారుతాః ఇతి = మారుతులు అని, విశ్రుతాః = ప్రసిద్ధి పొందినవా రగుదురు గాక.

తా. నీవు ఖండించుచున్నప్పుడు వీళ్లు ఏడ్చుచుండగా 'మా రుదః' (ఏడ్వకుము) అని నీవు అని ఉంటివి. అందుచే అదే పేరుతో వీరు 'మారుత' అని ప్రసిద్ధి చెందగలరు.

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా సహస్రాక్షః పురన్దరః,
ఉవాచ ప్రాంజలిర్వాక్యం దితిం బలనిషూదనః. 7

ప్ర. అ. సహస్రాక్షః=వేయి నేత్రములు గలవాడును, బలనిషూదనః= బలాసురుని సంహరించినవాడును అగు, పురన్దరః=దేవేంద్రుడు, తస్యాః=ఆమె

యొక్క, తత్=ఆ, వచనమ్=వాక్యమును, శ్రుత్వా = విని, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, దితిమ్=దితిదేవిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. బలాసురసంహారియు, సహస్రాక్షుడును అగు దేవేంద్రుడు ఆ దితి వాక్యములు విని, దోసిలి ఒగ్గి నమస్కరించుచు ఇట్లనెను. 7

మూ. సర్వమేతద్యథోక్తం తే భవిష్యతి న సంశయః, 8
విచరిష్యన్తి భద్రం తే దేవభూతా స్తవాత్మజాః.

ప్ర. అ. తే = నీకు (నీచేత), యథా = ఏ విధముగా, ఉక్తమ్ = చెప్పబడినదో, ఏతత్=ఇది, సర్వమ్=అంతయు, భవిష్యతి=కాగలదు. సంశయః= సంశయము, న = లేదు. తవ = నీయొక్క, ఆత్మజాః = కుమారులు, దేవభూతాః = దేవతలై, విచరిష్యన్తి = నంచరించగలరు. తే = నీకు, భద్రమ్ = మంగళము అగు గాక.

తా. అంతయు నీవు చెప్పిన విధముననే జరుగగలదు. సంశయము లేదు. నీ కుమారులు దేవతలై నంచరించగలరు. నీకు క్షేమ మగుగాక. 8

మూ. ఏవం తౌ నిశ్చయం కృత్వా మాతాపుత్రౌ తపోవనే, 9
జగ్మతుస్త్రిదివం రామ కృతార్థావితి నః శ్రుతమ్.

ప్ర. అ. రామ = శ్రీరామా! తౌ = ఆ, మాతాపుత్రౌ = తల్లియు కుమారుడును, తపోవనే = తపోవనమునందు, ఏవమ్ = ఈ విధముగా, నిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, కృతార్థౌ = కృతార్థులై, దివమ్ = స్వర్గమును గూర్చి, జగ్మతుః = వెళ్లిరి. ఇతి = ఈ విధముగ, నః = మాకు (మాచేత) శ్రుతమ్ = వినబడినది.

తా. శ్రీరామా! ఆ తల్లియు కుమారుడును, తపోవనమునందు ఈ విధముగ నిశ్చయము చేసి, కృతార్థులై, స్వర్గమునకు వెళ్లి రని వినియున్నాము. 9

మూ. ఏష దేశస్స కాకుత్స్థ మహేంద్రాధ్యుషితః పురా, 10
దితిం యత్ర తపఃసిద్ధామేవం పరిచచార సః.

ప్ర. అ. కాకుత్స్థ = శ్రీరామా! ఏషః = ఇది, పురా = పూర్వము, మహేన్ద్రాధ్యుషితః = మహేంద్రునిచే అధిష్ఠింపబడిన (మహేంద్రుడు నివసించిన), సః = ఆ, దేశః = దేశము. యత్ర = ఎచట, సః = ఆతడు, తపఃసిద్ధామ్ = తపస్సునందు ప్రసిద్ధురా లగు, దితిమ్ = దితిని, ఏవమ్ = ఈ విధముగా, ఉపచచార = ఉపచరించెనో.

తా. రామా! పూర్వము మహేంద్రుడు నివసించిన ఆ దేశ మిదియే. ఇచటనే దితి తపస్సు చేయుచుండగా ఆతడు ఆమెకు ఉపచారములు చేసెను. 10

మూ. ఇక్ష్వాకోస్తు నరవ్యాఘ్ర పుత్రః పరమధార్మికః, 11
అలంబుసాయాముత్పన్నో విశాల ఇతి విశ్రుతః,
తేన చాసీదిహ స్థానే విశాలేతి పురీ కృతా. 12

ప్ర. అ. నరవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడ వైన శ్రీరామా! ఇక్ష్వాకోః = ఇక్ష్వాకువునకు, అలంబుసాయామ్ = అలంబుసయందు, పరమధార్మికః = ఎక్కువ ధార్మికుడును, విశాల ఇతి = విశాలు డని, విశ్రుతః = ప్రసిద్ధి పొందినవాడును అగు, పుత్రః = పుత్రుడు, ఉత్పన్నః = పుట్టినాడు. తేన = ఆతనిచేత, ఇహ = ఈ, స్థానే = స్థానమునందు, విశాలేతి = విశాల అను, పురీ = పట్టణము, కృతా = చేయబడినది, ఆసీత్ = ఆయెను.

తా. రామా! ఇక్ష్వాకునకు అలంబుసయందు జనించిన విశాలు డనే పరమధార్మికు డైన కుమారుడు, ఈ ప్రదేశమునందు విశాల అను పురిని నిర్మించెను. 11, 12

మూ. విశాలస్య సుతో రామ హేమచన్ద్రో మహాబలః,
సుచంద్ర ఇతి విఖ్యాతః హేమచంద్రాదనన్తరః. 13

ప్ర. అ. రామ = రామా, మహాబలః = మహాబలశాలి యగు, హేమచన్ద్రః = హేమచంద్రుడు, విశాలస్య = విశాలునియొక్క, సుతః = కుమారుడు. హేమచన్ద్రాత్ = హేమచంద్రునికంటె, అనన్తరః = తరువాతివాడు, సుచన్ద్ర ఇతి = సుచంద్రు డని, విఖ్యాతః = ప్రసిద్ధుడు.

తా. రామా ! మహాబలశాలి యగు హేమచంద్రుడు విశాలుని కుమారుడు. హేమచంద్రుని తరవాత (అతని కుమారుడు), సుచంద్రు డని ప్రసిద్ధి చెందెను. 13

మూ. సుచంద్రతనయో రామ ధూమ్రాశ్వ ఇతి విశ్రుతః,
ధూమ్రాశ్వతనయశ్చాపి సృంజయః సమపద్యత. 14

ప్ర. అ. రామ = రామా, సుచన్ద్రతనయః = సుచంద్రుని కుమారుడు, ధూమ్రాశ్వ ఇతి = ధూమ్రాశ్వు డని, విశ్రుతః = ప్రసిద్ధి పొందెను. సృఞ్జయః = సృంజయు డనెడు వాడు, ధూమ్రాశ్వతనయః = ధూమ్రాశ్వుని కుమారుడుగా, సమపద్యత = జనించెను.

తా. రామా ! సుచంద్రుని కుమారుడు ధూమ్రాశ్వుడు. ఆతని కుమారుడు సృంజయుడు. 14

మూ. సృఞ్జయస్య సుతః శ్రీమాన్ సహదేవః ప్రతాపవాన్,
కుశాశ్వః సహదేవస్య పుత్రః పరమధార్మికః. 15

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడును, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడును అగు, సహదేవః = సహదేవుడు, సృఞ్జయస్య = సృంజయునియొక్క, సుతః = కుమారుడు. పరమధార్మికః = గొప్ప ధర్మాత్ము డైన, కుశాశ్వః = కుశాశ్వుడు, సహదేవస్య = సహదేవునియొక్క, పుత్రః = కుమారుడు.

తా. శ్రీమంతుడు, ప్రతాపవంతుడు అయిన సహదేవుడు సృంజయుని కుమారుడు, పరమధార్మికు డైన కుశాశ్వుడు సహదేవుని కుమారుడు. 15

మూ. కుశాశ్వస్య మహాతేజా సోమదత్తః ప్రతాపవాన్,
సోమదత్తస్య పుత్రస్తు కాకుత్స్థ ఇతి విశ్రుతః. 16

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సుకలవాడును, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడును అగు, సోమదత్తః = సోమదత్తుడు, కుశాశ్వస్య = కుశాశ్వుని యొక్క, (కుమారుడు). సోమదత్తస్య = సోమదత్తునియొక్క, పుత్రః = పుత్రుడు, కాకుత్స్థః ఇతి = కాకుత్స్థు డని, విశ్రుతః = ప్రసిద్ధుడు.

తా. కుశాశ్వునకు, మహాతేజశ్శాలియు, ప్రతాపవంతుడును అగు సోమదత్తుడును, సోమదత్తునకు కాకుత్థ్సుడును పుత్రులుగా జనించిరి. 16

మూ. తస్య పుత్రో మహాతేజాః సమ్ప్రత్యేష పురీమిమామ్,
ఆవసత్యమరప్రఖ్యః సుమతిర్నామ దుర్జయః. 17

ప్ర. అ. సంప్రతి = ఇపుడు, ఇమామ్ = ఈ, పురీమ్ = పట్టణమును, (నందు), తస్య = ఆ ఇక్ష్వాకువుయొక్క, పుత్రః = పుత్రుడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, అమరప్రఖ్యః = దేవతలతో సమానుడును, దుర్జయః = జయింప శక్యము కానివాడును అగు, సుమతిర్నామ = సుమతి అనునతడు, ఆవసతి = నివసించుచున్నాడు.

తా. గొప్ప తేజస్సు కలవాడును, దేవతాసమానుడును, జయింప శక్యము కానివాడును అగు, ఇక్ష్వాకుకుమారు డగు సుమతి, ఇపుడు ఈ నగరమును పాలించుచున్నాడు. 17

మూ. ఇక్ష్వాకోస్తు ప్రసాదేన సర్వే వైశాలికా నృపాః,
దీర్ఘాయుషో మహాత్మానో వీర్యవన్తస్సుధార్మికాః. 18

ప్ర. అ. ఇక్ష్వాకోః = ఇక్ష్వాకువుయొక్క, ప్రసాదేన = అనుగ్రహముచేత, వైశాలికాః = విశాలానగరమునకు సంబంధించిన, నృపాః = రాజులు, సర్వే = అందరును, దీర్ఘాయుషః = దీర్ఘాయుర్దాయము కలవారు, మహాత్మానః = మహాత్ములు, వీర్యవన్తః = పరాక్రమము కలవారు, సుధార్మికాః = బాగుగా

తా. విశాలానగరరాజు లందరును, ఇక్ష్వాకుప్రభావముచేత, దీర్ఘాయుర్దాయవంతులై, మహాత్ములై, వీర్యవంతులై, ధార్మికులై ఒప్పుచుందురు. 18

మూ. ఇహాద్య రజనీం రామ సుఖం వత్స్యామహే వయమ్,
శ్వః ప్రభాతే నరశ్రేష్ఠ జనకం ద్రష్టుమర్హసి. 19

ప్ర. అ. రామ = రామా, అద్య = నేడు, రజనీమ్ = రాత్రి, వయమ్ = మనము, ఇహ = ఇచటనే, సుఖమ్ = సుఖముగా, వత్స్యామహే = నివసించెదము.

నరశ్రేష్ఠ=ఓ నరశ్రేష్ఠుడా, శ్వః=రేపు, ప్రభాతే=ప్రాతఃకాలమున, జనకమ్=జనకుని, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. రామా! ఈ రాత్రి మనము ఇచటనే సుఖముగ నివసించెదము. రేపు ఉదయమున జనకమహారాజును చూచెదము. 19

మూ. సుమతిస్తు మహాతేజా విశ్వామిత్రముపాగతమ్,
శ్రుత్వా నరవరశ్రేష్ఠః ప్రత్యుద్గచ్ఛన్మహాయశాః. 20

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును, మహాయశాః=గొప్ప యశస్సు కలవాడును, నరవరశ్రేష్ఠః=నరవరులలో శ్రేష్ఠుడును అగు, సుమతిస్తు=సుమతి యైతే, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, ఉపాగతమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, ప్రత్యుద్గచ్ఛత్ = ఎదురుగా వెళ్లెను.

తా. మహాతేజుడు, మహాయశుడు, నరవరశ్రేష్ఠుడు అగు సుమతి విశ్వామిత్రుడు వచ్చిన వార్త విని, స్వాగతము చెప్పుటకై ఎదురుగా వెళ్లెను. 20

మూ. పూజాం చ పరమాం కృత్వా సోపాధ్యాయః సబాన్ధవః,
ప్రాఞ్జలిః కుశలం పృష్ట్వా విశ్వామిత్రమథాబ్రవీత్. 21

ప్ర. అ. సోపాధ్యాయః = పురోహితునితో కూడినవాడును, సబాన్ధవః = బంధుసమేతుడును అగు ఆ సుమతి, పరమామ్ = గొప్ప, పూజామ్ = పూజను, కృత్వా = చేసి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, కుశలమ్=కుశలమును, పృష్ట్వా = అడిగి, అథ = పిమ్మట, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. బంధుపురోహితాది సమేతుడైన ఆ సుమతి విశ్వామిత్రుని అధికముగ పూజించి, అంజలి ఘటించి, కుశలప్రశ్నపూర్వకముగ ఇట్లు పలికెను. 21

మూ. ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే విషయం మునిః,
సంప్రాప్తో దర్శనం చైవ నాస్తి ధన్యతరో మమ. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. యస్య = ఏ, మే = నాయొక్క, విషయమ్ = దేశమును, మునిః = ముని (నీవు), సంప్రాప్తః = వచ్చినావో, దర్శనం చైవ = దర్శనము కూడ (ఇచ్చినావో), అట్టి నేను, ధన్యః = ధన్యుడను, అస్మి = అయి ఉన్నాను. అనుగృహీతః = అనుగ్రహింపబడిన వాడను, అస్మి=అయి ఉన్నాను. మమ = నాకంటె, ధన్యతరః = ఎక్కువ ధన్యుడు, నాస్తి = లేడు.

తా. నీవు మా దేశమునకు వచ్చి దర్శనమిచ్చినందులకు నేను చాల ధన్యుడ నైతిని. అనుగ్రహింపబడినవాడ నైతిని. నన్ను మించిన ధన్యాత్ము డెవ్వడును లేడు. 22

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో నలభైఏడవ సర్గ సమాప్తము.

## అథ అష్టచత్వారింశః సర్గః

మూ. పృష్ట్వా తు కుశలం తత్ర పరస్పరసమాగమే,
కథాన్తే సుమతిర్వాక్యం వ్యాజహార మహామునిమ్. 1

ప్ర. అ. తత్ర = అచట, పరస్పరసమాగమే = పరస్పరముతో (ఒండొరులతో) సమాగమమునందు, సుమతిః = సుమతి, కుశలమ్ = క్షేమమును, పృష్ట్వా = అడిగి, కథాన్తే = కథాంతమునందు, మహామునిమ్ = మహామునిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, వ్యాజహార = పలికెను.

**తా.** అచట వారు పరస్పరము కలిసినపుడు సుమతి క్షేమసమాచారములను అడిగి, కొంత సంభాషణము జరిగిన పిమ్మట మహామునితో ఇట్లు పలికెను. 1

మూ. ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ,
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ. 2

పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ,
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ. 3

యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ,
కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే. 4

ప్ర. అ. మునే=విశ్వామిత్రమహామునీ ! తే=నీకు, భద్రమ్=మంగళము అగు గాక. దేవతుల్య పరాక్రమౌ = దేవతలతో సమాన మైన పరాక్రమము కల వారును, గజసింహగతీ = గజసింహములవంటి గమనము కలవారును, వీరౌ= వీరులును, శార్దూలవృషభోపమౌ = శార్దూలవృషభముల వలె ఉన్నవారును, పద్మపత్రవిశాలాక్షౌ = తామరపూవుల రేకుల వలె విశాల మైన నేత్రములు కల వారును, ఖడ్గతూణీధనుర్ధరౌ = ఖడ్గములను, అంబులపొదులను, ధనస్సులను ధరించినవారును, రూపేణ = రూపముచేత, అశ్వినావివ = అశ్వినీదేవతల వలె ఉన్నవారును, సముపస్థితయౌవనౌ = సమీపించిన యౌవనము కలవారును,

దేవలోకాత్ = దేవలోకమునుండి, యదృచ్ఛయైవ = ఇచ్ఛాను సారముగనే, గామ్ = భూమిని, ప్రాప్తౌ = పొందిన, అమరావివ = దేవతల వలె ఉన్న, ఇమౌ = ఈ, కుమారౌ = కుమారులు, ఇహ = ఇచటికి, పద్భ్యామ్ = పాదముల చేతనే (నడచి), కథమ్ = ఎట్లు, కిమర్థమ్ = ఎందుకు, అనుప్రాప్తౌ = వచ్చి నారు ? కస్య వా = ఎవనికి సంబంధించినవారు ?

తా. ఓ మునీ ! నీకు క్షేమ మగు గాక. ఈ కుమారు లిరువురును, దేవతలతో సమాన మైన పరాక్రమము కలవారుగా కనపడుచున్నారు. ఏనుగ వలె, సింహము వలె నడచుచున్నారు. వీరులు. శార్దూలము వలెను, వృషభము వలెను ఉన్నారు. వీరి నేత్రములు పద్మపత్రముల వలె విశాలముగ నున్నవి. ఖడ్గములను, అంబులపొదులను, ధనస్సులను ధరించి ఉన్నారు. యౌవనము ప్రారంభ మగుచున్నది. సౌందర్యమున అశ్వినీదేవతలను పోలి యున్నారు. స్వేచ్ఛగా దేవలోకమునుండి భూలోకమునకు దిగి వచ్చిన అశ్వినీదేవతల వలె ఉన్నారు. వీరు ఎవరి కుమారులు ? కాలి నడకతో ఇచటకు ఎట్లు వచ్చినారు ? ఎందుకు వచ్చినారు ? 2-4

మూ. భూషయన్తావిమం దేశం చన్ద్రసూర్యావివామ్బరమ్,
పరస్పరస్య సదృశౌ ప్రమాణేఙ్గితచేష్టితైః. 5

కిమర్థం చ మునిశ్రేష్ఠ సంప్రాప్తౌ దుర్గమే పథి,
వరాయుధధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. 6

ప్ర. అ. మునిశ్రేష్ఠ = ఓ మునిశ్రేష్ఠుడా! ప్రమాణేఙ్గితచేష్టితైః = ప్రమాణము చేతను, భావములచేతను, చేష్టలచేతను, పరస్పరస్య = ఒండొరులకు, సదృశౌ = సమానులును, చన్ద్రసూర్యౌ = చంద్రసూర్యులు, అమ్బరమివ = ఆకాశమును వలె, ఇమామ్ = ఈ, దేశమ్ = దేశమును, భూషయన్తౌ = అలంకరించు చున్నవారును, వరాయుధధరౌ = శ్రేష్ఠము లైన ఆయుధములను ధరించిన వారును అగు, వీరౌ = ఈ వీరులు, దుర్గమే = నడవ శక్యము కాని, పథి = మార్గమునందు, కిమర్థమ్ = ఎందునిమిత్తమై, సంప్రాప్తౌ = వచ్చినారు ? తత్త్వతః = యథార్థముగా, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. మునిశ్రేష్ఠా! వీరి ప్రమాణములు, భావములు, చేష్టలు ఒకే విధముగ నున్నవి. చంద్రసూర్యులు ఆకాశమును అలంకరించి నట్లు ఈ ప్రదేశమును అలంకరించుచున్నారు. శ్రేష్ఠము లైన ఆయుధములు ధరించిన ఈ వీరులు, దుర్గమ మైన మార్గమునందు ప్రయాణము చేసి ఎందుకు వచ్చినారు? పూర్తిగ విన గోరుచున్నాను. 5, 6

మూ. తస్య తద్వచనం శ్రుత్వా యథావృత్తం న్యవేదయత్,
సిద్ధాశ్రమనివాసం చ రాక్షసానాం వధం తథా. 7

ప్ర. అ. తస్య=ఆతనియొక్క, తత్ వచనమ్=ఆ వాక్యమును, శ్రుత్వా= విని, సిద్ధాశ్రమనివాసం చ = సిద్ధాశ్రమమునందు నివాసమును, తథా=మరియు, రాక్షసానామ్=రాక్షసులయొక్క, వధమ్=వధను, యథావృత్తమ్ = జరిగినది జరిగినట్లుగా, న్యవేదయత్ = తెలిపెను.

తా. విశ్వామిత్రుడు ఆతని మాటలు విని, సిద్ధాశ్రమనివాసము, రాక్షస వధము మొద లైన వృత్తాంతమును జరిగినది జరిగినట్లుగా తెలిపెను. 7

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా రాజా పరమహర్షితః,
అతిథీ పరమౌ ప్రాప్తౌ పుత్రౌ దశరథస్య తౌ, 8
పూజయామాస విధివత్సత్కారార్హౌ మహాబలౌ.

ప్ర. అ. రాజా = రాజైన సుమతి, విశ్వామిత్రవచః = విశ్వామిత్రుని వాక్యమును, శ్రుత్వా = విని, పరమహర్షితః = మిక్కిలి సంతసించినవాడై, పరమౌ = శ్రేష్ఠ లైన, అతిథీ = అతిథులుగా, ప్రాప్తౌ = వచ్చినవారును, సత్కారార్హౌ = సత్కారమునకు తగినవారును, మహాబలౌ = గొప్ప బలము కల వారును అగు, తౌ = ఆ, దశరథస్య పుత్రౌ = దశరథసుతులను, విధివత్ = యథాశాస్త్రముగా, పూజయామాస = పూజించెను.

తా. సుమతి విశ్వామిత్రుని మాటలు విని చాల సంతోషించి, గొప్ప బలముకలవారును, సత్కారము చేయదగినవారును, ఉత్తమాతిథులుగా వచ్చిన వారును అగు ఆ దశరథకుమారులను యథావిధిగా పూజించెను. 8

మూ. తతః పరమసత్కారం సుమతేః ప్రాప్య రాఘవౌ, 9
ఉష్య తత్ర నిశామేకాం జగ్మతుర్మిథిలాం తతః.

ప్ర. అ. రాఘవౌ = రామలక్ష్మణులు, తతః = ఆ, సుమతేః = సుమతి నుండి, పరమసత్కారమ్ = గొప్ప సత్కారమును, ప్రాప్య = పొంది, తత్ర = అచట, ఏకామ్ = ఒక, నిశామ్ = రాత్రి, ఉష్య = ఉండి, తతః = పిమ్మట, మిథిలామ్ = మిథిలను గూర్చి, జగ్మతుః = వెళ్లిరి.

తా. రామలక్ష్మణులు ఆ సుమతి చేసిన సత్కారము లందికొని, ఒక రాత్రి అచట నివసించి, పిమ్మట మిథిలకు వెళ్లిరి. 9

మూ. తాం దృష్ట్వా మునయః సర్వే జనకస్య పురీం శుభామ్, 10
సాధు సాధ్వితి శంసన్తో మిథిలాం సమపూజయన్.

ప్ర. అ. సర్వే = సమస్త మైన, మునయః = మునులు, జనకస్య = జనక మహారాజు యొక్క, తామ్ = ఆ, శుభామ్ = శుభ మైన, పురీమ్ = పట్టణమును దృష్ట్వా = చూచి, సాధు సాధు ఇతి = బాగున్నది బాగున్నది అని, శంసన్తః = ప్రశంసించుచు, మిథిలామ్ = ఆ మిథిలను, సమపూజయన్ = పూజించిరి.

తా. విశ్వామిత్రాదిమును లందరును శుభ మైన ఆ జనకరాజపురిని చూచి బాగున్నది, బాగున్నది అని మెచ్చుకొనుచు ఆ మిథిలను పూజించిరి. 10

మూ. మిథిలోపవనే శూన్యమాశ్రమం దృశ్య రాఘవః, 11
పురాణం నిర్జనం రమ్యం పప్రచ్ఛ మునిపుఙ్గవమ్.

ప్ర. అ. రాఘవః = రాముడు, మిథిలోపవనే = మిథిలాసమీపమున నున్న వనమునందు, పురాణమ్=ప్రాచీన మైనదియు, నిర్జనమ్=జనులు లేనిదియు, రమ్యమ్ = సుందర మైనదియు, శూన్యమ్ = శూన్యమును అగు, ఆశ్రమమ్ = ఆశ్రమమును, దృశ్య = చూచి, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠు డైన విశ్వామిత్రుని, పప్రచ్ఛ = అడిగెను.

తా. రాముడు, మిథిలాసమీపమునం దున్న వనమునందు, ప్రాచీనము, నిర్జనము, సుందరము, శూన్యము అయిన ఆశ్రమమును చూచి మునిశ్రేష్ఠు డైన విశ్వామిత్రుని ప్రశ్నించెను. 11

మూ. శ్రీమదాశ్రమసంకాశం కిం న్విదం మునివర్జితమ్, 12
శ్రోతుమిచ్ఛామి భగవన్ కస్యాయం పూర్వ ఆశ్రమః.

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా ! శ్రీమత్ = శోభాయుక్త మైనదియు, ఆశ్రమసంకాశమ్ = ఆశ్రమముతో సమాన మైనదియు, మునివర్జితమ్ = మునులతో శూన్య మైనదియు అగు, ఇదమ్ = ఇది, కిం ను = ఏమి ? పూర్వః = ప్రాచీన మైన, అయమ్ = ఈ, ఆశ్రమః = ఆశ్రమము, కస్య = ఎవరిది ? శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. ఓ పూజ్యుడా ! ఇది ఆశ్రమమువలె కనబడుచున్నది. ఇందు మును లెవ్వరును లేరు. ఇది ఏమి ? ప్రాచీన మైన ఈ ఆశ్రమము ఎవరిది ? వినగోరు చున్నాను. 12

మూ. తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం వాక్యం వాక్యవిశారదః, 13
ప్రత్యువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః.

ప్ర అ. వాక్యవిశారదః = వాక్యములందు నేర్పు గలవాడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును అగు, విశ్వామిత్రః మహామునిః = విశ్వామిత్రమహాముని, రాఘవేణ = రాముని చేత, ఉక్తమ్ = పలకబడిన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మాటలలో నేర్పు గల మహాతేజఃశాలి యగు విశ్వామిత్ర మహాముని రాముని మాటలు విని ఇట్లు పలికెను. 13

మూ. హన్త తే కథయిష్యామి శృణు తత్త్వేన రాఘవ, 14
యస్యేదమాశ్రమపదం శప్తం కోపాన్మహాత్మనా.

ప్ర. అ. రాఘవ = రామా ! మహాత్మనా = మహాత్ము డైన, (ఎవనిచేత) కోపాత్ = కోపమువలన, శప్తమ్ = శపింపబడిన, ఇదమ్ = ఈ, ఆశ్రమపదమ్= ఆశ్రమము, యస్య = ఎవనిదో, తత్త్వేన = యథార్థముగా, తే = నీకు, కథయిష్యామి = చెప్పగలను. శృణు = వినుము, హన్త = ఎంత ఆనందము.

**తా.** రామా! చాలా సంతోషము! ఈ ఆశ్రమము ఎవ్వరిదో, ఏ మహాత్ముడు కోపముచే దీనిని శపించెనో యథార్థముగా, చెప్పెదను, వినుము. 14

**మూ.** గౌతమస్య నరశ్రేష్ఠ పూర్వమాసీన్మహాత్మనః 15
ఆశ్రమో దివ్యసంకాశః సురైరపి సుపూజితః.

**ప్ర. అ.** నరశ్రేష్ఠ = ఓ నరశ్రేష్ఠా! దివ్యసంకాశః = దేవలోకాశ్రమముతో సమాన మైన, సురైరపి = దేవతలచేత గూడ, సుపూజితః = బాగుగా పూజింపబడిన, ఆశ్రమః = ఈ ఆశ్రమము, పూర్వమ్ = పూర్వము, మహాత్మనః = మహాత్ము డైన, గౌతమస్య = గౌతమునిదిగా, ఆసీత్ = ఉండెను.

**తా.** రామా! దేవతలు కూడా పూజించు దివ్య మైన ఈ ఆశ్రమము పూర్వము మహాత్ము డైన గౌతమునిదై యుండెను. 15

**మూ.** స చేహ తప ఆతిష్ఠదహల్యాసహితః పురా, 16
వర్షపూగాననేకాంశ్చ రాజపుత్ర మహాయశః.

**ప్ర. అ.** మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర = రాజకుమారా! పురా = పూర్వము, సః = ఆతడు, అహల్యాసహితః = అహల్యాసమేతుడై, అనేకాన్ = అనేకము లైన, వర్షపూగాన్ = సంవత్సర సముదాయములను, ఇహ = ఇచట, తపః = తపస్సు, ఆతిష్ఠత్ = ఆచరించెను.

**తా.** గొప్ప కీర్తి గల ఓ రాజకుమారా! పూర్వ మాతడు అహల్యాసమేతుడై, ఇచట, అనేక సంవత్సరముల పాటు తపస్సు చేసెను. 16

**మూ.** తస్యాన్తరం విదిత్వా తు సహస్రాక్షః శచీపతిః, 17
మునివేషధరోఽహల్యామిదం వచనమబ్రవీత్.

**ప్ర. అ.** శచీపతిః = శచీదేవికి భర్త యైన, సహస్రాక్షః = దేవేంద్రుడు, తస్య = ఆతనియొక్క, అంతరమ్ = అవకాశమును, విదిత్వా = తెలిసికొని, మునివేషధరః = ఆ గౌతమమునియొక్క వేషమును ధరించినవాడై, అహల్యామ్ = అహల్యను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శచీపతి యైన దేవేంద్రుడు ఆ ముని లేని సమయము చూచి, ఆతని వేషము ధరించి అహల్యతో ఇట్లు పలికెను. 17

మూ. ఋతుకాలం ప్రతీక్షన్తే నార్థినః సుసమాహితే, 18
సంగమం త్వహమిచ్ఛామి త్వయా సహ సుమధ్యమే.

ప్ర. అ. సుసమాహితే=చక్కగా సృష్టింపబడినదానా ! అర్థినః=భోగమును కోరువారు, ఋతుకాలమ్=ఋతుకాలమును, న ప్రతీక్షన్తే = ఎదురుచూడరు. సుమధ్యమే=మంచి నడుము కలదానా ! అహమ్=నేను, త్వయా సహ=నీతో కూడ, సంగమమ్=సంగమమును, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. సుందరీ ! కాముకులు ఋతుకాలమునకై వేచి యుండరు. మంచి నడుము కలదానా ! నీ సంగమమును కోరుచున్నాను. 18

మూ. మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునన్దన, 19
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్.

ప్ర. అ. రఘునన్దన=రామా ! దుర్మేధాః=దుర్బుద్ధి గల ఆమె, మునివేషమ్=మునివేషధారి యగు వానిని, సహస్రాక్షమ్=దేవేంద్రునిగా, విజ్ఞాయ=తెలుసుకొని, దేవరాజకుతూహలాత్=దేవతాప్రభు వైన ఆ యింద్రునియందు ఆసక్తివలన, మతిం చకార=అంగీకరించెను.

తా. మునివేషధారి యగు ఆతడు దేవేంద్రు డని తెలిసి కూడ, దుర్బుద్ధి యైన ఆమె దేవరాజు కదా అను మక్కువచే సమ్మతించెను. 19

మూ. అథాబ్రవీన్నరశ్రేష్ఠ కృతార్థేనాన్తరాత్మనా, 20
కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో,
ఆత్మానం మాం చ దేవేశ సర్వథా రక్ష గౌతమాత్. 21

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా ! అథ=పిమ్మట, ఆమె, కృతార్థేన=నెరవేరిన పని గల, అన్తరాత్మనా=అంతఃకరణముతో, అబ్రవీత్=పలికెను. సురశ్రేష్ఠ=ఓ దేవతాశ్రేష్ఠుడా ! కృతార్థా=కృతార్థురాలను, అస్మి=

అయితిని, ప్రభో = ఓ ప్రభూ ! ఇతః = ఇచటినుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్లుము. దేవేశ = దేవరాజా ! ఆత్మానం చ = తనను, మాం చ = నన్నును, సర్వథా = అన్ని విధముల, గౌతమాత్ = గౌతమునినుండి, రక్ష = రక్షింపుము.

తా. రామా ! పిమ్మట, అహల్య, కృతార్థ మైన అంతఃకరణముతో ఇట్లు పలికెను. దేవతలలో శ్రేష్ఠుడా ! కృతార్థురాల నైతిని. ఓ ప్రభూ ! ఇచటినుండి శీఘ్రముగా వెళ్లిపొమ్ము. ఓ దేవరాజా ! నిన్ను, నన్ను కూడ గౌతమునినుండి అన్ని విధముల రక్షించుము. 20, 21

మూ. ఇన్ద్రస్తు ప్రహసన్ వాక్యమహల్యామిదమబ్రవీత్,
సుశ్రోణి పరితుష్టోఽస్మి గమిష్యామి యథాగతమ్. 22

ప్ర. అ. ఇన్ద్రస్తు = ఇంద్రుడైతే, ప్రహసన్ = నవ్వుచు, అహల్యామ్ = అహల్యను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సుశ్రోణి = అంద మైన పిరుదులు గలదానా, పరితుష్టః అస్మి = సంతసించినాను, యథాగతమ్ = వచ్చినట్లుగానే, గమిష్యామి = వెళ్లగలను.

తా. ఇంద్రుడు నవ్వుచు, అహల్యతో— "ఓ సుందరీ ! సంతోషించితిని, వచ్చినట్లే వెళ్లెదను" అని పలికెను. 22

మూ. ఏవం సంగమ్య తు తయా నిశ్చక్రామోటజాత్తతః,
స సంభ్రమాత్త్వరన్ రామ శఙ్కితో గౌతమం ప్రతి. 23

ప్ర. అ. రామ = రామా ! ఏవమ్ = ఈ విధముగా, తయా = ఆమెతో, సంగమ్య = సంగమము చేసి, సః = ఆతడు, సంభ్రమాత్ = భయమువలన, త్వరన్ = తొందరపడుచు, గౌతమం ప్రతి = గౌతముని గూర్చి, శఙ్కితః = శంకించుచున్నవాడై, ఉటజాత్ = పర్ణశాలనుండి, నిశ్చక్రామ = బయలుదేరెను.

తా. రామా ! ఆతడీ విధముగ అహల్యాసంగమము చేసి, గౌతము డెక్కడ వచ్చునో యని శంకించుచు, భయమువలన తొందరపడుచు, పర్ణశాల నుండి బైటకు వచ్చెను. 23

మూ. గౌతమం సందదర్శాథ ప్రవిశన్తం మహామునిమ్,
దేవదానవదుర్ధర్షం తపోబలసమన్వితమ్, 24
తీర్థోదకపరిక్లిన్నం దీప్యమానమివానలమ్,
గృహీతసమిధం తత్ర సకుశం మునిపుఙ్గవమ్. 25

ప్ర. అ. అథ = పిమ్మట, దేవదానవదుర్ధర్షమ్ = దేవతలచేత గాని దానవులచేత గాని ఎదిరింపశక్యము కానివాడును, తపోబలసమన్వితమ్ = తపోబలముతో కూడినవాడును, తీర్థోదకపరిక్లిన్నమ్ = తీర్థోదకముచేత తడిసినవాడును, దీప్యమానమ్ = ప్రజ్వలించుచున్న, అనలమివ = అగ్నివలె నున్నవాడును, గృహీతసమిధమ్ = గ్రహింపబడిన సమిధలు కలవాడును, సకుశమ్ = కుశలతో కూడినవాడును, మునిపుఙ్గవమ్ = మునులలో శ్రేష్ఠుడును అగు, గౌతమం మహామునిమ్ = గౌతమమహామునిని, తత్ర = అచట, ప్రవిశన్తమ్ = ప్రవేశించుచుండగా, సందదర్శ = చూచెను.

తా. అంతట, దేవదానవులచే ఎదిరింప శక్యముకాని వాడును, తపోబలవంతుడును, తీర్థోదకముచే తడిసి ఉన్నవాడును, అగ్నివలె ప్రకాశించుచున్నవాడును మునులలో శ్రేష్ఠుడును అగు గౌతమ మహాముని సమిధలను కుశలను గ్రహించి ఉటజమునందు ప్రవేశించుచుండగా చూచెను. 24, 25

మూ. దృష్ట్వా సురపతిస్త్రస్తో వివర్ణవదనోఽభవత్,
అథ దృష్ట్వా సహస్రాక్షం మునివేషధరం మునిః. 26
దుర్వృత్తం వృత్తసంపన్నో రోషాద్వచనమబ్రవీత్.

ప్ర. అ. సురపతిః = దేవేంద్రుడు, దృష్ట్వా = చూచి, త్రస్తః = భయపడినవాడై, వివర్ణవదనః = రంగుమారిన ముఖము కలవాడు, అభవత్ = ఆయెను. అథ = పిమ్మట, వృత్తసంపన్నః = మంచి నడవడిక గల, మునిః = ముని, మునివేషధరమ్ = మునివేషమును ధరించినవాడును, దుర్వృత్తమ్ = చెడు నడవడిక కలవాడును అగు, సహస్రాక్షమ్ = దేవేంద్రుని, దృష్ట్వా = చూచి, రోషాత్ = కోపమువలన, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ మునిని చూడగనే దేవేంద్రుని ముఖము వెలవెలబారెను. ఉత్తమ చరిత్రశాలి యగు ఆ ముని, మునివేషములో ఉన్న దుష్టచరిత్రుడగు ఆ ఇంద్రుని చూచి కోపముతో ఇట్లు పలికెను. 26

మూ. మమ రూపం సమాస్థాయ కృతవానసి దుర్మతే, 27
అకర్తవ్యమిదం తస్మాద్విఫలస్త్వం భవిష్యసి.

ప్ర. అ. దుర్మతే=ఓ దుర్బుద్ధీ, మమ=నాయొక్క, రూపమ్=రూపమును, సమాస్థాయ = గ్రహించి, ఇదమ్ = ఈ, అకర్తవ్యమ్ = చేయరానిపని, కృతవాన్ అసి = చేసినావు. తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, విఫలః = వృషణములు లేనివాడవు, భవిష్యసి = కాగలవు.

తా. ఓ దుర్మతీ! నా రూపమును ధరించి ఈ విధమైన దుష్టకార్యము నాచరించినందులకు నీ వృషణములు పడిపోవుగాక. 27

మూ. గౌతమేనైవముక్తస్య సరోషేణ మహాత్మనా, 28
పేతతుర్వృషణౌ భూమౌ సహస్రాక్షస్య తత్క్షణాత్.

ప్ర. అ. సరోషేణ = కోపముతో కూడిన, మహాత్మనా = మహాత్ముడైన, గౌతమేన = గౌతమునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తస్య = పలకబడిన, సహస్రాక్షస్య = దేవేంద్రునియొక్క, వృషణౌ = వృషణములు, తత్క్షణాత్ = వెంటనే, భూమౌ = భూమిపై, పేతతుః = పడినవి.

తా. గౌతముడు కోపముతో ఇట్లు పలుకగనే ఇంద్రుని వృషణములు వెంటనే నేలపై పడినవి. 28

మూ. తథా శప్త్వా స వై శక్రమహల్యామపి శప్తవాన్. 29
ఇహ వర్షసహస్రాణి బహూని త్వం వసిష్యసి,
వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ, 30
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేస్మిన్నివత్స్యసి.

ప్ర. అ. సః = అతడు, శక్రమ్ = దేవేంద్రుని, తథా = ఆ విధముగా, శప్త్వా = శపించి, అహల్యామపి = అహల్యను కూడ, శప్తవాన్=శపించినాడు.

త్వమ్ = నీవు, ఇహ = ఇచట, బహూని = అనేక మైన, వర్షసహస్రాణి=వేల కొలది సంవత్సరములను, వసిష్యసి=నివసించగలవు. వాయుభక్షా=వాయువునే భక్షించు చున్నదానవై, నిరాహారా = ఆహారము లేనిదానవై, భస్మశాయినీ = భస్మమునందు శయనించుచున్నదానవై, తప్యన్తీ = తపస్సు చేయుచు, సర్వ భూతానామ్ = సకలభూతములకును, అదృశ్యా = అదృశ్యురాలవై, అస్మిన్ = ఈ, ఆశ్రమే = ఆశ్రమమునందు, నివత్స్యసి = నివసించగలవు.

తా. గౌతముడు ఇంద్రుని ఆ విధముగ శపించి అహల్యను కూడ ఈ విధముగా శపించెను. "చాల వేలసంవత్సరముల పాటు ఇచటనే నివసించెదవు. ఎవ్వరికిని కనబడకుండగ భస్మములో పడి యుండి, ఆహార మేమియు లేక, వాయువును మాత్రమే భక్షించుచు, తపస్సు చేయుచు ఈ ఆశ్రమమునందు నివసించెదవు." 29, 30.

మూ. యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః, 31
ఆగమిష్యతి దుర్ధర్షస్తదా పూతా భవిష్యసి.

ప్ర. అ. దశరథాత్మజః=దశరథుని కుమారుడును, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానివాడును అగు, రామః=రాముడు, యదా=ఎప్పుడు, ఘోరమ్ = భయంకర మైన, ఏతత్ వనమ్ = ఈ వనమును గూర్చి, ఆగమిష్యతి = రాగలడో, తదా = అప్పుడు, పూతా = పవిత్రురాలవు, భవిష్యసి=కాగలవు.

తా. దశరథకుమారు డైన రాముడు భయంకర మైన ఈ వనములో ప్రవేశించగనే నీవు శుద్ధురాలవు కాగలవు. 31

మూ. తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా, 32
మత్సకాశే ముదా యుక్తా స్వం వపుర్ధారయిష్యసి.

ప్ర. అ. దుర్వృత్తే = చెడ్డ నడవడిక కలదానా! తస్య = ఆ రామునకు, ఆతిథ్యేన = అతిథ్యముచేయుటచేత, లోభమోహవివర్జితా = లోభమోహములు తొలగి పోయినదానవై, ముదా = సంతోషముతో, యుక్తా = కూడినదానవై, మత్సకాశే=నా సమీపమునందు, స్వమ్=నీసంబంధమైన, వపుః=శరీరమును, ధారయిష్యసి = ధరింపగలవు.

తా. ఓ దుశ్చరితురాలా ! నీవు ఆ రామునకు ఆతిథిసత్కారములు చేసిన తరువాత లోభమోహములు తొలగి, సంతోషవంతురాలవై, స్వస్వరూపము ధరించి నాతో నివసింపగలవు. 32

మూ. ఏవముక్త్వా మహాతేజా గౌతమో దుష్టచారిణీమ్, 33
ఇమమాశ్రమముత్సృజ్య సిద్ధచారణసేవితే,
హిమవచ్ఛిఖరే పుణ్యే తపస్తేపే మహాతపాః. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టచత్వారింశః సర్గః.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, మహాతపాః = గొప్పతపస్సు కలవాడును అగు, గౌతమః = గౌతముడు, దుష్టచారిణీమ్ = చెడు ప్రవర్తన గల ఆమెను గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, ఇమమ్ = ఈ, ఆశ్రమమ్=ఆశ్రమమును, ఉత్సృజ్య=విడచి, సిద్ధచారణసేవితే= సిద్ధులచేతను చారణులచేతను సేవింపబడిన, పుణ్యే=పుణ్యమైన, హిమవచ్ఛిఖరే= హిమవత్పర్వత శిఖరమునందు, తపః = తపస్సును, తేపే = చేసెను.

తా. మహాతేజఃశాలియు, మహాతపః సంపన్నుడును అగు ఆ గౌతముడు చెడ్డగా ప్రవర్తించిన ఆ అహల్యతో ఈ విధముగ పలికి, ఈ అరణ్యమును విడచి, సిద్ధులును చారణులును నివసించు హిమవత్పర్వత శిఖరమునకు పోయి, అచట తపస్సు చేసెను. 33, 34

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో నలభైఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనపఞ్చాశః సర్గః

మూ. అఫలస్తు తతః శక్రో దేవానగ్నిపురోగమాన్,
అబ్రవీత్త్రస్తవదనః సర్షిసఙ్ఘాన్ సచారణాన్. 1

ప్ర. అ. తతః = పిమ్మట, అఫలః = వృషణములు లేని, శక్రః = దేవేంద్రుడు, త్రస్తవదనః = భయపడిన ముఖము కలవాడై, సర్షిసఙ్ఘాన్ = ఋషి సంఘములతో కూడిన వారును, సచారణాన్ = చారణులతో కూడిన వారును అగు, అగ్నిపురోగమాన్ = అగ్ని మొదలైన, దేవాన్ = దేవతలను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. వృషణములు పడిపోవుటచే దిగులు చెందిన దేవేంద్రుడు, అగ్ని మొదలగు దేవతలతోను ఋషిసంఘములతోను, చారణులతోను ఇట్లు పలికెను. 1

మూ. కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః,
క్రోధముత్పాద్య హి మయా సురకార్యమిదం కృతమ్. 2

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, గౌతమస్య = గౌతమునకు, క్రోధమ్ = కోపమును, ఉత్పాద్య = పుట్టించి, తపసః = తపస్సునకు, విఘ్నమ్ = విఘ్నమును, కుర్వతా = చేసిన, మయా = నాచేత, ఇదమ్ = ఈ, సురకార్యమ్ = దేవతలకార్యము, కృతమ్ = చేయబడినది.

తా. మహాత్ముడైన గౌతమునకు కోపము కలిగించి ఆతని తపస్సునకు విఘ్నము చేయుట ద్వారా నేను దేవతాకార్యమును సాధించితిని. 2

మూ. అఫలోఽస్మి కృతస్తేన క్రోధాత్సా చ నిరాకృతా,
శాపమోక్షేణ మహతా తపోఽస్యాపహృతం మయా. 3

ప్ర. అ. తేన = ఆతనిచేత, క్రోధాత్ = కోపమువలన, అఫలః = వృషణములు లేనివాడను, కృతః అస్మి = చేయబడితిని. సా చ = ఆ అహల్య కూడ, నిరాకృతా = నిరాకరింపబడినది. మహతా = గొప్పదైన, శాపమోక్షేణ =

శాపము నిచ్చుటచేత, అస్య = ఈతనియొక్క, తపః = తపస్సు, మయా = నా చేత, అపహృతమ్ = అపహరింపబడినది.

తా. కోపముతో నన్నాతడు వృషణములు లేనివానినిగా చేసి, ఆ అహల్యనుకూడ పరిత్యజించినాడు. ఈ విధముగ ఆతడు గొప్ప శాపము నిచ్చునట్లు చేసి నే నాతని తపస్సును హరించితిని. 3

మూ. తస్మాత్సురవరాః సర్వే సర్షిసంఘాః సచారణాః,
సురసాహ్యకరం సర్వే సఫలం కర్తుమర్హథ. 4

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, సర్షిసంఘాః = ఋషిసంఘములతో కూడిన, సచారణాః = చారణులతో కూడిన, సర్వే = సమస్తమైన, సురవరాః = దేవతాశ్రేష్ఠులారా ! సురసాహ్యకరమ్ = దేవతలకు సహాయము చేసిన నన్ను, సఫలమ్ = వృషణములు కలవానినిగా, కర్తుమ్ = చేయుటకు, అర్హథ = తగి యున్నారు.

తా. అందుచేత, ఓ దేవతాశ్రేష్ఠులారా, ఋషులారా, చారణులారా, మీరందరును, దేవకార్యము చేసిన నాకు మరల వృషణములు వచ్చునట్లు చేయుడు. 4

మూ. శతక్రతోర్వచః శ్రుత్వా దేవాః సాగ్నిపురోగమాః,
పితృదేవానుపేత్యాహుస్సహ సర్వైర్మరుద్గణైః. ౫

ప్ర. అ. సాగ్నిపురోగమాః = అగ్ని మొదలైన, దేవాః = దేవతలు, శతక్రతోః = దేవేంద్రునియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా=విని, సర్వైః= సమస్తమైన, మరుద్గణైః సహ = దేవగణములతో కూడ, పితృదేవాన్ = పితృదేవతలను, ఉపేత్య = సమీపించి, ఆహుః = పలికిరి.

తా. అగ్నిమొదలైన దేవతలు ఇంద్రుని మాటలు విని, మరుద్గణములతో కలిసి పితృదేవతల దగ్గరకు వెళ్లి ఈ విధముగ పలికిరి. 5

మూ. అయం మేషః సవృషణః శక్రో హ్యవృషణః కృతః,
మేషస్య వృషణౌ గృహ్య శక్రాయాశు ప్రయచ్ఛత. 6

ప్ర. అ. అయమ్ = ఈ, మేషః = మేషము, (గొఱ్ఱె), సవృషణః = వృషణములతో కూడినది. శక్రః = దేవేంద్రుడు, అవృషణః=వృషణములు లేనివాడుగా, కృతః హి = చేయబడినాడు కదా. మేషస్య = మేషముయొక్క, వృషణౌ = వృషణములను, గృహ్యా = స్వీకరించి, ఆశు = వెంటనే, శక్రాయ= దేవేంద్రునకు, ప్రయచ్ఛత = ఇవ్వండి.

తా. యజ్ఞములో మీ భాగముగా లభించు మేషమున కున్న వృషణములను తీసి వృషణములు లేని దేవేంద్రునకు ఇవ్వండి. 6

మూ. అఫలస్తు కృతో మేషః పరాం తుష్టిం ప్రదాస్యతి,
భవతాం హర్షణార్థాయ యే చ దాస్యన్తి మానవాః. 7

ప్ర. అ. అఫలః = వృషణములు లేనిదిగా, కృతః = చేయబడినను, మేషః = మేషము, భవతామ్ = మీకు, పరామ్=గొప్ప, తుష్టిమ్=ఆనందమును, ప్రదాస్యతి = ఇవ్వగలదు. యే మానవాః = ఏ మానవులు, దాస్యన్తి = ఇచ్చెదరో, (వారికి), హర్షణార్థాయ = సంతోషపెట్టుటకు, (సమర్థము కాగలదు).

తా. మేషము వృషణములు తీసివేసినను అది మీకు చాల సంతోషమును ఇవ్వగలదు. మీకు అట్టి మేషమును సమర్పించు మానవులకు కూడ సంతోష ప్రదము కాగలదు. అనగా అట్టి మేషమును మీకు సమర్పించి మానవులు ఇష్ట ఫలమును పొందగలరు. 7

మూ. అగ్నేస్తు వచనం శ్రుత్వా పితృదేవాః సమాగతాః,
ఉత్పాట్య మేషవృషణౌ సహస్రాక్షే న్యవేశయన్. 8

ప్ర. అ. సమాగతాః = వచ్చిన, పితృదేవాః = పితృదేవతలు, అగ్నేః = అగ్నియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, మేషవృషణౌ=మేషము యొక్క వృషణములను, ఉత్పాట్య = పెకలించి, సహస్రాక్షే = దేవేంద్రుని యందు, న్యవేశయన్ = ఉంచిరి.

తా. అగ్ని మాటలు విన్న పితృదేవత లందరును కలిసి, మేషవృషణములు తీసి సహస్రాక్షునకు అతికించిరి. 8

మూ. తదా ప్రభృతి కాకుత్స్థ పితృదేవాః సమాగతాః,
అఫలాన్ భుఞ్జతే మేషాన్ ఫలై స్తేషామయోజయన్. 9

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! సమాగతాః = కలిసిన, పితృదేవాః = పితృదేవతలు, తదాప్రభృతి = అది మొదలు, అఫలాన్ = వృషణములు లేని, మేషాన్ = మేషములను, భుఞ్జతే = భుజించుచున్నారు. తేషామ్ = ఆ మేషముల యొక్క, ఫలైః = వృషణములతో, అయోజయన్ = (దేవేంద్రుని) కూర్చిరి.

తా. రామా ! పితృదేవత లందరును మేషముల వృషణములను ఇంద్రునకు అతికించినారు గాన, అది మొదలు వృషణములు లేని మేషములనే భుజించుచున్నారు. 9

మూ. ఇన్ద్రస్తు మేషవృషణ స్తదాప్రభృతి రాఘవ,
గౌతమస్య ప్రభావేణ తపసశ్చ మహాత్మనః. 10

ప్ర. అ. రాఘవ = రామా ! మహాత్మనః=మహాత్ముడైన, గౌతమస్య= గౌతమునియొక్క, తపసః = తపస్సుయొక్క, ప్రభావేణ = ప్రభావముచేత, ఇన్ద్రః తు = ఇంద్రుడైతే, తదాప్రభృతి = అదిమొదలు, మేషవృషణః = మేషవృషణములు కలవాడైనాడు.

తా. రామా ! మహాత్ముడైన గౌతముని తపఃప్రభావముచే, అదిమొదలు ఇంద్రుడు మేషవృషణుడైనాడు. 10

మూ. తదాగచ్ఛ మహాతేజ ఆశ్రమం పుణ్యకర్మణః,
తారయైనాం మహాభాగామహల్యాం దేవరూపిణీమ్. 11

ప్ర. అ. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా ! తత్ = ఆకారణము వలన, పుణ్యకర్మణః = పుణ్యకర్మ గల గౌతమునియొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, ఆగచ్ఛ = రమ్ము. మహాభాగామ్ = గొప్ప భాగ్యము కలదియు, దేవరూపిణీమ్=దేవతల వంటి రూపము కలదియు అగు, ఏనామ్ = ఈ, అహల్యామ్ = అహల్యను, తారయ = తరింపచేయుము.

తా. మహాతేజఃశాలి వైన రామా! పుణ్యాత్ము డైన గౌతముని ఆశ్రమము ప్రవేశించి, మహాభాగ్యవంతురాలును, దేవతల వంటి రూపము కలదియు అగు ఈ అహల్యను తరింపచేయుము. 11

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా రాఘవః సహలక్ష్మణః,
విశ్వామిత్రం పురస్కృత్య తమాశ్రమమథావిశత్. 12

ప్ర. అ. సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రాఘవః = రాముడు, విశ్వామిత్రవచః = విశ్వామిత్రుని వాక్యమును, శ్రుత్వా = విని, అథ = పిమ్మట, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = ముందిడుకొని, తమ్ = ఆ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అవిశత్ = ప్రవేశించెను.

తా. లక్ష్మణసమేతు డైన రాముడు, విశ్వామిత్రుని మాటలు విని ఆతని వెనుక నడచుచు ఆ ఆశ్రమములో ప్రవేశించెను. 12

మూ. దదర్శ చ మహాభాగాం తపసా ద్యోతితప్రభామ్,
లోకైరపి సమాగమ్య దుర్నిరీక్ష్యాం సురాసురైః, 13
ప్రయత్నాన్నిర్మితాం ధాత్రా దివ్యాం మాయామయీమివ,
సతుషారావృతాం సాభ్రాం పూర్ణచన్ద్రప్రభామివ. 14
మధ్యేంఽభసో దురాధర్షాం దీప్తాం సూర్యప్రభామివ,

ప్ర. అ. మహాభాగామ్ = గొప్ప భాగ్యము కలదియు, తపసా = తపస్సుచేత, ద్యోతితప్రభామ్ = ప్రకాశింపచేయబడిన కాంతి కలదియు, లోకైరపి = జనులచేతను, సురాసురైః = దేవతలచేతను అసురులచేతను, సమాగమ్య = సమీపించి, దుర్నిరీక్ష్యామ్ = చూడ శక్యము కానిదియు, ధాత్రా = బ్రహ్మచేత, ప్రయత్నాత్ = ప్రయత్నమువలన, నిర్మితామ్ = సృజింపబడినదియు, దివ్యామ్ = దివ్యమైనదియు, మాయామయీమివ = మాయారూపమైనది వలె ఉన్నదియు, తుషారావృతామ్ = మంచుచేత కప్పబడినదియు, సాభ్రామ్ = మేఘములతో కూడినదియు అగు, పూర్ణచన్ద్రప్రభామివ = పూర్ణచంద్రకాంతి వలె ఉన్నదియు, అమ్భసః = నీటియొక్క, మధ్యే = మధ్యయందు, దురాధర్షామ్ = ఎదిరింపరాని,

దీప్తామ్ = ప్రకాశించుచున్న, సూర్యప్రభామివ = సూర్యకాంతి వలె ఉన్నదియు అగు ఆ అహల్యను, సః = ఆ రాముడు, దదర్శ చ = చూచెను.

తా. రాముడు, తపస్సుచేత వృద్ధిపొందిన తేజస్సు గల, మహాభాగ్యవతి యగు ఆ అహల్యను చూచెను. ఆమె మానవులు కాని, దేవతలు గాని, అసురులు గాని సమీపించి చూడజాలని విధముగనుండెను. బ్రహ్మ ఆమెను ప్రయత్నపూర్వకముగ సృజించెనా అన్నట్లు దివ్యరూపవంతురాలై ఉండెను. మాయాస్వరూపిణి వలె ఉండెను. మంచు, మేఘములు కప్పిన పూర్ణచంద్రకాంతి వలెను, జలమధ్యమునందు ప్రతిబింబించిన సూర్యకాంతివలెను పైకి స్పష్టముగ కనబడకున్నను ఎదిరింపరాని తేజస్సుతో ప్రకాశించుచుండెను. 13, 14

మూ. సా హి గౌతమవాక్యేన దుర్నిరీక్ష్యా బభూవ హ, 15
త్రయాణామపి లోకానాం యావద్రామస్య దర్శనమ్.

ప్ర. అ. సా=ఆమె, గౌతమవాక్యేన = గౌతమునియొక్క వాక్యముచేత, రామస్య = రామునియొక్క, దర్శనం యావత్ = దర్శన మగునంతవరకు, త్రయాణామపి లోకానామ్ = మూడు లోకములకును, దుర్నిరీక్ష్యా = చూడ శక్యము కానిది, బభూవ హ = అయినది.

తా. గౌతమవాక్యముచే ఆమె, రామదర్శన మగునంత వరకును, మూడు లోకములలో నివసించువారి కెవ్వరికిని కూడ చూడ శక్యము కాకుండెను. 15

మూ. శాపస్యాన్తముపాగమ్య తేషాం దర్శనమాగతా, 16
రాఘవౌ తు తతస్తస్యాః పాదౌ జగృహతుస్తదా.

ప్ర. అ. శాపస్య=శాపముయొక్క, అన్తమ్=అంతమును, ఉపాగమ్య = పొంది, తేషామ్ = వారియొక్క, దర్శనమ్ = దర్శనమును, ఆగతా = పొందినది. తతః=పిమ్మట, రాఘవౌ=రామలక్ష్మణులు, తదా=అప్పుడు, తస్యాః= ఆమెయొక్క, పాదౌ = పాదములను, జగృహతుః = గ్రహించిరి.

తా. ఆ శాపము అంత మగుటచే ఆమె వారికి కనబడెను. పిమ్మట రామలక్ష్మణులు ఆమె పాదములు స్పృశించి నమస్కరించిరి. 16

మూ. స్మరన్తీ గౌతమవచః ప్రతిజగ్రాహ సా చ తౌ, 17
పాద్యమర్ఘ్యం తథాతిథ్యం చకార సుసమాహితా,
ప్రతిజగ్రాహ కాకుత్స్థో విధిదృష్టేన కర్మణా. 18

ప్ర. అ. సా చ = ఆమె కూడ, గౌతమవచః = గౌతముని వాక్యమును, స్మరన్తీ = స్మరించుచున్నదై, తౌ = వారిని, ప్రతిజగ్రాహ = సగౌరవముగా ఆహ్వానించెను. సుసమాహితా = సావధానచిత్తురాలై, పాద్యమ్ = పాద్యమును, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, తథా = మరియు, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును. విధిదృష్టేన = శాస్త్రదృష్ట మైన, కర్మణా = విధానముచే, చకార = చేసెను. కాకుత్స్థః = రాముడు, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. అహల్య గౌతముని మాటలు స్మరించి, వారిని సగౌరవముగా ఆదరించుచు, శాస్త్రోక్తప్రకారమున, సావధాన మైన మనస్సుతో అర్ఘ్యపాద్యాదులు సమర్పించి అతిథిపూజ చేసెను. రాముడు ఆ సత్కారముల నన్నింటిని స్వీకరించెను. 17, 18

మూ. పుష్పవృష్టిర్మహత్యాసీద్దేవదున్దుభినిస్స్వనైః,
గన్ధర్వాప్సరసాం చైవ మహానాసీత్సమాగమః. 19

ప్ర. అ. దేవదున్దుభినిస్స్వనైః = దేవతల దుందుభిధ్వనులతో కూడ, మహతీ = గొప్ప, పుష్పవృష్టిః = పుష్పవర్షము, ఆసీత్ = ఆయెను. గన్ధర్వాప్సరసాం చైవ = గంధర్వులయొక్కయు అప్సరసలయొక్కయు, మహాన్ = గొప్ప, సమాగమః = సమాగమము, ఆసీత్ = ఆయెను.

తా. దేవతలు దుందుభులు మ్రోగించి పుష్పవృష్టి కురిపించిరి. గంధర్వులు పాటలు పాడగా అప్సరసలు నాట్యము చేసిరి. 19

మూ. సాధు సాధ్వీతి దేవాస్తామహల్యాం సమపూజయన్,
తపోబలవిశుద్ధాఙ్గీం గౌతమస్య వశానుగామ్. 20

ప్ర. అ. గౌతమస్య = గౌతమునియొక్క, వశానుగామ్ = వశములో నున్నదియు, తపోబలవిశుద్ధాఙ్గీమ్ = తపోబలముచే విశుద్ధ మైన శరీరముగలదియు

అగు, తామ్ = ఆ, అహల్యామ్ = అహల్యను, దేవాః = దేవతలు, సాధు సాధు ఇతి = బాగు బాగు అని, సమపూజయన్ = పూజించిరి.

తా. గౌతముని ఆదేశము ప్రకారము ఘోరతపస్సు చేయుటచే పరిశుద్ధమైన శరీరము గల ఆ అహల్యను దేవత లందరును బాగు బాగు అని మెచ్చుకొనిరి. 20

మూ. గౌతమోఽపి మహాతేజా అహల్యాసహితః సుఖీ,
రామం సంపూజ్య విధివత్తపస్తేపే మహాతపాః. 21

ప్ర. అ. మహాతపాః = గొప్ప తపస్సు గల, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, గౌతమోఽపి = గౌతముడు కూడా, అహల్యాసహితః=అహల్యతో కూడినవాడై, సుఖీ = సుఖవంతుడై, రామమ్ = రాముని, విధివత్ = యథాశాస్త్రముగా, సంపూజ్య=పూజించి, తపః తేపే = తపస్సు చేసెను.

తా. గొప్ప తపస్తేజస్సులు గల గౌతముడు కూడ అహల్యను స్వీకరించి, సంతోషించినవాడై, రాముని యథావిధిగా పూజించి తపస్సు చేసికొనుచుండెను. 21

మూ. రామోపి పరమాం పూజాం గౌతమస్య మహామునేః,
సకాశాద్విధివత్ప్రాప్య జగామ మిథిలాం తతః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకోనపంచాశః సర్గః.

ప్ర. అ. రామోఽపి = రాముడు కూడ, గౌతమస్య మహామునేః=గౌతమ మహామునియొక్క, సకాశాత్ = సమీపమునుండి, పరమామ్ = గొప్ప, పూజామ్ = పూజను, విధివత్ = యథాశాస్త్రముగ, ప్రాప్య = పొంది, తతః = అచటినుండి, మిథిలామ్ = మిథిలను గూర్చి, జగామ = వెళ్లెను.

తా. రాముడు ఆ గౌతమమహాముని యథావిధిగా చేసిన పూజను అందుకొని మిథిలకు వెళ్లెను. 22

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో నలభైతొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చాశః సర్గః

మూ. తతః ప్రాగుత్తరాం గత్వా రామః సౌమిత్రిణా సహ,
విశ్వామిత్రం పురస్కృత్య యజ్ఞవాటముపాగమత్. 1

ప్ర. అ. తతః = పిమ్మట, రామః = రాముడు, సౌమిత్రిణా సహ= లక్ష్మణునితో కూడ, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = పురస్క రించుకొని, ప్రాగుత్తరామ్ = ఈశాన్యదిక్కునుగూర్చి, గత్వా = వెళ్లి, యజ్ఞ వాటమ్=యజ్ఞవాటికను, ఉపాగమత్ = పొందెను.

తా. పిమ్మట, లక్ష్మణసమేతుడైన రాముడు విశ్వామిత్రుని వెంట నడచుచు ఈశాన్యదిక్కు వైపు ప్రయాణము చేసి, (జనకుని) యజ్ఞవాటమును చేరెను. 1

మూ. రామస్తు మునిశార్దూలమువాచ సహ లక్ష్మణః,
సాధ్వీ యజ్ఞసమృద్ధిర్హి జనకస్య మహాత్మనః. 2

ప్ర. అ. సహ లక్ష్మణః = లక్ష్మణసమేతుడైన, రామస్తు = రాముడైతే, మునిశార్దూలమ్ = మునిశ్రేష్ఠుని గూర్చి, ఉవాచ = పలికెను. మహాత్మనః = మహాత్ముడైన, జనకస్య = జనకునియొక్క, యజ్ఞసమృద్ధిః=యజ్ఞముయొక్క సంభారముల సంపద, సాధ్వీ = మంచిది కదా ?

తా. లక్ష్మణసహితుడైన రాముడు విశ్వామిత్రునితో ఇట్లు పలికెను. మహాత్ముడైన జనకుని యజ్ఞ, సంభారాదులు చాల ఉత్తమముగా ఉన్నవి. 2

మూ. బహూనీహ సహస్రాణి నానాదేశనివాసినామ్,
బ్రాహ్మణానాం మహాభాగ వేదాధ్యయనశాలినామ్. 3
ఋషివాటాశ్చ దృశ్యన్తే శకటీశతసంకులాః,
దేశో విధీయతాం బ్రహ్మన్ యత్ర వత్స్యామహే వయమ్. 4

ప్ర. అ. మహాభాగ=పూజ్యుడా! ఇహ=ఇచట, నానాదేశనివాసినామ్ = నానాదేశములందు నివసించువారును, వేదాధ్యయనశాలినామ్=వేదాధ్యయనముతో ప్రకాశించువారును అగు, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులయొక్క, సహస్రాణి= సహస్రములును, శకటీశతసంకులాః = వందలకొలది బండ్లతో ఇరుకైన, ఋషివాటాశ్చ = ఋషుల నివాసప్రదేశములు, దృశ్యన్తే = చూడబడుచున్నవి. బ్రహ్మన్=ఓ మహామునీ! వయమ్=మనము, యత్ర=ఎచట, వత్స్యామహే= నివసించగలమో, అట్టి, దేశః = ప్రదేశము, విధీయతామ్=నిర్ణయింపబడుగాక.

తా. మహామునీ! ఇచట, నానాదేశములనుండి వచ్చిన, అధ్యయన సంపన్నులైన బ్రాహ్మణులు వేలకొలది ఉన్నారు. వందల కొలది శకటము లతో ఇరుకుగా ఉన్న ఋషివాటికలు కనబడుచున్నవి. ఇచట మనము నివసించు టకు అనువగు ప్రదేశమును నిర్ణయింపుము. 3, 4

మూ. రామస్య వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః,
నివేశమకరోద్దేశే వివిక్తే సలిలాన్వితే. 5

ప్ర. అ. మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, రామస్య=రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, సలిలాన్వితే= నీటితో కూడినదియు, వివిక్తే = జనసంమర్ద రహితమును అగు, దేశే = ప్రదేశము నందు, నివేశమ్ = విడిదిని, అకరోత్ = చేసెను.

తా. విశ్వామిత్రుడు రాముని మాటలు విని, జలసమృద్ధమై, జనసంమర్దము లేని ప్రదేశమునందు విడిది చేసెను. 5

మూ. విశ్వామిత్రమనుప్రాప్తం శ్రుత్వా స నృపతిస్తదా,
శతానన్దం పురస్కృత్య పురోహితమనిన్దితమ్. 6
ప్రత్యుజ్జగామ సహసా వినయేన సమన్వితః.

ప్ర. అ. సః=ఆ, నృపతిః=రాజు, తదా=అప్పుడు, విశ్వామిత్రమ్=విశ్వా మిత్రుని, అనుప్రాప్తమ్=వచ్చినవానినిగా, శ్రుత్వా=విని, అనిన్దితమ్ = దోష అహితుడును, పురోహితమ్=పురోహితుడును అగు, శతానన్దమ్ = శతానందుని,

పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, వినయేన = వినయముతో, సమన్వితః = కూడినవాడై, సహసా = వెంటనే, ప్రత్యుజ్జగామ = ఎదురు వెళ్లెను.

తా. జనకమహారాజు విశ్వామిత్రుడు వచ్చినట్లు విని, పుణ్యాత్ముడును, పురోహితుడును అయిన శతానందుని ముందిడికొని, సవినయముగా ఎదురేగెను. 6

మూ. ఋత్విజోఽపి మహాత్మానస్త్వర్ఘ్యమాదాయ సత్వరమ్, 7
విశ్వామిత్రాయ ధర్మేణ దదుర్మన్త్రపురస్కృతమ్.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, ఋత్విజోఽపి = ఋత్విక్కులు కూడ, సత్వరమ్ = శీఘ్రముగా, అర్ఘ్యమ్ = పూజాద్రవ్యమును, ఆదాయ = గ్రహించి, మంత్రపురస్కృతమ్ = మంత్రపూర్వకముగా, ధర్మేణ = ధర్మము చేత, విశ్వామిత్రాయ = విశ్వామిత్రునకు, దదుః = ఇచ్చిరి.

తా. మహాత్ములైన ఋత్విక్కులు శీఘ్రముగా పూజాద్రవ్యములు తీసికొని వచ్చి మంత్రపూర్వకముగా, ధర్మానుసారముగా విశ్వామిత్రునకు సమర్పించిరి. 7

మూ. ప్రతిగృహ్య చ తాం పూజాం జనకస్య మహాత్మనః, 8
పప్రచ్ఛ కుశలం రాజ్ఞో యజ్ఞస్య చ నిరామయమ్.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, జనకస్య = జనకునియొక్క, తామ్ = ఆ, పూజామ్ = పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, రాజ్ఞః = రాజుయొక్క, కుశలమ్ = కుశలమును, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, నిరామయం చ = ఎట్టి బాధలు లేకుండుటను, పప్రచ్ఛ = అడిగెను.

తా. విశ్వామిత్రుడు, మహాత్ముడైన ఆ జనకుడు చేసిన పూజలను అందికొని, "నీవు కుశలముగా నున్నావా ? యజ్ఞము ఎట్టి లోపములును లేక జరుగుచున్నదా ?" అని ప్రశ్నించెను. 8

మూ. స తాంశ్చాపి మునీన్ పృష్ట్వా సోపాధ్యాయపురోధసః, 9
యథాన్యాయం తతః సర్వైః సమాగచ్ఛత్ ప్రహృష్టవత్.

ప్ర. అ. సః = విశ్వామిత్రుడు, సోపాధ్యాయపురోధసః = ఉపాధ్యాయుల తోను పురోహితులతోను కూడిన, మునీన్ = మునులను, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, పృష్ట్వా = కుశలాదికమును అడిగి, తతః = పిమ్మట, ప్రహృష్టవత్ = సంతోషించినవాడై, సర్వైః = వారి అందరితోటిని, సమాగచ్ఛత్ = కలిసి ఉండెను.

తా. విశ్వామిత్రుడు ఉపాధ్యాయులను, పురోహితుని, మునులను న్యాయానుసారముగ కుశలప్రశ్నము చేసి వారందరితో కలిసి ఆనందముతో నుండెను. 9

మూ. అథ రాజా మునిశ్రేష్ఠం కృతాఞ్జలిరభాషత, 10
ఆసనే భగవానాస్తాం సహైభిర్మునిపుఙ్గవైః.

ప్ర. అ. అథ = పిమ్మట, రాజా = రాజు, కృతాంజలిః = దోసిలి కట్టినవాడై, మునిశ్రేష్ఠమ్ = మునిశ్రేష్ఠుని గూర్చి, అభాషత = పలికెను. భగవాన్ = పూజ్యుడవైన నీవు, ఏభిః = ఈ, మునిపుఙ్గవైః సహ = మునిశ్రేష్ఠులతో కూడ, ఆసనే = ఆసనమునందు, ఆస్తామ్ = కూర్చుందువుగాక.

తా. పిమ్మట జనకుడు అంజలి ఘటించి విశ్వామిత్రునితో ఇట్లు పలికెను—"ఓ పూజ్యుడా ! మునులతో గూడ నీవు ఆసనముపై కూర్చుండుము." 10

మూ. జనకస్య వచః శ్రుత్వా నిషసాద మహామునిః, 11
పురోధా ఋత్విజశ్చైవ రాజా చ సహ మన్త్రిభిః.

ప్ర. అ. జనకస్య = జనకునియొక్క, వచః = వాక్కును, శ్రుత్వా = విని, మహామునిః = మహాముని, నిషసాద = కూర్చుండెను. పురోధాః = పురోహితుడును, ఋత్విజశ్చైవ = ఋత్విక్కులును, మన్త్రిభిః సహ = మంత్రులతో కూడ, రాజా చ = రాజును, (కూర్చుండిరి).

తా. జనకుని వాక్యము విని విశ్వామిత్రుడు కూర్చుండెను. పిమ్మట, పురోహితుడైన శతానందుడును, ఋత్విక్కులును, రాజును, మంత్రులును కూర్చుండిరి. 11

మూ. ఆసనేషు యథాన్యాయముపవిష్టాన్ సమన్తతః, 12
దృష్ట్వా స నృపతిస్తత్ర విశ్వామిత్రమథాబ్రవీత్.

ప్ర. అ. అథ = పిమ్మట, సః = ఆ, నృపతిః = రాజు, తత్ర = అచట, సమన్తతః = నలు వైపుల, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ఆసనేషు = ఆసనములయందు, ఉపవిష్టాన్ = కూర్చున్న వారినందరిని, దృష్ట్వా = చూచి, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. వారందరును న్యాయానుసారముగ ఉచితాసనములపై కూర్చున్న పిమ్మట జనకుడు విశ్వామిత్రునితో ఇట్లు పలికెను. 12

మూ. అద్య యజ్ఞసమృద్ధిర్మే సఫలా దైవతైః కృతా, 13
అద్య యజ్ఞఫలం ప్రాప్తం భగవద్దర్శనాన్మయా.

ప్ర. అ. అద్య = ఈనాడు, మే = నాయొక్క, యజ్ఞసమృద్ధిః = యజ్ఞ సంపద, సఫలా = ఫలము కలదిగా, దైవతైః = దేవతలచేత, కృతా = చేయ బడినది. అద్య = ఈనాడు, భగవద్దర్శనాత్ = పూజ్యుడ వైన నీయొక్క దర్శనమువలన, మయా = నాచేత, యజ్ఞఫలమ్ = యజ్ఞముయొక్క ఫలము, ప్రాప్తమ్ = పొందబడినది.

తా. ఈనాడు దేవతలు సర్వాంగసంపన్న మైన నా యజ్ఞమును సఫలము చేసినారు. పూజ్యుడ వైన నీ దర్శనము లభించినది గాన ఈనాడు నా యజ్ఞము సఫల మైనది. 13

మూ. ధన్యోస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుఙ్గవ, 14
యజ్ఞోపసదనం బ్రహ్మన్ ప్రాప్తోఽసి మునిభిః సహ.

ప్ర. అ. మునిపుఙ్గవ = ముని శ్రేష్ఠుడ వైన, బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా! మునిభిః సహ = మునులతో కూడ, యస్య = ఏ, మే = నాయొక్క, యజ్ఞోపసదనమ్ = యజ్ఞస్థానమును గూర్చి, ప్రాప్తః అసి = వచ్చినావో, అట్టి నేను, ధన్యః అస్మి = ధన్యుడ నైతిని. అనుగృహీతః అస్మి = అనుగ్రహింపబడినవాడ నైతిని.

తా. ముని శ్రేష్ఠుడ వగు విశ్వామిత్రా! మునులతో కలిసి నీవు నా యజ్ఞ వాటమునకు వచ్చుటచే నేను ధన్యుడ నైతిని, అనుగ్రహపాత్ర మైతిని. 14

మూ. ద్వాదశాహం తు బ్రహ్మర్షే శేషమాహుర్మనీషిణః, 15
తతో భాగార్థినో దేవాన్ ద్రష్టుమర్హసి కౌశిక.

ప్ర. అ. బ్రహ్మర్షే=ఓ బ్రహ్మర్షీ! మనీషిణః=విద్వాంసులు, ద్వాదశాహం తు = పంద్రెండు రోజులు మాత్రమే, శేషమ్ = శేషించినదానినిగా, ఆహుః = చెప్పుచున్నారు. కౌశిక = విశ్వామిత్రా! తతః = అటుపిమ్మట, భాగార్థినః = భాగములను కోరుచున్న, దేవాన్=దేవతలను, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి= తగియున్నావు.

తా. బ్రహ్మర్షి వైన విశ్వామిత్రా! ఈ యజ్ఞము పూర్తి యగుటకు ఇంక పంద్రెండు దినములే ఉన్నవని పండితులు చెప్పుచున్నారు. పిమ్మట యజ్ఞ భాగములకొరకు వచ్చు దేవతలను చూడగలవు. 15

మూ. ఇత్యుక్త్వా మునిశార్దూలం ప్రహృష్టవదన స్తదా, 16
పునస్తం పరిపప్రచ్ఛ ప్రాఞ్జలిః ప్రణతో నృపః.

ప్ర. అ. నృపః = రాజు, మునిశార్దూలమ్=మునిశ్రేష్ఠుని గూర్చి, ఇతి= ఈ విధముగా, ఉక్త్వా = పలికి, తదా = అప్పుడు, ప్రహృష్టవదనః = సంతసించిన ముఖము కలవాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ప్రణతః= నమస్కరించుచు, పునః=మరల, తమ్=అతనిని. పరిపప్రచ్ఛ=అడిగెను.

తా. జనకమహారాజు విశ్వామిత్రునితో ఈ విధముగా పలికి, సంతోషముతో వికసించిన ముఖము కలవాడై, దోసిలి యొగ్గి నమస్కరించుచు, మరల విశ్వామిత్రుని ఈ విధముగ ప్రశ్నించెను. 16

మూ. ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ, 17
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ,
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణీధనుర్ధరౌ. 18
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ,
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాదివామరౌ. 19
కథం పద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్య వా మునే.

ప్ర. అ. మునే = విశ్వామిత్రా ! తే = నీకు, భద్రమ్ = మంగళ మగు గాక. దేవతుల్యపరాక్రమౌ = దేవతలతో నమాన మైన పరాక్రమము కలవారును, గజసింహగతీ = గజసింహముల గమనమువంటి గమనము కలవారును, వీరౌ = వీరులును, శార్దూలవృషభోపమౌ = శార్దూలముతోడను, వృషభముతోడను నమానులును, పద్మపత్రవిశాలాక్షౌ = తామరపూవుల రేకుల వలె విశాల మైన నేత్రములు కలవారును, ఖడ్గతూణీధనుర్ధరౌ = ఖడ్గములను, అంబులపొదులను, ధనస్సులను ధరించినవారును, రూపేణ = రూపముచేత, అశ్వినావివ = అశ్వినీ దేవతల వలె ఉన్నవారును, సముపస్థితయౌవనౌ = నమీపించిన యౌవనము కలవారును, దేవలోకాత్ = దేవలోకమునుండి, యదృచ్ఛయా = స్వేచ్ఛాను సారముగా, గామ్ = భూమిని, ప్రాప్తౌ = చేరిన, అమరౌ ఇవ = దేవతల వలె ఉన్నవారును అగు, ఇమౌ = ఈ, కుమారౌ = బాలులు, ఇహ = ఇచటికి, కథమ్ = ఎట్లు, కిమర్థమ్ = ఎందుకు, పద్భ్యామ్ = పాదములచేత, ప్రాప్తౌ = వచ్చినారు ? కస్య వా = ఎవరికి నంబంధించినవారు ?

తా. విశ్వామిత్రా ! (నీకు క్షేమ మగు గాక.) దేవతలతో సమాన మైన పరాక్రమము కలవారును, గజసింహముల నడక వంటి నడక కలవారును, వీరులును, శార్దూలవృషభములతో తుల్యులును, పద్మపత్రముల వలె విశాల మైన నేత్రములు కలవారును, ఖడ్గములను అంబులపొదులను ధనస్సులను ధరించినవారును, అశ్వినీదేవతల వంటి సౌందర్యము కలవారును, యౌవనము నమీపించుచున్నవారును, దేవలోకమునుండి భూలోకమునకు దిగి వచ్చిన దేవతల వలె ఉన్నవారును, అగు ఈ బాలురు ఎవరివారు ? ఇచటికి కాలి నడకనే వచ్చినా రేమి ? ఎందుకు వచ్చినారు? 17-19

మూ. వరాయుధధరౌ వీరౌ కస్య పుత్రౌ మహామునే, 20
భూషయన్తావిమం దేశం చన్ద్రసూర్యావివామ్బరమ్,
పరస్పరస్య సదృశౌ ప్రమాణేఙ్గితచేష్టితైః, 21
కాకపక్షధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః.

ప్ర. అ. మహామునే = ఓ మహామునీ ! వరాయుధధరౌ = శ్రేష్ఠ మైన ఆయుధములను ధరించిన, వీరౌ = ఈ వీరులు, కస్య = ఎవనియొక్క, పుత్రౌ =

పుత్రులు. చన్ద్రసూర్యౌ = చంద్రసూర్యులు, అమ్బరమివ = ఆకాశమును వలె, ఇమమ్ = ఈ, దేశమ్ = ప్రదేశమును, భూషయన్తౌ = అలంకరించుచున్న వారును, ప్రమాణేఙ్గితచేష్టితైః = ప్రమాణముచేతను, అభిప్రాయసూచనలచేతను, చేష్టలచేతను, పరస్పరస్య = ఒకరికొకరు, సదృశౌ = పోలికగలవారును, కాకపక్షధరౌ = జునపములను ధరించినవారును అగు, వీరౌ = ఈ వీరులను గూర్చి, తత్త్వతః = యథార్థముగా, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించు చున్నాను.

తా. మహామునీ! శ్రేష్ఠ మైన ఆయుధములను ధరించిన ఈ వీరులు ఎవని కుమారులు? జునపములను ధరించిన ఈ వీరులు ప్రమాణమునందును, ఇంగితములందును, చేష్టలందును ఒకరి నొకరు పోలియున్నారు. చంద్రసూర్యులు ఆకాశమును ప్రకాశింపచేసి నట్లు ఈ ప్రదేశమును ప్రకాశింప చేయుచున్నారు. ఈ వీరులను గూర్చి తెలిసికొన దలచుచున్నాను. 20, 21

మూ. తస్య తద్వచనం శ్రుత్వా జనకస్య మహాత్మనః, 22
న్యవేదయన్మహాత్మానౌ పుత్రౌ దశరథస్య తౌ.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ము డైన, తస్య = ఆ, జనకస్య = జనకుని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తౌ = ఆ, మహాత్మానౌ = మహాత్ములగు, దశరథస్య = దశరథునియొక్క, పుత్రౌ = పుత్రులనుగా, న్యవేదయత్ = తెలిపెను.

తా. విశ్వామిత్రుడు మహాత్ము డైన జనకుని మాటలు విని, ఆ మహాత్ములిరువురును దశరథకుమారు లని తెలిపెను. 22

మూ. సిద్ధాశ్రమనివాసం చ రాక్షసానాం వధం తథా. 23
తచ్చాగమనమవ్యగ్రం విశాలాయాశ్చ దర్శనమ్,
అహల్యాదర్శనం చైవ గౌతమేన సమాగమమ్. 24
మహాధనుషి జిజ్ఞాసాం కర్తుమాగమనం తథా,
ఏతత్సర్వం మహాతేజా జనకాయ మహాత్మనే, 25
నివేద్య విరరామాథ విశ్వామిత్రో మహామునిః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పఞ్చాశః సర్గః.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, సిద్ధాశ్రమనివాసం చ = సిద్ధాశ్రమమునందు నివాసమును, తథా = మరియు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వధమ్ = వధను, అవ్యగ్రమ్ = నిర్భయముగా, తత్ = ఆ, ఆగమనమ్ = వచ్చుటను, విశాలాయాః = విశాలానగరముయొక్క, దర్శనమ్ = దర్శనమును, అహల్యా దర్శనం చైవ = అహల్యాదర్శనమును, గౌతమేన = గౌతమునితో, సమాగమమ్ = సమాగమమును, తథా = మరియు, మహాధనుషి = గొప్పదైన శివధనస్సునందు, జిజ్ఞాసామ్ = పరీక్షను, కర్తుమ్ = చేయుటకొరకు, ఆగమనమ్ = వచ్చుటను, ఏతత్సర్వమ్ = దీని నంతను, మహాత్మనే = మహాత్ముడైన, జనకాయ = జనకునకు, నివేద్య = తెలిపి, అథ = పిమ్మట, విరరామ = విరమించెను.

తా. మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రమహాముని, రామలక్ష్మణులు నిర్భయముగ సిద్ధాశ్రమమునకు వచ్చి, అచట నివసించి రాక్షసులను సంహరించుట, విశాలానగరమును చూచుట, అహల్యాసందర్శనము, గౌతమునితో సమాగమము, శివధనస్సును పరీక్షించుటకై మిథిలకు వచ్చుట మొదలగు విషయము లన్నియు జనకమహారాజునకు తెలిపెను. 23-25

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకపఞ్చాశః సర్గః

మూ. తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రస్య ధీమతః,
హృష్టరోమా మహాతేజాః శతానన్దో మహాతపాః. 1

గౌతమస్య సుతో జ్యేష్ఠస్తపసా ద్యోతితప్రభః,
రామసందర్శనాదేవ పరం విస్మయమాగతః. 2

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతు డైన, తస్య = ఆ, విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క, తద్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును, గౌతమస్య = గౌతమునియొక్క, జ్యేష్ఠః సుతః = పెద్దకుమారుడును, తపసా = తపస్సుచేత, ద్యోతితప్రభః = ప్రకాశించుచున్న కాంతి కలవాడును అగు, శతానన్దః = శతానందుడు, హృష్టరోమాః = గగుర్పాటు చెందినవాడై, రామసందర్శనాదేవ = రాముని చూడగనే, పరమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగతః = పొందినాడు.

తా. మహాతేజశ్శాలియు, మహాతపస్వియు, తపస్సుతో ప్రకాశించుచున్నవాడును అగు గౌతమజ్యేష్ఠపుత్రు డైన శతానందుడు, బుద్ధిమంతు డగు విశ్వామిత్రుని మాటలు విని, గగుర్పాటు చెందిన శరీరముతో, రాముని చూడగనే అత్యాశ్చర్యవంతు డయ్యెను. 1, 2

మూ. స తౌ నిషణ్ణౌ సంప్రేక్ష్య సుఖాసీనౌ నృపాత్మజౌ,
శతానన్దో మునిశ్రేష్ఠం విశ్వామిత్రమథాబ్రవీత్. 3

ప్ర. అ. అథ = పిమ్మట, సః = ఆ, శతానన్దః = శతానందుడు, నిషణ్ణౌ = సమీపమునం దున్నవారును, సుఖాసీనౌ = సుఖముగా కూర్చున్నవారును అగు, తౌ = ఆ, నృపాత్మజౌ = రాజకుమారులను, సంప్రేక్ష్య = చూచి, మునిశ్రేష్ఠమ్ = మునులలో శ్రేష్ఠ డైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. శతానందుడు సమీపమునందే సుఖముగా కూర్చున్న ఆ రాజకుమారులను చూచి మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రునితో ఇట్లు పలికెను. 3

మూ. అపి తే మునిశార్దూల మమ మాతా యశస్వినీ,
దర్శితా రాజపుత్రాయ తపో దీర్ఘముపాగతా. 4

ప్ర. అ. మునిశార్దూల = మునిశ్రేష్ఠుడా! దీర్ఘమ్ = దీర్ఘమైన, తపః = తపస్సును, ఉపాగతా = పొందినదియు, యశస్వినీ = యశస్సుకలదియు అగు, మమ = నాయొక్క, మాతా = తల్లి, తే = నీచేత, రాజపుత్రాయ = రాజకుమారునకు, అపి దర్శితా = చూపబడినదా?

తా. ఓ మునిశ్రేష్ఠా! తీవ్రతపస్సు చేయుచున్న, యశస్విని యగు మా తల్లిని రామునకు చూపితివా? 4

మూ. అపి రామే మహాతేజా మమ మాతా యశస్వినీ,
వన్యైరుపాహరత్పూజాం పూజార్హే సర్వదేహినామ్. 5

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలదియు, యశస్వినీ = కీర్తి కలదియు అగు, మమ మాతా = నా తల్లి, సర్వదేహినామ్ = సకలప్రాణులకును, పూజార్హే = పూజించుటకు తగిన, రామే = రామునియందు, వన్యైః = వనమునందు లభ్యము లగు వస్తువులచే, పూజామ్ = పూజను, అపి ఉపాహరత్ = చేసినదా?

తా. గొప్ప తేజస్సు, యశస్సు గల మా తల్లి సర్వప్రాణులచేతను పూజింపదగిన రాముని ఫలమూలాదు లర్పించి పూజించినదా? 5

మూ. అపి రామాయ కథితం యథావృత్తం పురాతనమ్,
మమ మాతుర్మహాతేజో దైవేన దురనుష్ఠితమ్. 6

ప్ర. అ. మహతేజః = గొప్ప తేజస్సుకలవాడా! మమ = నాయొక్క, మాతుః = తల్లివిషయమున, దైవేన = దైవముచేత, దురనుష్ఠితమ్ = చెడ్డగా చేయబడిన, పురాతనమ్ = పూర్వము జరిగిన విషయము, యథావృత్తమ్ = జరిగినది జరిగినట్లుగా, రామాయ = రామునకు, అపి కథితమ్ = చెప్పబడినదా?

తా. మహాతేజశ్శాలి వైన విశ్వామిత్రా! విధిబలముచే మా తల్లి విషయమున జరిగిన వృత్తాంతము నంతను రామునకు యథాతథముగ చెప్పినావా? 6

మూ. అపి కౌశిక భద్రం తే గురుణా మమ సంగతా,
మమ మాతా మునిశ్రేష్ఠ రామసందర్శనాదితః. 7

ప్ర. అ. కౌశిక = విశ్వామిత్రుడా! తే = నీకు, భద్రమ్ = మంగళమగుగాక. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠుడా! మమ మాతా = నా తల్లి, రామసందర్శనాదితః = రామునియొక్క దర్శనాదికమువలన, మమ గురుణా = నా తండ్రితో, అపి సంగతా = కలిసినదా?

తా. మునిశ్రేష్ఠుడ వైన విశ్వామిత్రా! రాముని చూచి ఆతిథ్యాదు లిచ్చుటచే పవిత్రురా లైన మా తల్లి మా తండ్రిగారిని చేరినదా? 7

మూ. అపి మే గురుణా రామః పూజితః కుశికాత్మజ,
ఇహాగతో మహాతేజాః పూజాం ప్రాప్తో మహాత్మనః. 8

ప్ర. అ. కుశికాత్మజ = విశ్వామిత్రా! రామః = రాముడు, మే గురుణా = నా తండ్రిచేత, అపి పూజితః = పూజింపబడినాడా? ఇహ = ఇచటికి, ఆగతః = వచ్చిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల నా తండ్రి, మహాత్మనః = మహాత్ముడైన రామునినుండి, పూజామ్ = పూజను, అపి ప్రాప్తః = పొందినాడా?

తా. కుశికనందనా! నా తండ్రి రాముని పూజించినాడా? అచటికి వచ్చిన నా తండ్రిని ఈ మహాత్ముడు గౌరవించినాడా? 8

మూ. అపి శాన్తేన మనసా గురుర్మే కుశికాత్మజ,
ఇహాగతేన రామేణ ప్రయతేనాభివాదితః. 9

ప్ర. అ. కుశికాత్మజ = విశ్వామిత్రా! ఇహ = ఇచటికి, ఆగతేన = వచ్చిన, ప్రయతేన = పరిశుద్ధుడైన, రామేణ = రామునిచేత, మే గురుః = నా తండ్రి, శాన్తేన = శాంతమైన, మనసా = మనస్సుతో, అపి అభివాదితః = నమస్కరింప బడినాడా?

తా. విశ్వామిత్రా! ఆ ఆశ్రమమును చేరిన పరిశుద్ధ దగు రాముడు శాంతమైన మనస్సుతో నా తండ్రిని పూజించినాడా? 9

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రో మహామునిః,
ప్రత్యువాచ శతానన్దం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. 10

ప్ర. అ. మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, తస్య = ఆతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, వాక్యజ్ఞః = వాక్యజ్ఞానము కల ఆతడు, వాక్యకోవిదమ్ = వాక్యము నెరిగిన, శతానన్దమ్ = శతానందుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మాట లాడుటలో నేర్పు గల విశ్వామిత్రమహాముని ఆ మాటలు విని, మాటలలో నేర్పు గల ఆ శతానందునితో ఇట్లు పలికెను. 10

మూ. నాతిక్రాన్తం మునిశ్రేష్ఠ యత్కర్తవ్యం కృతం మయా
సంగతా మునినా పత్నీ భార్గవేణేవ రేణుకా. 11

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠుడా! న అతిక్రాన్తమ్ = (ఏ పనియు) విడువబడలేదు. మయా = నాచేత, యత్ = ఏది, కర్తవ్యమ్ = చేయదగినదో, అది, కృతమ్ = చేయబడినది. రేణుకా = రేణుకాదేవి, భార్గవేణేవ=జమదగ్నితో వలె, పత్నీ = (భార్య) అహల్య, మునినా = గౌతమునితో, సంగతా=కలిసినది.

తా. మునిశ్రేష్ఠుడ వైన శతానందా! చేయదగిన దంతయు చేసినాను. ఏమియు విడువలేదు. రేణుకాదేవి జమదగ్నిని చేరినట్లు అహల్య గౌతముని చేరినది. 11

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య విశ్వామిత్రస్య భాషితమ్,
శతానన్దో మహాతేజా రామం వచనమబ్రవీత్. 12

ప్ర. అ. తస్య=ఆ, విశ్వామిత్రస్య=విశ్వామిత్రుని యొక్క, భాషితమ్= పలకబడిన, తత్ = ఆ, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, మహాతేజాః= గొప్ప తేజస్సు గల, శతానన్దః = శతానందుడు, రామమ్ = రాముని గూర్చి, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తా.** విశ్వామిత్రుని మాటలను విని మహాతేజశ్శాలి యగు శతానందుడు రామునితో ఇట్లనెను. 12

మూ. స్వాగతం తే నరశ్రేష్ఠ దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ,
విశ్వామిత్రం పురస్కృత్య మహర్షిమపరాజితమ్. 13

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడ వైన, రాఘవ=రామా, అపరాజితమ్ = పరాజయము లేని, మహర్షిమ్ = మహర్షి యైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పురస్కృత్య = పురస్కరించుకొని, దిష్ట్యా = దైవవశముచేత, ప్రాప్తః అసి = వచ్చితివి. తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము.

**తా.** నరశ్రేష్ఠుడ వైన రామా! అడ్డు లేని మహిమ గల విశ్వామిత్ర మహర్షిని అనుసరించి దైవవశముచే (మా అదృష్టముచే) ఇచటికి వచ్చితివి. నీకు స్వాగతము. 13

మూ. అచిన్త్యకర్మా తపసా బ్రహ్మర్షిరతులప్రభః,
విశ్వామిత్రో మహాతేజా వేత్స్యేనం పరమాం గతిమ్. 14

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, అచిన్త్యకర్మా = ఊహింప శక్యము కాని పనులు కలవాడు. తపసా = తపస్సుచేత, బ్రహ్మర్షిః = బ్రహ్మర్షి, అతులప్రభః=సాటి లేని కాంతి కలవాడు. ఏనమ్= ఈతనిని, పరమామ్ = గొప్ప, గతిమ్ = గతినిగా, వేత్సి = ఎరుగుదువు.

**తా.** గొప్ప తేజస్సు గల ఈ విశ్వామిత్రుని కార్యములు మనసా కూడ ఊహింప శక్యము కానివి. తపస్సుచేత బ్రహ్మర్షి యైనాడు. ఈతని ప్రభావము సాటిలేనిది. ఈతనినే ఉత్తమగతిగా గ్రహించినావు. 14

మూ. నాస్తి ధన్యతరో రామ త్వత్తోఽన్యో భువి కశ్చన,
గోప్తా కుశికపుత్రస్తే యేన తప్తం మహత్తపః. 15

ప్ర. అ. రామ = రామా, భువి = ఈ భూలోకమునందు, త్వత్తః = నీకంటె, ధన్యతరః = ఎక్కువ ధన్యుడు, అన్యః = మరి యొకడు, కశ్చన = ఒక్కడును, నాస్తి = లేడు. యేన = ఎవనిచేత, మహత్ = గొప్ప, తపః =

తపస్సు, తప్తమ్ = చేయబడినదో, అట్టి, కుశికపుత్రః = విశ్వామిత్రుడు, తే = నీకు, గోప్తా = రక్షకుడు.

తా. రామా! గొప్ప తపస్సు చేసిన విశ్వామిత్రుడు నీకు రక్షకుడుగా ఉన్నాడు. అందుచే నీకంటె ధన్యుడు మరెవ్వడును ఈ లోకములో లేడు. 15

మూ. శ్రూయతాం చాభిధాస్యామి కౌశికస్య మహాత్మనః,
యథాబలం యథావృత్తం తన్మే నిగదతః శృణు. 16

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, కౌశికస్య = విశ్వామిత్రుని, బలమ్ = బలము, యథా = ఎట్లో, వృత్తమ్ = చరిత్రము, యథా = ఎట్లో, అభిధాస్యామి = చెప్పెదను. తత్ = దానిని, నిగదతః = చెప్పుచున్న, మే = నా నుండి, శృణు = వినుము.

తా. విశ్వామిత్రుని బల మెంతటిదో, ఆతని చరిత్ర ఎట్టిదో చెప్పెదను, వినుము. 16

మూ. రాజాభూదేష ధర్మాత్మా దీర్ఘకాలమరిన్దమః,
ధర్మజ్ఞః కృతవిద్యశ్చ ప్రజానాం చ హితే రతః. 17

ప్ర. అ. ఏషః = ఇతడు, ధర్మాత్మా = ధర్మాత్ముడును, అరిన్దమః = శత్రువులను అణచివేయు వాడును, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడును, కృతవిద్యః = విద్యల నభ్యసించినవాడును, ప్రజానామ్ = ప్రజలయొక్క, హితే = హితమునందు, రతః = ఆసక్తి కలవాడును అగు, రాజా = రాజుగా, దీర్ఘకాలమ్ = చాల కాలము, అభూత్ = ఉండెను.

తా. ఈ విశ్వామిత్రుడు, చాలకాలము పాటు, ధర్మాత్ముడును, శత్రువినాశకుడును, ధర్మవేత్తయు, సకలవిద్యలను అభ్యసించిన వాడును, ప్రజల మేలు కోరువాడును అగు రాజుగా ఉండెను. 17

మూ. ప్రజాపతిసుతశ్చాసీత్కుశో నామ మహీపతిః,
కుశస్య పుత్రో బలవాన్ కుశనాభస్సుధార్మికః. 18

ప్ర. అ. ప్రజాపతిసుతః = ప్రజాపతియొక్క కుమారు డైన, కుశో నామ=కుశుడను పేరు గల, మహీపతిః = రాజు, ఆసీత్=ఉండెను. బలవాన్= బలవంతుడును, సుధార్మికః = మంచి ధర్మాత్ముడును అగు, కుశనాభః = కుశ నాభుడు, కుశస్య = కుశునియొక్క, పుత్రః = పుత్రుడు.

తా. బ్రహ్మపుత్రు డైన కుశు డనెడు రాజు ఉండెను. ఆ కుశునకు, బలవంతుడును, ధార్మికుడును అగు కుశనాభు డను కుమారు డుండెను. 18

మూ. కుశనాభసుతస్త్వాసీద్గాధిరిత్యేవ విశ్రుతః,
గాధేః పుత్రో మహాతేజా విశ్వామిత్రో మహామునిః. 19

ప్ర. అ. గాధిః ఇత్యేవ = గాధి అని, విశ్రుతః = ప్రసిద్ధు డైన, కుశనాభ సుతః తు = కుశనాభుని కుమారుడు, ఆసీత్ = ఉండెను. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, గాదేః = గాధియొక్క, పుత్రః = కుమారుడు.

తా. ప్రసిద్ధు డగు గాధి కుశనాభుని కుమారుడు. మహాతేజశ్శాలి యైన ఈ విశ్వామిత్రముని ఆ గాధియొక్క కుమారుడు. 19

మూ. విశ్వామిత్రో మహాతేజాః పాలయామాస మేదినీమ్,
బహువర్షసహస్రాణి రాజా రాజ్యమకారయత్. 20

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, మేదినీమ్ = భూమిని, పాలయామాస = పరిపాలించెను. రాజా = ఈ రాజు, బహువర్షసహస్రాణి = చాల వేల సంవత్సరములు, రాజ్యమ్ = రాజ్యమును, అకారయత్ = చేసెను.

తా. మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రుడు రాజై చాల వేల సంవత్స రములు రాజ్యము చేసెను. 20

మూ. కదాచిత్తు మహాతేజా యోజయిత్వా వరూథినీమ్,
అక్షౌహిణీపరివృతః పరిచక్రామ మేదినీమ్. 21

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల ఆ విశ్వామిత్రుడు, కదాచిత్ = ఒకానొకప్పుడు, వరూధినీమ్ = సేనను, యోజయిత్వా = కూర్చుకొని, అక్షౌహిణీపరివృతః = అక్షౌహిణీప్రమాణము గల సైన్యముతో కూడినవాడై, మేదినీమ్ = భూమిని, పరిచక్రామ = చుట్టు తిరిగెను.

తా. మహాతేజఃశాలి యగు విశ్వామిత్రుడు ఒకప్పుడు సైన్యమును నమకూర్చుకొని, అక్షౌహిణీ ప్రమాణములో నున్న సైన్యము వెంట రాగా భూమి అంతయును తిరిగెను. 21

మూ. నగరాణి సరాష్ట్రాణి సరితశ్చ తథా గిరీన్,
ఆశ్రమాన్ క్రమశో రామ విచరన్నాజగామ హ. 22

వసిష్ఠస్యాశ్రమపదం నానావృక్షసమాకులమ్,
నానామృగగణాకీర్ణం సిద్ధచారణసేవితమ్. 23

దేవదానవగన్ధర్వైః కిన్నరైరుపశోభితమ్,
ప్రశాన్తహరిణాకీర్ణం ద్విజసఙ్ఘనిషేవితమ్. 24

బ్రహ్మర్షిగణసఙ్కీర్ణం దేవర్షిగణసేవితమ్,
తపశ్చరణసంసిద్ధైరగ్నికల్పైర్మహాత్మభిః. 25

అబ్భక్షైర్వాయుభక్షైశ్చ శీర్ణపర్ణాశనైస్తథా,
ఫలమూలాశనైర్దాన్తైర్జితరోషైర్జితేన్ద్రియైః. 26

ఋషిభిర్వాలఖిల్యైశ్చ జపహోమపరాయణైః,
అన్యైర్వైఖానసైశ్చైవ సమన్తాదుపశోభితమ్. 27

ప్ర. అ. రామ = రామా! సరాష్ట్రాణి = రాష్ట్రములతో కూడిన, నగరాణి = నగరములను, సరితః = నదులను, తథా = మరియు, గిరీన్ = పర్వతములను, ఆశ్రమాన్ = ఆశ్రమములను, క్రమశః = క్రమముగా, విచరన్ = సంచరించుచు, నానావృక్షసమాకులమ్ = అనేకవిధము లైన వృక్షములతో ఆకుల మైనదియు,

నానామృగగణాకీర్ణమ్ = అనేక విధములైన మృగగణములతో నిండినదియు, సిద్ధచారణసేవితమ్ = సిద్ధులచేతను చారణులచేతను సేవింపబడినదియు, దేవదానవగన్ధర్వైః = దేవదానవగంధర్వులతోను, కిన్నరైః = కిన్నరులతోను, ఉపశోభితమ్ = ప్రకాశించుచున్నదియు, ప్రశాన్తహరిణాకీర్ణమ్ = ప్రశాంతము లైన లేళ్లతో కూడినదియు, ద్విజసఙ్ఘనిషేవితమ్ = పక్షుల సముదాయముచే సేవింపబడినదియు, బ్రహ్మర్షిగణసఙ్కీర్ణమ్ = బ్రహ్మర్షుల సముదాయముచే వ్యాప్తమైనదియు, దేవర్షిగణసేవితమ్=దేవర్షుల సముదాయములచే సేవింపబడినదియు, తపశ్చరణసంసిద్ధైః = తపస్సును ఆచరించుటచే సిద్ధి పొందినవారును, అగ్నికల్పైః = అగ్నితుల్యులును, మహాత్మభిః = మహాత్ములును, అబ్భక్షైః = ఉదకమును మాత్రమే భక్షించువారును, వాయుభక్షైశ్చ = వాయువును మాత్రమే భక్షించువారును, తథా = మరియు, శీర్ణపర్ణాశనైః = రాలిన ఆకులే ఆహారముగా కలవారును, ఫలమూలాశనైః = ఫలములను దుంపలను తినువారును, దాన్తైః = మనోనిగ్రహము కలవారును, జితరోషైః = జయింపబడిన కోపము కలవారును, జితేన్ద్రియైః = జయించబడిన ఇంద్రియములు కలవారును అగు, ఋషిభిః = ఋషీశ్వరులతోను, జపహోమపరాయణైః = జపహోమములందు ఆసక్తు లగు, వాలఖిల్యైః = వాలఖిల్యులతోను, (బ్రహ్మయొక్క వాలమునుండి పుట్టిన ఋషులు వాలఖిల్యులు), అన్యైః = ఇతరు లైన, వైఖానసైశ్చైవ = బ్రహ్మయొక్క నఖములనుండి పుట్టిన వైఖానసులతోడను, సమన్తాత్ = అంతటను, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడిన, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, ఆజగామ=చేరెను.

తా. రామా ! విశ్వామిత్రుడు నగరములందును, రాష్ట్రములందును నదీగిరి ప్రాంతములందును, ఆశ్రమములందును క్రమముగా సంచరించుచు వసిష్ఠుని ఆశ్రమమును చేరెను. ఆ ఆశ్రమము నానావిధము లగు వృక్షములతోడను, పక్షిగణములతోడను వ్యాప్త మై యుండెను. అచట సిద్ధ-చారణ-దేవ-దానవ-గంధర్వ-కిన్నరాదులు నివసించుచుండిరి. ప్రశాంతములైన వేళ్లతోను, పక్షిసముదాయములతోను ఒప్పుచుండెను. బ్రహ్మర్షిగణములు, దేవర్షిగణములు ఆ ఆశ్రమమును ఆశ్రయించి ఉండిరి. తపస్సు నాచరించి సిద్ధి పొందిన వారును, అగ్నితో సమానులును, మహాత్ములును, మనస్సును నిగ్రహించిన వారును, రోషమును జయించినవారును జితేంద్రియులును అగు ఋషులు అచట నివసించుచుండిరి. వారిలో కొందరు నీరు

మాత్రమే భక్షింప కొందరు వాయువునే భక్షించుచుండిరి. కొందరు రాలిన ఆకులను మాత్రమే ఆహారముగా తీసికొనెడివారు. మరి కొందరు పండ్లు, దుంపలు మాత్రమే ఆహారముగా తీసుకొనెడివారు. జపహోమములందు ఆసక్తి గల వాలఖిల్యులు, ఇతరులైన వైఖానసులును దీనికి శోభ కలిగించుచుండిరి. 22-27

మూ. వసిష్ఠస్యాశ్రమపదం బ్రహ్మలోకమివాపరమ్,
దదర్శ జయతాం శ్రేష్ఠో విశ్వామిత్రో మహాబలః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. జయతామ్=జయించువారిలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడును, మహాబలః=మహాబలవంతుడును అగు, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, అపరమ్=రెండవ, బ్రహ్మలోకమివ=బ్రహ్మలోకము వలె నున్న, వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమమును, దదర్శ=చూచెను.

తా. విజయవంతులలో శ్రేష్ఠుడును, మహాబలశాలియు అగు విశ్వామిత్రుడు రెండవ బ్రహ్మలోకము వలె నున్న వసిష్ఠాశ్రమమును చూచెను. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
ఏబది ఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

మూ. స దృష్ట్వా పరమప్రీతో విశ్వామిత్రో మహాబలః,
ప్రణతో వినయా ద్వీరో వసిష్ఠం జపతాం వరమ్. 1

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము కలవాడును, వీరః = వీరుడును అగు, సః = ఆ, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, జపతామ్=జపము చేయు మునులలో, వరమ్=శ్రేష్ఠు డైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, దృష్ట్వా = చూచి, పరమప్రీతః = చాల సంతసించినవాడై, వినయాత్ = వినయము వలన, ప్రణతః= నమస్కరించెను.

తా. గొప్ప బలము కలవాడును, వీరుడును అగు ఆ విశ్వామిత్రుడు మునులలో శ్రేష్ఠు డైన వసిష్ఠుని చూచి చాల సంతసించి, సవినయముగా నమస్కరించెను. 1

మూ. స్వాగతం తవ చేత్యుక్తో వసిష్ఠేన మహాత్మనా,
ఆసనం చాస్య భగవాన్ వసిష్ఠోఽస్యాదిదేశ హ. 2

ప్ర. అ. తవ=నీకు, స్వాగతమ్=స్వాగతము, ఇతి=అని, మహాత్మనా= మహాత్ము డైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, ఉక్తశ్చ=పలకబడెను కూడ. భగవాన్= భగవంతుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, అస్య = ఈతనికి, ఆసనం చ=ఆసనమును కూడ, వ్యాదిదేశ హ = ఇచ్చెను.

తా. మహాత్ముడును, పూజ్యుడును అగు వసిష్ఠుడు ఆతనికి స్వాగతము పలికి ఆసన మిచ్చెను. 2

మూ. ఉపవిష్టాయ చ తదా విశ్వామిత్రాయ ధీమతే,
యథాన్యాయం మునివరః ఫలమూలముపాహరత్. 3

ప్ర. అ. తదా = అప్పుడు, మునివరః = మునిశ్రేష్ఠుడు, ఉపవిష్టాయ = కూర్చున్న, ధీమతే = బుద్ధిమంతు డైన, విశ్వామిత్రాయ = విశ్వామిత్రునకు,

యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ఫలమూలమ్ = ఫలమూలములను, ఉపాహరత్ = సమర్పించెను.

తా. అప్పుడు మునిశ్రేష్ఠుడైన వసిష్ఠుడు కూర్చున్న, బుద్ధిమంతుడైన విశ్వామిత్రునకు న్యాయానుసారముగా ఫలమూలములను సమర్పించెను. 3

మూ. ప్రతిగృహ్య తు తాం పూజాం వసిష్ఠాద్రాజసత్తమః,
తపోగ్నిహోత్రశిష్యేషు కుశలం పర్యపృచ్ఛత. 4

విశ్వామిత్రో మహాతేజా వనస్పతిగణే తథా,
సర్వత్ర కుశలం చాహ వసిష్ఠో రాజసత్తమమ్. 5

ప్ర. అ. రాజసత్తమః = రాజులలో శ్రేష్ఠుడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును అగు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వసిష్ఠాత్ = వసిష్ఠుని నుండి, తామ్ = ఆ, పూజామ్ = పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, తపోగ్నిహోత్రశిష్యేషు = తపస్సునందు, అగ్నిహోత్రమునందును, శిష్యులందును, తథా = మరియు, వనస్పతిగణే = వృక్షసముదాయమునందును, కుశలమ్ = కుశలమును, పర్యపృచ్ఛత = అడిగెను. వసిష్ఠః చ = వసిష్ఠుడుకూడ, సర్వత్ర = అన్నింటియందును, కుశలమ్ = కుశలమును, రాజసత్తమమ్ = ఆ రాజశ్రేష్ఠుని గూర్చి, ఆహ = చెప్పెను.

తా. మహాతేజఃశాలి యగు ఆ విశ్వామిత్రమహారాజు వసిష్ఠుడు చేసిన ఆ పూజను స్వీకరించి – "మీ తపస్సునకును, అగ్నిహోత్రమునకును, శిష్యులకును, వృక్షసముదాయమునకును క్షేమమా" అని ప్రశ్నించెను. "అన్నియు క్షేమముగా నున్నవి" అని వసిష్ఠుడు అతనికి చెప్పెను. 4, 5

మూ సుఖోపవిష్టం రాజానం విశ్వామిత్రం మహాతపాః,
పప్రచ్ఛ జపతాం శ్రేష్ఠో వసిష్ఠో బ్రహ్మణః సుతః. 6

ప్ర. అ. జపతామ్ = జపము చేయువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడును, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, సుతః = కుమారుడును అగు, వసిష్ఠః = వసిష్ఠుడు, సుఖోపవిష్టమ్ = సుఖముగా కూర్చున్న, రాజానమ్ = రాజైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, పప్రచ్ఛ = అడిగెను.

తా. మహాతపశ్శాలియు, మునులలో శ్రేష్ఠుడును, బ్రహ్మపుత్రుడును అగు వసిష్ఠుడు సుఖాసీనుడై ఉన్న విశ్వామిత్రమహారాజును ఇట్లు అడిగెను. 6.

మూ. కచ్చిత్తే కుశలం రాజన్ కచ్చిద్ధర్మేణ రఞ్జయన్,
ప్రజాః పాలయసే వీర రాజవృత్తేన ధార్మిక. 7

ప్ర అ. రాజన్ = ఓ రాజా ! తే=నీకు, కుశలం కచ్చిత్=క్షేమమే కదా ? ధార్మిక = ధార్మికుడవైన, వీర = వీరుడా ! ప్రజాః = ప్రజలను, ధర్మేణ = ధర్మముచేత, రఞ్జయన్=రంజింపచేయుచు, రాజవృత్తేన=రాజధర్మానుసారముగా, పాలయసే కచ్చిత్ = పరిపాలించుచున్నావా ?

తా. రాజా ! నీకు క్షేమమే కదా ? ధార్మికుడవైన ఓ వీరుడా ! ధర్మముచే ప్రజలను రక్షింపచేయుచు, వారిని రాజవృత్తానుసారము పాలించుచున్నావా ?

వి. "న్యాయేనార్జన మర్థస్య వర్ధనం పాలనం తథా
సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్".

అని చెప్పినట్లు, ధనమును న్యాయముగా ఆర్జించుట, దానిని వృద్ధి పొందించుట, రక్షించుట, సత్పాత్రలకు ఇచ్చుట అనునది "రాజవృత్తము". 7

మూ. కచ్చిత్తే సంభృతా భృత్యాః కచ్చిత్తిష్ఠన్తి శాసనే,
కచ్చిత్తే విజితాః సర్వే రిపవో రిపుసూదన. 8

ప్ర. అ. తే=నీయొక్క, భృత్యాః=పోష్యవర్గములోనివారు, సంభృతాః=బాగుగా పోషింపబడుచున్నారా ? శాసనే= నీ ఆజ్ఞయందు, తిష్ఠన్తి కచ్చిత్ = ఉంటున్నారా ? రిపుసూదన = శత్రువులను సంహరించు వాడా ! తే=నీయొక్క, రిపవః = శత్రువులు, సర్వే = అందరును, విజితాః కచ్చిత్ = జయింపబడినారా ?

తా. నీవు నీ భృత్యులను చక్కగా పోషించుచున్నావా ? వారు నీ ఆజ్ఞను అతిక్రమించక ఉన్నారా ? ఓ శత్రుసంహారకా ! నీ శత్రువుల నందరిని జయించితివా ? 8.

మూ. కచ్చిద్బలేషు కోశేషు మిత్రేషు చ పరంతప,
కుశలం తే నరవ్యాఘ్ర పుత్రపౌత్రే తవానఘ. 9

ప్ర. అ. పరంతప = శత్రువులను పీడించువాడా! అనఘ = పాపములు లేనివాడా! నరవ్యాఘ్ర = నరశ్రేష్ఠుడా! బలేషు = సేనలయందును, కోశేషు = ధనాగారములందును, మిత్రేషు = మిత్రులందును, తవ = నీయొక్క, పుత్రపౌత్రే = పుత్రపౌత్రులందును, తే = నీకు, కుశలమ్ = కుశలమా?

తా. శత్రుసంహారకుడవు, పాపరహితుడవు అయిన ఓ పురుషశ్రేష్ఠుడా! నీ సేనలు, కోశములు, మిత్రులు, పుత్రపౌత్రాదులును కుశలమా? 9

మూ. సర్వత్ర కుశలం రాజా వసిష్ఠం ప్రత్యుదాహరత్,
విశ్వామిత్రో మహాతేజా వసిష్ఠం వినయాన్వితః. 10

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రాజా = రాజైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, వినయాన్వితః = వినయముతో కూడినవాడై, వసిష్ఠం ప్రతి = వసిష్ఠుని గూర్చి, సర్వత్ర = అంతటను, కుశలమ్ = కుశలమును, ఉదాహరత్ = చెప్పెను.

తా. మహాతేజశ్శాలి యైన విశ్వామిత్రమహారాజు అంతటను కుశలమే అని వసిష్ఠునకు సవినయముగ నివేదించెను. 10

మూ. కృత్వోభౌ సుచిరం కాలం ధర్మిష్ఠౌ తాః కథాః శుభాః,
ముదా పరమయా యుక్తౌ ప్రీయేతాం తౌ పరస్పరమ్. 11

ప్ర. అ. ధర్మిష్ఠౌ = ధర్మతత్పరులైన, తౌ ఉభౌ = వారిరువురును, పరమయా = గొప్ప, ముదా = సంతోషముతో, యుక్తౌ = కూడినవారై, సుచిరం కాలమ్ = చాలాకాలము, శుభాః = శుభమైన, తాః కథాః = ఆ యా విషయములను గూర్చిన సంభాషణములను, కృత్వా = చేసి, పరస్పరమ్ = ఒండొరులను, ప్రీయేతామ్ = సంతసింపచేసికొనిరి.

తా. ధర్మనిష్ఠులైన వారిరువురును మిక్కిలి ఆనందముతో చాల సేపు ఆ యా విషయములను గూర్చి సంభాషణలు చేసికొని ఒకరి నొకరు సంతోష పెట్టుకొనిరి. 11

మూ. తతో వసిష్ఠో భగవాన్ కథాన్తే రఘునన్దన,
విశ్వామిత్రమిదం వాక్యమువాచ ప్రహసన్నివ. 12

ప్ర. అ. రఘునన్దన = రామా, తతః = పిమ్మట, భగవాన్=పూజ్యు డైన, వసిష్ఠః = వసిష్ఠుడు, కథాన్తే=సంభాషణము ముగిసిన తరువాత, ప్రహసన్నివ= నవ్వుచు, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రామా! సంభాషణాంతమునందు, పూజ్యు డైన వసిష్ఠుడు నవ్వుచు విశ్వామిత్రునితో ఇట్లనెను. 12

మూ. ఆతిథ్యం కర్తుమిచ్ఛామి బలస్యాస్య మహాబల,
తవ చైవాప్రమేయస్య యథార్హం సంప్రతీచ్ఛ మే. 13

ప్ర. అ. మహాబల = గొప్ప బలము కలవాడా! అస్య = ఈ, బలస్య = సైన్యమునకును, అప్రమేయస్య = సాటిలేని, తవ చైవ = నీకును, యథార్హమ్= తగు విధముగా, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించుచున్నాను. మే = నానుండి, సంప్రతీచ్ఛ = అంగీకరింపుము.

తా. సాటి లేనివాడ వైన ఓ విశ్వామిత్రా! మహాబల శాలి వైన నీకును, నీ సైన్యమునకును యథోచితముగ అతిథిసత్కారము చేయ గోరుచున్నాను. దీనిని స్వీకరింపుము. 13

మూ. సత్క్రియాం తు భవానేతాం ప్రతీచ్ఛతు మయోద్యతామ్,
రాజా త్వమతిథిశ్రేష్ఠః పూజనీయః ప్రయత్నతః. 14

ప్ర. అ. భవాన్ = నీవు, మయా = నాచేత, ఉద్యతామ్=ఇవ్వబడుచున్న, సత్క్రియామ్ = సత్కారమును, ప్రతీచ్ఛతు = అంగీకరింతువుగాక. రాజా = రాజు వైన, త్వమ్=నీవు, ప్రయత్నతః=ప్రయత్నపూర్వకముగా, పూజనీయః= పూజించ దగిన, అతిథిశ్రేష్ఠః = శ్రేష్ఠాతిథివి.

తా. నీవు నేనిచ్చుచున్న ఈ సత్కారమును స్వీకరింపుము. రాజువైన నీవు ఉత్తము డైన అతిథివి. అందుచే నిన్ను ప్రయత్నపూర్వకముగ పూజింప వలసి యున్నది. 14

మూ. ఏవముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహామతిః,
కృతమిత్యబ్రవీద్రాజా ప్రియవాక్యేన మే త్వయా. 15

ప్ర. అ. వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, మహామతిః = గొప్పబుద్ధిగల, రాజా = రాజైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, త్వయా = నీచేత, ప్రియవాక్యేన = ప్రియవాక్యముచేతనే, కృతమ్ = ఆతిథ్యము చేయబడినది, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. వసిష్ఠుని మాటలు విన్న బుద్ధిశాలి యగు విశ్వామిత్రుడు ఇట్లు పలికెను :— "నీవు ప్రియ మైన మాటలు పలికితివి. ఇదియే నాకు ఆతిథ్యము". 15

మూ. ఫలమూలేన భగవన్విద్యతే యత్తవాశ్రమే,
పాద్యేనాచమనీయేన భగవద్దర్శనేన చ, 16

సర్వథా చ మహాప్రాజ్ఞ పూజార్హేణ సుపూజితః,
గమిష్యామి నమస్తేఽస్తు మైత్రేణేక్షస్వ చక్షుషా. 17

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! యత్ = ఏది, తవ = నీయొక్క, ఆశ్రమే = ఆశ్రమమునందు, విద్యతే = ఉన్నదో, అట్టి, ఫలమూలేన = ఫలమూలాదికముచేతను, పాద్యేన=పాద్యముచేతను, ఆచమనేన చ=ఆచమనముచేతను, భగవద్దర్శనేన = పూజ్యుడ వైన నీ దర్శనముచేతను, పూజార్హేణ = పూజార్హుడ వైన నీ చేత, సర్వథా=అన్ని విధముల, సుపూజితః=బాగుగా పూజింపబడితిని. మహాప్రాజ్ఞ = గొప్ప జ్ఞానము కలవాడా ! గమిష్యామి = నేను వెళ్లెదను. తే= నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక. మైత్రేణ = స్నేహపూర్ణ మైన, చక్షుషా = నేత్రముతో, ఈక్షస్వ = చూచుచుండుము.

తా. మహాప్రాజ్ఞుడ వైన ఓ పూజ్యుడా ! నీ ఆశ్రమములో లభించు ఫలమూలాదికమును. పాద్యమును, ఆచమనమును ఇచ్చి, పూజార్హుడ వైన నీవు నన్ను సర్వవిధముల సత్కరించితివి. ఇదియే చాలును; నేను వెళ్లెదను. స్నేహపూర్ణ మైన దృష్టితో చూచుచుండుము. 16, 17

మూ. ఏవం బ్రువన్తం రాజానం వసిష్ఠః పునరేవ హి,
న్యమన్త్రయత ధర్మాత్మా పునః పునరుదారధీః. 18

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, బ్రువన్తమ్ = మాటలాడు చున్న, రాజానమ్ = రాజును, ధర్మాత్మా = ధర్మాత్ముడును, ఉదారధీః = ఉదార మైన

బుద్ధి కలవాడును అగు, వసిష్ఠః = వసిష్ఠుడు, పునరేవ = మరల, పునః పునః = మాటిమాటికిని, న్యమంత్రయత = ఆహ్వానించెను.

తా. విశ్వామిత్రుడు ఇట్లు పలికినను, ధర్మాత్ముడును, ఉదారబుద్ధియు అగు వసిష్ఠుడు ఆతిథ్యము స్వీకరింపు మని ఆతనిని మాటిమాటికిని నిర్బంధించెను. 18

మూ. బాఢమిత్యేవ గాధేయో వసిష్ఠం ప్రత్యువాచ హ,
యథా ప్రియం భగవత స్తథాస్తు మునిపుఙ్గవ. 19

ప్ర. అ. గాదేయః = విశ్వామిత్రుడు, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠుడా ! బాఢమ్ = తప్పక అటులనే చేసెదను. భగవతః = పూజ్యుడ వైన నీకు, యథా = ఏ విధముగా, అభిమతమ్ = సంమతమో, తథా = అట్లే, అస్తు = అగుగాక.

తా. చివరికి విశ్వామిత్రుడు, వసిష్ఠునితో, "మునిశ్రేష్ఠా ! నీకు ఎట్లు ప్రియమో అట్లే తప్పక అగును గాక" అని పలికెను. 19

మూ. ఏవముక్తో మహాతేజా వసిష్ఠో జపతాం వరః,
ఆజుహావ తతః ప్రీతః కల్మాషీం ధూతకల్మషః. 20

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, జపతాం వరః = మునీశ్వరులలో గొప్పవాడైన, ధూతకల్మషః = తొలగించబడిన పాపములు గల, వసిష్ఠః = వసిష్ఠుడు, ప్రీతః = సంతసించినవాడై, తతః = పిమ్మట, కల్మాషీమ్ = చిత్ర వర్ణము గల ధేనువును, ఆజుహావ = పిలచెను.

తా. మహాతేజశ్శాలియు, మునులలో గొప్పవాడును, పాపములను నశింప చేయువాడును అగు వసిష్ఠుడు విశ్వామిత్రుని మాటలు విని సంతోషించి, చిత్ర వర్ణము గల కామధేనువును పిలిచెను. 20

మూ. ఏహ్యేహి శబలే క్షిప్రం శృణు చాపి వచో మమ,
సబలస్యాస్య రాజర్షేః కర్తుం వ్యవసితోఽస్మ్యహమ్. 21
భోజనేన మహార్హేణ సత్కారం సంవిధత్స్వ మే.

ప్ర. అ. శబలే = చిత్రవర్ణము గల ఓ ధేనువా! క్షిప్రమ్=శీఘ్రముగా, ఏహి ఏహి = రమ్ము రమ్ము. మమ = నాయొక్క, వచః = వాక్కును, శృణు చ అపి = వినుము. అహమ్ = నేను, మహార్హేణ = శ్రేష్ఠమైన, భోజనేన=భోజనము చేత, సబలస్య = సేనతో కూడిన, అస్య = ఈ, రాజర్షేః=రాజర్షికి, సత్కారమ్= సత్కారమును, కర్తుమ్ = చేయుటకు, వ్యవసితః అస్మి = నిశ్చయించితిని. మే = నాకు, సంవిధత్స్వ = ఏర్పాట్లు చేయుము.

తా. ఓ శబలా! రమ్ము రమ్ము. నా మాట వినుము. నేను సేనాసమేతుడైన ఈ రాజర్షికి శ్రేష్ఠమైన భోజన మొసగి సత్కరింప నిశ్చయించినాను. తగిన ఏర్పాట్లు చేయుము. 21

మూ. యస్య యస్య యథాకామం షడ్రసేష్వభిపూజితమ్, 22
తత్సర్వం కామధుక్ క్షిప్రమభివర్ష కృతే మమ.

ప్ర. అ. కామదుక్ = ఓ కామధేనువా! యస్య యస్య = ఎవరెవరికి, (యద్యత్ = ఏది ఏది), షడ్రసేషు = ఆరు రసములలో, అభిపూజితమ్ = ఇష్టమైనదో, తత్సర్వమ్ = దానినంతను, యథాకామం = ఆతడు కోరిన విధముగ, మమ కృతే = నా నిమిత్తమై, క్షిప్రమ్ = శీఘ్రముగా, అభివర్ష= వర్షించుము.

తా. ఎవరికి ఏది ఇష్టమో దానిని ఆతని కోరిక ప్రకారము, నాకుగాను, శీఘ్రముగా ఇమ్ము. 22

మూ. రసేనాన్నేన పానేన లేహ్యచోష్యేణ సంయుతమ్, 23
అన్నానాం నిచయం సర్వం సృజస్వ శబలే త్వర.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ. శబలే = ఓ శబలా! రసేన = రసముతోడను, అన్నేన = అన్నముతోడను, పానేన=త్రాగదగిన వాటితోడను, లేహ్యచోష్యేణ=నాకదగిన

వాటితోడను, పీల్చదగిన దానితోడను, సంయుతమ్ = కూడిన, సర్వమ్ = సమస్త మైన, అన్నానామ్ = అన్నముల యొక్క, నిచయమ్=సముదాయమును, సృజస్వ = సృష్టించుము, త్వర = తొందరపడుము.

తా. ఓ శబలా ! రసాయనములతోను, తినదగినవి, త్రాగదగినవి, నాకదగినవి, పీల్చదగినవి మొదలయిన పదార్థములతోను కూడిన ఆహారసముదాయమును శీఘ్రముగా సమకూర్చుము. 23

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో ఏబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిపఞ్చాశః సర్గః

మూ. ఏవముక్తా వసిష్ఠేన శబలా శత్రుసూదన,
విదధే కామధుక్కామాన్యస్య యస్య యథేప్సితమ్. 1

ప్ర. అ. శత్రుసూదన = శత్రువులను సంహరించు రామా ! వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తా = పలకబడిన, కామధుక్ = కోరిన వస్తువులను పిదికెడు, శబలా = చిత్రవర్ణము గల ఆ ధేనువు, యస్య యస్య = ఎవనికి ఎవనికి, యథా = ఎట్లు, ఈప్సితమ్ = ఇష్టమో, ఆ విధముగా, కామాన్ = కామములను, విదధే = నమకూర్చెను.

తా. రామా ! ఆ కామధేనువు వసిష్ఠుడు చెప్పిన విధముగ ఎవరెవరికి ఏది ఇష్టమో దాని నంతయు నమకూర్చెను. 1

మూ. ఇక్షూన్మధూంస్తథా లాజాన్ మైరేయాంశ్చ వరాసనాన్,
పానాని చ మహార్హాణి భక్ష్యాంశ్చోచ్చావచాంస్తథా. 2

ప్ర. అ. ఇక్షూన్ = చెరకుగడలను, మధూన్ = తేనెలను, తథా = మరియు, లాజాన్ = పేలాలను, వరాసనాన్ = మంచి పాత్రలు గల, మైరేయాన్ చ = మద్యములను, మహార్హాణి = శ్రేష్ఠమైన, పానాని చ = పానములను, ఉచ్చావచాన్ = అనేక భేదములు గల, భక్ష్యాంశ్చ = తినుబండారములను, సృజించెను.

తా. ఆ కామధేనువు, చెరకు గడలు, తేనెలు, పేలాలు, మంచి పాత్రలలో పోసిన మద్యములు, శ్రేష్ఠము లైన పానీయములు, అనేక విధము లైన భక్ష్యములు సృజించెను. 2

మూ. ఉష్ణాఢ్యస్యోదనస్యాత్ర రాశయః పర్వతోపమాః,
మృష్టాన్నాని చ సూపాశ్చ దధికుల్యాస్తథైవ చ. 3
నానాస్వాదురసానాం చ షాడబానాం తథైవ చ,
భాజనాని సుపూర్ణాని గౌడాని చ సహస్రశః. 4

ప్ర. అ. అత్ర = ఇచట, ఉష్ణాఢ్యస్య = వేడితో కూడిన, ఓదనస్య = అన్నముయొక్క, పర్వతోపమాః = పర్వతముల వంటి, రాశయః = రాశులును, మృష్టాన్నాని చ = శ్రేష్ఠము లైన అన్నములును, సూపాశ్చ = పప్పులును, తథైవ = మరియు, దధికుల్యాః = పెరుగు కాలువలును, నానాస్వాదురసానామ్ = అనేక విధము లైన మధుర మైన రసము గల, షాడబానామ్ = షడ్రసభక్ష్యముల యొక్క, సుపూర్ణాని = బాగుగా నిండిన, భాజనాని = పాత్రలును, గౌడాని చ = బెల్లముతో వేసిన పదార్థములును, సహస్రశః = వేలకొలది, (ఏర్పడినవి).

**తా.** అచట పర్వతముల వంటి వేడిగా ఉన్న అన్నరాశులును, మధురాన్నములును, సూపములును, పెరుగు కాలువలును, వివిధ రసములను చేర్చి వండిన పదార్థములతో నింపబడిన పాత్రలును, బెల్లములో చేసిన పదార్థములును వేలకొలది ఏర్పడినవి. 4

మూ. సర్వమాసీత్సుసంతుష్టం హృష్టపుష్టజనాయుతమ్,
విశ్వామిత్రబలం రామ వసిష్ఠేనాభితర్పితమ్. 5

ప్ర. అ. రామ = రామా ! విశ్వామిత్రబలమ్ = విశ్వామిత్ర సైన్యము, సర్వమేవ = అంతయు, వసిష్ఠేన = వసిష్ఠునిచేత, అభితర్పితమ్ = తృప్తిపొందింపబడినదై, సుసంతుష్టమ్ = బాగుగా సంతోషించినది గాను, హృష్టపుష్టజనాయుతమ్ = బాగుగా తిని సంతసించిన జనులతో నిండినదిగాను, ఆసీత్ = ఆయెను.

**తా.** రామా ! ఈ విధముగా వసిష్ఠుని ఆతిథ్యముచే విశ్వామిత్రుని సైన్యములోనివా రందరును భుజించి, సంతృప్తి చెంది, ఆనందించిరి. 5

మూ. విశ్వామిత్రోఽపి రాజర్షిర్హృష్టః-పుష్టస్తదాఽభవత్,
సాన్తఃపురవరో రాజా సబ్రాహ్మణపురోహితః. 6

ప్ర. అ. తదా = అప్పుడు, సాన్తఃపురవరః = శ్రేష్ఠ మైన అంతఃపురముతో కూడిన, సబ్రాహ్మణపురోహితః = బ్రాహ్మణపురోహితులతో కూడిన, రాజర్షిః = ఋషి వంటి రాజైన, విశ్వామిత్రః రాజాపి = విశ్వామిత్ర మహారాజు

కూడ, హృష్టః=సంతసించినవాడును, పుష్టః=తృప్తి చెందినవాడును, అభవత్=అయెను.

తా. రాజర్షి యైన విశ్వామిత్రుడును, అతని అంతఃపురకాంతలును, అతనితో వచ్చిన బ్రాహ్మణపురోహితాదులును, తృప్తి చెంది ఆనందించిరి. 6

మూ. సామాత్యో మన్త్రిసహితః సభృత్యః పూజితస్తదా,
యుక్తః పరమహర్షేణ వసిష్ఠమిదమబ్రవీత్. 7

ప్ర. అ. తదా=అప్పుడు, పూజితః=పూజింపబడినవాడును, సామాత్యః=అమాత్యులతో కూడినవాడును, మన్త్రిసహితః = మంత్రులతో కూడినవాడును, సభృత్యః = భృత్యులతో కూడినవాడును అగు విశ్వామిత్రుడు, పరమహర్షేణ = గొప్ప సంతోషముతో, యుక్తః = కూడినవాడై, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అమాత్య-మంత్రి - భృత్యసమేతముగ వసిష్ఠుని పూజ లందుకొన్న విశ్వామిత్రుడు సంతోషించి వసిష్ఠునితో ఇట్లు పలికెను. 7

మూ. పూజితోఽహం త్వయా బ్రహ్మన్ పూజార్హేణ సుసత్కృతః,
శ్రూయతామభిధాస్యామి వాక్యం వాక్యవిశారద. 8

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా! పూజార్హేణ = పూజింప దగిన, త్వయా = నీచేత, అహమ్ = నేను, పూజితః = పూజింపబడితిని. సుసత్కృతః= బాగుగా సత్కరింపబడితిని. వాక్యవిశారద = వాక్యములందు నేర్పు గలవాడా! వాక్యమ్ = వాక్యమును, అభిధాస్యామి = చెప్పగలను ; శ్రూయతామ్ = వినబడుగాక.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! పూజార్హుడ వైన నీవు నన్ను పూజించి సత్కరించినావు. ఓ వాక్యవిశారదుడా! నేనొక మాట చెప్పెదను. వినుము. 8

మూ. గవాం శతసహస్రేణ దీయతాం శబలా మమ,
రత్నం హి భగవన్నేతద్రత్నహారీ చ పార్థివః, 9
తస్మాన్మే శబలాం దేహి మామైషా ధర్మతో ద్విజ.

ప్ర. అ. గవామ్ = గోవులయొక్క, శతసహస్రేణ = నూరువేలకు, శబలా = శబల, మమ = నాకు, దీయతామ్ = ఇవ్వబడుగాక. భగవన్ = ఓ పూజ్యుడా ! ఏతత్ = ఇది, రత్నం హి = రత్నము కదా. పార్థివః = రాజు, రత్నహారీ = రత్నములను తీసికొనువాడు. ద్విజ = ఓ బ్రాహ్మణుడా, తస్మాత్ = ఆ కారణము వలన, శబలామ్ = ఈ శబలను, మే = నాకు, దేహి = ఇమ్ము. ఏషా = ఇది, ధర్మతః = ధర్మానుసారముగా, మమ = నాకు చెందినది.

తా. లక్షగోవుల నిచ్చెదను ; ఈ శబలను నా కిమ్ము. ఓ పూజ్యుడా ! ఈ దేనువు రత్నము వంటిది. రత్నములు రాజు సొమ్ము. అందుచే ఇది నాకు చెందవలసి యున్నది. కావున ఈ దేనువును నా కిమ్ము. 9

మూ. ఏవముక్తస్తు భగవాన్ వసిష్ఠో మునిసత్తమః, 10
విశ్వామిత్రేణ ధర్మాత్మా ప్రత్యువాచ మహీపతిమ్.

ప్ర. అ. విశ్వామిత్రేణ = విశ్వామిత్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలక బడిన, భగవాన్ = పూజ్యుడైన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, మునిసత్తమః = మునులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, మహీపతిమ్ = రాజును గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ధర్మాత్ముడైన వసిష్ఠమహాముని, విశ్వామిత్రుని మాటలు విని అతని కిట్లు బదులు చెప్పెను. 10

మూ. నాహం శతసహస్రేణ నాపి కోటిశతైర్గవామ్, 11
రాజన్ దాస్యామి శబలాం రాశిభీ రజతస్య చ.

ప్ర. అ. రాజన్ = రాజా ! అహమ్ = నేను, గవామ్ = గోవులయొక్క, శతసహస్రేణ = లక్షలకు, శబలామ్ = శబలను, న దాస్యామి = ఇవ్వను. కోటి శతైః అపి = వందల కొలది కోటుల ఆవులకు బదులుగా కూడ, న = ఇవ్వను. రజతస్య = వెండియొక్క, రాశిభిః చ = రాశులచేత కూడ, (ఇవ్వను).

తా. రాజా ! నీవు లక్షలకొలది ఆవు లిచ్చినను, కొన్ని వందల కోట్ల ఆవు లిచ్చినను, వెండి రాశు లిచ్చినను నే నీ శబలను ఇవ్వను. 11

మూ. న పరిత్యాగమర్హేయం మత్సకాశాదరిందమ, 12
శాశ్వతీ శబలా మహ్యం కీర్తిరాత్మవతో యథా.

ప్ర. అ. అరిందమ = శత్రువులను పీడించువాడా! ఇయమ్ = ఈ ధేనువు, మత్సకాశాత్ = నా సమీపమునుండి, పరిత్యాగమ్ = విడచుటను గూర్చి, న అర్హా = తగినది కాదు. ఆత్మవతః = బుద్ధిశాలికి లేదా ధైర్యశాలికి, కీర్తిః యథా = కీర్తి వలె, శబలా = శబల, మహ్యమ్ = నాకు, శాశ్వతీ = శాశ్వత మైనది.

తా. శత్రుసంహారకుడ వైన ఓ విశ్వామిత్రా! ఈ ధేనువు నానుండి దూర మగుటకు వీలు లేదు. ఈ ధేనువునకును నాకును ఉన్న సంబంధము బుద్ధిమంతున కును కీర్తికిని గల సంబంధము వలె శాశ్వత మైనది. 12

మూ. అస్యాం హవ్యం చ కవ్యం చ ప్రాణయాత్రా తథైవ చ, 13
ఆయత్తమగ్నిహోత్రం చ బలిర్హోమస్తథైవ చ.

ప్ర. అ. హవ్యం చ = (దేవతల కీయదగిన) హవ్యము, కవ్యం చ = (పితృదేవతల కీయ దగిన) కవ్యము, తథైవ చ = మరియు, ప్రాణయాత్రా = నా ప్రాణయాత్రయు, అగ్నిహోత్రం చ = అగ్నిహోత్రము, బలిః = భూతబలియు, తథైవ చ = మరియు, హోమః = హోమము, అస్యామ్ = ఈ ధేనువునందు, ఆయత్తమ్ = ఆధారపడి యున్నది.

తా. హవ్యము, కవ్యము, నా ప్రాణయాత్ర, అగ్నిహోత్రము, భూతబలి, హోమము—ఇవి అన్నియు ఈ ధేనువుపై ఆధారపడి యున్నవి. 13

మూ. స్వాహాకారవషట్కారౌ విద్యాశ్చ వివిధాస్తథా, 14
ఆయత్తమత్ర రాజర్షే సర్వమేతన్న సంశయః.

ప్ర. అ. రాజర్షే = ఓ రాజర్షీ, స్వాహాకారవషట్కారౌ = 'స్వాహా' "వషట్" అనునవియు, తథా = మరియు, వివిధాః = అనేకవిధము లైన, విద్యాః = విద్య లును, ఏతత్ సర్వమ్ = ఇది అంతయు, అత్ర = ఈ ధేనువునందు, ఆయత్తమ్ = ఆధారపడి యున్నది. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఓ రాజర్షీ! స్వాహాకారవషట్కారములు, (అనగా దేవతాదులకు హవిరాదులు అర్పించుట అని అర్థము) నానావిధము లైన విద్యలు, ఇవన్నియు ఈ కామధేనువు మీదనే ఆధారపడి యున్నవి. సందేహము లేదు. 14

మూ. సర్వస్వమేతత్సత్యేన మమ తుష్టికరీ సదా. 15
కారణైర్బహుభీ రాజన్న దాస్యే శబలాం తవ

ప్ర. అ. ఏతత్ = ఇది, సత్యేన = నిజముగ, మమ = నాయొక్క, సర్వస్వమ్ = సర్వస్వము. సదా = ఎల్లప్పుడును, తుష్టికరీ = ఆనందము కలిగించునది. రాజన్ = రాజా! బహుభిః = అనేకమైన, కారణైః = కారణములచేత, శబలామ్ = శబలను, తవ = నీకు, న దాస్యే = ఇవ్వను.

తా. రాజా! నిజముగ ఈ ధేనువు నా సర్వస్వము. నాకు ఆనందము కలిగించునది. ఇంకను అనేక కారణములను బట్టి కూడ ఈ ధేనువును నీకు ఇవ్వను. 15

మూ. వసిష్ఠేనైవముక్తస్తు విశ్వామిత్రోఽబ్రవీత్తతః, 16
సంరబ్ధతరమత్యర్థం వాక్యం వాక్యవిశారదః.

ప్ర. అ. వాక్యవిశారదః = మాటలలో నేర్పరి యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడినవాడై, తతః = అటుపిమ్మట, అత్యర్థమ్ = మిక్కిలి, సంరబ్ధతరమ్ = తొందరబాటుతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మాటలలో నేర్పరి యైన విశ్వామిత్రుడు వసిష్ఠుని మాటలు విని, మిక్కిలి తొందరబాటుతో ఇట్లు పలికెను. 16

మూ. హైరణ్యకక్ష్యాగ్రైవేయాన్ సువర్ణాఙ్కుశభూషితాన్, 17
దదామి కుఞ్జరాంస్తేషాం సహస్రాణి చతుర్దశ.

ప్ర. అ. హైరణ్యకక్ష్యాగ్రైవేయాన్ = బంగారు నడుము త్రాళ్లను మెడ త్రాళ్లను గల, సువర్ణాఙ్కుశభూషితాన్ = బంగారు అంకుశములచే అలంకరింప

బడిన, కుఞ్జరాన్ = ఏనుగులను, తేషామ్ = అట్టి ఏనుగులయొక్క, చతుర్దశసహస్రాణి = పదునాలుగు వేలను, దదామి = ఇచ్చెదను.

తా. బంగారు నడుముత్రాళ్లను మెడత్రాళ్లను గలవియు, బంగారు అంకుశములు కలవియు అగు పదునాలుగు వేల ఏనుగులను ఇచ్చెదను. 17

మూ. హైరణ్యానాం రథానాం చ శ్వేతాశ్వానాం చతుర్యుజామ్, 18
దదామి తే శతాన్యష్టౌ కిఙ్కిణీకవిభూషితాన్.

ప్ర. అ. శ్వేతాశ్వానామ్ = తెల్లని గుఱ్ఱములు కలవియు, చతుర్యుజామ్ = నాలుగు గుఱ్ఱములు కట్ట వీలైనవియు అగు, హైరణ్యానామ్ = బంగారు వికారమైన, రథానాం = రథములయొక్క, కిఙ్కిణీకవిభూషితాన్ = చిరు గంటలచేత అలంకరించబడిన, అష్టౌ శతాని = ఎనిమిది వందలను, తే = నీకు, దదామి = ఇచ్చెదను.

తా. తెల్లని గుఱ్ఱములు కలవియు, నాలుగేసి గుఱ్ఱములు కట్టదగినవియు, చిరు గంటలచే అలంకరించబడినవియు అగు ఎనిమిది వందల బంగారురథములను నీ కిచ్చెదను. 18

మూ. హయానాం దేశజాతానాం కులజానాం మహౌజసామ్, 19
సహస్రమేకం దశ చ దదామి తవ సువ్రత.

ప్ర. అ. సువ్రత = మంచి వ్రతము కలవాడా ! దేశజాతానామ్ = మంచి దేశమునందు పుట్టినవియు, కులజానామ్ = మంచి కులమునందు పుట్టినవియు, మహౌజసామ్ = గొప్ప శక్తికలవియు అగు, హయానామ్ = అశ్వములయొక్క, ఏకం దశ చ = పదకొండు, సహస్రమ్ = సహస్రమును, తవ = నీకు, దదామి = ఇచ్చెదను.

తా. మంచి నియమములు కల ఓ మహర్షీ ! మంచి దేశమునందు, మంచి జాతియందు పుట్టిన గొప్ప బలముగల పదకొండువేల అశ్వములను నీ కిచ్చెదను. 19

మూ. నానావర్ణవిభక్తానాం వయస్థానాం తథైవ చ, 20
దదామ్యేకాం గవాం కోటిం శబలా దీయతాం మమ.

ప్ర. అ. నానావర్ణవిభక్తానామ్ = అనేక వర్ణములచే వేరువేరుగా ఉన్న వియు, తథైవ చ = మరియు, వయస్థానామ్ = మంచి వయస్సులో ఉన్న, గవామ్ = గోవులయొక్క, ఏకామ్ = ఒక, కోటిమ్ = కోటిని, దదామి = ఇచ్చెదను. మమ = నాకు, శబలా = ఈ శబల, దీయతామ్ = ఇవ్వబడుగాక.

తా. వివిధ వర్ణములు గల, మంచివయస్సులో ఉన్న ఒక కోటి గోవులను ఇచ్చెదను. నాకీ శబలను ఇమ్ము. 20

మూ. యావదిచ్ఛసి రత్నం వా హిరణ్యం వా ద్విజోత్తమ, 21
తావద్దదామి తత్సర్వం శబలా దీయతాం మమ.

ప్ర. అ. ద్విజోత్తమ = ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! రత్నం వా=రత్నములను కాని, హిరణ్యం వా = బంగారమును గాని, యావత్ = ఎంత, ఇచ్ఛసి = కోరుచున్నావో, తత్సర్వమ్ = దాని నంతను, తావత్ = అంత, దదామి=ఇచ్చెదను. శబలా = శబల, మమ = నాకు, దీయతామ్ = ఇవ్వబడుగాక.

తా. బ్రాహ్మణోత్తమా! రత్నములు కాని, బంగారము కాని ఎంత కావలెనని కోరెదవో అంత ఇచ్చెదను. ఈ శబలను నా కిమ్ము. 21

మూ. ఏవముక్తస్తు భగవాన్ విశ్వామిత్రేణ ధీమతా, 22
న దాస్యామీతి శబలాం ప్రాహ రాజన్ కథం చన.

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతు డైన, విశ్వామిత్రేణ = విశ్వామిత్రునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః=పలకబడిన, భగవాన్=పూజ్యు డైన వసిష్ఠుడు, రాజన్ = రాజా! కథంచన = ఏమైనను, శబలామ్ = శబలను, న దాస్యామి = ఇవ్వను, ఇతి = అని, ప్రాహ = పలికెను.

తా. బుద్ధిమంతు డైన విశ్వామిత్రుడు పలికిన మాటలు విని పూజ్యు డైన వసిష్ఠుడు—"రాజా! ఏమైనను శబలను ఇవ్వను" అని పలికెను. 22

మూ. ఏతదేవ హి మే రత్నమేతదేవ హి మే ధనమ్, 23
ఏతదేవ హి సర్వస్వమేతదేవ హి జీవితమ్.

ప్ర. అ. ఏతదేవ = ఇదియే, మే = నాకు, రత్నం హి = రత్నము. ఏతదేవ = ఇదియే, మే = నాకు, ధనమ్ = ధనము. ఏతదేవ హి = ఇదియే, సర్వస్వమ్ = సర్వస్వము. ఏతదేవ = ఇదియే, జీవితమ్ = జీవితము.

తా. నాకిదియే రత్నము; ఇదే ధనము; ఇదే సర్వస్వము. ఇదే జీవితము. 23

మూ. దర్శశ్చ పూర్ణమాసశ్చ యజ్ఞాశ్చైవా ప్తదక్షిణాః, 24
ఏతదేవ హి మే రాజన్ వివిధాశ్చ క్రియా స్తథా.

ప్ర. అ. రాజన్ = రాజా! మే=నాకు, దర్శశ్చ=దర్శయాగము, పూర్ణమాసశ్చ = పూర్ణమాసయాగము, ఆప్తదక్షిణాః = సరి యైన దక్షిణలు గల, యజ్ఞాశ్చ = యజ్ఞములును, తథా = మరియు, వివిధాః = అనేకవిధము లైన, క్రియాశ్చ=క్రియలును, ఏతదేవ హి = ఇదియే.

తా. రాజా! నాకు దర్శపూర్ణమాసయాగములు, మంచి దక్షిణలు గల యజ్ఞములు, వివిధము లైన ఇతరక్రియలును ఈ ధేనువే. 24

మూ. అదోమూలాః క్రియాః సర్వా మమ రాజన్న సంశయః, 25
బహునా కిం ప్రలాపేన న దాస్యే కామదోహినీమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రిపఞ్చాశః సర్గః.

ప్ర. అ. రాజన్ = రాజా! మమ = నాయొక్క, సర్వాః = సమస్త మైన, క్రియాః = క్రియలు, అదోమూలాః = ఇదియే మూలముగలవి. సంశయః = సంశయము, న = లేదు. బహునా = అధిక మైన, ప్రలాపేన = నిరుపయోగ మైన మాటలచేత, కిమ్ = ఏమి ప్రయోజనము? కామదోహినీమ్ = సర్వకామములను పిదికి ఇచ్చు ఈ ధేనువును, న దాస్యే = ఇవ్వను.

తా. రాజా! నాక్రియ లన్నింటికిని ఇదియే ఆధారము. ఇంక ఉపయోగము లేని మాట లేల? ఈ కామధేనువు నివ్వను. 25

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలోని ఏబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపఞ్చాశః సర్గః

మూ. కామధేనుం వసిష్ఠోఽపి యదా న త్యజతే మునిః,
తదాస్య శబలాం రామ విశ్వామిత్రోఽన్వకర్షత. 1

ప్ర. అ. రామ = రామా ! వసిష్ఠః మునిః అపి = వసిష్ఠముని, కామధేనుమ్ = కామధేనువును, యదా = ఎప్పుడు, న త్యజతే = ఇవ్వలేదో, తదా = అప్పుడు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, శబలామ్ = శబలను, అన్వకర్షత = లాగెను.

తా. రామా ! ఈ విధముగా వసిష్ఠుడు కామధేనువు నిచ్చుటకు నిరాకరించగా విశ్వామిత్రుడు ఆ ధేనువును బలాత్కారముగా లాగికొనిపోయెను. 1

మూ. నీయమానా తు శబలా రామ రాజ్ఞా మహాత్మనా,
దుఃఖితా చిన్తయామాస రుదన్తీ శోకకర్శితా. 2

ప్ర. అ. రామ = రామా ! మహాత్మనా = మహాత్ముడైన, రాజ్ఞా = రాజుచేత, నీయమానా = తీసికొనివెళ్లబడుచున్న, శబలా = శబల, దుఃఖితా = దుఃఖించినదై, శోకకర్శితా = శోకముచే కృశించినదై, రుదన్తీ = ఏడ్చుచున్నదై, చిన్తయామాస = చింతించెను.

తా. రామా ! బలశాలి యగు ఆ రాజు తన నీ విధముగ లాగికొని పోవుచుండగా ఆ శబల దుఃఖార్తురాలై, ఏడ్చుచు ఇట్లు ఆలోచించెను. 2

మూ. పరిత్యక్తా వసిష్ఠేన కిమహం సుమహాత్మనా,
యాహం రాజభటైర్దీనా హ్రియేయ భృశదుఃఖితా. 3

ప్ర. అ. దీనా = దీనురాలును, భృశదుఃఖితా = మిక్కిలి దుఃఖితురాలును అగు, యా అహమ్ = ఏ నేను, రాజభటైః = రాజభటులచేత, హ్రియేయ = హరింపబడుచున్నానో, అహమ్ = అట్టి నేను, మహాత్మనా = మహాత్ముడైన, వసిష్ఠేన = వసిష్ఠునిచేత, పరిత్యక్తా కిమ్ = విడువబడితినా ?

తా. మిక్కిలి దుఃఖముతో దీనురాల నైన నన్ను ఈ రాజభటులు ఈ విధముగా తీసికొనిపోవుచున్నారు. నన్ని మహాత్ము డైన వసిష్ఠుడు విడిచివేసినాడా యేమి ? 3

మూ. కిం మయాపకృతం తస్య మహర్షేర్భావితాత్మనః,
యన్మామనాగసం భక్తామిష్టాం త్యజతి ధార్మికః. 4

ప్ర. అ. ధార్మికః = ధార్మికు డైన ఈ వసిష్ఠుడు, అనాగసమ్ = అపరాధము లేనిదానను, భక్తామ్ = భక్తురాలను, ఇష్టామ్ = ఇష్టురాలను అయిన, మామ్=నన్ను, యత్ త్యజతి = విడిచిపెట్టుచున్నాడే, భావితాత్మనః=పవిత్రమైన అంతఃకరణము గల, తస్య=ఆ, మహర్షేః = మహర్షికి, మయా=నాచేత, కిమ్=ఏమి, అపకృతమ్ = అపకారము చేయబడినది ?

తా. పవిత్రహృదయు డైన ఈ మహర్షికి నే నేమి అపకారము చేసినాను? భక్తురాలను, ఇష్టురాలను, ఏ అపరాధము ఎరుగనిదానను అయిన నన్ని విధముగ విడచివేయుచున్నాడు ! 4

మూ. ఇతి సా చిన్తయిత్వా తు వినిశ్వస్య పునః పునః,
నిర్ధూయ తాం స్తదా భృత్యాన్ శతశః శత్రుసూదన,
జగామానిలవేగేన పాదమూలం మహాత్మనః. 5

ప్ర. అ. శత్రుసూదన=శత్రుసంహారకుడ వైన రామా ! సా=ఆ ధేనువు, ఇతి=ఈ విధముగా, చిన్తయిత్వా=ఆలోచించి, పునః పునః = మాటిమాటికి, వినిశ్వస్య=నిట్టూర్చి, తదా=అప్పుడు, తాన్=ఆ, శతశః=వందలకొలది ఉన్న, భృత్యాన్=భృత్యులను, నిర్ధూయ=విదిలించి, అనిలవేగేన = వాయువేగముతో, మహాత్మనః=మహాత్ము డైన వసిష్ఠునియొక్క, పాదమూలమ్=పాదసమీపమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. రామా ! ఆ ధేనువు ఈ విధముగ ఆలోచించి, మాటిమాటికి నిట్టూర్చుచు, వందలకొలది ఉన్న ఆ భృత్యులను విదల్చుకొని వాయువేగముతో వసిష్ఠుని దగ్గరకు పోయెను. 5

మూ. శబలా సా రుదన్తీ చ క్రోశన్తీ చేదమబ్రవీత్,
వసిష్ఠస్యాగ్రతః స్థిత్వా మేఘదున్దుభిరావిణీ. 6

ప్ర. అ. సా=ఆ, శబలా=శబల, రుదన్తీ చ=ఏడ్చుచున్నదై, క్రోశన్తీ చ=అరచుచున్నదై, వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క, అగ్రతః=ఎదుట, స్థిత్వా=నిలచి, మేఘదున్దుభిరావిణీ = మేఘమువలెను దుందుభివలెను ధ్వని చేయుచున్నదై, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ శబల, ఏడ్చుచు, అరచుచు వసిష్ఠుని ఎదుట నిలచి మేఘదుందుభుల వంటి ధ్వనితో ఇట్లు పలికెను. 6

మూ. భగవన్ కిం పరిత్యక్తా త్వయాహం బ్రహ్మణః సుత,
యస్మాద్రాజభృతా మాం హి నయన్తే త్వత్సకాశతః. 7

ప్ర. అ. బ్రహ్మణః=బ్రహ్మయొక్క, సుత=కుమారుడా, భగవన్=ఓ పూజ్యుడా! అహమ్=నేను, త్వయా=నీచేత, పరిత్యక్తా కిమ్=విడువబడితినా? యస్మాత్=ఏ కారణమువలన, రాజభృతాః=రాజభృత్యులు, త్వత్సకాశతః=నీ సమీపమునుండి, మామ్ = నన్ను, నయన్తే హి=తీసికొనిపోవుచున్నారు.

తా. బ్రహ్మపుత్రుడవైన ఓ పూజ్యుడా! ఈ రాజభృత్యులు నన్ను నీ వద్దనుండి తీసికొని పోవుచున్నారు; నీవు నన్ను విడిచివేసితివా? 7

మూ. ఏవముక్తస్తు బ్రహ్మర్షిరిదం వచనమబ్రవీత్,
శోకసన్తప్తహృదయాం స్వసారమివ దుఃఖితామ్. 8

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, బ్రహ్మర్షిః=బ్రహ్మర్షి, శోకసంతప్తహృదయామ్ = శోకముచే తప్తమైన హృదయము గల ఆ ధేనువును గూర్చి, దుఃఖితామ్=దుఃఖించిన, స్వసారమివ = సోదరిని గూర్చి వలె, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఈ మాటలు విని ఆ బ్రహ్మర్షి, శోకముచే తపించుచున్న మనస్సు గల ఆ ధేనువుతో, దుఃఖించుచున్న సోదరితో పలికినట్లు ఇట్లు పలికెను. 8

మూ. న త్వాం త్యజామి శబలే నాపి మేఽపకృతం త్వయా,
ఏష త్వాం నయతే రాజా బలాన్మత్తో మహాబలః. 9

ప్ర. అ. శబలే = ఓ శబలా ! త్వామ్ = నిన్ను, న త్యజామి=విడచుట లేదు. త్వయా = నీ చేత, మే = నాకు, న అపకృతమపి = అపకారము కూడ చేయబడలేదు. మహాబలః = గొప్ప బలము గల, ఏషః = ఈ, రాజా = రాజు, మత్తః = నా నుండి, బలాత్ = బలాత్కారముగా, త్వామ్ = నిన్ను, నయతే = తీసికొని వెళ్లుచున్నాడు.

తా. ఓ శబలా ! నేను నిన్ను విడచుటలేదు. నీవు నా కేమియు అపకారము చేయలేదు. మహాబలవంతుడైన ఈ రాజు నిన్ను నా వద్దనుంచి బలాత్కారముగ తీసికొని పోవుచున్నాడు. 9

మూ. న హి తుల్యం బలం మహ్యం రాజా త్వద్య విశేషతః,
బలీ రాజా క్షత్రియశ్చ పృథివ్యాః పతిరేవ చ. 10

ప్ర. అ. మహ్యమ్ = నాయొక్క, బలమ్ = బలము, తుల్యమ్ = ఈతని బలముతో తుల్యమైనది, న హి = కాదు కదా. అద్య = ఇపుడు, విశేషతః = విశేషముగా, రాజా తు = రాజుగా ఉన్నాడు. రాజా = రాజైన ఇతడు, బలీ = బలవంతుడు. క్షత్రియశ్చ = క్షత్రియుడు. పృథివ్యాః = భూమియొక్క, పతిరేవ చ = ప్రభువుగా కూడ ఉన్నాడు.

తా. నా బలము ఈతని బలముతో తుల్యము కాదు. విశేషించి ఇతడు రాజుగా ఉన్నాడు. రాజైన ఇతడు బలవంతుడైన క్షత్రియుడు, పృథివి కంతకును ప్రభువు కూడ. 10

మూ. ఇయమక్షౌహిణీ పూర్ణా సవాజిరథసఙ్కులా,
హస్తిధ్వజసమాకీర్ణా తేనాసౌ బలవత్తరః. 11

ప్ర. అ. సవాజిరథసంకులా=అశ్వములతో కూడిన రథములతో ఇరుకుగానున్నదియు, హస్తిధ్వజసమాకీర్ణా=ఏనుగులతో ధ్వజములతో వ్యాప్తమైనదియు

అగు, ఇయమ్ = ఈ, అక్షౌహిణీ = అక్షౌహిణి, పూర్ణా = నిండియున్నది. తేన = ఆ కారణముచేత, అసౌ = ఇతడు, బలవత్తరః = చాల బలము కలవాడు.

తా. ఇతనికి అశ్వములతోను, రథములతోను, గజములతోను, ధ్వజములతోను వ్యాప్తమైన పూర్తి అక్షౌహిణి సేన ఉన్నది. అందుచేత ఇతడు ఎక్కువ బలము కలవాడు. 11

మూ. ఏవముక్తా వసిష్ఠేన ప్రత్యువాచ వినీతవత్,
వచనం వచనజ్ఞా సా బ్రహ్మర్షిమమితప్రభమ్. 12

ప్ర. అ. వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తా = పలకబడిన, వచనజ్ఞా = మాటలందు నేర్పు గల, సా = ఆ ధేనువు. అమితప్రభమ్ = అనంతమైన కాంతి గల, బ్రహ్మర్షిమ్ = బ్రహ్మర్షిని గూర్చి, వచనమ్ = వచనమును, వినీతవత్ = వినయవంతురాలుగా ఉండి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. వసిష్ఠుని వాక్యమును విని వాక్యములందు నేర్పు గల ఆ ధేనువు అమితమైన కాంతి గల ఆ బ్రహ్మర్షిని గూర్చి, సవినయముగా ఇట్లు పలికెను. 12

మూ. న బలం క్షత్రియస్యాహు ర్బ్రాహ్మణో బలవత్తరః,
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షాత్త్రాత్తు బలవత్తరమ్. 13

ప్ర. అ. క్షత్రియస్య = క్షత్రియుని బలమును, బలమ్ = బలమునుగా, నాహుః = చెప్పరు. బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, బలవత్తరః = ఎక్కువ బలము కలవాడు. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా! క్షాత్రాత్ తు = క్షత్రియ బలముకంటె, బ్రహ్మబలమ్ = బ్రాహ్మణ బలము, దివ్యమ్ = శ్రేష్ఠమైనది, బలవత్తరమ్ = అధికబలయుక్తము.

తా. బ్రాహ్మణోత్తమా! క్షత్రియబలము బలము కాదు; బ్రాహ్మణుడు ఎక్కువ బలముకలవాడు. క్షత్రియబలము కంటె బ్రహ్మబలము దివ్యమైనది; అధికమైనది. 13

మూ. అప్రమేయబలం తుభ్యం న త్వయా బలవత్తరః,
విశ్వామిత్రో మహావీర్యస్తేజస్తవ దురాసదమ్. 14

ప్ర. అ. తుభ్యమ్ = నీకు, అప్రమేయబలమ్ = లెక్కపెట్ట రాని బల మున్నది. మహావీర్యః = మహావీర్య వంతు డైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, త్వయా = నీ కంటె, బలవత్తరః = ఎక్కువ బలము కలవాడు, న = కాదు. తవ = నీయొక్క, తేజః = తేజస్సు, దురాసదమ్ = సమీపింప శక్యము కానిది.

తా. నీ బలము అంతము లేనిది. ఎంతటి మహావీర్యవంతు డైనను విశ్వామిత్రుడు నీ కంటె అధికబలము కలవాడు కాడు. నీ తేజస్సు సమీపింప శక్యము కానిది. 14

మూ. నియుఙ్క్ష్వ మాం మహాభాగ త్వద్బ్రహ్మబలసంభృతామ్
తస్య దర్పం బలం యత్తన్నాశయామి దురాత్మనః. 15

ప్ర. అ. మహాభాగ = ఓ మహాభాగ్యవంతుడా! త్వద్బ్రహ్మబలసంభృతామ్ = నీ యొక్క బ్రహ్మబలముతో నిండిన, మామ్ = నన్ను, నియుఙ్క్ష్వ = నియమించుము. దురాత్మనః = దుర్బుద్ధి యైన, తస్య = ఆతనియొక్క, యత్ = ఏ, దర్పబలమ్ = దర్పము బలము ఉన్నదో, తత్ = దానిని, నాశయామి = నశింపచేసెదను.

తా. మహాత్మా! నీ బ్రహ్మబలముతో నిండిన నన్ను ఆజ్ఞాపించుము. ఆ దురాత్ముని దర్పమును, బలమును నశింపచేసెదను. 15

మూ. ఇత్యుక్తస్తు తయా రామ వసిష్ఠస్తు మహాయశాః,
సృజస్వేతి తదోవాచ బలం పరబలారుజమ్. 16

ప్ర. అ. రామ = రామా! తయా = ఆమెచేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాయశాః = గొప్ప కీర్తి గల, వసిష్ఠః తు = వసిష్ఠుడు, తదా = అప్పుడు, పరబలారుజమ్ = శత్రుబలమును పీడించు, బలమ్ = సేనను, సృజస్వ = సృజించుము, ఇతి = అని, ఉవాచ = పలికెను.

తా. ఆ ధేనువు మాటలు విని, మహాయశఃశాలి యగు వసిష్ఠుడు —"శత్రు సైన్యమును నశింపచేయు సైన్యమును సృజింపుము" అని పలికెను. 16

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సురభిస్సాసృజత్తదా,
తస్యా హుమ్భారవోత్సృష్టాః పప్లవాః శతశో నృప, 17
నాశయన్తి బలం సర్వం విశ్వామిత్రస్య పశ్యతః.

ప్ర. అ. **తస్య** = **ఆతనియొక్క, తత్** = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సా = ఆ, సురభిః = కామధేనువు, తదా=అప్పుడు, అసృజత్= (సైన్యమును) సృజించెను. నృప = రాజా! **తస్యాః** = ఆ కామధేనువుయొక్క, **హుంభారవోత్సృష్టాః** = హుంభా అను ధ్వనినుండి బయలుదేరిన, పప్లవాః = పప్లవులు, **శతశః** = వందలకొలది, విశ్వామిత్రస్య = విశ్వామిత్రుడు, **పశ్యతః**= చూచుచుండగనే, సర్వమ్ = సమస్తమైన, బలమ్ = సైన్యమును, నాశయన్తి = నశింపచేసినారు.

**తా.** వసిష్ఠుని మాటలు విని ఆ కామధేనువు సైనికులను సృజించెను. రామా! ఆ కామధేనువు యొక్క హుంభాధ్వనినుండి పుట్టిన వందలాది పప్లవులు, విశ్వామిత్రుడు చూచుచుండగనే ఆతని సైన్యము సంతను నశింపచేసిరి. 17

మూ. బలం భగ్నం తతో దృష్ట్వా రథేనాక్రమ్య కౌశికః, 18
స రాజా పరమక్రుద్ధో రోషవిస్ఫారితేక్షణః,
పప్లవాన్నాశయామాస శస్త్రైరుచ్చావచైరపి. 19

ప్ర. అ. **తతః**=పిమ్మట, సః=ఆ, రాజా=రాజైన, కౌశికః=విశ్వామిత్రుడు, **భగ్నమ్**=నశింపచేయబడిన, బలమ్=సైన్యమును, దృష్ట్వా = చూచి, పరమక్రుద్ధః=మిక్కిలి కోపగించినవాడై, రోషవిస్ఫారితేక్షణః=కోపముచేత పెద్దవైన నేత్రములు కలవాడై, రథేన = రథముచేత, ఆక్రమ్య = ఆక్రమించి; **ఉచ్చావచైః**=అనేక విధములైన, శస్త్రైః=ఆయుధములచేత, పప్లవాన్=పప్లవులను, నాశయామాస అపి=నశింపచేసెను కూడ.

**తా.** అంతట విశ్వామిత్రమహారాజు తన సైన్యము ఈ విధముగ నశించుచుండగా చూచి, చాల కోపించి, కోపముచేత కళ్లు పెద్దవి చేసి, రథము నధిరోహించి, అనేకవిధములైన ఆయుధములతో పప్లవులను నశింపచేసెను. 18, 19

మూ. విశ్వామిత్రార్దితాన్ దృష్ట్వా పప్లవాంశ్శతశస్తదా,
భూయ ఏవాసృజత్కోపాచ్ఛకాన్ యవనమిశ్రితాన్. 20

ప్ర. అ. విశ్వామిత్రార్దితాన్=విశ్వామిత్రునిచేత పీడింపబడిన, శతశః= వందలకొలది, పహ్లవాన్ = పహ్లవులను, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, కోపాత్ = కోపమువలన, భూయ ఏవ = మరల, యవనమిశ్రితాన్ = యవనులతో కలిసిన, శకాన్ = శకులను, అసృజత్ = సృజించెను.

తా. అప్పు డా కామధేనువు ఆ పహ్లవుల నందరిని విశ్వామిత్రుడు చంపివేయుట చూచి, కోపముతో, మరల, యవనులను శకులను సృజించెను. 20

మూ. తైరాసీత్సంవృతా భూమిః శకైర్యవనమిశ్రితైః,
ప్రభావద్భిర్మహావీర్యై ర్హేమకిఞ్జల్కసన్నిభైః. 21

ప్ర. అ. ప్రభావద్భిః = కాంతి కలవారును, మహావీర్యైః = గొప్ప పరాక్రమము కలవారును, హేమకిఞ్జల్కసన్నిభైః = బంగారు కింజల్కములతో సమానులును అగు, తైః = ఆ, యవనమిశ్రితైః = యవనులతో కలిసిన, శకైః= శకులచేత, భూమిః = భూమి, సంవృతా=కప్పబడినది, ఆసీత్ = ఆయెను.

తా. కాంతి కలవారును, మహావీర్యవంతులును, బంగారు కింజల్కముల వలె నున్నవారును అగు ఆ యవనులును, శకులును, భూమిని కప్పివేసిరి. 21

మూ. దీర్ఘాసిపట్టసధరై ర్హేమవర్ణామ్బరావృతైః,
నిర్దగ్ధం తద్బలం సర్వం ప్రదీప్తైరివ పావకైః. 22

ప్ర. అ. దీర్ఘాసిపట్టసధరైః = దీర్ఘము లైన ఖడ్గములను పట్టసములను ధరించినవారును, హేమవర్ణామ్బరావృతైః = బంగారు రంగు గల వస్త్రములచే ఆచ్ఛాదింపబడినవారును అగు ఆ శకయవనులచేత, ప్రదీప్తైః = ప్రజ్వలించుచున్న, పావకైరివ = అగ్నులచేత వలె, తత్ = ఆ, సర్వమ్ = సమస్త మైన, బలమ్ = సైన్యము, నిర్దగ్ధమ్ = దహింపబడినది.

తా. పొడ వైన ఖడ్గములను పట్టసములను చేత పట్టుకొని, బంగారు వస్త్రములను ధరించి మండుచున్న అగ్నుల వలె ఉన్న ఆ శకయవనులు ఆ సైన్యమునంతను నశింపచేసిరి. 22

మూ. తతోఽస్త్రాణి మహాతేజా విశ్వామిత్రో ముమోచ హ
తైస్తైర్యవనకామ్బోజాః పహ్లవాశ్చాకులీకృతాః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే బాలకాణ్డే
చతుఃపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = పిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, అస్త్రాణి = అస్త్రములను, ముమోచ హ = విడచెను. తైస్తైః = ఆ యా అస్త్రములచేత, యవన కామ్భోజాః = యవనులు కాంభోజులును, పహ్లవాశ్చ = పహ్లవులును, ఆకులీకృతాః = వ్యాకులము చేయబడినారు.

తా. పిమ్మట మహాతేజఃశాలి యైన విశ్వామిత్రుడు మహాస్త్రములను ప్రయోగింపగా యవనులును, కాంభోజులును, పహ్లవులును చెల్లాచెదరై పోయిరి. 25

బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో
ఏబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చపఞ్చాశః సర్గః

మూ. తతస్తానాకులాన్ దృష్ట్వా విశ్వామిత్రాస్త్రమోహితాన్,
వసిష్ఠశ్చోదయామాస కామధుక్సృజ యోగతః. 1

ప్ర. అ. తతః = పిమ్మట, వసిష్ఠః = వసిష్ఠుడు, విశ్వామిత్రాస్త్రమోహితాన్ = విశ్వామిత్రుని అస్త్రములచే మోహము చెందింపబడిన, ఆకులాన్ = వ్యాకులులైన, తాన్ = వారిని, దృష్ట్వా = చూచి, కామధుక్ = ఓ కామధేనువా! యోగతః = యోగబలమువలన, సృజ = సృజించుము అని, చోదయామాస = ప్రేరేపించెను.

తా. వారందరును విశ్వామిత్రుని అస్త్రములచే మోహితులై చెల్లాచెదరై పోవుట చూచి వసిష్ఠుడు— "ఓ కామధేనువా! యోగశక్తిచేత ఇంకను సృజింపుము" అని ఆ ధేనువును ప్రేరేపించెను. 1

మూ. తస్యా హుమ్భారవాజ్జాతాః కామ్భోజా రవిసన్నిభాః,
ఊధసస్త్వథ సంజాతాః పహ్లవాః శస్త్రపాణయః. 2

యోనిదేశాచ్చ యవనాః శకృద్దేశాచ్ఛకాస్తథా,
రోమకూపేషు చ మ్లేచ్ఛా హారీతాః సకిరాతకాః. 3

ప్ర. అ. తస్యాః = ఆ కామధేనువుయొక్క, హుమ్భారవాత్ = హుంభాధ్వనినుండి, రవిసన్నిభాః = సూర్యునితో సమానులైన, కామ్భోజాః = కాంభోజులు, జాతాః = పుట్టిరి. అథ = మరియు, ఊధసః = పొదుగునుండి, శస్త్రపాణయః = ఆయుధములు హస్తములందు గల, పహ్లవాః = పహ్లవులు, సంజాతాః = పుట్టిరి. యోనిదేశాత్ చ = యోనినుండి, యవనాః = యవనులు, తథా = మరియు, శకృద్దేశాత్ = గోమయప్రదేశమునుండి, శకాః = శకులును, రోమకూపేషు = రోమకూపములనుండి, మ్లేచ్ఛాః = మ్లేచ్ఛులును, సకిరాతాః = కిరాతులతో కూడిన, హారీతాః = హారీతులును (పుట్టిరి).

తా. ఆ కామధేనువు హుంభాధ్వని చేయగా దానినుండి సూర్యుని వంటి కాంతి గల కాంభోజులు పుట్టిరి. పొదుగునుండి ఆయుధములను హస్తములందు ధరించిన పహ్లవులును, యోనినుండి యవనులును, గోమయప్రదేశమునుండి శకులును, రోమకూపములనుండి మ్లేచ్ఛులు, హారీతులు, కిరాతులును పుట్టిరి. 2, 3

మూ. తైస్తైర్నిషూదితం సర్వం విశ్వామిత్రస్య తత్క్షణాత్,
సపదాతిగజం సాశ్వం సరథం రఘునన్దన. 4

ప్ర. అ. రఘునన్దన=రామా! తైస్తైః = ఆయాకాంభోజాదులచేత, తత్క్షణాత్=వెంటనే, విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క, సపదాతిగజమ్=కాలిబంటులతోను ఏనుగులతోను కూడినదియు, సాశ్వమ్=అశ్వములతో కూడినదియు, సరథమ్=రథములతో కూడినదియు అగు, సర్వమ్ = సైన్య మంతయు, నిషూదితమ్=నశింపచేయబడినది.

తా. రామా! ఈ విధముగ జనించిన కాంభోజాదు లందరును పదాతి-గజ-అశ్వ-రథములతో కూడిన విశ్వామిత్రసైన్యము నంతను క్షణములో నశింపచేసిరి. 4

మూ. దృష్ట్వా నిషూదితం సైన్యం వసిష్ఠేన మహాత్మనా,
విశ్వామిత్రసుతానాం చ శతం నానావిధాయుధమ్. 5

అభ్యధావత్సుసంక్రుద్ధం వసిష్ఠం జపతాం వరమ్,
హుంకారేణైవ తాన్ సర్వాన్ దదాహ భగవానృషిః. 6

ప్ర. అ. మహాత్మనా=మహాత్ము డైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, నిషూదితమ్=నశింపచేయబడిన, సైన్యమ్=సైన్యమును, దృష్ట్వా = చూచి, విశ్వామిత్రసుతానామ్=విశ్వామిత్రుని కుమారులయొక్క, శతమ్ = శతము, నానావిధాయుధమ్=నానావిధము లైన ఆయుధములు కలదై, సుసంక్రుద్ధమ్=చాల కోపించినదై, జపతాం వరమ్=మునులలో శ్రేష్ఠు డైన, వసిష్ఠమ్=వసిష్ఠుని గూర్చి, అభ్యధావత్=పరుగెత్తెను. భగవాన్=భగవంతు డైన, ఋషిః=వసిష్ఠమహర్షి, తాన్=ఆ, సర్వాన్=అందరిని, హుంకారేణైవ=హుంకారముచేతనే, దదాహ=కాల్చివేసెను.

తా. మహాత్ముడైన వసిష్ఠుడు తమ సైన్యమును నశింపచేయుటను చూచి, విశ్వామిత్రుని నూర్గురు కుమారులు మిక్కిలి కోపించినవారై, అనేకవిధములైన ఆయుధములను ధరించి, వసిష్ఠమహాముని పైకి దుమికిరి. ఆతడు వారి నందరిని, హుంకారము చేసి, భస్మము చేసెను. 5, 6

మూ. తే సాశ్వరథపాదాతా వసిష్ఠేన మహాత్మనా,
భస్మీకృతా ముహూర్తేన విశ్వామిత్రసుతాస్తదా. 7

ప్ర. అ. తదా = అప్పుడు, సాశ్వరథపాదాతాః = అశ్వములతోడను, రథములతోడను, కాలిబంటులతోడను కూడిన, తే = ఆ, విశ్వామిత్రసుతాః = విశ్వామిత్రుని కుమారులు, మహాత్మనా = మహాత్ముడైన, వసిష్ఠేన = వసిష్ఠుని చేత, ముహూర్తేన = క్షణకాలములో, భస్మీకృతాః = భస్మము చేయబడినారు.

తా. ఆ విశ్వామిత్రకుమారుల సందరిని మహాత్ముడైన వసిష్ఠుడు, అశ్వరథపదాతులతో సహా క్షణములో భస్మము చేసెను. 7

మూ. దృష్ట్వా వినాశితాన్ పుత్రాన్ బలం చ సుమహాయశాః,
సవ్రీడశ్చిన్తయావిష్టో విశ్వామిత్రోఽభవత్తదా. 8

ప్ర. అ. తదా = అప్పుడు, సుమహాయశాః = గొప్ప కీర్తి గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వినాశితాన్ = నశింపచేయబడిన, పుత్రాన్ = పుత్రులను, బలం చ = సైన్యమును, దృష్ట్వా = చూచి, సవ్రీడః = సిగ్గుతో కూడినవాడై, చిన్తయా = విచారముతో, ఆవిష్టః = కూడినవాడు, అభవత్ = ఆయెను.

తా. ఆ విధముగ తన సైన్యమంతయు, కుమారులును నశించిపోవుట చూచి విశ్వామిత్రుడు సిగ్గుతో చింతాక్రాంతుడయ్యెను. 8

మూ. సముద్ర ఇవ నిర్వేగో భగ్నదంష్ట్ర ఇవోరగః,
ఉపరక్త ఇవాదిత్యః సద్యో నిష్ప్రభతాం గతః. 9

ప్ర. అ. నిర్వేగః = వేగము లేని, సముద్రః ఇవ = సముద్రము వలె, భగ్నదంష్ట్రః = విరిగిపోయిన కోరలు గల, ఉరగః ఇవ = సర్పము వలె, ఉప

రక్తః = రాహువుచే మ్రింగబడిన, ఆదిత్యః ఇవ = సూర్యుడు వలె, సద్యః = వెంటనే, నిష్ప్రభతామ్ = కాంతిరహితత్వమును, గతః = పొందెను.

తా. వేగము లేని సముద్రము వలె, కోరలు తీసిన పాము వలె, రాహువు మ్రింగిన సూర్యుడు వలె కాంతివిహీను డయ్యెను. 9

మూ. హతపుత్రబలో దీనో లూనపక్ష ఇవ ద్విజః,
హతదర్పో హతోత్సాహో నిర్వేదం సమపద్యత. 10

ప్ర. అ. హతపుత్రబలః = చంపబడిన పుత్రులును సైన్యమును గల అతడు, లూనపక్షః = ఖండింపబడిన రెక్కలు గల, ద్విజః ఇవ = పక్షి వలె, దీనః = దీనుడై, హతదర్పః = తొలగిన దర్పముకలవాడై, హతోత్సాహః = తొలగిన ఉత్సాహము కలవాడై, నిర్వేదమ్ = దుఃఖమును, సమపద్యత = పొందెను.

తా. పుత్రులును సైన్యమును నశించుటచే అతడు రెక్కలు తెగగొట్టిన పక్షి వలె, దీనుడై దర్పోత్సాహములు అడగి దుఃఖమును పొందెను. 10

మూ. స పుత్రమేకం రాజ్యాయ పాలయేతి నియుజ్య చ,
పృథివీం క్షత్రధర్మేణ వనమేవాన్వపద్యత. 11

ప్ర. అ. సః = అతడు, పృథివీమ్ = భూమిని, క్షత్రధర్మేణ = క్షత్రియ ధర్మానుసారముగా, పాలయ = పాలించుము, ఇతి = అని, ఏకమ్ = ఒక, పుత్రమ్ = పుత్రుని, రాజ్యాయ = రాజ్యమునకై, నియుజ్య = నియమించి, వన మేవ = వనమునే, అన్వపద్యత = చేరెను.

తా. విశ్వామిత్రుడు, "ఈ భూమిని క్షత్రియధర్మానుసారముగా పాలింపుము" అని ఒక కుమారుని నియమించి వనమునకు వెళ్లిపోయెను. 11

మూ. స గత్వా హిమవత్పార్శ్వం కిన్నరోరగసేవితమ్,
మహాదేవప్రసాదార్థం తపస్తేపే మహాతపాః. 12

ప్ర. అ. మహాతపాః = గొప్ప తపస్సు గల, సః = అతడు, కిన్నరోరగ సేవితమ్ = కిన్నరులచేతను సర్పములచేతను సేవింపబడిన (ఉరగు లనువారు

ఒక జాతి కావచ్చును). హిమవత్పార్శ్వమ్=హిమవత్పర్వతప్రాంతమును గూర్చి, గత్వా=వెళ్లి, మహాదేవప్రసాదార్థమ్=మహాదేవుని అనుగ్రహముకొరకై, తపః= తపస్సును, తేపే=తపించెను.

తా. మహాతపశ్శాలి యగు ఆ విశ్వామిత్రుడు కిన్నరులతోడను ఉరగుల తోడను కూడిన హిమవత్పర్వతసమీపము చేరి మహాదేవుని అనుగ్రహము కోరుచు తపస్సు చేసెను. 12

మూ. కేన చిత్త్వథ కాలేన దేవేశో వృషభధ్వజః,
దర్శయామాస వరదో విశ్వామిత్రం మహాబలమ్. 13

ప్ర. అ. అథ=పిమ్మట, కేన చిత్ కాలేన=కొంతకాలమునకు, దేవేశః= దేవతాప్రభువైన, వృషభధ్వజః=వృషభము ధ్వజముగా గల శివుడు, వరదః= వరముల నిచ్చువాడై, మహాబలమ్=గొప్ప బలము గల, విశ్వామిత్రమ్=విశ్వా మిత్రునకు, దర్శయామాస=తనను చూపించెను.

తా. అంత కొంతకాలమునకు దేవాధీశు డైన పరమేశ్వరుడు మహాబల శాలి యగు విశ్వామిత్రునకు వరముల నిచ్చుటకై ప్రత్యక్ష మాయెను. 13

మూ. కిమర్థం తప్యసే రాజన్ బ్రూహి యత్తే వివక్షితమ్,
వరదోఽస్మి వరో యస్తే కాఙ్క్షితః సోఽభిధీయతామ్. 14

ప్ర. అ. రాజన్=రాజా! కిమర్థమ్=ఎందుకు, తప్యసే = తపస్సుచేయు చున్నావు? తే=నీకు, యత్ = ఏది, వివక్షితమ్ = చెప్ప నుద్దేశింపబడినదో, తత్=దానిని, బ్రూహి=చెప్పుము. వరదః=వరములనిచ్చువాడను, అస్మి=అయి ఉన్నాను. యః=ఏ, వరః=వరము, తే=నీచేత, కాఙ్క్షితః=కోరబడినదో, సః= అది, అభిధీయతామ్=చెప్పబడుగాక.

తా. రాజా! ఎందుకు తపస్సు చేయుచున్నావు? నీవు చెప్పదలచిన దేదియో చెప్పుము. నీకు వరముల నిచ్చెదను. నీవు కోరెడు కోరిక ఏదియో చెప్పుము. 14

మూ. ఏవముక్తస్తు దేవేన విశ్వామిత్రో మహాతపాః,
ప్రణిపత్య మహాదేవమిదం వచనమబ్రవీత్. 15

ప్ర. అ. దేవేన=ఈశ్వరునిచేత, ఏవమ్=ఈ విధముగా, ఉక్తః=పలకబడిన, మహాతపాః=గొప్ప తపస్సు గల, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, మహాదేవమ్=మహాదేవుని, ప్రణిపత్య=నమస్కరించి, ఇదమ్=ఈ, వచనమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాదేవు డిట్లు పలుకగా విని మహాతపశ్శాలి యగు విశ్వామిత్రుడు ఆతనికి నమస్కరించి ఇట్లు పలికెను. 15

మూ. యది తుష్టో మహాదేవ ధనుర్వేదో మమానఘ,
సాఙ్గోపాఙ్గోపనిషదః సరహస్యః ప్రదీయతామ్. 16

ప్ర. అ. అనఘ=దోషములు లేని, మహాదేవ = మహాదేవుడా! తుష్టః యది = సంతసించినట్లైతే, సాఙ్గోపాఙ్గోపనిషదః = అంగములతోడను, ఉపాంగములతోడను ఉపనిషత్తులతోడను కూడినదియు, సరహస్యః = రహస్యములతో కూడినదియు అగు, ధనుర్వేదః=ధనుర్వేదము, మమ=నాకు, ప్రదీయతామ్= ఇవ్వబడుగాక.

తా. "మహాదేవా! నీవు అనుగ్రహించినట్లైతే, నాకు ధనుర్వేదము నంతను సాంగోపాంగముగా సరహస్యముగా ఇమ్ము" 16

మూ. యాని దేవేషు చాస్త్రాణి దానవేషు మహర్షిషు,
గన్ధర్వయక్షరక్షస్సు ప్రతిభాన్తు మమానఘ. 17

ప్ర. అ. అనఘ=దోషరహితుడా! దేవేషు=దేవతలయందు, దానవేషు= దానవులయందును, మహర్షిషు = మహర్షులయందును, గన్ధర్వయక్షరక్షస్సు= గంధర్వులందును, యక్షులందును, రాక్షసులందును, యాని = ఏ, అస్త్రాణి= అస్త్రము లున్నవో, అవి, మమ=నాకు, ప్రతిభాన్తు=స్ఫురించుగాక.

తా. "పాపరహితుడ వైన ఓ మహాదేవా! దేవతలకును, దానవులకును,

మహర్షులకును, గంధర్వయక్షరక్షస్సులకును తెలిసిన అస్త్రము లన్నియు నాకు స్ఫురించుగాక". 17

మూ. తవ ప్రసాదాద్భవతు దేవదేవ మమేప్సితమ్,
ఏవమస్త్వితి దేవేశో వాక్యముక్త్వా గతస్తదా. 18

ప్ర. అ. దేవదేవ = దేవతలకు దేవుడ వైన మహాదేవా! తవ = నీ యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, మమ = నాయొక్క, ఈప్సితమ్ = కోరిక, భవతు = సిద్ధించుగాక. ఏవమ్ = ఇటులనే, అస్తు = అగుగాక, ఇతి = అని, దేవేశః = మహాదేవుడు, ఉక్త్వా = పలికి, తదా = అప్పుడు, గతః = వెళ్లినాడు.

తా. "దేవాధిదేవా! నీ అనుగ్రహమువలన నా కోరిక తీరుగాక". ఈ వాక్యమును విని మహాదేవుడు– "అటులనే అగును" అని పలికి వెడలి పోయెను. 18

మూ. ప్రాప్య చాస్త్రాణి రాజర్షిర్విశ్వామిత్రో మహాబలః,
దర్పేణ మహతా యుక్తో దర్పపూర్ణోఽభవత్తదా. 19

ప్ర. అ. మహాబలః = గొప్ప బలముకలవాడును, రాజర్షిః = రాజర్షియు, మహతా = గొప్ప, దర్పేణ = దర్పముతో, యుక్తః = కూడినవాడును అగు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, తదా = అప్పుడు, అస్త్రాణి = అస్త్రములను, ప్రాప్య = పొంది, దర్పపూర్ణః = దర్పముతో నిండినవాడు, అభవత్ = అయెను.

తా. మహాబలశాలి యగు విశ్వామిత్రుడు స్వతః దర్పముకలవాడు. ఆ అస్త్రములు లభించగనే ఆతని దర్పము ఇనుమడించెను. 19

మూ. వివర్ధమానో వీర్యేణ సముద్ర ఇవ పర్వణి,
హతమేవ తదా మేనే వసిష్ఠమృషిసత్తమమ్. 20

ప్ర. అ. పర్వణి = పర్వమునందు, సముద్ర ఇవ = సముద్రము వలె, వీర్యేణ = వీర్యముచేత, వివర్ధమానః = వృద్ధిపొందుచున్నవాడై, ఋషిసత్తమమ్ =

ఋషిశ్రేష్ఠుడైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, తదా = అప్పుడు, హతమేవ = చంప బడినవానినిగానే, మేనే = తలచెను.

తా. పూర్ణిమాపర్వమునందు సముద్రము పొంగి నట్లు వీర్యముచేత వృద్ధి పొందుచున్నవాడై, విశ్వామిత్రుడు— "ఇపు డిక ఈ వసిష్ఠుడు తప్పక నశింప గలడు" అని భావించెను. 20

మూ. తతో గత్వాశ్రమపదం ముమోచాస్త్రాణి పార్థివః,
యైస్తత్తపోవనం సర్వం నిర్దగ్ధం చాస్త్రతేజసా. 21

ప్ర. అ. తతః = పిమ్మట, పార్థివః = రాజు, ఆశ్రమపదమ్ = ఆశ్రమ మును గూర్చి, గత్వా = వెళ్లి, అస్త్రాణి = అస్త్రములను, ముమోచ = విడచెను. యైః = వేటిచేత, తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, తపోవనమ్ = తపోవనము, అస్త్రతేజసా = అస్త్రముల తేజస్సుచేత, నిర్దగ్ధమ్ = కాల్చివేయబడినదో.

తా. విశ్వామిత్రుడు వసిష్ఠాశ్రమమునకు పోయి అస్త్రములను విడువగా ఆ అస్త్రముల తేజస్సుచే ఆ తపోవన మంతయు దగ్ధ మయ్యెను. 21

మూ. ఉదీర్యమాణమస్త్రం తద్విశ్వామిత్రస్య ధీమతః,
దృష్ట్వా విప్రద్రుతాః సర్వే మునయః శతశో దిశః. 22

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతుడైన, విశ్వామిత్రస్య = విశ్వామిత్రుని యొక్క, తత్ = ఆ, ఉదీర్యమాణమ్=విజృంభించుచున్న, అస్త్రమ్=అస్త్రమును, దృష్ట్వా = చూచి, శతశః = వందలకొలది, మునయః = మునులు, సర్వే = అందరును, దిశః = దిక్కులను గూర్చి, విప్రద్రుతాః = పారిపోయిరి.

తా. ఆ విశ్వామిత్రాస్త్రములు విజృంభించుట చూచి అచట నున్న మును లందరును దిక్కులను పట్టి పారిపోయిరి. 22

మూ. వసిష్ఠస్య చ యే శిష్యాస్తథైవ మృగపక్షిణః,
విద్రవన్తి భయాద్భీతా నానాదిగ్భ్యః సహస్రశః. 23

ప్ర. అ. వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, యే = ఏ, శిష్యాః = శిష్యులు కలరో వారును, తథైవ = మరియు, మృగపక్షిణః = మృగములును పక్షులును, భయాత్ = ఆ భయకారణమువలన, భీతాః = భీతులై, సహస్రశః = వేలకొలది, నానాదిగ్భ్యః = అన్నిదిక్కులకును, విద్రవన్తి = పారిపోయిరి.

తా. వసిష్ఠుని శిష్యులును, వేలకొలది మృగములును, పక్షులును భీతిచెంది నలు దిక్కులకును పారిపోయిరి. 23

మూ. వసిష్ఠస్యాశ్రమపదం శూన్యమాసీన్మహాత్మనః,
ముహూర్తమివ నిశ్శబ్దమాసీదిరిణసన్నిభమ్. 24

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠుని యొక్క, ఆశ్రమపదమ్ = ఆశ్రమము, శూన్యమ్ = శూన్యముగ, ఆసీత్ = ఆయెను. ముహూర్తమివ = క్షణకాలములో, ఇరిణసన్నిభమ్ = మరుస్థానముతో తుల్యమైనదై, నిశ్శబ్దమ్ = నిశ్శబ్దము, ఆసీత్ = ఆయెను.

తా. మహాత్ముడైన వసిష్ఠుని ఆశ్రమము, క్షణకాలములో మరుస్థలము వలె ప్రాణిశూన్యమును, నిశ్శబ్దమును ఆయెను. 24

మూ. వదతో వై వసిష్ఠస్య మాభైరితి ముహుర్ముహుః,
నాశయామ్యద్య గాధేయం నీహారమివ భాస్కరః. 25

ప్ర. అ. భాస్కరః = సూర్యుడు, నీహారమివ = పొగమంచును వలె, గాధేయమ్ = విశ్వామిత్రుని, అద్య = ఇప్పుడు, నాశయామి = నశింపచేయుదును. మాభైః = భయపడకుడు. ఇతి = అని, వసిష్ఠస్య = వసిష్ఠుడు, ముహుర్ముహుః = మాటిమాటికిని, వదతః = పలుకుచుండగనే, (పారిపోయిరి).

తా. "సూర్యుడు మంచును నశింపచేసి నట్లు ఈ విశ్వామిత్రుని నశింప చేసెదను. భయపడకుడు" అని వసిష్ఠుడు అనుచుండగనే అచటి మునులును, తదితరప్రాణులును పారిపోయిరి. 25

మూ. ఏవముక్త్వా మహాతేజా వసిష్ఠో జపతాం వరః,
విశ్వామిత్రం తదా వాక్యం సరోషమిదమబ్రవీత్. 26

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, జపతాం వరః = మునులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తదా = అప్పుడు, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, సరోషమ్ = రోషముతో కూడినట్లుగా, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మునులలో శ్రేష్ఠుడును, మహాతేజశ్శాలియు అగు వసిష్ఠుడు ఈ విధముగా పలికి, క్రోధావిష్టుడై విశ్వామిత్రునితో ఇట్లనెను. 26

మూ. ఆశ్రమం చిరసంవృద్ధం యద్వినాశితవానసి,
దురాచారోఽసి తన్మూఢ తస్మాత్త్వం న భవిష్యసి. 27

ప్ర. అ. మూఢ = మూడుడా! చిరసంవృద్ధమ్ = చిరకాలమునుండి పెంచబడిన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, యత్ = ఏ కారణమువలన, వినాశితవాన్ = నశింపచేసినవాడవు, అసి = అయితివో, తత్ = ఆకారణమువలన, దురాచారః = దుష్ప్రవర్తన కలవాడవు, అసి=అయితివి. తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, న భవిష్యసి = ఉండవు.

తా. "ఓరీ! మూఢాత్మా! చిరకాలమునుంచి పెంచిన ఆశ్రమమును నశింపచేసితివి. ఇంతటి దుష్కార్యము చేసితివి. ఇక నీవు జీవించవు". 27

మూ. ఇత్యుక్త్వా పరమక్రుద్ధో దణ్డముద్యమ్య సత్వరః,
విధూమమివ కాలాగ్నిం యమదణ్డమివాపరమ్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, సత్వరః = తొందర కలవాడై, పరమక్రుద్ధః = చాల కోపించినవాడై, విధూమమ్ = ధూమము లేని,

కాలాగ్నిమివ=కాలాగ్ని వలె నున్నదియు, అపరమ్=రెండవ, యమదణ్డమివ= యమదండము వలె నున్నదియు అగు, దణ్డమ్ = దండమును, ఉద్యమ్య = ఎత్తి, (నిలచెను).

తా. మిక్కిలి కోపించిన వసిష్ఠుడు ఈ విధముగ పలికి ధూమము లేని కాలాగ్ని వలె, రెండవ యమదండము వలె ఉన్న దండమును శీఘ్రముగ చేత ధరించి నిలచెను. 28

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు, బాలకాండలో ఏబదియెదవ సర సమాపము.

# అథ షట్పఞ్చాశః సర్గః

మూ. ఏవముక్తో వసిష్ఠేన విశ్వామిత్రో మహాబలః,
ఆగ్నేయమస్త్రముత్క్షిప్య తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్. 1

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడినవాడై, ఆగ్నేయమ్ అస్త్రమ్ = ఆగ్నేయాస్త్రమును, ఉత్క్షిప్య = ఎత్తి, తిష్ఠ తిష్ఠ ఇతి = నిలువుము, నిలువుము అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. వసిష్ఠుని వాక్యములు విన్న మహాబలశాలి యగు విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించుచు, "నిలువుము, నిలువుము" అని పలికెను. 1

మూ. బ్రహ్మదణ్డం సముత్క్షిప్య కాలదణ్డమివాపరమ్,
వసిష్ఠో భగవాన్ క్రోధాదిదం వచనమబ్రవీత్. 2

ప్ర. అ. భగవాన్ = పూజ్యుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, అపరమ్ = రెండవ, కాలదణ్డమివ = యమదండము వలె నున్న, బ్రహ్మదణ్డమ్ = బ్రహ్మదండమును, సముత్క్షిప్య = ఎత్తి, క్రోధాత్ = కోపముతో, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పూజ్యుడైన వసిష్ఠుడు రెండవ కాలదండము వలె నున్న బ్రహ్మదండము నెత్తి కోపముతో ఇట్లు పలికెను. 2

మూ. క్షత్రబన్ధో స్థితోఽస్మ్యేష యద్బలం తద్విదర్శయ,
నాశయామ్యద్య తే దర్పం శస్త్రస్య తవ గాధిజ. 3

ప్ర. అ. క్షత్రబన్ధో = ఓ దుష్టక్షత్రియా ! ఏషః = ఈ నేను, స్థితః అస్మి = నిలచి ఉన్నాను. యత్ = ఏ, బలమ్ = బల మున్నదో, తత్ = దానిని, విదర్శయ = చూపుము. గాధిజ = ఓ గాధికుమారుడా ! అద్య = ఇప్పుడు, తే = నీయొక్క,

దర్పమ్=దర్పమును, తవ=నీయొక్క, శస్త్రస్య = ఆయుధముయొక్క, దర్ప మును, నాశయామి=నశింపచేసెదను.

తా. ఓ దుష్టక్షత్రియా! నీ కున్న బల మేదియో చూపుము. ఇపుడు నీ దర్పమును, నీ శస్త్రముల దర్పమును నశింపచేసెదను. 3

మూ. క్వ చ తే క్షత్రియబలం క్వ చ బ్రహ్మబలం మహత్,
పశ్య బ్రహ్మబలం దివ్యం మమ క్షత్రియపాంసన. 4

ప్ర. అ. క్షత్రియపాంసన = ఓ క్షత్రియాధమా! తే = నీయొక్క, క్షత్రియబలమ్=క్షత్రియబలము, క్వ=ఎక్కడ! మహత్=గొప్పదైన, బ్రహ్మ బలమ్=బ్రహ్మబలము, క్వ చ=ఎక్కడ! మమ=నాయొక్క, దివ్యమ్=దివ్య మైన, బ్రహ్మబలమ్=బ్రహ్మబలమును, పశ్య=చూడుము.

తా. ఓ క్షత్రియాధమా! నీ క్షత్రియబల మెక్కడ, గొప్పదైన బ్రహ్మ బల మెక్కడ! దివ్య మైన నా బ్రహ్మబలమును చూడుము. 4

మూ. తస్యాస్త్రం గాధిపుత్రస్య ఘోరమాగ్నేయముద్యతమ్,
బ్రహ్మదణ్డేన తచ్ఛాన్తమగ్నేర్వేగ ఇవామ్బసా. 5

ప్ర. అ. తస్య=ఆ, గాధిపుత్రస్య=విశ్వామిత్రునియొక్క, ఉద్యతమ్= ప్రయోగింపబడిన, తత్=ఆ, ఆగ్నేయమ్=ఆగ్నేయ మను, అస్త్రమ్=అస్త్రము, అమ్బసా=నీటిచేత, అగ్నేః=అగ్నియొక్క, వేగః ఇవ=వేగము వలె, బ్రహ్మ దణ్డేన=బ్రహ్మదండముచేత, శాన్తమ్=శాంతించినది.

తా. విశ్వామిత్రుడు ప్రయోగించిన భయంకర మైన ఆ బ్రహ్మాస్త్రము అగ్నివేగము ఉదకముచే శాంతించి నట్లు బ్రహ్మదండముచే శాంతించెను. 5

మూ. వారుణం చైవ రౌద్రం చ ఐన్ద్రం పాశుపతం తథా,
ఐషీకం చాపి చిక్షేప కుపితో గాధినన్దనః. 6

ప్ర. అ. కుపితః=కోపించిన, గాధినన్దనః = విశ్వామిత్రుడు, వారుణం చైవ=వారుణాస్త్రమును, రౌద్రం చ=రౌద్రాస్త్రమును, ఐన్ద్రం చ=ఐంద్రాస్త్రమును,

తథా=మరియు, పాశుపతమ్=పాశుపతాస్త్రమును, ఐషీకం చాపి=ఐషీకాస్త్రమును, చిక్షేప=ప్రయోగించెను.

తా. విశ్వామిత్రుడు కోపించి వారుణ—రౌద్ర—ఐంద్ర—పాశుపత—ఐషీకాస్త్రములను ప్రయోగించెను. 6

మూ. మానవం మోహనం చైవ గాన్ధర్వం స్వాపనం తథా,
జృమ్భణం మాదనం చైవ సన్తాపనవిలాపనే. 7

శోషణం దారణం చైవ వజ్రమస్త్రం సుదుర్జయమ్,
బ్రహ్మపాశం కాలపాశం వారుణం పాశమేవ చ. 8

పైనాకాస్త్రం చ దయితం శుష్కార్ద్రే అశనీ ఉభే,
దణ్డాస్త్రమథ పైశాచం క్రౌఞ్చమస్త్రం తథైవ చ. 9

ధర్మచక్రం కాలచక్రం విష్ణుచక్రం తథైవ చ,
వాయవ్యం మథనం చైవ అస్త్రం హయశిరస్తథా. 10

శక్తిద్వయం చ చిక్షేప కఙ్కాళం ముసలం తథా,
వైద్యాధరం మహాస్త్రం చ కాలాస్త్రమథ దారుణమ్. 11

త్రిశూలమస్త్రం ఘోరం చ కాపాలమథ కఙ్కణమ్,
ఏతాన్యస్త్రాణి చిక్షేప సర్వాణి రఘునన్దన. 12
వసిష్ఠే జపతాం శ్రేష్ఠే తదద్భుతమివాభవత్.

ప్ర. అ. రఘునన్దన = రామా! మానవమ్ = మానవాస్త్రమును, మోహనం చైవ = మోహము కలిగించు అస్త్రమును, గాన్ధర్వమ్ = గాంధర్వమును, తథా = మరియు, స్వాపనమ్ = నిద్రకలిగించు అస్త్రమును, జృమ్భణమ్ = ఆవులింతలు కలిగించు అస్త్రమును, మాదనం చైవ = మత్తు కలిగించు అస్త్రమును, సన్తాపన విలాపనే = తాపమును విలాపమును కలిగించు అస్త్రములను, శోషణమ్ = ఎండింపచేయు అస్త్రమును, దారణం చైవ = చీల్చివేయు అస్త్రమును, సుదుర్జయమ్ = ఏమాత్రము జయింపశక్యము కాని, వజ్రమ్ అస్త్రం చ =

వజ్రాస్త్రమును, బ్రహ్మపాశమ్ = బ్రహ్మపాశమును, కాలపాశమ్ = కాల పాశమును, వారుణం పాశమేవ చ = వరుణపాశమును, పైనాకాస్త్రమ్ = పైనా కాస్త్రమును, దయితం చ = దయితాస్త్రమును, శుష్కార్ద్రే = శుష్కము (ఎండినది) ఆర్ద్రము (తడిసినది) అను, ఉభే = రెండు, అశనీ = వజ్రములను, అథ = మరియు, దణ్డాస్త్రమ్ = దండాస్త్రమును, పైశాచమ్ = పైశాచమును, తథైవ చ = మరియు, క్రౌఞ్చమస్త్రమ్ = క్రౌంచాస్త్రమును, ధర్మచక్రమ్ = ధర్మ చక్రమును, కాలచక్రమ్ = కాలచక్రమును, తథైవ చ = మరియు, విష్ణుచక్రమ్ = విష్ణుచక్రమును, వాయవ్యమ్ = వాయవ్యమును, మథనం చైవ = మథనమును, తథా = మరియు, హయశిరః అస్త్రమ్ = హయశిరస్సు అను అస్త్రమును, కఙ్కాళమ్ = కంకాళము, తథా = మరియు, ముసలమ్ = ముసలము అనెడు, శక్తి ద్వయం చ = రెండు శక్తులను, చిక్షేప = ప్రయోగించెను. వైద్యాధరమ్ = వైద్యా ధర మనెడు, మహాస్త్రం చ = మహాస్త్రమును, అథ = అటుపిమ్మట, దారుణమ్ = భయంకరమైన, కాలాస్త్రమ్ = కాలాస్త్రమును, ఘోరమ్ = ఘోరమైన, త్రిశూలమ్ అస్త్రమ్ = త్రిశూలాస్త్రమును, అథ = మరియు, కాపాలమ్ = కాపాలమును, కఙ్కణమ్ = కంకణాస్త్రమును, ఏతాని = ఈ, సర్వాణి = సమస్తమైన, అస్త్రాణి = అస్త్రములను, జపతాం శ్రేష్ఠే = మునులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠే = వసిష్ఠునిపై, చిక్షేప = ప్రయోగించెను. తత్ = అది, అద్భుతమివ = చాలఆశ్చర్యకరము, అభవత్ = ఆయెను.

తా. రామా ! ఆ విశ్వామిత్రుడు, మానవ—మోహన—గాంధర్వ—స్వాపన—జృంభణ—మాదన—సంతాపన—విలాపన—శోషణ—ధారణ—వజ్రాస్త్రములను, బ్రహ్మ పాశ—వరుణపాశములను, పైనాక—దయితాస్త్రములను, శుష్కము, ఆర్ద్రము అను రెండు వజ్రములను, దండ—పైశాచ క్రౌంచాస్త్రములను, ధర్మచక్ర—కాలచక్ర—విష్ణుచక్రములను, వాయవ్య—మథన—హయశిరోస్త్రములను, కంకాళ—ముసలము లను రెండు శక్తులను, వైద్యాధర—కాల—త్రిశూల—కాపాల—కంకణా స్త్రములను ప్రయోగించెను. 7-12.

మూ. తాని సర్వాణి దణ్డేన గ్రసతే బ్రహ్మణః సుతః. 13.
తేషు శాన్తేషు బ్రహ్మాస్త్రం క్షిప్తవాన్ గాధినన్దనః,

ప్ర. అ. బ్రహ్మణః సుతః = బ్రహ్మకుమారుడైన వసిష్ఠుడు, తాని

సర్వాణి = వాటి నన్నింటిని, దణ్డేన = దండముచేత, గ్రసతే = మ్రింగివేసెను. తేషు = ఆ అస్త్రములు, శాన్తేషు = శాంతించగా, గాధినన్దనః = విశ్వామిత్రుడు, బ్రహ్మాస్త్రమ్ = బ్రహ్మాస్త్రమును, క్షిప్తవాన్ = ప్రయోగించినాడు.

తా. వసిష్ఠుడు ఆ అస్త్రముల నన్నింటిని దండముచే మ్రింగివేసెను. ఆ అస్త్రము లన్నియు శాంతింపగా, విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. 13

మూ. తదస్త్రముద్యతం దృష్ట్వా దేవాః సాగ్నిపురోగమాః. 14
దేవర్షయశ్చ సంభ్రాన్తా గన్ధర్వాః సమహోరగాః,
త్రైలోక్యమాసీత్సంతప్తం బ్రహ్మాస్త్రే సముదీరితే. 15

ప్ర. అ. ఉద్యతమ్ = ప్రయోగించబడిన, తత్ = ఆ, అస్త్రమ్ = అస్త్రమును, దృష్ట్వా = చూచి, సాగ్నిపురోగమాః = అగ్నితో కూడిన, దేవాః = దేవతలును, దేవర్షయః చ = దేవర్షులును, సమహోరగాః = మహోరగులతో కూడిన, గన్ధర్వాః = గంధర్వులును, సంభ్రాన్తాః = కలతచెందిరి. బ్రహ్మాస్త్రే = బ్రహ్మాస్త్రము, సముదీరితే = ప్రయోగింపబడిన దగుచుండగా, త్రైలోక్యమ్ = మూడు లోకములు, సంతప్తమ్ = తపింపబడినవి, ఆసీత్ = ఆయెను.

తా. ఆ అస్త్రము ప్రయోగించుటను చూచి అగ్న్యాదిదేవతలును, దేవర్షులును, గంధర్వులును, మహోరగులును, కలత చెందిరి. బ్రహ్మాస్త్రము ప్రయోగింపగనే ముల్లోకములును బాధ చెందెను. 15

మూ. తదప్యస్త్రం మహాఘోరం బ్రాహ్మం బ్రాహ్మేణ తేజసా,
వసిష్ఠో గ్రసతే సర్వం బ్రహ్మదణ్డేన రాఘవ. 16

ప్ర. అ. రాఘవ = రామా! వసిష్ఠః = వసిష్ఠుడు, బ్రాహ్మేణ తేజసా = బ్రహ్మతేజస్సుచేత, బ్రహ్మదణ్డేన = బ్రహ్మదండముచేత, మహాఘోరమ్ = అతిభయంకర మైన, తత్ = ఆ, బ్రాహ్మమ్ అస్త్రమపి = బ్రహ్మాస్త్రమును కూడ, సర్వమ్ = పూర్తిగా, గ్రసతే = మ్రింగివేసెను.

తా. రామా! వసిష్ఠుడు, బ్రహ్మతేజః ప్రభావముచే, బ్రహ్మదండముచేత, ఆ అతిభయంకర మైన బ్రహ్మాస్త్రమును కూడ పూర్తిగా మ్రింగివేసెను. 16

మూ. బ్రహ్మాస్త్రం గ్రసమానస్య వసిష్ఠస్య మహాత్మనః,
త్రైలోక్యమోహనం రౌద్రం రూపమాసీత్సుదారుణమ్. 17

ప్ర. అ. బ్రహ్మాస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, గ్రసమానస్య=మ్రింగుచున్న, మహాత్మనః=మహాత్ముడైన, వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క, రూపమ్ = రూపము, త్రైలోక్యమోహనమ్=మూడు లోకములను మూర్ఛనొందించునదిగాను, రౌద్రమ్=భయంకర మైనదిగాను, సుదారుణమ్=చాల దారుణముగాను, ఆసీత్=ఆయెను.

తా. బ్రహ్మాస్త్రమును మ్రింగుచున్న సమయమున ఆ మహాత్ముడైన వసిష్ఠుని రూపము రౌద్రమై, అతిదారుణమై, ముల్లోకములను మూర్ఛనొందించునదిగా ఉండెను. 17

మూ. రోమకూపేషు సర్వేషు వసిష్ఠస్య మహాత్మనః,
మరీచ్య ఇవ నిష్పేతు రగ్నేర్ధూమాకులార్చిషః. 18

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, సర్వేషు = సమస్తమైన, రోమకూపేషు = రోమకూపములందును, ధూమాకులార్చిషః = ధూమముతో నిండిన జ్వాలలు గల, అగ్నేః = అగ్నియొక్క, మరీచ్యః=కిరణములు, నిష్పేతురివ=బయల్వెడలిన ట్లుండెను.

తా. మహాత్ముడైన వసిష్ఠుని రోమకూపములనుండి ధూమముతో నిండిన జ్వాలలు గల అగ్నికిరణములు బయల్వెడలి నట్లు కనబడెను. 18

మూ. ప్రాజ్వలద్బ్రహ్మదణ్డశ్చ వసిష్ఠస్య కరోద్యతః,
విధూమ ఇవ కాలాగ్నిర్యమదణ్డ ఇవాపరః. 19

ప్ర. అ. వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క, కరోద్యతః = హస్తమునందు ఎత్తబడిన, బ్రహ్మదణ్డశ్చ = బ్రహ్మదండము, విధూమః = ధూమములేని, కాలాగ్నిరివ = ప్రలయకాలాగ్ని వలె, అపరః = మరి యొక, యమదణ్డః ఇవ = యమదండము వలె, ప్రాజ్వలత్ = మండిపడెను.

తా. వసిష్ఠుని హస్తములో నున్న బ్రహ్మదండము ధూమము లేని ప్రలయకాలాగ్ని వలె, రెండవ యమదండము వలె ప్రజ్వరిల్లెను. 19

మూ. తతోఽస్తువన్ మునిగణా వసిష్ఠం జపతాం వరమ్,
అమోఘం తే బలం బ్రహ్మన్ తేజో ధారయ తేజసా. 20

ప్ర. అ. **తతః** = పిమ్మట, మునిగణాః = మునిసముదాయములు, జపతాం వరమ్ = మునులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, అస్తువన్ = స్తుతించిరి. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణా! తే = నీయొక్క, బలమ్ = బలము, అమోఘమ్ = శ్రేష్ఠమైనది. తేజః = తేజస్సును, తేజసా = తేజస్సుచేత, ధారయ = ధరించుము.

**తా.** అపుడు మునిగణములు మునిశ్రేష్ఠుడైన వసిష్ఠునితో ఇట్లు పలికిరి. "మహామునీ! నీ బలము అడ్డులేనిది. నీ తేజస్సును నీ తేజస్సునందే నిగ్రహించుము". 20

మూ. నిగృహీత స్త్వయా బ్రహ్మన్ విశ్వామిత్రో మహాతపాః,
ప్రసీద జపతాం శ్రేష్ఠ లోకాస్సన్తు గతవ్యథాః. 21

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణా! త్వయా = నీచేత, మహాతపాః = గొప్ప తపస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, నిగృహీతః = నిగ్రహింపబడినాడు. జపతాం శ్రేష్ఠ = మునులలో శ్రేష్ఠుడా! ప్రసీద = అనుగ్రహింపుము. లోకాః = లోకములు, గతవ్యథాః = తొలగినవ్యథ కలవిగా, సన్తు = అగుగాక.

తా. బ్రాహ్మణోత్తమా! నీవు మహాతపఃశాలి యైన విశ్వామిత్రుని నిగ్రహించితివి. ఓ మునిశ్రేష్ఠా! అనుగ్రహింపుము. లోకముల బాధ తొలగుగాక. 21

మూ. ఏవముక్తో మహాతేజాః శమం చక్రే మహాతపాః,
విశ్వామిత్రోఽపి నికృతో వినిఃశ్వస్యేదమబ్రవీత్. 22

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహాతపాః = గొప్ప తపస్సు గల వసిష్ఠుడు, శమమ్ = శాంతిని, చక్రే = చేసెను. నికృతః = అవమానింపబడిన, విశ్వామిత్రః అపి = విశ్వామిత్రుడు కూడ, వినిఃశ్వస్య = నిట్టూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తా. మహాతేజశ్శాలియు, మహాతపశ్శాలియు అగు వసిష్ఠుడు వారి మాటలు**

విని శాంతించెను. ఈ విధముగ భంగపాటు చెందిన విశ్వామిత్రుడు నిట్టూర్చుచు ఇట్లు పలికెను. 22

మూ. ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్,
ఏకేన బ్రహ్మదణ్డేన సర్వాస్త్రాణి హతాని మే. 23

ప్ర. అ. క్షత్రియబలమ్=క్షత్రియబలమును గూర్చి, ధిక్ = నింద అగుగాక. బ్రహ్మతేజోబలమ్ = బ్రహ్మతేజస్సుయొక్క బలమే, బలమ్ = బలము. ఏకేన = ఒక్క, బ్రహ్మదణ్డేన = బ్రహ్మదండముచేత, మే = నాయొక్క, సర్వాస్త్రాణి = అన్ని అస్త్రములును, హతాని = కొట్టబడినవి.

తా. ఛీ! క్షత్రియబల మేమి బలము! బ్రహ్మతేజోబలమే నిజమైన బలము. ఒక్క బ్రహ్మదండము నా అస్త్రముల నన్నింటిని మ్రింగివేసినది కదా! 23

మూ. తదేతత్సమవేక్ష్యాహం ప్రసన్నేన్ద్రియమానసః,
తపో మహత్సమాస్థాస్యే యద్వై బ్రహ్మత్వకారణమ్. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తత్ = ఆ కారణము వలన, ఏతత్ = ఈ విషయమును, సమవేక్ష్య=చూచి, అహమ్=నేను, ప్రసన్నేన్ద్రియమానసః=ప్రసన్న మైన ఇంద్రియములును మనస్సును కలవాడనై, యత్=ఏది, బ్రహ్మత్వకారణమ్ = బ్రాహ్మణత్వమునకు కారణమో అట్టి, మహత్=గొప్ప, తపః=తపస్సును, సమాస్థాస్యే= అవలంబింపగలను.

తా. ఇపుడు నే నీ విషయమును గ్రహించితిని. అందుచేత మనస్సును ఇంద్రియములను నిర్మలముగ ఉంచుకొని, నాకు బ్రాహ్మణత్వము నొసగు తీవ్ర తపస్సు చేసెదను. 24

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో ఏబదియారవ సర్గ సమాప్తము.

## అథ సప్తపఞ్చాశః సర్గః

మూ. తతః సంతప్తహృదయః స్మరన్నిగ్రహమాత్మనః,
వినిశ్శ్వస్య వినిశ్శ్వస్య కృతవైరో మహాత్మనా. 1

స దక్షిణాం దిశం గత్వా మహిష్యా సహ రాఘవ,
తతాప పరమం ఘోరం విశ్వామిత్రో మహత్తపః, 2
ఫలమూలాశనో దాన్తశ్చకార సుమహత్తపః.

ప్ర. అ. రాఘవ=రామా! తతః=పిమ్మట, మహాత్మనా=మహాత్ముడైన వసిష్ఠునితో, కృతవైరః = చేయబడిన వైరము గల, సః=ఆ, విశ్వామిత్రః= విశ్వామిత్రుడు, సంతప్తహృదయః = తపింపచేయబడిన హృదయము కలవాడై, ఆత్మనః=తనయొక్క, నిగ్రహమ్ = పరాభవమును, స్మరన్ = స్మరించుచు, వినిశ్శ్వస్య వినిశ్శ్వస్య=మాటిమాటికి నిట్టూర్చి, మహిష్యా సహ=జ్యేష్ఠభార్యతో కూడ, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, గత్వా = వెళ్లి, పరమం ఘోరమ్=మిక్కిలి ఘోర మైన, మహత్=గొప్ప, తపః=తపస్సును, తతాప= చేసెను. ఫలమూలాశనః=ఫలమూలములను ఆహారముగ గ్రహించుచు, దాన్తః= ఇంద్రియనిగ్రహము గలవాడై, సుమహత్=గొప్ప, తపః=తపస్సు, చకార= చేసెను.

తా. ఈ విధముగ మహాత్ము డైన వసిష్ఠునితో వైరము పెట్టుకొనిన ఆ విశ్వామిత్రుడు తనకు కలిగిన పరాభవమును స్మరించుచు, బాధపడు చున్న మనస్సుతో మాటి మాటికి నిట్టూర్చుచు, జ్యేష్ఠభార్యతో కూడ దక్షిణదిక్కునకు వెళ్లి, ఫలములు మూలములు మాత్రమే ఆహారముగా గొనుచు, ఇంద్రియములను నిగ్రహించుకొని అతి తీవ్ర మైన తపస్సు చేసెను. 1, 2

మూ. అథాస్య జజ్ఞిరే పుత్రాస్సత్యధర్మపరాయణాః,
హవిష్యన్దో మధుష్యన్దో దృఢనేత్రో మహారథః. 3

ప్ర. అ. అథ=పిమ్మట, అస్య=ఈతనికి, హవిష్యన్దః = హవిష్యందుడు, మధుష్యన్దః=మధుష్యందుడు, దృఢనేత్రః = దృఢనేత్రుడు, మహారథః=మహా

రథుడు అను, సత్యధర్మపరాయణాః=సత్యధర్మములందాసక్తి గల, పుత్రాః= పుత్రులు, జజ్ఞిరే=పుట్టిరి.

తా. పిమ్మట, ఈ విశ్వామిత్రునకు హవిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు అను సత్యధర్మపరాయణు లైన నలుగురు కుమారులు పుట్టిరి. 3

మూ. పూర్ణే వర్షసహస్రే తు బ్రహ్మా లోకపితామహః,
అబ్రవీన్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. 4

ప్ర. అ. వర్షసహస్రే=వేయి సంవత్సరములు, పూర్ణే = నిండగా, లోకపితామహః=లోకములకు పితామహుడైన, బ్రహ్మా=బ్రహ్మదేవుడు, తపోధనమ్= తపస్సే ధనముగా గల, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, మధురమ్= మధుర మైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. వేయి సంవత్సరములు పూర్తి యైనవి. అపుడు సర్వలోకములకును పితామహు డైన బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై తపోధను డైన విశ్వామిత్రునితో మధుర మైన వాక్యము పలికెను. 4

మూ. జితా రాజర్షిలోకాస్తే తపసా కుశికాత్మజ,
అనేన తపసా త్వాం తు రాజర్షిరితి విద్మహే. 5

ప్ర. అ. కుశికాత్మజ=విశ్వామిత్రా! తే=నీయొక్క, తపసా=తపస్సుచేత, రాజర్షిలోకాః = రాజర్షిలోకములు, జితాః=జయింపబడినవి. అనేన=ఈ, తపసా=తపస్సుచేత, త్వామ్ = నిన్ను, రాజర్షిః ఇతి=రాజర్షి అని, విద్మహే= గుర్తించుచున్నాము.

తా. కుశికనందనా! నీవు తపస్సుచేత రాజర్షులు చేర గల్గిన లోకాలను జయించినావు. ఈ తపస్సుచే నీవు రాజర్షి వైనావు. 5

మూ. ఏవముక్త్వా మహాతేజా జగామ సహ దైవతైః,
త్రివిష్టపం బ్రహ్మలోకం లోకానాం పరమేశ్వరః. 6

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును, లోకానామ్=లోకములకు, పరమేశ్వరః=పరమేశ్వరుడును అయిన బ్రహ్మదేవుడు, ఏవమ్=ఈ విధముగా, ఉక్త్వా=పలికి, దైవతైః=దేవతలతో కూడ, బ్రహ్మలోకమ్=బ్రహ్మలోకమైన, త్రివిష్టపమ్=స్వర్గమునుగూర్చి, జగామ=వెళ్లెను.

తా. మహాతేజఃశాలియు, లోకములకు అధిపతియు అగు బ్రహ్మ ఈ విధముగ పలికి, దేవతలతో కూడ తన నివాసస్థానమైన స్వర్గమునకు వెళ్లెను. 6

మూ. విశ్వామిత్రోఽపి తచ్ఛ్రుత్వా హ్రియా కిఞ్చిదవాఙ్ముఖః,
దుఃఖేన మహతావిష్టః సమన్యు రిదమబ్రవీత్. 7

ప్ర. అ. విశ్వామిత్రోఽపి = విశ్వామిత్రుడు కూడ, తత్=ఆ వాక్యమును, శ్రుత్వా = విని, హ్రియా = సిగ్గుతో, కిఞ్చిత్ = కొంచెము, అవాఙ్ముఖః = వంచబడిన ముఖము కలవాడై, మహతా = గొప్పదైన, దుఃఖేన = దుఃఖముతో, ఆవిష్టః = కూడినవాడై, సమన్యుః = కోపముతో కూడినవాడై, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. విశ్వామిత్రుడు ఈ మాటలు విని, సిగ్గుతో తలవంచుకొని, గొప్ప దుఃఖముతో కూడినవాడై, కోపముతో ఇట్లనెను 7

మూ. తపశ్చ సుమహత్తప్తం రాజర్షిరితి మాం విదుః,
దేవాః సర్షిగణాః సర్వే నాస్తి మన్యే తపఃఫలమ్. 8

ప్ర. అ. సుమహత్ = చాల అధికమైన, తపః = తపస్సు, తప్తమ్ = చేయబడినది. మామ్ = నన్ను, రాజర్షిరితి = రాజర్షి యని, సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, సర్వే = సమస్తమైన, దేవాః = దేవతలు, విదుః = గుర్తించుచున్నారు. తపఃఫలం = తపస్సుకు ఫలము, నాస్తి = లేదు అని, మన్యే = తలచుచున్నాను.

తా. ఇంత తపస్సు చేసినాను; అయినను, దేవతలును, ఋషిగణములును రాజర్షి యని మాత్రమే నన్ను గుర్తించుచున్నారు. ఇంత తపస్సు చేసి ఫలితమేమియు లేదని తలచుచున్నాను. 8

మూ. ఇతి నిశ్చిత్య మనసా భూయ ఏవ మహాయశాః,
తపశ్చకార కాకుత్స్థ పరమం పరమాత్మవాన్. 9

ప్ర. అ. కాకుత్స్థ = రామా! మహాయశాః = గొప్ప కీర్తి కలవాడును, పరమాత్మవాన్ = మంచి బుద్ధి కలవాడును అగు ఆ విశ్వామిత్రుడు, ఇతి = ఈ విధముగా, మనసా = మనస్సుచేత, నిశ్చిత్య = నిశ్చయించి, భూయః ఏవ = మరల, పరమమ్ = గొప్ప, తపః = తపస్సును, చకార = చేసెను.

తా. రామా! గొప్ప కీర్తి కలవాడును, గొప్ప బుద్ధి కలవాడును అగు ఆ విశ్వామిత్రుడు మనస్సుచే ఈ విధముగా నిశ్చయించి మరల తీవ్ర మైన తపస్సు చేయ నారంభించెను. 9

మూ. ఏతస్మిన్నేవ కాలే తు సత్యవాదీ జితేన్ద్రియః,
త్రిశఙ్కురితి విఖ్యాత ఇక్ష్వాకుకులవర్ధనః. 10

ప్ర. అ. ఏతస్మిన్నేవ కాలే = ఈ కాలమునందే, సత్యవాదీ = సత్యమును పలుకువాడును, జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడును, ఇక్ష్వాకుకులవర్ధనః = ఇక్ష్వాకుకులమును వృద్ధిపొందించువాడును, త్రిశఙ్కురితి = త్రిశంకువు అని, విఖ్యాతః = ప్రసిద్ధు డైన (రాజు ఉండెను).

తా. ఆ కాలమునందే, సత్యవాదియు, జితేంద్రియుడు, ఇక్ష్వాకు వంశీయుడును అగు త్రిశంకు వను రాజు ఉండెను. 10

మూ. తస్య బుద్ధిః సముత్పన్నా యజేయమితి రాఘవ,
గచ్ఛేయం స్వశరీరేణ దేవానాం పరమాం గతిమ్. 11

ప్ర. అ. రాఘవ = రామా! స్వశరీరేణ = స్వశరీరముతో, దేవానామ్ = దేవతలయొక్క, పరమాం గతిమ్ = ఉత్తమగతిని, గచ్ఛేయమ్ = పొందెదను; యజేయమ్ = యాగము చేయుదును; అని, తస్య = ఆతనికి, బుద్ధిః = బుద్ధి సముత్పన్నా = పుట్టినది.

తా. రామా! యజ్ఞము చేసి ఈ శరీరముతోడనే స్వర్గమునకు వెళ్లవలెను అని ఆతనికి బుద్ధి పుట్టినది. 11

మూ. స వసిష్ఠం సమాహూయ కథయామాస చిన్తితమ్,
అశక్యమితి చాప్యుక్తో వసిష్ఠేన మహాత్మనా. 12

ప్ర. అ. సః=అతడు, వసిష్ఠమ్=వసిష్ఠుని, సమాహూయ = పిలిపించి, చిన్తితమ్=తన ఆలోచనను, కథయామాస=చెప్పెను. మహాత్మనా = మహాత్ముడైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, అశక్యమితి = శక్యముకాదు అని, ఉక్తః అపి= పలకబడెను కూడ.

తా. ఆతడు వసిష్ఠుని పిలిపించి తన అభిప్రాయము తెలుపగా ఆ మహాత్ముడు ఇది శక్యము కాదు అని చెప్పెను. 12

మూ. ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన స యయౌ దక్షిణాం దిశమ్,
తతస్తత్కర్మసిద్ధ్యర్థం పుత్రాంస్తస్య గతో నృపః. 13

ప్ర. అ. వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ప్రత్యాఖ్యాతః = నిరాకరింపబడిన ఆతడు, దక్షిణామ్ దిశమ్=దక్షిణదిక్కును గూర్చి, యయౌ=వెళ్లెను. తతః= పిమ్మట, నృపః=రాజు, తత్కర్మసిద్ధ్యర్థమ్ = ఆ కర్మయొక్క సిద్ధికొరకు, తస్య=వసిష్ఠునియొక్క, పుత్రాన్=పుత్రులను గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. వసిష్ఠుడు నిరాకరింపగా, ఆ రాజు దక్షిణముగా వెళ్లి అచట అట్టి యజ్ఞము చేయింపుడని ప్రార్థించుటకై వసిష్ఠపుత్రులవద్దకు వెళ్లెను. 13

మూ. వాసిష్ఠా దీర్ఘతపసస్తపో యత్ర హి తేపిరే,
త్రిశఙ్కుస్సుమహాతేజాశ్శతం పరమభాస్వరమ్, 14
వసిష్ఠపుత్రాన్ దదృశే తప్యమానాన్ యశస్వినః.

ప్ర. అ. దీర్ఘతపసః=దీర్ఘమైన తపస్సు గల, వాసిష్ఠాః=వసిష్ఠపుత్రులు, యత్ర=ఎచట, తపః=తపస్సు, తేపిరే=చేసిరో, అచట, సుమహాతేజాః=గొప్ప తేజస్సు గల, త్రిశఙ్కుః=త్రిశంకువు, పరమభాస్వరమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న, శతమ్=నూరుగురు, యశస్వినః=కీర్తి గల, తప్యమానాన్ = తపస్సు చేయుచున్న, వసిష్ఠపుత్రాన్=వసిష్ఠకుమారులను, దదృశే=చూచెను.

తా. గొప్ప తేజస్సు గల త్రిశంకువు దీర్ఘతపస్సు గల వసిష్ఠకుమారులు తపస్సు చేయుచున్న ఆశ్రమమునకు వెళ్లి అచట తపస్సు చేయుచున్నవారును, యశస్సు కలవారును తేజస్సు కలవారును అగు నూర్గురు వసిష్ఠపుత్రులను చూచెను. 14

మూ. సోఽభిగమ్య మహాత్మానః సర్వానేవ గురోః సుతాన్, 15
అభివాద్యానుపూర్వ్యేణ హ్రియా కిఞ్చిదవాఙ్ముఖః,
అబ్రవీత్సుమహాభాగాన్ సర్వానేవ కృతాఞ్జలిః. 16

ప్ర. అ. సః = అతడు, మహాత్మానః = మహాత్ము లైన, సర్వానేవ = సమ స్త మైన, గురోః సుతాన్=గురుపుత్రులను, అభిగమ్య = సమీపించి, ఆను పూర్వ్యేణ=వయఃక్రమానుసారముగా, అభివాద్య = నమస్కరించి, హ్రియా = సిగ్గుచేత, కిఞ్చిత్=కొంచెము, అవాఙ్ముఖః = వంచబడిన ముఖము కలవాడై, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలికలవాడై, సర్వానేవ = సమ స్త మైన, మహా భాగాన్=ఆ మహాత్ములను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. అతడు మహాత్ము లగు ఆ గురుపుత్రులను సమీపించెను. ఆ మహాత్ముల నందరిని వారి వయఃక్రమము ననుసరించి నమస్కరించి సిగ్గుతో కొంచెము తలవంచి, దోసిలి యొగ్గి, వారితో ఇట్లనెను. 15, 16

మూ. శరణం వః ప్రపద్యేఽహం శరణ్యాన్ శరణాగతః,
ప్రత్యాఖ్యాతోఽస్మి భద్రం వో వసిష్ఠేన మహాత్మనా. 17

ప్ర. అ. శరణాగతః = శరణకోసమై వచ్చిన, అహమ్ = నేను, శర ణ్యాన్=రక్షకు లైన, వః = మిమ్ములను, శరణం ప్రపద్యే = శరణపొందు చున్నాను. వః=మీకు, భద్రమ్=క్షేమ మగుగాక. మహాత్మనా=మహాత్ము డైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, ప్రత్యాఖ్యాతః అస్మి=ప్రత్యాఖ్యానము చేయబడితిని.

తా. నేను శరణాగతరక్షకు లైన మీవద్దకు శరణము కోరి వచ్చినాను. మీకు క్షేమ మగుగాక. మహాత్ము డైన వసిష్ఠుడు నా కోరిక నిరాకరించినాడు. 17

మూ. యష్టుకామో మహాయజ్ఞం తదనుజ్ఞాతుమర్హథ,
గురుపుత్రానహం సర్వాన్నమస్కృత్య ప్రసాదయే. 18

ప్ర. అ. మహాయజ్ఞమ్=గొప్ప యజ్ఞమును, యష్టుకామః=చేయ కోరిక కలవాడను, తత్=ఆకారణమువలన, అనుజ్ఞాతుమ్=అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హథ= తగియున్నారు. అహమ్=నేను, గురుపుత్రాన్ = గురుపుత్రు లైన, సర్వాన్= మిమ్ములనందరిని, నమస్కృత్య = నమస్కరించి, ప్రసాదయే=అనుగ్రహింప చేసుకొనుచున్నాను.

తా. మహాయజ్ఞ మొకటి చేయవలె నని నాకు కోరిక ఉన్నది. అందుకు అనుజ్ఞ ఇవ్వండి. గురుపుత్రు లైన మిమ్ముల నందరిని నమస్కరించి వేడుచున్నాను. 18

మూ. శిరసా ప్రణతో యాచే బ్రాహ్మణాన్ తపసి స్థితాన్,
తే మాం భవన్తః సిద్ధ్యర్థం యాజయన్తు సమాహితాః. 19
సశరీరో యథాహం హి దేవలోకమవాప్నుయామ్.

ప్ర. అ. శిరసా = శిరస్సుచేత, ప్రణతః = నమస్కరించుచున్నవాడనై, తపసి స్థితాన్=తపస్సు చేయుచున్న, బ్రాహ్మణాన్=బ్రాహ్మణు లైన మిమ్ములను, యాచే = ప్రార్థించుచున్నాను. తే=అట్టి, భవన్తః=మీరు, సమాహితాః= సావధానచిత్తులై, మామ్=నన్ను, సిద్ధ్యర్థమ్=కార్యసిద్ధికొరకు, యాజయన్తు= యజ్ఞము చేయించెదరు గాక. అహమ్=నేను, సశరీరః = శరీరముతో కూడిన వాడనై, యథా = ఎట్లు, దేవలోకమ్ = దేవలోకమును, అవాప్నుయామ్ = పొందుదునో.

తా. తపస్సు చేయుచున్న బ్రాహ్మణోత్తములు మీరు. మిమ్ములను తల వంచి నమస్కరించి ప్రార్థించుచున్నాను. నేను శరీరముతో స్వర్గమునకు వెళ్లునట్లు చేయుటకై, మీరు సావధానచిత్తులై, యజ్ఞము చేయించుడు. 19

మూ. ప్రత్యాఖ్యాతో వసిష్ఠేన గతిమన్యాం తపోధనాః, 20
గురుపుత్రాన్ఋతే సర్వాన్నాహం పశ్యామి కాఞ్చన.

ప్ర. అ. తపోధనాః = ఓ తపోధనులారా! వసిష్ఠేన = వసిష్ఠునిచేత, ప్రత్యాఖ్యాతః = నిరాకరింపబడిన, అహమ్=నేను, సర్వాన్ = సమస్త మైన,

గురుపుత్రాన్నృతే=గురుపుత్రులు తప్ప, అన్యామ్=మరి యొక, గతిమ్=గతిని, కాఞ్చన=దేనినీ, న పశ్యామి=చూడను.

**తా.** ఓ తపోధనులారా! వసిష్ఠుడు నిరాకరించిన పిమ్మట గురుపుత్రులైన మీరు తప్ప నాకు మరొక గతి యేమియును లేదు. 20

మూ. ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమా గతిః, 21
పురోధసస్తు విద్వాంసస్తారయన్తి సదా నృపాన్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సర్వేషామ్ = సమస్తమైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయులకు, పురోధాః = పురోహితుడు, పరమా = గొప్పదైన, గతిః హి = గతి కదా. విద్వాంసః = విద్వాంసులైన, పురోధసః = పురోహితులు, సదా = ఎల్లప్పుడును, నృపాన్ = రాజులను, తారయన్తి = తరింపచేయుదురు. తస్మాత్ = ఆ వసిష్ఠుని కంటె, అనన్తరమ్ = తరువాత, భవన్తః = మీరు, సర్వే = అందరును, మమ = నాకు, దైవతమ్=దేవతలు.

తా. ఇక్ష్వాకువంశీయు లందరికిని పురోహితుడే పరమగతి. విద్వాంసులైన పురోహితులు ఎల్లప్పుడును, రాజులను తరింపచేయుచుందురు. వసిష్ఠుని తరవాత మీరే నాకు దేవతలు. 21

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
ఏబదిఏడవ సర్గ సమాప్తము.

## అథ అష్టపఞ్చాశః సర్గః

**మూ.** తతస్త్రిశఙ్కోర్వచనం శ్రుత్వా క్రోధసమన్వితమ్,
ఋషిపుత్రశతం రామ రాజానమిదమబ్రవీత్. 1

ప్ర. అ. రామ=శ్రీరామా! త్రిశఙ్కోః=త్రిశంకువుయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా = విని, తతః = పిమ్మట, ఋషిపుత్రశతమ్ = ఋషిపుత్రుల శతము, క్రోధసమన్వితమ్ = కోపముతో కూడినదై, రాజానమ్=రాజును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యము, అబ్రవీత్ = పలికెను.

తా. రామా! త్రిశంకుని వచనములు విన్న నూరుగురు ఋషికుమారులును, కోపావిష్టులై రాజుతో ఇట్లు పలికిరి. 1

**మూ.** ప్రత్యాఖ్యాతో హి దుర్బుద్ధే గురుణా సత్యవాదినా,
తం కథం సమతిక్రమ్య శాఖాన్తరముపేయివాన్. 2

ప్ర. అ. దుర్బుద్ధే = ఓ చెడ్డబుద్ధి కలవాడా, సత్యవాదినా = సత్యమును పలికెడు, గురుణా = గురువుచేత, ప్రత్యాఖ్యాతః = నిరాకరింప బడినవాడవై, తమ్ = ఆగురువును, అతిక్రమ్య = అతిక్రమించి, శాఖాన్తరమ్ = మరి యొక శాఖను, కథమ్=ఎట్లు, ఉపేయివాన్=పొందినావు ?

తా. ఓ దుర్బుద్ధీ! సత్యవాది యైన గురువు నిరాకరించిన పిమ్మట, ఆతనిని కాదని మరొకరిని ఎట్లు ఆశ్రయించుచున్నావు ? 2

**మూ.** ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమో గురుః,
న చాతిక్రమితుం శక్యం వచనం సత్యవాదినః. 3

ప్ర. అ. సర్వేషామ్ = సమస్తమైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశ రాజులకు, పురోధాః=పురోహితుడు, పరమః = గొప్ప, గురుః = పూజ్యుడు. సత్యవాదినః = సత్యవాదియైన ఆ గురువుయొక్క, వచనమ్ = వాక్యము, అతిక్రమితుమ్=అతిక్రమించుటకు, న శక్యమ్=శక్యము కాదు.

తా. ఇక్ష్వాకువంశీయు లందరికిని పురోహితుడే పరమపూజ్యుడు. సత్యవాదియైన గురువుయొక్క వాక్యము అతిక్రమింపరానిది. 3

మూ. అశక్యమితి చోవాచ వసిష్ఠో భగవాన్ ఋషిః,
తం వయం వై సమాహర్తుం క్రతుం శక్తాః కథం తవ. 4

ప్ర. అ. భగవాన్=పూజ్యు డైన, వసిష్ఠః ఋషిః=వసిష్ఠమహర్షి, అశక్యమితి=అశక్య మైనది అని, ఉవాచ=చెప్పి ఉన్నాడు. తమ్=అట్టి, క్రతుమ్=యజ్ఞమును, తవ=నీకు, సమాహర్తుమ్=చేయుటకు, వయమ్=మేము, కథమ్=ఎట్లు, శక్తాః=సమర్థులము ?

తా. పూజ్యు డైన వసిష్ఠమహర్షి అశక్య మని చెప్పిన యజ్ఞమును మేము చేయించగలమా ? 4

మూ. బాలిశ స్త్వం నరశ్రేష్ఠ గమ్యతాం స్వపురం పునః,
యాజనే భగవాన్ శక్తస్త్రైలోక్యస్యాపి పార్థివ. 5
అవమానం చ తత్కర్తుం తస్య శక్ష్యామహే కథమ్.

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా, త్వమ్=నీవు, బాలిశః=మూడుడవు. పునః=మరల, స్వపురమ్ = నీపురమును గూర్చి, గమ్యతామ్=వెళ్లెదవుగాక. పార్థివ=రాజా ! భగవాన్ = పూజ్యుడైన వసిష్ఠుడు, త్రైలోక్యస్య=మూడులోకములయొక్క, యాజనేఽపి=యజ్ఞము చేయించుటలో కూడ, శక్తః=సమర్థుడు. తత్=ఆకారణమువలన, తస్య=ఆతనియొక్క, అవమానమ్=అవమానమును, కర్తుమ్=చేయుటకు, కథమ్=ఎట్లు, శక్ష్యామహే=సమర్థులము కాగలము.

తా. ఓ నరశ్రేష్ఠుడా ! నీవు మూడుడవు. నీ నగరమునకు తిరిగి వెళ్లుము. పూజ్యు డైన వసిష్ఠుడు ముల్లోకములలో ఉన్న ఎవ్వరిచేత నైనను యాగము చేయించ సమర్థుడు. ఆయన కాదనిన తరువాత యాగము చేయించి ఆయనను మేము అవమానించగలమా ? 5

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా క్రోధపర్యాకులాక్షరమ్, 6
స రాజా పునరేవైతానిదం వచన మబ్రవీత్.

ప్ర. అ. సః=ఆ, రాజా=రాజు, క్రోధపర్యాకులేక్షణమ్ = క్రోధముచేత వ్యాకుల మైన అక్షరములు గల, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా= విని, పునరేవ = మరల, ఇదమ్=ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్= పలికెను.

తా. క్రోధముచే అక్షరములు తడబడు చున్న, వారు పలికిన, మాటలు విని ఆ రాజు మరల ఇటనెను. 6

మూ. ప్రత్యాఖ్యాతోఽస్మి గురుణా గురుపుత్రైస్తథైవ చ, 7
అన్యాం గతిం గమిష్యామి స్వస్తి వోఽస్తు తపోధనాః.

ప్ర. అ. తపోధనాః = ఓ తపోధనులారా ! గురుణా = గురువుచేతను, తథైవ చ=మరియు, గురుపుత్రైశ్చ=గురుపుత్రులచేతను, ప్రత్యాఖ్యాతః అస్మి= నిరాకరింపబడితిని, అన్యామ్=మరి యొక, గతిమ్=గతిని, గమిష్యామి=పొంద గలను. వః=మీకు, స్వస్తి అస్తు=క్షేమమగుగాక.

తా. ఓ తపోధనులారా ! నా గురువు, గురుపుత్రులు కూడ నా కోరికను నిరాకరించినారు. మరొకగతి చూచుకొనెదను. మీకు క్షేమమగుగాక. 7

మూ. ఋషిపుత్రాస్తు తచ్ఛ్రుత్వా వాక్యం ఘోరాభిసంహితమ్, 8
శేపుః పరమసంక్రుద్ధా శ్చణ్డాలత్వం గమిష్యసి.

ప్ర. అ. ఋషిపుత్రాస్తు=ఋషిపుత్రు లైతే, ఘోరాభిసంహితమ్=ఘోర మైన అభిప్రాయము గల, తత్ = ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, పరమసంక్రుద్ధాః=చాల కోపించినవారై, చణ్డాలత్వమ్=చండాలత్వమును, గమి ష్యసి=పొందగలవు అని, శేపుః=శపించిరి.

తా. చెడ్డ అభిప్రాయముతో కూడిన ఆతని మాట విని, వసిష్ఠపుత్రులు చాల కోపించి, చండాలుడ వగుదువు గాక అని శపించిరి. 8

మూ. ఏవముక్త్వా మహాత్మానో వివిశుస్తే స్వమాశ్రమమ్, 9
అథ రాత్ర్యాం వ్యతీతాయాం రాజా చణ్డాలతాం గతః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, తే = వారు, ఏవమ్=ఈ విధముగా, ఉక్త్వా=పలికి, స్వమ్=తమసంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, వివిశుః=ప్రవేశించిరి. అథ=పిమ్మట, రాత్ర్యామ్=రాత్రి, వ్యతీతాయామ్=గడచినదగుచుండగా, రాజా = రాజు, చణ్డాలతామ్ = చండాలత్వమును, గతః = పొందినాడు.

తా. ఈ విధముగ పలికి ఆ మహాత్ములు తమ ఆశ్రమములోనికి వెళ్లిపోయిరి. పిమ్మట రాత్రి గడవగానే రాజు చండాలుడై పోయెను. 9

మూ. నీలవస్త్రధరో నీలః పరుషో ధ్వస్తమూర్ధజః, 10
చిత్యమాల్యానులేపశ్చ ఆయసాభరణోఽభవత్.

ప్ర. అ. నీలవస్త్రధరః=నల్లని వస్త్రములు ధరించి, నీలః = నల్లనివాడుగను, పరుషః = సౌకుమార్యము లేనివాడుగను, ధ్వస్తమూర్ధజః = తగ్గిపోయిన కేశములు కలవాడుగను, చిత్యమాల్యానులేపశ్చ=శ్మశానములోని మాలలను బూడిదను ధరించినవాడుగను, ఆయసాభరణః=ఇనుప అలంకారములు కలవాడుగను, అభవత్=ఆయెను.

తా. ఆతడు నల్లనివాడై, నల్లని వస్త్రములు ధరించి, సౌకుమార్యము తొలగి, కురుచలైన కేశములతో, శ్మశానమునందలి మాలలను ధరించి, బూడిదను పూసికొని, ఇనుప ఆభరణములను ధరించి ఉండెను. తెల్లవారుసరికి ఆతని రాజవస్త్రభూషణాదు లన్నియు ఈ విధముగా మారిపోయెను. 10

మూ. తం దృష్ట్వా మన్త్రిణః సర్వే త్యక్త్వా చణ్డాలరూపిణమ్, 11
ప్రాద్రవన్ సహితా రామ పౌరా యేఽస్యానుగామినః.

ప్ర. అ. రామ = రామా! చణ్డాలరూపిణమ్ = చండాలరూపము గల, తమ్=ఆతనిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, మన్త్రిణః=మంత్రులును, పౌరాః=పౌరులును, యే=ఎవరు, అస్య = ఇతనియొక్క, అనుగామినః=అనుసరించి ఉండువారో వారును, సహితాః = కలిసిన వారై, ప్రాద్రవన్ = పారిపోయిరి.

తా. రామా ! చండాలరూపము గల ఆతనిని చూచి, మంత్రులును, పౌరులును, ఆతని అనుచరులును, అందరును కలిసి దూరముగ పారిపోయిరి. 11

మూ. ఏకో హి రాజా కాకుత్స్థ జగామ పరమాత్మవాన్, 12
దహ్యమానో దివారాత్రం విశ్వామిత్రం తపోనిధిమ్.

ప్ర. అ. కాకుత్స్థ=రామా ! పరమ్ = మిక్కిలి, ఆత్మవాన్=ధైర్యము గల, రాజా=రాజు, ఏకః = ఒక్కడే, దివారాత్రమ్ = రాత్రులందును పగటి యందును, దహ్యమానః = దుఃఖముచే దహింపబడుచు, తపోనిధిమ్=తపస్సుకు నిధి యైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని గూర్చి, జగామ=వెళ్లెను.

తా. రామా ! మిక్కిలి ధైర్యము గల ఆ త్రిశంకుడు ఏకాకియై, దుఃఖముతో కుములుచు, విశ్వామిత్రమహామునివద్దకు వెళ్లెను. 12

మూ. విశ్వామిత్రస్తు తం దృష్ట్వా రాజానం విఫలీకృతమ్, 13
చణ్డాలరూపిణం రామ మునిః కారుణ్యమాగతః.

ప్ర. అ. రామ=రామా, మునిః = ముని యైన, విశ్వామిత్రస్తు=విశ్వామిత్రుడై తే, విఫలీకృతమ్=వ్యర్థుడుగా చేయబడిన, చణ్డాలరూపిణమ్ = చండాల రూపము ధరించిన, తమ్=ఆ, రాజానమ్ = రాజును, దృష్ట్వా=చూచి, కారుణ్యమ్=కారుణ్యమును, ఆగతః=పొందెను.

తా. రామా ! వసిష్ఠాదులచే విఫలీకృతుడై చండాలత్వము చెందిన ఆ రాజును జూచి విశ్వామిత్రుడు జాలి చెందెను. 13

మూ. కారుణ్యాత్స మహాతేజా వాక్యం పరమధార్మికః, 14
ఇదం జగాద భద్రం తే రాజానం ఘోరరూపిణమ్.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడును, పరమధార్మికః= మిక్కిలి ధార్మికుడును అగు, సః=ఆతడు, కారుణ్యాత్ = కారుణ్యమువలన, ఘోరరూపిణమ్= ఘోర మైన రూపము గల, రాజానమ్ = ఆ రాజును గూర్చి, తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక అని ముందుగ పలికి, ఇదమ్=ఈ వాక్యమును, జగాద=పలికెను.

తా. మహాతేజశ్శాలియు పరమధార్మికుడును అగు విశ్వామిత్రుడు, ఘోర రూపము గల ఆ త్రిశంకుని చూచి, జాలిగొని, "నీకు భద్ర మగుగాక" అని అనుచు, ఇట్లు పలికెను. 14

మూ. కిమాగమనకార్యం తే రాజపుత్ర మహాబల, 15
అయోధ్యాధిపతే వీర శాపాచ్చణ్డాలతాం గతః.

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గల, రాజపుత్ర = రాజా! తే = నీయొక్క, ఆగమనకార్యమ్ = వచ్చుటలోని పని, కిమ్ = ఏమి? అయోధ్యాధి పతే = అయోధ్యకు అధిపతి యైన, వీర = ఓ వీరుడా! శాపాత్ = శాపమువలన, చణ్డాలతామ్ = చండాలత్వమును, గతః = పొందినావు.

తా. మహాబలుడ వైన ఓ రాజపుత్రా! నీవు ఎందుకు వచ్చినావు? అయోధ్యాధిపతి వైన ఓ వీరుడా! పాపము! శాపమువలన చండాలుడ వైతివి కదా! 15

మూ. అథ తద్వాక్యమాజ్ఞాయ రాజా చణ్డాలతాం గతః, 16
అబ్రవీత్ ప్రాఞ్జలిర్వాక్యం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్.

ప్ర. అ. అథ = పిమ్మట, చణ్డాలతామ్ = చండాలత్వమును, గతః = పొందిన, వాక్యజ్ఞః = మాటలనెరిగిన, రాజా = రాజు, తద్వాక్యమ్ = అతని వాక్యమును, ఆజ్ఞాయ = విని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యకోవిదమ్ = వాక్యముల నెరిగిన ఆ విశ్వామిత్రుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. చండాలత్వమును పొందిన ఆ త్రిశంకుడు ఆ మాటలు విని, మాటలలో నేర్పు గల ఆ విశ్వామిత్రునితో, చేతులు జోడించి, ఇట్లనెను. 16

మూ. ప్రత్యాఖ్యాతోఽస్మి గురుణా గురుపుత్రైస్తథైవ చ, 17
అనవాప్యైవ తం కామం మయా ప్రాప్తో విపర్యయః.

ప్ర. అ. గురుణా = గురువుచేతను, తథైవ చ = మరియు, గురుపుత్రైః = గురుపుత్రులచేతను, ప్రత్యాఖ్యాతః అస్మి = నిరాకరింపబడితిని, తమ్ = ఆ,

కామమ్ = కోరికను, అనవాప్యైవ = పొందకుండగనే, మయా = నాచేత, విప ర్యయః = ఈ విపరీతఫలము, ప్రాప్తః = పొందబడినది.

తా. గురువు గురుపుత్రులు కూడ నా కోరికను మన్నింపలేదు. ఆ కోరిక తీరకుండగనే ఈ విపరీతఫలమును పొందితిని. 17

మూ. సశరీరో దివం యాయామితి మే సౌమ్య దర్శనమ్,
మయా చేష్టం క్రతుశతం తచ్చ నావాప్యతే ఫలమ్. 18

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా! సశరీరః = శరీరముతో కూడిన వాడనై, దివమ్ = స్వర్గమును గూర్చి, యాయామ్ = వెళ్లుదును, ఇతి = అని, మే = నాయొక్క, దర్శనమ్ = అభిప్రాయము. మయా = నాచేత, క్రతుశతమ్= నూరు క్రతువులు, ఇష్టమ్ = చేయబడినది. తత్ = ఆ, ఫలమ్ = ఫలము, నావా ప్యతే చ = పొందబడుటలేదు.

తా. ఓ సౌమ్యుడా! ఈ శరీరముతో స్వర్గమునకు వెళ్లవలె నని నా అభి ప్రాయము. నూరు యజ్ఞములు చేసితిని కాని ఆ ఫలము లభింపలేదు. 18

మూ. అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదా చన, 19
కృచ్ఛ్రేష్వపి గతః సౌమ్య క్షత్రధర్మేణ తే శపే.

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యా! మే = నాచేత, అనృతమ్ = అసత్యము, న ఉక్తపూర్వమ్ = పూర్వము పలకబడలేదు. కదాచన = ఎన్నడును, కృచ్ఛ్రేషు గతః అపి = కష్టములు చెందినను, న వక్ష్యే = పలకను. క్షత్రధర్మేణ = క్షత్రియధర్మముచేత, తే = నీకు, శపే = ఒట్టుపెట్టుచున్నాను.

తా. మహామునీ! నే నెన్నడును అసత్యము పలికి ఎరుగను. ఇటుపైన కూడ ఎన్ని కష్టములు వచ్చినను అబద్ధ మాడను. నా క్షత్రియధర్మముపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 19

మూ. యజ్ఞైర్బహువిధైరిష్టం ప్రజా ధర్మేణ పాలితాః, 20
గురవశ్చ మహాత్మానః శీలవృత్తేన తోషితాః.

ప్ర. అ. బహువిధైః = అనేకవిధము లైన, యజ్ఞైః = యజ్ఞములచేత, ఇష్టమ్ = యజ్ఞము (దేవతాపూజ) చేయబడినది. ప్రజాః = ప్రజలు, ధర్మేణ = ధర్మముచేత, పాలితాః = పాలింపబడినారు. మహాత్మానః = మహాత్ము లైన, గురవశ్చ = పెద్దలు కూడ, శీలవృత్తేన = శీలముచేతను నడవడికచేతను, తోషితాః = సంతోష పెట్టబడిరి.

తా. అనేకవిధము లైన యజ్ఞములు చేసితిని. ప్రజలను ధర్మముగా పాలించితిని. మహాత్ము లగు పెద్దలను మంచి శీలముచేతను నడవడికచేతను సంతోష పెట్టితిని. 20

మూ. ధర్మే ప్రయతమానస్య యజ్ఞం చాహర్తుమిచ్ఛతః, 21
పరితోషం న గచ్ఛన్తి గురవో మునిపుఙ్గవ.

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠుడా ! ధర్మే = ధర్మమునందు, ప్రయతమానస్య = ప్రయత్నము చేయుచున్నవాడను, యజ్ఞమ్ = యజ్ఞమును, ఆహర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛతశ్చ = ఇచ్ఛయించుచున్నవాడను అయిన, నా విషయమున, గురవః = గురువులు, పరితోషమ్ = సంతోషమును, న గచ్ఛన్తి = పొందుటలేదు.

తా. ఓ మునిశ్రేష్ఠా! నేను ధర్మాచరణమునకై ప్రయత్నించుచు యాగము చేయవలె నని అభిలషింపగా గురువులు అభినందింపకున్నారు. 21

మూ. దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకమ్. 22
దైవేనాక్రమ్యతే సర్వం దైవం హి పరమా గతిః.

ప్ర. అ. దైవమేవ = దైవమునే, పరమ్ = శ్రేష్ఠ (బల) మైన దానినిగా, మన్యే = తలచెదను. పౌరుషం తు = పౌరుష మైతే, నిరర్థకమ్ = వ్యర్థ మైనదే. సర్వమ్ = అంతయు, దైవేన = దైవముచేత, ఆక్రమ్యతే = ఆక్రమించబడును. దైవమ్ = దైవమే, పరమా = గొప్పదైన, గతిః హి = గతి కదా ?

తా. దైవమే బలవత్తర మైనది; పురుషప్రయత్నము వ్యర్థము. అంతయు దైవవశమే. దైవమే ఉత్తమగతి. 22

మూ. తస్య మే పరమార్తస్య ప్రసాదమభికాఙ్క్షతః, 23
కర్తుమర్హసి భద్రం తే దైవోపహతకర్మణః.

ప్ర. అ. పరమ్ = మిక్కిలి, ఆర్తస్య = పీడితుడును, అభికాఙ్క్షతః = ప్రార్థించుచున్నవాడును, దైవోపహతకర్మణః = దైవముచేత కొట్టబడిన కర్మ గల, తస్య=అట్టి, మే = నాకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. దైవముచేత విఫలప్రయత్నుడ నైన నేను మిక్కిలి అర్తుడనై నీ అనుగ్రహమునకై వేడుచున్నాను. అనుగ్రహింపుము. నీకు మంగళ మగును. 23

మూ. నాన్యాం గతిం గమిష్యామి నాన్యః శరణమస్తి మే, 24
దైవం పురుషకారేణ నివర్తయితుమర్హసి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. అన్యామ్ = మరి యొక, గతిమ్ = గతిని, న గమిష్యామి = పొందను. మే = నాకు, అన్యః = మరియొకడు, శరణమ్ = రక్షకుడు, నాస్తి= లేడు. దైవమ్=దైవమును, పురుషకారేణ=పురుషకారముచేత, నివర్తయితుమ్= మరల్చుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నేను మరి యెవ్వరి వద్దకును వెళ్లను. మరొక రక్షకు డెవ్వడును లేడు. పురుషకారముచే దైవమును నివర్తింపచేయుము. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో
ఏబది యెనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనషష్టితమః సర్గః

మూ. ఉక్తవాక్యం తు రాజానం కృపయా కుశికాత్మజః,
అబ్రవీన్మధురం వాక్యం సాక్షాచ్చణ్డాలరూపిణమ్. 1

ప్ర. అ. ఉక్తవాక్యమ్ = పలకబడిన వాక్యము కలవాడును, సాక్షాత్ = ప్రత్యక్షముగా, చణ్డాలరూపిణమ్ = చండాలరూపము గలవాడును అగు, రాజానమ్ = రాజును గూర్చి, కృపయా = జాలితో, కుశికాత్మజః = విశ్వామిత్రుడు, మధురమ్ = మధుర మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పూర్తిగా చండాలరూపు డైన ఆ రాజు మాటలు విని విశ్వామిత్రుడు జాలిచెంది, ఆతనితో మధుర మైన వాక్యము పలికెను. 1

మూ. ఐక్ష్వాక స్వాగతం వత్స జానామి త్వాం సుధార్మికమ్,
శరణం తే భవిష్యామి మా భైషీర్నృపపుఙ్గవ. 2

ప్ర. అ. ఐక్ష్వాక = ఇక్ష్వాకువంశమునందు పుట్టిన, వత్స = ఓ వత్సా! స్వాగతమ్ = నీకు స్వాగత మగుగాక. త్వామ్ = నిన్ను, సుధార్మికమ్ = మంచి ధార్మికునిగా, జానామి = నే నెరుగుదును, నృపపుఙ్గవ = ఓ రాజశ్రేష్ఠా! మా భైషీః = భయపడకుము. తే = నీకు, శరణమ్ = రక్షకుడను, భవిష్యామి = కాగలను.

తా. ఇక్ష్వాకువంశసంజాతుడ వైన ఓ వత్సా! నీకు స్వాగతము. నీవు ధార్మికుడ వని నాకు తెలియును. ఓ రాజశ్రేష్ఠా! నేను నీకు రక్ష నొనగెదను; భయపడకుము. 2

మూ. అహమామన్త్రయే సర్వాన్మహర్షీన్ పుణ్యకర్మణః,
యజ్ఞసాహ్యకరాన్ రాజన్ తతో యక్ష్యసి నిర్వృతః. 3

ప్ర. అ. అహమ్ = నేను, పుణ్యకర్మణః = పుణ్య మైన కర్మలు గల, యజ్ఞసాహ్యకరాన్ = యజ్ఞమునందు సాహాయ్యము చేయు, సర్వాన్ = సమస్త

మైన, మహర్షీన్ = మహర్షులను, ఆమన్త్రయే = ఆహ్వానించెదను. నిర్వృతః = ఆనందముకలవాడవై, యక్ష్యసి = యాగము చేయగలవు.

తా. రాజా! పుణ్యాత్ములైన మహర్షులను యజ్ఞములో సాహాయ్యము చేయుటకై నేను ఆహ్వానించెదను. నీవు నిశ్చింతగ యజ్ఞము చేయగలవు. 3

మూ. గురుశాపకృతం రూపం యదిదం త్వయి వర్తతే,
అనేన సహ రూపేణ సశరీరో గమిష్యసి. 4

ప్ర. అ. గురుశాపకృతమ్ = గురువుయొక్క శాపముచేత చేయబడిన, యత్ = ఏ, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపము, త్వయి = నీయందు, వర్తతే = ఉన్నదో, అనేన = ఈ, రూపేణ సహ = రూపముతో కూడ, సశరీరః = శరీరసహితుడవై, గమిష్యసి = వెళ్లగలవు.

తా. గురుశాపముచే ఏర్పడిన ఈ రూపముతో, సశరీరుడవై స్వర్గమునకు వెళ్లగలవు. 4

మూ. హస్తప్రాప్తమహం మన్యే స్వర్గం తవ నరాధిప,
యస్త్వం కౌశికమాగమ్య శరణ్యం శరణాగతః. 5

ప్ర. అ. నరాధిప = రాజా! యః = ఏ, త్వమ్ = నీవు, శరణ్యమ్ = శరణు పొంద దగిన, కౌశికమ్ = విశ్వామిత్రుని, ఆగమ్య = చేరి, శరణాగతః = శరణు చొచ్చితివో, తవ = అట్టి నీకు, స్వర్గమ్ = స్వర్గమును, హస్తప్రాప్తమ్ = చేతికి అందినదానినిగా, మన్యే = తలచెదను.

తా. రాజా! శరణాగతరక్షకుడైన విశ్వామిత్రుని శరణు జొచ్చితివి. ఇక స్వర్గము నీ చేతిలో నున్నది. 5

మూ. ఏవముక్త్వా మహాతేజాః పుత్రాన్ పరమధార్మికాన్,
వ్యాదిదేశ మహాప్రాజ్ఞాన్ యజ్ఞసంభారకారణాత్. 6

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల ఆ విశ్వామిత్రుడు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, పరమధార్మికాన్ = మిక్కిలి ధార్మికులును, మహా

ప్రాజ్ఞాన్=గొప్ప బుద్ధి కలవారును అగు, పుత్రాన్=పుత్రులను, యజ్ఞసంభార కారణాత్=యజ్ఞసంభారములను సమకూర్చుటకై, వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ విశ్వామిత్రుడు ఈ విధముగ పలికి యజ్ఞ సంభారములను సమకూర్చు డని, పరమధార్మికులును, గొప్ప బుద్ధిమంతులును అగు కుమారులను ఆజ్ఞాపించెను. 6

మూ. సర్వాన్ శిష్యాన్ సమాహూయ వాక్యమేతదువాచ హ,
సర్వానృషిగణాన్వత్సా ఆనయధ్వం మమాజ్ఞయా, 7
సశిష్యసుహృదశ్చైవ సర్త్విజః సబహుశ్రుతాన్.

ప్ర. అ. సర్వాన్=సమస్తమైన, శిష్యాన్=శిష్యులను, సమాహూయ= పిలచి, ఏత్=ఈ, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను. వత్సాః = ఓ శిష్యులారా! మమ=నాయొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, సశిష్యసుహృదశ్చైవ= శిష్యులతోడను స్నేహితులతోడను కూడిన, సర్త్విజః=ఋత్విక్కులతో కూడిన, సబహుశ్రుతాన్=బహు విద్యావంతులతో కూడిన, సర్వాన్=సమస్తమైన, ఋషి గణాన్=ఋషిగణములను, ఆనయధ్వమ్=తీసికొనిరండి.

తా. విశ్వామిత్రుడు శిష్యు లందరిని పిలచి ఇట్లు పలికెను. "ఓవత్స లారా! నా ఆజ్ఞానుసారముగా వెళ్లి శిష్యులతోడను, స్నేహితులతోడను, ఋత్వి క్కులతోడను, విద్యావంతులతోడను కూడిన ఋషుల నందరిని తీసికొని రండు. 7

మూ. యదన్యో వచనం బ్రూతే మద్వాక్యబలచోదితః, 8
తత్సర్వమఖిలేనోక్తం మమాఖ్యేయమనాదృతమ్.

ప్ర. అ. అన్యః=ఇతరుడు, మద్వాక్యబలచోదితః=నా వాక్యముయొక్క బలముచేత ప్రేరేపింపబడిన వాడై, యత్=ఏ, వచనమ్=వచనమును, బ్రూతే= పలుకునో, అఖిలేన = అందరిచేతను, ఉక్తమ్ = పలకబడిన, అనాదృతమ్= అనాదరపూర్వక మైన, తత్=ఆ, సర్వమ్=అంతయు, మమ = నాకు, ఆఖ్యే యమ్=చెప్పదగినది.

తా. నా సందేశమును విని ఎవరెవరు అనాదరపూర్వకముగా ఏ మాటలు పలుకుదురో ఆ మాట లన్నియు నాకు చెప్పవలెను. 8

మూ. తస్య తద్వచనం శ్రుత్వా దిశో జగ్ముస్తదాజ్ఞయా, 9
ఆజగ్మురథ దేశేభ్యః సర్వేభ్యో బ్రహ్మవాదినః.

ప్ర. అ. తస్య=ఆతని యొక్క, తత్=ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, తదాజ్ఞయా=ఆతని ఆజ్ఞచే, దిశః=దిక్కులను గూర్చి, జగ్ముః= వెళ్లిరి. అథ=పిమ్మట, సర్వేభ్యః=సమస్తమైన, దేశేభ్యః = దేశములనుండి, బ్రహ్మవాదినః=వేదాధ్యయనసంపన్ను లైన మునులు, ఆజగ్ముః=వచ్చిరి.

తా. విశ్వామిత్రుని ఆజ్ఞ ప్రకారము శిష్యులు నలుదిక్కులకును వెళ్లి ఆహ్వానింపగా వేదాధ్యయనసంపన్ను లైన బ్రాహ్మణులు అన్ని దేశములనుండియు వచ్చిరి. 9

మూ. తే చ శిష్యాః సమాగమ్య మునిం జ్వలితతేజసమ్, 10
ఊచుశ్చ వచనం సర్వే సర్వేషాం బ్రహ్మవాదినామ్.

ప్ర. అ. తే=ఆ, శిష్యాః=శిష్యులు, సర్వే=అందరును, సమాగమ్య= తిరిగి వచ్చి, జ్వలితతేజసమ్=ప్రకాశించుచున్న తేజస్సు గల, మునిమ్=విశ్వామిత్రుని గూర్చి, సర్వేషామ్=సమస్తమైన, బ్రహ్మవాదినామ్ = వేదాధ్యయన సంపన్నుల యొక్క, వచనమ్=వాక్యమును, ఊచుశ్చ=చెప్పిరి.

తా. తిరిగి వచ్చిన ఆ శిష్యు లందరును, తేజస్సుతో ప్రకాశించుచున్న ఆ విశ్వామిత్రునితో, వేదాధ్యయన సంపన్ను లగు బ్రాహ్మణు లందరును పలికిన మాటలను చెప్పిరి. 10

మూ. శ్రుత్వా తే వచనం సర్వే సమాయాన్తి ద్విజాతయః, 11
సర్వదేశేషు చాగచ్ఛన్ వర్జయిత్వా మహోదయమ్.

ప్ర. అ. తే=నీయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, సర్వే= సమస్తమైన, ద్విజాతయః = బ్రాహ్మణులు, సమాయాన్తి = వచ్చుచున్నారు.

మహోదయం వర్జయిత్వా=మహోదయుని మినహాయించి, సర్వదేశేషు = సమస్త దేశములం దున్నవారు, ఆగచ్ఛన్=వచ్చిరి.

తా. మీ సందేశము విని బ్రాహ్మణు లందరును వచ్చుచున్నారు. మహోదయుడు తక్క, సకలదేశములలోని బ్రాహ్మణులును వచ్చినారు. 11

మూ. వాసిష్ఠం తచ్ఛతం సర్వం క్రోధపర్యాకులాక్షరమ్, 12
యదాహ వచనం సర్వం శృణు త్వం మునిపుఙ్గవ.

ప్ర. అ. మునిపుఙ్గవ=మునిశ్రేష్ఠుడా ! సర్వమ్=సమస్త మైన, తత్=ఆ, వాసిష్ఠం శతమ్=వసిష్ఠకుమారుల శతము, క్రోధపర్యాకులాక్షరమ్ = క్రోధముచే వ్యాకుల మైన అక్షరములు గల, యత్=ఏ, వచనమ్ = వచనమును, ఆహ = పలికెనో, సర్వమ్=దాని నంతనూ, త్వమ్=నీవు, శృణు=వినుము.

తా. మునిశ్రేష్ఠా ! నీ వాక్యము విని వసిష్ఠకుమారులు నూర్వురును, ఏమనిరో వినుము. 12

మూ. క్షత్రియో యాజకో యస్య చణ్డాలస్య విశేషతః, 13
కథం సదసి భోక్తారో హవిస్తస్య సురర్షయః.

ప్ర. అ. యస్య=ఎవనికి, క్షత్రియః=క్షత్రియుడు, యాజకః=యజ్ఞము చేయించువాడో, విశేషతః=విశేషించి, చణ్డాలస్య=చండాలు డైన, తస్య=వాని యొక్క, సదసి=యజ్ఞసదస్సునందు, సురర్షయః = సురులును ఋషులును, హవిః=హవిస్సును, కథమ్=ఎట్లు, భోక్తారః=భుజించగలరు ?

తా. క్షత్రియుని యాజకునిగా స్వీకరించినవాడు, విశేషించి చండాలుడు, సమర్పించు హవిస్సును యాగములో దేవతలును, ఋషులును ఎట్లు గ్రహింతురు ? 13

మూ. బ్రాహ్మణా వా మహాత్మానో భుక్త్వా చణ్డాలభోజనమ్, 14
కథం స్వర్గం గమిష్యన్తి విశ్వామిత్రేణ పాలితాః.

ప్ర. అ. విశ్వామిత్రేణ=విశ్వామిత్రునిచేత, పాలితాః = పాలింపబడిన, మహాత్మానః=మహాత్ము లైన, బ్రాహ్మణాః వా=బ్రాహ్మణు లైనను, చణ్డాల

భోజనమ్=చండాలుని భోజనమును, భుక్త్వా=భుజించి, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, కథమ్=ఎట్లు, గమిష్యన్తి=వెళ్లగలరు ?

తా. విశ్వామిత్రుని మాటలు విని చండాలుని అన్నము భుజించిన మహాత్ము లైన బ్రాహ్మణు లైనను స్వర్గమున కెట్లు వెళ్లెదరు ? 14

మూ. ఏతద్వచననైష్ఠుర్యమూచుస్సంరక్తలోచనాః, 15
వాసిష్ఠా మునిశార్దూల సర్వే తే సమహోదయాః.

ప్ర. అ. మునిశార్దూల = ఓ మునిశ్రేష్ఠా! సమహోదయాః=మహోదయునితో కూడిన, తే = ఆ, సర్వే = సమస్త మైన, వాసిష్ఠాః = వసిష్ఠకుమారులు, సంరక్తలోచనాః = ఎఱ్ఱనైన నేత్రములు కలవారై, ఏతత్ = ఈ వాక్యమును, వచననైష్ఠుర్యమ్ = వచనములో నైష్ఠుర్య ముండునట్లుగా, ఊచుః = పలికిరి.

తా. మునిశ్రేష్ఠా ! మహోదయుడును, వసిష్ఠకుమారు లందరును, క్రోధముచే ఎఱ్ఱ నైన నేత్రములలో ఈ విధముగ పరుషముగా మాట్లాడిరి. 15

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా సర్వేషాం మునిపుఙ్గవః, 16
క్రోధసంరక్తనయనః సరోషమిద మబ్రవీత్.

ప్ర. అ. మునిపుఙ్గవః = ఆ మునిశ్రేష్ఠుడు, తేషాం సర్వేషామ్ = ఆ అందరియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, క్రోధసంరక్తనయనః = క్రోధముచే ఎఱ్ఱ నైన నేత్రములు కలవాడై, సరోషమ్ = కోపముతో, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మునిశ్రేష్ఠు డైన ఆ విశ్వామిత్రుడు వారి మాటలు విని, క్రోధముతో నేత్రములు ఎఱ్ఱబారగా, ఇట్లు పలికెను. 16

మూ. యే దూషయన్త్యదుష్టం మాం తప ఉగ్రం సమాస్థితమ్, 17
భస్మీభూతా దురాత్మానో భవిష్యన్తి న సంశయః.

ప్ర. అ. ఉగ్రమ్ = ఉగ్ర మైన, తపః = తపస్సును, ఆస్థితమ్ = అవలంబించినవాడను, అదుష్టమ్ = దుష్టుడు కానివాడను అగు, మామ్ = నన్ను,

యే = ఎవరు, దూషయన్తి = దూషించుచున్నారో, అట్టి, దురాత్మానః = దురాత్ములు, భస్మీభూతాః = భస్మ మైన వారుగా, భవిష్యన్తి = కాగలరు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఎట్టి దోషములును లేక ఉగ్రమైన తపస్సు ఆచరించుచున్న నన్ను దూషించు ఆ దురాత్ములు భస్మమై పోయెదరు. సంశయము లేదు. 17

మూ. అద్య తే కాలపాశేన నీతా వైవస్వతక్షయమ్, 18
సప్తజాతిశతాన్యేవ మృతపాః సన్తు సర్వశః.

ప్ర. అ. తే = వారు, అద్య = ఇప్పుడు, కాలపాశేన = యమపాశముచేత, వైవస్వతక్షయమ్ = యముని గృహమును గూర్చి, నీతాః = తీసికొని వెళ్లబడినవారై, సప్తజాతిశతాన్యేవ = ఏడువందల జన్మముల పాటు, సర్వశః = అన్ని విధముల, మృతపాః = శవభక్షకులుగా, సన్తు = అగుదురుగాక.

తా. వాశందరును ఈ నాడే యమపాశబదులె యమలోకమునకు పోయి ఏడువందల జన్మముల పాటు శవభక్షకులుగా ఉందురుగాక. 18

మూ. శ్వమాంసనియతాహారా ముష్టికా నామ నిర్ఘృణాః, 19
వికృతాశ్చ విరూపాశ్చ లోకాననుచరన్త్విమాన్.

ప్ర. అ. నిర్ఘృణాః = జాలిలేని, ముష్టికాః నామ = ముష్టికు లనే జాతి వారుగా పుట్టి, శ్వమాంసనియతాహారాః = కుక్కమాంసమునే నిత్యము భక్షించుచు, వికృతాశ్చ = వికారము కలవారై, విరూపాశ్చ = చెడ్డ రూపము కలవారై, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను (లో), అనుచరన్తు = సంచరింతురు గాక.

తా. వసిష్ఠపుత్రు లందరును జాలి లేని ముష్టికజాతిలో పుట్టి, నిత్యము కుక్కమాంసమును భక్షించుచు, వికృతరూపములతో ఈ లోకమునందు సంచరించెదరు గాక. 19

మూ. మహోదయస్తు దుర్బుద్ధిర్మామదూష్యం హ్యదూషయత్, 20
దూషితః సర్వలోకేషు నిషాదత్వం గమిష్యతి.

ప్ర. అ. దుర్బుద్ధిః = చెడ్డ బుద్ధి గల, మహోదయస్తు = మహోదయుడైతే, అదూష్యమ్ = దూషింపకూడని, మామ్ = నన్ను, అదూషయత్ హి = దూషించినాడు కదా. సర్వలోకేషు = సకలలోకములయందును, దూషితః = దూషింపబడినవాడై, నిషాదత్వమ్ = నిషాదత్వమును, గమిష్యతి = పొందగలడు.

తా. దూషింపరాని నన్ను దూషించిన మహోదయుడు సకలజనులును దూషించు నిషాదజాతిలో పుట్టగలడు. 20

మూ. ప్రాణాతిపాతనిరతో నిరనుక్రోశతాం గతః, 21
దీర్ఘకాలం మమ క్రోధాద్దుర్గతిం వర్తయిష్యతి.

ప్ర. అ. మమ = నాయొక్క, క్రోధాత్ = కోపమువలన, ప్రాణాతిపాతనిరతః = ప్రాణములను తీయుటయందు ఆసక్తి కలవాడై, నిరనుక్రోశతామ్ = దయారాహిత్యమును, గతః = పొందినవాడై, దీర్ఘకాలమ్ = చాల కాలము, దుర్గతిమ్ = చెడ్డ జీవన విధానమును, వర్తయిష్యతి = అనుసరించగలడు.

తా. నా కోపమునకు ఫలితముగ ఆ మహోదయుడు, దయావిహీనుడై, ప్రాణములు తీయుటయందు ఆసక్తి కలవాడై, చాలకాలము దుష్టమైన జీవికను పొందగలడు. 21

మూ. ఏతావదుక్త్వా వచనం విశ్వామిత్రో మహాతపాః,
విరరామ మహాతేజా ఋషిమధ్యే మహామునిః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ. మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, మహామునిః = మహామునియు అగు, విశ్వామిత్రః =

విశ్వామిత్రుడు, ఋషిమధ్యే=ఋషులమధ్యయందు, ఏతావత్ = ఇంతమాత్రము, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, విరరామ = విరమించెను.

తా. మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రమహాముని, ఋషుల మధ్య ఇట్లు పలికి విరమించెను. 22

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో ఏబది తొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ షష్టితమః సర్గః

మూ. తపోబలహతాన్ కృత్వా వాసిష్ఠాన్ సమహోదయాన్,
ఋషిమధ్యే మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత. 1

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, సమహోదయాన్ = మహోదయునితో కూడిన, వాసిష్ఠాన్ = వసిష్ఠ కుమారులను, తపోబలహతాన్=తపోబలముచేత చంపబడిన వారినిగా, కృత్వా= చేసి, ఋషిమధ్యే = ఋషుల మధ్యయందు, అభ్యభాషత = పలికెను.

తా. మహాతేజస్సు గల విశ్వామిత్రుడు మహోదయుని, వసిష్ఠకుమారులను ఈ విధముగ శపించి ఋషులతో ఇట్లు పలికెను. 1

మూ. అయమిక్ష్వాకుదాయాదస్త్రిశఙ్కురితి విశ్రుతః,
ధర్మిష్ఠశ్చ వదాన్యశ్చ మాం చైవ శరణం గతః, 2
తేనానేన శరీరేణ దేవలోకజిగీషయా.

ప్ర. అ. ఇక్ష్వాకుదాయాదః = ఇక్ష్వాకువంశమునందు పుట్టినవాడును, త్రిశఙ్కురితి = త్రిశంకువు అని, విశ్రుతః=ప్రసిద్ధి చెందిన వాడును, ధర్మిష్ఠః= ధర్మాత్ముడును, వదాన్యశ్చ = దాతయు అగు, అయమ్ = ఇతడు, తేన = అట్టి, అనేన = ఈ, శరీరేణ = శరీరముతో, దేవలోక జిగీషయా = దేవలోకమును జయించవలె ననెడు కోరికతో, మామ్ = నన్ను, శరణం గతః = శరణజొచ్చి నాడు.

తా. ఇతడు ఇక్ష్వాకువంశమునకు చెందిన త్రిశంకువు. ధర్మిష్ఠుడు. దాతృత్వము కలవాడు. ఈ శరీరముతోడనే స్వర్గమునకు వెళ్లవలె నను కోరికతో నా సాహాయ్య మర్థించినాడు. 2

మూ. యథాయం స్వశరీరేణ స్వర్గలోకం గమిష్యతి, 3
తథా ప్రవర్త్యతాం యజ్ఞో భవద్భిశ్చ మయా సహ.

ప్ర. అ. అయమ్ = ఈతడు, స్వశరీరేణ = తన శరీరముతో, స్వర్గ లోకమ్ = స్వర్గలోకమును గూర్చి, యథా = ఎట్లు, గమిష్యతి = వెళ్లగలడో, తథా=ఆ విధముగా, భవద్భిః=మీచేత, మయా సహ=నాతో కలిసి, యజ్ఞః = యజ్ఞము, ప్రవర్త్యతామ్ = చేయబడుగాక.

తా. ఈతడు శరీరముతో స్వర్గమును చేరుటకై నేను చేయు యజ్ఞము నందు మీరు సహాయపడవలెను. 3

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా సర్వ ఏవ మహర్షయః, 4
ఊచుః సమేత్య సహితా ధర్మజ్ఞా ధర్మసంహితమ్.

ప్ర. అ. ధర్మజ్ఞాః = ధర్మము తెలిసినవారును, సహితాః = అచట సమా వేశమైనవారును అగు, సర్వే ఏవ = సమస్తమైన, మహర్షయః = మహర్షులు, విశ్వామిత్రవచః = విశ్వామిత్రుని వాక్యమును, శ్రుత్వా = విని, సమేత్య = కలిసి, ధర్మసంహితమ్ = ధర్మయుక్తముగా, ఊచుః = పలికిరి.

తా. ధర్మజ్ఞులైన ఆ మహర్షు లందరును విశ్వామిత్రుని మాటలు విని, (తమలో తాము) ఒక్కుమ్మడిగా, ధర్మసంమతమైన మాట పలికిరి. 4

మూ. అయం కుశికదాయాదో మునిః పరమకోపనః, 5
యదాహ వచనం సమ్యగేతత్కార్యం న సంశయః,
అగ్నికల్పో హి భగవాన్ శాపం దాస్యతి రోషితః. 6

ప్ర. అ. కుశికదాయాదః = కుశికుని వంశమునందు పుట్టిన, పరమ కోపనః = ఎక్కువ కోపస్వభావము గల, అయమ్ = ఈ, మునిః = ముని, యత్ = ఏ, వచనమ్ = వచనమును, ఆహ = పలుకుచున్నాడో, ఏతత్ = ఇది, సమ్యక్ = బాగుగా, కార్యమ్ = చేయదగినది. న సంశయః = సంశయము లేదు. అగ్నికల్పః=అగ్నితో సమానుడైన, భగవాన్=పూజ్యుడైన ఇతడు, రోషితః= కోపగింపచేయబడినవాడై, శాపమ్ = శాపమును, దాస్యతి = ఇవ్వగలడు.

తా. ఈ కౌశికుడు చాల కోపస్వభావము కలవాడు. ఈతడు చెప్పిన విధ ముగ చేయవలెను. ఇతడు అగ్నివలె తీవ్రస్వభావుడు. కోపము కలిగించినచో శపించును. 6

మూ. తస్మాత్ప్రవర్త్యతాం యజ్ఞః సశరీరో యథా దివమ్,
గచ్ఛేదిక్ష్వాకుదాయాదో విశ్వామిత్రస్య తేజసా, 7
తథా ప్రవర్త్యతాం యజ్ఞః సర్వే సమధితిష్ఠత.

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, యజ్ఞః = యజ్ఞము, ప్రవర్త్యతామ్ = జరుపబడుగాక. ఇక్ష్వాకుదాయాదః = ఇక్ష్వాకువంశీయు డైన ఈ త్రిశంకువు, విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క, తేజసా = తేజస్సుచేత, సశరీరః = సశరీరుడై, యథా = ఎట్లు, దివమ్ = స్వర్గమును గూర్చి, గచ్ఛేత్ = వెళ్లునో, తథా = ఆవిధముగా, యజ్ఞః = యజ్ఞము, ప్రవర్త్యతామ్ = జరుపబడుగాక. సర్వే = అందరును, సమధితిష్ఠత = ప్రారంభింపుడు.

తా. ఈ త్రిశంకువు విశ్వామిత్రుని తపఃప్రభావముచే సశరీరముగ స్వర్గమునకు వెళ్లుటకై యజ్ఞము చేయుడు. అందరును ప్రారంభింపుడు. 7

మూ. ఏవముక్త్వా మహర్షయశ్చక్రుస్తాస్తాః క్రియాస్తదా, 8
యాజకశ్చ మహాతేజా విశ్వామిత్రోఽభవత్క్రతౌ.

ప్ర. అ. మహర్షయః = మహర్షులు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, తదా = అప్పుడు, తాస్తాః = ఆయా, క్రియాః = క్రియలను, చక్రుః = చేసిరి. క్రతౌ = ఆ యజ్ఞమునందు, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, యాజకః = యజ్ఞము చేయించు ప్రధానఋత్విక్కుగా, అభవత్ = ఆయెను.

తా. మహర్షు లీ విధముగ పలికి యజ్ఞమునకు కావలసిన ఆ యా పనులను చేసిరి. మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రుడు ఆ క్రతువులో యాజకుడుగా ఉండెను. 8

మూ. ఋత్విజశ్చానుపూర్వ్యేణ మన్త్రవన్మన్త్రకోవిదాః, 9
చక్రుః కర్మాణి సర్వాణి యథాకల్పం యథావిధి.

ప్ర. అ. మన్త్రకోవిదాః = మంత్రములందు ప్రవీణులైన, ఋత్విజశ్చ = ఋత్విక్కులు కూడ, మన్త్రవత్ = మంత్రసహితముగా, యథాకల్పమ్ = కల్పోక్త ప్రకారముగా, యథావిధి = యథాశాస్త్రముగా, సర్వాణి = సమస్త మైన, కర్మాణి = కర్మలను, ఆనుపూర్వ్యేణ = క్రమానుసారముగా, చక్రుః = చేసిరి.

తా. మంత్రము లెరిగిన ఋత్విక్కులు కల్పోక్తప్రకారమున, యథా విధిగా సర్వకర్మలును క్రమము తప్పక మంత్రపూర్వకముగా నిర్వహించిరి. 9

మూ. తతః కాలేన మహతా విశ్వామిత్రో మహాతపాః, 10
చకారావాహనం తత్ర భాగార్థం సర్వదేవతాః.

ప్ర. అ. తతః = పిమ్మట, మహాతపాః = గొప్ప తపస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, మహతా కాలేన = చాల కాలమునకు, తత్ర=అచట, సర్వదేవతాః = సర్వదేవతలను, భాగార్థమ్ = భాగములకొరకు, ఆవాహనం చకార=ఆవాహనము చేసెను.

తా. ఈ విధముగా చాల దినములు గడచిన పిమ్మట మహాతపఃశాలి యగు విశ్వామిత్రుడు సమస్తదేవతలను వారివారియజ్ఞ భాగములను స్వీకరించుటకై ఆహ్వానించెను. 10

మూ. నాభ్యాగమంస్తదాహూతా భాగార్థం సర్వదేవతాః, 11
తతః క్రోధసమావిష్టో విశ్వామిత్రో మహామునిః,
స్రువముద్యమ్య సక్రోధస్త్రిశఙ్కుమిదమబ్రవీత్. 12

ప్ర. అ. తదా = అప్పుడు, ఆహూతాః = పిలవబడిన, సర్వదేవతాః= సకలదేవతలును, భాగార్థమ్=భాగముల కొరకై, నాభ్యాగమన్=రాలేదు. తతః= పిమ్మట, క్రోధసమావిష్టః = క్రోధముతోకూడిన, విశ్వామిత్రః మహామునిః = విశ్వామిత్రమహాముని, స్రువమ్=స్రువమును, ఉద్యమ్య=ఎత్తి, సక్రోధః=క్రోధముతో కూడిన వాడై, త్రిశఙ్కుమ్ = త్రిశంకువును గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఈ విధముగ ఆహ్వానించినను తమ భాగములు గ్రహించుటకై దేవతలు రాకుండుట జూచి, విశ్వామిత్రమహాముని, కోపోద్దీపితుడై, స్రువ మనెడు హోమసాధనమును చేత ఎత్తి, త్రిశంకునితో ఇట్లనెను. 11, 12

మూ. పశ్య మే తపసో వీర్యం స్వార్జితస్య నరేశ్వర,
ఏష త్వాం సశరీరేణ నయామి స్వర్గమోజసా. 13
దుష్ప్రాపం సశరీరేణ దివం గచ్ఛ నరాధిప.

ప్ర. అ. నరేశ్వర=రాజా! స్వార్జితస్య=స్వయముగా సంపాదింపబడిన, మే=నాయొక్క, తపసః = తపస్సుయొక్క, వీర్యమ్ = వీర్యమును, పశ్య= చూడుము. ఏషః=ఈ నేను, ఓజసా=నా తేజస్సుచేత, త్వామ్=నిన్ను, సశరీరేణ=శరీరసహితముగా, స్వర్గమ్ = స్వర్గమును, నయామి = పొందించెదను. నరాధిప=రాజా! దుష్ప్రాపమ్=పొంద శక్యము కాని, దివమ్=స్వర్గమునుగూర్చి, సశరీరేణ=శరీరముతో, గచ్ఛ=వెళ్లుము.

తా. రాజా! నా తపఃప్రభావమును చూడుము. నా తపఃశక్తిచే నిన్ను సశరీరముగా స్వర్గమునకు పంపెదను. సశరీరుడవై ఇతరు లెవ్వరును వెళ్లజాలని స్వర్గమునకు వెళ్లుము. 13

మూ. స్వార్జితం కించిదప్యస్తి మయా హి తపసః ఫలమ్, 14
రాజన్ స్వతేజసా తస్య సశరీరో దివం వ్రజ.

ప్ర. అ. రాజన్=రాజా! మయా = నాచేత, స్వార్జితమ్=స్వయముగా సంపాదింపబడిన, తపసః ఫలమ్ = తపస్సుయొక్క ఫలము, కించిదపి=కొంచెమైనను, అస్తి హి=ఉన్నది కదా. తస్య=దానియొక్క, స్వతేజసా=తేజస్సుచేత, సశరీరః = శరీరముతో కూడినవాడవై, దివమ్ = స్వర్గమును గూర్చి, వ్రజ= వెళ్లుము.

తా. రాజా! నేను స్వయముగా సంపాదించిన తపఃఫలము కొంత ఉన్నది. దాని తేజస్సుచే, సశరీరుడవై స్వర్గమునకు వెళ్లుము. 14

మూ. ఉక్తవాక్యే మునౌ తస్మిన్ సశరీరో నరేశ్వరః, 15
దివం జగామ కాకుత్థ్స మునీనాం పశ్యతాం తదా.

ప్ర. అ. కాకుత్థ్స = రామా, తస్మిన్ = ఆ, మునౌ=ముని, ఉక్తవాక్యే= పలకబడిన వాక్యము కలవాడగుచుండగా, నరేశ్వరః = రాజు, సశరీరః = శరీరముతో కూడినవాడై, తదా = అప్పుడు, మునీనామ్=మునులు, పశ్యతామ్= చూచుచుండగా, దివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. విశ్వామిత్రు డీవిధముగా పలికిన వెంటనే ఆ రాజు, ఆ మును లందరును చూచుచుండగా, సశరీరుడై స్వర్గమునకు వెళ్లెను. 15

మూ. దేవలోకగతం దృష్ట్వా త్రిశఙ్కుం పాకశాసనః, 16
సహ సర్వైస్సురగణైరిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. దేవలోకగతమ్ = దేవలోకమునకు వచ్చిన, త్రిశఙ్కుమ్ = త్రిశంకువును, దృష్ట్వా = చూచి, సర్వైః = సమస్త మైన, సురగణైః సహ = దేవతాగణములతో కూడిన, పాకశాసనః = దేవేంద్రుడు, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. దేవతాగణములతోకూడిన దేవేంద్రుడు త్రిశంకువు స్వర్గములో ప్రవేశించుట చూచి ఇట్లనెను. 16

మూ. త్రిశఙ్కో గచ్ఛ భూయస్త్వం నాసి స్వర్గకృతాలయః, 17
గురుశాపహతో మూఢ పత భూమిమవాక్ఛిరాః.

ప్ర. అ. త్రిశఙ్కో = ఓ త్రిశంకూ ! స్వర్గకృతాలయః = స్వర్గనివాసివి, న అసి = కావు. త్వమ్ = నీవు, భూయః = మరల, గచ్ఛ = వెళ్లుము. గురుశాపహతః = గురుశాపముచే హతుడ వైన, మూఢ = మూడుడా ! అవాక్ఛిరాః = తలక్రిందుగా ఉన్నవాడవై, భూమిమ్ = భూమివైపు, పత = పడుము.

తా. ఓ త్రిశంకూ ! నీవు స్వర్గనివాసమునకు అర్హుడవు కావు. తిరిగి పొమ్ము. గురుశాపహతుడ వైన ఓ మూఢాత్మా ! తలక్రిందులుగా భూమిపై పడుము. 17

మూ. ఏవముక్తో మహేన్ద్రేణ త్రిశఙ్కురపతత్పునః, 18
విక్రోశమానస్త్రాహీతి విశ్వామిత్రం తపోధనమ్.

ప్ర. అ. మహేన్ద్రేణ = మహేంద్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, త్రిశఙ్కుః = త్రిశంకువు, త్రాహి ఇతి = రక్షింపుము అని, తపోధనమ్ = మహర్షి యైన, విశ్వామిత్రం = విశ్వామిత్రుని గూర్చి, విక్రోశమానః = అరచుచు, పునః = మరల, అపతత్ = పడెను.

తా. మహేంద్రుడు ఇట్లు పలుకగా, త్రిశంకువు, రక్షింపు మని విశ్వామిత్రునితో మొరపెట్టుచు మరల క్రిందికి పడెను. 18

మూ. తచ్ఛ్రుత్వా వచనం తస్య క్రోశమానస్య కౌశికః, 19
రోషమాహారయత్తీవ్రం తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్.

ప్ర. అ. కౌశికః = విశ్వామిత్రుడు, క్రోశమానస్య = అరచుచున్న, తస్య=అతనియొక్క, తత్=ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తీవ్రమ్=తీవ్రమైన, రోషమ్=కోపమును, ఆహారయత్ = తెప్పించుకొనెను. తిష్ఠ తిష్ఠ ఇతి=ఆగుము ఆగుము అని, అబ్రవీత్ చ=పలికెను.

తా. విశ్వామిత్రుడు, ఆ విధముగా అరచుచున్న అతని మాటలు విని, తీవ్రమైన కోపముతో ఆగుము, ఆగుము అని పలికెను. 19

మూ. ఋషిమధ్యే స తేజస్వీ ప్రజాపతిరివాపరః, 20
సృజన్ దక్షిణమార్గస్థాన్ సప్తర్షీనపరాన్ పునః,
నక్షత్రమాలామపరామసృజత్క్రోధమూర్ఛితః, 21
దక్షిణాం దిశమాస్థాయ మునిమధ్యే మహాయశాః.

ప్ర. అ. ఋషిమధ్యే=ఋషులమధ్యమునందున్న, సః=ఆ, తేజస్వీ=తేజశ్శాలియైన విశ్వామిత్రుడు, అపరః=రెండవ, ప్రజాపతిః ఇవ = బ్రహ్మవలె, దక్షిణమార్గస్థాన్=దక్షిణ మార్గమునందున్న, అపరాన్=వేరైన, సప్తర్షీన్=సప్తర్షులను, సృజన్=సృజించుచు, మునిమధ్యే=మునుల మధ్యయందు, క్రోధమూర్ఛితః = కోపముచే వ్యాపింపబడినవాడై, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును, ఆస్థాయ= ఆశ్రయించి, మహాయశాః=గొప్ప కీర్తి గల అతడు, అపరామ్ = మరియొక, నక్షత్రమాలామ్=నక్షత్రపంక్తిని, అసృజత్ = సృజించెను.

తా. ఋషుల మధ్య నున్న ఆ విశ్వామిత్రుడు కోపోద్దీపితుడై, రెండవ బ్రహ్మ వలె, దక్షిణ దిక్కునందు, ఇతరులైన సప్తర్షులను, మరియొక నక్షత్రమాలను సృజించెను. 20, 21

మూ. సృష్ట్వా నక్షత్రవంశం చ క్రోధేన కలుషీకృతః, 22
అన్యమిన్ద్రం కరిష్యామి లోకో వా స్యాదనిన్ద్రకః,
దైవతాన్యపి స క్రోధాత్స్రష్టుం సముపచక్రమే. 23

ప్ర. అ. నక్షత్రవంశం చ=నక్షత్రవంశమును కూడ, సృష్ట్వా=సృజించి, క్రోధేన=క్రోధముచేత, కలుషీకృతః=కలుషముగా చేయబడినవాడై, అన్యమ్=మరియొక, ఇన్ద్రమ్=ఇంద్రుని, కరిష్యామి = చేసెదను; లోకః = లోకము, అనిన్ద్రకః వా=ఇంద్రుడు లేని దైనను, స్యాత్ = అగుగాక, (అని పలుకుచు), సః = ఆతడు, దైవతాన్యపి = దేవతలను కూడ, క్రోధాత్ = కోపమువలన, స్రష్టుమ్=సృజించుటకు, సముపచక్రమే=ఉపక్రమించెను.

తా. ఆ విశ్వామిత్రుడు క్రోధముతో నక్షత్రవంశమును కూడ సృజించి, "మరొక ఇంద్రు నైనను సృజించెదను; లేదా లోకములో ఇంద్రు డైన లేకుండవలెను" అని పలుకుచు, దేవతాసృష్టి కూడ చేయ ప్రారంభించెను. 22, 23

మూ. తతః పరమసంభ్రాన్తాస్సర్షిసఙ్ఘాస్సురాసురాః,
విశ్వామిత్రం మహాత్మానమూచుస్సానునయం వచః. 24

ప్ర. అ. తతః=పిమ్మట, పరమసంభ్రాన్తాః = మిక్కిలి భయపడిన, సర్షిసఙ్ఘాః = ఋషిసంఘములతో కూడిన, సురాసురాః = దేవతలును అసురులును, మహాత్మానమ్ = మహాత్ము డైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, సానునయమ్=అనునయముతో కూడినట్లుగా, వచః=వాక్కును, ఊచుః=పలికిరి.

తా. పిమ్మట మిక్కిలి భయపడిన దేవాసురులును, ఋషులును మహాత్ము డైన విశ్వామిత్రుని అనునయించుచు ఇట్లు పలికిరి. 24

మూ. అయం రాజా మహాభాగ గురుశాపపరిక్షతః,
సశరీరో దివం యాతుం నార్హత్యేవ తపోధన. 25

ప్ర. అ. తపోధన=ఓ మహర్షీ! మహాభాగ=ఓ పూజ్యుడా! గురుశాపపరిక్షతః=గురుశాపముచేత కొట్టబడిన, అయమ్=ఈ, రాజా=రాజు, సశరీరః=

శరీరసహితుడై, దివమ్ = స్వర్గమును గూర్చి, యాతుమ్=వెళ్లుటకు, నార్హత్యేవ= అర్హుడు కానే కాడు.

తా. మహాప్రభావశాలి వగు ఓ తపోధనా ! గురుశాపముచేత దెబ్బ తిన్న ఈ రాజు సశరీరముగా స్వర్గమునకు వెళ్లుటకు అనర్హుడు. 25

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా దేవానాం మునిపుఙ్గవః,
అబ్రవీత్సుమహద్వాక్యం కౌశికః సర్వదేవతాః. 26

ప్ర. అ. మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడైన, కౌశికః = విశ్వామిత్రుడు, తేషామ్=ఆ, దేవానామ్=దేవతలయొక్క, తత్=ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, సర్వదేవతాః=ఆ సకలదేవతలను గూర్చి, సుమహత్ = చాల గొప్పదైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మునిశ్రేష్ఠుడైన ఆ విశ్వామిత్రుడు దేవతల మాటలు విని వారితో ప్రశంసనీయ మగు ఒక వచనము పలికెను. 26

మూ. సశరీరస్య భద్రం వస్త్రిశఙ్కోరస్య భూపతేః,
ఆరోహణం ప్రతిజ్ఞాయ నానృతం కర్తుముత్సహే. 27

ప్ర. అ. వః=మీకు, భద్రమ్=మంగళ మగుగాక. సశరీరస్య = శరీరముతో కూడిన, అస్య=ఈ, త్రిశఙ్కోః భూపతేః = త్రిశంకు మహారాజునకు, ఆరోహణమ్ = స్వర్గారోహణమును, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, అనృతమ్ = అసత్యమును, కర్తుమ్=చేయుటకు, న ఉత్సహే=ఇష్టపడను.

తా. దేవతలారా ! మీకు క్షేమ మగు గాక. ఈ త్రిశంకువును సశరీరముగా స్వర్గమునకు పంపెద నని ప్రతిజ్ఞ చేసి ఆ ప్రతిజ్ఞను అసత్యము చేయ నంగీకరింపను. 27

మూ. స్వర్గోఽస్తు సశరీరస్య త్రిశఙ్కోరస్య శాశ్వతః,
నక్షత్రాణి చ సర్వాణి మామకాని ధ్రువాణ్యథ. 28

యావల్లోకా ధరిష్యన్తి తిష్ఠన్త్వేతాని సర్వశః,
మత్కృతాని సురాః సర్వే తదనుజ్ఞాతుమర్హథ. 29

ప్ర. అ. అస్య=ఈ, త్రిశఙ్కోః=త్రిశంకువునకు, సశరీరస్య=శరీరముతో కూడి యుండగనే, శాశ్వతః=శాశ్వత మైన, స్వర్గః=స్వర్గము, అస్తు=అగుగాక. అథ=మరియు, మత్కృతాని=నాచేత సృజింపబడిన, ఏతాని=ఈ, సర్వాణి=సమస్త మైన, నక్షత్రాణి=నక్షత్రములు, మామకాని=నావిగా, సర్వశః=అంతటను, లోకాః=లోకములు, యావత్=ఎంతవరకు, ధరిష్యన్తి = నిలచునో (అంతవరకు), ధ్రువాణి=స్థిరములై, తిష్ఠన్తు=ఉండుగాక. సురాః = ఓ దేవతలారా ! సర్వే=మీరందరును, తత్=దానిని, అనుజ్ఞాతుమ్ = అనుమతించుటకు, అర్హథ=తగియున్నారు.

తా. ఈ త్రిశంకువు సశరీరుడై, శాశ్వతముగా స్వర్గమునందు నివసించవలెను. నేను సృజించిన నక్షత్రము లన్నియు ఈ లోకము లున్నంత వరకును స్థిరముగ ఉండవలెను. ఓ దేవతలారా ! మీరు నాకు దీనిని అనుమతింపుడు. 28, 29

మూ. ఏవముక్తాః సురాః సర్వే ప్రత్యూచుర్మునిపుఙ్గవమ్,
ఏవం భవతు భద్రం తే తిష్ఠన్త్వేతాని సర్వశః. 30

గగనే తాన్యనేకాని వైశ్వానరపథాద్బహిః,
నక్షత్రాణి మునిశ్రేష్ఠ తేషు జ్యోతిష్షు జాజ్వలన్, 31
అవాక్శిరాస్త్రిశఙ్కుశ్చ తిష్ఠత్వమరసన్నిభః.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, ఉక్తాః=పలకబడిన, సర్వే = సమస్తమైన, సురాః=దేవతలు, మునిపుఙ్గవమ్=మునిశ్రేష్ఠుని గూర్చి, ప్రత్యూచుః=తిరిగి పలికిరి. ఏవమ్=ఇట్లు, భవతు=అగుగాక. మునిశ్రేష్ఠ=ఓ మునిశ్రేష్ఠుడా ! తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. ఏతాని=ఈ, తాని=ప్రసిద్ధమైన, అనేకాని=అనేకమైన, నక్షత్రాణి = నక్షత్రములు, వైశ్వానరపథాత్ = జ్యోతిశ్చక్రము కంటె, బహిః=వెలుపల, గగనే=ఆకాశమునందు, సర్వశః=అన్ని వైపుల, తిష్ఠన్తు=ఉండుగాక. తేషు=ఆ, జ్యోతిష్షు=నక్షత్రములమధ్య, జాజ్వలన్=ప్రకాశించుచు, త్రిశఙ్కుశ్చ = త్రిశంకువు కూడ, అమరసన్నిభః = దేవతలతో సమానుడై, అవాక్శిరాః = తలక్రిందుగ తిష్ఠతు=ఉండుగాక

తా. ఆ దేవతలు మునిపుంగవునితో ఇట్లని ఓ మునిశ్రేష్ఠా! నీవు చెప్పి
ట్లే అగును. నీకు భద్ర మగుగాక. నీవు సృష్టించిన నక్షత్రము లన్నియు
్యోతిశ్చక్రమునకు వెలుపల నుండుగాక. త్రిశంకువు ఆ నక్షత్రముల
డుమ ప్రకాశించుచు, దేవతాతుల్యుడై, తలక్రిందుగ నివసించుగాక. 30, 31

మూ. అనుయాస్యన్తి చైతాని జ్యోతింషి నృపసత్తమమ్, 32
కృతార్థం కీర్తిమన్తం చ స్వర్గలోకగతం యథా.

ప్ర. అ. ఏతాని=ఈ, జ్యోతింషి చ = నక్షత్రములును, కృతార్థమ్=
రవేరిన వనులు గలవాడును, కీర్తిమన్తం చ = కీర్తి కలవాడును అయిన,
ృపసత్తమమ్=రాజశ్రేష్ఠుని, స్వర్గలోకగతం యథా=స్వర్గలోకములో ఉన్న
ానిని వలె, అనుయాస్యన్తి=అనుసరించగలవు.

తా. చరితార్థుడై కీర్తిమంతు డైన ఈ రాజశ్రేష్ఠుని, ఈ నక్షత్రము
న్నియు స్వర్గములో ఉన్నవానిని అనుసరించినట్లు అనుసరింపగలవు. 32

మూ. విశ్వామిత్రస్తు ధర్మాత్మా సర్వదేవైరభిష్టుతః, 33
ఋషిభిశ్చ మహాతేజా బాఢమిత్యాహ దేవతాః.

ప్ర. అ. సర్వదేవైః=సమస్త మైన దేవతలచేతను, ఋషిభిశ్చ=ఋషుల
తను, అభిష్టుతః=స్తుతింపబడిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, ధర్మాత్మా=
ర్మాత్ము డైన, విశ్వామిత్రస్తు = విశ్వామిత్రు డై తే, దేవతాః = దేవతలను
ుర్చి, బాఢమ్ ఇత్యేవ=సరే అని, ఆహ=పలికెను.

తా. ఈ విధముగా సకలదేవతలును, ఋషులును స్తుతింపగా, ధర్మాత్ము
ను, తేజోవంతుడును అగు విశ్వామిత్రుడు 'సరే' అని అంగీకరించెను. 33

మూ. తతో దేవా మహాత్మానో మునయశ్చ తపోధనాః,
జగ్ముర్యథాగతం సర్వే యజ్ఞస్యాన్తే నరోత్తమ. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షష్టితమః సర్గః.

ప్ర. అ. నరోత్తమ=నరులలో ఉత్తముడవైన రామా! తతః=పిమ్మట, యజ్ఞస్య=యజ్ఞముయొక్క, అన్తే=అంతమునందు, మహాత్మానః=మహాత్ములైన, దేవాః=దేవతలును, తపోధనాః = తపస్సే ధనముగా గల, మునయశ్చ = మునులును, సర్వే=అందరును, యథాగతమ్=వచ్చినట్లుగనే, జగ్ముః = వెళ్లిరి.

తా. రామా! యజ్ఞము పూర్తియైన పిమ్మట మహాత్ములైన దేవతలును, తపోధనులైన మునులును తమ తమ స్థానములకు వెళ్లిపోయిరి. 34

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో అరువదవ సర్గ సమాప్తము.

## అథ ఏకషష్టితమః సర్గః

మూ. విశ్వామిత్రో మహాత్మాథ ప్రస్థితాన్ ప్రేక్ష్య తాన్ ఋషీన్,
అబ్రవీన్నరశార్దూల సర్వాంస్తాన్వనవాసినః. 1

ప్ర. అ. నరశార్దూల=ఓ నరశ్రేష్ఠుడా! అథ=పిమ్మట, మహాత్మా = మహాత్ము డైన, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, ప్రస్థితాన్ = ప్రయాణ మైన, వనవాసినః = వనములందు నివసించు, తాన్=ఆ, సర్వాన్ = సమస్త మైన, ఋషీన్=ఋషులను, ప్రేక్ష్య=చూచి, అబ్రవీత్=పలికెను

తా. రామా! మహాత్ము డైన విశ్వామిత్రుడు, ప్రయాణ మైన ఆ ఋషు లందరిని చూచి ఇట్లు పలికెను. 1

మూ. మహాన్విఘ్నః ప్రవృత్తోఽయం దక్షిణామాస్థితో దిశమ్,
దేశమన్యాం ప్రపత్స్యామస్తత్ర తప్స్యామహే తపః. 2

ప్ర. అ. దక్షిణాం దిశమ్=దక్షిణ దిక్కును, ఆస్థితః = అవలంబించి నదై, అయమ్=ఈ, మహాన్=గొప్ప, విఘ్నః=విఘ్నము, ప్రవృత్తః = ఏర్ప డినది. అన్యామ్=మరియొక, దిశమ్=దిక్కును, ప్రపత్స్యామః = పొందెదము. తత్ర=అచట, తపః=తపస్సు, తప్స్యామహే=తపించెదము.

తా. ఈదక్షిణపు దిక్కున గొప్ప విఘ్నము సంభవించినది. మరొక దిక్కునకు వెళ్లి అచట తపస్సు చేసెదము. 2

మూ. పశ్చిమాయాం విశాలాయాం పుష్కరేషు మహాత్మనః,
సుఖం తపశ్చరిష్యామః పరం తద్ధి తపోవనమ్. 3

ప్ర. అ. మహాత్మనః=ఓ మహాత్ములారా! విశాలాయామ్=విశాల మైన, పశ్చిమాయామ్=పశ్చిమదిక్కునందు, పుష్కరేషు = పుష్కర క్షేత్రమునందు, సుఖమ్=సుఖముగా, తపః=తపస్సు, చరిష్యామః=చేసెదము. తత్=అది, పరమ్=శ్రేష్ఠ మైన, తపోవనం హి=తపోవనము కదా?

తా. ఓ మహాత్ములారా ! విశాల మైన పశ్చిమదిక్కునకు పోయి, అచట పుష్కరక్షేత్రమునందు తపస్సు చేయుదము. అది ఉత్తమ మైన తపోవనము. 3

మూ. ఏవముక్త్వా మహాతేజాః పుష్కరేషు మహామునిః,
తప ఉగ్రం దురాధర్షం తేపే మూలఫలాశనః. 4

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహామునిః=ఆ మహాముని, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పుష్కరేషు=పుష్కరమునందు, మూలఫలాశనః=దుంపలను ఫలములను మాత్రము భుజించుచు, దురాధర్షమ్=ఎదిరింప శక్యము కాని, ఉగ్రమ్=ఉగ్ర మైన, తపః=తపస్సును, తేపే=చేసెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ విశ్వామిత్రుడు ఇట్లు పలికి, పుష్కర క్షేత్రము చేరి, అచట, మూలఫలములను మాత్రమే భుజించుచు ఉగ్ర మైన తపస్సు చేసెను. 4

మూ. ఏతస్మిన్నేవ కాలే తు అయోధ్యాధిపతిర్నృపః,
అమ్బరీష ఇతి ఖ్యాతో యష్టుం సముపచక్రమే. 5

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, కాలే ఏవ = కాలమునందే, అమ్బరీషః ఇతి = అంబరీషుడు అని, ఖ్యాతః = ప్రసిద్ధు డైన, అయోధ్యాధిపతిః = అయోధ్యాప్రభు వైన, నృపః = రాజు, యష్టుమ్ = యాగముచేయుటకు, సముపచక్రమే=ప్రారంభించెను.

తా. ఈ కాలమునందే అయోధ్యాధిపతి యైన అంబరీషు డను రాజు యాగము చేయ ప్రారంభించెను. 5

మూ. తస్య వై యజమానస్య పశుమిన్ద్రో జహార హ,
ప్రణష్టే తు పశౌ విప్రో రాజానమిదమబ్రవీత్. 6

ప్ర. అ. యజమానస్య = యాగము చేయుచున్న, తస్య=ఆతనియొక్క, పశుమ్ = పశువును, ఇన్ద్రః = ఇంద్రుడు, జహార హ = అపహరించెను. పశౌ = పశువు, ప్రణష్టే సతి = కనబడకపోగా, విప్రః = పురోహితుడు, రాజానమ్ = రాజును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆతడు యాగము చేయుచుండగా ఇంద్రుడు పశువును హరించెను. యజ్ఞపశువు కనబడకపోయినతోడనే పురోహితుడు రాజుతో ఇట్లు పలికెను. 6

మూ. పశురద్య హృతో రాజన్ ప్రణష్టస్తవ దుర్నయాత్,
అరక్షితారం రాజానం ఘ్నన్తి దోషా నరేశ్వర. 7

ప్ర. అ. రాజన్ = రాజా, అద్య = ఇపుడు, పశుః = పశువు, హృతః = హరింపబడినది. తవ = నీ యొక్క, దుర్నయాత్ = అధర్మమువలన, ప్రణష్టః = కనబడకుండపోయినది. నరేశ్వర = రాజా! అరక్షితారమ్ = రక్షించని, రాజానమ్ = రాజును, దోషాః = దోషములు, ఘ్నన్తి = చంపును.

తా. రాజా! పశువు నెవరో హరించినారు. నీ అధర్మముచే ఇది పోయినది. పశువును రక్షింపజాలని రాజును దోషములు చంపివేయును. 7

మూ. ప్రాయశ్చిత్తం మహద్ధ్యేతన్నరం వా పురుషర్షభ,
ఆనయస్వ పశుం శీఘ్రం యావత్కర్మ ప్రవర్తతే. 8

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! ఏతత్ = ఇది, మహత్ = గొప్పదైన, ప్రాయశ్చిత్తమ్ = ప్రాయశ్చిత్తము. నరం వా = మనుష్యు నైనను, పశుమ్ = పశువునుగా, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆనయస్వ = తీసికొనిరమ్ము. కర్మ = కర్మ, యావత్ ప్రవర్తతే = జరుగగలదు.

తా. రాజా! దీనికి చాల పెద్ద ప్రాయశ్చిత్తము చేయవలసి యున్నది. పశువు లభించనిచో మనుష్యు నైనను పశువుగా తీసికొని రమ్ము. అపుడు యజ్ఞము జరుగగలదు. 8

మూ. ఉపాధ్యాయవచః శ్రుత్వా స రాజా పురుషర్షభ,
అన్వియేష మహాబుద్ధిః పశుం గోభిః సహస్రశః. 9

ప్ర. అ. పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా! మహాబుద్ధిః = గొప్ప బుద్ధిగల, సః = ఆ, రాజా = రాజు, ఉపాధ్యాయవచః = ఉపాధ్యాయుని వాక్యమును, శ్రుత్వా = విని, సహస్రశః = వేలకొలది, గోభిః = గోవులచే, పశుమ్ = పశువును, అన్వియేష = అన్వేషించెను.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ రామా! మహాబుద్ధిశాలి యగు ఆ రాజు ఉపాధ్యాయుని మాటలు విని, వేలకొలది ఆవుల నిచ్చి నరపశువును సంపాదించుటకు ప్రయత్నించెను. 9

మూ. దేశాన్ జనపదాంస్తాఁస్తాన్నగరాణి వనాని చ,
ఆశ్రమాణి చ పుణ్యాని మార్గమాణో మహీపతిః. 10

స పుత్రసహితం తాత సభార్యం రఘునన్దన,
భృగుతుఙ్గే సమాసీనమృచీకం సందదర్శ హ. 11

ప్ర. అ. తాత=నాయనా! రఘునన్దన=రామా! సః=ఆ, మహీపతిః=రాజు, తాంస్తాన్=ఆయా, దేశాన్ = దేశములను, జనపదాన్=పల్లెలను, నగరాణి చ = నగరములను, వనాని చ = వనములను, పుణ్యాని = పుణ్యమైన, ఆశ్రమాణి చ = ఆశ్రమములను, మార్గమాణః = వెదకుచు, భృగుతుఙ్గే = భృగుతుంగపర్వతమునందు, పుత్రసహితమ్=పుత్రులతో కూడినవాడును, సభార్యమ్=భార్యాసమేతుడును, సమాసీనమ్ = కూర్చుని ఉన్న, ఋచీకమ్=ఋచీకమహర్షిని, సందదర్శ హ = చూచెను.

తా. రామా! ఆ రాజు ఆయా దేశములందును, పల్లెలందును, నగరములందును, పవిత్ర మైన ఆశ్రమములందును వెదకుచు భృంగతుంగపర్వతముపై భార్యాపుత్రసమేతుడై సుఖముగా కూర్చొని ఉన్న ఋచీకమహర్షిని చూచెను. 10, 11

మూ. తమువాచ మహాతేజాః ప్రణమ్యాభిప్రసాద్య చ,
బ్రహ్మర్షిం తపసా దీప్తం రాజర్షిరమితప్రభః, 12
పృష్ట్వా సర్వత్ర కుశలమృచీకం తమిదం వచః.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడును, అమితప్రభః = అనంత మైన కాంతి కలవాడును అగు ఆ రాజు, తపసా=తపస్సుతో, దీప్తమ్=ప్రజ్వరిల్లుచున్న, తమ్ = ఆ, బ్రహ్మర్షిమ్ = బ్రహ్మర్షిని, ప్రణమ్య = నమస్కరించి, అభిప్రసాద్య చ = అనుగ్రహింపచేసికొని, సర్వత్ర = అన్నింటియందును,

కుశలమ్ = క్షేమమును, పృష్ట్వా=అడిగి, తం ఋచీకమ్ = ఆ ఋచీకుని గూర్చి, ఇదమ్ = ఈ, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. మహాతేజశ్శాలి యగు ఆ రాజు తపస్సుతో ప్రకాశించుచున్న ఆ ఋచీకుని నమస్కరించి, అనుగ్రహింపచేసికొని, అన్నింటను కుశలవార్త లడిగి, ఇట్లు పలికెను. 12

మూ. గవాం శతసహస్రేణ విక్రీణీషే సుతం యది, 13
పశోరర్థే మహాభాగ కృతకృత్యోఽస్మి భార్గవ.

ప్ర. అ. మహాభాగ = గొప్ప భాగ్యము గల, భార్గవ = భృగువంశ సంజాతుడ వైన ఓ ఋచీకమునీ ! గవామ్ = గోవులయొక్క, శతసహస్రేణ = నూరువేలచేత, సుతమ్ = నీ కుమారుని, పశోః అర్థే = పశువుకొరకై, విక్రీణీషే యది = అమ్మినట్లైతే, కృతకృత్యః = కృతకృత్యుడను, అస్మి=అగుదును.

తా. మహామునీ ! నీవు లక్ష ఆవులను తీసికొని నీ కుమారుని యజ్ఞపశువుగా అమ్మినచో నేను చరితార్థుడ నగుదును. 13

మూ. సర్వే పరిసృతా దేశా యజ్ఞీయం న లభే పశుమ్,
దాతుమర్హసి మూల్యేన సుతమేకమితో మమ. 14

ప్ర. అ. సర్వే = సమస్త మైన, దేశాః = దేశములు, పరిసృతాః = సంచరించబడినవి. యజ్ఞీయమ్ = యజ్ఞసంబంధ మైన, పశుమ్=పశువును, న లభే= పొందజాలకున్నాను. ఇతః = వీరిలోనుండి, ఏకమ్ = ఒక, సుతమ్ = కుమారుని, మూల్యేన = మూల్యముచేత, మమ = నాకు, దాతుమ్=ఇచ్చుటకు, అర్హసి= తగి యున్నావు.

తా. అన్ని దేశములు తిరిగితిని కాని యజ్ఞపశువు లభించలేదు. నీ కుమారులలో నుండి ఒకనిని నాకు మూల్యమున కిమ్ము. 14

మూ. ఏవముక్తో మహాతేజా ఋచీకస్త్వబ్రవీద్వచః, 15
నాహం జ్యేష్ఠం నరశ్రేష్ఠ విక్రీణీయాం కథం చన.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ఋచీకస్తు = ఋచీకమహర్షి యైతే, వచః=వచనమును, అబ్రవీత్= పలికెను. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! అహమ్ = నేను, కథం చన = ఎట్లైనను, జ్యేష్ఠమ్= పెద్దవానిని, న విక్రీణీయామ్=అమ్మను.

తా. రాజు మాటలు విని ఋచీకుడు— "నే నే విధమున నైనను జ్యేష్ఠ పుత్రుని అమ్మజాలను" అని పలికెను. 15

మూ. ఋచీకస్య వచః శ్రుత్వా తేషాం మాతా మహాత్మనామ్,
ఉవాచ నరశార్దూలమమ్బరీషం తపస్వినీ. 16

ప్ర. అ. ఋచీకస్య=ఋచీకునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా= విని, మహాత్మనామ్=మహాత్ములైన, తేషామ్=వారియొక్క, మాతా=తల్లియైన, తపస్వినీ=తాపసి, నరశార్దూలమ్ = నరులలో శ్రేష్ఠుడైన, అమ్బరీషమ్=అంబరీషుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ఆ మహాత్ముల తల్లి యైన తపోధనురాలు ఋచీకుని మాటలు విని అంబరీషునితో ఇట్లనెను. 16

మూ. అవిక్రేయం సుతం జ్యేష్ఠం భగవానాహ భార్గవః. 17
మమాపి దయితం విద్ధి కనిష్ఠం శునకం నృప,
తస్మాత్కనీయసం పుత్రం న దాస్యే తవ పార్థివ. 18

ప్ర. అ. భగవాన్=పూజ్యుడైన, భార్గవః=ఋచీకమహాముని, జ్యేష్ఠమ్= జ్యేష్ఠుడైన, సుతమ్=కుమారుని, అవిక్రేయమ్=అమ్మకూడనివానినిగా, ఆహ= చెప్పుచున్నాడు, నృప=రాజా, శునకమ్=శునకుడనే, కనిష్ఠమ్=చిన్నపిల్లవానిని, మమ=నాకు. దయితమ్=ఇష్టునిగా, విద్ధి = తెలుసుకొనుము. పార్థివ=రాజా ! తస్మాత్=ఆ కారణమువలన, కనీయసం పుత్రమ్ = చిన్న కుమారుని, తవ= నీకు, న దాస్యే=ఇవ్వను.

తా. ఋచీకమహాముని పెద్దకుమారుని అమ్మ నని చెప్పుచున్నాడు. రాజా ! చిన్న కుమారు డైన శునకుడు నాకు ఇష్టుడు. అందుచేత ఆతనిని నీకు ఇవ్వను. 17, 18

మూ. ప్రాయేణ హి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః,
మాతౄణాం తు కనీయాంస స్తస్మా ద్రక్షే కనీయసమ్. 19

ప్ర. అ. నరశ్రేష్ఠ = ఓ నరశ్రేష్ఠుడా ! ప్రాయేణ = సాధారణముగా, జ్యేష్ఠాః = పెద్దవాళ్లు, పితృషు = తండ్రులయందు, వల్లభాః = ప్రియులు మాతౄణాం తు = తల్లులకైతే, కనీయాంసః = చిన్నవాళ్లు ప్రియులు. తస్మాత్ = ఆ కారణము వలన. కనీయసమ్ = చిన్నవానిని, రక్షే = రక్షించెదను.

తా. రాజా ! సాధారణముగా జ్యేష్ఠుడు తండ్రికి ఇష్టుడు కాగా చిన్నవాడు తల్లికి ఇష్టు డగును. అందుచేత చిన్నవానిని రక్షించుకొందును. 19

మూ. ఉక్తవాక్యే మునౌ తస్మిన్ మునిపత్న్యాం తథైవ చ,
శునశ్శేఫస్స్వయం రామ మధ్యమో వాక్యమబ్రవీత్. 20

ప్ర. రామ = రామా ! తస్మిన్ = ఆ, మునౌ = ముని, ఉక్తవాక్యే = పలకబడిన వాక్యము కలవా డగుచుండగా, తథైవ చ = అట్లే, మునిపత్న్యామ్ = మునిపత్ని పలకబడిన వాక్యముకలదగుచుండగా, మధ్యమః = మధ్యము డైన, శునఃశేఫః = శునశ్శేపుడు, స్వయమ్ = స్వయముగా, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మునియు, మునిపత్నియు పలికిన మాటలు విని మధ్యము డైన శునశ్శేపుడు స్వయముగ ఇట్లు పలికెను. 20

మూ. పితా జ్యేష్ఠమవిక్రేయం మాతా చాహ కనీయసమ్,
విక్రీతం మధ్యమం మన్యే రాజన్ పుత్రం నయస్వ మామ్. 21

ప్ర. అ. రాజన్ = రాజా ! పితా = తండ్రి, జ్యేష్ఠమ్ = జ్యేష్ఠకుమారుని, అవిక్రేయమ్ = అమ్మ శక్యము కాని వానినిగా, ఆహ = చెప్పుచున్నాడు. మాతా చ = తల్లియు, కనీయసమ్ = చిన్న వానిని అమ్మ వీలు కాని వానినిగా చెప్పుచున్నది. మధ్యమం పుత్రమ్ = మధ్యమ పుత్రుడ నైన నన్ను, విక్రీతమ్ = అమ్మబడిన వానినిగా, మన్యే = తలచుచున్నాను. మామ్ = నన్ను, నయస్వ = తీసికొని వెళ్లుము.

తా. రాజా! జ్యేష్ఠకుమారుని అమ్మజాల నని తండ్రి చెప్పుచున్నాడు. చిన్నవానిని అమ్మజాల నని తల్లి చెప్పుచున్నది. దీనిని బట్టి మధ్యముడ నైన నన్ను అమ్ముచున్నా రని అనుకొనుచున్నాను. అందుచే నన్ను తీసికొని పొమ్ము. 21

మూ. గవాం శతసహస్రేణ శునఃశేఫం నరేశ్వరః,
గృహీత్వా పరమప్రీతో జగామ రఘునన్దన. 22

ప్ర. అ. రఘునన్దన = రామా! నరేశ్వరః = రాజు, గవామ్ = గోవుల యొక్క, శతసహస్రేణ = నూరువేలచేత, శునఃశేఫమ్ = శునఃశేపుని, గృహీత్వా = గ్రహించి, పరమప్రీతః = మిక్కిలి సంతసించినవాడై, జగామ = వెళ్లెను.

తా. రామా! ఆ రాజు లక్ష గోవులతో ఆ శునఃశేపుని కొని ఆనందముతో వెళ్లెను. 22

మూ. అమ్బరీషస్తు రాజర్షి రథమారోప్య సత్వరః,
శునఃశేఫం మహాతేజా జగామాశు మహాయశాః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. మహాతేజాః = గొప్పతేజస్సు గల, మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజర్షిః = రాజర్షి యైన, అమ్బరీషస్తు = అంబరీషుడైతే, సత్వరః = తొందరతో కూడినవాడై, శునఃశేఫమ్ = శునఃశేపుని, రథమ్ ఆరోప్య = రథ మెక్కించి, ఆశు = శీఘ్రముగా, జగామ = వెళ్లెను.

తా. గొప్ప తేజోయశస్సులు గల రాజర్షి యైన ఆ అంబరీషుడు శునఃశేపుని శీఘ్రముగా రథముపై కూర్చుండబెట్టుకొని వెళ్లెను. 23

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
అరువది యొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విషష్టితమః సర్గః

మూ. శునఃశేఫం నరశ్రేష్ఠ గృహీత్వా తు మహాయశాః,
వ్యశ్రామ్యత్పుష్కరే రాజా మధ్యాహ్నే రఘునన్దన. 1

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడ వైన, రఘునన్దన = రామా! మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజా = ఆ రాజు, శునఃశేఫమ్ = శునశ్శేపుని, గృహీత్వా = గ్రహించి, మధ్యాహ్నే = మధ్యాహ్నమునందు, పుష్కరే=పుష్కరమునందు, వ్యశ్రామ్యత్ = విశ్రమించెను.

తా. రామా! ఆ రాజు శునఃశేపుని తీసికొని వెళ్లుచు, మధ్యాహ్నసమయమునందు పుష్కరక్షేత్రమున విశ్రాంతి తీసికొనెను. 1

మూ. తస్య విశ్రమమాణస్య శునఃశేఫో మహాయశాః,
పుష్కరక్షేత్రమాగమ్య విశ్వామిత్రం దదర్శ హ, 2
తప్యన్తమృషిభిస్సార్ధం మాతులం పరమాతురః.

ప్ర. అ. తస్య = ఆతడు, విశ్రమమాణస్య = విశ్రాంతి తీసికొనుచుండగా, మహాయశాః=గొప్ప కీర్తి గల, శునఃశేఫః=శునఃశేపుడు, పరమాతురః=మిక్కిలి బాధపడుచున్నవాడై, పుష్కరక్షేత్రమ్ = పుష్కరక్షేత్రమును గూర్చి, ఆగమ్య= వచ్చి, ఋషిభిః సార్ధమ్ = ఋషులతో కూడ, తప్యన్తమ్=తపస్సు చేయుచున్న, మాతులమ్ = తన మేనమామ యైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, దదర్శ హ = చూచెను.

తా. ఆ రాజు విశ్రాంతి తీసికొనుచున్న సమయమున మహాయశస్వి యగు ఆ శునఃశేపుడు మనస్సులో చాల బాధపడుచు, ఆ పుష్కరక్షేత్రమునందు ఇతరఋషులతో కలిసి తపస్సు చేసుకొనుచున్న మేనమామ యగు విశ్వామిత్రుని దర్శనము చేసెను. 2

మూ. వివర్ణవదనో దీనస్తృష్ణయా చ శ్రమేణ చ, 3
పపాతాఙ్కే మునేరాశు వాక్యం చేదమువాచ హ.

ప్ర. అ. తృష్ణయా చ = దప్పికచేతను, శ్రమేణ చ = శ్రమచేతను, వివర్ణవదనః = రంగు మారిన ముఖముకలవాడై, దీనః = దీనుడై, ఆశు = శీఘ్రముగా, మునేః = మునియొక్క, అఙ్కే = ఒడిలో, పపాత = పడెను. ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. దప్పికచేతను, అలనటచేతను ఎండిపోయిన ముఖముతో, శీఘ్రముగా విశ్వామిత్రుని ఒడిలో పడి ఇట్లు పలికెను. 3

మూ. న మేఽస్తి మాతా న పితా జ్ఞాతయో బాన్ధవాః కుతః, 4
త్రాతుమర్హసి మాం సౌమ్య ధర్మేణ మునిపుఙ్గవ.

ప్ర. అ. సౌమ్య = శాంతుడవైన, మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠా, మే = నాకు, మాతా = తల్లి, నాస్తి = లేదు. పితా = తండ్రి, న = లేదు. జ్ఞాతయః = జ్ఞాతులును, బాన్ధవాః = బంధువులును, కుతః = ఎక్కడ? మామ్ = నన్ను, ధర్మేణ = ధర్మముచేత, త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ మహామునీ! నాకు తల్లి లేదు. తండ్రి లేడు. ఇంక జ్ఞాతులైన ఇతర బంధువు లెక్కడ? అందుచే నన్ను ధర్మానుసారముగా రక్షింపుము. 4

మూ. త్రాతా త్వం హి మునిశ్రేష్ఠ సర్వేషాం త్వం హి భావనః. 5
రాజా చ కృతకార్యః స్యాదహం దీర్ఘాయురవ్యయః,
స్వర్గలోకముపాశ్నీయాం తపస్తప్త్వా హ్యనుత్తమమ్. 6

ప్ర. అ. మునిశ్రేష్ఠ = ఓ మునిశ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, సర్వేషామ్ = అందరికిని, త్రాతా హి = రక్షకుడవు కదా? త్వమ్ = నీవు, భావనః హి = హితము చేయువాడవు కదా? రాజా చ = రాజు, కృతకార్యః = చేయబడిన కార్యము కలవాడు, స్యాత్ = అగుగాక. అహమ్ = నేను, దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయము కలవాడనై, అవ్యయః = నాశములేనివాడనై, అనుత్తమమ్ = గొప్ప, తపః = తపస్సు, తప్త్వా = చేసి, స్వర్గలోకమ్ = స్వర్గలోకమును, ఉపాశ్నీయామ్ = అనుభవించెదను గాక.

తా. ఓ మహామునీ! నీవు అందరిని రక్షించువాడవు. అందరికిని హితము చేకూర్చువాడవు. రాజు కార్యము సఫల మగునట్లును, నేను దీర్ఘాయుర్దాయవంతుడనై, తపస్సు చేసి స్వర్గము చేరకల్గు నట్లును చేయుము. 5, 6

మూ. త్వం మే నాథో హ్యనాథస్య భవ భవ్యేన చేతసా,
పితేవ పుత్రం ధర్మాత్మంస్త్రాతుమర్హసి కిల్బిషాత్. 7

ప్ర. అ. అనాథస్య = రక్షకుడు లేని, మే = నాకు, త్వమ్ = నీవు, భవ్యేన = మంగళకర మైన, చేతసా = చిత్తముతో, నాథః = రక్షకుడవుగా, భవ = అగుము. ధర్మాత్మన్ = ధర్మాత్ముడా! పితా = తండ్రి, పుత్రమివ = పుత్రుని వలె, కిల్బిషాత్ = పాపమునుండి, త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ ధర్మాత్మా! మంగళకర మైన చిత్తముతో, నాథుడు లేని నాకు నాథుడ వగుము. తండ్రి కుమారుని రక్షించి నట్లు నన్ను ఆపదనుండి రక్షింపుము. 7

మూ. తస్య తద్వచనం శ్రుత్వా విశ్వామిత్రో మహాతపాః,
సాన్త్వయిత్వా బహువిధం పుత్రానిదమువాచ హ. 8

ప్ర. అ. మహాతపాః = గొప్ప తపస్సు గల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, తస్య = ఆతనియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, బహువిధమ్ = అనేక విధములుగా, సాన్త్వయిత్వా = ఓదార్చి, పుత్రాన్ = పుత్రులను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆతని మాటలు విన్న విశ్వామిత్ర మహాముని ఆతనిని బహువిధముల ఓదార్చి తన పుత్రులతో ఇట్లనెను. 8

మూ. యత్కృతే పితరః పుత్రాన్ జనయన్తి శుభార్థినః,
పరలోకహితార్థాయ తస్య కాలోఽయమాగతః. 9

ప్ర. అ. శుభార్థినః = శుభమును కోరు, పితరః = తలిదండ్రులు, యత్కృతే = దేని కొరకై, పరలోకహితార్థాయ = పరలోకమునందు హిత

మనెడు ప్రయోజనము కొరకై, పుత్రాన్ = పుత్రులను, జనయన్తి = కను చుందురో, తస్య = దానికి, అయమ్ = ఈ, కాలః = కాలము, ఆగతః = వచ్చినది.

తా. మంగళమును కోరు తలిదండ్రులు ఏ వరలోకహితమును కోరి పుత్రులను కనుచుందురో దానిని సాధించు సమయము ఇప్పుడు వచ్చినది. 9

మూ. అయం బాలో మునిసుతో మత్తః శరణమిచ్ఛతి,
అస్య జీవితమాత్రేణ ప్రియం కురుత పుత్రకాః. 10

ప్ర. అ. మునిసుతః = మునికుమారు డైన, అయమ్ = ఈ, బాలః = బాలుడు, మత్తః = నానుండి, శరణమ్ = శరణమును, ఇచ్ఛతి = కోరుచున్నాడు. పుత్రకాః = పుత్రులారా ! అస్య = వీనికి, జీవితమాత్రేణ = జీవితమును మాత్ర మిచ్చుటచేత, ప్రియమ్ = ప్రియమును, కురుత = చేయుడు.

తా. మునిసుతు డైన ఈ బాలుడు రక్షింపు మని నన్ను వేడుచున్నాడు. పుత్రులారా ! ఈతనికి జీవితదానము చేసి ప్రియము చేకూర్చుడు. 10

మూ. సర్వే సుకృతకర్మాణః సర్వే ధర్మపరాయణాః,
పశుభూతా నరేన్ద్రస్య తృప్తిమగ్నేః ప్రయచ్ఛత. 11

ప్ర. అ. సర్వే = మీరందరును, సుకృతకర్మాణః = పుణ్యకర్మ కల వారు. సర్వే = మీరందరును, ధర్మపరాయణాః = ధర్మమునం దాసక్తి కల వారు. నరేన్ద్రస్య = రాజునకు, పశుభూతాః = యజ్ఞపశువులై, అగ్నేః = అగ్నికి, తృప్తిమ్ = తృప్తిని, ప్రయచ్ఛత = ఇవ్వండి.

తా. ధర్మపరాయణు లైన మీ రందరును పుణ్యకర్మలు చేసి ఉన్నారు. మీరు రాజునకు యజ్ఞపశువులుగా అయి అగ్నికి తృప్తి కలిగింపుడు. 11

మూ. నాథవాంశ్చ శునఃశేఫో యజ్ఞశ్చావిఘ్నితో భవేత్,
దేవతాస్తర్పితాశ్చ స్యుర్మమ చాపి కృతం వచః. 12

ప్ర. అ. శునఃశేఫః = శునశ్శేఫుడు, నాథవాన్ చ = రక్షకుడు కలవాడు (అగును). యజ్ఞశ్చ = యజ్ఞము కూడ, అవిఘ్నితః = విఘ్నము లేనిది, భవేత్ =

అగును. దేవతాః = దేవతలు, తర్పితాః = తృప్తి పొందింపబడినవారు, స్యుః= అగుదురు. మమ = నాయొక్క, వచః చ = మాట కూడ, కృతమ్ = చేయబడిన దగును.

తా. మీ రట్లు చేసినచో శునఃశేపునకు రక్షణ ఇచ్చి నట్లగును; యజ్ఞము నిర్విఘ్నముగ కొనసాగును; దేవతలకు తృప్తి లభించును; నే నిచ్చిన మాట నిలబెట్టుకొని నట్లగును. 12

మూ. మునేస్తు వచనం శ్రుత్వా మధుష్యన్దాదయః సుతాః,
సాభిమానం నరశ్రేష్ఠ సలీలమిదమబ్రువన్. 13

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! మధుష్యన్దాదయః = మధుష్యందుడు మొదలైన, సుతాః = కుమారులు, మునేః = మునియొక్క, వచనమ్= వచనమును, శ్రుత్వా=విని, సాభిమానమ్=అహంకారపూర్వకముగా, సలీలమ్= పరిహాసపూర్వకముగా, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. రామా ! విశ్వామిత్రుని మాటలు విని ఆతని కుమారు లైన మధుష్యందాదులు అహంకారముతో పరిహాసపూర్వకముగా ఇట్లనిరి. 13

మూ. కథమాత్మసుతాన్హిత్వా త్రాయసేఽన్యసుతం విభో,
అకార్యమివ పశ్యామః శ్వమాంసమివ భోజనే. 14

ప్ర. అ. విభో = ఓ ప్రభూ ! ఆత్మసుతాన్=తన కుమారులను, హిత్వా= విడచి, అన్యసుతమ్ = ఇతరుల కుమారుని, కథమ్ = ఎట్లు, త్రాయసే=రక్షించుచున్నావు ? భోజనే = భోజనమునందు, శ్వమాంసమివ=కుక్కమాంసమును వలె, అకార్యమివ = చేయకూడని కార్యమునుగా, పశ్యామః = చూచుచున్నాము.

తా. తండ్రీ ! తన కుమారులను త్యజించి ఇతరుల కుమారుని రక్షించుట శ్వమాంసము భుజించుటవంటి దని మా అభిప్రాయము. 14

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా పుత్రాణాం మునిపుఙ్గవః,
క్రోధసంరక్తనయనో వ్యాహర్తుముపచక్రమే. 15

ప్ర. అ. మునిపుఙ్గవః = ఆ మునిశ్రేష్ఠుడు, తేషామ్ = ఆ, పుత్రాణామ్ = పుత్రులయొక్క, తద్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, క్రోధసంరక్తనయనః = క్రోధముచే ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, వ్యాహర్తుమ్ = పలుకుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. విశ్వామిత్రుడు పుత్రుల మాటలు విని, క్రోధముచే ఎఱ్ఱబారిన కండ్లతో వారితో నిట్లనెను. 15

మూ. నిస్సాధ్వసమిదం ప్రోక్తం ధర్మాదపి విగర్హితమ్,
అతిక్రమ్య తు మద్వాక్యం దారుణం రోమహర్షణమ్. 16

ప్ర. అ. మద్వాక్యమ్ = నామాటను, అతిక్రమ్య = అతిక్రమించి, ధర్మాదపి = ధర్మానుసారముగా కూడ, విగర్హితమ్ = నింద్య మైనదియు, దారుణమ్ = భయంకర మైనదియు, రోమహర్షణమ్ = గగుర్పాటు కలిగించునదియు, అగు, ఇదమ్ = ఈ వాక్యము, నిస్సాధ్వసమ్ = భయము లేకుండగా, ప్రోక్తమ్ = పలకబడినది.

తా. మీరు నా మాటను అతిక్రమించుటయే కాక, ఎట్టి సంకోచము లేక ధర్మవిరుద్ధమును, భయంకరమును అగు ఈ వాక్యమును పలికినారు. 16

మూ. శ్వమాంసభోజినః సర్వే వాసిష్ఠా ఇవ జాతిషు,
పూర్ణం వర్షసహస్రం తు పృథివ్యామనువత్స్యథ. 17

ప్ర. అ. సర్వే = మీరందరును, శ్వమాంసభోజినః = కుక్కమాంసమును తినుచు, పూర్ణం వర్షసహస్రమ్ = పూర్తిగా వేయి సంవత్సరములు, పృథివ్యామ్ = భూమియందు, వాసిష్ఠాః ఇవ = వసిష్ఠకుమారులు వలె, జాతిషు = ముష్టికులను జాతులలో, అనువత్స్యథ = ఉండగలరు.

తా. మీ రందరును వసిష్ఠకుమారుల వలె ముష్టికజాతులందు పుట్టి, కుక్కమాంసమును తినుచు పూర్తిగా వేయి సంవత్సరముల పాటు భూమిపై సంచరించగలరు. 17

మూ. కృత్వా శాపసమాయుక్తాన్ పుత్రాన్ మునివర స్తదా,
శునఃశేఫమువాచార్తం కృత్వా రక్షాం నిరామయమ్. 18

ప్ర. అ. మునివరః = ఆ మునిశ్రేష్ఠుడు, పుత్రాన్ = పుత్రులను, శాప సమాయుక్తాన్ = శాపముతో కూడినవారినిగా, కృత్వా = చేసి, తదా = అప్పుడు, నిరామయమ్ = బాధ లేని విధముగా, రక్షామ్ = రక్షను, కృత్వా = చేసి, ఆర్తమ్ = దుఃఖితు డైన, శునఃశేఫమ్ = శునఃశేపుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. విశ్వామిత్రుడు పుత్రులను ఈ విధముగ శపించి, దుఃఖితు డైన శునఃశేపునకు ఎట్టి బాధయు లేకుండు నట్లు మంత్రాదులచే రక్ష చేసి ఆతనితో ఇట్లనెను. 18

మూ. పవిత్రపాశైరాసక్తో రక్తమాల్యానులేపనః,
వైష్ణవం యూపమాసాద్య వాగ్భిరగ్నిముదాహర. 19

ప్ర. అ. వైష్ణవం యూపమ్ = విష్ణుదేవతాక మైన యూప స్తంభమును, ఆసాద్య = పొంది, పవిత్రపాశైః = పవిత్ర మైన పాశములచే, ఆసక్తః = కట్ట బడిన, రక్తమాల్యానులేపనః=ఎఱ్ఱని మాలలు, మైపూతయు గల నీవు, వాగ్భిః= (నే చెప్పబోవు) వాక్కులతో, అగ్నిమ్ = అగ్నిని, ఉదాహర = చెప్పుము (స్తుతింపుము).

తా. నీకు ఎఱ్ఱని పుష్పమాలలు వేసి, ఎఱ్ఱని మైపూత పూసి, పవిత్రము లైన పాశములతో వైష్ణవయూప స్తంభమునకు కట్టుదురు. అప్పుడు ఈ మంత్రము లతో అగ్నిని స్తుతింపుము. 19

మూ. ఇమే తు గాథే ద్వే దివ్యే గాయేథా మునిపుత్రక,
అమ్బరీషస్య యజ్ఞేఽస్మిం స్తతస్సిద్ధిమవాప్స్యసి. 20

ప్ర. అ. మునిపుత్రక = మునికుమారా ! అమ్బరీషస్య = అంబరీషుని యొక్క, అస్మిన్ = ఈ, యజ్ఞే = యజ్ఞమునందు ఇమే = ఈ, ద్వే = రెండు,

దివ్యే = దివ్య మైన, గాథే = గాథలను, గాయేథాః = గానము చేయుము. తతః = పిమ్మట, సిద్ధిమ్ = సిద్ధిని, అవాప్స్యసి = పొందగలవు.

తా. ఓ మునికుమారా! అంబరీషుని యజ్ఞములో శ్రేష్ఠము లైన ఈ రెండు మంత్రములను పఠించినచో నీకు కార్యసిద్ధి లభించును. 20

మూ. శునఃశేఫో గృహీత్వా తే ద్వే గాథే సుసమాహితః,
త్వరయా రాజసింహం తమమ్బరీషమువాచ హ. 21

ప్ర. అ. శునఃశేఫః = శునఃశేపుడు, సుసమాహితః = సావధానచిత్తుడై, తే = ఆ, ద్వే = రెండు, గాథే=గాథలను, గృహీత్వా=గ్రహించి, రాజసింహమ్= రాజశ్రేష్ఠు డైన, తమ్ = ఆ, అమ్బరీషమ్ = అంబరీషుని, త్వరయా = తొందరతో, ఉవాచ హ = పలికెను.

తా. శునఃశేపుడు శ్రద్ధాపూర్వకముగ ఆ రెండు మంత్రములను గ్రహించి రాజశ్రేష్ఠు డైన ఆ అంబరీషుని తొందరపెట్టుచు ఇట్లనెను. 21

మూ. రాజసింహ మహాసత్త్వ శీఘ్రం గచ్ఛావహే సదః,
నిర్వర్తయస్వ రాజేన్ద్ర దీక్షాం చ సముపావిశ. 22

ప్ర. అ. మహాసత్త్వ = గొప్ప బలము గల, రాజసింహ = రాజశ్రేష్ఠుడా! సదః = యజ్ఞసదస్సును గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛావహే=వెళ్లుదము. రాజేన్ద్ర = ఓ రాజేంద్రా! దీక్షామ్ = దీక్షను, నిర్వర్తయస్వ = నడిపింపుము. సముపావిశ = దీక్షలో కూర్చుండుము.

తా. గొప్ప బలము గల రాజశ్రేష్ఠా! యజ్ఞశాలకు శీఘ్రముగా వెళ్లుదము. దీక్షలో కూర్చుండి యజ్ఞము జరిపింపుము. 22

మూ. తద్వాక్యమృషిపుత్రస్య శ్రుత్వా హర్షసముత్సుకః,
జగామ నృపతిః శీఘ్రం యజ్ఞవాటమతన్ద్రితః. 23

ప్ర. అ. నృపతిః=రాజు, ఋషిపుత్రస్య=ఋషిపుత్రునియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, హర్షసముత్సుకః = సంతోషముతో

ఉత్సాహవంతుడై, అతన్ద్రితః = ఆలస్యము లేనివాడై, యజ్ఞవాటమ్ = యజ్ఞవాటమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ఋషిపుత్రుని మాటలు విన్న ఆ రాజు సంతోషోత్సాహభరితుడై, మాంద్యము లేనివాడై, శీఘ్రముగా యజ్ఞవాటికకు వెళ్లెను. 23

మూ. సదస్యానుమతే రాజా పవిత్రకృతలక్షణమ్,
పశుం రక్తామ్బరం కృత్వా యూపే తం సమబన్ధయత్. 24

ప్ర. అ. రాజా = రాజు, సదస్యానుమతే = సభ్యుల అనుమతిప్రకారము, తమ్ = ఆ శునఃశేపుని, పవిత్రకృతలక్షణమ్ = దర్భపవిత్రముచే ఏర్పరుపబడిన గుర్తు గల, రక్తామ్బరమ్ = ఎఱ్ఱని వస్త్రములు గల, పశుమ్ = పశువునుగా, కృత్వా = చేసి, యూపే = యూపస్తంభమునందు, సమబన్ధయత్ = కట్టించెను.

తా. ఆ రాజు సదస్యుల అనుమతి పొంది, ఆ శునఃశేపునకు దర్భపవిత్రముచే గుర్తు లుంచి, ఎఱ్ఱని వస్త్రము కట్టి, యజ్ఞపశువునుగా ఆతనిని యూపస్తంభమున బంధింపచేసెను. 24

మూ. స బద్ధో వాగ్భిరగ్ర్యాభిరభితుష్టావ వై సురౌ,
ఇన్ద్రమిన్ద్రానుజం చైవ యథావన్మునిపుత్రకః. 25

ప్ర. అ. బద్ధః = కట్టబడిన, సః = ఆ, మునిపుత్రకః = మునికుమారుడు, ఇన్ద్రమ్ = ఇంద్రుని, ఇన్ద్రానుజం చైవ = ఉపేంద్రుని, సురౌ = ఈ ఇద్దరు దేవతలను, అగ్ర్యాభిః = శ్రేష్ఠము లైన, వాగ్భిః = వాక్కులచేత, యథావత్ = యథాశాస్త్రముగా, అభితుష్టావ = స్తుతించెను.

తా. యూపమున బంధింపబడిన ఆ మునికుమారుడు ఇంద్రుని, ఉపేంద్రుని శ్రేష్ఠము లైన వాక్కులతో యథాశాస్త్రముగా స్తుతించెను. 25

మూ. తతః ప్రీతః సహస్రాక్షో రహస్యస్తుతితర్పితః,
దీర్ఘమాయుస్తదా ప్రాదాచ్ఛునఃశేఫాయ రాఘవ. 26

ప్ర. అ. రాఘవ = రామా ! తతః = పిమ్మట, రహస్యస్తుతితర్పితః = రహస్యముగా స్తుతించుటచే తృప్తిపొందింపబడిన, సహస్రాక్షః = దేవేంద్రుడు, ప్రీతః = సంతసించినవాడై, తదా = అప్పుడు, శునఃశేఫాయ=శునఃశేపునకు, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుః = ఆయుర్దాయమును, ప్రాదాత్ = ఇచ్చెను.

తా. రామా ! రహస్యముగా చేసిన స్తుతికి సంతసించి దేవేంద్రుడు శునఃశేపునకు దీర్ఘాయువును ప్రసాదించెను. 26

మూ. స చ రాజా నరశ్రేష్ఠ యజ్ఞస్య చ సమాప్తవాన్,
ఫలం బహుగుణం రామ సహస్రాక్షప్రసాదజమ్. 27

ప్ర. అ. నరశేష్ఠ=నరులలో శ్రేష్ఠుడవైన, రామ=రామా ! సః=ఆ, రాజా చ=రాజు కూడ, సహస్రాక్షప్రసాదజమ్ = దేవేంద్రుని అనుగ్రహము వలన కలిగిన, బహుగుణమ్ = చాలరెట్లైన, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, ఫలమ్=ఫలమును, సమాప్తవాన్=పొందినాడు.

తా. నరశ్రేష్ఠుడవైన రామా ! అంబరీషమహారాజునకు దేవేంద్రుని అనుగ్రహముచే ఎన్నో రెట్లు యజ్ఞఫలము లభించెను. 27

మూ. విశ్వామిత్రోఽపి ధర్మాత్మా భూయస్తేపే మహాతపాః,
పుష్కరేషు నరశ్రేష్ఠ దశవర్షశతాని చ. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! ధర్మాత్మా = ధర్మాత్ముడును, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును అగు, విశ్వామిత్రోఽపి = విశ్వామిత్రుడు కూడ, పుష్కరేషు = పుష్కరమునందు, దశవర్షశతాని = వేయి సంవత్సరములు, భూయః = మరల, తేపే = తపస్సు చేసెను.

తా. రామా ! మహాతపఃశాలియు, ధర్మాత్ముడును అగు విశ్వామిత్రుడు పుష్కరక్షేత్రమునందు మరల వేయి సంవత్సరములపాటు తపస్సు చేసెను. 28

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో అరువది రెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిషష్టితమః సర్గః

మూ. పూర్ణే వర్షసహస్రే తు వ్రతస్నాతం మహామునిమ్,
అభ్యాగచ్ఛన్ సురాః సర్వే తపఃఫలచికీర్షవః. 1

ప్ర. అ. వర్షసహస్రే = వేయి సంవత్సరముల కాలము, పూర్ణే=నిండినదగుచుండగా, సర్వే = సమస్త మైన, సురాః = దేవతలు, తపః ఫలచికీర్షవః = తపస్సునకు ఫలమును ఇవ్వగోరినవారై, వ్రతస్నాతమ్ = వ్రతాంతమునందు స్నానము చేసిన, మహామునిమ్ = విశ్వామిత్రుని, అభ్యాగచ్ఛన్ = సమీపించిరి.

తా. వేయి సంవత్సరములు గడచిన పిమ్మట ఆ మహాముని వ్రతము పూర్తి చేసికొని యుండగా దేవతల లందరును ఆతని తపస్సునకు ఫలము ఇవ్వ గోరి వచ్చిరి. 1

మూ. అబ్రవీత్సుమహాతేజా బ్రహ్మా సురుచిరం వచః,
ఋషిస్త్వమసి భద్రం తే స్వార్జితైః కర్మభిః శుభైః. 2

ప్ర. అ. సుమహాతేజాః = గొప్ప తేజస్సు గల, బ్రహ్మా = బ్రహ్మ, సురుచిరమ్ = చాల అంద మైన, వచః = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. త్వమ్= నీవు, స్వార్జితైః = నీచేత సంపాదింపబడిన, శుభైః కర్మభిః = పుణ్య కర్మలచే, ఋషిః అసి = ఋషి అయితివి. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. మహాతేజస్సు గల బ్రహ్మ— "నీవు ఆచరించిన శుభకర్మలచేత, ఋషి వయినావు. నీకు క్షేమ మగుగాక" అని విశ్వామిత్రునితో మధుర మైన వాక్యమును పలికెను. 2

మూ. తమేవముక్త్వా దేవేశస్త్రిదివం పునరభ్యగాత్,
విశ్వామిత్రో మహాతేజా భూయస్తేపే మహత్తపః. 3

ప్ర. అ. దేవేశః = దేవతల ప్రభు వైన బ్రహ్మ, తమ్ = ఆతనిని గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, పునః = తిరిగి, త్రిదివమ్ = స్వర్గమును

గూర్చి, అభ్యగాత్ = వెళ్లెను. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, విశ్వామిత్రః= విశ్వామిత్రుడు, భూయః = మరల, మహత్ = గొప్ప, తపః=తపస్సును, తేపే= చేసెను.

తా. బ్రహ్మదేవుడు విశ్వామిత్రునితో ఇట్లు పలికి స్వర్గమునకు వెళ్లి పోయెను. గొప్ప తేజస్సు గల విశ్వామిత్రుడు మరల గొప్ప తపస్సు చేసెను.

వి. ఈ శ్లోకములో "విశ్వామిత్రః" అనుపదములో 'వి' అని గాయత్రీ మంత్రములోని మూడవ అక్షరము గ్రహింపబడినది. 3

మూ. తతః కాలేన మహతా మేనకా పరమాప్సరాః,
పుష్కరేషు నరశ్రేష్ఠ స్నాతుం సముపచక్రమే. 4

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా ! తతః=పిమ్మట, మహతా = గొప్ప, కాలేన=కాలముచేత, మేనకా=మేనక యనెడు, పరమాప్సరాః=గొప్ప అప్సరస్త్రీ, పుష్కరేషు=పుష్కరమునందు, స్నాతుమ్ = స్నానముచేయుటకు, సముపచక్రమే=ప్రారంభించెను.

తా. రామా ! పిమ్మట చాలకాలమునకు మేనక యనెడు గొప్ప అప్సరస పుష్కరమునందు స్నాన మాడ మొదలిడెను. 4

మూ. తాం దదర్శ మహాతేజా మేనకాం కుశికాత్మజః,
రూపేణాప్రతిమాం తత్ర విద్యుతం జలదే యథా. 5

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, కుశికాత్మజః=విశ్వామిత్రుడు, తత్ర=ఆ పుష్కరమునందు, జలదే=మేఘమునందు, విద్యుతం యథా=మెరుపు వలె నున్న, రూపేణ=రూపముచేత, అప్రతిమామ్=సాటి లేని, తామ్=ఆ, మేనకామ్=మేనకను, దదర్శ=చూచెను.

తా. మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రుడు, ఆ పుష్కరతీర్థములో, మేఘములో మెరుపు వలె నున్న, సాటి లేని రూపము గల ఆ మేనకను చూచెను. 5

మూ. దృష్ట్వా కన్దర్పవశగో మునిస్తామిదమబ్రవీత్,
అప్సరః స్వాగతం తేఽస్తు వస చేహ మమాశ్రమే, 6
అనుగృహ్ణీష్వ భద్రం తే మదనేన సుమోహితమ్.

ప్ర. అ. దృష్ట్వా=చూచి, మునిః=ముని, కన్దర్పవశగః=మన్మథునకు వశ మైనవాడై, తామ్=ఆమెను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అప్సరః=ఓ అప్సరసా! తే=నీకు, స్వాగతమ్ అస్తు=స్వాగత మగుగాక. మమ=నాయొక్క, ఇహ=ఈ, ఆశ్రమే=ఆశ్రమమునందు, వస చ = నివసింపుము. మదనేన=మన్మథునిచేత, సుమోహితమ్=అధికముగా మోహితుడ నైన నన్ను, అనుగృహ్ణీష్వ=అనుగ్రహింపుము. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక.

తా. ఆమెను చూడగనే కామపరవశు డైన విశ్వామిత్రుడు ఆమెతో ఇట్లనెను — "ఓ! అప్సరసా! నీకు స్వాగతము. నా యీ ఆశ్రమములో నివసింపుము. మన్మథునిచే మిక్కిలి మోహితుడ నైన నన్ను అనుగ్రహింపుము. నీకు క్షేమ మగుగాక." 6

మూ. ఇత్యుక్తా సా వరారోహా తత్ర వాసమథాకరోత్. 7
తస్యాం వసన్త్యాం వర్షాణి పఞ్చ పఞ్చ చ రాఘవ,
విశ్వామిత్రాశ్రమే రామ సుఖేన వ్యతిచక్రముః. 8

ప్ర. అ. రాఘవ=రామా! సా=ఆ, వరారోహా=స్త్రీ, ఇతి=ఇట్లు, ఉక్తా=పలకబడినదై, అథ=పిమ్మట, తత్ర=అచట, వాసమ్=నివాసమును, అకరోత్ = చేసెను. రామ = రామా! తస్యామ్ = ఆమె, విశ్వామిత్రాశ్రమే = విశ్వామిత్రుని ఆశ్రమమునందు, వసన్త్యామ్=నివసించుచుండగా, పఞ్చ పఞ్చ చ= పది, వర్షాణి=సంవత్సరములు, సుఖేన = సుఖముగా, వ్యతిచక్రముః = గడచిపోయినవి.

తా. విశ్వామిత్రు డిట్లు పలుకగా ఆ అప్సరస అచట నివసించెను. ఆమె విశ్వామిత్రాశ్రమములో నివసించుచుండగా పది సంవత్సరములు సుఖముగ గడచిపోయినవి. 7, 8

మూ. అథ కాలే గతే తస్మిన్విశ్వామిత్రో మహామునిః,
సవ్రీళ ఇవ సంవృత్తశ్చిన్తాశోకపరాయణః. 9

ప్ర. అ. అథ = పిమ్మట, తస్మిన్ కాలే = ఆ (పది సంవత్సరముల) కాలము, గతే = గడచిపోయిన దగుచుండగా, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, చిన్తాశోకపరాయణః = చింతాశోకములతో కూడిన వాడై, సవ్రీళ ఇవ = సిగ్గు కలవాడుగా, సంవృత్తః = అయినాడు.

తా. పది సంవత్సరములు గడచిన తరువాత విశ్వామిత్రమహాముని చింతాదుఃఖములతో నిండినవాడై సిగ్గుపడెను. 9

మూ. బుద్ధిర్మునేః సముత్పన్నా సామర్షా రఘునన్దన,
సర్వం సురాణాం కర్మైతత్తపోపహరణం మహత్. 10

ప్ర. అ. రఘునన్దన = రామా ! మునేః = మునికి, సామర్షా = కోపముతో కూడిన, బుద్ధిః = బుద్ధి, సముత్పన్నా = పుట్టినది. ఏతత్ సర్వమ్ = ఇది యంతయు, మహత్ = గొప్పదైన, తపోపహరణమ్ = తపస్సును అపహరించు, సురాణామ్ = దేవతలయొక్క, కర్మ = కర్మ.

తా. రామా ! అపుడు విశ్వామిత్రునకు కోపముతో కూడిన ఆలోచన ఒకటి కలిగినది — "ఇది అంతయు, నా తపస్సు హరించుటకై దేవతలు చేసిన పని." 10

మూ. అహోరాత్రాపదేశేన గతాః సంవత్సరా దశ,
కామమోహాభిభూతస్య విఘ్నోఽయం సముపస్థితః. 11

ప్ర. అ. కామమోహాభిభూతస్య = కామమోహములచేత ఆవహింపబడిన నాకు, దశ సంవత్సరాః = పది సంవత్సరములు, అహోరాత్రాపదేశేన = పగళ్లు రాత్రులు అను మిషచేత, గతాః = గడచిపోయినవి. అయమ్ = ఈ, విఘ్నః = విఘ్నము, సముపస్థితః = వచ్చినది.

తా. పగలు, రాత్రి అని అనుకొనుచుండగనే కామమోహములో చిక్కి

కొనియున్న నాకు పది సంవత్సరములు గడచిపోయినవి. ఈ విధముగ పెద్ద విఘ్నము వచ్చి పడినది. 11

మూ. వినిశ్శ్వసన్మునివరః పశ్చాత్తాపేన దుఃఖితః,
భీతామప్సరసం దృష్ట్వా వేపన్తీం ప్రాఞ్జలిం స్థితామ్. 12

మేనకాం మధురైర్వాక్యైర్విసృజ్య కుశికాత్మజః,
ఉత్తరం పర్వతం రామ విశ్వామిత్రో జగామ హ. 13

ప్ర. అ. రామ = రామా ! మునివరః = మునిశ్రేష్ఠు డైన, కుశికాత్మజః = కుశికుని కుమారు డైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, పశ్చాత్తాపేన = పశ్చాత్తాపముచేత, దుఃఖితః = దుఃఖించినవాడై, వినిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, భీతామ్ = భయపడినదియు, ప్రాఞ్జలిం స్థితామ్ = దోసిలికట్టి నిలచినదియు, వేపన్తీమ్ = వణకుచున్నదియు, అప్సరసమ్ = అప్సరస యైన, మేనకామ్ = మేనకను, దృష్ట్వా = చూచి, మధురైః = మధురము లైన, వాక్యైః = వాక్యముల చేత, విసృజ్య = విడచి, ఉత్తరం పర్వతమ్ = హిమవత్పర్వతమును గూర్చి, జగామ హ = వెళ్లెను.

తా. రామా ! విశ్వామిత్రమహాముని పశ్చాత్తాపముచే పీడితుడై, నిట్టూర్చు చున్నవాడై, తన ఎదుట అంజలి ఘటించి వణకుచు నిలచిన మేనక భయపడిన దని గ్రహించి, ఆమెను తీయని మాటలతో పంపివేసి, హిమవత్పర్వతమునకు వెళ్లెను. 12, 13

మూ. స కృత్వా నైష్ఠికీం బుద్ధిం జేతుకామో మహాయశాః,
కౌశికీతీరమాసాద్య తపస్తేపే సుదారుణమ్. 14

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = ఆతడు, నైష్ఠికీమ్ = నిష్ఠకు సంబంధించిన, బుద్ధిమ్ = బుద్ధిని, కృత్వా = చేసి, జేతుకామః = జయింపవలె నను కోరిక గలవాడై, కౌశికీతీరమ్ = కౌశికీనదీతీరమును, ఆసాద్య = పొంది, సుదారుణమ్ = మిక్కిలి భయంకర మైన, తపః = తపస్సును, తేపే = చేసెను.

తా. విశ్వామిత్రుడు నిష్ఠ నవలంబింపవలె నని దృఢనిశ్చయము చేసికొని, ఇంద్రియములను (లేదా వసిష్ఠుని) జయింపగోరుచున్నవాడై, కౌశికీనదీతీరము చేరి అతితీవ్ర మైన తపస్సు చేసెను. 14

మూ. తస్య వర్షసహస్రం తు ఘోరం తప ఉపాసతః,
ఉత్తరే పర్వతే రామ దేవతానామభూద్భయమ్. 15

ప్ర. అ. రామ = రామా। తస్య = అతడు, ఉత్తరే పర్వతే = హిమవత్పర్వతముమీద, వర్షసహస్రమ్ = వేయిసంవత్సరములు, ఘోరమ్ = ఘోరమైన, తపః = తపస్సును, ఉపాసతః = చేయుచుండగా, దేవతానామ్ = దేవతలకు, భయమ్ = భయము, అభూత్ = కలిగెను.

తా. విశ్వామిత్రుడు హిమవత్పర్వతముపై వేయి సంవత్సరముల పాటు ఘోరమైన తపస్సు చేయుచుండగా దేవతలకు భయము కలిగెను. 15

మూ. ఆమన్త్రయన్ సమాగమ్య సర్వే సర్షిగణాః సురాః,
మహర్షిశబ్దం లభతాం సాధ్వయం కుశికాత్మజః. 16

ప్ర. అ. సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, సర్వే = సమస్త మైన, సురాః = దేవతలు, సమాగమ్య = కలిసి, అయమ్ = ఈ, కుశికాత్మజః = విశ్వామిత్రుడు, సాధు = బాగుగా, మహర్షిశబ్దమ్ = మహర్షి అను పేరును, లభతామ్ = పొందుగాక అని, అమంత్రయన్ = ఆలోచించిరి.

తా. ఋషులును దేవత లందరును కలిసి ఈ విశ్వామిత్రుని "మహర్షి" అనవచ్చును అని నిశ్చయించిరి. 16

మూ. దేవతానాం వచః శ్రుత్వా సర్వలోకపితామహః,
అబ్రవీన్మధురం వాక్యం విశ్వామిత్రం తపోధనమ్. 17

ప్ర. అ. సర్వలోకపితామహః = బ్రహ్మదేవుడు, దేవతానామ్ = దేవతల యొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, తపోధనమ్ = తపస్సే ధనముగా గల, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, మధురమ్ = మధురమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దేవతల అభిప్రాయము ననుసరించి బ్రహ్మదేవుడు విశ్వామిత్రునితో మధుర మైన వాక్యము పలికెను. 17

మూ. మహర్షే స్వాగతం వత్స తపసోగ్రేణ తోషితః,
మహత్త్వమృషిముఖ్యత్వం దదామి తవ కౌశిక. 18

ప్ర. అ. మహర్షే = మహర్షీ ! వత్స = నాయనా ! స్వాగతమ్ = స్వాగత మగుగాక. ఉగ్రేణ = ఉగ్ర మైన, తపసా = తపస్సుచేత, తోషితః = సంతోషింప చేయబడితిని. కౌశిక = విశ్వామిత్రా ! తవ = నీకు, మహత్త్వమ్ = గొప్ప తనమును, ఋషిముఖ్యత్వమ్ = ఋషులలో శ్రేష్ఠత్వమును, దదామి = ఇచ్చు చున్నాను.

తా. మహర్షీ ! నీవు చేసిన ఉగ్ర తపస్సుకు సంతోషించినాను. నీకు మహత్త్వమును, ఋషిత్వమును, (అనగా మహర్షిత్వమును) ఇచ్చుచున్నాను. 18

మూ. బ్రహ్మణః స వచః శ్రుత్వా సర్వలోకేశ్వరస్య హ,
న విషణ్ణో న సన్తుష్టో విశ్వామిత్ర స్తపోధనః. 19

ప్ర. అ. తపోధనః = తపోధను డైన, సః = ఆ, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, సర్వలోకేశ్వరస్య = సర్వలోకాధిపతి యైన, బ్రహ్మణః = బ్రహ్మ యొక్క, వచః = వాక్కును, శ్రుత్వా = విని, న విషణ్ణః = విషాదము పొంద లేదు. న సన్తుష్టః = సంతోషించ లేదు.

తా. సర్వలోకాధీశ్వరు డైన బ్రహ్మ మాటలను విన్న ఆ విశ్వామిత్ర మహామునికి విషాదము కలుగలేదు. సంతోషము కలుగలేదు. 19

మూ. ప్రాఞ్జలిః ప్రణతో భూత్వా సర్వలోకపితామహమ్,
ప్రత్యువాచ తతో వాచం విశ్వామిత్రో మహామునిః. 20

ప్ర. అ. తతః = పిమ్మట, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ప్రణతః = నమ్రుడుగా,

భూత్వా = అయి, సర్వలోకపితామహమ్ = బ్రహ్మదేవుని గూర్చి, వాచమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. పిమ్మట ఆ విశ్వామిత్ర మహాముని అంజలి ఘటించి, నమ్రుడై బ్రహ్మదేవునితో ఇట్లనెను. 20

మూ. మహర్షిశబ్దమతులం స్వార్జితైః కర్మభిః శుభైః,
యది మే భగవానాహ తతోఽహం విజితేన్ద్రియః. 21

ప్ర. అ. భగవాన్ = పూజ్యుడ వైన నీవు, స్వార్జితైః = నాచే చేయబడిన, శుభైః = శుభము లైన, కర్మభిః = కర్మలచేత, అతులమ్ = సాటిలేని, మహర్షి శబ్దమ్ = 'మహర్షి' అను పేరును, మే = నాకు, ఆహ యది = చెప్పినట్లయితే, తతః = అందువలన, అహమ్ = నేను, విజితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడను.

తా. నేను చేసిన శుభకర్మలచే నాకు మహర్షిత్వము లభించిన దని పూజ్యుడ వైన నీవు చెప్పుచున్నావు కదా. అందుచే నేను జితేంద్రియుడ నైతిని. 21

మూ. తమువాచ తతో బ్రహ్మ న తావత్త్వం జితేన్ద్రియః,
యతస్వ మునిశార్దూల ఇత్యుక్త్వా త్రిదివం గతః. 22

ప్ర. అ. తతః = పిమ్మట, బ్రహ్మ = బ్రహ్మ, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను. త్వమ్ = నీవు, జితేన్ద్రియస్తావత్ = ఇంద్రియములను జయించినవాడవు మాత్రము, న = కాదు. మునిశార్దూల = ఓ మునిశ్రేష్ఠుడా ! యతస్వ = ఇంకను ప్రయత్నింపుము. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్లెను.

తా. "నీవు జితేంద్రియుడవు మాత్రము కావు. ఇంకను ప్రయత్నింపుము" అని బ్రహ్మ విశ్వామిత్రునితో పలికి స్వర్గమునకు వెళ్లెను. 22

మూ. విప్రస్థితేషు దేవేషు విశ్వామిత్రో మహామునిః,
ఊర్ధ్వబాహుర్నిరాలమ్బో వాయుభక్షస్తపశ్చరన్. 23

ప్ర. అ. దేవేషు = దేవతలు, విప్రస్థితేషు సత్సు = ప్రయాణ మైనవా రగు చుండగా, మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, ఊర్ధ్వబాహుః = పైకి ఎత్తబడిన బాహువులు కలవాడై, నిరాలంబః = ఆలంబ నము (ఊత) లేనివాడై, వాయుభక్షః = వాయువును భక్షించుచున్నవాడై, తపః చరన్ = తపస్సు చేయుచు ఉండెను.

తా. దేవత లందరును వెడలిపోయిన పిమ్మట, విశ్వామిత్ర మహాముని, చేతులు పైకెత్తి ఆలంబన మేదియు లేకుండ నిలచి, వాయువును మాత్రమే ఆహారముగ గొని తపస్సు చేయ మొదలిడెను. 23

మూ. ఘర్మే పఞ్చతపా భూత్వా వర్షాస్వాకాశసంశ్రయః,
శిశిరే సలిలస్థాయీ రాత్ర్యహాని తపోధనః. 24
ఏవం వర్షసహస్రం హి తపో ఘోరముపాగమత్.

ప్ర. అ. తపోధనః = ఆ విశ్వామిత్రమహర్షి, ఘర్మే = గ్రీష్మర్తువు నందు, పఞ్చతపాః = అయిదు అగ్నుల మధ్య తపస్సు చేయువాడు, భూత్వా = అయి, వర్షాసు = వర్షకాలమునందు, ఆకాశ సంశ్రయః = బయటనే నివసించుచు, శిశిరే = శిశిరర్తువునందు, రాత్ర్యహాని = రేయింబగళ్లు, సలిలస్థాయీ = నీటిలో నిలచినవాడై, ఏవమ్ = ఈ విధముగా, వర్షసహస్రమ్ = వేయి సంవత్సర ములు, ఘోరమ్ = ఘోర మైన, తతః = తపస్సును, ఉపాగమత్ = పొందెను.

తా. విశ్వామిత్రమహర్షి గ్రీష్మమునందు పంచాగ్నిమధ్య తపస్సు చేయుచు, వర్షాకాలమునందు ఆరుబైటనే వసించుచు, శీతకాలమున రేయింబగళ్లు జలమునందు నిలచుచు, వేయి సంవత్సరములపాటు ఘోరతపస్సు చేసెను. 24

మూ. తస్మిన్ సంతప్యమానే తు విశ్వామిత్రే మహామునౌ, 25
సంభ్రమః సుమహానాసీత్సురాణాం వాసవస్య చ.

ప్ర. అ. మహామునౌ=మహాముని యైన, తస్మిమ్=అ, విశ్వామిత్రే=విశ్వామిత్రుడు, సంతప్యమానే = తపము చేయుచుండగా, సురాణామ్ = దేవతలకును, వాసవస్య చ = దేవేంద్రునకును, సుమహాన్ = చాల గొప్ప దైన, సంభ్రమః = భయము, ఆసీత్ = కలిగెను.

తా. విశ్వామిత్రమహాముని ఈ విధముగ తపస్సు చేయుట చూచి దేవేంద్రుడును, దేవతలును చాల భయపడిరి. 25

మూ. రమ్భామప్సరసం శక్రః సహ సర్వైర్మరుద్గణైః,
ఉవాచాత్మహితం వాక్యమహితం కౌశికస్య చ. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. శక్రః=దేవేంద్రుడు, సర్వైః=సమస్త మైన, మరుద్గణైః సహ=దేవతాగణములతో కూడినవాడై, ఆత్మహితమ్ = తనకు హిత మైనదియు, కౌశికస్య = విశ్వామిత్రునకు, అహితం చ = హితము కానిదియు అగు, వాక్యమ్ = వాక్యమును, రమ్భామ్ = రంభ అనెడు, అప్సరసమ్ = అప్సరస్త్రీని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. సకలదేవతాసమేతు డైన దేవేంద్రుడు రంభ యను అప్సరసతో, తనకు హితకరమును, విశ్వామిత్రునకు అహితకరమును అగు వాక్యము పలికెను. 26

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండములో
అరువది మూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃషష్టితమః సర్గః

మూ. సురకార్యమిదం రమ్భే కర్తవ్యం సుమహత్త్వయా,
లోభనం కౌశికస్యేహ కామమోహసమన్వితమ్. 1

ప్ర. అ. రమ్భే = ఓ రంభా ! ఇహ = ఇపుడు, కౌశికస్య=విశ్వామిత్రుని యొక్క, (విశ్వామిత్రుని), కామమోహనమన్వితమ్ = కామముచే కలిగిన మోహముతో కూడుకున్నట్లుగా, లోభనమ్=లోభపెట్టుట యనెడు, సుమహత్ = చాల గొప్పదైన, ఇదమ్=ఈ, సురకార్యమ్=దేవతా కార్యము, త్వయా=నీచేత, కర్తవ్యమ్ = చేయదగినది.

తా. రంభా ! విశ్వామిత్రుని కామమోహితుని చేసి ఆశ కల్పించ వలెను. ఈ గొప్ప దేవతాకార్యమును నీవు చేయవలెను. 1

మూ. తథోక్తా సాప్సరా రామ సహస్రాక్షేణ ధీమతా,
వ్రీళితా ప్రాఞ్జలిర్వాక్యం ప్రత్యువాచ సురేశ్వరమ్. 2

ప్ర. అ. రామ = రామా ! ధీమతా = బుద్ధిమంతు డైన, సహస్రాక్షేణ = దేవేంద్రునిచేత, తథా = ఆ విధముగా, ఉక్తా = పలకబడిన, సా=ఆ, అప్సరాః= అప్సరన, వ్రీళితా = సిగ్గుపడు చున్నదై, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలదై, సురేశ్వరమ్=దేవేంద్రుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రామా ! ధీమంతుడైన దేవేంద్రుని మాటలు విని రంభ సిగ్గుపడుచు, చేతులు జోడించి ఆతనితో ఇటు పలికెను. 2

మూ. అయం సురపతే ఘోరో విశ్వామిత్రో మహామునిః,
ఘోరముత్స్రుజతే క్రోధం మయి దేవ న సంశయః. 3
తతో హి మే భయం దేవ ప్రసాదం కర్తు మర్హసి.

ప్ర. అ. సురపతే = ఓ దేవేంద్రా ! అయమ్ = ఈ, మహామునిః = మహా ముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, ఘోరః = భయంకరుడు. దేవ = ప్రభూ ! మయి = నాయందు, ఘోరమ్ = భయంకర మైన, క్రోధమ్ = క్రోధ మును, ఉత్సృజతే = విడచును. సంశయః = సంశయము, న = లేదు. తతః = ఆకారణమువలన, మే=నాకు, భయమ్=భయము. దేవ=ప్రభూ ! ప్రసాదమ్= అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ సురాధీశా ! విశ్వామిత్రమహాముని చాల కోపస్వభావుడు. నాపై తప్పక తన క్రోధమును చూపి నన్ను శపించగలడు. అందుచే నాకు భయము కలుగుచున్నది. నన్ను అనుగ్రహింపుము. 3

మూ. ఏవముక్తస్తయా రామ రమ్భయా భీతయా తదా, 4
తాముఖవాచ సహస్రాక్షో వేపమానాం కృతాఞ్జలిమ్.

ప్ర. అ. రామ=రామా! భీతయా=భయపడిన, తయా=ఆ, రమ్భయా= రంభచేత, తదా = అప్పుడు, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సహస్రాక్షః= దేవేంద్రుడు, వేపమానామ్ = వణకుచున్నదియు, కృతాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలి గలదియు అగు, తామ్ = ఆమెను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రామా ! రంభ భయముతో వణకుచు, చేతులు జోడించి పలికిన మాటలు విని దేవేంద్రు డిట్లు పలికెను. 4

మూ. మాభైషీ రమ్భే భద్రం తే కురుష్వ మమ శాసనమ్, 5
కోకిలో హృదయగ్రాహీ మాధవే రుచిరద్రుమే,
అహం కన్దర్పసహితః స్థాస్యామి తవ పార్శ్వతః. 6

ప్ర. అ. రమ్భే = ఓ రంభా ! మా భైషీః = భయపడకుము. తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక. మమ = నాయొక్క, శాసనమ్ = ఆజ్ఞను, కురుష్వ= చేయుము. అహమ్ = నేను, రుచిరద్రుమే = అంద మైన వృక్షములు గల, మాధవే= వసంతర్తువునందు, హృదయగ్రాహీ = హృదయము నాకర్షించు, కోకిలః = కోకిలగా అయి, కన్దర్పసహితః = మన్మథసమేతుడనై, తవ = నీ యొక్క, పార్శ్వతః = పార్శ్వమునందు, స్థాస్యామి = ఉండగలను.

తా. ఓ రంభా ! భయపడకుము. నీకు క్షేమ మగును. నా శాసనమును చేయుము. అంద మైన వృక్షములు గల వసంతర్తువునందు కోకిల రూపము ధరించి, నేను మన్మథునితో కూడ నీ ప్రక్కనే ఉందును. 5, 6

మూ. త్వం హి రూపం బహుగుణం కృత్వా పరమభాస్వరమ్,
తమృషిం కౌశికం రమ్భే భేదయస్వ తపస్వినమ్. 7

ప్ర. అ. రమ్భే!=రంభా! త్వమ్ = నీవు, బహుగుణమ్=అనేక శృంగార చేష్టాదిగుణములు గల, పరమభాస్వరమ్=మిక్కిలి ప్రకాశించుచున్న, రూపమ్= రూపమును, కృత్వా = చేసికొని, తపస్వినమ్ = తపశ్శాలి యైన, తమ్ = ఆ. ఋషిమ్ = ఋషి యైన, కౌశికమ్ = విశ్వామిత్రుని, భేదయస్వ = (తపస్సునుండి) విడదీయుము.

తా. ఓ రంభా ! అనేక శృంగారచేష్టాదిగుణములు గల చాల ప్రకాశించు రూపము వహించి విశ్వామిత్రమహర్షి తపస్సుకు భంగము చేయుము. 7

మూ. సా శ్రుత్వా వచనం తస్య కృత్వా రూపమనుత్తమమ్.
లోభయామాస లలితా విశ్వామిత్రం శుచిస్మితా. 8

ప్ర. అ. సా = ఆమె, తస్య = ఆతనియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, అనుత్తమమ్=అత్యుత్తమ మైన, రూపమ్=రూపమును, కృత్వా= చేసి, లలితా = సుందర మైనదై, శుచిస్మితా = తెల్లని చిరునవ్వు గలదై, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, లోభయామాస = లోభపెట్టెను.

తా. రంభ దేవేంద్రుని మాటలు విని అత్యుత్తమ మైన రూపమును ధరించి, సౌందర్యవతియై తెల్లని చిరునవ్వు నవ్వుచు విశ్వామిత్రుని లోభింపచేసెను. 8

మూ. కోకిలస్య చ శుశ్రావ వల్గు వ్యాహరతః స్వనమ్,
సంప్రహృష్టేన మనసా తత ఏనాముదైక్షత. 9

ప్ర. అ. వల్గు = మధురముగా, వ్యాహరతః=కూయుచున్న, కోకిలస్య= కోకిలయొక్క, స్వనమ్ = ధ్వనిని, శుశ్రావ = వినెను. తతః = పిమ్మట,

సంప్రహృష్టేన = సంతసించిన, మనసా = మనస్సుతో, ఏనామ్ = ఈమెను, ఉదైక్షత = చూచెను.

తా. విశ్వామిత్రుడు కోకిలయొక్క మధురధ్వనిని విని, సంతసించిన మనస్సుతో రంభను చూచెను. 9

మూ. అథ తస్య చ శబ్దేన గీతేనాప్రతిమేన చ,
దర్శనేన చ రమ్భాయా మునిస్సన్దేహమాగతః. 10

ప్ర. అ. అథ = పిమ్మట, తస్య = ఆ కోకిలయొక్క, శబ్దేన = కూత చేతను, అప్రతిమేన = సాటిలేని, గీతేన = గానముచేతను, రమ్భాయాః = రంభ యొక్క, దర్శనేన చ = దర్శనముచేతను, మునిః = ముని, సన్దేహమ్ = సందేహ మును, ఆగతః = పొందెను.

తా. కోకిలధ్వనియు, మధుర మైన సంగీతధ్వనియు వినబడిన పిమ్మట రంభ కనబడగనే విశ్వామిత్రునకు సందేహము కలిగెను. 10

మూ. సహస్రాక్షస్య తత్కర్మ విజ్ఞాయ మునిపుఙ్గవః,
రమ్భాం క్రోధసమావిష్టః శశాప కుశికాత్మజః. 11

ప్ర. అ. మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠు డైన, కుశికాత్మజః = విశ్వామిత్రుడు, తత్ = దానిని, సహస్రాక్షస్య = ఇంద్రునియొక్క, కర్మ = పనినిగా, విజ్ఞాయ = తెలుసుకొని, క్రోధసమావిష్టః = క్రోధముతో కూడినవాడై, రమ్భామ్ = రంభను, శశాప = శపించెను.

తా. ఇదంతయు ఇంద్రుడు చేసిన పని యని తెలిసికొని విశ్వామిత్ర మహాముని రంభను ఇట్లు శపించెను. 11

మూ. యన్మాం లోభయసే రమ్భే కామక్రోధజయైషిణమ్,
దశవర్షసహస్రాణి శైలీ స్థాస్యసి దుర్భగే. 12

ప్ర. అ. దుర్భగే = దౌర్భాగ్యవంతురాలై న, రమ్భే = ఓరంభా! కామ క్రోధజయైషిణమ్ = కామక్రోధములను జయింపవలె నని కోరుచున్న, మామ్ =

నన్ను, యత్ = ఎందువలన, లోభయసే = లోభపెట్టుచున్నావో, అందువలన, దశ = పది, వర్షసహస్రాణి=వేల సంవత్సరములు, శైలీ=ఱాయిగా, స్థాస్యసి= ఉండగలవు.

తా. దౌర్భాగ్యవంతురాలైన ఓ రంభా ! కామక్రోధములను జయించవలెనని కోరుచున్న నన్ను లోభపెట్టుటకై ప్రయత్నించితివి గాన పదివేల సంవత్సరములు ఱాతిబండవై పడియుందువుగాక. 12

మూ. బ్రాహ్మణః సుమహాతేజా స్తపోబలసమన్వితః,
ఉద్ధరిష్యతి రమ్భే త్వాం మత్క్రోధకలుషీకృతామ్. 13

ప్ర. అ. రమ్భే = రంభా ! సుమహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, తపోబలసమన్వితః = తపోబలముతో కూడినవాడును అగు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, మత్క్రోధకలుషీకృతామ్=నా క్రోధముచే పీడింపబడిన, త్వామ్= నిన్ను, ఉద్ధరిష్యతి = ఉద్ధరించగలడు.

తా. ఓ రంభా ! నా కోపమునకు గురి యైన నిన్ను, గొప్ప తేజస్సు కలవాడును, తపోబలసంపన్నుడను అగు ఒక బ్రాహ్మణుడు ఉద్ధరించగలడు. 13

మూ. ఏవముక్త్వా మహాతేజా విశ్వామిత్రో మహామునిః,
అశక్నువన్ ధారయితుం క్రోధం సన్తాపమాగతః. 14

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, మహామునిః = గొప్ప మునియు అగు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, క్రోధమ్ = క్రోధమును, ధారయితుమ్ = నిగ్రహించుకొనుటకు, అశక్నువన్ = సమర్థుడు కానివాడై, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సన్తాపమ్ = చింతను, ఆగతః = పొందెను.

తా. విశ్వామిత్రమహాముని కోపము పట్టలేక రంభను ఈ విధముగ శపించి, పశ్చాత్తాపము పొందెను. 14

మూ. తస్య శాపేన మహతా రమ్భా శైలీ తదాభవత్,
వచః శ్రుత్వా తు కన్దర్పో మహర్షేః స చ నిర్గతః. 15

ప్ర. అ. తదా = అప్పుడు, మహతా = గొప్పదైన, తస్య = ఆతనియొక్క, శాపేన = శాపముచేత, రమ్భా = రంభ, శైలీ = ఱాయిగా, అభవత్ = అయెను. మహర్షేః = మహర్షియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, కన్దర్పః = మన్మథుడును, సః చ = ఆదేవేంద్రుడును, నిర్గతః = వెడలిపోయిరి.

తా. ఆతని శాపముచేత రంభ వెంటనే శిల ఐపోయెను. మహర్షి మాటలు విని మన్మథుడును, ఇంద్రుడును పారిపోయిరి. 15

మూ. కోపేన స మహాతేజా స్తపోపహరణే కృతే,
ఇన్ద్రియైరజితై రామ న లేభే శా న్తిమాత్మనః. 16

ప్ర. అ. రామ = రామా ! మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = ఆతడు, కోపేన = కోపముచేత, తపోపహరణే = తపస్సుయొక్క హరణము, కృతే = చేయబడిన దగుచుండగా, అజితైః = జయింపబడని, ఇన్ద్రియైః = ఇంద్రియములచేత, ఆత్మనః = మనస్సుయొక్క, శాన్తిమ్ = శాంతిని, న లేభే = పొందలేదు.

తా. ఇట్లు కోపము కలుగుటచే తపస్సు క్షీణింపగా మహాతేజశ్శాలి యగు ఆవిశ్వామిత్రుడు, ఇంద్రియములను జయించకపోవుటచే మనఃశాంతి పొందజాలక పోయెను. 16

మూ. బభూవాస్య మనశ్చిన్తా తపోఽపహరణే కృతే,
నైవ క్రోధం గమిష్యామి న చ వక్ష్యే కథంచన. 17

ప్ర. అ. తపోపహరణే = తపస్సుయొక్క హరణము, కృతే = చేయబడిన దగు చుండగా, అస్య = ఈతనికి, మనశ్చిన్తా = మనస్సులో ఆలోచన, బభూవ = ఆయెను. క్రోధమ్ = కోపమును, నైవ గమిష్యామి = పొందను. కథంచన = ఎట్లైనను, న చ వక్ష్యే = మాటలాడను కూడ.

తా. ఇట్లు తపస్సు క్షీణించగా విశ్వామిత్రుడు ఈ విధముగ నిశ్చయించు కొనెను— "నేను కోపము చెందను. ఏమైనను మాట కూడ పలుకను". 17

మూ. అథవా నోచ్ఛ్వసిష్యామి సంవత్సరశతాన్యపి,
అహం విశోషయిష్యామి హ్యాత్మానం విజితేన్ద్రియః. 18

ప్ర. అ. అథవా = లేదా, సంవత్సరశతాన్యపి = నూరు సంవత్సరములైనను, నోచ్ఛ్వసిష్యామి = ఊపిరి విడువను. అహమ్ = నేను, విజితేన్ద్రియః = జయించబడిన ఇంద్రియములు కలవాడనై, ఆత్మానమ్ = శరీరమును, విశోషయిష్యామి = ఎండింపచేసెదను.

తా. "లేదా వందల కొలది సంవత్సరములు ఊపిరి విడవక ఉండి, జితేంద్రియుడనై శరీరమును శుష్కింపచేసెదను". 18

మూ. తావద్యావద్ధి మే ప్రాప్తం బ్రాహ్మణ్యం తపసార్జితమ్,
అనుచ్ఛ్వసన్నభుఞ్జానస్తిష్ఠేయం శాశ్వతీః సమాః. 19
న హి మే తప్యమానస్య క్షయం యాస్యన్తి మూర్తయః.

ప్ర. అ. మే = నాకు, తపసా = తపస్సుచేత, ఆర్జితమ్ = సంపాదింపబడిన, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణత్వము, యావత్ = ఎప్పటికి, ప్రాప్తమ్ = ప్రాప్తమగునో, తావత్ = అంతవరకు, అనుచ్ఛ్వసన్ = ఊపిరి విడవనివాడనై, అభుఞ్జానః = భుజించనివాడనై, శాశ్వతీః సమాః = శాశ్వతమైన సంవత్సరములు, తిష్ఠేయమ్ = ఉందును. తప్యమానస్య = తపస్సుచేయుచున్న, మే = నాయొక్క, మూర్తయః = అవయవములు, క్షయమ్ = క్షయమును, న యాస్యన్తి = పొందవు.

తా. "తపస్సుచేత నాకు బ్రాహ్మణ్యము లభించువరకును అనేక సంవత్సరములు ఊపిరి విడవక, ఆహారమును పరిత్యజించి ఉండెదను. తపస్సు చేయునంతవరకును నా అవయవములు క్షీణింపవు". 19

మూ. ఏవం వర్షసహస్రస్య దీక్షాం స మునిపుఙ్గవః, 20
చకారాప్రతిమాం లోకే ప్రతిజ్ఞాం రఘునన్దన.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
చతుష్షష్టితమః సర్గః

ప్ర. అ. రఘునన్దన = రామా ! సః = ఆ, మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడు, ఏవమ్ = ఈ విధముగా, లోకే = లోకమునందు, అప్రతిమామ్ = సాటిలేని, వర్ష సహస్రస్య దీక్షామ్ = వేయి సంవత్సరముల దీక్షను గూర్చి, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, చకార = చేసెను.

తా. రామా ! ఆ విశ్వామిత్ర మహాముని, ఇట్లు, లోకములో ఎన్నడును కని విని ఎరుగని విధముగ వేయి సంవత్సరముల పాటు దీక్షను గూర్చి ప్రతిజ్ఞ చేసెను. 20

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో అరువదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చషష్టితమః సర్గః

మూ. అథ హైమవతీం రామ దిశం త్యక్త్వా మహామునిః,
పూర్వాం దిశమనుప్రాప్య తపస్తేపే సుదారుణమ్. 1

ప్ర. అ. రామ = రామా ! అథ = పిమ్మట, మహామునిః=విశ్వామిత్రుడు, హైమవతీమ్ = హిమవత్పర్వతముతో సంబంధించిన, దిశమ్ = దిక్కును, త్యక్త్వా = విడచి, పూర్వాం దిశమ్ = తూర్పు దిక్కును, అనుప్రాప్తః = చేరినవాడై, సుదారుణమ్ = చాల తీవ్ర మైన, తపః = తపస్సును, తేపే = చేసెను.

తా. రామా ! అటుపిమ్మట విశ్వామిత్రమహాముని ఉత్తరదిక్కు విడచి తూర్పుదిక్కునకు వెళ్లి అచట అతితీవ్ర మైన తపస్సు చేసెను. 1

మూ. మౌనం వర్షసహస్రస్య కృత్వా వ్రతమనుత్తమమ్,
చకారాప్రతిమం రామ తపః పరమదుష్కరమ్. 2

ప్ర. అ. రామ = రామా ! వర్షసహస్రస్య = వేయి సంవత్సరముల యొక్క, అనుత్తమమ్ = గొప్ప దైన, మౌనం వ్రతమ్ = మౌనవ్రతమును, కృత్వా = చేసి, అప్రతిమమ్ = సాటి లేని, పరమదుష్కరమ్ = మిక్కిలి చేయ శక్యముకాని, తపః = తపస్సును, చకార = చేసెను.

తా. రామా ! వేయి సంవత్సరముల పాటు చాల గొప్ప దైన మౌన వ్రతము నవలంబించి, చేయ శక్యము కానిదియు, సాటి లేనిదియు అగు తపస్సు చేసెను. 2

మూ. పూర్ణే వర్షసహస్రే తు కాష్ఠభూతం మహామునిమ్,
విఘ్నైర్బహుభిరాధూతం క్రోధో నాన్తర ఆవిశత్, 3
స కృత్వా నిశ్చయం రామ తప ఆతిష్ఠదవ్యయమ్.

ప్ర. అ. వర్షసహస్రే = వేయి సంవత్సరముల కాలము, పూర్ణే=నిండగా, కాష్ఠభూతమ్ = కట్టె వలె అయిన, మహామునిమ్ = మహామునిని, బహుభిః =

అనేక మైన, విఘ్నైః = విఘ్నములచేత, అధూతమ్ = కదల్పి వేయబడినను, క్రోధః = క్రోధము, అన్తరే = హృదయమునందు, న అవిశత్ = ప్రవేశించలేదు. రామ = రామా ! సః = ఆతడు, నిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, అవ్యయమ్ = నాశములేని, తపః = తపస్సును, అతిష్ఠత్ = చేసెను.

తా. వేయి సంవత్సరములు నిండునరికి విశ్వామిత్రుడు కట్టె వలె ఆయెను. ఎన్ని విఘ్నములు వచ్చినను ఆతని మనస్సులో క్రోధము కలుగలేదు. ఆతడు దృఢనిశ్చయముతో నాశము లేని తపస్సు చేసెను. 3

మూ. తస్య వర్షసహస్రస్య వ్రతే పూర్ణే మహావ్రతః, 4
భోక్తుమారబ్ధవానన్నం తస్మిన్ కాలే రఘూత్తమ,
ఇన్ద్రో ద్విజాతిర్భూత్వా తం సిద్ధమన్నమయాచత. 5

ప్ర. అ. రఘూత్తమ = రామా ! తస్య = ఆ, వర్షసహస్రస్య = వేయి సంవత్సరముల, వ్రతే = వ్రతము, పూర్ణే=పూర్ణ మైన దగుచుండగా, మహావ్రతః = గొప్ప నియమము గల ఆ విశ్వామిత్రుడు, అన్నమ్ = అన్నమును, భోక్తుమ్=తినుటకు, ఆరబ్ధవాన్=ప్రారంభించినాడు, తస్మిన్ = ఆ, కాలే = సమయమునందు, ఇన్ద్రః=ఇంద్రుడు, ద్విజాతిః=బ్రాహ్మణుడుగా, భూత్వా = అయి, తమ్=ఆతనిని, సిద్ధమ్ = సిద్ధమై యున్న, అన్నమ్ = అన్నమును, అయాచత=కోరెను.

తా. రామా ! వేయి సంవత్సరముల వ్రతము పూర్తి యైన పిమ్మట, మహావ్రతు డైన విశ్వామిత్రుడు అన్నము తినవలె నని అనుకొనుచుండగా ఇంద్రుడు బ్రాహ్మణ వేషమున వచ్చి, ఆ సిద్ధాన్నమును యాచించెను. 4, 5

మూ. తస్మై దత్త్వా తదా సిద్ధం సర్వం విప్రాయ నిశ్చితః,
నిశ్శేషితేఽన్నే భగవానభుక్త్వైవ మహాతపాః. 6

న కించిదవదద్విప్రం మౌనవ్రతముపస్థితః,
అథ వర్షసహస్రం వై నోచ్ఛ్వసన్మునిపుఙ్గవః. 7

ప్ర. అ. భగవాన్=పూజ్యుడును, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును, మౌనవ్రతమ్=మౌనవ్రతమును, ఉపస్థితః = అవలంబించినవాడును

అగు విశ్వామిత్రుడు, నిశ్చితః=దృఢ నిశ్చయము కలవాడై, తదా=అప్పుడు, సిద్ధమ్=సిద్ధముగా నున్న, సర్వమ్ = ఆ అన్నమునంతను, తస్మై = ఆ, విప్రాయ=బ్రాహ్మణునకు, దత్త్వా=ఇచ్చి, అన్నే = అన్నము, నిశ్శేషితే= శేషములేకుండ భుజింపబడగా, అభుక్త్వైవ = తాను తినకుండగనే ఉండి, విప్రమ్=ఆ బ్రాహ్మణుని గూర్చి, కించిత్=ఏమియు, న అవదత్=పలకలేదు. అథ=అటు పిమ్మట, మునిపుఙ్గవః=ఆ మునిశ్రేష్ఠుడు, వర్షసహస్రం = వేయి సంవత్సరముల పాటు, నోచ్ఛ్వసత్=ఊపిరి పీల్చలేదు.

తా. మౌనవ్రత మవలంబించిన మహాతపఃశాలి యైన ఆ విశ్వామిత్రుడు సిద్ధాన్నము నంతను ఆ బ్రాహ్మణున కిచ్చివేసెను. ఆతడు పూర్తిగా భుజించెను. విశ్వామిత్రుడు భోజనము లేకయే ఉండిపోయెను. ఆ బ్రాహ్మణుని మాత్రము ఏమియు అనలేదు. పిదప వేయి సంవత్సరముల పాటు ఉచ్ఛ్వాసనిఃశ్వాసములను బంధించి తపస్సు చేసెను. 6, 7

మూ. తస్యానుచ్ఛ్వసమానస్య మూర్ధ్ని ధూమో వ్యజాయత,
త్రైలోక్యం యేన సంభ్రాన్తమాదీపితమివాభవత్. 8

ప్ర. అ. అనుచ్ఛ్వసమానస్య=ఊపిరి పీల్చకుండ ఉన్న, తస్య=విశ్వామిత్రుని యొక్క, మూర్ధ్ని=శిరస్సుపై, ధూమః = దూమము, వ్యజాయత = పుట్టెను. యేన=దేనిచేత, త్రైలోక్యమ్=ముల్లోకమును, సంభ్రాన్తమ్ = భయపడినదై, ఆదీపితమివ=కాల్చబడినది వలె, అభవత్=ఆయెను.

తా. విశ్వామిత్రు డా విధముగ ఉచ్ఛ్వాసనిశ్వాసములను బంధించి యుండగా ఆతని శిరస్సునుండి ధూమము బయలుదేరెను. దానిచే ముల్లోకములును దహింపబడి నట్లు అయి భయపడిపోయినవి. 8

మూ. తతో దేవాః సగన్ధర్వాః పన్నగాసురరాక్షసాః,
మోహితాస్తేజసా తస్య తపసా మన్దరశ్మయః, 9
కశ్మలోపహతాస్సర్వే పితామహమథాబ్రువన్.

ప్ర. అ. తతః=పిమ్మట, దేవాః=దేవతలును, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, పన్నగాసురరాక్షసాః = పన్నగులు, అసురులు రాక్షసులును, తస్య=

ఆతని యొక్క, తేజసా = తేజస్సుచేత, మోహితాః=మోహితులై తపసా= తపస్సుచేత, మన్దరశ్మయః=మంద మైన కాంతి గలవారై, కశ్మలోపహతాః= దుఃఖముచే పీడితులై, అథ=పిమ్మట, సర్వే=అందరును, పితామహమ్=బ్రహ్మ దేవుని గూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. అపుడు దేవగంధర్వ పన్నగాసుర రాక్షసులు ఆ విశ్వామిత్రుని తేజస్సుచే తెలివి తప్పినవారై, ఆతని తపస్సుచే కాంతి తొలగినవారై, పీడితులై బ్రహ్మవద్దకు వెళ్లి ఇట్లు పలికిరి. 9

మూ. బహుభిః కారణైర్దేవ విశ్వామిత్రో మహామునిః, 10
లోభితః క్రోధితశ్చైవ తపసా చాభివర్ధతే.

ప్ర. అ. దేవ=బ్రహ్మదేవా ! మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, బహుభిః=అనేక మైన, కారణైః = కారణములచేత, లోభితః = లోభపెట్టబడినను, క్రోధితశ్చైవ = కోపపెట్టబడినను, తపసా = తపస్సుచే, అభివర్ధతే=వృద్ధిపొందుచునే ఉన్నాడు.

తా. ప్రభూ ! ఈ విశ్వామిత్ర మహామునిని అనేక విధముల లోభపెట్టినను, కోపము కలిగించినను, ఈతని తపస్సు వృద్ధిపొందుచునే ఉన్నది. 10

మూ. న హ్యస్య వృజినం కించిద్దృశ్యతే సూక్ష్మమప్యథ, 11
న దీయతే యది త్వస్య మనసా యదభీప్సితమ్,
వినాశయతి త్రైలోక్యం తపసా సచరాచరమ్. 12

ప్ర. అ. అథ=ఇంక, అస్య=ఈతని యొక్క, సూక్ష్మమపి = సూక్ష్మ మైన దైనను, వృజినమ్=పాపము, కించిత్=ఏదియు, న దృశ్యతే=కనబడుట లేదు. అస్య=ఇతని యొక్క, మనసా=మనస్సుచేత, యత్=ఏది, అభీప్సితమ్= కోరబడినదో అది, న దీయతే యది=ఇవ్వబడక పోయినచో, తపసా=తపస్సుచేత, సచరాచరమ్=చరాచరములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడు లోకములను, వినాశయతి=నశింపచేయును.

తా. ఈతనిలో కొంచె మైనను పాపము కనబడుటలేదు. ఈతడు కోరిన

వరము నీయకున్నచో తపస్సుచేత చరాచరాత్మక మగు లోకత్రయమును దహించివేయగలడు. 12

మూ. వ్యాకులాశ్చ దిశః సర్వా న చ కించిత్ప్రకాశతే,
సాగరాః క్షుభితాః సర్వే విశీర్యన్తే చ పర్వతాః. 13

ప్ర. అ. సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులు, వ్యాకులాః=వ్యాకులమైనవి. కించిత్=ఏమియు, న ప్రకాశతే=ప్రకాశించుటలేదు. సర్వే = సమస్తమైన, సాగరాః=సాగరములు, క్షుభితాః=క్షోభపడుచున్నవి. పర్వతాః=పర్వతములు, విశీర్యన్తే=బ్రద్దలగుచున్నవి.

తా. దిక్కు లన్నియు వ్యాకుల మైనవి. ఏమియు ప్రకాశించుటలేదు. సాగరములు క్షోభ చెందుచున్నవి. పర్వతములు బ్రద్ద లగుచున్నవి. 13

మూ. ప్రకమ్పతే చ పృథివీ వాయుర్వాతి భృశాకులః,
బ్రహ్మన్న ప్రతిజానీమో నాస్తికో జాయతే జనః. 14

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రహ్మదేవా! పృథివీ చ = భూమి కూడ, ప్రకమ్పతే=కంపించుచున్నది. వాయుః = వాయువు, భృశాకులః = వ్యాకులమైనదై, వాతి=వీచుచున్నది. న ప్రతిజానీమః=ఏమి చేయవలెనో తెలియజాలకున్నాము. జనః=జనులు, నాస్తికః=నాస్తికులుగా, జాయతే=అగుచున్నారు.

తా. బ్రహ్మదేవా! భూమి కంపించుచున్నది. వాయువు చాల వ్యాకులముగ వీచుచున్నది. జనులందరును నాస్తికు లగుచున్నారు. మా కేమియు తోచకున్నది. 14

మూ. సంమూఢమివ త్రైలోక్యం సంప్రక్షుభితమానసమ్,
భాస్కరో నిష్ప్రభశ్చైవ మహర్షేస్తస్య తేజసా. 15

ప్ర. అ. త్రైలోక్యమ్=మూడు లోకముల సముదాయము, సంప్రక్షుభితమానసమ్=క్షోభచెందిన మనస్సు కలదై, సంమూఢమివ = మూర్ఛ పొందినట్లున్నది. తస్య మహర్షేః = ఆ మహర్షియొక్క, తేజసా = తేజస్సుచేత, భాస్కరశ్చ=సూర్యుడు కూడ, నిష్ప్రభః=కాంతి విహీనుడుగా ఉన్నాడు.

తా. క్షోభించిన మనస్సుతో మూడు లోకములును మార్పు చెంది నట్లున్నవి. ఆ మహర్షి తేజస్సుచేత సూర్యుడు కాంతివిహీను డైనాడు. 15

మూ. బుద్ధిం న కురుతే యావన్నాశే దేవ మహామునిః,
తావత్ప్రసాద్యో భగవానగ్నిరూపో మహాద్యుతిః. 16

ప్ర. అ. దేవ = దేవా! మహామునిః = ఈ మహాముని. నాశే = మూడు లోకములను నశింపచేయుటయందు, యావత్ = ఎంతలో, బుద్ధిం న కురుతే = నిర్ణయము చేయడో, తావత్ = అంతలో, అగ్నిరూపః = అగ్నితుల్యుడును, మహాద్యుతిః = గొప్ప కాంతికలవాడును అగు, భగవాన్ = ఈ పూజ్యుడైన విశ్వామిత్రుడు, ప్రసాద్యః = సంతోషింపచేయదగినవాడు.

తా. అగ్నితుల్యుడును, మహాకాంతిమంతుడును అగు ఈ పూజ్యు డైన్ మహాముని లోకత్రయనాశము చేయ నిర్ణయించుటకు ముందుగా ఇతనికి కోరిన వరము లిచ్చి ప్రసన్నుని చేయుము. 16

మూ. కాలాగ్నినా యథా పూర్వం త్రైలోక్యం దహ్యతేఽఖిలమ్,
దేవరాజ్యం చికీర్షేత దీయతామస్య యన్మతమ్. 17

ప్ర. అ. అఖిలమ్ = సమస్తమైన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, పూర్వమ్ = పూర్వము, కాలాగ్నినా = కాలాగ్నిచేత, యథా = ఎట్లు దహింపబడెనో, అట్లు, దహ్యతే = దహింపబడుచున్నది. దేవరాజ్యమ్ = దేవ రాజ్యమును, చికీర్షేత (యది) చేయదలచినట్లైతే, అస్య = ఇతనికి, యత్ = ఏది, మతమ్ = ఇష్టమో అది, దీయతామ్ = ఇవ్వబడుగాక.

తా. ముల్లోకములును, పూర్వము ప్రలయాగ్నిచే దహింపబడినట్లు దహింపబడుచున్నవి. ఇతడు దేవలోకరాజ్యము చేయ వలె నని కోరినను ఈతని కేది కావలెనో అది ఇమ్ము. 17

మూ. తతః సురగణాః సర్వే పితామహపురోగమాః,
విశ్వామిత్రం మహాత్మానం మధురం వాక్యమబ్రువన్. 18

ప్ర. అ. తతః = పిమ్మట, పితామహపురోగమాః = బ్రహ్మదేవుడు మొదలైన, సర్వే = సమస్తమైన, సురగణాః = దేవతలు, మహాత్మానమ్ = మహాత్ముడైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చి, మధురమ్ = మధురమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట బ్రహ్మదేవుడు మొదలగు దేవత లందరును మహాత్ముడైన విశ్వామిత్రునితో మధుర మైన వాక్యము పలికిరి. 18

మూ. బ్రహ్మర్షే స్వాగతం తేఽస్తు తపసా స్మ సుతోషితాః,
బ్రాహ్మణ్యం తపసోగ్రేణ ప్రాప్తవానసి కౌశిక. 19

ప్ర. అ. బ్రహ్మర్షే = ఓ బ్రహ్మర్షీ ! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము, అస్తు = అగుగాక, తపసా = తపస్సుచేత, సుతోషితాః = బాగుగా సంతోషపెట్ట బడినవారము, స్మః = అయినాము. కౌశిక = విశ్వామిత్రా, ఉగ్రేణ = ఉగ్ర మైన, తపసా = తపస్సుచేత, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణత్వమును, ప్రాప్తవాన్ = పొందినవాడవు, అసి = అయితివి.

తా. ఓ బ్రహ్మర్షీ ! నీకు స్వాగత మగుగాక. నీ తపస్సుచేత చాల సంతోషించినాము. ఓ విశ్వామిత్రా ! ఉగ్రమైన తపస్సుచేత బ్రాహ్మణత్వమును పొందితివి. 19

మూ. దీర్ఘమాయుశ్చ తే బ్రహ్మన్ దదామి సమరుద్గణః,
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గచ్ఛ సౌమ్య యథాసుఖమ్. 20

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణా ! సమరుద్గణః = దేవతాగణములతో కూడిన నేను, తే = నీకు, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుశ్చ = ఆయుర్దాయమును కూడ, దదామి = ఇచ్చుచున్నాను. స్వస్తి = క్షేమమును, ప్రాప్నుహి = పొందుము. తే = నీకు, భద్రమ్ = భద్ర మగుగాక. సౌమ్య = ఓ సౌమ్యుడా ! యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్లుము.

తా. ఓ బ్రాహ్మణా ! దేవతాగణములతో కూడిన నేను నీకు దీర్ఘాయుర్దాయము కూడ ఇచ్చుచున్నాను. క్షేమమును పొందుము. నీకు భద్ర మగును. ఓ సౌమ్యుడా ! నీకు సుఖము కలుగువిధముగ సంచరించుము. 20

మూ. పితామహవచః శ్రుత్వా సర్వేషాం చ దివౌకసామ్,
కృత్వా ప్రణామం ముదితో వ్యాజహార మహామునిః. 21

ప్ర. అ. మహామునిః = విశ్వామిత్రమహాముని, పితామహవచః = బ్రహ్మ యొక్క వచనమును, సర్వేషామ్ = సమస్త మైన, దివౌకసాం చ = దేవతల వచనమును, శ్రుత్వా = విని, ముదితః = సంతసించినవాడై, ప్రణామమ్ = నమస్కారమును, కృత్వా = చేసి, వ్యాజహార = పలికెను.

తా. విశ్వామిత్రుడు బ్రహ్మాదిదేవతల మాటలు విని, సంతసించి, నమస్కరించి ఇట్లు పలికెను. 21

మూ. బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘమాయు స్తథైవ చ,
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయన్తు మామ్. 22

ప్ర. అ. మే = నాకు, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణ్యము, ప్రాప్తం యది = లభించినట్లైతే, తథైవ చ = మరియు, దీర్ఘమ్ = దీర్ఘ మైన, ఆయుశ్చ = ఆయుర్దాయము కూడ లభించినట్లైతే, ఓంకారశ్చ = ఓంకారము, వషట్కారశ్చ = వషట్కారము, వేదాశ్చ = వేదములును, మామ్ = నన్ను, వరయన్తు = వరించుగాక.

తా. నాకు బ్రాహ్మణత్వము, దీర్ఘాయుర్దాయము లభించినచో, ఓంకార వషట్కారములును, వేదములును నన్ను వరించుగాక. నాకు వేదములను ఇతరులకు బోధించు అధికారము, యజ్ఞయాగాదులు చేయించు అధికారము లభించుగాక. 22

మూ. క్షత్రవేదవిదాం శ్రేష్ఠో బ్రహ్మవేదవిదామపి,
బ్రహ్మపుత్రో వసిష్ఠో మామేవం వదతు దేవతాః. 23
యద్యయం పరమః కామః కృతో యాన్తు సురర్షభాః.

ప్ర. అ. దేవతాః = దేవతలారా ! క్షత్రవేదవిదామ్ = క్షత్రియులకు యోగ్యములైన ధనుర్వేదాదివిద్యల నెరిగినవారిలోను, బ్రహ్మవేదవిదామపి = బ్రాహ్మణులకు యోగ్యము లైన వేదములను ఎరిగినవారిలోను, శ్రేష్ఠః = శ్రేష్ఠ

డును, బ్రహ్మపుత్రః = బ్రహ్మపుత్రుడును అయిన, వసిష్ఠః = వసిష్ఠుడు, మామ్= నన్ను గూర్చి, ఏవమ్ = ఇట్లు, వదతు = పలుకుగాక. అయమ్=ఈ, పరమః= గొప్పదైన, కామః = కోరిక, కృతః యది = చేయబడినట్లైతే, సురర్షభాః = సుర శ్రేష్ఠులైన మీరు, యాన్తు = వెళ్లుదురుగాక.

తా. క్షత్రియుల విద్యలను బ్రాహ్మణుల వేదములను ఎరిగినవారిలో శ్రేష్ఠుడును, బ్రహ్మపుత్రుడును అగు వసిష్ఠుడు నన్ను బ్రహ్మర్షి యని అంగీకరించుగాక. నాకీ శ్రేష్ఠమైన వరమును ఇచ్చినచో మీరందరు వెళ్లవచ్చును. 23

మూ. తతః ప్రసాదితో దేవైర్వసిష్ఠో జపతాం వరః, 24
సఖ్యం చకార బ్రహ్మర్షి రేవమస్త్వితి చాబ్రవీత్.

ప్ర. అ. తతః = పిమ్మట, దేవైః = దేవతలచేత, ప్రసాదితః = అనుగ్రహింపచేసికొనబడిన, జపతాం వరః = మునులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, సఖ్యమ్ = స్నేహమును, చకార = చేసెను. ఏవమ్ = ఇట్లు, బ్రహర్షిః = బ్రహ్మర్షి, అస్తు = అగుగాక, ఇతి = అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. పిమ్మట దేవతలు బ్రతిమాలుకొనగా వసిష్ఠమహాముని వచ్చి, విశ్వామిత్రునితో మైత్రి చేసికొని, 'నీవు బ్రహ్మర్షివి' అని పలికెను. 24

మూ. బ్రహ్మర్షిస్త్వం న సన్దేహః సర్వం సంపత్స్యతే తవ, 25
ఇత్యుక్త్వా దేవతాశ్చాపి సర్వా జగ్ముర్యథాగతమ్.

ప్ర. అ. త్వమ్ = నీవు, బ్రహ్మర్షిః = బ్రహ్మర్షివి. సన్దేహః=సందేహము, న = లేదు. తవ = నీకు, సర్వమ్ = అంతయు, సంపత్స్యతే = సిద్ధించును. ఇతి= ఇట్లు, ఉక్త్వా=పలికి, సర్వాః=సమస్తమైన, దేవతాః=దేవతలు, యథాగతమ్= వచ్చినట్లుగనే, జగ్ముః = వెళ్లిరి.

తా. "నీవు బ్రహ్మర్షివే. సందేహము లేదు. నీకు అన్నియు సమకూరును" అని పలికి దేవత లందరును వచ్చిన దారినే వెళ్లిపోయిరి. 25

మూ. విశ్వామిత్రోఽపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రాహ్మణ్యముత్తమమ్, 26
పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాం వరమ్.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, విశ్వామిత్రోఽపి = విశ్వామిత్రుడు కూడా, ఉత్తమమ్ = ఉత్తమ మైన, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణ్యమును, లబ్ధ్వా = పొంది, బ్రహ్మర్షిమ్ = బ్రహ్మర్షియు, జపతామ్ = జపము చేయువారిలో, వరమ్= శ్రేష్ఠుడును అగు, వసిష్ఠమ్ = వసిష్ఠుని, పూజయామాస = పూజించెను.

తా. ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు ఉత్తమ మైన బ్రాహ్మణ్యమును సంపాదించి, బ్రహ్మర్షి యైన వసిష్ఠమహామునిని పూజించెను. 26

మూ. కృతకామో మహీం సర్వాం చచార తపసి స్థితః. 27
ఏవం త్వనేన బ్రాహ్మణ్యం ప్రాప్తం రామ మహాత్మనా.

ప్ర. అ. కృతకామః = చేయబడిన కోరికకలవాడై, తపసి = తపస్సునందు, స్థితః = ఉన్నవాడై, సర్వామ్ = సమస్త మైన, మహీమ్ = భూమిని, చచార = సంచరించెను. రామ = రామా ! మహాత్మనా = మహాత్ముడైన, అనేన= ఇతనిచేత, ఏవమ్= ఈ విధముగా, బ్రాహ్మణ్యమ్=బ్రాహ్మణత్వము, ప్రాప్తమ్= పొందబడినది.

తా. విశ్వామిత్రు డీ విధముగ కోరికను తీర్చుకొని, తపస్సు అచరించుచు భూమండలము నంతను సంచరించెను. రామా ! ఈ మహాత్ముడు బ్రాహ్మణత్వమును ఈ విధముగ సంపాదించుకొనెను. 27

మూ. ఏష రామ మునిశ్రేష్ఠ ఏష విగ్రహవాం స్తపః, 28
ఏష ధర్మపరో నిత్యం వీర్యస్యైష పరాయణమ్.

ప్ర. అ. రామ = రామా ! ఏషః = ఇతడు, మునిశ్రేష్ఠః = మునులలో శ్రేష్ఠుడు. ఏషః = ఇతడు, విగ్రహవాన్ = శరీరము గల, తపః = తపస్సు. ఏషః= ఇతడు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ధర్మపరః = ధర్మమునందాసక్తి గలవాడు. ఏషః= ఇతడు, వీర్యస్య=పరాక్రమమునకు, పరాయణమ్=గొప్పస్థానము.

తా. రామా ! ఈతడు మునులలో శ్రేష్ఠుడు. ఇతడు మూర్తీభవించిన తపస్సు. ఇతడు ఎల్లప్పుడును ధర్మపరుడు. ఇతడు వీర్యమునకు నివాసస్థానము. 28

మూ. ఏవముక్త్వా మహాతేజా విరరామ ద్విజోత్తమః, 29
శతానన్దవచః శ్రుత్వా రామలక్ష్మణసన్నిధౌ,
జనకః ప్రాఞ్జలిర్వాక్యమువాచ కుశికాత్మజమ్. 30

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ద్విజోత్తమః=ద్విజశ్రేష్ఠుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, విరరామ=విరమించెను. జనకః=జనకమహారాజు, రామలక్ష్మణసన్నిధౌ = రామలక్ష్మణుల సమీపమునందు, శతానన్దవచః = శతానందుని వాక్యమును, శ్రుత్వా=విని, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలికలవాడై, కుశికాత్మజమ్=విశ్వామిత్రుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మహాతేజశ్శాలి యగు శతానందుడు ఈ విధముగా పలికి ఊరకుండెను. రామలక్ష్మణులతో శతానందుడు చెప్పిన మాటలు విని జనకమహారాజు, చేతులు జోడించి విశ్వామిత్రునితో ఇట్లనెను. 29, 30

మూ. ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుఙ్గవ,
యజ్ఞం కాకుత్స్థ సహితః ప్రాప్తవానసి ధార్మిక. 31

ప్ర. అ. ధార్మిక = ధర్మాత్ముడా ! మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠుడా ! కాకుత్స్థసహితః=రామలక్ష్మణసమేతుడవై, యస్య=ఏ, మమ = నాయొక్క, యజ్ఞమ్ = యజ్ఞమును గూర్చి, ప్రాప్తవాన్ అసి = వచ్చినావో అట్టినేను, ధన్యః అస్మి = ధన్యుడ నైతిని. అనుగృహీతః = అనుగ్రహింపబడినవాడను, అస్మి= అయితిని.

తా. ధార్మికుడ వైన ఓ మునిపుంగవా ! రామలక్ష్మణసమేతుడవై నా యజ్ఞమునకు వచ్చితివి; నేను ధన్యుడ నైతిని. అనుగ్రహపాత్రుడ నైతిని. 31

మూ. పావితోఽహం త్వయా బ్రహ్మన్ దర్శనేన మహామునే,
గుణా బహువిధాః ప్రాప్తాస్తవ సందర్శనాన్మయా. 32

ప్ర. అ. మహామునే = ఓ మహామునీ ! బ్రహ్మన్ = బ్రాహ్మణోత్తమా ! త్వయా=నీచేత, దర్శనేన=దర్శనముచేతనే, అహమ్ = నేను, పావితః=పవిత్రింపచేయబడితిని. తవ=నీయొక్క, సందర్శనాత్=దర్శనమువలన, మయా=

నాచేత, బహువిధాః=అనేకవిధము లైన, గుణాః=గుణములు, ప్రాప్తాః=పొంద బడినవి.

తా. బ్రాహ్మణోత్తముడ వైన ఓ మహామునీ! నీ దర్శనముచే నేను పవి త్రుడ నైతిని. నీ దర్శనమువలన నేను అనేకవిధము లగు లాభములను పొందితిని. 32

మూ. విస్తరేణ చ తే బ్రహ్మన్ కీర్త్యమానం మహత్తపః,
శ్రుతం మయా మహాతేజో రామేణ చ మహాత్మనా. 33

ప్ర. అ. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా! బ్రహ్మన్=బ్రాహ్మణో త్తమా! విస్తరేణ=సవిస్తరముగా, కీర్త్యమానమ్=చెప్పబడుచున్న, తే=నీయొక్క, మహత్=గొప్ప, తపః=తపస్సు, మయా = నాచేతను, మహాత్మనా=మహాత్ము డైన, రామేణ=రామునిచేతను, శ్రుతమ్=వినబడినది.

తా. మహాతేజశ్శాలి వైన ఓ బ్రహ్మర్షీ! నీ తపస్సును గూర్చి సవిస్త రముగ వర్ణించి శతానందుడు చెప్పగా నేనును, మహాత్ము డైన రాముడును వింటిమి. 33

మూ. సదస్యైః ప్రాప్య చ సదః శ్రుతాస్తే బహవో గుణాః,
అప్రమేయం తపస్తుభ్యమప్రమేయం చ తే బలమ్, 34
అప్రమేయా గుణాశ్చైవ నిత్యం తే కుశికాత్మజ.

ప్ర. అ. సదస్యైః = సభ్యులచేత, సదః = యజ్ఞవాటికను, ప్రాప్య = పొంది, తే = నీయొక్క, బహవః=అనేక మైన, గుణాః=గుణములు, శ్రుతాః= వినబడినవి. తుభ్యమ్ = నీయొక్క, తపః = తపస్సు, అప్రమేయమ్ = కొలత లేనిది. తే = నీయొక్క, బలమ్ = బలము, అప్రమేయమ్ = కొలవశక్యము కానిది. కుశికాత్మజ = విశ్వామిత్రా! తే = నీయొక్క, గుణాశ్చైవ = గుణములు కూడ, నిత్యమ్ = నిత్యము, అప్రమేయాః = కొలవశక్యము కానివి.

తా. యజ్ఞసభలో ఉన్న సదస్యు లందరును నీ గుణములను వినిరి. ఓ విశ్వామిత్రా! నీ తపస్సు, నీ బలము, నీ గుణములును కొలతకు అందనివి. 34

మూ. తృప్తిరాశ్చర్యభూతానాం కథానాం నాస్తి మే విభో, 35
కర్మకాలో మునిశ్రేష్ఠ లమ్బతే రవిమణ్డలమ్.

ప్ర. అ. విభో = ప్రభూ ! ఆశ్చర్యభూతానామ్ = ఆశ్చర్యకరము లైన, కథానామ్ = కథల విషయమున, మే = నాకు, తృప్తిః = తృప్తి, నాస్తి = లేదు. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠుడా ! రవిమణ్డలమ్ = సూర్యమండలము, లమ్బతే = వ్రేలాడుచున్నది. కర్మకాలః = కర్మానుష్ఠానకాలము (సమీపించినది).

తా. మహాత్మా ! ఆశ్చర్యకరము లైన నీ కథలను వినుచుండగా తృప్తి కలుగుట లేదు. ఓ మునిశ్రేష్ఠా ! సూర్యుడస్తాద్రికి పోవుచున్నాడు. కర్మకాలము సమీపించుచున్నది. 35

మూ. శ్వః ప్రభాతే మహాతేజో ద్రష్టుమర్హసి మాం పునః, 36
స్వాగతం తపతాం శ్రేష్ఠ మామనుజ్ఞాతుమర్హసి.

ప్ర. అ. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా ! శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలమున, మామ్ = నన్ను, పునః = మరల, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హసి = తగియున్నావు. తపతామ్ = తపస్సు చేసేవారిలో, శ్రేష్ఠ = శ్రేష్ఠుడా ! స్వాగతమ్ = నీకు స్వాగతము. మామ్ = నన్ను, అనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగియున్నావు.

తా. గొప్ప తేజస్సు గల మునిశ్రేష్ఠుడా ! రేపు ప్రాతఃకాలమున మరల నన్ను చూడుము (నా వద్దకు రమ్ము). నీకు స్వాగతము. నాకు అనుజ్ఞ 36

మూ. ఏవముక్తో మునివరః ప్రశస్య పురుషర్షభమ్, 37
విససర్జాశు జనకం ప్రీతం ప్రీతమనాస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మునివరః = మునిశ్రేష్ఠుడు, ప్రీతమనాః = సంతోషించిన మనస్సు కలవాడై, ప్రీతమ్ = సంతసించిన, పురుషర్షభమ్ = పురుషశ్రేష్ఠు డైన, జనకమ్ = జనకుని, ప్రశస్య = ప్రశంసించి, ఆశు = శీఘ్రముగా, విససర్జ = విడచెను.

తా. జనకుడిట్లు పలుకగా సంతసించిన ఆ మహాముని, సంతోష యుక్తు డైన ఆ పురుషశ్రేష్ఠు డగు దశరథుని ప్రశంసించి, వెంటనే ఆతనికి వెళ్లుటకు అనుజ్ఞ ఇచ్చెను. 37

మూ ఏవముక్త్వా మునిశ్రేష్ఠం వైదేహో మిథిలాధిపః, 38
ప్రదక్షిణం చకారాశు సోపాధ్యాయః సబాన్ధవః.

ప్ర. అ. వైదేహః = విదేహదేశాధిపతి యైన, మిథిలాధిపః=మిథిలానగర రాజు, మునిశ్రేష్ఠమ్ = ఆ మునిశ్రేష్ఠుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సోపాధ్యాయః = ఉపాధ్యాయునితో కూడినవాడై, సబాన్ధవః = బంధువులతో కూడినవాడై, ఆశు = శీఘ్రముగా, ప్రదక్షిణం చకార = ప్రదక్షిణము చేసెను.

తా. జనకమహారాజు ఆ మహామునితో ఇట్లు పలికి ఆతనికి ప్రదక్షిణ నమస్కారములు చేసెను. ఆతని ఉపాధ్యాయులును. బంధువులును కూడ విశ్వామిత్రునకు ప్రదక్షిణ నమస్కారములు చేసిరి. 38

మూ. విశ్వామిత్రోఽపి ధర్మాత్మా సహరామః సలక్ష్మణః, 39
స్వవాటమభిచక్రామ పూజ్యమానో మహర్షిభిః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, విశ్వామిత్రోఽపి = విశ్వామిత్రుడు కూడ, సహరామః = రామునితో కూడినవాడై, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, మహర్షిభిః = మహర్షులచే, పూజ్యమానః = పూజింపబడుచున్నవాడై, స్వవాటమ్ = తన నివాసస్థానమును గూర్చి, అభిచక్రామ = నడచెను.

తా. ధర్మాత్ము డగు విశ్వామిత్రుడు రామలక్ష్మణసమేతుడై, మహర్షులు పూజింప తన నివాసస్థానమునకు వెళ్లెను. 39

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
అరువదియైదవ సర్గ సమాప్తము.

## అథ షట్షష్టితమః సర్గః

మూ. తతః ప్రభాతే విమలే కృతకర్మా నరాధిపః,
విశ్వామిత్రం మహాత్మానమాజుహావ సరాఘవమ్. 1

ప్ర. అ. **తతః** = పిమ్మట, విమలే = తెల్లవారిన, ప్రభాతే = ప్రాతః కాలమునందు, నరాధిపః = రాజు, కృతకర్మా = చేయబడిన ప్రాతఃకాలకృత్యములు కలవాడై, నరాఘవమ్ = రాఘవులతో కూడిన, మహాత్మానమ్ = మహాత్ముడైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని, ఆజుహావ = పిలచెను.

తా. తెల్లవారిన పిమ్మట జనకమహారాజు ప్రాతఃకాలకృత్యములను దీర్చుకొని, రామలక్ష్మణసమేతు డైన, మహాత్ము డైన విశ్వామిత్రుని పిలిపించెను. 1

మూ. తమర్చయిత్వా ధర్మాత్మా శాస్త్రదృష్టేన కర్మణా,
రాఘవౌ చ మహాత్మానౌ తదా వాక్యమువాచ హ. 2

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన జనకుడు, తమ్ = ఆ విశ్వామిత్రుని, మహాత్మానౌ = మహాత్ము లైన, రాఘవౌ చ = రామలక్ష్మణులను, శాస్త్రదృష్టేన = శాస్త్రమునందు చూడబడిన, కర్మణా = కర్మచేత, అర్చయిత్వా = పూజించి, తదా = అప్పుడు, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. జనకుడు, విశ్వామిత్రుని, రామలక్ష్మణులను యథావిధిగ పూజించి ఇట్లు పలికెను. 2

మూ. భగవన్ స్వాగతం తేఽస్తు కిం కరోమి తదానఘ,
భవానాజ్ఞాపయతు మామాజ్ఞాప్యో భవతా హ్యాహమ్. 3

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము, అస్తు = అగుగాక. అనఘ = పాపములు లేనివాడా ! తవ = నీకు, కిమ్ = ఏమి, కరోమి = చేయుదును ? భవాన్ = నీవు, మామ్ = నన్ను, ఆజ్ఞాపయతు =

ఆజ్ఞాపింతువుగాక. అహమ్ = నేను, భవతా = నీచేత, ఆజ్ఞవ్యః హి = ఆజ్ఞాపింపదగినవాదను కదా.

తా. పూజ్యుడా! నీకు స్వాగత మగుగాక. పాపరహితుడా! నీ కేమి చేయుదును? నేను నీచే ఆజ్ఞాపింపదగినవాడను. ఆజ్ఞాపింపుము. 3

మూ. ఏవముక్తస్స ధర్మాత్మా జనకేన మహాత్మనా,
ప్రత్యువాచ మునిర్వీరం వాక్యం వాక్యవిశారదః. 4

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముఁడైన, జనకేన = జనకునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముఁడైన, వాక్యవిశారదః = మాటలలో నేర్పు గల, సః = ఆ, మునిః = విశ్వామిత్రుడు, వీరమ్ = ఆ వీరుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మహాత్ముఁడగు జనకుని మాటలు విని, ధర్మాత్ముఁడును మాటలలో నేర్పరియు అగు ఆ విశ్వామిత్రుడిట్లు పలికెను. 4

మూ పుత్రౌ దశరథస్యేమౌ క్షత్రియౌ లోకవిశ్రుతౌ,
ద్రష్టుకామౌ ధనుః శ్రేష్ఠం యదేతత్త్వయి తిష్ఠతి. 5

ప్ర. అ. దశరథస్య = దశరథునియొక్క, పుత్రౌ = పుత్రులును, క్షత్రియౌ = క్షత్రియులును, లోకవిశ్రుతౌ = లోకములో ప్రసిద్ధులును అగు, ఇమౌ = వీరిరువురు, యత్ = ఏ, ధనుఃశ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన ధనస్సు, త్వయి = నీయందు, తిష్ఠతి = ఉన్నదో, ఏతత్ = దానిని, ద్రష్టుకామౌ = చూడ కోరిక గలవారు.

తా. దశరథుని పుత్రులును, క్షత్రియులును, లోకప్రసిద్ధులును అగు ఈ రామలక్ష్మణులు నీవద్ద నున్న శ్రేష్ఠమైన ధనస్సును చూడ దలచుచున్నారు. 5

మూ. ఏతద్దర్శయ భద్రం తే కృతకామౌ నృపాత్మజౌ,
దర్శనాదస్య ధనుషో యథేష్టం ప్రతియాస్యతః. 6

ప్ర. అ. ఏతత్ = ఈ ధనస్సును, దర్శయ = చూపుము. తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక. అస్య = ఈ, ధనుషః = ధనస్సు యొక్క, దర్శ నాత్ = దర్శనమువలన, కృతకామౌ = తీరిన కోరిన గలవారై, నృపాత్మజౌ = ఈ రాజకుమారులు, యథేష్టమ్ = ఇష్టమువచ్చి నట్లుగా, ప్రతియాస్యతః = తిరిగి వెళ్లగలరు.

తా. ఆ ధనస్సును చూపుము. నీకు భద్ర మగుగాక. ఈ రాజకుమారులు దానిని చూచి, కోరిక తీరినవారై వారి ఇష్టము ప్రకారము తిరిగి వెళ్లెదరు. 6

మూ. ఏవముక్తస్తు జనకః ప్రత్యువాచ మహామునిమ్,
శ్రూయతామస్య ధనుషో యదర్థమిహ తిష్ఠతి. 7

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, జనకుడు, మహా మునిమ్ = మహామునిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. ఇహ = ఇచట, యదర్థమ్ = ఎందు నిమిత్తమై, తిష్ఠతి = ఉన్నదో, అస్య = ఈ, ధనుషః = ధనస్సునకు సంబంధించిన ఆ వృత్తాంతము, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. విశ్వామిత్రుని మాటలు విని జనకు డీవిధముగ ప్రతివచనము పలి కెను. "ఈ ధనస్సు ఇచట ఎందువలన ఉన్నదో ఆ వృత్తాంతమును చెప్పెదను, వినుము. 7

మూ. దేవరాత ఇతి ఖ్యాతో నిమేః షష్ఠో మహీపతిః,
న్యాసోఽయం తస్య భగవన్ హస్తే దత్తో మహాత్మనా. 8

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! నిమేః = నిమినుండి, షష్ఠః = ఆరవ వాడైన, దేవరాతః ఇతి = దేవరాతు డని, ఖ్యాతః = ప్రసిద్ధు డైన, మహీపతిః = రాజు (ఉండెను). నః అయమ్ = ఆ యీ ధనస్సు, తస్య = ఆ రాజుయొక్క, హస్తే = హస్తమునందు, న్యాసః = దాచి మరల ఇవ్వవలసిన వస్తువుగా, మహాత్మనా = మహాత్ము డైన శివునిచేత, దత్తః = ఇవ్వబడినది.

తా. ఈ ధనస్సును మహాత్ము డైన శివుడు నిమిచక్రవర్తికి ఆరవవా డైన దేవరాతు డనెడు రాజువద్ద న్యాసముగా ఉంచెను. 8

మూ. దక్షయజ్ఞవధే పూర్వం ధనురాయమ్య వీర్యవాన్,
రుద్రస్తు త్రిదశాన్ రోషాత్సలీలమిదమబ్రవీత్. 9

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, దక్షయజ్ఞవధే=దక్షయజ్ఞవినాశము చేయు సమయమున, వీర్యవాన్=పరాక్రమవంతు డైన, రుద్రః=రుద్రుడు, ధనుః= ధనస్సును, ఆయమ్య = వంచి, త్రిదశాన్=దేవతలను గూర్చి, రోషాత్=కోపము వలన, సలీలమ్=విలాసముతో కూడినట్లుగా, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పూర్వము దక్షయజ్ఞధ్వంస చేయుచు వీర్యవంతు డైన రుద్రుడు ధనస్సును వంచి, కుపితుడై దేవతలతో ఇట్లనెను. 9

మూ. యస్మాద్భాగార్థినో భాగాన్నాకల్పయత మే సురాః,
వరాఙ్గాణి మహార్హాణి ధనుషా శాతయామి వః. 10

ప్ర. అ. సురాః = దేవతలారా ! భాగార్థినః = యజ్ఞభాగమును కోరుచున్న, మే = నాకు, యస్మాత్ = ఏ కారణమువలన, భాగాన్ = భాగములను, నాకల్పయత = కల్పింపలేదో, అందువలన, వః = మీ యొక్క, మహార్హాణి = విలువైన, వరాఙ్గాణి = శ్రేష్ఠ మైన అవయవములను, ధనుషా = ఈ ధనస్సుతో, శాతయామి = ఖండించెదను.

తా. దేవతలారా ! యజ్ఞభాగముల నపేక్షించుచున్న నాకు మీరు యజ్ఞభాగములను కల్పింపలేదు గాన ఈ ధనస్సుతో మీ శిరస్సులను ఖండించెదను. 10

మూ. తతో విమనసః సర్వే దేవా వై మునిపుఙ్గవ,
ప్రసాదయన్తి దేవేశం తేషాం ప్రీతోఽభవద్భవః. 11

ప్ర. అ. మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠా ! తతః = పిమ్మట, సర్వే = సమస్తమైన, దేవాః=దేవతలు, విమనసః=వ్యాకుల మైన మనస్సు కలవారై, దేవేశమ్= దేవేశు డైన శివుని, ప్రసాదయన్తి = అనుగ్రహింపచేసికొనిరి. భవః = శివుడు, తేషామ్ = వారి విషయమున, ప్రీతః = సంతసించినవాడు, అభవత్ = ఆయెను.

తా. మహామునీ! పిమ్మట, ఆ దేవత లందరును భయపడి మహేశ్వరుని అనుగ్రహింపచేసుకొనగా ఆ మహేశ్వరుడు వారి విషయమున అనుగ్రహించెను. 11

మూ. ప్రీతియుక్తస్స సర్వేషాం దదౌ తేషాం మహాత్మనామ్,
తదేతద్దేవదేవస్య ధనూరత్నం మహాత్మనః, 12
న్యాసభూతం తదా న్యస్తమస్మాకం పూర్వకే విభో.

ప్ర. అ. సః = మహేశ్వరుడు, ప్రీతియుక్తః = ఆనందముతో కూడినవాడై, తేషామ్ = ఆ, మహాత్మనామ్ = మహాత్ములకు, దదౌ = ఇచ్చెను, విభో = ప్రభూ! మహాత్మనః = మహాత్ముడైన శివునియొక్క, తత్ = ఆ, ఏతత్ = ఈ, ధనూరత్నమ్ = శ్రేష్ఠమైన ధనస్సు, తదా = అప్పుడు, అస్మాకమ్ = మాయొక్క, పూర్వకే = పూర్వపురుషునియందు, న్యాసభూతమ్ = న్యాసముగా, న్యస్తమ్ = ఉంచబడినది.

తా. శివుడు దేవతల విషయమున అనుగ్రహించి ఆ ధనస్సును వారికి ఇచ్చివేయగా దానిని దేవతలు మా పూర్వపురుషుని వద్ద న్యాసముగా ఉంచిరి. 12

మూ. అథ మే కృషతః క్షేత్రం లాఙ్గలాదుత్థితా మయా, 13
క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా.

ప్ర. అ. అథ = పిమ్మట, మే = నేను, క్షేత్రమ్ = యాగభూమిని, కృషతః = దున్నుచుండగా, లాఙ్గలాత్ = నాగలినుండి, ఉత్థితా = వేచినదియు, నామ్నా = పేరుచేత, సీతేతి = సీత అని, విశ్రుతా = ప్రసిద్ధురాలును అగు కన్య, క్షేత్రమ్ = ఆ క్షేత్రమును, శోధయతా = పరిశుద్ధము చేయుచున్న, మయా = నాచేత, లబ్ధా = పొందబడినది.

తా. నేనొకప్పుడు యజ్ఞభూమిని దున్ని పరిశుద్ధము చేయుచుండగా నాగలినుండి బైటకు వచ్చిన సీత అను కన్య నాకు లభించినది. 13

మూ. భూతలాదుత్థితా సా తు వ్యవర్ధత మమాత్మజా, 14
వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితేయమయోనిజా.

ప్ర.అ. భూతలాత్=భూతలమునుండి, ఉత్థితా=లేచిన, సా=ఆమె, మమ=నాయొక్క, ఆత్మజా=కుమార్తెగా, వ్యవర్ధత = పెరిగెను. అయోనిజా = స్త్రీ గర్భమునుండి పుట్టని, ఇయమ్=ఈ, కన్యా=కన్య, వీర్యశుల్కా = వీర్యమే శుల్కముగా కలది అని, మే=నాచేత, స్థాపితా=ఉంచబడినది.

తా. భూమినుండి బైటకు వచ్చిన ఆమె నా కుమార్తెగా పెరిగినది. అయోనిజ యైన ఈమెను వివాహ మాడవలె నన్న పరాక్రమమే శుల్క మని నేను నియమము చేసితిని. 14

మూ. భూతలాదుత్థితాం తాం తు వర్ధమానాం మమాత్మజామ్, 15
వరయామాసురాగమ్య రాజానో మునిపుఙ్గవ.

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠా! భూతలాత్ = భూతలమునుండి, ఉత్థితామ్=లేచినదియు, వర్ధమానామ్=పెరుగుచున్న, తామ్=ఆ, మమ ఆత్మజామ్=నా కుమార్తెను, రాజానః=రాజులు, ఆగమ్య=వచ్చి, వరయామాసుః=వరించిరి.

తా. మహాముని! భూతలమునుండి ఆవిర్భవించి, నా కుమార్తెగా పెరుగుచున్న ఈమెను వివాహ మాడదలచి ఎందరో రాజులు వచ్చిరి. 15

మూ. తేషాం వరయతాం కన్యాం సర్వేషాం పృథివీక్షితామ్, 16
వీర్యశుల్కేతి భగవన్ న దదామి సుతామహమ్.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! తేషామ్ = ఆ, సర్వేషామ్=సమస్తమైన, మహీక్షితామ్ = రాజులు, కన్యామ్ = కన్యను, వరయతామ్ = వరించుచుండగా, వీర్యశుల్కేతి = వీర్యశుల్క యని చెప్పి: అహమ్ = నేను, సుతామ్ = కుమార్తెను, న దదామి = ఇవ్వలేదు.

తా. మహాముని! ఆ రాజు లందరును వచ్చి కన్య నిమ్మని కోరగా, నేను, ఈమె వీర్యశుల్క యని చెప్పి వారి కీయలేదు. 16

మూ. తతః సర్వే నృపతయః సమేత్య మునిపుఙ్గవ, 17
మిథిలామభ్యుపాగమ్య వీర్యజిజ్ఞాసవస్తదా.

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠా ! తతః = పిమ్మట, సర్వే = సమస్తమైన, నృపతయః = రాజులు, సమేత్య = కలసి, తదా = అప్పుడు, వీర్యజిజ్ఞాసవః = తమ వీర్యమును తెలిసికొన దలచినవారై, మిథిలామ్ = మిథిలాపట్టణమును గూర్చి, అభ్యుపాగమ్య = వచ్చి, (ఉండిరి).

తా. మునిశ్రేష్ఠా ! పిమ్మట ఆ రాజు లందరును కలిసి తమ బల మెంత యున్నదో పరీక్షించుకొన గోరి మిథిలకు వచ్చిరి. 17

మూ. తేషాం జిజ్ఞాసమానానాం వీర్యం ధనురుపాహృతమ్. 18
న శేకుర్గ్రహణే తస్య ధనుషస్తోలనేఽపి వా.

ప్ర. అ. వీర్యమ్ = బలమును, జిజ్ఞాసమానానామ్ = తెలియగోరుచున్న, తేషామ్ = వారికి, ధనుః = ధనస్సు, ఉపాహృతమ్ = తేబడినది. తస్య = ఆ, ధనుషః = ధనస్సుయొక్క, గ్రహణే = గ్రహించుటయందు గాని, తోలనేఽపి = కదల్చుటయందుగాని, న శేకుః = సమర్థులు కాకపోయిరి.

తా. తమ బలమును పరీక్షించ దలచిన వారికి ధనస్సును చూపగా దానిని పట్టుకొనుటకు గాని, కదల్చుటకు గాని వారికి శక్యము కాలేదు. 18

మూ. తేషాం వీర్యవతాం వీర్యమల్పం జ్ఞాత్వా మహామునే, 19
ప్రత్యాఖ్యాతా నృపతయస్తన్నిబోధ తపోధన.

ప్ర. అ. మహామునే = మహామునీ, తేషామ్ = ఆ, వీర్యవతామ్ = రాజుల యొక్క, వీర్యమ్ = బలమును, అల్పమ్ = అల్పమైనదానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, నృపతయః = ఆ రాజులు, ప్రత్యాఖ్యాతాః = నిరాకరింపబడినారు. తపోధన = విశ్వామిత్రమహర్షీ ! తత్ = ఆవిషయమును, నిబోధ = తెలిసికొనుము.

తా. ఆ రాజుల బలము అల్ప మైన దని తెలిసికొని నేను వారికి సీత నీయ నిరాకరించితిని. విశ్వామిత్రమహర్షీ ! ఈ విషయము తెలిసికొనుము. 19

మూ. తతః పరమకోపేన రాజానో మునిపుఙ్గవ,
న్యరున్ధన్ మిథిలాం సర్వే వీర్యసన్దేహమాగతాః. 20

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠుడా ! తతః = పిమ్మట, సర్వే = సమస్తమైన, రాజానః = రాజులు, వీర్యసన్దేహమ్ = తమ బలమును గూర్చిన సందేహమును, ఆగతాః = పొందినవారై, పరమకోపేన = ఎక్కువ కోపముతో, మిథిలామ్ = మిథిలానగరమును, న్యరున్ధన్ = ముట్టడించిరి.

తా. మహామునీ ! ఈ విధముగ తమ బలము విషయమున సందేహము కలుగగా రాజు లందరును మిక్కిలి కోపించి మిథిలానగరమును ముట్టడించిరి. 20

మూ. ఆత్మానమవధూతం తే విజ్ఞాయ నృపపుఙ్గవాః, 21
రోషేణ మహతావిష్టాః పీడయన్ మిథిలాం పురీమ్.

ప్ర. అ. తే = ఆ, నృపపుఙ్గవాః = రాజశ్రేష్ఠులు, ఆత్మానమ్ = తమను, అవధూతమ్ = తిరస్కరింపబడినవారినిగా, విజ్ఞాయ = తెలుసుకొని, మహతా = గొప్ప, కోపేన = కోపముతో, ఆవిష్టాః = కూడినవారై, మిథిలాం పురీమ్ = మిథిలానగరమును, పీడయన్ = బాధించిరి.

తా. ఆ రాజు లందరును ఇది ఒక అవమాన మని భావించి, కోపముతో మిథిలాపురిని బాధించిరి. 21

మూ. తతః సంవత్సరే పూర్ణే క్షయం యాతాని సర్వశః, 22
సాధనాని మునిశ్రేష్ఠ తతోఽహం భృశదుఃఖితః.

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠుడా ! తతః = పిమ్మట, సంవత్సరే = సంవత్సరము, పూర్ణే = నిండిన దగుచుండగా, సర్వశః=అంతటను, సాధనాని= జీవనోపకరణములు, క్షయం యాతాని = క్షయము పొందినవి. తతః = అందువలన, అహమ్ = నేను, భృశదుఃఖితః = చాల దుఃఖితుడ నైతిని.

తా. ఈ విధముగా సంవత్సరము గడవగా నగరములో నున్న జీవనోపకరణము లన్నియు తరిగిపోయినవి. దానితో నాకు చాల దుఃఖము కలిగెను. 22

మూ. తతో దేవగణాన్ సర్వాం స్తపసాఽహం ప్రసాదయమ్, 23
దదుశ్చ పరమప్రీతాశ్చతురఙ్గబలం సురాః.

ప్ర. అ. తతః = పిమ్మట, అహమ్ = నేను, తపసా = తపస్సుచేత, సర్వాన్ = సమస్త మైన, దేవగణాన్ = దేవగణములను, ప్రసాదయమ్ = అనుగ్రహింపచేసికొంటిని. సురాః = దేవతలు, పరమప్రీతాః = చాల సంతసించినవారై, చతురఙ్గబలమ్ = చతురంగసైన్యమును, దదుః = ఇచ్చిరి.

తా. అపుడు నేను తపస్సుచే దేవతల నందరిని అనుగ్రహింపచేసికొనగా వారు నాకు చతురంగబలమును ఇచ్చిరి. 23

మూ. తతో భగ్నా నృపతయో హన్యమానా దిశో యయుః, 24
అవీర్యా వీర్యసన్దిగ్ధాః సామాత్యాః పాపకర్మణః.

ప్ర. అ. తతః=పిమ్మట, అవీర్యాః=బలము లేనివారును, వీర్యసన్దిగ్ధాః= బలము విషయమున సందేహము కలవారును, పాపకర్మణః = పాపకర్మ కలవారును అగు, నృపతయః = రాజులు, హన్యమానాః = కొట్టబడుచున్నవారై, భగ్నాః = ఓడిపోయినవారై, సామాత్యాః = పరివారసమేతులై, దిశః = దిక్కులనుగూర్చి, యయుః = పారిపోయిరి.

తా. తమ బలమును గూర్చి సందేహము గల ఆ వీర్యశూన్యు లగు పాపాత్ము లైన రాజులు యుద్ధమునందు పరాజితులై, సపరివారముగ దిక్కులు పట్టి పారిపోయిరి. 24

మూ. తదేతన్మునిశార్దూల ధనుః పరమభాస్వరమ్, 25
రామలక్ష్మణయోశ్చాపి దర్శయిష్యామి సువ్రత.

ప్ర. అ. సువ్రత = మంచి వ్రతము గల, మునిశార్దూల = మునిశ్రేష్ఠుడా ! తత్ = ఆ, ఏతత్ = ఈ, పరమభాస్వరమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న, ధనుః = ధనస్సును, రామలక్ష్మణయోశ్చాపి = రామలక్ష్మణులకు కూడ, దర్శయిష్యామి = చూపగలను.

తా. ఓ మునిశ్రేష్ఠా ! మిక్కిలి ప్రకాశించు అట్టి ఈ ధనస్సును రామలక్ష్మ ణులకు కూడ చూపగలను. 25

మూ. యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే, 26
సుతామయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షట్‌షష్టితమః సర్గః.

ప్ర. అ. మునే = ఓ మునీ ! రామః = రాముడు, అస్య = ఈ, ధనుషః = ధనస్సుయొక్క, ఆరోపణమ్ = ఎక్కుపెట్టుటను, కుర్యాద్యది = చేసిన ట్లయితే అయోనిజామ్ = అయోనిజ యైన, సుతామ్ = కుమార్తె యగు, సీతామ్=సీతను, అహమ్ = నేను, దాశరథేః = రామునకు, దద్యామ్ = ఇచ్చెదను.

తా. మహామునీ ! రాము డీ ధనస్సును ఎక్కుపెట్టగలిగినచో, అయోనిజ యగు సీతను ఈతని కిచ్చెదను. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
అరువది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తషష్టితమః సర్గః

మూ. జనకస్య వచః శ్రుత్వా విశ్వామిత్రో మహామునిః,
ధనుర్దర్శయ రామాయ ఇతి హోవాచ పార్థివమ్. 1

ప్ర. అ. మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, జనకస్య = జనకునియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, రామాయ = రామునకు, ధనుః = ధనస్సును, దర్శయ = చూపుము, ఇతి = అని, పార్థివమ్ = రాజును గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. విశ్వామిత్రమహాముని జనకుని మాటలు విని, "రామునకు ఆ ధనస్సును చూపుము" అని ఆతనితో పల్కెను. 1

మూ. తతః స రాజా జనకః సామన్తాన్వ్యాదిదేశ హ,
ధనురానీయతాం దివ్యం గన్ధమాల్యవిభూషితమ్. 2

ప్ర. అ. తతః = పిమ్మట, సః = ఆ, రాజా = రాజైన, జనకః = జనకుడు, సామన్తాన్ = సామంతరాజులను, వ్యాదిదేశ హ = ఆజ్ఞాపించెను. గన్ధమాల్యవిభూషితమ్ = గంధమాల్యములచే అలంకరింపబడిన, దివ్యమ్ = దివ్యమైన, ధనుః = ధనస్సు, ఆనీయతామ్ = తీసికొనిరాబడుగాక.

తా. విశ్వామిత్రుని వాక్యము విని జనకమహారాజు గంధమాల్యాదులచే అలంకరించిన ఆ దివ్యధనస్సును తీసికొని రండు అని సామంతులను ఆజ్ఞాపించెను. 2

మూ. జనకేన సమాదిష్టాః సచివాః ప్రావిశన్ పురీమ్,
తద్ధనుః పురతః కృత్వా నిర్జగ్ముః పార్థివాజ్ఞయా. 3

ప్ర. అ. జనకేన = జనకునిచేత, సమాదిష్టాః = ఆజ్ఞాపింపబడిన, సచివాః = మంత్రులు, పురీమ్ = పట్టణమును, ప్రావిశన్ = ప్రవేశించిరి. తద్ధనుః = ఆ ధన

స్సును, పార్థివాజ్ఞయా = రాజుయొక్క ఆజ్ఞచేత, పురతః = ఎదుట, కృత్వా = ఉంచుకొని, నిర్జగ్ముః = బయలుదేరిరి.

తా. జనకుని ఆజ్ఞ ప్రకారము మంత్రులు నగరమును ప్రవేశించి ఆ ధనస్సును ముందిడుకొని బయలుదేరి వచ్చిరి. 3

మూ. నృణాం శతాని పఞ్చాశద్వ్యాయతానాం మహాత్మనామ్,
మఞ్జూషామష్టచక్రాం తాం సమూహుస్తే కథంచన. 4

ప్ర. అ. మహాత్మనామ్ = గొప్ప బలము కలవారును, వ్యాయతానామ్ = పొడగరులును అగు, నృణామ్ = పురుషుల, పఞ్చాశత్ = ఏబది, శతాని = వందలు, అష్టచక్రామ్ = ఎనిమిది చక్రములు గల, మఞ్జూషామ్ = పెట్టెను, సమూహుః = లాగికొని వచ్చిరి. తే = వారు, తామ్ = ఆ పెట్టెను, కథంచన = అతికష్టముగ, (లాగికొనివచ్చిరి).

తా. మంచి బలము కలవారును, దీర్ఘకాయులును అగు ఏబది వందల మంది పురుషులు ఆ ధనస్సు ఉంచిన పెట్టెను అతికష్టముగ లాగికొని వచ్చిరి. 4

మూ. తామాదాయ తు మఞ్జూషామాయసీం యత్ర తద్ధనుః,
సురోపమం తే జనకమూచుర్నృపతిమన్త్రిణః. 5

ప్ర. అ. తే = ఆ, నృపతిమన్త్రిణః = రాజుయొక్క మంత్రులు, యత్ర = ఏ పెట్టెయందు, తత్ = ఆ, ధనుః = ధనస్సు ఉన్నదో, తామ్ = ఆ, ఆయసీమ్ = ఇనుపదైన, మఞ్జూషామ్ = పెట్టెను, ఆదాయ = గ్రహించి, సురోపమమ్ = దేవతలతో సమానుడైన, జనకమ్ = జనకమహారాజును గూర్చి, ఊచుః = పలికిరి.

తా. జనకుని మంత్రులు ధనస్సు ఉన్న ఆ ఇనుప పెట్టెను తీసికొనివచ్చి, దేవతా సమానుడైన ఆతనితో ఇట్లనిరి. 5

మూ. ఇదం ధనుర్వరం రాజన్ పూజితం సర్వరాజభిః,
మిథిలాధిప రాజేన్ద్ర దర్శనీయం యదిచ్ఛసి. 6

ప్ర. అ. రాజేన్ద్ర = రాజశ్రేష్ఠుడా ! మిథిలాధిప = మిథిలాప్రభువైన, రాజన్ = ఓ రాజా ! యత్ = దేనిని, దర్శనీయమ్ = చూపదగినదానినిగా, ఇచ్ఛసి = కోరుచున్నావో, అట్టి, సర్వరాజభిః = సమస్తరాజులచేతను, పూజితమ్ = పూజింపబడిన, ధనుర్వరమ్ = శ్రేష్ఠమైన ధనస్సు, ఇదమ్ = ఇదిగో.

తా. రాజులలో శ్రేష్ఠుడ వైన ఓ మిథిలాధిపతీ ! నీవు దేనిని రామునకు చూపదలచుచున్నావో అట్టి, సర్వరాజపూజిత మగు శ్రేష్ఠధనస్సు ఇదిగో. 6

మూ. తేషాం నృపో వచః శ్రుత్వా కృతాఞ్జలిరభాషత,
విశ్వామిత్రం మహాత్మానం తౌ చోభౌ రామలక్ష్మణౌ. 7

ప్ర. అ. నృపః = రాజు, తేషామ్ = వారియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలికలవాడై, మహాత్మానమ్ = మహాత్ముడైన, విశ్వామిత్రమ్ = విశ్వామిత్రుని గూర్చియు, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను గూర్చియు, అభాషత = పలికెను.

తా. రాజు వారి వాక్యము విని, కరములు జోడించి, మహాత్ముడైన విశ్వామిత్రునితోను, రామలక్ష్మణులతోను ఇట్లు పలికెను. 7

మూ. ఇదం ధనుర్వరం బ్రహ్మన్ జనకైరభిపూజితమ్,
రాజభిశ్చ మహావీర్యైరశక్తైః పూరితుం పురా. 8

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా ! జనకైః = జనకవంశీయులచేతను, పురా = పూర్వము, పూరితుమ్ = ఎక్కుపెట్టుటకు, అశక్తైః = అసమర్థులైన, మహావీర్యైః = గొప్ప పరాక్రమము గల, రాజభిశ్చ = రాజులచేతను, అభిపూజితమ్ = పూజింపబడిన, ధనుర్వరమ్ = శ్రేష్ఠ మైన ధనస్సు, ఇదమ్ = ఇదే.

తా. విశ్వామిత్రమహామునీ ! మా జనకవంశీయులును, పూర్వము దీనిని ఎక్కుపెట్టపోయి విఫలు లైన మహావీర్యవంతు లగు రాజులును పూజించిన శ్రేష్ఠ ధనస్సు ఇదియే. 8

మూ. నైతత్సురగణాః సర్వే నాసురా న చ రాక్షసాః,
గన్ధర్వయక్షప్రవరాస్సకిన్నరమహోరగాః. 9

ప్ర. అ. ఏతత్ = దీనిని (ఎక్కుపెట్టుటకు) సర్వే = సమస్తమైన, సుర గణాః = దేవతాగణములు, న = సమర్థులు కాలేదు. అసురాః = అసురులు, న = సమర్థులు కాలేదు. రాక్షసాః = రాక్షసులును, సకిన్నరమహోరగాః = కింనరులతోడను, మహోరగులతోడను కూడిన, గన్ధర్వయక్షప్రవరాః = గంధర్వయక్షశ్రేష్ఠులును, న = సమర్థులు కాలేదు.

తా. సురగణములు కాని, అసురులు కాని, రాక్షసులు కాని, గంధర్వ-యక్ష-కిన్నర-మహోరగులు గాని దీనిని ఎక్కుపెట్టజాలకపోయిరి. 9

మూ. క్వ గతిర్మానుషాణాం చ ధనుషోఽస్య ప్రపూరణే,
ఆరోపణే సమాయోగే వేపనే తోలనేఽపి వా. 10

ప్ర. అ. అస్య = ఈ ధనస్సుయొక్క, ప్రపూరణే = వంచుటయందుగాని, ఆరోపణే = నారిని ఎక్కించుటయందు గాని, సమాయోగే = బాణమును సంధించుటయందు గాని, వేపనే = నారిని లాగుటయందు గాని, తోలనేఽపి వా = కదల్చుటయందు గాని, మానుషాణామ్ = మనుష్యులకు, గతిః = గతి, క్వ = ఎక్కడ.

తా. ఈ ధనస్సును వంచుటకు గాని, నారి కట్టుటకు గాని, బాణము సంధించుటకు గాని, నారిని లాగుటకు గాని, కదల్చుటకు గాని మనుష్యులకు శక్తి ఎక్కడిది? 10

మూ. తదేతద్ధనుషాం శ్రేష్ఠమానీతం మునిపుఙ్గవ,
దర్శయైతన్మహాభాగ అనయో రాజపుత్రయోః. 11

ప్ర. అ. మునిపుఙ్గవ = మునిశ్రేష్ఠా, తత్ = అట్టి, ఏతత్ = ఈ, ధనుషామ్ = ధనస్సులలో, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన ధనస్సు, ఆనీతమ్ = తీసికొనిరాబడినది. మహాభాగ = మహాభాగ్యవంతుడా! ఏతత్ = దీనిని, అనయోః = ఈ, రాజపుత్రయోః = రాజపుత్రులకు, దర్శయ = చూపుము.

తా. ఓ మునిశ్రేష్ఠా ! అట్టి ఈ ధనస్సును తీసికొని వచ్చినారు. దీనిని ఈ రాజపుత్రులకు చూపుము. 11

మూ. విశ్వామిత్రస్తు ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవమబ్రవీత్. 12

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుడైతే, జనకభాషితమ్ = జనకునిమాటను, శ్రుత్వా = విని, వత్స = నాయనా ! రామ = రామా ! ధనుః = ధనస్సును, పశ్య = చూడుము, ఇతి = అని, రాఘవమ్ = రామునిగూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు జనకుని మాటలు విని– "వత్సా ! రామా ! ఆ ధనస్సును చూడు" అని రామునితో పలికెను. 12

మూ. బ్రహ్మర్షేర్వచనాద్రామో యత్ర తిష్ఠతి తద్ధనుః,
మఞ్జూషాం తామపావృత్య దృష్ట్వా ధనురథాబ్రవీత్. 13

ప్ర. అ. రామః = రాముడు, బ్రహ్మర్షేః = బ్రహ్మర్షియొక్క, వచనాత్= వచనమువలన, తత్ = ఆ, ధనుః = ధనస్సు, యత్ర = దేనియందు, తిష్ఠతి = ఉన్నదో, తామ్ = అట్టి, మఞ్జూషామ్ = పెట్టెను, అపాకృత్య = తెరచి, ధనుః= ధనస్సును, దృష్ట్వా = చూచి, అథ = పిమ్మట, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ బ్రహ్మర్షి ఆదేశానుసారము రాముడు ధనస్సు ఉన్న ఆ పెట్టెను తెరిచి, ధనస్సును చూచి, ఇట్లు పలికెను. 13

మూ. ఇదం ధనుర్వరం బ్రహ్మన్ సంస్పృశామీహ పాణినా,
యత్నవాంశ్చ భవిష్యామి తోలనే పూరణేఽపి వా. 14

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రహ్మర్షీ ! ఇహ = ఇప్పుడు, ఇదమ్=ఈ, ధనుర్వరమ్ = శ్రేష్ఠమైన ధనస్సును, పాణినా = హస్తముచేత, సంస్పృశామి = స్పృశింతును. తోలనే = కదల్చుటయందు గాని, పూరణేఽపి వా=ఎక్కుపెట్టుటయందు గాని, యత్నవాన్ = ప్రయత్నముకలవాడను, భవిష్యామి = కాగలను.

తా. బ్రహ్మర్షీ! ఇపు డీ శ్రేష్ఠ మైన ధనస్సును హస్తముతో స్పృశించెదను. దానిని కదల్చుటకు గాని శక్యమైనచో ఎక్కుపెట్టుటకు గాని ప్రయత్నించెదను. 14

మూ. బాఢమిత్యేవ తం రాజా మునిశ్చ సమభాషత,
లీలయా స ధనుర్మధ్యే జగ్రాహ వచనాన్మునేః. 15

ప్ర. అ. రాజా = రాజును, మునిశ్చ = మునియు, బాఢమ్ ఇత్యేవ = సరే అని, తమ్ = ఆరాముని గూర్చి, సమభాషత = పలికెను. సః = రాముడు, మునేః = మునియొక్క, వచనాత్=వచనమువలన, ధనుః=ధనస్సును, మధ్యే= మధ్యయందు, లీలయా = అనాయాసముగా, జగ్రాహ=పట్టుకొనెను.

తా. "అటులే చేయుము" అని జనకమహారాజును, విశ్వామిత్రుడును పలికిరి. విశ్వామిత్రుని ఆజ్ఞ ప్రకారము రాముడు అనాయాసముగా ఆ ధనస్సును మధ్యయందు పట్టుకొనెను. 15

మూ. పశ్యతాం నృసహస్రాణాం బహూనాం రఘునన్దనః,
ఆరోపయత్స ధర్మాత్మా సలీలమివ తద్ధనుః. 16

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డైన, సః=ఆ, రఘునన్దనః=రాముడు, బహూనామ్=అనేకు లైన, నృసహస్రాణామ్=వేలకొలది జనులు, పశ్యతామ్= చూచుచుండగా, తత్=ఆ, ధనుః=ధనస్సును, సలీలమివ = అనాయాసముగా, ఆరోపయత్=ఎక్కుపెట్టెను.

తా. ధర్మాత్ము డైన ఆ రఘునందనుడు, వేలకొలది జనులు చూచుచుండగా ఆ ధనస్సును అనాయాసముగ ఎక్కుపెట్టెను. 16

మూ. ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః,
తద్బభఞ్జ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః. 17

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన ఆ రాముడు, తత్ = ఆ, ధనుః= ధనస్సును, ఆరోపయిత్వా = ఎక్కుపెట్టి, పూరయామాస = ఆకర్ణాంతము

లాగెను. మహాయశాః = గొప్ప కీర్తి గల, నరశ్రేష్ఠః = ఆ నరశ్రేష్ఠుడు, తత్ = ఆ, ధనుః = ధనస్సును, మధ్యే = మధ్యయందు, బభఞ్జ = విరచెను.

తా. ధర్మాత్ముడును, మహాయశఃశాలియు, నరశ్రేష్ఠుడును అగు ఆ రాముడు ఆ ధనస్సును ఎక్కుపెట్టి, నారిని ఆకర్ణాంతము లాగి దానిని విరచివేసెను. 17

మూ. తస్య శబ్దో మహానాసీన్నిర్ఘాతసమనిస్వనః,
భూమికమ్పశ్చ సుమహాన్ పర్వతస్యేవ దీర్యతః. 18

ప్ర. అ. తస్య = దానియొక్క, శబ్దః = శబ్దము, నిర్ఘాతసమనిస్వనః = పిడుగుతో సమానమైన ధ్వని కలది గాను, మహాన్ = చాలపెద్దదిగాను, ఆసీత్ = ఆయెను. పర్వతస్య = పర్వతము, దీర్యతః ఇవ = బ్రద్దలగుచున్నపుడు వలె, సుమహాన్ = చాల పెద్దదైన, భూమికమ్పశ్చ = భూకంపము గూడ కలిగెను.

తా. ఆ ధనస్సు విరిగినపుడు పిడుగు ధ్వనితో సమానమైన గొప్ప ధ్వని వచ్చెను. పర్వతము బ్రద్దలగుచున్నపుడు అదరినట్లు భూమి అదరెను. 18

మూ. నిపేతుశ్చ నరాః సర్వే తేన శబ్దేన మోహితాః,
వర్జయిత్వా మునివరం రాజానం తౌ చ రాఘవౌ. 19

ప్ర. అ. తేన = ఆ, శబ్దేన = శబ్దముచేత, మోహితాః = మూర్ఛితులై, మునివరం = విశ్వామిత్రుని, రాజానమ్ = జనకుని, తౌ = ఆ, రాఘవౌ చ = రాఘవులను, వర్జయిత్వా = విడచి, సర్వే = సమస్తమైన, నరాః = మనుష్యులు, నిపేతుః = పడిరి.

తా. విశ్వామిత్ర–జనక–రామలక్ష్మణులు తప్ప మిగిలిన జనులందరును ఆ ధ్వనికి మూర్ఛితులై క్రింద పడిరి. 19

మూ. ప్రత్యాశ్వస్తే జనే తస్మిన్రాజా విగతసాధ్వసః,
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం వాక్యజ్ఞో మునిపుఙ్గవమ్. 20

ప్ర. అ. తస్మిన్ = ఆ, జనే = జనము, ప్రత్యాశ్వస్తే = ఊరడిల్లినదగు.

చుండగా, వాక్యజ్ఞః = మాటలలో నేర్పుగల, రాజా = రాజు, విగతసాధ్వసః = భయము లేనివాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అచట వారందరు యథాపూర్వస్థితికి వచ్చిన పిమ్మట మాటలలో నేర్పరి యైన జనకుడు, కంగారు లేనివాడై, ఆ మునిశ్రేష్ఠునితో ఇట్లు పలికెను. 20

మూ. భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః, 21
అత్యద్భుతమచిన్త్యం చ న తర్కితమిదం మయా.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! దశరథాత్మజః = దశరథకుమారు డైన, రామః = రాముడు, మే = నాచేత, దృష్టవీర్యః = చూడబడిన పరాక్రమము కలవాడు. అత్యద్భుతమ్ = చాల ఆశ్చర్యకరము, అచిన్త్యం చ = ఊహింపరానిదియు అగు, ఇదమ్ = ఇది, మయా = నాచేత, న తర్కితమ్ = ఊహింపబడలేదు.

తా. మహాముని ! దశరథాత్మజు డైన రాముని వీర్యమును ప్రత్యక్షముగ చూచితిని. అత్యద్భుతము, ఊహింప అశక్యము అగు ఈ కార్య మిట్లు జరుగునని నేను అనుకొనలేదు. 21

మూ. జనకానాం కులే కీర్తిమాహరిష్యతి మే సుతా, 22
సీతా భర్తారమాసాద్య రామం దశరథాత్మజమ్.

ప్ర. అ. మే=నాయొక్క, సుతా = కుమార్తె యైన, సీతా=సీత, దశరథాత్మజమ్ = దశరథునికుమారుడైన, రామమ్ = రాముని. భర్తారమ్=భర్తనుగా, ఆసాద్య=పొంది, జనకానామ్=జనకులయొక్క, కులే=కులమునందు, కీర్తిమ్= కీర్తిని, ఆహరిష్యతి = తీసికొని రాగలదు.

తా. నా కుమార్తె యైన సీత దశరథుని పుత్రు డైన రాముని భర్తగా పొంది మా వంశమునకు కీర్తిని తీసికొని రాగలదు. 22

మూ. మమ సత్యా ప్రతిజ్ఞా చ వీర్యశుల్కేతి కౌశిక,
సీతా ప్రాణైర్బహుమతా దేయా రామాయ మే సుతా. 23

ప్ర. అ. కౌశిక = విశ్వామిత్రా! వీర్యశుల్కేతి = వీర్యశుల్క అని, మమ=నాయొక్క, ప్రతిజ్ఞా చ=ప్రతిజ్ఞ కూడ, సత్యా = నిజ మైనది. ప్రాణైః= నాప్రాణములతో, బహుమతా = సమముగా ఆదరింపబడిన, మే = నాయొక్క, సుతా = కుమార్తె యైన, సీతా = సీత, రామాయ = రామునకు, దేయా = ఇవ్వ దగినది.

తా. విశ్వామిత్ర మహామునీ! నా కుమార్తె యగు సీతను వివాహమాడు టకు వీర్యమే శుల్క మని నేను చేసిన ప్రతిజ్ఞ ఇపుడు సత్య మైనది. నా ప్రాణము లతో సమానురా లగు ఈమెను రామున కిచ్చెదను. 23

మూ. భవతోఽనుమతే బ్రహ్మన్ శీఘ్రం గచ్ఛన్తు మన్త్రిణః, 24
మమ కౌశిక భద్రం తే అయోధ్యాం త్వరితా రథైః.

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా! కౌశిక = విశ్వామిత్రా! భవతః = నీయొక్క, అనుమతే = అనుమతియందు, మన్త్రిణః = మంత్రులు, త్వరితాః = తొందర గలవారై, రథైః = రథములచేత, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛన్తు = వెళ్లెదరుగాక. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. విశ్వామిత్రమహర్షీ! నీ ఆజ్ఞ ప్రకారము నా మంత్రులు రథముల నధిరోహించి శీఘ్రముగా అయోధ్యకు వెళ్లెదరుగాక. నీకు భద్ర మగు గాక. 24

మూ. రాజానం ప్రశ్రితైర్వాక్యైరానయన్తు పురం మమ, 25
ప్రదానం వీర్యశుల్కాయాః కథయన్తు చ సర్వశః.

ప్ర. అ. వీర్యశుల్కాయాః=వీర్యశుల్క యైన సీతయొక్క, ప్రదానమ్= రామున కిచ్చుటను, సర్వశః = పూర్తిగా, కథయన్తు=చెప్పుదురుగాక. ప్రశ్రితైః= వినయపూర్వక మైన, వాక్యైః = వాక్యములచేత, రాజానమ్ = దశరథ మహా రాజును, మమ = నాయొక్క, పురమ్ = పురమును గూర్చి, ఆనయన్తు = తీసి కొని వచ్చెదరు గాక.

తా. వీర్యశుల్క యగు సీతను రామున కీయ నిర్ణయించుట మొదలగు

వృత్తాంతము నంతను సవినయముగ దశరథునకు తెలిపి అతనిని నా నగరమునకు తీసికొని వచ్చెదరు గాక. 25

మూ. మునిగుప్తౌ చ కాకుత్స్థౌ కథయన్తు నృపాయ వై, 26
ప్రీయమాణం తు రాజానమానయన్తు సుశీఘ్రగాః.

ప్ర. అ. కాకుత్స్థౌ = రామలక్ష్మణులను, మునిగుప్తౌ = మునిచేత రక్షింపబడినవారినిగా, నృపాయ = దశరథునకు, కథయన్తు = చెప్పెదరుగాక. సుశీఘ్రగాః = చాల శీఘ్రముగా పోయినవారై, ప్రీయమాణమ్ = ఆనందించుచున్న, రాజానమ్ = రాజును, ఆనయన్తు = తీసికొని వచ్చెదరుగాక.

తా. శీఘ్రముగ వెళ్లి, రామలక్ష్మణులు విశ్వామిత్రుని సంరక్షణలో నున్నారని దశరథునకు తెలిపి, సంతోషించిన అతనిని తీసికొనివత్తురుగాక. 26

మూ. కౌశికశ్చ తథేత్యాహ రాజా చాభాష్య మన్త్రిణః, 27
అయోధ్యాం ప్రేషయామాస ధర్మాత్మా కృతశాసనాన్,
యథావృత్తం సమాఖ్యాతుమానేతుం చ నృపం తదా. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. కౌశికశ్చ = విశ్వామిత్రుడు కూడ, తథేతి = అటులనే అగుగాక అని, ఆహ = పలికెను. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాజా చ = జనకుడు కూడ, మన్త్రిణః = మంత్రులను, ఆభాష్య = సంప్రదించి, తదా = అప్పుడు, యథావృత్తమ్ = జరిగినది జరిగినట్లుగా, సమాఖ్యాతుమ్ = చెప్పుటకును, నృపమ్ = రాజును, ఆనేతుం చ = తీసికొని వచ్చుటకును, కృతశాసనాన్ = అనుచరులను, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ప్రేషయామాస = పంపెను.

తా. అటులే చేయు మని విశ్వామిత్రుడు పలుకగా జనకమహారాజు మంత్రులతో సంప్రదించి, దశరథునకు జరిగిన దంతయు చెప్పి అతనిని తీసికొని వచ్చుటకై తన ఆజ్ఞానిర్వాహకు లగు భృత్యులను అయోధ్యకు పంపెను. 27-28

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
అరవైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టషష్టితమః సర్గః

మూ. జనకేన సమాదిష్టా దూతాస్తే క్లాన్తవాహనాః,
త్రిరాత్రముషితా మార్గే తేఽయోధ్యాం ప్రావిశన్ పురీమ్. 1

ప్ర. అ. జనకేన = జనకునిచేత, సమాదిష్టాః = ఆజ్ఞాపింపబడిన, తే = ఆ, దూతాః = దూతలు, మార్గే = మార్గమునందు, త్రిరాత్రమ్=మూడు రాత్రులు, ఉషితాః = ఉన్నవారై, క్లాన్తవాహనాః = అలసిపోయిన అశ్వములు కలవారై, అయోధ్యాం పురీమ్ = అయోధ్యానగరమును, ప్రావిశన్ = ప్రవేశించిరి.

తా. జనకు డాజ్ఞాపించిన దూతలు మూడు దినములు ప్రయాణము చేసి, అలసిపోయిన గుఱ్ఱములతో అయోధ్యానగరము చేరిరి. 1

మూ. రాజ్ఞో భవనమాసాద్య ద్వారస్థానిదమబ్రువన్,
శీఘ్రం నివేద్యతాం రాజ్ఞే దూతాన్నో జనకస్య చ. 2

ప్ర. అ. రాజ్ఞః = రాజుయొక్క, భవనమ్ = భవనమును, ఆసాద్య = పొంది, ద్వారస్థాన్ = ద్వారపాలకులను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యము, అబ్రువన్ = పలికిరి. జనకస్య = జనకమహారాజుయొక్క, దూతాన్ = దూతలమైన, నః=మమ్ములను గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, రాజ్ఞే=రాజుకు, నివేద్యతామ్= తెలుపబడుగాక.

తా. అచట రాజభవనమునకు వెళ్లి, ద్వారపాలకులతో— "జనకమహారాజు దూతలు వచ్చినా రని దశరథమహారాజుతో చెప్పుడు" అని పల్కిరి. 2

మూ. ఇత్యుక్తా ద్వారపాలాస్తే రాఘవాయ న్యవేదయన్,
తే రాజవచనాద్దూతా రాజవేశ్మ ప్రవేశితాః, 3
దదృశుర్దేవసఙ్కాశం వృద్ధం దశరథం నృపమ్.

ప్ర. అ. ఇతి = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, తే=ఆ, ద్వారపాలాః= ద్వారపాలులు, రాఘవాయ=దశరథునకు, న్యవేదయన్ = తెలిపిరి. తే=ఆ,

దూతాః=దూతలు, రాజవచనాత్ = రాజుయొక్క వచనమువలన, రాజవేశ్మ= రాజుయొక్క గృహమును, ప్రవేశితాః=ప్రవేశపెట్టబడినవారై, దేవసంకాశమ్= దేవతలతో సమానుడును, వృద్ధమ్ = వృద్ధుడును అగు, దశరథం నృపమ్= దశరథమహారాజును, దదృశుః=చూచిరి.

తా. వారి మాటలు విని ద్వారపాలులు దశరథునకు నివేదించిరి. పిమ్మట రాజాజ్ఞ ప్రకారము రాజభవనములో ప్రవేశించిన ఆ దూతలు దేవతాసదృశుడును, వృద్ధుడును అగు దశరథుని చూచిరి. 3

మూ. బద్ధాఞ్జలిపుటాః సర్వే దూతా విగతసాధ్వసాః, 4
రాజానం ప్రయతా వాక్యమబ్రువన్ మధురాక్షరమ్.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, దూతాః=దూతలు, బద్ధాఞ్జలిపుటాః=కట్టబడిన దోసిళ్లు కలవారై, విగతసాధ్వసాః = పోయిన భయము కలవారై, ప్రయతాః = నియమసంపన్నులై, రాజానమ్ = రాజును గూర్చి, మదురాక్షరమ్= మదురమైన అక్షరములు గల, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్=పలికిరి.

తా. ఆ దూత లందరును చేతులు జోడించి, కంగారు పడనివారై, నియమబద్ధులై దశరథునితో మధురాక్షరములు గల వాక్యమును పలికిరి. 4

మూ. మైథిలో జనకో రాజా సాగ్నిహోత్రపురస్కృతమ్, 5
కుశలం చావ్యయం చైవ సోపాధ్యాయపురోహితమ్,
ముహుర్ముహుర్మధురయా స్నేహసంయుక్తయా గిరా, 6
జనకస్త్వాం మహారాజ పృచ్ఛతే సపురస్సరమ్.

ప్ర. అ. మహారాజ = ఓ మహారాజా ! మైథిలః = మిథిలాధిపతి యైన, జనకః రాజా = జనకమహారాజు, సాగ్నిహోత్రపురస్కృతమ్ = అగ్నిహోత్రాది కర్మలను పురస్కరించు వాడవును, సోపాధ్యాయపురోహితమ్ = ఉపాధ్యాయుల తోడను పురోహితులతోడను కూడినవాడవును, సపురస్సరమ్ = ముందు నడచు పరివారజనముతో కూడినవాడవును అగు, త్వామ్ = నిన్ను, మధురయా=మధుర మైనదియు, స్నేహసంయుక్తయా = స్నేహముతో కూడినదియు అగు, గిరా= వాక్కుతో, కుశలం చ = కుశలమును, అవ్యయం చైవ=నాశము లేకుండుటను, ముహుః = మాటిమాటికిని, పృచ్ఛతే=అడుగుచున్నాడు.

తా. "మహారాజా ! మిథిలాధిపతి యైన, జనకమహారాజు, స్నేహపూర్ణ మగు మధుర మైన వాక్కుతో, అగ్నిహోత్రాదినిరతుడ వగు నీ యొక్కయు, నీ ఉపాధ్యాయులయొక్కయు, పురోహితులయొక్కయు, పరివారజనము యొక్కయు యోగక్షేమములను విచారించుచున్నాడు. 5-6

మూ. పృష్ట్వా కుశలమవ్యగ్రం వైదేహో మిథిలాధిపః, 7
కౌశికానుమతే వాక్యం భవన్తమిదమబ్రవీత్.

ప్ర. అ. మిథిలాధిపః=మిథిలాధిపతి యగు, వైదేహః=జనకుడు, అవ్యగ్రమ్=చిత్తవిక్షేపము లేకుండగ, కుశలమ్=క్షేమమును, పృష్ట్వా=అడిగి, కౌశికానుమతే = విశ్వామిత్రుని అనుమతి ప్రకారము, భవన్తమ్ = నిన్ను గూర్చి, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మిథిలాధీశు డగు జనకమహారాజు శ్రద్ధాపూర్వకముగ నిన్ను కుశలప్రశ్న చేసి, కౌశికుని అనుమతి పొంది, నీతో ఈ మాట చెప్పుచున్నాడు. 7

మూ. పూర్వం ప్రతిజ్ఞా విదితా వీర్యశుల్కా మమాత్మజా, 8
రాజానశ్చ కృతామర్షా నిర్వీర్యా విముఖీకృతాః.

ప్ర. అ. ఆత్మజా=నా కుమార్తె, వీర్యశుల్కా = వీర్యశుల్కము కలది అను, పూర్వమ్=పూర్వము చేయబడిన, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, విదితా=అందరికిని తెలిసినదే. కృతామర్షాః=చేయబడిన అమర్షముగల, నిర్వీర్యాః = వీర్యరహితులైన, రాజానః చ=రాజులు కూడ, విముఖీకృతాః = విముఖులుగా చేయబడినారు.

తా. నా పుత్రిక వీర్యశుల్క యని నేను పూర్వము చేసిన ప్రతిజ్ఞ ప్రసిద్ధమే కదా. కోపించి వచ్చిన రాజులు నిర్వీర్యులై పరాజితులై పోయిరి. 8

మూ. సేయం మమ సుతా రాజన్ విశ్వామిత్రపురస్సరైః, 9
యదృచ్ఛయా గతైర్వీరై ర్నిర్జితా తవ పుత్రకైః.

ప్ర. అ. రాజన్=రాజా ! సా=ఆ, ఇయమ్=ఈ, మమ=నాయొక్క, సుతా=కుమార్తె, విశ్వామిత్రపురస్సరైః=విశ్వామిత్రుడు ముందు నడచువాడుగా

గల, యదృచ్ఛయా=దైవవశముచేత, ఆగతైః=వచ్చిన, తవ = నీయొక్క, వీరైః=వీరు డైన, పుత్రకైః=చిన్న పుత్రునిచేత, నిర్జితా=జయింపబడినది.

తా. దశరథమహారాజా! అట్టి నా ఈ పుత్రికను విశ్వామిత్రుని వెంట దైవవశముచే మిథిలకు వచ్చిన, వీరు డైన నీ చిన్నికుమారుడు, సంపాదించు కొన్నాడు.

వి. రాముడు వయస్సుచే చిన్నవాడు గావున "పుత్రకైః" అని కప్రత్యయము, గౌరవసూచకముగా బహువచనము ప్రయోగింపబడినవి. 9

మూ. తచ్చ రాజన్ ధనుర్దివ్యం మధ్యే భగ్నం మహాత్మనా, 10
రామేణ హి మహారాజ మహత్యాం జనసంసది.

ప్ర. అ. మహారాజ = రాజులలో గొప్పవాడ వైన, రాజన్=దశరథా! తత్=ఆ, దివ్యమ్=దివ్య మైన, ధనుః = ధనస్సు, మహత్యామ్=గొప్ప దైన, జనసంసది=జనుల సభయందు, మహాత్మనా=మహాత్ము డైన, రామేణ=రాముని చేత, మధ్యే=నడుమ, భగ్నమ్=విరవబడినది.

తా. దశరథమహారాజా! గొప్ప సభలో, మహాత్ము డైన రాముడు, ఆ దివ్యధనస్సును మధ్యకు విరచెను. 10

మూ. అస్మై దేయా మయా సీతా వీర్యశుల్కా మహాత్మనే, 11
ప్రతిజ్ఞాం కర్తుమిచ్ఛామి తదనుజ్ఞాతుమర్హసి.

ప్ర. అ. వీర్యశుల్కా=వీర్యశుల్క యైన, సీతా=సీత, అస్మై=ఈ, మహాత్మనే=మహాత్మునకు, మయా=నాచేత, దేయా=ఇవ్వదగినది. ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, కర్తుమ్=చేయుటకు, (నిలుపుకొనుటకు), ఇచ్ఛామి=కోరుచున్నాను. తత్ = ఆకారణమువలన, అనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. వీర్యశుల్క యైన సీతను ఈ మహాత్మున కిచ్చి నా ప్రతిజ్ఞను నెరవేర్చుకొనవలెను గాన అందులకు అనుజ్ఞ ఇమ్ము. 11

మూ. సోపాధ్యాయో మహారాజ పురోహితపురఃసరః, 12
శీఘ్రమాగచ్ఛ భద్రం తే ద్రష్టుమర్హసి రాఘవౌ.

ప్ర. అ. మహారాజ = మహారాజా ! సోపాధ్యాయః = ఋత్విక్కులతో కూడినవాడవై, పురోహితపురఃసరః=పురోహితుడు ముందు నడచువాడుగా కలవాడవై, (పురోహితుని ముందిడుకొని), శీఘ్రమ్=శీఘ్రముగా, ఆగచ్ఛ=రమ్ము. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. రాఘవౌ=రామలక్ష్మణులను, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి=తగియున్నావు.

తా. దశరథమహారాజా ! నీకు క్షేమ మగుగాక. నీవు ఉపాధ్యాయ పురోహితసహితుడవై శీఘ్రముగ వచ్చి రామలక్ష్మణులను చూడుము. 12

మూ. ప్రీతిం చ మమ రాజేన్ద్ర నిర్వర్తయితుమర్హసి,
పుత్రయోరుభయోరేవ ప్రీతిం త్వమపి లప్స్యసే. 13

ప్ర. అ. రాజేన్ద్ర = రాజశ్రేష్ఠుడా ! మమ = నాకు, ప్రీతిమ్ = ఆనందమును, నిర్వర్తయితుమ్ = కలిగించుటకు, అర్హసి=తగియున్నావు. త్వమపి = నీవు కూడ, ఉభయోః = ఇరువురు, పుత్రయోః = పుత్రులయొక్క, ప్రీతిమ్ = ఆనందమును, లప్స్యసే = పొందగలవు.

తా. దశరథమహారాజా ! ఇచటికి వచ్చి నాకానందమును కలిగింపుము. నీకు కూడ పుత్రవివాహోత్సవాది దర్శనానందము కలుగగలదు. 13

మూ. ఏవం విదేహాధిపతిర్మధురం వాక్యమబ్రవీత్,
విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః శతానన్దమతే స్థితః, 14
ఇత్యుక్త్వా విరతా దూతా రాజగౌరవశఙ్కితాః.

ప్ర. అ. విదేహాధిపతిః = విదేహదేశరాజు, విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః = విశ్వామిత్రునిచే అనుజ్ఞ ఇవ్వబడినవాడై, శతానన్దమతే = శతానందునిమతమునందు, స్థితః = ఉన్నవాడై, ఏవమ్ = ఇట్లు, మధురమ్ = మధుర మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. దూతాః = దూతలు, ఇతి = ఇట్లు,

ఉక్త్వా = పలికి, రాజగౌరవశఙ్కితాః = రాజుపై గౌరవముచే భయపడుచు, విరతాః = విరమించిరి.

తా. జనకమహారాజు విశ్వామిత్రుని అనుజ్ఞ పొంది, శతానందుని అనుమతి కూడ గ్రహించి ఈ విధముగ మధురవాక్యమును చెప్పినాడు". దూతలు ఈ విధముగా జనకుని సందేశమును వినిపించి రాజుపై గల గౌరవముచే అధికముగ మాటలాడ జంకి ఊరకుండిరి. 14

మూ. దూతవాక్యం చ తచ్ఛ్రుత్వా రాజా పరమహర్షితః,
వసిష్ఠం వామదేవం చ మన్త్రిణోఽన్యాంశ్చ సోఽబ్రవీత్. 15

ప్ర. అ. సః = ఆ, రాజా = రాజు, తత్ = ఆ, దూతవాక్యమ్ = దూతల వాక్యమును, శ్రుత్వా = విని, పరమహర్షితః = చాల సంతసించినవాడై, వసిష్ఠమ్ = వసిష్ఠుని, వామదేవం చ = వామదేవుని, అన్యాన్ = ఇతరులైన, మన్త్రిణశ్చ = మంత్రులను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. దూతవాక్యములు విన్న దశరథుడు మిక్కిలి సంతసించి, వసిష్ఠ వామదేవులతోడను, ఇతరమంత్రులతోడను ఇట్లు పలికెను. 15

మూ. గుప్తః కుశికపుత్రేణ కౌసల్యానన్దవర్ధనః,
లక్ష్మణేన సహ భ్రాత్రా విదేహేషు వసత్యసౌ. 16

ప్ర. అ. అసౌ = ఈ, కౌసల్యానన్దవర్ధనః = కౌసల్యానందమును వృద్ధి పొందించు రాముడు, కుశికపుత్రేణ = విశ్వామిత్రుని చేత, గుప్తః = రక్షింపబడినవాడై, భ్రాత్రా = సోదరుడైన లక్ష్మణునితో కూడ, విదేహేషు = విదేహదేశమునందు, వసతి = నివసించుచున్నాడు.

తా. కౌసల్యానందవర్ధనుడైన మన రాముడు విశ్వామిత్రపరిరక్షితుడై, సోదరుడైన లక్ష్మణునితో కూడ ఇపుడు విదేహదేశమునం దున్నాడు. 16

మూ. దృష్టవీర్యస్తు కాకుత్స్థో జనకేన మహాత్మనా,
సంప్రదానం సుతాయాస్తు రాఘవే కర్తుమిచ్ఛతి. 17

ప్ర. అ. కాకుత్థ్సః = రాముడు, మహాత్మనా = మహాత్ముడైన, జనకేన= జనకునిచేత, దృష్టవీర్యః = చూడబడిన పరాక్రమము కలవాడు. (ఆ జనకుడు), సుతాయాః = కుమార్తెయొక్క, సంప్రదానమ్ = దానమును, రాఘవే = రాముని యందు, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు.

తా. మహాత్ము డైన జనకుడు రాముని పరాక్రమమును చూచి తన కుమార్తెను అతని కీయ గోరుచున్నాడు. 17

మూ. యది వో రోచతే వృత్తం జనకస్య మహాత్మనః,
పురీం గచ్ఛామహే శీఘ్రం మాభూత్కాలస్య పర్యయః. 18

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, జనకస్య = జనకునియొక్క, వృత్తమ్ = చరితము, వః = మీకు, రోచతే యది = ఇష్టమైనట్లైతే, శీఘ్రమ్ = శీఘ్రముగా, పురీమ్ = మిథిలాపట్టణమును గూర్చి, గచ్ఛామహే = వెళ్లుదము. కాలస్య = కాలముయొక్క, పర్యయః = జరుగుబాటు, మాభూత్ = లేక పోవుగాక.

తా. మహాత్ము డైన జనకుని ఆచారసంపత్తి మీకు నచ్చిన ట్లయితే విలంబ మేమియు చేయక శీఘ్రముగ మిథిలాపురికి వెళ్లుదము. 18

మూ. మన్త్రిణో బాఢమిత్యాహుః సహ సర్వైర్మహర్షిభిః,
సుప్రీతశ్చాబ్రవీద్రాజా శ్వో యాత్రేతి స మన్త్రిణః. 19

ప్ర. అ. సర్వైః = సమస్త మైన, మహర్షిభిః సహ=మహర్షులతో గూడ, మన్త్రిణః = మంత్రులు, బాఢమితి = మంచిది అని, ఆహుః = పలికిరి. సుప్రీతః= మిక్కిలి సంతసించిన, సః = ఆ, రాజా = రాజు, శ్వః = రేపు, యాత్రా = ప్రయాణము, ఇతి = అని, మన్త్రిణః = మంత్రులను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మంత్రులును, మహర్షు లందరును, "తప్పక అట్లే చేయుదము" అని పల్కగా దశరథుడు చాల సంతసించి "రేపే ప్రయాణము" అని మంత్రులతో అనెను. 19

మూ. మన్త్రిణస్తు నరేన్ద్రస్య రాత్రిం పరమసత్కృతాః,
ఊషుస్తే ముదితాః సర్వే గుణైః సర్వైః సమన్వితాః. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
అష్టషష్టితమః సర్గః.

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, గుణైః = గుణములతో, సమన్వితాః = కూడిన, తే = ఆ, నరేన్ద్రస్య = జనకమహారాజుయొక్క, మన్త్రిణస్తు = మంత్రులైతే, పరమసత్కృతాః = చాలా సత్కరింపబడినవారై, ముదితాః = సంతసించినవారై, రాత్రిమ్ = ఆ రాత్రి, ఊషుః = నివసించిరి.

తా. సకలసద్గుణ సంపన్ను లగు జనకుని మంత్రులు మంచి సత్కారములు నంది, సంతసించినవారై ఆ రాత్రి ఆ నగరముననే ఉండిపోయిరి. 20

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో
అరువదిఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనసప్తతితమః సర్గః

మూ. తతో రాత్ర్యాం వ్యతీతాయాం సోపాధ్యాయః సబాన్ధవః,
రాజా దశరథో హృష్టః సుమన్త్రమిదమబ్రవీత్. 1

ప్ర. అ. సోపాధ్యాయః=ఉపాధ్యాయులతో గూడిన, సబాన్ధవః=బంధువులతో గూడిన, రాజా=రాజైన, దశరథః = దశరథుడు, హృష్టః=సంతసించినవాడై, తతః=పిమ్మట, రాత్ర్యామ్ = రాత్రి, వ్యతీతాయామ్ = గడచిన దగుచుండగా, సుమన్త్రమ్=సుమంత్రుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. రాత్రి గడచిన పిమ్మట, బంధువులతోను, ఉపాధ్యాయులతోను, కూడిన దశరథమహారాజు సంతసించి సుమంత్రునితో ఇట్లు పలికెను. 1

మూ. అద్య సర్వే ధనాధ్యక్షా ధనమాదాయ పుష్కలమ్,
వ్రజన్త్వగ్రే సువిహితా నానారత్నసమన్వితాః. 2

ప్ర. అ. అద్య=ఇప్పుడు, సర్వే = సమస్తమైన, ధనాధ్యక్షాః = ధనాగారాధ్యక్షులు, పుష్కలమ్ = అత్యధిక మైన, ధనమ్=ధనమును, ఆదాయ= గ్రహించి, నానారత్నసమన్వితాః=అనేకవిధము లైన రత్నములతో కూడినవారై, సువిహితాః=బాగుగా సిద్ధులై, అగ్రే=ముందు, యాన్తు=వెళ్లెదరుగాక.

తా. ధనాధ్యక్షు లందరును పుష్కలముగా ధనము తీసికొని, వివిధ రత్నములను గూడ గ్రహించి, బాగుగా సంసిద్ధులై ముందుగా వెళ్లెదరుగాక. 2

మూ. చతురఙ్గబలం చాపి శీఘ్రం నిర్యాతు సర్వశః,
మమాజ్ఞాసమకాలం చ యానయుగ్యమనుత్తమమ్. 3

ప్ర. అ. మమ=నాయొక్క, ఆజ్ఞాసమకాలమ్=ఆజ్ఞకు వెంటనే, చతురఙ్గబలమ్=చతురంగసైన్యము, సర్వశః = నలువైపులనుండి, నిర్యాతు=బయలు

దేరుగాక. అనుత్తమమ్=శ్రేష్ఠ మైన, యానయుగ్యమ్=పల్లకీలు, రథములు మొద లగునవి కూడ, (బయలుదేరుగాక).

తా. నేను ఆజ్ఞాపించిన క్షణమునందే చతురంగ బలసైన్యము, శ్రేష్ఠ మైన పలకీలు రథములు మొదలగునవియు బయలుదేరుగాక. 3

మూ. వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథ కాశ్యపః,
మార్కణ్డేయశ్చ దీర్ఘాయుః ఋషిః కాత్యాయనస్తథా. 4

ఏతే ద్విజాః ప్రయాన్త్వగ్రే స్యన్దనం యోజయస్వ మే,
యథా కాలాత్యయో న స్యాద్దూతా హి త్వరయన్తి మామ్. 5

ప్ర. అ. వసిష్ఠః = వసిష్ఠుడును, వామదేవశ్చ = వామదేవుడును, అథ = మరియు, జాబాలిః = జాబాలియు, కాశ్యపః = కాశ్యపుడును, దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయవంతు డగు, మార్కణ్డేయశ్చ=మార్కండేయుడును, తథా=మరియు, ఋషిః = ఋషి యైన, కాత్యాయనః = కాత్యాయనుడు, ఏతే = ఈ, ద్విజాః = బ్రాహ్మణులు, అగ్రే = ముందు, ప్రయాన్తు = నడచెదరుగాక. మే = నాయొక్క, స్యన్దనమ్ = రథమును, యోజయస్వ = కూర్చుము. కాలాత్యయః = కాలము గడచిపోవుట, యథా = ఎట్లు, న స్యాత్ = కాకుండునో, (అట్లు చేయుము). దూతాః = దూతలు, మామ్ = నన్ను, త్వరయన్తి హి = తొందర పెట్టుచున్నారు కదా.

తా. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, దీర్ఘాయుర్దాయవంతు డైన మార్కండేయుడు, కాత్యాయనఋషి —ఈ బ్రాహ్మణు లందరును ముందు వెళ్లెదరుగాక. నా రథమును కూర్చి శీఘ్రముగ తీసికొని రమ్ము. విలంబము చేయవలదు. జనకుని దూతలు నన్ను తొందర పెట్టుచున్నారు. 4, 5

మూ. వచనాత్తు నరేన్ద్రస్య సా సేనా చతురఙ్గిణీ,
రాజానమృషిభిః సార్ధం వ్రజన్తం పృష్ఠతోఽన్వగాత్. 6

ప్ర. అ. నరేన్ద్రస్య = దశరథమహారాజుయొక్క, వచనాత్ = ఆజ్ఞ వలన, చతురఙ్గిణీ=నాలుగు అంగములు గల, సా=ఆ, సేనా=సేన, ఋషిభిః

సార్ధమ్ = ఋషులతో కూడ, ప్రవజన్తమ్ = వెళ్లుచున్న, రాజానమ్ = రాజును, పృష్ఠతః = వెనుకనే, అన్వగాత్ = అనుసరించి వెళ్లెను.

తా. దశరథమహారాజు ఋషులతో కలిసి వెళ్లుచుండగా, అతని ఆజ్ఞను సారము చతురంగబలము అతని వెనుకనే వెళ్లెను. 6

మూ. గత్వా చతురహం మార్గం విదేహానభ్యుపేయివాన్,
రాజా తు జనకః శ్రీమాన్ శ్రుత్వా పూజామకల్పయత్. 7

ప్ర. అ. చతురహమ్ = నాల్గు దినముల, మార్గమ్=మార్గమును, గత్వా = ప్రయాణము చేసి, విదేహాన్ = విదేహదేశమును, అభ్యుపేయివాన్ = చేరినాడు. రాజా = రాజైన, శ్రీమాన్ = శ్రీమంతుడైన, జనకః = జనకుడు, శ్రుత్వా=విని, పూజామ్ = పూజను, అకల్పయత్ = చేసెను.

తా. నాల్గు దివసముల మార్గ ప్రయాణము చేసి, దశరథుడు విదేహ దేశము చేరగా జనకమహారాజు ఆ విషయము విని, దశరథునకు ఆయా ప్రాంతములలో తగు విధముగ సత్కారముల నేర్పరచెను. 7

మూ. తతో రాజానమాసాద్య వృద్ధం దశరథం నృపమ్,
జనకో ముదితో రాజా హర్షం చ పరమం యయౌ. 8

ప్ర. అ. తతః = పిమ్మట, రాజా = రాజైన, ముదితః = సంతసించిన, జనకః = జనకుడు, నృపమ్ = మనుష్యులకు పాలకుడును, రాజానమ్=రాజును, వృద్ధమ్ = వృద్ధుడును అగు, దశరథమ్ = దశరథుని, ఆసాద్య = సమీపించి, పరమమ్ = గొప్ప, హర్షమ్ = ఆనందమును, యయౌ = పొందెను.

తా. పిమ్మట జనకమహారాజు వృద్ధుడైన దశరథమహారాజును కలిసి కొని చాల సంతోషించెను. 8

మూ. ఉవాచ చ నరశ్రేష్ఠో నరశ్రేష్ఠం ముదాన్వితః,
స్వాగతం తే మహారాజ దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ, 9
పుత్రయోరుభయోః ప్రీతిం లప్స్యసే వీర్యనిర్జితామ్.

ప్ర. అ. నరశ్రేష్ఠః = నరశ్రేష్ఠుడైన జనకుడు, ముదా = ఆనందముతో, అన్వితః = కూడినవాడై, నరశ్రేష్ఠమ్ = నరశ్రేష్ఠుడైన దశరథుని గూర్చి, ఉవాచ = పలికెను. రాఘవ = రఘువంశమునందు పుట్టిన, మహారాజ = దశరథ మహారాజా ! తే = నీకు, స్వాగతమ్ = స్వాగత మగుగాక. దిష్ట్యా = భాగ్య వశముచేత, ప్రాప్తః అసి = వచ్చినావు. ఉభయోః = ఇద్దరు, పుత్రయోః = పుత్రులయొక్క, వీర్యనిర్జితామ్ = పరాక్రమముచే జయింపబడిన, ప్రీతిమ్ = ఆనందమును, లప్స్యసే = పొందగలవు.

తా. దశరథమహారాజా ! నీకు స్వాగతము. నా భాగ్యవశముచే వచ్చి నావు. నీ ఇరువురి కుమారుల పరాక్రమముచే ప్రాప్తించిన ఆనందమును పొంద గలవు. 9

మూ. దిష్ట్యా ప్రాప్తో మహాతేజా వసిష్ఠో భగవానృషిః, 10
సహ సర్వైర్ద్విజశ్రేష్ఠైర్దేవైరివ శతక్రతుః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును, భగవాన్ = పూజ్యుడును అగు, వసిష్ఠః ఋషిః=వసిష్ఠమహర్షి, సర్వైః=సమస్తమైన, ద్విజశ్రేష్ఠైః= బ్రాహ్మణోత్తములతో కూడ, దేవైః = దేవతలతో, శతక్రతురివ = దేవేంద్రుడు వలె, దిష్ట్యా = భాగ్యవశముచేత, ప్రాప్తః = వచ్చినాడు.

తా. మహాతేజఃశాలియు, భగవంతుడును అగు వసిష్ఠమహర్షి, బ్రాహ్మణోత్తములతో కలిసి, దేవతలతో కలిసి దేవేంద్రుడు వలె, నా భాగ్యవశమున ఇచటికి వచ్చినాడు. 10

మూ. దిష్ట్యా మే నిర్జితా విఘ్నా దిష్ట్యా మే పూజితం కులమ్, 11
రాఘవైః సహ సమ్బన్ధాద్వీర్యశ్రేష్ఠైర్మహాత్మభిః.

ప్ర. అ. వీర్యశ్రేష్ఠైః = వీర్యముచేత శ్రేష్ఠులును, మహాత్మభిః = మహాత్ములును అగు, రాఘవైః సహ = రఘువంశీయులతో కూడ, సంబన్ధాత్=సంబంధమువలన, దిష్ట్యా = భాగ్యవశముచేత, మే = నాయొక్క, విఘ్నాః = విఘ్న

ములు, నిర్జితాః = జయింపబడినవి. దిష్ట్యా = భాగ్యవశముచేత, మే = నాయొక్క, కులమ్ = కులము, పూజితమ్=పూజింపబడినది.

తా. పరాక్రమముచే శ్రేష్ఠులును మహాత్ములును అగు రఘువంశరాజులతో వియ్య మందుటవలన, భాగ్యవశముచే నా విఘ్నము లన్నియు తొలగినవి. భాగ్యవశముచే నా కులము పూజనీయ మైనది. 11

మూ. శ్వః ప్రభాతే నరేన్ద్రేన్ద్ర నిర్వర్తయితుమర్హసి, 12
యజ్ఞస్యాన్తే నరశ్రేష్ఠ వివాహమృషిసమ్మతమ్.

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరశ్రేష్ఠుడ వైన, నరేన్ద్రేన్ద్ర = రాజాధిరాజా! శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలము, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, అన్తే = అంతమునందు, ఋషిసంమతమ్=ఋషులకు అంగీకారయోగ్య మైన, వివాహమ్= వివాహమును, నిర్వర్తయితుమ్=జరుపుటకు, అర్హసి = తగియున్నావు.

తా. మునిశ్రేష్ఠుడ వైన ఓ రాజాధిరాజా! రేపు ప్రాతఃకాలము యజ్ఞము పూర్తి యైన పిమ్మట ఋషిసంమత మైన వివాహమును నెరవేర్పుము. 12

మూ. తస్య తద్వచనం శ్రుత్వా ఋషిమధ్యే నరాధిపః, 13
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః ప్రత్యువాచ మహీపతిమ్.

ప్ర. అ. వాక్యవిదామ్ = వాక్యవేత్తలలో, వరః=శ్రేష్ఠుడగు, నరాధిపః= రాజు, తస్య = అతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, ఋషిమధ్యే = ఋషుల మధ్యయందు, మహీపతిమ్ = రాజునుగూర్చి, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మాటల నేర్పరులలో శ్రేష్ఠు డగు దశరథమహారాజు జనకుని వచనము విని, అచటి ఋషు లందరును వినుచుండగా ఆతనితో ఇట్లనెను. 13

మూ. ప్రతిగ్రహో దాతృవశః శ్రుతమేతన్మయా పురా, 14
యథా వక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యామహే వయమ్.

ప్ర. అ. ప్రతిగ్రహః = ప్రతిగ్రహము, దాతృవశః = దాతవశములో నున్నది. ఏతత్ = ఇది, పురా = పూర్వము, మయా = నాచేత, శ్రుతమ్=వినబడి

నది. ధర్మజ్ఞ = ధర్మము నెరిగినవాడా ! యథా = ఎట్లు, వక్ష్యసి = చెప్పగలవో, తత్ = అది, వయమ్ = మేము, కరిష్యామహే = చేయగలము.

తా. ధర్మముల నెరిగిన జనకమహారాజా ! ప్రతిగ్రహ మనునది దాత చేతిలో నున్నది. దాత ఇచ్చినప్పుడే కదా ప్రతిగ్రహీత ప్రతిగ్రహించునది. నీ కన్యాదాననిర్ణయాదికమును వినియున్నాము. నీ వెట్లు చెప్పెదవో అట్లే చేసెదము. 14

మూ. ధర్మిష్ఠం చ యశస్యం చ వచనం సత్యవాదినః, 15
శ్రుత్వా విదేహాధిపతిః పరం విస్మయమాగతః.

ప్ర. అ. సత్యవాదినః = సత్యవాది యైన దశరథునియొక్క, ధర్మిష్ఠం చ = ధర్మసంమతము, యశస్యం చ = యశఃకరము అగు, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, విదేహాధిపతిః = జనకుడు, పరమ్ = మిక్కిలి, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగతః = పొందెను.

తా. జనకమహారాజు, సత్యవాది యైన ఆ దశరథుడు పలికిన ధర్మసంమతము, యశఃకరము అగు వచనము విని చాల ఆశ్చర్యపడెను. 15

మూ. తతః సర్వే మునిగణాః పరస్పరసమాగమే, 16
హర్షేణ మహతా యుక్తాస్తాం నిశామవసన్ సుఖమ్.

ప్ర. అ. తతః=పిమ్మట, సర్వే = సమస్త మైన, మునిగణాః = మునిగణములు, పరస్పరసమాగమే = పరస్పరము కలియుటయందు, మహతా = గొప్ప, హర్షేణ = సంతోషముతో, యుక్తాః = కూడినవై, తామ్ = ఆ, నిశామ్ = రాత్రిని, సుఖమ్ = సుఖముగా, అవసన్ = నివసించినవి.

తా. ఆ మునీశ్వరు లందరును పరస్పరము కలిసినందులకు చాల సంతసించినవారై, ఆ రాత్రి సుఖముగ గడపిరి. 16

మూ. రాజా చ రాఘవౌ పుత్రౌ నిశామ్య పరిహర్షితః, 17
ఉవాస పరమప్రీతో జనకేన సుపూజితః.

ప్ర. అ. రాజా చ = దశరథమహారాజు, పుత్రౌ = పుత్రులైన, రాఘవౌ= రామలక్ష్మణులను, నిశామ్య=చూచి, పరిహర్షితః = సంతసించినవాడై, జనకేన= జనకునిచేత, సుపూజితః=బాగుగా పూజింపబడినవాడై, పరమప్రీతః=మిక్కిలి ఆనందించినవాడై, ఉవాస=నివసించెను.

తా. దశరథమహారాజు పుత్రులైన రామలక్ష్మణులను జూచి ఆనందభరితుడై, జనకుని సత్కారములకు సంతుష్టుడై నివసించెను. 17

మూ. జనకోఽపి మహాతేజాః క్రియాం ధర్మేణ తత్త్వవిత్, 18
యజ్ఞస్య చ సుతాభ్యాం చ కృత్వా రాత్రిముపాస హ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకోనసప్తతితమః సర్గః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, తత్త్వవిత్=ధర్మరహస్యముల నెరిగిన, జనకోఽపి=జనకుడు కూడ, యజ్ఞస్య=యజ్ఞముయొక్కయు, సుతాభ్యాం చ=కుమార్తెలకొరకును, క్రియామ్=క్రియను, కృత్వా=చేసి, రాత్రిమ్=రాత్రి, ఉవాస హ=నివసించెను.

తా. గొప్ప తేజస్సు కలవాడును, ధర్మరహస్యముల నెరిగినవాడును అగు జనకమహారాజు, యజ్ఞమునకు సంబంధించిన కర్మలను, కుమార్తెల వివాహమునకు సంబంధించిన అంకురారోపణాదిక్రియలను పూర్తిచేసికొని ఆ రాత్రి గడపెను. 18

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలోని
అరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ సప్తతితమః సర్గః

మూ. తతః ప్రభాతే జనకః కృతకర్మా మహర్షిభిః,
ఉవాచ వాక్యం వాక్యజ్ఞః శతానన్దం పురోహితమ్. 1

ప్ర. అ. తతః=పిమ్మట, ప్రభాతే=ప్రాతఃకాలమున, మహర్షిభిః=మహర్షులచేత, కృతకర్మా=చేయబడినకర్మలుగల, వాక్యజ్ఞః=మాటలలో నేర్పరియైన, జనకః=జనకుడు, పురోహితమ్ = పురోహితుడైన, శతానన్దమ్=శతానందుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. ప్రాతఃకాలమున మహర్షులు కర్తవ్యకర్మ లన్నియు చేయించిన పిమ్మట వాక్యకుశలు డైన జనకుడు పురోహితు డైన శతానందునితో ఇట్లనెను. 1

మూ. భ్రాతా మమ మహాతేజా యవీయానతిధార్మికః,
కుశధ్వజ ఇతి ఖ్యాతః పురీమధ్యవసచ్ఛుభామ్. 2

వార్యాఫలకపర్యన్తాం పిబన్నిక్షుమతీం నదీమ్,
సాఙ్కాశ్యాం పుణ్యసంకాశాం విమానమివ పుష్పకమ్. 3

ప్ర. అ. అతిధార్మికః = మిక్కిలిధార్మికుడును, కుశధ్వజః ఇతి=కుశధ్వజు డని, ఖ్యాతః = ప్రసిద్ధుడును అగు, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మమ=నాయొక్క, యవీయాన్=చిన్న, భ్రాతా=సోదరుడు, ఇక్షుమతీమ్=ఇక్షుమతి అనెడు, నదీమ్=నదిని, పిబన్=త్రాగుచు, వార్యాఫలకపర్యన్తామ్=నీటిలో నాటబడిన శూలములు సరిహద్దుగా గల, శుభామ్=శుభమైన, పుణ్యసంకాశామ్=పుణ్యముతో సమానమైన (పరిశుద్ధమైన), సాంకాశ్యామ్ = సాంకాశ్య మనెడు, పురీమ్=పట్టణమును, పుష్పకమ్ = పుష్పక మనెడు, విమానమివ=విమానమును వలె, అధ్యవసత్=నివసించియున్నాడు.

తా. మహాతేజశ్శాలియు, అతిధార్మికుడును అగు నా తమ్ముడగు కుశధ్వజుడు, ఇక్షుమతీజలమును త్రాగుచు (ఇక్షుమతీనదీతీరమున) నీటిలో

పాతిన ఇనుప శూలములు సరిహద్దుగా గలదియు, పరిశుద్ధ మైనదియు, పుష్పక విమానమువంటిదియు అగు శుభ మైన సాంకాశ్యనగరములో నివసించు చున్నాడు.

వి. "వార్యామలకపర్యన్తామ్" అను పాఠమున "చుట్టును నీటి ఉసిరిక చెట్లు కలది" అని యర్థము. 2, 3

మూ. తమహం ద్రష్టుమిచ్ఛామి యజ్ఞగోప్తా స మే మతః,
ప్రీతిం సోఽపి మహాతేజా ఇమాం భోక్తా మయా సహ. 4

ప్ర. అ. అహమ్ = నేను, తమ్ = ఆతనిని, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. సః=అతడు, మే=నాయొక్క, యజ్ఞగోప్తా = యజ్ఞమును రక్షించువాడుగా, మతః=అంగీకరింపబడినవాడు. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సోఽపి=అతడు కూడ, మయా సహ=నాతో కూడ, ఇమామ్=ఈ, ప్రీతిమ్=ఆనందమును, భోక్తా=అనుభవింపగలడు.

తా. ఆతడు సంభారములను సమకూర్చుట మొదలగు పనుల ద్వారా నాకు యజ్ఞసంరక్షణ చేసినవాడు. ఆతనిని చూడవలె నని అనుకొనుచున్నాను. ఆ మహాతేజస్వి కూడ నాతో ఈ ఆనందమును అనుభవించవలెను. 4

మూ. ఏవముక్తే తు వచనే శతానన్దస్య సన్నిధౌ,
ఆగతాః కేచిదవ్యగ్రా జనకస్తాన్ సమాదిశత్. 5

ప్ర. అ. శతానన్దస్య=శతానందునియొక్క, సన్నిధౌ = సంనిధియందు, ఏవమ్ = ఇట్లు, వచనే = వచనము, ఉక్తే సతి = పలకబడినదగుచుండగా, అవ్యగ్రాః=తొందరపాటు లేని, కేచిత్=కొంతమంది, ఆగతాః=వచ్చిరి. జనకః= జనకుడు, తాన్=వారిని, సమాదిశత్=ఆజ్ఞాపించెను.

తా. జనకుడు శతానందునితో ఇట్లు చెప్పగా అచటికి శతానందుడు పిలువ నంపగా వచ్చిన కొందరు ఉత్సాహవంతు లగు దూతలను జనకు డాజ్ఞాపించెను. 5

మూ. శాసనాత్తు నరేన్ద్రస్య ప్రయయుః శీఘ్రవాజిభిః,
సమానేతుం నరవ్యాఘ్రం విష్ణుమిన్ద్రాజ్ఞయా యథా. 6

ప్ర. అ. నరేన్ద్రస్య = జనకమహారాజుయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, ఇన్ద్రాజ్ఞయా=ఇంద్రుని ఆజ్ఞచేత, విష్ణుం యథా=విష్ణువును వలె, నరవ్యాఘ్రమ్= నరశ్రేష్ఠుడైన కుశధ్వజుని, సమానేతుమ్ = తీసికొని వచ్చుటకు, శీఘ్రవాజిభిః= శీఘ్రముగా నడచు గుఱ్ఱములచే, ప్రయయుః=వెళ్లిరి.

తా. ఆ దూతలు జనకుని ఆజ్ఞ ప్రకారము, ఇంద్రుని ఆజ్ఞ ప్రకారము విష్ణువును వలె, ఆ కుశధ్వజుని తీసికొని వచ్చుటకై శీఘ్రముగా పరుగెత్తు అశ్వము లధిరోహించి వెళ్లిరి. 6

మూ. సాఙ్కాశ్యాం తే సమాగత్య దదృశుశ్చ కుశధ్వజమ్,
న్యవేదయన్యథావృత్తం జనకస్య చ చిన్తితమ్. 7

ప్ర. అ. తే=ఆ దూతలు, సాఙ్కాశ్యామ్=సాంకాశ్యనగరమును, సమాగమ్య=చేరి, కుశధ్వజమ్=కుశధ్వజుని, దదృశుశ్చ=చూచిరి. యథావృత్తమ్= జరిగిన విషయము నంతను, జనకస్య=జనకునియొక్క, చిన్తితమ్ = ఆలోచనను, న్యవేదయన్ చ=తెలిపిరికూడ.

తా. వారు సాంకాశ్యమునకు వెళ్లి కుశధ్వజుని చూచి, జరిగిన విషయము నంతను తెలిపి జనకుని అభిప్రాయమును నివేదించిరి. 7

మూ. తద్వృత్తం నృపతిః శ్రుత్వా దూతశ్రేష్ఠైర్మహాబలైః,
ఆజ్ఞయాథ నరేన్ద్రస్య ఆజగామ కుశధ్వజః. 8

ప్ర. అ. నృపతిః=రాజైన, కుశధ్వజః = కుశధ్వజుడు, మహాబలైః= గొప్పబలముగల, దూతశ్రేష్ఠైః = శ్రేష్ఠులైన దూతలచే చెప్పబడిన, తత్=ఆ, వృత్తమ్=వృత్తాంతమును, శ్రుత్వా = విని, అథ=పిమ్మట, నరేన్ద్రస్య=జనక మహారాజుయొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, ఆజగామ=వచ్చెను.

తా. కుశధ్వజుడు మహాబలవంతు లగు ఆ దూతలు చెప్పిన వృత్తాంతమును విని జనకుని ఆజ్ఞ ననుసరించి మిథిలానగరమునకు వచ్చెను. 8

మూ. స దదర్శ మహాత్మానం జనకం ధర్మవత్సలమ్,
సోఽభివాద్య శతానన్దం రాజానం చాపి ధార్మికమ్, 9
రాజార్హం పరమం దివ్యమాసనం చాధ్యరోహత.

ప్ర. అ. సః=అతడు, ధర్మవత్సలమ్ = ధర్మమునందు ఆసక్తి గల, మహాత్మానమ్ = మహాత్ము డైన, జనకమ్ = జనకుని, దదర్శ = చూచెను. సః = అతడు, శతానన్దమ్ = శతానందుని, ధార్మికమ్ = ధార్మికు డైన, రాజానం చ = జనకుని, అభివాద్య = నమస్కరించి, రాజార్హమ్ = రాజుకు తగిన, పరమమ్ = గొప్ప దైన, దివ్యమ్ = శ్రేష్ఠ మైన, ఆసనమ్ = ఆసనమును, అధ్య రోహత = అధిష్ఠించెను.

తా. ఆ కుశధ్వజుడు, ధర్మనిరతుడును మహాత్ముడును అగు జనకుని చూచెను. శతానందునకును, ధార్మికు డైన జనకునకును అభివాదనము చేసి, రాజోచిత మగు శ్రేష్ఠ మైన ఆసనమును అధిష్ఠించెను. 9

మూ. ఉపవిష్టావుభౌ తౌ తు భ్రాతరావతితేజసౌ, 10
ప్రేషయామాసతుర్వీరౌ మన్త్రిశ్రేష్ఠం సుదామనమ్.

ప్ర. అ. అతితేజసౌ = గొప్ప తేజస్సు గల, తౌ = ఆ, వీరౌ = వీరు లైన, ఉభౌ = ఇద్దరు, భ్రాతరౌ = సోదరులు, ఉపవిష్టౌ = కూర్చున్న వారై, మన్త్రిశ్రేష్ఠమ్ = మంత్రులలో శ్రేష్ఠ దైన, సుదామనమ్ = సుదామనుని, ప్రేషయామాసతుః = పంపిరి.

తా. మహాతేజఃశాలులును, వీరులును అగు ఆ సోదరు లిరువురును కూర్చుండి మంత్రులలో శ్రేష్ఠ దైన సుదామనుని (దశరథుని వద్దకు) పంపిరి. 10

మూ. గచ్ఛ మన్త్రిపతే శీఘ్రమైక్ష్వాకుమమితప్రభమ్, 11
ఆత్మజైః సహ దుర్ధర్షమానయస్వ సమన్త్రిణమ్.

ప్ర. అ. మన్త్రిపతే = మన్త్రిశ్రేష్ఠుడా, శీఘ్రమ్ = శీఘ్రముగా, అమిత ప్రభమ్ = సాటి లేని కాంతి గలవాడగు, ఐక్ష్వాకుమ్ = దశరథ మహారాజును గూర్చి, గచ్ఛ = వెళ్లుము. దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కానివాడును, సమన్త్రిణమ్ = మంత్రులతో కూడిన వాడును అగు ఆతనిని, ఆత్మజైః సహ = కుమారులతో కూడ, సమానయస్వ = తీసికొని రమ్ము.

తా. మహామంత్రీ ! ఎదిరింప శక్యము కానివాడును, అమిత మైన తేజస్సు కలవాడును అగు దశరథుని వద్దకు వెళ్లి, పుత్రమంత్రి సమేతముగ ఆతనిని తీసికొని రమ్ము. 11

మూ. ఔపకార్యం స గత్వా తు రఘూణాం కులవర్ధనమ్, 12
దదర్శ శిరసా చైనమభివాద్యేదమబ్రవీత్.

ప్ర. అ. సః = ఆతడు, ఔపకార్యమ్ = విడిదిని గూర్చి, గత్వా = వెళ్లి, రఘూణామ్ = రఘువంశీయుల, కులవర్ధనమ్ = కులమును వృద్ధి పొందించు ఆ దశరథుని, దదర్శ = చూచెను. ఏనమ్ = ఈతనిని, శిరసా = శిరస్సుచేత, అభివాద్య = నమస్కరించి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అతడు విడిదికి వెళ్లి, అచట రఘువంశవర్ధను డైన దశరథుని చూచి, తల వంచి నమస్కరించి ఇట్లు చెప్పెను. 12

మూ. అయోధ్యాధిపతే వీర వైదేహో మిథిలాధిపః, 13
స త్వాం ద్రష్టుం వ్యవసితః సోపాధ్యాయపురోహితమ్.

ప్ర. అ. వీర = వీరుడ వైన, అయోధ్యాధిపతే = అయోధ్యాధీశా ! మిథిలాధిపః = మిథిలారాజైన, సః = ఆ, వైదేహః = జనకుడు, సోపాధ్యాయపురోహితమ్ = ఉపాధ్యాయులతోడను పురోహితులతోడను కూడిన, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, వ్యవసితః = నిశ్చయించినాడు.

తా. మహావీరుడ వైన దశరథమహారాజా ! మిథిలాధిపతి యైన జనక మహారాజు, ఉపాధ్యాయపురోహితసమేతుడ వైన నిన్ను చూడవలె నని అనుకొనుచున్నాడు. 13

మూ. మన్త్రిశ్రేష్ఠవచః శ్రుత్వా రాజా సర్షిగణస్తదా, 14
సబన్ధురగమత్తత్ర జనకో యత్ర వర్తతే.

ప్ర. అ. తదా = అప్పుడు, రాజా = దశరథుడు, మన్త్రిశ్రేష్ఠవచః = మంత్రిశ్రేష్ఠుని వచనమును, శ్రుత్వా = విని, సర్షిగణః = ఋషిగణముతో కూడినవాడై, సబన్ధుః = బంధువులతో కూడినవాడై, జనకః = జనకుడు, యత్ర = ఎచట, వర్తతే = ఉంటున్నాడో, తత్ర = అచటికి, అగమత్ = వెళ్లెను.

తా. దశరథమహారాజు మంత్రి మాటలు విని, ఋషులతోను, బంధువుల తోను కలిసి జనకు డున్న చోటికి వెళ్ళెను. 14

మూ. స రాజా మన్త్రిసహితః సోపాధ్యాయః సబాన్ధవః, 15
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో వైదేహమిదమబ్రవీత్.

ప్ర. అ. మన్త్రిసహితః = మంత్రులతో కూడిన, సబాన్ధవః = బంధువులతో కూడిన, సః = ఆ, వాక్యవిదామ్ = వాక్యవేత్తలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, రాజా = రాజు, వైదేహమ్ = జనకమహారాజును గూర్చి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. బంధువులతోడను, ఉపాధ్యాయులతోడను కూడినవాడును, మాటలలో నేర్పరియు అగు దశరథుడు జనకునితో ఇట్లు పలికెను. 15

మూ. విదితం తే మహారాజ ఇక్ష్వాకుకులదైవతమ్, 16
వక్తా సర్వేషు కృత్యేషు వసిష్ఠో భగవానృషిః.

ప్ర. అ. మహారాజ = మహారాజా ! భగవాన్ = పూజ్యుడైన, వసిష్ఠః = వసిష్ఠమహర్షి, ఇక్ష్వాకుకులదైవతమ్ = ఇక్ష్వాకువంశీయులకు దేవత యనియు, సర్వేషు = సమస్తమైన, కృత్యేషు = కార్యములందు, వక్తా = మాటలాడువాడనియు, తే = నీకు, విదితమ్ = తెలియును కదా.

తా. మహారాజా ! పూజ్యుడైన వసిష్ఠమహర్షి మా వంశమువారికందరికిని దేవత అనియు, అన్ని పనులందును మా పక్షమున మాటలాడువాడనియు నీకు తెలియును గదా ? 16

మూ. విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః సహ సర్వైర్మహర్షిభిః, 17
ఏష వక్ష్యతి ధర్మాత్మా వసిష్ఠో మే యథాక్రమమ్.

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, మహర్షిభిః సహ = మహర్షులతో కూడ, విశ్వామిత్రాభ్యనుజ్ఞాతః = విశ్వామిత్రునిచే అనుజ్ఞ ఇవ్వబడినవాడై, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, ఏషః = ఈ, వసిష్ఠః = వసిష్ఠుడు, యథాక్రమమ్ = క్రమానుసారముగా, మే = నాయొక్క (వంశమును గూర్చి), వక్ష్యతి = చెప్పగలడు.

తా. విశ్వామిత్రుని అనుజ్ఞను, సకలమహర్షుల అనుజ్ఞను పొంది ధర్మాత్ము డైన వసిష్ఠుడు నా వంశములోని పూర్వపురుషులను గూర్చి యథాక్రమముగా చెప్పగలడు. 17

మూ. ఏవముక్త్వా నరశ్రేష్ఠే రాజ్ఞాం మధ్యే మహాత్మనామ్, 18
తూష్ణీంభూతే దశరథే వసిష్ఠో భగవానృషిః,
ఉవాచ వాక్యం వాక్యజ్ఞో వైదేహం సపురోధసమ్. 19

ప్ర. అ. నరశ్రేష్ఠే = నరులలో శ్రేష్ఠు డైన, దశరథే = దశరథుడు, మహాత్మనామ్ = మహాత్ము లైన, రాజ్ఞామ్ = రాజులయొక్క, మధ్యే = మధ్య యందు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తూష్ణీంభూతే = మౌనముగా నుండగా, వాక్యజ్ఞః = వాక్యముల నెరిగినవాడును, భగవాన్ = పూజ్యుడును అగు, వసిష్ఠః ఋషిః = వసిష్ఠమహర్షి, సపురోధసమ్ = పురోహితులతో గూడిన, వైదేహమ్ = జనకుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. నరులలో శ్రేష్ఠు డగు దశరథుడు ఈ విధముగ పలికి ఊరకుండెను. అపుడు మాటలలో నేర్పరి యగు పూజ్యు డైన వసిష్ఠమహర్షి, పురోహితులతో గూడిన జనకమహారాజుతో ఇట్లనెను. 18, 19

మూ. అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మాన్మరీచిః సంజజ్ఞే మరీచేః కాశ్యపః సుతః. 20

ప్ర. అ. అవ్యక్తప్రభవః = అవ్యక్తమునుండి పుట్టినవాడును, శాశ్వతః = ఎల్లప్పుడు ఉండువాడును, నిత్యః = నిత్యుడును, అవ్యయః = వినాశము లేని వాడును అగు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు (ఉన్నాడు). తస్మాత్ = అతనినుండి, మరీచిః = మరీచిమహర్షి, సంజజ్ఞే = పుట్టెను. మరీచేః = మరీచినుండి, కాశ్యపః = కాశ్యపుడను, సుతః = కుమారుడు (జనించెను.)

తా. అవ్యక్తమునుండి పుట్టినవాడును, ఎల్లప్పుడు ఉండువాడును, నిత్యుడును, వినాశరహితుడును అగు బ్రహ్మదేవునినుండి మరీచియు, మరీచినుండి కాశ్యపు డనెడు కుమారుడును పుట్టెను. 20

మూ. వివస్వాన్ కాశ్యపాద్ జజ్ఞే మనుర్వైవస్వతః స్మృతః,
మనుః ప్రజాపతిః పూర్వమిక్ష్వాకుస్తు మనోస్సుతః. 21

ప్ర. అ. కాశ్యపాత్ = కాశ్యపునినుండి, వివస్వాన్ = సూర్యుడు, జజ్ఞే = పుట్టెను. వైవస్వతః = సూర్యుని కుమారుడు, మనుః = మనువు అని, స్మృతః = చెప్పబడినాడు. మనుః = మనువు, పూర్వమ్ = పూర్వము, ప్రజాపతిః = ప్రజాపతిగా ఉండెను. ఇక్ష్వాకుః = ఇక్ష్వాకువు, మనోః = మనువుయొక్క, సుతః = కుమారుడు.

తా. కాశ్యపునకు సూర్యుడు జనించెను. సూర్యుని కుమారుడు మనువు. పూర్వము ప్రజాపతిగ ఉన్న మనువునకు ఇక్ష్వాకువు అను పుత్రుడు జనించెను. 21

మూ. తమిక్ష్వాకుమయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్,
ఇక్ష్వాకోస్తు సుతః శ్రీమాన్ కుక్షిరిత్యేవ విశ్రుతః. 22

ప్ర. అ. తమ్ = ఆ, ఇక్ష్వాకుమ్ = ఇక్ష్వాకువును, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, పూర్వకమ్ = మొదటివాడైన, రాజానమ్=రాజునుగా, విద్ధి= తెలుసుకొనుము. శ్రీమాన్ = శ్రీమంతుడైన, కుక్షిరిత్యేవ=కుక్షి అని, విశ్రుతః= ప్రసిద్ధ మైనవాడు, ఇక్ష్వాకోః=ఇక్ష్వాకువుయొక్క, సుతః = కుమారుడు.

తా. ఆ ఇక్ష్వాకువు అయోధ్యలో మొదటి రాజుగా ఉండెను. శ్రీమంతుడగు కుక్షి ఇక్ష్వాకుని పుత్రుడు. 22

మూ. కుక్షేరథాత్మజః శ్రీమాన్ వికుక్షిరుదపద్యత,
వికుక్షేస్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్. 23

ప్ర. అ. అథ = పిమ్మట, కుక్షేః = కుక్షికి, శ్రీమాన్ = శ్రీమంతుడైన, వికుక్షిః = వికుక్షి, ఆత్మజః = కుమారుడుగా, ఉదపద్యత = పుట్టెను. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, ప్రతాపవాన్ = ప్రతాపము కలవాడును అగు, బాణః = బాణుడు, వికుక్షేః = వికుక్షియొక్క, పుత్రః = పుత్రుడుగా, పుట్టెను.

తా. పిమ్మట కుక్షికి వికుక్షి అను నతడు కుమారుడుగా పుట్టెను. వికుక్షి కుమారుడు, మహాతేజఃశాలియు ప్రతాపవంతుడును అగు బాణుడు. 23

మూ. బాణస్య తు మహాతేజా అనరణ్యః ప్రతాపవాన్,
అనరణ్యాత్పృథుర్జజ్ఞే త్రిశఙ్కుస్తు పృథోః సుతః. 24

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కల, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, అనరణ్యః = అనరణ్యుడు, బాణస్య=బాణుని కుమారుడు. అనరణ్యాత్= అనరణ్యునినుండి, పృథుః = పృథువు, జజ్ఞే = పుట్టెను. త్రిశఙ్కుః తు=త్రిశంకువు, పృథోః=పృథువుయొక్క, సుతః=కుమారుడు.

తా. మహాతేజస్వి, ప్రతాపవంతుడు అయిన అనరణ్యుడు బాణుని కుమారుడు. అనరణ్యునకు పృథువు, పృథువునకు త్రిశంకువు కుమారుడుగా జనించెను. 24

మూ. త్రిశఙ్కోరభవత్పుత్రో దున్దుమారో మహాయశాః,
యువనాశ్వసుతస్త్వాసీన్మాన్ధాతా పృథివీపతిః. 25

ప్ర. అ. త్రిశఙ్కోః = త్రిశంకువునకు, మహాయశాః=గొప్ప కీర్తిగల, దున్దుమారః = దుందుమారుడను, పుత్రః = పుత్రుడు, అభవత్ = పుట్టెను. మాన్ధాతా=మాంధాత అను, పృథివీపతిః = రాజు, యువనాశ్వసుతః=యువనాశ్వుని కుమారుడుగా, ఆసీత్=పుట్టెను.

తా. త్రిశంకువునకు దుందుమారు డను గొప్ప కీర్తి గల కుమారుడు పుట్టెను. ఆతనికి యువనాశ్వ డని కూడ పేరు. మాంధాతచక్రవర్తి యువనాశ్వుని కుమారుడు. 25

మూ. మాన్ధాతుస్తు సుతః శ్రీమాన్ సుసంధిరుదపద్యత,
సుసన్ధేరపి పుత్రౌ ద్వౌ ధ్రువసన్ధిః ప్రసేనజిత్. 26

ప్ర. అ. మాన్ధాతుః=మంధాతకు, సుసన్ధిః = సుసంధి అను, శ్రీమాన్= శ్రీమంతుడైన, సుతః=కుమారుడు, ఉదపద్యత=పుట్టెను. సుసన్ధేరపి=సుసంధికి

కూడ, ధ్రువసన్ధిః=ధ్రువసంధి అనియు, ప్రసేనజిత్=ప్రసేనజిత్తు అనియు, ద్వౌ=ఇరువురు, పుత్రౌ=పుత్రులు జనించిరి.

తా. మాంధాతకు సునంధి యను శ్రీమంతు డగు కుమారుడు జనించెను. ఆతనికి ధ్రువసంధి, ప్రసేనజిత్ అను ఇరువురు కుమారులు జనించిరి. 26

మూ. యశస్వీ ధ్రువసన్ధేస్తు భరతో నామ నామతః,
భరతాత్తు మహాతేజా అసితో నామ జాతవాన్. 27

ప్ర. అ. ధ్రువసన్ధేః తు=ధ్రువసంధికి, నామతః=పేరుచే, భరతః నామ=భరతుడను, యశస్వీ=కీర్తిశాలియు, భరతాత్ తు=భరతునినుండి, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, అసితో నామ=అసితు డను పేరు గలవాడు, జాతవాన్=పుట్టెను.

తా. ధ్రువసంధికి కీర్తిమంతు డగు భరతు డను కుమారుడు పుట్టెను. భరతునకు గొప్ప తేజస్సు గల అసితు డను కుమారుడు పుట్టెను. 27

మూ. యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యన్త శత్రవః,
హైహయాస్తాలజఙ్ఘాశ్చ శూరాశ్చ శశిబిన్దవః. 28

ప్ర. అ. యస్య=ఏ అసితునకు, హైహయాః=హైహయులును, తాలజఙ్ఘాశ్చ=తాలజంఘులును, శూరాః=శూరు లైన, శశిబిన్దవశ్చ=శశిబిందువులును అను, ఏతే=ఈ, ప్రతిరాజానః = ఎదిరించే రాజులు, శత్రవః = శత్రువులుగా, ఉదపద్యన్త=అయిరో.

తా. హైహయ- తాలజంఘ- శశిబిందు వంశములకు చెందిన రాజులు ఈ అసితునకు శత్రువు లైరి. 28

మూ. తాంస్తు స ప్రతియుధ్యన్ వై యుద్ధే రాజా ప్రవాసితః,
హిమవన్తముపాగమ్య భృగుప్రస్రవణేఽవసత్. 29
అసితోఽల్పబలో రాజా మనిభిః సహిత సదా.

ప్ర. అ. సః=ఆ, రాజా=రాజు, తాన్=వారిని, యుద్ధే=యుద్ధమునందు, ప్రతియుధ్యన్=ఎదిరించి యుద్ధము చేయుచు, ప్రవాసితః=రాజ్యమునుండి తొల

గింపబడినాడు. రాజా=రాజైన, అసితః=అసితుడు, అల్పబలః=అల్పమైన సేన కలవాడై, మన్త్రిభిః=మంత్రులతో, సహితః=కూడినవాడై, తదా=అపుడు, హిమవన్తమ్=హిమవత్పర్వతమును, ఉపాగమ్య=చేరి, భృగుప్రస్రవణే=భృగుప్రస్రవణ మను ప్రదేశమునందు, అవసత్=నివసించెను.

తా. ఆ అసితమహారాజు శత్రువులతో యుద్ధము చేసి, పరాజితుడై రాజ్యభ్రష్టు డయ్యెను. అల్పమైన సైన్యముతోడను, మంత్రులతోడను కలిసి హిమవత్పర్వతమునకు వెళ్లి అచట భృగుప్రస్రవణ మను ప్రదేశమున నివసించెను. 29

మూ. ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతురితి శ్రుతమ్, 30
ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరం దదౌ.

ప్ర. అ. అస్య = ఇతనియొక్క, ద్వే=ఇరువురు, భార్యే = భార్యలు, గర్భిణ్యౌ=గర్భవతులై, బభూవతుః=ఉండిరి. ఏకా = ఒక భార్య, గర్భవినాశాయ=గర్భము నశించుటకై, సపత్న్యై=సవతికి, సగరమ్=విషముతో కూడిన ఆహారమును, దదౌ=ఇచ్చెను, ఇతి=అని, శ్రుతమ్=వినబడినది.

తా. ఆ సమయమున ఆతని భార్యలలో ఇద్దరు గర్భవతులై యుండిరి. వారిలో ఒకతె సవతి గర్భము నష్ట మగుటకై ఆమెకు విషముతో కూడిన ఆహారమిచ్చినదట. 30

మూ. తతః శైలవరం రమ్యం బభూవాభిరతో మునిః, 31
భార్గవశ్చ్యవనో నామ హిమవన్తముపాశ్రితః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రమ్యమ్=రమ్యమైన, శైలవరమ్=శైలశ్రేష్ఠమును గూర్చి, అభిరతః=అభిరుచిగల, భార్గవః = భృగువంశోద్భవు డైన, చ్యవనో నామ=చ్యవను డను ఋషి, హిమవన్తమ్=హిమవత్పర్వతమును, ఉపాశ్రితః=ఆశ్రయించినాడు.

తా. ఆ దివసములలో రమ్య మైన పర్వతశ్రేష్ఠమునందు అభిరుచి గల, భృగువంశసంజాతు డగు చ్యవనుడు హిమవత్పర్వతమునకు వచ్చెను. 31

మూ. తత్రైకా తు మహాభాగా భార్గవం దేవవర్చసమ్, 32
వవన్దే పద్మపత్రాక్షీ కాఙ్క్షన్తీ సుతమాత్మనః.

ప్ర. అ. మహాభాగా=గొప్ప భాగ్యము కలదియు, పద్మపత్రాక్షీ=పద్మ పత్రముల వంటి కన్నులు కలదియు అగు, తయోః ఏకా = ఆ ఇరువురు రాజ భార్యలలో ఒకతె, ఆత్మనః=తనకు, సుతమ్=పుత్రుని, కాఙ్క్షన్తీ=కోరుచున్నదై, దేవవర్చసమ్=దేవతల వంటి కాంతి గల, భార్గవమ్ = చ్యవనుని, వవన్దే=నమస్కరించెను.

తా. గొప్ప భాగ్యము కలదియు, పద్మపత్రాక్షియు అగు ఒక రాజభార్య తనకు కుమారుడు కావలె నని కోరుచు, దేవతల వంటి కాంతి గల ఆ చ్యవనుని నమస్కరించెను. 32

మూ. తమృషిం సాభ్యుపాగమ్య కాళిన్దీ చాభ్యవాదయత్, 33
స తామభ్యవదద్విప్రః పుత్రేప్సుం పుత్రజన్మని.

ప్ర. అ. సా=ఆ, కాళిన్దీ చ = కాళింది అను పేరు గల విషము పెట్టిన భార్యకూడ, తమ్=ఆ, ఋషిమ్=ఋషిని, అభ్యుపాగమ్య=సమీపించి, అభ్యవాదయత్=నమస్కరించెను. సః=ఆ, విప్రః=బ్రాహ్మణుడు, తామ్=ఆ, పుత్రేప్సుమ్=పుత్రుని కోరు భార్యను గూర్చి, పుత్రజన్మని = పుత్రజన్మవిషయమున, అభ్యవదత్=పలికెను.

తా. సవతికి విషము పెట్టిన కాళింది కూడ ఆ మునివద్దకు వెళ్లి నమస్కరించెను. ఆతడు పుత్రాభిలాషిణి యగు రాజభార్యతో ఇట్లు చెప్పెను. 33

మూ. తవ కుక్షౌ మహాభాగే సుపుత్రః సుమహాబలః, 34
మహావీర్యో మహాతేజా అచిరాత్సంభవిష్యతి,
గరేణ సహితః శ్రీమాన్మా శుచః కమలేక్షణే. 35

ప్ర. అ. మహాభాగే=గొప్ప భాగ్యము కలదానా! తవ=నీయొక్క, కుక్షౌ=కుక్షియందు, సుమహాబలః=చాల గొప్ప బలము కలవాడును, మహావీర్యః=గొప్ప వీర్యము కలవాడును, మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడును

అగు, సుపుత్రః = సుపుత్రుడు, (ఉన్నాడు). శ్రీమాన్ = శ్రీమంతు డైన అతడు, గరేణ = విషముతో, సహితః = కూడినవాడై, అచిరాత్ = కొంచెము కాలములో, సంజనిష్యతి=పుట్టగలడు ; కమలేక్షణే=పద్మముల వంటి నేత్రములు కలదానా! మా శుచః = దుఃఖింపకుము.

తా. "మహాభాగ్యవంతురాలా ! మహాబలుడు, మహావీర్యుడు, మహాతేజస్వియు అగు సుపుత్రుడు నీ గర్భములో ఉన్నాడు. ఐశ్వర్యవంతు డైన ఆ కుమారుడు కొలది కాలములో పుట్టగలడు ; దుఃఖింపకుము". 34, 35

మూ. చ్యవనం తు నమస్కృత్య రాజపుత్రీ పతివ్రతా,
పతిశోకాతురా తస్మాత్పుత్రం దేవీ వ్యజాయత. 36

ప్ర. అ. రాజపుత్రీ = రాజపుత్రియు, పతివ్రతా = పతివ్రతయు, పతిశోకాతురా = భర్తృమరణశోకముచే వ్యాకులురాలును అగు, దేవీ = ఆ పట్టమహిషి, చ్యవనమ్ = చ్యవనుని, నమస్కృత్య = నమస్కరించి, తస్మాత్ = ఆ కారణము వలన, పుత్రమ్ = పుత్రుని, వ్యజాయత = కనెను.

తా. రాజపుత్రియు, పతివ్రతయు, భర్తృమరణముచే దుఃఖితురాలును అగు ఆ రాజమహిషి ఈ విధముగ చ్యవనుని అనుగ్రహముచే పుత్రుని కనెను. 36

మూ. సపత్న్యా తు గర స్తస్యై దత్తో గర్భజిఘాంసయా,
సహ తేన గరేణైవ జాతః స సగరోఽభవత్. 37

ప్ర. అ. సపత్న్యా = సవతిచేత, తస్యై = ఆమెకు, గర్భజిఘాంసయా = గర్భమును హింసించ వలె నను కోరికచే, గరః = విషము, దత్తః = ఇవ్వబడినది. తేన = ఆ, గరేణ సహ ఏవ = గరముతోడనే, జాతః = పుట్టిన, సః = అతడు, సగరః = సగరుడు, అభవత్ = ఆయెను.

తా. గర్భమును నశింపచేయవలె నను అభిప్రాయముతో సవతి ఆమెకు ఇచ్చిన గరముతో పాటు పుట్టుటచే ఆ పుత్రుడు 'సగరుడు' అయ్యెను. 37

మూ. సగరస్యాసమంజస్తు అసమంజా త్తథాంశుమాన్,
దిలీపోఽంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. 38

ప్ర. అ. అసమంజః = అసమంజుడు, సగరస్య = సగరుని కుమారుడు. తథా = మరియు, అసమంజాత్ = అసమంజునివలన, అంశుమాన్ = అంశుమంతుడు జనించెను. దిలీపః = దిలీపుడు, అంశుమతః = అంశుమంతునియొక్క, పుత్రః = పుత్రుడు. భగీరథః = భగీరథుడు, దిలీపస్య = దిలీపుని కుమారుడు.

తా. సగరుని కుమారుడు అసమంజుడు. అతని కుమారుడు అంశుమంతుడు. అంశుమంతుని పుత్రుడు దిలీపుడు. అతని కుమారుడు భగీరథుడు. 38

మూ. భగీరథాత్ కకుత్స్థశ్చ కకుత్స్థస్య రఘుః సుతః,
రఘోస్తు పుత్రస్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః, 39
కల్మాషపాదో హ్యభవత్తస్మాజ్జాతస్తు శఙ్ఖణః.

ప్ర. అ. భగీరథాత్ = భగీరథునినుండి, కకుత్స్థః = కకుత్స్థుడు పుట్టెను. రఘుః = రఘువు, కకుత్స్థస్య = కకుత్స్థునియొక్క, సుతః = కుమారుడు. తేజస్వీ = తేజఃశాలియైన, ప్రవృద్ధః = ప్రవృద్ధుడు, రఘోః = రఘువుయొక్క, పుత్రః = పుత్రుడు. అతడే, పురుషాదకః = పురుషాదకుడును, కల్మాషపాదః = కల్మాషపాదుడును, అభవత్ = ఆయెను. తస్మాత్ = అతనినుండి, శఙ్ఖణః = శంఖణుడు, జాతః = పుట్టెను.

తా. భగీరథునకు కకుత్స్థుడును, అతనికి రఘువును పుట్టెను. తేజఃశాలియగు ప్రవృద్ధుడు రఘువుయొక్క కుమారుడు. అతడు వసిష్ఠుని శాపముచే పురుషాదకుడు (మనుష్యమాంసము తినువాడు) అయ్యెను. అతడు వసిష్ఠునకు ప్రతిశాప మిచ్చుటకై జలము గ్రహించెను. అపుడు అతని భార్య నివారించుటచే ఆ శాపోదకమును తన పాదములపైననే విడచుటచే కల్మాషపాదుడు (కల్మషముతో కూడిన పాదములు కలవాడు) అయ్యెను. అతనికి శంఖణుడు పుట్టెను. 39

మూ. సుదర్శనః శఙ్ఖణస్య అగ్నివర్ణః సుదర్శనాత్, 40
శీఘ్రగస్త్వగ్నివర్ణస్య శీఘ్రగస్య మరుః సుతః,
మరోః ప్రశుశ్రుకస్త్వాసీదమ్బరీషః ప్రశుశ్రుకాత్. 41

ప్ర. అ. శఙ్ఖణస్య = శంఖణునకు, సుదర్శనః = సుదర్శనుడును, సుదర్శనాత్ = సుదర్శనునివలన, అగ్నివర్ణః = అగ్నివర్ణుడును, అగ్ని

వర్ణస్య = అగ్నివర్ణునకు, శీఘ్రగః = శీఘ్రగుడును, శీఘ్రగస్య = శీఘ్రగునకు, మరుః = మరువు అను, సుతః = కుమారుడును, మరోః = మరువునకు, ప్రశుశ్రుకః = ప్రశుశ్రుకుడును, ప్రశుశ్రుకాత్ = ప్రశుశ్రుకునినుండి, అంబరీషః = అంబరీషుడును, ఆసీత్=పుట్టెను.

తా. శంఖణుని కుమారుడు సుదర్శనుడు. సుదర్శనుని కుమారుడు అగ్నివర్ణుడు. ఆతని కుమారుడు శీఘ్రగుడు. ఆతని కుమారుడు మరువు. ఆతని కుమారుడు ప్రశుశ్రుకుడు. ప్రశుశ్రుకుని కుమారుడు అంబరీషుడు. 40, 41

మూ. అమ్బరీషస్య పుత్రోఽభూన్నహుషః పృథివీపతిః,
నహుషస్య యయాతిస్తు నాభాగస్తు యయాతిజః. 42

ప్ర. అ. పృథివీపతిః=రాజైన, నహుషః=నహుషుడు, అమ్బరీషస్య= అంబరీషునియొక్క, పుత్రః=పుత్రుడు, అభూత్=ఆయెను. నహుషస్య=నహుషునికి, యయాతిః=యయాతి పుట్టెను. నాభాగః తు=నాభాగుడు, యయాతిజః= యయాతివలన పుట్టినవాడు.

తా. అంబరీషుని పుత్రుడు నహుషమహారాజు. నహుషునకు యయాతి యను పుత్రుడు జనించెను. ఆతని కుమారుడు నాభాగుడు. 42

మూ. నాభాగస్య బభూవాజః అజాద్దశరథోఽభవత్,
అస్మాద్దశరథాజ్జాతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 43

ప్ర. అ. నాభాగస్య = నాభాగునకు, అజః = అజు డను కుమారుడు, బభూవ=పుట్టెను. అజాత్=అజునినుండి, దశరథః = దశరథుడు, అభవత్= పుట్టెను. అస్మాత్=ఈ, దశరథాత్ = దశరథునినుండి, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, జాతౌ=పుట్టినారు.

తా. నాభాగునకు అజు డను కుమారుడు కలిగెను. అజుని కుమారుడు దశరథుడు. ఈ దశరథుని కుమారులే ఈ రామలక్ష్మణులు. 43

మూ. ఆదివంశవిశుద్ధానాం రాజ్ఞాం పరమధర్మిణామ్,
ఇక్ష్వాకుకులజాతానాం వీరాణాం సత్యవాదినామ్. 44

రామలక్ష్మణయోరర్థే త్వత్సుతే వరయే నృప,
సదృశాభ్యాం నృపశ్రేష్ఠ సదృశే దాతుమర్హసి. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
సప్తతితమః సర్గః.

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడ వైన, నృప = రాజా ! ఆదివంశవిశుద్ధానామ్ = మొదటినుండియు వంశముచే పరిశుద్ధులును, పరమధర్మిణామ్=మిక్కిలి ధర్మాత్ములును, వీరాణామ్=వీరులును, సత్యవాదినామ్ = సత్యమునే పలుకువారును అగు, ఇక్ష్వాకుకులజాతానామ్=ఇక్ష్వాకువంశీయులైన, రాజ్ఞామ్=రాజులకు సంబంధించిన, రామలక్ష్మణయోరర్థే = రామలక్ష్మణులకొరకై, త్వత్సుతే=నీ కుమార్తెలను, వరయే=వరించుచున్నాను. సదృశాభ్యామ్=తగిన ఈ రామలక్ష్మణులకు, సదృశే=తగిన నీ పుత్రికలను, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి=తగి యున్నావు.

తా. నరశ్రేష్ఠుడ వైన జనకమహారాజా! ఆదినుండియు పరిశుద్ధ మైన వంశము కలవారును, పరమధార్మికులును, వీరులును, సత్యవాదులును అగు ఇక్ష్వాకువంశీయరాజుల వంశములో జనించిన ఈ రామలక్ష్మణులకొరకై నీ కుమార్తెలను వరించుచున్నాను. నీ కుమార్తెలకు తగిన వరు లైన ఈ రామలక్ష్మణులకు, వీరికి తగిన వధువు లైన నీ కుమార్తెల నిచ్చి వివాహము చేయుము. 44

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
బాలకాండలో డెబ్బదవ సర్గ సమాప్తము.

## అథ ఏకసప్తతితమః సర్గః

మూ. ఏవం బ్రువాణం జనకః ప్రత్యువాచ కృతాఞ్జలిః,
శ్రోతుమర్హసి భద్రం తే కులం నః పరికీర్తితమ్. 1

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న వసిష్ఠుని గూర్చి, జనకః=జనకుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, ప్రత్యువాచ= తిరిగి పలికెను. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. పరికీర్తితమ్=చెప్పబడిన, నః=మాయొక్క, కులమ్ = కులమును గూర్చి, శ్రోతుమ్=వినుటకు, అర్హసి= తగియున్నావు.

తా. ఈ విధముగ దశరథుని వంశమును వర్ణించి చెప్పిన వసిష్ఠునితో జనకుడు, చేతులు జోడించి ఇట్లు పలికెను. నీకు మంగళ మగుగాక. నా వంశ మును గూర్చి చెప్పుచున్నాను; వినుము. 1

మూ. ప్రదానే హి మునిశ్రేష్ఠ కులం నిరవశేషతః,
వక్తవ్యం కులజాతేన తన్నిబోధ మహామునే. 2

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునులలో శ్రేష్ఠుడ వైన, మహామునే=ఓ మహా మునీ! కులజాతేన =సత్కులమునందు పుట్టినవానిచేత, ప్రదానే = కన్యాదాన సమయమునందు, నిరవశేషతః=పూర్తిగా, కులమ్ = కులము, వక్తవ్యం హి= చెప్పదగినది కదా. తత్=దానిని గూర్చి, నిబోధ=తెలుసుకొనుము.

తా. మహామునీ! సత్కులప్రసూతు లైనవారు, కన్యాదానసమయమున తమ కులమును గూర్చి పూర్తిగా చెప్పవలెను. దానిని వినుము. 2

మూ. రాజాఽభూత్త్రిషు లోకేషు విశ్రుతః స్వేన కర్మణా,
నిమిః పరమధర్మాత్మా సర్వసత్త్వవతాం వరః. 3

ప్ర. అ. స్వేన=తనసంబంధమైన, కర్మణా=కర్మచేత, త్రిషు=మూడు, లోకేషు=లోకములందు, విశ్రుతః = ప్రసిద్ధుడును, పరమధర్మాత్మా = మిక్కిలి

ధర్మాత్ముడును, సర్వసత్త్వవతామ్=బలము కలవా రందరిలో, వరః=శ్రేష్ఠుడును అగు, నిమిః=నిమిచక్రివర్తి, అభూత్=ఉండెను.

**తా.** తన పనులచే మూడు లోకములందును ప్రసిద్ధుడును, పరమ ధర్మాత్ముడును, బలము కలవా రందరిలోను శ్రేష్ఠుడును అగు నిమిచక్రివర్తి ఉండెను. 3

మూ. తస్య పుత్రో మిథిర్నామ మిథిలా యేన నిర్మితా,
ప్రథమో జనకో నామ జనకాదప్యుదావసుః. 4

ప్ర. అ. మిథిర్నామ = మిథి అను పేరు గలవాడు, తస్య = ఆతని యొక్క, పుత్రః=పుత్రుడు; యేన = ఎవనిచేత, మిథిలా = మిథిల, నిర్మితా= నిర్మింపబడినదో, అతడు, ప్రథమః = మొదటి, జనకః నామ=జనకుడు. జన కాత్=జనకునినుండి, ఉదావసుః=ఉదావసువు పుట్టెను.

**తా.** మిథిలను నిర్మించిన మిథి ఆ నిమిచక్రవర్తి కుమారుడు. ఇతడే మొట్టమొదటి జనకుడు. ఆతని కుమారుడు ఉదావసువు. 4

మూ. ఉదావసోస్తు ధర్మాత్మా జాతో వై నన్దివర్ధనః,
నన్దివర్ధనపుత్రస్తు సుకేతుర్నామ నామతః. 5

ప్ర. అ. ఉదావసోః తు = ఉదావసువునకు, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, నన్దివర్ధనః=నందివర్ధనుడు, జాతః = పుట్టెను. నన్దివర్ధనపుత్రః తు=నందివర్ధ నుని పుత్రుడు, నామతః = పేరుచే, సుకేతుర్నామ = సుకేతు వను ప్రసిద్ధి గలవాడు.

**తా.** ఉదావసువునకు ధర్మాత్ము డైన నందివర్ధను డను కుమారుడు కలి గెను. ఆతని కుమారుడు సుకేతువు. 5

మూ. సుకేతోరపి ధర్మాత్మా దేవరాతో మహాబలః,
దేవరాతస్య రాజర్షేర్బృహద్రథ ఇతి స్మృతః. 6

ప్ర. అ. సుకేతోః అపి = సుకేతువునకు, ధర్మాత్మా = ధర్మాత్ముడును, మహాబలః = గొప్ప బలము కలవాడును అగు, దేవరాతః=దేవరాతుడు పుట్టెను.

రాజర్షేః=రాజర్షియైన, దేవరాతస్య=దేవరాతునకు, బృహద్రథః ఇతి = బృహద్రథు దని, స్మృతః=చెప్పబడిన కుమారుడు పుట్టెను.

తా. సుకేతువునకు ధర్మాత్ముడును, మహాబలుడును అగు దేవరాతుడు పుట్టెను. రాజర్షి యైన దేవరాతునకు బృహద్రథు డను పుత్రుడు జనించెను. 6

మూ. బృహద్రథస్య శూరోఽభూన్మహావీరః ప్రతాపవాన్,
మహావీరస్య ధృతిమాన్ సుధృతిః సత్యవిక్రమః. 7

ప్ర. అ. బృహద్రథస్య=బృహద్రథునకు, శూరః=శూరుడును, ప్రతాపవాన్=ప్రతాపవంతుడును అగు, మహావీరః = మహావీరు డను పుత్రుడు కల్గెను. మహావీరస్య=మహావీరునకు, ధృతిమాన్=ధైర్యము కలవాడును, సత్యవిక్రమః= సత్య మైన పరాక్రమము కలవాడును అగు, సుధృతిః=సుధృతి పుట్టెను.

తా. బృహద్రథునకు శూరుడును ప్రతాపవంతుడును అగు మహావీరుడు పుట్టెను. మహావీరునకు ధైర్యవంతుడును, సత్య మైన పరాక్రమము కలవాడును, అగు సుధృతి జన్మించెను. 7

మూ. సుధృతేరపి ధర్మాత్మా దృష్టకేతుస్సుధార్మికః,
దృష్టకేతోస్తు రాజర్షేర్హర్యశ్వ ఇతి విశ్రుతః. 8

ప్ర. అ. సుధృతేః = సుధృతికి, ధర్మాత్మా = ధర్మమునందు బుద్ధి కలవాడును, సుధార్మికః = బాగుగా ధార్మికుడును అయిన, దృష్టకేతుః = దృష్టకేతువు, రాజర్షేః = రాజర్షియైన, దృష్టకేతోః = దృష్టకేతువునకు, హర్యశ్వః ఇతి = హర్యశ్వు దని, విశ్రుతః = ప్రసిద్ధు డైన కుమారుడును జన్మించెను.

తా. ధర్మబుద్ధి కలవాడును, ధర్మాచరణశీలుడును అగు దృష్టకేతువు సుధృతికి కుమారుడుగ జన్మించెను. రాజర్షి యైన దృష్టకేతువునకు హర్యశ్వు డని ప్రసిద్ధు డైన పుత్రుడు జనించెను. 8

మూ. హర్యశ్వస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రతిన్ధకః,
ప్రతిన్ధకస్య ధర్మాత్మా రాజా కీర్తిరథః సుతః 9

ప్ర. అ. హర్యశ్వస్య = హర్యశ్వునకు, మరుః = మరువు, పుత్రః = పుత్రుడు. మరోః = మరువునకు, ప్రతిన్ధకః = ప్రతింధకుడు, పుత్రః = పుత్రుడు. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాజా = రాజైన, కీర్తిరథః = కీర్తిరథుడు, ప్రతిన్ధకస్య = ప్రతింధకునియొక్క, సుతః = కుమారుడు.

తా. హర్యశ్వునకు మరుడు అను పుత్రుడు జనించెను. మరుని పుత్రుడు ప్రతింధకుడు. ధర్మాత్ముడైన కీర్తిరథమహారాజు ప్రతింధకుని కుమారుడు. 9

మూ. పుత్రః కీర్తిరథస్యాపి దేవమీఢ ఇతి స్మృతః,
దేవమీఢస్య విబుధో విబుధస్య మహీధ్రకః. 10

ప్ర. అ. కీర్తిరథస్యాపి=కీర్తిరథునియొక్క, పుత్రః=పుత్రుడు, దేవమీఢః ఇతి = దేవమీడు డని, స్మృతః = చెప్పబడినాడు. దేవమీఢస్య = దేవమీడుని కుమారుడు, విబుధః = విబుధుడు. విబుధస్య = విబుధునకు, మహీధ్రకః = మహీధ్రకుడు కుమారుడు.

తా. కీర్తిరథునికి దేవమీడుడు, దేవమీడునకు విబుధుడు, అతనికి మహీధ్రకుడును పుట్టెను. 10

మూ. మహీధ్రకసుతో రాజా కీర్తిరాతో మహాబలః,
కీర్తిరాతస్య రాజర్షేర్మహారోమా వ్యజాయత. 11

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, రాజా=రాజైన, కీర్తిరాతః= కీర్తిరాతుడు, మహీధ్రకసుతః = మహీధ్రకుని కుమారుడు. రాజర్షేః = రాజర్షియైన, కీర్తిరాతస్య = కీర్తిరాతునకు, మహారోమః =మహారోముడు, వ్యజాయత= పుట్టెను.

తా. మహీధ్రకునకు మహాబలుడైన కీర్తిరాతు డను కుమారుడు జనించెను. రాజర్షి యైన కీర్తిరాతునకు మహారోముడు పుట్టెను. 11

మూ. మహారోమ్ణస్తు ధర్మాత్మా స్వర్ణరోమా వ్యజాయత,
స్వర్ణరోమ్ణస్తు రాజర్షేర్హ్రస్వరోమా వ్యజాయత. 12

ప్ర. అ. మహారోమ్ణః తు = మహారోమునకు, స్వర్ణరోమా=స్వర్ణరోముడు, అజాయత = జనించెను. రాజర్షేః = రాజర్షి యైన, స్వర్ణరోమ్ణస్తు = స్వర్ణరోమునకు, హ్రిస్వరోమా = హ్రిస్వరోముడు, వ్యజాయత = పుట్టెను.

తా. మహారోమునకు ధర్మాత్ముఁ డైన స్వర్ణరోముడు పుట్టెను. రాజర్షి యైన స్వర్ణరోమునకు హ్రస్వరోముడు పుట్టెను. 12

మూ. తస్య పుత్రద్వయం జజ్ఞే ధర్మజ్ఞస్య మహాత్మనః,
జ్యేష్ఠోఽహమనుజో భ్రాతా మమ వీరః కుశధ్వజః. 13

ప్ర. అ. ధర్మజ్ఞస్య = ధర్మజ్ఞుఁ డైన, తస్య = ఆ, మహాత్మనః = మహాత్మునకు, పుత్రద్వయమ్ = పుత్రద్వయము, జజ్ఞే = పుట్టెను ; అహమ్ = నేను, జ్యేష్ఠః = పెద్దవాడను, వీరః = వీరుడైన, కుశధ్వజః = కుశధ్వజుడు, మమ = నాయొక్క, అనుజః భ్రాతా = తమ్ముడు.

తా. ధర్మము నెరిగిన ఆ మహాత్మునకు ఇద్దరు పుత్రులు జనించిరి. నేను పెద్దవాడను. వీరు డైన కుశధ్వజుడు నా తమ్ముడు. 13

మూ. మాం తు జ్యేష్ఠం పితా రాజ్యే సోఽభిషిచ్య నరాధిపః,
కుశధ్వజం సమావేశ్య భారం మయి వనం గతః. 14

ప్ర. అ. పితా = మా తండ్రి యైన, సః నరాధిపః=ఆ రాజు, జ్యేష్ఠమ్= పెద్దవాఁడ నైన, మామ్ = నన్ను, రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్య = అభిషేకించి, కుశధ్వజమ్=కుశధ్వజుని, భారమ్=పోషింపవలసినవానినిగా, మయి= నాయందు, సమావేశ్య = ఉంచి, వనమ్ = వనమునుగూర్చి, గతః = వెళ్లినాడు.

తా. మా తండ్రి యైన హ్రస్వరోమమహారాజు జ్యేష్ఠుఁడ నైన నన్ను రాజ్యాభిషిక్తుని చేసి, కుశధ్వజుని పోషణభారమును నాపై ఉంచి వనమునకు పోయెను. 14

మూ. వృద్ధే పితరి స్వర్యాతే ధర్మేణ ధురమావహమ్,
ఖ్రాతరం దేవసంకాశం స్నేహాత్పశ్యన్ కుశధ్వజమ్. 15

ప్ర. అ. వృద్ధే = వృద్ధుడైన, పితరి = తండ్రి, స్వర్యాతే సతి = స్వర్గమునకు వెళ్లగా, భ్రాతరమ్ = సోదరుడైన, దేవసంకాశమ్ = దేవతలతో సమానుడైన, కుశధ్వజమ్ = కుశధ్వజుని, స్నేహాత్ = స్నేహమువలన, పశ్యన్ = చూచుచు, ధర్మేణ = ధర్మముతో, ధురమ్ = రాజ్యభార మును, ఆవహమ్ = వహించితిని.

తా. వృద్ధుడైన తండ్రి స్వర్గస్థుడైన పిమ్మట, దేవసదృశుడైన నా తమ్ముడు కుశధ్వజుని స్నేహముతో చూచుకొనుచు, ధర్మానుసారముగా రాజ్యభారము వహించితిని. 15

మూ. కస్య చిత్త్వథ కాలస్య సాజ్కాశ్యాదగమత్పురాత్,
సుధన్వా వీర్యవాన్రాజా మిథిలామవరోధకః. 16

ప్ర. అ. అథ = పిమ్మట, కస్యచిత్ కాలస్య = కొంత కాలమునకు, వాన్ = పరాక్రమవంతుడైన, సుధన్వా = సుధన్వు డను, రాజా = రాజు, మిథిలామ్ = మిథిలానగరమును, అవరోధకః = ముట్టడించ నున్నవాడై, సాజ్కాశ్యాత్ = సాంకాశ్య మనెడు, పురాత్ = పురమునుండి, (మిథిలను) అగమత్ = పొందెను.

తా. కొంత కాలమునకు, పరాక్రమవంతు డగు సుధన్వు డను రాజు సాంకాశ్యపురమునుండి మిథిల పైకి దండెత్తివచ్చెను. 16

మూ. స చ మే ప్రేషయామాస శైవం ధనురనుత్తమమ్,
సీతా కన్యా చ పద్మాక్షీ మహ్యం వై దీయతామితి. 17

ప్ర. అ. అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, శైవం ధనుః = శివధనస్సు, పద్మాక్షీ = పద్మముల వంటి నేత్రములుగల, కన్యా = నీ కుమార్తెయైన, సీతా చ = సీతయు, మహ్యమ్ = నాకు, దీయతామ్ = ఇవ్వబడుగాక. ఇతి = అని, సః = అతడు, మే = నాకు, ప్రేషయామాస = కబురుపంపెను.

తా. "శ్రేష్ఠ మగు శివధనస్సును, పద్మపత్రాక్షి యగు సీతను నా కిమ్ము" అని అతడు నాకు వార్త పంపెను. 17

మూ. తస్యాప్రదానాద్బ్రహ్మర్షే యుద్ధమాసీన్మయా సహ,
స హతోఽభిముఖో రాజా సుధన్వా తు మయా రణే. 18

ప్ర. అ. బ్రహ్మర్షే=బ్రహ్మర్షీ ! అప్రదానాత్ = ఇవ్వక పోవుటవలన, తస్య = ఆతనికి, మయా సహ = నాతో కూడ, యుద్ధమ్ = యుద్ధము, ఆసీత్= జరిగెను. రణే=యుద్ధమునందు, అభిముఖః=నాకు ఎదురుగా వచ్చిన, సః=ఆ, సుధన్వా రాజా=సుధన్వరాజు, మయా=నాచేత, హతః=చంపబడినాడు.

తా. సీతాశివధనస్సులను ఇవ్వక పోవుటచే ఆతనికిని నాకును యుద్ధము జరుగగా, రణరంగమున నే నాతనిని వధించితిని. 18

మూ. నిహత్య తం మునిశ్రేష్ఠ ! సుధన్వానం నరాధిపమ్,
సాఙ్కాశ్యే భ్రాతరం వీరమభ్యషిఞ్చం కుశధ్వజమ్. 19

ప్ర. అ. మునిశ్రేష్ఠ=ఓ మునిశ్రేష్ఠుడా ! నరాధిపమ్=రాజైన, తమ్=ఆ, సుధన్వానమ్=సుధన్వుని, నిహత్య=చంపి, భ్రాతరమ్=నా సోదరుడైన, వీరమ్= వీరు డైన, కుశధ్వజమ్=కుశధ్వజుని, సాఙ్కాశ్యే = సాంకాశ్యమునందు, అభ్య షిఞ్చమ్=అభిషేకించితిని.

తా. వసిష్ఠమహామునీ ! ఆ సుధన్వుని సంహరించి, నా సోదరు డైన ఈ కుశధ్వజుని సాంకాశ్యపురమున రాజ్యాభిషిక్తుని చేసితిని. 19

మూ. కనీయానేష మే భ్రాతా అహం జ్యేష్ఠో మహామునే,
దదామి పరమప్రీతో వధ్వౌ తే మునిపుఙ్గవ. 20
సీతాం రామాయ భద్రం తే ఊర్మిళాం లక్ష్మణాయ చ.

ప్ర. అ. మహామునే=ఓ మహామునీ ! ఏషః=ఇతడు, మే = నాయొక్క, కనీయాన్=చిన్నవాడైన, భ్రాతా=సోదరుడు. అహమ్=నేను, జ్యేష్ఠః = పెద్ద వాడను. మునిపుఙ్గవ = ఓ మునిశ్రేష్ఠా ! పరమప్రీతః = మిక్కిలి సంతసించిన వాడనై, తే=ఆ, వధ్వౌ=కన్యలను, దదామి=ఇచ్చుచున్నాను. సీతామ్=సీతను,

**రామాయ**=రామునకును, **ఊర్మిళామ్**=ఊర్మిళను, **లక్ష్మణాయ చ**=లక్ష్మణునకును ఇచ్చుచున్నాను. **తే** = నీకు, **భద్రమ్**=మంగళమగు గాక.

**తా.** మునిశ్రేష్ఠుడ వైన వసిష్ఠా ! సోదరులలో నేను పెద్దవాడను. ఇతడు చిన్నవాడు. కన్య లిద్దరిని ఆనందపూర్వకముగ ఇచ్చెదను. సీతను రామునకును, ఊర్మిళను లక్ష్మణునకును ఇచ్చెదను. 20

మూ. వీర్యశుల్కాం మమ సుతాం సీతాం సురసుతోపమామ్, 21
ద్వితీయామూర్మిళాం చైవ త్రిర్దదామి న సంశయః.

**ప్ర. అ.** **వీర్యశుల్కామ్**=వీర్యమే శుల్కముగా గలదియు, **సురసుతోపమామ్** = దేవకన్యతో సమానురా లైన, **మమ సుతామ్** = నాకుమార్తె యైన, **సీతామ్** = సీతను, **ద్వితీయామ్** = రెండవ కుమార్తె యైన, **ఊర్మిళాం చైవ** = ఊర్మిళను, **త్రిః** = మూడు సార్లు, **దదామి** = ఇచ్చుచున్నాను. **సంశయః** = సంశయము, **న** = లేదు.

**తా.** వీర్యశుల్కయు, దేవకన్యతో సమానురాలును అగు నా పుత్రిక యైన సీతను, రెండవ కుమార్తె యైన ఊర్మిళను ఇచ్చెద నని మూడు పర్యాయములు నొక్కి వక్కాణించుచున్నాను. ఈ విషయమున సందేహము లేదు.

**వి.** "త్రిః దదామి" అను దానికి "మనోవాక్కాయము లను మూడు కరణముల చేత ఇచ్చుచున్నాను" అని కొంద రర్థము చెప్పినారు. 21

మూ. దదామి పరమప్రీతో వధ్వౌ తే రఘునన్దన, 22
రామలక్ష్మణయో రాజన్ గోదానం కారయస్వ హ,
పితృకార్యం చ భద్రం తే తతో వైవాహికం కురు. 23

**ప్ర. అ.** **రఘునన్దన** = దశరథమహారాజా ! **పరమప్రీతః** = చాల సంతసించినవాడనై, **తే** = ఆ, **వధ్వౌ**=కన్యలను, **దదామి**=ఇచ్చుచున్నాను. **రాజన్**= రాజా ! **రామలక్ష్మణయోః** = రామలక్ష్మణులకు, **గోదానమ్** = గోదానవ్రతమును, **కారయస్వ హ**=చేయించుము. **పితృకార్యం చ**=నాందీశ్రాద్ధమును కూడ, **కురు**= చేయుము. **తతః**=పిమ్మట, **వైవాహికమ్**=వివాహమును, (చేయుము).

తా. దశరథమహారాజా! ఈ కన్యలను ఆనందపూర్వకముగా ఇచ్చుచున్నాను. రామలక్ష్మణులకు గోదానమును (సమావర్తనవ్రతమును) చేయించుము. నాందీశ్రాద్ధము చేసిన పిమ్మట వివాహము జరిపించుము. 22

మూ. మఘా హ్యద్య మహాబాహో తృతీయే దివసే ప్రభో, 23
ఫల్గున్యాముత్తరే రాజన్ తస్మిన్ వైవాహికం కురు,
రామలక్ష్మణయో రాజన్ దానం కార్యం సుఖోదయమ్. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ఏకసప్తతితమః సర్గః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, ప్రభో = ఓ మహారాజా! అద్య = నేడు, మఘా హి = మఘానక్షత్రము కదా. రాజన్ = మహారాజా! దివసే = నేటినుండి మూడవ దివసమున, ఫల్గున్యామ్ = ఫల్గుని యనెడు, తస్మిన్ = ఆ, ఉత్తరే = ఉత్తరనక్షత్రమునందు, వైవాహికమ్ = వివాహకార్యమును, కురు = చేయుము, రాజన్ = రాజా, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులయొక్క సుఖోదయమ్ = సుఖమే భావిఫలముగా గల, దానమ్ = దానము, కార్యమ్ = చేయదగినది.

తా. దశరథమహారాజా! ఈ దివసమున మఘానక్షత్రము కదా. నేటికి మూడవరోజున, ఉత్తరఫల్గునీ నక్షత్రమునందు, వివాహము చేయుము. ముందుగా, రామలక్ష్మణుల భావిసుఖహేతు వగు గోహిరణ్యభూమ్యాదిదానము కూడ చేయింపవలెను. 23, 24

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు, బాలకాండలో డెబ్బదిఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విసప్తతితమః సర్గః

మూ. తముక్తవన్తం వైదేహం విశ్వామిత్రో మహామునిః,
ఉవాచ వచనం వీరం వసిష్ఠసహితో నృపమ్. 1

ప్ర. అ. మహామునిః = మహాముని యైన, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, వసిష్ఠసహితః = వసిష్ఠునితో కూడినవాడై, ఉక్తవన్తమ్ = ఇట్లు పలికిన, వీరమ్ = వీరుడైన, వైదేహమ్ = విదేహాధిపతి యైన, నృపమ్ = జనకమహారాజును గూర్చి, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. విదేహాధిపతి యగు జనకమహారాజు పలికిన మాటలు విని వసిష్ఠ విశ్వామిత్రు లాతనితో ఇట్లు పలికిరి. 1

మూ. అచిన్త్యాన్యప్రమేయాని కులాని నరపుఙ్గవ,
ఇక్ష్వాకూణాం విదేహానాం నైషాం తుల్యోఽస్తి కశ్చన. 2

ప్ర. అ. నరపుఙ్గవ = నరశ్రేష్ఠుడా ! ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజుల యొక్కయు, విదేహానాం చ = విదేహరాజులయొక్కయు, కులాని = కులములు, అచిన్త్యాని = ఊహింప శక్యముకానివి. అప్రమేయాని = కొలత పెట్టరానివి. ఏషామ్ = ఈ ఇక్ష్వాకు విదేహరాజులకు, తుల్యః = సమాన మైనవాడు, కశ్చన = ఎవ్వడును, నాస్తి = లేడు.

తా. జనకమహారాజా ! ఇక్ష్వాకువిదేహవంశములు ఊహింపరాని, కొలత పెట్టశక్యము కాని, ప్రభావము కలవి. ఏతద్వంశీయులతో సమాను లెవ్వరును లేరు. 2

మూ. సదృశో ధర్మసంబన్ధః సదృశో రూపసమ్పదా,
రామలక్ష్మణయో రాజన్ సీతా చోర్మిళయా సహ. 3

ప్ర. అ. రాజన్ = రాజా, ఊర్మిళయా సహ = ఊర్మిళతో గూడ, సీతా = సీత, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులకు (ఇవ్వబడుచున్నది. ఇది), సదృశః =

తగిన, ధర్మసంబన్ధః=వివాహరూప మైన ధర్మసంబంధము. రూపసమ్పదా చ= రూపసంపదచేత కూడ, సదృశః=తగినది.

తా. రాజా ! సీతా, ఊర్మిళలను రామలక్ష్మణుల కిచ్చి వివాహము చేయుట అనునది పరస్పరకులగౌరవాదులకును, రూపసంపదకును తగిన సంబంధము. 3

మూ. వక్తవ్యం చ నరశ్రేష్ఠ శ్రూయతాం వచనం మమ,
భ్రాతా యవీయాన్ ధర్మజ్ఞ ఏష రాజా కుశధ్వజః. 4

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా ! మమ = నాయొక్క, వక్తవ్యం చ=చెప్పదగిన, వచనమ్=వచనము, శ్రూయతామ్=వినబడుగాక. యవీయాన్ భ్రాతా=నీ తమ్ము డైన, ఏషః=ఈ, రాజా=రాజైన, కుశధ్వజః = కుశధ్వజుడు, ధర్మజ్ఞః=ధర్మము లెరిగినవాడు.

తా. నరశ్రేష్ఠుడ వైన జనకమహారాజా ! మేము చెప్పదలచిన వచనమును వినుము. నీ తమ్ము డైన ఈ కుశధ్వజుడు ధర్మము నెరిగినవాడు. 4

మూ. అస్య ధర్మాత్మనో రాజన్ రూపేణాప్రతిమం భువి,
సుతాద్వయం నరశ్రేష్ఠ పత్న్యర్థం వరయామహే. 5

ప్ర. అ. రాజన్=రాజా ! నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా ! రూపేణ = సౌందర్యము చేత, భువి=భూలోకమునందు, అప్రతిమమ్ = సాటిలేని, అస్య ధర్మాత్మనః = ఈ ధర్మాత్మునియొక్క, సుతాద్వయమ్ = పుత్రికాద్వయమును, పత్న్యర్థమ్ = భరతశత్రుఘ్నుల భార్య లగుటకై, వరయామహే = వరించు చున్నాము.

తా. జనకనరేంద్రా ! భూలోకమునందు సాటి లేని రూపము గలవారగు ఈ ధర్మాత్ముని ఇరువురు పుత్రికలను భరతశత్రుఘ్నులకు భార్యలనుగా వరించు చున్నాము. 5

మూ. భరతస్య కుమారస్య శత్రుఘ్నస్య చ ధీమతః,
వరయామః సుతే రాజన్ తయోరర్థే మహాత్మనోః. 6

ప్ర. అ. రాజన్=రాజా ! కుమారస్య=కుమారుడైన, భరతస్య=భరతుని కొరకును, ధీమతః=బుద్ధిమంతుడైన, శత్రుఘ్నస్య చ=శత్రుఘ్నుని కొరకును, మహాత్మనోః=మహాత్ములైన, తయోరర్థే = వారిరువురికొరకును, సుతే = మీ తమ్ముని కుమార్తెలను, వరయామః=వరించుచున్నాము.

తా. రాజా ! భరతకుమారుని కొరకును, ధీమంతుడైన శత్రుఘ్నుని కొరకును నీ తమ్ముని కుమార్తెలను కోరుచున్నాము. 6

మూ. పుత్రా దశరథస్యేమే రూపయౌవనశాలినః,
లోకపాలసమాః సర్వే దేవతుల్యపరాక్రమాః. 7

ప్ర. అ. ఇమే=ఈ, దశరథస్య పుత్రాః = దశరథుని పుత్రులు, సర్వే= అందరును, రూపయౌవనశాలినః=సౌందర్యముతోడను యౌవనముతోడను ప్రకాశించుచున్నారు. లోకపాలసమాః = లోకపాలులతో సమానులు. దేవతుల్యపరాక్రమాః=దేవతలతో సమానమైన పరాక్రమము గలవారు.

తా. ఈ దశరథకుమారు లందరును రూపయౌవనములతో ప్రకాశించుచున్నవారు. లోకపాలులతో సమానులు. దేవతల వంటి పరాక్రమము గలవారు. 7

మూ. ఉభయోరపి రాజేన్ద్ర సంబన్ధేనానుబధ్యతామ్,
ఇక్ష్వాకోః కులమవ్యగ్రం భవతః పుణ్యకర్మణః. 8

ప్ర. అ. రాజేన్ద్ర = మహారాజా ! ఇక్ష్వాకోః = ఇక్ష్వాకువుయొక్కయు, పుణ్యకర్మణః=పుణ్యమైన కర్మగల, భవతః = నీయొక్కయు, ఉభయోరపి= ఇద్దరియొక్కయు, కులమ్ = కులము, సమ్బన్ధేన = వివాహసంబంధముచేత, అవ్యగ్రమ్ = దృఢముగా, అనుబధ్యతామ్=కట్టబడుగాక.

తా. జనకమహారాజా ! పుణ్యకర్మ గల నీ కులమునకును, ఇక్ష్వాకుకులమునకును ఈ వివాహసంబంధముచే దృఢమైన బంధము ఏర్పడుగాక. 9

మూ. విశ్వామిత్రవచః శ్రుత్వా వసిష్ఠస్య మతే తదా,
జనకః ప్రాఞ్జలిర్వాక్యమువాచ మునిపుఙ్గవౌ. 9

ప్ర. అ. తదా=అప్పుడు, వసిష్ఠస్య=వసిష్ఠునియొక్క, మతే = అనుజ్ఞ ప్రకారము, విశ్వామిత్రవచః=విశ్వామిత్రుని వాక్యమును, శ్రుత్వా=విని, జనకః= జనకుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, మునిపుఙ్గవౌ = మునిపుంగవులను గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వసిష్ఠుని అనుమతి ననుసరించి విశ్వామిత్రుడు పలికిన ఈ మాటలు విని, జనకమహారాజు, అంజలి ఘటించి, ఆ వసిష్ఠవిశ్వామిత్రులతో నిట్లనెను. 9

మూ. కులం ధన్యమిదం మన్యే యేషాం నో మునిపుఙ్గవౌ,
సదృశం కులసమ్బన్ధం యదాజ్ఞాపయథః స్వయమ్. 10

ప్ర. అ. యేషామ్=ఏ, నః=మాకు, సదృశమ్=తగిన, కులసంబన్ధమ్= కులసంబంధమును. మునిపుఙ్గవౌ=మునిపుంగవు లైన మీరు, స్వయమ్=స్వయముగా, యత్=ఏకారణమువలన, ఆజ్ఞాపయథః = ఆజ్ఞాపించుచున్నారో అట్టి, ఇదమ్=ఈ, కులమ్=కులమును, ధన్యమ్=ధన్య మైనదానినిగా, మన్యే=తలచుచున్నాను.

తా. మునిశ్రేష్ఠు లైన మీరు మాకు తగిన కులసంబంధమునుగూర్చి స్వయముగ ఆజ్ఞాపించుచున్నారు. అందుచే మా కులము ధన్య మైనది. 10

మూ. ఏవం భవతు భద్రం వః కుశధ్వజసుతే ఇమే,
పత్న్యౌ భజేతాం సహితౌ శత్రుఘ్నభరతావుభౌ. 11

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, భవతు=అగుగాక ; వః = మీకు, భద్రమ్= కుశల మగుగాక. ఇమే=ఈ, కుశధ్వజసుతే=కుశధ్వజుని కుమార్తెలు, సహితౌ= కలిసియుండువారైన, శత్రుఘ్నభరతౌ=శత్రుఘ్నభరతులను, ఉభౌ=ఇద్దరిని, పత్న్యౌ=భార్యలుగా, భజేతామ్=సేవింతురు గాక.

తా. అట్లే అగుగాక. మీకు భద్ర మగుగాక. ఈ కుశధ్వజుని కుమార్తెలగు మాండవీశ్రుతకీర్తులు, కలసి సంచరించెడు ఈ భరతశత్రుఘ్నులకు (వరుసగ) భార్యలై వారిని సేవింతురుగాక. 11

మూ. ఏకాహ్నే రాజపుత్రీణాం చతసృణాం మహామునే,
పాణీన్ గృహ్ణన్తు చత్వారో రాజపుత్రా మహాబలాః. 12

ప్ర. అ. మహామునే = ఓమహామునీ ! మహాబలాః=గొప్ప బలముగల, చత్వారః=నలుగురు, రాజపుత్రాః = రాజపుత్రులు, ఏకాహ్నే = ఒకేదివసమున, చతసృణామ్=నలుగురు, రాజపుత్రీణామ్ = రాజపుత్రికలయొక్క, పాణీన్= హస్తములను, గృహ్ణన్తు=గ్రహింతురుగాక.

తా. మహామునీ ! మహాబలశాలు లగు నలుగురు రాజపుత్రులును ఒకే దివసమున నలుగురు రాజపుత్రికలను వివాహ మాడుదురు గాక. 11

మూ. ఉత్తరే దివసే బ్రహ్మన్ ఫల్గునీభ్యాం మనీషిణః,
వైవాహికం ప్రశంసన్తి భగో యత్ర ప్రజాపతిః. 13

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణోత్తమా ! ఫల్గునీభ్యామ్ = పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, అను రెండు ఫల్గునీనక్షత్రములతో కూడిన దినములలో, యత్ర= ఏ దినమునందు, ప్రజాపతిః = ప్రజాపతి యైన (సంతానదాతయైన), భగః= భగుడు, (దేవతా=దేవతయో), అట్టి, ఉత్తరే దివసే=ఉత్తరఫల్గునీనక్షత్రముతో కూడిన దివసమున, వైవాహికమ్=వివాహకృత్యమును, మనీషిణః=విద్వాంసులు, ప్రశంసన్తి=ప్రశంసించుచున్నారు.

తా. బ్రాహ్మణోత్తమా! సంతానదాత యగు భగుడు దేవతగా గల ఉత్తర నక్షత్రముతో కూడిన దివసమున వివాహకృత్యము శ్రేష్ఠ మని బుద్ధిమంతులు చెప్పుదురుకదా ? 13

మూ. ఏవముక్త్వా వచః సౌమ్యం ప్రత్యుత్థాయ కృతాఞ్జలిః,
ఉభౌ మునివరౌ రాజా జనకో వాక్యమబ్రవీత్. 14

ప్ర. అ. జనకః రాజా = జనకమహారాజు, ఏవమ్=ఇట్లు, సౌమ్యమ్= మధుర మైన, వచః = వచనమును, ఉక్త్వా=పలికి, ప్రత్యుత్థాయ=లేచి, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, ఉభౌ=ఇద్దరు, మునివరౌ = మునివరులను గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. జనకమహారాజు ఈ విధముగ సౌమ్య మగు వాక్యము పలికి, లేచి, దోసిలి కట్టి, ఆ మహాముని లిరువురితో మరల ఇట్లనెను. 14

మూ. పరో ధర్మః కృతో మహ్యం శిష్యోఽస్మి భవతోః సదా,
ఇమాన్యాసనముఖ్యాని ఆసాతాం మునిపుఙ్గవౌ. 15

ప్ర. అ. మహ్యమ్=నాకు, పరః=గొప్ప, ధర్మః=ధర్మము, కృతః=చేయ బడినది. సదా=ఎల్లప్పుడును, భవతోః=మీ ఇద్దరికిని, శిష్యః అస్మి=శిష్యుడ నై యున్నాను. మునిపుఙ్గవౌ=ముని శ్రేష్ఠు లైన మీరు, ఇమాని=ఈ, ఆసనముఖ్యాని=సింహాసనములను, ఆసాతామ్=అధిష్ఠింతురుగాక.

తా. మీరు నాకు గొప్ప ధర్మకార్యమును నెరవేర్చినారు. నేను ఎల్లప్పుడును మీ శిష్యుడనే. మునిపుంగవు లైన మీ రిరువురును ఈ మూడుసింహాసనములను (జనక—దశరథ-కుశధ్వజుల సింహాసనములను) అధిష్ఠింతురు గాక.

వి. సింహాసనము నధిష్ఠించుట యనగా లక్షణచే అధికారము నిర్వహించుట అని అర్థము, మీ రిరువురును మా ముగ్గురి రాజ్యములపై అధికారము నిర్వహింతురు గాక అని భావము. 15

మూ. యథా దశరథస్యేయం తథాయోధ్యా పురీ మమ,
ప్రభుత్వే నాస్తి సన్దేహో యథార్హం కర్తుమర్హథ. 16

ప్ర. అ. ఇయమ్=ఈ మిథిల, దశరథస్య=దశరథునకు, యథా=ఎట్లో, అయోధ్యా పురీ=అయోధ్యానగరము, మమ=నాకు, తథా=అట్లే. ప్రభుత్వే=ప్రభుత్వము విషయమున, సన్దేహః=సందేహము, నాస్తి=లేదు, యథార్హమ్=తగు విధముగ, కర్తుమ్=చేయుటకు, అర్హథ=తగియున్నారు.

తా. దశరథునకు మిథిలపై అధికార మున్నట్లే నాకును అయోధ్యపై అధికార మున్నది. అందుచేతనే దశరథుని రాజ్యముపై కూడ మీకు అధికారము నిచ్చుచున్నాను. ప్రభుత్వవిషయమున సందేహము లేదు. తగు విధముగ కార్యము నిర్వహింపుడు. 16

మూ. తథా బ్రువతి వైదేహే జనకే రఘునన్దనః,
రాజా దశరథో హృష్టః ప్రత్యువాచ మహీపతిమ్. 17

ప్ర. అ. వైదేహే = విదేహదేశరాజైన, జనకే = జనకుడు, తథా = అట్లు, బ్రువతి = పలుకుచుండగా, రఘునన్దనః = రఘువంశానందకరుడైన, రాజా దశరథః = దశరథమహారాజు, హృష్టః = సంతసించినవాడై, మహీపతిమ్ = జనకమహారాజును గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. దశరథమహారాజు జనకుని మాటలకు సంతసించి ఆతనితో ఇట్లనెను. 17

మూ. యువామసఙ్ఖ్యేయగుణౌ భ్రాతరౌ మిథిలేశ్వరౌ,
ఋషయో రాజసంఘాశ్చ భవద్భ్యామభిపూజితాః. 18

ప్ర. అ. మిథిలేశ్వరౌ = మిథిలాధిపతులును, భ్రాతరౌ = సోదరులును అగు, యువామ్ = మీరిరువురును, అసంఖ్యేయగుణౌ = లెక్కింప శక్యము కాని గుణములు కలవారు. భవద్భ్యామ్ = మీచేత, ఋషయః = ఋషులును, రాజ సంఘాశ్చ = రాజసముదాయములును, అభిపూజితాః = పూజింపబడినారు.

తా. "మిథిలాధిపతులైన మీ సోదరులిరువురును లెక్కింపరాని సద్గుణములు గలవారు. మీ రెండరో ఋషులను, రాజులను పూజించి వారినుండి సద్గుణముల నలవరచుకొనినారు". 18

మూ. స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గమిష్యామి స్వమాలయమ్,
శ్రాద్ధకర్మాణి సర్వాణి విధాస్యామీతి చాబ్రవీత్. 19

ప్ర. అ. స్వస్తి = క్షేమమును, ప్రాప్నుహి = పొందుము. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. స్వమ్ = నా సంబంధమైన, ఆలయమ్ = నివాసమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను, సర్వాణి = సమస్తమైన, శ్రాద్ధకర్మాణి = శ్రాద్ధకర్మలను, విధాస్యామి చ = చేయగలను. ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. "నీవు మంగళమును పొందెదవు గాక. నీకు భద్ర మగు గాక. నా నివాసమునకు వెళ్లెదను. నాందీముఖశ్రాద్ధాదికర్మలు కూడ చేసెదను" అని పలికెను. 19

మూ. తమాపృష్ట్వా నరపతిం రాజా దశరథ స్తదా,
మునీన్ద్రౌ తౌ పురస్కృత్య జగామాశు మహాయశాః. 20

ప్ర. అ. తదా = అప్పుడు, మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజా దశరథః = దశరథమహారాజు, తమ్ = ఆ, నరపతిమ్ = రాజును, ఆపృష్ట్వా = అడిగి, తౌ = ఆ, మునీన్ద్రౌ = మునీంద్రులను, పురస్కృత్య = ముందిడుకొని, ఆశు = శీఘ్రముగా, జగామ = వెళ్లెను.

తా. మహాయశఃశాలి యగు దశరథమహారాజు అపుడు, జనకునివద్ద సెలవు గైకొని వసిష్ఠవిశ్వామిత్రులతో నిజనివాసమునకు వెళ్లెను. 20

మూ. స గత్వా నిలయం రాజా శ్రాద్ధం కృత్వా విధానతః,
ప్రభాతే కాల్యముత్థాయ చక్రే గోదానముత్తమమ్. 21

ప్ర. అ. సః = ఆ, రాజా = రాజు, నిలయమ్ = గృహమును గూర్చి, గత్వా = వెళ్లి, విధానతః=శాస్త్రానుసారముగా, శ్రాద్ధమ్=శ్రాద్ధమును, కృత్వా= చేసి, ప్రభాతే = ప్రాతఃకాలమున, ఉత్థాయ = లేచి, కాల్యమ్ = కాలోచిత మైన, ఉత్తమమ్=ఉత్తమ మైన, గోదానమ్=సమావర్తన(స్నాతక)వ్రతమును, చక్రే= చేసెను.

తా. దశరథమహారాజు తన నివాసగృహముచేరి యథాశాస్త్రముగ శ్రాద్ధము చేసి, మరునాడు ప్రాతఃకాలముననే లేచి అపుడు చేయవలసిన స్నాతకవ్రతమును జరిపించెను. 21

మూ. గవాం శతసహస్రాణి బ్రాహ్మణేభ్యో నరాధిపః,
ఏకైకశో దదౌ రాజా పుత్రానుద్దిశ్య ధర్మతః. 22

ప్ర. అ. నరాధిపః = నరులకు అధిపతి యగు, రాజా=రాజు, పుత్రాన్= పుత్రులను, ఏకైకశః = ఒక్కొక్కరిని, ఉద్దిశ్య = ఉద్దేశించి, బ్రాహ్మణేభ్యః =

బ్రాహ్మణులకొరకు, గవామ్ = గోవులయొక్క, సహస్రాణి = సహస్రములను, ధర్మతః = ధర్మానుసారముగా, దదౌ=ఇచ్చెను.

తా. దశరథమహారాజు ఒక్కొక్క కుమారు నుద్దేశించి ఒక్కొక లక్ష చొప్పున గోవులను బ్రాహ్మణులకు దానము చేసెను. 22

మూ. సువర్ణశృఙ్గాః సమ్పన్నాః సవత్సాః కాంస్యదోహనాః,
గవాం శతసహస్రాణి చత్వారి పురుషర్షభః. 23

విత్తమన్యచ్చ సుబహు ద్విజేభ్యో రఘునన్దనః,
దదౌ గోదానముద్దిశ్య పుత్రాణాం పుత్రవత్సలః. 24

ప్ర. అ. పురుషర్షభః=పురుషశ్రేష్ఠుడును, పుత్రవత్సలః=పుత్రులయందు ప్రేమ కలవాడును అగు, రఘునన్దనః = దశరథుడు, పుత్రాణామ్ = పుత్రుల యొక్క, గోదానమ్ = గోదానవ్రతమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, సువర్ణశృఙ్గాః= బంగారు కొమ్ములు కలవియు, సమ్పన్నాః = క్షీరసమృద్ధి కలవియు, సవత్సాః= లేగదూడలతో కూడినవియు, కాంస్యదోహనాః=పాలు పిదుకుటకై కంచుపాత్రలు కలవియుఅగు, గవామ్=గోవులయొక్క, చత్వారి = నాలుగు, శతసహస్రాణి= లక్షలను, అన్యత్ = ఇతరమైన, సుబహు = చాల అధిక మైన, విత్తం చ = ధనమును, ద్విజేభ్యః = బ్రాహ్మణులకు, దదౌ=ఇచ్చెను.

తా. పురుషశ్రేష్ఠుడును, పుత్రులయందు అత్యధికప్రేమకలవాడును అగు దశరథమహారాజు, బంగారు కొమ్ములు కలవియు, లేగదూడలతో కూడినవియు, కంచుపాత్రలతో కూడినవియు, క్షీరసమృద్ధములును అగు నాలుగు లక్షల గోవులను, అత్యధిక మైన ఇతరద్రవ్యమును, పుత్రుల గోదానవ్రతసమయమున బ్రాహ్మణులకు దానము చేసెను. 23, 24

మూ. స సుతైః కృతగోదానైర్వృతస్తు నృపతిస్తదా,
లోకపాలైరివాభాతి వృతః సౌమ్యః ప్రజాపతిః. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
ద్విసప్తతితమః సర్గః.

ప్ర. అ. కృతగోదానైః = చేయబడిన గోదానవ్రతము గల, సుతైః = కుమారులతో, వృతః = కూడి యున్న, సః = ఆ, నృపతిః = రాజు, తదా = అప్పుడు, లోకపాలైః = లోకపాలులచేత, వృతః = చుట్టుకొనబడి ఉన్న, సౌమ్యః = ప్రసన్ను డైన, ప్రజాపతిరివ = బ్రహ్మ వలె, ఆభాతి = ప్రకాశించు చుండెను.

తా. గోదానవ్రతము పూర్తిచేసికొనిన కుమారులు చుట్టును నిలచి యుండ ఆ దశరథమహారాజు లోకపాలుల మధ్య నున్న బ్రహ్మ వలె ప్రకాశించెను.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో డెబ్బదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిసప్తతితమః సర్గః

మూ. యస్మింస్తు దివసే రాజా చక్రే గోదానముత్తమమ్,
తస్మింస్తు దివసే శూరో యుధాజిత్సముపేయివాన్. 1

ప్ర. అ. రాజా = దశరథుడు, యస్మిన్ = ఏ, దివసే = దివసమునందు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, గోదానమ్ = గోదానవ్రతమును, చక్రే = చేసెనో, తస్మిన్ తు = ఆ, దివసే = దివసమునందు, శూరః = శూరు డైన, యుధాజిత్ = యుధాజిత్తు, సముపేయివాన్ = వచ్చెను.

తా. దశరథమహారాజు కుమారులకు గోదానవ్రతము జరిపించిన దివసమునందే భరతుని మేనమామ యగు యుధాజిత్తు వచ్చెను. 1

మూ. పుత్రః కేకయరాజస్య సాక్షాద్భరతమాతులః,
దృష్ట్వా పృష్ట్వా చ కుశలం రాజానమిదమబ్రవీత్. 2

ప్ర. అ. కేకయరాజస్య = కేకయరాజుయొక్క, పుత్రః = పుత్రుడును, సాక్షాత్ = సాక్షాత్తుగ, భరతమాతులః = భరతుని మేనమామయు నైన ఆ యుధాజిత్తు, రాజానమ్ = రాజును, దృష్ట్వా = చూచి, కుశలమ్ = కుశలమును, పృష్ట్వా చ = అడిగి, రాజానమ్ = రాజును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. కేకయరాజుకుమారుడును, సాక్షాత్తుగ భరతుని మేనమామయు అగు ఆ యుధాజిత్తు రాజును చూచి, కుశలప్రశ్న మడిగి ఇట్లు పలికెను. 2

మూ. కేకయాధిపతీ రాజా స్నేహాత్కుశలమబ్రవీత్,
యేషాం కుశలకామోఽసి తేషాం సంప్రత్యనామయమ్. 3

ప్ర. అ. కేకయాధిపతిః = కేకయదేశప్రభు వైన, రాజా = రాజు, స్నేహాత్ = స్నేహమువలన, కుశలమ్ = కుశలమును, అబ్రవీత్ = పలికెను.

యేషామ్ = ఎవరియొక్క, కుశలకామః = కుశలమునందు కోరిక గలవాడవుగ, అసి = అయి ఉన్నవో, తేషామ్ = వారందరికిని, సంప్రతి = ఇప్పుడు, అనామయమ్=ఆరోగ్యము.

తా. కేకయదేశప్రభు వైన మా తండ్రి స్నేహపూర్వకముగ నిన్ను కుశల ప్రశ్న చేసినారు. నీవు ఎవరి కుశలమును కోరుచుందువో వారందరును ఇపుడు ఆరోగ్యముగ నున్నారు. 3

మూ. స్వస్రీయం మమ రాజేన్ద్ర ద్రష్టుకామో మహీపతిః,
తదర్థముపయాతోఽహమయోధ్యాం రఘునన్దన. 4

ప్ర. అ. రఘునన్దన = రఘువంశానందకరుడ వగు, రాజేన్ద్ర = మహారాజా ! మహీపతిః = కేకయరాజు, మమ = నాయొక్క, స్వస్రీయమ్ = మేనల్లుని, ద్రష్టుకామః = చూడ కోరిక గలవాడు. తదర్థమ్ = దాని(అవని)కొరకు, అహమ్ = నేను, అయోధ్యామ్ = అయోధ్యాపట్టణమును గూర్చి, ఉపయాతః = వెళ్లితిని.

తా. మహారాజు మా తండ్రి మా మేనల్లుని చూడవలె నని కోరుటచే అందుకొరకై నేను అయోధ్యానగరమునకు వెళ్లి యుంటిని. 4

మూ. శ్రుత్వా త్వహమయోధ్యాయాం వివాహార్థం తవాత్మజాన్,
మిథిలాముపయాతాంస్తు త్వయా సహ మహీపతే, 5
త్వరయాభ్యుపయాతోఽహం ద్రష్టుకామః స్వసుః సుతమ్.

ప్ర. అ. మహీపతే = రాజా ! తవ = నీయొక్క, ఆత్మజాన్=కుమారులను, వివాహార్థమ్=వివాహముకొరకై, త్వయా సహ=నీతో కూడ, మిథిలామ్= మిథిలను గూర్చి, ఉపయాతాన్=చేరినవారినిగా, అయోధ్యాయామ్=అయోధ్యలో, శ్రుత్వా=విని, అహమ్=నేను, స్వసుః=సోదరియొక్క, సుతమ్=కుమారుని, ద్రష్టుకామః=చూచుటకు కోరిక గలవాడనై, త్వరయా = తొందరతో, అః యాతః=వచ్చినాను.

తా. రాజా ! నీ కుమారులు వివాహముకొరకై నీతో కలిసి మిథిలకు వెళ్లి నా రని అయోధ్యలో తెలియగా నేను నాసోదరీపుత్రుని చూచుటకై శీఘ్రముగా ఇచటికి వచ్చినాను. 5

మూ. అథ రాజా దశరథః ప్రియాతిథిముపస్థితమ్, 6
దృష్ట్వా పరమసత్కారైః పూజార్హం సమపూజయత్.

ప్ర. అ. అథ = పిమ్మట, రాజా = రాజైన, దశరథః = దశరథుడు, ఉపస్థితమ్ = వచ్చిన, ప్రియాతిథిమ్ = ప్రియుడైన అతిథిని, దృష్ట్వా=చూచి, పూజార్హమ్=పూజకు అర్హుడైన అతనిని, పరమసత్కారైః = అధికసత్కారములచే, సమపూజయత్=పూజించెను.

తా. పిమ్మట దశరథుడు వచ్చిన ఆ ప్రియాతిథిని చూచి, పూజార్హుడైన అతనిని అధికసత్కారములతో పూజించెను. 6

మూ. తతస్తాముషితో రాత్రిం సహ పుత్రైర్మహాత్మభిః, 7
ప్రభాతే పునరుత్థాయ కృత్వా కర్మాణి కర్మవిత్,
ఋషీంస్తదా పురస్కృత్య యజ్ఞవాటముపాగమత్. 8

ప్ర. అ. తతః=పిమ్మట, మహాత్మభిః=మహాత్ములైన, పుత్రైః సహ= పుత్రులతోకూడ, తామ్=ఆ, రాత్రిమ్=రాత్రి, ఉషితః=ఉన్నవాడై, కర్మవిత్= కర్మల నెరిగిన ఆ దశరథుడు, ప్రభాతే = ప్రాతఃకాలమున, పునః=మరల, ఉత్థాయ=లేచి, కర్మాణి=యథోచితకర్మలను, కృత్వా=చేసి, తదా=అప్పుడు, ఋషీన్=ఋషులను, పురస్కృత్య = ముందిడికొని, యజ్ఞవాటమ్ = యజ్ఞవాటమును, ఉపాగమత్=చేరెను.

తా. కర్మవేత్త యైన దశరథుడు మహాత్ములైన పుత్రులతో ఆ రాత్రి గడపి, ప్రాతఃకాలమున లేచి, కర్మ లాచరించి, ఆ ఋషులను ముందిడుకొని యజవాటమును చేరెను. 7, 8

మూ. యుక్తే ముహూర్తే విజయే సర్వాభరణభూషితైః,
భ్రాతృభిః సహితో రామః కృతకౌతుకమఙ్గలః. 9

వసిష్ఠం పురతః కృత్వా మహర్షీనపరానపి,
పితుః సమీపమాశ్రిత్య తస్థౌ భ్రాతృభిరావృతః. 10

ప్ర. అ. యుక్తే=తగిన, విజయే=విజయ మనెడు, ముహూర్తే=ముహూర్త మునందు, సర్వాభరణభూషితైః=సమస్తమైన అలంకారములచే అలంకరింప బడిన, భ్రాతృభిః=సోదరులతో, సహితః=కూడిన, రామః = రాముడు, కృత కౌతుకమఙ్గలః = చేయబడిన తోరముకట్టుట మొదలైన వివాహమంగలములు కలవాడై, వసిష్ఠమ్=వసిష్ఠుని, అపరాన్=ఇతరులైన, మహర్షీనపి=మహర్షులను, పురతః=ముందు, కృత్వా=ఉంచుకొని, పితుః = తండ్రియొక్క, సమీపమ్= సమీపమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, భ్రాతృభిః=సోదరులచే, ఆవృతః=చుట్టుకొన బడినవాడై, తస్థౌ=ఉండెను.

తా. సర్వాలంకారములచే అలంకృతులైన సోదరులతో కూడిన రాముడు విజయ మనెడు యుక్తమైన ముహూర్తమునందు తోరముకట్టుట మొదలగు వివాహమంగళములు జరుపుకొని, వసిష్ఠాదిమహర్షులను ముందిడికొని, సోదర సహితుడై తండ్రివద్దకు చేరెను. 9, 10

మూ. వసిష్ఠో భగవానేత్య వైదేహమిదమబ్రవీత్,
రాజా దశరథో రాజన్ కృతకౌతుకమఙ్గలైః, 11
పుత్రైర్నరవరశ్రేష్ఠ దాతారమభికాఙ్క్షతే.

ప్ర. అ. భగవాన్=పూజ్యుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, వైదేహమ్=జన కుని, ఏత్య=సమీపించి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. రాజన్= రాజా! నరవరశ్రేష్ఠ=నరవరులలో శ్రేష్ఠుడా! రాజా = రాజైన, దశరథః=దశ రథుడు, కృతకౌతుకమఙ్గలైః=చేయబడినకౌతుకమంగళము గల, పుత్రైః=పుత్రు లతో, దాతారమ్=కన్యాదాత వైన నిన్ను, అభికాఙ్క్షతే=ఎదురుచూచుచున్నాడు.

తా. వసిష్ఠమహాముని జనకుని వద్దకు వెళ్లి ఇట్లు చెప్పెను. నరోత్తము లలో ఉత్తముడవైన జనకమహారాజా! దశరథమహారాజు కుమారుల కౌతుక మంగళము పూర్తిచేసి కన్యాదాత వైన నీకొరకు ఎదురుచూచుచున్నాడు. 11

మూ. దాతృప్రతిగ్రహీతృభ్యాం సర్వార్థాః ప్రభవన్తి హి, 12
స్వధర్మం ప్రతిపద్యస్వ కృత్వా వైవాహ్యముత్తమమ్.

ప్ర. అ. సర్వార్థాః = అన్ని పనులును, దాతృప్రతిగ్రహీతృభ్యామ్= దాతద్వారా ప్రతిగ్రహీతద్వారా, ప్రభవన్తి హి=జరుగుచున్నవి కదా. ఉత్తమమ్= ఉత్తమ మైన, వైవాహ్యమ్ = వివాహకృత్యమును, కృత్వా=చేసి, స్వధర్మమ్= స్వధర్మమును, ప్రతిపద్యస్వ=నిర్వహించుము.

తా. ఇట్టి పనులు దాత, ప్రతిగ్రహీత ఇరువురు కలిసినప్పుడే జరుగును. ఉత్తమ మైన వివాహమును చేసి స్వధర్మము నాచరించుము. 12

మూ. ఇత్యుక్తః పరమోదారో వసిష్ఠేన మహాత్మనా, 13
ప్రత్యువాచ మహాతేజా వాక్యం పరమధర్మవిత్.

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, ఇతి= ఇట్లు, ఉక్తః=పలకబడినవాడును, పరమోదారః=గొప్ప ఔదార్యము కలవాడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, పరమధర్మవిత్ = గొప్ప ధర్మవేత్తయు అగు ఆ జనకుడు, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. పరమౌదార్యవంతుడును, మహాతేజఃశాలియు, పరమధర్మవేత్తయు అగు జనకుడు వసిష్ఠుని మాటలు విని ఇట్లు పలికెను. 13

మూ. కః స్థితః ప్రతిహారో మే కస్యాజ్ఞా సంప్రతీక్ష్యతే, 14
స్వగృహే కో విచారోఽస్తి యథా రాజ్యమిదం తవ.

ప్ర. అ. మే=నాయొక్క, ప్రతిహారః = ద్వారపాలకుడు, కః=ఎవ్వడు, స్థితః=ఉన్నాడు? కస్య = ఎవనియొక్క, ఆజ్ఞా = అనుజ్ఞ, సంప్రతీక్ష్యతే= ఎదురుచూడబడుచున్నది? స్వగృహే=స్వగృహమునందు, కః=ఏమి, విచారః= ఆలోచన, అస్తి=ఉన్నది. ఇదమ్=ఈ, రాజ్యమ్ = రాజ్యము, తవ యథా= నీరాజ్యమువంటిదే.

తా. ద్వారమువద్ద అడ్డగించు ద్వారపాలకుడు ఎవ్వడైన ఉన్నాడా? లోనికి ఏల రాకూడదు? ఎవరి ఆజ్ఞకై ఎదురుజూచుచున్నారు? స్వగృహములో సంకోచ మెందుకు? ఈ రాజ్యము కూడ నీ రాజ్యమువంటిదే. 14

మూ. కృతకౌతుకసర్వస్వా వేదిమూలముపాగతాః, 15
మమ కన్యా మునిశ్రేష్ఠ దీప్తా వహ్నే రివార్చిషః.

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠుడా! మమ = నాయొక్క, కన్యాః = కన్యలు, కృతకౌతుకసర్వస్వాః = చేయబడిన పరిపూర్ణకౌతుకమంగళము గలవారై, దీప్తాః = ప్రకాశించుచున్న, వహ్నేః = అగ్నియొక్క, అర్చిషః ఇవ = జ్వాలలు వలె, వేదిమూలమ్ = వేదిసమీపమును, ఉపాశ్రితాః = ఆశ్రయించి ఉన్నారు.

తా. వసిష్ఠమునీన్ద్రా! పూర్తిగ కౌతుకమంగళములు చేసికొనిన నా కన్యలు, ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలల వలె వేదికసమీపము చేరి యున్నారు. 15

మూ. సజ్జోఽహం త్వత్ప్రతీక్షోఽస్మి వేద్యామస్యాం ప్రతిష్ఠితః, 16
అవిఘ్నం కురుతాం రాజా కిమర్థమవలమ్బతే.

ప్ర. అ. సజ్జః = సిద్ధముగా నున్న, అహమ్ = నేను, అస్యామ్ = ఈ, వేద్యామ్ = వేదియందు, ప్రతిష్ఠితః = ఉన్నవాడనై, త్వత్ప్రతీక్షః = నిన్ను ఎదురుచూచుచు, అస్మి = ఉన్నాను. రాజా = రాజు, అవిఘ్నమ్ = విఘ్నములు లేకుండా! కురుతామ్ = చేయుగాక, కిమర్థమ్ = ఎందుకు, అవలమ్బతే = ఆలస్యము చేయుచున్నాడు.

తా. నేను సిద్ధుడనై వేదిదగ్గర ఉండి మిమ్ములను ఎదురుజూచుచున్నాను. దశరథమహారాజు విఘ్నము లేవియు లేకుండ కార్యము జరుపుగాక. ఆలస్య మెందులకు? 16

మూ. తద్వాక్యం జనకేనోక్తం శ్రుత్వా దశరథ స్తదా, 17
ప్రవేశయామాస సుతాన్ సర్వానృషిగణానపి.

ప్ర. అ. తదా = అప్పుడు, దశరథః = దశరథుడు, జనకేన = జనకుని చేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని,

సుతాన్ = కుమారులను, సర్వాన్ = సమస్తమైన, ఋషిగణానపి = ఋషిగణములను కూడ, ప్రవేశయామాస = లోనికి ప్రవేశపెట్టెను.

తా. దశరథు డప్పుడు జనకుని వాక్యము విని, కుమారులను, సకలఋషులను కూడ లోనికి తీసికొని వెళ్లెను. 17

మూ. తతో రాజా విదేహానాం వసిష్ఠమిదమబ్రవీత్, 18
కారయస్వ ఋషే సర్వమృషిభిః సహ ధార్మిక,
రామస్య లోకరామస్య క్రియాం వైవాహికీం విభో. 19

ప్ర. అ. తతః = పిమ్మట, విదేహానాం రాజా = విదేహదేశరాజు, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ధార్మిక = ధర్మము నాచరించువాడా! విభో = సమర్థుడా! ఋషే = వసిష్ఠమహర్షీ! ఋషిభిః సహ = ఋషులతో కూడ కలిసి, లోకరామస్య = లోకమనోహరుడైన, రామస్య = రామునియొక్క, వైవాహికీమ్ = వివాహసంబంధమైన, క్రియామ్ = క్రియను, కారయస్వ = చేయించుము.

తా. పిమ్మట జనకుడు వసిష్ఠునితో నిట్లు పలికెను. ధార్మికుడవైన వసిష్ఠమహామునీ! ఇతరఋషుల సహాయముతో, లోకాభిరాముడైన రాముని వివాహక్రియను జరిపింపుము. 18, 19

మూ. తథేత్యుక్త్వా తు జనకం వసిష్ఠో భగవానృషిః,
విశ్వామిత్రం పురస్కృత్య శతానన్దం చ ధార్మికమ్, 20

ప్రపామధ్యే తు విధివద్వేదిం కృత్వా మహాతపాః,
అలఞ్చకార తాం వేదిం గన్ధపుష్పైః సమన్తతః. 21

సువర్ణపాలికాభిశ్చ ఛిద్రకుమ్భైశ్చ సాఙ్కురైః,
అఙ్కురాఢ్యైః శరావైశ్చ ధూపపాత్రైః సధూపకైః. 22

శఙ్ఖపాత్రైః స్రువైః స్రుగ్భిః పాత్రైరర్ఘ్యాభిపూరితైః,
లాజపూర్ణైశ్చ పాత్రీభిరక్షతైరభిసంస్కృతైః. 23

ప్ర. అ. భగవాన్ = పూజ్యుడును, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడును అగు, వసిష్ఠః ఋషిః=వసిష్ఠమహర్షి, జనకమ్=జనకునిగూర్చి, తథా ఇతి= అట్లే అని, ఉక్త్వా=పలికి, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని, ధార్మికమ్=ధార్మికుడైన, శతానన్దం చ = శతానందుని, పురస్కృత్య = ముందు ఉంచుకొని, ప్రపామధ్యే=పందిలి మధ్యయందు, విధివత్ = యథాశాస్త్రముగా, వేదిమ్ = వేదిని, కృత్వా=చేసి, గన్ధపుష్పైః = సుగంధపుష్పములతోడను, సువర్ణపాలికాభిశ్చః = బంగారుపాలికలతోడను, సాఙ్కురైః=అంకురములతో కూడిన, ఛిద్రకుమ్భైశ్చ= రంధ్రములు గల కుంభములతోడను, అఙ్కురాఢ్యైః = అంకురములతో నిండిన, శరావైశ్చ = మూకుళ్లతోడను, సధూపకైః=ధూపముతో కూడిన, ధూపపాత్రైః= ధూపపాత్రల తోడను, శఙ్ఖపాత్రైః=శంఖాకారము లైన పాత్రలతోడను, స్రువైః= హోమసాధనము లగు స్రువము లను పాత్రలతోడను, స్రుగ్భిః=హోమసాధనము లగు స్రుక్కు లను పాత్రలతోడను, అర్ఘ్యాభిపూరితైః = అర్ఘ్యోదకముచే నింపబడిన, పాత్రైః = పాత్రలచేతను, లాజపూర్ణైః = పేలాలతో నిండిన, పాత్రీభిః = పాత్రలచేతను, అభిసంస్కృతైః = సంస్కరింపబడిన, అక్షతైః = అక్షతలచేతను, తామ్ = ఆ, వేదిమ్ = వేదిని, సమన్తతః=నలుమూలల, అలఙ్చకార=అలంకరించెను.

తా. వసిష్ఠమహర్షి "అటులనే చేసెదను" అని జనకునకు చెప్పి, విశ్వామిత్ర శతానందులను ముందిడుకొని, మండపము మధ్య యథాశాస్త్రముగ అగ్ని వేదికను నిర్మించెను. దాని చుట్టును, గంధపుష్పములు, బంగారుపాలికలు, అంకురములు గల రంధ్రములతో కూడిన కుంభములు, అంకురములతో నిండిన మూకుళ్లు, ధూపముతో కూడిన ధూపపాత్రలు, శంఖాకారము లైన పాత్రలు, స్రుక్కులు, స్రువములు, అర్ఘ్యోదకము నింపిన పాత్రలు, పేలాలు నింపిన పాత్రలు, సంస్కరించిన అక్షతలు, ఉంచి అలంకరించెను. 20, 21, 22

మూ. దర్భైః సమైః సమాస్తీర్య విధివన్మన్త్రపూర్వకమ్,
అగ్నిమాదాయ వేద్యాం తు విధిమన్త్రపురస్కృతమ్, 24
జుహావాగ్నౌ మహాతేజా వసిష్ఠో భగవానృషిః.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, భగవాన్ = పూజ్యు డైన, వసిష్ఠః ఋషిః = వసిష్ఠమహర్షి, సమైః = సమప్రమాణము గల, దర్భైః =

దర్భలతో, విధివత్ = యథాశాస్త్రముగా, మన్త్రపురస్కృతమ్ = మంత్రపూర్వక ముగా, సమాస్తీర్య = కప్పి, విధిమన్త్రపురస్కృతమ్ = యథాశాస్త్రముగా మంత్ర పూర్వకముగా, వేద్యామ్ = వేదియందు, అగ్నిమ్ = అగ్నిని, ఆదాయ = గ్రహించి (ఉంచి), అగ్నౌ = అగ్నియందు, జుహావ = హోమము చేసెను.

తా. మహాతేజశ్శాలియు పూజ్యు డును అగు వసిష్ఠుడు వేది చుట్టు, యథా శాస్త్రముగను, మంత్రపూర్వకముగను, సమము లైన దర్భలను పరిచి యథా శాస్త్రముగా, మంత్రపూర్వకముగా వేదియందు అగ్నిని ఉంచి, అగ్నిలో హోమము చేసెను. 24

## శ్రీ సీతారామ వివాహ ఘట్టః

మూ. తతః సీతాం సమానీయ సర్వాభరణభూషితామ్, 25
సమక్షమగ్నేః సంస్థాప్య రాఘవాభిముఖే తదా,
అబ్రవీజ్జనకో రాజా కౌసల్యానన్దవర్ధనమ్. 26

ప్ర. అ. తతః = పిమ్మట, రాజా = రాజైన, జనకః = జనకుడు, సర్వా భరణభూషితామ్ = సమస్త మైన ఆభరణములచే అలంకరింపబడిన, సీతామ్ = సీతను, ఆనీయ = తీసికొని వచ్చి, అగ్నేః = అగ్నికి, సమక్షమ్ = ఎదుట, రాఘవాభి ముఖే = రామునకు అభిముఖముగా, సంస్థాప్య = నిలబెట్టి, తదా = అప్పుడు, కౌసల్యానన్దవర్ధనమ్ = కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించు రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట జనకమహారాజు, సర్వాభరణభూషితురా లగు సీతను తీసి కొని వచ్చి, అగ్ని సమక్షమున, రామునకు ఎదురుగా నిలబెట్టి, కౌసల్యానంద వర్ధను డగు ఆ రామునితో ఇట్లనెను. 25, 26

మూ. ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా. 27

ప్ర. అ. మమ = నాయొక్క, సుతా = కుమార్తెయు, తవ = నీయొక్క, సహధర్మచరీ = (ఇటుపై) కూడా ఉండి ధర్మము నాచరించు నదియు అగు,

సీతా=సీత, ఇయమ్=ఇదిగో. ఏనామ్=ఈమెను, ప్రతీచ్ఛ చ=అంగీకరింపుము. తే=నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. పాణిమ్ = ఈమె హస్తమును, పాణినా=హస్తముతో, గృహ్ణీష్వ=గ్రహింపుము.

తా. "ఇదిగో నా కుమార్తె యైన సీత, ఈమె నీకు సహధర్మచారిణి కాగలదు. ఈమెను స్వీకరింపుము. నీ హస్తముతో ఈమె హస్తమును పట్టుకొనుము. 26

మూ. పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా,
ఇత్యుక్త్వా ప్రాక్షిపద్రాజా మన్త్రపూతం జలం తదా. 27

ప్ర. అ. మహాభాగా=గొప్ప భాగ్యము గల ఈమె, పతివ్రతా=పతివ్రతయై, సదా=ఎల్లప్పుడును, ఛాయేవ=నీడ వలె, అనుగతా=నిన్ను అనుసరించియుండును. ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, రాజా=రాజు, తదా=అప్పుడు, మన్త్రపూతమ్=మంత్రముచే పవిత్రము చేయబడిన, జలమ్=జలమును, ప్రాక్షిపత్=విడచెను.

తా. మహాభాగ్యవంతురా లగు ఈమె పతివ్రతయై నీడ వలె సర్వదా నిన్ను అనుసరించి యుండగలదు" జనకమహారాజు ఇట్లు పలికి, మంత్రపూతమైన జలము వదలెను. 27

మూ. సాధు సాధ్వితి దేవానామృషీణాం వదతాం తదా,
దేవదున్దుభినిర్ఘోషః పుష్పవర్షో మహానభూత్. 28

ప్ర. అ. తదా=అప్పుడు, సాధు సాధు ఇతి=బాగు బాగు అని, వదతామ్=పలుకుచున్న, ఋషీణామ్=ఋషులయొక్కయు, దేవానామ్=దేవతలయొక్కయు ధ్వనియు, దేవదున్దుభినిర్ఘోషః = దేవదుందుభుల ధ్వనియు, మహాన్=గొప్ప, పుష్పవర్షః=పుష్పవర్షమును, అభూత్=ఆయెను.

తా. ఆ సమయమున దేవతలును ఋషులును "బాగు బాగు" అని పలికిరి. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవర్షము కురిసినది. 28

మూ. ఏవం దత్త్వా తదా సీతాం మన్త్రోదకపురస్కృతామ్,
అబ్రవీజ్జనకో రాజా హర్షేణాభిపరిప్లుతః. 29

ప్ర. అ. తదా = అప్పుడు, జనకః రాజా = జనకమహారాజు, మన్త్రోదక పురస్కృతామ్ = మంత్రోదకముచే పురస్కృతురా లగు, సీతామ్ = సీతను, దత్వా = ఇచ్చి, హర్షేణ = సంతోషముచేత, అభిపరిప్లుతః = నిండినవాడై, అబ్రవీత్ = పలికెను.

తా. జనకమహారాజు మంత్రోదకపూర్వకముగా సీతను ఇచ్చిన పిమ్మట ఆనందముతో నిండినవాడై ఇట్లు పలికెను. 29

మూ. లక్ష్మణాగచ్ఛ భద్రం తే ఊర్మిళాముద్యతాం మయా,
ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూత్కాలస్య పర్యయః. 30

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! ఆగచ్ఛ = రమ్ము. మయా = నాచేత, ఉద్యతామ్ = ఇవ్వనిశ్చయింపబడిన, ఊర్మిళామ్ = ఊర్మిళను, ప్రతీచ్ఛ = అంగీకరించుము. పాణిమ్ = హస్తమును, పాణినా = హస్తముతో, గృహ్ణీష్వ = గ్రహింపుము. కాలస్య = కాలముయొక్క, పర్యయః = గడచిపోవుట, మా భూత్ = కాకుండుగాక.

తా. "లక్ష్మణా! రమ్ము. నీకు క్షేమ మగు గాక. నే నిచ్చుచున్న ఊర్మిళను స్వీకరింపుము. ఈమె హస్తమును హస్తముతో గ్రహింపుము. ఆలస్యము చేయకుము". 30

మూ. తమేవముక్త్వా జనకో భరతం చాభ్యభాషత,
గృహాణ పాణిం మాణ్డవ్యాః పాణినా రఘునన్దన. 31

ప్ర. అ. జనకః = జనకుడు, తమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, భరతం చ = భరతుని గూర్చి కూడ, అభ్యభాషత = పలికెను. రఘునన్దన = భరతా! పాణినా = హస్తముచేత, మాణ్డవ్యాః = మాండవియొక్క, పాణిమ్ = హస్తమును, గృహాణ = గ్రహింపుము.

తా. జనకుడు లక్ష్మణునితో ఇట్లు పలికి పిదప భరతునితో ఇట్లనెను. "భరతా! మాండవి హస్తమును హస్తముతో పట్టుకొనుము." 31

మూ. శత్రుఘ్నం చాపి ధర్మాత్మా అబ్రవీజ్జనకేశ్వరః,
శ్రుతకీర్త్యా మహాబాహో పాణిం గృహ్ణీష్వ పాణినా. 32

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, జనకేశ్వరః = జనకమహారాజు, శత్రుఘ్నం చాపి = శత్రుఘ్నుని గూర్చి కూడ, అబ్రవీత్ = పలికెను. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా ! పాణినా = హస్తముతో, శ్రుతకీర్త్యాః = శ్రుతకీర్తియొక్క, పాణిమ్ = హస్తమును, గృహాణ = గ్రహింపుము.

తా. ధర్మాత్ముడైన జనకమహారాజు శత్రుఘ్నునితో కూడ ఇట్లనెను. "ఓ మహాబాహూ ! శ్రుతకీర్తి హస్తమును హస్తముతో పట్టుకొనుము". 32

మూ. సర్వే భవన్తః సౌమ్యాశ్చ సర్వే సుచరితవ్రతాః,
పత్నీభిస్సన్తు కాకుత్స్థా మా భూత్కాలస్య పర్యయః. 33

ప్ర. అ. కాకుత్స్థాః = ఓ రామలక్ష్మణభరతశత్రుఘ్నులారా ! భవన్తః = మీరు, సర్వే = అందరును, సౌమ్యాః చ = సౌమ్యస్వభావము కలవారు. సర్వే = మీరందరును, సుచరితవ్రతాః = మంచి నడవడిక నియమము కలవారు. పత్నీభిః = భార్యలతో, (సహితాః = కూడినవారు), సన్తు = అగుదురుగాక. కాలస్య = కాలముయొక్క, పర్యయః = కడచిపోవుట, మాభూత్ = కాకుండుగాక.

తా. "ఓ రామలక్ష్మణభరతశత్రుఘ్నులారా ! మీరందరును సౌమ్యులు. అందరును మంచినడవడిక, నియమములు కలవారు. భార్యలను స్వీకరింపుడు. ఆలస్యము చేయవద్దు". 33

మూ. జనకస్య వచః శ్రుత్వా పాణీన్ ప్రాణిభిరాస్పృశన్,
చత్వారస్తే చతసృణాం వసిష్ఠస్య మతే స్థితాః. 34

ప్ర. అ. తే = ఆ, చత్వారః = నలుగురును, జనకస్య = జనకునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, మతే = మతమునందు, స్థితాః = ఉన్నవారై, పాణిభిః = హస్తములతో, చతసృణామ్ = ఆ నలుగురి కన్యలయొక్క, పాణీన్ = హస్తములను, ఆస్పృశన్ = స్పృశించిరి.

తా. జనకుని వాక్యము విని ఆ నలుగురు రాజకుమారులును, వసిష్ఠుని అనుమతి పొంది, తమ హస్తములతో ఆ నలుగురి కన్యల హస్తములను గ్రహించిరి. 34

మూ. అగ్నిం ప్రదక్షిణీకృత్య వేదిం రాజానమేవ చ,
ఋషీంశ్చైవ మహాత్మానస్సభార్యా రఘుసత్తమాః, 35
యథోక్తేన తదా చక్రుర్వివాహం విధిపూర్వకమ్.

ప్ర. అ. మహాత్మానః=మహాత్ములైన, రఘుసత్తమాః = ఆ రఘువంశ శ్రేష్ఠులు, సభార్యాః = భార్యలతో కూడినవారై, అగ్నిమ్ = అగ్నిని, వేదిమ్= వేదిని, రాజానమేవ చ = జనకమహారాజును, ఋషీంశ్చైవ = ఋషీశ్వరులను, ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణము చేసి, యథోక్తేన = చెప్పిన ప్రకారము, విధిపూర్వకమ్ = శాస్త్రపూర్వకముగా. వివాహమ్ = వివాహమును, చక్రుః = చేసిరి.

తా. మహాత్ములైన ఆ రఘువంశకుమారులు, భార్యాసమేతులై, అగ్నికిని, వేదికిని, జనకమహారాజునకును, ఋషులకును ప్రదక్షిణము చేసి, వసిష్ఠాదులు చెప్పిన విధమున, యథావిధిగ వివాహము చేసికొనిరి. 35

మూ. కాకుత్స్థైశ్చ గృహీతేషు లలితేషు చ పాణిషు, 36
పుష్పవృష్టిర్మహత్యాసీద న్తరిక్షాత్సుభాస్వరా.

ప్ర. అ. కాకుత్స్థైః = రామలక్ష్మణభరతశత్రుఘ్నులచేత, లలితేషు = సుందరములైన, పాణిషు=హస్తములు, గృహీతేషు సత్సు=గ్రహింపబడిన వగుచుండగా, అన్తరిక్షాత్=ఆకాశమునుండి, సుభాస్వరా = చాల ప్రకాశించుచున్న, మహతీ=గొప్ప, పుష్పవృష్టిః = పుష్పవృష్టి, ఆసీత్=ఆయెను.

తా. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు, సీతా—ఊర్మిళా—మాండవీ—శ్రుతకీర్తుల సుకుమారములైన హస్తములు గ్రహించగనే ఆకాశమునుండి, మిక్కిలి ప్రకాశించుచున్న గొప్ప పుష్పవృష్టి పడినది. 36

మూ. దివ్యదున్దుభినిర్ఘోషైర్గీతవాదిత్రనిస్వనైః, 37
ననృతుశ్చాప్సరఃసంఘా గన్ధర్వాశ్చ జగుః కలమ్,
వివాహే రఘుముఖ్యానాం తదద్భుతమదృశ్యత. 38

ప్ర. అ. రఘుముఖ్యానామ్ = రాఘవుల, వివాహే = వివాహమునందు, దివ్యదున్దుభినిర్ఘోషైః=దివ్యమైన దుందుభిధ్వనులతోడను, గీతవాదిత్రనిస్వనైః= గీతవాద్యధ్వనులతోడను, అప్సరఃసంఘాః = అప్సరఃసంఘములు, ననృతుః = నాట్యము చేసినవి. గన్ధర్వాశ్చ=గంధర్వులుకూడ, కలమ్=మధురముగా, జగుః= పాడిరి. తత్=అది, అద్భుతమ్=ఆశ్చర్యకరముగ, అదృశ్యత=చూడబడెను.

తా. రాఘవుల వివాహసమయమున, స్వర్గమునందు దుందుభులు మ్రోగినవి. గీతమంగళవాద్యధ్వనులతో అప్సరసలు నాట్యము చేసిరి. గంధర్వులు మధురముగా గానము చేసిరి. ఇది అంతయు ఆశ్చర్యకరముగ కనబడెను. 37, 38.

మూ. ఈదృశే వర్తమానే తు తూర్యోద్ఘుష్టనినాదితే,
త్రిరగ్నిం తే పరిక్రమ్య ఊహుర్భార్యాం మహౌజసః. 39

ప్ర. అ. ఈదృశే = ఇట్టి, తూర్యోద్ఘుష్టనినాదితే = నృత్తగీతవాద్యాదుల ధ్వనిచే కలిగిన శబ్దము, వర్తమానే = జరుగుచుండగా, మహౌజసః = గొప్ప తేజస్సు గల, తే = ఆసోదరులు, త్రిః = మూడు పర్యాయములు, అగ్నిమ్= అగ్నిని, పరిక్రమ్య=ప్రదక్షిణముచేసి, భార్యాః = భార్యలను, ఊహుః=వివాహ మాడిరి.

తా. ఈ విధముగ తూర్యాదిధ్వని ప్రవర్తిల్లుచుండగా ఆ రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు మూడు పర్యాయములు అగ్నిప్రదక్షిణము చేసి, భార్యలను వివాహ మాడిరి.

మూ. అథోపకార్యాం జగ్ముస్తే సభార్యా రఘునన్దనాః,
రాజాప్యనుయయౌ పశ్యన్సర్షిసంఘః సబాన్ధవః. 40

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
త్రిసప్తతితమః సర్గః

ప్ర. అ. అథ=పిమ్మట, తే=ఆ, రఘునన్దనాః = రాఘవులు, సభార్యాః= భార్యలతో కూడినవారై, ఉపకార్యామ్ = విడిదిని గూర్చి, జగ్ముః = వెళ్లిరి.

రాజాపి=రాజు కూడ, సర్షిసంఘః=ఋషిసంఘముతో కూడినవాడై, సబాన్ధవః= బంధువులతో కూడినవాడై, పశ్యన్ = చూచుచు, అనుయయౌ = అనుసరించి వెళ్లెను.

తా. పిమ్మట రామలక్ష్మణభరతశత్రుఘ్నులు భార్యలతో గూడి తమ విడిదికి వెళ్లిరి. ఋషులతోను, బంధువులతోను కూడిన దశరథుడు కూడ భార్యాసమేతు లైన పుత్రులను చూచుకొనుచు వెనుకనే వెళ్లెను. 40

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో డెబ్బదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుఃసప్తతితమః సర్గః

మూ. అథ రాత్ర్యాం వ్యతీతాయాం విశ్వామిత్రో మహామునిః,
ఆపృష్ట్వా తౌ చ రాజానౌ జగామోత్తరపర్వతమ్, 1
ఆశీర్భిః పూరయిత్వా చ కుమారాంశ్చ సరాఘవాన్.

ప్ర. అ. అథ = పిమ్మట, రాత్ర్యామ్ = రాత్రి, వ్యతీతాయాం సత్యామ్= గడచిన దగుచుండగా, సః = ఆ, మహామునిః=మహాముని యైన, విశ్వామిత్రః= విశ్వామిత్రుడు, రాఘవాన్ = రఘువంశోద్భవు లైన, కుమారాన్ చ = రాజ కుమారులను, ఆశీర్భిః = ఆశీర్వాదములచేత, పూరయిత్వా = నింపి, తౌ=ఆ, రాజానౌ = రాజులను, ఆపృష్ట్వా = అడిగి, ఉత్తరపర్వతమ్ = ఉత్తరపర్వత మునుగూర్చి, జగామ = వెళ్లెను.

తా. రాత్రి గడచిన పిదప విశ్వామిత్రమహాముని ఆ రాజకుమారులకు అనేకాశీర్వాదముల నిచ్చి, జనకదశరథమహారాజులవద్ద సెలవు గైకొని హిమ వత్పర్వతమునకు వెళ్లిపోయెను. 1

మూ. విశ్వామిత్రే గతే రాజా వైదేహం మిథిలాధిపమ్, 2
ఆపృష్ట్వాథ జగామాశు రాజా దశరథః పురీమ్.

ప్ర. అ. విశ్వామిత్రే = విశ్వామిత్రుడు, గతే = వెళ్లినవాడగుచుండగా, అథ = పిమ్మట, రాజా = ప్రజారంజకు డైన, దశరథః రాజా = దశరథమహా రాజు, మిథిలాధిపమ్ = మిథిలాధిపతి యైన, వైదేహమ్ = జనకమహారాజును, ఆపృష్ట్వా = అడిగి, ఆశు = శీఘ్రముగా, పురీమ్ = పట్టణమునుగూర్చి, జగామ= వెళ్లెను.

తా. విశ్వామిత్రుడు వెళ్లిన పిమ్మట దశరథమహారాజు జనకమహారాజు వద్ద సెలవు గైకొని శీఘ్రముగ అయోధ్యకు బయలుదేరెను. 2

మూ. గచ్ఛన్తం తం తు రాజానమన్వగచ్ఛన్నరాధిపః, 3
అథ రాజా విదేహానాం దదౌ కన్యాధనం బహు.

ప్ర. అ. నరాధిపః = జనకమహారాజు, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న, తమ్ = ఆ, రాజానమ్ = దశరథమహారాజును, అన్వగచ్ఛత్ = అనుసరించి వెళ్లెను. అథ = పిమ్మట, విదేహానాం రాజా = జనకమహారాజు, బహు = అత్యధిక మైన, కన్యాధనమ్ = కన్యాధనమును, దదౌ = ఇచ్చెను.

తా. జనకమహారాజు ప్రయాణమై వెళ్లు చున్న దశరథమహారాజును అనుసరించి వెళ్లి సాగనంపెను. ఆతడు తన కుమార్తెలకు అరణముగా అత్యధిక మగు ధనము నిచ్చెను. 3

మూ. గవాం శతసహస్రాణి బహూని మిథిలేశ్వరః, 4
కమ్బలానాం చ ముఖ్యానాం క్షౌమకోట్యమ్బరాణి చ,
హస్త్యశ్వరథపాదాతం దివ్యరూపం స్వలంకృతమ్, 5
దదౌ కన్యాపితా తాసాం దాసీదాసమనుత్తమమ్.

ప్ర. అ. కన్యాపితా = కన్యల తండ్రి యైన, మిథిలేశ్వరః = జనకమహారాజు, గవామ్ = గోవులయొక్క, బహూని = అనేకము లైన, శతసహస్రాణి = లక్షలను, ముఖ్యానామ్ = ముఖ్యము లైన, కమ్బలానామ్ = కంబళ్ల యొక్క లక్షలను, క్షౌమకోట్యమ్బరాణి చ = కోట్లకొలది పట్టువస్త్రములను, హస్త్యశ్వరథపాదాతమ్ = ఏనుగులను, గుఱ్ఱములను, రథములను, కాలిబంటులను, దివ్యరూపమ్ = దివ్య మైన రూపము గలదియు, స్వలంకృతమ్ = బాగుగా అలంకరింపబడినదియు, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైనదియు అగు, దాసీదాసమ్ = దాసీదాసజనమును, తాసామ్ = వారికి, దదౌ = ఇచ్చెను.

తా. ఆ మిథిలేశ్వరుడు లక్షల కొలది ఆవులను, శ్రేష్ఠ మైన కంబళీలను, కోట్ల కొలది పట్టువస్త్రములను, ఏనుగులు, అశ్వములు, రథములు, కాలిబంటులును గల చతురంగసైన్యమును, మంచి సౌందర్యము కలవారును బాగుగా అలంకరించుకున్నవారును, శ్రేష్ఠులును అగు దాసీదాసులను కుమార్తెలకు అరణముగా పంపెను. 4, 5

మూ. హిరణ్యస్య సువర్ణస్య ముక్తానాం విద్రుమస్య చ, 6
దదౌ పరమసంహృష్టః కన్యాధన మనుత్తమమ్.

ప్ర. అ. పరమసంహృష్టః = మిక్కిలి సంతసించినవాడై, హిరణ్యస్య= వెండియొక్కయు, సువర్ణస్య = బంగారముయొక్కయు, ముక్తానామ్ = ముత్య ములయొక్కయు, విద్రుమస్య = పగడములయొక్కయు, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైన, కన్యాధనమ్=కన్యాధనమును, దదౌ = ఇచ్చెను.

తా. అతడు చాల సంతసించినవాడై, వెండి, బంగారము, ముత్యములు, పగడములు, వీటి రూపములో నున్న అత్యధిక మగు కన్యాధనమును ఇచ్చెను. 6

మూ. దత్వా బహుధనం రాజా సమనుజ్ఞాప్య పార్థివమ్, 7
ప్రవివేశ స్వనిలయం మిథిలాం మిథిలేశ్వరః.

ప్ర. అ. మిథిలేశ్వరః = మిథిలాధిపతి యైన, రాజా = జనకమహారాజు, బహు = అత్యధిక మైన, ధనమ్ = ధనమును, దత్వా = ఇచ్చి, పార్థివమ్ = దశరథమహారాజును, సమనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చువానినిగా చేసి, స్వనిలయమ్= తన నివాస మైన, మిథిలామ్ = మిథిలానగరమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మిథిలాధిపతి యైన జనకమహారాజు కుమార్తెలకు అత్యధిక మైన ధనము నిచ్చి, దశరథమహారాజు వద్ద అనుజ్ఞ గైకొని తన నివాసస్థాన మగు మిథిలాపురిని ప్రవేశించెను. 7

మూ. రాజా ప్యయోధ్యాధిపతిః సహ పుత్త్రైర్మహాత్మభిః, 8
ఋషీన్ సర్వాన్ పురస్కృత్య జగామ సబలానుగః.

ప్ర. అ. అయోధ్యాధిపతిః = అయోధ్యాధిపతి యైన, రాజాపి = దశరథ మహారాజు కూడ, మహాత్మభిః = మహాత్ము లైన, పుత్త్రైః సహ = పుత్రులతో కూడ, సర్వాన్ = సమస్త మైన, ఋషీన్ = ఋషులను, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, సబలానుగః = సైన్యముతోడను అనుచరులతోడను కూడినవాడై, జగామ=వెళ్లెను.

తా. దశరథమహారాజు, మహాత్ము లైన కుమారులతో కూడ, ఋషు

లందరిని ముందు ఉంచుకొని, సైన్యమును, అనుచరులును వెంట రాగా, వెళ్లెను. 8

మూ. గచ్ఛన్తం తం నరవ్యాఘ్రం సర్షిసంఘం సరాఘవమ్. 9
ఘోరాః స్మ పక్షిణో వాచో వ్యాహరన్తి తతస్తతః,

ప్ర. అ. సర్షిసంఘమ్ = ఋషిసముదాయముతో కూడి నట్టియు, సరాఘవమ్ = రామలక్ష్మణభరతశత్రుఘ్నులతో కూడిన, నరవ్యాఘ్రమ్=నరశ్రేష్ఠుడైన, తమ్ = ఆ దశరథుని గూర్చి, తతస్తతః = అచ్చటచ్చట, ఘోరాః = భయంకరమైన, పక్షిణః = పక్షులు, వాచః = వాక్కులను, వ్యాహరన్తి స్మ = పలికెను.

తా. ఆ దశరథుడు, రామలక్ష్మణభరతశత్రుఘ్నసమేతుడై, ఋషులతో కూడ ప్రయాణము చేయుచుండగా, అక్కడక్కడ భయంకరములైన పక్షులు ధ్వనులుచేయ నారంభించినవి. 9

మూ. భౌమాశ్చైవ మృగాః సర్వే గచ్ఛన్తి స్మ ప్రదక్షిణమ్. 10
తాన్ దృష్ట్వా రాజశార్దూలో వసిష్ఠం పర్యపృచ్ఛత,

ప్ర. అ. భౌమాః = భూమికి సంబంధించిన, సర్వే = సమస్తమైన, మృగాః=మృగములు, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణముగా, గచ్ఛన్తి స్మ=వెళ్లినవి. తాన్=వాటిని, దృష్ట్వా = చూచి, రాజశార్దూలః = రాజశ్రేష్ఠుడు, వసిష్ఠమ్=వసిష్ఠుని, పర్యపృచ్ఛత=అడిగెను.

తా. భూమిపై నున్న మృగములు ప్రదక్షిణముగా వెళ్లినవి. దీని నంతయు చూచి దశరథమహారాజు వసిష్ఠుని ఇట్లు ప్రశ్నించెను. 10

మూ. అసౌమ్యాః పక్షిణో ఘోరాః మృగాశ్చాపి ప్రదక్షిణాః, 11
కిమిదం హృదయోత్కమ్పి మనో మమ విషీదతి.

ప్ర. అ. ఘోరాః=భయంకరమైన, పక్షిణః = పక్షులు, అసౌమ్యాః= ప్రతికూలముగా నున్నవి. మృగాశ్చాపి=మృగములు, ప్రదక్షిణాః=ప్రదక్షిణములుగా ఉన్నవి. హృదయోత్కమ్పి = హృదయమును కంపింపచేయు, ఇదమ్=

ఇది, కిమ్=ఏమిటి ? మమ=నాయొక్క, మనః = మనస్సు, విషీదతి=క్రుంగి పోవుచున్నది.

తా. ఘోరము లైన పక్షులు ప్రతికూలముగా నున్నవి. మృగములు ప్రదక్షిణముగా నంచరించుచు అనుకూలముగా ఉన్నవి. హృదయమును కంపింప చేయు ఇది యంతయు ఏమిటి ? నా మనస్సు విషాదము చెందుచున్నది. 11

మూ. రాజ్ఞో దశరథస్యైతచ్ఛ్రుత్వా వాక్యం మహానృషిః, 12
ఉవాచ మధురాం వాణీం శ్రూయతామస్య యత్ ఫలమ్.

ప్ర. అ. మహానృషిః=ఆ వసిష్ఠమహర్షి, రాజ్ఞః = రాజైన, దశరథస్య= దశరథునియొక్క, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, మధు రామ్=మధుర మైన, వాణీమ్=వాక్కును, ఉవాచ = పలికెను. అస్య=దీనికి, యత్=ఏది, ఫలమ్=ఫలమో, శ్రూయతామ్=వినబడుగాక.

తా. దశరథమహారాజు మాటలు విని వసిష్ఠమహర్షి మధుర మైన వాక్యము పలికెను. దీని ఫల మేదియో చెప్పెదను వినుము. 12

మూ. ఉపస్థితం భయం ఘోరం దివ్యం పక్షిముఖాచ్చ్యుతమ్, 13
మృగాః ప్రశమయన్త్యేతే సంతాపస్త్యజ్యతామయమ్.

ప్ర. అ. పక్షిముఖాత్=పక్షుల ముఖమునుండి, చ్యుతమ్=జారిన, (సూచింప బడిన), దివ్యమ్=దైవకృత మైన, ఉపస్థితమ్=వచ్చిపడిన, ఘోరమ్=ఘోర మైన, భయమ్=భయమును, ఏతే=ఈ, మృగాః=మృగములు, ప్రశమయన్తి= శాంతింపచేయుచున్నవి. అయమ్=ఈ, సన్తాపః = మనస్తాపము, త్యజ్యతామ్= విడువబడుగాక.

తా. ఆకస్మికముగ దైవకృతమై ఘోర మైన భయము వచ్చిపడ నున్నట్లు పక్షులు సూచించుచున్నవి. మృగములు ఆ భయము శాంతింప నున్నట్లు సూచించుచున్నవి. అందుచేత మనస్తాపము పొందకుము. 13

మూ. తేషాం సంవదతాం తత్ర వాయుః ప్రాదుర్బభూవ హ, 14
కమ్పయన్ పృథివీం సర్వాం పాతయంశ్చ ద్రుమాఞ్ఛుభాన్.

ప్ర. అ. తేషామ్ = వారు, సంవదతామ్ = మాటలాడుచుండగా, తత్ర = అచట, పృథివీమ్ = భూమిని, కమ్పయన్ = కంపింపచేయుచు, శుభాన్ = శుభ మైన, ద్రుమాన్ = వృక్షములను, పాతయన్ = పడవేయుచు, వాయుః = వాయువు, ప్రాదుర్బభూవ హ = పుట్టెను.

తా. వారిట్లు మాటలాడుకొనుచుండగా అచట, భూమిని కంపింపచేయుచు, మంగళకరము లైన వృక్షములను పడగొట్టుచు వాయువు బయలుదేరెను. 14

మూ. తమసా సంవృతః సూర్యః సర్వా న ప్రబభుర్దిశః, 15
భస్మనా చావృతం సర్వం సమ్మూఢమివ తద్బలమ్.

ప్ర. అ. సూర్యః = సూర్యుడు, తమసా = చీకటిచే, ఆవృతః = ఆవరింపబడెను. సర్వాః = సమస్త మైన, దిశః = దిక్కులు, న ప్రబభుః = ప్రకాశింపలేదు. తత్ = ఆ, సర్వమ్ = సమస్త మైన, బలమ్ = సైన్యము, భస్మనా = దుమ్ముచేత, ఆవృతమ్ = కప్పబడినదై, సమ్మూఢమివ = మూర్ఛనొందినట్లయినది.

తా. సూర్యుని చీకటి ఆవరించెను. దిక్కు లన్నియు ప్రకాశవిహీనములయ్యెను. ఆ సైన్య మంతయు బూడిద కప్పగా మూర్ఛపొందిన ట్లుండెను. 15

మూ. వసిష్ఠశ్చర్షయశ్చాన్యే రాజా చ ససుత స్తదా, 16
ససంజ్ఞా ఇవ తత్రాసన్ సర్వమన్యద్విచేతనమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, వసిష్ఠశ్చ = వసిష్ఠుడును, అన్యే = ఇతరులైన, ఋషయశ్చ = ఋషులును, ససుతః = కుమారులతో కూడిన, రాజా చ = రాజును, ససంజ్ఞాః ఇవ = చైతన్య మున్నవారు వలె, ఆసన్ = ఉండిరి. అన్యత్ = ఇతర మైన, సర్వమ్ = అంతయు, విచేతనమ్ = చైతన్యరహిత మైనది.

తా. ఆ సమయమున, వసిష్ఠాదిఋషులు, దశరథుడు, అతని కుమారులు వీరుమాత్రమే చైతన్య మున్నట్లు కనబడిరి. మిగిలినవా రందరును విచేతనుల వలె అయిరి. 16

మూ. తస్మింస్తమసి ఘోరే తు భస్మచ్ఛన్నేవ సా చమూః. 17
దదర్శ భీమసఙ్కాశం జటామణ్డలధారిణమ్,
భార్గవం జామదగ్న్యం తం రాజరాజవిమర్దినమ్, 18
కైలాసమివ దుర్ధర్షం కాలాగ్నిమివ దుఃసహమ్,
జ్వలన్తమివ తేజోభిర్దుర్నిరీక్ష్యం పృథగ్జనైః, 19
స్కన్దే చాసజ్య పరశుం ధనుర్విద్యుద్గణోపమమ్,
ప్రగృహ్య శరముఖ్యం చ త్రిపురఘ్నం యథా శివమ్. 20

ప్ర. అ. తస్మిన్ = ఆ, ఘోరే = భయంకర మైన, తమసి = అంధకారమునందు, భస్మచ్ఛన్నేవ = భస్మముచేత కప్పబడినది వలె ఉన్న, సా = ఆ, చమూః = సేన, భీమసఙ్కాశమ్ = భయంకరుడుగా ఉన్నవాడును, జటామణ్డలధారిణమ్ = జటామండలమును ధరించినవాడును, రాజరాజవిమర్దినమ్ = రాజులరాజులను గూడ నశింపచేసినవాడును, కైలాసమివ = కైలాసపర్వతము వలె, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యముకానివాడును, కాలాగ్నిమివ = ప్రలయ కాలాగ్ని వలె, దుస్సహమ్ = సహింప శక్యముకానివాడును, తేజోభిః = తేజస్సుల చేత, జ్వలన్తమివ = ప్రజ్వరిల్లుచున్నవాడును, పృథగ్జనైః = సామాన్యులచేత, దుర్నిరీక్ష్యమ్ = చూడ శక్యముకానివాడును, పరశుమ్ = గండ్రగొడ్డలిని, స్కన్దే = భుజమునందు, ఆసజ్య = తగల్చుకొని, విద్యుద్గణోపమమ్ = మెరపుల గుంపుతో సమాన మైన, ధనుః = ధనస్సును, శరముఖ్యమ్ = శ్రేష్ఠ మైన శరమును, పరిగృహ్య = గ్రహించి, త్రిపురఘ్నమ్ = త్రిపురధ్వంసము చేసిన, శివం యథా = శివుడు వలె ఉన్న, తమ్ = ఆ, భార్గవమ్ = భృగువంశసంజాతు డైన, జామదగ్న్యమ్ = పరశురాముని, దదర్శ = చూచెను.

తా. ఆ ఘోర మైన అంధకారములో, బూడిద కప్పినట్లున్న ఆ సైన్యము, జటామండలమును ధరించినవాడును, భయంకరుడును, రాజులను సంహరించిన వాడును అగు పరశురాముని చూచెను. అతడు కైలాసము వలె ఎదిరింప శక్యము కానివాడై, ప్రళయకాలాగ్ని వలె సహింప శక్యముకానివాడై యుండెను. తేజస్సులచే మండుచున్నట్లున్న అతనిని సామాన్యజనులు చూడజాలకుండిరి. గండ్ర గొడ్డలిని బుజముపై వ్రేలాడదీసికొని, మెరపుల గుంపు వంటి ధనస్సును, శ్రేష్ఠ మైన శరమును చేతులలో ధరించి త్రిపురసంహారము చేయు శివుడు వలె నుండెను. 17, 18, 19

మూ. తం దృష్ట్వా భీమసంకాశం జ్వలన్తమివ పావకమ్,
వసిష్ఠప్రముఖా విప్రా జపహోమపరాయణాః, 21
సంగతా మునయః సర్వే సంజజల్పురథో మిథః.

ప్ర. అ. భీమసంకాశమ్ = భయంకరుడును, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, పావకమ్ ఇవ = అగ్ని వలె ఉన్న, తమ్ = ఆతనిని, దృష్ట్వా = చూచి, జపహోమపరాయణాః = జపమునందును హోమమునందును ఆసక్తి గలవారును, విప్రాః = బ్రాహ్మణులును అయిన, వసిష్ఠప్రముఖాః = వసిష్ఠుడు మొదలైన, సర్వే = సమస్తమైన, మునయః = మునులు, సంగతాః = కలిసినవారై, అథో = పిమ్మట, మిథః = పరస్పరము, సంజజల్పుః = మాటలాడుకొనిరి.

తా. ప్రజ్వరిల్లుచున్న అగ్ని వలె భయంకరముగా ఉన్న ఆతనిని చూచి, జపహోమాదిపరాయణులును, శాంతస్వభావులును అగు వసిష్ఠాదిమును లందరును కలిసి, పరస్పరము ఇట్లనుకొనిరి. 20, 21

మూ. కచ్చిత్పితృవధామర్షీ క్షత్రం నోత్సాదయిష్యతి, 22
పూర్వం క్షత్రవధం కృత్వా గతమన్యుర్గతజ్వరః,
క్షత్రస్యోత్సాదనం భూయో న ఖల్వస్య చికీర్షితమ్. 23

ప్ర. అ. పితృవధామర్షీ = తండ్రియొక్క వధచేత కోపించిన ఇతడు, క్షత్రమ్ = క్షత్రియజాతిని, నోత్సాదయిష్యతి కచ్చిత్ = నశింపచేయడు కదా ? పూర్వమ్ = పూర్వము, క్షత్రవధమ్ = క్షత్రియవధను, కృత్వా = చేసి, గతమన్యుః = పోయిన కోపము గలవాడును, గతజ్వరః = పోయిన మనస్తాపము గలవాడును అయినాడు కదా ? భూయః = మరల, క్షత్రస్య = క్షత్రియజాతియొక్క, ఉత్సాదనమ్ = వినాశము, అస్య = ఈతనికి, న చికీర్షితం ఖలు = చేయనభిలషింపబడలేదు కదా ?

తా. (కార్తవీర్యార్జునుడు) తండ్రిని చంపుటచే కోపించిన ఇతడు క్షత్రియజాతిని నశింపచేయడు కదా ? పూర్వము క్షత్రియవధ చేసి కోపతాపములు తగ్గి శాంతించిన ఇతడు మరల క్షత్రియవంశవినాశమునకు పూనొకనునా ? 22, 23

మూ. ఏవముక్త్వార్ఘ్యమాదాయ భార్గవం భీమదర్శనమ్,
ఋషయో రామ రామేతి వచో మధురమబ్రువన్. 24

ప్ర. అ. ఋషయః = ఋషులు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = తమలో తాము చెప్పుకొని, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, ఆదాయ = గ్రహించి, భీమదర్శనమ్ = భయంకర మైన దర్శనము గల, భార్గవమ్ = పరశురాముని గూర్చి, రామ రామ ఇతి = రామా రామా అని, మధురమ్ = మధుర మైన, వచః = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. ఋషులు తమతో తా మీ విధముగ మాటలాడుకొని, భయంకరుడుగా కనబడుచున్న ఆ పరశురామునకై అర్ఘ్యము గ్రహించి, "రామా! రామా!" అని మధురముగ పిలచి పూజించిరి. 24

మూ. ప్రతిగృహ్య తు తాం పూజామృషిదత్తాం ప్రతాపవాన్,
రామం దాశరథిం రామో జామదగ్న్యోఽభ్యభాషత. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
చతుఃసప్తతితమః సర్గః.

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపము గల, జామదగ్న్యః = జమదగ్ని కుమారు డైన, రామః = పరశురాముడు, ఋషిదత్తామ్ = ఋషులచేత ఇవ్వబడిన, తామ్ = ఆ, పూజామ్ = పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, దాశరథిమ్ = దశరథుని కుమారుడైన, రామమ్ = రాముని గూర్చి, అభ్యభాషత = పలికెను.

తా. ప్రతాపవంతు డైన ఆ పరశురాముడు ఋషులు సమర్పించిన ఆ పూజను స్వీకరించి, దశరథుని కుమారు డగు రామునితో ఇట్లనెను. 24

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, బాలకాండలో డెబ్బది నాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చసప్తతితమః సర్గః

మూ. రామ దాశరథే రామ వీర్యం తే శ్రూయతేఽద్భుతమ్,
ధనుషో భేదనం చైవ నిఖిలేన మయా శ్రుతమ్. 1

ప్ర. అ. దాశరథే = దశరథకుమారుడ వైన, రామ = రామా ! రామ = రామా ! తే = నీయొక్క, వీర్యమ్ = పరాక్రమము, అద్భుతమ్ = అద్భుతమైనదిగా, శ్రూయతే = వినబడుచున్నది. ధనుషః = ధనస్సుయొక్క, భేదనం చైవ = భేదనము కూడ, నిఖిలేన = పూర్తిగా, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది.

తా. రామా ! రామా ! నీ పరాక్రమము అత్యద్భుత మైన దని వినుచున్నాము. శివధనుర్భంగమును గూర్చి గూడ పూర్తిగ విని యున్నాము. 1

మూ. తదద్భుతమచిన్త్యం చ భేదనం ధనుషస్త్వయా,
తచ్ఛ్రుత్వాహమనుప్రాప్తో ధనుర్గృహ్యాపరం శుభమ్. 2

ప్ర. అ. త్వయా = నీచేత, ధనుషః = ధనస్సుయొక్క, తత్ = ఆ, భేదనమ్ = విరచుట, అద్భుతమ్ = ఆశ్చర్యకర మైనది. అచిన్త్యం చ = ఊహింప శక్యము కానిది. తత్ = దానిని, శ్రుత్వా = విని, అహమ్ = నేను, అపరమ్ = మరియొక, శుభమ్ = శుభ మైన, ధనుః = ధనస్సును, గృహ్య = గ్రహించి, అనుప్రాప్తః = వచ్చినాను.

తా. నీవు శివుని విల్లు విరచుట చాల ఆశ్చర్యకర మైనది, ఊహింపరానిది. ఆ వార్త విని నేను మరొక శుభ మైన విల్లు తీసికొని వచ్చినాను. 2

మూ. తదిదం ఘోరసంకాశం జామదగ్న్యం మహద్ధనుః,
పూరయస్వ శరేణైవ స్వబలం దర్శయస్వ చ. 3

ప్ర. అ. ఘోరసంకాశమ్ = భయంకరముగా నున్నదియు, జామదగ్న్యమ్ = జమదగ్నివలన వచ్చినదియు అగు, తత్ = ఆ, ఇదమ్ = ఈ, మహత్ =

గొప్ప, ధనుః = ధనస్సును, శరేణైవ=బాణముచే, పూరయస్వ = పూరింపుము. స్వబలమ్ = నీ బలమును, దర్శయస్వ చ = చూపుము.

తా. ఘోర మైనదియు, జమదగ్ని ద్వారా లభించినదియు అగు అట్టి ఈ మహాధనస్సును, ఎక్కుపెట్టి, బాణముచే పూరించి, నీ బలమును చూపుము. 3

మూ. తదహం తే బలం దృష్ట్వా ధనుషోఽస్య ప్రపూరణే,
ద్వన్ద్వయుద్ధం ప్రదాస్యామి వీర్యశ్లాఘ్యస్య రాఘవ. 4

ప్ర. అ. రాఘవ = రామా ! తత్ = అప్పుడు, అహమ్ = నేను, అస్య= ఈ, ధనుషః=ధనస్సుయొక్క, ప్రపూరణే=పూరించుటయందు, తే=నీయొక్క, బలమ్=బలమును, దృష్ట్వా=చూచి, వీర్యశ్లాఘ్యస్య = పరాక్రమముచే శ్లాఘింప దగిన నీకు, ద్వన్ద్వయుద్ధమ్=ద్వంద్వయుద్ధమును, ప్రదాస్యామి=ఇవ్వగలను.

తా. రామా ! ఈ ధనస్సును పూరించినచో అపుడు నీ బలమును చూచి, వీర్యముచే శ్లాఘింప దగిన నీతో ద్వంద్వయుద్ధము చేయగలను. 4

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజా దశరథ స్తదా,
విషణ్ణవదనో దీనః ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్. 5

ప్ర. అ. తదా=అప్పుడు, రాజా దశరథః=దశరథమహారాజు, తస్య= అతనియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, విషణ్ణవదనః= దిగులుపాటు చెందిన ముఖము కలవాడై, దీనః=దీనుడై, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అపుడు, దశరథమహారాజు అతని మాటలు విని, వాడిపోయిన ముఖముతో దీనుడై, చేతులు జోడించి ఇట్లు పలికెను. 5

మూ. క్షత్రరోషాత్ప్రశాన్త స్త్వం బ్రాహ్మణశ్చ మహాయశాః,
బాలానాం మమ పుత్రాణామభయం దాతుమర్హసి. 6

ప్ర. అ. క్షత్రరోషాత్=క్షత్రియులపై రోషమునుండి, ప్రశాన్తః=శాంతించినవాడవును, బ్రాహ్మణః=బ్రాహ్మణుడవును, మహాయశాః = గొప్ప కీర్తి కల

వాడవును అగు, త్వమ్=నీవు, బాలానామ్ = బాలులైన, మమ=నాయొక్క, పుత్రాణామ్=పుత్రులకు, అభయమ్ = అభయమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి=తగియున్నావు.

తా. గొప్ప యశస్సు కలవాడవు, బ్రాహ్మణుడవు అయిన నీవు క్షత్రియులపై ఉన్న కోపము తొలగి శాంతుడవుగా ఉన్నావు కదా? ఇపుడు బాలురైన నా కుమారులకు అభయ మిమ్ము. 6

మూ. భార్గవాణాం కులే జాతః స్వాధ్యాయవ్రతశాలినామ్,
సహస్రాక్షే ప్రతిజ్ఞాయ శస్త్రం నిక్షిప్తవానసి. 7

ప్ర. అ. స్వాధ్యాయవ్రతశాలినామ్ = వేదాధ్యయనముచేతను ఇతరవ్రతములచేతను ప్రకాశించుచున్న, భార్గవాణామ్ = భృగువంశీయుల, కులే=కులమునందు, జాతః=పుట్టితివి. సహస్రాక్షే = దేవేంద్రునియందు, ప్రతిజ్ఞాయ=ప్రతిజ్ఞ చేసి, శస్త్రమ్=ఆయుధమును, నిక్షిప్తవాన్ అసి=విడచిపెట్టితివి.

తా. నీవు స్వాధ్యాయమునందును, తదితరవ్రతములందును ఆసక్తులైన భృగువంశీయుల కులమునందు పుట్టినావు. దేవేంద్రుని ముందు ప్రతిజ్ఞ చేసి శస్త్రమును విడచితివి. 7

మూ. స త్వం ధర్మపరో భూత్వా కాశ్యపాయ వసున్ధరామ్,
దత్వా వనముపాగమ్య మహేన్ద్రకృతకేతనః. 8

ప్ర. అ. సః=అట్టి, త్వమ్=నీవు, ధర్మపరః=ధర్మపరుడవు, భూత్వా=అయి, కాశ్యపాయ = కాశ్యపునకు, వసున్ధరామ్=భూమిని, దత్వా = ఇచ్చి, వనమ్=వనమును, ఉపాగమ్య = పొంది, మహేన్ద్రకృతకేతనః = మహేంద్ర పర్వతముపై చేయబడిన నివాసము కలవాడవు.

తా. నీవు ధర్మపరుడవై, భూమి నంతను కాశ్యపునకు దానము చేసి, వనము చేరి, మహేంద్రపర్వతముపై నివాస మేర్పరచుకున్నావు. 8

మూ. మమ సర్వవినాశాయ సంప్రాప్తస్త్వం మహామునే,
న చైకస్మిన్ హతే రామే సర్వే జీవామహే వయమ్. 9

ప్ర. అ. మహామునే = ఓ మహామునీ ! త్వమ్ = నీవు, మమ = నా యొక్క, సర్వవినాశాయ = సర్వవినాశమునకు, సంప్రాప్తః = వచ్చినావు. ఏకస్మిన్ = ఒక, రామే = రాముడు, హతే = చంపబడినవాడగుచుండగా, వయమ్= మేము, సర్వే = అందరము, న జీవామహే = జీవించము.

తా. మహామునీ ! ఈనాడు నీవు మా అందరి వినాశార్థమై వచ్చితివి. ఒక్క రాముడు మరణించినను మే మందరము మరణింతుము కదా ? 9

మూ. బ్రువత్యేవం దశరథే జామదగ్న్యః ప్రతాపవాన్,
అనాదృత్త్యైవ తద్వాక్యం రామమేవాభ్యభాషత. 10

ప్ర. అ. దశరథే = దశరథుడు, ఏమ్ = ఇట్లు, బ్రువతి=చెప్పుచుండగా, ప్రతాపవాన్ = ప్రతాపము గల, జామదగ్న్యః = పరశురాముడు, తద్వాక్యమ్ = ఆతని వాక్యమును, అనాదృత్త్యైవ = ఆదరించకయే, రామమేవ = రాముని గూర్చియే, అభ్యభాషత = పలికెను.

తా. దశరథు డీ విధముగ మాటలాడుచుండగా ప్రతాపవంతు డైన పరశురాముడు, ఆతని మాటలు లెక్కచేయకుండగనే, రామునితో మాత్రమే ఇట్లు పలికెను. 10

మూ. ఇమే ద్వే ధనుషీ శ్రేష్ఠే దివ్యే లోకాభివిశ్రుతే,
దృఢే బలవతీ ముఖ్యే సుకృతే విశ్వకర్మణా. 11

ప్ర. అ. ఇమే = ఈ, ద్వే = రెండు, ధనుషీ = ధనస్సులు, శ్రేష్ఠే = శ్రేష్ఠ మైనవి. దివ్యే = స్వర్గమున పుట్టినవి. లోకాభివిశ్రుతే=లోకములలో ప్రసిద్ధ మైనవి. దృఢే = దృఢ మైనవి. బలవతీ = బలము కలవి. ముఖ్యే = ప్రధాన మైనవి. విశ్వకర్మణా = విశ్వకర్మచేత, సుకృతే = బాగుగా నిర్మింపబడినవి.

తా. ఈ రెండు ధనస్సులును శ్రేష్ఠ మైనవి. దేవలోకమునకు సంబంధించినవి. లోకములలో ప్రసిద్ధిపొందినవి. దృఢ మైనవి. బలము గలవి. ప్రధాన మైనవి. విశ్వకర్మ వీటిని బాగుగ నిర్మించెను. 11

మూ. అతిసృష్టం సురై రేకం త్ర్యమ్బకాయ యుయుత్సవే,
త్రిపురఘ్నం నరశ్రేష్ఠ భగ్నం కాకుత్స్థ యత్త్వయా. 12

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడ వైన, కాకుత్స్థ=రామా ! యత్= ఏ ధనస్సు, త్వయా = నీచేత, భగ్నమ్ = విరుగకొట్టబడినదో, అది, యుయుత్సవే = యుద్ధము కోరుచున్న, త్ర్యమ్బకాయ = ఈశ్వరునకు, సురైః = దేవతల చేత. అతిసృష్టమ్ = ఇవ్వబడిన, త్రిపురఘ్నమ్ = త్రిపురములను నశింపచేసిన, ఏకమ్ = (ఆ రెండింటిలో) ఒకధనస్సు.

తా. నరశ్రేష్ఠుడ వైన రామా ! వాటిలో ఒక ధనస్సును దేవతలు యుద్ధము చేయ గోరుచున్న ఈశ్వరునకు ఇచ్చిరి. త్రిపురవినాశక మగు దానినే నీవు విరిచితివి. 12

మూ. ఇదం ద్వితీయం దుర్ధర్షం విష్ణోర్దత్తం సురోత్తమైః,
తదిదం వైష్ణవం రామ ధనుః పరమభాస్వరమ్,
సమానసారం కాకుత్స్థ రౌద్రేణ ధనుషా త్విదమ్. 13

ప్ర. అ. దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యముకాని, ఇదమ్= ఈ, ద్వితీయమ్= రెండవధనస్సు, సురోత్తమైః = సురోత్తములచేత, విష్ణోః=విష్ణువునకు, దత్తమ్= ఇవ్వబడినది. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు పుట్టిన, రామ = రామా, పరమభాస్వరమ్=మిక్కిలి ప్రకాశించుచున్న, తత్ = ఆ, ఇదమ్ = ఇది, వైష్ణవమ్ = విష్ణుసంబంధ మైన, ధనుః = ధనస్సు. ఇదమ్ = ఇది, రౌద్రేణ ధనుషా = శివ ధనస్సుతో, సమానసారమ్ = సమానమైన సారము గలది.

తా. ఎదిరింప రాని ఈ రెండవ ధనస్సును దేవతలు విష్ణువున కిచ్చి నారు. రామా ! అట్టి ఈ మిక్కిలి ప్రకాశించుచున్న ధనస్సు విష్ణువునకు సంబంధించినది. ఇది శివధనస్సుతో సమాన మైన సారము గలది. 13

మూ. తదా తు దేవతాః సర్వాః పృచ్ఛన్తి స్మ పితామహమ్,
శితికణ్ఠస్య విష్ణోశ్చ బలాబలనిరీక్షయా. 14

ప్ర. అ. తదా = అప్పుడు, సర్వాః = సమస్త మైన, దేవతాః=దేవతలు,

శితికణ్ఠస్య = శివునియొక్కయు, విష్ణోః చ = విష్ణువుయొక్కయు, బలాబలనిరీక్షయా=బలాబలముల పరీక్షచేత, పితామహమ్=బ్రహ్మదేవుని, పృచ్ఛన్తి స్మ= ప్రశ్నించిరి.

తా. అపుడు దేవత లందరును శివవిష్ణువుల బలాబలములను తెలిసికొనగోరి బ్రహ్మను అడిగిరి. 14

మూ. అభిప్రాయం తు విజ్ఞాయ దేవతానాం పితామహః,
విరోధం జనయామాస తయోః సత్యవతాం వరః. 15

ప్ర. అ. సత్యవతామ్ = సత్యవంతులలో, వరః = శ్రేష్ఠుడైన, పితామహః = బ్రహ్మదేవుడు, దేవతానామ్ = దేవతలయొక్క, అభిప్రాయమ్ = అభిప్రాయమును, విజ్ఞాయ = తెలిసికొని, తయోః = వారిరువురకును, విరోధమ్ = విరోధమును, జనయామాస = పుట్టించెను.

తా. సత్యవంతులలో గొప్పవా డగు బ్రహ్మదేవుడు దేవతల అభిప్రాయము తెలిసికొని వారిద్దరికిని విరోధము కల్పించెను. 15

మూ. విరోధే చ మహద్యుద్ధమభవద్రోమహర్షణమ్,
శితికణ్ఠస్య విష్ణోశ్చ పరస్పరజిగీషుణోః. 16

ప్ర. అ. విరోధే = విరోధము కలుగగా, పరస్పరజిగీషుణోః = ఒండొరులను జయింప గోరిన, శితికణ్ఠస్య = శివునకును, విష్ణోశ్చ = విష్ణువునకును, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించు, మహత్ = గొప్ప, యుద్ధం=యుద్ధము, అభవత్ = అయెను.

తా. విరోధము కలుగగా, పరస్పరము జయించ వలె నని కోరుచున్న శివునకును విష్ణువునకును గొప్ప భయంకర మగు యుద్ధము జరిగెను. 16

మూ. తదా తు జృమ్భితం శైవం ధనుర్భీమపరాక్రమమ్,
హుంకారేణ మహాదేవః స్తంభితోఽథ త్రిలోచనః. 17

ప్ర. అ. తదా = అప్పుడు, హుంకారేణ = విష్ణువు 'హుం' అని అనుటచే,

భీమపరాక్రమమ్ = భయంకర మైన పరాక్రమము గల, శైవం ధనుః = శివ ధనుస్సు, జృమ్భితమ్=ఆవులించినది. అనగా జడమై పోయినది. అథ=పిమ్మట, త్రిలోచనః = మూడు నేత్రములు గల, మహాదేవః = ఈశ్వరుడు, స్తమ్భితః = స్తంభింపచేయబడినాడు.

తా. అపుడు విష్ణువు హుంకారము చేయగా భయంకర మైన పరాక్రమము గల ఆ శివధనస్సు జడ మైపోయినది. త్రిలోచనుడు కూడ కదలలేక పోయెను. 17

మూ. దేవైస్తదా సమాగమ్య సర్షిసంఘైః సచారణైః,
యాచితౌ ప్రశమం తత్ర జగ్మతుస్తౌ సురోత్తమౌ. 18

ప్ర. అ. తదా = అప్పుడు, సర్షిసంఘైః = ఋషిసంఘములతో కూడిన, సచారణైః = చారణులతో కూడిన, దేవైః = దేవతలచేత, తత్ర = అచట, సమాగమ్య = వచ్చి, యాచితౌ = ప్రార్థింపబడినవారై, తౌ = ఆ, సురోత్తమౌ = దేవతాశ్రేష్ఠులు, ప్రశమమ్ = శాంతిని, జగ్మతుః = పొందిరి.

తా. అపుడు దేవతలు, ఋషులు, చారణులు వచ్చి ప్రార్థింపగా ఆ దేవతాశ్రేష్ఠు లిరువురును శాంతించిరి. 18

మూ. జృమ్భితం తద్ధనుర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః,
అధికం మేనిరే విష్ణుం దేవాః సర్షిగణాస్తదా. 19

ప్ర. అ. విష్ణుపరాక్రమైః = విష్ణువుయొక్క పరాక్రమములచేత, జృమ్భితమ్ = నిర్వీర్యముగచేయబడిన, తత్ = ఆ, శైవమ్ = శివుని సంబంధ మైన, ధనుః = దనస్సును, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, దేవాః = దేవతలు, విష్ణుమ్ = విష్ణువును, అధికమ్ = గొప్పవానినిగా, మేనిరే = తలచిరి.

తా. విష్ణుపరాక్రమముచే ఆ శివధనస్సు జడ మైపోవుట జూచి దేవతలును, ఋషిగణములును, విష్ణువే అధికు డని తెలిసికొనిరి. 19

మూ. ధనూ రుద్రస్తు సంక్రుద్ధో విదేహేషు మహాయశాః,
దేవరాతస్య రాజర్షేర్దదౌ హస్తే ససాయకమ్. 20

ప్ర. అ. సంక్రుద్ధః = కోపగించిన, మహాయశాః = గొప్ప కీర్తి గల, రుద్రస్తు = రుద్రుడైతే, విదేహేషు = విదేహదేశమునందు, ససాయకమ్ = బాణముతో కూడిన, ధనుః = ధనస్సును, రాజర్షేః = రాజర్షి యైన, దేవరాతస్య = దేవరాతునియొక్క, హస్తే = హస్తమునందు, దదౌ = ఇచ్చెను.

తా. మహాయశస్సు గల రుద్రుడు కోపించి, బాణసహిత మైన ఆ ధనస్సును, విదేహదేశములో దేవరాతు డను రాజర్షి చేతికి ఇచ్చివేసెను. 20

మూ. ఇదం చ వైష్ణవం రామ ధనుః పరపురఞ్జయమ్,
ఋచీకే భార్గవే ప్రాదాద్విష్ణుః స న్యాసముత్తమమ్. 21

ప్ర. అ. రామ = రామా! సః = ఆ, విష్ణుః = విష్ణువు, పరపురఞ్జయమ్ = పరుల పురములను జయించు, ఇదమ్ = ఈ, వైష్ణవం ధనుః = వైష్ణవధనస్సును, భార్గవే = భృగువంశమునకు చెందిన, ఋచీకే = ఋచీకునియందు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, న్యాసమ్ = న్యాసమునుగా, ప్రాదాత్ = ఇచ్చెను.

తా. రామా! శత్రుపురవినాశక మగు తన ధనస్సును, విష్ణువు, భృగువంశమునకు చెందిన ఋచీకుని వద్ద ఉత్తమ మైన, న్యాసమునుగా ఇచ్చెను. 21

మూ. ఋచీకస్తు మహాతేజాః పుత్రస్యాప్రతికర్మణః,
పితుర్మమ దదౌ దివ్యం జమదగ్నేర్మహాత్మనః. 22

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ఋచీకస్తు = ఋచీకుడు, పుత్రస్య = తన కుమారుడును, అప్రతికర్మణః = సాటి లేని కార్యములు కల వాడును, మహాత్మనః = మహాత్ముడును, మమ = నాయొక్క, పితుః = తండ్రియు అయిన, జమదగ్నేః = జమదగ్నికి, దదౌ = ఇచ్చెను.

తా. మహాతేజఃశాలి యగు ఋచీకుడు, దానిని సాటి లేని కర్మ కల వాడును, మహాత్ముడును, తన కుమారుడును, నా తండ్రియు అగు జమదగ్నికిచ్చెను. 22

మూ. న్యస్తశస్త్రే పితరి మే తపోబలసమన్వితే,
అర్జునో విదధే మృత్యుం ప్రాకృతాం బుద్ధిమాస్థితః. 23

ప్ర. అ. తపోబలసమన్వితే = తపోబలముతో కూడిన, మే = నాయొక్క, పితరి = తండ్రి, న్యస్తశస్త్రే = విడువబడిన ఆయుధములు కలవాడై యుండగా, అర్జునః = కార్తవీర్యార్జునుడు, ప్రాకృతామ్ = ప్రాకృత మైన, బుద్ధిమ్ = బుద్ధిని, ఆస్థితః = అవలంబించినవాడై, మృత్యుమ్ = మరణమును, విదదే = చేసెను.

తా. తపోబలసమన్వితు డగు నా తండ్రి అస్త్రసంన్యాసము చేసి ఉన్నపుడు కార్తవీర్యార్జునుడు పామరబుద్ధికలవాడై ఆతనిని చంపెను. 23

మూ. వధమప్రతిరూపం తు పితుః శ్రుత్వా సుదారుణమ్,
క్షత్రముత్సాదయన్రోషాజ్జాతం జాతమనేకశః, 24
పృథివీం చాఖిలాం ప్రాప్య కాశ్యపాయ మహాత్మనే,
యజ్ఞస్యాన్తే తదా రామ దక్షిణాం పుణ్యకర్మణే,
దత్త్వా మహేన్ద్రనిలయస్తపోబలసమన్వితః. 25

ప్ర. అ. రామ = రామా! అప్రతిరూపమ్ = సాటి లేనిదియు, సుదారుణమ్ = చాల దారుణ మైనదియు అగు, పితుః = తండ్రియొక్క, వధమ్ = వధను; శ్రుత్వా = విని, రోషాత్ = కోపమువలన, జాతం జాతమ్ = పుట్టినవానినిపుట్టినట్లుగనే, క్షత్రమ్ = క్షత్రియజాతివానిని, అనేకశః = అనేకవిధములుగ, ఉత్సాదయన్ = నశింపచేయుచున్నవాడనై, అఖిలామ్ = సమస్తమైన, పృథివీమ్ = భూమిని, ప్రాప్య = పొంది, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, అన్తే = అంతమునందు, మహాత్మనే = మహాత్ముడును, పుణ్యకర్మణే = పుణ్యమైన కర్మ గలవాడును అగు, కాశ్యపాయ = కాశ్యపునకు, దత్త్వా = ఇచ్చి, తపోబలసమన్వితః = తపోబలముతో కూడినవాడనై, మహేన్ద్రనిలయః = మహేంద్రపర్వతమే నివాసముగ కలవాడనైతిని.

తా. చాల దారుణము, క్రౌర్యమున సాటి లేనిదియు అగు నా తండ్రి వధను గూర్చి విన్న నేను రోషముతో అనేకపర్యాయములు క్షత్రియజాతికి చెందిన ప్రతి ఒక్కనిని, పుట్టినవానిని పుట్టినట్లుగనే సంహరించితిని. ఈ భూమి

నంతను జయించి, యజ్ఞాంతమునందు మహాత్ముడును, పుణ్యకర్మ కలవాడును అగు కాశ్యపునకు దానము చేసితిని. పిదప తపోబలసమన్వితుడనై, మహేంద్ర పర్వతముపై నివసించుచున్నాను. 24, 25

మూ. అద్య తూత్తమవీర్యేణ త్వయా రామ మహాబల,
శ్రుతవాన్ ధనుషో భేదం తతోఽహం ద్రుతమాగతః. 26

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గల, రామ=రామా! అద్య= ఇపుడు, ఉత్తమవీర్యేణ=గొప్ప పరాక్రమము గల, త్వయా=నీచేత, ధనుషః= ధనస్సుయొక్క, భేదమ్=భంగమును, శ్రుతవాన్ = విన్నవాడనై, అహమ్= నేను, తతః=ఆ కారణమువలన, ద్రుతమ్=శీఘ్రముగా, ఆగతః=వచ్చితిని.

తా. మహాబలుడ వగు రామా! ఉత్తమ మైన పరాక్రమము గల నీవు ఇపుడు ధనస్సు విరచితి వని విని శీఘ్రముగా వచ్చినాను. 26

మూ. తదిదం వైష్ణవం రామ పితృపైతామహం మహత్,
క్షత్రధర్మం పురస్కృత్య గృహ్ణీష్వ ధనురుత్తమమ్. 27

ప్ర. అ. రామ = రామా! క్షత్రధర్మమ్ = క్షత్రియధర్మమును, పురస్కృత్య = పురస్కరించుకొని, తత్=ఆ, ఇదమ్=ఈ, పితృపైతామహమ్= పితృపితామహక్రమమున వచ్చుచున్న, మహత్=గొప్ప దైన, ఉత్తమమ్=శ్రేష్ఠ మైన, వైష్ణవమ్ = విష్ణుసంబంధ మైన, ధనుః = ధనస్సును, గృహ్ణీష్వ = గ్రహింపుము.

తా. రామా! క్షత్రియధర్మమును మన్నించి, మా పితృపితామహక్రమమున లభించినదియు, శ్రేష్ఠ మైనదియు అగు అట్టి ఈ విష్ణుధనస్సును గ్రహింపుము. 27

మూ. యోజయస్వ ధనుః శ్రేష్ఠే శరం పరపురఞ్జయమ్,
యది శక్నోషి కాకుత్స్థ ద్వన్ద్వం దాస్యామి తే తతః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
పఞ్చసప్తతితమః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! ధనుఃశ్రేష్ఠే=శ్రేష్ఠ మైన ఈ ధనస్సుపై, పరపురఞ్జయమ్ = శత్రుపురములను జయించు, శరమ్ = బాణమును, యోజయస్వ=కూర్చుము. శక్నోషి యది = అట్లు చేయ సమర్థుడ వైనచో, తతః= పిమ్మట, తే=నీకు, ద్వన్ద్వమ్=ద్వంద్వయుద్ధమును, దాస్యామి=ఇవ్వగలను.

తా. రామా! శ్రేష్ఠ మైన ఈ ధనస్సు మీద శత్రువుల పురములను జయించు ఈ శరమును సంధించుము. నీ వట్లు చేయ గలిగినచో నీతో ద్వంద్వ యుద్ధము చేయగలను. 28

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు బాలకాండలో
డెబ్బదిఐదవ సర్గ సమాప్తము.

## అథ షట్సప్తతితమః సర్గః

మూ. శ్రుత్వా తజ్జామదగ్న్యస్య వాక్యం దాశరథిస్తదా,
గౌరవాద్యన్త్రితకథః పితూ రామమథాబ్రవీత్. 1

ప్ర. అ. తదా=అప్పుడు, దాశరథిః=రాముడు, జామదగ్న్యస్య=పరశు రామునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా = విని, పితుః=తండ్రియొక్క, గౌరవాత్ = గౌరవమువలన, యన్త్రితకథః = తగ్గింపబడిన సంభాషణము కల వాడై. అథ=పిమ్మట, రామమ్=బలరాముని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. అపుడు రాముడు పరశురాముని మాటలు విని, తండ్రి దగ్గర నుండుటచే ఆయనపై నున్న గౌరవభావముచే, అధికముగ మాటలాడక ఇట్లనెను. 1

మూ. శ్రుతవానస్మి యత్కర్మ కృతవానసి భార్గవ,
అనురున్ధ్యామహే బ్రహ్మన్ పితురానృణ్యమాస్థితమ్. 2

ప్ర. అ. భార్గవ=ఓ పరశురామా! యత్=ఏ, కర్మ=కర్మను, కృతవాన్ అసి=చేసితివో, దానిని, శ్రుతవాన్ అస్మి = విని యుంటిని. బ్రహ్మన్=బ్రాహ్మణా! పితుః=తండ్రికి, ఆనృణ్యమ్=ఋణము తీర్చివేయుటను, ఆస్థితమ్=పొందిన నిన్ను, అనురున్ధ్యామహే=మెచ్చుకొనుచున్నాము.

తా. పరశురామా! నీవు చేసిన పనులను వింటిమి. తండ్రి విషయమున స్వధర్మమును నిర్వహించి ఆనృణ్యమును పొందిన నిన్ను అభినందించు చున్నాము. 2

మూ. వీర్యహీనమివాశక్తం క్షత్రధర్మేణ భార్గవ,
అవజానాసి మే తేజః పశ్య మేఽద్య పరాక్రమమ్. 3

ప్ర. అ. భార్గవ = పరశురామా! వీర్యహీనమివ = పరాక్రమము లేని వానిని వలెను, క్షత్రధర్మేణ = క్షత్రియధర్మము చేత, అశక్తమివ=సామర్థ్యము లేనివానిని వలె, అవజానాసి = నన్ను అవమానము చేయుచున్నావు. అద్య =

ఇప్పుడు, మే = నాయొక్క, తేజః = తేజస్సును, పరాక్రమమ్=పరాక్రమమును, పశ్య = చూడుము.

తా. పరశురామా ! నన్ను, పరాక్రమము లేనివానిని వలె, క్షత్రియధర్మానుసారము ప్రవర్తింప సామర్థ్యము లేనివానిని వలె, అవమానించుచున్నావు. ఇపుడు నా తేజస్సును, పరాక్రమమును చూడుము. 3

మూ. ఇత్యుక్త్వా రాఘవః క్రుద్ధో భార్గవస్య శరాసనమ్,
శరం చ ప్రతిజగ్రాహ హస్తాల్లఘుపరాక్రమః. 4

ప్ర. అ. లఘుపరాక్రమః=శీఘ్ర మైన పరాక్రమము గల, రాఘవః = రాముడు, క్రుద్ధః = కోపించినవాడై, ఇతి=ఇట్లు, ఉక్త్వా = పలికి, భార్గవస్య = పరశురామునియొక్క, హస్తాత్ = హస్తమునుండి, శరాసనమ్ = ధనస్సును, శరం చ = బాణమును, ప్రతిజగ్రాహ = తీసికొనెను.

తా. శీఘ్ర మైన పరాక్రమము గల రాముడు కోపముతో ఇట్లు పలికి పరశురాముని చేతిలోనుండి ధనస్సును, బాణమును తీసికొనెను. 4

మూ. ఆరోప్య స ధనూ రామశ్శరం సజ్యం చకార హ,
జామదగ్న్యం తతో రామం రామః క్రుద్ధోఽబ్రవీద్వచః. 5

ప్ర. అ. సః = ఆ, రామః = రాముడు, ధనుః = ధనస్సును, ఎక్కుపెట్టి, శరమ్ = బాణమును, సజ్యమ్=నారితో కూడినదానినిగా, చకార= చేసెను. రామః = రాముడు, తతః = పిమ్మట, క్రుద్ధః = కోపించినవాడై, జామదగ్న్యమ్ = జమదగ్నికుమారు డైన, రామమ్ = రాముని గూర్చి, వచః = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు ధనస్సును ఎక్కుపెట్టి నారిపై బాణము సంధించి, క్రుద్ధుడై పరశురామునితో ఇట్లనెను. 5

మూ. బ్రాహ్మణోఽసీతి పూజ్యో మే విశ్వామిత్రకృతేన చ,
తస్మాచ్ఛక్తో న తే రామ మోక్తుం ప్రాణహరం శరమ్. 6

ప్ర. అ. రామ = పరశురామా ! బ్రాహ్మణః = బ్రాహ్మణుడవు, అసి = అయియున్నావు, ఇతి = ఈ కారణమువలనను, విశ్వామిత్రకృతేన చ = విశ్వామిత్రుని పట్టియు, మే = నాకు, పూజ్యః = పూజింపదగినవాడవు. తస్మాత్ = ఆ కారణమువలన, తే = నీయొక్క, ప్రాణహరమ్ = ప్రాణములను హరించు, శరమ్ = బాణమును, మోక్తుమ్ = విడచుటకు, న శక్తః = సమర్థుడను కాను.

తా. పరశురామా ! నీవు బ్రాహ్మణుడ వగుటచేతను, విశ్వామిత్రునికి నీవు బంధు వగుట చేతను నాకు పూజ్యుడవు. అందుచే ప్రాణములను హరించు ఈ బాణమును నీపై ప్రయోగింపజాలను.

వి. పరశురాముని తండ్రి యైన జమదగ్ని విశ్వామిత్రుని సోదరి యగు సత్యవతి కుమారుడు. 6

మూ. ఇమాం పాదగతిం రామ తపోబలసమార్జితాన్,
లోకానప్రతిమాన్వా తే హనిష్యామి యదిచ్ఛసి. 7

ప్ర. అ. రామ=రామా ! తే=నీయొక్క, ఇమామ్=ఈ, పాదగతిమ్=పాదగమనమును గాని, తపోబలసమార్జితాన్ = తపోబలముచే సంపాదింపబడిన, అప్రతిమాన్=సాటి లేని, లోకాన్ వా=లోకములను గాని, హనిష్యామి = కొట్టెదను. యత్=దేనిని, ఇచ్ఛసి=కోరుచున్నావో అది చెప్పుము.

తా. రామా ! నీ పాదగమనశక్తిని గాని, తపోబలముచే నీవు సంపాదించిన సాటి లేని ఉత్తమలోకములను గాని, కొట్టివేసెదను. ఏది ఇష్టమో చెప్పుము. 7

మూ. న హ్యయం వైష్ణవో దివ్యః శరః పరపురఞ్జయః,
మోఘః పతతి వీర్యేణ బలదర్పవినాశనః. 8

ప్ర. అ. పరపురఞ్జయః = శత్రువుల పురమును జయించునదియు, వీర్యేణ = పరాక్రమముచేత, బలదర్పవినాశనః = బలదర్పములను నశింపచేయునదియు, దివ్యః=స్వర్గమునందు పుట్టినదియు అగు, అయమ్=ఈ, వైష్ణవః శరః=విష్ణువుయొక్క బాణము, మోఘః=వ్యర్థ మైనదై, న పతతి హి=పడదు కదా.

తా. స్వర్గములో పుట్టినదియు, శత్రుపురములను జయించునదియు, వీర్యముచే బలమును దర్పమును నశింపచేయునదియు అగు ఈ విష్ణుబాణము వ్యర్థ మగుటకు వీలు లేదు. 8

మూ. వరాయుధధరం రామం ద్రష్టుం సర్షిగణాః సురాః,
పితామహం పురస్కృత్య సమేతాస్తత్ర సంఘశః. 9

గన్ధర్వాప్సరసశ్చైవ సిద్ధచారణకిన్నరాః,
యక్షరాక్షసనాగాశ్చ తద్ద్రష్టుం మహదద్భుతమ్. 10

ప్ర. అ. వరాయుధధరమ్=శ్రేష్ఠ మైన ఆ వైష్ణవధనస్సును ధరించిన, రామమ్=రాముని, ద్రష్టుమ్=చూచుటకై, సర్షిగణాః=ఋషిగణములతో కూడిన, సురాః=దేవతలు, పితామహమ్=బ్రహ్మదేవుని, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, తత్ర=అచట, సంఘశః=గుంపులు గుంపులుగా, సమేతాః = కూడిరి. గన్ధర్వాప్సరసశ్చైవ=గంధర్వులును అప్సరసలును, సిద్ధచారణకిన్నరాః=సిద్ధులు, చారణులు, కిన్నరులును, యక్షరాక్షసనాగాశ్చ=యక్షులు, రాక్షసులు, నాగులును, తత్=ఆ, మహత్=గొప్ప, అద్భుతమ్=ఆశ్చర్యమును, ద్రష్టుమ్=చూచుటకు, వచ్చిరి.

తా. శ్రేష్ఠ మైన విష్ణుధనస్సును ధరించిన రాముని చూచుటకై బ్రహ్మాది దేవతలును, ఋషులును గుంపులు గుంపులుగా ఆచటికి వచ్చిరి. గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, చారణులు, కిన్నరులు, యక్షులు, రాక్షసులు, నాగులు కూడ ఆ అద్భుతమును చూచుటకై వచ్చిరి. 9, 10

మూ. జడీకృతే తదా లోకే రామే వరధనుర్ధరే,
నిర్వీర్యో జామదగ్న్యోఽసౌ రామో రామముదీక్షత. 11

ప్ర. అ. తదా=అప్పుడు, రామే=రాముడు, వరధనుర్ధరే = శ్రేష్ఠ మైన ధనస్సును ధరించినవాడగుచుండగా, లోకే = లోకము, జడీకృతే = జడముగ చేయబడిన దగుచుండగా, అసౌ=ఈ, జామదగ్న్యః = జమదగ్నికుమారు డైన, రామః=పరశురాముడు, నిర్వీర్యః=తొలగినశక్తిగలవాడై, రామమ్ = రాముని, ఉదైక్షత=చూచెను.

తా. రాముడు ఆ శ్రేష్ఠ మైన ధనస్సును ఎక్కు పెట్టగానే పరశురాముడు నిర్వీర్యు డయ్యెను. లోక మంతయు స్తంభించిపోయెను. అపు డా పరశురాముడు రాముని సాశ్చర్యముగ చూచెను. 11

మూ. తేజోభిహతవీర్యత్వాజ్జామదగ్న్యో జడీకృతః,
రామం కమలపత్రాక్షం మన్దం మన్దమువాచ హ. 12

ప్ర. అ. తేజోభిహతవీర్యత్వాత్ = రాముని తేజస్సుచే అణచివేయబడిన పరాక్రమము కలవా డగుటచే, జడీకృతః=జడుడుగా చేయబడిన, జామదగ్న్యః= పరశురాముడు, కమలపత్రాక్షమ్ = కమలపత్రములవంటి నేత్రములు గల, రామమ్ = రాముని గూర్చి, మన్దం మన్దమ్ = మెల్లమెల్లగా, ఉవాచ హ = పలికెను.

తా. రాముని తేజస్సుచే పరాక్రమము అణగి పోయి జడు డైన పరశురాముడు పద్మపత్రాక్షు డైన రామునితో మెల్లమెల్లగ ఇట్లు పలికెను. 12

మూ. కాశ్యపాయ మయా దత్తా యదా పూర్వం వసున్ధరా,
విషయే మే న వస్తవ్యమితి మాం కాశ్యపోఽబ్రవీత్. 13

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, వసున్ధరా = భూమి, యదా = ఎప్పుడు, మయా = నాచేత, కాశ్యపాయ = కాశ్యపునకు, దత్తా = ఇవ్వబడినదో, అప్పుడు, మే = నాయొక్క, విషయే = దేశమునందు, న వస్తవ్యమ్ = నివసించకూడదు. ఇతి = అని, మామ్ = నన్ను గూర్చి, కాశ్యపః = కాశ్యపుడు, అబ్రవీత్ = పలికెను.

తా. నేను పూర్వ మీ భూమి నంతను కాశ్యపున కిచ్చినపుడు— "నీవు నా దేశములో నివసింపగూడదు" అని కాశ్యపుడు నన్నాదేశించెను. 13

మూ. సోఽహం గురువచః కుర్వన్ పృథివ్యాం న వసే నిశామ్,
కృతా ప్రతిజ్ఞా కాకుత్స్థ కృతా భూః కాశ్యపస్య హి. 14

ప్ర. అ. సః = అట్టి, అహమ్ = నేను, గురువచః = నా గురువైన కశ్య

పునివచనమును, కుర్వన్ = చేయుచు, పృథివ్యామ్ = భూమియందు, నిశామ్ = రాత్రి, న వసే = వసించను. కాకుత్స్థ = రామా ! ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, కృతా = చేయబడినది. భూః = ఈ భూమి యంతయు, కాశ్యపస్య = కాశ్యపునిదిగా, కృతా హి = చేయబడినది కదా ?

తా. రామా ! ఈ భూమిని కాశ్యపునకు దానము చేసి, ఆయన కోరిన విధమున ఇచట నివసించ నని ప్రతిజ్ఞచేసితిని. గురు వైన ఆ కాశ్యపుని మాట ననుసరించి నేను రాత్రి ఈ భూమిపై నివసించను. 14

మూ. తదిమాం త్వం గతిం వీర హన్తుం నార్హసి రాఘవ,
మనోజవం గమిష్యామి మహేన్ద్రం పర్వతోత్తమమ్. 15

ప్ర. అ. వీర = వీరుడవైన, రాఘవ = రామా ! తత్ = ఆ కారణము వలన, త్వమ్ = నీవు, ఇమామ్ = ఈ, గతిమ్ = నడచు శక్తిని, హన్తుమ్ = కొట్టుటకు, నార్హసి = తగవు, మనోజవమ్ = మనోవేగముతో కూడినట్లుగా, మహేన్ద్రమ్ = మహేంద్ర మనెడు, పర్వతోత్తమమ్ = పర్వతశ్రేష్ఠమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. కావున, పరాక్రమశాలి వగు ఓ రామా ! నీవు నా గమనశక్తిని కొట్ట వద్దు. మనోవేగముతో మహేంద్రపర్వతమునకు వెళ్లిపోయెదను. 15

మూ. లోకాస్త్వప్రతిమా రామ నిర్జితాస్తపసా మయా,
జహి తాన్ శరముఖ్యేన మా భూత్కాలస్య పర్యయః. 16

ప్ర. అ. రామ = రామా ! మయా = నాచేత, అప్రతిమాః = సాటిలేని, లోకాః = లోకములు, తపసా = తపస్సుచేత, నిర్జితాః = జయింపబడినవి. తాన్ = వాటిని, శరముఖ్యేన = ప్రధాన మైన బాణముచేత, జహి = కొట్టుము. కాలస్య = కాలముయొక్క, పర్యయః = కడచిపోవుట, మాభూత్ = కాకుండుగాక.

తా. రామా! నేను తపస్సుచేత జయించిన ఉత్తమలోకములను ఈ బాణ ముచే కొట్టుము. కాలవిలంబము చేయవద్దు. 16

మూ. అక్షయ్యం మధుహన్తారం జానామి త్వాం సురేశ్వరమ్,
ధనుషోఽస్య పరామర్శాత్స్వస్తి తేఽస్తు పరంతప. 17

ప్ర. అ. అస్య = ఈ, దనుషః = ధనస్సుయొక్క, పరామర్శాత్ = ఆరోపించుటవలన, త్వామ్=నిన్ను, అక్షయ్యమ్=నశింపచేయ శక్యముకాని వాడును, సురేశ్వరమ్ = దేవతలకు అధిపతియు అగు, మధుహన్తారమ్ = మధువును సంహరించిన విష్ణువునుగా, జానామి = తెలిసికొనుచున్నాను. పరంతప = శత్రువులను పీడించువాడా ! తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక.

తా. ఈ ధనస్సును ఎక్కుపెట్టుటవలన, నీవు సురేశ్వరుడును, నాశరహితుడును, మధుసంహారియు అగు మహావిష్ణువే అని గ్రహించినాను. ఓ శత్రువినాశకా ! నీకు క్షేమ మగుగాక. 17

మూ. ఏతే సురగణాః సర్వే నిరీక్షన్తే సమాగతాః,
త్వామప్రతిమకర్మాణమప్రతిద్వన్ద్వమాహవే. 18

ప్ర. అ. సమాగతాః = వచ్చిన, ఏతే = ఈ, సర్వే = సమస్తమైన, సురగణాః = సురగణములు, అప్రతిమకర్మాణమ్ = సాటి లేని కర్మ కలవాడవును, ఆహవే = యుద్ధమునందు, అప్రతిద్వన్ద్వమ్ = ఎదిరి లేనివాడవును అగు, త్వామ్ = నిన్ను, నిరీక్షన్తే = చూచుచున్నారు.

తా. నీవు చేయు పనులు సాటిలేనివి. యుద్ధములో నిన్ను ఎదిరించువాడు ఎవ్వడును లేడు. అట్టి నిన్ను దేవత లందరును వచ్చి చూచుచున్నారు. 18

మూ. న చేయం మమ కాకుత్స్థ వ్రీడా భవితుమర్హతి,
త్వయా త్రైలోక్యనాథేన యదహం విముఖీకృతః. 19

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! త్రైలోక్యనాథేన = మూడు లోకములకును ప్రభువైన, త్వయా = నీచేత, అహమ్ = నేను, యత్ = ఎందువలన, విముఖీకృతః = పరాజితుడ నైతినో, అందువలన, ఇయమ్ = ఇది, మే = నాకు, వ్రీడా = సిగ్గు, భవితుమ్ = అగుటకు, న అర్హతి = తగదు.

తా. రామా! నేను ముల్లోకములకును ప్రభు వైన నీ చేతిలో పరాజితుడ నైనాను. అందుచే నాకు సిగ్గు పడవలసిన పని లేదు. 19

మూ. శరమప్రతిమం రామ మోక్తుమర్హసి సువ్రత,
శరమోక్షే గమిష్యామి మహేన్ద్రం పర్వతోత్తమమ్. 20

ప్ర. అ. సువ్రత = మంచి వ్రతము గలవాడా! రామ = రామా! అప్రతిమమ్ = సాటి లేని, శరమ్ = బాణమును, మోక్తుమ్ = విడచుటకు, అర్హసి = తగియున్నావు. శరమోక్షే = బాణము విడచిన పిమ్మట, పర్వతోత్తమమ్ = పర్వతశ్రేష్ఠ మైన, మహేన్ద్రమ్ = మహేంద్రపర్వతమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. ఉత్తమ మైన నియమము గల రామా! నీవు బాణమును ప్రయోగింపుము. బాణము ప్రయోగించిన పిమ్మట నేను మహేంద్రగిరికి వెళ్లెదను. 20

మూ. తథా బ్రువతి రామే తు జామదగ్న్యే ప్రతాపవాన్,
రామో దాశరథిః శ్రీమాన్ చిక్షేప శరముత్తమమ్. 21

ప్ర. అ. జామదగ్న్యే = జమదగ్నికుమారు డైన, రామే = రాముడు, తథా = అట్లు, బ్రువతి = మాటలాడుచుండగా, ప్రతాపవాన్ = ప్రతాపవంతు డైన, దాశరథిః = దశరథకుమారు డైన, రామః = రాముడు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, శరమ్ = బాణమును, చిక్షేప = ప్రయోగించెను.

తా. పరశురాముని మాటలు విని ప్రతాపవంతు డైన దశరథరాముడు బాణమును ప్రయోగించెను. 21

మూ. స హతాన్ దృశ్య రామేణ స్వాన్ లోకాన్ తపసార్జితాన్,
జామదగ్న్యో జగామాశు మహేన్ద్రం పర్వతోత్తమమ్. 22

ప్ర. అ. సః = ఆ, జామదగ్న్యః = పరశురాముడు, తపసా = తపస్సుచే, అర్జితాన్ = సంపాదింపబడిన, స్వాన్ = తన సంబంధ మైన, లోకాన్ = పుణ్య

లోకములను, రామేణ = రామునిచేత, హతాన్ = కొట్టబడినవాటినిగా, దృశ్య= చూచి, ఆశు = శీఘ్రముగా, పర్వతోత్తమమ్ = పర్వతశ్రేష్ఠ మైన, మహేన్ద్రిమ్= మహేంద్రపర్వతమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. తాను తపస్సుచే నంపాదించిన పుణ్యలోకములను రాముడు కొట్టగా జూచి, పరశురాముడు శీఘ్రముగ మహేంద్రపర్వతమునకు పోయెను. 22

మూ. తతో వితిమిరాః సర్వా దిశశ్చోపదిశ స్తథా,
సురాః సర్షిగణా రామం ప్రశశంసురుదాయుధమ్. 23

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వాః = నమస్త మైన, దిశః = దిక్కులును, తథా = మరియు, ఉపదిశః = విదిక్కులును, వితిమిరాః = చీకటి లేనివి అయినవి. సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, సురాః=దేవతలు, ఉదాయుధమ్= ఎత్తబడిన ఆయుధముగల, రామమ్ = రాముని, ప్రశశంసుః = ప్రశంసించిరి.

తా. అపుడు, దిక్కులును, విదిక్కులును చీకటి తొలగి ప్రకాశించినవి. ఆయుధము ధరించిన ఆ రాముని దేవతలును ఋషులును స్తుతించిరి. 23

మూ. రామం దాశరథిం రామో జామదగ్న్యః ప్రశస్య చ,
తతః ప్రదక్షిణీకృత్య జగామాత్మగతిం విభుః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాణ్డే
షట్సప్తతితమః సర్గః.

ప్ర. అ. ప్రభుః = సమర్థుడైన, జామదగ్న్యః = జమదగ్నికుమారు డైన, రామః = పరశురాముడు, దాశరథిమ్ = దశరథకుమారు డైన, రామమ్ = రాముని, ప్రశస్య చ = ప్రశంసించి. తతః = పిమ్మట, ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణము చేసి, ఆత్మగతిమ్ = తన మార్గమును, జగామ = పొందెను.

తా. సమర్థు డగు ఆ పరశురాముడు దశరథరాముని స్తుతించి, ప్రదక్షిణము చేసి తన దారిని తాను పోయెను. 24

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండలో డెబ్బదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తసప్తతితమః సర్గః

మూ. గతే రామే ప్రశాన్తాత్మా రామో దాశరథిర్ధనుః,
వరుణాయాప్రమేయాయ దదౌ హస్తే ససాయకమ్. 1

ప్ర. అ. రామే = రాముడు, గతే=వెళ్లినవాడగుచుండగా, ప్రశాన్తాత్మా= కోపము తొలగుటచే శాంత మైన చిత్తము కలవాడై, దాశరథిః=దశరథకుమారు డైన, రామః = రాముడు, ససాయకమ్ = బాణములతోకూడిన, ధనుః = ధనస్సును, అప్రమేయాయ = కొలవశక్యము కాని వాడగు, వరుణాయ = వరుణునకు, హస్తే = హస్తమునందు, దదౌ = ఇచ్చెను.

తా. పరశురాముడు వెళ్లిన పిమ్మట రాముడు ఆ ధనస్సును, బాణమును, అప్రమేయప్రభావశాలి యగు వరుణునకు ఇచ్చివేసెను. 1

మూ. అభివాద్య తతో రామో వసిష్ఠప్రముఖాన్ ఋషీన్,
పితరం విహ్వలం దృష్ట్వా ప్రోవాచ రఘునన్దనః. 2

ప్ర. అ. తతః = పిమ్మట, రఘునన్దనః = రఘువంశీయులను ఆనందింపచేయు, రామః = రాముడు, వసిష్ఠప్రముఖాన్ = వసిష్ఠుడు మొదలైన, ఋషీన్ = ఋషులను, అభివాద్య = నమస్కరించి, విహ్వలమ్=వ్యాకులు డైన, పితరమ్= తండ్రిని, దృష్ట్వా = చూచి, ప్రోవాచ = పలికెను.

తా. పిమ్మట రాముడు, వసిష్ఠుడు మొదలైన ఋషులకు నమస్కరించి, వ్యాకులుడై యున్న తండ్రిని జూచి ఇట్లనెను. 2

మూ. జామదగ్న్యే గతో రామః ప్రయాతు చతురఙ్గిణీ,
అయోధ్యాభిముఖీ సేనా త్వయా నాథేన పాలితా. 3

ప్ర. అ. జామదగ్న్యః = జమదగ్నికుమారుడైన, రామః = రాముడు, గతః = వెళ్లినాడు. నాథేన = ప్రభువైన, త్వయా = నీచేత, పాలితా = పాలింప

బడిన, చతురఙ్గిణీ = చతురంగములు గల, సేనా = సేన, అయోధ్యాభిముఖీ = అయోధ్యకు అభిముఖ మైనదై, ప్రయాతు = వెళ్లగాక.

తా. పరశురాముడు వెళ్లిపోయినాడు. నీ సంరక్షణలో నున్న చతురంగ బలము అయోధ్యాభిముఖముగ పయనించుగాక. 3

మూ. సన్దిశస్వ మహారాజ సేనాం త్వచ్ఛాసనే స్థితామ్,
శాసనం కాఙ్క్షతే సేనా చాతకాళిర్జలం యథా. 4

ప్ర. అ. మహారాజ=మహారాజా ! త్వచ్ఛాసనే=నీ ఆజ్ఞయందు, స్థితామ్= ఉన్న, సేనామ్ = సేనను, సన్దిశస్వ = ఆజ్ఞాపింపుము. చాతకాళిః = చాతకముల పంక్తి, జలం యథా = జలమును వలె, సేనా = సేన, శాసనమ్ = నీ ఆజ్ఞను, కాఙ్క్షతే = కోరుచున్నది.

తా. మహారాజా నీ అజ్ఞ ననుసరించు సైన్యమును అజ్ఞాపింపుము. చాతకముల పంక్తి జలమును కోరి నట్లు సేన నీ శాసనమును కోరుచున్నది. 4

మూ. రామస్య వచనం శ్రుత్వా రాజా దశరథస్సుతమ్,
బాహుభ్యాం సంపరిష్వజ్య మూర్ధ్ని చాఘ్రాయ రాఘవమ్. 5

గతో రామ ఇతి శ్రుత్వా హృష్టః ప్రముదితో నృపః,
పునర్జాతం తదా మేనే పుత్రమాత్మానమేవ చ. 6

ప్ర. అ. రాజా = రాజైన, దశరథః = దశరథుడు, రామస్య = రాముని యొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సుతమ్ = కుమారుడైన, రాఘవమ్ = రాముని, బాహుభ్యామ్ = బాహువులచేత, సంపరిష్వజ్య=కౌగలించుకొని, మూర్ధ్ని = తలపై, ఆఘ్రాయ చ = వాసనచూచి (ఆనందించెను). రామః= రాముడు, గతః ఇతి = వెళ్లెను అని, శ్రుత్వా = విని, హృష్టః=హర్షించినవాడై, ప్రముదితః = చాల ఆనందించినవాడై, నృపః = రాజు, తదా = అప్పుడు, పుత్రమ్ = పుత్రుని, ఆత్మానమేవ చ = తనను, పునః = మరల, జాతమ్= పుట్టినవానినిగా, మేనే=తలచెను.

తా. దశరథమహారాజు రాముని వచనము విని ఆతనిని బాహువులతో కౌగలించుకొని, శిరస్సుపై మూర్కొనెను. పరశురాముడు వెళ్లిపోయె నని విన్న రాజు ఆనందభరితుడై తనను, తన కుమారులను కూడ మరల పుట్టినట్లుగా భావించెను. 5, 6

మూ. చోదయామాస తాం సేనాం జగామాశు తతః పురీమ్,
పతాకాధ్వజినీం రమ్యాం తూర్యోద్ఘుష్టనినాదితామ్. 7

సిక్తరాజపథాం రమ్యాం ప్రకీర్ణకుసుమోత్కరామ్,
రాజప్రవేశసుముఖైః పౌరైర్మఙ్గలవాదిభిః, 8
సమ్పూర్ణాం ప్రావిశద్రాజా జనౌఘైస్సమలఙ్కృతామ్.

ప్ర. అ. రాజా=దశరథుడు, తామ్=ఆ, సేనామ్=సేనను, చోదయామాస=ప్రేరేపించెను. పతాకాధ్వజినీమ్=చిన్నవి పెద్దవి అయిన జండాలు కలదియు, రమ్యామ్=సుందరమైనదియు, తూర్యోద్ఘుష్టనినాదితామ్=తూర్యముల మ్రోతచే ప్రతిధ్వనించినదియు, సిక్తరాజపథామ్ = తడపబడిన రాజమార్గములు కలదియు, ప్రకీర్ణకుసుమోత్కరామ్=చిమ్మబడిన పుష్పసముదాయము గలదియు, రాజప్రవేశసుముఖైః = రాజుయొక్క ప్రవేశముచే సంతసించిన, మఙ్గలవాదిభిః= మంగళధ్వనులు చేయుచున్న, పౌరైః=పౌరులతో, సంపూర్ణామ్=నిండినదియు, జనౌఘైః=జనుల సముదాయములచే. సమలంకృతామ్ = అలంకరింపబడిన, పురీమ్=అయోధ్యాపురిని, ఆశు=శీఘ్రముగా, జగామ=వెళ్లెను.

తా. పిదప దశరథుడు సైన్యమును ముందుగా నడచుటకై ఆజ్ఞాపించెను. ప్రయాణము చేసి శీఘ్రముగా అయోధ్యాపురి చేరెను. ఆ పట్టణము చిన్న జండాల తోడను, పెద్ద జండాలతోడను రమ్యమై తూర్యనాదములతో ప్రతిధ్వనించుచుండెను. రాజమార్గములను జలముతో తడిపి పుష్పములు చల్లి పౌరు లందరును రాజప్రవేశము చూచుటకై ఆనందముతో ఎదురుచూచుచుండిరి. మంగళవాద్యములను మ్రోగించుచుండిరి. 7, 8

మూ. పౌరైః ప్రత్యుద్గతో దూరం ద్విజైశ్చ పురవాసిభిః,
పుత్రైరనుగతః శ్రీమాన్ శ్రీమద్భిశ్చ మహాయశాః, 9
ప్రవివేశ గృహం రాజా హిమవత్సదృశం పునః.

ప్ర. అ. పౌరైః=పౌరులచేతను, పురవాసిభిః = పురమునందు నివసించుచున్న, ద్విజైః చ=బ్రాహ్మణులచేతను, దూరమ్=దూరమునుండి, ప్రత్యుద్గతః= ఎదుర్కొనబడినవాడును, శ్రీమద్భిః=శోభాయుక్తులైన, పుత్రైః = పుత్రులచేత, అనుగతః = అనుసరింపబడినవాడును, శ్రీమాన్ = శోభాయుక్తుడును, మహాయశాః=గొప్ప యశస్సు కలవాడును అగు, రాజా=రాజు, పునః = మరల, హిమవత్సదృశమ్ = హిమవత్పర్వతముతో సమాన మైన, గృహమ్=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. శ్రీమంతుడును, మహాయశస్వియు అగు ఆ దశరథుని శ్రీమంతులగు పుత్రులు అనుసరించి వెళ్లిరి. పౌరులును, పురమునందలి బ్రాహ్మణులును దూరమునుండి ఎదురు వచ్చి స్వాగతము చెప్పిరి. ఈ విధముగ అయోధ్యానగరము ప్రవేశించి అతడు హిమవత్పర్వతముతో సమాన మైన గృహమును ప్రవేశించెను. 9

మూ. ననన్ద సజనో రాజా గృహే కామైః సుపూజితః, 10
కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ సుమధ్యమా,
వధూప్రతిగ్రహే యుక్తా యాశ్చాన్యా రాజయోషితః. 11

ప్ర. అ. రాజా=రాజు, గృహే=గృహమునందు, కామైః=భోగ్యవస్తువులచేత, సుపూజితః=బాగుగా పూజింపబడినవాడై, సజనః=కుటుంబబంధుజనులతో కూడినవాడై, ననన్ద=ఆనందించెను. కౌసల్యా చ=కౌసల్యయు, సుమిత్రా చ=సుమిత్రయు, సుమధ్యమా=మంచి నడుముగల, కైకేయీ చ=కైకేయియు, యాః=ఏ, అన్యాః=ఇతరులైన, రాజయోషితః = రాజస్త్రీలు గలరో వారును, వధూప్రతిగ్రహే = కోడండ్రను గ్రహించుటయందు, యుక్తాః = వ్యగ్రలై, (ననన్దుః=సంతసించిరి).

తా. బాంధవజనులతో కూడిన దశరథమహారాజు సకలభోగ్యవస్తువులచేతను పూజితుడై ఆనందించెను. కౌసల్యా—సుమిత్రా—కైకేయులును, తదితర రాజస్త్రీలును క్రొత్త కోడండ్రను ప్రతిగ్రహించుటలో వ్యగ్రలై ఆనందించిరి. 10, 11

మూ. తతస్సీతాం మహాభాగామూర్మిళాం చ యశస్వినీమ్,
కుశధ్వజసుతే చోభే జగృహుర్నృపపత్నయః. 12

ప్ర. అ. తతః=పిమ్మట, నృపపత్న్యః=రాజభార్యలు, మహాభాగామ్=గొప్ప భాగ్యము గల, సీతామ్=సీతను, యశస్వినీమ్ = కీర్తి గల, ఊర్మిళాం చ=ఊర్మిళను, ఉభే = ఇద్దరు. కుశధ్వజసుతే = కుశధ్వజుని కుమార్తెలను, జగృహుః=గ్రహించిరి.

తా. అంత రాజభార్యలు మహాభాగ్యవతి యగు సీతను, కీర్తిమంతురాలగు ఊర్మిళను, మాండవీశ్రుతకీర్తులను గ్రహించిరి. 12

మూ. మఙ్గళాలమ్భనైశ్చాపి శోభితాః క్షౌమవాససః.
దేవతాయతనాన్యాశు సర్వాస్తాః ప్రత్యపూజయన్. 13

ప్ర. అ. తాః=ఆ, సర్వాః=అందరును, మఙ్గలాలమ్భనైశ్చాపి=మంగళకరము లైన శరీరమునకు పూసికొను ద్రవ్యములచేత, శోభితాః=ప్రకాశింపచేయబడినవారై, క్షౌమవాససః = పట్టువస్త్రములు ధరించినవారై, ఆశు = శీఘ్రముగా, దేవతాయతనాని=దేవాలయములను, ప్రత్యపూజయన్=పూజించిరి.

తా. ఆ నూతనవధువు లందరును మంగళకరము లగు వస్తువులను అలదికొని, పట్టుబట్టలు ధరించి గృహదేవతలను పూజించిరి. 13

మూ. అభివాద్యాభివాద్యాంశ్చ సర్వా రాజసుతాస్తదా,
స్వం స్వం గృహమథాసాద్య కుబేరభవనోపమమ్, 14

గోభిర్ధనైశ్చ ధాన్యైశ్చ తర్పయిత్వా ద్విజోత్తమాన్,
రేమిరే ముదితాః సర్వా భర్తృభిః సహితా రహః. 15

ప్ర. అ. తదా = అప్పుడు, సర్వాః = సమస్త మైన, రాజసుతాః = రాజపుత్రికలు, అభివాద్యాన్ = నమస్కరింపదగిన వారిని, అభివాద్య = నమస్కరించి, అథ = పిదప, కుబేరభవనోపమమ్ = కుబేరభవనముతో సమాన మైన, స్వం స్వమ్ = తమ తమ, గృహమ్ = గృహమును, ఆసాద్య=పొంది, గోభిః=గోవులచేతను, ధనైశ్చ = ధనములచేతను, ధాన్యైశ్చ = ధాన్యములచేతను, ద్విజోత్తమాన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, అర్చయిత్వా = పూజించి, రహః =

రహస్యమునందు, భర్తృభిః = భర్తలతో, సహితాః = కూడినవారై, ముదితాః = ఆనందించినవారై, రేమిరే = క్రీడించిరి.

తా. అపుడు, ఆ రాజపుత్రికలు నమస్కరింపదగిన పెద్ద లందరికిని నమస్కరించి, కుబేర భవనముతో సమాన మైన తమ తమ గృహమును పొంది, గోవులను, ధనధాన్యములను దానము చేసి బ్రాహ్మణోత్తములను సంతృప్తిపరచి, రహస్యమున భర్తలతో కలిసి ఆనందముతో క్రీడించిరి. 14, 15

మూ. కుమారాశ్చ మహాత్మానో వీర్యేణాప్రతిమా భువి,
కృతదారాః కృతాస్త్రాశ్చ సధనాః ససుహృజ్జనాః, 16
శుశ్రూషమాణాః పితరం వర్తయన్తి నరర్షభాః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములును, వీర్యేణ = పరాక్రమముచేత, భువి = భూమియందు, అప్రతిమాః = సాటి లేనివారును, కృతదారాః = వివాహము చేసి కొన్నవారును, కృతాస్త్రాశ్చ = అస్త్రములందు నేర్పుగలవారును, సధనాః = ధనముతో కూడినవారును, ససుహృజ్జనాః = స్నేహితులతో కూడినవారును, నరర్షభాః = మనుష్యులలో శ్రేష్ఠులును అగు, కుమారాః = కుమారులు, పితరమ్ = తండ్రిని, శుశ్రూషమాణాః = శుశ్రూషచేయుచు, వర్తయన్తి = అనుసరించు చుండిరి.

తా. మహాత్ములును, పరాక్రమముచే భూలోకమున సాటి లేనివారును, అస్త్రములందు సమర్థులును, ధనము, మిత్రులు మొదలగు వాటితో కూడినవారును, నరశ్రేష్ఠులును అగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు వివాహము చేసికొని, తండ్రికి శుశ్రూష చేయుచు అతని ఆజ్ఞను పాటించుచు ఉండిరి. 16

మూ. కస్య చిత్త్వథ కాలస్య రాజా దశరథః సుతమ్, 17
భరతం కైకయీపుత్రమబ్రవీద్రఘునన్దనః.

ప్ర. అ. అథ = పిమ్మట, కస్యచిత్ః కాలస్య = కొంత కాలమునకు, రఘునన్దనః = రఘువంశీయులకు ఆనందకరుడైన, రాజా = రాజైన, దశరథః =

దశరథుడు, కైకయీపుత్రమ్ = కైకయీపుత్రుడైన, సుతమ్ = కుమారుడైన, భరతమ్=భరతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. తరువాత కొంత కాలమునకు దశరథమహారాజు కైకయీపుత్రుడైన భరతునితో ఇట్లనెను. 17

మూ. అయం కేకయరాజస్య పుత్రో వసతి పుత్రక, 18
త్వాం నేతుమాగతో వీరో యుధాజిన్మాతులస్తవ.

ప్ర. అ. పుత్రక = కుమారా! త్వామ్ = నిన్ను, నేతుమ్ = తీసికొని వెళ్లుటకు, ఆగతః = వచ్చినవాడును, కేకయరాజస్య = కేకయదేశరాజు యొక్క, పుత్రః = పుత్రుడును, వీరః = వీరుడును, తవ = నీయొక్క, మాతులః = మేనమామయు అగు, అయమ్ = ఈ, యుధాజిత్ = యుధాజిత్తు, వసతి = ఉన్నాడు.

తా. కుమారా! కేకయరాజు పుత్రుడును, నీ మేనమామయు అగు ఈ యుధాజిత్తు, నిన్ను తీసికొని వెళ్లుటకై వచ్చి యున్నాడు. 18

మూ. ప్రార్థితస్తేన ధర్మజ్ఞ మిథిలాయామహం తథా, 19
ఋషిమధ్యే తు తస్య త్వం ప్రీతిం కర్తుమిహార్హసి.

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మము నెరిగినవాడా! అహమ్ = నేను, తేన = ఆతనిచేత, మిథిలాయామ్ = మిథిలలో, ఋషిమధ్యే = ఋషుల మధ్యయందు; తథా = అట్లు, ప్రార్థితః = ప్రార్థింపబడితిని. త్వమ్ = నీవు, తస్య = ఆతనికి, ప్రీతిమ్ = ఆనందమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ ధర్మజ్ఞుడా! మిథిలలో, ఋషుల సమక్షమున ఆతడు నన్నావిధముగ ప్రార్థించినాడు. ఆతనికి ఆనందమును కలిగించుము. 19

మూ. శ్రుత్వా దశరథస్యైతద్భరతః కైకయీసుతః, 20
అభివాద్య గురుం రామం పరిష్వజ్య చ లక్ష్మణమ్,
గమనాయాభిచక్రామ శత్రుఘ్నసహితస్తదా. 21

ప్ర. అ. కైకయీసుతః = కైకయీకుమారు డైన, భరతః = భరతుడు, దశరథస్య=దశరథుని యొక్క, ఏతత్ = ఈ వాక్యమును, శ్రుత్వా = విని, గురుమ్=తండ్రిని, రామమ్=రాముని, అభివాద్య=నమస్కరించి, లక్ష్మణమ్= లక్ష్మణుని, పరిష్వజ్య చ=కౌగలించుకొని, తదా=అప్పుడు, శత్రుఘ్నసహితః= శత్రుఘ్నసమేతుడై, గమనాయ=వెళ్లుటకు, ఉపచక్రామ=ఉపక్రమించెను.

తా. భరతుడు దశరథుని మాటలు విని, తండ్రికిని, రామునకును అభివాదనము చేసి, లక్ష్మణుని కౌగలించుకొని, శత్రుఘ్నసమేతుడై ప్రయాణ మాయెను. 20, 21

మూ. ఆపృచ్ఛ్య పితరం శూరో రామం చాక్లిష్టకారిణమ్,
మాతౄశ్చాపి నరశ్రేష్ఠః శత్రుఘ్నసహితో యయౌ. 22

ప్ర. అ. శూరః=శూరుడును, నరశ్రేష్ఠః = నరులలో శ్రేష్ఠుడును అగు భరతుడు, పితరమ్=తండ్రిది, అక్లిష్టకారిణమ్ = శ్రమపడకుండ పనులుచేయు, రామమ్=రాముని, మాతౄశ్చాపి = తల్లులను, ఆపృచ్ఛ్య=అడిగి, శత్రుఘ్న సహితః=శత్రుఘ్నసహితుడై, యయౌ=వెళ్లెను.

తా. శూరుడును, నరశ్రేష్ఠుడును అగు భరతుడు తండ్రివద్దను, అనాయాస ముగ పనులు చేయు రాముని వద్దను, తల్లులవద్దను సెలవు గైకొని, శత్రుఘ్న సహితుడై వెళ్లెను. 22

మూ. గతే తు భరతే రామో లక్ష్మణశ్చ మహాబలః,
పితరం దేవసఙ్కాశం పూజయామాసతు స్తదా. 23

ప్ర. అ. తదా=అప్పుడు, భరతే=భరతుడు, గతే=వెళ్లినవాడగుచుండగా, రామః=రాముడును, మహాబలః=గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణు డును, దేవసఙ్కాశమ్=దేవతలతో సమాను డైన, పితరమ్=తండ్రిని, పూజ యామాసతుః= సేవించిరి.

తా. భరతుడు వెళ్లిన పిమ్మట, రాముడును మహాబలశాలి యగు లక్ష్మణు డును, దేవసమాను డైన తండ్రికి సేవ యొనర్చుచుండిరి. 23

మూ. పితురాజ్ఞాం పురస్కృత్య పౌరకార్యాణి సర్వశః,
చకార రామో ధర్మాత్మా ప్రియాణి చ హితాని చ. 24

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డైన, రామః=రాముడు, పితుః=తండ్రి యొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, పురస్కృత్య = పురస్కరించుకొని, ప్రియాణి = ప్రియ మైనవియు, హితాని చ = సుఖమును సంపాదించునవియు అగు, పౌర కార్యాణి=పౌరులకార్యములను, సర్వశః=అన్నియు, చకార=చేసెను.

తా. ధర్మాత్ము డైన రాముడు తండ్రి యాజ్ఞ ననుసరించి, పౌరులకు ప్రియములును, లాభకరములును అగు కార్యముల నన్నింటిని చేసెను. 24

మూ. మాతృభ్యో మాతృకార్యాణి కృత్వా పరమయన్త్రితః,
గురూణాం గురుకార్యాణి కాలే కాలేఽన్వవైక్షత. 25

ప్ర. అ. పరమయన్త్రితః=మిక్కిలి నియమబద్ధుడై, మాతృభ్యః=తల్లులకు, మాతృకార్యాణి=తల్లులకు చేయవలసిన కృత్యములను, కృత్వా = చేసి, గురూణామ్ = పూజ్యు లైన వారికి, గురుకార్యాణి = గురువులకు చేయవలసిన కార్యములను, కాలే కాలే=ఆయా కాలమునందు, అన్వవైక్షత = పరిశీలించుచుండెను.

తా. రాముడు నియమములను పూర్తిగ పాటించుచు, తల్లులకు చేయవలసిన కార్యములను చేయుచు, ఆయా కాలములందు పూజ్యులకు చేయవలసిన కార్యములను పర్యవేక్షించుచుండెను. 25

మూ. ఏవం దశరథః ప్రీతో బ్రాహ్మణా నైగమాస్తథా,
రామస్య శీలవృత్తేన సర్వే విషయవాసినః. 26

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, రామస్య = రామునియొక్క, శీలవృత్తేన=శీలము చేతను, నడవడిక చేతను, దశరథః = దశరథుడు, ప్రీతః= సంతసించెను. బ్రాహ్మణాః=బ్రాహ్మణులును, తథా=మరియు, నైగమాః = నగరవాసులును, సర్వే=సమస్త మైన, విషయవాసినః=దేశమునందు నివసించువారును (సంతసించిరి).

తా. రాముని ఈ శీలమును, నడవడికను చూచి దశరథుడు చాల సంత సించెను. బ్రాహ్మణులును, నాగరికులును, రాజ్యములో అందరును సంత సించిరి. 26

మూ. తేషామతియశా లోకే రామః సత్యపరాక్రమః,
స్వయమ్భూరివ భూతానాం బభూవ గుణవత్తరః. 27

ప్ర. అ. లోకే=లోకమునందు, అతియశాః=గొప్ప కీర్తి కలవాడును, సత్యపరాక్రమః=సత్య మైన పరాక్రమము కలవాడును, గుణవత్తరః=అధికముగ గుణవంతుడును అగు, రామః=రాముడు, తేషామ్ = ఆ దేశవాసులకు, భూతానామ్=ప్రాణులకు, స్వయమ్భూః ఇవ=బ్రహ్మ వలె, బభూవ=ఆయెను.

తా. లోకమునందు గొప్ప కీర్తి గలవాడును, సత్య మైన పరాక్రమము కలవాడును, ఎక్కువ గుణములు కలవాడును అగు రాముడు రాజ్యములోని వారి కందరికిని ప్రాణులకు బ్రహ్మదేవు డెట్లో అట్లుండెను. 27

మూ. రామస్తు సీతయా సార్ధం విజహార బహూనృతూన్,
మనస్వీ తద్గతస్తస్యా నిత్యం హృది సమర్పితః. 28

ప్ర. అ. మనస్వీ=మంచిమనస్సు గల, రామస్తు=రాముడై తే, తద్గతః= ఆసీతనే పొందినవాడై, తస్యాః=ఆమెయొక్క, హృది = హృదయమునందు, నిత్యమ్ = ఎల్లప్పుడును, సమర్పితః = ఉంచబడినవాడై, సీతయా సార్ధమ్ = సీతతో కూడ, బహూన్ = అనేక మైన, ఋతూన్ = ఋతువులను, విజహార = విహరించెను.

తా. ఉత్తమ మైన, మనస్సు గల రాముడు సీతయందే మనస్సు నిలిపెను. ఆమె తన హృదయమునందు రామునే సర్వదా నిలుపుకొనెను. ఈ విధముగ అన్యోన్యాసక్తులై సీతారాములు అనేక ఋతువులపాటు (చాలకాలము) విహరించిరి. 28

మూ. ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి,
గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతిర్భూయోఽభ్యవర్ధత. 29

కన్యయా = ఉత్తము డైన జనకమహారాజుయొక్క కన్య యైన సీతతో, సమేయివాన్= కలిసినవాడై, శ్రియా=లక్ష్మితో కూడిన, అమరేశ్వరః = దేవతా ప్రభువైన, విభుః=సమర్థు డైన, విష్ణుః ఇవ=విష్ణువు వలె, ముదా=ఆనందముతో, అన్వితః=కూడినవాడై, శుశుభే=ప్రకాశించెను.

తా. దశరథమహారాజపుత్రు డైన రాముడు జనకమహారాజపుత్రియు, మనోహరురాలును అగు సీతతో కలిసినవాడై, ఆనందించుచు, లక్ష్మితో గూడిన, అమరాధీశ్వరు డైన మహావిష్ణువు వలె ప్రకాశించెను. 32

పుల్లెల శ్రీ రామచంద్రుడు రచించిన

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు బాలకాండములో డెబ్బదిఏడవ సర్గ సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.

దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః

# అనుబంధము

## కొన్ని శ్లోకాలకు వ్యాఖ్యావిశేషాలు

## 1

కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా,
అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః.
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్,
ప్రదదౌ చావశిష్టార్ధం పాయస స్యామృతోపమం,
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః,
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్.
బాల. 16 స. 27-29

పాయసవిభాగమునుగూర్చి చెప్పు పై శ్లోకాల భావమును వ్యాఖ్యాతలు వివిధరీతుల తెలిపియున్నారు.

1. మహేశ్వరతీర్థ గోవిందరాజుల వ్యాఖ్యప్రకారము— దశరథుడు పాయసములో సగము కౌసల్యకును, నాల్గవపాలు సుమిత్రకును, ఎనిమిదవపాలు కైకేయికిని, మఱల మిగిలిన యెనిమిదవ పాలు సుమిత్రకును ఇచ్చెను. ఈ వ్యాఖ్య శ్లోకాక్షరానుగుణముగా ఉన్నది.

2. మునిభావ ప్రకాశికాకారుల వ్యాఖ్య మాత్రము మఱియొక విధముగా ఉన్నది. తదా = అప్పుడు, పుత్రార్థకారణాత్ = పుత్ర ప్రయోజనము నిమిత్తము, నరపతిః = దశరథమహారాజు, కౌసల్యాయై = కౌసల్యకొరకు, పాయసార్ధమ్ = పాయసము యొక్క సగమును, దదౌ = ఇచ్చెను. నరాధిపః = రాజు, సుమిత్రాయై చాపి=సుమిత్రకొఱకును, శేషస్య (అధ్యాహారము)=కౌసల్య కివ్వగా మిగిలిన సగముయొక్క అర్ధాత్ = సగము నుండి, అనగా నాల్గవభాగము నుండి, అర్ధమ్ = సగమును, (ఎనిమిదవ భాగమును), దదౌ = ఇచ్చెను. కైకేయ్యై చ =

కైకేయికొరకును, అవశిష్టార్ధమ్ = కౌసల్యకీయగా మిగలిన సగములో సుమిత్ర కిచ్చుటకు రెండు భాగములు చేసిన సగము పోగా సగమును, అనగా నాల్గవ భాగమును, దదౌ = ఇచ్చెను. మహీపతిః = దశరథుడు, అనుచిన్త్య = ఆలోచించి, పునరేవ = మరల, సుమిత్రాయై = సుమిత్రకు, అమృతోపమమ్ = అమృతముతో సమానమైన, పాయసస్య = పాయసముయొక్క, అవశిష్టార్ధం చ = పూర్వము సుమిత్ర కిచ్చుటకై రెండు భాగములు చేసిన నాల్గవ భాగములో అపుడు సుమిత్ర కివ్వగా మిగిలిన సగమును, అనగా రెండవ ఎనిమిదవ భాగమును) ప్రదదౌ = ఇచ్చెను. మిగిలినది పూర్వము వలెనే.

ఈ అర్థము ప్రకారము— కౌసల్యకు సగము, సుమిత్రకు సగములోని సగములో సగము, అనగా ఎనిమిదవ భాగమును, సుమిత్రకై విభజించిన నాల్గవ పాలుగాక మిగిలిన నాల్గవపాలును కైకేయికిని ఇచ్చెను. పూర్వమొక నాల్గవ పాలు విభజించి అందు సగము సుమిత్ర కియ్యగా మిగిలిన సగమును (రెండ వదగు ఎనిమిదవ భాగమును) మరల సుమిత్రకే ఇచ్చెను. అనగా కౌసల్యకు పాయసములోని సగము, కైకేయికి నాల్గవపాలు, సుమిత్రకు రెండు ఎనిమిదవ పాళ్లు లభించెను.

3. పురాణాంతరములతో విరోధము లేకుండుటకై మరొక అర్థము కూడ చెప్పబడినది— కౌసల్యకు నాల్గవపాలును, సుమిత్రకు నాల్గవపాలును, కైకేయికి నాల్గవపాలును, మిగిలిన నాల్గవపాలు మరల సుమిత్రకును ఇచ్చెను.

దశరథుడు పాయసమును రెండు సమభాగములుగ చేసి కౌసల్యా కైకేయిల కీయగా వారు తమ తమ భాగములనుండి సగమును సుమిత్ర కిచ్చినట్లు అధ్యాత్మరామాయణములో ఉన్నది. దీనిని పట్టియే పై మూడవ వ్యాఖ్యానము చేయబడినది. అయితే దశరథుడే సుమిత్ర కిచ్చినట్లు ఈ రామాయణములో ఉండగా కౌసల్యా కైకేయు లిచ్చినట్లు అధ్యాత్మరామాయణములో ఉన్నది గాన గ్రంథవిరోధము ఉండనే ఉన్నది.

దశరథుడు వసిష్ఠఋశ్యశృంగుల ఆజ్ఞ ప్రకారము పాయసమును కౌసల్యా కైకేయీల కిచ్చినట్లు అధ్యాత్మ రామాయణములో ఉన్నది. తమ భర్త అభిప్రాయ మునకు విరుద్ధముగా వారు (తాము మాత్రమే భుజింపక) సుమిత్రకు కూడ ఎట్లు

ఇచ్చినారు అని ప్రశ్న. దీనికి సమాధానముగా— ఆ మునులు త్రికాలద్రష్టలుగాన సుమిత్రాగర్భమున లక్ష్మణశత్రుఘ్ను లుదయించవలసియున్నదని తెలిసి ఆమెకు కూడ పాయస మీయవలెనని దశరథునకు చెప్పియే ఉందురు. ఆ విషయ మెరిగినవా రగుటచే కౌసల్యా కైకేయులు సుమిత్రకు కూడ ఇచ్చినారని మన మూహించుకొనవలెనని ఒక వ్యాఖ్యాత.

మరొక వ్యాఖ్య :— దశరథుడు మొదట కౌసల్యకు పాయసములో సగము తీసి ఇచ్చెను. మరల ఆ ఇచ్చిన పాయసమునే రెండు భాగములు చేసి ఒక భాగము సుమిత్ర కిచ్చి, రెండవ భాగము కౌసల్య కిచ్చెను. అనగా కౌసల్యా సుమిత్రలకు రెండు నాల్గవభాగములు ముట్టినవి. మిగిలిన సగమును కైకేయి కిచ్చెను. సుమిత్ర కిద్దరు కుమారులు పుట్ట దగియుండుట నెరిగిన మునుల ప్రేరణచే మరల ఆ సగమును రెండు భాగములు చేసి ఒక భాగము మాత్రమే కైకేయి కిచ్చి మిగిలినది సుమిత్ర కిచ్చెను. అనగా కైకేయితోబాటు మరల సుమిత్రకు మరొక నాల్గవ భాగము లభించెను.

ఈ శ్లోకాల కీ అర్థము లెట్లు వచ్చునో ఆ వ్యాఖ్యాతలకే తెలియవలెను. శ్రీమద్రామాయణము ఆది కావ్యము. వైదికవాఙ్మయము తప్ప ఇతర వాఙ్మయ మంతయు దీని తరవాతనే వచ్చినది. వాటిలో చెప్పిన విషయాలతో విరోధము వచ్చునని రామాయణ శ్లోకాలకు ఇలాంటి అర్థాలు కల్పించుట ఎంతవరకు సమంజసమో సహృదయులే ప్రమాణము. ఈ చివరి వ్యాఖ్యానము ప్రకారము పాయసము నాలుగుపాళ్లకును నలుగురు పుత్రులు పుట్టిరి అని చెప్పినట్లయినది. అనగా విష్ణువు అంశ నలుగురిలోను సమమైన పాళ్లలోనే ఉన్నదని చెప్పవలసి ఉన్నది. ఇలా చెప్పిన పక్షాన—

"కౌసల్యాజనయద్రామం సర్వలక్షణసంయుతమ్
విష్ణోరర్ధం మహాభాగం పుత్రమైక్ష్వాకవర్ధనమ్,
భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః సర్వైః సముదితో గుణైః,
అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ."

అని అష్టాదశసర్గలో చెప్పనున్నదానితో విరోధము వచ్చును. "కౌసల్యాయై నరపతిః" ఇత్యాది (27-29) శ్లోకాల స్పష్టార్థానికి కూడా దీనితో విరోధము వచ్చుచున్నది. దానిని పట్టి రాముడు విష్ణువు యొక్క అర్ధభాగము, లక్ష్మణుడు చతుర్థభాగము, భరతుడు అష్టమభాగము, శత్రుఘ్నుడు కూడ అష్టమభాగము కావలెను. ఈ శ్లోకాలలో రాముడు అర్ధభాగమనీ, భరతుడు చతుర్థాంశమనీ, లక్ష్మణశత్రుఘ్నులు అర్ధరూపులనీ చెప్పబడినది. అందుచేత మహేశ్వరతీర్థ గోవిందరాజులు "విష్ణోః చతుర్భాగః" అను దానిని విష్ణువుయొక్క ఎనిమిదవ భాగమనీ, "విష్ణోః అర్ధసమన్వితాః" అనుదానికి విష్ణువుయొక్క అంశతో కూడినవారనీ అర్థం చెప్పినారు. 'చతుర్భాగః' అనుదానికి అష్టమభాగమనే అర్థము ఎట్లు లభించినదో తెలియదు.

విష్ణ్వంశ పాయసాంశాలని పట్టి ఉండునని ఎచటను చెప్పలేదు గాన ఈ శ్లోకాలకును పాయసవిభాగశ్లోకాలకును విరోధము లేదని ఒక సమాధానము.

పాయసవిభాగశ్లోకాలలో ఉన్న 'అర్ధ' శబ్దానికి సగము అనే అర్థము గ్రహించక అంశము, భాగము అను అర్థమును మాత్రమే (అంతటను) గ్రహించినచో ఈ ప్రయాస ఏదియు ఉండదని నా అభిప్రాయము.

మన ప్రాంతంలో ఉన్న రామాయణం దాక్షిణాత్యపాఠము. దీనికి ఉత్తరదేశపాఠము మరొక్కటి ఉన్నది. దీనిలో కూడా కొంచెము భేదాలతో ఈశాన్య ప్రాంత పాఠమనియు, వాయవ్య ప్రాంతపాఠమనియు రెండు పాఠములున్నవి. ఈశాన్యప్రాంతపాఠానికి ప్రాచ్యపాఠమని కూడ పేరు. దీనిని 1843-67 సంవత్సరాలలో, గాౢరెసియో అను ఇటలీ దేశ పండితుడు పదకొండు సంపుటాలలో ప్రచురించెను. ఈతడు ఇటలీలోని టూరిన్ విశ్వవిద్యాలయంలో సంస్కృత ప్రొఫెసర్‌గా ఉండెను. వీటిలో ఏడు సంపుటాలు మూలము నాలుగు సంపుటాలు ఇటాలియన్ భాషలోనికి అనువాదము. ఈ సంపుటాలను 1981లో మరల మద్రాసు నుండి ప్రచురించుట జరిగినది. దానిలో ఈ ఘట్టాలలో ఉన్న పాఠాలు చూచినచో ఈ వ్యాఖ్యాభేదాలన్నియు అనావశ్యములని తోచక మానదు. అయితే మా పాఠమే సరియైన పాఠము అనే వాదం ఉండనే ఉంటుంది. అచటి శ్లోకములు ఈ విధముగా ఉన్నవి.

"పుత్రీయం పాయసం దేవి ప్రాశేదం హితమాత్మనః
ఇత్యుక్త్వా ప్రదదౌ తస్యై హవిషోఽర్ధం నరాధిపః,
స్వయమేవ సమం కృత్వా భాగం భాగచతుష్టయమ్
అర్ధాదర్ధం దదౌ చాపి కైకేయ్యై స నరాధిపః.
చతుర్భాగం ద్విధా కృత్వా సుమిత్రాయై దదౌ తదా
ప్రదదౌ చావశిష్టం తత్ పాయసం దేవనిర్మితమ్
అనుచిన్త్య సుమిత్రాయై పునరేవ నరాధిపః.
(ఆదికాండ 15వ సర్గ 21-23 శ్లోకాలు)

పుత్రుల నిచ్చు ఈ పాయసమును భక్షింపుమని చెప్పి ఆతడు సమముగా సగము అగునట్లుగను, మొత్తము నాలుగుభాగములు అగునట్లుగను స్వయముగనే విభజించి కౌసల్యకు సగము భాగమును ఇచ్చెను (అనగా కౌసల్యకు సగము పాయసము లభించినది). సగములో సగము కైకేయి కిచ్చెను (ఆమెకు నాల్గవవంతు లభించినది). మిగిలిన నాల్గవవంతును రెండు భాగములు చేసి ఒక భాగము సుమిత్ర కిచ్చెను. మరల ఆలోచించి రెండవభాగము కూడ సుమిత్రకే ఇచ్చెను (ఆమెకు రెండు ఎనిమిదవ భాగములు లభించినవి).

రామాదుల ఉత్పత్తిని వర్ణించు ఘట్టములో కూడ పాఠము వేరుగా నున్నది. అది పాయసభాగాలకు అనుగుణముగా ఉన్నది.

జన్మతేజోగుణజ్యేష్ఠం పుత్రమప్రతిమౌజసమ్,
కౌసల్యాజనయద్రామం విష్ణుతుల్యపరాక్రమమ్,
కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా
యథాధిపేన దేవానామదితి ర్వజ్రపాణినా
భవాయ స హి లోకానాం రావణస్య వధాయ చ.
విష్ణోర్వీర్యార్ధతో జజ్ఞే రామో రాజీవలోచనః
తేజోవీర్యాధికః శూరః శ్రీమాన్ గుణగణాకరః
బభూవానవరశ్చైవ శక్రాద్విష్ణోశ్చ పౌరుషే.
తథాలక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ

దృఢభక్తిమహోత్సాహౌ రామస్యాపరజౌ గుణైః
తావప్యాస్తాం చతుర్భాగౌ విష్ణోః సంపిణ్డితావుభౌ
ఏకఏకచతుర్భాగాదపరస్మాదజాయత
భరతో నామ కైకేయ్యాః పుత్రః సత్యపరాక్రమః.
(ఆదికాండము. 15వ సర్గ. శ్లో. 10-16)

ఇచట రాముడు అర్ధభాగమనియు, లక్ష్మణశత్రుఘ్ను లిరువురును కలిసి ఒక చతుర్థభాగమనియు, భరతుడు మరొకచతుర్థభాగమనియు స్పష్టముగా చెప్పబడినది. ఇది పాయస భాగాలకు కూడ అనుగుణముగా ఉన్నది.

## 2

కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్.
బా. కా. 23 స॥ 2 శ్లో॥

విశేషార్థములు :— మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మేలు కొలుప వచ్చి రాముని అచింత్యాద్భుతరూపము చూడగనే ఆశ్చర్యపడి, తాను వచ్చిన పని మరచి "నిన్ను గన్న తల్లి ఎంత ధన్యాత్మురాలో కదా" అని చెప్పు చున్నాడు. రామ = సర్వోత్తమసౌందర్యవంతుడగు ఓ రామా! కౌసల్యా = సర్వేశ్వరుడవైన నిన్ను గన్న కౌసల్య, సుప్రజాః = నీవు కొడుకుగా పుట్టుట వలన మంచి కొడుకుగలది. లేదా మాతృశుశ్రూష చక్కగా చేయు నీచేత కౌసల్య సత్పుత్రవతి అయినది.

లేదా రాముని అమేయ స్వరూపమును చూచి విశ్వామిత్రుడు మనస్సులో ఈ విధముగ వితర్కించుకొనుచున్నాడు. కౌసల్యా = ఇట్టి రాముని కన్న కౌసల్యాదేవి, సుప్రజాః=మంచి సంతానము కలది. (ఈ అర్థమున "రామ" అనునది తరువాతి వాక్యమున అన్వయించును). రాముడు కుమారుడుగా పుట్టుటచే మంచి కుమారుడు కలిగి యుండుట కౌసల్యకు దశరథునకును సమానమే అయినను "పితుః శతగుణం మాతా (తండ్రి కంటె తల్లి నూరింతలు)" అని స్మృతిలో

చెప్పుటచే కౌసల్యాదేవి మాత్రము మంచి కొడుకుగలది అని ఇక్కడ వర్ణింప బడినది.

కౌసల్యాదశరథులకు చాల అంతరమున్నది. విశ్వామిత్రుడు "అహం వేద్మి మహాత్మానమ్" ఇత్యాదివిధముల ఎంతగా చెప్పినను దశరథుడు రాముని విశ్వామిత్రున కిచ్చుటకు సంశయించెను. కౌసల్య స్త్రీయైనను, దశరథుని కన్న రెండింతలు పుత్రవాత్సల్యము కలదైనను ఎంత మాత్రమును సందేహించలేదు. అందుచే కౌసల్య పేరు చెప్పబడినది. రామ = రాముడా, పూర్వా సన్ధ్యా ప్రవర్తతే = తూర్పు దిక్కునందు కలుగు సంధ్య ప్రవర్తించుచున్నది. నీవు కౌసల్యకు చేసినట్లు ఈ సంధ్యకు కూడ ఉపచారము చేయవలెను. లేదా—ఇంక సూర్యు డుదయింపనున్నాడు. సూర్యునకువలె నీకును ఇంక శత్రువులను చంప సమయము వచ్చినది. లేదా—పూర్వా సన్ధ్యా ప్రవర్తతే = అంధకారము పోయినది. తెల్లవార వచ్చినది. నా అజ్ఞానము నశించినది. భగవంతుడవైన నీ దర్శనము కలిగినది. ఉత్తిష్ఠ = లెమ్ము, నీ నిద్రాకాలలక్ష్మిని (నీవు నిద్రించు సమయమున ఉండు లక్ష్మిని) చూచితిని. ఇక ప్రబోధలక్ష్మిని చూడగోరుచున్నాను. నరశార్దూల = పురుషశ్రేష్ఠుడా! నరశ్రేష్ఠుడవు కావున "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః" అన్నట్లు నీవును సంధ్యను ఉపాసింపవలసినదే కదా? లేదా—నీవు ఆశ్రితులను రక్షింపవలెను. దుష్టులను శిక్షింపవలెను. నీకు నిద్రించుట కవకాశ మెక్కడిది?

దైవమ్ ఆహ్నిక- కర్తవ్యమ్— దైవమ్ = దేవునిచే, అనగా సర్వేశ్వరునిచే ఏర్పరుపబడిన, ఆహ్నికమ్ = నిత్యకర్మము, కర్తవ్యమ్ = చేయదగినది. లేదా— ఇచట 'దేవ' 'శబ్దమునకు 'నీవు' అని అర్థము. దైవమ్ = నీచే ఏర్పరుపబడిన, ఆహ్నికం కర్తవ్యమ్=నీ వేర్పరచిన నియమమును నీవే అనుష్ఠింపక పోరాదు కదా అని భావము.

లేదా నేను నీచే ఆజ్ఞాపింపబడిన భగవత్పూజనరూపమైన నిత్యకర్మము చేయవలెను కదా. దానిని ప్రతిగ్రహించుటకు లెమ్ము అని భావము. ఇట్లు ఇంకను అనేకార్థములు బుద్ధిమంతు లూహించు కొనవలెను అని గోవిందరాజులు.

"కౌసల్యా సుప్రజాః" అను పదమునకు "కౌసల్యయొక్క సుపుత్రుడా!" అని అర్థము చెప్పి సంబోధన ప్రథమా విభక్తిగా గ్రహించుటకు వీలులేదు.

అపుడు అది "కౌసల్యా సుప్రజాః" అని కావలెను. అందుచేత "కౌసల్యా = కౌసల్య, సుప్రజాః = మంచి సంతానము కలది" ఇత్యాది విధముల అర్థములు కల్పించవలసి వచ్చినది. వాస్తవమున దీనిని ఆర్షప్రయోగముగ గ్రహించి సంబోధన ప్రథమా విభక్తిగా అంగీకరించవచ్చును. పాణినీయవిరుద్ధములైన ఎన్నో ప్రయోగాలు వాల్మీకిరామాయణంలో ఉన్నవి. ప్రాచ్యపాఠంలో ఈ శ్లోకము పూర్తిగా భిన్నముగా ఉన్నది.

"కౌసల్యామాతరుత్తిష్ఠ పూర్వాసంధ్యా ఉపాస్యతామ్,
పౌర్వాహ్ణికం విధిం కర్తుం తాత కాలోఽయమాగతః"
(అ. కాం. 26. 2)

3

ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా.
(బా. కాం. 73. 26)

విశేషార్థములు :— 1. ఇయమ్ = ఇదిగో. నీవు పరాక్రమముచేత శివ ధనస్సు విరచి జయించుకొన్న సీత ఇదిగో. ఈమె రూపసౌందర్యలావణ్యము చూడుము. సీతా = సీత అనగా నాగటి చాలు, అందుబుట్టినదగుటచే సీత అను పేరు గలది. ఈమె అనుపమ సౌందర్యాదులు కలది మాత్రమే కాదు. నాగటి చాలునందు పుట్టినది. అయోనిజ. అందుచే ఈమెయందు సమస్తసద్గుణములును ఒప్పి ఉండును.

ఇయం సీతా :— "జనకునివద్ద శివధనస్సు ఉన్నది. దానిని వంచిన వానికి అతడు తన కుమార్తె యైన సీత నిచ్చి పెండ్లి చేయును" అని నీవు సిద్ధాశ్రమములో విన్న నాటినుండియు ఏ సీతను చూడవలెనని కూతూహలము చెంది ఉన్నావో "ఆ సీత ఇదిగో" చూడుము.

లేదా—సీత మెరుపు వంటిది గాన సీతను చూడగానే, మెరుపును చూచినట్లు రామున కేమియు కనబడలేదు. ఈ విధముగ సీతాశరీరకాంతిని చూడగనే

కండ్లు మిరుమిట్లు గొలిపి సీతాశరీరమును చూడజాలకున్న రాముని జూచి జనకుడు "ఇయం సీతా" "ఇదిగో సీత" అని చెప్పుచున్నాడు.

లేదా—సిద్ధాశ్రమములో సీతను గూర్చి విన్నది మొదలు రాముని మనస్సులో సీతా దర్శన కుతూహలము తీవ్రముగ ఉండుటచే ప్రాసాదే సా పథి పథి చ సా పృష్ఠతః సా పురః సా" (మేడపైనను ఆమెయే, ప్రతిమార్గమునందును ఆమెయే వెనుకను ఆమెయే. ముందును ఆమెయే) అని చెప్పినట్లు, విరహిజనులకు భావనావిశేషముచే, అంతటను, ప్రియజనము కనబడుచుండును గాన, అతడు ప్రపంచమంతయు సీతామయముగనే చూచుచుండెను. అందుచే తా నీయ బోవు సీత సరిగా తెలియుటకై జనకుడు "ఇయం సీతా" అని చెప్పుచున్నాడు.

మమ సుతా=నా కూతురు ఈమె సౌందర్యవతియైనను, అయోనిజయైనను, దుష్టకులనివాసముచే దూషితయను సందేహము వలదు. కర్మకులమని ప్రసిద్ధి కెక్కిన మాచే పోషింపబడినది కావున జన్మశుద్ధి మాత్రమే కాక కులశుద్ధి కూడ కలిగియున్నది.

లేదా—నా కూతురు, నీ వెట్లు దశరథునకు ప్రియకుమారుడవో అట్లే ఈమెయు నాకు ప్రియపుత్రి. కావున ఈమెయందు స్థిరమైన ప్రేమను ఉంచవలెను. సహధర్మచరీ తవ=నీకు ధర్మపత్ని కాగలదు. ఈమె భోగమునకు మాత్రమే అని తలపకుము, ఈమెతో నీవు ధర్మము లాచరించుచు ఈమెనే ధర్మపత్నిగా చేసికొనుము. అయోనిజత్వమను జన్మశుద్ధి గల మరొక కన్య లభింపదు. దానితో కులశుద్ధి కూడ ఉన్నది దొరకదని వేరుగా చెప్పనవసరము లేదు. కావున ఈమెను తప్ప మరెవ్వరిని ధర్మపత్నిగా చేసికొనుట యుక్తము కాదు.

లేదా—తవ సహధర్మచరీ— నీకు సరియైన ధర్మ మాచరించునది. అనగా నీవు ఎట్లు, ఏ ధర్మము నాచరింతువో ఈమెయును అట్లే ఆధర్మమును ఆచరించునది. లోకములో ఒకరు మరియొకరివలె ఉండరు. ఈమె అట్లు కాదు. లోకవిలక్షణముగా సర్వథా నీవలెనే ప్రవర్తించును గాన నీకే ఈమె తగినది. ఈమె తప్ప మరి ఏ వనితయు నీకు పత్ని యగుటకు తగదు.

ఏనాం ప్రతీచ్ఛ చ = ఈ సీతను ప్రతిగ్రహింపుము. 'చ' కారముచే ధర్మ పత్నిగా చేసికొనుము అని అర్థము. ఈమె ఇట్టి లక్షణముకలది గాన, "నేను నా పరాక్రమముచే జయించుకొంటిని" అను సాధారణబుద్ధి యుంచక నేను చెప్పి నట్లు ఈమెనే ధర్మపత్నిగా వరింపుము.

తే భద్రమ్ = నీకు మంగళమగు గాక. ఇట్టి శుభలక్షణములు కలదానిని పెండ్లాడుటవలన నీకు సమస్త మంగళములును ఘటిల్లును. లేదా—దృష్టి దోషము కలుగకుండు గాక.

పాణినా పాణిం గృహ్ణీష్వ = నీ హస్తముచే ఈమె హస్తమును పట్టు కొనుము. ప్రణయకోపము కలిగిన సందర్భములలో నీ హస్తముతో ఈమె పాదము పట్టుకొనుటయు ఘటిల్లవచ్చును. ఇప్పుడు మాత్రము హస్తమునే పట్టు కొనుము.

లేదా—సిద్ధాశ్రమములో సీతను గూర్చి వినిన నాటి నుండియు రామునకు సీతపై అనురాగము కలిగి యుండుటచేత భావనాబలముచే సీతకు ప్రణయ కోపము కలిగినట్లు తోచి ఆమె పాదమునే పట్టుకొనుట సంభవించునని తలచి "పాణిం గృహ్ణీష్వ పాణినా" అని చెప్పుచున్నాడు.

2. ఎవ్వరును కదల్పజాలని శివధనస్సును రాముడు అనాయాసముగ విరచుటవలనను ఆతని అప్రమేయమగు రూపమువలనను, ఆ కాలమునందు కలిగిన సంవిధానవైచిత్ర్యము వలనను జనకుడు బ్రహ్మనిష్ఠుడగుట వలనను రాముడు విష్ణుదేవుడనియు, సీత మహాలక్ష్మియనియు తెలిసికొని, ఈ దేవ రహస్యము ఇతరులకు తెలియకుండుటకై, ధ్వనివృత్తిచే సీతారాముల అనాది సంబంధమును సూచించుచున్నాడు— ఇయమ్ = ఇదిగో! జగత్సృష్ట్యాది కారణ భూతుడవును, సాక్షాద్విష్ణుదేవుడవును అగు నీవు రామ రూపమున అవత రించినట్లే లక్ష్మియు సీతా రూపమున అవతరించి ఉన్నది. చూడుము. మీ దాంపత్యము నిత్యమే యైనను మనుష్య ధర్మము ననుసరించి సీతను శీఘ్రముగ పెండియాడుము.

సీతా = నాగటి చాలున పుట్టుటచే అయోనిజ, నీవు దేవకార్యార్థమై కౌసల్యా గర్భమున పుట్టినావు. అట్లు పుట్టుకయే లేనిదై నిన్ను అనుసరించుటకై కేవలము

మనుష్యత్వము మాత్ర మవలంబించి, నిన్నే వరించుచు తనకు నీతో నిత్య దాంపత్య మున్నట్లు సూచించుచున్నది.

మమ సుతా— నా కూతురు నా యింటిలో పెరుగుటచే నేను కూతురుగా భావించి నీకిచ్చుచున్నాను.

తవ సహధర్మచరీ— నీకు ధర్మపత్ని. నీవలెనే ధర్మముల నాచరించునది. నీవలెనే ఉండునది. నీ కవినాభూతయై జగత్సృష్ట్యాదులందు నీకు సహకరించుచుండునది.

ఏనాం ప్రతీచ్ఛ చ- ఈమెను అంగీకరింపుము. నిత్యపత్నిగా యున్నదైనను ఇపుడు మనుష్యత్వమును అభినయించుటకై అంగీకరింపుము.

తే భద్రమ్ :— నీకు మంగళమగు గాక. నీ వెంత మనుష్యుడవై యున్నను, జగదీశ్వరుడ వగు నీకు నిత్యసిద్ధయగు ఈమె నిచ్చెదను అని చెప్పుటకు నేను సాహసించినందులకు మన్నింపవలెను.

పాణినా పాణిం గృహ్ణీష్వ :— నీ వెల్లప్పుడును వక్షస్థలముపై ధరించిన వాడవు. ఇపుడు మనుష్య ధర్మము ననుసరించుటకై హస్తమును పట్టుకొనుము. లేదా— నీ విదివర కెన్నిమారులో ప్రణయకోపకాలమునందు హస్తముచే ఈమె పాదము పట్టుకొని యుందువు. ఇప్పుడు చిరవియోగము కలిగినది గాన విరహిజన సాధారణమైన ఉత్కంఠచే, ఈమెను అనునయించుటకై పాదములు పట్టెదవేమో. అట్లు చేయకుము. వివాహమునందు మేము చేయునట్లు, ఇప్పుడు మాత్రము, చేయి పట్టుకొనుము.

3. ఇయమ్ = ఈ "ఈమె వీర్యశుల్క. పరాక్రమము చూపి క్రయము చేతవలె కొనబడినది. శివధనువును విరచినందున నాచే జయింపబడినది." అని అలతిగా తలపకుము. మెరుపువలె మెరయుచున్నది. "ఇదిగో." చూడుము. నీకును గౌరవింప దగినది. నీవెంతగా గౌరవించినను దానికి తగినది.

సీతా :— నాగటి చాలున పుట్టినది. నీవు మొదలు సమస్త జంతుజాలమును భరించుచున్న సాక్షాద్భూదేవికి కూతురు. కావున నీవిప్పుదవశ్యము ఈవిడ

యందు బహుమానముంచవలెను. భార్యగా నున్నపుడు విశేషము అభిమానముంచ వలెనని చెప్పనవసరమే లేదు. మరియు, సీతా = ఈమె అయోనిజ. నీవు కౌసల్యకు పుట్టినావు. అందుచే ఈమెకును నీకును చాల అంతరమున్నది. అందు చేత కూడ నీవు ఈమె విషయమున చాల గౌరవబుద్ధి ఉంచవలెను.

మమ సుతా = నా కూతురు. రాజరాజునైన నేను పెంచినది. కావున నాయందుండు గౌరవమును నీవు ఈమెయందు చూపవలెను.

మమ సుతా = నా కూతురు. నేను బ్రహ్మనిష్ఠుడను. చాల తపస్విని. ఈమెను గౌరవించకున్నచో నాకు కోపము కలుగును. దానిచే నీకు కీడు వాటిల్లును.

తవ సహధరచరీ– నీవు ఈమెను అగ్రపత్నిగా ఉంచుకొనవలెను.

ఏనాం ప్రతీచ్ఛ చ– ఈమెను ప్రతిగ్రహింపుము. తే భద్రమ్– అట్లు మేము చెప్పినట్లు చేసిన నీకు మంగళము కలుగును.

4. ఇయమ్ = ఈ, ఎవ్వరికిని కదలింప శక్యము కాని శివధనస్సును రెండుగా విరిచి, అసదృశపరాక్రమము చూపి నీవు జయించినది ఈమెనే. నీ పరాక్రమమునకు సరియైనది కాకున్నకు కరుణింపవలెను.

సీతా = నాగటి చాలున పుట్టినది. తల్లి లేనిది లోకములో తల్లి కాని బిడ్డపై ప్రేమ హెచ్చుగా చేయుదురు. నీవును ఈమె యందు దయయుంచ వలెను.

మమ సుతా = నా కూతురు. నేను పెంచినవాడను మాత్రమే. నేను బ్రహ్మ నిష్ఠుడను గాన నావలన పెంపుడు సౌఖ్యము ఈమెకు కలిగియుండదు. నేను బ్రహ్మనిష్ఠుడ నగుటచే, నీవు ఈమె నుపేక్షించినను విచారించువారు లేక పోవు టచే అట్లు చేయక, ఈమెపై దృఢమగు ప్రేమ నుంచవలెనని ఇప్పుడే చెప్పు చున్నాను.

తవ సహధర్మచరీ :– నీవు ఈమెను ధర్మపత్నిగా గ్రహించిన చాలును. మేము కర్మఠులము కావున అదియే మాకు ప్రార్థనీయము.

ఏనాం ప్రతీచ్ఛ :– ఈమెను అంగీకరింపుము. చాల గౌరవము గల తలి దండ్రులివ్వగా గ్రహించుటకు తామే త్వరపడుదురు. ఇట్టి కన్యను గ్రహించుటకు కొంత ప్రార్థించిననే గాని కాదని అర్థము.

తే భద్రమ్ :— నీకు మంగళము అగుగాక. ఇట్టి వారియందు ప్రేమ ఉంచుటవలనను, బ్రహ్మనిష్ఠులమైన మా మాట వినుట వలనను నీకు మంగళము కలుగును (గోవిందరాజ మహేశ్వర తీర్థులు).

5. (తనిశ్లోకి) ఇయమ్ = ఇదిగో, రూపసౌందర్యములచే నేనే గొప్ప వాడనని అనుకొనకుము. నీవలె సౌందర్యము గల ఈ సీతను చూడుము.

సీతా = నాగటి చాలున పుట్టినది. బంగారు తీగెయు భూమియందే పుట్టును బంగారు తీగెవంటిది గాన భూమియందు పుట్టినది. ఈ విధముగ అయోనిజ గాన ఆభిజాత్యాదులను గూర్చి విచారింపబనిలేదు.

మమ సుతా = నా కొమార్తె, ఇట్టి దానిని పెంచుటచే నేను ధన్యుడనైతిని.

తవ సహధర్మచరీ :— నీకు "కూడ ధర్మమాచరించునది" ధర్మమాచరించుటకు సహాయురాలు. నీవు చేయు ధర్మములకు సహాయురాలు. నీవు చేయు ధర్మములకు ప్రవర్తకురాలు.

ఏనాం ప్రతీచ్ఛ :— నిన్ను వరించియున్న ఈమెను విడిచి పెట్టక ఆదరించి గ్రహించుము.

భద్రం తే :— నీకు మంగళమగు గాక. ముందు ప్రార్థింపబోవు కార్యము విషయమున అనుకూలుడ వగుము.

పాణినా పాణిం గృహ్ణీష్వ :— హస్తముచే హస్తము పట్టుకొనుము. ఎవ్వరికిని కదిలించుటకు కూడ శక్యము కాని శివధనస్సును లీలగా విరచిన హస్తము కలవాడవు నీవు. సీత హస్తము అతిమృదులము. కావున సరిగా పట్టుకొనుము.

6. (మరికొందరి వ్యాఖ్య) ఇయమ్ = ఈ నిన్ను విడువనప్పుడు మాత్రమే ఈమె జీవించియుండగలరు. "ఆర్తార్తే ముదితే కృష్టా ప్రోషితే మలినా కృశా, మృతే మ్రియేత యా నారీ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా" (ఏస్త్రీ భర్త దుఃఖితుడైనపుడు దుఃఖించునో, సంతుష్టుడైనపుడు సంతోషించునో, ఆతడు ప్రవాసములో నున్నపుడు మలినయై కృశించునో, మరణించినపుడు మరణించునో ఆమె పతివ్రత) అని

చెప్పినట్లు సాధారణపతివ్రతయే భర్తను విడిచి యుండజాలనప్పుడు శాస్త్రములలోచెప్పిన సర్వసల్లక్షణములు కలిగి లోకవిలక్షణయై, సర్వోత్తమురాలుగా ఉన్న ఈమె విషయము చెప్పవలెనా ?

ఇయమ్ = ఈ, నీ ఆత్మయనియు, నీ శరీరమనియు, నీ ఛాయయనియు వేదములలో చెప్పబడినది కావున ఈమె నిర్దోషయే. ఒకవేళ దోషమున్నను అది నీదే కదా ? స్వాత్మదోషము కాని, స్వశరీర దోషము కాని, స్వచ్ఛాయా దోషము కాని, తనదే అగును కదా ! నీ వెట్లు నిర్దోషుడవో ఈమెయు అట్లేనిర్దోషురాలు.

సీతా :— నాగటి చాలున పుట్టినది. "మాతరమజ్ఞనాః" (స్త్రీలు తల్లిని పోలియుందురు) అని చెప్పినట్లు భూదేవి కుమార్తె అగుటచే ఈమె యందు క్షమాది సద్గుణములన్నియు ఉన్నవని చెప్ప పని లేదు.

మమ సుతా :— నా కుమార్తె, భూమి కుమార్తెయైనను నేను పురాకృత పుణ్యవశముచేత ఈమెను పెంచినవాడ నగుటవలన నీ కిచ్చుచున్నాను.

ఏనాం ప్రతీచ్ఛ చ :— ఇట్టి దానిని అంగీకరింపుము .ఇట్టి దానిని నీవంటి ప్రాజ్ఞులుతామే కోరుదురు. 'కావున అంగీకరింపుమని చెప్పుటగూడ ఉపచారార్థమే.

భద్రం తే :— నీకు మంగళమగు గాక. ఈమెయందు ఇట్టి సల్లక్షణములుండుట నీకే ఫలము. భోగ్యపదార్థము పుష్కలముగా నున్నచో భోక్తకే కదా ఫలము లభించును !

పాణినా పాణిం గృహ్ణీష్వ :— నీ హస్తముచే ఈమె హస్తమును గ్రహింపుము, సీత ముగ్ధ గావున చేయి చాచి నీ చేయి పట్టుకొనజాలదు. కావున నీవే పట్టుకొనుము.

వ్యాఖ్యాతలు ఇంకా ఎన్నెన్నో అర్థాలు ఊహించి వాల్మీకికి ఆపాదించినారు. వినే వారికి ఓపిక ఉండవలెను గాని వాగ్ధాటి గలవారు ఇంకా ఎన్నెన్నో అర్థాలుచెప్ప వచ్చును, జనకుడు లక్ష్మణుని ఉద్దేశించి కూడ—

"లక్ష్మణాగచ్ఛ భద్రం తే ఊర్మిళాముద్యతాం మయా,
ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూత్కాలస్య పర్యయః"
(బా. కా. 73. 30)

అని చెప్పినాడు. దానికి వ్యాఖ్యాత లీ యర్థాలేవీ చెప్పలేదు. పఠితలు స్వయముగనే ఊహించుకొనగలరని విడిచినారేమో!

ప్రాచ్య పాఠంలో ఈ శ్లోకం (ఇయం సీతా అనునది) మరొక విధంగా ఉన్నది.

ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
గృహాణ పాణినా పాణిం త్వమస్యా రఘునన్దన"
(ఆ. కాం. 75. 19)

ఈ శ్లోకం తరువాత దాక్షిణాత్యపాఠంలో ఉన్న—

"పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా"

అనువాక్యము ప్రాచ్య పాఠంలో లేదు.

శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకిమహర్షిప్రణీత

# శ్రీమద్రామాయణము

# అయోధ్యాకాండము

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన

బాలానందినీ వ్యాఖ్యతో కూడినది

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

1991

# ముందుమాట

జగత్కల్యాణకారకుడైన పరమేశ్వరుని పరమానుగ్రహంతో, ఆంధ్ర మహాజనుల ఆదరణతో శ్రీమద్వాల్మీకిరామాయణ మహాకావ్యమును, ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారి "బాలానందిని" వ్యాఖ్యతో కూడిన అయోధ్య కాండ ద్వితీయ సంపుటాన్ని సకాలంలో పాఠకలోకానికి అందించగలిగినందుకు హర్షిస్తున్నాము.

రామాయణంవంటి రసవత్కావ్యంలో ఏ భాగానికి ఆ భాగమే, ఏ ఘట్టానికి ఆ ఘట్టమే సహృదయహృదయాహ్లాదకరం. సంప్రదాయవిదుల విశ్వాసాన్ని బట్టి రామాయణ కథ జరిగి యుగాలు గడిచినవి. అయినప్పటికీ, కేవలం భారతీయులు మాత్రమే గాక, ఆధునిక నాగరికప్రపంచం యావత్తు ఆదర్శప్రాయంగా పరిగణించే అనేక నైతిక ప్రమాణాలు, ధర్మసూక్ష్మాలు, పాలక పాలిత ప్రజాసంబంధాలు గ్రంథమంతటా కొల్లలుగా లభిస్తవి.

ఉదాహరణకు, తనకు వార్ధక్యం వచ్చినందువల్ల దశరథమహారాజు తన నలువురు కుమారులలో అగ్రజుడైన శ్రీరామచంద్రుని పట్టాభిషిక్తునిగా చేయ దలచి, గురువులు, మిత్రులతో సహ తన రాజ్యంలోని ప్రజలందరనూ సమావేశపరిచి, శ్రీరాముని యౌవరాజ్యపట్టాభిషేకానికి వారందరి అభిప్రాయాన్ని, అంగీకారాన్ని అర్థిస్తాడు. అధికారం తనకు ఉన్నది కదా అని ప్రజానుమతి కోరకుండా రామునికి రాజ్యం అప్పగించడానికి తలపెట్టడు. నేటి నాగరక ప్రపంచం ఉత్తమోత్తమంగా భావించే ప్రజాస్వామికపరిపాలనాసూత్రానికి ఇదేమంత భిన్నం కాదు.

ఇక, అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యాధికారం చేపట్టవలసిందని భరతుడు శ్రీరాముని ప్రార్థించే సందర్భంలో రామచంద్రమూర్తి భరతునితో జరిపిన సంభాషణావిధానం గమనించదగింది. మచ్చుకు శ్రీరాము డడిగిన కొన్ని ప్రశ్నలు- "తమ్ముడా! మంత్రాలోచన పలువురితోగాక, పరిణతబుద్ధులైన పరిమితప్రజలతో చేస్తున్నావు కదా!

ఉత్తములైన వారిని ఉత్తమకార్యాలకు, మధ్యములను మధ్యమవిధులకూ ఆయా పనులకు తగినట్టు యథోచితంగా నియోగిస్తున్నావా?

ప్రభుత్వోద్యోగులకు వారి వారి యోగ్యతలను బట్టి తగిన వేతనాలను సకాలంలో అందజేస్తున్నావు కదా?

వ్యవసాయాభివృద్ధి పనులకు నదీజలాలు సక్రమంగా ఉపయోగించబడుతున్నవా?

ప్రజలు ఉద్రిక్తులు కాకుండునట్లు నీ ప్రభుత్వం కఠినతరమైన శాసనాలేవీ చేయడం లేదు కదా?

తక్కువ వ్యయంతో ప్రజల కెక్కువ ప్రయోజనం సమకూరే పనులు వెంటవెంటనే జరిగేటట్టు చూస్తున్నావా?

అపాత్రులకు ధనం వ్యర్థం కావడం లేదు కదా? నిర్దోషులను శిక్షించడం గాని, దోషులను విడిచిపెట్టడం గానీ జరగడం లేదు కదా?

కృషి, గోరక్షణ చేసేవారి కష్టాలు నివారించి, వారిని పోషిస్తున్నావా?

దేశంలో మంచిచెడ్డలు, కష్టసుఖాలు ప్రజలు తెలుసుకోడానికి వార్త నడుపుతున్నావు కదా?"

పై సంభాషణలో విదితమైన శ్రీరామభద్రుని రాజనీతికోవిదత్వం మాట అటుంచి, అసలు రామాయణ మంటే, కేవలం విరాగులైనవారో, వయసు చెల్లినవారో మడి కట్టుకొని పారాయణ చేసే గ్రంథం మాత్రమే కాదనీ, మన సంస్కృతిని, మనదైన సర్వస్వాన్ని పెంపొందించి, ఇహపరసుఖాలను సాధించదగిన మహోత్కృష్టకావ్యమనీ స్పష్టం కావడం లేదా?

అందుకే రామాయణం సమస్తమానవాళికి, ఆబాలగోపాలానికి ఆదర్శగ్రంథం.

పరమపవిత్రము, పుణ్యావహము, లోకహితంకరము అయిన మా యీ సాహిత్యోద్యమమునకు ధనముచే, ధనేతరముచే అమూల్యసహాయము అందజేయుచున్న వదాన్యులందరకూ కృతజ్ఞతాంజలులు.

నీలంరాజు వెంకటశేషయ్య

# అయోధ్యాకాండాంతర్గత విషయసూచిక-II

సర్గ — విషయము — పుట

# పఞ్చపఞ్చాశః సర్గః

[భరద్వాజమహర్షి శ్రీరామాదులకు స్వస్తివచనము పలికి వారికి చిత్రకూటమునకు మార్గము తెలుపుట. తామే నిర్మించిన తెప్పతో వారు యమునానది దాటుట, సీత యమునను. శ్యామవటమును ప్రార్థించుట. వారు ముగ్గురును యమునాతీరమార్గముననే ఒక క్రోసుదూరము పోయి వనవిహారము చేయుట, పమనైన యమునాతటప్రదేశమున ఆ రాత్రి నివసించుట.]

మూ. ఉషిత్వా రజనీం తత్ర రాజపుత్రావరిందమౌ,
మహర్షిమభివాద్యాథ జగ్మతుస్తం గిరిం ప్రతి. 1

ప్ర. అ. అరిందమౌ = శత్రువినాశకులైన, రాజపుత్రౌ = రాజపుత్రులు, తత్ర = అక్కడ, రజనీమ్ = రాత్రిని, ఉషిత్వా = నివసించి, అథ = అటు పిమ్మట, మహర్షిమ్ = మహర్షిని, అభివాద్య = నమస్కరించి, తం గిరిం ప్రతి = ఆ పర్వతమును గూర్చి, జగ్మతుః = వెళ్లిరి.

తా. శత్రుసంహారకులైన ఆ రాజకుమారులు, ఆ రాత్రి అక్కడ గడపి, మరునాడు, భరద్వాజమహర్షికి అభివాదనము చేసి, చిత్రకూటపర్వతమునకు వెళ్లిరి. 1

మూ. తేషాం చైవ స్వస్త్యయనం మహర్షిః స చకార హ,
ప్రస్థితాంశ్చైవ తాన్ ప్రేక్ష్య పితా పుత్రానివాన్వగాత్ 2

ప్ర. అ. సః మహర్షిః = ఆ మహర్షి, తేషామ్ = వారికి, స్వస్త్యయనమ్ = క్షేమముగా ప్రయాణము చేయుటకు మంగళాశాసనమును, చకార హ = చేసెను. ప్రస్థితాన్ = ప్రయాణమైన, తాన్ = వారిని, ప్రేక్ష్య = చూచి, పితా = తండ్రి, పుత్రానివ = పుత్రీపుత్రులను వలె, అన్వగాత్ చ = అనుసరించి వెళ్ళెను కూడ.

తా. ప్రయాణ మైన ఆ సీతారామలక్ష్మణులకు భరద్వాజమహర్షి స్వస్త్యయనము చేసి, ప్రయాణమై వెళ్ళు పుత్రీ-పుత్రులను వలె, వారిని సాగనంపుటకై కొంత దూరము వెళ్ళెను. 2

మూ. తతః ప్రచక్రమే వక్తుం వచనం స మహామునిః,
భరద్వాజో మహాతేజా రామం సత్యపరాక్రమమ్. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహామునిః = మహాముని యైన, సః భరద్వాజః = ఆ భరద్వాజుడు, సత్యపరాక్రమమ్ = సత్య మైన పరాక్రమము గల, రామమ్ = రామునిగూర్చి, వచనమ్ = వచనమును, వక్తుమ్ = చెప్పుటకు, ప్రచక్రమే = ప్రారంభించెను.

తా. పిమ్మట, మహాతేజఃశాలి యైన ఆ భరద్వాజమహాముని, సత్యమైన పరాక్రమముగల రామునితో ఇట్లు పలికెను. 3

మూ. గఙ్గాయమునయోః సన్ధిమాసాద్య మనుజర్షభౌ,
కాళిన్దీమనుగచ్ఛేతాం నదీం పశ్చాన్ముఖాశ్రితామ్. 4

ప్ర. అ. మనుజర్షభౌ = మనుష్యశ్రేష్ఠు లైన రామలక్ష్మణులారా ! గఙ్గాయమునయోః = గంగాయమునలయొక్క, సన్ధిమ్ = సంధిని (అవి కలసిన ప్రదేశమును), గత్వా = పొంది, పశ్చాన్ముఖాశ్రితామ్ = పశ్చిమముగా ప్రవహించుచున్న, కాళిన్దీంనదీమ్ = యమునానదిని, అనుగచ్ఛేతామ్ = అనుసరించి వెళ్ళుడు.

తా. ఓ రామలక్ష్మణులారా ! గంగాయమునాసంగమప్రదేశము చేరిన తరువాత, అక్కడినుండి, పడమటి వైపు ప్రవహించుచున్న యమునానదిని అనుసరించి వెళ్లండి. 4

మూ. అథాసాద్య తు కాళిన్దీం శీఘ్రస్రోతసమాపగామ్,
తస్యాస్తీర్థం ప్రచరితం పురాణం ప్రేక్ష్య రాఘవౌ. 5
తత్ర యూయం ప్లవం కృత్వా తరతాంశుమతీం నదీమ్.

ప్ర. అ. రాఘవౌ = రామలక్ష్మణులారా ! అథ = అటు పిమ్మట, శీఘ్రస్రోతసమ్ = శీఘ్రముగా ప్రవహించు ప్రవాహముగల, అపగామ్ = నదియైన, కాళిన్దీమ్ = యమునను, ఆసాద్య = సమీపించి, ప్రచరితమ్ = అందరిచేతను సంచ

రించబడిన, పురాణమ్ = ప్రాచీన మైన, తస్యాః తీర్థమ్ = ఆ నదియొక్క తీర్థ మును, ప్రేక్ష్య=చూచి, తత్ర=అక్కడ, యూయమ్=మీరు, ప్లవమ్=తెప్పను, కృత్వా = నిర్మించుకొని, అంశుమతీమ్ = సూర్యుని కుమార్తె యైన, నదీమ్ = ఆ యమునా నదిని, తరత = దాటండి.

తా. ఓ రామలక్ష్మణులారా! శీఘ్ర మైన ప్రవాహము గల యమునానదిని సమీపించి, చాలమంది సేవించు, అతి పురాతన మైన ఆ నదీతీర్థమును చూచి, అక్కడ. ఒక తెప్ప నిర్మించుకొని, సూర్యకుమారి యైన ఆ నదిని దాటి వెళ్లండి.

మూ. తతో న్యగ్రోధమాసాద్య మహా న్తం హరితచ్ఛదమ్. 6
వివృద్ధం బహుభిర్వృక్షైః శ్యామం సిద్ధోప సేవితమ్,
తస్మై సీతాఞ్జలిం కృత్వా ప్రయుఞ్జీతాశిషః శివాః. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, హరితచ్ఛదమ్ = ఆకుపచ్చని ఆకులు గలది, మహా న్తమ్=గొప్పది, బహుభిః = అనేకములైన. వృక్షైః=వృక్షములతో, వివృద్ధమ్ = పెరిగినది, సిద్ధోప సేవితమ్ = సిద్ధులచేత సేవింపబడినది అయిన, శ్యామమ్=శ్యామమను పేరుగల, న్యగ్రోధమ్=మఱ్ఱిచెట్టును, అసాద్య =సమీపించి, సీతా =సీత, తస్మై =దానికి, అఞ్జలిమ్=దోసిలిని, కృత్వా=చేసి, శివాః=మంగళ కరము లైన, ఆశిషః = కోరికలను, ప్రయుఞ్జీత = కోరవలెను.

తా. యమునను దాటిన పిమ్మట, పచ్చని ఆకులతో కూడిన, 'శ్యామము' అనే అతివిశాల మైన మఱ్ఱిచెట్టు కనబడును. దాని చుట్టును అనేక వృక్షములు పెరిగి యుండును. దానిని ఆశ్రయించి సిద్ధులు నివసించి యుందురు. ఆ మహా వృక్షమునకు, సీత నమస్కరించి మంగళప్రదము లగు కోరికలను కోరుకొన వచ్చును. 6, 7

మూ. సమాసాద్య తు తం వృక్షం వసేద్వాతిక్రమేత వా,
క్రోశమాత్రం తతో గత్వా నీలం ద్రక్ష్యథ కాననమ్. 8
పలాశబదరీమిశ్రం రమ్యం వంశైశ్చ యామునైః.

ప్ర. అ. తం వృక్షమ్ = ఆ వృక్షమును, సమాసాద్య = సమీపించి, వసేద్వా = అక్కడ నివసించవచ్చును. అతిక్రమేత వా=లేదా దానిని దాటి వెళ్ల

వచ్చును. తతః = అక్కడినుండి. క్రోశమాత్రమ్ = క్రోసు దూరము, గత్వా = వెళ్ళి, నీలమ్ = నీలవర్ణము కలది, పలాశబదరీమిశ్రమ్ = పలాశవృక్షములు బదరీవృక్షములుకలిసి ఉన్నది, యామునైః = యమునకు సంబంధించిన, వంశైః చ = వెదుళ్ళచేత, రమ్యమ్ = రమ్యమైనది అయిన. కాననమ్ = అడవిని, ద్రక్ష్యథ = చూడగలరు.

తా. ఆ వృక్షము దగ్గర కావలె నన్నచో మీరు ఆగవచ్చును; లేదా దాటి ముందుకు వెళ్ళవచ్చును. అక్కడినుండి ఒక క్రోసు దూరము వెళ్ళినచో మోదుగ చెట్లతోను, రేగుచెట్లతోను, యమునాతీరమున పుట్టిన వెదురు డొంకలతోను నిండిన, నీలవర్ణమైన అడవి కనబడును. 8

మూ. స పన్థాశ్చిత్రకూటస్య గతః సుబహుశో మయా, 9
రమ్యో మార్దవయుక్తశ్చ వనదావైర్వివర్జితః.

ప్ర. అ. సః = అది, చిత్రకూటస్య = చిత్రకూటమునకు, పన్థాః = మార్గము. మయా = నాచేత, బహుశః = అనేక పర్యాయములు, గతః = వెళ్లబడినది. రమ్యః = సుందరమైనది. మార్దవయుక్తశ్చ = మృదుత్వముతో కూడినది. వనదావైః = వనమునందు పుట్టు దావాగ్నులతో, వివర్జితః = శూన్యమైనది.

తా. అదే చిత్రకూటమునకు వెళ్లు మార్గము. నేను అనేక పర్యాయములు ఆ మార్గమున ప్రయాణము చేసితిని. అది అందమైనది; సుఖకరము. అక్కడ దావాగ్ని భయ ముండదు. 9

మూ ఇతి పన్థానమావేద్య మహర్షిః స న్యవర్తత, 10
అభివాద్య తథేత్యుక్త్వా రామేణ వినివర్తితః.

ప్ర. అ. సః మహర్షిః = ఆ మహర్షి, ఇతి = ఈ విధముగా, పన్థానమ్ = మార్గమును, ఆవేద్య = తెలిపి, రామేణ = రాముని చేత, తథేతి = అట్లే చేసెదము అని, ఉక్త్వా = పలికి, అభివాద్య = నమస్కరించి, వినివర్తితః = వెనుకకు పంపబడినవాడై, న్యవర్తత = మరలి వెళ్ళెను.

తా. భరద్వాజమహర్షి ఈ విధముగా మార్గమును చెప్పగా, రాముడు అటులనే వెళ్ళెదము అని పలికి నమస్కరించి, "మీరు వెనుకకు వెళ్లండి" అని కోరిన పిమ్మట ఆ మహర్షి వెనుకకు వెళ్ళెను. 10

మూ. ఉపావృత్తే మునౌ తస్మిన్ రామో లక్ష్మణమబ్రవీత్, 11
కృతపుణ్యాః స్మ సౌమిత్రే మునిర్యన్నో ఽనుకమ్పతే.

ప్ర. అ. తస్మిన్ = ఆ, మునౌ = ముని, ఉపావృత్తే = తిరిగి వెళ్ళినవా డగుచుండగా, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్= పలికెను. సౌమిత్రే=లక్ష్మణా! కృతపుణ్యాః=చేయబడిన పుణ్యము కలవారము, స్మ = అయిఉన్నాము; యత్ = ఏ కారణమువలన, మునిః = భరద్వాజముని, నః=మనలను గూర్చి, అనుకమ్పతే=దయ చూపుచున్నాడో.

తా. ఆ భరద్వాజముని తిరిగి వెళ్ళిపోయిన పిమ్మట రాముడు లక్ష్మణు నితో ఇట్లు పలికెను. "లక్ష్మణా! భరద్వాజమహర్షి మనపై దయ చూపుచున్నాడు. మనము అదృష్టవంతులము". 11

మూ. ఇతి తౌ పురుషవ్యాఘ్రౌ మన్త్రయిత్వా మనస్వినౌ, 12
సీతామేవాగ్రతః కృత్వా కాళిన్దీం జగ్మతుర్నదీమ్.

ప్ర. అ. మనస్వినౌ = ఉత్తమ మైన మనస్సుగల, తౌ = ఆ, పురుష వ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులు, ఇతి = ఈ విధముగా, మన్త్రయిత్వా = ఆలోచించు కొని, సీతామ్=సీతను. అగ్రతః ఏవ=ఎదుటనే, కృత్వా=ఉంచుకొని, కాళిన్దీం నదీమ్=యమునానదిని, జగ్మతుః=చేరిరి.

తా. ఉత్తమ మైన మనస్సు గల, నరశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు, ఈ విధముగా అనుకొనుచు, సీతను తమ ఎదుటనే ఉంచుకొని, యమునానదిని సమీపించిరి. 12

మూ. అథాసాద్య తు కాళిన్దీం శీఘ్రస్రోతోవహాం నదీమ్. 13
చిన్తామాపేదిరే సర్వే నదీజలతితీర్షవః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, సర్వే = వారందరును, శీఘ్రస్రోతో వహామ్ = శీఘ్రముగా ప్రవహముతో ప్రవహించుచున్న, కాళిన్దీం నదీమ్ = యమునానదిని, ఆసాద్య=పొంది, నదీజలతితీర్షవః = నదీజలమును దాట కోరు చున్నవారై, చిన్తామ్=విచారమును, ఆపేదిరే=పొందిరి.

తా. దశరథకుమారుడైన రాముడు లక్ష్మివలె ఊహింప శక్యము కాని ప్రభావము కల, కొంచెము సిగ్గుపడుచున్న ప్రియురాలైన సీతను తెప్పపైకి ఎక్కించెను. 16

మూ. పార్శ్వే చ తత్ర వైదేహ్యా వసనే భూషణాని చ. 17
ప్లవే కఠినకాజం చ రామశ్చక్రే సహాయుధైః.

ప్ర. అ. రామః = రాముడు, తత్ర = అక్కడ, ప్లవే = తెప్పమీద, వైదేహ్యాః = సీతయొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, వసనే = వస్త్రములను, భూషణాని చ = అలంకారములను, కఠినకాజం చ = చిన్న గునపమును, మేక తోలుతో చేసిన పుటికను, ఆయుధైః = ఆయుధములతో కూడ, చక్రే = ఉంచెను.

తా. సీత వస్త్రములను, ఆభరణములను, చిన్న గునపమును, మేక తోలుతో చేసిన పుటికను, ఆయుధములను, రాముడు సీత ప్రక్కనే, ఆ తెప్ప మీద ఉంచెను. 17

మూ. ఆరోప్య ప్రథమం సీతాం సంఘాటం ప్రతిగృహ్య తౌ,
తతః ప్రతేరతుర్యత్తౌ వీరౌ దశరథాత్మజౌ.

ప్ర. అ. వీరౌ = వీరులైన, తౌ = ఆ, దశరథాత్మజౌ = దశరథకుమారులు, సంఘాటమ్ = ఆ తెప్పను, ప్రతిగృహ్య = గట్టిగా పట్టుకొని, ప్రథమమ్ = ముందుగా, సీతామ్ = సీతను, ఆరోప్య = ఎక్కించి, తతః = పిమ్మట, యత్తౌ = సావధానచిత్తులై, ప్రతేరతుః = దాటిరి.

తా. వీరులైన ఆ రామలక్ష్మణులు, ఆ తెప్పను గట్టిగా పట్టి నిలిపి, ముందుగా సీతను ఎక్కించి, పిదప తా మెక్కి, ప్రయత్నపూర్వకముగా దానిని నడుపుచు యమునానదిని దాటిరి. 18

మూ. కాళిన్దీమధ్యమాయాతా సీతా త్వేనామవన్దత, 19
స్వస్తి దేవి తరామి త్వాం పారయేన్మే పతిర్వ్రతమ్.
యక్ష్యే త్వాం గోసహస్రేణ సురాఘటశతేన చ, 20
స్వస్తి ప్రత్యాగతే రామే పురీమిక్ష్వాకుపాలితామ్.

ప్ర. అ. కాళిన్దీమధ్యమ్=యమునానదీమధ్యమును, ఆయాతా = పొందిన, సీతా = సీత, ఏనామ్ = ఈ నదిని, అవన్దత = నమస్కరించెను. దేవి = ఓ యమునాదేవీ! త్వామ్ = నిన్ను, తరామి = దాటుచున్నాను, స్వస్తి = మంగళమగుగాక. మే=నాయొక్క, పతిః=భర్త, వ్రతమ్=వ్రతమును, పారయేత్ = పూర్తిచేయునుగాక. రామః= రాముడు, స్వస్తి=క్షేమముగా, ఇక్ష్వాకుపాలితామ్= ఇక్ష్వాకురాజులచే పాలింపబడిన, పురీమ్ = అయోధ్యను గూర్చి, ప్రత్యాగతే = తిరిగి వచ్చినవా డగుచుండగా, త్వామ్=నిన్ను, గోసహస్రేణ = వేయి గోవుల చేతను, సురాఘటశతేన చ = నూరు సురాఘటములచేతను, యక్ష్యే = పూజించెదను.

తా. యమునానదీమధ్యమును చేరిన పిమ్మట, సీత, ఆ నదికి నమస్కరించుచు, ఈ విధముగ ప్రార్థించెను. "ఓ ! యమునాదేవీ ! నేను నిన్ను దాటి వెళ్ళుచున్నాను. మాకు క్షేమమగుగాక. నా భర్త వ్రతమును పూర్తిచేసికొనుగాక. రాముడు ఇక్ష్వాకువులచే పాలింపబడిన అయోధ్యకు క్షేమముగా తిరిగి వచ్చిన పిమ్మట, నీకు వేయి గోవులను, వంద సురా (కల్లు) ఘటములను సమర్పించి పూజించెదను. 19, 20

మూ. కాళిన్దీమథ సీతా తు యాచమానా కృతాఞ్జలిః, 21
తీరమేవాభిసంప్రాప్తా దక్షిణం వరవర్ణినీ,

ప్ర. అ. వరవర్ణినీ = ఉత్తమ మైన శరీరవర్ణము గల, సీతా = సీత, కాళిన్దీమ్ = యమునానదిని, కృతాఞ్జలిః = చేయబడిన అంజలి కలదై, యాచమానా = యాచించుచు, అథ=అటుపిమ్మట, దక్షిణం తీరమేవ = దక్షిణమున ఉన్న ఒడ్డును, అభిసంప్రాప్తా=చేరినది.

తా. ఉత్తమ మైన శరీరవర్ణము గల సీత యమునానదిని ఈ విధముగా నమస్కారపూర్వకముగా ప్రార్థించుచు, దక్షిణతీరమును చేరెను. 21

మూ. తతః ప్లవేనాంశుమతీం శీఘ్రగామూర్మిమాలినీమ్. 22
తీరజైర్బహుభిర్వృక్షైః సంతేరుర్యమునాం నదీమ్,

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శీఘ్రగామ్=శీఘ్రముగా ప్రవహించునదీ, ఊర్మిమాలినీమ్=తరంగముల పంక్తులు కలదీ, తీరజైః = తీరమునందు పుట్టిన,

బహుభిః = అనేకమైన, వృక్షైః = వృక్షములతో నిండినదీ, అంశుమతీమ్ = సూర్యుని కుమార్తెయూ అయిన, యమునాం నదీమ్ = యమునానదిని, సంతేరుః = దాటిరి.

తా. ఈ విధముగా సీతారామలక్ష్మణులు, శీఘ్రముగా ప్రవహించుచున్నదీ, తరంగపంక్తులతో కూడినదీ, తీరములపై అనేక వృక్షములతో నిండినదీ, అయిన సూర్యపుత్రి యైన యమునానదిని దాటిరి. 22

మూ. తే తీర్ణాః ప్లవముత్సృజ్య ప్రస్థాయ యమునావనాత్, 23
శ్యామం న్యగ్రోధమాసేదుః శీతలం హరితచ్ఛదమ్.

ప్ర. అ. తీర్ణాః = దాటిన, తే = వారు, ప్లవమ్ = తెప్పను, ఉత్సృజ్య = విడచి, యమునావనాత్ = యమునానదీ వనమునుండి, ప్రస్థాయ = బయలుదేరి, హరితచ్ఛదమ్ = పచ్చని ఆకులు కలదీ. శీతలమ్ = చల్లనిదీ అయిన, శ్యామం న్యగ్రోధమ్ = శ్యామ మను పేరు గల వటవృక్షమును, ఆసేదుః = సమీపించిరి.

తా. నదిని దాటిన ఆ సీతారామలక్ష్మణులు, ఆ తెప్పను విడచి, యమునా నదీతీరమునం దున్న వనము గుండ ప్రయాణము చేసి, పచ్చని ఆకులతో నిండిన చల్లని, శ్యామ మను వటవృక్షమును సమీపించిరి. 23

మూ. న్యగ్రోధం తముపాగమ్య వైదేహీ వాక్యమబ్రవీత్, 24
నమస్తేఽస్తు మహావృక్ష పారయేన్మే పతిర్వ్రతమ్.
కౌసల్యాం చైవ పశ్యేయం సుమిత్రాం చ యశస్వినీమ్,
ఇతి సీతాఞ్జలిం కృత్వా పర్యగచ్ఛద్వనస్పతిమ్.

ప్ర. అ. వైదేహీ = సీత, తం న్యగ్రోధమ్ = ఆ వటవృక్షమును, ఉపాగమ్య = సమీపించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహావృక్ష = ఓ మహావృక్షమా! తే = నీకు, నమః అస్తు = నమస్కార మగుగాక. మే పతిః = నా భర్త, వ్రతమ్ = వ్రతమును, పారయేత్ = దాటుగాక. కౌసల్యాం చ = కౌసల్యను, యశస్వినీమ్ = కీర్తి గల, సుమిత్రాం చ = సుమిత్రను, పశ్యేయమ్ = మరల చూచెదను గాక. సీతా = సీత, ఇతి = ఇట్లు పలికి, అఞ్జలిం కృత్వా = దోసిలి కట్టి, వనస్పతిమ్ = ఆ వృక్షమును, పర్యగచ్ఛత్ = ప్రదక్షిణము చేసెను.

తా. ఆ వటవృక్షమును సమీపించి, సీత ఇట్లు ప్రార్థించెను. "ఓ మహా వృక్షమా ! నీకు నమస్కారము. నా భర్త తన వ్రతమును పూర్తిచేయునుగాక. నేను మరల అయోధ్య చేరి, కౌసల్యను, కీర్తిమంతురాలైన సుమిత్రను చూచెదను గాక !" ఈ విధముగ పలుకుచు సీత, అంజలి ఘటించి, ఆ వటవృక్షమునకు నమస్కారము చేసెను. 24, 25

మూ. అవలోక్య తతః సీతామాయాచన్తీమనిన్దితామ్, 26
దయితాం చ విధేయాం చ రామో లక్ష్మణమబ్రవీత్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రామః = రాముడు, అయాచన్తీమ్ = ఈ విధముగా వృక్షమును ప్రార్థించుచున్నదీ, అనిన్దితామ్ = నిందింపబడనిదీ, దయితామ్=తనకు ప్రియురాలూ, విధేయాం చ=వశమునందుండునదీ అయిన, సీతామ్=సీతను, అవలోక్య=చూచి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ =పలికెను.

తా. తనకు ప్రియురాలూ, విధేయురాలూ, దోషములు లేనిదీ అయిన సీత ఈ విధముగా వటవృక్షమును ప్రార్థించుచుండగా చూచిన రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను. 26

మూ. సీతామాదాయ గచ్ఛ త్వమగ్రతో భరతానుజ, 27
పృష్ఠతోఽహం గమిష్యామి సాయుధో ద్విపదాం వర.

ప్ర అ. ద్విపదామ్=మనుష్యులలో, వర = శ్రేష్ఠుడా : భరతానుజ = భరతుని తమ్ముడవైన ఓ లక్ష్మణా ! త్వమ్=నీవు, సీతామ్ = సీతను, ఆదాయ = తీసికొని, అగ్రతః = ముందు, గచ్ఛ = నడువుము. అహమ్ = నేను, సాయుధః=ఆయుధములతో కూడినవాడనై, పృష్ఠతః=వెనుకనే, గమిష్యామి= నడచెదను.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడవైన ఓ లక్ష్మణా ! నీవు సీతను తీసికొని ముందు నడువుము. నేను ఆయుధధారినై వెనుక నడచెదను. 27

మూ. యద్యత్ఫలం ప్రార్థయతే పుష్పం వా జనకాత్మజా. 28
తత్తత్ప్రదద్యా వైదేహ్యా యత్రాస్యా రమతే మనః.

ప్ర. అ. జనకాత్మజా = సీత, యద్యత్ = ఏ యే, ఫలమ్ = ఫలమును గాని, పుష్పం వా = పుష్పమును గాని, ప్రార్థయతే = కోరునో, తత్తత్ = దానిని, అస్యాః = ఈ వైదేహ్యాః = సీతయొక్క, మనః = మనస్సు, యత్ర = దేనియందు, రమతే = క్రీడించునో దానిని, ప్రదద్యాః = ఇమ్ము.

తా. సీత ఏ యే ఫలములను, పుష్పములను కోరునో వాటిని, ఈమె మనస్సునకు సంతోషము కలిగించు ఇతరవస్తువులను ఈమెకు ఇచ్చుచుండుము.

మూ. గచ్ఛతోస్తు తయోర్మధ్యే బభూవ జనకాత్మజా, 29
మాతఙ్గయోర్మధ్యగతా శుభా నాగవధూరివ.

ప్ర. అ. గచ్ఛతోః = నడచుచున్న, తాయోః = ఆ ఇరువురియొక్క, మధ్యగతా = మధ్యను పొందిన, జనకాత్మజా = సీత, మాతఙ్గయోః = రెండు ఏనుగులయొక్క, మధ్యగతా = మధ్యను పొందిన, శుభా = శుభమైన, నాగవధూః ఇవ = ఆడ ఏనుగ వలె, బభూవ = ఉండెను.

తా. ఆ రామలక్ష్మణుల మధ్య నడచుచున్న సీత, రెండు గజముల మధ్య నడచుచున్న అందమైన ఆడ ఏనుగు వలె ప్రకాశించెను. 29

మూ. ఏకైకం పాదపం గుల్మం లతాం వా పుష్పశాలినీమ్. 30
అదృష్టపూర్వాం పశ్యన్తీ రామం పప్రచ్ఛ సాఽబలా.

ప్ర. అ. సా అబలా = ఆ సీత, ఏకైకమ్ = ఒక్కొక్క, పాదపమ్ = వృక్షమును గాని, గుల్మమ్ = పొదను గాని, అదృష్టపూర్వామ్ = పూర్వము చూడబడని, పుష్పశాలినీమ్ = పుష్పములతో ప్రకాశించుచున్న, లతాం వా = లతనుగాని, పశ్యన్తీ = చూచుచున్నదై, రామమ్ = రాముని, పప్రచ్ఛ = అడిగెను.

తా. తాను పూర్వము చూడని ఏదైన చెట్టు గాని, పొద గాని, పుష్పములతో నిండిన లత గాని కనబడినపుడు దానిని గూర్చి, సీత రాముని, అడుగుచుండెను. 30

మూ. రమణీయాన్ బహువిధాన్ పాదపాన్ కుసుమోత్కటాన్,
సీతావచనసంరబ్ధ ఆనయామాస లక్ష్మణః.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, సీతావచనసంరబ్ధః = సీత మాటచే తొందరపడుచున్నవాడై, కుసుమోత్కటాన్ = పుష్పములతో నిండిన, రమణీయాన్ = అందమైన, బహువిధాన్ = అనేకవిధములైన, పాదపాన్ = వృక్షములను, ఆనయామాస = తీసికొనివచ్చెను.

తా. సీత అడిగిన వెంటనే, లక్ష్మణుడు, పుష్పములతో నిండిన, అనేకవిధములైన, సుందరమైన వృక్షముల గుత్తులను తీసికొనివచ్చి ఇచ్చెను. 31

మూ. విచిత్రవాలుకజలాం హంససారసనాదితామ్, 32
రేమే జనకరాజస్య తదా ప్రేక్ష్య సుతా నదీమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, జనకరాజస్య సుతా = జానకి, విచిత్రవాలుకజలమ్ = విచిత్రమైన ఇసుకలు, జలము గలది, హంససారసనాదితామ్ = హంసలచేతను సారసపక్షులచేతను ధ్వనింప చేయబడినది అయిన, నదీమ్ = యమునానదిని, ప్రేక్ష్య = చూచి, రేమే = క్రీడించెను.

తా. అప్పుడు సీత విచిత్రమైన ఇసుక, జలము గలది, హంసధ్వనులతోను, సారసధ్వనులతోను నిండినది అయిన యమునానదిని చూచి ఆనందించెను.

మూ. క్రోశమాత్రం తతో గత్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ, 33
బహూన్మేధ్యాన్ మృగాన్ హత్వా చేరతుర్యమునావనే.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భ్రాతరౌ = సోదరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, క్రోశమాత్రమ్ = ఒక క్రోసు దూరము, గత్వా = వెళ్ళి, మేధ్యాన్ = పవిత్రమైన, బహూన్ = అనేకమైన, మృగాన్ = మృగములను, హత్వా = చంపి, యమునావనే = యమునాతీరమునందలి వనమునందు, చేరతుః = భక్షించిరి.

తా. సోదరులైన రామలక్ష్మణులు ఒక క్రోసు దూరము ప్రయాణము చేసి, ఆ యమునాతీరమునందు పవిత్రమైన అనేకమృగములను చంపి, భక్షించిరి. 33

మూ. విహృత్య తే బర్హిణపూగనాదితే
శుభే వనే వానరవారణాయుతే,

సమం నదీవప్రముపేత్య సంమతం
నివాసమాజగ్మ రదీనదర్శనాః. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర అ. అదీనదర్శనాః = దైన్యము లేని దర్శనము గల, తే = వారు, బర్హిణవూగనాదితే = నెమళ్ళ సముదాయముచే ధ్వనింపచేయబడుచున్నదీ, వానర వారణాయుతే = వానరములతోను ఏనుగులతోను కూడినదీ, శుభే = మంగళ ప్రదమూ అయిన, వనే = వనమునందు, విహృత్య = విహరించి, సమమ్ = సమముగా నున్న, సంమతమ్ = అనుకూల మైన, నదీవప్రమ్ = నదీ తీరమును, ఉపేత్య = చేరి, నివాసమ్ = నివాసమును, ఆజగ్మతుః = పొందిరి.

తా. ఆ యమునా నదీ తీరప్రాంతము నెమళ్ళ ధ్వనులతో నిండి యుండెను. అక్కడ వానరములు, గజములు నివసించుచుండెను. అట్టి ఆ ప్రదేశమునందు విహరించుచు, సీతారామలక్ష్మణులు, అనుకూలమైనదీ, మిట్టపల్లములు లేనిదీ అయిన ఒక స్థానమున, ఏ మాత్రము దైన్యమనునది లేక, ఆ రాత్రికి నివాస మేర్పరచుకొనిరి. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదియైదవ సర్గ సమాప్తము.

## అథ షట్పఞ్చాశః సర్గః

[వనశోభను చూచుచు - చూపుచు శ్రీరామాదులు చిత్రకూటము చేరుట. వాల్మీకిమహర్షిని దర్శించుట. రామాజ్ఞచే లక్ష్మణుడు పర్ణశాలను నిర్మించుట. వాస్తుశాంతి చేసి వారు కుటీరమున ప్రవేశించుట.]

మూ. అథ రాత్ర్యామతీతాయామవసుప్త మనన్తరమ్,
ప్రబోధయామాస శనైర్లక్ష్మణం రఘునన్దనః. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రఘునన్దనః = రాముడు, రాత్ర్యామ్ = రాత్రి, అతీతాయామ్ = గడచినదగుచుండగా, అనన్తరమ్ = అనంతరము (తరువాతకూడ), అవసుప్తమ్ = నిద్రించిన, లక్ష్మణమ్ = లక్ష్మణుని, శనైః = మెల్లగా, ప్రబోధయామాస = మేల్కొలిపెను.

తా. ఆ రాత్రి గడచిన పిమ్మట ముందుగా నిద్రనుండి లేచిన రాముడు, ఇంకను నిద్రించుచున్న లక్ష్మణుని మెల్లగా మేల్కొలిపెను.

మూ. సౌమిత్రే శృణు వన్యానాం వల్గు వ్యాహరతాం స్వనమ్,
సంప్రతిష్ఠామహే కాలః ప్రస్థానస్య పరంతప. 2

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! వల్గు = మనోహరముగా, వ్యాహరతామ్ = ధ్వనించుచున్న, వన్యానామ్ = వనమృగముల, స్వనమ్ = ధ్వనిని, శృణు = వినుము. పరంతప = శత్రువులను పీడించువాడా! ప్రస్థానస్య = ప్రయాణమునకు, కాలః = సమయము. సంప్రతిష్ఠామహే = ప్రయాణమయ్యెదము.

తా. లక్ష్మణా! మధురముగా ధ్వని చేయుచున్న వన్యప్రాణుల ధ్వనిని వినుము. ఓ! పరంతపా! ఇది మనము బయలుదేరుటకు తగిన సమయము. అందుచే బయలు దేరెదము.

మూ. స సుప్తః సమయే భ్రాత్రా లక్ష్మణః ప్రతిబోధితః,
జహౌ నిద్రాం చ తన్ద్రీం చ ప్రసక్తం పథి చ శ్రమమ్.

ప్ర. అ. సుప్తః = నిద్రపోయిన, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, సమయే = ప్రాతఃకాలమునందు, భ్రాత్రా = సోదరునిచేత, ప్రతిబోధితః = మేల్కొల్పబడినవాడై, నిద్రాం చ = నిద్రను, తన్ద్రీం చ = సోమరితనమును, పథి = మార్గమునందు, ప్రసక్తమ్ = ఏర్పడిన, శ్రమం చ = శ్రమను, జహౌ = విడచెను

తా. ప్రాతఃకాలమునందు సోదరునిచే నిద్రనుండి మేల్కొల్పబడిన లక్ష్మణుడు నిద్రను, సోమరితనమును, మార్గాయాసమును కూడ విడచెను. 3

మూ. తత ఉత్థాయ తే సర్వే స్పృష్ట్వా నద్యాః శివం జలమ్,
పన్థానమృషిణాఽఽదిష్టం చిత్రకూటస్య తం యయుః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే సర్వే = వారందరును, ఉత్థాయ = లేచి, నద్యాః = నదియొక్క, శివమ్ = మంగళకర మైన, జలమ్ = జలమును, స్పృష్ట్వా = స్పృశించి, ఋషిణా = భరద్వాజర్షిచేత, ఆదిష్టమ్ = చెప్పబడిన, తమ్ = ఆ, చిత్రకూటస పన్థానమ్ = చిత్రకూటమార్గమును, యయుః = పొందిరి.

తా. వారందరును లేచి. మంగళప్రదమగు యమునాదీజలమును స్పృశించి (స్నానము చేసి), భరద్వాజమహర్షి చెప్పిన చిత్రకూటపర్వతమార్గమును పట్టి వెళ్ళిరి. 4

మూ. తతః సంప్రస్థితః కాలే రామః సౌమిత్రిణా సహ,
సీతాం కమలపత్రాక్షీమిదం వచనమబ్రవీత్. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కాలే = ప్రాతః కాలమునందు, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడ, సంప్రస్థితః = ప్రయాణ మైన, రామః = రాముడు, కమలపత్రాక్షీమ్ = కమలపత్రములవంటి నేత్రములు గల, సీతామ్ = సీతను, గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ప్రాతఃకాలమునందు లక్ష్మణునితో కలిసి ప్రయాణ మైన రాముడు, పద్మపత్రములవంటి నేత్రములు కల సీతతో ఇట్లనెను. 5

మూ. ఆదీప్తానివ వైదేహి సర్వతః పుష్పితాన్నగాన్,
స్వైః పుష్పైః కింశుకాన్ పశ్య మాలినః శిశిరాత్యయే. 6

ప్ర. అ. వైదేహి = ఓ సీతా! శిశిరాత్యయే = వసంతఋతువునందు, సర్వతః = అంతటను, పుష్పితాన్ = పుష్పించినవీ, ఆదీప్తానివ = మండుచున్నట్లున్నవీ, స్వైః = తమ, పుష్పైః = పుష్పములచేత, మాలినః = పుష్పమాలలు గలవీ అయిన, కింశుకాన్ నగాన్ = కింశుకవృక్షములను, పశ్య = చూడుము.

తా. సీతా! ఈ కింశుకవృక్షములు, శిశిరఋతువు గడచిపోవుటతో అంతటా పుష్పించి, ఎఱ్ఱని పూవులతో మండుచున్నట్లున్నవి. వాటి పుష్పములతోనే అవి మాలలను ధరించినట్లు ఉన్నవి. చూడుము.

మూ. పశ్య భల్లాతకాన్ ఫుల్లాన్ నరైరనుపసేవితాన్,
ఫలపత్రైరవనతాన్ నూనం శక్ష్యామ జీవితుమ్. 7.

ప్ర. అ. ఫుల్లాన్ = వికసించినవీ, ఫలపత్రైః = పండ్లచేతను, ఆకులచేతను, అవనతాన్ = వంగినవీ, నరైః = నరులచేత, అనుపసేవితాన్ = సేవింపబడనివీ అయిన, భల్లాతకాన్ = భల్లాతకవృక్షములను, పశ్య = చూడుము. నూనమ్ = నిశ్చయముగా, జీవితమ్ = జీవించుటకు, శక్ష్యామ = సమర్థుల మయ్యెదము.

తా. ఈ భల్లాతక వృక్షములు (జీడిచెట్లు) వికసించి, పుష్పఫలములతో వంగి యున్నవి. కాని వీటి ఫలాదులను అనుభవించుటకు నరు లెవ్వరును లేరు. వీటిని చూడుము. ఇట్టి వృక్షము లన్నియు ఉన్న ఈ ప్రదేశమున మనము తప్పక సుఖముగా జీవించవచ్చును. 7

మూ. పశ్య ద్రోణప్రమాణాని లమ్బమానాని లక్ష్మణ,
మధూని మధుకారీభిః సంభృతాని నగే నగే. 8

ప్ర. అ. లక్ష్మణ = ఓ! లక్ష్మణా! నగే నగే = ప్రతివృక్షమునందును, మధుకారీభిః = తేనెటీగలచేత, సంభృతాని = ప్రోగుచేయబడిన, ద్రోణప్రమాణాని = తొట్టెల వంటి ప్రమాణముగల, లమ్బమానాని = వ్రేలాడుచున్న, మధూని = తేనె పట్టులను, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! ప్రతిచెట్టుమీదను, తేనెటీగలు పెట్టిన, తొట్టెల వలె ఉన్న పెద్ద తేనెపట్టులు వ్రేలాడుచున్నవి; చూడుము. 8

మూ. ఏష క్రోశతి నత్యూహ స్తం శిఖీ ప్రతికూజతి,
రమణీయే వనోద్దేశే పుష్పసంస్తరసంకటే. 9

ప్ర. అ. పుష్పసంస్తరసంకటే = పుష్పముల పరపుచే దట్ట మైన, రమణీయే = సుందర మైన; వనోద్దేశే = వనప్రదేశమునందు, ఏషః = ఈ, నత్యూహః = వానకోయిల, క్రోశతి = అరచుచున్నది తమ్ = దానిని, శిఖీ = నెమలి, ప్రతికూజతి = ఎదురు కూత కూయుచున్నది.

తా. దట్టముగా పూవులు రాలి కప్పబడి ఉన్న ఈ అంద మైన వన ప్రదేశమునందు ఈ వానకోయిల కూయుచుండగా, నెమలి దానికి ఎదురు కూత కూయుచున్నది.

మూ. మాతఙ్గయూథానుసృతం పక్షిసంఘానునాదితమ్,
చిత్రకూటమిమం పశ్య ప్రవృద్ధశిఖరం గిరిమ్. 10

ప్ర. అ. మాతఙ్గయూథానుసృతమ్ = ఏనుగుల గుంపులచేత అనుసరింప బడినదీ, పక్షిసంఘానునాదితమ్ = పక్షిసముదాయములచేత ధ్వనింపచేయ బడినదీ, ప్రవృద్ధశిఖరమ్ = ఎత్తైన శిఖరములు గలదీ అయిన, ఇదమ్ = ఈ, చిత్రకూటం గిరిమ్ = చిత్రకూటపర్వతమును, పశ్య = చూడుము.

తా. చాల ఎత్తైన శిఖరములు గల ఈ చిత్రకూటపర్వతముపై ఏనుగులు గుంపులు గుంపులుగా సంచరించుచున్నవి. పక్షులు ధ్వనిచేయుచున్నవి. దీనిని చూడుము. 10

మూ. సమభూమితలే రమ్యే ద్రుమైర్బహుభిరావృతే,
పుణ్యే రంస్యామహే తాత చిత్రకూటస్య కాననే. 11

ప్ర. అ. తాత = నాయనా! సమభూమితలే = సమాన మైన నేల కలదీ, బహుభిః = అనేకమైన, ద్రుమైః = వృక్షములచేత, ఆవృతే = కప్పబడినదీ, పుణ్యే = పవిత్రమూ అయిన, చిత్రకూటస్య = చిత్రకూటముయొక్క, కాననే = అడవియందు, రంస్యామహే = క్రీడించెదము.

మూ. ఆదీప్తానివ వైదేహి సర్వతః పుష్పితాన్నగాన్,
స్వైః పుష్పైః కింశుకాన్ పశ్య మాలినః శిశిరాత్యయే. 6

ప్ర. అ. వైదేహి = ఓ సీతా! శిశిరాత్యయే = వసంతఋతువునందు, సర్వతః = అంతటను, పుష్పితాన్ = పుష్పించినవీ, ఆదీప్తానివ = మండుచున్నట్లున్నవీ, స్వైః = తమ, పుష్పైః = పుష్పములచేత, మాలినః = పుష్పమాలలు గలవీ అయిన, కింశుకాన్ నగాన్ = కింశుకవృక్షములను, పశ్య = చూడుము.

తా. సీతా! ఈ కింశుకవృక్షములు, శిశిరఋతువు గడచిపోవుటతో అంతటా పుష్పించి, ఎఱ్ఱని పూవులతో మండుచున్నట్లున్నవి. వాటి పుష్పములతోనే అవి మాలలను ధరించి నట్లు ఉన్నవి. చూడుము.

మూ. పశ్య భల్లాతకాన్ ఫుల్లాన్ నరైరనుపసేవితాన్.
ఫలపత్రైరవనతాన్ నూనం శక్ష్యామ జీవితుమ్. 7.

ప్ర. అ. ఫుల్లాన్ = వికసించినవీ, ఫలపత్రైః = పండ్లచేతను, ఆకుల చేతను, అవనతాన్ = వంగినవీ, నరైః = నరులచేత, అనుపసేవితాన్ = సేవింపబడనివీ అయిన, భల్లాతకాన్ = భల్లాతకవృక్షములను, పశ్య = చూడుము. నూనమ్ = నిశ్చయముగా, జీవితమ్ = జీవించుటకు, శక్ష్యామ = సమర్థుల మయ్యెదము.

తా. ఈ భల్లాతక వృక్షములు (జీడిచెట్లు) వికసించి, పుష్పఫలములతో వంగి యున్నవి. కాని వీటి ఫలాదులను అనుభవించుటకు నరు లెవ్వరును లేరు. వీటిని చూడుము. ఇట్టి వృక్షము లన్నియు ఉన్న ఈ ప్రదేశమున మనము తప్పక సుఖముగా జీవించవచ్చును. 7

మూ. పశ్య ద్రోణప్రమాణాని లమ్బమానాని లక్ష్మణ,
మధూని మధుకారీభిః సంభృతాని నగే నగే. 8

ప్ర. అ. లక్ష్మణ = ఓ! లక్ష్మణా! నగే నగే = ప్రతివృక్షమునందును, మధుకారీభిః = తేనెటీగలచేత, సంభృతాని = ప్రోగుచేయబడిన, ద్రోణప్రమాణాని = తొట్టెల వంటి ప్రమాణముగల, లమ్బమానాని = వ్రేలాడుచున్న, మధూని = తేనె పట్టులను, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! ప్రతిచెట్టుమీదను, తేనెటీగలు పెట్టి[illegible] [illegible] ఉన్న పెద్ద తేనెపట్టులు వ్రేలాడుచున్నవి; చూడుము. ॥

మూ. ఏష క్రోశతి నత్యూహస్తం శిఖీ ప్రతికూజతి,
రమణీయే వనోద్దేశే పుష్పసంస్తరసంకటే. ॥

ప్ర. అ. పుష్పసంస్తరసంకటే = పుష్పములు [illegible] రమణీయే = సుందరమైన; వనోద్దేశే = వనప్రదేశమునందు, ఏషః = ఈ, నత్యూహః = వానకోయిల, క్రోశతి = అరచుచున్నది తమ్ = దానిని, శిఖీ = నెమలి, ప్రతికూజతి = ఎదురు కూత కూయుచున్నది.

తా. దట్టముగా పూవులు రాలి కప్పబడి ఉన్న ఈ అంద[illegible] ప్రదేశమునందు ఈ వానకోయిల కూయుచుండగా, నెమలి దాని[illegible] కూయుచున్నది.

మూ. మాతఙ్గయూథానుసృతం పక్షిసంఘానునాదితమ్,
చిత్రకూటమిమం పశ్య ప్రవృద్ధశిఖరం గిరిమ్. ॥

ప్ర. అ. మాతఙ్గయూథానుసృతమ్ = ఏనుగుల గుంపులచేత [illegible] బడినదీ, పక్షిసంఘానునాదితమ్ = పక్షిసముదాయములచేత ధ్వనింప[illegible], ప్రవృద్ధశిఖరమ్ = ఎత్తైన శిఖరములు గలదీ అయిన, ఇదమ్ = ఈ, [illegible] గిరిమ్ = చిత్రకూటపర్వతమును, పశ్య = చూడుము.

తా. చాల ఎత్తైన శిఖరములు గల ఈ చిత్రకూటపర్వతము[illegible] గుంపులు గుంపులుగా సంచరించుచున్నవి. పక్షులు ధ్వనించుచు[illegible] చూడుము. ॥

మూ. సమభూమితలే రమ్యే ద్రుమైర్బహుభిరావృతే,
పుణ్యే రంస్యామహే తాత చిత్రకూటస్య [illegible]. ॥

ప్ర. అ. తాత = నాయనా! సమభూమితలే = [illegible] బహుభిః = అనేకమైన, ద్రుమైః = వృక్షములచేత, ఆవృతే = [illegible] పుణ్యే = పవిత్రమూ అయిన, చిత్రకూటస్య = చిత్రకూటము[illegible] అడవియందు, రంస్యామహే = క్రీడించెదము.

తా. నాయనా! సమ మైన నేల కలదీ, అనేక మైన వృక్షములతో నిండినదీ, పవిత్రమూ అయిన ఈ చిత్రకూటపర్వతవనమునందు సుఖముగా క్రీడించెదము. 11

మూ. తతస్తౌ పాదచారేణ గచ్ఛన్తౌ సహ సీతయా,
రమ్యమాసేదతుః శైలం చిత్రకూటం మనోరమమ్. 12

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సీతయా సహ = సీతతో కూడ, పాదచారేణ = కాలినడకచేత, గచ్ఛన్తౌ = వెళ్ళుచున్న, తౌ = రామలక్ష్మణులు, రమ్యమ్ = సుందరమూ, మనోరమమ్ = మనోహరమూ అయిన, చిత్రకూటం శైలమ్ = చిత్రకూట పర్వతమును, ఆసేదతుః = సమీపించిరి.

తా. కాలినడకతో ప్రయాణము చేయుచున్న ఆ సీతారామలక్ష్మణులు, సుందరమూ, మనోహరమూ అయిన చిత్రకూటపర్వతమును చేరిరి. 12

మూ. తం తు పర్వత మాసాద్య నానాపక్షిగణాయుతమ్,
బహుమూలఫలం రమ్యం సంపన్నం సరసోదకమ్. 13

ప్ర. అ. నానాపక్షిగణాయుతమ్ = అనేక విధము లైన పక్షిగణములతో కూడినదీ, బహుమూలఫలమ్ = అనేక మైన మూలములు ఫలములు కలదీ, రమ్యమ్ = సుందర మైనదీ, సంపన్నమ్ = సమృద్ధ మైనదీ, సరసోదకమ్ = మంచి రుచి గల ఉదకముగలదీ, అయిన, తం పర్వతమ్ = ఆ పర్వతమును, ఆసాద్య = పొంది, రాము డిట్లు పలికెను.

తా. ఆ పర్వతమునందు అనేక జాతుల పక్షుల సముదాయము లుండెను. మూలములు, ఫలములు అత్యధికము గా లభించుచుండెను. మంచి రుచి గల ఉదకముతో ఆ పర్వతము రమ్యముగాను, సమృద్ధముగాను ఉండెను. అట్టి పర్వతమును సమీపించిన పిమ్మట రాము డిట్లు పలికెను. 13

మూ. మనోజ్ఞోఽయం గిరిః సౌమ్య నానాద్రుమలతాయుతః,
బహుమూలఫలో రమ్యః స్వాజీవః ప్రతిభాతి మే. 14

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడ వైన ఓ లక్ష్మణా! మనోజ్ఞః = మనోహరమూ, నానాద్రుమలతాయుతః = అనేకవిధము లైన వృక్షములతోను, లతలతోను

కూడినదీ, బహుమూలఫలః = అనేక మైన మూలములు ఫలములు కలదీ, రమ్యః = సుందరమూ అయిన, అయం గిరిః = ఈ పర్వతము, స్వాజీవః = సుఖముగా జీవించుటకు శక్య మైనదిగా, మే = నాకు, ప్రతిభాతి = కనబడు చున్నది.

తా. లక్ష్మణా! సుందరమూ అనేకవిధము లైన వృక్షములూ, లతలూ కలదీ, అనేకము లైన మూలములు ఫలములూ ఉన్నదీ, రమ్యమూ అయిన ఈ చిత్రకూటపర్వతముపై సుఖముగా జీవింపవచ్చు నని నాకు తోచుచున్నది. 14

మూ. మునయశ్చ మహాత్మానో వసన్త్యత్ర శిలోచ్చయే,
అయం వాసో భవేత్తావదత్ర సౌమ్య రమేమహి. 15

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా! అస్మిన్ = ఈ, శిలోచ్చయే = పర్వతముపై, మహాత్మానః = మహాత్ము లైన, మునయశ్చ = మునులు కూడ, వసన్తి = నివసించుచున్నారు. అయమ్ = ఇది, వాసః = నివాసస్థానము, భవేత్తావత్ = అగుగాక, అత్ర = ఇక్కడ, రమేమహి = ఆనందముగా ఉందము.

తా. ఓ! సౌమ్యుడా! ఈ పర్వతముపై మహాత్ము లైన మునులు కూడ నివసించుచున్నారు. మన మిక్కడనే నివాస మేర్పరచుకొని సుఖముగా ఉందము. 15

మూ. ఇతి సీతా చ రామశ్చ లక్ష్మణశ్చ కృతాఞ్జలిః,
అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్. 16

ప్ర. అ. ఇతి = ఈ విధముగ నిర్ణయించి, సీతా చ = సీతయు, రామశ్చ = రాముడు, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, సర్వే = అందరును, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అభిగమ్య = సమీపించి, వాల్మీకిమ్ = వాల్మీకిమహర్షిని, అభివాదయన్ = నమస్కరించిరి.

తా. ఈ విధముగ నిర్ణయించి సీతారామలక్ష్మణులు ఆశ్రమమును సమీపించి, వాల్మీకికి నమస్కరించిరి. 16

మూ. తాన్మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్,
ఆస్యతామితి చోవాచ స్వాగతం తు నివేద్య చ. 17

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మములు తెలిసిన, మహర్షిః = వాల్మీకి మహర్షి, ప్రముదితః = సంతోషించినవాడై, తాన్ = వారిని, పూజయామాస = పూజించెను. స్వాగతమ్ = స్వాగతమును, నివేద్య = తెలిపి, ఆస్యతామ్ ఇతి = కూర్చుందురుగాక అని, ఉవాచ చ = పలికెను.

తా. ధర్మవేత్త యైన ఆ వాల్మీకిమహర్షి చాలా సంతోషించి వారిని ఆదరించి, స్వాగత వచనములు పలుకుచు, కూర్చుండుడు అని కోరెను. 17

మూ. తతోఽబ్రవీన్మహాబాహుర్లక్ష్మణం లక్ష్మణాగ్రజః,
సంనివేద్య యథాన్యాయ మాత్మానమృషయే ప్రభుః. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాబాహుః = గొప్ప బాహువులు గల, ప్రభుః = ప్రభు వైన, లక్ష్మణాగ్రజః = రాముడు, ఆత్మానమ్ = తనను గూర్చి, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ఋషయే = ఆ ఋషికి, సంనివేద్య = తెలిపి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఆజానుబాహువు, సర్వసమర్థుడు అయిన రాముడు, తనను గూర్చి ఆ ఋషికి యథాన్యాయముగా తెలిపి, లక్ష్మణునితో ఇట్లు పలికెను. 18

మూ. లక్ష్మణానయ దారూణి దృఢాని చ వరాణి చ,
కురుష్వావసథం సౌమ్య వాసే మేఽభిరతం మనః. 19

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడ వైన, లక్ష్మణ = ఓ లక్ష్మణా, దృఢాని = దృఢ మైన, వరాణి చ = శ్రేష్ఠ మైన, దారూణి = కఱ్ఱలను, ఆనయ = తీసికొనిరమ్ము, అవసథమ్ = నివాసగృహమును, కురుష్వ = నిర్మించుము. మే మనః = నా మనస్సు, వాసే = నివాసమునందు, అభిరతమ్ = ఆసక్తి కలది.

తా. సౌమ్యస్వభావము గల ఓ లక్ష్మణా : దృఢములు, శ్రేష్ఠములూ అయిన కఱ్ఱలు తీసికొని వచ్చి గృహమును నిర్మింపుము. నివాస మొకటి ఏర్పరచుకొనవలె నని కోరుచున్నాను. 19

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సౌమిత్రిర్వివిధాన్ ద్రుమాన్,
ఆజహార తతశ్చక్రే పర్ణశాలామరిందమః. 20

ప్ర. అ. సౌమిత్రిః = లక్ష్మణుడు, తస్య = రాముని యొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, వివిధాన్ = అనేకవిధము లైన, ద్రుమాన్ = వృక్షములను, ఆజహార = తీసికొనివచ్చెను. అరిందమః = శత్రు సంహారకు డగు అతడు, తతః = అటుపిమ్మట, పర్ణశాలామ్ = పర్ణశాలను, చక్రే = నిర్మించెను.

తా. శత్రుసంహారకు డగు లక్ష్మణుడు రాముని ఆజ్ఞ ప్రకారము అనేక విధము లైన వృక్షములను తెచ్చి, పర్ణశాలను నిర్మించెను. 20

మూ. తాం నిష్ఠితాం బద్ధకటాం దృష్ట్వా రామః సుదర్శనామ్,
శుశ్రూషమాణమేకాగ్రమిదం వచనమబ్రవీత్. 21

ప్ర. అ. రామః = రాముడు, నిష్ఠితామ్ = స్థిరముగా ఉన్నదీ, బద్ధకటామ్ = ఏర్పరుపబడిన ఆవరణము కలదీ, సుదర్శనామ్ = సుందరమూ అయిన, తామ్ = ఆ పర్ణశాలను, దృష్ట్వా = చూచి, శుశ్రూషమాణమ్ = ఆజ్ఞను వినగోరుచున్న వాడూ, ఏకాగ్రమ్ = ఏకాగ్రచిత్తుడూ అయిన అతనిని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. చాపలతో ఆవరణమును ఏర్పరచి, స్థిరముగా నుండు నట్లు కట్ట బడిన ఆ పర్ణశాలను చూచి, రాముడు తన ఆజ్ఞను విన కోరికతో సావధానచిత్తు డై నిలచి ఉన్న లక్ష్మణునితో ఇట్లు పలికెను. 21

మూ. ఐణేయం మాంసమాహృత్య శాలాం యక్ష్యామహే వయమ్,
కర్తవ్యం వాస్తుశమనం సౌమిత్రే చిరజీవిభిః. 22

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! ఐణేయం మాంసమ్ = లేడి మాంసమును, ఆహృత్య = తీసికొనివచ్చి, వయమ్ = మనము, శాలామ్ = ఈ పర్ణశాలను, యక్ష్యామహే = పూజించెదము, చిరజీవిభిః = చిరకాలము జీవించువారిచేత, (జీవింపకోరువారిచేత), వాస్తుశమనమ్ = వాస్తుదేవతా శాంతి, కర్తవ్యమ్ = చేయదగినది.

తా. లక్ష్మణా! చిరకాలము జీవించగోరువారు వాస్తుదేవతాశాంతి చేసు కొనవలెను. అందుచే మనము లేడిమాంసమును తీసికొనివచ్చి శాలాపూజ చేసెదము. 22

మూ. మృగం హత్వాఽఽనయ క్షిప్రం లక్ష్మణేహ శుభేక్షణ,
కర్తవ్యః శాస్త్రదృష్టో హి విధిర్ధర్మమనుస్మర. 23

ప్ర. అ. శుభేక్షణ = శుభ మైన నేత్రములు గల, లక్ష్మణ = లక్ష్మణా! మృగమ్ = లేడిని, హత్వా = చంపి, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఇహ = ఇచటికి, ఆనయ = తీసికొనిరమ్ము, శాస్త్రదృష్టః = శాస్త్రముతో చూడబడిన, విధిః = విధి, కర్తవ్యః హి = చేయదగినది కదా. ధర్మమ్ = ధర్మమును, అనుస్మర = స్మరించుము.

తా. లక్ష్మణా! ఒక లేడిని చంపి, శీఘ్రముగా ఇచటికి తీసికొని రమ్ము. శాస్త్రవిహిత మగు కార్యమును చేయవలెను కదా. ఈ ధర్మము నీకు కూడ తెలియును కదా.

మూ. భ్రాతుర్వచన మాజ్ఞాయ లక్ష్మణః పరవీరహా,
చకార స యథోక్తం చ తం రామః పునరబ్రవీత్. 24

ప్ర. అ. పరవీరహా = శత్రువీరులను సంహరించు, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు. భ్రాతుః = సోదరుని యొక్క, వచనమ్ = వచనమును, ఆజ్ఞాయ = తెలిసికొని, యథోక్తమ్ = చెప్పినవిధముగా, చకార = చేసెను, రామః = రాముడు, తమ్ = వానినిగూర్చి, పునః = మరల, అబ్రవీత్ = పలికెను.

తా. శత్రువీరులను సంహరించు లక్ష్మణుడు, రాముడు చెప్పినవిధముగ చేసెను. మరల రాముడు అతనితో ఇట్లనెను. 24.

మూ. ఐణేయం శ్రపయస్వైతచ్ఛాలాం యక్ష్యామహే వయమ్,
త్వర సౌమ్య ముహూర్తోఽయం ధ్రువశ్చ దివసోఽప్యయమ్.

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా! ఏతత్ = ఈ, ఐణేయమ్ = లేడి మాంసమును, శ్రపయస్వ = ఉడికించుము. వయమ్ = మనము, శాలామ్ = పర్ణశాలను, యక్ష్యామహే = పూజించెదము. అయమ్ = ఈ, దివసః = దినము, అయమ్ = ఈ, ముహూర్తః అపి = ముహూర్తము కూడ, ధ్రువః = స్థిర మైనది. త్వర = తొందరపడుము.

తా. ఓ సౌమ్యుడా! ఈ లేడి మాంసమును ఉడికించుము. పర్ణశాలాపూజ చేసెదము. ఈ దినము స్థిరదినము. ముహూర్తము కూడ స్థిరముహూర్తము. 25

మూ. స లక్ష్మణః కృష్ణమృగం మేధ్యం హత్వా ప్రతాపవాన్,
అథ చిక్షేప సౌమిత్రిః సమిద్ధే జాతవేదసి. 26

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సౌమిత్రిః = సుమిత్రాపుత్రుడైన, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, మేధ్యమ్ = పవిత్రమైన, కృష్ణమృగమ్ = కృష్ణ మృగమును, హత్వా = చంపి, సమిద్ధే = ప్రజ్వలింపచేయబడిన, జాతవేదసి = అగ్నియందు, చిక్షేప = పడవేసెను.

తా. పిదప, ప్రతాపవంతుడు, సుమిత్రాపుత్రుడు అయిన లక్ష్మణుడు ఒక పవిత్రమైన కృష్ణసార మను లేడిని చంపి, దానిని ప్రజ్వలించుచున్న అగ్నిలో పడవేసి దాని మాంసమును పక్వము చేసెను. 26

మూ. తం తు పక్వం పరిజ్ఞాయ నిష్టప్తం ఛిన్నశోణితమ్,
లక్ష్మణః పురుషవ్యాఘ్రమథ రాఘవమబ్రవీత్.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, నిష్టప్తమ్ = తపింపచేయబడినది, ఛిన్న శోణితమ్ = తెగిన (తొలగిన) రక్తము కలది అయిన, తమ్ = దానిని, పక్వమ్ = పక్వమైన దానినిగా, పరిజ్ఞాయ = తెలుసుకొని, అథ = అటుపిమ్మట, పురుష వ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠుడైన, రాఘవమ్ = రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. బాగుగా కాలి, రక్తము తొలగిపోయిన ఆ మృగము పక్వమైనట్లు తెలుసుకొని, లక్ష్మణుడు, పురుషశ్రేష్ఠుడైన రామునితో ఇట్లనెను. 26

మూ. అయం కృష్ణః సమాప్తాఙ్గః శృతః కృష్ణమృగో యథా,
దేవతాం దేవసంకాశ యజస్వ కుశలో హ్యసి. 28

ప్ర. అ. "అయం సర్వః సమస్తాఙ్గః శృతః కృష్ణమృగో మయా'' అను గోరఖ్‌పూరు ప్రతిపాఠము బాగున్నది. సమస్తాఙ్గః = పరిపూర్ణములైన అవయవములు కల, అయమ్ = ఈ, కృష్ణమృగః = కృష్ణమృగము, సర్వః = సమస్తమూ, మయా = నాచేత, శృతః = పక్వము చేయబడినది, దేవసంకాశ = దేవతలతో

సమాన మైన వాడా! దేవతాః = దేవతలను, యజస్వ = పూజించుము, కుశలః = నేర్పుగలవాడవు, అసి హి = అయి ఉన్నావు కదా.

తా. అంగవైకల్య మేమియు లేని ఈ కృష్ణమృగమును పూర్తిగా పక్వము చేసినాను. దేవతాతుల్యుడ వైన ఓ రామా! దేవతాపూజ చేయుము. అట్టి కార్యము నందు నీవే నేర్పుగలవాడవు. 28

మూ. రామః స్నాత్వా తు నియతో గుణవాన్ జప్యకోవిదః,
సంగ్రహేణాకరోత్సర్వాన్ మన్త్రాన్ సత్రావసానికాన్. 29

ప్ర. అ. గుణవాన్ = గుణవంతుడూ, జప్యకోవిదః = జపింపతగిన మంత్రముల యందు పాండిత్యము కలవాడూ, అయిన, రామః = రాముడు, స్నాత్వా = స్నానముచేసి, నియతః = నియమవంతుడై, సత్రావసానికాన్ = వాస్తుపూజకు చివర పఠింపదగిన, సర్వాన్ = సమస్త మైన, మన్త్రాన్ = మంత్రములను, సంగ్రహేణ = సంగ్రహముగా, అకరోత్ = చేసెను. (పఠించెను.)

తా. గుణవంతుడు, జపింపదగిన మంత్రములు బాగుగా తెలిసినవాడు అయిన రాముడు, స్నానము చేసి, నియమవంతుడై, వాస్తుపూజాసమయమున పఠింపదగిన మంత్రముల నన్నింటిని సంగ్రహముగా చదివెను. 29

మూ. ఇష్ట్వా దేవగణాన్ సర్వాన్ వివేశావసథం శుచిః,
బభూవ చ మనోహ్లాదో రామస్యామితతేజసః. 30

ప్ర. అ. సర్వాన్ = సమస్త మైన, దేవగణాన్ = దేవతాగణములను, ఇష్ట్వా = పూజించి, శుచిః = పరిశుద్ధుడై, ఆవసథమ్ = గృహమును, వివేశ = ప్రవేశించెను. అమితతేజసః = అమిత మైన తేజస్సు గల, రామస్య = రామునకు, మనోహ్లాదః = మనస్సునకు ఆనందము, బభూవ చ = కలిగెను.

తా. దేవతల నందరిని పూజించి, పవిత్రుడై పర్ణశాలలో ప్రవేశించగనే, అమిత మైన తేజస్సు గల ఆ రాముని మనస్సునందు ఆహ్లాదము కలిగెను. 30

మూ. వైశ్వదేవబలిం కృత్వా రౌద్రం వైష్ణవమేవ చ,
వాస్తుసంశమనీయాని మఙ్గళాని ప్రవర్తయన్. 31

జపం చ న్యాయతః కృత్వా స్నాత్వా నద్యాం యథావిధి,
పాపసంశమనం రామశ్చకార బలిముత్తమమ్. 32

ప్ర. అ. రామః = రాముడు, వైశ్వదేవబలిమ్ = వైశ్వదేవబలిని, రౌద్రమ్ = రుద్రబలిని, వైష్ణవమేవ చ = విష్ణుబలిని, కృత్వా = చేసి, వాస్తు సంశమనీయాని = వాస్తుదేవతాశాంతికి సంబంధించిన, మఙ్గలాని = మంగళములను, ప్రవర్తయన్ = చేయుచు, న్యాయతః = నియమానుసారముగా, జపం చ = జపమును కూడ, కృత్వా = చేసి, నద్యామ్ = నదియందు, యథావిధి = యథాశాస్త్రముగా, స్నాత్వా = స్నానము చేసి, పాపసంశమనమ్ = పాపములను శమింపచేయు, ఉత్తమం బలిమ్ = ఉత్తమ మైన బలిని, చకార = చేసెను.

తా. రాముడు, విశ్వేదేవతలను, రుద్రుని, విష్ణువును ఉద్దేశించి బలులు సమర్పించి, వాస్తుశాంతినిమిత్తమై మంగళములు చేసి, నియమానుసారముగా జపించి, యథావిధిగా నదిలో స్నానము చేసి, పాపములను నశింపచేయు ఉత్తమ బలిని ఇచ్చెను. 31, 32

మూ. వేదిస్థలవిధానాని చైత్యాన్యాయతనాని చ,
ఆశ్రమస్యానురూపాణి స్థాపయామాస రాఘవః. 33

ప్ర. అ. రాఘవః = లక్ష్మణుడు, ఆశ్రమస్య = ఆశ్రమమునకు, అనురూపాణి = అనురూప మైన, వేదిస్థలవిధానాని = అరుగుల నిర్మాణములను, చైత్యాని = దేవాలయములను, ఆయతనాని చ = అగ్నిగృహాదులను, స్థాపయామాస = స్థాపించెను.

తా. లక్ష్మణుడు, ఆశ్రమములో ఉండవలసిన వేదికలను, చైత్యములను, అగ్నిగృహములను గూడ స్థాపించెను. 33

మూ. వన్యైర్మాల్యైః ఫలైర్మూలైః పక్వైర్మాంసైర్యథావిధి,
అద్భిర్జపైశ్చ వేదోక్తైర్దర్భైశ్చ ససమిత్కుశైః. 34
తౌ తర్పయిత్వా భూతాని రాఘవౌ సహ సీతయా,
తదా వివిశతుః శాలాం సుశుభాం శుభలక్షణౌ. 36

ప్ర. అ. శుభలక్షణౌ = శుభకర మైన లక్షణములు గల, రాఘవౌ = రామలక్ష్మణులు, సహ సీతయా = సీతతో కూడ, వన్యైః = వనములో లభించు, మాల్యైః = పుష్ప మాలలచేతను, ఫలైః = ఫలములచేతను, మూలైః = మూలములచేతను, పక్వైః = పక్వ మైన, మాంసైః = మాంసములచేతను, అద్భిః = ఉదకములచేతను, వేదోక్తైః = వేదమునందు చెప్పబడిన, జపైశ్చ = జపములచేతను, దర్భైశ్చ = దర్భలచేతను, ససమిత్కుశైః = సమిధలచేతను కుశలచేతను, భూతాని = భూతములను, తర్పయిత్వా = తృప్తిపొందించి, తదా = అప్పుడు, శుభమ్ = శుభమైన, శాలామ్ = పర్ణశాలను, వివిశతుః = ప్రవేశించిరి.

తా. ఉత్తమలక్షణములు గల సీతారామలక్ష్మణులు, వనమునందు లభించు పుష్పమాలలు, ఫలములు, మూలములు, పక్వమాంసములు, ఉదకము, వేదోక్త విధానమున జపము, దర్భలు, మంచి సమిధలు, కుశలు మొదలగువాటిచే యథావిధిగా భూతతృప్తి చేసి శుభకర మైన పర్ణశాలలో ప్రవేశించిరి. 34,35

మూ. తాం వృక్షపర్ణచ్ఛదనాం మనోజ్ఞాం
యథాప్రదేశం సుకృతాం వివాతామ్
వాసాయ సర్వే వివిశుః సమేతాః
సభాం యథా దేవగణాః సుధర్మామ్. 36

ప్ర. అ. వృక్షపర్ణచ్ఛదనామ్ = వృక్షముల పర్ణములు ఆచ్ఛాదనముగా గలది, మనోజ్ఞామ్ = మనోహరమైనదీ, యథాప్రదేశమ్ = ప్రదేశానుసారముగా, సుకృతామ్ = చక్కగా నిర్మించబడినదీ, వివాతామ్ = అధిక మైన వాయువు లేనిదీ అయిన, తామ్ = ఆ శాలను, సర్వే = వారందరును, సమేతాః = కలసినవారై, వాసాయ = నివాసము నిమిత్తమై, దేవగణాః = దేవతా గణములు, సుధర్మామ్ = సుధర్మ అను పేరు గల, సభాం యథా = సభను వలె, వివిశుః = ప్రవేశించిరి.

తా. చెట్ల ఆకులచే ఏర్పరచిన ఆచ్ఛాదనము కలదీ, మనోహరమూ, ఏ ప్రదేశములో ఏ విధముగా ఉండవలెనో అట్లు నిర్మింపబడినదీ, గాలి తాకిడి లేనిదీ, అయిన ఆ పర్ణశాలలోనికి, సీతారామలక్ష్మణులు ముగ్గురును కలిసి, దేవతాగణములు సుధర్మ యను దేవసభలోనికి ప్రవేశించి నట్లు ప్రవేశించిరి. 36

మూ. అనేకనానామృగపక్షిసంకులే
విచిత్రపుష్పస్తబకైర్ద్రుమైర్యుతే,
వనోత్తమే వ్యాళమృగానునాదితే
తదా విజహ్రుః సుసుఖం జితేన్ద్రియాః. 37

ప్ర. అ. తదా = అప్పుడు, జితేన్ద్రియాః = జితేంద్రియు లైన ఆ సీతా రామలక్ష్మణులు, అనేకనానామృగపక్షిసంకులే = అసంఖ్యాకములు అనేక విధములు అయిన మృగములచేతను, పక్షులచేతనూ వ్యాకుల మైన, విచిత్ర పుష్పస్తబకైః = విచిత్రము లైన పుష్పముల గుత్తులు గల, ద్రుమైః = వృక్షము లతో, వృతే = కూడినదీ, వ్యాళమృగానునాదితే = మదపు టేనుగులచేతను మృగ ములచేతనూ ప్రతిధ్వనింపచేయబడినదీ అయిన, వనోత్తమే = ఉత్తమ మైన వనమునందు, సుసుఖమ్ = చాల సుఖముగా, విజహ్రుః = విహరించిరి.

తా. జితేంద్రియు లైన సీతారామలక్ష్మణులు, అసంఖ్యాకము లైన వివిధ పక్షిమృగాదులతో వ్యాకులమూ, విచిత్రమైన పుష్పగుచ్ఛములతో నిండిన వృక్ష ములు కలదీ, మదపు టేనుగులచేతను, ఇతరమృగములచేతనూ ధ్వనింపచేయ బడినదీ అయిన శ్రేష్ఠ మైన ఆ వనమునందు సుఖముగా విహరించిరి. 37

మూ. సురమ్యమాసాద్య తు చిత్రకూటం
నదీం చ తాం మాల్యవతీం సుతీర్థామ్,
ననన్ద హృష్టో మృగపక్షిజుష్టాం
జహౌ చ దుఃఖం పురవిప్రవాసాత్. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. సురమ్యమ్ = చాల రమ్య మైన, చిత్రకూటమ్ = చిత్రకూట పర్వతమును, ఆసాద్య = పొంది, సుతీర్థామ్ = మంచి తీర్థములు(రేవులు)గల, మృగపక్షిజుష్టామ్ = మృగములచేతను పక్షులచేతను సేవింపబడిన, తామ్ = ఆ, మాల్యవతీం నదీం చ = మాల్యవతి యను నదిని కూడ పొంది, హృష్టః =

హర్షించినవాడై, ననన్ద = ఆనందించెను. పురవిప్రవాసాత్ = పురమునుండి ప్రవాసమువలన కలిగిన, దుఃఖమ్ = దుఃఖమును, జహౌ చ = విడిచిపెట్టెను కూడ.

తా. చాల రమ్యముగా ఉన్న చిత్రకూటపర్వతమును, మంచి తీర్థములు గల, మృగపక్షిసేవిత మైన మాల్యవతీనదిని పొందిన ఆ సీతారామలక్ష్మణులు చాల ఆనందించుచు, తమ పురమును విడుచుటవలన కలిగిన దుఃఖమును విడచిరి. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో ఏబదియారవ సర్గ సమాప్తము

* * *

## సప్తపఞ్చాశః సర్గః

[సుమంత్రుడు అయోధ్యకు మరలివచ్చుట, రాముని సందేశ మును అతనివలన విని పౌరులు విలపించుట, దశరథమహారాజు, కౌసల్య మూర్ఛిల్లుట, అంతఃపురమందలి రాణులు ఆర్తనాదముచేయుట.]

మూ. కథయిత్వా సుదుఃఖార్తః సుమన్త్రేణ చిరం సహ,
రామే దక్షిణకూలస్థే జగామ స్వగృహం గుహః. 1

ప్ర. అ. రామే = రాముడు, దక్షిణకూలస్థే = దక్షిణపు టొడ్డునందు ఉండగా, గుహః = గుహుడు, సుమన్త్రేణ సహ = సుమంతునితో కూడ, చిరమ్ = చిరకాలము, కథయిత్వా = మాటలాడి, సుదుఃఖార్తః = మిక్కిలి దుఃఖముచే పీడితుడై, స్వగృహమ్ = తన గృహమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. రాముడు గంగను దాటి దక్షిణతీరము చేరిన పిమ్మట, గుహుడు సుమంత్రునితో చాల సేపు మాటలాడి, చాల దుఃఖార్తుడై తన ఇంటికి తిరిగి వెళ్ళెను. 1

మూ. భరద్వాజాభిగమనం ప్రయాగే చ సహాసనమ్,
ఆగిరేర్గమనం తేషాం తత్రస్థైరభిలక్షితమ్. 2

ప్ర. అ. తేషామ్ = వారియొక్క, భరద్వాజాభిగమనమ్ = భరద్వాజ మహర్షిని చేరుట, ప్రయాగే = ప్రయాగయందు, సహాసనమ్ = ఆయనతో కూడ ఉండుట, ఆగిరేః = చిత్రకూటపర్వతమువరకు, గమనమ్ = వెళ్ళుట, తత్రస్థైః = అచట నున్న గుహాదులచేత, అభిలక్షితమ్ = చూడబడినది.

తా. గుహుడు మొదలైనవారు, అక్కడనే ఉండి, సీతారామలక్ష్మణులు భరద్వాజమహర్షి వద్దకు వెళ్ళుటను, ఆయనతో కలిసి ఉండుటను, చిత్రకూటము వరకు వెళ్లుటను తెలుసుకొనిరి. 2

మూ. అనుజ్ఞాతః సుమన్త్రోఽథ యోజయిత్వా హయోత్తమాన్,
అయోధ్యామేవ నగరీం ప్రయయౌ గాఢదుర్మనాః. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, అనుజ్ఞాతః = రామునిచే అనుజ్ఞ ఇవ్వబడిన, సుమన్త్రః = సుమంత్రుడు, హయోత్తమాన్ = అశ్వశ్రేష్ఠములను, యోజయిత్వా = రథమునకు కట్టుకొని, గాఢదుర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు కలవాడై, అయోధ్యాం నగరీమేవ=అయోధ్యానగరమునే, ప్రయయౌ= పొందెను.

తా. రాముని అనుజ్ఞ పొందిన సుమంత్రుడు ఉత్తమము లైన అశ్వములను రథమునకు కట్టుకొని, మిక్కిలి దుఃఖించుచు, అయోధ్యానగరమునకే తిరిగి వెళ్ళెను. 3

మూ. స వనాని సుగన్ధీని సరితశ్చ సరాంసి చ,
పశ్యన్నతియయౌ శీఘ్రం గ్రామాణి నగరాణి చ 4

ప్ర. అ. సః = అతడు, సుగన్ధీని = మంచి గంధము గల, వనాని = వనములను, సరితః చ = నదులను, సరాంసి చ = సరస్సులను, గ్రామాణి = గ్రామములను, నగరాణి చ = నగరములను, పశ్యన్ = చూచుచు, శీఘ్రమ్ = శీఘ్రముగా, అతియయౌ = వాటిని దాటి వెళ్లెను.

తా. ఆ సుమంత్రుడు, మంచి వాసనలు గల అరణ్యములను, నదులను, సరస్సులను, గ్రామములను, నగరములను చూచుచు, వాటిని శీఘ్రముగా దాటి వెళ్లెను. 4

మూ. తతః సాయాహ్నసమయే తృతీయేఽహని సారథిః,
అయోధ్యాం సమనుప్రాప్య నిరానన్దాం దదర్శ హ. 5

ప్ర. అ. సారథిః = సారథి, తృతీయే = మూడవ, అహని=దినమునందు, సాయాహ్నసమయే = సాయంకాలసమయమున, నిరానన్దామ్ = ఆనందము లేని, అయోధ్యామ్ = అయోధ్యను, సమనుప్రాప్య = చేరి, దదర్శ హ = చూచెను.

తా. సుమంత్రుడు మూడవ దినమునందు, సాయంకాలమున అయోధ్యను చేరి, ఆనందశూన్య మైన ఆ నగరమును చూచెను. 5

మూ. స శూన్యామివ నిశ్శబ్దాం దృష్ట్వా పరమదుర్మనాః,
సుమన్త్రశ్చిన్తయామాస శోకవేగసమాహతః. 6

ప్ర. అ. సః సుమన్త్రః = ఆ సుమంత్రుడు, నిశ్శబ్దామ్ = నిశ్శబ్దమై, శూన్యామివ = పాడుపడినది వలె ఉన్న అయోధ్యను, దృష్ట్వా = చూచి, పరమదుర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు కలవాడై, శోకవేగ సమాహతః = దుఃఖవేగముచేత కొట్టబడినవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

సుమంత్రుడు, నిశ్శబ్దమై పాడుపడి నట్లున్న అయోధ్యను చూచి, మనస్సులో మిక్కిలి బాధపడుచు, దుఃఖవేగముచే పీడితుడై ఈ విధముగ తలచెను. 6

మూ. కచ్చిన్న సగజా సాశ్వా సజనా సజనాధిపా,
రామసన్తాపదుఃఖేన దగ్ధా శోకాగ్నినా పురీ. 7

ప్ర. అ. సగజా = గజములతో కూడినది, సాశ్వా = అశ్వములతో కూడినది, సజనా = జనులతో కూడినది. సజనాధిపా = రాజులతో కూడినదీ అయిన, పురీ = పట్టణము, రామసన్తాపదుఃఖేన = రాముని విషయమున కలిగిన తీవ్రముగ తపింపచేయు దుఃఖముచేతను, శోకాగ్నినా = శోకాగ్నిచేతను, కచ్చిన్న దగ్ధా = కాల్చివేయబడలేదు కద !

తా. గజములతోను, అశ్వములతోను, జనులతోను, రాజుతోను కూడిన ఈ అయోధ్యానగరము రాముని గూర్చిన దుఃఖముచే పీడితమై, శోకాగ్నిచే దగ్ధము కాలేదు కద ! 7

మూ. ఇతి చిన్తాపరః సూతో వాజిభిః శీఘ్రపాతిభిః,
నగరద్వారమాసాద్య త్వరితః ప్రవివేశ హ. 8

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, చిన్తాపరః = చింతతో నిండిన, సూతః = సారథి, శీఘ్రపాతిభిః = శీఘ్రముగా పరుగెత్తు. వాజిభిః = గుఱ్ఱములచే, నగర ద్వారమ్ = అయోధ్యానగరద్వారమును, ఆసాద్య = పొంది, త్వరితః = తొందర పడుచు, ప్రవివేశ హ = ప్రవేశించెను.

తా. సుమంత్రు డీ విధ మగు ఆలోచనలు చేయుచు, శీఘ్రముగా పరుగెత్తు అశ్వములచేత నగరద్వారమును సమీపించి, నగరములోనికి ప్రవేశించెను. 8

మూ. సుమన్త్రమభియాన్తం తం శతశోఽథ సహస్రశః,
క్వ రామ ఇతి పృచ్ఛన్తః సూతమభ్యద్రవన్నరాః. 9

ప్ర. అ. అథ = అటుపిమ్మట, అభియాన్తమ్ = వచ్చుచున్న, తమ్ = ఆ, సూతమ్ = సారథి యైన, సుమన్త్రమ్=సుమంత్రుని, రామః = రాముడు, క్వ= ఎక్కడ, ఇతి = అని, పృచ్ఛన్తః = అడుగుచు, నరాః = జనులు, శతశః = వందలకొలది. సహస్రశః = వేలకొలది, అభ్యద్రవన్ = అతని వైపు పరుగెత్తిరి.

తా. అంతలో, సుమంత్రుడు వచ్చుట చూచి, వందలకొలది, వేలకొలది జనులు. "రాము డెక్కడ, రాము డెక్కడ" అని అడుగుచు, ఆతని వైపు పరుగెత్తిరి. 9

మూ. తేషాం శశంస గఙ్గాయామహమాపృచ్ఛ్య రాఘవమ్,
అనుజ్ఞాతో నివృత్తోఽస్మి ధార్మికేణ మహాత్మనా. 10

ప్ర. అ. అహమ్ = నేను, గఙ్గాయామ్ = గంగయందు, రాఘవమ్ = రాముని, ఆపృచ్ఛ్య = అడిగి, ధార్మికేణ=ధార్మికుడైన, మహాత్మనా=మహాత్ముడైన ఆ రామునిచే, అనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడిన వాడనై, నివృత్తః అస్మి = తిరిగి వచ్చితిని అని, తేషామ్ = వారికి, శశంస = చెప్పెను.

తా. "నేను గంగాతీరమునందు రామునకు వీడ్కోలు చెప్పి, ధర్మాత్ముడైన ఆ మహాత్ముని అనుజ్ఞ పొంది తిరిగి వచ్చినాను" అని అతడు వారికి చెప్పెను. 10

మూ. తే తీర్ణా ఇతి విజ్ఞాయ బాష్పపూర్ణముఖా జనాః,
అహో ధిగితి నిశ్శ్వస్య హా రామేతి చ చుక్రుశుః. 11

ప్ర. అ. తే = ఆ సీతారామలక్ష్మణులు, తీర్ణాః ఇతి = గంగను దాటి వెళ్ళినారు అని, విజ్ఞాయ = తెలిసికొని, జనాః = జనులు, బాష్పపూర్ణముఖాః = కన్నీటితో నిండిన ముఖములు కలవారై, అహో = అయ్యో, ధిక్ = ఛీ ఇతి = అని, నిశ్శ్వస్య = నిట్టూర్చి, హా రామ ఇతి = హా రామా అని, చుక్రుశుః చ= ఆక్రందనము కూడ చేసిరి.

తా. సీతారామలక్ష్మణులు గంగానదిని దాటి వెళ్ళిపోయినా రని వినగానే ఆ జనులు అయ్యో! ఛీ! అని తమను తాము నిందించుకొనుచు, 'హా రామా! అని ఆక్రందనము చేసిరి. 11

మూ. శుశ్రావ చ వచస్తేషాం బృన్దం బృన్దం చ తిష్ఠతామ్,
హతాః స్మ ఖలు యే నేహ పశ్యామ ఇతి రాఘవమ్. 12

ప్ర. అ. యే = ఏ మనము, ఇహ = ఇచట, రాఘవమ్ = రాముని, న పశ్యామః = చూచుటలేదో, అట్టి మనము, హతాః స్మ ఖలు = హతుల మైతిమి కదా! ఇతి = ఇట్లు పలుకుచు, బృన్దం బృన్దమ్ = గుంపుగుంపులుగా చేరి, తిష్ఠతామ్ = ఉన్న, తేషామ్ = వారియొక్క, వచః = వాక్కును, శుశ్రావ చ = వినెను కూడ.

తా. 'రాము డిచట మనకు కనబడడు; మనము హతుల మైతిమి' అనుచు గుంపులు గుంపులుగా చేరి, అనుకొనుచున్న ఆ జనుల మాటలను కూడా, సుమంత్రుడు వినెను. 12

మూ. దానయజ్ఞవివాహేషు సమాజేషు మహత్సు చ,
న ద్రక్ష్యామః పునర్జాతు ధార్మికం రామమన్తరా. 13

ప్ర. అ. దానయజ్ఞవివాహేషు = దానములందు, యజ్ఞములందు, వివాహములందు, మహత్సు = గొప్ప వైన, సమాజేషు చ = సమాజములందు, అన్తరా = మధ్యయందు, ధార్మికమ్ = ధార్మికు డైన, రామమ్ = రాముని, పునః = మరల, జాతు = ఎన్నడును, న ద్రక్ష్యామః = చూడము.

తా. దానయజ్ఞవివాహాదులందును, గొప్ప గొప్ప సమాజములందును, మనము రాముని చూచుచుండెడివారము. ఇపు డాతడు ఎన్నడును మనకు కనబడడు. 13

మూ. కిం సమర్థం జనస్యాస్య కిం ప్రియం కిం సుఖావహమ్,
ఇతి రామేణ నగరం పితృవత్పరిపాలితమ్. 14

ప్ర. అ. అస్య జనస్య = ఈ జనమునకు, కిమ్ = ఏమి, సమర్థమ్ = తగినది, కిమ్ = ఏది, ప్రియమ్ = ఇష్ట మైనది? కిమ్ = ఏది, సుఖావహమ్ = సుఖమును కలిగించునది? ఇతి = అని, రామేణ = రామునిచేత, నగరమ్ = అయోధ్యానగరము, పితృవత్ = తండ్రి వలె, పరిపాలితమ్ = పాలింపబడినది.

తా. రాముడు, తండ్రి వలె, "ఈ జనమునకు ఏది తగినది? ఏది ప్రియ మైనది? ఏది వీరికి సుఖము కలిగించును?" అని పర్యాలోచించి, ఈ నగరమును పరిపాలించుచుండెడివాడు. 14

మూ. వాతాయనగతానాం చ స్త్రీణామన్వన్తరాపణమ్,
రామశోకాభితప్తానాం శుశ్రావ పరిదేవనమ్. 15

ప్ర. అ. వాతాయనగతానామ్ = కిటికీలలో ఉన్న, స్త్రీణామ్= స్త్రీల యొక్క, అన్వన్తరాపణమ్ = బజారుమధ్యయందు, రామశోకాభితప్తానామ్ = రాముని గూర్చిన శోకముచే తపింపచేయబడినవారియొక్క, పరిదేవనమ్ = ఏడ్పును, శుశ్రావ = వినెను.

తా. కిటికీలలో నున్న స్త్రీల విలాపములను, బజారులలో రాముని గూర్చిన శోకముతో బాధపడుచున్న జనుల రోదనములను సుమంత్రుడు వినెను. 15

మూ. స రాజమార్గమధ్యేన సుమన్త్రః పిహితాననః,
యత్ర రాజా దశరథస్తదేవోపయయౌ గృహమ్. 16

ప్ర. అ. సః సుమన్త్రః = ఆ సుమంత్రుడు, పిహితాననః=కప్పబడిన ముఖము కలవాడై, రాజమార్గమధ్యేన = రాజమార్గముయొక్క మధ్యచేత, రాజా =రాజైన, దశరథః = దశరథుడు, యత్ర = ఏ గృహమునం దున్నాడో, తత్ = ఆ, గృహమేవ = గృహమును, ఉపయయౌ = చేరెను.

తా. సుమంత్రుడు తన ముఖ మితరులకు కనబడకుండు నట్లు కప్పుకొని, రాజమార్గముద్వారా, దశరథు డున్న గృహమును చేరెను. 16

మూ. సోఽవతీర్య రథాచ్ఛీఘ్రం రాజవేశ్మ ప్రవిశ్య చ,
కక్ష్యాః సప్తాభిచక్రామ మహాజనసమాకులాః. 17

ప్ర. అ. సః = అతడు, రథాత్ = రథమునుండి, అవతీర్య = దిగి, శీఘ్రమ్ = శీఘ్రముగా, రాజవేశ్మ = రాజగృహమును, ప్రవిశ్య చ = ప్రవేశించి, మహాజనసమాకులాః = చాలామంది జనులతో వ్యాకులముగా నున్న, సప్త = ఏడు, కక్ష్యాః = వాకిళ్లను, అభిచక్రామ = దాటెను.

తా. సుమంత్రుడు రథము దిగి, శీఘ్రముగా రాజగృహములోనికి ప్రవేశించి, జనులతో కిక్కిరిసి ఉన్న ఏడు వాకిళ్లను దాటెను. 17

మూ. హర్మ్యైర్విమానైః ప్రాసాదైరవేక్ష్యాథ సమాగతమ్,
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః. 18

ప్ర. అ. అథ = అటుపిమ్మట, నార్యః = స్త్రీలు, హర్మ్యైః = హర్మ్యముల నుండి, విమానైః = ఏడంతస్తుల మేడలనుండి, ప్రాసాదైః = రాజగృహముల నుండి, సమాగతమ్ = వచ్చిన ఆ సుమంత్రుని, అవేక్ష్య = చూచి, రామదర్శన కర్శితాః = రాముని చూడకపోవుటచే కృశించినవారై, హాహాకారకృతాః = హాహాకారము చేసిరి.

తా. మేడలలోను, ఏడంతస్తుల మేడలలోను, ప్రాసాదములలోను ఉన్న స్త్రీలు సుమంత్రుడు వచ్చినట్లు చూచి, రాముడు కనబడకపోవుటచే కృశించిన వారై హాహాకారములు చేసిరి. 18

మూ. ఆయతైర్విమలైర్నేత్రైరశ్రువేగపరిప్లుతైః,
అన్యోన్యమభివీక్షన్తే ఽవ్యక్తమార్తతరాః స్త్రియః. 19

ప్ర. అ. స్త్రియః = స్త్రీలు, ఆర్తతరాః = మిక్కిలి దుఃఖించుచున్నవారై, ఆయతైః = దీర్ఘములూ, విమలైః = స్వచ్ఛములూ, అశ్రువేగపరిప్లుతైః = కన్నీళ్ల వేగముచే వ్యాకులములూ అయిన, నేత్రైః = నేత్రములతో, అవ్యక్తమ్ = అస్పష్టముగా, అన్యోన్యమ్ = పరస్పరము, అభివీక్షన్తే = చూచుకొనుచుండిరి.

తా. స్త్రీలు మిక్కిలి దుఃఖముచే పీడింపబడినవారై, దీర్ఘములూ, నిర్మలములూ, కన్నీటి వేగముచే వ్యాకులములూ అయిన నేత్రములతో, ఒకరి నొకరు అస్పష్టముగా చూచుకొనుచుండిరి. 19

మూ. తతో దశరథస్త్రీణాం ప్రాసాదేభ్యస్తతస్తతః,
రామశోకాభితప్తానాం మన్దం శుశ్రావ జల్పితమ్. 20

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తతస్తతః = ఆ యా, ప్రాసాదేభ్యః = ప్రాసాదములనుండి, రామశోకాభితప్తానామ్ = రామశోకముచే తపింపబడిన, దశ

రథస్త్రీణామ్ = దశరథుని భార్యల, మన్దమ్ = మంద మైన, జల్పితమ్ = సంభాషణమును, శుశ్రావ = వినెను.

తా. సుమంత్రుడు, దశరథుని భార్యలు, రామశోకముతో బాధపడుచు ప్రాసాదములలో మెల్లగా చెప్పుకొనుచున్న మాటలు వినెను. 20

మూ. సహ రామేణ నిర్యాతో వినా రామమిహాగతః,
సూతః కిం నామ కౌసల్యాం శోచన్తీం ప్రతివక్ష్యతి. 21

ప్ర. అ. రామేణ సహ = రామునితో కూడ, నిర్యాతః = బయలుదేరి వెళ్ళిన వాడై, వినా రామమ్ = రాముడు లేకుండ, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చిన, సూతః = సారథి, శోచన్తీమ్ = దుఃఖించుచున్న, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, కిం నామ = ఏమి, ప్రతివక్ష్యతి = సమాధానము చెప్పునో.

తా. రామునితో కలిసి వెళ్ళి ఇపుడు రాముడు లేకుండా తిరిగి వచ్చిన ఈ సుమంత్రుడు, దుఃఖించుచున్న కౌసల్యకు ఏమి సమాధానము చెప్పును? 21

మూ. యథా చ మన్యే దుర్జీవమేవం న సుకరం ధ్రువమ్,
ఆచ్ఛిద్య పుత్రే నిర్యాతే కౌసల్యా యత్ర జీవతి. 22

ప్ర. అ. పుత్రే = పుత్రుడు, ఆచ్ఛిద్య = బలాత్కారముగా, నిర్యాతే = వెళ్ళిపోయినవా డగుచుండగా, కౌసల్యా = కౌసల్య, యథా = ఎట్లు, యత్ర జీవతి = జీవించుచున్నదనగా, ఆ విధముగా, దుర్జీవమ్ = జీవింప శక్యము కాదు అని, మన్యే = తలచుచున్నాను. ఏవమ్ = ఈ విధముగా, సుకరమ్ = సులభముగా, చేయదగినది, న = కాదు. ధ్రువమ్ = నిశ్చయము.

తా. "వలదన్నను అంగీకరించక పుత్రుడు దూరముగా వెళ్ళిపోయిన పిమ్మట కూడా కౌసల్య జీవించియున్నది. ఇట్లు జీవించుట చాల కష్టము; అంత సులభముగా చేయదగిన పని కాదు అని తలచెదను''. 22

మూ. సత్యరూపం తు తద్వాక్యం రాజ్ఞః స్త్రీణాం నిశామయన్,
ప్రదీప్తమివ శోకేన వివేశ సహసా గృహమ్. 23

ప్ర. అ. రాజ్ఞః = రాజుయొక్క, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, సత్యరూపమ్ = మిక్కిలి సత్యమైన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, నిశామయన్ = చూచుచు (వినుచు), సహసా = వెంటనే, శోకేన = శోకముచేత, ప్రదీప్తమివ = మండు చున్నది వలె నున్న, గృహమ్ = గృహమును, వివేశ = ప్రవేశించెను.

తా. దశరథుని భార్యలు చెప్పుకొనుచున్న, సత్య మైన ఆ మాటలు వినుచు సుమంత్రుడు శీఘ్రముగా, శోకముతో ప్రజ్వలించుచున్నట్లున్న గృహ మును ప్రవేశించెను. 23

మూ. స ప్రవిశ్యాష్టమీం కక్ష్యాం రాజానం దీనమాతురమ్,
పుత్రశోకపరిమ్లానమపశ్యత్పాణ్డురే గృహే. 24

ప్ర. అ. సః = ఆ సుమంత్రుడు, అష్టమీమ్ = ఎనిమిదవ, కక్ష్యామ్ = వాకిలిని, ప్రవిశ్య = ప్రవేశించి, పాణ్డురే = తెల్లని, గృహే = గృహమునందు, దీనమ్ = దీనుడు, ఆతురమ్ = దుఃఖితుడు, పుత్రశోకపరిమ్లానమ్ = పుత్రశోకము చేత వాడిపోయినవాడు, అయిన, రాజానమ్ = రాజును, అపశ్యత్ = చూచెను.

తా. సుమంత్రుడు ఎనిమిదవ కక్ష్యలో ప్రవేశించి, అక్కడ, తెల్లని గృహమునందు, దీనుడు, దుఃఖించుచున్నవాడు, పుత్రశోకముతో కాంతి విహీ నుడు అయిన రాజును చూచెను. 24

మూ. అభిగమ్య తమాసీనం నరేన్ద్రమభివాద్య చ,
సుమన్త్రో రామవచనం యథోక్తం ప్రత్యవేదయత్. 25

ప్ర. అ. సుమన్త్రః = సుమంత్రుడు, ఆసీనమ్ = కూర్చొని యున్న, నరేన్ద్రమ్ = రాజును, అభిగమ్య = సమీపించి, అభివాద్య చ = నమస్కరించి, రామవచనమ్ = రాముని వచనమును, యథోక్తమ్ = అతడు చెప్పిన విధముగా, ప్రత్యవేదయత్ = తెలిపెను.

తా. సుమంత్రుడు కూర్చొని ఉన్న ఆ రాజును సమీపించి, నమస్కరించి రాముడు పంపిన సందేశమును యథాతథముగా వినిపించెను. 25

మూ. స తూష్ణీమేవ తచ్ఛ్రుత్వా రాజా విభ్రాన్తచేతనః,
మూర్ఛితో న్యపతద్భూమౌ రామశోకాభిపీడితః. 26

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, తూష్ణీమేవ = మౌనముగానే, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, విభ్రాన్తచేతనః = తిరిగిపోయిన చైతన్యము కలవాడై, రామశోకాభిపీడితః = రాముని గూర్చిన శోకముచేత పీడింపబడిన వాడై, మూర్ఛితః = మూర్ఛచెందినవాడై, భూమౌ = భూమిపై, న్యపతత్ = పడెను.

తా. ఆ రాజు సుమంత్రుడు చెప్పిన రామసందేశమును మౌనముగానే వినెను. అతని మనస్సు కలత చెందెను. రామశోకపీడితుడై అతడు మూర్ఛిల్లి నేలపై పడెను. 26

మూ. తతోఽన్తఃపురమావిద్ధం మూర్ఛితే పృథివీపతౌ,
ఉద్ధృత్య బాహూ చుక్రోశ నృపతౌ పతితే క్షితౌ. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పృథివీపతౌ = రాజు, మూర్ఛితే = మూర్ఛచెందినవాడగుచుండగా, అన్తఃపురమ్ = అంతఃపురము, ఆవిద్ధమ్ = కొట్టబడెను. నృపతౌ = రాజు, క్షితౌ = భూమిపై, పతితే = పడినవాడగుచుండగా, బాహూ = బాహువులను, ఉద్ధృత్య = ఎత్తి, చుక్రోశ = ఏడ్చెను.

తా. రాజు మూర్ఛచెందగనే అంతఃపురములోని వారందరును మిక్కిలి బాధపడిరి. అతడు నేలపై పడిపోగా, వారందరును చేతులనెత్తి ఏడ్చిరి. 27

మూ. సుమిత్రయా తు సహితా కౌసల్యా పతితం పతిమ్,
ఉత్థాపయామాస తదా వచనం చేదమబ్రవీత్. 28

ప్ర. అ. తదా = అప్పుడు, సుమిత్రయా సహితా = సుమిత్రతో కూడిన, కౌసల్యా = కౌసల్య, పతితమ్ = పడిపోయిన, పతిమ్ = భర్తను, ఉత్థాపయామాస = లేవదీసెను. ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును. అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. నేలపై పడిపోయిన భర్తను చూచి కౌసల్యయు, సుమిత్రయు అతనిని లేవదీసిరి. కౌసల్య అతనితో ఇట్లనెను. 28

మూ. ఇమం తస్య మహాభాగ దూతం దుష్కరకారిణః,
వనవాసాదనుప్రాప్తం కస్మాన్న ప్రతిభాషసే. 29

ప్ర. అ. మహాభాగ = ఓ మహాభాగ్యవంతుడా! వనవాసాత్ = వనవాసము నుండి, అనుప్రాప్తమ్ = వచ్చిన, దుష్కరకారిణః = చేయ శక్యము కాని పని చేసిన, తస్య = రామునియొక్క, ఇమమ్ = ఈ, దూతమ్ = దూతను గూర్చి, కస్మాత్ = ఎందువలన, న ప్రతిభాషసే = మాటలాడుటలేదు ?

తా. మహారాజా! ఎవ్వరును చేయలేని పనులను చేసిన రాముని దూతగా సుమంత్రుడు వనవాసమునుండి వచ్చినాడు. ఈతనితో మాట్లాడ వేమి? 29

మూ. అద్యైవమనయం కృత్వా వ్యపత్రపసి రాఘవ,
ఉత్తిష్ఠ సుకృతం తేఽస్తు శోకే న స్యాత్సహాయతా. 30

ప్ర. అ. రాఘవ = దశరథుడా! అనయమ్ = నీతివిరుద్ధమైన కార్యమును, కృత్వా = చేసి, అద్య = ఇప్పుడు, ఏవమ్ = ఈ విధముగా, వ్యపత్రపసి = సిగ్గు పడుచున్నావు. ఉత్తిష్ఠ = లెమ్ము, తే = నీకు, సుకృతమ్ = మాటనిలుపుకొనిన పుణ్యము, అస్తు = అగుగాక. శోకే = దుఃఖమునందు, సహాయతా = సాహాయ్యము, న స్యాత్ = లభించదు.

తా. రాజా! చేయకూడని పని చేసి ఇపు డీ విధముగా ఎందుకు సిగ్గుపడు చున్నావు? లెమ్ము; మాట నిలుపుకొనిన పుణ్యము లభించినదికదా! ఇట్లు దుఃఖించినచో ఎవ్వరు సాహాయ్యము చేయుదురు ? 30

మూ. దేవ యస్యా భయాద్రామం నానుపృచ్ఛసి సారథిమ్,
నేహ తిష్ఠతి కైకేయీ విస్రబ్ధం ప్రతిభాష్యతామ్. 31

ప్ర. అ. దేవ = రాజా! యస్యాః = ఎవతెవల్ల, భయాత్ = భయమువలన, సారథిమ్ = సారథిని, రామమ్ = రాముని గూర్చి, నానుపృచ్ఛసి = ప్రశ్నించుట లేదో, కైకేయీ = ఆ కైకేయి, ఇహ = ఇక్కడ, న తిష్ఠతి = లేదు. విస్రబ్ధమ్ = నిర్భయముగా, ప్రతిభాష్యతామ్ = మాటలాడెదవుగాక.

తా. ఏ కైకేయికి భయపడి సారథితో రాముని గూర్చి మాటలాడుట లేదో, ఆ కైకేయి ఇక్కడ లేదు. నీవు నిర్భయముగా మాటలాడవచ్చును. 31

మూ. సా తథోక్త్వా మహారాజం కౌసల్యా శోకలాలసా,
ధరణ్యాం నిపపాతాశు బాష్పవిప్లుతభాషిణీ. 32

ప్ర. అ. బాష్పవిప్లుతభాషిణీ = కన్నీటితో వ్యాకులముగా మాటలాడుచున్న, శోకలాలసా = దుఃఖముచేత చపల మైన, సా కౌసల్యా = ఆ కౌసల్య, మహారాజమ్ = మహారాజును గూర్చి, తథా = అట్లు, ఉక్త్వా = పలికి, ఆశు = శీఘ్రముగా, ధరణ్యామ్ = నేలపై, నిపపాత = పడెను.

తా. దుఃఖముతో నిండిన ఆ కౌసల్య, బాష్పముచే కలిగిన డగ్గుత్తికతో మాటలాడుచు, రాజుతో ఇట్లు పలికి, వెంటనే నేలపై బడెను. 32

మూ. ఏవం విలపతీం దృష్ట్వా కౌసల్యాం పతితాం భువి,
పతిం చావేక్ష్య తాః సర్వాః సుస్వరం రురుదుః స్త్రియః.

ప్ర. అ. సర్వాః = సమస్త మైన, తాః స్త్రియః = ఆ స్త్రీలు, ఏవమ్ = ఈ విధముగా, విలపతీమ్ = విలపించుచున్న, భువి పతితామ్ = నేలపై పడిన, కౌసల్యామ్=కౌసల్యను, దృష్ట్వా=చూచి, పతిం చ=భర్తను కూడ, అవేక్ష్య= చూచి, సుస్వరమ్ = అధిక మైన ధ్వని కలుగునట్లుగా, రురుదుః = ఏడ్చిరి.

తా. ఈ విధముగా నేలపై బడి విలపించుచున్న కౌసల్యను, మూర్ఛితు డైన భర్తను చూచి, ఆ స్త్రీలందరును ఎలుగెత్తి ఏడ్చిరి. 33

మూ. తతస్తమన్తఃపురనాదముత్థితం
సమీక్ష్య వృద్ధాస్తరుణాశ్చ మానవాః.
స్త్రియశ్చ సర్వా రురుదుః సమన్తతః
పురం తదాసీత్పునరేవ సంకులమ్. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఉత్థితమ్ = బయలుదేరిన, తమ్ = ఆ, అన్తఃపురనాదమ్ = అంతపురముయొక్క ధ్వనిని, సమీక్ష్య=చూచి, వృద్ధాః = వృద్ధులును, తరుణాశ్చ = యువకులును అయిన, మానవాః = మానవులును,

సర్వాః=సమస్తమైన, స్త్రియశ్చ=స్త్రీలును, సమన్తతః=అంతటను, రురుదుః=ఏడ్చిరి. తదా = అప్పుడు, పురమ్=పట్టణము, పునరేవ=మరల, సంకులమ్=వ్యాకులముగా, ఆసీత్ = ఆయెను.

తా. అంతఃపురమునుండి బయలుదేరిన ఆ రోదనధ్వని విని, వృద్ధులు, యువకులు, స్త్రీలు అందరును, అంతటను ఏడ్చిరి. అపుడు మరల ఆ పట్టణము వ్యాకులమైపోయెను. 34

"బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదిఏడవ సర్గ సమాప్తము.

* * *

## అష్టపఞ్చాశః సర్గః

[దశరథమహారాజు ఆదేశింపగా సుమంత్రుడు రామలక్ష్మణుల సందేశము వినిపించుట.]

మూ. ప్రత్యాశ్వస్తో యదా రాజా మోహాత్ప్రత్యాగతః పునః,
అథాజుహావ తం సూతం రామవృత్తాన్తకారణాత్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రాజా = రాజు, యదా = ఎప్పుడు, ప్రత్యాశ్వస్తః = ఊరడిల్లినవాడై, మోహాత్ = మోహమునుండి, పునః = మరల, ప్రత్యాగతః = తిరిగి వచ్చినాడో, అప్పుడు, రామవృత్తాన్తకారణాత్ = రాముని వృత్తాంతముకొరకై, తం సూతమ్ = ఆ సారథిని, ఆజుహావ = పిలచెను.

తా. పిమ్మట కొంత సేపటికి రాజు తెప్పరిల్లి, తిరిగి సంజ్ఞ పొంది, రాముని వృత్తాంతము తెలిసికొనుటకై ఆ సారథిని పిలచెను. 1

మూ. అథ సూతో మహారాజం కృతాఞ్జలిరుపస్థితః,
రామమేవానుశోచన్తం దుఃఖశోకసమన్వితమ్. 2
వృద్ధం పరమసంతప్తం నవగ్రహమివ ద్విపమ్,
వినిశ్వసన్తం ధ్యాయన్తమస్వస్థమివ కుఞ్జరమ్. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సూతః = సారథి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, రామమేవ = రాముని గూర్చియే, అనుశోచన్తమ్ = దుఃఖించుచున్నవాడూ, దుఃఖశోకసమన్వితమ్ = దుఃఖముతోను శోకముతోను కూడిన వాడూ, వృద్ధమ్ = వృద్ధుడూ, పరమసంతప్తమ్ = మిక్కిలి బాధపడుచున్న వాడూ, నవగ్రహమ్ = క్రొత్తగా పట్టుకొనబడిన, ద్విపమివ = ఏనుగ వలె, వినిఃశ్వసన్తమ్ = నిట్టూర్చుచున్నవాడు, అస్వస్థమ్ = ఆరోగ్యము లేని, కుఞ్జరమివ = ఏనుగు వలె, ధ్యాయన్తమ్ = ఏదో ఆలోచించుచున్నవాడూ అయిన, మహారాజమ్ = మహారాజును, ఉపస్థితః = సమీపించెను.

తా. అంతట ఆ సుమంత్రుడు, అంజలి ఘటించి, ఆ రామునిగూర్చియే ఆలోచించుచు దుఃఖశోకములతో క్రుంగి యున్న దశరథమహారాజు దగ్గరకు వెళ్లెను. వృద్ధు డైన ఆ దశరథుడు మిక్కిలి మండిపోవుచున్న హృదయము కలవాడై, క్రొత్తగా పట్టుకొనిన ఏనుగు వలె, దీర్ఘముగా నిట్టూర్చుచుండెను. అస్వస్థ మైన గజము వలె ఏదియో ఆలోచించుచుండెను.

మూ. రాజా తు రజసా సూతం ధ్వస్తాఙ్గం సముపస్థితమ్,
అశ్రుపూర్ణముఖం దీనమువాచ పరమార్తవత్. 4

ప్ర. అ. రాజా = రాజు, రజసా = పరాగముచే, ధ్వస్తాఙ్గమ్ = కప్పబడిన శరీరము కలవాడూ, అశ్రుపూర్ణముఖమ్ = కన్నీళ్ళతో నిండిన ముఖము కలవాడూ, దీనమ్ = దీనుడూ అయిన, సముపస్థితమ్ = తన సమీపమునకు వచ్చిన, సూతమ్ = ఆ సారథిని గూర్చి, పరమార్తవత్ = మిక్కిలి దుఃఖముతో కూడినవాడై, ఉవాచ = పలికెను.

తా. శరీరము నందు పరాగము కప్పి ఉండగా, దీనుడై, కన్నీళ్ళతో నిండిన ముఖముతో తన దగ్గరకు వచ్చిన సూతుని చూచి, రాజు, చాల దుఃఖించుచు ఇట్లు పలికెను. 4

మూ. క్వ ను వత్స్యతి ధర్మాత్మా వృక్షమూల ముపాశ్రితః,
సోఽత్యన్తసుఖితః సూత కిమశిష్యతి రాఘవః. 5

ప్ర. అ. సూత = ఓ సుమంత్రా! ధర్మాత్మా=ధర్మాత్ము డైన రాముడు, వృక్షమూలమ్ = వృక్షముయొక్క మూలమును, ఉపాశ్రితః = ఆశ్రయించిన వాడై, క్వ ను = ఎక్కడ, వత్స్యతి = నివసించగలడు ? అత్యన్తసుఖితః = మిక్కిలి సుఖమును అనుభవించిన, సః రాఘవః = ఆ రాముడు, కిమ్ = దేనిని, అశిష్యతి = తినగలడు?

తా. సుమంత్రా! ధర్మాత్ము డైన ఆ రాముడు, ఎక్కడ చెట్ల క్రింద నివసించును? ఇంతవరకును చాల సుఖపడిన అతడు ఏమి భక్షించును? 5

మూ. దుఃఖస్యానుచితో దుఃఖం సుమన్త్రి శయనోచితః,
భూమిపాలాత్మజో భూమౌ శేతే కథమనాథవత్. 6

ప్ర. అ. సుమన్త్ర = సుమంత్రుడా! దుఃఖస్య = దుఃఖమునకు, అనుచితః = అలవాటుపడని, శయనోచితః = ఉత్తమమైన శయనములకు అలవాటు పడిన. భూమిపాలాత్మజః = రాజకుమారుడైన రాముడు, అనాథవత్ = నాథుడు లేనివాడు వలె, భూమౌ = నేలపై, దుఃఖమ్ = దుఃఖముగా, కథమ్ = ఎట్లు, శేతే = శయనించుచున్నాడు?

తా. సుమంత్రా! రాజకుమారుడైన రాముడు ఎన్నడును దుఃఖములకు అలవాటు పడినవాడు కాడు. శయనములపై శయనించుటకు అలవడ్డవాడు. అట్టి రాముడు, అనాథుడు వలె, నేలపై దుఃఖముగా ఎట్లు శయనించుచున్నాడో.

మూ. యం యాన్తమనుయాన్తి స్మ పదాతిరథకుఞ్జరాః,
స వత్స్యతి కథం రామో విజనం వనమాశ్రితః. 7

ప్ర. అ. యాన్తమ్ = ప్రయాణమై వెళ్ళుచున్న, యమ్ = ఎవనిని, పదాతిరథకుఞ్జరాః = కాలిబంట్లు, రథములు, గజములు, అనుయాన్తి స్మ = అనుసరించి వెళ్ళుచుండెనో, సః = అట్టి, రామః = రాముడు, విజనమ్ = విజనమైన, వనమ్ = వనమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడై, కథమ్ = ఎట్లు, వత్స్యతి = నివసించగలడో?.

తా. ఏ రాముడు, ఎచటికైన ప్రయాణమై వెళ్ళుచుండగా, కాలిబంట్లు, రథములు, గజములు వెంట వెళ్ళెడివో, అట్టి రాముడు, విజనమైన వనములో ఎట్లు నివసించునో! 7

మూ. వ్యాళైర్మృగైరాచరితం కృష్ణసర్పనిషేవితమ్,
కథం కుమారౌ వైదేహ్యా సార్ధం వనముపస్థితౌ. 8

ప్ర. అ. కుమారౌ = రామలక్ష్మణులు, వైదేహ్యా సార్ధమ్ = సీతతో కూడ, వ్యాళైః = క్రూరమైన, మృగైః = జంతువులచేత, ఆచరితమ్ = సంచరించబడినదీ, కృష్ణసర్పనిషేవితమ్ = త్రాచుపాములచేత ఆశ్రయింపబడినదీ అయిన, వనమ్ = వనమును, కథమ్ = ఎట్లు, ఉపస్థితౌ = చేరినారు ?

తా. సీతారామలక్ష్మణులు, క్రూరమృగములతోను, కృష్ణసర్పములతోను నిండిన అరణ్యము నెట్లు చేరినారు ? 8

మూ. సుకుమార్యా తపస్విన్యా సుమన్త్ర సహ సీతయా,
రాజపుత్రౌ కథం పాదై రవరుహ్య రథాద్గతౌ. 9

ప్ర. అ. సుమన్త్ర = సుమంత్రా! రాజపుత్రౌ = ఆ రాజకుమారులు, సుకుమార్యా = సుకుమారురాలూ, తపస్విన్యా = దీనురాలూ అయిన, సీతయా సహ = సీతతో కూడ, రథాత్ = రథమునుండి, అవరుహ్య = దిగి, పాదైః = పాదములచేత, కథమ్ = ఎట్లు, గతౌ = వెళ్ళినారు ?

తా. సుమంత్రా! ఆ రాజకుమారులు, దీన యైన, సుకుమారి సీతతో కలిసి, రథమునుండి క్రిందికి దిగి, పాదచారు లై అరణ్యములోనికి ఎట్లు ప్రవేశించినారు? 9

మూ. సిద్ధార్థః ఖలు సూత త్వం యేన దృష్టౌ మమాత్మజౌ,
వనా న్తం ప్రవిశన్తౌ తావశ్వినావివ మన్దరమ్. 10

ప్ర. అ. సూత = ఓ సుమంత్రా ! యేన = ఏ నీచేత, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, మన్దరమ్ ఇవ = మందరపర్వతమును వలె, వనాన్తమ్ = వనమధ్యమును, ప్రవిశన్తౌ = ప్రవేశించుచున్న, మమ = నాయొక్క, ఆత్మజౌ = కుమారులు, దృష్టౌ = చూడబడినారో, త్వమ్ = అట్టి నీవు, సిద్ధార్థః ఖలు = కృతార్థుడవు కదా.

తా. సుమంత్రా! అశ్వినీదేవతలు మందరపర్వతప్రాంతమును ప్రవేశించుచున్నట్లు, అరణ్యములోనికి ప్రవేశించుచున్న నా కుమారులను చూడగలిగితివి; నీ వెంతయు అదృష్టవంతుడవు. 10

మూ. కిమువాచ వచో రామః కిమువాచ చ లక్ష్మణః,
సుమన్త్ర వనమాసాద్య కిమువాచ చ మైథిలీ. 11

ప్ర. అ. సుమన్త్ర = ఓ సుమంత్రా! వనమ్ = వనమును, ఆసాద్య = పొంది, రామః = రాముడు, కిమ్ = ఏమి, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను! లక్ష్మణః = లక్ష్మణుడు, కిమ్ = ఏమి, ఉవాచ = పలికెను? మైథిలీ చ = సీత, కిమ్ = ఏమి, ఉవాచ = పలికెను,

తా. సుమంత్రా! అరణ్యమునకు చేరిన పిమ్మట రాము డేమనినాడు? లక్ష్మణు డేమనినాడు? సీత ఏమన్నది?

మూ. ఆసితం శయితం భుక్తం సూత రామస్య కీర్తయ,
జీవిష్యామ్యహమేతేన యయాతిరివ సాధుషు. 12

ప్ర. అ. సూత = ఓ సారథీ! రామస్య = రాముని యొక్క, ఆసితమ్ = కూర్చుండుటను, శయితమ్ = పరుండుటను, భుక్తమ్ = భుజించుటను, కీర్తయ = చెప్పుము. అహమ్ = నేను, యయాతిః = యయాతి, సాధుషు ఇవ = సత్పురుషుల యందు వలె, ఏతేన = దీనిచేత, జీవిష్యామి = జీవించెదను.

తా. సుమంత్రా! రాముడు ఎక్కడ కూర్చుండెనో, ఎక్కడ పరుండెనో, ఎక్కడ భుజించెనో చెప్పుము. ఆ విషయములను వినుచు, నేను, సాధుజన సంగముచేత యయాతి జీవించి నట్లు, జీవించెదను. 12

మూ. ఇతి సూతో నరేన్ద్రేణ బోధితః సజ్జమానయా,
ఉవాచ వాచా రాజానం స బాష్పపరిబద్ధయా. 13

ప్ర. అ. నరేన్ద్రేణ = రాజుచేత, ఇతి = ఈ విధముగా. చోదితః = ప్రేరేపింపబడిన, సః సూతః = ఆ సారథి, బాష్పపరిబద్ధయా = బాష్పముచే అడ్డుకొనబడిన, సజ్జమానయా = తొట్రుపడుచున్న, వాచా = వాక్కుతో, రాజానమ్ = రాజును గూర్చి, ఉవాచ = పలికెను.

తా. దశరథు డిట్లు ప్రశ్నింపగా, సుమంత్రుడు, బాష్పముచే అవరుద్ధమై తొట్రుపడుచున్న వాక్కుతో, రాజుకు ఇట్లు చెప్పెను. 13

మూ. అబ్రవీన్మాం మహారాజ ధర్మమేవానుపాలయన్,
అఞ్జలిం రాఘవః కృత్వా శిరసాభిప్రణమ్య చ. 14

ప్ర. అ. మహారాజ = మహారాజా! రాఘవః = రాముడు, ధర్మమేవ = ధర్మమునే, అనుపాలయన్ = పాలించుచు, అఞ్జలిమ్ = దోసిలిని, కృత్వా = చేసి, శిరసా = శిరస్సుతో, అభిప్రణమ్య చ = నమస్కరించి, మామ్ = నన్ను, అబ్రవీత్ = పలికెను.

తా. మహారాజా! రాముడు ధర్మమునే పాలించుచు, అంజలి ఘటించి, శిరస్సు వంచి నీకు నమస్కరించుచు, నాతో ఇట్లు చెప్పెను. 14

మూ. సూత మద్వచనా త్తస్య తాతస్య విదితాత్మనః,
శిరసా వన్దనీయస్య వన్ద్యౌ పాదౌ మహాత్మనః. 15

ప్ర. అ. సూత = ఓ సారథీ! మద్వచనాత్ = నా వచనమువలన, విదితాత్మనః=ప్రసిద్ధ మైన బుద్ధిగలవాడును, మహాత్మనః=మహాత్ముడును, వన్దనీయస్య = నమస్కరింప దగిన వాడును అయిన, తస్య=ఆ, తాతస్య = తండ్రి యొక్క, పాదౌ = పాదములు, శిరసా = శిరస్సు చేత, వన్ద్యౌ = నమస్కరింప దగినవి.

తా. సుమంత్రా! ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడూ, మహాత్ముడూ, నమస్కరింపదగినవాడూ అయిన నా తండ్రికి నేను శిరస్సు వంచి నమస్కరించి నట్లుగా చెప్పుము. 15

మూ. సర్వమ న్తఃపురం వాచ్యం సూత మద్వచనా త్త్వయా,
ఆరోగ్యమవిశేషేణ యథార్హం చాభివాదనమ్. 16

ప్ర. అ. సూత=ఓ సారథీ! త్వయా=నీచేత, మద్వచనాత్=నా మాట వలన (మాటగా), సర్వమ్ = సమస్త మైన, అన్తఃపురమ్ = అంతపురము, అవిశేషేణ=భేద మేమియు లేకుండగా, ఆరోగ్యమ్=ఆరోగ్యమును, యథార్హమ్ = తగువిధముగా, అభివాదనం చ=నమస్కారమును, వాచ్యమ్=చెప్పదగినది.

తా. సుమంత్రా! అంతఃపురములో నున్నవారినందరినీ నేను ఎట్టి భేదము లేకుండ క్షేమ మడిగినట్లును, ఆ యా వ్యక్తులకు వారి యోగ్యతానుసారముగా అభివాదనము చేసినట్లును చెప్పవలెను. 16

మూ. మాతా చ మమ కౌసల్యా కుశలం చాభివాదనమ్,
అప్రమాదం చ వక్తవ్యా బ్రూయాశ్చైనామిదం వచః.

ప్ర. అ. మమ=నాయొక్క, మాతా = తల్లి యైన, కౌసల్యా = కౌసల్య, కుశలమ్=కుశలమును, అభివాదనం చ=అభివాదనమును, అప్రమాదం చ = ఏమరిపాటు చెందవల దను విషయమును, వక్తవ్యా=చెప్ప దగినది. ఇదమ్=ఈ వచశ్చ=వచనమును కూడ, బ్రూయాః=చెప్పుము.

తా. నా తల్లి యైన కౌసల్యకు నా కుశలమును, నా అభివాదనమును చెప్పి, ఏమరిపాటులేకుండ ఉండవలె నని కూడ తెలిపి, ఈ మాటలు కూడ చెప్పుము. 17

మూ. ధర్మనిత్యా యథాకాలమగ్న్యగారపరా భవ,
దేవి దేవస్య పాదౌ చ దేవవత్పరిపాలయ. 18

ప్ర. అ. దేవి=ఓ! దేవీ! ధర్మనిత్యా=నిత్యము ధర్మపరురాలవై, యథాకాలమ్ = కాలానుసారముగ, అగ్న్యగారపరా = అగ్నిగృహమునందు పూజా హోమాదులు చేయుటయందు ఆసక్తికలదానవు, భవ=అగుము. దేవస్య=మహారాజైన దశరథునియొక్క, పాదౌ చ=పాదములను కూడ, దేవవత్ = దేవతను వలె, పరిపాలయ=పాలించుకొనుచుండుము.

తా. తల్లీ, ధర్మమునందు స్థిరత్వము కలదానవై, యథాకాలమున, అగ్నిగృహములో అగ్నిహోమాదికము చేయుచు, దశరథమహారాజునకు దేవతకు ఉపచారములు చేసినట్లు ఉపచారములు చేయుచు ఆయనను రక్షించు కొనుము. 18

మూ. అభిమానం చ మానం చ త్యక్త్వా వర్తస్వ మాతృషు,
అను రాజాన మార్యాం చ కైకేయీమమ్బ కారయ. 19

ప్ర. అ. అభిమానం చ = అహంకారమును, మానం చ = చిత్తౌన్నత్యమును, త్యక్త్వా=విడచి, మాతృషు=(మిగిలిన) తల్లుల విషయమున, వర్తస్వ=ప్రవర్తించుము. అమ్బ=తల్లీ! ఆర్యామ్=పూజ్యురాలైన, కైకేయీమ్=కైకేయిని, రాజానమ్ అను=రాజునకు అనుకూలముగా ఉండునట్లు, కారయ=చేయించుము.

తా. తల్లీ! అహంకారమును, నేను పట్టపురాణిని అను చిత్తసమున్నతిని విడచి నా మిగిలిన తల్లుల (నీ సవతుల) విషయమున సౌహార్దముతో ప్రవర్తింపుము. పూజ్యురాలైన కైకేయి రాజునకు అనుకూలముగా నుండు నట్లు చేయుము. 19

మూ. కుమారే భరతే వృత్తిర్వర్తితవ్యా చ రాజవత్,
అర్థజ్యేష్ఠా హి రాజానో రాజధర్మమనుస్మర. 20

ప్ర. అ. కుమారే = కుమారుడైన, భరతే = భరతుని విషయమున, రాజవత్ = రాజునందు వలె, వృత్తిః = ప్రవృత్తి, వర్తితవ్యా = అనుసరింపదగినది. రాజానః = రాజులు, అర్థజ్యేష్ఠాః హి = ధనముచేత జ్యేష్ఠులు కదా, లేదా ధనమే ప్రధానముగా కలవారుగదా! రాజధర్మమ్ = రాజధర్మమును, అనుస్మర = స్మరించుము.

తా. భరతుడు నీకు కుమారుడే యైనను అతని విషయమునందు రాజు విషయమున ప్రవర్తించి నట్లు ప్రవర్తించుచుండుము, రాజులు అర్థముచేత జ్యేష్ఠులుకదా! (రాజులకు అర్థమే ప్రధానముకదా!) రాజధర్మమును గుర్తుంచుకొనుము. 20

మూ. భరతః కుశలం వాచ్యో వాచ్యో మద్వచనేన చ,
సర్వాస్వేవ యథాన్యాయం వృత్తిం వర్తస్వ మాతృషు.

ప్ర. అ. భరతః = భరతుడు, కుశలమ్ = కుశలమును, వాచ్యః = చెప్పదగినవాడు. మద్వచనేన = నా మాటచేత, వాచ్యః చ = ఈ విధముగా చెప్పదగినవాడు. సర్వాసు = సమస్తమైన, మాతృషు = తల్లుల విషయమున, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, వృత్తిమ్ = ప్రవర్తనను, వర్తస్వ = అనుసరించుము.

తా. భరతుని కుశల మడిగి, ఆతనితో ఈ విధముగ కూడ చెప్పుము. "తల్లు లందరి విషయమునను, న్యాయానుసారముగా ప్రవర్తింపుము." 21

మూ. వక్తవ్యశ్చ మహాబాహురిక్ష్వాకుకులనన్దనః,
పితరం యౌవరాజ్యస్థో రాజ్యస్థమనుపాలయ. 22

ప్ర. అ. ఇక్ష్వాకుకులనన్దనః = ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడైన, మహాబాహుః = గొప్ప బాహువులు గల భరతుడు, వక్తవ్యశ్చ = ఈ విధముగా చెప్పదగినవాడు. యౌవరాజ్యస్థః = యౌవరాజ్యమునందు ఉన్నవాడవై, రాజ్యస్థమ్ = రాజ్యమునందున్న, పితరమ్ = తండ్రిని, అనుపాలయ = అనుసరించి రాజ్యపాలనము చేయుము.

తా. ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడైన ఆ భరతునితో మరి యొక

మాటకూడ చెప్పుము—"నీవు యౌవరాజ్యమును పొందిన పిదప, మహారాజుగా నున్న తండ్రిగారి అనుమతి ప్రకారము రాజ్యపాలనము చేయుము". 22

మూ. అతిక్రాన్తవయా రాజా మా స్మైనం వ్యవరోరుధః,
కుమారరాజ్యే జీవ త్వం తస్యైవాజ్ఞాప్రవర్తనాత్. 23

ప్ర. అ. రాజా = రాజు, అతిక్రాన్తవయాః = అతిక్రమించిన వయస్సు కలవాడు. ఏనమ్ = ఈయనను, మా స్మ వ్యవరోరుధః = నిర్బంధింపకుము. త్వమ్ = నీవు, తస్యైవ = ఆ మహారాజుయొక్కయే, ఆజ్ఞాప్రవర్తనాత్ = ఆజ్ఞను నడిపించుటవలన, కుమారరాజ్యే = యౌవరాజ్యమునందు, జీవ = జీవించుము (ఉండుము).

తా. రాజు చాల వృద్ధు డైనాడు. ఏ విషయమునందును ఆయనను నిర్బంధింపకుము. ఆయన ఆజ్ఞయే చెల్లునట్లు చూచుచు, నీ యౌవరాజ్యమును నడిపింపుము. 23

మూ. అబ్రవీచ్చాపి మాం భూయో భృశమశ్రూణి వర్తయన్,
మాతేవ మమ మాతా తే ద్రష్టవ్యా పుత్రగర్ధినీ. 24

ప్ర. అ. భృశమ్ = మిక్కిలి, అశ్రూణి = కన్నీళ్ళను, వర్తయన్ = కార్చుచు, మామ్ = నన్నుగూర్చి, భూయః = మరల, అబ్రవీచ్చాపి = పలికెను. పుత్రగర్ధినీ = పుత్రప్రేమవంతురా లైన, మమ మాతా = నా తల్లి, తే = నీకు (నీచే), మాతేవ = నీ తల్లి వలె, ద్రష్టవ్యా = చూడదగినది.

తా. అధికముగా కన్నీళ్ళు కార్చుచు, నాతో మరల ఇట్లు పలికెను. "పుత్రునిపై అధిక మైన ప్రేమ గల నా తల్లిని నీ తల్లిని వలె చూచుకొనుము." 24

మూ. ఇత్యేవం మాం మహారాజ బ్రువన్నేవ మహాయశాః,
రామో రాజీవతామ్రాక్షో భృశమశ్రూణ్యవర్తత. 25

ప్ర. అ. మహా రాజ = మహారాజా ! మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజీవతామ్రాక్షః = ఎఱ్ఱతామరపూవుల వలె ఎఱ్ఱ నైన నేత్రములు గల, రామః =

రాముడు, మామ్ = నన్ను గూర్చి, ఇత్యేవమ్ = ఈ విధంగా, బ్రువన్నేవ = పలుకుచునే, భృశమ్ = అధికముగా, అశ్రూణి = కన్నీళ్ళను, అవర్తత = విడచెను.

తా. మహారాజా! పద్మముల వలె ఎఱ్ఱని నేత్రములు కలవాడూ, మహాయశఃశాలీ అయిన రాముడు, నాతో ఈ విధముగా మాటలాడుచునే, అత్యధికముగ కన్నీళ్ళు రాల్చెను. 25

మూ. లక్ష్మణస్తు సుసంక్రుద్ధో నిశ్శ్వసన్ వాక్యమబ్రవీత్,
కేనాయమపరాధేన రాజపుత్రో వివాసితః. 26

ప్ర. అ. లక్ష్మణస్తు = లక్ష్మణుడైతే, సుసంక్రుద్ధః = మిక్కిలి కోపించినవాడై, నిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అయమ్ = ఈ, రాజపుత్రః = రాజకుమారుడు, కేన = ఏ, అపరాధేన = అపరాధముచేత, వివాసితః = నగరమునుండి వెడలగొట్టబడినాడు.

తా. లక్ష్మణుడు మాత్రము చాల కోపగించి, నిట్టూర్చుచు ఇట్లు పలికెను- "ఈ రాజకుమారుడు ఏ అపరాధముచేసినాడని ఇతనిని వెడలగొట్టినారు?" 26

మూ. రాజ్ఞా తు ఖలు కైకేయ్యా లఘు త్వాశ్రిత్య శాసనమ్,
కృతం కార్యమకార్యం వా వయం యేనాభిపీడితాః. 27

ప్ర. అ. రాజ్ఞా తు = రాజుచేత నైతే, కైకేయ్యాః = కైకేయియొక్క, లఘు = తుచ్ఛమైన, శాసనమ్ = శాసనమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, అకార్యమ్ = చేయగూడనిపని, కార్యం వా = చేయదగిన పని వలె, కృతమ్ = చేయబడినది, యేన = దేనిచేత, వయమ్ = మేము, అభిపీడితాః = పీడింపబడితిమో.

తా. రాజైతే, కైకేయి ఇచ్చిన తుచ్ఛమైన శాసనమును పాటించి, చేయకూడని పనిని ఒక చేయదగిన పని చేసినట్లు చేసినాడు. దీనితో మేమందరము కష్టపడవలసి వచ్చినది. 27

మూ. యది ప్రవ్రాజితో రామో లోభకారణకారితమ్,
వరదాననిమిత్తం వా సర్వథా దుష్కృతం కృతమ్. 28

ప్ర. అ. రామః = రాముడు, లోభకారణకారితమ్ = దురాశ అనెడు కారణముచే ప్రవర్తిపబడగా గాని, వరదాననిమిత్తం వా = వరదానము అనే కారణముచేత గాని, ప్రవ్రాజితః యది = నగరమునుండి వెడలగొట్టబడినట్లయితే, సర్వథా = అన్ని విధముల, దుష్కృతమ్ = చెడ్డ పని, కృతమ్ = చేయబడినది.

తా. రాముని, రాజ్యముపై దురాశచేత వెడలగొట్టినా, వరము అను కారణముచే వెడలగొట్టినా, ఏమైనను, చేసిన పని మాత్రము పూర్తిగా చెడ్డ పని. 28

మూ. ఇదం తావద్యథాకామమీశ్వరస్య కృతే కృతమ్,
రామస్య తు పరిత్యాగే న హేతుముపలక్షయే. 29

ప్ర. అ. ఇదం తావత్ = ఇది, ఈశ్వరస్య కృతే = ప్రభు వైన దశరథుని కొరకై, యథాకామమ్ = ఇష్టము వచ్చినట్లుగా, కృతమ్ = చేయబడినది. రామస్య = రామునియొక్క, పరిత్యాగే = త్యాగమువిషయమున, హేతుమ్ = కారణమును, న ఉపలక్షయే = చూడను.

తా. ఈ రామపరిత్యాగ మనునది, నేను ప్రభువును కదా అని దశరథుడు యథేచ్ఛగా చేసినదే కాని, ఇందుకు తగిన హేతువు నా కేమియు కనబడదు. 29

మూ. అసమీక్ష్య సమారబ్ధం విరుద్ధం బుద్ధిలాఘవాత్,
జనయిష్యతి సంక్రోశం రాఘవస్య వివాసనమ్. 30

ప్ర. అ. బుద్ధిలాఘవాత్ = బుద్ధిమాంద్యమువలన, అసమీక్ష్య = ఆలోచించకుండగ, సమారబ్ధమ్ = ప్రారంభించబడినది, విరుద్ధమ్ = శాస్త్రవిరుద్ధము అయిన, రాఘవస్య = రామునియొక్క, వివాసనమ్ = దూరముగా పంపివేయుట, సంక్రోశమ్ = దుఃఖమును, జనయిష్యతి = పుట్టించగలదు.

తా. సరిగా ఆలోచించక, తెలివితక్కువతనముచే రాముని ప్రవాసమునకు పంపివేయుట జరిగినది. ఇది దుఃఖమును కలిగించగలదు. 30

మూ. అహం తావన్మహారాజే పితృత్వం నోపలక్షయే,
భ్రాతా భర్తా చ బన్ధుశ్చ పితా చ మమ రాఘవః. 31

ప్ర. అ. అహమ్ = నేను, మహారాజే = మహారాజునందు, పితృత్వమ్ = పితృత్వమును, నోపలక్షయే = చూడను. మమ = నాకు, రాఘవః = రాముడే, భ్రాతా చ = సోదరుడు, భర్తా చ = ప్రభువు, బన్ధుశ్చ = బంధువు, పితా = తండ్రి.

తా. నేను దశరథమహారాజును తండ్రిగా పరిగణించను. నాకు సోదరు డైనను, ప్రభు వైనను, బంధు వైనను, తండ్రి యైనను రాముడే. 31

మూ. సర్వలోకప్రియం త్యక్త్వా సర్వలోకహితే రతమ్,
సర్వలోకోఽనురజ్యేత కథం త్వానేనకర్మణా. 32

ప్ర. అ. సర్వలోకప్రియమ్=సకలజనులకును ఇష్టుడు, సర్వలోకహితే= సకలజనుల హితమునందు, రతమ్ = ఆసక్తుడు అయిన రాముని, త్యక్త్వా = విడచి, అనేన కర్మణా = ఈ పనిచేత, త్వా = నిన్నుగూర్చి, సర్వలోకః = సకలలోకము, కథమ్ = ఎట్లు, అనురజ్యేత = అనురాగము కలదగును ?

తా. సకలజనులకు ప్రియుడు, సకలజనుల హితము కోరువాడు అయిన రాముని పరిత్యజించి, ఇట్టి అకార్యము చేసిన నీ విషయమున ఎవరికి అనురాగ ముండును ? 32

మూ. సర్వప్రజాభిరామం హి రామం ప్రవ్రాజ్య ధార్మికమ్,
సర్వలోకం విరుధ్యేమం కథం రాజా భవిష్యసి. 33

ప్ర. అ. సర్వప్రజాభిరామమ్ = సకలప్రజలకును మనోహరుడును, ధార్మికమ్ = ధార్మికుడును అయిన, రామమ్ = రాముని, ప్రవ్రాజ్య=దూరముగ పంపివేసి, ఇమమ్ = ఈ, సర్వలోకమ్ = సకలలోకమును, విరుధ్య=విరోధించి, రాజా=రాజువుగా, కథమ్ = ఎట్లు, భవిష్యసి =ఉండగలవు ?

తా. సకలప్రజలకును మనోహరుడు, ధార్మికుడు అయిన రాముని వనమునకు పంపి, ప్రజ లందరితో విరోధము తెచ్చుకొనిన నీవు రాజుగా ఎట్లు ఉండగలవు? 33

మూ. జానకీ తు మహారాజ నిశ్శ్వసన్తీ మనస్వినీ,
భూతోపహతచిత్తేవ విష్ఠితా విస్మృతాస్మితా. 34

ప్ర. అ. మహారాజ = మహారాజా!, మనస్వినీ = ఆత్మాభిమానము గల, జానకీ తు = జానకి యైతే, నిశ్శ్వసన్తీ = నిట్టూర్చుచున్నదై, భూతోపహతచిత్తేవ = భూతముచే ఆక్రమింపబడిన చిత్తము గలది వలె, విస్మృతాస్మితా = విస్మరింపబడిన తన ఉనికి గలదై, విక్షితా = వైకల్యముతో నిలచినది.

తా. మహారాజా! ఆత్మాభిమానవంతురా లగు జానకి యైతే, నిట్టూర్చుచు, తనను తాను మరచినదై, భూతముచే ఆక్రమింపబడిన మనస్సుకలది వలె, వికలయై నిలచినది. 34

మూ. అదృష్టపూర్వవ్యసనా రాజపుత్రీ యశస్వినీ,
తేన దుఃఖేన రుదతీ నైవ మాం కించిదబ్రవీత్. 35

ప్ర. అ. అదృష్టపూర్వవ్యసనా = పూర్వ మెన్నడును చూడబడని వ్యసనముకల, యశస్వినీ = కీర్తిమంతురా లైన, రాజపుత్రీ = ఆ రాజకుమారి, తేన = ఆ, దుఃఖేన = దుఃఖముచేత, రుదతీ = ఏడ్చుచున్నదై, మామ్ = నన్ను గూర్చి, కించిత్ = ఏమియు, నైవ అబ్రవీత్ = పలకనేలేదు.

తా. పూర్వ మెన్నడును ఇట్టి వ్యసనము ఎరుగని, కీర్తిమతి యైన ఆ సీత, దుఃఖముతో ఏడ్చుచు. నాతో ఏమియు చెప్పలేదు. 35

మూ. ఉద్వీక్షమాణా భర్తారం ముఖేన పరిశుష్యతా,
ముమోచ సహసా బాష్పం మాం ప్రయాన్తముదీక్ష్య సా.

ప్ర. అ. సా = ఆమె. ప్రయాన్తమ్ = తిరిగి వెళ్ళిపోవు చున్న, మామ్ = నన్ను, ఉదీక్ష్య = చూచి, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, భర్తారమ్ = భర్తను, ఉద్వీక్షమాణా = చూచుచు, సహసా = వెంటనే, బాష్పమ్ = కన్నీటిని. ముమోచ = విడచెను.

తా. తిరుగుముఖముతో ప్రయాణ మైన నన్ను చూచి, సీత, ఎండిపోవుచున్న ముఖముతో భర్త వైపు చూచుచు, కన్నీరు రాల్చెను. 36

మూ. తథైవ రామోఽశ్రుముఖః కృతాఞ్జలిః
స్థితోఽభవల్లక్ష్మణబాహుపాలితః,

తథైవ సీతా రుదతీ తపస్వినీ
నిరీక్షతే రాజరథం తథైవ మామ్. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తథైవ = అట్లే, రామః = రాముడు, అశ్రుముఖః = కన్నీళ్ళు ముఖమునందుకలవాడై, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలికలవాడై, లక్ష్మణబాహుపాలితః = లక్ష్మణుని బాహువుచే పాలింపబడినవాడై, స్థితః అభవత్ = నిలచెను. తథైవ = అట్లే, తపస్వినీ = దీనురాలైన, సీతా = సీత, రుదతీ = ఏడ్చుచున్నదై, రాజరథమ్ = రాజరథమును, తథైవ = మరియు, మామ్ = నన్నూ, నిరీక్షతే = చూచుచుండెను.

తా. రాముడు కూడ, కన్నీళ్లతో నిండిన ముఖముతో, చేతులు ఘటించి నమస్కరించుచు, లక్ష్మణుని భుజమును ఆనుకొని నిలబడెను. దీనురాలైన సీత ఏడ్చుచు, రాజరథము వైపునకు, నా వైపునకు చూచుచు నిలచిపోయెను. 37

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

* * *

# ఏకోనషష్టితమః సర్గః

[శ్రీరామవియోగముచే అయోధ్యాపురిలోని జడచేతనముల దురవస్థను సుమంత్రుడు చెప్పుట. దశరథుడు విలపించుట.]

మూ. ఇతి బ్రువన్తం తం సూతం సుమన్త్రం మన్త్రిసత్తమమ్,
బ్రూహి శేషం పునరితి రాజా వచనమబ్రవీత్. 1

ప్ర. అ. రాజా = దశరథుడు, ఇతి = ఇట్లు, బ్రువన్తమ్ = మాటలాడుచున్న, సూతమ్ = సారథి యైన, మన్త్రిసత్తమమ్ = మంత్రిశ్రేష్ఠుడైన, తం సుమన్త్రమ్ = ఆ సుమంత్రుని గూర్చి, శేషమ్ = మిగిలిన విషయమును, పునః = మరల, బ్రూహి = చెప్పుము, ఇతి = అని, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సుమంత్రుడు చెప్పిన మాటలు విని "ఇంకను మిగిలిన విషయములన్నీ చెప్పుము" అని రాజు, తన సారథీ, మంత్రిశ్రేష్ఠుడూ అయిన సుమంత్రునితో పలికెను. 1

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సుమన్త్రో బాష్పవిక్లవః,
కథయామాస భూయోఽపి రామసన్దేశవిస్తరమ్. 2

ప్ర. అ. సుమన్త్రః = సుమంత్రుడు, తస్య = అతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, బాష్పవిక్లబః = కన్నీటితో వ్యాకులుడై, రామసన్దేశవిస్తరమ్ = రాముని సందేశమునకు సంబంధించిన వివరములను, భూయోఽపి = మరల, కథయామాస = చెప్పెను.

తా. దశరథుని మాట విని, సుమంత్రుడు కన్నీళ్లతో వ్యాకులుడై, రాముని సందేశమునందలి వివరములను మరల చెప్పెను.

మూ. జటాః కృత్వా మహారాజ చీరవల్కలధారిణౌ,
గఙ్గాముత్తీర్య తౌ వీరౌ ప్రయాగాభిముఖౌ గతౌ. 3

ప్ర. అ. మహారాజ = ఓ మహారాజా!, చీరవల్కలధారిణౌ = నారచీరలను ధరించిన, తౌ వీరౌ = ఆ వీరులు, జటాః = జటలను, కృత్వా = చేసికొని, గఙ్గామ్ = గంగను, ఉత్తీర్య = దాటి, ప్రయాగాభిముఖౌ = ప్రయాగకు అభిముఖులై, గతౌ = వెళ్ళినారు.

ప్ర. అ. మహారాజా! నారచీరలు ధరించిన ఆ రామలక్ష్మణులు జటలు కట్టుకొని, గంగానది దాటి, ప్రయాగ వైపు వెళ్లిరి. 3

మూ. అగ్రతో లక్ష్మణో యాతః పాలయన్ రఘునన్దనమ్,
తాంస్తథా గచ్ఛతో దృష్ట్వా నివృత్తోఽస్మ్యవశస్తదా. 4

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, రఘునన్దనమ్ = రాముని, పాలయన్ = పాలించుచు, అగ్రతః = ముందు, యాతః = వెళ్లినాడు. తథా = అట్లు, గచ్ఛతః = వెళ్లుచున్న, తాన్ = వారిని, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, అవశః = ఏమియు చేయునది లేనివాడనై, నివృత్తః అస్మి = వెనుకకు మరలితిని.

తా. రాముని రక్షించుచు లక్ష్మణుడు ముందు నడచి వెళ్ళెను. ఈ విధముగా వెళ్లిపోవుచున్న వారిని చూచి, నేను చేయునదేమియు లేక తిరిగి వచ్చితిని.

వి. ఈ నాలుగు శ్లోకములు గోరఖ్‌పూర్ ప్రతిలో లేవు. వీటికి గోవిందరాజాదుల వ్యాఖ్య కూడ లేదు. అందుచే ఇవి ప్రక్షిప్తములు. 'కథయామాస భూయోఽపి రామసన్దేశవిస్తరమ్" అని రెండవశ్లోకములో అన్నను, సందేశమేదియు చెప్పలేదు.

మూ. మమ త్వశ్వా నివృత్తస్య న ప్రావర్తన్త వర్త్మని,
ఉష్ణమశ్రు ప్రముఞ్చన్తో రామే సంప్రస్థితే వనమ్. 5

ప్ర. అ. రామే = రాముడు, వనమ్ = వనమును గూర్చి, సంప్రస్థితే = ప్రయాణమైనవాడగుచుండగా, నివృత్తస్య = వెనుకకు మరలిన, మమ = నా యొక్క, అశ్వాః తు = గుఱ్ఱములైతే, ఉష్ణమ్ = వేడియైన, అశ్రు = కన్నీటిని, ప్రముఞ్చన్తః = విడచుచున్నవై, వర్త్మని = మార్గమునందు, న ప్రావర్తన్త = నడవలేదు.

తా. రాముడు అరణ్యమునకు ప్రయాణమైన పిమ్మట నేను వెనుకకు

మరలితిని. నా గుఱ్ఱములు మాత్రము వేడి యైన కన్నీళ్ళు కార్చుచు, మార్గము నందు నడచుటకు నిరాకరించినవి. 5

మూ. ఉభాభ్యాం రాజపుత్రాభ్యామథ కృత్వాహమఞ్జలిమ్,
ప్రస్థితో రథమాస్థాయ తద్దుఃఖమపి ధారయన్. 6

ప్ర. అ. అథ=అటు పిమ్మట, అహమ్=నేను, ఉభాభ్యామ్ = ఇరువురు, రాజపుత్రాభ్యామ్ = రాజపుత్రులకు, అఞ్జలిమ్ = దోసిలిని, కృత్వా = చేసి, తత్ =ఆ, దుఃఖమ్ అపి=దుఃఖమును, ధారయన్=ఆపుకొనుచు, రథమ్=రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, ప్రస్థితః = ప్రయాణ మైతిని.

తా. పిదప నేను, ఎటులనో ఆ దుఃఖమును ఆపుకొనుచు, రాజకుమారులిరువురికిని అంజలి ఘటించి నమస్కరించి రథము నెక్కి ప్రయాణ మైతిని. 6

మూ. గుహేన సార్ధం తత్రైవ స్థితోఽస్మి దివసాన్ బహూన్,
ఆశయా యది మాం రామః పునః శబ్దాపయేదితి. 7

ప్ర. అ. రామః = రాముడు, పునః = మరల, మామ్=నన్ను, శబ్దాపయేత్ · ద్యది=పిలచునా, ఇతి=అను, ఆశయా=ఆశచేత, తత్రైవ=ఆచటనే, గుహేన సార్ధమ్ = గుహునితో గూడ, బహూన్=చాల (మూడు), దివసాన్ = దినములను, స్థితః అస్మి=ఉంటిని.

తా. రాముడు మరల నన్ను పిలచు నేమో అను ఆశచే గుహునితో కలిసి అక్కడనే మూడు దినములు ఉండిపోయితిని. 7

మూ. విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః,
అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాఙ్కురకోరకాః. 8

ప్ర. అ. మహారాజ = మహారాజా! తే విషయే=నీ దేశమునందు, వృక్షాః అపి = చెట్లు కూడ, సపుష్పాఙ్కురకోరకాః= పుష్పములతో, అంకురములతో, మొగ్గలతో సహ, రామవ్యసనకర్శితాః = రామవ్యసనము చేత కృశించిన వై, పరిమ్లానాః = వాడిపోయినవి.

తా. మహారాజా! నీ దేశములో ఉన్న చెట్లు కూడ, రామవ్యసనము చే కృశించి, పుష్పములతో చిగుళ్ళతో మొగ్గలతో సహ వాడిపోయినవి. 8

మూ. ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసి చ,
పరిశుష్కపలాశాని వనాన్యుపవనాని చ. 9

ప్ర.అ. నద్యః = నదులు, ఉపతప్తోదకాః = కాగిన ఉదకము కలవి. పల్వలాని = చిన్న చెరువులు, సరాంసి చ = సరస్సులు, వనాని = వనములు, ఉపవనాని చ = ఉద్యానములు, పరిశుష్కపలాశాని = ఎండిన ఆకులు గలవి.

తా. నదులలోను, చిన్న చెరువులలోను, సరస్సులలోను ఉన్న నీరు వేడెక్కినది. వనములలోను, ఉద్యానములలోను (వృక్షాదుల) ఆకులు ఎండిపోయినవి. 9

మూ. న చ సర్పన్తి సత్త్వాని వ్యాళా న ప్రచరన్తి చ,
రామశోకాభిభూతం తన్నిష్కూజమభవద్వనమ్. 10

ప్ర. అ. సత్త్వాని = ప్రాణులు, న చ సర్పన్తి = కదలుట లేదు. వ్యాళాః చ = క్రూరమృగములు కూడ, న ప్రచరన్తి = సంచరించుట లేదు. తత్ వనమ్ = ఆ వనము, రామశోకాభిభూతమ్ = రామశోకముచేత పీడితమై, నిష్కూజమ్ = నిశ్శబ్దము, అభవత్ = ఆయెను.

తా. ప్రాణులన్నియు కదలకుండ పడియున్నవి. క్రూరమృగములు గూడ సంచరించుట లేదు. రాముని గూర్చిన శోకముచే పీడింపబడినదై ఆ అరణ్యము నిశ్శబ్దముగా నున్నది. 10

మూ. వనపుష్కరపత్రాశ్చ నరేన్ద్ర కలుషోదకాః,
సంతప్తపద్మాః పద్మిన్యో లీనమీనవిహఙ్గమాః. 11

ప్ర. అ. నరేన్ద్ర = రాజా! పద్మిన్యః = పద్మ సరస్సులు, లీనపుష్కరపత్రాః చ = కనబడకుండ అణగిపోయిన పద్మపత్రములు కలవై, కలుషోదకాః = కలుష మైన ఉదకములు కలవై, సంతప్తపద్మాః = వాడిపోయిన పద్మములు కలవై, మీనవిహఙ్గమాః = అణగి పడియున్న మీనములు, పక్షులు కలవై ఉన్నవి.

తా. మహారాజా! పద్మసరస్సులలోని జలము కలుష మై పోయినది. పద్మములు వాడిపోయి వాటి పత్రములు పైకి కనబడుట లేదు. ఆ సరస్సులోని చేపలు, పక్షులు అణగి పడి యున్నవి. 11

మూ. జలజాని చ పుష్పాణి మాల్యాని స్థలజాని చ,
నాద్య భాన్త్యల్పగన్ధీని ఫలాని చ యథాపురమ్. 12

ప్ర. అ. జలజాని = జలమునందు పుట్టిన, పుష్పాణి = పుష్పములు, స్థలజాని = స్థలమునందు పుట్టిన, మాల్యాని=పుష్పమాలలు, ఫలాని చ =ఫలములు, అద్య =ఇప్పుడు, అల్పగన్ధీని=అల్ప మైన గంధము గలవై, యథాపురమ్ = పూర్వమునందు వలె, న భాన్తి =ప్రకాశించుట లేదు.

తా. నీటిలో పుట్టు పద్మాదులు, నేలపై జనించు మల్లె, మొల్ల మొదలైన పుష్పములు, ఫలములు కూడ ఇపుడు సుగంధము తగ్గిపోయి, పూర్వము వలె మనోహరముగా లేవు. 12

మూ. అత్రోద్యానాని శూన్యాని ప్రలీనవిహగాని చ,
న చాభిరామానారామాన్ పశ్యామి మనుజర్షభ. 13

ప్ర. అ. అత్ర = ఇక్కడ, ఉద్యానాని=ఉద్యానములు, శూన్యాని=జనశూన్యములై, ప్రలీనవిహగాని చ = అణగిన పక్షులు కలవై యున్నవి. మనుజర్షభ = ఓ మనుజశ్రేష్ఠుడా! ఆరామాన్=ఉద్యానములను, అభిరామాన్=మనోహర మైన వాటినిగా, న పశ్యామి=నేను చూచుట లేదు.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడ వైన మహారాజా! ఇక్కడ ఉద్యానములన్నియు జనశూన్యములై, అణగి పడియున్న పక్షులతో, ఏ మాత్రము మనోహరములుగా కనబడుట లేదు. 13

మూ. ప్రవిశన్తమయోధ్యాయాం న కశ్చిదభినన్దతి,
నరా రామమపశ్యన్తో నిఃశ్వసన్తి ముహుర్ముహుః. 14

ప్ర. అ. అయోధ్యాయామ్=అయోధ్యలో, ప్రవిశన్తమ్ = ప్రవేశించుచున్న నన్ను, కశ్చిత్ = ఏ ఒక్కడును, న అభినన్దతి=అభినందించుటలేదు. నరాః= నరులు, రామమ్=రాముని, అపశ్యన్తః = చూడని వారై, ముహుర్ముహుః= మాటి మాటికి, నిశ్శ్వసన్తి=నిట్టూర్పుచున్నారు.

తా. అయోధ్యలో ప్రవేశించుచున్న నన్ను చూచి ఏ ఒక్కడును అభి

నందించుట లేదు. రాముడు కనబడక జనులందరు మాటిమాటికిని నిట్టూర్చు చున్నారు. 14

మూ. దేవ రాజరథం దృష్ట్వా వినా రామమిహాగతమ్,
దుఃఖాదశ్రుముఖః సర్వో రాజమార్గగతో జనః. 15

ప్ర. అ. దేవ=మహారాజా! వినా రామమ్=రాముడు లేకుండా, ఇహ=ఇక్కడికి, ఆగతమ్=వచ్చిన, రాజరథమ్=రాజరథమును, దృష్ట్వా=చూచి, రాజమార్గగతః=రాజమార్గమునం దున్న, సర్వః=సమస్త మైన, జనః=జనము, దుఃఖాత్=దుఃఖమువలన, అశ్రుముఖః = కన్నీళ్ళు ముఖమునందు కలది ఆయినది.

తా. మహారాజా! రాముడు లేకుండా తిరిగి వచ్చిన రాజరథమును చూచి రాజమార్గమునం దున్న జను లందరును దుఃఖముతో కన్నీళ్లు కార్చు చున్నారు. 15

మూ. హర్మ్యైర్విమానైః ప్రాసాదైరవేక్ష్య రథమాగతమ్,
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః. 16

ప్ర. అ. నార్యః=స్త్రీలు, హర్మ్యైః=మేడల నుండియు, విమానైః=ఏడంతస్తుల మేడల నుండియు, ప్రాసాదైః=రాజగృహములనుండియు, ఆగతమ్=వచ్చిన, రథమ్=రథమును, అవేక్ష్య=చూచి, రామాదర్శనకర్శితాః=రాముడు కనబడక పోవుటచే కృశించినవారై, హాహాకారకృతాః=హాహాకారములు చేసిరి.

తా. తిరిగి వచ్చిన రథమును హర్మ్యములనుండి, విమానములనుండి ప్రాసాదములనుండి చూచిన స్త్రీలు, రాముడు కనబడకపోవుటచే దుఃఖించుచు, హాహాకారము చేయుచున్నారు. 16

మూ. ఆయతైర్విమలైర్నేత్రైరశ్రువేగపరిప్లుతైః,
అన్యోన్యమభివీక్షన్తేఽవ్యక్తమార్తతరాః స్త్రియః. 17

ప్ర. అ. స్త్రియః=స్త్రీలు, ఆర్తతరాః=మిక్కిలిదుఃఖితలై, ఆయతైః=దీర్ఘ మైన, విమలైః=నిర్మల మైన, అశ్రువేగపరిప్లుతైః=కన్నీళ్ళ వేగముచే కలత చెందిన, నేత్రైః=నేత్రములతో, అవ్యక్తమ్=అస్పష్టముగా, అన్యోన్యమ్=పరస్పరము, అభివీక్షన్తే=చూచుచున్నారు.

తా. స్త్రీలు చాల దుఃఖించుచు దీర్ఘములు, నిర్మలములు, కన్నీళ్ళచే కలుషములు అయిన నేత్రములతో, ఒకరి నొకరు, అస్పష్టముగా చూచుకొనుచున్నారు. 17

మూ. నామిత్రాణాం న మిత్రాణాముదాసీనజనస్య చ,
అహమార్తతయా కించిద్విశేషముపలక్షయే. 18

ప్ర. అ. అహమ్=నేను, ఆర్తతయా=దుఃఖించుటచే (దుఃఖించుటలో), అమిత్రాణామ్=అమిత్రులలో, కించిత్=కొంచెమైనను, విశేషమ్=భేదమును, న ఉపలక్షయే=చూడను. మిత్రాణామ్=మిత్రులందును, ఉదాసీనజనస్య=ఉదాసీను లైన జనులకును, న=చూడను.

తా. రాముని ప్రవాసముచేత శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు, అందరును గూడ సమముగానే దుఃఖించుచున్నారు. వారి దుఃఖములో భేదమేమియు కనబడుటలేదు. 18

మూ. అప్రహృష్టమనుష్యా చ దీననాగతురంగమా,
ఆర్తస్వరపరిమ్లానా వినిఃశ్వసితనిస్స్వనా. 19
నిరానన్దా మహారాజ రామప్రవ్రాజనాతురా,
కౌసల్యా పుత్రహీనేవ అయోధ్యా ప్రతిభాతి మా. 20

ప్ర. అ. మహారాజ=మహారాజా!, అప్రహృష్టమనుష్యా చ=ఆనందము లేని మనుష్యులు కలది, దీననాగతురంగమా=దీన మైన ఏనుగులు గుఱ్ఱములు గలది, ఆర్తస్వరపరిమ్లానా=ఆర్తస్వరముచేత వాడిపోయినది, వినిశ్వసిత నిస్స్వనా=నిట్టూర్పుధ్వనులతో కూడినది, నిరానన్దా=ఆనందము లేనిది, రామప్రవ్రాజనాతురా=రాముని దూరముగా పంపివేయుటచే దుఃఖించుచున్నది అయిన, అయోధ్యా=అయోధ్య, పుత్రహీనా=పుత్రుడు దగ్గర లేని, కౌసల్యా

ఇవ = కౌసల్య వలె, మా = నన్ను గూర్చి (నాకు), ప్రతిభాతి = కనబడు చున్నది.

తా. మహారాజా! సంతోషము లేని మనుష్యులతో, దీనములైన గజాశ్వము లతో, ఆర్తస్వరముచేత వాడిపోయి, నిట్టూర్పుల ధ్వనులే అంతటను వ్యాపింప, ఆనందశూన్యమై, రాముని ప్రవాసముచేత దుఃఖించుచున్న అయోధ్య, నా దృష్టికి, పుత్రుడు దూరమైన కౌసల్య వలె కనబడుచున్నది. 19, 20

మూ. సూతస్య వచనం శ్రుత్వా వాచా పరమదీనయా,
బాష్పోపహతయా రాజా తం సూతమిదమబ్రవీత్. 21

ప్ర. అ. రాజా = రాజు, సూతస్య = సారథియొక్క, వచనమ్ = వచన మును, శ్రుత్వా = విని, పరమదీనయా = మిక్కిలి దీనము, బాష్పోపహతయా = బాష్పముచే అడ్డుకొనబడినది, అయిన, వాచా = వాక్కుతో, తం సూతమ్ = ఆ సారథిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథమహారాజు సూతుని మాటలు విని, డగ్గుత్తికచే ఆగిపోవు చున్న మాటలలో దైన్యము ఉట్టిపడ ఆతనితో ఇట్లనెను. 21

మూ. కైకేయ్యా వినియుక్తేన పాపాభిజనభావయా,
మయా న మన్త్రికుశలైర్వృద్ధైః సహ సమర్థితమ్. 22

ప్ర. అ. పాపాభిజనభావయా = దుష్టులైన బంధుజనులూ, దుష్టమైన భావమూ కల, కైకేయ్యా = కైకేయిచేత, వినియుక్తేన = ప్రేరేపించబడిన, మయా = నాచేత, మన్త్రికుశలైః = ఆలోచనయందు కుశలులైన, వృద్ధైః సహ = వృద్ధులతో కూడ, న సమర్థితమ్ = ఆలోచన చేయబడలేదు.

తా. దుష్టులైన బంధుజనులు, దుష్టమైన ఆశయము గల కైకేయి ప్రేరేపించగా, నేను ఆలోచనలో నేర్పరులైన వృద్ధులతో సంప్రతించకుండగా ఈ పని చేసితిని. 22

మూ. న సుహృద్భిర్న చామాత్యైర్మన్త్రయిత్వా చ నైగమైః,
మయాయమర్థః సంమోహాత్ స్త్రీహేతోః సహసా కృతః.

ప్ర. అ. సుహృద్భిః = స్నేహితులతో, న మన్త్రయిత్వా = ఆలోచించకుండగా, అమాత్యైః = మంత్రులతోను, నైగమైః చ = నిగమములకు సంబంధించినవారితోను (పౌరులు లేదా వర్తకుల శ్రేణులకు చెందినవారు), న మన్త్రయిత్వా = ఆలోచించకుండగా, మయా = నాచేత, అయమ్ = ఈ, అర్థః = కార్యము, స్త్రీహేతోః = స్త్రీకొరకై, సహసా = తొందరపాటుతో, కృతః = చేయబడినది.

తా. నే నొక స్త్రీ మాట విని, స్నేహితులతోను, మంత్రులతోను, నైగములతోను ఆలోచించకుండగా, ఈ పని, తొందరపడి చేసితిని. 23

మూ. భవితవ్యతయా నూనమిదం వా వ్యసనం మహత్,
కులస్యాస్య వినాశాయ ప్రాప్తం సూత యదృచ్ఛయా.

ప్ర. అ. సూత = సుమంత్రా ! వా = లేక, ఇదమ్ = ఈ, మహత్ = గొప్ప, వ్యసనమ్ = కష్టము, భవితవ్యతయా = అట్లు కావలసియుండుటచేత, అస్య = ఈ, కులస్య = కులముయొక్క, వినాశాయ = నాశమునకై, యదృచ్ఛయా = దైవవశముచేత, ప్రాప్తమ్=వచ్చినది, నూనమ్=నిశ్చయము.

తా. సుమంత్రా ! ఈ విధముగ కావలసి యుండుటచేతనే ఈ గొప్ప వ్యసనము, ఈ కులము నంతను నశింపచేయుటకై, దైవవశముచేత, వచ్చి పడినది. నిశ్చయము. 24

మూ. సూత యద్యస్తి తే కించిన్మయా తు సుకృతం కృతమ్,
త్వం ప్రాపయాశు మాం రామం ప్రాణాఃసంత్వరయన్తి మామ్

ప్ర. అ. సూత = ఓ సుమంత్రా ! మయా=నాచేత, తే=నీకు, కించిత్= ఏదైన, సుకృతమ్=ఉపకారము, కృతమ్=చేయబడి,అస్తి యది=ఉన్నట్లయితే, త్వమ్ = నీవు, ఆశు = శీఘ్రముగా, మామ్ = నన్ను, రామమ్ = రాముని, ప్రాపయ = పొందించుము. ప్రాణాః = ప్రాణములు, మామ్ = నన్ను, సంత్వరయన్తి = తొందరపెట్టుచున్నవి.

తా. సుమంత్రా: నీకు నే నేమాత్ర మైన ఉపకారము చేసి యున్నట్లయితే,

నన్ను రామునివద్దకు తీసికొని వెళ్లుము. నన్ను నా ప్రాణములు తొందరపెట్టు చున్నవి. 25

మూ. యద్యద్యాపి మమైవాజ్ఞా నివర్తయతు రాఘవమ్,
న శక్ష్యామి వినా రామం ముహూర్తమపి జీవితుమ్. 26

ప్ర. అ. అద్యాపి = ఇప్పుడు కూడ, మమ = నాయొక్క, ఆజ్ఞైవ = ఆజ్ఞయే చెల్లినచో, రాఘవమ్ = రాముని, నివర్తయతు = వెనుకకు మరల్చెదవుగాక. రామం వినా = రాముడు లేకుండా, ముహూర్తమపి = క్షణకాల మైనను, జీవితుమ్ = జీవించుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాను.

తా. ఇప్పుడు కూడ నా ఆజ్ఞ చెల్లుటకు వీలున్నచో, రాముని వెనుకకు తీసికొని రమ్ము. రాముడు లేకుండ క్షణకాల మైనను జీవింపజాలను. 26

మూ. అథవాపి మహాబాహుర్గతో దూరం భవిష్యతి,
మామేవ రథమారోప్య శీఘ్రం రామాయ దర్శయ. 27

ప్ర. అ. అథవా = లేదా, మహాబాహుః = గొప్ప బాహువులు గల రాముడు, దూరమ్ = దూరముగా, గతః భవిష్యతి = వెళ్లి యుండు నన్నచో, మామేవ = నన్నే, రథమ్ = రథమును, ఆరోప్య = ఎక్కించి, శీఘ్రమ్ = శీఘ్రముగా, రామాయ = రామునకు, దర్శయ = చూపుము.

తా. ఆజానుబాహు డైన రాముడు దూరము వెళ్లిపోవుటచే అతనిని తీసికొనివచ్చుటకు శక్యము కానిచో, నన్నే రథము నెక్కించి తీసికొని వెళ్ళి రాముని చూపుము. 27

మూ. వృత్తదంష్ట్రో మహేష్వాసః క్వాసౌ లక్ష్మణపూర్వజః,
యది జీవామి సాధ్వేనం పశ్యేయం సీతయా సహ. 28

ప్ర. అ. వృత్తదంష్ట్రః = గుండ్రని దంతములు కలవాడు, మహేష్వాసః = గొప్పధనస్సుకలవాడు అయిన, అసౌ = ఆ, లక్ష్మణపూర్వజః = రాముడు, క్వ = ఎక్కడ? ఏనమ్ = ఈతనిని, సీతయా సహ = సీతతో కూడ, సాధు = బాగుగా, పశ్యేయం యది = చూడ గల్గినచో, జీవామి = జీవింతును.

తా. సుంద్రని దంతములు గలవాడు, గొప్ప ధనుస్సును ధరించినవాడు అయిన ఆ రాముడు ఎక్కడ నున్నాడు? నేను సీతాసమేతు డైన ఆతనిని చూచినయెడలనే జీవించగలను. 28

మూ. లోహితాక్షం మహాబాహుమాముక్తమణికుణ్డలమ్,
రామం యది న పశ్యేయం గమిష్యామి యమక్షయమ్.

ప్ర. అ. లోహితాక్షమ్ = ఎఱ్ఱని నేత్రములు కలవాడు, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడు, ఆముక్తమణికుణ్డలమ్ = ధరింపబడిన మణికుండలములు గలవాడు అయిన, రామమ్ = రాముని, న పశ్యేయం యది = చూడక పోయినచో, యమక్షయమ్ = యమలోకమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. ఎఱ్ఱని నేత్రములు కలవాడు, ఆజానుబాహువు, మణికుండలములను ధరించినవాడూ అయిన రాముని చూడకున్నచో నేను మరణింతును. 29

మూ. అతో ను కిం దుఃఖతరం సోఽహమిక్ష్వాకునన్దనమ్,
ఇమామవస్థామాపన్నో నేహ పశ్యామి రాఘవమ్. 30

ప్ర అ. ఇమామ్ = ఈ, అవస్థామ్ = అవస్థను, ఆపన్నః = పొందిన, సః అహమ్ = అట్టి నేను, ఇక్ష్వాకుకులనన్దనమ్ = ఇక్ష్వాకుకులమునకు ఆనందకరుడైన, రాఘవమ్ = రాముని, ఇహ = ఇక్కడ, న పశ్యామి = చూడకున్నాను. అతః = దీనికంటె, దుఃఖతరమ్ = ఎక్కువ దుఃఖము కలిగించునది, కిం ను = ఏమి ఉండును!

తా. ఇట్టి దురవస్థలో నున్న నేను, ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడైన రాముని చూడజాలకున్నా ననగా ఇంతకంటె దుఃఖ మేమి ఉండును! 30

మూ. హా రామ రామానుజ హా హా వైదేహి తపస్విని,
న మాం జానీథ దుఃఖేన మ్రియమాణమనాథవత్. 31

ప్ర. అ. హా రామ = అయ్యో రామా! హా రామానుజ = అయ్యో లక్ష్మణా! తపస్విని = దీనురాల వైన, హా వైదేహి = అయ్యో! సీతా! మామ్ = నన్ను, దుఃఖేన = దుఃఖముతో, అనాథవత్ = నాథు డెవ్వడూ లేనివాడు వలె, మ్రియమాణమ్ = మరణించుచున్నవానినిగా, న జానీథ = ఎరుగరు కదా!

తా. అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో! దీనురాలవైన సీతా! అనాథుడు వలె నేను మరణించుచున్నా నను విషయము మీకు తెలియదు కదా! 31

మూ. స తేన రాజా దుఃఖేన భృశమర్పితచేతనః,
అవగాఢః సుదుష్పారం శోకసాగరమబ్రవీత్. 32

ప్ర. అ. తేన దుఃఖేన = ఆ దుఃఖముచేత, భృశమ్ = మిక్కిలి, అర్పిత చేతనః = లొంగిపోయిన చిత్తము గల, సః రాజా = ఆ రాజు, సుదుష్పారమ్= మిక్కిలి దాటశక్యము కాని, శోకసాగరమ్ = శోకసముద్రమును, అవగాఢః = ప్రవేశించినవాడై, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ దుఃఖముతో చిత్తము మిక్కిలి దుర్బల మైపోయిన ఆ దశరథుడు ఏ మాత్రము దాట శక్యము కాని శోకసాగరములో మునిగిపోయినవాడై ఇట్లు పలికెను. 32

మూ. రామశోకమహాభోగః సీతావిరహపారగః,
శ్వసితోర్మిమహావర్తో బాష్పఫేనజలావిలః, 33
బాహువిక్షేపమీనౌఘో విక్రన్దితమహాస్వనః.
ప్రకీర్ణకేశశైవాలః కైకేయీబడబాముఖః. 34
మమాశ్రువేగప్రభవః కుబ్జావాక్యమహాగ్రహః,
వరవేలో నృశంసాయా రామప్రవ్రాజనాయతః. 35
యస్మిన్ బత నిమగ్నోఽహం కౌసల్యే రాఘవం వినా,
దుస్తరో జీవతా దేవి మయాయం శోకసాగరః. 36

ప్ర. అ. దేవి = ఓ దేవీ! కౌసల్యే = కౌసల్యా, అహమ్ = నేను, యస్మిన్ = దేనియందు, నిమగ్నః = మునిగిపోయినానో, అసౌ = ఈ, శోకసాగరః = శోక సముద్రము, రామశోకమహాభోగః = రామునికొరకై శోక మనెడు వైశాల్యము గలది. సీతావిరహపారగః = సీతావిరహ మను అవతలి ఒడ్డువరకు వ్యాపించినది. శ్వసితోర్మిమహావర్తః = నిట్టూర్పు లనెడు తరంగములు, పెద్ద సుడులు కలది. బాష్పఫేనజలావిలః = కన్నీళ్లనెడు నురుగుతోను, జలముతోను వ్యాకుల

మీనము గలది. బాహువిక్షేపమీనౌఘః = బాహువులు విసరుట అనెడు మీన సమూహము గలది. విక్రన్దితమహాస్వనః = ఏడ్పు లను గొప్ప ధ్వని గలది. ప్రకీర్ణకేశశైవాలః = చిమ్మబడిన కేశము లనెడు నాచు గలది. కైకేయీ బడబాముఖః = కైకేయి అను బడబాగ్ని కలది. మమ = నాయొక్క, అశ్రువేగ ప్రభవః = కన్నీళ్ల వేగమునకు కారణ మైనది. కుబ్జావాక్యమహాగ్రహః = గూను దాని మాట లనెడు మొసళ్లు కలది. నృశంసాయాః = క్రూరురాలైన కైకేయి యొక్క, వరవేలః = వరములే ఒడ్డు గలది. రామప్రవ్రాజనాయతః = రాముని దూరముగా పంపివేయుటచేత సుదీర్ఘ మైనది. అయమ్ = ఈ, శోకసాగరః = శోకసముద్రము. రాఘవం వినా = రాముడులేకుండగా, మయా = నాచేత, జీవతా = జీవించియుండగా, దుస్తరః = దాటశక్యము కానిది. బత = ఎంత కష్టము:

తా. ఓ కౌసల్యాదేవీ! నేను ఈ శోక మనెడు మహాసముద్రములో మునిగి పోయినాను. రామశోకమే దీని మహావైశాల్యము. సీతావిరహమే దీని అవలి ఒడ్డు. నిట్టూర్పులే దీని తరంగములు, మరియు పెద్ద సుడులు. ఇది బాష్పమనెడు సుడులతోను, జలముతోను వ్యాకులముగా నున్నది. చేతులు కదుపుటయే (కదలుచున్న చేతులే) మీనసముదాయము. ఏడ్పులే మహాధ్వని. విరియబోసికొనిన కేశములే నాచు. కైకేయియే బడబాగ్ని. ఇది నా కన్నీళ్ల వేగమునకు కారణ భూతము. దీనిలో గూనుదాని మాటలే పెద్ద పెద్ద మొసళ్లు. క్రూరురాలైన కైకేయి అడిగిన వరములే తీరములు. రాముని దూరముగా పంపివేయుటచే ఇది అతిదీర్ఘ మైనది. రాముడు లేకుండగా, నేను దీనిని సజీవుడనై దాటజాలను. ఎంత కష్టము వచ్చిపడినది!

33-36.

మూ. అశోభనం యోఽహమిహాద్య రాఘవం
దిదృక్షమాణో న లభే సలక్ష్మణమ్,
ఇతీవ రాజా విలపన్ మహాయశాః
పపాత తూర్ణం శయనే స మూర్ఛితః. 37

ప్ర. అ. యః అహమ్ = ఏ నేను, అద్య = ఇప్పుడు, దిదృక్షమాణః = చూడగోరినవాడ నైనను, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, రాఘవమ్ = రాముని, ఇహ = ఇక్కడ, న లభే = పొందజాలకున్నానో, అట్టి నా చూడజాల

కుండుట, అశోభనమ్ = చాల చెడ్డది. ఇతీవ = ఈ విధముగా, మహాయశాః = గొప్ప కీర్తి గల, సః రాజా = ఆ రాజు, విలపన్ = విలపించుచు, మూర్ఛితః = మూర్ఛితుడై, తూర్ణమ్ = శీఘ్రముగా, శయనే = శయనముమీద, పపాత = పడెను.

తా. ''లక్ష్మణసహితుడైన రాముని చూడవలెనను కోరిక ఉన్నను నే నాతనిని ఇక్కడ చూడజాలకపోవుచున్నాను. ఇది ఏ మాత్రము బాగు లేదు". అని విలపించుచు మహాయశః శాలియైన ఆ దశరథుడు మూర్ఛిల్లి, శయనముపై పడిపోయెను. 37

మూ. ఇతి విలపతి పార్థివే ప్రణష్టే
కరుణతరం ద్విగుణం చ రామహేతోః,
వచనమనునిశమ్య తస్య దేవీ
భయమగమత్పునరేవ రామమాతా. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ. పార్థివే = రాజు, రామహేతోః = రామునికొరకై, కరుణతరమ్ = మిక్కిలి దీనముగా, ద్విగుణం చ = రెట్టింపు, విలపతి = విలపించుచు, ప్రణష్టే = మూర్ఛచెందగా, రామమాతా = రాముని తల్లియైన, దేవీ = కౌసల్య, తస్య = ఆతనియొక్క, వచనమ్ = వచనమును, అనునిశమ్య = విని, పునరేవ = మరల, భయమ్ = భయమును, అగమత్ = పొందెను.

తా. దశరథు డా విధముగ రామునికొరకై అతిదీనముగా, పూర్వము కంటెను రెట్టింపు దుఃఖముతో విలపించుచు మూర్ఛిల్లగా, రాముని తల్లియైన కౌసల్య, ఆ మాటలు విని చాల భయపడెను. 38

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదితొమ్మిదవసర్గ సమాప్తము.

## షష్టితమః సర్గః

[కౌసల్య విలపించుట. సుమంత్రుడు ఆమెను ఓదార్చుట.]

మూ. తతో భూతోపసృష్టేవ వేపమానా పునః పునః,
ధరణ్యాం గతసత్త్వేవ కౌసల్యా సూతమబ్రవీత్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కౌసల్యా = కౌసల్య, భూతోపసృష్టేవ = భూతముచేత ఆవేశించబడినది వలె, వేపమానా = వణకుచు, గతసత్త్వేవ = తొలగిన చైతన్యము గలది వలె, పునః పునః = మాటిమాటికిని, ధరణ్యామ్ = భూమిపై దొరలుచు, సూతమ్ = సారథిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అపుడు కౌసల్య భూతము ఆవహించినది వలె వణకుచు, స్పృహ తప్పినది వలె నేలపై మాటిమాటికిని దొర్లుచు, సుమంత్రునితో ఇట్లు పలికెను. 1

మూ. నయ మాం యత్ర కాకుత్స్థః సీతా యత్ర చ లక్ష్మణః,
తాన్ వినా క్షణమప్యత్ర జీవితుం నోత్సహే హ్యహమ్.

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, సీతా చ = సీతయు, యత్ర = ఎక్కడ ఉన్నారో, లక్ష్మణః = లక్ష్మణుడు, యత్ర = ఎక్కడ నున్నాడో, తత్ర = అచటికి, మామ్ = నన్ను, నయ = తీసికొని వెళ్లుము. తాన్ వినా = వాళ్లు లేకుండగ, అత్ర = ఇక్కడ, క్షణమపి = క్షణకాల మైనను, జీవితుమ్ = జీవించుటకు, అహమ్ = నేను, న ఉత్సహే = ఉత్సహించను.

తా. సీతారామలక్ష్మణు లెక్కడ ఉన్నారో, నన్ను కూడా అక్కడికే తీసికొని పొమ్ము. వాళ్లను విడచి నేను, ఇక్కడ, క్షణకాల మైనను ఉండుటకు ఇచ్ఛగింపను. 2

మూ. నివర్తయ రథం శీఘ్రం దణ్డకాన్నయ మామపి,
అథ తాన్నానుగచ్ఛామి గమిష్యామి యమక్షయమ్. 3

ప్ర. అ. రథమ్ = రథమును, శీఘ్రమ్=శీఘ్రముగా, నివర్తయ=వెనుకకు మరల్చుము. మామపి=నన్ను కూడ, దణ్డకాన్ = దండకారణ్యమును గూర్చి, నయ=తీసికొని వెళ్లుము. అథ = అట్లు కాక, తాన్ = వాళ్లను, నాను గచ్ఛామి=అనుసరించి వెళ్లకపోయినచో, యమక్షయమ్=యమలోకమును గూర్చి, గమిష్యామి=వెళ్లగలను.

తా. రథమును శీఘ్రముగా వెనుకకు మరల్చుము. నన్ను కూడ దండకారణ్యమునకు తీసికొని పొమ్ము. వాళ్లను అనుసరించి వెళ్లకపోయినచో నేను యమలోకమునకే పోయెదను. 3

మూ. శోకవేగోపహతయా స వాచా సజ్జమానయా,
ఇదమాశ్వాసయన్ దేవీం సూతః ప్రాఞ్జలిరబ్రవీత్. 4

ప్ర. అ. సః సూతః = ఆ సారథి, బాష్పవేగోపహతయా = బాష్పముయొక్క వేగముచేత కొట్టబడిన, సజ్జమానయా=తొట్రుపడుచున్న, వాచా = వాక్కుతో, దేవీమ్=కౌసల్యాదేవిని, ఆశ్వాసయన్=ఓదార్చుచు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఇదమ్= ఈ వాక్యమును, అబ్రవీత్ =పలికెను.

తా. సుమంత్రుడు అంజలి ఘటించి నమస్కరించుచు, బాష్పవేగము అడ్డుకొనగా తొట్రుపడుచున్న వాక్కుతో కౌసల్యను ఓదార్చుచు ఇట్లు పలికెను. 4

మూ. త్యజ శోకం చ మోహం చ సంభ్రమం దుఃఖజం తథా,
వ్యవధూయ చ సన్తాపం వనే వత్స్యతి రాఘవః. 5

ప్ర. అ. శోకమ్=శోకమును, మోహం= మోహమును, తథా=మరియు, దుఃఖజమ్= దుఃఖమువలన కలిగిన, సంభ్రమం చ =తొందరను, త్యజ = విడిచిపెట్టుము. రాఘవః=రాముడు, సంతాపమ్=దుఃఖమును, వ్యవధూయ = విడచి, వనే=వనమునందు, వత్స్యతి=నివసించగలడు.

తా. శోకమును, మోహమును, దుఃఖమువలన కలిగిన తొందరపాటును విడిచిపెట్టుము. రాముడే కష్టములును లేకుండ వనములో నివసింపగలడు. 5

మూ. లక్ష్మణశ్చాపి రామస్య పాదౌ పరిచరన్వనే,
ఆరాధయతి ధర్మజ్ఞః పరలోకం జితేన్ద్రియః. 6

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మము నెరిగిన, లక్ష్మణశ్చాపి = లక్ష్మణుడు కూడ, వనే = వనమునందు, జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములుకల వాడై, రామస్య=రాముని యొక్క, పాదౌ=పాదములను, పరిచరన్=సేవించుచు, పరలోకమ్ = పరలోకమును, ఆరాధయతి = సాధించుచున్నాడు.

తా. ధర్మజ్ఞుడైన లక్ష్మణుడు, జితేంద్రియుడై, వనమునందు రాముని పాదసేవ చేయుచు పరలోకమును సాధించుచున్నాడు. 6

మూ. విజనేఽపి వనే సీతా వాసం ప్రాప్య గృహేష్వివ,
విస్రమ్భం లభతేఽభీతా రామే సన్న్యస్తమానసా. 7

ప్ర. అ. సీతా = సీత, విజనే = జనశూన్య మైన, వనేఽపి=వనమునందు గూడ, గృహేష్వివ = గృహమునందు వలె, వాసమ్ = నివాసమును, ప్రాప్య = పొంది, రామే = రామునియందు, సన్న్యస్తమానసా = ఉంచబడిన మనస్సు కలదై, అభీతా = భయపడనిదై, విస్రమ్భమ్ = విశ్వాసమును, లభతే = పొందు చున్నది

తా. సీత వనమునందు, గృహమునందు వలె నివసించుచు, మనస్సును రాముని పైననే నిలపి, భయము లేనిదై, విశ్వాసముతో ఉన్నది. 7

మూ. నాస్యా దైన్యం కృతం కించిత్సుసూక్ష్మమపి లక్ష్యతే,
ఉచితేవ ప్రవాసానాం వైదేహీ ప్రతిభాతి మా. 8

ప్ర. అ. అస్యాః = ఈ సీతకు, సుసూక్ష్మమపి = చాల సూక్ష్మమైనను, దైన్యమ్ = దైన్యము, కించిత్ = కొంచె మైనను, కృతమ్ = చేయబడినది, న లక్ష్యతే = చూడబడుటలేదు. వైదేహీ = సీత, ప్రవాసానామ్ = ప్రవాసములకు, ఉచితేవ = అలవాటుపడినది వలె, మా = నన్ను గూర్చి (నాకు), ప్రతిభాతి = తోచుచున్నది.

తా. సీతలో ఏ మాత్రము కూడ దైన్యము కనబడుటలేదు. ఆమె ఎన్నియో ప్రవాసములకు, ఎప్పటినుండియో అలవాటుపడి నట్లు నాకు కనబడు చున్నది. 8

మూ. నగరోపవనం గత్వా యథా స్మ రమతే పురా,
తథైవ రమతే సీతా నిర్జనేషు వనేష్వపి. 9

ప్ర. అ. సీతా = సీత, పురా = పూర్వము, నగరోపవనమ్ = నగరము నందలి ఉద్యానవనమును గూర్చి, గత్వా = వెళ్లి, యథా = ఎట్లు, రమతే స్మ = క్రీడించుచుండెడిదో, నిర్జనేషు = నిర్జనము లైన, వనేష్వపి = వనములందు కూడ, తథైవ = అట్లే, రమతే = క్రీడించుచున్నది.

తా. సీత, పూర్వము నగరోద్యానములకు వెళ్లి అక్కడ ఏ విధముగ క్రీడించుచుండెడిదో, అట్లే నిర్జనము లైన అరణ్యములందు కూడ విహరించు చున్నది. 9

మూ. బాలేవ రమతే సీతాఽబాలచన్ద్రనిభాననా,
రామా రామే హ్యదీనాత్మా విజనేఽపి వనే సతీ. 10

ప్ర. అ. రామా = మనోహరురాలు, రామే = రామునియందు, అదీనాత్మా = అధీన మైన మనస్సుకలది, అబాలచన్ద్రనిభాననా = పూర్ణచంద్రుని వంటి ముఖము కలది అయిన, సీతా = సీత, విజనే = జనశూన్య మైన, వనే = వనమునందు, సతీ అపి = ఉన్నను, బాలేవ = చిన్న బాలిక వలె, రమతే = సుఖముగా క్రీడించుచున్నది.

తా. పూర్తిగా రామునిపై చిత్తము నిలిపిన ఆ పూర్ణచంద్రముఖి యగు సీత, విజన మైన వనములో నివసించుచున్నను, బాలిక వలె విహరించు చున్నది.

మూ. తద్గతం హృదయం హ్యస్యాస్తదధీనం చ జీవితమ్,
అయోధ్యాపి భవేత్తస్యా రామహీనా తదా వనమ్. 11

ప్ర అ. అస్యాః = ఈమెయొక్క, హృదయమ్ = హృదయము, తద్గతమ్ = ఆ రామునే పొందియున్నది. జీవితం చ = జీవితము కూడ, తదధీనమ్ = అతనిపై ఆధారపడియున్నది. అయోధ్యాపి = అయోధ్య కూడ, రామహీనా = రాముడు లేనిది అయినచో, తదా = అప్పుడు, తస్యాః = ఆమెకు, వనమ్ = వనముగా, భవేత్ = అగును.

తా. ఆమె హృదయ మెల్లప్పుడును రామునియందే లగ్నమైనది. ఆమె జీవితము రామునిపై ఆధారపడి యున్నది. రాముడు లేనిచో అయోధ్య కూడ ఆమెకు వనమే అగును. 11

మూ. పరిపృచ్ఛతి వైదేహీ గ్రామాంశ్చ నగరాణి చ.
గతిం దృష్ట్వా నదీనాం చ పాదపాన్వివిధానపి. 12
రామం హి లక్ష్మణం వాపి పృష్ట్వా జానాతి జానకీ,
అయోధ్యాక్రోశమాత్రే తు విహారమివ సంశ్రితా. 13

ప్ర. అ. అయోధ్యాక్రోశమాత్రే=అయోధ్యకు క్రోసు దూరమునం దున్న, విహారమ్ = ఉద్యానవనమును, సంశ్రితా ఇవ = ఆశ్రయించి ఉన్నది వలె, వైదేహీ = సీత, గ్రామాంశ్చ = గ్రామములను, నగరాణి చ = నగరములను, నదీనామ్ = నదులయొక్క, గతిం చ = గమనమును, వివిధాన్=అనేక విధములైన, పాదపానపి = వృక్షములను, దృష్ట్వా=చూచి, రామమ్ = రాముని, పరిపృచ్ఛతి = ప్రశ్నించును. లక్ష్మణం వాపి = లక్ష్మణునైనా, పృష్ట్వా = ప్రశ్నించి, జానాతి = వాటిని గూర్చి తెలుసుకొనుచున్నది.

తా. సీత, వనములో నున్నను, అయోధ్యకు క్రోసు దూరమునం దున్న ఉద్యానవనములో ఉన్నట్లు ప్రవర్తించుచు, తనకు కనబడిన గ్రామములు, నగరములు, నదీప్రవాహములు, వివిధవృక్షములు మొదలగు వాటిని గూర్చి రాముని గాని, లక్ష్మణుని గాని ప్రశ్నించి తెలుసుకొనుచున్నది. 12, 13

మూ. ఇదమేవ స్మరామ్యస్యాః సహసైవోపజల్పితమ్,
కైకేయీసంశ్రితం వాక్యం నేదానీం ప్రతిభాతి మా. 14

ప్ర. అ. అస్యాః = ఈమెయొక్క. ఇదమేవ = దీనిని మాత్రమే, స్మరామి = స్మరించుచున్నాను. సహసైవ = తొందరగా, ఉపజల్పితమ్=పలకబడిన, కైకేయీసంశ్రితమ్ = కైకేయిని గూర్చిన, వాక్యమ్ = వాక్యము, ఇదానీమ్ = ఇప్పుడు, మా = నన్ను గూర్చి (నాకు), న ప్రతిభాతి = స్ఫురించుటలేదు.

తా. సీతకు సంబంధించి ఈ విషయము మాత్రమే నాకు జ్ఞప్తిలో ఉన్నది. కైకేయినిగూర్చి ఆమె తొందరగా ఏమో అన్నది గాని, అది నాకు ఇప్పుడు గుర్తు లేదు. 14

మూ. ధ్వంసయిత్వా తు తద్వాక్యం ప్రమాదాత్పర్యుపస్థితమ్,
హ్లాదనం వచనం సూతో దేవ్యా మధురమబ్రవీత్. 15

ప్ర. అ. సూతః = సారథి, ప్రమాదాత్ = పొరబాటువలన, పర్యుపస్థితమ్ = (నాలుక చివరకు) వచ్చిన, తద్వాక్యమ్ = కైకేయిని గూర్చి సీత అన్న మాటను, ధ్వంసయిత్వా = కప్పిపుచ్చి, దేవ్యాః = కౌసల్యకు, హ్లాదనమ్ = ఆనందము కలిగించు, మధురమ్ = మధుర మైన, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా నాలుక చివరకు వచ్చిన, కైకేయిని గూర్చి సీత అన్న మాటలను కప్పిపుచ్చి, సుమంత్రుడు, కౌసల్యకు ఆనందమును కలిగించు, మధుర మైన వాక్యము పలికెను.

వి. సుమంత్రుడు సీతకు సంబంధించిన విషయములు చెప్పుచుండగా, ఆమె కైకేయిని గూర్చి అన్న పరుషవాక్యములు కూడ నాలుకచివరకు వచ్చినవి. ఆ మాటలు కూడ చెప్పినచో కౌసల్యాదులకు ఇంకను దుఃఖము కలుగు నని అతడు వెంటనే గ్రహించి, మాట మార్చివేసి. "కైకేయిని గూర్చి కూడ సీత ఏమేమియో అన్నది కాని, తొందరగా చెప్పుటచే అది నా కిపుడు గుర్తు లేదు" అని ఆ ప్రసంగము దాటవేసి, కౌసల్యకు ఆనందము కలిగించు విషయము చెప్పె నని భావము. 15

మూ. అధ్వనా వాతవేగేన సంభ్రమేణాతపేన చ,
న విగచ్ఛతి వైదేహ్యాశ్చన్ద్రాంశుసదృశా ప్రభా. 16

ప్ర. అ. వైదేహ్యాః = సీతయొక్క, చన్ద్రాంశుసదృశా = చంద్రుని కిరణములతో, సమాన మైన, ప్రభా = కాంతి, అధ్వనా = మార్గమునందు ప్రయాణము చేయుటచేత గాని, వాతవేగేన = వాయువేగముచేత గాని, సంభ్రమేణ = కంగారుపడుటచేత గాని, ఆతపేన చ = ఎండచేత గాని, న విగచ్ఛతి = తొలగుటలేదు.

తా. ప్రయాణముచేత గాని, వాయువేగముచేత గాని, కంగారుపడుటచేత గాని, ఎండచేత గాని, చంద్రకిరణములతో సమాన మైన సీత శరీరకాంతి ఏ మాత్రము వాడిపోవుటలేదు. 16

మూ. సదృశం శతపత్రస్య పూర్ణచన్ద్రోపమప్రభమ్,
వదనం తద్వదాన్యాయా వైదేహ్యా న వికమ్పతే. 17

ప్ర. అ. వదాన్యాయాః=ఉదారస్వభావము గల, వైదేహ్యాః=సీతయొక్క, శతపత్రస్య = పద్మమునకు (తో), సదృశమ్ = సమాన మైనదీ, పూర్ణచన్ద్రోపమప్రభమ్=పూర్ణచంద్రునితో సమాన మైన కాంతి కలదీ, అయిన, తత్ వదనమ్= ఆ ముఖము, న వికమ్పతే=చలించుట లేదు.

తా. పద్మముతో సమానమూ, పూర్ణచంద్రునివంటి కాంతి గలదీ అయిన, ఉదారస్వభావురా లగు ఆ సీత ముఖము ఏ మాత్రము వసివాడలేదు. 17

మూ. అలక్తరసరక్తాభావలక్తరసవర్జితౌ,
అద్యాపి చరణౌ తస్యాః పద్మకోశసమప్రభౌ. 18

ప్ర. అ. అలక్తరసరక్తాభౌ = లత్తుక రసము వలె ఎఱ్ఱని కాంతి కలవీ, అలక్తరసవర్జితౌ = అలక్తరసము లేనివి అయిన, తస్యాః = ఆమెయొక్క, చరణౌ = పాదములు, అద్యాపి = ఇప్పుడును, పద్మకోశసమప్రభౌ = పద్మకోశములతో సమాన మైన కాంతి కలవి.

తా. ఆమె పాదములకు లత్తుక (పారాయణ) వ్రాసుకొనకపోయినను అవి లత్తుక వలె ఎఱ్ఱగా నుండి, ఇప్పుడు కూడ, పద్మపు మొగ్గల వంటి కాంతితో ప్రకాశించుచున్నవి. 18

మూ. నూపురోద్ఘుష్టహేలేవ ఖేలం గచ్ఛతి భామినీ,
ఇదానీమపి వైదేహీ తద్రాగాన్న్యస్తభూషణా. 19

ప్ర. అ. భామినీ = సీత, నూపురోద్ఘుష్టహేలేవ = నూపురములచే ఘోషించబడుచున్న విలాసములు కలది వలె, ఖేలమ్ = ఆడుకొనుచున్నట్లు, గచ్ఛతి = నడచుచున్నది. వైదేహీ = సీత, ఇదానీమపి = ఇప్పుడు కూడ, తద్రాగాత్ = రామునియందు అనురాగమువలన, న్యస్తభూషణా = ధరించబడిన అలంకారములు కలది.

తా. సీత ఆడుకొనుచున్నట్లు నడచుచుండగా ఆమె కాలి నూపురములు, ఆమె విలాసమును ఘోషించుచున్నట్లున్నవి. సీత ఇప్పుడు, రామునకు ఆనందమును కలిగించుటకై భూషణములు ధరించి ఉన్నది. 19

మూ. గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వా వనమాశ్రితా,
నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా. 20

ప్ర. అ. వనమ్=వనమును, ఆశ్రితా=ఆశ్రయించిన ఆ సీత, రామస్య=రామునియొక్క, బాహూ = బాహువులను, సంశ్రితా = ఆశ్రయించినదై, గజం వా = గజమును గాని, సింహం వా = సింహమును కాని, వ్యాఘ్రం వా= పులిని గాని, వీక్ష్య = చూచి, సంత్రాసమ్ = భయమును, నాహారయతి = చెందుటలేదు.

తా. వనములో ఉన్న ఆ సీత, రాముని బాహుబలముచే రక్షింపబడుచు ఏనుగను గాని, సింహమును గాని, వ్యాఘ్రమును గాని చూచి కూడ భయపడుటలేదు. 20

మూ. న శోచ్యాస్తే న చాత్మానః శోచ్యో నాపి జనాధిపః,
ఇదం హి చరితం లోకే ప్రతిష్ఠాస్యతి శాశ్వతమ్. 21

ప్ర. అ. తే = వారు, న శోచ్యాః = విచారింపతగనివారు. ఆత్మానః చ= మనము కూడ, న=దుఃఖించతగినవారము కాదు. జనాధిపః అపి=రాజు కూడ, న=విచారింపదగినవాడు కాదు. ఇదమ్=ఈ, చరితమ్=చరిత్ర, లోకే=లోకమునందు, శాశ్వతమ్ = స్థిరముగా, ప్రతిష్ఠాస్యతి = ఉండగలదు.

తా. వారిని గూర్చి గాని, మనలను గూర్చి గాని, మహారాజును గూర్చి గాని విచారించవలసిన పని లేదు. ఈ చరిత్ర లోకమునందు స్థిరముగా నిలచి ఉండగలదు. 21

మూ. విధూయ శోకం పరిహృష్టమానసాః
మహర్షియాతే పథి సువ్యవస్థితాః,
వనే రతా వన్యఫలాశనాః పితుః
శుభాం ప్రతిజ్ఞాం పరిపాలయన్తి తే. 22

ప్ర. అ. తే = వారు, శోకమ్ = శోకమును, విధూయ = విడిచి, పరిహృష్టమానసాః = సంతోషించిన మనస్సులు కలవారై, మహర్షియాతే = మహర్షులచేత అనుసరించబడిన, పథి=మార్గమునందు, సువ్యవస్థితాః=చక్కగా నిలచిన వారై, వనే = వనమునందు, రతాః = ఆసక్తి కలవారై, వన్యఫలాశనాః = వనములందలి ఫలములను భుజించుచున్నవారై, పితుః = తండ్రియొక్క, శుభామ్=శుభమైన, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, పరిపాలయన్తి=పాలించుచున్నారు.

తా. ఆ సీతారామలక్ష్మణులు శోకమును విడచి, సంతోషముతో గూడిన మనస్సులతో, మహర్షులు నడచిన మార్గమునందు స్థిరముగా ఉన్నవారై, వనములో ఆనందించుచు, అక్కడ లభించు ఫలములను భుజించుచు, తండ్రియొక్క శుభమైన ప్రతిజ్ఞను పాలించుచున్నారు. 22

మూ. తథాపి సూతేన సుయుక్తవాదినా
నివార్యమాణా సుతశోకకర్శితా,
న చైవ దేవీ విరరామ కూజితాత్
ప్రియేతి పుత్రేతి చ రాఘవేతి చ. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షష్టితమః సర్గః.

ప్ర. అ. సుయుక్తవాదినా=చాల యుక్తముగా మాటలాడుచున్న, సూతేన= సుమంత్రునిచేత, తథా = ఆ విధముగా, నివార్యమాణాపి = నివారింపబడుచున్నను దేవీ = కౌసల్య, సుతశోకకర్శితా = పుత్రశోకముచే కృశించినదై, ప్రియేతి = ప్రియుడా అని, పుత్రేతి = పుత్రుడా అని, రాఘవేతి చ=రామా అని, కూజితాత్=అరచుటనుండి, న చైవ విరరామ = విరమించనే లేదు.

తా. యుక్తముగా పలుకుచున్న సుమంత్రుడీ విధముగా నివారించుచున్నను కౌసల్య పుత్రశోకముచే పీడితురాలై "ప్రియపుత్రా రామా!" అని అరచుట మానలేదు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదవ సర్గ సమాప్తము

# ఏకషష్టితమః సర్గః

[కౌసల్యా విలపించుచు దశరథుని నిందించుట]

మూ. వనం గతే ధర్మపరే రామే రమయతాం వరే,
కౌసల్యా రుదతీ స్వార్తా భర్తారమిద మబ్రవీత్. 1

ప్ర. అ. ధర్మపరే = ధర్మముచేత శ్రేష్ఠుడు, రమయతామ్ = ఆనందింప చేయువారిలో, వరే = శ్రేష్ఠుడు అయిన, రామే = రాముడు, వనమ్ = వనమును గూర్చి, గతే = వెళ్లినవా డగుచుండగా, కౌసల్యా = కౌసల్య, స్వార్తా = మిక్కిలి దుఃఖితురాలై, రుదతీ = ఏడ్చుచు, భర్తారమ్ = భర్తను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మము ఆచరించుటలో శ్రేష్ఠుడు, ఆనందము కలిగించువారిలో అగ్రగణ్యుడూ అయిన రాముడు అరణ్యమునకు వెళ్ళిన పిదప కౌసల్య చాలా దుఃఖించుచు, ఏడ్చుచు భర్తతో ఇట్లు పలికెను.

మూ. యద్యపి త్రిషు లోకేషు ప్రథితం తే మహద్యశః,
సానుక్రోశో వదాన్యశ్చ ప్రియవాదీ చ రాఘవః. 2

ప్ర. అ. రాఘవః = దశరథుడు, సానుక్రోశః = జాలి కలవాడు, వదాన్యశ్చ = ఔదార్యవంతుడు, ప్రియవాదీ చ = ప్రియముగా మాటలాడువాడు, అని, తే = నీయొక్క, మహత్ = గొప్ప, యశః = కీర్తి, త్రిషు = మూడు, లోకేషు = లోకములందు, ప్రథితం యద్యపి = ప్రసిద్ధమైతే కావచ్చును.

తా. "దశరథుడు దయాశీలుడు, ఉదారస్వభావము కలవాడు; ప్రియముగా మాటలాడువాడు'' అని నీకు మూడు లోకములందును గొప్ప కీర్తి ఉండిన ఉండ వచ్చును.

వి. ఈ శ్లోకం 'యద్యపి' తో ప్రారంభమై అర్థము అసంపూర్ణంగా

ఉండుటచేత వ్యాఖ్యాతలు-"తథాపి అతిశయితాపయశస్కరం కృత్యం కృతమ్" అను పదాలు అధ్యాహారముగా గ్రహించి - "అయినను కీర్తికంటె అధిక మైన అపకీర్తిని కలిగించు పని చేయబడినది" అని అర్థము చెప్పినారు. ఇన్ని పదములు అధ్యాహారముగా తీసికొనుట అంత యుక్త మని తోచదు. అందుచేత "నీ కింత కీర్తి ఉన్నను రామాదులు అరణ్యంలో దుఃఖమును ఎట్లు సహింతురు" అని ఉత్తర శ్లోకముతో సమన్వయము చేసి అర్థము చెప్పినాము. ప్రాచ్యపాఠము గ్రహించినచో ఇంకను బాగుండును.

"యదిదం త్రిషు లోకేషు ప్రథితం తే మహద్యశః,
పుత్రప్రవ్రాజనాత్ తత్తే ప్రనష్టమివ లక్షయే"

అని అందలి శ్లోకము (61-3). "మూడు లోకములలో ప్రసిద్ధ మైన నీ కీర్తి అంతయు కుమారుని పంపివేయుటచే నశించిన దని తలచెదను" అని దాని భావము. 2

మూ. కథం నరవరశ్రేష్ఠ పుత్రౌ తౌ సహ సీతయా
దుఃఖితౌ సుఖసంవృద్ధౌ వనే దుఃఖం సహిష్యతః. 3

ప్ర. అ. నరవరశ్రేష్ఠ = నరవరులలో శ్రేష్ఠుడా! సుఖసంవృద్ధౌ = సుఖముగా పెరిగిన, తౌ పుత్రౌ = ఆ పుత్రు లిద్దరును, సీతయా సహ = సీతతో కూడ, దుఃఖితౌ = దుఃఖించుచు, వనే = వనమునందు, దుఃఖమ్ = దుఃఖమును, కథమ్ = ఎట్లు, సహిష్యతః = సహింపగలరు ?

తా. (నీ కెంత కీర్తి ఉన్నను), రాజులలో శ్రేష్ఠుడ వైనవాడా! చిన్నతనమునుండియు సుఖముగా పెరిగిన, సీతాసహితు లైన నీ కుమారు లిరువురును దుఃఖించుచు, వనములో క్లేశములను ఎట్లు సహించగలరు ? 3

మూ. సా నూనం తరుణీ శ్యామా సుకుమారీ సుఖోచితా,
కథముష్ణం చ శీతం చ మైథిలీ ప్రసహిష్యతే. 4

ప్ర. అ. తరుణీ = యువతీ, శ్యామా = యౌవనమధ్యమునం దున్నదీ, సుకుమారీ = సుకుమారురాలూ, సుఖోచితా = సుఖమునకు అలవాటుపడినదీ

అయిన, సా మైథిలీ = ఆ సీత, ఉష్ణం చ = వేడిని, శీతం చ = శీతమును, నూనమ్ = సత్యముగా, కథమ్ = ఎట్లు, ప్రసహిష్యతే = సహించగలదు ?

తా. సుకుమారి, సుఖములకు అలవాటుపడినదీ అయిన ఆ సీత యౌవనమధ్యమునం దున్నది. అట్టి ఆ తరుణి శీతోష్ణములను ఎట్లు సహింప గలదు ? 4

మూ. భుక్త్వాశనం విశాలాక్షీ సూపదంశాన్వితం శుభమ్,
వన్యం నైవారమాహారం కథం సీతోపభోక్ష్యతే. 5

ప్ర. అ. విశాలాక్షీ = విశాల మైన నేత్రములు గల, సీతా = సీత, సూపదంశాన్వితమ్ = సూపములతోను సంజులతోను కూడిన, శుభమ్ = మంచి, అశనమ్ = ఆహారమును, భుక్త్వా = భుజించి, వన్యమ్ = వనమునకు సంబంధించిన, నైవారమ్ = నెవరుధాన్యముతో చేసిన, ఆహారమ్ = ఆహారమును, కథమ్ = ఎట్లు, ఉపభోక్ష్యతే = తినగలదు ?

తా. ఇంత వరకును, సూపములతోను, ఉపదంశములతోను కూడిన మంచి ఆహారమును భుజించుచున్న విశాలాక్షి యైన సీత, అరణ్యములో లభించు నెవరు ధాన్యముతో చేసిన ఆహారమును ఎట్లు తినగలదు ? 5

మూ. గీతవాదిత్రనిర్ఘోషం శ్రుత్వా శుభమనిన్దితా,
కథం క్రవ్యాదసింహానాం శబ్దం శ్రోష్యత్యశోభనమ్. 6

ప్ర. అ. అనిన్దితా = నిందింపబడని ఆ సీత, శుభమ్ = మంగళకర మైన, గీతవాదిత్రనిర్ఘోషమ్ = గీతములయొక్క, వాద్యములయొక్క ధ్వనిని, శ్రుత్వా = విని, అశోభనమ్ = చెడ్డ దైన, క్రవ్యాదసింహానామ్ = క్రూరజంతువులయొక్క, సింహములయొక్క, శబ్దమ్ = శబ్దమును, కథమ్ = ఎట్లు, శ్రోష్యతి = వినగలదు ?

తా. మంగళకర మైన గీతవాద్యధ్వనులను వినుటకు అలవాటుపడిన, అనిందిత యగు ఆ జానకి, అరణ్యములో సింహాదిక్రూరమృగముల భయంకర ధ్వనిని ఎట్లు వినగలదు ? 6

మూ. మహేన్ద్రధ్వజసంకాశః క్వ ను శేతే మహాభుజః,
భుజం పరిఘసంకాశముపధాయ మహాబలః. 7

ప్ర. అ. మహేన్ద్రధ్వజసంకాశః = మహేంద్రధ్వజముతో సమానుడు, మహాభుజః = గొప్పబాహువులు కలవాడు, మహాబలః=గొప్ప బలము కలవాడు అయిన రాముడు, పరిఘసంకాశమ్=పరిఘతో సమానమైన, భుజమ్=భుజమును, ఉపధాయ = తలగడగ ఉంచుకొని, క్వ=ఎక్కడ, శేతే ను = శయనించుచున్నాడో కదా!

తా. ఇంద్రధ్వజము వలె ఉన్నత మైన వాడు, గొప్ప భుజములు కలవాడు, మహాబలశాలీ అయిన రాముడు పరిఘ వంటి బాహువును తలగడగా పెట్టుకొని ఎక్కడ శయనించుచున్నాడో కదా! 7

మూ. పద్మవర్ణం సుకేశాన్తం పద్మనిఃశ్వాసముత్తమమ్,
కదా ద్రక్ష్యామి రామస్య వదనం పుష్కరేక్షణమ్. 8

ప్ర. అ. పద్మవర్ణమ్ = పద్మమువంటి వర్ణము కలది, సుకేశాన్తమ్ = చక్కని కేశాగ్రములు కలది, పద్మనిశ్వాసమ్ = పద్మము వంటి శ్వాసకలదీ, పుష్కరేక్షణమ్ = పద్మముల వంటి నేత్రములు కలదీ, ఉత్తమమ్ = ఉత్తమమూ అయిన, రామస్య = రామునియొక్క, వదనమ్ = ముఖమును, కదా=ఎప్పుడు, ద్రక్ష్యామి = చూడగలనో.

తా. పద్మము వంటి వర్ణము, అంద మైన కేశాగ్రములు, పద్మగంధము వంటి గంధము గల శ్వాస, పద్మములవంటి నేత్రములూ కల ఉత్తమ మైన రాముని ముఖమును మరల ఎప్పుడు చూచెదనో! 8

మూ. వజ్రసారమయం నూనం హృదయం మే న సంశయః,
అపశ్యన్త్యా న తం యద్వై ఫలతీదం సహస్రధా. 9

ప్ర. అ. మే హృదయమ్ = నా హృదయము, వజ్రసారమయమ్=వజ్రమునందలి సారముతో చేయబడినది. నూనమ్ = నిశ్చయము. సంశయః = సంశయము, న = లేదు. యత్=ఏ కారణమువలన, తమ్ = రాముని, అప

శ్యన్త్యాః = చూడని నాయొక్క, ఇదమ్ = ఈ హృదయము, సహస్రధా = వేయి ముక్కలుగా, న ఫలతి వై = బ్రద్దలగుటలేదు.

తా. ఆ రాముని చూడకున్నను నా హృదయము, వేయిముక్కలుగా బ్రద్దలగుట లేదు. నిజముగా ఇది వజ్రములో ఉండు సారముతో చేయబడినది. సందేహము లేదు. 9

మూ. యత్త్వయా కరుణం కర్మ వ్యపోహ్య మమ బాన్ధవాః,
నిరస్తాః పరిధావన్తి సుఖార్హాః కృపణా వనే. 10

ప్ర. అ. త్వయా = నీచేత, కరుణమ్ = కరుణతో కూడిన, కర్మ = కర్మను, వ్యపోహ్య = విడచి, సుఖార్హాః = సుఖమునకు తగిన, మమ బాన్ధవాః = నా బంధువులు, నిరస్తాః = దూరముచేయబడినవారై, కృపణాః = దీనులై, వనే = వనమునందు, యత్ = ఏకారణమువలన, పరిధావన్తి = తిరుగాడుచున్నారో.

తా. నీవు కరుణావిహీనుడవై, సుఖము ననుభవించుటకు తగిన నా కుమారుడు మొదలగువారిని దూరముగా పంపివేయగా, వారు దీనులై వనములో తిరుగాడుచున్నను నా హృదయము బ్రద్దలుకాకున్నది. 10

మూ. యది పఞ్చదశే వర్షే రాఘవః పునరేష్యతి,
జహ్యాద్రాజ్యం చ కోశం చ భరతో నోపలక్ష్యతే. 11

ప్ర. అ. రాఘవః = రాముడు, పఞ్చదశే వర్షే = పదునైదవ సంవత్సరమున, పునః = తిరిగి, ఏష్యతి యది = వచ్చినట్లైతే, భరతః = భరతుడు, రాజ్యం చ = రాజ్యమును, కోశం చ = కోశమును, జహ్యాత్ = విడిచిపెట్టును అని, నోపలక్ష్యతే = ఊహింపబడదు.

తా. రాముడు పదునైదవ సంవత్సరమునందు తిరిగి వచ్చినను భరతుడు రాజ్యమును, కోశమును విడచి, రామునకు అప్పచెప్పునని ఊహింప జాలము. 11

మూ. భోజయన్తి కిల శ్రాద్ధే కేచిత్స్వానేవ బాన్ధవాన్,
తతః పశ్చాత్సమీక్షన్తే కృతకార్యా ద్విజర్షభాన్. 12

ప్ర. అ. కేచిత్ = కొందరు, శ్రాద్ధే = శ్రాద్ధమునందు, స్వాన్ = తమ, బాన్ధవానేవ = బంధువులనే, భోజయన్తి కిల = భుజింపచేయుదురట. కృత కార్యాః = పూర్తి చేయబడిన శ్రాద్ధకృత్యము కలవారై, తతః పశ్చాత్ = ఆటు పిమ్మట, ద్విజర్షభాన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, సమీక్షన్తే = భోజనార్థమై చూచెదరు.

తా. కొందరు శ్రాద్ధమునందు తమ బంధువులకే ముందుగా భోజనము పెట్టి ఆటు పిమ్మట బ్రాహ్మణోత్తములను ఇష్టపంక్తికి ఆహ్వానింతు రట. 12.

మూ. తత్ర యే గుణవన్తశ్చ విద్వాంసశ్చ ద్విజాతయః,
న పశ్చాత్తే ఽభిమన్యన్తే సుధామపి సురోపమాః. 13

ప్ర. అ. తత్ర = అక్కడ, యే = ఏ, గుణవన్తశ్చ = గుణవంతులూ, విద్వాంసశ్చ = విద్వాంసులూ, సురోపమాః = దేవతలతో సమానులూ ఐన, ద్విజాతయః = బ్రాహ్మణు లుందురో, తే = వారు, పశ్చాత్ = ఇతరుల భోజనానంతరము, సుధామపి = అమృతమును కూడ, న అభిమన్యన్తే = అంగీకరించరు.

తా. ఆ విధముగ ఆహూతు లైనవారిలో గుణవంతులు, విద్వాంసులు, దేవతాసదృశులు అయిన బ్రాహ్మణులు, ఇతరులు భోజనము చేసిన తరువాత, తమకు అమృతము పెట్టినను స్వీకరింపరు. 13

మూ. బ్రాహ్మణేష్వపి తృప్తేషు పశ్చాద్భోక్తుం ద్విజర్షభాః,
నాభ్యుపైతుమలం ప్రాజ్ఞాః శృఙ్గచ్ఛేదమివర్షభాః. 14

ప్ర. అ. తృప్తేషు = తృప్తి చెందినవారు, బ్రాహ్మణేష్వపి = బ్రాహ్మణులే అయినను, ప్రాజ్ఞాః = బుద్ధిమంతు లైన, ద్విజర్షభాః = బ్రాహ్మణశ్రేష్ఠులు, ఋషభాః = వృషభములు, శృఙ్గచ్ఛేదమివ = శృంగముల ఛేదమును వలె, పశ్చాత్ = పిదప, భోక్తుమ్ = భుజించుటకు, అభ్యుపైతుమ్ = అంగీకరించుటకు, నాలమ్ = సమర్థులు కారు.

తా. తమకంటె ముందు భుజించినవారు బ్రాహ్మణులే యైనను, బుద్ధిమంతు లైన బ్రాహ్మణులు, వృషభములు తమ కొమ్ములను ఛేదించుటకు ఎట్లు అంగీకరింపవో, అట్లు ఇతరులు భుజించిన పిదప భుజించుటకు అంగీకరింపజాలరు. 14

మూ. ఏవం కనీయసా భ్రాత్రా భుక్తం రాజ్యం విశాంపతే,
భ్రాతా జ్యేష్ఠో వరిష్ఠశ్చ కిమర్థం నావమంస్యతే. 15

ప్ర. అ. విశాంపతే = ఓ రాజా! ఏవమ్ = ఈ విధముగనే, జ్యేష్ఠః = జ్యేష్ఠుడు, వరిష్ఠశ్చ = శ్రేష్ఠుడూ అయిన, భ్రాతా = సోదరుడు, కనీయసా = చిన్న, భ్రాత్రా = సోదరునిచేత, భుక్తమ్ = అనుభవింపబడిన, రాజ్యమ్ = రాజ్యమును, కిమర్థమ్ = ఎందుకు, నావమంస్యతే = అవమానించడు ?

తా. మహారాజా ! జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అయిన సోదరుడు, తమ్ముడు అనుభవించిన రాజ్యమును, ఆ విధముగనే నిరాకరింపకుండునా ? 15

మూ. న పరేణాశితం భక్ష్యం వ్యాఘ్రః ఖాదితుమిచ్ఛతి,
ఏవమేవ నరవ్యాఘ్రః పరలీఢం న మన్యతే. 16

ప్ర. అ. వ్యాఘ్రః = పెద్దపులి, పరేణ = మరియొక మృగముచేత, అశితమ్ = తినబడిన, భక్ష్యమ్ = ఆహారమును, ఖాదితుమ్ = తినుటకు, నేచ్ఛతి = కోరదు. ఏవమేవ = ఇట్లే, నరవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడు, పరలీఢమ్ = ఇతరునిచే ఆస్వాదింపబడినదానిని, నమన్యతే = అంగీకరించడు.

తా. మరియొక మృగము ముట్టిన ఆహారమును పెద్దపులి తినదు. అట్లే పురుషశ్రేష్ఠుడైన రాముడు, ఇతరు లనుభవించిన రాజ్యమును, అంగీకరించడు. 16

మూ. హవిరాజ్యం పురోడాశాః కుశా యూపాశ్చ ఖాదిరాః,
నైతాని యాతయామాని కుర్వన్తి పునరధ్వరే. 17

ప్ర. అ. హవిః = హవిస్సు, ఆజ్యమ్ = ఆజ్యము, పురోడాశాః = పురోడాశములు, కుశాః = కుశలు, ఖాదిరాః = ఖదిరవృక్షదారువుతో చేసిన, యూపాశ్చ = యూపస్తంభములు, యాతయామాని = ఒక పర్యాయము ఉపయోగించబడిన, ఏతాని = వీటిని, అధ్వరే = యజ్ఞమునందు, పునః = మరల, న కుర్వన్తి = ఉపయోగించరు.

తా. హవిస్సు, నెయ్యి, పురోడాశములు, కుశలు, ఖాదిరయూపస్తంభములు—వీటిని ఒక పర్యాయము ఉపయోగించిన వాటిని, మరల యజ్ఞములో ఉపయోగించరు. 17

మూ. తథాహ్యాత్త మిదం రాజ్యం హృతసారాం సురామివ,
నాభిమన్తుమలం రామో నష్టసోమ మివాధ్వరమ్. 18

ప్ర. అ. తథా = అట్లే, రామః = రాముడు, ఆత్తమ్ = ఇతరులచే గ్రహింపబడిన, ఇదం రాజ్యమ్ = ఈ రాజ్యమును, హృతసారామ్ = హరింపబడిన సారము గల, సురామివ = సురను వలె, నష్టసోమమ్ = నష్ట మైన సోమలత గల, అధ్వరమివ = యజ్ఞమును వలె, అభిమన్తుమ్ = అంగీకరించుటకు, నాలమ్ = సమర్థుడు కాజాలడు.

తా. అట్లే, రాముడు, ఇతరు లనుభవించిన రాజ్యమును, సారము తీసివేసిన సురను వలె, నష్ట మైన సోమలత గల యజ్ఞమును వలె అంగీకరింప జాలడు. 18

మూ. న చేమాం ధర్షణాం రామః సంగచ్ఛేదత్యమర్షణః,
దారయేన్మన్దరమపి స హి క్రుద్ధః శితైః శరైః. 19

ప్ర. అ. అత్యమర్షణః = మిక్కిలి ఆత్మాభిమానము గల, రామః = రాముడు, ఇమామ్ = ఈ, ధర్షణామ్ = అవమానమును, న సంగచ్ఛేత్ = పొందడు. క్రుద్ధః = కోపించిన. సః = అతడు, శితైః = వాడి యైన, శరైః = శరములచేత, మన్దరమపి = మందరపర్వతమును గూడ, దారయేత్ హి = చీల్చివేయును గదా.

తా. చాల ఆత్మాభిమానము కల రాముడు ఈ అవమానమును సహించడు. అతడు కోపించినచో, తీక్ష్ణ మైన శరములతో మందరపర్వతమును కూడా చీల్చి వేయగలడు. 19

మూ. త్వాం తు నోత్సహతే హన్తుం మహాత్మా పితృగౌరవాత్,
ససోమార్కగ్రహగణం నభస్తారావిచిత్రితమ్. 20
పాతయేద్యో దివం క్రుద్ధః స త్వాం న వ్యతివర్తతే,
ప్రక్షోభయేద్దారయేద్వా మహీం శైలశతాచితామ్. 21

ప్ర. అ. తు = కాని, మహాత్మా = మహాత్ము డైన ఆ రాముడు. పితృగౌరవాత్ = తండ్రి అను గౌరవమువలన, త్వామ్ = నిన్ను, హన్తుమ్ = చంపుటకు, నోత్సహతే = ఉత్సాహము చూపడు. క్రుద్ధః = కోపగించిన, యః =

ఏ రాముడు, ససోమార్కగ్రహగణమ్ = చంద్రసూర్యులతోను, గ్రహసముదాయముతోను కూడిన, తారావిచిత్రితమ్ = నక్షత్రములతో చిత్రముగా నున్న, నభః= ఆకాశమును, దివమ్=ద్యులోకమును, పాతయేత్ = క్రింద పడవేయునో, సః = అతడు, త్వామ్ = నిన్ను, న వ్యతివర్తతే = అతిక్రమించుట లేదు. శైలశతాచితామ్=వందలకొలది శైలములచే వ్యాప్తమైన, మహీమ్=భూమిని, ప్రక్షోభయేద్వా = క్షోభింపచేయును. దారయేద్వా = చీల్చివేయును.

(19, 20, 21 శ్లోకములు ప్రక్షిప్తములు. గోరఖ్‌పూర్ ప్రతిలో లేవు. వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించలేదు).

తా. తండ్రి వనే గౌరవముచేత ఆ మహాత్ముడు నిన్ను చంపుటకు ఉత్సహించుటలేదు. కోపగించినచో, చంద్రసూర్యగ్రహాదులతో కూడినదీ, నక్షత్రములచే విచిత్రముగా ఉన్నదీ అయిన ఆకాశమును, ద్యులోకమును కూడ క్రిందికి పడగొట్టసమర్థుడైన ఆ రాముడు నీ మాట దాటుటలేదు. ఆతడు తలుచుకొన్నచో వందలకొలది శైలములతో వ్యాప్తమైన భూమిని క్షోభింపచేయగలడు. లేదా చీల్చివేయగలడు. 20, 21

మూ. నైవంవిధమసత్కారం రాఘవో మర్షయిష్యతి,
బలవానివ శార్దూలో వాలధేరవమర్శనమ్. 22

ప్ర. అ. బలవాన్ = బలము గల, శార్దూలః = పెద్దపులి, వాలధేః = వాలముయొక్క, అవమర్శనమ్ ఇవ = స్పర్శను వలె, రాఘవః = రాముడు, ఏవంవిధమ్ = ఈ విధమైన, అసత్కారమ్ = అవమానమును, న మర్షయిష్యతి = సహించడు.

తా. బలము గల వ్యాఘ్రము, ఎవరైన దాని తోకను స్పృశించినచో ఎట్లు సహింపదో, అట్లే రాముడు ఈ అవమానమును సహించడు. 22

మూ. నైతస్య సహితా లోకా భయం కుర్యుర్మహామృధే,
అధర్మం త్విహ ధర్మాత్మా లోకం ధర్మేణ యోజయేత్.

ప్ర అ. మహామృధే = గొప్ప యుద్ధమునందు, లోకాః = లోకములు, సహితాః = కలిసి వచ్చినను, ఏతస్య = ఈతనికి, భయమ్ = భయమును, న

కుర్యుః = చేయజాలవు. ధర్మాత్మా = ధర్మాత్ము డైన ఇతడు, అధర్మమ్ = ధర్మము లేని, లోకమ్ = లోకమును, ధర్మేణ = ధర్మముతో, యోజయేత్ = కూర్చును.

తా. మహాయుద్ధములో లోకము లన్నియు కలిసి వచ్చి ఎదిరించినను రామునకు భయము కలిగింపజాలవు. ఈ ధర్మాత్ముడు, ధర్మవిముఖ మైన లోకమునందు ధర్మమును నిలుపగలడు. 23

మూ. నన్వసౌ కాఞ్చనై ర్బాణై ర్మహావీర్యో మహాభుజః,
యుగాన్త ఇవ భూతాని సాగరానపి నిర్దహేత్. 24

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, మహాభుజః = గొప్ప భుజములు గల, అసౌ = ఈ రాముడు, కాఞ్చనైః = బంగారు వికార మైన, బాణైః = బాణములచేత, యుగాన్తః ఇవ = ప్రళయకాలము వలె, భూతాని = సకలభూతములను, సాగరానపి = సముద్రములను కూడ, నిర్దహేత్ = కాల్చి వేయును.

తా. మహాపరాక్రమవంతుడు, ఆజానుబాహువు అయిన రాముడు బంగారుబాణముల చేత, ప్రళయకాలము వలె, సకలభూతములను, సముద్రము లను కూడ కాల్చివేయగలడు. 24

మూ. స తాదృశః సింహబలో వృషభాక్షో నరర్షభః,
స్వయమేవ హతః పిత్రా జలజేనాత్మజో యథా. 25

ప్ర. అ. తాదృశః = అట్టి, సింహబలః = సింహమువంటి బలము గల, వృషభాక్షః = వృషభము వంటి నేత్రములు గల, సః నరర్షభః = ఆ నర శ్రేష్ఠుడు, జలజేన = మత్స్యముచేత, ఆత్మజో యథా = తన పిల్ల వలె, పిత్రైవ = తండ్రిచేతనే, స్వయమ్ = స్వయముగా, హతః = చంపబడినాడు.

తా. సింహము వంటి బలము కలవాడూ, వృషభము నేత్రముల వంటి నేత్రములు కలవాడూ అయిన అట్టి ఆ పురుషశ్రేష్ఠుని తండ్రి వైన నీవే స్వయ ముగా, మత్స్యము తన పిల్లను చంపినట్లు నశింపచేసినావు. 25

మూ. ద్విజాతిచరితో ధర్మః శాస్త్రదృష్టః సనాతనః,
యది తే ధర్మనిరతే త్వయా పుత్రే వివాసితే. 26

ప్ర. అ. ధర్మనిరతే = ధర్మమునందు ఆసక్తి గల, పుత్రే = పుత్రుడు, త్వయా = నీచేత, వివాసితే = ప్రవాసమునకు పంపివేయబడగా, (ఇది) తే= నీకు, శాస్త్రదృష్టః = శాస్త్రములందు చూడబడిన, సనాతనః = శాశ్వత మైన, ద్విజాతిచరితః = ద్విజులచే ఆచరించబడిన, ధర్మః యది=ధర్మమేనా?

తా. నీవు ధర్మనిరతు డైన పుత్రుని దేశమునుండి వెడలగొట్టినావు. ఇది శాస్త్ర బోధితము, ద్విజులు అనుసరించునదీ అయిన సనాతనధర్మమేనా! 26

మూ. గతిరేకా పతిర్నార్యా ద్వితీయా గతిరాత్మజః,
తృతీయా జ్ఞాతయో రాజంశ్చతుర్థీ నేహ విద్యతే. 27

ప్ర. అ. రాజన్ = రాజా! నార్యాః = స్త్రీకి, పతిః = భర్త, ఏకా = ఒక, గతిః = గతి. ఆత్మజః = కుమారుడు, ద్వితీయా గతిః=రెండవ గతి. జ్ఞాతయః =జ్ఞాతులు, తృతీయా = మూడవ గతి. చతుర్థీ = నాల్గవది, ఇహ = ఇక్కడ, న విద్యతే = లేదు.

తా. రాజా! స్త్రీకి మొదటి గతి (రక్షకుడు) భర్త. కుమారుడు రెండవ గతి. జ్ఞాతులు మూడవ గతి, నాల్గవ గతి ఏదీ లేదు. 27

మూ. తత్ర త్వం చైవ మే నాసి రామస్తు వనమాశ్రితః,
న వనం గన్తుమిచ్ఛామి సర్వథా నిహతా త్వయా. 28

ప్ర. అ. తత్ర = ఈ మూడు గతులలో, త్వమ్ = నీవు, నైవ అసి = లేనే లేవు. రామస్తు = రాముడైతే, వనమ్ = వనమును, ఆశ్రితః = ఆశ్రయించినాడు, వనమ్=వనమును గూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, న ఇచ్ఛామి = ఇచ్ఛయించను. సర్వథా = అన్ని విధముల, త్వయా = నీ చేత, నిహతా = నశింపచేయబడితిని.

తా. ఆ మూడు గతులలో మొదటి గతి యైన నీవు నాకు లేనట్లే. రాముడా అరణ్యమునకు పోయినాడు. అతనితో అరణ్యానికి వెళ్లజాలక పోయినాను. నీవు అన్ని విధములా నన్ను గతి లేనిదానిని చేసినావు. 28

మూ. హతం త్వయా రాజ్యమిదం సరాష్ట్రం
హతస్తథాత్మా సహమన్త్రిభిశ్చ.
హతా సపుత్రాస్మి హతాశ్చ పౌరాః,
సుతశ్చ భార్యా చ తవ ప్రహృష్టౌ. 29

ప్ర. అ. త్వయా = నీచేత, సరాష్ట్రమ్ = రాష్ట్రముతో కూడిన, ఇదమ్ = ఈ, రాజ్యము, హతమ్ = నశింప చేయబడినది. తథా = మరియు, మన్త్రిభిః సహ = మంత్రులతో కూడ, ఆత్మా = తాను, హతః = నశింపచేయబడినాడు. సపుత్రా = పుత్రునితో గూడిన నేను, హతా = నశింపచేయబడితిని. పౌరాశ్చ = పౌరులు కూడ, హతాః = నశింపచేయబడినారు. తవ = నీయొక్క, సుతశ్చ = కుమారుడైన భరతుడు, భార్యా = భార్యయైన కైకేయి, ప్రహృష్టౌ = సంతోషించినది (నారు).

తా. నీవు ఈ రాష్ట్రమును రాజ్యమును నశింపచేసితివి. మంత్రులను నశింపచేసితివి. నిన్ను నీవే నశింపచేసికొంటివి. నా కుమారుని నన్ను కూడ నశింపచేసితివి. పౌరులను నశింపచేసితివి. కేవలం నీ కుమారుడైన భరతుడు నీ భార్యయైన కైకేయి మాత్రమే ఆనందించుచున్నారు. 29

మూ. ఇమాం గిరం దారుణశబ్దసంశ్రితాం
నిశమ్య రాజాపి ముమోహ దుఃఖితః.
తతః సశోకః ప్రవివేశ పార్థివః,
స్వదుష్కృతం చాపి పునస్తదా స్మరన్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకషష్టితమః సర్గః

ప్ర. అ. రాజాపి = రాజు కూడ, దారుణశబ్దసంశ్రితామ్ = క్రూరమైన పదములతో కూడిన, ఇమామ్ = ఈ, గిరమ్ = వాక్కును, నిశమ్య = విని, దుఃఖితః = దుఃఖితుడై, ముమోహ = మోహపడెను. తతః = అటు పిమ్మట, సః = ఆ,

పార్థివః = రాజు, తదా = అప్పుడు, స్వదుష్కృతమ్ = తాను చేసిన చెడ్డపనిని, పునః = మరల, స్మరన్ = స్మరించుచు, శోకమ్ = శోకమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. రాజు తీవ్రమైన పదములతో కూడిన ఆ వాక్యమును, విని దుఃఖితుడై, మోహము చెందెను. పిదప తాను చేసిన తప్పు పనిని స్మరించుచు శోకార్తుడయ్యెను. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువది యొకటవ సర్గ సమాప్తము.

* * *

## ద్విషష్టితమః సర్గః

[దుఃఖితుడైన దశరథమహారాజు కౌసల్యకు చేతులు మోడ్చి ప్రార్థించుట. కౌసల్య ఆయన పాదములపై పడి క్షమింపగోరుట.]

మూ. ఏవం తు క్రుద్ధయా రాజా రామమాత్రా సశోకయా,
శ్రావితః పరుషం వాక్యం చిన్తయామాస దుఃఖితః. 1

ప్ర. అ. క్రుద్ధయా = కోపించిన, సశోకయా = శోకముతో కూడిన, రామమాత్రా = రాముని తల్లిచేత, ఏవమ్ = ఈ విధముగా, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, శ్రావితః = వినిపించబడిన, రాజా = రాజు, దుఃఖితః = దుఃఖించినవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. శోకాక్రాంతయైన కౌసల్య చాల కోపముతో పలికిన ఆ పరుషములైన మాటలు విని దశరథమహారాజు చాల దుఃఖించుచు ఆలోచించెను. 1

మూ. చిన్తయిత్వా స చ నృపో ముమోహ వ్యాకులేన్ద్రియః,
అథ దీర్ఘేణ కాలేన సంజ్ఞామాప పరంతపః. 2

ప్ర. అ. సః = ఆ, నృపః = రాజు, చిన్తయిత్వా = ఆలోచించి, వ్యాకులేన్ద్రియః = వ్యాకులమైన ఇంద్రియములు కలవాడై, ముమోహ = మోహము చెందెను. అథ = పిమ్మట, పరంతపః = శత్రువులను తపింపచేయు ఆ రాజు, దీర్ఘేణ = దీర్ఘమైన, కాలేన = కాలము చేత, సంజ్ఞామ్ = సంజ్ఞను, ఆప = పొందెను.

తా. దశరథుడా విధముగ ఆలోచించి, ఇంద్రియములు కలత చెందగా, మూర్ఛ చెందెను. పిదప చాల సేపటికి మూర్ఛనుండి తేరుకొనెను. 2

మూ. స సంజ్ఞాముపలభ్యైవ దీర్ఘముష్ణం చ నిఃశ్వసన్,
కౌసల్యాం పార్శ్వతో దృష్ట్వా పునశ్చిన్తాముపాగమత్. 3

ప్ర. అ. సః = అతడు, సంజ్ఞామ్ = సంజ్ఞను, ఉపలభ్యైవ = పొందగానే, దీర్ఘమ్ = దీర్ఘముగాను, ఉష్ణం చ = వేడిగాను, నిఃశ్వసన్ = నిట్టూర్చుచు, పార్శ్వతః = ప్రక్కన, కౌసల్యామ్ = కౌసల్యను, దృష్ట్వా = చూచి, పునః = మరల, చిన్తామ్ = చింతను, ఉపాగమత్ = పొందెను.

తా. అతడు స్పృహ వచ్చిన వెంటనే దీర్ఘముగాను, వేడిగాను, నిట్టూర్చుచు, ప్రక్క నున్న కౌసల్యను చూచి మరల చింతాకులు డయ్యెను. 3

మూ. తస్య చిన్తయమానస్య ప్రత్యభాత్కర్మ దుష్కృతమ్,
యదనేన కృతం పూర్వమజ్ఞానాచ్ఛబ్దవేధినా. 4

ప్ర. అ. చిన్తయమానస్య = ఆలోచించుచున్న, తస్య = ఆతనికి, పూర్వమ్ = పూర్వము, అనేన = వీని చేత, శబ్దవేధినా = శబ్దవేధిబాణము చేత, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, యత్ = ఏది, కృతమ్ = చేయబడినదో, దుష్కృతమ్ = పాప మైన, కర్మ = ఆ పని, ప్రత్యభాత్ = స్ఫురించెను.

తా. దశరథుడు ఆలోచించుచుండగా, పూర్వము తాను అజ్ఞానమున శబ్దవేధి బాణమును ప్రయోగించి చేసిన పాపకర్మ గుర్తుకు వచ్చెను. 4

మూ. అమనాస్తేన శోకేన రామశోకేన చ ప్రభుః
ద్వాభ్యామపి మహారాజః శోకాభ్యామన్వతప్యత. 5

ప్ర. అ. తేన శోకేన = ఆ శోకముచేతను, రామశోకేన = రామశోకము చేతను, అమనాః = దుఃఖించుచున్న మనస్సు గలవాడై, ప్రభుః = ప్రభు వైన, మహారాజః = మహారాజు, ద్వాభ్యామ్ = రెండు, శోకాభ్యామ్ అపి = శోకములతో కూడ, అన్వతప్యత = బాధపడెను.

తా. ప్రభు వైన ఆ దశరథ మహారాజు, ఆ పాపకర్మము వలన కలిగిన శోకము, రామశోకము రెండును మనస్సును ఎక్కువగా పీడించగా పరితపించెను. 5

మూ. దహ్యమానస్తు శోకాభ్యాం కౌసల్యామాహ భూపతిః,
వేపమానోఽఞ్జలిం కృత్వా ప్రసాదార్థమవాఙ్ముఖః. 6

ప్ర. అ. శోకాభ్యామ్ = శోకములచేత, దహ్యమానః = దహింపబడు చున్న, సః భూపతిః = ఆ రాజు, వేపమానః=వణకిపోవుచు, అవాఙ్ముఖః = క్రిందికి వంచబడిన ముఖము కలవాడై, ప్రసాదార్థమ్ = అనుగ్రహింపచేసుకొను టకై, అఞ్జలిమ్=దోసిలిని, బద్ధ్వా=కట్టి, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, ఆహ = పలికెను.

తా. ఈ శోకములు దహించివేయుచుండగా, ఆ రాజు వణకిపోవుచు, ముఖము క్రిందికి వంచి, కౌసల్యను అనుగ్రహింపచేసికొనుటకై చేతులు జోడించి నమస్కరించుచు, ఆమెతో ఇట్లనెను. 6

మూ. ప్రసాదయే త్వాం కౌసల్యే రచితోఽయం మయాఞ్జలిః,
వత్సలా చానృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి. 7

ప్ర. అ. కౌసల్యే = ఓ కౌసల్యా! త్వామ్ = నిన్ను, ప్రసాదయే = అను గ్రహింప చేసుకొనుచున్నాను. మయా = నా చేత, అయమ్=ఈ, అఞ్జలిః = దోసిలి, రచితః = కట్టబడినది. త్వమ్ = నీవు, పరేష్వపి=ఇతరుల విషయము నందు కూడ, నిత్యమ్=ఎల్లపుడును, వత్సలా = ప్రేమకలదానవు, అనృశంసా చ హి = క్రౌర్యము లేనిదానవూ కదా?

తా. కౌసల్యా! నేను ఇదిగో చేతులు జోడించి బ్రతిమాలుచున్నాను. నీవు సర్వదా ఇతరుల విషయమునందు కూడ ప్రేమ కలిగి ఎన్నడును కఠిన ముగా ప్రవర్తించని దానవు కదా? 7

మూ. భర్తా తు ఖలు నారీణాం గుణవాన్నిర్గుణోఽపి వా,
ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి దైవతమ్. 8

ప్ర. అ. దేవి = ఓ కౌసల్యా దేవీ! ధర్మమ్ = ధర్మమును, విమృశమానా నామ్ = విమర్శించు, నారీణామ్ = స్త్రీలకు, గుణవాన్=గుణవంతు డైనను, నిర్గు ణోఽపి వా = గుణములు లేనివా డైనను, భర్తా=భర్త, ప్రత్యక్షమ్ = ప్రత్యక్ష మైన, దైవతం ఖలు=దేవత కదా?

తా. ఓ! కౌసల్యా! ధర్మదృష్టి గల స్త్రీలకు, గుణవంతు డైనను, గుణ విహీను డైనను, భర్తయే ప్రత్యక్ష దేవత కదా! 8

మూ. సా త్వం ధర్మపరా నిత్యం దృష్టలోకపరావరా,
నార్హసే విప్రియం వక్తుం దుఃఖితాపి సుదుఃఖితమ్. 9

ప్ర. అ. నిత్యమ్=ఎల్లప్పుడూ, ధర్మపరా = ధర్మమునందు ఆసక్తి కల దానవూ, దృష్టలోకపరావరా = చూడబడిన లోకమునందలి మంచిచెడ్డలు కల దానవూ అయిన, సా త్వమ్ = అట్టి నీవు, దుఃఖితా ఽపి = దుఃఖితురాల వై నను, సుదుఃఖితమ్ = చాల దుఃఖితుడ నైన నన్ను గూర్చి, విప్రియమ్=అప్రియ మైన మాటలను, వక్తుమ్ = పలుకుటకు, నార్హసి = తగవు.

తా. నీవు నిత్యము ధర్మమునం దాసక్తి కలదానవు. లోకములోని మంచి చెడ్డలు, పెద్ద చిన్న అను తారతమ్యము తెలిసినదానవు. అట్టి నీవు ఎంత దుఃఖముతో ఉన్నను, చాల దుఃఖించుచున్న నన్ను ఈ విధముగ దూషించుట తగదు. 9

మూ. తద్వాక్యం కరుణం రాజ్ఞః శ్రుత్వా దీనస్య భాషితమ్,
కౌసల్యా వ్యసృజద్బాష్పం ప్రణాలీవ నవోదకమ్. 10

ప్ర. అ. కౌసల్యా = కౌసల్య, దీనస్య = దీను డైన, రాజ్ఞః = రాజు యొక్క, కరుణమ్ = దీన మైన, భాషితమ్ = పలకబడిన, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, శ్రుత్వా = విని, ప్రణాలీ = నీటి గొట్టము, నవోదకమివ =క్రొత్త ఉదకమును వలె, బాష్పమ్ = కన్నీటిని, వ్యసృజత్ = విడచెను.

తా. దీను డైన దశరథుడు పలికిన, కరుణాభరిత మైన ఆ మాట వినగానే, కౌసల్య, నీటి గొట్టము క్రొత్త వాన నీటిని కార్చి నట్లు కన్నీరు కార్చెను.

మూ. సా మూర్ధ్ని బద్ధ్వా రుదతీ రాజ్ఞః పద్మమివాఞ్జలిమ్.
సంభ్రమాదబ్రవీత్త్రస్తా త్వరమాణాక్షరం వచః. 11

ప్ర. అ. సా=ఆమె, రుదతీ = ఏడ్చుచున్నదై, పద్మమివ=పద్మమువలె ఉన్న, రాజ్ఞః=రాజుయొక్క, అఞ్జలిమ్=దోసిలిని, మూర్ధ్ని=తన శిరస్సుపై, బద్ధ్వా=కట్టి, త్రస్తా=భయపడినదై, సంభ్రమాత్=తొందరవలన, త్వరమాణాక్షరమ్=తొట్రుపడుచున్న అక్షరములు గల, వచః=వచనమును, అబ్రవీత్= పలికెను.

తా. కౌసల్య మిక్కిలి భయపడిపోయినదై, ఏడ్చుచు, రాజు దోసిలిని పద్మమును వలె తన తలపై ఉంచుకొనుచు, కంగారుచే అక్షరములు తొట్రుపడ ఇట్లు పలికెను. 11

మూ. ప్రసీద శిరసా యాచే భూమౌ నిపతితాస్మి తే,
యాచితాస్మి హతా దేవ క్షన్తవ్యాహం న హి త్వయా.

ప్ర. అ. దేవ = మహారాజా, భూమౌ = నేలమీద, నిపతితా అస్మి = పడితిని. శిరసా = శిరస్సుతో, యాచే = ప్రార్థించుచున్నాను. తే = నీకు (నీచేత), యాచితా = ప్రార్థింపబడిన నేను, హతా అస్మి = చంపబడితిని. అహమ్ = నేను, త్వయా = నీచేత, న క్షన్తవ్యా హి = క్షమింపదగిన దానను కానుకదా ?

తా. మహారాజా ! భూమిపై పడి నీకు శిరస్సు వంచి నమస్కరించుచు ప్రార్థించుచున్నాను. నన్ను ప్రార్థించుట ద్వారా నీవు నన్ను చంపివేసిన ట్లయినది. నేను క్షమింప రాని అపరాధము చేసినాను. 12

మూ. నైషా హి సా స్త్రీ భవతి శ్లాఘనీయేన ధీమతా,
ఉభయోర్లోకయోర్వీర పత్యా యా సంప్రసాద్యతే. 13

ప్ర. అ. వీర = ఓ వీరుడా; యా = ఏ స్త్రీ, శ్లాఘనీ యేన = శ్లాఘించదగిన వాడు. ధీమతా = బుద్ధిమంతుడు అయిన, పత్యా = భర్త చేత, సంప్రసాద్యతే = అనునయింపబడునో, సా ఏషా = అట్టి ఈ, స్త్రీ = స్త్రీ, ఉభయోః = రెండు, లోకయోః = లోకములకును. న భవతి హి = కాదు కదా.

తా. ఓ మహావీరా! శ్లాఘింపదగినవాడూ, బుద్ధిమంతుడూ అయిన భర్త చేత అనునయింపచేసుకొనే స్త్రీ ఈ ఇహలోకమునకును, పరలోకమునకును కూడా చెడును కదా. 13

మూ. జానామి ధర్మం ధర్మజ్ఞ త్వాం జానే సత్యవాదినమ్,
పుత్రశోకార్తయా తత్తు మయా కిమపి భాషితమ్. 14

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మముల నెరిగినవాడా! ధర్మమ్ = ధర్మమును, జానామి = ఎరుగుదును. త్వామ్ = నిన్ను, సత్యవాదినమ్ = సత్యమునే పలుకువాని

గా, జానే=ఎరుగుదును. తు=కాని, పుత్రశోకార్తయా=పుత్రశోకముచే పీడితురాల నైన. మయా=నాచేత, తత్=అది, కిమపి = ఏమేమో, భాషితమ్=పలకబడినది.

తా. ధర్మము లన్నియు తెలిసిన ఓ మహారాజా ! నాకు ధర్మము తెలియును; నీవు సత్యసంధుడ వనే విషయము కూడా తెలియును. అయినను నేను పుత్రశోకముతో బాధపడుచు ఏమేమో అనరాని మాటలు పలికినాను.

మూ. శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్,
శోకో నాశయతే సర్వం నాస్తి శోకసమో రిపుః. 15

ప్ర. అ. శోకః =శోకము, ధైర్యమ్ = ధైర్యమును, నాశయతే=నశింపచేయును. శోకః = శోకము, శ్రుతమ్ = శాస్త్ర జ్ఞానమును, నాశయతే = నశింపచేయును. శోకః = శోకము, సర్వమ్ = సమస్తమును, నాశయతే = నశింపచేయును. శోకసమః = శోకముతో సమాన మైన, రిపుః = శత్రువు, నాస్తి = లేదు.

తా. శోకము ధైర్యమును నశింపచేయును. శోకము శాస్త్ర జ్ఞానమును నశింపచేయును. శోకము సర్వమును నశింపచేయును. శోకము వంటి శత్రువు లేదు. 15

మూ. శక్య ఆపతితః సోఢుం ప్రహారో రిపుహస్తతః,
సోఢుమాపతితః శోకః సుసూక్ష్మోఽపి న శక్యతే. 16

ప్ర. అ. రిపుహస్తతః=శత్రుహస్తమునుండి, ఆపతితః=వచ్చిన, ప్రహారః = దెబ్బ, సోఢుమ్= సహించుటకు, శక్యః = శక్యమైనది. ఆపతితః = హటాత్తుగా వచ్చిపడిన, శోకః = శోకము, సుసూక్ష్మోఽపి = చాల చిన్న దైనను, సోఢుమ్ = సహించుటకు, న శక్యతే = శక్యము కాదు.

తా. శత్రువు కొట్టిన దెబ్బ నైనను సహించవచ్చును గాని, హటాత్తుగా వచ్చిన శోకము ఎంత చిన్న దైనను, దానిని సహించుట కష్టము. 16

మూ. ధర్మజ్ఞాః శ్రుతిమన్తోఽపి ఛిన్నధర్మార్థసంశయాః.
యతయో వీర ముహ్యన్తి శోకసంమూఢచేతసః. 17

ప్ర. అ. వీర = ఓ వీరుడా! ధర్మజ్ఞాః = ధర్మము నెరిగినవారు, శ్రుతిమన్తః = శాస్త్రాభ్యాసము కలవారు, ఛిన్నధర్మార్థసంశయాః = ఛేదించబడిన ధర్మార్థములకు సంబంధించిన సంశయములు కలవారూ అయిన, యతయః అపి = యతులు కూడ, శోకసంమూఢచేతసః = శోకముచేత మూఢ మైన చిత్తములు కలవారై, ముహ్యన్తి = మోహము చెందుచుందురు.

తా. ఓ వీరుడా! ధర్మవేత్తలూ, శాస్త్రజ్ఞులూ, ధర్మార్థముల విషయమున సంశయము లన్నియు తొలగినవారు ఆయిన సంన్యాసులు కూడ శోకముచేత మనస్సు మూఢ మై మోహము చెందుచుందురు. 17

మూ. వనవాసాయ రామస్య పఞ్చరాత్రోఽద్య గణ్యతే,
యః శోకహతహర్షాయాః పఞ్చవర్షోపమో మమ. 18

ప్ర. అ. వనవాసాయ = వనవాసమునకు వెళ్ళిన, రామస్య = రామునకు, పఞ్చరాత్రః = ఐదు రోజులుగా, అద్య = నేడు, గణ్యతే = లెక్కపెట్టబడుచున్నది. యః = ఏది, శోకహతహర్షాయాః = శోకముచే తొలగిన హర్షము గల, మమ = నాకు, పఞ్చవర్షోపమః = ఐదు సంవత్సరములతో సమాన మైనదో.

తా. రాముడు అరణ్యమునకు వెళ్ళి నేటికి ఐదు దినము లయిన దని లెక్కచెప్పబడుచున్నది. కాని శోకముచే సంతోషము నశించిన నాకు ఐదు సంవత్సరముల వలె ఉన్నది 18

మూ. తం హి చిన్తయమానాయాః శోకోఽయం హృది వర్ధతే,
నదీనామివ వేగేన సముద్రసలిలం మహత్. 19

ప్ర. అ. తమ్ = ఆ రాముని గూర్చి, చిన్తయమానాయాః = ఆలోచించుచున్న నా యొక్క, హృది = హృదయమునందు, అయమ్ = ఈ, శోకః = శోకము, నదీనామ్ = నదులయొక్క, వేగేన = వేగముచేత, మహత్ = గొప్ప, సముద్రసలిలమివ = సముద్రోకదము వలె, వర్ధతే = వృద్ధి పొందుచున్నది.

తా. నదీవేగములచే, సముద్ర జలము అధికముగా వృద్ధిపొందినట్లు రాముని తలచుకొనిన కొలది నా హృదయములో శోకము పెరుగుచున్నది. 19

మూ. ఏవం హి కథయన్త్యాస్తు కౌసల్యాయాః శుభం వచః,
మన్దరశ్మిరభూత్సూర్యో రజనీ చాభ్యవర్తత. 20

ప్ర. అ. కౌసల్యాయాః = కౌసల్య, ఏవమ్ = ఈ విధముగ, శుభమ్ = శుభమైన, వచః = వాక్యమును, కథయన్త్యాః = చెప్పుచుండగా, సూర్యః = సూర్యుడు, మన్దరశ్మిః = మందమైన కిరణములు గలవాడు, అభూత్ = ఆయెను. రజనీ చ = రాత్రికూడ, అభ్యవర్తత = వచ్చెను.

తా. కౌసల్య ఈ విధముగా శుభమైన మాటలాడుచుండగా, సూర్య కిరణములు మందము లాయెను. రాత్రి వచ్చెను. 20

మూ. తథా ప్రసాదితో వాక్యైర్దేవ్యా కౌసల్యయా నృపః,
శోకేన చ సమాక్రాన్తః నిద్రాయా వశమేయివాన్. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. దేవ్యా = దేవి యైన, కౌసల్యయా = కౌసల్యచేత, తథా = అట్లు ప్రసాదితః = అనుగ్రహింపచేసుకొనబడిన, నృపః = రాజు, శోకేన = శోకముచేత, సమాక్రాన్తః చ = ఆక్రమించబడినవాడై, నిద్రాయాః = నిద్రయొక్క, వశమ్ = వశమును, ఏయివాన్ = పొందినాడు.

తా. ఈ విధముగా కౌసల్యచే అనునయించుకొనబడిన ఆ రాజు, శోకాక్రాంతుడై, నిద్రకు వశు డాయెను. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదిరెండవ సర్గ సమాప్తము.

## త్రిషష్టితమః సర్గః

[దశరథుడు విలపించుట. ఆయన పూర్వము తాను మునికుమారుని చంపిన వృత్తాంతమును కౌసల్యకు వినిపించుట.]

మూ. ప్రతిబుద్ధో ముహూర్తేన శోకోపహతచేతనః,
అథ రాజా దశరథః స చిన్తామభ్యపద్యత. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సః రాజా = ఆరాజు, ముహూర్తేన = కొద్ది కాలముచే, ప్రతిబుద్ధః = మేల్కొనినవాడై, శోకోపహతచేతనః = శోకముచేత పీడింపబడిన బుద్ధికలవాడై, చిన్తామ్ = చింతను, అభ్యపద్యత = పొందెను.

తా. పిమ్మట ఆ రాజు కొంచెముసేపటికి మేల్కొని, శోకముచేత పీడింపబడిన మనస్సుతో ఆలోచించుట ప్రారంభించెను. 1

మూ. రామలక్ష్మణయోశ్చైవ వివాసాద్వాసవోపమమ్,
ఆవివేశోపసర్గస్తం తమః సూర్యమివాసురమ్. 2

ప్ర. అ. రామలక్ష్మణయోః = రామలక్ష్మణుల, వివాసాత్ = ప్రవాసము వలన, వాసవోపమమ్ = దేవేంద్రునితో సమానుడైన, తమ్ = ఆ దశరథుని, ఆసురమ్ = అసురునకు సంబంధించిన, తమః = తమస్సు (రాహువు), సూర్యమివ = సూర్యుని వలె, ఉపసర్గః = గొప్ప ఉపద్రవము. ఆవివేశ = ఆవేశించెను.

తా. రామలక్ష్మణులను ప్రవాసమునకై పంపివేయుటచే, దేవేంద్రతుల్యుడైన ఆ దశరథుని, రాహువు సూర్యుని ఆక్రమించినట్లు గొప్ప ఉపద్రవము ఆక్రమించెను. 2

మూ. సభార్యే నిర్గతే రామే కౌసల్యాం కోసలేశ్వరః,
వివక్షురసితాపాఙ్గాం స్మృత్వా దుష్కృతమాత్మనః. 3

ప్ర. అ. సభార్యే=భార్యాసమేతు డైన, రామే=రాముడు, నిర్గతే సతి=వెళ్ళిపోయినవా డగుచుండగా, కోసలేశ్వరః=కోసలాధిపతి యైన దశరథమహారాజు, ఆత్మనః=తనయొక్క, దుష్కృతమ్=పాపమును, స్మృత్వా=స్మరించి, అసితాపాఙ్గామ్ = నల్లని నేత్రాంతములు గల, కౌసల్యామ్=కౌసల్యను గూర్చి, వివక్షుః=చెప్పకోరికకలవాఁడు, ఆయెను.

తా. రాముడు భార్యతో కూడా అరణ్యమునకు వెళ్ళిన పిమ్మట, ఆ దశరథునకు పూర్వము తాను చేసిన పాపము జ్ఞప్తికి రాగా ఆతడు దానిని గూర్చి నల్లని నేత్రాంతములు గల కౌసల్యకు చెప్పదలచెను. 3

మూ. స రాజా రజనీం షష్ఠీం రామే ప్రవ్రాజితే వనమ్.
అర్ధరాత్రే దశరథః సంస్మరన్ దుష్కృతం కృతమ్. 4

ప్ర. అ. రామే = రాముడు, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజితే=పంపివేయపడినపిమ్మట, రాజా=రాజైన, సః దశరథః=ఆ దశరథుడు, షష్ఠీమ్=ఆరవ, రజనీమ్=రాత్రిని (రాత్రియందు), అర్ధరాత్రే = అర్ధరాత్రమునందు, కృతమ్=చేయబడిన, దుష్కృతమ్ = పాపమును, సంస్మరన్ = స్మరించుచు ఉండెను

తా. రాముని అరణ్యమునకు పంపివేసిన తరువాత, ఆ దశరథమహారాజునకు ఆరవ రోజున అర్ధరాత్రమునందు, అతడు పూర్వము చేసిన పాపమును గూర్చి గుర్తుకువచ్చెను. 4

మూ. స రాజా పుత్రశోకార్తః స్మరన్ దుష్కృతమాత్మనః
కౌసల్యాం పుత్రశోకార్తామిదం వచనమబ్రవీత్. 5

ప్ర. అ. పుత్రశోకార్తః = పుత్రశోకముచేత పీడితు డైన, సః రాజా=ఆ రాజు, ఆత్మనః=తనయొక్క, దుష్కృతమ్ = పాపమును గూర్చి, స్మరన్=స్మరించుచు, పుత్రశోకార్తామ్=పుత్రశోకముతో బాధబడుచున్న, కౌసల్యామ్=కౌసల్యను గూర్చి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పుత్రశోకముచే పీడితు డైన ఆ దశరథమహారాజు, తాను చేసిన పాపకృత్యమును స్మరించుచు, పుత్రశోకార్త యైన కౌసల్యతో ఇట్లనెను. 5

మూ. యదాచరతి కల్యాణి శుభం వా యది వాశుభమ్,
తదేవ లభతే భద్రే కర్తా కర్మజమాత్మనః. 6

ప్ర. అ. కల్యాణి = మంగళకరురాలా! భద్రే=శుభస్వభావము కలదానా! కర్తా=కర్మ చేయువాడు, శుభం వా=పుణ్యము నైనా, యది వా=లేక, అశుభమ్ =పాపమునైనా, యత్=దేనిని, కురుతే= చేయునో, ఆత్మనః = తనయొక్క, కర్మజమ్ = కర్మవలన కలిగిన, తదేవ=దానినే, లభతే=పొందును.

తా. మంగళస్వభావము గల ఓ కౌసల్యా ! మానవుడు పుణ్య మైనను, పాపమైనను ఎట్టి కర్మ చేయునో దానికి తగిన ఫలమునే పొందును. 6

మూ. గురులాఘవమర్థానామారమ్భే కర్మణాం ఫలమ్,
దోషం వా యో న జానాతి స బాల ఇతి హోచ్యతే. 7

ప్ర. అ. యః=ఎవడు, కర్మణామ్=కర్మలయొక్క, ఆరమ్భే=ఆరంభమునందు, అర్థానామ్=ప్రయోజనములయొక్క, గురులాఘవమ్ = గౌరవలాఘవములను (హెచ్చుతగ్గులను)గాని, ఫలమ్ = ఫలమును గాని, దోషం వా= దోషమును గాని, న జానాతి = ఎరుగడో, సః=ఆతడు, బాలః ఇతి = బాలుడు అని, ఉచ్యతే హ = చెప్పబడుచున్నాడు.

తా. తా నేదైన ఒక పని ప్రారంభించునపుడు అది మంచిదా చెడ్డదా అను విషయమును, దానివలన కలుగు ఫలమును, దోషమును ఎవడు తెలుసుకొనడో వాడే బాలుడు. (మూఢుడు)అని పెద్దలు చెప్పుదురు. 7

మూ. కశ్చిదామ్రవణం ఛిత్త్వా పలాశాంశ్చ నిషిఞ్చతి,
పుష్పం దృష్ట్వా ఫలే గృధ్నుః స శోచతి ఫలాగమే. 8

ప్ర. అ. కశ్చిత్ = ఒకడు, పుష్పమ్ = అంద మైన మోదుగు పువ్వును, దృష్ట్వా=చూచి, ఫలే=దాని ఫలమునందు, గృధ్నుః=ఆశకలవాడై, ఆమ్రవణమ్ = మామిడితోటను, ఛిత్త్వా=ఛేదించి, పలాశాన్ = మోదుగ చెట్లను, నిషిఞ్చతి= నీళ్ళు పోసి పెంచును. సః = వాడు, ఫలాగమే = దాని పండు రాగానే, శోచతి =దుఃఖించును.

తా. అందమైన పెద్ద పెద్ద మోదుగు చెట్టు పూవులను చూచి, దానిపండ్లు బాగుండు ననుకొని వాటిపై ఆశతో ఒకడు మామడితోట నరికి మోదుగు చెట్లు పెంచును. చివరకు దాని పండ్లు చూడగానే హతాశుడై దుఃఖించును. 8

మూ. అవిజ్ఞాయ ఫలం యో హి కర్మ త్వేవానుధావతి,
స శోచేత్ఫలవేళాయాం యథా కింశుక సేచకః. 9

ప్ర. అ. యః = ఎవడు, ఫలమ్=ఫలమును, అవిజ్ఞాయ=తెలుసుకొన కుండగా, కర్మ తు ఏవ = కర్మనే, అనుధావతి = అనుసరించి పరుగెత్తునో, సః = వాడు, కింశుక సేచకః ఇవ=కింశుకమునకు నీళ్లు పోసి పెంచువాడు వలె, ఫలవేలాయామ్ = ఫల సమయమునందు, శోచేత్ = దుఃఖించును.

తా. తాను చేయు కర్మకు ఎట్టి ఫలము కలుగునో తెలుసుకొనక కర్మ వెనుకనే పరుగెత్తువాడు, కింశుకవృక్షమునకు నీళ్ళుపోసి పెంచినవాడు వలె దుఃఖించును. 9

మూ. సోఽహమామ్రవణం ఛిత్త్వా పలాంశాశ్చ న్యషేచయమ్,
రామం ఫలాగమే త్యక్త్వా పశ్చాచ్ఛోచామి దుర్మతిః. 10

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, ఆమ్రవణమ్ = మామిడి తోటను, చిత్త్వా=ఛేదించి, పలాశాన్ చ=మోదుగ చెట్లను, న్యషేచయమ్ = తడిపితిని. దుర్మతిః=చెడ్డబుద్ధి కలవాడనై, ఫలాగమే = ఫలములు లభించే సమయము నందు, రామమ్ = రాముని, త్యక్త్వా=విడచి, పశ్చాత్ = తరువాత, శోచామి= దుఃఖించుచున్నాను.

తా. నేను మామిడితోటను నరికి, మోదుగు చెట్లకు నీళ్ళు పోసి పెంచి నాను. చెడు బుద్ధి గల నేను ఫలములు లభించే సమయమునందు రాముని దూరముగా పంపివేసి ఇపుడు దుఃఖించుచున్నాను. 10

మూ. లబ్ధశబ్దేన కౌసల్యే కుమారేణ ధనుష్మతా,
కుమారః శబ్దవేధీతి మయా పాపమిదం కృతమ్. 11

తా. కౌసల్యే = కౌసల్యా! శబ్దవేధీ = శబ్దమును పట్టి బాణముతో కొట్టగల, కుమారః ఇతి = నవయువకుడు అని, లబ్ధశబ్దేన=పొందబడిన కీర్తి గల, కుమా

రేణ = కౌమారావస్థలో నున్న, ధనుష్మతా = ధనుర్ధారి నైన, మయా = నాచేత ఇదమ్ = ఈ, పాపమ్ = పాపము, కృతమ్ = చేయబడినది.

తా. కౌసల్యా! శబ్దమును పట్టి బాణముతో కొట్ట గల నవయువకుడు అని పేరు పొందిన నేను కౌమారావస్థలో ఉన్నపుడు, ధనుర్ధారినై, ఈ పాపము చేసితిని. 11

మూ. తదిదం మేఽనుసంప్రాప్తం దేవి దుఃఖం స్వయంకృతమ్,
సంమోహాదిహ బాలేన యథా స్యాద్భక్షితం విషమ్. 12

ప్ర. అ. దేవి = ఓ కౌసల్యా దేవీ! ఇహ = ఈ లోకమున, సంమోహాత్ = అజ్ఞానమువలన, బాలేన = బాలునిచేత, భక్షితమ్ = భక్షింపబడిన, విషమ్ = విషము, యథా = ఎట్లు, స్యాత్ = అగునో. అట్లే, స్వయమ్=స్వయముగా, కృతమ్ = చేయబడిన, తత్ ఇదమ్ = అట్టి ఈ, దుఃఖమ్ = దుఃఖము, మే = నాకు, సమనుప్రాప్తమ్ = వచ్చిపడినది.

తా. కౌసల్యా! తెలియక విషము తిన్న బాలునకు వలె నాకు కూడ, ఇపుడు స్వయముగా చేసికొనిన (తెచ్చుకొన్న) దుఃఖము వచ్చిపడినది. 12

మూ. యథాన్యః పురుషః కశ్చిత్పలాశైర్మోహితో భవేత్,
ఏవం మయాప్రవిజ్ఞాతం శబ్దవేధ్యమయం ఫలమ్. 13

ప్ర. అ. అన్యః = ఇతరుడైన, కశ్చిత్ = ఒకానొక, పురుషః = పురుషుడు, పలాశైః=పలాశవృక్షములచేత, యథా=ఎట్లు, మోహితః = మోహితుడై, భవేత్ = అగునో, ఏవమ్ = ఇట్లే, మయాపి=నాచేత కూడ, శబ్దవేధ్యమయమ్= శబ్దమును కొట్టదగిన లక్ష్యము వలన కలుగు, ఫలమ్ = ఫలము, అప్రవిజ్ఞాతమ్ = తెలియబడలేదు.

తా. ఎవరో ఒక వ్యక్తి పలాశ వృక్షములను చూచి మోసపోయినట్లే, నేను కూడ శబ్దమును లక్ష్యముగా చేసి కొట్టుటచే కలుగు ఫలమును తెలుసుకొనజాలక పోయితిని. 13

మూ. దేవ్యనూఢా త్వమభవో యువరాజో భవామ్యహమ్,
తతః ప్రావృడనుప్రాప్తా మదకామవివర్ధినీ. 14

ప్ర. అ. దేవి = కౌసల్యా దేవీ! త్వమ్ = నీవు, అనూఢా = వివాహము చేసికొనబడని దానవు, అభవః = అయి ఉంటివి. అహమ్ = నేను, యువరాజః = యువరాజునుగా, భవామి = అయి ఉంటిని. తతః = అప్పుడు, మదకామవివర్ధినీ = మదమును కామమును వృద్ధిపొందించు, ప్రావృట్ = వర్షర్తువు, అనుప్రాప్తా = వచ్చినది.

తా. కౌసల్యా! అప్పటికి నేను నిన్ను వివాహము చేసుకొనలేదు. నేను యువరాజునుగా ఉంటిని. అప్పుడు మదమును, కామమును, వృద్ధిపొందించు వర్షర్తువు వచ్చినది.

వి. 'మదకామవివర్ధినీ' అను పాఠముకంటె "మనఃసంహర్షిణీ మమ" అను ప్రాచ్య పాఠము బాగున్నది. "నా మనస్సుకు ఉత్సాహము ఇచ్చునది" అని దాని అర్థము. వివాహితుడు కాని కాలమును గూర్చి చెప్పుచున్న దశరథుడు 'కామసంవర్ధినీ' అని చెప్పుకొనుట అనుచితము కదా! 14

మూ. ఉపాస్య చ రసాన్ భౌమాంస్తప్త్వా చ జగదంశుభిః,
పరేతాచరితాం భీమాం రవిరావిశతే దిశమ్. 15

ప్ర. అ. రవిః = సూర్యుడు, భౌమాన్ = భూమికి సంబంధించిన, రసాన్ = రసములను, ఉపాస్య = గ్రహించి, జగత్ = జగత్తును, అంశుభిః = కిరణముల చేత, తప్త్వా చ = తపింపచేసి, పరేతాచరితామ్ = ప్రేతలచే సంచరించబడిన, భీమామ్ = భయంకర మైన, దిశమ్ = దిక్కును, ఆవిశతే = ప్రవేశించెను.

తా. సూర్యుడు భూమిలో నున్న రసములు గ్రహించి, కిరణములచేత జగత్తును తపింపచేసి, ప్రేతలు సంచరించు భయంకరమైన దక్షిణ దిక్కునకు వెళ్ళెను. 15

మూ. ఉష్ణమన్తర్దధే సద్యః స్నిగ్ధా దదృశిరే ఘనాః,
తతో జహృషిరే సర్వే భేకసారఙ్గబర్హిణః. 16

ప్ర. అ. సద్యః = వెంటనే, ఉష్ణమ్ = వేడి, అన్తర్దధే = అంతర్ధానము పొందెను. స్నిగ్ధాః = నిగనిగలాడుచున్న, ఘనాః = మేఘములు, దదృశిరే = చూడబడినవి. తతః = అటుపిమ్మట, సర్వే = సమస్త మైన, భేకసారఙ్గబర్హిణః = కప్పలు, చక్రవాకములు, నెమళ్ళు, జహృషిరే = సంతోషించినవి.

తా. వెంటనే వేడి చటుమాయ మయ్యెను. నిగనిగలాడుచున్న మేఘములు కనబడెను. అపుడు కప్పలు, చక్రవాకములు, నెమళ్ళు అన్నీ సంతోషించెను. 16

మూ. క్లిన్నపక్షోత్తరాః స్నాతాః కృచ్ఛ్రాదివ పతత్రిణః.
వృష్టివాతావధూతాగ్రాన్ పాదపానభిపేదిరే. 17

ప్ర. అ. క్లిన్నపక్షోత్తరాః=తడసిన రెక్కల పై భాగములు గల, పతత్రిణః = పక్షులు, స్నాతాః = స్నానము చేసినవై, వృష్టివాతావధూతాగ్రాన్ = వర్షముచేతను గాలిచేతను కదల్చివేయబడిన అగ్రభాగములు గల, పాదపాన్ = వృక్షములను, కృచ్ఛ్రాత్ ఇవ = అతి కష్టముగ, అభిపేదిరే = చేరినవి.

తా. తడసిపోయిన రెక్కలపై భాగములతో పక్షులు, స్నానము చేసినట్లయినవై, గాలికిని, వర్షమునకును కదలిపోవుచున్న అగ్రభాగములు గల చెట్లను అతికష్టముమీద చేరుచుండెను. 17

మూ. పతితేనామ్భసా చ్ఛన్నః పతమానేన చాసకృత్,
ఆబభౌ మత్తసారఙ్గస్తోయరాశిరివాచలః. 18

ప్ర. అ. పతితేన = పడినదీ, అసకృత్=మాటిమాటికిని, పతమానేన = పడుచున్నదీ అయిన, అమ్భసా=జలముచే, ఛన్నః=కప్పబడిన, మత్తసారఙ్గః= మదించిన లేళ్ళు గల, అచలః=పర్వతము, తోయరాశిరివ = సముద్రమువలె, ఆబభౌ = ప్రకాశించెను.

తా. కురిసిన జలము, ఇంకనూ కురియుచున్న జలము కప్పివేయగా, మదించిన లేళ్ళుగల పర్వతము సముద్రము వలె ఉండెను. 18

మూ. పాణ్డురారుణవర్ణాని స్రోతాంసి విమలాన్యపి,
సుస్రువుర్గిరిధాతుభ్యః సభస్మాని భుజఙ్గవత్. 19

ప్ర. అ. విమలాన్యపి = నిర్మలములైనను, స్రోతాంసి = జలప్రవాహములు, గిరిధాతుభ్యః=పర్వతముపైనున్న గైరికాది ధాతువులవలన, సభస్మాని= భస్మముతో కూడినవై, పాణ్డురారుణ వర్ణాని = తెల్లని ఎఱ్ఱని రంగులు గలవై, భుజఙ్గవత్ = సర్పముల వలె, సుస్రువుః = స్రవించినది. (క్రిందికి పాకినవి.)

తా. జలప్రవాహములు నిర్మలములే అయినను, పర్వతములపై నున్న గైరికాదిధాతువుల సంపర్కముచేత వాటి బూడిద కలిసి తెల్లగాను, ఎఱ్ఱగాను మారినవై, సర్పముల వలె ప్రవహించుచుండెను. 19

మూ. ఆకులారుణతోయాని స్రోతాంసి విమలాన్యపి,
ఉన్మార్గజలవాహీని బభూవుర్జలదాగమే. 20

ప్ర. అ. జలదాగమే = వర్షాకాలమునందు, స్రోతాంసి= ప్రవాహములు, విమలాన్యపి=స్వచ్ఛము లైనను, ఆకులారుణతోయాని = కరిగిపోయి ఎఱ్ఱనైన ఉదకము కలవై, ఉన్మార్గజలగామిని = దారి తప్పిన జలముతో ప్రవహించునవి, బభూవుః=అయినవి.

తా. అంతవరకును నిర్మలముగా ఉన్న ప్రవాహములు కూడ, వర్షకాలము రాగానే, కరిగిపోయి ఎఱ్ఱనైన జలముతో దారి తప్పి ప్రవహించుచుండెను. 20

మూ. తస్మిన్నతిసుఖే కాలే ధనుష్మానిషుమాన్రథీ,
వ్యాయామకృతసంకల్పః సరయూమన్వగాం నదీమ్. 21

ప్ర. అ. అతిసుఖే = మిక్కిలి సుఖకర మైన, తస్మిన్ కాలే = ఆ కాలమునందు, వ్యాయామ కృతసంకల్పః=వ్యాయామము కొరకై చేయబడిన సంకల్పము గలవాడనై, ధనుష్మాన్=ధనుర్ధారినై, ఇషుమాన్ = బాణములు కలవాడనై, రథీ = రథము కలవాడనై, సరయూనదీమ్ = సరయూనదిని, అన్వగామ్ = అనుసరించి వెళ్ళితిని.

తా. ఆనందజనక మైన ఆ వర్షాకాలమునందు వేట అను వ్యాయామము చేయవలె నని సంకల్పించి, రథము నెక్కి, ధనుర్బాణములు ధరించి, సరయూనదీ తీరము వైపు వెళ్ళితిని. 21

మూ. నిపానే మహిషం రాత్రౌ గజం వాభ్యాగతం నదీమ్,
అన్యం వా శ్వాపదం కంచిజ్జిఘాంసు రజితేన్ద్రియః. 22
తస్మింస్తత్రాహమేకాన్తే రాత్రౌ వివృతకార్ముకః.

ప్ర. అ. అహమ్ = నేను, అజితేన్ద్రియః = జయింపబడని ఇంద్రియములు కలవాడనై, తస్మిన్ = ఆ ప్రదేశమునందు, నిపానే = నీరుత్రాగు స్థలమున, నదీమ్ = నదిని గూర్చి, రాత్రౌ = రాత్రియందు, అభ్యాగతమ్ = వచ్చిన, మహిషమ్ = మహిషమును గాని, గజం వా = గజమును గాని, అన్యమ్ = మరి యేదైన, శ్వాపదం వా = క్రూరమృగమును గాని, జిఘాంసుః = చంప దలచినవాడనై, తత్ర = అక్కడ, రాత్రౌ = రాత్రియందు, ఏకాన్తే = రహస్య ప్రదేశమునందు, వివృత కార్ముకః = తెరవబడిన (సిద్ధముగా ఉంచుకొనబడిన) ధనస్సు కలవాడనై ఉంటిని.

తా. అక్కడ, నేను సరియైన ఆలోచన లేక, తోచిన విధముగా చేయుచు, రాత్రి నదిలో నీరు త్రాగు రేవునకు వచ్చు మహిషమును గాని గజమును గాని, మరి యేదైన క్రూరమృగమును గాని చంపవలె నను అభిప్రాయముతో, ధనస్సు సిద్ధముగా ఉంచుకొని, రాత్రియం దొక ఏకాంతప్రదేశమునందు పొంచి ఉంటిని.

మూ. తత్రాహం సంవృతం వన్యం హతవాంస్తీరమాగతమ్, 23
అన్యం చాపి మృగం హింస్రం శబ్దం శ్రుత్వాభ్యుపాగతమ్

ప్ర. అ. తత్ర = అక్కడ, అహమ్ = నేను, తీరమ్ ఆగతమ్ = సరయూ తీరమునకు వచ్చిన, వన్యమ్ = ఒక అడవిజంతువును, అభ్యుపాగతమ్ = వచ్చిన, అన్యమ్ = మరియొక, హింస్రమ్ = హింసాస్వభావము గల, మృగం చ = మృగమును, శబ్దమ్ = వాటి శబ్దమును, శ్రుత్వా = విని, సంవృతమ్ = రహస్యముగా, హతవాన్ = చంపినాను.

తా. అక్కడనేను రహస్యముగా పొంచి ఉండి, నదీతీరమునకు వచ్చిన ఒక వన్యమృగమును, మరొక క్రూరమృగమును, అవి చేయు శబ్దమును పట్టి గుర్తించి చంపితిని.

మూ. అథాన్ధకారే త్వశ్రౌషం జలే కుమ్భస్య పూర్యతః, 24
అచక్షుర్విషయే ఘోషం వారణస్యేవ నర్దతః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, అన్ధకారే = చీకటియందు, అచక్షుర్విషయే = కండ్లకు కనబడని ప్రదేశమున, నర్దతః = ధ్వనిచేయుచున్న, వారణస్యేవ = ఏనుగయొక్క ధ్వని వలె నున్న, జలే = నీటిలో, పూర్యతః = నింప

బడుచున్న, కుమ్భస్య = కుంభముయొక్క, ఘోషమ్ = ధ్వనిని, అశ్రౌషమ్ = వింటిని.

తా. ఇంతలో అంధకారమునందు, కంటికి కనబడని ప్రదేశమునందు, నీడు నింపుచున్న కుంభము ధ్వని, ఘీంకరించుచున్న ఏనుగ ధ్వని వలె విన వచ్చెను. 24

మూ. తతోఽహం శరముద్ధృత్య దీప్తమాశీవిషోపమమ్, 25
శబ్దం ప్రతి గజప్రేప్సురభిలక్ష్య త్వపాతయమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, గజప్రేప్సుః = గజమును పొందదలచిన వాడ నై, దీప్తమ్ = ప్రకాశించుచున్న, ఆశీవిషోపమమ్ = సర్పముతో సమానమైన, శరమ్ = శరమును, ఉద్ధృత్య = తీసి, శబ్దం ప్రతి = శబ్దమును గూర్చి, అభిలక్ష్య = గురిచూచి, అపాతయమ్ = విడచితిని.

తా. పిమ్మట ఆ గజమును కొట్టవలె నను అభిలాషతో, ప్రకాశించు చున్న సర్పమువంటి బాణము తీసి ఆ ధ్వనిని గురి చూచి విడచితిని. 25

మూ. అముఞ్చం నిశితం బాణమహమాశీవిషోపమమ్, 26
తత్ర వాగుషసి వ్యక్తా ప్రాదురాసీద్వనౌకసః,
హా హేతి పతతస్తోయే బాణాభిహతమర్మణః 27

ప్ర. అ. అహమ్ = నేను, ఆశీవిషోపమమ్ = సర్పముతో సమాన మైన, నిశితమ్ = వాడియైన, బాణమ్ = బాణమును, అముఞ్చమ్ = విడచితిని. తత్ర = అక్కడ, ఉషసి = ప్రాతఃకాలమునందు, బాణాభిహతమర్మణః = బాణముచేత కొట్టబడిన మర్మస్థానము గలవాడూ, తోయే = ఉదకమునందు, పతతః = పడుచున్న వాడూ అయిన, వనౌకసః = వనమునందు నివసించువానియొక్క, హా హా ఇతి = అయ్యో అయ్యో అను, వ్యక్తా = స్పష్ట మైన, వాక్ = వాక్కు, ప్రాదురాసీత్ = బయలు దేరెను.

తా. నేను సర్పమువంటి, వాడి యైన బాణమును ప్రయోగించితిని. అపుడు ఆ ప్రాతఃకాలసమయమున, బాణము మర్మస్థలమునందు గ్రుచ్చుకొనగా నీటిలో పడిపోయిన ఒక వననివాసి "అయ్యోఅయ్యో" అని అరచిన అరపు స్పష్టముగా వినబడెను. 27

మూ. తస్మిన్నిపతితే బాణే వాగభూత్తత్ర మానుషీ,
కథమస్మద్విధే శస్త్రం నిపతేత్తు తపస్విని. 28

ప్ర. అ. తస్మిన్ = ఆ, బాణే = బాణము నిపతితే = పడినదగుచుండగా, తత్ర = అక్కడ, మానుషీ = మనుష్యసంబంధమైన, వాక్ = వాక్కు, అభూత్ = ఆయెను. అస్మద్విధే = నావంటి, తపస్విని = మునియందు, శస్త్రమ్ = ఆయుధము, కథమ్ = ఎట్లు, నిపతేత్తు = పడెనోకదా!

తా. ఆ బాణము తగలగనే అక్కడ ఒక మనుష్యవాక్కు వినబడెను. "తపస్సు చేసుకొను నావంటి వానిపై ఈ శస్త్ర మెవరు ప్రయోగించినారో కదా!"

మూ. ప్రవివిక్తాం నదీం రాత్రావుదాహారోఽహమాగతః,
ఇషుణాభిహతః కేన కస్య వా కిం కృతం మయా. 29

ప్ర. అ. అహమ్ = నేను, ఉదాహారః=జలమును తీసికొనబోవువాడనై, రాత్రౌ=రాత్రియందు, ప్రవివిక్తామ్ = నిర్జనముగా ఉన్న, నదీమ్=నదిని గూర్చి, ఆగతః = వచ్చితిని. ఇషుణా = బాణముతో, కేన = ఎవనిచేత, అభిహతః = కొట్టబడితిని? మయా = నాచేత, కస్య = ఎవనికి, కిమ్=ఏమి, కృతమ్ = చేయబడినది?

తా. నేను జలము తీసికొనిపోవుటకై, రాత్రి, ఈ నిర్జనమైన నదికి వచ్చినాను. నన్ను బాణముతో ఎవరు కొట్టినారో! నేను ఎవరికి ఏమి అపకారము చేసితిని? 29

మూ. ఋషేర్హి న్యస్తదణ్డస్య వనే వన్యేన జీవతః,
కథం ను శస్త్రేణ వధో మద్విధస్య విధీయతే. 30

ప్ర. అ. న్యస్తదణ్డస్య = విడువబడిన హింసకలవాడూ, వనే = వనమునందు, వన్యేన = వనమునందు లభించుదానితో, జీవతః = జీవించుచున్నవాడూ అయిన, మద్విధస్య = నా వంటి. ఋషేః = ఋషికి, శస్త్రేణ = శస్త్రముచేత, వధః = వధ, కథం ను = ఎట్లు, విధీయతే = విధింపబడుచున్నది.

తా. హింసను పరిత్యజించి వనములో లభించు వస్తువులతో వనమునందు జీవిక గడుపుచున్న నా వంటి ఋషికి, ఆయుధముచే మరణమును విధించుటకు కారణ మేమి? 30

మూ. జటాభారధరస్యైవ వల్కలాజినవాససః,
కో వధేన మమార్థీ స్యాత్కిం వాస్యాపకృతం మయా. 31

ప్ర. అ. జటాభారధరస్యైవ = జటాభారమునే ధరించువాడనూ, వల్కలాజినవాససః=నారచీరలను అజినమును వస్త్రముగా ధరించినవాడనూ అయిన, మమ = నాయొక్క, వధేన=వధచేత (యందు), అర్థీ = కోరిక గలవాడు, కః= ఎవ్వడు, స్యాత్ = ఆయిఉండును? మయా = నాచేత, అస్య = వీనికి, కిం వా = ఏమి, అపకృతమ్ = అపకారము చేయబడినది?

తా. జటాభారమును, నారచీరలను, కృష్ణాజినమును ధరించిన నన్ను చంపవలెనను కోరిక గలవాడు ఎవ్వడో ; అతనికి నేను ఏమి అపకారము చేసితిని ? 31

మూ. ఏవం నిష్ఫలమారబ్ధం కేవలానర్థసంహితమ్,
న కశ్చిత్సాధు మన్యేత యథైవ గురుతల్పగమ్. 32

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, కేవలానర్థసంహితమ్ = అనర్థముతో మాత్రమే సంబంధించిన, నిష్ఫలమ్ = వ్యర్థమైన కార్యము, ఆరబ్ధమ్=ప్రారంభింపబడినది. కశ్చిత్ = ఎవ్వడును, గురుతల్పగం యథైవ = గురుపత్నీగమనము చేసినవానిని వలె, ఈ పని చేసినవానిని, సాధు = మంచిగా, నమన్యేత = తలవజాలడు.

తా. ఆతడెవ్వడో కాని, కేవలము అనర్థమును మాత్రమే కలిగించు వ్యర్థమైన కార్యము చేసినాడు. ఏ ఒక్కడును, ఈతనిని గురుతల్పగమనము చేసిన వానిని వలె మెచ్చుకొనడు. 32

మూ. నాహం తథానుశోచామి జీవితక్షయమాత్మనః,
మాతరం పితరం చోభావనుశోచామి మద్వధే. 33

ప్ర. అ. అహమ్ = నేను, ఆత్మనః = నాయొక్క, జీవితక్షయమ్ = ప్రాణముల నాశమునుగూర్చి, తథా = అంతగా, నానుశోచామి = దుఃఖించను. మద్వధే = నావధవిషయమున, మాతరమ్ = తల్లినీ, పితరం చ = తండ్రినీ, ఉభౌ = ఇద్దరినీగూర్చి, అనుశోచామి = దుఃఖించుచున్నాను.

తా. నేను మరణించుచున్నందుకు నన్ను గూర్చి నాకు అంతగా విచారము లేదు. నాకు మరణము సంప్రాప్తించినందుకు నా తల్లిదండ్రుల నిద్దరిని గూర్చి మాత్రమే విచారించుచున్నాను. 33

మూ. తదేతన్మిథునం వృద్ధం చిరకాలభృతం మయా,
మయి పఞ్చత్వమాపన్నే కాం వృత్తిం వర్తయిష్యతి. 34

ప్ర. అ. మయి = నేను, పఞ్చత్వమ్ = మరణమును, ఆపన్నే = పొందినవాడ నగుచుండగా, మయా = నాచేత, చిరకాలభృతమ్ = చిరకాలము పోషింపబడిన, వృద్ధమ్ = వార్ధక్యములో నున్న, ఏతత్ = ఈ, మిథునమ్= మిథునము, కామ్ = ఏ, వృత్తిమ్ = జీవికను, వర్తయిష్యతి=అనుసరించునో ?

తా. నేను ఆ వృద్ధదంపతులను చిరకాలమునుండి పోషించుచున్నాను. నేను మరణించిన పిమ్మట వారు ఏ విధముగా జీవితమును సాగింతురో కదా !

మూ. వృద్ధౌ చ మాతాపితరావహం చైకేషుణా హతాః,
కేన స్మ నిహతాః సర్వే సుబాలేనాకృతాత్మనా. 35

ప్ర. అ. వృద్ధౌ = వృద్ధులైన, మాతాపితరౌ = నాతల్లిదండ్రులు, అహం చ = నేనూ, ఏకేషుణా = ఒకటే బాణముచేత, హతాః = చంపబడితిమి. అకృతాత్మనా = మనోనిగ్రహము లేని, సుబాలేన = చాల మూఢుడైన, కేన = ఎవనిచేత, సర్వే = మే మందరము, నిహతాః స్మ = చంపబడితిమి ?

తా. నా తలిదండ్రులు, నేనూ కూడా ఒకే బాణముచేత చంపబడినాము. ఈ విధముగా మమ్ముల నందరినీ చంపిన, ఆ మనోనిగ్రహము లేని పరమ మూఢు డెవ్వడో కదా ! 35

మూ. తాం గిరం కరుణాం శ్రుత్వా మమ ధర్మానుకాఙ్క్షిణః,
కరాభ్యాం సశరం చాపం వ్యథితస్యాపతద్భువి. 36

ప్ర. అ. కరుణామ్ = దీనమైన, తాం గిరమ్ = ఆ వాక్కును, శ్రుత్వా =విని, ధర్మానుకాఙ్క్షిణః = ధర్మమునుకోరు, వ్యథితస్య = దుఃఖితుడనైన, మమ = నాయొక్క, కరాభ్యామ్ = చేతులనుండి, సశరమ్ = బాణముతో కూడిన, చాపమ్ = ధనుస్సు, భువి = భూమియందు, అపతత్ = పడెను.

తా. దీనము లైన ఆ మాటలు వినగానే, ధర్మమునందు ఆసక్తి గల నాకు చాల వ్యథ కలిగినది. నా చేతులనుంచి శరచాపములు జారి నేలపై పడినవి. 36

మూ. తస్యాహం కరుణం శ్రుత్వా నిశి లాలపతో బహు,
సంభ్రాన్తః శోకవేగేన భృశమాస విచేతనః. 37

ప్ర. అ. అహమ్ = నేను, నిశి = రాత్రియందు, బహు = అత్యధికముగా, లాలపతః = విలపించుచున్న, తస్య=అతనియొక్క, కరుణమ్=దీనాలాపమును, శ్రుత్వా = విని, శోకవేగేన = దుఃఖవేగముచేత, సంభ్రాన్తః=త్రొట్రుపాటు చెందినవాడనై, భృశమ్ = మిక్కిలి, విచేతనః = చైతన్యము లేనివాడను, అస = అయితిని.

తా. రాత్రి ఆ విధముగ మిక్కిలి విలపించుచున్న ఆతని దీనవచనములు విని శోకవేగముచే త్రొట్రుపడుచున్న నా మనస్సు చాల వికల మైపోయెను. 37

మూ. తం దేశమహమాగమ్య దీనసత్త్వః సుదుర్మనాః,
అపశ్యమిషుణా తీరే సరయ్వాస్తాపసం హతమ్. 38
అవకీర్ణజటాభారం ప్రవిద్ధకలశోదకమ్,
పాంసుశోణితదిగ్ధాఙ్గం శయానం శల్యపీడితమ్. 39

ప్ర. అ. అహమ్ = నేను, దీనసత్త్వః=తరిగిపోయిన బలము కలవాడనై, సుదుర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు కలవాడనై, తం దేశమ్ = ఆ ప్రదేశమును, ఆగమ్య = చేరి, సరయ్వాః = సరయూనదియొక్క, తీరే=తీరమునందు, ఇషుణా = బాణముచే, హతమ్ = కొట్టబడినవాడూ, అవకీర్ణజటాభారమ్= చెదరిన జటాభారము కలవాడూ, ప్రవిద్ధకలశోదకమ్ = దూరముగా చిమ్మివేయబడిన కలశోదకము కలవాడూ, పాంసుశోణితదిగ్ధాఙ్గమ్ = పరాగముచేతను, రక్తముచేతను పూయబడిన శరీరము కలవాడూ, శయానమ్ = పడియున్నవాడూ, శల్యపీడితమ్ = ములికిచేత పీడింపబడినవాడూ అయిన, తాపసమ్ = మునిని, అపశ్యమ్=చూచితిని.

తా. బలము ఉడిగిపోయి, మనస్సులో మిగుల దుఃఖించుచు, నేను ఆ ప్రదేశమునకు వెళ్ళి సరయూనదీ తీరమున బాణముచే హతుడై, శల్యముచేత పీడింపబడుచు, నేలపై పడి యున్న మునికుమారుని చూచితిని. ఆతని జటాభారము

విడిపోయి చెదరి ఉండెను. కలశలోని ఉదకము దూరముగా పడిపోయెను. ఆతని శరీర మంతయు పరాగము చేతను, రక్తముచేతను కప్పబడి ఉండెను. 38,39

మూ. స మాముద్వీక్ష్య నేత్రాభ్యాం త్రస్తమస్వస్థచేతసమ్,
ఇత్యువాచ తతః క్రూరం దిధక్షన్నివ తేజసా. 40

ప్ర. అ. సః=అతడు, త్రస్తమ్=భయపడినవాడను. అస్వస్థచేతసమ్ = దిగులుపడిన మనస్సు కలవాడను అయిన, మామ్ = నన్ను, తేజసా=తేజస్సుచేత దిధక్షన్నివ = కాల్చివేయదలచుచున్నవాడు వలె, నేత్రాభ్యామ్ = నేత్రములతో, ఉద్వీక్ష్య = పైకి చూచి, తతః = అటు పిమ్మట, క్రూరమ్=పరుషముగా, ఇతి= ఈ విధముగా, ఉవాచ = పలికెను.

తా. భయపడి, దిగులు చెందిన మనస్సు గల నన్ను ఆతడు తన తేజస్సు చేత కాల్చివేయదలచుచున్నాడా అన్నట్లు నేత్రములతో పైకి చూచి పరుషముగా ఇట్లు పలికెను. 40

మూ. కిం తవాపకృతం రాజన్ వనే నివసతా మయా,
జిహీర్షురమ్భో గుర్వర్థం యదహం తాడితస్త్వయా. 41

ప్ర. అ. రాజన్ = రాజా, గుర్వర్థమ్ = తల్లిదండ్రులకొరకు, అమ్భః = ఉదకమును, జిహీర్షుః = తీసికొనబోవకోరుచున్న, అహమ్ = నేను, త్వయా= నీచేత, తాడితః = కొట్టబడితినే! వనే=వనమునందు, నివసతా=నివసించుచున్న, మయా = నాచేత, తవ=నీకు, కిమ్ = ఏమి, అపకృతమ్ = అపకారము చేయ బడినది?

తా. రాజా! నా తలిదండ్రుల కోసము జలము తీసికొనిపోవుచున్న నన్నిట్లు కొట్టితివే —వనములో నివసించుచున్న నేను నీకు ఏమి అపకారము చేసినాను ? 41

మూ. ఏకేన ఖలు బాణేన మర్మణ్యభిహతే మయి,
ద్వావన్ధౌ నిహతౌ వృద్ధౌ మాతా జనయితా చ మే. 42

ప్ర. అ. ఏకేన = ఒక్క, బాణేన = బాణముచేత, మయి = నేను, మర్మణి = మర్మస్థానమునందు, అభిహతే కొట్టబడినవాడ నగుచుండగా, మే

= నాయొక్క, మాతా = తల్లియు, జనయితా చ = తండ్రియు, అన్ధౌ = అంధులైన, ద్వౌ = ఇద్దరు, వృద్ధౌ = వృద్ధులు, నిహతౌ ఖలు = చంపబడినారు కదా!

తా. ఒక్క బాణముతో నన్ను మర్మస్థానమునందు కొట్టుటచేత, వృద్ధులూ అంధులూ అయిన నా తలిదండ్రులను కూడ చంపినట్లు అయినది కదా! 42

మూ. తౌ నూనం దుర్బలావన్ధౌ మత్ప్రతీక్షౌ పిపాసితౌ,
చిరమాశాకృతాం తృష్ణాం కష్టాం సంధారయిష్యతః. 43

ప్ర. అ. దుర్బలౌ = దుర్బలులు, అన్ధౌ = గ్రుడ్డివారు, పిపాసితౌ = దప్పికొన్నవారూ అయిన, తౌ = వారిద్దరు, కష్టామ్ = కష్టమైన, ఆశాకృతామ్ = ఆశచే చేయడిన, తృష్ణామ్ = దప్పికను, చిరమ్ = చిరకాలము, సంధారయిష్యతః = ఆపుకొందురు. నూనమ్ = నిశ్చయము.

తా. దప్పికొన్న దుర్బలులు, అంధులు అయిన నా తలిదండ్రులు, నాకోసమై నిరీక్షించుచు, నేను జలము తీసికొనివచ్చెదనను ఆశతో, అతికష్టముగా దప్పికను ఆపుకొనుచుందురు. నిశ్చయము. 43

మూ. న నూనం తపసో వాస్తి ఫలయోగః శ్రుతస్య వా,
పితా యన్మాం న జానాతి శయానం పతితం భువి. 44

ప్ర. అ. నూనమ్ = నిశ్చయముగా, తపసో వా = తపస్సునకు గాని, శ్రుతస్య వా = శాస్త్రజ్ఞానమునకు గాని, ఫలయోగః = ఫలసంబంధము, నాస్తి = లేదు. యత్ = ఏ కారణము వలన, పితా = నా తండ్రి, భువి = నేలపై, పతితమ్ = పడిపోయిన, శయానమ్ = శయనించి ఉన్న, మామ్ = నన్ను గూర్చి, న జానాతి = ఎరుగడో.

తా. నేనీ విధముగ నేలపై పడి ఉన్నట్లు నా తండ్రికి తెలియదు. దీనిని పట్టి తపస్సునకు గాని, శాస్త్రజ్ఞానమునకుగాని ప్రయోజన మేమియు లేదని నిశ్చయముగ చెప్పవచ్చును. 44

మూ. జానన్నపి చ కిం కుర్యాదశక్తిరపరిక్రమః,
ఛిద్యమానమివాశక్తస్త్రాతుమన్యో నగో నగమ్. 45

ప్ర. అ. అశక్తః=శక్తిలేనివాడు, అపరిక్రమః=నడక లేనివాడూ అయిన నా తండ్రి, ఛిద్యమానమ్=ఛేదింపబడుచున్న, నగమ్=వృక్షమును, త్రాతుమ్= రక్షించుటకు, అశక్తః=అసమర్థమైన, అన్యః=మరియొక, నగ ఇవ=వృక్షము వలె, జానన్నపి = తెలిసినవాడైనను, కిమ్=ఏమి, కుర్యాత్ = చేయును ?

తా. దుర్బలుడై, నడచుటకు కూడా శక్తి లేని నా తండ్రి, ఈ విషయము తెలిసినను ఏమిచేయగలడు : ప్రక్క నున్న వృక్షమును నరికివేయుచుండగా మరి యొక వృక్షము దాని నెట్లు రక్షింపజాలదో, అట్లే ఆత డేమియు చేయ జాలడు. 45

మూ. పితుస్త్వమేవ మే గత్వా శీఘ్రమాచక్ష్వ రాఘవ,
న త్వామనుదహేత్క్రుద్ధో వనం వహ్నిరివైధితః. 46

ప్ర. అ. రాఘవ = దశరథా: త్వమేవ = నీవే, శీఘ్రమ్ = శీఘ్రముగా, గత్వా = వెళ్ళి, మే పితుః = నా తండ్రికి, ఆచక్ష్వ = చెప్పుము. క్రుద్ధః = కోపగించినవాడై, ఏధితః = వృద్ధిపొందింపబడిన, వహ్నిః = అగ్ని, వనమివ= వనమును వలె, త్వామ్=నిన్ను, నానుదహేత్=కాల్చివేయడు.

తా. దశరథా : నా తండ్రి కోపగించి, రగిలిన అగ్ని వనమును దహించి నట్లు, నిన్ను దహించకుండ వలె నన్నచో, నీవే వెంటనే వెళ్ళి, నా తండ్రికి ఈ విషయమును చెప్పుము. 46

మూ. ఇయమేకపదీ రాజన్ యతో మే పితురాశ్రమః,
తం ప్రసాదయ గత్వా త్వం న త్వాం స కుపితః శపేత్.

ప్ర. అ. రాజన్ = రాజా, యతః = ఎటు వైపు, మే పితుః = నా తండ్రి యొక్క, ఆశ్రమః = ఆశ్రమ మున్నదో, అటు వైపు, ఇయమ్ = ఈ, ఏకపదీ= కాలిబాట (వెళ్లును). త్వమ్ = నీవు, గత్వా=వెళ్ళి, తమ్=అతనిని, ప్రసాదయ = అనుగ్రహింపచేసుకొనుము. సః=అతడు, కుపితః = కోపించినవాడై, త్వామ్ = నిన్ను, న శపేత్ = శపించకుండు గాక.

తా. రాజా : ఈ కాలిబాట నా తండ్రి ఆశ్రమమునకు పోవును. నీవు వెళ్ళి అతనిని బ్రతిమాలుకొనుము. అట్లు చేసినచో అతడు నిన్ను శపించక విడచును.

మూ. విశల్యం కురు మాం రాజన్ మర్మ మే నిశితః శరః,
రుణద్ధి మృదు సోత్సేధం తీరమమ్బురయో యథా. 48

ప్ర. అ. రాజన్ = రాజా! మామ్ = నన్ను, విశల్యమ్ = శల్యము లేని వానినిగా, కురు = చేయుము. నిశితః = వాడి యైన, శరః = బాణము, మే మర్మ = నా మర్మస్థానమును, మృదు = మృదు వైన, సోత్సేధమ్ = ఎత్తుతో కూడిన, తీరమ్ = తీరమును, అమ్బురయః యథా = జలవేగము వలె, రుణద్ధి = అడ్డుపెట్టు చున్నది (పీడించుచున్నది).

తా. రాజా! నా శరీరమునుండి బాణశల్యమును తీసివేయుము. వాడి యైన నీ బాణము, నా మర్మస్థానమును, జలవేగము, మృదు వైన, ఎత్తైన, తీరమును పీడించి నట్లు పీడించుచున్నది. 48

వి. ఈ శ్లోక భావం అంతగా సరిగా నున్నట్లు లేదు. "బాణశల్యము నా ప్రాణాలు బైటకు పోకుండా చేయుచున్నది- తీరము జలప్రవాహమును అడ్డగించినట్లు"- అని భావ ముండవలెను. ఆ భావము ఈ పాఠములో రాదు. అందుచేత ప్రాచ్య పాఠము బాగున్నది.

"విశల్యం మాం కురు క్షిప్రం త్వయాయం యోఽర్పితః శరః,
హృది వజ్రాగ్నిసంస్పర్శః ప్రాణానుపరుణద్ధి మే,
సశల్యో మరణం నాహమాప్నుయాం శల్యముద్ధర"

అని ఆ పాఠము. "తొందరగా నా శల్యమును ఊడబెరుకుము. నీవు వేసిన బాణము వజ్రాగ్నితుల్య స్పర్శతో నా ప్రాణాలను అడ్డుకొనుచున్నది. ఈ శల్యము ఉన్నంతవరకు నేను చావను. ఈ శల్యము పెరికివేయుము" అని తాత్పర్యము.

మూ. సశల్యః క్లిశ్యతే ప్రాణైర్విశల్యో వినశిష్యతి,
ఇతి మామవిశచ్చిన్తా తస్య శల్యాపకర్షణే. 49

ప్ర. అ. సశల్యః = శల్యముతోకూడినవా డైతే, ప్రాణైః = ప్రాణములతో, క్లిశ్యతే = బాధపడును. విశల్యః = శల్యము లేనివా డైతే, వినశిష్యతి = మరణించును. ఇతి = ఈ విధముగా, చిన్తా = ఆలోచన, తస్య = అతనియొక్క, శల్యాప

కర్షణే = శల్యమును లాగివేయుట విషయమున, మామ్ = నన్ను, అవిశత్ = ప్రవేశించెను.

తా. అతని శల్యము తొలగించు విషయమున, "శల్యము లాగి వేయకున్నచో ఇతడు ప్రాణములు పోక బాధపడును. శల్యము తీసివేసినచో మరణించును. ఇపు డేమి చేయవలెను" అను చింత నాకు కలిగెను. 49

మూ. దుఃఖితస్య చ దీనస్య మమ శోకాతురస్య చ,
లక్షయామాస హృదయే చిన్తాం మునిసుత స్తదా. 50

ప్ర. అ. తదా = అప్పుడు, మునిసుతః = మునికుమారుడు, దుఃఖితస్య = దుఃఖితుడను, దీనస్య = దీనుడను, శోకాతురస్య చ = శోకముచే వ్యాకులుడను అయిన, మమ = నాయొక్క, హృదయే = హృదయమునందు, చిన్తామ్ = చింతను, లక్షయామాస = ఊహించెను.

తా. అప్పు డా మునికుమారుడు, దుఃఖితుడ నై, దీనుడ నై, శోకముతో వ్యాకులుడ నై ఉన్న నా మనస్సులోని భావమును గ్రహించెను. 50

మూ. తామ్యమానః స మాం దుఃఖాదువాచ పరమార్తవత్,
సీదమానో వివృత్తాఙ్గో వేష్టమానో గతః క్షయమ్. 51

ప్ర. అ. తామ్యమానః = బాధపడుచున్నవాడూ, సీదమానః = క్రుంగిపోవుచున్న వాడూ, వివృత్తాఙ్గః = మెలికలు తిరుగుచున్న అవయవములు కలవాడూ, వేష్టమానః = దొర్లుచున్నవాడూ, క్షయమ్ = నాశమును, గతః = పొందినవాడూ అయిన, సః = అతడు, పరమార్తవత్ = మిక్కిలి పీడితుడై, కృచ్ఛ్రాత్ = అతికష్టముగా, మామ్ = నన్ను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. ఆ మునికుమారుడు బాధతో క్రుంగిపోయి, అవయవము లన్నియు మెలికలు తిరుగగా, నేలపై దొరలుచు మరణోన్ముఖు డై, చాల దుఃఖించుచు, నాతో అతికష్టము మీద ఇట్లనెను. 51

మూ. సంస్తభ్య శోకం ధైర్యేణ స్థిరచిత్తో భవామ్యహమ్,
బ్రహ్మహత్యాకృతం పాపం హృదయాదపనీయతామ్.

ప్ర. అ. అహమ్ = నేను, ధైర్యేణ=ధైర్యముచేత, శోకమ్=శోకమును, సంస్తభ్య = అణగద్రొక్కి, స్థిరచిత్తః = స్థిరమైన చిత్తము కలవాడను, భవామి = అగుచున్నాను. బ్రహ్మహత్యాకృతమ్ = బ్రహ్మహత్యవలన కలిగిన, పాపమ్ =పాపము, హృదయాత్ = హృదయమునుండి, అపనీయతామ్ = తొలగించబడుగాక.

తా. నేను ధైర్యముతో శోకమును అణగద్రొక్కుకొని, స్థిరచిత్తుడను అగుచున్నాను. బ్రహ్మహత్యాపాపము చేసితినే అని భయపడకుము. 52

మూ. న ద్విజాతిరహం రాజన్ మా భూత్తే మనసో వ్యథా,
శూద్రాయామస్మి వైశ్యేన జాతో జనపదాధిప. 53

ప్ర. అ. జనపదాధిప = దేశాధీశుడవైన, రాజన్ = ఓ రాజా! అహమ్= నేను, ద్విజాతిః = బ్రాహ్మణుడను, న = కాను. తే=నీయొక్క, మనసః = మనస్సునకు, వ్యథా = బాధ, మా భూత్ = కలగకుండుగాక. వైశ్యేన = వైశ్యుని చేత, శూద్రాయామ్ = శూద్ర స్త్రీయందు, జాతః = పుట్టినవాడను, అస్మి = అయి ఉన్నాను.

తా. దేశమును పాలించు ఓ రాజా! నేను బ్రాహ్మణుడను కాను. నీవు మనస్సులో బాధ పడకుము. నేను వైశ్యజాతీయునకు శూద్రస్త్రీయందు జన్మించిన వాడను. 53

మూ. ఇతీవ వదతః కృచ్ఛ్రాద్బాణాభిహతమర్మణః,
విఘూర్ణతో విచేష్టస్య వేపమానస్య భూతలే. 54
తస్య త్వానమ్యమానస్య తం బాణమహముద్ధరమ్,
స మాముద్వీక్ష్య సంత్రస్తో జహౌ ప్రాణాంస్తపోధనః

ప్ర. అ. ఇతీవ = ఈ విధముగా, కృచ్ఛ్రాత్ = అతికష్టముగా, వదతః= మాటలాడుచున్నవాడూ, బాణాభిహతమర్మణః = బాణముచేత కొట్టబడిన మర్మస్థానము కలవాడూ, విఘూర్ణతః = తిరిగిపోవుచున్నవాడూ, విచేష్టస్య = చేష్ట ఉడిగిన వాడూ, భూతలే = నేలపై, వేపమానస్య=వణకుచున్న వాడూ, ఆనమ్యమానస్య = ముణుచుకొనిపోవుచున్నవాడూ అయిన, తస్య = అతనియొక్క,

తం బాణమ్ = ఆ బాణమును, అహమ్ = నేను, ఉద్ధరమ్ = లాగివేసితిని. సః తపోధనః = ఆ ముని, మామ్ = నన్ను, ఉద్వీక్ష్య = పైకి చూచి, సంత్రస్తః = భయపడినవాడై, ప్రాణాన్ = ప్రాణములను, జహౌ = విడచెను.

తా. మర్మస్థానమునందు బాణము తగిలి, తిరిగిపోవుచు, నేలపై దొరలుచున్న అతడు అతికష్టముమీద నాతో ఈ మాటలు చెప్పెను. శరీరము ముణచుకొని పోవగా అతని చేష్టలు కూడ తగ్గిపోయెను. అపుడాతని శరీరమునుండి నేను బాణమును లాగివేసితిని. ఆ సమయమునందు ఆ తపోధనుడు కంద్లెత్తి నా వైపు చూచి, భయపడుచు ప్రాణములు విడచెను. 54, 55

మూ. జలార్ద్రగాత్రం తు విలప్య కృచ్ఛ్రాత్,
మర్మవ్రణం సంతతముచ్ఛ్వసన్తమ్,
తతః సరయ్యాం తమహం శయానం,
సమీక్ష్య భద్రేఽస్మి భృశం విషణ్ణః. 56

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. భద్రే=మంగళ స్వరూప వైన ఓ కౌసల్యా! జలార్ద్రగాత్రమ్= జలముచే తడిసిన శరీరము కలవాడూ, కృచ్ఛ్రాత్ = బాధవలన, విలప్య = విలపించి, సంతతమ్ = ఎడతెగకుండగా, ఉచ్ఛ్వసన్తమ్ = నిట్టూర్చుచున్నవాడూ, మర్మవ్రణమ్ = మర్మప్రదేశమునందు గాయము కలవాడూ, సరయ్వామ్ = సరయూనదిలో, శయానమ్ = శయనించుచున్నవాడూ అయిన, తమ్ = అతనిని సమీక్ష్య = చూచి, అహమ్ = నేను, తతః = దానివలన, భృశమ్ = మిక్కిలి, విషణ్ణః = దుఃఖితుడను, అస్మి = అయితిని.

తా. కౌసల్యా! మర్మప్రదేశమునందు తగిలిన గాయముచే కలిగిన బాధతో విలపించి, ఎడతెగక నిట్టూర్చుచు, నీళ్లతో తడిసి, సరయూనదిలో పడి ఉన్న అతనిని చూడగానే నాకు చాల దుఃఖము కలిగెను. 56

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదిమూడవ సర్గ సమాప్తము.

# చతుః షష్టితమః సర్గః

[దశరథుడు తాను మునికుమారుని వధించుటచే దుఃఖితుడై ఆతని తల్లిదండ్రులు విలపించుటను, వారు తన్ను శపించుటను కౌసల్యకు వినిపించి, రోదించుచు అర్ధరాత్రిసమయమున ప్రాణములు విడచుట.]

మూ. వధమప్రతిరూపం తు మహర్షేస్తస్య రాఘవః,
విలపన్నేవ ధర్మాత్మా కౌసల్యాం పున రబ్రవీత్. 1

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాఘవః = దశరథుడు, తస్య మహర్షేః = ఆ మహర్షియొక్క, అప్రతిరూపమ్ = సాటిలేని, వధమ్ = వధను గూర్చి, విలపన్నేవ = మాటలాడుచునే, పునః = మరల, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మాత్ముడైన దశరథుడు, విలపించుచునే సాటిలేని ఆ ముని కుమారవధను గూర్చి కౌసల్యతో మరల ఇట్లనెను. 1

మూ. తదజ్ఞానాన్మహత్పాపం కృత్వాహం సంకులేన్ద్రియః,
ఏకస్త్వచిన్తయం బుద్ధ్యా కథం ను సుకృతం భవేత్. 2

ప్ర. అ. అహమ్ = నేను, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, తత్ = ఆ, మహత్ = గొప్ప, పాపమ్ = పాపమును, కృత్వా = చేసి, సంకులేన్ద్రియః = వ్యాకులమైన ఇంద్రియములు కలవాడనై, ఏకస్తు = ఒక్కడనే, కథం ను = ఎట్లు, సుకృతమ్ = చక్కగా చేయబడినది, భవేత్ = అగును అని, బుద్ధ్యా = బుద్ధితో అచిన్తయమ్ = ఆలోచించితిని.

తా. అక్కడ ఒంటరిగానే ఉన్న నేను అజ్ఞానముచే చేసిన మహాపాపమునకు వ్యాకులమైన ఇంద్రియములు కలవాడనై, ఈ మహాపాపమునుండి బైటబడుట ఎట్లా అని నా బుద్ధితో ఆలోచించితిని. 2

మూ. తతస్తం ఘటమాదాయ పూర్ణం పరమవారిణా,
ఆశ్రమం తమహం ప్రాప్య యథాఖ్యాతపథం గతః. 3

ప్ర. అ. తతః = పిమ్మట, పరమవారిణా = ఉత్తమ మైన ఉదకముతో, పూర్ణమ్ = నిండిన, తమ్ = ఆ, ఘటమ్ = ఘటమును, ఆదాయ = గ్రహించి, యథాఖ్యాతపథమ్ = చెప్పిన విధముగా మార్గమును, ప్రాప్య = పొంది, అహమ్ = నేను, తమ్ ఆశ్రమమ్ = ఆ ఆశ్రమును, గతః = చేరితిని.

తా. పిమ్మట నేను ఆ ఘటమునందు ఉత్తమ మైన నీరు నింపుకొని, ఆ ముని కుమారుడు చెప్పిన మార్గమున ఆ ఆశ్రమమును చేరితిని. 3

మూ. తత్రాహం దుర్బలావన్ధౌ వృద్ధావపరిణాయకౌ,
అపశ్యం తస్య పితరౌ లూనపక్షావివ ద్విజౌ. 4
తన్నిమిత్తాభిరాసీనౌ కథాభిరపరిశ్రమౌ,
తామాశాం మత్కృతే హీనావుదాసీనావనాథవత్. 5

ప్ర. అ. తత్ర = అక్కడ, అహమ్ = నేను, దుర్బలౌ = దుర్బలులూ, అన్ధౌ = గ్రుడ్డివారూ, వృద్ధౌ=ముసలివారూ, అపరిణాయకౌ = నడిపించేవారు లేని వారూ, లూనపక్షౌ = ఛేదించబడిన రెక్కలు గల, ద్విజౌ ఇవ = పక్షుల వలె ఉన్నవారూ, తన్నిమిత్తాభిః = ఆ కుమారుడు నిమిత్తముగా గల, కథాభిః = కథలతో, ఆసీనౌ = కూర్చున్నవారూ, అపరిశ్రమౌ = ఏ పరిశ్రమయు లేని వారూ, మత్కృతే=నా నిమిత్తమై, తామ్ ఆశామ్ = ఆ పుత్రునికి సంబంధించిన ఆశను, హీనౌ=కోల్పోయినవారూ, అనాథవత్ = నాథుడు లేనివారు వలె, ఉదాసీనౌ = ఉత్సాహరహితులూ అయిన, తస్య = అతనియొక్క, పితరౌ = తలిదండ్రులను, అపశ్యమ్ = చూచితిని.

తా. అక్కడ నేను వృద్ధులూ, అంధులూ, దుర్బలులూ అయిన ఆ మునికుమారుని, తలిదండ్రులను చూచితిని. చేయి వట్టుకొని నడిపించువా రెవ్వరును లేకపోవుటచే వారు రెక్కలు నరికిన పక్షుల వలె ఉండిరి. మరి యొక కార్య మేమియు లేక కుమారుని గూర్చిన మాటలే చెప్పుకొనుచుండిరి. రక్షకుడు లేనివారు వలె ఉత్సాహశూన్యులై ఉన్న వారికి ఉన్న కుమారుని గూర్చిన ఆశ కూడ నాచే భగ్నము చేయబడినది. 4, 5

మూ. శోకోపహతచిత్తశ్చ భయసంత్రస్తచేతసః,
తచ్చాశ్రమపదం గత్వా భూయః శోకమహం గతః. 6

ప్ర. అ. శోకోపహతచిత్తః చ = శోకముచేత కొట్టబడిన చిత్తము గలవాడనూ, భయసంత్రస్తచేతనః = రాబోవు భయమును గూర్చి దిగులు చెందిన మనస్సు కలవాడనూ అయిన, అహమ్ = నేను, తత్ = ఆ, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, గత్వా = చేరి, భూయః = ఇంకను, శోకమ్ = శోకమును, గతః = పొందితిని.

తా. అంతకు పూర్వమే శోకము చేత పీడింపబడిన చిత్తముతో, ఏమి జరుగునో అని భయ పడుచున్న నాకు ఆ ఆశ్రమమును చేరగానే ఇంకను అధికముగా దుఃఖము కలిగెను. 6

మూ. పదశబ్దం తు మే శ్రుత్వా మునిర్వాక్యమభాషత,
కిం చిరాయసి మే పుత్ర పానీయం క్షిప్రమానయ. 7

ప్ర.అ. మే=నాయొక్క, పదశబ్దమ్=అడుగుల చప్పుడును, శ్రుత్వా=విని, మునిః=ముని, వాక్యమ్=వాక్యమును, అభాషత=పలికెను. పుత్ర =కుమారా! కిమ్ = ఎందువలన, చిరాయసి = ఆలస్యము చేయుచున్నావు? క్షిప్రమ్ = శీఘ్రముగా, మే=నాకు, పానీయమ్=ఉదకమును, ఆనయ = తీసికొనిరమ్ము.

తా. నా అడుగుల చప్పుడు విని ఆ ముని ఇట్లు పలికెను. "కుమారా! ఆలస్యము చేసితి వేమి! నాకు శీఘ్రముగా ఉదకము ఇమ్ము. 7

మూ. యన్నిమిత్తమిదం తాత సలిలే క్రీడితం త్వయా,
ఉత్కంఠితా తే మాతేయం ప్రవిశ క్షిప్రమాశ్రమమ్. 8

ప్ర. అ. తాత = నాయనా! త్వయా = నీచేత, యన్నిమిత్తమ్ = ఏ కారణముచేత, సలిలే = ఉదకమునందు, ఇదమ్ = ఈ, క్రీడితమ్ = క్రీడచేయబడినదో అందువలన, ఇయమ్ = ఈ, తే మాతా = నీ తల్లి, ఉత్కంఠితా = బెంగగొన్నది. క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ప్రవిశ = ప్రవేశించుము.

తా. నాయనా! నీ వీ విధముగా చాల సేపు నీటిలో ఆడుకొనుటచే నీ తల్లి బెంగ పెట్టుకొన్నది. శీఘ్రముగా ఆశ్రమములోనికి రమ్ము. 8

మూ. యద్వ్యలీకం కృతం పుత్ర మాత్రా తే యది వా మయా,
న తన్మనపి కర్తవ్యం త్వయా తాత తపస్వినా. 9

ప్ర. అ. పుత్ర=కుమారా! తే = నీయొక్క, మాత్రా = తల్లిచేత గాని, యది వా=లేక, మయా = నా చేత గాని, యత్ = ఏ, వ్యళీకమ్=అపరాధము, కృతమ్= చేయబడినదో, తాత = నాయనా! తపస్వినా=తపస్వి వైన, త్వయా = నీచేత, తత్ = అది, మనసి = మనస్సులో, న కర్తవ్యమ్ = ఉంచుకొనదగినది కాదు.

తా. నాయనా! కుమారా! నీ తల్లి గాని నేనుగాని ఏదైన అపరాధము చేసినచో తపఃశాలి వైన నీవు దానిని మనస్సులో ఉంచుకొనరాదు. 9

మూ. త్వం గతిస్త్వగతీనాం చ త్వం హి చక్షురచక్షుషామ్,
సమాసక్తాస్త్వయి ప్రాణాః కిం త్వం నో నాభిభాషసే.

ప్ర. అ. అగతీనామ్ = గతి లేని మాకు, త్వమ్ = నీవు, గతిః = గతివి. అచక్షుషామ్ = నేత్రములు లేని మాకు, త్వమ్ = నీవే, చక్షుః హి = నేత్రము కదా? ప్రాణాః=ప్రాణములు, త్వయి = నీయందు, సమాసక్తాః = లగ్నము లై ఉన్నవి. త్వమ్ = నీవు, నః = మమ్ములను, కిమ్ = ఎందువలన, నాభిభాషసే = మాటలాడకున్నావు?

తా. గతి లేని మాకు నీవే గతివి. నేత్రములు లేని మాకు నీవే నేత్రములు. మా ప్రాణములు నీ మీదనే ఆధారపడి యున్నవి. నీవు మాతో మాటలాడుట లే దేమి? 10

మూ. మునిమవ్యక్తయా వాచా తమహం సజ్జమానయా,
హీనవ్యఞ్జనయా ప్రేక్ష్య భీతచిత్త ఇవా బ్రువమ్. 11

ప్ర. అ. అహమ్ = నేను, తం మునిమ్ = ఆ మునిని, ప్రేక్ష్య=చూచి, భీతచిత్త ఇవ = భయపడిన చిత్తము కలవాడ నై, అవ్యక్తయా = అస్పష్టమూ,

సజ్జమానయా=కలిసిపోవుచున్నదీ, హీనవ్యఞ్జనయా = విడువబడిన హల్లులు కలదీ అయిన, వాచా = వాక్కుతో, అబ్రువమ్ = పలికితిని.

తా. నే నా మునిని చూడగానే భయపడి, అస్పష్టమూ, పదములు కలిసిపోయినదీ, హల్లులు జారిపోయినదీ అయిన వాక్కుతో ఇట్లు పలికితిని.

మూ. మనసః కర్మ చేష్టాభిరభిసంస్తభ్య వాగ్బలమ్,
ఆచచక్షే త్వహం తస్మై పుత్రవ్యసనజం భయమ్. 12

ప్ర. అహమ్=నేను, చేష్టాభిః = చేష్టలచేత, మనసః = మనస్సుయొక్క, కర్మ = కర్మను, వాగ్బలమ్ = వాక్కుయొక్క బలమును, అభిసంస్తభ్య = నిలద్రొక్కుకొని, తస్మై = అతనికి, పుత్రవ్యసనజమ్ = పుత్రవ్యసనమువలన కలిగిన, భయమ్=భయమును, ఆచచక్షే = చెప్పితిని.

తా. నేను తెచ్చిపెట్టుకొనిన కొన్ని చేష్టలచేత మనఃప్రవృత్తిని, వాగ్బలమును నిలబెట్టుకొని, ఆ మునీశ్వరునకు పుత్రవ్యసనము వలన కలిగిన భయమును గూర్చి చెప్పితిని. 12

మూ. క్షత్రియోఽహం దశరథో నాహం పుత్రో మహాత్మనః,
సజ్జనావమతం దుఃఖమిదం ప్రాప్తం స్వకర్మజమ్. 13

ప్ర. అ. అహమ్=నేను, దశరథః=దశరథుడను పేరు గల, క్షత్రియః = క్షత్రియుడను. అహమ్ = నేను, మహాత్మనః = మహాత్ముడవైన నీయొక్క, పుత్రః = పుత్రుడను, న = కాను. సజ్జనావమతమ్ = సజ్జనులచే నిందింపబడిన, ఇదమ్ = ఈ, స్వకర్మజమ్=స్వకర్మవలన కలిగిన, దుఃఖమ్ = దుఃఖము, ప్రాప్తమ్=వచ్చిపడినది.

తా. నేను దశరథుడనే పేరు గల క్షత్రియుడను; మహాత్ముడవైన నీ కుమారుడు కాదు. సజ్జనులు నిందించు ఈ దుఃఖమును, చేతులార చేసిన కర్మచే తెచ్చి పెట్టుకొనినాను. 13

మూ. భగవంశ్చాపహస్తోఽహం సరయూతీరమాగతః,
జిఘాంసుః శ్వాపదం కంచిన్నిపానే చాగతం గజమ్. 14

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! అహమ్=నేను, చాపహస్తః = చాపము హస్తమునందు కలవాడనై, కంచిత్=ఒకానొక, శ్వాపదమ్=క్రూరమృగమును, నిపానే = నీళ్ల త్రాగు రేవులోనికి, ఆగతమ్=వచ్చిన, గజం చ=గజమును, జిఘాంసుః=చంప గోరుచున్నవాడనై, సరయూతీరమ్ = సరయూతీరమును గూర్చి, ఆగతః = వచ్చితిని.

తా. ఓ పూజ్యుడా! నేను ధనుస్సు ధరించి, ఏదైన ఒక క్రూరమృగమును, నీరు త్రాగు రేవునకు వచ్చు గజమును చంపవలె నను కోరికతో సరయూతీర మునకు వచ్చితిని. 14

మూ. తతః శ్రుతో మయా శబ్దో జలే కుమ్భస్య పూర్యతః,
ద్విపోఽయమితి మత్వాయం బాణేనాభిహతో మయా. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మయా = నాచేత, జలే = జలమునందు, పూర్యతః = నిండుచున్న, కుమ్భస్య = కుంభముయొక్క, శబ్దః = శబ్దము, శ్రుతః = వినబడెను. అయమ్=ఇది, ద్విపః ఇతి=ఏనుగ అని, మత్వా=తలచి, అయమ్ = ఇది, మయా = నాచేత, బాణేన = బాణముచేత, అభిహతః = చంప బడినది (కొట్టబడినది).

తా. అంతలో నాకు నీరు నింపుచున్న కుంభము ధ్వని వినబడెను, అది ఏనుగు అని తలచి నేను దానిని బాణముతో కొట్టితిని. 15

మూ. గత్వా నద్యాస్తత స్తీరమపశ్యమిషుణా హృది,
వినిర్భిన్నం గతప్రాణం శయానం భువి తాపసమ్. 16

ప్ర. అ. తతః=అటు పిమ్మట, నద్యాః=నదియొక్క, తీరమ్=తీరమును గూర్చి, గత్వా = వెళ్ళి, ఇషుణా = బాణముచేత, హృది = వక్షఃస్థలమునందు, వినిర్భిన్నమ్ = భేదింపబడిన, గతప్రాణమ్=పోయిన ప్రాణములు గల, భువి= నేలపై, శయానమ్ = పడియున్న, తాపసమ్ = మునిని, అపశ్యమ్ = చూచితిని.

తా. పిదప నదీతీరమునకు వెళ్లి అక్కడ, బాణము వక్షఃస్థలమునందు గ్రుచ్చుకొని ప్రాణములు పోయి, నేలపై పడి యున్న మునిని చూచితిని.

మూ. భగవన్ శబ్దమాలక్ష్య మయా గజజిఘాంసునా,
విసృష్టోఽమ్భసి నారాచస్తతస్తే నిహతః సుతః. 17

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! శబ్దమ్ = శబ్దమును, ఆలక్ష్య = గురి చూచి, గజజిఘాంసునా = గజమును చంప దలచిన, మయా = నాచేత, అమ్భసి = ఉదకమునందు, నారాచః = నారాచబాణము, విసృష్టః = విడవబడినది. తతః = పిమ్మట, తే = నీయొక్క, సుతః = కుమారుడు, నిహతః = చంపబడినాడు.

తా. ఓ పూజ్యుడా! శబ్దమును లక్ష్యముగా చేసి ఏనుగును చంపవలె నను ఉద్దేశ్యముతో నేను నారాచబాణమును విడువగా నీ కుమారుడు నిహతు డైనాడు.

మూ. తతస్తస్యైవ వచనాదుపేత్య పరితప్యతః,
స మయా సహసా బాణ ఉద్ధృతో మర్మతస్తదా. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పరితప్యతః = బాధపడుచున్న, తస్యైవ = అతనియొక్కయే, వచనాత్ = మాటవలన, మయా = నాచేత, తదా = అప్పుడు, ఉపేత్య = అతనినిసమీపించి, సహసా = వెంటనే, సః బాణః = ఆ బాణము, మర్మతః = మర్మస్థానమునుండి, ఉద్ధృతః = లాగివేయబడినది

తా. పిమ్మట నే నాతనిని సమీపించి, అప్పుడు బాధపడుచున్న అతని మాట ప్రకారము, ఆతని మర్మస్థానమునుండి బాణమును ఊడలాగితిని. 18

మూ. స చోద్ధృతేన బాణేన తత్రైవ స్వర్గమాస్థితః,
భవన్తౌ పితరౌ శోచన్నన్ధావితి విలప్య చ. 19

ప్ర. అ. సః చ = అతడు కూడ, పితరౌ = తలిదండ్రు లైన, భవన్తౌ = మిమ్ములనిద్దరిని గూర్చి, శోచన్ = దుఃఖించుచు, అన్ధౌ ఇతి = మీరిరువురును అంధులు అని, విలప్య చ = విలపించి, ఉద్ధృతేన = పైకి లాగబడిన, తేన బాణేన = ఆ బాణముచేత, తత్రైవ = అచటనే, స్వర్గమ్ = స్వర్గమును, ఆస్థితః = పొందినాడు.

తా. ఆ బాణమును ఊడలాగినవెంటనే ఆతడు తలిదండ్రు లైన మీ ఇరువురను గూర్చి దుఃఖించుచు, వారు అంధు లని చెప్పి విలపించుచు అక్కడనే స్వర్గమునకు వెళ్ళినాడు. 19

మూ. అజ్ఞానాద్భవతః పుత్రః సహసాఽభిహతో మయా,
శేషమేవంగతే యత్స్యాత్ తత్ప్రసీదతు మే మునిః. 20

ప్ర. అ. అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, సహసా = తొందరపాటుచే, భవతః పుత్రః = నీ కుమారుడు, మయా = నాచేత, నిహతః = చంపబడినాడు. ఏవంగతే = ఇది ఇట్లు జరిగిపోగా, యత్ = ఏది, శేషం స్యాత్ = మిగిలినదో, తత్ = దానిని, మునిః = ముని, ప్రసీదతు = అనుగ్రహించుగాక.

తా. అజ్ఞానముచే తొందరపడి నేను నీ కుమారుని చంపినాను. ఇది ఈ విధముగ జరిగిపోయినది. ఈ విషయమున నే నేమి చేయవలెనో మునీశ్వరుడు ఆజ్ఞాపించుగాక. 20

మూ. స తచ్ఛ్రుత్వా వచః క్రూరం మయోక్తమఘశంసినా,
నాశకత్తీవ్రమాయాసమకర్తుం భగవానృషిః. 21

ప్ర. అ. భగవాన్ = పూజ్యుడైన, సః ఋషిః = ఆ మునీశ్వరుడు, అఘశంసినా = చెడ్డ వార్తను చెప్పుచున్న, మయా = నాచేత, ఉక్తమ్ = పలకబడిన, క్రూరమ్ = క్రూరమైన, తత్ = ఆ, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, తీవ్రమ్ = తీవ్రమైన, ఆయాసమ్ = దుఃఖమును, అకర్తుమ్ = చేయకుండుటకు, నాశకత్ = సమర్థుడుకాలేదు.

తా. దుర్వార్తను తీసికొని వచ్చిన నేను చెప్పిన ఆ క్రూరమైన మాట విని పూజ్యుడైన ఆ మునీశ్వరుడు తీక్ష్ణమైన దుఃఖము (లేదా కోపము) కలుగకుండ ఉండజాలకపోయెను. 21

మూ. స బాష్పపూర్ణవదనో నిఃశ్వసన్ శోకకర్శితః,
మాముమవాచ మహాతేజాః కృతాఞ్జలిముపస్థితమ్. 22

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = అతడు, బాష్పపూర్ణవదనః = కన్నీటితో నిండిన ముఖము కలవాడై, నిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, శోకకర్శితః = శోకముచేత కృశించినవాడై, కృతాఞ్జలిమ్ = చేయబడిన దోసిలి కలవాడను, ఉపస్థితమ్ = సమీపమునందున్నవాడను అయిన, మామ్ = నన్ను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. మహాతేజఃశాలి యైన ఆ మునీశ్వరుడు కన్నీళ్ళు కారుచున్న ముఖముతో నిట్టూర్చుచు, దుఃఖపీడితుడై దగ్గరనె చేతులు జోడించు కొని నిలచిఉన్న నాతో ఇట్లనెను. 22

మూ. యద్యేతదశుభం కర్మ న త్వం మే కథయేః స్వయమ్,
ఫలేన్మూర్ధా స్మ తే రాజన్ సద్యః శతసహస్రధా. 23

ప్ర. అ. రాజన్ = రాజా! అశుభమ్=అశుభ మైన, ఏతత్ = ఈ, కర్మ =కర్మను గూర్చి, త్వమ్=నీవు, మే=నాకు, స్వయమ్ = స్వయముగా, న కథయేః యది = చెప్పకపోయినచో, సద్యః = వెంటనే, తే = నీయొక్క, మూర్ధా= శిరస్సు, శతసహస్రధా = లక్ష ముక్కలుగా, ఫలేత్ స్మ = బ్రద్దలై ఉండెడిది.

తా. రాజా! నీవు చేసిన ఈ అమంగళ కృత్యమును నీవు స్వయముగా వచ్చి నాకు చెప్ప కున్నచో, వెంటనే నీ శిరస్సు లక్ష ముక్కలుగా బ్రద్ద లై ఉండెడిది. 23

మూ. క్షత్రియేణ వధో రాజన్ వానప్రస్థే విశేషతః,
జ్ఞానపూర్వం కృతః స్థానాచ్చ్యావయేదపి వజ్రిణమ్. 24

ప్ర. అ. రాజన్ = రాజా! క్షత్రియేణ = క్షత్రియునిచేత, జ్ఞానపూర్వమ్ = జ్ఞానము పూర్వమునందు కలుగునట్లుగా (తెలిసి), కృతః = చేయబడిన, వధః = వధ, విశేషతః = విశేషించి, వానప్రస్థే = వానప్రస్థునియందు చేయబడిన వధ, వజ్రిణమ్ అపి = దేవేంద్రుని కూడ, స్థానాత్ = తన స్థానమునుండి, చ్యావయేత్ = పడవేయును.

తా. రాజా! క్షత్రియుడు ఎవ్వని నైన తెలిసి చంపినచో, విశేషించి వానప్రస్థుని చంపినచో, ఆ పాపము దేవేంద్రుని కూడ పదచ్యుతుని చేయును.

వి. ఈ శ్లోక భావము అంతగా సరిగా నున్నట్లు లేదు. "క్షత్రియుడు చేసిన వధ" అనగా ఎవరి వధ అని చెప్పవలెను? క్షత్రియుడు దుష్టులను సంహరించవలసినదే కదా? అందుచేత 'సత్పురుషుని వధ' అని చెప్పవలెను. 'అది ఇంద్రుని కూడ పదచ్యుతుని చేయును" అను అర్థము వచ్చును. వానప్రస్థవధ అంతకంటె పాపతరము కావచ్చును. ఏ మైనను అధ్యాహారాదులనే సరిపెట్టు

కొనవలసి యున్నది. ప్రాచ్యపాఠము బాగున్నది. ఈ ఘట్టంలో ఉన్న అర్థ భేదంతో కూడిన-

"క్షత్రియ జ్ఞానపూర్వం చేద్వానప్రస్థవధః కృతః,
స్థానాత్ప్రచ్యావయేదాశు బ్రహ్మాణమపి సుస్థితమ్"

అను శ్లోకములో వానప్రస్థవధ మాత్రమే నిర్దేశించబడినది. 24

మూ సప్తధా తు ఫలేన్మూర్ధా మునౌ తపసి తిష్ఠతి,
జ్ఞానాద్విసృజతః శస్త్రం తాదృశే బ్రహ్మచారిణి. 25

ప్ర. అ. తపసి = తపస్సులో, తిష్ఠతి = ఉన్న, మునౌ = మునియందును, తాదృశే = అట్టి, బ్రహ్మచారిణి = బ్రహ్మచారియందును, జ్ఞానాత్ = జ్ఞానము వలన, శస్త్రమ్ = శస్త్రమును, విసృజతః = ప్రయోగించువాని, మూర్ధా = శిరస్సు సప్తధా = ఏడు ముక్కలుగా, ఫలేత్ = బద్దలగును.

తా. తపస్సులో నున్న మునిపై గాని, అట్టి బ్రహ్మచారిపై గాని, తెలిసి ఆయుధమును ప్రయోగించినవాని శిరస్సు ఏడు ముక్క లగును. 25

మూ. అజ్ఞానాద్ధి కృతం యస్మాదిదం తేనైవ జీవసి,
అపి హ్యద్య కులం న స్యాదిక్ష్వాకూణాం కుతో భవాన్.

ప్ర. అ. ఇదమ్ = ఈ కార్యము, యస్మాత్ = ఎందువలన, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, కృతం హి = చేయబడినదో, తేనైవ = దానిచేతనే, జీవసి = జీవించి యున్నావు. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకు రాజులయొక్క, కులమపి = వంశమే, అద్య = ఇప్పుడు, న స్యాత్ హి = లేకుండ పోవును కదా? భవాన్ = నీవు. కుతః = ఎక్కడ !

నీ వీ పనిని తెలియక చేసితివి గాన ఇంకను బ్రతికి ఉన్నావు. అట్లు కానిచో నీ వేమిటి, ఇక్ష్వాకువంశమే నశించేది! 26

మూ. నయ నౌ నృప తం దేశమితి మాం చాభ్యభాషత.
అద్య తం ద్రష్టుమిచ్ఛామః పుత్రం పశ్చిమదర్శనమ్. 27

రుధిరేణావసిక్తాఙ్గం ప్రకీర్ణాజినవాససమ్,
శయానం భువి నిస్సంజ్ఞం ధర్మరాజవశం గతమ్. 28

ప్ర. అ నృప = రాజా! అద్య = ఇప్పుడు, పశ్చిమదర్శనమ్ = చివరి దర్శనము కలవాడూ, రుధిరేణ = రక్తముచేత, అవసిక్తాఙ్గమ్ = తడపబడిన శరీరము కలవాడూ, ప్రకీర్ణాజినవాససమ్ = తొలగిపోయిన కృష్ణాజిన వస్త్రము కలవాడూ, భువి = నేలపై, శయానమ్ = శయనించి ఉన్నవాడూ, నిస్సంజ్ఞమ్ = సంజ్ఞ కోల్పోయిన వాడూ, ధర్మరాజవశమ్ = యముని వశమును, గతమ్ = పొందిన వాడూ అయిన, పుత్రమ్=పుత్రుని, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛావః= కోరుచున్నాము. తం దేశమ్ = ఆ దేశమును గూర్చి, నౌ = మమ్ములను నిరువురను, నయ = తీసికొని వెళ్ళుము. ఇతి = అని, మామ్ = నన్ను గూర్చి, అభ్యభాషత చ = పలికెను.

తా. "రాజా! మా ఇద్దరినీ ఆ ప్రదేశమునకు తీసికొని వెళ్ళుము. రక్తముచే శరీరము తడిసి, వస్త్రముగా ధరించిన కృష్ణాజినము తొలగిపోయి, యమునకు వశుడై ప్రాణములు కోల్పోయి నేలపై పడి యున్న కుమారుని చివరి చూపుగా చూడవలె నని కోరుచున్నాము" అని నాతో పలికెను. 27, 28

మూ. అథాహమేకస్తం దేశం నీత్వా తౌ భృశదుఃఖితౌ,
అస్పర్శయమహం పుత్రం తం మునిం సహ భార్యయా.

ప్ర. అ. అథ = పిమ్మట, ఏకః = ఒంటరిగా నున్న, అహమ్ = నేను, భృశదుఃఖితౌ = మిక్కిలి దుఃఖితులైన, తౌ = వారిద్దరిని, తం దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, నీత్వా = తీసికొని వెళ్ళి, భార్యయా సహ = భార్యతో కూడిన, తం మునిమ్ = ఆ మునిని, తం పుత్రమ్=ఆ పుత్రుని, అస్పర్శయమ్= స్పృశింపచేసితిని.

తా. పిదప, నేను, చాల దుఃఖించుచున్న వారిద్దరినీ ఆ ప్రదేశమునకు తీసికొని వెళ్ళి ఆ మునియు, ఆతని భార్యయు తమ పుత్రుని స్పృశించు నట్లు చేసితిని. 29

మూ. తౌ పుత్రమాత్మనః స్పృష్ట్వా తమాసాద్య తపస్వినౌ,
నిపేతతుః శరీరేఽస్య పితా చాస్యేద మబ్రవీత్. 30

ప్ర. అ. తపస్వినౌ = తపశ్శాలు లైన, తౌ = వా రిద్దరును, తమ్ = ఆ, ఆత్మనః = తమయొక్క, పుత్రమ్ = పుత్రుని, ఆసాద్య = సమీపించి, స్పృష్ట్వా = స్పృశించి, అస్య = ఈతని, శరీరే = శరీరముపై, నిపేతతుః = పడిరి. అస్య = ఇతనియొక్క, పితా చ = తండ్రి కూడ, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. తపశ్శాలు లైన ఆ ఇద్దరును తమ కుమారుని సమీపించి, ఆతని శరీరమును స్పృశించి, ఆతని శరీరపై పడిరి. తండ్రి ఇట్లు పలికెను. 30

మూ. నాభివాదయసే మాద్య న చ మామభిభాషసే,
కిం ను శేషే తు భూమౌ త్వం వత్స కిం కోపితో హ్యసి

ప్ర. అ. వత్స=వత్సా! అద్య=ఇపుడు, మా=నన్ను, నాభివాదయసే=నమస్కరించుట లేదు. మామ్ = నన్ను గూర్చి, న చ అభిభాషసే = మాటలాడుట కూడ లేదు. త్వమ్ = నీవు, భూమౌ = నేలపై, కిం ను శేషే = నిద్రపోవుచున్నావా? (ఎందుచే శయనించి ఉన్నావు?) కుపితః = కోపగించినవాడవు, కిమ్ అసి = అయితివా?

తా. వత్సా! నేడు నీవు నాకు నమస్కారము చేయుట లేదు; మాట కూడ మాటలాడుట లేదు. నేలపై శయనించితివా (లేదా ఏలపడియున్నావు?) లేక నాపై నీకు కోపము వచ్చినదా? 31

మూ. న త్వహం తే ప్రియః పుత్ర మాతరం పశ్య ధార్మిక,
కిం ను నాలిఙ్గసే పుత్ర సుకుమార వచో వద. 32

ప్ర. అ. ధార్మిక=ధార్మికుడ వైన, పుత్ర = కుమారా! అహమ్=నేను, తే = నీకు, ప్రియః = ఇష్టుడను, న తు=కాకపోయినచో, మాతరమ్=తల్లిని, పశ్య = చూడుము. పుత్ర=కుమారా! కిం ను=ఎందువలన, నాలిఙ్గసే=కౌగలించుకొనుట లేదు. సుకుమార=ఓ సుకుమారుడా! వచః=వచనమును, వద=పలుకుము.

తా. ధార్మికుడ వైన ఓ కుమారా! నేనంటే నీకు ఇష్టము లేనిచో నీ తల్లి నైనను చూడుము. పుత్రా! నన్ను ఆలింగనము చేసికొనుట లేదేమి! ఓ సుకుమారా! నాతో మాటలాడుము. 32

మూ. కస్య వాపరరాత్రేఽహం శ్రోష్యామి హృదయఙ్గమమ్,
అధీయానస్య మధురం శాస్త్రం వాన్యద్విశేషతః 33

ప్ర. అ. అపరరాత్రే = తెల్లవారుజామున, శాస్త్రమ్ = వేదమును గాని, విశేషతః = విశేషించి, అన్యద్వా = మరియొకటి గాని, అధీయానస్య = అధ్యయనము చేయుచున్న, కస్య వా = ఎవరియొక్క, హృదయంగమమ్ = మనోహర మైన, మధురమ్ = మధుర మైన ధ్వనిని, అహమ్ = నేను, శ్రోష్యామి = వినగలను?

తా. తెల్లవారు జామున వేదమును గాని, మరియొక గ్రంథమును గాని మనోహరముగా చదువుచున్న ఎవని మధురకంఠ ధ్వని నా కిటుపై వినిపించును?

మూ. కో మాం సన్ధ్యాముపాస్యైవ స్నాత్వా హుతహుతాశనః,
శ్లాఘయిష్యత్యుపాసీనః పుత్ర శోకభయార్దితమ్. 34

ప్ర అ. పుత్ర = కుమారా! కః = ఎవ్వడు, స్నాత్వా = స్నానముచేసి, సన్ధ్యామ్ = సంధ్యను, ఉపాస్యైవ = ఉపాసించిన వెంటనే, హుతహుతాశనః = హోమము చేయబడిన అగ్ని కలవాడై, ఉపాసీనః = సమీపమున కూర్చున్నవాడై, శోకభయార్దితమ్ = శోకముచేతను, భయముచేతను పీడితుడ నైన, మామ్ = నన్ను, శ్లాఘయిష్యతి = శ్లాఘించును.

తా. కుమారా! ఇటుపై ఎవ్వడు, స్నానము చేసి, సంధ్యోపాసనానంతరమే అగ్నికార్యము చేసికొని, శోకభయములతో బాధపడుచున్న నా ప్రక్కనే కూర్చుండి, నన్ను శ్లాఘించగలడు? 34

మూ. కన్దమూలఫలం హృత్వా కో మాం ప్రియమివాతిథిమ్,
భోజయిష్యత్యకర్మణ్యమప్రగ్రహమనాయకమ్. 35

ప్ర. అ. కన్దమూలఫలమ్ = దుంపలను పండ్లను, హృత్వా = తీసికొనివచ్చి, కః = ఎవడు, అకర్మణ్యమ్ = ఏ పని చేయజాలనివాడనూ, అప్రగ్రహమ్ = ఏమీ సంపాదింప జాలనివాడనూ, అనాయకమ్ = నడిపించువాడు లేనివాడనూ అయిన, మామ్ = నన్ను, ప్రియమ్ = ప్రియు డైన, అతిథిమివ = అతిథిని వలె, భోజయిష్యతి = తినిపించగలడు?

తా. నేను ఏ పనులూ చేయక, వస్తువులను సంగ్రహింపజాలక నడిపించు వాడు లేక కూర్చొని యుండగా, కందమూల ఫలములను తెచ్చి ఎవ్వరు నన్ను ప్రియుడైన అతిథిని తినిపించినట్లు తినిపించును. 35

మూ. ఇమామన్ధాం చ వృద్ధాం చ మాతరం తే తపస్వినీమ్,
కథం వత్స భరిష్యామి కృపణాం పుత్రగర్ధినీమ్. 36

ప్ర. అ. వత్స=ఓ వత్సా! అన్ధామ్ = అంధురాలూ, వృద్ధామ్ = వృద్ధురాలూ, తపస్వినీమ్ = జాలిపడదగినదీ, కృపణామ్ = దీనురాలూ, పుత్రగర్ధినీమ్ = పుత్రునిపై ప్రేమగలదీ అయిన, ఇమామ్ = ఈ, తే మాతరమ్ = నీ తల్లిని, కథమ్=ఎట్లు, భరిష్యామి = పోషించగలను.

తా. వత్సా! పుత్రప్రేమ కలదీ, వృద్ధురాలూ, అంధురాలూ, అయిన నీ తల్లి చాల దుఃఖించుచు శోచనీయ స్థితిలో ఉన్నది. ఈమెను ఎట్లు పోషించ గలను? 36

మూ. తిష్ఠ మా మా గమః పుత్ర యమస్య సదనం ప్రతి,
శ్వో మయా సహ గన్తాసి జనన్యా చ సమేధితః. 37

ప్ర. అ. పుత్ర=పుత్రా! తిష్ఠ = ఆగుము. యమస్య = యముని యొక్క, సదనం ప్రతి = గృహమును గూర్చి, మా మా గమః=వెళ్లవద్దు. మయా = నాతోనూ, జనన్యా సహ చ = తల్లితోను, సమేధితః=కూడినవాడవై, శ్వః = రేపు, గన్తాసి = వెళ్ళగలవు,

తా. కుమారా! ఆగుము; యమలోకమునకు వెళ్ళవద్దు, వెళ్ళవద్దు. నాతోను తల్లితోను కలసి రేపు వెళ్ళెదవు లెమ్ము. 37

మూ. ఉభావపి చ శోకార్తావనాథౌ కృపణౌ వనే,
క్షిప్రమేవ గమిష్యావస్త్వయా హీనౌ యమక్షయమ్. 38

ప్ర. అ. త్వయా = నీతో, హీనౌ = హీనులమై, శోకార్తౌ = శోకము చేత పీడింపబడిన వారమూ, వనే = వనమునందు, అనాథౌ = రక్షకుడు లేనివారమూ, కృపణౌ=దీనులమూ అయిన, ఉభావపి చ=మేమిద్దరము కూడ, క్షిప్రమేవ= వెంటనే, యమక్షయమ్=యమలోకమును గూర్చి, గమిష్యావః= వెళ్ళెదము.

తా. నీవు లేకపోవుటచే శోకార్తులమై, దీనులమై, ఈ అరణ్యములో రక్షకు లెవ్వరును లేక ఉన్న మేము ఇద్దరమూ కూడ యమలోకమునకు వచ్చెదము. 38

మూ. తతో వైవస్వతం దృష్ట్వా తం ప్రవక్ష్యామి భారతీమ్,
క్షమతాం ధర్మరాజో మే బిభృయాత్పితరావయమ్. 39

ప్ర. అ తతః=పిమ్మట, వైవస్వతమ్=ఆ యముని, దృష్ట్వా=చూచి, తమ్=అతనిని గూర్చి, భారతీమ్=వాక్కును, ప్రవక్ష్యామి=చెప్పెదను. ధర్మ రాజః=యమధర్మరాజు, మే=నాకు, క్షమతామ్=క్షమించుగాక. అయమ్ =ఇతడు, పితరౌ=తలిదండ్రులను, బిభృయాత్=పోషించుగాక.

తా. అక్కడ నేను యమునితో- "యమధర్మ రాజా! క్షమించుము; ఇతడు తలిదండ్రులను పోషించు నట్లు అనుమతి నిమ్ము" అని పలికెదను. 39

మూ. దాతుమర్హతి ధర్మాత్మా లోకపాలో మహాయశాః,
ఈదృశస్య మమాక్షయ్యా మేకామభయదక్షిణామ్. 40

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గలవాడూ, ధర్మాత్మా=ధర్మాత్ముడూ, లోకపాలః=లోకపాలుడూ అయిన ఆ యమధర్మరాజు, ఈదృశస్య =ఇట్టి, మమ=నాకు, అక్షయ్యామ్=అక్షయ మైన, ఏకామ్=ఈ ఒక్క, అభయదక్షిణామ్=అభయపను దక్షిణను, దాతుమ్=ఇచ్చుటకు, అర్హతి= తగిఉన్నాడు.

తా ధర్మాత్ముడూ, మహాయశః శాలీ, లోకపాలకుడూ అయిన ఆ యమ ధర్మరాజు ఇట్టి స్థితిలో ఉన్న నాకు ఈ అభయదక్షిణ నొక్కదానిని ఇవ్వ గలడు. 40

మూ. అపాపోఽసి యథా పుత్ర నిహతః పాపకర్మణా,
తేన సత్యేన గచ్ఛాశు యే లోకాః శస్త్రయోధినామ్. 41

ప్ర. అ. పుత్ర=పుత్రా! పాపకర్మణా=పాప మైన కర్మ గల ఈతనిచే, నిహతః=చపబడినావు. యథా=ఎట్లు, అపాపః=పాపము లేనివాడవు, అసి =అయి ఉన్నావో, తేన=ఆ, సత్యేన=సత్యముచేత, శస్త్రయోధినామ్=శస్త్ర

ముతో యుద్ధము చేయువారికి, యే = ఏ, లోకాః = లోకము లుండునో వాటిని, ఆశు = శీఘ్రముగా, గచ్ఛ = పొందుము.

తా. కుమారా! నీవు ఏ పాపము లేనివాడవు. అట్టి నిన్ను ఈ పాపకర్ముడు చంపినాడు. ఈ సత్యమును పురస్కరించుకొని ఆయుధములతో యుద్ధము చేయువారికి ఏ లోకములు లభించునో వాటిని పొందుము. 41

మూ. యాన్తి శూరా గతిం యాం చ సంగ్రామేష్వనివర్తినః.
హతాస్త్వభిముఖాః పుత్ర గతిం తాం పరమాం వ్రజ.

ప్ర. అ. పుత్ర = కుమారా, సంగ్రామేషు = యుద్ధములందు, అనివర్తినః = వెనుకకు మరలని, శూరాః = శూరులు, అభిముఖాః = శత్రువునకు అభిముఖులై. యామ్ = ఏ, గతిమ్ = గతిని, యాన్తి = పొందుదురో, తామ్ = అట్టి, పరమామ్=గొప్పదైన, గతిమ్ = గతిని, వ్రజ = పొందుము.

తా. కుమారా! యుద్ధములో వెనుకకు తిరగని శూరులు శత్రువులకు ఎదురుగా నిలచి, వారిచే నిహతులై ఏ ఉత్తమగతిని పొందుదురో ఆ గతిని పొందుము. 42

మూ. యాం గతిం సగరః శైబ్యో దిలీపో జనమేజయః,
నహుషో దున్దుమారశ్చ ప్రాప్తాస్తాం గచ్ఛ పుత్రక.

ప్ర. అ. పుత్రక=కుమారా! సగరః=సగరుడు, శైబ్యః = శైబ్యుడు, దిలీపః=దిలీపుడు, జనమేజయః=జనమేజయుడు, నహుషః=నహుషుడు, దున్దుమారశ్చ = దుందుమారుడును, యామ్=ఏ, గతిమ్=గతిని, ప్రాప్తాః=పొందినారో, తామ్ = దానిని, గచ్ఛ = పొందుము.

తా. పుత్రా! సగరుడు, శైబ్యుడు, దిలీపుడు, జనమేజయుడు, నహుషుడు దుందుమారుడు, ఏ గతి పొందినారో అట్టి సద్గతి నీకు లభించు గాక. 43

మూ. యా గతిః సర్వసాధూనాం స్వాధ్యాయాత్తపసా చ యా
యా భూమిదస్యాహితాగ్నే రేకపత్నీవ్రతస్య చ.
గోసహస్రప్రదాతౄణాం యా యా గురుభృతామపి
దేహన్యాసకృతాం యా చ తాం గతిం గచ్ఛ పుత్రక.

ప్ర. అ. పుత్రక = కుమారా! సర్వసాధూనామ్ = సమస్త మైన సత్పురుషులకును, యా = ఏ, గతిః = గతియో, స్వాధ్యాయాత్ = స్వాధ్యాయము వలన, తపసా చ = తపస్సు చేతను, యా = ఏ గతియో. భూమిదస్య = భూదానము చేసినవానికిని, ఆహితాగ్నేః = ఆహితాగ్నికిని, ఏకపత్నీవ్రతస్య చ = ఏకపత్నీ వ్రతము కలవానికిని, యా = ఏ గతియో, గోసహస్రప్రదాతౄణామ్ = గోసహస్ర దానము చేసిన వారికి, యా = ఏ గతియో, గురుభృతామపి = పూజ్యులను పోషించువారికి, యా = ఏ గతియో, దేహన్యాసకృతామ్ = దేహత్యాగము చేసినవారలకు, యా చ = = ఏ గతియో, తాం గతిమ్ = ఆ గతిని, గచ్ఛ = పొందుము.

తా. కుమారా! సమస్త మైన సాధువులకు ఏ గతి లభించునో, స్వాధ్యాయము వలనను, తపస్సువలనను ఏ గతి లభించునో, భూదానము చేసినవానికిని, ఆహితాగ్నికిని, ఏకపత్నీవ్రతము పాటించువానికిని ఏ గతి లభించునో, వేయి గోవులను దానము చేసినవారికి ఏ గతి లభించునో, పెద్దలను పోషించు వారికి ఏ గతి లభించునో, గంగాదిపుణ్యనదులలో సంకల్పపూర్వకముగా దేహత్యాగము చేసినవారికి ఏ గతి లభించునో ఆ గతి నీకు లభించుగాక. 44, 45

మూ. న హి త్వస్మిన్ కులే జాతో గచ్ఛత్యకుశలాం గతిమ్,
స తు యాస్యతి యేన త్వం నిహతో మమ బాన్ధవః. 46

ప్ర. అ. అస్మిన్ = ఈ, కులే = కులమునందు, జాతః = పుట్టినవాడు, అకుశలామ్ = క్షేమము కాని, గతిమ్ = గతిని, న గచ్ఛతి హి = పొందడు కదా! తు = కాని, మమ = నాయొక్క, బాన్ధవః = బంధు వైన, త్వమ్ = నీవు, యేన = ఎవనిచేత, నిహతః = చంపబడితివో, సః = అతడు, యాస్యతి = పొందగలడు.

తా. మన కులములో పుట్టినవాని కెవ్వనికిని చెడ్డ గతి రాదు. నా కుమారుడ వైన నిన్ను చంపినవానికే అట్టి గతి కలుగును. 46

మూ. ఏవం స కృపణం తత్ర పర్యదేవయతాసకృత్,
తతోఽస్మై కర్తుముదకం ప్రవృత్తః సహ భార్యయా.

ప్ర. అ. సః = అతడు, ఏవమ్ = ఈ విధముగా, తత్ర = అక్కడ, అసకృత్ = మాటి మాటికిని, కృపణమ్ = దీనముగా, పర్యదేవయత = ఏడ్చెను. తతః = పిమ్మట, అస్య = ఈతనికి, భార్యయా సహ = భార్యతో కూడ, ఉదకం కర్తుమ్ = ఉదకక్రియలు చేయుటకు, ప్రవృత్తః = ఉద్యమించెను.

తా. ఈ విధముగా ఆ ముని అక్కడ చాల సేపు ఏడ్చెను. పిమ్మట, భార్యాసహితు డైన ఆతడు కుమారునకు ఉదకక్రియలు చేయుటకు ప్రారంభించెను.

మూ. స తు దివ్యేన రూపేణ మునిపుత్రః స్వకర్మభిః,
స్వర్గమధ్యారుహత్ క్షిప్రం శక్రేణ సహ ధర్మవిత్. 48

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మవేత్త యైన, సః = ఆ, మునిపుత్రస్తు = ముని కుమారు డైతే, స్వకర్మభిః = తన పుణ్య కర్మలచేత, శక్రేణ సహ = ఇంద్రునితో కూడిన వా డై, దివ్యేన = దివ్య మైన, రూపేణ = రూపముతో, క్షిప్రమ్ = శీఘ్రముగా, స్వర్గమ్ = స్వర్గమును, అధ్యారుహత్ = అధిరోహించెను.

తా. ధర్మవేత్త యైన ఆ మునికుమారుడు తన పుణ్య కర్మల ఫలముగ, దివ్యరూపము ధరించి, దేవేంద్రునితో కూడ శీఘ్రముగా స్వర్గలోకమునకు వెళ్లెను.

మూ ఆబభాషే చ వృద్ధౌ తౌ సహ శక్రేణ తాపసః,
ఆశ్వాస్య చ ముహూర్తం చ పితరౌ వాక్యమబ్రవీత్. 49

ప్ర. అ. సహ శక్రేణ = దేవేంద్రునితో కూడిన, సః తాపసః = ఆ ముని, తౌ = ఆ, వృద్ధౌ = వృద్ధులను గూర్చి, ఆబభాషే చ = మాటలాడెను. పితరౌ = తలిదండ్రులను, ముహూర్తమ్ = క్షణకాలము, ఆశ్వాస్య = ఓదార్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఇంద్ర సమేతుడైన ఆ మునికుమారుడు ఆ వృద్ధులతో మాటలాడెను. తలిదండ్రులను క్షణకాలము పాటు ఓదార్చి వారితో ఇట్లు పలికెను. 49

మూ. స్థానమస్మి మహత్ప్రాప్తో భవతోః పరిచారణాత్,
భవన్తావపి చ క్షిప్రం మమ మూలముపైష్యతః. 50

ప్ర. అ. భవతోః = మీ ఇద్దరి యొక్క, పరిచారణాత్ = సేవ చేయుట వలన, మహత్ = గొప్ప, స్థానమ్ = స్థానమును, ప్రాప్తః అస్మి = పొందితిని. భవన్తౌ అపి చ = మీరు కూడా, క్షిప్రమ్ = శీఘ్రముగా. మమ = నా యొక్క, మూలమ్ = సమీపమును, ఉపైష్యతః = పొందగలరు.

తా. మీకు సేవ చేయుటవలన ఉత్తమస్థానమును పొంద గలిగితిని. మీరు కూడ శీఘ్రముగ నా సమీపమునకు రాగలరు. 50

మూ. ఏవముక్త్వా తు దివ్యేన విమానేన వపుష్మతా,
ఆరురోహ దివం క్షిప్రం మునిపుత్రో జితేన్ద్రియః. 51

ప్ర. అ. జితేన్ద్రియః = జయించబడిన ఇంద్రియములు గల, మునిపుత్రః = మునికుమారుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, వపుష్మతా = మంచి ఆకారము గల, దివ్యేన = దివ్య మైన, విమానేన = విమానముచేత. క్షిప్రమ్ = శీఘ్రముగా, దివమ్ = స్వర్గమును, ఆరురోహ = ఎక్కెను.

తా. జితేంద్రియు డైన ఆ మునికుమారుడు ఇట్లు పలికి, అంద మైన దివ్య విమానముపై ఎక్కి వెంటనే స్వర్గమునకు వెళ్ళెను. 51

మూ. స కృత్వా తూదకం తూర్ణం తాపసః సహ భార్యయా,
మాముపాచ మహాతేజాః కృతాఞ్జలిముపస్థితమ్. 52

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః తాపసః = ఆ ముని, భార్యయా సహ = భార్యతో కూడా, తూర్ణమ్ = శీఘ్రముగా, ఉదకం కృత్వా = ఉదకక్రియ చేసి, కృతాఞ్జలిమ్ = చేయబడిన దోసిలి కల, ఉపస్థితమ్ = సమీపము నందున్న, మామ్ = నన్ను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ ముని భార్యా సమేతుడై, జలతర్పణములు శీఘ్రముగ ముగించుకొని, దగ్గరనే అంజలి ఘటించి నిలచిన నాతో ఇట్లనెను. 52

మూ. అద్యైవ జహి మాం రాజన్ మరణే నాస్తి మే వ్యథా,
యచ్ఛరేణైకపుత్రం మాం త్వమకర్షీరపుత్రకమ్. 53

ప్ర. అ. రాజన్ = రాజా! త్వమ్ = నీవు, యత్ = ఏ కారణమువలన, ఏక పుత్రమ్ = ఒకే పుత్రుడు గల, మామ్ = నన్ను, శరేణ = బాణముచేత, అపుత్రకమ్

= పుత్రుడు లేనివానినిగా, అకార్షీః = చేసితివో, ఆ కారణమువలన, అద్యైవ = ఇప్పుడే, మామ్ = నన్ను, జహి = చంపుము. మే=నాకు, మరణే = మరణము నందు, వ్యథా=బాధ, నాస్తి=లేదు.

తా. రాజా ! బాణముచే నా ఏకైకపుత్రుని చంపి నన్ను పుత్రుడు లేని వానినిగా చేసితివి కదా ! నన్ను కూడ ఇప్పుడే చంపివేయుము. మరణమును గూర్చి నాకు బాధ లేదు.

మూ. త్వయా తు యదవిజ్ఞానాన్నిహతో మే సుతః శుచిః.
తేన త్వామభిశప్స్యామి సుదుఃఖమతిదారుణమ్. 54

ప్ర. అ. త్వయా = నీచేత, అవిజ్ఞానాత్ = అజ్ఞానమువలన, మే=నా యొక్క, శుచిః=పవిత్రు డైన, సుతః=కుమారుడు, యత్=ఏ కారణమువలన, నిహతః=చంపబడినాడో. తేన=ఆ కారణముచేత, త్వామ్ = నిన్ను, సుదుఃఖమ్ = చాల దుఃఖము కలుగునట్లు, అతిదారుణమ్ = మిక్కిలి దారుణముగాను, అభిశప్స్యామి = శపించెదను.

తా. నీవు, పవిత్రుడైన నా కుమారుని తెలియక చంపినను, నీకు చాలా దుఃఖము కలుగు నట్లు, భయంకర మైన శాపము నిచ్చెదను. 54

మూ. పుత్రవ్యసనజం దుఃఖం యదేతన్మమ సాంప్రతమ్,
ఏవం త్వం పుత్రశోకేన రాజన్ కాలం కరిష్యసి. 55

ప్ర. అ. సాంప్రతమ్ = ఇప్పుడు, యత్ = ఏ, ఏతత్=ఈ, పుత్రవ్యసనజమ్ = పుత్రవ్యసనమువలన కలిగిన, దుఃఖమ్=దుఃఖము కలదో, ఏవమ్ = ఇట్లే, రాజన్ = రాజా! త్వమ్=నీవు, పుత్రశోకేన = పుత్రశోకముచేత, కాలం కరిష్యసి=కాలము చేయగలవు.

తా. రాజా! ఇపుడు నేను పుత్రశోకముతో బాధపడుచున్నట్లే నీవు కూడా పుత్ర శోకముతో బాధపడుచు మరణించగలవు. 55

మూ. అజ్ఞానాత్తు హతో యస్మాత్ క్షత్రియేణ త్వయా మునిః,
తస్మాత్త్వాం నావిశత్యాశు బ్రహ్మహత్యా నరాధిప. 56

ప్ర. అ. నరాధిప=రాజా! క్షత్రియేణ=క్షత్రియుడ వైన, త్వయా=నీచేత, యస్మాత్=ఏ కారణమువలన, మునిః = ముని, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, హతః = చంపబడినాడో, తస్మాత్ = ఆ కారణమువలన, ఆశు = శీఘ్రముగా, బ్రహ్మహత్యా=బ్రహ్మహత్య, త్వామ్=నిన్ను, న ఆవిశతి=ప్రవేశించదు.

తా. రాజా! క్షత్రియుడ వైన నీవు మునిని తెలియక చంపినవుగాన నీకు బ్రహ్మహత్యాదోషము అంటదు.

వి. బ్రహ్మహత్యాపాపము కలుగదు అనుటకు మునికుమారుడు వెనుక (63 సర్గ. 49, 50శ్లో) వేరే కారణముచెప్పినాడు. ఇక్కడ మరొకవిధముగా ఉన్నది. ఇది పరస్పరవిరోధమే. ఈశ్లోకము ప్రాచ్య పాఠములో లేదు. మునికుమారుని వచనము ప్రక్షిప్తము కావచ్చును. అతడు వేదాధ్యయన సంధ్యాఅగ్నికార్యాదులాచరించి నట్లు 33, 34 శ్లోకములలో చెప్పినది అప్పుడే కుదురును.

మూ. త్వామప్యేతాదృశో భావః క్షిప్రమేవ గమిష్యతి,
జీవితాన్తకరో ఘోరో దాతారమివ దక్షిణా. 57

ప్ర. అ. జీవితాన్తకరః=నీ ప్రాణములను తీయునదీ, ఘోరః=ఘోరమూ అయిన, ఏతాదృశః = ఇట్టి, భావః=భావము (పుత్రశోకము), దక్షిణా = దక్షిణ, దాతారమ్ఇవ=దాతను వలె, క్షిప్రమేవ=శీఘ్రముగనే, త్వామపి=నిన్ను కూడ; గమిష్యతి = పొందగలదు.

తా. నీ జీవితమును అంత మొందించు, ఘోర మైన ఇట్టి పుత్రశోకము, సత్పాత్ర కిచ్చిన దక్షిణ కాలాంతరమున ఫలరూపమున దాతను చేరి నట్లు నిన్ను చేరగలదు. 57

మూ. ఏవం శాపం మయి న్యస్య విలప్య కరుణం బహు,
చితామారోప్య దేహం తన్మిథునం స్వర్గమభ్యయాత్. 58

ప్ర. అ. తత్ = ఆ, మిథునమ్ = మిథునము, ఏవమ్=ఇట్లు, మయి = నాయందు, శాపమ్ = శాపమును, న్యస్య=ఉంచి, కరుణమ్=దీనముగా, బహు విలప్య=చాలాఏడ్చి, దేహమ్=దేహమును, చితామ్ = చితను, ఆరోప్య = ఎక్కించి, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, అభ్యయాత్ = వెళ్ళెను.

తా. ఆ దంపతులు నన్నీ విధముగా శపించి, చాల దీనముగా ఏడ్చి తను శరీరములను చితిపై ఉంచి ప్రాణత్యాగము చేసి, స్వర్గమునకు వెళ్ళిరి. 58

మూ. తదేతచ్చిన్తయానేన స్మృతం పాపం మయా స్వయమ్,
తదా బాల్యాత్కృతం దేవి శబ్దవేధ్యనుకర్షిణా. 59

ప్ర. అ. దేవి = కౌసల్యాదేవీ! తదా = అప్పుడు, శబ్దవేధ్యనుకర్షిణా = శబ్దవేధిబాణమును లాగిన, మయా = నాచేత, బాల్యాత్ = అజ్ఞానమువలన, స్వయమ్ = స్వయముగా, కృతమ్ = చేయబడిన, తత్ = అట్టి, ఏతత్ = ఈ, పాపమ్ = పాపము. చిన్తయానేన = చింతించుచున్న నాచేత. స్మృతమ్ = స్మరింపబడినది.

తా. కౌసల్యా! ఆనాడు, శబ్దవేధిని ప్రయోగించి, నేను స్వయముగ అజ్ఞానముచే చేసిన పాపము, నా కీనాడు, ఆలోచించుచుండగా గుర్తుకు వచ్చినది. 59

మూ. తస్యాయం కర్మణో దేవి విపాకః సముపస్థితః,
అపథ్యైః సహ సంభుక్తే వ్యాధిరన్నరసే యథా. 60

ప్ర. అ. దేవి = కౌసల్యాదేవీ! తస్య కర్మణః = ఆ కర్మయొక్క, అయం విపాకః = ఈ ఫలితము. అన్నరసే = అన్నరసము, అపథ్యైః సహ = పథ్యము కాని వస్తువులతో, సంభుక్తే సతి = భుజింపబడగా, వ్యాధిః యథా = వ్యాధి వలె, సముపస్థితః = వచ్చినది.

తా. కౌసల్యా! అపథ్యమైన వస్తువులు కలిపి అన్నము భుజింపగా కాలాంతరమున వ్యాధి వచ్చినట్లు నేను ఎప్పుడో చేసిన ఆ కర్మకు ఫలముగా ఇది వచ్చినది. 60

మూ. తస్మాన్మమాగతం భద్రే తస్యోదారస్య తద్వచః,
యదహం పుత్రశోకేన సంత్యక్ష్యామ్యద్య జీవితమ్. 61

ప్ర. అ. భద్రే = మంగళస్వరూపురాలా! తస్మాత్ = ఆ కారణమువలన, అహమ్ = నేను, పుత్రశోకేన = పుత్రశోకముచేత, జీవితమ్ = జీవితమును, యత్ సంత్యక్ష్యామి = త్యజించగలను అను, ఉదారస్య = ఉదారుడైన, తస్య = ఆ మునియొక్క, తత్ వచః = ఆవచనము, మమ = నాకు, అద్య = ఇప్పుడు, ఆగతమ్ = వచ్చినది.

తా. కావున, ఓ కౌసల్యా ! నేను పుత్రశోకముతో మరణించగలను అని ఆ మునీశ్వరుడు చెప్పిన మాట ఈనాడు నాకు వచ్చినది. 61

మూ. చక్షుర్భ్యాం త్వాం న పశ్యామి కౌసల్యే సాధు మాం స్పృశ,
ఇత్యుక్త్వా స రుదంస్త్రస్తో భార్యామాహ చ భూమిపః. 62

ప్ర. అ. కౌసల్యే = కౌసల్యా! చక్షుర్భ్యామ్ = నేత్రములతో, త్వామ్= నిన్ను, న పశ్యామి = చూడ జాలకున్నాను. మా = నన్ను, సాధు = బాగుగా, స్పృశ = స్పృశించుము. భూమిపః = దశరథుడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా= పలికి, రుదన్ = ఏడ్చుచు, భార్యామ్=భార్యను గూర్చి, ఆహ చ = మరల పలికెను.

తా. "కౌసల్యా! నా దృష్టి మందగించినది. నువ్వు నాకు కనబడుటలేదు. నన్ను స్పృశించుము" అని పలుకుచు, దశరథుడు ఏడ్చుచు, మరల ఆమెతో ఇట్లనెను. 62

మూ. ఏతన్మే సదృశం దేవి యన్మయా రాఘవే కృతమ్.
సదృశం తత్తు తస్యైవ యదనేన కృతం మయి. 63

ప్ర. అ. దేవి=ఓ దేవీ! మయా = నా చేత, యత్ = ఏది, రాఘవే= రాముని విషయమున, కృతమ్= చేయబడినదో, ఏతత్=ఇది. మే=నాకు, సదృశమ్=తగినది. అనేన= ఈ రామునిచేత. మయి=నా విషయమున, యత్= ఏది, కృతమ్ = చేయబడినదో, తత్తు=అదైతే, తస్యైవ=అతనికే, సదృశమ్= తగినది.

తా. కౌసల్యా! రాముని విషయమున నేను చేసిన పని, (అతనిని అరణ్యవాసమునకు పంపివేయుట అనునది) పాపబుద్ధినైన నాకు తగినట్లే ఉన్నది. రాముడు నా విషయమున చేసినపని, (మారు మాటాడక అరణ్యమునకు వెళ్ళుట అనునది) అతనికే తగును. 63

మూ. దుర్వృత్తమపి కః పుత్రం త్యజేద్భువి విచక్షణః,
కశ్చ ప్రవ్రాజ్యమానో వా నాసూయేత్పితరం సుతః. 64

ప్ర. అ. భువి= ఈ భూలోకములో, విచక్షణః=బుద్ధిమంతుడైన, కః =ఎవ్వడు, దుర్వృత్తమపి=చెడ్డ నడవడిక కలవాడైనను, పుత్రమ్=పుత్రుని,

త్యజేత్ = విడచును? ప్రవ్రాజ్యమానోఽపి = ప్రవాసమునకు పంపివేయబడుచున్నను, కః = ఏ, సుతః = కుమారుడు, పితరమ్ = తండ్రిని గూర్చి, నా సూయేత్ = కోపగించడు?

తా. ఈ లోకములో తెలివిగలవా డెవ్వడైనా, ఎంత చెడ్డవాని నైనను కుమారుని విడిచిపెట్టునా? ఏ కుమారుడైనా, తనను ప్రవాసమునకు పంపివేయు తండ్రిపై కోపించకుండునా! 64

మూ. యది మాం సంస్పృశేద్రామః సకృదద్య లభేత వా,
యమక్షయమనుప్రాప్తా ద్రక్ష్యన్తి న హి మానవాః. 65

ప్ర. అ. రామః = రాముడు, అద్య = ఇపుడు, సకృత్ = ఒక్క పర్యాయము, మామ్ = నన్ను, సంస్పృశేత్ = స్పృశించునా? లభేత వా = నన్ను సమీపించునా? యమక్షయమ్ = యమలోకమును, అనుప్రాప్తాః = పొందిన, మానవాః = మానవులు, న ద్రక్ష్యన్తి హి = పుత్రాదులను చూడరు కదా!

తా. నేను మరణించుటకు పూర్వము రాముడు నన్నొక్కసారి స్పృశించినను, లేదా నా దగ్గరకు వచ్చినను బాగుండెడిది. మరణానంతరము మానవులు తమ బంధువర్గమును చూడ జాలరు కదా! 66

మూ. చక్షుషా త్వాం న పశ్యామి స్మృతిర్మమ విలుప్యతే,
దూతా వైవస్వతస్యైతే కౌసల్యే త్వరయన్తి మామ్. 66

ప్ర. అ. కౌసల్యే = కౌసల్యా! చక్షుషా = నేత్రములతో, త్వామ్ = నిన్ను న పశ్యామి = చూడలేకున్నాను. మమ = నాయొక్క, స్మృతిః = స్మరణశక్తి, విలుప్యతే = లోపించుచున్నది. వైవస్వతస్య = యమునియొక్క, ఏతే దూతాః = ఈ దూతలు. మామ్ = నన్ను త్వరయన్తి = తొందరపెట్టుచున్నారు.

తా. కౌసల్యా! నా కండ్లకు నీవు కనబడుటలేదు. నా జ్ఞాపకశక్తి తగ్గిపోవుచున్నది. ఇదిగో ఈ యమదూతలు నన్ను తొందరపెట్టుచున్నారు. 66

మూ. అతస్తు కిం దుఃఖతరం యదహం జీవితక్షయే,
న హి పశ్యామి ధర్మజ్ఞం రామం సత్యపరాక్రమమ్. 67

ప్ర. అ. అహమ్ = నేను, జీవితక్షయే = మరణసమయమునందు, ధర్మజ్ఞమ్ = ధర్మముల నెరిగినవాడూ, సత్యపరాక్రమమ్ = సత్యమైన పరాక్రమము కలవాడూ అయిన, రామమ్ = రాముని, న పశ్యామి హి ఇతియత్ = చూడలేక పోవుచున్నాను అను విషయ మేది గలదో, అతః = దీనికంటె, దుఃఖతరమ్ = మిక్కిలి దుఃఖమును కలిగించునది, కిం ను = ఏమి ఉండును.

తా. మరణసమయమున నాకు ధర్మవేత్త, సత్యపరాక్రముడూ అయిన రాముడు దూర మైపోయినాడు. ఇంతకంటె అధిక మైన దుఃఖ మే దైన ఉండునా! 67

మూ. తస్యాదర్శనజః శోకః సుతస్యాప్రతికర్మణః,
ఉచ్ఛోషయతి మే ప్రాణాన్వారి స్తోకమివాతపః. 68

ప్ర. అ. అప్రతికర్మణః = సాటి లేని కార్యములు గల, తస్య సుతస్య = ఆ కుమారునియొక్క, అదర్శనజః = కనబడక పోవుటవలన కలిగిన, శోకః = శోకము, స్తోకమ్ = అల్ప మైన, వారి = ఉదకమును, ఆతపః ఇవ = ఎండ వలె, మే = నాయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, ఉచ్ఛోషయతి = ఎండింప చేయుచున్నది.

తా. సాటి లేని మహాకార్యములు చేయ గల నా కుమారుడు కనబడక పోవుటచే కలిగిన శోకము స్వల్పముగా ఉన్న ఉదకమును ఎండ ఎండింపచేసి నట్లు, నా ప్రాణములను తీసివేయు చున్నది. 68

మూ. న తే మనుష్యా దేవాస్తే యే చారు శుభకుణ్డలమ్,
ముఖం ద్రక్ష్యన్తి రామస్య వర్షే పఞ్చదశే పునః. 69

ప్ర. అ. పఞ్చదశే వర్షే = పదునైదవ సంవత్సరమునందు, యే = ఎవరు, చారు = సుందరమూ, శుభకుణ్డలమ్ = శుభ మైన కుండలములు కలది అయిన, రామస్య = రామునియొక్క, ముఖమ్ = ముఖమును, పునః = మరల, ద్రక్ష్యన్తి = చూడగలరో, తే = వారు, దేవాః = దేవతలే. మనుష్యాః = మనుష్యులు, న = కారు.

తా. పదునైదవ సంవత్సరమునందు తిరిగి వచ్చిన రాముని అంద మైన కుండలశోభిత మైన ముఖమును చూడ గలుగువారు దేవతలే; మానవులు కారు.

మూ. పద్మపత్రేక్షణం సుభ్రు సుదంష్ట్రం చారునాసికమ్,
ధన్యా ద్రక్ష్యన్తి రామస్య తారాధిపనిభం ముఖమ్. 70

ప్ర. అ. పద్మపత్రేక్షణమ్ = పద్మపత్రములవంటి నేత్రములు కలది, సుభ్రు = అందమైన కనుబొమ్మలు కలది, సుదంష్ట్రమ్ = మంచి దంతములు కలది, చారునాసికమ్ = అందమైన ముక్కు కలది, తారాధిపనిభమ్ = చంద్రునితో సమానమూ అయిన, రామస్య = రాముని యొక్క, ముఖమ్ = ముఖమును ధన్యాః = ధన్యులు, ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. తామరరేకులవంటి కండ్లు, అందమైన కనుబొమ్మలు, చక్కని పలువరస, చక్కని ముక్కు కల, చంద్రసమానమైన రాముని ముఖమును ధన్యాత్ములు ఆతడు తిరిగి వచ్చిన తరువాత మరల చూడగలరు. 70

మూ. సదృశం శారదస్యేన్దోః ఫుల్లస్య కమలస్య చ,
సుగన్ధి మమ నాథస్య ధన్యా ద్రక్ష్యన్తి తన్ముఖమ్. 71

ప్ర. అ. శారదస్య = శరత్కాలమునకు సంబంధించిన, ఇన్దోః = చంద్రునకు, సదృశమ్ = సమానమూ. ఫుల్లస్య = వికసించిన, కమలస్య చ = పద్మమునకు కూడ సమానమూ. సుగన్ధి = మంచి గంధము గలదీ అయిన, మమ నాథస్య = నా నాథుడైన రాముని యొక్క, తత్ = ఆ, ముఖమ్ = ముఖమును, ధన్యాః = ధన్యులు. ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. శరత్కాలచంద్రునితోను, వికసించిన పద్మముతోను సమానమైన, ఉత్తమగంధము గల నా నాథుని అ ముఖమును ధన్యులు చూడగలరు.

వి. "సుగన్ధి మమ రామస్య ధన్యా ద్రక్ష్యన్తి యే ముఖమ్" అనుగోరఖ్‌పూర్ పాఠము బాగున్నది. "నా రాముని ముఖమును ఎవరు చూడగలరో వారు ధన్యాత్ములు" అని తాత్పర్యము. 71

మూ. నివృత్తవనవాసం తమయోధ్యాం పునరాగతమ్,
ద్రక్ష్యన్తి సుఖినో రామం శుక్రం మార్గగతం యథా. 72

ప్ర. అ. నివృత్తవనవాసమ్ = పూర్తియైన వనవాసము కలవాడూ, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, పునః = మరల, అగతమ్ = వచ్చినవాడూ ఆయిన

రామమ్ = రాముని, మార్గగతమ్ = ఆకాశమార్గమునం దున్న, శుక్రం యథా= శుక్రుని వలె, సుఖినః = సుఖవంతులు, ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. వనవాసము ముగించుకొని అయోధ్యకు తిరిగివచ్చిన రాముని, ఆకాశ మార్గమునం దున్న శుక్రుని చూచి నట్లు, సుఖవంతులు చూడగలరు. 72

మూ. కౌసల్యే చిత్తమోహేన హృదయం సీదతీవ మే,
వేదయే న చ సంయుక్తాన్ శబ్దస్పర్శరసానహమ్. 73

ప్ర. అ. కౌసల్యే=కౌసల్యా! చిత్తమోహేన = చిత్తముయొక్క మోహము చేత, మే హృదయమ్=నాహృదయము, సీదతీవ=క్రుంగి పోవుచున్న ట్లున్నది. అహమ్ = నేను, సంయుక్తాన్ = సమీపమునకు వచ్చిన, శబ్దస్పర్శరసాన్ = శబ్ద స్పర్శరములను, న చ వేదయే = తెలుసుకొనజాలకున్నాను.

తా. కౌసల్యా! చిత్తమోహముచేత నా హృదయము క్రుంగిపోవుచున్నట్లు న్నది. నా ఇంద్రియములకు దగ్గరగ వచ్చినను శబ్దస్పర్శరూపాదులను గ్రహింప జాలకున్నాను. 73

మూ. చిత్తనాశాద్విపద్యన్తే సర్వాణ్యేవేన్ద్రియాణి మే,
క్షీణస్నేహస్య దీపస్య సంసక్తా రశ్మయో యథా. 74

ప్ర. అ. చిత్తనాశాత్ = చిత్తముయొక్క నాశమువలన, మే=నాయొక్క, సర్వాణ్యేవ = సమస్తమైన, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, క్షీణస్నేహస్య = క్షీణించిన తైలము గల, దీపస్య = దీపముయొక్క, సంసక్తాః = కలిసి ఉన్న, రశ్మయః యథా = కిరణములు వలె, విపద్యన్తే = నశించుచున్నవి.

తా. మనస్సు నశించుటచే నా ఇంద్రియము లన్నియు, తైలము క్షీణించు టచే దీపకిరణములు వలె, నశించుచున్నవి.

వి. 'సంసక్తాః' కు బదులు 'సంరక్తాః' అను గోరఖ్‌పూర్ పాఠము బాగు న్నది. సంరక్తాః = ఎఱ్ఱబారిన. దీపము శాంతించుటకుముందు దీపశిఖ ఎఱ్ఱబారుట ప్రసిద్ధము. 74

మూ. అయమాత్మభవః శోకో మామనాథమచేతనమ్,
సంసాదయతి వేగేన యథా కూలం నదీరయః. 75

ప్ర. అ. ఆత్మభవః=నానుండియే పుట్టిన లేదాకుమారుని వలన కలిగిన, అయమ్ = ఈ, శోకః = శోకము, అనాథమ్=అనాథుడనూ, అచేతనమ్ = చైతన్యము లేని వాడను అయిన, మామ్ = నన్ను, నదీరయః = నదీవేగము, కూలం యథా = గట్టును వలె, వేగేన = వేగముచేత, సంసాదయతి = నశింపచేయుచున్నది.

తా. నదీప్రవాహవేగము తీరమును కూలత్రోసి నట్లు, పుత్రవియోగముచే కలిగిన ఈ శోకము, రక్షకు లెవ్వరూ లేని, చైతన్య శూన్యుడ నైన నన్ను క్షీణింపచేయుచున్నది. 75

మూ. హా రాఘవ మహాబాహో హా మమాయాసనాశన,
హా పితృప్రియ మే నాథ హాద్య క్వాసి గతః సుత. 76

ప్ర. అ. మహాబాహో = గొప్పబాహువులుగల, హా రాఘవ = అయ్యో రామా! మమ = నాయొక్క, ఆయాసనాశన = దుఃఖమును నశింపచేయువాడా! హా = అయ్యో! హాపితృప్రియ = అయ్యో! తండ్రికి ఇష్ట మైనవాడా! మే నాథ= నా రక్షకుడా! హా సుత = అయ్యో కుమారా! క్వ = ఎచటికి, గతః అసి = వెళ్ళినావు?

తా. అయ్యో రామా! అయ్యో మహాబాహూ! అయ్యో మదీయదుఃఖనాశకా! అయ్యో పితృప్రియా! అయ్యో మద్రక్షకా! అయ్యో నా కుమారా! ఇపు డెక్కడికి వెళ్ళిపోయినావు! 76

మూ. హా కౌసల్యే నశిష్యామి హా సుమిత్రే తపస్విని,
హా నృశంసే మమామిత్రే కైకేయి కులపాంసని. 77

ప్ర. అ. హా కౌసల్యే = అయ్యో కౌసల్యా, తపస్విని = దీనురాల వైన, హా సుమిత్రే = అయ్యో సుమిత్రా! హా = అయ్యో! నృశంసే = క్రూరురాలవూ, మమ అమిత్రే = నా శత్రువూ, కులపాంసని = కులమును అపవిత్రముచేసినదానవూ అయిన, కైకేయి = కైకేయీ! నశిష్యామి = మరణించెదను.

తా. అయ్యో కౌసల్యా! అయ్యో దీనురాల వైన సుమిత్రా! అయ్యో! క్రూరురాలవూ, నాశత్రువూ, కులమును అపవిత్రము చేసినదానవూ అయిన కైకేయీ! నే నిపుడు మరణించనున్నాను. 77

మూ. ఇతి రామస్య మాతుశ్చ సుమిత్రాయాశ్చ సన్నిధౌ,
రాజా దశరథః శోచన్ జీవితాన్తముపాగమత్. 78

ప్ర. అ. రాజా = రాజైన, దశరథః = దశరథుడు, ఇతి = ఈ విధముగా, రామస్య మాతుశ్చ = రాముని తల్లియొక్క, సుమిత్రాయాః చ = సుమిత్రయొక్క, సన్నిధౌ = సన్నిధియందు, ఇతి = ఈ విధముగా, శోచన్ = దుఃఖించుచు, జీవితాన్తమ్ = మరణమును, ఉపాగమత్ = పొందెను.

దశరథమహారాజు ఈ విధముగా కౌసల్యాసుమిత్రల సమీపమున, విలపించుచు మరణించెను. 78

మూ. యదా తు దీనం కథయన్నరాధిపః,
ప్రియస్య పుత్రస్య వివాసనాతురః,
గతేఽర్ధరాత్రే భృశదుఃఖపీడితః,
తదా జహౌ ప్రాణముదారదర్శనః. 79

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుఃషష్టితమః సర్గః

ప్ర. అ. ఉదారదర్శనః = ఉదారమైన దర్శనము గల, నరాధిపః = దశరథమహారాజు, దీనమ్ = దీనముగా, కథయన్ = ఇట్లు చెప్పుచు, పుత్రస్య = కుమారునియొక్క, వివాసనాతురః = ప్రవాసమునకు పంపివేయుటచే దుఃఖించుచు. అర్ధరాత్రే = అర్ధరాత్రి, గతే = గడచిన దగుచుండగా, యదా = ఎప్పుడు, భృశదుఃఖపీడితః = మిక్కిలి దుఃఖముచే పీడింపబడెనో, తదా = అప్పుడు, ప్రాణమ్ = ప్రాణమును, జహౌ = విడచెను.

తా. ఆనందకరమైన దర్శనము గల ఆ దశరాథమహారాజు పుత్రుడు అరణ్యమునకు పోవుటచే దుఃఖార్తుడై ఈ విధముగా దీనముగా మాటలాడుచు, అర్ధరాత్రి గడచిన పిమ్మట దుఃఖము అధిక మగుటచే దానిని భరింపజాలక ప్రాణములు విడచెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువది నాలుగవ సర్గ సమాప్తము.

# పఞ్చషష్టితమః సర్గః

[ప్రాతఃకాలమున వందిజనులు స్తోత్రము చేయుట, రాజు మర ణించుట తెలిసి రాణులు జాలికలుగునట్లు రోదించుట]

వి. దశరథుడు మునిశాపవృత్తాంతమును చెప్పి చివరకు దుఃఖము భరింప జాలక ప్రాణములు విడచి నట్లు వెనుకటి సర్గలో చెప్పబడినది. దశరథుడు అంతటి దుఃఖముతో తనకు ఆ నాడు వచ్చిన మునిశాపమును గూర్చి చెప్పు చుండగా కౌసల్య సావధానముగా విన్నట్లు గాని, చివరకు ఊఁకట్టినట్లు గాని చెప్పలేదు. ఈ విధముగా వాగి వాగి దశరథుడు మంచముపైననే మరణించగా ఆ విషయముకూడ కౌసల్యా సుమిత్రలకు తెలియలేదు. వందిమాగధాదులు వచ్చి దశరథుడు మరణించినట్లు గుర్తించిన పిమ్మట కౌసల్యాసుమిత్రలు కూడా నిద్ర నుండి మేల్కొని విలపింప ప్రారంభించి నట్లు ఈ సర్గలో చెప్పబడును. ఇది కొంత అనుచితముగానే కనబడుచున్నది. కాని ప్రాచ్య పాఠములో, ఈ సర్గ ప్రారంభములో రెండు శ్లోకము లున్నవి. అవి కూడా చేర్చి చదువు కున్నచో ఉచితముగా నుండి ఈ అనుచితత్వము తొలగిపోవును. ఆ శ్లోకములు ఇవి:-

మూ. విలప్యాథ తమేవం తు తూష్ణీంభూతం నరాధిపమ్,
సుప్త ఇత్యవగమ్యార్తా కౌసల్యా న వ్యబోధయత్. 1

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, విలప్య = విలపించి, అథ = పిమ్మట, తూష్ణీం భూతమ్ = మౌనము వహించిన, నరాధిపమ్= రాజును, సుప్తః ఇతి = నిద్రపోయినాడు అని, అవగమ్య = భావించి, ఆర్తా=దుఃఖితురా లైన, కౌసల్యా = కౌసల్య, న వ్యబోధయత్ = మేల్కొలుపలేదు.

తా. దశరథమహారాజు ఈ విధముగా విలపించిన పిమ్మట, మౌనముగా ఉండుట చూచి, రామప్రవాసదుఃఖితురా లగు కౌసల్య, రాజుకు నిద్ర పట్టిన దని తలచి అతనిని మేల్కొలుపలేదు.

మూ. అనుక్త్వైవ చ భర్తారం కిఞ్చిచ్ఛోకశ్రమాలసా,
సుష్వాప శయనే భూయః పుత్రశోకార్తమానసా. 2

ప్ర అ. పుత్రశోకార్తమానసా = పుత్రశోకముచే పీడింపబడిన మనస్సు గల, శోకశ్రమాలసా=శోకమువలన కలిగిన శ్రమచేత అలసిపోయిన కౌసల్య, భర్తారమ్ = భర్తనుగూర్చి, కించిత్ = ఏమియు, అనుక్త్వైవ = పలుకకుండగనే, భూయః = మరల, శయనే = శయనమునందు, సుష్వాప = నిద్రించెను.

తా. పుత్రశోకముచే పీడిత మైన మనస్సు గల కౌసల్య శోకశ్రమచే అలసి ఉండెను. అందుచేత ఆమె భర్తతో ఇంక నేమియు మాటలాడక, మరల శయనముపై శయనించెను. (సుమిత్ర కూడ ఇట్లే చేసి ఉండు నని మన మూహింప వచ్చును). 2

మూ. అథ రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాత రేవాపరేఽహని,
వన్దినః పర్యుపాతిష్ఠన్ తత్పార్థివనివేశనమ్. 1
సూతాః పరమసంస్కారాః మఙ్గళాశ్చోత్తమశ్రుతాః,
గాయకాః స్తుతిశీలాశ్చ నిగదన్తః పృథక్ పృథక్. 2

ప్ర. అ. అథ = అనంతరము, రాత్ర్యామ్ = రాత్రి, వ్యతీతాయామ్ = గడచిన దగుచుండగా, అపరే=తరువాతి దైన, అహని=దివసమునందు, ప్రాతః ఏవ=ప్రాతఃకాలమునందే, పరమసంస్కారాః = గొప్ప బుద్ధిసంస్కారము గల వారూ, ఉత్తమశ్రుతాః = ఉత్తమ మైన విద్య కలవారూ, మఙ్గలాశ్చ= మంగళ వాక్యములు ఉచ్చరించువారూ అయిన, సూతాః = సూతులూ (వంశావళి కీర్తించు వారూ), స్తుతిశీలాః = స్తోత్రము చేయు స్వభావముగల వారు అయిన, గాయకాః = గాయకులు, వన్దినః = స్తోత్రపాఠకులూ, పృథక్ పృథక్=వేరువేరుగా, నిగదన్తః = చెప్పుచు, తత్ = ఆ, పార్థివనివేశనమ్=రాజగృహమును, పర్యుపాతిష్ఠన్ = సమీపించిరి.

తా. ఇంతలో రాత్రి గడచినది మరునాడు ప్రాతఃకాలమునందే ఉత్తమ మైన సంస్కారమూ విద్యా గల, మంగళవాక్యములను పలుకు సూతులూ, స్తోత్ర పాఠకులూ, స్తుతిగీతములు పాడు గాయకులూ తమ తమ స్తుతిపాఠవంశావళ్యాది పాఠములు చేయుచు రాజగృహమును చేరిరి. 1, 2

మూ. రాజానం స్తువతాం తేషాముదాత్తాభిహితాశిషామ్,
ప్రాసాదాభోగవిస్తీర్ణః స్తుతిశబ్దో హ్యావర్తత. 3

ప్ర. అ. ఉదాత్తాభిహితాశిషామ్=ఉచ్చైఃస్వరములో పలకబడిన ఆశీర్వాదములు గల వారూ, రాజానమ్=రాజును, స్తువతామ్ = స్తుతించుచున్నవారూ అయిన, తేషామ్=వారియొక్క, స్తుతిశబ్దః=స్తోత్రధ్వని, ప్రాసాదాభోగవిస్తీర్ణః =ప్రాసాదపు విశాలప్రదేశమందు విస్తరించి, అవర్తత హి=ఉండెను.

తా. ఉచ్చైఃస్వరముతో ఆశీస్సులు పలుకుచు రాజును స్తుతించుచున్న వారి స్తోత్రధ్వని ప్రాసాదముయొక్క విశాలప్రదేశమునందు వ్యాపించెను. 3

మూ. తతస్తు స్తువతాం తేషాం సూతానాం పాణివాదకాః,
అవదానాన్యుదాహృత్య పాణివాదా నవాదయన్. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేషాం సూతానామ్ = ఆ సూతులు, స్తువతామ్ = స్తోత్రము చేయుచుండగా. పాణివాదకాః = చేతులతో శబ్దము చేయువారు (చప్పట్లు వేయువారు), అవదానాని=(దశరథుడు) పూర్వము చేసిన ఉత్తమకార్యములను, ఉదాహృత్య = ఉదాహరించి, పాణివాదాన్ = చప్పట్లు, అవాదయన్ = చరిచిరి.

తా. సూతులు స్తోత్రములు చేయు సమయమున పాణివాదకులు దశరథుడు పూర్వము చేసిన కృత్యములు ఉదాహరించుచు, చప్పట్లు చరుచుచు పాడిరి. 4

మూ. తేన శబ్దేన విహగాః ప్రతిబుద్ధా విసస్వనుః,
శాఖాస్థాః పఞ్జరస్థాశ్చ యే రాజకులగోచరాః. 5

ప్ర. అ. తేన = ఆ, శబ్దేన = శబ్దముచేత, శాఖాస్థాః = కొమ్మలమీదనున్నవి, పఞ్జరస్థాః చ = పంజరములో ఉన్నవీ అయిన, యే = ఏ, రాజకులగోచరాః = రాజగృహమునకు సంబంధించిన, విహగాః = పక్షులు కలవో అవి, ప్రతిబుద్ధాః = మేల్కొన్నవై, విసస్వనుః = ధ్వని చేసినవి.

తా. కొమ్మలమీదా, పంజరాలలోనూ ఉన్న రాజగృహమునకు సంబంధించిన పక్షు లన్నీ ఆ శబ్దమునకు మేల్కొని రొజచేయుట ప్రారంభించినవి. 5

మూ. వ్యాహృతాః పుణ్యశబ్దాశ్చ వీణానాం చాపి నిస్స్వనాః,
ఆశీర్గేయం చ గాథానాం పూరయామాస వేశ్మ తత్. 6

ప్ర. అ. వ్యాహృతాః = పలకబడిన, పుణ్యశబ్దాశ్చ = పుణ్యశబ్దములు, వీణానామ్ = వీణలయొక్క, నిస్స్వనాః చ = ధ్వనులూ, గాథానామ్ = గాథ లను ఛందోబద్ధరచనలయొక్క, ఆశీర్గేయం చ = ఆశీర్వాదరూప మైన గేయమూ, తత్ = ఆ, వేశ్మ = గృహమును, పూరమాయాస = నింపెను.

తా. వందిమాగధాదు లుచ్చరించిన పుణ్యశబ్దములు, వీణాధ్వనులూ, ఆశీర్వాదరూపము లైన గాథాఛందోనిబద్ధగేయములూ, ఆ గృహమును నింపి వేసినవి. 6

మూ. తతః శుచిసమాచారాః పర్యుపస్థానకోవిదాః,
స్త్రీవర్షవరభూయిష్ఠా ఉపతస్థుర్యథాపురమ్. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శుచిసమాచారాః = పరిశుద్ధ మైన ఆచారము కలవారూ, స్త్రీవర్షవరభూయిష్ఠాః = స్త్రీలు కంచుకులు అధికముగా కలవారూ అయిన, పర్యుపస్థానకోవిదాః = రాజసేవయందు నేర్పు గల జనులు, యథా పురమ్ = పూర్వమునందు వలె, ఉపతస్థుః = సేవార్థమై సమీపించిరి.

తా. పిమ్మట మంచి ఆచారము కలవారు, రాజసేవయందు నిపుణులూ, అయిన జనులు పూర్వము వలెనే దశరథుని సేవించుటకు వచ్చిరి. వారిలో స్త్రీ లును, కంచుకులును అధికసంఖ్యలో ఉండిరి. 7

మూ. హరిచన్దనసంపృక్త ముదకం కాఞ్చనైర్ఘటైః,
ఆనిన్యుః స్నానశిక్షాజ్ఞా యథాకాలం యథావిధి. 8

ప్ర. అ. స్నానశిక్షాజ్ఞాః = స్నానవిధిని ఎరిగిన పరిచారకులు, హరిచన్దన సంపృక్తమ్ = మంచిగంధముతో కూడిన, ఉదకమ్ = ఉదకమును, కాఞ్చనైః = బంగారువికార మైన, ఘటైః = ఘటములతో, యథాకాలమ్ = కాలానుసారముగా, యథావిధి = నియమానుసారముగా, ఆనిన్యుః = తీసికొనివచ్చిరి.

తా. స్నానము చేయుటలో నేర్పుగల పరిచారకులు, కాలమునకు అను గుణముగా, నియమానుసారముగా, బంగారు ఘటములలో మంచిగంధము కలిపిన ఉదకమును తీసికొనివచ్చిరి. 8

మూ. మఙ్గలాలమ్భనీయాని ప్రాశనీయానుపస్కరాన్,
ఉపనిన్యుస్తథాప్యన్యాః కుమారీబహులాః స్త్రియః. 9

ప్ర. అ. తథా=అట్లే, అన్యాః=ఇతర లైన, కుమారీబహులాః=కన్యకలు అధికముగా గల, స్త్రియఃఅపి = స్త్రీలు కూడ, మఙ్గలాలమ్భనీయాని = మంగళకరము లైన శరీరమునకు పూసికొనదగిన వస్తువులను, ప్రాశనీయాన్=తినదగిన పదార్థములను, ఉపస్కరాన్ = వస్త్రాభూషణాదులను, ఉపనిన్యుః = తిసికొని వచ్చిరి.

తా. ఎక్కువమంది కన్యక లున్న స్త్రీలు, శరీరమునకు అలదుకొనే మంగళద్రవ్యములను, తినే వస్తువులను, వస్త్రాదులను తీసికొనివచ్చిరి. 9

మూ. సర్వలక్షణసంపన్నం సర్వం విధివదర్చితమ్,
సర్వం సుగుణలక్ష్మీవత్తద్బభూవాభిహారికమ్. 10

ప్ర. అ. తత్ = ఆ, అభిహారికమ్ = రాజునిమిత్తమై తీసుకొనివచ్చిన ద్రవ్యజాతము, సర్వమ్=అంతయు, సర్వలక్షణసంపన్నమ్=సమస్తమైన మంచి లక్షణములతో కూడినదీ, విధివత్ = యథాశాస్త్రముగా, అర్చితమ్ = పూజింపబడినదీ, అభూత్ = అయెను. సర్వమ్ = ఆ సమస్తమూ, సుగుణలక్ష్మీవత్ = మంచి గుణముల లక్ష్మి కలది, ఆయెను

తా. దశరథమహారాజుకొరకై తీసికొనివచ్చిన ఆ పదార్థము లన్నియు, మంచిలక్షణములు కలవై, యథాశాస్త్రముగా అమర్చబడి,సుగుణసంపత్తుతో ప్రకాశించుచు ఉండెను. 10

మూ. తతః సూర్యోదయం యావత్సర్వం పరిసముత్సుకమ్
తస్థావనుపసంప్రాప్తం కిం స్విదిత్యుపశఙ్కితమ్. 11

ప్ర అ. తతః = పిమ్మట, సర్వమ్ = ఆ పరివార మంతయు, పరిసముత్సుకమ్=ఎక్కువ ఔత్సుక్యముతో కూడినదై, అనుపసంప్రాప్తమ్=రాజుదగ్గరకు చేరనిదై, కిం స్విత్ ఇతి = ఇది ఏమి అని, ఉపశఙ్కితమ్ = శంక కలదై, సూర్యోదయం యావత్ = సూర్యోదయము వరకును. తస్థౌ = అట్లే ఉండెను.

తా. ఆ పరిజన మంతయు, రాజుకు దగ్గరగా మాత్రము వెళ్ళక, ఔత్సుక్యముతో, ఏ మైనదా అని శంకించుచు, సూర్యోదయమువరకు అట్లే వేచి ఉండెను. 11

మూ. అథ యాః కోసలేన్ద్రస్య శయనం ప్రత్యనన్తరాః,
తాః స్త్రియస్తు సమాగమ్య భర్తారం ప్రత్యబోధయన్. 12

ప్ర. అ. అథ = పిమ్మట, యాః స్త్రియః = ఏ స్త్రీలు, కోసలేన్ద్రస్య = దశరథమహారాజుయొక్క, శయనం ప్రతి = శయనమును గూర్చి, అనన్తరాః = అడ్డు లేనివారో, తాః తు = ఆ స్త్రీలైతే, సమాగమ్య = దగ్గరకు వెళ్ళి భర్తారమ్ = ప్రభువును, ప్రత్యబోధయన్ = మేల్కొలిపిరి.

తా. అటుపిమ్మట, దశరథమహారాజు శయనము దగ్గరకు వెళ్ళుటకు అధికారము గల స్త్రీలు, ఆతని శయనముదగ్గరకు వెళ్ళి మేల్కొలిపిరి. 12

మూ. తథాప్యుచితవృత్తాస్తా వినయేన నయేన చ,
న హ్యస్య శయనం స్పృష్ట్వా కించిదప్యుపలేభిరే. 13

ప్ర. అ. తథాపి = అట్లైనను, వినయేన = వినయముతోను, నయేన = నీతిమార్గముచేతను, ఉచితవృత్తాః = తగిన ప్రవృత్తిగల, తాః = ఆ స్త్రీలు, అస్య = ఈ దశరథునియొక్క, శయనమ్ = శయనమును, స్పృష్ట్వా = స్పృశించి, కించిత్ అపి = ఏమియు, న ఉపలేభిరే = పొందలేదు.

తా. వినయముతోను, నయముతోను ఉచితరీతిని ప్రవర్తించు ఆ స్త్రీలు దశరథుని శయనము స్పృశించి చూచినను ఏమియు తెలుసుకొనలేకపోయిరి.

మూ. తాః స్త్రియః స్వప్నశీలజ్ఞాశ్చేష్టాసంచలనాదిషు,
తా వేపథుపరీతాశ్చ రాజ్ఞః ప్రాణేషు శఙ్కితాః. 14
ప్రతిస్రోతస్తృణాగ్రాణాం సదృశం సంచకాశిరే.

ప్ర. అ. తాః స్త్రియః = ఆ స్త్రీలు, చేష్టాసంచలనాదిషు = చేష్టలు కదలికలు మొదలగువాటియందు (వాటిని బట్టి), స్వప్నశీలజ్ఞాః = స్వప్న (నిద్రా)స్వభావమును తెలుసుకొనగలిగినవారు. తాః = అట్టి ఆ స్త్రీలు, రాజ్ఞః = రాజుయొక్క, ప్రాణేషు = ప్రాణముల విషయమున, శఙ్కితాః = శంక కలిగినవారై, వేపథుపరీతాః చ = వణకుతో కూడినవారై, ప్రతిస్రోతస్తృణాగ్రాణామ్ = ప్రవాహమునకు ఎదురుగానిలచిన తృణాగ్రములకు, సదృశమ్ = సమానముగా, సంచకాశిరే = ప్రకాశించిరి (ఉండిరి).

తా. ఆ స్త్రీలు చేష్టలనూ, కదలికలనూ బట్టి నిద్రా స్వభావమును గుర్తింపగలిగినవారు. అట్టి ఆ స్త్రీలు, రాజు ప్రాణముల విషయమున శంకతో వణకి

పోవుచు, ప్రవాహమునకు ఎదురుగా నిలచిన తృణముల చివరిభాగములు వలె అయిరి. 14

మూ. అథ సందేహమానానాం స్త్రీణాం దృష్ట్వా చ పార్థివమ్,
యత్తదాశఙ్కితం పాపం జజ్ఞే తస్య వినిశ్చయః. 15

ప్ర. అ. అథ = పిమ్మట, పార్థివమ్ = రాజును, దృష్ట్వా చ = చూచి, సందేహమానానామ్ = సందేహించుచున్న, స్త్రీణామ్ = స్త్రీలకు, యత్ = ఏ, తత్ = ఆ, పాపమ్ = పాపము, ఆశఙ్కితమ్ = శంకించబడినదో, తస్య = దానియొక్క వినిశ్చయః = నిశ్చయము, జజ్ఞే = కలిగెను.

తా. రాజును చూచిన పిమ్మట, అంత వరకును సందేహించుచున్న స్త్రీలు ఏ పాపమును శంకించిరో, అది నిశ్చిత మాయెను. 15

మూ. కౌసల్యా చ సుమిత్రా చ పుత్రశోకపరాజితే, 16
ప్రసుప్తే న ప్రబుధ్యేతే యథా కాలసమన్వితే.

ప్ర. అ. పుత్రశోకపరాజితే = పుత్రశోకముచేత అవహింపబడినవారై, ప్రసుప్తే = నిద్రించుచున్న, కౌసల్యా చ = కౌసల్యయు, సుమిత్రా చ = సుమిత్రయు, కాలసమన్వితే యథా = మృత్యువుతో కూడినవారు వలె, న ప్రబుధ్యేతే = మేల్కొనలేదు.

తా. పుత్రశోకము ఆక్రమింపగా నిద్రపోవుచున్న కౌసల్యా సుమిత్రలు, మరణించిన వారు వలె మేల్కొనలేదు. 16

మూ నిష్ప్రభా చ వివర్ణా చ సన్నా శోకేన సన్నతా, 17
న వ్యరాజత కౌసల్యా తారేవ తిమిరావృతా.

ప్ర. అ. నిష్ప్రభా చ = కాంతి లేనిదీ, వివర్ణా = మారి పోయిన శరీరచ్ఛాయ గలదీ, శోకేన = దుఃఖముచేత, సన్నా = క్రుంగిపోయినదీ, సన్నతా = వంగిపోయినదీ అయిన, కౌసల్యా = కౌసల్య, తిమిరావృతా = చీకటిచేత ఆవరింపబడిన, తారేవ = నక్షత్రము వలె, న వ్యరాజత = ప్రకాశించలేదు.

తా. కౌసల్య శోకముచేత కాంతి విహీనురాలై, శరీరచ్ఛాయ కూడ మారిపోగా, క్రుంగి, కృశించి ఉండుటచే, చీకటి కప్పిన నక్షత్రము వలె ప్రకాశించలేదు. 17

మూ. కౌసల్యాఽనన్తరం రాజ్ఞః సుమిత్రా తదనన్తరమ్, 18
న స్మ విభ్రాజతే దేవీ శోకాశ్రులులితాననా.

ప్ర. అ. రాజ్ఞః = రాజునకు, అనన్తరమ్ = అనంతరము, దేవీ = దేవి యైన, కౌసల్యా = కౌసల్య, తదనన్తరమ్=ఆమె ప్రక్క, సుమిత్రా = సుమిత్ర, శోకాశ్రులులితాననా = శోకముచే కలిగిన కన్నీళ్ళచే వ్యాకులముగా చేయబడిన ముఖము గలదై, న స్మవిభ్రాజతే = ప్రకాశించలేదు.

తా. రాజు ప్రక్కనేఉన్న కౌసల్యా, ఆమె ప్రక్కనే ఉన్న సుమిత్రా కూడ దుఃఖమువలన కలిగిన కన్నీళ్లచే వ్యాకులములైన ముఖములతో ప్రకాశహీనలుగా ఉండిరి. 18

మూ. తే చ దృష్ట్వా తథా సుప్తే శుభే దేవ్యౌ చ తం నృపమ్, 19
సుప్తమేవోద్గతప్రాణమన్తఃపురమమన్యత.

ప్ర. అ. అన్తఃపురమ్ = అంతఃపురము, తథా = ఆ విధముగా, సుప్తే= నిద్రించుచున్న, శుభే=మంగళప్రద లైన, తే దేవ్యౌ = ఆ రాణులను, తమ్=ఆ, నృపమ్ = రాజును, దృష్ట్వా = చూచి, సుప్తమేవ = నిద్రించి ఉండగానే, ఉద్గతప్రాణమ్ = పోయిన ప్రాణములు గలవానినిగా, అమన్యత = తలచెను.

తా. ఆ విధముగా నిద్రపోవుచున్న రాణు లిద్దరినీ, ఆ రాజునూ చూచి, అంతఃపురజనులు, రాజు నిద్రలోనే మరణించె నని తలచిరి(తెలుసుకొనిరి). 19

మూ. తతః ప్రచుక్రుశుర్దీనాః సస్వరం తా వరాఙ్గనాః,
కరేణవ ఇవారణ్యే స్థానప్రచ్యుతయూథపాః. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తాః వరాఙ్గనాః = ఆ స్త్రీలు, అరణ్యే = అరణ్యమునందు, స్థానప్రచ్యుతయూథపాః=స్థానమునుండి తొలగిన తమగుంపు నాయకు డైన ఏనుగు గల, కరేణవః ఇవ=ఆడ ఏనుగుల వలె, దీనాః = దీనలై, సస్వరమ్ = సస్వరముగా. ప్రచుక్రుశుః = గట్టిగా అరచిరి.

తా. పిమ్మట ఆ స్త్రీ లందరును, అరణ్యములో తమ గుంపుకు నాయకు డైన గజము దూర మైపోయి నపుడు ఆడ ఏనుగలు ఏడ్చినట్లు బిగ్గరగా, సస్వరముగా ఏడ్చిరి. 20

మూ. తాసామాక్రన్దశబ్దేన సహసోద్గతచేతనే,
కౌసల్యా చ సుమిత్రా చ త్యక్తనిద్రే బభూవతుః. 21

ప్ర. అ. కౌసల్యా చ=కౌసల్యయు, సుమిత్రా చ=సుమిత్రయు, తాసామ్ = వారియొక్క, ఆక్రన్దశబ్దేన = అరపుల ధ్వనిచేత, సహసా = హఠాత్తుగా, ఉద్గతచేతనే = పొందబడిన తెలివిగలవారై, త్యక్తనిద్రే = విడువబడిన నిద్రగలవారు, బభూవతుః = అయిరి.

తా. ఆ స్త్రీల ఆక్రందనధ్వనిచేత హఠాత్తుగా తెలివి వచ్చి, కౌసల్యాసుమిత్రలు నిద్రనుండి మేల్కొనిరి. 21

మూ. కౌసల్యా చ సుమిత్రా చ దృష్ట్వా స్పృష్ట్వా చ పార్థివమ్,
హా నాథేతి పరిక్రుశ్య పేతతుర్ధరణీతలే. 22

ప్ర. అ. కౌసల్యా చ = కౌసల్యయు, సుమిత్రా చ = సుమిత్రయు, పార్థివమ్ = రాజును, దృష్ట్వా = చూచి, స్పృష్ట్వా చ = స్పృశించి, హా నాథ ఇతి = హా నాథా! అని, పరిక్రుశ్య = అరచి, ధరణీతలే = నేలపై, పేతతుః = పడిరి.

తా. కౌసల్యాసుమిత్రలు, ఆ దశరథమహారాజును చూచి, స్పృశించి "హా నాథా!'' అని అరచుచు నేలపై పడిపోయిరి. 22

మూ. సా కోసలేన్ద్రదుహితా వేష్టమానా మహీతలే, 23
న బభ్రాజ రజోధ్వస్తా తారేవ గగనాచ్చ్యుతా.

ప్ర. అ. సా=ఆ, కోసలేన్ద్రదుహితా=కోసలరాజుకుమార్తె యైన కౌసల్య, మహీతలే = నేలపై, వేష్టమానా=దొరలుచు, రజోధ్వస్తా=పరాగముచే చెడినదై, గగనాత్ = ఆకాశమునుండి, చ్యుతా = జారిపడిన, తారేవ = నక్షత్రము వలె, న బభ్రాజ = ప్రకాశించలేదు.

తా. నేలపై దొరలుచు దుమ్ముచే కప్పబడిన కౌసల్య, ఆకాశమునుండి క్రిందికి పడిన నక్షత్రము వలె, కాంతివిహీన అయి ఉండెను. 23

మూ. నృపే శాన్తగుణే జాతే కౌసల్యాం పతితాం భువి, 24
అపశ్యంస్తాః స్త్రియః సర్వా హతాం నాగవధూమివ.

ప్ర. అ. నృపే = రాజు, శాన్తగుణే = శాంతించిన వేడి మొద లైన గుణములు కలవాడుగా, జాతే = అనగా, సర్వాః = సమస్త మైన, తాః స్త్రియః = ఆ స్త్రీలు, భువి = నేలమీద, పతితామ్ = పడిపోయిన, కౌసల్యామ్ = కౌసల్యను, హతామ్ = చంపబడిన, నాగవధూమివ = ఆడ ఏనుగును వలె, అపశ్యన్ = చూచిరి.

తా. దశరథుడు మరణించగా, నేలపై పడి యున్న కౌసల్య ఆ స్త్రీలకందరికిని, చంపబడి నేలపై పడి ఉన్న ఆడ ఏనుగ వలె కనబడెను. 24

మూ. తతః సర్వా నరేన్ద్రస్య కైకేయీప్రముఖాః స్త్రియః, 25
రుదన్త్యః శోకసన్తప్తా నిపేతుర్గతచేతనాః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కైకేయీప్రముఖాః = కైకేయి మొద లైన, నరేన్ద్రస్య = రాజుయొక్క, స్త్రియః = స్త్రీలు, రుదన్త్యః = ఏడ్చుచు, శోకసన్తప్తాః = శోకముచేత పీడింపబడినవారై, గతచేతనాః = పోయిన చైతన్యము కలవారై, నిపేతుః = పడిపోయిరి.

తా. కైకేయి మొద లైన రాజభార్య లందరును, ఏడ్చుచు, దుఃఖముచేత పీడితలై, స్పృహ తప్పి, నేలపై పడిపోయిరి. 25

మూ. తాభిః స బలవాన్నాదః క్రోశన్తీభిరనుద్రుతః, 26
యేన స్ఫీతీకృతో భూయస్తద్గృహం సమనాదయత్.

ప్ర. అ. క్రోశన్తీభిః = ఏడ్చుచున్న, తాభిః = ఆ స్త్రీలచేత, అనుద్రుతః = అనుసరింపబడిన, బలవాన్ = అధిక మైన, సః నాదః = ఆ ధ్వని, యేన = ఏగృహముచేత, స్ఫీతీకృతః = పెద్దదిగా చేయబడినదో, తత్ = ఆ, గృహమ్ = గృహమును, సమనాదయత్ = ధ్వనింపచేసెను.

తా. ఏడ్చుచున్న ఆ స్త్రీలు అత్యధిక మైన ఆ ధ్వనిని అవిచ్ఛిన్న మగునట్లు చేసిరి. ఆ ధ్వనిని గృహము(ప్రతిధ్వనిచే) ఇంకను అధికముచేయగా దానితో గృహమంతయు ధ్వనితో నిండిపోయెను. 26

మూ. తచ్చ సంత్రస్తసంభ్రాన్త పర్యుత్సుకజనాకులమ్. 27
సర్వతస్తుములాక్రన్దం పరితాపార్తబాన్ధవమ్.

సద్యోనిపతితానన్దం దీనవిక్లబదర్శనమ్, 28
బభూవ నరదేవస్య సద్మ దిష్టాన్తమీయుషః.

ప్ర. అ. దిష్టాన్తమ్=మరణమును, ఈయుషః=పొందిన, నరదేవస్య=రాజుయొక్క, తత్ సద్మ = ఆ గృహము, సంత్రస్తసంభ్రాన్త పర్యుత్సుకజనాకులమ్=భయపడి కంగారుపడు చున్న ఆతురతతో కూడిన జనముచే ఆకులముగాను, సర్వతః = అంతటను, తుములాక్రన్దమ్ = వ్యాకులమైనఅరపులుకలదిగాను, పరితాపార్తబాన్ధవమ్ = సంతాపముచే ఆర్తులైన బంధువులు కలదిగాను, సద్యః=తత్క్షణమే, నిపతితానన్దమ్=తొలగిన ఆనందము కలదిగాను, దీనవిక్లబదర్శనమ్ = దీనమూ వ్యాకులమూ అయిన దర్శనము కలదిగాను, బభూవ = ఆయెను.

తా. దశరథుడు మరణించగనే ఆ గృహమునందు ఆనందము తొలగిపోయెను. పరిజను లందరును భయభ్రాంతులై ఏమి చేయుటకును తోచక ఉండిరి. నలుమూలలనుండి ఏడ్పులు వినబడుచుండెను. బంధువు లందరును దుఃఖముచే పీడితులైరి. ఎటు చూచినను దైన్యము, విషాదము కనబడుచుండెను.

మూ. అతీతమాజ్ఞాయ తు పార్థివర్షభం,
యశస్వినం సంపరివార్య పత్నయః.
భృశం రుదన్త్యః కరుణం సుదుఃఖితాః,
ప్రగృహ్య బాహూ వ్యలపన్ననాథవత్. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. పత్నయః=భార్యలు, యశస్వినమ్=యశఃశాలి యైన, పార్థివర్షభమ్ = ఆ రాజశ్రేష్ఠుని, అతీతమ్=మరణించినవానినిగా, ఆజ్ఞాయ=తెలిసికొని, సంపరివార్య=చుట్టుముట్టి, సుదుఃఖితాః=చాల దుఃఖితలై, కరుణమ్=దీనముగా, భృశమ్= మిక్కిలి, రుదన్త్యః =ఏడ్చుచున్నవారై, బాహూ = బాహువులను, ప్రగృహ్య=పట్టుకొని, అనాథవత్=అనాథలు వలె, వ్యలపన్ = విలపించిరి.

తా. యశఃశాలీ, రాజశ్రేష్ఠుడూ అయిన, దశరథుడు మరణించి నట్లు తెలియగానే ఆతని భార్యలు, ఆతనిని చుట్టుముట్టి, చాలా దుఃఖించుచు, జాలి కలుగునట్లు ఎక్కువగా ఏడ్చుచు ఒకరి చేతు లొకరు పట్టుకొని అనాథలు వలె విలపించిరి. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదియైదవ సర్గ సమాప్తము.

* * *

# షట్షష్టితమః సర్గః

[రాజుకొరకై కౌసల్య విలపించుచు కైకేయిని నిందించుట. మంత్రులు రాజు శవమును తైలపాత్రలో నుంచుట. రాణులు విలపించుట. నగరము శోభావిహీన మగుట, పురవాసుల శోకము.]

మూ. తమగ్నిమివ సంశాన్త మమ్బుహీనమివార్ణవమ్,
హతప్రభమివాదిత్యం స్వర్గస్థం ప్రేక్ష్య పార్థివమ్. 1
కౌసల్యా బాష్పపూర్ణాక్షీ వివిధం శోకకర్శితా,
ఉపగృహ్య శిరో రాజ్ఞః కైకేయీం ప్రత్యభాషత. 2

ప్ర. అ. సంశాన్తమ్=శాంతించిన, అగ్నిమివ=అగ్నిని వలె, అమ్బుహీనమ్=ఉదకము లేని, అర్ణవమివ=సముద్రమును వలె, హతప్రభమ్=కొట్టబడిన కాంతి గల, ఆదిత్యమివ=సూర్యుని వలె ఉన్న, స్వర్గస్థమ్=మరణించిన, తం పార్థివమ్=ఆ రాజును, ప్రేక్ష్య=చూచి, కౌసల్యా=కౌసల్య, బాష్పపూర్ణాక్షీ=కన్నీటితో, నిండిన నేత్రములు కలదై, వివిధమ్=అనేకవిధములుగా, శోకకర్శితా=దుఃఖముచే కృశించినదై, రాజ్ఞః=రాజుయొక్క, శిరః=శిరస్సును, ఉపగృహ్య=గ్రహించి, కైకేయీం ప్రతి=కైకేయిని గూర్చి, అభాషత=పలికెను.

తా. కౌసల్య శాంతించిన అగ్ని వలె, ఉదకము లేని సముద్రము వలె, తేజస్సు పోయిన సూర్యుడు వలె ఉన్న, మరణించిన ఆ రాజును చూచి, ఆతని శిరస్సును ఒడిలో నుంచుకొని, కన్నీళ్లు కారుచున్న నేత్రములతో, అనేక విధములైన శోకములచే కృశించినదై, కైకేయితో ఇట్లు పలికెను. 1, 2

మూ. సకామా భవ కైకేయి భుఙ్క్ష్వ రాజ్యమకణ్టకమ్,
త్యక్త్వా రాజానమేకాగ్రా నృశంసే దుష్టచారిణి. 3

ప్ర. అ. నృశంసే = ఓ క్రూరురాలా! దుష్టచారిణి = చెడ్డపనులు చేయుదానా! కైకేయి=కైకేయీ, సకామా = నిండిన కోరికలు కలదానవు, భవ = అగుము. రాజానమ్ = రాజును, త్యక్త్వా = విడచి, ఏకాగ్రా = ఒక్క రాజ్యముపైననే స్థిర మైన దృష్టి కలదానవై, అకణ్టకమ్=ఏ అడ్డంకులును లేని, రాజ్యమ్ = రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము.

తా. క్రూరురాలా! చెడ్డ పనులు చేయు కైకేయీ! నీ కోరికలు ఈడేరినవి. ఇంక రాజు లేడు గాన, నీవు ఎట్టి అడ్డంకులు లేని రాజ్యమును నిరంతరము అనుభవించవచ్చును. 3

మూ. విహాయ మాం గతో రామో భర్తా చ స్వర్గతో మమ,
విపథే సార్థహీనేవ నాహం జీవితు ముత్సహే. 4

ప్ర. అ. రామః = రాముడు, మామ్=నన్ను, విహాయ = విడచి, గతః = వెళ్ళిపోయినాడు. మమ=నాయొక్క, భర్తా చ = భర్త కూడ, స్వర్గతః = స్వర్గమునకు వెళ్ళినాడు. విపథే = దారికాని దారిలో, సార్థహీనేవ = కావలసినవారి సముదాయముతో శూన్యమైన దానను వలె, అహమ్=నేను, జీవితుమ్ = జీవించుటకు, న ఉత్సహే = అభిలషింపను.

తా. రాముడు నన్ను విడచి వెళ్ళిపోయినాడు. నా భర్త స్వర్గస్థు డైనాడు భయంకర మైన మార్గములో గుంపునుండి విడిపోయినదాని వలె అయినాను. ఇంక జీవించ వలె నను కోరిక లేదు. 4

మూ. భర్తారం తం పరిత్యజ్య కా స్త్రీ దైవతమాత్మనః,
ఇచ్ఛేజ్జీవితుమన్యత్ర కైకేయ్యాస్త్యక్తధర్మణః, 5

ప్ర. అ. త్యక్తధర్మణః=విడువబడిన ధర్మము గల, కైకేయ్యాః అన్యత్ర = కైకేయి తప్ప, కా స్త్రీ = ఏ స్త్రీ, ఆత్మనః = తనయొక్క, దైవతమ్ = దేవత యైన, తం భర్తారమ్ = ఆ భర్తను, పరిత్యజ్య=విడచి, జీవితుమ్ = జీవించుటకు, ఇచ్ఛేత్ = ఇచ్ఛించును?

తా. ధర్మమును కాల తన్నిన కైకేయి తప్ప మరి యే స్త్రీ యైన తనకు దేవత యైన భర్తను విడచి జీవించుటకు ఇచ్ఛగించునా? 5

మూ. న లుబ్ధో బుద్ధ్యతే దోషాన్ కింపాకమివ భక్షయన్,
కుబ్జానిమిత్తం కైకేయ్యా రాఘవాణాం కులం హతమ్.

ప్ర. అ. లుబ్ధః = దురాశ కలవాడు, కింపాకమ్ = కింపాకఫలమును, భక్షయన్నివ = భక్షించువాడు వలె, దోషాన్ = దోషములను, న బుద్ధ్యతే = తెలిసికొనడు. కుబ్జానిమిత్తమ్ = ఆ గూనుదాని మూలమున, కైకేయ్యా = కైకేయి చేత, రాఘవాణామ్ = రఘువంశ రాజుల, కులమ్ = కులము, హతమ్ = నశింప చేయబడినది.

తా. దురాశాపీడితుడు, కింపాకమును తినువాడు వలె, తాను చేయు పని లోని దోషమును గుర్తింపడు. గూనుదాని మూలమున కైకేయి రఘువంశమును నశింపచేసినది. 6

మూ. అనియోగే నియుక్తేన రాజ్ఞా రామం వివాసితమ్,
సభార్యం జనకః శ్రుత్వా పరితప్స్యత్యహం యథా. 7

ప్ర. అ. సభార్యమ్ = భార్యాసమేతుడైన, రామమ్ = రాముని, అనియోగే = చెడ్డపనియందు, నియుక్తేన = నియుక్తుడైన, రాజ్ఞా = రాజుచేత, వివాసితమ్ = అరణ్యమునకు పంపబడిన వానినిగా, శ్రుత్వా = విని, జనకః = జనకుడు, అహం యథా = నా వలెనే, పరితప్స్యతి = దుఃఖించగలడు.

తా. చెడ్డ పని చేయుటకై ప్రేరేపింపబడిన రాజు భార్యాసమేతుడైన రాముని అరణ్యమునకు పంపివేసినాడని విని, జనకుడు, నా వలెనే దుఃఖించును.

మూ. స మామనాథాం విధవాం నాద్య జానాతి ధార్మికః,
రామః కమలపత్రాక్షో జీవన్నాశమితో గతః. 8

ప్ర. అ. ధార్మికః = ధర్మాత్ముడూ, కమలపత్రాక్షః = తామరరేకుల వంటి నేత్రములు కలవాడూ, జీవన్ = జీవించి యున్నను, ఇతః = ఇక్కడి నుండి, నాశమ్ = నాశమును, గతః = పొందిన వాడూ అయిన, సః రామః = ఆ రాముడు, అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, అనాథామ్ = రక్షకుడు లేని దానిని గానూ, విధవామ్ = భర్త లేనిదానిని గానూ, న జానాతి = ఎరుగడు కదా!

తా. ధార్మికుడు, కమలపత్రముల వంటి నేత్రములు కలవాడూ, జీవించి ఉండగానే ఇక్కడ కనబడకుండ పోయినవాడూ అయిన ఆ రామునకు నేను భర్త చనిపోగా అనాథురాలనై ఉన్నట్లు తెలియదు కదా! 8

మూ. విదేహరాజస్య సుతా తథా సీతా తపస్వినీ,
దుఃఖస్యానుచితా దుఃఖం వనే పర్యుద్విజిష్యతి. 9

ప్ర. అ. తథా = అట్లే, తపస్వినీ=దీనురాలూ, దుఃఖస్య = దుఃఖమునకు, అనుచితా = తగనిదీ, విదేహరాజస్య=జనకుని, సుతా=కూమార్తెయూ అయిన, సీతా=సీత, వనే=వనమునందు, దుఃఖమ్=అతి దుఃఖముతో కూడినట్లుగా, పర్యుద్విజిష్యతి=భయముపొందగలదు.

తా. దుఃఖమునకు తగనిదీ, దీనురాలూ అయిన జనకరాజ దుహిత యైన సీత, వనములో చాల దుఃఖితురాలై భయపడును. 9

మూ. నదతాం భీమఘోషాణాం నిశాసు మృగపక్షిణామ్,
నిశమ్య నూనం సంత్రస్తా రాఘవం సంశ్రయిష్యతి. 10

ప్ర. అ. నిశాసు=రాత్రులందు, భీమఘోషాణామ్ = భయంకర మైన ధ్వనిగల, మృగపక్షిణామ్ = మృగములు, పక్షులు, నదతామ్=ధ్వనిచేయు చుండగా, నిశమ్య=విని, సంత్రస్తా = భయపడిన దై, నూనమ్ = నిశ్చయముగా, రాఘవమ్=రాముని, సంశ్రయిష్యతి = ఆశ్రయించగలదు.

తా. ఆమె రాత్రులందు అరుచు భయంకరధ్వని గల మృగ పక్ష్యాదుల ధ్వనులను విని భయపడిన దై, తప్పక రాముని చెంత చేరుచుండును. 10

మూ. వృద్ధశ్చైవాల్ప పుత్రశ్చ వైదేహీమనుచిన్తయన్,
సోఽపి శోకసమావిష్టో నను త్యక్ష్యతి జీవితమ్. 11

ప్ర. అ. వృద్ధశ్చైవ=వృద్ధుడును, అల్పపుత్రశ్చ = అల్పమైన పుత్రులు కలవాడును అయిన, సోఽపి=ఆ జనకుడు కూడ, శోకసమావిష్టః=శోకముతో కూడినవాడై, వైదేహీమ్ = సీతను గూర్చి, అనుచిన్తయన్ = ఆలోచించుచు, జీవితమ్ = జీవితమును, త్యక్ష్యతి నను=విడచును కదా!

తా. వృద్ధుడూ, పుత్రులు లేనివాడూ అయిన, జనకుడు కూడ సీతను గూర్చియే చింతించుచు, దుఃఖాక్రాంతుడై ప్రాణములను విడచును. 11

మూ. సాహమద్యైవ దిష్టాన్తం గమిష్యామి పతివ్రతా,
ఇదం శరీరమాలిఙ్గ్య ప్రవేక్ష్యామి హుతాశనమ్. 12

ప్ర. అ. పతివ్రతా=పతివ్రత నైన, సా అహమ్=అట్టి నేను, అద్యైవ=ఇప్పుడే, దిష్టాన్తమ్=మరణమును, గమిష్యామి=పొందగలను. ఇదమ్=ఈ, శరీరమ్ = ఈ (నా భర్త) శరీరమును, ఆలిఙ్గ్య=కౌగలించుకొని, హుతాశనమ్=అగ్నిని, ప్రవేక్ష్యామి=ప్రవేశించగలను.

తా. పతివ్రత నైన నేను నా భర్త శరీరమును ఆలింగనము చేసికొని అగ్నిలో ప్రవేశించి ఇప్పుడే ప్రాణములను విడచెదను. 12

మూ. తాం తతః సంపరిష్వజ్య విలపన్తీం తపస్వినీమ్,
వ్యపనిన్యుః సుదుఃఖార్తాం కౌసల్యాం వ్యావహారికాః 13

ప్ర. అ. వ్యావహారికాః=వ్యవహారమునందు నియుక్త లైన స్త్రీలు, సంపరిష్వజ్య=(దశరథుని) కౌగలించుకొని, విలపన్తీమ్=విలపించుచున్న, తపస్వినీమ్ = దీనురా లైన, సుదుఃఖార్తామ్=చాల దుఃఖముచే పీడింపబడిన, తాం కౌసల్యామ్=ఆ కౌసల్యను, తతః=అక్కడినుండి, వ్యపనిన్యుః=తొలగించిరి.

తా. దీనురా లైన కౌసల్య శోకార్తురా లై, ధశథునిశరీరమును కౌగలించుకుని ఈ విధముగ ఏడ్చుచుండగా, అంతఃపురకార్యములందు నియుక్త లైన స్త్రీలు, ఆమెను అక్కడినుండి దూరముగా తీసికొనిపోయిరి. 13

మూ. తైలద్రోణ్యామథామాత్యాః సంవేశ్య జగతీపతిమ్,
రాజ్ఞః సర్వాణ్యథాదిష్టాశ్చక్రుః కర్మాణ్యనన్తరమ్. 14

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ఆదిష్టాః = ఆజ్ఞాపింపబడిన, అమాత్యాః = అమాత్యులు, జగతీపతిమ్ = రాజును. తైలద్రోణ్యామ్ = నూనె తొట్టియందు, సంవేశ్య=పరుండపెట్టి, అనన్తరమ్=పిమ్మట చేయవలసిన, కర్మాణి=కర్మలను, సర్వాణి = అన్నింటిని, చక్రుః = చేసిరి.

తా. అమాత్యులు, వసిష్ఠాదుల ఆజ్ఞ ప్రకారము, రాజు శరీరమును తైల ద్రోణిలో ఉంచి, తరువాత చేయవలసిన పను లన్నియు చేసిరి. 14

మూ. న తు సంకలనం రాజ్ఞో వినా పుత్రేణ మన్త్రిణః,
సర్వజ్ఞాః కర్తు మీషుస్తే తతో రక్షన్తి భూమిపమ్. 15

ప్ర. అ. సర్వజ్ఞాః = అన్ని విషయములు తెలిసిన, మన్త్రిణః = మంత్రులు, వినా పుత్రేణ = పుత్రుడు లేకుండగా, రాజ్ఞః = రాజుయొక్క, సంకలనమ్ = దహనసంస్కారమును, కర్తుమ్ = చేయుటకు, న ఈషుః = ఇచ్ఛయించలేదు. తతః = ఆ కారణమువలన, భూమిపమ్ = రాజును, రక్షన్తి = రక్షించిరి.

తా. అన్ని విషయములు తెలిసిన మంత్రులు, కుమారు లెవ్వరును దగ్గర లేనపుడు రాజు శరీరమునకు దహనసంస్కారము చేయుటకు ఇచ్ఛయించక ఆ దేహమును రక్షించిరి. 15

మూ. తైలద్రోణ్యాం తు సచివైః శాయితం తం నరాధిపమ్,
హా మృతోఽయమితి జ్ఞాత్వా స్త్రియస్తాః పర్యదేవయన్.

ప్ర. అ. సచివైః = మంత్రులచేత, తైలద్రోణ్యామ్ = తైలద్రోణియందు, శాయితమ్ = పరుండబెట్టబడిన, తం నరాధిపమ్ = ఆ రాజును, జ్ఞాత్వా = తెలిసికొని (చూచి), హా = అయ్యో! అయమ్ = ఇతడు, మృతః = మరణించినాడు, ఇతి = అని, తాః = ఆ, స్త్రియః = స్త్రీలు, పర్యదేవయన్ = ఏడ్చిరి.

తా. ఆ రాజు శరీరమును మంత్రులు తైలద్రోణిలో ఉంచగానే "అయ్యో! ఇతడు మరణించినాడు" అని స్త్రీలు ఏడ్చిరి. 16

మూ. బాహూనుద్యమ్య కృపణా నేత్రప్రస్రవణైర్ముఖైః,
రుదన్త్యః శోకసంతప్తాః కృపణం పర్యదేవయన్. 17

ప్ర. అ. నేత్రప్రస్రవణైః = నేత్రములలో కన్నీళ్ళు స్రవించుచున్న, ముఖైః = ముఖములతో, కృపణాః = దీనలై, బాహూన్ = బాహువులను, ఉద్యమ్య = ఎత్తి, రుదన్త్యః = ఏడ్చుచు, శోకసన్తప్తాః = శోకముచే పీడింపబడినవారై, కృపణమ్ = దీనముగా, పర్యదేవయన్ = ఈ విధముగవిలపించిరి.

తా. కన్నీళ్లు కారుచున్న నేత్రములు గల ముఖములతో, దీనలై బాహువులను పైకెత్తి ఏడ్చుచు, శోకపీడితలై, దీనముగా విలపించిరి. 17

మూ. హా మహారాజ రామేణ సతతం ప్రియవాదినా,
విహీనాః సత్యసన్ధేన కిమర్థం విజహాసి నః. 18

ప్ర. అ. హా మహారాజ = అయ్యో! మహారాజా! సతతమ్=ఎల్లప్పుడును, ప్రియవాదినా = ప్రియమునే పలుకు, సత్యసన్ధేన = సత్యమైన ప్రతిజ్ఞ గల; రామేణ=రామునితో, విహీనాః = శూన్యులమైన, నః = మమ్ములను, కిమర్థమ్ = ఎందువలన, విజహాసి = విడిచిపెట్టుచున్నావు?

తా. అయ్యో! మహారాజా! ప్రియముగా మాటలాడువాడూ, సత్యసంధుడూ అయిన రామునకు దూరమైన మమ్ములను నీవు కూడ ఏల విడచిపోయినావు?

మూ. కైకేయ్యా దుష్టభావాయా రాఘవేణ వియోజితాః,
కథం పతిఘ్న్యా వత్స్యామః సమీపే విధవా వయమ్. 19

ప్ర. అ. రాఘవేణ = రామునితో, వియోజితాః = వియోగము పొందించబడిన, వయమ్ = మేము, విధవాః = భర్త లేనివారమై, దుష్టభావాయాః = దుష్టస్వభావము కలదీ, పతిఘ్న్యాః=భర్తను చంపినదీ అయిన, కైకేయ్యాః=కైకేయి యొక్క, సమీపే=సమీపమునందు, కథమ్=ఎట్లు, వత్స్యామః=నివసింతుము?

తా. దుష్టమైన భావము గల కైకేయి మొదటనే మమ్ములను రామునకు దూరము చేసినది. ఇపుడు భర్త కూడా లేని మేము, భర్తను చంపిన ఆమె వద్ద ఎట్లుండగలము? 19

మూ. స హి నాథః సదాస్మాకం తవ చ ప్రభురాత్మవాన్,
వనం రామో గతః శ్రీమాన్ విహాయ నృపతిశ్రియమ్.

ప్ర. అ. అస్మాకమ్ = మాకును, తవ చ = నీకును, సదా = ఎల్లప్పుడూ, నాథః = రక్షకుడూ, ప్రభుః=సమర్థుడూ, ఆత్మవాన్=బుద్ధిమంతుడూ, శ్రీమాన్ = శ్రీమంతుడూ అయిన, సః = ఆ, రామః = రాముడు, నృపతిశ్రియమ్ = రాజ్యలక్ష్మిని, విహాయ = విడచి, వనమ్ = వనమును గూర్చి, గతః హి= వెళ్ళిపోయినాడు కదా!

తా. సమర్థుడూ, సద్బుద్ధిశాలీ, శ్రీమంతుడూ, సర్వదా నీకును మాకును సంరక్షకుడుగా ఉన్నవాడూ అయిన ఆ రాముడు రాజ్యలక్ష్మిని విడచి అరణ్యమునకు వెళ్లిపోయినాడు కదా! 20

మూ. త్వయా తేన చ వీరేణ వినా వ్యసనమోహితాః,
కథం వయం నివత్స్యామః కైకేయ్యా చ విదూషితాః.

ప్ర. అ. త్వయా వినా = నీవు లేకను, తేన వీరేణ వినా = వీరుడైన ఆ రాముడు లేకను, వ్యసనమోహితాః = దుఃఖముచేత మోహము నందజేయబడిన, వయమ్ = మేము, కైకేయ్యా = కైకేయిచేత, విదూషితాః చ = దూషింపబడుచు, కథమ్ = ఎట్లు, నివత్స్యామః = నివసింపగలము?

తా. నీవు, ఆ వీరుడైన రాముడూ లేకపోవుటచే దుఃఖముతో బాధపడుచున్న మేము కైకేయి దూషణలను కూడ సహించుచు ఎట్లు నివసింపగలము?

మూ. యయా తు రాజా రామశ్చ లక్ష్మణశ్చ మహాబలః,
సీతయా సహ సంత్యక్తాః సా కమన్యం న హాస్యతి. 22

ప్ర. అ. యయా = ఏ కైకేయిచే, రాజా = రాజు, రామశ్చ = రాముడు, మహాబలః = గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, సీతయా సహ = సీతతో కూడ, సంత్యక్తాః = విడువబడినారో, సా = అట్టి కైకేయి, అన్యమ్ = ఇతరుని, కమ్ = ఎవనిని, న హాస్యతి = విడువదు.

తా. రాజును, రాముని, మహాబలుడైన లక్ష్మణుని, సీతను కూడ వదలివేయ గల్గిన కైకేయి ఇతరుల నెవ్వరిని విడిచివేయదు? 22

మూ. తా బాష్పేణ చ సంవీతాః శోకేన విపులేన చ,
వ్యవేష్టన్త నిరానన్దా రాఘవస్య వరస్త్రియః. 23

ప్ర. అ. రాఘవస్య = దశరథునియొక్క, తాః వరస్త్రియః = ఆ శ్రేష్ఠలైన స్త్రీలు, బాష్పేణ = బాష్పముతోను, విపులేన = అధికమైన, శోకేన చ = శోకముతోను, సంవీతాః = కూడినవారై, నిరానన్దాః = ఆనందము లేనివారై, వ్యవేష్టన్త = నేలపై దొర్లిరి.

తా. దశరథుని భార్యలందరు కన్నీళ్లు కార్చుచు, అధిక మైన శోకముతో ఆనందము పూర్తిగ నశింపగా, నేలపై దొర్లిరి. 23

మూ. నిశా చన్ద్రవిహీనేవ స్త్రీవ భర్తృవివర్జితా,
పురీ నారాజతాయోధ్యా హీనా రాజ్ఞా మహాత్మనా. 24

ప్ర. అ. మహాత్మనా=మహాత్ము డైన, రాజ్ఞా=రామునితో, హీనా=శూన్య మైన, అయోధ్యాపురీ=అయోధ్యానగరము, చన్ద్రవిహీనా=చంద్రుడు లేని, నిశేవ = రాత్రి వలె, భర్తృవివర్జితా = భర్త లేని. స్త్రీవ = స్త్రీ వలె, నారాజత = ప్రకాశించలేదు.

తా. మహాత్ము డైన ఆ దశరథమహారాజు లేని ఆ ఆయోధ్య, చంద్రుడు లేని రాత్రి వలె భర్త లేని స్త్రీ వలె శోభావిహీన మయ్యెను. 24

మూ. బాష్పపర్యాకులజనా హాహాభూతకులాఙ్గనా,
శూన్యచత్వరవేశ్మాన్తా న బభ్రాజ యథాపురమ్. 25

ప్ర. అ. బాష్పపర్యాకులజనా = కన్నీళ్లతో వ్యాకుల మైన జనులుకల దై, హాహాభూత కులాఙ్గనా = హాహాకారము చేయుచున్న కుల స్త్రీలు కలదై, శూన్య చత్వరవేశ్మాన్తా = శూన్యము లైన ముంగిళ్లు, గృహమధ్యములూ కలదై, యథా పురమ్ = పూర్వము వలె, న బభ్రాజ = ప్రకాశించలేదు.

తా. ఆ నగరములోని జనులందరును కన్నీళ్లతో కలత చెంది ఉండిరి. కులాంగనలు హాహాకారము చేయుచుండిరి. ఇళ్ళముందు వాకిళ్లు, గృహమధ్య ప్రదేశములును, శూన్యము లైనవి, ఈ విధముగ వెనుకటి శోభను కోల్పోయెను.

మూ. గతే తు శోకాత్త్రిదివం నరాధిపే
మహీతలస్థాసు నృపాఙ్గనాసు చ.
నివృత్తచారః సహసా గతో రవిః,
ప్రవృత్తచారా రాజనీ హ్యుపస్థితా. 26

ప్ర. అ. నరాధిపే = రాజు, శోకాత్ = దుఃఖమువలన, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, గతే తు = వెళ్ళినవా డగుచుండగా, నృపాఙ్గనాసు = రాజ-

భార్యలు, మహీతలస్థాసు చ = నేలపై పడియుండగా, రవిః = సూర్యుడు, సహసా = వెంటనే, నివృత్తచారః = నివర్తించిన సంచారము గలవాడై, గతః = వెళ్ళిపోయెను. ప్రవృత్తచారా = ప్రవర్తించిన రాత్రించర ప్రాణులు గల, రజనీ = రాత్రి, ఉపస్థితా హి = సమీపించినది.

తా. దశరథమహారాజు పుత్రశోకముచే స్వర్గస్థు డయ్యెను. అతని భార్యలు దుఃఖముచే నేలపై పడియుండిరి. ఆ సమయమునందు సూర్యుడు తన గమనమును ఆపి అస్తంగతు డయ్యెను. రాత్రి సంచరించు ప్రాణుల సంచారమునకు అనువుగ రాత్రి వచ్చెను. 26

మూ. ఋతే తు పుత్రాద్దహనం మహీపతే
ర్న రోచయన్తే సుహృదః సమాగతాః,
ఇతీవ తస్మిన్ శయనే న్యవేశయన్,
విచిన్త్య రాజానమచిన్త్య దర్శనమ్. 27

ప్ర. అ. సమాగతాః = వచ్చిన, సుహృదః = మిత్రులు, పుత్రాత్ ఋతే = పుత్రుడు లేకుండగ, మహీపతేః = రాజుయొక్క, దహనమ్ = దహనమును గూర్చి, న రోచయన్తే = ఇష్టపడరు. ఇతీవ = ఇట్లు, విచిన్త్య = ఆలోచించి, అచిన్త్య దర్శనమ్ = ఊహింపరాని దర్శనము గల, రాజానమ్ = రాజును, తస్మిన్ శయనే = ఆ శయనముపై, న్యవేశయన్ = ఉంచిరి.

తా. పుత్రులు లేకుండ దశరథునకు సంస్కారము చేయుటకు, వచ్చిన స్నేహితులు ఇష్టపడరు అని ఆలోచించి, ఊహింపరాని దర్శనము గల ఆ దశరథుని శరీరమును ఆ శయనము పైననే (తైల ద్రోణిలో) ఉంచిరి. 27

మూ. గతప్రభా ద్యౌరివ భాస్కరం వినా
వ్యపేతనక్షత్రగణేవ శర్వరీ.
పురీ బభాసే రహితా మహాత్మనా
న చాస్రకణ్ఠాకులమార్గచత్వరా. 28

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన దశరథునితో, రహితా = శూన్యమైనదీ, అస్రకణ్ఠాకులమార్గచత్వరా = కంఠములలో కన్నీళ్ళు నిలుపుకొనిన జనులతో వ్యాకులమైన మార్గములూ, ముంగిళ్ళూ కలదీ అయిన, పురీ = అయోధ్య,

భాస్కరం వినా = సూర్యుడు లేకుండా ఉన్న. ద్యౌరివ = ఆకాశము వలె, వ్యపేతనక్షత్రగణా=తొలగిన నక్షత్రసముదాయము గల, శర్వరీవ=రాత్రి వలె, గతప్రభా = తొలగిన కాంతి గలదై, న బభాసే = ప్రకాశించలేదు.

తా. దశరథుడు మరణించుటచే, మార్గములు, చత్వరములు (ముంగిళ్ళు లేదా చతుష్పథములు) బాష్పమును కంఠమునందు నిలుపుకొని దుఃఖించుచున్న జనులతో వ్యాకులములై ఉండెను. అట్టి అయోధ్య సూర్యుడు లేని ఆకాశము వలె, నక్షత్రములు లేని రాత్రి వలె, కాంతి విహీనమై ప్రకాశించకుండెను. 28

మూ. నరాశ్చ నార్యశ్చ సమేత్య సంఘశో
విగర్హమాణా భరతస్య మాతరమ్.
తదా నగర్యాం నరదేవసంక్షయే
బభూవురార్తా న చ శర్మ లేభిరే. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షట్షష్టితమః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, నరదేవసంక్షయే = రాజు మరణించగా, నగర్యామ్=నగరమునందు, నరాశ్చ=పురుషులును, నార్యశ్చ=స్త్రీలును, సంఘశః = గుంపులు గుంపులుగా, సమేత్య = కలిసి, భరతస్య = భరతుని యొక్క, మాతరమ్ = తల్లిని, విగర్హమాణాః = నిందించుచు, ఆర్తాః = దుఃఖితులుగా, బభూవుః = అయిరి. శర్మ = సుఖమును, న చ లేభిరే = పొందలేకపోయిరి.

తా. దశరథుడు మరణించిన పిమ్మట నగరములోని పురుషులును, స్త్రీలును, గుంపులుగుంపులుగా చేరి, భరతుని తల్లిని నిందించుచు చాలా దుఃఖించిరి. ఏమాత్రము సుఖమును పొందలేదు. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదియారవ సర్గ సమాప్తము.

## సప్తషష్టితమః సర్గః

[మార్కండేయుడు మొదలైన మునులు, మంత్రులు రాజు లేనిచో దేశమునకు కలుగు దురవస్థను వర్ణించి, ఎవ్వారినైన రాజును చేయుమని వసిష్ఠుని ప్రార్థించుట.]

మూ. ఆక్రన్దితనిరానన్దా సాస్రకంఠజనావిలా,
అయోధ్యాయామతితతా సా వ్యతీయాయ శర్వరీ. 1

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యయందు, ఆక్రన్దితనిరానన్దా = అరపులతో ఆనందహీన మై పోయినదీ, సాస్రకంఠజనావిలా = కన్నీళ్ళు కంఠములందు గల జనులతో వ్యాకులమూ, అతితతా = చాల దీర్ఘమూ అయిన, సా శర్వరీ = ఆ రాత్రి, వ్యతీయాయ = గడచెను.

తా. అయోధ్యలో ఆ రాత్రి అతిదీర్ఘమై, అరపులతో ఆనందవిహీనమై, కన్నీళ్ళు కంఠములం దున్న జనులతో వ్యాకుల మై ఎట్లో గడచెను. 1

మూ. వ్యతీతాయాం తు శర్వర్యామాదిత్యస్యోదయే తతః,
సమేత్య రాజకర్తారః సభామీయుర్ద్విజాతయః. 2

ప్ర. అ. తతః = పిమ్మట, శర్వర్యామ్ = రాత్రి, వ్యతీతాయాంతు = గడచిన దగుచుండగా, ఆదిత్యస్య = సూర్యునియొక్క, ఉదయే = ఉదయము అయిన పిమ్మట, రాజకర్తారః = రాజును చేయు, ద్విజాతయః = బ్రాహ్మణులు, సమేత్య = కలిసి, సభామ్ = సభను, ఈయుః = పొందిరి.

తా. రాత్రి గడచి సూర్యోదయ మైన పిమ్మట రాజును ఏర్పరచు బ్రాహ్మణు లందరును కలిసి సభకు వచ్చిరి. 2

మూ. మార్కణ్డేయోఽథ మౌద్గల్యో వామదేవోఽథ కాశ్యపః,
కాత్యాయనో గౌతమశ్చ జాబాలిశ్చ మహాయశాః. 3

ఏతే ద్విజాః సహామాత్యైః పృథగ్వాచముదీరయన్,
వసిష్ఠమేవాభిముఖాః శ్రేష్ఠం రాజపురోహితమ్. 4

ప్ర. అ. మార్కండేయః=మార్కండేయుడు, అథ=మరియు, మౌద్గల్యః=మౌద్గల్యుడు, అథ = మరియు, కాశ్యపః = కాశ్యపుడు, కాత్యాయనః = కాత్యాయనుడు, గౌతమశ్చ = గౌతముడు, మహాయశాః = గొప్ప కీర్తి గల, జాబాలిశ్చ=జాబాలి, ఏతే = ఈ, ద్విజాః=ద్విజులు, అమాత్యైః సహ=అమాత్యులతో కూడినవారై, శ్రేష్ఠమ్=శ్రేష్ఠుడైన, రాజపురోహితమ్ = రాజపురోహితుడైన, వసిష్ఠమేవ=వసిష్ఠుని గూర్చియే. అభిముఖాః = అభిముఖులై, పృథక్ = వేరువేరుగా, వాచమ్=వాక్కును, ఉదీరయన్ = పలికిరి.

తా. మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు. గొప్ప కీర్తి గల జాబాలి అను బ్రాహ్మణుడును, ఇతర మంత్రులును, రాజపురోహితుడైన వసిష్ఠునితో, వేరువేరుగా ఇట్లు పలికిరి. 3,4

మూ. అతీతా శర్వరీ దుఃఖం యా నో వర్షశతోపమా,
అస్మిన్ పఞ్చత్వమాపన్నే పుత్రశోకేన పార్థివే. 5

ప్ర. అ. అస్మిన్=ఈ, పార్థివే=రాజు, పుత్రశోకేన=పుత్రశోకముచేత, పఞ్చత్వమ్=మరణమును, ఆపన్నే = పొందినవాడగుచుండగా, యా=ఏ రాత్రి, నః=మనకు, వర్షశతోపమా=నూరు సంవత్సరములతో సమానమైనదో, శర్వరీ=అట్టి రాత్రి, దుఃఖమ్=అతికష్టముగా, అతీతా=గడచినది.

తా. పుత్రశోకముచే దశరథమహారాజు మరణించిన పిమ్మట వచ్చి, మనకు నూరు సంవత్సరముల వలె తోచిన రాత్రి అతికష్టముమీద గడచినది. 5

మూ. స్వర్గతశ్చ మహారాజో రామశ్చారణ్యమాశ్రితః,
లక్ష్మణశ్చాపి తేజస్వీ రామేణైవ గతః సహ. 6

ప్ర.అ. మహారాజః=మహారాజు, స్వర్గతశ్చ=స్వర్గస్థుడైనాడు. రామశ్చ=రాముడు కూడ, అరణ్యమ్=అరణ్యమును, ఆశ్రితః=ఆశ్రయించినాడు. తేజస్వీ=తేజఃశాలియైన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, రామేణైవ సహ=రామునితోడనే, గతః=వెళ్ళినాడు.

తా. మహారాజు మరణించినాడు. రాముడా అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. తేజఃశాలి యైన లక్ష్మణుడు కూడ రామునితో కలిసి వెళ్ళిపోయినాడు. 6

మూ. ఉభౌ భరతశత్రుఘ్నౌ కేకయేషు పరంతపౌ,
పురే రాజగృహే రమ్యే మాతామహనివేశనే. 7

ప్ర. అ. పరంతపౌ = శత్రువినాశకులైన, భరతశత్రుఘ్నౌ = భరత శత్రుఘ్నులు, ఉభౌ = ఇరువురును, కేకయేషు = కేకయదేశమునందు, రాజగృహే=రాజగృహమను, పురే=పట్టణమునందు, రమ్యే=సుందరమైన, మాతా మహనివేశనే=మాతామహునిఇంటిలో ఉన్నారు.

తా. మహావీరులైన భరతశత్రుఘ్నులిద్దరూ, కేకయదేశములో రాజగృహ నగరములోని, మాతామహుని ఇంట ఉన్నారు.

వి. ఇక్కడ "పురే రాజగృహే" అనుదానికి "రాజగృహ మను పురమునందు" అని అర్థము. మధ్యఆసియా ప్రాంతంలో ఉన్నదని చెప్పబడు కేకయ దేశమునకు రాజధాని 'రాజగృహము' అగుటకు వీలున్నదా అని పరిశీలించవలసి ఉన్నది, లేదా అ దేశపు ముఖ్యపట్టణమునకు కూడ ఈ పేరు అని చెప్పవలెను.

మూ. ఇక్ష్వాకుణామిహాద్యైవ కశ్చిద్రాజా విధీయతామ్,
అరాజకం హినో రాష్ట్రం వినాశం సముపాప్నుయాత్. 8

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశీయులలో, కశ్చిత్ = ఎవ్వడైన, ఇహ = ఇక్కడ, అద్యైవ = ఇప్పుడే, రాజా = రాజుగా, విధీయతామ్ = చేయబడుగాక. అరాజకమ్ = రాజులేని, నః = మనయొక్క, రాష్ట్రమ్ = రాష్ట్రము, వినాశమ్ = నాశమును, సమవాప్నుయాత్ = పొందును.

తా. అందుచేత ఇక్ష్వాకు వంశమునకు చెందిన ఎవనినైనను, ఇక్కడ, ఇప్పుడే రాజుగా చేయవలెను. రాజు లేకున్నచో మన రాష్ట్రము నశించి పోవచ్చును. 8

మూ. నారాజకే జనపదే విద్యున్మాలీ మహాస్వనః,
అభివర్షతి పర్జన్యో మహీం దివ్యేన వారిణా. 9

ప్ర. అ. అరాజకే=రాజు లేని, జనపదే = దేశమునందు, విద్యున్మాలీ = విద్యుత్తుల పంక్తులతో కూడిన, మహాస్వనః = గొప్ప ధ్వని కల, పర్జన్యః = మేఘము, మహీమ్ = భూమిని, దివ్యేన = ఆకాశసంబంధి యైన, వారిణా = ఉదకముతో. నాభివర్షతి = వర్షించదు. (తడపదు)

తా. రాజు లేని దేశములో మెరపులు, మెరయుచు ఉరుముచున్న మేఘములు భూమిపై వర్షములు కురియవు. 9

మూ. నారాజకే జనపదే బీజముష్టిః ప్రకీర్యతే,
నారాజకే పితుః పుత్రో భార్యా వా వర్తతే వశే. 10

ప్ర. అ. అరాజకే = రాజులేని, జనపదే = దేశమునందు, బీజముష్టిః = విత్తనముల పిడికిలి, న ప్రకీర్యతే = చల్లబడదు. అరాజకే = రాజులేని దేశమునందు, పుత్రః = పుత్రుడు గాని, భార్యా వా = భార్య గాని, పితుః = తండ్రి యొక్క (ఇంటి యజమాని యొక్క) వశే = వశమునందు, న వర్తతే = ఉండదు.

తా. రాజు లేని దేశముతో, పిడికిళ్లతో విత్తనములు చల్లుట జరుగదు. (వ్యవసాయము సక్రమముగా నడవదు). పుత్రుడు కాని, భార్యగాని ఇంటి యజమాని మాట వినరు. 10

మూ. అరాజకే ధనం నాస్తి నాస్తి భార్యాప్యరాజకే,
ఇదమత్యాహితం చాన్యత్కుతః సత్యమరాజకే. 11

ప్ర. అ. అరాజకే=రాజు లేని దేశమునందు, ధనమ్ = ధనము, నాస్తి లేదు. అరాజకే=రాజు లేని దేశమునందు, భార్యాపి=భార్య కూడ, నాస్తి=లేదు. అత్యాహితమ్ = అత్యంతము అపాయ హేతు వైన, అన్యత్ = మరి యొకటి, ఇదం చ = ఇది కూడ ఉన్నది; అరాజకే = రాజులేని రాజ్యమునందు, సత్యమ్ = సత్యము, కుతః = ఎట్లు ఉండును?

తా. రాజు లేని రాజ్యమునందు ధనము తక్కదు. రాజు లేని రాజ్యములో భార్య కూడ తక్కదు. చాల ప్రమాదకర మైన విషయమేమనగా రాజు లేని దేశములో సత్యానికి తావు ఉండదు. 11

మూ. నారాజకే జనపదే కారయన్తి సభాం నరాః,
ఉద్యానాని చ రమ్యాణి హృష్టాః పుణ్యగృహాణి చ. 12

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, నరాః = మనుష్యులు, హృష్టాః = సంతోషించినవారై, సభామ్ = సభను, రమ్యాణి = అందమైన, ఉద్యానాని = ఉద్యానము లను, పుణ్యగృహాణి = పవిత్రము లైన గృహములను (దేవాలయాదులను), న కారయన్తి = చేయించరు.

తా. రాజు లేని దేశమునందలి ప్రజలు, సంతోషముతో సభలు నిర్వహింపరు. అందమైన ఉద్యానములను, దేవాలయాదులను నిర్మింపరు. 12

మూ. నారాజకే జనపదే యజ్ఞశీలా ద్విజాతయః,
సత్రాణ్యన్వాసతే దాన్తా బ్రాహ్మణాః సంశితవ్రతాః. 13

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, యజ్ఞశీలాః = యజ్ఞము లాచరించు స్వభావము కలవారూ, దాన్తాః = ఇంద్రియనిగ్రహవంతులూ, బ్రాహ్మణాః = వేదాధ్యయన సంపన్నులూ, సంశితవ్రతాః = తీవ్ర మైన వ్రతములు కలవారూ అయిన, ద్విజాతయః = ద్విజులు, సత్రాణి = యజ్ఞములను, న అన్వాసతే = ఆచరింపరు.

తా. రాజు లేని రాజ్యములో, యజ్ఞము చేయు స్వభావము కలవారూ, ఇంద్రియనిగ్రహవంతులూ, వేదాధ్యయన సంపన్నులూ, తీవ్ర మైన వ్రతములు అవలంబించు వారూ, అయిన ద్విజులు యజ్ఞములు చేయరు. 13

మూ. నారాజకే జనపదే మహాయజ్ఞేషు యజ్వనః,
బ్రాహ్మణా వసుసంపన్నా విసృజన్త్యాప్తదక్షిణాః. 14

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, మహాయజ్ఞేషు = గొప్ప యజ్ఞములందు, యజ్వనః = యాగములు చేసిన, వసుసంపన్నాః = ధనవంతు లైన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, ఆప్తదక్షిణాః = యుక్త మైన దక్షిణలను, న విసృజన్తి = ఇవ్వరు.

తా. రాజు లేని రాజ్యంలో ధనవంతు లైన బ్రాహ్మణులు యాగములు చేసి, ఆ మహాయజ్ఞములందు తగిన దక్షిణలను ఇవ్వరు. 14

మూ. నారాజకే జనపదే ప్రభూతనటనర్తకాః,
ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధన్తే రాష్ట్రవర్ధనాః. 15

ప్ర. అ. అరాజకే=రాజు లేని, జనపదే = దేశమునందు, ప్రభూతనట నర్తకాః=అధికులైన నటులు (అభినయనము చేసే వారు) నర్తకులు (నృత్యము చేసే వారు) గల, రాష్ట్రవర్ధనాః = రాష్ట్రమునకు అభివృద్ధిని కలిగించు, ఉత్సవాశ్చ = ఉత్సవములును, సమాజాశ్చ=సమాజము (జనుల సమావేశము)లును, న వర్ధన్తే = వృద్ధి పొందవు.

తా. రాజు లేని దేశములో ఎందరో నటులూ, నర్తకులూ పాల్గొను, రాష్ట్రాభివృద్ధి కారకములైన ఉత్సవములూ, సమాజములూ వృద్ధి పొందవు.

మూ. నారాజకే జనపదే సిద్ధార్థా వ్యవహారిణః,
కథాభిరనురజ్యన్తే కథాశీలాః కథాప్రియైః. 16

ప్ర. అ. అరాజకే = రాజులేని, జనపదే = దేశమునందు, వ్యవహారిణః = న్యాయ స్థానాదులలో దాయవిభాగాది వ్యవహారము కలవారు, సిద్ధార్థాః = సిద్ధమైన ప్రయోజనము కలవారు, న = కాజాలరు. కథాశీలాః = కథలు చెప్పుకొను స్వభావము కలవారు, కథాప్రియైః = కథలు ప్రియముగా గలవారితో కలిసి, కథాభిః = కథలతో, న అనురజ్యన్తే = ఆనందించరు.

తా. రాజు లేని రాజ్యములో, దాయభాగాది వ్యవహారములకై న్యాయ స్థానాదులకు వెళ్ళినవారి పనులు న్యాయసమ్మతముగా నెరవేరవు. కథలు చెప్పు అలవాటు కలవారు కథాప్రియులతో (కథలంటే చాలా ఇష్టపడు వారితో) కలిసి కథలు చెప్పుకొనుచు, ఆనందింప జాలరు. 16

మూ. నారాజకే జనపదే ఉద్యానాని సమాగతాః,
సాయాహ్నే క్రీడితుం యాన్తి కుమార్యో హేమభూషితాః.

ప్ర. అ. అరాజకే=రాజు లేని, జనపదే=దేశమునందు, హేమభూషితాః = బంగారముతో అలంకరించ బడిన, కుమార్యః=యౌవన ప్రారంభమునందున్న స్త్రీలు, సమాగతాః = కలిసిన వారై, సాయాహ్నే = సాయంకాలమునందు, క్రీడితుమ్ = ఆడుకొనుటకు, ఉద్యానాని = ఉద్యానములను గూర్చి, న యాన్తి = వెళ్లరు.

తా. రాజు లేని రాజ్యములో కన్యకలు బంగారు అలంకారములు ధరించి ఒండొరులతో కలిసి, క్రీడించుటకై సాయంకాలమున ఉద్యానమునకు వెళ్ళరు.

మూ. నారాజకే జనపదే వాహనైః శీఘ్రగామిభిః,
నరా నిర్యాన్త్యరణ్యాని నారీభిః సహ కామినః. 18

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, కామినః = కాముకులైన, నరాః = నరులు, నారీభిః = స్త్రీలతో కలిసి, శీఘ్రగామిభిః = శీఘ్రముగా నడచు, వాహనైః = వాహనములచే, అరణ్యాని = అరణ్యములను గూర్చి, న నిర్యాన్తి = బయలుదేరి వెళ్లరు.

తా. రాజు లేని రాజ్యములో, యువకులు యువతులతో కలిసి, వేగముగా పరుగెత్తు వాహనము లెక్కి, అరణ్యములకు వెళ్లజాలరు. 18

మూ. నారాజకే జనపదే ధనవన్తః సురక్షితాః,
శేరతే వివృతద్వారాః కృషిగోరక్షజీవినః. 19

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, కృషిగోరక్ష జీవినః = వ్యవసాయముచేతను, గోవుల రక్షణముచేతను జీవించు, ధనవన్తః = ధనవంతులు, సురక్షితాః=చక్కగా రక్షింపబడినవారై, వివృతద్వారాః = తెరవ బడిన ద్వారములు కలవారై, న శేరతే = నిద్రించరు.

తా. రాజు లేని దేశములో, కృషి, గోరక్షణము మొదలగువాటిచే జీవించు ధనికులు, చక్కగ రక్షింపబడినవారై, తలుపులు తెరచుకొని నిద్రింపజాలరు.

మూ. నారాజకే జనపదే బద్ధఘణ్టా విషాణినః,
అటన్తి రాజమార్గేషు కుఞ్జరాః షష్టిహాయనాః. 20

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే=దేశమునందు, షష్టిహాయనాః = అరువది సంవత్సరములు గల, కుఞ్జరాః = ఏనుగులు, బద్ధఘణ్టావిషాణినః = కట్టబడిన ఘంటలు కల దంతములు కలవై, రాజమార్గేషు = రాజమార్గము లందు, న అటన్తి = తిరుగవు.

తా. రాజు లేని రాజ్యములో దంతములకు గంటలు కట్టిన అరువది సంవత్సరాల యౌవనములో ఉన్న ఏనుగులు, రాజమార్గములలో సంచరించవు.

మూ. నారాజకే జనపదే శరాన్ సంతతమస్యతామ్.
శ్రూయతే తలనిర్ఘోష ఇష్వస్త్రాణాముపాసనే. 21

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, ఇష్వస్త్రాణామ్ = బాణములయొక్క, ఇతరాస్త్రములయొక్క, ఉపాసనే = ప్రయోగాభ్యాసమునందు, సంతతమ్ = అవిచ్ఛిన్నముగా, శరాన్ = బాణములను, అస్యతామ్ = విసురుచున్న వీరులయొక్క, తలనిర్ఘోషః = తలము యొక్కధ్వని, న శ్రూయతే = వినబడదు.

తా. రాజు లేని దేశములో, బాణాస్త్రాదుల ప్రయోగమును అభ్యసించునపుడు అవిచ్ఛిన్నముగా బాణములను ప్రయోగించుచున్న వీరుల తలధ్వని వినబడదు.

వి. తల మనగా కుడిచేతితో లాగిన ధనస్సు నారి దెబ్బ తగలకుండునట్లు ఎడమచేతికి చుట్టి కట్టిన కఠినచర్మము. 21

మూ. నారాజకే జనపదే వణిజో దూరగామినః,
గచ్ఛన్తి క్షేమమధ్వానం బహుపణ్యసమాచితాః. 22

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, దూరగామినః = దూరదేశములకు వెళ్లు, వణిజః = వర్తకులు, బహుపణ్యసమాచితాః = అనేకమైన అమ్మదగిన వస్తువులతో కూడినవారై, క్షేమమ్ = క్షేమముగా, అధ్వానమ్ = మార్గమును గూర్చి, న గచ్ఛన్తి = వెళ్ళజాలరు.

తా. రాజు లేని రాజ్యములో, అనేకమైన పణ్యవస్తువులతో దూరదేశములకు ప్రయాణము చేయవలసిన వర్తకులు మార్గములో క్షేమముగ ప్రయాణము చేయజాలరు. 22

మూ. నారాజకే జనపదే చరత్యేకచరో వశీ,
భావయన్నాత్మ నాత్మానం యత్ర సాయంగృహోమునిః.

ప్ర. అ. అరాజకే = రాజులేని, జనపదే = దేశమునందు, ఏకచరః = = ఒంటరిగా సంచరించివాడూ, వశీ = ఇంద్రియనిగ్రహము కలవాడూ, ఆత్మనా = బుద్ధిచేత, ఆత్మానమ్ = ఆత్మను గూర్చి, భావయన్ = భావనచేయువాడూ,

యత్రసాయంగృహః=ఎక్కడ సాయంకాల మగునో అక్కడనే గృహము గల, మునిః = ముని, న చరతి = సంచరించడు.

తా. రాజు లేని రాజ్యములో, ఎల్లప్పుడు ఒంటరిగానే సంచరించువాడూ, ఇంద్రియనిగ్రహము కలవాడూ, మనస్సులో ఆత్మస్వరూపమును గూర్చి ధ్యానముచేయువాడూ, ఎక్కడ సాయంకాల మగునో అక్కడనే గృహముగా భావించి ఆ రాత్రి నివసించువాడూ, అయిన ముని సంచరించడు. 23

మూ. నారాజకే జనపదే యోగక్షేమం ప్రవర్తతే,
న చాప్యరాజకే సేనా శత్రూన్ విషహతే యుధి. 24

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, యోగక్షేమమ్ = యోగక్షేమాలు, న ప్రవర్తతే = ప్రవర్తించవు. అరాజకే = రాజు లేని దేశమునందు, సేనా = సేన, యుధి = యుద్ధమునందు, శత్రూన్ = శత్రువులను, న విషహతే = సహింపజాలదు.

తా. రాజు లేని దేశములో యోగక్షేమములు సరిగా ఉండవు. రాజు లేని దేశములో సేన, యుద్ధములో, శత్రువులను ఎదిరింపజాలదు. 24

మూ. నారాజకే జనపదే హృష్టైః పరమవాజిభిః,
నరాః సంయాన్తి సహసా రథైశ్చ పరిమణ్డితాః. 25

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, నరాః= పురుషులు, పరిమణ్డితాః =అలంకరింపబడినవారై, హృష్టైః = ఉత్సాహము గల, పరమవాజిభిః = ఉత్తమాశ్వములచేతను, రథైశ్చ = రథములచేతను, సహసా = శీఘ్రముగా, న సంయాన్తి = వెళ్లరు.

తా. రాజు లేని రాష్ట్రములో మనుష్యులు చక్కగా అలంకరించుకొని, ఉత్సాహపూర్ణము లగు అశ్వములమీదను, రథములమీదను కూర్చుండి ప్రయాణము చేయుటకు భయపడుదురు. 25

మూ. నారాజకే జనపదే నరాః శాస్త్రవిశారదాః,
సంవదన్తోఽవతిష్ఠన్తే వనేషూపవనేషు చ, 26

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, శాస్త్రవిశారదాః = శాస్త్రజ్ఞులైన, నరాః = నరులు, వనేషు = వనములందును, ఉపవనేషు చ = ఉద్యానములందును, సంవదన్తః = సంవాదములుచేయుచు, న అవతిష్ఠన్తే = ఉండరు.

తా. రాజు లేని దేశములో ఆ యా శాస్త్రములలో విశారదు లైన పండితులు, వనములలోను, ఉపవనములలోను కూర్చుండి శాస్త్రచర్చలు జరుపజాలరు. 26

మూ. నారాజకే జనపదే మాల్యమోదకదక్షిణాః,
దేవతాభ్యర్చనార్థాయ కల్ప్యన్తే నియతైర్జనైః. 27

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, నియతైః = నియమవంతు లైన లేదా ఆ పనికై నియుక్తు లైన, జనైః = జనులచేత, దేవతాభ్యర్చనార్థాయ = దేవతల పూజకొరకై, మాల్యమోదకదక్షిణాః = పుష్పమాలలు, మధురభక్ష్యములు, దక్షిణలు, న కల్ప్యన్తే = ఏర్పరుపబడవు.

తా. రాజు లేని రాజ్యములో, జనులు నియమపూర్వకముగా దేవతాపూజానిమిత్తము పుష్పమాలలను, మధురభక్ష్యములను, దక్షిణలను సమకూర్చరు. 27

మూ. నారాజకే జనపదే చన్దనాగురురూషితాః,
రాజపుత్రా విరాజన్తే వసన్త ఇవ శాఖినః. 28

ప్ర. అ. అరాజకే = రాజు లేని, జనపదే = దేశమునందు, రాజపుత్రాః = రాజపుత్రులు, చన్దనాగురురూషితాః = చందనముతోను అగురుతోను పూయబడినవారై, వసన్తే = వసంతఋతువునందు, శాఖినః ఇవ = వృక్షములువలె, న రాజన్తే = ప్రకాశించరు.

తా. రాజు లేని రాజ్యమునందు, రాజపుత్రులు, చందనాగరువులు పూసికొని, వసంతమునందు వృక్షములు ప్రకాశించు నట్లు ప్రకాశింపరు. 28

మూ. యథా హ్యనుదకా నద్యో యథా వాప్యతృణం వనమ్,
అగోపాలా యథా గావస్తథా రాష్ట్రమరాజకమ్. 29

ప్ర. అ. అనుదకాః = ఉదకము లేని, నద్యః = నదులు, యథా = ఎట్లో, అతృణమ్ = తృణములు లేని, వనమ్ = వనము, యథా వా = ఎట్లో, అగోపాలాః = గోపాలులు లేని, గావః = గోవులు, యథా = ఎట్లో, అరాజకమ్ = రాజు లేని, రాష్ట్రమ్ = రాష్ట్రము, తథా = అట్లే,

తా. రాజు లేని రాష్ట్రము ఉదకము లేని నదుల వంటిది. తృణములు లేని వనము వంటిది. గోపాలులు లేని గోవుల వంటిది. 29

మూ. ధ్వజో రథస్య ప్రజ్ఞానం ధూమో జ్ఞానం విభావసోః,
తేషాం యో నో ధ్వజో రాజా స దేవత్వమితో గతః. 30

ప్ర. అ. రథస్య = రథమునకు, ధ్వజః = ధ్వజము, ప్రజ్ఞానమ్ = (ఎవరి రథమో) గుర్తించుటకు సాధనము. విభావసోః = అగ్నికి, ధూమః = ధూమము, జ్ఞానమ్ = గుర్తించు సాధనము. తేషామ్ = అట్టి, నః = మనకు, యః = ఎవ్వడు, ధ్వజః = ధ్వజముగా ఉండెడి వాడో, సః రాజా = అట్టి రాజు, ఇతః = ఇక్కడి నుండి, దేవత్వమ్ = దేవత్వమును, గతః = పొందినాడు.

తా. ఒక రథము ఎవరి రథమో తెలుసుకొనుటకు సాధనము ధ్వజము. అగ్నిని గుర్తించు సాధనము ధూమము. మనల కందరకును ధ్వజము వంటి వాడైన, (తన ప్రభావముచే మనకు కూడ గురితింపు తెచ్చి పెట్టిన) ఆ దశరథ మహారాజు ఈ లోకమును విడిచి స్వర్గమునకు వెళ్ళిపోయినాడు. 30

మూ. నారాజకే జనపదే స్వకం భవతి కస్యచిత్,
మత్స్యా ఇవ నరా నిత్యం భక్షయన్తి పరస్పరమ్. 31

ప్ర. అ. అరాజకే = రాజులేని, జనపదే = దేశమునందు, కస్య చిత్ = ఎవ్వనికిని, స్వకమ్ = తన సొత్తనునది, న భవతి = ఉండదు. నరాః = నరులు, మత్స్యాః ఇవ = మత్స్యముల వలె, నిత్యమ్ = ఎల్లప్పుడును, పరస్పరమ్ = ఒకరినొకరు, భక్షయన్తి = భక్షించి వేయుదురు.

తా. రాజు లేని రాజ్యములో ఎవ్వడునూ దేనినీ కూడ తన సొత్తుగా భావించుటకు వీలుండదు. మానవులు, నిత్యము మత్స్యముల వలె ఒకరి నొకరు తినివేయుదురు. 31

మూ. యే హి సంభిన్నమర్యాదా నాస్తికాశ్ఛిన్నసంశయాః,
తేఽపి భావాయ కల్పన్తే రాజదణ్డనిపీడితాః. 32

ప్ర. అ. సంభిన్నమర్యాదాః = భేదింపబడిన కట్టుబాట్లు గల, ఛిన్న సంశయాః = ఛేదింపబడిన సంశయము గల, యే హి = ఏ, నాస్తికాః = నాస్తికులు గలరో, తేఽపి = వాళ్ళు కూడ, రాజదణ్డనిపీడితాః = రాజదండముచే పీడింపబడినవారై, భావాయ = సద్భావమునకు, కల్పన్తే = సమర్థు లగుచున్నారు.

తా. కట్టుబాట్లను పాటింపక, ఎట్టి సంశయము లేక స్వేచ్ఛగా ప్రవర్తించు నాస్తికులు కూడ, రాజదండముచే దండితు లై, సన్మార్గమున ప్రవర్తింతురు. 32

మూ. యథా దృష్టిః శరీరస్య నిత్యమేవప్రవర్తతే,
తథా నరేన్ద్రో రాష్ట్రస్య ప్రభవః సత్యధర్మయోః, 33

ప్ర. అ. దృష్టిః = దృష్టి, నిత్యమేవ = ఎల్లప్పుడును, యథా = ఏ విధముగ, శరీరస్య = శరీరము యొక్క, సంరక్షణాది విషయమున, ప్రవర్తతే = ప్రవర్తించునో, తథా = అట్లే, నరేన్ద్రః = రాజు, రాష్ట్రస్య = రాష్ట్రము యొక్క, సత్యధర్మయోః = సత్యధర్మములకు, ప్రభవః = ఉత్పత్తి హేతువు.

తా. దృష్టి నిత్యము శరీరమునకు ఎట్లు ఉపకరించునో, అట్లే రాజు రాష్ట్రముయొక్క, సత్యధర్మముల పోషణమునకు కారణభూతుడు. 33

మూ రాజా సత్యం చ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. 34

ప్ర. అ. రాజా = రాజు, సత్యం చ = సత్యము. ధర్మశ్చ = ధర్మము కూడ. రాజా = రాజే, కులవతామ్ = కులవంతుల, కులమ్ = కులము. రాజా = రాజే, మాతా = తల్లి. పితాచైవ = తండ్రి కూడ. రాజా = రాజు, నృణామ్ = మానవులకు, హితకరః = హితము చేయువాడు.

తా. సత్యమును, ధర్మమును, రక్షించువాడు రాజే. కులవంతుల కులమును. రక్షించువాడు కూడ రాజే. రాజే తల్లి. రాజే తండ్రి. ప్రజలకు హితమును చేయువాడు రాజే. 34

మూ. యమో వైశ్రవణః శక్రో వరుణశ్చ మహాబలః.
విశేష్యన్తే నరేన్ద్రేణ వృత్తేన మహతా తతః. 35

ప్ర. అ. తతః = ఆకారణమువలన, యమః = యముడు, వైశ్రవణః = కుబేరుడు, శక్రః = ఇంద్రుడు, మహాబలః = గొప్ప బలము గల, వరుణశ్చ = వరుణుడూ, నరేన్ద్రేణ = రాజుచేత, మహతా = గొప్ప దైన, వృత్తేన = చరిత్ర చేత, విశేష్యన్తే = అతిశయింపబడుచున్నారు.

తా. కావుననే రాజు తన గొప్ప చరిత్రచేత, దిక్పాలకు లైన యమ-కుబేర-ఇంద్ర-వరుణులను కూడ అతిశయించి ఉండును. 35

మూ. అహో తమ ఇవేదం స్యాన్న ప్రజాయేత కించన,
రాజా చేన్న భవేల్లోకే విభజన్సాధ్వసాధునీ. 36

ప్ర. అ. అహో = ఎంత ఆశ్చర్యము: రాజా = రాజు, సాధ్వసాధునీ = మంచి చెడ్డలను, విభజన్ = వేరువేరుగా చూపుచు, లోకే = లోకమునందు, న భవేద్యది = లేకున్నట్లయితే, ఇదమ్ = ఇది, తమః = అంధకారముగా, స్యాత్ = అయి ఉండెడిది. కించన = ఏదియు, న ప్రజాయేత = పుట్టకుండెడిది.

తా. ఇది ధర్మము, ఇది అధర్మము అని రాజు విభజించి చూపకున్నచో ఈ ప్రపంచమంతయు అంధకారబంధురమై ఉండెడిది. సృష్టియే జరుగకుండెడిది.

మూ. జీవత్యపి మహారాజే తవైవ వచనం వయమ్,
నాతిక్రమామహే సర్వే వేలాం ప్రాప్యేవ సాగరః. 37

ప్ర. అ. మహారాజే = మహారాజు, జీవత్యపి = జీవించి ఉండగా కూడ, వయమ్ = మేము, సర్వే = అందరమూ, సాగరః = సముద్రము, వేలామ్ = తీరమును, ప్రాప్యేవ = పొంది వలె, తవ = నీ యొక్క, వచనమేవ = వచనమునే, నాతిక్రమామహే = అతిక్రమింపలేదు.

తా. మహారాజు జీవించి ఉన్నకాలమునందు కూడ మేమందరము, సముద్రము తీరమును దాటనట్లు నీ మాటను దాట లేదు. 37

మూ. స నః సమీక్ష్య ద్విజవర్య వృత్తం,
నృపం వినా రాజ్యమరణ్యభూతమ్,

కుమారమిక్ష్వాకుసుతం వదాన్యం
త్వమేవ రాజానమిహాభిషిఞ్చ 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. ద్విజవర్య = ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! సః = అట్టి నీవు, వృత్తమ్ = జరిగిన విషయమును, సమీక్ష్య = పరిశీలించి, నృపం వినా = రాజు లేకుండ, రాజ్యమ్ = రాజ్యమును, అరణ్యభూతమ్ = అరణ్యమైనదానినిగా చూచి, త్వమేవ = నీవే, ఇహ = ఇక్కడ, వదాన్యమ్ = ఉదారుడైన, ఇక్ష్వాకు సుతమ్ = ఇక్ష్వాకు వంశమునందు పుట్టిన, కుమారమ్ = యువకుని, నః = మాకు, రాజానమ్ = రాజునుగా, అభిషిఞ్చ = అభిషేకించుము.

తా. ద్విజులలో శ్రేష్ఠుడవైన ఓ వసిష్ఠా! జరిగిన విషయమును పరిశీలించి, రాజులేని రాజ్యము అరణ్యమైపోవును అను విషయమును గుర్తించి, నీవే, ఉత్తమ స్వభావవంతుడైన ఇక్ష్వాకు వంశసంభూతు నొకనిని మాకు రాజుగా రాజ్యాభిషిక్తుని చేయుము. 38

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువదియేడవసర్గ సమాప్తము.

## అష్టషష్టితమః సర్గః

[వసిష్ఠుని ఆనతిపై దూతలైదుగురు అయోధ్యనుండి కేకయ దేశమున రాజగృహమునకు పోవుట.]

మూ. తేషాం హి వచనం శ్రుత్వా వసిష్ఠః ప్రత్యువాచ హ,
మిత్రామాత్యగణాన్సర్వాన్బ్రాహ్మణాంస్తానిదం వచః. 1

ప్ర. అ. తేషామ్ = వారియొక్క, వచనం = వచనమును, శ్రుత్వా = విని, వసిష్ఠః = వసిష్ఠుడు, తాన్ = ఆ, మిత్రామాత్యగణాన్ = మిత్రగణములను, అమాత్యగణములను గూర్చి సర్వాన్ = సమస్తమైన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను గూర్చి, ఇదం వచః = ఈ వచనమును, ప్రత్యువాచహ = తిరిగిపలికెను.

తా. వారి వచనము విని, వసిష్ఠుడు ఆ రాజమిత్రగణముతోను, అమాత్యగణముతోను, బ్రాహ్మణులతోను ఇట్లు పలికెను. 1

మూ. యదసౌ మాతులకులే దత్తరాజ్యః పరం సుఖీ,
భరతో వసతి భ్రాతా శత్రుఘ్నేన సమన్వితః. 2
తచ్ఛీఘ్రం జవనా దూతా గచ్ఛన్తు త్వరితైర్హయైః,
ఆనేతుం భ్రాతరౌ వీరౌ కిం సమీక్షామహే వయమ్. 3

ప్ర. అ. దత్తరాజ్యః = (దశరథునిచే) ఇవ్వబడిన రాజ్యము గల, అసౌ భరతః = ఆ భరతుడు, భ్రాతా = సోదరుడైన, శత్రుఘ్నేన = శత్రుఘ్నునితో, సమన్వితః = కూడినవాడై, యత్ = ఏ కారణమువలన, మాతులకులే = మేనమామ యింటిలో, పరమ్ = మిక్కిలి, సుఖీ = సుఖవంతుడై, వసతి = నివసించుచున్నాడో, తత్ = ఆ కారణమువలన, వీరౌ = వీరులైన, భ్రాతరౌ = సోదరులను, ఆనేతుమ్ = తీసికొనివచ్చుటకు, జవనాః = వేగవంతులైన, దూతాః = దూతలు, త్వరితైః = శీఘ్రముగా పోవు, హయైః = గుఱ్ఱములచే, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛన్తు

= వెళ్లెదరుగాక. వయమ్ = మనము, కిమ్=ఏమి, సమీక్షామహే = విచారణము చేయవలెను.

తా. భరతుడు శత్రుఘ్న సహితుడై మేనమామ ఇంటి వద్ద సుఖముగా ఉన్నాడు. వీరులైన ఆ సోదరుల నిద్దరిని తీసికొనివచ్చుటకు శీఘ్రముగా పరుగెత్త గల అశ్వములను అధిరోహించి, వేగవంతులైన దూతలు వెంటనే వెళ్లవలెను. దశరథుడే భరతునకు రాజ్యమిచ్చిన పిమ్మట ఈ విషయమున మనము ఆలోచించవలసినది ఏ మున్నది?

వి. "దత్తరాజ్యః పరం సుఖీ" అను గోరఖ్‌పూర్‌ప్రతిలో ఉన్న పాఠము "పురే రాజగృహే సుఖీ" అనుపాఠముకంటె బాగున్నది. "యోఽసౌమాతా మహాకులే కుమారః శ్రీమతాం వరః" అని ప్రాచ్యపాఠము. 2, 3

మూ. గచ్ఛన్త్వితి తతః సర్వే వసిష్ఠం వాక్యమబ్రువన్.
తేషాం తద్వచనం శ్రుత్వా వసిష్ఠో వాక్యమబ్రవీత్. 4

ప్ర. అ. తతః = పిమ్మట, గచ్ఛన్తు = వెళ్లెదరుగాక, ఇతి = అని, సర్వే = అందరును, వసిష్ఠమ్=వసిష్ఠుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి. తేషామ్=వారియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా= విని, వసిష్ఠః=వసిష్ఠుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. "నీవు చెప్పినట్లు దూతలు వెళ్లెదరుగాక" అని వారందరు వసిష్ఠునితో పలికిరి. అపుడు ఆ మాట విని వసిష్ఠుడు మరల ఇట్లనెను. 4

మూ. ఏహి సిద్ధార్థ విజయ జయన్తాశోక నన్దన,
శ్రూయతామితికర్తవ్యం సర్వానేవ బ్రవీమి వః. 5

ప్ర. అ. సిద్ధార్థ=సిద్ధార్థుడా, విజయ=విజయుడా, జయన్త = జయన్తుడా, అశోక = అశోకుడా, నన్దన=నందనుడా, ఏహి = రమ్ము. వః=మిమ్ములను, సర్వానేవ=అందరిని గూర్చి, అహమ్ = నేను, బ్రవీమి = చెప్పుచున్నాను. ఇతికర్తవ్యమ్ = ఏమిచేయవలెనుఅనువిషయము, శ్రూయతామ్=వినబడుగాక.

తా. సిద్ధార్థా! జయంతా! విజయా! అశోకా! నందనా! రండి; మీ అందరికి చెప్పుచున్నాను. ఏమి చేయవలెనో వినండి. 5

మూ. పురం రాజగృహం గత్వా శీఘ్రం శీఘ్రజవైర్హయైః
త్యక్తశోకై రిదం వాచ్యః శాసనాద్భరతో మమ. 6

ప్ర. అ. ఇతః = ఇక్కడినుండి, శీఘ్రజవైః = శీఘ్ర మైన వేగము గల, హయైః = అశ్వములతో, శీఘ్రమ్=శీఘ్రముగా, రాజగృహమ్=రాజగృహ మను, పురమ్ = పట్టణమును గూర్చి, గత్వా = వెళ్ళి, త్యక్తశోకైః = విడువబడిన శోకము గల మీచేత, భరతః = భరతుడు, మమ = నాయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, ఇదమ్ = ఈ వాక్యమును, వాచ్యః = చెప్పదగినవాడు.

తా. మీ రిచటినుండి శీఘ్రముగా బయలుదేరి, మంచి వేగము గల గుఱ్ఱములపై ప్రయాణము చేసి రాజగృహపురమును చేరి, మనస్సులోని దుఃఖమును పైకి కనబడనీయక, నా ఆజ్ఞగా భరతునితో ఇట్లు చెప్పవలెను. 6

మూ. పురోహితస్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మన్త్రిణః,
త్వరమాణశ్చ నిర్యాహి కృత్యమాత్యయికం త్వయా. 7

ప్ర. అ. పురోహితః = పురోహితుడు, త్వామ్ = నిన్ను గూర్చి, కుశలమ్ = కుశలమును, ప్రాహ = పలుకుచున్నాడు. సర్వే=సమస్త మైన, మన్త్రిణశ్చ = మంత్రులు కూడా పలుకుచున్నారు. త్వరమాణః చ = తొందరపడుచు, నిర్యాహి = బయలుదేరి రమ్ము. త్వయా = నీతో, ఆత్యయికమ్ = మిక్కిలి కష్టముతో కూడిన, కృత్యమ్ = పని యున్నది.

తా. "పురోహితుడును మంత్రు లందరును నీ కుశలము ప్రశ్నించు చున్నారు. వెంటనే నీవు బయలుదేరి రావలెను. నీతో చాల తొందర పని ఉన్నది." 7

మూ. మా చాస్మై ప్రోషితం రామం మా చాస్మై పితరం మృతమ్
భవన్తః శంసిషుర్గత్వా రాఘవాణామిమం క్షయమ్. 8

ప్ర. అ. భవన్తః = మీరు, గత్వా = వెళ్ళి, అస్మై = ఇతనికి, రామమ్ = రాముని, ప్రోషితమ్ = ప్రవాసమునకు వెళ్ళినవానిని గా, మా శంసిషుః = చెప్పకుడు. పితరమ్=తండ్రిని, మృతమ్=మరణించినవానిని గాను, రాఘవాణామ్ =రఘువంశీయులయొక్క, ఇమమ్ = ఈ, క్షయమ్ = ఆపదను గూర్చియు, మా శంసిషుః = చెప్పకుడు.

తా. మీ రక్కడికి వెళ్ళి, రాముడు ప్రవాసమునకు వెళ్లినట్లును, ఆతని తండ్రిమరణించినట్లును,రఘువంశీయులకు ఆపదలు సంభవించినట్లును చెప్పవద్దు.

మూ. కౌశేయాని చ వస్త్రాణి భూషణాని వరాణి చ,
క్షిప్రమాదాయ రాజ్ఞశ్చ భరతస్య చ గచ్ఛత. 9

ప్ర. అ. రాజ్ఞశ్చ = రాజునకూ, భరతస్య చ = భరతునకూ, కౌశేయాని వస్త్రాణి = పట్టువస్త్రములనూ, వరాణి = శ్రేష్ఠమైన, భూషణాని చ = అలంకారములనూ, ఆదాయ = తీసికొని, క్షిప్రమ్ = శీఘ్రముగా, గచ్ఛత = వెళ్లుడు.

తా. కేకయరాజునకూ, భరతునికీ పట్టువస్త్రములనూ, ఉత్తమమైన అలంకారములనూ తీసికొని వెళ్ళవలెను 9

మూ. దత్తపథ్యశనా దూతా జగ్ముః స్వం స్వం నివేశనమ్,
కేకయాంస్తే గమిష్యన్తో హయానారుహ్య సంమతాన్. 10

ప్ర. అ. కేకయాన్ = కేకయదేశమును గూర్చి, గమిష్యన్తః = వెళ్ళనున్న, తే దూతాః = ఆ దూతలు, దత్తపథ్యశనాః = ఇవ్వబడిన దారి బత్తెములు కలవారై, సంమతాన్ = ఉత్తమమైన, హయాన్ = అశ్వములను, ఆరుహ్య = ఎక్కి, స్వం స్వమ్ = తమ తమ, నివేశనమ్ = గృహమును గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. కేకయదేశమునకు వెళ్ళనున్న ఆ దూతలు, దారిలో కావలిసిన ఆహారాదిసామగ్రిని తీసికొని, ఉత్తమాశ్వముల నెక్కి, తమ ఇండ్లకు వెళ్ళిరి. 10

మూ. తతః ప్రాస్థానికం కృత్వా కార్యశేషమనన్తరమ్,
వసిష్ఠేనాభ్యనుజ్ఞాతా దూతాః సంత్వరితా యయుః. 11

ప్ర. అ. తతః = పిమ్మట, దూతాః = దూతలు, ప్రాస్థానికమ్ = ప్రయాణమునకు సంబంధించిన, అనన్తరమ్ = తరువాత చేయవలసిన, కార్యశేషమ్ = మిగిలిన కార్యమును, కృత్వా = చేసి, వసిష్ఠేన = వసిష్ఠునిచేత, అభ్యనుజ్ఞాతాః = అనుజ్ఞ ఇవ్వబడినవారై, సంత్వరితాః = తొందరబడుచు, యయుః = వెళ్ళిరి.

తా. పిమ్మట ఆ దూతలు, ప్రయాణము నిమిత్తమై చేసుకొనవలసిన మిగిలిన పనులన్నియు పూర్తి చేసికొని, వసిష్ఠుని అనుమతి తీసికొని, శీఘ్రముగా వెళ్ళిరి. 11

మూ. న్యన్తేనాపరతాలస్య ప్రలమ్బస్యోత్తరం ప్రతి,
నిషేవమాణాస్తే జగ్ముర్నదీం మధ్యేన మాలినీమ్. 12

ప్ర. అ. తే=ఆ దూతలు, అపరతాలస్య=అపరతాలపర్వతముయొక్క, న్యన్తేన = చివరి ప్రాంతము మీదుగ, ప్రలమ్బస్య = ప్రలంబపర్వతముయొక్క, ఉత్తరం ప్రతి=ఉత్తరమువైపునకు, మధ్యేన=మధ్యభాగముచేత, మాలినీం నదీమ్ =మాలినీనదిని, నిషేవమాణాః= సేవించుచు, జగ్ముః=వెళ్ళిరి.

తా. [అక్కడ ముందుగా, దక్షిణోత్తరములకు వ్యాపించిన అపరతాల పర్వతము, దానికి పడమట, దక్షిణోత్తరముకును, వంకరగా ఉండుటచే పూర్వ పశ్చిమములకును కూడ వ్యాపించిన ప్రలంబపర్వతము ఉన్నవి.] దూతలు అయోధ్యనుండి బయలుదేరి, పశ్చిమాభిముఖులై కొంత దూరము వెళ్ళి, అపరతాల పర్వతము చివరి దక్షిణభాగము దాటి, పిదప అపరతాల—ప్రలంబపర్వతముల మధ్య మాలినీనదీతీరమార్గమున ఉత్తరముగా ప్రయాణము చేసి, పశ్చిమాభిముఖులై వెళ్ళిరి.

వి. ఇది ప్రాచీన వ్యాఖ్యానముల ననుసరించిన, తాత్పర్యము. అక్కడి భౌగోళిక పరిస్థితి ఇట్లు ఉన్నదో లేదో తెలియదు. 'ప్రలమ్బస్య' అనేదానిని పర్వత నామముగా, కాక, 'అపరతాలస్య' అనుదానికి విశేషణముగా కూడా గ్రహించి 'పొడవైన' అని అర్థము చెప్పవచ్చును. సుందరకాండలో హనుమంతుడు సముద్రము దాటి త్రికూటతటమున దిగినట్లు చెప్పిన (రెండవ సర్గ) పిదప మూడవ సర్గలో "సలమ్బశిఖరే లమ్బే" అని ఆ పర్వతమునకు "లమ్బశిఖరే" "లమ్బే" అని విశేషణములు ఉపయోగించబడినవి. అట్లే ఇక్కడ చెప్పవచ్చును. అప్పుడు దీని తాత్పర్యము— "దీర్ఘమైన అపరతాల పర్వతము చివరిభాగము మీదుగా ప్రయాణము చేసి, మధ్యయందు మాలినీ నదీ తీరమున విశ్రమించి, ఉత్తరము వైపు ప్రయాణము చేసిరి" అని చెప్పవచ్చును. ప్రాచ్యపాఠములో ఈ శ్లోకమే లేదు. 12

మూ. తే హస్తినాపురే గఙ్గాం తీర్త్వా ప్రత్యఙ్ముఖా యయుః,
పాఞ్చాలదేశమాసాద్య మధ్యేన కురుజాఙ్గలమ్. 13
సరాంసి చ సుపూర్ణాని నదీశ్చ విమలోదకాః,
నిరీక్షమాణాస్తే జగ్ముర్దూతాః కార్యవశాద్ద్రుతమ్. 14

ప్ర. అ. తే దూతాః = ఆ దూతలు, హస్తినాపురే = హస్తినాపురమునందు, గఙ్గామ్ = గంగను, తీర్త్వా = దాటి, ప్రత్యఙ్ముఖాః = పశ్చిమాభిముఖులై, యయుః = వెళ్ళిరి. మధ్యేన కురుజాఙ్గలమ్ = కురు జాంగల ప్రాంతమధ్యమము మీదుగా, పాఞ్చాలదేశమ్ = పాంచాలదేశమును, ఆసాద్య = పొంది, సుపూర్ణాని = బాగుగా నిండి ఉన్న, సరాంసి చ = సరస్సులను, విమలోదకాః = నిర్మలమైన ఉదకము గల, నదీశ్చ = నదులను, నిరీక్షమాణాః = చూచుచు, కార్యవశాత్ = కార్యమును పట్టి, ద్రుతమ్ = శీఘ్రముగా, జగ్ముః = వెళ్లిరి.

తా. ఆ దూతలు హస్తినాపురమున గంగానదిని దాటి, పశ్చిమాభిముఖులై ప్రయాణముచేసి, కురుజాంగల మధ్యదేశము మీదుగా పాంచాలదేశము చేరి, అచట నుండి, బాగుగా జలముతో నిండిన సరస్సులను, నిర్మలమైన ఉదకము గల నదులను చూచుచు, పనితొందరను బట్టి అతి శీఘ్రముగా వెళ్లిరి. 13, 14

మూ. తే ప్రసన్నోదకాం దివ్యాం నానావిహగసేవితామ్,
ఉపాతిజగ్ముర్వేగేన శరదణ్డాం జనాకులామ్. 15

ప్ర. అ. తే = వారు, ప్రసన్నోదకామ్ = ప్రసన్నమైన ఉదకము కలదీ, దివ్యామ్ = దివ్యమూ, నానావిహగసేవితామ్ = అనేక పక్షులచే సేవింపబడినదీ, జనాకులామ్ = జనులతో నిండినదీ అయిన, శరదణ్డామ్ = శరదండానదిని, వేగేన = వేగముతో, ఉపాతిజగ్ముః = దాటి వెళ్లిరి.

తా. ఆ దూతలు, నిర్మలమైన ఉదకము కలదీ, శ్రేష్ఠమూ, వివిధములైన పక్షులచే సేవింపబడినదీ, జనులతో నిండినదీ అయిన శరదండానదిని దాటి వేగముగా ప్రయాణముచేసిరి. 15

మూ. నికూలవృక్షమాసాద్య దివ్యం సత్యోపయాచనమ్.
అభిగమ్యాభివాద్యం తం కులిఙ్గాం ప్రావిశన్. పురీమ్. 16

ప్ర. అ. దివ్యమ్ = దేవతాధిష్ఠిత మైన, సత్యోపయాచనమ్ = సత్యోపయాచన మను పేరు గల (ప్రార్థించువారి ప్రార్థనలను సత్యము చేయునది.), నికూలవృక్షమ్ = తీరమునందలి వృక్షమును. ఆసాద్య = చేరి, అభివాద్యమ్ = నమస్కరించ దగిన, తమ్ = దానిని, అభిగమ్య = ప్రదక్షిణము చేసి, కులిఙ్గాం పుర్యమ్ = కుళింగ పట్టణమును, ప్రావిశన్ = ప్రవేశించిరి.

తా. వారు తీరముపై ఉన్న సత్యోపయాచన మను దివ్యవృక్షమును సమీపించి నమస్కారార్హ మైన దానికి ప్రదక్షిణము చేసి. కులింగానగరిని ప్రవేశించిరి. 16

మూ. అభికాలం తతః ప్రాప్య తే బోధిభవనాచ్చ్యుతామ్,
పితృపైతామహీం పుణ్యాం తేరురిక్షుమతీం నదీమ్. 17

ప్ర. అ. తతః = అక్కడినుండి, తే = వారు, అభికాలమ్ = అభికాల మను గ్రామమును, ప్రాప్య = పొంది, బోధిభవనాత్ = బోధిభవన పర్వతమునుండి, చ్యుతామ్ = ప్రవహించుచున్న, పితృపైతామహీమ్ = తండ్రులకు, తాతలకు, సంబంధించిన, పుణ్యామ్ = పుణ్య మైన, ఇక్షుమతీమ్ = ఇక్షుమతీ నదిని, తేరుః = దాటిరి.

తా. వారు అక్కడినుండి అభికాలగ్రామమునకు చేరి, అక్కడ బోధిభవన మను పర్వతమునుండి ప్రవహించుచున్న పవిత్రమైన ఇక్షుమతీ నదిని దాటిరి. ఆ నదీప్రాంత దేశము దశరథుని పితృ పితామహాదులచేత అనుభవింప బడినది. 17

మూ. అవేక్ష్యాఞ్జలిపానాంశ్చ బ్రాహ్మణాన్ వేదపారగాన్,
యయుర్మధ్యేన బాహ్లీకాన్ సుదామానం చ పర్వతమ్.

ప్ర. అ. అఞ్జలిపానాన్ = దోసిళ్లతో మాత్రమే జలము త్రాగు, వేదపారగాన్ = వేదముల పారములను చూచిన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, అవేక్ష్య = చూచి, బాహ్లీకాన్ మధ్యేన = బాహ్లీకదేశము నందలి మధ్య భాగముచే, సుదామానమ్ = సుదామ అను, పర్వతం చ = పర్వతమును గూర్చి, యయుః = వెళ్లిరి.

తా. అక్కడ దోసిళ్ళతో మాత్రమే నీళ్ళు త్రాగి జీవించు వేద విద్వాంసు లైన బ్రాహ్మణులను చూచి, బాహ్లీకదేశమధ్యప్రాంతమున ప్రయాణము చేసి, సుదామ పర్వతము చేరిరి. 18

మూ. విష్ణోః పదం ప్రేక్షమాణా విపాశాం చాపి శాల్మలీమ్,
నదీర్వాపీస్తటాకాని పల్వలాని సరాంసి చ. 19
పశ్యన్తో వివిధాంశ్చాపి సింహవ్యాఘ్రమృగద్విపాన్,
యయుః పథాతిమహతా శాసనం భర్తురీప్సవః. 20

ప్ర. అ. విష్ణోః = విష్ణువుయొక్క, పదమ్ = క్షేత్రమును, ప్రేక్షమాణాః = చూచుచు, విపాశాం చాపి = విపాశానదిని, శాల్మలీం చాపి = శాల్మలీ వృక్షమును, నదీః = నదులను, వాపీః = దిగుడుబావులను, తటాకాని = చెరువులను, పల్వలాని = చిన్న చెరువులను, సరాంసి చ = పెద్ద చెరువులను, వివిధాన్ = అనేక విధము లైన, సింహవ్యాఘ్రమృగద్విపాన్ = సింహములను, వ్యాఘ్రములను, మృగములను, ఏనుగులను. పశ్యన్తః = చూచుచున్నవారై, భర్తుః = ప్రభువు యొక్క, శాసనమ్ = ఆజ్ఞను, ఈప్సవః = పొంద దలచిననారై, అతిమహతా = మిక్కిలి గొప్ప దైన, పథా = మార్గముచేత, యయుః = వెళ్లిరి.

తా. ఆ ప్రాంతమునం దున్న విష్ణు క్షేత్రమును, విపాశానదిని, శాల్మలీ వృక్షమును, నదులను, దిగుడుబావులను, తటాకములను, పల్వలములను, సరస్సులను, అనేక విధము లైన సింహవ్యాఘ్ర గజాది వన్యమృగములను చూచుచు, ప్రభువు ఆజ్ఞను పాలించవలె నను ఉత్సాహముతో అతి దీర్ఘ మైన మార్గమున ప్రయాణము చేయుచు వెళ్ళిరి. 19, 20

మూ. తే శ్రాన్తవాహనా దూతా వికృష్టేన పథా తతః,
గిరివ్రజం పురవరం శీఘ్రమాసేదురఞ్జసా. 21

ప్ర. అ. వికృష్టేన = దూర మైన, పథా = మార్గముచే, శ్రాన్తవాహనాః = అలసిన వాహనములు గల, తే దూతాః = ఆ దూతలు, తతః = అటు పిమ్మట, శీఘ్రమ్ = శీఘ్రముగా, అఞ్జసా = చక్కగ; పురవరమ్ = పురశ్రేష్ఠ మైన, గిరివ్రజమ్ = గిరివ్రజమును, ఆసేదుః = చేరిరి.

తా. అతిదూర ప్రయాణముచేత అశ్వములు అలసిన ఆ దూతలు వేగముగా, గిరివ్రజపురమును, చక్కగా ప్రవేశించిరి. 21

మూ. భర్తుః ప్రియార్థం కులరక్షణార్థం
భర్తుశ్చ వంశస్య పరిగ్రహార్థమ్.
అహేడమానాస్త్వరయా స్మ దూతా
రాత్ర్యాం తు తే తత్పురమేవ యాతాః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టషష్టితమః సర్గః

ప్ర. అ. తే దూతాః = ఆ దూతలు, భర్తుః = ప్రభువుయొక్క, ప్రియార్థమ్ = ప్రియము కొరకును, కులరక్షణార్థమ్ = భర్తృ కులమును రక్షించుటకును, భర్తుః = ప్రభువుయొక్క, వంశస్య = వంశముయొక్క, పరిగ్రహార్థమ్ = ప్రతిష్ఠ కొరకును, త్వరయా = తొందరతో, అహేడమానాః = అనాదరము చేయనివారై, రాత్ర్యామ్ = రాత్రియందు, తత్ = ఆ, పురమేవ = పట్టణమునే, యాతాః = పొందిరి.

తా. ఆ దూతలు తమ ప్రభువునకు ప్రియ మాచరించు విషయములోను రాజకులమును రక్షించే విషయములోను, రాజవంశప్రతిష్ఠ కాపాడు విషయములోను అశ్రద్ధ చూపక, రాత్రి అగు సరికి, ఆ పట్టణము చేరిరి. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువది యెనిమిదవ సర్గ సమాప్తము.

# ఏకోనసప్తతితమః సర్గః

[భరతుని చింత, మిత్రులతనిని ప్రసన్నుని చేయుటకు ప్రయత్నించుట, మిత్రులు ప్రశ్నింపగా భరతుడు తాను చూచిన భయంకర దుఃస్వప్నములు వర్ణించుట.]

మూ. యామేవ రాత్రిం తే దూతాః ప్రవిశన్తి స్మ తాం పురీమ్,
భరతేనాపి తాం రాత్రిం స్వప్నో దృష్టోఽయమప్రియః.

ప్ర. అ. తే దూతాః = ఆ దూతలు, యామేవ = ఏ, రాత్రిమ్ = రాత్రిని (రాత్రియందు), తాం పురీమ్ = ఆ పురమునందు, ప్రవిశన్తి స్మ = ప్రవేశించిరో, తాం రాత్రిమ్ = ఆ రాత్రియందే, భరతేనాపి = భరతుని చేత కూడ, అయమ్ = ఈ, అప్రియః = అప్రియ మైన, స్వప్నః = స్వప్నము, దృష్టః = చూడబడినది.

తా. ఆ దూతలు ఆ నగరములోనికి ప్రవేశించిన రాత్రియందే, భరతుడు ఒక అప్రియ మైన దుఃస్వప్నమును చూచెను. 1

మూ. వ్యుష్టామేవ తు తాం రాత్రిం దృష్ట్వా తం స్వప్నమప్రియమ్,
పుత్రో రాజాధిరాజస్య సుభృశం పర్యతప్యత. 2

ప్ర. అ. రాజాధిరాజస్య = రాజాధిరా జైన దశరథునియొక్క, పుత్రః = పుత్రుడు, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని (యందు), వ్యుష్టామ్ ఏవ = తెల్లవారగనే, తమ్ = ఆ, అప్రియమ్ = అప్రియ మైన, స్వప్నమ్ = స్వప్నమును, దృష్ట్వా = చూచి, సుభృశమ్ = మిక్కిలి, పర్యతప్యత = దుఃఖించెను.

తా. రాజాధిరాజకుమారు డైన భరతుడు తెల్లవారుజామున ఆ దుఃస్వప్నమును చూచి మనస్సులో చాల ఖేదమును పొందెను. 2

మూ. తప్యమానం సమాజ్ఞాయ వయస్యాః ప్రియవాదినః,
ఆయాసం హి వినేష్యన్తః సభాయాం చక్రిరే కథాః. 3

ప్ర. అ. ప్రియవాదినః = ప్రియముగా పలుకు, వయస్యాః = స్నేహితులు, తప్యమానమ్ = పరితపించుచున్నవానినిగా, సమాజ్ఞాయ = తెలుసుకొని, ఆయాసమ్ = దుఃఖమును, వినేష్యన్తః = తొలగింపనున్నవారై, సభాయామ్ = సభయందు, కథాః = కథలను. చక్రిరే = చేసిరి.

తా. ప్రియవాక్యములు పలుకు స్నేహితులు భరతుడు పరితపించుచున్నట్లు గ్రహించి, అతని మనఃపరితాపమును తొలగించుటకై, సభలో అనేకవిధము లైన కథలు (వినోద కార్యక్రమములు) జరిపిరి. 3

మూ. వాదయన్తి తథా శాన్తిం లాసయన్త్యపి చాపరే,
నాటకాన్యపరే ప్రాహుర్హాస్యాని వివిధాని చ. 4

ప్ర. అ. శాన్తిమ్ = మనశ్శాంతిని ఉద్దేశించి, వాదయన్తి = వీణాదులు ప్రయోగించిరి. తథా = అట్లే, అపరే = మరికొందరు, నాటకాని = నాటకములను, లాసయన్త్యపి = ప్రయోగింపచేసిరి. అపరే = మరికొందరు, వివిధాని = అనేకవిధము లైన, హాస్యాని = హాస్యములను, ప్రాహుః = చెప్పిరి.

తా. భరతునిమనస్సుకు శాంతి కలుగుటకై కొందరు వీణాదివాద్యములను ప్రయోగించిరి. కొందరు నాటకము లాడించిరి. మరికొందరు వివిధము లైన, హాస్య ప్రధానము లైన మాటలు చెప్పిరి. 4

మూ. స తైర్మహాత్మా భరతః సఖిభిః ప్రియవాదిభిః,
గోష్ఠీహాస్యాని కుర్వద్భిర్న ప్రాహృష్యత రాఘవః. 5

ప్ర. అ. రాఘవః = రఘువంశమునందు పుట్టిన, మహాత్మా = మహాత్ముడైన, సః భరతః = ఆ భరతుడు, గోష్ఠీహాస్యాని = గోష్ఠులను హాస్యములను, కుర్వద్భిః = చేయుచున్న, ప్రియవాదిభిః = ప్రియముగా పలుకు, సఖిభిః = స్నేహితులచేత, న ప్రాహృష్యత = సంతోషింప చేయబడలేదు.

తా. ప్రియముగా మాటలాడు ఆ స్నేహితులందరును, గోష్ఠీహాస్యాదులెన్ని చేసినను, మహాత్ము డైన భరతునకు సంతోషము కలుగలేదు. 5

మూ. తమబ్రవీత్ప్రియసఖో భరతం సఖిభిర్వృతమ్,
సుహృద్భిః పర్యుపాసీనః కిం సఖే నానుమోదసే. 6

ప్ర. అ. ప్రియసఖః = ఒకానొక ప్రియమిత్రుడు, సఖిభిః = మిత్రులచే, వృతమ్ = చుట్టు కొనబడిన, తం భరతమ్ = ఆ భరతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. సఖే = ఓ మిత్రమా! సుహృద్భిః = స్నేహితులచే, పర్యుపాసీనః = దగ్గరఉండి సేవింపబడుచున్నను, కిమ్ = ఎందువలన, న అనుమోదసే = సంతోషించవు?

తా. మిత్రులతో కూడిన ఆ భరతుని, ఒక ప్రియమిత్రుడు— "ఓ మిత్రమా స్నేహితు లందరు వచ్చి నిన్ను చుట్టి ఉన్నను నీవు ఇట్లు ఆనందహీనుడవై ఉన్నావేమి?" అని ప్రశ్నించెను. 6

మూ. ఏవం బ్రువాణం సుహృదం భరతః ప్రత్యువాచ హ,
శ్రుణు త్వం యన్నిమిత్తం మే దైన్యమేతదుపాగతమ్.

ప్ర. అ. భరతః=భరతుడు, ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, సుహృదమ్ = మిత్రుని గూర్చి, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. మే = నాకు, యన్నిమిత్తమ్ = ఏ కారణమువలన, ఏతత్ = ఈ, దైన్యమ్ = దైన్యము, ఉపాగతమ్ = వచ్చినదో, త్వమ్=నీవు, శృణు = వినుము.

తా. ఇట్లు ప్రశ్నించిన ఆ మిత్రునితో భరతు డీ విధముగ చెప్పెను- ''నాకు ఈ దైన్యము కలుగుటకు కారణమును వినుము''. 7

మూ. స్వప్నే పితరమద్రాక్షం మలినం ముక్తమూర్ధజమ్,
పతన్తమద్రిశిఖరాత్కలుషే గోమయహ్రదే. 8

ప్ర. అ. స్వప్నే=స్వప్నమునందు, మలినమ్ = మాలిన్యము కలవాడూ, ముక్తమూర్ధజమ్=విడిపోయిన కేశములు కలవాడూ, అద్రి శిఖరాత్=పర్వత శిఖరమునుండి, కలుషే = కలుష మైన, గోమయహ్రదే = గోమయముతో నిండిన హ్రదమునందు, పతన్తమ్ = పడిపోవుచున్న, పితరమ్ = తండ్రిని, అద్రాక్షమ్ = చూచితిని.

తా. నా తండ్రి మలిన మైన శరీరముతో, జుట్టు విరబోసికొని, పర్వత శిఖరమునుండి, గోమయముతో నిండిన గోతిలో పడుచున్నట్లు స్వప్నము చూచితిని. 8

మూ. ప్లవమానశ్చ మే దృష్టః స తస్మిన్ గోమయహ్రదే,
పిబన్నఞ్జలినా తైలం హసన్నపి ముహుర్ముహుః. 9

ప్ర. అ. సః = అతడు, తస్మిన్ = ఆ, గోమయహ్రదే = గోమయహ్రదమునందు, ప్లవమానః = తేలుచున్నవాడుగాను, అఞ్జలినా = దోసిలితో, తైలమ్ = తైలమును, పిబన్ = త్రాగుచున్నవాడుగాను, ముహుర్ముహుః = మాటి మాటికిని, హసన్ = నవ్వుచున్నట్లుగాను, మే = నాచేత, దృష్టః = చూడబడినాడు.

తా. నా తండ్రి ఆ గోమయహ్రదమునందు, తేలుచు, మాటిమాటికిని నవ్వుచు, దోసిలితో తైలము త్రాగుచున్నట్లుగా కనబడినాడు. 9

మూ. తతస్తిలోదనం భుక్త్వా పునః పునరధఃశిరాః,
తైలేనాభ్యక్తసర్వాఙ్గస్తైలమేవాన్వగాహత. 10

ప్ర. అ. తతః = పిమ్మట, తిలోదనమ్ = తిలలు కలిపిన అన్నమును, భుక్త్వా = తిని, పునః పునః = మాటి మాటికిని, అధఃశిరాః = క్రిందికి వంచబడిన శిరస్సు కలవాడై, తైలేన = తైలముచేత, అభ్యక్తసర్వాఙ్గః = పూయబడిన సకల శరీరమును కలవాడై, తైలమేవ = తైలమునే, అన్వగాహత = ప్రవేశించెను.

తా. పిదప తిలలు కలిపిన అన్నము తిని, మాటిమాటికి శిరస్సు క్రిందికి వంచుచు, శరీరమున కంతకును తైలము పూసికొని, తైలములోనే మునిగి పోయెను. 10

మూ. స్వప్నేఽపి సాగరం శుష్కం చన్ద్రం చ పతితం భువి,
ఉపరుద్ధాం చ జగతీం తమసేవ సమావృతామ్. 11
ఔపవాహ్యస్య నాగస్య విషాణం శకలీకృతమ్,
సహసా చాపి సంశాన్తం జ్వలితం జాతవేదసమ్. 12
అవదీర్ణాం చ పృథివీం శుష్కాంశ్చ వివిధాన్ ద్రుమాన్,
అహం పశ్యామి విధ్వస్తాన్ సధూమానపి పర్వతాన్. 13

ప్ర. అ. అహమ్ = నేను, స్వప్నే = స్వప్నమునందు, సాగరమ్ = సముద్రమును, శుష్కమ్ = ఎండిపోయిన దానినిగాను, చన్ద్రమ్ = చంద్రుని, భువి = నేలపై, పతితమ్ = పడిపోయిన వానినిగాను, జగతీమ్ = భూమిని, తమసా

=చీకటిచే, సమావృతామ్ ఇవ=కప్పబడినది వలె, ఉపరుద్ధామ్=కనబడకున్న దానిని గాను, ఔపవాహ్యస్య=రాజు ఎక్కి ఊరేగ దగిన, నాగస్య=ఏనుగు యొక్క, విషాణమ్=దంతమును, శకలీకృతమ్=ముక్కలు చేయబడిన దానిని గాను, జ్వలితమ్=ప్రజ్వలించుచున్న, జాతవేదసమ్=అగ్నిని, సహసా=హఠాత్తుగా, సంశాన్తమ్=శాంతించిన దానినిగాను, పృథివీమ్=భూమిని, అవదీర్ణాం చ=బ్రద్దలైన దానిని గాను, వివిధాన్=అనేక విధములైన, ద్రుమాన్=వృక్షములను, శుష్కాంశ్చ=ఎండిపోయిన వాటినిగాను, పర్వతాన్=పర్వతములను, విధ్వస్తాన్=నశించినవై, సధూమాన్=ధూమముతో కూడిన వాటినిగాను, పశ్యామి=చూచితిని.

తా. సముద్రము ఎండిపోయి నట్లు, చంద్రుడు నేలపై పడిపోయినట్లు, భూమి చీకటి కప్పివేయుటచేత వలె కనబడకుండ పోయినట్లు, రాజు ఉత్సవ సమయములలో అధిరోహించు గజము దంతములు విరిగిపోయినట్లు, ప్రజ్వలించు చున్న అగ్ని హఠాత్తుగా ఆరిపోయినట్లు, భూమి బ్రద్దలై పోయినట్లు, చెట్లన్నియు ఎండిపోయి నట్లు పర్వతములు నశించి ధూమముచే ఆవరింపబడి నట్లు, నాకు స్వప్నములో కనబడినది. 11, 12, 13

మూ. పీఠే కార్ష్ణాయసే చైనం నిషణ్ణం కృష్ణవాససమ్.
ప్రహసన్తి స్మ రాజానం ప్రమదాః కృష్ణపిఙ్గలాః. 14

ప్ర. అ. కార్ష్ణాయసే=ఇనుముతో చేసిన! పీఠే=పీఠమునందు, నిషణ్ణమ్=కూర్చొని ఉన్న, కృష్ణవాసనమ్=నల్లని వస్త్రములు గల, ఏనం రాజానమ్=ఈ రాజును, కృష్ణపిఙ్గలాః = నల్లగాను ఎఱ్ఱగాను ఉన్న, ప్రమదాః = స్త్రీలు, ప్రహసన్తి = నవ్వుచుండిరి.

తా. ఇనుముతో చేసిన ఆసనముపై, నా తండ్రి నల్లని వస్త్రములను ధరించి కూర్చున్నట్లును, ఆతనిని చూచి నల్లగాను, ఎర్రగాను ఉన్న స్త్రీలు పరిహాసపూర్వకముగా నవ్వుచున్నట్లును స్వప్నములో కనబడినది. 14

మూ. త్వరమాణశ్చ ధర్మాత్మా రక్తమాల్యానులేపనః,
రథేన ఖరయుక్తేన ప్రయాతో దక్షిణాముఖః. 16

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డైన నా తండ్రి, రక్తమాల్యానులేపనః= ఎఱ్ఱని పుష్పమాలలూ, మైపూతా కలవాడై, త్వరమాణశ్చ = తొందరపడుచు, ఖరయుక్తేన= గాడిదలతో కట్టబడిన, రథేన = రథముచేత, దక్షిణాముఖః = దక్షిణదిక్కునకు అభిముఖు డై, ప్రయాతః = వెళ్ళినాడు.

తా. ధర్మాత్ము డైన నా తండ్రి ఎఱ్ఱని మాలికలు ధరించి, ఎఱ్ఱని చందనము శరీరమునకు పూసుకొని, తొందరగా, గాడిదలు కట్టిన రథముపై ఎక్కి, దక్షిణాభిముఖముగా వెళ్ళి నట్లు స్వప్నములో కనబడినది. 15

మూ. ప్రహసన్తీవ రాజానం ప్రమదా రక్తవాసినీ.
ప్రకర్షన్తీ మయా దృష్టా రాక్షసీ వికృతాననా. 16

ప్ర. అ. రక్తవాసినీ = ఎఱ్ఱని వస్త్రములు ధరించినదీ, వికృతాననా = వికృత మైన ముఖము కలదీ అయిన, రాక్షసీ ప్రమదా = రాక్షసస్త్రీ, ప్రహసన్తీవ = నవ్వుచూ, రాజానమ్ = రాజును, ప్రకర్షన్తీ = లాగుచున్నదిగా, మయా = నాచేత, దృష్టా = చూడబడినది.

తా. ఎఱ్ఱని వస్త్రములు ధరించి, వికృత మైన ముఖము గల ఒక రాక్షస స్త్రీ, నవ్వుచూ, దశరథమహారాజును లాగుచున్నట్లుగా నాకు కనబడినది. 16

మూ. ఏవమేతన్మయా దృష్టమిమాం రాత్రిం భయావహమ్,
అహం రామోఽథవా రాజా లక్ష్మణో వా మరిష్యతి. 17

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఇమాం రాత్రిమ్ = ఈ రాత్రియందు, భయావహమ్ = భయముకలిగించు, ఏతత్ = ఇది, దృష్టమ్=చూడబడినది. అహమ్ = నేను గాని, అథ వా = లేక, రాజా = రాజు గాని, లక్ష్మణో వా = లక్ష్మణుడు గాని, మరిష్యతి = మరణించును.

తా. ఈ రాత్రి నేను ఇట్టి భయంకర మైన స్వప్నము చూచితిని. నాకు గాని, రామునకు గాని, రాజునకు గాని, లక్ష్మణునకు గాని మరణము రానున్నది.

మూ. నరో యానేన యః స్వప్నే ఖరయుక్తేన యాతి హి,
అచిరాత్తస్య ధూమాగ్రం చితాయాం సంప్రదృశ్యతే. 18

ప్ర. అ. స్వప్నే = స్వప్నమునందు, యః = ఏ, నరః = నరుడు, ఖరయుక్తేన=గాడిదలతో కట్టబడిన, యానేన=వాహనముచేత, యాతి=వెళ్లునో, అచిరాత్ = కొద్దికాలములోనే, చితాయామ్ = చితియందు, తస్య = అతని, ధూమాగ్రమ్=ధూమముయొక్క అగ్రభాగము, సంప్రదృశ్యతే = చూడబడును.

తా. ఎవడు గాడిదలు కట్టిన రథముపై ఎక్కి వెళ్లినట్లు స్వప్నము వచ్చునో, అతనిని దహించగా చితినుండి వచ్చు ధూమశిఖ, కొద్ది కాలములోనే కనబడును. 18

మూ. ఏతన్నిమిత్తం దీనోఽహం తన్న వః ప్రతిపూజయే,
శుష్యతీవ చ మే కణ్ఠో న స్వస్థమివ మే మనః. 19

ప్ర. అ. అహమ్ = నేను, ఏతన్నిమిత్తమ్=ఈ కారణయువలననే, దీనః =దీనుడనై ఉన్నాను. తత్ = ఆ కారణమువలన, వః = మిమ్ములను, న ప్రతిపూజయే=పూజించుటలేదు. మే=నాయొక్క, కణ్ఠః=కంఠము. శుష్యతీవ చ = ఎండిపోవుచున్నట్లున్నది. మే = నాయొక్క, మనః = మనస్సు, న స్వస్థమ్ ఇవ = స్వస్థముగా ఉన్నట్లు లేదు.

తా. అందుచేతనే నేను దీనుడనై మిమ్ములను సరిగా ఆదరించుటలేదు. నా కంఠము ఎండిపోవుచున్నట్లున్నది. నా మనస్సు కూడ స్వస్థముగా లేదు. 19

మూ. న పశ్యామి భయస్థానం భయం చైవోపధారయే,
భ్రష్టశ్చ స్వరయోగో మే ఛాయా చోపహతా మమ. 20
జుగుప్సన్నివ చాత్మానం న పశ్యామి చ కారణమ్.

ప్ర. అ. భయస్థానమ్ = భయహేతువును, న పశ్యామి = నేను చూచుట లేదు. భయం చైవ = భయమును మాత్రము, ఉపధారయే = నిశ్చయించు చున్నాను. మే = నాయొక్క, స్వరయోగః = కంఠధ్వనిసంబంధము, భ్రష్టః= నశించినది. మమ = నాయొక్క, ఛాయా చ = కాంతికూడ, ఉపహతా = కొట్టబడినది. ఆత్మానమ్=నన్ను నేనే, జుగుప్సన్నివ=అసహించుకొనునట్లున్నాను. కారణం చ = కారణమును, న పశ్యామి = చూడకున్నాను.

తా. దేనిని గూర్చి భయపడవలెనో తెలియుట లేదు గాని భయము మాత్రము తప్పకకలుగును అనిపించుచున్నది. నా కంఠస్వరము మందగించినది.

కాంతి తగ్గినది. కారణమేమియు లేకుండగనే నాపై నాకే జుగుప్స కలుగుచున్న ట్లున్నది. 20

మూ. ఇమాం హి దుఃస్వప్నగతిం నిశామ్య తా
మనేకరూపామవితర్కితాం పురా.
భయం మహత్తద్ధృదయాన్న యాతి మే,
విచిన్త్య రాజానమచిన్త్యదర్శనమ్. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనసప్తతితమః సర్గః

ప్ర. అ. అనేకరూపామ్ = అనేక మైన రూపములు కలదీ, పురా= పూర్వము, అతర్కితామ్ = ఊహింపబడనిదీ, తామ్ = అట్టి, ఇమామ్ = ఈ, దుఃస్వప్నగతిమ్ = దుఃస్వప్నముయొక్క గతిని, నిశామ్య=చూచి, రాజానమ్ = రాజును, అచిన్త్యదర్శనమ్=ఊహింపరాని దర్శనము కలవానినిగా, విచిన్త్య = ఆలోచించి, మహత్ = గొప్ప దైన, తత్ = ఆ, భయమ్ = భయము, మే హృదయాత్ = నా హృదయమునుండి, న యాతి = పోవుటలేదు.

తా. పూర్వ మెన్నడును ఊహింపబడని, అనేకరూపములు గల ఈ స్వప్నమును చూచుటచేతను, నా తండ్రి యైన దశరథమహారాజు దర్శనమును గూర్చి ఇక ఊహింప వనిలే దను చింత కలుగుటచేతను పుట్టిన ఈ మహా భయము నా హృదయమునుండి తొలగుటలేదు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో అరువది తొమ్మిదవ సర్గ సమాప్తము

# సప్తతితమః సర్గః

[దూతలు భరతుని తాతగారికి, మేనమామకు కానుక లొసగుట, వసిష్ఠుని సందేశము వినిపించుట. భరతుడు తండ్రి మున్నగువారి కుశల మడుగుట, తాతగారు భరతుని కనుజ్ఞ నిచ్చుట. ఆయన ఇచ్చిన కానుకలు తీసికొని భరతుడు శత్రుఘ్నసమేతుడై అయోధ్యకుబయలు దేరుట.]

మూ. భరతే బ్రువతి స్వప్నం దూతాస్తే క్లాన్తవాహనాః,
ప్రవిశ్యాసహ్యపరిఘం రమ్యం రాజగృహం పురమ్. 1
సమాగమ్య తు రాజ్ఞా చ రాజపుత్రేణ చార్చితాః,
రాజ్ఞః పాదౌ గృహీత్వా తు తమూచుర్భరతం వచః, 2

ప్ర. అ. భరతే=భరతుడు, స్వప్నమ్=స్వప్నమును, బ్రువతి=చెప్పుచుండగా, క్లాన్తవాహనాః=అలసినవాహనములు గల, తే దూతాః=ఆ దూతలు, అసహ్యపరిఘమ్=సహింపశక్యము కాని కందకము గల (లేదా కోటతలుపుల గడియలు గల), రమ్యమ్=సుందర మైన, రాజగృహమ్=రాజగృహ మను, పురమ్=పురమును, ప్రవిశ్య=ప్రవేశించి, రాజ్ఞా చ=కేకయరాజుతోను, రాజపుత్రేణ=రాజపుత్రు డైన యుధాజిత్తుతోను, సమాగమ్య=కలిసి, అర్చితాః=వారిచే ఆదరించబడినవారై, రాజ్ఞః=కేకయరాజుయొక్క, పాదౌ=పాదములను, గృహీత్వా=పట్టుకొని నమస్కరించి, తం భరతమ్=ఆ భరతుని గూర్చి, వచః=వాక్యమును, ఊచుః=పలికిరి.

తా. భరతుడు తన స్వప్నమును గూర్చి చెప్పుచున్న సమయమునందే, అలసిన గుఱ్ఱములు గల ఆ దూతలు, శత్రువులు దాట శక్యము కాని కందకము గల (లేదా దుర్భేద్య మైన కోట గడియలు గల) రమ్య మైన రాజగృహపురమును

ప్రవేశించి, కేకయరాజునూ, ఆతని కుమారుడైన యుధాజిత్తునూ కలిసి, వారిచే ఆదరింపబడినవారై, ఆ రాజు పాదములకు నమస్కరించి, భరతునితో ఇట్లనిరి.

మూ. పురోహితస్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మన్త్రిణః,
త్వరమాణశ్చ నిర్యాహి కృత్యమాత్యయికం త్వయా. 3

ప్ర. అ. పురోహితః = పురోహితుడు, త్వామ్ = నిన్ను గూర్చి, కుశలమ్ = కుశలమును, ప్రాహ = పలుకుచున్నాడు. సర్వే = సమస్తమైన, మన్త్రిణశ్చ = మంత్రులు కూడ పలుకుచున్నారు. త్వరమాణః చ = తొందరపడుచు, నిర్యాహి = బయలుదేరి రమ్ము. త్వయా = నీతో, ఆత్యయికమ్ = చాలకష్టముతో కూడిన, కృత్యమ్ = పని ఉన్నది.

తా. పురోహితుడును, మంత్రులందరును నీ కుశలము ప్రశ్నించుచున్నారు. వెంటనే నీవు బయలుదేరి రావలెను. నీతో చాల తొందర పని ఉన్నది. 3

మూ. ఇమాని చ మహార్హాణి వస్త్రాణ్యాభరణాని చ,
ప్రతిగృహ్య విశాలాక్ష మాతులస్య చ దాపయ. 4

ప్ర. అ. విశాలాక్ష = విశాలమైన నేత్రములు కలవాడా! ఇమాని = ఈ, మహార్హాణి = గొప్ప విలువ గల, వస్త్రాణి = వస్త్రములను, ఆభరణాని చ = అలంకారములను; ప్రతిగృహ్య = గ్రహించి, మాతులస్య = నీ మేనమామకు, దాపయ = ఇప్పించుము (ఇమ్ము).

తా. విశాలమైన నేత్రములు గలవాడా! చాల వెల గల ఈ వస్త్రములను, ఆభరణములను తీసికొని నీ మేనమామకు ఇమ్ము.

మూ. అత్ర వింశతికోట్యస్తు నృపతేర్మాతులస్య తే,
దశకోట్యస్తు సంపూర్ణాస్తథైవ చ నృపాత్మజ. 5

ప్ర. అ. నృపాత్మజ = రాజకుమారా! అత్ర = వీటిలో, వింశతికోట్యః = నూరు కోట్లు, నృపతేః = కేకయరాజునకు ఇవ్వదగినవి. తథైవ చ = అట్లే, సంపూర్ణాః = నిండు, దశకోట్యస్తు = పది కోట్లు, తే = నీయొక్క, మాతులస్య = మేనమామకు ఇవ్వదగినవి.

తా. రాజకుమారా ! ఈ వస్త్రాభరణాదులలో మీ మాతామహు డైన కేకయరాజునకు ఇవ్వదగినవాటి వెల ఇరువది కోట్లు. మీ మేనమామకు ఇవ్వ వలసిన వాటి వెల పూర్తి పది కోట్లు. 5

మూ. ప్రతిగృహ్య తు తత్సర్వం స్వనురక్తః సుహృజ్జనే,
దూతానువాచ భరతః కామైః సంప్రతిపూజ్య తాన్. 6

ప్ర. అ. సుహృజ్జనే=మిత్రులందు (బంధువులందు), స్వనురక్తః=చాలా ప్రేమ గల, భరతః = భరతుడు, తత్ సర్వమ్ = దాని నంతను, ప్రతిగృహ్య = తీసికొని, తాన్ = ఆ, దూతాన్ = దూతలను, కామైః = ఇష్టవస్తువులచేత, సంప్రతిపూజ్య = పూజించి, ఉవాచ = పలికెను.

తా. బంధువులపై ప్రేమ గల భరతుడు ఆ వస్తువుల నన్నింటిని తీసికొని ఆ దూతలకు కావలసిన వస్తువులను బహూకరించి, ఆదరించి ఇట్లు పలికెను. 6

మూ. కచ్చిత్సుకుశలీ రాజా పితా దశరథో మమ,
కచ్చిచ్చారోగతా రామే లక్ష్మణే చ మహాత్మని. 7

ప్ర. అ. మమ పితా = నా తండ్రి యైన, రాజా దశరథః = దశరథ మహారాజు, కచ్చిత్సుకుశలీ = బాగుగా క్షేమముగా ఉన్నాడా? రామే=రాముని యందును, మహాత్మని = మహాత్ము డైన, లక్ష్మణే చ = లక్ష్మణునియందును, అరోగతా కచ్చిత్ = ఆరోగ్యమే కదా!

తా. నా తండ్రిగా రైన దశరథమహారాజు క్షేమముగా నున్నాడా! రాముడును, మహాత్ము డైన లక్ష్మణుడును ఆరోగ్యముగా ఉన్నారా? 7

మూ. ఆర్యా చ ధర్మనిరతా ధర్మజ్ఞా ధర్మదర్శినీ,
అరోగా చాపి కౌసల్యా మాతా రామస్య ధీమతః. 8

ప్ర. అ. ఆర్యా చ=పూజ్యురాలూ, ధర్మనిరతా=ధర్మమునందు ఆసక్తి కలదీ, ధర్మజ్ఞా = ధర్మములు తెలిసినదీ, ధర్మదర్శినీ = ధర్మమును చూచునదీ, ధీమతః = బుద్ధిమంతు డైన, రామస్య=రామునియొక్క, మాతా = తల్లి అయిన, కౌసల్యా = కౌసల్యాదేవి, అపి అరోగా = రోగము లేకుండ ఉన్నదా?

తా. పూజ్యురాలూ, ధర్మమునందే ఆసక్తి కలదీ, ధర్మము నెరిగినదీ, ధర్మమునే చూచునదీ, ధీమంతు డైన రాముని తల్లి అయిన కౌసల్యాదేవి ఆరోగ్యముగా ఉన్నదా? 8

మూ. కచ్చిత్సుమిత్రా ధర్మజ్ఞా జననీ లక్ష్మణస్య యా,
శత్రుఘ్నస్య చ వీరస్య సారోగా చాపి మధ్యమా. 9

ప్ర. అ. యా = ఏ సుమిత్ర, ధర్మజ్ఞా = ధర్మము నెరిగినదో, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, వీరస్య = వీరు డైన, శత్రుఘ్నస్య చ = శత్రుఘ్నుని యొక్క, జననీ = తల్లియో, మధ్యమా = మా మధ్యమాంబ అయిన. సా సుమిత్రాపి = ఆ సుమిత్ర, కచ్చిత్ అరోగా = రోగములు లేకుండ ఉన్నదా?

తా. ధర్మములు తెలిసినదీ, లక్ష్మణునకూ, వీరు డైన శత్రుఘ్నునకూ తల్లి, మా మధ్యమాంబ అయిన సుమిత్రాదేవి ఆరోగ్యముగా ఉన్నదా? 9

మూ. ఆత్మకామా సదా చణ్డీ క్రోధనా ప్రాజ్ఞమానినీ,
అరోగా చాపి మే మాతా కైకేయీ కిమువాచ హ. 10

ప్ర. అ. ఆత్మకామా = తననే (తన సుఖమునే) కోరునదీ, సదా = ఎల్లప్పుడును, చణ్డీ = తీవ్రంగా ప్రవర్తించునదీ, క్రోధనా = కోప స్వభావము కలదీ, ప్రాజ్ఞమానినీ = బుద్ధిమంతురాల నను గర్వము గలదీ, మే మాతా = నా తల్లి అయిన, కైకేయీ = కేకేయి, అపి ఆరోగా = రోగము లేకుండా ఉన్నదా? కిమ్ = ఏమి, ఉవాచ హ = చెప్పినది?

తా. తన సుఖమునే కోరేదీ, తీవ్రముగా ప్రవర్తించేదీ, క్రోధ స్వభావురాలూ, బుద్ధిమంతురాల ననే గర్వము కలదీ అయిన, నా తల్లి కైకేయి ఆరోగ్యముగా ఉన్నదా? ఆమె మాకు ఏమి చెప్ప మన్నది? 10

మూ. ఏవముక్తాస్తు తే దూతా భరతేన మహాత్మనా,
ఊచుః సప్రశ్రయం వాక్యమిదం తం భరతం తదా. 11

ప్ర. అ. మహాత్మనా = మహాత్ము డైన, భరతేన = భరతుని చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, తే దూతాః = ఆ దూతలు, తదా = అప్పుడు, తం భర

తమ్ = ఆ భరతుని గూర్చి, సప్రశ్రయమ్=వినయముతో, కూడినట్లుగా, ఇదం వచః=ఈ వాక్యమును, ఊచుః=పలికిరి.

తా. మహాత్ముడైన భరతుని మాటలు విని ఆ దూతలు, భరతునితో సవినయముగా ఇట్లు పలికిరి. 11

మూ. కుశలాస్తే నరవ్యాఘ్ర యేషాం కుశల మిచ్ఛసి,
శ్రీశ్చ త్వాం వృణుతే పద్మా యుజ్యతాం చాపి తే రథః.

ప్ర. అ. నరవ్యాఘ్ర = ఓ నరశ్రేష్ఠుడా, యేషామ్ = ఎవరియొక్క, కుశలమ్ = కుశలమును, ఇచ్ఛసి = కోరుచున్నావో, తే=వారు, కుశలాః = క్షేమముగా ఉన్నారు. శ్రీః = ఐశ్వర్యము, పద్మా = లక్ష్మియు, త్వామ్=నిన్ను వృణుతే=కోరుచున్నది. తే=నీ యొక్క, రథః = రథము, యుజ్యతాం చాపి= కట్టబడుగాక.

తా. ఓ నరశ్రేష్ఠా! నీవు ఎవరి కుశలము కోరుచున్నావో వారందరును క్షేమముగా ఉన్నారు. నిన్ను ఐశ్వర్యము, లక్ష్మి వరించుచున్నవి. శీఘ్రముగా రథము కూర్చుకొని బయలుదేరుము.

వి. ఈ శ్లోకములోని ఉత్తరార్ధములో "నిన్ను లక్ష్మి వరించినది". అని చెప్పగానే భరతునకు చాలా వరకు విషయము అర్థమై పోవును. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసి నట్లు ఏవేవో భావాలు చెప్పుట సరిగాకుదరదు. ఈ విధముగ చెప్పిన దూతలు వసిష్ఠుని ఆజ్ఞప్రకారము తమ కర్తవ్యము నిర్వహించి నట్లు కాజాలదు.

"భరతుడు అమంగళమును ఆశంకించుచున్నాడు గాన తన్నివారణార్థమై లక్ష్మి వరించుచున్న దని పైకి చెప్పిన మాట (ఈ విషయము దూతల కెట్లు తెలిసినది?) రాజ్యలక్ష్మి నీకు లభించ నున్నది అని అంతరార్థము". "నీవు ఎవరి క్షేమమును కోరుచున్నావో వారందరును క్షేమముగా ఉన్నారు. నీకు రాజ్యలక్ష్మి లభింప నున్నది" అని చెప్పుటచే రాజ్యప్రాప్తికి కారణ మైన రామవనవాస దశరథమరణములు సూచింపబడినవి గాన దూతలు అసత్యము చెప్పిన దోషము లేదు."- ఇత్యాది విధముగ చేసిన వ్యాఖ్యానములోని ఔచిత్యము ఆ వ్యాఖ్యాతలకే తెలియవలెను.

ఇట్టి పరిస్థితులలో సత్యమును కప్పిపుచ్చినను అసత్యదోషము లేదు. కావుననే ప్రాచ్యపాఠములో ఈ శ్లోకార్థము లేదు. భరతుని తీసికొని రావలసి నదిగా దశరథుడే తమను పంపించి నట్లు దానిలో ఉన్నది.

"ఇతి తే కుశలం ప్రశ్నం పృష్టా దూతాః ససంభ్రమమ్,
మన్త్రిసంవరణం కృత్వా ప్రత్యూచుర్హృష్టమానసాః.
సర్వే హ్యేతే కుశలినో యేషాం కుశలమిచ్ఛసి,
ఆహ త్వాం చ పితా శీఘ్రమేహీతి రఘునన్దన.
యది పశ్యసి గన్తవ్యం గమ్యతామచిరాత్ తతః,
భృశం హి దర్శనాకాఙ్క్షీ పితా తే సహ మన్త్రిభిః." 12

మూ. భరతశ్చాపి తాన్ దూతానేవముక్తోఽభ్యభాషత,
ఆపృచ్ఛేఽహం మహారాజం దూతాః సంత్వరయన్తి మామ్.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, భరతశ్చాపి = భరతుడు, తాన్ = ఆ, దూతాన్ = దూతలను గూర్చి, అభ్యభాషత = పలికెను, "మామ్ = నన్ను, దూతాః = దూతలు, సంత్వరయన్తి = తొందరపెట్టుచున్నారు (అని), అహమ్ = నేను, మహారాజమ్ = మహారాజును, ఆపృచ్ఛే = అనుజ్ఞ వేడుచున్నాను".

తా. దూతల మాటలు విని భరతుడు వారితో "నన్ను దూతలు తొందర పెట్టుచున్నారు అని చెప్పి రాజు అనుజ్ఞ వేడెదను" అని చెప్పెను. 13

మూ. ఏవముక్త్వా తు తాన్ దూతాన్ భరతః పార్థివాత్మజః,
దూతైః సంచోదితో వాక్యం మాతామహమువాచ హ. 14

ప్ర. అ. దూతైః = దూతలచేత, సంచోదితః = ప్రేరేపింపబడిన, పార్థివాత్మజః = రాజకుమారుడైన, భరతః = భరతుడు, తాన్ దూతాన్ = ఆ దూతలను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, మాతామహమ్ = మాతామహుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. అయోధ్యాగమనమునకై దూతలచేత ప్రేరితుడైన రాజకుమారుడైన భరతుడు, వారితో పై విధముగ చెప్పి, తన మాతామహునితో ఇట్లు అనెను. 14

మూ. రాజన్ పితుర్గమిష్యామి సకాశం దూతచోదితః,
పునరప్యహమేష్యామి యదా మే త్వం స్మరిష్యసి. 15

ప్ర. అ. రాజన్ = రాజా! దూతచోదితః = దూతలచేత ప్రేరితుడనైన నేను, పితుః = తండ్రియొక్క, సకాశమ్=సమీపమును, గమిష్యామి = వెళ్ళెదను. త్వమ్ = నీవు, మే=నాకు (నన్ను), యదా = ఎప్పుడు, స్మరిష్యసి = స్మరించగలవో అప్పుడు, పునరపి = మరల, ఏష్యామి = రాగలను.

తా. మహారాజా! దూతలు నన్నయోధ్యకు రమ్మనుచున్నారు. నేను నా తండ్రిగారి వద్దకు వెళ్ళెదను. మరల నీవు ఎప్పుడు రమ్మనిన అప్పుడు వచ్చెదను. 15

మూ. భరతేనైవముక్తస్తు నృపో మాతామహస్తదా,
తమువాచ శుభం వాక్యం శిరస్యాఘ్రాయ రాఘవమ్. 16

ప్ర. అ. తదా = అప్పుడు, భరతేన = భరతుని చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మాతామహః = మాతామహుడైన, నృపః = కేకయరాజు, తమ్ = ఆ, రాఘవమ్ = భరతుని, శిరసి = శిరస్సు మీద, ఆఘ్రాయ = వాసన చూచి, శుభమ్ = మంగళకర మైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మాతామహుడైన కేకయరాజు భరతుని మాట విని, ఆతని శిరస్సుపై మూర్కొని, మంగళకర మైన వాక్యమును పలికెను. 16

మూ. గచ్ఛ తాతానుజానే త్వాం కైకేయీ సుప్రజాస్త్వయా,
మాతరం కుశలం బ్రూయాః పితరం చ పరంతప. 17

ప్ర. అ. తాత = నాయనా! గచ్ఛ = వెళ్ళుము. త్వామ్ = నిన్ను, అనుజానే=అనుమతించుచున్నాను. త్వయా = నీచేత, కైకేయీ = కైకేయి, సుప్రజాః = మంచి సంతానము కలది. పరంతప = శత్రువులను పీడించువాడా! మాతరమ్ = తల్లినీ, పితరం చ = తండ్రినీ, కుశలమ్ = క్షేమమును, బ్రూయాః = చెప్పుము.

తా. నాయనా! నేను అనుజ్ఞ ఇచ్చుచున్నాను; వెళ్లుము. నీవు కైకేయి సత్పుత్రుడవు. ఓ పరంతపా! నీ తల్లినీ, తండ్రినీ కుశల మడిగి నట్లు చెప్పుము.

మూ. పురోహితం చ కుశలం యే చాన్యే ద్విజసత్తమాః,
తౌ చ తాత మహేష్వాసౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 18

ప్ర. అ. తాత = నాయనా! పురోహితమ్ = పురోహితు డైన వసిష్ఠునీ, అన్యే = ఇతరు లైన, యే = ఏ, ద్విజసత్తమాః = బ్రాహ్మణశ్రేష్ఠు లున్నారో వారినీ, మహేష్వాసౌ = గొప్ప ధనుస్సులు గల, భ్రాతరౌ = సోదరు లైన, తౌ = ఆ, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులనూ, కుశలమ్ = కుశలము, బ్రూహి = చెప్పుము.

తా నాయనా! పురోహితు డైన వసిష్ఠునీ, ఇతరు లైన బ్రాహ్మణోత్తములనూ, మహాధనుర్ధరు లైన. ఆ సోదరులు రామలక్ష్మణులనూ కుశల మడిగినా నని చెప్పుము. 18

మూ. తస్మై హస్త్యుత్తమాంశ్చిత్రాన్ కమ్బళానజినాని చ,
అభిసత్కృత్య కైకేయో భరతాయ ధనం దదౌ. 19

ప్ర. అ. కైకేయః = కేకయమహారాజు, తస్మై = ఆ, భరతాయ = భరతునకు, హస్త్యుత్తమాన్ = ఉత్తము మైన గజములను, చిత్రాన్ = వివిధవర్ణములు గల, కమ్బళాన్ = కంబళములను, అజినాని చ = మృగచర్మములను, ధనమ్ = ధనమును, అభిసత్కృత్య = సత్కరించి, దదౌ = ఇచ్చెను.

తా కేకయరాజు, ఆ భరతునకు, ప్రేమపూర్వకముగా శ్రేష్ఠ మైన గజములను రంగు రంగుల కంబళ్లను, మృగచర్మములను ధనమును ఇచ్చెను. 19

మూ. రుక్మనిష్కసహస్రే ద్వే షోడశాశ్వశతాని చ,
సత్కృత్య కైకయీపుత్రం కేకయో ధనమాదిశత్ 20

ప్ర. అ. కేకయః = కేకయదేశరాజు, కైకయీపుత్రమ్ = భరతుని, సత్కృత్య = సత్కరించి, ద్వే = రెండు, రుక్మనిష్కసహస్రే = బంగారు హారముల సహస్రములను, షోడశ = పదునారు, అశ్వశతాని చ = అశ్వముల శతములను, ధనమ్ = ధనముగా, ఆదిశత్ = ఇచ్చెను.

తా. కేకయరాజు, భరతునకు ఆదరపూర్వకముగా రెండువేల బంగారు కంఠహారములు, పదునారు వందల అశ్వములు అను ధనమును బహూకరించెను.

మూ. తథామాత్యానభిప్రేతాన్ విశ్వాస్యాంశ్చ గుణాన్వితాన్,
దదావశ్వపతిః క్షిప్రం భరతాయానుయాయినః. 21

ప్ర. అ. తథా=అట్లే, అశ్వపతిః=అశ్వపతి, భరతాయ=భరతునకు, అభిప్రేతాన్=ఇష్టులును, విశ్వాస్యాన్=విశ్వసింపదగినవారును, గుణాన్వితాన్=గుణములతో కూడినవారును, అమాత్యాన్ = సర్వదా దగ్గర ఉండువారును అయిన, అనుయాయినః=అనుచరులను, దదౌ=ఇచ్చెను.

తా. అశ్వపతి శీఘ్రముగా ఆ భరతునకు, ఇష్టులూ, విశ్వాసపాత్రులూ, సద్గుణవంతులూ, సర్వదా సమీపముననే ఉండదగినవారూ అయిన అనుచరులను ఇచ్చెను. 21

మూ. ఐరావతానైన్ద్రశిరాన్నాగాన్వై ప్రియదర్శనాన్,
ఖరాన్ శీఘ్రాన్ సుసంయుక్తాన్మాతులోఽస్మై ధనం దదౌ

ప్ర. అ. మాతులః=మేనమామ, అస్మై = భరతునకు, ఐరావతాన్ = ఐరావతవంశమునందు పుట్టినవీ, ఐన్ద్రశిరాన్ = ఇంద్రశిరఃపర్వతమునందు పుట్టినవీ అయిన, ప్రియదర్శనాన్=ప్రియ మైన దర్శనము గల, నాగాన్ = ఏనుగులను, శీఘ్రాన్=శీఘ్రముగా నడచు, సుసంయుక్తాన్= బాగా శిక్షణము ఇవ్వబడిన, ఖరాన్=గాడిదలను, ధనమ్=ధనముగా, దదౌ=ఇచ్చెను.

తా. మేనమామ యైన యుధాజిత్తు అతనికి ఐరావతవంశమునకు చెందిన, ఇంద్రశిరఃపర్వతమునందు పుట్టిన, చూచుటకు అందమైన గజములూ, బాగుగా శిక్షణము ఇచ్చిన శీఘ్రముగా పరుగెత్తు గాడిదలూ అను ధనమును ఇచ్చెను. 22

మూ. అన్తఃపురేఽతిసంవృద్ధాన్ వ్యాఘ్రవీర్యబలాన్వితాన్,
దంష్ట్రాయుధాన్ మహాకాయాన్ శునశ్చోపాయనం దదౌ.

ప్ర. అ. అన్తఃపురే=అంతఃపురమునందు, అతిసంవృద్ధాన్=బాగుగా పెంచబడినవీ, వ్యాఘ్రవీర్యబలాన్వితాన్ = వ్యాఘ్రముల వంటి వీర్యముతోను బలముతోను కూడినవీ, దంష్ట్రాయుధాన్=కోరలే ఆయుధములుగా కలవీ,

మహాకాయాన్ = పెద్ద శరీరము కలవీ అయిన, శునశ్చ = కుక్కలను కూడ, ఉపాయనమ్ = కానుకగా, దదౌ = ఇచ్చెను.

తా. అంతఃపురములో చక్కగా పెంచబడినవీ, వ్యాఘ్రములతో సమాన మైన వీర్యబలములు కలవీ, కోరలే ఆయుధములుగా కలవీ, చాల పెద్ద శరీరము కలవీ అయిన కుక్కలను కూడ ఉపాయనముగా ఇచ్చెను. 23

మూ. స దత్తం కేకయేన్ద్రేణ ధనం తన్నాభ్యనన్దత,
భరతః కైకయీపుత్రో గమనత్వరయా తదా. 24

ప్ర. అ. తదా=అప్పుడు, గమనత్వరయా = వెళ్ళుటయందు తొందరచే, సః = ఆ, కైకయీపుత్రః = కైకేయికుమారు డైన, భరతః=భరతుడు, కేకయేన్ద్రేణ = కేకయరాజుచేత, దత్తమ్ = ఇవ్వబడిన, ధనమ్ = ధనమును, నాభ్యనన్దత = అభినందించలేదు.

తా. అయోధ్యకు వెళ్ళే తొందరలో ఉన్న కైకేయీపుత్రు డగు భరతునకు తన మాతామహు డిచ్చిన కానుక లేవియు ఆనందమును కలిగించలేదు.

మూ. బభూవ హ్యస్య హృదయే చిన్తా సుమహతీ తదా,
త్వరయా చాపి దూతానాం స్వప్నస్యాపి చ దర్శనాత్.

ప్ర. అ. దూతానామ్ = దూతలయొక్క, త్వరయా చాపి = తొందర చేతను, స్వప్నస్య = స్వప్నముయొక్క, దర్శనాచ్చాపి = చూచుటవలనను, తదా = అప్పుడు, అస్య = ఈతనియొక్క, హృదయే = హృదయమునందు, సుమహతీ = చాల అధిక మైన, చిన్తా = చింత, బభూవ హి = కలిగెను కదా!

తా. కారణ మేమనగా, దూతలు తొందరపెట్టుటను పట్టియు, తాను చూచిన స్వప్నముచేతను ఆ సమయమున ఆతని మనస్సు చాలా చింతాక్రాంత మై ఉండెను. 25

మూ. స స్వవేశ్మాభ్యతిక్రమ్య నరనాగాశ్వసంవృతమ్,
ప్రపేదే సుమహచ్ఛ్రీమాన్ రాజమార్గమనుత్తమమ్. 26

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః = భరతుడు, నరనాగాశ్వసంవృతమ్=నరులతోను, గజములతోను అశ్వములతోను కూడిన, సుమహత్ =

చాల పెద్దదైన, స్వవేశ్మ = తన గృహమును, అభ్యతిక్రమ్య = దాటి, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, రాజమార్గమ్ = రాజమార్గమును, ప్రపేదే = పొందెను.

తా. శ్రీమంతుడైన ఆ భరతుడు, నరులతోను, గజాశ్వాదులతోను నిండిన సువిశాలమైన తన గృహముమ దాటి శ్రేష్ఠమైన రాజమార్గమును ప్రవేశించెను.

మూ. అభ్యతీత్య తతోఽపశ్యదన్తఃపురముదారధీః,
తతస్తద్భరతః శ్రీమానావివేశానివారితః. 27

ప్ర. అ. ఉదారధీః = అధికమైన బుద్ధి గల భరతుడు, అభ్యతీత్య = రాజమార్గమును దాటి, తతః = పిమ్మట, అన్తఃపురమ్ = అంతఃపురమును. అపశ్యత్ = చూచెను. తతః = పిమ్మట, శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = భరతుడు, అనివారితః = నివారింపబడనివాడై, తత్ = ఆ అంతఃపురమును, ఆవివేశ = ప్రవేశించెను.

తా. ఉత్తమబుద్ధి గల ఆ భరతుడు రాజమార్గము దాటి వెళ్ళి, అంతఃపురమును చూచెను. పిదప ఆ శ్రీమంతుడైన భరతుడు, అడ్డమేమియు లేక ఆ అంతఃపురములో ప్రవేశించెను. 27

మూ. స మాతామహమాపృచ్ఛ్య మాతులం చ యుధాజితమ్,
రథమారుహ్య భరతః శత్రుఘ్నసహితో యయౌ. 28

ప్ర. అ. సః భరతః = ఆభరతుడు, మాతామహమ్ = మాతామహునీ, మాతులమ్ = మేనమామయైన, యుధాజితమ్ = యుధాజిత్తునూ, ఆపృచ్ఛ్య = అనుమతి అడిగి, శత్రుఘ్నసహితః = శత్రుఘ్నసమేతుడై, రథమ్ = రథమును. ఆరుహ్య = ఎక్కి, యయౌ = వెళ్ళెను.

తా. ఆ భరతుడు మాతామహునివద్దనూ, మేనమామయైన యుధాజిత్తు వద్దనూ సెలవుగైకొని, శత్రుఘ్నసమేతుడై రథమెక్కి బయలుదేరెను. 28

మూ. రథాన్ రత్నవిచిత్రాంశ్చ యోజయిత్వా పరఃశతమ్,
ఉష్ట్రగోశ్వఖరైర్భృత్యా భరతం యాన్తమన్వయుః. 29

ప్ర. అ. భృత్యాః = భృత్యులు, రత్నవిచిత్రాన్ = రత్నములచే విచిత్రములైన, పరఃశతాన్ = వందలు మించిన, రథాన్ = రథములను, యోజయిత్వా =

కూర్చుకొని, ఉష్ట్రగోశ్వబలైః = ఉష్ట్రములతోను, గోవులతోను, అశ్వబలములతోను, యాన్తమ్ = వెళ్ళుచున్న, భరతమ్ = భరతుని, అన్వయుః = అనుసరించి వెళ్ళిరి.

తా. భరతుడు ప్రయాణమై వెళ్ళుచుండగా, భృత్యులు, వందలకొలది రత్నవిచిత్రము లైన రథములను కూర్చుకొని, ఒంటెలు, గోవులు, అశ్వబలము మొదలగువాటితో భరతుని వెనుకనే వెళ్లిరి.

వి. "రథాన్ మణ్డలచక్రాంశ్చ" అను పాఠమునకు బదులు "రథాన్ రత్నవిచిత్రాంశ్చ" అను ప్రాచ్యపాఠము గ్రహింపబడునది. గుండ్రని చక్రములు గల రథములు అను విశేషణము నిరర్థకము కదా? 29

మూ. బలేన గుప్తో భరతో మహాత్మా
సహార్యకస్యాత్మసమైరమాత్యైః,
ఆదాయ శత్రుఘ్నమపేతశత్రుః
గృహాద్యయౌ సిద్ధ ఇవేన్ద్రలోకాత్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తతితమః సర్గః.

ప్ర. అ. బలేన = సైన్యముచేత, గుప్తః = రక్షించబడిన, మహాత్మా = మహాత్ము డైన, అపేతశత్రుః = తొలగిన శత్రువులు గల, భరతః = భరతుడు, ఆత్మసమైః = తనతో సమాను లైన, అమాత్యైః సహ = కూడనే ఉండు వీరులతోకూడ, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని, ఆదాయ = తీసికొని, ఆర్యకస్య = పూజ్యుడైన మాతామహుని యొక్క, గృహాత్ = గృహము నుండి, సిద్ధః = సిద్ధపురుషుడు, ఇన్ద్రలోకాదివ = ఇంద్రలోకమునుండి వలె, యయౌ = బయలుదేరెను.

తా. మహాత్ముడూ, శత్రువులు లేనివాడూ అయిన భరతుడు, సేనచే రక్షింపబడుచు, తనతో సమాను లైన శరీరరక్షకులును, శత్రుఘ్నుడును వెంట రాగా, సిద్ధపురుషుడు ఇంద్రలోకమునుండి బయలుదేరినట్లు మాతామహుని ఇంటి నుండి బయలుదేరెను. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
డెబ్బదవ సర్గ సమాప్తము.

## ఏకసప్తతితమః సర్గః

[భరతుడు రథసేనాసహితుడై బయలుదేరుట. వివిధ ప్రదేశములను దాటి అతడు ఉజ్జిహానానగరి ఉద్యానములో ప్రవేశించుట. సైన్యమును మెల్ల మెల్లగా రమ్మని ఆజ్ఞాపించి, తాను మాత్రము రథారూఢుడై వేగమున ముందుకు సాగి సాలవనము గడచి అయోధ్యా చెంతకు వచ్చుట. అటనుండి అయోధ్యానగరి దురవస్థను చూచుచు ముందుకు పోవుట సారథికి వెల్లువిరుచున్న తన దుఃఖమును తెలియజేయుచు రాజభవనమును ప్రవేశించుట].

మూ. స ప్రాఙ్ముఖో రాజగృహాదభినిర్యాయ రాఘవః,
తతః సుదామాం ద్యుతిమాన్ సంతీర్యావేక్ష్య తాం నదీమ్,
హ్లాదినీం దూరపారాం చ ప్రత్యక్స్రోతస్తరఙ్గిణీమ్,
శతద్రూమతరచ్ఛ్రీమాన్నదీమిక్ష్వాకునన్దనః. 2

ప్ర.అ. ద్యుతిమాన్ = కాంతి గల, శ్రీమాన్ = శ్రీమంతుడైన, ఇక్ష్వాకుకులనన్దనః = ఇక్ష్వాకుకులమునకు ఆనందకరుడైన, సః రాఘవః = ఆ భరతుడు, రాజగృహాత్ = రాజగృహమునుండి, ప్రాఙ్ముఖః = పూర్వాభిముఖుడై, అభినిర్యాయ = బయలుదేరి, తతః = అటు పిమ్మట, తామ్ = ఆ, సుదామామ్ = సుదామ అను, నదీమ్ = నదిని, అవేక్ష్య = చూచి, సంతీర్య = దానిని దాటి, హ్లాదినీమ్ = హ్లాదిని అను నదిని, దూరపారామ్ = దూరమైన ఒడ్డుగల, ప్రత్యక్స్రోతస్తరఙ్గిణీమ్ = పశ్చిమాభిముఖమైన ప్రవాహము గల నదియైన, శతద్రూం నదీమ్ = శతద్రూ నదిని, అతరత్ = దాటెను.

తా. కాంతి గలవాడు, శ్రీమంతుడు, ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడూ అయిన ఆ భరతుడు, రాజగృహమునుండి తూర్పు దిక్కునకు అభిముఖముగ బయలుదేరి, అచటినుండి సుదామానదిని చూచి దానిని దాటి, పిదప హ్లాదినీ నదిని, దూరమైన తీరము గల పశ్చిమాభిముఖముగా ప్రవహించు శతద్రూనదిని దాటెను. 1, 2

మూ. ఏలాధానే నదీం తీర్త్వా ప్రాప్య చాపరపర్పటాన్,
శిలామాకుర్వతీం తీర్త్వా ఆఙ్ఞేయం శల్యకర్తనమ్. 3
సత్యసన్ధః శుచిః శ్రీమాన్ ప్రేక్షమాణః శిలావహామ్.
అత్యయాత్స మహాశైలాన్ వనం చైత్రరథం ప్రతి. 4

ప్ర. అ. సత్యసన్ధః = సత్యసంధుడు, శుచిః = పరిశుద్ధుడు, శ్రీమాన్ = శ్రీమంతుడు అయిన, సః = ఆ భరతుడు, ఏలాధానే = ఏలాధానగ్రామము నందు, నదీమ్ = శతద్రూనదిని, తీర్త్వా = దాటి, అపరపర్పటాన్ = అపరపర్పట దేశమును, ప్రాప్య చ = పొంది, శిలామ్ = రాయిని, ఆకుర్వతీమ్ = ఆకర్షించు శిలావహ యను నదిని, తీర్త్వా = దాటి, ఆఙ్ఞేయమ్ = ఆఙ్ఞేయమును, శల్యకర్తనమ్ = శల్యకర్తనమును, శిలావహామ్ = శిలావహానదిని, ప్రేక్షమాణః = చూచుచు, చైత్రరథం వనం ప్రతి = చైత్రరథవనమును గూర్చి, మహాశైలాన్ = మహా పర్వతములను, అత్యయాత్ = దాటి వెళ్ళెను.

తా. సత్యసంధుడు, పరిశుద్ధుడు, శ్రీమంతుడు అయిన ఆ భరతుడు ఏలాధాన మను గ్రామమునందు శతద్రూనదినిదాటి. అపరపర్పటదేశమును చేరి, శిలలను లాగు శిలావహనదిని దాటి, ఆఙ్ఞేయము, శల్యకర్తనము అను గ్రామములను, శిలావహానదిని చూచుచు, మహాశైలములను దాటి, చైత్రరథవనము వైపు ప్రయాణము చేసెను. 3, 4

మూ. సరస్వతీం చ గఙ్గాం చ యుగ్మేన ప్రతిపద్య చ,
ఉత్తరం వీరమత్స్యానాం భారుణ్డం ప్రావిశద్వనమ్. 5

ప్ర. అ. సరస్వతీం చ = సరస్వతీనదిని, గఙ్గాం చ = గంగను, యుగ్మేన = యుగ్మముచేత, ప్రతిపద్య = పొంది, వీరమత్స్యానామ్ = వీరమత్స్యదేశమునకు, ఉత్తరమ్ = ఉత్తర మైన, భారుణ్డం వనమ్ = భారుండవనమును, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. సరస్వతీ గంగ లను నదీయుగ్మమును చేరి, వీరమత్స్యదేశమునకు ఉత్తరమున నున్న భారుండ మను వనమును ప్రవేశించెను.

మూ. వేగినీం చ కులిఙ్గాఖ్యాం హ్లాదినీం పర్వతావృతామ్,
యమునాం ప్రాప్య సంతీర్ణో బలమాశ్వాసయత్తదా. 6

ప్ర. అ. వేగినీమ్ = వేగముగలదీ, పర్వతావృతామ్ = పర్వతములచే ఆవరింపబడినదీ, హ్లాదినీమ్ = సంతోషమును కలిగించునదీ అయిన, కులిఙ్గాఖ్యామ్ = కులింగ అను పేరు గల నదిని, యమునామ్ = యమునానదిని, ప్రాప్య = పొంది, సంతీర్ణః = దాటినవాడై, తదా = అప్పుడు, బలమ్ = సైన్యమును, ఆశ్వాసయత్ = విశ్రమింప చేసెను.

తా. అక్కడినుండి, అధికవేగము కలది, ఆనందమును కలిగించునది, పర్వతములచే ఆవరింపబడినది అయిన కులింగనదిని, యమునానదిని చేరి, వాటిని దాటి, అక్కడ సైన్యమును, విశ్రమింపచేసెను. 6

మూ. శీతీకృత్య తు గాత్రాణి క్లాన్తానాశ్వాస్య వాజినః,
తత్ర స్నాత్వా చ పీత్వా చ ప్రాయాదాదాయ చోదకమ్.

ప్ర. అ. గాత్రాణి = అవయవములను, శీతీకృత్య = చల్లగా చేసి, క్లాన్తాన్ = అలసిన, వాజినః = అశ్వములను, ఆశ్వాస్య = సేదదీర్చి, తత్ర = అక్కడ, స్నాత్వా = స్నానముచేసి, పీత్వా చ = ఉదకము త్రాగి, ఉదకమ్ = ఉదకమును, ఆదాయ = తీసికొని, ప్రాయాత్ = వెళ్ళెను.

తా. అలసిన అశ్వముల శరీరముపై చల్లని నీరు చల్లి, వాటిని సేదదీర్చి, స్నానము చేసి, నీరు త్రాగి, కొంచెము నీరు కూడ తీసికొని ప్రయాణమై వెళ్ళెను.

మూ. రాజపుత్రో మహారణ్యమనభీక్ష్ణోపసేవితమ్,
భద్రో భద్రేణ యానేన మారుతః ఖమివాత్యయాత్. 8

ప్ర. అ. భద్రః = మంగళకరుడైన, రాజపుత్రః = దశరథుడు, అనభీక్ష్ణోపసేవితమ్ = మిక్కిలి సేవింపబడని, మహారణ్యమ్ = మహారణ్యమును, భద్రేణ = ఉత్తమమైన, యానేన = వాహనముచేత, మారుతః = వాయువు, ఖమివ = ఆకాశమును వలె, అత్యయాత్ = దాటి వెళ్ళెను.

తా. మంగళకరుడైన భరతుడు, జనసంచారము లేని ఆ అరణ్యమును ఉత్తమమైన వాహనముపై (లేదా భద్ర మను గజముపై) ఎక్కి, వాయువు ఆకాశమును దాటినట్లు దాటెను. 8

మూ. భాగీరథీం దుష్ప్రతరామంశుధానే మహానదీమ్,
ఉపాయాద్రాఘవస్తూర్ణం ప్రాగ్వటే విశ్రుతే పురే. 9

ప్ర. అ. రాఘవః = భరతుడు, విశ్రుతే = ప్రసిద్ధ మైన, ప్రాగ్వటే = ప్రాగ్వట మను, పురే = పురమునందు, అంశుధానే = అంశుధాన మను స్థానమునందు, దుష్ప్రతరామ్ = దాటుటకు శక్యము కాని, మహానదీమ్ = మహానది యైన భాగీరథీమ్ = గంగను, తూర్ణమ్ = శీఘ్రముగా, ఉపాయాత్ = చేరెను.

తా. భరతుడు, ప్రాగ్వట మను ప్రసిద్ధ మైన పురమునందు, అంశుధాన మను ప్రదేశమునందు, దాటుటకు కష్ట మైన భాగీరథీమహానదిని సమీపించెను. 9

మూ. స గఙ్గాం ప్రాగ్వటే తీర్త్వా సమాయాత్కుటికోష్ఠికామ్,
సబలస్తాం స తీర్త్వాథ సమాయాద్ధర్మవర్ధనమ్. 10

ప్ర. అ. సః = అతడు, ప్రాగ్వటే = ప్రాగ్వటమునందు, గఙ్గామ్ = గంగను, తీర్త్వా = దాటి, కుటికోష్ఠికామ్ = కుటికోష్ఠికానదిని, సమాయాత్ = చేరెను. సః = అతడు, సబలః = సైన్యసహితు డై, తామ్ = దానిని, తీర్త్వా = దాటి, అథ = పిమ్మట, ధర్మవర్ధనమ్ = ధర్మవర్ధన మను ప్రదేశమును, సమాయాత్ = చేరెను.

తా. అతడు ప్రాగ్వటమునందు గంగను దాటి, కుటికోష్ఠికానదిని చేరి సైన్యసహితు డై, ఆ నదిని కూడ దాటి, ధర్మవర్ధన మను గ్రామమును చేరెను.

మూ. తోరణం దక్షిణార్ధేన జమ్బూప్రస్థముపాగమత్,
వరూథం చ యయౌ రమ్యం గ్రామం దశరథాత్మజః.

ప్ర. అ. దశరథాత్మజః = భరతుడు, తోరణమ్ = తోరణ మను ప్రదేశమునకు, దక్షిణార్ధేన = దక్షిణముగా, జమ్బూప్రస్థమ్ = జంబూప్రస్థ గ్రామమును, ఉపాగమత్ = చేరెను, వరూథమ్ = వరూథ మను, రమ్యం = సుందర మైన, గ్రామం చ = గ్రామమును కూడ, యయౌ = పొందెను.

తా. భరతుడు, తోరణ మను ప్రదేశమునకు దక్షిణముగా ఉన్న జంబూప్రస్థమును, అక్కడినుండి వరూథ మను సుందర గ్రామమును చేరెను. 11

మూ. తత్ర రమ్యే వనే వాసం కృత్వాసౌ ప్రాఙ్ముఖో యయౌ,
ఉద్యానముజ్జిహానాయాః ప్రియకా యత్ర పాదపాః. 12

ప్ర. అ. అసౌ=భరతుడు, తత్ర=అక్కడ, రమ్యే = సుందరమైన, వనే=వనమునందు, వాసమ్=నివాసమును, కృత్వా=చేసి, ప్రాఙ్ముఖః=తూర్పునకు అభిముఖుడై, యత్ర = దేనియందు, ప్రియకాః = కదంబములు అను, పాదపాః= వృక్షములు అధికముగా ఉండెనో అట్టి, ఉజ్జిహానాయాః = ఉజ్జిహాన అను నగరము యొక్క, ఉద్యానమ్=ఉద్యానమును, యయౌ=పొందెను.

తా. భరతుడు, అక్కడ రమ్యమైన అరణ్యమునందు విడిది చేసి, అక్కడినుండి తూర్పుగా వెళ్ళి కదంబవృక్షములు అధికముగా గల, ఉజ్జిహాన నగర్యుద్యానమును చేరెను. 12

మూ. సాలాంస్తు ప్రియకాన్ ప్రాప్య శీఘ్రానాస్థాయ వాజినః,
అనుజ్ఞాప్యాథ భరతో వాహినీం త్వరితో యయౌ. 13

ప్ర. అ. భరతః=భరతుడు, సాలాన్=సాలవృక్షములను, ప్రియకాన్= ప్రియకవృక్షములను, ప్రాప్య = పొంది, శీఘ్రాన్=శీఘ్రముగా పరుగెత్తు, వాజినః =అశ్వములను, ఆస్థాయ=అవలంబించి, అథ=అటు పిమ్మట, వాహినీమ్= సేనను, అనుజ్ఞాప్య = ఒప్పించి, త్వరితః = తొందరగలవాడై, యయౌ = వెళ్ళెను.

తా. భరతుడు ఆ సాల-ప్రియకవృక్షములవద్ద విశ్రాంతి తీసికొని, అచటినుండి శీఘ్రముగా నడచు గుఱ్ఱములు కట్టిన రథమెక్కి మీరు వెనుక రండని సైన్యము నాదేశించి, తాను తొందరగా వెళ్ళెను. 13

మూ. వాసం కృత్వా సర్వతీర్థే తీర్త్వా చోత్తానికాం నదీమ్,
అన్యా నదీశ్చ వివిధాః పార్వతీయైస్తురఙ్గమైః, 14
హస్తిపృష్ఠకమాసాద్య కుటికామత్యవర్తత.
తతార చ నరవ్యాఘ్రో లౌహిత్యే స కపీవతీమ్. 15

ప్ర.అ. సర్వతీర్థే=సర్వతీర్థమను స్థానమునందు,వాసమ్=నివాసమును,కృత్వా =చేసి, ఉత్తానికాం నదీమ్=ఉత్తానిక అను నదిని, వివిధాః=అనేక విధములైన,

అన్యాః=ఇతర మైన, నదీశ్చ=నదులను, పార్వతీయైః=పర్వతములందు పుట్టిన, తురఙ్గమైః = గుఱ్ఱములతో, తీర్త్వా=దాటి, హస్తిపృష్ఠకమ్=ఏనుగను, ఆసాద్య = పొంది, కుటికామ్=కుటికానదిని, అత్యవర్తత=దాటెను. సః నరవ్యాఘ్రః = ఆ నరశ్రేష్ఠు డైన భరతుడు, లౌహిత్యే = లౌహిత్యమునందు, కపీవతీమ్= కపీవతీనదిని, తతార = దాటెను.

తా. ఆ నరశ్రేష్ఠుడు సర్వతీర్థ మను ప్రదేశమునందు నివసించి, పిదప ఉత్తానికానదిని ఇతర మైన అనేకవిధము లైన నదులను పర్వతములందు పుట్టిన అశ్వముల సాహాయ్యముతో దాటి, ఏనుగపై ఎక్కి కుటికానదిని దాటెను. పిదప లౌహిత్య మను ప్రదేశమున కపీవతీనదిని దాటెను. 14, 15

మూ. ఏకసాలే స్థాణుమతీం వినతే గోమతీం నదీమ్,
కలిఙ్గనగరే చాపి ప్రాప్య సాలవనం తదా, 16
భరతః క్షిప్రమాగచ్ఛత్సుపరిశ్రాన్తవాహనః.

ప్ర. అ. భరతః = భరతుడు, ఏకసాలే = ఏకసాలగ్రామమునందు, స్థాణుమతీమ్ = స్థాణుమతీనదిని, వినతే = వినతగ్రామమునందు, గోమతీం నదీమ్ = గోమతీ నదిని దాటి, సుపరిశ్రాన్తవాహనః = చాల అలసిపోయిన వాహనములు కలవాడై, తదా=అప్పుడు, కలిఙ్గనగరేచాపి=కలింగనగరమునందు, సాలవనమ్ = సాలవనమును, ప్రాప్య = పొంది, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆగచ్ఛత్ = వెళ్ళెను.

తా. భరతుడు ఏకసాలగ్రామమునందు స్థాణుమతీనదిని, వినతగ్రామమునందు గోమతీనదిని దాటి, అశ్వములు అలసిపోవుటచే కలింగనగరమునందలి సాలవనమున విశ్రమించి, మరల శీఘ్రముగ ప్రయాణము చేసెను. 16

మూ. వనం చ సమతీత్యాశు శర్వర్యామరుణోదయే. 17
అయోధ్యాం మనునా రాజ్ఞా నిర్మితాం సన్దదర్శ హ.

ప్ర. అ. ఆశు = శీఘ్రముగా, శర్వర్యామ్ = రాత్రియందు, వనం చ = వనమును కూడ, సమతీత్య = దాటి, అరుణోదయే = అరుణోదయసమయమున, మనునా రాజ్ఞా=మనుమహారాజుచేత, నిర్మితామ్=నిర్మింపబడిన, అయోధ్యామ్= అయోధ్యను, సన్దదర్శ హ = చూచెను.

తా. రాత్రియందే శీఘ్రముగా సాలవనమును దాటి వెళ్ళి అరుణోదయ సమయమునందు, మనుచక్రవర్తి నిర్మితమైన అయోధ్యానగరమును చూచెను.

మూ. తాం పురీం పురుషవ్యాఘ్రః సప్తరాత్రోషితః పథి. 18
అయోధ్యామగ్రతో దృష్ట్వా సారథిం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. పథి = మార్గమునందు, సప్తరాత్రోషితః = ఏడు రాత్రులు ఉన్న, పురుషవ్యాఘ్రః = ఆ పురుషశ్రేష్ఠుడు, అగ్రతః = ఎదుట, తామ్ = ఆ, అయోధ్యాం పురీమ్ = అయోధ్యను, దృష్ట్వా = చూచి, సారథిమ్ = సారథిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ప్రయాణములో ఏడు దినములు గడిపిన ఆ పురుషశ్రేష్ఠుడు, ఎదుట అయోధ్యానగరమును చూచి సారథితో ఇట్లనెను. 18

మూ. ఏషా నాతిప్రతీతా మే పుణ్యోద్యానా యశస్వినీ, 19
అయోధ్యా దృశ్యతే దూరాత్సారథే పాణ్డుమృత్తికా,
యజ్వభిర్గుణసంపన్నైర్బ్రాహ్మణైర్వేదపారగైః, 20
భూయిష్ఠమృద్ధైరాకీర్ణా రాజర్షిపరిపాలితా.

ప్ర. అ. సారథే = సారథీ! పుణ్యోద్యానా = పుణ్యమైన ఉద్యానములు కలది, యశస్వినీ = కీర్తి కలది, పాణ్డుమృత్తికా = తెల్లని మట్టి కలది, యజ్వభిః = యాగములు చేసినవారు, గుణసంపన్నైః = సద్గుణసంపన్నులు, వేదపారగైః = వేదముల పారమును చూచినవారు, భూయిష్ఠమ్ = చాలవరకు, ఋద్ధైః = ఐశ్వర్యవంతులు అయిన, బ్రాహ్మణైః = బ్రాహ్మణులతో, ఆకీర్ణా = వ్యాప్తమైనదీ, రాజర్షిపరిపాలితా = రాజర్షులచే పాలింపబడినదీ అయిన, ఏషా = ఈ, అయోధ్యా = అయోధ్య, మే = నాకు, నాతిప్రతీతా = అంతగా స్పష్టము కాకుండ, దూరాత్ = దూరమునుంచి, దృశ్యతే = కనబడుచున్నది.

తా. సారథీ! పుణ్యమైన ఉద్యానములతో ఒప్పుచు, మంచి కీర్తి కలిగిన ఈ అయోధ్యానగరము నాకు దూరమునుండి అస్పష్టముగ కనబడుచున్నది. తెల్లని మట్టి గల ఈ నగరమును ఎందరో రాజర్షులు పాలించి ఉన్నారు. ఉత్తమ గుణసంపన్నులు, వేదవేత్తలు చాలవరకు ఐశ్వర్యవంతులు, ఎన్నియో యజ్ఞములు చేసినవారు అయిన బ్రాహ్మణు లిక్కడ నివసించుచున్నారు. 19, 20

మూ. అయోధ్యాయాం పురా శబ్దః శ్రూయతే తుములో మహాన్,
సమన్తాన్నరనారీణాం తమద్య న శృణోమ్యహమ్.

ప్ర. అ పురా = పూర్వము, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, నర నారీణామ్ = స్త్రీపురుషులయొక్క, మహాన్ = గొప్ప, తుములః=వ్యాకుల మైన, శబ్దః=శబ్దము, సమన్తాత్ = అంతటను, శ్రూయతే=వినబడుచుండెడిది. అద్య= ఇప్పుడు, తమ్= ఆ శబ్దమును, అహమ్ = నేను, న శృణోమి = వినుటలేదు.

తా. పూర్వము అయోధ్యలో స్త్రీ పురుషాదుల సంచారము వలన, గొప్ప కలకలధ్వని వినబడు చుండెడిది. ఈనాడు వినబడుట లేదు. 21

మూ. ఉద్యానాని హి సాయాహ్నే క్రీడిత్వోపరతైర్నరైః,
సమన్తాత్పరిధావద్భిః ప్రకాశన్తే మమాన్యథా. 22

ప్ర. అ. సాయాహ్నే = సాయంకాలమునందు, క్రీడిత్వా=క్రీడించి, ఉప రతైః=విరమించిన, సమన్తాత్ = అంతటను, పరిధావద్భిః= పరుగెత్తుచున్న, నరైః=నరులతో, ఉద్యానాని = ఉద్యానములు, మమ=నాకు, అన్యథా=మరి యొక విధముగా, ప్రకాశన్తే హి = ప్రకాశించుచుండెడివి కదా.

తా. సాయంకాలమునందు వచ్చి, రాత్రి అంతయు క్రీడించి, ఉదయము ననే ఇండ్లకు పరుగెత్తుచున్న నరులతో ఉద్యానములు పూర్వము నాకొక విధముగ కనబడుచుండెడివి. 22

మూ. తాన్యద్యానురుదన్తీవ పరిత్యక్తాని కామిభిః, 23
అరణ్యభూతేవ పురీ సారథే ప్రతిభాతి మే.

ప్ర. అ. కామిభిః = కాముకులచేత, పరిత్యక్తాని=విడువబడిన, తాని=ఆ ఉద్యానములు, అద్య=ఇపుడు, అనురుదన్తీవ=ఏడ్చుచున్న ట్లున్నవి. సారథే= సారథీ! పురీ=పట్టణము, అరణ్యభూతేవ=అరణ్యముగా అయినట్లు, మే=నాకు, ప్రతిభాతి=కనబడుచున్నది.

మూ. న హ్యత్ర యానైర్దృశ్యన్తే న గజైర్న చ వాజిభిః, 24
నిర్యాన్తో వాభియాన్తో వా నరముఖ్యా యథాపురమ్.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, నరముఖ్యాః=నరశ్రేష్ఠులు, యథాపురమ్=పూర్వమునందు వలె, యానైః=వాహనముల చేత, నిర్యాన్తో వా=బైటకు పోవుచున్నవారు గాని, అభియాన్తో వా=వచ్చుచున్నవారుగా గాని, న దృశ్యన్తే హి=చూడబడుట లేదు కదా! గజైః=గజములచేత, న=కనబడుటలేదు. వాజిభిః చ=అశ్వములచేత కూడ, న=కనబడుటలేదు.

తా. ఇప్పుడిక్కడ నరశ్రేష్ఠులు వెనుకటి వలె వాహనములపై గాని, గజములపైగాని, అశ్వములపై గాని ఎక్కి, నగరములో ప్రవేశించుచు గాని, నగరమునుండి నిర్గమించుచుగాని కనబడుట లేదు. 24

మూ. ఉద్యానాని పురా భాన్తి మత్తప్రముదితాని చ,
జనానాం రతిసంయోగేష్వత్యన్తగుణవన్తి చ. 25

ప్ర. అ. పురా=పూర్వము, ఉద్యానాని=ఉద్యానవనములు, మత్తప్రముదితాని చ=మదించినవి గాను ఆనందభరితములుగాను, జనానామ్=జనులయొక్క, రతిసంయోగేషు=ఆనందముకొరకై కలియుటయందు, అత్యన్తగుణవన్తి చ=మిక్కిలి గుణములు కలవిగాను, భాన్తి=ప్రకాశించుచుండెడివి.

తా. పూర్వము ఉద్యానవనము లన్నియు జనులు ఆనందపూర్వకముగా కలసి విహరించుటకు (లేదా కాముకులు కలియుటకు) అనుకూలముగా ఉండుటచే మదించినట్లు, ఆనందభరితము లైనట్లును కనబడుచుండెడివి. 25

మూ. తాన్యేతాన్యద్య పశ్యామి నిరానన్దాని సర్వశః, 26
స్రస్తపర్ణైరనుపథం విక్రోశద్భిరివ ద్రుమైః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అనుపథమ్=మార్గసమీపమున, స్రస్తపర్ణైః=రాలిపోయిన ఆకులు కలవై, విక్రోశద్భిరివ=ఏడ్చుచున్నట్లు ఉన్న, ద్రుమైః=చెట్లతో, తాన్యేవ=ఆ ఉద్యానవనములనే, అద్య=ఇప్పుడు, సర్వశః = అన్ని వైపుల, నిరానన్దాని=ఆనందరహితములనుగా, పశ్యామి=చూచుచున్నాను.

తా. ఆ ఉద్యానవనములే నేడు ఆకులు రాలిపోయి మార్గసమీపమున ఏడ్చుచున్నట్లు నిలచిన వృక్షములతో, అన్ని వైపులా, ఆనందశూన్యములుగా కనబడుచున్నవి. 26

మూ. నాద్యాపి శ్రూయతే శబ్దో మత్తానాం మృగపక్షిణామ్, 27
సంరక్తాం మధురాం వాణీం కలం వ్యాహరతాం బహు.

ప్ర. అ. సంరక్తామ్ = రాగముతో నిండిన, మధురామ్ = మధుర మైన, వాణీమ్ = వాక్కును, బహు = అధికముగా, కలమ్ = అవ్యక్తమధురముగా, వ్యాహరతామ్ = పలుకుచున్న, మత్తానామ్ = మదించిన, మృగపక్షిణామ్ = మృగములయొక్కయు, పక్షులయొక్కయు, శబ్దః = శబ్దము, అద్యాపి = ఇంకను, న శ్రూయతే = వినబడుటలేదు.

తా. సూర్యోదయ మయినను, మదించి, అనురాగభరితము, మధురము అయిన ధ్వనులను చేయు మృగపక్ష్యాదుల శబ్దములు వినబడుటలేదు. 27

మూ. చన్దనాగురుసంపృక్తో ధూపసంమూర్ఛితోఽతులః, 28
ప్రవాతి పవనః శ్రీమాన్ కిం ను నాద్య యథాపురమ్.

ప్ర. అ. చన్దనాగురుసంపృక్తః = చందన అగురుల గంధముతో కూడినదీ, ధూపసంమూర్ఛితః = ధూపముచే వ్యాపింపబడినదీ అయిన, శ్రీమాన్ = అధిక మైన శోభ గల, పవనః = వాయువు, అద్య = ఇప్పుడు, యథాపురమ్ = పూర్వమునందువలె, కిం ను = ఎందుచేతనో, న ప్రవాతి = వీచుటలేదు.

తా. చందనగంధము, అగరుగంధము కలిసి, ధూపముచే వ్యాప్త మైన సుఖకర మైన వాయువు, వెనుకటి వలె ఈనాడు ఇంకను వీచుటలేదు; కారణ మేమై ఉండునో! 28

మూ. భేరీమృదఙ్గవీణానాం కోణసంఘట్టితః పునః, 29
కిమద్య శబ్దో విరతః సదాఽదీనగతిః పురా.

ప్ర. అ. పురా = పూర్వము, అదీనగతిః = తగ్గని గమనముగల, పునః = మాటిమాటికి, కోణసంఘట్టితః = (వాయించు) దండాదులచే కొట్టబడిన, భేరీమృదఙ్గవీణానామ్ = భేరీమృదంగవీణల యొక్క, శబ్దః = శబ్దము, అద్య = ఇప్పుడు, కిమ్ = ఎందుచేత, విరతః = ఆగిపోయినది?

తా. పూర్వము ఎన్నడును తగ్గని ప్రసారము గల, కోణసంఘట్టనముచే పుట్టిన భేరీమృదంగవీణాదుల ధ్వని ఇప్పుడు ఆగిపోయినది ఎందుచేతనో! 29

మూ. అనిష్టాని చ పాపాని పశ్యామి వివిధాని చ, 30
నిమిత్తాన్యమనోజ్ఞాని తేన సీదతి మే మనః.

ప్ర. అ. అనిష్టాని = అనిష్టమును కలిగించునవీ, పాపాని = పాపకరములూ, అమనోజ్ఞాని = మనోహరములు కానివీ అయిన, వివిధాని = అనేక విధము లైన, నిమిత్తాని = నిమిత్తములను, పశ్యామి = చూచుచున్నాను. తేన = దానిచేత, మే = నాయొక్క, మనః = మనస్సు, సీదతి = దుఃఖించుచున్నది.

తా. అనిష్టమును కలిగించునవీ, క్రూరములూ, అయిన అనేక విధము లైన చెడు శకునములు కనబడుచున్నవి. అందుచే నా మనస్సు చాల బాధపడుచున్నది. 30

మూ. సర్వథా కుశలం సూత దుర్లభం మమ బన్ధుషు, 31
తథా హ్యసతి సంమోహే హృదయం సీదతీవ మే.

ప్ర. అ. సూత = సారథీ, సర్వథా = అన్ని విధముల, మమ = నాయొక్క, బన్ధుషు = బంధువులలో, కుశలమ్ = క్షేమము, దుర్లభమ్ = దుర్లభమైనది. తథాహి = అది యుక్తమే కదా (ఏల అనగా) సంమోహే = సంమోహము చెందుటకు కారణము, అసతి = లేకున్నను, మే = నాయొక్క, హృదయమ్ = హృదయము, సీదతీవ = క్షీణించుచున్న ట్లున్నది.

తా. సారథీ, అన్ని విధములా నా బంధువులకు క్షేమము దుర్లభ మనియే తోచుచున్నది. ఏల ననగా, దుఃఖహేతు వేదీ కనబడకున్నను నా మనస్సు దిగులుచెందుచున్నట్లున్నది. 31

మూ. విషణ్ణః శ్రాన్తహృదయస్త్రస్తః సులులితేన్ద్రియః, 32
భరతః ప్రవివేశాశు పురీమిక్ష్వాకుపాలితామ్.

ప్ర. అ. విషణ్ణః = దుఃఖితుడు, శ్రాన్తహృదయః = అలసట చెందిన హృదయము కలవాడూ, త్రస్తః = భయము చెందినవాడూ, సులులితేన్ద్రియః = అధికముగ నలిగిపోయిన, ఇంద్రియములు కలవాడూ అయిన, భరతః = భర

తుడు, అశు = శీఘ్రముగా, ఇక్ష్వాకుపాలితామ్ = ఇక్ష్వాకులచే పాలింపబడిన, పురీమ్ = పట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఈ విధముగ దిగులు చెంది, అలసిన హృదయముతో, పట్టు తప్పిన ఇంద్రియములు కలవాడై భరతుడు అయోధ్యానగరమును భయపడుచు ప్రవేశించెను. 32

మూ. ద్వారేణ వైజయన్తేన ప్రావిశచ్ఛ్రాన్తవాహనః, 33
ద్వాఃస్థైరుత్థాయ విజయముక్తస్తైః సహితో యయౌ.

ప్ర. అ. శ్రాన్తవాహనః = అలసిన అశ్వములు గల భరతుడు, వైజయన్తేన = వైజయంత మను, ద్వారేణ = ద్వారముచే, ప్రావిశత్ = ప్రవేశించెను. ద్వాఃస్థైః = ద్వారమునం దున్న వారిచేత, ఉత్థాయ = లేచి, విజయమ్ = విజయమును, ఉక్తః = చెప్పబడినవాడై, తైః = వారితో, సహితః = కూడినవాడై, యయౌ = వెళ్లెను.

తా. అలసిపోయిన గుఱ్ఱములతో ఆ భరతుడు, వైజయంత మను ద్వారము నుండి లోనికి ప్రవేశించి, ద్వారపాలకులు లేచి జయజయధ్వానములు చేయగా వారితో కలిసి వెళ్ళెను. 33

మూ. స త్వనేకాగ్రహృదయో ద్వాఃస్థం ప్రత్యర్చ్య తం జనమ్,
సూతమశ్వపతేః కాన్తమబ్రవీత్తత్ర రాఘవః.

ప్ర. అ. సః = ఆ, రాఘవః తు = భరతుడైతే, అనేకాగ్రహృదయః = నిలకడ లేని మనస్సు కలవాడై, ద్వాఃస్థమ్ = ద్వారములో నున్న, తమ్ = ఆ, జనమ్ = జనమును, ప్రత్యర్చ్య = బదులుగా ఆదరించి, తత్ర = అక్కడ, అశ్వపతేః = అశ్వపతికి, కాన్తమ్ = ఇష్టుడైన, సూతమ్ = సారథిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మనస్సులో వ్యాకులత చెందిన భరతుడు, ఆ ద్వారపాలకులను గౌరవించి, అశ్వపతికి ఇష్టుడైన ఆ సారథితో ఇట్లు పలికెను. 34

మూ. కిమహం త్వరయానీతః కారణేన వినానఘ, 35
అశుభాశఙ్కి హృదయం శీలం చ పతతీవ మే.

ప్ర.అ. అనఘ=దోషములు లేనివాడా! అహమ్=నేను, కారణేన వినా=కారణము లేకుండగా, త్వరయా=తొందరతో, కిమ్=ఎందుచేత, ఆనీతః=తీసికొని రాబడితినో! హృదయమ్=హృదయము, అశుభాశఙ్కి=అశుభమును ఆశంకించుచున్నది. మే=నాయొక్క, శీలం చ=శీలము కూడ, పతతీవ=పతితమగుచున్న ట్లున్నది.

తా. దోషములు లేని ఓ సారథీ! ఏ కారణము లేకుండగా నన్ను ఇంత తొందరగా ఎందుకు రప్పించినారో! నా మనస్సు ఏదో అమంగళమును శంకించుచున్నది. నా సచ్ఛీలము పతిత మైపోయిన ట్లున్నది. 35

మూ. శ్రుతా నో యాదృశాః పూర్వంన్నృపతీనాం వినాశనే, 36
ఆకారాంస్తానహం సర్వానిహ పశ్యామి సారథే.

ప్ర. అ. సారథే=సారథీ! నృపతీనామ్=రాజులయొక్క, వినాశనే=నాశనమునందు, యాదృశాః=ఎట్టివి, పూర్వమ్=పూర్వము, నః=మాకు, శ్రుతాః=వినబడినవో, తాన్=ఆ, సర్వాన్=సమస్త మైన, ఆకారాన్=ఆకారములను, అహమ్=నేను, పశ్యామి=చూచుచున్నాను.

తా. సారథీ! రాజులు మరణించి నపుడు ఎట్టి చిహ్నములు కలుగు నని పూర్వము వినుచుండెడివారమో అట్టి చిహ్నము లన్నీ ఇక్కడ కనబడుచున్నవి.

మూ. సంమార్జనవిహీనాని పరుషాణ్యుపలక్షయే, 37
అసంయతకవాటాని శ్రీవిహీనాని సర్వశః,
బలికర్మవిహీనాని ధూపసంమోదనేన చ, 38
అనాశితకుటుమ్బాని ప్రభాహీనజనాని చ
అలక్ష్మీకాని పశ్యామి కుటుంబిభవనాన్యహమ్. 39

ప్ర. అ. అహమ్=నేను, సంమార్జనవిహీనాని=తుడుచుట లేని, కుటుంబిభవనాని=కుటుంబవంతుల భవనములను, పరుషాణి=చూచుటకు వికారముగా నున్న వాటినిగా, ఉపలక్షయే=చూచుచున్నాను. అసంయతకవాటాని=మూయబడని తలుపులు కలవాటినిగాను, సర్వశః=అంతటను, శ్రీవిహీనాని=శోభ లేనివాటిని గాను, బలికర్మవిహీనాని=బలికర్మలతో శూన్య మైన వాటిని గాను, ధూపసంమోదనేన చ=ధూపముచే సుగంధము కలిగించుటతో కూడ

శూన్యమైనవాటిని గాను, అనాశితకుటుమ్బాని=భోజనము చేయని కుటుంబములు కలవాటినిగాను, ప్రభాహీనజనాని చ = కాంతి లేని జనులు కలవాటిని గాను, అలక్ష్మీకాని = లక్ష్మీ శూన్యములను గాను, పశ్యామి = చూచుచున్నాను.

తా. అయోధ్యలోని కుటుంబవంతుల భవనము లన్నీ, తుడవక పోవు టచే ఎబ్బెట్టుగా కనబడుచున్నవి. వీటి తలుపు లన్నియు తెరచి ఉన్నవి. అన్ని వైపుల శోభావిహీనము లై ఉన్నవి. ఎవ్వరును పూజలకు సంబంధించిన బలులు మొదలగునవి ఇచ్చినట్లు లేదు. ధూపముచే ఈ భవనములు సుగంధములుగా లేవు. కుటుంబములోనివా రందరు భోజనములు లేక శోభావిహీను లై ఉన్నారు. భవనముల కుండవలసిన లక్ష్మీ కనబడుటలేదు. 37,38,39

మూ. అపేతమాల్యశోభాని అసంమృష్టాజిరాణి చ,
దేవాగారాణి శూన్యాని న చాభాన్తి యథాపురమ్. 40

ప్ర. అ. అపేతమాల్యశోభాని = పోయిన పుష్పమాలాశోభలు కలవి, అసంమృష్టాజిరాణి చ = చక్కగ అలకబడని ముంగిళ్లు గలవీ అయిన, దేవా గారాణి = దేవాలయములు, శూన్యాని = శూన్యము లై, యథాపురమ్=పూర్వము నందు వలె, నాభాన్తి చ = ప్రకాశించుటలేదు.

తా. దేవాలయములలో మాలికల శోభ లేదు. వాటి ముంగిళ్ళను తుడిచి అలకలేదు. ఇవి శూన్యము లై, పూర్వము ప్రకాశించి నట్లు ప్రకాశించుట లేదు.

మూ. దేవతార్చాః ప్రవిద్ధాశ్చ యజ్ఞగోష్ఠ్యస్తథావిధాః,
మాల్యాపణేషు రాజన్తే నాద్య పణ్యాని వా తథా. 41

ప్ర. అ. దేవతార్చాః = దేవతల పూజలు లేదా దేవతావిగ్రహములు, ప్రవిద్ధాః చ=కొట్టబడిఉన్నవి. యజ్ఞగోష్ఠ్యః=యజ్ఞముల గోష్ఠులు, తథావిధాః= అట్లే ఉన్నవి. తథా=మరియు, మాల్యాపణేషు=మాలికల అంగళ్ళలో, అద్య= ఇప్పుడు, పణ్యాని = అమ్మదగిన మాలాదులు, న రాజన్తే = ప్రకాశించుటలేదు.

తా. దేవతాపూజలు ఆగిపోయినవి. లేదా దేవతామూర్తులు కాంతివిహీన ముగా ఉన్నవి. యజ్ఞగోష్ఠులు నడచుటలేదు. పుష్పమాలలు అమ్మే అంగళ్ళు మాలలు లేక శోభాశూన్యముగా ఉన్నవి. 41

మూ. దృశ్యన్తే వణిజోఽప్యద్య న యథాపూర్వమత్ర వై,
ధ్యానసంవిగ్నహృదయాః నష్టవ్యాపారయన్త్రితాః. 42

ప్ర. అ. నష్టవ్యాపారయన్త్రితాః = నష్ట మైన వ్యాపారముచే నియంత్రితులై, ధ్యానసంవిగ్నహృదయాః = ఆలోచనలచే దిగులు చెందిన మనస్సు గల, వణిజోఽపి = వర్తకులు కూడ, అద్య = ఇప్పుడు, అత్ర = ఇక్కడ, యథాపూర్వమ్ = వెనుకటి వలె, న దృశ్యన్తే = కనబడుటలేదు.

తా. వ్యాపారము లేకపోవుటచే ఉత్సాహము లేక, ఆలోచనలతో దిగులు చెందిన మనస్సు కలవారై, వర్తకులు కూడ ఇపు డిక్కడ, వెనుకటి వలె కనబడుటలేదు, 42

మూ. దేవాయతనచైత్యేషు దీనాః పక్షిగణాస్తథా, 43
మలినం చాశ్రుపూర్ణాక్షం దీనం ధ్యానపరం కృశమ్,
సస్త్రీపుంసం చ పశ్యామి జనముత్కణ్ఠితం పురే. 44

ప్ర. అ. తథా = మరియు, దేవాయతనచైత్యేషు = దేవాలయములందును చైత్యములందును, పక్షిగణాః = పక్షుల సముదాయములు, దీనాః = దీనముగా ఉన్నవి. పురే = పట్టణమునందలి, సస్త్రీపుంసమ్ = స్త్రీపురుషులతో కూడిన, జనమ్ = జనమును, ఉత్కణ్ఠితమ్ = బెంగగొన్నదానినిగాను, మలినమ్ = మలినమునుగాను, అశ్రుపూర్ణాక్షమ్ = కన్నీళ్ళతో నిండిన నేత్రములు కలదానినిగాను, దీనమ్ = దీన మైనదానిని గాను, ధ్యానపరమ్ = చింతలో మునిగినదానినిగాను, కృశమ్ = కృశించినదానిని గాను, పశ్యామి = చూచుచున్నాను.

తా. దేవాలయములలోను, చైత్యములందును (చైత్యము లనగా వీథుల మొగలలో ఉన్న కట్టడములు, లేదా పూజాస్థానములకు సంబంధించిన శిలానిర్మితగృహములు; లేదా వీథులలో ఉన్న మఱ్ఱిచెట్లు) నివసించు పక్షిసముదాయములు దీనముగా ఉన్నవి. నగరములోని స్త్రీపురుషు లందరును, బెంగపెట్టుకొని, మలినవస్త్రధారులై, కన్నీళ్ళు నిండిన నేత్రములతో, దీనులై, చింతానిమగ్నులై, కృశించి ఉన్నారు. 43, 44

మూ. ఇత్యేవముక్త్వా భరతః సూతం తం దీనమానసః,
తాన్యనిష్టాన్యయోధ్యాయాం ప్రేక్ష్య రాజగృహం యయౌ

ప్ర. అ. భరతః = భరతుడు, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, తాని = ఆ, అనిష్టాని = అనిష్టములను, ప్రేక్ష్య = చూచి, దీనమానసః = దీనమైన మనస్సు కలవాడై, తం సూతమ్ = ఆ సారథిని గూర్చి, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, రాజగృహమ్ = రాజభవనమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. భరతుడు అయోధ్యలో ఆ అనిష్టము లైన అపశకునాదులను చూచి, దైన్యము చెందిన మనస్సుతో, ఆ సారథితో ఈ విధముగ పలికి, రాజభవనమునకు వెళ్లెను. 45

మూ. తాం శూన్యశృఙ్గాటక వేశ్మరథ్యాం
రజోఽరుణద్వారకవాటయన్త్రామ్,
దృష్ట్వా పురీమిన్ద్రపురప్రకాశాం
దుఃఖేన సంపూర్ణతరో బభూవ. 46

ప్ర. అ. శూన్యశృఙ్గాటక వేశ్మరథ్యామ్ = జనశూన్యములుగా ఉన్న చతుష్పథములు, గృహములు, వీథులు కలదీ, రజోఽరుణద్వారకవాటయన్త్రామ్ = పరాగముచే ఎఱ్ఱ నైన ద్వారముల తలుపులు దారుబంధములు గలదీ, ఇన్ద్రపురప్రకాశామ్ = ఇంద్రుని పురమువంటి ప్రకాశముగల, తాంపురీమ్ = ఆ అయోధ్యను, దృష్ట్వా = చూచి, దుఃఖేన = దుఃఖముతో, సంపూర్ణతరః = మిక్కిలి నిండినవాడు, బభూవ = ఆయెను.

తా. ఇంద్రుని పురియైన అమరావతితో సమాన మైన ఆ అయోధ్య, పరాగముతో ఎఱ్ఱ నైన తలుపుల దారుబంధములతో, చతుష్పథములందును, గృహములందును, వీథులందును జనశూన్యముగ ఉండుట చూచిన ఆ భరతునకు చాల దుఃఖము కలిగెను. 45

మూ. బహూని పశ్యన్ మనసోఽప్రియాణి
యాన్యన్యదా నాస్య పురే బభూవుః,
అవాక్ఛిరా దీనమనా నహృష్టః
పితుర్మహాత్మా ప్రవివేశ వేశ్మ. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకసప్తతితమః సర్గః.

ప్ర. అ. అన్యదా = ఇతరసమయములందు, యాని = ఏవి, అస్య = ఈతనియొక్క, పురే = పురమునందు, న బభూవుః = జరగలేదో, అట్టి, బహూని = అనేక మైన, మనసః = మనస్సునకు, అప్రియాణి = ప్రియము కాని వాటిని, పశ్యన్ = చూచుచు, అవాక్ఛిరాః = వంగిన శిరస్సుకలవాడై, దీనమనాః = దీన మైన మనస్సు కలవాడై, నహృష్టః = సంతోషించనివాడై, మహాత్మా = మహాత్ము డైన భరతుడు, పితుః = తండ్రియొక్క, వేశ్మ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మహాత్ము డైన భరతుడు, పూర్వ మెన్నడును ఆ పురములో జరగని, మనస్సుకు అప్రియమైనవాటిని ఎన్నియో చూచుచు, దైన్యముతో నిండిన మనస్సుతో, సంతోషవిహీనుడై, తల వంచుకొని, తండ్రి గృహమును ప్రవేశించెను. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో డెబ్బదిఒకటవవ సర్గ సమాప్తము.

# అథ ద్విసప్తతితమః సర్గః

[భరతుడు కైకేయి భవనమునకు పోయి తల్లికి ప్రణమిల్లుట, ఆమె చెప్పగా, తన తండ్రి స్వర్గస్థుడయ్యెనని విని దుఃఖితుడై విలపించుట, అన్న రాముడెక్కడ అని యడిగి ఆమె వలన రామవనవాసవార్త్తను వినుట.]

మూ. అపశ్యంస్తు తతస్తత్ర పితరం పితురాలయే,
జగామ భరతో ద్రష్టుం మాతరం మాతురాలయే. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భరతః = భరతుడు, తత్ర = అక్కడ, పితుః = తండ్రియొక్క, ఆలయే = గృహమునందు, పితరమ్ = తండ్రిని, అపశ్యన్ = చూడనివాడై, మాతుః = తల్లియొక్క. ఆలయే = గృహమునందు, మాతరమ్ = తల్లిని, ద్రష్టుమ్ = చూచుటకు, జగామ = వెళ్ళెను.

తా. తండ్రి గృహములో తండ్రి కనబడకపోగా, భరతుడు, తల్లిని చూచుటకై ఆమె గృహమునకు వెళ్ళెను. 1

మూ. అనుప్రాప్తం తు తం దృష్ట్వా కైకేయీ ప్రోషితం సుతమ్
ఉత్పపాత తదా హృష్టా త్యక్త్వా సౌవర్ణమాసనమ్. 2

ప్ర. అ. కైకేయీ = కైకేయి, ప్రోషితమ్ = ప్రవాసమునందున్న, తం సుతమ్ = ఆ కుమారుని. అనుప్రాప్తమ్ = వచ్చినవానినిగా, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, హృష్టా = సంతోషించినదై, సౌవర్ణమ్ = బంగారువికారమైన, ఆసనమ్ = ఆసనమును, త్యక్త్వా = విడచి, ఉత్పపాత = ఎగిరి లేచెను.

తా. దూరదేశములో ఉండి, తిరిగి వచ్చిన తన కుమారుని చూడగానే, కైకేయి, సంతోషించినదై, బంగారు ఆసనమునుండి ఎగిరి లేచెను. 2

మూ. స ప్రవిశ్యైవ ధర్మాత్మా స్వగృహం శ్రీవివర్జితమ్,
భరతః ప్రతిజగ్రాహ జనన్యాశ్చరణౌ శుభౌ. 3

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ము డైన, సః భరతః=ఆ భరతుడు, శ్రీవివర్జితమ్=శోభావిహీన మైన, స్వగృహమ్=తన గృహమును, ప్రవిశ్యైవ=ప్రవేశించగానే, జనన్యాః=తల్లియొక్క, శుభౌ=మంగళకరము లైన, చరణౌ=పాదములను, ప్రతిజగ్రాహ=పట్టుకొనెను.

తా. ధర్మాత్ము డైన ఆ భరతుడు శోభావిహీన మై ఉన్న తన గృహములో ప్రవేశించి మంగళకరము లైన తల్లి పాదములు స్పృశించి నమస్కరించెను. 3

మూ. సా తం మూర్ధన్యుపాఘ్రాయ పరిష్వజ్య యశస్వినమ్,
అఙ్కే భరతమారోప్య ప్రష్టుం సముపచక్రమే. 4

ప్ర. అ. సా=ఆమె, యశస్వినమ్=కీర్తిమంతు డైన, తం భరతమ్=ఆ భరతుని, మూర్ధని=శిరస్సుపై, ఉపాఘ్రాయ=వాసన చూచి, పరిష్వజ్య=కౌగలించుకొని, అఙ్కే=ఒడిలో, ఆరోప్య=కూర్చుండబెట్టుకొని, ప్రష్టుమ్=అడుగుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. ఆమె, యశఃశాలి యైన ఆ భరతుని శిరస్సుపై మూర్కొని, కౌగలించుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొని, ప్రశ్నింప ప్రారంభించెను. 4

మూ. అద్య తే కతిచిద్రాత్ర్యశ్చ్యుతస్యార్యకవేశ్మనః,
అపి నాధ్వశ్రమః శీఘ్రం రథేనాపతత స్తవ. 5

ప్ర. అ. అర్యకవేశ్మనః=మాతామహుని ఇంటినుండి, చ్యుతస్య=బయలుదేరిన, తే=నీకు, అద్య=నేడు, కతిచిత్=ఎన్ని, రాత్ర్యః=రాత్రు లైనవి? శీఘ్రమ్=శీఘ్రముగా, రథేన=రథముచేత, ఆపతతః=వచ్చిన, తవ=నీకు, అధ్వశ్రమః=మార్గాయాసము, అపి న=లేదు కదా?

తా. నీవు తాతగారి ఇంటినుండి బయలుదేరి ఎన్ని రోజు లైనవి? రథముపై శీఘ్రముగా ప్రయాణము చేయుటచే నీ కేమియు మార్గాయాసము కలగ లేదుకదా? 5

మూ. ఆర్యకస్తే సుకుశలీ యుధాజిన్మాతులస్తవ,
ప్రవాసాచ్చ సుఖం పుత్ర సర్వం మే వక్తుమర్హసి. 6

ప్ర. అ. పుత్ర = కుమారా ! తే = నీయొక్క, ఆర్యకః = తాత, సుకుశలీ=బాగుగా క్షేమముగా ఉన్నాడా? తవ=నీయొక్క, మాతులః=మేన మామ యైన, యుధాజిత్ = యుధాజిత్తు, క్షేమముగా ఉన్నాడా ? ప్రవాసాత్ = ప్రవాసమువలన, సుఖమ్ = సుఖమే కదా? మే=నాకు, సర్వమ్=సమస్తమును, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. కుమారా ! నీ తాత, నీ మేనమామ యైన యుధాజిత్తూ క్షేమముగా ఉన్నారా ? నీ ప్రవాసము సుఖముగా గడచినదా ? ఈ విషయము లన్నీ చెప్పుము. 6

మూ. ఏవం పృష్టస్తు కైకేయ్యా ప్రియః పార్థివనన్దనః,
ఆచష్ట భరతః సర్వం మాత్రే రాజీవలోచనః. 7

ప్ర. అ. రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు గల, పార్థివ నన్దనః = రాజకుమారు డైన, భరతః = భరతుడు, కైకేయ్యా = కైకేయిచేత, ఏవమ్=ఈ విధముగా, ప్రియమ్=సంతోషముగా, పృష్టః = అడగబడినవాడై, మాత్రే = తల్లికి, సర్వమ్=సమస్తమును. ఆచష్ట = చెప్పెను.

తా. పద్మముల వంటి నేత్రములు గల రాజకుమారు డైన భరతుడు, కైకేయి ప్రేమపూర్వకముగా ఇట్లు ప్రశ్నించగా, ఆమెకు అంతయు చెప్పెను. 7

మూ. అద్య మే సప్తమీ రాత్రిశ్చ్యుతస్యార్యకవేశ్మనః,
అమ్బాయాః కుశలీ తాతో యుధాజిన్మాతులశ్చ మే. 8

ప్ర. అ. ఆర్యకవేశ్మనః=తాతగారి ఇంటినుండి, చ్యుతస్య=బయలు దేరిన, మే=నాకు, అద్య=నేడు, సప్తమీ=ఏడవ, రాత్రిః=రాత్రి. అమ్బాయాః= తల్లియొక్క, తాతః=తండ్రీ, మే=నాయొక్క, మాతులశ్చ=మేనమామ యైన, యుధాజిత్ = యుధాజిత్తూ, కుశలీ=క్షేమముగా నున్నాడు.

తా. నేను తాతగారి ఇంటినుండి బయలుదేరి నేటికి ఏడు రోజు లైనది. నీ తండ్రి యైన కేకయరాజూ, నా మేనమామ యైన యుధాజిత్తూ క్షేమముగా ఉన్నారు. 8

మూ. యన్మే ధనం చ రత్నం చ దదౌ రాజా పరంతపః,
పరిశ్రాన్తం పథ్యభవత్తతోఽహం పూర్వమాగతః. 9

ప్ర. అ. పరంతపః = శత్రువులను తపింపచేయు, రాజా = కేకయరాజు, మే = నాకు, యత్ = ఏ, ధనం చ = ధనమును, రత్నం చ = రత్నమును, దదౌ = ఇచ్చెనో, అది, పథి = మార్గమునందు, పరిశ్రాన్తమ్ = అలసినది, అభవత్ = ఆయెను. తతః = దానికంటె, అహమ్ = నేను, పూర్వమ్ = ముందుగా, ఆగతః = వచ్చినాను.

తా. శత్రుసంహారకుడైన కేకయరాజు నాకు ఇచ్చిన ధనమును, రత్నములను, తీసికొనివచ్చువారు మార్గములో అలసట చెందుటచే వారిని వెనుక రమ్మని, నేను ముందుగా వచ్చితిని. 9

మూ. రాజవాక్యహరైర్దూతైస్త్వర్యమాణోఽహమాగతః,
యదహం ప్రష్టుమిచ్ఛామి తదమ్బా వక్తుమర్హతి. 10

ప్ర. అ. అహమ్ = నేను, రాజవాక్యహరైః = రాజుమాటలను తెచ్చిన, దూతైః = దూతలతో, త్వర్యమాణః = తొందరపడుచు, ఆగతః = వచ్చినాను. అహమ్ = నేను, యత్ = దేనిని, ప్రష్టుమ్ = అడుగుటకు, ఇచ్ఛామి = కోరుచున్నానో, తత్ = దానిని, అమ్బా = తల్లి, వక్తుమ్ = చెప్పుటకు, అర్హతి = తగిఉన్నది.

తా. రాజసందేశము తీసుకొని వచ్చిన దూతలు తొందరపెట్టుటచే నేను ముందుగా వచ్చినాను. నేను కొన్ని ప్రశ్నలు అడగదలచుచున్నాను. సమాధానము చెప్పుము. 10

మూ. శూన్యోఽయం శయనీయస్తే పర్యఙ్కో హేమభూషితః,
న చాయమిక్ష్వాకుజనః ప్రహృష్టః ప్రతిభాతి మా. 11

ప్ర. అ. శయనీయః = శయనించుటకు తగినదీ, హేమభూషితః = బంగారముచే అలంకరింపబడినదీ అయిన, అయమ్ = ఈ, తే = నీయొక్క, పర్యఙ్కః = పాన్పు, శూన్యః = శూన్యముగా నున్నది. అయమ్ = ఈ, ఇక్ష్వాకుజనః = ఇక్ష్వాకువంశీయుల జనము, ప్రహృష్టః = ఆనందముతో కూడినదిగా, మా = నన్ను గూర్చి (నాకు), న ప్రతిభాతి = కనబడుటలేదు.

తా. శయనించుటకు తగినదీ, బంగారముచే అలంకరింపబడినదీ అయిన నీ పర్యంకము శోభావిహీనముగా ఉన్నది. ఇక్కడనున్న దశరథమహారాజు పరివారజను లెవ్వరును ఆనందముగ ఉన్నట్లు కనబడుటలేదు. 11

మూ. రాజా భవతి భూయిష్ఠమిహామ్బాయా నివేశనే,
తమహం నాద్య పశ్యామి ద్రష్టుమిచ్ఛన్నిహాగతః. 12

ప్ర. అ. రాజా=రాజు, భూయిష్ఠమ్=ఎక్కువగా, ఇహ = ఇక్కడ, అమ్బాయాః = తల్లి యొక్క, నివేశనే = గృహమునందు, భవతి = ఉండును. అద్య = ఇపుడు, తమ్ = అతనిని, అహమ్ = నేను, న పశ్యామి = చూచుట లేదు. ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛన్ = కోరుచు, ఇహ=ఇక్కడికి, ఆగతః= వచ్చినాను.

తా. దశరథమహారాజు ఎక్కువగా, ఇక్కడ నీ గృహములో ఉంటుండును. ఈనాడు అయన కనబడుట లేదు. ఆయనను చూచుటకై నే నిక్కడికి వచ్చినాను. 12

మూ. పితుర్గ్రహీష్యే చరణౌ తం మమాఖ్యాహి పృచ్ఛతః,
ఆహో స్విదమ్బ జ్యేష్ఠాయాః కౌసల్యాయా నివేశనే. 13

ప్ర. అ. అమ్బ = తల్లీ! పితుః = తండ్రియొక్క, చరణౌ = పాదములను, గ్రహీష్యే = గ్రహించెదను. పృచ్ఛతః = ప్రశ్నించుచున్న, మమ = నాకు, తమ్ = అతనినిగూర్చి, ఆఖ్యాహి = చెప్పుము. ఆహోస్విత్ = లేదా, జ్యేష్ఠాయాః = పెద్ద తల్లి యైన, కౌసల్యాయాః = కౌసల్యయొక్క, నివేశనే = గృహమునం దున్నాడా?

తా. నా తండ్రిగారి పాదాభివందనము చేయవలెను. ఆయనను గూర్చి చెప్పుము. ఆయన ఇక్కడికి రానిచో, నా పెద్దతల్లి యైన కౌసల్య గృహములో ఉన్నాడా? 13

మూ. తం ప్రత్యువాచ కైకేయీ ప్రియవద్ఘోరమప్రియమ్,
అజానన్తం ప్రజానన్తీ రాజ్యలోభేన మోహితా. 14

ప్ర. అ. ప్రజానన్తీ = విషయము లన్నియు తెలిసిన దైనను, రాజ్యలోభేన

=రాజ్యలోభము చేత, మోహితా = మోహితురాలైన, కైకేయీ = కైకేయి, ఘోరమ్ = భయంకర మైన, అప్రియమ్ = అప్రియ మైన విషయమును, ప్రియ వత్ = ప్రియమును వలె, అజానన్తమ్ = ఈ విషయము లేవియు తెలియని, తమ్ = ఆతనిని గూర్చి, ప్రత్యువాచ = పలికెను.

తా. అన్ని విషయములు తెలిసిన దైనను, రాజ్యలోభముచే మోహితురాలైన ఆ కైకేయి ఈ విషయము లేవియు తెలియని ఆ భరతునకు, భయంకర మైన అప్రియవిషయమును ప్రియమును, చెప్పినట్లు చెప్పెను. 14

మూ. యా గతిః సర్వభూతానాం తాం గతిం తే పితా గతః,
రాజా మహాత్మా తేజస్వీ యాయజూకః సతాం గతిః. 15

ప్ర. అ. రాజా = రాజు, మహాత్మా = మహాత్ముడు, తేజస్వీ = తేజస్సు కలవాడు, యాయజూకః = యజ్ఞములు చేయు స్వభావము కలవాడు, సతామ్= సత్పురుషులకు, గతిః = ఆశ్రయభూతుడు అయిన, తే పితా = నీ తండ్రి, సర్వభూతానామ్ = అన్ని ప్రాణులకు, యా = ఏది, గతిః = గతియో, తాం గతిమ్ = ఆ గతిని, గతః = పొందినాడు.

తా. మహారాజు మహాత్ముడు, తేజఃశాలీ, యజ్ఞములు చేసినవాడు, సత్పురుషులకు ఆశ్రయభూతుడూ అయిన నీ తండ్రి ప్రాణు లన్నింటికి ఏది చివరి గతియో, ఆ గతిని పొందినాడు. 15

మూ. తచ్ఛ్రుత్వా భరతో వాక్యం ధర్మాభిజనవాన్ శుచిః,
పపాత సహసా భూమౌ పితృశోకబలార్దితః. 16

ప్ర. అ. ధర్మాభిజనవాన్=ధర్మమూ సద్వంశమూ కలవాడూ, శుచిః= పరిశుద్ధ స్వభావుడూ అయిన, భరతః=భరతుడు, తత్ = ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా = విని, పితృశోకబలార్దితః = పితృశోకముచే అధికముగా పీడింపబడినవాడై, సహసా = వెంటనే, భూమౌ=నేలపై, పపాత=పడెను.

తా. ధార్మికుడు, సత్కులమునందు పుట్టినవాడు, పరిశుద్ధ మైన చరిత్ర కలవాడూ అయిన భరతుడు ఆ మాట వినగానే, పితృశోకముచే మిక్కిలి బాధ పడుచు వెంటనే నేలపై పడిపోయెను. 16

మూ. హా హతోఽస్మీతి కృపణాం దీనాం వాచముదీరయన్,
నిపపాత మహాబాహుర్బాహూ విక్షిప్య వీర్యవాన్. 17

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, వీర్యవాన్ = పరాక్రమ వంతుడైన భరతుడు, హా హతః అస్మి = అయ్యో చచ్చితిని, ఇతి = అని, కృపణామ్ = జాలి కలిగించు, దీనామ్ = దీనమైన, వాచమ్ = వాక్కును, ఉదీరయన్ = పలుకుచు, బాహూ = బాహువులను, విక్షిప్య = చాచి, నిపపాత = పడెను.

తా. ఆజానుబాహుడూ, వీర్యవంతుడూ అయిన ఆ భరతుడు, "అయ్యో చచ్చితిని" అని జాలి కొలుపునట్లుగా, దీనముగా పలుకుచు, చేతులు చాచి నేలపై పడెను. 17

మూ. తతః శోకేన సంవీతః పితుర్మరణదుఃఖితః,
విలలాప మహాతేజా భ్రాన్తాకులిత చేతనః. 18

ప్ర. అ. తతః = పిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల భరతుడు శోకేన = శోకముతో, సంవీతః = కూడినవాడై, పితుః = తండ్రియొక్క, మరణ దుఃఖితః = మరణముచే దుఃఖించినవాడై, భ్రాన్తాకులితచేతనః = భ్రాంతి చెంది వ్యాకులమైన బుద్ధి కలవాడై, విలలాప = విలపించెను.

తా. మహాతేజఃశాలియైన ఆ భరతునకు పితృమరణముచే కలిగిన దుఃఖము భరింపరానిదై ఆతని మనస్సును కలత చెందునట్లు చేసెను. ఇట్లు శోకాక్రాంతుడై అతడు విలపించెను. 18

మూ. ఏతత్ స్మ రుచిరం భాతి పితుర్మే శయనం పురా,
శశినేవామలం రాత్రౌ గగనం తోయదాత్యయే 19

ప్ర. అ. మే పితుః = నా తండ్రియొక్క, ఏతత్ = ఈ, రుచిరమ్ = సుందరమైన, శయనమ్ = శయనము, పురా = పూర్వమునందు, తోయ దాత్యయే = వర్షాకాలము గడచిన పిమ్మట, రాత్రౌ = రాత్రియందు, అమలమ్ = నిర్మలమైన, గగనమ్ = ఆకాశము, శశినేవ = చంద్రునిచేత వలె, భాతి స్మ = ప్రకాశించెడిది.

తా. సుందర మైన ఈ నా తండ్రి శయనము, వర్షాకాలము గడచిన పిమ్మట నిర్మలముగా ఉన్న రాత్రియందు ఆకాశము చంద్రునితో ప్రకాశించి నట్లు ప్రకాశించుచుండెడిది. 19

మూ. తదిదం న విభాత్యద్య విహీనం తేన ధీమతా,
వ్యోమేవ శశినా హీనమప్శుష్క ఇవ సాగరః. 20

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతు డైన, తేన = నా తండ్రితో, విహీనమ్= శూన్య మైన, తత్ ఇదమ్=ఆ ఈ శయనమే, అద్య=ఇప్పుడు, శశినా=చంద్రు నితో, హీనమ్ = శూన్య మైన, వ్యోమేవ=ఆకాశము వలె, అప్శుష్కః=ఎండిన నీరు గల, సాగరః ఇవ = సముద్రము వలె, న విభాతి = ప్రకాశించుటలేదు.

తా. ధీశాలి యైన నా తండ్రి లేకపోవుటచే, ఆ శయనమే ఈనాడు, చంద్రుడు లేని ఆకాశము వలె, నీరు ఎండిపోయిన సముద్రము వలె, ప్రకాశ రహిత మై ఉన్నది. 20

మూ. బాష్పముత్సృజ్య కణ్ఠేన స్వాత్మనా పరిపీడితః,
ఆచ్ఛాద్య వదనం శ్రీమద్వస్త్రేణ జయతాం వరః. 21

ప్ర. అ. జయతామ్ = జయించువారిలో, వరః = శ్రేష్ఠు డైన భరతుడు, కణ్ఠేన=కంఠము చేత, బాష్పమ్=బాష్పమును, ఉత్సృజ్య=విడచి, వస్త్రేణ= వస్త్రముచేత, శ్రీమత్ = శోభాయుక్త మైన, వదనమ్ = ముఖమును, ఆచ్ఛాద్య= కప్పికొని, స్వాత్మనా = తన మనస్సుచేత, పరిపీడితః = అధికముగా పీడితు డయ్యెను.

తా. జయించువారిలో శ్రేష్ఠు డైన భరతుడు, కంఠముతో బాష్పమును (డగ్గుత్తికను కలిగించు శ్లేష్మాదికమును) విడచుచు, శోభాయుక్త మైన ముఖమును వస్త్రముతో కప్పికొని, మనస్సులో అధికముగా పీడితు డయ్యెను. 21

మూ. తమార్తం దేవసంకాశం సమీక్ష్య పతితం భువి,
నికృత్తమివ సాలస్య స్కన్ధం పరశునా వనే. 22
మత్తమాతఙ్గసంకాశం చన్ద్రార్కసదృశం భువః,
ఉత్థాపయిత్వా శోకార్తం వచనం చేదమబ్రవీత్. 23

ప్ర. అ. ఆర్తమ్=దుఃఖితుడూ, దేవసంకాశమ్=దేవతతో సమానుడూ, వనే = వనమునందు, పరశునా=గండ్రగొడ్డలిచేత, నికృత్తమ్=ఛేదించబడిన, సాలస్య = సాలవృక్షముయొక్క, స్కంధమివ = మ్రాను వలె, భువి = నేలపై, పతితమ్=పడి ఉన్నవాడూ, మత్తమాతఙ్గసంకాశమ్ = మదించిన ఏనుగుతో సమానుడూ, చన్ద్రార్కసదృశమ్ = చంద్రసూర్యులతో సమానుడూ, శోకార్తమ్ = శోకముచేత పీడింపబడినవాడూ అయిన, తమ్ = ఆ భరతుని, భువః = భూమినుండి, ఉత్థాపయిత్వా = లేవదీసి, ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. ఆర్తుడైన ఆ దేవతాతుల్యుడైన భరతుడు, వనమునందు గండ్ర గొడ్డలిచేత ఛేదించిన సాలవృక్షము మ్రాను వలె నేలపై పడి యుండెను. మదించిన ఏనుగు వలె ఉన్న, చంద్రసూర్యులతో సమానుడైన ఆ శోకార్తుడైన భరతుని చూచి, కైకేయి, ఆతనిని నేలమీదనుండి లేవదీసి ఇట్లు పలికెను. 22,23

మూ. ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే రాజపుత్ర మహాయశః,
త్వద్విధా న హి శోచన్తి సన్తః సదసి సంమతాః. 24

ప్ర. అ. మహాయశః = గొప్పకీర్తి గల, రాజపుత్ర=రాజపుత్రా! ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము. కిమ్ = ఎందువలన, శేషే = పండుకొని ఉన్నావు? సదసి=సభలో, సంమతాః = గౌరవించబడిన, త్వద్విధాః = నీవంటి, సన్తః = సత్పురుషులు, న శోచన్తి హి=దుఃఖించరు కదా.

తా. గొప్ప కీర్తి గల ఓ రాజకుమారా! లెమ్ము. లెమ్ము, అట్లు పండు కొని ఉన్నావేమి? సభలలో సంమానమును పొందుటకు అర్హత గల నీవంటి సత్పురుషులు ఈ విధముగా దుఃఖింతురా? 24

మూ. దానయజ్ఞాధికారా హి శీలశ్రుతివచోనుగా,
బుద్ధిస్తే బుద్ధిసంపన్న ప్రభేవార్కస్య మన్దిరే 25

ప్ర. అ. బుద్ధిసంపన్న=బుద్ధితో కూడినవాడా! తే=నీయొక్క, బుద్ధిః= బుద్ధి, శీలశ్రుతివచోనుగా = మంచి శీలమును, వేదవాక్కును అనుసరించునదై, దానయజ్ఞాధికారా=దానములందును యజ్ఞములందును అధికారము గలది కదా.

అర్కస్య = సూర్యునియొక్క, మన్దిరే = గృహమునందు, ప్రభేవ = కాంతివలె, సర్వదా ప్రకాశించును.

తా. ఓ సద్బుద్ధిసంపన్నుడా ! శీలమును, వేదవాక్యములను అనుసరించు నీ బుద్ధి, దానయజ్ఞాదులందు అధికారము కలదై, సూర్యుని గృహమున కాంతి వలె అవిచ్ఛిన్నముగ ప్రకాశించును. 25

మూ. స రుదిత్వా చిరం కాలం భూమౌ విపరివృత్య చ,
జననీం ప్రత్యువాచేదం శోకైర్బహుభిరావృతః. 26

ప్ర. అ. సః = అతడు, బహుభిః = అనేక మైన, శోకైః = శోకములచే, ఆవృతః = ఆవరింపబడినవాడై, చిరం కాలమ్ = చిరకాలము, రుదిత్వా=ఏడ్చి, భూమౌ = నేలపై, విపరివృత్య చ = దొర్లి, జననీమ్ = తల్లిని గూర్చి, ఇదమ్= ఈ వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. అనేకవిధము లైన శోకములు చుట్టుముట్టగా అతడు నేలపై దొర్లుచు చాలసేపు ఏడ్చి, తల్లితో మరల ఇట్లనెను. 26

మూ. అభిషేక్ష్యతి రామం ను రాజా యజ్ఞం ను యక్ష్యతే,
ఇత్యహం కృతసంకల్పో హృష్టో యాత్రామయాసిషమ్.

ప్ర. అ. రాజా = రాజు, రామమ్ = రాముని, అభిషేక్ష్యతి ను = అభిషేకము చేయునో, యజ్ఞమ్ = యజ్ఞమును, యక్ష్యతే ను = చేయునో, ఇతి = అని, అహమ్=నేను, కృతసంకల్పః=చేయబడిన సంకల్పము కలవాడనై, హృష్టః= సంతోషించినవాడనై, యాత్రామ్ = యాత్రను, అయాసిషమ్ = వెళ్ళితిని. (చేసితిని).

తా. మహారాజు రామునకు రాజ్యాభిషేకము చేయునో, లేదా ఏదైన యజ్ఞము చేయునో అని ఆలోచించుకొనుచు నేను సంతోషముతో ప్రయాణము చేసితిని. 27

మూ. తదిదం హ్యన్యథా భూతం వ్యవదీర్ణం మనో మమ,
పితరం యో న పశ్యామి నిత్యం ప్రియహితే రతమ్. 28

ప్ర. అ. తత్ ఇదమ్=ఆ ఇది అంతయూ, అన్యథా=మరొక విధముగా, భూతమ్ = అయినది. యః = ఏ నేను, నిత్యమ్ = నిత్యమూ, ప్రియహితే=నాకు ప్రియమునూ హితమునూ చేయుటయందు, రతమ్ = ఆసక్తు డైన, పితరమ్ = తండ్రిని, న పశ్యామి = చూడకున్నానో, మమ = అట్టి నాయొక్క, మనః = మనస్సు, వ్యవదీర్ణమ్ = బ్రద్ద లైపోయినది.

తా. నేను అనుకున్న దంతయు తారుమా రైనది. నిత్యమూ నా ప్రియ హితములను కోరు నా తండ్రిని చూడజాలకపోవుటచే నా మనస్సు బ్రద్ద లై పోయినది. 28

మూ. అమ్బ కేనాత్యగాద్రాజా వ్యాధినా మయ్యనాగతే,
ధన్యా రామాదయః సర్వే యైః పితా సంస్కృతః స్వయమ్.

ప్ర అ. అమ్బ = తల్లీ, రాజా = రాజు, మయి = నేను, అనాగతే = రాకుండగా, కేన వ్యాధినా=ఏ వ్యాధిచేత, అత్యగాత్=చనిపోయినాడు? యైః= ఏ రామాదులచేత, పితా = తండ్రి, స్వయమ్ = స్వయముగా, సంస్కృతః = సంస్కరించబడినాడో, అట్టి, రామాదయః = రాముడు మొదలైనవారు, ధన్యాః= ధన్యులు.

తా. తల్లీ! నేను ఇక్కడ లేనప్పుడు తండ్రి చనిపోవుటకు అతని కేమి వ్యాధి వచ్చినది? స్వయముగా తండ్రికి ప్రేతసంస్కారము చేసిన రామాదులు ధన్యాత్ములు కదా! 29

మూ. న నూనం మాం మహారాజః ప్రాప్తం జానాతి కీర్తిమాన్,
ఉపజిఘ్రేద్ధి మాం మూర్ధ్ని తాతః సంనమ్య సత్వరమ్.

ప్ర. అ. కీర్తిమాన్=కీర్తిమంతు డైన, మహారాజః=మహారాజు, మామ్= నన్ను, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, న జానాతి = ఎరుగడు నూనమ్ = నిశ్చ యము. తాతః = తండ్రి, సత్వరమ్ = శీఘ్రముగా, మామ్=నన్ను, సంనమ్య= వంచి, మూర్ధ్ని = శిరస్సుపై, ఉపజిఘ్రేత్ హి = వాసనచూచును కదా.

తా. కీర్తిమంతు డైన మహారాజునకు, నిజముగా, నేను వచ్చి నట్లు తెలియదు. తెలిసి ఉన్నచో శీఘ్రముగా నన్ను వంచి, నా తలపై ఆఘ్రాణించి ఉండెడివాడు. 30

మూ. క్వ స పాణిః సుఖస్పర్శస్తాతస్యాక్లిష్టకర్మణః,
యేన మాం రజసా ధ్వస్తమభీక్ష్ణం పరిమార్జతి. 31

ప్ర. అ. రజసా = పరాగముచే, ధ్వస్తమ్ = కప్పబడిన, మామ్ = నన్ను, యేన = ఏ హస్తముచే, అభీక్ష్ణమ్ = మిక్కిలి, పరిమార్జతి = తుడుచునో, అక్లిష్టకర్మణః = శ్రమపడకుండ పనులను సాధించు, తాతస్య = తండ్రియొక్క, సుఖస్పర్శః = సుఖ మైన స్పర్శగల, సః పాణిః = ఆ హస్తము, క్వ = ఎక్కడ ?

తా. బూడిద కప్పి ఉన్న నన్ను ఏ చేతితో మాటిమాటికి తుడుచుచుండెడివాడో, శ్రమ లేకుండ పనులను సాధించు నా తండ్రియొక్క, సుఖకర మైన స్పర్శగల అట్టి హస్తము ఎక్కడ ఉన్నది ? 31

మూ. యో మే భ్రాతా పితా బన్ధుర్యస్య దాసోఽస్మి ధీమతః,
తస్య మాం శీఘ్రమాఖ్యాహి రామస్యాక్లిష్టకర్మణః. 32

ప్ర. అ. యః = ఎవ్వడు, మే = నాకు, భ్రాతా = సోదరుడో, పితా = తండ్రియో, బన్ధుః = బంధువో, ధీమతః = ధీమంతు డైన, యస్య = ఎవనికి, దాసః అస్మి = దాసుడనుగా ఉన్నానో, తస్య = అట్టి, అక్లిష్టకర్మణః = అక్లిష్టకర్మ యైన, రామస్య = రామునకు, మామ్ = నన్ను గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆఖ్యాహి = చెప్పుము.

తా. ఏ రాముడు నాకు సోదరుడో, తండ్రియో, బంధువో, ధీమంతు డైన ఏ రామునకు నేను దాసుడనో, శ్రమపడకుండ కార్యములను సాధించు ఆ రామునకు నన్ను గూర్చి శీఘ్రముగా తెలుపుము. 32

మూ. పితా హి భవతి జ్యేష్ఠో ధర్మమార్యస్య జానతః,
తస్య పాదౌ గ్రహీష్యామి స హీదానీం గతిర్మమ. 33

ప్ర. అ. ధర్మమ్ = ధర్మమును, జానతః = ఎరిగిన, ఆర్యస్య = పూజ్యునకు, జ్యేష్ఠః = అన్నగారు, పితా = తండ్రిగా, భవతి హి = అగును కదా. తస్య = అతనియొక్క, పాదౌ = పాదములను, గ్రహీష్యామి = గ్రహించెదను. సః = అతడు, ఇదానీమ్ = ఇప్పుడు, మమ = నాకు, గతిః హి = గతి కదా.

తా. ధర్మము తెలిసిన పూజ్యు లందరికిని అన్నగారు తండ్రి కదా ? అట్టి అన్నగారి పాదములు పట్టుకొనెదను. ఇప్పుడు నా కతడే గతి కదా ? 33

మూ. ధర్మవిద్ధర్మనిత్యశ్చ సత్యసన్ధో దృఢవ్రతః,
ఆర్యః కిమబ్రవీద్రాజా పితా మే సత్యవిక్రమః. 34

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మములు ఎరిగినవాడు, ధర్మనిత్యశ్చ = నిత్యము ధర్మము ననుసరించువాడు, సత్యసన్ధః = సత్యసంధుడు, దృఢవ్రతః = దృఢ మైన వ్రతము కలవాడు, సత్యవిక్రమః = సత్య మైన పరాక్రమము కల వాడు, ఆర్యః = పూజ్యుడు, రాజా = రాజు అయిన, మే పితా = నా తండ్రి, కిమ్ = ఏమి, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మములు తెలిసినవాడూ, నిత్యము ధర్మము ననుసరించు వాడూ, సత్య మైన ప్రతిజ్ఞ కలవాడూ, దృఢ మైన నియమము కలవాడూ, పూజ్యుడూ, సత్య మైన పరాక్రమము కలవాడూ, మహారాజూ అయిన నా తండ్రి ఏమి చెప్పినాడు ? 34

మూ. పశ్చిమం సాధు సన్దేశమిచ్ఛామి శ్రోతుమాత్మనః,
ఇతి పృష్టా యథాతత్త్వం కైకేయీ వాక్యమబ్రవీత్. 35

ప్ర. అ. ఆత్మనః = నా కిచ్చిన, పశ్చిమమ్ = చివరి దైన, సన్దేశమ్ = పితృసందేశమును, సాధు = బాగుగా, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరు చున్నాను. ఇతి = ఇట్లు, పృష్టా = అడగబడిన, కైకేయీ = కైకేయి, యథా తత్త్వమ్ = ఉన్న దున్నట్లుగా, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. నాకు నా తండ్రి ఇచ్చిన చివరి సందేశమును యథాతథముగా విన గోరుచున్నాను. భరతు డీ విధముగ ప్రశ్నించగా, కైకేయి జరిగినది జరిగినట్లుగా చెప్పుచు ఇట్లు పలికెను. 35

మూ. రామేతి రాజా విలపన్ హా సీతే లక్ష్మణేతి చ.
స మహాత్మా పరం లోకం గతో గతిమతాం వరః. 36

ప్ర. అ. గతిమతామ్ = జంగమము లైన ప్రాణులలో లేదా సద్గతి కల వారిలో, వరః = శ్రేష్ఠు డైన, మహాత్మా = మహాత్ము డైన, సః = ఆ, రాజా =

రాజు, రామేతి=రామా అనీ, హా సీతే=అయ్యో సీతా అనీ, లక్ష్మణేతి చ= లక్ష్మణా అనీ, విలపన్=విలపించుచు, పరం లోకమ్=పరలోకమును గూర్చి, గతః=వెళ్ళినాడు.

తా. జంగమప్రాణులలో శ్రేష్ఠుడైన (లేదా సద్గతికలవారిలో శ్రేష్ఠుడైన) మహాత్ముడైన ఆ రాజు, "హా రామా! హా సీతా! హా లక్ష్మణా!" అని విలపించుచు పరలోకమును పొందినాడు. 36

మూ. ఇమాం తు పశ్చిమాం వాచం వ్యాజహార పితా తవ,
కాలధర్మపరిక్షిప్తః పాశైరివ మహాగజః. 37

ప్ర. అ. తవ=నీయొక్క, పితా=తండ్రి, మహాగజః = మహాగజము, పాశైరివ=పాశములచేత వలె, కాలధర్మపరిక్షిప్తః=కాలధర్మముచే చుట్టబడిన వాడై, పశ్చిమామ్=చివరిదైన, ఇమామ్=ఈ, వాచమ్=వాక్కును, వ్యాజహార =పలికెను.

తా. నీ తండ్రి, పాశములచే కొట్టబడిన మహాగజము వలె, మృత్యుపాశములచే చుట్టబడిన వాడై, ఈ చివరి మాటలు పలికెను. 37

మూ, సిద్ధార్థాస్తే నరా రామమాగతం సహ సీతయా,
లక్ష్మణం చ మహాబాహుం ద్రక్ష్యన్తి పునరాగతమ్. 38

ప్ర. అ. సీతయా సహ = సీతతో కూడ, ఆగతమ్=వచ్చిన, రామమ్= రామునీ, పునః = మరల, ఆగతమ్=వచ్చిన, మహాబాహుమ్=గొప్పబాహువులు గల, లక్ష్మణం చ=లక్ష్మణునీ, (యే=ఎవరు), ద్రక్ష్యన్తి = చూడగలరో, తే నరాః=ఆ నరులు, సిద్ధార్థాః=కృతార్థులు.

తా. "సీతాసమేతుడై తిరిగి వచ్చిన రామునీ, తిరిగి వచ్చిన మహాబాహువైన లక్ష్మణునీ చూడ గల్గినవారు ధన్యాత్ములు కదా!" 38

మూ. తచ్ఛ్రుత్వా విషసాదైవ ద్వితీయాప్రియశంసనాత్,
విషణ్ణవదనో భూత్వా భూయః పప్రచ్ఛ మాతరమ్. 39

ప్ర. అ. తత్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, ద్వితీయాప్రియశంసనాత్ =రెండవ అప్రియమును చెప్పుటచే, విషసాదైవ=దుఃఖించెను. విషణ్ణవదనః=

దిగులు చెందిన ముఖము కలవాడై, భూత్వా = అయి, భూయః = మరల, మాతరమ్=తల్లిని, పప్రచ్ఛ = అడిగెను.

తా. రెండవ అప్రియవార్తను చెప్పు ఆ మాట వినగానే భరతుడు దుఃఖించుచు, దిగులుచెందిన ముఖముతో, మరల తల్లిని ఇట్లు అడిగెను. 39

మూ. క్వ చేదానీం స ధర్మాత్మా కౌసల్యానన్దవర్ధనః,
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ సమం గతః. 40

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, సః = ఆ, కౌసల్యానన్దవర్ధనః= కౌసల్యానందమును వృద్ధిపొందించు రాముడు, భ్రాత్రా=సోదరు డైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితోను, సీతయా చ సమమ్=సీతతోను, ఇదానీమ్ = ఇప్పుడు, క్వ=ఎక్కడికి, గతః=వెళ్ళినాడు ?

తా. ధర్మాత్ముడూ, కౌసల్యకు ఆనందమును వృద్ధిపొందించువాడూ అయిన ఆ రాముడు, సోదరు డైన లక్ష్మణునితోను, సీతతోను, ఇపు డెక్కడికి వెళ్ళినాడు ? 40

మూ. తథా పృష్టా యథాతత్త్వమాఖ్యాతుముపచక్రమే,
మాతాస్య సుమహద్వాక్యం విప్రియం ప్రియశఙ్కయా.

ప్ర. అ. తథా = అట్లు, పృష్టా = అడగబడిన, అస్య మాతా = ఇతని తల్లి, సుమహత్=చాల గొప్ప, విప్రియమ్=అప్రియ మైన, వాక్యమ్ = వాక్యమును, ప్రియశఙ్కయా = ప్రియ మను అభిప్రాయముతో, యథాతత్త్వమ్= యథార్థమును అనుసరించి, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. భరతు డీ విధముగ ప్రశ్నించగా, ఆతని తల్లి. "అతనికి ప్రియ మైన విషయము చెప్పుచున్నాను'' అను భ్రాంతితో చాల అప్రియ మైన వాక్యమును, జరిగినది జరిగి నట్లుగా, చెప్పుటకు ప్రారంభించెను. 41

మూ. స హి రాజసుతః పుత్ర చీరవాసా మహావనమ్,
దణ్డకాన్ సహ వైదేహ్యా లక్ష్మణానుచరో గతః. 42

ప్ర. అ. పుత్ర = కుమారా ! రాజసుతః = రాజకుమారు డైన, సః = ఆ రాముడు, చీరవాసాః = నారచీరలు వస్త్రముగా కలవాడై, లక్ష్మణానుచరః = లక్ష్మణుడు కూడ వచ్చువాడుగా కలవాడై, వైదేహ్యా సహ = సీతతో కూడ, మహావనమ్ = మహావనమైన, దణ్డకాన్ = దండకను గూర్చి, గతః హి = వెళ్ళినాడు కదా.

తా. కుమారా ! రాజకుమారు డైన ఆ రాముడు నారచీరలు ధరించి, సీతాసమేతుడై, లక్ష్మణుడు కూడ తన వెంట రాగా, దండకారణ్యమునకు వెళ్ళి నాడు. 42

మూ. తచ్ఛ్రుత్వా భరతస్త్రస్తో భ్రాతుశ్చారిత్రశఙ్కయా,
స్వస్య వంశస్య మాహాత్మ్యాత్ప్రష్టుం సముపచక్రమే.

ప్ర. అ. భరతః = భరతుడు, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, స్వస్య వంశస్య = తన వంశముయొక్క, మాహాత్మ్యాత్ = గొప్పతనమువలన, భ్రాతుః = సోదరునియొక్క, చరిత్రశఙ్కయా = చరితమును గూర్చి శంకతో, ప్రష్టుమ్ = అడుగుటకు, సముపచక్రమే = ప్రారంభించెను.

తా. భరతుడు ఆ మాటలు విని, తన వంశము ఔన్నత్యము తెలిసినవా డగుటచే, రాము డేమైన అధర్మకార్యము చేయుటచే దేశమునుండి వెడలకొట్ట బడినాడా అని శంకించుచు, మరల ప్రశ్నించెను. 43

మూ. కచ్చిన్న బ్రాహ్మణధనం హృతం రామేణ కస్య చిత్.
కచ్చిన్నాఢ్యో దరిద్రో వా తేనాపాపో విహింసితః. 44

ప్ర. అ. రామేణ = రామునిచేత, కస్యచిత్ = ఒకానొక, బ్రాహ్మణ ధనమ్ = బ్రాహ్మణుని ధనము, న హృతం కచ్చిత్ = హరింపబడలేదు కదా! తేన = ఆతనిచేత, ఆఢ్యః = ధనవంతుడు కాని, దరిద్రో వా = దరిద్రుడు కాని, అయిన, అపాపః = పాపము చేయనివాడు, న విహింసితః కచ్చిత్ = హింసింప బడలేదు కదా !

తా. రాముడు ఎవ్వ డైన బ్రాహ్మణుని ధనమును అపహరించలేదుకదా! అపరాధ మేదియు లేకుండగ, ఆతడు ఏ ధనవంతు నైనను, దరిద్రు నైనను హింసించలేదు కద ! 44

మూ. కచ్చిన్న పరదారాన్వా రాజపుత్రోఽభిమన్యతే,
కస్మాత్స దణ్డకారణ్యే భ్రూణహేవ వివాసితః. 45

ప్ర. అ. రాజపుత్రః = ఆ రాజకుమారుడు, పరదారాన్ = పరకాంతలను, నాభిమన్యతే వా కచ్చిత్ = కోరుట లేదు కద ; సః = అతడు, భ్రూణహా = గర్భస్థశిశువును చంపిన పాపాత్ముడు వలె, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, కస్మాత్ = ఎందువలన, వివాసితః = వెడలకొట్టబడినాడు ?

తా. రాజకుమారుడైన రాముడు పరభార్యలపై అభిలాష చూపలేదు కద; భ్రూణహత్యాపాపము చేసినవానిని వలె అతనిని దండకారణ్యమునకు ఎందువలన పంపివేసినారు ? 45

మూ. అథాస్య చపలా మాతా తత్స్వకర్మ యథాతథమ్,
తేనైవ స్త్రీస్వభావేన వ్యాహర్తుముపచక్రమే. 46

ప్ర. అ. అథ = అటుపిమ్మట, చపలా = చపలురాలైన, అస్య మాతా = ఈతని తల్లి, తేన = ఆ పూర్వము చూపబడిన, స్త్రీస్వభావేనైవ = స్త్రీస్వభావము చేతనే, తత్ = ఆ, స్వకర్మ = తన పనిని, యథాతథమ్ = జరిగినది జరిగి నట్లు, వ్యాహర్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. పిమ్మట చపలస్వభావురాలైన ఆతని తల్లి, తాను వెనుక చూపిన స్త్రీస్వభావమునే పురస్కరించుకొని తాను చేసిన పనిని గూర్చి, జరిగినది జరిగి నట్లు చెప్పుటకు ప్రారంభించెను. 46

మూ. ఏవముక్తా తు కైకేయీ భరతేన మహాత్మనా,
ఉవాచ వచనం హృష్టా మూఢా పణ్డితమానినీ. 47

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, భరతేన = భరతునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, మూఢా = మూఢురాలూ, పణ్డితమానినీ = బుద్ధిమంతురాల నని తలచునదీ అయిన, కైకేయీ = కైకేయి, హృష్టా = సంతోషించినదై, వచనమ్ = వాక్యమును, ఉవాచ = పలికినది.

తా. మూఢురాలూ, బుద్ధిమంతురాల ననే గర్వము కలదీ అయిన కైకేయి, మహాత్ముడైన భరతుని మాటలు విని, సంతోషించుచు ఇట్లు పలికెను.

మూ. న బ్రాహ్మణ ధనం కించిద్ధృతం రామేణ కస్య చిత్.
కశ్చిన్నాఢ్యో దరిద్రో వా తేనాపాపో విహింసితః. 48
న రామః పరదారాంశ్చ చక్షుర్భ్యామపి పశ్యతి.

ప్ర. అ. రామేణ = రామునిచేత, కస్య చిత్ = ఏ ఒక్క, బ్రాహ్మణ ధనమ్ = బ్రాహ్మణుని ధనము, కిం చిత్ = కొంచెమును, న హృతమ్ = హరింప బడలేదు. తేన = వానిచేత, ఆఢ్యః = ధనవంతుడు గాని, దరిద్రో వా = దరిద్రుడు గాని, అపాపః = పాపము లేని వాడు, కశ్చిత్ = ఎవ్వడును, న విహింసితః = హింసింపబడలేదు. రామః = రాముడు, పరదారాన్ = పరభార్యలను, చక్షుర్భ్యామ్ = నేత్రములతో, న పశ్యత్యపి = చూడ నైన చూడడు.

తా. రాముడు ఏ బ్రాహ్మణుని ధనమును కూడ, కొంచె మైనను హరించ లేదు. ఆతడు పాపము చేయని ధనికుని గాని, దరిద్రుని గాని ఎవ్వనిని హింసించ లేదు. రాముడు పరభార్యలను కంటితో చూడను కూడ చూడడు. 48

మూ. మయా తు పుత్ర శ్రుత్వైవ రామస్యైవాభిషేచనమ్. 49
యాచితస్తే పితా రాజ్యం రామస్య చ వివాసనమ్.

ప్ర. అ. పుత్ర = కుమారా ! మయా తు = నాచేతనైతే, రామస్యైవ = రామునియొక్కయే, అభిషేచనమ్ = అభిషేకమును, శ్రుత్వైవ = వినగానే, పితా = నీ తండ్రి, తే = నీకు, రాజ్యమ్ = రాజ్యమును, రామస్య = రాముని యొక్క, వివాసనం చ = వనమునకు పంపివేయుటను, యాచితః = కోరబడినాడు.

తా. కుమారా ! రామునకు అభిషేకము జరుగ నున్న దని వినగానే నేను, నీ తండ్రిని, నీకు రాజ్యము ఇమ్మనీ, రాముని అరణ్యమునకు పంపివేయ మనీ కోరినాను. 49

మూ. స స్వవృత్తిం సమాస్థాయ పితా తే తత్తథాకరోత్. 50
రామశ్చ సహసౌమిత్రిః ప్రేషితః సహ సీతయా.

ప్ర. అ. తే పితా = నీ తండ్రి యైన, సః = ఆ దశరథమహారాజు, స్వవృత్తిమ్ = తన నియమమును, సమాస్థాయ = అవలంబించి, తత్ = దానిని, తథా = అట్లు, అకరోత్ = చేసెను. సహసౌమిత్రిః = లక్ష్మణునితో కూడిన,

రామశ్చ = రాముడుకూడ, సీతయా సహ = సీతతో కూడ, ప్రేషితః = పంపబడినాడు.

తా. నీ తండ్రి తన నియమమును పాటించుచు అది ఆ విధముగానే చేసెను. సీతాలక్ష్మణసమేతు డైన రాముని అరణ్యమునకు పంపివేసెను. 50

మూ. తమపశ్యన్ ప్రియం పుత్రం మహీపాలో మహాయశాః, 51
పుత్రశోకపరిద్యూనః పఞ్చత్వముపపేదివాన్.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, మహీపాలః = రాజు, తమ్ = ఆ, ప్రియం పుత్రమ్ = ప్రియపుత్రు డైన రాముని, అపశ్యన్ = చూడనివా డై, పుత్రశోకపరిద్యూనః = పుత్రశోకముచేత పరితపించుచు, పఞ్చత్వమ్ = మరణమును, ఉపపేదివాన్ = పొందినాడు.

తా. మహాకీర్తిశాలి యైన మహారాజు తన ప్రియపుత్రు డైన రాముడు కనబడకపోవుటచే, పుత్రశోకముతో బాధపడుచు మరణించెను. 51

మూ. త్వయా త్విదానీం ధర్మజ్ఞ రాజత్వమవలమ్బ్యతామ్, 52
త్వత్కృతే హి మయా సర్వమిదమేవంవిధం కృతమ్.

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మముల నెరిగినవాడా ! ఇదానీమ్ = ఇప్పుడు, త్వయా = నీచేత, రాజత్వమ్ = రాజత్వము, అవలమ్బ్యతామ్ = గ్రహింవబడుగాక; మయా = నాచేత, త్వత్కృతే = నీకొరకై, ఏవంవిధమ్ = ఈ విధముగా, ఇదం సర్వమ్ = ఇది అంతయు, కృతం హి = చేయబడినది కదా.

తా. ధర్మముల నెరిగిన భరతుడా ! ఇపుడు నీవు రాజత్వమును స్వీకరింపుము. ఈ విధముగా నేను నీకోసమే ఇది అంతా చేసినాను. 52

మూ. మా శోకం మా చ సంతాపం ధైర్యమాశ్రయ పుత్రక.
త్వదధీనా హి నగరీ రాజ్యం చైతదనామయమ్. 53

ప్ర. అ. పుత్రక = కుమారా ! శోకమ్ = శోకమును, మా ఆశ్రయ = ఆశ్రయించకుము. సంతాపం చ = సంతాపమును కూడ, మా = ఆశ్రయించకుము. ధైర్యమ్ = ధైర్యమును, ఆశ్రయ = ఆశ్రయించుము. నగరీ = ఈ నగ

రము, త్వదధీనా = నీ అధీన మైనది. అనామయమ్ = (దాయాదాదులవలన) ఎట్టి బాధలు లేని, ఏతత్ = ఈ, రాజ్యం చ = రాజ్యమూ, నీ అధీన మైనది కదా.

తా. కుమారా ! శోకమును సంతాపమును విడచి ధైర్యము అవలంబించుము. ఈ నగరమూ, శత్రుబాధాదులు లేని ఈ రాజ్యమూ కూడ నీకు అధీనములై ఉన్నవి. 53

మూ. తత్పుత్ర శీఘ్రం విధినా విధిజ్ఞై
ర్వసిష్ఠముఖ్యైః సహితో ద్విజేన్ద్రైః,
సంకాల్య రాజాన మదీనసత్త్వ
మాత్మానముర్వ్యామభిషేచయస్వ. 54

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్విసప్తతితమః సర్గః

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, పుత్ర = కుమారా ! విధిజ్ఞైః = శాస్త్రవిధానమును ఎరిగిన, వసిష్ఠముఖ్యైః = వసిష్ఠుడు మొదలైన, ద్విజేన్ద్రైః = బ్రాహ్మణశ్రేష్ఠులతో, సహితః = కూడినవాడ వై, రాజానమ్ = రాజును, విధినా = శాస్త్రవిధానముచే, శీఘ్రమ్ = శీఘ్రముగా, సంకాల్య = సంస్కరించి, అదీనసత్త్వమ్ = దైన్యము లేని బుద్ధి గల, ఆత్మానమ్ = తనను, ఉర్వ్యామ్ = భూమియందు, అభిషేచయస్వ = అభిషిక్తుని చేసికొనుము.

తా. కుమారా ! ఆ కారణముచే, శాస్త్రవిధానము తెలిసిన వసిష్ఠుడు మొదలగు బ్రాహ్మణశ్రేష్ఠులతో కలిసి, శీఘ్రముగా రాజునకు యథావిధిగా సంస్కారము చేసి, మనస్సులో ఏ దైన్యము లేనివాడవై, రాజ్యాభిషిక్తుడవు అగుము. 54

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో డెబ్బదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిసప్తతితమః సర్గః

[భరతుడు కైకను చీకొట్టుట. ఆమెపై తీవ్రంగా కోపించుట].

మూ. శ్రుత్వా తు పితరం వృత్తం భ్రాతరౌ చ వివాసితౌ,
భరతో దుఃఖసన్తప్త ఇదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. భరతః = భరతుడు, పితరమ్ = తండ్రిని, వృత్తమ్ = చని పోయినవానినిగాను, భ్రాతరౌ = సోదరు లిద్దరినీ, వివాసితౌ = వెడలకొట్టబడిన వారినిగానూ, శ్రుత్వా తు = విని, దుఃఖసంతప్తః = దుఃఖముచేత తపింపచేయ బడినవాడై, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. భరతుడు తండ్రి మరణించి నట్లును, సోదరు లిద్దరినీ దేశమునుండి వెడలగొట్టి నట్లును విని, దుఃఖపీడితు డై ఇట్లు పలికెను. 1

మూ. కిం ను కార్యం హతస్యేహ మమ రాజ్యేన శోచతః,
విహీనస్యాథ పిత్రా చ భ్రాత్రా పితృసమేన చ. 2

ప్ర. అ. పిత్రా చ = తండ్రితోను, అథ = మరియు, పితృసమేన = తండ్రితో సమాను డైన, భ్రాత్రా చ = సోదరునితోను, విహీనస్య = హీనుడను, శోచతః = దుఃఖించుచున్నవాడను, హతస్య = కష్టముపాలైన, మమ = నాకు, ఇహ = ఇప్పుడు, రాజ్యేన = రాజ్యముతో, కిం ను కార్యమ్ = ఏమి పని ;

తా. తండ్రి మరణించి, తండ్రితో సమాను డైన సోదరుడు ప్రవాసము నకు పోయి దుఃఖించుచు కష్టముల పాలై ఉన్న నాకు ఇప్పుడీ రాజ్య మెందుకు?

మూ. దుఃఖే మే దుఃఖమకరోర్వ్రణే క్షారమివాదధాః,
రాజానం ప్రేతభావస్థం కృత్వా రామం చ తాపసమ్. 3

ప్ర. అ. రాజానమ్ = రాజును, ప్రేతభావస్థమ్ = మరణించినవానినిగాను, రామం చ = రాముని, తాపసమ్ = మునిని గాను, కృత్వా = చేసి, మే = నాకు, దుఃఖే = ఒక దుఃఖమునందు, దుఃఖమ్ = మరి యొక దుఃఖమును, అకరోః = చేసితివి. వ్రణే = పుండునందు, క్షారమ్ = ఉప్పును, అదధాః ఇవ = ఉంచి నట్లు చేసితివి.

తా. రాజు మరణించు నట్లు, రాముడు తాపసు డగు నట్లును చేసి, నీవు, పుండుపై ఉప్పు చల్లి నట్లు, ఒక దుఃఖములో మరొక దుఃఖము కలిగించినావు.

మూ. కులస్య త్వమభావాయ కాళరాత్రిరివాగతా,
అఙ్గారముపగుహ్య స్మ పితా మే నావబుద్ధవాన్. 4

ప్ర. అ. త్వమ్ = నీవు, కులస్య = కులముయొక్క, అభావాయ = నాశము కొరకు, కాలరాత్రి రివ = కాలరాత్రి వలె, ఆగతా = వచ్చినావు. మే పితా = నా తండ్రి, అఙ్గారమ్ = నిప్పును, ఉపగుహ్య = కౌగలించుకొని, నావబుద్ధవాన్ = తెలుసుకొనలేక పోయి నాడు.

తా. నీవు ఈ కులమును నశింపచేయుటకు కాలరాత్రి వలె దాపురించి నావు. నా తండ్రి కొరవిని కౌగలించుకొని తెలుసుకొనలేక పోయినాడు. 4

మూ. మృత్యుమాపాదితో రాజా త్వయా మే పాపదర్శిని,
సుఖం పరిహృతం మోహాత్కులేఽస్మిన్ కులపాంసని. 5

ప్ర. అ. పాపదర్శిని = పాపపు ఆలోచన కలదానా ! త్వయా = నీచేత, మే పితా = నా తండ్రి, మృత్యుమ్ = మృత్యువును, ఆపాదితః = పొందించ బడినాడు. కులపాంసని = కులమును అపవిత్రము చేసినదానా ! మోహాత్ = అజ్ఞానమువలన, అస్మిన్ కులే = ఈ కులమునందు, సుఖమ్ = సుఖము, పరిహృతమ్ = తొలగింపబడినది.

తా. ఓ ! పాపపు టాలోచన కలదానా ! నీవే తండ్రిని చంపినావు. కులమును అపవిత్రము చేసినదానా ! అజ్ఞానముచే నీవు ఈ కులములో సుఖము లేకుండా చేసినావు. 5

మూ. త్వాం ప్రాప్య హి పితా మేఽద్య సత్యసన్ధో మహాయశాః,
తీవ్రదుఃఖాభిసంతప్తో వృత్తో దశరథో నృపః. 6

ప్ర. అ. మే = నాయొక్క. పితా = తండ్రి, సత్యసన్ధః = సత్య మైన ప్రతిజ్ఞకలవాడూ, మహాయశాః = గొప్పకీర్తి కలవాడూ, నృపః = రాజూ అయిన, దశరథః = దశరథుడు, అద్య = ఇప్పుడు, త్వామ్ = నిన్ను, ప్రాప్య = పొంది, తీవ్రదుఃఖాభిసంతప్తః = తీవ్ర మైన దుఃఖముచేత తపింపచేయబడినవా డై, వృత్తః = మరణించినాడు.

తా. సత్యసంధుడు, మహాకీర్తిశాలీ అయిన నా తండ్రి దశరథమహారాజు, ఇప్పుడు నీ మూలమున తీవ్ర మైన దుఃఖముచే పీడితు డై మరణించినాడు. 6

మూ. వినాశితో మహారాజః పితా మే ధర్మవత్సలః,
కస్మాత్ప్రవ్రాజితో రామః కస్మాదేవ వనం గతః. 7

ప్ర. అ. ధర్మవత్సలః = ధర్మమునందు ఆసక్తి గల, మహారాజః = మహారా జైన, మే పితా = నా తండ్రి, కస్మాత్ = ఎందువలన, వినాశితః = చంపబడినాడు? రామః = రాముడు, కస్మాత్ = ఏ కారణమువలన, ప్రవ్రాజితః = వెడలగొట్ట బడినవా డై, వనమ్ = వనమును గూర్చి, గతః = వెళ్ళినాడు ?

తా. ధర్మశ్రద్ధ గల నా తండ్రి దశరథమహారాజును ఎందుకు చంపినావు ? రాముని దేశమునుండి వెడలగొట్టి అరణ్యమున కెందుకు పంపినావు ?

మూ. కౌసల్యా చ సుమిత్రా చ పుత్రశోకాభిపీడితే,
దుష్కరం యది జీవేతాం ప్రాప్య త్వాం జననీం మమ.

ప్ర. అ. పుత్రశోకాభిపీడితే = పుత్రశోకము చేత పీడించబడిన, కౌసల్యా చ = కౌసల్యయు, సుమిత్రా చ = సుమిత్రయు, మమ జననీమ్ = నా తల్లి వైన, త్వామ్ = నిన్ను, ప్రాప్య = పొంది, జీవేతాం యది = జీవింతురు అనునది, దుష్కరమ్ = చేయ శక్యము కాని పని.

తా. పుత్రశోకముతో బాధపడు చున్న కౌసల్యాసుమిత్రలు. నా తల్లి వైన నీ సహవాసమున జీవింపగల రనునది కల్ల. 8

మూ. నను త్వార్యోఽపి ధర్మాత్మా త్వయి వృత్తి మనుత్తమామ్
వర్తతే గురువృత్తిజ్ఞో యథా మాతరి వర్తతే. 9

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడూ, గురువృత్తిజ్ఞః = గురువుల విషయమున ఎట్లు ప్రవర్తించవలెనో తెలిసినవాడూ అయిన, ఆర్యోఽపి = అన్నగారు కూడా, మాతరి = తల్లి విషయమున, యథా = ఎట్లు, వర్తతే = ప్రవర్తించుచున్నాడో అట్లే, త్వయి=నీ విషయమున, అనుత్తమామ్=శ్రేష్ఠమైన, వృత్తిమ్ = ప్రవర్తనను, వర్తతే నను = అనుసరించుచున్నాడు కదా!

తా. ధర్మాత్ముడు, పెద్దల విషయమున ఎట్లు ప్రవర్తించవలెనో తెలిసినవాడూ అయిన, నా అన్నగారైన రాముడు, నీ విషయమునందు కూడా, తన తల్లి విషయమున ఎట్లు ప్రవర్తించునో అట్లే ప్రవర్తించెడివాడు కదా! 9

మూ. తథా జ్యేష్ఠా హి మే మాతా కౌసల్యా దీర్ఘదర్శినీ,
త్వయి ధర్మం సమాస్థాయ భగిన్యామివ వర్తతే. 10

ప్ర. అ. తథా = అట్లే, మే = నాయొక్క, జ్యేష్ఠా = పెద్ద, మాతా = తల్లీ, దీర్ఘదర్శినీ = దూరదృష్టి కలదీ అయిన, కౌసల్యా = కౌసల్య, ధర్మమ్= ధర్మమును, సమాస్థాయ = అవలంబించి, త్వయి = నీ విషయమున, భగిన్యామివ = సోదరియందు వలె, వర్తతే హి= ప్రవర్తించుచున్నది కదా!

తా. అట్లే, దూరదృష్టి గల మా పెదతల్లి కౌసల్య కూడ, ధర్మమును అనుసరించుచు, నీ విషయమున సోదరి విషయమున ప్రవర్తించుచున్నట్లు ప్రవర్తించుచున్నది కదా! 10

మూ. తస్యాః పుత్రం కృతాత్మానం చీరవల్కలవాససమ్,
ప్రస్థాప్య వనవాసాయ కథం పాపే న శోచసి. 11

ప్ర. అ. పాపే = పాపాత్మురాలా! కృతాత్మానమ్ = చేయబడిన సద్బుద్ధి గలవాడైన, తస్యాః = అట్టి కౌసల్యయొక్క, పుత్రమ్ = పుత్రుడైన రాముని, చీరవల్కలవాసనమ్ = నార చీరలు వస్త్రములుగా కలవానినిగా, వనవాసాయ= వనవాసమునకు, ప్రస్థాప్య = పంపి, కథమ్ = ఎట్లు, న శోచసి = విచారించకున్నావు!

తా. పాపాత్మురాలా! అట్టి కౌసల్య యొక్క బుద్ధి శాలియైన కుమారుని నారచీరలు కట్టింపచేసి, వనవాసమునకు పంపిన తరువాత కూడా నీకు విచారము కలుగుట లేదా! 11

మూ. అపాపదర్శనం శూరం కృతాత్మానం యశస్వినమ్,
ప్రవ్రాజ్య చీరవసనం కిం ను పశ్యసి కారణమ్. 12

ప్ర. అ. అపాపదర్శనమ్ = పుణ్య మైన దర్శనము కలవాడూ, శూరమ్ = శూరుడూ, కృతాత్మానమ్ = నిగ్రహించుకొనబడిన బుద్ధి కలవాడూ, యశస్వినమ్ = కీర్తి కలవాడూ అయిన ఆ రాముని, చీరవసనమ్ = నారచీరలు వస్త్రములుగా కలవానినిగా, ప్రవ్రాజ్య = ప్రవాసమునకు పంపి, కిం ను = ఏమి, కారణమ్ = కారణమును, పశ్యసి = చూచుచున్నావు?

తా. పుణ్యప్రద మైన దర్శనము కలవాడూ (చూచినవారికి పుణ్యము కలిగించువాడూ), శూరుడూ, మనోనిగ్రహవంతుడూ, కీర్తిశాలీ అయిన రాముని చీరలు ధరింపచేసి అరణ్యమునకు పంపితివి కదా! దీనికి ఏమి కారణము చెప్పెదవు? 12

మూ. లుబ్ధాయా విదితో మన్యే న తేఽహం రాఘవం ప్రతి,
తథాహ్యనర్థో రాజ్యార్థం త్వయాఽఽనీతో మహానయమ్.

ప్ర. అ. లుబ్ధాయాః = లుబ్ధురాల వైన, తే = నీకు, అహమ్ = నేను, రాఘవం ప్రతి = రాముని గూర్చి, న విదితః = తెలియబడలేదు అని, మన్యే = తలచుచున్నాను. తథాహి = అది యుక్తము కదా! త్వయా = నీచేత, రాజ్యార్థమ్ = రాజ్యముకొరకై, అయమ్ = ఈ, మహాన్ = గొప్ప, అనర్థః = అనర్థము, ఆనీతః = తీసికొని రాబడినది.

తా. లుబ్ధురాల వైన నీకు రాముని విషయమున నా కున్న భక్తినిగూర్చి తెలియదని భావించెదను. అందువలననే రాజ్యముకొరకై నీవు అనర్థము తెచ్చి పెట్టినావు. 13

మూ. అహం హి పురుషవ్యాఘ్రావపశ్యన్ రామలక్ష్మణౌ,
కేన శక్తిప్రభావేణ రాజ్యం రక్షితుముత్సహే. 14

ప్ర. అ. అహమ్ = నేను, పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠు లైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, అపశ్యన్ = చూడనివాడనై, కేన = ఏ, శక్తి

ప్రభావేణ = శక్తియొక్క ప్రభావముచేత, రాజ్యమ్ = రాజ్యమును, రక్షితుమ్ = రక్షించుటకు, ఉత్సహే = సమర్థుడ నగుదును.

తా. పురుషశ్రేష్ఠు లైన రామలక్ష్మణులు దగ్గర లేని నేను, ఈ రాజ్యమును ఏ శక్తితో పాలించుటకు సమర్థుడ నగుదును? 14

మూ. తం హి నిత్యం మహారాజో బలవన్తం మహాబలః,
ఉపాశ్రితోఽభూద్ధర్మాత్మా మేరుర్మేరువనం యథా. 15

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గలవాడూ, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, మహారాజః = మహారాజు, నిత్యమ్ = ఎల్లప్పుడును, బలవన్తమ్ = బలవంతు డైన, తమ్ = ఆ రాముని, మేరుః = మేరు పర్వతము, మేరువనం యథా = మేరుపర్వతము చుట్టూ ఉన్న అరణ్యమును వలె, ఉపాశ్రితః = ఆశ్రయించినవాడు, అభూత్ హి = అయి ఉండెను కదా!

తా. మేరుపర్వతము తన రక్షణముకొరకై తన చుట్టు ఉన్న వనమును ఆశ్రయించి నట్లు, మహాబలశాలీ, ధర్మాత్ముడూ అయిన దశరథమహారాజు, ఎల్లప్పుడు మహాబలశాలి యైన ఆ రాముని ఆశ్రయించి ఉండెడివాడు కదా? 15

మూ. సోఽహం కథమిమం భారం మహాధుర్యసముద్ధృతమ్,
దమ్యో ధురమివాసాద్య వహేయం కేన చౌజసా. 16

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, ఇమం భారమ్ = ఈ భారమును, ఆసాద్య=పొంది, మహాధుర్యసముద్ధృతమ్=కాడికి కట్టుటకు తగిన మహావృషభముచే ఎత్తబడిన, ధురమ్ = భారమును, దమ్యః ఇవ = కాడి మోయుటకు శిక్షణ ఇవ్వ తగిన ఎద్దు వలె, కేన = ఏ, ఓజసా = తేజస్సుతో, వహేయమ్ = మోయుదును?

తా. కాడికి కట్ట దగిన పెద్ద వృషభము మోయు కాడిని ఇంకను ఆ పని నేర్పవలసి ఉన్న చిన్న ఎద్దు వలె, నేను ఏ బలముచే ఈ రాజ్యభారమును మోయగలను? 16

మూ. అథవా మే భవేచ్ఛక్తిర్యోగైర్బుద్ధిబలేన వా,
సకామాం న కరిష్యామి త్వామహం పుత్రగర్ధినీమ్. 17

ప్ర. అ. అథవా = లేదా, యోగైః = సామదానాద్యుపాయములచేత గాని, బుద్ధిబలేన వా = బుద్ధిబలముచేత గాని, మే = నాకు, శక్తిః = శక్తి, భవేత్ = కలుగవచ్చును. అహమ్ = నేను, పుత్రగర్ధినీమ్=పుత్రునిపై ప్రేమ గల, త్వామ్ = నిన్ను, సకామామ్ = నిండిన కోరిక కలదానినిగా, న కరిష్యామి = చేయను.

తా. అథవా, సామదానాద్యుపాయములను ప్రయోగించుటచేతను, బుద్ధి బలముచేతను, నా కీ భారమును మోయు శక్తి కలుగవచ్చునేమో. అయినను, పుత్రునిపై మితి మీరిన ప్రేమ గల నీ కోరికను మాత్రము తీర్చను. 17

మూ. న మే వికాఙ్క్షా జాయేత త్యక్తుం త్వాం పాపనిశ్చయామ్,
యది రామస్య నావేక్షా త్వయి స్యాన్మాతృవత్సదా. 18

ప్ర అ. త్వయి = నీయందు, రామస్య = రామునకు, సదా = ఎల్లప్పుడును, మాతృవత్ = తల్లియందు వలె, అవేక్షా = దృష్టి, న స్యాద్యది = లేకున్నచో, పాపనిశ్చయామ్ = పాపనిశ్చయము గల, త్వామ్ = నిన్ను, త్యక్తుమ్= విడచుటకు, మే = నాకు, వికాఙ్క్షా=కోరిక లేకపోవుట, న జాయేత = కలుగదు.

తా. రాముడు సర్వదా నిన్ను తన తల్లి వలె చూచుకొనుచుండెడివాడు. అందుచేతనే పాపబుద్ధి కలదాన వైనను నిన్ను విడచుటకు మనసు రాకున్నది.

మూ. ఉత్పన్నా తు కథం బుద్ధిస్తవేయం పాపదర్శిని,
సాధుచారిత్రవిభ్రష్టే పూర్వేషాం నో విగర్హితా. 19

ప్ర. అ. పాపదర్శిని=పాప మైన దృష్టి కలదానా, సాధుచరిత్రవిభ్రష్టే మంచి నడవడికనుండి జారిపోయినదానా! నః = మాయొక్క, పూర్వేషామ్ = పూర్వికులకు (చేత), విగర్హితా = నిందిత మైన, ఇయం బుద్ధిః = ఈ బుద్ధి, తవ = నీకు, కథమ్ = ఎట్లు, ఉత్పన్నా = పుట్టినది.

తా. ఓ పాపాలోచనపరురాలా! సచ్చరిత్రను విడచినదానా! మా పూర్వులందరూ నిందించు ఇట్టి బుద్ధి నీ కెట్లు కలిగినది? 19

మూ. అస్మిన్ కులే హి సర్వేషాం జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే,
అపరే భ్రాతరస్తస్మిన్ ప్రవర్తన్తే సమాహితాః. 20

ప్ర. అ. అస్మిన్ కులే=ఈ కులమునందు, సర్వేషామ్ = అందరిలోనూ, జ్యేష్ఠః=జ్యేష్ఠుడైనవాడు, రాజ్యే=రాజ్యమునందు, అభిషిచ్యతే హి=అభిషేకింపబడును కదా. అపరే = మిగిలిన, భ్రాతరః = సోదరులు, తస్మిన్ = జ్యేష్ఠునియందు, సమాహితాః = ఆదరము కలవారై, ప్రవర్తన్తే = ప్రవర్తింతురు.

తా. పుత్రు లందరిలోను జ్యేష్ఠుడైనవాడు రాజ్యాభిషిక్తుడు కాగా మిగిలిన సోదరు లందరు అతనిపై మంచి భక్తితో ప్రవర్తించుచుందురు అనునది ఈ వంశములోని ఆచారము కదా! 20

మూ. న హి మన్యే నృశంసే త్వం రాజధర్మమవేక్షసే,
గతిం వా న విజానాసి రాజవృత్తస్య శాశ్వతీమ్. 21

ప్ర. అ. నృశంసే = క్రూరురాలా! త్వమ్ = నీవు, రాజధర్మమ్ = రాజధర్మమును, న అవేక్షసే = చూచుట లేదు. వా = లేదా, రాజవృత్తస్య = రాజధర్మముయొక్క, శాశ్వతీమ్ = శాశ్వతమైన, గతిమ్ = పద్ధతిని, న విజానాసి = ఎరుగవు; అని, మన్యే = తలచుచున్నాను.

తా. క్రూరురాలా! నీకు రాజధర్మముపై ఆదరమైన లేకపోవలె, లేదా నీకు శాశ్వతమైన రాజధర్మపద్ధతి తెలియకపోవలె అని అనుకొనుచున్నాను.

మూ. సతతం రాజవృత్తే హి జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే,
రాజ్ఞామేతత్సమం తత్స్యాదిక్ష్వాకూణాం విశేషతః. 22

ప్ర. అ. రాజవృత్తే = రాజధర్మమునందు, సతతమ్ = ఎల్లప్పుడును, జ్యేష్ఠః = జ్యేష్ఠపుత్రుడు, రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్యతే = అభిషేకింపబడును. ఏతత్ = ఇది, రాజ్ఞామ్ = అందరు రాజులకును, సమమ్ = సమానమే. తత్ = అది, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజులకు, విశేషతః = విశేషించి, స్యాత్ = అగును.

తా. రాజధర్మానుసారము జ్యేష్ఠుడే ఎల్లప్పుడును, రాజ్యమునందు అభిషిక్తుడగును. ఈ నియమము రాజు లందరికిని సమానమే. విశేషించి, ఇది ఇక్ష్వాకువంశీయులకు ప్రధానమైన ధర్మము. 22

మూ. తేషాం ధర్మైకరక్షాణాం కులచారిత్రయోగినామ్,
అత్ర చారిత్రశౌణ్డీర్యం త్వాం ప్రాప్య వినివర్తితమ్. 23

ప్ర. అ. ధర్మైకరక్షాణామ్=ధర్మమే ప్రధానరక్షగా కలవారూ, కులచారిత్రయోగినామ్ = మంచి కులమునకు తగిన చరిత్రతో కూడినవారూ అయిన, తేషామ్ = ఆ ఇక్ష్వాకువంశీయులయొక్క, చారిత్రశౌణ్డీర్యమ్ = సచ్చరిత్రను గూర్చిన గర్వము, అత్ర = ఈ విషయమునందు, త్వామ్=నిన్ను, ప్రాప్య= పొంది, వినివర్తితమ్=మరల్చబడినది.

తా. ఇక్ష్వాకువంశీయులకు ధర్మమే ప్రధానరక్ష. వారు మంచి కులము, దానికి తగిన సదాచారము కలవారు. సచ్చరిత్రవిషయమున వారికి గల గర్వము ఈనాడు నీవు నశింపచేసినావు. 23

మూ. తవాపి సుమహాభాగా జనేన్ద్రాః కులపూర్వగాః,
బుద్ధేర్మోహః కథమయం సంభూతస్త్వయి గర్హితః. 24

ప్ర. అ. తవ = నీయొక్క. కులపూర్వగాః = కులములో పూర్వము నందుండే, జనేన్ద్రాః అపి=రాజులు కూడా, సుమహాభాగాః=చాల గొప్పవారే. గర్హితః=నింద్య మైన, అయమ్=ఈ, బుద్ధేః=బుద్ధియొక్క, మోహః=మోహము, త్వయి=నీయందు, కథమ్=ఎట్లు, సంభూతః=పుట్టినది.

తా. నీ వంశములో పూర్వపురుషు లైన మహారాజు లందరు కూడ మహానుభావులే కదా! నిందింపదగిన ఈ బుద్ధిమోహము నీ కెట్లు కలిగినది! 24

మూ. న తు కామం కరిష్యామి తవాఽహం పాపనిశ్చయే,
త్వయా వ్యసనమారబ్ధం జీవితాన్తకరం మమ. 25

ప్ర. అ. పాపనిశ్చయే=పాప మైన నిశ్చయము కలదానా! అహం తు= నేనైతే, తవ=నీయొక్క, కామమ్=కోరిన పనిని, న కరిష్యామి=చేయను. త్వయా=నీచేత, మమ=నాయొక్క, జీవితాన్తకరమ్=జీవితమునకు అంతమును కలిగించు, వ్యసనమ్ = దుఃఖకర మైన కార్యము, ఆరబ్ధమ్ = ప్రారంభింపబడినది.

తా. పాపనిశ్చయము కలదానా! నేను మాత్రము నీవు కోరిన పని చేయను. నీవు నా ప్రాణములకే ముప్పు వాటిల్లు చెడ్డ పని ప్రారంభించినావు.

మూ. ఏష త్విదానీమేవాహమప్రియార్థం తవానఘమ్,
నివర్తయిష్యామి వనాద్భ్రాతరం స్వజనప్రియమ్. 26

ప్ర. అ. ఏషః అహం తు=ఈ నే నైతే, ఇదానీమ్=ఇప్పుడే, తవ=నీ యొక్క, అప్రియార్థమ్=అప్రియముకొరకై, అనఘమ్=దోషములు లేనివాడూ, స్వజనప్రియమ్=స్వజనులకు ప్రియుడూ అయిన, భ్రాతరమ్=సోదరుని, వనాత్ =వనమునుండి, నివర్తయిష్యామి=మరల్చెదను.

తా. నే నిపుడు నీకు అప్రియము చేయ నిశ్చయించినాను. స్వజనులకు ఇష్టుడూ, దోషరహితుడూ అయిన సోదరుని వనమునుండి వెనుకకు తీసికొని వచ్చెదను. 26

మూ. నివర్తయిత్వా రామం చ తస్యాహం దీప్తతేజసః,
దాసభూతో భవిష్యామి సుస్థిరేణాన్తరాత్మనా. 27

ప్ర. అ. రామం= రాముని, నివర్తయిత్వా = మరల తీసికొని వచ్చి, సుస్థిరేణ=చాల స్థిర మైన, అన్తరాత్మనా=హృదయముతో, దీప్తతేజసః = ప్రకాశించుచున్న తేజస్సు గల, తస్య=అతనికి, దాసభూతః=దాసుడను, భవిష్యామి = కాగలను.

తా. రాముని మరల వెనుకకు తీసికొని వచ్చి, ప్రకాశించుచున్న తేజస్సు గల ఆతనికి సుస్థిర మైన మనస్సుతో దాస్యము చేసెదను. 27

మూ. ఇత్యేవముక్త్వా భరతో మహాత్మా
ప్రియేతరై ర్వాక్యగణైస్తుదంస్తామ్,
శోకాతురశ్చాపి ననాద భూయః
సింహో యథా పర్వతగహ్వరస్థః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రిసప్తతితమః సర్గః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ము డైన, భరతః=భరతుడు, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్త్వా=పలికి, ప్రియేతరైః=అప్రియము లైన, వాక్యగణైః=వాక్య సముదాయములతో, తామ్=ఆమెను, తుదన్=పీడించుచు, శోకాతురః=శోకపీడితు డై, పర్వతగహ్వరస్థః=పర్వతగుహలో ఉన్న, సింహో యథా=సింహము వలె, భూయశ్చాపి=మరల, ననాద = ధ్వని చేసెను.

తా. మహాత్ము డైన భరతుడు ఈ విధముగ పలుకుచు, అప్రియము లైన మాటలచే ఆమెను పీడించుచు, శోకపీడితు డై పర్వతగుహలో ఉన్న సింహము వలె మరల బిగ్గరగా ఏడ్చెను. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో డెబ్బదిమూడవ సర్గ సమాప్తము

## అథ చతుఃసప్తతితమః సర్గః

*[భరతుడు కైకను తీవ్రముగ నిందించుట.]*

మూ. తాం తథా గర్హయిత్వా తు మాతరం భరతస్తదా,
రోషేణ మహతావిష్టః పునరేవాబ్రవీ ద్వచః. 1

ప్ర. అ. తదా = అప్పుడు, భరతః = భరతుడు, మాతరమ్ = తల్లి యైన, తామ్ = ఆమెను, తథా = అట్లు, గర్హయిత్వా = నిందించి, మహతా = గొప్ప, రోషేణ = రోషముతో, ఆవిష్టః = కూడినవాడై, పునరేవ = మరల, వచః = వాక్కును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు భరతుడు తల్లిని ఆ విధముగా దూషించి, చాల కోపముతో కూడినవాడై మరల ఇట్లు పలికెను. 1

మూ. రాజ్యాద్భ్రంశస్వ కైకేయి నృశంసే దుష్టచారిణి,
పరిత్యక్తా చ ధర్మేణ మా మృతం రుదతీ భవ. 2

ప్ర. అ. నృశంసే = క్రూరురాలా, దుష్టచారిణి = చెడ్డగా ప్రవర్తించుదానా, కైకేయి = ఓ కైకేయీ, రాజ్యాత్ = రాజ్యమునుండి, భ్రంశస్వ = భ్రష్టురాలవు అగుము. ధర్మేణ = ధర్మముచేత, పరిత్యక్తా = విడువబడిన నీవు, మృతమ్ = మరణించిన, మా = నన్ను గూర్చి, రుదతీ = ఏడ్చుచున్నదానవు, భవ = అగుము.

తా. క్రూరురాలా! దుష్ట మైన ప్రవృత్తి గలదానా! ఓ కైకేయీ! నీవు కోరిన రాజ్యము నీకు లభించకపోవుగాక! ధర్మవిహీనురాల వైన నీవు మరణించిన నన్ను గూర్చి ఏడ్చుచు కూర్చుండుము. 2

మూ. కిం ను తేఽదూషయద్రాజా రామో వా భృశధార్మికః,
యయోర్మృత్యుర్వివాసశ్చ త్వత్కృతే తుల్యమాగతౌ. 3

ప్ర. అ. యయోః=ఎవ్వరికి, త్వత్కృతే=నీ కొరకై, తుల్యమ్=ఒక్క మారుగా, మృత్యుః=మరణము, వివాసశ్చ=ప్రవాసమూ, ఆగతౌ = వచ్చినవో అట్టి, రాజా=రాజూ కాని, భృశధార్మికః=మిక్కిలి ధార్మికు డైన, రామో వా = రాముడు గాని, తే = నీకు, కిం ను = ఏమి, అదూషయత్ = దూషించెను.

తా. నీ మూలమున రాజునకు మరణము, రామునకు ప్రవాసము ఒక్క మారుగా సంప్రాప్తించినవి కదా! ఆ రాజుగాని పరమధార్మికు డైన రాముడు కాని నీ కేమి అపకారము చేసినాడు. 3

మూ. భ్రూణహత్యామసి ప్రాప్తా కులస్యాస్య వినాశనాత్,
కైకేయి నరకం గచ్ఛ మా చ భర్తుః సలోకతామ్. 4

ప్ర. అ. అస్య కులస్య=ఈ కులముయొక్క, వినాశనాత్ = నశింప చేయుటవలన, భ్రూణహత్యామ్=భ్రూణహత్యాదోషమును, ప్రాప్తా అసి=పొందిన దాన వైతివి. కైకేయి = కైకేయీ, నరకమ్=నరకమును గూర్చి, గచ్ఛ = వెళ్ళుము. భర్తుః=భర్తకు, సలోకతామ్=సలోకత్వమును, మా చ=పొందకుము.

తా. కైకేయీ, ఈ కులమును నశింపచేసి, భ్రూణహత్యాపాపము పొందినావు. నీకు నరకమే ప్రాప్తించును గాని, భర్తతో సాలోక్యము (భర్త ఉన్న లోకములోనే అతనితో కలిసి నివసించుట) లభింపదు. 4

మూ. యత్త్వయా హీదృశం పాపం కృతం ఘోరేణ కర్మణా,
సర్వలోకప్రియం హిత్వా మమాప్యాపాదితం భయమ్. 5

ప్ర. అ. త్వయా=నీచేత, ఘోరేణ=ఘోర మైన, కర్మణా=కర్మ చేత, యత్=ఏ కారణము వలన, ఈదృశమ్ = ఇట్టి, పాపమ్=పాపము, కృతమ్=చేయబడినదో అందువలన, సర్వలోకప్రియమ్=సర్వలోకమునకు ప్రియమును, హిత్వా = విడచి లేదా సర్వలోకములకు ప్రియు డైన రాముని దూరము చేసి, మమాపి = నాకు కూడ, భయమ్=భయము, ఆపాదితమ్ = చేయబడినది.

తా. నీ వీ భయంకర మైన పని చేసి ఇట్టి పాపము సంపాదించితివి. ఈ విధముగ అందరికిని అప్రియమును చేయుటచే నీ కుమారుడ నైన నాకు కూడ భయము కలిగించినావు. 5

మూ. త్వత్కృతే మే పితా వృత్తో రామశ్చారణ్యమాశ్రితః,
అయశో జీవలోకే చ త్వయాహం ప్రతిపాదితః. 6

ప్ర. అ. త్వత్కృతే = నీ నిమిత్తమున, మే పితా = నా తండ్రి, వృత్తః = మరణించినాడు. రామశ్చ = రాముడు, అరణ్యమ్ = అరణ్యమును, ఆశ్రితః = ఆశ్రయించినాడు. త్వయా = నీచేత, అహమ్ = నేను, జీవలోకే = ఈ ప్రాణి లోకమునందు, అయశః చ = అపకీర్తిని కూడా, ప్రతిపాదితః = పొందింపబడితిని.

తా. నీ మూలమున నా తండ్రి మరణించినాడు. రాముడు అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. నాకు కూడ నీ వీ లోకమునందు గొప్ప అపకీర్తి తెచ్చి పెట్టినావు. 6

మూ. మాతృరూపే మమామిత్రే నృశంసే రాజ్యకాముకే,
న తేఽహమభిభాష్యోఽస్మి దుర్వృత్తే పతిఘాతిని. 7

ప్ర. అ. మమ = నాయొక్క, మాతృరూపే = మాతృరూపము గల, అమిత్రే = శత్రువా! నృశంసే = క్రూరురాలా! రాజ్యకాముకే = రాజ్యమునందు కోరికగలదానా! దుర్వృత్తే = చెడ్డ నడవడిక కలదానా! పతిఘాతిని = భర్తను చంపినదానా! అహమ్ = నేను, తే = నీకు, అభిభాష్యః = పలకరించదగినవాడను, నాస్మి = కాను.

తా. నీవు నాకు తల్లి అను పేరు పెట్టుకొన్న శత్రువు. క్రూరురాలవు. రాజ్యలోభము కలదానవు. చెడ్డగా ప్రవర్తించి భర్తను చంపినావు. నీవు నాతో మాటలాడతగినదానవు కావు. 7

మూ. కౌసల్యా చ సుమిత్రా చ యాశ్చాన్యా మమ మాతరః,
దుఃఖేన మహతావిష్టాస్త్వాం ప్రాప్య కులదూషణీమ్. 8

ప్ర. అ. కులదూషణీమ్ = కులమును అపవిత్రము చేసిన, త్వామ్ = నిన్ను, ప్రాప్య = పొంది, కౌసల్యా = కౌసల్యా, సుమిత్రా చ = సుమిత్రా, మమ = నాయొక్క, యాః = ఏ, అన్యాః = ఇతరలైన, మాతరః = తల్లులు గలరో వారూ, మహతా = గొప్ప, దుఃఖేన = దుఃఖముతో, ఆవిష్టాః = కూడినవారు అయినారు.

తా. కులమునకు చేటు తెచ్చిన నీ మూలమున, కౌసల్యకూ, సుమిత్రకూ, నా మిగిలిన తల్లులందరికీ కూడ గొప్ప కష్టము వచ్చిపడినది. 8

మూ. న త్వమశ్వపతేః కన్యా ధర్మరాజస్య ధీమతః,
రాక్షసీ తత్ర జాతాసి కులప్రధ్వంసినీ పితుః. 9
యత్త్వయా ధార్మికో రామో నిత్యం సత్యపరాయణః,
వనం ప్రస్థాపితో దుఃఖాత్పితా చ త్రిదివం గతః. 10

ప్ర. అ. యత్ = ఏ కారణమువలన, త్వయా = నీచేత, ధార్మికః = ధర్మతత్పరుడూ, నిత్యమ్=నిత్యమూ, సత్యపరాయణః=సత్యమునందు ఆసక్తి కలవాడూ అయిన, రామః = రాముడు, వనమ్=వనమును గూర్చి, ప్రస్థాపితః = పంపబడినాడో, పితా చ = నా తండ్రి కూడ, దుఃఖాత్ = దుఃఖమువలన, త్రిదివమ్=స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడో, అందువలన, త్వమ్ = నీవు, ధర్మరాజస్య = ధార్మికుడైన రాజూ, ధీమతః = బుద్ధిమంతుడూ అయిన, అశ్వపతేః = అశ్వపతియొక్క, కన్యా = కుమార్తెవు, న = కాదు. తత్ర= ఆ వంశమునందు, జాతా = పుట్టిన, పితుః = తండ్రియొక్క, కులప్రధ్వంసినీ= కులమును నశింపచేసే, రాక్షసీ=రాక్షసిగా. అసి = అయి ఉన్నావు.

తా. ధార్మికుడూ, సత్యపరాయణుడూ అయిన రాముని అరణ్యమునకు పంపివేసినావు. పుత్రశోకముతో నా తండ్రి స్వర్గస్థుడైనాడు. అందుచే, నీవు ధర్మాత్ముడూ, బుద్ధిశాలీ అయిన అశ్వపతి కుమార్తెవు కాదు. తండ్రి కులమును నశింపచేయుటకై ఆ వంశమునందు జనించిన రాక్షసివి. 9-10

మూ. యత్ప్రధానాసి తత్పాపం మయి పిత్రా వినా కృతే,
భ్రాతృభ్యాం చ పరిత్యక్తే సర్వలోకస్య చాప్రియే. 11

ప్ర. అ. యత్ప్రధానా = ఏ పాపము ప్రధానముగా కలదానవు, అసి అయి ఉన్నావో, తత్=ఆ, పాపమ్=పాపము, పిత్రా వినా=తండ్రి లేకుండగా, కృతే=చేయబడినవాడనూ, భ్రాతృభ్యామ్ = సోదరులచేత, పరిత్యక్తే = విడువబడినవాడనూ, సర్వలోకస్య = సమస్త లోకమునకు, అప్రియే చ=అప్రియుడనూ అయిన, మయి=నాయందు, పడినది.

తా. నీవు చేసిన పాపము నాకు సంక్రమించుటచే నా తండ్రి మరణించి నాడు. సోదరులు నన్ను పరిత్యజించినారు. నేను అందరికిని అప్రియుడను అయినాను. 11

మూ. కౌసల్యాం ధర్మసంయుక్తాం వియుక్తాం పాపనిశ్చయే,
కృత్వా కం ప్రాప్స్యసే త్వద్య లోకం నిరయగామిని. 12

ప్ర. అ పాపనిశ్చయే = పాప మైన నిశ్చయము కలదానా, నిరయగామిని=నరకమునకు పోవుదానా! ధర్మసంయుక్తామ్ = ధర్మముతో కూడిన, కౌసల్యామ్=కౌసల్యను, వియుక్తామ్ = పుత్రవియుక్తురాలనుగా, కృత్వా=చేసి, అద్య = ఇప్పుడు, కం లోకమ్ = ఏ లోకమును, ప్రాప్స్యసే=పొందగలవు!

తా. పాపనిశ్చయము కలదానా ! నరకమునకు పోవుదానా! ధర్మాత్మురాలైన కౌసల్యకు పుత్రవియోగము కలిగించిన నువ్వు పోవుటకు తగిన లోకమేదియో తెలియదు! 12

మూ. కిం నావబుధ్యసే క్రూరే నియతం బన్ధుసంశ్రయమ్,
జ్యేష్ఠం పితృసమం రామం కౌసల్యాయాత్మసంభవమ్. 13

ప్ర. అ. క్రూరే = క్రూరురాలా! కౌసల్యాయాః=కౌసల్యయొక్క, ఆత్మసంభవమ్=కుమారుడైన, రామమ్=రాముని, నియతమ్ = ఆత్మనిగ్రహవంతునిగానూ, బన్ధుసంశ్రయమ్ = బంధువులకు ఆశ్రయ మైనవానినిగాను, జ్యేష్ఠమ్ = జ్యేష్ఠునిగానూ, పితృసమమ్ = తండ్రితో సమానునిగాను, కిం నావబుధ్యసే = ఎరుగవా ?

తా. క్రూరురాలా : కౌసల్యాకుమారు డైన రాముడు ఆత్మనిగ్రహము కలవాడనీ, బంధువులకు ఆశ్రయ మైనవాడనీ, జ్యేష్ఠు డగుటచే మాకు తండ్రి వంటివాడనీ నీకు తెలియదా? 13

మూ. అఙ్గప్రత్యఙ్గజః పుత్రో హృదయాచ్చాపి జాయతే,
తస్మాత్ప్రియతమో మాతుః ప్రియా ఏవ తు బాన్ధవాః.

ప్ర. అ. పుత్రః=పుత్రుడు, అఙ్గప్రత్యఙ్గజః=అంగములనుండీ, ప్రత్యంగములనుండీ పుట్టినవాడు. హృదయాచ్చాపి=హృదయమునుండి కూడ, జాయతే

= పట్టును. తస్మాత్ = ఆ కారణమువలన, మాతుః = తల్లికి, ప్రియతమః = అత్యంతము ప్రియుఁడు. బాన్ధవాః = ఇతరబంధువులు, ప్రియా ఏవ తు = ప్రియులు మాత్రమే.

తా. పుత్రుడు తన అంగములనుండీ, ప్రత్యంగములనుండీ (చిన్న, పెద్ద ప్రతి అవయవమునుండి) హృదయమునుండీ కూడ పుట్టినవా డగుటచే తల్లికి అత్యంతప్రియుడు. ఇతరబాంధవులు ప్రియులు మాత్రమే.

వి. "మాతుః ప్రియత్వాన్న తు బాన్ధవః" అను పాఠముకంటె బాగుండుట చేత గోరఖ్‌పూర్ ప్రతి పాఠము గ్రహింపబడినది.

మూ. అన్యదా కిల ధర్మజ్ఞా సురభిః సురసంమతా,
వహమానౌ దదర్శోర్వ్యాం పుత్రౌ విగతచేతసౌ. 15

ప్ర. అ. అన్యదా = ఒకానొకప్పుడు, ధర్మజ్ఞా = ధర్మము నెరిగినదీ, సురసంమతా = సురులచేత పూజింపబడినదీ అయిన, సురభిః = కామధేనువు, ఉర్వ్యామ్ = భూమిపై, వహమానౌ = భారము మోయుచున్న (నాగలిలాగుచున్న), విగతచేతసౌ = పోయిన మనస్సు గల (మూర్ఛ నొందిన), పుత్రౌ = పుత్రులను, దదర్శ కిల = చూచినదట.

తా. ఒకానొకప్పుడు, ధర్మములు తెలిసినదీ, దేవతలచే పూజింపబడినదీ అయిన కామధేనువు తన పుత్రులు, భూలోకమున దున్నుచూ మూర్ఛ చెంది ఉండగా చూచెనట. 15

మూ. తావర్ధదివసం శ్రాన్తౌ దృష్ట్వా పుత్రౌ మహీతలే,
రురోద పుత్రశోకేన బాష్పపర్యాకులేక్షణా. 16

ప్ర. అ. మహీతలే = భూమియందు, అర్ధదివసమ్ = దివసములో సగము భాగము, శ్రాన్తౌ = పరిశ్రమించి అలసిన, పుత్రౌ = పుత్రులను, దృష్ట్వా = చూచి, పుత్రశోకేన = పుత్రులకు కలిగిన శోకముచే, బాష్పపర్యాకులేక్షణా = కన్నీళ్ళతో వ్యాకుల మైన నేత్రములు కలదై, రురోద = ఏడ్చెను.

తా. భూలోకమునందు దినములో సగము భాగము శ్రమించి అలసి

పోయిన ఆ వృషభములను చూచి, పుత్రశోకముచే కన్నీళ్లతో వ్యాకుల మైన నేత్రములు కలదై ఏడ్చెను. 16

మూ. అధస్తాద్వ్రజతస్తస్యాః సురరాజ్ఞో మహాత్మనః,
బిన్దవః పతితా గాత్రే సూక్ష్మాః సురభిగన్ధినః. 17

ప్ర. అ. తస్యాః = ఆ కామధేనువుయొక్క, సూక్ష్మాః = సూక్ష్మ మైన, సురభిగన్ధినః=మంచి గంధము గల, బిన్దవః=కన్నీటి బిందువులు, అధస్తాత్ =క్రింద, వ్రజతః=వెళ్ళుచున్న, మహాత్మనః = మహాత్ము డైన, సురరాజ్ఞః = దేవేంద్రునియొక్క, గాత్రే=గాత్రమునందు, పతితాః=పడినవి.

తా. ఆ సమయమున దేవేంద్రుడు క్రింది భాగమున వెళ్ళుచుండగా, కామధేనువుయొక్క పరిమళించుచున్న సూక్ష్మ మైన కన్నీటి బిందువులు అతనిపై పడినవి. 17

మూ. ఇన్ద్రోఽప్యశ్రునిపాతం తం స్వగాత్రే పుణ్యగన్ధినమ్,
సురభిం మన్యతే దృష్ట్వా భూయసీం తాం సురేశ్వరః.

ప్ర. అ. సురేశ్వరః = దేవతాప్రభు వైన, ఇన్ద్రోఽపి = ఇంద్రుడు, స్వగాత్రే = తన శరీరముపై, పుణ్యగన్ధినమ్=ఉత్తమగంధము గల, తమ్=ఆ, అశ్రుపాతమ్=కన్నీళ్ళు పడుటను, దృష్ట్వా=చూచి, తామ్=అమెను, భూయసీమ్ =గొప్ప దైన, సురభిమ్=కామధేనువునుగా, మన్యతే = తలచెను.

తా. దేవాధీశు డైన ఇంద్రుడు తన శరీరముపై పడిన పరిమళించుచున్న కన్నీటిబిందువులను చూచి, అవి పూజ్యురా లైన కామధేనువు కన్నీటి బిందువులే అయి ఉండు నని తలచెను. 18

మూ. నిరీక్షమాణః శక్రస్తాం దదర్శ సురభిం స్థితామ్,
ఆకాశే విష్ఠితాం దీనాం రుదతీం భృశదుఃఖితామ్. 19

ప్ర అ. శక్రః = ఇంద్రుడు, ఆకాశే = ఆకాశమునందు, నిరీక్షమాణః = చూచుచున్నవాడై, స్థితామ్ = అక్కడ ఉన్నదీ, విష్ఠితామ్ = వ్యాకులతతో ఉన్నదీ, దీనామ్= దీనురాలూ, రుదతీమ్ = ఏడ్చుచున్నదీ, భృశదుఃఖితామ్ =

మిక్కిలి దుఃఖించుచున్నదీ అయిన, తాం సురభిమ్=ఆ కామధేనువును, దదర్శ =చూచెను.

తా. దేవేంద్రుడు పైకి చూచి, అక్కడ, వ్యాకులురాలై, దైన్యముతో మిక్కిలి దుఃఖించుచు ఏడ్చుచున్న ఆ కామధేనువును చూచెను. 19

మూ. తాం దృష్ట్వా శోకసంతప్తాం వజ్రపాణిర్యశస్వినీమ్,
ఇన్ద్రః ప్రాఞ్జలిరుద్విగ్నః సురరాజోఽబ్రవీద్వచః. 20

ప్ర. అ. వజ్రపాణిః = వజ్రము హస్తమునందు కల, సురరాజః=దేవతల రాజైన, ఇన్ద్రః=ఇంద్రుడు, శోకసంతప్తామ్=శోకముచేత తపింప చేయబడిన, యశస్వినీమ్=కీర్తి గల, తామ్=ఆ కామధేనువును, దృష్ట్వా=చూచి, ఉద్విగ్నః= దిగులొందినవాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వజ్రధరుడు, దేవతాప్రభువూ అయిన ఇంద్రుడు కీర్తికల ఆ కామధేనువు శోకసంతప్తురాలగుటను చూచి, దిగులు చెంది, నమస్కరించుచు ఇట్లు పలికెను. 20

మూ. భయం కచ్చిన్న చాస్మాసు కుతశ్చిద్విద్యతే మహత్,
కుతోనిమిత్తః శోకస్తే బ్రూహి సర్వహితైషిణి. 21

ప్ర. అ. సర్వహితైషిణి = అందరి హితమును కోరుదానా, అస్మాసు = మాయందు (మాకు), కుతశ్చిత్=ఎక్కడినుంచైనా, మహత్=గొప్ప, భయమ్= భయము, న విద్యతే కచ్చిత్ = లేదు కదా. తే = నీయొక్క, శోకః = శోకము, కుతోనిమిత్తః = ఏమి నిమిత్తము కలది? బ్రూహి = చెప్పుము.

తా. అందరి హితమునూ కోరుదానా! మాకు ఎవ్వరినుండి మహాభయము వచ్చుట లేదు కదా! నీ శోకమునకు కారణ మేమో చెప్పుము. 21

మూ. ఏవముక్తా తు సురభిః సురరాజేన ధీమతా,
ప్రత్యువాచ తతో ధీరా వాక్యం వాక్యవిశారదమ్. 22

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతుడైన, సురరాజేన = ఇంద్రుని చేత,

ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, ధీరా = ధీరురాలైన, సురభిః = కామధేనువు, తతః = అటు పిమ్మట, వాక్యవిశారదమ్ = మాటలలో నేర్పరి యైన ఆ దేవేంద్రుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ధీమంతు డైన ఆ సురరాజు మాటలు విని, ధైర్యవంతురా లైన ఆ కామధేనువు మాటలలో నేర్పరి యైన ఆతనితో ఇట్లు పలికెను. 22

మూ. శాన్తం పాపం న వః కశ్చిత్ కుతశ్చిదమరాధిప,
అహం మగ్నా తు శోచామి స్వపుత్రౌ విషమే స్థితౌ. 23
ఏతౌ దృష్ట్వా కృశౌ దీనౌ సూర్యరశ్మిప్రతాపితౌ,
అర్ద్యమానౌ బలీవర్దౌ కర్షకేణ సురాధిప. 24

ప్ర. అ. అమరాధిప = దేవతల ప్రభు వైన ఓ ఇంద్రా! పాపమ్ = పాపము, శాన్తమ్ = శమించుగాక. వః = మీకు, కుతశ్చిత్ = ఎక్కడి నుండి, కశ్చిత్ = ఏ ఉపద్రవమూ కూడ, న = లేదు. సురాధిప = ఓ దేవేంద్రా! అహమ్ = నేను, విషమే = కష్టమునందు, స్థితౌ = ఉన్నవి, సూర్యరశ్మిప్రతాపితౌ = సూర్యకిరణములచే తపింప చేయబడినవి, కృశౌ = దుర్బల మైనవి, కర్షకేణ = దున్నువానిచేత, అర్ద్యమానౌ = పీడింపబడుచున్నవి, మగ్నా = దుఃఖములో మునిగినవి అయిన, స్వపుత్రౌ = నా పుత్రు లైన, ఏతౌ = ఈ, బలీవర్దౌ = వృషభములను, దృష్ట్వా = చూచి, దీనా = దీనురాల నై, శోచామి = దుఃఖించుచున్నాను.

తా. పాపము శమించుగాక! ఇంద్రా! మీకు ఎక్కడినుండీ ఏ భయమూ లేదు. నా పుత్రు లైన ఈ వృషభములు కష్టములో ఉన్నవి. కృశించి ఎండకు బాధపడుచున్న వీటిని ఈ కర్షకుడు ఇంకను పీడించుచున్నాడు. దుఃఖమగ్నము లైన వీటిని చూచుటచే నాకు దుఃఖము కలిగినది. 23, 24

మూ. మమ కాయాత్ప్రసూతౌ హి దుఃఖితౌ భారపీడితౌ.
యౌ దృష్ట్వా పరితప్యేఽహం నాస్తి పుత్రసమః ప్రియః.

ప్ర. అ. అహమ్ = నేను, భారపీడితౌ = భారముచే పీడింపబడినవి, దుఃఖితౌ = దుఃఖించుచున్నవి అయిన, యౌ = వేటిని, దృష్ట్వా = చూచి, పరి

తప్యే = దుఃఖించుచున్నానో అవి, మమ = నాయొక్క, కాయాత్ = శరీరము నుండి, ప్రసూతాః హి = పుట్టినవి కదా. పుత్రసమః = పుత్రునితో సమాను డైన, ప్రియః = ఇష్టుడు, నాస్తి = లేదు.

తా. భారము మోయలేక దుఃఖించుచున్న ఈ వృషభములు నా శరీరము నుండి పుట్టినవి. అందుచేతనే వాటి దుఃఖమును చూచి నాకు దుఃఖము కలిగినది. పుత్రునితో సమాను డైన ప్రియుడు ఉండడు కదా! 25

మూ. యస్యాః పుత్రసహస్రైస్తు కృత్స్నం వ్యాప్తమిదం జగత్,
తాం దృష్ట్వా రుదతీం శక్రో న సుతాన్మన్యతే పరమ్. 26

ప్ర. అ. యస్యాః = ఏ కామధేనువుయొక్క, పుత్రశతైః = పుత్రుల శతములచేత, ఇదం జగత్ = ఈ జగత్తు, వ్యాప్తమ్ = వ్యాప్త మైనదో, తామ్=అట్టి కామధేనువును, రుదతీమ్ = ఏడ్చుచున్నదానినిగా, దృష్ట్వా = చూచి, శక్రః = ఇంద్రుడు, సుతాత్ = కుమారునికంటె, పరమ్ = శ్రేష్ఠుని, న మన్యతే = తలవ లేదు (అంగీకరించలేదు).

తా. వందలాది కామధేను పుత్రులు ఈ ప్రపంచకమునం దంతటను వ్యాపించి ఉన్నారు. అట్టి కామధేనువు కూడ పుత్రులకై ఏడ్చుట చూచి దేవేంద్రుడు "పుత్రుని మించిన వారెవ్వరును లేరు కదా" అని నిర్ణయించుకొనెను.

మూ. సదాఽప్రతిమవృత్తాయా లోకధారణకామ్యయా,
శ్రీమత్యా గుణనిత్యాయాః స్వభావపరిచేష్టయా. 27
యస్యాః పుత్రసహస్రాణి సాపి శోచతి కామధుక్,
కిం పునర్యా వినా రామం కౌసల్యా వర్తయిష్యతి. 28

ప్ర. అ. లోకధారణకామ్యయా=లోకములను నిలుపవలె నను కోరికచే, సదా = ఎల్లప్పుడును, అప్రతిమవృత్తాయాః = సాటి లేని ప్రవృత్తి గలదీ, శ్రీమత్యాః = శోభాయుక్తురాలూ, స్వభావపరిచేష్టయా = స్వభావముయొక్క ప్రవృత్తిచేతనే, గుణనిత్యాయాః = గుణములందు నిత్యురాలూ అయిన, యస్యాః = దేనికి, పుత్రసహస్రాణి = పుత్రుల సహస్రములున్నవో, సా = అట్టి, కామధుక్ అపి = కామధేనువు కూడ, శోచతి=దుఃఖించుచున్నది. యా=ఏ, కౌసల్యా

= కౌసల్య, రామం వినా = రాముడు లేకుండా, వర్తయిష్యతి = జీవించునో (జీవించవలసి ఉన్నదో) ఆమె, కిం పునః = చెప్పవలెనా?

తా. ఈ లోకములను నిలుపవలె ననే కోరికతో కామదేనువు సర్వదా సాటి లేని విధముగా ప్రవర్తించుచుండును. స్వభావముచేతనే ఎల్లప్పుడును, సకలసద్గుణములకు నిలయ మైనది. సకలైశ్వర్యసంపన్నురాలు. వేలకొలది పుత్రుల పరంపర గల అట్టి కామదేనువే ఈ విధముగ తన సంతాన మైన రెండు వృషభములకొరకై దుఃఖించుచున్నది కదా, ఏకైకపుత్రుడైన రామునకు దూర మై జీవింపవలసిన కౌసల్య ఆ రామునకై ఎంత దుఃఖించునో చెప్పవలెనా?

మూ. ఏకపుత్రా చ సాధ్వీ చ వివత్సేయం త్వయా కృతా,
తస్మాత్త్వం సతతం దుఃఖం ప్రేత్య చేహ చ లప్స్యసే.

ప్ర. అ. ఏకపుత్రా చ = ఒకే పుత్రుడు కలదీ, సాధ్వీ చ = పతివ్రతా అయిన, ఇయమ్ = ఈమె, త్వయా = నీచేత, వివత్సా =పిల్లవాడు లేనిదిగా, కృతా=చేయబడినది. తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, ప్రేత్య చ=మరణించీ, ఇహ చ = ఇహలోకమునందూ, సతతమ్=ఎల్లప్పుడూ, దుఃఖమ్ = దుఃఖమును, లప్స్యసే = పొందగలవు.

తా. ఒకే కుమారుడు గల ఈ పరమసాధ్విని నీవు కుమారునకు దూరము చేసినావు. అందుచే, ఇహలోకమునందూ, మరణానంతరమూ కూడ నీకు ఎల్లప్పుడూ, దుఃఖము తప్పదు. 29

మూ. అహం హ్యపచితిం భ్రాతుః పితుశ్చ సకలామిమామ్,
వర్ధనం యశసశ్చాపి కరిష్యామి న సంశయః. 30

ప్ర. అ. అహమ్ = నేను, భ్రాతుః=సోదరునకును, పితుశ్చ = తండ్రికిని, ఇమామ్ = ఈ, సకలామ్ = సంపూర్ణ మైన, అపచితమ్ = అపచితిని (చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తము చేసికొనుట అపచితి,) యశసః=కీర్తియొక్క, వర్ధనమ్ = వర్ధనమును, కరిష్యామి = చేసెదను. సంశయః = సంశయము, న = లేదు.

తా. నా సోదరుని విషయమునందూ, నా తండ్రి విషయమునందూ జరి

గిన అపచారమునకు ప్రాయశ్చిత్తముగా చేయవలసిన దంతా చేసి, నేను కీర్తిని కూడ పెంచుకొనెదను. సంశయము లేదు. 30

మూ. ఆనాయయిత్వా తనయం కౌసల్యాయా మహాబలమ్,
స్వయమేవ ప్రవేక్ష్యామి వనం మునినిషేవితమ్. 31

ప్ర. అ. మహాబలమ్=గొప్ప బలము గల, కౌసల్యాయాః తనయమ్= కౌసల్యాకుమారు డైన రాముని, ఆనాయయిత్వా=తిరిగి రప్పించి, స్వయమేవ= నేనే, మునినిషేవితమ్=మునులచేత సేవింపబడిన, వనమ్=వనమును, ప్రవేక్ష్యామి =ప్రవేశించగలను.

తా. మహాబలశాలి యైన రాముని అరణ్యమునుండి వెనుకకు రప్పించి నేనే మునినివాస మైన అరణ్యమునకు పోయెదను. 31

మూ. న హ్యహం పాపసంకల్పే పాపే పాపం త్వయా కృతమ్,
శక్తో ధారయితుం పౌరై రశ్రుకణ్ఠై ర్నిరీక్షితః. 32

ప్ర. అ. పాపే=పాపాత్మురాలా! పాపసంకల్పే = పాపసంకల్పము గల దానా! అహమ్=నేను, అశ్రుకణ్ఠైః=కన్నీళ్ళు కంఠములందు గల, పౌరైః= పౌరులచేత, నిరీక్షితః=చూడబడినవాడనై, త్వయా = నీచేత, కృతమ్=చేయ బడిన, పాపమ్=పాపమును, ధారయితుమ్=మోయుటకు, న శక్తః హి=సమర్థు డను కాను కదా!

తా. పాపసంకల్పము గల ఓ పాపాత్మురాలా! పౌరు లందరూ దుఃఖ మును దిగమ్రింగికొని చూచుచుండగా, నీవు చేసిన పాపమును మోయజాలను.

మూ. సా త్వమగ్నిం ప్రవిశ వా స్వయం వా దణ్డకాన్విశ,
రజ్జుం బధాన వా కణ్ఠే న హి తేஉన్యత్పరాయణమ్. 33

ప్ర. అ. సా త్వమ్=అట్టి నీవు, అగ్నిం వా=అగ్ని నైనా, ప్రవిశ= ప్రవేశించుము. దణ్డకాన్వా=దండకారణ్యము నైనా, స్వయమ్ = స్వయముగా, విశ=ప్రవేశించుము. వా=లేదా, కణ్ఠే=కంఠమునందు, రజ్జుమ్=త్రాడును, బధాన=కట్టుకొనుము. తే=నీకు, అన్యత్=మరియొక విధ మైన, పరాయణమ్= గతి, న హి=లేదు కదా!

తా. అట్టి నీవు అగ్నిలోనైనా దూకుము. నీవే ఆ దండకారణ్యమునకు వెళ్ళుము. లేదా ఉరి పోసికొనుము. మరొక మార్గ మేదీ లేదు. 33

మూ. అహమప్యవనిం ప్రాప్తే రామే సత్యపరాక్రమే,
కృతకృత్యో భవిష్యామి విప్రవాసితకల్మషః. 34

ప్ర. అ. సత్యపరాక్రమే=సత్యమైన పరాక్రమముగల, రామే=రాముడు, అవనిమ్=భూమిని (రాజ్యమును), ప్రాప్తే=పొందినవా డగుచుండగా, అహమపి=నేను కూడా, విప్రవాసితకల్మషః=తొలగింపబడిన పాపములు కలవాడనై, కృతకృత్యః=కృతకృత్యుడను, భవిష్యామి=కాగలను.

తా. సత్యపరాక్రముడైన రాముడు రాజ్యమును స్వీకరించిన పిమ్మట, నేను కూడ, నా పాప మంతయు తొలగిపోవుటచే కృతకృత్యుడ నయ్యెదను, 34

మూ. ఇతి నాగ ఇవారణ్యే తోమరాఙ్కుశచోదితః,
పపాత భువి సంక్రుద్ధో నిఃశ్వసన్నివ పన్నగః. 35

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, అరణ్యే=అరణ్యమునందు, తోమరాఙ్కుశచోదితః=తోమరముచేతను, అంకుశముచేతను, పొడిచి త్రోలబడిన, నాగః ఇవ=ఏనుగు వలె, సంక్రుద్ధః=కోపించిన వాడై, పన్నగః ఇవ=సర్పము వలె, నిఃశ్వసన్=నిట్టూర్చుచు, భువి=నేలపై, పపాత=పడెను.

తా. అరణ్యములో తోమరములచేతను, అంకుశములచేతను పొడవబడిన ఏనుగ వలె ఈ విధముగ చాల కోపించినవాడై, భరతుడు సర్పము వలె నిట్టూర్చుచు నేలపై పడెను. 35

మూ. సంరక్తనేత్రః శిథిలామ్బరస్తదా
విధూతసర్వాభరణః పరంతపః,
బభూవ భూమౌ పతితో నృపాత్మజః
శచీపతేః కేతురివోత్సవక్షయే 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుఃసప్తతితమః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, సంరక్తనేత్రః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడూ, శిథిలామ్బరః = శిథిలమైన వస్త్రములు కలవాడూ, విధూతసర్వాభరణః = రాల్చివేయబడిన సమస్తమైన ఆభరణములు కలవాడూ, భూమౌ = నేలపై, పతితః = పడినవాడూ అయిన, పరంతపః = శత్రువులకు పీడాకరుడైన, నృపాత్మజః = భరతుడు, ఉత్సవక్షయే = ధ్వజోత్సవాంతము నందు, శచీపతేః = ఇంద్రునియొక్క, కేతురివ = ధ్వజము వలె, బభూవ = ఉండెను.

తా. కండ్లు ఎఱ్ఱబడి, వస్త్రము జారిపోవుచు, అలంకారము లన్నీ చెల్లాచెదురుగా క్రింద పడిపోయి, నేలపై పడి ఉన్న పరంతపుడైన ఆ భరతుడు, ఇంద్రధ్వజోత్సవాంతమునందు నేలపై పడిన ఇంద్రధ్వజము వలె ఉండెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో డెబ్బదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చసప్తతితమః సర్గః

[కౌసల్య యెదుట భరతుడు శపథము చేయుట.]

మూ. దీర్ఘకాలాత్సముత్థాయ సంజ్ఞాం లబ్ధ్వా చ వీర్యవాన్,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యాం దీనాముద్వీక్ష్య మాతరమ్, 1
సోఽమాత్యమధ్యే భరతో జననీమభ్యకుత్సయత్.

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః భరతః = ఆ భరతుడు, దీర్ఘకాలాత్ = చాల సేపటికి, సముత్థాయ = లేచి, సంజ్ఞామ్ = సంజ్ఞను, లబ్ధ్వా చ = పొంది, అశ్రుపూర్ణాభ్యామ్ = కన్నీళ్ళతో నిండిన, నేత్రాభ్యామ్ = నేత్రములతో, దీనామ్ = దీనురాలైన, మాతరమ్ = తల్లిని, ఉద్వీక్ష్య = చూచి, అమాత్యమద్యే = మంత్రుల మధ్యయందు, జననీమ్=తల్లిని, అభ్యకుత్సయత్= నిందించెను.

తా. వీర్యవంతుడైన ఆ భరతుడు చాల సేపటికి తిరిగి సంజ్ఞ రాగా లేచి అశ్రువులతో నిండిన నేత్రములతో, దీనురాలైన తల్లిని చూచి, అమాత్యుల మధ్యయందు, ఆమెను ఈ విధముగా నిందించెను. 1

మూ. రాజ్యం న కామయే జాతు మన్త్రయే నాపి మాతరమ్, 2
అభిషేకం న జానామి యోఽభూద్రాజ్ఞా సమీక్షితః,
విప్రకృష్టే హ్యహం దేశే శత్రుఘ్నసహితోఽవసమ్. 3

ప్ర. అ. జాతు = ఎన్నడును, రాజ్యమ్=రాజ్యమును, న కామయే = కోరలేదు. మాతరమ్ అపి=తల్లి(తో)కూడ, న మన్త్రయే = (ఈ విషయమై) ఆలోచన చేయలేదు. యః=ఏ అభిషేకము, రాజ్ఞా = రాజుచేత, సమీక్షితః = చూడబడినది, అభూత్=ఆయెనో, అభిషేకమ్=అట్టి రాజ్యాభిషేకమును గూర్చి కూడ, న జానామి = ఎరుగను. అహమ్ = నేను, శత్రుఘ్నసహితః =

శత్రుఘ్నునితో కూడినవాడనై, విప్రకృష్టే = దూర మైన, దేశే=దేశమునందు, అవసం హి = నివసించితిని కదా.

తా. నే నెన్నడూ రాజ్యము కావలె నని కోరలేదు. ఈ విషయమునందు తల్లితో కూడ ఎన్నడూ ఆలోచన చేయలేదు. రాజు నాకు రాజ్య మిచ్చుటకు అంగీకరించిన విషయము కూడ నాకు తెలియదు. నేనూ శత్రుఘ్నుడూ చాల దూర మైన దేశములో ఉంటిమి కదా. 3

మూ. వనవాసం న జానామి రామస్యాహం మహాత్మనః,
వివాసనం వా సౌమిత్రేః సీతాయాశ్చ యథాభవత్. 4

ప్ర. అ. అహమ్ = నేను, మహాత్మనః = మహాత్ము డైన, రామస్య = రామునియొక్క, వనవాసమ్ = వనవాసమును గూర్చి, న జానామి = ఎరుగను. సౌమిత్రేః = లక్ష్మణునియొక్క, సీతాయాశ్చ = సీతయొక్క, వివాసనమ్ = దూరముగా పంపివేయుట, యథా = ఎట్లు, అభవత్ = జరిగెనో, అది కూడ ఎరుగను.

తా. మహాత్ము డైన రాముడు వనవాసమునకు వెళ్ళి నట్లు గాని, సీత, లక్ష్మణుడు ఏ విధముగా అరణ్యమునకు వెళ్ళినారో ఆ విషయమును గాని నేను ఎరుగను. 4

మూ. తథైవ క్రోశత స్తస్య భరతస్య మహాత్మనః,
కౌసల్యా శబ్దమాజ్ఞాయ సుమిత్రామిదమబ్రవీత్. 5

ప్ర. అ. తథైవ = ఆ విధముగా, క్రోశతః = ఏడ్చుచున్న, మహాత్మనః = మహాత్ము డైన, భరతస్య=భరతునియొక్క, శబ్దమ్ = శబ్దమును, ఆజ్ఞాయ =గుర్తించి, కౌసల్యా = కౌసల్య, సుమిత్రామ్ = సుమిత్రను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాత్ము డైన భరతు డీ విధముగా అరచుచుండగా, కౌసల్య ఆతని కంఠధ్వనిని గుర్తించి సుమిత్రతో ఇట్లనెను. 5

మూ. ఆగతః క్రూరకార్యాయాః కైకేయ్యా భరతః సుతః,
తమహం ద్రష్టుమిచ్ఛామి భరతం దీర్ఘదర్శినమ్. 6

ప్ర. అ. క్రూరకార్యాయాః = క్రూర మైన కార్యము గల, కైకేయ్యాః = కైకేయియొక్క, సుతః=కుమారు డైన, భరతః = భరతుడు, ఆగతః = వచ్చినాడు. దీర్ఘదర్శినమ్ = దీర్ఘాలోచన గల, తం భరతమ్ = ఆ భరతుని, అహమ్=నేను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. "క్రూర మైన పని చేసిన కైకేయి కుమారు డైన భరతుడు వచ్చి నాడు. దీర్ఘాలోచన గల ఆ భరతుని చూడగోరుచున్నాను." 6

మూ. ఏవముక్త్వా సుమిత్రాం సా వివర్ణా మలినా కృశా,
ప్రతస్థే భరతో యత్ర వేపమానా విచేతనా. 7

ప్ర. అ. వివర్ణా = మారిపోయిన శరీరచ్ఛాయ కలది, మలినా=మాలిన్య ముతో నిండినదీ, కృశా=కృశించినదీ అయిన, సా=ఆ కౌసల్య, సుమిత్రామ్= సుమిత్రను గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా = పలికి, వేపమానా = వణకిపోవు చున్నదై, విచేతనా= చైతన్యము (సంజ్ఞ)లేనిదై, భరతః=భరతుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో, అచటికి, ప్రతస్థే=ప్రయాణ మాయెను.

తా. రంగు మారి, మలిన మైన శరీరముతో కృశించి ఉన్న ఆ కౌసల్య, సుమిత్రతో ఇట్లు పలికి, వణకిపోవుచు, సంజ్ఞ తప్పినదై, భరతు డున్న చోటికి వెళ్ళుటకు బయలుదేరెను. 7

మూ. స తు రామానుజశ్చాపి శత్రుఘ్నసహితస్తదా,
ప్రతస్థే భరతో యత్ర కౌసల్యాయా నివేశనమ్. 8

ప్ర. అ. తదా=అప్పుడు, రామానుజః = రామానుజు డైన, సః భరతః తు = ఆ భరతు డైతే, శత్రుఘ్నసహితః = శత్రుఘ్నునితో కూడినవాడై, కౌసల్యాయాః = కౌసల్యయొక్క, నివేశనమ్ = గృహము, యత్ర=ఎక్కడ ఉన్నదో, అక్కడికి, ప్రతస్థే=ప్రయాణ మాయెను.

తా. రాముని తమ్ము డైన ఆ భరతుడు శత్రుఘ్నసమేతు డై కౌసల్య గృహము వైపు బయలుదేరెను. 8

మూ. తతః శత్రుఘ్నభరతౌ కౌసల్యాం ప్రేక్ష్య దుఃఖితౌ,
పర్యష్వజేతాం దుఃఖార్తాం పతితాం నష్టచేతనామ్. 9
రుదన్తౌ రుదతీం దుఃఖాత్సమేత్యార్యాం మనస్వినీమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శత్రుఘ్నభరతౌ = శత్రుఘ్నభరతులు, దుఃఖార్తామ్ = దుఃఖముచేత పీడింపబడినదీ, నష్టచేతనామ్ = నష్ట మైన సంజ్ఞ కలదీ, రుదతీమ్ = ఏడ్చుచున్నదీ, ఆర్యామ్ = పుజ్యురాలూ, మనస్వినీమ్ = ఉత్తమ మైన మనస్సు కలదీ అయిన, కౌసల్యామ్ = కౌసల్యను, ప్రేక్ష్య = చూచి, దుఃఖితౌ = దుఃఖితులై, రుదన్తౌ = ఏడ్చుచు, దుఃఖాత్ = అతికష్టముగా, సమేత్య = సమీపించి, పర్యష్వజేతామ్ = కౌగలించుకొనిరి.

తా. దుఃఖముచే ఆర్తురా లై, సంజ్ఞ తప్పి, నేలపై బడి, ఏడ్చుచున్న పూజ్యురాలూ, ఉత్తమమనస్సు కలదీ అయిన కౌసల్యను చూచి, భరత శత్రుఘ్నులు, దుఃఖితు లై, ఏడ్చుచు, అతికష్టమున ఆమె దగ్గరకు వెళ్ళి కౌగలించుకొనిరి". 9

మూ. భరతం ప్రత్యువాచేదం కౌసల్యా భృశదుఃఖితా, 10
ఇదం తే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్తమకణ్టకమ్,
సంప్రాప్తం బత కైకేయ్యాః శీఘ్రం క్రూరేణ కర్మణా.

ప్ర. అ. భృశదుఃఖితా = మిక్కిలి దుఃఖించుచున్న, కౌసల్యా = కౌసల్య, భరతం ప్రతి = భరతుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను. రాజ్యకామస్య = రాజ్యమునందు కోరిక గల, తే = నీకు, ఇదమ్ = ఈ, అకణ్టకమ్ = శత్రువులు లేని, రాజ్యమ్ = రాజ్యము, ప్రాప్తమ్ = పొందబడినది. కైకేయ్యాః = కైకేయియొక్క, క్రూరేణ = క్రూర మైన, కర్మణా = కర్మచేత, శీఘ్రమ్ = శీఘ్రముగా, సంప్రాప్తమ్ = పొందబడినది. బత = ఏమి ఆశ్చర్యము! లేదా ఎంత కష్టము!

తా. మిక్కిలిదుఃఖితురా లైన కౌసల్య భరతునితో ఇట్లు పలికెను— "రాజ్యము కావలె నని కోరుకున్న నీకు ఏ శత్రుబాధా లేని రాజ్యము లభించినది. కైకేయి చేసిన క్రూరకార్యముచే చాల శీఘ్రముగా లభించినది! 10, 11

మూ. ప్రస్థాప్య చీరవసనం పుత్త్రం మే వనవాసినమ్,
కైకేయీ కం గుణం తత్ర పశ్యతి క్రూరదర్శినీ. 12

ప్ర. అ. క్రూరదర్శినీ = క్రూర మైన ఆలోచన గల, కైకేయీ = కైకేయి, మే = నాయొక్క, పుత్త్రమ్ = పుత్రుని, చీరవసనమ్ = నారచీరలు ధరించిన

వానినిగా చేసి, వనవాసినమ్ = వనమునందు నివసించువానినిగా, ప్రస్థాప్య = పంపివేసి, తత్ర = అట్లు చేయుటయందు, కమ్ = ఏమి, గుణమ్ = గుణమును, పశ్యతి = చూచుచున్నదో!

తా. క్రూర మైన ఆలోచనలు గల కైకేయి నా కుమారుడు నారచీర కట్టి వనానికి వెళ్ళు నట్లు చేసినది కదా, ఏమి గుణమును (ప్రయోజనమును) ఉద్దేశించి అట్లు చేసినది!

మూ. క్షిప్రం మామపి కైకేయీ ప్రస్థాపయితుమర్హతి,
హిరణ్యనాభో యత్రాస్తే సుతో మే సుమహాయశాః. 13

ప్ర. అ. సుమహాయశాః = గొప్ప మంచి కీర్తి గల, హిరణ్యనాభః = బంగారము బొడ్డునందు గల, (మంచి అదష్టము గల,) మే సుతః = నా కుమారుడు, యత్ర = ఎక్కడ, ఆస్తే = ఉన్నాడో అక్కడికి, మామపి = నన్ను కూడా, కైకేయీ = కైకేయి. క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రస్థాపయితుమ్ = పంపివేయుటకు, అర్హతి = తగియున్నది.

తా. బంగారు బొడ్డుగల (అదృష్టవంతు డైన) ఉత్తమకీర్తిశాలి యైన నా కుమారు డున్న చోటికి కైకేయి నన్ను కూడ పంపివేయుట మంచిది. 13

మూ. అథవా స్వయమేవాహం సుమిత్రానుచరా సుఖమ్,
అగ్నిహోత్రం పురస్కృత్య ప్రస్థాస్యే యత్ర రాఘవః.

ప్ర. అ. అథవా = లేదా, అహమ్ = నేను, స్వయమేవ = స్వయముగానే సుమిత్రానుచరా = సుమిత్ర అనుచరురాలుగా కలదాననై, అగ్నిహోత్రమ్ = అగ్నిహోత్రమును, పురస్కృత్య = పురస్కరించుకొని, రాఘవః = రాముడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో అక్కడికి, సుఖమ్ = సుఖముగా, ప్రస్థాస్యే = ప్రయాణ మయ్యెదను.

తా. లేదా, నేనే స్వయముగా, సుమిత్ర నా వెంట రాగా, అగ్నిహోత్రమును ముందు ఉంచుకొని, రాము డున్న చోటికి సుఖముగా పోయెదను. 14

మూ. కామం వా స్వయమేవాద్య తత్ర మాం నేతుమర్హసి,
యత్రాసౌ పురుషవ్యాఘ్రః పుత్రో మే తప్యతే తపః. 15

ప్ర. అ. వా = లేదా, పురుషవ్యాఘ్రః = పురుష శ్రేష్ఠు డైన, మే పుత్రః = నా పుత్రు డైన, అసౌ = ఈ రాముడు, యత్ర = ఎక్కడ, తపః = తపస్సును, తప్యతే = చేయుచున్నాడో, తత్ర = అక్కడికి. స్వయమేవ = నీవే, అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, కామమ్ = నీ కిష్ట మైనచో, నేతుమ్ = తీసికొని వెళ్ళుటకు, అర్హసి = తగయున్నావు.

తా. లేదా, పురుషశ్రేష్ఠు డైన నా పుత్రుడు తపస్సు చేయుచున్న ప్రదేశమునకు, నీకు ఇష్ట మైనచో, నీవే స్వయముగా నన్నిప్పుడు తీసికొని వెళ్లుము. 15

మూ. ఇదం హి తవ విస్తీర్ణం ధనధాన్యసమాచితమ్,
హస్త్యశ్వరథసంపూర్ణం రాజ్యం నిర్యాతితం తయా. 16

ప్ర. అ. హస్త్యశ్వరథసంపూర్ణమ్ = ఏనుఁగులతోను, అశ్వములతోను, రథములతోను నిండినదీ, ధనధాన్యసమాచితమ్ = ధనముతోను, ధాన్యముతోను కూడినదీ, విస్తీర్ణమ్ = విస్తీర్ణమూ అయిన, ఇదం రాజ్యమ్ = ఈ రాజ్యము, తయా = ఆమెచేత, తవ = నీకు, నిర్యాతితం హి = ఇప్పించబడినది కదా?

తా. ధనధాన్యసమృద్ధమూ, గజాశ్వరథపూర్ణమూ, అతివిస్తృతమూ అయిన ఈ రాజ్యము ఆమె నీ కిప్పించినది కదా? 16

మూ. ఇత్యాదిబహుభిర్వాక్యైః క్రూరైః సంభర్త్సితోఽనఘః,
వివ్యథే భరతస్తీవ్రం వ్రణే తుద్యేవ సూచినా. 17

ప్ర. అ ఇత్యాది = ఇది మొదలుగా, బహుభిః = అనేక మైన, క్రూరైః = క్రూర మైన, వాక్యైః = వాక్యముల చేత, సూచినా = సూదితో, వ్రణే = వ్రణమునందు, తుద్యేవ = గ్రుచ్చి వలె, సంభర్త్సితః = నిందింపబడినవాడై, అనఘః = దోషము లేని, భరతః = భరతుడు, తీవ్రమ్ = తీవ్రముగా, వివ్యథే = బాధపడెను.

తా. వ్రణమునందు సూదితో గుచ్చినట్లు, ఈ విధముగా అనేక మైన క్రూరవాక్కులతో నిందింపబడిన, ఏ పాపమూ ఎరుగని భరతుడు చాల బాధపడెను. 17

మూ. పపాత చరణౌ తస్యాస్తదా సంభ్రాన్తచేతనః,
విలప్య బహుధాఽసంజ్ఞో లబ్ధసంజ్ఞస్తతః స్థితః. 18

ప్ర. అ. తదా = అప్పుడు, సంభ్రాన్తచేతనః = తిరిగిపోవుచున్న మనస్సు కలవాడై, తస్యాః = ఆమెయొక్క, చరణౌ = పాదములను స్పృశించుచు, పపాత = పడెను. బహుధా = అనేకవిధములుగా, విలప్య = విలపించి, అసంజ్ఞః = సంజ్ఞ లేనివాడై, తతః = అటుపిమ్మట, లబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞకలవాడై, స్థితః = ఉండెను.

తా. ఆ మాటలు వినగానే తల తిరిగిపోయి, ఆమె పాదములపై బడి, అనేకవిధముల విలపించి, సంజ్ఞ కోల్పోయెను. కొంత సేపటికి సంజ్ఞ తిరిగి రాగా అట్లే ఉండిపోయెను. 18

మూ. ఏవం విలపమానాం తాం భరతః ప్రాఞ్జలిస్తదా,
కౌసల్యాం ప్రత్యువాచేదం శోకైర్బహుభిరావృతామ్. 19

ప్ర. అ. తదా = అప్పుడు, భరతః = భరతుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఏవమ్ = ఇట్లు, విలపనామామ్=విలపించుచున్న, బహుభిః = అనేకమైన, శోకైః=శోకములతో, ఆవృతామ్=ఆవరింపబడిన, తాం కౌసల్యామ్ = ఆ కౌసల్యను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. భరతు డప్పుడు దోసిలి పట్టి నమస్కరించుచు, అనేకవిధములైన శోకములు పట్టి పీడింపగా ఈ విధముగా విలపించుచున్న కౌసల్యతో ఇట్లు పలికెను. 19

మూ. ఆర్యే కస్మాదజానన్తం గర్హసే మామకిల్బిషమ్,
విపులాం చ మమ ప్రీతిం స్థిరాం జానాసి రాఘవే. 20

ప్ర. అ. ఆర్యే = ఓ ఆర్యురాలా! అజానన్తమ్ = ఏమీ ఎరుగని, అకిల్బిషమ్ = పాపము లేని, మామ్=నన్ను, కస్మాత్ =ఏ కారణమువలన, గర్హసే= నిందించుచున్నావు? రాఘవే = రామునియందు, మమ = నాయొక్క, విపులామ్

= అధిక మైన, స్థిరామ్=స్థిర మైన, ప్రీతిమ్=ప్రేమను, జానాసి = నీ వెరుగు దువు కూడ!

తా. ఆర్యురాలా! ఏ విషయము తెలియని, ఏ పాపమూ ఎరుగని నన్నీ విధముగా ఎందుకు నిందించెదవు? నాకు రామునిపై ఎంత అధికమూ స్థిరమూ అయిన ప్రేమ ఉన్నదో కూడ నీకు తెలియును కదా? 20

మూ. కృతా శాస్త్రానుగా బుద్ధిర్మా భూత్తస్య కదాచన,
సత్యసన్ధః సతాం శ్రేష్ఠో యస్యార్యోఽనుమతే గతః. 21

ప్ర. అ. సత్యసన్ధః = సత్య మైన ప్రతిజ్ఞ కలవాడూ, సతామ్ = సత్పురుషులలో శ్రేష్ఠుడూ అయిన, ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారమునందు, గతః = వెళ్ళిపోయినాడో, తస్య = అట్టివాని యొక్క, బుద్ధిః=బుద్ధి, కదాచన = ఎన్నడును, శాస్త్రానుగా = శాస్త్రాను సారిగాను, కృతా = నిశ్చిత మైనది గాను, మా భూత్ = కాకుండు గాక.

తా. సత్యసంధుడూ, సత్పురుషులలో శ్రేష్ఠుడూ అయిన అన్నగారు ఎవ్వని సంమతిచే అరణ్యమునకు వెళ్ళినాడో, వానికి శాస్త్రమును అనుసరించు నదీ, స్థిర మైనదీ అయిన బుద్ధి లేకుండు గాక. అనగా రాముడు అరణ్యవాసము నకు పోవలె నని నేనెన్న డైన మనస్సులో కూడ అనుకొని ఉన్నచో నా బుద్ధి వక్ర మై, శాస్త్రమును అనుసరించక, అస్థిరము అయిపోవుగాక అని భావము. రాబోవు శ్లోకాలకుకూడ ఇట్లే భావము గ్రహించవలెను. సత్పురుషులకు అపకారము తలపెట్టువాని బుద్ధి చెడి, అమార్గమున ప్రవర్తించి వాని వినాశమునకు హేతు వగునని తాత్పర్యము. ఈ విధముగా భరతుని శపథము లను వ్యాజముచే వాల్మీకి మహాముని ఈ ఘట్టములో మనకు ధర్మబోధ చేయుచున్నాడు. 21

మూ. ప్రేష్యం పాపీయసాం యాతు సూర్యం చ ప్రతి మేహతు,
హన్తు పాదేన గాం సుప్తాం యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = పూజ్యు డైన అన్నగారు, యస్య = ఎవ్వనియొక్క, అనుమతే = సంమతిప్రకారము, గతః = అరణ్యమునకు వెళ్ళినాడో అతడు, పాపీయసామ్ = పాపాత్ములకు, ప్రేష్యమ్ = సేవకత్వమును, యాతు = పొందు గాక! సూర్యం చ ప్రతి = సూర్యునకు అభిముఖముగా, మేహతు = మలమూత్ర

విసర్జన చేయుగాక. సుప్తామ్ = నిద్రించుచున్న, గామ్ = గోవును, పాదేన = పాదముచేత, హన్తు=తన్నుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళుటకు నేను సమ్మతించి ఉన్నట్లయితే, నాకు పాపాత్ముల సేవ చేసిన (లేదా చేయవలసిన) పాపము, సూర్యునకు ఎదురుగా మలమూత్ర విసర్జన చేసిన పాపము, నిద్రించుచున్న గోవును పాదముతో తన్నిన పాపము వచ్చుగాక. 22

మూ. కారయిత్వా మహత్కర్మ భర్తా భృత్యమనర్థకమ్,
అధర్మో యోఽస్య సోఽస్యాస్తు యస్యార్యోఽనుమతేగతః.

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవ్వనియొక్క, అనుమతే = సంమతిప్రకారము, గతః = వెళ్ళినాడో, అస్య = వానికి, యః భర్తా = ఏ ప్రభువు, భృత్యమ్ = భృత్యుని, అనర్థకమ్ = వ్యర్థముగా, మహత్ = గొప్ప, కర్మ = పని, కారయిత్వా = చేయించి, (చేయించినచో), అస్య = ఈ ప్రభువుకు, యః అధర్మః = ఏ అధర్మము కలుగునో, సః = అది, అస్తు = కలుగుగాక.

తా. అన్నగారు నా సంమతి ప్రకారమే అరణ్యమునకు వెళ్ళి ఉన్నచో, నాకు ఒక యజమాని తన భృత్యునిచేత చాల పని చేయించుకొని ఆతని కేమీ ధన మివ్వనిచో వానికి ఎంత పాపము కలుగునో అంత పాపము కలుగుగాక. 23

మూ. పరిపాలయమానస్య రాజ్ఞో భూతాని పుత్రవత్,
తతస్తద్ద్రుహ్యతాం పాపం యస్యార్యోఽనుమతే గతః. 24

ప్ర. అ. యస్య = ఎవ్వనియొక్క, అనుమతే = సంమతియందు, ఆర్యః = అన్నగారు, గతః = వెళ్ళినాడో ఆతనికి, రాజ్ఞః = రాజు, భూతాని = ప్రజలను, పుత్రవత్ = పుత్రులను వలె, పరిపాలయమానస్య = పాలించుచుండగా, తతః = ఆతని విషయమున, ద్రుహ్యతామ్ = ద్రోహముచేయుచున్నవారికి, పాపమ్ = ఎట్టి పాపము కలుగునో, తత్ = అది కలుగుగాక.

తా. ఆర్యుడు అరణ్యమునకు వెళ్ళుటకు, నా సమ్మతి ఉన్నచో, నాకు ప్రజలను తన పుత్రులను వలె పరిపాలించుచున్న రాజుకు ద్రోహము చేసేవారికి ఎట్టి పాపము కలుగునో అట్టి పాపము కలుగుగాక. 24

మూ. బలిషడ్భాగముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః,
అధర్మో యోఽస్య సోఽస్త్వస్తు యస్యార్యోఽనుమతేగతః.

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = సంమతిప్రకారము, గతః = వెళ్లినాడో, అస్య = వీనికి, బలిషడ్భాగమ్ = పన్ను అయిన ఆరవభాగమును, ఉద్ధృత్య = తీసికొని, నృపస్య = రాజు, ప్రజాః = ప్రజలను, అరక్షతః=రక్షించకున్నచో, అస్య = ఈతనికి, యః = ఏ, అధర్మః = అధర్మము కలుగునో, సః = అది, అస్తు = అగుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్ళుటలో నా అంగీకార మున్నచో, నాకు, ప్రజలనుండి వారి ఆదాయములోని ఆరవ వంతు పన్నుగా స్వీకరించుచున్నను వారిని రక్షింపని రాజునకు ఎట్టి పాపము కలుగునో అది కలుగుగాక. 25

మూ. సంశ్రుత్య చ తపస్విభ్యః సత్రే వై యజ్ఞదక్షిణామ్,
తాం విప్రలపతాం పాపం యస్యార్యోఽనుమతే గతః. 26

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, అనుమతే = సంమతియందు, ఆర్యః= ఆర్యుడు, గతః=అడవికి వెళ్ళినాడో, తపస్విభ్యః=మునులకు, సత్రే=యాగమునందు, యజ్ఞదక్షిణామ్=యజ్ఞమునం దీయవలసిన దక్షిణను, సంశ్రుత్య = ప్రతిజ్ఞ చేసి, తామ్ = దానిని గూర్చి, విప్రలపతామ్=బొంకుచున్నవారికి కలుగు, పాపమ్ = పాపము కలుగు గాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని నేను సంమతించి ఉన్నచో నాకు యాగమునందు, దానికి కావలసిన దక్షిణ లన్నీ ఇచ్చెద నని మునులకు మాట ఇచ్చి, పిదప నేను అట్లనలే దని బొంకువానికి కలుగు పాపము కలుగు గాక. 26

మూ. హస్త్యశ్వరథసంబాధే యుద్ధే జనసమాకులే,
మా స్మ కార్షీత్సతాం ధర్మం యస్యార్యోఽనుమతే గతః

ప్ర. అ. ఆర్యః=అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే=సంమతి ప్రకారము, గతః=వెళ్లినాడో అతడు, హస్త్యశ్వరథసంబాధే = ఏనుగులతోను, అశ్వములతోను, రథములతోను కిక్కిరిసి ఉన్న, జనసమాకులే=జనులతో నిండి

ఉన్న, యుద్ధే=యుద్ధమునందు, సతామ్=సత్పురుషులయొక్క, ధర్మమ్=ధర్మమును, మా స్మ కార్షీత్=చేయకుండుగాక.

తా. అన్నగారు నా అనుమతి ప్రకారమే అడవికి వెళ్లి ఉన్నచో, నాకు గజములతోను, అశ్వములతోను, రథములతోను నిండిన, యోధజనులతో వ్యాకులమైన రణరంగమునకు వెళ్లి, శూరుల ధర్మము పాటించక, వెన్నిచ్చి పారిపోయి వచ్చినవానికి కలుగు పాపము కలుగు గాక. 27

మూ. ఉపదిష్టం సుసూక్ష్మార్థం శాస్త్రం యత్నేన ధీమతా,
స నాశయతు దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః. 28

ప్ర. అ. ఆర్యః=పూజ్యుడైన అన్నగారు, యస్య=ఎవనియొక్క, అనుమతే=అనుమతి ననుసరించి, గతః=వెళ్లినాడో, సః=ఆ, దుష్టాత్మా=దుష్టాత్ముడు, ధీమతా=బుద్ధిమంతుడైన ఆచార్యునిచేత, యత్నేన=ప్రయత్నపూర్వకముగా, ఉపదిష్టమ్=ఉపదేశించబడిన, సూక్ష్మార్థమ్=సూక్ష్మమైన అర్థము గల, శాస్త్రమ్=శాస్త్రమును, నాశయతు=నశింపచెయుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్ళుటలో నా సంమతి ఉన్న పక్షమున, దుష్టాత్ముడనైన నాకు ధీమంతుడైన ఆచార్యుడు ప్రయత్నపూర్వకముగా ఉపదేశించిన సూక్ష్మవిషయములు గల, శాస్త్రమును విస్మరించిన వానికి కలుగు పాపము కలుగు గాక. 28

మూ. మా చ తం వ్యూఢబాహ్వంసం చన్ద్రార్కసమతేజసమ్,
ద్రాక్షీద్రాజ్యస్థమాసీనం యస్యార్యోఽనుమతే గతః. 29

ప్ర. అ. ఆర్యః=అన్నగారు, యస్య=ఎవనియొక్క, అనుమతే=సంమతి ననుసరించి, గతః=వెళ్లినాడో వాడు, వ్యూఢబాహ్వంసమ్ = విశాలమైన (బలమైన), బాహువులూ భుజములూ కలవాడూ, చన్ద్రార్కసమతేజసమ్= చంద్రసూర్యులతో సమానమైన తేజస్సు కలవాడూ, రాజ్యస్థమ్ = రాజ్యపరిపాలనలో ఉన్నవాడు, ఆసీనమ్=సింహాసనముపై కూర్చున్నవాడూ అయిన, తమ్=ఆ రాముని, మా చ ద్రాక్షీత్=చూడకపోవుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళుట నాకు సమ్మతమే అయినచో, బలిష్ఠమైన బాహువులూ భుజములూ గల, చంద్రార్కసమాన తేజఃశాలియైన

ఆ రాముడు రాజ్యాధిపుడై సింహాసనముపై కూర్చొని ఉండగా చూచు భాగ్యము నాకు కలగకపోవుగాక. 29

మూ. పాయసం కృసరం ఛాగం వృథా సోఽశ్నాతు నిర్ఘృణః,
గురూంశ్చాప్యవజానాతు యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః=ఆర్యుడు, యస్య=ఎవనియొక్క, అనుమతే=సంమతి యందు, గతః = వెళ్ళినవాడో, నిర్ఘృణః = జాలి లేని, సః=అతడు, పాయసమ్ = పాయసమును, కృసరమ్ = పులగమును, ఛాగమ్ = మేకనూ, వృథా = వ్యర్థముగా, అశ్నాతు = తినుగాక; గురూన్ = పెద్దలను, అవజానాతు చ = అవమానించుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్లుటకు నా సంమతి ఉన్నచో, అప్పుడు, దయా రహితుడనైన నాకు, పితృ-అతిథిపూజాదినిమిత్తము లేవీ లేకుండగనే, పాయస మునూ, కృసరమును (పులగము లేదా బెల్లం కలిపిన నువ్వులు) మేక మాంసమునూ తినువానికీ, గురువులను అవమానించు దయావిహీనునికీ కలుగు పాపము కలుగుగాక. 30

మూ. గాశ్చ స్పృశతు పాదేన గురూన్ పరివదేత్స్వయమ్,
మిత్రే ద్రుహ్యేత సోఽత్యన్తం యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారము ప్రకారము, గతః = వెళ్ళినాడో, సః=అతడు, పాదేన = పాదము చేత, గాః=గోవులను, స్పృశతు = స్పృశించుగాక. స్వయమ్ = స్వయముగా, గురూన్ = గురువులను, పరివదేత్ = నిందించుగాక. మిత్రే=మిత్రుని విషయ మున, అత్యన్తమ్ = మిక్కిలి, ద్రుహ్యేత = ద్రోహము చేయుగాక.

తా. రాముడు నా సంమతి ప్రకారమే అరణ్యమునకు వెళ్ళినచో, నాకు గోవులను పాదముతో తన్నిన పాపము, స్వయముగా పెద్దవారిని దూషించిన పాపము, మిత్రునకు గొప్ప ద్రోహము చేసిన పాపము కలుగుగాక. 31

మూ. విశ్వాసాత్కథితం కించిత్పరివాదం మిథః క్వచిత్,
వివృణోతు స దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః. 32

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారమునందు, గతః = వెళ్ళినాడో, సః దుష్టాత్మా = ఆ దుష్టాత్ముడు, క్వచిత్ = ఒకానొక చోట, మిథః = రహస్యమున, విశ్వాసాత్ = విశ్వాసమువలన, కథితమ్ = చెప్పబడిన, (చేయబడిన) కించిత్ = కొంచెము, పరివాదమ్ = ఇతర దూషణమును, వివృణోతు = మరొకరికి వివరించుగాక.

తా. అన్నగారు నా అనుమతి ప్రకారమే అడవికి వెళ్ళినచో, దుష్టాత్ముడనైన నాకు, ఒక వ్యక్తి, తనపై ఉన్న విశ్వాసముతో, రహస్యమునందు తన మిత్రాదులు ఇతరులను గూర్చి చెప్పిన దూషణవాక్యములను, వారికి చెప్పినచో ఆ వ్యక్తికి ఎంత పాపము వచ్చునో అంత పాపము కలుగుగాక. 32

మూ. అకర్తా హ్యకృతజ్ఞశ్చ త్యక్తాత్మా నిరపత్రపః,
లోకే భవతు విద్వేష్యో యస్యార్యోఽనుమతే గతః. 33

ప్ర. అ. ఆర్యః = అన్నగారైన రాముడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారమునందు, గతః = వెళ్ళినాడో అతడు, అకర్తా = ఉపకారము చేయనివాడుగాను, అకృతజ్ఞః చ = కృతజ్ఞుడు కానివాడుగాను, త్యక్తాత్మా = ఆత్మను విడచినవాడుగాను, నిరపత్రపః = సిగ్గు లేనివాడుగాను, లోకే = లోకమునందు, విద్వేష్యః = ద్వేషింపతగినవాడుగాను, భవతు = అగుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్లుటలో నా అంగీకార మున్నచో, నేను ఎవ్వరికీ ఎట్టి ఉపకారమూ చేయనివాడనుగానూ, కృతజ్ఞత లేనివాడను గానూ, ఆత్మహత్యాపాపవంతుడనుగానూ, సిగ్గులేనివాడనుగానూ, లోకములో అందరిచేత ద్వేషింపబడేవాడనుగానూ అగుదును గాక. 33

మూ. పుత్రదారైశ్చ భృత్యైశ్చ స్వగృహే పరివారితః,
స ఏకో మృష్టమశ్నాతు యస్యార్యోఽనుమతే గతః. 34

ప్ర. అ. ఆర్యః = పూజ్యుడైన అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = సంమతిప్రకారము, గతః = వెళ్ళినాడో, సః = అతడు, స్వగృహే = తన గృహమునందు, పుత్రదారైశ్చ = పుత్రులచేతను, భార్యచేతను, భృత్యైశ్చ = పోష్యవర్గముచేతను, పరివారితః = చుట్టువారుకొనబడినవాడై ఉండి, ఏకః = తానొక్కడే, మృష్టమ్ = మృష్టాన్నమును, అశ్నాతు = తినుగాక.

తా. అన్నగారు నా అనుమతి ప్రకారమే అడవికి వెళ్ళినచో, నాకు, ఇంటిలో భార్యాపుత్రాదులు, ఇతరు లైన పోష్యజనులు ఉండగా, తా నొక్కడే మృష్టాన్నమును భుజించినవానికి ఎట్టి పాపము వచ్చునో అట్టి పాపము వచ్చుగాక. 34

మూ. అప్రాప్య సదృశాన్ దారాననపత్యః ప్రమీయతామ్,
అనవాప్య క్రియాం ధర్మ్యాం యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = పూజ్యు డైన అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే=సంమతిప్రకారము, గతః=వెళ్ళినాడో, అతడు, సదృశాన్ = తగిన, దారాన్=భార్యను, అప్రాప్య=పొందక, అనపత్యః = సంతానము లేనివాడై, ధర్మ్యామ్=ధర్మసంమత మైన, క్రియామ్ = క్రియను, అనవాప్య = పొందక, ప్రమీయతామ్=మరణించుగాక.

తా. ఆర్యు డైన రాముడు నా అనుమతి ప్రకారమే అడవికి వెళ్ళి ఉన్నచో, నాకు, తగిన భార్యను వివాహము చేసికొనక, సంతానరహితు డై, ధర్మసంమత మైన కర్మలు చేయజాలనివానికి కలుగు పాపము కలుగుగాక; అనగా ఎంత పాపము చేసిన ఇట్టి దుఃస్థితి కలుగునో అట్టి పాపము కలుగుగాక అని భావము.

మూ. మాత్మనః సంతతిం ద్రాక్షీత్స్వేషు దారేషు దుఃఖితః,
ఆయుః సమగ్రమప్రాప్య యస్యార్యోఽనుమతే గతః. 36

ప్ర. అ. ఆర్యః=అన్నగారు, యస్య=ఎవనియొక్క, అనుమతే=సంమతియందు, గతః = వెళ్ళినాడో, అతడు, సమగ్రమ్ = పూర్ణ మైన, ఆయుః = ఆయుర్దాయమును, అప్రాప్య = పొందక, దుఃఖితః=దుఃఖితు డై, స్వేషు=తన సంబంధ మైన, దారేషు = భార్యయందు, ఆత్మనః=తనయొక్క, సంతతిమ్= సంతానమును, మా ద్రాక్షీత్ = చూడకుండుగాక.

తా. అన్నగారు నా అనుమతి ప్రకారమే అరణ్యమునకు వెళ్ళినచో, నాకు పూర్ణాయుర్దాయము లేక దుఃఖితు డై తన భార్యయందు సంతానము పొందని వానికి కలుగు పాపము- అనగా ఎంత పాపము చేయుటచే ఇట్టి దుఃస్థితి కలుగునో అంత పాపము- కలుగుగాక. 36

మూ. రాజస్త్రీబాలవృద్ధానాం వధే యత్పాపముచ్యతే,
భృత్యత్యాగే చ యత్పాపం తత్పాపం ప్రతిపద్యతామ్. 37

ప్ర. అ. రాజస్త్రీబాలవృద్ధానామ్ = రాజు, స్త్రీ, బాలుడు, వృద్ధుడు- వీరి యొక్క, వధే = వధయందు, యత్ = ఏ, పాపమ్ = పాపము, ఉచ్యతే = చెప్పబడుచున్నదో, భృత్యత్యాగే చ = పోషింపతగినవారిని త్యజించుటయందు, యత్ = ఏ, పాపమ్ = పాపము చెప్పబడుచున్నదో, తత్ = ఆ, పాపమ్ = పాపమును. ప్రతిపద్యతామ్ = పొందుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని కోరుకున్నవాడు, రాజును స్త్రీలను, బాలలను, వృద్ధులను చంపుటచేతను, పోషించతగినవారిని విడచివేయుట చేతను ఏ పాపము కలుగునో ఆ పాపమును పొందుగాక. 37

మూ. లాక్షయా మధుమాంసేన లోహేన చ విషేణ చ,
సదైవ బిభృయాద్భృత్యాన్ యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = పూజ్యుడైన అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారమునందు, గతః = వెళ్ళినాడో, అతడు, సదైవ = ఎల్లప్పుడు, భృత్యాన్ = పోషింపదగిన దారపుత్రాదులను, లాక్షయా = లక్కచేతను, మధుమాంసేన = మధుమాంసములచేతను, లోహేన = లోహముచేతను, విషేణ చ = విషముచేతను, బిభృయాత్ = పోషించుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని నేను కోరియున్నచో, నాకు పణ్యములు కాని (అమ్మకూడని) లక్క, మధువు, మాంసము, లోహము, విషము విక్రయించి వ్యాపారము చేయుచు నిత్యము దారపుత్రాదులను పోషించువానికి ఎట్టి పాపము కలుగునో అట్టి పాపము కలుగుగాక. 38

మూ. సంగ్రామే సముపోఢే స శత్రుపక్షభయంకరే,
పలాయమానో వధ్యేత యస్యార్యోఽనుమతే గతః. 39

ప్ర. అ. ఆర్యః = పూజ్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, సః = అతడు, శత్రుపక్షభయంకరే = శత్రుపక్షములకు భయంకర మైన, సంగ్రామే = యుద్ధము, సముపోఢే = తార

స్థాయిలో ఉండగా, పలాయమానః = పారిపోవుచున్నవాడై, వధ్యేత = చంపబడు గాక.

తా. అన్నగారు అడవికి వెళ్లుటలో నా సంమతి ఉన్న పక్షమున, నాకు, శత్రుపక్షములు రెండింటికి భయము కలిగించు యుద్ధము తారస్థాయిలో ఉండగా వెన్నిచ్చి పారిపోవుచు చంపబడిన యోధునకు ఎంత పాపము కలుగునో అంత పాపము కలుగుగాక. 39

మూ. కపాలపాణిః పృథివీమటతాం చీరసంవృతః,
భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యోఽనుమతే గతః. 40

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతమునందు, గతః = వెళ్ళినాడో, అతడు, కపాలపాణిః = కపాలము హస్తమునందు కలవాడై, చీరసంవృతః = గుడ్డలచే కప్పబడినవాడై, భిక్షమాణః = బిచ్చ మెత్తుకొనుచు, ఉన్మత్తో యథా = పిచ్చివాడు వలె, పృథివీమ్ = భూమిని, అటతామ్ = సంచరించుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని కోరినవాడు, కుండపెంకు చేతిలో పెట్టుకొని, చినిగిన గుడ్డలు కట్టుకొని, బిచ్చ మెత్తుకొనుచు, పిచ్చివాని వలె భూమిమీద తిరుగుగాక. 40

మూ. పానే ప్రసక్తో భవతు స్త్రీష్వక్షేషు చ నిత్యశః,
కామక్రోధాభిభూతస్తు యస్యార్యోఽనుమతే గతః. 41

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = సంమతియందు, గతః = వెళ్ళినాడో, వాడు, నిత్యశః = ఎల్లప్పుడును, పానే = మద్యపానమునందు, స్త్రీషు = స్త్రీలయందు, అక్షేషు చ = పాచికలందును, ప్రసక్తః = లగ్నుడైనవాడై, కామక్రోధాభిభూతః = కామక్రోధములచేత తిరస్కరింపబడినవాడు, భవతు = అగుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్లవలె నని కోరుకొన్నవాడు కామక్రోధములకు వశుడై నిత్యము మద్యపానము, స్త్రీలు, జూదము మొదలైన వ్యసనములందు ఆసక్తు డగుగాక. నేను రాముని వనగమనము నంగీకరించి

యున్నచో నాకు పైన చెప్పినవానికి ఎంత పాపము కలుగునో అంత పాపము కలుగుగాక. 41

మూ. యస్య ధర్మే మనో భూయాదధర్మం స నిషేవతామ్,
అపాత్రవర్షీ భవతు యస్యార్యోఽనుమతే గతః. 42

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అంగీకారమునందు, గతః = వెళ్ళినాడో, అస్య = ఇతనియొక్క, మనః = మనస్సు. ధర్మే = ధర్మమునందు, మా భూయాత్ = ఉండకపోవుగాక. సః = వాడు, అధర్మమ్ = అధర్మమునే, నిషేవతామ్ = సేవించుగాక. అపాత్రవర్షీ = పాత్ర కానివానియందు దానము చేయువాడు, భవతు = అగుగాక.

తా. ఆర్యు డైన అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని కోరినవాని మనస్సు ధర్మమునందు ప్రవర్తింపకుండుగాక. ఆతడు అధర్మమునే అచరించుగాక. అపాత్రలకు దానము చేయుగాక.

మూ. సంచితాన్యస్య విత్తాని వివిధాని సహస్రశః,
దస్యుభిర్విప్రలుప్యన్తాం యస్యార్యోఽనుమతే గతః. 43

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతి యందు, గతః = వెళ్ళినాడో, అస్య = వీనియొక్క, సహస్రశః = వేల కొలది, సంచితాని = పోగుచేయబడిన, వివిధాని = అనేకవిధము లైన. విత్తాని = ధనములు. దస్యుభిః = దొంగలచేత, విప్రలుప్యన్తామ్ = లోపింపచేయబడుగాక.

తా. ఆర్యుడు అరణ్యమునకు వెళ్ళవలె నని కోరినవాడు వేలకొలది సంపాదించుకొనిన అనేకవిధము లైన ధనములను చోరులు అపహరింతురుగాక. రాముని అరణ్యగమనమునకు నేను కారణ మైనచో ఎంత పాపము చేసినచో కూడబెట్టుకొనిన ధన మంతా దొంగలు అపహరింతురో అంత పాపము నాకు కలుగుగాక. 43

మూ. ఉభే సన్ధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే,
తచ్చ పాపం భవేత్తస్య యస్యార్యోఽనుమతే గతః. 44

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతమునందు, గతః = వెళ్ళినాడో, తస్య = వానికి, ఉభే సంధ్యే = రెండు సంధ్యాసమయములను (ములందు), శయానస్య = నిద్రించువానికి, యత్ = ఏ, పాపమ్ = పాపము, పరికల్ప్యతే = చెప్పబడినదో, తత్ పాపమ్ = ఆ పాపము, భవేత్ = కలుగుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్ళుటకు అనుమతించినవానికి సాయంప్రాతః సంధ్యాకాలములందు నిద్రించువానికి కలుగు పాపము కలుగుగాక. 44

మూ. యదగ్నిదాయకే పాపం యత్పాపం గురుతల్పగే,
మిత్రద్రోహే చ యత్పాపం తత్పాపం ప్రతిపద్యతామ్.

ప్ర. అ. అగ్నిదాయకే = నిప్పుపెట్టినవానియందు, యత్ = ఏ, పాపమ్ = పాపము కలుగునో, గురుతల్పగే = పూజ్యుల భార్యతో సంగము చేసినవానికి, యత్ = ఏ, పాపమ్ = పాపము కలుగునో, మిత్రద్రోహే = మిత్రద్రోహము చేసినపుడు, యత్ = ఏ, పాపమ్ = పాపము కలుగునో, తత్ = ఆ, పాపమ్ = పాపమును, ప్రతిపద్యతామ్ = పొందుగాక.

తా. అన్నగారి అరణ్యగమనానికి కారణమైనవానికి ఇతరుల గృహములను దహించినవానికి కలుగు పాపము, గురుభార్యాగమనము చేసినవానికి కలుగు పాపము, మిత్రద్రోహమువలన కలుగు పాపము కలుగుగాక. 45

మూ. దేవతానాం పితౄణాం చ మాతాపిత్రో స్తథైవ చ,
మా స్మ కార్షీత్స శుశ్రూషాం యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతి ప్రకారము, గతః = వెళ్ళినాడో, సః = వాడు, దేవతానామ్ = దేవతలయొక్క, పితౄణామ్ = పితృదేవతలయొక్క, తథైవ చ = మరియు, మాతాపిత్రోః = తలిదండ్రులయొక్క, శుశ్రూషామ్ = శుశ్రూషను, మా స్మ కార్షీత్ = చేయకుండుగాక.

తా. నేను అన్నగారి అరణ్యగమనానికి కారణమైనచో, దేవతలకు,

పితృదేవతలకు, తలిదండ్రులకు శుశ్రూషచేయనివానికి ఎట్టి పాపము వచ్చునో అట్టి పాపము నాకు కలుగుగాక. 46

మూ. సతాం లోకాత్సతాం కీర్త్యాః సజ్జుష్టాత్కర్మణ స్తథా,
భ్రశ్యతు క్షిప్రమద్యైవ యస్యార్యోఽనుమతే గతః. 47

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతి యందు, గతః = వెళ్ళినాడో, అతడు, అద్యైవ = ఇప్పుడే, క్షిప్రమ్ = శీఘ్రముగా, సతామ్ = సత్పురుషులయొక్క, లోకాత్ = లోకమునుండి, సతామ్ = సత్పురుషులయొక్క, కీర్త్యాః = కీర్తినుండి, తథా = మరియు. సజ్జుష్టాత్ = సత్పురుషులచేత పొందబడిన, కర్మణః = కర్మనుండి, భ్రశ్యతు = భ్రష్టుడగుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని అనుమతించినవాడు, ఇప్పుడే, వెంటనే, సత్పురుషులకు లభించు లోకమునుండీ, సత్పురుషుల కీర్తి నుండీ, సత్పురుషులు ఆచరించు కర్మనుండీ భ్రష్టు డగుగాక. 47

మూ. అపాస్య మాతృశుశ్రూషామనర్థే సోఽవతిష్ఠతామ్,
దీర్ఘబాహుర్మహావక్షా యస్యార్యోఽనుమతే గతః. 48

ప్ర. అ. దీర్ఘబాహుః = దీర్ఘములైన బాహువులు కలవాడూ, మహావక్షాః = విశాల మైన వక్షఃస్థలము కలవాడూ అయిన, ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, సః = వాడు, మాతృశుశ్రూషామ్ = తల్లియొక్క శుశ్రూషను, అపాస్య = విడచి, అనర్థే = అనర్థమునందు, అవతిష్ఠతామ్ = ఉండుగాక.

తా. దీర్ఘబాహుడూ విశాలవక్షముకలవాడూ అయిన అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని కోరుకొన్న వానికి, తల్లి శుశ్రూష చేయుట మాని, అనర్థకర మైన పనులుచేయువానికి కలుగు పాపము కలుగుగాక. 48

మూ. బహుపుత్రో దరిద్రశ్చ జ్వరరోగసమన్వితః,
స భూయాత్సతతక్లేశీ యస్యార్యోఽనుమతే గతః. 49

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, సః = అతడు, బహుపుత్రః = చాలమంది

పుత్రులు కలవాడై, దరిద్రః = దరిద్రుడుగాను, జ్వరరోగసమన్వితః = జ్వరముతోను రోగముతోను కూడినవాడుగాను, సతతక్లేశీ = ఎల్లప్పుడును క్లేశములు కలవాడుగాను, భూయాత్ = అగుగాక.

తా. అన్నగారు ఎవరి అనుమతిచే వెళ్ళినాడో అతడు అత్యధికసంతానవంతుడై, దారిద్ర్యముతోను, జ్వరరోగములతోను ఎల్లప్పుడు బాధపడుచుండుగాక. నేను రాము డడవికి వెళ్ళుటకు కారణ మైనచో ఎంతటి పాపము చేసినవానికి పైన చెప్పిన బాధ లన్నీ వచ్చునో అన్ని బాధలూ నాకు కలుగుగాక.

మూ. ఆశామాశంసమానానాం దీనానామూర్ధ్వచక్షుషామ్,
ఆర్థినాం వితథాం కుర్యాద్యస్యార్యోఽనుమతే గతః. 50

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే=అనుమతి యందు, గతః=వెళ్ళినాడో, అతడు, ఆశంసమానానామ్=కోరుచున్నవారూ, దీనానామ్ = దీనులూ, ఊర్ధ్వచక్షుషామ్ = పైకి ఎత్తబడిననే త్రములు కలవారూ అయిన, అర్థినామ్ = యాచకులయొక్క, ఆశామ్ = ఆశను, వితథామ్= వ్యర్థ మైనదానినిగా, కుర్యాత్=చేయుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్లుటకు నేను నిమిత్త మైనచో నాకు, దీనులై పైకి చూచుచు, యాచించుచున్న యాచకుల ఆశను నిష్ఫలము చేసినవానికి వచ్చు పాపము వచ్చుగాక. 50

మూ. మాయయా రమతాం నిత్యం పరుషః పిశునోఽశుచిః,
రాజ్ఞో భీత స్త్వధర్మాత్మా యస్యార్యోఽనుమతే గతః.51

ప్ర. అ. ఆర్యః = పూజ్యు డైన అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, అతడు, పరుషః = క్రూరుడై, పిశునః = చాడీలు చెప్పుచున్న వాడై, అశుచిః = అపవిత్రుడై, అధర్మాత్మా = అధర్మాత్ముడై, నిత్యమ్ = ఎల్లప్పుడూ, రాజ్ఞః = రాజునుండి, భీతః = భయపడినవాడై, మాయయా= మోసముతో, రమతామ్=క్రీడించుగాక.

తా. రాముని అరణ్యగమనమునకు నేనే కారణ మైనచో, నాకు, క్రూరుడై చాడీలు చెప్పుచు, అపవిత్రుడై, అధర్మాత్ముడై, నిత్యము రాజున కెక్కడ వట్టి

బడుదుమో అని భయపడుచు, అందరిని మోసగించుచు జీవించువానికి ఎట్టి పాపము వచ్చునో అట్టి పాపము కలుగుగాక. 51

మూ. ఋతుస్నాతాం సతీం భార్యామృతుకాలానురోధినీమ్,
అతివర్తేత దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః. 52

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, దుష్టాత్మా = అట్టి దుష్టబుద్ధి, ఋతుకాలానురోధినీమ్ = ఋతుకాలమును పాటించుచున్నదీ, ఋతుస్నాతామ్ = ఋతుస్నానము చేసినదీ, సతీమ్ = పతివ్రతా అయిన, భార్యామ్ = భార్యను, అతివర్తేత = అతిక్రమించుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్లుటకు నేను అనుమతించి ఉన్నచో, నాకు, ఋతుస్నాత యై, ఋతుకాలమును పాటించు పతివ్రత యైన భార్యను కలియని దుష్టాత్మున కెంత పాపము కల్గునో అంత పాపము కలుగుగాక. 52

మూ. ధర్మదారాన్ పరిత్యజ్య పరదారాన్నిషేవతామ్,
త్యక్తధర్మరతిర్మూఢో యస్యార్యోఽనుమతే గతః. 53

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, మూఢః = అట్టి మూఢుడు, త్యక్తధర్మరతిః = విడువబడిన ధర్మాసక్తి కలవాడై, ధర్మదారాన్ = ధర్మపత్నిని, పరిత్యజ్య = విడచి, పరదారాన్ = పరభార్యను, నిషేవతామ్ = సేవించుగాక.

తా. పూజ్యుడైన అన్నగారు అడవికి వెళ్ళవలె నని నేను కోరి ఉన్నచో నాకు, ధర్మమునందు ఆసక్తి లేక తన ధర్మపత్నిని విడచి పరభార్యాసంగము చేసిన మూఢాత్మునకు ఎట్టి పాపము కలుగునో అట్టి పాపము కలుగుగాక. 53

మూ. విప్రలుప్తప్రజాతస్య దుష్కృతం బ్రాహ్మణస్య యత్,
తదేవ ప్రతిపద్యేత యస్యార్యోఽనుమతే గతః. 54

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = సంమతి ప్రకారము, గతః = వెళ్ళినాడో వాడు, విప్రలుప్తప్రజాతస్య = లోపించిన

సంతానము గల, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునకు, యత్ = ఏ, దుష్కృతమ్ = పాప ముండునో, తదేవ = దానినే, ప్రతిపద్యతామ్ = పొందుగాక.

తా. ఆర్యుడు అరణ్యమునకు వెళ్లవలె నని కోరుకొన్నవానికి, సంతానము లేని బ్రాహ్మణునకు ఎంత పాప ముండునో- అనగా ఎంత పాపము చేసినచో బ్రాహ్మణుడు సంతానహీను డగునో- అంత పాపము కలుగుగాక. 54

మూ. పానీయదూషకే పాపం తథైవ విషదాయకే,
యత్తదేకః స లభతాం యస్యార్యోఽనుమతే గతః. 55

ప్ర. అ. ఆర్యః = ఆర్యుడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతి ప్రకారము, గతః = వెళ్ళినాడో, సః = అతడు, ఏకః = ఒక్కడే, పానీయదూషకే = త్రాగేనీళ్లను పాడుచేసినవానికిని, తథైవ = అట్లే, విషదాయకే = ఇతరులకు విషము పెట్టినవానికి, యత్ = ఏ, పాపమ్ = పాపము గలదో, దానిని, లభతామ్ = పొందుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్లుటకు నేను కారణ మైనచో, త్రాగే నీరు పాడుచేసినవానికీ, ఇతరులకు విషము ఇచ్చినవానికీ ఎట్టి పాపము కలుగునో ఆ పాప మంతా నా ఒక్కనికే కలుగుగాక. 55

మూ. బ్రాహ్మణాయోద్యతాం పూజాం విహన్తు కలుషేన్ద్రియః,
బాలవత్సాం చ గాం దోగ్ధు యస్యార్యోఽనుమతే గతః.

ప్ర. అ. ఆర్యః = పూజ్యు డైన రాముడు, యస్య = ఎవనియొక్క, అనుమతే = అనుమతియందు, గతః = వెళ్ళినాడో, ఆతడు, కలుషేన్ద్రియః = దుష్ట మైన ఇంద్రియములు కలవాడై, బ్రాహ్మణాయ = బ్రాహ్మణునికొరకు, ఉద్యతామ్ = సిద్ధము చేయబడిన, పూజామ్ = పూజను, విహన్తు = భగ్నము చేయుగాక. బాలవత్సామ్ = లేగ దూడ గల, గామ్ = గోవును, దోగ్ధు = పాలుపితుకుగాక.

తా. అన్నగారు అరణ్యమునకు వెళ్ళవలె నని నేను కోరి ఉన్నచో, నాకు దుష్టము లైన ఇంద్రియములు కలవాడై, బ్రాహ్మణునికొరకై సిద్ధము చేసిన పూజకు విఘాతముకలిగించువానికి ఎట్టి పాపము వచ్చునో, లేగదూడ ఉన్న ఆవు

పాలను, దూడకై మిగల్చకుండా పితికివేయు వానికి (లేదా ఈనిన పిదప పది రోజులు దాటకుండా ఆవుపాలు పిదుకువానికి) ఎట్టి పాపము వచ్చునో అట్టి పాపము వచ్చుగాక. 56

మూ. తృష్ణార్తం సతి పానీయే విప్రలమ్భేన యోజయేత్,
లభేత తస్య యత్పాపం యస్యార్యోఽనుమతే గతః. 57

ప్ర. అ. ఆర్యః=ఆర్యుడు, యస్య=ఎవనియొక్క, అనుమతే=అనుమతి యందు, గతః=వెళ్ళినాడో, వాడు, పానీయే = జలము, సతి = ఉన్నను, తృష్ణార్తమ్=దప్పికతో బాధపడువానిని, విప్రలంభేన=మోసముతో, యోజయేత్ =ఎవ్వడు కూర్చునో, తస్య=వానికి, యత్=ఏ, పాపమ్=పాపము కలుగునో, దానిని, లభేత = పొందుగాక.

తా. అన్నగారి అరణ్యగమనమునకు నేను కారణ మైనచో, నాకు,జలము ఉండికూడ లేదని చెప్పి, దప్పికొన్నవానిని మోసగించినవానికి కలుగు పాపము కలుగుగాక. 57

మూ. భక్త్యా వివదమానేషు మార్గమాశ్రిత్య పశ్యతః,
తస్య పాపేన యుజ్యేత యస్యార్యోఽనుమతే గతః. 58

ప్ర. అ. ఆర్యః = అన్నగారు, యస్య = ఎవనియొక్క, అనుమతే = సంమతిప్రకారము, గతః=వెళ్ళినాడో, అతడు, భక్త్యా = రెండు పక్షాలుగా విడిపోవుటచేత, వివదమానేషు=కలహించుచుండగా, మార్గమ్=మార్గమును, ఆశ్రిత్య =ఆశ్రయించి, పశ్యతః=చూచుచున్న, తస్య=అట్టివాని, పాపేన=పాపముతో, యుజ్యేత = కూడుగాక.

తా. అన్నగారు అడవికి వెళ్ళవలె నని నేను కోరి ఉన్నచో, నాకు, కొందరు రెండు పక్షాలుగా విడిపోయి కలహించుచుండగా, వారిని విడదీయక, మార్గములో నిలబడి చోద్యము చూచుచున్నవానికి ఎట్టి పాపము వచ్చునో అట్టి పాపము కలుగుగాక. 58

వి. ఇక్కడ 'భక్త్యా' అనగా విభక్తిచేత, అనగా రెండు వర్గాలుగా చీలి పోవుటచేత అని అర్థము.

మూ. విహీనాం పతిపుత్రాభ్యాం కౌసల్యాం పార్థివాత్మజః,
ఏవమాశ్వాసయన్నేవ దుఃఖార్తో నిపపాత హ. 59

ప్ర. అ. పార్థివాత్మజః = రాజకుమారు డైన భరతుడు, పతిపుత్రాభ్యామ్ = భర్తతోను పుత్రునితోను, విహీనామ్ = శూన్యురా లైన, కౌసల్యామ్ = కౌసల్యను, ఏవమ్ = ఈవిధముగా, ఆశ్వాసయన్నేవ = ఓదార్చుచునే, దుఃఖార్తః = దుఃఖార్తుడై, నిపపాత హ = క్రింద పడిపోయెను.

తా. పతి లేక, పుత్రునకు దూర మైన కౌసల్యను ఈ విధముగా ఓదార్చుచునే భరతుడు దుఃఖార్తుడై నేలపై పడిపోయెను. 59

మూ. తథా తు శపథైః కష్టైః శపమానమచేతనమ్,
భరతం శోకసంతప్తం కౌసల్యా వాక్యమబ్రవీత్. 60

ప్ర. అ. తథా = ఆవిధముగా, కష్టైః = కష్ట మైన, శపథైః = శపథముల చేత, శపమానమ్ = ఒట్లు పెట్టుకొనుచున్న, అచేతనమ్ = స్పృహ తప్పి పడియున్న, శోకసంతప్తమ్ = దుఃఖపీడితు డైన, భరతమ్ = భరతుని గూర్చి, కౌసల్యా = కౌసల్య, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా కష్ట మైన శపథములతో ఒట్లు పెట్టుచు, దుఃఖార్తుడై స్పృహ తప్పి నేలపై పడిపోయిన భరతునితో కౌసల్య ఇట్లు పలికెను. 60

మూ. మమ దుఃఖమిదం పుత్ర భూయః సముపజాయతే,
శపథైః శపమానో హి ప్రాణానుపరుణత్సి మే. 61

ప్ర. అ. పుత్ర = పుత్రా! మమ = నాకు, ఇదం దుఃఖమ్ = ఈ దుఃఖము, భూయః = ఇంకను. సముపజాయతే = కలుగుచున్నది. శపథైః = శపథముల చేత, శపమానః = ఒట్లు పెట్టుచూ, మే = నాయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, ఉపరుణత్సి హి = పీడించుచున్నావు కదా.

తా. కుమారా! నీవు ఈ విధముగా శపథములు చేసి, ఒట్లు పెట్టుచు నా ప్రాణములకు దుఃఖము కలిగించుచున్నావు. అందుచే నా దుఃఖము ఇంకను పెరిగిపోవుచున్నది. 61

మూ. దిష్ట్యా న చలితో ధర్మాదాత్మా తే సహలక్ష్మణః.
వత్స సత్యప్రతిజ్ఞో హి సతాం లోకమవాప్స్యసి. 62

ప్ర. అ. వత్స = కుమారా : దిష్ట్యా = అదృష్టవశముచేత, తే=నీయొక్క, ఆత్మా = మనస్సు, ధర్మాత్ = ధర్మమునుండి, న చలితః = చలించలేదు. సత్య ప్రతిజ్ఞః=సత్యమైన ప్రతిజ్ఞ గల నీవు, సహలక్ష్మణః = లక్ష్మణసహితుడవై, సతామ్=సత్పురుషులయొక్క, లోకమ్=లోకమును, అవాప్స్యసి=పొందగలవు.

తా. వత్సా ! పుణ్యవశముచే, నీ మనస్సు ధర్మమార్గమునుండి చలించ లేదు. సత్యప్రతిజ్ఞుడవైన నీవు, లక్ష్మణసమేతుడవై సత్పురుషుల లోకమును చేరగలవు. 62

మూ. ఇత్యుక్త్వా చాఙ్కమానీయ భరతం భ్రాతృవత్సలమ్,
పరిష్వజ్య మహాబాహుం రురోద భృశదుఃఖితా. 63

ప్ర. అ. భ్రాతృవత్సలమ్ = సోదరునియందు ప్రేమ గల, భరతమ్ = భరతుని గూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అఙ్కమ్ = ఒడిని, ఆనీయ = పొందించి, మహాబాహుమ్ = గొప్ప బాహువులు గల అతనిని, పరిష్వజ్య = కౌగలించుకొని, భృశదుఃఖితా=చాలా దుఃఖించినదై, రురోద = ఏడ్చెను.

తా. రామునియందు అత్యధికమైన ప్రేమ గల ఆ భరతునితో ఇట్లు పలికి కౌసల్య ఆ మహాబాహుని ఒడిలో కూర్చుండబెట్టుకొని, కౌగలించుకొని, చాల దుఃఖించుచు ఏడ్చెను. 63

మూ. ఏవం విలపమానస్య దుఃఖార్తస్య మహాత్మనః,
మోహాచ్చ శోకసంరోధాద్బభూవ లులితం మనః. 64

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, విలపమానస్య = విలపించుచున్న, దుఃఖార్తస్య = దుఃఖార్తుడైన, మహాత్మనః = మహాత్ముడైన భరతునియొక్క, మనః = మనస్సు, మోహాచ్చ = మోహమువలనను, శోకసంరోధాత్ = దుఃఖముయొక్క పీడనమువలనను, లులితమ్ = నలిగినది, బభూవ = ఆయెను.

తా. దుఃఖార్తుడై ఈ విధముగా విలపించుచున్న ఆ మహాత్ముని మనస్సు మోహముచేతను, దుఃఖపీడచేతను చాలా నలిగిపోయెను. 64

మూ. లాలప్యమానస్య విచేతనస్య
ప్రణష్టబుద్ధేః పతితస్య భూమౌ,
ముహుర్ముహుర్నిఃశ్వసతశ్చ ఘర్మం
సా తస్య శోకేన జగామ రాత్రిః. 65

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చసప్తతితమః సర్గః.

ప్ర. అ. లాలప్యమానస్య = మిక్కిలి విలపించుచున్నవాడూ, విచేతనస్య = స్పృహ తప్పినవాడూ, ప్రణష్టబుద్ధేః = నశించిన బుద్ధికలవాడూ, భూమౌ = నేలపై, పతితస్య = పడినవాడూ, ముహుర్ముహుః = మాటి మాటికిని, ఘర్మమ్ = వేడిగా, నిఃశ్వసతః = నిట్టూర్చుచున్నవాడూ అయిన, తస్య = ఆ భరతునకు, రాత్రిః = రాత్రి, శోకేన = దుఃఖముతో, జగామ = గడచెను.

తా. ఎక్కువ విలపించుచు, చైతన్యరహితుడై, బుద్ధి నశించి, నేలపై పడి, మాటి మాటికిని వేడిగా నిట్టూర్చుచున్న ఆ భరతునకు ఆ రాత్రి దుఃఖముతో గడచెను. 65

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో డెబ్బదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్సప్తతితమః సర్గః

[దశరథ మహారాజునకు దహనసంస్కారము]

మూ. తమేవం శోకసన్తప్తం భరతం కైకయీసుతమ్,
ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠః శ్రేష్ఠవాగృషిః. 1

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా. శోకసంతప్తమ్ = శోకముచే తపింప చేయబడిన, కైకయీసుతమ్ = కైకేయి కుమారుడైన, తం భరతమ్ = ఆ భరతుని గూర్చి, వదతామ్ = మాటలాడువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడూ, శ్రేష్ఠవాక్ = శ్రేష్ఠమైన వాక్కు కలవాడూ అయిన, వసిష్ఠః ఋషిః = వసిష్ఠమహర్షి, ఉవాచ = పలికెను.

తా. ఈ విధముగా దుఃఖసంతప్తుడైన కైకయీకుమారుడైన భరతునితో మాటలలో నేర్పు కలవాడు, శ్రేష్ఠమైన మాటలు మాటలాడువాడు అయిన వసిష్ఠ మహర్షి ఇట్లు పలికెను. 1

మూ. అలం శోకేన భద్రం తే రాజపుత్ర మహాయశః,
ప్రాప్తకాలం నరపతేః కురు సంయానముత్తమమ్. 2

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర = రాజకుమారా, తే = నీకు, భద్రమ్ = భద్ర మగుగాక. శోకేన = దుఃఖముచేత, అలమ్ = చాలును. నరపతేః = రాజుయొక్క, ప్రాప్తకాలమ్ = ప్రాప్తించిన సమయము గల, ఉత్తమమ్ = శ్రేష్ఠమయిన, సంయానమ్ = దీర్ఘప్రస్థానమును (ఉత్తరక్రియను), కురు = చేయుము.

తా. ఉత్తమమైన కీర్తి గల రాజకుమారా ! నీకు మంగళ మగుగాక, దుఃఖించకుము. రాజునకు ఉత్తమమైన ఉత్తరకర్మ చేయవలసిన సమయము కదా; ఆ ఉత్తరకర్మ చేయుము. 2

మూ. వసిష్ఠస్య వచః శ్రుత్వా భరతో ధారణాం గతః,
ప్రేతకార్యాణి సర్వాణి కారయామాస ధర్మవిత్. ౩

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మవేత్త యైన, భరతః=భరతుడు, వసిష్ఠస్య= వసిష్ఠునియొక్క, వచః=వాక్యమును, శ్రుత్వా=విని, ధారణామ్ = స్థైర్యమును, గతః = పొందినవాడై, సర్వాణి = సమస్త మైన, ప్రేతకార్యాణి = ప్రేతకార్యములను, కారయామాస= చేయించెను (చేసెను).

తా. ధర్మవేత్త యైన భరతుడు వసిష్ఠుని మాటలు విని, స్థైర్యము నవలంబించి, ప్రేతకార్యము లన్నింటిని చేయించెను. ౩

మూ. ఉద్ధృతం తైలసంరోధాత్స తు భూమౌ నివేశితమ్,
ఆపీతవర్ణవదనం ప్రసుప్తమివ భూమిపమ్. ౪

సంవేశ్య శయనే చాగ్ర్యే నానారత్నపరిష్కృతే,
తతో దశరథం పుత్రో విలలాప సుదుఃఖితః. ౫

ప్ర. అ. సః పుత్రః=పుత్రుడైన ఆ భరతుడు, తైలసంరోధాత్=నూనెతొట్టినుండి, ఉద్ధృతమ్= పైకి తీయబడినవాడూ, భూమౌ=నేలపై, నివేశితమ్= ఉంచబడినవాడూ, ఆపీతవదనమ్ = పచ్చబడిన ముఖము కలవాడూ అయిన, ప్రసుప్తమివ=నిద్రపోవుచున్నవాడువలె ఉన్న, భూమిపమ్=రాజైన, దశరథమ్= దశరథుని, నానారత్నపరిష్కృతే=అనేకవిధము లైన రత్నములచేత పరిష్కరింపబడిన, అగ్ర్యే=శ్రేష్ఠ మైన, శయనే = శయనముమీద, సంవేశ్య=పరుండబెట్టి, తతః= అటుపిమ్మట, సుదుఃఖితః = చాలా దుఃఖితుడై, విలలాప = విలపించెను.

తా. దశరథమహారాజు కళేబరమును తైలద్రోణినుండి పైకి తీసి నేలపై ఉంచిరి. పచ్చనైన ముఖముతో ఆతడు నిద్రపోవుచున్నట్లుండెను. పిదప ఆతనిని అనేకరత్నములచే అలంకృత మైన శ్రేష్ఠ మైన శయనముపై పరుండబెట్టిరి. అట్టి దశరథుని చూచి కుమారుడైన భరతుడు చాలా దుఃఖించుచు విలపించెను. 4,5

మూ. కిం తే వ్యవసితం రాజన్ ప్రోషితే మయ్యనాగతే,
వివాస్య రామం ధర్మజ్ఞం లక్ష్మణం చ మహాబలమ్. 6

ప్ర. అ. రాజన్ = మహారాజా! ప్రోషితే = ప్రవాసమునకు వెళ్ళిన, మయి = నేను, అనాగతే = రాకుండగా, ధర్మజ్ఞమ్ = ధర్మము నెరిగిన, రామమ్ = రాముని, మహాబలమ్ = గొప్ప బలము గల, లక్ష్మణం చ = లక్ష్మణునీ, వివాస్య = దూరముగా పంపివేసి, తే = నీకు, కిమ్ = ఏమి, వ్యవసితమ్ = నిశ్చయింపబడినది ?

తా. మహారాజా ! ప్రవాసమునుండి నేను తిరిగి రాకుండగా, ధర్మవేత్తయైన రామునీ, మహాబలశాలి యైన లక్ష్మణునీ దూరముగా పంపివేసినావు కదా, నీవు ఏమి నిర్ణయము చేసికొని అట్లు చేసినావు ? 6

మూ. క్వ యాస్యసి మహారాజ హిత్వేమం దుఃఖితం జనమ్,
హీనం పురుషసింహేన రామేణాక్లిష్టకర్మణా. 7

ప్ర. అ. మహారాజ = మహారాజా ! అక్లిష్టకర్మణా = శ్రమ లేని పనులు గల, పురుషసింహేన = పురుషశ్రేష్ఠు డైన, రామేణ = రామునితో, హీనమ్ = హీనుడూ, దుఃఖితమ్ = దుఃఖితుడూ అయిన, ఇమం జనమ్ = ఈ జనుణ్ణి, హిత్వా = విడచి, క్వ = ఎక్కడికి, యాస్యసి = వెళ్లెదవు.

తా. మహారాజా ! శ్రమపడకుండా పనులు చేయగలవాడూ, పురుషశ్రేష్ఠుడూ అయిన రాముడు దగ్గర లేని, దుఃఖార్తుడ నైన నన్ను విడచి ఎక్కడికి వెళ్ళెదవు? 7

మూ. యోగక్షేమం తు తే రాజన్ కోఽస్మిన్ కల్పయితా పురే
త్వయి ప్రయాతే స్వస్తాత రామే చ వనమాశ్రితే. 8

ప్ర. అ. రాజన్ = రాజా, తాత = తండ్రీ, త్వయి = నీవు, స్వః = స్వర్గమును గూర్చి, ప్రయాతే = వెళ్ళినవాడ వగుచుండగా, రామే చ = రాముడు, వనమ్ = వనమును, ఆశ్రితే = ఆశ్రయించినవా డగుచుండగా, తే = నీయొక్క, అస్మిన్ = ఈ, పురే = పట్టణమునందు, కః = ఎవ్వడు, యోగక్షేమమ్ = యోగక్షేమములను, కల్పయితా = ఏర్పరచును.

తా. తండ్రీ! మహారాజా! నీవు స్వర్గమునకు వెళ్ళిపోయినావు. రాముడు అరణ్యమునకు వెళ్ళినాడు. ఇపుడు నీ అయోధ్యానగరమునకు సంబంధించిన యోగక్షేమములు చూచువా రెవరు? 8

మూ. విధవా పృథివీ రాజం స్త్వయా హీనా న రాజతే,
హీనచన్ద్రేవ రజనీ నగరీ ప్రతిభాతి మా. 9

ప్ర. అ. రాజన్ = రాజా, త్వయా = నీతో, హీనా = హీనురా లైన, (నీవు లేని), పృథివీ = ఈ భూమి, విధవా = విధవయై. న రాజతే = ప్రకాశించుటలేదు. నగరీ = ఈ నగరము, హీనచన్ద్రా = హీను డైన చంద్రుడు గల (చంద్రుడు లేని) రజనీవ = రాత్రి వలె, మా = నన్ను గూర్చి, ప్రతిభాతి = కనబడుచున్నది.

తా. మహారాజా! నీవు లేని ఈ భూమి విధవ యై ప్రకాశహీనురా లై ఉన్నది. నాకు ఈ నగరము చంద్రుడు లేని రాత్రి వలె కనబడుచున్నది. 9

మూ. ఏవం విలపమానం తం భరతం దీనమానసమ్,
అబ్రవీద్వచనం భూయో వసిష్ఠస్తు మహామునిః. 10

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, విలపమానమ్ = విలపించుచున్న, దీనమానసమ్ = దీన మైన మనస్సు గల, తం భరతమ్ = ఆ భరతుని గూర్చి, మహామునిః = మహాముని యైన, వసిష్ఠః = వసిష్ఠుడు, భూయః = మరల, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దీన మైన మనస్సుతో ఈ విధముగా విలపించుచున్న భరతునితో మహాముని యైన వసిష్ఠుడు మరల ఇట్లు పలికెను. 10

మూ. ప్రేతకార్యాణి యాన్యస్య కర్తవ్యాని విశాం పతేః,
తాన్యవ్యగ్రం మహాబాహో క్రియన్తామవిచారితమ్. 11

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! అస్య = ఈ, విశాం పతేః = రాజునకు, యాని = ఏ, ప్రేతకార్యాణి = ప్రేతకార్యములు, కర్తవ్యాని = చేయ దగినవో, తాని = ఆ కార్యములు, అవిచారితమ్ = మరొక ఆలోచన ఏమీ లేకుండగా, అవ్యగ్రమ్ = తొందరపాటు లేకుండగా, క్రియన్తామ్ = చేయబడుగాక.

తా. గొప్ప బాహువులు కలవాడా ! ఇంక జాగు చేయక, తొందరపాటు లేక, ఈ రాజుకు జరపవలసిన ప్రేతకార్యము లన్నీ జరుపుము. 11

మూ. తథేతి భరతో వాక్యం వసిష్ఠస్యాభిపూజ్య తత్,
ఋత్విక్పురోహితాచార్యాం స్త్వరయామాస సర్వశః. 12

ప్ర. అ. భరతః = భరతుడు, తథేతి = అట్లే చేసెదను అని, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, అభిపూజ్య = మన్నించి, సర్వశః = అన్ని విధముల, ఋత్విక్పురోహితాచార్యాన్ = ఋత్విక్కులను, పురోహితులను, ఆచార్యులను, త్వరయామాస = తొందర పెట్టెను.

తా. భరతుడు "అటులనే చేసెదను" అని పలికి, వసిష్ఠుని మాటను గౌరవించి వివిధకార్యములు చేయుటకు ఋత్విక్కులను, పురోహితులను ఆచార్యులను తొందర పెట్టెను. 12

మూ. యే త్వగ్నయో నరేన్ద్రస్య చాగ్న్యగారాద్బహిష్కృతాః
ఋత్విగ్భిర్యాజకైశ్చైవ తే౽హ్రియన్త యథావిధి. 13

ప్ర. అ. నరేన్ద్రస్య = రాజుయొక్క, యే = ఏ, అగ్నయః = అగ్నులు, అగ్న్యగారాత్ = అగ్నిగృహమునుండి, బహిష్కృతాః = బైటికి తీసికొనిరాబడినవో, తే = అవి, యథావిధి = యథాశాస్త్రముగా, ఋత్విగ్భిః = ఋత్విక్కులచేతను, యాజకైశ్చైవ = పురోహితులచేతను, అహ్రియన్త = గ్రహింపబడినవి.

తా. అగ్నిగృహమునుండి బైటకు తీసికొనివచ్చిన దశరథుని అగ్నులను ఋత్విక్కులు, పురోహితులు యథాశాస్త్రముగా గ్రహించిరి. 13

మూ. శిబికాయామథారోప్య రాజానం గతచేతసమ్,
బాష్పకణ్ఠా విమనస స్తమూహుః పరిచారకాః. 14

ప్ర. అ. అథ = అటు పిమ్మట, పరిచారకాః = పరిచారకులు, గతచేతసమ్ = మరణించిన, రాజానమ్ = రాజును, శిబికాయామ్ = చిన్న పల్లకియందు, ఆరోప్య = ఎక్కించి, బాష్పకణ్ఠాః = బాష్పము కంఠములందు కలవారై, విమనసః = బాధ చెందిన మనస్సు కలవారై, తమ్ = ఆ రాజును, ఊహుః = మోసిరి.

తా. పిమ్మట పరిచారకులు, బాష్పముతో నిండిన కంఠములతో దుఃఖించుచు, మరణించిన ఆ రాజును చిన్న పల్లకిపై ఎక్కించి మోసికొని వెళ్ళిరి. 14

మూ. హిరణ్యం చ సువర్ణం చ వాసాంసి వివిధాని చ
ప్రకిరన్తో జనా మార్గం నృపతేరగ్రతో యయుః. 15

ప్ర. అ. జనాః = జనులు, నృపతేః = రాజుయొక్క, అగ్రతః = ఎదుట, హిరణ్యమ్ = వెండిని, సువర్ణం చ = బంగారమును, వివిధాని = అనేకవిధములైన, వాసాంసి చ = వస్త్రములను, ప్రకిరన్తః = చిమ్ముచు, మార్గమ్ = మార్గమును, యయుః = పొందిరి.

తా. రాజునకు ఎదుట వెండి, బంగారము, అనేకవిధాలైన వస్త్రములు చల్లుచు జనులు మార్గమునందు వెళ్ళిరి. 15

మూ. చన్దనాగురునిర్యాసాన్ సరళం పద్మకం తథా.
దేవదారూణి చాహృత్య క్షేపయన్తి తథాపరే. 16

గన్ధానుచ్చావచాంశ్చాన్యాం స్తత్ర గత్వాథ భూమిపమ్,
తత్ర సంవేశయామాసుశ్చితామధ్యే తమృత్విజః. 17

ప్ర. అ. తథా = అట్లే, అపరే = ఇతరులు, చన్దనాగురునిర్యాసాన్ = చందనమును అగురువును, గుగ్గిలమును, సరళమ్ = సరళ మను చెట్టు కఱ్ఱను, పద్మకమ్ = పద్మక మను చెట్టు కఱ్ఱను, దేవదారూణి చ = దేవదారుచెట్టు కఱ్ఱలను, అన్యాన్ = ఇతరములైన, ఉచ్చావచాన్ = అనేకవిధములైన, గన్ధాన్ = సుగంధద్రవ్యములను, ఆహృత్య = తీసికొని వచ్చి, తత్ర = అచటికి, గత్వా = వెళ్ళి, క్షేపయన్తి = పడవేసిరి. అథ = అటు పిమ్మట, ఋత్విజః = ఋత్విక్కులు, భూమిపమ్ = రాజును, తత్ర = అక్కడ, చితామధ్యే = చితిమధ్యలో, సంవేశయామాసుః = పరుండబెట్టిరి.

తా. మరి కొందరు చందనము, అగురువు, గుగ్గిలము, సరళ-పద్మక-దేవదారువృక్షముల కఱ్ఱలు, ఇంకా అనేకవిధాలైన గంధద్రవ్యములు తీసికొని వచ్చి అక్కడ వేసిరి. పిదప ఋత్విక్కులు ఆ రాజు కళేబరమును చితిమధ్యలో పరుండ బెట్టిరి. 16,17

మూ. తదా హుతాశనం హుత్వా జేపు స్తస్య తదృత్విజః,
జగుశ్చ తే యథాశాస్త్రం తత్ర సామాని సామగాః. 18

ప్ర. అ. తదా = అప్పుడు, తదృత్విజః = ఆతని ఋత్విక్కులు, తస్య = ఆ రాజుయొక్క, హుతాశనమ్ = అగ్నిని, హుత్వా = హోమము చేసి, జేపుః = జపించిరి. తత్ర = అక్కడ, తే సామగాః = సామవేదము గానము చేయువారు, యథాశాస్త్రమ్ = శాస్త్రానుసారముగా, సామాని = సామలను, జగుశ్చ = గానము చేసిరి.

తా. అప్పుడు దశరథుని ఋత్విక్కులు ఆతని అగ్నిలో హోమములు చేసి జపించిరి. సామగులు యథాశాస్త్రముగా సామగానము చేసిరి. 18

మూ. శిబికాభిశ్చ యానైశ్చ యథార్హం తస్య యోషితః,
నగరాన్నిర్యయు స్తత్ర వృద్ధైః పరివృతా స్తదా. 19

ప్ర. అ. తదా = అప్పుడు, తస్య = ఆతనియొక్క, యోషితః = స్త్రీలు, వృద్ధైః = వృద్ధులతో, పరివృతాః = కూడినవారై, యథార్హమ్ = తగిన విధముగా, శిబికాభిశ్చ = పల్లకీలచేతను, యానైశ్చ = ఇతరవాహనములచేతను, నగరాత్ = నగరమునుండి, తత్ర = అక్కడికి, నిర్యయుః = బయలుదేరి వచ్చిరి.

తా. రాజభార్య లందరును వృద్ధులు వెంట రాగా, తమ తమ అర్హత ననుసరించి పల్లకీలను, ఇతరవాహనములను ఎక్కి, నగరమునుండి బయలుదేరి వచ్చిరి. 19

మూ. ప్రసవ్యం చాపి తం చక్రుః ఋత్విజోఽగ్నిచితం నృపమ్,
స్త్రియశ్చ శోకసంతప్తాః కౌసల్యాప్రముఖా స్తదా. 20

ప్ర. అ. తదా = అప్పుడు, ఋత్విజః = ఋత్విక్కులూ, శోకసంతప్తాః = శోకముచే పీడింపబడిన, కౌసల్యాప్రముఖాః = కౌసల్య మొదలైన, స్త్రియశ్చ = స్త్రీలూ, అగ్నిచితమ్ = అగ్నిచయనము చేసిన, తం నృపమ్ = ఆ రాజును, ప్రసవ్యం చాపి చక్రుః = అప్రదక్షిణ పరిక్రమణము చేసిరి.

తా. అప్పుడు ఋత్విక్కులు, దుఃఖాక్రాంత లైన కౌసల్యాదిస్త్రీలు ఆహి తాగ్ని యైన ఆ రాజుకు చుట్టు అప్రదక్షిణముగా తిరిగిరి. 20

మూ. క్రౌఞ్చీనామివ నారీణాం నినాద స్తత్ర శుశ్రువే,
ఆర్తానాం కరుణం కాలే క్రోశ న్తీనాం సహస్రశః. 21

ప్ర. అ. తత్ర కాలే = ఆ సమయమునందు. ఆర్తానామ్ = దుఃఖపీడితలూ, కరుణమ్ = జాలి పుట్టించునట్లుగా, క్రోశ న్తీనామ్ = ఏడ్చుచున్నవారూ అయిన, సహస్రశః = వేలకొలది, నారీణామ్=స్త్రీలయొక్క, నినాదః = ధ్వని, క్రౌఞ్చీ నామివ = ఆడ క్రౌంచపక్షుల ధ్వని వలె, శుశ్రువే=వినబడెను.

తా. ఆ సమయమున, అతిదీనముగా దుఃఖముతో ఏడ్చుచున్న వేలకొలది స్త్రీల రోదనధ్వని క్రౌంచపక్షుల ధ్వని వలె వినవచ్చెను. 21

మూ. తతో రుదన్త్యో వివశా విలప్య చ పునః పునః,
యానేభ్యః సరయూతీరమవతేరుర్వరాఙ్గనాః. 22

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రుదన్త్యః = ఏడ్చుచున్న, వివశాః = స్వాధీనము తప్పిన, వరాఙ్గనాః = స్త్రీలు, పునః పునః = మాటిమాటికి, విలప్య= విలపించి, సరయూతీరమ్=సరయూతీరము చేరి, యానేభ్యః=వాహనములనుండి, అవతేరుః = దిగిరి.

తా. పిమ్మట స్వాధీనము తప్పి, ఏడ్చుచున్న స్త్రీలు మాటి మాటికిని విలాపము చేసి సరయూనదీతీరమునందు యానములనుండి దిగిరి. 22

మూ. కృత్వోదకం తే భరతేన సార్ధం
నృపాఙ్గనా మన్త్రిపురోహితాశ్చ,
పురం ప్రవిశ్యాశ్రుపరీతనేత్రా
భూమౌ దశాహం వ్యనయన్త దుఃఖమ్. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షట్సప్తతితమః సర్గః.

ప్ర. అ. నృపాఙ్గనాః=రాజస్త్రీలు, తే=ఆ, మన్త్రిపురోహితాశ్చ=మంత్రులు

పురోహితులూ, భరతేన సార్ధమ్ = భరతునితో కూడా, ఉదకమ్ = ఉదకమును, కృత్వా = చేసి, అశ్రుపరీతనేత్రాః = కన్నీళ్ళతో నిండిన నేత్రములు కలవారై, పురమ్ = పట్టణమును, ప్రవిశ్య = ప్రవేశించి, దశాహమ్ = పది రోజుల కాలమును, భూమౌ = నేలపై శయనించి, దుఃఖమ్ = అతికష్టముగా, వ్యనయన్త = గడపిరి.

తా. ఆ రాజస్త్రీలూ, మంత్రిపురోహితాదులూ, భరతునితో పాటు తాము కూడా రాజునకు జలతర్పణములు ఇచ్చి, కన్నీళ్లతో నిండిన నేత్రములతో పురము ప్రవేశించి, నేలమీదనే పరుండుచు, పది దివసములు అతికష్టముతో గడపిరి. 23

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో డెబ్బదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తసప్తతితమః సర్గః

[భరతుడు తండ్రి శ్రాద్ధమున బ్రాహ్మణులకు ధనరత్నాదులను విరివిగా దానమిచ్చుట. పదుమూడవనాడు అస్థిసంచయనకార్యము నెరవేర్చుటకై భరతశత్రుఘ్నులు తండ్రికి దహనసంస్కారము చేసిన చోటికి పోయి విలపించుట. వసిష్ఠసుమంత్రులు వారి నోదార్చుట.]

మూ. తతో దశాహేఽతిగతే కృతశౌచో నృపాత్మజః,
ద్వాదశేఽహని సంప్రాప్తే శ్రాద్ధకర్మాణ్యకారయత్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దశాహే=పదవ రోజు, అతిగతే=గడచిన దగుచుండగా, కృతశౌచః = చేసికొనబడిన శుద్ధి గల, నృపాత్మజః=భరతుడు, ద్వాదశే = పండ్రెండవ, అహని = దినము, సంప్రాప్తే = వచ్చినదగుచుండగా, శ్రాద్ధకర్మాణి = శ్రాద్ధకర్మలను, అకారయత్ = చేయించెను.

తా. పదవ దినము గడచిన పిమ్మట శుద్ధి చేసికొని, భరతుడు పండ్రెండవ దినమునందు శ్రాద్ధకర్మలు చేయించెను. 1

మూ. బ్రాహ్మణేభ్యో దదౌ రత్నం ధనమన్నం చ పుష్కలమ్,
వాసాంసి చ మహార్హాణి రత్నాని వివిధాని చ. 2

ప్ర. అ. బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొరకు, రత్నమ్ = రత్నములను, ధనమ్ = ధనమును, పుష్కలమ్ = పుష్కల మైన, అన్నమ్ = అన్నమును, మహార్హాణి = గొప్ప విలువ గల, వాసాంసి = వస్త్రములను, వివిధాని = అనేక విధము లైన, రత్నాని = శ్రేష్ఠవస్తువులను, దదౌ=ఇచ్చెను.

తా. భరతుడు, శ్రాద్ధసమయమునందు, బ్రాహ్మణులకు, రత్నములు, ధనము, పుష్కల మైన భోజనము, విలు వైన వస్త్రములు, అనేకవిధము లైన శ్రేష్ఠవస్తువులు దానము చేసెను. 2

మూ. బాస్తికం బహు శుక్లం చ గాశ్చాపి శతశ స్తథా,
దాసీదాసం చ యానం చ వేశ్మాని సుమహా న్తి చ, 2
బ్రాహ్మణేభ్యో దదౌ పుత్రో రాజ్ఞ స్తస్యౌర్ధ్వదేహికమ్.

ప్ర. అ. పుత్రః = దశరథకుమారు డైన భరతుడు, తస్య = ఆ, రాజ్ఞః = రాజుయొక్క, ఔర్ధ్వదేహికమ్ = పారలౌకికక్రియ నుద్దేశించి, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, బహు = అత్యధిక మైన, శుక్లమ్ = తెల్లని, బాస్తికమ్ = మేకల గుంపును, తథా = అట్లే, శతశః = వందలకొలది, గాశ్చాపి = గోవులను, దాసీ దాసం చ = దాసీదాసులను, యానం చ = వాహనములను, సుమహాన్తి = చాల పెద్ద వైన, వేశ్మాని చ = గృహములను, దదౌ = ఇచ్చెను.

తా. దశరథుని పారలౌకికక్రియలు చేయు సమయమున భరతుడు అత్యధిక మైన తెల్లని మేకల మందను, వందల కొలది గోవులను, దాసదాసీ జనమును, వాహనములను, విశాల మైన గృహములను బ్రాహ్మణులకు దానము చేసెను. 3

మూ. తతః ప్రభాతసమయే దివసేఽథ త్రయోదశే, 4
విలలాప మహాబాహుర్భరతః శోకమూర్ఛితః,
శబ్దాపిహితకణ్ఠస్తు శోధనార్థముపాగతః, 5
చితామూలే పితుర్వాక్యమిదమాహ సుదుఃఖితః.

ప్ర. అ. తతః = పిమ్మట, త్రయోదశే = పదమూడవ, దివసే = దినము నందు, ప్రభాతసమయే = ప్రాతఃకాలసమయమునందు, అథ = అనంతరము, శోధనార్థమ్ = దహనప్రదేశమును శోధించుటకు (అస్థిసంచయనము చేయుటకు), ఉపాగతః = వచ్చిన, మహాబాహుః = గొప్ప బాహువులుగల, భరతః = భరతుడు, శోకమూర్ఛితః = శోకముచేత వ్యాపింపబడినవాడై, శబ్దాపిహితకణ్ఠః = కప్పబడని ధ్వనిగల కంఠముగలవాడై, విలలాప = విలపించెను. పితుః = తండ్రియొక్క, చితా మూలే = చితిదగ్గర, సుదుఃఖితః = చాలదుఃఖించినవాడై, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, ఆహ = పలికెను.

తా. పదమూడవ దినమున ప్రాతఃకాలమునందు, అస్థిసంచయనము చేయుటకై శ్మశానమునకు వెళ్లిన మహాబాహు వగు ఆ భరతుడు, శోకాక్రాంతు

డై, ఎలుగెత్తి ఏడ్చెను. తండ్రి చితాస్థానమును సమీపించి, చాల దుఃఖించుచు ఇట్లు పలికెను. 4,5

మూ. తాత యస్మిన్ నిసృష్టోఽహం త్వయా భ్రాతరి రాఘవే,
తస్మిన్ వనం ప్రవ్రజితే శూన్యే త్యక్తోఽస్మ్యహం త్వయా.

ప్ర. అ. తాత = తండ్రీ ! యస్మిన్ = ఏ, భ్రాతరి = సోదరు డైన, రాఘవే = రామునియందు, అహమ్ = నేను, త్వయా = నీచేత, నిసృష్టః = అప్పగించ బడితినో, తస్మిన్ = ఆ రాముడు, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రజితే = ప్రవాసము వెళ్లగా, అహమ్ = నేను, త్వయా = నీచేత, శూన్యే = శూన్యమునందు, త్యక్తః = విడవబడినవాడను, అస్మి = అయితిని.

తా. తండ్రీ ! నీవు నన్ను ఏ రామునకు అప్పగించినావో ఆ రాముడు అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. ఇక నన్నిపుడు శూన్యములో వదలివేసినావు. 6

మూ. యస్యా గతిరనాథాయాః పుత్రః ప్రవాజితో వనమ్, 7
తామమ్బాం తాత కౌసల్యాం త్యక్త్వా త్వం క్వ గతో నృప.

ప్ర. అ. నృప = మహారాజా ! తాత = తండ్రీ, అనాథాయాః = అనాథురా లైన, యస్యాః = ఏ కౌసల్యకు, గతిః = గతి యైన, పుత్రః = కుమారుడు, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజితః = పంపివేయబడినాడో, తామ్ = అట్టి, అమ్బామ్ = తల్లి యైన, కౌసల్యామ్ = కౌసల్యను, త్యక్త్వా = విడచి, క్వ = ఎక్కడికి, గతః = వెళ్ళినావు ?

తా. మహారాజా ఓ తండ్రీ ! అనాథురా లైన కౌసల్యకు గతి కావలసి యున్న రాముని అరణ్యమునకు పంపివేసి, ఇపుడు నీవు కూడ ఆమెను విడచి ఎక్కడికి వెళ్ళిపోయినావు ? 7

మూ. దృష్ట్వా భస్మారుణం తచ్చ దగ్ధాస్థి స్థానమణ్డలమ్, 8
పితుః శరీరనిర్వాణం నిష్టనన్ విషసాద సః.

ప్ర. అ. సః = అతడు, భస్మారుణమ్ = భస్మముచేత, ఎఱ్ఱనైనదీ, దగ్ధాస్థి = కాల్చబడిన ఎముకలుకలదీ, పితుః = తండ్రియొక్క, శరీరనిర్వాణమ్ =

శరీరమును అదృశ్యమునుగా చేసినదీ అయిన, తత్=ఆ, స్థానమణ్డలమ్ = చితా స్థానమునం దున్న మండలాకారమును, దృష్ట్వా = చూచి, నిష్టనన్ = ధ్వని చేయుచు, విషసాద=దుఃఖించెను.

తా. ఆతడు అక్కడ ఎముకలు దగ్ధములు కాగా, భస్మముచేత ఎఱ్ఱగా ఉన్న, తన తండ్రి శరీరమును అదృశ్యముచేసిన ఆ మండలాకార మైన స్థానమును చూచి బిగ్గరగా ఏడ్చెను. 8

మూ. స తు దృష్ట్వా రుదన్ దీనః పపాత ధరణీతలే, 9
ఉత్థాప్యమానః శక్రస్య యన్త్రధ్వజ ఇవ చ్యుతః.

ప్ర. అ. సః తు=ఆ భరతుడు, దృష్ట్వా=చూచి, దీనః=దీనుడై, రుదన్ = ఏడ్చుచు, ఉత్థాప్యమానః = లేపబడుచున్నదై, చ్యుతః=క్రిందికి జారి పడిన, శక్రస్య = ఇంద్రునియొక్క, యన్త్రధ్వజః ఇవ = యంత్రముపై అమర్చిన ధ్వజము వలె, ధరణీతలే=నేలపై, పపాత=పడెను.

తా. భరతుడు ఆ చితాస్థానము చూచి, ఏడ్చుచు, దీనుడై, పైకి ఎత్తుచుండగా జారి క్రింద పడిపోయిన, యంత్రబద్ధ మైన ఇంద్రధ్వజము వలె నేలపై పడెను. 9

మూ. అభిపేతు స్తతః సర్వే తస్యామాత్యాః శుచివ్రతమ్, 10
అన్తకాలే నిపతితం యయాతిమృషయో యథా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్త మైన, తస్య అమాత్యాః= ఆతని మంత్రులు, శుచివ్రతమ్=పరిశుద్ధ మైన నియమములు గల ఆతనిని, అన్తకాలే = మరణసమయమందు, నిపతితమ్=క్రింద పడిన, యయాతిమ్=యయాతిని, ఋషయో యథా=ఋషులు వలె, అభిపేతుః = తొందరగా సమీపించిరి.

తా. అప్పు డాతని మంత్రు లందరును, అంతకాలమునందు క్రింద పడిపోయిన యయాతిని ఋషులు వచ్చి చుట్టుముట్టి నట్లు, శుద్ధ మైన నియమములు గల ఆ భరతుని శీఘ్రముగా సమీపించిరి. 10

మూ. శత్రుఘ్నశ్చాపి భరతం దృష్ట్వా శోకపరిప్లుతః, 11
విసంజ్ఞో న్యపతద్భూమౌ భూమిపాలమనుస్మరన్.

ప్ర. అ. శత్రుఘ్నశ్చాపి = శత్రుఘ్నుడు కూడా, భరతమ్ = భరతుని, దృష్ట్వా = చూచి, శోకపరిప్లుతః = శోకముతో నిండినవాడై, భూమిపాలమ్ = రాజును, అనుస్మరన్ = స్మరించుచు, విసంజ్ఞః = సంజ్ఞ లేని వాడై, భూమౌ = నేలపై, న్యపతత్ = పడెను.

తా. శత్రుఘ్నుడు కూడ, భరతుని చూచి, శోకముతో వ్యాకులుడై, రాజును స్మరించుచు, స్పృహ తప్పి నేలపై పడెను. 11

మూ. ఉన్మత్త ఇవ నిశ్చేతా విలలాప సుదుఃఖితః, 12
స్మృత్వా పితుర్గుణాఙ్గాని తాని తాని తథా తథా.

ప్ర. అ. పితుః = తండ్రియొక్క, తాని తాని = ఆ యా, గుణాఙ్గాని = మంచి గుణములు గల అవయవములను, తథా తథా = ఆ యా విధముగా, స్మృత్వా = స్మరించి, ఉన్మత్తః ఇవ = పిచ్చివాడు వలె, నిశ్చేతాః = మనఃస్థైర్యము లేనివాడై, సుదుఃఖితః = చాల దుఃఖించినవాడై, విలలాప = విలపించెను.

తా. తండ్రియొక్క శ్రేష్ఠములైన ఆ యా అవయవములను ఆ యా విధములుగా స్మరించుచు, పిచ్చివాడు వలె, మనఃస్థైర్యము కోల్పోయి, చాలా దుఃఖించుచు, విలపించెను. 12

మూ. మన్థరాప్రభవ స్తీవ్రః కైకేయీగ్రాహసంకులః, 13
వరదానమయోఽక్షోభ్యోఽమజ్జయచ్ఛోకసాగరః.

ప్ర. అ. మన్థరాప్రభవః = మంథర ఉత్పత్తిస్థానముగా కలదీ, కైకేయీగ్రాహసంకులః = కైకేయి అను మొసలిచే వ్యాకులమైనదీ, అక్షోభ్యః = క్షోభింప శక్యముకానిదీ, తీవ్రః = తీవ్రమూ అయిన, వరదానమయః = వరదానవికారమైన, శోకసాగరః = శోకసముద్రము, అమజ్జయత్ = ముంచివేసెను.

తా. మంథరనుండి పుట్టినదీ, కైకేయి అనే మొసలిచే భయంకరమైనదీ, తీవ్రమూ, క్షోభింపశక్యము కానిదీ అయిన, వరదాన మనే సముద్రము అందరినీ ముంచివేసినది. 13

మూ. సుకుమారం చ బాలం చ సతతం లాలితం త్వయా. 14
క్వ తాత భరతం హిత్వా విలపన్తం గతో భవాన్,

ప్ర. అ. తాత = తండ్రీ: సుకుమారమ్ = సుకుమారుడూ, బాలం చ = బాలుడూ, త్వయా=నీచేత, సతతమ్=ఎల్లప్పుడూ, లాలితమ్=లాలన చేయబడిన వాడూ, విలపన్తమ్ = విలపించుచున్న వాడూ అయిన, భరతమ్ = భరతుని. హిత్వా = విడచి, భవాన్ = నీవు, క్వ = ఎచటికి, గతః = వెళ్ళినావు ?

తా. తండ్రీ ! సుకుమారుడు, బాలుడు సర్వదా నీచేత లాలింపబడినవాడు అయిన భరతుడు ఈ విధముగా విలపించుచుండగా విడచి ఎక్కడికి వెళ్ళి పోయినావు ? 14

మూ. నను భోజ్యేషు పానేషు వస్త్రేష్వాభరణేషు చ, 15
ప్రవారయసి నః సర్వాన్ తన్నః కోఽన్యః కరిష్యతి.

ప్ర. అ. భోజ్యేషు = భుజింపదగినవాటి విషయమునందు, పానేషు = పానముల విషయమునందు, వస్త్రేషు = వస్త్రముల విషయమునందు, ఆభరణేషు చ = అలంకారముల విషయమునందు, నః సర్వాన్ = మమ్ముల నందరిని, ప్రవారయసి నను=ఇష్టమైన వాటిని కోరుకొనునట్లు చేయుచుండెడివాడవు కదా! తత్ = దానిని, నః=మాకు, అన్యః=మరి యొకడు, కః = ఎవడు, కరిష్యతి= చేయగలడు ?

తా. మీకు కావలసిన భోజ్యములు, పానీయములు, వస్త్రములు అలంకారములు తీసికొనుడని అనుచు మా కందరికీ ఆ యా వస్తువులను ఇచ్చుచుండెడి వాడవు కదా! మా కట్లు మరి యెవ్వరు చేయగలరు ? 15

మూ. అవదారణకాలే తు పృథివీ నావదీర్యతే, 16
యా విహీనా త్వయా రాజ్ఞా ధర్మజ్ఞేన మహాత్మనా.

ప్ర. అ. ధర్మజ్ఞేన=ధర్మముల నెరిగినవాడవు, మహాత్మనా = మహాత్ముడవు. రాజ్ఞా=రాజువు అయిన, త్వయా=నీతో, యా=ఏ భూమి, విహీనా=శూన్యమైనదో, పృథివీ = ఆ భూమి. అవదీరణకాలే = బ్రద్దలైపోవలసిన సమయమునందు, నావదీర్యతే = బ్రద్దలగుటలేదు.

తా. ధర్మాత్ముడవు, మహాత్ముడవు, రాజువు అయిన నీవు లేని ఈ భూమి బ్రద్దలైపోవలసి ఉన్నది, కాని అట్లు బ్రద్దలగుటలేదు. 16

మూ. పితరి స్వర్గమాపన్నే రామే చారణ్యమాశ్రితే, 17
కిం మే జీవితసామర్థ్యం ప్రవేక్ష్యామి హుతాశనమ్.

ప్ర. అ. పితరి = తండ్రి, స్వర్గమ్ = స్వర్గమును, ఆపన్నే = పొందినవాడగుచుండగా, రామే చ = రాముడు, అరణ్యమ్ = అరణ్యమును, ఆశ్రితే = ఆశ్రయించినవా డగుచుండగా, మే = నాకు, జీవితసామర్థ్యమ్ = జీవించుటకు సామర్థ్యము, కిమ్ = ఏమి ఉన్నది ? హుతాశనమ్ = అగ్నిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను.

తా. తండ్రి స్వర్గస్థుడైనాడు. రాముడు అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. ఇంక నాకు జీవించుటకు సామర్థ్య మెక్కడిది ? అగ్నిలో ప్రవేశించెదను. 17

మూ. హీనో భ్రాత్రా చ పిత్రా చ శూన్యామిక్ష్వాకు పాలితామ్,
అయోధ్యాం న ప్రవేక్ష్యామి ప్రవేక్ష్యామి తపోవనమ్.

ప్ర. అ. భ్రాత్రా = సోదరునితోడను, పిత్రా చ = తండ్రితోను, హీనః = హీనుడ నైన నేను, శూన్యామ్ = శూన్య మైపోయిన, ఇక్ష్వాకుపాలితామ్ = ఇక్ష్వాకువంశీయులచేత పాలింపబడిన, అయోధ్యామ్ = అయోధ్యను, న ప్రవేక్ష్యామి = ప్రవేశించను. తపోవనమ్ = తపోవనమును, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను.

తా. సోదరుడూ, తండ్రీ లేని నేను, ఇక్ష్వాకువంశీయులచే పాలిత మైన ఈ శూన్య మైపోయిన అయోధ్యను ప్రవేశించను. తపోవనమును ప్రవేశించెదను.

మూ. తయోర్విలపితం శ్రుత్వా వ్యసనం చాన్వవేక్ష్య తత్, 19
భృశమార్తతరా భూయః సర్వ ఏవానుగామినః.

ప్ర. అ. తయోః = వారిద్దరియొక్క, విలపితమ్ = విలాపమును, శ్రుత్వా = విని, తత్ = ఆ, వ్యసనమ్ = అపదను, అన్వవేక్ష్య = చూచి, సర్వే = సమస్త మైన, అనుగామినః = అనుచరులు, భూయః = మరల, భృశమ్ = అధికముగా, ఆర్తతరాః = మిక్కిలి ఆర్తులుగా అయిరి.

తా. వారిద్దరి విలాపములు విని, వచ్చి పడిన ఆ ఆపదను చూచి, అనుచరు లందరు చాల దుఃఖితు లైరి. 19

మూ. తతో విషణ్ణౌ శ్రాన్తౌ చ శత్రుఘ్నభరతావుభౌ, 21
ధరణ్యాం సంవ్యవేష్టేతాం భగ్నశృఙ్గావివర్షభౌ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విషణ్ణౌ = దుఃఖితులైన, శ్రాన్తౌ చ = అలసిన, ఉభౌ = ఇద్దరైన, శత్రుఘ్నభరతౌ = శత్రుఘ్నభరతులు, భగ్న శృఙ్గౌ = విరుగగొట్టబడిన కొమ్ములు గల, ఋషభౌ ఇవ = వృషభములు వలె, ధరణ్యామ్ = భూమిమీద, సంవ్యవేష్టేతామ్ = దొర్లిరి.

తా. దుఃఖితులై అలసిపోయిన ఆ శత్రుఘ్నభరతు లిద్దరూ కొమ్ములు విరగగొట్టిన రెండు వృషభములు వలె నేలపై దొర్లిరి. 20

మూ. తతః ప్రకృతిమాన్ వైద్యః పితురేషాం పురోహితః, 21
వసిష్ఠో భరతం వాక్యముత్థాప్య తమువాచ హ.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రకృతిమాన్ = ఉత్తమస్వభావము కలవాడూ, వైద్యః = జ్ఞానవంతుడూ, ఏషామ్ = వీరియొక్క, పితుః = తండ్రి యొక్క, పురోహితః = పురోహితుడూ అయిన, వసిష్ఠః = వసిష్ఠుడు, తమ్ = ఆ, భరతమ్ = భరతుని, ఉత్థాప్య = లేవదీసి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. అప్పుడు ఉత్తమస్వభావము కలవాడూ, జ్ఞానవంతుడూ, వీరి తండ్రికి పురోహితుడూ అయిన వసిష్ఠుడు ఆ భరతుని లేవదీసి, ఇట్లు పలికెను.

మూ. త్రయోదశోఽయం దివసః పితుర్వృత్తస్య తే విభో, 22
సావశేషాస్థినిచయే కిమిహ త్వం విలమ్బసే.

ప్ర. అ. విభో = ఓ ప్రభూ! అయమ్ = ఇది, వృత్తస్య = మరణించిన, తే పితుః = నీ తండ్రియొక్క, త్రయోదశః = పదమూడవదైన, దివసః = దివసము. సావశేషాస్థినిచయే = అస్థిసంచయనము ఇంకను మిగిలి ఉండగా, త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడ, కిమ్ = ఎందుకు, విలమ్బసే = ఆలస్యము చేయుచున్నావు.

తా. ప్రభువైన ఓ భరతా! నీ తండ్రి మరణించి ఇది పదమూడవ దివసము. అస్థిసంచయనకార్యము ఇంకను మిగిలి ఉన్నది. నీ విక్కడ ఆలస్యము చేయుచున్నావేమి ? 22

మూ. త్రీణి ద్వన్ద్వాని భూతేషు ప్రవృత్తాన్యవిశేషతః, 23
తేషు చాపరిహార్యేషు నైవం భవితుమర్హసి.

ప్ర. అ. త్రీణి = మూడు, ద్వన్ద్వాని = ద్వంద్వములు - ఆకలిదప్పులు, సుఖదుఃఖములు, జరామరణములు అనునవి, భూతేషు=ప్రాణులందు, అవిశేషతః=విశేష మేమియు లేకుండగా, ప్రవృత్తాని=ప్రవర్తించుచున్నవి. తేషు= అవి, అపరిహార్యేషు=పరిహరింప శక్యముకానివి అగుచుండగా, ఏవమ్=ఇట్లు, భవితుమ్=అగుటకు, నార్హసి = తగవు.

తా. ఆకలిదప్పులు, సుఖదుఃఖములు, జరామరణములు లేదా జన్మమరణములు అను మూడు జంటలు అన్ని ప్రాణులవిషయమునను భేద మేమీ లేకుండా ప్రవర్తించును. అవి పరిహరింప శక్యము కానివి. అట్టి స్థితిలో నీ విట్లు అగుట బాగులేదు. 23

మూ. సుమన్త్రశ్చాపి శత్రుఘ్నముత్థాప్యాభిప్రసాద్య చ, 24
శ్రావయామాస తత్త్వజ్ఞః సర్వభూతభవాభవమ్.

ప్ర. అ. తత్త్వజ్ఞః = తత్త్వవేత్త యైన, సుమన్త్రశ్చాపి=సుమంత్రుడు కూడ, శత్రుఘ్నమ్=శత్రుఘ్నుని, ఉత్థాప్య = లేవదీసి, అభిప్రసాద్య చ = ఊరడిల్లజేసి, సర్వభూతభవాభవమ్ = సమస్తప్రాణుల జన్మమరణములను గూర్చి, శ్రావయామాస=వినిపించెను.

తా. తత్త్వవేత్త యైన సుమంత్రుడు శత్రుఘ్నుని లేవదీసి, సకలప్రాణులకు జన్మమరణములు తప్పనివి అను విషయమును బోధించెను. 24

మూ. ఉత్థితౌ చ నరవ్యాఘ్రౌ ప్రకాశేతే యశస్వినౌ, 25
వర్షాతపపరిగ్లానౌ పృథగిన్ద్రధ్వజావివ.

ప్ర. అ. ఉత్థితౌ = లేచిన, యశస్వినౌ = కీర్తిమంతులైన, నరవ్యాఘ్రౌ =ఆ నరశ్రేష్ఠులు, పృథక్ = వేరువేరుగా, వర్షాతపపరిగ్లానౌ=వర్షముచేతను, ఎండచేతను వాడిపోయిన, ఇన్ద్రధ్వజావివ=ఇంద్రధ్వజములు వలె, ప్రకాశేతే= ప్రకాశించిరి.

తా. నేలనుంచి లేచిన ఆ యశఃశాలు లిరువురూ, ఒక మారు వర్షమునకు తడిసి, పిదప ఎండకు ఎండి రంగుమారిన రెండు ఇంద్రధ్వజముల వలె ఉండిరి.

మూ. అశ్రూణి పరిమృద్నన్తౌ రక్తాక్షౌ దీనభాషిణౌ,
అమాత్యా స్త్వరయ న్తి స్మ తనయౌ చాపరాః క్రియాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తసప్తతితమః సర్గః.

ప్ర. అ. అశ్రూణి = కన్నీళ్ళను, పరిమృద్నన్తౌ = తుడుచుకొనుచున్న, రక్తాక్షౌ = ఎఱ్ఱనైన నేత్రములు గల, దీనభాషిణౌ = దీనముగా మాటలాడు చున్న, తనయౌ = రాజకుమారులను, అమాత్యాః = మంత్రులు, అపరాః = ఇతర మైన, క్రియాః = కర్మలను గూర్చి, త్వరయ న్తి స్మ = తొందర పెట్టిరి.

తా. కన్నీరు తుడుచుకొనుచు, ఎఱ్ఱబడిన కళ్ళతో దీనముగా మాటలాడు చున్న ఆ రాజకుమారులను, అమాత్యులు, మిగిలిన పనులు చేయుటకు తొందర బెట్టిరి. 26

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
డెబ్బదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టసప్తతితమః సర్గః

*[శత్రుఘ్నుని రోషము. అతడు గూనిదానిని పట్టి ఈడ్చుట. భరతుడు వారించగా మూర్ఛిల్లిన ఆమెను విడచిపెట్టుట].*

మూ. అథ యాత్రాం సమీహన్తం శత్రుఘ్నో లక్ష్మణానుజః,
భరతం శోకసంతప్తమిదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. అథ=అటు పిమ్మట, యాత్రామ్=రాముని దగ్గరకు యాత్రను, సమీహన్తమ్ = కోరుచున్న, శోకసంతప్తమ్ = శోకముచేత తపింపచేయబడిన, భరతమ్ = భరతుని గూర్చి, లక్ష్మణానుజః=లక్ష్మణునితమ్ముడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, ఇదమ్ = ఈ, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అనంతరము రాముని వద్దకు వెళ్ళవలె నని యోచించుచున్న, శోకసంతప్తుడైన భరతునితో లక్ష్మణుని తమ్ముడైన శత్రుఘ్నుడిట్లు పలికెను. 1

మూ. గతిర్యః సర్వభూతానాం దుఃఖే కిం పునరాత్మనః,
స రామః సత్త్వసంపన్నః స్త్రియా ప్రవ్రాజితో వనమ్. 2

ప్ర. అ. యః = ఎవ్వడు, సర్వభూతానామ్ = సకలభూతములకు, గతిః =గతియో, ఆత్మనః = తనయొక్క (మన), దుఃఖే=దుఃఖమునందు, కిం పునః =చెప్ప నేల, సః= అట్టి, సత్త్వసంపన్నః=బలముతో కూడిన, రామః=రాముడు, స్త్రియా=స్త్రీచేత, వనమ్=వనమును గూర్చి, ప్రవ్రాజితః = పంపివేయబడినాడు.

తా. బలశాలి యైన రాముడు సకలప్రాణులకును గతి యైనవాడు. మనకు ఆపద వచ్చినపుడు ఆతడే రక్షకుడని వేరుగా చెప్పవలెనా ! అట్టి రాముని ఒక ఆడుది వనమునకు పంపివేసినది. 2

మూ. బలవాన్ వీర్యసంపన్నో లక్ష్మణో నామ యోఽప్యసౌ,
కిం న మోచయతే రామం కృత్వా స్మ పితృనిగ్రహమ్.

ప్ర. అ. బలవాన్ = బలము కలవాడూ, వీర్యసంపన్నః = వీర్యవంతుడూ, అయిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డను ప్రసిద్ధి గల, యః = ఏ, మన సోద రుడు గలడో, అసౌ అపి = ఇత డైనను, పితృనిగ్రహమ్ = తండ్రియొక్క నిగ్ర హమును, కృత్వా = చేసి, రామమ్ = రాముని, కిమ్ = ఎందువలన, న మోచ యతే స్మ = విడిపించలేదో :

తా. బలవంతుడూ, పరాక్రమవంతుడూ అయిన మన సోదరుడు లక్ష్మ ణుడు ఇక్కడనే ఉండెను కదా; ఆత డైనను తండ్రిని నిగ్రహించి రాముని ఎందుకు ఈ ప్రవాసమునుండి విడిపింపలేదో : 3

మూ. పూర్వమేవ తు నిగ్రాహ్యః సమవేక్ష్య నయానయౌ,
ఉత్పథం యః సమారూఢో రాజా నార్యా వశం గతః. 4

ప్ర. అ. యః = ఎవ్వడు, నార్యాః = స్త్రీయొక్క, వశమ్ = వశమును, గతః = పొందినవా డై, ఉత్పథమ్ = అమార్గమును, సమారూఢః = అధిష్ఠించి నాడో, రాజా = అట్టి రాజు, నయానయౌ = న్యాయాన్యాయములను, సమవేక్ష్య = పరీక్షించి, పూర్వమేవ = ముందుగానే, నిగ్రాహ్యః = నిగ్రహించదగినవాడు.

తా. స్త్రీకి వశు డై అమార్గమున సంచరించుచున్న రాజును, న్యాయా న్యాయములు పరీక్షించి, ముందుగానే నిగ్రహించినచో బాగుండెడిది. 4

మూ. ఇతి సంభాషమాణే తు శత్రుఘ్నే లక్ష్మణానుజే,
ప్రాగ్ద్వారేఽభూ త్తదా కుబ్జా సర్వాభరణభూషితా. 5

ప్ర. అ. లక్ష్మణానుజే = లక్ష్మణుని తమ్ము డైన, శత్రుఘ్నే = శత్రు ఘ్నుడు, ఇతి = ఇట్లు, సంభాషమాణే = మాటలాడుచుండగా, తదా = అప్పుడు, కుబ్జా = గూను దైన మంథర, సర్వాభరణభూషితా = సమస్త మైన అలంకార ములచేత అలంకరించబడినదై, ప్రాగ్ద్వారే = తూర్పు ద్వారమునందు, అభూత్ = ఉండెను.

తా. లక్ష్మణుని తమ్ము డైన శత్రుఘ్నుడు ఇట్లు మాటలాడుచున్న సమయ మునందు, మంథర సర్వాభరణములు అలంకరించుకొని, తూర్పు ద్వారమునందు కనబడెను. 5

మూ. లిప్తా చన్దనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ,
వివిధం వివిధైస్తైస్తైర్భూషణైశ్చ విభూషితా. 6

ప్ర. అ. చన్దనసారేణ = శ్రేష్ఠ మైన చందనముచేత, లిప్తా=పూయబడిన దై, రాజవస్త్రాణి = రాజుకు తగిన వస్త్రములను, బిభ్రతీ = ధరించుచున్న దై, వివిధైః = అనేకవిధము లైన, తైస్తైః = ఆ యా, భూషణైశ్చ = అలంకారముల చేత కూడ, వివిధమ్ = అనేక విధములుగా, విభూషితా = అలంకరించబడిన దై, ఉండెను.

తా. ఆమె శ్రేష్ఠ మైన చందనము పూసికొని, రాజులకు తగిన చాలవిల వైనవస్త్రములను ధరించి, అనేకవిధము లైన అలంకారములతో అనేకవిధములుగ అలంకరించుకొని ఉండెను. 6

మూ. మేఖలాదామభిశ్చిత్రై రన్యైశ్చ శుభభూషణైః,
బభాసే బహుభిర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ. 7

ప్ర. అ. చిత్రైః = చిత్ర మైన, మేఖలాదామభిః = వడ్డాణములతోను, అన్యైః=ఇతర మైన, బహుభిః = అనేక మైన, శుభభూషణైశ్చ = శుభ మైన అలంకారములతోను, బద్ధా=కట్టబడిన, ఆమె, రజ్జుబద్ధా=త్రాళ్ళచేత కట్టబడిన, వానరీవ = ఆడ కోతి వలె, బభాసే = ప్రకాశించెను.

తా. చిత్రము లైన వడ్డాణములు, అనేక మైన శుభకరము లైన అలంకారములు కట్టుకొన్న ఆమె త్రాళ్ళతో కట్టిన ఆడకోతి వలె ఉండెను. 7

మూ. తాం సమీక్ష్య తదా ద్వాఃస్థాః సుభృశం పాపకారిణీమ్,
గృహీత్వాఽకరుణాం కుబ్జాం శత్రుఘ్నాయ న్యవేదయన్.

ప్ర. అ. తదా=అప్పుడు, ద్వాఃస్థాః = ద్వారపాలకులు, సుభృశమ్ = మిక్కిలి, పాపకారిణీమ్=పాపము చేసిన, అకరుణామ్ = జాలి లేని, తాం కుబ్జామ్ = ఆ గూనుదానిని, సమీక్ష్య = చూచి, గృహీత్వా = పట్టుకొని, శత్రుఘ్నాయ= శత్రుఘ్నునకు, న్యవేదయన్ = తెలిపిరి.

తా. అప్పుడు ద్వారపాలకులు మిక్కిలి పాపము చేసిన, జాలి లేని ఆ మంథరను చూచి, ఆమెను పట్టుకొని శత్రుఘ్నునకు తెలిపిరి. 8

మూ. యస్యాః కృతే వనే రామో న్యస్తదేహశ్చ వః పితా,
సేయం పాపా నృశంసా చ తస్యాః కురు యథామతి. 9

ప్ర. అ. యస్యాః కృతే = ఎవతె నిమిత్తమై (మూలమున), రామః = రాముడు, వనే = వనమునం దున్నాడో, వః పితా = మీ తండ్రి, న్యస్తదేహశ్చ = విడువబడిన దేహము కలవాడో, సా = అట్టి, పాపా = పాపాత్మురాలూ, నృశంసా చ = క్రూరురాలూ అయిన స్త్రీ, ఇయమ్ = ఇదిగో; తస్యాః = ఆమె విషయమున, యథామతి = నీకు ఇష్టము వచ్చినట్లు, కురు = చేయుము.

తా. ఎవతె మూలమున రాముడు అరణ్యమునకు వెళ్ళినాడో, నీ తండ్రి మరణించినాడో, పాపాత్మురాలూ, క్రూరురాలూ అయిన అట్టి స్త్రీ ఇదిగో; ఈమెను ఏమి చేయదలచెదవో అది చేయుము. 9

మూ. శత్రుఘ్నశ్చ తదాజ్ఞాయ వచనం భృశదుఃఖితః,
అన్తఃపురచరాన్సర్వానిత్యువాచ ధృతవ్రతః. 10

ప్ర. అ. భృశదుఃఖితః = చాల దుఃఖించుచున్న, ధృతవ్రతః = ధరింపబడిన వ్రతము గల, శత్రుఘ్నశ్చ = శత్రుఘ్నుడు కూడ, తత్ = ఆ, వచనమ్ = వచనమును, ఆజ్ఞాయ = తెలిసికొని (విని), సర్వాన్ = సమస్తమైన, అన్తఃపురచరాన్ = అంతఃపురములో సంచరించేవారిని గూర్చి, ఇతి = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. మిక్కిలి దుఃఖించుచున్న, ఉత్తమనియమవంతుడైన శత్రుఘ్నుడు ఆ మాటలు విని, అంతఃపురములోనివా రందరితో ఇట్లు పలికెను. 10

మూ. తీవ్రముత్పాదితం దుఃఖం భ్రాతౄణాం మే తథా పితుః,
యయా సేయం నృశంసస్య కర్మణః ఫలమశ్నుతామ్. 11

ప్ర. అ. యయా = ఎవతెచేత, భ్రాతౄణామ్ = సోదరులమైన మాకు, మే = నాయొక్క, పితుః = తండ్రికిని, తీవ్రమ్ = తీవ్రమైన, దుఃఖమ్ = దుఃఖము, ఉత్పాదితమ్ = పుట్టించబడినదో, సా ఇయమ్ = అట్టి ఈమె, నృశంసస్య = క్రూరమైన, కర్మణః = కర్మకు, ఫలమ్ = ఫలమును, అశ్నుతామ్ = పొందుగాక.

తా. మా అన్నదమ్ములకూ నా తండ్రికి తీవ్ర మైన దుఃఖమును కలిగించిన ఈమె తాను చేసిన క్రూరకర్మకు ఫలము అనుభవించుగాక. 11

మూ. ఏవముక్త్వా తు తేనాశు సఖీజనసమావృతా,
గృహీతా బలవత్కుబ్జా సా తద్గృహమనాదయత్. 12

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, ఆశు = శీఘ్రముగా, తేన = ఆతనిచేత, బలవత్ = బలాత్కారముగా, గృహీతా = గ్రహింపబడిన, సఖీజన సమావృతా = సఖీజనముతో కూడిన, సా కుబ్జా = ఆ గూనుది, తత్ గృహమ్ = ఈ గృహమును, అనాదయత్ = ధ్వనింపచేసెను.

తా. ఆత డిట్లు పలికి వెంటనే ఆ మంథరను బలాత్కారముగా పట్టు కొనగా, సఖీజనముతో కూడిన ఆమె ఏడ్చుచు ఆ గృహమును ధ్వనింపచేసెను.

మూ, తతః సుభృశసంతప్త స్తస్యాః సర్వః సఖీజనః,
క్రుద్ధమాజ్ఞాయ శత్రుఘ్నం విపలాయత సర్వశః. 13

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తస్యాః = ఆమెయొక్క, సర్వః = సమస్త మైన, సఖీజనః = సఖీజనము, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని. క్రుద్ధమ్ = కోపగించిన వానినిగా, ఆజ్ఞాయ = తెలుసుకొని, సుభృశసంతప్తః = మిక్కిలి దుఃఖించుచు, సర్వశః = నలు వైపుల, విపలాయత = పారిపోయెను.

ప్ర. అ. అపు డామె సఖురాళ్లు అందరూ శత్రుఘ్నుడు కోపగించినా డని తెలుసుకొని, చాల దుఃఖించుచు నలుదిక్కులకూ పారిపోయిరి. 13

మూ. అమన్త్రయత కృత్స్నశ్చ తస్యాః సర్వః సఖీజనః.
యథాయం సముపక్రాన్తో నిఃశేషం నః కరిష్యతి. 14

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, సర్వః = సమస్త మైన, సఖీజనః = సఖీజనసముదాయము, అయమ్ = ఇతడు, యథా = ఎట్లు, సముపక్రాన్తః = ప్రారంభించినాడో, దానిని పట్టి, నః = మనలను, నిఃశేషమ్ = శేషము లేకుండగా, కరిష్యతి = చేయగలడు, అని, అమన్త్రయత = చెప్పుకొనెను.

తా. "ఇతని ఉపక్రమము చూడగా మనల నందరిని నిశ్శేషముగా చంపు నట్లు ఉన్నాడు" అని ఆమె సఖురాళ్లు అందరును అనుకొనిరి. 14

మూ. సానుక్రోశాం వదాన్యాం చ ధర్మజ్ఞాం చ యశస్వినీమ్,
కౌసల్యాం శరణం యామ సా హి నోఽస్తు ధ్రువా గతిః.

ప్ర. అ. సానుక్రోశామ్ = జాలి గలదీ, వదాన్యాం చ = ఉదారస్వభావురాలూ, ధర్మజ్ఞామ్ = ధర్మము నెరిగినదీ, యశస్వినీమ్ = కీర్తి గలదీ అయిన, కౌసల్యామ్ = కౌసల్యను, శరణం యామ = శరణు జొచ్చెదము. సా = ఆమె, నః = మనకు, ధ్రువా = నిశ్చిత మైన, గతిః = గతి, అస్తు = అగుగాక.

తా. జాలికలదీ, ఔదార్యవంతురాలూ, ధర్మజ్ఞురాలూ, కీర్తిమంతురాలూ అయిన కౌసల్యను శరణు వేడెదము. ఆమె తప్పక మనలను రక్షించును. 15

మూ. స చ రోషేణ తామ్రాక్షః శత్రుఘ్నః శత్రుతాపనః,
విచకర్ష తదా కుబ్జాం క్రోశన్తీం ధరణీతలే. 16

ప్ర. అ. రోషేణ = కోపముచేత, తామ్రాక్షః = ఎర్ర నైన నేత్రములుగల, శత్రుతాపనః = శత్రునాశకు డగు, సః శత్రుఘ్నః = ఆ శత్రుఘ్నుడు, తదా = అప్పుడు, క్రోశన్తీమ్ = అరచుచున్న, కుబ్జామ్ = గూనుదానిని, ధరణీతలే = నేల మీద, విచకర్ష = ఈడ్చెను.

తా. రోషముచేత కళ్లు ఎఱ్ఱబారిన, శత్రువినాశకు డగు ఆ శత్రుఘ్నుడు, అప్పుడు, అరచుచున్న ఆ గూనుదానిని నేలపై ఈడ్చెను. 16

మూ. తస్యా హ్యాకృష్యమాణాయా మన్థరాయా స్తత స్తతః,
చిత్రం బహువిధం భాణ్డం పృథివ్యాం తద్వ్యశీర్యత. 17

ప్ర. అ. తస్యాః = ఆ, మన్థరాయాః = మంథర, ఆకృష్యమాణాయాః = లాగబడుచుండగా, చిత్రమ్ = చిత్ర మైన, బహువిధమ్ = అనేకవిధము లైన, తత్ = ఆ, భాణ్డమ్ = అలంకారసముదాయము, తత స్తతః = అటు ఇటు, వ్యశీర్యత = రాలిపోయెను.

తా. శత్రుఘ్నుడా విధముగా మంథరను నేలపై ఈడ్చినపుడు ఆమె ధరించిన చిత్ర మైన, బహువిధ మైన అలంకారసముదాయము చెల్లాచెదురుగ పడిపోయెను. 17

మూ. తేన భాణ్డేన వి స్తీర్ణం శ్రీమద్రాజనివేశనమ్,
అశోభత తదా భూయః శారదం గగనం యథా. 18

ప్ర. అ. తేన = ఆ, భాణ్డేన = అలంకారసముదాయముచేత, వి స్తీర్ణమ్ = చల్లబడిన, రాజనివేశనమ్ = రాజగృహము, తదా = అప్పుడు, శారదమ్ = శరత్కాలసంబంధ మైన, గగనం యథా = ఆకాశము వలె, భూయః = అధిక ముగా, అశోభత = ప్రకాశించెను.

తా. అపుడు ఆ అలంకారము లన్నియు చెల్లాచెదరై పడుటచేత ఆ రాజ గృహము శరత్కాలమునందలి (నక్షత్రములతో నిండిన) ఆకాశము వలె మిక్కిలి ప్రకాశించెను. 18

మూ. స బలీ బలవత్ క్రోధాద్గృహీత్వా పురుషర్షభః,
కైకేయీమభినిర్భర్త్స్య బభాషే పరుషం వచః. 19

ప్ర. అ. బలీ = బలవంతు డైన, సః పురుషర్షభః = ఆ పురుషశ్రేష్ఠుడు, క్రోధాత్ = కోపమువలన, బలవత్ = బలాత్కారముగా, గృహీత్వా=పట్టుకొని, కైకేయీమ్ = కైకేయిని, అభినిర్భర్త్స్య = భయపెట్టి, పరుషమ్ = పరుష మైన, వచః = వాక్యమును, బభాషే = పలికెను.

తా. బలవంతు డైన ఆ పురుషశ్రేష్ఠుడు ఆమెను బలాత్కారముగ గ్రహించి, కైకేయిని భయపెట్టుచు పరుష మైన వాక్కులు పలికెను. 19

మూ. తైర్వాక్యైః పరుషైర్దుఃఖైః కైకేయీ భృశదుఃఖితా,
శత్రుఘ్నభయసంత్రస్తా పుత్రం శరణమాగతా. 20

ప్ర. అ. కైకేయీ = కైకేయి, పరుషైః = పరుషము లైన, దుఃఖైః = దుఃఖకరము లైన, తైః = ఆ, వాక్యైః = వాక్యములచేత, భృశదుఃఖితా = చాల దుఃఖితురాలై, శత్రుఘ్నభయసంత్రస్తా = శత్రుఘ్నునివలన కలుగు ఆపదనుండి భయపడిన దై, పుత్రమ్ = తన కుమారుని, శరణమ్ = శరణమును, ఆగతా = పొందెను.

తా. కైకేయి, పరుషములు, దుఃఖజనకములు అయిన అ మాటలకు చాల దుఃఖించుచు, శత్రుఘ్నునివలన ఏమి ఆపద సంభవించునో అని భయపడుచు, భరతుని శరణువేడెను. 20

మూ. తం ప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్నమిదమబ్రవీత్,
అవధ్యాః సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతామితి. 21

ప్ర. అ. భరతః = భరతుడు, క్రుద్ధమ్ = కోపగించిన, తమ్ = ఆ, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ప్రమదాః = స్త్రీలు. సర్వభూతానామ్ = సకలప్రాణులలోను, అవధ్యాః = చంపదగనివారు; క్షమ్యతామ్ = క్షమింపబడుగాక.

తా. భరతుడు కోపగించిన ఆ శత్రుఘ్నుని చూచి, ఆతనితో ఇట్లనెను. "ఏ ప్రాణులలో ఐనను స్త్రీలను చంపకూడదు. అందుచేత దీనిని క్షమింపుము".

మూ. హన్యామహమిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్,
యది మాం ధార్మికో రామో నాసూయేన్మాతృఘాతకమ్.

ప్ర. అ. ధార్మికః = ధార్మికుడైన, రామః = రాముడు, మాతృఘాతకమ్ = తల్లిని చంపినవానినిగా, మామ్ = నన్ను గూర్చి, న అసూయేద్యది = కోపగించక పోయినట్లయితే, దుష్టచారిణీమ్ = చెడ్డగా ప్రవర్తించుచున్న, పాపామ్ = పాపాత్మురాలైన, ఇమాం కైకేయీమ్ = ఈ కైకెయిని, అహమ్ = నేను, హన్యామ్ = చంపెడివాడను.

తా. ధర్మాత్ముడైన రాముడు మాతృహత్య చేసినందుకు నన్ను నిందింపకున్నచో నేను చెడ్డగా ప్రవర్తించిన, పాపాత్మురాలైన కైకేయిని చంపి ఉండెడివాడను. 22

మూ. ఇమామపి హతాం కుబ్జాం యది జనాతి రాఘవః,
త్వాం చ మాంచైవ ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాఘవః = రాముడు, ఇమామ్ = ఈ, కుబ్జామ్ అపి = గూనుదానిని కూడా, హతామ్ = చంపబడినదానినిగా, జానాతి యది = తెలిసికొన్నట్లయితే, ధ్రువమ్ = నిశ్చయముగా, త్వాం చ = నిన్ను, మాం చైవ = నన్ను కూడ, నాభిభాషిష్యతే = పలకరించడు.

తా. మనము ఈ కుబ్జను చంపినట్లు ధర్మాత్ముడైన రామునకు తెలిసినచో, ఆతడు నిన్ను నన్ను కూడ పలకరించడు. నిశ్చయము. 23

మూ. భరతస్య వచః శ్రుత్వా శత్రుఘ్నో లక్ష్మణానుజః,
న్యవర్తత తతో రోషాత్తాం ముమోచ చ మన్థరామ్. 24

ప్ర. అ. లక్ష్మణానుజః = లక్ష్మణుని తమ్ముడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, భరతస్య = భరతునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, తతః = పిమ్మట, రోషాత్ = రోషమునుండి, న్యవర్తత = మరలెను. తామ్ = ఆ, మన్థరామ్ = మంథరను, ముమోచ చ = విడచెనుకూడా.

తా. లక్ష్మణుని తమ్ముడైన శత్రుఘ్నుడు భరతుని మాటలు విని, కోపమును అణచుకొని ఆ మంథరను విడచెను. 24

మూ. సా పాదమూలే కైకేయ్యా మన్థరా నిపపాత హ,
నిఃశ్వసన్తీ సుదుఃఖార్తా కృపణం విలలాప చ. 25

ప్ర. అ. సా మన్థరా = ఆ మన్థర, కైకేయ్యాః = కైకేయియొక్క, పాదమూలే = పాదముల సమీపమున, నిపపాత హ = పడెను. సుదుఃఖార్తా = చాల దుఃఖముచే పీడితురాలై, నిఃశ్వసన్తీ = నిట్టూర్చుచు. కృపణమ్ = దీనముగా, విలలాప చ = విలపించెను.

తా. ఆ మంథర కైకేయి పాదముల చెంత పడి, చాల దుఃఖముచేత పీడితురాలై, నిట్టూర్చుచు విలపించెను. 25

మూ. శత్రుఘ్నవిక్షేపవిమూఢసంజ్ఞాం
సమీక్ష్య కుబ్జాం భరతస్య మాతా,
శనైః సమాశ్వాసయదార్తరూపాం
క్రౌఞ్చీం విలగ్నామివ వీక్షమాణామ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టసప్తతితమః సర్గః.

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, మాతా = తల్లి, శత్రుఘ్నవిక్షేపవిమూఢసంజ్ఞామ్ = శత్రుఘ్నునియొక్క(డు) విసిరివేయుటచేత మోహము చెందిన బుద్ధి కలదీ, ఆర్తరూపామ్ = దుఃఖించుచున్నదీ, విలగ్నామ్ = వలలో చిక్క

కొనిన, క్రౌఞ్చీమివ = ఆడ క్రౌంచపక్షి వలె, వీక్షమాణామ్ = నలు దిక్కుల చూచుచున్నదీ అయిన, కుబ్జామ్ = గూనుదానిని, సమీక్ష్య = చూచి, శనైః = మెల్లగా సమాశ్వాసయత్ = ఓదార్చెను.

తా. శత్రుఘ్నుడు దూరముగా విసిరివేయుటచే స్పృహ చెడి, దుఃఖించుచు వలలో తగుల్కొన్న క్రౌంచపక్షి వలె నలువైపుల చూచుచున్న ఆ కుబ్జను చూచి భరతుని తల్లి యైన కైకేయి మెల్లగా ఓదార్చెను. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో డెబ్బదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనాశీతితమః సర్గః

[మంత్రులు మున్నగువారు రాజ్యము స్వీకరింపుమని భరతుని కోరుట. భరతుడు అభిషేకసామగ్రికి ప్రదక్షిణముచేసి, రాముడే రాజ్యాధికారి యని పలికి, ఆయనను మరలించి తెచ్చుటకై తగు ప్రయత్నము చేయుడని యెల్లర నాదేశించుట].

మూ. తతః ప్రభాతసమయే దివసేఽథ చతుర్దశే,
సమేత్య రాజకర్తారో భరతం వాక్యమబ్రువన్. 1

ప్ర. అ. తతః = పిమ్మట, చతుర్దశే = పదునాల్గవ, దివసే = దివసమునందు, అథ = అనంతరము, ప్రభాతసమయే = ప్రాతఃకాలమునందు, రాజకర్తారః = రాజును చేయు అధికారము గల అమాత్యాదులు, సమేత్య = కలిసి, భరతమ్ = భరతునిగూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట, పదునాల్గవ దినమునందు, రాజును చేయు అధికారముగల అమాత్యాదులు, భరతుని వద్దకు వెళ్ళి ఇట్లు పలికిరి. 1

మూ. గతో దశరథః స్వర్గం యో నో గురుతరో గురుః,
రామం ప్రవ్రాజ్య వై జ్యేష్ఠం లక్ష్మణం చ మహాబలమ్. 2

ప్ర. అ. యః = ఎవ్వడు, నః = మనకు, గురుతరః = అందరికంటెను అధికముగా పూజ్యుడైన, గురుః = పూజ్యుడో, అట్టి, దశరథః = దశరథుడు, జ్యేష్ఠమ్ = పెద్దకుమారుడైన, రామమ్ = రాముని, మహాబలం చ = మహాబలశాలి యైన, లక్ష్మణం చ = లక్ష్మణునీ, ప్రవ్రాజ్య = ప్రవాసమునకు దూరముగా పంపివేసి, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళిపోయినాడు.

తా. మన అందరికీ అధికపూజ్యుడైన దశరథుడు, జ్యేష్ఠకుమారుడైన రాముని, మహాబలవంతుడైన లక్ష్మణునీ వనమునకు పంపివేసి, తాను స్వర్గస్థుడైనాడు. 2

మూ. త్వమద్య భవ నో రాజా రాజపుత్ర మహాయశః.
సంగత్యా నాపరాధ్నోతి రాజ్యమేతదనాయకమ్. 3

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర = రాజకుమారా! అద్య = ఇపుడు, త్వమ్ = నీవు, నః = మాకు, రాజా = రాజువుగా, భవ = అగుము. అనాయకమ్ = రాజు లేని, ఏతత్ = ఈ, రాజ్యమ్ = రాజ్యము, సంగత్యా = దైవవశముచేత, నాపరాధ్నోతి = పరస్పరపీడనాద్యపరాధములు చేయుటలేదు.

తా. మహాయశఃశాలి వైన ఓ రాజకుమారా! ఇపుడు నీవు మాకు రాజు వగుము. అరాజక మైన ఈ రాజ్యములోని ప్రజలు, దైవవశముచే పరస్పర పీడనము మొద లైన అపరాధములు చేయుటలేదు. నీవు ఆలసించినచో అట్టి ఉపద్రవములు కూడ ప్రారంభము కావచ్చును. 3

మూ. అభిషేచనికం సర్వమిదమాదాయ రాఘవ,
ప్రతీక్షతే త్వాం స్వజనః శ్రేణయశ్చ నృపాత్మజ. 4

ప్ర. అ. నృపాత్మజ = రాజకుమారా! రాఘవ = భరతుడా! స్వజనః = నీకు సంబంధించిన జనము, శ్రేణయశ్చ = శ్రేణులు (వర్తకులు, శిల్పులు మొద లైన వారి సంఘములు), సర్వమ్ = సమస్త మైన, ఇదమ్ = ఈ, అభిషేచనికమ్ = అభిషేకమునకు ఉపయుక్త మైన ద్రవ్యసముదాయమును, ఆదాయ = గ్రహించి, త్వామ్ = నిన్ను, ప్రతీక్షతే = నిరీక్షించుచున్నది.

తా. రాజకుమారుడ వైన భరతా! నీవారందరూ, శ్రేణులూ, అభిషేక సంభారములు సిద్ధము చేసికొని నీకొరకై వేచి ఉన్నారు. 4

మూ. రాజ్యం గృహాణ భరత పితృపైతామహం ధ్రువమ్,
అభిషేచయ చాత్మానం పాహి చాస్మాన్నరర్షభ. 5

ప్ర. అ. భరత = ఓ భరతా! పితృపైతామహమ్ = పితృపితామహక్రమమున వచ్చుచున్న, ధ్రువమ్ = స్థిర మైన, రాజ్యమ్ = రాజ్యమును, గృహాణ = గ్రహించుము. నరర్షభ = నరశ్రేష్ఠుడా! ఆత్మానమ్ = తనను, అభిషేచయ = అభిషిక్తుని చేసికొనుము. అస్మాన్ = మమ్ములను, పాహి చ = పాలించుము.

తా. నరశ్రేష్ఠుడ వైన భరతా! పితృపితామహక్రమమున వచ్చుచున్న, స్థిర మైన ఈ రాజ్యమును గ్రహించి, రాజ్యాభిషిక్తుడ వై, మమ్ము పాలింపుము. 5

మూ. అభిషేచనికం భాణ్డం కృత్వా సర్వం ప్రదక్షిణమ్,
భరత స్తం జనం సర్వం ప్రత్యువాచ ధృతవ్రతః. 6

ప్ర. అ. ధృతవ్రతః = ధరింపబడినవ్రతము గల, భరతః = భరతుడు, ఆభిషేచనికమ్ = అభిషేకమునకు సంబంధించిన, సర్వమ్ = సమస్త మైన, భాణ్డమ్ = వస్తుసముదాయమును, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, సర్వమ్ = సమస్త మైన, తం జనమ్ = ఆ జనమును గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. నియమమును అవలంబించిన భరతుడు, అభిషేకమునకు సంబంధించిన ఆ సమస్తవస్తుసముదాయమునకు ప్రదక్షిణనమస్కారములు చేసి, వారందరికి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 6

మూ. జ్యేష్ఠస్య రాజతా నిత్యముచితా హి కులస్య నః,
నైవం భవన్తో మాం వక్తుమర్హన్తి కుశలాః జనాః. 7

ప్ర. అ. నిత్యమ్ = ఎల్లప్పుడును, నః = మాయొక్క, కులస్య = కులము యొక్క, జ్యేష్ఠస్య = జ్యేష్ఠునకే, రాజతా = రాజత్వము, ఉచితా హి = తగినది కదా (అలవాటుగా ఉన్నది కదా)? కుశలాః = నేర్పు గల, జనాః = జను లైన, భవన్తః = మీరు, మామ్ = నన్ను గూర్చి, ఏవమ్ = ఇట్లు, వక్తుమ్ = చెప్పుటకు, న అర్హన్తి = తగరు.

తా. మా వంశములో, ఎల్లప్పుడూ, పెద్దకుమారుడే రాజగుట ఉచితముగా ఉన్న ఆచారము. అన్నియు తెలిసిన మీరు నాతో ఇట్లు పలుకుట యుక్తము కాదు.

మూ. రామః పూర్వో హి నో భ్రాతా భవిష్యతి మహీపతిః,
అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవ పఞ్చ చ. 8

ప్ర. అ. నః = మాయొక్క, పూర్వః = మొదటి, భ్రాతా = సోదరు డైన, రామః = రాముడు, మహీపతిః = రాజు, భవిష్యతి = కాగలడు. అహం తు =

నేనైతే, నవ పఞ్చ చ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, అరణ్యే = అరణ్యమునందు, వత్స్యామి = నివసించగలను.

తా. మా సోదరులలో పెద్దవాడైన రాముడు రాజు కాగలడు. నేను పదునాలుగు సంవత్సరాలు అరణ్యములో నివసించెదను. 8

మూ. యుజ్యతాం మహతీ సేనా చతురఙ్గమహాబలా,
ఆనయిష్యామ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవం వనాత్. 9

ప్ర. అ. చతురఙ్గమహాబలా = నాలుగు అంగముల గొప్ప బలములతో కూడిన, మహతీ = గొప్పదైన, సేనా = సేన, యుజ్యతామ్=కూర్చబడుగాక. అహమ్=నేను, జ్యేష్ఠమ్= పెద్ద, భ్రాతరమ్=సోదరుడైన, రాఘవమ్=రాముని, వనాత్ = వనమునుండి, ఆనయిష్యామి = తీసికొనివచ్చెదను.

తా. నాలుగు విధములైన బలములు గల మహాసైన్యమును సమకూర్చుడు. నేను నా జ్యేష్ఠసోదరుడైన రాముని అరణ్యమునుండి తీసికొని వచ్చెదను. 9

మూ. అభిషేచనికం చైవ సర్వమేతదుపస్కృతమ్,
పురస్కృత్య గమిష్యామి రామహేతోర్వనం ప్రతి. 10

ప్ర. అ. ఏతత్ = ఈ, ఉపస్కృతమ్ = సంస్కరింపబడిన, సర్వమ్= సమస్తమైన, అభిషేచనికమ్ = అభిషేకమునకు ఉపయుక్తమైన సంభారమును, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, రామహేతోః = రామునికొరకై, వనం ప్రతి = వనమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. సంస్కరించిన ఈ అభిషేకసంభారము లన్నీ ఎదుట ఉంచుకొని, రాముని తిరిగి తీసికొనివచ్చుటకు అడవికి వెళ్లెదను. 10

మూ. తత్రైవ తం నరవ్యాఘ్రమభిషిచ్య పురస్కృతమ్,
ఆనేష్యామి తు వై రామం హవ్యవాహమివాధ్వరాత్. 11

ప్ర. అ. నరవ్యాఘ్రమ్=నరశ్రేష్ఠుడైన, తమ్ = ఆతనిని, తత్రైవ = అక్కడనే, అభిషిచ్య = అభిషేకించి, పురస్కృతమ్ = ముందు ఉంచుకొనబడిన

రామమ్ = ఆ రాముని, అధ్వరాత్ = యజ్ఞమునుండి, హవ్యవాహమివ=అగ్నిని వలె, ఆనేష్యామి తు వై = తప్పక తీసికొని వచ్చెదను.

తా. పురుషశ్రేష్ఠుడైన రామునకు అక్కడనే రాజ్యాభిషేకము చేసి, ఆతనిని ముందు ఉంచుకొని, యజ్ఞమునుండి అగ్నిని తీసికొనివచ్చి నట్లు తీసికొని వచ్చెదను. 11

మూ. న సకామాం కరిష్యామి స్వామిమాం మాతృగన్ధినీమ్,
వనే వత్స్యామ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి. 12

ప్ర. అ. స్వామ్ = నాసంబంధమైన, మాతృగన్ధినీమ్ = తల్లి అనే గంధము గల, ఇమామ్ = ఈమెను, సకామామ్ = తీరిన కోరిక కలదానినిగా, న కరిష్యామి = చేయను. అహమ్ = నేను, దుర్గే = దుర్గమైన, వనే = వనమునందు, వత్స్యామి = నివసించెదను. రామః = రాముడు, రాజా = రాజుగా, భవిష్యతి = కాగలడు.

తా. నా తల్లి అను పేరు పెట్టుకొనిన ఈమె కోరిక తీరునట్లు చేయను. నేనే దుర్గమైన అరణ్యములో నివసించెదను. రాముడు రాజు కాగలడు. 12

మూ. క్రియతాం శిల్పిభిః పన్థాః సమాని విషమాణి చ,
రక్షిణశ్చానుసంయాన్తు పథి దుర్గవిచారకాః. 13

ప్ర. అ. శిల్పిభిః = శిల్పులచేత, పన్థాః=మార్గము, క్రియతామ్ = చేయబడుగాక. విషమాణి=ఎత్తుపల్లము లున్న ప్రదేశములు, సమాని=సమములుగా చేయబడుగాక. దుర్గవిచారకాః = దుర్గమమైన ప్రదేశములో సంచరించు, రక్షిణశ్చ = రక్షకులు కూడ, పథి = మార్గమునందు, అనుసంయాన్తు = అనుసరించి వచ్చెదరు గాక.

తా. శిల్పులు, ఎత్తుపల్లము లున్న ప్రదేశములు సమములుగా ఉండునట్లు చేసి మార్గమును ఏర్పరచవలెను. ప్రవేశించ శక్యము కాని ప్రదేశములలో సంచరించకలుగు రక్షకులు మార్గమునందు మన వెంటనే రావలెను. 13

మూ. ఏవం సంభాషమాణం తం రామహేతోర్మహాత్మజమ్,
ప్రత్యువాచ జనః సర్వః శ్రీమద్వాక్యమనుత్తమమ్. 14

ప్ర. అ. రామహేతోః = రాముని నిమిత్తమై, ఏవమ్ = ఇట్లు, సంభాష మాణమ్ = మాటలాడుచున్న, తం నృపాత్మజమ్ = ఆ రాజకుమారుని గూర్చి, సర్వేః = సమస్త మైన, జనః = ఆ జనము, శ్రీమత్ = శోభాయుక్తమూ, అనుత్త మమ్ = శ్రేష్ఠమూ అయిన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రాముని విషయమునందు ఈ విధముగా మాటలాడు చున్న ఆ భరతునితో ఆ జనులందరూ, శోభాయుక్తమూ, చాల ఉత్తమమూ అయిన మాట పలికిరి. 14

మూ. ఏవం తే భాషమాణస్య పద్మా శ్రీరుపతిష్ఠతాత్,
యస్త్వం జ్యేష్ఠే నృపసుతే పృథివీం దాతుమిచ్ఛసి. 15

ప్ర. అ. యః త్వమ్ = ఏ నీవు, జ్యేష్ఠే = జ్యేష్ఠు డైన, నృపసుతే = రాజ కుమారునియందు, పృథివీమ్ = భూమిని (రాజ్యమును), దాతుమ్ = ఇచ్చుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, ఏవమ్ = ఈ విధముగా, భాషమాణస్య = మాటలాడు చున్న, తే = నీకు, (నిన్ను), శ్రీః = శోభాయుక్తురా లైన, పద్మా = లక్ష్మి, ఉపతిష్ఠతామ్ = సమీపించుగాక.

తా. పెద్దవా డైన రాజకుమారునికి రాజ్యమును ఇవ్వవలె నని అభిల షించుచు ఈ విధముగా మాటలాడుచున్న నిన్ను శోభాయుక్తురా లైన లక్ష్మి ఆశ్రయించుగాక. 15

మూ. అనుత్తమం తద్వచనం నృపాత్మజ
ప్రభాషితం సంశ్రవణే నిశమ్య చ,
ప్రహర్షజాస్తం ప్రతి బాష్పబిన్దవో
నిపేతురార్యాననన్త్రేసంభవాః. 16

ప్ర. అ. సంశ్రవణే = తమ చెవులదగ్గరనే (స్పష్టముగా వినబడు నట్లు) నృపాత్మజప్రభాషితమ్ = రాజకుమారునిచేత పలకబడిన, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైన, తత్ = ఆ, వచనమ్ = వచనమును, నిశమ్య చ = విని, తం ప్రతి = ఆతనిని గూర్చి, ప్రహర్షజాః = సంతోషమువలన కలిగిన, ఆర్యాననన్త్రేసంభవాః = పూజ్యు లైన వారి ముఖములనుండి నేత్రములనుండి పుట్టిన, బాష్పబిన్దవః = కన్నీటి బిందువులు, నిపేతుః = పడినవి.

తా. తమ చెవులు ప్రత్యక్షముగా విను నట్లు ఆ రాజకుమారుడు పలికిన మాటలు విన్న పిదప ఆతని విషయమున కలిగిన ఆనందముచేత, ఆ పూజ్యులైన జనుల నేత్రములనుండి కన్నీటి బిందువులు కారినవి. 16.

మూ. ఊచుస్తే వచనమిదం నిశమ్య హృష్టాః
సామాత్యాః సపరిషదో వియాతశోకాః,
పన్థానం నరవర భక్తిమాన్ జనశ్చ
వ్యాదిష్టస్తవ వచనాచ్చ శిల్పివర్గః. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనాశీతితమః సర్గః.

ప్ర. అ. ఇదమ్ = ఈ, వచనమ్ = వాక్యమును, నిశమ్య=విని, హృష్టాః = సంతోషించినవారై, సామాత్యాః = అమాత్యులతో కూడిన, సపరిషదః = పరిషత్తుతో కూడిన, తే=వారు, వియాతశోకాః = తొలగిన శోకము కలవారై, ఇదం వచనమ్ = ఈ వచనమును, ఊచుః = పలికిరి. నరవర = ఓ నరశ్రేష్ఠా ! భక్తిమాన్ = భక్తి గల, జనశ్చ = జనమును, శిల్పివర్గః = శిల్పుల సముదాయము, తవ = నీయొక్క, వచనాత్ = వచనమువలన, పన్థానమ్ = మార్గమును గూర్చి, ఆదిష్టః = ఆదేశింపబడినారు.

తా. అమాత్యులు, పరిషత్తు కలిసిన ఆ జను లందరు ఆతని మాటలు విని సంతోషించి 'ఓ నరశ్రేష్ఠా ! నీ ఆజ్ఞ ప్రకారము, భక్తిమంతులైన జనులను, శిల్పిసముదాయమును, మార్గనిర్మాణముచేయు డని ఆదేశించినాము' అని పలికిరి.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో డెబ్బదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ అశీతితమః సర్గః

[అయోధ్యనుండి గంగాతీరము వరకు శిల్పులు సుందర శిబిరములు బావులతో కూడి సుఖకరమగు రాజమార్గము నిర్మించుట]

మూ. అథ భూమిప్రదేశజ్ఞాః సూత్రకర్మవిశారదాః,
స్వకర్మాభిరతాః శూరాః ఖనకా యన్త్రికా స్తథా. 1

కర్మాన్తికాః స్థపతయః పురుషా యన్త్రకోవిదాః,
తథా వార్ధకయశ్చైవ మార్గిణో వృక్షతక్షకాః. 2

కూపకారాః సుధాకారాః వంశకర్మకృత స్తథా,
సమర్థా యే చ ద్రష్టారః పురత స్తే ప్రతస్థిరే. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, భూమిప్రదేశజ్ఞాః = భూమిపై ఉన్న ఆ యా ప్రదేశములు తెలిసినవారు, సూత్రకర్మవిశారదాః = సూత్రము పట్టి కొలుచుటయందు నేర్పు కలవారు, స్వకర్మాభిరతాః = తమ తమ పనులయందు ఆసక్తి గల, శూరాః = కార్యశూరులు, ఖనకాః = త్రవ్వేవారు, తథా = మరియు, యన్త్రకాః = యంత్రముల నుపయోగించేవారు, కర్మాన్తికాః = కూలివాళ్లు, స్థపతయః = పెద్ద శిల్పులు, యన్త్రకోవిదాః = యంత్రములందు నేర్పుగల, పురుషాః = పురుషులు, తథా = మరియు, వార్ధకయః = వడ్రంగులు, మార్గిణః = మార్గములు వేయువారు, వృక్షతక్షకాః = వృక్షములు ఛేదించువారు, కూపకారాః = కూపములు త్రవ్వువారు, సుధాకారాః = సున్నము వేయు వారు, తథా = మరియు, వంశకర్మకృతః = వెదురుకఱ్ఱలతో పని చేయువారు, సమర్థాః = సమర్థులైన, యే = ఏ, ద్రష్టారః = పర్యవేక్షకులు గలరో, తే = వారు, పురతః = ముందు, ప్రతస్థిరే = ప్రయాణమైరి.

తా. పిమ్మట, ఆ యా ప్రదేశముల స్వరూపస్వభావములు తెలిసినవారు, సూత్రములు పట్టి కొలతలు వేయువారు, తమ తమ పనులందు శ్రద్ధ గల కార్య

శూరులు, నేల త్రవ్వువారు, యంత్రము ఉపయోగించువారు, కూలివాళ్లు, పెద్ద శిల్పులు, యంత్రముల ప్రయోగముల నెరిగిన పురుషులు, వడ్రంగులు, బాట వేయువారు, వృక్షములు ఛేదించువారు, నూతులు త్రవ్వువారు, సున్నము వేయువారు, వెదురు పని చేయువారు, సమర్థులైన పర్యవేక్షకులు వీరందరూ ముందు బయలుదేరిరి. 1-3

మూ. స తు హర్షాత్తముద్దేశం జనౌఘో విపులః ప్రయాన్,
అశోభత మహావేగః సముద్ర ఇవ పర్వణి. 4

ప్ర. అ. హర్షాత్ = సంతోషమువలన, తమ్ ఉద్దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, ప్రయాన్ = వెళ్లుచున్న, సః = ఆ, విపులః = అధికమైన, జనౌఘః = జనసముదాయము, పర్వణి = పర్వమునందు, మహావేగః = గొప్ప వేగము గల, సముద్రః ఇవ = సముద్రము వలె, అశోభత = ప్రకాశించెను.

తా. సంతోషముతో ఆ ప్రదేశమునందు నడచుచున్న ఆ జనసమూహము పర్వదివసమునందు గొప్ప వేగముతో పొంగిన సముద్రము వలె ఉండెను. 4

మూ. తే స్వవారం సమాస్థాయ వర్త్మకర్మణి కోవిదాః,
కరణైర్వివిధోపేతైః పురస్తాత్సంప్రతస్థిరే. 5

ప్ర. అ. వర్త్మకర్మణి = మార్గము వేయుటయందు, కోవిదాః = నేర్పరులైన, తే = వారు, వివిధోపేతైః = అనేకవిధములతో కూడిన, కరణైః = సాధనములతో, స్వవారమ్ = తమ సంఘమును, సమాస్థాయ = పొంది, పురస్తాత్ = ముందు, సంప్రతస్థిరే = ప్రయాణమైరి.

తా. బాటలు వేయుటలో నేర్పు కలవారందరు అనేకవిధములైన సాధనములు ధరించి, ఒక గుంపుగా ముందు బయలుదేరిరి. 5

మూ. లతావలీశ్చ గుల్మాంశ్చ స్థాణూనశ్మన ఏవ చ,
జనయాంచక్రిరే మార్గం ఛిన్దన్తో వివిధాన్ ద్రుమాన్. 6

ప్ర. అ. లతావలీః చ = లతాసముదాయములను, గుల్మాంశ్చ = పొదలను, స్థాణూన్ = పెద్ద శిలలను, అశ్మన ఏవ చ = రాళ్ళను, వివిధాన్ = అనేక

విధము లైన, ద్రుమాన్=వృక్షములను, ఛిన్దన్తః=ఛేదించుచున్నవారై, మార్గమ్= మార్గమును, జనయాంచక్రిరే = ఏర్పరచిరి.

తా. తీగలు, పొదలు, పెద్ద శిలలు, చిన్న ఝాప్లు, అనేకవిధము లైన చెట్లు ఛేదించి, వారు మార్గము ఏర్పరచిరి. 6

మూ. అవృక్షేషు చ దేశేషు కేచిద్వృక్షానరోపయన్,
కేచిత్కుఠారైష్టఙ్కైశ్చ దాత్రైశ్ఛిన్దన్ క్వచిత్క్వచిత్.

ప్ర. అ. కేచిత్ = కొందరు, అవృక్షేషు = వృక్షములు లేని, దేశేషు = ప్రదేశములయందు, వృక్షాన్ = వృక్షములను, అరోపయన్ = నాటిరి. కేచిత్ = కొందరు, క్వచిత్ క్వచిత్ = కొన్ని కొన్ని చోట్ల, కుఠారైః = గొడ్డళ్ళతోను, టఙ్కైశ్చ=టంకములతోను, దాత్రైః చ=అంపములచేతను, ఛిన్దన్=ఛేదించిరి.

తా. కొందరు చెట్లు లేని ప్రదేశములందు చెట్లు నాటిరి. కొందరు ఆ యా ప్రదేశములందు, గొడ్డళ్ళతోను, ఉలులతోను, రంపములతోను ఛేదించిరి. 7

మూ. అపరే వీరణస్తమ్బాన్ బలినో బలవత్తరాః,
విధమన్తి స్మ దుర్గాణి స్థలాని చ తతస్తతః. 8

ప్ర. అ. బలవత్తరాః = ఎక్కువ బలము గల, అపరే = మరి కొందరు, బలినః = దృఢముగా ఉన్న, వీరణస్తమ్బాన్ = వీరణము స్తంబము అను తృణములను, విధమన్తి స్మ = తొలగించిరి. తతస్తతః = అక్కడక్కడ, దుర్గాణి= దుర్గప్రదేశములను, స్థలాని = చదును నేలలనుగా చేసిరి.

తా. అధికబలవంతు లైన కొందరు దృఢముగా ఉన్న వీరణములు, స్తంబములు అను తృణములను పెరికివేసిరి. అక్కడక్కడ ఉన్న నడచుటకు శక్యము కాని ప్రదేశములను చదును చేసిరి. 8

మూ. అపరేఽపూరయన్ కూపాన్ పాంసుభిః శ్వభ్రమాయతమ్,
నిమ్నభాగాంస్తతః కేచిత్సమాంశ్చక్రుః సమన్తతః 9

ప్ర. అ. అపరే = మరికొందరు, కూపాన్=కూపములను, ఆయతమ్ = పొడ వైన, శ్వభ్రమ్=గోయిని, పాంసుభిః = పరాగములతో, అపూరయన్ =

నింపిరి. తతః = పిమ్మట, కేచిత్ = కొందరు, నిమ్నభాగాన్ = పల్లములను, సమస్తతః = అంతటను, సమాన్ = సమములనుగా, చక్రుః = చేసిరి.

తా. కొందరు నూతులను, హెడ పైన గోతులను బూడిదతో కప్పివేసిరి. మరి కొందరు పల్లములను సమము చేసిరి. 9

మూ. బబన్ధుర్బన్ధనీయాంశ్చ క్షోద్యాన్ సంచుక్షుదుస్తదా.
బిభిదుర్భేదనీయాంశ్చ తాంస్తాన్దేశాన్నరా స్తదా. 10

ప్ర. అ. తదా = అప్పుడు, నరాః = కొందరు మనుష్యులు, బన్ధనీయాన్ బంధింప దగిన, తాంస్తాన్ = ఆ యా, దేశాన్ = ప్రదేశములను, బబన్ధుః = బంధించిరి. క్షోద్యాన్ = నలగకొట్టదగిన వాటిని, సంచుక్షుదుః = నలగకొట్టిరి. భేదనీయాన్ చ = బద్దలుకొట్టదగినవాటిని, బిభిదుః = బద్దలుకొట్టిరి.

తా. అప్పుడు కొందరు మనుష్యులు కట్టదగిన ప్రదేశములను కట్టిరి. చూర్ణముచేయదగిన వాటిని చూర్ణముచేసిరి, బ్రదద్దలుకొట్టదగినవాటిని బ్రద్దలు కొట్టిరి. 10

మూ. అచిరేణైవ కాలేన పరివాహాన్ బహూదకాన్,
చక్రుర్బహువిధాకారాన్ సాగరప్రతిమాన్ బహూన్. 11

ప్ర. అ. అచిరేణ కాలేనైవ = కొద్ది సమయములోనే, బహూదకాన్ = అధిక మైన ఉదకము గల, బహువిధాకారాన్ = అనేకవిధము లైన ఆకారము గల, సాగరప్రతిమాన్ = సాగరముతో సమాన మైన, బహూన్ = అనేక మైన, పరివాహాన్ = కాలవలను, చక్రుః = నిర్మించిరి.

తా. కొద్ది సమయములోనే, అధిక మైన ఉదకము కలవీ, అనేకవిధము లైన ఆకారములు కలవీ, సముద్రమువంటి ఆకారము కలవీ అయిన, అనేక మైన కాలవలను నిర్మించిరి. 11

మూ. నిర్జలేషు చ దేశేషు ఖానయామాసురుత్తమాన్,
ఉదపానాన్ బహువిధాన్ వేదికాపరిమణ్డితాన్. 12

ప్ర. అ. నిర్జలేషు = జలము లేని, దేశేషు = ప్రదేశములందు, ఉత్తమాన్ = ఉత్తమము లైన, బహువిధాన్ = అనేకవిధములైన, వేదికాపరిమణ్డితాన్ =

వేదికలచేత అలంకరించబడిన, ఉదపానాన్ = నూతులను, ఖానయామాసుః = త్రవ్వించిరి.

తా. నీరు లభించని ప్రదేశములలో, చుట్టును వేదికలు (పళ్ళెములు) కట్టిన, అనేకవిధములైన, శ్రేష్ఠ మైన నూతులు త్రవ్వించిరి.

మూ. స సుధాకుట్టిమతలః ప్రపుష్పితమహీరుహః,
మత్తోద్ఘుష్టద్విజగణః పతాకాభిరలఙ్కృతః. 13

చన్దనోదకసంసిక్తో నానాకుసుమభూషితః,
బహ్వశోభత సేనాయాః పన్థాః సురపథోపమః. 14

ప్ర. అ. సుధాకుట్టిమతలః=సున్న (సిమెంటు) ముతో కట్టిన చదు నైన ప్రదేశములు కలదీ, ప్రపుష్పితమహీరుహః=పుష్పించిన వృక్షములు కలదీ, మత్తోద్ఘుష్టద్విజగణః = మదించిన ధ్వనిచేయుచున్న పక్షిసముదాయము కలదీ, పతాకాభిః = చిన్న జండాలచే, అలఙ్కృతః=అలంకరించబడినదీ, చందనోదక సంసిక్తః = మంచిగంధము నీటిచే తడపబడినదీ, నానాకుసుమభూషితః = అనేకవిధము లైన పుష్పములచే అలంకరించబడినదీ అయిన, సేనాయాః= సేన యొక్క, సురపథోపమః = దేవతల మార్గముతో సమాన మైన, సః పన్థాః = ఆ మార్గము, బహు = అధికముగా, అశోభత = ప్రకాశించెను.

తా. సేన నడచు ఆ మార్గమునందు సున్నము (ఒక విధమైన సిమ్మెంటు) వేసి చదునుచేసిరి. ప్రక్కల నున్న వృక్షము లన్నీ పుష్పించినవి. పక్షులు మదించి కూయుచుండెను. మార్గమునం దంతటను పతాకలు కట్టి అలంకరించిరి. చందనోదకముతో తడిపిరి. అనేకపుష్పములు రాలి ఉన్నవి. ఈ విధముగా దేవతలు నడచు మార్గము వలె ఉన్న ఆ సేనామార్గము చాలా ప్రకాశించెను.

మూ. ఆజ్ఞప్త్యాథ యథాజ్ఞప్తి యుక్తాస్తేఽధికృతా నరాః,
రమణీయేషు దేశేషు బహుస్వాదుఫలేషు చ. 15

యో నివేశస్త్వభిప్రేతో భరతస్య మహాత్మనః,
భూయస్తం శోభయామాసుర్భూషాభిర్భూషణోపమమ్. 16

ప్ర. అ. అధికృతాః = నియమితు లైన, తే నరాః = ఆ అధికారులు, యథాజ్ఞప్తి = భరతుని ఆజ్ఞానుసారముగా, యుక్తాః = పనులు చేయుటకు పూను కొన్నవారై, ఆజ్ఞప్య = తమ క్రింద నున్న కర్మచారులను ఆజ్ఞాపించి, అథ = అటుపిమ్మట, బహుస్వాదుఫలేషు = అధిక మైన మధురఫలములు గల, రమణీ యేషు = సుందరము లైన, దేశేషు = దేశములందు, మహాత్మనః = మహాత్ము డైన, భరతస్య = భరతునికి, యః = ఏ, నివేశః = నివాసగృహము, అభిప్రేతః = ఉద్దిష్ట మైనదో, తమ్ = దానిని, భూషాభిః = అలంకారములచేత, భూషణో పమమ్ = అలంకారముతో సమానముగా ఉండునట్లుగా, భూయః = అధికముగా, శోభయామాసుః = ప్రకాశించునట్లు చేసిరి.

తా. ఆ యా పనులందు అధికారము గల అధికారులు భరతుని ఆజ్ఞ ప్రకారము తమ క్రింద పనిచేయువారి నందరిని ఆ యా పనులు చేయుటకై ఆజ్ఞా పించి మధుర మైన ఫలములు అధికముగా లభించు ప్రదేశములందు, మహాత్ము డైన భరతుడు నివసించుటకై ఉద్దేశించిన గృహమును, ఇతరగృహము లన్నింటి కిని అలంకారము వలె ఉండునట్లు అధికముగా ప్రకాశించునట్లుగా చేసిరి. 15,16

మూ. నక్షత్రేషు ప్రశస్తేషు ముహూర్తేషు చ తద్విదః,
నివేశాన్ స్థాపయామాసుర్భరతస్య మహాత్మనః. 17

ప్ర. అ. తద్విదః = నక్షత్రముహూర్తాదులు తెలిసినవారు, ప్రశస్తేషు = ప్రశస్త ము లైన, నక్షత్రేషు = నక్షత్రములందును, ముహూర్తేషు = ముహూర్త ము లందును, మహాత్మనః = మహాత్ము డైన, భరతస్య = భరతుని యొక్క, నివే శాన్ = శిబిరములను, స్థాపయామాసుః = స్థాపించిరి.

తా. జ్యోతిశ్శాస్త్రవేత్తలు, ప్రశస్తము లైన నక్షత్రములయందు, ముహూర్తములందు మహాత్ము డైన భరతుని సైన్యము కొరకు శిబిరములు స్థాపించిరి. 17

మూ. బహుపాంసుచయాశ్చాపి పరిఖాపరివారితాః,
తత్రేన్ద్రకీలప్రతిమాః ప్రతోళీవరశోభితాః, 18
ప్రాసాదమాలా వితతాః సౌధప్రాకారసంవృతాః,
పతాకాశోభితాః సర్వే సునిర్మితమహాపథాః. 19

విసర్పద్భిరివాకాశే విటంకాగ్రవిమానకైః,
సముచ్ఛ్రితైర్నివేశాస్తే బభుః శక్రపురోపమాః. 20

ప్ర. అ. తత్ర=అక్కడ, బహుపాంసుచయాశ్చాపి=అధిక మైన ఇసుక ప్రోవులు కలవీ, పరిఖాపరివారితాః = పరిఖలచేత చుట్టబడినవీ, ఇన్ద్రకీల ప్రతిమాః = ఇంద్రకీలపర్వతముతో సమాన మైనవీ, ప్రతోళీవరశోభితాః = శ్రేష్ఠ మైన వీథులతో ప్రకాశించునవీ, ప్రాసాదమాలావితతాః=ప్రాసాదముల పంక్తులచే వ్యాప్త మైనవీ, సౌధప్రాకారసంవృతాః = సున్నముతో కట్టిన ప్రాకారములచే చుట్టబడినవీ, పతాకాశోభితాః = పతాకలచే అలంకరింపబడినవీ, సునిర్మిత మహాపథాః = చక్కగా నిర్మింపబడిన విశాల మైన మార్గములు కలవీ అయిన, తే = ఆ, నివేశాః = గృహములు, ఆకాశే = ఆకాశమునందు, విసర్పద్భిరివ = ఎగురుచున్నవివలె ఉన్న, సముచ్ఛ్రితైః = ఎత్తైన, విటఙ్కాగ్రవిమానకైః = శిఖరములు అగ్రమునందు గల ఉత్తమగృహములతో, శక్రపురోపమాః=ఇంద్ర నగరితో సమానములై, బభుః=ప్రకాశించినవి.

తా. ఆ శిబిరముల దగ్గర ఇసుకకుప్పలు, చుట్టును పరిఖలు ఉండెను. ఇంద్రకీలపర్వతము వలె ఎత్తుగా ఉన్న వాటి దగ్గర ప్రాసాదములు (దేవతా గృహములు) చుట్టూ ప్రాకారములు, అంద మైన చిన్న మార్గములు, విశాలము లైన మార్గములు నిర్మితము లై ఉండెను. అక్కడ నిర్మించిన ఉత్తమగృహ ములు ఎత్తుగా ఉన్న తమ శిఖరములతో ఆకాశములోనికి ఎగిరిపోవుచున్న ట్లుండెను. అంతటను అలంకారార్థ మై కట్టిన పతాకలు ఎగురు చుండెను. ఈ విధముగా ఆ శిబిరము లేర్పరచిన ప్రాంతములు దేవేంద్రనగరము వలె ఉండెను. 18-20

మూ. జాహ్నవీం తు సమాసాద్య వివిధద్రుమకాననామ్,
శీతలామలపానీయాం మహామీనసమాకులామ్. 21

ప్ర. అ. వివిధద్రుమకాననామ్ = అనేకవిధము లైన వృక్షములు అడ వులు గలదీ, శీతలామలపానీయామ్ = చల్లని స్వచ్ఛ మైన ఉదకము కలదీ, మహామీనసమాకులామ్ = గొప్ప మీనములతో వ్యాకుల మైనదీ అయిన, జాహ్న వీమ్ = గంగానదిని, సమాసాద్య=చేరి, ఆ శిబిరములు ప్రకాశించినవి.

తా. ఇరుప్రక్కల అనేక వృక్షములతో నిండిన అరణ్యములు, చల్లని నిర్మల మైన ఉదకము, అనేకము లైన మహామీనములు గల గంగానది వరకును ఆ శిబిరములు వ్యాపించి ఉండెను. 21

మూ. స చన్ద్రతారాగణమణ్డితం యథా
నభః క్షపాయామమలం విరాజతే,
నరేన్ద్రమార్గః స తథా వ్యరాజత
క్రమేణ రమ్యః శుభశిల్పినిర్మితః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అశీతితమః సర్గః.

ప్ర. అ. సచన్ద్రతారాగణమణ్డితమ్ = చంద్రునితో కూడిన నక్షత్రముల సముదాయముచేత అలంకరించబడిన, అమలమ్ = నిర్మల మైన, నభః = ఆకాశము, క్షపాయామ్ = రాత్రియందు, యథా = ఎట్లు, విరాజతే = ప్రకాశించునో, క్రమేణ = క్రమముగా, శుభశిల్పినిర్మితః = ఉత్తము లైన శిల్పులచేత నిర్మింపబడిన, రమ్యః = అంద మైన, సః = ఆ, నరేన్ద్రమార్గః = రాజమార్గము, తథా = ఆ విధముగా, వ్యరాజత = ప్రకాశించెను.

తా. ఉత్తము లైన శిల్పులు క్రమముగా నిర్మించిన ఆ రమ్య మైన రాజమార్గము చంద్రనక్షత్రగణములతో నిర్మల మైన ఆకాశము రాత్రియందు ప్రకాశించి నట్లు ప్రకాశించెను.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
అయోధ్యాకాండలో ఎనుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకాశీతితమః సర్గః

[ప్రాతఃకాలమున మంగళవాద్యఘోషము విని భరతుడు దుఃఖితు డగుట. ఆ వాద్యఘోషమును నిలిపివేయ నాజ్ఞాపించి విల పించుట. వసిష్ఠుడు సభకువచ్చి మంత్రులు మున్నగువారిని పిలువ దూత నంపుట.]

మూ. తతో నాన్దీముఖీం రాత్రిం భరతం సూతమాగధాః,
తుష్టువుర్వాగ్విశేషజ్ఞాః స్తవైర్మఙ్గలసంహితైః. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వాగ్విశేషజ్ఞాః = మాటలలోని విశేష ములు ఎరిగిన, సూతమాగధాః = సూతమాగధులు, నాన్దీముఖీమ్ = ఆనందకర మైన ప్రారంభము గల. రాత్రిమ్=రాత్రిని, (రాత్రియందు), మఙ్గలసంహితైః= మంగళములతో కూడిన. స్తవైః = స్తోత్రములతో. భరతమ్ = భరతుని, తుష్టువుః = స్తుతించిరి.

తా. పిమ్మట మాటలలో నేర్పరు లైన సూత మాగధులు, ఆనందకర మైన ప్రారంభము గల రాత్రియందు (రాత్రి చివరి భాగమున) మంగళవాద్యాదు లతో కూడిన స్తోత్రములతో భరతుని స్తుతించిరి.

వి. 'నాన్దీముఖీమ్' అనే పదమునకు పై అర్థము వ్యాఖ్యాకారులు చెప్పి నది. కాని దీనికి పితృకార్యములకు సంబంధించిన ఏదో కర్మవిశేషము చేయ వలసిన రాత్రి (పండ్రెండవ దినము వంటిది) అని అర్థ ముండునేమో అని నా అభిప్రాయము. పరిశీలింపవలసి ఉన్నది. ఇప్పుడు కూడా ఉపయననాదుల ప్రారంభమునందు నాందీముఖశ్రాద్ధము చేయుచుందురు. బహుశా ప్రేతకర్మాంత మున అట్టి శ్రాద్ధము కర్తవ్య మై ఉండును.

మూ. సువర్ణకోణాభిహతః ప్రాణదద్యామదున్దుభిః,
దధ్ముః శఙ్ఖాంశ్చ శతశో నాదాంశ్చోచ్చావచస్వరాన్. 2

ప్ర. అ. సువర్ణకోణాభిహతః = బంగారు దండముచేత కొట్టబడిన, యామదున్దుభిః = జాములను సూచించుటకై మ్రోగించు దుందుభి, ప్రాణదత్ = ధ్వనిచేసెను. శఙ్ఖాంశ్చ = శంఖములను, ఉచ్చావచస్వరాన్ = అనేకవిధములైన స్వరములు గల, నాదాంశ్చ = వాద్యములను, శతశః = వందలకొలది, దధ్మః = పూరించిరి.

తా. బంగారు దండములో కొట్టి యామదుందుభి మ్రోగించిరి. వందలకొలది శంఖములను పూరించిరి, వివిధస్వరములు గల వాద్యములు వాయించిరి.

మూ. స తూర్యఘోషః సుమహాన్ దివమాపూరయన్నివ,
భరతం శోకసంతప్తం భూయః శోకై రరన్ధయత్. 2

ప్ర. అ. సుమహాన్ = చాలా గొప్ప దైన, సః = ఆ. తుర్యఘోషః = తూర్యముల ధ్వని, దివమ్ = ఆకాశమును, ఆపూరయన్నివ = నింపుచున్నది వలె, శోకసంతప్తమ్ = శోకముచేత తపింపచేయబడిన, భరతమ్ = భరతుని, భూయః = మరల, శోకైః = శోకములచేత, అరన్ధయత్ = పీడించెను.

తా. ఆకాశము నంతను నింపుచున్న ట్లున్న ఆ గొప్ప తూర్యధ్వని శోకముతో బాధపడుచున్న భరతుని, ఇంకను అధిక మైన శోకముచే పీడించెను. 3

మూ. తతః ప్రబుద్ధో భరత స్తం ఘోషం సన్నివర్త్య చ,
నాహం రాజేతి చాప్యుక్త్వా శత్రుఘ్నమిదమబ్రవీత్. 4

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రబుద్ధః = మేల్కొనిన, భరతః = భరతుడు, అహమ్ = నేను, రాజా = రాజును, న = కాను, ఇతి = అని, ఉక్త్వా = పలికి, తమ్ = ఆ, ఘోషమ్ = ధ్వనిని, సంనివర్త్య చ = నిలిపివేసి, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు భరతుడు మేల్కొని, "నేను రాజును కాను" అని చెప్పుచు ఆ తూర్యధ్వనిని నిలిపివేసి, శత్రుఘ్నునితో ఇట్లు పలికెను. 4

మూ. పశ్య శత్రుఘ్న కైకేయ్యా లోకస్యాపకృతం మహత్,
విసృజ్య మయి దుఃఖాని రాజా దశరథో గతః. 5

ప్ర. అ. శత్రుఘ్న = ఓ శత్రుఘ్నా ! పశ్య = చూడుము, కైకేయ్యా = కైకేయిచేత, లోకస్య = లోకమునకు, మహత్ = అత్యధికముగా, అపకృతమ్ = అపకారము చేయబడినది. రాజా = రాజైన, దశరథః = దశరథుడు, దుఃఖాని = దుఃఖములను, మయి = నాయందు, విసృజ్య = విడచి, గతః = వెళ్ళిపోయినాడు.

తా. శత్రుఘ్నా ! చూడు. కైకేయివలన లోకమునకు ఎంత గొప్ప అపకారము జరిగినదో ! దశరథమహారాజు దుఃఖము లన్నీ నాకు విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు. 5

మూ. తస్యైషా ధర్మరాజస్య ధర్మమూలా మహాత్మనః,
పరిభ్రమతి రాజశ్రీర్నౌరివాకర్ణికా జలే. 6

ప్ర. అ. ధర్మరాజస్య = ధర్మతత్పరుడైన రాజైన, తస్య = ఆ, మహాత్మనః = మహాత్మునియొక్క, ధర్మమూలా = ధర్మమూలమైన, ఏషా = ఈ, రాజశ్రీః = రాజలక్ష్మి, జలే = జలమునందు, అకర్ణికా = చుక్కానిలేని, నౌః ఇవ = నావవలె, పరిభ్రమతి = తిరుగుచున్నది.

తా. ధర్మరక్షకుడు, మహాత్ముడు అయిన ఆ దశరథమహారాజునకు ధర్మానుసారముగా సంక్రమించిన ఈ రాజ్యలక్ష్మి, ఇపుడు చుక్కాని లేని పడవ నీటిలో తిరిగి నట్లు తిరుగుచున్నది. 6

మూ. యో హి నః సుమహాన్నాథః సోఽపి ప్రవ్రాజితో వనమ్,
అనయా ధర్మముత్సృజ్య మాత్రా మే రాఘవః స్వయమ్.

ప్ర. అ. యః = ఎవ్వడు, నః = మనకు, సుమహాన్ = చాల గొప్పవాడైన, నాథః = నాథుడో, సః = అట్టి, రాఘవః అపి = రాముడు కూడా, అనయా = ఈ, మే మాత్రా = నా తల్లి చేత, ధర్మమ్ = ధర్మమును, ఉత్సృజ్య = విడచి, స్వయమ్ = స్వయముగా, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజితః = పంపివేయబడినాడు.

తా. మన కందరికిని గొప్ప రక్షకుడైన రాముని కూడ, ధర్మహీనురాలైన నా తల్లి, స్వయముగా అడవికి పంపివేసినది. 7

మూ. ఇత్యేవం భరతం ప్రేక్ష్య విలపన్తం విచేతనమ్,
కృపణం రురుదుః సర్వాః సస్వరం యోషిత స్తదా. 8

ప్ర. అ. తదా = అప్పుడు, ఇత్యేవమ్ = ఈ విధముగా, విలపన్తమ్ = విలపించుచున్న, విచేతనమ్ = స్పృహ తప్పిన, భరతమ్ = భరతుని, ప్రేక్ష్య = చూచి, సర్వాః = సమస్త మైన, యోషితః = స్త్రీలు, సస్వరమ్ = సస్వరముగా, కృపణమ్ = దీనముగా, రురుదుః = ఏడ్చిరి.

తా. ఈ విధముగా విలపించుచు స్పృహ తప్పి ఉన్న భరతుని చూచి, స్త్రీ లందరు దీనముగా, ఎలుగెత్తి ఏడ్చిరి. 8

మూ. తథా తస్మిన్ విలపతి వసిష్ఠో రాజధర్మవిత్,
సభామిక్ష్వాకునాథస్య ప్రవివేశ మహాయశాః. 9

ప్ర. అ. తస్మిన్ = ఆతడు, తథా = అట్లు, విలపతి = విలపించుచుండగా, రాజధర్మవిత్ = రాజధర్మములు ఎరిగినవాడూ, మహాయశాః = గొప్ప కీర్తి కలవాడూ అయిన, వసిష్ఠః = వసిష్ఠుడు, ఇక్ష్వాకునాథస్య = ఇక్ష్వాకువంశీయుల ప్రభువైన దశరథునియొక్క, సభామ్ = సభాభవనమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. భరతు డీ విధముగా విలపించుచుండగా, రాజధర్మము లెరిగినవాడూ, గొప్ప కీర్తి కలవాడూ అయిన వసిష్ఠుడు, దశరథుని సభాభవనమునకు వచ్చెను. 9

మూ. శాతకుమ్భమయీం రమ్యాం మణిరత్నసమాకులామ్,
సుధర్మామివ ధర్మాత్మా సగణః ప్రత్యపద్యత, 10

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన వసిష్ఠుడు, సగణః = పరివారముతో కూడినవాడై, శాతకుమ్భమయీమ్ = బంగారు వికారమైనదీ, రమ్యామ్ = సుందరమైనదీ, మణిరత్నసమాకులామ్ = మణులతోను, రత్నములతోను వ్యాప్త మైనదీ, సుధర్మామివ = సుధర్మవలె ఉన్న, ఆ సభను, ప్రత్యపద్యత = చేరెను.

తా. ధర్మాత్ము డైన వసిష్ఠుడు, జనసమూహముతో కూడి, బంగారము పూసి, రమ్య మై, వివిధ రత్నసమలంకృత మై, దేవసభ యైన సుధర్మవలె ఉన్న ఆ సభను ప్రవేశించెను. 10

మూ. స కాఞ్చనమయం పీఠం సుఖాస్తరణసంవృతమ్,
అధ్యాస్త సర్వవేదజ్ఞో దూతాననుశశాస చ. 11

ప్ర. అ. సర్వవేదజ్ఞః=సకలవేదములు ఎరిగిన, సః=అతడు, సుఖాస్తరణ సంవృతమ్ = సుఖకర మైన ఆస్తరణముచేత కప్పబడిన, కాఞ్చనమయమ్ = బంగారు వికార మైన, పీఠమ్=పీఠమును, అధ్యాస్త=అధిష్ఠించెను. దూతాన్ = దూతలను, అనుశశాస చ=ఆజ్ఞాపించెను కూడ.

తా. అన్ని వేదములు తెలిసిన ఆ వసిష్ఠుడు, సుఖకర మైన ఆస్తరణము కప్పిన బంగారు పీఠముపై కూర్చుండి, దూతలను ఈ విధముగ ఆజ్ఞాపించెను.

మూ. బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యానమాత్యాన్ గణవల్లభాన్,
క్షిప్రమానయతాఽవ్యగ్రాః కృత్యమాత్యయికం హి నః.

ప్ర. అ. అవ్యగ్రాః=కంగారు పడనివారై, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, క్షత్రియాన్=క్షత్రియులను, వైశ్యాన్=వైశ్యులను, అమాత్యాన్=మంత్రులను, గణవల్లభాన్=గణాధ్యక్షులను, క్షిప్రమ్=శీఘ్రముగా, ఆనయత=తీసికొనిరండి. నః=మాకు, ఆత్యయికమ్ = చాలతొందర యైన, కృత్యం హి=కృత్య మున్నది కదా.

తా. మీరు ఏ మాత్రము కంగారు పడక, బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, అమాత్యులను, (శిల్పకారాది) గణాధ్యక్షులను శీఘ్రముగా తీసికొని రండి. మాకు వారితో చాల తొందర పని ఉన్నది. 12

మూ. సరాజభృత్యం శత్రుఘ్నం భరతం చ యశస్వినమ్,
యుధాజితం సుమన్త్రం చ యే చ తత్ర హితా జనాః. 13

ప్ర. అ. సరాజభృత్యమ్=రాజభృత్యులతో కూడిన, శత్రుఘ్నమ్=శత్రుఘ్నుని, యశస్వినమ్=కీర్తి గల, భరతం చ=భరతుని, యుధాజితమ్ = యుధాజిత్తును, సుమన్త్రం చ=సుమంత్రుని, తత్ర=అక్కడ, హితాః=రాజ హితు లైన, యే జనాః=ఏ జనులు కలరో వారిని, తీసికొనిరండి.

తా. రాజభృత్యులను, శత్రుఘ్నుని, కీర్తిమంతు డైన భరతుని, యుధాజిత్తును, సుమంత్రుని, రాజహితుల నందరిని తీసికొనిరండి. 13

మూ. తతో హలహలాశబ్దః సుమహాన్ సమపద్యత,
రథైరశ్వైర్గజైశ్చాపి జనానాముపగచ్ఛతామ్. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రథైః = రథములచేతను (పైన), అశ్వైః = గుఱ్ఱములపైన, గజైశ్చాపి = ఏనుగులపైన, ఉపగచ్ఛతామ్ = వచ్చుచున్న, జనానామ్ = జనులయొక్క, సుమహాన్ = చాల గొప్పదైన, హలహలా శబ్దః = కోలాహలము, సమపద్యత = పుట్టెను.

తా. పిమ్మట వసిష్ఠుని ఆజ్ఞప్రకారము ఆహూతు లందరూ రథములు, అశ్వములు, గజములు ఎక్కి వచ్చుచుండగా గొప్ప కలకలధ్వని కలిగెను. 14

మూ. తతో భరతమాయాన్తం శతక్రతుమివామరాః,
ప్రత్యనన్దన్ ప్రకృతయో యథా దశరథం తథా. 15

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఆయాన్తమ్ = వచ్చుచున్న, భరతమ్ = భరతుని, ప్రకృతయః = అమాత్యాదిప్రకృతులు, దశరథమ్ = దశరథుని, యథా = ఎట్లో, తథా = అట్లు, అమరాః = దేవతలు, శతక్రతుమివ = దేవేంద్రుని వలె, ప్రత్యనన్దన్ = అభినందించిరి.

తా. వచ్చుచున్న భరతుని చూచి, అమాత్యాదిప్రకృతులు, దశరథుని వలెను, దేవతలు దేవేంద్రుని వలె అభినందించిరి. 15

మూ. హ్రద ఇవ తిమినాగసంవృతః
స్తిమితజలో మణిశఙ్ఖశర్కరః,
దశరథసుతశోభితా సభా
సదశరథేవ బభౌ యథా పురా. 16

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకాశీతితమః సర్గః.

ప్ర. అ. దశరథసుతశోభితా = దశరథుని కుమారునిచే శోభింపచేయబడిన, సభా = సభ, సదశరథా ఇవ = దశరథునితో కూడినది వలె, తిమినాగసంవృతః = తిము లను మత్స్యములతోను, నాగములతోను కూడిన, మణిశఙ్ఖశర్కరః = మణులతోను, శంఖములతోను, ఇసుకతోను కూడిన, స్తిమితజలః = నిశ్చలమైన జలము గల, హ్రద ఇవ = మడుగు వలె, యథాపురా = పూర్వము నందు వలె, బభౌ = ప్రకాశించెను.

తా. దశరథ కుమారునిచేత శోభితమైన ఆ సభ, అడుగున తిములు, నాగములు, మణులు, శంఖములు, ఇసుక ఉన్న, నిశ్చలమైన ఉదకము గల మడుగు వలె, పూర్వము దశరథు డున్నప్పుడు ఎట్లు ప్రకాశించెనో అట్లే ప్రకాశించెను. 16

బాలానందిని అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఎనుబదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వ్యశీతితమః సర్గః

[వసిష్ఠుడు భరతుని రాజ్యాభిషిక్తుడవు కమ్మని ఆదేశించుట. భరతుడది యనుచితమని పలికి ఆదేశమును అంగీకరించకుండుట. శ్రీరాముని కొనితెచ్చుటకై వనమునకు బయలుదేరుడని అందరిని ఆజ్ఞాపించుట.]

మూ. తామార్యగణసంపూర్ణాం భరతః ప్రగ్రహాం సభామ్,
దదర్శ బుద్ధిసంపన్నః పూర్ణచన్ద్రో నిశామివ. 1

ప్ర. అ. బుద్ధిసంపన్నః = బుద్ధితో సంపన్నుడైన, భరతః = భరతుడు, ఆర్యగణసంపన్నామ్ = ఆర్యులైన (మాన్యులైన జనుల) గణములతో నిండి ఉన్న, తాం సభామ్ = ఆ సభను, పూర్ణచన్ద్రః = పూర్ణచంద్రుడు, ప్రగ్రహామ్ = ఉత్తమమైన గ్రహములు గల, నిశామివ = రాత్రిని వలె, దదర్శ = చూచెను.

తా. బుద్ధిశాలియైన భరతుడు, మాన్యులైన జనుల గణములతో నిండిన ఆ సభను, పూర్ణచంద్రుడు ఉత్తమమైన గ్రహములతో కూడిన రాత్రిని వలె చూచెను. 1

మూ. ఆసనాని యథాన్యాయమార్యాణాం విశతాం తదా,
వస్త్రాఙ్గరాగప్రభయా ద్యోతితా సా సభోత్తమా. 2

ప్ర. అ. తదా = అప్పుడు, ఉత్తమా = ఉత్తమమైన, సా సభా = ఆ సభ, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ఆసనాని = ఆసనములను, విశతామ్ = అధిష్ఠించుచున్న, ఆర్యాణామ్ = మాన్యులైన సభ్యులయొక్క, వస్త్రాఙ్గరాగప్రభయా = వస్త్రములయొక్క, శరీరమునకు పూసికొనిన సుగంధద్రవ్యముల యొక్క కాంతిచే, ద్యోతితా = ప్రకాశింపచేయబడినది.

తా. సభ్యులందరు ఎవరికి తగిన ఆసనములు వారు అధిష్ఠించుచుండగా

వారి వస్త్రముల కాంతిచేతను, అంగరాగముల కాంతిచేతను, ఉత్తమ మైన ఆ సభ ప్రకాశింపచేయబడెను. 2

మూ. సా విద్వజ్జనసంపూర్ణా సభా సురుచిరా తదా.
అదృశ్యత ఘనాపాయే పూర్ణచన్ద్రేవ శర్వరీ. 3

ప్ర. అ. తదా = అప్పుడు, విద్వజ్జనసంపూర్ణా = విద్వాంసులతో నిండిన, సురుచిరా = చాల అందముగా ఉన్న, సా సభా = ఆ సభ, ఘనాపాయే = శరదృతువునందు, పూర్ణ చన్ద్రా = పూర్ణ మైన చంద్రుడు గల, శర్వరీవ = రాత్రి వలె, అదృశ్యత = కనబడెను.

తా. విద్వాంసులతో నిండిన అంద మైన ఆ సభ శరదృతువునందు పూర్ణ చంద్రునితో కూడి న రాత్రి వలె ప్రకాశించెను. 3

మూ. రాజ్ఞస్తు ప్రకృతీః సర్వాః సమగ్రాః ప్రేక్ష్య ధర్మవిత్,
ఇదం పురోహితో వాక్యం భరతం మృదు చాబ్రవీత్. 4

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మవేత్త యైన, పురోహితః = వసిష్ఠుడు, సమగ్రాః = పరిపూర్ణు లైన, సర్వాః = సమస్త మైన, రాజ్ఞః = రాజుయొక్క, ప్రకృతీః = ప్రకృతులను, ప్రేక్ష్య = చూచి, భరతమ్ = భరతుని గూర్చి, మృదు = మృదువుగా, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథుని ఆమాత్యాదిప్రకృతులు, ఒక్కరును మానకుండ అందరును అచటికి వచ్చి యుండిరి. వారిని చూచి, ధర్మవేత్త యైన వసిష్ఠుడు భరతునితో మృదువుగా ఇట్లు పలికెను. 4

మూ. తాత రాజా దశరథః స్వర్గతో ధర్మమాచరన్,
ధనధాన్యవతీం స్ఫీతాం ప్రదాయ పృథివీం తవ. 5

ప్ర. అ. తాత = నాయనా! రాజా = రాజైన, దశరథః = దశరథుడు, ధర్మమ్ = ధర్మమును, ఆచరన్ = ఆచరించుచు, ధనధాన్యవతీమ్ = ధనధాన్యములు గల, స్ఫీతామ్ = విశాల మైన, పృథివీమ్ = భూమిని, తవ = నీకు, ప్రదాయ = ఇచ్చి, స్వర్గతః = స్వర్గమునకు వెళ్ళినాడు.

తా. నాయనా భరతా దశరథమహారాజు ధర్మాచరణము చేయుచు

రాజ్యము పాలించి, ధనధాన్యసమృద్ధ మైన విశాల మైన ఈ పృథివిని నీకు ఇచ్చి, స్వర్గస్థు డైనాడు. 5

మూ. రామ స్తథా సత్యధృతిః సతాం ధర్మమనుస్మరన్,
నాజహాత్పితురాదేశం శశీ జ్యోత్స్నామివోదితః. 6

ప్ర. అ. తథా = మరియు, సత్యధృతిః = సత్య మైన నిశ్చయము గల, రామః = రాముడు, సతామ్ = సత్పురుషులయొక్క, ధర్మమ్ = ధర్మమును, అనుస్మరన్ = స్మరించుచు, ఉదితః = ఉదయించిన, శశీ = చంద్రుడు, జ్యోత్స్నామివ = వెన్నెలను వలె, పితుః = తండ్రియొక్క, ఆదేశమ్ = ఆజ్ఞను, నాజహాత్ = విడువలేదు.

తా. సత్యమునందు స్థిర మైన చిత్తము గల రాముడు కూడ, సత్పురుషులు అనుసరించిన ధర్మమును స్మరించుచు, ఉదయించిన చంద్రుడు వెన్నెలను విడువకుండు నట్లు, తండ్రి ఆజ్ఞను విడువలేదు. 6

మూ. పిత్రా భ్రాత్రా చ తే దత్తం రాజ్యం నిహతకణ్టకమ్,
తద్భుఙ్క్ష్వ ముదితామాత్యః క్షిప్రమేవాభిషేచయ. 7

ప్ర. అ. పిత్రా = తండ్రిచేతను, భ్రాత్రా చ = సోదరునిచేతను, నిహతకణ్టకమ్ = తొలగించబడిన అడ్డంకులు (శత్రువులు) గల, రాజ్యమ్ = రాజ్యము, తే = నీకు, దత్తమ్ = ఇవ్వబడినది. ముదితామాత్యః = సంతసించిన అమాత్యులు కలవాడవై, తత్ = దానిని, భుఙ్క్ష్వ = అనుభవింపుము. క్షిప్రమేవ = శీఘ్రముగా, అభిషేచయ = అభిషేకము చేయించుకొనుము.

తా. ఈ విధముగ నీ తండ్రీ, సోదరుడూ నీ కిచ్చిన, ఏ బాధలూ లేని రాజ్యమును, సంతోషించిన మంత్రులతో అనుభవింపుము. శీఘ్రముగా రాజ్యాభిషిక్తుడవు అగుము. 7

మూ. ఉదీచ్యాశ్చ ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ కేవలాః,
కోట్యాపరాన్తాః సాముద్రా రత్నాన్యభిహరన్తు తే. 8

ప్ర. అ. ఉదీచ్యాః = ఉత్తరముదిక్కువారూ, ప్రతీచ్యాశ్చ = పశ్చిమదిక్కువారు, దాక్షిణాత్యాశ్చ = దక్షిణదేశమువారు, కేవలాః = సింహాసనము లేని

రాజులూ, అపరాన్తాః = సరిహద్దులలోని రాజులూ, సాముద్రాః = సముద్రద్వీప ములలోని రాజులూ, తే = నీకు, కోట్యః = కోటిసంఖ్యచే, రత్నాని = శ్రేష్ఠవస్తువు లను, అభిహరన్తు = కానుకగా తీసికొనివచ్చెదరుగాక.

తా. ఉత్తరదేశపురాజులు, పశ్చిమదేశరాజులు, దాక్షిణాత్యరాజులు, సింహాసనములేని రాజులు, సరిహద్దులలోని రాజులూ, సముద్రమధ్యద్వీపములలోని రాజులూ నీకు కోట్లకొలది ఉత్తమవస్తువులను పారితోషికముగ తీసికొనివచ్చి సమర్పించెదరుగాక. 8

మూ. తచ్ఛ్రుత్వా భరతో వాక్యం శోకేనాభిపరిప్లుతః,
జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాఙ్క్షయా. 9

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మజ్ఞుడైన, భరతః = భరతుడు, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, శోకేన = శోకముచేత, అభిపరిప్లుతః = నిండినవాడై, ధర్మకాఙ్క్షయా = ధర్మమునందు కోరికచేత, రామమ్ = రాముని, మనసా = మనస్సుచేత, జగామ = పొందెను.

తా. ధర్మజ్ఞుడైన భరతుడు ఆ మాటలు విని, శోకాక్రాంతుడై, ధర్మ మార్గము నవలంబింపవలె నని కోరుచు, రాముని మనసా స్మరించెను. 9

మూ. సబాష్పకలయా వాచా కలహంసస్వరో యువా,
విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్. 10

ప్ర. అ. కలహంసస్వరః = కలహంస వంటి స్వరము గల. యువా = యువకుడైన భరతుడు, సబాష్పకలయా = బాష్పముతో కూడినదీ, మధురమూ అయిన, వాచా = వాక్కుతో, సభామధ్యే = సభామధ్యమునందు, విలలాప = విల పించెను. పురోహితమ్ = పురోహితుని, జగర్హే చ = నిందించెనుకూడ.

తా. కలహంసస్వరము వంటి స్వరము గల యువకుడైన ఆ భరతుడు, సభామధ్యమునందు, బాష్పముతో కూడిన మధురమైన స్వరముతో విలపించుచు, పురోహితుని నిందించెను. 10

మూ. చరితబ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః,
ధర్మే ప్రయతమానస్య కో రాజ్యం మద్విధో హరేత్. 11

ప్ర. అ. చరితబ్రహ్మచర్యస్య = ఆచరించబడిన బ్రహ్మచర్యము కల వాడు, విద్యాస్నాతస్య = విద్యాపారంగతుడు, ధీమతః = బుద్ధిమంతుడు, ధర్మే = ధర్మమునందు, ప్రయతమానస్య = ప్రయత్నము చేయుచున్నవాడూ అయిన రాముని వంటివానియొక్క, రాజ్యమ్ = రాజ్యమును, మద్విధః = నావంటివాడు, కః = ఎవ్వడు, హరేత్ = హరించును ?

తా. బ్రహ్మచర్యవ్రతమును ఆచరించి, సకలవిద్యాపారంగతు డై, ధర్మ మును రక్షించుటకు ప్రయత్నించుచున్న రామునివంటి ధీశాలికి చెందవలసిన రాజ్యమును అపహరించవలె నని నా వంటివాడు ఎవ్వడైన యత్నించునా ? 11

మూ. కథం దశరథాజ్జాతో భవేద్రాజ్యాపహారకః,
రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తుమిహార్హసి. 12

ప్ర. అ. దశరథాత్ = దశరథునినుండి, జాతః = పుట్టినవాడు, రాజ్యాప హారకః = రాజ్యమును అపహరించువాడుగా, కథమ్ = ఎట్లు, భవేత్ = ఆగును ? రాజ్యం చ = రాజ్యమూ, అహం చ = నేనూ కూడ, రామస్య = రామునికి చెందినవారమే. ఇహ = ఈ విషయమునందు, ధర్మమ్ = ధర్మమును, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. దశరథునికి పుట్టినవా డెన్నడైన రాజ్యాపహారము చేయునా ? ఈ రాజ్యము, నేను కూడ రామునకు చెందినవారము. ఈ విషయములో ధర్మమేదో నీవే చెప్పుము. 12

మూ. జ్యేష్ఠః శ్రేష్ఠశ్చ ధర్మాత్మా దిలీపనహుషోపమః,
లబ్ధుమర్హతి కాకుత్స్థో రాజ్యం దశరథో యథా. 13

ప్ర. అ. జ్యేష్ఠః = పెద్దవాడూ, శ్రేష్ఠః చ = శ్రేష్ఠుడూ, ధర్మాత్మా = ధర్మాత్ముడూ, దిలీపనహుషోపమః = దిలీపనహుషులతో సమానుడూ అయిన, కాకుత్స్థః = రాముడు, దశరథో యథా = దశరథుడు వలె, రాజ్యమ్ = రాజ్య మును, లబ్ధుమ్ = పొందుటకు, అర్హతి = తగి ఉన్నాడు.

తా. పెద్దవాడూ, శ్రేష్ఠుడూ, ధర్మాత్ముడూ, దిలీపనహుషులతో సమా నుడూ అయిన రామునకే ఈ రాజ్యముపై దశరథునకు వలె అధికార మున్నది, వే రెవ్వరికీ లేదు. 13

మూ. అనార్యజుష్టమస్వర్గ్యం కుర్యాం పాపమహం యది,
ఇక్ష్వాకూణామహం లోకే భవేయం కులపాంసనః. 14

ప్ర. అ. అహమ్ = నేను, అనార్యజుష్టమ్ = పెద్దవారిచేత సేవింపబడేదీ, అస్వర్గ్యమ్ = స్వర్గమును ఇవ్వనిదీ అయిన, పాపమ్ = పాపమును, కుర్యాం యది = చేసినట్లైతే, లోకే = లోకమునందు, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజుల, కులపాంసనః = కులమును అపవిత్రము చేసినవాడను, భవేయమ్ = అగుదును.

తా. పెద్దవారు చేసే ఈ నరకహేతు వైన పాపమును చేసినచో నే నీ లోకమునందు ఇక్ష్వాకువంశమునకు కళంకము తెచ్చినవాడను అగుదును. 14

మూ. యద్ధి మాత్రా కృతం పాపం నాహం తదపి రోచయే,
ఇహస్థో వనదుర్గస్థం నమస్యామి కృతాఞ్జలిః. 15

ప్ర. అ. మాత్రా = తల్లిచేత, యత్ = ఏ, పాపమ్ = పాపము, కృతమ్ = చేయబడినదో, తత్అపి = దానిని, అహమ్ = నేను, న రోచయే హి = ఇష్టపడను కదా. ఇహస్థః = ఇక్కడ నున్న నేను, వనదుర్గస్థమ్ = వనదుర్గమునం దున్న రాముని. కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడ నై, నమస్యామి = నమస్కరించుచున్నాను.

తా. నా తల్లి చేసిన పాపకార్యమును నే నేమాత్రము అంగీకరించను. దుర్గమ మైన వనములో ఉన్న అన్నగారికి దోసిలి కట్టి ఇక్కడినుండియే నమస్కరించుచున్నాను. 15

మూ. రామమేవానుగచ్ఛామి రాజా స ద్విపదాం వరః,
త్రయాణామపి లోకానాం రాజ్యమర్హతి రాఘవః. 16

ప్ర. అ. రామమేవ = రామునే, అనుగచ్ఛామి = అనుసరించి వెళ్ళెదను. ద్విపదాం వరః = మనుష్యులలో శ్రేష్ఠు డైన, సః = అతడే, రాజా = రాజు. రాఘవః = రాముడు, త్రయాణాం లోకానామ్ = మూడు లోకములయొక్క, రాజ్యమపి = రాజ్యమును గూడ, అర్హతి = తగి ఉన్నాడు.

తా. నేను రామునే అనుసరించి వెళ్ళెదను. మనుష్యశ్రేష్ఠు డైన ఆ

రాముడే రాజు, వేరెవ్వరును కాజాలరు. రాముడు మూడు లోకముల రాజ్యమేలుటకు కూడ తగినవాడు. 16

మూ. తద్వాక్యం ధర్మసంయుక్తం శ్రుత్వా సర్వే సభాసదః,
హర్షాన్ముముచురశ్రూణి రామే నిహితచేతసః. 17

ప్ర. అ. సర్వే = సమస్తమైన, సభాసదః = సభాసదులు, ధర్మసంయుక్తమ్ = ధర్మముతో కూడిన, తద్వాక్యమ్ = ఆ భరతునివాక్యమును, శ్రుత్వా = విని, రామే = రామునియందు, నిహితచేతసః = ఉంచబడిన చిత్తములు కలవారై, హర్షాత్ = సంతోషమువలన, అశ్రూణి = కన్నీళ్ళను, ముముచుః = విడిచిరి.

తా. ఆ సభాసదు లందరు ధర్మబద్ధమైన ఆ భరతుని మాటలు విని, రామునే స్మరించుచు, ఆనందబాష్పమును విడచిరి. 17

మూ. యది త్వార్యం న శక్ష్యామి వినివర్తయితుం వనాత్,
వనే తత్రైవ వత్స్యామి యథార్యో లక్ష్మణస్తథా. 18

ప్ర. అ. ఆర్యమ్ = అన్నగారిని, వనాత్ = వనమునుండి, వినివర్తయితుమ్ = మరల్చుటకు, న శక్ష్యామి యది = సమర్థుడను కాకపోయినచో, ఆర్యః = పూజ్యుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, యథా = ఎట్లో, తథా = అట్లు, తత్ర = ఆ, వనే ఏవ = వనమునందే, వత్స్యామి = నివసించెదను.

తా. అన్నగారిని వనమునుండి వెనుకకు తీసికొనిరాజాలని యడల, ఆర్యుడైన లక్ష్మణు డున్నట్లే నేను కూడ ఆ వనములోనే ఉండిపోయెదను. 18

మూ. సర్వోపాయం తు వర్తిష్యే వినివర్తయితుం బలాత్,
సమక్షమార్యమిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్. 19

ప్ర. అ గుణవర్తినామ్ = సద్గుణములం దున్న, సాధూనామ్ = సత్పురుషులైన, ఆర్యమిశ్రాణామ్ = పూజ్యులైన మీ అందరియొక్క, సమక్షమ్ = ఎదుట, బలాత్ = బలాత్కారముగా, వినివర్తయితుమ్ = వెనుకకు మరల్చుటకు. సర్వోపాయమ్ = సమస్తమైన ఉపాయములను, వర్తిష్యే = చేయగలను.

తా. గుణవంతులూ, సత్పురుషులూ, పూజ్యులూ అయిన మీ అందరి సమక్షమున, రాముని ఎట్లైన వెనుకకు తీసికొని వచ్చుటకు అన్ని ఉపాయములు ప్రయోగించెదను. 19

మూ. విష్టికర్మాన్తికాః సర్వే మార్గశోధనరక్షకాః,
ప్రస్థాపితా మయా పూర్వం యాత్రాపి మమ రోచతే. 20

ప్ర. అ. మార్గశోధకరక్షకాః=మార్గమును శోధించువారు. రక్షించువారూ, అయిన, సర్వే=సమస్తమైన, విష్టికర్మాంతికాః=కూలి లేకుండా పనిచేయువారు, కూలి తీసికొని పనిచేయువారు, మయా=నాచేత, పూర్వమ్ = ముందుగానే, ప్రస్థాపితాః = పంపబడినారు. మమ = నాకు, యాత్రాపి = ప్రయాణము, రోచతే = ఇష్ట మగుచున్నది.

తా. మార్గమును శోధించేవారూ, రక్షించేవారూ అయిన వెట్టివాళ్ళనూ కూలి వాళ్ళనూ నేను ముందుగనే పంపి ఉన్నాను. ఇవుడు నేను కూడ బయలుదేర వలె నని అనుకొనుచున్నాను. 20

మూ. ఏవముక్త్వా తు ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః,
సమీపస్థమువాచేదం సుమన్త్రం మన్త్రికోవిదమ్. 21

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు, భ్రాతృవత్సలః=సోదరునిపై ప్రేమ కలవాడూ అయిన, భరతః = భరతుడు, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా తు= పలికి, సమీపస్థమ్=సమీపమునందున్న, మన్త్రికోవిదమ్ = ఆలోచనలో నేర్పరియైన, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, ఇదమ్= ఈ వాక్యమును. ఉవాచ = పలికెను.

తా. ధర్మాత్ముడు, సోదరునియందు ప్రేమ కలవాడు అయిన భరతుడు ఇట్లు పలికి, ప్రక్కనే ఉన్న, మంత్రనిపుణుడైన సుమంత్రునితో ఇట్లు పలికెను.

మూ. తూర్ణముత్థాయ గచ్ఛ త్వం సుమన్త్ర మమ శాసనాత్,
యాత్రామాజ్ఞాపయ క్షిప్రం బలం చైవ సమానయ. 22

ప్ర. అ. సుమన్త్ర=సుమంత్రా ! మమ = నాయొక్క, శాసనాత్ = ఆజ్ఞ వలన, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్థాయ=లేచి, గచ్ఛ=వెళ్లుము. క్షిప్రమ్=శీఘ్రముగా, యాత్రామ్=ప్రయాణమును, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపించుము. బలం చైవ= సైన్యమును కూడ, సమానయ=తీసికొని రమ్ము,

తా. సుమంత్రా ! శీఘ్రముగా లేచి వెళ్ళి నా ఆజ్ఞగా చెప్పి, యాత్రను ఏర్పరుపుము. వెంటనే సైన్యమును కూడ తీసికొనిరమ్ము. 22

మూ. ఏవముక్తః సుమన్త్రస్తు భరతేన మహాత్మనా,
హృష్టస్తదాదిశత్సర్వం యథాసందిష్టమిష్టవత్. 23

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, భరతేన = భరతునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సుమన్త్రః = సుమంత్రుడు, హృష్టః = సంతోషించిన వాడై, తత్ = దానిని, సర్వమ్ = అంతనూ, యథాసందిష్టమ్ = ఆదేశించిన విధముగా, ఇష్టవత్ = తన కిష్ట మైనకార్యమును వలె, ఆదిశత్ = ఆజ్ఞాపించెను.

తా. మహాత్ముడైన భరతుని మాటలు విని సుమంత్రుడు సంతోషించి, భరతుని ఆజ్ఞ ప్రకారము ఆ కార్యము నంతను, తన కిష్ట మైన కార్యము చేయు నంతటి శ్రద్ధతో చేసెను. 23

మూ. తాః ప్రహృష్టాః ప్రకృతయో బలాధ్యక్షా బలస్య చ,
శ్రుత్వా యాత్రాం సమాజ్ఞప్తాం రాఘవస్య నివర్తనే. 24

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, నివర్తనే = మరల్చుటవిషయమున, సమాజ్ఞప్తామ్ = ఆజ్ఞాపింపబడిన, బలస్య చ = సైన్యముయొక్క కూడ, యాత్రామ్ = యాత్రను గూర్చి, శ్రుత్వా = విని, తాః = ఆ, ప్రకృతయః = ప్రకృతులు, బలాధ్యక్షాః = సేనాధ్యక్షులూ, ప్రహృష్టాః = సంతోషించిరి.

తా. రాముని వెనుకకు తీసికొనివచ్చుటకై సైన్యమును కూడ తీసికొని వెళ్ళవలె నని ఆజ్ఞ ఇచ్చి నట్లు విని, ఆ ప్రకృతులూ, సైన్యాధ్యక్షులూ సంతోషించిరి. 24

మూ. తతో యోధాఙ్గనాః సర్వా భర్తౄన్ సర్వాన్ గృహేగృహే,
యాత్రాగమనమాజ్ఞాయ త్వరయన్తి స్మ హర్షితాః. 25

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గృహే గృహే = ప్రతి ఇంటియందును, సర్వాః = సమస్త మైన, యోధాఙ్గనాః = యోధుల భార్యలు, యాత్రాగమనమ్ = యాత్రకొరకై గమనమును, ఆజ్ఞాయ = తెలుసుకొని, హర్షితాః = సంతోషించిన వారై, సర్వాన్ = సమస్త మైన, భర్తౄన్ = భర్తలను, త్వరయన్తి స్మ = తొందర పెట్టిరి.

తా. పిమ్మట, యోధుల భార్య లందరును భరతుడు సంకల్పించిన యాత్రను గూర్చి విని, సంతోషించుచు, ప్రతి ఇంటియందును, తమ తమ భర్తలను తొందర పెట్టిరి. 25

మూ. తే హయైర్గోరథైః శీఘ్రైః స్యన్దనైశ్చ మహాజవైః,
సహ యోధైర్బలాధ్యక్షా బలం సర్వమచోదయన్. 26

ప్ర. అ. తే=ఆ, బలాధ్యక్షాః=సేనాధ్యక్షులు, హయైః=గుఱ్ఱములతోను, శీఘ్రైః=శీఘ్రముగా నడచు, గోరథైః=ఎడ్లబండులతోను, మహాజవైః=గొప్ప వేగము గల, స్యన్దనైశ్చ=రథములతోను, యోధైశ్చ సహ=యుద్ధ భటులతోను, సర్వమ్=సమస్త మైన, బలమ్=సేనను, అచోదయన్=ప్రేరేపించిరి.

తా. ఆ సేనాధ్యక్షులు గుఱ్ఱములు, శీఘ్రముగా పోవు ఎడ్లబండ్లు, గొప్ప వేగము గల రథములు, యుద్ధభటులు ఉన్న సైన్యము నంతను ప్రేరేపించిరి (నడిపించిరి). 26

మూ. సజ్జం తు తద్బలం శ్రుత్వా భరతో గురుసన్నిధౌ,
రథం మే త్వరయస్వేతి సుమన్త్రం పార్శ్వతోఽబ్రవీత్.

ప్ర. అ. భరతః=భరతుడు, సజ్జమ్=సన్నద్ధ మైన, తత్ బలమ్=ఆ సైన్యమును, దృష్ట్వా=చూచి, గురుసన్నిధౌ=వసిష్ఠుని సమీపమున, పార్శ్వతః=తన ప్రక్కన ఉన్న, సుమన్త్రమ్=సుమంత్రుని గూర్చి, మే=నాయొక్క, రథమ్=రథమును, త్వరయస్వ=తొందరచేయుము, ఇతి=అని, అబ్రవీత్=వలికెను.

తా. భరతుడు సన్నద్ధ మైన ఆ సైన్యమును చూచి, గురు వైన వసిష్ఠుని సమక్షమునందు, తన ప్రక్కన ఉన్న సుమంత్రునితో- "నా రథమును తొందరగా సిద్ధము చేయుము" అని ఆజ్ఞాపించెను. 27

మూ. భరతస్య తు తస్యాజ్ఞాం ప్రతిగృహ్య చ హర్షితః,
రథం గృహీత్వా ప్రయయౌ యుక్తం పరమవాజిభిః. 28

ప్ర. అ. తస్య భరతస్య=ఆ భరతునియొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, ప్రతిగృహ్య=స్వీకరించి, హర్షితః=సంతోషించినవా డై, పరమవాజిభిః=శ్రేష్ఠము లైన అశ్వములతో, యుక్తమ్=కూర్చబడిన, రథమ్=రథమును, గృహీత్వా=గ్రహించి, ప్రయయౌ=వెళ్లెను.

తా. భరతుని ఆజ్ఞ విని సుమంత్రుడు సంతోషముతో ఉత్తమ మైన గుఱ్ఱములు కట్టిన రథమును తీసికొనివచ్చెను. 28

మూ. స రాఘవః సత్యధృతిః ప్రతాపవాన్
బ్రువన్ సుయుక్తం దృఢసత్యవిక్రమః,
గురుం మహారణ్యగతం యశస్వినం
ప్రసాదయిష్యన్ భరతోఽబ్రవీత్తదా. 29

ప్ర. అ. తదా=అప్పుడు, రాఘవః=రఘువంశమునందు పుట్టినవాడూ, సత్యధృతిః=సత్యమైన స్థైర్యము కలవాడూ, దృఢసత్యవిక్రమః = దృఢము, సత్యము అయిన పరాక్రమము కలవాడూ, సుయుక్తమ్ = చాల యుక్తముగా, బ్రువన్=మాటలాడుచున్నవాడూ అయిన, భరతః=భరతుడు, మహారణ్యగతమ్ =గొప్ప అరణ్యమునందున్న, యశస్వినమ్=యశఃశాలి యైన, గురుమ్=అన్నగారిని, ప్రసాదయిష్యన్=అనుగ్రహింపచేసుకోగలవాడై, అబ్రవీత్=పలికెను.

తా. సత్యమైన చిత్తస్థైర్యము గలవాడూ, ప్రతాపవంతుడూ, దృఢము, సత్యము అయిన విక్రమము కలవాడూ, యుక్తముగా మాటలాడుచున్నవాడూ, రఘువంశసంజాతుడూ అయిన భరతుడు, మహారణ్యములో ఉన్న యశఃశాలి యైన అన్నగారిని అనుగ్రహింపచేసికొనదలచినవాడై, అపుడు ఇట్లు పలికెను. 29

మూ. తూర్ణం సముత్థాయ సుమన్త్ర గచ్ఛ
బలస్య యోగాయ బలప్రధానాన్,
ఆనేతుమిచ్ఛామి హి తం వనస్థం
ప్రసాద్య రామం జగతో హితాయ. 30

ప్ర. అ. సుమన్త్ర=ఓ సుమంత్రా ! సముత్థాయ=లేచి, బలస్య=సైన్యము యొక్క, యోగాయ=సమకూర్చుటకొరకు, బలప్రధానాన్=సేనానాయకులను గూర్చి, తూర్ణమ్=శీఘ్రముగా, గచ్ఛ=వెళ్ళుము. వనస్థమ్=వనములో నున్న, తమ్=ఆ, రామమ్=రాముని, ప్రసాద్య=అనుగ్రహింపచేసుకొని, జగతః= జగత్తుయొక్క, హితాయ = హితముకొరకై, ఆనేతుమ్ = తీసికొనివచ్చుటకు, ఇచ్ఛామి హి=కోరుచున్నాను కదా ?

తా. సుమంత్రా ! శీఘ్రముగా లేచి వెళ్ళి సైన్యమును సమకూర్చు డని

సైన్యాధిపతులకు చెప్పుము. వనములో ఉన్న రాముని అనుగ్రహింపచేసుకొని, జగత్తుకు హితము చేకూర్చుటకై తీసికొనిరావలె నని కోరుచున్నాను.

మూ. స సూతపుత్రో భరతేన సమ్యగ్
గాజ్ఞాపితః సంపరిపూర్ణకామః,
శశాస సర్వాన్ ప్రకృతిప్రధానాన్
బలస్య ముఖ్యాంశ్చ సుహృజ్జనం చ. 31

ప్ర. అ. భరతేన=భరతునిచేత, సమ్యక్=బాగుగా, ఆజ్ఞాపితః=అజ్ఞాపింపబడినవాడై, సంపరిపూర్ణకామః=తీరిన కోరిక గలవాడై, సః=ఆ, సూతపుత్రః=సుమంత్రుడు, సర్వాన్=సమస్తమైన, ప్రకృతిప్రధానాన్=ప్రకృతులలో ప్రధాన మైనవారినీ, బలస్య=సేనయొక్క, ముఖ్యాంశ్చ = ప్రధానులనూ, సుహృజ్జనం చ=మిత్రసముదాయమును, శశాస=శాసించెను.

తా. భరతు డీ విధముగా చక్కగ ఆజ్ఞాపించగా, సుమంత్రుడు తన కోరిక తీరుటచే సంతోషించుచు ప్రకృతులలో ప్రధాను లైనవారినీ, సేనాధిపతులనూ, మిత్రులను ఆజ్ఞాపించెను. 31

మూ. తతః సముత్థాయ కులే కులే తే
రాజన్యవైశ్యా వృషలాశ్చ విప్రాః,
అయూయుజన్నుష్ట్రఖరాన్రథాంశ్చ
నాగాన్ హయాంశ్చైవ కులప్రసూతాన్. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వ్యశీతితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కులే కులే=ప్రతి ఇంటియందూ, తే=ఆ, రాజన్యవైశ్యాః=క్షత్రియులూ, వైశ్యులూ, వృషలాశ్చ=శూద్రులూ, విప్రాః = బ్రాహ్మణులూ, సముత్థాయ = లేచి, ఉష్ట్రఖరాన్ = ఒంటెలను, గాడిదలను, రథాంశ్చ=రథములను, కులప్రసూతాన్ = మంచిజాతులలోపుట్టిన, నాగాన్= ఏనుగులను, హయాంశ్చైవ= గుఱ్ఱములను, అయూయుజన్=ప్రయాణమునకై సిద్ధము చేసిరి.

తా. పిమ్మట ప్రతిగృహమునందును, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులూ, బ్రాహ్మణులూ, లేచి, ఒంటెలనూ, గాడిదలనూ, రథములనూ, ఉత్తమజాతులకు చెందిన గజములను, అశ్వములను సిద్ధము చేసిరి.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో ఎనుబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్ర్యశీతితమోఽధ్యాయః

[భరతుని వనగమనము. శృంగిబేరపురమున ఆ రాత్రి నివసించుట]

మూ. తతః సముత్థితః కాల్యమాస్థాయ స్యన్దనోత్తమమ్,
ప్రయయౌ భరతః శీఘ్రం రామదర్శనకాఙ్క్షయా. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భరతః = భరతుడు, కాల్యమ్=ప్రాతః కాలమునందే, సముత్థితః=లేచినవాడై, స్యన్దనోత్తమమ్=శ్రేష్ఠమైన రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, రామదర్శనకాఙ్క్షయా=రాముని చూడవలెనను కోరికతో, శీఘ్రమ్=శీఘ్రముగా, ప్రయయౌ=వెళ్లెను.

తా. పిమ్మట భరతుడు ప్రాతఃకాలమునందే లేచి, శ్రేష్ఠమైన రథము నధిష్ఠించి, రాముని చూడవలెనను కోరికతో శీఘ్రముగా వెళ్లెను. 1

మూ అగ్రతః ప్రయయుస్తస్య సర్వే మన్త్రిపురోధసః,
అధిరుహ్య హయైర్యుక్తాన్ రథాన్ సూర్యరథోపమాన్. 2

ప్ర. అ. సర్వే=సమస్తమైన, మన్త్రిపురోధసః=మంత్రులు పురోహితులు, హయైః=గుఱ్ఱములతో, యుక్తాన్=కూర్చబడిన, సూర్యరథోపమాన్=సూర్యుని రథముతో సమానమైన, రథాన్=రథములను, అధిరుహ్య = ఎక్కి, తస్య= అతనియొక్క, అగ్రతః=ఎదుట, ప్రయయుః=వెళ్ళిరి.

తా. మంత్రులు, పురోహితులు అందరూ, గుఱ్ఱములు కట్టిన, సూర్యరథ సదృశములైన రథము లెక్కి, భరతుని ముందు వెళ్ళిరి. 2

మూ. నవనాగసహస్రాణి కల్పితాని యథావిధి,
అన్వయుర్భరతం యాన్తమిక్ష్వాకుకులనన్దనమ్. 3

ప్ర. అ. యథావిధి=నియమానుసారముగా, కల్పితాని=ఏర్పరుపబడిన, నవనాగస్రాణి=తొమ్మిదివేల గజములు, యాన్తమ్=వెళ్లుచున్న, ఇక్ష్వాకుకుల

నన్దనమ్=ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన, భరతమ్=భరతుని. అన్వయుః =అనుసరించినవి.

తా. ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన భరతుడు ముందు వెళ్లు చుండగా అతని వెనుక నియమానుసారముగా కూర్చిన తొమ్మిదివేల ఏనుగులు ప్రయాణము చేసినవి. 3

మూ. షష్టి రథసహస్రాణి ధన్వినో వివిధాయుధాః,
అన్వయుర్భరతం యాన్తం రాజపుత్రం యశస్వినమ్. 4

ప్ర. అ. షష్టిః = అరువది, రథసహస్రాణి = రథసహస్రములు, వివిధాయుధాః=అనేకవిధము లైన ఆయుధములు గల, ధన్వినః=ధనుర్ధరులు, యాన్తమ్ =వెళ్లుచున్న, యశస్వినమ్=యశశ్శాలి యైన, రాజపుత్రమ్=రాజకుమారు డైన, భరతమ్=భరతుని, అన్వయుః = అనుసరించి వెళ్ళిరి.

తా. యశఃశాలీ, రాజపుత్రుడూ అయిన భరతుడు ముందు వెళ్లుచుండగా, అరువదివేల రథములు, అనేకవిధము లైన ఆయుధములు ధరించిన ధనుర్ధరులూ, అతని వెనుక వెళ్ళిరి. 4

మూ. శతం సహస్రాణ్యశ్వానాం సమారూఢాని రాఘవమ్,
అన్వయుర్భరతం యాన్తం సత్యసన్ధం జితేన్ద్రియమ్. 5

ప్ర. అ. రాఘవమ్ = రఘువంశమునందు పుట్టినవాడూ, సత్యసన్ధమ్ = సత్య మైన ప్రతిజ్ఞ కలవాడూ, జితేన్ద్రియమ్=జయింపబడిన ఇంద్రియములు కల వాడూ అయిన, యాన్తమ్ = వెళ్లుచున్న, భరతమ్=భరతుని, సమారూఢాని= అశ్వికులచే అధిష్ఠింపబడిన, అశ్వానామ్ = అశ్వములయొక్క, శతమ్ = నూరు, సహస్రాణి=వేలు, అన్వయుః=అనుసరించి వెళ్ళినవి.

తా. సత్యసంధుడు, జితేంద్రియుడు అయిన ఆ భరతుడు వెళ్లుచున్నపుడు లక్షమంది అశ్వారూఢులు అనుసరించి వెళ్ళిరి. 5

మూ. కైకేయీ చ సుమిత్రా చ కౌసల్యా చ యశస్వినీ,
రామానయనసంహృష్టా యయుర్యానేన భాస్వతా. 6

ప్ర. అ. కైకేయీ చ = కైకేయి, సుమిత్రా చ = సుమిత్ర, యశస్వినీ = కీర్తి గల, కౌసల్యా చ = కౌసల్య, రామానయన సంహృష్టాః = రాముని తీసి కొనివచ్చుటనుగూర్చి సంతోషించినవారై, భాస్వతా = ప్రకాశించుచున్న. యానేన = వాహనముచేత, యయుః = వెళ్ళిరి.

తా. కైకేయి, సుమిత్ర, యశఃశాలిని యైన కౌసల్య కూడ రాముడు తిరిగి వచ్చును కదా అని ఆనందించుచు, ప్రకాశించుచున్న వాహనము నెక్కి వెళ్ళిరి. 6

మూ. ప్రయాతాశ్చార్యసంఘాతా రామం ద్రష్టుం సలక్ష్మణమ్,
తస్యైవ చ కథాశ్చిత్రాః కుర్వాణా హృష్టమానసాః. 7

ప్ర. అ. ఆర్యసంఘాతాశ్చ = పూజ్యులైన జనుల సముదాయములు కూడ, హృష్టమానసాః = సంతోషించిన మనస్సు కలవై, చిత్రాః = విచిత్ర మైన, తస్యైవ = ఆ రామునియొక్కయే, కథాః = కథలను, కుర్వాణాః = చేయుచు, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, రామమ్ = రాముని, ద్రష్టుమ్ = చూచుటకు, ప్రయాతాః = వెళ్ళినవి.

తా. పూజ్యులైన జనులు గుంపులు గుంపులుగా కలిసి, రామునికి సంబంధించిన విచిత్ర మైన కథలు చెప్పుకొనుచు, రామలక్ష్మణులను చూచుటకై, సంతోషముతో వెళ్ళిరి. 7

మూ. మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతమ్,
కదా ద్రక్ష్యామహే రామం జగతః శోకనాశనమ్. 8

ప్ర. అ. మేఘశ్యామమ్ = మేఘము వలె శ్యామలవర్ణము కలవాడూ, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడూ, స్థిరసత్త్వమ్ = స్థిర మైన బలము కలవాడూ, దృఢవ్రతమ్ = దృఢ మైన నియమము కలవాడూ, జగతః = జగత్తుయొక్క, శోకనాశనమ్ = శోకమును నశింపచేయువాడూ అయిన, రామమ్ = రాముని, కదా = ఎప్పుడు, ద్రక్ష్యామహే = చూడగలమో ?

తా. "మేఘశ్యాముడూ, మహాబాహువు, స్థిర మైన బలము దృఢ మైన నియమము కలవాడూ అయిన, జగత్తు శోకము నంతను నశింపచేయు రాముని ఎప్పుడు చూచెదమో కదా ?" 8

మూ. దృష్ట ఏవ హి నః శోకమపనేష్యతి రాఘవః,
తమః సర్వస్య లోకస్య సముద్యన్నివ భాస్కరః. 9

ప్ర. అ. సముద్యన్=ఉదయించుచున్న, భాస్కరః=సూర్యుడు, సర్వస్య =సమస్తమైన, లోకస్య=లోకముయొక్క, తమః ఇవ = అంధకారమును వలె, రాఘవః = రాముడు, దృష్ట ఏవ=చూడబడగానే, నః=మనయొక్క, శోకమ్= శోకమును, అపనేష్యతి=తొలగించగలడు.

తా. ఉదయించిన సూర్యుడు సకలలోకము నందలి అంధకారమును తొలగించి నట్లు రాముడు మన కంటబడగానే మన శోకములన్నియు తొలగించును.

మూ. ఇత్యేవం కథయన్తస్తే సంప్రహృష్టాః కథాః శుభాః,
పరిష్వజానాశ్చాన్యోన్యం యయుర్నాగరికా జనాః. 10

ప్ర. అ. తే=ఆ, నాగరికాః జనాః=నగరమునందలి జనులు, ఇత్యేవమ్ = ఇట్లు, శుభాః = శుభకరమైన, కథాః=కథలను, కథయన్తః=చెప్పుకొనుచు, సంప్రహృష్టాః=సంతోషించినవారై, అన్యోన్యమ్=పరస్పరము, పరిష్వజానాశ్చ = కౌగలించుకొనుచు, యయుః = వెళ్ళిరి.

తా. పట్టణములోని జను లందరూ ఈ విధముగా మంచి మాటలు చెప్పుకొనుచు, సంతోషముతో ఒండొరులను కౌగలించుకొనుచు వెళ్ళిరి. 10

మూ. యే చ తత్రాపరే సర్వే సమ్మతా యే చ నైగమాః,
రామం ప్రతి యయుర్హృష్టాః సర్వాః ప్రకృతయస్తథా.

ప్ర. అ. తత్ర = అక్కడ, యే = ఏ, అపరే = ఇతరులైన, సంమతాః = రాజప్రియు లున్నారో, యే = ఏ, నైగమాః=వర్తకుల సంఘములకు చెందిన వారు కలరో వారూ, తథా = మరియు, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః= ప్రకృతులూ, హృష్టాః=సంతోషించినవారై, రామమ్=రాముని గూర్చి, యయుః = వెళ్ళిరి.

తా ఆ పట్టణములోని రాజకుటుంబమునకు దగ్గరగా ఉండేవారూ, వర్తకుల సంఘములకు చెందినవారూ, సమస్తమైన ప్రకృతులూ సంతోషించుచు రాముని చూచుటకై వెళ్ళిరి. 11

మూ. మణికారాశ్చ యే కేచిత్కుమ్భకారాశ్చ శోభనాః,
సూత్రకర్మకృతశ్చైవ యే చ శస్త్రోపజీవినః. 12

మాయూరకాః క్రాకచికా రోచకా వేధకా స్తథా,
దన్తకారాః సుధాకారా స్తథా గన్ధోపజీవినః. 13

సువర్ణకారాః ప్రఖ్యాతా స్తథా కమ్బళధావకాః,
స్నాపకోష్ణోదకా వైద్యా ధూపకాః శౌణ్డికా స్తథా. 14

రజకాస్తున్నవాయాశ్చ గ్రామఘోషమహత్తరాః,
శైలూషాశ్చ సహ స్త్రీభిర్యయుః కైవర్తకా స్తథా. 15

ప్ర. అ. యే = ఏ, కేచిత్ = కొందరు, మణికారాః = రత్నములు సాన బట్టువారూ, శోభనాః = మంచి, కుమ్భకారాశ్చ = కుంభములు చేయువారూ, యే = ఏ, శస్త్రోపజీవినః = ఆయుధములతో జీవించువారూ, సూత్రకర్మకృతశ్చైవ = దారము పని చేయువారూ, మాయూరకాః = నెమలిపింఛములతో అలంకరణము చేయవారూ, క్రాకచికాః = రంపము పనిచేయువారూ, రోచకాః = అలంకరణములు చేయువారూ. వేధకాః = రంధ్రములు చేయువారూ, తథా = మరియు, దన్తకరాః = దంతపు పని చేయువారూ, సుధాకారాః = వెల్లలు వేయువారూ, తథా = మరియు, గన్ధోపజీవినః = సుగంధవస్తువులను తయారుచేసి జీవించువారూ, ప్రఖ్యాతాః = ప్రసిద్ధమైన, సువర్ణకారాః = కంసాలులు, తథా = మరియు, కమ్బలధావకాః = కంబళ్లు ఉతికేవారూ, స్నాపకోష్ణోదకాః = స్నానము చేయించేవారూ, వేడినీళ్లు ఇచ్చేవారూ, వైద్యాః = వైద్యులూ, శౌణ్డికాః = మద్యము తయారుచేయువారూ, ధూపకాః = సుగంధధూపము వేయువారు, రజకాః = చాకళ్లు, తున్నవాయాశ్చ = కుట్టుపనులు చేయువారూ, గ్రామఘోషమహత్తరాః = గ్రామాలలోను, గొల్లపల్లెలలోను ఉండు పెద్దవారూ, స్త్రీభిః సహ = స్త్రీలతో కూడిన, శైలూషాః = నటులు, తథా = మరియు, కైవర్తకాః = చేపలు పట్టేవారూ, ఉన్నారో వారందరూ, యయుః = వెళ్ళిరి.

తా. భరతుని వెంట, రత్నములు సానపట్టువారు, అందమైన కుండలు తయారు చేయువారు, సాలెవారు, ఆయుధములతో జీవించువారు, నెమళ్ళ వాళ్ళు, రంపపు పని చేయువారూ, అలంకరణము చేయువారూ, రంధ్రములు

చేయువారూ, దంతపుపని చేయువారు, వెల్ల వేయువారు లేదా సున్నము పని చేయువారూ, సుగంధద్రవ్యములు చేసి జీవించేవారు, ప్రసిద్ధు లైన కంసాలులూ, కంబళ్లు ఉతికేవారూ, స్నానాలు చేయించేవారూ, వేన్నీళ్లు అందించేవారూ, వైద్యులూ, సుగంధధూపములు వేయువారూ, మద్యము తయారుచేయువారూ, చాకళ్లూ, కుట్టుపనివారూ, గ్రామాలకు గొల్లపల్లెలకు చెందిన పెద్దలూ, స్త్రీ సహితు లైన నటులు, చేపలు పట్టేవాళ్లూ వెళ్ళిరి. 12-15

మూ. సమాహితా వేదవిదో బ్రాహ్మణా వృత్తసంమతాః,
గోరథైర్భరతం యాన్తమనుజగ్ముః సహస్రశః. 16

ప్ర. అ. సమాహితాః = నిశ్చల మైన మనస్సు కలవారూ, వృత్త సంమతాః = మంచి నడవడికచేత పూజ్యులు అయిన, వేదవిదః = వేదవేత్త లైన, సహస్రశః = వేలకొలది, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, యాన్తమ్ = వెళ్లుచున్న, భరతమ్ = భరతుని, గోరథైః = ఎండ్ల బండ్లచేత, అనుజగ్ముః = అనుసరించి వెళ్ళిరి.

తా. నిశ్చల మైన మనస్సు కలవారూ, మంచి నడవడికచేత పూజ్యులూ, వేదవేత్తలూ అయిన వేలకొలది బ్రాహ్మణులు భరతుని వెనుక మెల్లగా ఎడ్ల బండ్లెక్కి వెళ్ళిరి. 16

మూ. సువేషాః శుద్ధవసనాస్తామ్రమృష్టానులేపనాః,
సర్వే తే వివిధైర్యానైః శనైర్భరతమన్వయుః. 17

ప్ర. అ. సువేషాః = మంచి వేషములు కలవారూ, శుద్ధవసనాః = మంచి వస్త్రములు కలవారూ, తామ్రమృష్టానులేపనాః = ఎఱ్ఱని శుద్ధ మైన మైపూతలు కలవారూ అయిన, తే సర్వే = వారందరు, వివిధైః = అనేకవిధము లైన, యానైః = వాహనములతో, భరతమ్ = భరతుని, అన్వయుః = అనుసరించి వెళ్ళిరి.

తా. వారందరు మంచి వేషములు పరిశుద్ధ మైన వస్త్రములు ధరించి ఎఱ్ఱగా ఉన్న మంచి సుగంధద్రవ్యముల అనులేపములను శరీరములకు పూసి కొని, అనేకవిధము లైన వాహనము లెక్కి ఆ భరతుని మెల్లగా అనుసరించి వెళ్ళిరి. 17

మూ. ప్రహృష్టముదితా సేనా సాన్వయాత్కైకయీసుతమ్,
భ్రాతురానయనే యాన్తం భరతం భ్రాతృవత్సలమ్. 18

ప్ర. అ. ప్రహృష్టముదితా = ఎక్కువ సంతోషించి ఆనందించుచున్న, సా సేనా = ఆ సేన, భ్రాతుః = సోదరుని యొక్క, ఆనయనే = తీసికొని వచ్చుటకై, యాన్తమ్ = వెళ్లుచున్న, కైకయీసుతమ్ = కైకేయి కుమారుడైన, భ్రాతృవత్సలమ్ = సోదరునిపై ప్రేమ గల, భరతమ్ = భరతుని, అన్వయాత్ = అనుసరించి వెళ్ళెను.

తా. మిక్కిలి సంతోషించుచు ఆనందించుచున్న ఆ సేన సోదరునిపై ప్రేమతో అతనిని తిరిగి తీసికొనివచ్చుటకై వెళ్ళుచున్న, కైకేయీపుత్రుడైన భరతుని వెంట వెళ్ళెను. 18

మూ. తే గత్వా దూరమధ్వానం రథయానాశ్వకుఞ్జరైః,
సమాసేదుస్తతో గఙ్గాం శృఙ్గిబేరపురం ప్రతి, 19

యత్ర రామసఖో వీరో గుహో జ్ఞాతిగణైర్వృతః,
నివసత్యప్రమాదేన దేశం తం పరిపాలయన్. 20

ప్ర. అ. తే = వారు, రథయానాశ్వకుఞ్జరైః = రథములు, బండ్లు, గుఱ్ఱములు, ఏనుగులు వీటిపై, దూరమ్ = దూరమైన, అధ్వానమ్ = మార్గమును, గత్వా = ప్రయాణము చేసి, తతః = పిమ్మట, రామసఖః = రాముని మిత్రుడైన, వీరః = వీరుడైన, గుహః = గుహుడు, జ్ఞాతిగణైః = జ్ఞాతుల సముదాయములతో, వృతః = కూడినవాడై, తమ్ = ఆ, దేశమ్ = ప్రదేశమును, అప్రమాదేన = ఏమరిపాటు లేకుండగా, పరిపాలయన్ = పాలించుచు, యత్ర = ఎక్కడ, నివసతి = నివసించుచున్నాడో అట్టి, శృఙ్గిబేరపురం ప్రతి = శృంగిబేరపురము వైపున ఉన్న, గఙ్గామ్ = గంగను, సమాసేదుః = చేరిరి.

తా. వారందరూ రథముల పైన, బండ్ల పైన, గుఱ్ఱముల పైన, గజముల పైన చాలదూరము ప్రయాణము చేసి వెళ్ళి, రాముని మిత్రుడూ, వీరుడూ అయిన గుహుడు తన బంధువులతో కలిసి ఆ ప్రాంతము నంతను ఏమరిపాటు లేకుండ పరిపాలించుచు నివసించుచున్న శృంగిబేరపురము దగ్గర గంగానదిని సమీపించిరి. 19, 20

మూ. ఉపేత్య తీరం గఙ్గాయాశ్చక్రవాకైరలఙ్కృతమ్,
వ్యవాతిష్ఠత సా సేనా భరతస్యానుయాయినీ. 21

ప్ర. అ. భరతస్య అనుయాయినీ = భరతుని వెనుకనే ప్రయాణము చేయుచున్న. సా సేనా = ఆ సేన, చక్రవాకైః = చక్రవాకపక్షులచేత, అలఙ్కృతమ్ = అలంకరించబడిన, గఙ్గాయాః = గంగయొక్క, తీరమ్ = తీరమును, ఉపేత్య = సమీపించి, వ్యవాతిష్ఠత = నిలచెను.

తా. భరతుని వెనుకనే ప్రయాణము చేయుచున్న ఆ సేన, చక్రవాక పక్షులతో అందముగా ఉన్న గంగాతీరమును చేరి అక్కడ నిలచెను. 21

మూ. నిరీక్ష్యానుగతాం సేనాం తాం చ గఙ్గాం శివోదకామ్,
భరతః సచివాన్ సర్వానబ్రవీద్వాక్యకోవిదః. 22

ప్ర. అ. అనుగతామ్ = అనుసరించి వచ్చిన, సేనామ్ = సేనను, శివోదకామ్ = మంగళప్రద మైన ఉదకముగల. తాం గఙ్గాం చ = ఆ గంగానదినీ, నిరీక్ష్య = చూచి, వాక్యకోవిదః = మాటలయందు నేర్పరి యైన, భరతః = భరతుడు, సర్వాన్ = సమస్త మైన, సచివాన్ = మంత్రులను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. తన వెనుక వచ్చిన సేనను, ముందున్న ఆ పవిత్రోదక మైన గంగను చూచి, మాటలలో నేర్పరి యైన భరతుడు అమాత్యు లందరితో ఇట్లు పలికెను. 22

మూ. నివేశయత మే సైన్యమభిప్రాయేణ సర్వతః,
విశ్రాన్తాః ప్రతరిష్యామః శ్వ ఇదానీమిమాం నదీమ్. 23

ప్ర. అ. మే సైన్యమ్ = నా సైన్యమును, అభిప్రాయేణ = మీ అభిప్రాయము ననుసరించి. సర్వతః = అంతటను, నివేశయత = విడియునట్లు చేయండి. ఇదానీమ్ = ఇప్పుడు, విశ్రాన్తాః = విశ్రాంతి తీసికొన్న వార మై, నదీమ్ = నదిని, శ్వః = రేపు, ప్రతరిష్యామః = దాటెదము.

తా. మీ సౌకర్యమును అనుసరించి సైన్యమును ఆ యా స్థానములందు విడిది చేయించండి. ఈనాడు విశ్రాంతి తీసికొని రేపు ఈ గంగానదిని దాటెదము.

మూ. దాతుం చ తావదిచ్ఛామి స్వర్గతస్య మహీపతేః,
ఔర్ధ్వదేహనిమిత్తార్థమవతీర్యోదకం నదీమ్. 24

ప్ర. అ. నదీమ్ = నదిని, అవతీర్య = దిగి, స్వర్గతస్య = స్వర్గస్థు డైన, మహీపతేః = రాజుయొక్క, ఔర్ధ్వదేహనిమిత్తార్థమ్ = పైలోకములో శరీరము కొరకు, ఉదకమ్ = ఉదకమును, దాతుమ్ చ = ఇచ్చుటకు కూడ, ఇచ్ఛామి తావత్ = కోరుచున్నాను.

తా. నేను ఈ గంగానదిలో దిగి, స్వర్గస్థు డైన నా తండ్రిగారికి పారలౌకిక శరీరమునందు సుఖము కలుగుటకై, జలతర్పణములు చేయవలె నని కూడ కోరుచున్నాను. 24

మూ. తస్యైవం బ్రువతోఽమాత్యాస్తథేత్యుక్త్వా సమాహితాః,
న్యవేశయంస్తాం ఛన్దేన స్వేన స్వేన పృథక్ పృథక్.

ప్ర. అ. తస్య = అతడు, ఏవమ్ = ఇట్లు, బ్రువతః = చెప్పుచుండగా, అమాత్యాః = మంత్రులు, తథేతి = అట్లే అని, ఉక్త్వా = పలికి, సమాహితాః = సావధానచిత్తు లై, తామ్ = ఆ సేనను, స్వేన స్వేన = తన తన, ఛన్దేన=ఇచ్ఛ చేత, పృథక్ పృథక్ = వేరువేరుగా, న్యవేశయన్ = నిలిపిరి.

తా. భరతుని మాటలు విన్న ఆ అమాత్యులు "అట్లే చేసెదము" అని పలికి తమ తమ ఇష్టము ప్రకారము ఆ సేనను వేరు వేరుగా అచ్చటచ్చట నిలిపిరి.

మూ. నివేశ్య గఙ్గామను తాం మహానదీం
చమూం విధానైః పరిబర్హశోభినీమ్,
ఉవాస రామస్య తదా మహాత్మనో
విచిన్తయానో భరతో నివర్తనమ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్ర్యశీతితమః సర్గః.

ప్ర. అ. భరతః = భరతుడు, పరిబర్హశోభినీమ్=వివిధము లైన ఉపకరణములతో ప్రకాశించుచున్న, చమూమ్= సేనను, తామ్ = ఆ, మహానదీమ్=

మహానది యైన, గఙ్గామ్ అను=గంగను అనుసరించి, విధానైః=తగు ఏర్పాట్లతో, నివేశ్య=విడిది చేయించి, తదా=అప్పుడు, మహాత్మనః = మహాత్ముడైన, రామస్య=రాముని యొక్క, నివర్తనమ్= మరల్పుటను, విచిన్తయానః =ఆలోచించుచు, ఉవాస = నివసించెను.

తా. భరతుడు అనేకవిధములైన ఉపకరణములతో శోభించుచున్న ఆ సేనను ఆ గంగామహానది వెంబడి విడిది చేయించి, మహాత్ముడైన రాముని ఎట్లు వెనుకకు తీసుకొని రావలెనా అని ఆలోచించుచుండెను. 26

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఎనుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతురశీతితమః సర్గః

[నిషాదరాజగు గుహుడు తన బంధువులను నదివద్ద కావలి యుండి యుద్ధసన్నద్ధులు కండని ఆజ్ఞాపించుట. స్వాగత సత్కార సామగ్రితో భరతుని కడకేగుట. ఆతిథ్యము స్వీకరింపుమని భరతుని కోరుట].

మూ. తతో నివిష్టాం ధ్వజినీం గఙ్గామన్వాశ్రితాం నదీమ్,
నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీన్ సన్త్వరితోఽబ్రవీత్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నిషాదరాజః = గుహుడు, గఙ్గాం నదీమ్ = గంగానదిని, అన్వాశ్రితామ్ = అనుసరించి ఆశ్రయించిన, నివిష్టామ్ = విడిదిచేసి ఉన్న, ధ్వజినీమ్ = సేనను, దృష్ట్వైవ = చూడగనే, సన్త్వరితః = తొందర పడుచు, జ్ఞాతీన్ = బంధువులను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. గంగానది పొడవున విడిసి యున్న ఆ సైన్యమును చూడగానే గుహుడు తొందరపడుచు తన బంధువులతో ఇట్లనెను. 1

మూ. మహతీయమితః సేనా సాగరాభా ప్రదృశ్యతే,
నాస్యాన్తమధిగచ్ఛామి మనసాపి విచిన్తయన్. 2

ప్ర. అ. ఇతః = ఇటు వైపు, సాగరాభా = సముద్రమువంటి, ఇయమ్ = ఈ, మహతీ = గొప్ప, సేనా = సేన. ప్రదృశ్యతే = చూడబడుచున్నది. మనసా = మనస్సుతో, విచిన్తయన్నపి = ఆలోచించినను, అస్యాః = ఈ సేనయొక్క అన్తమ్ = అంతమును, నాధిగచ్ఛామి = (నేను) పొందుటలేదు.

తా. ఇటు వైపు సముద్రము వలె విశాలమైన గొప్ప సేన, ఇదిగో, కనబడుచున్నది. ఇది ఎంత ఉన్నదో నా ఊహకు కూడా అందుట లేదు. 2

మూ. యథా తు ఖలు దుర్బుద్ధిర్భరతః స్వయమాగతః,
స ఏష హి మహాకాయః కోవిదారధ్వజో రథే. 3

ప్ర. అ. దుర్బుద్ధిః=దుర్బుద్ధి గల, భరతః = భరతుడు, స్వయమ్ = స్వయముగా, యథా తు ఆగతః ఖలు=వచ్చి నట్లున్నది కదా? సః = ప్రసిద్ధ మైన, మహాకాయః=గొప్ప ఆకారము గల, కోవిదారధ్వజః = కోవిదారవృక్ష చిహ్నిత మైన ధ్వజము, ఏషః = ఇదిగో, రథే హి = రథముపై ఉన్నది కదా!

తా. పెద్ద ఆకారము గల కోవిధారవృక్షము రథముపై ఉన్న ధ్వజము మీద కనబడుచున్నది. దుర్బుద్ధి యైన భరతుడే స్వయముగా వచ్చినట్లు కనబడుచున్నది. 3

మూ. బన్ధయిష్యతి వా దాశానథ వాస్మాన్వధిష్యతి,
అథ దాశరథిం రామం పిత్రా రాజ్యాద్వివాసితమ్. 4

సంపన్నాం శ్రియమన్విచ్ఛంస్తస్య రాజ్ఞః సుదుర్లభామ్,
భరతః కైకయీపుత్రో హన్తుం సమధిగచ్ఛతి. 5

ప్ర. అ. కైకయీపుత్రః = కైకేయి కుమారు డైన, భరతః = భరతుడు, దాశాన్=పల్లెవాళ్ళను. బన్ధయిష్యతి=బంధింపచేయునా? అథవా=లేక, అస్మాన్ = మనలను, వధిష్యతి=చంపునా? అథ=లేక, తస్య రాజ్ఞః=ఆ రాజుయొక్క, సంపన్నామ్=సమృద్ధ మైన, సుదుర్లభామ్=చాల దుర్లభమైన, శ్రియమ్=రాజ్య లక్ష్మిని, అన్విచ్ఛన్=కోరుచు, పిత్రా= =తండ్రిచేత, రాజ్యాత్ = రాజ్యము నుండి, వివాసితమ్= వెడలగొట్టబడిన, దాశరథిమ్=దశరథకుమారు డైన, రామమ్=రాముని, హన్తుమ్ = చంపుటకు, సమధిగచ్ఛతి=వచ్చుచున్నాడా!

తా. కైకేయీకుమారు డైన ఈ భరతుడు ఇక్కడ ఉన్న పల్లె వారి నందరిని బంధించుటకై వచ్చినాడా! లేదా మనలను చంపుటకై వచ్చినాడా! లేదా చాల దుర్లభ మైన దశరథుని సుసమృద్ధ మైన రాజ్యలక్ష్మిని వశము చేసుకొన వలె నను ఉద్దేశ్యముతో తండ్రిచే అరణ్యవాసమునకు పంపబడిన రాముని చంపుటకై వచ్చుచున్నాడా! 4, 5

మూ. భర్తా చైవ సఖా చైవ రామో దాశరథిర్మమ,
తస్యార్థకామాః సన్నద్ధా గఙ్గానూపే ప్రతిష్ఠత. 6

ప్ర. అ. దాశరథిః=దశరథకుమారుడైన, రామః = రాముడు, మమ= నాయొక్క, భర్తా చైవ=ప్రభువు. సఖా చైవ=మిత్రుడూ కూడ. తస్య=ఆ రాముని యొక్క, అర్థకామాః = ప్రయోజనమునందు కోరిక గలవారై, గఙ్గానూపే=గంగానదీసమీపమునందు, ప్రతిష్ఠత = ఉండుడు.

తా. దశరథకుమారుడైన రాముడు నాకు ప్రభువు మాత్రమే కాదు, నా మిత్రుడు కూడ. అందుచేత అతని ప్రయోజనమును కాపాడుటకై సన్నద్ధులై గంగాతీరప్రాంతమునందు నిలచి ఉండుడు. 6

మూ. తిష్ఠన్తు సర్వే దాశాశ్చ గఙ్గామన్వాశ్రితా నదీమ్,
బలయుక్తా నదీరక్షా మాంసమూలఫలాశనాః. 7

ప్ర. అ. మాంసమూలఫలాశనాః=మాంసమును, మూలములను, ఫలములను తినుచు, నదీరక్షాః = నదిని రక్షించు, సర్వే=సమస్తమైన, దాశాశ్చ= పల్లెవారు కూడ, బలయుక్తాః=తమ సైన్యముతో కూడినవారై, గఙ్గాం నదీమ్ = గంగానదిని, అన్వాశ్రితాః=అనుసరించి స్థానము నేర్పరచుకొన్నవారై, తిష్ఠన్తు = ఉందురు గాక.

తా. మాంసమును, దుంపలను ఫలములను తినుచు నదిని రక్షించుచుండు పల్లెవారందరు తమ సైన్యముతో, గంగానది వెంబడినే నిలచి ఉండవలెను.

మూ. నావాం శతానాం పఞ్చానాం కైవర్తానాం శతం శతమ్,
సన్నద్ధానాం తథా యూనాం తిష్ఠన్త్విత్యభ్యచోదయత్. 8

ప్ర. అ. పఞ్చానామ్=ఐదు, శతనామ్ = శతముల, నావామ్ = నావలయొక్క. సన్నద్ధానామ్ = సిద్ధముగా ఉన్న, తథా=మరియు, యూనామ్ =యువకులైన, కైవర్తానామ్ = మత్స్యగ్రాహుల, శతం శతమ్=నూరుచొప్పున, తిష్ఠన్తు = నిలచి ఉండెదరు గాక, ఇతి = అని, అభ్యచోదయత్ = ప్రేరేపించెను.

తా. ఐదువందల నావలలో ఒక్కొక్కదానిపై నూరుగురు చొప్పున

యువకులైన కైవర్తులు కవచాదులు ధరించి సిద్ధముగా ఉండవలెను అని ప్రేరేపించెను. 8

మూ. యదాఽదుష్టస్తు భరతో రామస్యేహ భవిష్యతి,
సేయం స్వస్తిమతీ సేనా గఙ్గామద్య తరిష్యతి. 9

ప్ర. అ. భరతః = భరతుడు, ఇహ = ఇచ్చట (ఇప్పుడు), రామస్య = రాముని విషయమునందు, అదుష్టః = దుష్టుడు కానివాడుగా, యదా తు = ఎప్పుడు భవిష్యతి = అగునో అప్పుడు, సా ఇయమ్ = అట్టి ఈ, సేనా = సేన, అద్య = ఇప్పుడు, స్వస్తిమతీ = క్షేమము కలదై, గఙ్గామ్ = గంగను, తరిష్యతి = దాటగలదు.

తా. భరతునకు రాముని విషయమున దుష్టబుద్ధి లేదని తెలిసిన పిమ్మటనే ఈ సేన సుఖముగా గంగానదిని దాటగలదు. 9

మూ. ఇత్యుక్త్వోపాయనం గృహ్య మత్స్యమాంసమధూని చ
అభిచక్రామ భరతం నిషాదాధిపతిర్గుహః. 10

ప్ర. అ. గుహః = గుహుడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, మత్స్యమాంసమధూని = మత్స్యములను మాంసమును తేనెను, ఉపాయనమ్ = ఉపాయనమునుగా గృహ్య = గ్రహించి, భరతమ్ = భరతుని, అభిచక్రామ = సమీపించెను.

తా. గుహుడు ఈ విధముగా పలికి, మత్స్యములను, మాంసమును, తేనెను భరతునకు ఉపాయనముగా తీసికొని వెళ్ళెను.

మూ. తమాయాన్తం తు సంప్రేక్ష్య సూతపుత్రః ప్రతాపవాన్,
భరతాయాచచక్షేఽథ వినయజ్ఞో వినీతవత్. 11

ప్ర. అ. అథ = అటు పిమ్మట, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడు, వినయజ్ఞః = వినయమును ఎఱిగినవాడు అయిన, సూతపుత్రః = సుమంత్రుడు, ఆయాన్తమ్ = వచ్చుచున్న, తమ్ = అతనిని, సంప్రేక్ష్య = చూచి, వినీతవత్ = వినీతుడై, భరతాయ = భరతునకు, ఆచచక్షే = చెప్పెను.

తా. ప్రతాపవంతుడు వినయముగా ఎట్లు ప్రవర్తించవలెనో తెలిసిన

వాడూ అయిన సుమంత్రుడు వచ్చుచున్న గుహుని చూచి వినయపూర్వకముగా భరతునకు చెప్పెను. 11

మూ. ఏష జ్ఞాతిసహస్రేణ స్థపతిః పరివారితః,
కుశలో దణ్డకారణ్యే వృద్ధో భ్రాతుశ్చ తే సఖా. 12

ప్ర. అ. జ్ఞాతిసహస్రేణ=వేయిమంది జ్ఞాతులచేత, పరివారితః = చుట్టువారు కొనబడిన, ఏషః=ఈ, స్థపతిః=ప్రభు వైన గుహుడు, దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, కుశలః=నేర్పుకలవాడు. వృద్ధః=పెద్దవాడు. తే=నీయొక్క, భ్రాతుః=సోదరునకు, సఖా చ=మిత్రుడు కూడా.

తా వేయిమంది బంధువులతో కలిసి వచ్చిన ఈ గుహుడు దండకారణ్యముతో చాల పరిచయము కలవాడు; వయస్సు కలవాడు; నీ సోదరు డైన రామునకు మిత్రుడు కూడ 12

మూ. తస్మాత్ పశ్యతు కాకుత్స్థ త్వాం నిషాదాధిపో గుహః.
అసంశయం విజానీతే యత్ర తౌ రామలక్ష్మణౌ. 13

ప్ర. అ. కాకుత్స్థ = ఓ భరతా ! తస్మాత్ = ఆ కారణమువలన, నిషాదాధిపః = నిషాదప్రభు వైన, గుహః = గుహుడు, త్వామ్ = నిన్ను, పశ్యతు= చూచుగాక. తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు,యత్ర=ఎక్కడ ఉన్నారో, అసంశయమ్ = నిశ్చయముగా, విజానీతే = ఎరుగును.

తా. భరతా ! ఆ కారణము చేత, నిషాదాధిపు డైన ఈ గుహునకు దర్శన మిమ్ము. రామలక్ష్మణు లెక్కడ ఉన్నారో ఇతనికి తప్పక తెలిసి ఉండును. 13

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా సుమన్త్రాద్భరతః శుభమ్,
ఉవాచ వచనం శీఘ్రం గుహః పశ్యతు మామితి. 14

ప్ర. అ. భరతః = భరతుడు, సుమన్త్రాత్ = సుమంత్రునినుండి, ఏతత్= ఈ, శుభమ్ = మంచి, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, గుహః = గుహుడు, శీఘ్రమ్ = శీఘ్రముగా, మామ్ = నన్ను, పశ్యతు = చూచుగాక, ఇతి = అని, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. భరతుడు శుభకరము లైన సుమంత్రుని మాటలు విని "వెంటనే గుహుని నావద్దకు తీసికొని రండి" అని పలికెను. 14

మూ. లబ్ధ్వాఽభ్యనుజ్ఞాం సంహృష్టో జ్ఞాతిభిః పరివారితః,
ఆగమ్య భరతం ప్రహ్వో గుహో వచనమబ్రవీత్. 15

ప్ర. అ. గుహః = గుహుడు, అభ్యనుజ్ఞామ్ = అనుజ్ఞను, లబ్ధ్వా=పొంది, సంహృష్టః = సంతోషించినవాడై, జ్ఞాతిభిః = జ్ఞాతులచేత, పరివారితః=చుట్టువారు కొనబడినవాడై, ఆగమ్య = సమీపించి, ప్రహ్వః = వినీతు డై, భరతమ్= భరతుని గూర్చి, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. గుహుడు భరతుని అనుజ్ఞ లభించుటచే సంతోషించుచు, తన జ్ఞాతి వర్గముతో భరతుని సమీపించి సవినయముగా ఇట్లు పలికెను. 15

మూ. నిష్కుటశ్చైవ దేశోఽయం వఞ్చితాశ్చాపి తే వయమ్,
నివేదయామస్తే సర్వే స్వకే దాసకులే వస. 16

ప్ర. అ. అయమ్ = ఈ, దేశః = ప్రదేశము, తే = నీకు, నిష్కుటః = ఇంటి వెనుక ఉన్న ఉద్యానము వంటిది. వయమ్ = మేము, వఞ్చితాశ్చాపి = లొంగి ఉన్న వారము. తే = అట్టి, సర్వే = మేమందరము, నివేదయావః = తెలుపుచున్నాము. దాసకులే = దాసుని గృహమునందు, వస = నివసించుము.

తా. ఈ ప్రదేశము నీ గృహోద్యానమువంటిది. మేము నీకు లొంగియుండే మనుష్యులము. ఇది నీ దాసుని గృహము. దీనిలో నీ ఇచ్ఛానుసారము నివసింపు మని మే మందరము కోరుచున్నాము. 16

మూ. అస్తి మూలం ఫలం చైవ నిషాదైః సముదాహృతమ్.
ఆర్ద్రం చ మాంసం శుష్కం చ వన్యం చోచ్చావచం మహత్.

ప్ర. అ. నిషాదైః = బోయవారిచేత, సముదాహృతమ్ = తీసికొనిరాబడిన, మూలమ్ = మూలము, ఫలం చైవ = ఫలము, వన్యమ్ = వనసంబంధ మైన, ఆర్ద్రమ్ = పచ్చిదీ, శుష్కం చ =ఎండుదీ, ఉచ్చావచమ్ = అనేకవిధము లైన, మహత్ = గొప్ప, మాంసం చ = మాంసమూ, అస్తి = ఉన్నది.

తా. ఇక్కడ దుంపలు, ఫలములు, బోయవారు తీసికొనివచ్చిన అనేక విధము లైన చాల అధిక మైన పచ్చిమాంసము, ఎండు మాంసము ఉన్నవి. 17

మూ. ఆశంసే స్వాశితా సేనా వత్స్యతీమాం విభావరీమ్,
అర్చితో వివిధైః కామైః శ్వః ససైన్యో గమిష్యసి. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతురశీతితమః సర్గః.

ప్ర. అ. సేనా = సేన, స్వాశితా = బాగుగా భుజించినదై, ఇమామ్ = ఈ, విభావరీమ్ = రాత్రి, వత్స్యతి = నివసించగలదు అని, ఆశంసే = కోరుచున్నాను. వివిధైః = అనేకవిధము లైన, కామైః = కోరదగిన పదార్థములతో, అర్చితః = పూజింపబడినవాడ వై, శ్వః = రేపు, ససైన్యః = సైన్యముతో కూడినవాడవై, గమిష్యసి = వెళ్ళగలవు.

తా. నీ సైన్యము సుఖముగా భుజించి ఈ రాత్రి ఇక్కడనే నివసించు నని అనుకొనుచున్నాను. వివిధపదార్థములను సమర్పించి మేము చేయు సపర్యలను అందుకొని నీవు సేనాసమేతుడ వై రేపు వెళ్ళవచ్చును. 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఎనుబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చాశీతితమః సర్గః

[గుహభరత సంవాదము. భరతుని శోకము.]

మూ. ఏవముక్తస్తు భరతో నిషాదాధిపతిం గుహమ్,
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో వాక్యం హేత్వర్థసంహితమ్. 1

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధి గల, భరతః = భరతుడు, నిషాదాధిపతిమ్=బోయల ప్రభు వైన, గుహమ్ = గుహుని గూర్చి, హేత్వర్థసంహితమ్ = యుక్తులతోను మంచి అర్థముతోను కూడిన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మహాబుద్ధిశాలి యైన భరతుడు ఆ మాటలు విని, నిషాదాధిపతి యైన గుహునితో యుక్తియుక్తము, మంచి అర్థము కలదీ అయిన వాక్యము పలికెను. 1

మూ. ఊర్జితః ఖలు తే కామః కృతో మమ గురోః సఖే,
యో మే త్వమీదృశీం సేనామేకోఽభ్యర్చితుమిచ్ఛసి. 2

ప్ర. అ. మమ = నాయొక్క, గురోః = అన్నగారియొక్క, సఖే = మిత్రుడా, యః = ఏ, త్వమ్ = నీవు, ఏకః = ఒక్కడవే, ఈదృశీమ్ = ఇట్టి, సేనామ్ = సేనను, అభ్యర్చితుమ్ = పూజించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, తే = అట్టి నీయొక్క, కృతః = చేయబడిన, కామః=కోరిక, ఊర్జితః ఖలు=చాల గొప్పది కదా!

తా. మా అన్నగారి మిత్రుడ వైన ఓ గుహుడా! ఇంత సేనకు నీవొక్కడవే ఆతిథ్య మీయ వలె నని కోరుచున్నావు; నీ అభిలాష ఎంత గొప్పది! 2

మూ. ఇత్యుక్త్వా తు మహాతేజా గుహం వచనముత్తమమ్,
అబ్రవీద్భరతః శ్రీమాన్ నిషాదాధిపతిం పునః. 3

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, శ్రీమాన్=శ్రీమంతు డైన, భరతః = భరతుడు, గుహమ్=గుహుని గూర్చి, ఉత్తమమ్=ఉత్తమ మైన, వచనమ్=వచనమును, ఉక్త్వా తు=పలికి, పునః=తిరిగి, నిషాదాధిపతిమ్=ఆ నిషాద రాజును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజఃశాలి, శ్రీమంతుడూ అయిన భరతుడు గుహునితో ఇట్లు పలికి, మరల ఆతనితో ఇట్లనెను. ३

మూ. కతరేణ గమిష్యామి భరద్వాజాశ్రమం గుహ,
గహనోఽయం భృశం దేశో గఙ్గానూపో దురత్యయః. 4

ప్ర. అ. గుహ = ఓ గుహుడా! కతరేణ = ఏ మార్గముచేత, భరద్వాజాశ్రమమ్=భరద్వాజుని ఆశ్రమమును గూర్చి, గమిష్యామి = వెళ్ళగలను? గంగానూపః = గంగాజలమయ మైన, అయమ్ = ఈ, దేశః = ప్రదేశము, భృశమ్= మిక్కిలి, గహనః = ప్రవేశింప శక్యము కానిది. దురత్యయః = దాట శక్యము కానిది.

తా. ఓ గుహుడా! జలముతో నిండిన ఈ గంగాతీరప్రాంతము ప్రవేశింప శక్యము కానిది; దాటుటకు కష్ట మైనది. నేను ఏ మార్గమున భరద్వాజాశ్రమమునకు వెళ్ళవలెనో చెప్పుము. 4

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం గుహో గహనగోచరః. 5

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతు డైన, తస్య = ఆ, రాజపుత్రస్య = రాజకుమారునియొక్క, తత్ వచనమ్=ఆ మాటను, శ్రుత్వా=విని, గహనగోచరః =అరణ్యములో సంచరించు, గుహః=గుహుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ధీమంతు డైన ఆ భరతుని మాటలు విని, అరణ్యసంచారి యైన ఆ గుహుడు, చేతులు జోడించి ఇట్లు పలికెను. 5

మూ. దాశాస్త్వానుగమిష్యన్తి ధన్వినః సుసమాహితాః,
అహం త్వానుగమిష్యామి రాజపుత్ర మహాయశః. 6

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర = రాజకుమారా ! ధన్వినః = ధనుర్ధరులైన, దాశాః = పల్లెవారు, సుసమాహితాః = బాగుగా సావధాన మనస్కులై, త్వా = నిన్ను, అనుగమిష్యన్తి = అనుసరించగలరు. అహమ్ = నేను కూడ, త్వా = నిన్ను, అనుగమిష్యామి = అనుసరించి వెళ్ళెదను.

తా. కీర్తిమంతుడవైన రాజకుమారా! ఈ దాశులు, ధనుర్ధారులై, జాగరూకులై నీ వెనుక వచ్చెదరు. నేను కూడ వచ్చెదను. 6

మూ. కచ్చిన్న దుష్టో వ్రజసి రామస్యాక్లిష్టకర్మణః,
ఇయం తే మహతీ సేనా శఙ్కాం జనయతీవ మే. 7

ప్ర. అ. అక్లిష్టకర్మణః = శ్రమ లేకుండ పనులు చేయు, రామస్య = రాముని విషయమునందు, దుష్టః = చెడ్డవాడవై, న వ్రజసి కచ్చిత్ = నీవు వెళ్లుట లేదు కదా. మహతీ = గొప్పదైన, తే = నీయొక్క, ఇయం సేనా = ఈ సేన, మే = నాకు, శఙ్కామ్ = శంకను, జనయతీవ = పుట్టించుచున్నట్లున్నది.

తా. నీవు, శ్రమపడకుండ పనులు చేయ గల రామునికి కీడు తలపెట్టి అచటికి వెళ్లుటలేదు కదా ! నీ విశాలసైన్యమును చూడగా నాకు శంక కలుగుచున్నది. 7

మూ. తమేవమభిభాషన్తమాకాశ ఇవ నిర్మలః,
భరతః శ్లక్ష్ణయా వాచా గుహం వచనమబ్రవీత్. 8

ప్ర. అ. ఆకాశః ఇవ = ఆకాశము వలె, నిర్మలః = నిర్మలుడైన, భరతః = భరతుడు, ఏవమ్ = ఇట్లు, అభిభాషన్తమ్ = మాటలాడుచున్న, తం గుహమ్ = ఆ గుహుని గూర్చి, శ్లక్ష్ణయా = మృదువైన, వాచా = మాటతో, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆకాశము వలె నిర్మలుడైన భరతుడు ఈ విధముగా మాటలాడు చున్న గుహునితో మృదువుగా ఇట్లనెను. 8

మూ. మా భూత్స కాలో యత్కష్టం న మాం శఙ్కితుమర్హసి,
రాఘవః స హి మే భ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః. 9

ప్ర. అ. యత్ = ఏ కాలమునందు, కష్టమ్ = కష్టము కలుగునో, సః కాలః = అట్టి కాలము, మా భూత్ = కలగకుండుగాక. మామ్ = నన్ను, శఙ్కితుమ్ = శంకించుటకు, నార్హసి = తగవు. మే = నాయొక్క, జ్యేష్ఠః = పెద్ద, భ్రాతా = సోదరుడైన, సః రాఘవః = ఆ రాముడు, పితృసమః = తండ్రితో సమానుడుగా, మతః హి = అంగీకరింపబడినవాడు కదా!

తా. రాముని విషయమున అపచారము తలపెట్టు దుష్కాలము ఎన్నడును రాకుండుగాక. నా జ్యేష్ఠసోదరుడైన ఆ రాముడు నాకు తండ్రి వంటివాడుకదా!

మూ. తం నివర్తయితుం యామి కాకుత్థ్సం వనవాసినమ్,
బుద్ధిరన్యా న తే కార్యా గుహ సత్యం బ్రవీమి తే. 10

ప్ర. అ. వనవాసినమ్ = వనములో నివసించుచున్న, తమ్ = ఆ, కాకుత్థ్సమ్ = రాముని, నివర్తయితుమ్ = వెనుకకు మరల్చుటకై, యామి = వెళ్లుచున్నాను. గుహ = ఓ గుహుడా! తే = నీకు (నీచేత), అన్యా = మరి యొక, బుద్ధిః = బుద్ధి, న కార్యా = చేయదగినది కాదు. తే = నీకు, సత్యమ్ = సత్యమును, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. వనములో నివసించుచున్న ఆ రాముని వెనుకకు తీసికొనివచ్చుటకై వెళ్లుచున్నాను. ఓ గుహుడా! నీవు మరొకవిధముగా తలవకుము, సత్యము చెప్పుచున్నాను. 10

మూ. స తు సంహృష్టవదనః శ్రుత్వా భరతభాషితమ్,
పునరేవాబ్రవీద్వాక్యం భరతం ప్రతి హర్షితః. 11

ప్ర. అ. భరతభాషితమ్ = భరతుని మాటను, శ్రుత్వా = విని, సంహృష్టవదనః = వికసించిన ముఖముగల, సః తు = ఆ గుహుడైతే, హర్షితః = సంతోషించినవాడై, భరతం ప్రతి = భరతుని గూర్చి, పునరేవ = మరల, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ గుహుడు భరతుని మాటలు విని, సంతోషించి, వికసించిన ముఖముతో, మరల అతనితో ఇట్లు పలికెను. 11

మూ. ధన్యస్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే,
అయత్నాదాగతం రాజ్యం యస్త్వం త్యక్తుమిహేచ్ఛసి.

ప్ర. అ. యః త్వమ్ = ఏ నీవు, ఇహ = ఇప్పుడు, అయత్నాత్ = అప్ర యత్నముగా, ఆగతమ్ = లభించిన, రాజ్యమ్ = రాజ్యమును, త్యక్తుమ్ = విడచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, త్వమ్ = అట్టి నీవు, ధన్యః = ధన్యుడవు, త్వయా = నీతో, తుల్యమ్ = సమాన మైనవానిని, జగతీతలే = ఈ భూలోకము నందు, న పశ్యామి = (నేను) చూచుటలేదు.

తా. అప్రయత్నముగా లభించిన రాజ్యమును కూడ విడచివేయ వలె నని కోరుచున్నావు; నా కీ లోకములో నీవంటివాడు ఎవ్వడును కనబడుటలేదు. 12

మూ. శాశ్వతీ ఖలు తే కీర్తిర్లోకాననుచరిష్యతి,
యస్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యానయితుమిచ్ఛసి. 13

ప్ర. అ. యః త్వమ్ = ఏ నీవు, కృచ్ఛ్రగతమ్ = కష్టాలలో ఉన్న, రామమ్ = రాముని, ప్రత్యానయితుమ్ = తిరిగి తీసికొనివచ్చుటకై, ఇచ్ఛసి = కోరుచున్నావో, తే = అట్టి నీయొక్క, శాశ్వతీ = శాశ్వత మైన, కీర్తిః = కీర్తి, లోకాన్ = లోకములను (అందు), అనుచరిష్యతి = సంచరించగలదు.

తా. కష్టాలలో ఉన్న రాముని తిరిగి వెనుకకు తీసికొని రావలె నని కోరుచున్న నీ కీర్తి శాశ్వతముగా లోకములలో వ్యాపించగలదు. 13

మూ. ఏవం సంభాషమాణస్య గుహస్య భరతం తదా,
బభౌ నష్టప్రభః సూర్యో రజనీ చాభ్యవర్తత. 14

ప్ర. అ. తదా = అపుడు, గుహస్య = గుహుడు, ఏవం = ఇట్లు, భరతం = భరతుని గూర్చి, సంభాషమాణస్య = మాటలాడుచుండగా, సూర్యః = సూర్యుడు, నష్టప్రభః = తగ్గిన కాంతి కలవాడై, బభౌ = ప్రకాశించెను. రజనీ చ = రాత్రి కూడ, అభ్యవర్తత = వచ్చెను.

తా. గుహుడు ఈ విధముగ భరతునితో మాటలాడుచుండగా, సూర్యుని కాంతి తగ్గెను. ఇంతలో రాత్రి కూడ వచ్చెను. 14

మూ. సంనివేశ్య స తాం సేనాం గుహేన పరితోషితః,
శత్రుఘ్నేన సహ శ్రీమాన్ శయనం సముపాగమత్. 15

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, సః=ఆతడు, తాం సేనాం=ఆ సేనను, సన్నివేశ్య=విడియచేసి, గుహేన=గుహునిచేత, పరితోషితః=సంతోషింపచేయబడినవాడై, శత్రుఘ్నేన సహ=శత్రుఘ్నునితో కూడ, శయనం=శయనమును, సముపాగమత్=పొందెను.

తా. శ్రీమంతుడైన ఆ భరతుడు సేనను తగు విధముగా విడియచేసి, గుహుని సేవలకు సంతోషించుచు, శయనించెను. శత్రుఘ్నుడు కూడ శయనించెను. 15

మూ. రామచిన్తామయః శోకో భరతస్య మహాత్మనః,
ఉపస్థితో హ్యనర్హస్య ధర్మప్రేక్షస్య తాదృశః. 16

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడు, ధర్మప్రేక్షస్య=ధర్మదృష్టికలవాడు, అనర్హస్య=అట్టి శోకమునకు తగనివాడు అయిన, భరతస్య=భరతునకు, తాదృశః=అట్టి, రామచిన్తామయః=రాముని గూర్చిన చింతయనెడు, శోకః=శోకము, ఉపస్థితః హి =వచ్చినది కదా.

తా. మహాత్ముడు, ధర్మదృష్టి కలవాడు, అట్టి శోకమునకు తగనివాడు అయిన ఆ భరతునకు రాముని గూర్చిన విచారము అను శోకము కలిగెను. 16

మూ. అన్తర్దాహేన దహనః సంతాపయతి రాఘవమ్,
వనదాహాభిసంతప్తం గూఢోఽగ్నిరివ పాదపమ్. 17

ప్ర. అ. వనదాహాభిసంతప్తం=వనము కాలిపోవుటచే ఎండిపోయిన, పాదపం=వృక్షమును, గూఢః=దాగి యున్న, అగ్నిరివ=అగ్ని వలె, రాఘవమ్=భరతుని, దహనః=దుఃఖాన్ని, అంతర్దాహేన=లోలోన కాల్చివేయుటచే సన్తాపయతి=తపింపచేయుచున్నది.

తా. అడవి కాలిపోయి నపుడు శుష్కించిన వృక్షమును లోపల దాగియున్న అగ్ని కాల్చివేసి నట్లు భరతుని దుఃఖాగ్ని లోలోన తపింపచేయుచు బాధ పెట్టెను. 17

మూ. ప్రసృతః సర్వగాత్రేభ్యః స్వేదం శోకాగ్నిసంభవమ్,
యథా సూర్యాంశుసంతప్తో హిమవాన్ ప్రసృతో హిమమ్.

ప్ర. అ. సూర్యాంశుసంతప్తః=సూర్యకిరణములచే తపింపచేయబడిన, హిమవాన్=హిమవత్పర్వతము, యథా=ఎట్లు, హిమం=మంచును, ప్రస్రుతః= కార్చెనో, అట్లు, సర్వగాత్రేభ్యః=సమస్త అవయవములనుండి, శోకాగ్ని సంభవమ్=శోకాగ్ని వలన కలిగిన, స్వేదమ్=చెమటను, ప్రస్రుతః=కార్చినాడు.

తా. సూర్యుని కిరణములచే వేడెక్కిన హిమవత్పర్వతమునుండి మంచు కారు నట్లు అతని అన్ని అవయవములనుండి శోకాగ్నివలన పుట్టిన చెమట కారు చుండెను. 18

మూ. ధ్యాననిర్దరశైలేన వినిఃశ్వసితధాతునా,
దైన్యపాదపసంఘేన శోకాయాసాధిశృఙ్గిణా.
ప్రమోహానన్తసత్త్వేన సంతాపౌషధివేణునా,
ఆక్రాన్తో దుఃఖశైలేన మహతా కైకయీసుతః. 20

ప్ర. అ. కైకయీసుతః=కైకేయికొడుకైన భరతుడు, ధ్యాననిర్దరశైలేన =ధ్యాన మనెడు భేదింప శక్యము గాని శిలాసముదాయము కలది, వినిఃశ్వసిత ధాతునా=నిట్టూర్పు లనెడు ధాతువులు కలది, దైన్యపాదపసంఘేన=దైన్య మనెడు వృక్షసముదాయముకలది. శోకాయాసాధిశృఙ్గిణా=శోకము, ఆయాసము, మనోవ్యథ యనెడు శిఖరములు కలది, ప్రమోహానన్తసత్త్వేన=ప్రమోహ మనెడు అనేక మృగములు కలది, సంతాపౌషధివేణునా=సంతాపము అనెడు ఓషధులు వేణువు కలది అయిన, మహతా=గొప్ప, దుఃఖశైలేన=దుఃఖ మనెడు పర్వ తము చేత, ఆక్రాన్తః=ఆక్రమించబడినాడు.

తా. దుఃఖ మనెడు మహాశైలము ఆ భరతుని ఆక్రమించెను. ఏదియో ఆలోచించుటే ఆ పర్వతమునందలి భేదింపరాని శిలలు. నిట్టూర్పులే ధాతువులు. దైన్యమే వృక్షసముదాయము. శోకము, ఆయాసము, మనస్తాపము అనునవే దాని శిఖరములు. మోహమే అనంతమైన జంతుసముదాయము. సంతాపమే దానిపై నున్న ఓషధులు, వేణువులు (వెదురుకర్రలు). 19-20

మూ. వినిశ్శ్వసన్నేవ భృశదుర్మనాస్తతః,
ప్రమూఢసంజ్ఞః పరమాపదం గతః,

శమం న లేభే హృదయజ్వరార్దితో
నరర్షభో యూథహతో యథర్షభః. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నరర్షభః=నరులలో శ్రేష్ఠుడైన ఆ భరతుడు, వినిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, భృశదుర్మనాః=మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు కలవాడై, ప్రమూఢసంజ్ఞః=మూఢమైన బుద్ధి కలవాడై, పరమాపదం =గొప్ప ఆపదను, గతః = పొందినవాడై, హృదయజ్వరార్దితః = హృదయజ్వరముచే పీడితుడై, యూథహతః=తన గుంపుచే కొట్టబడిన, ఋషభః యథా = ఋషభము వలె, శమం = శాంతిని, న లేభే = పొందలేదు

తా. అపుడు నరులలో శ్రేష్ఠుడైన ఆ భరతుడు, దుఃఖపీడితమైన మనస్సుతో నిట్టూర్చుచు, ఏమి చేయవలెనో తోచక గొప్ప ఆపదలో చిక్కుకొని హృదయజ్వరముచే పీడితుడై తన గుంపులోని వృషభములచే పీడింపబడిన వృషభము వలె, మనశ్శాంతిని పొందలేక పోయెను. 21

మూ. గుహేన సార్ధం భరతః సమాగతో
మహానుభావః సజనః సమాహితః,
సుదుర్మనాస్తం భరతం తదా పున
ర్గుహః సమాశ్వాసయదగ్రజం ప్రతి. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచాశీతితమః సర్గః.

ప్ర. అ. మహానుభావః = గొప్ప ప్రభావము కల, సజనః = పరివారజనముతో కూడిన, భరతః = భరతుడు, సమాహితః = ఏకాగ్రచిత్తుడై, గుహేన సార్ధం = గుహునితో కూడ, సమాగతః = కలిసినాడు. తదా = అప్పుడు, సుదర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు గల, గుహః = గుహుడు, తం భరతమ్ = ఆ భరతుని, పునః = మరల, అగ్రజం ప్రతి = అన్నగారిని గూర్చి, ఆశ్వాసయత్ = ఓదార్చెను.

తా. మహానుభావుడైన ఆ భరతుడు ఏకాగ్రచిత్తుడై (రాముని తలచుచు) పరివారసహితుడై గుహుని చేరియుండెను. అపుడు దుఃఖార్తుడైన ఆ గుహుడు భరతుని అన్నగారి విషయమున మరల ఓదార్చెను.

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున అయోధ్యాకాండలో ఎనుబదియైదవసర్గ సమాప్తము.

# అథ షడశీతితమః సర్గః

[నిషాదరాజు గుహుడు లక్ష్మణుని యుత్తమస్వభావమును విలాపమును వర్ణించుట].

మూ. ఆచచక్షేఽథ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః,
భరతాయాప్రమేయాయ గుహో గహనగోచరః. 1

ప్ర. అ. అథ = పిమ్మట, గహనగోచరః = అరణ్యనివాసి యైన, గుహః = గుహుడు, అప్రమేయాయ = ఊహింపశక్యము గాని, (గుణములు గల), భరతాయ = భరతునకు, మహాత్మనః = మహాత్ము డైన, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, సద్భావం = మంచితనమును గూర్చి, ఆచచక్షే = చెప్పెను.

తా. అప్పుడు అరణ్యనివాసి యైన ఆ గుహుడు అప్రమేయగుణములు గల భరతునకు మహాత్ముడైన లక్ష్మణుని, భ్రాతృభక్తి మొదలగు సద్గుణములను గూర్చి చెప్పెను. 1

మూ. తం జాగ్రతం గుణైర్యుక్తం శరచాపాసిధారిణమ్,
భ్రాతృగుప్త్యర్థమత్యన్తమహం లక్ష్మణమబ్రవమ్. 2

ప్ర. అ. అహమ్ = నేను, భ్రాతృగుప్త్యర్థమ్ = సోదరుని రక్షణకొరకు, అత్యన్తమ్ = మిక్కిలి, జాగ్రతమ్ = మేల్కొని యున్న, శరచాపాసిధారిణమ్ = శరములను, ధనస్సును, ఖడ్గమును ధరించిన, గుణైః = సద్గుణములతో, యుక్తమ్ = కూడిన, తం లక్ష్మణమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, అబ్రవమ్ = పలికితిని.

తా. సద్గుణవంతు డైన లక్ష్మణుడు శరచాపఖడ్గములను ధరించి సోదరుని రక్షకై పూర్తిగా మేల్కొని యుండెను. అట్టి లక్ష్మణునితో నేను యిట్లంటిని.

మూ. ఇయం తాత సుఖా శయ్యా త్వదర్థముపకల్పితా,
ప్రత్యాశ్వసిహి శేష్వాస్యాం సుఖం రాఘవనన్దన. 3

ప్ర. అ. రాఘవనన్దన = రఘువంశమునందు జనించిన వారలకు ఆనందమును కల్గించువాడా! తాత = తండ్రీ లక్ష్మణా! సుఖా = సుఖకరమైన, ఇయమ్ = ఈ, శయ్యా = శయ్య, త్వదర్థమ్ = నీ కొరకై, ఉపకల్పితా = కల్పింపబడినది. ప్రత్యాశ్వసిహి = నమ్మకము కలవాడ వగుము. అస్యామ్ = దీనిపై, సుఖమ్ = సుఖముగా, శేష్వ = శయనింపుము.

తా. తండ్రీ లక్ష్మణా! సుఖకర మైన ఈ శయ్యను నీకోసమే ఏర్పరచితిమి. ఏట్టి భయము లేక దీనిపై సుఖముగా శయనించుము. 3

మూ. ఉచితో౽యం జనః సర్వో దుఃఖానాం త్వం సుఖోచితః,
ధర్మాత్మంస్తస్య గుప్త్యర్థం జాగరిష్యామహే వయమ్. 4

ప్ర. అ. ధర్మాత్మన్ = ఓ ధర్మాత్ముడా! అయమ్ = ఈ, సర్వః = సమస్త మైన, జనః = జనము, దుఃఖానామ్ = దుఃఖములకు, ఉచితః = అలవడినది. త్వమ్ = నీవు, సుఖోచితః = సుఖమునకు అలవాటుపడినవాడవు. తస్య = రామునియొక్క, గుప్త్యర్థమ్ = రక్షణముకొరకు, వయమ్ = మేము, జాగరిష్యామహే = మేల్కొనెదము.

తా. ఓ ధర్మాత్మా! మే మందరము కష్టపడుటకు అలవాటుపడినవారము. నీవు సుఖమునకు అలవాటుపడినవాడవు. రాముని రక్షించుటకై మేము మేల్కొని ఉండెదము. 4

మూ. న హి రామాత్ప్రియతరో మమాస్తి భువి కశ్చన,
మోత్సుకో౽భూర్బ్రవీమ్యేతదథ సత్యం తవాగ్రతః. 5

ప్ర. అ. మమ = నాకు, భువి = ఈ భూలోకమునందు, రామాత్ = రామునికంటె, ప్రియతరః = ఎక్కువ ప్రియ మైనవాడు, కశ్చన = ఎవ్వడును, నాస్తి హి = లేడు కదా! అథ = అటుపై (అందువలన), ఉత్సుకః = బెంగ పెట్టుకొన్నవాడవు, మా భూః = కాకుము. తవ = నీయొక్క, అగ్రతః = ఎదుట, ఏతత్ = ఈ, సత్యమ్ = సత్య మైన, వాక్యమ్ = వాక్యమును, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. ఈ భూలోకములో నాకు రాముని కంటె ప్రియ మైనవాడు ఎవ్వడును లేడు. అందుచే నీ వేమియు భయపడకుము. నీ యెదుట సత్యమే చెప్పుచున్నాను. 5

మూ. అస్య ప్రసాదాదాశంసే లోకేఽస్మిన్ సుమహద్యశః,
ధర్మావాప్తిం చ విపులామర్థకామౌ చ కేవలౌ. 6

ప్ర. అ. అస్య = ఈ రామునియొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అస్మిన్ లోకే = ఈ లోకమునందు, సుమహత్ = చాలా గొప్ప దైన, యశః = కీర్తిని, విపులామ్ = అధిక మైన, ధర్మావాప్తిం చ = ధర్మలాభమును, కేవలౌ = పరిశుద్ధ మైన, అర్థకామౌ చ = అర్థకామములను, ఆశంసే = పొందగోరుచున్నాను.

తా. రాముని అనుగ్రహమువలన ఈ లోకములో గొప్ప కీర్తిని, అధికమైన ధర్మమును పరిశుద్ధ మైన అర్థకామములను పొందవలె నని కోరుకొనుచున్నాను.

మూ. సోఽహం ప్రియసఖం రామం శయానం సహ సీతయా,
రక్షిష్యామి ధనుష్పాణిః సర్వైః స్వైర్జ్ఞాతిభిస్సహ. 7

ప్ర. అ. సః = అట్టి, అహం = నేను, సర్వైః = సమస్త మైన, స్వైః = నా సంబంధ మైన, జ్ఞాతిభిః సహ = బంధువులతో కూడినవాడనై, సీతయా సహ = సీతతో కూడ, శయానమ్ = శయనించిన, ప్రియసఖమ్ = ప్రియమిత్రు డైన, రామమ్ = రాముని, రక్షిష్యామి = రక్షించెదను.

తా. అట్టి నేను నా బంధువులతో కలసి ధనుస్సు చేత ధరించి నిద్రించుచున్న సీతారాములను రక్షించెదను. 7

మూ. న హి మేఽవిదితం కించిద్వనేఽస్మిన్ చరతః సదా,
చతురఙ్గం హ్యపి బలం ప్రసహేమ వయం యుధి. 8

ప్ర. అ. అస్మిన్ = ఈ, వనే = వనమునందు, సదా = ఎల్లప్పుడు, చరతః సంచరించుచున్న. మే = నాకు, అవిదితమ్ = తెలియబడనది, కించిత్ = ఏదియు. న హి = లేదు కదా! వయమ్ = మేము, యుధి = యుద్ధమునందు, చతురఙ్గం బలమ్ అపి = చతురంగసేనను కూడ, ప్రసహేమ హి = సహింపగలము కదా!

తా. ఎల్లపుడు ఈ వనములో సంచరించుచున్న నాకు తెలియని దేదీ ఇక్కడ లేదు. చతురంగసైన్యమును కూడా మేము యుద్ధములో ఎదిరించ గలము. 8

మూ. ఏవమస్మాభిరుక్తేన లక్ష్మణేన మహాత్మనా,
అనునీతా వయం సర్వే ధర్మమేవానుపశ్యతా. 9

ప్ర. అ. ఏవం=ఇట్లు, అస్మాభిః=మాచేత, ఉక్తేన=పలకబడిన, మహాత్మనా=మహాత్ముడైన. ధర్మమేవ=ధర్మమునే. అనుపశ్యతా=చూచుచున్న, లక్ష్మణేన=లక్ష్మణునిచే, వయమ్=మేము, సర్వే=అందరము, అనునీతాః=బతిమాలుకొనబడితిమి.

తా. మా మాటలు విని మహాత్ముడైన లక్ష్మణుడు ధర్మైకదృష్టితో ఇట్లనెను. 9

మూ. కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితం వా సుఖాని వా. 10

ప్ర. అ. దాశరథౌ=రాముడు, సీతయా సహ=సీతతో కూడ, భూమౌ=నేలపై, శయానే=శయనించి ఉండగా, మయా=నాచేత, నిద్రా=నిద్ర, లబ్ధుమ్=పొందుటకై, కథమ్=ఎట్లు, శక్యా=శక్యమైనది. జీవితం వా=జీవితము కాని, సుఖాని వా=సుఖములు కాని (పొందుటకు ఎట్లు శక్య మగును).

తా. రాముడు సీతాసహితుడై నేలపై శయనించి ఉండగా నాకు నిద్ర ఎట్లు వచ్చును. జీవితము కాని సుఖములు కాని ఎట్లు నిలుచును. 10

మూ. యో న దేవాసురైః సర్వైః శక్యః ప్రసహితుం యుధి,
తం పశ్య గుహ సంవిష్టం తృణేషు సహ సీతయా. 11

ప్ర. అ. గుహః=ఓ గుహుడా! యః=ఏ రాముడు, సర్వైః=సమస్తమైన, దేవాసురైః=దేవాసురులచేత, యుధి=యుద్ధమునందు, ప్రసహితుం=సహించుటకు, న శక్యః=శక్యమైనవాడు కాడో, తమ్=అట్టి, సీతయా సహ=సీతతో కూడ, తృణేషు=తృణములపై, సంవిష్టమ్=శయనించి ఉన్న రాముని, పశ్య=చూడుము.

తా. ఓ గుహుడా! దేవాసురు లందరును కలిసి గూడ ఏ రాముని యుద్ధమునందు ఎదుర్కొనజాలరో అట్టి రాముడు సీతాసమేతుడై తృణములపై శయనించినాడు. చూడుము. 11

మూ. మహతా తపసా లబ్ధో వివిధైశ్చ పరిశ్రమైః,
ఏకో దశరథస్యైష పుత్రః సదృశలక్షణః. 12

ప్ర. అ. ఏషః=ఇతడు, మహతా=గొప్ప, తపసా=తపస్సుచేతను, వివిధైః=అనేకవిధము లైన, పరిశ్రమైశ్చ= కష్టములచేతను, లబ్ధః=పొంద బడిన, దశరథస్య=దశరథునియొక్క, ఏకః = ముఖ్యు డైన, సదృశలక్షణః =సమానము లైన లక్షణములు గల, పుత్రః = కుమారుడు.

తా. ఈ రాముడు దశరథునితో సమానము లైన లక్షణములు గల ముఖ్యమైన కుమారుడు గొప్ప తపస్సుచేసి, అనేకవిధము లైన కష్టములు సహించి దశరథుడు ఇతనిని పొందగలిగినాడు. 12

మూ. అస్మిన్ ప్రవ్రజితే రాజా న చిరం వర్తయిష్యతి,
విధవా మేదినీ నూనం క్షిప్రమేవ భవిష్యతి. 13

ప్ర. అ. అస్మిన్=ఇతడు, ప్రవ్రజితే = ప్రవాసమునకు వెళ్ళినవా డగు చుండగా, రాజా=రాజు, చిరమ్=చిరకాలము, న వర్తయిష్యతి=జీవింపడు. నూనమ్=నిశ్చయముగ. మేదినీ = భూమి, క్షిప్రమేవ=శీఘ్రముగానే, విధవా= భర్త లేనిది, భవిష్యతి = కాగలదు.

తా. రాముడు ప్రవాసమునకు వెళ్ళిన పిమ్మట దశరథమహారాజు చిర కాలము జీవింపడు. ఈ భూమి అచిరకాలములో తప్పక వైధవ్యము పొందగలదు.

మూ. వినద్య సుమహానాదం శ్రమేణోపరతాః స్త్రియః,
నిర్ఘోషో విరతో నూనమద్య రాజనివేశనే. 14

ప్ర. అ. స్త్రియః = స్త్రీలు, సుమహానాదమ్ = గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినద్య = అఱచి, శ్రమేణ = శ్రమచేత, ఉపరతాః = విరమించినారు. అద్య = ఇపుడు, రాజనివేశనే = రాజగృహమునందు, నిర్ఘోషః = ధ్వని, నూనమ్ = తప్పక, విరతః = నిలిచిపోయినది.

తా. అంతఃపురస్త్రీలు బిగ్గరగా అరచి అరచి అలసట చెంది ఏడ్పును మానివేసియుందురు. ఇపుడు ఆ రాజగృహములో ఆర్తధ్వని నిలిచిపోయి ఉండును. 14

మూ. కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ,
నాశంసే యది జీవేయుః సర్వే తే రజనీమిమామ్. 15

ప్ర. అ. కౌసల్యా చైవ = కౌసల్య, రాజా చ = రాజు, తథైవ=మరియు, మమ జననీ = నా తల్లి, తే సర్వే = వారందరు, ఇమామ్ = ఈ, రజనీమ్ = రాత్రిని (రాత్రియందు), యది జీవేయుః=జీవింతురా అని, నాశంసే=తలపను.

తా. కౌసల్యాదేవి, దశరథమహారాజు, నా తల్లి యైన సుమిత్రాదేవి, వీరందరు ఈ రాత్రి జీవించి గడపగల రను విశ్వాసము నాకు లేదు. 15

మూ. జీవేదపి చ మే మాతా శత్రుఘ్నస్యాన్వవేక్షయా,
దుఃఖితా యా తు కౌసల్యా వీరసూర్వినశిష్యతి. 16

ప్ర. అ. మే మాతా=నా తల్లి, శత్రుఘ్నస్య=శత్రుఘ్నునియొక్క, అన్వవేక్షయా=చూచుటచేత, జీవేదపి చ = జీవించవచ్చునేమో. వీరసూః = వీరుని కన్న, యా=యే, కౌసల్యా=కౌసల్య ఉన్నదో, సా తు=ఆమెయైతే, దుఃఖితా=దుఃఖితురాలై, వినశిష్యతి=మరణించగలదు.

తా. శత్రుఘ్నుని చూచుకొనుచు నా తల్లి జీవించి యుండవచ్చునేమో ; కాని వీరమాత యైన కౌసల్యాదేవి మాత్రము దుఃఖితురాలై మరణించును. 16

మూ. అతిక్రాన్తమతిక్రాన్తమనవాప్య మనోరథం,
రాజ్యే రామమనిక్షిప్య పితా మే వినశిష్యతి. 17

ప్ర. అ. మే పితా=నా తండ్రి, అతికాన్తమ్ అతికాన్తమ్=ఒకదాని వెనుక ఒకటిగా గడచిపోయిన, మనోరథమ్ = మనోరథమును, అనవాప్య = పొందక, రాజ్యే=రాజ్యమునందు, రామమ్ = రాముని, అనిక్షిప్య = ఉంచలేక వినశిష్యతి = మరణించును.

తా. నా తండ్రి యైన దశరథమహారాజు, ఒకదాని వెనుక ఒకటిగా ఏ మనోరథమును సఫలము చేసుకొనలేక రాముని రాజ్యాభిషిక్తుని చేయజాలక పోవుటచే మరణించును. 17

మూ. సిద్ధార్థాః పితరం వృత్తం తస్మిన్కాలే హ్యుపస్థితే,
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యన్తి భూమిపమ్. 18

ప్ర. అ. తస్మిన్కాలే = ఆ కాలము, ఉపస్థితే = వచ్చిన దగుచుండగా, వృత్తమ్ = మరణించిన, పితరమ్ = తండ్రి యైన, భూమిపమ్ = దశరథమహారాజును, సర్వేషు = సమస్త మైన, ప్రేతకార్యేషు = ప్రేతకార్యములయందు, (యే = ఎవరు) సంస్కరిష్యన్తి = సంస్కరింపగలరో వారు, సిద్ధార్థాః = కృతార్థులు.

తా. ఆ సమయము వచ్చినపుడు మరణించిన తండ్రి యైన దశరథ మహారాజునకు ప్రేతకార్యము లన్నియు చేసి సంస్కరింపగలిగిన భరతశత్రుఘ్నాదులు కృతార్థులు. 18

మూ. రమ్యచత్వరసంస్థానాం సువిభక్తమహాపథామ్,
హర్మ్యప్రాసాదసంపన్నాం సర్వరత్నవిభూషితామ్. 19

గజాశ్వరథసంబాధాం తూర్యనాదవినాదితామ్,
సర్వకల్యాణసంపూర్ణాం హృష్టపుష్టజనాకులామ్. 20

ఆరామోద్యానసంపూర్ణాం సమాజోత్సవశాలినీమ్,
సుఖితా విచరిష్యన్తి రాజధానీం పితుర్మమ. 21

ప్ర. అ. రమ్యచత్వరసంస్థానామ్ = అంద మైన ముంగిళ్ళ ఏర్పాట్లు కలది, సువిభక్తమహాపథామ్ = చక్కగా వేరుచేయబడిన రాజమార్గములుకలది, హర్మ్యప్రాసాదసంపన్నామ్ = ధనికుల గృహములతోను, ప్రాసాదములతోను నిండినది, సర్వరత్నవిభూషితామ్ = అన్ని రత్నములచే అలంకరింపబడినది, గజాశ్వరథసంబాధామ్ = గజములచేత, అశ్వములచేత, రథములచేత, ఇరుకైనది, తూర్యనాదవినాదితామ్ = తూర్యధ్వనులచే ధ్వనింపచేయబడినది, సర్వకల్యాణసంపూర్ణామ్ = సమస్త మైన మంగళములతో నిండినది, హృష్టపుష్టజనాకులామ్ = సంతోషించినవారై పరిపుష్టులై ఉన్న జనులతో నిండినది, ఆరామోద్యానసంపూర్ణామ్ = గృహారామములతోను, ఉద్యానములతోను నిండినది, సమాజోత్సవశాలినీమ్ = సమాజములయొక్క ఉత్సవములతో ప్రకాశించుచున్నది అయిన, మమ పితుః = నా తండ్రియొక్క, రాజధానీమ్ = రాజధానిని (యందు), సుఖితాః = సుఖవంతులై, విచరిష్యన్తి = సంచరించగలరు.

తా. వా రందరు మా తండ్రిగారి రాజధానిలో, సుఖముగా సంచరించగలరు. ఆ రాజధానిలోని ముంగిళ్ళు చక్కగా ఏర్పరపబడి యుండును. విశాల

మైన రాజమార్గములు పనికుల గృహములు, ప్రాసాదములు, ఆ నగరమునం దంతటను ఉన్నవి. అన్ని విధము లైన రత్నములచే. ఆ నగరము అలంకృత మై ఉండును. ఏనుగలతోను అశ్వములతోను రథములతోను కిక్కిరిసియుండును. అక్కడ తూర్యనాదములు మారుమ్రోగుచుండును. సకలవిధము లైన మంగళ ములు సంపూర్ణముగా నుండును. ఆ నగరము పరిపుష్టులై సంతోషించుచున్న జనులతో నిండి యుండును. ఇంటి వెనుక నుండు చిన్న చిన్న ఆరామములు, విశాలము లైన ఉద్యానములు, ఆ నగరమునందు అంతటను ఉండును. జనులు సమాజములుగా ఏర్పడి ఉత్సవములు చేసుకొనుచుందురు. 21

మూ. అపి సత్య ప్రతిజ్ఞేన సార్ధం కుశలినా వయం,
నివృత్తే సమయే హ్యస్మిన్ సుఖితాః ప్రవిశేమహి. 22

ప్ర. అ. వయం=మేము, అస్మిన్=ఈ, సమయే=నిర్ణీత మైన కాలము, నివృత్తే=గడవగా, సత్యప్రతిజ్ఞేన=సత్యమైన ప్రతిజ్ఞ గల, కుశలినా సార్ధం= క్షేమము గల రామునితో కూడ, సుఖితాః=సుఖవంతుల మై, అపి ప్రవిశేమహి =అయోధ్యలో ప్రవేశించెదమా !

తా. ఈ గడువు గడచిన పిమ్మట ప్రతిజ్ఞను పాలించి క్షేమముగా నున్న రామునితో కలిసి మేము సుఖముగా అయోధ్యలో ప్రవేశింపగలుగుదుమా : 22

మూ. పరిదేవయమానస్య తస్యైవం సుమహాత్మనః,
తిష్ఠతో రాజపుత్రస్య శర్వరీ సాత్యవర్తత. 23

ప్ర. అ. సుమహాత్మనః=చాలా గొప్ప దైన మనస్సు కలవాడు, ఏవం= ఈ విధముగ, పరిదేవయమానస్య=విలపించుచున్నవాడూ అయిన, తస్య=ఆ, రాజపుత్రస్య=రాజపుత్రుడు, తిష్ఠతః = నిలిచి యుండగానే, సా శర్వరీ=ఆ రాత్రి, అత్యవర్తత=గడచిపోయినది.

తా. మహాత్ము డైన ఆ రాజపుత్రుడు ఈ విధముగా విలపించుచు నిలచి ఉండగానే ఆ రాత్రి గడచిపోయినది. 23

మూ. ప్రభాతే విమలే సూర్యే కారయిత్వా జటా ఉభౌ,
అస్మిన్ భాగీరథీతీరే సుఖం సంతారితౌ మయా. 24

ప్ర. అ. విమలే=నిర్మలు డైన, సూర్యే = సూర్యుడు. ప్రభాతే = ప్రకాశించగా, ఉభౌ = వారిరువురు, అస్మిన్ = ఈ, భాగీరథీతీరే=గంగాతీరమునందు, జటాః=జటలను, కారయిత్వా=చేయించి, మయా=నాచేత, సుఖమ్=సుఖముగా, సంతారితౌ = దాటింపబడినారు.

తా. మరునాడు సూర్యోదయానంతరము వారిద్దరు ఈ గంగాతీరమున జటలను కట్టించుకొనిరి. నేను వారిని సుఖముగా ఈ నది దాటించితిని. 24

మూ. జటాధరౌ తౌ ద్రుమచీరవాససౌ
మహాబలౌ కుంజరయూథపోపమౌ,
వరేషుచాపాసిధరౌ పరంతపౌ
వ్యపేక్షమాణౌ సహ సీతయా గతౌ. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షడశీతితమః స్సర్గః.

ప్ర. అ. జటాధరౌ = జటలను ధరించినవారు, ద్రుమచీరవాససౌ = వృక్షముల బెరళ్లు వస్త్రములుగా గలవారు, మహాబలౌ = గొప్ప బలము కలవారు, కుంజరయూథపోపమౌ = ఏనుగల గుంపుల నాయకులతో సమానులు, వరేషుచాపాసిధరౌ = శ్రేష్ఠము లైన బాణములను ధనుస్సులను ఖడ్గములను ధరించినవారు అయిన, తౌ = ఆ, పరంతపౌ = శత్రుపీడకు లైన రామలక్ష్మణులు, వ్యపేక్షమాణౌ = జాగరూకతతో చూచుకొనుచు, సీతయా సహ=సీతతో కూడ, గతౌ = వెళ్ళినారు.

తా. శత్రుసంహారకులు, మహాబలశాలురు గజరాజులతో సమానులూ అయిన, ఆ రామలక్ష్మణులు జటాధారు లై నారచీరలు కట్టుకొని శ్రేష్ఠము లైన బాణములను, ధనుస్సులను, ఖడ్గములను ధరించి జాగరూకతతో సీతాసమేతు లై వెళ్ళిపోయినారు. 25

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఎనుబదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తాశీతితమః సర్గః

[భరతుడు మూర్ఛిల్లుటచే గుహుడు, శత్రుఘ్నుడు, తల్లులును దుఃఖించుట. తెలివినొంది భరతుడు గుహుని రామాదుల భోజనము, శయనము మున్నగు విషయములను గూర్చి ప్రశ్నించుట. గుహు డా ప్రశ్నలకు బదులు పలుకుట.]

మూ. గుహస్య వచనం శ్రుత్వా భరతో భృశమప్రియమ్,
ధ్యానం జగామ తత్రైవ యత్ర తచ్ఛ్రుతమప్రియమ్. 1

ప్ర. అ. భరతః = భరతుడు, భృశమ్ = మిక్కిలి, అప్రియం=అప్రియ మైన, గుహస్య=గుహునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా=విని, తత్ = ఆ, అప్రియమ్ = అప్రియవచనము, యత్ర = ఎచట, శ్రుతమ్=వినబడెనో, తత్రైవ = అచటనే, ధ్యానమ్=ఆలోచనను, జగామ = పొందెను.

తా. భరతుడు గుహుని చాల అప్రియ మైన ఆ వాక్యమును విని ఆ అప్రియవాక్యమును విన్నచోటనే కూర్చుండిపోయి ఆలోచింపదొడగెను. 1

మూ. సుకుమారో మహాసత్త్వః సింహస్కన్ధో మహాభుజః,
పుణ్డరీకవిశాలాక్ష స్తరుణః ప్రియదర్శనః. 2

ప్రత్యాశ్వస్య ముహూర్తం తు కాలం పరమదుర్మనాః,
పపాత సహసా తోత్త్రైర్హృతివిద్ధ ఇవ ద్విపః. 3

ప్ర. అ. సుకుమారః = సుకుమారుడు, మహాసత్త్వః = గొప్ప బలముకల వాడు, సింహస్కన్ధః=సింహము వంటి మూపు కలవాడు, మహాభుజః=దీర్ఘ మైన బాహువులు కలవాడు, పుణ్డరీకవిశాలాక్షః = పద్మముల వలె విశాల మైన నేత్రములు కలవాడు, తరుణః=యువకుడు, ప్రియదర్శనః=ప్రియ మైన దర్శనము కలవాడు అయిన ఆ భరతుడు, ముహూర్తం కాలం తు = క్షణకాలము, ప్రత్యా

శ్చస్వ = ఊరడిల్లి, (తేరుకుని) పరమదుర్మనాః=మిక్కిలి దుఃఖించిన మనస్సు కలవాడై, తోత్త్రైః = కొరడాలచేత, అతివిద్ధః = ఎక్కువగా కొట్టబడిన, ద్విపః ఇవ = ఏనుగు వలె, సహసా = వెంటనే, పపాత = పడెను.

తా. సుకుమారుడు, గొప్ప బలము కలవాడు, సింహము వంటి మూపు కలవాడు, గొప్ప భుజములు కలవాడు, పద్మముల వలె విశాలములైన నేత్రములు కలవాడు, యువకుడు, ఆనందకరమైన దర్శనము కలవాడు, అయిన ఆ భరతుడు క్షణకాలము తెప్పరిల్లి మిక్కిలి దుఃఖించుచున్న మనస్సుతో, కొరడాలచే ఎక్కువగా కొట్టబడిన ఏనుగు వలె వెంటనే నేలపై పడెను. 3

మూ. తదవస్థం తు భరతం శత్రుఘ్నోఽనన్తరస్థితః,
పరిష్వజ్య రురోదోచ్చైర్విసంజ్ఞః శోకకర్శితః. 4

ప్ర. అ. అనన్తరస్థితః = ప్రక్కనే ఉన్న, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తదవస్థమ్ = అట్టి అవస్థ గల, భరతమ్=భరతుని, పరిష్వజ్య=కౌగలించుకొని, శోకకర్శితః = శోకముచేత కృశింపచేయబడినవాడై, విసంజ్ఞః = స్పృహతప్పినవాడై, ఉచ్చైః = గట్టిగా, రురోద = ఏడ్చెను.

తా. సమీపముననే ఉన్న శత్రుఘ్నుడు శోకముచే పీడింపబడినవాడై ఆ విధముగా నేలపై బడిన భరతుని కౌగలించుకొని, స్పృహ తప్పినవాడై, బిగ్గరగా ఏడ్చెను. 4

మూ. తతః సర్వాః సమాపేతుర్మాతరో భరతస్య తాః,
ఉపవాసకృశా దీనా భర్తృవ్యసనకర్శితాః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఉపవాసకృశాః = ఉపవాసముచే కృశించినవారు, దీనాః=దీనలు, భర్తృవ్యసనకర్శితాః=భర్తృవియోగముచేత కృశింపచేయబడినవారు అయిన, సర్వాః = సమస్తమైన, భరతస్య = భరతునియొక్క, తాః మాతరః = ఆ తల్లులు, సమాపేతుః = తొందరగా వచ్చి చేరిరి.

తా. అపుడు ఉపవాసముచే కృశించి, దీనలై భర్తృవియోగముతో దుఃఖించుచున్న తల్లు లందరు భరతుని వద్దకు వచ్చి చేరిరి. 5

మూ. తాశ్చ తం పతితం భూమౌ రుదత్యః పర్యవారయన్,
కౌసల్యా త్వనుసృత్యైనం దుర్మనాః పరిషస్వజే. 6

ప్ర. అ. తాః = వారందరు, రుదత్యః = ఏడ్చుచు, భూమౌ = నేలపై, పతితమ్ = పడిన, తమ్ = ఆతనిని, పర్యవారయన్ = చుట్టుముట్టిరి. కౌసల్యా తు = కౌసల్య యైతే, దుర్మనాః = దుఃఖించుచున్న మనస్సు కలదై, అనుసృత్య = సమీపించి, ఏనమ్ = ఈ భరతుని, పరిషస్వజే = కౌగలించుకొనెను.

తా. వారందరును ఏడ్చుచు నేలపై బడిన ఆ భరతుని చుట్టి నిలచిరి. కౌసల్య మాత్రము మిక్కిలి దుఃఖించుచు, సమీపించి ఆతనిని కౌగలించుకొనెను.

మూ. వత్సలా స్వం యథా వత్సముపగూహ్య తపస్వినీ,
పరిపప్రచ్ఛ భరతం రుదతీ శోకలాలసా. 7

ప్ర. అ. శోకలాలసా = శోకముతో వ్యాకులురాలైన, తపస్వినీ = దీనురాలైన, వత్సలా = వాత్సల్యము గల ఆ కౌసల్య, రుదతీ = ఏడ్చుచున్నదై, స్వమ్ = తన సంబంధమైన, వత్సం యథా = పిల్లవానిని వలె, ఉపగూహ్య = కౌగలించుకొని, భరతమ్ = భరతుని, పరిపప్రచ్ఛ = ఇట్లడిగెను.

తా. శోకముతో వ్యాకులురాలు, దీనురాలు, వాత్సల్యవంతురాలు అయిన ఆ కౌసల్య తన పుత్రుని కౌగలించుకొన్నట్లుగా భరతుని కౌగలించుకొని ఏడ్చుచు ఆతనిని ప్రశ్నించెను. 7

మూ. పుత్ర వ్యాధిర్న తే కచ్చిచ్ఛరీరం పరిబాధతే,
అద్య రాజకులస్యాస్య త్వదధీనం హి జీవితమ్. 8.

ప్ర. అ. పుత్ర = ఓ కుమారా! వ్యాధిః = వ్యాధి, తే శరీరమ్ = నీ శరీరమును, కచ్చిత్ న పరిబాధతే = బాధించుటలేదు కదా! అద్య = ఇపుడు, అస్య = ఈ, రాజకులస్య = రాజవంశముయొక్క, జీవితమ్ = జీవితము, త్వదధీనం హి = నీపై ఆధారపడి యున్నది కదా!

తా. కుమారా! నీ శరీరమును వ్యాధి ఏదియు బాధించుటలేదు కదా! ఇపుడు ఈ రాజవంశము జీవితము నీమీదనే ఆధారపడి యున్నది. 8

మూ. త్వాం దృష్ట్వా పుత్ర జీవామి రామే సభ్రాతృకే గతే,
వృత్తే దశరథే రాజ్ఞి నాథ ఏక స్త్వమద్య నః. 9

ప్ర. అ. పుత్ర = ఓ కుమారా! సభ్రాతృకే = లక్ష్మణునితో కూడిన, రామే

=రాముడు, గతే=వెళ్ళిపోయినవా డగుచుండగా, రాజ్ఞి=రా జైన, దశరథే= దశరథుడు, మృతే=మరణించినవాడగుచుండగా, త్వామ్=నిన్ను, దృష్ట్వా= చూచుకొని, జీవామి=జీవించుచున్నాను. అద్య=ఇపుడు, త్వమ్=నీవు, ఏకః= ఒక్కడవే, నః=మాకు, నాథః=నాథుడవు.

తా. ఓ కుమారా! రాముడు లక్ష్మణసహితు డై వనమునకు వెళ్ళిపోయి నాడు. దశరథమహారాజు మరణించినాడు. ఇపుడు నిన్నే చూచుకొని జీవించు చున్నాను. నీవు ఒక్కడివే మాకు ఇపుడు రక్షకుడవు. 9

మూ. కచ్చిన్న లక్ష్మణే పుత్ర శ్రుతం తే కించిదప్రియమ్,
పుత్రే వా హ్యేకపుత్రాయాః సహభార్యే వనం గతే. 10

ప్ర. అ. పుత్ర=ఓ కుమారా: లక్ష్మణే=లక్ష్మణుని విషయంలో కాని, సహభార్యే=భార్యాసమేతు డై, వనమ్=వనమును గూర్చి, గతే=వెళ్ళిన, ఏక పుత్రాయాః=ఒకే పుత్రుడుగల నాయొక్క, పుత్రే వా=పుత్రు డైన రాముని విషయమందు కాని, కించిత్=ఏ దైన, అప్రియమ్=అప్రియము, తే=నీకు, కచ్చిత్ న శ్రుతమ్=వినబడలేదు కదా!

తా. కుమారా లక్ష్మణుని గూర్చి గాని, భార్యాసమేతు డై అరణ్యమునకు వెళ్ళిన నా ఏకైకపుత్రు డైన రాముని గూర్చి గాని, నీవు ఏ దైన అప్రియ మైన వార్తను వినలేదు కదా! 10

మూ. స ముహూర్తం సమాశ్వస్య రుదన్నేవ మహాయశాః,
కౌసల్యాం పరిసాన్త్వ్యేదం గుహం వచనమబ్రవీత్. 11

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, సః=అతడు, ముహూర్తమ్= క్షణకాలము, సమాశ్వస్య=ఊరడిల్లి, కౌసల్యామ్=కౌసల్యను, పరిసాన్త్వ్య= ఓదార్చి, రుదన్నేవ=ఏడ్చుచునే, గుహమ్=గుహుని గూర్చి, వచనమ్=వచన మును, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప కీర్తి గల ఆ భరతుడు క్షణకాలము ఊరడిల్లి కౌసల్యను ఓదార్చి ఏడ్చుచునే గుహునితో యిట్లనెను. 11

మూ. భ్రాతా మే క్వావసద్రాత్రౌ క్వ సీతా క్వ చ లక్ష్మణః,
అస్వపచ్ఛయనే కస్మిన్ కిం భుక్త్వా గుహ శంస మే. 12

ప్ర. అ. గుహ = ఓ గుహుడా, మే భ్రాతా = నా సోదరుడు, రాత్రౌ = రాత్రియందు, క్వ = ఎక్కడ, అవసత్ = నివసించెను? సీతా = సీత. క్వ = ఎక్కడ నివసించెను ? లక్ష్మణః చ = లక్ష్మణుడు, క్వ = ఎక్కడ నివసించెను ? కిమ్ = ఏమి, భుక్త్వా = తిని, కస్మిన్ = ఏ, శయనే = శయనమునందు, అశ్వపత్ = నిద్రించెను? మే = నాకు, శంస = చెప్పుము.

తా. ఓ గుహుడా! నా సోదరు డైన రాముడు రాత్రి ఎక్కడ నివసించెను? సీత ఎక్కడ నివసించెను ? లక్ష్మణుడు ఎక్కడ నివసించెను ? వారు ఏమి భుజించిరి? ఏ శయనముపై శయనించిరి ? నాకు చెప్పుము. 12

మూ. సోఽబ్రవీత్ భరతం హృష్టో నిషాదాధిపతిర్గుహః,
యద్విధం ప్రతిపేదే చ రామే ప్రియహితేఽతిథౌ. 13

ప్ర. అ. నిషాదాధిపతిః = నిషాదుల ప్రభు వైన, సః గుహః = ఆ గుహుడు, హృష్టః = సంతోషించినవాడై, ప్రియహితే = ప్రియుడు హితుడు అయిన, అతిథౌ = అతిథి యైన, రామే = రాముని విషయమున, యద్విధమ్ = ఏ విధముగా, ప్రతిపేదే = తాను ప్రవర్తించెనో (దానిని గూర్చి), భరతమ్ = భరతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. నిషాదుల ప్రభు వైన ఆ గుహుడు సంతోషించినవాడై, ప్రియుడు హితుడు ఆయిన అతిథిగా వచ్చిన రాముని విషయమున తాను ఎట్లు ప్రవర్తించెనో భరతునితో చెప్పెను. 13

మూ. అన్నముచ్చావచం భక్షాః ఫలాని వివిధాని చ,
రామాయాభ్యవహారార్థం బహు చోపహృతం మయా. 14

ప్ర. అ. మయా = నాచేత, రామాయ = రామునికొరకు, అభ్యవహారార్థమ్ = భోజనము నిమిత్త మై, ఉచ్చావచమ్ = అనేకవిధము లైన, అన్నమ్ = అన్నము, భక్షాః = భక్ష్యములు, వివిధాని = అనేకవిధము లైన, ఫలాని చ = ఫలములు, బహు = అత్యధికముగా, ఉపహృతమ్ = తీసుకొనిరాబడినది.

తా. నేను రాముని భోజనముకొరకై చాల రకము లైన అన్నములను, భక్ష్యములను, అనేకవిధము లైన ఫలములను సమర్పించితిని. 14

మూ. తత్సర్వం ప్రత్యనుజ్ఞాసీద్రామః సత్యపరాక్రమః,
న తు తత్ప్రత్యగృహ్ణాత్స క్షత్రధర్మమనుస్మరన్. 15

ప్ర. అ. సత్యపరాక్రమః = సత్యమైన పరాక్రమము గల, రామః = రాముడు, తత్సర్వమ్ = దాని నంతను, ప్రత్యనుజ్ఞాసీత్ = తిరిగి తీసుకొని పొమ్మని ఆజ్ఞ యిచ్చెను. సః = అతడు, క్షత్రధర్మమ్ = క్షత్రియధర్మమును, అనుస్మరన్ = స్మరించుచు, తత్ = దానిని, న తు ప్రత్యగృహ్ణాత్ = స్వీకరించలేదు.

తా. సత్యపరాక్రము డైన ఆ రాముడు వాటి నన్నిటిని వెనుకకు తీసుకొని పొమ్మని ఆజ్ఞాపించెను అతడు క్షత్రియధర్మమును పాటించుచు, దానిని స్వీకరించలేదు. 15

మూ. న హ్యస్మాభిః ప్రతిగ్రాహ్యం సఖే దేయం తు సర్వదా,
ఇతి తేన వయం రాజన్ననునీతా మహాత్మనా. 16

ప్ర. అ. రాజన్ = ఓ భరతుడా ! సఖే = ఓ స్నేహితుడా, అస్మాభిః = మాచేత, న ప్రతిగ్రాహ్యమ్ = ప్రతిగ్రహింపబడకూడదు. సర్వదా = ఎల్లప్పుడును, దేయమ్ = ఇవ్వదగినది. ఇతి = అని, మహాత్మనా = మహాత్ము డైన, తేన = ఆ రామునిచేత, వయమ్ = మేము, అనునీతాః = అనునయింపబడితిమి.

తా. "ఓ రాజా ! మహాత్ము డైన ఆ రాముడు' ఓ స్నేహితుడా ! మేము ఎల్లపుడు ఇతరులకు ఇవ్వవలెను గాని ఇతరులనుండి ప్రతిగ్రహింపకూడదు" అని మమ్ములను అనునయించెను (మాతో ప్రేమపూర్వకముగా చెప్పెను ) 16

మూ. లక్ష్మణేన సమానీతం పీత్వా వారి మహాయశాః,
ఔపవాస్యం తదాకార్షీద్రాఘవః సహ సీతయా. 17

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రాఘవః = రాముడు, తదా = అపుడు, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, సమానీతమ్ = తీసుకొనిరాబడిన, వారి = ఉదకమును, సీతయా సహ = సీతతో కూడ, పీత్వా = త్రాగి, ఔపవాస్యమ్ = ఉపవాసమును, అకార్షీత్ = చేసెను.

తా. గొప్ప కీర్తి గల ఆ రాముడు, సీత కూడ లక్ష్మణుడు తీసుకొని వచ్చిన జలమును త్రాగి ఆనాడు ఉపవాసమును చేసిరి. 17

మూ. తతస్తు జలశేషేణ లక్ష్మణోప్యకరోత్తదా,
వాగ్యతాస్తే త్రయః సన్ధ్యాం సముపాసత సంహితాః. 18

ప్ర. అ. తతః తు=అటు పిమ్మట, తదా=అపుడు, లక్ష్మణోఽపి=లక్ష్మణుడు కూడ, జలశేషేణ=మిగిలిన జలముతో, అకరోత్=ఆహారమును చేసెను. తే త్రయః=ఆ ముగ్గురు, వాగ్యతాః = వాఙ్నియమమును పాటించుచున్నవారై, సంహితాః=ఏకాగ్రచిత్తులై, సన్ధ్యామ్=సంధ్యను, సముపాసత=సేవించిరి.

తా. అపుడు లక్ష్మణుడు కూడ మిగిలిన జలమును ఆహారముగా గ్రహించెను. వారు ముగ్గురు మౌనమును పాటించుచు, ఏకాగ్రచిత్తులై సన్ధ్యోపాసనము చేసిరి. 18

మూ. సౌమిత్రిస్తు తతః పశ్చాదకరోత్స్వాస్తరం శుభమ్,
స్వయమానీయ బర్హీంషి క్షిప్రం రాఘవకారణాత్. 19

ప్ర. అ. తతః పశ్చాత్ = అటు పిమ్మట, సౌమిత్రిస్తు = లక్ష్మణుడు, స్వయమ్=స్వయముగా, బర్హీంషి=దర్భలను, ఆనీయ=తీసుకొని వచ్చి, రాఘవకారణాత్ = రామునికొరకై, క్షిప్రమ్ = శీఘ్రముగా, శుభమ్ = శుభకరమైన, స్వాస్తరమ్ = మంచి శయనమును, అకరోత్ = ఏర్పరచెను.

తా. పిమ్మట లక్ష్మణుడు స్వయముగా బర్హిస్సు తీసుకొని వచ్చి రామునికొరకై ఒక మంగళకరమైన శయనమును శీఘ్రముగా ఏర్పరచెను. 19

మూ. తస్మిన్ సమావిశద్రామః స్వాస్తరే సహ సీతయా,
ప్రక్షాల్య చ తయోః పాదావపచక్రామ లక్ష్మణః. 20

ప్ర. అ. రామః = రాముడు, తస్మిన్=ఆ, స్వాస్తరే=శయనమునందు, సీతయా సహ = సీతతో కూడ, సమావిశత్ = శయనించెను. లక్ష్మణః=లక్ష్మణుడు, తయోః = వారియొక్క, పాదౌ = పాదములను, ప్రక్షాల్య = కడిగి, అపచక్రామ = దూరముగా వెళ్ళెను.

తా. రాముడు సీతాసమేతుడై ఆ శయనముపై శయనించెను. లక్ష్మణుడు వారి పాదములను కడిగి దూరముగా వెళ్ళి నిలిచియుండెను. 20

మూ. ఏతత్తదిఙ్గుదీమూలమిదమేవ చ తత్తృణమ్,
యస్మిన్ రామశ్చ సీతా చ రాత్రిం తాం శయితావుభౌ.

ప్ర. అ. రామశ్చ = రాముడు, సీతా = సీత, ఉభౌ = ఇద్దరు, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని (యందు), యస్మిన్ = దేనియందు, శయితౌ = శయనించిరో, తత్ = ఆ, ఇంగుదీమూలమ్ = ఇంగుదీవృక్షము యొక్క మూలము, ఏతత్ = ఇదే. తత్ = ఆ, తృణం చ = తృణము కూడ, ఇదమేవ = ఇదే.

తా. సీతారాము లిరువురు ఆ రాత్రి శయనించిన ఇంగుదీవృక్షమూలము ఆ గడ్డిపరుపు ఇవే. 21

మూ. నియమ్య పృష్ఠే తు తలాంగులిత్రవాన్
శరైస్సుపూర్ణావిషుధీ పరంతపః,
మహద్ధనుః సజ్యముపోహ్య లక్ష్మణో
నిశామతిష్ఠత్పరితోఽస్య కేవలమ్. 22

ప్ర. అ. పరంతపః = శత్రువును బాధించు, లక్ష్మణః = లక్ష్మణుడు, తలాంగులిత్రవాన్ = అరచేతులను వ్రేళ్లను రక్షించు తొడుగు ధరించినవాడై, శరైః = బాణములతో, సుపూర్ణౌ = బాగుగ నిండిన, ఇషుధీ = అంబుల పొదులను, పృష్ఠే = వీపునందు, నియమ్య = కట్టుకొని, సజ్యమ్ = నారితో కూడిన, మహత్ = గొప్ప, ధనుః = ధనుస్సును, ఉపోహ్య = ధరించి, నిశామ్ = రాత్రియందు, అస్య = రాముని యొక్క, పరితః = చుట్టుప్రక్కల, అతిష్ఠత్ కేవలమ్ = నిలచియే యుండెను.

తా. శత్రువులకు బాధ కలిగించు లక్ష్మణుడు, అరచేతులను, వ్రేళ్ళను రక్షించు తొడుగులు ధరించి, బాణములతో నిండిన అంబులపొదులు వీపున కట్టుకొని, నారి కట్టిన ధనుస్సును చేత ధరించి రాత్రి యంతయు ఆ రాముని పరిసరములందు నిలబడియే ఉండెను.

మూ. తతస్త్వహం చోత్తమ బాణచాపధృత్
స్థితోఽభవం తత్ర స యత్ర లక్ష్మణః,
అతన్ద్రిభిర్జ్ఞాతిభిరాత్తకార్ముకై
ర్మహేన్ద్రకల్పం పరిపాలయంస్తదా. 23

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే సప్తాశీతితమః సర్గః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహం తు = నేనైతే, తదా = అప్పుడు, ఉత్తమబాణచాపధృత్ = ఉత్తమ మైన బాణములను, చాపమును ధరించిన వాడ నై, అతన్ద్రిభిః = ఏమరుపాటు లేని, ఆత్తకార్ముకైః = ధరింపబడిన ధనుస్సులు గల, జ్ఞాతిభిః = బంధువులతో కూడి, మహేన్ద్రకల్పమ్ = మహేంద్రునితో సమాను డైన ఆ రాముని, పరిపాలయన్ = పాలించుచు, లక్ష్మణః = లక్ష్మణుడు, యత్ర = ఎక్కడ ఉండెనో, తత్ర = అక్కడ, స్థితః = నిలచినవాడనై, అభవమ్ = అయితిని.

తా. అపుడు నేను కూడ ఉత్తమ మైన బాణములను ధనుస్సును ధరించి, ఏమరపాటు లేని ధనుర్ధరు లైన బంధువులతో కూడినవాడనై, మహేంద్రునితో సమాను డైన రాముని రక్షించుచు, లక్ష్మణుడు నిలచిన చోటనే నిలిచియుంటిని.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, అయోధ్యాకాండలో ఎనుబదిఏడవ సర్గ సమాప్తము.

## అథ అష్టాశీతితమః సర్గః

[శ్రీరాముని పలాశయ్యను చూచి భరతుడు మిక్కిలి శోకించుట. తానును జటావల్కలములు దాల్చి వనమందుండ దలంపును ప్రకటించుట].

మూ. తచ్ఛ్రుత్వా నిపుణం సర్వం భరతః సహ మన్త్రిభిః,
ఇఙ్గుదీమూలమాగమ్య రామశయ్యామవేక్ష్య తామ్. 1

అబ్రవీజ్జననీః సర్వా ఇహ తేన మహాత్మనా,
శర్వరీ శయితా భూమావిదమస్య విమర్దితమ్. 2

ప్ర. అ. భరతః = భరతుడు, తత్ సర్వమ్ = దాని నంతని, నిపుణమ్ = చక్కగా, శ్రుత్వా = విని, మన్త్రిభిస్సహ = మంత్రులతో కూడ, ఇఙ్గుదీ మూలమ్ = ఇంగుదీవృక్షమూలమును, ఆగమ్య = చేరి, తామ్ = ఆ, రామశయ్యామ్ = రామశయనమును, అవేక్ష్య = చూచి, సర్వాః = సమస్తమైన, జననీః = తల్లులను గూర్చి, అబ్రవీత్ = పలికెను. తేన = ఆ, మహాత్మనా = మహాత్ముడైన రామునిచేత, ఇహ = ఇక్కడ, భూమౌ = నేలపై, శర్వరీ = రాత్రి, శయితా = శయనించుట (జరిగినది). అస్య = ఇతని, విమర్దితమ్ = నలిగి నట్లు చేయబడిన శయనము, ఇదమ్ = ఇదే

తా. మంత్రిసహితుడైన భరతుడు ఆ మాటలన్నీ శ్రద్ధగా విని ఇంగుదీ వృక్షమూలము చేరి, రాముని శయ్యను చూచి తల్లులందరితో ఇట్లనెను. "మహాత్ముడైన రాముడు ఆ రాత్రి ఇక్కడనే నేలపై శయనించెను. అతడు పండుకొనగా నలిగిన శయనము ఇదే." 1, 2

మూ. మహాభాగకులీనేన మహాభాగేన ధీమతా,
జాతో దశరథేనోర్వ్యాం న రామః స్వప్తుమర్హతి. 3

ప్ర. అ. మహాభాగకులీనేన = గొప్ప భాగ్యము గల కులమునందు పుట్టిన,

మహాభాగేన = మహాభాగ్యవంతు డైన, ధీమతా = బుద్ధిమంతు డైన, దశరథేన= దశరథునిచేత, జాతః = పుట్టిన, రామః = రాముడు, ఉర్వ్యామ్ = నేలపై, స్వప్తుమ్ = నిద్రించుటకు, న అర్హతి=తగదు.

తా. "గొప్ప భాగ్యము కల కులమునందు పుట్టినవాడు, గొప్ప భాగ్యము కలవాడు, బుద్ధిమంతు డైన దశరథుని కుమారుడు అయిన రాముడు నేలపై శయనించుట తగదు."

మూ. అజినోత్తరసంస్తీర్ణే వరాస్తరణసంచయే,
శయిత్వా పురుషవ్యాఘ్రః కథం శేతే మహీతలే. 4

ప్ర. అ. పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠు డైన, రాముడు, అజినోత్తర సంస్తీర్ణే = మృగచర్మరూపము లైన, పై ఆవరణలచే పరవబడిన, వరాస్తరణ సంచయే = శ్రేష్ఠ మైన ఆస్తరణముల (పైన పరచు వస్త్రములు) సముదాయము గల శయనమునందు, శయిత్వా = శయనించి, మహీతలే = నేలపై, కథమ్ = ఎట్లు, శేతే = శయనించును.

తా. "మృగచర్మములు పైన కప్పినదీ, శ్రేష్ఠ మైన ఆస్తరణముల సముదాయముతో ఏర్పరచినదీ అయిన శయనముపై శయనించుటకు అలవాటు పడిన పురుషశ్రేష్ఠు డైన ఆ రాముడు నేలపై ఎట్లు శయనించెనో!" 4

మూ. ప్రాసాదాగ్రవిమానేషు వలభీషు చ సర్వదా,
హైమరాజతభౌమేషు వరాస్తరణశాలిషు,
పుష్పసంచయచిత్రేషు చన్దనాగరుగన్ధిషు,
పాణ్డురాభ్రప్రకాశేషు శుకసంఘరుతేషు చ,
ప్రాసాదవరవర్యేషు శీతవత్సు సుగన్ధిషు,
ఉషిత్వా మేరుకల్పేషు కృతకాంచనభిత్తిషు,
గీతవాదిత్రనిర్ఘోషైర్వరాభరణనిస్స్వనైః,
మృదఙ్గవరశబ్దైశ్చ స తత్ర ప్రతిబోధితః,
వన్దిభిర్వన్దితః కాలే బహుభిః సూతమాగధైః,
గాథాభిరనురూపాభిః స్తుతిభిశ్చ పరంతపః, 5-9

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించు, సః = ఆ రాముడు, సర్వదా = ఎల్లపుడు, ప్రాసాదాగ్రవిమానేషు = ప్రాసాదముల అగ్రములందు, ఉత్తమ గృహములందు, వలభీషు చ = మేడల పై భాగములందు, హైమరాజతభౌమేషు = బంగారువికార మైన అంతస్థులు కలవి, వరాస్తరణశాలిషు = శ్రేష్ఠ మైన ఆస్తరణములతో ప్రకాశించునవి, పుష్పసంచయచిత్రేషు = పుష్పముల ప్రోగులచే చిత్రవర్ణము లైనవి, చన్దనాగరుగన్ధిషు = మంచి గంధముయొక్క, అగరు యొక్క సువాసన కలవి, పాణ్డరాభ్రప్రకాశేషు = తెల్లని మేఘముల వంటి కాంతి గలవి, శుకసంఘరుతేషు చ = చిలకల గుంపుల ధ్వనులతో కూడినవి, శీతవత్సు = చల్లదనము కలవి, సుగంధిషు = సుగంధములు కలవి, కృతకాంచనభిత్తిషు = ఏర్పరుపబడిన బంగారు గోడలు కలవి, మేరుకల్పేషు = మేరుపర్వతముతో సమాన మైనవి యైన, ప్రాసాదవరవర్యేషు = అతిశ్రేష్ఠము లైన ప్రాసాదము లందు, ఉషిత్వా = నివసించి, గీతావాదిత్రనిర్ఘోషైః = గీతధ్వనులచేతను, వాద్య ధ్వనులచేతను, వరాభరణనిస్వనైః = శ్రేష్ఠ మైన ఆభరణముల ధ్వనులచేతను, మృదఙ్గవరశబ్దైశ్చ = మృదంగముల మధురధ్వనులచేతను, తత్ర = ఆ ప్రాసాదాదు లందు, ప్రతిబోధితః = మేల్కొలుపబడుచుండెడివాడు. బహుభిః = అనేకు లైన, సూతమాగధైః = సూతమాగధులచేతను, వన్దిభిః = వందులచేతను, గాథాభిః = గాథలతోను, అనురూపాభిః = తగిన, స్తుతిభిశ్చ = స్తోత్రములతోను, కాలే = తగిన కాలమునందు, వన్దితః = నమస్కరింపబడుచుండెడివాడు.

తా. "శత్రుభయంకరు డైన ఆ రాముడు ఎల్లప్పుడు ప్రాసాదాగ్రము లందు, విమానములందు, (ఉత్తమగృహములందు) గృహముల పైభాగము లందు, అతిశ్రేష్ఠ మైన ప్రాసాదములందు నివసించుచుండెడివాడు. ఆ ప్రాసాద ములు శ్రేష్ఠ మై, ఆస్తరణములతో ప్రకాశించుచుండెడివి. పుష్పముల సముదాయ ములు అక్కడక్కడ ఉంచుటచే వివిధవర్ణములు కలవై, చందనాగరు సుగంధముతో నిండియుండెడివి. తెల్లని మేఘము వలె ఎత్తుగా ఉండి గుంపులు గుంపులుగా తిరుగు చిలుకల పలుకులతో ప్రతిధ్వనించుచు, సుగంధయుక్తము లై చల్లగా యుండెడివి. బంగారు గోడలతో కట్టబడి మేరుపర్వతము వలె నున్న ఆ ప్రాసాదములలో నివసించుచున్నపుడు ఆ రాముని గీతవాద్యాదుల ధ్వనుల చేతను, పరిచారికల శ్రేష్ఠ మైన అలంకారముల ధ్వనులచేతను, మధుర మైన

మృదంగశబ్దములచేత మేల్కొలుపు చుండెడివారు. చాలామంది వందులు, సూతమాగధులు గాథలు పాడుచు, తగిన స్తోత్రవాక్యములు పలుకుచు, ఆ యా కాలములందు వచ్చి ఆ రామునికి నమస్కరించుచుండెడివారు." 5-9

మూ. అశ్రద్ధేయమిదం లోకే న సత్యం ప్రతిభాతి మా,
ముహ్యతే ఖలు మే భావః స్వప్నోఽయమితి యే మతిః

ప్ర. అ. లోకే = లోకమునందు, ఇదమ్ = ఇది, అశ్రద్ధేయమ్ = నమ్మ తగనిది. సత్యమ్ = సత్యమైనదిగా, మా = నన్ను గూర్చి, న ప్రతిభాతి = తోచుట లేదు. మే = నాయొక్క, భావః = భావము (మనస్సు), ముహ్యతే ఖలు = మోహ పడుచున్నది, అయమ్ = ఇది, స్వప్నః ఇతి = స్వప్నము అని, మే = నాయొక్క మతిః = బుద్ధి.

తా. లోకములో ఇది (అట్టి రాముడు ఇట్లగుట) నమ్మ శక్యము గాకు న్నది. ఇది సత్య మని నాకు తోచుటలేదు. నా మనస్సు మోహము చెందు చున్నది. ఇది యంతయు స్వప్నమా అనిపించుచున్నది. 10

మూ. న నూనం దైవతం కించిత్ కాలేన బలవత్తరమ్,
యత్ర దాశరథీ రామో భూమావేవ శయీత సః. 11

ప్ర. అ. దైవతమ్ = దేవత, కాలేన = కాలముచేత, (కాలముకంటె), కించిత్ = కొంచెముకూడ, బలవత్తరమ్ = ఎక్కువ బలమైనది, న = కాదు. నూనమ్ = నిశ్చయము. యత్ర = ఎందువలన, సః = ఆ, దాశరథిః = దశరథ కుమారుడైన, రామః = రాముడు, భూమావేవ = నేలపైననే, శయీత = శయ నించెనో.

తా. "దశరథకుమారుడైన అట్టి రాముడే నేలపై శయనింపవలసివచ్చిన దనగా ఏ దేవతయు కాలముకంటె కొంచెము కూడా అధికమైన బలము కలది కాదని తెలియుచున్నది. ఇది నిజము." 11

మూ. విదేహరాజస్య సుతా సీతా చ ప్రియదర్శనా,
దయితా శయితా భూమౌ స్నుషా దశరథస్య చ. 12

ప్ర. అ. విదేహరాజస్య = జనకుని యొక్క, సుతా = కుమార్తెయు, ప్రియదర్శనా = ఆనందకరమైన దర్శనము కలది, దశరథస్య = దశరథుని

యొక్క, దయితా = ఇష్టురాలైన, స్నుషా చ=కోడలూ అయిన. సీతా చ = సీత కూడ, భూమౌ=నేలపై. శయితా = శయనించినది.

తా. "చూచువారికి ఆనందమును కల్గించునది, జనకుని కూతురు దశరథునకు ఇష్టమైన కోడలు అయిన. సీత కూడ నేలపై పండుకొనినది కదా!"

మూ ఇయం శయ్యా మమ భ్రాతురిదం హి పరివర్తితమ్,
స్థణ్డిలే కఠినే సర్వం గాత్రైర్విమృదితం తృణమ్. 14

ప్ర. అ. ఇయమ్ = ఇది, మమ భ్రాతుః = నా సోదరునియొక్క, శయ్యా = శయ్య కదా: ఇదమ్=ఇది, పరివర్తితం హి = పొరలుట కదా: కఠినే = కఠిన మైన, స్థండిలే=నేలపై, సర్వమ్=సమస్త మైన, తృణమ్=తృణము, గాత్రైః = అవయములచేత, విమృదితమ్ = నలగగొట్టబడినది.

తా. "ఇది నా అన్నగారి శయనము. ఆయన పొరలిన చోటు ఇది. కఠిన మైన నేలపై పరచిన ఈ తృణ మంతయు అవయవముల రాపిడిచే నలిగి యున్నది". 14

మూ. మన్యే సాభరణా సుప్తా సీతాఽస్మిన్ శయనోత్తమే,
తత్ర తత్ర హి దృశ్యన్తే సక్తాః కనకబిందవః. 14

ప్ర. అ. సీతా = సీత, అస్మిన్=ఈ, శయనోత్తమే=శ్రేష్ఠ మైన, శయనము నందు, సాభరణా = అలంకారములతో కూడిన దై, సుప్తా = నిద్రించినది అని, మన్యే = తలచుచున్నాను. తత్ర తత్ర = అక్కడక్కడ, సక్తాః = అంటుకొనియున్న, కనకబిందవః=బంగారు పొడులు, దృశ్యన్తే హి=కనబడుచున్నవి కదా:

తా. "ఈ శయ్య పై అక్కడక్కడ బంగారపు పొడులు అంటుకొని ఉన్నవి. దీనిని బట్టి సీత ఈ శయనముపై అలంకారములతోనే శయనించినదని అనుకొనుచున్నాను." 14

మూ. ఉత్తరీయమిహాసక్తం సువ్యక్తం సీతయా తదా,
తథా హ్యేతే ప్రకాశన్తే సక్తాః కౌశేయతన్తవః, 15

ప్ర. అ. తదా=అపుడు, సీతయా=సీతచేత, (యొక్క), ఉత్తరీయమ్ = ఉత్తరీయము, ఇహ = ఇచట, ఆసక్తమ్ = తగుల్కొన్నదిగా, సువ్యక్తమ్ =

బాగ స్పష్ట మగుచున్నది. తథాహి = అది యుక్తమే కదా! సక్తాః = తగుల్కొని యున్న, ఏతే = ఈ, కౌశేయతన్తవః = పట్టు దారములు, ప్రకాశన్తే = ప్రకాశించుచున్నవి.

తా. ఇక్కడ తగుల్కొనియున్న పట్టు దారములు ప్రకాశించుచున్నవి. దీనిని బట్టి ఆనాడు సీత ఉత్తరీయము ఈ ప్రదేశమున తగుల్కొన్న దని స్పష్ట మగుచున్నది. 15

మూ. మన్యే భర్తుః సుఖా శయ్యా యేన బాలా తపస్వినీ,
సుకుమారీ సతీ దుఃఖం న హి జానాతి మైథిలీ. 16

ప్ర. అ. యేన = ఏ కారణముచేత, బాలా = బాలయు, తపస్వినీ = దీనురాలు, సుకుమారీ = సుకుమారురాలు, సతీ = పతివ్రతా అయిన, మైథిలీ = సీత, దుఃఖమ్ = దుఃఖమును, న హి జానాతి = తెలుసుకొనుటలేదో అందువలన, భర్తుః = భర్తయొక్క, శయ్యా = శయ్యయే, సుఖా = సుఖకర మైనది అని, మన్యే = తలచుచున్నాను.

తా. చిన్నవయసులో ఉన్నదీ, శోచనీయురాలు, సుకుమారి, పతివ్రతా అయిన, సీతాదేవి ఇట్టి పరిస్థితులలో కూడ, దుఃఖముగా భావించుటలేదు. దీనిని బట్టి ఆమెకు భర్త ఉన్న శయనమే సుఖకరమని అనుకొనుచున్నాను. 16

మూ. హా హన్తాస్మి నృశంసోఽహం యత్సభార్యః కృతే మమ,
ఈదృశీం రాఘవః శయ్యామధిశేతే హ్యనాథవత్. 17

ప్ర. అ. హా హన్త = అయ్యో! ఎంత కష్టము! అహమ్ = నేను, నృశంసః = క్రూరుడను, అస్మి = ఆయి ఉన్నాను. యత్ = ఎందువలన, మమ కృతే = నా మూలమున, రాఘవః = రాముడు, సభార్యః = భార్యాసహితు డై, అనాథవత్ = అనాథుడు వలె, ఈదృశీమ్ = ఇట్టి, శయ్యామ్ = శయ్యను, అధిశేతే = అధిష్ఠించి శయనించినాడో !

తా. అయ్యో! ఎంత కష్టము వచ్చినది! నేను చాలా క్రూరుడను. ఎందుచేత ననగా భార్యాసహితు డైన రాముడు నా మూలమున అనాథుడు వలె ఇట్టి శయనముపై పండుకొనవలసి వచ్చినది. 17

మూ. సార్వభౌమకులే జాతః సర్వలోకస్య సమ్మతః,
సర్వలోకప్రియ స్త్యక్త్వా రాజ్యం సుఖమనుత్తమమ్. 18

కథమిన్దీవరశ్యామో రక్తాక్షః ప్రియదర్శనః,
సుఖభాగీ న దుఃఖార్హః శయితో భువి రాఘవః. 19

ప్ర. అ. సార్వభౌమకులే=చక్రవర్తివంశమునందు, జాతః=పుట్టినవాడు, సర్వలోకస్య = సమస్తలోకమునకు, సమ్మతః = ఆదరపాత్ర మైనవాడు, సర్వలోకప్రియః = సమస్తలోకమునకు ఇష్టుడు, ఇన్దీవరశ్యామః = నల్లకలువ వలె నీలవర్ణము కలవాడు, రక్తాక్షః = ఎఱ్ఱని నేత్రములు కలవాడు, ప్రియదర్శనః= ఆనందకర మైన దర్శనము కలవాడు. సుఖభాగీ=సుఖమును పొందదగినవాడు. నదుఃఖార్హః = దుఃఖమునకు తగనివాడు అయిన, రాఘవః = రాముడు, రాజ్యమ్ = రాజ్యమును, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైన, సుఖమ్ = సుఖమును, త్యక్త్వా = విడచి, భువి = నేలపై, కథమ్ = ఎట్లు, శయితః = శయనించినాడో !

తా. "చక్రవర్తివంశమునందు బుట్టి, జనులందరిచే ఆదరింపబడుచు, వారికి ఇష్టు డైన ఇందీవరశ్యాముడు, ఎర్రని నేత్రములు కలవాడు, చూచువారికి ఆనందమును కల్గించువాడు, సుఖమునకు తగినవాడు, దుఃఖములకు తగనివాడు అయిన రాముడు రాజ్యమును, అత్యుత్తమ మైన సుఖమును కూడ పరిత్యజించి నేలపై ఎట్లు పండుకొనెనో." 18,19

మూ. ధన్యః ఖలు మహాభాగో లక్ష్మణః శుభలక్షణః,
భ్రాతరం విషమే కాలే యో రామమనువర్తతే. 20

ప్ర. అ. యః = ఏ లక్ష్మణుడు, విషమే = చెడ్డ దైన, కాలే = కాలమునందు, భ్రాతరమ్ = సోదరు డైన, రామమ్ = రాముని, అనువర్తతే=అనుసరించియున్నాడో, అట్టి, శుభలక్షణః = శుభ మైన లక్షణములు కల, మహాభాగ్యః = మహాభాగ్యవంతు డైన, లక్ష్మణః = లక్ష్మణుడు, ధన్యః ఖలు=ధన్యుడు కదా !

తా. "మహాభాగ్యవంతుడు, ఉత్తమలక్షణములు కలవాడు అయిన లక్ష్మణుడు చాలా ధన్యుడు. ఎందుచేత ననగా ఇట్టి కష్టసమయములో అతడు సోదరు డైన రాముని అనుసరించి వెళ్ళినాడు." 20

మూ. సిద్ధార్థా ఖలు వైదేహీ పతిం యానుగతా వనమ్,
వయం సంశయితాః సర్వే హీనాస్తేన మహాత్మనా. 21

ప్ర. అ. యా = ఏ సీత, వనమ్ = వనమును గూర్చి, పతిమ్ = భర్తను, అనుగతా = అనుసరించి వెళ్ళినదో, వైదేహీ = అట్టి సీత, సిద్ధార్థా ఖలు = కృతార్థురాలు కదా! మహాత్మనా = మహాత్ముడైన, తేన = ఆ రామునితో, హీనాః = హీనుల మైన, వయమ్ = మనము, సర్వే = అందరము, సంశయితాః = సంశయాస్పదస్థితిలో ఉన్నాము.

తా. భర్త ననుసరించి అరణ్యమునకు వెళ్ళిన సీత కృతార్థురాలు. మహాత్ముడైన ఆ రామునకు దూర మైన మన అందరి పరిస్థితి సంశయాస్పద మైపోయినది. 21

మూ. అకర్ణధారా పృథివీ నౌరివ ప్రతిభాతి మా,
గతే దశరథే స్వర్గం రామే చారణ్యమాశ్రితే. 22

ప్ర. అ. దశరథే = దశరథుడు, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతే = వెళ్ళినవా డగుచుండగా, రామే చ = రాముడు, అరణ్యమ్ = అరణ్యమును, ఆశ్రితే = ఆశ్రయించినవా డగుచుండగా, పృథివీ = ఈ భూమి, అకర్ణధారా = చుక్కాని పట్టువాడు లేని, నౌరివ = ఓడ వలె, మా = నన్ను గూర్చి, ప్రతిభాతి = కనబడుచున్నది.

తా. దశరథమహారాజు స్వర్గస్థు డయినాడు. రాముడు అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. అందుచే ఈ రాజ్యము నాకు, చుక్కాని పట్టువాడులేని ఓడ వలె కనబడుచున్నది. 22

మూ. న చ ప్రార్థయతే కచ్చిన్మనసాపి వసుంధరామ్,
వనేఽపి వసత స్తస్య బాహువీర్యాభిరక్షితామ్. 23

ప్ర. అ. వనే = వనమునందు, వసతః అపి = నివసించుచున్నను, తస్య = ఆ రామునియొక్క, బాహువీర్యాభిరక్షితామ్ = బాహువులయొక్క పరాక్రమముచేత రక్షింపబడిన, వసుంధరామ్ = ఈ భూమిని, కశ్చిత్ = ఎవ్వడును, మనసాపి = మనస్సుచేత కూడ, న చ ప్రార్థయతే = కోరడు.

తా. రాముడు అరణ్యములో ఉన్నను, ఆతని బాహుపరాక్రమము ఈ భూమిని రక్షించుచునే ఉండును. అందుచే దీనిని ఆక్రమింపవలె నని ఎవ్వడును మనస్సులో కూడ అనుకొనజాలడు. 23

మూ. శూన్యసంవరణారక్షామయన్త్రితహయద్విపామ్,
అపావృతపురద్వారాం రాజధానీమరక్షితామ్. 24

అప్రహృష్టబలాం శూన్యాం విషమస్థామనావృతామ్,
శత్రవో నాభిమన్యన్తే భక్షాన్విషకృతానివ. 25

ప్ర. అ. శూన్యసంవరణారక్షాం = శూన్య మైన ప్రాకారరక్షణ కలది, అయన్త్రితహయద్విపామ్=అదుపులో ఉంచబడని అశ్వములు గజములు కలది, అపావృతపురద్వారామ్ = తెరచివేయబడిన పట్టణములోని ద్వారములు కలది, అరక్షితామ్=రక్షించబడనిది, అప్రహృష్టబలామ్=సంతోషించని సేనలు కలది, శూన్యామ్ = శూన్య మైనది, విషమస్థామ్=కష్టములలో ఉన్నది, అనావృతామ్ =ఆవరింపబడనిది, (రక్షణములేనిది)అయిన, రాజధానీమ్=అయోధ్యను, శత్రవః = శత్రువులు, విషకృతాన్=విషముతో చేయబడిన, భక్షానివ = భక్ష్యములను వలె, నాభిమన్యన్తే = తలపరు.

తా. "ఇపుడు మన రాజధాని యైన అయోధ్యలో ప్రాకారమునకు రక్షణము లేదు. అశ్వములు, గజములు యుద్ధసన్నద్ధములుగా లేవు. పట్టణపు ద్వారము లన్నీ తెరచి రక్షణశూన్యము లై ఉన్నవి. సైనికు లందరు సంతోష రహితు లై ఉన్నారు. కష్టములలో నున్న ఈ నగరము శూన్య మై వెలుపల కూడ రక్షణవిధానములేకుండా ఉన్నది. అయినను శత్రువులు, ఈ నగరమును గూర్చి విషముతో చేసిన భక్ష్యములను గూర్చి మనసా కూడ ఎట్లు తలపరో అట్లే తలపరు." 24-25

మూ. అద్య ప్రభృతి భూమౌ తు శయిష్యేఽహం తృణేషు వా,
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్. 26

ప్ర. అ. అద్య ప్రభృతి = ఈ సమయము మొదలు, అహమ్ = నేను, జటాచీరాణి = జటలను నారచీరలను, ధారయన్ = ధరించుచు, నిత్యమ్ = ఎల్ల

పుడు, ఫలమూలాశనః = ఫలములు మూలములు ఆహారముగా కలవాడనై, భూమౌ తు = నేలపై కాని, తృణేషు వా = తృణములపై కాని, శయిష్యే = శయనించెదను.

తా. నేను ఈ నాడు మొదలు జటలను నారచీరలను ధరించి, ఫలములను దుంపలను భక్షించుచు, నేలపై కాని, తృణములపై కాని శయనించెదను.

మూ. తస్యార్థముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే,
తం ప్రతిశ్రవమాముచ్య నాస్య మిథ్యా భవిష్యతి. 27

ప్ర. అ. తమ్ = ఆ, ప్రతిశ్రవమ్ = ప్రతిజ్ఞను, ఆముచ్య = నాపై వేసుకొని, ఉత్తరం కాలమ్ = ఈ మిగిలిన కాలమును, తస్య అర్థమ్ = ఆ రాముని కొరకై, వనే = వనమునందు, సుఖమ్ = సుఖముగా, నివత్స్యామి = నివసించెదను. అస్య = ఈ రామునియొక్క ప్రతిజ్ఞ, మిథ్యా = అసత్యము, న భవిష్యతి = కాదు.

తా. రాముడు చేసిన వనవాసప్రతిజ్ఞను నాపై వేసుకొని ఆ రామునికి బదులు నేను మిగిలిన కాలము వనములో సుఖముగా నివసించెదను. అట్లు చేయుటచే రాముని ప్రతిజ్ఞ కూడా అసత్యము కాదు. 27

మూ. వసన్తం భ్రాతురర్థాయ శత్రుఘ్నో మానువత్స్యతి,
లక్ష్మణేన సహ త్వార్యో హ్యయోధ్యాం పాలయిష్యతి.

ప్ర. అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, భ్రాతుః అర్థాయ = సోదరుడైన రాముని నిమిత్తమై, వసన్తమ్ = (అరణ్యంలో) నివసించుచున్న, మా = నన్ను, అనువత్స్యతి = అనుసరించి నివసింపగలడు, ఆర్యః = అన్నగారు, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడా, అయోధ్యామ్ = అయోధ్యను, పాలయిష్యతి హి = పాలించగలడు.

తా. సోదరుడైన రామునకు బదులు అరణ్యములో నివసించుచున్న నాతో కలిసి శత్రుఘ్నుడు అరణ్యములో నివసించగలడు. పూజ్యుడైన రాముడు లక్ష్మణసమేతుడై అయోధ్యను పాలింపగలడు. 28

మూ. అభిషేక్ష్యన్తి కాకుత్స్థమయోధ్యాయాం ద్విజాతయః,
అపి మే దేవతాః కుర్యురిమం సత్యం మనోరథమ్. 29

ప్ర. అ. ద్విజాతయః = బ్రాహ్మణులు, కాకుత్స్థమ్ = రాముని, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, అభిషేక్ష్యన్తి = అభిషేకించగలరు. దేవతాః = దేవతలు, ఇమమ్ = ఈ, మే = నాయొక్క, మనోరథమ్ = మనోరథమును, సత్యమ్ = సత్యమైన దానినిగా, అపి కుర్యుః = చేయుదురా!

తా. బ్రాహ్మణులు అయోధ్యలో రాముని రాజ్యాభిషిక్తుని చేయగలరు. నాయీ మనోరథమును దేవతలు సఫలము చేయుదురా! 29

మూ. ప్రసాద్యమానః శిరసా మయా స్వయం
బహుప్రకారం యది న ప్రపత్స్యతే,
తతోఽనువత్స్యామి చిరాయ రాఘవమ్
వనేచరం నార్హతి మాముపేక్షితుమ్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టాశీతితమః సర్గః.

ప్ర. అ. మయా = నాచేత, స్వయమ్ = స్వయముగా, బహుప్రకారమ్ = అనేకవిధముల, శిరసా = శిరస్సుతో, ప్రసాద్యమానః = అనుగ్రహింపచేసుకొనబడుచు, రాముడు, న ప్రపత్స్యతే యది = అంగీరించకపోయినట్లైతే, తతః = అపుడు, వనేచరం = వనమునందు సంచరించుచున్న, రాఘవమ్ = రాముని, చిరాయ = చిరకాలము, అనువత్స్యామి = అనుసరించి నివసించెదను. మామ్ = నన్ను, ఉపేక్షితుమ్ = ఉపేక్షించుటకు, నార్హతి = తగడు.

తా. నేను స్వయముగా తల వంచి నమస్కరించుచు, అనేకవిధముల బ్రతిమాలినను రాముడు అంగీకరించనిచో నేను కూడ అరణ్యములో సంచరించుచున్న ఆ రాముని అనుసరించి అచటనే నివసించెదను. రాముడు నన్ను కాదనజాలడు. 30

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
ఎనుబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోననవతితమః సర్గః

[భరతుడు సేనాసమేతుడై గంగను దాటి భరద్వాజాశ్రమమున కేగుట].

మూ. ఉష్య రాత్రిం తు తత్రైవ గంగాకూలే స రాఘవః,
భరతః కాల్యముత్థాయ శత్రుఘ్నమిదమబ్రవీత్. 1

ప్ర. అ. రాఘవః = రఘువంశమునందు పుట్టిన, సః భరతః = ఆ భరతుడు, తత్ర = అ, గంగాకూలే ఏవ = గంగాతీరమునందే, రాత్రిమ్ = రాత్రిని, ఉష్య = నివసించి, కాల్యమ్ = ప్రాతఃకాలమునందు, ఉత్థాయ = లేచి, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నునిగూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భరతుడు ఆ రాత్రి ఆ గంగాతీరమునందే నివసించి, మరునాడు, ప్రాతఃకాలమున లేచి శత్రుఘ్నునితో యిట్లు పలికెను. 1

మూ. శత్రుఘ్నోత్తిష్ఠ కిం శేషే నిషాదాధిపతిం గుహమ్,
శీఘ్రమానయ భద్రం తే తారయిష్యతి వాహినీమ్. 2

ప్ర. అ. శత్రుఘ్న = ఓ శత్రుఘ్నుడా! ఉత్తిష్ఠ = లెమ్ము. కిమ్ = ఎందుకు, శేషే = పండుకొనియున్నావు. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక! నిషాదాధిపతిమ్ = నిషాదుల ప్రభువైన, గుహమ్ = గుహుని, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆనయ = తీసుకొనిరమ్ము. వాహినీమ్ = సేనను, తారయిష్యతి = దాటింపచేయగలడు.

తా. శత్రుఘ్నా! ఇంకను పరుండిఉన్నావేమి? లెమ్ము. నీకు భద్రమగుగాక! నిషాదుల ప్రభువైన గుహుని శీఘ్రముగా తీసుకొని రమ్ము. అతడు సేనను దాటించును. 2

మూ॥ జాగర్మి నాహం స్వపిమి తమేవార్యం విచిన్తయన్,
ఇత్యేవమబ్రవీద్భ్రాతా శత్రుఘ్నోఽపి ప్రచోదితః. 3

ప్ర. అ. భ్రాతా = సోదరుడైన, శత్రుఘ్నోఽపి = శత్రుఘ్నుడు కూడ, ప్రచోదితః = ఇట్లు ప్రేరేపింపబడిన వాడై, అహమ్ = నేను, తమ్ = ఆ, ఆర్యమ్ ఏవ = అన్నగారైన రాముని గూర్చియే, విచిన్తయన్ = ఆలోచించుచు, జాగర్మి = మేలుకొనియే ఉన్నాను. న స్వపిమి = నిద్రపోవుటలేదు. ఇత్యేవమ్ = ఇట్లు, అబ్రవీత్ = పలికెను.

తా. భరతుడు ఈ విధముగా ప్రేరేపింపగా, సోదరుడైన శత్రుఘ్నుడు, ఇట్లు పలికెను. ''పూజ్యుడైన రాముని గూర్చి ఆలోచించుచు నేను మేల్కొనియే ఉన్నాను. నిద్రపోవుటలేదు''. 3

మూ॥ ఇతి సంవదతోరేవమన్యోన్యం నరసింహయోః,
ఆగమ్య ప్రాఞ్జలిః కాలే గుహో భరతమబ్రవీత్. 4

ప్ర. అ. నరసింహయోః = ఆ నరశ్రేష్ఠులు, ఇత్యేవమ్ = ఈ విధముగా, అన్యోన్యమ్ = పరస్పరము, సంవదతోః = మాటలాడుకొనుచుండగ, గుహః = గుహుడు, కాలే = తగిన కాలమునందు, ఆగమ్య = వచ్చి, ప్రాంజలిః = కట్టబడిన దోసిలికలవాడై, భరతమ్ = భరతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పురుషశ్రేష్ఠులైన ఆ భరతశత్రుఘ్నులు ఈ విధముగా పరస్పరము మాటలాడుకొనుచుండగా, గుహుడు తగిన సమయమునందు వచ్చి నమస్కరించుచు భరతునితో ఇట్లనెను. 4

మూ॥ కచ్చిత్ సుఖం నదీతీరే వాత్సీః కాకుత్స్థ శర్వరీమ్,
కచ్చిత్ తే సహ సైన్యస్య తావత్సర్వమనామయమ్. 5

ప్ర. అ. కాకుత్స్థ = ఓ భరతుడా! శర్వరీమ్ = రాత్రిని (యందు), నదీతీరే = నదీతీరమునందు, సుఖమ్ = సుఖముగా, కచ్చిత్ వాత్సీః = నివసించితివి కదా! సహ సైన్యస్య = సైన్యముతో కూడిన, తే = నీకు, సర్వమ్ = అంతయు, అనామయం తావత్ కచ్చిత్ = బాధ లేకుండుట కదా!

తా. భరతుడా! నదీతీరమునందు రాత్రి నీ నివాసము, సుఖకరముగా ఉన్నదికదా! సైన్యసహితుడవైన నీకు ఎట్టి బాధలు కలుగలేదు కదా? 5

మూ. గుహస్య వచనం శ్రుత్వా తత్తు స్నేహాదుదీరితమ్,
రామస్యానువశో వాక్యం భరతోఽపీదమబ్రవీత్. 6

ప్ర. అ. రామస్య = రామునియొక్క, అనువశః = వశమునం దున్న, భరతోఽపి = భరతుడు కూడా, స్నేహాత్ = స్నేహమువలన, ఉదీరితమ్ = పలుకబడిన, తత్ = ఆ, గుహస్య = గుహునియొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రామునికి వశవర్తి యైన భరతుడు స్నేహపూర్వకముగా పలికిన గుహుని మాటలు విని ఇట్లనెను. 6

మూ. సుఖా నః శర్వరీ రాజన్ పూజితాశ్చాపి తే వయమ్,
గఙ్గాం తు నౌభిర్బహ్వీభిర్దాశాః సంతారయన్తు నః. 7

ప్ర. అ. రాజన్ = ఓ నిషాదరాజా! నః = మాకు, శర్వరీ = రాత్రి, సుఖా = సుఖకరముగా ఉండెను. వయమ్ = మేము, తే = నీకు (నీచేత), పూజితాశ్చాపి = పూజింపబడినవారము కూడ! దాశాః = పల్లెవారు, బహ్వీభిః = అనేక మైన, నౌభిః = ఓడలచేత, నః = మమ్ములను, గఙ్గామ్ = గంగను, సంతారయన్తు = దాటింపచేయుదురు గాక!

తా. ఓ గుహుడా! రాత్రి మాకు సుఖముగా గడచినది. నీవు మమ్ములను అనేకవిధముల పూజించితివి. ఇపుడు అనేక మైన ఓడలపై మమ్ము గంగను దాటించుటకు, నీ భృత్యులను ఆజ్ఞాపించుము. 7

మూ. తతో గుహః సంత్వరితం శ్రుత్వా భరతశాసనమ్,
ప్రతి ప్రవిశ్య నగరం తం జ్ఞాతిజనమబ్రవీత్. 8

ప్ర. అ. తతః = పిమ్మట, గుహః = గుహుడు, సంత్వరితమ్ = మిక్కిలి తొందరగా ఉన్న, భరతశాసనమ్ = భరతుని ఆజ్ఞను, శ్రుత్వా = విని, నగరమ్ = నగరమును, ప్రతిప్రవిశ్య = తిరిగి ప్రవేశించి, తమ్ = ఆ, జ్ఞాతిజనమ్ = బంధుజనమును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మిక్కిలి తొందరను సూచించుచున్న ఆ భరతాజ్ఞను విని గుహుడు నగరములోనికి తిరిగి వెళ్ళి తన బంధుజనముతో యిట్లు పలికెను. 8

మూ. ఉత్తిష్ఠత ప్రబుధ్యధ్వం భద్రమస్తు చ వస్సదా.
నావః సమనుకర్షధ్వం తారయిష్యామ వాహినీమ్. 9

ప్ర. అ. ఉత్తిష్ఠత = లేవండి. ప్రబుధ్యధ్వమ్ = మేల్కొనండి, వః = మీకు, సదా = ఎల్లప్పుడు, భద్రమ్ = క్షేమము, అస్తు = అగుగాక. నావః = ఓడలను, సమనుకర్షధ్వమ్=లాగి తీసుకొని రండి. వాహినీమ్= సేనను, తార యిష్యామ = దాటించెదము.

తా. "మేల్కొనండి: లేవండి, మీ కందరుకును ఎల్లపుడు క్షేమ మగు గాక: ఓడలను లాగికొని తీసుకొనిరండి. సైన్యమును గంగ దాటించెదము''. 9

మూ. తే తథోక్తాః సముత్థాయ త్వరితా రాజశాసనాత్,
పంచ నావాం శతాన్యాశు సమానిన్యుః సమన్తతః. 10

ప్ర. అ. తథా=అట్లు, ఉక్తాః = పలుకబడిన, తే=వారు, రాజశాసనాత్ = రాజాజ్ఞవలన, త్వరితాః = తొందరపడుచున్నవారై, ఆశు = శీఘ్రముగా, సమన్తతః=నలువైపుల, నావామ్=ఓడలయొక్క, పంచ శతాని=ఐదు వందలను, సమానిన్యుః=తీసుకొని వచ్చిరి.

తా. గుహుని మాటలు విని వారు రాజాజ్ఞచే తొందరపడుచు వెంటనే నలు మూలలనుండి ఐదువందల ఓడలను తీకాకొనివచ్చిరి. 10

మూ. అన్యాః స్వస్తికవిజ్ఞేయా మహాఘంటాధరా వరాః,
శోభమానాః పతాకాభిర్యుక్తవాతాః సుసంహతాః. 11

ప్ర. అ. మహాఘంటాధరాః = పెద్ద ఘంటలు ధరించినవి. వరాః = శ్రేష్ఠమైనవి, పతాకాభిః = పతాకలచేత, శోభమానాః = ప్రకాశించుచున్నవి, యుక్తవాతాః=తగిన వాయువు కలవి, సుసంహతాః=చక్కగా కూర్చబడినవి అయిన, స్వస్తికవిజ్ఞేయాః=స్వస్తికము అనే పేరు గల, అన్యాః = మరి కొన్ని ఓడలను (తీసుకొనివచ్చిరి).

తా. స్వస్తికము లను పేరు గల శ్రేష్ఠమైన మరి కొన్ని ఓడలనుకూడ తీసికొనివచ్చిరి. వాటికి పెద్ద పెద్ద గంటలు కట్టి ఉండెను. వాయువునకు అను

కూలముగా నడచు ఆ ఓడలు చిన్న జెండాలతో ప్రకాశించుచుండెను. వాటి బంధములు దృఢముగా ఉండెను. 11

మూ. తతః స్వస్తికవిజ్ఞేయాం పాణ్డుకమ్బళసంవృతామ్,
సనన్దిఘోషాం కల్యాణీం గుహో నావముపాహరత్. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గుహః = గుహుడు, పాణ్డుకమ్బళసంవృతామ్ = తెల్లని కంబళులచే కప్పబడినది, సనన్దిఘోషామ్ = ఆనందకర మైన ధ్వని కలది, కల్యాణామ్ = మంగళప్రద మైనది, స్వస్తికవిజ్ఞేయామ్ = స్వస్తిక మను పేరు కలది యైన, నావమ్ = నావను, ఉపాహరత్ = తీసుకొనివచ్చెను.

తా. పిమ్మట గుహుడు స్వయముగా, తెల్లని కంబళులతో కప్పిన మంగళ ప్రద మైన, ఆనందకర మైన ధ్వని కల, స్వస్తిక మను ఓడను తీసుకొనివచ్చెను.

మూ. తామారురోహ భరతః శత్రుఘ్నశ్చ మహాబలః,
కౌసల్యా చ సుమిత్రా చ యాశ్చాన్యా రాజయోషితః,
పురోహితశ్చ తత్పూర్వం గురవో బ్రాహ్మణాశ్చ యే,
అనన్తరం రాజదారాస్తథైవ శకటాపణాః. 13-14

ప్ర. అ. భరతః = భరతుడు, తామ్ = దానిని, ఆరురోహ = ఎక్కెను. మహాబలః = గొప్ప బలము గల, శత్రుఘ్నశ్చ = శత్రుఘ్నుడు, కౌసల్యా చ = కౌసల్య, సుమిత్రా చ = సుమిత్ర, అన్యాః = ఇతర మైన, యాః = యే, రాజ యోషితః = రాజస్త్రీలు కలరో వారు, తత్పూర్వమ్ = వారికంటె ముందుగా, పురోహితశ్చ = పురోహితు డైన వసిష్ఠుడు, గురవః = పూజ్యు లైన, యే = ఏ, బ్రాహ్మణాశ్చ = బ్రాహ్మణు లున్నారో వారు, అనన్తరమ్ = అనంతరము, రాజదారాః = రాజభార్యలు, తథైవ = మరియు, శకటాపణాః = బండ్లు, ఆపణములు (అంగళ్లు) ఎక్కిరి.

తా. ముందుగా వసిష్ఠుడు, పూజ్యు లైన బ్రాహ్మణులు ఆ ఓడను ఎక్కిరి. భరతుడు, శత్రుఘ్నుడు, కౌసల్య, సుమిత్ర, ఇతరరాజస్త్రీలు ఎక్కిన పిమ్మట రాజభార్యలు బండ్లు అంగళ్లు ఎక్కినవి. 13-14

మూ. ఆవాసమాదీపయతాం తీర్థం చాప్యవగాహతామ్,
భాణ్డాని చాదదానానాం ఘోషస్త్రిదివమస్పృశత్. 15

ప్ర. అ. ఆవాసమ్=నివాసస్థానమును, ఆదీపయతామ్=కాల్చి వేయుచున్న వారియొక్క, తీర్థం చాపి=రేవును, అవగాహతామ్=దిగుచున్న వారియొక్కయు, భాణ్డాని=సామగ్రులను, ఆదదానానామ్ = గ్రహించుచున్నవారి యొక్కయు. ఘోషః=ధ్వని, త్రిదివమ్=స్వర్గమును, అస్పృశత్=స్పృశించెను.

తా. అపుడు కొందరు తాము విడిది చేసిన స్థానములను కాల్చివేయు చుండిరి. కొందరు రేవులో దిగుచుండిరి. కొందరు ఓడలో చేర్చుటకై ఆ యా వస్తువులను తీసుకొనుచుండిరి. వీరందరు చేయు ధ్వని స్వర్గము వరకు వ్యాపించెను.

వి యజ్ఞానంతరము యజ్ఞశాలను కాల్చివేసి నట్లు సైనికులు తాము విడిది యున్న ప్రదేశమును, దానిని విడిచివేయు నపుడు కాల్చివేసెడివా రని దీనినిబట్టి తెలియుచున్నది. తాము ఏర్పరచిన విడుదులు శత్రుపక్షము వారికి ఉపయోగింప కుండుటకై ఈ విధముగా చేసెడివారేమో ! లేదా ఓడలో తాము కూర్చుండతగిన ప్రదేశమును దీపాదులచే ప్రకాశింపచేయుచున్నారు అని "ఆవాసమ్ ఆదీపయతామ్" అనుదానికి అర్థము చెప్పవచ్చును.

మూ. పతాకిన్యస్తు తా నావః స్వయం దాశైరధిష్ఠితాః,
వహన్త్యో జనమారూఢం తదా సంపేతురాశుగాః. 16

ప్ర. అ. పతాకిన్యః=పతాకములు కలవి, దాశైః=పల్లెవారిచే, స్వయమ్=స్వయముగా, అధిష్ఠితాః = అధిష్ఠింపబడినవి అయిన, తాః నావః=ఆ ఓడలు, తదా=అపుడు, ఆరూఢమ్=ఎక్కిన, జనమ్=జనమును, వహన్త్యః = మోయుచున్నవై, ఆశుగాః=వేగముగా పోవుచు. సంపేతుః=పరుగెత్తినవి.

తా. పతాకలచే అలంకరించిన ఆ నావలను, పల్లెవారు స్వయముగా నడపుచుండిరి. అవి ఎక్కిన జనమును మోసుకొని అతివేగముగా పరుగెత్తినవి.

మూ. నారీణామధి పూర్ణాస్తు కాశ్చిత్ కాశ్చిచ్చ వాజినామ్,
కాశ్చిదత్ర వహన్తి స్మ యానయుగ్యం మహాధనమ్. 17

ప్ర. అ. అత్ర = ఈ ఓడలలో, కాశ్చిత్ = కొన్ని, నారీణామ్ = స్త్రీల యొక్క(తో), అధిపూర్ణాః=నిండినవి. కాశ్చిత్ = కొన్ని, వాజినామ్=గుఱ్ఱముల

యొక్క(తో) నిండినవి. కాశ్చిత్ = కొన్ని, యానయుగ్యమ్=రథాదివాహనము లను బండ్లకు కట్టు యెద్దులను, మహాధనమ్=గొప్ప ధనమును, వహన్తి స్మ= మోయుచుండెను.

తా. ఈ ఓడలలో కొన్ని స్త్రీలతోను, కొన్ని గుఱ్ఱములతోను నిండి ఉండెను. కొన్నిటిపై రథాదివాహనములు, బండ్లను లాగు యెడ్లు గొప్ప ధనము ఎక్కింపబడినవి. 17

మూ. తాః స్మ గత్వా పరం తీరమవరోప్య చ తం జనమ్,
నివృత్తాః కాణ్డచిత్రాణి క్రియన్తే దాశబన్ధుభిః. 18

ప్ర. అ. తాః = ఆ ఓడలు, పరం తీరమ్ = ఆవలి ఒడ్డును, గత్వా = పొంది, తం జనమ్ = ఆ జనమును, అవరోప్య = దింపి, నివృత్తాః స్మ = తిరిగి వచ్చినవి. దాశబన్ధుభిః=పల్లెవారిచేత, కాణ్డచిత్రాణి = నీటిలో చిత్రాకార మైన ఓడల సన్నివేశములు, క్రియన్తే స్మ=చేయబడెను.

తా. ఆ ఓడలు ఆవలి ఒడ్డు చేరి, ఆ జనులను దింపి, తిరిగి వచ్చినవి. కొందరు పల్లెవారు నీటిపై ఆ నావలతో వివిధచిత్రాకారము లగు సన్నివేశములను చేసిరి. 18

మూ. సవైజయన్తాస్తు గజా గజారోహప్రచోదితాః,
తరన్తః స్మ ప్రకాశన్తే సధ్వజా ఇవ పర్వతాః. 19

ప్ర. అ. సవైజయన్తాః = జెండాలతో కూడిన, గజారోహప్రచోదితాః = మావటివారిచే ప్రేరేపింపబడిన, గజాః=గజములు, తరన్తః = దాటుచున్నవై, సధ్వజాః=ధ్వజములతో కూడిన, పర్వతాః ఇవ=పర్వతములు వలె, ప్రకాశన్తే స్మ=ప్రకాశించెను.

తా. మావటివారు ప్రేరేపించగ ఈదుచు నదిని దాటుచున్న, జెండాలు కట్టిన ఏనుగులు ధ్వజములతో కూడిన పర్వతముల వలె ప్రకాశించెను. 19

మూ. నావశ్చారురుహుస్త్వన్యే ప్లవైస్తేరుస్తథాపరే,
అన్యే కుమ్భఘటైస్తేరురన్యే తేరుశ్చ బాహుభిః. 20

ప్ర. అ. అన్యే=కొందరు, నావః=ఓడలను, ఆరురుహుశ్చ = ఎక్కిరి. అపరే=మరికొందరు, తథా=అట్లే, ప్లవైః=తెప్పలచేత, తేరుః=దాటిరి. అన్యే= మరి కొందరు, కుమ్భఘటైః=కడవలచే, తేరుః=దాటిరి. అన్యే = మరికొందరు, బాహుభిః=బాహువులచేత, తేరుశ్చ=దాటిరి.

తా. అపుడు కొందరు నావలపై ఎక్కిరి. కొందరు తెప్పలపై ఎక్కి దాటిరి. కొందరు కడవల సహాయముతో తేలుచూ దాటిరి. మరి కొందరు చేతులతో ఈది దాటిరి. 20

మూ. సా పుణ్యా ధ్వజినీ గఙ్గాం దాశైః సంతారితా స్వయమ్,
మైత్రే ముహూర్తే ప్రయయౌ ప్రయాగవనముత్తమమ్.

ప్ర. అ. దాశైః=పల్లెవారిచేత, స్వయమ్=స్వయముగా, గఙ్గామ్=గంగా నదిని, సంతారితా=దాటింపబడిన, పుణ్యా=పవిత్రమైన, సా ధ్వజినీ = ఆ సేన, మైత్రే ముహూర్తే=మైత్ర మను ముహూర్తమునందు, ఉత్తమమ్ = శ్రేష్ఠ మైన, ప్రయాగవనమ్ = ప్రయాగవనమును, ప్రయయౌ=పొందెను.

తా. ఆ పల్లెవారు స్వయముగా దాటింపగా, పవిత్ర మైన ఆ సేన గంగా నదిని దాటి మైత్రముహూర్తమునందు శ్రేష్ఠ మైన ప్రయాగవనమును చేరెను. 21

మూ. ఆశ్వాసయిత్వా చ చమూం మహాత్మా
నివేశయిత్వా చ యథోపజోషమ్,
ద్రష్టుం భరద్వాజమృషిప్రవర్య
మృత్విగ్వృతః సన్ భరతః ప్రతస్థే. 22

ప్ర. అ. మహాత్మా=మహాత్ము డైన, భరతః = భరతుడు, చమూమ్ = సేనను, ఆశ్వాసయిత్వా=విశ్రమింపచేసి, యథోపజోషమ్ = యథాసుఖముగా, నివేశయిత్వా=విడియచేసి, ఋషిప్రవర్యమ్=ఋషిశ్రేష్ఠు డైన, భరద్వాజమ్=భరద్వాజుని, ద్రష్టుమ్=చూచుటకు, ఋత్విగ్వృతస్సన్=ఋత్విక్కులతో కూడినవా డై, ప్రతస్థే=బయలుదేరెను.

తా. పూజ్యు డైన భరతుడు మంచి మాటలచే సేనకు విశ్రాంతి కలుగజేసి, దానిని సుఖముగా నుండునట్లు విడియచేసి, ఋషులలో శ్రేష్ఠు డైన భరద్వాజుని చూచుటకై ఋత్విక్కులతో కూడ బయలుదేరి వెళ్లెను. 22

మూ. స బ్రాహ్మణస్యాశ్రమమభ్యుపేత్య
మహాత్మనో దేవపురోహితస్య,
దదర్శ రమ్యోటజవృక్షషణ్డం
మహద్వనం విప్రవరస్య రమ్యమ్. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోననవతితమః సర్గః.

ప్ర. అ సః=భరతుడు, దేవపురోహితస్య=దేవతలకు పురోహితుడు అయిన (భరద్వాజుడు దేవపురోహితు డైన బృహస్పతి కుమారు డగుటచే ఇట్లు చెప్పబడినది.) మహాత్మనః=మహాత్ము డైన, బ్రాహ్మణస్య=ఆ బ్రాహ్మణునియొక్క, ఆశ్రమమ్=ఆశ్రమమును, అభ్యుపేత్య = సమీపించి, రమ్యోటజవృక్షషణ్డమ్ = రమ్య మైన పర్ణశాలలు, వృక్షసముదాయములు గల, విప్రవరస్య=ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునియొక్క, రమ్యమ్ = సుందర మైన, మహత్ వనమ్ = గొప్ప వనమును, దదర్శ=చూచెను.

తా. భరతుడు దేవపురోహితుడు, మహాత్ముడు అయిన ఆ భరద్వాజుని ఆశ్రమమును సమీపించి, అంద మైన పర్ణశాలలు, వృక్షసముదాయములు గల ఆ బ్రాహ్మణోత్తముని సుందర మైన వనమును చూచెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఎనుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ నవతితమః సర్గః

[భరతుడు భరద్వాజమహర్షిని కలిసికొని సంభాషించుట. తన ఆశ్రమమున వసింపుమని భరద్వాజు డాదేశించుట].

మూ. భరద్వాజాశ్రమం దృష్ట్వా క్రోశాదేవ నరర్షభః,
బలం సర్వమవస్థాప్య జగామ సహ మన్త్రిభిః. 1
పద్భ్యామేవ హి ధర్మజ్ఞో న్యస్తశస్త్రపరిచ్ఛదః,
వసానో వాససీ క్షౌమే పురోధాయ పురోధసమ్. 2

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మమును తెలిసిన, నరర్షభః = నరశ్రేష్ఠు డైన, ఆ భరతుడు, క్రోశాదేవ = కోసు దూరమునుండియే, భరద్వాజాశ్రమమ్ = భరద్వాజుని ఆశ్రమమును, దృష్ట్వా = చూచి, సర్వమ్ = సమస్త మైన, బలమ్ = సైన్యమును, అవస్థాప్య = నిలిపివేసి, న్యస్తశస్త్రపరిచ్ఛదః = విడువబడిన ఆయుధములు పరివారములు కలవాడై, క్షౌమే వాససీ = పట్టుబట్టలను, వసానః = ధరించినవాడై, పురోధసమ్ = పురోహితు డైన వసిష్ఠుని, పురోధాయ = ఎదుట ఉంచుకొని, మన్త్రిభిస్సహ = మంత్రులతో కూడ, పద్భ్యామ్ ఏవ = పాదములచేతనే, జగామ = వెళ్ళెను.

తా. ధర్మవేత్త యైన ఆ భరతుడు, కోసు దూరమునుండియే, భరద్వాజాశ్రమమును చూచి, సైన్యమును అక్కడనే నిలిపివేసి, ఆయుధములను పరివారమును విడిచివేసి, పట్టుబట్టలు ధరించినవా డై వశిష్ఠుని ఎదట ఉంచుకొని, మంత్రులతో కూడ కాలినడకనే అచటికి వెళ్లెను. 1, 2

మూ. తతః సందర్శనే తస్య భరద్వాజస్య రాఘవః,
మన్త్రిణస్తానవస్థాప్య జగామానుపురోహితమ్. 3

ప్ర. అ తతః = అటుపిమ్మట, రాఘవః = భరతుడు, తాన్ మన్త్రిణః = ఆ మంత్రులను, తస్య భరద్వాజస్య = ఆ భరద్వాజునియొక్క, సందర్శనే =

కనబడు నంత దూరములో, అవస్థాప్య = నిలిపివేసి, అనుపురోహితమ్ = పురోహితు ననుసరించి, జగామ = వెళ్లెను.

తా. పిమ్మట ఆ భరతుడు భరద్వాజుడు కనబడునంత దూరములో మంత్రులను నిలిపివేసి తాను వసిష్ఠుని వెనుక నడిచి వెళ్లెను. 3

మూ. వసిష్ఠమథ దృష్ట్వైవ భరద్వాజో మహాతపాః,
సంచచాలాసనాత్తూర్ణం శిష్యానర్ఘ్యమితి బ్రువన్. 4

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతపాః=గొప్ప తపస్సుగల, భరద్వాజః = భరద్వాజుడు, వసిష్ఠమ్ = వసిష్ఠుని, దృష్ట్వైవ = చూడగానే, అర్ఘ్యమ్ ఇతి = అర్ఘ్యమును తీసుకొని రండు అని, శిష్యాన్ = శిష్యులను గూర్చి, బ్రువన్= పలుకుచూ, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆసనాత్ = ఆసనమునుండి, సంచచాల = = కదలెను.

తా. వసిష్ఠుని చూడగానే మహాతపశ్శాలి యైన భరద్వాజుడు, "అర్ఘ్యము అర్ఘ్యము" అని శిష్యులతో పలుకుచు వెంటనే ఆసనము నుండి లేచెను. 4

మూ. సమాగమ్య వసిష్ఠేన భరతేనాభివాదితః,
అబుద్ధ్యత మహాతేజాః సుతం దశరథస్య తమ్. 5

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల ఆ భరద్వాజుడు; వసిష్ఠేన = వసిష్ఠునితో, సమాగమ్య = కలిసి, భరతేన = భరతుని చే, అభివాదితః = నమస్కరింపబడినవాడై, తమ్ = అతనిని, దశరథస్య = దశరథునియొక్క, సుతమ్ = కుమారునిగా, అబుద్ధ్యత = తెలుసుకొనెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ భరద్వాజుడు, వసిష్ఠునితో కలిసిన పిమ్మట భరతుడు ఆయనకు నమస్కరించెను. అపుడు అతడు దశరథుని కుమారుడు అని భరద్వాజునకు తెలిసెను. 5

మూ. తాభ్యామర్ఘ్యం చ పాద్యం చ దత్త్వా పశ్చాత్ఫలాని చ,
ఆనుపూర్వ్యాచ్చ ధర్మజ్ఞః పప్రచ్ఛ కుశలం కులే. 6

ప్ర. అ. ధర్మజ్ఞః=ధర్మములు ఎరిగిన ఆ భరద్వాజుడు, ఆనుపూర్వ్యాత్

= క్రమానుసారముగా, తాభ్యామ్ = వారిరువురకు, అర్ఘ్యం చ = అర్ఘ్యమును, పాద్యం చ = పాద్యమును, పశ్చాత్ = పిమ్మట, ఫలాని చ = ఫలములను, దత్త్వా = ఇచ్చి, కులే = కులమునందు, కుశలమ్ = క్షేమమును, పప్రచ్ఛ = అడిగెను.

తా. ధర్మములు తెలిసిన ఆ భరద్వాజుడు ఆ యిద్దరికిని క్రమము తప్పకుండా అర్ఘ్యమును, పాద్యమును ఫలములను ఇచ్చి, "మీ కులములో అందరును క్షేమముగా ఉన్నారా!" అని (భరతుని) ప్రశ్నించెను.

వి. కొందరు వ్యక్తులు అతిథులుగా వచ్చి నపుడు వారి విద్యాతపో వయస్సులను బట్టి కొందరికి ముందు, కొందరికి తరువాత అతిథిసత్కారము చేయవలయును అని, క్రమము పాటించనిచో అపచారమని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. "అనుపూర్వ్యాత్" అను దానికి ఇదే భావము. 6

మూ. అయోధ్యాయాం బలే కోశే మిత్రేష్వపి చ మన్త్రిషు,
జానన్ దశరథం వృత్తం న రాజానముదాహరత్. 7

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యయందు, బలే = సైన్యమునందు, కోశే = కోశమునందు, మిత్రేష్వపి చ = మిత్రులందు, మన్త్రిషు = మంత్రులందు, క్షేమమును ప్రశ్నించెను. వృత్తమ్ = మరణించిన వానినిగా, జానన్ = ఎరిగిన వాడై, రాజానమ్ = రాజైన, దశరథమ్ = దశరథుని గూర్చి, నోదాహరత్ = పేర్కొనలేదు.

తా. "అయోధ్యానగరము, సైన్యము, ధనాగారము, మీ మిత్రులు మంత్రులు అందరును కుశలమా" అని ప్రశ్నించెను కాని, దశరథమహారాజు మరణించెనని తెలిసినవాడగుటచే ఆతనిని గూర్చి ప్రశ్నించలేదు. 7

మూ. వసిష్ఠో భరతశ్చైనం పప్రచ్ఛతురనామయమ్,
శరీరేఽగ్నిషు వృక్షేషు శిష్యేషు మృగపక్షిషు. 8

ప్ర. అ. వసిష్ఠః = వసిష్ఠుడు, భరతశ్చ = భరతుడు, ఏనమ్ = ఇతనిని, శరీరే = శరీరమునందు, అగ్నిషు = అగ్నులయందు, వృక్షేషు = వృక్షములందు,

శిష్యేషు = శిష్యులందు, మృగపక్షిషు = మృగములయందు, పక్షులయందు, అనామయమ్ = బాధలు లేకుండుటను గూర్చి, పప్రచ్ఛతుః = అడిగిరి.

తా. "నీ శరీరమునకు, అగ్నులకు, వృక్షములకు, శిష్యులకు మృగపక్షులకు ఏ బాధలు లేవు కదా" అని వసిష్ఠుడు, భరతుడు ఆ భరద్వాజుని ప్రశ్నించిరి.

మూ. తథేతి తత్ప్రతిజ్ఞాయ భరద్వాజో మహాతపాః,
భరతం ప్రత్యువాచేదం రాఘవస్నేహబన్ధనాత్. 9

ప్ర. అ. మహాతపాః=గొప్ప తపస్సు గల, భరద్వాజః=భరద్వాజుడు, తథేతి = అట్లే ఉన్నది అని, తత్=ఆ క్షేమమును, ప్రతిజ్ఞాయ=తెలిపి, రాఘవస్నేహబంధనాత్ = రామునియందలి స్నేహబంధమువలన, భరతం ప్రతి = భరతుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మహాతపశ్శాలి యైన భరద్వాజుడు, "ఇక్కడ మేము అన్ని విధముల క్షేమముగా ఉన్నాము" అని తెలిపి రామునియందలి స్నేహమును పురస్కరించుకొని భరతునితో ఇట్లనెను. 9

మూ. కిమిహాగమనే కార్యం తవ రాజ్యం ప్రశాసతః,
ఏతదాచక్ష్వ మే సర్వం న హి మే శుద్ధ్యతే మనః. 10

ప్ర. అ. రాజ్యమ్ = రాజ్యమును, ప్రశాసతః = పరిపాలించుచున్న, తవ = నీకు, ఇహ = ఇచటికి, ఆగమనే = వచ్చుటయందు, కార్యమ్ = పని, కిమ్= ఏమి? ఏతత్ = దీనిని, సర్వమ్ = అంతను, మే=నాకు, ఆచక్ష్వ = చెప్పుము. మే=నాయొక్క, మనః=మనస్సు, న హి శుద్ధ్యతే = శుద్ధముగా (శంకారహితముగా) లేదు కదా!

తా. రాజ్యమును పాలించుచున్న నీవు ఇచటకు ఎందుకు వచ్చితివి? ఈ విషయము సంతను పూర్తిగా తెలుపుము. నా మనస్సులో ఏదియో శంక కలుగుచున్నది. 10

మూ. సుషువే యమమిత్రఘ్నం కౌసల్యానన్దవర్ధనమ్,
భ్రాత్రా సహ సభార్యో యశ్చిరం ప్రవ్రాజితో వనమ్.

నియుక్తః స్త్రీనియుక్తేన పిత్రా యోఽసౌ మహాయశాః,
వనవాసీ భవేతీహ సమాః కిల చతుర్దశ.

కచ్చిన్న తస్యాపాపస్య పాపం కర్తుమిహేచ్ఛసి,
అకణ్టకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్య చ. 13

ప్ర. అ. అమిత్రఘ్నమ్ = శత్రువులను సంహరించువాడు, ఆనన్దవర్ధనమ్ = ఆనందమును, వృద్ధి పొందించువాడూ అయిన, యం = ఏ రాముని, కౌసల్యా = కౌసల్య, సుషువే = కనెనో, యః = ఏ రాముడు, సభార్యః = భార్యాసహితు డై, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, చిరమ్ = చిరకాలము, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజితః = పంపివేయ బడినాడో, మహాయశాః = గొప్ప కీర్తి గల, యః అసౌ = యే ఈ రాముడు, స్త్రీనియుక్తేన = భార్యచే ప్రేరేపింపబడిన, పిత్రా = తండ్రిచేత, చతుర్దశ = పదునాలుగు, సమాః = సంవత్సరములు, వనవాసీ = వనము నందు నివసించువాడవు, భవ = అగుము, ఇతి = అని, ఇహ = ఇపుడు, నియుక్తః = నియమింపబడినాడో, తస్య = అట్టి, అపాపస్య = పాపములు లేని రాముని విషయమునందును, తస్య = అతని, అనుజస్య చ = తమ్ముడైన లక్ష్మణుని విషయము నందును, పాపమ్ = పాపకార్యమును, కర్తుమ్ = చేయుటకై, అకణ్టకమ్ = శత్రువులు లేని, రాజ్యమ్ = రాజ్యమును, భోక్తుమనాః = అనుభవించుటకు కోరిక కలవాడ వై, ఇహ = ఇపుడు, న ఇచ్ఛసి = ఇచ్ఛయించుట లేదు కదా!

తా. శత్రుసంహారకుడు, ఆనందమును వృద్ధి పొందించువాడు అయిన ఏ రాముని, కౌసల్య కనెనో, భార్యచే ప్రేరితుడైన తండ్రి "పదునాలుగు సంవత్సరములు అరణ్యములో నివసించుము" అని ఆజ్ఞాపించగా మహాయశశ్శాలి యైన యే రాముడు భార్యాసోదరసహితు డై చిరకాలము పాటు, అరణ్యమునకు వెళ్ళిపోయెనో, అట్టి పాపరహితు డైన రాముని విషయమునందును, ఆతని తమ్ముని విషయమునందును, నీవు ఎట్టి ఆటంకములు లేని రాజ్యమును అనుభవించవలెను అను అభిలాషతో, పాపకార్యమును చేయుటకై ప్రయత్నించుటలేదు కదా: 13

మూ. ఏవముక్తో భరద్వాజం భరతః ప్రత్యువాచ హ,
పర్యశ్రునయనో దుఃఖాద్వాచా సంసజ్జమానయా. 14

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, భరతః = భరతుడు, దుఃఖాత్

= దుఃఖమువలన, పర్యశ్రునయనః = కన్నీళ్ళతో నిండిన నేత్రములు కలవాడై, సంసజ్జమానయా = తొట్రుపడుచున్న, వాచా = వాక్కుతో, భరద్వాజమ్ = భరద్వాజునిగూర్చి, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను.

తా. భరతుడు ఆ మాటలు విని, దుఃఖముతో కన్నీళ్లు కార్చుచు, తొట్రుపడుచున్న మాటలతో, భరద్వాజునితో ఇట్లు పలికెను. 14

మూ. హతోఽస్మి యది మామేవం భగవానపి మన్యతే,
మత్తో న దోషమాశఙ్కే నైవం మామనుశాస్తు హి. 15

ప్ర. అ. భగవానపి = పూజ్యుడవైన నీవు గూడ, మామ్ = నన్ను గూర్చి, ఏవమ్ = ఇట్లు, మన్యతే యది = తలచుచున్నట్లైతే, హతః అస్మి = చంపబడినవాడ నగుచున్నాను. మత్తః = నావలన, దోషమ్ = దోషమును, న ఆశఙ్కే = శంకించను. మామ్ = నన్ను, ఏవమ్ = ఇట్లు, న అనుశాస్తు హి = శాసింపవద్దు.

తా. పూజ్యుడవైన నీవు కూడ నన్ను గూర్చి ఇట్లు భావించినచో, నన్ను చంపివేసినట్లే. నావలన ఎట్టి దోషమును లేదు. నన్ను గూర్చి నీవు ఈ విధముగా పలుకరాదు. 15

మూ. న చైతదిష్టం మాతా మే యదవోచన్మదన్తరే,
నాహమేతేన తుష్టశ్చ న తద్వచనమాదదే. 16

ప్ర. అ. మే మాతా = నా తల్లి, మదన్తరే = నేను దూరముగా నున్నపుడు, యత్ = దేనిని, అవోచత్ = పలికెనో, ఏతత్ = ఇది, ఇష్టమ్ = నాకు ఇష్టమైనది, న చ = కాదు. ఏతేన = దీనిచేత, అహమ్ = నేను, తుష్టశ్చ = సంతోషించినవాడను, న = కాను. తద్వచనం = ఆమె మాటను, న ఆదదే = స్వీకరించను.

తా. నేను లేని సమయమున నా తల్లి పలికిన మాట లన్నీ నాకుఇష్టము కాదు. వాటిచే నేను సంతోషించలేదు. వాటిని నేను సమ్మతింపను. 16

మూ. అహం తు తం నరవ్యాఘ్రముపయాతః ప్రసాదకః,
ప్రతినేతుమయోధ్యాం చ పాదౌ తస్యాభివన్దితుమ్. 17

ప్ర. అ. అహం తు = నేనైతే, నరవ్యాఘ్రమ్ = నరశ్రేష్ఠుడైన, తమ్ =

ఆ రాముని, ప్రసాదకః = అనుగ్రహింపచేసుకొన నున్నవాడనై, అయోధ్యామ్= అయోధ్యను గూర్చి, ప్రతినేతుమ్ = తీసుకొనివెళ్లుటకై, తస్య = అతనియొక్క, పాదౌ = పాదములను, అభినన్దితుం చ = నమస్కరించుటకును, ఉపయాతః = వచ్చినాను.

తా. నేను ఇపుడు పురుషులలో శ్రేష్ఠుడైన ఆ రాముని పాదములకు నమస్కరించుటకు, ఆతనిని అనుగ్రహింపచేసుకొని మరల అయోధ్యకు తీసుకొని వెళ్లుటకు వచ్చి యున్నాను. 17

మూ. త్వం మామేవంగతం మత్వా ప్రసాదం కర్తుమర్హసి,
శంస మే భగవన్ రామః క్వ సంప్రతి మహీపతిః. 18

ప్ర. అ. భగవన్=ఓ పూజ్యుడా ! త్వమ్=నీవు, మామ్=నన్ను, ఏవంగతమ్ = ఇట్టి పరిస్థితులలో ఉన్నవానినిగా, మత్వా=తెలిసికొని, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు. మహీపతిః= రాజైన, రామః = రాముడు, సంప్రతి = ఇపుడు, క్వ=ఎక్కడ? మే = నాకు, శంస = చెప్పుము.

తా. ఓ మహామునీ ! నేను ఇట్టి పరిస్థితులలో ఉన్నట్లు తెలిసికొని, నన్ను అనుగ్రహింపుము. మహారాజైన రాముడు ఇపుడు ఎక్కడ ఉన్నాడో నాకు తెలుపుము. 18

మూ. వశిష్ఠాదిభి ఋత్విగ్భి ర్యాచితో భగవాం స్తతః,
ఉవాచ తం భరద్వాజః ప్రసాదాత్ భరతం వచః. 19

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వశిష్ఠాదిభిః = వసిష్ఠుడు మొదలైన, ఋత్విగ్భిః = ఋత్విక్కులచేత, యాచితః = ప్రార్థింపబడిన, భగవాన్=పూజ్యుడైన, భరద్వాజః = భరద్వాజుడు, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, తం భరతమ్ = ఆ భరతుని గూర్చి, వచః = వాక్కును, ఉవాచ=పలికెను.

తా. వసిష్ఠాదిరుత్విక్కులు కూడ ప్రార్థింపగా, పూజ్యుడైన ఆ భరద్వాజుడు, ప్రసన్నుడై, భరతునితో ఇట్లు పలికెను. 19

మూ. త్వయ్యేతత్పురుషవ్యాఘ్ర యుక్తం రాఘవవంశజే,
గురువృత్తిర్దమశ్చైవ సాధూనామనుయాయితా. 20

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = ఓ పురుషశ్రేష్ఠుడా ; గురువృత్తిః = గురువుల విషయమున సత్ప్రవర్తనము, దమశ్చైవ = ఇంద్రియనిగ్రహము, సాధూనామ్ = సత్పురుషులయొక్క, అనుయాయితా = అనుసరించి యుండుట, ఏతత్ = ఇది అంతయు, రాఘవవంశజే = రఘువంశమునందు పుట్టిన, త్వయి = నీయందు, యుక్తమ్ = యుక్తముగా నున్నది.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ భరతా ! గురువుల విషయమున సత్ప్రవర్తనము, ఇంద్రియనిగ్రహము, సత్పురుషులను అనుసరించి ఉండుట, ఇవన్నీ రఘువంశములో జన్మించిన నీకు తగిఉన్నవి. 20

మూ. జానే చైతన్మనస్థం తే దృఢీకరణమస్త్వితి,
అపృచ్ఛం త్వాం తవాత్యర్థం కీర్తిం సమభివర్ధయన్. 21

ప్ర. అ. తే = నీయొక్క, మనస్థమ్ = మనస్సులో ఉన్న, ఏతత్ = ఈ విషయమును, జానే చ = ఎరుగుదును. దృఢీకరణమ్ = ఆ విషయమునకు దృఢత్వమును చేయుట, అస్తు = అగుగాక : ఇతి = అని, తవ = నీయొక్క, కీర్తిమ్ = కీర్తిని, అత్యర్థమ్ = మిక్కిలి, సమభివర్ధయన్ = వృద్ధిపొందించుచున్నవాడనై, త్వామ్ = నిన్ను, అపృచ్ఛమ్ = అడిగితిని.

తా. నీ మనస్సులోని భావము నాకు తెలియును. అయినను దానిని ధ్రువీకరించుకొనుటకును, నీ కీర్తిని అభివృద్ధిచేయుటకును, నిన్ను ఇట్లు ప్రశ్నించితిని.

మూ జానే చ రామం ధర్మజ్ఞం ససీతం సహలక్ష్మణమ్,
అసౌ వసతి తే భ్రాతా చిత్రకూటే మహాగిరౌ. 22

ప్ర. అ. ధర్మజ్ఞమ్ = ధర్మము నెరిగినవాడు, ససీతమ్ = సీతతో కూడినవాడు, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడినవాడు అయిన, రామమ్ = రాముని, జానే చ = ఎరుగుదును, అసౌ = ఈ, తే భ్రాతా = నీ సోదరుడు, చిత్రకూటే = చిత్రకూట మను, మహాగిరౌ = మహాపర్వతమునందు, వసతి = నివసించుచున్నాడు.

తా. ధర్మజ్ఞు డైన రాముడు సీతాలక్ష్మణసహితు డై, ఎక్కడ వున్నాడో నాకు తెలియును. నీ సోదరు డైన రాముడు చిత్రకూటపర్వతము నందు నివసించు చున్నాడు. 22

మూ. శ్వస్తు గన్తాసి తం దేశం వసాద్య సహ మన్త్రిభిః,
ఏతన్మే కురు సుప్రాజ్ఞ కామం కామార్థకోవిద. 23

ప్ర. అ. తం దేశమ్=ఆ ప్రదేశమును గూర్చి, శ్వః=రేపు, గన్తాసి = వెళ్లగలవు, అద్య=నేడు, మన్త్రిభిస్సహ=మంత్రులతో కూడ, వస = ఇక్కడ నివసించుము. సుప్రాజ్ఞ=మిక్కిలి బుద్ధిమంతుడా! కామార్థకోవిద = కామార్థము లను తెలిసినవాడా! మే=నాయొక్క, ఏతత్=ఈ, కామం=కోరికను, కురు= చేయుము.

తా. నీవు రేపు అక్కడకు వెళ్ళవచ్చును. మంత్రిసహితుడ వై, నేడు ఇక్క డనే ఉండుము. ఓ మహాబుద్ధిశాలీ! కామార్థములను తెలిసినవాడా! ఈ నా కోరికను తీర్పుము. 23

మూ. తతస్తథేత్యేవముదారదర్శనః
ప్రతీతరూపో భరతోఽబ్రవీద్వచః,
చకార బుద్ధిం చ తదా తదాశ్రమే
నిశానివాసాయ నరాధిపాత్మజః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
నవతితమః సర్గః.

ప్ర. అ. ఉదారదర్శనః=గొప్పబుద్ధి కలవాడు అయిన, భరతః=భరతుడు, ప్రతీతరూపః=చాలా సంతోషించినవా డై, తతః=పిమ్మట, తథా = అట్లే, ఇత్యే వమ్=అని, వచః=వాక్యమును, అబ్రవీత్=పలికెను. తదా = అపుడు, నరాధి పాత్మజః=రాజకుమారుడు, తదాశ్రమే=ఆ ఆశ్రమమునందు, నిశానివాసాయ = రాత్రియందు నివసించుటకై, బుద్ధిమ్=బుద్ధిని, చకార=చేసెను.

తా. ఉత్తమమైన ఆలోచన కల భరతుడు చాల సంతోషించి, అట్లే అగు గాక అని పలికెను. అపుడు ఆ రాజకుమారుడు ఆ రాత్రి ఆశ్రమమునందు నివసించుటకు నిశ్చయించుకొనెను. 24

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో తొంబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకనవతితమ సర్గః

[సైన్యసమేతుడగు భరతునకు భరద్వాజు డాతిథ్యమిచ్చుట.]

మూ. కృతబుద్ధిం నివాసాయ తత్రైవ స మునిస్తదా,
భరతం కైకయీపుత్రమాతిథ్యేన న్యమన్త్రయత్. 1

ప్ర. అ. సః=ఆ, మునిః=ముని, తదా=అపుడు, తత్రైవ=అక్కడనే, నివాసాయ=నివాసముకొరకు, కృతబుద్ధిమ్ = చేయబడిన బుద్ధి గల, కైకయీ పుత్రమ్=కైకేయి పుత్రు డైన, భరతమ్=భరతుని, ఆతిథ్యేన=ఆతిథ్యముచేత, న్యమన్త్రయత్=నియంత్రణము చేసెను.

తా. ఆ భరద్వాజుడు, అపుడు అక్కడ నివసించుటకు, నిర్ణయించు కొనిన భరతునితో "నేను ఇచ్చు ఆతిథ్యమును స్వీకరింపుము" అని కోరెను. 1

మూ. అబ్రవీద్భరతస్త్వేనం నన్విదం భవతా కృతమ్,
పాద్యమర్ఘ్యం తథాతిథ్యం వనే యదుపపద్యతే. 2

ప్ర. అ. భరతస్తు=భరతు డైతే, ఏనమ్=ఈ భరద్వాజమునిని గూర్చి, అబ్రవీత్=పలికెను. భవతా=నీచేత, పాద్యమ్=పాద్యము, అర్ఘ్యమ్=అర్ఘ్యము, తథా=మరియు, వనే= వనమునందు, యత్=ఏది, ఉపపద్యతే=లభించునో అట్టి, ఇదమ్ ఆతిథ్యమ్=ఈ అతిథిసత్కారము, కృతం ను = చేయబడినది కదా!

తా. భరతు డైతే భరద్వాజునితో ఇట్లనెను. "పాద్యము, అర్ఘ్యము, అరణ్యములో లభించు ఈ ఆతిథ్యము నీవు నాకు ఇచ్చియే ఉన్నావు కదా! 2

మూ. అథోవాచ భరద్వాజో భరతం ప్రహసన్నివ,
జానే త్వాం ప్రీతిసంయుక్తం తుష్యేస్త్వం యేన కేనచిత్.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, భరద్వాజః=భరద్వాజుడు, ప్రహసన్నివ =నవ్వుచు, భరతమ్=భరతుని గూర్చి, ఉవాచ =పలికెను. త్వామ్=నిన్ను, ప్రీతిసంయుక్తమ్=ప్రేమతో కూడిన వానినిగా, జానే=ఎరుగుదును. త్వమ్= నీవు, యేన కేన చిత్=దేనితో నైనను, తుష్యేః = సంతసించెదవు.

తా. పిమ్మట భరద్వాజుడు చిరునవ్వు నవ్వుచు, భరతునితో ఇట్లనెను. నీవు సంతుష్టి కలవాడ వని ఎరుగుదును. నీకు ఏమి ఇచ్చినను దానితో తృప్తి పడెదవు. 3

మూ. సేనాయాస్తు తవైతస్యాః కర్తుమిచ్ఛామి భోజనమ్,
మమ ప్రీతిర్యథారూపా తథార్హో మనుజర్షభ. 4

ప్ర. అ. మనుజర్షభ=ఓ మనుజశ్రేష్ఠుడా, తవ=నీయొక్క, ఏతస్యాః =ఈ, సేనాయాః=సేనకు, భోజనమ్=భోజనమును, కర్తుమ్=చేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. మమ=నాయొక్క, ప్రీతిః=ఆనందము, యథా= రూపా=ఏ విధముగా నున్నదో, తథా=ఆ విధముగా, అర్హః=తగినవాడవు.

తా. ఓ మనుజశ్రేష్ఠుడా! నీ సేన కంతకును భోజనము ఏర్పరుపవలె నని కోరుచున్నాను. ఏ విధముగా చేసిన నాకు ఆనందము కలుగునో ఆ విధ ముగా సత్కరించుటకు నీవు తగినవాడవు. 4

మూ. కిమర్థం చాపి నిక్షిప్య దూరే బలమిహాగతః,
కస్మాన్నేహోపయాతోఽసి సబలః పురుషర్షభ. 5

ప్ర. అ. పురుషర్షభ=ఓ పురుషశ్రేష్ఠుడా! కిమర్థమ్ = ఎందువలన, బలమ్=సేనను, దూరే=దూరమునందు, నిక్షిప్య=ఉంచి, ఇహ=ఇచటికి, ఆగతః=వచ్చినావు? ఇహ=ఇచటికి, సబలః=సేనతో కూడినవాడవై, కస్మాత్= ఏ కారణమువలన, న ఉపయాతః అసి=రాలేదు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! నీ సైన్యమును దూరముగా ఉంచి ఇక్కడికి వచ్చినా వేమి? సైన్యముతో కూడ ఎందుకు రాలేదు. 5

మూ. భరతః ప్రత్యువాచేదం ప్రాఞ్జలిస్తం తపోధనమ్,
ససైన్యో నోపయాతోఽస్మి భగవన్భగవద్భయాత్. 6

ప్ర. అ. భరతః = భరతుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, తపోధనమ్ = తపస్సే ధనముగా గల, తమ్ = ఆ భరద్వాజుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను. భగవన్ = ఓ పూజ్యుడా! భగవద్భయాత్ = పూజ్యుడ వైన నీ నుండి భయమువలన, ససైన్యః = సైన్యముతో కూడినవాడనై, నోపయాతోఽస్మి = రాలేదు.

తా. భరతుడు చేతులు జోడించి నమస్కరించుచు, భరద్వాజునితో ఇట్లనెను. ఓ పూజ్యుడా! నేను నీకు భయపడి ఇక్కడకు సేనను తీసుకొని రాలేదు.

మూ. రాజ్ఞా చ భగవన్నిత్యం రాజపుత్రేణ వా సదా,
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః. 7

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! రాజ్ఞా చ = రాజుచేతగాని, రాజపుత్రేణ వా = రాజపుత్రునిచేత గాని, విషయేషు = దేశములయందు, సదా = ఎల్లప్పుడు, తపస్వినః = మునులు, యత్నతః = ప్రయత్నమువలన, పరిహర్తవ్యాః = పరిహరింపతగినవారు.

తా. ఓ పూజ్యుడా! రాజుగాని రాజపుత్రుడు గాని ఎల్లపుడును దేశములో ప్రయత్నపూర్వకముగా మునులకు దూరముగా సంచరించవలెను. 7

మూ. వాజిముఖ్యా మనుష్యాశ్చ మత్తాశ్చ వరవారణాః,
ప్రచ్ఛాద్య భగవన్భూమిం మహతీమనుయాన్తి మామ్.

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా! వాజిముఖ్యాః = ఉత్తమ మైన అశ్వములు, మనుష్యాశ్చ = మనుష్యులు, మత్తాః = మదించిన, వరవారణాశ్చ = శ్రేష్ఠమైన ఏనుగులు, మహతీమ్ = విశాల మైన, భూమిమ్ = భూమిని, ప్రచ్ఛాద్య = ఆచ్ఛాదించి, మామ్ = నన్ను, అనుయాన్తి = అనుసరించి వచ్చుచున్నవి.

తా. ఓ మహాముని! ఉత్తమ మైన అశ్వములు, మనుష్యులు, మదించిన శ్రేష్ఠ మైన గజములు విశాలమైన భూమిని ఆక్రమించుచు నా వెనుక వచ్చుచున్నవి. 8

మూ. తే వృక్షానుదకం భూమిమాశ్రమేషూటజాంస్తథా,
న హింస్యురితి తేనాఽహమేక ఏవ సమాగతః. 9

ప్ర. అ. తే=అవి, ఆశ్రమేషు = ఆశ్రమములందు, వృక్షాన్=వృక్షములను, ఉదకమ్ = ఉదకమును, భూమిమ్ = భూమిని, తథా=మరియు, ఉటజాన్ = పర్ణశాలను, న హింస్యుః = హింసింపకుండుగాక: ఇతి = అని తలచి, తేన = ఆ కారణముచేత, అహమ్ = నేను, ఏక ఏవ = ఒక్కడనే, సమాగతః = వచ్చినాను.

తా. ఆ సైన్యములు ఆశ్రమములో నున్న వృక్షములను, ఉదకములను భూమిని, పర్ణశాలను పాడుచేయును అను భయముచే అట్లు జరుగకుండుటకై నేను ఒక్కడనే వచ్చినాను. 9

మూ. ఆనీయతామితస్సేనేత్యాజ్ఞప్తః పరమర్షిణా,
తతస్తు చక్రే భరతః సేనాయాః సముపాగమమ్. 10

ప్ర. అ. తతస్తు = అటుపిమ్మట, సేనా = సేన, ఇతః = ఇక్కడికి, ఆనీయతామ్ = తీసికొని రాబడుగాక. ఇతి = అని, పరమర్షిణా = ఆ మహర్షిచేత, ఆజ్ఞప్తః=ఆజ్ఞాపింపబడిన, భరతః = భరతుడు, సేనాయాః = సేనయొక్క, సముపాగమమ్ = రాకను, చక్రే=చేసెను.

తా. పిమ్మట "సైన్యమును ఇక్కడకు తీసికొని రమ్ము" అని ఆ మహర్షి ఆజ్ఞాపింపగా భరతుడు సైన్యమును రప్పించెను. 10

మూ. అగ్నిశాలాం ప్రవిశ్యాథ పీత్వాపః పరిమృజ్య చ,
ఆతిథ్యస్య క్రియాహేతోర్విశ్వకర్మాణమాహ్వయత్. 11

ప్ర. అ. అథ = పిమ్మట, అగ్నిశాలామ్ = అగ్నిశాలను, ప్రవిశ్య = ప్రవేశించి, అపః = ఉదకమును, పీత్వా=త్రాగి, పరిమృజ్య చ=ఉదకముతో అవయవములను తుడుచుకొని, ఆతిథ్యస్య=ఆతిథ్యముయొక్క, క్రియాహేతోః= చేయుటకొరకై, విశ్వకర్మాణమ్ = విశ్వకర్మను, ఆహ్వాయత్=పిలచెను.

తా. పిదప భరద్వాజుడు అగ్నిగృహములో ప్రవేశించి, ఆచమనము చేసి, అవయవముల పరిమార్జనము చేసుకొని ఆతిథ్యమును ఏర్పరచుటకు విశ్వకర్మను ఆహ్వానించెను. 11

మూ. ఆహ్వయే విశ్వకర్మాణమహం త్వష్టారమేవ చ,
ఆతిథ్యం కర్తుమిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. 12

ప్ర. అ. అహమ్=నేను, ఆతిథ్యమ్=ఆతిథ్యమును, కర్తుమ్=చేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. త్వష్టారమ్ ఏవ చ=గృహాదినిర్మాణము చేయు, విశ్వకర్మాణమ్=విశ్వకర్మను, ఆహ్వయే=పిలుచుచున్నాను. తత్ర = ఆ ఆతిథ్యము విషయమున, మే=నాకు, సంవిధీయతామ్=ఏర్పాటు చేయబడుగాక!

తా. ఆతిథ్యము ఇవ్వ గోరుచున్న నేను గృహాదులు నిర్మించు విశ్వకర్మను ఆహ్వానించుచున్నాను. అతడు వచ్చి తగు ఏర్పాట్లు చేయుగాక!

మూ. ఆహ్వయే లోకపాలాంస్త్రీన్ దేవాన్ శక్రముఖాంస్తథా,
ఆతిథ్యం కర్తుమిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. 13

ప్ర. అ. తథా = మరియు, శక్రముఖాన్ = దేవేంద్రుడు మొదలైన, లోకపాలాన్=లోకపాలకులైన, త్రీన్ దేవాన్ = ముగ్గురు దేవతలను, ఆహ్వయే = ఆహ్వానించుచున్నాను. ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తత్ర = ఆ విషయమునందు, మే = నాకు, సంవిధీయతామ్ = ఏర్పాట్లు చేయబడుగాక.

తా. దేవేంద్రుడు మొదటగల యమ, వరుణ, కుబేరులు అను లోకపాలకులు ముగ్గురిని ఆహ్వానించుచున్నాను. నేను భరతునకు ఆతిథ్యము చేయ గోరుచున్నాను. కావున వారు వచ్చి తగు ఏర్పాట్లు చేయుదురు గాక! 13

మూ. ప్రాక్స్రోతసశ్చ యా నద్యః ప్రత్యక్స్రోతస ఏవ చ,
పృథివ్యామన్తరిక్షే చ సహాయాన్త్వద్య సర్వశః. 14

ప్ర. అ. యాః నద్యః=ఏ నదులు, ప్రాక్స్రోతసశ్చ=తూర్పుగా ప్రవహించు ప్రవాహములు కలవో, ప్రత్యక్స్రోతస ఏవ చ = పశ్చిమముగా ప్రవహించు ప్రవాహములు కలవో, పృథివ్యామ్=భూమియందు, అంతరిక్షే చ=అంతరిక్షమునందు ఉన్న ఆ నదులు, సర్వశః=నలువైపుల నుండి, అద్య=ఇపుడు, సహ ఆయాన్తు=కలిసి వచ్చు గాక.

తా. భూమిపైన, అంతరిక్షమునందు, తూర్పుగాను, పడమటవైపునకు ప్రవహించు నదు లన్నియు కలిసి ఇపుడు నలువైపులనుండి వచ్చుగాక: 14

మూ. అన్యాః స్రవన్తు మైరేయం సురామన్యాః సునిష్ఠితామ్,
అపరా శ్చోదకం శీతమిక్షుకాణ్డరసోపమమ్. 15

ప్ర. అ. అన్యాః=కొన్ని నదులు, మైరేయమ్=మైరేయ మను మద్యమును, స్రవన్తు=స్రవించుగాక: అన్యాః=మరికొన్ని నదులు, సునిష్ఠితామ్ = బాగుగా తయారుచేయబడిన, సురామ్ = కల్లును, స్రవించుగాక: అపరాశ్చ=మరి కొన్ని నదులు, ఇక్షుకాణ్డరసోపమమ్= చెఱకురసముతో సమాన మైన, శీతమ్=చల్లని, ఉదకమ్=ఉదకమును, స్రవంతు=స్రవించుగాక:

తా. కొన్ని నదులు మైరేయ మను మద్యమును, కొన్ని నదులు బాగుగా తయారు చేయబడిన సురను, మరికొన్ని నదులు చెఱకురసము వలె మధుర మైన చల్లని ఉదకమును స్రవించుగాక:

మూ. ఆహ్వాయే దేవగన్ధర్వాన్విశ్వావసుహహాహూహూన్,
తథైవాప్సరసో దేవీర్గన్ధర్వీశ్చాపి సర్వశః. 16

ప్ర. అ. దేవగన్ధర్వాన్ =దేవగన్ధర్వు లైన, విశ్వావసుహహాహూహూన్= విశ్వావసువును, హాహాను, హూహూను, తథైవ=మరియు, దేవీః = దేవజాతికి చెందినవారు అయిన, గన్ధర్వీశ్చాపి=గంధర్వజాతికి చెందినవారు అయిన, అప్స రసః=అప్సరసలను, సర్వశః=నలువైపులనుండి, ఆహ్వాయే=పిలచుచున్నాను.

తా. దేవగంధర్వు లైన విశ్వావసు, హాహా, హూహూలను, దేవజాతికి చెందిన అప్సరసలను, గంధర్వజాతికి చెందిన అప్సరసలను నలువైపులనుండి ఆహ్వానించుచున్నాను. 16

మూ. ఘృతాచీమథ విశ్వాచీం మిశ్రకేశీమలంబుసామ్,
నాగదన్తాం చ హేమాం చ హిమామద్రికృతస్థలామ్. 17

ప్ర. అ. అథ=మరియు, ఘృతాచీమ్=ఘృతాచి యను అప్సర స్త్రీని, విశ్వాచీమ్ = విశ్వాచిని, మిశ్రకేశీమ్ = మిశ్రకేశిని, అలంబుసామ్=అలంబు సను, నాగదన్తాం చ=నాగదంతను, హేమాం చ= హేమను, అద్రికృతస్థలామ్

=పర్వతములందు చేయబడిన నివాసస్థానము గల, హేమామ్=హేమను పిలుచు చున్నాను.

తా. ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస, నాగదంత, హేమ అను అప్సరసస్త్రీలను, పర్వతముపై నివసించు హేమ అను అప్సరసను ఆహ్వానించు చున్నాను. 17

మూ. శక్రం యాశ్చోపతిష్ఠన్తి బ్రహ్మాణం యాశ్చ యోషితః,
సర్వాస్తుంబురుణా సార్ధమాహ్వయే సపరిచ్ఛదాః. 18

ప్ర. అ. యాశ్చ=ఏ, యోషితః=స్త్రీలు, శక్రమ్ = దేవేంద్రుని, ఉప తిష్ఠన్తి=సేవించుచున్నారో, యాశ్చ = ఏ స్త్రీలు, బ్రహ్మాణమ్ = బ్రహ్మను, సేవించుచున్నారో, సపరిచ్ఛదాః=ఉపకరణములతో కూడిన, సర్వాః=వారినంద రిని, తుంబురుణా సార్ధమ్=తుంబురునితోగూడ, ఆహ్వయే=పిలుచుచున్నాను.

తా. దేవేంద్రుని సేవించుచున్న స్త్రీలను, బ్రహ్మను సేవించు స్త్రీలను, తుంబురువును ఆహ్వానించుచున్నాను. వారు తమ తమ ఉపకరణములు తీసికొని రావలెను. 18

మూ. వనం కురుషు యద్దివ్యం వాసోభూషణపత్రవత్,
దివ్యం నారీఫలం శశ్వత్ తత్ కౌబేరమిహైతు చ. 19

ప్ర. అ. కురుషు=ఉత్తరకురుదేశమునందు, శశ్వత్=ఎల్లపుడు, వాసో భూషణపత్రవత్ = వస్త్రములు, అలంకారములు, పత్రములుగా కలది, దివ్య నారీఫలమ్=ఉత్తమస్త్రీలే ఫలములుగా గలది, కౌబేరం = కుబేరునికి సంబంధిం చిన, యత్=యే, దివ్యం వనమ్=దివ్యమైన వనము కలదో, తత్ = అది, ఇహ=ఇచటకు, ఏతు=వచ్చుగాక!

తా. ఎల్లపుడు వస్త్రములు, భూషణములు అను పత్రములతోను, ఉత్తమ స్త్రీలు అను ఫలములతోను ప్రకాశించుచున్న కుబేరుని ఏ దివ్యవనము ఉత్తర కురు దేశమునందు ఉన్నదో అది ఇక్కడికి వచ్చుగాక! 19

మూ. ఇహ మే భగవాన్ సోమో విధత్తామన్నముత్తమమ్,
భక్ష్యంచోజ్యం చ చోష్యం చ లేహ్యం చ వివిధం బహు.

ప్ర. అ. భగవాన్ = భగవంతు డైన, సోమః = చంద్రుడు, మే = నా కొరకై, ఇహ = ఇక్కడ, ఉత్తమమ్ = ఉత్తమ మైన, అన్నమ్ = అన్నమును, వివిధమ్ = అనేకవిధము లైన. బహు = అధిక మైన, భక్ష్యమ్ = తినదగిన పిండివంటలను, భోజ్యమ్ = భుజింప దగిన వరి యన్నము మొదలగుదానిని, చోష్యమ్ = పీల్చదగిన చారు మొదలైన దానిని, లేహ్యం చ = నాక దగిన పచ్చళ్లు మొదలగు దానిని, విధత్తామ్ = చేయుగాక.

తా. భగవంతు డైన చంద్రుడు ఇక్కడ నా కొరకై ఉత్తమ మైన అన్నమును, అనగా బహువిధము లైన భక్ష్యములను, భోజ్యములను, చోష్యములను, లేహ్యములను కల్పించుగాక! 20

మూ. విచిత్రాణి చ మాల్యాని పాదపప్రచ్యుతాని చ,
సురాదీని చ పేయాని మాంసాని వివిధాని చ. 21

ప్ర. అ. పాదపప్రచ్యుతాని = అపుడే చెట్లనుండి రాలిన, విచిత్రాణి = విచిత్ర మైన, మాల్యాని చ = పుష్పమాలలను, సురాదీని = మద్యము మొదలైన, పేయాని = త్రాగదగిన ద్రవ్యములను, వివిధాని = అనేక విధము లైన, మాంసాని చ = మాంసములను ఏర్పరుచుగాక!

తా. చంద్రుడు అపుడే చెట్లనుండి రాలి నూతనముగా నున్న వివిధ పుష్పమాలలను, సుర మొదలగు పేయములను, అనేకవిధము లైన మాంసములను ఇచ్చుగాక! 21

మూ. ఏవం సమాధినా యుక్తస్తేజసాప్రతిమేన చ,
శిక్షాస్వరసమాయుక్తం తపసా చాబ్రవీన్మునిః. 22

ప్ర. అ. సమాధినా = ఏకాగ్రచిత్తముతోను, అప్రతిమేన = సాటి లేని, తేజసా చ = తేజస్సుతోను, తపసా చ = తపస్సుతోను, యుక్తః = కూడిన, మునిః = ఆ భరద్వాజముని, శిక్షాస్వరసమాయుక్తమ్ = శిక్షలో చెప్పిన స్వరముతో కూడు నట్లుగా, ఏవమ్ = ఇట్లు, అబ్రవీత్ = పలికెను.

తా. సాటి లేని తేజస్సు, తపస్సు గల ఆ భరద్వాజుడు, ఏకాగ్రచిత్తుడై శిక్షలో చెప్పబడిన స్వరములను పాటించుచు, ఇట్లు పలికెను. 22

మూ. మనసా ధ్యాయతస్తస్య ప్రాఙ్ముఖస్య కృతాఞ్జలేః,
ఆజగ్ముస్తాని సర్వాణి దైవతాని పృథక్ పృథక్. 23

ప్ర. అ. తస్య = ఆ భరద్వాజమహాముని, ప్రాఙ్ముఖస్య = తూర్పునకు అభిముఖు డై, కృతాఞ్జలేః = కట్టబడిన దోసిలి కలవాడై, మనసా = మనస్సుతో, ధ్యాయతః = ధ్యానము చేయుచుండగా, సర్వాణి = సమస్త మైన, తాని దైవతాని = ఆ దేవతలు, పృథక్ పృథక్ = వేర్వేరుగా, ఆజగ్ముః = వచ్చిరి.

తా. ఆ భరద్వాజుడు తూర్పుదిక్కు వైపు తిరిగి, చేతులు జోడించి నమస్కరించుచు మనస్సులో ఈ విధముగా ధ్యానము చేయుచుండగానే, ఆహూతు లైన ఆ దేవత లందరును ఒక్కరొక్కరుగా అక్కడికి వచ్చిరి. 23

మూ. మలయం దర్దురం చైవ తతః స్వేదనుదోఽనిలః,
ఉపస్పృశ్య వవౌ యుక్త్యా సుప్రియాత్మా సుఖః శివః. 24

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అనిలః = వాయువు, మలయమ్ = మలయపర్వతమును, దర్దురం చైవ = దర్దురపర్వతమును, ఉపస్పృశ్య = స్పృశించి, యుక్త్యా = సంబంధముచేత, సుప్రియాత్మా = మిక్కిలి ప్రియ మైన స్వరూపము కలదై, సుఖః = సుఖకర మై, శివః = మంగళకర మై, స్వేదనుదః = చెమటను తొలగించుచు, వవౌ = వీచెను.

తా. ఇంతలో వాయువు మలయదర్దురపర్వతములనుండి వచ్చుచు, శరీరములకు తాకుటచే సుఖానందములను కల్గించుచు, చెమటలనుతొలగించుచు మంగళకరముగా వీచెను. 24

మూ. తతోఽభ్యవర్షన్త ఘనా దివ్యాః కుసుమవృష్టయః,
దివ్యదున్దుభిఘోషశ్చ దిక్షు సర్వాసు శుశ్రువే. 25

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దివ్యాః = దివ్యము లైన, కుసుమవృష్టయః = పుష్పముల వర్షములు కలవి అయిన, ఘనాః = మేఘములు, అభ్యవర్షన్త = వర్షించినవి. సర్వాసు = సమస్త మైన, దిక్షు = దిక్కులయందు, దివ్యదున్దుభిఘోషశ్చ = దివ్యము లైన దుందుభుల ధ్వని కూడ, శుశ్రువే = వినబడెను.

తా. ఇంతలో దివ్య మైన మేఘములు వచ్చి, పుష్పవర్షములను వర్షించెను. దివ్యము లైన దుందుభుల ధ్వని అన్ని దిక్కులందును వినబడెను. 25

మూ. ప్రవవుశ్చోత్తమా వాతా ననృతుశ్చాప్సరోగణాః,
జగుశ్చ దేవగన్ధర్వా వీణాః ప్రముముచుః స్వరాన్. 26

ప్ర. అ. ఉత్తమాః = ఉత్తమ మైన, వాతాశ్చ = వాయువులు, ప్రవవుః = వీచినవి. అప్సరోగణాః = అప్సరస్త్రీగణములు, ననృతుశ్చ = నాట్యము చేసినవి. దేవగన్ధర్వాః = దేవతలు, గంధర్వులు, జగుశ్చ = గానము చేసిరి. వీణాః = వీణలు, స్వరాన్ = స్వరములను, ప్రముముచుః = విడచినవి.

తా. అపుడు వాయువులు సుఖకరముగా వీచెను. అప్సరసలు నృత్యము చేసిరి. దేవతలు గంధర్వులు గానములు చేసిరి. వీణాధ్వనులు అంతట వ్యాపించెను. 26

మూ. స శబ్దో ద్యాం చ భూమిం చ ప్రాణినాం శ్రవణాని చ
వివేశోచ్చరితః శ్లక్ష్ణః సమో లయసమన్వితః. 27

ప్ర. అ. ఉచ్చరితః = ఉచ్చరింపబడిన, శ్లక్ష్ణః = మధుర మై, లయసమన్వితః = లయతో కూడిన దై, సమః = సమముగా ఉన్న, సః శబ్దః = ఆ శబ్దము, ద్యాం చ = ఆకాశమును, భూమిం చ = భూమిని, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, శ్రవణాని చ = చెవులను, వివేశ = ప్రవేశించెను.

తా. లయసమన్విత మై, మృదువుగాను, సమముగాను, ఉన్న ఆ వీణాది ధ్వని ఆకాశమును భూమిని ప్రాణుల శ్రవణములను ప్రవేశించెను. 27

మూ. తస్మిన్నుపరతే శబ్దే దివ్యే శ్రోత్రసుఖే నృణామ్,
దదర్శ భారతం సైన్యం విధానం విశ్వకర్మణః. 28

ప్ర. అ. నృణామ్ = మనుష్యులయొక్క, శ్రోత్రసుఖే = చెవులకు సుఖకర మైన, తస్మిన్ = ఆ, దివ్యే శబ్దే = దివ్య మైన ధ్వని, ఉపరతే = శాంతించిన దగుచుండగా, భారతమ్ = భరతునకు సంబంధించిన, సైన్యమ్ = సైన్యము, విశ్వకర్మణః = విశ్వకర్మయొక్క, విధానమ్ = నిర్మాణమును, దదర్శ = చూచెను.

తా. మానవుల శ్రోత్రములకు సుఖకరమైన ఆ దివ్యధ్వని శాంతించిన పిమ్మట భరతుని సైన్యము విశ్వకర్మ చేసిన నిర్మాణమును చూచెను. 28

మూ. బభూవ హి సమా భూమిః సమన్తాత్ పఞ్చయోజనా,
శాద్వలైర్బహుభిశ్ఛన్నా నీలవైదూర్యసన్నిభైః. 29

ప్ర. అ. సమన్తాత్=ఆ చుట్టుప్రక్కల, పఞ్చయోజనా=అయిదు ఆమడల ప్రమాణము గల, భూమిః=భూమి, సమా=మిట్ట పల్లములు లేనిదిగాను, నీలవైదూర్యసన్నిభైః=నీలమణులతోను, వైడూర్యమాణిక్యములతోను, సమానమైన, బహుభిః=అనేకమైన, శాద్వలైః=పచ్చికబయళ్లచే, ఛన్నా=కప్పబడినదిగాను, బభూవ హి=ఆయెను.

తా. ఆ చుట్టుప్రక్కల అయిదు ఆమడల భూమి చదనుగా ఏర్పడెను. అంతటను ఇంద్రనీలవైడూర్యమణుల వలె నున్న అనేకమైన పచ్చికబీళ్లు వ్యాపించియుండెను. 29

మూ. తస్మిన్ బిల్వాః కపిత్థాశ్చ పనసా బీజపూరకాః,
ఆమలక్యో బభూవుశ్చ చూతాశ్చ ఫలభూషణాః. 30

ప్ర. అ. తస్మిన్=ఆ ప్రదేశమునందు, ఫలభూషణాః = ఫలములు అలంకారములుగా గల, బిల్వాః=మారేడుచెట్లు, కపిత్థాశ్చ=వెలగచెట్లు, పనసాః =పనసచెట్లు, బీజపూరకాః=మాదీఫలపుచెట్లు, ఆమలక్యః=ఉసిరిచెట్లు, చూతాశ్చ = మామిడి చెట్లు, బభూవుః=ఉండెను.

తా. ఆ ప్రదేశమునందు, ఫలములతో నిండిన మారేడుచెట్లు, వెలగచెట్లు, పనసచెట్లు, మాదీఫలపుచెట్లు, ఉసిరిచెట్లు, మామిడిచెట్లు ఆవిర్భవించెను. 30

మూ. ఉత్తరేభ్యః కురుభ్యశ్చ వనం దివ్యోపభోగవత్,
ఆజగామ నదీ దివ్యా తీరజైర్బహుభిర్వృతా. 31

ప్ర. అ. ఉత్తరేభ్యః కురుభ్యః = ఉత్తరకురుదేశమునుండి, దివ్యోపభోగవత్ = దివ్యమైన భోగములు గల, వనమ్ = వనమును, బహుభిః = అనేకమైన, తీరజైః = వృక్షములతో, వృతా = కూడిన, దివ్యా = దివ్యమైన, నదీ = నదియు, ఆజగామ = వచ్చెను.

తా. ఉత్తరకురుదేశమునుండి దివ్య మైన భోగ్యవస్తువులు గల వనము, తీరములపై అనేక వృక్షములతో నిండిన దివ్య మైన నది అచటికి వచ్చెను. 31

మూ. చతుశ్శాలాని శుభ్రాణి శాలాశ్చ గజవాజినామ్,
హర్మ్యప్రాసాదసంయుక్తతోరణాని శుభాని చ. 32

ప్ర. అ శుభ్రాణి = శుభ్రమైన, చతుశ్శాలాని = నాలుగిండ్ల భవనములు, గజవాజినామ్ = గజములయొక్క, అశ్వములయొక్క, శాలాశ్చ = శాలలు, శుభాని = శుభమైన, హర్మ్యప్రాసాదసంయుక్తతోరణాని = మేడలకు, ప్రాసాదములకు కట్టబడిన ముఖద్వారములు ఆవిర్భవించినవి.

తా. పరిశుభ్రము లైన నాలు గిండ్ల భవంతులు, గజశాలలు, అశ్వశాలలు, మేడలకును, ప్రాసాదములకును సంబంధించిన శుభకర మైన ముఖద్వారములు ఆవిర్భవించెను. 32

మూ. సితమేఘనిభం చాపి రాజవేశ్మ సుతోరణమ్,
శుక్లమాల్యకృతాకారం దివ్యగన్ధసముక్షితమ్,
చతురశ్రమసంబాధం శయనాసనయానవత్,
దివ్యైః సర్వరసైర్యుక్తం దివ్యభోజనవస్త్రవత్,
ఉపకల్పితసర్వాన్నం ధౌతనిర్మలభాజనమ్,
క్లృప్తసర్వాసనం శ్రీమత్ స్వాస్తీర్ణశయనోత్తమమ్. 33-35

ప్ర. అ. సితమేఘనిభమ్ = తెల్లని మేఘముతో సమానము, సుతోరణమ్ = అందమైన ముఖద్వారము కలది, శుక్లమాల్యకృతాకారమ్ = తెల్లని పుష్పమాలికలతో చేయబడిన అలంకరణము గలది, దివ్యగన్ధసముక్షితం = దివ్యములైన గంధములతో చల్లబడినది, చతురశ్రమ్ = నలుచదరముగా నున్నది, అసంబాధమ్ = ఇరుకు లేనిది, శయనాసనయానవత్ = శయనములు, ఆసనములు, యానములు కలది, దివ్యైః = దివ్యము లైన, సర్వరసైః = సమస్తరసములతో, యుక్తమ్ = కూడినది, దివ్యభోజనవస్త్రవత్ = దివ్యములైన, భోజనములు, వస్త్రములు కలది, ఉపకల్పితసర్వాన్నం = ఏర్పరుపబడిన సమస్త మైన అన్నములు కలది, ధౌతనిర్మలభాజనమ్ = కడగబడిన నిర్మల మైన పాత్రలు

కలది, క్లృప్తసర్వాసనమ్ = ఏర్పరుపబడిన సమస్తమైన ఆసనములు కలది, స్వాస్తీర్ణశయనోత్తమమ్ = చక్కగా పరవబడిన శ్రేష్ఠమైన శయనములు కలది, శ్రీమత్ = శోభాయుక్తము అయిన, రాజవేశ్మ చాపి = రాజగృహము కూడ, ఆవిర్భవించెను.

తా. మంచి ముఖద్వారములతో, తెల్లని మేఘము వలె నున్న శోభాయుక్తమైన, రాజగృహము కూడా అక్కడ ఆవిర్భవించెను. దానియందు దేవలోకమునకు సంబంధించిన గంధద్రవ్యములు చల్లి దానిని తెల్లనిపుష్పమాలలతో అలంకరించిరి. నలుచదరముగా నున్న విశాలమైన ఆ రాజభవనమునందు, శయనములు, ఆసనములు, వాహనములు, దివ్యములైన సమస్తరసములు దివ్యములైన భోజన వస్త్రాదులు సిద్ధముచేసి ఉన్నవి. అనేకవిధములైన అన్నములు కడిగి, నిర్మలముగా నున్న పాత్రలలో, ఏర్పరచిరి. అనేక విధములైన ఆసనములు, అందమైన ఆచ్ఛాదనములు కప్పిన ఉత్తమమైన శయనములు అచట సిద్ధము చేయబడి ఉన్నవి. 33-35

మూ. ప్రవివేశ మహాబాహురనుజ్ఞాతో మహర్షిణా,
వేశ్మ తద్రత్నసంపూర్ణం భరతః కైకయీసుతః. 36

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కల, కైకయీసుతః = కైకేయి కుమారుడైన, భరతః = భరతుడు, మహర్షిణా = మహర్షిచేత, అనుజ్ఞాతః = అనుమతింపబడినవాడై, రత్నసంపూర్ణమ్ = శ్రేష్ఠమైన వస్తువులతో నిండిన, తత్ వేశ్మ = ఆ గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మహాబాహువైన ఆ కైకేయి కుమారుడైన భరతుడు, మహర్షి అనుమతి తీసుకొని, శ్రేష్ఠమైన వస్తువులతో నిండిన ఆ రాజభవనములోనికి ప్రవేశించెను. 36

మూ. అనుజగ్ముశ్చ తం సర్వే మన్త్రిణస్సపురోహితాః,
బభూవుశ్చ ముదా యుక్తా దృష్ట్వా తం వేశ్మసంవిధిమ్.

ప్ర. అ. సపురోహితాః = పురోహితులతో కూడిన, సర్వే = సమస్తమైన, మన్త్రిణః = మంత్రులు, తమ్ = భరతుని, అనుజగ్ముశ్చ = అనుసరించి వెళ్ళిరి.

తమ్ = ఆ. వేశ్మసంవిధిమ్ = గృహసంవిధానమును, దృష్ట్వా = చూచి, ముదా = ఆనందముతో, యుక్తాః = కూడిన వారుగా, బభూవుశ్చ = అయిరి.

తా. పురోహితులు మంత్రులు భరతుని అనుసరించి వెళ్ళి ఆ గృహములో ప్రవేశించి దాని సంవిధానమును (ఏర్పాటు) చూచి చాల సంతోషించిరి. 37

మూ. తత్ర రాజాసనం దివ్యం వ్యజనం ఛత్రమేవ చ,
భరతో మన్త్రిభిస్సార్ధమభ్యవర్తత రాజవత్ 38

ప్ర. అ. భరతః = భరతుడు, మన్త్రిభిః సార్ధం = మంత్రులతో కూడినవాడై, తత్ర = అక్కడ ఉన్న, దివ్యమ్ = దివ్యమైన, రాజాసనమ్ = సింహాసనమును, వ్యజనమ్ = వింజామరను, ఛత్రమేవ చ = ఛత్రమును, రాజవత్ = రాజు వలె, అభ్యవర్తత = ప్రదక్షిణము చేసెను.

తా. మంత్రిసహితుడైన భరతుడు, అక్కడ ఉన్న దివ్యమైన సింహాసనమునకు, ఛత్రచామరములకు, రాజునకు ప్రదక్షిణము చేసినట్లు ప్రదక్షిణము చేసెను. 38

మూ. ఆసనం పూజయామాస రామాయాభిప్రణమ్య చ,
వాలవ్యజనమాదాయ న్యషీదత్సచివాసనే. 39

ప్ర. అ. రామాయ = రామునకు, అభిప్రణమ్య చ = నమస్కరించి, ఆసనమ్ = ఆ సింహాసనమును, పూజయామాస = పూజించెను. వాలవ్యజనమ్ = వింజామరను, ఆదాయ = గ్రహించి, సచివాసనే = మంత్రి కూర్చుండ తగిన ఆసనమునందు, న్యషీదత్ = కూర్చుండెను.

తా. రామునకు నమస్కారము చేసి, ఆ సింహాసనమును పూజించి, వింజామరను చేత బట్టుకొని, మంత్రి కూర్చుండ దగిన ఒక ఆసనముపై కూర్చుండెను. 39

మూ. ఆనుపూర్వ్యాన్నిషేదుశ్చ సర్వే మన్త్రిపురోహితాః,
తతస్సేనాపతిః పశ్చాత్ప్రశాస్తా చ నిషేదతుః. 40

ప్ర. అ. సర్వే = సమస్తమైన, మన్త్రిపురోహితాః = మంత్రులు పురోహితులు, ఆనుపూర్వ్యాత్ = క్రమమువలన, నిషేదుః = కూర్చుండిరి. తతః =

అటుపిమ్మట, సేనాపతిః=సేనాపతి, పశ్చాత్=అతని వెనుక, ప్రశాస్తా చ = సేనాపతి క్రింది అధికారి యైన ప్రశాస్త, నిషీదతుః=కూర్చుండిరి.

తా. పిమ్మట మంత్రులు పురోహితులు అందరు యథాక్రమముగా కూర్చుండిరి. తరువాత సేనాపతి అతని వెనుక ప్రశాస్త కూర్చుండిరి. 40

మూ. తతస్తత్ర ముహూర్తేన నద్యః పాయసకర్దమాః,
ఉపాతిష్ఠన్త భరతం భరద్వాజస్య శాసనాత్. 41

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భరద్వాజస్య = భరద్వాజునియొక్క, శాసనాత్ = శాసనమువలన, ముహూర్తేన = క్షణకాలములో, తత్ర = అక్కడ, పాయసకర్దమాః=పాలబురదగా గల, నద్యః = నదులు, భరతమ్ = భరతుని, ఉపాతిష్ఠన్త=సమీపించినవి.

తా. పిమ్మట భరద్వాజుని ఆజ్ఞచే, క్షణకాలములో కొన్ని నదులు భరతుని దగ్గరకు వచ్చెను. వాటిలో బురదకు బదులు పాయసము ఉండెను.

మూ. తాసాముభయతఃకూలం పాణ్డుమృత్తికలేపనాః,
రమ్యాశ్చావసథా దివ్యా బ్రహ్మణస్తు ప్రసాదజాః. 42

ప్ర. అ. తాసామ్ = ఆ నదులయొక్క, ఉభయతఃకూలమ్ = రెండు తీరములందు, పాణ్డుమృత్తికలేపనాః=తెల్లని మట్టి యొక్క విలేపనముకలవి, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, ప్రసాదజాః = అనుగ్రహమువలన బుట్టినవి, దివ్యాః=దివ్యమైనవి, రమ్యాః=రమ్యములూ అయిన, ఆవసథాశ్చ = గృహములు కూడ ఆవిర్భవించినవి.

తా. ఆ నదుల రెండు తీరములందును, సుందర మైన దివ్యగృహములు, బ్రహ్మ అనుగ్రహముచే ఆవిర్భవించెను. ఆ గృహములు తెల్లని మట్టిచే పూయబడి ఉండెను. 42

మూ. తేనైవ చ ముహూర్తేన దివ్యాభరణభూషితాః,
ఆగుర్వింశతిసాహస్రాః బ్రహ్మణా ప్రహితాః స్త్రియః.

ప్ర. అ. తేన = ఆ, ముహూర్తేన చ =ముహూర్తముచేతనే, దివ్యాభరణభూషితాః=దివ్య మైన అలంకారములచే అలంకరింపబడిన, బ్రహ్మణా =

బ్రహ్మచేత, ప్రహితాః=పంపబడిన, వింశతిసాహస్రాః=ఇరువది వేల, స్త్రియః=స్త్రీలు, ఆగుః =వచ్చిరి.

తా. అదే సమయమునందు, బ్రహ్మ పంపగా దివ్యములైన ఆభరణములు అలంకరించుకొని, ఇరువదివేలమంది స్త్రీలు వచ్చిరి. 43

మూ. సువర్ణమణిముక్తేన ప్రవాళేన చ శోభితాః,
ఆగుర్వింశతిసాహస్రాః కుబేరప్రహితాః స్త్రియః. 44

ప్ర. అ. సువర్ణమణిముక్తేన = బంగారముచేతను, మణులచేతను, ముత్యములచేతను, ప్రవాళేన = పగడములచేతను, శోభితాః = ప్రకాశింపచేయబడిన, కుబేరప్రహితాః = కుబేరునిచే పంపబడిన, వింశతిసాహస్రాః = ఇరువదివేల, స్త్రియః=స్త్రీలు, ఆగుః=వచ్చిరి.

తా. కుబేరుడు పంపగా ఇరువదివేలమంది స్త్రీలు, బంగారము, మణులు, ముత్యములు, పగడములు, మొదలగువాటితో ప్రకాశించుచు వచ్చిరి. 44

మూ. యాభిర్గృహీతః పురుషః సోన్మాద ఇవ లక్ష్యతే,
ఆగుర్వింశతిసాహస్రా నన్దనాదప్సరోగణాః. 45

ప్ర. అ. యాభిః = ఎవరిచేత, గృహీతః=గ్రహింపబడిన, పురుషః = పురుషుడు, సోన్మాద ఇవ=ఉన్మాదముతో కూడిన వాడు వలె, లక్ష్యతే=కనబడునో, అట్టి, వింశతిసాహస్రాః = ఇరువదివేల, అప్సరోగణాః=అప్సరస్త్రీల గణములు, నన్దనాత్=నందనవనమునుండి, ఆగుః = వచ్చిరి.

తా. ఎవరి చేతిలో చిక్కిన పురుషుడు ఉన్మత్తుడు వలె మైమరచిపోవునో, అట్టి ఇరువదివేలమంది అప్సరసస్త్రీలు నందనవనమునుండి వచ్చిరి.

మూ. నారదస్తుమ్బురుర్గోపః ప్రవరాః సూర్యవర్చసః,
ఏతే గంధర్వరాజానో భరతస్యాగ్రతో జగుః. 46

ప్ర. అ. నారదః = నారదుడు, తుమ్బురుః = తుంబురుడు, గోపః = గోపుడు, ప్రవరాః=శ్రేష్ఠులు, సూర్యవర్చసః=సూర్యునివంటి కాంతికలవారు అయిన, ఏతే=ఈ, గంధర్వరాజానః=గంధర్వరాజులు, భరతస్య=భరతుని యొక్క, అగ్రతః=ఎదుట, జగుః=గానము చేసిరి.

తా. నారదుడు, తుంబురుడు, గోపుడు అను సూర్యుని వంటి కాంతిగల శ్రేష్ఠులైన గంధర్వరాజులు భరతుని ఎదుట గానము చేసిరి. 46

మూ. అలంబుసా మిశ్రకేశీ పుణ్డరీకాథ వామనా,
ఉపానృత్యంస్తు భరతం భరద్వాజస్య శాసనాత్. 47

ప్ర. అ. అథ = పిమ్మట భరద్వాజస్య = భరద్వాజునియొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, అలంబుసా = అలంబుస, మిశ్రకేశీ = మిశ్రకేశి, పుణ్డరీకా = పుండరీక, వామనా = వామన, భరతమ్ = భరతుని, ఉపానృత్యన్ తు = సమీపించి నృత్యము చేసిరి.

తా. అటు పిమ్మట, భరద్వాజుని ఆజ్ఞను అనుసరించి, అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన అను అప్సరసలు భరతుని సమీపమున నృత్యము చేసిరి. 47

మూ. యాని మాల్యాని దేవేషు యాని చైత్రరథే వనే,
ప్రయాగే తాన్యదృశ్యన్త భరద్వాజస్య శాసనాత్. 48

ప్ర. అ. యాని = యే, మాల్యాని = పుష్పమాలికలు, దేవేషు = దేవతలయందున్నవో, యాని = ఏ పుష్పమాలికలు, చైత్రరథే = చైత్రరథమను, వనే = వనమునందున్నవో, తాని = అవి, భరద్వాజస్య = భరద్వాజునియొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, ప్రయాగే = ప్రయాగయందు, అదృశ్యన్త = చూడబడినవి.

తా. భరద్వాజుని ఆజ్ఞచే దేవలోకములోని పుష్పమాలలు, కుబేరుని చైత్రరథవనములోని పుష్పమాలలు ప్రయాగక్షేత్రమునందు ఆవిర్భవించినవి.

మూ. బిల్వా మార్దఙ్గికా ఆసన్ శమ్యాగ్రాహా విభీతకాః,
అశ్వత్థా నర్తకాశ్చాసన్ భరద్వాజస్య శాసనాత్. 49

ప్ర. అ. భరద్వాజస్య = భరద్వాజునియొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, బిల్వాః = మారేడుచెట్లు, మార్దఙ్గికాః = మృదంగము వాయించువారుగా. ఆసన్ = అయినవి. విభీతకాః = తాండ్రచెట్లు, శమ్యాగ్రాహాః = తాళము పట్టుకొనువారుగను, అశ్వత్థాః = రావిచెట్లు, నర్తకాశ్చ = నృత్యముచేయువారుగాను, ఆసన్ = అయినవి.

తా. భరద్వాజుని అజ్ఞచే, మారేడుచెట్లు మృదంగము వాయించువారుగాను, తాండ్రచెట్లు తాళము వేయువారుగాను, రావిచెట్లు నర్తకులుగాను అయినవి.

మూ. తతస్సరళతాళాశ్చ తిలకా నక్తమాలకాః,
ప్రహృష్టాస్తత్ర సంపేతుః కుబ్జా భూత్వాఽథ వామనాః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సరళతాళాశ్చ=సరళవృక్షములు, తాళవృక్షములు, తిలకాః = తిలకవృక్షములు, నక్తమాలకాః = కానుగచెట్లు, ప్రహృష్టాః = సంతోషించిన, కుబ్జాః = గూనువారుగాను, అథ = మరియు, వామనాః= పొట్టివారిగాను, భూత్వా = అయి, తత్ర=అచటకు, సంపేతుః = వచ్చినవి.

తా. సరళవృక్షములు, తాళవృక్షములు, తిలకవృక్షములు, నక్తమాల వృక్షములు, అంతఃపురములో చరించు కుబ్జులుగాను, వామనులుగాను మారి సంతోషముతో అక్కడికి వచ్చినవి. 50

మూ. శింశుపామలకీజమ్బ్వో యాశ్చాన్యాః కాననేషు తాః,
మాలతీ మల్లికా జాతిర్యాశ్చాన్యాః కాననే లతాః, 51
ప్రమదావిగ్రహం కృత్వా భరద్వాజాశ్రమేఽవదన్.

ప్ర. అ. శింశుపామలకీజమ్బ్వః = శింశుపావృక్షములు, ఉసిరిచెట్లు, నేరేడుచెట్లు, కాననేషు = అడవులయందు, అన్యాః = ఇతరమైన, యాః = ఏవి కలవో, తాః = అవియు, మాలతీ = మాలతీలత, మల్లికా=మల్లికాలత, జాతిః= జాజిలత, కాననే = అడవియందు, అన్యాః = ఇతర మైన, యాః లతాః = ఏ లత లున్నవో అవియు, ప్రమదావిగ్రహమ్ = స్త్రీశరీరమును, కృత్వా=చేసి, భరద్వాజాశ్రమే = భరద్వాజుని ఆశ్రమమునందు, అవదన్ = పలికినవి.

తా. అడవులలో నున్న శింశుపావృక్షములు, ఆమలకీవృక్షములు, జంబూ వృక్షములు, ఇతర మైన వృక్షములు, మాలతి, మల్లికా, జాజి మొదలైన ఇతర లతలు, స్త్రీశరీరములు ధరించి భరద్వాజాశ్రమమునకు వచ్చి ఇట్లు పలికినవి 51

మూ. సురాః సురాపాః పిబత పాయసం చ బుభుక్షితాః, 52
మాంసాని చ సుమేధ్యాని భక్ష్యన్తాం యావదిచ్ఛథ. 53

ప్ర. అ. సురాపాః = మద్యమును త్రాగేవారలారా! యావత్ = ఎంత,

ఇచ్ఛత = కోరెదరో అంత, సురాః = మద్యములను, పిబత = త్రాగండి. బుభుక్షితాః = ఆకలిగొన్నవారలారా! పాయసం చ = క్షీరాన్నమును తినండి. సుమేధ్యాని = చాల పవిత్ర మైన, మాంసాని చ = మాంసములు కూడ, భక్ష్యన్తామ్= భక్షింపబడుగాక!

తా. మద్యమును త్రాగువా రందరు ఎంత కావలెనో అంత మద్యము త్రాగండి. ఆకలిగొన్నవారు పాయసమును పవిత్రము లైన మాంసములను తినండి. 52, 53

మూ. ఉచ్ఛాద్య స్నాపయన్తి స్మ నదీతీరేషు వల్గుషు,
అభ్యేకమేకం పురుషం ప్రమదాస్సప్త చాష్ట చ. 54

ప్ర. అ. సప్త చ = ఏడుగురు, అష్ట చ = ఎనమండుగురు, ప్రమదాః = స్త్రీలు, ఏకమ్ = ఒక, పురుషమ్ = పురుషుని, ఉచ్ఛాద్య = శరీరమునకు నలుగు పెట్టి, వల్గుషు = సుందరము లైన, నదీతీరేషు=నదీతీరములందు, స్నాపయన్తి స్మ అపి = స్నానమును చేయించిరి కూడ.

తా. ఒక్కొక్క పురుషుని ఏడుగురు లేదా ఎనమండుగురు స్త్రీలు నదీతీరమునకు తీసుకొనిపోయి ఒడలికి నలుగు పెట్టి స్నానము చేయించిరి. 54

మూ. సంవాహన్త్యః సమాపేతుర్నార్యో రుచిరలోచనాః,
పరిమృద్య తథాఽన్యోన్యం పాయయన్తి వరాఙ్గనాః. 55

ప్ర. అ. రుచిరలోచనాః = అంద మైన నేత్రములు గల, నార్యః = స్త్రీలు, సంవాహన్త్యః = శరీరములు ఒత్తుచు, సమాపేతుః=శీఘ్రముగా వచ్చిరి. వరాఙ్గనాః = స్త్రీలు, తథా = అట్లే, పరిమృజ్య = తుడిచి, అన్యోన్యమ్ = పరస్పరము, పాయయన్తి = త్రాగించిరి.

తా. వారి శరీరములు పట్టుటకై అంద మైన నేత్రములు గల కొందరు స్త్రీలు, శీఘ్రముగా వచ్చిరి. ఉత్తమ లైన మరి కొందరు స్త్రీలు వారి శరీరములు తుడిచి, పరస్పరము సురాపానము చేయించిరి. 55

మూ. హయాన్ గజాన్ ఖరానుష్ట్రాన్ తథైవ సురభేః సుతాన్,
అభోజయన్ వాహనపాస్తేషాం భోజ్యం యథావిధి. 56

ప్ర. అ. వాహనపాః = వాహనములను పాలించువారు, హయాన్ = గుఱ్ఱములను, గజాన్ = ఏనుగులను, ఖరాన్ = గాడిదలను, ఉష్ట్రాన్ = ఒంటెలను, తథైవ = అట్లే, సురభేః = కామధేనువుయొక్క, సుతాన్ = పుత్రులైన ఎద్దులను, యథావిధి = చేయవలసిన ప్రకారము ననుసరించి, తేషామ్ = వాటి యొక్క, భోజ్యమ్ = ఆహారమును, అభోజయన్ = తినిపించిరి.

తా. వాహనములను పాలించువారు, అశ్వములకు, ఏనుగులకు, గాడిదలకు, ఒంటెలకు, ఎద్దులకు వాటి వాటి ఆహారమును యథావిధిగా ఇచ్చి తినిపించిరి. 56

మూ. ఇక్షూంశ్చ మధులాజాంశ్చ భోజయన్తి స్మ వాహనాన్,
ఇక్ష్వాకువరయోధానాం చోదయన్తో మహాబలాః. 57

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల ఆ వాహనపాలకులు, ఇక్ష్వాకువరయోధానామ్=ఇక్ష్వాకువంశరాజుల శ్రేష్ఠులైన యోధులయొక్క, వాహనాన్= వాహనములను, చోదయన్తః=తినండి తినండి అని ప్రేరేపించుచు, ఇక్షూంశ్చ= చెఱకుగడలను, మధులాజాంశ్చ = తేనె కలిపిన పేలాలను, భోజయన్తి స్మ = తినిపించిరి.

తా. మహాబలశాలురైన ఆ వాహనపాలకులు భరతుని సైన్యములోని యోధులు ఎక్కి వచ్చిన వాహనములను "తినండి తినండి" అని ప్రేరేపించుచు, వాటికి చెరుకుగడలు, తేనె కలిపిన పేలాలు తినిపించిరి. 57

మూ. నాశ్వబన్ధోఽశ్వమాజానాన్న గజం కుఞ్జరగ్రహః,
మత్తప్రమత్తముదితా చమూః సా తత్ర సంబభౌ. 58

ప్ర. అ. అశ్వబన్ధః = గుఱ్ఱములు కట్టువాడు, అశ్వమ్ = గుఱ్ఱమును, న అజానాత్ = గుర్తించలేదు. కుఞ్జరగ్రహః = ఏనుగులు కట్టువాడు, గజమ్= ఏనుగును, న = గుర్తించలేదు. తత్ర = అక్కడ, సా = ఆ, చమూః = సేన, మత్తప్రమత్తముదితా = మదించినదై ఒళ్ళు తెలియనిదై ఆనందించినదై, సంబభౌ = ప్రకాశించెను.

తా. గుఱ్ఱములు కట్టువాడు గుఱ్ఱములను, ఏనుగులను పాలించువాడు

ఏనుగులను గుర్తించుటలేదు. ఈ విధముగా అక్కడ ఆ సైనికు లందరు మదించి ఒళ్లు తెలియక ఆనందముతో ఉండిరి. 58

మూ. తర్పితాః సర్వకామైస్తే రక్తచన్దనరూషితాః,
అప్సరోగణసంయుక్తాః సైన్యా వాచముదైరయన్. 59

ప్ర. అ. సర్వకామైః = సమస్తభోగములచే, తర్పితాః = తృప్తి పొందింపబడినవారు, రక్తచన్దనరూషితాః = ఎఱ్ఱని చందనముచే పూయబడినవారు, అప్సరోగణసంయుక్తాః = అప్సరస్త్రీల సముదాయముతో కూడినవారు అయిన, తే సైన్యాః = ఆ సైనికులు, వాచమ్ = వాక్యను, ఉదైరయన్ = పలికిరి.

తా. సమస్తభోగములచే తృప్తిపొందింపబడినవారై ఎఱ్ఱని చందనము శరీరమునకు పూసుకొని అప్సరస్త్రీలతో కూడి యున్న ఆ సైనికులు ఇట్లు పలికిరి. 59

మూ. నైవాయోధ్యాం గమిష్యామో న గమిష్యామ దణ్డకాన్,
కుశలం భరతస్యాస్తు రామస్యాస్తు తథా సుఖమ్. 60

ప్ర. అ. అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, నైవ గమిష్యామః = వెళ్ళము, దండకాన్ = దండకావనమును గూర్చి, న గమిష్యామః = వెళ్ళము. భరతస్య = భరతునకు, కుశలమ్ = కుశలము, అస్తు = అగుగాక; తథా = అట్లే, రామస్య = రామునకు, సుఖమ్ = సుఖము, అస్తు = అగుగాక.

తా. మేము అయోధ్యకు గాని దండకారణ్యమునకు గాని వెళ్లము. ఇక్కడనే ఉండిపోయెదము. భరతునకు క్షేమ మగుగాక! రాముడు కూడ సుఖముగా నుండు గాక. 60

మూ. ఇతి పాదాతయోధాశ్చ హస్త్యశ్వారోహబన్ధకాః,
అనాథాస్తం విధిం లబ్ధ్వా వాచమేతాముదైరయన్. 61

ప్ర. అ. పాదాతయోధాశ్చ = కాలిబంట్లు, హస్త్యశ్వారోహబన్ధకాః = ఏనుగులను, గుఱ్ఱములను ఎక్కువారు వాటిని బంధించుపరిచారకులు, తమ్ = ఆ, విధిమ్ = సత్కారమును, లబ్ధ్వా = పొంది, అనాథాః = నియమించు నాథుడు

లేనివారై, ఇతి = ఇట్లు, ఏతామ్ = ఈ, వాచమ్ = వాక్కును, ఉదైరయన్ = పలికిరి.

తా. ఈ విధముగా భరద్వాజుడు చేసిన సత్కారమును పొందిన కాలిబంట్లు, అశ్వములను గజములను ఎక్కువారు, వాటిని పాలించువారు, తమను నియమించు ప్రభువు లేదనుకొనుచు స్వతంత్రులై ఈ విధముగా పలికిరి. 61

మూ. సంప్రహృష్టా వినేదుస్తే నరాస్తత్ర సహస్రశః,
భరతస్యానుయాతారః స్వర్గోఽయమితి చాబ్రువన్. 62

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, అనుయాతారః = అనుసరించి వెళ్లు, తే నరాః = ఆ నరులు, తత్ర = అచట, సహస్రశః = వేలకొలది, సంప్రహృష్టాః = సంతోషించినవారై, వినేదుః = ధ్వని చేసిరి. అయమ్ = ఇదియే, స్వర్గః = స్వర్గము, ఇతి = అని, అబ్రువన్ చ = పలికిరి కూడ.

తా. భరతుని అనుచరులైన వేల సంఖ్యలో నున్న ఆ సైనికులు సంతోషముతో బిగ్గరగా కేకలు వేయుచు, ఇదే స్వర్గము అని పలికిరి. 62

మూ. నృత్యన్తి స్మ హసన్తి స్మ గాయన్తి స్మ చ సైనికాః,
సమన్తాత్ పరిధావన్తి మాల్యోపేతాః సహస్రశః. 63

ప్ర. అ. సహస్రశః = వేలకొలది, సైనికాః = సైనికులు, మాల్యోపేతాః = పుష్పమాలలతో కూడినవారై, నృత్యన్తి స్మ = నాట్యము చేసిరి. హసన్తి స్మ = నవ్విరి, గాయన్తి స్మ = గానముచేసిరి. సమన్తాత్ = నలు వైపుల, పరిధావన్తి = పరుగులెత్తిరి.

తా. పుష్పమాలలు ధరించిన వేలకొలది ఆ సైనికులు, నృత్యము చేయుచు, నవ్వుచు, పాటలు పాడుచు, నలు వైపుల పరుగెత్తుచుండిరి. 63

మూ. తతో భుక్తవతాం తేషాం తదన్నమమృతోపమమ్,
దివ్యానుద్వీక్ష్య భక్ష్యాంస్తానభవద్భక్షణే మతిః. 64

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అమృతోపమమ్ = అమృతముతో సమానమైన, తత్ అన్నమ్ = ఆ అన్నమును, భుక్తవతామ్ = భుజించిన, తేషామ్ = వారికి,

దివ్యాన్=దివ్యములైన, తాన్ భక్ష్యాన్ = ఆ భక్ష్యములను, ఉద్వీక్ష్య = చూచి, భక్షణే=భక్షించుటయందు, మతిః = కోరిక, అభవత్ = ఆయెను.

తా. అమృతముతో సమాన మైన ఆ అన్నమును తినిన ఆ సైనికులకు, అక్కడ ఉన్న దివ్యము లైన భక్ష్యములను చూచి వాటిని తినవలె నని మరల కోరిక పుట్టెను. 64

మూ. ప్రేష్యాశ్చేట్యశ్చ వధ్వశ్చ బలస్థాశ్చ సహస్రశః,
బభూవుస్తే భృశం దృప్తాః సర్వే చాహతవాససః. 65

ప్ర. అ. సహస్రశః = వేలకొలది, ప్రేష్యాః = పరిచారకులు, చేట్యశ్చ= దాసీలు, వధ్వశ్చ = స్త్రీలు, బలస్థాః = సైన్యములో నున్న, తే=వారు, సర్వే చ = అందరును, ఆహతవాససః=నలగని వస్త్రములు కలవారై, భృశమ్ = మిక్కిలి, దృప్తాః=గర్వితులు, బభూవుః=అయిరి.

తా. అక్కడ ఉన్న వేలకొలది నౌకర్లు, దాసీలు. స్త్రీలు, సైనికులు, అందరును నలగని వస్త్రములు ధరించి, దృప్తులై ఉండిరి. 65

మూ. కుఞ్జరాశ్చ ఖరోష్ట్రాశ్చ గోఽశ్వాశ్చ మృగపక్షిణః,
బభూవుస్సుభృతాస్తత్ర నాన్యో హ్యన్యమకల్పయత్. 66

ప్ర. అ. తత్ర=అక్కడ, కుఞ్జరాశ్చ = ఏనుగులు, ఖరోష్ట్రాశ్చ= గాడిదలు, ఒంటెలు, గోఽశ్వాశ్చ = ఎద్దులు, గుఱ్ఱములు, మృగపక్షిణః= మృగములు, పక్షులు, సుభృతాః = చక్కగా పోషింపబడిన వై, బభూవుః = అయినవి. అన్యః=ఒకటి, అన్యమ్=మరొకదానిని, న అకల్పయత్ హి = బాధించలేదు.

తా. అక్కడ ఏనుగులు, గాడిదలు, ఒంటెలు, వృషభములు, అశ్వములు, మృగములు, పక్షులు వీటి కన్నిటికి ఇష్టమైన చక్కని ఆహారము లభించుటచే అవి ఒకదానిని ఒకటి బాధించలేదు. 66

మూ. నాశుక్లవాసాస్తత్రాసీత్ క్షుధితో మలినోఽపి వా,
రజసా ధ్వస్తకేశో వా నరః కశ్చిదదృశ్యత. 67

ప్ర. అ. తత్ర = అక్కడ, అశుక్లవాసాః = తెల్లని వస్త్రములు లేని వాడు గాని, క్షుధితః = ఆకలిగొన్నవాడు గాని, మలినోఽపి = మాలిన్యము కల వాడు గాని, న ఆసీత్ = లేకుండెను. కశ్చిత్ నరః = ఏ మనుష్యుడు, రజసా = పరాగముచేత, ధ్వస్తకేశో వా = పాడైన కేశములు కలవాడుగా కాని, నా దృశ్యత = కనబడలేదు.

తా. ఆ సైన్యములో, తెల్లని వస్త్రములు ధరించనివాడు గాని, ఆకలి గొన్నవాడు గాని, మాలిన్యవంతుడు గాని, కేశములకు పరాగము తగిలినవాడు గాని ఏ ఒక్కడును లేకుండెను. 67

మూ. ఆజైశ్చాపి చ వారాహైర్నిష్ఠానవరసంచయైః,
ఫల నిర్యూహసంసిద్ధైః సూపైర్గన్ధ రసాన్వితైః, 68
పుష్పధ్వజవతీః పూర్ణాః శుక్లస్యాన్నస్య చాభితః,
దదృశుర్విస్మితా స్తత్ర నరా లౌహీః సహస్రశః. 69

ప్ర. అ. తత్ర = అక్కడ, నరాః = ఆ సైనికులు, ఆజైశ్చాపి = మేక మాంసములచేతను, వారాహైశ్చ = వరాహమాంసములచేతను, నిష్ఠానవరసంచయైః = శ్రేష్ఠములైన వ్యంజనములచేతను, ఫలనిర్యూహసంసిద్ధైః = ఫలముల సముదాయములచే సిద్ధములైన రసములచేతను, గంధరసాన్వితైః = గంధముల తోను, రసములతోను కూడిన, సూపైః = సూపములతోను, పూర్ణాః = నిండిన, పుష్పధ్వజవతీః = పుష్పములు ధ్వజములుగా గల, సహస్రశః = వేలకొలది, శుక్లాంచ్చ = తెల్లని, అన్నస్య = అన్నముయొక్క, లౌహీః = లోహపాత్రలను, అభితః = నలు వైపుల, విస్మితాః = ఆశ్చర్యపడినవారై, దదృశుః = చూచిరి.

తా. ఆ సైనికులు, అక్కడ నలు వైపుల, తెల్లని అన్నముతో కూడిన పైన పుష్పములు కప్పిన వేలకొలది లోహపాత్రలను, ఆశ్చర్యముతో చూచిరి. ఆ పాత్రలు మేకమాంసముతోను, వరాహమాంసముతోను, శ్రేష్ఠమైన శాకాది వ్యంజనములతోను, వివిధ ఫలరసములతోను మంచిసువాసన, రుచి గల సూపములతోను నిండియుండెను. 68-69

మూ. బభూవుర్వనపార్శ్వేషు కూపాః పాయసకర్దమాః,
తాశ్చ కామదుఘా గావో ద్రుమాశ్చాసన్ మధుశ్చ్యుతః.

ప్ర. అ. వనపార్శ్వేషు=వనముల పార్శ్వములందు, పాయసకర్దమాః =పరమాన్నమే బురదగా గల, కూపాః = కూపములు, బభూవుః=ఏర్పడినవి. తాః = ఆ, గావః = గోవులు, కామదుఘాః = కోరికలను పితుకునవిగాను, ద్రుమాశ్చ = వృక్షములు, మధుశ్చ్యుతః = తేనెను స్రవించునవిగాను, ఆసన్ = అయినవి.

తా. ఆశ్రమము ప్రక్కలందు పాయసము బురదా గల (చిక్కని పాయసముతో నిండిన) కూపములు ఏర్పడినవి. అచట నున్న ఆవులు కోరిన వస్తువులను ఇచ్చెను. వృక్షములనుండి తేనె స్రవించుచుండెను. 70

మూ. వాప్యో మైరేయపూర్ణాశ్చ మృష్టమాంసచయైర్వృతాః.
ప్రతప్తపిఠరైశ్చాపి మార్గమాయూరకౌక్కుటైః. 71

ప్ర. అ. వాప్యః = దిగుడుబావులు, మైరేయపూర్ణాశ్చ = మద్యముతో నిండినవిగాను, ప్రతప్తపిఠరైః = కుండలలో వండబడిన, మార్గమాయూరకౌక్కుటైః = మృగములకు, నెమళ్ళకు, కోళ్ళకు సంబంధించిన, మృష్టమాంసచయైః = ఉత్తమమైన మాంసముల సముదాయములతోను, వృతాః = కూడినవి.

తా. అక్కడ మద్యముతో నిండిన దిగుడుబావులు, వాటి చుట్టును, పరిశుద్ధమైన లేడి మాంసము, నెమలి మాంసము, కోడి మాంసము కుండలలో వండి రాసులుగా పోయబడి ఉండెను. 71

మూ. పాత్రీణాం చ సహస్రాణి స్థాలీనాం నియుతాని చ,
న్యర్బుదాని చ పాత్రాణి శాతకుమ్భమయాని చ,
స్థాల్యః కుమ్భ్యః కరమ్భ్యశ్చ దధిపూర్ణాః సుసంస్కృతాః,

ప్ర. అ. పాత్రీణామ్ = చిన్న పాత్రలయొక్క, సహస్రాణి = వేలు, స్థాలీనామ్ = గిన్నెలయొక్క, నియుతాని = నియుతములు (లక్షలు), శాతకుమ్భమయాని = బంగారువికారమైన, పాత్రాణి = పాత్రలు, న్యర్బుదాని చ = పదికోట్లు, దధిపూర్ణాః = పెరుగుతో నిండిన, సుసంస్కృతాః = చక్కగా సంస్కరింపబడిన, స్థాల్యః = గిన్నెలు, కుమ్భ్యః = చిన్న పాత్రలు, కరమ్భ్యశ్చ = వెడల్పైన ముఖములు గల పాత్రలు ఉండెను.

తా. అక్కడ వేలకొలది చిన్న పాత్రలు, లక్షలకొలది గిన్నెలు, పదికోట్ల బంగారు పాత్రలు, పెరుగు నింపిన బాగుగా సంస్కరింపబడిన గిన్నెలు, చిన్న కుంభములు, విశాల మైన ముఖము గల పాత్రలు ఉండెను. 72

మూ. యౌవనస్థస్య గౌరస్య కపిత్థస్య సుగన్ధినః, 73
హ్రదాః పూర్ణా రసాలస్య దధ్నః శ్వేతస్య చాపరే,
బభూవుః పాయసస్యాన్యే శర్కరా యావసంచయాః. 74

ప్ర. అ. యౌవనస్థస్య = యౌవనములో నున్న (అంత పాతది అంత కొత్తది కాని) గౌరస్య = తెల్లని, సుగన్ధినః = మంచి సువాసన గల, కపిత్థస్య = వెలగపండురంగు గల పెరుగుయొక్క, పూర్ణాః = నిండిన, హ్రదాః = సరస్సులు, (ఏర్పడినవి). రసాలస్య = శొంఠి, పిప్పలి, మిరియాలు, ఏలకులు, లవంగములు, తక్కోశము, శర్కర, అల్లము, జీలకర్ర వేసి తాళింపు చేసిన పెరుగుయొక్క, హ్రదములు, శ్వేతస్య = తెల్లని, దధ్నః = పెరుగుయొక్క, అపరే చ = మరి కొన్ని హ్రదములు, పాయసస్య = పాయసముయొక్క, అన్యే = మరి కొన్ని హ్రదములు, శర్కరాయావసంచయాః = శర్కర కలిపిన యవల పిండి రాసులు, బభూవుః = ఏర్పడినవి.

తా. పాతది కాని, క్రొత్తది కాని, కాక, మధ్యరకముగా ఉన్న, సుగంధము కపిత్థవర్ణము గల, పెరుగుతో నిండిన హ్రదములు, రసాల మను పెరుగు హ్రదములు, తెల్లని పెరుగుతో నిండిన హ్రదములు పాయసముతో నిండిన హ్రదములు, ఏర్పడెను. శర్కర కలిపిన యవల చూర్ణము రాసులు ఏర్పడెను.

మూ. కల్కాన్ చూర్ణకషాయాంశ్చ స్నానాని వివిధాని చ,
దదృశుర్భాజనస్థాని తీర్థేషు సరితాం నరాః. 75

ప్ర. అ. నరాః = ఆ సైనికులు, సరితామ్ = నదులయొక్క, తీర్థేషు = రేవులయందు, కల్కాన్ = ఉసిరికాయ మొదలగువాటితో చేసిన కల్కములను, చూర్ణకషాయాంశ్చ = ఇంగుదీఫలాదుల చూర్ణమును, వాటితో చేసిన కషాయములను, భాజనస్థాని = పాత్రలలో ఉన్న, వివిధాని = అనేకవిధము లైన, స్నానాని చ = స్నానోపకరణములను, దదృశుః = చూచిరి.

తా. ఆ సైనికులు నదుల రేవులలో, కల్కములను, చూర్ణములను, కషాయములను పాత్రలలో ఉంచిన అనేకవిధము లైన స్నానద్రవ్యములను చూచిరి.

మూ. శుక్లానంశుమతశ్చాపి దన్తధావనసంచయాన్,
శుక్లాన్ చన్దనకల్కాంశ్చ సముద్గేష్వవతిష్ఠతః, 76
దర్పణాన్ పరిమృష్టాంశ్చ వాససాం చాపి సంచయాన్,
పాదుకోపానహాం చైవ యుగ్మాని చ సహస్రశః, 77
ఆఞ్జనీః కఙ్కతాన్ కూర్చాన్ వస్త్రాణి చ ధనూంషి చ,
మర్మత్రాణాని చిత్రాణి శయనాన్యాసనాని చ, 78
ప్రతిపానహ్రదాన్ పూర్ణాన్ ఖరోష్ట్రగజవాజినామ్,
అవగాహ్యసుతీర్థాంశ్చ హ్రదాన్ సోత్పలపుష్కరాన్, 79
ఆకాశవర్ణప్రతిమాన్ స్వచ్ఛతోయాన్ సుఖప్లవాన్,
నీలవైడూర్యవర్ణాంశ్చ మృదూన్ యవససంచయాన్,
నిర్వాపార్థాన్ పశూనాం తే దదృశుస్తత్ర సర్వశః. 80

ప్ర. అ. తే = ఆ సైనికులు, తత్ర = అక్కడ, సర్వశః = నలువైపుల, శుక్లాన్ = తెల్లని, అంశుమతశ్చాపి = కుంచెలు గల, దన్తధావనసంచయాన్ = దంతకాష్ఠముల సముదాయములను, సముద్గేషు = దొప్పలయందు, అవతిష్ఠతః = ఉన్న, శుక్లాన్ = తెల్లని, చందనకల్కాంశ్చ = చందనపు ముద్దలను, పరిమృష్టాన్ = తుడవబడిన, దర్పణాన్ చ = అద్దములను, వాససామ్ = వస్త్రముల యొక్క, సంచయాన్ చాపి = సముదాయములను, పాదుకోపానహామ్ = తొడుగుకొను చెప్పులయొక్క, కాలికి కట్టుకొను చెప్పులయొక్క, సహస్రశః = వేల కొలది, యుగ్మాని చ = జోళ్లను, ఆఞ్జనీః = కాటుకభరిణలను, కంకతాన్ = దువ్వెనలను, కూర్చాన్ = మీసములు మొదలగువాటిని సరిచేసుకొను కూర్చలను, వస్త్రాణి చ = వస్త్రములను, ధనూంషి చ = ధనుస్సులను, మర్మత్రాణాని = కవచములను, చిత్రాణి = చిత్రము లైన, శయనాని = శయనములను, ఆసనాని చ = ఆసనములను, ఖరోష్ట్రగజవాజినామ్ = గాడిదలయొక్క, ఒంటెలయొక్క, అశ్వములయొక్క, ఏనుగులయొక్క, ప్రతిపానహ్రదాన్ = నీరుత్రాగు గుంటలను, అవగాహ్యసుతీర్థాన్ = దిగుటకు తగిన మంచి రేవులు గల, సోత్పలపుష్క-

రాన్ = కలవలతోను, పద్మములతోను కూడిన, ఆకాశవర్ణప్రతిమాన్ = ఆకాశ వర్ణముతో సమాన మైన, స్వచ్ఛతోయాన్ = స్వచ్ఛ మైన ఉదకము గల, సుఖ ప్లవాన్ = సుఖముగా ఈదుటకు శక్య మైన, హ్రదాన్ = మడుగులను, పశూ నామ్=పశువులకు, నిర్వాపార్థాన్=ఇచ్చుట ప్రయోజనముగా గల, నీపవైడూర్య వర్ణాంశ్చ = నీపవృక్షముల, వైడూర్యమణుల వర్ణము వంటి వర్ణము గల, మృదూన్ = మృదు వైన, యవససంచయాన్ = తృణసముదాయములను, దదృశుః = చూచిరి.

తా. ఆ ప్రాంతమునం దంతటను తెల్లని కుచ్చులు గల దంతకాష్ఠ సముదాయములు, దొప్పలలో ఉంచిన తెల్లని చందనపు ముద్దలు, శుభ్రముగా తుడిచిన అద్దములు, వస్త్రసముదాయములు, వేలకొలది తొడుగుకొను చెప్పుల జోళ్లు, పాదములకు కట్టుకొను చెప్పులజోళ్లు, కాటుకభరిణెలు, దువ్వెనలు, కూర్చెలు, వస్త్రములు, ధనుస్సులు, కవచములు, చిత్రము లైన శయనములు, ఆసనములు, ఉండెను. గాడిదెలు, ఒంటెలు, గజములు, అశ్వములు త్రాగుటకై నీళ్లు నింపిన గుంటలు ఉండెను. దిగుటకు అను వైన రేవులు, కలవలు, పద్మ ములు ఉండెను. స్వచ్ఛ మైన ఉదకముతో ఆకాశము వంటి రంగు గల, సుఖ ముగా స్నానము చేయుటకు అనుకూల మైన సరస్సులు, పశువులు మేయుటకై నీపవృక్షముల, వైడూర్యమాణిక్యముల వంటి రంగు గల మృదు వైన తృణ సముదాయములు ఉండెను. 76-80

మూ. వ్యస్మయన్త మనుష్యాస్తే స్వప్నకల్పం తదద్భుతమ్,
దృష్ట్వాఽతిథ్యం కృతం తాదృగ్భరతస్య మహర్షిణా. 81

ప్ర. అ. తే మనుష్యాః = ఆ మనుష్యులు, మహర్షిణా=భరద్వాజమహర్షి చేత, భరతస్య=భరతునకు, కృతమ్=చేయబడిన, తాదృక్=అట్టి, స్వప్న కల్పమ్=స్వప్నముతో సమాన మైన, అద్భుతమ్=అద్భుత మైన, తత్=ఆ, ఆతిథ్యమ్=ఆతిథ్యమును, దృష్ట్వా=చూచి, వ్యస్మయన్త=ఆశ్చర్యపడిరి.

తా. భరద్వాజమహర్షి భరతునకు చేసిన అద్భుత మైన ఆ ఆతిథ్యము స్వప్నలోకములో జరిగిన ట్లుండెను. దానిని చూచి అక్కడ నున్న మనుష్యు లందరును ఆశ్చర్యపడిరి. 81

మూ. ఇత్యేవం రమమాణానాం దేవానామివ నన్దనే,
భరద్వాజాశ్రమే రమ్యే సా రాత్రిర్వ్యత్యవర్తత. 82

ప్ర. అ. ఇత్యేవమ్=ఈ విధముగా, నన్దనే=నందనవనమునందు, దేవానామివ=దేవతలు వలె, రమ్యే=సుందర మైన, భరద్వాజాశ్రమే=భరద్వాజాశ్రమమునందు, (తేషామ్=వారు) రమమాణానామ్=క్రీడించుచుండగా, సా రాత్రిః=ఆ రాత్రి. వ్యత్యవర్తత=గడచిపోయినది.

తా. ఈ విధముగా వారు నందనవనములో దేవతలు విహరించి నట్లు రమ్య మైన భరద్వాజాశ్రమములో విహరించుచుండగ, ఆ రాత్రి గడచిపోయినది. 82

మూ. ప్రతిజగ్మశ్చ తా నద్యో గన్ధర్వాశ్చ యథాగతమ్,
భరద్వాజమనుజ్ఞాప్య తాశ్చ సర్వా వరాఙ్గనాః. 83

ప్ర. అ. తాః నద్యః=ఆ నదులు, గన్ధర్వాశ్చ=గంధర్వులు, సర్వాః=సమస్త మైన, తాః=ఆ, వరాఙ్గనాశ్చ=ఉత్తమస్త్రీలు, భరద్వాజమ్=భరద్వాజుని, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసి, యథాగతమ్ = వచ్చినట్లుగానే, ప్రతిజగ్మశ్చ=తిరిగి వెళ్ళిపోయిరి.

**తా.** ఆ నదులు, గంధర్వులు, ఆ ఉత్తమస్త్రీలు అందరు భరద్వాజుని అనుజ్ఞ పొంది వచ్చినట్లుగానే తిరిగి వెళ్ళిపోయిరి. 83

మూ. తథైవ మత్తా మదిరోత్కటా నరా
స్తథైవ దివ్యాగరుచన్దనోక్షితాః,
తథైవ దివ్యా వివిధాః స్రగుత్తమాః
పృథక్ప్రకీర్ణా మనుజైః ప్రమర్దితాః. 84

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకనవతితమః సర్గః.

ప్ర. అ. నరాః=మనుష్యులు, మదిరోత్కటాః=మద్యముచేత మితిమీరినవారై, తథైవ=అట్లే, మత్తాః=మదించియున్నారు. తథైవ=అట్లే, దివ్యాగరు

చందనోక్షితాః=దివ్య మైన అగరువుచేత, చందనముచేత తడపబడి యున్నారు. మనుజైః = మనుష్యులచేత, ప్రమర్దితాః = నలగకొట్టబడిన, పృథక్ = దూర దూరముగా, ప్రకీర్ణాః = విసిరివేయబడిన, దివ్యాః = దివ్య మైన, వివిధాః = అనేక విధము లైన, స్రగుత్తమాః = శ్రేష్ఠ మైన మాలికలు, తథైవ = అట్లే ఉన్నవి.

తా. గంధర్వాదు లందరు తిరిగి వెళ్ళిపోయిన పిమ్మట కూడ, ఆ సైనికు లందరు మితిమీరి త్రాగిన మద్యము మత్తుతో అట్లే పడి ఉండిరి. వారి శరీరము నకు పూసుకొనిన దివ్య మైన అగరుచందనములు అట్లే ఉండెను. వారు నలగ గొట్టిన అనేకవిధము లైన ఆ దివ్యపుష్పమాలలు అచ్చటచ్చట పడి ఉండెను.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో తొంబదిఒకటవ సర్గ సమాప్తము.

# ద్వినవతితమః సర్గః

[భరతుడు భరద్వాజునికడ సెలవు గైకొని, శ్రీరాముని ఆశ్రమమునకు మార్గమడిగి తెలిసికొనుట. మునికి తన తల్లులను పరిచయము చేసి, అటనుండి సేనాసమేతుడై చిత్రకూటమునకేగుట.]

మూ. తతస్తాం రజనీం వ్యుష్య భరతః సపరిచ్ఛదః,
కృతాఽతిథ్యో భరద్వాజం కామాదభి జగామ హ. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, కృతాఽతిథ్యః = చేయబడిన ఆతిథ్యము గల, సపరిచ్ఛదః = పరివారముతో కూడిన, భరతః = భరతుడు, తాం రజనీమ్ = ఆ రాత్రిని, వ్యుష్య = నివసించి, కామాత్ = కోరిక వలన, భరద్వాజమ్ = భరద్వాజుని, అభిజగామ హ = పొందెను.

తా. పరివార సహితుడైన భరతుడు ఆతిథ్యము స్వీకరించి, ఆ రాత్రి అక్కడ గడిపి, అనుజ్ఞ వేడవలెనను కోరికతో భరద్వాజుని సమీపించెను. 1

మూ. తం ఋషిః పురుషవ్యాఘ్రం ప్రాఞ్జలిం ప్రేక్ష్య చాగతమ్,
హుతాగ్నిహోత్రో భరతం భరద్వాజోఽభ్యభాషత. 2

ప్ర. అ. హుతాగ్నిహోత్రః = చేయబడిన అగ్నిహోత్రము గల, భరద్వాజః ఋషి = భరద్వాజఋషి, పురుషవ్యాఘ్రమ్ = పురుషులలో శ్రేష్ఠుడు, ప్రాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలి గలవాడు అయిన, ఆగతమ్ = వచ్చిన, తం భరతమ్ = ఆ భరతుని, ప్రేక్ష్య = చూచి, అభ్యభాషత = పలికెను.

తా. అగ్నిహోత్రము పూర్తిచేసికొని కూర్చొనియున్న ఆ భరద్వాజ మహర్షి, ముకుళితహస్తములతో తన వద్దకు వచ్చిన పురుషశ్రేష్ఠుడైన ఆ భరతునితో ఇట్లనెను. 2

మూ. కచ్చిదత్ర సుఖా రాత్రిస్తవాస్మద్విషయే గతా,
సమగ్రస్తే జనః కచ్చిదాతిథ్యే శంస మేఽనఘ. 3

ప్ర. అ. అత్ర = ఈ, అస్మద్విషయే = మా దేశమునందు, తవ = నీకు, రాత్రిః = రాత్రి, సుఖమ్ = సుఖకరమైన దై, గతా కచ్చిత్ = గడచినదా? హే అనఘః= ఓ పాపరహితుడా, ఆతిథ్యే = ఆతిథ్యవిషయమున, తే జనః = నీ పరివారజనము, సమగ్రః కచ్చిత్ = పరిపూర్ణ మైనదా! మే = నాకు, శంస = చెప్పుము.

తా. పాపరహితుడ వైన ఓ భరతుడా! నీవు మా ఆశ్రమమునందు, రాత్రిని సుఖముగా గడిపినావా? మీ పరిజనమున కంతకును పరిపూర్ణముగా ఆతిథ్యము లభించినదా? చెప్పుము. 3

మూ. తమువాచాఞ్జలిం కృత్వా భరతోఽభివ్రణమ్య చ
ఆశ్రమాదభినిష్క్రాన్తమృషిముత్తమతేజసమ్. 4

ప్ర. అ. భరతః = భరతుడు, ఆశ్రమాత్=ఆశ్రమమునుండి, అభినిష్క్రాన్తమ్ = బయటకు వచ్చిన, ఉత్తమతేజసమ్ = ఉత్తమమైన తేజస్సు గల, తమ్ ఋషిమ్ = ఆ ఋషిని, అఞ్జలిం కృత్వా = చేతులు జోడించి, అభివ్రణమ్య చ= నమస్కరించి, ఉవాచ = పలికెను

తా. ఆశ్రమమునుండి బయటకు వచ్చిన, గొప్ప తేజస్సు గల, ఆ భరద్వాజర్షికి చేతులు జోడించి నమస్కరించుచు భరతుడు ఇట్లు పలికెను. 4

మూ. సుఖోషితోఽస్మి భగవన్ సమగ్రబలవాహనః,
తర్పితః సర్వకామైశ్చ సామాత్యో బలవత్త్వయా. 5

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా! సామాత్యః = మంత్రులతో కూడిన, సమగ్రబలవాహనః = సమగ్ర మైన సేనయు వాహనములు గల నేను, త్వయా = నీచేత, బలవత్ = చాలా అధికముగా, సర్వకామైః = సమస్తకామములచేత, తర్పితః = తృప్తి పొందింపబడినవాడనై, సుఖోషితః అస్మి = సుఖముగా నివసించినాను.

తా. ఓ పూజ్యుడా! అమాత్యసహితుడనైన నేను, సమస్తమైన నా సైన్యము, వాహనములు కూడ నీవు ఇచ్చిన సమస్తభోగములచే తృప్తిపొందినవారలమై సుఖముగా ఉంటిమి. 5

మూ. అపేతక్లమసంతాపాః సుభక్షాః సుప్రతిశ్రయాః,
అపి ప్రేష్యానుపాదాయ సర్వే స్మ సుసుఖోషితాః. 6

ప్ర. అ. ప్రేష్యాన్ అపి=పరిచారకులను కూడ, ఉపాదాయ=ఆరంభించి, సర్వే=మే మందరము, అపేతక్లమసంతాపాః=తొలగిన శ్రమ, తాపము కలవారమై, సుభక్షాః=మంచి ఆహారము కలవారమై, సుప్రతిశ్రయాః=ఉత్తమమైన గృహములు కలవారమై, సుసుఖోషితాః=చాల సుఖముగా ఉన్నవారము, స్మః=అయితిమి.

తా. మా పరిచారకుల దగ్గరనుంచి కూడ మే మందరము శ్రమయు, సంతాపమును తొలగి, మంచి ఆహారము భుజించి, ఉత్తమ మైన గృహములతో సుఖముగా నివసించితిమి. 6

మూ. ఆమన్త్రయేఽహం భగవన్ కామం త్వామృషిసత్తమ,
సమీపం ప్రస్థితం భ్రాతుర్మైత్రేణేక్షస్వ చక్షుషా.

ప్ర. అ. భగవన్=పూజ్యుడా, ఋషిసత్తమ=ఓ ఋషిశ్రేష్ఠుడా! అహమ్=నేను, త్వామ్=నిన్ను, కామమ్=మిక్కిలి, ఆమన్త్రయే=వీడ్కొనుచున్నాను. భ్రాతుః=సోదరునియొక్క, సమీపమ్=సమీపమును గూర్చి, ప్రస్థితమ్=ప్రయాణ మైన నన్ను, మైత్రేణ=మైత్రీపూర్వక మైన, చక్షుషా=నేత్రముతో ఈక్షస్వ=చూడుము.

తా. పూజ్యుడ వైన ఓ ఋషిశ్రేష్ఠుడా! వెళ్లుటకై అనుజ్ఞ కోరుచున్నాను. సోదరుని వద్దకు ప్రయాణ మైన నా విషయమున స్నేహమును చూపుము. 7

మూ. ఆశ్రమం తస్య ధర్మజ్ఞ ధార్మికస్య మహాత్మనః,
ఆచక్ష్వ కతమో మార్గః కియానితి చ శంస మే. 8

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసినవాడా! ధార్మికస్య=ధార్మికుడైన, తస్య మహాత్మనః=ఆ మహాత్మునియొక్క, ఆశ్రమమ్=ఆశ్రమమును

గూర్చి, ఆచక్ష్వ = చెప్పుము. కతమః = ఏది, మార్గః = మార్గమో, కియాన్ = ఎంతయో, ఇతి చ = అనునది కూడ, మే = నాకు, శంస = చెప్పుము.

తా. ధర్మములు తెలిసిన ఓ మహామునీ! ధార్మికు డైన ఆ మహాత్ముని ఆశ్రమము ఎక్కడ ఉన్నదో, అచటికి పోవుటకు ఏది మార్గమో, ఎంత దూరమో చెప్పుము. 8

మూ. ఇతి పృష్టస్తు భరతం భ్రాతృదర్శనలాలసమ్,
ప్రత్యువాచ మహాతేజా భరద్వాజో మహాతపాః. 9

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడు అయిన, భరద్వాజః = భరద్వాజుడు, ఇతి = ఇట్లు, పృష్టః = అడగబడినవా డై, భ్రాతృదర్శనలాలసమ్ = సోదరుని దర్శనమునందు ఆసక్తి గల, భరతమ్ = భరతుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మహాతేజశ్శాలి, మహాతపస్వి అయిన భరద్వాజుడు, సోదరుని చూచుటకై ఆసక్తి గల భరతుని మాటలు విని అతనితో ఇట్లనెను. 9

మూ. భరతార్ధతృతీయేషు యోజనేష్వజనే వనే,
చిత్రకూటో గిరిస్తత్ర రమ్యనిర్ఝరకాననః. 10

ప్ర. అ. భరత = ఓ భరతుడా, అర్ధతృతీయేషు = మూడున్నర, యోజనేషు = యోజనములలో, తత్ర = అక్కడ, అజనే = జనులు లేని, వనే = వనమునందు, రమ్యనిర్ఝరకాననః = అంద మైన సెలయేళ్లు, అడవులు గల, చిత్రకూటః = చిత్రకూట మను, గిరిః = పర్వతము ఉన్నది.

తా. ఓ భరతుడా! ఇక్కడనుండి మూడున్నర యోజనముల దూరమున నిర్జనవనమునందు అంద మైన సేలయేళ్లు అడవులు కల చిత్రకూట మను పర్వతము ఉన్నది. 10

మూ. ఉత్తరం పార్శ్వమాసాద్య తస్య మన్దాకినీ నదీ,
పుష్పితద్రుమసంఛన్నా రమ్యపుష్పితకాననా. 11

ప్ర. అ. తస్య = దానియొక్క, ఉత్తరం పార్శ్వమ్ = ఉత్తరపార్శ్వమును,

ఆసాద్య = సమీపించి, పుష్పితద్రుమసంఛన్నా=పుష్పించిన వృక్షములచే కప్ప బడిన, రమ్యపుష్పితకాననా = రమ్య మైన పుష్పించిన అడవులు గల, మన్దాకినీ నదీ = మందాకినీ నది ఉన్నది.

తా. దాని ఉత్తరపార్శ్వమున, మందాకినీనది ఉన్నది. దాని తీరము నందు పుష్పించిన వృక్షములు దట్టముగా ఉండును. పుష్పించిన అంద మైన ఆరణ్యములు కూడ దాని ఇరు పార్శ్వములం దుండును. 11

మూ. అనన్తరం తత్సరితశ్చిత్రకూటశ్చ పర్వతః,
తయోః పర్ణకుటీ తాత తత్ర తౌ వసతో ధ్రువమ్. 12

ప్ర. అ. తత్సరితః = ఆ నదికి. అనన్తరమ్=పిమ్మట, చిత్రకూటః = చిత్రకూట మను, పర్వతశ్చ=పర్వతము కూడ ఉన్నది. తయోః=వారియొక్క, పర్ణకుటీ = పర్ణశాల ఉన్నది, తాత=తండ్రీ, తౌ=వారిద్దరు, తత్ర=అక్కడ. వసతః = నివసించుచున్నారు. ధ్రువమ్ = నిశ్చయము.

తా. తండ్రీ! ఆ నదికి అవతల చిత్రకూటపర్వతము, దానిపై ఆ రామ లక్ష్మణుల పర్ణశాల ఉన్నవి. వారు ఆ పర్ణశాలలో నివసించుచున్నారు. నిశ్చయము. 12

మూ. దక్షిణేనైవ మార్గేణ సవ్యదక్షిణమేవ వా,
గజవాజిరథాకీర్ణాం వాహినీం వాహినీపతే, 13
వాహయస్వ మహాభాగ తతో ద్రక్ష్యసి రాఘవమ్.

ప్ర. అ. వాహినీపతే = సేనకు అధిపతి వైన, మహాభాగ = ఉత్తమ భాగ్యవంతుడ వైన ఓ భరతా! గజవాజిరథాకీర్ణామ్ = గజములతోను, అశ్వముల తోను, రథములతోను నిండిన, వాహినీమ్ = సేనను, దక్షిణేనైవ = దక్షిణపు, మార్గేణ = మార్గముచేతగాని. సవ్యదక్షిణమేవ వా = నైఋతి దిక్కుచేత గాని, వాహయస్వ = నడిపించుము. తతః = పిమ్మట, రాఘవమ్ = రాముని, ద్రక్ష్యసి చూడగలవు.

ప్ర. అ. సేనలకు అధిపతి వైన మహాభాగ్యవంతుడా ! గజములతోను,

అశ్వములతోను, రథములతోను నిండిన సేనను దక్షిణమార్గమున గాని, నైఋతి మార్గమునగాని నడిపించికొని వెళ్ళినచో రాముడు కనబడును. 13

మూ. ప్రయాణమితి తచ్ఛ్రుత్వా రాజరాజస్య యోషితః,
హిత్వా యానాని యానార్హాః బ్రాహ్మణం పర్యవారయన్.

ప్ర. అ. ఇతి = ఇట్లు, తత్ = ఆ, ప్రయాణమ్=ప్రయాణమును గూర్చి, శ్రుత్వా = విని, యానార్హాః=వాహనములకు తగిన, రాజరాజస్య = రాజులకు రాజైన దశరథుని యొక్క, యోషితః=స్త్రీలు, యానాని=వాహనములను, హిత్వా = విడచి, బ్రాహ్మణమ్ = ఆ భరద్వాజుని, పర్యవారయన్=చుట్టి నిలచిరి.

తా. ప్రయాణమును గూర్చి విన్న దశరథుని భార్యలు, తమ వాహనములనుండి దిగి, ఆ భరద్వాజమహర్షి చుట్టును చేరి నిలచిరి. 14

మూ. వేపమానా కృశా దీనా సహ దేవ్యా సుమిత్రయా,
కౌసల్యా తత్ర జగ్రాహ కరాభ్యాం చరణౌ మునేః. 15

ప్ర. అ. తత్ర=వారిలో, కృశా=కృశించినది, దీనా=దీనురాలు అయిన, కౌసల్యా = కౌసల్య, వేపమానా = వణకుచు, మునేః = మునియొక్క, చరణౌ= పాదములను, సుమిత్రయా దేవ్యా సహ=సుమిత్రాదేవితో కూడ, జగ్రాహ = గ్రహించెను.

తా. వారిలో కృశించి, దీనురాలై, వణకుచున్న కౌసల్యా, సుమిత్రాదేవీ ఆ భరద్వాజుని పాదములను స్పృశించి నమస్కరించిరి. 15

మూ. అసమృద్ధేన కామేన సర్వలోకస్య గర్హితా,
కైకేయీ తస్య జగ్రాహ చరణౌ సవ్యపత్రపా. 16

ప్ర. అ. అసమృద్ధేన=సఫలముకాని- కామేన=కోరికతో, సర్వలోకస్య= సమస్తలోకములకు, గర్హితా = నిందితురాలైన, కైకేయీ = కైకేయి, సవ్యపత్రపా = సిగ్గుతో కూడినదై, తస్య=అతనియొక్క, చరణౌ = పాదములను, జగ్రాహ = గ్రహించెను.

తా. తన కోరిక నెరవేరక, సర్వలోకనిందిత అయిన కైకేయి సిగ్గు పడుచు ఆ భరద్వాజముని పాదములు స్పృశించి నమస్కరించెను. 16

మూ. తం ప్రదక్షిణమాగమ్య భగవన్తం మహామునిమ్,
అదూరాద్భరతస్యైవ తస్థౌ దీనమనా స్తదా. 17

ప్ర. అ. తదా = అపుడు, భగవన్తమ్ = పూజ్యు డైన, తం మహామునిమ్ = ఆ మహామునిని, ప్రదక్షిణం ఆగమ్య = ప్రదక్షిణము చేసి, దీనమనాః = దీన మైన మనస్సు కలదై, భరతస్య = భరతునకు, అదూరాదేవ = సమీపమునందే, తస్థౌ = నిలబడెను.

తా. ఆమె భగవంతు డైన ఆ మహామునికి ప్రదక్షిణము చేసి, దీనమైన మనస్సుతో భరతుని దగ్గర నిలబడెను. 17

మూ. తతః పప్రచ్ఛ భరతం భరద్వాజో దృఢవ్రతః,
విశేషం జ్ఞాతుమిచ్ఛామి మాతౄణాం తవ రాఘవ. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దృఢవ్రతః = దృఢ మైన వ్రతము గల, భరద్వాజః = భరద్వాజుడు, భరతమ్ = భరతుని, పప్రచ్ఛ = అడిగెను. రాఘవ = ఓ భరతుడా! తవ = నీయొక్క, మాతౄణామ్ = తల్లులయొక్క, విశేషమ్ = విశేషమును, జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. అపుడు దృఢమైన తపోనియమములు గల భరద్వాజుడు, "ఓ భరతా! నీ తల్లులలో ఎవరు ఎవరో తెలుసుకొనగోరుచున్నాను'' అని భరతునితో పలికెను. 18

మూ. ఏవముక్తస్తు భరతో భరద్వాజేన ధీమతా,
ఉవాచ ప్రాఞ్జలిర్భూత్వా వాక్యం వచనకోవిదః. 19

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతు డైన, భరద్వాజేన = భరద్వాజునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, వచనకోవిదః = వచనములందు నేర్పుగల, భరతః = భరతుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ధీమంతు డైన భరద్వాజుని మాటలు విని, మాటలలో నేర్పరి యైన భరతుడు చేతులు జోడించి నమస్కరించుచు ఇట్లు పలికెను. 19

మూ. యామియాం భగవన్ దీనాం శోకానశనకర్శితామ్,
పితుర్హి మహిషీం దేవీం దేవతామివ పశ్యసి,
ఏషా తం పురుషవ్యాఘ్రం సింహవిక్రాన్తగామినమ్,
కౌసల్యా సుషువే రామం ధాతారమదితిర్యథా. 21

ప్ర. అ. భగవన్=ఓ పూజ్యుడా! దీనామ్ = దీనురాలు, శోకానశనకర్శితామ్ = శోకము చేతను, భుజించక పోవుటచేతను కృశించినది, పితుః = మా తండ్రిగారియొక్క, మహిషీమ్ = పట్టపురాణి, దేవతామివ = దేవత వలె ఉన్నది అయిన, యామ్ = ఏ, ఇమామ్ = ఈ, దేవీమ్ = దేవిని, పశ్యసి = చూచుచున్నావో, ఏషా = ఈ, కౌసలా = కౌసల్య, అదితిః = అదితి, ధాతారం యథా = ధాతను వలె, సింహవిక్రాన్తగామినమ్=సింహమువలె పరాక్రమపూర్వకముగా నడచు, పురుషవ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠుడైన, తం రామమ్ = ఆ రాముని, సుషువే=కన్నది.

తా- ఓ మహాముని ! దీనురాలై, శోకము చేతను, ఉపవాసములచేతను, కృశించి ఉన్న, దేవతాసదృశురా లగు ఈమె, తండ్రిగారి పట్టపురాణి యైన కౌసల్యాదేవి. ఈమెయే సింహమువలె పరాక్రమముతో నడచు పురుషశ్రేష్ఠుడైన రాముని అదితి ధాతను కన్నట్లు కనినది. 20, 21

మూ. అస్యా వామభుజం శ్లిష్టా యైషా తిష్ఠతి దుర్మనాః,
కర్ణికారస్య శాఖేవ శీర్ణపుష్పా వనాన్తరే. 22
ఏతస్యాస్తు సుతౌ దేవ్యాః కుమారౌ దేవవర్ణినౌ,
ఉభౌ లక్ష్మణశత్రుఘ్నౌ వీరౌ సత్యపరాక్రమౌ. 23

ప్ర. అ. యా = ఏ, ఏషా = ఈమె, దుర్మనాః = దుఃఖించిన మనస్సు కలదై, వనాన్తరే = వనమధ్యమునందు, శీర్ణపుష్పా = రాలిపోయిన పుష్పములు గల, కర్ణికారస్య = కర్ణికారవృక్షముయొక్క, శాఖేవ = కొమ్మవలె ఉన్నదై, అస్యాః = ఈ కౌసల్యయొక్క, వామభుజమ్ = ఎడమ భుజమును, శ్లిష్టా = ఆశ్రయించినదై, తిష్ఠతి = నిలచి యున్నదో, కుమారౌ = చిన్నవారు, దేవవర్ణినౌ = దేవతలతో సమానులు, వీరౌ = వీరులు, సత్యపరాక్రమౌ = సత్యమైన పరాక్రమము గలవారు అయిన, లక్ష్మణశత్రుఘ్నౌ = లక్ష్మణశత్రుఘ్నులు, ఉభౌ = ఇరువురు, ఏతస్యాః = ఈ, దేవ్యాః = దేవియొక్క, సుతౌ = కుమారులు.

తా. దుఃఖించుచున్న మనస్సుతో, వనమధ్యమునందు పుష్పములు రాలి పోయిన కర్ణికారశాఖ వలె, కాంతిహీన యైన కౌసల్య ఎడమభుజమునకు దగ్గరగా నిలిచి యున్నది సుమిత్ర. దేవతలతో సమానులు, వీరులు, సత్యపరాక్రమ వంతులు అయిన లక్ష్మణశత్రుఘ్నులు ఇరువురు ఈ సుమిత్రాదేవి పుత్రులు.

మూ. యస్యాః కృతే నరవ్యాఘ్రౌ జీవనాశమితో గతౌ,
రాజా పుత్రవిహీనశ్చ స్వర్గం దశరథో గతః. 24
క్రోధనామకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీమ్,
ఐశ్వర్యకామాం కైకేయీమనార్యామార్యరూపిణీమ్, 25
మమైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయామ్,
యతోమూలం హి పశ్యామి వ్యసనం మహదాత్మనః. 26

ప్ర. అ. యస్యాః కృతే = ఎవతె నిమిత్తమున, నరవ్యాఘ్రౌ = పురుష శ్రేష్ఠులైన రామలక్ష్మణులు, ఇతః = ఇక్కడినుండి, జీవనాశమ్ = ప్రాణనాశ మును, గతౌ = పొందినారో, రాజా దశరథః = దశరథమహారాజు, పుత్రవిహీ నశ్చ = పుత్రులు లేనివాడై, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడో, ఆత్మనః = నాయొక్క, మహత్ = గొప్పదైన, వ్యసనమ్ = వ్యసనమును, యతో మూలమ్ = ఎవ్వతెయే మూలము కలదానిగా, పశ్యామి = చూచుచున్నానో, క్రోధ నామ్ = కోపముకలది, అకృతప్రజ్ఞామ్ = నేర్వబడని బుద్ధికలది, దృప్తామ్ = గర్వించినది, సుభగమానినీమ్ = తానే సౌందర్యవంతురా లని భావించునది, ఐశ్వర్యకామామ్ = ఐశ్వర్యమునందు కోరిక గలది, అనార్యామ్ = పూజ్యురాలు కానిది, ఆర్యరూపిణీమ్ = పూజ్యురాలు వలె కనబడునది, అయిన, ఏతామ్ = ఈమెను, నృశంసామ్ = క్రూరురాలు, పాపనిశ్చయామ్ = పాపనిశ్చయము కలది, మమ = నాయొక్క, మాతరమ్ = తల్లి అయిన, కైకేయీమ్ = కైకేయినిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. కోపస్వభావము గలది, వివేకములేనిది, గర్వితురాలు, నేనే అంద మైనదానను అను గర్వము కలది, ఐశ్వర్యమునందు కోరిక గలది, ఆర్యురాలు వలె కనబడు అనార్యురాలు, క్రూరురాలు, పాప మైన నిశ్చయము కలది అయిన ఈమెయే నా తల్లి యైన కైకేయి. ఈమె మూలముననే పురుషశ్రేష్ఠులైన రామ లక్ష్మణులకు మరణమువంటి అరణ్యవాసము ప్రాప్తించినది. దశరథమహారాజు

పుత్రవియోగముతో బాధపడుచు స్వర్గస్థుడైనాడు. ఈమెయే నాకు వచ్చిన ఈ మహావ్యసనమునకు మూలకారణము. 26

మూ. ఇత్యుక్త్వా నరశార్దూలో బాష్పగద్గదయా గిరా,
స నిశశ్వాస తామ్రాక్షో నాగః క్రుద్ధ ఇవ శ్వసన్. 27

ప్ర. అ. తామ్రాక్షః = ఎర్రని నేత్రములు గల, నరశార్దూలః = పురుష శ్రేష్ఠుడైన. సః = అతడు, బాష్పగద్గదయా = బాష్పముచే గద్గద మైన, గిరా = వాక్కుచేతో, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి క్రుద్ధః = కోపించిన, శ్వసన్ = బుస కొట్టుచున్న, నాగః ఇవ = సర్పము వలె, నిశశ్వాస = నిట్టూర్పు విడిచెను.

తా. కండ్లు ఎర్రబారిన, నరశ్రేష్ఠుడైన ఆ భరతుడు, గద్గద మైన కంఠ స్వరముతో ఇట్లు పలికి పగ బట్టి బుసలు కొట్టుచున్న పాము వలె నిట్టూర్పులు విడచెను. 27

మూ. భరద్వాజో మహర్షిస్తం బ్రువన్తం భరతం తథా,
ప్రత్యువాచ మహాబుద్ధిరిదం వచనమర్థవత్. 28

ప్ర. అ. మహాబుద్ధిః = గొప్ప బుద్ధి గల, మహర్షిః = మహర్షి యైన, భరద్వాజః = భరద్వాజుడు, తథా = అట్లు, బ్రువన్తమ్ = పలుకుచున్న, తం భరతమ్ = ఆ భరతుని, అర్థవత్ = అధిక మైన అర్థము గల, ఇదం వచనమ్ = ఈ మాటను, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ఈ విధముగా పలుకుచున్న భరతుని మాటలు విని మహాబుద్ధిశాలి యైన భరద్వాజమహర్షి మంచి అర్థము గల ఒక వాక్యమును ఇట్లు పలికెను. 28

మూ. స దోషేణావగన్తవ్యా కైకేయీ భరత త్వయా,
రామప్రవ్రాజనం హ్యేతత్ సుఖోదర్కం భవిష్యతి. 29

ప్ర. అ. భరత = ఓ భరతుడా! కైకేయీ = కైకేయి, త్వయా = నీచేత, దోషేణ = దోషము చేత, న అవగన్తవ్యా = తెలియదగినది కాదు. ఏతత్ = ఈ, రామప్రవ్రాజనమ్ = రాముని వనగమనము, సుఖోదర్కమ్ = సుఖమైన భావి ఫలితము కలదిగా, భవిష్యతి హి = కాగలదు కదా!

తా. ఓ భరతా! నీవు కైకేయి విషయమున దోషమును చూడవలదు. రాముని అరణ్యాగమనమువలన మున్ముందు సుఖకర మైన ఫలము లభించ గలదు. 29

మూ. దేవానాం దానవానాం చ ఋషీణాం భావితాత్మనామ్,
హితమేవ భవిష్యద్ధి రామప్రవ్రాజనాదిహ. 30

ప్ర. అ. ఇహ = ఇపుడు, రామప్రవ్రాజనాత్ = రాముని అరణ్యమునకు పంపుటవలన, దేవానామ్ = దేవతలకు, దానవానాం చ = దానవులకు, భావితాత్మనామ్ = సంశుద్ధ మైన మనస్సు గల, ఋషీణాం చ = ఋషులకు, హితమేవ = హితమే, భవిష్యద్ధి = కాగలదు కదా.

తా. రాముని అరణ్యగమనమువలన దేవతలకు దానవులకు, పరిశుద్ధ హృదయు లైన ఋషులకు హితమే కలుగ నున్నది. 30

మూ. అభివాద్య తు సంసిద్ధః కృత్వా చైనం ప్రదక్షిణమ్,
ఆమన్త్ర్య భరతః సైన్యం యుజ్యతామిత్యచోదయత్. 31

ప్ర. అ. భరతః = భరతుడు, ఏనమ్ = ఈ భరద్వాజమహర్షిని, అభివాద్య = నమస్కరించి, సంసిద్ధః = ప్రయాణమునకు సిద్ధ మైనవా డై, ప్రదక్షిణం చ కృత్వా = ప్రదక్షిణము కూడ చేసి, ఆమన్త్ర్య = అనుజ్ఞ గైకొని, యుజ్యతామ్ = ప్రయాణసన్నాహము చేయబడుగాక! ఇతి = అని, సైన్యమ్ = సైన్యమును, అచోదయత్ = ప్రేరేపించెను.

తా. భరతుడు ఆ భరద్వాజమహర్షికి ప్రదక్షిణపూర్వకముగా నమస్కరించి ఆయన అనుజ్ఞ పొంది, ప్రయాణమునకు సన్నద్ధుడై, "ప్రయాణమునకు సన్నాహము చేయబడుగాక !" అని సైన్యమును ఆజ్ఞాపించెను 31

మూ. తతో వాజిరథాన్యుక్తాన్ దివ్యాన్ హేమపరిష్కృతాన్,
అధ్యారోహత్ప్రయాణార్థీ బహూన్ బహువిధో జనః. 32

ప్ర. అ. తతః = అటుపిమ్మట, బహువిధః = అనేకవిధము లైన, జనః = జనము, ప్రయాణార్థీ = ప్రయాణమును కోరుచు, దివ్యాన్ = శ్రేష్ఠము లైన, హేమ

పరిష్కృతాన్ = బంగారముచే అలంకరింపబడిన, యుక్తాన్ = కట్టబడిన, వాజి రథాన్ = గుఱ్ఱముల రథములను, అధ్యారోహత్ = ఎక్కెను.

తా. పిమ్మట అనేకవిధములైన జనులు ప్రయాణముకొరకై ప్రకాశించు చున్న బంగారముతో అలంకరించిన గుఱ్ఱములు కట్టిన రథములను ఎక్కిరి. 32

మూ. గజకన్యా గజాశ్చైవ హేమకక్ష్యాః పతాకినః,
జీమూతా ఇవ ఘర్మాన్తే సఘోషాః సంప్రతస్థిరే. 35

ప్ర. అ. హేమకక్ష్యాః = బంగారు నడుముత్రాడు గల, పతాకినః = పతాకలు గల, గజకన్యాః = ఆడ ఏనుగులు, గజాశ్చైవ = ఏనుగులు, ఘర్మాన్తే = వర్షఋతువునందు, జీమూతాః ఇవ = మేఘములు వలె, సఘోషాః = ధ్వనులతో కూడినవై, సంప్రతస్థిరే = ప్రయాణమైనవి.

తా. బంగారు నడుము త్రాళ్లు, పతాకలు ధరించిన ఏనుగులు, ఆడఏనుగులు ధ్వని చేయుచు వర్షకాలమునందలి మేఘముల వలె బయలుదేరెను. 33

మూ. వివిధాన్యపి యానాని మహాన్తి చ లఘూని చ,
ప్రయయుః సుమహార్హాణి పాదైరేవ పదాతయః. 34

ప్ర. అ. మహాన్తి చ = పెద్దవి, లఘూని చ = చిన్నవి అయిన, వివిధాని = అనేకవిధములైన, సుమహార్హాణి = చాల వెల గల, యానాని = వాహనములు, ప్రయయుః = వెళ్ళినవి. పదాతయః = కాలిబంట్లు, పాదైరేవ = పాదములచేతనే వెళ్ళిరి.

తా. అమూల్యమైన చిన్నవి, పెద్దవి అయిన అనేకవిధముల వాహనములు బయలుదేరినవి. కాలిబంట్లు కాలినడకనే వెళ్ళిరి. 34

మూ. అథ యానప్రవేకైస్తు కౌసల్యాప్రముఖాః స్త్రియః,
రామదర్శనకాంక్షిణ్యః ప్రయయుర్ముదితాస్తదా. 35

ప్ర. అ. అథ = అటు పిమ్మట, కౌసల్యాప్రముఖాః = కౌసల్య మొదలైన, స్త్రియః = స్త్రీలు, రామదర్శనకాంక్షిణ్యః = రాముని దర్శనమును కోరుచున్న వారై, ముదితాః = సంతోషించినవారై, తదా = అపుడు, యానప్రవేకైః = విశిష్టమైన వాహనములచే, ప్రయయుః = వెళ్ళిరి.

తా. కౌసల్య మొదలైన స్త్రీలు, రామదర్శనము కోరుచు సంతోషించు చున్నవారై, ఉత్తమములైన వాహనము లెక్కి వెళ్ళిరి. 35

మూ. చంద్రార్కతరుణాభాసాం నిర్యుక్తాం శిబికాం శుభామ్,
ఆస్థాయ ప్రయయౌ శ్రీమాన్ భరతః సపరిచ్ఛదః. 36

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = భరతుడు, చంద్రార్క తరుణాభాసామ్ = యౌవనము గల చంద్రసూర్యుల వంటి కాంతి గల, నిర్యుక్తామ్ = సిద్ధము చేయబడిన, శుభామ్ = మంగళకరమైన, శిబికామ్ = పల్లకిని, ఆస్థాయ = ఎక్కి, సపరిచ్ఛదః = పరివారముతో కూడినవాడై. ప్రయయౌ = వెళ్ళెను.

తా. శ్రీమంతుడైన భరతుడు, చంద్రసూర్యుల కాంతి వంటి కాంతి గల సిద్ధముచేయబడిన, మంగళకరమైన పల్లకిని ఎక్కి, పరివార సమేతుడై వెళ్ళెను. 36

మూ. సా ప్రయాతా మహాసేనా గజవాజిరథాకులా,
దక్షిణాం దిశమావృత్య మహామేఘ ఇవోత్థితః. 37
వనాని తు వ్యతిక్రమ్య జుష్టాని మృగపక్షిభిః,
గఙ్గాయాః పరవేలాయాం గిరిష్వపి నదీషు చ. 38

ప్ర. అ. గజవాజిరథాకులా = గజములచేతను, అశ్వములచేతను, రథములచేతను నిండి ఉన్న, సా మహాసేనా = ఆ మహాసేన, ఉత్థితః = పైకి లేచిన, మహామేఘ ఇవ = గొప్ప మేఘము వలె, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును, ఆవృత్య = కప్పివేసి, మృగపక్షిభిః = మృగములచేతను, పక్షులచేతను, జుష్టాని = పొందబడిన, వనాని = వనములను, వ్యతిక్రమ్య = దాటి, గఙ్గాయాః = గంగయొక్క, పరవేలాయామ్ = అవతలి ఒడ్డున, గిరిష్వపి = పర్వతములమీదను, నదీషు చ = నదులయందును. ప్రయాతా = వెళ్ళినది.

తా. గజములతోను, అశ్వములతోను, రథములతోను నిండిన, ఆ మహాసేన, పైకి లేచిన మహామేఘము వలె దక్షిణదిక్కును ఆవరించుచు, మృగములు పక్షులు నిండి ఉన్న వనములను దాటి, గంగ అవతలి ఒడ్డున పర్వతముల మీదుగను, నదులమీదుగను ప్రయాణముచేసెను. 37, 38

మూ. సా సంప్రహృష్టద్విపవాజియోధా
విత్రాసయన్తీ మృగపక్షిసఙ్ఘాన్,
మహద్వనం తత్ప్రతిగాహమానా
రరాజ సేనా భరతస్య తత్ర. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వినవతితమః సర్గః.

ప్ర. అ. సంప్రహృష్టద్విపవాజియోధా = మిక్కిలి ఉత్సాహముతో కూడిన ఏనుగులు, గుఱ్ఱములు, యుద్ధభటులు కలది. మృగపక్షిసఙ్ఘాన్ = మృగముల యొక్క, పక్షులయొక్క సముదాయములను, విత్రాసయన్తీ = భయపెట్టుచున్నది అయిన, భరతస్య = భరతునియొక్క, సా సేనా = ఆసేన, తత్ర = అచట, తత్ = ఆ, మహత్ = గొప్పదైన, వనమ్ = వనమును, ప్రతిగాహమానా = ప్రవేశించుచున్నదై, రరాజ = ప్రకాశించెను.

తా. ఉత్సాహము గల ఏనుగులు, అశ్వములు, యోధులు గల భరతుని ఆ సేన, మృగపక్షిసముదాయములను భయపెట్టుచు, ఆ మహావనమును ప్రవేశించుచు ప్రకాశించెను. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో తొంబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రినవతితమః సర్గః

[భరతుడు సేనాసమేతుడై చిత్రకూటమున కేగుట.]

మూ. తయా మహత్యా యాయిన్యా ధ్వజిన్యా వనవాసినః,
అర్దితా యూథపా మత్తాః సయూథాః సంప్రదుద్రువుః. 1

ప్ర. అ. యాయిన్యా = ప్రయాణముచేయుచున్న, మహత్యా = గొప్పదైన. తయా = ఆ, ధ్వజిన్యా = సేనచేత, వనవాసినః = వనమునందు నివసించు, మత్తాః = మదించిన, యూథపాః = గుంపుల నాయకు లైన మృగములు, అర్దితాః = భయ పెట్టబడినవై, సయూథాః = గుంపులతో కూడిన వై, సంప్రదుద్రువుః = పారిపోయినవి.

తా. ప్రయాణముచేసి, వెళ్లుచున్న ఆ మహా సైన్యమును చూచి, వనములోని ఆ యా మృగముల నాయకు లైన మదించిన మృగములు భయపడి తమ తమ గుంపులతో పరుగెత్తినవి. 1

మూ. ఋక్షాః పృషతసఙ్ఘాశ్చ రురవశ్చ సమన్తతః,
దృశ్యన్తే వనరాజీషు గిరిష్వపి నదీషు చ. 2

ప్ర. అ. వనరాజీషు = వనముల పంక్తులందు, గిరిష్వపి = పర్వతములందు, నదీషు చ = నదులయందు, సమన్తతః = నలు వైపుల, ఋక్షాః = ఎలుగుబంట్లు, పృషతసఙ్ఘాశ్చ = చుక్కల లేళ్ళ సముదాయములు, రురవశ్చ = చుక్కలులేని లేళ్ల సముదాయములు, దృశ్యన్తే = కనబడుచుండెను.

తా. పారిపోవుచున్న ఎలుగుబంట్లు, చుక్కల లేళ్ళ సముదాయములు, చుక్కలు లేని పెద్ద కొమ్ముల లేళ్లు వనపంక్తులలోను పర్వతములమీదను, నదులలోను అన్ని వైపుల కనబడుచుండెను. 2

మూ. స సంప్రతస్థే ధర్మాత్మా ప్రీతో దశరథాత్మజః,
వృతో మహత్యా నాదిన్యా సేనయా చతురఙ్గయా. 3

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆ, దశరథాత్మజః = భరతుడు, ప్రీతః = సంతోషించినవాడై, నాదిన్యా = ధ్వని చేయుచున్న, మహత్యా = గొప్పదైన, చతురఙ్గయా = నాలుగు అంగములు గల, సేనయా = సేనతో, వృతః = కూడినవాడై, సంప్రతస్థే = ప్రయాణమాయెను.

తా. ధర్మాత్ముడైన ఆ భరతుడు, ధ్వనిచేయుచున్న ఆ గొప్ప చతురంగబలముతో ఉత్సాహవంతుడై బయలుదేరెను. 3

మూ. సాగరౌఘనిభా సేనా భరతస్య మహాత్మనః,
మహీం సంఛాదయామాస ప్రావృషి ద్యామివామ్బుదః. 4

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, భరతస్య = భరతునియొక్క, సాగరౌఘనిభా = సముద్రప్రవాహముతో సమానమైన, సేనా = సేన, ప్రావృషి = వర్షాకాలమునందు, అంబుదః = మేఘము, ద్యామివ = ఆకాశమును వలె, మహీమ్ = భూమిని, సంఛాదయామాస = కప్పివేసెను.

తా. మహాత్ముడైన ఆ భరతుని సముద్రప్రవాహము వంటి సేన వర్షాకాలమునందు మేఘము అకాశమును కప్పివేసినట్లు భూమిని కప్పివేసెను. 4

మూ. తురఙ్గౌఘైరవతతా వారణైశ్చ మహాజవైః,
అనాలక్ష్యా చిరం కాలం తస్మిన్కాలే బభూవ భూః. 5

ప్ర. అ. తస్మిన్కాలే = ఆ సమయమున, మహాజవైః = గొప్ప వేగము గల, తురఙ్గౌఘైః = గుఱ్ఱముల సముదాయములచేతను, వారణైశ్చ = ఏనుగులచేతను, అవతతా = వ్యాపింపబడిన, భూః = భూమి, చిరకాలమ్ = చిరకాలము, అనాలక్ష్యా = కనబడనిది, బభూవ = ఆయెను.

తా. ఆ సమయమునందు మహావేగము గల, గుఱ్ఱములు, ఏనుగులు, అంతటను వ్యాపించి యుండుటచేత నేల చాలసేపటివరకు కనబడలేదు. 5

మూ. స యాత్వా దూరమధ్వానం సుపరిశ్రాన్తవాహనః,
ఉవాచ భరతః శ్రీమాన్ వసిష్ఠం మన్త్రిణాం వరమ్. 6

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, సః భరతః = ఆ భరతుడు, దూరమ్ = దూరమైన, అధ్వానమ్ = మార్గమును, యాత్వా = వెళ్ళి, సుపరిశ్రాన్తవాహనః = మిక్కిలి అలసిపోయిన వాహనములు గలవాడై, మన్త్రిణామ్ = మంత్రులలో, వరమ్ = శ్రేష్ఠుడైన, వసిష్ఠమ్ = వసిష్ఠునిగూర్చి, ఉవాచ = పలికెను.

తా. వాహనము లన్నియు మిక్కిలి అలసిపోవునట్లు దీర్ఘప్రయాణము చేసి శ్రీమంతుడైన ఆ భరతుడు, మంత్రులలో శ్రేష్ఠుడైన వసిష్ఠునితో ఇట్లనెను. 6

మూ. యాదృశం లక్ష్యతే రూపం యథా చైవ శ్రుతం మయా.
వ్యక్తం ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో యమబ్రవీత్.

ప్ర. అ. యాదృశమ్ = ఎట్టి, రూపమ్ = రూపము, లక్ష్యతే = చూడబడుచున్నదో, మయా = నాచేత, యథా = ఎట్లు, శ్రుతం చైవ = వినబడినదో, యమ్ = ఏ దేశమునుగూర్చి, భరద్వాజః = భరద్వాజుడు, అబ్రవీత్ = పలికెనో, తం దేశమ్ = ఆ దేశమును, ప్రాప్తాః స్మ = పొందినాము. వ్యక్తమ్ = స్పష్టము.

తా. ఈ పరిసరములలో కనబడు దానిని, నేను విన్న దానినిబట్టి, భరద్వాజ మహర్షి చెప్పిన ప్రదేశమునకు వచ్చితి మని స్పష్టముగా తెలియుచున్నది. 7

మూ. అయం గిరిశ్చిత్రకూట ఇయం మన్దాకినీ నదీ,
ఏతత్ప్రకాశతే దూరాన్నీలమేఘనిభం వనమ్. 8

ప్ర. అ. అయమ్ = ఈ, గిరిః = పర్వతము, చిత్రకూటః = చిత్రకూటము. ఇయం నదీ = ఈ నది, మన్దాకినీ = మందాకిని. దూరాత్ = దూరమునందు, ఏతత్ = ఈ, నీలమేఘనిభమ్ = నల్లని మేఘముతో సమానమైన, వనమ్ = వనము, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తా. ఈ పర్వతమే చిత్రకూటపర్వతము. ఈ నది మందాకినీనది. దూరముగా ఆ వనము నీలమేఘము వలె ప్రకాశించుచున్నది. 8

మూ. గిరేః సానూని రమ్యాణి చిత్రకూటస్య సంప్రతి,
వారణై రవమృద్యన్తే మామకైః పర్వతోపమైః. 9

ప్ర. అ. సంప్రతి = ఇపుడు, మామకైః=నాకు సంబంధించిన, పర్వతోపమైః=పర్వతములతో సమాన మైన, వారణైః=ఏనుగులచేత, చిత్రకూటస్య = చిత్రకూట మను, గిరేః = పర్వతముయొక్క, రమ్యాణి = రమ్యమైన, సానూని = చరియలు, అవమృద్యన్తే=మర్దింపబడుచున్నవి.

తా. పర్వతముల వంటి నా ఏనుగులు ఇపుడు అంద మైన చిత్రకూట పర్వతపు చరియలపై నడచుచున్నవి. 9

మూ. ముఞ్చన్తి కుసుమాన్యేతే నగాః పర్వతసానుషు,
నీలా ఇవాతపాపాయే తోయం తోయధరా ఘనాః. 10

ప్ర అ. పర్వతసానుషు = పర్వతముల చరియలయందు, ఏతే= ఈ, నగాః = వృక్షములు, ఆతపాపాయే=వర్షకాలమునందు, నీలాః = నల్లని, ఘనాః = దట్టమైన, తోయధరాః = మేఘములు, తోయమ్ ఇవ = నీటిని వలె, కుసుమాని = పుష్పములను, ముఞ్చన్తి = విడచుచున్నవి.

తా. ఈ పర్వతము చరియలపై ఉన్న వృక్షములు వర్షాకాలమునందు నల్లని దట్టమైన మేఘములు ఉదకమును వర్షించినట్లు పుష్పములను వర్షించుచున్నవి. 10

మూ. కిన్నరాచరితం దేశం పశ్య శత్రుఘ్న పర్వతమ్,
మృగైస్సమన్తాదాకీర్ణం మకరైరివ సాగరమ్. 11

ప్ర. అ. శత్రుఘ్న = ఓ శత్రుఘ్నుడా ! మకరైః = మొసళ్ళచేత, సాగరమ్ ఇవ = సముద్రమును వలె, సమన్తాత్ = అంతటను, మృగైః=మృగముల చేత, ఆకీర్ణమ్ = వ్యాపింపబడిన, కిన్నరాచరితమ్=కిన్నరులచేత సంచరించబడిన, దేశమ్ = ప్రదేశ మైన, పర్వతమ్=పర్వతమును, పశ్య=చూడుము.

తా. శత్రుఘ్నా! కిన్నరుల సంచారభూమియైన ఈ పర్వతము, మకరములచేత సముద్రము వలె, మృగములచే అంతటను వ్యాప్తమై ఉన్నది; చూడుము. 11

మూ. ఏతే మృగగణా భాన్తి శీఘ్రవేగాః ప్రచోదితాః,
వాయుప్రవిద్ధా శరది మేఘరాజిరివామ్బరే. 12

ప్ర. అ. ప్రచోదితాః = ప్రేరేపింపబడినవై, శీఘ్రవేగాః = శీఘ్ర మైన వేగము గల, ఏతే = ఈ, మృగగణాః = మృగసముదాయములు, శరది = శరత్కాలమునందు, అమ్బరే = ఆకాశమున, వాయుప్రవిద్ధా = వాయువుచేత కొట్టబడిన. మేఘరాజరివ = మేఘపంక్తివలె, భాన్తి = ప్రకాశించుచున్నవి.

తా. సైన్యకోలాహలముచే ప్రేరేపింపబడి, శీఘ్రముగా పరుగెత్తుచున్న ఈ మృగసముదాయములు, శరత్కాలమునందు ఆకాశమున వాయువుచే చెదర గొట్టబడిన మేఘపంక్తి వలె ప్రశికాంచుచున్నవి. 12

మూ. కుర్వన్తి కుసుమాపీడాన్ శిరస్సు సురభీనమీ,
మేఘప్రకాశైః ఫలకైర్దాక్షిణాత్యా యథా నరాః. 13

ప్ర. అ. అమీ = ఈ పర్వతముల చరియలు, మేఘప్రకాశైః = మేఘము లతో సమానమైన, ఫలకైః = ఫలకములతో, దాక్షిణాత్యాః = దక్షిణదేశీయు లైన, నరాః యథా = నరులు వలె, శిరస్సు = శిరస్సులపై, సురభీన్ = పరిమ ళించుచున్న. కుసుమాపీడాన్ = పుష్పరూపములైన అలంకారములను, కుర్వంతి = చేయుచున్నవి.

తా. దక్షిణదేశీయు లైన మనుష్యుల వలె, ఈ పర్వతసానువులు, మేఘ ముల వంటి శిలాఫలకముల అగ్రభాగమున పరిమళించుచున్న పుష్పము లనెడు అలంకారములను ధరించియున్నవి. 13

మూ. నిష్కూజమివ భూత్వేదం వనం ఘోరప్రదర్శనమ్,
అయోధ్యేవ జనాకీర్ణా సంప్రతి ప్రతిభాతి మే. 14

ప్ర. అ. ఘోరప్రదర్శనమ్ = ఘోర మైన దర్శనము గల, ఇదం వనమ్ = ఈ వనము, నిష్కూజమివ = ధ్వని లేనిది వలె, భూత్వా = అయి, సంప్రతి = ఇపుడు, జనాకీర్ణా = జనులతో నిండిన, అయోధ్యేవ = అయోధ్య వలె, మే = నాకు, ప్రతిభాతి = తోచుచున్నది.

తా. చూచుటకు భయంకర మైన ఈ వనము ఇంతవరకును అధిక మైన ధ్వనుS లేవియు లేకుండ ఉండి ఇపుడు మన రాకచే జనులతో నిండిన అయోధ్య వలె కనబడుచున్నది. 14.

మూ. ఖురైరుదీరితో రేణుర్దావం ప్రచ్ఛాద్య తిష్ఠతి,
తం వహత్యనిలః శీఘ్రం కుర్వన్నివ మమ ప్రియమ్.

ప్ర. అ. ఖురైః = డెక్కలచే, ఉదీరితః = ఎగరగొట్టబడిన, రేణుః = పరాగము, దావమ్=అరణ్యమును, ప్రచ్ఛాద్య=కప్పి, తిష్ఠతి = ఉంటున్నది. అనిలః = వాయువు, మమ = నాకు, ప్రియమ్ = ప్రియమును, కుర్వన్ ఇవ = చేయుచున్నది వలె, శీఘ్రమ్ = శీఘ్రముగా, తమ్ = ఆ పరాగమును, వహతి = తీసుకొనిపోవుచున్నది.

తా. డెక్కలచే ఎగరగొట్టబడిన పరాగము అరణ్యమును కప్పివేయుచుండగా, వాయువు నాకు ప్రియమును చేయగోరుచున్నదా అన్నట్లు దానిని శీఘ్రముగా, దూరముగా ఎగురగొట్టివేయుచున్నది. 15

మూ. స్యన్దనాంస్తురగోపేతాన్ సూతముఖ్యైరధిష్ఠితాన్,
ఏతాన్ సంపతతః శీఘ్రం పశ్య శత్రుఘ్న కాననే. 16

ప్ర. అ. శత్రుఘ్న = ఓ శత్రుఘ్నుడా : కాననే = అడివియందు, శీఘ్రమ్ = శీఘ్రముగా, సంపతతః = వచ్చుచున్న, సూతముఖ్యైః = సారథిశ్రేష్ఠులచేత, అధిష్ఠితాన్ = అధిష్ఠించబడిన, తురగోపేతాన్ = గుఱ్ఱములతో కూడిన, ఏతాన్ = ఈ, స్యన్దనాన్ = రథములను, పశ్య = చూడుము.

తా. ఓ శత్రుఘ్నా! శ్రేష్ఠులైన సారథులు ఎక్కి ఉన్న ఈ రథములు, గుఱ్ఱములు కట్టి శీఘ్రముగా అరణ్యములో నడుచుచున్నవి; వీటిని చూడుము. 16

మూ. ఏతాన్ విత్రాసితాన్ పశ్య బర్హిణః ప్రియదర్శనాన్,
ఏతమావిశతః శీఘ్రమధివాసం పతత్రిణః. 17

ప్ర. అ. ప్రియదర్శనాన్ = ప్రియమైన దర్శనములు కలవి, విత్రాసితాన్ = భయపెట్టబడినవి, ఏతమ్ = ఈ, అధివాసమ్ = నివాసమును, శీఘ్రమ్= శీఘ్రముగా, ఆవిశతః = ప్రవేశించుచున్నవి అయిన, ఏతాన్ = ఈ, బర్హిణః = నెమళ్ళను, పతత్రిణః=పక్షులను, పశ్య=చూడుము.

తా. చూచుటకు అందముగా నున్న ఈ నెమళ్లు, పక్షులు, భయపడి తమ తమ నివాసములకు పోవుచున్నవి. వీటిని చూడుము. 17

మూ. అతిమాత్రమయం దేశో మనోజ్ఞః ప్రతిభాతి మే,
తాపసానాం నివాసోఽయం వ్యక్తం స్వర్గపథో యథా.

ప్ర. అ. అయం దేశః = ఈ ప్రదేశము, అతిమాత్రమ్ = మిక్కిలి, మనోజ్ఞః = మనోహర మైనదిగా, మే = నాకు, ప్రతిభాతి = కనబడుచున్నది. స్వర్గపథో యథా = స్వర్గమార్గము వలె ఉన్న, అయమ్ = ఇది, వ్యక్తమ్ = స్పష్టముగా, తాపసానామ్ = ఋషులయొక్క. నివాసః = నివాసము.

తా. ఈ ప్రదేశము చాలా మనోహరముగా కనబడుచున్నది. స్వర్గమార్గము వలె ఉన్న ఇది తప్పక ఋషుల నివాసస్థానమే. 18

మూ. మృగా మృగీభిః సహితా బహవః పృషతా వనే,
మనోజ్ఞరూపా లక్ష్యన్తే కుసుమైరివ చిత్రితాః. 19

ప్ర. అ. వనే = వనమునందు, పృషతాః = తెల్లని చుక్కలు గల, బహవః = అనేక మైన, మృగాః = మృగములు, కుసుమైః = పుష్పములచే, చిత్రితా ఇవ = చిత్రింపబడినవి వలె, మనోజ్ఞరూపాః = మనోహర మైన రూపములు కలవై, మృగీభిః = ఆడలేళ్లతో, సహితాః = కూడినవై, లక్ష్యన్తే = చూడబడుచున్నవి.

తా. ఈ ఆరణ్యములో శరీరముపై చుక్కలుగల లేళ్లు, ఆడలేళ్లతో కలసినవై పుష్పములచేత చిత్రింబడినవి వలె మనోహరమైన రూపములతో విహరించుచున్నవి. 19

మూ. సాధు సైన్యాః ప్రతిష్ఠన్తాం విచిన్వన్తు చ కాననే,
యథా తౌ పురుషవ్యాఘ్రౌ దృశ్యేతే రామలక్ష్మణౌ.

ప్ర. అ. పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, యథా = ఎట్లు, దృశ్యేతే = చూడబడుదురో అట్లు, సైన్యాః = సైన్యములు, సాధు = బాగుగ, ప్రతిష్ఠన్తామ్ = వెళ్లుగాక, కాననే = అడవియందు, విచిన్వన్తు చ = వెదకు గాక.

తా. సైనికు లందరు అరణ్యములో ప్రవేశించి పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు కనబడువరకు వెదకెదరుగాక. 20

మూ. భరతస్య వచః శ్రుత్వా పురుషాః శస్త్రపాణయః,
వివిశు స్తద్వనం శూరా ధూమం చ దదృశు స్తతః. 21

ప్ర. అ. భరతస్య=భరతునియొక్క, వచః=వాక్యమును, శ్రుత్వా=విని, శస్త్రపాణయః=శస్త్రములు హస్తమునందు గల, శూరాః=శూరు లైన, పురుషాః = పురుషులు, తత్ = ఆ, వనమ్ = వనమును, వివిశుః = ప్రవేశించిరి. తతః = ఆటు పిమ్మట, ధూమమ్ = ధూమమును, దదృశుశ్చ = చూచిరి కూడ:.

తా. భరతుని మాటలు విని, శూరులైన పురుషులు ఆయుధములు ధరించి ఆ అరణ్యములో ప్రవేశించిరి. అపుడు వారికి అక్కడ ధూమము కనబడెను. 21

మూ. తే సమాలోక్య ధూమాగ్రమూచుర్భరతమాగతాః,
నామనుష్యే భవత్యగ్ని ర్వ్యక్తమత్రైవ రాఘవౌ. 22

ప్ర. అ. తే = వారు, ధూమాగ్రమ్=ధూమముయొక్క అగ్రభాగమును, సమాలోక్య = చూచి, భరతమ్ = భరతునిగూర్చి, ఆగతాః = వచ్చినవారై, ఊచుః=పలికిరి. అమనుష్యే=మనుష్యులు లేని ప్రదేశమున, అగ్నిః=అగ్ని, న భవతి = ఉండదు. వ్యక్తమ్ = స్పష్టముగా, రాఘవౌ = రామలక్ష్మణులు, అత్రైవ = ఇక్కడనే ఉన్నారు.

తా. వారు ధూమాగ్రమును చూచి భరతునివద్దకు వచ్చి ఇట్లు పలికిరి. మనుష్యులు లేనిచోట అగ్ని ఉండదు. రామలక్ష్మణులు తప్పక ఇక్కడనే ఉండి ఉందురు. 22

మూ. అథ నాత్ర నరవ్యాఘ్రౌ రాజపుత్రౌ పరంతపౌ,
అన్యే రామోపమాః సన్తి వ్యక్తమత్ర తపస్వినః. 23

ప్ర. అ. అథ = అట్లుకాక, నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠులు, పరంతపౌ = శత్రువులను పీడించువారు అయిన, రాజపుత్రౌ = రాజపుత్రులు, అత్ర=ఇచట, న = లేకపోయినచో, అత్ర = ఇక్కడ, రామోపమాః = రామునితో సమానులైన, అన్యే=ఇతరులైన, తపస్వినః=మునులు, సంతి=ఉన్నారు. వ్యక్తమ్ = స్పష్టము.

తా. లేదా ఇక్కడ శత్రుసంహారకులు, నరశ్రేష్ఠులు అయిన ఆ రాజ

పుత్రులు లేకపోయినచో రామునితో సమాను లైన మునులు ఇతరులు ఎవరో ఉండవచ్చును; ఇది తత్త్వము. 23

మూ. తచ్ఛ్రుత్వా భరతస్తేషాం వచనం సాధుసమ్మతమ్,
సైన్యానువాచ సర్వాంస్తానమిత్రబలమర్దనః 24

ప్ర. అ. అమిత్రబలమర్దనః=శత్రువు సైన్యమును మర్దించు, భరతః = భరతుడు, తేషామ్ = వారియొక్క, సాధుసమ్మతమ్=సత్పురుషులకు ఇష్టమైన, తత్ వచనమ్=ఆ మాటను, శ్రుత్వా=విని, సర్వాన్ = సమస్త మైన, తాన్ సైన్యాన్=ఆ సైన్యములను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. శత్రుసైన్యములను సంహరించు ఆ భరతుడు పెద్దలకు సమ్మతమైన వారి మాటలు విని ఆ సైనికు లందరితో ఇట్లు పలికెను. 24

మూ. యత్తా భవన్తస్తిష్ఠన్తు నేతో గన్తవ్యమగ్రతః,
అహమేవ గమిష్యామి సుమన్త్రో గురురేవ చ. 25

ప్ర. అ. భవన్తః=మీరు, యత్తాః=సన్నద్ధులై, తిష్ఠన్తు=ఉందురుగాక. ఇతః=ఇక్కడినుండి, అగ్రతః = ముందుకు, న గన్తవ్యమ్ = వెళ్లదగినదికాదు. అహమేవ=నేనే, గమిష్యామి=వెళ్లగలను. సుమన్త్రః=సుమంత్రుడు, గురురేవ చ = గురు వైన వసిష్ఠుడుకూడ (వచ్చెదరు).

తా. మీ రందరును వినీతులై ఇక్కడనే ఉండుడు. ముందుకు వెళ్లవద్దు. నేను, సుమంత్రుడు, వసిష్ఠుడు, వెళ్ళెదము. 25

మూ. ఏవముక్తా స్తతస్సర్వే తత్ర తస్థుః సమన్తతః,
భరతో యత్ర ధూమాగ్రం తత్ర దృష్టిం సమాదధాత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఏవమ్=ఇట్లు, ఉక్తాః = పలుకబడిన, సర్వే=వారందరును, సమన్తతః=అన్ని వైపుల, తత్ర=అక్కడ, తస్థుః= ఉండిరి. భరతః=భరతుడు, ధూమాగ్రమ్=ధూమముయొక్క అగ్రభాగము, యత్ర=ఎక్కడ ఉన్నదో, తత్ర=అక్కడ, దృష్టిమ్=దృష్టిని, సమాదధాత్= నిలిపెను.

తా. వారందరును భరతుని ఆజ్ఞ ప్రకారము అక్కడనే ఉండిపోయిరి. భరతుడు ధూమాగ్రము కనబడుచోట తన దృష్టిని నిలిపెను. 26

మూ. వ్యవస్థితా యా భరతేన సా చమూ
ర్నిరీక్షమాణాపి చ భూమిమగ్రతః,
బభూవ హృష్టా న చిరేణ జానతీ
ప్రియస్య రామస్య సమాగమం తదా. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రినవతితమః సర్గః.

ప్ర.అ. యా=ఏ సేన, భరతేన=భరతునిచేత, వ్యవస్థితా=నిలుపబడినదో, చమూః=ఆ సేన, అగ్రతః=ఎదుట నున్న, భూమిమ్=ప్రదేశమును, నిరీక్షమాణాపి చ=చూచుచు, నచిరేణ=కొద్దికాలములో, తదా=అపుడు, ప్రియస్య=ప్రేమపాత్రుడైన, రామస్య=రామునియొక్క, సమాగమమ్=సమాగమమును, జానతీ=తెలుసుకొనుచున్నదై, హృష్టా=సంతోషించినది, బభూవ=ఆయెను.

తా. భరతుడు ఆ విధముగా నిలిపివేసిన సైన్యము, తన ఎదుట నున్న ప్రదేశమును చూచుచు, తన ప్రేమ పాత్రుడైన రాముని దర్శనము అచిరకాలములో జరుగనున్నదని తెలుసుకొని చాల సంతోషించెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో తొంబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్నవతితమః సర్గః

[శ్రీరాముడు సీతకు చిత్రకూటశోభను చూపుట]

మూ. దీర్ఘకాలోషిత స్తస్మిన్ గిరౌ గిరివనప్రియః
వైదేహ్యాః ప్రియమాకాఙ్క్షన్ స్వం చ చిత్తం విలోభయన్,
అథ దాశరథిశ్చిత్రం చిత్రకూటమదర్శయత్
భార్యామమరసంకాశః శచీమివ పురందరః. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, అమరసంకాశః=దేవతలతో సమానుడు, గిరివనప్రియః=గిరులు, వనములు, ఇష్టముగా కలవాడు. తస్మిన్=ఆ, గిరౌ=పర్వతమునందు, దీర్ఘకాలోషితః=చాలకాలము ఉన్నవాడైన, దాశరథిః=రాముడు, వైదేహ్యాః=సీతయొక్క, ప్రియమ్=ప్రియమును, ఆకాఙ్క్షన్=కోరుచు, స్వమ్=తన సంబంధమైన, చిత్తమ్=మనస్సును, విలోభయన్=ఆనందింపచేయుచు, చిత్రమ్=చిత్రమైన, చిత్రకూటమ్=చిత్రకూటపర్వతమును, భార్యామ్=భార్యను (కు), పురందరః=దేవేంద్రుడు, శచీమివ = శచీదేవిని (కి) వలె, అదర్శయత్ = చూపించెను.

తా. దేవతాసమానుడు గిరులందును, వనములందును ప్రీతికలవాడు అయిన ఆ రాముడు, ఆ పర్వతముపై చిరకాలమునుండి నివసించుచు, సీతకు ప్రియమును చేకూర్చుటకును; తన మనోవినోదమునకును, చిత్రమైన ఆ చిత్రకూటపర్వతమును దేవేంద్రుడు శచీదేవికి చూపించి నట్లు చూపించెను. 2

మూ. న రాజ్యాద్భ్రంశనం భద్రే న సుహృద్భిర్వినాభవః,
మనో మే బాధతే దృష్ట్వా రమణీయమిమం గిరిమ్. 3

ప్ర. అ. హే భద్రే = ఓ మంగళప్రదురాలా : ఇమమ్=ఈ, రమణీయమ్=సుందరమైన, గిరిమ్=పర్వతమును, దృష్ట్వా=చూచి, రాజ్యాత్=రాజ్యమునుండి, భ్రంశనమ్=భ్రష్టుడనగుట, మే మనః = నా మనస్సును, న బాధతే =

బాధించుట లేదు. సుహృద్భిర్వినాభవః = స్నేహితులతో కలిసి ఉండకపోవుట కూడ, న=బాధించుటలేదు.

తా. మంగళప్రదురాల వగు ఓ సీతా ః ఈ సుందర మైన పర్వతమును చూచుచుండుటచే, రాజ్యభ్రంశము గాని, స్నేహితులకు దూరమైపోవుట గాని, నా మనస్సును బాధించుటలేదు. 3

మూ. పశ్యేమమచలం భద్రే నానాద్విజగణాయుతమ్,
శిఖరైః ఖమివోద్విద్ధైర్ధాతుమద్భిర్విభూషితమ్. 4

ప్ర. అ. భద్రే = ఓ మంగళప్రదురాలా ః నానాద్విజగణాయుతమ్=అనేక విధము లైన పక్షులసముదాయములతో కూడినది, ఖమ్=ఆకాశమును, ఉద్విద్ధైరివ = పొడుచుచున్నవివలె నున్న, ధాతుమద్భిః=ధాతువులు గల, శిఖరైః=శిఖరములచేత, విభూషితమ్=అలంకరింపబడిన, ఇమమ్ అచలమ్= ఈ పర్వతమును, పశ్య = చూడుము.

తా. ఓ సీతా ః ఈ పర్వతము అనేకవిధము లైన పక్షులతో నిండి ఉన్నది. గైరికాదిధాతువులు కల దీని శిఖరములు ఆకాశమును పొడుచుచున్న ట్లున్నవి. చూడుము. 4

మూ. కేచిద్రజతసంకాశాః కేచిత్ క్షతజసన్నిభాః,
పీతమాఞ్జిష్ఠవర్ణాశ్చ కేచిన్మణివరప్రభాః. 5
పుష్యార్కకేతకాభాశ్చ కేచిజ్జ్యోతీరసప్రభాః,
విరాజన్తేఽచలేన్ద్రస్య దేశా ధాతువిభూషితాః. 6

ప్ర. అ. ధాతువిభూషితాః=ధాతువులచే అలంకరించబడిన, అచలేన్ద్రస్య =పర్వతముయొక్క, కేచిత్=కొన్ని, దేశాః = ప్రదేశములు, రజతసంకాశాః= వెండితో సమాన మైనవి. కేచిత్=కొన్ని, క్షతజసన్నిభాః=రక్తముతో సమాన మైనవి. (కొన్ని) పీతమాఞ్జిష్ఠవర్ణాశ్చ = పచ్చని మంజిష్ఠ వంటి వర్ణము కలవి. కేచిత్=కొన్ని, మణివరప్రభాః=శ్రేష్ఠ మైన ఇంద్రనీలమాణిక్యము వంటి కాంతి గలవి. (కొన్ని) పుష్యార్కకేతకాభాశ్చ = పుష్యరాగముయొక్క, స్ఫటికము యొక్క, మొగలిపూవుయొక్క, కాంతి వంటి కాంతి గలవి. కేచిత్=కొన్ని,

జ్యోతిరసప్రభాః = నక్షత్రముల యొక్క, పాదరసము యొక్క, కాంతి వంటి కాంతి కలవై, విరాజన్తే = ప్రకాశించుచున్నవి.

తా. వివిధము లైన ధాతువులతో నిండిన ఈ పర్వతప్రదేశములలో కొన్ని వెండివలెను, కొన్ని రక్తమువలెను, కొన్ని పచ్చని మంజిష్ఠవలెను, కొన్ని ఇంద్రనీలమాణిక్యముల వలెను, కొన్ని పుష్యరాగములవలెను, స్ఫటికములవలెను, మొగలి పూవులవలెను, కొన్ని నక్షత్రములవలెను, పాదరసమువలెను, ప్రకాశించుచున్నవి. 5, 6

మూ నానామృగగణద్వీపితరక్ష్వృక్షగణై ర్వృతః,
అదుష్టైర్భాత్యయం శైలో బహుపక్షిసమాయుతః. 7

ప్ర. అ. అయం శైలః = ఈ పర్వతము, అదుష్టైః = దుష్టములు కాని, నానామృగగణద్వీపితరక్ష్వృక్షగణైః = అనేకవిధము లైన మృగసముదాయములతోను, పెద్దపులులతోను, చిరుతపులులతోను, భల్లూకగణముతోను, వృతః = కూడినదై, బహుపక్షిసమాయుతః = అనేక మైన పక్షులతో కూడినదై, భాతి = ప్రకాశించుచున్నది.

తా. ఈ చిత్రకూటపర్వతముపై అనేకవిధము లైన మృగములు, పులులు, చిరుతపులులు, భల్లూకములు, క్రూరత్వమును విడచి నివసించుచున్నవి. ఎన్నియో పక్షుల సమూహములు కూడ దీనిపై ఉన్నవి. 7

మూ. ఆమ్రజమ్బ్వసనైర్లోధ్రైః ప్రియాళైః పనసైర్ధవైః,
అంకోలై ర్భవ్యతినిశైర్బిల్వతిన్దుకవేణుభిః. 8

కాశ్మర్యారిష్టవరణైర్మధూకై స్తిలకై స్తథా,
బదర్యామలకై ర్నీపై ర్వేత్రధన్వనబీజకైః. 9

పుష్పవద్భిః ఫలోపేతై శ్ఛాయావద్భిర్మనోరమైః,
ఏవమాదిభిరాకీర్ణః శ్రియం పుష్యత్యయం గిరిః. 10

ప్ర. అ. అయం గిరిః = ఈ పర్వతము, పుష్పవద్భిః = పుష్పములు కలవి, ఫలోపేతైః = ఫలములతో కూడినవి, ఛాయావద్భిః = నీడ కలవి, మనో

రమ్యైః = మనోహరములు అయిన, ఆమ్రజమ్బ్వసనైః = మామిడి, నేరేడు, వేగిస చెట్లచేతను, లోధ్రైః = లొద్దుగుచెట్లచేతను, ప్రియాళైః = మోరటిచెట్లచేతను, పనసైః = పనసచెట్లచేతను, ధవైః = చంద్రచెట్లచేతను, అంకోలైః = ఊడుగుచెట్లచేతను, భవ్యతినిశైః = మంచితినిశపుచెట్లచేతను, బిల్వతిన్దుకవేణుభిః = మారేడు, తుమ్మికి, వెదుళ్ళచేతను, కాశ్మర్యారిష్టవరుణైః = గుమ్మడుచెట్లచేతను, వేపచెట్లచేతను ఉలిమిరిచెట్లచేతను, తథా = అట్లే, మధూకైః = ఇప్పచెట్లచేతను, తిలకైః = బొట్టుగు చెట్లచేతను, బదర్యామలకైః = రేగు, ఉసిరిచెట్లచేతను, నీపైః = మంకెనచెట్ల చేతను, వేత్రధన్వనబీజకైః = పేములచెతను, ఏరుమద్దిచెట్లచేతను, దానిమ్మచెట్ల చేతను, ఏవమాదిభిః = ఈవిధములైన చెట్లచే, ఆకీర్ణః = వ్యాప్తమైనదై, శ్రియమ్ = శోభను, పుష్ణాతి = పెంచుచున్నది.

తా. ఈ పర్వతముపై పుష్పములతోను, ఫలములతోను నిండి అధికమైన నీడ నిచ్చు మామిడి, నేరేడు, వేగిస, లొద్దుగు, మోరటి, పనస, చంద్ర, ఊడుగు, తినిసము, మారేడు, తుమ్మికి చెట్లు, వెదుళ్లు, గుమ్మడు, వేప, ఉలిమిరి, ఇప్ప, బొట్టుగు, రేగి, ఉసిరి, పేము, ఏరుమద్ది, దానిమ్మచెట్లు, ఇంకను ఈ విధమైన అనేకమైన చెట్లు అంతట వ్యాపించి ఉన్నవి. వీటితో ఇది చాలా శోభాయుక్తముగా ఉన్నది. 10

మూ. శైలప్రస్థేషు రమ్యేషు పశ్యేమాన్ రోమహర్షణాన్,
కిన్నరాన్ ద్వన్ద్వశో భద్రే రమమాణాన్ మనస్వినః. 11

ప్ర. అ. భద్రే = ఓ మంగళప్రదురాలా, రమ్యేషు = అందమైన, శైలప్రస్థేషు = పర్వతముల చరియలయందు, ద్వన్ద్వశః = జంటజంటలుగా, రమమాణాన్ = విహరించుచున్న, రోమహర్షణాన్ = రోమాంచమును కలిగించు, మనస్వినః = ఉత్తమమైన మనస్సు గల, ఇమాన్ = ఈ, కిన్నరాన్ = కిన్నరులను, పశ్య = చూడుము.

తా. ఓ మంగళప్రదురాలా ! చూచువారికి రోమాంచము కలిగించువారు, ఉత్తమమైన మనస్సు కలవారు అయిన ఈ కిన్నరులు, పర్వతముల చరియలపై జంటజంటలుగా విహరించుచున్నారు. వీరిని చూడుము. 11

మూ. శాఖావసక్తాన్ ఖడ్గాంశ్చ ప్రవరాణ్యంబరాణి చ,
పశ్య విద్యాధరస్త్రీణాం క్రీడోద్దేశాన్ మనోరమాన్. 12

ప్ర. అ. విద్యాధరస్త్రీణామ్ = విద్యాధరులయొక్క, వారి స్త్రీలయొక్క, శాఖావసక్తాన్ = కొమ్మలకు తగల్చబడిన, ఖడ్గాంశ్చ = ఖడ్గములను, ప్రవరాణి = శ్రేష్ఠమైన, అంబరాణి చ = వస్త్రములను, మనోరమాన్ = మనోహర మైన, క్రీడోద్దేశాన్ = క్రీడాస్థానములను, పశ్య = చూడుము.

తా. విద్యాధరులు, వారి స్త్రీలు విహరించు మనోహర మైన ప్రదేశములను, వృక్షశాఖలకు తగిల్చిన వారి ఖడ్గములను, శ్రేష్ఠము లైన వారి వస్త్రములను చూడుము. 12

మూ. జలప్రవాహైరుద్భేదైర్నిష్యన్దైశ్చ క్వచిత్క్వచిత్,
ప్రసవద్భిర్భాత్యయం శైలః ప్రసవన్మద ఇవ ద్విపః. 13

ప్ర. అ. అయమ్ = ఈ, శైలః = పర్వతము, క్వచిత్ క్వచిత్ = కొన్నికొన్ని చోట్ల, ప్రసవద్భిః = ప్రసవించుచున్న, జలప్రవాహైః = జలప్రవాహములచేతను, ఉద్భేదైః = భూమిని భేదించి వచ్చుచున్న, నిష్యన్దైశ్చ = నీటి ఊటలచేతను, ప్రసవన్మదః = ప్రసవించుచున్న మదోదకముగల, ద్విపః ఇవ = ఏనుగు వలె, భాతి = ప్రకాశించుచున్నది.

తా. ఈ పర్వతముమీద కొన్ని చోట్ల జలము ప్రవహించుచున్నది. కొన్ని చోట్ల భూమిని భేదించుకొని జలము పైకి వచ్చుచున్నది. అందుచే ఈ పర్వతము మదోదకము ప్రసవించుచున్న ఏనుగు వలె ప్రకాశించుచున్నది 13

మూ. గుహాసమీరణో గన్ధాన్నానాపుష్పభవాన్ వహన్,
ఘ్రాణతర్పణమభ్యేత్య కం నరం న ప్రహర్షయేత్. 14

ప్ర. అ. నానాపుష్పభవాన్ = అనేకవిధము లైన పుష్పములనుండి పుట్టిన, గన్ధాన్ = సువాసనలను, వహన్ = మోయుచున్న, గుహాసమీరణః = గుహల లోని వాయువు, ఘ్రాణతర్పణమ్ = ఘ్రాణేంద్రియమునకు తృప్తి కల్గించునట్లుగా, అభ్యేత్య = వచ్చి, కం నరమ్ = ఏ నరుని, న ప్రహర్షయేత్ = సంతోషపెట్టదు.

తా. గుహలలోని వాయువు అనేకవిధము లైన పుష్పముల సువాసనలను మోసికొని ఘ్రాణేంద్రియమునకు (నాసికకు) తృప్తికలుగు నట్లు వీచుచున్నది. దీనివలన ఆనందము కలుగనివా రెవరైనా ఉందురా ! 14

మూ. యదీహ శరదోఽనేకా స్త్వయా సార్థమనిన్దితే,
లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి. 15

ప్ర. అ. అనిన్దితే=నిందింపబడని ఓ సీతా! త్వయా=నీతోను, లక్ష్మణేన చ సార్ధం=లక్ష్మణునితోను, ఇహ=ఇక్కడ, అనేకాః=అనేక మైన, శరదః=సంవత్సరములు, వత్స్యామి యది=నేను నివసించినట్లైతే, మామ్=నన్ను, శోకః=శోకము, న ప్రధక్ష్యతి=దహింపదు.

తా. ఎవ్వరును నిందించని ఓ సీతా! నీతోను, లక్ష్మణునితోను కలిసి, ఇక్కడ ఎన్ని సంవత్సరములు నివసించినను నన్ను శోకము పీడింపదు. 15

మూ. బహుపుష్పఫలే రమ్యే నానాద్విజగణాయుతే,
విచిత్రశిఖరే హ్యస్మిన్ రతవానస్మి భామిని. 16

ప్ర. అ. భామిని! = ఓ సీతా! బహుపుష్పఫలే = అనేకము లైన పుష్పములు ఫలములు కల, నానాద్విజగణాయుతే = అనేకవిధము లైన పక్షుల సముదాయములతో కూడిన, విచిత్రశిఖరే=విచిత్రము లైన శిఖరములు కల, రమ్యే=సుందర మైన, అస్మిన్ = ఈ పర్వతమునందు, రతవాన్ = ప్రీతికలవాడను, అస్మి హి=అయి ఉన్నాను కదా!

తా. అనేకము లైన పుష్పములు, ఫలములు, వివిధము లైన పక్షిగణములు కల, విచిత్రము లైన శిఖరములు గల రమ్య మైన ఈ పర్వతమునందు నాకు చాల ప్రీతి కలుగుచున్నది. 16

మూ. అనేన వనవాసేన మయా ప్రాప్తం ఫలద్వయమ్,
పితుశ్చానృణతా ధర్మే భరతస్య ప్రియం తథా. 17

ప్ర. అ. అనేన=ఈ, వనవాసేన = వనవాసముచేత, ధర్మే = ధర్మము విషయమున, పితుః = తండ్రికి, అనృణతా = ఋణము లేకపోవుట, తథా = మరియు, భరతస్య=భరతునకు, ప్రియమ్ = ప్రియము అను, ఫలద్వయమ్ = రెండు ఫలములు, మయా=నాచేత, ప్రాప్తమ్=పొందబడినవి.

తా. ఈ వనవాసము చేయుటచే, తండ్రి ఋణమును తీర్చుట, భరతునకు సంతోషము కల్గించుట అను రెండు ఫలములు నాకు లభించినవి. 17

మూ. వైదేహి రమసే కచ్చిచ్చిత్రకూటే మయా సహ,
పశ్యన్తీ వివిధాన్ భావాన్ మనోవాక్కాయసమ్మతాన్.

ప్ర. అ. హే వైదేహి = ఓ సీతా, మనోవాక్కాయసమ్మతాన్ = మనస్సునకు, వాక్కునకు, శరీరమునకు అనుకూల మైన, వివిధాన్ = అనేకవిధము లైన, భావాన్ = వస్తువులను, పశ్యన్తీ = చూచుచున్న దానవై, చిత్రకూటే = చిత్రకూట పర్వతమునందు, మయా సహ = నాతో కూడ, రమసే కచ్చిత్ = ఆనందించుచున్నావా!

తా. ఓ సీతా! నాతో కలిసి నివసించుచున్న నీవు మనోవాక్కాయములకు అనుకూల మైన వస్తువులను చూచుచు, ఈ చిత్రకూటపర్వతముమీద ఆనందముగా నుండగలుగుచున్నావా! 18

మూ. ఇదమేవామృతం ప్రాహూ రాజ్ఞి రాజర్షయః పరే,
వనవాసం భవార్థాయ ప్రేత్య మే ప్రపితామహాః. 19

ప్ర. అ. మే = నాయొక్క, ప్రపితామహాః = ప్రపితామహు లైన, పరే = ప్రాచీను లైన, రాజర్షయః = రాజర్షులు, ప్రేత్య = మరణించి, భవార్థాయ = ఉత్తమ మైన పునర్జన్మకొరకు, ఇదమ్ = ఈ, వనవాసమేవ = వనవాసమునే, రాజ్ఞి = రాజు విషయమున, అమృతమ్ = అమృతమువంటిదానినిగా, ప్రాహుః = చెప్పుచున్నారు. (చెప్పిరి).

తా. రాజునకు మరణానంతరము ఉత్తమజన్మ లభించుటకై, ఈ వనవాసమే అమృతము వంటి దని నా ముత్తాత లైన ప్రాచీనులగు రాజర్షులు చెప్పిరి.

మూ. శిలాః శైలస్య శోభన్తే విశాలాః శతశోఽభితః,
బహుళా బహుళైర్వర్ణైర్నీలపీతసితారుణైః. 20

ప్ర. అ. బహుళైః = అనేక మైన, నీలపీతసితారుణైః = నీలము, పసుపు, తెలుపు, ఎరుపు అను, వర్ణైః = రంగులతో, బహుళాః = అనేక మైన, విశాలాః = విశాల మైన, శైలస్య = పర్వతముయొక్క, శిలాః = శిలలు, శతశః = వందల కొలది, అభితః = చుట్టుప్రక్కల, శోభన్తే = ప్రకాశించుచున్నవి.

తా. అనేక మైన నీలము, పసుపు, తెలుపు, ఎరుపు రంగులతో, విశాల మైన వందలకొలది ఈ పర్వతమునకు చుట్టుప్రక్కల ప్రకాశించుచున్నవి. 20

మూ. నిశి భాన్త్యచలేన్ద్రస్య హుతాశనశిఖా ఇవ,
ఓషధ్యః స్వప్రభాలక్ష్మ్యా భ్రాజమానాః సహస్రశః. 21

ప్ర. అ. స్వప్రభాలక్ష్మ్యా=తమ కాంతియొక్క శోభతో, భ్రాజమానాః=ప్రకాశించుచున్న, సహస్రశః=వేలకొలది, అచలేన్ద్రస్య=ఈ చిత్రకూటము యొక్క, ఓషధ్యః=ఓషధులు, నిశి=రాత్రియందు, హుతాశనశిఖా ఇవ=అగ్ని శిఖల వలె, భాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. పర్వతశ్రేష్ఠ మైన ఈ చిత్రకూటముమీద, రాత్రులందు వేలకొలది ఓషధులు, తమ కాంతుల శోభతో ప్రకాశించుచు, అగ్నిశిఖల వలె కనబడు చున్నవి. 21

మూ. కేచిత్ క్షయనిభా దేశాః కేచిదుద్యానసన్నిభాః,
కేచిదేకశిలా భాన్తి పర్వతస్యాస్య భామిని. 22

ప్ర. అ. భామిని=ఓ సీతా! అస్య=ఈ, పర్వతస్య=పర్వతముయొక్క, కేచిత్=కొన్ని, దేశాః=ప్రదేశములు, క్షయనిభాః=గృహములతో సమాన మైనవిగాను, కేచిత్=కొన్ని, ఉద్యానసన్నిభాః=ఉద్యానములతో సమాన మైనవిగాను, కేచిత్=కొన్ని, ఏకశిలాః=ఒకే శిలారూపమునను, భాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. ఓ సీతా! ఈ పర్వతము మీద ఉన్న కొన్ని ప్రదేశములు గృహముల వలెను, కొన్ని ప్రదేశములు ఉద్యానవనముల వలెను, కొన్ని ప్రదేశములు ఏక శిలలవలెను, ప్రకాశించుచున్నవి. 22

మూ. భిత్త్వేవ వసుధాం భాతి చిత్రకూటసముత్థితః,
చిత్రకూటస్య కూటోఽసౌ దృశ్యతే సర్వతః శుభః. 23

ప్ర. అ. చిత్రకూటః=చిత్రకూటపర్వతము, వసుధామ్=భూమిని, భిత్త్వా=భేదించి, సముత్థితః ఇవ=లేచినదివలె, భాతి=ప్రకాశించుచున్నది. చిత్రకూటస్య=చిత్రకూటపర్వతముయొక్క, అసౌ=ఈ, కూటః=శిఖరము, సర్వతః=అంతట, శుభః=సుందరముగా, దృశ్యతే=కనబడుచున్నది.

తా. ఈ చిత్రకూటపర్వతము, భూమిని చీల్చుకొని, పైకి వచ్చినట్లు

కనబడుచున్నది. ఎదుట కనబడుచున్న దాని శిఖరము, అంతటను రమణీయముగా ఉన్నది. 23

మూ. కుష్ఠస్థగరపున్నాగ భూర్జపత్రోత్తరచ్ఛదాన్,
కామినాం స్వాస్తరాన్పశ్య కుశేశయదళాయుతాన్. 24

ప్ర. అ. కుష్ఠస్థగరపున్నాగభూర్జపత్రోత్తరచ్ఛదాన్ = కుష్ఠ- స్థగర- పున్నాగ, భూర్జవృక్షములపత్రములు పై ఆచ్ఛాదనముగా గలవి, కుశేశయదళాయుతాన్=పద్మముల దళములతో కూడినవి అయిన, కామినామ్ = కాముకుల యొక్క, స్వాస్తరాన్=ఉత్తమ మైన శయనములను, పశ్య=చూడుము.

తా. కాములు ఇచట, కుష్ఠ–స్థగర–పున్నాగ-భూర్జ వృక్షముల ఆకులను, పద్మముల రేకులను పైన పరచి, మంచి శయనములను ఏర్పరచుకొనియున్నారు. వాటిని చూడుము. 24

మూ. మృదితాశ్చాపవిద్ధాశ్చ దృశ్యన్తే కమలస్రజః,
కామిభిర్వనితే పశ్య ఫలాని వివిధాని చ. 25

ప్ర. అ. వనితే=ఓ సీతా ! కామిభిః = కాముకులచేత, మృదితాశ్చ = నలగగొట్టబడినవి, అపవిద్ధాశ్చ=పారవేయబడినవి అయిన, కమలస్రజః=పద్మముల మాలలు, వివిధాని=అనేకవిధము లైన, ఫలాని చ=ఫలములు, దృశ్యన్తే =కనబడుచున్నవి. పశ్య=చూడుము.

తా. ఓ సీతా ! అక్కడ కాముకులు నలిపివేసి పారవేసిన పద్మములతో గుచ్చిన మాలలు, అనేకవిధము లైన ఫలములు పడి ఉన్నవి; చూడుము. 25

మూ. వస్వౌకసారాం నళినీమత్యేతీవోత్తరాన్ కురూన్,
పర్వతశ్చిత్రకూటోఽసౌ బహుమూలఫలోదకః. 26

ప్ర. అ. బహుమూలఫలోదకః=అనేకము లైన మూలములు, ఫలములు, ఉదకము గల, అసౌ=ఈ, చిత్రకూటః పర్వతః=చిత్రకూటపర్వతము, వస్వౌకసారామ్ = అలకాపట్టణమును, నళినీమ్ = సౌగంధికసరస్సును, ఉత్తరాన్ కురూన్=ఉత్తరకురుదేశమును, అత్యేతీవ = అతిక్రమించి నట్లున్నది.

తా. అనేకవిధము లైన దుంపలు, ఫలములు, ఉదకము గల ఈ చిత్ర కూటపర్వతము అలకాపట్టణమును, సౌగంధికసరస్సును, ఉత్తరకురుదేశమును కూడ మించి ఉన్నది. 26

మూ. ఇమం తు కాలం వనితే విజహ్రివాన్
త్వయా చ సీతే సహ లక్ష్మణేన చ,
రతిం ప్రపత్స్యే కులధర్మవర్ధనీం
సతాం పథి స్వైర్నియమైః పరైః స్థితః. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుర్నవతితమః సర్గః.

ప్ర. అ. వనితే = వనిత వైన, సీతే = ఓ సీతా : ఇమం కాలమ్ = ఈ కాలమును, త్వయా సహ = నీతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, విజహ్రివాన్ = విహరించినవాడనై, స్వైః = నా సంబంధ మైన, పరైః = ఉత్తమమైన, నియమైః = నియమములతో, సతామ్ = సత్పురుషులయొక్క, పథి = మార్గమునందు, స్థితః = ఉన్నవాడనై, కులధర్మవర్ధనీమ్ = కులమును, ధర్మమును వృద్ధిపొందించు, రతిమ్ = ఆనందమును, ప్రపత్స్యే = పొందగలను.

తా. ఓ సీతా ! నేను నీతోను, లక్ష్మణునితోను కలసి, ఇక్కడ విహరించుచు, ఉత్తమ మైన నియమములతో, సత్పురుషుల మార్గమునందు సంచరించుచు, కులమును, ధర్మమును వృద్ధిపొందించు ఆనందమును పొందగలను. 27

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
తొంబదినాలుగవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చనవతితమః సర్గః

## [శ్రీరాముడు సీతకు గంగానది శోభను వర్ణించి చెప్పుట]

మూ. అథ శైలాద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః,
అదర్శయచ్ఛుభజలాం రమ్యాం మన్దాకినీం నదీమ్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కోసలేశ్వరః = కోసలదేశాధీశు డైన రాముడు, శైలాత్ = శైలమునుండి, వినిష్క్రమ్య = మరలి, శుభజలామ్ = మంగళకర మైన జలము గల, రమ్యామ్=సుందర మైన, మన్దాకినీం నదీమ్= మందాకినీనదిని, మైథిలీమ్ = సీతను,(కు) అదర్శయత్=చూపించెను.

తా. రాముడు సీతకు పర్వతశోభను చూపించిన పిదప మంగళకరమైన ఉదకముతో రమ్య మైన మందాకినీనదిని ఆమెకు చూ పెను. 1

మూ. అబ్రవీచ్చ వరారోహాం చారుచన్ద్రనిభాననామ్,
విదేహరాజస్య సుతాం రామో రాజీవలోచనః. 2

ప్ర. అ. రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు గల, రామః = రాముడు, వరారోహామ్= సుందర మైన కటిప్రదేశము కలది, చారుచన్ద్రనిభాననామ్=అంద మైన చంద్రసమాన మైన ముఖము కలది అయిన, విదేహరాజస్య = జనకునియొక్క, సుతామ్ = కుమారై యైన సీతను గూర్చి, అబ్రవీచ్చ = పలికెను.

తా. పద్మములవంటి నేత్రములు గల రాముడు, సుందర మైన కటిప్రదేశము, చంద్రునివంటి అంద మైన ముఖముకల వైదేహితో ఇట్లు పలికెను. 2

మూ. విచిత్రపులినాం రమ్యాం హంససారససేవితామ్,
కమలైరుపసంపన్నాం పశ్య మన్దాకినీం నదీమ్. 3

ప్ర. అ. విచిత్రపులినామ్=విచిత్ర మైన ఇసుకతిన్నెలు కలది, రమ్యామ్ =అంద మైనది, హంససారససేవితామ్ = హంసలచేతను సారసపక్షులచేతను సేవించబడినది, కమలైః = పద్మములతో, ఉపసంపన్నామ్ = కూడినది అయిన, మన్దాకినీం నదీమ్=మందాకినీనదిని, పశ్య=చూడుము.

తా. విచిత్ర మైన ఇసుకతిన్నెలతో, రమ్యమై, హంసలతోను, సారస పక్షులతోను, పద్మములతోను, నిండి యున్న ఈ మన్దాకినీనదిని చూడుము. 3

మూ. నానావిధై స్తీరరుహైర్వృతాం పుష్పఫలద్రుమైః,
రాజ న్తీం రాజరాజస్య నళినీమివ సర్వతః. 4

ప్ర. అ. సర్వతః=అన్నివైపుల, నానావిధైః = అనేకవిధము లైన, తీర రుహైః=తీరములపై మొలచిన, పుష్పఫలద్రుమైః = పుష్పవృక్షములతోను ఫల వృక్షములతోను, వృతామ్=కూడినది, రాజరాజస్య=కుబేరునియొక్క, నళినీమ్ ఇవ = సౌగంధికసరస్సు వలె. రాజ న్తీమ్ = ప్రకాశించుచున్న, (ఈ నదిని చూడుము).

తా. ఈ నది తీరములపై అంతటను అనేకవిధము లైన పుష్పవృక్ష ములు, ఫలవృక్షములు ఉండుటచే కుబేరుని సౌగంధికసరస్సు వలె ప్రకాశించు చున్నది. 4

మూ. మృగయూథనిపీతాని కలుషామ్భాంసి సామ్ప్రతమ్,
తీర్థాని రమణీయాని రతిం సఞ్జనయ న్తి మే. 5

ప్ర. అ. సామ్ప్రతమ్=ఇపుడు, మృగయూథనిపీతాని = మృగముల గుం పులచే త్రాగబడినవి, కలుషామ్భాంసి=కలగిన జలము కలవి, రమణీయాని = సుందరములు అయిన, తీర్థాని=తీర్థములు, మే=నాకు, రతిమ్=ఆనందమును, సఞ్జనయ న్తి=కల్గించుచున్నవి.

తా. దీని రేవులలో దిగి లేళ్ల గుంపులు ఇపుడే నీరు త్రాగుటచే నీరు కలగి పోయి ఉన్నది. ఇవి చూచుటకు చాలా ఆనందకరముగా ఉన్నవి. 5

మూ. జటాజినధరాః కాలే వల్కలోత్తరవాససః,
ఋషయ స్త్వవగాహ న్తే నదీం మన్దాకినీం ప్రియే. 6

ప్ర. అ. ప్రియే=ఓ ప్రియురాలా! జటాజినధరాః = జటలు కృష్ణాజినము ధరించినవారు, వల్కలోత్తరవాససః = నారచీరలు ఉత్తరీయముగా కలవారు అయిన, ఋషయః=ఋషులు, కాలే=నియతకాలమునందు, మన్దాకినీం నదీమ్= మన్దాకినీనదిని, అవగాహన్తే=ప్రవేశించుచున్నారు.

తా. ఓ ప్రియురాలా! జటలను, కృష్ణాజినమును ధరించి, నారచీరలను ఉత్తరీయముగా వేసికొన్న ఋషులు, సంధ్యాకాలాదులందు ఈ మన్దాకినీనదిలోనికి దిగి స్నానము చేయుచున్నారు. 6

మూ. ఆదిత్యముపతిష్ఠన్తే నియమాదూర్ధ్వబాహవః,
ఏతే పరే విశాలాక్షి మునయః సంశితవ్రతాః. 7

ప్ర. అ. విశాలాక్షి = విశాలమైన నేత్రములు కలదానా! సంశితవ్రతాః =తీవ్రమైన వ్రతములు గల, ఏతే = ఈ, పరే = మరికొందరు, మునయః = మునులు, నియమాత్=నియమమువలన, ఊర్ధ్వబాహవః=పైకి ఎత్తబడిన చేతులు కలవారై, ఆదిత్యమ్=సూర్యుని, ఉపతిష్ఠన్తే = మంత్రపఠనపూర్వకముగా ఉపాసించుచున్నారు.

తా. ఓ విశాలాక్షి! తీవ్రమైన వ్రతములు గల మరికొందరు మునులు చేతులు పైకెత్తి, నియమపూర్వకముగా సూర్యోపస్థానము చేయుచున్నారు. 7

మూ. మారుతోద్ధూతశిఖరైః ప్రనృత్త ఇవ పర్వతః,
పాదపైః పత్రపుష్పాణి సృజద్భిరభితో నదీమ్. 8

ప్ర. అ. మారుతోద్ధూతశిఖరైః = గాలిచే కదల్పబడిన అగ్రభాగములు గలవి, నదీమభితః=నదికి చుట్టు, పత్రపుష్పాణి=ఆకులను పూవులను, సృజద్భిః =విడచుచున్న, పాదపైః = వృక్షములతో, పర్వతః=పర్వతము, ప్రనృత్త ఇవ = నాట్యముచేయుచున్నట్లున్నది

తా. అగ్రభాగములను గాలి కదల్పగా నది చుట్టును పుష్పములను పత్రములను విడచుచున్న వృక్షములతో ఈ పర్వతము, నాట్యము చేయుచున్నట్లున్నది. 8

మూ. క్వచిన్మణినికాశోదాం క్వచిత్పులినశాలినీమ్,
క్వచిత్సిద్ధజనాకీర్ణాం పశ్య మన్దాకినీం నదీమ్. 9

ప్ర. అ. క్వచిత్=కొన్ని చోట్ల, మణినికాశోదామ్ = మణులతో సమానమైన ఉదకము కలది, క్వచిత్=కొన్నిచోట్ల, పులినశాలినీమ్=ఇసుకతిన్నెలతో ప్రకాశించుచున్నది, క్వచిత్ = కొన్నిచోట్ల, సిద్ధజనాకీర్ణామ్ = సిద్ధులతో నిండి ఉన్నదీ అయిన, మన్దాకినీం నదీమ్=మన్దాకినీనదిని, పశ్య=చూడుము.

తా. ఈ మందాకినీనదిలో కొన్ని చోట్ల మణుల వలె నిర్మలమైన ఉదకమున్నది. కొన్ని చోట్ల ఇసుక తిన్నెలు ఉన్నవి. కొన్ని చోట్ల సిద్ధులు అంతటను వ్యాపించి ఉన్నారు. చూడుము. 9

మూ. నిర్ధూతాన్వాయునా పశ్య వితతాన్ పుష్పసఞ్చయాన్,
పోప్లూయమానానపరాన్ పశ్య త్వం జలమధ్యగాన్. 10

ప్ర. అ. వాయునా = వాయువుచేత, నిర్ధూతాన్ = ఎగరగొట్టబడిన, వితతాన్=వ్యాప్తములైన, పుష్పసఞ్చయాన్ = పుష్పసముదాయములను, పశ్య = చూడుము. జలమధ్యగాన్ = జలమధ్యములోనున్న, పోప్లూయమానాన్ = తేలియాడుచున్న, అపరాన్=ఇతరములైన పుష్పసముదాయములను, త్వమ్=నీవు పశ్య=చూడుము.

తా. వాయువు ఎగురగొట్టుటచే, పుష్పసముదాయములు కొన్ని చోట్ల విస్తృతముగా పడుచున్నవి. మరి కొన్ని పుష్పసముదాయములు జలమధ్యమునందు పడి తేలియాడుచున్నవి. చూడుము. 10

మూ. తాంశ్చాతివల్గువచసో రథాఙ్గాహ్వయనా ద్విజాః,
అధిరోహన్తి కల్యాణి నికూజన్తః శుభా గిరః. 11

ప్ర. అ. కల్యాణి = ఓ మంగళస్వరూపురాలా : వల్గువచసః = మధురమైన వాక్కులు గల, రథాఙ్గాహ్వయనాః=చక్రము పేరు గల, ద్విజాః=పక్షులు, శుభాః=శుభకరమైన, గిరః=వాక్కులను, వికూజన్తః=కూయుచున్నవై, తాన్ =ఆ పుష్పరాశులను, అధిరోహన్తి=ఎక్కుచున్నవి.

తా. ఓ మంగళస్వరూపిణి యైన సీతా ! మధుర మైన ధ్వనులు గల చక్రవాకపక్షులు మంగళప్రదముగా కూయుచు, ఆ పుష్పరాశులపై ఎక్కుచున్నవి. 11

మూ. దర్శనం చిత్రకూటస్య మన్దాకిన్యాశ్చ శోభనే,
అధికం పురవాసాచ్చ మన్యే తవ చ దర్శనాత్. 12

ప్ర. అ. శోభనే=ఓ మంగళప్రదురాలా ! తవ=నీయొక్క, దర్శనాత్=దర్శనమువలన, చిత్రకూటస్య=చిత్రకూటముయొక్క, మన్దాకిన్యాశ్చ = మందాకినీనదియొక్క, దర్శనమ్ = దర్శనమును, పురవాసాచ్చ = పురమునందు నివసించుటకంటే, అధికమ్=అధిక మైన దానినిగా, మన్యే=తలంచుచున్నాను.

తా. ఓ మంగళప్రదురాలా ! నీవు కనబడుచు ఉండగా (ప్రక్కన ఉండగా) ఈ చిత్రకూటమును, మన్దాకినీనదిని చూచుట అయోధ్యాపురములో నివాసముకంటె కూడ ఆనందకర మని తలచుచున్నాను. 12

మూ. విధూతకలుషైః సిద్ధైస్తపోదమశమాన్వితైః,
నిత్యవిక్షోభితజలాం విగాహస్వ మయా సహ. 13

ప్ర. అ. విధూతకలుషైః=తొలగింపబడిన పాపములు గల, తపోదమశమాన్వితైః = తపస్సుతోను, ఇంద్రియనిగ్రహముతోను, శమముతోను కూడిన, సిద్ధైః = సిద్ధులచేత, నిత్యవిక్షోభితజలామ్=నిత్యము క్షోభింపచేయబడిన జలము గల, మందాకినీనదిని, మయా సహ=నాతో కూడ, విగాహస్వ=ప్రవేశించుము.

తా. తపస్సు, ఇంద్రియనిగ్రహము, శాంతి కలిగి, పాపములను తొలగించు సిద్ధులు ఎల్లపుడును ప్రవేశించి స్నానము చేయుటచే, క్షోభింపచేయబడిన జలము గల ఈ మన్దాకినీనదిలో, నాతో కూడ దిగి జలక్రీడ చేయుము. 13

మూ. సఖీవచ్చ విగాహస్వ సీతే మన్దాకినీం నదీమ్,
కమలాన్యవమజ్జన్తీ పుష్కరాణి చ భామిని. 14

ప్ర. అ. భామిని=సుందరి వైన, సీతే=సీతా, కమలాని=ఎఱ్ఱనిపద్మము

లను, పుష్కరాణి చ = తెల్లనిపద్మములను, అవమజ్జన్తీ = ముంచుచు, సఖీవత్ = సఖురాలు వలె, మన్దాకినీం నదీమ్ = మందాకినీనదిని, విగాహస్వ = ప్రవేశించుము.

తా. సౌందర్యవతి వైన ఓ సీతా! ఎఱ్ఱని పద్మములు, తెల్లని పద్మములు, నీటిలో మునిగిపోవు నట్లు చేయుచు, సఖురాలు వలె మన్దాకినీనదిలోనికి ప్రవేశించి, జలక్రీడలు చేయుము. 14

మూ. త్వం పౌరజనవద్వ్యాళానయోధ్యామివ పర్వతమ్,
మన్యస్వ వనితే నిత్యం సరయూవదిమాం నదీమ్. 15

ప్ర. అ. త్వమ్ = నీవు, వ్యాళాన్ = అడవిమృగములను, పౌరజనవత్ = పట్టణమునం దుండు జనులను వలె, పర్వతమ్ = పర్వతమును, అయోధ్యామివ = అయోధ్యనువలె, ఇమామ్ = ఈ, నదీమ్ = నదిని, సరయూవత్ = సరయూనదిని వలె, నిత్యమ్ = ఎల్లపుడు, మన్యస్వ = తలపుము.

తా. అడవిలోని మృగాలను పౌరులను గాను, ఈ చిత్రకూటపర్వతమును అయోధ్యనుగాను, ఈ మందకినీనదిని సరయూనదినిగాను భావింపుము. 15

మూ. లక్ష్మణశ్చాపి ధర్మాత్మా మన్నిదేశే వ్యవస్థితః,
త్వం చానుకూలా వైదేహి ప్రీతిం జనయథో మమ. 16

ప్ర. అ. వైదేహి = ఓ సీతా ! ధర్మాత్మా = ధర్మాత్ముడైన, లక్ష్మణశ్చాపి = లక్ష్మణుడు, మన్నిదేశే = నా ఆజ్ఞయందు, వ్యవస్థితః = ఉన్నాడు. త్వం చ = నీవు కూడ, అనుకూలా = అనుకూలురాలవు. మమ = నాకు, ప్రీతిమ్ = సంతోషమును, జనయథః = కల్గించుచున్నారు.

తా. ఓ వైదేహీ ! నా ఆజ్ఞను పాలించుచున్న ధర్మాత్ముడైన లక్ష్మణుడు, నాకు అనుకూలురాలవై ఉన్న నీవు నాకు సంతోషమును కల్గించుచున్నారు. 16

మూ. ఉపస్పృశంస్త్రిషవణం మధుమూలఫలాశనః,
నాయోధ్యాయై న రాజ్యాయ స్పృహయేఽద్య త్వయా సహ.

ప్ర. అ. త్రిషవణమ్ = మూడు స్నానకాలములయందు, ఉపస్పృశన్ = స్నానముచేయుచు, మధుమూలఫలాశనః = తేనె, దుంపలు, ఫలములు ఆహార

ముగా కలవాడనై, త్వయా సహ=నీతో కూడ కలిసిఉన్న నేను, అద్య=ఇపుడు, అయోధ్యాయై=అయోధ్యకొరకు, న స్పృహయే=కోరను. రాజ్యాయ = రాజ్యము కొరకు, న = కోరను.

తా. సీతో కలిసి నివసించుచు, త్రిషవణస్నానము చేయుచు, తేనె, దుంపలు, ఫలములు భుజించుచు, ఉన్న నాకు అయోధ్యమీదగాని, రాజ్యముమీద గాని ఆసక్తి లేదు. 17

మూ. ఇమాం హి రమ్యాం మృగయూథశాలినీం
నిపీతతోయాం గజసింహవానరైః,
సుపుష్పితాం పుష్పభరైరలఙ్కృతాం
న సోఽస్తి యః స్యాన్న గతక్లమః సుఖీ. 18

ప్ర. అ. రమ్యామ్=రమ్య మైనది, మృగయూథశాలినీమ్ = లేళ్ల గుంపులతో ప్రకాశించుచున్నదీ, గజసింహవానరైః = గజములచేత, సింహములచేత, వానరములచేత, నిపీతతోయామ్ = త్రాగబడిన ఉదకము కలది, సుపుష్పితామ్ = చక్కగా పుష్పించినది, పుష్పభరైః = పుష్పములసముదాయములచే, అలంకృతామ్ = అలంకరింపబడినది యైన, ఇమామ్ = ఈ మందాకినీ నదిని (చేరి), యః=ఎవడు, గతక్లమః=పోయినశ్రమకలవాడై, సుఖీ=సుఖవంతుడు, న స్యాత్ =కాడో, సః=అట్టివాడు, నాస్తి=లేడు.

తా. రమ్య మైన ఈ మందాకినీనది లేళ్ల గుంపులతో, ప్రకాశించుచున్నది. గజములు, సింహములు, వానరములు దీని ఉదకమును త్రాగుచున్నవి. చక్కగా పుష్పించిన వృక్షములనుండి రాలిన పుష్పరాశులచే అలంకృతమై ఉన్నది. అట్టి ఈ నదిని చేరుటచే శ్రమ తొలగి సంతోషించని వాడు ఉండడు. 18

మూ. ఇతీవ రామో బహుసంగతం వచః
ప్రియాసహాయః సరితం ప్రతి బ్రువన్,
చచార రమ్యం నయనాఞ్జనప్రభం
స చిత్రకూటం రఘువంశవర్ధనః. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచనవతితమః సర్గః.

ప్ర. అ. రఘువంశవర్ధనః = రఘువంశమును వృద్ధిపొందించువాడైన, సః రామః = ఆ రాముడు, ఇతీవ = ఇట్లు, సరితం ప్రతి = మందాకినీనదిని గూర్చి, బహు = అధికముగా, సంగతమ్ = యుక్తమైన, వచః = వాక్యమును, బ్రువన్ = పలుకుచు, ప్రియాసహాయః = ప్రియురాలు తోడుగా కలవాడై, నయనాంజన ప్రభమ్ = కంటి కాటుక వంటి కాంతి గల, రమ్యమ్ = సుందరమైన, చిత్రకూటమ్ = చిత్రకూటపర్వతమును, = చచార సంచరించెను.

తా. రఘువంశమును వృద్ధిపొందించు ఆ రాముడు, మందాకినీనదిని గూర్చి ఈ విధముగా చక్కగా వర్ణించి చెప్పుచు, ప్రియురాలితో గూడి, కాటుక కాంతి వంటి కాంతి గల ఆ చిత్రకూటపర్వతముపై విహరించెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో తొంబదిఐదవ సర్గ సమాప్తము.

## అథ షణ్ణవతితమః సర్గః

*[వన్యమృగములు పారిపోవుచుండుటకు కారణము తెలిసికొనుమని రాముడాజ్ఞాపించగా లక్ష్మణుడు సాలవృక్షము నెక్కి భరతుని సేనను చూచుట, భరతునిపై తీవ్రకోపము ప్రకటించుట.]*

మూ. తాం తథా దర్శయిత్వా తు మైథిలీం గిరినిమ్నగామ్,
నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛన్దయన్. 1

ప్ర. అ. మైథిలీమ్=మిథిలారాజకుమార్తె యైన, తాం సీతామ్=ఆ సీతను, తథా = అట్లు, గిరినిమ్నగామ్ = పర్వతనదిని, దర్శయిత్వా = చూపించి, మాంసేన = మాంసముచేత, ఛన్దయన్ = అనునయించుచు, గిరిప్రస్థే = పర్వతము చరియయందు, నిషసాద = కూర్చుండెను.

తా. రాముడు, ఆ విధముగా మైథిలికి, ఆ మందాకినీనదిని చూపి ఆమెను అనునయించి మాంసమును తినిపించుచు, పర్వతశిఖరముపై కూర్చుండెను. 1

మూ. ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్తమిదమగ్నినా,
ఏవమాస్తే స ధర్మాత్మా సీతయా సహ రాఘవః. 2

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః రాఘవః = ఆ రాముడు, ఇదమ్=ఇది, మేధ్యమ్=పరిశుద్ధమైనది. ఇదమ్ = ఇది, స్వాదు = రుచియైనది. ఇదమ్ = ఇది, అగ్నినా = అగ్నిచేత, నిష్టప్తమ్ = కాల్చబడినది. ఏవమ్ = ఈ విధముగాపలుకుచు, సీతయా సహ = సీతతో కూడ, ఆస్తే = ఉండెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఈ మాంసము పరిశుద్ధమైనది; ఇది రుచిగా ఉన్నది; ఇది బాగుగా కాలినది; అని పలుకుచు సీతతో కూడ అక్కడ ఉండెను.

మూ. తథా తత్రాసత స్తస్య భరతస్యోపయాయినః,
సైన్యరేణుశ్చ శబ్దశ్చ ప్రాదురాస్తాం నభస్పృశౌ. 3

ప్ర. అ. తథా=అట్లు, తస్య=ఆ రాముడు, తత్ర=అక్కడ, ఆసతః = =కూర్చునియుండగా, ఉపయాయినః = వచ్చుచున్న, భరతస్య = భరతుని యొక్క, సైన్యరేణుశ్చ = సైన్యపరాగము, శబ్దశ్చ = శబ్దము, నభస్పృశౌ = ఆకాశమును స్పృశించుచు, ప్రాదురాస్తామ్ = పుట్టినవి.

తా. రాముడా విధముగా కూర్చుండి ఉండగా అచటకు భరతుడు వచ్చుచుండుటచే సేనాపరాగము, సేనాధ్వని ఆకాశమును ముట్టుచు బయల్వెడలెను. 3

మూ. ఏతస్మిన్నన్తరే త్రస్తాః శబ్దేన మహతా తతః,
అర్దితా యూథపా మత్తాః సయూథా దుద్రువుర్దిశః. 4

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఇంతలో, మత్తాః=మదించిన, యూథపాః= గుంపుల నాయకులైన మృగములు, మహతా=గొప్పదైన, శబ్దేన = శబ్దముచేత, త్రస్తాః = భయపడినవై, అర్దితాః = పీడింపబడినవై, సయూథాః = గుంపులతో కూడినవై, తతః = అక్కడినుండి, దిశః = దిక్కులను గూర్చి, దుద్రువుః= పారిపోయినవి.

తా. ఇంతలో మదించిన యూథనాయకులైన గజాదులు. ఆ మహాధ్వనికి భయపడి, పీడింపబడినవై, తమ యూథములతో కలిసి అక్కడినుండి నలు దిక్కులకు పారిపోయినవి. 4

మూ. స తం సైన్యసముద్ధూతం శబ్దం శుశ్రావ రాఘవః,
తాంశ్చ విప్రద్రుతాన్ సర్వాన్ యూథపానన్వవైక్షత. 5

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, సైన్యసముద్ధూతమ్ = సైన్యము చేత పుట్టింపబడిన, తం శబ్దమ్ = ఆ ధ్వనిని, శుశ్రావ = వినెను. విప్రద్రుతాన్ = పారిపోవుచున్న, తాన్ = ఆ, సర్వాన్ = సమస్తమైన, యూథపాన్ చ = యూథముల నాయకులను గూడ, అన్వవైక్షత = చూచెను.

తా. రాముడు సైన్యమువలన కలిగిన ఆ శబ్దమును వినెను. పారిపోవుచున్న ఆ యూథనాయకులైన మృగముల నన్నింటిని కూడ చూచెను. 5

మూ. తాంశ్చ విద్రువతో దృష్ట్వా తం చ శ్రుత్వా చ నిస్వనమ్,
ఉవాచ రామః సౌమిత్రిం లక్ష్మణం దీప్తతేజసమ్. 6

ప్ర. అ. రామః = రాముడు, విద్రవతః = పారిపోవుచున్న, తాన్ = వారిని, దృష్ట్వా = చూచి, తమ్ = ఆ, నిస్వనం చ = ధ్వనిని కూడ, శ్రుత్వా = విని, దీప్త తేజసమ్ = ప్రకాశించుచున్న కాంతి గల, సౌమిత్రిమ్ = సుమిత్రాకుమారు డైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పారిపోవుచున్న ఆ మృగములను చూచి, ఆ ధ్వనిని కూడ విని, రాముడు మహాతేజశ్శాలీ, సుమిత్రాకుమారుడూ అయిన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 6

మూ. హన్త లక్ష్మణ పశ్యేహ సుమిత్రాసుప్రజా స్త్వయా,
భీమ స్తనితగమ్భీర స్తుములః శ్రూయతే స్వనః. 7

ప్ర. అ. హన్త := ఏమి ఆశ్చర్యము ! లక్ష్మణ = ఓ లక్ష్మణా ! సుమిత్రా = సుమిత్ర, త్వయా = నీచేత, సుప్రజాః = ఉత్తమ మైన సంతానముకలది. ఇహ = ఇక్కడ, భీమ స్తనితగమ్భీరః = భయంకరము, మేఘగర్జనము వలె గంభీరము అయిన, తుములః = వ్యాకుల మైన, స్వనః = ధ్వని, ఇహ = ఇక్కడ, శ్రూయతే = వినబడుచున్నది. పశ్య = చూడుము.

తా. సుమిత్రాసుపుత్రుడ వైన ఓ లక్ష్మణా ! భయంకరము, మేఘగర్జితము వలె గంభీరము అయిన ధ్వని ఇక్కడ వినబడుచున్నది. ఇది ఆశ్చర్యకరముగా ఉన్నది. అది ఏమో చూడుము. 7

మూ. గజయూథాని వారణ్యే మహిషా వా మహావనే,
విత్రాసితా మృగాః సింహైః సహసా ప్రద్రుతా దిశః. 8

ప్ర. అ. అరణ్యే = అరణ్యమునందలి, గజయూథాని = ఏనుగుల గుంపులు, మహావనే = మహావనమునందలి, మహిషాః వా = మహిషములు, మృగాః = మృగములు, విత్రాసితాః = భయపెట్టబడినవై, సింహైః = సింహములతోకూడ, సహసా = శీఘ్రముగా, దిశః = దిక్కులను, ప్రద్రుతాః = పారిపోవుచున్నవి. (లేదా సింహైః = సింహములచేత, విత్రాసితాః = భయపెట్టబడినవై అని చెప్పవచ్చును).

తా. అరణ్యములోని గజయూథములు, మహావనములో ఉన్న మహిషములు, లేళ్లు, సింహములు, భయపెట్టబడినవై నలుదిక్కులకు పారిపోవుచున్నవి.

మూ. రాజా వా రాజపుత్రో వా మృగయామటతే వనే,
అన్యద్వా శ్వాపదం కిఞ్చిత్సౌమిత్రే జ్ఞాతుమర్హసి. 9

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా ! రాజా వా = రాజు గాని, రాజపుత్రో వా = రాజపుత్రుడు గాని, వనే = వనమునందు, మృగయామ్ అటతే = వేటాడుచున్నాడా! వా = లేక, కిఞ్చిత్ = ఒకానొక, అన్యత్ = మరి యొక, శ్వాపదమ్ = క్రూరమృగమా? జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. ఓ లక్ష్మణా ! ఎవరైన రాజు గాని, రాజపుత్రుడు గాని వేటాడుటకై వచ్చినాడా? లేక ఏదైన ఒక క్రూరమృగము ఈ వనములోనికి ప్రవేశించినదా? తెలుసుకొనుము. 9

మూ. సుదుశ్చరో గిరిశ్చాయం పక్షిణామపి లక్ష్మణ,
సర్వమేతద్యథాతత్త్వమచిరాత్ జ్ఞాతుమర్హసి. 10

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా ! అయమ్ = ఈ, గిరిః = పర్వతము, పక్షిణామపి = పక్షులకు కూడ, సుదుశ్చరః = సంచరించుటకు చాల కష్టమైనది. ఏతత్ సర్వమ్ = వీని నంతను, యథాతత్త్వమ్ = యథార్థముగా (ఉన్నదున్నట్లుగా) అచిరాత్ = శీఘ్రముగా, జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, అర్హసి = తగివున్నావు.

తా. ఓ లక్ష్మణా ! ఈ పర్వతముపై పక్షులు కూడ సంచరించుట కష్టము. అందుచే ఈ శబ్దము ఎట్లు వచ్చినదో దాని తత్వమును వెంటనే తెలుసుకొనుము.

మూ. స లక్ష్మణః సంత్వరితః సాలమారుహ్య పుష్పితమ్,
ప్రేక్షమాణో దిశః సర్వాః పూర్వాం దిశముదైక్షత. 11

ప్ర. అ. సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, సంత్వరితః = తొందరపడుచు, పుష్పితమ్ = పుష్పించిన, సాలమ్ = సాలవృక్షమును, ఆరుహ్య = ఎక్కి, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రేక్షమాణః = చూచుచు, పూర్వాం దిశమ్ = తూర్పు దిక్కును, ఉదైక్షత = చూచెను.

తా. ఆ లక్ష్మణుడు శీఘ్రముగా పుష్పించిన ఒక సాలవృక్షమును ఎక్కి, నలుదిక్కులు పరికించుచు, తూర్పుదిక్కు వైపు చూచెను. 11

మూ. ఉదఙ్ముఖం ప్రేక్షమాణో దదర్శ మహతీం చమూమ్,
రథాశ్వగజసమ్బాధాం యత్తైర్యుక్తాం పదాతిభిః. 12

ప్ర. అ. ఉదఙ్ముఖః = ఉత్తరాభిముఖుడై, ప్రేక్షమాణః = చూచుచు, రథాశ్వగజసమ్బాధామ్ = రథములతోను, అశ్వములతోను, గజములతోను, కిక్కిరిసి ఉన్నది, యత్తైః = సన్నద్ధులైన, పదాతిభిః = కాలిబంట్లతో, యుక్తామ్ = కూడినదియైన, మహతీమ్ = గొప్ప, చమూమ్ = సేనను, దదర్శ = చూచెను.

తా. లక్ష్మణుడు ఉత్తరము వైపు చూచుచు, అటుప్రక్క రథములతోను, అశ్వములతోను, గజములతోను, కిక్కిరిసి ఉన్న సన్నద్ధులైన కాలిబంట్లతో నిండిన గొప్ప సేనను చూచెను. 12

మూ. తామశ్వగజసంపూర్ణాం రథధ్వజవిభూషితామ్,
శశంస సేనాం రామాయ వచనం చేదమబ్రవీత్. 13

ప్ర. అ. అశ్వగజసంపూర్ణామ్ = అశ్వములతోను, గజములతోను నిండినదై, రథధ్వజవిభూషితామ్ = రథముల ధ్వజములచేత అలంకరింపబడిన, తాం సేనామ్ = ఆ సేననుగూర్చి, రామాయ = రామునకు, శశంస = చెప్పెను. ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును, కూడ అబ్రవీత్ = పలికెను.

తా. అశ్వములతోను, గజములతోను నిండి రథములపై కట్టిన ధ్వజములతో ప్రకాశించుచున్న సేన వచ్చుచున్నదని రామునకు తెలిపి మరల ఇట్లనెను.

మూ. అగ్నిం సంశమయత్వార్యః సీతా చ భజతాం గుహామ్,
సజ్యం కురుష్వ చాపం చ శరాంశ్చ కవచం తథా. 14

ప్ర. అ. ఆర్యః = పూజ్యుడవైన నీవు, అగ్నిమ్ = నిత్యాగ్నిహోత్రమునకు సంబంధించిన అగ్నిని, సంశమయతు = ఆర్పివేసెదవు గాక ; సీతా చ = సీత కూడ, గుహామ్ = గుహను, భజతామ్ = పొందునుగాక. చాపమ్ = ధనస్సును, సజ్యమ్ = నారితో కూడినదానినిగా, కురుష్వ = చేయుము. తథా = అట్లే, శరాంశ్చ = బాణములను; కవచమ్ = కవచమును, (ధరింపుము).

తా. నీవు అగ్నిని చల్లార్చి, సీతను పర్వతగుహలోనికి పంపివేసి, ధనస్సునకు నారి కట్టుము. కవచము ధరించి బాణములను సిద్ధము చేయుము. 14

మూ. తం రామః పురుషవ్యాఘ్రో లక్ష్మణం ప్రత్యువాచ హ,
అజ్ఞావేక్షస్వ సౌమిత్రే కస్యేమాం మన్యసే చమూమ్. 15

ప్ర. అ. పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన, రామః = రాముడు, తం లక్ష్మణమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. అంగ= ఓ, సౌమిత్రే = లక్ష్మణా : అవేక్షస్వ = చూడుము; ఇమామ్ = ఈ, చమూమ్= సేనను, కస్య = ఎవరిదానినిగా, మన్యసే=తలచుచున్నావు.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు "ఓ : లక్ష్మణా : సరిగా చూడుము; ఈ సేన ఎవరిది అని అనుకొనుచున్నావు?" అని లక్ష్మణునితో పలికెను. 15

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణో వాక్యమబ్రవీత్,
దిధక్షన్నివ తాం సేనాం రుషితః పావకో యథా. 16

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవం = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, లక్ష్మణః = లక్ష్మణుడు, పావకో యథా = అగ్ని వలె, రుషితః = కోపగించిన వాడై, తాం సేనామ్ = ఆ సేనను, దిధక్షన్నివ = కాల్చివేయదలచుచున్న వాడి వలె, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మిక్కిలి కోపించి, ఆ సైన్యమును, అగ్ని కాల్చివేసి నట్లు కాల్చి వేయ దలచుచున్నాడా అన్నట్లున్న లక్ష్మణుడు రాముని మాటలు విని ఇట్లు పలికెను. 16

మూ. సంపన్నం రాజ్యమిచ్ఛంస్తు వ్యక్తం ప్రాప్యాభిషేచనమ్,
ఆవాం హన్తుం సమభ్యేతి కైకేయ్యా భరతస్సుతః. 17

ప్ర. అ. కైకేయ్యాః = కైకేయియొక్క, సుతః = కుమారుడైన, భరతః = భరతుడు, అభిషేచనమ్ = పట్టాభిషేకమును, ప్రాప్య=పొంది, రాజ్యమ్ = రాజ్యమును, సంపన్నమ్=సమృద్ధమైన దానినిగా, ఇచ్ఛన్ =కోరుచు, ఆవామ్ =మనలను ఇద్దరిని, హన్తుమ్=చంపుటకు, సమభ్యేతి=వచ్చుచున్నాడు. వ్యక్తమ్ స్పష్టము.

తా. కైకేయి కుమారుడైన భరతుడు రాజ్యాభిషిక్తుడై రాజ్యమును నిష్కంటకము చేయవలెనను కోరికతో మనలను ఇద్దరిని చంపుటకు వచ్చుచున్నాడు.

మూ. ఏష వై సుమహాఞ్ఛ్రీమాన్ విటపీ సమ్ప్రకాశతే,
విరాజత్యుద్గతస్కంధః కోవిదారధ్వజో రథే. 18

ప్ర. అ. ఏషః = ఈ, సుమహాన్ = చాల గొప్ప దైన, శ్రీమాన్ = కాంతి గల, ఉద్గతస్కంధః = పైకి కనబడు చున్న మ్రాను గల, విటపీ = వృక్షము, సమ్ప్రకాశతే = ప్రకాశించుచున్నది. రథే = రథముపై, కోవిదారధ్వజః = కోవిదార వృక్షము గల ధ్వజము, విరాజతి = ప్రకాశించుచున్నది.

తా. ఇదిగో ఆ రథముమీద చాలగొప్పదీ, కాంతిగలదీ, విశాల మైన మ్రాను గలదీ అయిన కోవిదారవృక్షము చిహ్నముగా గల ధ్వజము ప్రకాశించు చున్నది. 18

మూ. అసౌ హి సుమహాస్కంధో విటపీ చ మహాద్రుమః,
విరాజతి మహాసైన్యే కోవిదారధ్వజో రథే. 19

ప్ర. అ. సుమహాస్కంధః = చాల పెద్ద మ్రానుకలదీ, విటపీ చ = కొమ్మలు గలదీ అయిన, అసౌ = ఈ, మహాద్రుమః = మహావృక్షరూప మైన, కోవి దారధ్వజః = కోవిదారధ్వజము, రథే = రథముపై, మహాసైన్యే = మహాసైన్యములో, విరాజతి = ప్రకాశించుచున్నది.

తా. ఈ మహాసైన్యములో రథముపై నున్న ధ్వజమునందు చిత్రింపబడి, విశాలమైన మ్రాను, కొమ్మలు గల కోవిదారవృక్షము ప్రకాశించుచున్నది. 19

మూ. భజన్త్యేతే యథాకామమశ్వానారుహ్య శీఘ్రగాన్,
ఏతే భ్రాజన్తి సంహృష్టా గజానారుహ్య సాదినః. 20

ప్ర. అ. ఏతే = వీరు, యథాకామమ్ = యథేచ్ఛగా, శీఘ్రగాన్ = శీఘ్ర ముగా నడచుచున్న, అశ్వాన్ = గుఱ్ఱములను, ఆరుహ్య = ఎక్కి, భజన్తి = ఈ ధ్వజమును సేవించుచున్నారు. ఏతే = ఈ, సాదినః = గజారోహకులు, గజాన్ = గజములను, ఆరుహ్య = ఎక్కి, సంహృష్టాః = సంతోషించుచున్నవారై, భ్రాజన్తి = ప్రకాశించుచున్నారు.

తా. ఈ అశ్వికులు యథేచ్ఛగా శీఘ్రముగా నడచు అశ్వములను ఎక్కి

ఈ ధ్వజమును అనుసరించి వచ్చుచున్నారు. గజారోహకులైన యోధులు గజముల నెక్కి, సంతోషముతో ప్రకాశించుచున్నారు. 20

మూ. గృహీతధనుషౌ చావాం గిరిం వీర శ్రయావహై,
అథవేహైవ తిష్ఠావః సన్నద్ధావుద్యతాయుధౌ. 21

ప్ర. అ. వీర! = ఓ వీరుడా! అవామ్ = మన మిద్దరము, గృహీతధనుషౌ = గ్రహింపబడిన ధనుస్సులు కలవారమై, గిరిమ్=పర్వతమును, శ్రయావహై =ఆశ్రయించెదము. అథవా=లేక, సన్నద్ధౌ=కవచములను ధరించినవారలమై, ఉద్యతాయుధౌ=ధరింపబడిన ఆయుధములు కలవారమై, ఇహైవ = ఇచ్చటనే, తిష్ఠావః=ఉందము.

తా. ఓ మహావీరా మన మిద్దరము ధనుస్సులు ధరించి పర్వతముపై ఎక్కెదము; లేదా కవచములు కట్టుకొని ఆయుధములు ధరించి ఇక్కడనే ఉండెదము. 21

మూ. అపి నౌ వశమాగచ్ఛేత్ కోవిదారధ్వజో రణే,
అపి ద్రక్ష్యామి భరతం యత్కృతే వ్యసనం మహత్, 22
త్వయా రాఘవ సంప్రాప్తం సీతయా చ మయా తథా.

ప్ర. అ. రాఘవ ! = ఓ రామా ! రణే=యుద్ధమునందు, కోవిదారధ్వజః = కోవిదారధ్వజము, నౌ=మనయొక్క, వశమ్ = వశమును, అప్యాగచ్ఛేత్= పొందునా ! యత్కృతే=ఎవని నిమిత్తము, త్వయా=నీచేతను, సీతయా=సీత చేతను, తథా=అట్లే, మయా చ=నాచేతను, మహత్=గొప్ప, వ్యసనమ్=కష్టము, సంప్రాప్తమ్=పొందబడినదో, అట్టి, భరతమ్=భరతుని, అపి ద్రక్ష్యామి = చూడ గలనా !

తా. ఓ రామా ! ఈ కోవిదారధ్వజము యుద్ధములో మనకు స్వాధీన మగునా! నీకును సీతకును నాకును దుఃఖము కలుగుటకు మూలకారణ మైన భరతుని చూడగలుగుదునా ! 22

మూ. యన్నిమిత్తం భవాన్ రాజ్యాచ్చ్యుతో రాఘవ శాశ్వతాత్,
సంప్రాప్తోఽయమరిర్వీర భరతో వధ్య ఏవ మే.

ప్ర. అ. హే వీర! = ఓ వీరుడా ! రాఘవ = ఓ రామా! భవాన్ = నీవు, యన్నిమిత్తమ్=ఎవని నిమిత్తము, శాశ్వతాత్=స్థిర మైన, రాజ్యాత్=రాజ్యము నుండి, చ్యుతః = భ్రష్టుడ వైతివో, అయమ్ = అట్టి, సంప్రాప్తః = ఇక్కడికి వచ్చిన, అరిః = శత్రు వైన, భరతః = భరతుడు, మే = నాకు, వధ్య ఏవ = చంపదగినవాడే.

తా. ఎవని మూలమున నీవు స్థిర మైన రాజ్యమునుండి భ్రష్టుడ వైతివో, అట్టి శత్రు వైన భరతుడు వచ్చి యున్నాడు. అతడు నాకు వధ్యుడే. 23

మూ. భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ,
పూర్వాపకారిణం హత్వా న హ్యధర్మేణ యుజ్యతే. 24

ప్ర. అ. రాఘవ = ఓ రామా ! భరతస్య=భరతునియొక్క, వధే = వధయందు, అహమ్ = నేను, దోషమ్ = దోషమును, న పశ్యామి = చూచుటలేదు. పూర్వాపకారిణమ్ = పూర్వము అపకారము చేసినవానిని. హత్వా = చంపి, అధర్మేణ = అధర్మముచేత, న యుజ్యతే = కూడదు.

తా. ఓ రామా ! భరతుని చంపుటలో నాకు దోష మేమియు కనబడుట లేదు. పూర్వము అపకారము చేసినవానిని చంపినవానికి అధర్మ మేమియు కలగదు. 24

మూ. పూర్వాపకారీ భరత స్త్యక్తధర్మశ్చ రాఘవ,
ఏతస్మిన్నిహతే కృత్స్నామనుశాధి వసున్ధరామ్. 25

ప్ర. అ. రాఘవ = ఓ రామా ! భరతః = భరతుడు. పూర్వాపకారీ = పూర్వము అపకారము చేసినవాడు. త్యక్తధర్మశ్చ = విడువబడిన ధర్మము కలవాడు. ఏతస్మిన్ = ఇతడు, నిహతే = చంపబడినవాడగుచుండగ, కృత్స్నామ్= సమస్త మైన, వసున్ధరామ్ = భూమిని, అనుశాధి = పాలింపుము.

తా. రామా ! భరతుడు నీకు ముందుగా అపకారము చేసి యున్నాడు. ధర్మమును త్యజించినాడు. ఈతనిని వధించిన పిమ్మట భూమి నంతను పరిపాలించుము. 25

మూ. అద్య పుత్రం హతం సంఖ్యే కైకేయీ రాజ్యకాముకా,
మయా పశ్యేత్సుదుఃఖార్తా హస్తిభగ్నమివ ద్రుమమ్. 26

ప్ర. అ. రాజ్యకాముకా=రాజ్యమునందు కోరిక గల, కైకేయీ=కైకేయి, అద్య=నేడు, సంఖ్యే=యుద్ధమునందు, మయా=నాచేత, హతమ్=చంపబడిన, పుత్రమ్=పుత్రుని, హస్తిభగ్నమ్=ఏనుగుచే విరగగొట్టబడిన, ద్రుమమ్ ఇవ =వృక్షమును వలె, సుదుఃఖార్తా=అధిక మైన దుఃఖముచే పీడితురాలై, పశ్యేత్ =చూచుగాక.

తా. రాజ్యమునందు కోరిక గల కైకేయి ఈ నాడు నాచే యుద్ధమునందు చంపబడి, ఏనుగు విరుగగొట్టిన వృక్షము వలె పడి ఉన్న పుత్రుని చూచి దుఃఖించుగాక. 26

మూ. కైకేయీం చ వధిష్యామి సానుబన్ధాం సబాన్ధవామ్,
కలుషేణాద్య మహతా మేదినీ పరిముచ్యతామ్. 27

ప్ర. అ. సానుబన్ధామ్ =దగ్గర ఉండు పరివారముతో కూడిన, సబాన్ధవామ్=బంధువులతో కూడిన, కైకేయీం చ =కైకేయిని కూడ, వధిష్యామి= చంపెదను. అద్య=నేడు, మేదినీ=భూమి, మహతా=గొప్ప దైన, కలుషేణ =పాపముచేత, పరిముచ్యతామ్=విడువబడుగాక :

తా. బంధుపరివారాదులతో కూడిన కైకేయినికూడ చంపెదను. భూమిపై నున్న పాపము నేటితో తొలగిపోవుగాక : 27

మూ. అద్యేమం సంయతం క్రోధమసత్కారం చ మానద,
మోక్ష్యామి శత్రుసైన్యేషు కక్షేష్వివ హుతాశనమ్. 28

ప్ర. అ. మానద=గౌరవము నిచ్చువాడా : సంయతమ్=అణచిఉంచ బడిన, ఇమమ్=ఈ, క్రోధమ్=కోపమును, అసత్కారం చ=అవమానమును, హుతాశనమ్=అగ్నిని, కక్షేష్వివ=డొంకలయందు వలె, అద్య=నేడు, శత్రు సైన్యేషు=శత్రుసైన్యములయందు, మోక్ష్యామి=విడచెదను.

తా. మానమును కాపాడు ఓ రామా : మనకు జరిగిన అవమానమును,

అణచి ఉంచిన కోపమును, నేడు శత్రుసైన్యములపై, అగ్నిని డొంకలలో విడిచి నట్లు విడచెదను. 28

మూ. అద్యైతచ్చిత్రకూటస్య కాననం నిశితైః శరైః,
ఛిన్దన్ శత్రుశరీరాణి కరిష్యే శోణితోక్షితమ్. 29

ప్ర. అ. అద్య = నేడు, నిశితైః = వాడి యైన, శరైః = బాణములచేత, శత్రుశరీరాణి = శత్రువుల శరీరములను, ఛిన్దన్ = ఛేదించుచున్నవాడనై, చిత్రకూటస్య = చిత్రకూటపర్వతముయొక్క, ఏతత్ కాననమ్ = ఈ అడవిని, శోణితోక్షితమ్ = రక్తముచేత తడపబడినదానినిగా, కరిష్యే = చేయగలను.

తా. నేడు తీక్ష్ణ మైన బాణములచే, శత్రువుల శరీరములను ఛేదించి ఈ చిత్రకూటారణ్యమును రక్తముచే తడిపెదను. 29

మూ. శరైర్నిర్భిన్నహృదయాన్ కుఞ్జరాంస్తురగాంస్తథా,
శ్వాపదాః పరికర్షన్తు నరాంశ్చ నిహతాన్మయా. 30

ప్ర. అ. శరైః = బాణములచే, నిర్భిన్నహృదయాన్ = భేదింపబడిన హృదయములు గల, కుఞ్జరాన్ = ఏనుగులను, తథా = మరియు, తురగాన్ = గుఱ్ఱములను, మయా = నాచేత, నిహతాన్ = చంపబడిన, నరాంశ్చ = మనుష్యులను, శ్వాపదాః = క్రూరమృగములు, పరికర్షన్తు = ఈడ్చునుగాక.

తా. నా బాణములచే, హృదయము చీల్చబడి పడిఉన్న ఏనుగులను, గుఱ్ఱములను, నాచేత చంపబడిన మనుష్యులను క్రూరమృగములు ఈడ్చుకొని పోవుగాక. 30

మూ. శరాణాం ధనుషశ్చాహమనృణోఽస్మిన్మహావనే,
ససైన్యం భరతం హత్వా భవిష్యామి న సంశయః. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షణ్ణవతితమః సర్గః

ప్ర. అ. అస్మిన్ = ఈ, మహావనే = మహావనమునందు, అహమ్ = నేను, ససైన్యమ్ = సైన్యముతో కూడిన, భరతమ్ = భరతుని, హత్వా = చంపి, శరా

ణామ్ = బాణములకు, ధనుషశ్చ = ధనుస్సునకు, అనృణః = ఋణము లేని వాడను, భవిష్యామి = కాగలను. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఈ మహారణ్యములో, భరతుని, అతని సైన్యమును చంపి. నేను నా ధనుర్బాణముల ఋణమును తీర్చుకొనెదను, సంశయము లేదు. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
అరువదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తనవతితమః సర్గః

*[రాముడు లక్ష్మణుని శాంతపరచి భరతుని సద్భావమును వర్ణించుట. లక్ష్మణుడు లజ్జితుడై, రాముని చెంత నిలచుట. భరతుని సేన కొండ క్రింది భాగమున విడిది సేయుట.]*

మూ. సుసంరబ్ధం తు సౌమిత్రిం లక్ష్మణం క్రోధమూర్ఛితమ్,
రామస్తు పరిసాన్త్వ్యాథ వచనం చేదమబ్రవీత్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామస్తు = రాముడైతే, సుసంరబ్ధమ్ = ఎక్కువ తొందరపడుచున్నవాడు, క్రోధమూర్ఛితమ్=కోపముచే వ్యాపింపబడిన వాడు అయిన, సౌమిత్రిమ్ = సుమిత్రాకుమారుడైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని, పరిసాన్త్వ్య = ఊరడించి, ఇదమ్ = ఈ, వచనం చ = వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. అటు పిమ్మట రాముడు, ఈ విధముగా మిక్కిలి కోపించి తొందర పడుచున్న లక్ష్మణుని శాంతింపచేయుచు ఇట్లు పలికెను. 1

మూ. కిమత్ర ధనుషా కార్యమసినా వా సచర్మణా,
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయమాగతే. 2

ప్ర. అ. మహేష్వాసే = గొప్ప ధనుస్సు కలవాడు, మహాప్రాజ్ఞే = మహా బుద్ధిశాలి యైన, భరతే = భరతుడు, స్వయమ్ = స్వయముగా, అత్ర=ఇచటికి, ఆగతే = వచ్చినవాడగుచుండగా, ధనుషా = ధనుస్సుచేత గాని, సచర్మణా = చర్మముతో కూడిన, అసినా వా = కత్తిచేత గాని, కిం కార్యమ్ = ఏమి పని?

తా. మహాధనుర్ధరుడూ, మహాబుద్ధిశాలీ యైన భరతుడే స్వయముగా వచ్చు చున్నపుడు, మనకు ధనస్సుతోగాని, కత్తితో గాని, డాలుతో గాని, ఏమి పని ఉన్నది? 2

మూ. పితుస్సత్యం ప్రతిశ్రుత్య హత్వా భరతమాగతమ్,
కిం కరిష్యామి రాజ్యేన సాపవాదేన లక్ష్మణ. 3

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా ! పితుః = తండ్రియొక్క, సత్యమ్ = సత్యమును, ప్రతిశ్రుత్య = ప్రతిజ్ఞచేసి, ఆగతమ్=వచ్చిన, భరతుమ్=భరతుని, హత్వా = చంపి, సాపవాదేన = అపకీర్తితో కూడిన, రాజ్యేన = రాజ్యముతో, కిం కరిష్యామి = ఏమి చెసెదను?

తా. ఓ! లక్ష్మణా ! తండ్రి వాక్యము సత్యము చేసెద నని ప్రతిజ్ఞ చేసిన నేను చూడ వచ్చిన భరతుని చంపి, అపకీర్తితో కూడ సంపాదించిన ఈ రాజ్యముతో ఏమి చేసెదను? 3

మూ. యద్ద్రవ్యం బాన్ధవానాం వా మిత్రాణాం వా క్షయే భవత్,
నాహం తత్ప్రతిగృహ్ణీయాం భక్షాన్విషకృతానివ. 4

ప్ర. అ. యత్ ద్రవ్యమ్ = ఏ ధనము, బాన్ధవానాం వా = బంధువుల యొక్కగాని, మిత్రాణాం వా = మిత్రులయొక్క గాని, క్షయే=నాశనమునందు, భవేత్ = కలుగునో, తత్ = దానిని, అహమ్ = నేను, విషకృతాన్ = విషముతో చేయబడిన, భక్ష్యానివ=పిండివంటలను వలె, న ప్రతిగృహ్ణీయామ్=స్వీకరించను.

తా. బంధువులకు గాని, మిత్రులకు గాని, నాశము కలుగుటచే లభించిన ద్రవ్యమును విషముతో వండిన పిండివంటలను వలె నేను ముట్టుకొనను. 4

మూ. ధర్మమర్థం చ కామం చ పృథివీం చాపి లక్ష్మణ,
ఇచ్ఛామి భవతామర్థే ఏతత్ ప్రతిశృణోమి తే. 5

ప్ర. అ. లక్ష్మణః = ఓ లక్ష్మణా; ధర్మమ్ = ధర్మమును, అర్థం చ = అర్థమును, కామం చ = కామమును, పృథివీం చాపి = ఈ భూమిని కూడ, భవతామ్ అర్థే = మీకొఱకై, ఇచ్ఛామి = కోరుచున్నాను. ఏతత్ = దీనిని, తే=నీకు, ప్రతిశృణోమి = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. ఓ లక్ష్మణా ! ధర్మార్థకామములను, ఈ రాజ్యమును కూడ మీ నిమిత్తమే కోరుచున్నాను కాని, నా కొరకు గాదు. ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

మూ. భ్రాతౄణాం సంగ్రహార్థం చ సుఖార్థం చాపి లక్ష్మణ,
రాజ్యమప్యహమిచ్ఛామి సత్యేనాయుధమాలభే. 6

ప్ర. అ. లక్ష్మణ ! = ఓ లక్ష్మణా ! భ్రాతౄణామ్ = సోదరులయొక్క, సంగ్రహార్థమ్ = సంగ్రహముకొరకు, సుఖార్థం చాపి = సుఖము కొరకు, అహమ్ = నేను, రాజ్యమపి=రాజ్యమునైనను, ఇచ్ఛామి = కోరుచున్నాను. సత్యేన = సత్యముచేత, ఆయుధమ్ = ఆయుధమును, ఆలభే=స్పృశించుచున్నాను.

తా. ఓ లక్ష్మణా ! నేను రాజ్యము నైనను కోరుచున్నా నన్నచో అది సోదరులైన మిమ్ములను కూడగట్టుకొనుటకు, మీ సుఖముకొరకు మాత్రమే. ఆయుధములు స్పృశించి శపథము చేయుచున్నాను. 6

మూ. నేయం మమ మహీ సౌమ్య దుర్లభా సాగరామ్బరా,
న హీచ్ఛేయమధర్మేణ శక్రత్వమపి లక్ష్మణ. 7

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడవైన, లక్ష్మణ!=ఓ లక్ష్మణా! సాగరామ్బరా = సముద్రము వస్త్రముగా గల, ఇయమ్ = ఈ, మహీ=భూమి, మమ = నాకు, దుర్లభా=దుర్లభ మైనది, న = కాదు. అధర్మేణ = అధర్మముచేత, శక్రత్వమపి = ఇంద్రత్వమును కూడ, న ఇచ్ఛేయం హి = కోరను కదా!

తా. ఓ లక్ష్మణా ! నేను తలచుకొన్నచో సముద్రపర్యంత మైన ఈ భూమిపై ఆధిపత్యము నాకు లభించనిది కాదు. అధర్మముచే వచ్చిన ఇంద్రపదవి కూడ నాకు ఇష్టము కాదు. 7

మూ. యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద,
భవేన్మమ సుఖం కించిద్భస్మ తత్కురుతాం శిఖీ. 8

ప్ర. అ. మానద! = మానమును ఇచ్చువాడా! యత్ = ఏ సుఖము, భరతమ్=భరతుని, త్వాం చ = నిన్ను, శత్రుఘ్నం చాపి = శత్రుఘ్నుని, వినా =విడిచి, మమ = నాకు, భవేత్ = అగునో, తత్ = అట్టి, కించిత్ సుఖమ్ = కొంచెము సుఖము నైనను, శిఖీ=అగ్ని, భస్మ = భస్మమునుగా, కురుతామ్ = చేయుగాక !

తా. గౌరవమును సంరక్షించు ఓ లక్ష్మణా ! భరతుడు, నీవు, శత్రు

ఘ్నుడు, అనుభవించని ఏ మాత్రము సుఖము నాకు కలిగినను దానిని అగ్ని భస్మముచేయుగాక ! 8

మూ. మన్యేఽహమాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః,
మమ ప్రాణాత్ప్రియతరః కులధర్మమనుస్మరన్. 9

శ్రుత్వా ప్రవ్రాజితం మాం హి జటావల్కలధారిణమ్,
జానక్యా సహితం వీర త్వయా చ పురుషర్షభ. 10

స్నేహేనాక్రాన్తహృదయః శోకేనాకులితేన్ద్రియః,
ద్రష్టుమభ్యాగతో హ్యేష భరతో నాన్యథాఽఽగతః. 11

ప్ర. అ. వీర=ఓ వీరుడా! పురుషర్షభ=పురుషశ్రేష్ఠుడా! భ్రాతృవత్సలః =సోదరులందు ప్రేమ గలవాడూ, మమ=నాకు, ప్రాణాత్=ప్రాణముకంటె, ప్రియతరః=ఎక్కువ ఇష్టమైనవాడూ అయిన, భరతః = భరతుడు, అయోధ్యామ్ = అయోధ్యనుగూర్చి, ఆగతః = వచ్చినవాడై, మామ్=నన్ను, జానక్యా = జానకితోను, త్వయా చ = నీతోను, సహితమ్=కూడినవాడనై, జటావల్కలధారిణమ్=జటావల్కలములను ధరించిన వాడనై, ప్రవ్రాజితమ్=అరణ్యమునకు పంపబడినవానినిగా, శ్రుత్వా=విని, కులధర్మమ్=కులధర్మమును, అనుస్మరన్ =స్మరించుచు, స్నేహేన=స్నేహముచేత, ఆక్రాన్తహృదయః=ఆక్రమింపబడిన హృదయము గలవాడై, శోకేన=శోకముచేత, అకులితేన్ద్రియః=వ్యాకులము చేయబడిన ఇంద్రియములు కలవాడై, ద్రష్టుమ్ = చూచుటకు, అభ్యాగతః = వచ్చినా డని, అహమ్=నేను, మన్యే=తలచుచున్నాను. ఏషః=ఈ, భరతః = భరతుడు, అన్యథా=మరియొక విధముగా, న ఆగతః=రాలేదు.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ వీరుడా ! సోదరులయందు ప్రేమగలవాడూ, నాకు ప్రాణములకంటే ప్రియుడూ అయిన భరతుడు, అయోధ్యకు తిరిగి వచ్చి, నేను జటావల్కలధారినై, సీతోను, జానకితోను, అరణ్యమునకు పంపివేయబడి నట్లు విని, జ్యేష్ఠపుత్రుడే రాజు కావలెను అను కులధర్మమును స్మరించుచు, స్నేహముతో నిండిన హృదయము కలవాడై, శోకముచే ఇంద్రియములు వ్యాకులములు కాగా, మనలను చూచుటకే ఇచటకు వచ్చినాడు కాని, మరి యొక కారణముచేత కాదు అని నేను తలచుచున్నాను. 9-11

మూ. అమ్బాం చ కైకయీం రుష్య పరుషం చాప్రియం వదన్,
ప్రసాద్య పితరం శ్రీమాన్ రాజ్యం మే దాతుమాగతః, 12

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన భరతుడు, అమ్బామ్ = తల్లి యైన, కైకయీమ్ = కైకేయిని గూర్చి, రుష్య=కోపగించి, పరుషమ్=పరుషముగాను, అప్రియం చ = అప్రియముగాను, వదన్ = పలుకుచు, పితరమ్ = తండ్రిని, ప్రసాద్య = అనుగ్రహింపచేసుకొని, మే=నాకు, రాజ్యమ్=రాజ్యమును, దాతుమ్ = ఇచ్చుటకు, ఆగతః = వచ్చినాడు.

తా. శ్రీమంతు డైన భరతుడు తల్లిఅయిన కైకేయిపై కోపించి, ఆమెను పరుషము లైన అప్రియవాక్యములతో దూషించి, తండ్రిగారిని అనుగ్రహింపచేసుకొని, నాకు రాజ్యమును ఇచ్చుటకై వచ్చినాడు. 12

మూ. ప్రాప్తకాలం యదేషోఽస్మాన్ భరతో ద్రష్టుమిచ్ఛతి,
అస్మాసు మనసాప్యేష నాప్రియం కిఞ్చిదాచరేత్. 13

ప్ర. అ. ఏషః భరతః = ఈ భరతుడు, అస్మాన్ = మనలను, యత్ ద్రష్టుమ్ ఇచ్ఛతి=చూచుటకు కోరుచున్నాడన్నది ఏది కలదో అది, ప్రాప్తకాలమ్ = పొందబడినకాలము కలది. ఏషః = ఇతడు, అస్మాసు = మన విషయమున, మనసా అపి = మనస్సుచేత కూడ, కించిత్ = కొంచె మైనను, అప్రియమ్ = అప్రియమును, నాచరేత్ = ఆచరింపడు.

తా. భరతుడు మనలను చూచుటకై వచ్చుటకు ఇది తగిన సమయమే. ఇతడు మన విషయమున ఏమాత్రము అప్రియము చేయుటకు, మనస్సులో కూడ ఆలోచింపజాలడు. 13

మూ. విప్రియం కృతపూర్వం తే భరతేన కదా ను కిమ్,
ఈదృశం వా భయం తేఽద్య భరతం యోఽత్ర శఙ్కసే.

ప్ర. అ. అత్ర = ఇక్కడ, యః = ఏ నీవు, అద్య=ఇపుడు, భరతమ్= భరతుని గూర్చి, శఙ్కసే = శంకించుచున్నావో, తే = అట్టి నీకు, భరతేన = భరతునిచేత, కదా = ఎపుడు, కిమ్ = ఏమి, విప్రియమ్ = అపకారముగాని, ఈదృశమ్ = ఇట్టి, భయం వా = భయకారణము కాని, కృతపూర్వమ్ = చేయ

బడినది? (విప్రియం = అపకారము, కృతపూర్వమ్ = పూర్వము చేయబడినది? అద్య = ఇపుడు, తే=నీకు, ఈదృశమ్=ఇట్టి, భయం వా = భయ మైనను, కిమ్ = ఏమి, అని కూడ అర్థము చెప్పవచ్చును.)

తా. నీకు పూర్వ మెన్నడైన భరతుడు ఏదైన అపకారము చేసి యున్నాడా? లేదా ఇట్టి భయమును కలిగించినాడా ! నీవు భరతుని గూర్చి ఇపుడు ఇట్లు శంకించుటకు ఏమి కారణము? 14

మూ. న హి తే నిష్ఠురం వాచ్యో భరతో నాప్రియం వచః,
అహం హ్యప్రియముక్తః స్యాం భరతస్యాప్రియే కృతే.

ప్ర. అ. భరతః = భరతుడు, తే = నీకు, నిష్ఠురమ్ = పరుష మైన మాటను, న వాచ్యః = పలుక తగినవాడు కాదు. అప్రియమ్ = అప్రియ మైన, వచః = మాటను, న=పలుక దగినవాడు కాదు. భరతస్య=భరతునకు,అప్రియే = అప్రియము, కృతే = చేయబడినపుడు, అహమ్ = నేనే, అప్రియమ్=అప్రియ వాక్యమును, ఉక్తః = చెప్పబడినవాడను, స్యాం హి = అగుదును కదా!

తా. నీవు భరతుని విషయమున పరుషములు, అప్రియములు అయిన మాటలు చెప్పరాదు. భరతుని గూర్చి అప్రియవాక్యములు పలికినచో ఆ వాక్యములు నన్ను గూర్చియే పలికిన ట్లగును. భరతుని దూషించినచో నన్నే దూషించిన ట్లగును. 15

మూ. కథం ను పుత్రాః పితరం హన్యుః కస్యాం చిదాపది,
భ్రాతా వా భ్రాతరం హన్యాత్ సౌమిత్రే ప్రాణమాత్మనః.

ప్ర. అ. సౌమిత్రే=ఓ లక్ష్మణా! కస్యాం చిత్ ఆపది = ఎట్టి ఆపదయం దైనను, పుత్రాః = పుత్రులు, పితరమ్ = తండ్రిని, కథం ను = ఎట్లు, హన్యుః = చంపుదురు? భ్రాతా వా = సోదరుడు, ఆత్మనః = తనకు, ప్రాణమ్ = ప్రాణ మైన, భ్రాతరమ్ = సోదరుని, హన్యాత్ = చంపును.

తా. లక్ష్మణా ! ఎంతటి ఆపదయం దైనను పుత్రులు తండ్రిని చంపుదురా ! సోదరుడు తన ప్రాణసమానుడైన సోదరుని చంపునా! 16

మూ. యది రాజ్యస్య హేతో స్త్వమిమాం వాచం ప్రభాషసే,
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్యమస్మై ప్రదీయతామ్. 17

ప్ర. అ. రాజ్యస్య హేతోః = రాజ్యము నిమిత్తమై, త్వమ్ = నీవు, ఇమాం వాచమ్ = ఈ వాక్యమును, ప్రభాషసే యది = పలుకుచున్నట్లైతే, భరతమ్ = భరతుని, దృష్ట్వా = చూచి, అస్మై = ఇతనికి, రాజ్యమ్=రాజ్యము, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక అని, వక్ష్యామి=చెప్పెదను.

తా. నీవు రాజ్యముకొఱకై ఇట్లు మాటలాడుచున్నావేమో ! అట్లైనచో "రాజ్యమును లక్ష్మణునకు ఇమ్ము" అని భరతునితో చెప్పెదను. 17

మూ. ఉచ్యమానోఽపి భరతో మయా లక్ష్మణ తత్త్వతః,
రాజ్యమస్మై ప్రయచ్ఛేతి బాఢమిత్యేవ వక్ష్యతి. 18

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా ! భరతోఽపి = భరతుడుకూడ, అస్మై = ఇతనికి, రాజ్యమ్ = రాజ్యమును, ప్రయచ్ఛ = ఇమ్ము, ఇతి = అని, ఉచ్యమానః = చెప్పబడుచున్నవాడై, తత్త్వతః = యథార్థముగా, బాఢమ్ ఇత్యేవ = మంచిది అనియే, వక్ష్యతి = చెప్పగలడు.

తా. ఓ లక్ష్మణా ! "రాజ్యమును ఇతనికి ఇమ్ము" అని నేను చెప్పగానే భరతుడు కూడ "తప్పక అట్లే చేసెదను" అని పలకగలడు. 18

మూ. తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః,
లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా. 19

ప్ర. అ. ధర్మశీలేన = ధర్మస్వభావుడైన, భ్రాత్రా = సోదరునిచే, తథా = అట్లు, ఉక్తః = పలుకబడిన, తస్య = ఆ సోదరునియొక్క, హితే=హితమునందు, రతః = ఆసక్తుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, లజ్జయా=సిగ్గుచేత, స్వాని = తన సంబంధమైన, గాత్రాణి = అవయవములను, ప్రవివేశేవ = ప్రవేశించినట్లయ్యెను.

తా. సోదరుడైన రాముని హితమునందే ఆసక్తి గల ఆ లక్ష్మణుడు, ధర్మశీలుడైన రాముని మాటలు విని సిగ్గుతో తన శరీరములో క్రుంగిపోయినట్లయ్యెను. 19

మూ. తద్వాక్యం లక్ష్మణః శ్రుత్వా వ్రీళితః ప్రత్యువాచ హ,
త్వాం మన్యే ద్రష్టుమాయాతః పితా దశరథః స్వయమ్.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, తద్వాక్యమ్ = అతని మాటను, శ్రుత్వా = విని, వ్రీళితః = సిగ్గుపడినవాడై, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. పితా = తండ్రి యైన, దశరథః = దశరథుడు, త్వా = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, స్వయమ్ = స్వయముగ, ఆయాతః = వచ్చినాడు అని, మన్యే = తలచెదను.

తా. రాముని మాటలు విన్న లక్ష్మణుడు సిగ్గుపడి ఇట్లనెను. "మన తండ్రిగారైన దశరథమహారాజు నిన్ను చూచుటకై స్వయముగా వచ్చుచున్నారని తలచెదను". 20

మూ. వ్రీడితం లక్ష్మణం దృష్ట్వా రాఘవః ప్రత్యువాచ హ,
ఏష మన్యే మహాబాహురిహాస్మాన్ ద్రష్టుమాగతః. 21

ప్ర. అ. వ్రీడితమ్ = సిగ్గుపడిన, లక్ష్మణమ్ = లక్ష్మణుని, దృష్ట్వా = చూచి, రాఘవః = రాముడు, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. మహాబాహుః = గొప్ప బాహువులు గల, ఏషః = ఈ దశరథమహారాజు, అస్మాన్ = మనలను, ద్రష్టుమ్ = చూచుటకొరకు, ఇహ = ఇచటికి, ఆగతః = వచ్చినాడు అని, మన్యే = తలచెదను.

తా. లక్ష్మణుడు సిగ్గుపడినట్లు తెలుసుకొని, రాముడిట్లు పలికెను. "మహాబాహువైన దశరథమహారాజు మనలను అందరిని చూచుటకు ఇక్కడికి వచ్చినాడని తలచెదను". 21

మూ. అథవా నౌ ధ్రువం మన్యే మన్యమానః సుఖోచితౌ,
వనవాసమనుధ్యాయ గృహాయ ప్రతినేష్యతి. 22

ప్ర. అ. అథవా = అట్లు కానిచో, నౌ = మనలను ఇద్దరిని, సుఖోచితౌ = సుఖమునకు అలవాటుపడినవారినిగా, మన్యమానః = తలచుచున్నవాడై, వనవాసమ్ = వనవాసమును, అనుధ్యాయ = తలచి, గృహాయ = గృహమునకు, ప్రతినేష్యతి = తిరిగి తీసుకొని వెళ్లగలడు. ధ్రువమ్ = నిశ్చయము అని, మన్యే = తలచుచున్నాను.

తా. లేదా- వనవాసములోని కష్టములను గ్రహించి, మన మిద్దరము సుఖమునకు అలవాటుపడిన వారము అను విషయమును కూడ తెలిసికొని, తప్పక మనలను మరల ఇంటికి తీసుకొనిపోగలడు అని తలచెదను. 22

మూ. ఇమాం వాప్యేష వైదేహీమత్యన్తసుఖసేవినీమ్,
పితా మే రాఘవః శ్రీమాన్ వనాదాదాయ యాస్యతి. 23

ప్ర. అ. మే పితా=నా తండ్రి యైన, శ్రీమాన్ = శ్రీమంతు డైన, ఏషః రాఘవః=ఈ దశరథమహారాజు, అత్యన్త సుఖసేవినీమ్ = మిక్కిలి సుఖమును సేవించు, ఇమామ్ = ఈ, వైదేహీం వా=సీత నైనను, వనాత్ = వనమునుండి, ఆదాయ=తీసికొని, యాస్యతి=వెళ్లగలడు.

తా. శ్రీమంతు డైన మన తండ్రి దశరథమహారాజు, మిక్కిలి సుఖమునకు అలవాటుపడిన ఈ సీత నైనను వనము నుండి తీసుకొనివెళ్లును. 23

మూ. ఏతౌ తౌ సంప్రకాశేతే గోత్రవన్తౌ మనోరమౌ,
వాయువేగసమౌ వీర జవనౌ తురగోత్తమౌ. 24

ప్ర. అ. వీర=ఓ వీరుడా ! గోత్రవన్తౌ = ఉత్తమవంశము కలవి. (లేదా మన వంశము పేరు వ్రాసి ఉన్నవి) మనోరమౌ = సుందర మైనవి, వాయువేగసమౌ=వాయువేగముతో సమానమైనవి, జవనౌ=వేగముకలవి అయిన, తౌ =ఆ, ఏతౌ=ఈ, తురగోత్తమౌ = రెండు ఉత్తమాశ్వములు, సంప్రకాశేతే = ప్రకాశించుచున్నవి.

తా. ఓ! వీరుడా ! ఇవిగో ఉత్తమజాతియందు పుట్టినవీ, అందమైనవీ, వాయువేగముతో సమాన మైన వేగము కలవీ అయిన, ఆప్రసిద్ధ మైన ఉత్తమాశ్వములు రెండూ సైన్యముముందు ప్రకాశించుచున్నవి. 24

మూ. స ఏష తు మహాకాయః కమ్పతే వాహినీముఖే,
నాగః శత్రుఞ్జయో నామ వృద్ధస్తాతస్య ధీమతః. 25

ప్ర అ. మహాకాయః=పెద్ద శరీరము గల, శత్రుఞ్జయో నామ = శత్రుఞ్జయ మను, ధీమతః=బుద్ధిమంతు డైన, తాతస్య=తండ్రిగారియొక్క, సః=ఆ,

వృద్ధః=పెద్దదైన, నాగః=ఏనుగు, ఏషః=ఇదిగో ! వాహినీముఖే= సేనాగ్రము నందు, కమ్పతే=కదలివచ్చుచున్నది.

తా. ధీమంతు డైన మన తండ్రిగారి పెద్ద శరీరము గల శత్రుఞ్జయ మను గజము ఇదిగో సేనాముఖమునందు కదలుచు వచ్చుచున్నది. 25

మూ. న తు పశ్యామి తచ్ఛత్రం పాణ్డరం లోకసత్కృతమ్,
పితుర్దివ్యం మహాబాహో సంశయో భవతీహ మే. 26

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! పాణ్డరమ్ = తెల్లనిదీ, లోకసత్కృతమ్ = జనులచేత గౌరవింపబడినదీ, దివ్యమ్ = శ్రేష్ఠము అయిన, పితుః = తండ్రిగారియొక్క, తత్ ఛత్రం తు = ఆ ఛత్రము నైతే, న పశ్యామి=నేను చూచుటలేదు. ఇహ=ఈ విషయమునందు, మే=నాకు, సంశయః = సందేహము, భవతి=కలుగుచున్నది.

తా. మహాబాహు వైన ఓ లక్ష్మణా ! జను లందరు గౌరవించు, శ్రేష్ఠ మైన మన తండ్రిగారి ఆ శ్వేతఛత్రము మాత్రము ఎందుచేతనో ఈ ఏనుగుపై కనబడుటలేదు. నాకు ఈ విషయమున సంశయము కల్గుచున్నది. 26

మూ. వృక్షాగ్రాదవరోహ త్వం కురు లక్ష్మణ మద్వచః,
ఇతీవ రామో ధర్మాత్మా సౌమిత్రిం తమువాచ హ. 27

ప్ర అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా ! త్వమ్ = నీవు, వృక్షాగ్రాత్ = వృక్షాగ్రమునుండి, అవరోహ=దిగుము. మద్వచః = నామాటను, కురు = చేయుము, ఇతీవ=ఇట్లు, ధర్మాత్మా=ధర్మాత్ము డైన, రామః=రాముడు, తం సౌమిత్రిమ్= ఆ లక్ష్మణుని గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. ఓ లక్ష్మణా : నీవు వృక్షాగ్రమునుండి దిగుము. నేను చెప్పినట్లు చేయుము. అని ధర్మాత్ము డైన రాముడు లక్ష్మణునితో చెప్పెను. 27

మూ. అవతీర్య తు సాలాగ్రాత్తస్మాత్స సమితింజయః,
లక్ష్మణః ప్రాఞ్జలిర్భూత్వా తస్థౌ రామస్య పార్శ్వతః. 28

ప్ర. అ. సమితింజయః = శత్రుసైన్యమును జయించు, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, తస్మాత్ = ఆ, సాలాగ్రాత్ = సాలవృక్షము అగ్రభాగమునుండి,

అవతీర్య = దిగి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, రామస్య = రామునియొక్క, పార్శ్వతః = పార్శ్వమునందు, తస్థౌ = నిల బడెను.

తా. శత్రుసేనాసంహారకు డైన ఆ లక్ష్మణుడు సాలవృక్షాగ్రమునుండి దిగి, అంజలి ఘటించి రాముని ప్రక్కనే నిలబడెను. 28

మూ. భరతేనాపి సందిష్టా సమ్మర్దో న భవేదితి,
సమన్తాత్తస్య శైలస్య సేనా వాసమకల్పయత్. 29

ప్ర. అ. సమ్మర్దః = సమ్మర్దము, న భవేత్ = కాకుండుగాక, ఇతి = అని, భరతేనాపి = భరతునిచేత, సందిష్టా = ఆజ్ఞాపింపబడిన, సేనా = సేన, తస్య శైలస్య = ఆ పర్వతముయొక్క, సమన్తాత్ = చుట్టూ, ఆవాసమ్ = నివాస మును, అకల్పయత్ = చేసికొనెను.

తా. "రాముని ఆశ్రమమునకు సమ్మర్దము కలుగకూడదు" అని భరతుడు ఆజ్ఞాపించుటచే ఆ సైన్యము పర్వతము చుట్టును విడిసెను. 29

మూ. అధ్యర్ధమిక్ష్వాకుచమూర్యోజనం పర్వతస్య సా,
పార్శ్వే న్యవిశదావృత్య గజవాజిరథాకులా. 30

ప్ర. అ. గజవాజిరథాకులా = గజములచేత, అశ్వములచేత, రథముల చేత వ్యాకుల మైన, సా = ఆ, ఇక్ష్వాకుచమూః = ఇక్ష్వాకువంశరాజసేన, అధ్యర్ధం యోజనమ్ = సగము అధికముగా గల యోజనము దూరము, పర్వతస్య = పర్వతముయొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, ఆవృత్య = చుట్టి, న్యవిశత్ = నివాసము చేసెను.

తా. ఏనుగులతోను, గుఱ్ఱములతోను, రథములతోను నిండిన భరతుని సైన్యము పర్వతము చుట్టును, ఒకటిన్నర యోజనముల దూరము ఆవరించి విడిసెను. 30

మూ. సా చిత్రకూటే భరతేన సేనా
ధర్మం పురస్కృత్య విధూయ దర్పమ్,
ప్రసాదనార్థం రఘునన్దనస్య
విరాజతే నీతిమతా ప్రణీతా. 31

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే సప్తనవతితమః సర్గః.

ప్ర. అ. ధర్మమ్ = ధర్మమును, పురస్కృత్య = పురస్కరించుకొని, దర్పమ్ = గర్వమును, విధూయ = విడచి, రఘునన్దనస్య = రాముని యొక్క, ప్రసాదనార్థమ్ = అనుగ్రహింపచేసికొనుటకు, నీతిమతా = నీతిమంతుడైన, భరతేన = భరతునిచేత, ప్రణీతా = తీసుకొని వెళ్ళబడిన, సా సేనా = ఆ సేన, చిత్రకూటే = చిత్రకూటమునందు, విరాజతే = ప్రకాశించుచున్నది.

తా. ధర్మమును పురస్కరించుకొని, దర్పమును విడచి, శ్రీరాముని అనుగ్రహింపచేసుకొనుటకై నీతిమంతుడైన భరతుడు తీసుకొనివచ్చిన ఆ సేన చిత్రకూట పర్వతప్రాంతమునందు ప్రకాశించుచుండెను. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో తొంబదియేడవ సర్గ సమాప్తము.

## అష్టనవతితమః సర్గః

[భరతుడు రామాశ్రమమును వెదుకసాగుట. ఆశ్రమమును దర్శించుట.]

మూ. నివేశ్య సేనాం తు విభుః పద్భ్యాం పాదవతాం వరః,
అభిగన్తుం స కాకుత్థ్సమియేష గురువర్తకమ్. 1

ప్ర. అ. విభుః = ప్రభువు, పాదవతామ్ = పాదములు కలవారిలో, వరః = శ్రేష్ఠుడు అయిన, సః = ఆ భరతుడు, సేనామ్ = సేనను, నివేశ్య = విడియ చేసి, గురువర్తకమ్ = తండ్రి ఆజ్ఞను అనుసరించి యున్న, కాకుత్థ్సమ్ = రాముని పద్భ్యామ్ = పాదములతో, అభిగన్తుమ్ = సమీపించుటకు, ఇయేష = కోరెను.

తా. మానవులలో శ్రేష్ఠుడు, ప్రభువు అయిన భరతుడు, సేనను నిలిపి, తండ్రి యాజ్ఞను అనుసరించి అరణ్యములో నివసించి యున్న ఆ రాముని వద్దకు నడచియే వెళ్లవలె నని నిశ్చయించెను. 1

మూ. నివిష్టమాత్రే సైన్యే తు యథోద్దేశం వినీతవత్,
భరతో భ్రాతరం వాక్యం శత్రుఘ్నమిదమబ్రవీత్. 2

ప్ర. అ. సైన్యే = సైన్యము, యథోద్దేశమ్ = ఆ యా స్థానములను అతిక్రమించకుండగా, నివిష్టమాత్రే = నిలువబడిన వెంటనే, భరతః = భరతుడు, వినీతవత్ = (రాముని గూర్చి మాట్లాడుటచే) వినయవంతుడై, భ్రాతరమ్ = సోదరుడైన, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ సైన్యమును తగు స్థానములందు నిలిపిన పిమ్మట భరతుడు వినయవంతుడై సోదరుడైన శత్రుఘ్నునితో ఇట్లు పలికెను. 2

మూ. క్షిప్రం వనమిదం సౌమ్య నరసఙ్ఘైః సమన్తతః,
లుబ్ధైశ్చ సహితైరేభి స్త్వమన్వేషితుమర్హసి. 3

ప్ర. అ. సౌమ్య=ఓ సౌమ్యుడా! నరసఙ్ఘైః=మనుష్యుల సముదాయముల తోను, సహితైః = ఒకచోట కలిసిన, లుబ్ధైశ్చ=ఆటవికులతోను కలిసినవాడవై, త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఇదం వనమ్ = ఈ వనమును, సమన్తతః =అంతటను, అన్వేషితుమ్ = వెదకుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. సౌమ్యుడ వైన శత్రుఘ్నా! నీవు నరసముదాయములతోను, ఒక్క చోట కూడిన ఆటవికులతోను కలిసి వెంటనే ఈ అరణ్యము నంతను వెదకుము.

మూ. గుహో జ్ఞాతిసహస్రేణ శరచాపాసిధారిణా,
సమన్వేషతు కాకుత్స్థమస్మిన్ పరివృతః స్వయమ్. 4

ప్ర. అ. గుహః = గుహుడు, శరచాపాసిధారిణా=శరములను, ధనుస్సులను, ఖడ్గములను, ధరించిన జ్ఞాతిసహస్రేణ = వేయిమంది బంధువులతో, పరివృతః = కూడినవాడై, స్వయమ్ = స్వయముగా, అస్మిన్ = ఈ వనమునందు, కాకుత్స్థౌ = రామలక్ష్మణులను, సమన్వేషతు = అన్వేషించుగాక!

తా. గుహుడు శరచాపఖడ్గములు ధరించిన వేయిమంది బంధువులతో కూడినవాడై స్వయముగా ఈ వనములో రామలక్ష్మణులను వెదకుగాక! 4

మూ. అమాత్యైః సహ పౌరైశ్చ గురుభిశ్చ ద్విజాతిభిః,
వనం సర్వం చరిష్యామి పద్భ్యాం పరివృతః స్వయమ్.

ప్ర. అ. స్వయమ్ = నేను కూడ, అమాత్యైః సహ = మంత్రులతోను, పౌరైశ్చ = పౌరులతోను, గురుభిశ్చ=గురువులతోను, ద్విజాతిభిః=బ్రాహ్మణుల తోను, పరివృతః = కూడినవాడనై, సర్వమ్=సమస్త మైన, వనమ్=వనమును, పద్భ్యామ్ = పాదములతో, చరిష్యామి = సంచరించెదను.

తా. నేను స్వయముగా అమాత్యులతోను, పౌరులతోను, గురువులతోను, బ్రాహ్మణులతోను కలిసి ఈ వనము నంతను కాలినడకతో తిరిగెదను. 5

మూ. యావన్న రామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్,
వైదేహీం వా మహాభాగాం న మే శాన్తిర్భవిష్యతి. 6

ప్ర. అ. రామమ్=రాముని, మహాబలమ్=మహాబలవంతు డైన, లక్ష్మణం వా=లక్ష్మణుని, మహాభాగామ్=మహాభాగ్యవంతురా లైన, వైదేహీం వా=సీతను, యావత్=ఎంత వరకు, న ద్రక్ష్యామి=చూడనో, అంతవరకు, మే=నాకు, శాన్తిః=శాంతి, న భవిష్యతి=కలగదు.

తా. రాముని, మహాబలశాలి యైన లక్ష్మణుని, మహాభాగ్యవంతురా లైన సీతను, చూడనంతవరకు నాకు దుఃఖశాంతి కలుగదు. 6

మూ. యావన్న చన్ద్రసంకాశం ద్రక్ష్యామి శుభమాననమ్,
భ్రాతుః పద్మపలాశాక్షం న మే శాన్తిర్భవిష్యతి. 7

ప్ర. అ. చన్ద్రసంకాశమ్=చంద్రునితో సమాన మైనదీ, పద్మపలాశాక్షమ్=పద్మపత్రముల వంటి నేత్రములు కలదీయైన, భ్రాతుః=సోదరు డైన రాముని యొక్క, శుభమ్=మంగళ కరమైన, ఆననమ్=ముఖమును, యావత్=ఎంత వరకు, న ద్రక్ష్యామి=చూడనో, అంతవరకు, మే=నాకు, శాన్తిః=శాంతి, న భవిష్యతి=కలుగదు.

తా. చంద్రసమానము, పద్మపత్రముల వంటి నేత్రములు కలది, అయిన అన్నగారి మంగళకర మైన ముఖమును చూడనంతవరకు నాకు మనఃశాంతి కలుగదు. 7

మూ. యావన్న చరణౌ భ్రాతుః పార్థివవ్యఞ్జనాన్వితౌ,
శిరసా ధారయిష్యామి న మే శాన్తిర్భవిష్యతి. 8

ప్ర. అ. భ్రాతుః=సోదరునియొక్క, పార్థివవ్యఞ్జనాన్వితౌ=రాజ చిహ్నములతో కూడిన, చరణౌ=పాదములను, యావత్=ఎంతవరకు, శిరసా=శిరస్సుతో, న ధారయిష్యామి=ధరించనో అంతవరకు, మే=నాకు, శాన్తిః=శాంతి, న భవిష్యతి=కలుగదు.

తా. రాజచిహ్నములతో కూడిన నా అన్నగారి పాదములను శిరస్సుమీద ధరించనంతవరకు నాకు మనఃశాంతి కలుగదు. 8

మూ. యావన్న రాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితః,
అభిషేకజలక్లిన్నో న మే శాన్తిర్భవిష్యతి. 9

ప్ర. అ. రాజ్యార్హః = రాజ్యమునకు తగిన రాముడు, అభిషేకజలక్లిన్నః = అభిషేకజలముచే తడపబడినవాడై, పితృపైతామహే = తండ్రులకు, తాతలకు సంబంధించిన, రాజ్యే = రాజ్యమునందు, యావత్ = ఎంతవరకు, న స్థితః = ఉండడో అంతవరకు, మే = నాకు, శాన్తిః = శాంతి, న భవిష్యతి = కలుగదు.

తా. రాజ్యమునకు తగిన ఆ రాముడు, రాజ్యాభిషేకజలములచే తడిసి పితృపితామహక్రమమున వచ్చుచున్న రాజ్యమును పొందనంతవరకు, నాకు మనఃశాంతి కలుగదు. 9

మూ. సిద్ధార్థః ఖలు సౌమిత్రిర్యశ్చన్ద్రవిమలోపమమ్,
ముఖం పశ్యతి రామస్య రాజీవాక్షం మహాద్యుతి. 10

ప్ర. అ. యః = ఏ లక్ష్మణుడు, చన్ద్రవిమలోపమమ్ = స్వచ్ఛమైన చంద్రునితో సమానము, రాజీవాక్షమ్ = పద్మములవంటి నేత్రములు కలది, మహాద్యుతి = గొప్ప కాంతి కలది అయిన, రామస్య = రామునియొక్క, ముఖమ్ = ముఖమును, పశ్యతి = చూచుచున్నాడో, సౌమిత్రిః = అట్టి లక్ష్మణుడు, సిద్ధార్థః ఖలు = కృతార్థుడు కదా!

తా. స్వచ్ఛమైన చంద్రునితో సమానము, పద్మములవంటి నేత్రములు కలది, గొప్ప కాంతితో ప్రకాశించుచున్నది అయిన రాముని ముఖమును సర్వదా చూడకలిగిన లక్ష్మణుడు కృతార్థుడు కదా! 10

మూ. కృతకృత్యా మహాభాగా వైదేహీ జనకాత్మజా,
భర్తారం సాగరాన్తాయాః పృథివ్యా యానుగచ్ఛతి. 11

ప్ర. అ. యా = ఏ సీత, సాగరాన్తాయాః = సాగరములే కొనలుగా గల,

పృథివ్యాః = భూమికి, భర్తారమ్ = భర్త యైన రాముని, అనుగచ్ఛతి = అనుసరించి వెళ్లుచున్నదో, అట్టి, మహాభాగా = మహాభాగ్యవంతురాలు, జనకాత్మజా = జనకుని కూతురు అయిన, వైదేహీ = సీత, కృతకృత్యా = కృతకృత్యురాలు.

తా. సముద్రమువరకు వ్యాపించిన ఈ భూమి కంతకును ప్రభు వైన ఆ రాముని అనుసరించి వెళ్ళిన మహా భాగ్యవంతురా లైన సీత చాల కృతార్థురాలు. 11

మూ. సుభగః చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః,
యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నన్దనే. 12

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, యస్మిన్ = దేనిపై, కుబేరః = కుబేరుడు, నన్దనే ఇవ = నందనవనమునందు వలె, వసతి = నివసించుచున్నాడో, అసౌ = ఇట్టి, గిరిరాజోపమః = పర్వతరాజైన హిమవంతునితో సమాన మైన, చిత్రకూటః గిరిః = చిత్రకూటపర్వతము, సుభగః = భాగ్యశాలి యైనది.

తా. కుబేరుడు నందనవనములో నివసించు నట్లు రాముడు హిమవత్పర్వముతో సమాన మైన ఈ చిత్రకూటపర్వతముపై నివసించుచున్నాడు. అందుచే ఈ పర్వతము చాల భాగ్యశాలి. 12

మూ. కృతకార్యమిదం దుర్గం వనం వ్యాళనిషేవితమ్,
యదధ్యాస్తే మహాతేజా రామః శస్త్రభృతాం వరః. 13

ప్ర. అ. శస్త్రభృతామ్ = ఆయుధములు ధరించినవారిలో, వరః = శ్రేష్ఠుడు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన, రామః = రాముడు, యత్ = ఏ వనమును, అధ్యాస్తే = అధిష్ఠించి యున్నాడో అట్టి, వ్యాళనిషేవితమ్ = క్రూరమృగములచే సేవింపబడినది, దుర్గమ్ = ప్రవేశింప శక్యము గానిది అయిన, ఇదం వనమ్ = ఈ వనము, కృతకార్యమ్ = కృతకృత్య మైనది.

తా. క్రూరమృగములతో నిండి, ప్రవేశింప శక్యము గాని ఈ వనము

కూడ ఎంతో పుణ్యము చేసుకొన్నది. ఎందుచేత ననగా మహాతేజశ్శాలి, శస్త్ర ధారులలో శ్రేష్ఠుడు అయిన రాముడు, దీనిలో నివసించుచున్నాడు. 13

మూ. ఏవముక్త్వా మహాతేజా భరతః పురుషర్షభః,
పద్భ్యామేవ మహాబాహుః ప్రవివేశ మహద్వనమ్. 14

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడు, పురుషర్షభః = పురుష శ్రేష్ఠుడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు అయిన, భరతః = భరతుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, మహత్ = గొప్పదైన, వనమ్ = వనమును, పద్భ్యామేవ = పాదములతోనే, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మహాతేజశ్శాలి, మహాబాహువు, పురుషశ్రేష్ఠుడు అయిన భరతుడు ఈ విధముగా పలుకుచు, కాలినడకనే ఆ మహావనములోనికి ప్రవేశించెను. 14

మూ. స తాని ద్రుమజాలాని జాతాని గిరిసానుషు,
పుష్పితాగ్రాణి మధ్యేన జగామ వదతాం వరః. 15

ప్ర. అ. వదతామ్ = మాటలాడువారిలో, వరః = శ్రేష్ఠుడైన, సః = ఆ భరతుడు, గిరిసానుషు = పర్వతముల చరియలపై, జాతాని = పుట్టిన, పుష్పితాగ్రాణి = పుష్పించిన అగ్రభాగములు గల, తాని = ఆ, ద్రుమజాలాని = వృక్షముల సముదాయములను, మధ్యే = మధ్యచేత, జగామ = వెళ్లెను.

తా. మాటలలో మంచి నేర్పు గల ఆ భరతుడు, పర్వతము చరియల మీద పెరిగిన, పుష్పించిన అగ్రభాగములు గల వృక్షముల సముదాయముల నడుమ నడచుచు వెళ్ళెను. 15

మూ. స గిరేశ్చిత్రకూటస్య సాలమాసాద్య పుష్పితమ్,
రామాశ్రమగతస్యాగ్నేర్దదర్శ ధ్వజముచ్ఛ్రితమ్. 16

ప్ర. అ. సః = అతడు, చిత్రకూటస్య గిరేః = చిత్రకూటపర్వతము యొక్క, పుష్పితమ్ = పుష్పించిన, సాలమ్ = సాలవృక్షమును, ఆసాద్య = సమీపించి, రామాశ్రమగతస్య = రాముని ఆశ్రమములో నున్న, అగ్నేః = అగ్ని

యొక్క, ఉచ్ఛ్రితం = ఉన్నతమైన, ధ్వజం = ధ్వజమైన ధూమమును, దదర్శ = చూచెను.

తా. అతడు చిత్రకూటపర్వతముపై ఉన్న పుష్పించిన ఒక సాలవృక్షమును సమీపించి, రాముని ఆశ్రమమునుండి పైకి ఎగురుచున్న పొగను చూచెను. 16

మూ. తం దృష్ట్వా భరతః శ్రీమాన్ ముమోద సహ బాన్ధవః,
అత్ర రామ ఇతి జ్ఞాత్వా గతః పారమివామ్భసః. 17

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, సహబాన్ధవః = బంధువులతో కూడిన, భరతః = భరతుడు, తమ్ = ఆ ధూమమును, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, అత్ర = ఇక్కడ ఉన్నాడు, ఇతి = అని, జ్ఞాత్వా = తెలుసుకొని, అమ్భసః = ఉదకముయొక్క, పారమ్ = అవతలి ఒడ్డును, గతః ఇవ = పొందినవాడు వలె, ముమోద = సంతోషించెను.

తా. బంధుసమేతుడైన శ్రీమంతుడైన ఆ భరతుడు, ఆ ధూమమును చూడగానే రాముడు ఇక్కడనే ఉన్నాడని తెలుసుకొని, నది అవతలి ఒడ్డున చేరిన ఈతగాడు వలె చాలా సంతోషించెను. 17

మూ. స చిత్రకూటే తు గిరౌ నిశామ్య,
రామాశ్రమం పుణ్యజనోపపన్నమ్
గుహేన సార్ధం త్వరితో జగామ
పునర్నివేశ్యైవ చమూం మహాత్మా. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టనవతితమః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, సః = ఆ భరతుడు, చిత్రకూటే గిరౌ = చిత్రకూటపర్వతమునందు, పుణ్యజనోపపన్నమ్ = పుణ్యాత్ములతో కూడిన, రామాశ్రమమ్ = రామాశ్రమమును, నిశామ్య = చూచి, చమూమ్ =

సేనను, నివేశ్యైవ = దూరముగానేఉంచి, పునః = మరల, గుహేన సార్ధమ్ = గుహునితో కూడ, త్వరితః = తొందరపడుచున్నవాడై, జగామ = వెళ్ళెను.

తా. మహాత్ముడైన ఆ భరతుడు, ఆ చిత్రకూటపర్వతముపై పుణ్యాత్ములతో నిండిన రాముని ఆశ్రమమును చూచి, సేనను దూరముగనే ఉండ మని నియమించి, గుహునితో కూడ మరల తొందరగా నడచుచు వెళ్లెను. 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో తొంబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనశతతమః సర్గః

*[భరతుడు శత్రుఘ్నాదులతో రామాశ్రమమునకు పోవుట. ఆయన పర్ణశాలను చూచుట. విలపించుచు రాముని పాదములపై పడుట. రాముడు వారిని కలిసికొని గాఢాలింగన మొనర్చుట.]*

మూ. నివిష్టాయాం తు సేనాయాముత్సుకో భరతస్తదా,
జగామ భ్రాతరం ద్రష్టుం శత్రుఘ్నమనుదర్శయన్. 1

ప్ర. అ. తదా = అప్పుడు, సేనాయామ్ = సేన, నివిష్టాయామ్ = విడిసియుండగా, భరతః = భరతుడు, ఉత్సుకః = వేడుక కలవాడై, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని, అనుదర్శయన్ = చూపుచు, భ్రాతరమ్ = సోదరుని, ద్రష్టుమ్ = చూచుటకు, జగామ = వెళ్లెను.

తా. సేనను అట్లు నిలిపి, భరతుడు సోదరుని చూడవలె నను ఆత్రముతో శత్రుఘ్నునకు అ యా చిహ్నములను చూపుచు శీఘ్రముగా వెళ్ళెను. 1

మూ. ఋషిం వసిష్ఠం సందిశ్య మాతౄర్మే శీఘ్రమానయ,
ఇతి త్వరితమగ్రే స జగామ గురువత్సలః. 2

ప్ర. అ. గురువత్సలః = పెద్దల యందు అధికప్రేమ గల, సః = అతడు, మే = నాయొక్క, మాతౄః = తల్లులను, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆనయ = తీసుకొనిరమ్ము, ఇతి = అని, ఋషిమ్ = ఋషి యైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, సందిశ్య = అదేశించి, త్వరితమ్ = శీఘ్రముగా, అగ్రే = ముందర, జగామ = వెళ్లెను.

తా. పెద్దలయందు అధికప్రేమ గల ఆ భరతుడు, నా తల్లులను శీఘ్రముగా తీసుకొని రమ్ము అని వసిష్ఠమహర్షిని ఆదేశించి, తాను ముందుగా తొందరగా వెళ్ళెను. 2

మూ. సుమన్త్రస్త్వపి శత్రుఘ్నమదూరాదన్వపద్యత,
రామదర్శనజస్తర్షో భరతస్యేవ తస్య చ. 3

ప్ర. అ. సుమన్త్రస్త్వపి=సుమంత్రుడు కూడ, శత్రుఘ్నమ్=శత్రుఘ్నుని, అదూరాత్ = సమీపముగా, అన్వపద్యత = వెంబడించెను. రామదర్శనజః = రాముని దర్శనమునందు కలిగిన, తర్షః = అభిలాష, తస్య చ=అతనికి కూడ, భరతస్యేవ=భరతునికి వలెనే ఉండెను.

తా. సుమంత్రుడు శత్రుఘ్నుని వెనువెంటనే వెళ్ళెను. రాముని చూడవలెనను అభిలాష భరతునకు ఎంత ఉండెనో ఆతనికికూడ అంత ఉండెను. 3

మూ. గచ్ఛన్నేవాథ భరతస్తాపసాలయసంస్థితామ్,
భ్రాతుః పర్ణకుటీం శ్రీమానుటజం చ దదర్శ హ. 4

ప్ర. అ. అథ = అటుపిమ్మట, శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = భరతుడు, గచ్ఛన్నేవ=నడచుచునే, తాపసాలయసంస్థితామ్ = తపోవనమునందున్న, భ్రాతుః = సోదరునియొక్క, పర్ణకుటీమ్ = ఆకులచే కప్పబడిన గృహమును, ఉటజం చ=దాని పక్కనే ఉన్న చిన్న పర్ణశాలను, దదర్శ హ =చూచెను.

తా. పిమ్మట శ్రీమంతుడైన ఆ భరతుడు నడచి వెళ్లుచుండగనే ఆతనికి తాపసాశ్రమములో సోదరుని ఒక పెద్ద పర్ణశాల, ఒక చిన్న పర్ణశాల కనబడెను.

మూ. శాలాయా స్త్వగ్రత స్తస్యా దదర్శ భరత స్తదా,
కాష్ఠాని చావభగ్నాని పుష్పాణ్యపచితాని చ. 5

ప్ర. అ. తదా = అపుడు, భరతః=భరతుడు, తస్యాః శాలాయాః = ఆ పర్ణశాలయొక్క, అగ్రతః=ఎదుట, అవభగ్నాని=విరువబడిన, కాష్ఠాని = కట్టెలను, అపచితాని=కోయబడిన, పుష్పాణి చ=పుష్పములను, దదర్శ=చూచెను.

తా. ఆ పర్ణశాల ముందు విరిచి పడవేసిన కట్టెలు, కోసిన పుష్పములు కూడ భరతునకు కనబడెను. 5

మూ. స లక్ష్మణస్య రామస్య దదర్శాశ్రమమీయుషః,
కృతం వృక్షేష్వభిజ్ఞానం కుశచీరైః క్వచిత్ క్వచిత్. 6

ప్ర. అ. సః=అతడు. ఆశ్రమమ్=ఆశ్రమమును, ఈయుషః=పొందిన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, రామస్య=రామునియొక్క, క్వచిత్ క్వచిత్= కొన్ని చోట్ల, వృక్షేషు=వృక్షములయందు, కుశచీరైః=దర్భలచేతను, నార చీరలచేతను, కృతమ్ = చేయబడిన, అభిజ్ఞానమ్=ఆనవాలును. దదర్శ= చూచెను.

తా. ఆశ్రమములో నున్న రామలక్ష్మణులు పర్ణశాలమార్గము తెలియుటకై అక్కడక్కడ, చెట్లపై గుర్తుగా కట్టుకొనిన దర్భలను, నారచీరలను కూడ భర తుడు చూచెను. 6

మూ. స దదర్శ వనే తస్మిన్ మహతః సంచయాన్ కృతాన్,
మృగాణాం మహిషాణాం చ కరీషైః శీతకారణాత్. 7

ప్ర. అ. సః=ఆ భరతుడు, తస్మిన్ వనే=ఆ వనమునందు, శీతకార ణాత్=చలినిమిత్తము, మృగాణామ్=లేళ్ళయొక్క, మహిషాణాం చ =దున్న పోతులయొక్క, కరీషైః=పిడకలచే, కృతాన్=చేయబడిన, మహతః=పెద్దవైన, సంచయాన్=ప్రోగులను, దదర్శ=చూచెను.

తా. చలికాలములో ఉపయోగించుకొనుటకై ఆ వనములో వారు, లేళ్ళ పేడతోను మహిషముల పేడతోను చేసుకొనిన పిడకల ప్రోగులను కూడ అతడు చూచెను. 7

మూ. గచ్ఛన్నేవ మహాబాహుర్ద్యుతిమాన్ భరత స్తదా,
శత్రుఘ్నం చాబ్రవీద్ధృష్టస్తానమాత్యాంశ్చ సర్వశః. 8

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, ద్యుతిమాన్ = కాంతి కలవాడు అయిన, భరతః=భరతుడు, తదా=అపుడు, గచ్ఛన్నేవ=వెళ్లు చునే, హృష్టః=సంతోషించినవాడై, శత్రుఘ్నం చ=శత్రుఘ్నుని గూర్చి, సర్వశః =తన నలువైపుల ఉన్న, తాన్=ఆ, అమాత్యాంశ్చ=మంత్రులను గూర్చి, అబ్ర వీత్=పలికెను.

తా. మహాబాహువు, కాంతిమంతుడు అయిన ఆ భరతుడు అవి అన్నియు చూచి, సంతోషించి నడచి వెళ్లుచునే, శత్రుఘ్నునితోను, తన చుట్టూ ఉన్న మంత్రులతోను ఇట్లు పలికెను. 8

మూ. మన్యే ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో యమబ్రవీత్,
నాతిదూరే హి మన్యేఽహం నదీం మన్దాకినీమితః. 9

ప్ర. అ. యమ్=దేనిని గూర్చి, భరద్వాజః=భరద్వాజుడు, అబ్రవీత్=చెప్పెనో, తం దేశమ్=ఆ ప్రదేశమును, ప్రాప్తాః స్మ = చేరినాము అని, మన్యే =తలచుచున్నాను. మన్దాకినీం నదీమ్=మందాకినీ నదిని, ఇతః=ఇక్కడినుండి, నాతిదూరే = సమీపముగా నున్నదానినిగా, అహమ్ = నేను, మన్యే = తలచుచున్నాను.

తా. భరద్వాజుడు చెప్పిన ప్రదేశమునకు వచ్చినాము. మన్దాకినీనది ఇక్కడికి దగ్గరగనే ఉన్న దని తలచెదను. 9

మూ. ఉచ్చైర్బద్ధాని చీరాణి లక్ష్మణేన భవేదయమ్,
అభిజ్ఞానకృతః పన్థా అకాలే గన్తుమిచ్ఛతా. 10

ప్ర. అ. చీరాణి = నారచీరలు, ఉచ్చైః = ఎత్తుగా, బద్ధాని=కట్టబడినవి. అయమ్ = ఇది, అకాలే=సమయము కాని సమయమునందు, గన్తుమ్=బయటకు వెళ్లుటకు, ఇచ్ఛతా = కోరుచున్న, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, అభిజ్ఞానకృతః= చేయబడిన గుర్తులు గల, పన్థాః = మార్గము, భవేత్=కావచ్చును.

తా. ఇక్కడ నారచీరలు ఎత్తైన ప్రదేశములలో కట్టబడి ఉన్నవి. అకాలమునందు ఆశ్రమమునుండి బయటకు వెళ్ళి తిరిగి వచ్చునపుడు గుర్తుగా ఉండుటకు లక్ష్మణుడు ఈ మార్గమును ఇట్లుచేసి యుండును. 10

మూ. ఇదం చోదాత్తదన్తానాం కుఞ్జరాణాం తరస్వినామ్,
శైలపార్శ్వే పరిక్రాన్తమన్యోన్యమభిగర్జతామ్. 11

ప్ర. అ. శైలపార్శ్వే = శైలముయొక్క పార్శ్వమునందు, ఇదమ్ = ఇది, ఉదాత్తదన్తానామ్ = పెద్ద దంతములు కలవీ, తరస్వినామ్=బలముగలవి, అన్యోన్యమ్ = పరస్పరము, అభిగర్జతామ్ = గర్జించుచున్నవీ అయిన, కుఞ్జరాణామ్ = ఏనుగులయొక్క, పరిక్రాన్తమ్ = సంచారస్థానము.

తా. పెద్దపెద్ద దంతములు కలవీ, గొప్ప బలము కలవీ అయిన ఏనుగులు ఒకదానినిచూచి ఒకటి గర్జించుచు ఇక్కడ శైలము ప్రక్కన సంచరించుచున్నవి.

మూ. యమేవాధాతుమిచ్ఛన్తి తాపసాః సతతం వనే,
తస్యాసౌ దృశ్యతే ధూమః సంకులః కృష్ణవర్త్మనః. 12

ప్ర. అ. వనే=వనమునందు, తాపసాః=మునులు, సతతమ్=ఎల్లపుడు, యమేవ = దేనిని, ఆధాతుమ్ = ఉంచుటకు, ఇచ్ఛన్తి = కోరుచుందురో, తస్య= ఆ, కృష్ణవర్త్మనః = అగ్నియొక్క, అసౌ=ఈ, సంకులః=దట్టమైన, ధూమః = ధూమము, దృశ్యతే = కనబడుచున్నది.

తా. అరణ్యములో నివసించు మునులు ఎల్లపుడు సంరక్షించుకొనుటకై కోరుకొనుచుండు అగ్నినుండి బయల్వెడలిన దట్టమైన ధూమము, ఇదిగో, ఇక్కడ కనబడుచున్నది. 12

మూ. అత్రాహం పురుషవ్యాఘ్రం గురుసత్కారకారిణమ్.
ఆర్యం ద్రక్ష్యామి సంహృష్టో మహర్షిమివ రాఘవమ్. 13

ప్ర. అ. అహమ్ = నేను, పురుషవ్యాఘ్రమ్=పురుషులలో శ్రేష్ఠుడు, గురుసత్కారకారిణమ్ = పెద్దలకు గౌరవము చేయువాడూ, ఆర్యమ్ = పూజ్యుడు, మహర్షిమివ = మహర్షివంటివాడూ అయిన, రాఘవమ్ = రాముని, సంహృష్టః= సంతోషించుచున్నవాడనై, అత్ర = ఇక్కడ, ద్రక్ష్యామి = చూడగలను.

తా. పురుషశ్రేష్ఠుడు, గురువులను సత్కరించువాడు, పూజ్యుడు, మహర్షి సదృశుడు అయిన రాముని నేను ఇక్కడ సంతోషపూర్వకముగా చూడగలను.

మూ. అథ గత్వా ముహూర్తం తు చిత్రకూటం స రాఘవః,
మన్దాకినీమనుప్రాప్తస్తం జనం చేదమబ్రవీత్. 14

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సః రాఘవః=ఆ భరతుడు, చిత్రకూటమ్ = చిత్రకూట పర్వతమును గూర్చి, ముహూర్తమ్=కొంచెముకాలము మాత్రము, గత్వా = వెళ్ళి, మన్దాకినీమ్ = మందాకినీనదిని, అనుప్రాప్తః = చేరినవాడై, తం జనమ్ = ఆ జనమును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ భరతుడు చిత్రకూటపర్వతము వైపు కొంచెము సేపు మాత్రమే నడచి, మందాకినీనదిని చేరి అమాత్యాదులతో ఇట్లు పలికెను. 14

మూ. జగత్యాం పురుషవ్యాఘ్ర ఆస్తే వీరాసనే రతః,
జనేన్ద్రో నిర్జనం ప్రాప్య ధిఙ్మే జన్మ సజీవితమ్. 15

ప్ర. అ. జనేన్ద్రః=జనులకు ప్రభువు, పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుడు అయిన రాముడు, నిర్జనమ్ = జనులు లేని ప్రదేశమును, ప్రాప్య = పొంది, వీరాసనే=వీరాసనమునందు, (కుడి మోకాలుపై ఎడమ పాదమును, ఎడమ తొడ క్రింద కుడిపాదమును ఉంచి కూర్చున్న ఆసనము వీరాసనము) రతః=ఆసక్తి కలవాడై, జగత్యామ్=నేలపై, ఆస్తే=కూర్చున్నాడు. మే=నాయొక్క, సజీవితమ్ = జీవితముతో కూడిన, జన్మ = జన్మను గూర్చి, ధిక్ = నింద అగుగాక :

తా. జనులకు ప్రభువు పురుషశ్రేష్ఠుడు అయిన రాముడు, ఈ నిర్జనవనములో వీరాసనము వేసుకొని నేలపై కూర్చుని యున్నాడు. ఛీ నా జన్మము జీవితము ఎందుకు? 15

మూ. మత్కృతే వ్యసనం ప్రాప్తో లోకనాథో మహాద్యుతిః,
సర్వాన్ కామాన్ పరిత్యజ్య వనే వసతి రాఘవః. 16

ప్ర. అ. లోకనాథః=లోకమునకు ప్రభువు, మహాద్యుతిః=గొప్ప కాంతి కలవాడు అయిన, రాఘవః=రాముడు, మత్కృతే=నాకొరకై, వ్యసనమ్=వ్యసనమును, ప్రాప్తః=పొందినవాడై, సర్వాన్=సమస్తమైన, కామాన్ = భోగములను, పరిత్యజ్య=విడచి, వనే=వనమునందు, వసతి=నివసించుచున్నాడుకదా.

తా. లోకమునకు అధిపతి, మహాకాంతిశాలీ యైన రాముడు నా మూలమున కష్టములకు లోనై భోగము లన్నియు విడిచి, అరణ్యములో నివసించుచున్నాడు.

మూ. ఇతి లోకసమాక్రుష్టః పాదేష్వద్య ప్రసాదయన్,
రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్య చ. 17

ప్ర. అ. ఇతి=ఇట్లు, లోకసమాక్రుష్టః=లోకముచే నిందింపబడిన నేను, అద్య = నేడు, ప్రసాదయన్ = అనుగ్రహింపచేసికొనుచు, రామస్య = రాముని యొక్క, సీతాయాః=సీతయొక్క, లక్ష్మణస్య చ=లక్ష్మణునియొక్క, పాదేషు = పాదములపై, నిపతిష్యామి = పడెదను.

తా. ఈ విధముగా లోకులచే నిందింపబడుచున్న నేను ఈ నాడు, సీతా రామలక్ష్మణుల పాదములపై పడి వారిని అనుగ్రహింపచేసుకొనెదను. 17

మూ. ఏవం సంవిలపం స్తస్మిన్ వనే దశరథాత్మజః,
దదర్శ మహతీం పుణ్యాం పర్ణశాలాం మనోరమామ్. 18

సాలతాలాశ్వకర్ణానాం పర్ణైర్బహుభిరానతామ్,
విశాలాం మృదుభి స్తీర్ణాం కుశై ర్వేదిమివాధ్వరే. 19

శక్రాయుధనికాశైశ్చ కార్ముకై ర్భారసాధనైః,
రుక్మపృష్ఠైర్మహాసారైః శోభితాం శత్రుబాధకైః. 20

అర్కరశ్మిప్రతీకాశైర్ఘోరై స్తూణీగతైః శరైః,
శోభితాం దీప్తవదనైః సర్పైర్భోగవతీమివ. 21

మహారజతవాసోభ్యామసిభ్యాం చ విరాజితామ్,
రుక్మబిందువిచిత్రాభ్యాం చర్మభ్యాం చాపి శోభితామ్. 22

గోధాఙ్గుళిత్రైరాసక్తైశ్చిత్రైః కాఞ్చనభూషితైః,
హరిసంఘైరనాధృష్యాం మృగైః సింహగుహామివ. 23

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సంవిలపన్ = విలపించుచున్న, దశరథాత్మజః = భరతుడు, తస్మిన్ వనే = ఆ వనమందు, మహతీమ్ = గొప్పది, పుణ్యామ్ = పవిత్ర మైనది, మనోరమామ్ = సుందర మైనది, సాలతాళాశ్వకర్ణానామ్ = మద్దిచెట్లయొక్క, తాటిచెట్లయొక్క, ఇనుమద్దిచెట్లయొక్క, బహుభిః = అనేక మైన, మృదుభిః = మెత్త నైన, పర్ణైః = పర్ణములచే, ఆవృతామ్ = కప్పబడినది, అధ్వరే = యజ్ఞమునందు, కుశైః = కుశలచేత, తీర్ణామ్ = కప్పబడిన, విశాలామ్ = విశాలమైన, వేదిమివ = వేదివలె నున్నది, శక్రాయుధనికాశైః = వజ్రాయుధముతో సమాన మైన, భారసాధనైః = కార్యభారమును సాధించు, రుక్మపృష్ఠైః = బంగారపు వెనుక భాగములు కలవి, మహాసారైః = గొప్ప సారము కలవి, శత్రుబాధకైః = శత్రువులను బాధించునవి అయిన, కార్ముకైః = ధనస్సులతో, శోభితామ్ = ప్రకాశింపచేయబడినదీ, సర్పైః = సర్పములచే, భోగవతీమ్

ఇవ=భోగవతివలె, అర్కరశ్మిప్రతీకాశైః = సూర్యకిరణములతో సమాన మైన, ఘోరైః = భయంకర మైన, దీప్తవదనైః = ప్రకాశించుచున్న ముఖములు గల, తూణీగతైః = అంబులపొదిలో నున్న, శరైః = బాణములచే, శోభితామ్ = ప్రకాశింపచేయబడినది, మహారజతవాసోభ్యామ్ = బంగారు ఒరలు గల, అసిభ్యామ్ = రెండు ఖడ్గములచేత, విరాజితామ్ = ప్రకాశింపచేయబడినది, రుక్మబిందువిచిత్రాభ్యామ్ = బంగారు చుక్కలచె విచిత్రము లైన, చర్మభ్యామ్ = డాలులచేత, శోభితామ్ = ప్రకాశింపచేయబడినది, కాఞ్చనభూషితైః = బంగారముచే అలంకరింపబడిన, చిత్రైః = వివిధవర్ణములు గల, అసక్తైః = వ్రేలాడదీయబడిన, గోధాఙ్గుళిత్రైః = (వ్రేళ్ళకు దెబ్బతగులకుండుటకై తొడుగుకొను ఉడుముచర్మముతో నిర్మించిన) అంగుళీకవచములతో ప్రకాశించుచున్నది, మృగైః = లేళ్ళచేత, సింహగుహామివ = సింహముయొక్క గుహ వలె, అరిసంఘైః = శత్రుసముదాయములచేత, అనాధృష్యామ్ = ఎదిరింపశక్యముకానిది అయిన, పర్ణశాలామ్ = పర్ణశాలను, తస్మిన్ వనే = ఆ వనమునందు, దదర్శ = చూచెను.

తా. భరతుడు ఈ విధముగా విలపించుచు, ఆ వనములో, పవిత్రము, సుందరము అయిన, చక్కని పర్ణశాలను చూచెను. యజ్ఞములో వేదిక మెత్తని కుశలచే కప్పబడి నట్లు విశాల మైన ఆ పర్ణశాల, సాల-తాళ-అశ్వకర్ణవృక్షముల అనేకపర్ణములచే, కప్పబడి యుండెను. మహాకార్యమును సాధించునవి, బంగారము పూసిన వెనుక భాగములు కలవి, గొప్ప సారము కలవి, శత్రువులను బాధించునవి, వజ్రాయుధముతో సమానములూ అయిన ధనస్సులు ఆ పర్ణశాలలో ఉండెను. ప్రకాశించుచున్న అగ్రభాగములు గలవి, సూర్యకిరణములతో సమానములూ, భయంకరములూ అయిన అంబులపొదులలో నున్న బాణములతో ఆ పర్ణశాల సర్పములతో భోగవతివలె ప్రకాశించుచుండెను. (భోగవతి పాతాళములోని నగరము). బంగారపు ఒరలలో ఉన్న రెండు ఖడ్గములు, బంగారపు చుక్కలతో చిత్రవర్ణము లైన రెండు డాలులూ, బంగారముచే అలంకరింపబడినవి, గోడలకు వ్రేలాడతీయబడినవి, చిత్రవర్ణములూ అయిన అంగుళీకవచములూ, ఆ పర్ణశాలను ప్రకాశింపచేయుచుండెను. అది మృగములచే ఎదిరింప శక్యము గాని సింహనివాస గుహ వలె శత్రుసంఘములచే ఎదిరింప శక్యముగానిదై, ఉండెను. 18-23

మూ. ప్రాగుదక్ప్రవణాం వేదీం విశాలాం దీప్తపావకామ్,
దదర్శ భరత స్తత్ర పుణ్యాం రామనివేశనే. 24

ప్ర. అ. భరతః = భరతుడు, తత్ర = అక్కడ, రామనివేశనే = రామ గృహమునందు, ప్రాగుదక్ప్రవణామ్ = ఈశాన్యముదిక్కు వల్లముగానున్నది, విశాలామ్ = విశాల మైనది, దీప్తపావకామ్ = మండుచున్న అగ్ని కలది, పుణ్యామ్ = పవిత్ర మైనది అయిన, వేదిమ్ = వేదిని, దదర్శ = చూచెను.

తా. భరతుడు ఆ రాముని గృహమునందు ఈశాన్యమువైపున వల్లముగా నున్నదీ, విశాల మైనదీ మండుచున్న అగ్ని కలదీ పవిత్రమూ అయిన వేదిని చూచెను. 24

మూ. నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామమాసీనం జటామణ్డలధారిణమ్. 25

ప్ర. అ. సః భరతః = ఆభరతుడు, ముహూర్తమ్ = క్షణకాలముపాటు, నిరీక్ష్య = పరిశీలించి, ఉటజే = పర్ణశాలయందు, ఆసీనమ్ = కూర్చున్న, జటామండలధారిణమ్ = జటామండలములను ధరించిన, గురుమ్ = అన్న యైన, రామమ్ = రాముని, దదర్శ = చూచెను.

తా. భరతుడు క్షణకాలము పరిశీలించి ఆ పర్ణశాలలో జటామండల ధారియై కూర్చొని ఉన్న అన్నగా రైన రాముని చూచెను. 25

మూ. తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్,
దదర్శ రామమాసీన మభితః పావకోపమమ్. 26
సింహస్కంధం మహాబాహుం పుణ్డరీకనిభేక్షణమ్,
పృథివ్యాః సాగరాన్తాయాః భర్తారం ధర్మచారిణమ్. 27
ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణమివ శాశ్వతమ్,
స్థణ్డిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ. 28

ప్ర. అ. కృష్ణాజినధరమ్ = కృష్ణాజినమును ధరించినవాడు, చీరవల్కల వాససమ్ = నారచీరలు వస్త్రములుగా కలవాడు, అభితః = చుట్టునూ, పావకోపమమ్ = అగ్నితో సమానుడు, ఆసీనమ్ = కూర్చున్నవాడు, సింహస్కంధమ్ = సింహము వంటి మూపు కలవాడు, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడు, పుణ్డరీకనిభేక్షణమ్ = పద్మములతో సమాన మైన నేత్రములు కలవాడు, సాగరా

న్తాయాః=సాగరము కొనలయందు గల, పృథివ్యాః = భూమికి, భర్తారమ్ = ప్రభువు, ధర్మచారిణమ్=ధర్మమును ఆచరించువాడు అయిన, తం రామమ్ = ఆ రాముని, దదర్శ=చూచెను. మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడు, శాశ్వతమ్=నిత్యుడైన, బ్రహ్మాణమివ=బ్రహ్మదేవుని వలె ఉన్నవాడు, సీతయా =సీతతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, దర్భసంస్తీర్ణే= దర్భలచే పరువ బడిన, స్థణ్డిలే = నేలపై, ఉపవిష్టమ్ = కూర్చున్నవాడు అయిన, ఆ రాముని చూచెను.

తా. ఆ రాముడు కృష్ణాజినమును, నారచీరలను ధరించెను. ఆతని చుట్టును అగ్నికాంతివంటి కాంతి వ్యాపించి యుండెను. సింహము వంటి మూపు రముతో దీర్ఘమైన బాహువులతో పద్మముల వంటి నేత్రములతో ఒప్పుచు, సముద్రపర్యంత మైన భూమికి అధిపతి యైన ఆ రాముడు ధర్మము నాచరించుచు స్థిరుడైన బ్రహ్మదేవుని వలె, సీతాలక్ష్మణులు పార్శ్వముల నుండి సేవింపగా, దర్భలు పరచిన నేలపై వీరాసనము బంధించి కూర్చొనియుండెను. భరతుడు అట్టి రాముని చూచెను. 26-28

మూ. తం దృష్ట్వా భరతః శ్రీమాన్ దుఃఖశోకపరిప్లుతః,
అభ్యధావత ధర్మాత్మా భరతః కైకేయీసుతః. 29

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = భరతుడు, తమ్ = ఆ రాముని, దృష్ట్వా=చూచి, దుఃఖశోకపరిప్లుతః=దుఃఖముచేతను, శోకముచేతను, వ్యాపింపబడినవాడు ఆయెను. ధర్మాత్మా = ధర్మాత్ముడు, కైకయీసుతః = కైకేయికుమారుడు అయిన, భరతః=భరతుడు, అభ్యధావత=రాముని ఎదుటకు పరుగెత్తి వెళ్ళెను.

తా. శ్రీమంతుడు, ధర్మాత్ముడు, కైకయీ తనయుడు అయిన ఆ భరతుడు, రాముని చూచి దుఃఖముతోను, మనస్తాపముతోను, నిండినవాడై ఆతని వైపు పరుగెత్తెను. 29

మూ. దృష్ట్వైవ విలలాపార్తో బాష్పసందిగ్ధయా గిరా,
అశక్నువన్ ధారయితుం ధైర్యాద్వచనమబ్రవీత్. 30

ప్ర. అ. దృష్ట్వైవ = చూడగానే, ఆర్తః = పీడితుడై, బాష్పసందిగ్ధయా = కన్నీటిచే అస్పష్టముగా నున్న, గిరా = వాక్కుతో, విలలాప = విలపించెను. ధైర్యాత్ = ధైర్యమువలన, ధారయితుమ్ = అణచుకొనుటకు, అశక్నువన్ = అసమర్థుడై, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భరతుడు రాముని చూడగానే దుఃఖపీడితుడై, బాష్పముచే అస్పష్టముగా నున్న వాక్కుతో విలపించెను. దుఃఖమును అణచుకొనుటకు తగిన ధైర్యము లేక ఇట్లు పలికెను. 30

మూ. యః సంసది ప్రకృతిభిర్భవేద్యుక్త ఉపాసితుమ్,
వన్యైర్మృగైరుపాసీనః సోఽయమాస్తే మమాగ్రజః. 31

ప్ర. అ. యః = ఎవ్వడు, సంసది = సభయందు, ప్రకృతిభిః = అమాత్యాది ప్రకృతులచేత, ఉపాసితుమ్ = దగ్గర కూర్చుండి సేవించుటకు, యుక్తః = తగినవాడు, భవేత్ = అగునో, సః = అట్టి, అయమ్ = ఈ, మమ = నాయొక్క, అగ్రజః = అన్నగారు, వన్యైః = వనమునందలి, మృగైః = మృగములచేత, ఉపాసీనః = దగ్గరకూర్చుండి సేవింపబడుచు, ఆస్తే = ఉన్నాడు.

తా. సభలో అమాత్యులు మొదలగు ప్రకృతులు చుట్టును కూర్చుండి సేవింపవలసిన మా అన్నగారు, అరణ్యమృగములు చుట్టును కూర్చుని ఉండగా ఇక్కడ ఉన్నాడు. 31

మూ. వాసోభిర్బహుసాహస్రైర్యో మహాత్మా పురోచితః,
మృగాజినే సోఽయమిహ ప్రవస్తే ధర్మమాచరన్. 32

ప్ర. అ. యః మహాత్మా = ఏ మహాత్ముడు, పురా = పూర్వము, బహుసాహస్రైః = అనేక సహస్రముల, వాసోభిః = వస్త్రములచేత, ఉచితః = అలవాటు పడినాడో, సః అయమ్ = అట్టి ఇతడు, ధర్మమ్ = ధర్మమును, ఆచరన్ = ఆచరించుచు, మృగాజినే = రెండు మృగాజినములను, ప్రవస్తే = ధరించి యున్నాడు.

తా. ఏ మహాత్ముడు పూర్వము వేలకొలది వస్త్రములకు అలవాటుపడి ఉండెనో అట్టివాడు ఇపుడు ధర్మాచరణము చేయుచు, రెండు మృగాజినములు ధరించి యున్నాడు. 32

మూ. అధారయద్యో వివిధాశ్చిత్రాః సుమనస స్తదా,
సోఽయం జటాభారమిమం వహతే రాఘవః కథమ్. 33

ప్ర. అ. యః=ఏ రాముడు, తదా=అపుడు, వివిధాః=అనేకవిధము లైన, చిత్రాః=చిత్ర మైన, సుమనసః=పుష్పములను, అధారయత్=ధరించెనో, సః=అట్టి, అయం రాఘవః=ఈ రాముడు, ఇమం జటాభారమ్=ఈజటాభారమును, కథమ్=ఎట్లు, వహతే=వహించుచున్నాడు?

తా. ఆ కాలమునందు, చిత్రవర్ణము లైన అనేకవిధముల పుష్పములను ధరించిన రాముడు, ఈ నాడు జటాభారమును ఎట్లు ధరించుచున్నాడో! 33

మూ. యస్య యజ్ఞైర్యథాదిష్టైర్యుక్తో ధర్మస్య సంచయః,
శరీరక్లేశసంభూతం స ధర్మం పరిమార్గతే. 34

ప్ర. అ. యథాదిష్టైః=యథావిహితము లైన, యజ్ఞైః=యజ్ఞములచేత, యస్య=ఎవనికి, ధర్మస్య=ధర్మముయొక్క, సంచయః=సంచయము(సంపాదనము) యుక్తః=తగినదో, సః=అట్టి రాముడు, శరీరక్లేశసంభూతమ్=శరీరక్లేశమువలన కలిగిన, ధర్మమ్=ధర్మమును, పరిమార్గతే=అన్వేషించుచున్నాడు.

తా. ఏ రాముడు శాస్త్రోక్తము లైన యజ్ఞములను ఆచరించి ధర్మసంపాదనము చేయవలెనో, అట్టి రాముడు, శరీరమును కష్టపెట్టుట ద్వారా కలుగు ధర్మమును ఆచరించుచున్నాడు. 34

మూ. చన్దనేన మహార్హేణ యస్యాఙ్గముపసేవితమ్,
మలేన తస్యాఙ్గమిదం కథమార్యస్య సేవ్యతే. 35

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, అఙ్గమ్=శరీరము, మహార్హేణ=గొప్పవెల గల, చన్దనేన=చందనముచేత, ఉపసేవితమ్=సేవింపబడినదో, తస్య=అట్టి, ఆర్యస్య=పూజ్యు డైన అన్నగారియొక్క, ఇదమ్ అఙ్గమ్=ఈ శరీరము, మలేన=మురికిచేత, కథమ్=ఎట్లు, సేవ్యతే=సేవించబడుచున్నదో!

తా. అమూల్య మైన చందనము పూసుకొనదగిన మా అన్నగారి శరీరము ఇపుడు మురికి పట్టి ఉన్నది కదా! 35

మూ. మన్నిమిత్తమిదం దుఃఖం ప్రాప్తో రామః సుఖోచితః,
ధిగ్జీవితం నృశంసస్య మమ లోకవిగర్హితమ్. 36

ప్ర. అ. సుఖోచితః = సుఖమునకు అలవాటుపడిన, రామః = రాముడు, మన్నిమిత్తమ్ = నా నిమిత్తమై, ఇదం దుఃఖమ్ = ఈ దుఃఖమును, ప్రాప్తః = పొందినాడు. నృశంసస్య = క్రూరుడ నైన, మమ = నాయొక్క, లోకవిగర్హితమ్ = లోకముచే నిందించబడిన, జీవితమ్ = జీవితమును గూర్చి, ధిక్ = నింద అగుగాక!

తా. సుఖమునకు అలవాటు పడిన రాముడు, నా మూలమున ఈ విధముగా కష్టపడుచున్నాడు. ఛీ! లోకులచే నిందింపబడుచున్న క్రూరుడ నైన నా జీవితము ఎందుకు? 36

మూ. ఇత్యేవం విలపన్ దీనః ప్రస్విన్నముఖపఙ్కజః,
పాదావప్రాప్య రామస్య పపాత భరతో రుదన్. 37

ప్ర. అ. భరతః = భరతుడు, దీనః = దీనుడై, ప్రస్విన్నముఖపఙ్కజః = అధికముగా చెమట పట్టిన ముఖపద్మము కలవాడై, ఇత్యేవమ్ = ఇట్లు, విలపన్ = విలపించుచు, రామస్య = రామునియొక్క, పాదౌ = పాదములను, అప్రాప్య = పొందకుండగానే, రుదన్ = ఏడ్చుచు, పపాత = నేలపై పడెను.

తా. భరతుడు దీనుడై, ముఖపద్మమునుండి చెమటలు కారుచుండగ, ఈ విధముగా విలపించుచు, రాముని పాదములు చేతులకు అందకుండగనే ఏడ్చుచు నేలపై పడెను. 37

మూ. దుఃఖాభితప్తో భరతో రాజపుత్రో మహాబలః,
ఉక్త్వార్యేతి సకృద్దీనం పునర్నోవాచ కించన. 38

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము కలవాడు, రాజపుత్రః = రాజకుమారుడు అయిన, భరతః = భరతుడు, దుఃఖాభితప్తః = దుఃఖముచే మిక్కిలి తపింప చేయబడినవాడై. ఆర్య ఇతి = పూజ్యుడా అని, సకృత్ = ఒక్కమారు, దీనమ్ = దీనముగా, ఉక్త్వా = పలికి, పునః = మరల, కించన = ఏమియు, నోవాచ = పలకలేదు.

తా. మహాబలశాలి, రాజపుత్రుడు అయిన భరతుడు దుఃఖపీడితు డై, "ఆర్యా !" అని ఒక్కసారి దీనముగా పలికి, పిదప ఏమియు మాటలాడలేక పోయెను. 38

మూ. బాష్పాభిహతకణ్ఠశ్చ ప్రేక్ష్య రామం యశస్వినమ్,
ఆర్యేత్యేవాథ సంక్రుశ్య వ్యాహర్తుం నాశకత్తదా. 39

ప్ర. అ. యశస్వినమ్ = యశశ్శాలి యైన, రామమ్ = రాముని, ప్రేక్ష్య = చూచి, బాష్పాభిహతకణ్ఠశ్చ = బాష్పము చే కొట్టబడిన కంఠముకలవాడై, అథ = పిమ్మట, ఆర్యేత్యేవ = ఓ ఆర్యా ! అని మాత్రమే, సంక్రుశ్య = అరచి, తదా = అపుడు, వ్యాహర్తుమ్ = మాటలాడుటకు, నాశకత్ = సమర్థుడు కాలేదు.

తా. యశఃశాలి యైన రాముని చూచి, బాష్పము కంఠమును అడ్డుకొనుచుండగా, "ఓ ఆర్యా !" అని మాత్రమే అరచి, ఇంక ఏమియు మాటలాడలేక పోయెను. 39

మూ. శత్రుఘ్నశ్చాపి రామస్య వవన్దే చరణౌ రుదన్,
తావుభౌ స సమాలిఙ్గ్య రామశ్చాశ్రూణ్యవర్తయత్. 40

ప్ర. అ. శత్రుఘ్నశ్చాపి = శత్రుఘ్నుడు కూడ, రుదన్ = ఏడ్చుచు, రామస్య = రామునియొక్క, చరణౌ = పాదములను, వవన్దే = నమస్కరించెను. సః రామశ్చ = ఆ రాముడుకూడ, తౌ ఉభౌ = వారిద్దరిని, సమాలిఙ్గ్య = కౌగలించుకొని, అశ్రూణి = కన్నీళ్ళను, అవర్తయత్ = విడిచెను.

తా. శత్రుఘ్నుడు కూడ ఏడ్చుచు, రాముని పాదములకు నమస్కరించెను. రాముడు వారిద్దరిని కౌగలించుకొని కన్నీళ్లు కార్చెను. 40

మూ. తతస్సుమన్త్రేణ గుహేన చైవ
సమీయతూ రాజసుతావరణ్యే,
దివాకరశ్చైవ నిశాకరశ్చ
యథామ్బరే శుక్రబృహస్పతిభ్యామ్. 41

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అరణ్యే = అరణ్యమునందు, రాజసుతౌ = రాజకుమారు లైన రామలక్ష్మణులు, అమ్బరే = ఆకాశమునందు, దివాకరశ్చైవ

=సూర్యుడు, నిశాకరశ్చ=చంద్రుడు, శుక్రబృహస్పతిభ్యామ్=శుక్రబృహస్పతులతో, యథా=ఎట్లో అట్లే, సుమన్త్రేణ=సుమంత్రునితోను, గుహేన చైవ=గుహునితోను, సమీయతుః=కలిసిరి.

తా. పిమ్మట ఆ రామలక్ష్మణులు అరణ్యములో సూర్యచంద్రులు ఆకాశమునందు శుక్రబృహస్పతులతో కలసి నట్లు సుమంత్రునితోను, గుహునితోను కలిసిరి. 41

మూ. తాన్ పార్థివాన్ వారణయూథపాభాన్
సమాగతాం స్తత్ర మహత్యరణ్యే,
వనౌకసస్తేపి సమీక్ష్య సర్వేఽ
ప్యశ్రూణ్యముఞ్చన్ ప్రవిహాయ హర్షమ్. 42

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనశతతమః సర్గః.

ప్ర. అ. తే=ఆ, సర్వే=సమస్తమైన, వనౌకసః=అరణ్యములో నివసించువారు, తత్ర=ఆ, మహతి=గొప్పదైన, అరణ్యే=అరణ్యమునందు, సమాగతాన్=కలిసిన, వారణయూథపాభాన్=శ్రేష్ఠములైన గజముల వంటి కాంతి గల, తాన్ పార్థివాన్=ఆ రాజులను, సమీక్ష్య=చూచి, హర్షమ్=సంతోషమును, ప్రవిహాయ=విడిచి, అశ్రూణి=కన్నీళ్లను, అముఞ్చన్=విడిచిరి.

తా. అరణ్యములో నివసించు ఋషులు మొదలగువారందరు, ఆ మహారణ్యములో కలిసిన మహాగజసమానులైన ఆ రాజకుమారులను చూచి, దుఃఖముతో కన్నీళ్లు కార్చిరి. 42

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
తొంబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ శతతమః సర్గః

[శ్రీరాముడు భరతునకు పశల మడుగుట అను వ్యాజముతో రాజ నీతి నుపదేశించుట.]

మూ. జటిలం చీరవసనం ప్రాఞ్జలిం పతితం భువి,
దదర్శ రామో దుర్దర్శం యుగాన్తే భాస్కరం యథా. 1

ప్ర. అ. రామః=రాముడు, జటిలమ్ = జటలు ధరించినవాడు, చీరవసనమ్=నారచీరలు కట్టుకొన్నవాడు, ప్రాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలి కలవాడు, భువి=నేలపై, పతితమ్=పడినవాడు, యుగాన్తే=ప్రళయకాలమునందు, భాస్కరం యథా=సూర్యుడు వలె, దుర్దర్శమ్=చూచుటకు శక్యము కానివాడు అయిన ఆ భరతుని, దదర్శ=చూచెను.

తా. జటలను ధరించినవాడు, నారచీరలను కట్టుకున్నవాడు, ప్రళయ కాలసూర్యుడు వలె చూడ శక్యము కాకున్నవాడు అయిన భరతుడు అంజలి ఘటించి నేలపై బడియుండగా రాముడు చూచెను. 1

మూ. కథంచిదభివిజ్ఞాయ వివర్ణవదనం కృశమ్,
భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా. 2

ప్ర. అ. రామః = రాముడు, వివర్ణవదనమ్ = మారిపోయిన రంగు గల ముఖము గలవాడు, కృశమ్=కృశించినవాడు అయిన, భ్రాతరమ్=సోదరుడైన, భరతమ్ = భరతుని, కథంచిత్ = అతికష్టముగా, అభివిజ్ఞాయ = గుర్తించి, బాహునా = బాహువుచేత, పరిజగ్రాహ = పట్టుకొనెను.

తా. ముఖము రంగు మారిపోయి, కృశించి యున్న సోదరుడైన భరతుని రాముడు ఎట్లో గుర్తించి, బాహువును పట్టుకొని లేవదీసెను. 2

మూ. ఆఘ్రాయ రామ స్తం మూర్ధ్ని పరిష్వజ్య చ రాఘవః,
అఙ్కే భరతమారోప్య పర్యపృచ్ఛత్సమాహితః. 3

ప్ర. అ. రాఘవః = రఘువంశమునందు పుట్టిన, రామః = రాముడు, తం భరతమ్ = ఆ భరతుని, మూర్ధ్ని = శిరస్సునందు, ఆఘ్రాయ = వాసనచూసి, పరిష్వజ్య చ = కౌగలించుకొని, అఙ్కే = తొడపై, ఆరోప్య = కూర్చుండపెట్టుకొని, సమాహితః = సావధానచిత్తుడై, పర్యపృచ్ఛత్ = అడిగెను.

తా. రాముడు ఆ భరతుని కౌగలించుకొని, అతని శిరస్సు వాసన చూచి, (ముద్దిడుకొని) ఒడిలో కూర్చుండబెట్టుకొని, సావధానచిత్తుడై, ఇట్లు ప్రశ్నించెను.

మూ. క్వ ను తేఽభూత్పితా తాత యదరణ్యం త్వమాగతః,
న హి త్వం జీవత స్తస్య వనమాగన్తుమర్హసి. 4

ప్ర. అ. తాత! = ఓ తండ్రీ ! త్వమ్ = నీవు, అరణ్యమ్ = అరణ్యమును గూర్చి, యత్ ఆగతః = వచ్చితివి కదా ! తే పితా = నీ తండ్రి, క్వ ను = ఎక్కడ, అభూత్ = ఉండెను? తస్య = ఆతడు, జీవతః = జీవించియుండగా, త్వమ్ = నీవు, వనమ్ = వనమును గూర్చి, ఆగన్తుమ్ = వచ్చుటకు, న అర్హసి హి = తగవు కదా!

తా. నాయనా! నీ విపుడు, అరణ్యమునకు వచ్చినావే నీ తండ్రి, దశరథ మహారాజు, ఎక్కడికి వెళ్ళినాడు? ఆయన జీవించియుండగా నీవు అరణ్యమునకు రాజాలవు కదా? 4

మూ. చిరస్య బత పశ్యామి దూరాద్భరతమాగతమ్,
దుష్ప్రతీకమరణ్యేఽస్మిన్ కిం తాత వనమాగతః. 5

ప్ర. అ. అస్మిన్ అరణ్యే = ఈ అరణ్యమునందు, దూరాత్ = దూరమునుండి, ఆగతమ్ = వచ్చిన, దుష్ప్రతీకం = కృశించిన శరీరము గల, భరతమ్ = భరతుని, చిరస్య = చాలాకాలమునకు, పశ్యామి = చూచుచున్నాను. బత = సంతోషము. తాత = ఓ తండ్రీ! వనమ్ = వనమును గూర్చి, కిమ్ = ఎందుకు, ఆగతః = వచ్చినావు?

తా. కృశించి, గుర్తు పట్టరాని శరీరముతో, చాల దూరమునుండి వచ్చిన

భరతుని చాలకాలమునకు నేడు చూడగలుగుచున్నాను. సంతోషము. నాయనా! నీవు అరణ్యమునకు ఎందుకు వచ్చినావు? 5

మూ. కచ్చిద్ధారయతే తాత రాజా యత్త్వమిహాగతః,
కచ్చిన్న దీనః సహసా రాజా లోకాన్తరం గతః. 6

ప్ర. అ. తాత! = నాయనా! త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడికి, యత్ ఆగతః = వచ్చినావే; రాజా = దశరథమహారాజు, కచ్చిద్ధారయతే = జీవించి ఉన్నాడు కదా? రాజా = రాజు, దీనః = దీనుడై, సహసా = వెంటనే, లోకాన్తరమ్ = పరలోకమునుగూర్చి. న గతః కచ్చిత్ = వెళ్లలేదు కదా?

తా. నాయనా! నీవు ఇక్కడకు వచ్చితివే; దశరథమహారాజు జీవించి ఉన్నాడుకదా? ఆయన దుఃఖాక్రాంతుడై, పరలోకమునకు వెళ్లలేదు కదా? 6

మూ. కచ్చిత్సౌమ్య న తే రాజ్యం భ్రష్టం బాలస్య శాశ్వతమ్,
కచ్చిచ్ఛుశ్రూషసే తాత పితరం సత్యవిక్రమమ్. 7

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా, బాలస్య = చిన్నవాడవైన, తే = నీయొక్క, శాశ్వతమ్ = శాశ్వతమైన, రాజ్యమ్ = రాజ్యము, న భ్రష్టం కచ్చిత్ = భ్రష్టము కాలేదు గదా? తాత = నాయనా! సత్యవిక్రమమ్ = సత్యమైన పరాక్రమము గల, పితరమ్ = తండ్రిని, శుశ్రూషసే కచ్చిత్ = శుశ్రూష చేయుచున్నావా!

తా. ఓ సౌమ్యుడా! నీవు చిన్నవాడవగుటచే, శాశ్వతమైన రాజ్యమును కోల్పోలేదు కదా? సత్యపరాక్రముడైన తండ్రికి శుశ్రూష చేయుచున్నావు కదా?

మూ. కచ్చిద్దశరథో రాజా కుశలీ సత్యసంగరః,
రాజసూయాశ్వమేధానామాహర్తా ధర్మనిశ్చయః. 8

ప్ర. అ. సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు, రాజసూయాశ్వమేధానామ్ = రాజసూయాశ్వమేధయాగములయొక్క, ఆహర్తా = చేయువాడు, ధర్మనిశ్చయః = ధర్మమునందు నిశ్చయము కలవాడు అయిన, రాజా దశరథః = దశరథమహారాజు, కచ్చిత్ కుశలీ = క్షేమముగా ఉన్నాడు కదా?

తా. సత్యప్రతిజ్ఞావంతుడు, రాజసూయాశ్వమేధయాగములను చేసినవాడు, ధర్మమునందు స్థిరబుద్ధి కలవాడు అయిన దశరథమహారాజు కుశలముగా ఉన్నాడు కదా? 8

మూ. స కచ్చిద్బ్రాహ్మణో విద్వాన్ ధర్మనిత్యో మహాద్యుతిః,
ఇక్ష్వాకూణాముపాధ్యాయో యథావత్తాత పూజ్యతే. 9

ప్ర. అ. తాత = నాయనా, బ్రాహ్మణః = వేదవేత్త, విద్వాన్ = విద్వాంసుడు, ధర్మనిత్యః = ధర్మమునందు స్థిరుడు, మహాద్యుతిః = గొప్ప కాంతి కలవాడు అయిన, సః = ఆ, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయుల, ఉపాధ్యాయః = గురువు, యథావత్ = మునుపటివలె, పూజ్యతే కచ్చిత్ = పూజింపబడుచున్నాడా?

తా. నాయనా! వేదవేత్త, విద్వాంసుడు, ధర్మనిరతుడు, మహాకాంతిశాలియైన, ఆ ఇక్ష్వాకువంశపురోహితుడైన వసిష్ఠుని వెనుకటి వలె పూజించుచున్నావు కదా!

మూ. సా తాత కచ్చిత్కౌసల్యా సుమిత్రా చ ప్రజావతీ,
సుఖినీ కచ్చిదార్యా చ దేవీ నన్దతి కైకయీ. 10

ప్ర. అ. తాత = నాయనా, సా కౌసల్యా = ఆ కౌసల్య, సుఖినీ కచ్చిత్ = సుఖము కలదికదా? ప్రజావతీ = సత్సంతానము గల, సుమిత్రా చ = సుమిత్ర కూడ, సుఖవంతురాలు కదా? ఆర్యా = పూజ్యురాలు, దేవీ = రాణియైన, కైకయీ = కైకేయి, నన్దతి కచ్చిత్ = సంతోషించుచున్నది కదా?

తా. నాయనా! కౌసల్య, మంచి సంతానము గల సుమిత్ర సుఖముగా ఉన్నారు కదా? పూజ్యురాలూ, రాణీ అయిన కైకేయి సంతోషముగా ఉన్నది కదా? 10

మూ. కచ్చిద్వినయసమ్పన్నః కులపుత్రో బహుశ్రుతః,
అనసూయురనుద్రష్టా స కృతస్తే పురోహితః. 11

ప్ర. అ. వినయసమ్పన్నః = వినయముతో కూడినవాడు, కులపుత్రః = ఉత్తమకులమునకు చెందిన పుత్రుడు, బహుశ్రుతః = అధికమైన శాస్త్రజ్ఞానము కలవాడు, అనసూయుః = అసూయ లేనివాడు, అనుద్రష్టా = విషయములను

చూపించువాడు అయిన, పురోహితః=పురోహితుడు, తే=నీకు, (నీచేత) సత్కృతః కచ్చిత్=సత్కరించబడుచున్నాడు కదా?

తా. వినయసంపన్నుడు, ఉత్తమకులమునందు పుట్టినవాడు, అధిక మైన శాస్త్రజ్ఞానము కలవాడు, అసూయలేనివాడు, కర్తవ్యవిషయములను బోధించువాడు అయిన పురోహితుని [వశిష్ఠుని కుమారు డైన సుయజ్ఞుని] సత్కరించుచున్నావు కదా! 11

మూ. కచ్చిదగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమానృజుః,
హుతం చ హోష్యమాణం చ కాలే వేదయతే సదా. 12

ప్ర. అ. తే=నీయొక్క, అగ్నిషు=అగ్నులయందు, యుక్తః=శ్రద్ధ కలవాడు, విధిజ్ఞః=శాస్త్రముల నెరింగినవాడు, మతిమాన్=బుద్ధిమంతుడు, ఋజుః=ఋజుస్వభావము కలవాడు అయిన పురోహితుడు, సదా=ఎల్లప్పుడు, హుతం చ=హోమము చేయబడినదానిని, హోష్యమాణం చ=హోమము చేయబడనున్నదానిని, కాలే=తగినకాలమునందు, వేదయతే కచ్చిత్=తెలియపరచుచున్నాడు కదా?

తా. శాస్త్రవిధి తెలిసినవాడూ, బుద్ధిమంతుడూ, కపటము ఎరుగనివాడూ అయిన పురోహితుడు నీ అగ్నుల విషయమున శ్రద్ధ కలవాడై, ఎప్పుడు ఏ హోమములు జరిగెనో, ఎప్పుడు ఏ హోమములు జరుగవలెనో నీకు ఎల్లపుడు చెప్పుచున్నాడు కదా! 12

మూ. కచ్చిద్దేవాన్ పితౄన్ మాతౄర్గురూన్ పితృసమానపి,
వృద్ధాంశ్చ తాత వైద్యాంశ్చ బ్రాహ్మణాంశ్చాభిమన్యసే.

ప్ర. అ. తాత=నాయనా! దేవాన్=దేవతలను, పితౄన్=తండ్రులను, మాతౄః=తల్లులను, గురూన్=గురువులను, పితృసమానపి=తండ్రితో సమాను లైన బంధువులను, వృద్ధాంశ్చ=వృద్ధులను, వైద్యాంశ్చ=వైద్యులను, బ్రాహ్మణాంశ్చ=బ్రాహ్మణులను, అభిమన్యసే కచ్చిత్=గౌరవించుచున్నావా!

తా. నాయనా! నీవు దేవతలను, తల్లులను, తండ్రులను, గురువులను, తండ్రితో సమాను లైన బంధువులను, వృద్ధులను, వైద్యులను, బ్రాహ్మణులను గౌరవించుచున్నావు కదా! 13

మూ. ఇష్వస్త్రవరసంపన్నమర్థశాస్త్రవిశారదమ్,
సుధన్వానముపాధ్యాయం కచ్చిత్త్వం తాత మన్యసే. 14

ప్ర. అ. తాత = నాయనా! ఇష్వస్త్రవరసంపన్నమ్ = బాణములలోను, అస్త్రములలోను శ్రేష్ఠమైనవాటితో కూడినవాడు, అర్థశాస్త్రవిశారదమ్ = రాజనీతి శాస్త్రమునందు పండితుడు, ఉపాధ్యాయమ్ = ఉపాధ్యాయుడు అయిన, సుధన్వానమ్ = సుధన్వుని, త్వమ్ = నీవు, మన్యసే కచ్చిత్ = గౌరవించుచున్నావు కదా?

తా. తండ్రీ! శ్రేష్ఠములైన బాణములు, అస్త్రములు కలవాడు, రాజనీతి శాస్త్రములో నిష్ణాతుడు, ఉపాధ్యాయుడు అయిన సుధ్వనుని గౌరవించుచున్నావు కదా! 14

మూ. కచ్చిదాత్మసమాః శూరాః శ్రుతవన్తో జితేన్ద్రియాః,
కులీనాశ్చేఙ్గితజ్ఞాశ్చ కృతాస్తే తాత మన్త్రిణః. 15

ప్ర. అ. తాత = తండ్రీ, ఆత్మసమాః = నీతో సమానులూ, శూరాః = శూరులు, శ్రుతవన్తః = శాస్త్రాభ్యాసము కలవారు, జితేన్ద్రియాః = జయింపబడిన ఇంద్రియములు కలవారు, కులీనాశ్చ = ఉత్తమకులమునందు పుట్టినవారు, ఇఙ్గితజ్ఞాశ్చ = మనస్సులోని అభిప్రాయమును తెలుసుకొనువారు అయిన పురుషులు, తే = నీకు, మన్త్రిణః = మంత్రులుగా, కృతాః కచ్చిత్ = చేయబడినారుకదా!

తా. నీవు, నీతో సమానులు, శూరులు, విద్యావంతులు, జితేంద్రియులు ఉత్తమకులమునందు పుట్టినవారు, మనస్సులోని భావములను తెలుసుకొనగలిగిన వారు అయినవారినే మంత్రులుగా నియమించినావు కదా? 15

మూ. మన్త్రో విజయమూలం హి రాజ్ఞాం భవతి రాఘవ,
సుసంవృతో మన్త్రిధరైరమాత్యైః శాస్త్రకోవిదైః. 16

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! శాస్త్రకోవిదైః = శాస్త్రములలో పండితులు, మన్త్రిధరైః = ఆలోచనలను ధరింపగలిగినవారు అయిన, అమాత్యైః = మంత్రులచేత, సుసంవృతః = చక్కగా దాచబడిన, మన్త్రః = ఆలోచన, రాజ్ఞామ్ = రాజులకు, విజయమూలమ్ = విజయమునకు కారణము, భవతి హి = అగును కదా!

తా. భరతా! శాస్త్రపండితులు, ఆలోచనలను తమలోనే ఉంచుకొనగల వారు అయిన అమాత్యులు రహస్యముగా ఉంచిన ఆలోచనలవలననే రాజులకు విజయము లభించునుకదా? 16

మూ. కచ్చిన్నిద్రావశం నైషిః కచ్చిత్కాలే ప్రబుధ్యసే,
కచ్చిచ్చాపరరాత్రేషు చింతయస్యర్థనైపుణమ్. 17

ప్ర. అ. నిద్రావశమ్ = నిద్రకు లొంగిపోవుటను, నైషిః కచ్చిత్ = (నీవు) పొందుట లేదు కదా? కాలే = తగిన కాలమునందు, ప్రబుధ్యసే కచ్చిత్ = మేల్కొనుచున్నావు కదా? అపరరాత్రేషు = తెల్లవారుఝాములందు, అర్థనైపుణమ్ = కర్తవ్యముల నేర్పును గూర్చి, చిన్తయసి కచ్చిత్ = ఆలోచించుచున్నావు కదా!

తా. నీవు నిద్రకు వశుడవు అగుటలేదు కదా? తగు కాలమునందు మేల్కొనుచున్నావు కదా? వివిధకార్యముల సామర్థ్యమును గూర్చి తెల్లవారు జామునందు ఆలోచించుచున్నావు కదా. 17

మూ. కచ్చిన్మన్త్రయసే నైకః కచ్చిన్న బహుభిస్సహ,
కచ్చిత్తే మన్త్రితో మన్త్రో రాష్ట్రం న పరిధావతి. 18

ప్ర. అ. ఏకః = ఒంటరివాడవై, న మన్త్రయసే కచ్చిత్ = ఆలోచించుట లేదు కదా! బహుభిస్సహ = చాలమందితో, న కచ్చిత్ = ఆలోచించుటలేదు కదా? మన్త్రితః = ఆలోచించబడిన, తే మన్త్రః = నీ ఆలోచన, రాష్ట్రమ్ = రాజ్యమును గూర్చి, న పరిధావతి కచ్చిత్ = పరుగెత్తుటలేదు కదా?

తా. నీవు ఒక్కడవే ఆలోచించుటలేదు కదా! చాల మందితో ఆలోచించుటలేదు కదా? నీ ఆలోచన రాజ్యములోని వారి కందరికిని తెలిసిపోవుట లేదు కదా. 18

మూ. కచ్చిదర్థం వినిశ్చిత్య లఘుమూలం మహోదయమ్,
క్షిప్రమారభసే కర్తుం న దీర్ఘయసి రాఘవ. 19

ప్ర. అ. రాఘవ = భరతా! లఘుమూలమ్ = స్వల్పమైన సాధనములు కలది, మహోదయమ్ = గొప్ప ఫలము కలది అయిన, అర్థమ్ = కార్యమును, వినిశ్చిత్య = నిశ్చయించి, క్షిప్రమ్ = శీఘ్రముగా, కర్తుమ్ = చేయుటకు, ఆరభసే

కచ్చిత్ = ఆరంభించుచున్నావు కదా: న దీర్ఘయసి = అలస్యము చేయుట లేదు కదా?

తా. భరతా! స్వల్ప మైన ప్రయత్నములతో ఎక్కువ ఫలమును సాధింప కల్గిన కార్యమును నిశ్చయించి ఆలస్యము చేయకుండగ వెంటనే దానిని ప్రారంభించుచున్నావు కదా. 19

మూ. కచ్చిత్తు సుకృతాన్యేవ కృతరూపాణి వా పునః,
విదుస్తే సర్వకార్యాణి న కర్తవ్యాని పార్థివాః. 20

ప్ర. అ. పార్థివాః = ఇతరరాజులు, సుకృతాన్యేవ = చక్కగా పూర్తి చేయబడినవి, పునః = మరియు, కృతరూపాణి వా = చాలవరకు చేయబడినవి అయిన, తే = నీయొక్క, సర్వకార్యాణి = సమస్త కార్యములను మాత్రమే, విదుః కచ్చిత్ = తెలుసు కొనుచున్నారుకదా? కర్తవ్యాని = మున్ముందు చేయదగిన కార్యములను, న = తెలుసుకొనుటలేదు కదా!

తా. ఇతర రాజులు, నీవు చక్కగా పూర్తి చేసిన పనులను, లేదా చాల వరకు పూర్తిచేసిన పనులను మాత్రమే తెలుసుకొనుచున్నారుకదా? నీవు మున్ముందు చేయ దలపెట్టిన పనులు వారికి తెలియుటలేదు కదా! 20

మూ కచ్చిన్న తర్కైర్యుక్త్యా వా యే చాప్యపరికీర్తితాః,
త్వయా వా తవ వామాత్యైర్బుధ్యతే తాత మన్త్రితమ్.

ప్ర. అ. తాత! = తండ్రీ! త్వయా వా = నీచేత గాని, తవ = నీయొక్క, అమాత్యైర్వా = మంత్రులచేత గాని, మన్త్రితమ్ = ఆలోచింపబడిన విషయము, తర్కైః = ఊహాల చేత గాని, యుక్త్యా వా = యుక్తి చేత గాని, యే చాపి = ఏ ఉపాయములు, అపరికీర్తితాః = చెప్పబడలేదో, ఆ ఉపాయముల చేత గాని, (ఇతరుల చేత) కచ్చిన్న బుధ్యతే = తెలియబడుటలేదు కదా!

తా. నాయనా! ఇతరు లెవ్వరును, ఊహలచేత గాని, యుక్తి చేత గాని, ఇతరోపాయములచేత గాని, నీ ఆలోచనలను, నీ మంత్రులు చేసిన ఆలోచనలను తెలిసికొనుటలేదుకదా? 21

మూ. కచ్చిత్సహస్రాన్మూర్ఖాణామేకమిచ్ఛసి పణ్డితమ్,
పణ్డితో హ్యర్థకృచ్ఛ్రేషు కుర్యాన్నిఃశ్రేయసం మహత్.

ప్ర. అ. మూర్ఖాణామ్ = మూర్ఖులయొక్క, సహస్రాత్ = సహస్రము కంటె, ఏకమ్=ఒక్క, పణ్డితమ్=పండితుని, ఇచ్ఛసి కచ్చిత్=కోరుచున్నావు కదా? అర్థకృచ్ఛ్రేషు = కార్యసంకటములయందు, పణ్డితః = పండితుడు, మహత్=గొప్ప, నిశ్శ్రేయసమ్=క్షేమమును, కుర్యాత్ = చేయును.

తా. వేయిమంది మూర్ఖులను విడచి యైనను ఒక్క పండితుని చేరదీయుటకు ప్రయత్నించుచున్నావు కదా! ఎందుచేతననగా కార్య సంకటములు ఏర్పడినపుడు పండితుడు గొప్ప సాహాయ్యమును చేయగలడు. 22

మూ. సహస్రాణ్యపి మూర్ఖాణాం యద్యుపాస్తే మహీపతిః,
అథవాప్యయుతాన్యేవ నాస్తి తేషు సహాయతా. 23

ప్ర. అ. మహీపతిః = రాజు, మూర్ఖాణామ్ = మూర్ఖులయొక్క, సహస్రాణి = సహస్రములను, అథవా = లేక. అయుతాన్యేవ = పది వేలను, ఉపాస్తే యద్యపి = ఆశ్రయించినను, తేషు = వారిలో, సహాయతా = సహాయత్వము, నాస్తి = లేదు.

తా. రాజు మూర్ఖులను వేలకొలది, లేదా అయుతములకొలది చేరదీసినను, వారు ఏట్టి సాహాయ్యము చేయజాలరు. 23

మూ. ఏకోఽప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః,
రాజానం రాజమాత్రం వా ప్రాపయేన్మహతీం శ్రియమ్.

ప్ర. అ. మేధావీ=బుద్ధిమంతుడు, శూరః=శూరుడు, దక్షః=సమర్థుడు, విచక్షణః = పండితుడు అయిన, ఏకః అమాత్యోపి = ఒక్క మంత్రి యైనను, రాజానమ్ = రాజును గాని, రాజమాత్రం వా=చిన్నప్రభువును గాని, మహతీమ్ గొప్ప, శ్రియమ్ = ఐశ్వర్యమును, ప్రాపయేత్ = పొందించును.

తా. మేధాశాలి, శూరుడు, సమర్థుడు, పండితుడు అయిన మంత్రి ఒక్కడున్నను, రాజునకు లేదా చిన్న ప్రభువునకు గొప్ప అభివృద్ధి కలుగు నట్లు చేయును. 24

మూ. కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషు చ మధ్యమాః,
జఘన్యాస్తు జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః. 25

ప్ర. అ. ముఖ్యాః = ఉత్తము లైన, భృత్యాః = భృత్యులు, మహత్సు = గొప్ప వైన, కర్మసు ఏవ = కార్యములయందే, యోజితాః కచ్చిత్ = నియోగింపబడినారు కదా। మధ్యమాః = మధ్యములు, మధ్యమేషు చ = మధ్యమ కార్యములయందు. జఘన్యాః తు = అధములు, జఘన్యేషు = అధమకార్యములందు, యోజితాః కచ్చిత్ = నియమింపబడినారు కదా।

తా. నీవు అధిక మైన సామర్థ్యము గల సేవకులను ఉత్తమకార్యములు చేయుటకు, సామాన్య మైన సామర్థ్యము కలవారిని సామాన్య మైన పనులు చేయుటకు చాలా తక్కువ సామర్థ్యము కలవారిని అధమ మైన కార్యములు చేయుటకు నియోగించినావు కదా? 25

మూ. అమాత్యానుపధాతీతాన్ పితృపైతామహాన్ శుచీన్,
శ్రేష్ఠాన్ శ్రేష్ఠేషు కచ్చిత్త్వం నియోజయసి కర్మసు. 26

ప్ర. అ. ఉపధాతీతాన్ = రహస్య మైన వివిధపరీక్షలను దాటినవారు, పితృపైతామహాన్ = తండ్రితాతలనుండి వచ్చినవారు, శుచీన్ = పరిశుద్ధ మైన నడవడిక కలవారు, శ్రేష్ఠాన్ = శ్రేష్ఠులు అయిన, అమాత్యాన్ = మంత్రులను, త్వమ్ = నీవు, శ్రేష్ఠేషు = శ్రేష్ఠ మైన. కర్మసు = పనులయందు, నియోజయసి కచ్చిత్ = నియోగించుచున్నావు కదా!

తా. రహస్య మైన పరీక్షలకు నిలిచినవారు. పితృపితామహక్రమమున వచ్చుచున్నవారు, పరిశుద్ధ మైన నడవడిక కలవారు, శ్రేష్ఠులు అయిన అమాత్యులను శ్రేష్ఠ మైన పనులు చేయుటకు నియోగించుచున్నావు కదా!

వి. ఉన్నతపదవులలో నియమించుటకు ముందు వారికి అనేక మైన ప్రలోభనములు (అనగా లంచములు స్త్రీలు మొదలగునవి) చూపివారు ఆప్రలోభనములకు లొంగక ఉత్తమచరిత్రగలవారుగా తేలినప్పుడు వారిని నియమించవలెను. ఇట్టి ప్రలోభనములకు "ఉపధా"అని పేరు. ఇది చాణక్యుని అర్థశాస్త్రము మొదలగు గ్రంథములలో సవిస్తరముగా చెప్పబడినది. 26

మూ. కచ్చిన్నోగ్రేణ దణ్డేన భృశముద్వేజితప్రజమ్,
రాజ్యం తవానుజానన్తి మన్త్రిణః కైకయీసుత. 27

ప్ర. అ. కైకయీసుత = భరతుడా ! ఉగ్రేణ = తీక్ష్ణమయిన, దణ్డేన = దండముచేత, భృశమ్ = మిక్కిలి, తవ = నీయొక్క, రాజ్యమ్ = రాజ్యమును, ఉద్వేజితప్రజమ్=భయపెట్టబడిన ప్రజలు కలదానినిగా, మన్త్రిణః = మంత్రులు, నానుజానన్తి కచ్చిత్ = అనుమతించరుకదా!

తా. భరతా! నీ రాజ్యములోని ప్రజలందరు, తీక్ష్ణము లైన దండనములచే భయపడిపోవుచుండగా నీ మంత్రులు ఊరక చూచుచుందరు కదా? 27

మూ. కచ్చిత్త్వాం నావజానన్తి యాజకాః పతితం యథా,
ఉగ్రప్రతిగ్రహీతారం కామయానమివ స్త్రియః. 28

ప్ర. అ. యాజకాః=యాగము చేయించువారు, ఉగ్రప్రతిగ్రహీతారమ్= భయంకర మైన దుర్దానములు ప్రతిగ్రహించు, పతితం యథా = పతితునివలె, స్త్రియః=స్త్రీలు, కామయానమ్ ఇవ = కాముకుని వలె, త్వామ్ = నిన్ను, నావజానన్తి కచ్చిత్=అవమానించరుకదా !

తా. సదాచారసంపన్ను లైన ఋత్విక్కులు, భయంకర మైన దుర్దానములు ప్రతిగ్రహించు పతితుని అవమానించి నట్లు, స్త్రీలు కాముకుని అవమానించి నట్లు, మంత్రులు నిన్ను అవమానించుటలేదుకదా? 28

మూ. ఉపాయకుశలం వైద్యం భృత్యసందూషణే రతమ్,
శూర మైశ్వర్యకామం చ యో న హన్తి స హన్యతే. 29

ప్ర. అ. ఉపాయకుశలమ్ = సామాద్యుపాయములందు నేర్పు కలవాడు, వైద్యమ్=విద్యావంతుడు, శూరమ్=శూరుడు, ఐశ్వర్యకామం చ = ఐశ్వర్యము నందు కోరిక గలవాడు, భృత్యసందూషణే = భృత్యుల సందూషణమునందు, (లేనిపోనివి చెప్పి సేవకుల మనస్సు విరిచి, వారిని ప్రభువునకు ఎదురుతిరుగునట్లు చేయుట "భృత్యసందూషణము") రతమ్ = ఆసక్తి కలవాడు అయిన వానిని, యః=ఎవడు, న హన్తి=చంపడో, సః=అతడు, హన్యతే=చంపబడును.

తా. సామాద్యుపాయములందు నేర్పు గలిగి, విద్యావంతు డైన శూరు డెవ

డైన అధికారవాంఛతో, రాజు అంతరంగసేవకులలో భేదము కల్గించుటకు ప్రయత్నించినచో రాజు అట్టివానిని చంపివేయవలెను. అట్లు చేయనిచో ఆ రాజే నశించును. 29

మూ. కచ్చిద్ధృష్టశ్చ శూరశ్చ మతిమాన్ ధృతిమాన్ శుచిః,
కులీనశ్చానురక్తశ్చ దక్షః సేనాపతిః కృతః. 30

ప్ర. అ. హృష్టశ్చ=సంతోషించినవాడు, శూరశ్చ=శూరుడు, మతిమాన్ = బుద్ధిమంతుడు, ధృతిమాన్=ధైర్యవంతుడు, శుచిః=పరిశుద్ధమైన నడవడిక కలవాడు, కులీనశ్చ=ఉత్తమకులమునందు పుట్టినవాడు, అనురక్తశ్చ=రాజభక్తి కలవాడు, దక్షః=సమర్థుడు అయిన, సేనాపతిః=సేనాపతి, కృతః కచ్చిత్ = చేయబడినాడా!

తా. తృప్తికలవాడు, శూరుడు, బుద్ధిమంతుడు, ధైర్యవంతుడు, నిజాయితీ కలవాడు, ఉత్తమకులసంజాతుడు, రాజభక్తి కలవాడు, సమర్థుడు అయినవానిని సేనాపతిగా చేసినావుకదా? 30

మూ. బలవన్తశ్చ కచ్చిత్తే ముఖ్యా యుద్ధవిశారదాః,
దృష్టాపదానా విక్రాన్తాస్త్వయా సత్కృత్య మానితాః. 31

ప్ర. అ. బలవన్తః = అధికమైన బలము కలవారు, యుద్ధవిశారదాః = యుద్ధమునందు నేర్పు గలవారు, దృష్టాపదానాః = చూడబడిన పూర్వపు ఉత్తమ కార్యములు కలవారు, విక్రాన్తాః=శూరులు అయిన, తే=ఆ, ముఖ్యాః = ముఖ్యులైన వీరులు, త్వయా=నీచేత, సత్కృత్య=సత్కరించి, మానితాః కచ్చిత్ = గౌరవింపబడినారా!

తా. బలవంతులు, యుద్ధములో నేర్పు గలవారు, పూర్వమెన్నియో ఘన కార్యములు సాధించినవారు, శూరులు అయిన వీరులను సత్కరించి గౌరవించు చున్నావుకదా! 31

మూ. కచ్చిద్బలస్య భక్తం చ వేతనం చ యథోచితమ్,
సంప్రాప్తకాలం దాతవ్యం దదాసి న విలమ్బసే. 32

ప్ర. అ. బలస్య=సైన్యమునకు, దాతవ్యమ్=ఇవ్వదగిన, భక్తం చ =

అన్నమును, యథోచితమ్=తగువిధ మైన, వేతనం చ=వేతనమును, సంప్రాప్త కాలమ్=ప్రాప్తించినకాలము గలదానిని, దదాసి కచ్చిత్ = ఇచ్చుచున్నావుకదా? న విలమ్బసే=ఆలస్యము చేయుటలేదుకదా!

తా. సైన్యమునకు ఇవ్వదగిన ఆహారమును, యథోచిత మైన జీతమును, ఆలస్యము చేయకుండగ తగు సమయములలో ఇచ్చుచున్నావు కదా! 32

మూ. కాలాతిక్రమణాచ్చైవ భక్తవేతనయోర్భృతాః,
భర్తుః కుప్యన్తి దుష్యన్తి సోఽనర్థః సుమహాన్ స్మృతః.

ప్ర. అ. భృతాః=పోషింపబడు (దగిన) సేవకులు, భక్తవేతనయోః = అన్నముయొక్క, జీతముయొక్క, కాలాతిక్రమణాత్ = కాలము దాటిపోవుట వలన, భర్తుః = ప్రభువు విషయమున. కుప్యన్తి = కోపగించెదరు, దుష్యన్తి = దుష్టులగుదురు. సః=అది, సుమహాన్=చాలగొప్ప దైన, అనర్థః=అనర్థముగా, స్మృతః=చెప్పబడినది.

తా. ఆహారము, వేతనము, అందవలసిన కాలములో అందకపోయినచో, భృత్యులు రాజు విషయమున కోపించి ఆతనికి విరుద్ధముగా ప్రవర్తించెదరు. దీని వలన గొప్ప అనర్థము కలుగును. 33

మూ. కచ్చిత్సర్వేఽనురక్తాస్త్వాం కులపుత్రాః ప్రధానతః,
కచ్చిత్ప్రాణాంస్తవార్థేషు సన్త్యజన్తి సమాహితాః. 34

ప్ర. అ. సర్వే=అందరును, ప్రధానతః=ప్రధానముగా, కులపుత్రాః = ఉత్తమరాజవంశమునకు చెందిన క్షత్రియులు, త్వామ్=నిన్ను గూర్చి, అనురక్తాః కచ్చిత్=అనురాగము కలిగి ఉన్నారా? సమాహితాః = ఐకమత్యముతో కూడిన వారై, తవ అర్థేషు=నీ కార్యముల విషయమై, ప్రాణాన్=ప్రాణములను, కచ్చిత్ సన్త్యజన్తి= విడచుచున్నారు కదా!

తా. ప్రజలందరును, ప్రధానముగ ఉత్తమవంశీయు లగు క్షత్రియు లందరును, నీ విషయమున అనురాగవంతు లై ఉన్నారు కదా! వారందరు ఐకమత్యముతో, నీ కార్యములను సాధించుటకై, ప్రాణములు విడచుటకు కూడ సిద్ధముగా ఉన్నారు కదా! 34

మూ. కచ్చిజ్జానపదో విద్వాన్ దక్షిణః ప్రతిభానవాన్,
యథోక్తవాదీ దూతస్తే కృతో భరత పణ్డితః. 35

ప్ర. అ. భరత = ఓ భరతుడా, జానపదః = స్వదేశమునందు పుట్టిన వాడు, విద్వాన్ = అన్ని విషయములు తెలిసినవాడు, దక్షిణః = నేర్పు కలవాడు, ప్రతిభానవాన్ = సమయస్ఫూర్తి కలవాడు, యథోక్తవాదీ = చెప్పినట్లుగా చెప్ప గలిగినవాడు, పణ్డితః = పండితుడు అయిన పురుషుడు, తే = నీకు (నీచేత) దూతః = దూతగా, కృతః కచ్చిత్ = చేయబడినాడుకదా?

తా. ఓ భరతుడా ! స్వదేశములో పుట్టినవాడు, విషయములు తెలిసిన వాడు, సమర్థుడు, సమయస్ఫూర్తి కలవాడు, చెప్పిన విషయమును ఉన్నది ఉన్నట్లు చెప్పువాడు, పండితుడు అయిన పురుషుని దూతగా నియమించినావు కదా? 35

మూ. కచ్చిదష్టాదశాన్యేషు స్వపక్షే దశ పఞ్చ చ,
త్రిభిస్త్రిభిరవిజ్ఞాతైర్వేత్సి తీర్థాని చారకైః. 36

ప్ర. అ. అన్యేషు = శత్రువులలో, అష్టాదశ = పద్దెనిమిది, తీర్థాని = తీర్థము లను, స్వపక్షే = నీ పక్షమునందు, దశ పఞ్చ చ = పదిహేను తీర్థములను, అవి జ్ఞాతైః = ఇతరులకు తెలియని, త్రిభిః త్రిభిః = ముగ్గురు ముగ్గురు, చారకైః = గూఢచారులచేత, వేత్సి కచ్చిత్ = తెలుసుకొనుచున్నావు కదా?

తా. శత్రుపక్షములోని పద్దెనిమిది తీర్థములను, నీ పక్షములోని పదిహేను తీర్థములను ఇతరుల కెవ్వరికి తెలియని ముగ్గురు ముగ్గురు గూఢచారుల ద్వారా తెలుసుకొనుచున్నావు కదా.

వి. మంత్రులు, పురోహితులు, యువరాజు, సేనాపతి, ద్వారపాలకులు, అంతఃపురాధికారులు, కారాగారాధికారులు, ధనాధ్యక్షులు, కార్యనియోజకులు, (పనులుచేయించే వాళ్లు) ప్రాడ్వివాకులు, (న్యాయాధికారులు), సేనానాయకులు, నగరాధ్యక్షుడు, కర్మాంతికులు (పనులలో నియుక్తులైనవారు), సభాధికృతులు, ధర్మాధికారులు, దండపాలుర , దుర్గపాలులు రాష్ట్రాంతపాలకులు, (రాష్ట్రము సరిహద్దుల ప్రభువులు) అనునవి శత్రుపక్షములోని పద్దెనిమిది తీర్థములు. ఈ తీర్థములను, ఒక్కొక్కదానికి ముగ్గురేసి గూఢచారులను నియమించి, అవి

చేయు కార్యకలాపములను రాజు తెలుసుకొనవలెను. అట్లే తన రాజ్యములో మన్త్రిపురోహిత యువరాజులు తప్ప మిగిలిన పదిహేను తీర్థముల కార్యకలాపములు తెలుసు కొనుటకై ముగ్గురేసి గూఢచారులను నియమించవలెను. మొదటి ముగ్గురును రాజువద్దనే ఉందురు కాన వారి విషయమై గూఢచారుల అవసరము లేదు.

మూ. కచ్చిద్వ్యపాస్తానహితాన్ ప్రతియాతాంశ్చ సర్వదా,
దుర్బలాననవజ్ఞాయ వర్తసే రిపుసూదన. 37

ప్ర. అ. రిపుసూదన = ఓ శత్రుసంహారకుడా! వ్యపాస్తాన్ = ఓడింపబడిన, ప్రతియాతాంశ్చ = తిరిగి వెళ్ళిపోయిన, దుర్బలాన్ = దుర్బలులైన, అహితాన్ = శత్రువులను, సర్వదా = ఎల్లపుడు, అనవజ్ఞాయ = నిర్లక్ష్యముచేయకుండగ, వర్తసే కచ్చిత్ = ఉంటున్నావు కదా?

తా. ఓ శత్రుసంహారకుడా! నీచే ఓడింపబడి, తిరిగి వెళ్ళిపోయిన శత్రువులను గూర్చి, వీరు దుర్బలులే కదా అని నిర్లక్ష్యము చేయక, జాగరూకతతో ఉన్నావు కదా! 37

మూ. కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాంస్తాత సేవసే,
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః. 38

ప్ర. అ. తాత = తండ్రీ! లోకాయతికాన్ = లోకమునుగురించియే ఆలోచించు నాస్తికులైన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, న సేవసే కచ్చిత్ = సేవించుటలేదు కదా! పండితమానినః = మేమే పండితులమను అహంకారముగల, బాలాః = అజ్ఞానులైన, ఏతే = వీరు, అనర్థకుశలాః హి = అనర్థములందు సమర్థులు కదా!

తా. నాయనా! ఈ లోకమును గూర్చియే ఆలోచించు నాస్తికులైన బ్రాహ్మణులు నీ దరికి చేరకుండా చూచుకొనుచున్నావు కదా! మేమే పండితులమని తలచుచుండు ఈ అజ్ఞానులు, అనేక అనర్థములను కలిగింతురు. 38

మూ. ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః,
బుద్ధిమాన్వీక్షకీం ప్రాప్య నిరర్థం ప్రవదన్తి తే. 39

ప్ర. అ. దుర్బుధాః = ఈ చెడ్డ పండితులు, ముఖ్యేషు=ప్రధానము లైన, ధర్మశాస్త్రేషు = ధర్మశాస్త్రములు, విద్యమానేషు = ఉండగా, ఆన్వీక్షకీమ్ = తర్కశాస్త్రమునకు సంబంధించిన, బుద్ధిమ్ = బుద్ధిని, ప్రాప్య=పొంది, నిరర్థమ్ = వ్యర్థముగా, ప్రవదన్తి = మాట్లాడుచుందురు.

తా. ఈ దుష్టపండితులు ప్రధాన మైన ధర్మశాస్త్రములు ఉండగా, వాటిని కాదని శుష్కతర్కమును అవలంబించి, నిరర్థకముగా ఏమేమో మాటలాడు చుందురు. 39

మూ. వీరై రధ్యుషితాం పూర్వమస్మాకం తాత పూర్వకైః,
సత్యనామాం దృఢద్వారాం హస్త్యశ్వరథసంకులామ్, 40

బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైః స్వకర్మనిరతైః సదా,
జితేన్ద్రియైర్మహోత్సాహైర్వృతామార్యైః సహస్రశః. 41

ప్రాసాదై ర్వివిధాకారై ర్వృతాం వైద్యజనాకులామ్,
కచ్చిత్సముదితాం స్ఫీతామయోధ్యాం పరిరక్షసి. 42

ప్ర. అ. తాత = తండ్రీ! వీరైః=వీరు లైన, అస్మాకమ్=మనయొక్క, పూర్వకైః = పూర్వికులచేత, పూర్వమ్ = పూర్వము, అధ్యుషితామ్ = అధిష్ఠింపబడినదీ, సత్యనామామ్ = సత్య మైన పేరుకలదీ, దృఢద్వారామ్ = దృఢము లైన ద్వారములు కలదీ, హస్త్యశ్వరథసంకులామ్=ఏనుగులతోను, అశ్వముల తోను, రథములతోను నిండినదీ, సదా = ఎల్లపుడు, స్వకర్మనిరతైః = తమ తమ కర్మలయందు ఆసక్తు లైన, జితేంద్రియైః = జయింపబడిన ఇంద్రియములు గల, మహోత్సాహైః = గొప్ప ఉత్సాహము గల, ఆర్యైః = పూజ్యు లైన, సహస్రశః = వేలకొలది, బ్రాహ్మణైః = బ్రాహ్మణులతోను, క్షత్రియైః = క్షత్రియుల తోను, వైశ్యైః = వైశ్యులతోను, వృతామ్ = కూడినదీ, వివిధాకారైః = అనేక విధము లైన ఆకారము గల, ప్రాసాదైః = ప్రాసాదములతో, వృతామ్ = కూడి నది, వైద్యజనాకులామ్=పండితులతో నిండినదీ, సముదితామ్=సంతోషముతో కూడినదీ, స్ఫీతామ్=సమృద్ధి కలది అయిన, అయోధ్యామ్ = అయోధ్యను, పరి రక్షసి కచ్చిత్ = రక్షించుచున్నావు కదా!

తా. నాయనా! వీరు లైన మన పూర్వులు పూర్వము రక్షించినదీ, శత్రు

వులు వచ్చి యుద్ధము చేయుటకు శక్యమైనది కాకపోవుటచే 'అయోధ్య' అను యథార్థమైన పేరుకలదీ, దృఢమైన ద్వారములు కలదీ, గజాశ్వరథములతో నిండినదీ, ఎల్లపుడు తమ తమ కర్మలు చేయుటలో ఆసక్తికలవారూ, జితేన్ద్రియులూ గొప్ప ఉత్సాహము కలవారూ, పూజ్యులూ అయిన వేలకొలది బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు నివసించునదీ, అనేక ఆకారములు గల రాజభవనములతో కూడినది, పండితజనులతో నిండిఉన్నదీ, సర్వసమృద్ధమై ఆనందించుచున్నదీ యైన మన నగరమును రక్షించుచున్నావు కదా! 42

మూ. కచ్చిచ్చైత్యశతైర్జుష్టః సునివిష్టజనాకులః,
దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకైశ్చోపశోభితః. 43

ప్రహృష్టనరనారీకః సమాజోత్సవశోభితః,
సుకృష్టసీమా పశుమాన్ హింసాభిః పరివర్జితః. 44

అదేవమాతృకో రమ్యః శ్వాపదైః పరివర్జితః,
పరిత్యక్తో భయైః సర్వైః ఖనిభిశ్చోపశోభితః. 45

వివర్జితో నరైః పాపైర్మమ పూర్వైః సురక్షితః,
కచ్చిజ్జనపదః స్ఫీతః సుఖం వసతి రాఘవ. 46

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! చైత్యశతైః = వందలకొలది సరిహద్దు రాళ్లతో, జుష్టః = కూడినది, సునివిష్టజనాకులః = చక్కగా నివసించు నట్లు చేయబడిన జనులతో నిండినది, దేవస్థానైః = దేవాలయములచేత, ప్రపాభిశ్చ = చలివెందళ్లచేత, తటాకైశ్చ = చెఱువులచేత, ఉపశోభితః = ప్రకాశింపచేయబడినది, సుకృష్టసీమా = చక్కగా దున్నబడిన భూమి కలది, పశుమాన్ = ఉత్తమమైన పశువులు కలది, హింసాభిః = హింసలచేత, పరివర్జితః = విడువబడినది, అదేవమాతృకః = దేవమాతృకము కానిది, (కేవలము వర్షము మీదనే ఆధారపడినది దేవమాతృకము) రమ్యః = సుందరమైనది, శ్వాపదైః = క్రూరజంతువులచేత, పరివర్జితః = విడువబడినది, సర్వైః = సమస్తమైన, భయైః = భయములచేత, పరిత్యక్తః = విడువబడినది, ఖనిభిశ్చ = గనులచే, ఉపశోభితః = ప్రకాశింపచేయబడినది, పాపైః = పాపాత్ములైన, నరైః = నరులచేత, వివర్జితః = విడువబడినది, మమ = నాయొక్క, పూర్వైః = పూర్వికులచేత, సురక్షితః = బాగుగారక్షింప

బడినది అయిన, జనపదః=దేశము, స్ఫీతః కచ్చిత్ = సమృద్ధముగా నున్నదా !
సుఖమ్=సుఖముగా, వసతి కచ్చిత్=నివసించుచున్నదా !

తా. అక్కడక్కడ భూముల సరిహద్దులను చూపు రాళ్లు గలదీ, చక్కగా నివాసము ఏర్పరుచుకొని ఉన్న జనులతో నిండినదీ, దేవాలయములతోను, చలి వెందళ్ళతోను, చెఱువులతోను ప్రకాశించుచున్నదీ, సంతోషించుచున్న స్త్రీ పురుషులు కలదీ, సమాజములో జరుగు ఉత్సవములతో ప్రకాశించుచున్నదీ, చక్కగా దున్నిన భూములు కలదీ, పశుసమృద్ధి కలదీ, హింస లేనిదీ, దేవమాతృకము కానిదీ, క్రూరజంతువుల భయము లేక రమ్యముగా నున్నదీ ఎట్టి భయములు లేనిదీ, గనులతో నిండియున్నదీ, పాపాత్ము లెవ్వరును నివసించనిదీ, నా పూర్వీకులచేత చక్కగా రక్షింపబడినదీ అయిన మన దేశము సుఖసమృద్ధులతో అలరారుచున్నదికదా ? 43-46

మూ. కచ్చిత్తే దయితాః సర్వే కృషిగోరక్షజీవినః,
వార్తాయాం సంశ్రితః తాత లోకో హి సుఖమేధతే. 47

ప్ర. అ. తాత=తండ్రీ! సర్వే=సమస్తమైన, కృషిగోరక్షజీవినః=కృషిచేతను, గోరక్షణముచేతను, జీవించు వైశ్యులు, తే=నీకు, దయితాః కచ్చిత్ = ఇష్టమైనవారుగా ఉన్నారుకదా? వార్తాయామ్ = వార్తయందు (కృషిగోరక్షణములందు) సంశ్రితః=ఆశ్రయించినదై, లోకః=జనము, సుఖమ్=సుఖముగా, ఏధతే హి = వృద్ధి పొందునుకదా?

తా. వ్యవసాయముచేతను గోరక్షణముచేతను జీవించు వైశ్యు లందరు నీకు అనుకూలముగా ఉన్నారు కదా? జను లందరు కృషిగోరక్షణములపై ఆధారపడియే సుఖముగా ఉందురుకదా ? 47

మూ. తేషాం భుక్తిపరీహారైః కచ్చిత్తే భరణం కృతమ్,
రక్ష్యా హి రాజ్ఞా ధర్మేణ సర్వే విషయవాసినః. 48

ప్ర. అ. భుక్తిపరీహారైః = రక్షణముచేతను, ఆపదలను తొలగించుటచేతను, తేషామ్=వారియొక్క, భరణమ్=పోషణము, తే=నీకు, (నీచేత)కృతం కచ్చిత్ = చేయబడినది కదా? రాజ్ఞా = రాజుచేత, విషయవాసినః = దేశములో

నివసించు, సర్వే = అందరు, ధర్మేణ = ధర్మముచేత, రక్ష్యాః హి = రక్షింప దగినవారు కదా?

తా. నీవు వారి నందరిని రక్షణ ఇచ్చి, ఆపద తొలగించి, పోషించు చున్నావుకదా? ఎందుచేతననగా రాజు దేశములోని ప్రజల నందరిని ధర్మముతో రక్షించవలెను. 48

మూ. కచ్చిత్స్త్రియః సాన్త్వయసి కచ్చిత్తాస్తే సురక్షితాః,
కచ్చిన్న శ్రద్దధాస్యాసాం కచ్చిద్గుహ్యం న భాషసే. 49

ప్ర. అ. స్త్రియః=స్త్రీలను, సాన్త్వయసి కచ్చిత్=అనునయించుచున్నావు కదా? తాః = వారు, తే = నీకు (నీచేత), సురక్షితాః కచ్చిత్=బాగుగా రక్షింపబడుచున్నారుకదా ? ఆసామ్ = ఈ స్త్రీలమాటలను, న శ్రద్దధాసి కచ్చిత్ = నమ్ముటలేదు కదా ? గుహ్యమ్ = రహస్యమును, న భాషసే కచ్చిత్ = చెప్పుట లేదుకదా ?

తా. స్త్రీలతో మంచి మాట లాడుచు వారిని బాగుగా రక్షించుకొనుచున్నావుకదా ? వారి మాటలను నమ్ముట లేదుకదా? వారికి రహస్య మేమియు చెప్పుటలేదుకదా ? 49

మూ. కచ్చిన్నాగవనం గుప్తం కచ్చిత్తే సన్తి ధేనుకాః,
కచిన్న గణికాశ్వానాం కుఞ్జరాణాం చ తృప్యసి. 50

ప్ర. అ. నాగవనమ్=గజము లుండు వనము, గుప్తం కచ్చిత్=రక్షింపబడుచున్నదా? తే = నీకు, ధేనుకాః = ఆడ ఏనుగులు, సన్తి కచ్చిత్ = ఉన్నవి కదా? గణికాశ్వానామ్ = ఆడఏనుగులకు, అశ్వములకు, కుఞ్జరాణాం చ = ఏనుగులకు, న తృప్యసి కచ్చిత్ = తృప్తిపొందుటలేదుకదా?

తా. నాగవనమును రక్షించుకొనుచున్నావుకదా? నీకు ఆడఏనుగలు అధికముగా ఉన్నవికదా? ఆడఏనుగులు, అశ్వములు, గజములు ఇవి ఉన్నవి చాలునని నీవు వాటి విషయమున తృప్తి చెందుటలేదుకదా? 50

మూ. కచ్చిద్దర్శయసే నిత్యం మానుషాణాం విభూషితమ్,
ఉత్థాయోత్థాయ పూర్వాహ్ణే రాజపుత్ర మహాపథే. 51

ప్ర. అ. రాజపుత్ర = రాజకుమారా! నిత్యమ్ = ప్రతిదినము. పూర్వాహ్ణే = ప్రాతఃకాలమునందు, ఉత్థాయోత్థాయ = లేచి లేచి, మహాపథే = రాజమార్గమునందు, మానుషాణామ్ = మనుష్యులకు, విభూషితమ్ = అలంకరింపబడిన, తనను, దర్శయసే కచ్చిత్ = చూపుచున్నావా!

తా. ఓ రాజకుమారా! నీవు ప్రతిదినము ఉదయమున లేచి, చక్కగా అలంకరించుకొని, పూర్వాహ్ణమునందు రాజమార్గమునకు వెళ్ళి, జనులకు దర్శనమిచ్చుచున్నావుకదా? 51

మూ. కచ్చిన్న సర్వే కర్మాన్తాః ప్రత్యక్షాస్తేఽవిశఙ్కయా,
సర్వే వా పునరుత్సృష్టా మధ్యమే వాత్ర కారణమ్. 52

ప్ర. అ. సర్వే = సమస్తమైన, కర్మాన్తాః = కర్మచారులు, తే = నీకు, అవిశఙ్కయా = భయము లేకుండగా, న ప్రత్యక్షాః కచ్చిత్ = ప్రత్యక్షమైనవారు కారుకదా! సర్వే = వారు అందరును, ఉత్సృష్టాః వా పునః = దూరముగా ఉంచబడినవారుగా గాని, (న కచ్చిత్ = కారు కదా). అత్ర = ఈ విషయమున, మధ్యమేవ = మధ్యమార్గమే, కారణమ్ = శ్రేయస్సుకు కారణము.

తా. నీ క్రింద పని చేయువారందరును నిన్ను చూచుటకు భయపడుచుందురుకదా? పూర్తిగా భయాతిశయముచేతవారు దూరముగా ఉండి పోవుట లేదు కదా? ఈ రెండును గాక మధ్యమార్గమును అవలంబించుటయే మంచిది. 52

మూ. కచ్చిత్సర్వాణి దుర్గాణి ధనధాన్యాయుధోదకైః,
యన్త్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః. 53

ప్ర. అ. సర్వాణి = సమస్తమైన, దుర్గాణి = దుర్గములు, ధనధాన్యాయుధోదకైః = ధనముతోను, ధాన్యములతోను, ఆయుధములతోను, ఉదకములతోను, యన్త్రైశ్చ = యంత్రములతోను, తథా = మరియు, శిల్పిధనుర్ధరైః = శిల్పులతోను, ధనుర్ధరులతోను, పరిపూర్ణాని కచ్చిత్ = నిండి ఉన్నవి కదా?

తా. దుర్గము లన్నింటిలోను ధనధాన్యములు, ఆయుధములు, ఉదకము, యంత్రములు, శిల్పులు, ధనుర్ధరులు, కావలసినంతగా ఉన్నారు కదా? 53

మూ. ఆయస్తే విపులః కచ్చిత్ కచ్చిదల్పతరో వ్యయః,
అపాత్రేషు న తే కచ్చిత్ కోశో గచ్ఛతి రాఘవ. 54

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! తే = నీయొక్క, ఆయః = రాబడి, విపులః కచ్చిత్ = అధికముగా నున్నది కదా! వ్యయః = వ్యయము, అల్పతరః కచ్చిత్ = చాలా తక్కువగా ఉన్నది కదా! తే = నీయొక్క, కోశః = ఆర్జించిన ధనము, అపాత్రేషు = అపాత్రలయందు, న గచ్ఛతి కచ్చిత్ = వెళ్లుట లేదు కదా!

తా. ఓ భరతా! నీ ఆదాయము అధికముగా నుండి వ్యయము చాలా తక్కువగా ఉన్నది కదా? నీ ధనము అపాత్రులచేతులలోనికి వెళ్ళిపోవుటలేదు కదా! 54

మూ. దేవతార్థే చ పిత్రర్థే బ్రాహ్మణాభ్యాగతేషు చ,
యోధేషు మిత్రవర్గేషు కచ్చిద్గచ్ఛతి తే వ్యయః. 55

ప్ర. అ. తే = నీయొక్క, వ్యయః = వ్యయము, దేవతార్థే చ = దేవతల కొరకు, పిత్రర్థే = పితృదేవతలకొరకు, బ్రాహ్మణాభ్యాగతేషు = బ్రాహ్మణుల యందు, ఇంటికి వచ్చిన అతిథులయందు, యోధేషు = యోధులయందు, మిత్ర వర్గేషు = మిత్రుల సముదాయమునందు, గచ్ఛతి కచ్చిత్ = వెళ్లుచున్నది కదా!

తా. నీవు దేవతలు, పితృదేవతలు, బ్రాహ్మణులు, అతిథులు, యుద్ధ భటులు, మిత్రవర్గములు వీరికొరకు మాత్రమే వ్యయము చేయుచున్నావు కదా! 55

మూ. కచ్చిదార్యో విశుద్ధాత్మా క్షారితశ్చాపకర్మణా,
అపృష్టః శాస్త్రకుశలైర్న లోభాద్వధ్యతే శుచిః. 56

ప్ర. అ. విశుద్ధాత్మా = పరిశుద్ధమైన మనస్సు కలవాడు, ఆర్యః = పూజ్యుడు, శుచిః = పరిశుద్ధుడు అయిన పురుషుడు, అపకర్మణా = చెడ్డపనిచేత, క్షారితః = ఆరోపింపబడిన వాడై, శాస్త్రకుశలైః = శాస్త్రమునందు నేర్పు కలవారి చేత, అపృష్టః = ప్రశ్నింపబడకుండగనే, లోభాత్ = దురాశవలన, న వధ్యతే కచ్చిత్ = చంపబడుటలేదు కదా!

తా. ఆర్యుడు, పరిశుద్ధ మైన మనస్సు కలవాడు, మంచి ఉత్తమ మైన చరిత్ర కలవాడు అయిన పురుషునిపై ఏదియో ఒక అపరాధము ఆరోపింపబడగా, శాస్త్రమునందు నేర్పుకలవారిచే వానిని ప్రశ్నింపచేయకుండగనే దురాశచే వానిని చంపివేయుటలేదు కదా! 56

మూ. గృహీతశ్చైవ పృష్టశ్చ కాలే దృష్టః సకారణః,
కచ్చిన్న ముచ్యతే చోరో ధనలోభాన్నరర్షభ. 57

ప్ర. అ. నరర్షభ = పురుషశ్రేష్ఠుడా! కాలే = చౌర్యము చేసే కాలమునందు, దృష్టః = చూడబడినవాడు, గృహీతశ్చైవ = గ్రహింపబడినవాడు, పృష్టశ్చ = ప్రశ్నింపబడినవాడు. సకారణః = కారణముతో గూడినవాడు అయిన, చోరః = చోరుడు, ధనలోభాత్ = ధనమునందు లోభమువలన, న ముచ్యతే కచ్చిత్ = విడువబడుట లేదుకదా!

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! చౌర్యము చేయు సమయమునందు చూడబడి, పట్టుబడి, ప్రశ్నించగా చౌర్యము చేసి నట్లు నిర్ధారణ చేయుటకు తగిన కారణములు గల చోరుని ధనలోభముచే విడచివేయుటలేదు కదా! 57

మూ. వ్యసనే కచ్చిదాఢ్యస్య దుర్గతస్య చ రాఘవ ,
అర్థం విరాగాః పశ్యన్తి తవామాత్యా బహుశ్రుతాః. 58

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! బహుశ్రుతాః = అధిక మైన విద్య గల, తవ అమాత్యాః = నీ మంత్రులు, ఆఢ్యస్య = ధనికునియొక్క, దుర్గతస్య చ = దరిద్రునియొక్క, వ్యసనే = కష్టసమయమునందు, అర్థమ్ = వ్యవహారమును, విరాగాః = పక్షపాతబుద్ధి లేనివారై, పశ్యన్తి కచ్చిత్ = చూచుచున్నారు కదా!

తా. భరతా! మంచి విద్యావంతు లైన నీ మంత్రులు, ధనికునకు కష్టము వచ్చి నపుడును, దరిద్రునకు కష్టము వచ్చినపుడును ఇతడు ధనికుడు, ఇతడు దరిద్రుడు అను పక్షపాతబుద్ధి లేక వ్యవహారనిర్ణయము చేయుచున్నారు కదా!

మూ. యాని మిథ్యాభిశస్తానాం పతన్త్యశ్రూణి రాఘవ,
తాని పుత్రపశూన్ ఘ్నన్తి ప్రీత్యర్థమనుశాసతః. 59

ప్ర. అ. రాఘవ = భరతుడా ! మిథ్యాభిశస్తానామ్ = లేని అపరాధము

మోపి నిందింప బడినవారియొక్క, యాని = ఏ, అశ్రూణి = కన్నీళ్లు, పతన్తి = పడునో, తాని = అవి, పీత్యర్థమ్ = తన సంతోషముకొరకు, (ఇష్టము వచ్చి నట్లు), అనుశాసతః = శాసించువానియొక్క, పుత్రపశూన్ = పుత్రులను, పశువులను, ఘ్నన్తి = చంపును.

తా. భరతుడా! ఎవ డైన రాజు తన ఇష్టము వచ్చి నట్లు శాసనము చేయుచు, ఎవరిపై లేని అపరాధమును మోపి శిక్షించునో అతడు కార్చిన కన్నీళ్లు ఆ రాజు పుత్రపశ్వాదులను నశింపచేయును. 59

మూ. కచ్చిత్ వృద్ధాంశ్చ బాలాంశ్చ వైద్యముఖ్యాంశ్చ రాఘవ,
దానేన మనసా వాచా త్రిభిరేతైర్బుభూషసే. 60

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! వృద్ధాంశ్చ = వృద్ధులను, బాలాంశ్చ = బాలురను, వైద్యముఖ్యాంశ్చ = పండితశ్రేష్ఠులను, దానేన = దానముచేత, మనసా = మనస్సుచేత, వాచా = వాక్కుచేత, ఏతైః = ఈ, త్రిభిః = మూడింటి చేత, బుభూషసే కచ్చిత్ = పొందగోరుచున్నావు కదా?

తా. భరతుడా! వృద్ధులను, బాలురను, ఉత్తము లైన పండితులను దానము, మనస్సు, వాక్కు, అను మూడింటిచే, వశము చేసికొనుటకు ప్రయత్నించుచున్నావు కదా? 60

మూ. కచ్చిద్గురూంశ్చ వృద్ధాంశ్చ తాపసాన్ దేవతాతిథీన్,
చైత్యాంశ్చ సర్వాన్ సిద్ధార్థాన్ బ్రాహ్మణాంశ్చ నమస్యసి.

ప్ర. అ. గురూంశ్చ = గురువులను, వృద్ధాంశ్చ = వృద్ధులను, తాపసాన్ = మునులను, దేవతాతిథీన్ = దేవతలను, అతిథులను, చైత్యాంశ్చ = దేవాలయములను, సిద్ధార్థాన్ = కృతార్థు లైన, బ్రాహ్మణాంశ్చ = బ్రాహ్మణులను, సర్వాన్ = అందరిని, నమస్యసి కచ్చిత్ = నమస్కరించుచున్నావు కదా?

తా. గురువులకు, వృద్ధులకు, మునులకు, దేవతలకు, అతిథులకు, చైత్యములకు, కృతార్థు లైన బ్రాహ్మణులకు నమస్కారము చేయుచున్నావు కదా? 61

మూ. కచ్చిదర్థేన వా ధర్మమర్థం ధర్మేణ వా పునః,
ఉభౌ వా ప్రీతిలోభేన కామేన చ న బాధసే. 62

ప్ర. అ. అర్థేన = అర్థముచేత, ధర్మం వా = ధర్మమును కాని, ధర్మేణ = ధర్మముచేత, అర్థం వా పునః = అర్థమును కాని, ప్రీతిలోభేన = సుఖము నందు ఆశచే, కామేన = కామముచేత, ఉభౌ = ధర్మార్థములు రెండింటిని కాని, న బాధసే కచ్చిత్ = బాధించుటలేదుకదా?

తా. నీవు అర్థముచేత ధర్మమును కాని, ధర్మముచేత అర్థమును కాని, అధికసుఖాసక్తుడ వై, కామముచేత ధర్మార్థములను కాని బాధించుటలేదు కదా?

మూ. కచ్చిదర్థం చ ధర్మం చ కామం చ జయతాం వర,
విభజ్య కాలే కాలజ్ఞ సర్వాన్ వరద సేవసే. 63

ప్ర. అ. జయతామ్ = జయించువారిలో, వర = శ్రేష్ఠుడా! కాలజ్ఞ = = కాలము తెలిసినవాడా! వరద = వరముల నిచ్చువాడా, (శ్రేష్ఠుడా), అర్థం చ = అర్థమును, ధర్మం చ = ధర్మమును, కామం చ = కామమును, సర్వాన్ = అన్నింటిని, కాలే = తగిన కాలమునందు, విభజ్య = విభజించి, సేవసే కచ్చిత్ = సేవించుచున్నావు కదా!

తా. విజయమును సాధింపగలవాడవు, కాలమును తెలిసినవాడవు, శ్రేష్ఠుడవు అయిన ఓ భరతా! నీవు ధర్మార్థకామముల నన్నింటిని వాటికి తగు కాలమును విభజించి సేవించుచున్నావు కదా? 63

మూ. కచ్చిత్తే బ్రాహ్మణాః శర్మ సర్వశాస్త్రార్థకోవిదాః.
ఆశంసన్తే మహాప్రాజ్ఞ పౌరజానపదైస్సహ. 64

ప్ర. అ. మహాప్రాజ్ఞ = ఓ మహాబుద్ధిమంతుడా! సర్వశాస్త్రార్థకోవిదాః = సమస్త మైన శాస్త్రార్థములందు పండితు లైన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, పౌరజానపదైస్సహ = పౌరులతోను, జానపదులతోను కూడ, తే = నీయొక్క, శర్మ = సౌఖ్యమును, ఆశంసన్తే కచ్చిత్ = కోరుచున్నారు కదా?

తా. మహాబుద్ధిమంతుడ వైన ఓ భరతా! సమస్త మైన శాస్త్రార్థము

లందు పండితు లైన బ్రాహ్మణులు, నీకు, నీ రాజ్యములోని పౌరులకు, జానపదు లకు, సౌఖ్యము కలుగవలె నని కోరుచున్నారు కదా?

మూ. నాస్తిక్యమనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్,
అదర్శనం జ్ఞానవతా మాలస్యం పంచవృత్తితామ్. 65
ఏకచింతనమర్థానామనర్థజ్ఞైశ్చ మన్త్రిణమ్,
నిశ్చితానామనారమ్భం మన్త్రిస్యాపరిరక్షణమ్. 66
మఙ్గలస్యాప్రయోగం చ ప్రత్యుత్థానం చ సర్వతః,
కచ్చిత్త్వం వర్జయస్యేతాన్ రాజదోషాంశ్చతుర్దశ. 67

ప్ర. అ. నాస్తిక్యమ్ = నాస్తికత్వమును, అనృతమ్ = అసత్యమును, క్రోధమ్=కోపమును, ప్రమాదమ్=ఏమరుపాటును, దీర్ఘసూత్రతామ్=ఆలోచనల తోనే కాలము గడిపివేయుచు ఆలస్యముగా పనిచేయుటను, జ్ఞానవతామ్ = జ్ఞాన వంతుల యొక్క, అదర్శనమ్=దర్శనము చేయకుండుటను, ఆలస్యమ్=సోమరి తనమును, పఞ్చవృత్తితామ్=పంచేంద్రియములకు వశ మగుటకు, అర్థానామ్ = కార్యములయొక్క, ఏకచింతనమ్=ఒక్కడే ఆలోచించుచుటను, అనర్థజ్ఞైః=కార్య ములు తెలియనివారితో కూడ, మన్త్రిణమ్=ఆలోచన చేయుటను, నిశ్చితానామ్= నిశ్చయించబడిన కార్యములయొక్క, అనారమ్భమ్ = ఆరంభము చేయక పోవు టను, మన్త్రిస్య=ఆలోచనయొక్క, అపరిరక్షణమ్=రక్షించక పోవుటను, మంగ ళస్య = మంగళముయొక్క, అప్రయోగం చ = ప్రయోగము చేయకపోవుటను, సర్వతః=అంతట, ప్రత్యుత్థానం చ = ఎదుర్కొనుటను, ఏతాన్=ఈ, చతుర్దశ =పదునాలుగు, రాజదోషాన్=రాజుయొక్క దోషములను, త్వమ్ = నీవు, వర్జ యసి కచ్చిత్=విడిచి పెట్టుచున్నావు కదా?

తా. నాస్తికత్వము, అసత్యము, క్రోధము, ఏమరపాటు, ఏ కార్యముల విషయమునను నిర్ణయము తీసుకొనకుండగ దీర్ఘాలోచన చేయుట, జ్ఞానవంతు లను నిర్లక్ష్యము చేయుట, సోమరితనము, ఇంద్రియములకు వశుడగుట, మంత్రు లెందుకు అని తాను ఒక్కడే ఆలోచన చేయుట, విషయము అర్థము కానివారితో ఆలోచనలు చేయుట, నిర్ణయించిన కార్యములు ప్రారంభించకపోవుట, ఆలోచన లను రహస్యముగా ఉంచకపోవుట, మంగళకర మైన పనులు చేయకపోవుట,

చాలామంది శత్రువులను ఒకే కాలమునందు ఎదిరించుట అనునవి పదునాలుగు రాజదోషములు; నీవు వీటిని త్యజించుచున్నావుకదా! 67

మూ. దశపంచచతుర్వర్గాన్ సప్తవర్గం చ తత్త్వతః,
అష్టవర్గం త్రివర్గం చ విద్యాస్తిస్రశ్చ రాఘవ. 68

ఇన్ద్రియాణాం జయం బుద్ధ్వా షాడ్గుణ్యం దైవమానుషమ్,
కృత్యం వింశతివర్గం చ తథా ప్రకృతిమణ్డలమ్. 69

యాత్రాదణ్డవిధానం చ ద్వియోనీ సంధివిగ్రహౌ,
కచ్చిదేతాన్ మహాప్రాజ్ఞ యథావదనుమన్యసే. 70

ప్ర. అ. మహాప్రాజ్ఞ!=మహాబుద్ధిశాలి వైన, రాఘవ!=ఓ భరతుడా! దశపంచచతుర్వర్గాన్ = పది, ఐదు, నాలుగువర్గములను, సప్తవర్గం చ = ఏడింటి వర్గమును, అష్టవర్గమ్ = ఎనిమిదింటి వర్గమును, త్రివర్గం చ = మూడింటి వర్గమును, తిస్రః = మూడు, విద్యాః చ = విద్యలను, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములయొక్క, జయమ్ = జయమును, షాడ్గుణ్యమ్ = ఆరు గుణములను, దైవమానుషమ్=దైవమువలనను, మనుష్యుల వలనను వచ్చిన ఆపదలను, కృత్యమ్ =కృత్యమును, వింశతివర్గం చ = ఇరువదింటి వర్గమును, తథా = మరియు, ప్రకృతిమణ్డలమ్ = ప్రకృతులను, మండలమును, యాత్రాదణ్డవిధానం చ = యాత్రావిధానమును, సేనావిధానమును, ద్వియోనీ=రెండుకారణము లైన, సంధివిగ్రహౌ = సంధి విగ్రహములను, తత్త్వతః = యథార్థముగా, బుద్ధ్వా= తెలుసుకొని, ఏతాన్ = వీటిని, యథావత్ = తగు విధముగా, అనుమన్యసే కచ్చిత్ = అనుసరించుచున్నావు కదా?

తా. మహాబుద్ధిశాలి వైన ఓ భరతుడా! దశవర్గము, పంచవర్గము, చతుర్వర్గము, సప్తవర్గము, అష్టవర్గము, త్రివర్గము, మూడు విద్యలు, ఇంద్రియజయము, షాడ్గుణ్యము, దైవమానుషములు, కృత్యము, వింశతివర్గము, ప్రకృతులు, మండలము, యాత్రావిధానము, దండవిధానము, సంధి విగ్రహములను రెండు కారణములు, వీటి నన్నింటిని యథాతథముగా అర్థము చేసికొని అనుసరించుచున్నావు కదా? 68-70

వి. **దశవర్గము** :– మృగయాక్షో దివాస్వాపః పరివాదః స్త్రియో మదః
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గుణః.

అని మనువు చెప్పినట్లు వేట, జూదము, పగటి నిద్ర, ఇతరులను నిందించుచు మాటలాడుట, స్త్రీలు. మదము, (మద్యపానాదులవలన,) తౌర్యత్రికము (నృత్త గీత-వాద్యములు), వ్యర్థముగా తిరుగుట అను పది కామమువలన కలుగు గుణములు. లేదా

లుబ్ధః క్రూరోఽలసోఽసత్యః ప్రమాదీ భీరురస్థిరః,
మూఢోఽనయోఽవమన్తా చ సుఖచ్ఛేద్యో రిపుర్మతః.

(లుబ్ధుడు, క్రూరుడు, అలసుడు, అసత్యవాది, ఏమరుపాటుతో ఉండువాడు, పిరికివాడు, స్థైర్యము లేనివాడు, మూఢుడు, నీతిలేనివాడు, అందరినీ అవమానించువాడు అయిన శత్రువును అనాయాసముగా ఓడించవచ్చును.) అని చెప్పిన గుణములే దశవర్గము.

**పంచవర్గము** :- ఉదకదుర్గము, పార్వతదుర్గము, వృక్షదుర్గము, ఐరిణదుర్గము (చవటపఱ్ఱచేత ఏర్పడిన దుర్గము) ధాన్వనదుర్గము, (ఎడారి) అను ఐదు దుర్గములు. లేదా శత్రువు, ద్రవ్యము, స్త్రీలు, పరుషవాక్కు, అపరాధము. వీటివలన కలుగు పంచవిధ వైరము పంచవర్గము.

"సాపత్నం వస్తుజం స్త్రీజం వాగ్జాతమపరాధజమ్,
వైరప్రభేదనిపుణైర్వైరం పఞ్చవిధం స్మృతమ్".

**చతుర్వర్గము** :- సామ, దాన, భేద, దండములు; లేదా

"ఔరసం తన్తుసంబన్ధం తథా వంశక్రమాగతమ్,
రక్షితం వ్యసనేభ్యశ్చ మిత్రం జ్ఞేయం చతుర్విధమ్."

అని కామందకుడు చెప్పినట్లు రక్తసంబంధముచేత ఏర్పడినవారు, తంతుసంబంధముచేత (వివాహాదిసంబంధములచేత) ఏర్పడినవారు, వంశక్రమాగతులు, వ్యసనములనుండి రక్షింపబడినవారు అను చతుర్విధమిత్రులు; లేదా-

"న్యాయేనార్జన మర్థస్య రక్షణం వర్ధనం తథా,
సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్."

"ధనమును న్యాయముగా ఆర్జించుట, రక్షించుట, వృద్ధి పొందించుట, సత్పాత్ర యందు ఇచ్చుట అని రాజవృత్తము నాలుగు విధములు" అని కామందకీయములో చెప్పిన చతుర్విధరాజవృత్తము చతుర్వర్గము.

సప్తవర్గము :- స్వామి, అమాత్యులు, రాష్ట్రము, దుర్గము, కోశము, సైన్యము, మిత్రుడు అను రాజ్యమునకు సంబంధించిన సప్తాంగములు. ఇవి పరస్పరోపకారకములు.

> "స్వామ్యమాత్యాశ్చ రాష్ట్రం చ దుర్గం కోశో బలం సుహృత్,
> పరస్పరోపకారీదం రాజ్యం సప్తాఙ్గముచ్యతే".

అని చెప్పిన సప్తాంగములు లేదా. "తనవాడు, మిత్రుడు, ఆశ్రితుడు, బంధుత్వము కలవాడు, కార్యముచే ఏర్పడినవాడు, భృత్యుడు, ఉపకారములు చేయుటచే లభించినవాడు అని స్వపక్షమునకు చెందినవారు ఏడు విధములు.

> "నిజోఽథ మైత్రశ్చ సమాశ్రితశ్చ
> సుబన్ధుజః కార్యసముద్భవశ్చ,
> భృతో గృహీతో వివిధోపచారైః
> పక్షం బుధాః సప్తవిధం వదన్తి".

అని చెప్పిన సప్తవిధస్వపక్షీయులు లేదా. ఏడు ప్రధాన వ్యూహములు.

> "శ్యేనః సూచీ చ వజ్రశ్చ శకటో మకరస్తథా,
> దణ్డాఖ్యః పద్మనామా చ వ్యూహాః సప్త ప్రధానతః."

(వ్యూహము అనగా సేనను యుద్ధరంగమునందు నిలుపు విధానము. శ్యేనము, సూచి, వజ్రము, శకటము, మకరము, దండము, పద్మము అని ప్రధానమైన వ్యూహములు ఏడు).

అష్టవర్గము :- "కృషివాణిజ్యదుర్గాణి సేతుః కుఞ్జరబన్ధనమ్,
ఖన్యాకరః కరాదానం శూన్యానాం చ నివేశనమ్,
అష్టవర్గమిమం సాధు స్వస్థవృత్తో న లోపయేత్".

"మంచి పరిపాలనావిధానమును అనుసరించు రాజు, వ్యవసాయము, వర్తకము, దుర్గములు, సేతువులు, ఏనుగులను బంధించు (పట్టు) అడవులు, గనులు,

పన్నులు గ్రహించుట, జనశూన్యప్రదేశములలో జనులను నివసింపచేయుట అను ఈ ఎనిమిదింటికి లోపము రాకుండగ చూచుకొనవలెను" అని చెప్పిన ఎనిమిదింటి సముదాయము. లేదా-

"పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణమ్,
వాగ్దణ్డయోశ్చ పారుష్యం క్రోధజోఽపి గుణోష్టకః".

''చెవులు కొరుకుట, సాహసము, ద్రోహము, ఇతరుల ధనమును అపహరించుట, ఈర్ష్య (ఇతరుల అభివృద్ధి చూచి ఓర్వలేకపోవుట) అసూయ (గుణములను దోషములుగా చిత్రించుట), వాక్పారుష్యము, దండపారుష్యము అనునవి క్రోధజము లైన ఎనిమిది గుణములు"అని చెప్పిన ఎనిమిదింటి సముదాయము.

**త్రివర్గము** :- ధర్మార్థకామములు. లేదా ప్రభుమంత్రోత్సాహశక్తులు. లేదా పరుల క్షయము, స్థానము, వృద్ధి. "క్షయః స్థానం చ వృద్ధిశ్చ త్రివర్గో నీతివేదినామ్"అని అమరము. లేదా-

"వస్తుష్వశక్యేషు సముద్యమశ్చ
శక్యేషు మోహాదసముద్యమశ్చ,
శక్యేష్వకాలేషు సముద్యమశ్చ
త్రిధైవ కార్యవ్యసనం వదన్తి".

"శక్యము కాని పనులు చేయుటకు ఉద్యమించుట, అజ్ఞానవశముచే శక్యమైన పనులు చేయుటకు ప్రయత్నము చేయకపోవుట, శక్య మైన పనులను చేయుటకు సమయము కాని సమయమున ప్రయత్నించుట అనునవి మూడు విధములైన కార్యవ్యసనము"అని చెప్పిన వ్యసనత్రయము.

**మూడు విద్యలు** :- త్రయి, వార్త, దండనీతి అనునవి. 'త్రయి' అనగా వేదత్రయము. 'వార్త'అనగా వ్యవసాయము, గోరక్షణము, వర్తకము. 'దండనీతి' అనగా రాజనీతి.

**షాడ్గుణ్యము** :- సంధి, విగ్రహము (విరోధము పెట్టుకొనుట), దండెత్తి వెళ్లుట (యానము), ఆసనము (కాలమునకై ప్రతీక్షించుట) ద్వైధీభావము (దుర్బలుడు ప్రబలు లైన ఇద్దరు శత్రువులతో మాటలతో మాత్రము మంచిగా ఉండుట) సమాశ్రయణము (బలవంతుని ఆశ్రయించుట) అను ఆరు గుణములు.

దైవమానుషమ్=దైవమువలన వచ్చిన ఐదు విధముల ఆపద, మనుష్యుల వలన వచ్చు ఐదు విధముల ఆపద.

"హుతాశనో జలం వ్యాధిర్దుర్భిక్షం మరణం తథా,
ఇతి పంచవిధం దైవం మానుషం వ్యసనం పరమ్,
ఆయుక్తేభ్యశ్చ చోరేభ్యః పరేభ్యో రాజవల్లభాత్,
పృథివీపతిలోభాచ్చ వ్యసనం పఞ్చధా భవేత్".

అని కామందకుడు చెప్పినట్లుగా- అగ్ని, జలము, వ్యాధులు, దుర్భిక్షము, మరణము అనునవి దైవమువలన వచ్చిన ఆపదలు. అధికారులు, దొంగలు, శత్రువులు, రాజసన్నిహితులు, రాజుదురాశ- వీటివలన కలిగినవి మానుషాపదలు.

**కృత్యము:-** శత్రుపక్షములోని- జీతము దొరకని లుబ్ధులూ, అవమానింపబడిన ఆత్మాభిమానవంతులూ, నిష్కారణముగా కోపింపచేయబడినవారూ, భయపెట్టబడిన భీరులూ అను నాలుగు విధాల జనులను, వారికి కావలసిన వస్నీ ఇచ్చి తన వైపు త్రిప్పుకొనుట-

"అలబ్ధవేతనో లుబ్ధో మానీ చాప్యవమానితః,
క్రుద్ధశ్చ కోపితోఽకస్మాత్తథాఽభీతశ్చ భీషితః,
యథాభిలషితైః కామైర్భిన్ద్యాదేతాం శ్చతుర్విధాన్".

—కామందకనీతి.

**వింశతివర్గము :-** ఎట్టి పరిస్థితులలోను సంధి చేసికొనుటకు తగనివారూ విరోధముచేతనే సాధించతగినవారూ అయిన ఇరవై విధాల శత్రువుల సముదాయము.

"బాలో వృద్ధో దీర్ఘరోగీ తథా జ్ఞాతిబహిష్కృతః,
భీరుకో భీరుజనకో లుబ్ధో లుబ్ధజనస్తథా,
విరక్తప్రకృతిశ్చైవ విషయేష్వతిసక్తిమాన్,
అనేకచిత్తమన్త్రశ్చ దేవబ్రాహ్మణనిన్దకః,
దైవోపహతకశ్చైవ దైవచిన్తక ఏవ చ.
దుర్భిక్షవ్యసనోపేతః బలవ్యసనసంకులః,
అదేశస్థో బహురిపుర్యుక్తోఽకాలేన యశ్చ సః.

సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషా అమీ,
ఏతైః సన్ధిం న కుర్వీత విగృహ్ణీయాత్తు కేవలమ్".

"చిన్నవాడు, వృద్ధుడు, దీర్ఘరోగముతో బాధపడుచున్నవాడు, బంధువులు బహిష్కరించినవాడు, పిరికివాడు, పిరికిపంద లైన జనము కలవాడు, లోభి, లుబ్ధు లైన జనులు కలవాడు, అమాత్యాదిప్రకృతుల ప్రేమను చూరకొననివాడు, ఎక్కువ భోగలాలసుడు, చపలచిత్తము, వివిధఆలోచనలు కలవాడు, దేవబ్రాహ్మణులను నిందించువాడు, దైవోపహతుడు (మునిశాపాదులచేత కొట్టబడినవాడు), దైవచింతకుడు (అన్నియు దైవమే చేకూర్చునులే అని పురుషప్రయత్నము చేయక కూర్చున్నవాడు), రాజ్యములో దుర్భిక్షము ఏర్పడినవాడు, వ్యసనములో చిక్కుకొన్న సేన కలవాడు, స్వదేశములో ఉండనివాడు, చాలమంది శత్రువులు కలవాడు, కాలము ప్రతికూలముగా ఉన్నవాడు, సత్యము, ధర్మము లేనివాడు అని ఇరువది విధముల శత్రువులతో సంధి చేసుకొనగూడదు. విరోధమే చేయవలెను" అని చెప్పబడిన ఇరువదిమంది వర్గము. లేదా- విగ్రహకారణము లైన ఇరువదింటి సముదాయము వింశతిగణము. వాటిని కామందకుడు ఈ విధముగ చెప్పి ఉన్నాడు-

"రాజ్యస్త్రీస్థానదేశానాం జ్ఞాతీనాం చ ధనస్య చ,
అపహారో మదో మానః పీడా వైషయికీ తథా,

జ్ఞానార్థశక్తిధర్మాణాం విఘాతో దైవమేవ చ,
మిత్రార్థయోశ్చాపమానస్తథా బన్ధువినాశనమ్,

భూతానుగ్రహవిచ్ఛేదస్తథా మణ్డలదూషణమ్,
ఏకార్థాభినివేశిత్వ మితి విగ్రహయోనయః.

"రాజ్య-స్త్రీ-స్థాన-దేశ-జ్ఞాతి- ధనములను అపహరించుట, మదము, దురభిమానము, దేశమును పీడించుట, జ్ఞాన-అర్థ-శక్తి-ధర్మములకు విఘాతము కలిగించుట, మిత్రులను, వారి అర్థమును అవమానించుట, బంధువులను నశింపచేయుట, ఇంద్రాదిదేవతల విరోధము, జనులకు ప్రేమలేకపోవుట, మండలమును హింసించుట, ఒకే కార్యమునందు తగని పట్టుదల ఇవి విగ్రహమును (విరోధమును) కొనసాగించుటకు కారణములు.

**ప్రకృతులు:-** అమాత్యులు, రాష్ట్రము, దుర్గములు, ధనాగారము, దండము ఈ ఐదూ ప్రకృతులు.

"అమాత్యరాష్ట్రదుర్గాణి కోశో దణ్డశ్చ పఞ్చమః,
ఏతాః ప్రకృతయస్తద్జ్ఞైర్విజిగీషో రుదాహృతాః".

—కామందక నీతిశాస్త్రము.

**మండలము :-** విజిగీషువునకు (తన రాజ్యమును విస్తరింపచేయవలె నని అనుకొనుచున్న రాజు విజిగీషువు) చుట్టుప్రక్కల ఉన్న పదకొండు విధము లైన రాజుల సముదాయము. మధ్య విజుగీషువు. వానికి ముందు శత్రువు, మిత్రుడు, శత్రుమిత్రుడు, మిత్రశత్రువు, శత్రుమిత్రమిత్రుడు అని ఐదుగు రుందురు. పృష్ఠ భాగమునందు పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు, పార్ష్ణిగ్రాహాసారుడు, ఆక్రందాసారుడు అని నలుగురు ఉందురు. పార్శ్వమునం దున్నవాడు మధ్యస్థుడు. వారికి బైట నున్నవాడు ఉదాసీనుడు. ఇది ద్వాదశరాజమండలము.

"సంపన్నస్తు ప్రకృతిభిర్మహోత్సాహః కృతశ్రమః,
జేతుమీషణశీలశ్చ విజిగీషురితి స్మృతః.
అరిర్మిత్రమరేర్మిత్రం మిత్రామిత్రమతః పరమ్,
అథారిమిత్రమిత్రం చ విజిగీషోః పురఃసరాః.
పార్ష్ణిగ్రాహ స్తతః పశ్చాదాక్రన్దస్తదనన్తరమ్,
ఆసారావనయో శ్చైవ విజిగీషోస్తు పృష్ఠతః.
ఆరేశ్చ విజిగీషోశ్చ మధ్యమో భూమ్యనన్తరః,
అనుగ్రహే సంహతయోర్వ్యస్తయోర్నిగ్రహే ప్రభుః.
మణ్డలాద్బహిరేతేషాముదాసీనో బలాధికః,
అనుగ్రహే సంహతానాం వ్యస్తానాం చ వధే ప్రభుః."

—కామందక నీతిశాస్త్రము.

**ద్వియోనీ సంధివిగ్రహౌ :-** సంధివిగ్రహాదిషడ్గుణములలో సంధివిగ్రహములు ప్రధానములు. యాన- ఆసనములకు మూలము విగ్రహము. ద్వైధీభావ-సమాశ్రయణములకు సంధి మూలము.

"యానాసనే విగ్రహస్య రూపం సద్భిరితి స్మృతమ్,
సన్ధేశ్చ సన్ధిమార్గజ్ఞైర్ద్వైధీభావసమాశ్రయా."

-కామందక నీతిశాస్త్రము. 68-70

మూ. మన్త్రిభిస్త్వం యథోద్దిష్టైశ్చతుర్భిస్త్రిభిరేవ వా,
కచ్చిత్సమస్తైర్వ్యస్తైశ్చ మన్త్రం మన్త్రయసే మిథః. 71

ప్ర. అ. త్వమ్=నీవు, యథోద్దిష్టైః=శాస్త్రములలో చెప్పబడిన, చతుర్భిః=నలుగురు కాని, త్రిభిరేవ వా=ముగ్గురు కాని, మన్త్రిభిః= మంత్రులతో, సమస్తైః=కలిసి ఉన్నవారితోను, వ్యస్తైశ్చ=ఒక్కరొక్కరుగా ఉన్నవారితోను, మిథః=రహస్యముసందు, మన్త్రమ్=ఆలోచనను, మన్త్రయసే కచ్చిత్=ఆలోచించుచున్నావుకదా? (చేయుచున్నావుకదా).

తా. నీవు శాస్త్రోక్తలక్షణములు గల ముగ్గురు లేక నలుగురు మంత్రులతో, అందరితో కలిసి గాని, వేరు వేరుగా గాని రహస్యముగా, ఆలోచన చేయుచున్నావుకదా? 71

మూ. కచ్చిత్తే సఫలా వేదాః కచ్చిత్తే సఫలాః క్రియాః,
కచ్చిత్తే సఫలా దారాః కచ్చిత్తే సఫలం శ్రుతమ్. 72

ప్ర. అ. తే=నీయొక్క, వేదాః=వేదములు, సఫలాః కచ్చిత్=సఫలములు అగుచున్నవా? తే క్రియాః=నీ పనులు, సఫలాః కచ్చిత్=సఫలములగుచున్నవా? తే దారాః=నీ భార్య, సఫలాః కచ్చిత్=సఫల మైనదా? తే శ్రుతమ్=నీ శాస్త్రశ్రవణము, సఫలం కచ్చిత్=సఫలమైనదా?

తా. నీవు చదివిన వేదములు, నీవు తలపెట్టిన పనులు, నీ భార్య, నీవు వినిన శాస్త్రములు సఫలములుగా ఉన్నవా? 72

మూ. కచ్చిదేషైవ తే బుద్ధిర్యథోక్తా మమ రాఘవ,
ఆయుష్యా చ యశస్యా చ ధర్మకామార్థసంహితా. 73

ప్ర. అ. రాఘవ=భరతుడా! తే బుద్ధిః=నీ బుద్ధి, ఆయుష్యా=ఆయుర్దాయము నిచ్చునదిగాను, యశస్యా చ = కీర్తి నిచ్చునదిగాను, ధర్మకామార్థ

సంహితా = ధర్మకామార్థములతో కూడినదిగాను, మమ=నాకు, (నాచేత). యథా = ఎట్లు, ఉక్తా = చెప్పబడినదో, ఏషైవ కచ్చిత్ = అట్టిదిగానే ఉన్నదా!

తా. భరతుడా! నేను కోరుకొనుచుండు విధముగా నీ బుద్ధి ధర్మకామార్థములయందు శ్రద్ధకలదై, ఆయుర్దాయమును, యశస్సును, వృద్ధిపొందించునదిగా ఉన్నదా? 73

మూ. యాం వృత్తిం వర్తతే తాతో యాం చ నః ప్రపితామహాః,
తాం వృత్తిం వర్తసే కచ్చిద్యాచ సత్పథగా శుభా. 74

ప్ర. అ. తాతః = తండ్రి, యామ్ = ఏ, వృత్తిమ్ = ఆచారమును, (పద్ధతిని), వర్తతే = ఆచరించుచున్నాడో, యామ్ = ఏ వృత్తిని, నః=మనయొక్క, ప్రపితామహాః = ముత్తాతలు మొదలైనవారు అనుసరించిరో, యా చ = ఏది, సత్పథగా = మంచిమార్గమును చేరునదో, శుభా = మంగళకరమైనదో, తామ్= అట్టి, వృత్తిమ్ = ప్రవర్తనను, వర్తసే కచ్చిత్ = అనుసరించుచున్నావు కదా!

తా. సన్మార్గమున నడిపించు, మంగళకరమైన యే ఆచారమును మన తండ్రి అనుసరించుచున్నాడో, మన ముత్తాతలు అనుసరించినారో, దానినే నీవు కూడా అనుసరించుచున్నావు కదా. 74

మూ కచ్చిత్ స్వాదు కృతం భోజ్యమేకో నాశ్నాసి రాఘవ,
కచ్చిదాశంసమానేభ్యో మిత్రేభ్యః సంప్రయచ్ఛసి. 75

ప్ర. అ. రాఘవ=భరతుడా! స్వాదుకృతమ్=మధురముగా చేయబడిన, భోజ్యమ్ = అన్నమును, ఏకః = నీ వొక్కడవే, నాశ్నాసి కచ్చిత్=తినుటలేదు కదా! ఆశంసమానేభ్యః=దానిని కోరుచున్న, మిత్రేభ్యః=మిత్రులకొరకు, సంప్రయచ్ఛసి కచ్చిత్ = ఇచ్చుచున్నావుకదా?

తా. భరతుడా! వండిన మధురమైన పదార్థములను నీవొక్కడవే భుజించకుండగా, దానియం దభిలాష గల నీ మిత్రులకు కూడ ఇచ్చుచున్నావుకదా?

మూ. రాజా తు ధర్మేణ హి పాలయిత్వా
మహామతిర్దండధరః ప్రజానామ్,

అవాప్య కృత్స్నాం వసుధాం యథావ
దితశ్చ్యుతః స్వర్గముపైతి విద్వాన్. 76

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
శతతమః సర్గః.

ప్ర. అ. మహామతిః=గొప్ప బుద్ధి గల, విద్వాన్=విద్వాంసుడైన, రాజా తు=రాజు, కృత్స్నామ్ = సమస్తమైన, వసుధామ్=భూమిని, అవాప్య=పొంది, ప్రజానామ్=ప్రజలకు, దణ్డధరః=దండమును ఇచ్చుచున్నవాడై, యథావత్ = యథాశాస్త్రముగ, ధర్మేణ=ధర్మముచేత, పాలయిత్వా=పరిపాలించి, ఇతః=ఈ లోకమునుండి, చ్యుతః = జారినవాడై, స్వర్గమ్ = స్వర్గమును, ఉపైతి హి = పొందును కదా?

తా. మహాబుద్ధిశాలి, విద్వాంసుడు అయిన రాజు, సమస్తరాజ్యమును పొంది, ప్రజలను తగు విధముగా దండించుచు, యథాశాస్త్రముగా ధర్మము ప్రకారము పరిపాలించుచు, మరణానంతరము స్వర్గమునకు వెళ్లును కదా. 76

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూరవ సర్గ సమాప్తము.

## అథ ఏకశతతమః సర్గః

[శ్రీరాముడు భరతు డడవికి వచ్చుటకు కారణ మడుగుట, భరతు డాయనను రాజ్యము స్వీకరింపు మని కోరుట. రాముడు అందు లకు అంగీకరింపకుండుట.]

మూ. తం తు రామః సమాశ్వాస్య భ్రాతరం గురువత్సలమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రష్టుం సముపచక్రమే. 1

ప్ర. అ. భ్రాత్రా = సోదరు డైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, గురువత్సలమ్ = పెద్దలయందు ప్రేమగల, భ్రాతరమ్ = సోదరు డైన, తమ్ = ఆ భరతుని, ప్రష్టుమ్ = ప్రశ్నించుటకు, సముపచక్రమే = ప్రారంభించెను.

తా. లక్ష్మణసమేతు డైన ఆ రాముడు, పెద్దలయందు ప్రేమ గల ఆ భరతుని ఓదార్చి, యిట్లు ప్రశ్నించుటకు ప్రారంభించెను. 1

మూ. కిమేతదిచ్ఛేయమహం శ్రోతుం ప్రవ్యాహృతం త్వయా,
యస్మాత్త్వమాగతో దేశమిమం చీరజటాజినః. 2

ప్ర. అ. త్వమ్ = నీవు, చీరజటాజినః = నారచీరలు, జటలు, అజినము కలవాడ వై, యస్మాత్ = ఏ కారణమువలన, ఇమం దేశమ్ = ఈ ప్రదేశమును గూర్చి, ఆగతః = వచ్చినావో, ఏతత్ = ఈ కారణము, కిమ్ = ఏమి అని, త్వయా = నీచేత, ప్రవ్యాహృతమ్ = చెప్పబడగా, అహమ్ = నేను, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛేయమ్ = కోరెదను.

తా. నీవు చీరజటాజినములు ధరించి ఇక్కడకు వచ్చుటకు కారణమును తెలుసుకొనగోరుచున్నాను. చెప్పుము. 2

మూ. కిం నిమిత్తమిమం దేశం కృష్ణాజినజటాధరః,
హిత్వా రాజ్యం ప్రవిష్టస్త్వం తత్సర్వం వక్తుమర్హసి. 3

ప్ర. అ. త్వమ్ = నీవు, రాజ్యమ్ = రాజ్యమును, హిత్వా=విడిచి, కృష్ణాజినజటాధరః = కృష్ణాజినమును, జటలను, ధరించినవాడవై, కిం నిమిత్తమ్ = ఎందుకు, ఇమం దేశమ్ = ఈ ప్రదేశమును, ప్రవిష్టః = ప్రవేశించినావు? తత్= దానిని, సర్వమ్ = అంతను, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నీవు రాజ్యమును విడిచి, కృష్ణాజినజటాధారి వై, ఈ అరణ్యమునకు వచ్చుటకు కారణ మేమో సవిస్తరముగా చెప్పుము. 3

మూ. ఇత్యుక్తః కైకయీపుత్రః కాకుత్స్థేన మహాత్మనా,
ప్రగృహ్య బలవద్భూయః ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్. 4

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, కాకుత్స్థేన = రాముని చేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, కైకయీపుత్రః = భరతుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, భూయః = మరల, బలవత్ = గట్టిగా, ప్రగృహ్య = రాముని పట్టుకొని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భరతుడు రాముని మాటలు విని, రాముని మరల గట్టిగా కౌగలించుకొని, నమస్కరించుచు, ఇట్లు పలికెను. 4

మూ. ఆర్యం తాతః పరిత్యజ్య కృత్వా కర్మ సుదుష్కరమ్,
గతః స్వర్గం మహాబాహుః పుత్రశోకాభిపీడితః. 5

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, తాతః=తండ్రి, ఆర్యం= పూజ్యుడవైన నిన్ను, పరిత్యజ్య=విడిచి, సుదుష్కరమ్=చేయ శక్యము కాని, కర్మ = పనిని, కృత్వా = చేసి, పుత్రశోకాభిపీడితః = పుత్రశోకముచే పీడింపబడినవాడై, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతః=వెళ్ళినాడు.

తా. గొప్ప బాహువులు గల మన తండ్రి, నిన్ను అడవికి పంపి, చేయ శక్యము గాని అట్టి పనిని చేసి, పుత్రశోకము సహింపజాలక స్వర్గస్థుడయ్యెను.

మూ. స్త్రియా నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరంతప,
చకార సుమహత్పాపమిదమాత్మయశోహరమ్. 6

ప్ర. అ. పరంతప = శత్రువులను బాధించు ఓ రామా! మమ=నాయొక్క

మాత్రా = తల్లియైన, స్త్రియా = స్త్రీ యైన, కైకేయ్యా = కైకేయిచేత, నియుక్తః = ఆజ్ఞాపింపబడినవా డై, ఆత్మయశోహరమ్ = తన కీర్తిని హరించు, సుమహత్ = చాల గొప్ప, ఇదం పాపమ్ = ఈ పాపమును, చకార = చేసెను.

తా. శత్రుసంహారకుడ వైన ఓ రామా! మన తండ్రి, స్త్రీ యైన నా తల్లి కైకేయి ప్రేరేపింపగా, తన కీర్తిని అంతను నశింపచేయు ఈ మహాపాపమును చేసినాడు. 6

మూ. సా రాజ్యఫలమప్రాప్య విధవా శోకకర్శితా,
పతిష్యతి మహాఘోరే నిరయే జననీ మమ. 7

ప్ర. అ. మమ = నాయొక్క, జననీ = తల్లి యైన, సా = ఆ కైకేయి, రాజ్యఫలమ్ = రాజ్య మనే ఫలమును, అప్రాప్య = పొందక, విధవా = విధవ యై, శోకకర్శితా = శోకముచే కృశింపచేయబడిన దై, మహాఘోరే = చాలా ఘోర మైన, నిరయే = నరకమునందు, పతిష్యతి = పడగలదు.

తా. నా తల్లి, రాజ్యము లభింపక వైధవ్యమును మాత్రము పొంది, శోకముచే కృశించినదై, భయంకర మైన నరకములో పడగలదు. 7

మూ. తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తుమర్హసి,
అభిషిఞ్చస్వ చాద్యైవ రాజ్యేన మఘవానివ. 8

ప్ర. అ. తస్య = అట్టి, దాసభూతస్య = దాసుడ వైన, మే = నాకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగిఉన్నావు. అద్యైవ = ఇపుడు, మఘవానివ = దేవేంద్రుడు వలె, రాజ్యేన = రాజ్యముచేత, అభిషిఞ్చస్వ = అభిషేకించుకొనుము.

తా. దాసుడ నైన నన్ను అనుగ్రహించి, దేవేంద్రుడు వలె ఇపుడే రాజ్యాభిషిక్తుడవు అగుము. 8

మూ. ఇమాః ప్రకృతయః సర్వా విధవా మాతరశ్చ యాః,
త్వత్సకాశమనుప్రాప్తాః ప్రసాదం కర్తుమర్హసి. 9

ప్ర. అ. ఇమాః = ఈ, సర్వాః = సమస్త మైన, ప్రకృతయః = ప్రజలు,

విధవాః = భర్త లేని, యాః మాతరశ్చ = ఏ తల్లు లున్నారో వారు, త్వత్స కాశమ్ = నీ సమీపమును. అనుప్రాప్తాః = పొంది ఉన్నారు. ప్రసాదమ్ = అను గ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. ఈ ప్రజలు, భర్తను కోల్పోయిన మన తల్లులు, అందరును నీ దగ్గరకు వచ్చినారు. అనుగ్రహింపుము. 9

మూ. తదానుపూర్వ్యా యుక్తం చ యుక్తం చాత్మని మానద,
రాజ్యం ప్రాప్నుహి ధర్మేణ సకామాన్ సుహృదః కురు.

ప్ర. అ. మానద = గౌరవము నిచ్చు రామా! తత్ = ఆ కారణమువలన, ఆనుపూర్వ్యా = క్రమముతో, యుక్తమ్ = కూడినది, ఆత్మని = నీయందు, యుక్తం చ = తగినది అయిన, రాజ్యమ్ = రాజ్యమును, ధర్మేణ = ధర్మముచేత, ప్రాప్నుహి = పొందుము. సుహృదః = స్నేహితులను, సకామాన్ = తీరిన కోరిక కలవారినిగా, కురు = చేయుము.

తా. గౌరవము నిచ్చు రామా! అందుచే, వంశక్రమమును బట్టి పెద్ద వాడవగు నీకు సక్రమించినదీ తగినదీ అయిన ఈ రాజ్యమును ధర్మానుసార ముగా స్వీకరించి నీమిత్రుల కోరికను తీర్పుము. 10

మూ. భవత్వవిధవా భూమిః సమగ్రా పతినా త్వయా,
శశినా విమలేనేవ శారదీ రజనీ యథా. 11

ప్ర. అ. సమగ్రా = సమస్త మైన, భూమిః = భూమి, శారదీ = శరత్కాలి మునకు సంబంధించిన, రజనీ యథా = రాత్రివలె, పతినా = ప్రభు వైన, త్వయా = నీచేత, విమలేన = స్వచ్ఛ మైన, శశినా ఇవ = చంద్రునిచేత వలె, అవిధవా = విధవకానిదిగా, భవతు = అగుగాక.

తా. శరత్కాలరాత్రి నిర్మల మైన చంద్రుని పొంది నట్లు, సమస్త మైన ఈ భూమి నిన్ను ప్రభువుగా పొంది సనాథురాలు అగుగాక. 11

మూ. ఏభిశ్చ సచివైః సార్ధం శిరసా యాచితో మయా,
భ్రాతుః శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి. 12

ప్ర. అ. ఏభిః = ఈ, సచివైః సార్ధమ్ = మంత్రులతో కూడ, మయా = = నాచేత, శిరసా = శిరస్సుతో, యాచితః = యాచింపబడినావు. భ్రాతుః = సోదరుడను, శిష్యస్య = శిష్యుడను, దాసస్య = దాసుడను అయిన నాకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. ఈ సచివులు, నేను, అందరము కూడా శిరస్సు వంచి నమస్కరించుచు, నిన్ను ప్రార్థించుచున్నాము. నీ సోదరుడను, శిష్యుడను, దాసుడను అయిన నన్ను అనుగ్రహింపుము. 12

మూ. తదిదం శాశ్వతం పిత్ర్యం సర్వం ప్రకృతిమణ్డలమ్,
పూజితం పురుషవ్యాఘ్ర నాతిక్రమితుమర్హసి. 13

ప్ర. అ. పురుషవ్యాఘ్ర! = పురుషులలో శ్రేష్ఠుడా! తత్ = ఆ కారణము వలన, శాశ్వతమ్=శాశ్వత మైనదీ (పరంపరాగతము) పిత్ర్యమ్=తండ్రినుండి వచ్చినది, పూజితమ్ = పూజింపబడినది అయిన, సర్వమ్ = సమస్త మైన, ఇదమ్ = ఈ, ప్రకృతిమణ్డలమ్ = ప్రకృతిమండలమును, అతిక్రమితుమ్ = అతిక్రమించుటకు, నార్హసి=తగవు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! వంశక్రమమున వచ్చుచున్నది, తండ్రిగారికి సంబంధించినదీ, గౌరవింపబడునదీ అయిన ఈ ప్రకృతిమండలము చేయు ప్రార్థనను కాదనకుము. 13

మూ. ఏవముక్త్వా మహాబాహుః సబాష్పః కైకయీసుతః,
రామస్య శిరసా పాదౌ జగ్రాహ విధివత్పునః. 14

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, కైకయీసుతః = భరతుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సబాష్పః = కన్నీటితో కూడినవాడై, రామస్య = రామునియొక్క, పాదౌ = పాదములను, పునః = మరల, విధివత్ = యథాశాస్త్రముగా, శిరసా = శిరస్సుతో, జగ్రాహ = గ్రహించెను.

తా. మహాబాహు వైన భరతుడు ఇట్లు పలికి, కన్నీరు కార్చుచు మరల రాముని పాదములను శిరస్సుతో స్పృశించి నమస్కరించెను. 14

మూ. తం మత్తమివ మాతఙ్గం నిఃశ్వసన్తం పునః పునః,
భ్రాతరం భరతం రామః పరిష్వజ్యేదమబ్రవీత్. 15

ప్ర. అ. రామః = రాముడు, పునః పునః = మాటిమాటికి, నిఃశ్వసన్తమ్ = నిట్టూర్చుచున్నవాడు, మత్తమ్=మదించిన, మాతఙ్గమ్ ఇవ = ఏనుగు వలె ఉన్నవాడు అయిన, భ్రాతరమ్ = సోదరు డైన, తం భరతమ్ = ఆ భరతుని, పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు మాటిమాటికి నిట్టూర్చుచు, మదించిన ఏనుగు వలె ఉన్న సోదరు డైన ఆ భరతుని కౌగలించుకొని ఇట్లు పలికెను. 15

మూ. కులీనస్సత్త్వసమ్పన్నస్తేజస్వీ చరితవ్రతః,
రాజ్యహేతోః కథం పాపమాచరేత్త్వద్విధో జనః. 16

ప్ర. అ. కులీనః = ఉత్తమవంశమునందు పుట్టినవాడు, సత్త్వసంపన్నః = బలముతో కూడినవాడు, తేజస్వీ = తేజశ్శాలి, చరితవ్రతః=ఆచరింపబడిన వ్రతము కలవాడు అయిన, త్వద్విధః=నీవంటి, జనః=జనుడు, రాజ్యహేతోః= రాజ్యముకొరకై, పాపమ్ = పాపమును, కథమ్ = ఎట్లు, ఆచరేత్ = చేయును.

తా. ఉత్తమకులమునందు పుట్టినవాడు, బలవంతుడు, తేజశ్శాలి, సద్వ్రతములను ఆచరించువాడు, అయిన నీవంటి జను డెవ్వడైన, రాజ్యముకొరకై పాపము చేయునా! (అనగా నీ విషయమున నా కేమియు సందేహము లేదని భావము). 16

మూ. న దోషం త్వయి పశ్యామి సూక్ష్మమప్యరిసూదన,
న చాపి జననీం బాల్యాత్త్వం విగర్హితుమర్హసి. 17

ప్ర. అ. అరిసూదన! = శత్రువులను సంహరించువాడా! త్వయి = నీ యందు, సూక్ష్మమపి = చాలా చిన్న దైనను, దోషమ్ = దోషమును, న పశ్యామి = చూడను. త్వమ్ = నీవు, బాల్యాత్ = చిన్నతనమువలన, జననీం = తల్లిని, విగర్హితుమ్ = నిందించుటకు, నార్హసి చాపి = తగవు కూడ!

తా. శత్రుసంహారకుడ వైన ఓ భరతా! నీలో ఏ కొంచెము కూడ దోషము నాకు కనబడుటలేదు. బాల్యముచేత, నీవు నీ తల్లిని కూడ నిందింపవద్దు. 17

మూ. కామకారో మహాప్రాజ్ఞ గురూణాం సర్వదానఘ,
ఉపపన్నేషు దారేషు పుత్రేషు చ విధీయతే. 18

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధికలవాడా ! అనఘ = దోషములు లేనివాడా ! గురూణామ్ = పెద్దలకు, ఉపపన్నేషు = సమర్థులైన, దారేషు = భార్యల విషయమునందును, పుత్రేషు చ = పుత్రుల విషయమునందును, సర్వదా = ఎల్లపుడు, కామకారః = స్వేచ్ఛాచరణము, విధీయతే = విధింపబడుచున్నది.

తా. మహాబుద్ధిమంతుడవు, పాపరహితుడవు అయిన ఓ భరతా! పెద్దలు సమర్థులైన తమ భార్యాపుత్రాదులవిషయమున తమ ఇష్టము వచ్చినట్లు చేయవచ్చునని శాస్త్రము. 18

మూ. వయమస్య యథా లోకే సంఖ్యాతాః సౌమ్య సాధుభిః,
భార్యాః పుత్రాశ్చ శిష్యాశ్చ త్వమనుజ్ఞాతుమర్హసి. 19

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా, లోకే = లోకమునందు, భార్యాః = భార్యలు, పుత్రాశ్చ = పుత్రులు, శిష్యాశ్చ = శిష్యులు, సాధుభిః = సత్పురుషుల చేత, యథా = ఎట్లు, సంఖ్యాతాః = చెప్పబడినారో, వయమ్ = మనము, అస్య = ఈ దశరథమహారాజునకు, (తథా = అట్లే అని) త్వం = నీవు, అనుజ్ఞాతుం = తెలుసుకొనుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. ఓ సౌమ్యుడా! సత్పురుషులు లోకములో భార్యాపుత్రశిష్యుల విషయమున, ఏవిధముగా చెప్పుచున్నారో, మనము దశరథమహారాజునకు అట్టివారమే అను విషయమును తెలుసుకొనుము. 19

మూ. వనే వా చీరవసనం సౌమ్యకృష్ణాజినామ్బరమ్,
రాజ్యే వాపి మహారాజో మాం వాసయితుమీశ్వరః. 20

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా! చీరవసనమ్ = నారచీరలు వస్త్రముగా గల, కృష్ణాజినాంబరమ్ = కృష్ణాజినము వస్త్రముగా గల, మామ్ = నన్ను, మహారాజః = మహారాజు, వనే వా = వనమునందుకాని, రాజ్యే వాపి = రాజ్యమునందు కాని, వాసయితుమ్ = నివసింపచేయుటకు, ఈశ్వరః = సమర్థుడు.

తా. నాచేత నారచీరలు కృష్ణాజినము ధరింపజేసి అరణ్యములో నివసింప

చేయుటకు గాని, నన్ను రాజ్యములో అభిషిక్తుని చేయుటకు గాని, మహారాజు నకు అధికార మున్నది. 20

మూ. యావత్పితరి ధర్మజ్ఞే గౌరవం లోకసత్కృతమ్,
తావద్ధర్మభృతాం శ్రేష్ఠ జనన్యామపి గౌరవమ్. 21

ప్ర. అ. ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, శ్రేష్ఠ=శ్రేష్ఠుడా! ధర్మజ్ఞే = ధర్మములు తెలిసిన, పితరి = తండ్రియందు, లోకసత్కృతమ్ = లోకులచే అభినందింపబడిన, యావత్ = ఎంతటి, గౌరవమ్ = గౌరవము ఉండునో, జనన్యామపి=తల్లియందు కూడ, తావత్=అంత, గౌరవమ్=గౌరవ ముండవలయును.

తా. ధర్మవేత్తలలో శ్రేష్ఠుడ వైన ఓ భరతా : ధర్మజ్ఞు డైన తండ్రి విష యమున లోకు లందరు మెచ్చుకొను నట్లుగా ఎంతటి గౌరవమును చూపించ వలెనో అంతటి గౌరవమును తల్లివిషయమునందు కూడ చూపవలెను. 21

మూ. ఏతాభ్యాం ధర్మశీలాభ్యాం వనం గచ్ఛేతి రాఘవ,
మాతాపితృభ్యాముక్తోఽహం కథమన్యత్సమాచరే. 22

ప్ర. అ. రాఘవ=ఓ భరతుడా! ధర్మశీలాభ్యామ్=ధర్మస్వభావము కల, ఏతాభ్యామ్ = ఈ, మాతాపితృభ్యామ్ = తల్లిదండ్రులచేత, వనమ్ = వనమును గూర్చి, గచ్ఛ=వెళ్లుము, ఇతి = అని, ఉక్తః = పలుకబడిన, అహమ్ = నేను, అన్యత్=మరియొకపనిని, కథమ్ = ఎట్లు, సమాచరే=చేయుదును?

తా. భరతా! ధర్మశీలు లైన నా తల్లిదండ్రు లిద్దరు నన్ను అరణ్యము నకు వెళ్ల మని ఆజ్ఞాపించగా నేను మరి యొక విధముగా ఎట్లు చేయుదును? 22

మూ. త్వయా రాజ్యమయోధ్యాయాం ప్రాప్తవ్యం లోకసత్కృతమ్,
వస్తవ్యం దణ్డకారణ్యే మయా వల్కలవాససా. 23

ప్ర అ. త్వయా=నీచేత, అయోధ్యాయామ్=అయోధ్యలో, లోకసత్కృతమ్=జనులచే కొనియాడబడిన, రాజ్యమ్=రాజ్యము, ప్రాప్తవ్యమ్=పొందబడ తగినది. మయా=నాచేత, వల్కలవాససా=నారచీరలను వస్త్రములుగా కలవా డనై, దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, వస్తవ్యమ్=నివసింపదగియున్నది.

తా. నీవు అయోధ్యలో లోకుల గౌరవమునకు పాత్ర మైన రాజ్యపాలనము చేయుచుండవలెను. నేను నారచీరలు ధరించి దండకారణ్యములో నివసించవలెను. 23

మూ. ఏవం కృత్వా మహారాజో విభాగం లోకసన్నిధౌ,
వ్యాదిశ్య చ మహాతేజా దివం దశరథో గతః. 24

ప్ర. అ. మహారాజః = మహారాజు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన, దశరథః = దశరథుడు, లోకసన్నిధౌ = జనుల సన్నిధియందు, ఏవమ్ = ఈ విధముగా, విభాగమ్ = విభాగమును, కృత్వా = చేసి, వ్యాదిశ్య చ = ఆజ్ఞాపించి, దివమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. మహాతేజశ్శాలి యైన దశరథమహారాజు, ప్రజల సమక్షమున ఈ విధముగా పంపకము చేసి, మనలను ఆజ్ఞాపించి స్వర్గస్థు డైనాడు. 24

మూ. స చ ప్రమాణం ధర్మాత్మా రాజా లోకగురు స్తవ,
పిత్రా దత్తం యథాభాగముపభోక్తుం త్వమర్హసి. 25

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు, లోకగురుః = లోకమునకుపూజ్యుడూ అయిన, సః రాజా = ఆ రాజు, తవ = నీకు, ప్రమాణమ్ = ప్రమాణము. త్వమ్ = నీవు, పిత్రా = తండ్రిచేత, దత్తమ్ = ఇవ్వబడినదానిని, యథాభాగమ్ = భాగమును అనుసరించి, ఉపభోక్తుమ్ = అనుభవించుటకు, అర్హసి = తగివున్నావు.

తా. ధర్మాత్ముడు, లోకగురువు, అయిన ఆ మహారాజు వాక్యమును నీవు ప్రమాణముగా గ్రహించవలెను. నీకు తండ్రి ఇచ్చిన భాగమును అనుభవించవలెను. 25

మూ. చతుర్దశ సమాః సౌమ్య దణ్డకారణ్యమాశ్రితః,
ఉపభోక్ష్యే త్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా; అహం తు = నేనైతే, చతుర్దశ = పదు

నాలుగు, సమాః=సంవత్సరములు,దండకారణ్యమ్=దండకారణ్యమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడనై, మహాత్మనా = మహాత్ముడైన, పిత్రా = తండ్రిచేత, దత్తమ్ = ఇవ్వబడిన, భాగమ్ = భాగమును, ఉపభోక్ష్యే = అనుభవించగలను.

తా. మహాత్ముడైన తండ్రి పదునాలుగు సంవత్సరములు దండకారణ్యములో నివసించుట అనే భాగమును నాకిచ్చినాడు. నేను దానిని అనుభవించెదను. 26

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వ్యధికశతతమః సర్గః

[*భరతుడు తిరిగి రాజ్యమును గ్రహింపుమని పట్టుబట్టి తండ్రి మరణము నెరిగించుట.*]

మూ. రామస్య వచనం శ్రుత్వా భరతః ప్రత్యువాచ హ,
కిం మే ధర్మాద్విహీనస్య రాజధర్మః కరిష్యతి. 1

(ఇక్కడ సర్గల పౌర్వాపర్యం తారుమారైన దని గోవిందరాజుల అభిప్రాయము. కచ్చిత్సర్గలో (నూరవసర్గలో) రాముడు రాజ్యపాలనాదులు సరిగా జరుగుచున్నవా అని భరతుని ప్రశ్నించినాడు. "తం తు రామః సమాజ్ఞాయ" అను సర్గ ప్రారంభములో 'నీవు అరణ్యమునకు ఎందుకు వచ్చినా' వని ప్రశ్నింపగా భరతుడు- "దశరథుడు స్వర్గస్థు డైనాడు. నీవే రాజువు కావలెను" అని చెప్పెను. అపుడు రాముడు తండ్రిమరణవార్త విని కూడ ఏ మాత్రము శోకించకుండగా తాను రాజ్యమును స్వీకరించజాల నని మాత్రమే గట్టిగా చెప్పెను. ఇది అసంగతముగా ఉన్నది. ఈ సంభాషణ జరుగు నప్పటికి మంత్రులు, దశరథుని భార్యలు మొదలగువారు అక్కడికి చేరి నట్లు లేదు. కాని భరతుడు వారందరూ ఎదుట కూర్చున్నట్లు అంగుళీనిర్దేశము చేయుచు- "వీరందరును నిన్ను రాజ్యము స్వీకరింపు మని ప్రార్థించుచున్నారు" అని చెప్పెను. ఇదికూడ కుదరదు. అందుచేత లేఖకప్రమాదముచే నూరవసర్గ తరవాత "తం తు రామః సమాజ్ఞాయ" అను సర్గ వ్రాయబడిన దనీ, వాస్తవమున ఆ సర్గ తరవాత ఈ సర్గ "రామస్య వచనం శ్రుత్వా" అను సర్గ ఉండవలె ననీ, దాని తరువాత "తాం శ్రుత్వా కరుణాం వాచమ్" అను సర్గా, దాని తరవాత "వసిష్ఠః పురతః కృత్వా దారాన్ దశరథస్య చ" అనుసర్గా, రావలె ననీ, దాని తరువాత ''తం తు రామః సమాజ్ఞాయ'' అను సర్గ రావలె ననీ గోవిందరాజులు వ్రాసినారు. అది యుక్తముగానే ఉన్నది).

ప్ర. అ. రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా

= విని, భరతః = భరతుడు, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. ధర్మాత్ = ధర్మమునుండి, విహీనస్య=హీనుడైన, మే=నాకు, రాజధర్మః=రాజధర్మము, కిం కరిష్యతి = ఏమిచేయగలదు.

తా. రాముని మాటలు విని భరతు డిట్లు చెప్పెను- ధర్మవిహీనుడ నైన నాకు రాజధర్మముతో ఏమి ప్రయోజనము. 1

మూ. శాశ్వతోఽయం సదా ధర్మః స్థితోఽస్మాసు నరర్షభ,
జేష్ఠపుత్రే స్థితే రాజన్ న కనీయాన్ నృపో భవేత్. 2

ప్ర. అ. నరర్షభ = నరశ్రేష్ఠుడా! అయమ్ = ఇది, శాశ్వతః = శాశ్వత మైన, ధర్మః = ధర్మముగా, అస్మాసు = మనలలో, సదా=ఎల్లపుడు, స్థితః= ఉన్నది. రాజన్ = రాజా! జ్యేష్ఠపుత్రే = పెద్ద కుమారుడు, స్థితే = ఉండగా, కనీయాన్ = చిన్నవాడు, నృపః = రాజు, న భవేత్ = కాకూడదు.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ రామా! మన వంశములో ఎల్లపుడు ఉన్న శాశ్వత మైన ధర్మము ఏమనగా జ్యేష్ఠపుత్రుడు ఉండగా చిన్నవాడు రాజు కాకూడదు. 2

మూ. స సమృద్ధాం మయా సార్ధమయోధ్యాం గచ్ఛ రాఘవ,
అభిషేచయ చాత్మానం కులస్యాస్య భవాయ నః. 3

ప్ర. అ. రాఘవ! = ఓ రామా, సః=అట్టి నీవు, మయా సార్ధమ్=నాతో కూడ, సమృద్ధామ్ = సమృద్ధ మైన, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, గచ్ఛ = వెళ్లుము. నః = మనయొక్క, అస్య కులస్య = ఈ కులముయొక్క, భవాయ = క్షేమముకొరకు, ఆత్మానమ్ = తనను, అభిషేచయ = అభిషిక్తుని చేయించు కొనుము.

తా. రామా! అందుచేత నీవు నాతో కూడ ఐశ్వర్యసమృద్ధ మైన అయోధ్యకు వచ్చి, మన కులమునకు క్షేమము కలుగుటకై రాజ్యాభిషిక్తుడవు అగుము.

మూ. రాజానం మానుషం ప్రాహుర్దేవత్వే సమ్మతో మమ,
యస్య ధర్మార్థసహితం వృత్తమాహురమానుషమ్. 4

ప్ర. అ. రాజానమ్ = రాజును, మానుషమ్ = మనుష్యునిగా, ప్రాహుః = చెప్పుదురు. యస్య = ఏ రాజుయొక్క, ధర్మార్థసహితమ్ = ధర్మార్థములతో కూడిన, వృత్తమ్ = చరిత్రను. అమానుషమ్ = మనుష్యులకు శక్యము కాని దానినిగా, అహుః = చెప్పుదురో అట్టి రాజు, మమ = నాకు, దేవత్వే = దేవతగా, సమ్మతః = అంగీకరింపబడినవాడు.

తా. జనులు రాజు కూడా మనుష్యుడే అని అనుకొనుచుండవచ్చును. కాని ధర్మార్థములను సంరక్షించు చరిత్రగల రాజు మనుష్యునకు శక్యము కాని ప్రభావము గల దేవత యని నా అభిప్రాయము. 4

మూ. కేకయస్థే చ మయి తు త్వయి చారణ్యమాశ్రితే,
దివమార్యో గతో రాజా యాయజూకః సతాం మతః. 5

ప్ర. అ. మయి = నేను, కేకయస్థే = కేకయదేశములో ఉండగా, త్వయి చ = నీవు, అరణ్యమ్ = అరణ్యమును, ఆశ్రితే = ఆశ్రయించినవాడవు అగుచుండగా, ఆర్యః = పూజ్యుడు, యాయజూకః = యజ్ఞమును చేయు స్వభావము కలవాడు, సతామ్ = సత్పురుషులకు, మతః = ఇష్టుడు అయిన, రాజా = రాజు, దివమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. నేను కేకయదేశములో ఉండగా, నీవు అరణ్యమునకు వెళ్ళగా, అనేక యజ్ఞములు చేసినవాడూ, పూజ్యుడూ, సత్పురుషులకు ఇష్టమైనవాడూ అయిన దశరథమహారాజు స్వర్గస్థుడైనాడు. 5

మూ. నిష్క్రాన్తమాత్రే భవతి సహసీతే సలక్ష్మణే,
దుఃఖశోకాభిభూతస్తు రాజా త్రిదివమభ్యగాత్. 6

ప్ర. అ. సహసీతే = సీతాసహితుడవు, సలక్ష్మణే = లక్ష్మణసహితుడవు అయిన, భవతి = నీవు, నిష్క్రాన్తమాత్రే = బయలుదేరి వెళ్ళిన వెంటనే, రాజా = రాజు, దుఃఖశోకాభిభూతః = దుఃఖముచేతను, శోకముచేతను ఆక్రమించబడినవాడై, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, అభ్యగాత్ = వెళ్ళెను.

తా. నీవు సీతాలక్ష్మణసహితుడవై, అరణ్యమునకు వెళ్ళిన వెంటనే దశరథమహారాజు దుఃఖపీడితుడై, స్వర్గస్థుడయ్యెను. 6

మూ. ఉత్తిష్ఠ పురుషవ్యాఘ్ర క్రియతాముదకం పితుః,
అహం చాయం చ శత్రుఘ్నః పూర్వమేవ కృతోదకౌ. 7

ప్ర. అ. పురుషవ్యాఘ్రః = పురుషులలో శ్రేష్ఠుడా! ఉత్తిష్ఠ = లెమ్ము. పితుః = తండ్రికి, ఉదకమ్ = జలతర్పణము, క్రియతామ్ = చేయబడుగాక. అహం చ = నేను, అయమ్ = ఈ, శత్రుఘ్నశ్చ = శత్రుఘ్నుడు, పూర్వమేవ = పూర్వమే, కృతోదకౌ = చేయబడిన జలతర్పణము కలవారము.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ రామా! లేచి తండ్రికి జలతర్పణములు ఇమ్ము. నేనూ శత్రుఘ్నుడూ కూడ పూర్వమే జలతర్పణము ఇచ్చి యున్నాము.

మూ. ప్రియేణ ఖలు దత్తం హి పితృలోకేషు రాఘవ,
అక్షయ్యం భవతీత్యాహుర్భవాంశ్చైవ పితుః ప్రియః. 8

ప్ర. అ. రాఘవ! = ఓ రామా! ప్రియేణ = ప్రియు డైన పుత్రునిచేత, దత్తమ్ = ఇవ్వబడినది, పితృలోకేషు = పితృలోకములయందు, అక్షయ్యమ్ = = నాశనము లేనిది, భవతి = అగును. ఇతి = అని, ఆహుః ఖలు = చెప్పుదురు కదా! భవాంశ్చైవ = నీవే, పితుః = తండ్రికి, ప్రియః = ప్రియుడవు.

తా. రామా! ప్రియు డైన పుత్రు డిచ్చినది పితృలోకములలో అక్షయ్యముగా ఉండు నని చెప్పుదురు కదా! మన తండ్రికి ప్రియమైన పుత్రుడవు నీవే. అందుచేత నీవు ఆయనకు అపరక్రియలు చేయుము. 8

మూ. త్వామేవ శోచంస్తవ దర్శనేప్సుః
త్వయ్యేవ సక్తామనివర్త్య బుద్ధిం,
త్వయా విహీనస్తవ శోకమగ్న
స్త్వాం సంస్మరన్నస్తమితః పితా తే. 9

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వ్యుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తే = నీయొక్క, పితా = తండ్రి యైన దశరథమహారాజు, త్వయా = నీచేత, విహీనః = విడువబడినవాడై, త్వామేవ = నిన్ను గూర్చియే,

శోచన్ = దుఃఖించుచు, తవ = నీయొక్క, దర్శనేప్సుః = దర్శనమును పొంద గోరుచు, త్వయ్యేవ = నీయందే, సక్తామ్ = లగ్నమైన, బుద్ధిమ్ = బుద్ధిని, అని వర్త్య = మరల్పజాలక, తవ = నీయొక్క, శోకమగ్నః = శోకమునందు మునిగిన వాడై, త్వామ్ = నిన్ను, సంస్మరన్ = స్మరించుచు , అస్తమితః = మరణించినాడు.

తా. నీ తండ్రియైన దశరథుడు, నీవు దూరముగా వెళ్ళిపోవుటచే నిన్ను గూర్చియే దుఃఖించుచు, నిన్ను చూడవలెనని కోరుచు, నీయందు లగ్నమైన మనస్సును మరల్పజాలక, నిన్ను గూర్చిన శోకముతో మునిగిపోయి నిన్నే స్మరించుచు మరణించినాడు. 9

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటరెండవ సర్గ సమాప్తము.

## అథ త్ర్యుత్తరశతతమః సర్గః

[రామాదుల విలాపము, రాముడు తండ్రికి జలాంజలి నిచ్చుట, పిండదానము చేయుట, రోదించుట].

మూ. తాం శ్రుత్వా కరుణాం వాచం పితుర్మరణసంహితామ్,
రాఘవో భరతేనోక్తాం బభూవ గతచేతనః. 1

ప్ర. అ. రాఘవః=రాముడు, భరతేన = భరతునిచేత, ఉక్తామ్=చెప్పబడిన, పితుః = తండ్రియొక్క, మరణసంహితామ్=మరణముతో కూడిన, కరుణామ్ = దుఃఖకర మైన, తాం వాచమ్ = ఆ వాక్కును, శ్రుత్వా = విని, గతచేతనః=పోయిన స్మృతి కలవాడు, బభూవ = ఆయెను.

తా. భరతుడు చెప్పిన దుఃఖకర మైన ఆ పితృమరణవార్తను విని రాముడు స్మృతి తప్పి మూర్ఛపడెను. 1

మూ. తం తు వజ్రమివోత్సృష్టమాహవే దానవారిణా,
వాగ్వజ్రం భరతేనోక్తమమనోజ్ఞం పరంతపః. 2
ప్రగృహ్య రామో బాహూ వై పుష్పితాగ్రో యథా ద్రుమః,
వనే పరశునా కృత్తస్తథా భువి పపాత హ. 3

ప్ర. అ. పరంతపః = శత్రువులను తపింపచేయు, రామః=రాముడు, ఆహవే = యుద్ధమునందు, దానవారిణా = దేవేంద్రునిచేత, ఉత్సృష్టమ్=విడువబడిన, వజ్రమివ = వజ్రము వలె ఉన్న, అమనోజ్ఞమ్ = మనస్సుకు పీడాకర మైన, భరతేన = భరతునిచేత, ఉక్తమ్=పలుకబడిన, తమ్=ఆ, వాగ్వజ్రమ్=వజ్రము వలె భయంకరమైన వాక్కును విని, బాహూ =బాహువులను, ప్రగృహ్య=పట్టుకొని, వనే = వనమునందు, పరశునా = గొడ్డలిచేత, కృత్తః = ఛేదింపబడిన, పుష్పితాగ్రః = పుష్పించిన శాఖాగ్రములు గల, ద్రుమః=వృక్షము, యథా = ఎట్లో, తథా=అట్లు, భువి=నేలపై, పపాత హ=పడెను.

తా. శత్రుసంహారకు డైన ఆ రాముడు యుద్ధములో దేవేంద్రుడు ప్రయోగించిన వజ్రము వంటి, దుఃఖకర మైన, భరతుడు పలికిన ఆ వాగ్వజ్రము తగులగానే రెండు బాహువులు మెలివేసి అరణ్యములో గొడ్డలిచేత ఖండించిన, పుష్పించిన వృక్షము వలె నేలపై పడెను. 2,3

మూ. తథా నిపతితం రామం జగత్యాం జగతీపతిమ్,
కూలఘాతపరిశ్రాన్తం ప్రసుప్తమివ కుఞ్జరమ్. 4
భ్రాతరస్తే మహేష్వాసం సర్వతః శోకకర్శితమ్,
రుదన్తః సహ వైదేహ్యా సిషిచుః సలిలేన వై. 5

ప్ర. అ. తథా = ఆ విధముగా, జగత్యామ్ = భూమిపై, నిపతితమ్ = పడినవాడు, జగతీపతిమ్ = భూమికి ప్రభువూ, కూలఘాతపరిశ్రాన్తమ్ = నదీ తీరమును పొడుచుటచే అలసిన, ప్రసుప్తమ్ = నిద్రించుచున్న, కుఞ్జరమ్ ఇవ = ఏనుగువలె ఉన్నవాడు, మహేష్వాసమ్ = గొప్ప ధనుస్సు గలవాడు, శోకకర్శితమ్ = శోకముచే కృశింప చేయబడినవాడు అయిన, రామమ్ = రాముని, సర్వతః = అన్ని వైపులందును చేరి, వైదేహ్యా సహ = సీతతో కూడ, తే = ఆ, భ్రాతరః = సోదరులు, రుదన్తః = ఏడ్చుచు, సలిలేన = ఉదకముతో, సిషిచుః వై = చల్లిరి.

తా. దగ్గరనే ఉన్న ఆ సోదరులూ, సీతా ఏడ్చుచు ఆ విధముగా నేలపై బడి, నదీ తీరమును పొడిచి పొడిచి అలసి నిద్రించుచున్న ఏనుగు వలె నున్నవాడూ మహాధనుర్ధారీ, శోకముతో కృశించినవాడూ, పృథివీపతీ అయిన ఆ రామునిపై ఉదకము చల్లిరి. 4, 5

మూ. స తు సంజ్ఞాం పునర్లబ్ధ్వా నేత్రాభ్యామస్రముత్సృజన్,
ఉపాక్రామత కాకుత్స్థః కృపణం బహు భాషితుమ్. 6

ప్ర. అ. సః కాకుత్స్థః = ఆ రాముడు, పునః = తిరిగి, సంజ్ఞామ్ = సంజ్ఞను, లబ్ధ్వా = పొంది, నేత్రాభ్యామ్ = నేత్రములచే, అస్రమ్ = కన్నీటిని, ఉత్సృజన్ = విడచుచు, కృపణమ్ = దీనముగా, బహు = అధికముగా, భాషితుమ్ = పలుకుటకు, ఉపాక్రామత = ప్రారంభించెను.

తా. ఆ రాముడు, మూర్ఛనుండి తేరుకొని లేచి, కన్నీళ్లు కార్చుచు, దైన్యముతో, అధికముగా విలపింప ప్రారంభించెను. 6

మూ. స రామః స్వర్గతం శ్రుత్వా పితరం పృథివీపతిమ్,
ఉవాచ భరతం వాక్యం ధర్మాత్మా ధర్మసంహితమ్. 7

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, సః రామః = ఆ రాముడు, పృథివీపతిమ్ = రాజైన, పితరమ్ = తండ్రిని, స్వర్గతమ్ = స్వర్గస్థు డైన వానినిగా, శ్రుత్వా = విని, భరతమ్ = భరతుని గూర్చి. ధర్మసంహితమ్ = ధర్మముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ధర్మాత్ము డైన ఆ రాముడు, తన తండ్రి యైన దశరథమహారాజు స్వర్గస్థు డైనట్లు విని, భరతునితో, ధర్మసమ్మత మైన మాటలను ఇట్లు పలికెను.

మూ. కిం కరిష్యామ్యయోధ్యాయాం తాతే దిష్టాం గతిం గతే,
కస్తాం రాజవరాద్ధీనామయోధ్యాం పాలయిష్యతి. 8

ప్ర. అ. తాతే = తండ్రి, దిష్టాం గతిమ్ = దైవకల్పిత మైన గతిని, గతే = పొందినవా డగుచుండగా, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, కిం కరిష్యామి = ఏమి చేయగలను. రాజవరాత్ = ఆ రాజశ్రేష్ఠునివలన, (తో), హీనామ్ = శూన్య మైన, తామ్ అయోధ్యామ్ = ఆ అయోధ్యను, కః = ఎవడు, పాలయిష్యతి = పాలించగలడు?

తా. తండ్రి మరణించిన పిమ్మట ఆ అయోధ్యతో నాకు ఏమి పని? ఆ రాజశ్రేష్ఠుడు లేని అయోధ్యను ఎవరు పాలింపగలరు? 8

మూ. కిం ను తస్య మయా కార్యం దుర్జాతేన మహాత్మనః,
యో మృతో మమ శోకేన మయా చాపి న సంస్కృతః.

ప్ర. అ. యః = ఏ దశరథమహారాజు, మమ శోకేన = నన్ను గూర్చిన శోకముచేత, మృతః = మరణించినాడో, మయా = నాచేత, న సంస్కృతశ్చాపి = సంస్కరింపబడలేదో, తస్య = అట్టి, మహాత్మనః = మహాత్మునకు, దుర్జాతేన = చెడ్డ పుట్టుక గల, మయా = నాచేత, కిం ను కార్యమ్ = ప్రయోజనము ఏమి?

తా. నన్ను గూర్చిన శోకముతో మరణించిన ఆ మహాత్మునకు నేను సంస్కారము కూడ చేయజాలకపోతిని. చెడ్డ పుట్టుక గల అట్టి నాచేత ఆయనకు ఏమి ప్రయోజనము? 9

మూ. అహో! భరత! సిద్ధార్థో యేన రాజా త్వయానఘ!
శత్రుఘ్నేన చ సర్వేషు ప్రేతకృత్యేషు సత్కృతః. 10

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా భరత = ఓ భరతుడా! యేన =యే, త్వయా=నీచేతను, శత్రుఘ్నేన చ=శత్రుఘ్నునిచేతను, రాజా=రాజు, సర్వేషు=సమస్త మైన, ప్రేతకృత్యేషు = ప్రేతకృత్యములయందు, సత్కృతః = సత్కరింపబడినాడో, అట్టి నీవు, సిద్ధార్థః = కృతార్థుడవు. అహో = ఏమి అదృష్టము!

తా. పాపశూన్యుడ వైన ఓ భరతుడా! నీవును శత్రుఘ్నుడును, మన తండ్రి యైన దశరథమహారాజునకు చేయవలసిన ప్రేతకృత్యము లన్నీ చేసి సత్కరించినారు. అందుచే మీ రిద్దరు కృతార్థులు. 10

మూ. నిష్ప్రధానా మనేకాగ్రాం నరేన్ద్రేణ వినా కృతామ్,
నివృత్త వనవాసోఽపి నాయోధ్యాం గన్తుముత్సహే. 11

ప్ర. అ. నివృత్తవనవాసోఽపి= నెరవేరిన వనవాసముకలవాడ నైనను, నిష్ప్రధానామ్=ప్రధానపురుషుడు లేనిది, అనేకాగ్రామ్=వ్యాకుల మైనది, నరేన్ద్రేణ = రాజుచేత, వినాకృతామ్ = విడువబడినది అయిన, అయోధ్యామ్= అయోధ్యనుగూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, న ఉత్సహే=కోరను.

తా. దశరథమహారాజు చనిపోవుటచే ప్రధానపురుషుడు లేక వ్యాకులముగా నున్న ఆ అయోధ్యకు నేను వనవాసానంతరము కూడ వెళ్ళను. 11

మూ. సమాప్త వనవాసం మామయోధ్యాయాం పరంతప,
కోఽను శాసిష్యతి పునస్తాతే లోకాన్తరం గతే. 12

ప్ర. అ. పరంతప=శత్రువులను తపింపచేయు ఓ భరతుడా! తాతే= తండ్రి, లోకాన్తరమ్ = మరియొక లోకమును గూర్చి, గతే=వెళ్ళినవా డగుచుండగా, సమాప్తవనవాసమ్=సమాప్త మైన వనవాసము గల, మామ్=నన్ను,

పునః=మరల, అయోధ్యాయామ్ = అయోధ్యలో, కః=ఎవడు, అనుశాసిష్యతి =శిక్షింపగలడు.

తా. భరతా! తండ్రిగారు మరణించినారు కదా! నేను వనవాసమును పూర్తి చేసుకొని అయోధ్య తిరిగి వచ్చిన పిమ్మట అక్కడ నాకు ఉపదేశము చేయువారు ఎవరు? 12

మూ పురా ప్రేక్ష్య సువృత్తం మాం పితా యాన్యాహ సాన్త్వయన్,
వాక్యాని తాని శ్రోష్యామి కుతః శ్రోత్రసుఖాన్యహమ్. 13

ప్ర. అ. పురా = పూర్వము, పితా = తండ్రి, మామ్ = నన్ను, సువృత్తమ్ = మంచి నడవడిక కలవానినిగా, ప్రేక్ష్య = చూచి, సాన్త్వయన్ = అనునయించుచు, యాని వాక్యాని = యే వాక్యములను, ఆహ = పలికెనో, శ్రోత్రసుఖాని=చెవులకు సుఖకరము లైన, తాని = ఆ వాక్యములను, కుతః = ఎవరి నుండి, శ్రోష్యామి = వినగలను.

తా. పూర్వము మన తండ్రి నా మంచి నడవడికను చూచి ఆనందించుచు నన్ను సంతోషపెట్టుటకై కొన్ని మాటలు చెప్పుచుండెడివాడు. చెవులకు సుఖకరము లైన అట్టి మాటలను, ఇటుపై నేను ఎవరినుండి వినగలను? 13

మూ. ఏవముక్త్వా స భరతం భార్యామభ్యేత్య రాఘవః,
ఉవాచ శోకసంతప్తః పూర్ణచన్ద్రనిభాననామ్. 14

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, భరతమ్= భరతుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా= పలికి, పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గల, భార్యామ్ = భార్యను, అభ్యేత్య=సమీపించి, శోకసంతప్తః = శోకముచే పీడింపబడినవాడై, ఉవాచ = పలికెను.

తా. రాముడు భరతునితో ఇట్లు పలికి, శోకసంతప్తుడై, పూర్ణచంద్రుని వంటి ముఖము గల సీతతో ఇట్లనెను. 14

మూ. సీతే మృతస్తే శ్వశురః పిత్రా హీనోఽసి లక్ష్మణ,
భరతో దుఃఖమాచష్టే స్వర్గతం పృథివీపతిమ్. 15

ప్ర. అ. సీతే=ఓ సీతా! తే శ్వశురః = నీ మామగారు, మృతః=మరణించినాడు. లక్ష్మణ = ఓ లక్ష్మణా! పిత్రా = తండ్రితో, హీనః = హీనుడవు, అసి=అయినావు. భరతః = భరతుడు, పృథివీపతిమ్= దశరథమహారాజును, స్వర్గతమ్ = స్వర్గస్థునిగా, దుఃఖమ్ = దుఃఖవార్తను, ఆచష్టే = చెప్పుచున్నాడు.

తా. ఓ సీతా! నీ మామగారు మరణించినారు. ఓ లక్ష్మణా! తండ్రిలేనివాడ వైనావు. దశరథమహారాజు మరణించె నను దుఃఖవార్తను భరతుడు చెప్పుచున్నాడు. 15

మూ. తతో బహుగుణం తేషాం బాష్పో నేత్రేష్వజాయత,
తథా బ్రువతి కాకుత్స్థే కుమారాణాం యశస్వినామ్. 16

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, తథా = అట్లు, బ్రువతి=చెప్పుచుండగా, తతః = అటుపిమ్మట, యశస్వినామ్ = యశశ్శాలు లైన, తేషామ్ = ఆ, కుమారాణామ్ = దశరథునికుమారులయొక్క, నేత్రేషు = నేత్రములయందు, బహుగుణమ్ = అత్యధికముగా, బాష్పః = కన్నీరు, అజాయత=కలిగెను.

తా. రాము డట్లు చెప్పగానే యశశ్శాలు లైన ఆ భరతలక్ష్మణశత్రుఘ్నుల నేత్రములనుండి అత్యధికముగా కన్నీరు కారెను. 16

మూ. తతస్తే భ్రాతరస్సర్వే భృశమాశ్వాస్య రాఘవమ్,
అబ్రువన్ జగతీభర్తుః క్రియతాముదకం పితుః. 17

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సర్వే = సమస్త మైన, తే భ్రాతరః = ఆ సోదరులు, రాఘవమ్ = రాముని, భృశమ్ = మిక్కిలి, ఆశ్వాస్య=ఓదార్చి, జగతీభర్తుః = మహారా జైన, పితుః = తండ్రికి, ఉదకమ్ = జలతర్పణము, క్రియతామ్=చేయబడుగాక అని, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ సోదరు లందరు, రాముని మిక్కిలి ఓదార్చి "తండ్రి యైన దశరథమహారాజునకు జలతర్పణము లిమ్ము" అని ప్రార్థించిరి. 17

మూ. సా సీతా శ్వశురం శ్రుత్వా స్వర్గలోకగతం నృపమ్,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యామశకన్నేక్షితుం పతిమ్. 18

ప్ర అ. సా సీతా = ఆ సీత, శ్వశురమ్ = మామగారైన, నృపమ్ = దశరథమహారాజును, స్వర్గలోకగతమ్ = స్వర్గలోకమునకు వెళ్ళినవానినిగా, శ్రుత్వా=విని, అశ్రుపూర్ణాభ్యామ్=కన్నీళ్ళతో నిండిన, నేత్రాభ్యామ్=నేత్రములతో, పతిమ్=భర్తను, ఈక్షితుమ్=చూచుటకు, నాశకత్=సమర్థురాలు కాలేదు.

తా. మామగారైన దశరథమహారాజు స్వర్గస్థుడైనట్లు వినిన ఆ సీత, కన్నీళ్ళతో నిండిన నేత్రములతో, భర్తను చూడలేకపోయెను. 18

మూ. సాన్త్వయిత్వా తు తాం రామో రుదతీం జనకాత్మజామ్,
ఉవాచ లక్ష్మణం తత్ర దుఃఖితో దుఃఖితం వచః. 19

ప్ర. అ. రామః=రాముడు, రుదతీమ్ = ఏడ్చుచున్న, తాం జనకాత్మజామ్=ఆ సీతను, సాన్త్వయిత్వా = ఓదార్చి, దుఃఖితః=దుఃఖితుడగుచు, దుఃఖితమ్=దుఃఖించుచున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, తత్ర=అక్కడ, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఏడ్చుచున్న సీతను ఓదార్చి, దుఃఖించుచు, దుఃఖముతో బాధపడుచున్న లక్ష్మణునితో ఇట్లు పలికెను. 19

మూ. ఆనయేఙ్గుదిపిణ్యాకం చీరమాహర చోత్తరమ్,
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః. 20

ప్ర. అ. ఇఙ్గుదిపిణ్యాకమ్=గారచెట్టు తెలగపిండిని, ఆనయ=తీసుకొనిరమ్ము. ఉత్తరమ్=ఉత్తరీయమైన, చీరం చ=నారచీరను, ఆహర= తీసుకొనిరమ్ము. మహాత్మనః=మహాత్ముడైన, తాతస్య=తండ్రియొక్క, జలక్రియార్థమ్ =జలతర్పణములు చేయుటకు, గమిష్యామి=వెళ్ళెదను.

తా. మహాత్ముడైన తండ్రిగారికి ఉత్తరక్రియలు చేయుటకు వెళ్లెదను. గారచెట్టు తెలగపిండిని, ఉత్తరీయమును తీసుకొనిరమ్ము. 20

మూ. సీతా పురస్తాద్వ్రజతు త్వమేనామభితో వ్రజ,
అహం పశ్చాద్గమిష్యామి గతి ర్హ్యేషా సుదారుణా. 21

ప్ర. అ. సీతా = సీత, పురస్తాత్=ముందు, వ్రజతు = వెళ్లుగాక. ఏనామ్

అభితః = ఈమె వెనుకనే, త్వమ్ = నీవు, వ్రజ = నడువుము. అహమ్ = నేను, పశ్చాత్ = వెనుక, గమిష్యామి = వెళ్ళెదను. ఏషా = ఈ, గతిః = గమనము, సుదారుణా హి = చాల భయంకర మైనదికదా!

తా. సీత ముందు నడుచుగాక. నీవు ఆమె వెనుకనే నడచి వెళ్లుము. నీ వెనుక నేను వచ్చెదను. ఈ మరణనిమిత్తక మైన స్నానము కొరకై మనము చేయు ఈ గమనము చాలా భయంకర మైనది. 21

మూ. తతో నిత్యానుగస్తేషాం విదితాత్మా మహామతిః,
మృదుర్దాన్తశ్చ శాన్తశ్చ రామే చ దృఢభక్తిమాన్. 22
సుమన్త్రిస్తైర్నృపసుతైః సార్ధమాశ్వాస్య రాఘవమ్,
అవాతారయదాలమ్బ్య నదీం మన్దాకినీం శివామ్. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేషామ్=వారికి, నిత్యానుగః = నిత్యము అనుసరించి వెళ్లేవాడు, విదితాత్మా =ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడు, మహామతిః= గొప్ప ఆలోచన కలవాడు, మృదుః = మెత్తని స్వభావము కలవాడు, దాన్తశ్చ = ఇంద్రియనిగ్రహము కలవాడు, శాన్తశ్చ = శాంతుడు, రామే చ = రాముని విషయమై, దృఢభక్తిమాన్=దృఢ మైన భక్తి కలవాడు అయిన, సుమన్త్రిః= సుమంత్రుడు, తైః = ఆ, నృపసుతైః సార్ధమ్ = రాజకుమారులతో కూడ, రాఘవమ్ = రాముని, ఆశ్వాస్య = ఓదార్చి, ఆలమ్బ్య = పట్టుకొని, శివామ్=మంగళకర మైన, మన్దాకినీం నదీమ్ = మందాకినీనదిని (లో), అవాతారయత్ = దింపెను.

తా. పిమ్మట, ఎల్లప్పుడు ఆ రాజకుమారులను అనుసరించి ఉండువాడూ, ప్రశస్త మైన బుద్ధీ, గొప్ప ఆలోచనాశక్తీ, మెత్తనిస్వభావమూ కలవాడూ, ఇంద్రియనిగ్రహవంతుడూ, శాంతుడూ, రామునియందు దృఢభక్తికలవాడూ అయిన సుమంత్రుడు ఆ రాజకుమారు లందరిని ఓదార్చి, మంగళకర మైన ఆ మందాకినీనదిలో స్నానములు చేయుటకు వారి చేతులను పట్టుకొని దింపెను. 22, 23

మూ. తే సుతీర్థాం తతః కృచ్ఛ్రాదుపాగమ్య యశస్వినః,
నదీం మన్దాకినీం రమ్యాం సదా పుష్పితకాననామ్. 24

శీఘ్రస్రోతసమాసాద్య తీర్థం శివమకర్దమమ్,
సిషిచుస్తూదకం రాజ్ఞే తాతైతత్తే భవత్వితి. 25

ప్ర. అ. తతః = అటు పిమ్మట, యశస్వినః = యశస్సుగల, తే = వారు, సుతీర్థాం = మంచిరేవుకలదీ, రమ్యామ్ = సుందరమైనదీ, సదాపుష్పితకాననామ్ = ఎల్లపుడు పుష్పించిన అడవులు కలది, శీఘ్రస్రోతసమ్ = శీఘ్ర మైన ప్రవాహము కలదీ అయిన, మన్దాకినీం నదీమ్ = మందాకినీనదిని, కృచ్ఛ్రాత్ = కష్టము వలన, ఉపాగమ్య = సమీపించి, అకర్దమమ్ = బురద లేని, శివమ్ = మంగళకర మైన, తీర్థమ్ = తీర్థమును (రేవును), ఆసాద్య = పొంది, తాత = ఓతండ్రీ! ఏతత్ = ఇది, తే = నీకు, భవతు = అగుగాక! ఇతి = అని, రాజ్ఞే = రాజునకు, ఉదకమ్ = ఉదకమును, సిషిచుః = విడచిరి.

తా. గొప్ప కీర్తి గల ఆ సోదరులు, మంచి రేవులు కలదీ సుందరమైనదీ, ఎల్లపుడును పుష్పించిన అరణ్యములు కలదీ అయిన మందాకినీనదిని అతికష్టముగా సమీపించి, బురద లేని మంగళకర మైన రేవులో దిగి, "తండ్రీ! ఈ జలము నీకు తృప్తి కలిగించుగాక" అని పలుకుచు దశరథమహారాజునకు జలతర్పణములు ఇచ్చిరి. 24, 25

మూ. ప్రగృహ్య చ మహీపాలో జలపూరితమఞ్జలిమ్,
దిశం యామ్యామభిముఖో రుదన్వచనమబ్రవీత్. 26

ప్ర. అ. మహీపాలః = రాజు, జలపూరితమ్ = నీటితో నింపబడిన, అఞ్జలిమ్ = దోసిలిని, ప్రగృహ్య = పట్టి, యామ్యాం దిశమ్ = యముని దిక్కైన దక్షిణమునకు, అభిముఖః = అభిముఖుడై, రుదన్ = ఏడ్చుచు, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు దోసిలితో నీళ్లు గ్రహించి, దక్షిణాభిముఖుడై ఏడ్చుచు ఇట్లనెను. 26

మూ. ఏతత్తే రాజశార్దూల విమలం తోయమక్షయమ్,
పితృలోకగతస్యాద్య మద్దత్తముపతిష్ఠతు. 27

ప్ర. అ. రాజశార్దూల = రాజశ్రేష్ఠుడా! పితృలోకగతస్య = పితృలోక

ము ను పొందిన, తే = నీకు, అద్య = ఇపుడు, మద్దత్తమ్ = నాచేత ఇవ్వబడిన, ఏతత్ = ఈ, విమలమ్ = నిర్మల మైన, తోయమ్ = ఉదకము, అక్షయమ్ = అక్షయ మైనదై, ఉపతిష్ఠతు = నిన్ను చేరుగాక.

తా. రాజులలో శ్రేష్ఠుడ వైన ఓ తండ్రీ ! పితృలోకములో నున్న నీకు ఇపుడు నే నిచ్చుచున్న ఈ పవిత్ర మైన జలము అక్షయ మై, నిన్ను చేరుగాక.

మూ. తతో మన్దాకినీతీరాత్ప్రత్యుత్తీర్య స రాఘవః,
పితుశ్చకార తేజస్వీ నివాపం భ్రాతృభిః సహ. 28

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తేజస్వీ = తేజశ్శాలి యైన, రాఘవః = రాముడు, మన్దాకినీతీరాత్ = మందాకినీతీరమునుండి, ప్రత్యుత్తీర్య = అవలికి చేరి, భ్రాతృభిః సహ = సోదరులతో కూడినవాడై, పితుః = తండ్రికి, నివాపమ్ = పిండ ప్రదానమును, చకార = చేసెను.

తా. పిమ్మట తేజశ్శాలి యైన ఆ రాముడు, సోదరులతో మందాకినీనది ఆవలితీరమునకు వెళ్ళి, తండ్రికి పిండప్రదానము చేసెను. 28

మూ. ఐఙ్గుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భసంస్తరే,
న్యస్య రామస్స దుఃఖార్తో రుదన్వచనమబ్రవీత్. 29

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, బదరీమిశ్రమ్ = రేగు పళ్లతో కలిసిన, ఐంగుదమ్ = ఇంగుదీ వృక్షమునకు సంబంధించిన, పిణ్యాకమ్ = తెలకపిండిని, దర్భసంస్తరే = దర్భల ఆస్తరణమునందు, న్యస్య = ఉంచి, దుఃఖార్తః = దుఃఖ పీడితుడై, రుదన్ = ఏడ్చుచు, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు దర్భలు పరచి, వాటిపై రేగుపండ్లు కలిపిన గారతెలక పిండిని ముద్దలు చేసి ఉంచి, దుఃఖార్తుడై, ఏడ్చుచు ఇట్లు పలికెను. 29

మూ. ఇదం భుజ్క్ష్వ మహారాజ ప్రీతో యదశనా వయమ్,
యదన్నః పురుషో భవతి తదన్నాస్తస్య దేవతాః. 30

ప్ర. అ. మహారాజ = ఓ మహారాజా, వయమ్ = మేము, యదశనాః = ఏది ఆహారముగా కలవారమో, ఇదమ్ = అట్టిదీనిని, ప్రీతః = సంతోషించుచున్న వా

దవై, భుజ్క్ష్వ=తినుము. పురుషః=పురుషుడు, యదన్నః=ఏ అన్నముకలవాడు, భవతి=అగునో, తస్య=వాని యొక్క, దేవతాః=దేవతలుకూడ, తదన్నాః = ఆ అన్నము కలవారే.

తా. మహారాజా! మేము తినుచున్నదానినే నీకు అర్పించుచున్నాను. సంతోషముతో భుజింపుము. పురుషుడు ఏ అన్నమును తినునో, వాని దేవతలు కూడ, ఆ అన్నమునే తినెదరు కదా. 30

మూ. తతస్తేనైవ మార్గేణ ప్రత్యుత్తీర్య నదీతటాత్,
ఆరురోహ నరవ్యాఘ్రో రమ్యసానుం మహీధరమ్. 31

ప్ర. అ. తతః = అటు పిమ్మట, నరవ్యాఘ్రః = నరులలో శ్రేష్ఠుడైన రాముడు, తేన=ఆ, మార్గేణైవ=మార్గము చేతనే, నదీతటాత్ = నదీతీరమునుండి, ప్రత్యుత్తీర్య=దాటివెళ్ళి, రమ్యసానుమ్ = సుందరమైన చరియలు గల, మహీధరమ్=పర్వతమును, ఆరురోహ=ఎక్కెను.

తా. నరశ్రేష్ఠుడైన రాముడు, పిదప ఆ మార్గముమీదుగానే నదీతటమును దాటి వెళ్ళి, అందమైన చరియలు గల చిత్రకూటపర్వతమును ఎక్కెను. 31

మూ. తతః పర్ణకుటీద్వారమాసాద్య జగతీపతిః,
పరిజగ్రాహ బాహుభ్యాముభౌ భరతలక్ష్మణౌ. 32

ప్ర. అ. తతః=అటుపిమ్మట, జగతీపతిః=భూమికి ప్రభువైన రాముడు, పర్ణకుటీద్వారమ్=పర్ణశాలాద్వారమును, ఆసాద్య=సమీపించి, బాహుభ్యామ్ = బాహువులతో, భరతలక్ష్మణౌ=భరతలక్ష్మణులను, ఉభౌ=ఇద్దరిని, పరిజగ్రాహ = పట్టుకొనెను.

తా. భూమండలాధిపతియైన ఆ రాముడు, పర్ణశాల ద్వారము చేరి, భరతలక్ష్మణుల నిద్దరిని చేతులతో కౌగలించుకొనెను. 32.

మూ. తేషాం తు రుదతాం శబ్దాత్ప్రతిశ్రుతోఽభవద్గిరౌ,
భ్రాతౄణాం సహ వైదేహ్యా సింహానామివ నర్దతామ్. 33

ప్ర. అ. వైదేహ్యా సహ = సీతతో కూడ, రుదతామ్ = ఏడ్చుచున్న,

తేషాం భ్రాతౄణామ్=ఆ సోదరులయొక్క, శబ్దాత్=శబ్దమువలన, నర్దతామ్=అరచుచున్న, సింహానామివ=సింహములయొక్క వలె, శబ్దాత్=శబ్దమువలన, గిరౌ=పర్వతమునందు, ప్రతిశ్రుతః=ప్రతిధ్వని, అభవత్=అయెను.

తా. ఆ సోదరులు, సీత ఏడ్చుటచే, అ పర్వతమునందు, సింహములు గర్జించి నపుడు కలుగు నట్లు ప్రతిధ్వని కలిగెను. 33

మూ. మహాబలానాం రుదతాం కుర్వతాముదకం పితుః,
విజ్ఞాయ తుములం శబ్దం త్రస్తా భరతసైనికాః. 34

ప్ర. అ. మహాబలానామ్=గొప్ప బలము కలవారు, పితుః=తండ్రికి, ఉదకమ్ = జలతర్పణమును, కుర్వతామ్ = చేయుచున్నవారు, రుదతామ్ = ఏడ్చుచున్నవారైన సోదరులయొక్క, తుములమ్=వ్యాకులమైన, శబ్దమ్=శబ్దమును, విజ్ఞాయ = తెలుసుకొని, భరతసైనికాః = భరతుని సైనికులు, త్రస్తాః = భయపడినారు.

తా. తండ్రికి జలతర్పణములు చేయుచు, ఏడ్చుచున్న ఆ మహాబలశాలులైన సోదరులు చేసిన వ్యాకులమైనధ్వనిని విని భరతుని సైనికులు భయపడిరి.

మూ. అబ్రువంశ్చాపి రామేణ భరతస్సంగతో ధ్రువమ్,
తేషామేవ మహాశబ్దః శోచతాం పితరం మృతమ్. 35

ప్ర. అ. భరతః = భరతుడు, రామేణ = రామునితో, సంగతః = కలిసినాడు, ధ్రువమ్=నిశ్చయము. మృతమ్=మరణించిన, పితరమ్=తండ్రిని గూర్చి, శోచతామ్=ఏడ్చుచున్న, తేషామేవ= వారియొక్కయే, మహాన్=గొప్ప, శబ్దః=ధ్వని వచ్చుచున్నది అని, అబ్రువన్ చ అపి=ఆ సైనికులు అనిరి కూడ.

తా. భరతుడు రామునితో, తప్పక కలిసి యుండును. ఈ ధ్వని, మరణించిన తండ్రిని గూర్చి ఏడ్చుచున్న వారి రోదనధ్వనియే; అని ఆ సైనికులు అనుకొనిరి. 35

మూ. అథ వాసాన్పరిత్యజ్య తం సర్వేఽభిముఖాః స్వనం.
అప్యేకమనసో జగ్ముర్యథాస్థానం ప్రధావితాః. 36

ప్ర. అ. సర్వే=వారందరు, అథ = అటుపిమ్మట, వాసాన్ =తమ నివాస ములను, పరిత్యజ్య = విడచి, తం స్వనమ్ = ఆ ధ్వనిని, అభిముఖాః = అభిముఖులై. ఏకమనసః అపి = ఒకే విధమైన మనస్సు కలవారై, యథాస్థానమ్= వారి వారి స్థానములను అనుసరించి, ప్రధావితాః = పరుగెత్తుచున్నవారై, జగ్ముః = వెళ్ళిరి.

తా. వారందరు తమ తమ స్థానములు విడిచి, ఒకే విధమైన ఆలోచనతో పరుగెత్తుచు, ఆ ధ్వని వచ్చు వైపునకు తమ తమ స్థానములను అనుసరించి వెళ్ళిరి. 36

మూ. హయైరన్యే గజైరన్యే రథైరన్యే స్వలంకృతైః,
సుకుమారాస్తథైవాన్యే పద్భిరేవ నరా యయుః. 37

ప్ర. అ. అన్యే=కొందరు, హయైః=గుఱ్ఱములచేతను, అన్యే=కొందరు, గజైః = ఏనుగులచేతను, సుకుమారాః= సుకుమారులైన, అన్యే = కొందరు, స్వలంకృతైః=చక్కగా అలంకరింపబడిన, రథైః=రథములచేతను, తథైవ= అట్లే, అన్యే=మరికొందరు, నరాః=మనుష్యులు, పద్భిరేవ= పాదములచేతను, యయుః=వెళ్ళిరి.

తా. కొందరు గుఱ్ఱముల మీదను, కొందఱు ఏనుగులమీదను, సుకుమారులైన కొందరు చక్కగా అలంకరించిన రథముల మీదను, మరికొందరు కాలి నడకను వెళ్ళిరి. 37

మూ. అచిరప్రోషితం రామం చిరవిప్రోషితం యథా,
ద్రష్టుకామో జనస్సర్వో జగామ సహసాశ్రమమ్. 38

ప్ర. అ. సర్వః=సమస్తమైన, జనః=జనము, అచిరప్రోషితమ్ = కొంచెము కాలము క్రితమే ప్రవాసమునకు వెళ్ళిన, రామమ్=రాముని, చిరప్రోషితం యథా=చాలకాలము క్రితము ప్రవాసమునకు వెళ్ళినవానిని వలె, ద్రష్టుకామః = చూడదలచినదై, సహసా=వెంటనే, ఆశ్రమమ్= ఆశ్రమమును గూర్చి, జగామ=వెళ్ళెను.

తా. ఆ జనులందరు కొంచెము కాలము క్రితమే ప్రవాసమునకు వెళ్ళిన

ఆ రాముని చాలా కాలము క్రితము వెళ్ళిన వానిని వలె చూడవలె నను కోరికతో ఆ ఆశ్రమమునకు శీఘ్రముగా వెళ్ళిరి. 38

మూ. భ్రాతౄణాం త్వరితాస్తత్ర ద్రష్టుకామాస్సమాగమమ్,
యయుర్బహువిధైర్యానైః ఖురనేమిస్వనాకులైః. 39

ప్ర. అ. తత్ర=అక్కడ, భ్రాతౄణామ్=సోదరులయొక్క, సమాగమమ్=సమాగమమును, ద్రష్టుకామాః=చూడకోరికకలవారై, త్వరితాః=తొందరపడుచున్నవారై, ఖురనేమిస్వనాకులైః=డెక్కలయొక్క, చక్రాంతములయొక్క, ధ్వనులచే వ్యాకుల మైన,బహువిధైః=అనేకవిధము లైన, యానైః=వాహనముల చేత, యయుః=వెళ్ళిరి.

తా. అక్కడ కలిసిన సోదరులను చూడవలె నను తొందరతో, ఆ జనులందరు, డెక్కల ధ్వనులతోను, చక్రాంతముల ధ్వనులతోను, వ్యాకుల మైన, వివిధ వాహనము లెక్కి వెళ్ళిరి. 39

మూ. సా భూమిర్బహుభిర్యానైః ఖురనేమిసమాహతా,
ముమోచ తుములం శబ్దం ద్యౌరివాభ్రసమాగమే. 40

ప్ర. అ. బహుభిః=అనేక మైన, యానైః=వాహనములచేత, ఖురనేమి సమాహతా=డెక్కలచేత, చక్రాంతములచేత కొట్టబడిన, సా భూమిః=ఆ భూమి, అభ్రసమాగమే=మేఘముల సమాగమమునందు, ద్యౌరివ=ఆకాశము వలె, తుములమ్=సంకుల మైన, శబ్దమ్=శబ్దమును, ముమోచ=విడచెను.

**తా.** అనేక మైన వాహనములు, డెక్కలు, చక్రాంతములు, ఆ భూమిని నలగగొట్టుటచేత మేఘములు కమ్మినపుడు ఆకాశమునందు వలె సంకుల మైన ధ్వని బయలుదేరెను. 40

మూ. తేన విత్రాసితా నాగాః కరేణుపరివారితాః,
ఆవాసయన్తో గన్ధేన జగ్మురన్యద్వనం తతః. 41

ప్ర. అ. తేన=ఆ ధ్వనిచేత, విత్రాసితాః=భయపెట్టబడిన, కరేణు పరివారితాః=ఆడఏనుగులచే చుట్టబడిన, నాగాః=ఏనుగులు, గన్ధేన = వాసనచేత, ఆవాసయన్తః=వాసనగొట్టునట్లుచేయును, తతః=అక్కడినుండి, అన్యత్ వనమ్ = మరియొక వనమును గూర్చి, జగ్ముః=వెళ్ళినవి.

తా. ఆ ధ్వనికి భయపడిన ఏనుగులు, ఆడ ఏనుగులు తమ వెంట రాగా, మదగంధమును అంతట వ్యాపింపచేయుచు, ఆ వనమునుండి మరియొక వనమునకు వెళ్ళినవి. 41

మూ. వరాహవృకసంఘాశ్చ మహిషాః సర్పవానరాః,
వ్యాఘ్రగోకర్ణగవయాః విత్రేసుః పృషతైస్సహ. 42

ప్ర. అ. వరాహవృకసంఘాశ్చ = వరాహములయొక్క, తోడేళ్ళయొక్క సముదాయములు, మహిషాః = మహిషములు, సర్పవానరాః = సర్పములు, వానరములు, వ్యాఘ్రగోకర్ణగవయాః = పెద్దపులులు, గోవుల చెవులవంటి చెవులు గల లేళ్లు, గవయమ్మృగములు, పృషతైః సహ = చుక్కల జింకలతో కూడ, విత్రేసుః = భయపడినవి.

తా. ఆ శబ్దము విని, వరాహములు, తోడేళ్లు, మహిషములు, సర్పములు, వానరములు, వ్యాఘ్రములు, గోకర్ణములు, గవయములు చుక్కల జింకలు భయపడినవి. 42

మూ. రథాఙ్గసాహ్వా నత్యూహా హంసాః కారణ్డవాః ప్లవాః,
తథా పుంస్కోకిలాః క్రౌఞ్చా విసంజ్ఞా భేజిరే దిశః. 43

ప్ర. అ. రథాఙ్గసాహ్వాః=చక్రవాకములు, నత్యూహాః=నీటికోళ్లు, హంసాః = హంసలు, కారణ్డవాః = కారండవపక్షులు, ప్లవాః = కొంగలు, తథా = అట్లే, పుంస్కోకిలాః=మగకోయిలలు, క్రౌఞ్చాః=క్రౌంచపక్షులు, విసంజ్ఞాః=స్మృతి తప్పినవై, దిశః = దిక్కులను, భేజిరే = పొందినవి.

తా. చక్రవాకములు, నత్యూహములు, హంసలు, కారండవములు, కొంగలు, కోకిలలు, క్రౌంచములు, ఆ ధ్వని విని భయపడి, నలు దిక్కులకు పారిపోయినవి. 43

మూ. తేన శబ్దేన విత్రస్తైరాకాశం పక్షిభిర్వృతమ్,
మనుష్యైరావృతా భూమిరుభయం ప్రబభౌ తదా. 44

ప్ర. అ. తేన శబ్దేన = ఆ శబ్దముచేత, విత్రస్తైః = భయపడిన, పక్షిభిః

= పక్షులచేత, వృతమ్ = కూడినదై, ఆకాశమ్ = ఆకాశము, మనుష్యైః = మనుష్యులచేత, ఆవృతా = కప్పబడినదై, భూమిః = భూమి, ఉభయమ్ = ఈ ఉభయము, తదా = అపుడు, ప్రబభౌ = అధికముగా ప్రకాశించెను.

ప్ర. అ. ఆ శబ్దమునకు భయపడిన పక్షులతో నిండిన ఆకాశము, మనుష్యులతో నిండిన భూమి, ఈ రెండును ఆ సమయమునందు సమముగా ప్రకాశించెను.

మూ. తతస్తం పురుషవ్యాఘ్రం యశస్వినమరిన్దమమ్,
ఆసీనం స్థణ్డిలే రామం దదర్శ సహసా జనః. 45

ప్ర. అ. తతః = అటుపిమ్మట. జనః = జనము, పురుషవ్యాఘ్రం = పురుషులలో శ్రేష్ఠుడు, యశస్వినమ్ = కీర్తి కలవాడు, అరిన్దమమ్ = శత్రువు, లను నశింపచేయువాడు అయిన, స్థణ్డిలే = నేలపై, ఆసీనమ్ = కూర్చున్న, తం రామమ్ = ఆ రాముని, సహసా = శీఘ్రముగా, దదర్శ = చూచెను.

తా. పిదప ఆ జనులు, పురుషశ్రేష్ఠుడు, కీర్తిశాలి, శత్రుసంహారకుడు అయిన ఆ రాముడు నేలపై కూర్చుండి యుండగా చూచిరి. 45

మూ. విగర్హమాణః కైకేయీం మన్థరాసహితామపి,
అభిగమ్య జనో రామం బాష్పపూర్ణముఖోఽభవత్. 46

ప్ర. అ. జనః = ఆ జనము, మన్థరాసహితామ్ = మన్థరతో కూడిన, కైకేయీమ్ = కైకేయిని, విగర్హమాణః = నిందించుచు, రామమ్ = రాముని, అభిగమ్య = చేరి, బాష్పపూర్ణముఖః = బాష్పములతో నిండిన ముఖము కలదై, అభవత్ = ఆయెను.

తా. వారందరు రాముని సమీపించి, కైకేయిని మంథరను నిందించుచు కన్నీళ్లు కార్చిరి. 46

మూ. తాన్నరాన్ బాష్పపూర్ణాక్షాన్ సమీక్ష్యాథ సుదుఃఖితాన్,
పర్యష్వజత ధర్మజ్ఞః పితృవన్మాతృవచ్చ సః. 47

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మము తెరిగిన, సః = రాముడు, అథ = అటుపిమ్మట, బాష్పపూర్ణాక్షాన్ = కన్నీళ్లతో నిండిన నేత్రములు గల, సుదుఃఖితాన్ =

=బాగా దుఃఖించుచున్న, తాన్ నరాన్ = ఆ జనులను, సమీక్ష్య = చూచి, పితృవత్ = తండ్రులను వలెను, మాతృవచ్చ = తల్లులను వలెను, పర్యష్వజత = కౌగలించుకొనెను.

తా. పిదప ధర్మజ్ఞుడైన ఆ రాముడు, చాలా దుఃఖితుడై, నేత్రములలో బాష్పములు నిండి యున్న వారి నందరిని చూచి పురుషులను తండ్రులను వలెను, స్త్రీలను తల్లులను వలెను కౌగలించుకొనెను. 47

మూ. స తత్ర కాంశ్చిత్ పరిషస్వజే నరాన్
నరాశ్చ కేచిత్తు తమభ్యవాదయన్,
చకార సర్వాన్ సవయస్యబాన్ధవాన్
యథార్హమాసాద్య తదా నృపాత్మజః. 48

ప్ర. అ. సః = ఆ రాముడు, తత్ర = అక్కడ, కాంశ్చిత్ = కొందరు, నరాన్ = మనుష్యులను, పరిషస్వజే = కౌగలించుకొనెను. కేచిత్తు=కొంతమంది నరాశ్చ=మనుష్యులైతే, తమ్ = ఆ రాముని, అభ్యవాదయన్=నమస్కరించిరి. తదా=అపుడు, సః = ఆ, నృపాత్మజః = రాజకుమారుడైన రాముడు, సర్వాన్ = సమస్తమైన, వయస్యబాన్ధవాన్ = మిత్రులను బంధువులను, ఆసాద్య = చేరి, యథార్హమ్ = తగిన విధముగా, చకార=చేసెను.

తా. అక్కడ రాముడు కొందరిని కౌగలించుకొనెను. కొందరు ఆ రామునకు అభివాదనము చేసిరి. అపుడు దశరథనందనుడు తన మిత్రులను బంధువులను అందరిని చేరి అర్హతలను అనుసరించి గౌరవించెను. 48

మూ. స తత్ర తేషాం రుదతాం మహాత్మనాం
భువం చ ఖం చానునినాదయన్ స్వనః,
గుహా గిరీణాం చ దిశశ్చ సన్తతం
మృదఙ్గఘోషప్రతిమః ప్రశుశ్రువే. 49

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్ర్యుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తత్ర=అక్కడ, రుదతామ్= ఏడ్చుచున్న, తేషాం మహాత్మ నామ్ = ఆ మహాత్ములయొక్క, సః=ఆ, స్వనః=ధ్వని, భువం చ = భూమిని, ఖం చ=ఆకాశమును, గిరీణామ్ = పర్వతములయొక్క, గుహాశ్చ = గుహలను, దిశశ్చ = దిక్కులను, అనునినాదయన్ = ప్రతిధ్వనింపచేయుచు, మృదఙ్గఘోష ప్రతిమః=మృదంగధ్వనితో సమానమై, సన్తతమ్=అవిచ్ఛిన్నముగా, ప్రశు శ్రువే=వినబడెను.

తా. అక్కడ, ఆ మహాత్ముల రోదనధ్వని భూమిని, ఆకాశమును, పర్వతగుహలను, దిక్కులను ప్రతిధ్వనింపచేయుచు, మృదంగధ్వని వలె అవిచ్ఛిన్నమై వినవచ్చెను. 49

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యకాండలో నూటమూడవ సర్గ సమాప్తము.

# అథ చతురుత్తరశతతమః సర్గః

[వసిష్ఠాదులతో కూడి వచ్చిన కౌసల్యా గంగానది యొడ్డున సుమిత్రాదుల సమక్షమున దుఃఖించుట. రామలక్ష్మణులు, సీత తల్లులకు ప్రణమిల్లుట. వసిష్ఠునకు ప్రణమిల్లి రామాదులు అందరితో కలిసి కూర్చుండుట.]

మూ. వసిష్ఠః పురతః కృత్వా దారాన్ దశరథస్య చ,
అభిచక్రామ తం దేశం రామదర్శనతర్షితః. 1

ప్ర. అ. వసిష్ఠః=వసిష్ఠుడు, దశరథస్య = దశరథునియొక్క, దారాన్ =భార్యలను, పురతః=ముందట, కృత్వా==ఉంచుకొని, రామదర్శనతర్షితః =రాముని దర్శనముకొరకు తీవ్ర మైన ఇచ్ఛ కలవాడై, తం దేశమ్=ఆ ప్రదేశమును గూర్చి, అభిచక్రామ=నడచెను.

తా. రాముని చూడవలె నని తీవ్ర మైన ఇచ్ఛ గల వసిష్ఠుడు దశరథుని భార్యల వెంట ఆ ప్రదేశమునకు నడచి వెళ్లెను. 1

మూ. రాజపత్న్యశ్చ గచ్ఛన్త్యో మన్దం మన్దాకినీం ప్రతి,
దదృశుస్తత్ర తత్తీర్థం రామలక్ష్మణసేవితమ్. 2

ప్ర. అ. రాజపత్న్యశ్చ=రాజభార్యలు కూడ, మన్దాకినీం ప్రతి=మందాకినీ నదిని గూర్చి, మన్దమ్=మందముగా, గచ్ఛన్త్యః=వెళ్లుచు, తత్ర=అక్కడ, రామలక్ష్మణసేవితమ్= రామలక్ష్మణులచే సేవింపబడిన, తత్తీర్థమ్=ఆ తీర్థమును, దదృశుః=చూచిరి.

తా. రాజభార్యలు మందాకినీనది వైపు మెల్లగా నడచి వెళ్లుచు, రామలక్ష్మణులు ఉపయోగించు రేవును అక్కడ చూచిరి. 2

మూ. కౌసల్యా బాష్పపూర్ణేన ముఖేన పరిశుష్యతా,
సుమిత్రామబ్రవీద్దీనా యాశ్చాన్యా రాజయోషితః. 3

ప్ర. అ. కౌసల్యా = కౌసల్య, బాష్పపూర్ణేన = బాష్పములతో నిండిన, పరిశుష్యతా = శోషించుచున్న, ముఖేన = ముఖముతో, దీనా = దీనురాలై, సుమిత్రామ్ = సుమిత్రను గూర్చి, యాః = యే, అన్యాః = ఇతర మైన, రాజయోషితః = రాజస్త్రీలు ఉన్నారో వారిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. దీనురాలైన కౌసల్య కన్నీటితో నిండి, ఎండిపోవుచున్న ముఖముతో సుమిత్రతోను, ఇతర రాజస్త్రీలతోను ఇట్లు పలికెను. 3

మూ. ఇదం తేషామనాథానాం క్లిష్టమక్లిష్టకర్మణామ్,
వనే ప్రాక్కూలనం తీర్థం యే తే నిర్విషయీకృతాః. 4

ప్ర. అ. ఇదమ్ = ఇది, యే తే = ఏ వారు, నిర్విషయీకృతాః = దేశము నుండి వెడలగొట్టబడినారో, తేషామ్ = అట్టి, అక్లిష్టకర్మణామ్ = శ్రమపడకుండగా పనులుచేయు, అనాథానామ్ = నాథులు లేని రామాదులయొక్క, క్లిష్టమ్ = క్లేశకర మైన, ప్రాక్కూలనమ్ = తూర్పుదిక్కుగా ఉన్న, వనే = వనమునందలి, తీర్థమ్ = రేవు.

తా. దేశమునుండి వెడలగొట్టబడి, అనాథులై, వనములో నివసించుచున్న ఆ సీతారామలక్ష్మణులు ఉపయోగించు రేవు ఇదియే. 4

మూ. ఇతస్సుమిత్రే పుత్రస్తే సదా జలమతన్ద్రితః,
స్వయం హరతి సౌమిత్రిర్మమ పుత్రస్య కారణాత్. 5

ప్ర. అ. సుమిత్రే = ఓ సుమిత్రా! తే పుత్రః = నీ కుమారు డైన, సౌమిత్రిః = లక్ష్మణుడు, మమ పుత్రస్య = నా కుమారునియొక్క, కారణాత్ = కారణము వలన, సదా = ఎల్లపుడు, అతన్ద్రితః = సోమరితనము లేనివాడై, ఇతః = ఇక్కడ నుండి, జలమ్ = జలమును, స్వయమ్ = స్వయముగా, హరతి = తీసుకొనివెళ్ళు చున్నాడు.

తా. ఓ సుమిత్రా! నీ కుమారు డైన లక్ష్మణుడు, నా కుమారు డైన

రామునికొరకు, ఎల్లపుడును, ఉత్సాహవంతుడై, అక్కడినుండి జలము తీసుకొని పోవుచుండును. 5

మూ. జఘన్యమపి తే పుత్రః కృతవాన్న తు గర్హితః,
భ్రాతుర్యదర్థసహితం సర్వం తద్విహితం గుణైః. 6

ప్ర. అ. తే పుత్రః = నీ కుమారుడు, జఘన్యమ్ = నీచకార్యమును, కృతవాన్ అపి = చేసినవాడైనను, గర్హితః తు = నిందింపబడినవాడు, మాత్రము, న = కాడు. యత్ = ఏది, భ్రాతుః = సోదరునకు, అర్థసహితమ్ = ప్రయోజనముతో కూడినదో, తత్ సర్వమ్ = అది అంతయు, గుణైః = గుణములతో, విహితమ్ = చేయబడినదే (కూడినది).

తా. నీ కుమారుడు జలము తీసుకొని వచ్చుట వంటి నీచకార్యములు చేసినను ఆకార్యము నింద్యము మాత్రము కాదు. ఎందుచేతననగా సోదరుని ప్రయోజనము నుద్దేశించి చేసిన అన్ని కార్యములు, గుణములచే శ్రేష్ఠ మైనవే.

మూ. అద్యాయమపి తే పుత్రః క్లేశానామతథోచితః,
నీచానర్థసమాచారం సజ్జం కర్మ ప్రముఞ్చతు. 7

ప్ర. అ. క్లేశానామ్ = క్లేశములకు, అతథోచితః = అట్లు తగని, అయమ్ = ఈ, తే పుత్రః అపి = నీ కుమారుడు కూడ, అద్య = ఇపుడు, నీచానర్థసమాచారమ్ = నీచము, దుఃఖకర మైన పద్ధతి కలదీ అయిన, సజ్జమ్ = ఉద్యుక్తమైన (ప్రారంభించి నడుపబడుచున్న) కర్మ = కర్మను, ప్రముఞ్చతు = విడచుగాక!

తా. ఇటుపై రాముడు, భరతుని ప్రార్థనచే రాజ్యాభిషిక్తు డగును కావున ఇట్టి కష్టములకు తగని నీ కుమారుడు, నీచము అధికదుఃఖకరము అయిన ఈ సేవను విడచుగాక. 7

మూ. దక్షిణాగ్రేషు దర్భేషు సా దదర్శ మహీతలే,
పితురిఙ్గుదిపిణ్యాకం న్యస్తమాయతలోచనా. 8

ప్ర. అ. ఆయతలోచనా! = విశాల మైన నేత్రములు గల, సా = ఆమె, దక్షిణాగ్రేషు = దక్షిణము వైపు అగ్రములు గల, దర్భేషు = దర్భలయందు,

మహీతలే = నేలపై, పితుః=తండ్రికి, న్యస్తమ్=ఉంచబడిన, ఇఙ్గుదిపిణ్యాకమ్ =ఇంగుదీవృక్షపు తెలకపిండిని, దదర్శ = చూచెను.

తా. విశాలనేత్ర యైన ఆ కౌసల్య నేలపై దక్షిణాగ్రములుగా పరచిన దర్భలమీద రాముడు తండ్రిని ఉద్దేశించి ఉంచిన ఇంగుదిచెట్టు తెలకపిండిని చూచెను. 8

మూ. తం భూమౌ పితురార్తేన న్యస్తం రామేణ వీక్ష్య సా,
ఉవాచ దేవీ కౌసల్యా సర్వా దశరథస్త్రియః. 9

ప్ర. అ. దేవీ = దేవి యైన, సా కౌసల్యా = ఆ కౌసల్య, ఆర్తేన = =దుఃఖితు డైన, రామేణ=రామునిచేత, పితుః=తండ్రికి, న్యస్తమ్=ఉంచబడిన, తమ్ = ఆ పిండమును, భూమౌ = నేలపై, వీక్ష్య = చూచి, సర్వాః = సమస్త మైన, దశరథస్త్రియః=దశరథునిస్త్రీలను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ఆ కౌసల్యాదేవి, రాముడు దుఃఖించుచు తండ్రికొరకై నేలమీద ఉంచిన ఆ పిండమును చూచి దశరథుని భార్య లందరితోను ఇట్లు పలికెను. 9

మూ. ఇదమిక్ష్వాకునాథస్య రాఘవస్య మహాత్మనః,
రాఘవేణ పితుర్దత్తం పశ్యతైతద్యథావిధి. 10

ప్ర. అ. రాఘవేణ = రామునిచేత, ఇక్ష్వాకునాథస్య = ఇక్ష్వాకువంశ ప్రభువూ, మహాత్మనః=మహాత్ముడూ, పితుః=తండ్రీ అయిన, రాఘవస్య = దశరథునకు, యథావిధి=యథాశాస్త్రముగ, దత్తమ్ = ఇవ్వబడిన, ఇదమ్ = ఈ పిండమును, పశ్యత=చూడండి.

తా. ఇక్ష్వాకువంశప్రభువూ, మహాత్ముడూ, తండ్రీ యైన దశరథమహారాజునకు రాముడు యథావిధిగా ఇచ్చిన ఈ పిండమును చూడండి. 10

మూ. తస్య దేవసమానస్య పార్థివస్య మహాత్మనః,
నైతదౌపయికం మన్యే భుక్తభోగస్య భోజనమ్. 11

ప్ర. అ. దేవసమానస్య=దేవతలతో సమానుడు, భుక్తభోగస్య = అనుభవింపబడిన భోగములు కలవాడు, మహాత్మనః=మహాత్ముడు అయిన, తస్య

పార్థివస్య = ఆ రాజునకు, ఏతత్ = ఈ, భోజనమ్ = భోజనమును, ఔపయికమ్ యుక్త మైన దానినిగా, న మన్యే = తలవను.

తా. దేవసమానుడు, అనేకభోగములను అనుభవించినవాడు, మహాత్ముడు అయిన ఆ రాజునకు ఇది తగిన అహారము కాదు.

మూ. చతురన్తాం మహీం భుక్త్వా మహేన్ద్రసదృశో విభుః,
కథమిఙ్గుదిపిణ్యాకం స భుఙ్క్తే వసుధాధిపః. 12

ప్ర. అ. మహేన్ద్రసదృశః = మహేంద్రునితో సమాన మైన, విభుః = ప్రభు వైన, సః వసుధాధిపః = ఆ రాజు, చతురన్తామ్ = నాలుగు కొనలు గల, మహీమ్ = భూమిని, భుక్త్వా = అనుభవించి, ఇఙ్గుదిపిణ్యాకమ్ = ఇంగుదిచెట్టు తెలక పిండిని, కథమ్ = ఎట్లు, భుఙ్క్తే = తినుచున్నాడు?

తా. మహేంద్రునితో సమానుడై, నాలుగు సముద్రములవరకు వ్యాపించిన సమస్తభూమండలమును పాలించిన ఆ దశరథమహారాజు, ఇంగుదిచెట్టు తెలక పిండిని ఎట్లు తినగలడు? 12

మూ. అతో దుఃఖతరం లోకే న కిఞ్చిత్ప్రతిభాతి మా,
యత్ర రామః పితుర్దద్యాదిఙ్గుదిక్షోదమృద్ధిమాన్. 13

ప్ర. అ. యత్ర = ఎపుడు, ఋద్ధిమాన్ = ఐశ్వర్యవంతు డైన, రామః = రాముడు, పితుః = తండ్రికి, ఇఙ్గుదిక్షోదమ్ = ఇంగుదికాయల పిండిని, దద్యాత్ = ఇచ్చెనో, అతః = దీనికంటె, లోకే = లోకమునందు, దుఃఖతరమ్ = ఎక్కువ దుఃఖకర మైనది, కిఞ్చిత్ = ఏదియు, మా = నన్ను గూర్చి, న ప్రతిభాతి = తోచుటలేదు.

తా. ఐశ్వర్యవంతు డైన రాముడు తండ్రికి ఇంగుదికాయల పిండిని ఇచ్చినాడే- ఇంతకంటే దుఃఖకర మైన దేదియు నాకు లోకములో కనబడుట లేదు. 13

మూ. రామేణేఙ్గుదిపిణ్యాకం పితుర్దత్తం సమీక్ష్య మే,
కథం దుఃఖేన హృదయం న స్ఫోటతి సహస్రధా. 14

ప్ర. అ. రామేణ = రామునిచేత, పితుః = తండ్రికి, దత్తమ్ = ఇవ్వబడిన, ఇఙ్గుదిపిణ్యాకమ్ = ఇంగుదికాయల తెలగపిండిని, సమీక్ష్య = చూచి, మే హృదయమ్ = నా హృదయము, దుఃఖేన = దుఃఖముచేత, సహస్రధా = వేయి ముక్కలుగా, కథమ్ = ఎట్లు, న స్ఫోటతి = పగులకున్నది.

తా. రాముడు తండ్రికి ఇచ్చిన ఈ ఇఙ్గుదిపిణ్యాకమును చూచిన పిమ్మట కూడ నా హృదయము దుఃఖముతో వేయి ముక్కలుగా పగిలిపోకున్నది. ఎంత ఆశ్చర్యము ! 14

మూ. శ్రుతిస్తు ఖల్వియం సత్యా లౌకికీ ప్రతిభాతి మా,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. 15

ప్ర. అ. పురుషః = పురుషుడు, యదన్నః = ఏది అన్నముగా కలవాడు, భవతి = అగునో, తస్య = వానియొక్క, దేవతాః = దేవతలు, తదన్నాః = అదే అన్నము కలవారు అను, ఇయమ్ = ఈ, లౌకికీ = లోకప్రసిద్ధ మైన, శ్రుతిస్తు = శ్రుతి యైతే, సత్యా = సత్య మైనదిగా, మా = నన్ను గూర్చి, (నాకు), ప్రతిభాతి ఖలు = తోచుచున్నది కదా!

తా. "పురుషుడు తాను ఏ ఆహారమును తినునో, అతని దేవతలకు కూడ, అదే ఆహారము" అని లోకప్రసిద్ధ మైన ఈ శ్రుతి సత్యమైనది అని నేను తలచుచున్నాను. 15

మూ. ఏవమార్తాం సపత్న్యస్తా జగ్మురాశ్వాస్య తాం తదా,
దదృశుశ్చాశ్రమే రామం స్వర్గచ్యుతమివామరమ్. 16

ప్ర. అ. తదా = అపుడు, తాః సపత్న్యః = ఆ సవతులు, ఏవమ్ = ఇట్లు, ఆర్తామ్ = దుఃఖితురా లైన, తామ్ = ఆమెను, ఆశ్వాస్య = ఓదార్చి, జగ్ముః = వెళ్ళిరి. ఆశ్రమే = ఆశ్రమమునందు, స్వర్గచ్యుతమ్ = స్వర్గమునుండి జారి వచ్చిన, అమరమివ = దేవతవలె ఉన్న, రామమ్ = రాముని, దదృశుశ్చ = చూచిరి.

తా. ఈ విధముగా దుఃఖితురా లైన, ఆ కౌసల్యను, ఓదార్చి, రాజభార్య లందరు ఆశ్రమమును చేరి, అక్కడ స్వర్గమునుండి భూమికి వచ్చిన దేవత వలె ఉన్న రాముని చూచిరి. 16

మూ. సర్వభోగైః పరిత్యక్తం రామం సంప్రేక్ష్య మాతరః,
ఆర్తా ముముచురశ్రూణి సస్వరం శోకకర్శితాః. 17

ప్ర, అ. శోకకర్శితాః = శోకముచేత కృశింపచేయబడిన, మాతరః = తల్లులు, సర్వభోగైః = సమస్తమైన భోగములచేత, పరిత్యక్తమ్=విడువబడిన, రామమ్ = రాముని, సంప్రేక్ష్య = చూచి, ఆర్తాః = దుఃఖితలై, సస్వరమ్ = ధ్వనితో కూడినట్లుగా, అశ్రూణి = కన్నీళ్లను, ముముచుః = విడచిరి.

తా. సమస్తభోగములు విడిచి ఆశ్రమములో ఉన్న రాముని చూడగానే కౌసల్య మొదలైన తల్లులు దుఃఖాక్రాంతలై, బిగ్గరగా ఏడ్చిరి. 17

మూ. తాసాం రామః సముత్థాయ జగ్రాహ చరణాన్ శుభాన్,
మాతౄణాం మనుజవ్యాఘ్రః సర్వాసాం సత్యసంగరః.

ప్ర. అ. మనుజవ్యాఘ్రః = మనుజులలో శ్రేష్ఠుడు, సత్యసంగరః=సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు అయిన, రామః = రాముడు, సముత్థాయ = లేచి, సర్వాసామ్ = సమస్తమైన, తాసాం మాతౄణామ్ = ఆ తల్లులయొక్క, శుభాన్ = మంగళకరములైన, చరణాన్ = పాదములను, జగ్రాహ = పట్టుకొనెను.

తా. మనుజులలో శ్రేష్ఠుడు, సత్యప్రతిజ్ఞ కలవాడూ అయిన రాముడు లేచి, ఆ తల్లు లందరికిని పాదములు స్పృశించి నమస్కరించెను. 18

మూ. తాః పాణిభిః సుఖస్పర్శైర్మృద్వఙ్గులితలైశ్శుభైః,
ప్రమమార్జూ రజః పృష్ఠాద్రామస్యాయతలోచనాః. 19

ప్ర. అ. ఆయతలోచనాః = విశాలమైన నేత్రములు గల, తాః = వారు, సుఖస్పర్శైః = సుఖకరమైన స్పర్శ గల, మృద్వఙ్గులితలైః = మృదువైన వేళ్లూ అరచేతులూ గల, శుభైః=మంగళకరమైన, పాణిభిః = హస్తములతో, రామస్య = రామునియొక్క, పృష్ఠాత్ = వీపునుండి, రజః = పరాగమును, ప్రమమార్జుః = తుడిచిరి.

తా. విశాలమైన నేత్రములు గల ఆ కౌసల్యా మొదలైనవారు, మృదువైన వేళ్లూ, అరచేతులూ గల, స్పృశించుటకు సుఖకరముగా నున్న, మంగళ

కరములైన చేతులతో, రాముని వీపుపై అంటుకొని యున్న పరాగమును దులిపిరి. 19

మూ. సౌమిత్రిరపి తాః సర్వా మాతౄః సంప్రేక్ష్య దుఃఖితః,
అభ్యవాదయదాసక్తం శనై రామాదనన్తరమ్. 20

ప్ర. అ. సౌమిత్రిరపి = లక్ష్మణుడు కూడ, సర్వాః = సమస్తమైన, తాః మాతౄః = ఆ తల్లులను, సంప్రేక్ష్య = చూచి, దుఃఖితః = దుఃఖించుచున్నవాడై, రామాత్ అనంతరమ్ = రామునకు పిమ్మట, శనైః = మెల్లగా, ఆసక్తమ్ = భక్తిపూర్వకముగా, అభ్యవాదయత్ = నమస్కరించెను.

తా. ఆ తల్లు లందరినీ చూచి దుఃఖితుడైన లక్ష్మణుడు కూడ, రాముని తరువాత, వారి కందరికి మెల్లగా, భక్తిపూర్వకముగా నమస్కరించెను. 20

మూ. యథా రామే తథా తస్మిన్ సర్వా వవృతిరే స్త్రియః,
వృత్తిం దశరథాజ్జాతే లక్ష్మణే శుభలక్షణే. 21

ప్ర. అ. సర్వాః = సమస్తమైన, స్త్రియః = దశరథుని భార్యలు, దశరథాత్ = దశరథునినుండి, జాతే = పుట్టిన, శుభలక్షణే = శుభమైన లక్షణములు గల, తస్మిన్ లక్ష్మణే = ఆ లక్ష్మణుని విషయమున, రామే యథా = రామునియందెట్లో, తథా = అట్లే, వృత్తిమ్ = ప్రవృత్తిని, వవృతిరే = చేసిరి.

తా. దశరథుని భార్య లందరు దశరథకుమారుడు, మంగళకరములైన లక్షణములు కలవాడు అయిన ఆ లక్ష్మణుని కూడ రాముని ఆదరించి నట్లే ఆదరించిరి. 21

మూ. సీతాపి చరణాంస్తాసాముపసంగృహ్య దుఃఖితా,
శ్వశ్రూణామశ్రుపూర్ణాక్షి సా బభూవాగ్రతః స్థితా. 22

ప్ర. అ. సా సీతాపి = ఆ సీతకూడ, దుఃఖితా = దుఃఖితురాలై, తాసామ్ = ఆ, శ్వశ్రూణామ్ = అత్తగార్లయొక్క, చరణాన్ = పాదములను, ఉపసంగృహ్య = పట్టుకొని, అశ్రుపూర్ణాక్షీ = కన్నీళ్లతో నిండిన నేత్రములు కలదై, అగ్రతః = ఎదుట, స్థితా = నిలచినది, బభూవ = ఆయెను.

తా. దుఃఖితురా లైన సీత కూడ, అత్తలకు పాదములు స్పృశించి నమస్కరించి, అశ్రువులు కార్చుచు ఎదుట నిలబడెను. 22

మూ. తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా,
వనవాసకృశాం దీనాం కౌసల్యా వాక్యమబ్రవీత్. 23

ప్ర. అ. కౌసల్యా = కౌసల్యాదేవి, దుఃఖార్తామ్ = దుఃఖముచే పీడింపబడినదీ, వనవాసకృశామ్ = వనవాసముచేత కృశించినదీ, దీనామ్ = దీను రాలూ అయిన, తామ్ = ఆమెను, మాతా = తల్లి, దుహితరం యథా = కుమార్తెను వలె, పరిష్వజ్య = కౌగలించుకొని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వనవాసముచే కృశించి, దుఃఖముచేత పీడింపబడుచు, దీనురా లైన ఆ సీతను కౌసల్యాదేవి తల్లి కుమార్తెను కౌగలించుకొని నట్లు కౌగలించుకొని, ఇట్లు పలికెను. 23

మూ. విదేహరాజస్య సుతా స్నుషా దశరథస్య చ,
రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా నిర్జనే వనే. 24

ప్ర. అ. విదేహరాజస్య = జనకమహారాజుయొక్క, సుతా = కుమార్తెయు, దశరథస్య = దశరథునియొక్క, స్నుషా = కోడలు, రామపత్నీ = రాముని భార్య అయిన సీత, నిర్జనే = జనులు లేని, వనే = వనమునందు, కథమ్ = ఎట్లు, దుఃఖమ్ = దుఃఖమును, సంప్రాప్తా = పొందినదో.

తా. జనకుని కూతురు, దశరథుని కోడలు, రాముని భార్య అయిన సీత కూడ నిర్జన మైన అరణ్యములో ఈ విధముగా కష్టపడవలసి వచ్చినదికదా! 24

మూ. పద్మమాతపసన్తప్తం పరిక్లిష్టమివోత్పలమ్,
కాఞ్చనం రజసా ధ్వస్తం క్లిష్టం చన్ద్రమివామ్బుదైః. 25

ముఖం తే ప్రేక్ష్య మాం శోకో దహత్యగ్నిరివాశ్రయమ్,
భృశం మనసి వైదేహి వ్యసనారణిసంభవః. 26

ప్ర. అ. వైదేహి = ఓ సీతా! ఆతపసన్తప్తమ్ = ఎండచేత తపింపచేయబడిన, పద్మమ్ ఇవ = పద్మము వలె, పరిక్లిష్టమ్ = నలిగిన, ఉత్పలమివ = కలువ

వలె, రజసా = పరాగముచేత, ధ్వస్తమ్ = చెడిన, కాఞ్చనమ్ ఇవ = బంగారము వలె, అమ్బుదైః = మేఘములచేత, క్లిష్టమ్ = కప్పబడిన, చన్ద్రమ్ ఇవ = చంద్రుని వలె ఉన్న, తే ముఖమ్ = నీ ముఖమును, ప్రేక్ష్య = చూచి, వ్యసనారణిసంభవః = కష్టము లను అరణినుండి పుట్టిన, శోకః = శోకము, అగ్నిః = అగ్ని, ఆశ్రయమివ = తనకు ఆశ్రయ మైన కఱ్ఱనువలె, మామ్ = నన్ను, మనసి = మనస్సునందు, భృశమ్ = మిక్కిలి, దహతి = కాల్చివేయుచున్నది.

తా. ఓ సీతా ! ఎండకు ఎండిన పద్మము వలె, నలిగిన కలువ వలె, దుమ్ము పట్టిన బంగారము వలె, మేఘములు కప్పిన చంద్రబింబము వలె, ఉన్న నీ ముఖమును చూడగానే, కష్టము లను అరణి నుండి (అరణి అనగా మథించి, యజ్ఞాదులలో ఉపయోగించు అగ్నిని తీయుటకై ఉపయోగించు కఱ్ఱ) పుట్టిన శోకము, అగ్ని తనకు ఆశ్రయ మైన దారువును దహించు నట్లు, నా మనస్సును, మిక్కిలి దహించివేయుచున్నది. 25,26

మూ. బ్రువన్త్యామేవమార్తాయాం జనన్యాం భరతాగ్రజః,
పాదావాసాద్య జగ్రాహ వసిష్ఠస్య చ రాఘవః. 27

ప్ర అ. ఆర్తాయాం = దుఃఖితురా లైన, జనన్యామ్ = తల్లి, ఏవమ్ = ఇట్లు, బ్రువన్త్యామ్ = చెప్పుచుండగా, భరతాగ్రజః = భరతుని అన్నగా రైన, రాఘవః = రాముడు, ఆసాద్య = సమీపించి, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, పాదౌ = పాదములను, జగ్రాహ = పట్టుకొనెను.

తా. దుఃఖితురా లైన తల్లి ఇట్లు చెప్పుచుండగా రాముడు వసిష్ఠుని సమీపించి, ఆయనకు కూడ పాదాభివందనము చేసెను. 27

మూ. పురోహితస్యాగ్నిసమస్య వై తదా
బృహస్పతేరిన్ద్రమివామరాధిపః,
ప్రగృహ్య పాదౌ సుసమృద్ధతేజసః
సహైవ తేనోపవివేశ రాఘవః. 28

ప్ర. అ. తదా = అపుడు, రాఘవః = రాముడు, అగ్నిసమస్య = అగ్నితో సమానుడు, సుసమృద్ధతేజసః = చాలా అధిక మైన తేజస్సు కలవాడు అయిన, పురోహితస్య = పురోహితునియొక్క, పాదౌ = పాదములను, అమరాధిపః = దేవ

తల ప్రభు వైన, ఇన్ద్రః= ఇంద్రుడు, బృహస్పతే రివ=బృహస్పతియొక్క పాదములను వలె, ప్రగృహ్య= పట్టుకొని, తేన సహైవ=అతనితో కూడానే ఉపవివేశ=కూర్చుండెను.

తా. అప్పుడా రాముడు, అగ్నిసమానుడు, మహాతేజశ్శాలీ యైన ఆ వసిష్ఠుని పాదములు దేవతాప్రభు వైన ఇంద్రుడు బృహస్పతి పాదములను, స్పృశించినట్లు స్పృశించి, అతనితో కలిసి కూర్చుండెను.

మూ. తతో జఘన్యం సహితైః సమన్త్రిభిః
పురప్రధానైశ్చ సహైవ సైనికైః,
జనేన ధర్మజ్ఞతమేన ధర్మవా
నుపోపవిష్టో భరతస్తదాగ్రజమ్. 29

ప్ర. అ. తదా=అపుడు, తతః జఘన్యమ్=వారు కూర్చున్న పిమ్మట, ధర్మవాన్=ధర్మము కల, సః భరతః = ఆ భరతుడు, సహితైః = కూడిన, మన్త్రిభిః=మంత్రులతోను, పురప్రధానైశ్చ = పురమునందు ప్రధాను లయిన వారితోను, సైనికైస్సహైవ=సైనికులతోను, ధర్మజ్ఞతమేన=మిక్కిలి ధర్మము నెరిగిన, జనేన=జనముతోను, అగ్రజమ్=అన్నగారిని, ఉపోపవిష్టః=సమీపించి, కూర్చుండెను.

తా. వసిష్ఠుడూ, రాముడూ కూర్చున్న పిదప, ధర్మాత్ము డైన భరతుడు, మంత్రులు, ప్రధానపౌరులు, సైనికులు, ధర్మము తెలిసిన జనులు రాముని సమీపమునందే కూర్చుండిరి. 29

మూ. ఉపోపవిష్టస్తు తదా స వీర్యవాం
స్తపస్వివేషేణ సమీక్ష్య రాఘవమ్,
శ్రియా జ్వలన్తం భరతః కృతాఞ్జలి
ర్యథా మహేన్ద్రః ప్రయతః ప్రజాపతిమ్. 30

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతు డైన, సః=ఆ, భరతః=భరతుడు, తపస్వివేషేణ=మునివేషముతో, శ్రియా=కాంతితో, జ్వలన్తమ్= వెలుగుచున్న, రాఘవమ్=రాముని, ప్రయతః=పరిశుద్ధు డైన, మహేన్ద్రః = మహేంద్రుడు,

ప్రజాపతిం యథా= బ్రహ్మదేవుని వలె, సమీక్ష్య=చూచి, కృతాఞ్జలిః=కట్ట బడిన దోసిలి కలవాడై, తదా=అపుడు, ఉపోపవిష్టః తు = సమీపమునందు కూర్చుండెను.

తా. పరాక్రమవంతు డైన ఆ భరతుడు ఆ సమయమున, మునుల వేషము ధరించి కాంతితో వెలుగుచున్న ఆ రాముని చూచి నమస్కరించుచు, పరిశుద్ధు డైన మహేంద్రుడు బ్రహ్మదేవుని సమీపమునందు కూర్చున్నట్లు ఆయన ప్రక్కనే కూర్చుండెను. 30

మూ. కిమేష వాక్యం భరతోఽద్య రాఘవం
ప్రణమ్య సత్కృత్య చ సాధు వక్ష్యతి,
ఇతీవ తస్యార్యజనస్య తత్త్వతో
బభూవ కౌతూహలముత్తమం తదా. 31

ప్ర. అ. ఏషః=ఈ, భరతః=భరతుడు, అద్య=ఇపుడు, రాఘవమ్= రాముని, ప్రణమ్య = నమస్కరించి, సత్కృత్య చ=గౌరవించి, సాధు = చక్కగా, కిం వాక్యమ్=ఏమి వాక్యమును, వక్ష్యతి=పలుక గలడో, ఇతీవ= అని, తదా=అపుడు, తస్య=ఆ, ఆర్యజనస్య=పూజ్యు లైన జనులకు, తత్త్వతః =యథార్థముగా, ఉత్తమమ్=ఉత్తమ మైన, కౌతుహలమ్=కౌతుకము, బభూవ= అయెను.

తా. భరతుడు ఇపుడు రాముని నమస్కరించి, సత్కరించి, ఏ మంచి మాటలు చెప్పునో అని అక్కడచేరిన జనులందరికిని అత్యధిక మైన కౌతుకము కలిగెను. 31

మూ. స రాఘవః సత్యధృతిశ్చ లక్ష్మణో
మహానుభావో భరతశ్చ ధార్మికః,
వృతాః సుహృద్భిశ్చ విరేజురధ్వరే
యథా సదస్యైః సహితాస్త్రయోఽగ్నయః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతురుత్తరశతతమః సర్గః

ప్ర. అ. సత్యధృతిః=సత్య మైన ధైర్యము గల, సః రాఘవశ్చ=ఆ రాముడు, మహానుభావః=అధిక మైన ప్రభావము గల, లక్ష్మణః = లక్ష్మణుడు, ధార్మికః=ధర్మమును ఆచరించు, భరతశ్చ=భరతుడు, సుహృద్భిః=స్నేహితులతో, వృతాః=కూడినవా రై, అధ్వరే=యజ్ఞమునందు, సదస్యైః = సభ్యులతో, సహితాః=కూడిన, త్రయః అగ్నయః యథా =మూడు అగ్నులవలెే, విరేజుః=ప్రకాశించిరి.

తా. సత్య మైన ధైర్యము గల రాముడు, గొప్ప ప్రభావము గల లక్ష్మణుడు, ధార్మికు డైన భరతుడు, మిత్రు లందరు చుట్టు కూర్చొని ఉండగా, యజ్ఞశాలలో చుట్టూ సదస్యులు కూర్చున్న త్రేతాగ్నులు వలె ప్రకాశించిరి. 32

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటనాలుగవ సర్గ సమాప్తము.

# అథ షణ్ణోత్తరశతతమ సర్గః

[భరతుడు రాము నయోధ్యకు వచ్చి రాజ్యము స్వీకరింపవేడుట, రాముడు జీవిత మనిత్యమని పలుకుచు తండ్రి మృతికి శోకింపవల దని భరతున కుపదేశించుట. తండ్రియాజ్ఞ పాలించుటకే రాజ్యమును స్వీకరింపక అడవిలో నుండనిశ్చయించితినని పలుకుట.]

మూ. తతః పురుషసింహానాం వృతానాం తైః సుహృద్గణైః,
శోచతామేవ రజనీ దుఃఖేన వ్యత్యవర్తత. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తైః = ఆ, సుహృద్గణైః = మిత్రగణములతో, వృతానామ్ = కూడిన, పురుషసింహానామ్ = సింహముల వంటి పురుషులు, శోచతామేవ = దుఃఖించుచుండగానే, రజనీ = రాత్రి, దుఃఖేన = అతికష్టముగ, వ్యత్యవర్తత = గడచెను.

తా. స్నేహితులతో కూడి పురుషశ్రేష్ఠులైన ఆ నలుగురు సోదరులు దుఃఖించుచుండగానే, ఆ రాత్రి అతికష్టముగా గడచినది.

మూ. రజన్యాం సుప్రభాతాయాం భ్రాతరస్తే సుహృద్వృతాః,
మన్దాకిన్యాం హుతం జప్యం కృత్వా రామముపాగమన్.

ప్ర. అ. రజన్యామ్ = రాత్రి, సుప్రభాతాయామ్ = చక్కగా తెల్లవారగనే, తే భ్రాతరః = ఆ సోదరులు, సుహృద్వృతాః = స్నేహితులతో కూడినవారై, మన్దాకిన్యామ్ = మందాకినీ నదియందు, హుతమ్ = హోమమును, జప్యమ్ = జపమును, కృత్వా = చేసి, రామమ్ = రాముని, ఉపాగమన్ = చేరిరి.

తా. రాత్రి తెల్లవారిన పిమ్మట, ఆ సోదరు లందరు తమ స్నేహితులతో కూడి మన్దాకినీ తీరమునందు హోమజపాదులు చేసుకొని, రాముని వద్దకు వచ్చిరి.

మూ. తూష్ణీం తే సముపాసీనా న కశ్చిత్కించిదబ్రవీత్,
భరతస్తు సుహృన్మధ్యే రామం వచనమబ్రవీత్. 3

ప్ర. అ. తే = వారు, తూష్ణీమ్ = మౌనముగా, సముపాసీనాః = కూర్చుండిరి. కశ్చిత్ = ఏ ఒక్కడును, కించిత్ = ఏమియు, నాబ్రవీత్ = పలుకలేదు. భరతస్తు = భరతుడైతే, సుహృన్మధ్యే = స్నేహితుల మధ్యమునందు, రామమ్ = రాముని గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. వారందరు మౌనముగా కూర్చుండిరి. ఎవ్వరును ఏమియు మాట్లాడలేదు. భరతుడు మాత్రము మిత్రుల మధ్యమునందు, రామునితో ఇట్లనెను. 3

మూ. సాన్త్వితా మామికా మాతా దత్తం రాజ్యమిదం మమ,
తద్దదామి తవైవాహం భుఙ్క్ష్వ రాజ్యమకణ్టకమ్. 4

ప్ర. అ. మామికా = నా సంబంధమైన, మాతా = తల్లి, సాన్త్వితా = అనునయించబడినది, ఇదమ్ = ఈ, రాజ్యమ్ = రాజ్యము, మమ = నాకు, దత్తమ్ = ఇవ్వబడినది, తత్ = ఆ రాజ్యమును, అహమ్ = నేను, తవైవ = నీకే, దదామి = ఇచ్చుచున్నాను. అకణ్టకమ్ = కంటకముగా లేని (శత్రుబాధాదులు లేని), రాజ్యమ్ = రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము.

తా. నా తల్లిమాట మన్నించి నాకు రాజ్యమును ఇచ్చినావు. దానిని నీకే తిరిగి ఇచ్చివేయుచున్నాను. నిష్కంటకమైన ఈ రాజ్యమును అనుభవింపుము. 4

మూ. మహతేవామ్బువేగేన భిన్నః సేతుర్జలాగమే,
దురావారం త్వదన్యేన రాజ్యఖణ్డమిదం మహత్. 5

ప్ర. అ. జలాగమే = వర్షకాలమునందు, మహతా = గొప్పదైన, అమ్బువేగేన = జలవేగముచేత, భిన్నః = తెగగొట్టబడిన, సేతుః ఇవ = నీటికట్ట వలె, ఇదమ్ = ఈ, మహత్ = గొప్పదైన, రాజ్యఖణ్డమ్ = రాజ్యభాగము, త్వదన్యేన = నీకంటె వేరైనవానిచేత, దురావారమ్ = నిలుప శక్యము గానిది.

తా. వర్షకాలమున గొప్ప జలవేగముచేత, తెగిపోయిన సేతువు వలె ఈ విశాలరాజ్యమును, నీవు తప్ప ఎవ్వరును నిలుపజాలరు. 5

మూ. గతిం ఖర ఇవాశ్వస్య తార్క్ష్యస్యేవ పతత్రిణః,
అనుగన్తుం న శక్తిర్మే గతిం తవ మహీపతే. 6

ప్ర. అ. మహీపతే — ఓ రాజా! అశ్వస్య = గుఱ్ఱము యొక్క, గతిమ్ = నడకను, (అనుసరించుటకు) ఖర ఇవ = గాడిద (కు) వలె, తార్క్ష్యస్య = గరుత్మంతుని గమనమును అనుసరించుటకు, పతత్రిణః ఇవ = సాధారణపక్షికి వలె, తవ గతిమ్ = నీ గమనమును, అనుగన్తుమ్ = అనుసరించుటకు, మే = నాకు, శక్తిః = శక్తి, న = లేదు.

తా. గాడిద గుఱ్ఱము నడకను ఎట్లు అనుసరింపజాలదో, సాధారణ పక్షి గరుత్మంతుని గమనమును ఎట్లు అనుసరించజాలదో అట్లే ఓ మహారాజా! నేను నీ గమనమును అనుసరింపజాలను. 6

మూ. సుజీవం నిత్యశస్తస్య యః పరైరుపజీవ్యతే,
రామ తేన తు దుర్జీవం యః పరానుపజీవతి. 7

ప్ర. అ. రామ = ఓ రామా! యః = ఎవడు, పరైః = ఇతరులచేత, నిత్యశః = ఎల్లపుడు, ఉపజీవ్యతే = జీవనార్థమై ఆశ్రయింపబడుచున్నాడో, తస్య = వానిది, సుజీవమ్ = మంచి జీవితము. యః = ఎవడు, పరాన్ = ఇతరులను, ఉపజీవతి = ఆధారపడి జీవించుచున్నాడో, తేన తు = వానిచేతనైతే, దుర్జీవమ్ = చెడ్డ జీవనము (చేయబడుచున్నది).

తా. రామా! ఎల్లపుడు ఇతరులు తమ జీవికకై ఎవనిని ఆశ్రయింతురో ఆతని జీవనము మంచి జీవనము. ఎవడు ఇతరులపై ఆధారపడిజీవించునో, వాని జీవనము దుర్జీవనము. 7

మూ. యథా తు రోపితో వృక్షః పురుషేణ వివర్ధితః,
హ్రస్వకేన దురారోహో రూఢస్కన్ధో మహాద్రుమః.
స యదా పుష్పితో భూత్వా ఫలాని న విదర్శయేత్,
స తాం నానుభవేత్ప్రీతిం యస్యా హేతోః ప్రరోపితః.
ఏషోపమా మహాబాహో తమర్థం వేత్తుమర్హసి,
యది త్వమస్మాన్ వృషభో భర్తా భృత్యాన్ న శాధి హి.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల ఓ రామా! వృషభః = శ్రేష్ఠు డైన, భర్తా = ప్రభు వైన, త్వమ్ = నీవు, భృత్యాన్ = భృత్యుల మైన, అస్మాన్ = మమ్ములను, న శాధి హి = పాలింపక పోయినచో, పురుషేణ = ఒక పురుషునిచేత, రోపితః = నాటబడినది, వివర్ధితః = పెంచబడినది, హ్రస్వకేన = పొట్టివానిచేత, దురారోహః = ఎక్కుటకు శక్యముగానిది, రూఢస్కన్ధః = పెద్దగా పెరిగిన మ్రాను గలదీ అయిన, మహాద్రుమః = మహావృక్షముగా పెరిగిన, వృక్షః = వృక్షము, యదా = ఎప్పుడు, పుష్పితః = పుష్పించినది, భూత్వా = అయి, ఫలాని = ఫలములను, యథా = ఎట్లు, న విదర్శయేత్ = చూపించదో, యస్యాః హేతోః = దేని నిమిత్తము. ప్రరోపితః = నాటబడినదో, సః = అతడు, తాం ప్రీతిమ్ = ఆ ఆనందమును, నానుభవేత్ = అనుభవించడో, ఏషా = ఇది, ఉపమా = ఉపమ. తమ్ అర్థమ్ = ఆ అర్థమును, వేత్తుమ్ = తెలుసుకొనుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. మహాబాహు వైన రామా! ఒక పురుషుడు, ఒక వృక్షమును నాటి, దానిని పెంచగా, అది పొట్టివాడు ఎక్కుటకు శక్యము కానంత లావైన మ్రాను గల మహావృక్షముగా పెరిగి, పుష్పించి ఫలములను మాత్రము ఇవ్వకపోయినచో, దానిని దేనికోసమై, నాటినాడో ఆతనికి ఆ ఆనందము కలుగదు. ప్రభువులలో శ్రేష్ఠుడ వైన నీవు, భృత్యుల మైన మమ్ము పరిపాలించకపోయినచో ఈ ఉపమలోని అర్థమును గ్రహించుము. నీవు రాజ్యాభిషేకమునకు అంగీకరించక పోయినచో మన తండ్రి యైన దశరథుడు నీవు రాజువై, ప్రజల నందరను పరిపాలించెదవు అను ఆశతో చిన్ననాటినుండియు నిన్ను పెంచిన శ్రమ అంతయు వ్యర్థ మగును అని భావము. 10

మూ. శ్రేణయస్త్వాం మహారాజ పశ్యన్త్వగ్ర్యాశ్చ సర్వశః,
ప్రతపన్తమివాదిత్యం రాజ్యే స్థితమరిన్దమమ్. 11

ప్ర. అ. మహారాజ = ఓ మహారాజా! రాజ్యే = రాజ్యమునందు, స్థితమ్ = ఉన్న, అరిన్దమమ్ = శత్రుసంహారకుడ వైన, త్వామ్ = నిన్ను, అగ్ర్యాః = శ్రేష్ఠములైన, శ్రేణయః = శ్రేణులు, సర్వశః = అంతట, ప్రతపన్తమ్ = వెలుగుచున్న, ఆదిత్యమ్ ఇవ = సూర్యుని వలె, పశ్యన్తు = చూచెగాక!

తా. మహారాజా! శత్రుసంహారకుడవైన నీవు రాజ్యాభిషిక్తుడ వై తపింప

చేయుచున్న సూర్యునివలె ప్రకాశించుచుండగా, శ్రేష్ఠము లైన శ్రేణులన్నియు, నిన్ను చూచి ఆనందించుగాక! (శ్రేణు లనగా వర్తకులు, శిల్పులు మొద లైన వారి సంఘములు లేదా ప్రజా సముదాయములు). 11

మూ. తవానుయానే కాకుత్స్థ మత్తా నర్దన్తు కుఞ్జరాః,
అంతఃపురగతా నార్యో నన్దన్తు సుసమాహితాః. 12

ప్ర. అ. కాకుత్స్థ = ఓ రామా! తవ = నీయొక్క, అనుయానే = అనుసరించి వెళ్లుటయందు, మత్తాః = మదించిన, కుఞ్జరాః = ఏనుగులు, నర్దన్తు = ధ్వని చేయుగాక. అంతఃపురగతాః = అంతఃపురములో ఉన్న, నార్యః = స్త్రీలు, సుసమాహితాః = చక్కని మనస్సమాధానము కలవారై (మనస్సమాధాన మనగా మనస్సు కుదుటపడి ఉండుట). నన్దన్తు = ఆనందించెదరుగాక!

తా. రామా! నిన్ను వెంబడించి వచ్చుచు మదించిన ఏనుగులు ధ్వని చేయుగాక. అంతఃపురములో స్త్రీలు కుదుటపడిన మనస్సులతో ఆనందించెదరు గాక. 12

మూ. తస్య సాధ్విత్యమన్యన్త నాగరా వివిధా జనాః,
భరతస్య వచః శ్రుత్వా రామంప్రత్యనుయాచతః. 13

ప్ర. అ, రామం ప్రతి = రాముని గూర్చి, అనుయాచతః = ప్రార్థించుచున్న, తస్య భరతస్య = ఆ భరతునియొక్క, వచః = వాక్కును, శ్రుత్వా = విని, నాగరాః = నగరమునకు సంబంధించిన, వివిధాః = అనేకవిధము లైన, జనాః = జనులు, సాధు ఇతి = బాగున్నది అని, అమన్యన్త = తలచిరి.

తా. అయోధ్యానివాసు లైన వివిధజనులు, రాముని ప్రార్థించుచు, భరతుడు పలికిన మాటలు విని, చాలా బాగున్నది అని అనుకొనిరి. 13

మూ. తమేవం దుఃఖితం ప్రేక్ష్య విలపన్తం యశస్వినమ్,
రామః కృతాత్మా భరతం సమాశ్వాసయదాత్మవాన్. 14

ప్ర. అ. కృతాత్మా = నిశ్చిత మైన బుద్ధికలవాడు, ఆత్మవాన్ = ధైర్యము కలవాడు అయిన, రామః = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, విలపన్తమ్ =

విలపించుచున్న, యశస్వినమ్ = కీర్తిశాలి యైన, దుఃఖితమ్ = దుఃఖితు డైన, తం భరతమ్ = ఆ భరతుని, ప్రేక్ష్య = చూచి, సమాశ్వాసయత్ = ఓదార్చెను.

తా. పరాక్రమశాలి, నిశ్చిత మైన బుద్ధి కలవాడు అయిన రాముడు, ఆ విధముగా దుఃఖితు డై, విలపించుచున్న యశశ్శాలి యైన భరతుని ఈ విధముగా ఓదార్చెను. 14

మూ. నాత్మనః కామకారోఽస్తి పురుషోఽయమనీశ్వరః,
ఇతశ్చేతరతశ్చైనం కృతాన్తః పరికర్షతి. 15

ప్ర. అ. ఆత్మనః = తనకు, కామకారః = ఇష్టము వచ్చి నట్లు చేయుట అనునది, నాస్తి = లేదు. అయమ్ = ఈ, పురుషః = పురుషుడు, అనీశ్వరః = అస్వతంత్రుడు. కృతాన్తః = దైవము, ఏనమ్ = వీనిని, ఇతశ్చ = ఇటువైపు, ఇతరతశ్చ = మరి యొక వైపు, పరికర్షతి = లాగుచుండును.

తా. ఏ పురుషునకును స్వాతంత్ర్యము కాని, తన ఇష్టము వచ్చి నట్లు పనులు చేయు సామర్థ్యము కాని లేదు. ప్రతి ఒక్కనిని దైవము ఇటువైపు అటు వైపు లాగుచుండును. 15

మూ. సర్వే క్షయాన్తాః నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్. 16

ప్ర. అ. సర్వే = సమస్త మైన, నిచయాః = ధనసంచయములు, (కూడ బెట్టిన ధనములు) క్షయాన్తాః = క్షయము అంతమునందు కలవి. సముచ్ఛ్రయాః = ఔన్నత్యములు, పతనాన్తాః = పతనములు అంతమునందు కలవి. సంయోగాః = సంబంధములు, విప్రయోగాన్తాః = వియోగము అంతమునందు కలవి. జీవితమ్ = జీవితము, మరణాన్తమ్ = మరణము అంతమునందు గలది.

తా. ఎంత ప్రోగుచేసినను ధనము చివరకు నశింపక తప్పదు. ఎంత ఉన్నతి పొందినను ప్రతిఒక్కడును పతనమును పొందితీరును. మానవుల పరస్పర సంబంధములు చివరకు విచ్ఛిన్నము లగుట తప్పదు. పుట్టినవాడు మరణించక తప్పదు. 16

మూ. యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయమ్,
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణాద్భయమ్. 17

ప్ర. అ. పక్వానామ్ = పక్వము లైన, ఫలానామ్ = ఫలములకు, పతనాత్ = క్రిందపడుటకంటె, అన్యత్ర = మరియొకదానివలన, భయమ్ = భయము, యథా = ఎట్లు, న = లేదో, ఏవమ్ = అట్లే, జాతస్య = పుట్టిన, నరస్య = మానవునకు, మరణాత్ = మరణముకంటె, అన్యత్ర = మరియొకదానివలన, భయమ్ = భయము, న = లేదు.

తా. పండిన పండ్లకు చెట్టునుండి పడిపోవుట అనునది ఒక్కటే భయము. అట్లే జనించిన మానవునకు మరణమే భయము. 17

మూ. యథాగారం దృఢస్థూణం జీర్ణం భూత్వావసీదతి,
తథైవ సీదన్తి నరా జరామృత్యువశం గతాః. 18

ప్ర. అ. దృఢస్థూణమ్ = దృఢ మైన స్తంభములు కల, అగారమ్ = ఇల్లు, యథా = ఎట్లు, జీర్ణం భూత్వా = జీర్ణించినదై, అవసీదతి = నశించునో, తథైవ = అట్లే, నరాః = మనుష్యులు, జరామృత్యువశంగతాః = ముసలితనముయొక్క, మృత్యువుయొక్క వశమును పొందినవారై, సీదన్తి = నశించెదరు.

తా. ఎంత దృఢము లైన స్తంభములతో నిర్మించినను, కొంతకాలమునకు ఇల్లు జీర్ణమై, కూలిపోవును. అట్లే మానవులు కూడ జరామృత్యువులకు వశులై నశించెదరు. 18

మూ. అత్యేతి రజనీ యా తు సా న ప్రతినివర్తతే,
యాత్యేవ యమునా పూర్ణా సముద్రముదకాకులమ్. 19

ప్ర. అ. యా = ఏ, రజనీ = రాత్రి, అత్యేతి = గడచిపోవుచున్నదో, సా = అది, న ప్రతినివర్తతే = తిరిగి రాదు. పూర్ణా = నిండిన, యమునా = యమునా నది, ఉదకాకులమ్ = ఉదకముతో నిండిన, సముద్రమ్ = సముద్రమును గూర్చి, యాత్యేవ = వెళ్ళిపోవుచునే ఉండును.

తా. గడచిన రాత్రి తిరిగి రాదు. జలపూర్ణ మైన యమునానది జలముతో నిండిన సముద్రములో ప్రవేశించిన పిమ్మట మరల రాదుకదా! 19

మూ. అహోరాత్రాణి గచ్ఛన్తి సర్వేషాం ప్రాణినామిహ,
ఆయూంషి క్షపయన్త్యాశు గ్రీష్మే జలమివాంశవః. 20

ప్ర. అ. ఇహ=ఈ లోకమునందు, గచ్ఛన్తి=గడచిపోవుచున్న, అహోరాత్రాణి = అహోరాత్రములు, గ్రీష్మే= గ్రీష్మఋతువుయందు, అంశవః = సూర్యకిరణములు, జలమివ=నీటిని వలె, సర్వేషామ్ = సమస్తమైన, ప్రాణినామ్=ప్రాణులయొక్క, ఆయూంషి=ఆయుర్దాయములను, ఆశు = శీఘ్రముగా, క్షపయన్తి = నశింపచేయుచున్నవి.

తా. గడచిపోవుచున్న రాత్రులు, పగళ్లు గ్రీష్మకాలములో సూర్యకిరణములు జలమును పీల్చివేయునట్లు సమస్తప్రాణుల ఆయుర్దాయమును క్షీణింపచేయుచున్నవి. 20

మూ. ఆత్మానమనుశోచ త్వం కిమన్యమనుశోచసి,
ఆయుస్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ. 21

ప్ర. అ. స్థితస్య చ = నిలిచి ఉన్నను, గతస్య చ = నడచుచున్నను, యస్య = ఏ, తే = నీయొక్క, ఆయుః = ఆయుర్దాయము, హీయతే = తగ్గిపోవుచున్నదో అట్టి, ఆత్మానమ్=నిన్నుగూర్చి, త్వమ్ = నీవు, అనుశోచ = దుఃఖించుము. అన్యమ్ = ఇతరమైన దానిని గూర్చి, కిమ్ = ఎందుకు, అనుశోచసి = దుఃఖించుచున్నావు.

తా. నిలచిఉన్నా, నడుచుచున్నా నీ ఆయుర్దాయము క్షీణించిపోవుచున్నది. అందుచే నీవు నిన్ను గూర్చియే విచారించవలెను గాని, ఇతరులను గూర్చి ఎందుకు విచారించెదవు? 21

మూ. సహైవ మృత్యుర్వ్రజతి సహ మృత్యుర్నిషీదతి,
గత్వా సుదీర్ఘమధ్వానం సహ మృత్యుర్నివర్తతే. 22

ప్ర. అ. మృత్యుః=మృత్యువు, సహైవ=కూడానే, వ్రజతి=వెళ్లుచున్నది. సహ మృత్యుః = మృత్యువుతో కూడినవాడగుచునే, నిషీదతి = కూర్చుంటున్నాడు. సుదీర్ఘమ్ = చాలా దీర్ఘమైన, అధ్వానమ్=మార్గమును,

గత్వా=వెళ్ళి, సహమృత్యుః= మృత్యువుతో కూడినవాడై, నివర్తతే=మళ్ళీ వచ్చుచున్నాడు.

తా. మానవుడు ఎక్కడికి వెళ్ళినను మృత్యువు కూడ అతనిని అనుసరించుచునే వెళ్ళుచున్నది. కూర్చుండువాడు మృత్యువుతో కలిసియే కూర్చొనుచున్నాడు. ఎంత దీర్ఘప్రయాణము చేసినను మృత్యువుతో కలిసియే తిరిగి వచ్చుచున్నాడు. 22

మూ. గాత్రేషు వలయః ప్రాప్తాః శ్వేతాశ్చైవ శిరోరుహాః,
జరయా పురుషో జీర్ణః కిం హి కృత్వా ప్రభావయేత్. 23

ప్ర. అ. గాత్రేషు =అవయవములయందు, వలయః=ముడతలు, ప్రాప్తాః =వచ్చినవి. శిరోరుహాశ్చైవ=కేశములు కూడ, శ్వేతాః=తెల్లబడినవి. జరయా =ముసలితనముచే, జీర్ణః=జీర్ణించిన, పురుషః = పురుషుడు, కిం హి=దేనిని, కృత్వా=చేసి, ప్రభావయేత్ = సమర్థునిగా చేసుకొనును.

తా. శరీరముపై ముడతలు పడినవి. వెంట్రుక లన్నియు తెల్లబడినవి. ఈ విధముగా ముసలితనముచే జీర్ణు డైపోయిన మనుష్యుడు ఏమి చేసి మాత్రము తనను సమర్థునిగా చేసుకొనగలడు. 23

మూ. నన్దన్త్యుదిత ఆదిత్యే నన్దన్త్యస్తమితే రవౌ,
ఆత్మనో నావబుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్. 24

ప్ర. అ. మనుష్యాః=మనుష్యులు, ఆదిత్యే=సూర్యుడు, ఉదితే=ఉదయించగా, నన్దన్తి=సంతోషించుచున్నారు. రవౌ = సూర్యుడు, అస్తమితే=అస్తమించగా, నన్దన్తి=సంతోషించుచున్నారు. ఆత్మనః=తమయొక్క. జీవితక్షయమ్ =ఆయుర్దాయము యొక్క క్షయమును, నావబుధ్యన్తే = తెలుసుకొనుటలేదు.

తా. సూర్యుడు ఉదయించగానే మనుష్యులు తమ పనులు చేసుకొనవచ్చును గదా అని సంతోషించుచున్నారు. సూర్యుడు అస్తమించగనే విశ్రాంతి సుఖమును పొందవచ్చును గదా అని సంతోషించుచున్నారు. తమ ఆయుర్దాయము క్షీణించుచున్న దను విషయమును మాత్రము తెలుసుకొనకున్నారు. 24

మూ. హృష్యన్త్యృతుముఖం దృష్ట్వా నవం నవమిహాగతమ్,
ఋతూనాం పరివర్తేన ప్రాణినాం ప్రాణసంక్షయః. 25

ప్ర. అ. ఋతుముఖమ్ = ఋతువుయొక్క ప్రారంభమును, దృష్ట్వా = చూచి, ఇహ = ఇపుడు, నవం నవమ్ = క్రొత్త క్రొత్త పుష్పఫలాదికము, ఆగతమ్ = వచ్చినది కదా అని, హృష్యన్తి = సంతోషించుచున్నారు. ఋతూనామ్ = ఋతువుల యొక్క, పరివర్తేన = తిరుగుటచేత, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, ప్రాణసంక్షయః = ప్రాణనాశము జరుగుచున్నది.

తా. క్రొత్త ఋతువు ప్రారంభము చూడగానే మానవులు ఇపుడు క్రొత్త క్రొత్త పుష్పఫలాదులు వచ్చినవి కదా అని సంతోషించుచుందురు. కాని ఋతువు మారుచుండగా ప్రాణుల ఆయుర్దాయము కూడ క్షీణించుచుండును. 25

మూ. యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే,
సమేత్య చ వ్యపేయాతాం కాలమాసాద్య కంచన. 26

ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ ధనాని చ,
సమేత్య వ్యపధావన్తి ధ్రువో హ్యేషాం వినాభవః. 27

ప్ర. అ. యథా = ఎట్లు, మహార్ణవే = మహాసముద్రమునందు, కాష్ఠం చ = ఒక కఱ్ఱయు, కాష్ఠం చ = మరొక కఱ్ఱయు, సమేయాతామ్ = కలసుకొనునో, సమేత్య = కలిసి, కంచన = ఒకానొక, కాలమ్ = కాలమును, ఆసాద్య = పొంది, వ్యపేయాతాం చ = విడిపోవునో, ఏవమ్ = ఇట్లే, భార్యాశ్చ = భార్యలు, పుత్రాశ్చ = పుత్రులు, జ్ఞాతయశ్చ = బంధువులు, ధనాని చ = ధనములు, సమేత్య = కలిసి, వ్యపధావన్తి = విడిపోవుచుండును, ఏషామ్ = వీటియొక్క, వినాభవః = విడిపోవుట, ధ్రువో హి = నిశ్చిత మైనది కదా!

తా. మహాసముద్రములో ఒక కాష్ఠము, మరియొక కాష్ఠము కలిసి దగ్గరగా ఉండి, కొంతకాలమునకు విడిపోవుచుండును. అట్లే భార్యలు, పుత్రులు, బంధువులు, ధనములు కొంతకాలము కలిసియుండి విడిపోవుచుందురు. వీరు విడిపోవుట తప్పదు. 27

మూ. నాత్ర కచ్చిద్యథాభావం ప్రాణీ సమభివర్తతే,
తేన తస్మిన్న సామర్థ్యం ప్రేతస్యాస్త్యనుశోచతః. 28

ప్ర. అ. అత్ర=ఈ లోకమునందు, కచ్చిత్ప్రాణీ=ఏ ప్రాణియు కూడ, యథాభావమ్=ఇష్టము వచ్చినట్లుగా, న సమభివర్తతే=ప్రవర్తింపజాలదు. తేన =ఆ కారణముచేత, ప్రేతస్య=మరణించినవానికి గాని, అనుశోచతః = వానిని గూర్చి దుఃఖిచుచున్న వానికిగాని, తస్మిన్ = దాని విషయమున, సామర్థ్యమ్= సామర్థ్యము, నాస్తి = లేదు.

తా. ఈ లోకములో ఏ ప్రాణీ కూడ తన ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపజాలదు. అందుచేత మరణించినవానికి గాని, మరణించనివానిని గూర్చి ఏడ్చువానికి గాని, దాని విషయమున (మరణాదివిషయమున) సామర్థ్యము లేదు. 28

మూ. యథా హి సార్థం గచ్ఛన్తం బ్రూయాత్కశ్చిత్పథి స్థితః,
అహమప్యాగమిష్యామి పృష్ఠతో భవతామితి. 29
ఏవం పూర్వైర్గతో మార్గః పితృపైతామహో ధ్రువః,
తమాపన్నః కథం శోచేద్యస్య నాస్తి వ్యతిక్రమః. 30

ప్ర. అ. గచ్ఛన్తమ్=ప్రయాణమై వెళ్లుచున్న, సార్థమ్ = బాటసారుల (లేదా వర్తకుల) సమూహమును గూర్చి, పథి = మార్గములో, స్థితః = ఉన్నవాడు, అహమపి = నేనుకూడ, భవతామ్ = మీయొక్క, పృష్ఠతః = వెనుకనే, ఆగమిష్యామి = వచ్చెదను; ఇతి=అని, యథా=ఎట్లు, బ్రూయాత్=పలుకునో, ఏవమ్ = ఈ విధముగానే, పూర్వైః = పూర్వికులచేత, గతః = వెళ్ళబడిన, పితృపైతామహః = తండ్రులకు, తాతలకు సంబంధించిన, మార్గః = మార్గము, ధ్రువః = నిశ్చిత మైనది. యస్య=దేనికి, వ్యతిక్రమః=తిరుగు, నాస్తి = లేదో, తమ్=ఆ మార్గమును, అపన్నః = పొందినవాడు, కథమ్=ఎట్లు, శోచేత్= దుఃఖించును.

తా. కొందరు బాటసారుల గుంపు నడిచి వెళ్ళిపోవుచుండగా, "మీ వెనుకనే నేను కూడ వచ్చుచున్నాను" అని దారిలో ఉన్నవాడు ఒకడు చెప్పునట్లు, పూర్వికులైన పితృపితామహాదులు వెళ్ళిన మార్గము అందరికి నిశ్చితము. తిరుగు లేని ఆ మార్గమును పొందువాడు ఎందుకు దుఃఖించవలెను. 30

మూ. వయసః పతమానస్య స్రోతసో వానివర్తినః,
ఆత్మా సుఖే నియోక్తవ్యః సుఖభాజః ప్రజాః స్మృతాః.

ప్ర. అ. స్రోతసో వా = ప్రవాహము వలె, అనివర్తినః = తిరిగి రాని, వయసః = వయస్సు, పతమానస్య = దాటిపోవుచుండగా, ఆత్మా = మనస్సు, సుఖే = సుఖమునందు (సుఖమునకు కారణమైన ధర్మమునందు) నియోక్తవ్యః = నియమింపతగినది. ప్రజాః = ప్రజలు, సుఖభాజః = సుఖమును పొందువారుగా, స్మృతాః = చెప్పబడినారు.

తా. జలప్రవాహము వలె వెనుకకు మరలకుండగ వయస్సు దాటిపోవుచుండును. అందుచేత రాజు తన మనస్సును సుఖకరమైన ధర్మమునందు లగ్నము చేయవలెను. అట్లు చేయుటచే ప్రజలు సుఖవంతులగుదురు. 31

మూ. ధర్మాత్మా స శుభైః కృత్స్నైః క్రతుభిశ్చాప్తదక్షిణైః,
స్వర్గం దశరథః ప్రాప్తః పితా నః పృథివీపతిః. 32

ప్ర. అ. నః = మనయొక్క, పితా = తండ్రి, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, సః = ఆ, పృథివీపతిః = రాజైన, దశరథః = దశరథుడు, శుభైః = మంగళకరమైన, కృత్స్నైః = సమస్తమైన, ఆప్తదక్షిణైః = పొందబడిన (ఇవ్వబడిన) దక్షిణలు గల, క్రతుభిః = యాగములచేత, స్వర్గమ్ = స్వర్గమును, గతః = పొందినాడు.

తా. ధర్మాత్ముడైన మన తండ్రి దశరథమహారాజు, యథాశాస్త్రముగా పుష్కలమైన దక్షిణ లిచ్చుచు అనేక క్రతువులు చేయుటచే స్వర్గమునకు వెళ్ళినాడు. 32

మూ. భృత్యానాం భరణాత్సమ్యక్ ప్రజానాం పరిపాలనాత్,
అర్థాదానాచ్చ ధర్మేణ పితా నస్త్రిదివం గతః. 33

ప్ర. అ. నః = మనయొక్క, పితా = తండ్రి, భృత్యానామ్ = పోషింపదగినవారియొక్క, భరణాత్ = పోషించుటవలనను, సమ్యక్ = బాగుగా, ప్రజానామ్ = ప్రజలయొక్క, పరిపాలనాత్ = పరిపాలనము వలనను, ధర్మేణ = ధర్మము

చేత, అర్థానామ్ = ధనములయొక్క, ఆదానాత్ = తీసికొనుట వలనను, త్రిదివమ్ = స్వర్గమును, గతః = పొందినాడు.

తా. పోష్యవర్గమును పోషించుటవలనా, ప్రజలను చక్కగా పాలించుట వలనా, ధర్మానుసారముగా ధనమును స్వీకరించుటవలనా మన తండ్రిగారు స్వర్గమునకు వెళ్లకలిగినారు. 33

మూ. కర్మభిస్తు శుభైరిష్టైః క్రతుభిశ్చాప్తదక్షిణైః,
స్వర్గం దశరథః ప్రాప్తః పితా నః పృథివీపతిః. 34

ప్ర. అ. నః = మనయొక్క, పితా = తండ్రీ, పృథివీపతిః = భూమికి ప్రభువూ అయిన, దశరథః = దశరథుడు, శుభైః = మంగళకరము లైన, కర్మభిః = కర్మలచేతను, ఆప్తదక్షిణైః = పొందబడిన దక్షిణలు గల, ఇష్టైః = యజింపబడిన, క్రతుభిశ్చ = యాగములచేతను, స్వర్గమ్ = స్వర్గమును, ప్రాప్తః = పొందినాడు.

తా. మన తండ్రి యైన దశరథమహారాజు, మంగళకరము లైన పనులు చేయుటచేతా, ఉత్తమ మైన దక్షిణలతో యాగములు చేయుటచేతా స్వర్గమును చేరగలిగినాడు. 34

మూ. ఇష్ట్వా బహువిధై ర్యజ్ఞైర్భోగాంశ్చావాప్య పుష్కలాన్,
ఉత్తమం చాయురాసాద్య స్వర్గతః పృథివీపతిః. 35

ప్ర. అ. పృథివీపతిః = దశరథమహారాజు, బహువిధైః = అనేకవిధము లైన, యజ్ఞైః = యజ్ఞములచేత, ఇష్ట్వా = యజించి, పుష్కలాన్ = సమృద్ధము లైన, భోగాన్ = భోగములను, అవాప్య చ = పొంది, ఉత్తమమ్ = ఉత్తమ మైన, ఆయుశ్చ = ఆయుర్దాయమును కూడా, ఆసాద్య = పొంది, స్వర్గతః = స్వర్గమునకు వెళ్ళినాడు.

తా. దశరథమహారాజు, అనేకవిధము లైన యాగములచే దేవతలను పూజించి దీర్ఘాయుర్దాయవంతుడై పుష్కలముగా భోగము లనుభవించి స్వర్గస్థుడైనాడు. 35

మూ. ఆయురుత్తమమాసాద్య భోగానపి చ రాఘవః,
స న శోచ్యః పితా తాత స్వర్గతః సత్కృతః సతామ్.

ప్ర. అ. తాత=తండ్రీ, సతామ్=సత్పురుషులకు, సత్కృతః=సత్కరింపబడిన వాడూ, ఉత్తమమ్=ఉత్తమ మైన, ఆయుః = ఆయుర్దాయమును, భోగానపి = భోగములను, అసాద్య=పొంది, స్వర్గతః=స్వర్గస్థు డైన వాడూ అయిన, పితా=తండ్రి యైన, స రాఘవః=ఆ దశరథమహారాజు, న శోచ్యః= విచారింపదగినవాడు కాదు.

తా. నాయనా! దీర్ఘాయుర్దాయవంతు డై, ఉత్తమ మైన భోగము లను భవించి సత్పురుషులచే గౌరవము అందుకొని స్వర్గస్థు డైన మన తండ్రి దశరథ మహారాజును గూర్చి విచారించవలసిన పని లేదు. 36

మూ. స జీర్ణం మానుషం దేహం పరిత్యజ్య పితా హి నః,
దైవీమృద్ధిమనుప్రాప్తో బ్రహ్మలోకవిహారిణీమ్. 37

ప్ర. అ. నః=మనయొక్క, పితా=తండ్రి యైన, సః=ఆ దశరథ మహారాజు, జీర్ణమ్=జీర్ణించిన, మానుషం దేహమ్ = మనుష్యదేహమును, పరిత్యజ్య = విడచి, బ్రహ్మలోకవిహారిణీమ్ = బ్రహ్మలోకమునందు విహరించు, దైవీమ్=దివ్య మైన, ఋద్ధిమ్ = సంపదను, (దివ్యదేహమును), అనుప్రాప్తః హి =పొందినాడు కదా.

తా. మన తండ్రి జీర్ణ మైపోయిన మనుష్యదేహమును విడచి, బ్రహ్మ లోకములో కూడ సంచరించ గల దివ్యదేహమును పొందినాడు కదా? 37

మూ. తం తు నైవంవిధః కశ్చిత్ప్రాజ్ఞ శోచితుమర్హతి,
త్వద్విధో మద్విధశ్చాపి శ్రుతవాన్ బుద్ధిమత్తరః. 38

ప్ర. అ. శ్రుతవాన్ = శాస్త్రజ్ఞానము కలవాడు, బుద్ధిమత్తరః=అధికబుద్ధి కలవాడు అయిన, ఏవంవిధః=ఈ దశరథునివంటి. ప్రాజ్ఞః=జ్ఞానముగల, కశ్చిత్=ఎవ్వడూ, త్వద్విధః=నీవంటివాడూ, మద్విధశ్చాపి=నా వంటి వాడూ, తమ్=అతనిని గూర్చి, శోచితుమ్=దుఃఖించుటకు, నార్హతి=తగడు.

తా. శాస్త్రజ్ఞానసంపన్నుడూ, అధికబుద్ధిశాలీ, అయిన ఆ దశరథమహా

రాజు వంటి ప్రాజ్ఞుడు గాని నీవంటివాడు గాని, నావంటివాడు గాని అయనను గూర్చి దుఃఖింపకూడదు. 38

మూ. ఏతే బహువిధాః శోకా విలాపరుదితే తథా,
వర్జనీయా హి ధీరేణ సర్వావస్థాసు ధీమతా. 39

ప్ర. అ. ధీరేణ = ధీరుడైన, ధీమతా = బుద్ధిమంతునిచేత, బహువిధాః = అనేకవిధములైన, ఏతే = ఈ, శోకాః = శోకములు, తథా = మరియు, విలాప రుదితే = విలాపము (ఏదేదో మాటలాడుచూ ఏడ్చుట విలాపము) ఏడ్పు, సర్వావస్థాసు = అన్ని అవస్థలయందు, వర్జనీయాః హి = విడువదగినవి కదా.

తా. ధీమంతుడు ధైర్యము వహించి, ఎట్టి అవస్థ వచ్చినను ఇట్టి అనేక విధములైన శోకములను విలాపమును, రోదనమును విడువవలెను. 39

మూ. స స్వస్థో భవ మా శోకో యాత్వా చావస తాం పురీమ్,
తథా పిత్రా నియుక్తోఽసి వశినా వదతాం వర. 40

ప్ర. అ. వదతామ్ = మాటలాడువారిలో, వర = శ్రేష్ఠుడా, సః = అట్టి నీవు, స్వస్థః = స్వస్థుడవు, భవ = అగుము. శోకః = శోకము, మా = కూడదు. యాత్వా = వెళ్ళి, తాం పురీమ్ = ఆ నగరమును, ఆవస = అధిష్ఠింపుము. వశినా = = ఇంద్రియనిగ్రహవంతుడైన, పిత్రా = తండ్రిచేత, తథా = అట్లు, నియుక్తః = నియమింపబడినవాడవు, అసి = అయినావు.

తా. మాటలలో నేర్పు గల ఓ భరతా! నీవు స్వస్థుడవు అగుము. దుఃఖించకుము. వెళ్ళి అయోధ్యను పాలించుము. జితేంద్రియుడైన మన తండ్రి నీకు ఆ విధముగ అజ్ఞ ఇచ్చి ఉన్నాడు. 40

మూ. యత్రాహమపి తేనైవ నియుక్తః పుణ్యకర్మణా,
తత్రైవాహం కరిష్యామి పితురార్యస్య శాసనమ్. 41

ప్ర. అ. అహమపి = నేను కూడ, పుణ్యకర్మణా = పుణ్యమైన కర్మ గల, తేనైవ = ఆ దశరథమహారాజుచేతనే, యత్ర = దేని విషయమున, నియుక్తః = నియమింపబడితినో, తత్రైవ = దాని విషయముననందే, అర్యస్య = పూజ్యుడైన, పితుః = తండ్రియొక్క, శాసనమ్ = అజ్ఞను, కరిష్యామి = చేసెదను.

తా. పవిత్ర మైన కర్మలు గల తండ్రి నన్ను ఏ విషయమునందు ఆజ్ఞా పించినాడో, ఆ విషయమునందే, నేను ఆయన ఆజ్ఞను నిర్వర్తించెదను. 41

మూ. న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్యమరిన్దమ,
తత్త్వయాపి సదా మాన్యం స వై బన్ధుః స నః పితా.

ప్ర. అ. అరిన్దమ = శత్రువులను అణచివేయు ఓ భరతుడా, మయా = నాచేత, తస్య = దశరథమహారాజుయొక్క, శాసనమ్ = ఆజ్ఞ, త్యక్తుమ్ = విడచుటకు. న న్యాయ్యమ్ = తగినది కాదు. త్వయాపి = నీచేత కూడ, తత్ = అది, సదా = ఎల్లపుడు, మాన్యమ్ = గౌరవింపదగినది. సః = అతడు, నః = మనకు, బన్ధుః వై = బంధువు కదా? సః = అతడు, పితా = తండ్రి కదా?

తా. భరతుడా! నేను మహారాజు ఇచ్చిన ఆజ్ఞను ఉల్లంఘింపరాదు. నీవు కూడ దానిని గౌరవించవలెను. ఎందుచేత ననగా ఆయనయే మనకు బంధువు. ఆయన మన తండ్రి. 42

మూ. తద్వచః పితురేవాహం సమ్మతం ధర్మచారిణః,
కర్మణా పాలయిష్యామి వనవాసేన రాఘవ! 43

ప్ర. అ. రాఘవ = ఓ భరతుడా! తత్ = అందువలన, అహమ్ = నేను, ధర్మచారిణః = ధర్మము నాచరించు, పితుః = తండ్రియొక్క, సమ్మతమ్ = పూజ్య మైన, వచః ఏవ = వాక్కునే, వనవాసేన = వనవాసమను, కర్మణా = కర్మ చేత, పాలయిష్యామి = పాలించెదను.

తా. ఓ భరతుడా! అందువలన నేను ధర్మాత్ము డైన తండ్రిగారి పూజనీయ మైన ఆజ్ఞనే వనములో నివసించుట ద్వారా పాలించెదను. 43

మూ. ధార్మికేణానృశంసేన నరేణ గురువర్తినా,
భవితవ్యం నరవ్యాఘ్ర పరలోకం జిగీషతా. 44

ప్ర. అ. నరవ్యాఘ్ర = ఓ పురుషశ్రేష్ఠా! పరలోకమ్ = పరలోకమును, జిగీషతా = జయించవలె నని కోరుచున్న, నరేణ = నరునిచేత, ధార్మికేణ = ధార్మి

కుడు గాను, అనృశంసేన = క్రూరుడు కానివాడుగాను, గురువర్తినా = గురు శుశ్రూష చేయువాడుగాను, భవితవ్యమ్ = కాదగి యున్నది.

తా. ఓ నరశ్రేష్ఠుడా! పరలోకములో సుఖముకావలె నని కోరు మానవుడు ధార్మికుడై, క్రూరత్వము లేక గురుశుశ్రూష చేయవలెను. 44

మూ. ఆత్మానమనుతిష్ఠ త్వం స్వభావేన నరర్షభ,
నిశామ్య తు శుభం వృత్తం పితుర్దశరథస్య నః. 45

ప్ర. అ. నరర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా! నః = మనయొక్క, పితుః = తండ్రి యైన, దశరథస్య = దశరథునియొక్క, శుభమ్ = శుభ మైన, వృత్తమ్ = చరిత్రమును, నిశామ్య = చూచి, త్వమ్ = నీవు, ఆత్మానమ్ = తనను, స్వభావేన = నీ ధర్మముచేత, అనుతిష్ఠ = అనుష్ఠింపుము.

తా. ఓ పురుషశ్రేష్ఠా! మన తండ్రి యైన దశరథుడు ఎట్టి ఉత్తమచరిత్ర కలవాడో తెలుసుకొని, నీవు కూడ నీ స్వధర్మమును నిర్వర్తింపుము. 45

మూ. ఇత్యేవముక్త్వా వచనం మహాత్మా
పితుర్నిదేశప్రతిపాలనార్థమ్,
యవీయసం భ్రాతరమర్థవచ్చ
ప్రభుర్ముహూర్తాద్విరరామ రామః. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడు, ప్రభుః = సమర్థుడు అయిన, రామః = రాముడు, యవీయసమ్ = చిన్నవా డైన, భ్రాతరమ్ = సోదరుని గూర్చి, ఇత్యేవమ్ = ఈ విధముగా, పితుః = తండ్రిగారియొక్క, నిదేశప్రతిపాలనార్థమ్ = ఆజ్ఞను పాలించుటకై, అర్థవత్ = ఉత్తమ మైన అర్థము గల, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, ముహూర్తాత్ = క్షణకాలములో, విరరామ = విరమించెను.

తా. మహాత్ముఁడు, సర్వసమర్థుఁడు అయిన రాముడు ఇట్లు "తండ్రియాజ్ఞను పరిపాలించుము" అని భరతునితో ఉత్తమ మైన అర్థము గల మాటలు చెప్పి విరమించెను. 46

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటఅయిదవ సర్గ సమాప్తము.

# అథ షడుత్తరశతతమ సర్గః

[భరతుడు మరల రాముని అయోధ్యకు వచ్చి రాజ్యము గ్రహింపు మని కోరుట.]

మూ. ఏవముక్త్వా తు విరతే రామే వచనమర్థవత్,
తతో మన్దాకినీతీరే రామం ప్రకృతివత్సలమ్, 1
ఉవాచ భరతశ్చిత్రం ధార్మికో ధార్మికం వచః.

ప్ర. అ. రామే = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, అర్థవత్ = మంచి అర్థము గల, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, విరతే = విరమించినవా డగుచుండగా, తతః = అటుపిమ్మట, ధార్మికః = ధార్మికు డైన, భరతః = భరతుడు, మన్దాకినీతీరే = ఆ మందాకినీ నదీతీరమునందు, ప్రకృతివత్సలమ్ = స్వభావముచేత వాత్సల్యము కలవా డైన, ధార్మికమ్= ధార్మికు డైన, రామమ్ = రాముని గూర్చి, ధార్మికమ్ = ధర్మసమ్మతము, చిత్రమ్ = ఆశ్చర్యకరము అయిన, వచః = వాక్యను, ఉవాచ = పలికెను.

తా. ఆ మందాకినీతీరమునందు, రాము డీ విధముగా మంచి అర్థము గల మాటలు పలికి ఊరకుండెను. అపుడు ధార్మికు డైన భరతుడు స్వభావముచే తనే వాత్సల్యము కలవా డైన రామునితో, ధర్మసమ్మతము, ఆశ్చర్యజనకము అయిన వాక్యమును పలికెను. 1

మూ. కో హి స్యాదీదృశో లోకే యాదృశస్త్వమరిన్దమ, 2
న త్వాం ప్రవ్యథయేద్దుఃఖం ప్రీతిర్వా న ప్రహర్షయేత్,
సమ్మతశ్చాసి వృద్ధానాం తాంశ్చ పృచ్ఛసి సంశయాన్.

ప్ర. అ. అరిన్దమ = ఓ శత్రుసంహారకుడా! త్వమ్ = నీవు, యాదృశః = ఎట్టి వాడవో, ఈదృశః = ఇట్టివాడు, లోకే = లోకమునందు, కో హి = ఎవడు, స్యాత్ = ఉండును? త్వామ్= నిన్ను. దుఃఖమ్ = దుఃఖము, న ప్రవ్యథయేత్ = బాధింపదు. ప్రీతిః = సుఖము, న వా ప్రహర్షయేత్ = సంతోషింపచేయదు, వృద్ధా

నామ్ = వృద్ధులకు, సమ్మతః = ఇష్టుడవు, అసి = అయి ఉన్నావు. తాంశ్చ = వారిని, సంశయాన్ = సంశయములను, పృచ్ఛసి = అడుగుచుందువు.

తా. ఓ శత్రుసంహారకుడ వైన రామా! నీకు దుఃఖమువలన బాధ కాని, సుఖమువలన సంతోషము గాని లేదు. అట్టి నీతో సమానమైనవాడు ఈ లోకములో ఎవడున్నాడు? నీవు వృద్ధులచే గౌరవింపబడుచున్నావు. సంశయములు కలిగి నపుడు వెళ్ళి వారిని అడుగుచుందువు.

మూ. యథా మృతస్తథా జీవన్యథాఽసతి తథా సతి,
యస్యైష బుద్ధిలాభః స్యాత్ పరితప్యేత కేన సః. 4

ప్ర. అ. మృతః = మరణించినవాడు, యథా = ఎట్లో, జీవన్ = జీవించి ఉన్నవాడు, తథా = అట్లే. అసతి = చెడ్డవాని విషయమునందు, యథా = ఎట్లో, సతి = మంచివాని విషయమునందు కూడ, తథా = అట్లే. యస్య = ఎవనికి, ఏషః = ఈ, బుద్ధిలాభః = బుద్ధియొక్క లాభము, స్యాత్ = అగునో, సః = అతడు, కేన = దేనిచేత, పరితప్యేత = తపించును?

తా. మరణించినవాని విషయమునందు, జీవించి ఉన్నవాని విషయము నందు, చెడ్డవాని విషయమునందు, మంచివాని విషయమునందు, రాగద్వేషాదులు లేని బుద్ధి కలవానికి ఈ లోకములో దుఃఖమును కల్గించున దేది? 4

మూ. పరావరజ్ఞో యశ్చ స్యాత్ యథా త్వం మనుజాధిప,
స ఏనం వ్యసనం ప్రాప్య న విషీదితుమర్హతి. 5

ప్ర. అ. మనుజాధిప = ఓ రాజా! యః = ఎవడు, త్వం యథా = నీవు వలె, పరావరజ్ఞః = వస్తువుల తారతమ్యములు తెలిసినవాడో (ఏది మంచిది ఏది చెడ్డది అను విషయములు తెలిసినవాడో) సః = అట్టివాడు, ఏనమ్ = ఈ, వ్యసనమ్ = వ్యసనమును, ప్రాప్య = పొంది, విషీదితుం = దుఃఖించుటకు, న అర్హతి = తగడు.

తా. ఓ మహారాజా! వస్తువులలోని లేదా జనులలోని, తారతమ్యమును చక్కగా గుర్తింపగలిగిన నీవంటివాడు ఇట్టి దుఃఖమును పొంది బాధపడకూడదు.

వి. ఈ శ్లోకములోను, రాబోవు రెండు మూడు శ్లోకములలోను-రాముడు

దుఃఖించుచుండగా అట్లు దుఃఖించరాదని భరతుడు ధైర్యము చెప్పుచున్నట్లు కన బడుచున్నది. కాని ఇంతవరకు- "ఏదీ మన చేతులలో లేదు. దేనికీ విచారించ కూడదు; మన కర్తవ్యం మనము నెరవేరుస్తూ పూర్వికులు నడచిన మార్గంలో నడవాలి" అని భరతునకు ఉపదేశించిన రాముడు తనకు వచ్చిన కష్టాలకై చింతించుచున్నాడనీ, భరతుడు ఓదార్చుచున్నాడనీ చెప్పుట యుక్తము కాదు. అందుచేత "నీవంటి సత్పురుషుడు ఈ విధముగా కష్టములు పడుట యుక్తము కాదు, నీవు తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యము పాలింపుము" అని చెప్పుటయే భరతుని ఉద్దేశ్యమని గ్రహించవలెను. 5

మూ. అమరోపమసత్త్వస్త్వం మహాత్మా సత్యసంగరః,
సర్వజ్ఞః సర్వదర్శీ చ బుద్ధిమాంశ్చాసి రాఘవ! 6

ప్ర. అ. రాఘవ = రామా ! మహాత్మా = మహాత్ముడవైన. త్వమ్ = నీవు, అమరోపమసత్త్వః = దేవతలతో సమానమైన బలము కలవాడవు. సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు, సర్వజ్ఞః = అన్నీ తెలిసినవాడవు, సర్వదర్శీ చ = అన్నీ చూడగలిగినవాడవు, బుద్ధిమాంశ్చ = బుద్ధి కలవాడవు, అసి = అయి ఉన్నావు.

తా. మహాత్ముడవైన ఓ రామా ! నీవు దేవతలతో సమానమైన బలము కలవాడవు. సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు. అన్నీ తెలిసినవాడవు, అన్నీ చూడ గలిగినవాడవు. బుద్ధిమంతుడవు. 6

మూ. న త్వామేవంగుణైర్యుక్తం ప్రభవాభవకోవిదమ్,
అవిషహ్యతమం దుఃఖమాసాదయితుమర్హతి. 7

ప్ర. అ. ఏవంగుణైః = ఇట్టి గుణములతో, యుక్తమ్ = కూడినవాడవు, ప్రభవాభవకోవిదమ్ = ఉత్పత్తివినాశములను తెలుసుకొన్నవాడవు అయిన, త్వామ్ = నిన్ను, అవిషహ్యతమమ్ = ఎంతమాత్రము సహింపశక్యము కాని, దుఃఖమ్ = దుఃఖము, ఆసాదయితుమ్ = చేరుటకు, నార్హతి = తగదు.

తా. జగత్తుయొక్క ఉత్పత్తివినాశాదులను గూర్చి తెలిసికొనగలిగిన, నీవంటి ఉత్తమగుణవంతుడు, సహింపశక్యము కాని ఇట్టి దుఃఖముతో బాధపడుట యుక్తము గాదు. 7

మూ. ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణాత్కృతమ్,
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవాన్మమ. 8

ప్ర. అ. మయి = నేను, ప్రోషితే = ప్రవాసమునకు వెళ్ళినవాడనై యుండగా, క్షుద్రయా = నీచస్వభావము గల, మాత్రా = తల్లిచేత, మత్కారణాత్ = నాకొరకై, యత్ పాపమ్ = ఏ పాపము, కృతమ్ = చేయబడినదో, తత్ = అది, మే = నాకు, అనిష్టమ్ = అనిష్ట మైనది. భవాన్ = నీవు, మమ = నా విషయమున, ప్రసీదతు = అనుగ్రహించెదవుగాక!

తా. నేను దేశాంతరములో నున్నపుడు నాకొరకై దుష్టురాలగు నా తల్లి చేసిన పాపకార్యము నాకు ఇష్టము కాదు. నీవు నన్ను అనుగ్రహింపుము. 8

మూ. ధర్మబన్ధేన బద్ధోఽస్మి తేనేమాం నేహ మాతరమ్,
హన్మి తీవ్రేణ దణ్డేన దణ్డార్హాం పాపకారిణీమ్. 9

ప్ర. అ. ధర్మబన్ధేన = ధర్మపాశముచేత, బద్ధః అస్మి = కట్టబడినవాడనై ఉన్నాను. తేన = ఆ కారణముచేత, ఇహ = ఇప్పుడు, దణ్డార్హామ్ = దండమునకు తగినదీ, పాపకారిణీమ్ = పాపము చేయునదీ అయిన, ఇమాం మాతరమ్ = ఈ తల్లిని, తీవ్రేణ = తీవ్ర మైన, దణ్డేన = దండముచేత, న హన్మి = వధించుట లేదు.

తా. పాపకార్యము చేయుటచే దండమునకు తగిన నా తల్లిని నేను ధర్మమునకు భయపడి, తీవ్రదండముచేత వధింపలేకపోవుచున్నాను. 9

మూ. కథం దశరథాజ్జాతః శుద్ధాఽభిజనకర్మణః,
జానన్ ధర్మమధర్మిష్ఠం కుర్యాం కర్మ జుగుప్సితమ్.

ప్ర. అ. శుద్ధాభిజనకర్మణః = పవిత్ర మైన కులము కర్మలు గల, దశరథాత్ = దశరథునినుండి, జాతః = పుట్టినవాడనూ, ధర్మమ్ = ధర్మమును, జానన్ = ఎరిగినవాడను అయిన నేను, అధర్మిష్ఠమ్ = అధర్మయుక్త మైన, జుగుప్సితమ్ = నిందిత మైన, కర్మ = కర్మను, కథమ్ = ఎట్లు, కుర్యామ్ = చేయుదును?

తా. పవిత్ర మైన వంశమునందు బుట్టి, పవిత్ర మైన కర్మలు ఆచరిం

చిన దశరథుని కుమారుడ నైన నేను ధర్మము తెలిసికూడ, లోకనిందిత మైన ఈ అధర్మకార్యమును ఎట్లు చేయుదును? 10

మూ. గురుః క్రియావాన్ వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతి చ,
తాతం న పరిగర్హేయం దైవతం చేతి సంసది. 11

ప్ర. అ. గురుః=గురువు, క్రియావాన్=కర్మశీలుడు, వృద్ధశ్చ=వృద్ధుడు అయిన, రాజా = దశరథమహారాజు, ప్రేతః=మరణించినాడు. పితా = తండ్రి, ఇతి చ=ఈకారణముచేతను, దైవతంచేతి=దేవత అనే కారణముచేతను, సంసది =సభయందు, తాతమ్ = తండ్రిగారిని, న పరిగర్హేయమ్ = నిందింపను.

తా. దశరథమహారాజు నాకు గురువు; క్రియాశీలుడు, వృద్ధుడు; తండ్రి; దేవతవంటివాడు; ఇపుడు మరణించినాడు కూడ. ఈ కారణములచే తండ్రిని నేను సభలో నిందించుటలేదు. 11

మూ. కో హి ధర్మార్థయోర్హీనమీదృశం కర్మ కిల్బిషమ్,
స్త్రియాః ప్రియం చికీర్షుస్సన్ కుర్యాద్ధర్మజ్ఞ ధర్మవిత్.

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసినవాడా! ధర్మవిత్=ధర్మవేత్త యైన, కో హి = ఎవడు, స్త్రియాః = స్త్రీకి, ప్రియమ్ = ప్రియమును, చికీర్షుః సన్ = చేయదలచినవాడై, ధర్మార్థయోః = ధర్మార్థములతో, హీనమ్=హీనమ్యము, కిల్బిషమ్ = పాపము అయిన, ఈదృశమ్ = ఇట్టి, కర్మ = కర్మను, కుర్యాత్ = చేయును.

తా. ధర్మములు తెలిసిన ఓ రామా! ధర్మజ్ఞు డైనవాడు ఎవ్వ డైన స్త్రీని సంతోషపెట్టుటకై, ధర్మార్థములకు విరుద్ధ మైన ఇట్టి పాపకర్మను చేయునా? 12

మూ. అన్తకాలే హి భూతాని ముహ్యన్తీతి పురా శ్రుతిః,
రాజ్ఞైవం కుర్వతా లోకే ప్రత్యక్షా సా శ్రుతిః కృతా. 13

ప్ర. అ భూతాని=ప్రాణులు, అన్తకాలే=వినాశకాలమునందు, ముహ్యన్తి =మోహమును పొందును; ఇతి=అని, పురాశ్రుతిః=ప్రాచీనమైన మాట ఉన్నది. ఏవమ్ = ఈ విధముగా, కుర్వతా = చేయుచున్న, రాజ్ఞా=రాజుచేత, సా శ్రుతిః

= ఆ గాథ, లోకే = లోకమునందు, ప్రత్యక్షా = ప్రత్యక్ష మైనదిగా, కృతా = చేయబడినది.

తా. వినాశకాలమునందు ప్రాణుల బుద్ధి చెడిపోవు నని ప్రాచీన మైన లోకోక్తి ఉన్నది. దశరథమహారాజు ఈ విధముగా ప్రవర్తించి ఆ లోకోక్తి సత్యమే అని నిరూపించినాడు. 13

మూ. సాధ్వర్థమభిసన్ధాయ క్రోధాన్మోహాచ్చ సాహసాత్,
తాతస్య యదతిక్రాన్తం ప్రత్యాహరతు తద్భవాన్. 14

ప్ర. అ. క్రోధాత్ = కోపమువలన, మోహాత్ = అజ్ఞానమువలన, సాహసాత్ = సాహసమువలన, తాతస్య = తండ్రిగారియొక్క, యత్ = ఏ, అతిక్రాన్తమ్ = ధర్మాతిక్రమణ మున్నదో, తత్ = దానిని, భవాన్ = నీవు, సాధు = చక్కగా, అర్థమ్ = విషయమును, అభిసన్ధాయ = ఆలోచించి, ప్రత్యాహరతు = మరల్చెదవు గాక ॥

తా. మన తండ్రిగారు, కోపమువలననో, అజ్ఞానము వలననో, సాహసము వలననో ధర్మాతిక్రమణము చేసినారు. అందుచే నీవు కర్తవ్యమును బాగుగా ఆలోచించి, వారు చేసిన ధర్మ విరుద్ధ మైన కార్యమును వెనుకకు త్రిప్పవలయును.

మూ పితుర్హి సమతిక్రాన్తం పుత్రో యస్సాధు మన్యతే,
తదపత్యం మతం లోకే విపరీతమతోఽన్యథా. 15

ప్ర. అ. యః పుత్రః = ఏ పుత్రుడు, పితుః = తండ్రియొక్క, సమతిక్రాన్తమ్ = బాగుగా జరిగిన కార్యమును, సాధు = ఉత్తమ మైనదానినిగా మాత్రమే, మన్యతే = తలచునో, తత్ = ఆ పుత్రుడే, లోకే = లోకమునందు, అపత్యమ్ = కుమారుడుగా, మతమ్ = అంగీకరింపబడినాడు. అతః = దీనికి, అన్యథా = మరియొక విధముగా అయినచో, విపరీతమ్ = విపరీతు డగును.

తా. తండ్రి చేసిన ఉత్తమకార్యమును మాత్రమే అభినందించు పుత్రుడే పుత్రుడు. అట్లు కానిచో, (అధర్మకార్యమును అభినందించినచో) అతడు పుత్రుడే కాదు. 15

మూ. తదపత్యం భవానస్తు మా భవాన్ దుష్కృతం పితుః,
అభిపత్తా కృతం కర్మ లోకే ధీరవిగర్హితమ్. 16

ప్ర. అ. భవాన్ = నీవు, తత్ = అట్టి, అపత్యమ్ = పుత్రుడవు, అస్తు = అగుదువుగాక ! లోకే = లోకమునందు, ధీరవిగర్హితమ్ = బుద్ధిమంతులచే నిందింపబడినదీ, దుష్కృతమ్ = పాపమూ అయిన, పితుః = తండ్రియొక్క, కృతమ్ = చేయబడిన, కర్మ = కర్మను, భవాన్ = నీవు, అభిపత్తా = పొందువాడవు, మాస్తు = కాకుందువుగాక !

తా. అందువలన నీవు అట్టి సుపుత్రుడవు అగుము. లోకములో నున్న బుద్ధిమంతు లందరు నిందించిన, తండ్రి చేసిన, పాపకర్మ నిన్ను పొందకుండు గాక ! 16

మూ. కైకేయీం మాం చ తాతం చ సుహృదో బాంధవాంశ్చ నః,
పౌర జానపదాన్ సర్వాంస్త్రాతు సర్వమిదం భవాన్. 17

ప్ర. అ. భవాన్ = నీవు, కైకేయీమ్ = కైకేయిని, మాం చ = నన్ను, తాతం చ = తండ్రిని, నః = మనయొక్క, సుహృదః = మిత్రులను, బాన్ధవాంశ్చ = బంధువులను, సర్వాన్ = సమస్తమైన, పౌరజానపదాన్ = పట్టణవాసులను, గ్రామవాసులను, సర్వమ్ = సమస్తమైన, ఇదమ్ = ఈ రాజ్యమును, త్రాతు = రక్షించెదవుగాక !

తా. నీవు కైకేయిని, నన్ను, తండ్రిని, మన మిత్రులను, బంధువులను, పౌరజానపదులను, ఈ సకలరాజ్యమును రక్షింపుము. 17

మూ. క్వ చారణ్యం క్వ చ క్షాత్రం క్వ జటాః క్వ చ పాలనమ్,
ఈదృశం వ్యాహతం కర్మ న భవాన్ కర్తుమర్హతి. 18

ప్ర. అ. అరణ్యం చ = అరణ్యము, క్వ = ఎక్కడ? క్షాత్రం చ = క్షత్రియ ధర్మము, క్వ = ఎక్కడ? జటాః = జటలు, క్వ = ఎక్కడ ? పాలనం చ = రాజ్యపాలనము, క్వ = ఎక్కడ? భవాన్ = నీవు, ఈదృశమ్ = ఇట్టి, వ్యాహతమ్ = విరుద్ధమైన, కర్మ = కర్మను, కర్తుమ్ = చేయుటకు, న అర్హతి = తగవు.

తా. అరణ్యమెక్కడ ! క్షత్రియధర్మమెక్కడ ? జట లెక్కడ? రాజ్య పాలన మెక్కడ? నీవు ఇట్టి విరుద్ధ మైన కార్యమును చేయవలదు. 18

మూ. ఏష హి ప్రథమో ధర్మః క్షత్రియస్యాభిషేచనమ్,
యేన శక్యం మహాప్రాజ్ఞ ప్రజానాం పరిపాలనమ్. 19

ప్ర. అ. మహాప్రాజ్ఞ = మహాబుద్ధిమంతుడా! యేన = దేనిచేత, ప్రజానామ్ = ప్రజలయొక్క, పరిపాలనమ్ = పరిపాలనము, శక్యమ్ = శక్య మగునో, ఏషః = ఇది, క్షత్రియస్య = క్షత్రియునకు, అభిషేచనమ్ = రాజ్యాభిషేకము, ప్రథమః = మొదటి, ధర్మః హి = ధర్మము కదా!

తా. మహాబుద్ధిమంతుడ వైన రామా ! రాజ్యమునందు అభిషిక్తు డగుటయే క్షత్రియుని ప్రధానధర్మము దానిచే అతడు ప్రజలను పరిపాలింప గలుగును.

మూ. కశ్చ ప్రత్యక్షముత్సృజ్య సంశయస్థమలక్షణమ్,
ఆయతిస్థం చరేద్ధర్మం క్షత్రబన్ధురనిశ్చితమ్. 20

ప్ర. అ కః = ఏ, క్షత్రబన్ధుః = క్షత్రియుడు, ప్రత్యక్షమ్ = ప్రత్యక్ష మైన ధర్మమును, ఉత్సృజ్య = విడిచి, సంశయస్థమ్ = సంశయమునం దున్నదీ, అలక్షణమ్ = చెడ్డ లక్షణములు కలదీ, ఆయతిస్థమ్ = కాలాంతరమునకు సంబం ధించినదీ, అనిశ్చితమ్ = నిశ్చితము కానిదీ అయిన, ధర్మమ్ = ధర్మమును, చరేత్ = ఆచరించును.

తా. ప్రత్యక్షఫలము నిచ్చు రాజ్యపాలనరూప మైన ధర్మమును విడిచి, క్షత్రియుడు ఎవ డైన సంశయాస్పదము, మంచి లక్షణములు లేనిది, కాలాంత రమున ఫలము నిచ్చునది, నిశ్చిత మైన ఫలములు లేనిది అయిన తాపసధర్మ మును ఆచరించునా? 20

మూ. అథ క్లేశజమేవ త్వం ధర్మం చరితుమిచ్ఛసి,
ధర్మేణ చతురో వర్ణాన్ పాలయన్ క్లేశమాప్నుహి. 21

ప్ర. అ. అథ = లేక, త్వమ్ = నీవు, క్లేశజమ్ = శ్రమవలన కలుగు, ధర్మమేవ = ధర్మమునే, చరితుమ్ = ఆచరించుటకు, ఇచ్ఛసి యది = కోరిన

న్వైతే, చతురః = నాలుగు, వర్ణాన్ = వర్ణములను, ధర్మేణ = ధర్మముచేత, పాల యన్ =పాలించుచు, క్లేశమ్ = క్లేశమును, అప్నుహి=పొందుము.

తా. లేదా నీవు శ్రమపడుటవలన కలుగు ధర్మమునే ఆచరింపవలె నని కోరుకొన్నచో, నాలుగు వర్ణములను, ధర్మానుసారముగా పరిపాలించు శ్రమను పొందుము. 21

మూ. చతుర్ణామాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్ఠమాశ్రమమ్,
ప్రాహుర్ధర్మజ్ఞ ధర్మజ్ఞాస్తం కథం త్యక్తుమర్హసి. 22

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మమును తెలిసినవాడా! గార్హస్థ్యమ్=గృహస్థాశ్రమమును, చతుర్ణామ్ = నాలుగు, ఆశ్రమాణామ్ = ఆశ్రమములలో, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠ మైన, ఆశ్రమమ్=ఆశ్రమమునుగా, ధర్మజ్ఞాః=ధర్మవేత్తలు, ప్రాహుః హి = చెప్పుదురు కదా! తమ్ = దానిని, త్యక్తుమ్ = విడచుటకు, కథమ్ = ఎట్లు, అర్హసి =తగుదువు?

తా. ఓ ధర్మజ్ఞుడా! నాలుగు ఆశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠ మైన దని ధర్మవేత్తలు చెప్పుచుందురు కదా! అట్టి గృహస్థాశ్రమమును ఎట్లు విడిచి పెట్టెదవు? 22

మూ. శ్రుతేన బాలః స్థానేన జన్మనా భవతో హ్యహమ్,
స కథం పాలయిష్యామి భూమిం భవతి తిష్ఠతి. 23

ప్ర. అ. అహమ్=నేను, శ్రుతేన=విద్యచేతను, స్థానేన=స్థానముచేతను, జన్మనా=పుట్టుకచేతను, భవతః = నీకంటె, బాలః హి = చిన్నవాడను కదా? సః=అట్టి నేను, భవతి=నీవు, తిష్ఠతి=ఉండగా, భూమిమ్=భూమిని, కథమ్= ఎట్లు, పాలయిష్యామి=పాలించెదను?

తా. నేను విద్యచేతను, స్థానముచేతను, జన్మముచేతను కూడ, నీకంటె చిన్నవాడను. అట్టి నేను, నీవు ఉండగా, ఈ భూమిని ఎట్లు పరిపాలించగలను?

మూ. హీనబుద్ధిగుణో బాలో హీనః స్థానేన చాప్యహమ్,
భవతా చ వినా భూతో న వర్తయితుముత్సహే. 24

ప్ర. అ. హీనబుద్ధిగుణః = అల్పమైన బుద్ధి, గుణములు కలవాడను, స్థానేన చాపి = స్థానముచేతకూడ, హీనః = హీనుడను, బాలః = చిన్నవాడను అయిన, అహమ్ = నేను, భవతా = నీచేత, వినాభూతః = విడువబడినవాడనై, వర్తయితుమ్ = జీవించుటకు, న ఉత్సహే = ఉత్సాహవంతుడను కాను.

తా. బాలుడనైన నేను, బుద్ధిచేతను, గుణములచేతను, స్థానముచేతను గూడ చాలా తక్కువైనవాడను. నీవు లేనిచో నేను జీవించవలెనని కూడ అభిలషించను. 24

మూ. ఇదం నిఖిలమవ్యగ్రం రాజ్యం పిత్ర్యమకణ్టకమ్,
అనుశాధి స్వధర్మేణ ధర్మజ్ఞ సహ బాన్ధవైః. 25

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! పిత్ర్యమ్ = తండ్రి సంబంధమైన, నిఖిలమ్ = సమస్తమైన, ఇదం రాజ్యమ్ = ఈ రాజ్యమును, అవగ్రమ్ = ఏమరుపాటు లేకుండగను, అకంటకమ్ = శత్రుబాధాదులు లేకుండగను, బాన్ధవైస్సహ = బంధువులతో కూడ, స్వధర్మేణ = స్వధర్మముచేత, అనుశాధి = పాలించుము.

తా. ధర్మజ్ఞుడవైన ఓ రామా! తండ్రిగారి నుండి సంక్రమించిన, నిష్కంటకమైన ఈ రాజ్యమునంతను, బంధుసమేతుడవై, ధర్మానుసారముగా జాగరూకుడవై పరిపాలింపుము. 25

మూ. ఇహైవ త్వాభిషిఞ్చన్తు సర్వాః ప్రకృతయః సహ,
ఋత్విజః సవసిష్ఠాశ్చ మన్త్రవన్మన్త్రకోవిదాః. 26

ప్ర. అ. సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = అమాత్యాదులు, సవసిష్ఠాః = వసిష్ఠునితో కూడిన, మన్త్రకోవిదాః = మంత్రములను ఎరిగిన, ఋత్విజశ్చ = ఋత్విక్కులు, సహ = కూడినవారై, త్వా = నిన్ను, ఇహైవ = ఇక్కడనే, మన్త్రవత్ = మంత్రములు కలుగునట్లుగా, అభిషిఞ్చన్తు = అభిషేకింతురు గాక!

తా. సమస్తమైన అమాత్యాదిప్రకృతులు, మంత్రకోవిదులైన వసిష్ఠాది ఋత్విక్కులు, నీకు ఇక్కడనే, వేదమంత్రములతో, రాజ్యాభిషేకము చేయుదురు గాక. 26

మూ. అభిషిక్తస్త్వమస్మాభిరయోధ్యాం పాలనే వ్రజ.
విజిత్య తరసా లోకాన్మరుద్భిరివ వాసవః. 27

ప్ర. అ. త్వమ్ = నీవు, అభిషిక్తః = రాజ్యాభిషిక్తుడవై, అస్మాభిః = మాతో, పాలనే = పరిపాలించుట నిమిత్తమై, తరసా = బలముచేత, లోకాన్ = లోకములను, విజిత్య = జయించి, వాసవః = దేవేంద్రుడు, మరుద్భిరివ = దేవతలతోవలె, అయోధ్యామ్ = అయోధ్యానగరమును గూర్చి, వ్రజ = వెళ్లుము.

తా. అన్ని లోకములను బలముచే జయించిన దేవతాసహితుడైన దేవేంద్రుని వలె, నీవు రాజ్యాభిషిక్తుడవై, మేమందరము వెంట రాగా అయోధ్యను పాలించుటకు వెళ్లుము. 27

మూ. ఋణాని త్రీణ్యపాకుర్వన్ దుర్హృదః సాధు నిర్దహన్,
సుహృదస్తర్పయన్ కామైస్త్వమేవాత్రానుశాధి మామ్.

ప్ర. అ. త్రీణి = మూడు, ఋణాని = ఋణములను, అపాకుర్వన్ = తీర్చుచు, దుర్హృదః = శత్రువులను, సాధు = బాగుగా, నిర్దహన్ = కాల్చివేయుచు, సుహృదః = స్నేహితులను, కామైః = కోరికలతో, తర్పయన్ = తృప్తిపొందించుచు, అత్ర = అయోధ్యయందు, త్వమేవ = నీవే, మామ్ = నన్ను, అనుశాధి = పాలింపుము.

తా. దేవఋషిపితౄఋణము లను మూడు ఋణములను తీర్చుచు, శత్రువులను బాధించుచు, మిత్రుల కోరికలను తీర్చుచు, నీవే నన్ను పాలింపవలయును. 28

మూ. అద్యార్య ముదితాస్సన్తు సుహృదస్తేఽభిషేచనే,
అద్య భీతాః పలాయన్తాం దుర్హృదస్తే దిశో దశ. 29

ప్ర. అ. ఆర్య = పూజ్యుడా! అద్య = ఇపుడు, అభిషేచనే = అభిషేకము కాగా, తే = నీయొక్క, సుహృదః = మిత్రులు, ముదితాః = సంతోషించినవారు, సన్తు = అగుదురుగాక. అద్య = ఇపుడు, తే దుర్హృదః = నీ శత్రువులు, భీతాః = భయపడినవారై, దశ దిశః = పది దిక్కులను గూర్చి, పలాయన్తామ్ = పారిపోయెదరుగాక!

తా. పూజ్యుడ వైన ఓ రామా! ఈనాడు నీవు రాజ్యాభిషిక్తుడ వగుటచే నీ మిత్రులందరు సంతోషించెదరుగాక! నీ శత్రువు లందరు భయపడి దిక్కులు పట్టి పారిపోవుదురుగాక! 29

మూ. ఆక్రోశం మమ మాతుశ్చ ప్రమృజ్య పురుషర్షభ,
అద్య తత్రభవన్తం చ పితరం రక్ష కిల్బిషాత్. 30

ప్ర. అ. పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా! అద్య = ఇపుడు, మమ = నాయొక్క, మాతుః = తల్లియొక్క, ఆక్రోశమ్ = శాపమును, ప్రమృజ్య = తుడిచివేసి, తత్రభవన్తమ్ = పూజ్యు డైన, పితరం చ = తండ్రిని కూడ, కిల్బిషాత్ = పాపమునుండి, రక్ష = రక్షించుము.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! నా తల్లికి జనులవలన కలిగిన శాపమును తొలగించి, పూజ్యు డైన తండ్రిగారిని కూడా పాపమునుండి రక్షించుము. 30

మూ. శిరసా త్వాభియాచేఽహం కురుష్వ కరుణాం మయి,
బాన్ధవేషు చ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః. 31

ప్ర. అ. అహమ్ = నేను, శిరసా = శిరస్సుతో, త్వా = నిన్ను, అభియాచే = కోరుచున్నాను. మయి = నాయందు, సర్వేషు = సమస్త మైన, బాన్ధవేషు = బంధువులయందు, భూతేషు = ప్రాణులయందు, మహేశ్వరః ఇవ = మహేశ్వరుడు వలె, కరుణామ్ = దయను, కురుష్వ = చేయుము.

తా. నేను శిరస్సు వంచి ప్రార్థించుచున్నాను. మహేశ్వరుడు ప్రాణులపై దయచూపి నట్లు నాపైన, సమస్తబాంధవుల పైన దయ చూపుము. 31

మూ. అథైతత్పృష్ఠతః కృత్వా వనమేవ భవానితః,
గమిష్యతి గమిష్యామి భవతా సార్ధమప్యహమ్. 32

ప్ర. అ. అథ = అట్లు గాక! భవాన్ = నీవు, ఏతత్ = దీని నంతను, పృష్ఠతః కృత్వా = వెనుకనే ఉంచివేసి, (అనాదరము చేసి), ఇతః = ఇక్కడ నుండి, వనమేవ = వనమును గూర్చియే, గమిష్యతి = వెళ్ళినట్లైతే, అహమపి = నేను కూడ, భవతా సార్ధమ్ = నీతో కూడ, గమిష్యామి = అరణ్యమునకే వెళ్లెదను.

తా. నా ప్రార్థనను కాదని నీవు అరణ్యమునకే వెళ్ళినచో, నేను కూడ నీతో అరణ్యమునకు వచ్చెదను. 32

మూ. తథా హి రామో భరతేన తామ్యతా
ప్రసాద్యమానః శిరసా మహీపతిః,
న చైవ చక్రే గమనాయ సత్త్వవాన్
మతిం పితుస్తద్వచనే ప్రతిష్ఠితః. 33

ప్ర. అ. తామ్యతా = దుఃఖించుచున్న, భరతేన = భరతుని చేత, తథా = అట్లు, శిరసా = శిరస్సుచేత, ప్రసాద్యమానః = అనుగ్రహింపచేయబడుచున్న, మహీపతిః = రాజైన. సత్త్వవాన్ = అధికమైన ధైర్యము గల, రామః = రాముడు, పితుః = తండ్రియొక్క, తద్వచనే = ఆమాటయందే, ప్రతిష్ఠితః = నిలిచినవాడై, గమనాయ = తిరిగి వెళ్లుటకు, మతిమ్ = బుద్ధిని, న చక్రే = చేయలేదు.

తా. గొప్ప మనఃస్థైర్యము కలవాడు, భూమండలమునకు ప్రభువు అయిన రాముడు భరతుడా విధముగా సవినయముగా ప్రార్థించుచున్నను తండ్రి మాటమీదనే స్థిరముగా నిలచినవాడై అయోధ్యకు తిరిగి వెళ్లుటకు అంగీకరించ లేదు. 33

మూ. తదద్భుతం స్థైర్యమవేక్ష్య రాఘవే
సమం జనో హర్షమవాప దుఃఖితః,
న యాత్యయోధ్యామితి దుఃఖితోఽభవత్
స్థిరప్రతిజ్ఞత్వమవేక్ష్య హర్షితః. 34

ప్ర. అ. రాఘవే = రామునియందు, అద్భుతమ్ = ఆశ్చర్యకర మైన, తత్ స్థైర్యమ్ = ఆ మనఃస్థైర్యమును, అవేక్ష్య = చూచి, జనః = జనము, దుఃఖితః = దుఃఖించుచున్నదై, సమమ్ = దుఃఖముతో పాటు, హర్షమ్ = సంతోషమును, అవాప = పొందెను. అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, న యాతి = వెళ్లుట లేదు; ఇతి = అని, దుఃఖితః = దుఃఖించినది, అభవత్ = అయెను, స్థిరప్రతిజ్ఞ త్వమ్ = స్థిర మైన ప్రతిజ్ఞకలవా డగుటను, అవేక్ష్య = చూచి, హర్షితః = సంతోషించినది.

తా. రాముని లోని ఆశ్చర్యకర మైన ఆ మనఃస్థైర్యమును చూచి, [illegible]లందరు దుఃఖితు లై దుఃఖముతో పాటు సంతోషమును కూడ పొందిరి. [illegible] అయోధ్యకు వచ్చుటలేదే అని దుఃఖించిరి. అతని స్థిర ప్రతిజ్ఞత్వమును చూచి సంతోషించిరి.

మూ. తమృత్విజో నైగమయూథవల్లభా
స్తదా విసంజ్ఞాశ్రుకలాశ్చ మాతరః,
తథా బ్రువాణం భరతం ప్రతుష్టువుః
ప్రణమ్య రామం చ యయాచిరే సహ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షడుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. ఋత్విజః = ఋత్విక్కులు, నైగమయూథవల్లభాః = నిగమముల సముదాయముల నాయకులు, విసంజ్ఞాశ్రుకలాః = స్పృహ తప్పి లేశమాత్రము కన్నీళ్లు కూడా లేని, మాతరః = తల్లులు, తదా = అపుడు, తథా = ఆ విధముగా, బ్రువాణమ్ = పలుకుచున్న, తం భరతమ్ = ఆ భరతుని, ప్రతుష్టువుః = స్తుతించిరి. రామమ్ = రాముని, ప్రణమ్య = నమస్కరించి, సహ = అందరు కలిసి, యయాచిరే చ = ప్రార్థించిరి కూడ!

తా. అపుడు ఆ విధముగా పలుకుచున్న భరతుని ఋత్విక్కులు, నిగమ సముదాయముల నాయకులు స్పృహ తప్పి కన్నీళ్ళ బొట్లు కూడా లేని తల్లులు స్తుతించిరి. వారందరు రాముని సవినయముగా ప్రార్థించిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నూటఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తోత్తరశతతమ సర్గః

[రాముడు భరతుని ఓదార్చి అయోధ్యకు పొమ్మని ఆదేశించుట.]

మూ. పునరేవం బ్రువాణం తం భరతం లక్ష్మణాగ్రజః,
ప్రత్యువాచ తతః శ్రీమాన్ జ్ఞాతిమధ్యేఽభిసత్కృతః. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శ్రీమాన్ = అధిక మైన కాంతి గలవాడు, అభిసత్కృతః = పూజింపబడినవాడు అయిన, లక్ష్మణాగ్రజః = రాముడు, జ్ఞాతిమధ్యే = బంధువుల మధ్యయందు, పునః = తిరిగి, ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = చెప్పుచున్న, భరతమ్ = భరతుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. శ్రీమంతుడు, అందరిచేత పూజింపబడినవాడు అయిన రాముడు బంధువుల మధ్య మరల ఈ విధముగా మాటలాడుచున్న భరతునితో ఇట్లు పలికెను. 1

మూ. ఉపపన్నమిదం వాక్యం యత్త్వమేవమభాషథాః,
జాతః పుత్రో దశరథాత్ కైకేయ్యాం రాజసత్తమాత్. 2

ప్ర. అ. రాజసత్తమాత్ = రాజశ్రేష్ఠుడైన, దశరథాత్ = దశరథునివలన, కైకేయ్యామ్ = కైకేయియందు, జాతః = పుట్టిన, పుత్రః = పుత్రుడవైన, త్వమ్ = నీవు, ఏవమ్ = ఇట్లు, యత్ = ఏ వాక్యమును, అభ్యభాషథాః = పలికితివో, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యము, ఉపపన్నమ్ = యుక్తమైనది.

తా. రాజశ్రేష్ఠుడైన దశరథునకు కైకేయియందు జన్మించిన పుత్రుడవైన నీవు చెప్పిన దంతయు యుక్తముగానే ఉన్నది. 2

మూ. పురా భ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీద్రాజ్యశుల్కమనుత్తమమ్. 3

ప్ర. అ. భ్రాతః = సోదరుడా! పురా = పూర్వము, సః = ఆ, నః పితా = మన

తండ్రి, తే మాతరమ్ = నీ తల్లిని, సముద్వహన్ = వివాహమాడుచు, మాతామహే = నీ మాతామహునియందు, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, రాజ్యశుల్కమ్ = రాజ్య మనే శుల్కమును, సమాశ్రౌషీత్ = ప్రతిజ్ఞ చేసెను.

తా. మన తండ్రి పూర్వము నీ తల్లిని వివాహమాడు సమయమునందు, అత్యుత్తమమైన ఈ రాజ్యమును ఆమె కుమారునకే ఇచ్చెద నని నీ మాతామహుని ముందు ప్రతిజ్ఞ చేసెను. 3

మూ. దైవాసురే చ సఙ్గ్రామే జనన్యై తవ పార్థివః,
సమ్ప్రహృష్టో దదౌ రాజా వరమారాధితః ప్రభుః. 4

ప్ర. అ. పార్థివః = రాజు, ప్రభుః = సమర్థుడు అయిన, రాజా = దశరథ మహారాజు, దైవాసురే = దేవాసురులకు జరిగిన, సఙ్గ్రామే = యుద్ధమునందు, ఆరాధితః = సేవింపబడినవాడై, సమ్ప్రహృష్టః = సంతోషించిన వాడై, తవ జనన్యై = నీ తల్లికి, వరం చ = వరమును కూడ, దదౌ = ఇచ్చెను.

తా. దేవాసురుల సంగ్రామము జరిగి నపుడు నీ తల్లి చేసిన సేవకు చాల సంతోషించి, సమర్థుడైన దశరథమహారాజు, ఆమెకు వరమును కూడ ఇచ్చెను. 4

మూ. తతస్సా సమ్ప్రతిశ్రావ్య తవ మాతా యశస్వినీ,
అయాచత నరశ్రేష్ఠం ద్వౌ వరౌ వరవర్ణినీ. 5
తవ రాజ్యం నరవ్యాఘ్ర మమ ప్రవ్రాజనం తథా,
తౌ చ రాజా తదా తస్యై నియుక్తః ప్రదదౌ వరౌ. 6

ప్ర. అ. నరవ్యాఘ్ర! = ఓ నరశ్రేష్ఠుడా! తతః = అటుపిమ్మట, యశస్వినీ = కీర్తి గలది, వరవర్ణినీ = ఉత్తమస్త్రీ అయిన, తవ మాతా = నీ తల్లి, సమ్ప్రతిశ్రావ్య = శపథము చేయించి, నరశ్రేష్ఠమ్ = నరశ్రేష్ఠుడైన దశరథుని, తవ = నీకు, రాజ్యమ్ = రాజ్యము, తథా = మరియు, మమ = నాకు, ప్రవ్రాజనమ్ = అడవికి పంపుట అను, ద్వౌ = రెండు, వరౌ = వరములను, అయాచత = కోరెను. తదా = అపుడు, రాజా చ = రాజు కూడ, నియుక్తః = కోరబడిన వాడై, తౌ వరౌ = ఆ వరములను, తస్యై = ఆమెకు, ప్రదదౌ = ఇచ్చెను.

తా. ఓ నరశ్రేష్ఠుడా! పిదప కీర్తిగలదీ, ఉత్తమస్త్రీజాతికి చెందినదీ అయిన నీ తల్లి, దశరథమహారాజుచే ఒట్టు పెట్టించుకొని, నీకు రాజ్యము, నాకు అరణ్యవాసము అను రెండు వరములను కోరెను. ఆమె అట్లు కోరగా రాజు ఆ వరములను ఆమెకు ఇచ్చెను. 5, 6

మూ. తేన పిత్రాఽహమప్యత్ర నియుక్తః పురుషర్షభ,
చతుర్దశ వనే వాసం వర్షాణి వరదానికమ్. 7

ప్ర. అ. పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా! తేన పిత్రా = ఆ తండ్రిచేత, అహమపి = నేను కూడ, వరదానికమ్ = వరదానమునకు సంబంధించిన, చతుర్దశ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, అత్ర = ఈ, వనే = వనమునందు, వాసమ్ = నివాసమును గూర్చి, నియుక్తః = నియమింపబడితిని.

తా. ఆ వరములలో ఒకటిగా పదునాలుగు సంవత్సరములు నేను నివసించవలె నని, నన్ను తండ్రి ఆజ్ఞాపించినాడు. 7

మూ. సోఽహం వనమిదం ప్రాప్తో నిర్జనం లక్ష్మణాన్వితః,
సీతయా చాప్రతిద్వన్ద్వః సత్యవాదే స్థితః పితుః. 8

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, లక్ష్మణాన్వితః = లక్ష్మణునితో కూడినవాడనై, అప్రతిద్వన్ద్వః = బెదిరించువాడు లేనివాడనై, పితుః = తండ్రియొక్క, సత్యవాదే = సత్యవాక్యమందే, స్థితః = నిలచినవాడనై, సీతయా చ = సీతతో కూడ, నిర్జనమ్ = జనశూన్యమైన, ఇదం వనమ్ = ఈ వనమును, గూర్చి, ప్రాప్తః = వచ్చినాను.

తా. నేను తండ్రి పలికిన సత్యవాక్యమందే స్థిరముగా నిలచి, ఎదురు లేనివాడనై, సీతాలక్ష్మణసహితుడనై, ఈ నిర్జనవనమునకు వచ్చితిని. 8

మూ. భవానపి తథేత్యేవ పితరం సత్యవాదినమ్,
కర్తుమర్హతి రాజేన్ద్ర క్షిప్రమేవాభిషేచనాత్. 9

ప్ర. అ. రాజేన్ద్ర = ఓ రాజశ్రేష్ఠుడా! భవానపి = నీవు కూడ, తథేత్యేవ = అట్లే అని, క్షిప్రమేవ = శీఘ్రముగా, అభిషేచనాత్ = అభిషేకమువలన,

పితరమ్ = తండ్రిని, సత్యవాదినమ్ = సత్యమును పలికిన వానినిగా, కర్తుమ్ = చేయుటకు, అర్హతి = తగియున్నావు.

తా. రాజులలో శ్రేష్ఠుడ వైన భరతా! నీవు కూడ మన తండ్రి చెప్పిన విధమున వెంటనే రాజ్యాభిషిక్తుడ వై, ఆయన సత్యవాదిత్వమును నిలబెట్టుము.

మూ. ఋణాన్మోచయ రాజానం మత్కృతే భరతం ప్రభుమ్,
పితరం చాపి ధర్మజ్ఞం మాతరం చాభినన్దయ. 10

ప్ర. అ. భరత = ఓ! భరతా, మత్కృతే = నా నిమిత్తమై, ప్రభుమ్ = సమర్థు డైన, రాజానమ్ = రాజును, ఋణాత్ = ఋణమునుండి, మోచయ = విడిపించుము. ధర్మజ్ఞమ్ = ధర్మమును ఎరిగిన, పితరమ్ చాపి = తండ్రిని, మాతరం చ = తల్లిని, అభినన్దయ = సంతోష పెట్టుము.

తా. ఓ భరతా! నా మాట విని దశరథమహారాజును ఋణవిముక్తుని చేయుము. ధర్మజ్ఞు డైన తండ్రిని, తల్లిని సంతోష పెట్టుము. 10

మూ. శ్రూయతే హి పురా తాత శ్రుతిర్గీతా యశస్వినా,
గయేన యజమానేన గయేష్వేవ పితౄన్ప్రతి. 11

ప్ర. అ. తాత = తండ్రీ, పురా = పూర్వము. గయేష్వేవ = గయ అను ప్రదేశమునందు, పితౄన్ ప్రతి = పితరుల నుద్దేశించి, యజమానేన = యాగము చేయుచున్న, యశస్వినా = కీర్తిమంతు డైన, గయేన = గయునిచేత, గీతా = పాడబడిన, శ్రుతిః = పాట (గాథ), శ్రూయతే హి = వినబడుచున్నది కదా!

తా. తండ్రీ! పూర్వము గయాక్షేత్రములో పితృదేవతలను గూర్చి యాగము చేయుచు, కీర్తిమంతు డైన గయుడు, ఈ విధముగా చెప్పినట్లు విను చున్నాము. 11

మూ. పున్నామ్నో నరకాద్యస్మాత్ పితరం త్రాయతే సుతః,
తస్మాత్ పుత్ర ఇతి ప్రోక్తః పితౄన్ యః పాతి సర్వతః.

ప్ర. అ. యస్మాత్ = ఏ కారణమువలన, సుతః = కుమారుడు, పితరమ్ = తండ్రిని, పున్నామ్నః = పుత్ అను పేరుగల, నరకాత్ = నరకమునుండి,

త్రాయతే=రక్షించుచున్నాడో, తస్మాత్ = ఆ కారణమువలన, యః = ఎవడు, సర్వతః = అన్నిటినుండి, పితౄన్=పితృదేవతలను, పాతి=రక్షించుచున్నాడో, అతడు, పుత్ర ఇతి=పుత్రుడు అని, ప్రోక్తః = చెప్పబడినాడు.

తా. సుతుడు తండ్రిని "పుత్" అను నరకమునుండి రక్షించును. పితృదేవతలను అన్ని విధముల రక్షించును. అందుచేత అతనికి పుత్రుడు అను పేరు వచ్చినది. 12

మూ. ఏష్టవ్యా బహవః పుత్రా గుణవన్తో బహుశ్రుతాః,
తేషాం వై సమవేతానా మపి కశ్చిద్గయాం వ్రజేత్. 13

ప్ర. అ. గుణవన్తః = గుణవంతులు, బహుశ్రుతాః = అధికవిద్యాభ్యాసము కలవారు అయిన, బహవః=అనేకులు, పుత్రాః=పుత్రులు, ఏష్టవ్యాః=కోరదగినవారు. సమవేతానామ్=కూడిన, తేషామ్ = వారిలో, కశ్చిదపి = ఏ ఒక్కడైనను, గయామ్=గయను గూర్చి, వ్రజేత్=వెళ్ళవచ్చును.

తా. గుణవంతులు, విద్యావంతులు అయిన చాలామంది పుత్రులు కావలెనని కోరుకొనవలెను. ఎందుచేత ననగా, వారిలో ఏ ఒక్కడైన గయాక్షేత్రమునకు వెళ్ళవచ్చును కదా! 13

మూ. ఏవం రాజర్షయః సర్వే ప్రతీతా రాజనన్దన,
తస్మాత్త్రాహి నరశ్రేష్ఠ పితరం నరకాత్ప్రభో. 14

ప్ర. అ. రాజనన్దన!=ఓ రాజకుమారా! సర్వే=సమస్తమైన, రాజర్షయః = రాజర్షులు, ఏవమ్=ఇట్లు, ప్రతీతాః=నిశ్చయించినారు. ప్రభో=ఓ సమర్థుడా, నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! తస్మాత్ = ఆ కారణము వలన, పితరమ్ = తండ్రిని, నరకాత్=నరకమునుండి, త్రాహి=రక్షింపుము.

తా. ఓ రాజకుమారా! రాజర్షు లందరు ఇట్లే నిర్ణయించినారు. సమర్థుడవైన ఓ నరశ్రేష్ఠుడా! అందుచే నీవు తండ్రిని నరకములో పడకుండ రక్షించుము.

మూ. అయోధ్యాం గచ్ఛ భరత ప్రకృతీరనురఞ్జయ,
శత్రుఘ్నసహితో వీర సహ సర్వైర్ద్విజాతిభిః. 15

ప్ర. అ. వీర! = వీరుడ వైన, భరత! = భరతుడా! శత్రుఘ్నసహితః = శత్రుఘ్నునితో కూడినవాడ వై, సర్వైః = సమస్త మైన, ద్విజాతిభిః సహ = ద్విజులతో కూడినవాడ వై, అయోధ్యామ్ = అయోధ్యానగరమును గూర్చి, గచ్ఛ = వెళ్లుము. ప్రకృతీః = ప్రజలను, అనురఞ్జయ = రంజింపచేయుము.

తా. వీరుడ వైన ఓ భరతా! నీవు అయోధ్యకు వెళ్లుము. శత్రుఘ్నునితోను, ద్విజు లందరితోను కూడి, ప్రజల నందరిని రంజింపచేయుము. లేదా నీవు శత్రుఘ్నునితోను, ద్విజులతోను కలిసి అయోధ్యకు వెళ్లి ప్రజలను రంజింప చేయుము. 15

మూ. ప్రవేక్ష్యే దణ్డకారణ్యమహమప్యవిలమ్బయన్,
అభ్యాన్తు సహితో రాజన్ వైదేహ్యా లక్ష్మణేన చ. 16

ప్ర. అ. రాజన్ = ఓ రాజా, అహమపి = నేను కూడ, అవిలమ్బయన్ = ఆలస్యము చేయనివాడ నై, అభ్యామ్ = ఈ, వైదేహ్యా = సీతతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, సహితః = కూడినవాడనై, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, ప్రవేక్ష్యే = ప్రవేశించగలను.

తా. ఓ రాజా! నేను ఈ సీతాలక్ష్మణులతో కలిసి, వెంటనే దండకారణ్యమునకు వెళ్ళెదను. 16

మూ. త్వం రాజా భరత భవ స్వయం నరాణాం
వన్యానామహమపి రాజరాణ్మృగాణామ్,
గచ్ఛ త్వం పురవరమద్య సంప్రహృష్టః
సంహృష్టస్త్వహమపి దణ్డకాన్ ప్రవేక్ష్యే. 17

ప్ర. అ. భరత = ఓ భరతుడా! త్వమ్ = నీవు, స్వయమ్ = స్వయముగా, నరాణామ్ = మనుష్యులకు, రాజా = రాజువుగా, భవ = అగుము. అహమపి = నేను కూడ, వన్యానామ్ = వనములో ఉన్న, మృగాణామ్ = మృగములకు, రాజరాట్ = మహారాజుగా అయ్యెదను. త్వమ్ = నీవు, సంప్రహృష్టః = సంతోషించినవాడ వై, అద్య = ఇపుడు, పురవరమ్ = శ్రేష్ఠ మైన పురమును గూర్చి, గచ్ఛ = వెళ్లుము. అహమపి = నేను కూడ, సంప్రహృష్టః = సంతోషించినవాడనై, దండకాన్ = దండకారణ్యమును, ప్రవేక్ష్యే = ప్రవేశించెదను.

తా. ఓ భరతా! నీవు నరులకు రాజు వగుము. నేను వనములో నున్న మృగములకు రాజు అయ్యెదను. నీవు సంతోషపూర్వకముగా ఇపుడు అయోధ్యకు వెళ్లుము. నేను సంతోషపూర్వకముగా దండకారణ్యమునకు వెళ్ళెదను. 17

మూ. ఛాయాం తే దినకరభాః ప్రబాధమానం
వర్షత్రం భరత కరోతు మూర్ధ్ని శీతామ్,
ఏతేషామహమపి కాననద్రుమాణాం
ఛాయాం తామతిశయినీం సుఖీ శ్రయిష్యే. 18

ప్ర. అ. భరత=ఓ భరతుడా! వర్షత్రమ్ = ఛత్రము, దినకరభాః = సూర్యుని కాంతిని, ప్రబాధమానమ్ = బాధించుచు, తే మూర్ధ్ని = నీ శిరస్సుపై, శీతామ్ = చల్లని, ఛాయామ్ = నీడను, కరోతు = చేయుగాక. అహమపి=నేను కూడ, సుఖీ = సుఖవంతుడ నై, ఏతేషామ్ = ఈ, కాననద్రుమాణామ్ = అడివిలోని వృక్షములయొక్క, అతిశయినీమ్ = అత్యధిక మైన, తామ్=ఆ. ఛాయామ్ = నీడను, శ్రయిష్యే = ఆశ్రయించగలను.

తా. ఓ భరతుడా! సూర్యుని ఎండను తొలగించుచు, శ్వేతఛత్రము నీ శిరస్సుపై చల్లని నీడను ఇచ్చుగాక. నేను కూడ ఈ అరణ్యవృక్షముల దట్టమైన నీడను సుఖముగా ఆశ్రయించెదను. 18

మూ. శత్రుఘ్నః కుశలమతిస్తు తే సహాయః
సౌమిత్రిర్మమ విదితః ప్రధానమిత్రమ్,
చత్వారస్తనయవరా వయం నరేన్ద్రం
సత్యస్థం భరత చరామ మా విషీద. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. భరత!=ఓ భరతుడా! కుశలమతిః=సమర్థ మైన బుద్ధి గల, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తే = నీకు, సహాయః = సహాయుడు. సౌమిత్రిః = లక్ష్మణుడు, మమ = నాకు, ప్రధానమిత్రమ్ = ప్రధాన మైన స్నేహితుడుగా, విదితః = ప్రసిద్ధుడు. తనయవరాః = శ్రేష్ఠపుత్రుల మైన; వయమ్ = మనము,

చత్వారః = నలుగురము, నరేన్ద్రమ్ = రాజును, సత్యస్థమ్ = సత్యమునందు నిలబడినవానినిగా, చరామ = చేసెదము. మా విషీద = దుఃఖించకుము.

తా. ఓ భరతుడా! బుద్ధిశాలియైన శత్రుఘ్నుడు నీకు తోడుగా ఉండును. లక్ష్మణుడు నాకు ప్రధానమిత్రు డని ప్రసిద్ధ మైన విషయమే కదా! మనము నలుగురు కుమారులము దశరథమహారాజు సత్యవ్రతమును నిలబెట్టెదము. దుఃఖించకుము. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యకాండలో నూటపదవ సర్గ సమాప్తము.

# అథ అష్టోత్తరశతతమః సర్గః

[జాబాలి నాస్తికమత మవలంబించి రామునికి నచ్చుజెప్పుట.]

మూ. ఆశ్వాసయన్తం భరతం జాబాలిర్బ్రాహ్మణోత్తమః,
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేతమిదం వచః. 1

ప్ర. అ. బ్రాహ్మణోత్తమః = బ్రాహ్మణశ్రేష్ఠు డైన, జాబాలిః = జాబాలి, భరతమ్ = భరతుని, ఆశ్వాసయన్తమ్ = ఓదార్చుచున్న, ధర్మజ్ఞమ్ = ధర్మములు తెలిసినవా డైన, రామమ్ = రామునిగూర్చి, ధర్మాపేతమ్ = ధర్మమునుండి తొలగిన, ఇదమ్ = ఈ, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ధర్మజ్ఞు డైన రాముడు భరతునకు ఈ విధముగా నచ్చచెప్పుచుండగా, బ్రాహ్మణోత్తము డైన జాబాలి ఆతనితో ధర్మవిరుద్ధముగా ఇట్లు పలికెను. 1

మూ. సాధు రాఘవ మాఽభూత్తే బుద్ధిరేవం నిరర్థికా,
ప్రాకృతస్య నరస్యేవ హ్యార్యబుద్ధేర్మనస్వినః. 2

ప్ర. అ. రాఘవ = రామా ! సాధు = బాగు బాగు. ఆర్యబుద్ధేః = పూజ్య మైన బుద్ధి కలవాడవు, మనస్వినః = ఆత్మాభిమానవంతుడవు, అయిన, తే = నీకు, ప్రాకృతస్య నరస్యేవ = సామాన్యమానవునకు వలె, ఏవమ్ = ఇట్లు, నిరర్థికా = ప్రయోజనము లేని, బుద్ధిః = బుద్ధి, మాఽభూత్ = కలుగకుండుగాక !

తా. రామా ! బాగు బాగు! ఉత్తమ మైన బుద్ధి గల ఆత్మాభిమానవంతుడ వైన నీకు సామాన్యు డైన మూఢునకు వలె, ఇట్టి నిష్ప్రయోజన మైన ఆలోచన కలుగకూడదు. 2

మూ. కః కస్య పురుషో బన్ధుః కిమాప్యం కస్య కేన చిత్,
యదేకో జాయతే జన్తురేక ఏవ వినశ్యతి. 3

ప్ర. అ. కః పురుషః=ఏ పురుషుడు, కస్య=ఎవనికి, బన్ధుః=బంధువు? కస్య=ఎవనికి, కేన చిత్=ఎవనినుండి, కిమ్=ఏమి, ఆప్యమ్=పొందదగినది? యత్=ఎందువలన అనగా, జన్తుః = ప్రాణి, ఏకః=ఒక్కడే, జాయతే = పుట్టుచున్నాడు, ఏక ఏవ=ఒక్కడుగానే, వినశ్యతి=నశించుచున్నాడు.

తా. ఎవ డైనను ఒక్కడే పుట్టుచున్నాడు; ఒక్కడే మరణించుచున్నాడు. అట్టి స్థితిలో ఎవనికి ఎవడు బంధువు? ఎవడు ఎవనినుంచి ఏమి పొందగలుగును?

మూ. తస్మాన్మాతా పితా చేతి రామ సజ్జేత యో నరః,
ఉన్మత్త ఇవ స జ్ఞేయో నాస్తి కచ్చిద్ధి కస్య చిత్. 4

ప్ర. అ. రామ=ఓ రామా! తస్మాత్=ఆ కారణమువలన, యః నరః= ఏ నరుడు, మాతా=తల్లి యని, పితా చేతి = తండ్రి యని, సజ్జేత = ఆసక్తు డై ఉండునో, సః=అతడు, ఉన్మత్త ఇవ = ఉన్మత్తుడు వలె, విజ్ఞేయః = తెలియదగినవాడు, కశ్చిత్=ఎవడును, కస్య చిత్=ఎవనికిని, నాస్తి హి=లేడు కదా!

తా. రామా! తల్లి యనీ, తండ్రి యనీ, అనుకొనుచు వారిపై అధికప్రేమ బంధము కలవాడు ఉన్మత్తునివంటి వాడు. ఎవ్వరు ఎవరికి ఏమి కావలెను? 4

మూ. యథా గ్రామాన్తరం గచ్ఛన్ నరః కశ్చిత్ క్వచిద్వసేత్,
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠేతాపరేఽహని. 5
ఏవమేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసు,
ఆవాసమాత్రం కాకుత్స్థ సజ్జన్తే నాత్ర సజ్జనాః. 6

ప్ర. అ. కాకుత్స్థ=రామా! గ్రామాన్తరమ్=గ్రామాంతరమును గూర్చి, గచ్ఛన్=వెళ్లుచున్న, కశ్చిత్=ఒకానొక, నరః=నరుడు, యథా=ఎట్లు, క్వచిత్ = ఒక చోట, వసేత్ = నివసించునో, తమ్ ఆవాసమ్ = ఆ నివాసమును, ఉత్సృజ్య=విడచి, అపరే = తరువాతి, అహని = దివసమునందు, ప్రతిష్ఠేత= ప్రయాణ మగునో, ఏవమేవ = ఇట్లే, మనుష్యాణామ్ = మనుష్యులకు, పితా= తండ్రి, మాతా = తల్లి, గృహమ్ = ఇల్లు, వసు=ధనము అనునవి, ఆవాసమాత్రమ్ = కేవలము ఆవాసము వంటివే. అత్ర = దీనియందు, సజ్జనాః=సజ్జనులు, న సజ్జన్తే = సంగము కలవారు కారు.

తా. రామా ! గ్రామాంతరమునకు వెళ్లువాడు, ఒక చోట ఆగి, మరునాడు ఆ నివాసస్థానమును విడచి, ప్రయాణమై పోవుచుండును. మనుష్యులకు తండ్రి, తల్లి, గృహము, ధనము అనునవి ఇట్టి నివాసస్థానమువంటివి మాత్రమే. సజ్జనులకు వాటియందు సంగము ఉండదు. 6

మూ. పిత్ర్యం రాజ్యం పరిత్యజ్య స నార్హసి నరోత్తమ,
ఆస్థాతుం కాపథం దుఃఖం విషయం బహుకణ్టకమ్. 7

ప్ర. అ. నరోత్తమ = ఓ నరశ్రేష్ఠుడా, సః = అట్టి నీవు, పిత్ర్యమ్ = తండ్రికి సంబంధించిన, రాజ్యమ్ = రాజ్యమును, పరిత్యజ్య = విడచి, దుఃఖమ్ = దుఃఖకరము, విషమమ్ = ఎగుడు దిగుడుగా ఉండేది, బహుకణ్టకమ్ = అనేకమైన బాధలు కలది అయిన, కాపథమ్ = చెడ్డమార్గమును, ఆస్థాతుమ్ = అవలంబించుటకు, నార్హసి = తగవు.

తా. ఓ నరశ్రేష్ఠుడా ! తండ్రివలన సంక్రమించిన రాజ్యమును విడిచి అనేక ఉపద్రవములతో, దుఃఖకరమైన, విషమమైన ఈ చెడ్డమార్గమును అవలంబించకుము. 7

మూ. సమృద్ధాయామయోధ్యాయామాత్మానమభిషేచయ,
ఏకవేణీధరా హి త్వాం నగరీ సంప్రతీక్షతే. 8

ప్ర. అ. సమృద్ధాయామ్ = ఐశ్వర్యముతో నిండిన, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, ఆత్మానమ్ = తనను, అభిషేచయ = అభిషిక్తుని చేసికొనుము. నగరీ = ఆ పట్టణము, ఏకవేణీధరా = ఒకటే జడను ధరించినదై, త్వామ్ = నిన్ను, సంప్రతీక్షతే = ఎదురుచూచుచున్నది.

తా. నీవు సర్వసమృద్ధమైన అయోధ్యకు వెళ్ళి, పట్టాభిషేకము చేసుకొనుము. పతివ్రత ఏకవేణిని ధరించి, భర్తకై వేచి యున్నట్లు, ఆ నగరము నీకై వేచి యున్నది. 8

మూ. రాజభోగాననుభవన్ మహార్హాన్ పార్థివాత్మజ,
విహర త్వమయోధ్యాయాం యథా శక్రస్త్రివిష్టపే. 9

ప్ర. అ. పార్థివాత్మజ = రాజకుమారా, మహార్హాన్ = శ్రేష్ఠములైన, రాజ

భోగాన్=రాజభోగములను, అనుభవన్=అనుభవించుచు, త్వమ్=నీవు, శక్రః =దేవేంద్రుడు, త్రివిష్టపే యథా=స్వర్గమునందు వలె, అయోధ్యాయామ్= అయోధ్యయందు. విహర=విహరించుము.

తా. రాజకుమారా! నీవు శ్రేష్ఠములైన రాజభోగములను అనుభవించుచు దేవేంద్రుడు స్వర్గములో విహరించు నట్లు, అయోధ్యలో విహరించుము. 9

మూ. న తే కశ్చిద్దశరథ స్త్వం చ తస్య న కశ్చన,
అన్యో రాజా త్వమన్యః స తస్మాత్కురు యదుచ్యతే. 10

ప్ర. అ. తే=నీకు, దశరథః=దశరథుడు, కశ్చిత్=ఎవడును, న= కాడు. త్వం చ=నీవు, తస్య=ఆతనికి, కశ్చన=ఎవ్వడవు, న=కావు. సః రాజా=ఆ రాజు, అన్యః=అన్యుడు. త్వమ్=నీవు, అన్యః=అన్యుడవు. తస్మాత్ =ఆ కారణమువలన, యత్=ఏది, ఉచ్యతే=చెప్పబడుచున్నదో, అది, కురు =చేయుము.

తా. నీకు దశరథు డేమియు కాడు. ఆతనికి నీవును ఏమియు కావు. ఆ రాజెవ్వరో నీ వెవ్వరో. అందుచేత నేను చెప్పి నట్లు చేయుము. 10

మూ. బీజమాత్రం పితా జన్తోః శుక్లం రుధిరమేవ చ,
సంయుక్తమృతుమన్మాత్రా పురుషస్యేహ జన్మ తత్. 11

ప్ర. అ. పితా=తండ్రి, జన్తోః=ప్రాణికి, బీజమాత్రమ్ = కేవలము బీజము మాత్రమే, శుక్లమ్=శుక్లము, రుధిరమేవ చ=రుధిరము, ఋతుమన్మాత్రా =ఋతువులో నున్న తల్లితో, సంయుక్తమ్=సంయుక్త మగును. తత్=ఆ కారణమువలన, ఇహ=ఈ లోకమునందు, పురుషస్య=పురుషునకు, జన్మ=జన్మ కలుగుచున్నది.

తా. ప్రాణికి తండ్రి బీజము మాత్రమే. తల్లి ఋతుమతి యైనప్పుడు శుక్లము శోణితము కలువగా పురుషుడు జన్మించుచున్నాడు. 11

మూ. గతః స నృపతిస్తత్ర గన్తవ్యం యత్ర తేన వై,
ప్రవృత్తిరేషా మర్త్యానాం త్వం తు మిథ్యా విహన్యసే. 12

ప్ర. అ. సః నృపతిః=ఆ రాజు, తేన=వానిచేత, యత్ర = ఎక్కడికి, గన్తవ్యమ్=వెళ్ళవలసి యున్నదో, తత్ర=అచటికి, గతః=వెళ్ళినాడు. మర్త్యానామ్ = మానవులయొక్క, ప్రవృత్తిః=ప్రవృత్తి, ఏషా=ఇదియే. త్వం తు= నీ వైతే, మిథ్యా = అనవసరముగా, విహన్యసే=పీడింపబడుచున్నావు.

తా. ఆ దశరథమహారాజు, తాను ఎక్కడికి వెళ్ళవలెనో, అక్కడికి వెళ్ళిపోయినాడు. మరణశీలు లైన మానవుల పద్ధతి ఇట్లే ఉండును. నీవు మాత్రము అనవసరముగా కష్టముల పాలగుచున్నావు. 12

మూ. అర్థధర్మపరా యే యే తాంస్తాన్ శోచామి నేతరాన్,
తే హి దుఃఖమిహ ప్రాప్య వినాశం ప్రేత్య భేజిరే 13

ప్ర. అ. యే యే=ఎవ రెవరు, అర్థధర్మపరాః = అర్థధర్మములయందాసక్తి కలవారో, తాంస్తాన్ = వారి నందరిని గూర్చి, శోచామి = విచారించుచున్నాను. ఇతరాన్ = ఇతరులను గూర్చి (కామపరులను గూర్చి) న = విచారించను. తే=అర్థధర్మపరులు, ఇహ = ఈ లోకమున, దుఃఖమ్=దుఃఖమును, ప్రాప్య=పొంది, ప్రేత్య=మరణించి, వినాశమ్=వినాశమును, భేజిరే=పొందిరి. (పొందుదురు).

తా. కేవలము అర్థముకొరకు, ధర్మముకొరకు, పాటుపడువారిని చూచి నాకు దుఃఖము (జాలి) కల్గుచున్నది. ఇతరులను చూచి కలుగదు. ఎందుచేత ననగా ఆ అర్థధర్మపరులు, ఈ లోకములో కష్టములు అనుభవించి, మరణానంతరము కూడ నాశనమును చెందుదురు. 13

మూ. అష్టకా పితృదైవత్యమిత్యయం ప్రసృతో జనః,
అన్నస్యోపద్రవం పశ్య మృతో హి కిమశిష్యతి. 14

ప్ర. అ. అష్టకా = అష్టకాశ్రాద్ధ మని, పితృదైవత్యమ్ ఇతి = ప్రత్యాబ్దికశ్రాద్ధ మని, అయమ్ = ఈ, జనః = జనము, ప్రసృతః = ప్రవర్తించుచున్నది. అన్నస్య = అన్నము యొక్క, ఉపద్రవమ్ = వినాశమును, పశ్య = చూడుము. మృతః=మరణించినవాడు, కిమ్=దేనిని, అశిష్యతి=తినగలడు (లేదా కిమ్ అశిష్యతి=తినునా?).

తా. జనులు అష్టకాశ్రాద్ధ మని, ప్రత్యాబ్దికశ్రాద్ధ మని చేయుచుందురు. ఎంత అన్నము వ్యర్థ మగుచున్నదో చూడుము చచ్చినవాడు ఏమి తినును? 14

మూ. యది భుక్తమిహాన్యేన దేహమన్యస్య గచ్ఛతి,
దద్యాత్ప్రవసతః శ్రాద్ధం న తత్పథ్యశనం భవేత్. 15

ప్ర. అ. ఇహ=ఈ లోకమున, అన్యేన=ఒకనిచే, భుక్తమ్=తినబడినది, అన్యస్య=మరియొకనియొక్క, దేహమ్=దేహమును, గచ్ఛతి యది=పొందిన ట్లైతే, ప్రవసతః=దేశాంతరము వెళ్లువానికి, శ్రాద్ధమ్ = శ్రాద్ధమును, దద్యాత్ =ఇవ్వవలెను. తత్ = అది, పథి = మార్గమునందు, అశనమ్ = ఆహారము, న భవేత్=కాదా?

తా. ఇక్కడ ఒకడు భుజించిన ఆహారము మరియొకని దేహములోనికి వెళ్ళినచో, విదేశమునకు వెళ్లువానికి శ్రాద్ధము పెట్టవచ్చును. అది అతనికి మార్గములో ఆహారము అగును గదా? 15

మూ. దానసంవననా హ్యేతే గ్రన్థా మేధావిభిః కృతాః,
యజస్వ దేహి దీక్షస్వ తపస్తప్యస్వ సంత్యజ. 16

ప్ర. అ. యజస్వ=యజ్ఞము చేయుము; దేహి = ఇమ్ము. దీక్షస్వ= యాగాదులలో దీక్ష వహింపుము; తపః=తపస్సు, తప్యస్వ=చేయుము; సంత్యజ =బాగుగా దానము చెయుము అని; ఏతే= ఈ, గ్రన్థాః =గ్రంథములు, మేధావిభిః =బుద్ధిమంతులచేత, కృతాః =చేయబడిన, దానసంవననాః హి=దానవశీకరణోపాయములు కదా?

తా. యజ్ఞములు చేయుము; దానములు ఇమ్ము, దీక్ష వహించుము; తపస్సు చేయుము; అన్నీ ఇచ్చివేయుము, అని చెప్పుచు, మేధావులు వ్రాసిన గ్రంథములన్నీ దానవశీకరణోపాయములు. 16

మూ. స నాస్తి పరమిత్యేవ కురు బుద్ధిం మహామతే,
ప్రత్యక్షం యత్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు. 17

ప్ర. అ. మహామతే=గొప్ప బుద్ధికలవాడా! సః= అట్టి నీవు, పరమ్= పరము, నాస్తి ఇత్యేవ =లేదు అనియే, బుద్ధిమ్ = బుద్ధిని, కురు = చేయుము.

యత్=ఏది, ప్రత్యక్షమ్=ప్రత్యక్షమో, తత్=దానిని, ఆతిష్ఠ=చేయుము. పరోక్షమ్ = పరోక్ష మైన దానిని, పృష్ఠతః కురు=వెనుకఉంచుము.

తా. మహాబుద్ధిశాలి వైన రామా! పర మనునది లే దనియే నిశ్చయించుకొని, ప్రత్యక్ష మైనదానిని ఆచరించుము. పరోక్ష మైన దానిని లెక్క చేయకుము.

మూ. సతాం బుద్ధిం పురస్కృత్య సర్వలోకనిదర్శినీమ్,
రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. సః=అట్టి, త్వమ్=నీవు, సర్వలోకనిదర్శినీమ్ = సర్వలోకములందు ఉదాహరణములు గల; తాం బుద్ధిమ్ = అట్టి బుద్ధిని, పురస్కృత్య = పురస్కరించుకొని, భరతేన=భరతునిచేత, ప్రసాదితః = అనుగ్రహింపచేసికొనబడుచున్నవాడవై, రాజ్యమ్=రాజ్యమును, ప్రతిగృహ్ణీష్వ=స్వీకరింపుము.

తా. భరతుడు బ్రతిమాలుచున్నాడు. అందుచేత నీవు లోకములో ఎన్నియో ఉదాహరణములు గల నేను చెప్పిన ఆలోచనను అంగీకరించి రాజ్యమును స్వీకరించుము. 18

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
నూటఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ నవోత్తరశతతమః సర్గః

[రాముడు జాబాలి పలికిన నాస్తికమతమును ఖండించి ఆస్తిక మతమును స్థాపించుట.]

మూ. జాబాలేస్తు వచః శ్రుత్వా రామః సత్యాత్మనాం వరః,
ఉవాచ పరయా భక్త్యా స్వబుద్ధ్యా చావిపన్నయా. 1

ప్ర. అ. సత్యాత్మనామ్ = సత్యమైన బుద్ధి కలవారిలో, వరః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, జాబాలేః = జాబాలియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, పరయా = గొప్ప, భక్త్యా = భక్తితోను, అవిపన్నయా = చెడని, స్వబుద్ధ్యా చ = తన బుద్ధితోను, ఉవాచ = పలికెను.

తా. సత్యబుద్ధులలో శ్రేష్ఠుడైన రాముడు, జాబాలి మాటలు విని అధికమైన భక్తితోను, చలించని బుద్ధితోను ఇట్లు పలికెను. 1

మూ. భవాన్మే ప్రియకామార్థం వచనం యదిహోక్తవాన్,
అకార్యం కార్యసఙ్కాశమపథ్యం పథ్యసమ్మతమ్. 2

ప్ర. అ. భవాన్ = నీవు, మే = నాయొక్క, ప్రియకామార్థమ్ = ప్రియమునందలి కోరికకొరకు, యత్ = ఏ, వచనమ్ = వచనమును, ఇహ = ఇపుడు, ఉక్తవాన్ = పలికినావో, అది, కార్యసఙ్కాశమ్ = కార్యము (చేయదగినది)వలె ఉండు, అకార్యమ్ = అకార్యము(చేయకూడనిది). పథ్యసమ్మతమ్ = పథ్యముగా కనబడు, అపథ్యమ్ = అపథ్యము.

తా. నీవు నా ప్రియమును కోరి ఇంతవరకు మాటలాడిన మాటలు పైకి కర్తవ్యములు వలె హితములువలె కనబడు అకర్తవ్యములు అహితములు అయిన మాటలు. 2

మూ. నిర్మర్యాదస్తు పురుషః పాపాచారసమన్వితః,
మానం న లభతే సత్సు భిన్నచారిత్రదర్శనః. 3

ప్ర. అ. నిర్మర్యాదః = కట్టుబాట్లు లేనివాడు, పాపాచారసమన్వితః = పాప మైన నడవడిక కలవాడు, భిన్నచారిత్రదర్శనః = భేదింపబడిన సచ్చరిత్రము, మంచి దృష్టి కలవాడు అయిన, పురుషస్తు = పురుషుడు, సత్సు = సత్పురుషులలో, మానమ్ = గౌరవమును, న లభతే = పొందడు.

తా. కట్టుబాట్లు లేక, పాపాచారవంతుడై, సచ్చరిత్రకు, మంచి దృష్టికి విరుద్ధముగా ప్రవర్తించు మానవుడు సత్పురుషుల గౌరవము పొందజాలడు. 3

మూ. కులీనమకులీనం వా వీరం పురుషమానినమ్,
చారిత్రమేవ వ్యాఖ్యాతి శుచిం వా యది వాఽశుచిమ్. 4

ప్ర. అ. కులీనమ్ = సత్కులమునందు పుట్టినవానిని గాని, అకులీనం వా = సత్కులమునందు పుట్టనివానిని గాని, వీరమ్ = వీరుని గాని, పురుషమానినమ్ = వీరుడ నైన పురుషుడ నను దురభిమానము కలవానిని గాని, శుచిం వా = పరిశుద్ధ మైన వానిని గాని, అశుచిం = అపరిశుద్ధుని గాని, చారిత్రమేవ = చరిత్రమే, వ్యాఖ్యాతి = వివరించి చెప్పుచున్నది.

తా. ఎవడు కులీనుడో ఎవడు కాడో, ఎవడు వీరుడో ఎవడు కేవలము వీరత్వాభిమానము కలవాడో, ఎవడు పరిశుద్ధుడో ఎవడు కాడో, వాని నడవడికయే చెప్పును. 4

మూ. అనార్యస్త్వార్యసఙ్కాశః శౌచాద్ధీనస్తథాఽశుచిః,
లక్షణ్యవదలక్షణ్యో దుశ్శీలః శీలవానివ. 5

అధర్మం ధర్మవేషేణ యదీమం లోకసఙ్కరమ్,
అభిపత్స్యే శుభం హిత్వా క్రియావిధివివర్జితమ్. 6

కశ్చేతయానః పురుషః కార్యాకార్యవిచక్షణః,
బహుమంస్యతి మాం లోకే దుర్వృత్తం లోకదూషణమ్.

ప్ర. అ. ఆర్యసఙ్కాశః = ఆర్యునితో సమానుడైన, అనార్యః = అనార్యు

డనై, శౌచాత్ = శౌచమునుండి, హీనః = హీనుడనై, తథా = మరియు, అశుచిః = చెడ్డ శీలము కలవాడనై, లక్షణ్యవత్ = ఉత్తమలక్షణములు కలవాడువలె ఉన్న, అలక్షణ్యః = ఉత్తమలక్షణశూన్యుడనై, శీలవానివ = మంచిశీలముకలవాడు వలె ఉన్న, దుశ్శీలః = చెడ్డశీలము కలవాడనై, (నేను) శుభమ్ = శుభమును, హిత్వా = విడిచి, ధర్మవేషేణ = ధర్మ మనే వేషముతో, లోకసఙ్కరమ్ = లోకములో సాంకర్యమును కలిగించు, క్రియావిధివివర్జితమ్ = సత్క్రియలు శాస్త్రములు లేని, ఇమమ్ = ఈ, అధర్మమ్ = అధర్మమును, అభిపత్స్యే యది = పొందినట్లైతే, దుర్వృత్తమ్ = చెడ్డ నడవడిక కలవాడను, లోకదూషణమ్ = లోకమునకు కీడు చేయువాడను అయిన, మామ్ = నన్ను, లోకే = లోకమునందు, కార్యాకార్య విచక్షణః = కార్యాకార్యములందు నేర్పు గల, చేతయానః = చైతన్యవంతు డైన, కః పురుషః = ఏ పురుషుడు, బహుమంస్యతి = గౌరవించగలడు?

తా. నేను ఆర్యుడు (పూజ్యుడు)వలె పైకి కనపడుచు, అనార్యుడనై, శుచిత్వము (నిజాయితీ) లేక అశుచి నై, ఉత్తమలక్షణము లున్నవాడు వలె కనబడుచు, ఉత్తమలక్షణములు లేనివాడ నై, చెడ్డశీలము కలవాడ నైనను, శీలవంతుడు వలె కనబడుచు, శుభ మైన మార్గమును విడిచి, సత్కర్మలు గాని, శాస్త్రము గాని లేనిదీ, లోకసంకర హేతువూ ఐన ఈ అధర్మమును, ధర్మ మనే వేషముతో ఆచరించినచో, ఈ విధముగా దుష్ట మైన ప్రవృత్తితో లోకమునకు కీడు కల్గించుచున్న నన్ను ఈ లోకములో కార్యాకార్యములు తెలిసిన చైతన్యవంతు డైన ఏ పురుషు డైన గౌరవించునా? 5-7

మూ. కస్య దాస్యామ్యహం వృత్తం కేన వా స్వర్గమాప్నుయామ్,
అనయా వర్తమానో హి వృత్త్యా హీనప్రతిజ్ఞయా. 8

ప్ర. అ. అహమ్ = నేను, హీనప్రతిజ్ఞయా = విడవబడిన ప్రతిజ్ఞ గల, అనయా = ఈ, వృత్త్యా = పద్ధతిచే, వర్తమానః = ప్రవర్తించుచు, కస్య = ఎవనికి, వృత్తమ్ = మంచి నడవడికను, దాస్యామి = ఇచ్చెదను? (ఉపదేశించగలను). కేన వా = దేని చేత, స్వర్గమ్ = స్వర్గమును, ఆప్నుయామ్ = పొందుదును.

తా. నేను ప్రతిజ్ఞ విడచి ఈ విధముగా ప్రవర్తించినచో, ఎవరికి మంచి మార్గమును ఉపదేశించగలను? స్వర్గమునకు ఎట్లు వెళ్ళగలను? 8

మూ. కామవృత్తస్త్వయం లోకః కృత్స్నః సముపవర్తతే,
యద్వృత్తాః సన్తి రాజానస్తద్వృత్తాః సన్తి హి ప్రజాః. 9

ప్ర. అ. అయమ్=ఈ, కృత్స్నః=సమస్తమైన, లోకః=లోకము, కామవృత్తః=స్వేచ్ఛాధీనమైన ప్రవృత్తి కలదై, సముపవర్తతే=నడుచును. రాజానః=రాజులు, యద్వృత్తాః=ఎట్టి చరిత్ర కలవారు, సన్తి=అగుదురో, ప్రజాః=ప్రజలు, తద్వృత్తాః=అట్టి ఆచారము కలవారు, సన్తి హి=అగుదురు కదా!

తా. నేను అట్లు ప్రవర్తించినచో జను లందరు స్వేచ్ఛాచారులైపోవుదురు. రాజులు ఏ విధముగా ప్రవర్తింతురో ప్రజలు కూడ ఆ విధముగానే ప్రవర్తించుచుందురుకదా! 9

మూ. సత్యమేవానృశంసం చ రాజవృత్తం సనాతనమ్,
తస్మాత్సత్యాత్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః. 10

ప్ర. అ. సనాతనమ్=సనాతనమైన, రాజవృత్తమ్=రాజధర్మము, సత్యమేవ=సత్యస్వరూపమైనదే. అనృశంసం చ=క్రౌర్యములేనిది. తస్మాత్=ఆ కారణమువలన, రాజ్యమ్=రాజ్యము, సత్యాత్మకమ్=సత్యరూపమైనది. లోకః=లోకము, సత్యే=సత్యమునందు, ప్రతిష్ఠితః=నిలబడి యున్నది.

తా. అతిపురాతనము, శాశ్వతము అయిన ఈ రాజధర్మము, సత్యస్వరూపమైనది. దీనిలో క్రూరత్వమునకు తావు లేదు. అందుచే రాజ్యము సత్యప్రధానము. సత్యము మీదనే లోకము నిలిచి యున్నది. 10

మూ. ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవ హి మేనిరే,
సత్యవాదీ హి లోకేఽస్మిన్ పరమం గచ్ఛతి క్షయమ్.

ప్ర. అ. ఋషయశ్చైవ=ఋషులు, దేవాశ్చ=దేవతలు. సత్యమేవ=సత్యమునే, మేనిరే=(ఉత్తమమైన దానినిగా) తలచిరి. సత్యవాదీ=సత్యమును పలుకువాడు, అస్మిన్ లోకే=ఈ లోకమునందు, పరమమ్=ఉత్తమమైన, క్షయమ్=స్థానమును, గచ్ఛతి=పొందును.

తా. ఋషులు, దేవతలు కూడ సత్యమే పరమధర్మమని అంగీకరించిరి. సత్యమును పలుకువాడు ఈ లోకములో ఉత్తమమైన స్థానమును పొందును. 11

మూ. ఉద్విజన్తే యథా సర్పాన్నరాదనృతవాదినః,
ధర్మః సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే. 12

ప్ర. అ. అనృతవాదినః=అసత్యమును పలుకు, నరాత్ = నరునినుండి, సర్పాత్ యథా=సర్పమునుండి వలె. ఉద్విజన్తే=భయపడుదురు. లోకే=లోకమునందు, సత్యమ్=సత్యము, పరః=గొప్ప దైన, ధర్మః=ధర్మము. స్వర్గస్య = స్వర్గమునకు, మూలం చ=మూలముగా కూడ, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. అసత్యము చెప్పువానిని చూచి, జనులు సర్పమును చూచి భయపడునట్లు భయపడుదురు. ఇహ లోకములో, సత్యమే ఉత్తమధర్మము. ఇది స్వర్గమునకు కూడ మూలకారణమని చెప్పుదురు.

మూ. సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా,
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్. 13

ప్ర. అ. లోకే=లోకమునందు, సత్యమేవ=సత్యమే, ఈశ్వరః=ఈశ్వరుడు. పద్మా=లక్ష్మి, సదా=ఎల్లపుడు, సత్యమ్ = సత్యమును, ఆశ్రితా = ఆశ్రయించి ఉన్నది. సర్వాణి = అన్నియు, సత్యమూలాని = సత్యమే మూలముగా కలవి. సత్యాత్=సత్యముకంటె, పరమ్=శ్రేష్ఠ మైన, పదమ్=స్థానము, నాస్తి =లేదు.

తా. ఈ లోకములో సత్యమే ఈశ్వరుడు. లక్ష్మి ఎల్లపుడు సత్యమును ఆశ్రయించి ఉండును. అన్నిటికిని సత్యమే మూలము. సత్యమును మించిన ఉత్తమధర్మ మేదియు లేదు. 13

మూ. దత్తమిష్టం హుతం చైవ తప్తాని చ తపాంసి చ,
వేదాః సత్యప్రతిష్ఠానాస్తస్మాత్సత్యపరో భవేత్. 14

ప్ర. అ. దత్తమ్ = దానము, ఇష్టం చ = యాగము, హుతం చైవ = హోమము, తప్తాని=చేయబడిన, తపాంసి చ = తపస్సులు, వేదాః=వేదములు, సత్యప్రతిష్ఠానాః=సత్యమే ఆధారముగా కలవి; తస్మాత్ = ఆ కారణమువలన, సత్యపరః = సత్యమునందు ఆసక్తి కలవాడు, భవేత్ = కావలెను.

తా. దానము, యాగము, హోమము, తపస్సు, వేదములు ఇవన్నియు సత్యముమీదనే ఆధారపడి యున్నవి. అందుచే మానవుడు సత్యమును అవలంబింపవలెను. 14

మూ. ఏకః పాలయతే లోకమేకః పాలయతే కులమ్.
మజ్జత్యేకో హి నిరయే ఏకః స్వర్గే మహీయతే. 15

ప్ర. అ. ఏకః = ఒకడు, లోకమ్ = లోకమును, పాలయితే = పాలించును. ఏకః = ఒకడు, కులమ్ = కులమును, పాలయతే = పాలించును. ఏకః = ఒకడు, నిరయే = నరకమునందు, మజ్జతి = మునిగిపోవును. ఏకః = ఒకడు, స్వర్గే = స్వర్గమునందు, మహీయతే = పూజింపబడును.

తా. లోకములో ఒకడు రాజ్యమును పాలించును. ఒకడు వంశమును వృద్ధిలోనికి తెచ్చును. ఒకడు నరకములో పడును. ఒకడు స్వర్గములో గౌరవమును పొందుచుండును. (ఇవి సత్యాసత్యముల వలన వచ్చు ఆ యా ఫలములు).

మూ. సోఽహం పితుర్నియోగం తు కిమర్థం నానుపాలయే,
సత్యప్రతిశ్రవః సత్యం సత్యేన సమయీకృతమ్. 16

ప్ర. అ. సత్యప్రతిశ్రవః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడ నైన, సః అహమ్ = అట్టి నేను, సత్యేన = సత్యముచేత, సమయీకృతమ్ = కట్టడి చేయబడిన, పితుః = తండ్రియొక్క, సత్యమ్ = సత్య మైన, నియోగమ్ = ఆజ్ఞను, కిమర్థమ్ = ఎందుకు, నానుపాలయే = పరిపాలించను.

తా. నేను సత్యప్రతిజ్ఞ కలవాడను. తండ్రి యెదుట సత్యముపై శపథము చేసి సత్యమైన ఆతని యాజ్ఞను పరిపాలించకుండ ఎట్లుందును? 16

మూ. నైవ లోభాన్న మోహాద్వా న హ్యజ్ఞానాత్తమోఽన్వితః,
సేతుం సత్యస్య భేత్స్యామి గురోః సత్యప్రతిశ్రవః. 17

ప్ర. అ. సత్యప్రతిశ్రవః = సత్య మైన ప్రతిజ్ఞ కలవాడ నైన, నేను, గురోః = తండ్రియొక్క, సత్యస్య = సత్యముయొక్క, సేతుమ్ = సేతువును, లోభాత్ = లోభమువలన, నైవ భేత్స్యామి = భేదించను. మోహాద్వా = మోహము

వలన కాని, న = భేదించను, తమోఽన్వితః = తమోగుణముతో కూడినవాడనై, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన కాని, న = భేదించను.

తా. సత్యప్రతిజ్ఞ కల నేను, నా తండ్రిగారి సత్యమను సేతువును లోభము వల్ల కాని, చిత్తభ్రమవలన కాని, తమోగుణముచే కలిగిన అజ్ఞానమువలన గాని భేదించను. 17

మూ. అసత్యసన్ధస్య సతశ్చలస్యాస్థిరచేతసః,
నైవ దేవా న పితరః ప్రతీచ్ఛన్తీతి నః శ్రుతమ్. 18

ప్ర. అ. అసత్యసన్ధస్య సతః = సత్యసంధుడు కానివాడై, చలస్య = చంచలుడు, అస్థిరచేతసః = స్థిరము కాని చిత్తము కలవాడు అయినవాని హవ్యకవ్యాదులను, దేవాః = దేవతలు, నైవ ప్రతీచ్ఛన్తి = స్వీకరించరు. పితరః = పితృదేవతలు, న = స్వీకరించరు, ఇతి = అని, నః = మాకు, శ్రుతమ్ = వినబడినది.

తా. అసత్యసందుడై, చిత్తస్థైర్యము లేక, చపలుడుగా ఉన్నవాడు సమర్పించిన హవ్యకవ్యాదులను దేవతలు గాని పితృదేవతలు గాని స్వీకరించ రని మేము విన్నాము. 18

మూ. ప్రత్యగాత్మమిమం ధర్మం సత్యం పశ్యామ్యహం స్వయమ్,
భారః సత్పురుషాచీర్ణస్తదర్థమభిమన్యతే. 19

ప్ర. అ. అహమ్ = నేను, స్వయమ్ = స్వయముగా, ఇమమ్ = ఈ, సత్యం ధర్మమ్ = సత్యరూపమైన ధర్మమును, ప్రత్యగాత్మమ్ = జీవునిగా, పశ్యామి = చూచుచున్నాను. తదర్థమ్ = అందుకొరకే, సత్పురుషాచీర్ణః = సత్పురులచే ఆచరించబడిన, భారః = భారము, అభిమన్యతే = గౌరవింపబడుచున్నది.

తా. సత్య మనే ఈ ధర్మము, సాక్షాత్తు ప్రత్యగాత్మ యని నేను తలచుచున్నాను. అందుచేతనే సత్పురుషు లాచరించిన ఈ కష్టమైన కార్యమును నేను గౌరవించుచున్నాను. 19

మూ. క్షాత్రం ధర్మమహం త్యక్ష్యే హ్యధర్మం ధర్మసంహితమ్,
క్షుద్రైర్నృశంసైర్లుబ్ధైశ్చ సేవితం పాపకర్మభిః. 20

ప్ర. అ. క్షుద్రైః = నీచులు, నృశంసైః = క్రూరులు, లుబ్ధైః = లుబ్ధులు అయిన, పాపకర్మభిః = పాపకర్మలు కలవారిచే, సేవితమ్ = సేవింపబడిన, ధర్మసంహితమ్ = ధర్మముతో కూడిన, అధర్మమ్ = అధర్మ మైన, క్షాత్రం ధర్మమ్ = క్షత్రియధర్మమును, అహమ్ = నేను, త్యక్ష్యే = విడచెదను.

తా. నీచులు, క్రూరులు, దురాశాపరులు, పాపాత్ములు అయినవారు సేవించునదీ, కొంచెము ధర్మముతో కూడినను, అధర్మముతో నిండినదీ అయిన క్షత్రియధర్మమును నేను పరిత్యజించెదను. 20

మూ. కాయేన కురుతే పాపం మనసా సమ్ప్రధార్య చ,
అనృతం జిహ్వయా చాహ త్రివిధం కర్మ పాతకమ్.

ప్ర. అ. మనసా = మనస్సుచేత, సమ్ప్రధార్య = నిర్ధారణ చేసుకొని, కాయేన = శరీరముతో, పాపమ్ = పాపమును, కురుతే = చేయుచున్నాడు. జిహ్వయా = నాలుకతో, అనృతం చ = అసత్యమును, ఆహ = చెప్పుచున్నాడు. పాతకం కర్మ = పాపకర్మ, త్రివిధమ్ = మూడు విధము లైనది.

తా. మానవుడు ముందుగా మనస్సుతో నిర్ధారణ చేసుకొని, పిమ్మట దేహముతో పాపకర్మ చేయును. నాలుకతో అసత్యము పలుకును. ఈ విధముగా పాపము మానసికము, కాయికము, వాచికము అని మూడు విధములు. 21

మూ. భూమిః కీర్తిర్యశో లక్ష్మీః పురుషం ప్రార్థయన్తి హి,
స్వర్గస్థం చానుపశ్యన్తి సత్యమేవ భజేత తత్. 22

ప్ర. అ. భూమిః = భూమి, కీర్తిః = కీర్తి, యశః = యశస్సు, లక్ష్మీః = లక్ష్మి, పురుషమ్ = సత్యవంతు డైన పురుషుని, ప్రార్థయన్తి హి = కోరుచుండును గదా? స్వర్గస్థం చ = స్వర్గమునం దున్నవానిని, అనుపశ్యన్తి = అనుసరించి చూచు చుండును. తత్ = ఆకారణము వలన, సత్యమేవ = సత్యమునే, భజేత = సేవించ వలెను.

తా. భూమి, సత్కార్యాదులచే కలిగిన కీర్తి, పౌరుషాదులచే కలిగిన యశస్సు, లక్ష్మి ఇవి సత్యవంతు డైన పురుషుని చేర వలె నని కోరుచుండును. అతడు స్వర్గస్థు డయినను అతనినే చూచుచుండును. అందువలన సత్యమునే అవలంబించవలయును. 22

మూ. శ్రేష్ఠం హ్యనార్యమేవ స్యాద్యద్భవానవధార్య మామ్,
ఆహ యుక్తికరైర్వాక్యై రిదం భద్రం కురుష్వ హ. 23

ప్ర. అ. భవాన్ = నీవు, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠ మైన దానినిగా, అవధార్య = నిశ్చయించి, భద్రమ్ = మంగళకర మైన, ఇదమ్ = దీనిని, కురుష్వ = చేయుము అని, యుక్తికరైః = యుక్తియుక్త ము లైన, వాక్యైః = వాక్యములతో, మామ్ = నన్ను గూర్చి, యత్ = ఏది, ఆహ = చెప్పితివో అది, అనార్యమేవ = చెడ్డదే, స్యాత్ = అగును.

తా. నీవు శ్రేష్ఠము అని నిర్ణయించి, యుక్తియుక్తము లైన మాటలతో "మంగళకర మైన దీనిని చేయుము" అని నాతో చెప్పిన దంతయు చెడ్డదే. 23

మూ. కథం హ్యహం ప్రతిజ్ఞాయ వనవాసమిమం గురౌ,
భరతస్య కరిష్యామి వచో హిత్వా గురోర్వచః. 24

ప్ర. అ. అహమ్ = నేను, ఇమం వనవాసమ్ = ఈ వనవాసమును, గురౌ = గురువుయందు, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, గురోః = తండ్రియొక్క, వచః = వచనమును, హిత్వా = విడచి, భరతస్య = భరతునియొక్క, వచః = వచనమును, కథమ్ = ఎట్లు, కరిష్యామి = చేయుదును?

తా. నేను వనవాసము చేసెదను అని తండ్రిగారి ఎదుట ప్రతిజ్ఞ చేసి, ఇపుడు ఆయన మాట కాదని భరతుని మాట లెట్లు చేయుదును? 24

మూ. స్థిరా మయా ప్రతిజ్ఞాతా ప్రతిజ్ఞా గురుసన్నిధౌ,
ప్రహృష్యమాణా సా దేవీ కైకేయీ చాభవత్తదా. 25

ప్ర. అ. మయా = నాచేత, గురుసన్నిధౌ = తండ్రి సమీపమున, స్థిరా = స్థిర మైన, ప్రతిజ్ఞా = పతిజ్ఞ, ప్రతిజ్ఞాతా = చేయబడినది. తదా = అపుడు, సా = ఆ,

దేవీ కైకేయీ చ=కైకేయీదేవి కూడ, ప్రహృష్యమాణా= సంతోషించుచున్నది, అభవత్=అయెను.

తా. నేను తండ్రి ఎదుట స్థిర మైన, ప్రతిజ్ఞ చేసితిని. అపుడు కైకేయీ దేవి కూడ చాలా సంతోషించినది. 25

మూ. వనవాసం వసన్నేవం శుచిర్నియతభోజనః,
మూలైః పుష్పైః ఫలైః పుణ్యైః పితౄన్ దేవాంశ్చ తర్పయన్.

సంతుష్టపఞ్చవర్గోఽహం లోకయాత్రాం ప్రవర్తయే,
అకుహః శ్రద్దధానస్సన్ కార్యాకార్యవిచక్షణః. 27

ప్ర. అ. అహమ్=నేను, శుచిః=పవిత్రుడనై, నియతభోజనః=నియమముతో కూడిన భోజనము కలవాడనై, పుణ్యైః = పవిత్ర మైన, మూలైః = దుంపలచేత, పుష్పైః=పుష్పములచేత, ఫలైః=ఫలములచేత, పితౄన్=పితృదేవతలను, దేవాంశ్చ=దేవతలను, తర్పయన్=తృప్తి పొందించుచు, సన్తుష్టపఞ్చవర్గః=సంతుష్టి చెందిన ఐదు ఇంద్రియముల సముదాయములు కలవాడనై, అకుహః=కపటము లేనివాడనై, శ్రద్దధానస్సన్=శ్రద్ధావంతుడ నై, కార్యాకార్యవిచక్షణః=కార్యాకార్యములందు నేర్పు (వివేకము) కలవాడనై, ఏవమ్=ఈ విధముగా, వనవాసమ్=వనవాసమును, వసన్=నివసించుచు, లోకయాత్రామ్=జీవితయాత్రను, ప్రవర్తయే=నడపెదను.

తా. నేను పరిశుద్ధుడనై, మితభోజనము చేయుచు, పవిత్రము లైన మూల ఫలములతో, పితృదేవతలను తృప్తి పొందించుచు, పంచేంద్రియములను సంతుష్టి కలవాటినిగా ఉంచుకొనుచు, కపటము విడనాడి శ్రద్ధావంతుడనై కార్యాకార్యములను తెలుసుకొనుచు, ఈ విధముగా వనవాసము చేయుచు జీవితమును గడపెదను. 26, 27

మూ. కర్మభూమిమిమాం ప్రాప్య కర్తవ్యం కర్మ యచ్ఛుభమ్,
అగ్నిర్వాయుశ్చ సోమశ్చ కర్మణాం ఫలభాగినః. 28

ప్ర. అ. ఇమామ్=ఈ, కర్మభూమిమ్=కర్మభూమిని, ప్రాప్య=పొంది, యత్=ఏది, శుభమ్= శుభ మైన, కర్మ=కర్మయో అది, కర్తవ్యమ్=చేయ

దగినది, అగ్నిః=అగ్నియు, వాయుశ్చ=వాయువు, సోమః = చంద్రుడు, కర్మణామ్=కర్మలయొక్క, ఫలభాగినః=ఫలమును పొందినవారు.

తా. ఈ కర్మభూమిని పొందినవాడు, శుభమైన కర్మను తప్పక చేయవలెను. అగ్ని వాయుచంద్రులు, వారు చేసిన కర్మలకు ఫలముగా ఆ యా పదములను పొందగలిగినారు. ౨౯

మూ. శతం క్రతూనామాహృత్య దేవరాట్ త్రిదివం గతః.
తపాంస్యుగ్రాణి చాస్థాయ దివం యాతా మహర్షయః.

ప్ర. అ. దేవరాట్ = దేవేంద్రుడు, క్రతూనామ్ = యజ్ఞములయొక్క, శతమ్=శతమును, ఆహృత్య=చేసి, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి. గతః= వెళ్ళినాడు. మహర్షయః=మహర్షులు, ఉగ్రాణి=ఉగ్రమైన, తపాంసి=తపస్సులను, ఆస్థాయ=అవలంబించి. దివమ్=స్వర్గమునుగూర్చి, యాతాః=వెళ్ళినారు.

తా. దేవేంద్రుడు నూరు యజ్ఞములు చేయుటచేతనే స్వర్గాధిపత్యమును పొందినాడు. మహర్షులు తీవ్రమైన తపస్సులు చేసి స్వర్గమునకు వెళ్ళినారు.

మూ. అమృష్యమాణః పునరుగ్రతేజా
నిశమ్య తం నాస్తికవాక్యహేతుమ్,
అథాబ్రవీత్తం నృపతేస్తనూజో
విగర్హమాణో వచనాని తస్య. ౩౦

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ఉగ్రతేజాః = ఉగ్రమైన తేజస్సు గల, నృపతేః తనూజః=ఆ రాజకుమారుడు, తమ్ = ఆ, నాస్తికవాక్యహేతుమ్ = నాస్తికవాక్యములలో చెప్పిన హేతువును, నిశమ్య=విని, అమృష్యమాణః = సహించనివాడై, తస్య=అతనియొక్క, వచనాని=వచనములను, విగర్హమాణః = నిందించుచు, తమ్ = అతనిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఉగ్రమైన తేజస్సు గల దశరథకుమారుడైన రాముడు, నాస్తికత్వముతో కూడిన ఆ జాబాలి చేసిన హేతువాదమును విని, దానిని సహించజాలక అతని మాటలు ఖండించుచు ఇట్లు పలికెను.

30

మూ. సత్యం చ ధర్మం చ పరాక్రమం చ
భూతానుకమ్పాం ప్రియవాదితాం చ,
ద్విజాతిదేవాతిథిపూజనం చ
పన్థానమాహుస్త్రిదివస్య సన్తః. 31

ప్ర. అ. సత్యం చ=సత్యమును, ధర్మం చ = ధర్మమును, పరాక్రమం చ = పరాక్రమమును, భూతానుకమ్పామ్ = భూతదయను, ప్రియవాదితాం చ= ప్రియవచనములు చెప్పుటను, ద్విజాతిదేవాతిథిపూజనం చ = బ్రాహ్మణులయొక్క, దేవతలయొక్క, అతిథులయొక్క, పూజించుటను, త్రిదివస్య = స్వర్గమునకు, పన్థానమ్ = మార్గమునుగా, సన్తః = సత్పురుషులు, ఆహుః = చెప్పుచున్నారు.

తా. సత్యము. ధర్మము, పరాక్రమము, భూతదయ, ప్రియవాక్కు, దేవబ్రాహ్మణాతిథుల పూజ, ఇవి స్వర్గమునకు మార్గము లని సత్పురుషులు చెప్పుచున్నారు. 31

మూ. తేనైవమాజ్ఞాయ యథావదర్థ
మేకోదయం సమ్ప్రతిపద్య విప్రాః,
ధర్మం చరన్తః సకలం యథావ
త్కాఙ్క్షన్తి లోకాగమమప్రమత్తాః. 32

ప్ర. అ. తేన = ఆ కారణముచేత, విప్రాః = బ్రాహ్మణులు, అర్థమ్ = విషయమును, యథావత్= యథార్థముగా, ఆజ్ఞాయ = తెలిసికొని, ఏకోదయమ్ = తప్పనిసరి యైన అభివృద్ధి గల ఆ మార్గమును, సమ్ప్రతిపద్య = పొంది, సకలమ్ = సమస్త మైన, ధర్మమ్ = దర్మమును, యథావత్ = యథాశాస్త్రము గా, అప్రమత్తాః = ఏమరుపాటు లేనివారై, చరన్తః = ఆచరించుచు, లోకాగమమ్ = ఉత్తమలోకముల ప్రాప్తిని, కాఙ్క్షన్తి = కోరుచున్నారు.

తా. అందుచేతనే బ్రాహ్మణులు, విషయమును సరిగా తెలుసుకొని, తప్పక సత్ఫలము నిచ్చు మార్గమును అవలంబించి, ఏమరుపాటు లేకుండగ, సకలధర్మములను యథావిధిగా ఆచరించుచు, ఉత్తమలోకప్రాప్తిని కోరుచున్నారు. 32

మూ. నిన్దామ్యహం కర్మ పితుః కృతం త
ద్యస్త్వామగృహ్ణాద్విషమస్థబుద్ధిమ్,
బుద్ధ్యానయైవంవిధయా చరన్తం
సునాస్తికం ధర్మపథాదపేతమ్. 33

ప్ర. అ. యః = ఎవ్వడు, విషమస్థబుద్ధిమ్ = తప్పు మార్గమునం దున్న బుద్ధికలవాడవు, ఏవంవిధయా = ఇట్టి, బుద్ధ్యా = బుద్ధితో, చరన్తమ్ = సంచరించుచున్నవాడవు, సునాస్తికమ్ = మిక్కిలి నాస్తికుడవు, ధర్మపథాత్ = ధర్మమార్గమునుండి, అపేతమ్ = తొలగినవాడవు అయిన, త్వామ్ = నిన్ను, అగృహ్ణాత్ = గ్రహించెనో, పితుః = అట్టి తండ్రియొక్క, తత్ = ఆ, కృతమ్ = చేయబడిన, కర్మ = పనిని, అహమ్ = నేను, నిన్దామి = నిందించుచున్నాను.

తా. చెడుమార్గమునందు ప్రవర్తించుచున్న బుద్ధికలవాడవూ, ఈ విధమైన ఆలోచనలతో సంచరించుచున్న నాస్తికుడవూ, ధర్మమార్గమునుండి చ్యుతుడవూ అయిన నిన్ను చేరదీసిన మాతండ్రిగారిని నేను నిందించుచున్నాను.

మూ. యథా హి చోరః స తథా హి బుద్ధ
స్తథాగతం నాస్తికమత్ర విద్ధి,
తస్మాద్ధి యః శఙ్క్యతమః ప్రజానామ్
న నాస్తికేనాభిముఖో బుధః స్యాత్. 34

ప్ర. అ. చోరః = చోరుడు, యథా హి = యెట్లో, సః = ఆ, బుద్ధః = బుద్ధుడు, తథా హి = అట్లే కదా. తథాగతమ్ = ఆ బుద్ధుని, అత్ర = ఇక్కడ, నాస్తికమ్ = నాస్తికునిగా, విద్ధి = తెలుసుకొనుము. తస్మాత్ = ఆ కారణము వలన, యః = ఏ బుద్ధుడు, ప్రజానామ్ = ప్రజలకు, శఙ్క్యతమః = మిక్కిలి శంకింపతగినవాడో, బుధః = పండితుడు, నాస్తికేన = నాస్తికునితో, అభిముఖః అభిముఖుడు, న స్యాత్ = కాకూడదు.

తా. బుద్ధుడు చోరునివంటి వాడు. అతడు నాస్తికు డని తెలుసుకొనుము. అందుచే అతడు ప్రజలకు శంకాపాత్రుడు. పండితుడు ఎన్నడును నాస్తికునితో సంబంధము ఉంచుకొనరాదు.

వి. అనుష్టుప్ ఛందస్సు మార్చి ఉపజాతివృత్తంలో వ్రాసిన (30వ శ్లోకం మొదలు) శ్లోకాలు ప్రక్షిప్తములై ఉండును. వీటిలో వాల్మీకి ముద్ర కన బడదు. త్రేతాయుగానికి చెందిన రాముడు బుద్ధునిగూర్చి మాటలాడుట అసంగతము కదా (34వ శ్లోకం). ఈ శ్లోకాన్ని బట్టి మిగిలిన శ్లోకాల యాథా ర్థ్యాన్ని కూడ శంకించవలసి ఉన్నది. 34

మూ. త్వత్తో జనాః పూర్వతరే వరాశ్చ
శుభాని కర్మాణి బహూని చక్రుః,
జిత్వా సదేమం చ పరం చ లోకం
తస్మాద్ద్విజాః స్వస్తి హుతం కృతం చ. 35

ప్ర. అ. త్వత్తః = నీకంటే, పూర్వతరే = పూర్వమునందున్నవారలు, వరాశ్చ = శ్రేష్ఠులు అయిన, జనాః = జనులు, శుభాని = శుభ మైన, బహూని = అనేక మైన, కర్మాణి = కర్మలను, చక్రుః = చేసిరి. సదా = ఎల్లపుడు, ఇమం చ = ఈ లోకమును, పరం చ = పరలోకమును, జిత్వా = జయించి ఉన్నారు. తస్మాత్ = అకారణమువలన, ద్విజాః = బ్రాహ్మణులు, స్వస్తి = క్షేమకర మైన, కృతమ్ = కర్మను, హుతం చ = హోమమును చేసిరి.

తా. నీకంటే పూర్వులు శ్రేష్ఠులు అయిన జనులు అనేక మైన శుభ కర్మలు చేసిరి. ఇహలోకమును పరలోకమును, కూడ జయించిరి. ఆ కారణము వలన బ్రాహ్మణులు హోమమును కర్మలను మంగళార్థమై చేయుచుందురు. 35

మూ. ధర్మే రతాః సత్పురుషైః సమేతా
స్తేజస్వినో దానగుణప్రధానాః,
అహింసకా వీతమలాశ్చ లోకే
భవన్తి పూజ్యా మునయః ప్రధానాః. 36

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, రతాః = ఆసక్తులు, సత్పురుషైః = సత్పురుషులతో, సమేతాః = కూడినవారు, తేజస్వినః = తేజశ్శాలురు, దానగుణ ప్రధానాః = దానగుణము ప్రధానముగా కలవారు, అహింసకాః = హింస చేయని వారు, వీతమలాః = పోయిన పాపము కలవారు, ప్రధానాః = ప్రధానులు అయిన,

మునయః=మునులు, లోకే=లోకమునందు, పూజ్యాః = పూజ్యులు, భవన్తి = అగుచున్నారు.

తా. ధర్మమునందాసక్తి కలవారు, సత్పురుషుల స్నేహము చేయువారు, తేజోవంతులు, దానగుణము ప్రధానముగా కలవారు, హింస చేయనివారు, తొలగిన పాపము గలవారు, ఉత్తములు అయిన మునులే లోకములో పూజింపదగినవారు. 36

మూ. ఇతి బ్రువన్తం వచనం సరోషం
రామం మహాత్మా సమదీనసత్త్వమ్,
ఉవాచ పథ్యం పునరాస్తికం చ
సత్యం వచః సానునయం చ విప్రః. 37

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, సరోషమ్ = కోపముతో కూడిన, వచనమ్ =వచనమును, బ్రువన్తమ్ = పలుకుచున్నవాడు, మహాత్మానమ్=మహాత్ముడు, అదీనసత్త్వమ్ = దైన్యము లేని బుద్ధి కలవాడు అయిన, రామమ్ = రాముని గూర్చి, విప్రః = ఆ బ్రాహ్మణుడు, పథ్యమ్=హితమైనది, ఆస్తికమ్=ఆస్తిక్యముతో కూడినది, సత్యమ్=సత్యము అయిన, వచః=వాక్కును, పునః = మరల, సానునయమ్=అనునయముతో కూడునట్లుగా, ఉవాచ=పలికెను.

తా. ఈ విధముగా కోపముతో పలుకుచున్న మహాత్ముడూ, దైన్యము లేని బుద్ధికలవాడూ అయిన రామునితో జాబాలి హితమూ, ఆస్తిక్యముతో కూడినదీ, సత్యమూ ఆయిన మాటను అనునయపూర్వకముగా ఇట్లు పలికెను. 37

మూ. న నాస్తికానాం వచనం బ్రవీమ్యహం
న నాస్తికోఽహం న చ నాస్తి కించన,
సమీక్ష్య కాలం పునరాస్తికోఽభవం
భవేయ కాలే పునరేవ నాస్తికః. 38

ప్ర. అ అహమ్=నేను, నాస్తికానామ్= నాస్తికులయొక్క, వచనమ్= వచనమును, న బ్రవీమి=చెప్పుటలేదు. అహమ్=నేను, నాస్తికః=నాస్తికుడను, న=కాను. కించన=ఏదియు. న చ నాస్తి=లేదనునది లేదు. కాలమ్=కాల

మును, సమీక్ష్య=చూచి, పునః=మరల, ఆస్తికః=ఆస్తికుడను, అభవమ్=అయితిని. కాలే=కాలమునందు, పునరేవ=మరల, నాస్తికః=నాస్తికుడను, భవేయ=అగుదును.

తా. నేను నాస్తికుల మాటలు చెప్పుటలేదు. నేను నాస్తికుడను కాను. పరలోకాదికము ఏమీ లేదనునది లేదు. కాలమును బట్టి నేను మరల ఆస్తికుడను అగుదును. మరొక సమయమునందు నాస్తికుని వలె మాటలాడుదును. 38

మూ. స చాపి కాలోఽయ ముపాగతః శనైః
యథా మయా నాస్తికవాగుదీరితా,
నివర్తనార్థం తవ రామ కారణాత్
ప్రసాదనార్థం చ మయైతదీరితమ్. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
నవోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. రామ=ఓ రామా! సః=ఆ, అయం కాలః చాపి=ఈ కాలము కూడ, శనైః=మెల్లగా, ఉపాగతః=వచ్చినది. మయా=నాచేత, యథా=ఎట్లు, నాస్తికవాక్=నాస్తికవాక్కు, ఉదీరితా=పలుకబడినదో, నివర్తనార్థమ్=నిన్ను మరల్చుటకు, ప్రసాదనార్థం చ=అనుగ్రహింపచేసుకొనుటకు, తవ కారణాత్=నీ కొరకే, మయా=నాచేత, ఏతత్=ఇది, ఈరితమ్=పలుకబడినది.

తా. రామా! నేను నాస్తికవాక్కు పలుకవలసిన సమయము మెల్లగా వచ్చుటచే అట్టి మాటలు చెప్పితిని. నిన్ను అయోధ్యకు మరలించుటకూ నిన్ను అనుగ్రహింపచేసుకొనుటకు నీకొరకు మాత్రమే నేను ఈ విధముగా మాటలాడితిని.

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
నూటతొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ దశోత్తరశతతమః సర్గః

[వసిష్ఠుడు సృష్టిపరంపరను, ఇక్ష్వాకువంశపరంపరను తెలిపి జ్యేష్ఠుడే రాజగుట యుక్తమని నిర్ణయించి, రాముని రాజ్యము స్వీకరింపు మని పలుకుట.]

మూ. క్రుద్ధమాజ్ఞాయ రామం తు వసిష్ఠః ప్రత్యువాచ హ
జాబాలిరపి జానీతే లోకస్యాస్య గతాగతమ్. 1

ప్ర. అ. రామమ్ = రాముని, క్రుద్ధమ్ = కోపించినవానినిగా, ఆజ్ఞాయ = తెలుసుకొని, వసిష్ఠః = వసిష్ఠుడు, ప్రత్యువాచ హ = ఇట్లు పలికెను. జాబాలిరపి = జాబాలి కూడ, అస్య లోకస్య = ఈ లోకముయొక్క, గతాగతమ్ = వెళ్లుచుండుటను, వచ్చుచుండుటను గూర్చి, జానీతే = ఎరుగును.

తా. రామునకు కోపము వచ్చి నట్లు గుర్తించి, వసిష్ఠుడు ఇట్లు పలికెను. "జనులు ఆ యా లోకములకు పోవుచు, తిరిగి వచ్చుచు ఉందు రని జాబాలికి కూడ తెలియును". 1

మూ. నివర్తయితుకామస్తు త్వామేతద్వాక్యముక్తవాన్,
ఇమాం లోకసముత్పత్తిం లోకనాథ నిబోధ మే. 2

ప్ర. అ. త్వామ్ = నిన్ను, నివర్తయితుకామస్తు = మరలింపవలె నను కోరిక కలవాడై మాత్రమే, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉక్తవాన్ = పలికినాడు. లోకనాథ = లోకములకు ప్రభు వైనవాడా! ఇమామ్ = ఈ, లోకసముత్పత్తిమ్ = లోకముయొక్క పుట్టుకను గూర్చి, మే = నాకు (నావలన), నిబోధ = తెలుసుకొనుము.

తా. కేవలము నిన్ను అయోధ్యకు మరలింపవలె నని మాత్రమే ఇతడు ఇట్లు పలికినాడు. లోకములకు ప్రభు వైన ఓ రామా! ఈ లోకము ఎట్లు పుట్టి నదో చెప్పెదను వినుము. 2

మూ. సర్వం సలిలమేవాసీత్ పృథివీ యత్ర నిర్మితా,
తతః సమభవద్బ్రహ్మా స్వయంభూర్దైవతైస్సహ. 3

ప్ర. అ. సర్వమ్=ఇది అంతయు, సలిలమ్ ఏవ=ఉదకముగానే, ఆసీత్ =ఉండెను, యత్ర=దేనియందు, పృథివీ=భూమి, నిర్మితా=నిర్మించబడినదో. తతః=అటు పిమ్మట, స్వయంభూః=స్వయముగనే పుట్టిన, బ్రహ్మా=బ్రహ్మ దేవుడు, దైవతైస్సహ=దేవతలతో కూడ, సమభవత్=ఆవిర్భవించెను.

తా. సృష్టిప్రారంభమున, అంతయు జలమయమై, ఉండెను. దానిపై భూమి పుట్టెను. అటుపిమ్మట దేవతలు, బ్రహ్మదేవుడు పుట్టిరి. 3

మూ. స వరాహ స్తతో భూత్వా ప్రోజ్జహార వసున్ధరామ్,
అసృజచ్చ జగత్సర్వం సహ పుత్రైః కృతాత్మభిః. 4

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సః=ఆ బ్రహ్మదేవుడు, వరాహః=వరాహముగా, భూత్వా=అయి, వసున్ధరామ్=భూమిని, ప్రోజ్జహార=ఎత్తెను. కృతాత్మభిః=శిక్షితమైన బుద్ధి గల, పుత్రైః సహ=పుత్రులతో కూడ, సర్వమ్ =సమస్తమైన, జగత్=జగత్తును, అసృజచ్చ=సృష్టించెను కూడ!

తా. ఆ బ్రహ్మదేవుడు వరాహరూపము ధరించి, భూమిని ఉద్ధరించెను. శిక్షితమైన బుద్ధి గల, తన పుత్రులైన మరీచ్యాదులతో కలసి అతడు ఈ జగత్తు నంతను సృష్టించెను.

వి. బ్రహ్మయే వరాహావతారము ఎత్తి భూమిని ఉద్ధరించె నని కూడ కొన్ని పురాణములలో ఉన్నది. అందుచేత విష్ణువు అను పదమును అధ్యాహారము తెచ్చుకొని ఆతడు వరాహావతారమున భూమిని ఉద్ధరించె నని పూర్వవ్యాఖ్యాతలు చెప్పి నట్లు గ్రహించవలసిన పనిలేదు. 4

మూ. ఆకాశప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మాన్మరీచిః సంజజ్ఞే మరీచేః కశ్యపః సుతః. 5

ప్ర. అ. శాశ్వతః=శాశ్వతుడు, నిత్యః=నిత్యుడు, అవ్యయః=నాశ రహితుడు అయిన, బ్రహ్మా=బ్రహ్మ, ఆకాశప్రభవః=ఆకాశమే, (పరబ్రహ్మయే)

జన్మస్థానము కలవాడు, తస్మాత్ = ఆతనినుండి, మరీచిః = మరీచి, సంజజ్ఞే = పుట్టెను. కశ్యపః = కశ్యపుడు. మరీచేః = మరీచియొక్క, సుతః=కుమారుడు.

తా. శాశ్వతుడు, నిత్యుడు, వినాశము లేనివాడు అయిన బ్రహ్మదేవుడు పరబ్రహ్మనుండి పుట్టెను. బ్రహ్మదేవునకు మరీచి, ఆతనికి కశ్యపుడు, కుమారులుగా పుట్టిరి. 5

మూ. వివస్వాన్ కశ్యపాత్ జజ్ఞే మనుర్వైవస్వతః సుతః,
స తు ప్రజాపతిః పూర్వమిక్ష్వాకుస్తు మనోః సుతః. 6

ప్ర. అ. కశ్యపాత్ = కశ్యపునినుండి, వివస్వాన్ = సూర్యుడు, జజ్ఞే= పుట్టెను. మనుః = మనువు, వైవస్వతః = సూర్యునికి సంబంధించిన, సుతః = కుమారుడు. స తు = అతడు, పూర్వమ్ = పూర్వము, ప్రజాపతిః = ప్రజాపతి. ఇక్ష్వాకుః = ఇక్ష్వాకువు, మనోః = మనువుయొక్క, సుతః=కుమారుడు.

తా. కశ్యపునకు సూర్యుడు కుమారుడుగా పుట్టెను. పూర్వము ప్రజాపతిగా నున్న మనువు సూర్యుని కుమారుడు. మనువు కుమారుడు ఇక్ష్వాకువు. 6

మూ. యస్యేయం ప్రథమం దత్తా సమృద్ధా మనునా మహీ,
తమిక్ష్వాకుమయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్. 7

ప్ర. అ. యస్య = ఎవనికి, ప్రథమమ్ = ముందుగా, సమృద్ధా=సమృద్ధమైన, మహీ = భూమి, మనునా = మనువుచేత, దత్తా=ఇవ్వబడినదో, తమ్ ఇక్ష్వాకుమ్ = ఆ ఇక్ష్వాకువును, అయోధ్యాయామ్= అయోధ్యయందు, పూర్వకమ్ = మొదటివాడైన, రాజానమ్ = రాజునుగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. మనువు మొదట సమృద్ధమైన ఈ భూమిని ఎవనికి ఇచ్చెనో ఆ ఇక్ష్వాకువే మొదటి అయోధ్యారాజని తెలిసికొనుము. 7

మూ. ఇక్ష్వాకోస్తు సుతః శ్రీమాన్ కుక్షిరేవేతి విశ్రుతః,
కుక్షేరథాత్మజో వీరో వికుక్షిరుదపద్యత. 8

ప్ర. అ. ఇక్ష్వాకోః=ఇక్ష్వాకువుయొక్క, సుతః = కుమారుడు, శ్రీమాన్ = శ్రీమంతుడైన, కుక్షిరేవేతి = కుక్షి అని, విశ్రుతః = ప్రసిద్ధుడు. అథ=అటు

పిమ్మట, కుక్షేః = కుక్షియొక్క, ఆత్మజః = కుమారుడు, వీరః = వీరుడైన, వికుక్షిః = వికుక్షి, ఉదపద్యత = పుట్టెను.

తా. ఇక్ష్వాకువునకు శ్రీమంతుడైన కుక్షి కుమారుడుగా పుట్టెను. కుక్షి కుమారుడు వికుక్షి. 8

మూ. వికుక్షేస్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్,
బాణస్య తు మహాబాహురనరణ్యో మహాయశాః. 9

ప్ర. అ. వికుక్షేః = వికుక్షికి, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడు అయిన, బాణః = బాణుడు, పుత్రః = పుత్రుడు. బాణస్య = బాణునకు, మహాబాహుః = మహాబాహువులుకల, మహాయశాః = గొప్ప కీర్తి గల. అనరణ్యః = అనరణ్యుడు పుట్టెను.

తా. వికుక్షికి, గొప్పతేజస్సు గలవాడు, ప్రతాపవంతుడు అయిన బాణుడు పుత్రుడుగా పుట్టెను బాణునకు గొప్ప బాహువులు కలవాడూ, గొప్ప కీర్తి గలవాడు అయిన అనరణ్యుడు పుట్టెను. 9

మూ. నానావృష్టిర్బభూవాస్మిన్ న దుర్భిక్షం సతాం వరే,
అనరణ్యే మహారాజే తస్కరో నాపి కశ్చన. 10

ప్ర. అ. సతామ్=సత్పురుషులలో, వరే = శ్రేష్ఠుడైన, అస్మిన్ = ఈ, అనరణ్యే = అనరణ్యుడు, మహారాజే=మహారాజై ఉండగా, అనావృష్టిః = అనావృష్టి, న బభూవ = కలుగలేదు. దుర్భిక్షమ్ = దుర్భిక్షము, న = కలుగలేదు. తస్కరః=దొంగవాడు, కశ్చన=ఎవడును, న=లేకుండెను.

తా. సత్పురుషులలో శ్రేష్ఠుడైన ఈ అనరణ్యమహారాజు రాజ్యము చేయుచున్నపుడు, అనావృష్టి కాని, దుర్భిక్షము కాని కలుగలేదు. ఒక్క దొంగ కూడ లేకుండెను. 10

మూ. అనరణ్యాన్ మహాబాహుః పృథూ రాజా బభూవ హ.
తస్మాత్పృథోర్మహారాజస్త్రిశఙ్కురుదపద్యత. 11
స సత్యవచనాద్వీరః సశరీరో దివం గతః,

ప్ర. అ. అనరణ్యాత్=అనరణ్యునినుండి, మహాబాహుః = గొప్ప బాహువులు గల, పృథుః = పృథువు అను, రాజా = రాజు, బభూవ హ = పుట్టెను. తస్మాత్ పృథోః=ఆ పృథువునుండి, త్రిశఙ్కుః=త్రిశంకువు అను, మహారాజః = మహారాజు, ఉదపద్యత = పుట్టెను. సః వీరః = ఆ వీరుడు, సత్యవచనాత్ =సత్యవచనమువలన, సశరీరః=శరీరముతో కూడినవాడై, దివమ్=స్వర్గమును గూర్చి, గతః=వెళ్ళినాడు.

తా. అనరణ్యునకు మహాబాహువైన, పృథువు అను రాజు, పృథువునకు త్రిశంకువు పుట్టిరి. వీరుడైన త్రిశంకువు సత్యవాక్యవరముచే శరీరముతో స్వర్గమునకు వెళ్ళినాడు. 11

మూ. త్రిశఙ్కోరభవత్సూనుర్ధున్ధుమారో మహాయశాః, 12
దున్ధుమారాన్మహాతేజా యువనాశ్వో వ్యజాయత.

ప్ర. అ. త్రిశఙ్కోః=త్రిశంకువునకు, మహాయశాః=గొప్ప కీర్తి గల, ధున్ధుమారః = దున్ధుమారుడు, సూనుః = కుమారుడుగా, అభవత్ = పుట్టెను. దున్ధుమారుత్=దున్ధుమారునినుండి, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, యువనాశ్వః=యువనాశ్వుడు, వ్యజాయత = పుట్టెను.

తా. త్రిశంకువునకు గొప్ప కీర్తి గల దున్ధుమారుడు, దున్ధుమారునకు గొప్ప తేజస్సు గల యువనాశ్వుడు పుట్టిరి. 12

మూ. యువనాశ్వసుతః శ్రీమాన్ మాంధాతా సమపద్యత. 13
మాన్ధాతుస్తు మహాతేజాః సుసంధిరుదపద్యత,
సుసంధేరపి పుత్రౌ ద్వౌ ధ్రువసంధిః ప్రసేనజిత్. 14
యశస్వీ ధ్రువసంధేస్తు భరతో రిపుసూదనః.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, మాన్ధాతా = మాంధాత, యువనాశ్వసుతః =యువనాశ్వుని కుమారుడై, సమపద్యత=పుట్టెను. మంధాతుః=మాంధాతనుండి, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సుసంధిః=సుసంధి, ఉదపద్యత = పుట్టెను. సుసంధేరపి=సుసంధికి కూడ, ధ్రువసంధిః=ధ్రువసంధి, ప్రసేనజిత్ =ప్రసేజిత్తు అను, ద్వౌ=ఇద్దరు, పుత్రౌ = కుమారులు. యశస్వీ = యశశ్శాలి,

రిపుసూదనః=శత్రుసంహారకుడు అయిన, భరతః=భరతుడు, ధ్రువసందేః = ధ్రువసంధినుండి పుట్టెను.

తా. శ్రీమంతు డైన మాంధాత యువనాశ్వుని కుమారుడు. మాంధాతకు మహాతేజశ్శాలి యైన సుసంధి పుట్టెను. సుసంధికి ధ్రువసంధి, ప్రసేనజిత్తు, అను ఇద్దరు కుమారులు పుట్టిరి. కీర్తి కలవాడు, శత్రుసంహారకుడు అయిన భరతుడు ధ్రువసంధి కుమారుడు. 13, 14

మూ. భరతాత్తు మహాబాహోరసితో నామ జాయత. 15
యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యన్త శత్రవః,
హైహయాస్తాలజఙ్ఘాశ్చ శూరాశ్చ శశిబిన్దవః. 16

ప్ర. అ. మహాబాహోః = మహాబాహువు అయిన, భరతాత్ = భరతుని నుండి, అసితో నామ=అసితు డను కుమారుడు, జాయత=పుట్టెను, యస్య = ఏ అసితునకు, హైహయాః = హైహయులు, తాలజఙ్ఘాశ్చ = తాలజంఘులు, శూరాః=శూరు లైన, శశిబిన్దవశ్చ=శశిబిందువులు అను, ప్రతిరాజానః = ఎదురించు రాజులు, శత్రవః=శత్రువులుగా, ఉదపద్యన్త=అయిరో.

తా. భరతునకు అసితుడు పుట్టెను. ఆతనికి హైహయులు, తాలజంఘులు, శూరు లైన శశిబిందువులు అను రాజవంశీయులు శత్రువు లైరి. 16

మూ. తాంస్తు సర్వాన్ ప్రతివ్యూహ్య యుద్ధే రాజా ప్రవాసితః,
స చ శైలవరే రమ్యే బభూవాభిరతో మునిః. 17

ప్ర. అ. రాజా=అసితుడు, యుద్ధే=యుద్ధమునందు, తాన్ సర్వాన్=వారినందరిని, ప్రతివ్యూహ్య=ఎదిరించి, ప్రవాసితః=తరమగొట్టబడినాడు. సః = అతడు, రమ్యే=సుందర మైన, శైలవరే=శ్రేష్ఠ మైన పర్వతముపై, అభిరతః =ఆసక్తి గల, మునిః=మునిగా, బభూవ=ఆయెను.

తా. అసితుడు ఆ శత్రురాజు లందరిని ఎదిరించగా వారు ఆతనిని తరిమి వేసిరి. అతడు అపుడు అంద మైన పర్వతమును ఆశ్రయించి, అక్కడ ముని వృత్తిని అవలంబించెను. 17

మూ. ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతురితి శ్రుతిః,
ఏకా గర్భవినాశాయ సపత్న్యై గరళం దదౌ. 18

ప్ర. అ. అస్య=ఇతనియొక్క, ద్వే భార్యే=ఇద్దరు భార్యలు, గర్భిణ్యౌ =గర్భవతులు, బభూవతుః=అయిరి. ఇతి = అని, శ్రుతిః = వినికిడి. ఏకా = ఒకతె, గర్భవినాశాయ=గర్భవినాశముకొరకు, సపత్న్యై=సవతికి, గరళమ్= విషమును, దదౌ=ఇచ్చెను.

తా. అసితుని ఇద్దరు భార్యలు గర్భవతులై ఉండిరి. వారిలో ఒక భార్య సవతి గర్భము నశించుటకై ఆమెకు విషము పెట్టెను. 18

మూ. భార్గవశ్చ్యవనో నామ హిమవన్తముపాశ్రితః,
తమృషిం సముపాగమ్య కాళిన్దీ త్వభ్యవాదయత్. 19
స తామభ్యవదద్విప్రో వరేప్సుం పుత్రజన్మని.

ప్ర. అ. భార్గవః = భృగువంశమునకు చెందిన, చ్యవనో నామ = చ్యవనుడు అను ఋషి, హిమవన్తమ్=హిమవత్పర్వతమును, ఉపాశ్రితః= ఆశ్రయించినాడు. కాళిన్దీ=కాళింది, తం ఋషిమ్ = ఆ ఋషిని, సముపాగమ్య=సమీపించి, అభ్యవాదయత్=నమస్కరించెను. సః విప్రః = ఆ బ్రాహ్మణుడు, పుత్రజన్మని = పుత్రజన్మ విషయమై, వరేప్సుమ్ = వరమును పొంద గోరుచున్న, తామ్= ఆమెను గూర్చి, అభ్యవదత్=పలికెను.

తా. భృగువంశమునకు చెందిన చ్యవనమహర్షి హిమవత్పర్వతముపై నివసించుచుండెను. అసితుని భార్య యైన కాళింది ఆతని దగ్గరకు వెళ్ళి నమస్కరించెను. పుత్రుడు జన్మించ వలె నను వరమును కోరుచున్న ఆమెను చూచి ఆ బ్రాహ్మణుడు ఇట్లు పలికెను. 19

మూ. పుత్రస్తే భవితా దేవి మహాత్మా లోకవిశ్రుతః, 20
ధార్మికశ్చ సుశీలశ్చ వంశకర్తారిసూదనః.

ప్ర. అ. దేవి = ఓ దేవీ, తే = నీకు, మహాత్మా = మహాత్ముడు, లోకవిశ్రుతః=లోకములో ప్రసిద్ధుడు, ధార్మికశ్చ = ధార్మికుడు, సుశీలశ్చ = మంచి

శీలము కలవాడు, వంశకర్తా = వంశమును నిలుపువాడు, అరిసూదనః = శత్రువులను నశింపచేయువాడు, అయిన, పుత్రః = పుత్రుడు, భవితా = పుట్టగలడు.

తా. ఓ దేవి! నీకు మహాత్ముడూ, లోకప్రసిద్ధుడూ, ధార్మికుడూ, ఉత్తమశీలుడూ, వంశోద్ధారకుడూ, శత్రుసంహారకుడూ అయిన, పుత్రుడు పుట్టును. 20

మూ. కృత్వా ప్రదక్షిణం హృష్టా మునిం తమనుమాన్య చ. 21
పద్మపత్రసమానాక్షం పద్మగర్భసమప్రభమ్,
తతస్సా గృహమాగమ్య దేవీ పుత్రం వ్యజాయత. 22

ప్ర. అ. సా దేవీ = ఆ కాళిన్దీదేవి, హృష్టా = సంతోషించినదై, తం మునిమ్=ఆ మునిని, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణముచేసి, అనుమాన్య చ= అనుమతింపచేసి, తతః = పిమ్మట, గృహమ్ = గృహమును గూర్చి, ఆగమ్య= వచ్చి, పద్మపత్రసమానాక్షమ్=పద్మపత్రములతో సమాన మైన నేత్రములు కలవాడు, పద్మగర్భసమప్రభమ్ = బ్రహ్మదేవునివంటి కాంతికలవాడు అయిన, పుత్రమ్ = కుమారుని వ్యజాయత = కనెను.

తా. ఆ కాళిందీ దేవి చాలాసంతోషించి, ఆ చ్యవనమహర్షికి ప్రదక్షిణముచేసి, అతని అనుమతి పొంది, ఇంటికి వచ్చి పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, బ్రహ్మసమాన మైన కాంతి కలవాడూ అయిన కుమారుని కనెను. 22

మూ. సపత్న్యా తు గర స్తస్యై దత్తో గర్భజిఘాంసయా,
గరేణ సహ తేనైవ జాతః స సగరోఽభవత్. 23

ప్ర. అ. సపత్న్యా = సవతిచేత, గర్భజిఘాంసయా = గర్భమును చంపవలె నను కోరికచేత, తస్యై = ఆమెకు, గరః=విషము, దత్తః = ఇవ్వబడినది. తేన=ఆ, గరేణ సహైవ=విషముతోనే, జాతః=పుట్టిన, సః = అతడు, సగరః =సగరుడుగా, అభవత్=ఆయెను.

తా. ఆమె గర్భమును చంపవలె నని ఆమె సవతి విషము పెట్టెను. ఆ పిల్లవాడు విషముతోనే పుట్టుటచేత సగరు డయ్యెను. 23

మూ. స రాజా సగరో నామ యస్సముద్రమఖానయత్,
ఇష్ట్వా పర్వణి వేగేన త్రాసయ న్తమిమాః ప్రజాః. 24

ప్ర. అ. సః=ఆతడు, సగరో నామ రాజా=సగరు డను పేరు గలరాజు, యః=ఎవడు, ఇష్ట్వా=యాగముచేసి, పర్వణి=పర్వమునందు, వేగేన=వేగము చేత, ఇమాః ప్రజాః = ఈ ప్రజలను, త్రాసయన్తమ్ = భయపెట్టుచున్న, సముద్రమ్ = సముద్రమును, అఖానయత్ = త్రవ్వించెనో.

తా. ఆ సగరచక్రవర్తి యజ్ఞము చేసి, యజ్ఞాశ్వమును అన్వేషించు సమయమునందు పర్వములలో పొంగి ప్రజలను భయపెట్టుచున్న సముద్రమును త్రవ్వించెను. 24

మూ. అసమఞ్జస్తు పుత్రోఽభూత్సగర స్యేతి నః శ్రుతమ్,
జీవన్నేవ స పిత్రా తు నిరస్తః పాపకర్మకృత్. 25

ప్ర. అ. అసమఞ్జః = అసమంజుడు, సగరస్య=సగరునియొక్క, పుత్రః = కుమారుడుగా, అభూత్=అయెను, ఇతి = అని, నః = మాకు, శ్రుతమ్ = వినికిడి. పాపకర్మకృత్=పాపకర్మలు చేయు, సః=అతడు, జీవన్నేవ=జీవించియుండగానే, పిత్రా=తండ్రిచేత, నిరస్తః = విడువబడినాడు.

తా. సగరునకు అసమంజు డను పుత్రుడు కలిగెను. ఆతడు పాపకర్మలు చేయుటచే తండ్రి ఆతనిని జీవించియుండగానే పరిత్యజించెను. 25

మూ. అంశుమానితి పుత్రోఽభూదసమఞ్జస్య వీర్యవాన్,
దిలీపోఽంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. 26

ప్ర. అ. అసమఞ్జస్య = అసమంజునకు, వీర్యవాన్ = వీర్యవంతుడైన, అంశుమానితి = అంశుమంతుడు అను, పుత్రః = పుత్రుడు, అభూత్ = కలిగెను. దిలీపః = దిలీపుడు, అంశుమతః = అంశమంతునియొక్క, పుత్రః = పుత్రుడు. భగీరథః=భగీరథుడు, దిలీపస్య=దిలీపుని కుమారుడు.

తా. అసమంజునకు పరాక్రమశాలి యైన అంశుమంతుడు, అంశుమంతునకు దిలీపుడు, దిలీపునకు భగీరథుడు పుట్టిరి. 26

మూ. భగీరథాత్కకుత్స్థస్తు కాకుత్స్థా యేన విశ్రుతాః,
కకుత్స్థస్య చ పుత్రోఽభూద్రఘుర్యేన చ రాఘవాః. 27

ప్ర. అ. భగీరథాత్=భగీరథునినుండి, కకుత్స్థః = కకుత్స్థుడు పుట్టెను, యేన = ఎవనిచేత, కాకుత్స్థాః = కాకుత్స్థు లని, విశ్రుతాః = ప్రసిద్ధి పొందినారో. కకుత్స్థస్య చ = కకుత్స్థునకు, రఘుః = రఘువు, పుత్రః=పుత్రుడుగా, అభూత్ = పుట్టెను, యేన = ఎవనిచేత, రాఘవాః = రాఘవులు అని ప్రసిద్ధు లైనారో.

తా. భగీరథునకు కకుత్స్థు డను పుత్రుడు పుట్టెను. అతనిని బట్టియే మీకు కాకుత్స్థు లని పేరు వచ్చినది. కకుత్స్థునకు రఘు వను పుత్రుడు పుట్టెను. అతనిని బట్టియే మీకు రాఘవు లని పేరు వచ్చినది. 27

మూ. రఘోస్తు పుత్రస్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః,
కల్మాషపాదః సౌదాస ఇత్యేవం ప్రథితో భువి. 28

ప్ర. అ. రఘోః=రఘువుయొక్క, తేజస్వీ=తేజశ్శాలి యైన, పుత్రః= పుత్రుడు, ప్రవృద్ధః = పెరిగినవాడై, పురుషాదకః = పురుషాదకుడు, కల్మాషపాదః=కల్మాషపాదుడు, సౌదాసః = సౌదాసుడు, ఇత్యేవమ్ = ఇట్లు, భువి = భూలోకమునందు, ప్రథితః=ప్రసిద్ధు డయ్యెను.

తా. రఘువు పుత్రుడు తేజశ్శాలి యై, పెరిగి లోకములో పురుషాదకుడు, కల్మాషపాదుడు, సౌదాసుడు అను పేర్లతో ప్రసిద్ధుడయ్యెను. 28

మూ. కల్మాషపాదపుత్రోఽభూచ్ఛఙ్ఖణ స్త్వితి విశ్రుతః,
యస్తు తద్వీర్య మాసాద్య సహసైన్యో వ్యనీనశత్. 29

ప్ర. అ. శఙ్ఖణః=శంఖణుడు, ఇతి=అని, విశ్రుతః=ప్రసిద్ధ మైనవాడు, కల్మాషపాదపుత్రః = కల్మాషపాదుని కుమారుడుగా, అభూత్=అయెను. యః =ఎవడు, తద్వీర్యమ్ = ఆ కల్మాషపాదుని పరాక్రమమును, ఆసాద్య=పొంది, సహసైన్యః = సైన్యసమేతుడై, వ్యనీనశత్=నశించెనో.

తా. కల్మాషపాదుని పుత్రుడు శంఖణుడు. అతడు తండ్రితోనే యుద్ధము చేసి ససైన్యముగా నశించెను. 29

మూ. శఙ్ఖణస్య చ పుత్రోఽభూచ్ఛూరః శ్రీమాన్ సుదర్శనః,
సుదర్శనస్యాగ్నివర్ణః అగ్నివర్ణస్య శీఘ్రగః. 30

శీఘ్రగస్య మరుః పుత్రో మరోః పుత్రః ప్రశుశ్రువః,
ప్రశుశ్రువస్య పుత్రోఽభూదమ్బరీషో మహాద్యుతిః. 31

అమ్బరీషస్య పుత్రోఽభూన్నహుషః సత్యవిక్రమః,
నహుషస్య చ నాభాగః పుత్రః పరమధార్మికః. 32

అజశ్చ సువ్రతశ్చైవ నాభాగస్య సుతావుభౌ,
అజస్యైవ చ ధర్మాత్మా రాజా దశరథస్సుతః. 33

ప్ర. అ. శఙ్ఖణస్య=శంఖణునకు, శ్రీమాన్ = శ్రీమంతుడైన, సుదర్శనః =సుదర్శను డను, పుత్రః=పుత్రుడు, సుదర్శనస్య = సుదర్శునకు, అగ్నివర్ణః = అగ్నివర్ణుడు, అగ్నివర్ణస్య = అగ్నివర్ణునకు, శీఘ్రగః=శీఘ్రగుడు, పుట్టెను. శీఘ్రగస్య = శీఘ్రగునియొక్క, పుత్రః = పుత్రుడు, మరుః = మరువు. మరోః= మరువుయొక్క. పుత్రః = పుత్రుడు, ప్రశుశ్రువః=ప్రశుశ్రువుడు. ప్రశుశ్రువస్య = ప్రశుశ్రువునకు, మహాద్యుతిః = గొప్ప కాంతి గల, అమ్బరీషః = అంబరీషు డను, పుత్రః = పుత్రుడు, అభూత్ = పుట్టెను. అమ్బరీషస్య = అంబరీషునకు, సత్యవిక్రమః = సత్యమైన పరాక్రమము గల. నహుషః = నహుషుడు, పుత్రః = పుత్రుడుగా, అభూత్ = పుట్టెను. నహుషస్య = నహుషునకు. పరమధార్మికః = మిక్కిలి ధార్మికు డైన, నాభాగః = నాభాగుడు. పుత్రః = పుత్రుడు. నాభాగస్య=నాభాగునకు, అజశ్చ=అజుడు, సువ్రతశ్చైవ = సువ్రతుడు అను, ఉభౌ = ఇద్దరు, సుతౌ = కుమారులు. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, రాజా దశరథః = దశరథమహారాజు, అజస్యైవ = అజునియొక్కయే, సుతః = కుమారుడు.

తా. శంఖణుని కుమారుడు, శ్రీమంతుడు శూరుడు అయిన సుదర్శనుడు. ఆతని కుమారుడు అగ్నివర్ణుడు. ఆతని కుమారుడు శీఘ్రగుడు. ఆతని కుమారుడు మరువు. ఆతని కుమారుడు ప్రశుశ్రువుడు, ఆతని కుమారుడు మహాకాంతిశాలి యైన అంబరీషుడు. ఆతని కుమారుడు సత్యవిక్రము డైన నహుషుడు. ఆతని కుమారుడు పరమధార్మికు డైన నాభాగుడు. నాభాగునకు అజుడు, సువ్రతుడు అను ఇద్దరు కుమారులు. ధర్మాత్ము డైన దశరథమహారాజు అజుని కుమారుడే.

మూ. తస్య జ్యేష్ఠోఽసి దాయాదో రామ ఇత్యభివిశ్రుతః,
తద్గృహాణ స్వకం రాజ్యమవేక్షస్వ జనం నృప. 34

ప్ర. అ. రామ ఇతి = రాముడు అని, అభివిశ్రుతః = ప్రసిద్ధుడ వైన నీవు, తస్య = ఆ దశరథమహారాజుయొక్క, దాయాదః = దాయమును అనుభవించ వలసిన, జ్యేష్ఠః = జ్యేష్ఠపుత్రు డవు, అసి = అయి ఉన్నావు. నృపః = ఓ రాజా తత్ = ఆ కారణమువలన, స్వకమ్ = నీకు సంబంధించిన, రాజ్యమ్ = రాజ్య. మును, గృహాణ = గ్రహించుము. జనమ్ = జనమును, అవేక్షస్వ = చూచు కొనుము.

తా. రాము డను ప్రసిద్ధనామధేయము గల నీవు ఆ దశరథుని జ్యేష్ఠ కుమారుడవు. అతని రాజ్యముపై అధికారము కలవాడవు. అందుచేత ఓ రాజా! నీ రాజ్యమును నీవు గ్రహించి ప్రజలను పాలింపుము. 34

మూ. ఇక్ష్వాకూణాం హి సర్వేషాం రాజా భవతి పూర్వజః,
పూర్వజే నావరః పుత్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే. 35

ప్ర. అ. సర్వేషామ్ = సమస్త మైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశము నందు పుట్టినవారిలో, పూర్వజః = జ్యేష్ఠుడే, రాజా = రాజుగా, భవతి = అగు చున్నాడు. పూర్వజే = పెద్దవాడు ఉండగా, అవరః = చిన్నవాడు, న = రాజు కాడు. జ్యేష్ఠః పుత్రః = జ్యేష్ఠపుత్రుడే. రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్యతే = అభిషేకింపబడును.

తా. ఇక్ష్వాకువంశీయులలో జ్యేష్ఠపుత్రుడే రాజగును. జ్యేష్ఠు డుండగా, చిన్నవాడు రాజు కాడు. జ్యేష్ఠుడే రాజ్యాభిషిక్తు డగును. 35

మూ. స రాఘవాణాం కులధర్మమాత్మనః
సనాతనం నాద్య విహన్తుమర్హసి,
ప్రభూతరత్నామనుశాధి మేదినీం
ప్రభూతరాష్ట్రాం పితృవన్మహాయశః. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
దశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తికలవాడా! సః = అట్టి నీవు, ఆత్మనః = నీయొక్క, రాఘవాణామ్ = రఘువంశమునందు పుట్టినవారియొక్క, సనాతనమ్

=అతిప్రాచీన మైన, కులధర్మమ్ = కులధర్మమును, అద్య = ఇపుడు, విహాతుమ్ = చెరచుటకు, నార్హసి = తగవు. ప్రభూతరత్నామ్ = అధిక మైన రత్నములు కలది, ప్రభూతరాష్ట్రామ్ = విశాల మైన రాష్ట్రము కలదీ యైన, మేదినీమ్ = భూమిని, పితృవత్ = తండ్రివలె, అనుశాధి = పాలింపుము.

తా. గొప్ప కీర్తి గల ఓ రామా! నీవు ఇపుడు అతిప్రాచీన మైన రఘు వంశీయుల ఆ కులధర్మమును చెరచవద్దు. అధిక మైన రత్నములు, విశాలము లైన రాష్ట్రములు గల ఈ భూమిని, నీ తండ్రివలెనే పరిపాలించుము. 36

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటపదవ సర్గ సమాప్తము.

## అథ ఏకాదశోత్తరశతతమః సర్గః

[వసిష్ఠుడు నచ్చజెలికినను రాముడు తండ్రియాజ్ఞ మీర దలంచక పోవుట చూచి భరతుడు ప్రాయోపవేశమునకు సిద్ధపడుట. రాము డత నికి నచ్చజెప్పి అయోధ్యకు మరలిపొమ్మని ఆజ్ఞాపించుట.]

మూ. వసిష్ఠస్తు తదా రామముక్త్వా రాజపురోహితః,
అబ్రవీద్ధర్మసంయుక్తం పునరేవాపరం వచః. 1

ప్ర. అ. రాజపురోహితః = రాజపురోహితు డైన, వసిష్ఠస్తు = వసిష్ఠుడు, తదా = అపుడు, రామమ్ = రాముని గూర్చి, ఉక్త్వా = పలికి, పునరేవ = మరల, ధర్మసంయుక్తమ్ = ధర్మముతో కూడిన, అపరం వచః = మరి యొక వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాజపురోహితు డైన వసిష్ఠుడు, రామునితో ఇట్లు పలికి, మరల ధర్మ సంయుక్త మైన మాట లిట్లు చెప్పెను. 1

మూ. పురుషస్య హి జాతస్య భవన్తి గురవస్త్రయః,
ఆచార్యశ్చైవ కాకుత్స్థ పితా మాతా చ రాఘవ. 2

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు పుట్టినవాడా ! రాఘవ = ఓ రామా ! జాతస్య = పుట్టిన, పురుషస్య = పురుషునకు, ఆచార్యశ్చైవ = ఆచార్యుడు, పితా = తండ్రి, మాతా చ = తల్లి అను, త్రయః = ముగ్గురు, గురవః = గురువులు, భవన్తి = అగుచున్నారు.

తా. ఓ రామా ! జన్మించిన ప్రతి పురుషునకును, ఆచార్యుడు, తండ్రి, తల్లి, అను ముగ్గురు గురువులు ఉందురు. 2

మూ. పితా హ్యేనం జనయతి పురుషం పురుషర్షభ,
ప్రజ్ఞాం దదాతి చాచార్యస్తస్మాత్స గురురుచ్యతే. 3

ప్ర. అ. పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా, ఏనం పురుషమ్ = ఈ పురుషుని, పితా = తండ్రి, జనయతి హి = పుట్టించును కదా? ఆచార్యః = ఆచార్యుడు, ప్రజ్ఞామ్ = బుద్ధిని, దదాతి = ఇచ్చును. తస్మాత్ = ఆ కారణమువలన, సః = ఆచార్యుడు, గురుః = గురువుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! తండ్రి పురుషుని పుట్టించును. ఆచార్యుడు ఆతనికి జ్ఞానమును ఇచ్చును. అందుచే అతడు గురు వగుచున్నాడు. 3

మూ. సోఽహం తే పితురాచార్య స్తవ చైవ పరంతప,
మమ త్వం వచనం కుర్వన్ నాతివర్తేః సతాం గతిమ్ 4

ప్ర అ. సః అహమ్ = అట్టి నేను, తే పితుః = నీతండ్రికి, తవ చైవ = నీకును, ఆచార్యః = ఆచార్యుడను. పరంతప = శత్రువులను పీడించువాడా, త్వమ్ = నీవు, మమ = నాయొక్క, వచనమ్ = వచనమును, కుర్వన్ = చేయుచు, సతామ్ = సత్పురుషులయొక్క, గతిమ్ = మార్గమును, నాతివర్తేః = అతిక్రమించవు.

తా. ఓ శత్రుసంహారకుడ వైన రామా! నేను నీ తండ్రికి నీకు కూడ ఆచార్యుడను. నీవు నేను చెప్పి నట్లు చేసినచో, సత్పురుషుల మార్గమును అతిక్రమించినవాడవు కావు. 4

మూ. ఇమా హి తే పరిషదః శ్రేణయశ్చ ద్విజా స్తథా,
ఏషు తాత చరన్ ధర్మం నాతివర్తేః సతాం గతిమ్. 5

ప్ర అ. తాత! = ఓ తండ్రీ, ఇమాః = ఈ, పరిషదః = పరిషత్తులు, శ్రేణయశ్చ = వర్తకులు మొదలగువారి శ్రేణులు, తథా = మరియు, ద్విజాః = ద్విజులు, తే హి = నీవారు కదా? ఏషు = వీరివిషయములో, ధర్మమ్ = ధర్మమును, చరన్ = ఆచరించుచున్నవాడవై, సతామ్ = సత్పురుషులయొక్క, గతిమ్ = మార్గమును, నాతివర్తేః = అతిక్రమింపవు.

తా. ఈ పండితపరిషత్తులు, శ్రేణులు, ద్విజులు, వీ రందరు నీవారు. వీరి విషయమున నీవు పాలనారూప మైన ధర్మము ఆచరించినచో సత్పురుషుల మార్గమును అతిక్రమించినవాడవు కావు. 5

మూ. వృద్ధాయా ధర్మశీలాయా మాతుర్నార్హస్యవర్తితుమ్,
అస్యాస్తు వచనం కుర్వన్నాతివర్తేస్సతాం గతిమ్. 6

ప్ర. అ. వృద్ధాయాః = వృద్ధురాలు, ధర్మశీలాయాః = ధర్మస్వభావము కలదీ యైన, మాతుః = తల్లికి, అవర్తితుమ్ = శుశ్రూష చేయకుండుటకు, నార్హసి = తగవు. అస్యాః = ఈమెయొక్క, వచనమ్ = వచనమును, కుర్వన్ = చేయుచున్నవాడవై, సతామ్ = సత్పురుషులయొక్క, గతిమ్ = మార్గమును, నాతివర్తేః = అతిక్రమించినవాడవు కావు.

తా. నీవు వృద్ధురాలు, ధర్మము చేయు స్వభావము కలదీ అయిన తల్లికి శుశ్రూష చేయకుండగా ఉండరాదు. ఈమె చెప్పినట్లు ఆచరించినచో నీవు సత్పురుషుల మార్గమును అతిక్రమించి నట్లు కాదు. 6

మూ. భరతస్య వచః కుర్వన్ యాచమానస్య రాఘవ,
ఆత్మానం నాతివర్తేస్త్వం సత్యధర్మపరాక్రమ. 7

ప్ర. అ. సత్యధర్మపరాక్రమ = సత్యమైన ధర్మము, పరాక్రమము కలవాడా, రాఘవ = ఓ రాముడా! త్వమ్ = నీవు, యాచమానస్య = ప్రార్థించుచున్న, భరతస్య = భరతునియొక్క, వచః = వచనమును, కుర్వన్ = చేయుచు. ఆత్మానమ్ = నిన్ను (నీ ధర్మమును), నాతివర్తేః = అతిక్రమించవు.

తా. సత్యమైన ధర్మపరాక్రమములు గల ఓ రామా! ఈ విధముగా ప్రార్థించుచున్న భరతుని మాటలు అంగీకరించినచో నీవు స్వధర్మమును అతిక్రమించి నట్లు కాదు. 7

మూ. ఏవం మధురముక్తస్సన్ గురుణా రాఘవః స్వయమ్,
ప్రత్యువాచ సమాసీనం వసిష్ఠం పురుషర్షభః. 8

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, రాఘవః = రాముడు, గురుణా = గురువుచేత, స్వయమ్ = స్వయముగా, ఏవమ్ = ఇట్లు, మధురమ్ = మధురముగా, ఉక్తస్సన్ = పలుకబడినవాడై, సమాసీనమ్ = కూర్చొని ఉన్న, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు, గురువైన వసిష్ఠుడు స్వయముగా

చెప్పిన మధుర మైన మాటలు విని, తన ప్రక్కనె కూర్చొని ఉన్న [illegible]తో ఇట్లనెను.

మూ. యన్మాతాపితరౌ వృత్తం తనయే కురుతః సదా,
న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్ ।
యథాశక్తి ప్రదానేన స్వాపనోచ్ఛాదనేన చ.
నిత్యం చ ప్రియవాదేన తథా సంవర్ధనేన చ.

ప్ర. అ. మాతాపితరౌ = తల్లిదండ్రులు, తనయే = కుమారుని విషయమున, సదా = ఎల్లపుడు, యత్ = ఏ, వృత్తమ్ = ప్రవృత్తిని, కురుతః = చేయుదురో, యథాశక్తిప్రదానేన = యథాశక్తిగా ఇచ్చుటచేతను, స్వాపనోచ్ఛాదనేన చ = నిద్రింపచేయుటచేతను, నలుగుపెట్టి స్నానము చేయించుటచేతను, నిత్యం చ = ఎల్లపుడు, ప్రియవాదేన = ప్రియ మైన మాటలచేతను, తథా = [illegible], సంవర్ధనేన చ = పెంచుటచేతను, మాత్రా = తల్లిచేత, పిత్రా చ = తండ్రిచేత, యత్ = ఏది, కృతమ్ = చేయబడినదో, తత్తు = అదైతే, న సుప్రతికరమ్ = సులభముగా బదులుచేయ శక్యము గాదు.

తా. తల్లిదండ్రులు పుత్రుని విషయమున ఎల్లపుడు ఏ విధముగా ప్రవర్తించుచుందురో దానికిని, యథాశక్తిగా ఆ యా వస్తువులను ఇచ్చి, నిద్రపుచ్చుచు స్నానాదులు చేయించుచు, నిత్యము మంచిమాటలు చెప్పుచు, పెంచు తల్లి, తండ్రీ ఏ ఉపకారము చేయుదురో దానికిని ప్రత్యుపకారము చేయుట శక్యమైన పనికాదు.

మూ. స హి రాజా జనయితా పితా దశరథో మమ,
ఆజ్ఞాతం యన్మయా తస్య న తన్మిథ్యా భవిష్యతి.

ప్ర. అ. మమ = నాయొక్క, పితా = తండ్రి యైన, సః = ఆ, రాజా దశరథః = దశరథమహారాజు, జనయితా హి = నాకు జన్మ నిచ్చినవాడు కదా! మయా = నాచేత, తస్య = ఆతనికి, యత్ = ఏది, ఆజ్ఞాతం = ప్రతిజ్ఞ చేయబడినదో, తత్ = అది, మిథ్యా = అసత్యము, న భవిష్యతి = కాదు.

తా. మా తండ్రి యైన దశరథమహారాజు నాకు జన్మ ఇచ్చినవాడు. ఆయన ఎదుట నేను చేసిన ప్రతిజ్ఞ వ్యర్థము కారాదు.

మూ. ఏవముక్తస్తు రామేణ భరతః ప్రత్యనన్తరమ్,
ఉవాచ పరమోదారః సూతం పరమదుర్మనాః. 12

ప్ర. అ. పరమోదారః = మిక్కిలి ఉదారుడైన, భరతః = భరతుడు, రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడినవాడై, పరమ దుర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్నవాడై, ప్రత్యనన్తరం = సమీపమునందే ఉన్న, సూతమ్ = సుమంత్రుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. గొప్ప ఔదార్యవంతుడైన భరతుడు రాముని మాటలు విని, చాలా దుఃఖించుచు, దగ్గరనే ఉన్న సుమంత్రునితో ఇట్లనెను. 12

మూ. ఇహ మే స్థణ్డిలే శీఘ్రం కుశానాస్తర సారథే,
ఆర్యమ్ప్రత్యుపవేక్ష్యామి యావన్మే న ప్రసీదతి. 13

ప్ర. అ. సారథే = ఓ సారథీ! మే = నాకు, ఇహ = ఇక్కడ, స్థణ్డిలే = నేలపై, శీఘ్రమ్ = శీఘ్రముగా, కుశాన్ = కుశలను, ఆస్తర = పరచుము. యావత్ = ఎంతవరకు, మే = నాకు, న ప్రసీదతి = ప్రసన్నుడు కాడో అంతవరకు, ఆర్యమ్ = పూజ్యుడైన అన్నగారిని, ప్రత్యుపవేక్ష్యామి = అడ్డగించుచు కూర్చుండెదను.

తా. ఓ సుమంత్రా! ఇక్కడ నేలపై వెంటనే కుశలను పరచుము. నా విషయమున ప్రసన్నుడగునంతవరకు అన్నగారిని అడ్డగించి, ఇక్కడ పరుండెదను. 13

మూ. అనాహారో నిరాలోకో ధనహీనో యథా ద్విజః,
శేష్యే పురస్తాచ్ఛాలాయా యావన్న ప్రతియాస్యతి. 14

ప్ర. అ. ధనహీనః = ధనహీనుడైన, ద్విజః యథా = బ్రాహ్మణుడు వలె, అనాహారః = ఆహారము లేనివాడనై, నిరాలోకః = వెలుతురు లేనివాడనై, శాలాయాః = పర్ణశాలయొక్క, పురస్తాత్ = ఎదుట, యావత్ = ఎంతవరకు, న ప్రతి యాస్యతి = తిరిగి వెళ్ళడో అంతవరకు, శేష్యే = శయనించెదను.

తా. ధనహీనుడైన బ్రాహ్మణుడు వలె ఆహారము తీసుకొనక, వెలుతురు చూడక, ఈ పర్ణశాలముందు రాముడు తిరిగి వచ్చునంతవరకు శయనించెదను.

మూ. స తు రామమవేక్షన్తం సుమన్త్రం ప్రేక్ష్య దుర్మనాః,
కుశోత్తరముపస్థాప్య భూమావేవాస్తరత్స్వయమ్. 15

ప్ర. అ. దుర్మనాః = దుఃఖితుడైన, స తు = ఆ భరతుడు, రామమ్ = రాముని, అవేక్షన్తమ్ = చూచుచున్న, సుమన్త్రమ్ = సుమంత్రుణ్ణి, ప్రేక్ష్య = చూచి, స్వయమేవ = స్వయముగానే, కుశోత్తరమ్ = కుశాస్తరణమును, ఉపస్థాప్య = తీసికొని వచ్చి, భూమౌ = నేలపై, ఆస్తరత్ = పరిచెను.

తా. దుఃఖితుడైన ఆ భరతుడు, రాముని ఆజ్ఞకై అతనిని చూచుచున్న సుమంత్రునిచూచి స్వయముగానే కుశాస్తరణము తీసుకొనివచ్చి నేలపై పరచెను.

మూ. తమువాచ మహాతేజా రామో రాజర్షిసత్తమః,
కిం మాం భరత కుర్వాణం తాత ప్రత్యుపవేక్ష్యసి. 16

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రాజర్షిసత్తమః = రాజర్షులలో శ్రేష్ఠుడైన, రామః = రాముడు, తమ్ = అతనిని గూర్చి, ఉవాచ = పలికెను. తాత! = తండ్రీ! భరత = భరతుడా, కిం కుర్వాణమ్ = ఏమి చేయుచున్న, మామ్ = నన్ను ఉద్దేశించి, ప్రత్యుపవేక్ష్యసి = అడ్డగించుచు శయనించెదవు?

తా. మహాతేజశ్శాలీ, రాజర్షులలో శ్రేష్ఠుడూ అయిన రాముడు అతనితో ఇట్లనెను. నాయనా! భరతా! నేను ఏమి చెడ్డ పని చేసితి నని నీవు ఇట్లు అడ్డముగా శయనించెదవు. 16

మూ. బ్రాహ్మణో హ్యేకపార్శ్వేన నరాన్ రోద్ధుమిహార్హతి,
న తు మూర్ధాభిషిక్తానాం విధిః ప్రత్యుపవేశనే. 17

ప్ర. అ. బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఏకపార్శ్వేన = ఒక పార్శ్వమున శయనించుటచేత, నరాన్ = నరులను, ఇహ = ఈ లోకమున, రోద్ధుమ్ = అడ్డుకొనుటకు, అర్హతి హి = తగి ఉన్నాడు కదా! మూర్ధాభిషిక్తానాం తు = క్షత్రియుల కైతే, ప్రత్యుపవేశనే = అడ్డగించి పరుండుటయందు, విధిః = విధి, న = లేదు.

తా. తనవద్ద అప్పు తీసుకొని ఎగగొట్టచూచుచున్న వారిని అడ్డగించు

టకై బ్రాహ్మణుడు ఒకప్రక్క శయనించవచ్చును గాని, ఈ విధముగా ప్రత్యవ వేశనము చేయుట క్షత్రియులకు విధింపబడలేదు. 17

మూ. ఉత్తిష్ఠ నరశార్దూల హిత్వైతద్దారుణం వ్రతమ్,
పురవర్యామితః క్షిప్రమయోధ్యాం యాహి రాఘవ. 18

ప్ర. అ. నరశార్దూల! = నరులలో శ్రేష్ఠుడా! రాఘవ = భరతుడా! ఏతత్ = ఈ, దారుణమ్ = దారుణ మైన, వ్రతమ్ = వ్రతమును, హిత్వా = విడచి, ఉత్తిష్ఠ = లెమ్ము. ఇతః = ఇక్కడినుండి, క్షిప్రమ్ = శీఘ్రముగా, పురవర్యామ్ = పట్టణములలో శ్రేష్ఠ మైన, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, యాహి = వెళ్ళుము.

తా. పురుషశ్రేష్ఠుడ వైన ఓ భరతా! దారుణ మైన ఈ వ్రతమును విడిచి వెంటనే పురములలో శ్రేష్ఠ మైన అయోధ్యకు వెళ్ళుము. 18

మూ. ఆసీనస్త్వేవ భరతః పౌరజానపదం జనమ్,
ఉవాచ సర్వతః ప్రేక్ష్య కిమార్యం నానుశాసథ. 19

ప్ర. అ. భరతః = భరతుడు, ఆసీనస్త్వేవ = కూర్చున్నవా డగుచునే, పౌరజానపదమ్ = పౌరులు, జానపదులు అయిన, జనమ్ = జనమును, సర్వతః = నలు వైపుల, ప్రేక్ష్య = చూచి, ఆర్యమ్ = పూజ్యు డైన అన్నగారిని, కిమ్ = ఎందుచేత, నానుశాసథ = శాశింపరు అని, ఉవాచ = పలికెను.

తా. భరతు డా విధముగా కూర్చుండియే, అక్కడఉన్న పౌరులను, జానపదులను అందరిని చూచి, మీరు అన్నగారికి ఏమియు చెప్పుటలేదేమి? అని ప్రశ్నించెను. 19

మూ. తే తమూచుర్మహాత్మానం పౌరజానపదా జనాః,
కాకుత్స్థమభిజానీమో సమ్యగ్వదతి రాఘవః. 20

ప్ర. అ. పౌరజానపదాః = పురములందు, గ్రామములందు నివసించు, తే జనాః = ఆ జనులు, మహాత్మానమ్ = మహాత్ము డైన, తమ్ = ఆ భరతుని గూర్చి, ఊచుః = పలికిరి. కాకుత్స్థమ్ = రాముని గూర్చి, అభిజానీయః = బాగుగ ఎరుగుదము. రాఘవః = రాముడు, సమ్యక్ = యుక్తముగా, వదతి = చెప్పుచున్నాడు.

తా. ఆ పౌర జానపదలు మహాత్ము డైన భరతునితో ఇట్లనిరి. రాముని గూర్చి మాకు బాగుగా తెలియును. రాముడు చెప్పునది యుక్తముగా ఉన్నది.

మూ. ఏషోఽపి హి మహాభాగః పితుర్వచసి తిష్ఠతి,
అత ఏవ న శక్తాః స్మో వ్యావర్తయితుమఞ్జసా. 21

ప్ర. అ. ఏషః = ఈ, మహాభాగః = మహాభాగ్యవంతు డైన రాముడు, పితుః = తండ్రియొక్క, వచసి = వాక్యమునందు, తిష్ఠతి హి = నిలిచి ఉన్నాడు కదా? అత ఏవ = ఆ కారణమువలననే, అఞ్జసా = శీఘ్రముగా, వ్యావర్తయితుమ్ = వెనుకకు మరలించుటకు, శక్తాః = సమర్థులము, న స్మః = కాజాల కున్నాము.

తా. మహాభాగ్యశాలి యైన ఈ రాముడు తండ్రిమాటపై నిలబడియున్నాడు. అందుచేతనే మేము ఈతనిని మరలింపజాలకున్నాము. 21

మూ. తేషామాజ్ఞాయ వచనం రామో వచనమబ్రవీత్,
ఏవం నిబోధ వచనం సుహృదాం ధర్మచక్షుషామ్. 22

ప్ర. అ. రామః = రాముడు, తేషామ్ = వారియొక్క, వచనమ్ = మాటను, ఆజ్ఞాయ = తెలుసుకొని, వచనమ్ = మాటను, అబ్రవీత్ = పలికెను. ధర్మచక్షుషామ్ = ధర్మమునందు దృష్టి గల, సుహృదామ్ = స్నేహితులయొక్క, ఏవమ్ = ఇట్లు, వచనమ్ = మాటను, నిబోధ = తెలుసుకొనుము.

తా. వారి మాటలు విని రాము డిట్లు పలికెను. ధర్మ దృష్టి గల మన మిత్రులు చెప్పుచున్న మాట వినుము. 22

మూ. ఏతచ్చైవోభయం శ్రుత్వా సమ్యక్ సమ్పశ్య రాఘవ,
ఉత్తిష్ఠ త్వం మహాబాహో మాం చ స్పృశ తథోదకమ్.

ప్ర. అ మహాబాహో = గొప్ప బాహువులు గల, రాఘవ = భరతుడా! ఏతత్ = ఈ, ఉభయం చైవ = రెండింటిని, శ్రుత్వా = విని, సమ్యక్ = బాగుగా, సమ్పశ్య = ఆలోచించి, త్వమ్ = నీవు, ఉత్తిష్ఠ = లెమ్ము. మాం చ = నన్ను, తథా = మరియు, ఉదకమ్ = ఉదకమును, స్పృశ = స్పృశించుము.

తా. మహాబాహు వైన ఓ భరతా: నా మాటలు, వీరి మాటలు చక్కగా ఆలోచించి లెమ్ము. నన్నూ, ఉదకమునూ స్పృశించుము. 23

మూ. అథోత్థాయ జలం స్పృష్ట్వా భరతో వాక్యమబ్రవీత్,
శృణ్వన్తు మే పరిషదః మన్త్రిణః శ్రేణయస్తథా. 24

ప్ర. అ. అథ=పిమ్మట, భరతః=భరతుడు, ఉత్థాయ = లేచి, జలమ్ = ఉదకమును, స్పృష్ట్వా = స్పృశించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. పరిషదః=విద్వత్పరిషత్తులు, మన్త్రిణః=మంత్రులు, తథా=మరియు, శ్రేణయః = వర్తకులు మొదలగువారి శ్రేణులు, మే = నామాటను, శృణ్వన్తు = వినెదరు గాక!

తా. పిమ్మట భరతుడు లేచి, ఆచమనము చేసి ఇట్లు పలికెను. విద్వత్పరిషత్తులు, మంత్రులు, శ్రేణులు, నే జెప్పు మాటలు విందురు గాక! 24

మూ. న యాచే పితరం రాజ్యం నానుశాసామి మాతరమ్,
ఆర్యం పరమధర్మజ్ఞం నానుజానామి రాఘవమ్. 25

ప్ర. అ. పితరమ్ = తండ్రిని, రాజ్యమ్ = రాజ్యమును, న యాచే = అడుగలేదు. మాతరమ్ = తల్లిని, నానుశాసామి = ప్రేరేపించలేదు. పరమధర్మజ్ఞమ్ = గొప్ప ధర్మవేత్త యైన, ఆర్యమ్=పూజ్యుడైన, రాఘవమ్ = రాముని, నానుజానామి = అనుమతించలేదు.

తా. నే నెన్నడు నాకు రాజ్యము ఇమ్మని తండ్రిని అడగలేదు. రాజ్యము వచ్చునట్లు చేయుమని నా తల్లిని ప్రేరేపించలేదు. పరమధర్మవేత్తా, పూజ్యుడూ అయిన రాముడు అరణ్యమునకు వెళ్ళవలెనని నేను ఎన్నడును సమర్థించలేదు. 25

మూ. యది త్వవశ్యం వస్తవ్యం కర్తవ్యం చ పితుర్వచః,
అహమేవ నివత్స్యామి చతుర్దశ సమా వనే. 26

ప్ర. అ. అవశ్యమ్=తప్పకుండగా, వస్తవ్యం యది=అడవిలో ఉండవలసి నట్లైతే, పితుః=తండ్రియొక్క, వచః=వాక్యము, కర్తవ్యం చ=చేయదగినదైతే, అహమేవ=నేనే, చతుర్దశ సమాః=పదునాలుగు సంవత్సరములు, వనే =వనమునందు, నివత్స్యామి=నివసించెదను.

తా. తండ్రి మాట ప్రకారము తప్పక అరణ్యములో నివసింపవలసి ఉన్నచో, నేనే పదునాలుగు సంవత్సరములు అరణ్యములో నివసించెదను.

మూ. ధర్మాత్మా తస్య తథ్యేన భ్రాతుర్వాక్యేన విస్మితః,
ఉవాచ రామః సంప్రేక్ష్య పౌరజానపదం జనమ్.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, రామః = రాముడు, తస్య = ఆ, భ్రాతుః = సోదరునియొక్క, తథ్యేన = సత్య మైన, వాక్యేన = వాక్యము చేత, విస్మితః = ఆశ్చర్య పడినవాడై, పౌరజానపదమ్ = పురములకు గ్రామము సంబంధించిన, జనమ్ = జనమును, సంప్రేక్ష్య = చూచి, ఉవాచ = పలికెను.

తా. ధర్మాత్ము డైన రాముడు తన తమ్ముడు దృఢనిశ్చయముతో పలికిన ఆ మాటలు విని ఆశ్చర్యపడుచు పౌరులను జానపదులను చూచి ఇట్లనెను.

మూ. విక్రీతమాహితం క్రీతం యత్పిత్రా జీవతా మమ,
న తల్లోపయితుం శక్యం మయా వా భరతేన వా.

ప్ర. అ. మమ = నాయొక్క, జీవతా = జీవించియున్న, పిత్రా = తండ్రి చేత, యత్ = ఏది, విక్రీతమ్ = అమ్మబడినదో, ఆహితమ్ = కుదువపెట్టబడినదో, క్రీతమ్ = కొనబడినదో, తత్ = దానిని, లోపయితుం = లోపింపచేయుటకు, మయా వా = నాచేత గాని, భరతేన వా = భరతునిచేత గాని, న శక్యమ్ = శక్యము కాదు.

తా. మా తండ్రిగారు జీవించి యుండగా చేసిన అమ్మకము, కుదువ బెట్టుట, కొనుట మొదలైన వ్యాపారమును నేను గాని, భరతుడు గాని మార్చుటకు వీలు లేదు. 28

మూ. ఉపధిర్న మయా కార్యో వనవాసే జుగుప్సితః,
యుక్తముక్తం చ కైకేయ్యా పిత్రా మే సుకృతం కృతమ్.

ప్ర. అ. మయా = నాచేత, వనవాసే = అరణ్యవాసవిషయమున, జుగుప్సితః = నిందిత మైన, ఉపధిః = ప్రతినిధిని ఉంచుట, న కార్యః = చేయదగినది కాదు. కైకేయ్యా = కైకేయిచేత, యుక్తమ్ = యుక్త మైన వాక్యమే,

ఉక్తమ్ = పలుకబడినది. మే పిత్రా = నా తండ్రిచేత, సుకృతమ్=మంచి పని, కృతమ్ = చేయబడినది.

తా. వనవాసము విషయమున నాకు బదులు మరొకరిని ప్రతినిధిగా పంపుట అనునది చాలా జుగుప్సిత మైనపని. కైకేయి రాజ్యమును ఇమ్మని కోరుట యుక్తమే. తండ్రి చేసిన పని కూడ యుక్తమే. 29

మూ. జానామి భరతం క్షాన్తం గురుసత్కారకారిణమ్,
సర్వమేవాత్ర కల్యాణం సత్యసంధే మహాత్మని. 30

ప్ర. అ. భరతమ్ = భరతుని, క్షాన్తమ్ = ఓర్పు కలవానిని గాను, గురుసత్కారకారిణమ్ = పెద్దల పూజ చేయువానిని గాను, జానామి = ఎరుగుదును. సత్యసంధే = సత్యప్రతిజ్ఞ గల, మహాత్మని = మహాత్ము డైన, అత్ర = ఈ భరతుని విషయమున, సర్వమేవ = అంతయు, కల్యాణమ్ = మంగళముగా కాగలదు.

తా. భరతుడు ఓర్పు గలవాడు, పెద్దలను పూజించువాడు అని నాకు తెలియును. సత్యసంధుడు మహాత్ముడు అయిన ఈ భరతునకు సమస్తము మంగళకరము అగును. 30

మూ. అనేన ధర్మశీలేన వనాత్ప్రత్యాగతః పునః,
భ్రాత్రా సహ భవిష్యామి పృథివ్యాః పతిరుత్తమః. 31

ప్ర. అ. వనాత్ = వనమునుండి, పునః = మరల, ప్రత్యాగతః = తిరిగి వచ్చిన వాడనై, ధర్మశీలేన = ధర్మస్వభావము గల, అనేన భ్రాత్రా సహ = ఈ సోదరునితో గూడ, పృథివ్యాః = భూమికి, ఉత్తమః = శ్రేష్ఠు డైన, పతిః = ప్రభువుగా, భవిష్యామి=కాగలను.

తా. నేను వనమునుండి తిరిగి వచ్చి, ధర్మశీలు డైన ఈ సోదరునితో కలిసి భూమిని పాలించెదను. 31

మూ. వృతో హి రాజా కైకేయ్యా మయా తద్వచనం కృతమ్,
అనృతాన్మోచయానేన పితరం తం మహీపతిమ్. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకాదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. రాజా = దశరథమహారాజు, కైకేయ్యా = కైకేయిచేత, వృతో హి = కోరబడినాడు కదా? మయా = నాచేత, తద్వచనం = ఆ రాజు వచనము, కృతమ్ = చేయబడినది. అనేన = ఈ కారణముచేత, మహీపతిమ్ = రాజైన, తం పితరమ్ = ఆ తండ్రిని, అనృతాత్ = అసత్యమునుండి, మోచయ = విడిపించుము.

తా. కైకేయి దశరథమహారాజును కోరెను. నేను ఆయన చెప్పినట్లు వనవాసము చేయుచున్నాను. అందుచేత నీవు కూడ రాజ్యమును అంగీకరించి మహారాజైన తండ్రికి అసత్యదోషము కలగకుండునట్లు చేయుము. 32

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమున
అయోధ్యాకాండలో నూటపదకొండవ సర్గ సమాప్తము.

# అథ ద్వాదశోత్తరశతతమ సర్గః

[రామునాజ్ఞ చొప్పున భరతుని మరలి పొమ్మని మునులు సూచించుట. భరతుడు మరల రాముని పాదములపై బడి రమ్మని ప్రార్థించుట. రాముడతనికి నచ్చజెప్పి, తన పాదుకల నొసగి వారిని పోయి రండనుట.]

మూ. తమప్రతిమతేజోభ్యాం భ్రాతృభ్యాం రోమహర్షణమ్,
విస్మితాః సఙ్గమం ప్రేక్ష్య సమవేతా మహర్షయః. 1

ప్ర. అ. సమవేతాః=గుమిగూడిన, మహర్షయః = మహర్షులు, అప్రతిమ తేజోభ్యాం = సాటి లేని తేజస్సు గల, భ్రాతృభ్యామ్ = సోదరులచేత, తమ్=ఆ, రోమహర్షణమ్ = గగుర్పాటు కల్గించు, సంగమమ్ = సమాగమమును, ప్రేక్ష్య= చూచి, విస్మితాః = ఆశ్చర్యపడినారు.

తా. అక్కడ చేరిన మహర్షు లందరు సాటి లేని తేజస్సు గల ఆ ఇరువురి సోదరుల, గగుర్పాటు కల్గించు ఆ సమాగమమును చూచి చాలా ఆశ్చర్య పడిరి. 1

మూ. అన్తర్హితా మునిగణాః సిద్ధాశ్చ పరమర్షయః,
తౌ భ్రాతరౌ మహాత్మానౌ కాకుత్స్థౌ ప్రశశంసిరే 2

ప్ర. అ. అన్తర్హితాః = అంతర్ధానమును పొంది ఉన్న, మునిగణాః = ముని సముదాయములు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=గొప్ప ఋషులు, మహాత్మానౌ = మహాత్ము లైన, భ్రాతరౌ=సోదరు లైన, తౌ కాకుత్స్థౌ = ఆ రామ భరతులను, ప్రశశంసిరే = ప్రశంసించిరి.

తా. అక్కడ అంతర్ధానము చెంది ఉండి చూచుచున్న ఋషిగణములు, సిద్ధులు, దేవర్షులు మహాత్ము లైన ఆ రామభరతులను ప్రశంసించిరి. 2

మూ. స ధన్యో యస్య పుత్రౌ ద్వౌ ధర్మజ్ఞౌ ధర్మవిక్రమౌ,
శ్రుత్వా వయం హి సమ్భాషాముభయోః స్పృహయామహే.

ప్ర. అ. ధర్మజ్ఞౌ=ధర్మమును తెలిసినవారూ, ధర్మవిక్రమౌ=ధర్మమునందు పరాక్రమము గలవారూ అయిన, ద్వౌ = వీరిద్దరు, యస్య=ఏ దశరథుని యొక్క, పుత్రౌ = పుత్రులో, సః = ఆ దశరథుడు, ధన్యః = ధన్యుడు. వయమ్ = మనము, సంభాషామ్=వీరి మాటలను, శ్రుత్వా= విని, ఉభయోః = ఇద్దరి విషయమున, స్పృహయామహే హి=ఆసక్తి కలవార మగుచున్నాము కదా.

తా. ధర్మవేత్తలూ, ధర్మమునందు అత్యాసక్తి చూపించువారూ అయిన ఈ ఇద్దరిని కుమారులుగా కన్న దశరథుడు ధన్యుడు. వీరి సంభాషణము వినుటచే మనకు వీరిద్దరిపైనను మక్కువ కలుగుచున్నది కదా! 3

మూ. తతస్త్వృషిగణాః క్షిప్రం దశగ్రీవవధైషిణః,
భరతం రాజశార్దూలమిత్యూచుః సఙ్గతా వచః. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, క్షిప్రమ్ = శీఘ్రముగా, దశగ్రీవవధైషిణః = రావణుని వధను కోరుచున్న, ఋషిగణాః = ఋషుల గణములు, సంగతాః కలిసి, రాజశార్దూలమ్ = రాజశ్రేష్ఠుడైన, భరతమ్ = భరతుని గూర్చి, ఇతి= = ఇట్లు, వచః=వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. పిమ్మట ఋషు లందరు శీఘ్రముగా రావణసంహారము కావలె నను కోరికతో, కలిసి వచ్చి రాజశ్రేష్ఠుడైన భరతునితో ఇట్లు చెప్పిరి. 4

మూ. కులే జాత మహాప్రాజ్ఞ మహావృత్త మహాయశః,
గ్రాహ్యం రామస్య వాక్యం తే పితరం యద్యవేక్షసే. 5

ప్ర. అ. కులే జాత = మంచి కులమునందు పుట్టినవాడా! మహాప్రాజ్ఞ= గొప్ప బుద్ధి కలవాడా! మహావృత్త = ఉత్తమ మైన ఆచారము కలవాడా! మహాయశః = గొప్పకీర్తి కలవాడా! తే = నీయొక్క, పితరమ్=తండ్రిని, అవేక్షసే యది=చూచినట్లైతే, రామస్య=రామునియొక్క, వాక్యమ్=వాక్యము, గ్రాహ్యమ్ = గ్రహింపదగినది.

తా. ఓ భరతుడా! నీవు ఉత్తమ కులమందు పుట్టినావు. గొప్ప బుద్ధి

మంతుడవు. మంచి ఆచారము కలవాడవు. గొప్ప కీర్తి గలవాడవు. నీకు తండ్రిపై గౌరవభావ మున్నచో, రాముడు చెప్పినట్లు చేయుము. 5

మూ. సదానృణమిమం రామం వయమిచ్ఛామహే పితుః,
ఆనృణత్వాచ్చ కైకేయ్యాః స్వర్గం దశరథో గతః. 6

ప్ర. అ. వయమ్ = మేము, ఇమం రామమ్ = ఈ రాముని, సదా = ఎల్లపుడు, పితుః = తండ్రివిషయమున, అనృణమ్ = ఋణము లేని వానినిగా, ఇచ్ఛామహే = కోరుచున్నాము. దశరథః = దశరథుడు, కైకేయ్యాః = కైకేయికి, అనృణత్వాచ్చ = ఋణము లేకపోవుట వలననే, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. రాముడు తండ్రి ఋణమును తీర్చవలె నని మేము ఎల్లపుడు కోరుచున్నాము. దశరథుడు కైకేయి ఋణమును తీర్చివేయుటచేతనే స్వర్గమునకు వెళ్లగలిగినాడు. 6

మూ. ఏతావదుక్త్వా వచనం గన్ధర్వాః సమహర్షయః,
రాజర్షయశ్చైవ తదా సర్వే స్వాం స్వాం గతిం గతాః.

ప్ర. అ. తదా = అప్పుడు, సమహర్షయః = మహర్షులతో కూడిన, గన్ధర్వాః = గంధర్వులు, రాజర్షయశ్చైవ = రాజర్షులు, ఏతావత్ = ఇంతమాత్రమే, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, సర్వే = అందరు, స్వాం స్వామ్ = తమ తమ, గతిమ్ = స్థానమును గూర్చి, గతాః = వెళ్ళినారు.

తా. గంధర్వులు, మహర్షులు, రాజర్షులు, అందరు ఇంతమాత్రమే చెప్పి తమ స్థానములకు వెళ్ళిరి. 7

మూ. హ్లాదితస్తేన వాక్యేన శుభేన శుభదర్శనః,
రామః సంహృష్టవదనస్తానృషీనభ్యపూజయత్. 8

ప్ర. అ. శుభదర్శనః = శుభకర మైన దర్శనము గల, రామః = రాముడు, శుభేన = మంగళకర మైన. తేన వాక్యేన = ఆ వాక్యముచేత, హ్లాదితః = సంతోష పెట్టబడినవాడై, సంహృష్టవదనః = సంతోషించిన ముఖము గలవాడై, తాన్ ఋషీన్ = ఆ ఋషులను, అభ్యపూజయత్ = పూజించెను.

తా. చూచువారికి మంగళము ఇచ్చు రాముడు మంగళకరమైన ఆ వాక్యము విని, సంతోషించినవాడై, వికసించిన ముఖముతో ఆ భరతుని పూజించెను.

మూ. త్రస్తగాత్రస్తు భరతః స వాచా సజ్జమానయా,
కృతాఞ్జలిరిదం వాక్యం రాఘవం పునరబ్రవీత్.

ప్ర. అ. సః భరతస్తు=ఆ భరతుడైతే, త్రస్తగాత్రః=భయపడిన అవయవములు కలవాడై, కృతాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, సజ్జమానయా=తొట్రుపడుచున్న, వాచా= వాక్కుతో, పునః=తిరిగి, రాఘవమ్ = రాముని గూర్చి, ఇదం వాక్యమ్= ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. భరతుడు మాత్రము చాలా భయపడుచు, అంజలి ఘటించి మాటలు తొట్రుపడ, రామునితో మరల ఇట్లు పలికెను.

మూ. రాజధర్మమనుప్రేక్ష్య కులధర్మానుసంతతిమ్,
కర్తుమర్హసి కాకుత్స్థ మమ మాతుశ్చ యాచనామ్. 10

ప్ర. అ. కాకుత్స్థ = రామా! రాజధర్మమ్=రాజధర్మమును, కులధర్మాను సంతతిమ్=కులధర్మము విచ్ఛిన్నము కాకుండుటను, అనుప్రేక్ష్య=చూచి, మమ=నాయొక్క, మాతుశ్చ = తల్లి యొక్క, యాచనామ్=ప్రార్థనను, కర్తుమ్ =చేయుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ రామా! రాజధర్మము, కులధర్మము అవిచ్ఛిన్నముగా జరుగవలెనను విషయమును దృష్టితో ఉంచుకొని నా ప్రార్థనను, నా తల్లి ప్రార్థనను మన్నింపుము. 10

మూ. రక్షితుం సుమహద్రాజ్యమహమేకస్తు నోత్సహే,
పౌరజానపదాంశ్చాపి రక్తాన్ రఞ్జయితుం తథా. 11

ప్ర. అ. అహమ్=నేను, ఏకస్తు=ఒక్కడనే, సుమహత్ = చాల పెద్దదైన, రాజ్యమ్=రాజ్యమును, రక్షితుమ్=రక్షించుటకు, రక్తాన్=అనురాగవంతులైన, పౌరజానపదాన్=పౌరులను, గ్రామనివాసులను, రఞ్జయితుమ్=సంతోషింపచేయుటకు, నోత్సహే=ఉత్సాహవంతుడను కాను.

తా. నే నొక్కడను విశాల మైన ఈ రాజ్యమును రక్షించుటకు, అను రాగము గల ఈ పౌరులను జానపదులను సంతోషపెట్టుటకును సమర్థుడను కాను. 11

మూ. జ్ఞాతయశ్చ హి యోధాశ్చ మిత్రాణి సుహృదశ్చ నః,
త్వామేవ ప్రతీక్షన్తే పర్జన్యమివ కర్షకాః. 12

ప్ర. అ. నః=మనయొక్క, జ్ఞాతయశ్చ=బంధువులు, యోధాశ్చ=సైనికులు, మిత్రాణి=మిత్రులు, సుహృదశ్చ= మంచి హృదయము కలవారు, త్వామేవ=నిన్నే, కర్షకాః=వ్యవసాయము చేయువారు, పర్జన్యమివ=మేఘమును వలె, ప్రతీక్షన్తే=ఎదురుచూచుచున్నాడు.

తా. మన బంధువులు, సైనికులు, మిత్రులు, మన హితాభిలాషులు, అందరు భూమిని దున్నువారు మేఘములకై ఎదురుచూచు నట్లు నీవే కావలె నని ఎదురుచూచుచున్నారు. 12

మూ. ఇదం రాజ్యం మహాప్రాజ్ఞ స్థాపయ ప్రతిపద్య హి,
శక్తిమానసి కాకుత్స్థ లోకస్య పరిపాలనే. 13

ప్ర. అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి కలవాడా! ఇదం రాజ్యమ్=ఈ రాజ్యమును, ప్రతిపద్య = పొంది, స్థాపయ=నిలబెట్టుము. కాకుత్స్థ=రామా! లోకస్య =లోకముయొక్క, పరిపాలనే=పరిపాలనము నందు. శక్తిమాన్=శక్తిమంతుడవు, అసి=అయివున్నావు.

తా. మహాబుద్ధిశాలి వైన ఓ రామా! ఈ రాజ్యమును స్వీకరించి, నిలబెట్టుము. ఈ లోకమును పాలించుటకు నీవే సమర్థుడవు. 13

మూ. ఇత్యుక్త్వా న్యపతద్భ్రాతుః పాదయోర్భరతస్తదా,
భృశం సంప్రార్థయామాస రామమేవ ప్రియంవదః. 14

ప్ర. అ. భరతః=భరతుడు, తదా=అపుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా= పలికి, భ్రాతుః = సోదరునియొక్క, పాదయోః=పాదములపై, న్యపతత్= పడెను. ప్రియంవదః= ప్రియవచనములు చెప్పు ఆ భరతుడు, రామమ్ ఏవ= రామునే, భృశమ్=మిక్కిలి, సంప్రార్థయామాస=ప్రార్థించెను.

తా. ప్రియముగా మాటలాడు ఆ భరతుడు, సోదరు డైన రాముని ఈ విధముగా ఎంతో ప్రార్థించుచు అతని పాదములపై పడెను. 14

మూ. తమఙ్కే భరతం కృత్వా రామో వచనమబ్రవీత్,
శ్యామం నలినపత్రాక్షం మత్తహంసస్వరం స్వయమ్.

ప్ర. అ. రామః = రాముడు, శ్యామమ్ = నల్లనివాడు, నలినపత్రాక్షమ్ = తామరరేకుల వంటి నేత్రములు కలవాడు, మత్తహంసస్వరమ్ = మదించిన హంసయొక్క స్వరము వంటి స్వరము కలవాడు అయిన, తం భరతమ్ = ఆ భరతుని, స్వయమ్ = స్వయముగా, అఙ్కే కృత్వా = ఒడిలో కూర్చుండ బెట్టుకొని, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు నల్లనివాడు, పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, మదించిన హంస స్వరమువంటి స్వరము కలవాడు, అయిన ఆ భరతుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని, ఇట్లు పలికెను. 15

మూ. ఆగతా త్వామియం బుద్ధిః స్వజా వైనయికీ చ యా,
భృశముత్సహసే తాత రక్షితుం పృథివీమపి. 16

ప్ర. అ. తాత! = ఓ తండ్రీ ! స్వజా = సహజ మైనది, వైనయికీ చ = గురుశిక్షణవలన లభించినది అయిన, యా బుద్ధిః = ఏ బుద్ధి, త్వామ్ = నిన్ను, ఆగతా = పొందినదో, దానిచేత, పృథివీమ్ = భూమిని, రక్షితుమ్ అపి = రక్షించుటకు కూడ, భృశమ్ = మిక్కిలి, ఉత్సహసే = సమర్థుడ వగుదువు.

తా. తండ్రీ ! నీకు సహజముగాను, గురుశిక్షణవలన, ఉత్తమ మైన బుద్ధి ఉన్నది. దానిచే నీవు ఈ భూమిని పాలించుటకు సర్వవిధముల సమర్థుడవు. 16

మూ. అమాత్యైశ్చ సుహృద్భిశ్చ బుద్ధిమద్భిశ్చ మన్త్రిభిః,
సర్వకార్యాణి సమ్మన్త్ర్య సుమహాన్త్యపి కారయ. 17

ప్ర. అ. అమాత్యైశ్చ = అమాత్యులతోను, సుహృద్భిశ్చ = మిత్రులతోను, బుద్ధిమద్భిః = బుద్ధిమంతు లైన, మన్త్రిభిశ్చ = మంత్రులతోను, సమ్మన్త్ర్య = ఆలోచించి, సుమహాన్త్యపి = చాల పెద్ద వైనను, సర్వకార్యాణి = సమస్తకార్యములను, కారయ = చేయించుము.

తా. బుద్ధిమంతు లైన అమాత్యులతోను, మిత్రులతోను, మంత్రులతోను, కలిసి ఆలోచించి ఎంత పెద్ద వైనను కార్యము లన్నింటిని చేయించుము. 17

మూ. లక్ష్మీశ్చన్ద్రాదపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్,
అతీయాత్సాగరో వేళాం న ప్రతిజ్ఞామహం పితుః. 18

ప్ర. అ. చన్ద్రాత్ = చంద్రునినుండి, లక్ష్మీః = కాంతి, అపేయాద్వా = తొలగిపోవచ్చును. హిమవాన్ = హిమవత్పర్వతము, హిమమ్ = మంచును, త్యజేద్వా = విడిచిన విడువవచ్చును. సాగరః = సముద్రము. వేలామ్ = తీరమును, అతీయాత్ = దాటవచ్చును. అహమ్ = నేను, పితుః = తండ్రియొక్క, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను. న = అతిక్రమించను.

తా. చంద్రుని కాంతి తొలగిపోయిన తొలగిపోవచ్చును. హిమవత్పర్వ ముసందు మంచు లేకుండ పోయిన పోవచ్చును. సముద్రము తీరమును దాటిన దాటవచ్చును. నేను మాత్రము తండ్రి ప్రతిజ్ఞను అతిక్రమించను. 18

మూ. కామాద్వా తాత లోభాద్వా మాత్రా తుభ్యమిదం కృతమ్,
న తన్మనసి కర్తవ్యం వర్తితవ్యం చ మాతృవత్. 19

ప్ర. అ. తాత = తండ్రీ, కామాద్వా = కామమువల్లనో, లోభాద్వా = లోభమువల్లనో, మాత్రా = నీ తల్లిచేత, తుభ్యమ్ = నీకొరకు, ఇదమ్ = ఇది, కృతమ్ = చేయబడినది. తత్ = అది, మనసి = మనస్సునందు. న కర్తవ్యమ్ = చేయదగినదికాదు, మాతృవత్ = తల్లియందు వలె, వర్తితవ్యమ్ = ప్రవర్తించవలెను.

తా. తండ్రీ : నీ తల్లి యైన కైక కోరిక వల్లనో, ఆశవల్లనో, నీకొరకై ఇది అంతా చేసినది. నీవు దానిని మనస్సులో ఉంచుకొనకూడదు. తల్లిగా ఆమెను గౌరవించవలెను. 19

మూ. ఏవం బ్రువాణం భరతః కౌసల్యాసుతమబ్రవీత్,
తేజసాదిత్యసజ్కాశం ప్రతిపచ్చన్ద్రదర్శనమ్. 20

ప్ర. అ. భరతః = భరతుడు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణమ్ = చెప్పుచున్నవాడూ, తేజసా = తేజస్సుచేత, ఆదిత్యసజ్కాశమ్ = సూర్యునితో సమా

నుడూ, ప్రతిపచ్చన్ద్రదర్శనమ్ = ప్రతిపత్తునందు ఉదయించిన చంద్రుని దర్శనమువంటి దర్శనము కలవాడూ అయిన, కౌసల్యాసుతమ్ = రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. తేజస్సుచే సూర్యునితో సమాన మైనవాడూ, ప్రతిపచ్చంద్రుని దర్శనము వలె ఉత్తరోత్తరాభివృద్ధిని కలిగించు దర్శనము కలవాడు, ఆయిన ఆ రాముని మాటలు విని భరతు డిట్లు చెప్పెను. 20

మూ. అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమభూషితే,
ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః. 21

ప్ర. అ. ఆర్య = ఓ పూజ్యుడా ! హేమభూషితే = బంగారముచే అలంకరింపబడిన, పాదుకే = పాదుకలను, పాదాభ్యామ్ = పాదములచేత, అధిరోహ = ఎక్కుము. ఏతే = ఇవి, సర్వలోకస్య = సమస్తలోకముయొక్క, యోగక్షేమమ్ = యోగమును క్షేమమును, విధాస్యతః హి = చేయగలవు కదా!

తా. పూజ్యుడ వైన రామా ! బంగారముచే అలంకరించిన ఈ పాదుకల పై నీ పాదము లుంచుము, ఈ పాదుకలే సమస్త లోకమునకు యోగక్షేమములు సమకూర్చగలవు. 21

మూ. సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే అవరుహ్య చ,
ప్రాయచ్ఛత్సుమహాతేజా భరతాయ మహాత్మనే. 22

ప్ర. అ. నరవ్యాఘ్రః = నరశ్రేష్ఠుడు, సుమహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన, సః = ఆ రాముడు, పాదుకే = పాదుకలను, అధిరుహ్య = ఎక్కి, అవరుహ్య చ = దిగి, మహాత్మనే = మహాత్ము డైన, భరతాయ = భరతునకు, ప్రాయచ్ఛత్ = ఇచ్చెను.

తా. నరులలో శ్రేష్ఠుడూ, మహాతేజశ్శాలీ యైన, ఆ రాముడు పాదుకలను తొడిగికొని, మరల విడచి, వాటిని మహాత్ము డైన భరతునకు ఇచ్చెను. 22

మూ. స పాదుకే సంప్రణమ్య రామం వచనమబ్రవీత్.
చతుర్దశ హి వర్షాణి జటాచీరధరో హ్యహమ్. 23
ఫలమూలాశనో వీర భవేయం రఘునందన,

తవాగమనమాకాఙ్క్షన్ వసన్వై నగరాద్బహిః, 24
తవ పాదుకయోర్న్యస్తరాజ్యతన్త్రః పరంతప.

ప్ర. అ. సః = ఆ భరతుడు, పాదుకే = పాదుకలను, సంప్రణమ్య = నమస్కరించి, రామమ్ = రాముని గూర్చి, వచనమ్=వచనమును, అబ్రవీత్= పలికెను. పరంతప = శత్రువును పీడించువాడా! వీర! = ఓ వీరుడా! అహమ్= నేను, చతుర్దశ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, జటాచీరధరః = జటలను, నారచీరలను ధరించుచున్నవాడనై, ఫలమూలాశనః = ఫలములను, దుంపలను తినుచున్నవాడనై, తవ = నీయొక్క, పాదుకయోః = పాదుకలపై, న్యస్తరాజ్యతన్త్రః = ఉంచబడిన రాజ్యతంత్రము కలవాడనై, తవ = నీయొక్క, ఆగమనమ్ = రాకను, ఆకాఙ్క్షన్ = కోరుచు, నగరాత్ = నగరమునుండి, బహిః = వెలుపల, వసన్ = నివసించుచు, భవేయమ్ = ఉండెదను.

తా. భరతుడు పాదుకలకు నమస్కరించి, రామునితో ఇట్లు చెప్పెను. శత్రుసంహారకుడవు, వీరుడవు అయిన ఓ రామా! నేను జటలను, నారచీరలను ధరించి ఫలమూలములనే తినుచు, రాజ్యభారము నంతను నీ పాదుకలపై ఉంచి, నగరము బయటనే నీ రాకకై ఎదురుచూచుచు, పదునాలుగు సంవత్సరములు నివసించెదను. 24

మూ. చతుర్దశే తు సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ, 25
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్.

ప్ర. అ. రఘూత్తమ=రామా! చతుర్దశే = పదునాలుగవ, వర్షే=సంవత్సరము, సంపూర్ణే = నిండినదగుచుండగా, అహని = ఆ దినమునందు, త్వామ్= నిన్ను, న ద్రక్ష్యామి యది = చూడకపోయినట్లైతే, హుతాశనమ్ = అగ్నిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను.

తా. ఓ రామా! పదునాలుగు సంవత్సరములు గడపిన పిదప మరుసటి దినమున నీవు నాకు కనబడక పోయినచో, నేను అగ్నిలో ప్రవేశించెదను. 25

మూ తథేతి చ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరమ్, 26
శత్రుఘ్నం చ పరిష్వజ్య భరతం చేదమబ్రవీత్.

ప్ర. అ. తథేతి = అటులే అని, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, తమ్ = ఆ భరతుని, సాదరమ్ = ఆదరపూర్వకముగా, పరిష్వజ్య = కౌగిలించుకొని, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని కూడ, పరిష్వజ్య = కౌగలించుకొని, భరతం చ = భరతుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు భరతుని మాటలకు అంగీకరించి, ఆతనిని శత్రుఘ్నుని ప్రేమపూర్వకముగా కౌగలించుకొని, భరతునితో ఇట్లనెను. 26

మూ. మాతరం రక్ష కైకేయీం మా రోషం కురు తాం ప్రతి,
మయా చ సీతయా చైవ శప్తోఽసి రఘుసత్తమ,
ఇత్యుక్త్వాశ్రుపరీతాక్షో భ్రాతరం విససర్జ హ. 28

ప్ర. అ. రఘుసత్తమ = భరతా! మాతరమ్ = తల్లి యైన, కైకేయీమ్ = కైకేయిని, రక్ష = రక్షించుము. తాం ప్రతి = ఆమెను గూర్చి, రోషమ్ = కోపమును, మా కురు = చేయకుము. మయా చ = నాచేతను, సీతయా చైవ = సీతచేతను, శప్తః = ఒట్టుపెట్టబడినవాడవు, అసి = అగుచున్నావు. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అశ్రుపరీతాక్షః = కన్నీళ్లతో నిండిన నేత్రములు కలవాడై, భ్రాతరమ్ = సోదరుని, విససర్జ హ = విడచెను.

తా. "ఓ భరతా! నీ తల్లి యైన కైకేయిని భక్తితో చూచుకొనుము. ఆమెపై కోపము చూపకుము. నాపైనను, సీతపైనను, ఒట్టుపెట్టి చెప్పుచున్నాను". అని పలికి నేత్రములనుండి కన్నీళ్లు కార్చుచు, భరతునకు వెళ్లుటకు అనుజ్ఞ ఇచ్చెను. 28

మూ. స పాదుకే తే భరతః ప్రతాపవాన్
స్వలఙ్కృతే సమ్పరిపూజ్య ధర్మవిత్,
ప్రదక్షిణం చైవ చకార రాఘవమ్
చకార తే చోత్తమనాగమూర్ధని. 29

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపవంతుడు, ధర్మవిత్ = ధర్మమును తెలిసినవాడు అయిన, సః భరతః = ఆ భరతుడు, స్వలఙ్కృతే = చక్కగా అలంకరింపబడిన, తే పాదుకే = ఆ పాదుకలను, సంపరిపూజ్య = పూజించి, రాఘవమ్

= రాముని, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణమును, చకార = చేసెను. తే = ఆ పాదుకలను, ఉత్తమనాగమూర్ధని = శ్రేష్ఠ మైన గజముయొక్క శిరస్సుపై, చకార = ఉంచెను.

తా. ప్రతాపవంతుడు, ధర్మవేత్త ఆయిన భరతుడు, చక్కగా అలంకరింపబడిన ఆ పాదుకలను పూజించి రామునకు ప్రదక్షిణముచేసి, ఆ పాదుకలను ఉత్తమ మైన ఏనుగుపై ఎక్కించెను. 29

మూ. అథానుపూర్వ్యా ప్రతినన్ద్య తం జనం
గురూంశ్చ మన్త్రిప్రకృతీస్తథానుజౌ,
వ్యసర్జయద్రాఘవవంశవర్ధనః
స్థిరః స్వధర్మే హిమవానివాచలః. 30

ప్ర. అ. అథ=అటు పిమ్మట, రాఘవవంశవర్ధనః = రఘువంశమును వృద్ధి పొందించు ఆ రాముడు, స్వధర్మే=తన ధర్మమునందు, హిమవాన్ = హిమవంతమను, అచలః ఇవ=పర్వతము వలె, స్థిరః = స్థిరముగా నున్నవాడై, తం జనమ్ = ఆ జనమును, అనుపూర్వ్యా=క్రమానుసారముగా, ప్రతినన్ద్య=అభినందించి, గురూంశ్చ=గురువులను, మన్త్రిప్రకృతీః=మంత్రులను, ప్రకృతులను, తథా=మరియు, అనుజౌ = సోదరులను అభినందించి, వ్యసర్జయత్ = విడచెను.

తా. స్వధర్మముపై, హిమవత్పర్వతము వలె స్థిరముగా నిలబడిన ఆ రాముడు, అచటకు వచ్చిన జను లందరిని, గురువులను, మంత్రులను, ప్రకృతులను భరతశత్రుఘ్నులను యథాక్రమముగా అభినందించి వారిని పంపివేసెను.

మూ. తం మాతరో బాష్పగృహీతకణ్ఠ్యో
దుఃఖేన నామన్త్రయితుం హి శేకుః,
స త్వేవ మాతౄరభివాద్య సర్వా
రుదన్ కుటీం స్వాం ప్రవివేశ రామః. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వాదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. దుఃఖేన=దుఃఖముచేత, బాష్పగృహీతకణ్ఠ్యః=బాష్పముచే పట్టు

కొనబడిన కంఠములు గల, మాతరః = తల్లులు, తమ్ = ఆ రాముని, ఆమన్త్ర యితుం = వీడ్కొనుటకు, న శేకుర్హి = సమర్థులు కాలేదు. సః = ఆ, రామ ఏవ = రాముడే, సర్వాః = సమస్త మైన, మాతౄః = తల్లులను, అభివాద్య = నమస్కరించి, రుదన్ = ఏడ్చుచు, స్వామ్ = తన సంబంధ మైన, కుటీం = పర్ణశాలను, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. దుఃఖార్త లైన తల్లులు వారి కంఠములకు కన్నీళ్లు అడ్డుపడుటచే రామునకు వీడ్కోలు మాటలు చెప్పజాలకపోయిరి. అపుడు రాముడే తల్లు లందరికి నమస్కరించి ఏడ్చుచు, తన పర్ణశాలలోనికి వెళ్ళిపోయెను. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటపన్నెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోదశోత్తరశతతమః సర్గః

[భరతుడు భరద్వాజుని కలిసికొని అయోధ్యకు మరలి వచ్చుట.]

మూ. తతః శిరసి కృత్వా తు పాదుకే భరతస్తదా,
ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తదా=అప్పుడు, భరతః=భరతుడు, పాదుకే=పాదుకలను, శిరసి=శిరస్సుపై, కృత్వా=ఉంచుకొని, హృష్టః=సంతోషించినవాడై, శత్రుఘ్నేన=శత్రుఘ్నునితో, సమన్వితః=కూడినవాడై, రథమ్=రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట శత్రుఘ్నసహితుడైన భరతుడు, రాముని పాదుకలను శిరస్సుపై ఉంచుకొని, సంతోషించుచు రథమును ఎక్కెను. 1

మూ. వసిష్ఠో వామదేవశ్చ జాబాలిశ్చ దృఢవ్రతః,
అగ్రతః ప్రయయుః సర్వే మన్త్రిణో మన్త్రపూజితాః.

ప్ర. అ. వసిష్ఠః=వసిష్ఠుడు, వామదేవశ్చ=వామదేవుడు, దృఢవ్రతః=దృఢమైన వ్రతము గల, జాబాలిశ్చ=జాబాలి, మన్త్రపూజితాః=మంత్రముచే పూజించబడిన, సర్వే=సమస్తమైన, మన్త్రిణః=మంత్రులు, అగ్రతః=ముందు ప్రయయుః=వెళ్ళిరి.

తా. అతని ముందు వసిష్ఠుడు, వామదేవుడు, వ్రతములలో స్థిరచిత్తుడైన జాబాలి, ఉత్తమమైన ఆలోచనాశక్తి గల మంత్రులు, అందరూ వెళ్ళిరి. 2

మూ. మన్దాకినీం నదీం రమ్యాం ప్రాఙ్ముఖాస్తే యయుస్తదా,
ప్రదక్షిణం చ కుర్వాణాశ్చిత్రకూటం మహాగిరిమ్. 3

ప్ర. అ. తదా=అపుడు, తే=వారు, చిత్రకూటం మహాగిరిమ్=చిత్రకూట

పర్వతమును, ప్రదక్షిణమ్=ప్రదక్షిణమును, కుర్వాణాః=చేయుచు, ప్రాఙ్ముఖాః =తూర్పుదిక్కునకు అభిముఖులై, మన్దాకినీమ్=మందాకినియను, రమ్యామ్= సుందరమైన, నదీమ్=నదిని గూర్చి, యయుః=వెళ్ళిరి.

తా. వారందరు చిత్రకూటపర్వతమునకు ప్రదక్షిణముగా తూర్పుదిక్కునకు అభిముఖులై, మందాకినీనది వైపు వెళ్ళిరి. 3

మూ. పశ్యన్ధాతుసహస్రాణి రమ్యాణి వివిధాని చ,
ప్రయయౌ తస్య పార్శ్వేన ససైన్యో భరతస్తదా. 4

ప్ర. అ. తదా=అపుడు, భరతః=భరతుడు, రమ్యాణి=సుందరమైన, వివిధాని = అనేక విధములైన, ధాతుసహస్రాణి = వేలకొలది ధాతువులను, పశ్యన్=చూచుచు, ససైన్యః=సైన్యముతో కూడినవాడై, తస్య=ఆ పర్వతము యొక్క, పార్శ్వే = పార్శ్వమునందు. ప్రయయౌ = వెళ్లెను. (ప్రయాణము చేసెను).

తా. అపుడు భరతుడు సైన్యముతో కూడ వేలకొలది సుందరమైన అనేకవిధములైన ధాతువులను చూచుచు, ఆ పర్వతపార్శ్వమున ప్రయాణము చేసి వెళ్ళెను. 4

మూ. అదూరాచ్చిత్రకూటస్య దదర్శ భరతస్తదా,
ఆశ్రమం యత్ర స మునిర్భరద్వాజః కృతాలయః. 5

ప్ర. అ. తదా=అపుడు, భరతః= భరతుడు, చిత్రకూటస్య = చిత్రకూటమునకు, అదూరాత్=సమీపమున, యత్ర=ఎక్కడ, మునిః=ముని యైన, సః భరద్వాజః=ఆ భరద్వాజుడు, కృతాలయః=చేసుకొనబడిన నివాసము కలవాడో అట్టి, ఆశ్రమమ్=ఆశ్రమమును, దదర్శ=చూచెను.

తా. అపుడు భరతుడు చిత్రకూటమునకు సమీపమునందు భరద్వాజ మహార్షి నివసించు ఆశ్రమమును చూచెను. 5

మూ. స తమాశ్రమమాగమ్య భరద్వాజస్య బుద్ధిమాన్,
అవతీర్య రథాత్పాదౌ వవన్దే భరతస్తదా. 6

ప్ర. అ. తదా = అపుడు, బుద్ధిమాన్ = బుద్ధిమంతుడైన, సః భరతః = ఆ భరతుడు, భరద్వాజస్య = భరద్వాజునియొక్క, తమ్ ఆశ్రమమ్=ఆ ఆశ్రమమును, ఆగమ్య = పొంది, రథాత్ = రథమునుండి, అవతీర్య = దిగి, పాదౌ= పాదములను, వవన్దే = నమస్కరించెను.

తా. బుద్ధిమంతుడైన ఆ భరతుడు, భరద్వాజుని ఆశ్రమమునకు వెళ్ళి, రథమునుండి దిగి, ఆ మహాముని పాదములకు నమస్కరించెను. 6

మూ. తతో హృష్టో భరద్వాజో భరతం వాక్యమబ్రవీత్,
అపి కృత్యం కృతం తాత రామేణ చ సమాగతమ్. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, హృష్టః = సంతోషించిన, భరద్వాజః= భరద్వాజుడు, భరతమ్ = భరతుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను. తాత = తండ్రీ, కృత్యమ్ = కార్యము, అపి కృతమ్ = చేయబడినదా? రామేణ చ = రామునితో, అపి సమాగతమ్ = సమాగమము జరిగినదా?

తా. అతనిని చూచి సంతోషించిన భరద్వాజుడు "నీ కార్యము పూర్తియైనదా? రాముని కలిసినావా"? అని అడిగెను. 7

మూ. ఏవముక్తః స తు తతో భరద్వాజేన ధీమతా,
ప్రత్యువాచ భరద్వాజం భరతో భ్రాతృవత్సలః. 8

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధీమతా = బుద్ధిమంతుడైన, భరద్వాజేన = భరద్వాజునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, భ్రాతృవత్సలః = సోదరునియందు ప్రేమ గల, భరతః = భరతుడు, భరద్వాజమ్ = భరద్వాజుని గూర్చి, ప్రత్యువాచ = పలికెను.

తా. ధీమంతుడైన భరద్వాజుని మాటలు విని, సోదరులపై ప్రేమ గల భరతుడు అతనితో ఇట్లు పలికెను. 8

మూ. స యాచ్యమానో గురుణా మయా చ దృఢవిక్రమః,
రాఘవః పరమప్రీతో వశిష్ఠం వాక్యమబ్రవీత్. 9

ప్ర. అ. గురుణా = గురువుచేతను, మయా = నాచేతను, యాచ్యమానః=

ప్రార్థింపబడుచున్న, దృఢవిక్రమః = దృఢ మైన పరాక్రమము గల, రాఘవః = రాముడు, పరమప్రీతః = మిక్కిలి సంతోషించినవాడై, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దృఢ మైన పరాక్రమము గల ఆ రాముని గురు వైన వసిష్ఠుడు నేను ప్రార్థింపగా, అతడు సంతోషించి వసిష్ఠునితో ఇట్లు చెప్పెను. 9

మూ. పితుః ప్రతిజ్ఞాం తామేవ పాలయిష్యామి తత్త్వతః,
చతుర్దశ హి వర్షాణి యా ప్రతిజ్ఞా పితుర్మమ. 10

ప్ర. అ. చతుర్దశ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, మమ పితుః = నా తండ్రియొక్క, యా = ఏ, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ కలదో, పితుః = తండ్రి యొక్క, తాం ప్రతిజ్ఞామ్ ఏవ = ఆ ప్రతిజ్ఞనే, తత్త్వతః = యథార్థముగా, పాల యిష్యామి = పాలించెదను.

తా. పదునాలుగు సంవత్సరములు నేను అరణ్యములో ఉండవలె నని నా తండ్రి చేసిన ప్రతిజ్ఞనే నేను పాలించెదను. 10

మూ. ఏవముక్తో మహాప్రాజ్ఞో వసిష్ఠః ప్రత్యువాచ హ,
వాక్యజ్ఞో వాక్యకుశలం రాఘవం వచనం మహత్. 11

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలకబడిన, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధిమంతు డైన, వాక్యజ్ఞః = మాటలు ఎరిగిన, వసిష్ఠః = వసిష్ఠుడు, వాక్యకుశలమ్ = మాటలలో నేర్పరి యైన, రాఘవమ్ = రాముని గూర్చి, మహత్ = గొప్ప, వచనమ్ = వచనమును, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను.

తా. మహాబుద్ధిశాలి, మాటలు చెప్పుటలో సమర్థుడు అయిన వసిష్ఠుడు ఆ మాటలు విని, మాటలలో నేర్పరి యైన రామునితో ఇట్లు పలికెను. 11

మూ. ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే,
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ యోగక్షేమకరే తవ. 12

ప్ర. అ. మహాప్రాజ్ఞ = ఓ గొప్పబుద్ధి కలవాడా! సంహృష్టః = సంతోషించినవాడ వై, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, యోగక్షేమకరే = యోగ

క్షేమములను చేయు, ఏతే=ఈ, హేమభూషితే=బంగారముచేత అలంకరింపబడిన, తవ పాదుకే=నీ పాదుకలను, ప్రయచ్ఛ=ఇమ్ము.

తా. గొప్ప బుద్ధి కల ఓ రామా! నీవు బంగారముచే అలంకరింపబడిన నీ పాదుకలను సంతోషపూర్వకముగా ఇమ్ము. అవి అయోధ్యానగరములో ప్రజల యోగక్షేమములను సమకూర్చును. 12

మూ. ఏవముక్తో వసిష్ఠేన రాఘవః ప్రాఙ్ముఖః స్థితః,
పాదుకే అధిరుహ్యైతే మమ రాజ్యాయ వై దదౌ. 13

ప్ర. అ. వసిష్ఠేన=వసిష్ఠునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః = పలుకబడిన, రాఘవః = రాముడు, ప్రాఙ్ముఖః=తూర్పుదిక్కు ముఖము కలవాడుగ, స్థితః= నిలచినవాడై, ఏతే=ఈ, పాదుకే=పాదుకలను, అధిరుహ్య=ఎక్కి, మమ= నాకు, రాజ్యాయ = రాజ్యమునిమిత్తము, దదౌ=ఇచ్చెను.

తా. వసిష్ఠుని మాటలు విని రాముడు తూర్పుదిక్కుకు తిరిగి ఈ పాదుకలు తొడుగుకొని, రాజ్యము నడపుటకై వీటిని నాకు ఇచ్చెను. 13

మూ. నివృత్తోఽహమనుజ్ఞాతో రామేణ సుమహాత్మనా,
అయోధ్యామేవ గచ్ఛామి గృహీత్వా పాదుకే శుభే. 14

ప్ర. అ. సుమహాత్మనా = మిక్కిలి మహాత్ముడైన, రామేణ=రాముని చేత, అనుజ్ఞాతః=అనుమతింపబడినవాడనై, అహమ్=నేను, నివృత్తః=వెనుకకు మరలినవాడనై, శుభే=మంగళకరములైన, పాదుకే=పాదుకలను, గృహీత్వా= =గ్రహించి, అయోధ్యామేవ=అయోధ్యనుగూర్చియే, గచ్ఛామి=వెళ్లుచున్నాను.

తా. మహాత్ముడైన రాముని అనుజ్ఞ పొంది, మంగళకరములైన ఈ పాదుకలతో నేను మరల అయోధ్యకే వెళ్లుచున్నాను. 14

మూ. ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
భరద్వాజః శుభతరం మునిర్వాక్యమువాచ హ. 15

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, భరతస్య = భరతునియొక్క, శుభమ్=మంగళకరమైన, ఏతత్ వాక్యమ్=ఈ వాక్యమును, శ్రుత్వా=విని, భరద్వాజః మునిః=భరద్వాజముని, శుభతరమ్=మిక్కిలి మంగళకరమైన, వాక్యమ్=వాక్యమును, తమ్=ఆ భరతుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. మహాత్ముఁ డైన భరతుని మంగళకర మైన మాటలు విని, భరద్వాజ మహర్షి అధికముగా మంగళకర మైన మాట పలికెను. 15

మూ. నైతచ్చిత్రం నరవ్యాఘ్ర శీలవృత్తవతాం వర,
యదార్యం త్వయి తిష్ఠేత్తు నిమ్నే సృష్టమివోదకమ్. 16

ప్ర. అ. నరవ్యాఘ్ర = మానవులలో శ్రేష్ఠుడా, శీలవృత్తవతామ్ = శీలము సచ్చరిత్ర కలవారిలో, వర = శ్రేష్ఠుడా! సృష్టమ్ = విడువబడిన, ఉదకమ్ = ఉదకమును, నిమ్నే ఇవ = పల్లమునందు వలె, ఆర్యమ్ = పూజ్య మైన లక్షణము, త్వయి = నీయందు, యత్ తిష్ఠేత్ = ఉండును అనునది ఏది కలదో, ఏతత్ = ఇది, చిత్రమ్ = ఆశ్చర్యకరము, న = కాదు.

తా. ఓ నరశ్రేష్ఠుడా! మంచి శీలము, ఉత్తమ మైన చరిత్రము కలవారిలో శ్రేష్ఠుడా! విడచిన నీరు పల్లములో నిలిచి నట్లు పూజ్య మైన లక్షణము లన్నియు నీయందు ఉండుటలో ఆశ్చర్యము లేదు. 16

మూ. అమృతః స మహాబాహుః పితా దశరథస్తవ,
యస్య త్వమీదృశః పుత్రో ధర్మజ్ఞో ధర్మవత్సలః. 17

ప్ర. అ. యస్య = ఎవనికి, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడవు, ధర్మవత్సలః = ధర్మమునందు అధిక మైన ప్రేమ కలవాడవు అయిన, ఈదృశః = ఇట్టి, త్వమ్ = నీవు, పుత్రః = పుత్రుడవో, సః = అట్టి, మహాబాహుః = గొప్ప బాహువులు గల, తవ పితా = నీ తండ్రి యైన, దశరథః = దశరథుడు, అమృతః = మరణించనివాడే.

తా. ధర్మజ్ఞుడు, ధర్మమునం దాసక్తి కలవాడు అయిన నీవంటివానిని పుత్రునిగా బడసిన నీ తండ్రి దశరథమహారాజు మరణించినను మరణించని వాడే. 17

మూ. తమృషిం తు మహాత్మానముక్తవాక్యం కృతాఞ్జలిః,
ఆమన్త్రయితుమారేభే చరణావుపగృహ్య చ. 18

ప్ర. అ. కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఉక్తవాక్యమ్ = ఇట్లు పలుకబడిన వాక్యము గల, తం ఋషిమ్ = ఆ ఋషిని, చరణౌ = పాదములను,

ఉపగృహ్య = పట్టుకొని, ఆమన్త్రయితుమ్ = వీడ్కొనుటకు, ఆరేభే = ప్రారంభించెను.

తా. మహాత్ము డైన ఆ భరద్వాజముని మాటలు విని, భరతుడు అంజలి ఘటించి అతని పాదములు స్పృశించి నమస్కరించుచు, ప్రయాణమునకు అనుమతి కోరెను. 18

మూ. తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునః పునః,
భరతస్తు యయౌ శ్రీమానయోధ్యాం సహ మన్త్రిభిః. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శ్రీమాన్ = శ్రీమంతు డైన, భరతః = భరతుడు, పునః పునః = మాటిమాటికి, భరద్వాజమ్ = భరద్వాజుని, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణమును, కృత్వా = చేసి, మన్త్రిభిస్సహ = మంత్రులలో కూడ, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. శ్రీమంతు డైన భరతుడు, భరద్వాజునకు అనేకపర్యాయములు ప్రదక్షిణపూర్వకముగా నమస్కారము చేసి, మంత్రులతో అయోధ్యకు వెళ్ళెను.

మూ. యానైశ్చ శకటైశ్చైవ హయైర్నాగైశ్చ సా చమూః,
పునర్నివృత్తా విస్తీర్ణా భరతస్యానుయాయినీ. 20

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, విస్తీర్ణా = విశాల మైన. సా చమూః = ఆ సేన, అనుయాయినీ = అనుసరించి వెళ్లుచున్న దై, యానైశ్చ = వాహనములతోను, శకటైశ్చైవ = బండ్లతోను, హయైః = గుఱ్ఱములతోను, నాగైశ్చ = ఏనుగులతోను, పునః = తిరిగి, నివృత్తా = మరలినది.

తా. విశాల మైన ఆ భరతుని సేన అతనిని వెంబడించి వాహనములతోను, బండ్లతోను, అశ్వములతోను, గజములతోను, తిరిగి అయోధ్యవైపు మరలెను. 20

మూ. తతస్తే యమునాం దివ్యాం నదీం తీర్త్వోర్మిమాలినీమ్,
దదృశుస్తాం పునః సర్వే గఙ్గాం శుభజలాం నదీమ్. 21

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే సర్వే = వారందరు, దివ్యామ్ =

శ్రేష్ఠ మైన, ఊర్మిమాలినీమ్ = తరంగముల పంక్తి గల, యమునాం నదీమ్ = యమునానదిని, తీర్త్వా = దాటి, శుభజలామ్ = పవిత్ర మైన జలముగల, తాం గంగాం నదీమ్ = ఆ గంగానదిని, పునః = తిరిగి, దదృశుః = చూచిరి.

తా. పిమ్మట వారందరు తరంగముల పంక్తులతో నిండిన శ్రేష్ఠ మైన యమునానదిని దాటి, మరల పవిత్రము లైన జలములు గల. ఆ గంగానదిని. చూచిరి. 21

మూ. తాం రమ్యజలసంపూర్ణాం సంతీర్య సహబాంధవః,
శృఙ్గిబేరపురం రమ్యం ప్రవివేశ ససైనికః. 22.
శృఙ్గిబేరపురాద్భూయ స్త్వయోధ్యాం సందదర్శ హ.

ప్ర. అ. రమ్యజలసంపూర్ణామ్ = సుందర మైన జలముతో నిండిన, తామ్ = ఆ గంగానదిని, సహబాంధవః = బంధుసమేతుడై, సంతీర్య = దాటి, ససైనికః = సైన్యముతో కూడిన వాడై, రమ్యమ్ = సుందర మైన, శృఙ్గిబేర పురమ్ = శృంగిబేరపట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను. శృఙ్గిబేరపురాత్ = శృఙ్గిబేరపురమునుండి, భూయః = తిరిగి, అయోధ్యామ్ = అయోధ్యను, సందదర్శ హ = చూచెను.

తా. భరతుడు బంధువులతోను, సైనికులతోను, కలిసి రమ్య మైన జలముతో నిండిన ఆ గంగానదిని దాటి, సుందర మైన శృంగిబేరపురమును. ప్రవేశించెను. శృంగిబేరపురమునుండి బయలుదేరి వెడలి అయోధ్యానగరమును. చూచెను. 22.

మూ. అయోధ్యాం చ తతో దృష్ట్వా పిత్రా భ్రాత్రా వివర్జితామ్,
భరతో దుఃఖసంతప్తః సారథిం చేదమబ్రవీత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భరతః = భరతుడు, పిత్రా = తండ్రి చేతను, భ్రాత్రా = సోదరునిచేతను, వివర్జితామ్ = విడువబడిన, అయోధ్యామ్ = అయోధ్యను, దృష్ట్వా = చూచి, దుఃఖసంతప్తః = దుఃఖముచేత పీడింపబడిన. వాడై, సారథిమ్ = సారథిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. తండ్రీ అన్నా లేని అయోధ్యను చూడగానే దుఃఖముచేత పీడితు డై భరతుడు సారథితో ఇట్లనెను. 23

మూ. సారథే పశ్య విధ్వస్తా సాఽయోధ్యా న ప్రకాశతే, 24
నిరాకారా నిరానన్దా దీనా ప్రతిహతస్వరా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రయోదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. సారథే = ఓ సారథీ, విధ్వస్తా = చెడిపోయిన, సా అయోధ్యా = ఆ అయోధ్య, నిరాకారా = మంచి ఆకారము లేనిదై, నిరానన్దా = ఆనందశూన్యమై, దీనా = దైన్యముతో కూడినదై, ప్రతిహతస్వరా = కొట్టబడిన స్వరము గలదై, న ప్రకాశతే = ప్రకాశించుటలేదు. పశ్య = చూడుము.

తా. ఓ సారథీ! ఆ అయోధ్యానగరము పూర్తిగా చెడిపోయి, మంచి ఆకారము లేక, ఆనందవిహీనమై, దైన్యముతో మంచి ధ్వను లన్నియు నశించి ఏ మాత్రము ప్రకాశించుట లేదు. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నూటపదమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్దశోత్తరశతతమః సర్గః

[భరతు డయోధ్యా పురవస్థను చూచుట. అంతఃపురము ప్రవేశించి దుఃఖితుడగుట.]

మూ. స్నిగ్ధగమ్భీరఘోషేణ స్యన్దనేనోపయాన్ ప్రభుః,
అయోధ్యాం భరతః క్షిప్రం ప్రవివేశ మహాయశాః. 1

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గలవాడు, ప్రభుః=ప్రభువు అయిన, భరతః = భరతుడు, స్నిగ్ధగమ్భీరఘోషేణ = ఇంపైన, గంభీర మైన, ధ్వని గల, స్యన్దనేన = రథముచేత, ఉపయాన్ = ప్రయాణము చేయుచు, క్షిప్రమ్= శీఘ్రముగా, అయోధ్యామ్=అయోధ్యను, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. గొప్ప కీర్తి గలవాడు, ప్రభువు అయిన భరతుడు చెవుల కింపైన గంభీరధ్వని గల రథముపై ప్రయాణము చేసి అయోధ్యలోనికి ప్రవేశించెను.

మూ. బిడాలోలూకచరితామాలీననరవారణామ్.
తిమిరాభ్యాహతాం కాలీమప్రకాశాం నిశామివ. 2

ప్ర. అ. బిడాలోలూకచరితామ్ = పిల్లులచేతను, గుడ్లగూబలచేతను, సంచరింపబడినదీ, ఆలీనసరవారణామ్ = అణగిన నరులు, గజములు కలదీ, తిరాభ్యాహతామ్ = చీకటిచేత కొట్టబడి, అప్రకాశామ్=ప్రకాశము లేని, కాళీమ్ =నల్లగా ఉన్న, నిశామివ = రాత్రి వలె ఉన్నదీ అయిన, అయోధ్యలోనికి ప్రవేశించెను.

(ఈ శ్లోకము మొదలు 20 వ శ్లోకము వరకు ఉన్న పందొమ్మిది శ్లోకలకు మొదటి శ్లోకముతో అన్వయము. ఆ శ్లోకము లోని "అయోధ్యామ్" అను దానికి ఈ శ్లోకములోని విశేషము లన్నీ అన్వయించును).

తా. ఆ అయోధ్యలో పిల్లులు, గుడ్లగూబలు, తిరుగుచుండెను. మనుష్యులు గాని, ఏనుగులు గాని బయట సంచరించుటలేదు. అందుచేత, చీకటి అవరించగా ప్రకాశము లేని నల్లని రాత్రి వలె ఉండెను. 2

మూ. రాహుశత్రోః ప్రియాం పత్నీం శ్రియా ప్రజ్వలితప్రభామ్,
గ్రహేణాభ్యుత్థితేనైకాం రోహిణీమివ పీడితామ్. 3

ప్ర. అ. శ్రియా = కాంతితో, ప్రజ్వలితప్రభామ్ = వెలుగొందుచున్న కాంతి గలది, అభ్యుత్థితేన = ఎదురుగా నిలచిన, గ్రహేన = క్రూరగ్రహముచేత, పీడితామ్ = పీడింపబడినదీ, రాహుశత్రోః = రాహువుయొక్క శత్రువు అయిన చంద్రుని యొక్క, ప్రియామ్ = ప్రియ మైన, పత్నీమ్ = భార్య అయిన, ఏకామ్ = ఏకాకినిగా ఉన్న, రోహిణీమివ = రోహిణి వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. ప్రకాశించుచున్న కాంతి గలదీ, ఎదురుగా నిలచిన క్రూరగ్రహము చేత పీడింపబడినదీ, చంద్రుని ప్రియభార్య అయిన రోహిణి వలె ఆ అయోధ్య కాంతివిహీనముగా ఉండెను. 3

మూ. అల్పోష్ణక్షుబ్ధసలిలాం ఘర్మోత్తప్తవిహఙ్గమామ్,
లీనమీనఝషగ్రాహాం కృశాం గిరినదీమివ. 4

తా. అల్పోష్ణక్షుబ్ధసలిలాం = అల్పమై, ఉష్ణమై, కరిగిపోయిన ఉదకము కలదీ, ఘర్మోత్తప్తవిహఙ్గమామ్ = ఎండచేత తపింపచేయబడిన పక్షులు కలదీ, లీనమీనఝషగ్రాహామ్ = అణగిపడి యున్న మత్స్యములు, పెద్ద మత్స్యములు మొసళ్లు కలదీ, కృశామ్ = కృశించినదీ అయిన, గిరినదీమివ = పర్వతనది వలె నున్న అయోధ్యను ప్రవేశించెను.

తా. వేడెక్కి కరగిపోయిన స్వల్ప మైన జలముతో, పక్షు లన్నీ ఎండకు బాధపడుచుండగా, మీనములు, పెద్దమత్స్యములు, మొసళ్లు అడుగున అణగి పడియున్న కృశించిన పర్వతనది వలె ఆ అయోధ్య శోభావిహీన మై ఉండెను. 4

మూ. విధూమామివ హేమాభామధ్వరాగ్నేః సముత్థితామ్,
హవిరభ్యుక్షితాం పశ్చాచ్ఛిఖాం విప్రలయం గతామ్. 5

ప్ర. అ. విధూమామ్ = ధూమము లేనిది, హేమాభామ్ = బంగారము

వంటి కాంతి గలది, సముత్థితామ్ = పైకి లేచినది, పశ్చాత్ = పిమ్మట, హవిర భ్యుక్షితామ్ = హవిస్సుచేత తడపబడినది, విప్రలయమ్=నాశమును, గతామ్= పొందినది అయిన, అధ్వరాగ్నేః = యజ్ఞమునందలి అగ్నియొక్క, శిఖామివ =శిఖ వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. ప్రారంభమున పైకి ఎగురుచు, ధూమము లేకపోవుటచే బంగారము వలె ప్రకాశించుచు, పిదప హవిస్సు వేయగనే ఆరిపోయిన యజ్ఞమునందలి అగ్ని శిఖ వలె ఆ అయోధ్య శోభావిహీనమై ఉండెను. 5

మూ. విధ్వస్తకవచాం రుగ్ణగజవాజిరథధ్వజామ్,
హతప్రవీరామాపన్నాం చమూమివ మహాహవే. 6

ప్ర. అ. మహాహవే = గొప్పయుద్ధమునందు, విధ్వస్తకవచామ్=నశింప చేయబడిన కవచములు కలది, రుగ్ణగజవాజిరథధ్వజామ్ = దెబ్బ తిన్న గజ ములు, అశ్వములు, రథములు, ధ్వజములు కలది, హతప్రవీరామ్=చంపబడిన ఉత్తమ వీరులు కలది, ఆపన్నామ్=ఆపద చెందినదీ అయిన, చమూమివ= సేన వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. ఘోరయుద్ధమునందు కవచము లన్నీ బద్దలై, ఏనుగులు, గుఱ్ఱ ములు, రథములు, ధ్వజములు, క్రింద పడి, ఉత్తమవీరు లందరు మరణించగా గొప్ప ఆపదలో ఉన్న సైన్యము వలె ఆ అయోధ్య భయంకరముగా కనబడు చుండెను. 6

మూ. సఫేనాం సస్వనాం భూత్వా సాగరస్య సముత్థితామ్,
ప్రశాన్తమారుతోద్ధూతాం జలోర్మిమివ నిస్స్వనామ్. 7

ప్ర. అ. సఫేనామ్ = నురుగుతో కూడినది, సస్వనామ్ = ధ్వనితో కూడి నది, భూత్వా = అయి, సముత్థితామ్ = లేచిన, ప్రశాన్తమారుతోద్ధూతామ్ = ప్రశాంత మైన వాయువుచే చెదరగొట్టబడిన, నిస్స్వనామ్=ధ్వనిలేని, సాగరస్య =సముద్రముయొక్క, జలోర్మిమివ=తరంగము వలె ఉన్న అయోధ్యను ప్రవే శించెను.

తా. ఎక్కువ నురుగుతోను, ధ్వనితోను లేచి, ఇంతలో ప్రశాంత మైన

వాయువు చెదరగొట్టుటచే, ధ్వని లేకుండా పోయిన సముద్రతరంగము వలె ఆ అయోధ్య ఎట్టి ధ్వనులు లేకుండ ఉండెను. 7

మూ. త్యక్తాం యజ్ఞాయుధైః సర్వైరభిరూపైశ్చ యాజకైః,
సుత్యాకాలే వినిర్వృత్తే వేదిం గతరవామివ. 8

ప్ర. అ. సర్వైః=సమస్తమైన, యజ్ఞాయుధైః=యజ్ఞములకు సంబంధించిన ఉపకరణములచేతను, అభిరూపైః=తగిన, యాజకైః=ఋత్విక్కులచేతను, సుత్యాకాలే=యాగసమాప్తిదివసము, వినిర్వృతే = గడిచిపోయిన దగుచుండగా, త్యక్తామ్=విడువబడిన, గతరవామ్=పోయిన ధ్వనిగల, వేదిమ్ ఇవ=వేదికవలె ఉన్న అయోధ్యను చూచెను.

తా. యాగసమాప్తిదినము గడచిన పిమ్మట, చుట్టు ప్రక్కల యజ్ఞములకు సంబంధించిన ఉపకరణములు, ఉత్తములైన ఋత్విక్కులు లేకపోవుటచే, నిశ్శబ్దముగా నున్న వేదిక వలె అయోధ్య ఉండెను. 8

మూ. గోష్ఠమధ్యే స్థితామార్తామచరన్తీం తృణం నవమ్,
గోవృషేణ పరిత్యక్తాం గవాం పత్నీమివోత్సుకామ్. 9

ప్ర. అ. గోవృషేణ = వృషభముచేత, పరిత్యక్తామ్ = విడువబడినది, ఉత్సుకామ్=ఆ వృషభమునం దాసక్తి కలది, గవామ్=గోవులయొక్క, గోష్ఠమధ్యే=(గో)శాల మధ్యయందు, స్థితామ్ = ఉన్నది, ఆర్తామ్=పీడితురాలైనది, నవం=నూతనమైన, తృణమ్=గడ్డిని, అచరన్తీం=మేయని, పత్నీమివ=వృషభముయొక్క భార్య వలె ఉన్న ఆయోధ్యను, ప్రవేశించెను.

తా. ఆ అయోధ్య, వృషభము దూరముగా వెళ్ళిపోగా, దానిపై అధికమైన ఆసక్తితో ఆర్తురాలై, గోష్ఠమధ్యములో నిలచి, కొత్త తృణమును మేయని గోవు వలె ఉండెను. 9

మూ. ప్రభాకరాద్యైః సుస్నిగ్ధైః ప్రజ్వలద్భిరివోత్తమైః,
వియుక్తాం మణిభిర్జాత్యైర్నవాం ముక్తావళీమివ. 10

ప్ర. అ. సుస్నిగ్ధైః = చాలా నున్నగా నున్నవి, ప్రజ్వలద్భిరివ = ప్రజ్వలించుచున్నట్లున్నవి, ఉత్తమైః=శ్రేష్ఠములైనవి, జాత్యైః = ఉత్తమజాతికి చెంది

నవి అయిన, ప్రభాకరాద్యైః=పద్మరాగము మొదలైన, మణిభిః=మాణిక్యముల చేత, వియుక్తామ్=విడువబడిన, నవామ్ = నూతనమైన, ముక్తావళీమివ=ముత్యముల హారముల వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. ఆ అయోధ్య, చాలా నున్నగా ఉన్నవీ (అందమైనవీ) జ్వలించుచున్నట్లున్నవీ, మంచి జాతికి చెందినవీ అయిన పద్మరాగాదిమణులు లేని కొత్త ముత్యాలహారము వలె ఉండెను. 10

మూ. సహసా చలితాం స్థానాన్మహీం పుణ్యక్షయాద్గతామ్,
సంవృతద్యుతివిస్తారాం తారామివ దివశ్చ్యుతామ్. 11

ప్ర. అ. పుణ్యక్షయాత్=పుణ్యము క్షీణించుటవలన, స్థానాత్=స్థానము నుండి, చలితామ్=చలించినది, సహసా = వెంటనే, మహీమ్=భూమిని, గతామ్ =పొందినది, సంవృతద్యుతివిస్తారామ్ = తగ్గిన కాంతియొక్క విస్తారము కలది, దివః = ఆకాశమునుండి, చ్యుతామ్ = జారినది అయిన, తారామివ = నక్షత్రము వలె ఉన్న అయోధ్యను ప్రవేశించెను.

తా. ఆ అయోధ్య పుణ్యము క్షీణించుటచే స్థానమునుండి చలించి, కాంతి యంతయు నశించగా ఆకాశమునుండి జారి తటాలున భూమిపై వడిన నక్షత్రము వలె ఉండెను. 11

మూ. పుష్పనద్ధాం వసన్తాన్తే మత్తభ్రమరనాదితామ్,
ద్రుతదావాగ్నివిప్లుష్టాం క్లాన్తాం వనలతామివ. 12

ప్ర. అ. వసన్తాన్తే = వసన్తఋతువు అంతమునందు, ద్రుతదావాగ్ని విప్లుష్టామ్ = వేగముగా వచ్చిన దావాగ్నిచే వేడెక్కించబడినది, పుష్పనద్ధామ్ = పుష్పములచేత వ్యాప్తమైనదీ, మత్తభ్రమరనాదితామ్ = మదించిన తుమ్మెదలచే ధ్వనింపచేయబడినది, క్లాన్తామ్=వాడిపోయినది అయిన, వనలతామివ=వనలత వలె ఉన్న అయోధ్యను ప్రవేశించెను.

తా. పుష్పములతో నిండి, మదించిన తుమ్మెదల రొజతో కూడిన వన లత, వసన్తాంతమునందు దావాగ్నిచే వేడెక్కి, ఏ విధముగా వాడిపోవునో అయోధ్య ఆ విధముగా ఉండెను. 12

మూ. సమ్మూఢనిగమాం స్తబ్ధాం సంక్షిప్తవిపణాపణామ్,
ప్రచ్ఛన్నశశినక్షత్రాం ద్యామివామ్బుధరైర్వృతామ్.

ప్ర. అ. సమ్మూఢనిగమామ్ = ఏ పనులు జరుగని కార్యాలయములు కలది, స్తబ్ధామ్ = నిశ్చలముగా నున్నది, సంక్షిప్తవిపణాపణామ్ = మూసివేయ బడిన విక్రయస్థానములు, అంగళ్లు కలది, అమ్బుధరైః = మేఘములచే, వృతామ్ = ఆవృత మైన. ప్రచ్ఛన్నశశినక్షత్రామ్ = కప్పబడిన చంద్రనక్షత్రములు గల, ద్యామివ = ఆకాశమువలె నున్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. అయోధ్యలోని కార్యాలయము లన్నీ ఏ పనులు లేకుండా ఉండెను. అంగళ్లు, అంగళ్లున్న వీథులు మూత బడి ఉండెను. ఈ విధముగా స్తబ్ధమై ఉన్న అయోధ్య మేఘము లావరించగా, చంద్రుడు, నక్షత్రములు కనబడకుండా పోయిన ఆకాశము వలె ఉండెను. 13

మూ. క్షీణపానోత్తమైర్భిన్నైః శరావైరపి సంవృతామ్,
హతశౌణ్డామివాకాశే పానభూమిమసంస్కృతామ్. 14

ప్ర. అ. ఆకాశే = బయట, క్షీణపానోత్తమైః = క్షీణ మైన ఉత్తమపానీయ ములు గల, భగ్నైః = బద్ధ లైన, శరావైః = పానపాత్రలచేత, అభిసంవృతామ్ = వ్యాప్త మైన, హతశౌణ్డామ్ = చంపబడిన పానశాలాధ్యక్షుడు గల, ధ్వస్తామ్ = ధ్వస్త మైన, అసంస్కృతామ్ = సంస్కరింపబడని, పానభూమిమ్ ఇవ = పానభూమి వలె ఉన్న అయోధ్యను ప్రవేశించెను.

తా. చుట్టును బద్ధ లైన ఉత్తమపానపాత్రలు పడి ఉండగా, సంస్కారము లేక, శాలాధ్యక్షుడు మరణించిన పానభూమి వలె అయోధ్య కాంతివిహీన మై ఉండెను. 14

మూ. వృక్ణభూమితలాం నిమ్నాం వృక్ణపాత్రైః సమావృతామ్,
ఉపయుక్తోదకాం భగ్నాం ప్రపాం నిపతితామివ. 15

ప్ర. అ. వృక్ణభూమితలామ్ = పగిలిన నేల కలది, వృక్ణపాత్రైః = పగిలిన పాత్రలతో, సమావృతామ్ = ఆవరింపబడినది, నిమ్నామ్ = పల్లముగా నున్నది, ఉపయుక్తోదకామ్ = ఉపయోగింపబడిన ఉదకము కలది, భగ్నామ్ = భగ్న

మైనది, నిపతితామ్=పడిపోయినది అయిన, ప్రపామివ=చలివెందల వలె నున్న అయోధ్యను ప్రవేశించెను.

తా. నేల పగిలి పల్లమై పోగా, బద్దలైన పాత్రలు ఇటు అటు పడి ఉండగా, త్రాగుటకు జలము లేక, విరిగి నేలపై బడిన చలివెందల వలె ఆ అయోధ్య కనబడుచుండెను. 15

మూ. విపులాం వితతాం చైవ యుక్తపాశాం తరస్వినామ్,
భూమౌ బాణై ర్వినిష్కృత్తాం పతితాం జ్యామివాయుధాత్.

ప్ర. అ. విపులామ్ = విశాల మైనది, వితతామ్ = వ్యాపించినది, యుక్త పాశామ్=తగిన త్రాళ్లు గలది, తరస్వినామ్ = బలవంతులయొక్క, బాణైః = బాణములచేత, వినిష్కృత్తామ్ = ఖండింపబడినది, ఆయుధాత్ = ఆయుధము నుండి, భూమౌ = భూమియందు, పతితామ్ = పడినది అయిన, జ్యామివ=నారి వలె ఉన్న అయోధ్యను ప్రవేశించెను.

తా. దీర్ఘము, తగిన త్రాళ్ళు కలది అయిన విశాల మైన నారి బలవంతుల బాణములచే ఛేదింపబడి, ధనుస్సునుండి నేలపై పడిన ఎట్లుండునో అయోధ్య ఆ విధముగా ఉండెను. 16

మూ. సహసా యుద్ధశౌణ్డేన హయారోహేణ వాహితామ్,
నిహతాం ప్రతిసైన్యేన వడవామివ పాతితామ్. 17

ప్ర. అ. యుద్ధశౌణ్డేన = యుద్ధమునందు శూరు డైన, హయారోహేణ= గుర్రము నెక్కువానిచేత, సహసా = హఠాత్తుగా, వాహితామ్ = తనను మోయునట్లు చేయబడినది, ప్రతిసైన్యేన=శత్రుసైన్యముచేత, నిహతామ్=చంపబడినది, పాతితామ్=పడగొట్టబడినది అయిన, వడవామివ = ఆడ గుఱ్ఱము వలె ఉన్న అయోధ్యను చూచెను.

తా. యుద్ధశూరు డైన రౌతు తటాలున ఎక్కి, యుద్ధరంగమునకు తీసుకొనిపోగా, అక్కడ శత్రువులచే చంపబడి, నేలపై పడిన ఆడగుఱ్ఱము వలె ఆ అయోధ్య కనబడెను. 17

మూ. శుష్కతోయాం మహామత్స్యైః కూర్మైశ్చ బహుభిర్వృతామ్,
ప్రభిన్నతటవిస్తీర్ణాం వాపీమివ హృతోత్పలామ్. 18

ప్ర. అ. శుష్కతోయామ్=ఎండిన ఉదకము కలది, బహుభిః = అనేక మైన, మహామత్స్యైః = గొప్ప మత్స్యములతోను, కూర్మైశ్చ = కూర్మముల తోను, వృతామ్=నిండినది, ప్రభిన్నతటవిస్తీర్ణామ్=పగిలిన తటములచే వ్యాప్త మైనది, హృతోత్పలామ్=హరింపబడిన కలువలు కలది అయిన, వాపీమివ = దిగుడుబావి వలె ఉన్న అయోధ్యను ప్రవేశించెను.

తా. నీరు ఎండిపోయి, అనేక మైన పెద్ద పెద్ద మత్స్యములు, కూర్మ ములు, బయటపడి ఉండగా, చుట్టుప్రక్కల నున్న తీరప్రదేశము బీటలువారి యున్న, ఉత్పలములు లేని, దిగుడుబావి వలె ఆ అయోధ్యానగరము కాంతివిహీన మై ఉండెను. 18

మూ. పురుషస్యాప్రహృష్టస్య ప్రతిషిద్ధానులేపనామ్,
సంతప్తామివ శోకేన గాత్రయష్టిమభూషణామ్. 19

ప్ర. అ. ప్రతిషిద్ధానులేపనాం = విడువబడిన మైపూత కలది, శోకేన = దుఃఖముచేత, సంతప్తామ్=తపింపచేయబడినది, అభూషణామ్=అలంకారములు లేనిది అయిన, అప్రహృష్టస్య = దుఃఖితు డైన, పురుషస్య = పురుషునియొక్క, గాత్రయష్టిమివ=శరీరము వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. పైన పూసుకొను చందనాదులు పూయక, భూషణములు ధరించక, శోకముతో బాధపడుచున్న దుఃఖితు డైన పురుషుని శరీరము వలె ఆ అయోధ్య ఉండెను. 19

మూ. ప్రావృషి ప్రవిగాఢాయాం ప్రవిష్టస్యాభ్రమణ్డలమ్,
ప్రచ్ఛన్నాం నీలజీమూతైర్భాస్కరస్య ప్రభామివ. 20

ప్ర. అ. ప్రవిగాఢాయామ్ = బాగా ముదిరిన, ప్రావృషి = వర్షకాలము నందు, అభ్రమణ్డలమ్=మేఘమండలమును, ప్రవిష్టస్య=ప్రవేశించిన, భాస్కరస్య =సూర్యునియొక్క, నీలజీమూతైః = నల్లని మేఘముల చేత, ప్రచ్ఛన్నామ్ = కప్పబడిన, ప్రభామివ=కాంతి వలె ఉన్న, అయోధ్యను ప్రవేశించెను.

తా. మంచి వర్షకాలమునందు, సూర్యుడు మేఘమండలములో ప్రవేశించగా నల్లని మేఘములచే కప్పబడిన సూర్యుని కాంతి వలె ఆ అయోధ్య ఉండెను. 20

మూ. భరతస్తు రథస్థః సన్ శ్రీమాన్ దశరథాత్మజః,
వాహయన్తం రథశ్రేష్ఠం సారథిం వాక్యమబ్రవీత్. 21

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడు, దశరథాత్మజః = దశరథుని కుమారుడు ఐన, భరతస్తు = భరతు డైతే, రథస్థస్సన్ = రథముపై ఉన్నవాడై, రథశ్రేష్ఠమ్ = శ్రేష్ఠ మైన రథమును, వాహయన్తమ్ = నడిపించుచున్న, సారథిమ్ = సారథిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రీమంతుడు, దశరథుని పుత్రుడు అయిన భరతుడు, రథమునందు కూర్చుండి, ఆ రథశ్రేష్ఠమును నడిపించుచున్న సారథితో, ఇట్లు పలికెను. 21

మూ. కిం ను ఖల్వద్య గమ్భీరో మూర్ఛితో న నిశమ్యతే,
యథాపురమయోధ్యాయాం గీతవాదిత్రనిస్వనః. 22

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యయందు, అద్య = నేడు, యథాపురమ్ = పూర్వమునందు వలె, గమ్భీరః = గంభీరమూ, మూర్ఛితః = సర్వత్ర వ్యాప్తమూ అయిన, గీతవాదిత్రనిస్వనః = గీతములయొక్క, వాద్యములయొక్క ధ్వని, న నిశమ్యతే = వినబడుట లేదు. కిం ను ఖలు = ఏమి కారణమో :

తా. అయోధ్యానగరములో ఇపుడు గంభీర మైన గీతవాద్యాదుల ధ్వని పూర్వమునందు వలె సర్వత్ర వ్యాపించి వినబడుట లేదు. కారణ మేమో ! 22

మూ. వారుణీమదగన్ధశ్చ మాల్యగన్ధశ్చ మూర్ఛితః,
ధూపితాగరుగన్ధశ్చ న ప్రవాతి సమన్తతః. 23

ప్ర. అ. వారుణీమదగన్ధశ్చ = మద్యముయొక్క మదగంధము, మాల్యగన్ధశ్చ = పుష్పమాలికల సువాసన, ధూపితాగరుగన్ధశ్చ = ధూపము వేయబడిన అగరువుయొక్క సువాసన, సమన్తతః = అంతటను, మూర్ఛితః = వ్యాపించినదై, న ప్రవాతి = వీచుటలేదు.

తా. మద్యగంధము, పుష్పమాలల సుగంధము, అగరుధూపముల సుగంధము అంతటను వ్యాపించి గుబాళించుటలేదు. 23

మూ. యానప్రవరఘోషశ్చ స్నిగ్ధశ్చ హయనిస్వనః,
ప్రమత్తగజనాదశ్చ మహాంశ్చ రథనిస్వనః. 24
నేదానీం శ్రూయతే పుర్యామస్యాం రామే వివాసితే.

ప్ర. అ. రామే = రాముడు, వివాసితే = దూరముగా పంపబడినవా డగుచుండగా, ఇదానీమ్ = ఇపుడు, అస్యాం పుర్యామ్ = ఈ పట్టణమునందు, యానప్రవరఘోషశ్చ=శ్రేష్ఠమైన వాహనముల ధ్వని, స్నిగ్ధః=మధురమైన, హయనిస్వనశ్చ=గుఱ్ఱముల ధ్వని, ప్రమత్తగజనాదశ్చ = మదించిన ఏనుగుల ధ్వని, మహాన్=గొప్పదైన, రథనిస్వనః చ = రథధ్వని, న శ్రూయతే = వినబడుటలేదు.

తా. రాముడు విడిచివెళ్ళిపోవుటచే, ఇపుడు ఈ నగరమునందు, శ్రేష్ఠమైన వాహనముల ధ్వని, మధురమైన అశ్వముల ధ్వని, మదించిన గజముల ధ్వని, గొప్ప రథధ్వని వినబడుటలేదు. 24

మూ. చన్దనాగరుగన్ధాంశ్చ మహార్హాశ్చ నవస్రజః, 25
గతే హి రామే తరుణాః సంతప్తా నోపభుఞ్జతే.

ప్ర. అ. రామే=రాముడు, గతే=వెళ్ళిపోయినవా డగుచుండగా, తరుణాః =యువకులు, సంతప్తాః=దుఃఖపడుచున్నవారై, చన్దనాగరుగన్ధాంశ్చ=చందనాగరుగంధములను, మహార్హాః=శ్రేష్ఠమైన, నవస్రజశ్చ = నూతనమైన పుష్పమాలలను, నోపభుఞ్జతే = అనుభవించుటలేదు.

తా. రాముడు అయోధ్యను విడిచి వెళ్ళిపోయిన పిమ్మట దుఃఖాక్రాంతులైన యువకులు చందనమును, అగరువును, ఇతర సుగంధద్రవ్యములను, శ్రేష్ఠములైన క్రొత్త పుష్పమాలలను ధరించుటలేదు. 25

మూ. బహిర్యాత్రాం న గచ్ఛన్తి చిత్రమాల్యధరా నరాః, 27
నోత్సవాః సంప్రవర్తన్తే రామశోకార్దితే పురే.

ప్ర. అ. రామశోకార్దితే = రామవిరహదుఃఖముచే పీడింపబడిన, పురే=

పట్టణమునందు, నరాః = నరులు, చిత్రమాల్యధరాః = చిత్రములైన పుష్పమాలలు ధరించినవారై, బహిః = బయటకు, యాత్రామ్ = విలాసయాత్రలను గూర్చి, న గచ్ఛన్తి = వెళ్లుటలేదు. ఉత్సవాః = ఉత్సవములు, న సంప్రవర్తన్తే జరుగుటలేదు.

తా. ఈ అయోధ్యానగరము రామశోకముచే పీడితమై ఉన్నది. పౌరులెవ్వరు వివిధములైన పుష్పమాలలు ధరించి, విలాసయాత్రకై బయటకు వెళ్లుటలేదు. ఉత్సవము లేమియు జరుగుటలేదు. 27

మూ. సహ నూనం మమ భ్రాత్రా పురస్యాస్య ద్యుతిర్గతా, 28
న హి రాజత్యయోధ్యేయం సాసారేవార్జునీ క్షపా.

ప్ర. అ. అస్య పురస్య = ఈ పట్టణముయొక్క, ద్యుతిః = కాంతి, మమ = నాయొక్క, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, గతా = వెళ్ళిపోయినది. నూనమ్ = నిశ్చయము. ఇయమ్ = ఈ, అయోధ్యా = అయోధ్య, సాసారా = = ధారావర్షముతో కూడిన, అర్జునీ = శుక్లపక్షమునకు సంబంధించిన, క్షపా ఇవ = రాత్రి వలె, న రాజతి హి = ప్రకాశించుటలేదు కదా!

తా. శోభ అంతా నా సోదరునితో కలిసి, ఈ పురమును విడచి వెళ్ళిపోయినది. నిశ్చయము. ధారావర్షము పడుచున్నపుడు, కృష్ణపక్షరాత్రివలె ఈ ఈ అయోధ్యానగరము ప్రకాశించుటలేదు. 28

మూ. కదా ను ఖలు మే భ్రాతా మహోత్సవ ఇవాగతః, 29
జనయిష్యత్యయోధ్యాయాం హర్షం గ్రీష్మ ఇవామ్బుదః.

ప్ర. అ. మే భ్రాతా = నా సోదరుడు, మహోత్సవ ఇవ = మహోత్సవము వలె, ఆగతః = వచ్చినవాడై, గ్రీష్మే = గ్రీష్మఋతువునందు, అమ్బుదః ఇవ = మేఘము వలె, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, హర్షమ్ = ఆనందమును, కదా = ఎపుడు, జనయిష్యతి ను ఖలు = పుట్టించునో!

తా. నా సోదరుడైన రాముడు మహోత్సవము వలె వచ్చి గీష్మకాలమునందు మేఘము వలె, అయోధ్యకు ఎపుడు ఆనందమును కలుగచేయునో కదా!

మూ. తరుణై శ్చారువేషైశ్చ నరై రున్నతగామిభిః, 30
సంపతద్భిరయోధ్యాయాం నాభిభాన్తి మహాపథాః.

ప్ర. అ అయోధ్యాయామ్ = అయోధ్యలో, మహాపథాః = విశాలమార్గములు, చారువేషైః = సుందర మైన వేషములు గల, ఉన్నతగామిభిః = నిటారుగా నిలిచి నడచుచున్న, సంపతద్భిః = గుంపులుగా వచ్చి పడుచున్న, తరుణైః = యువకు లైన, నరైః = నరులతో. నాభిభాన్తి = ప్రకాశించుటలేదు.

తా. అయోధ్యలోని విశాలమార్గములు, అంద మైన వేషములు ధరించి సగర్వముగా నడచుచున్న యువకు లైన నరులతో ప్రకాశించుటలేదు. 30

మూ. ఏవం బహువిధం జల్పన్ వివేశ వసతిం పితుః, 31
తేన హీనాం నరేన్ద్రేణ సింహహీనాం గుహామివ.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బహువిధమ్ = అనేకవిధములుగా, జల్పన్ = మాటలాడుచు, తేన = ఆ, నరేన్ద్రేణ = రాజుతో, హీనామ్ = శూన్య మైనదీ, సింహహీనామ్ = సింహముచే విడువబడిన, గుహామివ = గుహ వలె ఉన్నదీ అయిన, పితుః = తండ్రియొక్క, వసతిమ్ = నివాసమును, వివేశ = ప్రవేశించెను.

తా. భరతు డిట్లు అనేకవిధములుగా మాట్లాడుచు తండ్రి గృహములోనికి ప్రవేశించెను. దశరథమహారాజు లేకపోవుటచే ఆ గృహము సింహములేని గుహ వలె ఉండెను. 31

మూ. తదా తదన్తఃపురముజ్ఝితప్రభం
సురై రివోత్సృష్టమభాస్కరం దినమ్,
నిరీక్ష్య సర్వం తు వివిక్తమాత్మవాన్
ముమోచ బాష్పం భరతః సుదుఃఖితః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుర్దశో త్తరశతతమః సర్గః.

ప్ర. అ. తదా = అపుడు, ఆత్మవాన్ = బుద్ధిమంతు డైన, భరతః = భరతుడు, సురైః = దేవతలచేత, ఉత్సృష్టమ్ = విడువబడిన, అభాస్కరమ్ =

సూర్యుడు లేని, దినమివ = దివసము వలె నున్న, ఉజ్ఝితప్రభమ్ = విడువబడిన కాంతి గల, వివిక్తమ్=శూన్య మైన, సర్వమ్=సమస్త మైన, తత్ అన్తఃపురమ్ ఆ అంతఃపురమును, నిరీక్ష్య = చూచి, బాష్పమ్ = కన్నీటిని, ముమోచ = విడచెను.

తా. ఆత్మస్థైర్యవంతు డైన ఆ భరతుడు, సూర్యుడు లేక దేవతలుకూడ విడిచివేసిన దివసము వలె, కాంతిరహిత మై శూన్యముగా ఉన్న ఆ అంతఃపురము నంతను చూచి కన్నీళ్ళు విడచెను. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యకాండలో నూటపదునాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చదశోత్తరశతతమః సర్గః

[భరతుడు నందిగ్రామమున కేగి రామపాదుకలకు రాజ్యాభిషేక మొనర్చి, రాజకార్యములను వానికే నివేదించుచు కార్యములు నిర్వహించుట.]

మూ. తతో నిక్షిప్య మాతౄః స అయోధ్యాయాం దృఢవ్రతః,
భరతః శోకసంతప్తో గురూనిదమథాబ్రవీత్. 1

ప్ర. అ. దృఢవ్రతః = దృఢ మైన వ్రతము గల, సః భరతః = ఆ భరతుడు, తతః = అటుపిమ్మట, మాతౄః = తల్లులను, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, నిక్షిప్య = ఉంచి, శోకసంతప్తః = శోకముచేత తపింపచేయబడినవాడై, గురూన్ = గురువులను గూర్చి, అథ = అటుపిమ్మట, అబ్రవీత్ = పలికెను.

తా. దృఢ మైన వ్రతము గల భరతుడు తల్లులను అయోధ్య చేర్చిన పిదప, శోకసంతప్తు డై, వసిష్ఠాదిగురువులతో ఇట్లు చెప్పెను. 1

మూ. నన్దిగ్రామం గమిష్యామి సర్వానామన్త్రయేఽద్య వః,
తత్ర దుఃఖమిదం సర్వం సహిష్యే రాఘవం వినా. 2

ప్ర. అ. అద్య = ఇపుడు, నన్దిగ్రామమ్ = నందిగ్రామము గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. వః = మిమ్ములను, సర్వాన్ = అందరిని, ఆమన్త్రయే = వీడ్కొలుపుచున్నాను. తత్ర = అక్కడ, రాఘవం వినా = రాముడు లేకపోవుటచే కలిగిన, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్త మైన, దుఃఖమ్ = దుఃఖమును, సహిష్యే = సహించగలను.

తా. నేను ఇపుడు బయలుదేరి నందిగ్రామమునకు వెళ్లుచున్నాను.

మిమ్ములనందరిని పీడ్కొనుచున్నాను. రాముడు లేకపోవుటచే కలిగిన ఈ దుఃఖము నంతను ఆక్కడ సహించెదను. 2

మూ. గతశ్చ వా దివం రాజా వనస్థశ్చ గురుర్మమ,
రామం ప్రతీక్షే రాజ్యాయ స హి రాజా మహాయశాః.

ప్ర. అ రాజా = రాజు, దివమ్ = స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడు. మమ గురుః = నా అన్నగారు, వనస్థః = వనములో ఉన్నాడు. రాజ్యాయ = రాజ్యము కొరకు, రామమ్ = రాముని, ప్రతీక్షే = నిరీక్షించుచున్నాను. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = అతడే, రాజా హి = రాజు కదా!

తా. దశరథమహారాజు స్వర్గస్థుడైనాడు. అన్నగారు వనములో ఉన్నాడు. నేను రాజ్యముచేయుటకొరకు రామునికై వేచి యుండెదను. మహాయశశ్శాలియైన అతడే రాజు కదా! 3

మూ. ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
అబ్రువన్మన్త్రిణస్సర్వే వసిష్ఠశ్చ పురోహితః. 4

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, భరతస్య = భరతునియొక్క, శుభమ్ = మంగళకరమైన, ఏతత్ = ఈ వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా = విని, సర్వే=సమస్తమైన, మన్త్రిణః = మంత్రులు, పురోహితః = పురోహితుడైన, వసిష్ఠశ్చ=వసిష్ఠుడు, అబ్రువన్ = పలికిరి.

తా. మహాత్ముడైన ఆ భరతుడు పలికిన మంగళకరములైన మాటలు విని పురోహితుడైన వసిష్ఠుడు, మంత్రులందరును ఇట్లు పలికిరి. 4

మూ. సుభృశం శ్లాఘనీయం చ యదుక్తం భరత త్వయా,
వచనం భ్రాతృవాత్సల్యాదనురూపం తవైవ తత్. 5

ప్ర. అ. భరత! = ఓ భరతుడా! త్వయా = నీచేత, భ్రాతృవాత్సల్యాత్ = సోదరునియందు ప్రేమవలన, యత్ వచనమ్ = ఏ మాట, ఉక్తమ్ = చెప్పబడినదో, అది, సుభృశమ్ = మిక్కిలి, శ్లాఘనీయం=శ్లాఘింపదగినది. తత్ = అది, తవైవ = నీకే, అనురూపమ్ = తగినది.

తా. ఓ భరతుడా! సోదరప్రేమచే నీవు పలికిన ఈ మాట చాలా శ్లాఘింపదగినది. ఇట్టి మాట చెప్పుటకు నీకే తగును. 5

మూ. నిత్యం తే బన్ధులుబ్ధస్య తిష్ఠతో భ్రాతృసౌహృదే,
ఆర్యమార్గం ప్రపన్నస్య నానుమన్యేత కః పుమాన్. 6

ప్ర. అ. బన్ధులుబ్ధస్య = బంధువులయందు ఆసక్తి కలవాడవు, నిత్యమ్ = ఎల్లపుడు, భ్రాతృసౌహృదే = సోదరుల ప్రేమయందు, తిష్ఠతః = ఉన్నవాడవు, ఆర్యమార్గమ్ = పెద్దల మార్గమును, ప్రపన్నస్య = పొందినవాడవు అయిన, తే = నీకు, కః పుమాన్ = ఏ పురుషుడు, నానుమన్యేత = అనుమతించడు.

తా. బంధువులయం దాసక్తి కలవాడవు, స్థిర మైన సోదరస్నేహము కలవాడవు, పెద్దల మార్గము అనుసరించుచున్నవాడవు అయిన నీవు చెప్పినది ఎవరు అంగీకరించరు? 6

మూ. మన్త్రిణాం వచనం శ్రుత్వా యథాభిలషితం ప్రియమ్,
అబ్రవీత్ సారథిం వాక్యం రథో మే యుజ్యతామితి. 7

ప్ర. అ. యథాభిలషితమ్ = తన కోరిక ప్రకారము ఉన్న, ప్రియమ్ = ప్రియ మైన, మన్త్రిణామ్ = మంత్రుల యొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సారథిమ్ = సారథిని గూర్చి, మే రథః = నా రథము, యుజ్యతామ్ = కట్టబడుగాక! ఇతి = అని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. తన ఇష్టమును అనుసరించి, మంత్రులు పలికిన ప్రియ మైన ఆ మాటలు విని, భరతుడు" నా రథమును సిద్ధముచేయుము." అని సారథిని ఆజ్ఞాపించెను. 8

మూ. ప్రహృష్టవదనః సర్వా మాతౄః సమభివాద్య సః,
ఆరురోహ రథం శ్రీమాన్ శత్రుఘ్నేన సమన్వితః. 8

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః = భరతుడు, ప్రహృష్టవదనః = వికసించిన ముఖము గలవాడై, సర్వాః = సమస్త మైన, మాతౄః = తల్లులను, సమభివాద్య = నమస్కరించి, శత్రుఘ్నే = శత్రుఘ్నునితో, సమన్వితః = కూడినవాడై, రథమ్ = రథమును, ఆరురోహ = ఎక్కెను.

తా. శ్రీమంతు డైన ఆ భరతుడు, సంతోషించి తల్లు లందరికి నమస్కరించి, శత్రుఘ్న సహితు డై రథము ఎక్కెను. 8

మూ. ఆరుహ్యా చ రథం శీఘ్రం శత్రుఘ్న భరతావుభౌ,
యయతుః పరమప్రీతౌ వృతౌ మన్త్రిపురోహితైః. 9

ప్ర. అ. శత్రుఘ్న భరతౌ = శత్రుఘ్న భరతులు, ఉభౌ = ఇద్దరు, శీఘ్రమ్ = శీఘ్రముగా, రథమ్ = రథమును, ఆరుహ్య చ = ఎక్కి, పరమప్రీతౌ = చాలా సంతోషించినవారై, మన్త్రిపురోహితైః = మంత్రులతోను, పురోహితులతోను, వృతౌ = కూడినవారై, యయతుః = వెళ్ళిరి.

తా. భరతశత్రుఘ్ను లిద్దరు చాలా సంతోషించుచు, శీఘ్రముగా రథమును ఎక్కి, మంత్రులతోను, పురోహితులతోను కలిసి శీఘ్రముగా వెళ్ళిరి. 9

మూ. అగ్రతో గురవస్తత్ర వసిష్ఠప్రముఖా ద్విజాః,
ప్రయయుః ప్రాఙ్ముఖాః సర్వే నన్దిగ్రామో యతోఽభవత్.

ప్ర. అ. తత్ర = అక్కడ, గురవః = గురువు లైన, వసిష్ఠప్రముఖాః = వసిష్ఠుడు మొద లైన, సర్వే = సమస్త మైన, ద్విజాః = బ్రాహ్మణులు, ప్రాఙ్ముఖాః = తూర్పుదిక్కునకు అభిముఖు లై, నన్దిగ్రామః = నన్దిగ్రామము, యతః = ఎటు వైపు, అభవత్ = ఉండెనో అటు వైపు, అగ్రతః = యెదుట, ప్రయయుః = వెళ్ళిరి.

తా. గురువు లైన వసిష్ఠాదిబ్రాహ్మణు లందరు ఎదుట తూర్పుదిక్కునకు అభిముఖు లై నందిగ్రామము ఉన్న వైపు వెళ్ళిరి. 10

మూ. బలం చ తదనాహూతం గజాశ్వరథసంకులమ్,
ప్రయయౌ భరతే యాతే సర్వే చ పురవాసినః. 11

ప్ర. అ. భరతే = భరతుడు, యాతే = వెళ్ళిన వాడగుచుండగా, తదనాహూతమ్ = అతనిచే పిలువబడకుండగనే, గజాశ్వరథసంకులమ్ = గజములతోను, రథములతోను. అశ్వములతోను వ్యాకుల మైన, బలం చ = సేన, ప్రయయౌ = వెళ్ళెను. సర్వే = సమస్త మైన, పురవాసినః చ = పురములో నివసించువారు కూడ వెళ్ళిరి.

తా. భరతుడు వెళ్లగానే ఆతడు పిలవకపోయినను గజాశ్వరథములతో నిండిన సేన, పౌరులందరూ అతని వెనుక వెళ్ళిరి.

మూ. రథస్థః స హి ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః,
నన్దిగ్రామం యయౌ తూర్ణం శిరస్యాదాయ పాదుకే. 12

ప్ర. అ. భ్రాతృవత్సలః = సోదరులపై ప్రేమ గల, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః భరతః = ఆ భరతుడు, రథస్థః = రథమునం దున్నవాడై, పాదుకే = పాదుకలను, శిరసి = శిరస్సుపై, ఆదాయ = గ్రహించి (ఉంచుకొని), తూర్ణమ్ = శీఘ్రముగా, నన్దిగ్రామమ్ = నందిగ్రామమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. సోదరులయందు అత్యధిక మైన ప్రేమ గల, ధర్మాత్ము డైన ఆ భరతుడు, రథ మెక్కి, పాదుకలు శిరస్సుపై ఉంచుకొని శీఘ్రముగా నందిగ్రామమునకు వెళ్లెను. 12

మూ. తతస్తు భరతః క్షిప్రం నన్దిగ్రామం ప్రవిశ్య సః,
అవతీర్య రథాత్తూర్ణం గురూనిదముని వాచ హ. 13

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః భరతః = ఆ భరతుడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, నన్దిగ్రామమ్ = నందిగ్రామమును, ప్రవిశ్య = ప్రవేశించి, తూర్ణమ్ = శీఘ్రముగా, రథాత్ = రథమునుండి, అవతీర్య = దిగి, గురూన్ = గురువులను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. భరతుడు శీఘ్రముగా నందిగ్రామములో ప్రవేశించి రథము దిగి గురువులతో ఇట్లు పలికెను. 13

మూ. ఏతద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సన్న్యాసవత్స్వయమ్,
యోగక్షేమవహే చేమే పాదుకే హేమభూషితే. 14

ప్ర. అ. ఏతత్ రాజ్యమ్ = ఈ రాజ్యము, భ్రాత్రా = నా సోదరునిచేత, స్వయమ్ = స్వయముగా, సన్న్యాసవత్ = ఉత్తమ మైన న్యాసము వలె (కొంత కాలముపాటు దాచుటకై విశ్వాసపాత్రుల వద్ద ఉంచిన వస్తువు న్యాసము) మమ = నాకు, దత్తమ్ = ఇవ్వబడినది, యోగక్షేమవహే = యోగక్షేమములను వహించు

హేమభూషితే = బంగారముచే అలంకరించబడిన, ఇమే పాదుకే చ = ఈ పాదుకలు కూడా ఇవ్వబడినవి.

తా. మా అన్నగారు ఈ రాజ్యమును నావద్ద న్యాసముగా ఉంచి యోగక్షేమములు నిర్వహించుటకై, బంగారముచే అలంకరించబడిన ఈ పాదుకలను కూడా స్వయముగా ఇచ్చినారు. 14

మూ. భరతః శిరసా కృత్వా సన్న్యాసం పాదుకే తతః,
అబ్రవీద్దుఃఖసంతప్తః సర్వం ప్రకృతిమణ్డలమ్. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భరతః = భరతుడు, సన్న్యాసమ్ = ఉత్తమన్యాసమైన, పాదుకే = పాదుకలను, శిరసా = శిరస్సుచేత, కృత్వా = చేసి, దుఃఖసంతప్తః = దుఃఖముచేత పీడింపబడినవాడై, సర్వమ్ = సమస్తమైన, ప్రకృతిమణ్డలమ్ = ప్రకృతిమండలమును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట భరతుడు ఉత్తమన్యాసమైన పాదుకలను శిరస్సుపై ఉంచుకొని దుఃఖపీడితుడై, సమస్తప్రకృతిమండలముతో ఇట్లు పలికెను. 15

మూ. ఛత్రం ధారయత క్షిప్రమార్యపాదావిమౌ మతౌ,
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురోర్మమ.

ప్ర. అ. క్షిప్రమ్ = శీఘ్రముగా, ఛత్రమ్ = ఛత్రమును, ధారయత = పట్టుడు. ఇమౌ = ఇవి, ఆర్యపాదౌ = అన్నగారిపాదములుగా, మతౌ = అంగీకరింపబడినవి. మమ గురోః = నా అన్నగారియొక్క, ఆభ్యాం పాదుకాభ్యామ్ = ఈ పాదుకలచేత. రాజ్యే = రాజ్యమునందు, ధర్మః = ధర్మము, స్థితః = నిలచినది.

తా. వెంటనే ఛత్రమును పట్టుడు. ఇవి మా అన్నగారి పాదములు. రాజ్యములో ధర్మము మా అన్నగారి ఈ పాదుకలే నిర్వహించును. 16

మూ. భ్రాత్రా హి మయి సంన్యాసో నిక్షిప్తః సౌహృదాదయమ్,
తమిమం పాలయిష్యామి రాఘవాగమనం ప్రతి. 17

ప్ర. అ. భ్రాత్రా = సోదరునిచేత, అయమ్ = ఈ, సంన్యాసః = ఉత్తమమైన న్యాసము, సౌహృదాత్ = ప్రేమవలన, మయి = నాయందు, నిక్షిప్తః =

ఉంచబడినది. తత్ = అట్టి, ఇమమ్ = ఈ న్యాసమును, రాఘవాగమనం ప్రతి = రాముని రాకను గూర్చి, పాలయిష్యామి = పాలించెదను.

తా. నా మీద నున్న ప్రేమచేత మా అన్నగారు ఈ న్యాసమును నాకు అప్పగించినారు. ఆయన వచ్చువరకు నేను దీనిని పాలించెదను. 17

మూ. క్షిప్రం సంయోజయిత్వా తు రాఘవస్య పునః స్వయమ్,
చరణౌ తౌ తు రామస్య ద్రక్ష్యామి సహపాదుకౌ. 18

ప్ర. అ. క్షిప్రమ్ = శీఘ్రముగా, పునః = మరల, రాఘవస్య = రామునకు, స్వయమ్ = స్వయముగా, సంయోజయిత్వా = తొడిగి, సహపాదుకౌ = పాదుకలతో కూడిన, రామస్య = రామునియొక్క, తౌ చరణౌ = ఆ పాదములను, ద్రక్ష్యామి = చూడగలను.

తా. నేను స్వయముగా ఈ పాదుకలు రాముడు వచ్చిన పిదప, అతని పాదములకు తొడిగి పాదుకలతో కూడిన ఆ రామపాదములను చూచెదను 18

మూ. తతో నిక్షిప్తభారోఽహం రాఘవేణ సమాగతః,
నివేద్య గురవే రాజ్యం భజిష్యే గురువృత్తితామ్. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నిక్షిప్తభారః = ఉంచబడిన రాజ్యభారము గల, అహమ్ = నేను, రాఘవేణ = రామునితో, సమాగతః = కూడినవాడనై, రాజ్యమ్ = రాజ్యమును, గురవే = గురువునకు, నివేద్య = సమర్పించి, గురువృత్తితామ్ = గురువును సేవించుటను, భజిష్యే = పొందగలను.

తా. ఇపుడు ఈ రాజ్యభారము నామీద ఉంచబడినది. రాముడు వచ్చిన పిదప, నేను ఆయనను కలిసి ఆయనకు ఈ రాజ్యమును సమర్పించి, ఆయన శుశ్రూష చేసెదను. 19

మూ. రాఘవాయ చ సంన్యాసం దత్త్వేమే వరపాదుకే,
రాజ్యం చేదమయోధ్యాం చ ధూతపాపో భవామి చ. 20

ప్ర. అ. సంన్యాసమ్ = ఉత్తమన్యాస మైన, ఇమే వరపాదుకే = ఈ శ్రేష్ఠమైన పాదుకలను, ఇదం రాజ్యం చ = ఈ రాజ్యమును, అయోధ్యాం చ =

అయోధ్యను, రాఘవాయ = రామునకు, దత్త్వా = ఇచ్చివేసి, ధూతపాతః = కడగబడిన పాపములు కలవాడను, భవామి చ = అయ్యెదను.

తా. నా దగ్గర న్యాసముగా ఉంచిన పవిత్రము లైన ఈ పాదుకలను ఈ రాజ్యమును, అయోధ్యను కూడా రామునకు మరల సమర్పించి, నా పాపములను కడిగివేసుకొనెదను. 20

మూ. అభిషిక్తే తు కాకుత్స్థే ప్రహృష్టముదితే జనే,
ప్రీతిర్మమ యశశ్చైవ భవేద్రాజ్యాచ్చతుర్గుణమ్. 21

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, అభిషిక్తే = అభిషేకించబడినవా డగుచుండగా, జనే = జనము, ప్రహృష్టముదితే = సంతోషించి ఆనందించిన దగుచుండగా, మమ = నాకు, రాజ్యాత్ = రాజ్యముకంటె, చతుర్గుణమ్ = నాలుగురెట్లు, ప్రీతిః = ప్రేమ, యశశ్చైవ = కీర్తి, భవేత్ = అగును.

తా. రాముడు అభిషిక్తు డైన పిమ్మట జను లందరు మిక్కిలి సంతోషముతో ఆనందించెదరు. అపుడు నాకు రాజ్యమువలన వచ్చినదానికంటే నాలుగురెట్లు ఎక్కువ ఆనందము, కీర్తి కలుగును. 21

మూ. ఏవం తు విలపన్దీనో భరతః స మహాయశాః,
నన్దిగ్రామేఽకరోద్రాజ్యం దుఃఖితో మన్త్రిభిస్సహ. 22

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః భరతః = ఆ భరతుడు, దీనః = దీనుడై, ఏవమ్ = ఇట్లు, విలపన్ = విలపించుచున్నవాడై, దుఃఖితః = దుఃఖితుడై, మన్త్రిభిస్సహ = మంత్రులతో కూడ, నన్దిగ్రామే = నన్దిగ్రామమునందు, రాజ్యమ్ = రాజ్యమును, అకరోత్ = చేసెను.

తా. మహాకీర్తిశాలి యైన ఆ భరతుడు దుఃఖితు డై, దైన్యముతో ఈ విధముగా విలపించుచు, నందిగ్రామములో నివసించి, మంత్రులతో కూడి, రాజ్యము చేసెను. 22

మూ. స వల్కలజటాధారీ మునివేషధరః ప్రభుః,
నన్దిగ్రామేఽవసద్వీరః ససైన్యో భరతస్తదా. 23

ప్ర. అ. ప్రభుః = ప్రభువు, వీరః = వీరుడు అయిన, సః భరతః = ఆ భరతుడు, తదా = అపుడు, వల్కలజటాధారీ = నారచీరలను జటలను, ధరించుచు, మునివేషధరః = మునివేషధారియై, ససైన్యః = సైన్యముతో కూడినవాడై, నన్దిగ్రామే = నందిగ్రామమునందు, అవసత్ = నివసించెను.

తా. వీరుడు, ప్రభువు అయిన ఆ భరతుడు నారచీరలను, జటలను ధరించి, మునివేషముతో ఆ నందిగ్రామమునందు, సేనాసమేతుడై నివసించెను.

మూ. రామాగమనమాకాఙ్క్షన్ భరతో భ్రాతృవత్సలః,
భ్రాతుర్వచనకారీ చ ప్రతిజ్ఞాపారగస్తదా, 24.
పాదుకే త్వభిషిచ్యాథ నన్దిగ్రామేఽవసత్తథా.

ప్ర. అ. తదా = అపుడు, భ్రాతృవత్సలః = సోదరునియందు ప్రేమ గల, భరతః = భరతుడు, రామాగమనమ్ = రాముని రాకను, ఆకాఙ్క్షన్ = కోరుచు, భ్రాతుః = సోదరునియొక్క, వచనకారీ చ = వచనము చేయుచు, ప్రతిజ్ఞాపారగః = ప్రతిజ్ఞను నిర్వహించుకొనుచున్నవాడై, అథ = అటుపిమ్మట, పాదుకే = పాదుకలను, అభిషిచ్య = అభిషేకించి, నన్దిగ్రామే = నందిగ్రామమునందు, తథా = అట్లు, అవసత్ = నివసించెను.

తా. సోదరునియందు ప్రేమ గల భరతుడు, రాముని యాజ్ఞ ప్రకారము ప్రవర్తించుచు, తన ప్రతిజ్ఞను నిర్వర్తించుచు, రాముని పాదుకలకు అభిషేకము చేసి, రాముని రాకకు ఎదురుచూచుచు, నందిగ్రామములో ఆ విధముగా నివసించెను. 24

మూ. స వాలవ్యజనం ఛత్రం ధారయామాస స స్వయమ్,
భరతః శాసనం సర్వం పాదుకాభ్యాం నివేదయన్. 25

ప్ర. అ. సః భరతః = ఆ భరతుడు, సర్వమ్ = సమస్తమైన, శాసనమ్ = శాసనమును, పాదుకాభ్యామ్ = పాదుకలకొరకు, నివేదయన్ = తెలియపరచుచు, స్వయమ్ = స్వయముగా, సవాలవ్యజనమ్ = వింజామరలతో కూడిన, ఛత్రమ్ = ఛత్రమును, ధారయామాస = పట్టెను.

తా. భరతుడు ఆ పాదుకలకు సమస్తరాజకార్యములను విన్నవించుచు, వాటికి స్వయముగా ఛత్రచామరములు పట్టుచుండెను. 25

మూ. తతస్తు భరతః శ్రీమానభిషిచ్యార్యపాదుకే, 26
తదధీనస్తదా రాజ్యం కారయామాస సర్వదా.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = భరతుడు, ఆర్యపాదుకే = అన్నగారి పాదుకలను, అభిషిచ్య = అభిషేకముచేసి, సర్వదా = ఎల్లపుడు, తదధీనః = వాటికి అధీనుడై, రాజ్యమ్ = రాజ్యమును, కారయామాస = చేసెను.

తా. శ్రీమంతుడైన భరతుడు, అన్నగారి పాదుకలకు రాజ్యాభిషేకము చేసి, వాటి క్రింద ఎల్లపుడు బంటు వలె ఉండి రాజ్యము చేసెను. 26

మూ. తదా హి యత్కార్యముపైతి కించి
దుపాయనం చోపహృతం మహార్హమ్,
స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకార పశ్చాద్భరతో యథావత్. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పంచదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. సః భరతః = ఆ భరతుడు, తదా = అపుడు, యత్కించిత్ = ఏ కొంచెమైన, కార్యమ్ = కార్యము, ఉపైతి = వచ్చునో దానిని, ఉపహృతమ్ = సమర్పించబడిన, మహార్హమ్ = అధికమైన వెల గల, ఉపాయనమ్ = కానుకను, ప్రథమమ్ = ముందుగా. పాదుకాభ్యామ్ = పాదుకలకు, నివేద్య = తెలిపి, పశ్చాత్ = తరువాత, యథావత్ = తగువిధముగా, చకార = చేసెను.

తా. ఏ కార్యము వచ్చినను, అమూల్యమైన ఏ ఉపాయనము ఎవరైన సమర్పించినను, భరతుడు ముందుగా వాటిని పాదుకలకు తెలిపి, తరువాత, తగు విధముగా చేయుచుండెడివాడు. 27

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున
అయోధ్యాకాండలో నూటపదిహేనవ సర్గ సమాప్తము.

## అథ షోడశోత్తరశతతమ సర్గః

[వృద్ధకులపతితో పాటు పలువురు ఋషులు చిత్రకూటము వీడి ఇతరములగు ఆశ్రమములకు పోవుట.]

మూ. ప్రతిప్రయాతే భరతే వసన్ రామస్తపోవనే,
లక్షయామాస సోద్వేగమథౌత్సుక్యం తపస్వినామ్. 1

ప్ర. అ. భరతే = భరతుడు, ప్రతిప్రయాతే = తిరిగి వెళ్ళిపోయినవాడగుచుండగా, రామః = రాముడు, తపోవనే = తపోవనమునందు, అథ = అటు పిమ్మట, తపస్వినామ్ = మహర్షులయొక్క, సోద్వేగమ్ = భయముతో కూడిన, ఔత్సుక్యమ్ = ఔత్సుక్యమును, (ఆ వనమును విడుచుటకు, తీవ్రమైన కోరికను), లక్షయామాస = గుర్తించెను.

తా. భరతుడు తిరిగి వెళ్ళిపోయిన పిమ్మట, రాముడు తపోవనములో నివసించుచు, అక్కడ ఉన్న మహర్షులు భయపడుచున్నట్లు, ఆ ప్రదేశమును విడుచుటకై అభిలషించుచున్నట్లు గుర్తించెను. 1

మూ. యే తత్ర చిత్రకూటస్య పురస్తాత్తాపసాశ్రమే,
రామమాశ్రిత్య నిరతాస్తానలక్షయదుత్సుకాన్. 2

ప్ర. అ. తత్ర = అక్కడ, పురస్తాత్ = పూర్వము, చిత్రకూటస్య = చిత్రకూటముయొక్క, తాపసాశ్రమే = మునుల ఆశ్రమమునందు, రామమ్ = రాముని, ఆశ్రిత్య = ఆశ్రయించి, నిరతాః = అక్కడ ఉండుటయందు ఆసక్తులుగా ఉండిరో, తాన్ = వారిని, ఉత్సుకాన్ = ఔత్సుక్యముతో గూడినవారినిగా, అలక్షయత్ = చూచెను.

తా. ఆ చిత్రకూటపర్వతముపై ఉన్న ఆశ్రమములో పూర్వము తనను

ఆశ్రయించుకొని సంతోషముతో ఉన్నవారే ఇపుడు ఎందుకో కంగారు పడు చున్నట్లు రామునకు కనబడెను. 2

మూ. నయనైర్భ్రుకుటీభిశ్చ రామం నిర్దిశ్య శఙ్కితాః,
అన్యోన్యముపజల్పన్తః శనైశ్చక్రుర్మిథః కథాః. 3

ప్ర. అ. శఙ్కితాః = భయపడినవారై, నయనైః = నేత్రములతోను, భృకుటీభిశ్చ = కనుబొమ్మల విరుపులతోను, రామమ్ = రాముని, నిర్దిశ్య = చూపి, అన్యోన్యమ్ = పరస్పరము, ఉపజల్పన్తః = మాటలాడుకొనుచు, మిథః = రహస్యమునందు, కథాః = కథలను, చక్రుః = చేసిరి.

తా. ఆ మునులు భయపడుచు చూపులతోను, కనుబొమ్మల కదలికలతోను, రాముని వైపు సంజ్ఞలు చేయుచు ఏమేమో గొణుగుకొనుచు, రహస్యముగా మాటలాడుకొనుచుండిరి. 3

మూ. తేషామౌత్సుక్యమాలక్ష్య రామస్త్వాత్మని శఙ్కితః,
కృతాఞ్జలిరువాచేదమృషిం కులపతిం తతః. 4

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామస్తు = రాము డైతే, తేషామ్ = వారియొక్క, ఔత్సుక్యమ్ = ఔత్సుక్యమును, ఆలక్ష్య = గుర్తించి, స్వాత్మని = తన మనస్సులో, శఙ్కితః = శంకించుచున్నవాడై, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, కులపతిమ్ = ఆశ్రమమునకు ప్రభు వైన, ఋషిమ్ = ఋషిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు వారి ఔత్సుక్యమును గుర్తించి, తనవలన ఏ మైన అపరాధము జరిగినదేమో అని శంకించుచు, ఆ ఆశ్రమమునకు అధిపతి యైన ఋషి వద్దకు వెళ్ళి, నమస్కరించుచు ఇట్లు పలికెను. 4

మూ. న కచ్చిద్భగవన్ కిఞ్చిత్పూర్వవృత్తమిదం మయి,
దృశ్యతే వికృతం యేన విక్రియన్తే తపస్వినః. 5

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా! మయి = నాయందు, పూర్వవృత్తమ్ = పూర్వమునందు జరిగిన, కిఞ్చిత్ = ఏదైన, ఇదమ్ = ఈ, వికృతమ్ = వికారము,

న దృశ్యతే కచ్చిత్=చూడబడుటలేదు కదా? యేన=దేనిచేత, తపస్వినః=మునులు, విక్రియన్తే=వికారమును పొందుచున్నారో.

తా. ఓ పూజ్యుడా! ఈ మహర్షు లందరిలో ఏదో మార్పు కనబడుచున్నది. నే నింతవరకు నడచిన నడతలో వికార మేదియు లేదు కదా? 5

మూ. ప్రమాదాచ్చరితం కచ్చిత్కి-ఞ్చిన్నావరజస్య మే,
లక్ష్మణస్యర్షిభిర్దృష్టం నానురూపమివాత్మనః. 6

ప్ర. అ. యే అవరజస్య=నా తమ్ము డైన, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, ప్రమాదాత్=పొరపాటువలన, ఆత్మనః=తనకు (అతనికి), నానురూపం = తగినది కాని, చరితమ్=నడవడిక, ఋషిభిః = ఋషులచేత, న దృష్టం కచ్చిత్=చూడబడలేదు కదా?

తా. నా తమ్ము డైన లక్ష్మణుడు పొరపాటుచే ఏదైన చేయకూడని పని చేయలేదు కదా! 6

మూ. కచ్చిచ్ఛుశ్రూషమాణా వః శుశ్రూషణపరా మయి,
ప్రమదాభ్యుచితాం వృత్తిం సీతా యుక్తం న వర్తతే. 7

ప్ర. అ. వః=మీకు, శుశ్రూషమాణా=సేవ చేయుచున్నదీ, మయి=నా యందు, శుశ్రూషణపరా=శుశ్రూష చేయుటయం దాసక్తి కలదీ అయిన, సీతా=సీత, ప్రమదాభ్యుచితామ్=స్త్రీలకు తగిన, వృత్తిమ్=ప్రవర్తనను, యుక్తమ్=యుక్తముగా, న వర్తతే కచ్చిత్=ఆచరించుటలేదా.

తా. నాకు అత్యాసక్తితో శుశ్రూష చేయుచు మీకు కూడ శుశ్రూష చేయుచున్న సీత మీ విషయమున స్త్రీ ప్రవర్తించవలసిన పద్ధతిలో ప్రవర్తించకుండగా లేదు కదా! 7

మూ. అథర్షిర్జరయా వృద్ధస్తపసా చ జరాం గతః,
వేపమాన ఇవోవాచ రామం భూతదయాపరమ్. 8

ప్ర. అ. అథ=ఆటుపిమ్మట, జరయా=ముసలితనముచేత, వృద్ధః=వృద్ధుడు, తపసా చ=తపస్సుచేత కూడ, జరామ్=ముసలితనమును, గతః=

పొందినవాడు అయిన, ఋషిః=ఋషి, వేపమాన ఇవ = వణుకుచున్నవాడు వలె, భూతదయాపరమ్=ప్రాణులయందు దయాపరు డైన, రామమ్=రాముని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ఆ మాటలు విని, ముసలితనముచేతను, తపస్సుచేతను కూడ, వృద్ధు డైన ఆ మహర్షి వణుకుచు, భూతదయాశాలి యైన రామునితో ఇట్లు పలికెను. 8

మూ. కుతః కల్యాణసత్త్వాయాః కల్యాణాభిరతేస్తథా,
చలనం తాత వైదేహ్యాస్తపస్విషు విశేషతః. 9

ప్ర. అ. తాత=తండ్రీ! కళ్యాణసత్త్వాయాః= మంగళకర మైన స్వభావము కలది, తథా=మరియు, కల్యాణాభిరతేః = మంగళమునం దానక్తి కలదీ అయిన, వైదేహ్యాః=సీతకు, చలనమ్=ధర్మలోపము, విశేషతః=ప్రధానముగా, తపస్విషు=ఋషుల విషయమున, కుతః=ఎట్లు ఉండును?

తా. తండ్రీ! సీత మంగళకర మైన స్వభావము కలది. ఎల్లపుడు మంగళకరము లైన కార్యములందే ఆసక్తి కలది. అట్టి సీతతో ధర్మలోపము ఎట్లు కలుగును? విశేషించి మునుల విషయమున ఎట్లు కల్గును? 9

మూ. త్వన్నిమిత్తమిదం తావత్తాపసాన్ప్రతివర్తతే,
రక్షోభ్యస్తేన సంవిగ్నాః కథయన్తి మిథః కథాః. 10

ప్ర. అ. త్వన్నిమిత్తమ్=నీ కారణమువలన, రక్షోభ్యః=రాక్షసులవలన, తాపసాన్ ప్రతి=మునులను గూర్చి, ఇదమ్=ఇది, ప్రతివర్తతే తావత్=సంభవించుచున్నది. తేన=దానిచేత, సంవిగ్నాః = భయపడినవారై, మిథః= రహస్యమునందు, కథాః=కథలను, (మాటలను), కథయన్తి = చెప్పుకొనుచున్నారు.

తా. నీ మూలమున తాపసులకు రాక్షసులవలన ఆపద కలుగుచున్నది. ఆ కారణముచే భయపడినవారై వీరు రహస్యముగా మాటలాడుకొనుచున్నారు.

మూ. రావణావరజః కశ్చిత్ ఖరో నామేహ రాక్షసః,
ఉత్పాట్య తాపసాన్సర్వాన్ జనస్థాననికేతనాన్. 11

ధృష్టశ్చ జితకాశీ చ నృశంసః పురుషాదకః,
అవలిప్తశ్చ పాపశ్చ త్వాం చ తాత న మృష్యతే. 12

ప్ర. అ. తాతః = తండ్రీ! ఇహ = ఇక్కడ, రావణావరజః = రావణుని తమ్ముడూ, ధృష్టశ్చ = ధార్ష్ట్యము కలవాడూ, జితకాశీ చ = జయింపబడిన యుద్ధము కలవాడూ, నృశంసః = క్రూరుడూ, పురుషాదకః = మనుష్యులను భక్షించువాడూ, అవలిప్తశ్చ = గర్వించినవాడూ, పాపశ్చ = పాపాత్ముడూ అయిన, ఖరో నామ = ఖరుడను పేరు గల, రాక్షసః = రాక్షసుడు, జనస్థాననికేతనాన్ = జనస్థానము నివాసముగా గల, సర్వాన్ = సమస్తమైన, తాపసాన్ = మునులను, ఉత్పాట్య = పెల్లగించివేసి, త్వాం చ = నిన్ను, న మృష్యతే = ఓర్వజాలకున్నాడు.

తా. తండ్రీ! ఇక్కడ రావణుని తమ్ముడైన ఖరుడనే రాక్షసుడు జనస్థానములో నున్న మునులను అందరిని, సమూలముగా చంపివేసినాడు. ధార్ష్ట్యము కలవాడూ, క్రూరుడూ, మానవభక్షకుడూ, యుద్ధములలో విజేతా, గర్వితుడూ, పాపాత్ముడూ అయిన ఆ రాక్షసుడు నిన్ను చూచి ఓర్వజాలకున్నాడు. 11, 12

మూ. త్వం యదాప్రభృతి హ్యస్మిన్నాశ్రమే తాత వర్తసే,
తదాప్రభృతి రక్షాంసి విప్రకుర్వన్తి తాపసాన్. 13

ప్ర. అ. తాత = తండ్రీ, త్వమ్ = నీవు, యదాప్రభృతి = ఏనాడు మొదలు, అస్మిన్ ఆశ్రమే = ఈ ఆశ్రమములో, వర్తసే = నివసించుచున్నావో, తదాప్రభృతి = ఆ నాడు మొదలు, రక్షాంసి = రాక్షసులు, తాపసాన్ = మునులను, విప్రకుర్వన్తి = బాధించుచున్నారు.

తా. నాయనా! నీవు ఈ ఆశ్రమములో నివాసము ఏర్పరచుకున్నది మొదలు, రాక్షసులు మునులను బాధించుచున్నారు. 13

మూ. దర్శయన్తి హి బీభత్సైః క్రూరైర్భీషణకైరపి,
నానారూపైర్విరూపైశ్చ రూపైర్వికృతదర్శనైః. 14

ప్ర. అ. బీభత్సైః = చూచుటకు అసహ్యముగా ఉండేవి, క్రూరైః = క్రూరమైనవి, భీషణకైరపి = భయమును కల్గించేవి, నానారూపైః = అనేకరూపములు

కలవి, విరూపైశ్చ = వికృత మైన రూపములు కలవి, వికృతదర్శనైః = వికార మైన దర్శనము కలవి, (చూచుటకు వికారముగా ఉన్నవి) అయిన, రూపైః = రూపములతో, దర్శయన్తి = తమను తాము చూపుచున్నారు.

తా. ఆ రాక్షసులు జుగుప్స కల్గించునవీ, క్రూర మైనవీ, భయమును పుట్టించునవీ, వివిధరూపములలో నున్నవీ, వికృత మైన రూపము కలవీ, చూచుటకు వికారముగా ఉన్నవి అయిన ఆకారములతో కనబడుచున్నారు. 14

మూ. అప్రశస్తైరశుచిభిః సమ్ప్రయోజ్యా చ తాపసాన్,
ప్రతిఘ్నన్త్యపరాన్ క్షిప్రమనార్యాః పురతః స్థితాః. 15

ప్ర. అ. అనార్యాః = ఈ దుష్టులైన రాక్షసులు, పురతః = ఎదట, స్థితాః = నిలచినవారై, తాపసాన్ = కొందరు మునులను, అప్రశస్తైః = చెడ్డ వైన, అశుచిభిః = అపవిత్రపదార్థములతో, సమ్ప్రయోజ్య = కూర్చి, అపరాన్ = మరి కొందరు మునులను, ప్రతిఘ్నన్తి = చంపుచున్నారు.

తా. దుష్టులైన రాక్షసులు, కొందరు మునులపై, అపవిత్రములైన చెడ్డ పదార్థములు పడవేసి, యెదుట నిలచి, మరికొందరిని చంపుచున్నారు. 15

మూ. తేషు తేష్వాశ్రమస్థానేష్వబుద్ధమవలీయ చ,
రమన్తే తాపసాం స్తత్ర నాశయన్తోఽల్పచేతసః 16

ప్ర. అ. అల్పచేతసః = నీచబుద్ధిగల వీరు, తేషు తేషు = ఆ యా, ఆశ్రమస్థానేషు = ఆశ్రమస్థానములయందు, అబుద్ధమ్ = తెలియకుండగా, అవలీయ చ = అణగి ఉండి, తత్ర = అక్కడ, తాపసాన్ = మునులను, నాశయన్తః = నశింపచేయుచు, రమన్తే = ఆనందించుచున్నారు.

తా. నీచబుద్ధి గల ఈ రాక్షసులు, ఆశ్రమమునందు ఆ యా ప్రదేశములలో, తెలియకుండగా దాగి ఉండి, మునులను చంపుచు, ఆనందించుచున్నారు.

మూ. అపక్షిపన్తి స్రుగ్భాణ్డానగ్నీన్ సిఞ్చన్తి వారిణా,
కలశాంశ్చ ప్రమథ్నన్తి హవనే సముపస్థితే. 17

ప్ర. అ. హవనే = హోమము, సముపస్థితే = జరుగుచుండగా, స్రుగ్భాణ్డాన్

= స్రుక్కులనూ, హోమద్రవ్యపాత్రలనూ, అవకిరన్తి = దూరముగా పారవేయు చున్నారు. వారిణా = ఉదకముతో, అగ్నీన్ = అగ్నులను, సిఞ్చన్తి = తడుపు చున్నారు. కలశాంశ్చ = కలశలను, ప్రమృద్నన్తి = ముక్కలు చేయుచున్నారు.

తా. హోమసమయమునందు, స్రుక్కులనూ, హోమద్రవ్యపాత్రలనూ పారవేయుచున్నారు. అగ్నిగుండములో నీరు పోయుచున్నారు. కలశలను బ్రద్దలు కొట్టుచున్నారు. 17

మూ. తైర్దురాత్మభిరామృష్టానాశ్రమాన్ ప్రజిహాసవః,
గమనాయాన్యదేశస్య చోదయన్త్యృషయోఽద్య మామ్. 18

ప్ర. అ. అద్య = ఇపుడు. ఋషయః = ఋషులు, దురాత్మభిః = దుష్ట బుద్ధి గల, తైః = ఆ రాక్షసులచేత, ఆమృష్టాన్ = ఆక్రమించబడిన, ఆశ్రమాన్ = ఆశ్రమములను, ప్రజిహాసవః = విడువ దలచినవారై, అన్యదేశస్య = మరియొక దేశమునకు, గమనాయ = వెళ్ళుటకు, మామ్ = నన్ను, చోదయన్తి = ప్రేరేపించు చున్నారు.

తా. ఇపుడు ఈ ఋషు లందరు, ఈ దురాత్ములు ఆక్రమించిన ఆశ్రమ ములను విడచి, మరి యొక ప్రదేశమునకు వెళ్లెదము అని నన్ను ప్రేరేపించు చున్నారు. 18

మూ. తత్పురా రామ శారీరాముపహింసాం తపస్విషు,
దర్శయన్తి హి దుష్టాస్తే త్యక్ష్యామ ఇమమాశ్రమమ్. 19

ప్ర. అ. రామ = ఓ రాముడా ! తే దుష్టాః = ఆ దుష్టరాక్షసులు, తపస్విషు = మునుల విషయమున, శారీరామ్ = శరీరమునకు సంబంధించిన, ఉపహింసామ్ = హింసను, పురా దర్శయన్తి హి = చూపనున్నారుకదా? తత్ = ఆ కారణము వలన, ఇమమ్ ఆశ్రమమ్ = ఈ ఆశ్రమమును, త్యక్ష్యామః = విడచెదము.

తా. రామా ! ఆ దుర్మార్గులు మునుల విషయమున, శారీరక మైన హింస కూడ చేసెదరు. అందువలన ఈ ఆశ్రమమును మేము విడిచివేసెదము. 19

మూ. బహుమూలఫలం చిత్రమవిదూరాదితో వనమ్,
పురాణాశ్రమమేవాహం శ్రయిష్యే సగణః పునః. 20

తా. ఇతః = ఇక్కడినుండి, అతిదూరాత్ = సమీపమున, బహుమూల ఫలమ్= అనేకము లైన మూలములు, ఫలములు కల. వనమ్=వనము ఉన్నది. అహమ్ = నేను, పునః = మరల, సగణః = మునిగణముతో కూడినవాడనై, పురాణాశ్రమమేవ= ఆ ప్రాచీన మైన ఆశ్రమమునే, శ్రయిష్యే= ఆశ్రయించెదను.

తా. ఇక్కడికి సమీపమున అధిక మైన మూలఫలములు లభించు, చిత్ర మైన వనము ఉన్నది. నేను, మునిగణము మరల ఆ ప్రాచీనాశ్రమమునే ఆశ్రయించెదము. 20

మూ. ఖర స్త్వయ్యపి చాయుక్తం పురా తాత ప్రవర్తతే,
సహాస్మాభిరితో గచ్ఛ యది బుద్ధిః ప్రవర్తతే. 21

ప్ర. అ. తాత=తండ్రీ. ఖరః=ఖరుడు, త్వయ్యపి చ=నీ విషయములో కూడ, అయుక్తమ్=అయుక్తముగా, పురా ప్రవర్తతే = ప్రవర్తించగలడు. బుద్ధిః = నీ బుద్ధి, ప్రవర్తతే యది = ప్రవర్తించినట్లైతే, ఇతః = ఇక్కడినుండి, అస్మాభిః సహ = మాతో కూడ, గచ్ఛ = వెళ్లుము.

తా. తండ్రీ ! ఆ ఖరుడు నీ విషయములో కూడా చెడ్డగా ప్రవర్తించ గలడు. అందుచే నీకు ఇష్ట మైనచో ఈ ప్రదేశమును విడచి, మాతో రమ్ము. 21

మూ. సకలత్రస్య సన్దేహో నిత్యం యత్తస్య రాఘవ,
సమర్థస్యాపి హి సతో వాసో దుఃఖమిహాద్య తే. 22

ప్ర. అ. రాఘవ = రామా! నిత్యమ్ = ఎల్లపుడు, యత్తస్య = సన్నద్ధుడ వైనను, సమర్థస్యాపి హి సతః = సమర్థుడవే అయినను, సకలత్రస్య = భార్యతో కూడిన, తే = నీకు, సన్దేహః = సందేహమే. అద్య = ఇపుడు, ఇహ= ఇక్కడ, వాసః = నివాసము, దుఃఖమ్ = దుఃఖమును కల్గించును.

తా. ఓ రామా ! భార్యతో కూడిన నీవు, ఎంత జాగరూకతతో ఉన్నను, ఎంత సమర్థుడవైనను, సందేహమే కలుగుచుండును. ఇపుడు ఇక్కడ నీవు నివసించుటవలన కష్టము కలుగును. 22

మూ. ఇత్యుక్తవన్తం రామస్తం రాజపుత్రస్తపస్వినమ్,
న శశాకోత్తరైర్వాక్యైరవబన్ధుం సముత్సుకమ్. 23

ప్ర. అ. రాజపుత్రమ్ = రాజకుమారు డైన, రామః = రాముడు, ఇతి = ఇట్లు, ఉక్తవన్తమ్=పలికిన, సముత్సుకమ్ = వేగిరపడుచున్న, తం తపస్వినమ్ = ఆ మునిని, ఉత్తరైః = ప్రత్యుత్తరరూపము లైన, వాక్యైః = వాక్యములచేత, అవబన్ధుమ్=నిలుపుటకు, న శశాక=సమర్థుడు కాలేదు.

తా. ఈ విధముగా చెప్పి ఆశ్రమమును విడిచి వెళ్ళిపోవుటకు వేగిరపడుచున్న ఆ మునిని ఎన్ని మాటలు చెప్పినను రాముడు వెళ్లకుండ చేయలేక పోయెను. 23

మూ. అభినన్ద్య సమాపృచ్ఛ్య సమాధాయ చ రాఘవమ్,
స జగామాశ్రమం త్యక్త్వా కులైః కులపతిః సహ. 24

ప్ర. అ. సః కులపతిః = ఆ కులపతి, రాఘవమ్ = రాముని, అభినన్ద్య =అభినందించి, సమాపృచ్ఛ్య=వీడ్కొలిపి, సమాధాయ = ఒప్పించి, కులైస్సహ = మునిగణములతో కూడ, ఆశ్రమమ్=ఆశ్రమమును, త్యక్త్వా=విడచి, జగామ =వెళ్లెను.

తా. ఆ కులపతి, రాముని అభినందించి, వీడ్కొలిపి, ఆతనిని అంగీకరింప చేసి, మునిసమూహములతో కలిసి, ఆ ఆశ్రమమును విడిచి వెళ్ళిపోయెను.

మూ. రామః సంసాధ్య ఋషిగణమనుగమనా
ద్దేశాత్తస్మాత్కులపతిమభివాద్య ఋషిమ్,
సమ్యక్ప్రీతైస్తైరనుమత ఉపదిష్టార్థః
పుణ్యం వాసాయ స్వనిలయముపసంపేదే. 25

ప్ర. అ. రామః=రాముడు, తస్మాత్ దేశాత్=ఆ ప్రదేశమునుండి, అనుగమనాత్=అనుసరించి వెళ్లుటవలన, ఋషిగణమ్ = ఋషుల సముదాయమును, సంసాధ్య=వీడ్కొలిపి, కులపతిమ్ = కులపతి యైన, ఋషిమ్ = ఋషిని, అభివాద్య = నమస్కరించి, సమ్యక్ = బాగుగ, ప్రీతైః=సంతోషించిన, తైః=వారిచేత, అనుమతః=అనుమతింపబడినవాడై, ఉపదిష్టార్థః = ఉపదేశింపబడిన విషయములు కలవాడై, వాసాయ=నివాసముకొరకు, పుణ్యమ్ = పవిత్ర మైన, స్వం నిలయమ్=తన గృహమును, ఉపసంపేదే=పొందెను.

తా. రాముడు కొంత దూరము అనుసరించి వెళ్ళి, ఆ ఋషులను వీడ్కొలిపి, కులపతికి నమస్కరించి, అధికముగా సంతోషించిన వారు ఉపదేశించిన విషయములు గ్రహించి, వారి అనుమతి పొంది, పవిత్ర మైన తన పర్ణశాలను చేరెను.

మూ. ఆశ్రమమృషివిరహితం ప్రభుః
క్షణమపి న జహౌ స రాఘవః,
రాఘవం హి సతతమనుగతా
స్తాపసాశ్చార్షచరితే ధృతగుణాః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షోడశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. ప్రభుః=ప్రభు వైన, సః రాఘవః=ఆ రాముడు, ఋషివిరహితమ్ =ఋషులచే విడవబడిన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, క్షణమపి = క్షణకాల మైనను, న జహౌ=విడవలేదు. ఆర్షచరితే = ఋషుల ఆచరణమునందు, ధృతగుణాః = ధరింపబడిన గుణము గల, తాపసాశ్చ = ఆ మునులు కూడ, సతతమ్ =ఎల్లపుడు, రాఘవమ్ = రాముని, అనుగతాః హి = అనుసరించి ఉండెడివారు కదా.

తా. ప్రభు వైన ఆ రాముడు, ఋషులు లేని ఆ ఆశ్రమమును క్షణకాల మైనను విడువలేదు. ఋషుల ధర్మము నాచరించుటయందు వైశిష్ట్యమును పొందిన ఆ ఋషీశ్వరులు ఇంతవరకును రామునే అనుసరించి ఉండెడివారు కదా!

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో
నూటపదహారవ సర్గ సమాప్తము.

## అథ సప్తదశోత్తరశతతమః సర్గః

[శ్రీరామాదులు అత్రిముని ఆశ్రమమున కేగి, అయనచే సత్కరింపబడుట. అనసూయ సీతను సత్కరించుట.]

మూ. రాఘవస్త్వథ యాతేషు తపస్విషు విచిన్తయన్,
న తత్రారోచయద్వాసం కారణైర్బహుభిస్తదా. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రాఘవస్తు= రాముడైతే, తపస్విషు= మునులు, యాతేషు=వెళ్ళిపోయినవారగుచుండగా, విచిన్తయన్=ఆలోచించుచు, బహుభిః=అనేకమైన, కారణైః= కారణములచేత, తదా=అపుడు, తత్ర= అక్కడ, వాసమ్=నివాసమును, నారోచయత్=ఇష్టపడలేదు.

తా. ఆ మును లందరు వెళ్ళిపోయిన పిమ్మట రాముడు బాగుగా ఆలోచించి, అనేకకారణములచేత, అక్కడ నివసించకూడ దని నిశ్చయించెను. 1

మూ. ఇహ మే భరతో దృష్టో మాతరశ్చ సనాగరాః,
సా చ మే స్మృతిరన్వేతి తాన్నిత్యమనుశోచతః. 2

ప్ర. అ. మే=నాకు, ఇహ=ఇక్కడ, భరతః=భరతుడు, దృష్టః= చూడబడినాడు. సనాగరాః=పౌరులతో కూడిన, మాతరశ్చ=తల్లులు కూడ, చూడబడినారు, నిత్యమ్=ఎల్లపుడు, తాన్=వారిని గూర్చియే, అనుశోచతః= దుఃఖించుచున్న, మే=నాకు, సా స్మృతిః చ=ఆ స్మృతియే, అన్వేతి=వెంబడించుచున్నది.

తా. భరతుడు, తల్లులు పౌరులు వచ్చి ఇక్కడనే నన్ను కలిసినారు. ఎల్లపుడు వారిని గూర్చియే దుఃఖించుచుండుటచే నన్ను ఆ స్మృతియే వెంబడించుచున్నది. 2

మూ. స్కన్ధావారనివేశేన తేన తస్య మహాత్మనః,
హయహస్తికరీషైశ్చ ఉపమర్దకృతో భృశమ్. 3

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ భరతునియొక్క, తేన=ఆ, స్కన్ధావారనివేశేన=సేనానివేశముచేత, హయహస్తికరీషైశ్చ=గుర్ర ముల ఏనుగుల పేడలచేత, భృశమ్=మిక్కిలి, ఉపమర్దః=సమ్మర్దము, కృతః = చేయబడినది.

తా. ఈ ప్రదేశమునకు దగ్గరగానే భరతుడు సేనానివేశము చేయుటచే, అశ్వగజముల పేడలతో ఈ ప్రదేశ మంతా చెడిపోయినది. 3

మూ. తస్మాదన్యత్ర గచ్ఛామ ఇతి సంచిన్త్య రాఘవః,
ప్రాతిష్ఠత స వైదేహ్యా లక్ష్మణేన చ సంగతః. 4

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, అన్యత్ర = మరియొకచోటికి, గచ్ఛామః ఇతి = వెళ్ళెదము అని, సంచిన్త్య = ఆలోచించి, సః రాఘవః = ఆ రాముడు, వైదేహ్యా=సీతతోను, లక్ష్మణేన=లక్ష్మణునితోను, సంగతః=కూడిన వాడై, ప్రాతిష్ఠత=ప్రయాణ మాయెను.

తా. అందువలన మనము మరి యొక చోటకు వెళ్ళెదము అని ఆలోచించి రాముడు సీతాలక్ష్మణసహితుడై, ప్రయాణ మయ్యెను. 4

మూ. సోఽత్రేరాశ్రమమాసాద్య తం వవన్దే మహాయశాః,
తం చాపి భగవానత్రిః పుత్రవత్ప్రత్యపద్యత. 5

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, సః రామః=ఆ రాముడు, అత్రేః =అత్రియొక్క, ఆశ్రమమ్=ఆశ్రమమును, ఆసాద్య=చేరి, తమ్ = ఆ మునిని, వవన్దే=నమస్కరించెను. భగవాన్=పూజ్యుడైన, అత్రిః అపి=అత్రి కూడ, తం చ=ఆ రాముని, పుత్రవత్=పుత్రుని వలె, ప్రత్యపద్యత=పొందెను.

తా. మహాయశశ్శాలి యైన రాముడు అత్రిమహాముని ఆశ్రమమును చేరి ఆతనికి నమస్కరించెను. ఆ మహాముని కూడ రాముని, పుత్రుని వలె ఆదరించెను. 5

మూ. స్వయమాతిథ్యమాదిశ్య సర్వమస్య సుసత్కృతమ్,
సౌమిత్రిం చ మహాభాగాం సీతాం చ సమసాన్త్వయత్.

ప్ర. అ. అస్య=ఈ రామునకు, సుసత్కృతమ్ = చాలా బాగుగా చేయబడిన, సర్వమ్=సమస్తమైన, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, స్వయమ్=స్వయముగా, ఆదిశ్య=చేసి, సౌమిత్రిం చ = లక్ష్మణుని, మహాభాగామ్ = మహాభాగ్యవంతురాలైన, సీతాం చ=సీతను, సమసాన్త్వయత్=ఓదార్చెను.

తా. ఆ అత్రిమహాముని రామునకు యథావిధిగా ఆతిథ్యము నంతను స్వయముగా ఇచ్చి, మంచిమాటలతో లక్ష్మణుని, మహాభాగ్యవంతురాలైన సీతనూ సంతోషపెట్టెను. 6

మూ. పత్నీం చ సమనుప్రాప్తాం వృద్ధామామన్త్ర్య సత్కృతామ్,
సాన్త్వయామాస ధర్మజ్ఞః సర్వభూతహితే రతః. 7

ప్ర. అ. ధర్మజ్ఞః=ధర్మమును తెలిసినవాడు, సర్వభూతహితే = సమస్త ప్రాణుల హితమునందు, రతః = ఆసక్తి కలవాడు అయిన ఆ అత్రిమహాముని, సమనుప్రాప్తామ్=అక్కడికి వచ్చిన, సత్కృతామ్ = సత్కరింపబడిన, వృద్ధామ్ =వృద్ధురాలైన, పత్నీం చ=తన భార్యను కూడ, ఆమన్త్ర్య=పిలిచి, సాన్త్వయామాస=రామాదులను ఓదార్చెను.

తా. ధర్మములు తెలిసినవాడూ, సమస్తప్రాణుల హితమును కోరువాడూ అయిన ఆ అత్రిమహాముని అటువైపు వచ్చిన వృద్ధురాలైన తన భార్యను గౌరవపూర్వకముగా పిలచి, ఆమె సమ్ముఖమున రామాదులను మంచి మాటలతో సంతోషపెట్టెను. 7

మూ. అనసూయాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్,
ప్రతిగృహ్ణీష్వ వైదేహీమబ్రవీదృషిసత్తమః. 8
రామాయ చాచచక్షే తాం తాపసీం ధర్మచారిణీమ్.

ప్ర. అ. ఋషిసత్తమః=ఋషిశ్రేష్ఠుడైన ఆ అత్రిమహాముని, వైదేహీమ్= సీతను, ప్రతిగృహ్ణీష్వ = స్వీకరింపుము అని, మహాభాగామ్ = మహాభాగ్యవంతురాలు, తాపసీమ్=తపశ్శాలిని, ధర్మచారిణీమ్=ధర్మము ఆచరించునది అయిన, అనసూయామ్=అనసూయను గూర్చి, అబ్రవీత్ = పలికెను. ధర్మచారిణీమ్ = ధర్మమును ఆచరించు, తాం తాపసీమ్=ఆ తపోధనురాలిని గూర్చి, రామాయ= రామునకు, ఆచచక్షే చ = చెప్పెను.

తా. ఋషిశ్రేష్ఠుడైన ఆ అత్రిమహాముని, మహాభాగ్యవంతురాలు, తపోధనురాలు, ధర్మమును ఆచరించునది అయిన అనసూయతో "ఈ సీతను స్వీకరింపుము (గౌరవించుము)" అని పలికెను. ధర్మచారిణి యైన ఆ అనసూయను గూర్చి రామునకు ఇట్లు చెప్పెను. 8

మూ. దశ వర్షాణ్యనావృష్ట్యా దగ్ధే లోకే నిరన్తరమ్. 9

యయా మూలఫలే సృష్టే జాహ్నవీ చ ప్రవర్తితా,
ఉగ్రేణ తపసా యుక్తా నియమైశ్చాప్యలఙ్కృతా, 10

దశ వర్షసహస్రాణి యయా తప్తం మహత్తపః.
అనసూయా వ్రతైః స్నాతా ప్రత్యూహాశ్చ నివర్తితాః,

దేవకార్యనిమిత్తం చ యయా సన్త్వరమాణయా,
దశరాత్రం కృతా రాత్రిః సేయం మాతేవ తేఽనఘ. 12

ప్ర. అ. అనఘ=పాపములు లేని ఓ రామా! లోకే=లోకము, దశవర్షాణి=పది సంవత్సరములు, అనావృష్ట్యా = అనావృష్టిచేత, నిరంతరమ్=ఎల్లపుడు, దగ్ధే = కాల్చబడిన దగుచుండగా, యయా = ఎవ్వతెచేత, మూలఫలే = మూలములు, ఫలములు, సృష్టే = సృష్టింపబడినవో, జాహ్నవీ చ=గంగానది కూడ, ప్రవర్తితా = ప్రవహింపచేయబడినదో, (యా=ఎవ్వతె), ఉగ్రేణ = ఉగ్ర మైన, తపసా=తపస్సుతో, యుక్తా=కూడినదో, నియమైశ్చాపి=అనేకనియమములచేత, అలఙ్కృతా=అలంకరింపబడినదో, యయా = ఎవ్వతెచేత, దశవర్షసహస్రాణి = పది వేల సంవత్సరములు, మహత్=గొప్ప దైన, తపః = తపస్సు, తప్తమ్ = చేయబడినదో, దేవకార్యనిమిత్తమ్ = దేవతలకార్యముకొరకై, సన్త్వరమాణయా = తొందరపడుచున్న, యయా = ఎవ్వతెచే, ప్రత్యూహాః = విఘ్నములు, నివర్తితాః = మరలింపబడినవో, దశరాత్రమ్ = పది దివసములు, రాత్రిః = రాత్రి, కృతా = చేయబడినదో, సా = అట్టి, వ్రతైః స్నాతా = వ్రతములచేత స్నానము చేసిన (వ్రతములు పూర్తి చేసిన), ఇయమ్ అనసూయా = ఈ అనసూయ, తే = నీకు, మాతేవ = తల్లివంటిది.

తా. ఓ రామా! ఈ అనసూయాదేవి పది సంవత్సరములు నిరంతరము

అనావృష్టి వచ్చి, లోక మంతయు కాలిపోవుచున్నపుడు, మూలములను, ఫల ములను సృష్టించి, గంగానదిని ప్రవహింపచేసినది. అత్యుగ్ర మైన తపస్సు గల ఈమె అనేకనియమములను పాటించినది. పదివేల సంవత్సరములు గొప్ప తపస్సు చేసినది. ఎన్నియో వ్రతములు పూర్తిచేసినది. దేవతలకు సహాయము చేయుటకై ఉద్యుక్తురాలై, అనేక విఘ్నములను తొలగించి, పది దివసములు ఒకే రాత్రిగా అగునట్లు చేసినది. ఈమె నీకు తల్లి వంటిది. 9-12

మూ. తామిమాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీమ్,
అభిగచ్ఛతు వైదేహీ వృద్ధామక్రోధనాం సదా. 13
అనసూయేతి యా లోకే కర్మభిః ఖ్యాతిమాగతా.

ప్ర. అ. సర్వభూతానామ్=సమస్తప్రాణులకు, నమస్కార్యామ్=నమస్క రింప దగినది, యశస్వినీమ్ = కీర్తి గలది, వృద్ధామ్ = వృద్ధురాలు, సదా = ఎల్లపుడు, అక్రోధనామ్ = క్రోధశూన్యురాలు అయిన, తామ్ = అట్టి, ఇమామ్ = ఈమెను, వైదేహీ = సీతాదేవి, అభిగచ్ఛతు=చేరుగాక! యా=ఎవ్వతె, కర్మభిః =తన పనులచేత, అనసూయేతి= అనసూయ అని, ఖ్యాతిమ్ = ప్రసిద్ధిని. ఆగతా = పొందినదో.

తా. తన పనులచేత అనసూయ (కోపములేనిది)అని లోకములో ప్రసిద్ధి చెందిన ఈమె సర్వప్రాణులకు సమస్కరింప దగినది. కీర్తిమంతురాలు; వృద్ధు రాలు, ఎన్నడును కోపము ఎరుగనిది. అట్టి ఈమెవద్దకు సీత వెళ్లుగాక! 13

మూ. ఏవం బ్రువాణం తమృషిం తథేత్యుక్త్వా స రాఘవః, 14
సీతాముకవాచ ధర్మజ్ఞామిదం వచనముత్తమమ్.

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, తమ్ ఋషిమ్=ఆ ఋషీశ్వరుని గూర్చి, తథేతి = అటులనే అగు గాక అని, ఉక్త్వా = పలికి, ధర్మజ్ఞామ్ = ధర్మములు తెలిసిన, సీతామ్=సీతను గూర్చి, ఉత్తమమ్ = ఉత్తమ మైన, ఇదం వచనమ్ = ఈ వచనమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఆ మహాముని చెప్పిన మాటలు విని. అటులనే అగుగాక అని పలికి, ధర్మజ్ఞురాలైన సీతతో ఇట్లనెను. 14

మూ. రాజపుత్రి శ్రుతమిదం మునేరస్య సమీరితమ్, 15
శ్రేయోఽర్థమాత్మనః శీఘ్రమభిగచ్ఛ తపస్వినీమ్.

ప్ర. అ. రాజపుత్రి = ఓ రాజకుమారీ! అస్య మునేః = ఈ మునియొక్క, ఇదం సమీరితమ్ = ఈ మాట, శ్రుతమ్=వినబడినది కదా? ఆత్మనః=నీయొక్క, శ్రేయోఽర్థమ్ = శ్రేయస్సుకొరకు, శీఘ్రమ్ = శీఘ్రముగా, తపస్వినీమ్ = ఈ తపశ్శాలిని యైన అనసూయాదేవిని, అభిగచ్ఛ=సమీపించుము.

తా. సీతా! ఈ మహాముని మాట విన్నావు కదా? వెంటనే తపోధనురాలైన ఈ అనసూయాదేవివద్దకు వెళ్లుము. నీకు శ్రేయస్సు కలుగును. 15

మూ. సీతా త్వేతద్వచః శ్రుత్వా రాఘవస్య హితైషిణః, 16
తామత్రిపత్నీం ధర్మజ్ఞామభిచక్రామ మైథిలీ.

ప్ర. అ. మైథిలీ = మిథిలానగరమునకు సంబంధించిన, సీతా తు=సీత, హితైషిణః=తన హితమును కోరు, రాఘవస్య = రామునియొక్క, ఏతద్వచః= ఈ మాటను, శ్రుత్వా = విని, ధర్మజ్ఞామ్=ధర్మమును ఎరిగిన, తామ్=ఆ, అత్రిపత్నీమ్ = అత్రి భార్య యైన అనసూయాదేవిని, అభిచక్రామ = ప్రదక్షిణపూర్వకముగా సమీపించెను.

తా. సీత తన హితము కోరి రాముడు చెప్పిన మాట విని, ధర్మమును తెలిసిన ఆ అనసూయాదేవిని ప్రదక్షిణపూర్వకముగా సమీపించెను. 16

మూ. శిథిలాం పలితాం వృద్ధాం జరాపాణ్డురమూర్ధజామ్. 17
సతతం వేపమానాఙ్గీం ప్రవాతే కదలీం యథా,
తాం తు సీతా మహాభాగామనసూయాం పతివ్రతామ్, 18
అభ్యవాదయదవ్యగ్రా స్వనామ సముదాహరత్.

ప్ర. అ. సీతా = సీత, శిథిలామ్ = శిథిలమైనదీ, పలితామ్ = ముడతలు పడినదీ, వృద్ధామ్=వృద్ధురాలు, జరాపాణ్డురమూర్ధజామ్ = ముసలితనముచే తెల్లబడిన జుట్టు కలది, ప్రవాతే=అధిక మైన వాయువు గల ప్రదేశమునందు, కదళీం యథా = అరటిచెట్టు వలె, సతతమ్ = ఎల్లపుడు, వేపమానాఙ్గీమ్ = వణకుచున్న శరీరము కలదీ, మహాభాగామ్ = గొప్ప భాగ్యముగలదీ, పతివ్రతామ్=పతివ్రతా

యైన, తామ్ అనసూయామ్ = ఆ అనసూయాదేవిని, అవ్యగ్రా = తొందరపాటు లేనిదై, అభ్యవాదయత్=నమస్కరించెను. స్వనామ=తన పేరు, సముదాహరత్ = చెప్పెను.

తా. మహాపతివ్రత, మహాభాగ్యవంతురాలు అయిన ఆ అనసూయ శరీరము వార్ధక్యముచే దుర్బలమై, ముడతలు పడి ఉండెను. జుట్టు తెల్లబడెను. ఆమె గాలిలో అరటిచెట్టు వలె వణకుచుండెను. అట్టి ఆ అనసూయాదేవికి సీత తన నామధేయము చెప్పుచూ, ఏకాగ్రచిత్తముతో నమస్కరించెను. 17, 18

మూ. అభివాద్య చ వైదేహీ తాపసీం తామనిన్దితామ్, 19
బద్ధాఞ్జలిపుటా హృష్టా పర్యపృచ్ఛదనామయమ్.

ప్ర. అ. వైదేహీ = సీత, అనిన్దితామ్ = నిందింపబడని, తాం తాపసీమ్ = ఆ తపోధనురాలిని, అభివాద్య = నమస్కరించి, బద్ధాఞ్జలిపుటా = కట్టబడిన దొప్పవంటి దోసిలి కలదై, హృష్టా = సంతోషించినదై, అనామయమ్ = ఆరోగ్యమును, పర్యపృచ్ఛత్ = ప్రశ్నించెను.

తా. సీత ఎట్టి దోషములు లేని ఆ అనసూయాదేవికి నమస్కరించి, దోసిలి కట్టి నిలచి, ఆనందించుచు "ఆరోగ్యముగా నున్నారా" అని ఆమెను ప్రశ్నించెను. 19

మూ. తతస్సీతాం మహాభాగాం దృష్ట్వా తాం ధర్మచారిణీమ్,
సాన్త్వయన్త్యబ్రవీద్ధృష్టా దిష్ట్యా ధర్మమవేక్షసే.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాభాగామ్=మహాభాగ్యవంతురాలు, ధర్మచారిణీమ్ = ధర్మమును ఆచరించునది అయిన, తాం సీతామ్ = ఆ సీతను, సాన్త్వయన్తీ = ఓదార్చుచున్నదై, హృష్టా = సంతోషించుచు, అబ్రవీత్ = పలికెను. దిష్ట్యా = భాగ్యవశముచేత, ధర్మమ్ = ధర్మమును, అవేక్షసే = చూచుచున్నావు.

తా. అపుడు ఆ అనసూయదేవి చాలా సంతోషించి, మహాభాగ్యవంతురాలు, ధర్మమును ఆచరించునది అయిన ఆ సీతను ఓదార్చుచు, ఇట్లు పలికెను. "భాగ్యవశముచేత నీవు ధర్మమును పాటించుచున్నావు".

మూ. త్యక్త్వా జ్ఞాతిజనం సీతే మానమృద్ధిం చ భామిని, 21
అవరుద్ధం వనే రామం దిష్ట్యా త్వమనుగచ్ఛసి.

ప్ర. అ. భామిని = ఉత్తమస్త్రీ వైన, సీతే = సీతా! త్వమ్ = నీవు, దిష్ట్యా = భాగ్యవశముచేత, జ్ఞాతిజనమ్ = బంధుజనమును, మానమ్ = అహంకారమును, ఋద్ధిం చ = ఐశ్వర్యమును, త్యక్త్వా = విడిచి, వనే = వనమునందు, అవరుద్ధమ్ = నిర్బంధింపబడిన, రామమ్ = రాముని, అనుగచ్ఛసి = అనుసరించి వెళ్ళుచున్నావు.

తా. ఓ సీతా! నీవు మంచి భాగ్యవంతురాలవు. బంధుజనమును అహంకారమును, ఐశ్వర్యమును విడిచి, నీవు అడవికి వెళ్లుచున్న రాముని వెంబడించి వచ్చుచున్నావు. 21

మూ. నగరస్థో వనస్థో వా పాపో వా యది వా శుభః, 22
యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః.

ప్ర. అ. యాసామ్ = ఏ, స్త్రీణామ్ = స్త్రీలకు, నగరస్థః = నగరములో నున్నవాడైనా, వనస్థో వా = వనములో ఉన్నవాడైనా, పాపో వా = పాపాత్ముడైనా, యది వా = లేక. శుభః = పుణ్యాత్ముడైన, భర్తా = భర్త, ప్రియః = ఇష్టుడో, తాసామ్ = వారికి, మహోదయాః = గొప్ప అభివృద్ధి గల, లోకాః = లోకములు కలుగును.

తా. ఏ స్త్రీలు తమ భర్త వనములో ఉన్నా, నగరములో ఉన్నా, పాపాత్ముడైనా, పుణ్యాత్ముడైనా, అతనిని అనుసరించి ఉండెదరో వారికి ఉత్తమలోకములు కలుగును. 22

మూ. దుశ్శీలః కామవృత్తో వా ధనైర్వా పరివర్జితః, 23
స్త్రీణామార్యస్వభావానాం పరమం దైవతం పతిః.

ప్ర. అ. ఆర్యస్వభావానామ్ = పూజ్యమైన స్వభావము గల, స్త్రీణామ్ = స్త్రీలకు, దుశ్శీలః = చెడ్డ స్వభావము కలవాడైనా, కామవృత్తో వా = స్వేచ్ఛాచారము కలవాడైనా, ధనైః = ధనములతో, పరివర్జితో వా = శూన్యుడైనా, పతిః = భర్త, పరమమ్ = గొప్ప, దైవతమ్ = దేవత.

తా. ఉత్తమ స్వభావ లైన స్త్రీలకు, భర్త దుశ్శీలుడైనా, స్వేచ్ఛాచారి యైనా, దరిద్రుడు డైనా, అతడే ఉత్తమదేవత. 23

మూ. నాతో విశిష్టం పశ్యామి బాన్ధవం విమృశన్త్యహమ్, 24
సర్వత్ర యోగ్యం వైదేహి తపః కృతమివావ్యయమ్.

ప్ర. అ. వైదేహి = ఓ సీతా! అహమ్ = నేను, సర్వత్ర = అంతటను, విమృశన్తీ = విమర్శించుచున్నదాననై, కృతమ్ = చేయబడిన, అవ్యయమ్ = అనంత మైన, యోగ్యమ్ = తగిన, తపః ఇవ = తపస్సు వలె, అతః = భర్త కంటె, విశిష్టమ్ = విశిష్టు డైన, బాన్ధవమ్ = బంధువును, న పశ్యామి = చూడను.

తా. ఓ సీతా! నేను ఎంత ఆలోచించినను, భర్తను మించిన బంధువు నాకు కనబడుటలేదు. ఇతడు అనంత మైన తపస్సు వంటివాడు. 24

మూ. న త్వేవమవగచ్ఛన్తి గుణదోషమసత్స్త్రియః, 25
కామవక్తవ్యహృదయా భర్తృనాథాశ్చరన్తి యాః.

ప్ర. అ. యాః = ఏ స్త్రీలు, కామవక్తవ్యహృదయాః = కామమునకు వశ మైన హృదయములు కలవారై, భర్తృనాథాః = భర్తలకు నాథలై, చరన్తి = సంచరింతురో, అసత్స్త్రియః = అట్టి చెడ్డ స్త్రీలు, ఏవమ్ = ఇట్లు, గుణదోషమ్ = గుణదోషములను, న అవగచ్ఛన్తి = తెలుసుకొనరు.

తా. కామమునకు వశ మైన మనస్సుతో, భర్తలపై అధికారము వహించు దుష్టస్త్రీలు ఈ విధముగా మంచి చెడ్డలను తెలుసుకొనుటలేదు. 25

మూ. ప్రాప్నువన్త్యయశశ్చైవ ధర్మభ్రంశఞ్చ మైథిలి, 26
అకార్యవశమాపన్నాః స్త్రియో యాః ఖలు తద్విధాః.

ప్ర. అ. మైథిలి = ఓ సీతా! తద్విధాః = అట్టి, యాః స్త్రియః = ఏ స్త్రీలు, అకార్యవశమ్ = అకార్యమునకు వశమును, ఆపన్నాః = పొందినారో, వారు, అయశశ్చ = అపకీర్తిని, ప్రాప్నువన్తి = పొందుచున్నారు. ధర్మభ్రంశం చ = ధర్మమునుండి జారిపోవుటను పొందుచున్నారు.

తా. ఈ విధముగా అకార్యమును చేయు స్త్రీలు ధర్మభ్రష్టలై అపకీర్తి పొందుచున్నారు. 26

మూ. త్వద్విధాస్తు గుణైర్యుక్తా దృష్టలోకపరావరాః, 27
స్త్రియః స్వర్గే చరిష్యన్తి యథా ధర్మకృత స్తథా.

ప్ర. అ. గుణైః = సద్గుణములతో, యుక్తాః = కూడిన, దృష్టలోకపరావరాః = చూడబడిన లోకమునందలి మంచి చెడుగులు గల, త్వద్విధాః = నీవంటి, స్త్రియస్తు = స్త్రీ లైతే, ధర్మకృతః = ధర్మము నాచరించువారు, యథా = ఎట్లో, తథా = అట్లు, స్వర్గే = స్వర్గమునందు, చరిష్యన్తి = సంచరించెదరు.

తా. ఉత్తమగుణవంతు లై, లోకములోనే మంచిచెడుగులను చూడగలిగిన నీవంటి స్త్రీలు మాత్రము అనేకధర్మకార్యములు చేసినవారి వలె, స్వర్గములో విహరించెదరు. 27

మూ. తదేవమేనం త్వమనువ్రతా సతీ
పతివ్రతానాం సమయానువర్తినీ,
భవ స్వభర్తుః సహధర్మచారిణీ
యశశ్చ ధర్మం చ తతః సమాప్స్యసి. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, ఏనమ్ = ఈ రాముని, అనువ్రతా సతీ = అనుసరించిన నియమములు కలదానవై, పతివ్రతానామ్ = పతివ్రతలయొక్క, సమయానువర్తినీ = నియమములను పాటించుచున్నదాన వై, స్వభర్తుః = నీ భర్తకు, సహధర్మచారిణీ = కూడా ఉండి ధర్మము నాచరించుదానవు, భవ = అగుము. తతః = దానివలన, యశశ్చ = కీర్తిని, ధర్మం చ = ధర్మమును, సమాప్స్యసి = పొందగలవు.

తా. అందుచే నీవు భర్తనే అనుసరించుచు, పతివ్రతల ఆచారమును పాలించుచు, నీ భర్తకు సహధర్మచారిణిగా ఉండుము. దానివలన నీకు యశస్సు, ధర్మము లభించును. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నూటపదిహేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టాదశోత్తరశతతమ సర్గః

[సీత, అనసూయ సంభాషించుట, అనసూయ సీతకు ప్రీతితో బహుమాన మిచ్చుట. అనసూయ ప్రశ్నింపగా సీత తన స్వాయంవర వృత్తాంతము తెలుపుట.]

మూ. సా త్వేవముక్తా వైదేహీ అనసూయాఽనసూయయా,
ప్రతిపూజ్య వచో మన్దం ప్రవక్తుముపచక్రమే. 1

ప్ర. అ. అనసూయా = అసూయ లేని, సా వైదేహీ = ఆ సీత, అనసూయయా = అనసూయ చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడిన దై, వచః = ఆ మాటను, ప్రతిపూజ్య = పూజించి, మన్దమ్ = మందముగా, ప్రవక్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. అసూయ లేని ఆ సీత, అనసూయాదేవి చెప్పిన మాటలు విని, ఆ మాటలు శ్లాఘించుచు, మెల్లగా ఇట్లు పలికెను. 1

మూ. నైతదాశ్చర్యమార్యాయా యన్మాం త్వమభిభాషసే,
విదితం తు మమాప్యేతద్యథా నార్యాః పతిర్గురుః. 2

ప్ర అ. త్వమ్ = నీవు, మామ్ = నన్ను గూర్చి, యత్ అభిభాషసే = ఏది చెప్పుచున్నావో, ఏతత్ = ఇది, ఆర్యాయాః = పూజ్యురాలవైన నీ విషయమున, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యము, న = కాదు. నార్యాః = స్త్రీకి, పతిః = భర్త, గురుః = పూజ్యుడు, యథా = ఎట్లో, ఏతత్ = ఈ విషయము, మమాపి = నాకు కూడ, విదితం తు = తెలియును.

తా. పూజ్యురాల వైన నీవు నాతో ఇట్లు పలుకుట ఆశ్చర్యకరము కాదు. స్త్రీకి భర్త పూజ్యు డను విషయము నాకు కూడ తెలియును. 2

మూ. యద్యప్యేష భవేద్భర్తా మమార్యే వృత్తవర్జితః,
అద్వైధముపచర్తవ్యస్తథాప్యేష మయా భవేత్. 3

ప్ర. అ. ఆర్యే = ఓ పూజ్యురాలా! ఏషః = ఈ, మమ భర్తా = నా భర్త, వృత్తవర్జితః = చరిత్రహీనుడు, యద్యపి భవేత్ = అయినను, తథాపి = అట్లైనను, ఏషః = ఇతడు, మయా = నాచేత, అద్వైధమ్ = విభేదము లేకుండగా, ఉపచర్తవ్యః = ఉపచరింపతగినవాడు.

తా. ఓ పూజ్యురాలా! నా భర్త చరిత్రహీనుడైనా నేను అతనిని తప్పక పూజించవలసినదే. 3

మూ. కిం పునర్యో గుణశ్లాఘ్యః సానుక్రోశో జితేన్ద్రియః,
స్థిరానురాగో ధర్మాత్మా మాతృవత్పితృవత్ప్రియః. 4

ప్ర. అ. యః = ఏ భర్త, గుణశ్లాఘ్యః = గుణములచేత శ్లాఘింపదగినవాడో, సానుక్రోశః = దయతో కూడినవాడో, జితేన్ద్రియః = జితేంద్రియుడో, స్థిరానురాగః = స్థిరమైన ప్రేమ కలవాడో, ధర్మాత్మా = ధర్మాత్ముడో, మాతృవత్ = తల్లి వలె, పితృవత్ = తండ్రి వలె, ప్రియః = ఇష్టుడో అటువంటి భర్త, కిం పునః = చెప్ప నేల!

తా. గుణములచేత శ్లాఘింపతగినవాడూ, దయామయుడూ, జితేంద్రియుడూ, స్థిరమైన ప్రేమ గలవాడూ, ధర్మాత్ముడూ, తల్లి వలె, తండ్రి వలె, చాలా ఇష్టుడు అయిన భర్త విషయమున వేరే చెప్పవలెనా. 4

మూ. యాం వృత్తిం వర్తతే రామః కౌసల్యాయాం మహాబలః,
తామేవ నృపనారీణామన్యాసామపి వర్తతే 5

ప్ర. అ. మహాబలః = గొప్ప బలముగల, రామః = రాముడు, కౌసల్యాయామ్ = కౌసల్యవిషయమున, యాం వృత్తిమ్ = ఏ ప్రవర్తనను, వర్తతే = ఆచరించునో, అన్యాసామ్ = ఇతరలైన, నృపనారీణామపి = రాజభార్యల విషయమునందు కూడ, తామేవ = దానినే, వర్తతే = అనుసరించును.

తా. మహాబలశాలియైన రాముడు కౌసల్య విషయమున ఏ విధముగా

ప్రవర్తించునో, ఇతరరాజభార్యల విషయమునందు కూడ ఆ విధముగానే ప్రవర్తించును. 5

మూ. సకృద్దృష్టాస్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః,
మాతృవద్వర్తతే వీరో మానముత్సృజ్య ధర్మవిత్. 6

ప్ర. అ. నృపవత్సలః=దశరథమహారాజుపై ప్రేమ గల, ధర్మవిత్=ధర్మవేత్త యైన, వీరః=వీరు డైన రాముడు, నృపేణ=దశరథునిచేత, సకృత్=ఒక్కపర్యాయమే, దృష్టాసు=చూడబడిన, స్త్రీష్వపి=స్త్రీల విషయమునందు కూడ, మానమ్=అహంకారమును, ఉత్సృజ్య=విడచి, మాతృవత్=తల్లుల విషయమునందు వలె, వర్తతే=ప్రవర్తించును.

తా. దశరథమహారాజుపై ప్రేమ గలవాడూ, ధర్మవేత్తా, పరాక్రమవంతుడూ అయిన రాముడు అహంకారము లేనివాడై దశరథుడు ఒక్కమాటు చూచిన స్త్రీలను కూడ తల్లులను వలె గౌరవించెను. 6

మూ. ఆగచ్ఛన్త్యాశ్చ విజనం వనమేవం భయావహమ్,
సమాహితం మే శ్వశ్ర్వా చ హృదయే తద్ధృతం మహత్.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, భయావహమ్=భయంకర మైన, విజనమ్=విజన మైన, వనమ్=వనమును గూర్చి, ఆగచ్ఛన్త్యాః=వచ్చుచున్న, మే=నాకు, శ్వశ్ర్వా=అత్తగారిచేత, సమాహితమ్=ఉపదేశింపబడిన, తత్=ఆ, మహత్=గొప్ప దైన ఉపదేశము, హృదయే=హృదయమునందు, ధృతమ్=ధరింపబడినది.

తా. భయంకర మైన ఈ నిర్జనవనమునకు వచ్చుచున్న సమయమున అత్తగారు నాకు చేసిన ఉత్తమ మైన ఉపదేశమును మనస్సులో ఉంచుకొనియున్నాను. 7

మూ. పాణిప్రదానకాలే చ యత్పురా త్వగ్నిసన్నిధౌ,
అనుశిష్టా జనన్యాస్మి వాక్యం తదపి మే ధృతమ్. 8

ప్ర. అ. పురా=పూర్వము, పాణిప్రదానకాలే చ=వివాహసమయమునందు, అగ్నిసన్నిధౌ=అగ్నిసన్నిధియందు, జనన్యా=తల్లిచేత, యత్=ఏ,

వాక్యమ్=వాక్యమును, అనుశిష్టా=బోధింపబడినదానను, అస్మి=అయితినో, తదపి=ఆ వాక్యము కూడ, మే=నాచేత, ధృతమ్=ధరింపబడినది.

తా. పూర్వము వివాహసమయమునందు అగ్నిసన్నిధిలో, నాకు తల్లి ఉపదేశించిన మాటలు కూడ మనస్సులో ఉంచుకొన్నాను. 8

మూ. నవీకృతం తు తత్సర్వం వాక్యైస్తే ధర్మచారిణి,
పతిశుశ్రూషణాన్నార్యాస్తపో నాన్యద్విధీయతే 9

ప్ర. అ. ధర్మచారిణి=ధర్మమును ఆచరించు ఓ అనసూయాదేవీ! తే వాక్యైః=నీ మాటలచేత, తత్ సర్వమ్=అది అంతయు, నవీకృతమ్=క్రొత్తగా చేయబడినది. నార్యాః=స్త్రీకి, పతిశుశ్రూషణాత్=భర్తకు శుశ్రూష చేయుటకంటె, అన్యత్=మరి యొక, తపః=తపస్సు, న విధీయతే=విధింపబడుటలేదు.

తా. ఓ ధర్మాత్మురాలా! నీ మాటలు వినగానే మా అత్తగారు, తల్లీ చేసిన ఉపదేశములు మరల స్మృతికి వచ్చుచున్నవి. స్త్రీకి పతిశుశ్రూష తప్ప మరి యొక తపస్సు విధింపబడలేదు 9

మూ. సావిత్రీ పతిశుశ్రూషాం కృత్వా స్వర్గే మహీయతే,
తథావృత్తిశ్చ యాతా త్వం పతిశుశ్రూషయా దివమ్.

ప్ర. అ. పతిశుశ్రూషామ్=భర్తయొక్క సేవను, కృత్వా=చేసి, సావిత్రీ =సావిత్రి, స్వర్గే=స్వర్గమునందు, మహీయతే=పూజింపబడుచున్నది. తథా వృత్తిః=అట్టి ప్రవృత్తి గల, త్వం చ=నీవు కూడ, పతిశుశ్రూషయా=భర్త యొక్క శుశ్రూషచేత, దివమ్=స్వర్గమును గూర్చి, యాతా=వెళ్ళగలవు.

తా. సావిత్రీదేవి పతిశుశ్రూష చేయుటచేత స్వర్గములో ప్రకాశించు చున్నది. అదే విధముగా ప్రవర్తించుచున్న నీవు కూడ పతిశుశ్రూషచేత స్వర్గ మునకు వెళ్ళనున్నావు. 10

మూ. వరిష్ఠా సర్వనారీణామేషా చ దివి దేవతా,
రోహిణీ న వినా చన్ద్రం ముహూర్తమపి దృశ్యతే. 11

ప్ర. అ. సర్వనారీణామ్=సమస్త స్త్రీలలో, వరిష్ఠా=శ్రేష్ఠురాలు, దేవతా

=దేవత యైన, ఏషా రోహిణీ=ఈ రోహిణి, దివి=ఆకాశమునందు, చన్ద్రం వినా=చంద్రుడు లేకుండా, ముహూర్తమపి=క్షణకాల మైనను, న దృశ్యతే=చూడబడదు.

తా. సమస్త్రీలలో ఉత్తమురాలైన ఈ రోహిణీదేవత చంద్రుని, క్షణకాల మైనను విడచి, ఆకాశమునందు కనబడదు. 11

మూ. ఏవంవిధాశ్చ ప్రవరాః స్త్రియో భర్తృదృఢవ్రతాః,
దేవలోకే మహీయన్తే పుణ్యేన స్వేన కర్మణా. 12

ప్ర. అ. ఏవంవిధాః=ఇట్టి, ప్రవరాః=శ్రేష్ఠలైన, భర్తృదృఢవ్రతాః=భర్తలయందు దృఢ మైన వ్రతము గల, స్త్రియః=స్త్రీలు, పుణ్యేన=పుణ్య మైన, స్వేన=తమ సంబంధ మైన, కర్మణా=కర్మచేత, దేవలోకే=స్వర్గలోకనందు, మహీయన్తే=పూజింపబడుచున్నారు.

తా. ఇట్టి ఎందరో ఉత్తమస్త్రీలు, భర్తల విషయమున దృఢ మైన నియమములు అవలంబించి, తాము చేసిన పుణ్యకర్మకు ఫలితముగా దేవలోకమునందు పూజింపబడుచున్నారు. 12

మూ. తతోఽనసూయా సంహృష్టా శ్రుత్వోక్తం సీతయా వచః,
శిరస్యాఘ్రాయ చోవాచ మైథిలీం హర్షయన్త్యుత. 13

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సీతయా=సీతచేత, ఉక్తమ్=చెప్పబడిన, వచః=వాక్యమును, శ్రుత్వా=విని, అనసూయా=అనసూయాదేవి, సంహృష్టా=చాలా సంతోషించినదై, మైథిలీమ్ = సీతను, శిరసి=శిరస్సుపై, ఆఘ్రాయ=వాసనచూచి, హర్షయన్తీ=సంతోషింపచేయుచు, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట అనసూయాదేవి సీత మాటలు విని, చాలా సంతోషించి, ఆమెను శిరస్సుపై వాసనచూచి, (ప్రేమతో ముద్దు పెట్టుకొని) ఆమెకు సంతోషము కల్గించుచు, ఇట్లు పలికెను. 13

మూ. నియమైర్వివిధైరాప్తం తపో హి మహదస్తి మే,
తత్సంశ్రిత్య బలం సీతే ఛన్దయే త్వాం శుచిస్మితే. 14

ప్ర. అ. శుచిస్మితే = తెల్లని చిరునవ్వు గల, సీతే = ఓ సీతా! వివిధైః = అనేకవిధము లైన, నియమైః = నియమములచేత, ఆప్తమ్ = పొందబడిన, మహత్ = గొప్ప, తపః = తపస్సు, మే = నాకు, అస్తి హి = ఉన్నదికదా! తత్ బలమ్ = ఆ బలమును, సంశ్రిత్య = ఆశ్రయించి, త్వామ్ = నిన్ను, ఛందయే = ఇష్టము వచ్చినది కోరుకొమ్మని చెప్పుచున్నాను.

తా. అంద మైన చిరునవ్వు గల ఓ సీతా! నేను అనేకవిధము లైన నియమములు పాటించి సంపాదించిన గొప్ప తపస్సు ఉన్నది. దాని బలముచేత నీకు ఏమి కావలెనో ఇచ్చెదను, కోరుకొనుము. 14

మూ. ఉపపన్నం మనోజ్ఞం చ వచనం తవ మైథిలి,
ప్రీతా చాస్మ్యుచితం కిం తే కరవాణి బ్రవీహ్యాహమ్. 15

ప్ర. అ. మైథిలి = ఓ సీతా! తవ వచనమ్ = నీ మాట; ఉపపన్నమ్ = యుక్త మైనది. మనోజ్ఞం చ = మనోహర మైనది కూడ. ప్రీతా = సంతోషించిన దానను, అస్మి = అయితిని. ఉచితమ్ = తగిన, కిం = దేనిని, తే = నీకు, కరవాణి = చేయుదునో, మే = నాకు, బ్రవీహి = చెప్పుము.

తా. ఓ సీతా! నీ మాటలు యుక్తముగాను, మనోహరముగాను, ఉన్నవి. చాలా సంతోషించుచున్నాను. అందుకు తగినది ఏమి కోరెదవో చెప్పుము; ఇచ్చెదను. 15

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా విస్మితా మన్దవిస్మయా,
కృతమిత్యబ్రవీత్సీతా తపోబలసమన్వితామ్. 16

ప్ర. అ. సీతా = సీత, తస్యాః = ఆమెయొక్క, తద్వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, విస్మితా = ఆశ్చర్యపడినదై, మన్దవిస్మయా = మంద మైన చిరునవ్వు కలదై, తపోబలసమన్వితామ్ = తపోబలముతో కూడిన అనసూయా దేవిని గూర్చి, కృతమితి = చేయబడినది అని, అబ్రవీత్ = పలికెను.

తా. సీత అనసూయాదేవి మాటలు విని, ఆశ్చర్యపడిన దై, చిరునవ్వు నవ్వుచు, "ఇదియే చాలును. నీవు వరము నిచ్చినట్లే" అని తపోబలముతో కూడిన ఆమెతో పలికెను. 16

మూ. సా త్వేవముక్తా ధర్మజ్ఞా తయా ప్రీతతరాఽభవత్,
సఫలం చ ప్రహర్షం తే హన్త సీతే కరోమ్యహమ్. 17

ప్ర. అ. ధర్మజ్ఞా = ధర్మములు తెలిసిన, సా = ఆ అనసూయ, తయా = ఆ సీతచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడినదై, ప్రీతతరా = ఇంకను సంతోషించినది, అభవత్ = అయెను. సీతే = ఓ సీతా! హన్త = చాలా సంతోషము. ప్రహర్షమ్ = నా సంతోషమును, తే = నీ విషయమున, సఫలమ్ = సఫల మైన దానినిగా, అహమ్ = నేను, కరోమి = చేసెదను.

తా. ధర్మజ్ఞురాలైన ఆ అనసూయాదేవి సీత మాటలు విని, ఇంకను సంతోషించినదై, ఇట్లు పలికెను. "ఓ సీతా! నాకు నీ విషయమున కలిగిన అధిక సంతోషమును సఫలము చేసెదను. 17

మూ. ఇదం దివ్యం వరం మాల్యం వస్త్రమాభరణాని చ,
అఙ్గరాగం చ వైదేహి మహార్హం చానులేపనమ్. 18

మయా దత్తమిదం సీతే తవ గాత్రాణి శోభయేత్,
అనురూపమసంక్లిష్టం నిత్యమేవ భవిష్యతి. 19

ప్ర. అ. వైదేహి = ఓ విదేహరాజకుమారీ! సీతే = సీతా! దివ్యమ్ = దివ్యమైన, వరమ్ = శ్రేష్ఠ మైన, ఇదం మాల్యమ్ = ఈ పుష్పమాల, వస్త్రమ్ = వస్త్రము, ఆభరణాని చ = అలంకారములు, అఙ్గరాగం చ = శరీరమునకు రంగుకై పూసికొను ద్రవ్యము, మహార్హమ్ = శ్రేష్ఠ మైన, అనులేపనం చ = మైపూత, మయా = నాచేత, దత్తమ్ = ఇవ్వబడిన, ఇదమ్ = ఇది అంతా, తవ = నీయొక్క, గాత్రాణి = అవయవములను, శోభయేత్ = ప్రకాశింపచేయును. నిత్యమేవ = ఎల్లపుడు, అనురూపమ్ = శరీరమునకు అనుగుణముగాను, అసంక్లిష్టమ్ = నలగనిది గాను, భవిష్యతి = ఉండగలదు.

తా. విదేహరాజపుత్రి వైన ఓ సీతా! దివ్యములు శ్రేష్ఠములు అయిన ఈ పుష్పమాలలను, వస్త్రమును, అలంకారములను, అంగరాగమును, శ్రేష్ఠ మైన మైపూతను ఇచ్చుచున్నాను. ఇవి ఎల్లపుడు అనుకూలముగా ఉండి నలగక నీ అవయవములకు శోభ కల్గించును. 18, 19

మూ. అఙ్గరాగేణ దివ్యేన లిప్తాఙ్గీ జనకాత్మజే,
శోభయిష్యసి భర్తారం యథా శ్రీర్విష్ణుమవ్యయమ్. 20

ప్ర. అ. జనకాత్మజే = ఓ సీతా : దివ్యేన = దివ్య మైన, అఙ్గరాగేణ = ఈ అంగరాగముచేత, లిప్తాఙ్గీ = పూయబడిన శరీరము కలదాన వై, శ్రీః = లక్ష్మి, అవ్యయమ్ = నాశరహితు డైన, విష్ణుమ్ = విష్ణువును, యథా = ఎట్లో, అట్లు, భర్తారమ్ = భర్తను, శోభయిష్యసి = ప్రకాశింపచేయగలవు.

తా. ఓ సీతా! దివ్య మైన ఈ అంగరాగమును శరీరమునకు పూసుకొని, నీవు నాశరహితు డైన విష్ణువును లక్ష్మి శోభింపచేసి నట్లు, నీ భర్తను శోభింప చేయగలవు. 20

మూ. సా వస్త్రమఙ్గరాగం చ భూషణాని స్రజ స్తథా,
మైథిలీ ప్రతిజగ్రాహ ప్రీతిదానమను త్తమమ్. 21

ప్ర. అ. సా మైథిలీ = ఆ సీత, వస్త్రమ్ = వస్త్రమును, అఙ్గరాగం చ = అంగరాగమును, భూషణాని = అలంకారములను, తథా = మరియు, స్రజః = మాలికలను, అనుత్తమమ్ = శ్రేష్ఠ మైన. ప్రీతిదానమ్ = ప్రీతిదానమునుగా, (ప్రేమపూర్వకముగా ఇచ్చిన ఉపాయనమునుగా). ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. అనసూయాదేవి ఇచ్చిన వస్త్రమును, అంగరాగమును, భూషణములను, మాలికలను, సీత శ్రేష్ఠ మైన ప్రీతిదానముగా స్వీకరించెను. 21

మూ. ప్రతిగృహ్య చ తత్సీతా ప్రీతిదానం యశస్వినీ,
శ్లిష్టాఞ్జలిపుటా తత్ర సముపా స్త తపోధనామ్. 22

ప్ర. అ. యశస్వినీ = ఉత్తమ మైన కీర్తి గల, సీతా = సీత, తత్ = ఆ, ప్రీతిదానమ్ = ప్రీతిదానమును, ప్రతిగృహ్య = స్వీకరించి, శ్లిష్టాఞ్జలిపుటా = దగ్గరగా చేర్చబడిన దొప్ప వంటి దోసిలికలదై, తత్ర = అక్కడ, తపోధనామ్ = ఆ తపోధనురాలిని, సముపా స్త = సేవించెను.

తా. అధిక మైన యశస్సు గల సీత, ఆ ప్రీతిదానమును స్వీకరించి, చేతులు జోడించి నమస్కరించుచు, అనసూయాదేవిని సేవించెను. 22

మూ. తదా సీతాముపాసీనామనసూయా దృఢవ్రతా,
వచనం ప్రష్టుమారేభే కాంచిత్ప్రియకథామను. 23

ప్ర. అ. దృఢవ్రతా = దృఢ మైన నియమములు గల, అనసూయా = అనసూయాదేవి, తథా = ఆ విధముగా, ఉపాసీనామ్ = తన సమీపమున కూర్చొని యున్న, **సీతామ్** = సీతను, కాంచిత్ = ఒకానొక, ప్రియకథామను = ఇష్ట మైన కథను గూర్చి, ప్రష్టుమ్ = అడుగుటకు, వచనమ్ = వచనమును, ఆరేభే = ప్రారంభించెను.

తా. స్థిర మైన నియమములు గల ఆ అనసూయాదేవి ప్రియ మైన విషయము నొకదానిని ప్రశ్నించుటకై, తన ప్రక్కనే కూర్చొని యున్న సీతతో ఇట్లు పలికెను. 23

మూ. స్వయంవరే కిల ప్రాప్తా త్వమనేన యశస్వినా,
రాఘవేణేతి మే సీతే కథా శ్రుతిముపాగతా. 24

ప్ర. అ. సీతే = ఓ సీతా! త్వమ్ = నీవు, యశస్వినా = యశశ్శాలి యైన, రాఘవేణ = రామునిచేత, స్వయంవరే = స్వయంవరమునందు, ప్రాప్తా కిల = పొందబడితి వట. ఇతి = ఇట్లు, కథా = కథ, మే = నాయొక్క, శ్రుతిమ్ = చెవిని, ఉపాగతా = పొందినది.

తా. ఓ సీతా! యశశ్శాలి యైన ఈ రాముడు నిన్ను స్వయంవరంలో పొందినా డను విషయమును నేను విని ఉన్నాను. 24

మూ. తాం కథాం శ్రోతుమిచ్ఛామి విస్తరేణ చ మైథిలి,
యథాఽనుభూతం కార్త్స్న్యేన తన్మే త్వం వక్తుమర్హసి.

ప్ర. అ. మైథిలి = ఓ సీతా, తామ్ = ఆ కథను, విస్తరేణ = విస్తారముతో, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, యథాఽనుభూతమ్ = ఎట్లు అనుభవింపబడినదో అట్లు, కార్త్స్న్యేన = సంపూర్ణముగా, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. ఓ సీతా! ఆ వృత్తాంతమును సవిస్తరముగా విన గోరుచున్నాను. నీవు దానిని పూర్తిగా జరిగినది జరిగి నట్లు చెప్పుము. 25

మూ. ఏవముక్తా తు సా సీతా తాం తతో ధర్మచారిణీమ్,
శ్రూయతామితి చోక్త్వా వై కథయామాస తాం కథామ్.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తా = పలుకబడిన, సా సీతా = ఆ సీత, తతః = ఆటుపిమ్మట, శ్రూయతామ్ = వినబడుగాక, ఇతి = అని, ఉక్త్వా = పలికి, తామ్ = ఆ, ధర్మచారిణీమ్ = ధర్మమును ఆచరించు అనసూయను గూర్చి, తాం కథామ్ = ఆ కథను, కథయామాస = చెప్పెను.

తా. సీత ఆ మాటలు విని, చెప్పెదను వినుము అని పలికి, ధర్మాత్మురాలైన ఆ అనసూయకు ఆ కథ నంతను చెప్పెను 26

మూ. మిథిలాధిపతిర్వీరో జనకో నామ ధర్మవిత్,
క్షత్రధర్మే హ్యభిరతో న్యాయతః శాస్తి మేదినీమ్. 27

ప్ర. అ. మిథిలాధిపతిః = మిథిలకు ప్రభువు, వీరః = వీరుడు, ధర్మవిత్ = ధర్మమును తెలిసినవాడు ఐన, జనకో నామ = జనకుడు అను పేరు గల రాజు, క్షత్రధర్మే = క్షత్రియధర్మమునందు, అభిరతః = ఆసక్తి కలవాడై, న్యాయతః = న్యాయానుసారముగా, మేదినీమ్ = భూమిని, శాస్తి = పాలించు చున్నాడు.

తా. మిథిలకు ప్రభువు, వీరుడు, ధర్మవేత్త అయిన జనకు డను పేరు గల ఒక మహారాజు, క్షత్రియధర్మమును పాలించుచు, న్యాయానుసారముగా భూమిని పాలించుచున్నాడు. 27

మూ. తస్య లాఙ్గలహస్తస్య కర్షతః క్షేత్రమణ్డలమ్,
అహం కిలోత్థితా భిత్త్వా జగతీం నృపతేస్సుతా. 28

ప్ర. అ. తస్య = అతడు, లాఙ్గలహస్తస్య = నాగలి హస్తమునందు కలవాడై, క్షేత్రమండలమ్ = క్షేత్రము యొక్క మండలమును, కర్షతః = దున్నుచుండగా, అహమ్ = నేను, నృపతేః = ఆ రాజుయొక్క, సుతా = కుమారెనై, జగతీమ్ = భూమిని, భిత్త్వా = బేదించి, ఉత్థితా కిల = లేచితి నట.

తా. ఆ రాజు నాగలి పట్టి మండలాకారముగా ఉన్న యజ్ఞభూమిని

దున్నుచుండగా, నేను ఆ నేలను బ్రద్దలు కొట్టుకొని, పైకి వచ్చి ఆ రాజునకు కుమార్తెను అయినానట. 29

మూ. స మాం దృష్ట్వా నరపతిర్ముష్టివిక్షేపతత్పరః,
పాంసుగుణ్ఠితసర్వాఙ్గీం జనకో విస్మితోఽభవత్. 30

ప్ర. అ. ముష్టివిక్షేపతత్పరః = పిడికిలితో ఓషధిబీజములను చల్లుట యందు ఆసక్తుడైన, నరపతిః = రాజైన, సః జనకః = ఆ జనకుడు, పాంసుగుణ్ఠితసర్వాఙ్గీం = పరాగముచేత కప్పబడిన సమస్తమైన అవయవములు గల, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, విస్మితః = ఆశ్చర్యము కలవాడు, అభవత్ = ఆయెను.

తా. ఆ క్షేత్రమునందు ఓషధీబీజములను పిడికిళ్ళతో చల్లు కార్యమునందు నిమగ్నుడైన ఆ జనకమహారాజు శరీరమంతా పరాగము కప్పియున్న నన్ను చూచి ఆశ్చర్యపడెను. 30

మూ. అనపత్యేన చ స్నేహాదఙ్కమారోప్య చ స్వయమ్,
మమేయం తనయేత్యుక్త్వా స్నేహో మయి నిపాతితః.

ప్ర. అ. అనపత్యేన = సంతానము లేని ఆ జనకమహారాజుచేత, స్వయమ్ = స్వయముగా, స్నేహాత్ = ప్రేమవలన, అఙ్కమ్ = ఒడిని, ఆరోప్య = అధిష్ఠింపచేసి, ఇయమ్ = ఈమె, మమ తనయా = నా కుమార్తె, ఇతి = అని, ఉక్త్వా = పలికి, మయి = నాయందు, స్నేహః = స్నేహము, నిపాతితః = ఉంచబడినది.

తా. సంతానము లేని ఆ జనకమహారాజు నన్ను స్వయముగా లేవనెత్తి ఒడిలో కూర్చుండబెట్టుకొని, "ఈమె నా కూతురు" అని పలుకుచు నాపై స్నేహమును చూపెను. 31

మూ. అన్తరిక్షే చ వాగుక్తాఽప్రతిమాఽమానుషీ కిల,
ఏవమేతన్నరపతే ధర్మేణ తనయా తవ. 32

ప్ర. అ. నరపతే = ఓ రాజా! ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లే, అప్రతిమా

=సాటి లేని, అమానుషీ=మనుష్యస్త్రీ కానిది, తవ=నీకు, ధర్మేణ=ధర్మముచేత, తనయా=కుమార్తె అని, అన్తరిక్షే=ఆకాశమునందు, వాక్=వాక్కు, ఉక్తా=పలుకబడినది.

తా. "ఓ రాజా! ఈమె మనుష్యజాతికి చెందినది కాదు సాటి లేని దేవతా స్త్రీ. ధర్మముచేత నీకు ఈమె కూతురు అను విషయము సత్యమే" అని ఆకాశవాణి వినబడెను. 32

మూ. తతః ప్రహృష్టో ధర్మాత్మా పితా మే మిథిలాధిపః,
అవాప్తో విపులాం బుద్ధిం మామవాప్య నరాధిపః. 33

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడు, నరాధిపః నరులకు ప్రభువు, మిథిలాధిపః = మిథిలానగరమునకు అధిపతి అయిన, మే పితా=నా తండ్రి, ప్రహృష్టః=సంతోషించినవాడై, మామ్=నన్ను, అవాప్య=పొంది, విపులామ్=అధిక మైన, బుద్ధిమ్=ఐశ్వర్యమును, అవాప్తః=పొందినాడు.

తా. ఆ మాట విని, ధర్మాత్ముడు, నరులకు ప్రభువూ, మిథిలాధిపతీ యైన నా తండ్రి, నన్ను పుత్రికనుగా సంతోషముతో చేరదీసెను. ఆ నాటినుండి అత్యధిక మైన అభివృద్ధిని పొందెను. 33

మూ. దత్తా చాస్మీష్టవద్దేవ్యై జ్యేష్ఠాయై పుణ్యకర్మణా,
తయా సంభావితా చాస్మి స్నిగ్ధయా మాతృసౌహృదాత్.

ప్ర. అ. పుణ్యకర్మణా=పుణ్య మైన కర్మలు గల ఆ జనకమహారాజు చేత, జ్యేష్ఠాయై=జ్యేష్ఠురా లైన, దేవ్యై=రాణికి, ఇష్టవత్=ఇష్ట మైన వస్తువుగా, దత్తా=ఇవ్వబడినదానను, అస్మి=అయితిని. స్నిగ్ధయా=స్నేహముతో కూడిన, తయా=ఆమెచేత, మాతృసౌహృదాత్=మాతృప్రేమవలన, సంభావితా=ఆదరింపబడినదానను, అస్మి=అయితిని.

తా. పుణ్యాత్ము డైన ఆ జనకమహారాజు నన్ను తన పట్టపురాణికి చాలా ఇష్ట మైన వస్తువును ఇచ్చి నట్లు ఇచ్చెను. స్నేహశీలురా లైన ఆమె నన్ను మాతృప్రేమతో ఆదరించెను. 34

మూ. పతిసంయోగసులభం వయో దృష్ట్వా తు మే పితా,
చిన్తామభ్యగమద్దీనో విత్తనాశాదివాధనః. 35

ప్ర. అ. మే పితా=నా తండ్రి, పతిసంయోగసులభమ్=భర్తతో కలియుటకు తగిన, వయః=వయస్సును, దృష్ట్వా=చూచి, దీనః=దీనుడై, విత్తనాశాత్=ధనము పోవుటవలన, అధనః ఇవ=దరిద్రుడు వలె, చిన్తామ్=చింతను, అభ్యగమత్=పొందెను.

తా. నాకు వివాహమునకు తగిన వయస్సు వచ్చుట గమనించిన నా తండ్రి దీనుడై, ధనముపోయిన దరిద్రుడు ఎట్లు చింతించునో అట్లు చింతించెను.

మూ. సదృశాచ్చాపకృష్టాచ్చ లోకే కన్యాపితా జనాత్,
ప్రధర్షణామవాప్నోతి శక్రేణాపి సమో భువి. 36

ప్ర. అ. భువి=భూలోకమునందు, శక్రేణ=దేవేంద్రునితో, సమోఽపి=సమానుడైనను, కన్యాపితా=కన్య తండ్రి, సదృశాచ్చ=సమానమైన, అపకృష్టాచ్చ=తనకంటె తక్కువైన, జనాత్=జనమునుండి, లోకే=లోకమున, ప్రధర్షణామ్=తిరస్కారమును, అవాప్నోతి=పొందును.

తా. భూలోకములోని దేవేంద్రుని వంటివాడైనను, కన్య తండ్రి తనతో సమానులైన వారినుండి, తనకంటె తక్కువవారినుండి లోకములో తిరస్కారము పొందవలసి వచ్చును. 36

మూ. తాం ధర్షణామదూరస్థాం దృష్ట్వా చాత్మని పార్థివః,
చిన్తార్ణవగతః పారం నాససాదాప్లవో యథా. 37

ప్ర. అ. పార్థివః=జనకమహారాజు, తాం ధర్షణామ్=ఆ తిరస్కారమును, ఆత్మని=తనయందు, అదూరస్థామ్=దగ్గరనే ఉన్నదానినిగా, దృష్ట్వా=చూచి, చిన్తార్ణవగతః=చింతాసముద్రమును పొందినవాడై, అప్లవో యథా=తెప్ప లేనివాడు వలె, పారమ్=ఒడ్డును, నాససాద=పొందలేదు.

తా. అట్టి తిరస్కారము తనకు చాలా దగ్గరలో ఉన్నది అని గ్రహించిన జనకమహారాజు చింతాసముద్రములో పడి తెప్ప లేనివాడు వలె తీరమును చేరలేకపోయెను. 37

మూ. అయోనిజాం హి మాం జ్ఞాత్వా నాధ్యగచ్ఛద్విచిన్తయన్,
సదృశం చానురూపం చ మహీపాలః పతిం మమ. 38

ప్ర. అ. మహీపాలః = రాజు, మామ్ = నన్ను, అయోనిజామ్ = మాతృ గర్భమునుండి పుట్టనిదానినిగా, జ్ఞాత్వా = తెలుసుకొని, మమ = నాకు, సదృశమ్ = సమానుడు, అనురూపం చ = తగినవాడు అయిన, పతిమ్ = భర్తనుగూర్చి, విచిన్తయన్ = ఆలోచించుచు, నాధ్యగచ్ఛత్ = పొందజాలకపోయెను.

తా. నేను అయోనిజను అను విషయమును గుర్తించి, ఆ జనకమహారాజు ఎంత ఆలోచించినను నాతో సమానుడు, నాకు తగినవాడు అయిన భర్త ఆయన మనస్సునకు గోచరించలేదు.

మూ. తస్య బుద్ధిరియం జాతా చిన్తయానస్య సన్తతమ్,
స్వయంవరం తనూజాయాః కరిష్యామీతి ధీమతః. 39

ప్ర. అ. సన్తతమ్ = ఎల్లపుడు, చిన్తయానస్య = ఆలోచించుచున్న, ధీమతః = బుద్ధిమంతుడైన, తస్య = ఆతనికి, తనూజాయాః = కుమార్తెకు, స్వయంవరమ్ = స్వయంవరమును, కరిష్యామి = చేసెదను, ఇతి = అని, ఇయం బుద్ధిః = ఈ బుద్ధి, జాతా = పుట్టినది.

తా. నిరంతరము ఆలోచన చేయగా చేయగా, బుద్ధిమంతుడైన ఆ జనకునకు, "కుమార్తెకు స్వయంవరము చేసెదను" అను బుద్ధి కలిగినది. 39

మూ. మహాయజ్ఞే తదా తస్య వరుణేన మహాత్మనా,
దత్తం ధనుర్వరం ప్రీత్యా తూణీ చాక్షయసాయకౌ. 40

ప్ర. అ. తదా = అపుడు, మహాయజ్ఞే = గొప్ప యజ్ఞమునందు, తస్య = ఆతనికి, మహాత్మనా = మహాత్ముడైన, వరుణేన = వరుణునిచేత, ప్రీత్యా = ప్రేమతో, ధనుర్వరమ్ = శ్రేష్ఠమైన ధనుస్సు, దత్తమ్ = ఇవ్వబడినది. అక్షయసాయకౌ = అక్షయమైన బాణములు గల, తూణీ చ = రెండు అంబులపొదులు కూడ ఇవ్వబడినవి.

తా. పూర్వము ఒక మహాయజ్ఞమునందు మహాత్ముడైన వరుణుడు ఆ

జనకమహారాజునకు శ్రేష్ఠ మైన ధనుస్సును, తరగని బాణములు గల రెండు అంబులపొదులను ప్రేమపూర్వకముగా ఇచ్చి యుండెను. 40

మూ. అసంచాల్యం మనుష్యైశ్చ యత్నేనాపి చ గౌరవాత్,
తన్న శక్తా నమయితుం స్వప్నేష్వపి నరాధిపాః. 41

ప్ర. అ. గౌరవాత్ = బరువువలన, మనుష్యైః = మనుష్యులచేత, యత్నేనాపి = ప్రయత్నముచేత కూడ, అసంచాల్యమ్ = కదలింప శక్యము గాని, తత్ = ఆ ధనుస్సును, నరాధిపాః = రాజులు, స్వప్నేష్వపి = స్వప్నమునందుకూడ, నమయితుమ్ = వంచుటకు, న శక్తాః = సమర్థులు కారు.

తా. ఆ ధనుస్సు చాలా బరు వైన దగుటచే, దానిని మనుష్యు లెవరు, ఎంత ప్రయత్నము చేసినను కదల్పజాలరు. రాజులు స్వప్నమునందు కూడ దానిని వంచుటకు సమర్థులు కారు. 41

మూ. తద్ధనుః ప్రాప్య మే పిత్రా వ్యాహృతం సత్యవాదినా,
సమవాయే నరేన్ద్రాణాం పూర్వమామన్త్ర్య పార్థివాన్. 42

ప్ర. అ. సత్యవాదినా = సత్యమును చెప్పు, మే పిత్రా = నా తండ్రిచేత, పూర్వమ్ = ముందుగా, పార్థివాన్ = రాజులను, ఆమన్త్ర్య = పిలిచి, నరేన్ద్రాణామ్ = రాజులయొక్క, సమవాయే = సమూహమునందు, తత్ ధనుః = ఆ ధనుస్సును, ప్రాప్య = పొంది, వ్యాహృతమ్ = పలుకబడినది.

తా. సత్యవాది యైన మా తండ్రి ముందుగానే రాజుల నందరిని పిలిచి, ఆ ధనుస్సును గూర్చి వారితో ఇట్లు చెప్పెను. 42

మూ. ఇదం చ ధనురుద్యమ్య సజ్యం యః కురుతే నరః,
తస్య మే దుహితా భార్యా భవిష్యతి న సంశయః. 43

ప్ర. అ. యః నరః = ఏ నరుడు, ఇదం ధనుః = ఈ ధనుస్సును, ఉద్యమ్య = ఎత్తి, సజ్యం చ = నారితో కూడిన దానినిగా కూడ, కురుతే = చేయునో, తస్య = వానికి, మే దుహితా = నా కుమార్తె, భార్యా = భార్య, భవిష్యతి = కాగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. "ఎవడు ఈ ధనుస్సును ఎత్తి, దీనికి నారిని కట్టునో, ఆతనికి నా కుమార్తె నిచ్చి వివాహము చేసెదను. సందేహము లేదు". 43

మూ. తచ్చ దృష్ట్వా ధనుఃశ్రేష్ఠం గౌరవాద్గిరిసన్నిభమ్,
అభివాద్య నృపా జగ్మురశక్తాస్తస్య తోలనే. 44

ప్ర. అ. నృపాః = రాజులు, గౌరవాత్ = బరువువలన, గిరిసన్నిభమ్ = పర్వతముతో సమాన మైన, తత్ ధనుఃశ్రేష్ఠమ్ = ఆ శ్రేష్ఠధనస్సును, దృష్ట్వా = చూచి, తస్య = దానియొక్క, తోలనే = కదల్చుటయందు, అశక్తాః = అసమర్థు లై, అభివాద్య = నమస్కరించి, జగ్ముః = వెళ్ళిరి.

తా. ఆ రాజులు పర్వత మంత బరువు గల శ్రేష్ఠ మైన ధనుస్సును చూచి, దానిని కదల్చుటకు అసమర్థులై దానికి నమస్కరించి వెళ్ళిపోయిరి. 44

మూ. సుదీర్ఘస్య తు కాలస్య రాఘవోఽయం మహాద్యుతిః,
విశ్వామిత్రేణ సహితో యజ్ఞం ద్రష్టుం సమాగతః, 45
లక్ష్మణేన సహ భ్రాతా రామః సత్యపరాక్రమః.

ప్ర. అ. సుదీర్ఘస్య = చాల దీర్ఘ మైన, కాలస్య = కాలమునకు, రాఘవః = రఘువంశమునందు పుట్టినవాడు, మహాద్యుతిః = గొప్ప కాంతి కలవాడు, సత్యపరాక్రమః = సత్య మైన పరాక్రమము కలవాడు అయిన, అయం రామః = ఈ రాముడు, భ్రాతా = సోదరు డైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడ, విశ్వామిత్రేణ = విశ్వామిత్రునితో, సహితః = కూడినవా డై, యజ్ఞమ్ = యజ్ఞమును, ద్రష్టుమ్ = చూచుటకు, సమాగతః = వచ్చినాడు.

తా. చాలాకాలము గడచిన పిమ్మట, గొప్ప కాంతిగలవాడు, సత్య మైన పరాక్రమము కలవాడు, రఘువంశసంజాతుడు అయిన ఈ రాముడు లక్ష్మణ సహితు డై, విశ్వామిత్రుని వెంట యజ్ఞమును చూచుటకు వచ్చెను.

మూ. విశ్వామిత్రస్తు ధర్మాత్మా మమ పిత్రా సుపూజితః, 46
ప్రోవాచ పితరం తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన, విశ్వామిత్రస్తు = విశ్వామిత్రుడు,

మమ పిత్రా=నా తండ్రిచేత, సుపూజితః = బాగుగా పూజింపబడినవాడై, తత్ర = అక్కడ, భ్రాతరౌ = సోదరు లైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను గూర్చి, పితరమ్ = తండ్రిని గూర్చి, ప్రోవాచ = పలికెను.

తా. ధర్మాత్ము డైన విశ్వామిత్రుడు, నా తండ్రి చేసిన పూజ నందుకొని సోదరు లైన ఆ రామలక్ష్మణులను గూర్చి అతనికి చెప్పెను. 46

మూ. సుతౌ దశరథస్యేమౌ ధనుర్దర్శనకాఙ్క్షిణౌ, 47
ధనుర్దర్శయ రామాయ రాజపుత్రాయ దైవికమ్.

ప్ర. అ. దశరథస్య = దశరథునియొక్క, సుతౌ = కుమారు లైన, ఇమౌ = వీరిద్దరు, ధనుర్దర్శనకాఙ్క్షిణౌ = ధనుస్సును చూచుటకు కోరుచున్నారు. రాజపుత్రాయ = రాజపుత్రు డైన, రామాయ = రామునకు, దైవికమ్ = దేవతల వల్ల లభించిన, ధనుః = ధనస్సును, దర్శయ = చూపుము.

తా. "దశరథుని కుమారు లైన ఈ రామలక్ష్మణులు ధనుస్సును చూడ గోరుచున్నారు. దేవతల ద్వారా లభించిన ఆ ధనుస్సును రాజపుత్రు డైన రామునకు చూపుము." 47

మూ. ఇత్యుక్తస్తేన విప్రేణ తద్ధనుస్సముపానయత్, 48
నిమేషాన్తరమాత్రేణ తదానమ్య మహాబలః,
జ్యాం సమారోప్య ఝటితి పూరయామాస వీర్యవాన్. 49

ప్ర. అ. తేన విప్రేణ = ఆ బ్రాహ్మణునిచేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలుకబడినవాడై, తతో ధనుః = ఆ ధనుస్సును, ఉపానయత్ = తెప్పించెను. మహాబలః = గొప్ప బలము గలవాడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన రాముడు, నిమేషాన్తరమాత్రేణ = రెప్పపాటు వ్యవధానముతో, తత్ = దానిని, ఆనమ్య = వంచి, ఝటితి = వెంటనే, జ్యామ్ = నారిని, సమారోప్య =ఎక్కించి, పూరయామాస = పూరించెను.

తా. విశ్వామిత్రుని మాటలు విని, మా తండ్రి ఆ ధనుస్సును తెప్పించగా మహాబలశాలీ, పరాక్రమవంతుడూ అయిన రాముడు రెప్పపాటుకాలములో దానిని వంచి నారి ఎక్కించి పూరించెను (లాగెను). 49

మూ. తేన పూరయతా వేగాన్మధ్యే భగ్నం ద్విధా ధనుః,
తస్య శబ్దోఽభవద్భీమః పతితస్యాశనేరివ. 50

ప్ర. అ. పూరయతా=పూరించుచున్న, తేన=ఆ రామునిచేత, వేగాత్=వేగమువలన, ధనుః=ధనుస్సు, మధ్యే=మధ్యయందు, ద్విధా=రెండుగా, భగ్నమ్=విరగగొట్టబడినది. తస్య=దానియొక్క, భీమః=భయంకర మైన, శబ్దః=శబ్దము, పతితస్య=పడిన, అశనేరివ=పిడుగుయొక్క శబ్దము వలె, అభవత్=ఆయెను.

తా. రాముడు దానిని పూరించుచుండగా ఆ వేగమునకు అది మధ్యలో రెండు ముక్కల య్యెను. అపుడు పిడుగు పడుచున్నపుడు వలె భయంకర మైన శబ్దము కలిగెను. 50

మూ. తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసన్ధినా,
నిశ్చితా దాతుముద్యమ్య జలభాజనముత్తమమ్. 51

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడ, సత్యాభిసన్ధినా=సత్య మైన ఆలోచన గల, పిత్రా=తండ్రిచేత, ఉత్తమమ్=ఉత్తమ మైన, జలభాజనమ్=జలపాత్రను, ఉద్యమ్య=ఎత్తి, అహమ్=నేను, రామాయ=రామునకు, దాతుమ్=ఇచ్చుటకు, నిశ్చితా=నిశ్చయింపబడితిని.

తా. అపుడు సత్యప్రతిజ్ఞ గల నా తండ్రి నన్ను రామునకు ఇచ్చుటకై, జలకలశమును గ్రహించెను. 51

మూ. దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః,
అవిజ్ఞాయ పితుశ్ఛన్దమయోధ్యాఽధిపతేః ప్రభోః. 52

ప్ర. అ. తదా=అపుడు, రాఘవః=రాముడు, అయోధ్యాఽధిపతేః=అయోధ్యకు అధిపతి, ప్రభోః=ప్రభువు అయిన, పితుః=తండ్రియొక్క, ఛన్దమ్=అభిప్రాయమును, అవిజ్ఞాయ=తెలుసుకొనకుండగ, దీయమానామ్=ఇవ్వబడుచున్న నన్ను, న తు ప్రతిజగ్రాహ=స్వీకరించలేదు.

తా. అపుడు రాముడు తన తండ్రీ, ప్రభువూ అయిన దశరథమహారాజు

అభిప్రాయము తెలుసుకొనకుండగా, నా తండ్రి ఇచ్చుచున్న నన్ను స్వీకరించ లేదు. 52

మూ. తతః శ్వశురమామన్త్ర్య వృద్ధం దశరథం నృపమ్,
మమ పిత్రా త్వహం దత్తా రామాయ విదితాత్మనే. 53

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మమ పిత్రా = నా తండ్రిచేత, శ్వశురమ్ = మామగారైన, వృద్ధమ్ = వృద్ధుడైన, దశరథం నృపమ్ = దశరథమహారాజును, ఆమన్త్ర్య = పిలిపించి, అహమ్ = నేను, విదితాత్మనే = ప్రసిద్ధమైన బుద్ధి గల, రామాయ = రామునకు, దత్తా = ఇవ్వబడితిని.

తా. పిమ్మట నా తండ్రి వృద్ధుడైన మామగారు దశరథమహారాజును పిలిపించి బుద్ధిమంతుడుగా ప్రసిద్ధుడైన రామునకు నన్ను ఇచ్చెను. 53

మూ. మమ చైవానుజా సాధ్వీ ఊర్మిళా ప్రియదర్శనా,
భార్యార్థే లక్ష్మణస్యాపి పిత్రా దత్తా మమ స్వయమ్. 54

ప్ర. అ. మమ = నాయొక్క, అనుజా = చెల్లెలు, సాధ్వీ = సాధు స్వభావము కలది, ప్రియదర్శనా = ప్రియమైన దర్శనము కలది అయిన, ఊర్మిళా = ఊర్మిళ, భార్యార్థే = భార్యగా, మమ పిత్రా = నా తండ్రిచేత, స్వయమ్ = స్వయముగా, లక్ష్మణస్యాపి = లక్ష్మణునకు, దత్తా = ఇవ్వబడినది.

తా. నా తండ్రి స్వయముగా నా సోదరి, ఉత్తమశీల, చూచుటకు ప్రియముగా నుండునది అయిన ఊర్మిళను లక్ష్మణునకు ఇచ్చి వివాహము చేసెను.

మూ. ఏవం దత్తాస్మి రామాయ తదా తస్మిన్ స్వయంవరే,
అనురక్తాస్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్. 55

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టాదశోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తదా = అపుడు, తస్మిన్ స్వయంవరే = ఆ స్వయంవరమునందు, రామాయ = రామునకు, ఏవమ్ = ఈ విధముగా, దత్తా = ఇవ్వబడినదానను, అస్మి = అయితిని. వీర్యవతామ్ = పరాక్రమవంతులలో, వరమ్ =

శ్రేష్ఠుడైన, పతిమ్=భర్తను, ధర్మేణ=ధర్మముచేత, అనురక్తా=అనురాగము కలదానను, అస్మి=అయి ఉన్నాను.

తా. నా తండ్రి అపుడు ఆ స్వయంవరమునందు, నన్ను రామునకు ఆ విధముగా ఇచ్చి వివాహము చేసెను. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడైన భర్తపై ధర్మానుసారముగా అనురాగము కలదాననై ఉన్నాను. ౫౫

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటపదునెనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకనవింశోత్తరశతతమః సర్గః

[అనసూయ ఆజ్ఞాపించగా, సీత ఆమె యొసగిన వస్త్రాభరణములు దాల్చి రాముని వెంటను వచ్చుట. రాముడు ఆ రాత్రి యాశ్రమమున గడిపి ప్రాతఃకాలమున వేరొకచోటికి పోవుటకై ఋషులను సెలవడుగుట.]

మూ. అనసూయా తు ధర్మజ్ఞా శ్రుత్వా తాం మహతీం కథామ్,
పర్యష్వజత బాహుభ్యాం శిరస్యాఘ్రాయ మైథిలీమ్. 1

ప్ర. అ. ధర్మజ్ఞా = ధర్మములు తెలిసిన, అనసూయా తు = అనసూయ, తామ్ = ఆ, మహతీం కథామ్ = గొప్ప కథను, శ్రుత్వా = విని, మైథిలీమ్ = సీతను, శిరసి = శిరస్సుపై, ఆఘ్రాయ = వాసనచూచి, బాహుభ్యామ్ = బాహువులతో, పర్యష్వజత = కౌగలించుకొనెను.

తా. ధర్మజ్ఞురాలైన అనసూయ, పవిత్రమైన ఆ కథను విని, సీతను శిరస్సుపై ఆఘ్రాణించి, బాహువులతో కౌగలించుకొనెను. 1

మూ. వ్యక్తాక్షరపదం చిత్రం భాషితం మధురం త్వయా,
యథా స్వయంవరం వృత్తం తత్సర్వం హి శ్రుతం మయా,
రమేఽహం కథయా తే తు దృఢం మధురభాషిణి.

ప్ర. అ. త్వయా = నీచేత, వ్యక్తాక్షరపదమ్ = స్పష్టమైన అక్షరములు, పదములు కలుగునట్లుగా, చిత్రమ్ = ఆశ్చర్యజనకముగా, మధురమ్ = మధురముగా, భాషితమ్ = చెప్పబడినది. స్వయంవరమ్ = స్వయంవరము, యథా = ఎట్లు, వృత్తమ్ = జరిగినదో, తత్సర్వం = అది అంతా, మయా = నాచేత, శ్రుతం హి = వినబడినది కదా. మధురభాషిణి = మధురముగా మాటలాడు ఓ సీతా! తే కథయా = నీ కథచేత, అహమ్ = నేను, దృఢమ్ = అధికముగా, రమే = సంతోషించుచున్నాను.

తా. నీవు అక్షరములు, పదములు స్పష్టముగా నుండునట్లు మధురముగా ఆశ్చర్యకర మైన రీతిలో మాటలాడినావు. నీ స్వయంవరము ఎట్లు జరిగినదో ఆ విషయము నంతను వింటిని. మధురభాషిణి యైన ఓ సీతా! నీ కథ వినుటచే నాకు అధిక మైన ఆనందము కలిగినది. 2

మూ. రవిరస్తంగతః శ్రీమానుపోహ్యా రజనీం శివామ్, 3
దివసం ప్రతికీర్ణానామాహారార్థం పతత్రిణామ్,
సన్ధ్యాకాలే నిలీనానాం నిద్రార్థం శ్రూయతే ధ్వనిః. 4

ప్ర. అ. శ్రీమాన్=అధిక మైన కాంతి గల, రవిః=సూర్యుడు, శివామ్=మంగళకర మైన, రజనీమ్=రాత్రిని, ఉపోహ్యా=సమీపింపచేసి, (దగ్గరపడు నట్లు చేసి) అస్తగతః=అస్తమించినాడు. దివసమ్=పగటి భాగమున, ఆహారార్థమ్=ఆహారముకొరకై, ప్రతికీర్ణానామ్=దూరముగా వ్యాపించినవీ, సన్ధ్యాకాలే=సంధ్యాకాలమునందు, నిద్రార్థమ్=నిద్రకొరకై, నిలీనానామ్=అణగినవి అయిన, పతత్రిణామ్=పక్షులయొక్క, ధ్వనిః=ధ్వని, శ్రూయతే=వినబడు చున్నది.

తా. రాత్రి దగ్గర పడు నట్లు చేసి, సూర్యుడు అస్తమించినాడు. ఆహారము కొరకై, పగలు సుదూరప్రదేశములకు వెళ్ళి సాయంకాలమునందు తమ గూళ్లలో నిద్రకొరకై అణిగి ఉన్న పక్షుల ధ్వని వినబడుచున్నది.

మూ. ఏతేచాప్యభిషేకార్ద్రా ముసయః కలశోద్యతాః,
సహితా ఉపవర్తన్తే సలిలాప్లవవల్కలాః. 5

ప్ర. అ. ఏతే మునయః చ=ఈ మునులు కూడ, అభిషేకార్ద్రాః=స్నానముచే తడిసినవారై, కలశోద్యతాః=ఎత్తబడిన కలశలు కలవారై, సలిలాప్లవవల్కలాః=నీటిచే తడపబడిన నారచీరలు కలవారై, సహితాః=అందరు కలిసినవారై, ఉపవర్తన్తే=తిరిగి వచ్చుచున్నారు.

తా. ఈ మునులు కూడ స్నానములు చేసి, జలపూర్ణము లైన కలశలను చేతులలో గ్రహించి, నీటితో తడిసిన నారచీరలతో గుంపులుగుంపులుగా వచ్చుచున్నారు. 5

మూ. ఋషీణామగ్నిహోత్రేషు హుతేషు విధిపూర్వకమ్,
కపోతాఙ్గారుణో ధూమో దృశ్యతే పవనోద్ధతః. 6

ప్ర. అ. ఋషీణామ్=ఋషులయొక్క, అగ్నిహోత్రేషు=అగ్నిహోత్రములను హోమములు, విధిపూర్వకమ్=యథాశాస్త్రముగా, హుతేషు= చేయబడినవి అగుచుండగా, కపోతాఙ్గారుణః=పావురము శరీరము వలె అరుణమైన, ధూమః=ధూమము, పవనోద్ధతః = గాలిచేత ఎగురగొట్టబడినదై, దృశ్యతే= చూడబడుచున్నది.

తా. ఋషులు సాయంకాలము చేయవలసిన అగ్నిహోత్ర మను హోమము యథావిధిగా చేయగా, పావురము శరీరము రంగులో ఉన్న ధూమము గాలిచే ఎగురగొట్టబడి, కనబడుచున్నది. 6

మూ. అల్పపర్ణా హి తరవో ఘనీభూతాః సమన్తతః,
విప్రకృష్టేన్ద్రియే దేశే న ప్రకాశన్తి వై దిశః. 7

ప్ర. అ. సమన్తతః = నలు వైపుల, అల్పపర్ణాః = అల్పమైన ఆకులు గల, తరవః = వృక్షములు, ఘనీభూతాః = దట్టమైనవి. విప్రకృష్టేన్ద్రియే = ఆకర్షింపబడిన ఇంద్రియములు గల, అస్మిన్ దేశే = ఈ ప్రదేశమునందు, దిశః =దిక్కులు, న ప్రకాశన్తి వై=ప్రకాశించుటలేదు. 7

తా. చుట్టుప్రక్కల ఉన్న స్వల్పమైన ఆకులు గల చెట్లు కూడ దట్టముగా ఉన్నట్లు కనబడుచున్నవి. ఈ ప్రదేశమున ఇంద్రియములు (నేత్రములు) దుర్బలములుగా చేయబడుటచే దిక్కులు ప్రకాశించుటలేదు. 7

మూ. రజనీచరసత్త్వాని ప్రచరన్తి సమన్తతః,
తపోవనమృగా హ్యేతే వేదితీర్థేషు శేరతే. 8

ప్ర. అ. రజనీచరసత్త్వాని = రాత్రియందు సంచరించే జంతువులు, సమన్తతః= నలు వైపుల, ప్రచరన్తి = సంచరించుచున్నవి. ఏతే = ఈ, తపోవనమృగాః = తపోవనమునందలి మృగములు, వేదితీర్థేషు= వేదికలయందు, రేవులయందు, శేరతే = శయనించుచున్నవి.

తా. రాత్రి సంచరించు జంతువులు నలు వైపుల సంచరించుచున్నవి. ఈ తపోవనమృగములు వేదులయందు, తీర్థములందు శయనించుచున్నవి. 8

మూ. సంప్రవృత్తా నిశా సీతే నక్షత్రసమలఙ్కృతా,
జ్యోత్స్నాప్రావరణశ్చన్ద్రో దృశ్యతేఽభ్యుదితోఽమ్బరే. 9

ప్ర. అ. సీతే = సీతా ! నక్షత్రసమలఙ్కృతా = నక్షత్రములచేత అలంకరింపబడిన, నిశా = రాత్రి, సంప్రవృత్తా = ప్రారంభ మైనది. జ్యోత్స్నాప్రావరణః = వెన్నెల ఆవరణముగా గల, చన్ద్రః = చంద్రుడు, అమ్బరే = అకాశమునందు, అభ్యుదితః = ఉదయించినవాడై, దృశ్యతే = కనబడుచున్నాడు.

తా. ఓ సీతా ! నక్షత్రములచే అలంకృత మై, రాత్రి ప్రారంభ మైనది, చంద్రుడు వెన్నెలను కప్పుకొని, ఆకాశమునందు ఉదయించినాడు. 9

మూ. గమ్యతామనుజానామి రామస్యానుచరీ భవ,
కథయన్త్యా హి మధురం త్వయాఽహం పరితోషితా. 10

ప్ర. అ. గమ్యతామ్ = వెళ్లెదవు గాక ! అనుజానామి = అనుజ్ఞ ఇచ్చుచున్నాను. రామస్య = రామునకు, అనుచరీ = సమీపమున సంచరించుదానవు, భవ = అగుము. మధురమ్ = మధురముగా, కథయన్త్యా = మాటలాడుచున్న, త్వయా = నీచేత, అహమ్ = నేను, పరితోషితా = సంతోషింపచేయబడితిని.

తా. అనుజ్ఞ ఇచ్చుచున్నాను. ఇక నీవు రాముని పద్దకు వెళ్లుము. నీ మధుర మైన మాటలకు చాలా సంతోషించినాను. 10

మూ. అలఙ్కురు చ తావత్త్వం ప్రత్యక్షం మమ మైథిలి,
ప్రీతిం జనయ మే వత్సే దివ్యాలఙ్కారశోభితా. 11

ప్ర. అ. మైథిలి = ఓ సీతా, త్వమ్ = నీవు, మమ = నాకు, ప్రత్యక్షం తావత్ = ఎదురుగానే, అలఙ్కురు = అలంకరించుకొనుము. వత్సే = ఓ బిడ్డా ! దివ్యాలఙ్కారశోభితా = దివ్యము లైన అలంకారములచేత శోభింపబడిన దానవై, మే = నాకు, ప్రీతిమ్ = ఆనందమును, జనయ = కల్గించుము.

తా. ఓ సీతా ! నా యెదుటనే నీవు అలంకరించుకొనుము. ఓ బిడ్డా ! ఈ దివ్యాభరణములచే శోభితురాలవై, నాకు ఆనందమును కల్గించుము. 11

మూ. సా తథా సమలఙ్కృత్య సీతా సురసుతోపమా,
ప్రణమ్య శిరసా తస్యై రామం త్వభిముఖా యయౌ. 12

ప్ర. అ. సురసుతోపమా = దేవకన్యతో సమానురాలైన, సా సీతా = ఆ సీత, తథా = ఆ విధముగా, సమలఙ్కృత్య = అలంకరించుకొని, తస్యై = ఆమెకు, శిరసా = శిరస్సుచేత, ప్రణమ్య = నమస్కరించి, రామమ్ = రాముని గూర్చి, అభిముఖా = అభిముఖురాలై, యయౌ = వెళ్ళెను.

తా. దేవకన్యతో సమానురాలైన ఆ సీత, అనసూయాదేవి కోరిక ప్రకారము అలంకరించుకొని, ఆమెకు శిరస్సు వంచి నమస్కరించి, రాముని వద్దకు వెళ్ళెను. 12

మూ. తథా తు భూషితాం సీతాం దదర్శ వదతాం వరః,
రాఘవః ప్రీతిదానేన తపస్విన్యా జహర్ష చ. 13

ప్ర. అ. వదతామ్ = మాటలాడే వారిలో, వరః = శ్రేష్ఠుడైన, రాఘవః = రాముడు, తథా = ఆ విధముగా, భూషితామ్ = అలంకరింపబడిన, సీతామ్ = సీతను, దదర్శ = చూచెను. తపస్విన్యాః = తపోధనురాలైన అనసూయయొక్క, ప్రీతిదానేన = ప్రేమపూర్వకమైన ఉపాయనముచేత, జహర్ష చ = సంతోషించెను కూడ.

తా. మాటలాడువారిలో శ్రేష్ఠుడైన రాముడు ఆ విధముగా అలంకరించుకొని వచ్చిన సీతను చూచి, అనసూయాదేవి ప్రేమపూర్వకముగా ఇచ్చిన ఉపాయనమునకు సంతోషించెను. 13

మూ. న్యవేదయత్తతః సర్వం సీతా రామాయ మైథిలీ,
ప్రీతిదానం తపస్విన్యా వసనాభరణస్రజమ్. 14

ప్ర. అ. మైథిలీ = మిథిలాదేశపు రాజకుమారియైన, సీతా = సీత, తతః = అటుపిమ్మట, తపస్విన్యాః = అనసూయయొక్క, ప్రీతిదానమ్ = ప్రేమపూర్వకోపాయనమైన, వసనాభరణస్రజమ్ = వస్త్రములను, అలంకారములను,

మాలలను, సర్వమ్ = సమస్తమును, రామాయ = రామునకు, న్యవేదయత్ = చూపించెను.

తా. అనసూయాదేవి ప్రేమపూర్వకముగా తన కిచ్చిన వస్త్రములను, అలంకారములను, పుష్పమాలలను, సీత రామునకు చూపించెను. 14

మూ. ప్రహృష్టస్త్వభవద్రామో లక్ష్మణశ్చ మహారథః,
మైథిల్యాః సత్క్రియాం దృష్ట్వా మానుషేషు సుదుర్లభామ్.

ప్ర. అ. రామః = రాముడు, మహారథః = మహారథు డైన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, మానుషేషు = మనుష్యులలో, సుదుర్లభామ్ = మిక్కిలి దుర్లభ మైన, మైథిల్యాః = సీతయొక్క, సత్క్రియామ్ = సత్కారమును, దృష్ట్వా = చూచి, ప్రహృష్టః=సంతోషించినవాడు, అభవత్ = ఆయెను.

తా. మనుష్యులలో ఎవ్వరికిని లభింపజాలని, సీతకు జరిగిన సత్కారము చూచి, రాముడు, లక్ష్మణుడు సంతోషించిరి. 15

మూ. తతస్తాం శర్వరీం ప్రీతః పుణ్యాం శశినిభాననః,
అర్చితస్తాపసైః సిద్ధైరువాస రఘునన్దనః. 16

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శశినిభాననః = చంద్రునితో సమాన మైన ముఖము గల, రఘునన్దనః = రాముడు, సిద్ధైః=తపస్సిద్ధు లైన, తాపసైః = మునులచేత, అర్చితః = పూజింపబడినవాడై, ప్రీతః = సంతోషించినవాడై, పుణ్యామ్ = పుణ్య మైన, తాం శర్వరీమ్ = ఆ రాత్రి. ఉవాస = నివసించెను.

తా. చంద్రుని వంటి ముఖము గల ఆ రాముడు, తపస్సిద్ధులైన మునీశ్వరుల ఆతిథ్యమును స్వీకరించి, సంతోషించి, పవిత్ర మైన ఆ రాత్రిని అక్కడ గడపెను. 16

మూ. తస్యాం రాత్ర్యాం వ్యతీతాయామభిషిచ్య హుతాగ్నికాన్,
ఆపృచ్ఛేతాం నరవ్యాఘ్రౌ తాపసాన్వనగోచరాన్. 17

ప్ర. అ. తస్యామ్ = ఆ, రాత్ర్యామ్ = రాత్రి, వ్యతీతాయామ్ = గడచిన దగుచుండగా, నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠు లైన రామలక్ష్మణులు, అభిషిచ్య =

స్నానము చేసి, హుతాగ్నికాన్ = హోమము చేయబడిన అగ్నులు కల, వన గోచరాన్ = వనములో నివసించు, తాపసాన్ = మునులను, ఆపృచ్ఛేతామ్ = పిడ్కొనిరి.

తా. ఆ రామలక్ష్మణులు రాత్రి గడచిన పిమ్మట, స్నానము చేసి అగ్ని హోత్రమును పూర్తి చేసుకొని ఉన్న ఆ ఆశ్రమములో నివసించు మునులను పీడ్కొనిరి. 17

మూ. తావూచుస్తే వనచరాస్తాపసా ధర్మచారిణః,
వనస్య తస్య సంచారం రాక్షసైః సమభిప్లుతమ్. 18

ప్ర. అ. వనచరాః = వనమునందు సంచరించు, ధర్మచారిణః = ధర్మ మును ఆచరించువారైన, తే తాపసాః = ఆ మునులు, తస్య వనస్య = ఆ వనము యొక్క, సంచారమ్ = మార్గమును, రాక్షసైః = రాక్షసులచేత, సమభిప్లుతమ్ = ఉపద్రవముతో కూడినదానినిగా, తౌ = వారిద్దరిని గూర్చి, ఊచుః = చెప్పిరి.

తా. వనములో నివసించుచు ధర్మాచరణము చేయుచున్న ఆ మునులు, ఆ వనములోని మార్గ మంతయు రాక్షసుల ఉపద్రవముతో కూడిన దని రామ లక్ష్మణులకు చెప్పిరి. 18

మూ. రక్షాంసి పురుషాదాని నానారూపాణి రాఘవ!
వసన్త్యస్మిన్ మహారణ్యే వ్యాళాశ్చ రుధిరాశనాః. 19

ప్ర అ. రాఘవ = ఓ రామా! అస్మిన్ మహారణ్యే = ఈ మహారణ్యము నందు, పురుషాదాని = పురుషులను భక్షించు, నానారూపాణి = వివిధరూపములు గల, రక్షాంసి = రాక్షసులు, రుధిరాశనాః = రక్తమును భుజించు, వ్యాళాశ్చ = క్రూరమృగములు. వసన్తి = నివసించుచున్నవి.

తా. రామా! ఈ మహారణ్యములో, పురుషులను భక్షించు, వివిధము లైన రూపములు గల రాక్షసులూ, రక్తము త్రాగు క్రూరమృగములూ నివసించు చున్నవి. 19

మూ. ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం ధర్మచారిణమ్,
అదన్త్యస్మిన్ మహారణ్యే తాన్నివారయ రాఘవ! 20

ప్ర. అ. రాఘవ = ఓ రామా ! అస్మిన్ మహారణ్యే = ఈ మహారణ్యములో, ఉచ్ఛిష్టం వా = భోజనాద్యనంతరము శౌచము చేసికొనకుండా ఉన్నను, ప్రమత్తం వా = ఏమరుపాటుతో ఉన్నను, తాపసమ్ = మునీశ్వరుని, అదన్తి = రాక్షసులు తినివేయుచుందురు. తాన్ = వారిని, నివారయ = నివారించుము.

తా. ఓ రామా ! ఈ మహారణ్యములో, ఎవ్వరైన ముని ఉచ్ఛిష్టుడుగా గాని, ఏమరుపాటుతో గాని, ఉన్నచో వానిని రాక్షసులు తినివేయుచుందురు. వారిని నివారింపుము. (వాళ్ళను తప్పించుకొని వెళ్లుము). 20

మూ. ఏష పన్థా మహర్షీణాం ఫలాన్యాహరతాం వనే,
అనేన తు వనం దుర్గం గన్తుం రాఘవ తే క్షమమ్. 21

ప్ర. అ. రాఘవ = ఓ రామా ! ఏషః = ఇది. వనే = వనమునందు, ఫలాని = ఫలములను, ఆహరతామ్ = తీసుకొనివచ్చు, మహర్షీణామ్ = మహర్షుల యొక్క, పన్థాః = మార్గము. అనేన = ఈ మార్గముచేత, దుర్గమ్ = దుర్గమ మైన, వనమ్ = వనమునుగూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, తే = నీకు, క్షమమ్ = తగినది.

తా. రామా ! ఫలములు తెచ్చుకొనుటకై అరణ్యములలోనికి వెళ్లు మహర్షులు ఈ మార్గమును ఉపయోగించుచుందురు. దుర్గమ మైన వనములోనికి నీవు ఈ మార్గమున ప్రవేశించినచో అనుకూలముగా ఉండును. 21

మూ. ఇతీవ తైః ప్రాఞ్జలిభిస్తపస్విభి
ర్ద్విజైః కృతస్వస్త్యయనః పరంతపః,
వనం సభార్యః ప్రవివేశ రాఘవః
సలక్ష్మణః సూర్య ఇవాభ్రమణ్డలమ్. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే శ్రీమద్వాల్మీకీయే
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం శ్రీమదయోధ్యాకాణ్డే
ఏకోనవింశత్యుత్తరశతతమః సర్గః

అయోధ్యాకాణ్డః సమాప్తః.

ప్ర. అ. ప్రాఞ్జలిభిః=కట్టబడిన దోసిళ్ల గల, తపస్విభిః=ఉత్తమ మైన తపస్సు గల, తైః=ఆ, ద్విజైః=ద్విజులచేత, ఇతీవ=ఇట్లు, కృతస్వస్త్యయనః=చేయబడిన మంగళాచరణము గల, పరంతపః = శత్రువులను బాధించు, రాఘవః=రాముడు, సభార్యః=భార్యతో కూడినవాడై, సలక్ష్మణః=లక్ష్మణునితో కూడినవాడై, సూర్యః=సూర్యుడు, అభ్రమణ్డలమ్ ఇవ = మేఘమండలమును వలె, వనమ్=వనమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. సీతాలక్ష్మణసమేతు డైన, శత్రుసంహారకు డైన ఆ రాముడు ఉత్తమ మైన తపస్సు గల ఆ మునులు నమస్కరించుచు చేసిన స్వస్త్యయనమును స్వీకరించి, సూర్యుడు మేఘమండలములో ప్రవేశించి నట్లు వనములో ప్రవేశించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నూటపందొమ్మిదవ సర్గ సమాప్తము.

అయోధ్యాకాండము సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీరామాయ నమః

శ్రీ మద్వాల్మీకి మహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# అరణ్యకాండము

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన
బాలానందినీ వ్యాఖ్యతో కూడినది

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు
హైదరాబాదు
1993

# అరణ్యకాండ విషయసూచిక

| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| | ఖండించి ఖరుణ్ణి సంహరించుట. దేవతలు మునులు రాముణ్ణి స్తుతించుట. | 361 |
| 31. | ఖరుడు మొదలైనవారి మరణమును అకంపనుడు చెప్పగా విని రావణుడు సీతను హరించుటకై ఉద్యమించుట. మారీచుని ఉపదేశముచే ఆ కార్యము నుండి విరమించుట. | 376 |
| 32. | శూర్పణఖ రావణుని వద్దకు వెళ్ళుట. | 396 |
| 33. | శూర్పణఖ రావణుని నిందించుట. | 406 |
| 34. | రావణుడు ప్రశ్నించగా శూర్పణఖ అతనికి సీతాలక్ష్మణ సమేతుడైన రాముని గూర్చి చెప్పి, 'సీతను భార్యగా చేసికొనుము' అని అతనిని ప్రోత్సహించుట. | 416 |
| 35. | రావణుడు సాగరము ప్రక్కనున్న జలప్రాయదేశము చూచుచు మారీచుని వద్దకు వెళ్లుట. | 427 |
| 36. | రావణుడు రాముని అపరాధమును వర్ణించి చెప్పి, అతని భార్యయైన సీతను హరించుటకు సాహాయ్యము చేయుమని మారీచుని కోరుట. | 444 |
| 37. | మారీచుడు రాముని గుణప్రభావాదులను వర్ణించి చెప్పి, సీతాహరణ ప్రయత్నమునుండి విరమింపుమని రావణునకు ఉపదేశించుట. | 453 |
| 38. | రాముని పరాక్రమాదుల విషయమున తన అనుభవమును చెప్పుచు మారీచుడు రామునకు అపకారము చేయవద్దని రావణునకు ఉపదేశించుట. | 463 |
| 39. | మారీచుడు రావణునకు ఉపదేశించుట. | 476 |
| 40. | రావణుడు మారీచుని భయపెట్టి సీతను అపహరించుటకు సాహాయ్యము చేయవలెనని ఆజ్ఞాపించుట. | 485 |
| 41. | 'నీకు వినాశము కలుగును' అని భయపెట్టుచు మారీచుడు మరల రావణునకు ఉపదేశించుట. | 497 |



భద్రాచల శ్రీ సీతారామలక్ష్మణులు

వామాంకస్థితజానకీ పరిలసత్కోదండదండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే,
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తం భజే.

శ్రీః

# అరణ్యకాణ్డమ్

## అథ ప్రథమః సర్గః

[సీతాలక్ష్మణసహితు డైన శ్రీరాముని ఆశ్రమవాసు లైన మునులు సత్కరించుట.]

మూ. ప్రవిశ్య తు మహారణ్యం దణ్డకారణ్యమాత్మవాన్,
రామో దదర్శ దుర్ధర్షస్తాపసాశ్రమమణ్డలమ్. 1

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడు, దుర్ధర్షః = ఎవరిచేతను ఎదిరింప శక్యము కానివాడు అయిన, రామః = రాముడు, మహారణ్యమ్ = మహారణ్యమైన, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, ప్రవిశ్య = ప్రవేశించి, తాపసాశ్రమమణ్డలమ్ = మునుల ఆశ్రమముల సముదాయమును, దదర్శ = చూచెను.

తా. బుద్ధిమంతుడు, ఎవరిచేతను ఎదిరింప శక్యము కానివాడు అయిన రాముడు దండకమహారణ్యములో ప్రవేశించి అక్కడ మునులు నివసించే ఆశ్రమముల సముదాయమును చూచెను. 1

మూ. కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్,
యథా ప్రదీప్తం దుర్దర్శం గగనే సూర్యమణ్డలమ్. 2

ప్ర. అ. కుశచీరపరిక్షిప్తమ్ = కుశలచేత, నారచీరలచేత వ్యాప్తము, బ్రాహ్మ్యా = బ్రహ్మసంబంధ మైన (వైదిక మైన), లక్ష్మ్యా = కాంతిచేత, సమావృతమ్ = కప్పబడినది, గగనే = ఆకాశమునందు, ప్రదీప్తమ్ = ప్రజ్వరిల్లుచున్న, సూర్యమణ్డలం యథా = సూర్యమండలము వలె, దుర్దర్శమ్ = చూడ శక్యము కానిది అయిన (ఆశ్రమమండలమును చూచెను).

తా. ఆ ఆశ్రమమండలములో అక్కడక్కడ కుశలూ, నారచీరలు కనబడుచుండెను. అక్కడ వైదికశోభ (బ్రహ్మవర్చస్సు) స్పష్టముగా కనబడుచుండెను. ఆకాశములో ప్రకాశించుచున్న సూర్యమండలము వలె చూచుటకు శక్యముకాకుండ ఉండెను. 2

మూ. శరణ్యం సర్వభూతానాం సుసంమృష్టాజిరం సదా,
మృగైర్బహుభిరాకీర్ణం పక్షిసంఘైః సమావృతమ్. 3

ప్ర. అ. సర్వభూతానామ్ = సకలప్రాణులకు, శరణ్యమ్ = రక్షణము ఇచ్చునది, సదా = ఎల్లప్పుడు, సుసంమృష్టాజిరం = చక్కగా తుడవబడిన ముంగిళ్లు కలది, బహుభిః = అనేక మైన, మృగైః = మృగములచేత, ఆకీర్ణమ్ = వ్యాప్తము, పక్షిసంఘైః = పక్షిసముదాయములచేత, సమావృతమ్ = ఆవరింపబడినది (అయిన ఆశ్రమమండలమును చూచెను).

తా. ఆ ఆశ్రమమండలములో అన్ని ప్రాణులు నిర్భయముగా నివసించుచుండెను. మాటిమాటికి తుడుచుచుండుటచే ముంగిళ్లు శుభ్రముగా ఒప్పుచుండెను. ఆ ఆశ్రమమండలములో అనేకమృగములు, పక్షులూ కూడ సుఖముగా నివసించుచుండెను. 3

మూ. పూజితం చోపనృత్తం చ నిత్యమప్సరసాం గణైః,
విశాలైరగ్నిశరణైః స్రుగ్భాండైరజినైః కుశైః. 4

సమిద్భిస్తోయకలశైః ఫలమూలైశ్చ శోభితమ్,
ఆరణ్యైశ్చ మహావృక్షైః పుణ్యైః స్వాదుఫలైర్వృతమ్. 5

ప్ర. అ. అప్సరసామ్ = అప్సరఃస్త్రీలయొక్క, గణైః = గణములచేత, పూజితం చ = పూజింపబడినది, ఉపనృత్తం చ = సమీపమునందు నృత్తము చేయబడినది, విశాలైః = విశాలము లైన, అగ్నిశరణైః = అగ్నిగృహములచేతను, స్రుగ్భాండైః = స్రుక్కులచేతను, పాత్రలచేతను, అజినైః = కృష్ణాజినములచేతను, కుశైః = కుశలచేతను, సమిద్భిః = సమిధలచేతను, తోయకలశైః = జలకలశలచేతను, ఫలమూలైశ్చ = ఫలములచేతను, మూలములచేతను, శోభితమ్ = ప్రకాశింపచేయబడినది, ఆరణ్యైః = అరణ్యములకు సంబంధించిన, పుణ్యైః =

పవిత్రము లైన, స్వాదుఫలైః = మధుర మైన ఫలములు గల, మహావృక్షైః = మహావృక్షములచేత, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడినది (అయిన ఆశ్రమ మండలమును చూచెను).

తా. ఆ ఆశ్రమమండలమును అప్సరస్త్రీలు పూజించుచు, నిత్యము అక్కడ నృత్యము చేయుచుందురు. అది విశాలములైన అగ్నిగృహములతోను, స్రుక్కుల తోను, పాత్రలతోను, కృష్ణాజినాద్యజినములతోను, కుశలతోను, సమిధలతోను, ఉదకకలశలతోను, ఫలములతోను, మూలములతోను ఒప్పుచుండెను. ఆ ఆశ్రమ మండలము చుట్టూ పవిత్రములు, మధురము లైన ఫలము లిచ్చేవీ అయిన అరణ్యములో పెరిగే మహావృక్షములు ఉండెను. 4, 5

మూ. బలిహోమార్చితం పుణ్యం బ్రహ్మఘోషనినాదితమ్,
పుష్పైశ్చాన్యైః పరిక్షిప్తం పద్మిన్యా చ సపద్మయా. 6

ప్ర. అ. బలిహోమార్చితమ్ = భూతముల కిచ్చే ఆహారరూపము లైన బలులచేతను, హోమములచేతను పూజింపబడినది, పుణ్యమ్=పవిత్రము, బ్రహ్మ ఘోషనినాదితమ్ = వేదఘోషచేత ప్రతిధ్వనింపచేయబడినది, సపద్మయా= పద్మములతో కూడిన, పద్మిన్యా = పద్మలతచేతను, అన్యైః = ఇతరములైన, పుష్పైశ్చ = పుష్పములచేతను, పరిక్షిప్తమ్ = చుట్టూ వ్యాప్తమూ అయిన ఆశ్రమమండలమును చూచెను.

తా. ఆ పవిత్ర మైన ఆశ్రమమండలమునందు బలిహోమాదులతో దేవతా పూజలు జరుగుచుండెను. వేదఘోషలు మారుమ్రోగుచుండెను. దాని చుట్టూ పద్మములతో నిండిన పద్మలతలు, ఇతరపుష్పములు అధికముగా ఉండెను. 6

మూ. ఫలమూలాశనైర్దాన్తైశ్చీరకృష్ణాజినామ్బరైః,
సూర్యవైశ్వానరాభైశ్చ పురాణైర్మునిభిర్యుతమ్. 7

ప్ర. అ. ఫలమూలాశనైః = పండ్లు, దుంపలు ఆహారముగా గలవారు, దాన్తైః = ఇంద్రియనిగ్రహవంతులు, చీరకృష్ణాజినామ్బరైః=నారచీరలను, కృష్ణా జినములను వస్త్రములుగా ధరించినవారు, సూర్యవైశ్వానరాభైశ్చ = సూర్యుని వంటి, అగ్నివంటి కాంతి గలవారు అయిన, పురాణైః=ప్రాచీను లైన (వందల

కొలది సంవత్సరాల వయస్సు గల) మునిభిః = మునులతో, యుతమ్ = కూడినదీ అయిన (ఆశ్రమమండలమును చూచెను).

తా. ఆ ఆశ్రమమండలములో, ఫలమూలములను ఆహారముగా తీసికొను వారు, ఇంద్రియనిగ్రహవంతులు, నారచీరలను, కృష్ణాజినములను ధరించిన వారు, సూర్యాగ్నులవంటి తేజస్సు కలవారు అయిన అతివృద్ధులైన మునులు నివసించుచుండిరి. 7

మూ. పుణ్యైశ్చ నియతాహారైః శోభితం పరమర్షిభిః,
తద్ బ్రహ్మభవనప్రఖ్యం బ్రహ్మఘోషనినాదితమ్. 8

ప్ర. అ. పుణ్యైః=పవిత్రులు, నియతాహారైః = నియతమైన ఆహారము కలవారు అయిన, పరమర్షిభిః = గొప్ప ఋషులచేత, శోభితమ్=శోభింపచేయబడినది, బ్రహ్మఘోషనినాదితమ్ = వేదఘోషచేత ధ్వనింపచేయబడినదై, బ్రహ్మభవనప్రఖ్యమ్ = బ్రహ్మలోకముతో సమానమైన, తత్ = ఆ, (ఆశ్రమ మండలమును చూచెను).

తా. ఆ ఆశ్రమమండలమును పవిత్రులు, ఆహారమునందు నియమము పాటించువారు అయిన మహర్షులు శోభింపచేయుచుండిరి. వేదఘోషతో నిండి యుండుటచే అది బ్రహ్మలోకము వలె ఉండెను. 8

మూ. బ్రహ్మవిద్భిర్మహాభాగైర్బ్రాహ్మణైరుపశోభితమ్,
తద్దృష్ట్వా రాఘవః శ్రీమాంస్తాపసాశ్రమమణ్డలమ్, 9
అభ్యగచ్ఛన్మహాతేజా విజ్యం కృత్వా మహద్ధనుః.

ప్ర. అ. బ్రహ్మవిద్భిః=వేదవేత్తలు, మహాభాగైః = మహాభాగ్యవంతులు అయిన, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేత, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడిన, తత్ = ఆ, తాపసాశ్రమమణ్డలమ్ = మునుల ఆశ్రమసముదాయమును, దృష్ట్వా = చూచి, శ్రీమాన్ = శ్రీయుతుడు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన, రాఘవః = రాముడు, మహత్ = గొప్పదైన, ధనుః = ధనస్సును, విజ్యమ్ = నారి లేనిదానినిగా, కృత్వా = చేసి, అభ్యగచ్ఛత్ = సమీపించెను.

తా. గొప్ప శోభకలవాడు, మహాతేజఃశాలీ అయిన రాముడు, తన గొప్ప

ధనస్సు నారిని విప్పివేసి, వేదవేత్తలు, మహాపుణ్యాత్ములు ఆయిన బ్రాహ్మ ణులతో శోభించుచున్న ఆ మునుల ఆశ్రమమండలము వైపు, వినయపూర్వక ముగా వెళ్లెను. 9

మూ. దివ్యజ్ఞానోపపన్నాస్తే రామం దృష్ట్వా మహర్షయః, 10
అభిజగ్ముస్తదా ప్రీతా వైదేహీం చ యశస్వినీమ్.

ప్ర. అ. దివ్యజ్ఞానోపపన్నాః = దివ్యజ్ఞానముతో కూడిన, తే మహర్షయః = ఆ మహర్షులు, రామమ్ = రాముణ్ణి, యశస్వినీమ్ = కీర్తిమంతురాలైన, వైదేహీం చ = సీతను, దృష్ట్వా = చూచి, ప్రీతాః = సంతోషించినవారై, తదా = అప్పుడు, అభిజగ్ముః = ఎదురుగా వెళ్ళిరి.

తా. అప్పుడు, దివ్యజ్ఞానసంపన్నులైన ఆ మహర్షులు, రాముడు, కీర్తి మంతురాలైన సీతా తమ ఆశ్రమము వైపు వచ్చుట చూచి, సంతోషముతో ఎదు రేగిరి. 10

మూ. తే తు సోమమివోద్యన్తం దృష్ట్వా వై ధర్మచారిణమ్, 11
లక్ష్మణం చైవ దృష్ట్వా తు వైదేహీం చ యశస్వినీమ్,
మఙ్గలాని ప్రయుఞ్జానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః. 12

ప్ర. అ. దృఢవ్రతాః = దృఢమైన తపోనియమము గల, తే = ఆ మహర్షులు, ఉద్యన్తమ్ = ఉదయించుచున్న, సోమమివ = చంద్రుడు వలె ఉన్న, ధర్మచారిణమ్ = ధర్మము నాచరించు రాముణ్ణి, దృష్ట్వా తు = చూచి, లక్ష్మణం చైవ = లక్ష్మణుణ్ణి, యశస్వినీమ్ = కీర్తి గల, వైదేహీం చ = సీతను, దృష్ట్వా తు = చూచి, మఙ్గలాని = మంగళకరములైన వాక్యములను, ప్రయుఞ్జానాః = ప్రయోగించుచు, ప్రత్యగృహ్ణన్ = గ్రహించిరి (సాదరముగా స్వాగతము చెప్పిరి).

తా. దృఢమైన నియమములను పాటించు ఆ మహర్షులు, ఉదయించు చున్న సూర్యుడు వలె ఉన్న, ధర్మాచరణతత్పరుడైన ఆ రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, కీర్తిమంతురాలైన సీతను చూచి, మంగళకరములైన మాటలు పలుకుచు వారికి స్వాగతము పలికిరి. 11, 12

మూ. రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్,
దదృశుర్విస్మితాకారా రామస్య వనవాసినః. 13

ప్ర. అ. వనవాసినః = వనములో నివసించువారు, రామస్య = రాముని యొక్క, రూపసంహననమ్ = రూపమును శరీరసంఘటనమును, లక్ష్మీమ్ = శోభను, సౌకుమార్యమ్ = సౌకుమార్యమును, సువేషతామ్ = మంచి వేషమును, విస్మితాకారాః = ఆశ్చర్యము చెందిన ఆకారములు కలవారై, దదృశుః = చూచిరి.

తా. వనములో నివసించేవారు రాముని రూపమును, శరీరసౌష్ఠవమును, శోభను, సౌకుమార్యమును, మంచి వేషమును చూచి ఆశ్చర్యభరితు లైరి. 13

మూ. వైదేహీం లక్ష్మణం రామం నేత్రైరనిమిషైరివ,
ఆశ్చర్యభూతాన్ దదృశుః సర్వే తే వనవాసినః. 14

ప్ర. అ. సర్వే = సమస్త మైన, తే వనవాసినః = ఆ అరణ్యవాసులు, ఆశ్చర్యభూతాన్ = ఆశ్చర్యజనకులుగా ఉన్న, వైదేహీమ్ = సీతను, లక్ష్మణం చైవ = లక్ష్మణుణ్ణి, రామమ్ = రాముణ్ణి, అనిమిషైరివ = రెప్పపాటు లేనివా అన్నట్లున్న, నేత్రైః = నేత్రములతో, దదృశుః = చూచిరి.

తా. వనములో ఆ జనులందరు, ఆశ్చర్యమును కలిగించే రూపసౌంద ర్యాదులు గల ఆ సీతను, లక్ష్మణుణ్ణి, రాముణ్ణి కూడ, రెప్పలు వాల్చకుండా చూచిరి. 14

మూ. అత్రైనం హి మహాభాగాః సర్వభూతహితే రతాః,
అతిథిం పర్ణశాలాయాం రాఘవం సంన్యవేశయన్. 15

ప్ర. అ. సర్వభూతహితే = సకలప్రాణుల హితమునందు, రతాః = ఆసక్తి గల, మహాభాగాః = మహాత్ము లైన ఆ మునులు, అత్ర = ఈ ఆశ్రమము నందు, పర్ణశాలాయామ్ = పర్ణశాలలో, అతిథిమ్ = అతిథి యైన, ఏనం రాఘవమ్ = ఈ రాముణ్ణి, సంన్యవేశయన్ = నివసింపచేసిరి.

తా. సకలప్రాణుల హితమును కోరు ఆ మహర్షులు, తమ అతిథిగా వచ్చిన ఆ రామునకు, ఆ ఆశ్రమములోని ఒక పర్ణశాలలో నివాస మేర్పరచిరి.

మూ. తతో రామస్య సత్కృత్య విధినా పావకోపమాః,
ఆజహ్రుస్తే మహాభాగాః సలిలం ధర్మచారిణః. 16

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పావకోపమాః = అగ్నితో సమానులైన, మహాభాగాః = మహాభాగ్యవంతులైన, తే = ఆ, ధర్మచారిణః = ధర్మాచరణ చేయు మహర్షులు, విధినా = యథాశాస్త్రముగా, సత్కృత్య = సత్కరించి, రామస్య = రామునకు, సలిలమ్ = ఉదకమును, ఆజహ్రుః = తీసికొనివచ్చిరి.

తా. అగ్నితో సమానులు, ధర్మతత్పరులు, మహాతపోభాగ్యసంపన్నులూ అయిన ఆ మునులు యథాశాస్త్రముగా రాముణ్ణి సత్కరించి, ఆతనికి ఉదకము తెచ్చి ఇచ్చిరి. 16

మూ. మఙ్గలాని ప్రయుఞ్జానా ముదా పరమయా యుతాః,
మూలం పుష్పం ఫలం సర్వమాశ్రమం చ మహాత్మనః,
నివేదయిత్వా ధర్మజ్ఞాస్తే తు ప్రాఞ్జలయోఽబ్రువన్.

ప్ర. అ. ధర్మజ్ఞాః = ధర్మములను ఎరిగిన, తే = ఆ మహర్షులు, మఙ్గలాని = మంగళములను, ప్రయుఞ్జానాః = ప్రయోగించుచు, పరమయా = గొప్పదైన, ముదా = సంతోషముతో, యుతాః = కూడినవారై, మూలమ్ = మూలములను, పుష్పమ్ = పుష్పములను, ఫలమ్ = ఫలములను, సర్వమ్ = సమస్తమైన, ఆశ్రమం చ = ఆశ్రమమును, మహాత్మనః = మహాత్ముడైన రామునకు, నివేదయిత్వా = సమర్పించి, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్లు కలవారై, అబ్రువన్ = పలికిరి.

తా. ధర్మము లన్నీ తెలిసిన ఆ మునులు, చాల సంతోషించుచు, మహాత్ముడైన ఆ రామునకు మూలములను, పుష్పములను, ఫలములను, ఆ ఆశ్రమము నంతనూ కూడ సమర్పించి, వినయపూర్వకముగా ఇట్లు పలికిరి. 17

మూ. ధర్మపాలో జనస్యాస్య శరణ్యశ్చ మహాయశాః, 18
పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దణ్డధరో గురుః.

ప్ర. అ. రాజా = రాజు, మహాయశాః = గొప్ప కీర్తి గలవాడు. అస్య

= ఈ, జనస్య = జనముయొక్క, ధర్మపాలః = ధర్మమును పాలించువాడు. శరణ్యశ్చ = రక్షకుడు. పూజనీయశ్చ = పూజించదగినవాడు. మాన్యశ్చ = గౌరవించ దగినవాడు. దణ్డధరః = దండమును ధరించు (దుష్టులను శిక్షించు) వాడు, గురుః = పూజ్యుడు.

తా. రాజు గొప్ప కీర్తి గలవాడు. అందరు ప్రజల ధర్మమును సంరక్షించువాడు. రక్షకుడు. పూజింపదగినవాడు. గౌరవింపదగినవాడు. దుష్టశిక్షకుడగుటచే పూజ్యుడు. 18

మూ. ఇన్ద్రస్యైవ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ, 19
రాజా తస్మాద్వరాన్భోగాన్ రమ్యాన్ భుఙ్క్తే నమ
స్కృతః.

ప్ర. అ. రాఘవ = రామా ! ఇన్ద్రస్యైవ = ఇంద్రునియొక్కయే, చతుర్భాగః = నాల్గవ భాగము, ప్రజాః = ప్రజలను, రక్షతి = రక్షించుచున్నది. తస్మాత్ = ఆ కారణమువలననే, రాజా = రాజు, నమస్కృతః = నమస్కరింపబడుచున్నవాడై, వరాన్ = శ్రేష్ఠము లైన, రమ్యాన్ = సుందరములైన, భోగాన్ = భోగములను, భుఙ్క్తే = అనుభవించుచున్నాడు.

తా. రామా ! ఇంద్రుని నాల్గవ అంశమే ప్రజలను రక్షించుచున్నది. అందువలననే రాజు అందరి నమస్కారములు అందికొనుచు, శ్రేష్ఠములు,సుందరములూ అయిన భోగాలను అనుభవించుచున్నాడు. 19

మూ. తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః,
నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః. 20

ప్ర. అ. భవద్విషయవాసినః = నీ దేశమునందు నివసించుచున్న, తే వయమ్ = అట్టిమేము, భవతా = నీచేత, రక్ష్యాః = రక్షించదగినవారము. నగరస్థః = నగరములో ఉన్నా, వనస్థో వా = వనములో ఉన్నా, జనేశ్వరః = జనులకు ప్రభువువైన, త్వమ్ = నీవు, రాజా = రాజువు.

తా. నీ దేశములో (రాజ్యములో)నివసించుచున్న మమ్ములను నీవే రక్షించ

వలెను: ప్రజలకు ప్రభువు వైన నీవు నగరములో ఉన్నా, వనములో ఉన్నా, నీవే మాకు రాజువు. 20

మూ. న్యస్తదణ్డా వయం రాజఞ్జితక్రోధా జితేన్ద్రియాః,
రక్షణీయా స్త్వయా శశ్వద్గర్భభూతా స్తపోధనాః. 21

ప్ర. అ. రాజన్ = రాజా ! జితక్రోధాః = జయింపబడిన క్రోధము కల వారము, జితేన్ద్రియాః = జయింపబడిన ఇంద్రియములు కలవారము, తపోధనాః = తపస్సే ధనముగా గలవారము అయిన, వయమ్ = మేము, న్యస్తదణ్డాః = విడువబడిన దండనము కలవాళ్లము. గర్భభూతాః = గర్భమువంటివార మైన మేము, త్వయా = నీచేత, శశ్వత్ = ఎల్లప్పుడూ, రక్షణీయాః = రక్షింపదగిన వాళ్లము.

తా. రాజా ! మేము క్రోధమును జయించి, జితేంద్రియులమై, తపస్సే ధన మని నమ్ముచు, అపకారులపై కూడ దండప్రయోగమును విడిచివేసినాము. అందుచేత నీవు మమ్ములను సర్వదా తల్లి గర్భమును రక్షించి నట్లు రక్షించ వలెను. 21

మూ. ఏవముక్త్వా ఫలైర్మూలైః పుష్పైరన్యైశ్చ రాఘవమ్,
వన్యైశ్చ వివిధాహారైః సలక్ష్మణమపూజయన్. 22

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, రాఘవమ్ = రాముణ్ణి, ఫలైః = ఫలములచేత, మూలైః = దుంపలచేత, పుష్పైః = పుష్పములచేత, అన్యైశ్చ = ఇతరము లైన, వన్యైః = వనమునకు సంబంధించిన, వివిధాహారైః = అనేకవిధము లైన ఆహారములచేత, అపూజయన్ = పూజించిరి.

తా. మునులు ఈ విధముగ పలికి, లక్ష్మణసమేతు డైన ఆ రామునకు ఫలములు, మూలములు, పుష్పములు, వనములో లభించు ఇతరము లైన ఆహార ములు ఇచ్చి పూజించిరి. 22

మూ. తథాన్యే తాపసాః సిద్ధా రామం వైశ్వానరోపమాః,
న్యాయవృత్తా యథాన్యాయం తర్పయామాసురీశ్వరమ్.

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే ప్రథమః సర్గః.

ప్ర. అ. తథా = అట్లే, వైశ్వానరోపమాః = అగ్నితో సమానులైన, సిద్ధాః = తపఃసిద్ధులైన, అన్యే = ఇతరులైన, న్యాయవృత్తాః = న్యాయమైన ప్రవృత్తి గల, తాపసాః = మహర్షులు, ఈశ్వరమ్ = ప్రభువైన రాముణ్ణి, యథా న్యాయమ్ = న్యాయానుసారముగా, తర్పయామాసుః = సంతృప్తిపరచిరి.

తా. అగ్నితో సమానమైన తేజస్సు కలవారు, తపఃసిద్ధులు, న్యాయ సమ్మతమైన ప్రవర్తన కలవారు అయిన మరి కొందరు మునులుకూడ, ఈ విధముగానే, ప్రభువైన రామునకు సంతోషము కలిగించిరి. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ప్రథమసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

## [వనములో రామాదులను విరాధుడు ఎదిరించుట.]

మూ. కృతాతిథ్యోఽథ రామస్తు సూర్యస్యోదయనం ప్రతి,
ఆమన్త్ర్య స మునీన్ సర్వాన్ వనమేవాన్వగాహత. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కృతాతిథ్యః = చేయబడిన ఆతిథ్యము గల, సః రామస్తు = ఆ రాముడైతే, సూర్యస్య = సూర్యునియొక్క, ఉదయనం ప్రతి = ఉదయమునకు పూర్వము, సర్వాన్ = సమస్తమైన, మునీన్ = మునులను, ఆమన్త్ర్య = వీడుగొల్పి, వనమేవ = వనమునే, అన్వగాహత = ప్రవేశించెను.

తా. రాముడు మునుల ఆతిథ్యము స్వీకరించి, సూర్యోదయమునకు పూర్వమే ఆ అందరి మునుల అనుజ్ఞ పొంది వనములోనికి ప్రవేశించెను. 1

మూ. నానామృగగణాకీర్ణమృక్షశార్దూలసేవితమ్,
ధ్వస్తవృక్షలతాగుల్మం దుర్దర్శసలిలాశయమ్. 2

నిష్కూజమానశకుని ఝిల్లికాగణనాదితమ్,
లక్ష్మణానుచరో రామో వనమధ్యం దదర్శ హ. 3

ప్ర. అ. లక్ష్మణానుచరః = లక్ష్మణుడు అనుచరుడుగా గల, రామః = రాముడు, నానామృగగణాకీర్ణమ్ = అనేకవిధములైన మృగముల సముదాయములచే వ్యాప్తము, ఋక్షశార్దూలసేవితమ్ = ఎలుగుబంటులచేత, పెద్దపులులచేత సేవింపబడినది, ధ్వస్తవృక్షలతాగుల్మమ్ = పాడుపడిన వృక్షములు, లతలు, పొదలు కలది, దుర్దర్శసలిలాశయమ్ = చూడ శక్యము కాని (కనబడని) జలాశయములు కలది, నిష్కూజమానశకుని = కూయుచున్న పక్షులు గలది, ఝిల్లికాగణనాదితమ్ = అడవి ఈగల గుంపులచేత ధ్వనింపచేయబడినది అయిన, వనమధ్యమ్ = వనమధ్యమును, దదర్శ హ = చూచెను.

తా. లక్ష్మణునితో కూడిన రాముడు ఆ అరణ్యమధ్యమును చూచెను. ఎలుగుబంట్లు, పెద్ద పులులు మొదలైన అనేకవిధము లైన మృగములు అక్కడ గుంపులు గుంపులుగా తిరుగుచుండెను. అక్కడ ఉన్న వృక్షములు, లతలు, పొదలు పాడుపడి యుండెను. చుట్టుప్రక్కల ఎక్కడా సరస్సులు మొదలైన జలాశయములు కనబడుటలేదు. పక్షులు కూయుచుండెను. అడవి ఈగల రొజ అంతటా వ్యాపించి ఉండెను. 2, 3

మూ. సీతయా సహ కాకుత్థ్సస్తస్మిన్ ఘోరమృగాయుతే,
దదర్శ గిరిశృఙ్గాభం పురుషాదం మహాస్వనమ్. 4

ప్ర. అ. సీతయా సహ = సీతతో కూడిన, కాకుత్థ్సః = రాముడు, ఘోర మృగాయుతే = ఘోరములైన మృగములతో కూడిన, తస్మిన్ = ఆ అరణ్య మధ్యమునందు, గిరిశృఙ్గాభమ్ = పర్వతశిఖరమువంటి కాంతి గలవాడు, మహా స్వనమ్ = గొప్ప ధ్వని గలవాడు అయిన, పురుషాదమ్ = పురుషులను భక్షించే రాక్షసుని, దదర్శ = చూచెను.

తా. సీతాసమేతుడైన రాముడు భయంకరము లైన మృగములతో నిండిన ఆ అరణ్యమధ్యమునందు గొప్ప ధ్వని చేయుచున్న ఒక నరభక్షకుడైన రాక్షసుని చూచెను. ఆతని దేహము పర్వతశిఖరము వలె ఉండెను. 4

మూ. గభీరాక్షం మహావక్త్రం వికటం వికటోదరమ్,
బీభత్సం విషమం దీర్ఘం వికృతం ఘోరదర్శనమ్. 5

ప్ర. అ. గభీరాక్షమ్ = లోతైన నేత్రములు కలవాడు, మహావక్త్రమ్ = పెద్ద ముఖము కలవాడు, వికటమ్ = వికారరూపముతో ఉన్నవాడు, వికటోదరమ్ = వికారముగా ఉన్న పొట్ట గలవాడు, బీభత్సమ్ = భయంకరుడు, (జుగుప్స కలిగించువాడు), విషమమ్ = చాల చిన్నదీ చాల పెద్దదీ అయిన అవయవ ములతో విషమముగా ఉన్నవాడూ, దీర్ఘమ్ = పొడవైనవాడు, వికృతమ్ = వికార ముగా ఉన్నవాడు, ఘోరదర్శనమ్ = భయంకరమైన దర్శనము కలవాడు అయిన (రాక్షసుని చూచెను).

తా. ఆ రాక్షసుని కళ్లు లోతుగాను, ముఖము చాల పెద్దదిగాను, పొట్ట వికారముగాను ఉండుటచే ఆతడు వికటరూపముతో జుగుప్స కలిగించే టట్లు

ఉండెను. ఆతని కరచరణాద్యవయవములు విషమముగా (హెచ్చుతగ్గులతో) ఉండెను. చాల పొడవుగా, వికృతాకారముతో ఉన్న ఆతడు చూచుటకు భయంకరుడుగా ఉండెను. 5

మూ: వసానం చర్మ వైయాఘ్రం వసార్ద్రం రుధిరోక్షితమ్,
త్రాసనం సర్వభూతానాం వ్యాదితాస్యమివాన్తకమ్. 6

ప్ర. అ. వైయాఘ్రమ్ = వ్యాఘ్రసంబంధమైన, చర్మ = చర్మను, వసానమ్ = ధరించినవాడు, వసార్ద్రమ్ = వసచేత తడిగా ఉన్నవాడు, రుధిరోక్షితమ్ = రక్తముచేత తడపబడినవాడు, సర్వభూతానామ్ = సమస్తప్రాణులకు, త్రాసనమ్ = భయము కలిగించువాడు, వ్యాదితాస్యమ్ = తెరవబడిన ముఖము గలవాడు, అన్తకమ్ ఇవ = యముడు వలె ఉన్నవాడు అయిన (రాక్షసుని చూచెను).

తా. వ్యాఘ్రచర్మను ధరించిన ఆ రాక్షసుని శరీరము వసతో తడిగా ఉండెను. రక్తముతో తడిసెను. సకలప్రాణులకు భయము కలిగించు ఆ రాక్షసుడు నోరు తెరచుకొని మృత్యుదేవత వలె ఉండెను. 6

మూ. త్రీన్ సింహాంశ్చతురో వ్యాఘ్రాన్ ద్వౌ వృకౌ పృషతాన్దశ
సవిషాణం వసాదిగ్ధం గజస్య చ శిరో మహత్, 7
అవసజ్యాయసే శూలే వినదన్తం మహాస్వనమ్.

ప్ర. అ. త్రీన్ = మూడు, సింహాన్ = సింహములను, చతురః = నాలుగు, వ్యాఘ్రాన్ = పెద్దపులులను, ద్వౌ = రెండు, వృకౌ = తోడేళ్లను, దశ = పది, పృషతాన్ = చుక్కల లేళ్లను, సవిషాణమ్ = దంతములతో కూడిన, వసాదిగ్ధమ్ = వసచేత పూయబడిన, మహత్ = పెద్దదైన, గజస్య శిరః = ఏనుగుయొక్క తలను, ఆయసే = ఇనుము వికారమైన, శూలే = శూలము నందు, అవసజ్య = గ్రుచ్చి తగల్చుకొని, మహాస్వనమ్ = గొప్పధ్వని కలుగునట్లుగా, వినదన్తమ్ = ధ్వని చేయుచున్న (రాక్షసుని చూచెను).

తా. ఆ రాక్షసుడు మూడు సింహాలను, నాలుగు పెద్ద పులులను, రెండు తోడేళ్ళను, పది చుక్కలజింకలను, పైన వసతో నిండిన, దంతసహితమైన

ఒక పెద్ద ఏనుగు తలను ఇనుప శూలమునకు గ్రుచ్చి మోసికొనిపోవుచుండెను. గట్టిగా అరచుచుండెను. 7

మూ. స రామం లక్ష్మణం చైవ సీతాం దృష్ట్వా చ మైథిలీమ్,
అభ్యధావత్సుసంక్రుద్ధః ప్రజాః కాల ఇవాన్తకః.

ప్ర. అ. సః = అతడు, రామమ్ = రాముణ్ణి, లక్ష్మణం చ = లక్ష్మణుణ్ణి, మైథిలీమ్ = మిథిలానగరరాజపుత్రి యైన, సీతాం చ = సీతను, దృష్ట్వైవ = చూడగానే, సుసంక్రుద్ధః = చాలా కోపగించినవాడై, అన్తకః = సంహారముచేయు, కాలః = యముడు, ప్రజాః ఇవ = ప్రజలనుగూర్చి వలె, అభ్యధావత్ = వారికి ఎదురుగా పరుగెత్తెను.

తా. ఆ రాక్షసుడు రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, సీతను చూడగానే చాల కోపముతో యముడు సంహరించుటకై ప్రజలమీద పడి నట్లు, వారి వైపు పరుగెత్తి వెళ్ళెను. 8

మూ. స కృత్వా భైరవం నాదం చాలయన్నివ మేదినీమ్, 9
అఙ్కేనాదాయ వైదేహీమపక్రమ్య తదాబ్రవీత్.

ప్ర. అ. తదా = అప్పుడు, సః = అతడు, మేదినీమ్ = భూమిని, చాలయన్నివ = చలింపచేయుచున్నవాడు వలె, భైరవమ్ = భయంకర మైన, నాదమ్ = ధ్వనిని, కృత్వా = చేసి, వైదేహీమ్ = సీతను, అఙ్కేన = ఒడిచేత (ఒడిలోనికి), ఆదాయ = తీసికొని, అపక్రమ్య = దూరముగా తొలగి, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పు డాతడు భూమి దద్దరిల్లు నట్లు భయంకరముగ ధ్వని చేసి, సీతను ఒడిలోనికి తీసికొని, కొంచెము దూరము తొలగి, ఇట్లు పలికెను. 9

మూ. యువాం జటాచీరధరౌ సభార్యౌ క్షీణజీవితౌ, 10
ప్రవిష్టౌ దణ్డకారణ్యం శరచాపాసిధారిణౌ.

ప్ర. అ. జటాచీరధరౌ = జటలను, నారచీరలను ధరించిన, క్షీణజీవితౌ = క్షీణించిన జీవితము గల, యువామ్ = మీరిద్దరూ, సభార్యౌ = భార్యతో కూడిన

వారై, శరచాపాసిధారిణౌ = శరములను, ధనస్సును, ఖడ్గములను ధరించినవారై, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, ప్రవిష్టౌ = ప్రవేశించినారు.

తా. మీ రిద్దరూ జటావల్కలములు ధరించి, భార్యాసహితులై, ధనుర్బాణములను ఖడ్గములను ధరించి, దండకారణ్యములో ప్రవేశించినారు. మీ ఆయువు మూడినది. 10

మూ. కథం తాపసయోర్వాం చ వాసః ప్రమదయా సహ. 11
అధర్మచారిణౌ పాపౌ కౌ యువాం మునిదూషకౌ.

ప్ర. అ. తాపసయోః = మునులైన, వామ్ = మీ ఇద్దరికీ, ప్రమదయా సహ = స్త్రీతో కూడ, వాసః = నివాసము, కథమ్ = ఎట్లు? అధర్మాచరిణౌ = అధర్మమును ఆచరించుచున్న, మునిదూషకౌ = మునుల వ్రతమునకు విరుద్ధముగా ప్రవర్తించుచున్న, పాపౌ = పాపాత్ములైన, యువామ్ = మీ రిద్దరూ, కౌ = ఎవరు?

తా. మునులై యుండి మీరిద్దరూ స్త్రీతో కలిసి ఎట్లు నివసించుచున్నారు? మునుల నియమమునకు విరుద్ధముగా అధర్మాచరణము చేయుచున్న పాపాత్ములైన మీరు ఎవరు? 11

మూ. అహం వనమిదం దుర్గం విరాధో నామ రాక్షసః, 12
చరామి సాయుధో నిత్యమృషిమాంసాని భక్షయన్.

ప్ర. అ. అహమ్ = నేను, విరాధో నామ = విరాధు డను పేరు గల, రాక్షసః = రాక్షసుడను. సాయుధః = ఆయుధము ధరించినవాడనై, నిత్యమ్ = ఎల్లప్పుడు, ఋషిమాంసాని = ఋషుల మాంసములను, భక్షయన్ = భక్షించుచు, దుర్గమ్ = ప్రవేశింప శక్యముకాని, ఇదమ్ = ఈ, వనమ్ = వనమును, చరామి = సంచరించుచుందును.

తా. నేను విరాధు డనే పేరుగల రాక్షసుడను. ఆయుధధారినై, ఋషుల మాంసములు తినుచు నిత్యము, ఈ దుర్గమారణ్యములో సంచరించుచుందును.

మూ. ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి, 13
యువయోః పాపయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే.

ప్ర. అ. వరారోహా = శ్రేష్ఠ మైన కటిప్రదేశము గల, ఇయం నారీ = ఈ స్త్రీ, మమ = నాయొక్క, భార్యా = భార్య, భవిష్యతి = కాగలదు. అహమ్ = నేను, మృధే = యుద్ధమునందు, పాపయోః = పాపాత్ము లైన, యువయోః = మీ ఇద్దరియొక్క, రుధిరమ్ = రక్తమును, పాస్యామి = త్రాగగలను.

తా. సుందర మైన కటిప్రదేశము గల ఈ స్త్రీని నేను భార్యగా స్వీకరించెదను. పాపాత్ములైన మీ ఇద్దరి రక్తమును, యుద్ధములో త్రాగగలను. 13

మూ. తస్యైవం బ్రువతో దుష్టం విరాధస్య దురాత్మనః, 14
శ్రుత్వా సగర్వితం వాక్యం సంభ్రాన్తా జనకాత్మజా.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువతః = పలుకుచున్న, దురాత్మనః = దుష్టబుద్ధి గల, తస్యవిరాధస్య = ఆ విరాధునియొక్క, సగర్వితమ్ = గర్వముతో కూడిన, దుష్టమ్ = దుష్టమైన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, జనకాత్మజా = సీత, సంభ్రాన్తా = చాల భయపడినది.

తా. దురాత్ము డైన విరాధుడు ఈ విధముగా పలికిన, గర్వముతో కూడిన దుష్టవాక్యమును విని సీత చాల భయపడెను. 14

మూ. సీతా ప్రవేపితోద్వేగాత్ ప్రవాతే కదళీ యథా. 15
తాం దృష్ట్వా రాఘవః సీతాం విరాధాఙ్కగతాం శుభామ్,
అబ్రవీల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా. 16

ప్ర. అ. సీతా = సీత, ఉద్వేగాత్ = భయమువలన, ప్రవాతే = అధిక మైన గాలి గల ప్రదేశమునందు, కదళీ యథా = అరటిచెట్టు వలె, ప్రవేపితా = చాల వణకిపోయెను. రాఘవః = రాముడు, విరాధాఙ్కగతామ్ = విరాధుని ఒడిలో ఉన్న, శుభామ్ = మంగళప్రదురా లైన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సీత భయముతో, గాలివానలో అరటిచెట్టు వలె వణకిపోవుచుండెను. అప్పుడు విరాధుని ఒడిలో ఉన్న సీతను చూచి, రాముడు దుఃఖముచేత వాడి పోయిన ముఖముతో

మూ. పశ్య సౌమ్య నరేన్ద్రస్య జనకస్యాత్మసంభవామ్,
మమ భార్యాం శుభాచారాం విరాధాఙ్కే ప్రవేశితామ్, 17
అత్యన్తసుఖసంవృద్ధాం రాజపుత్రీం యశస్వినీమ్.

ప్ర. అ. సౌమ్య = ఓ! సౌమ్యుడా! నరేన్ద్రస్య = మహారాజైన, జనకస్య = జనకునియొక్క, ఆత్మసంభవామ్ = కుమార్తె, మమ భార్యామ్ = నా భార్య, శుభాచారామ్ = మంగళప్రదమైన ఆచారము కలది, అత్యన్తసుఖసంవృద్ధామ్ = అత్యధికమైన సుఖముతో పెరిగినది, యశస్వినీమ్ = కీర్తిమంతురాలు, విరాధాఙ్కే = విరాధుని ఒడిలో, ప్రవేశితామ్ = ఉంచబడినదీ అయిన, రాజపుత్రీమ్ = రాజపుత్రియైన సీతను, పశ్య = చూడుము.

తా. సౌమ్యుడవైన లక్ష్మణా! జనకమహారాజు కూతురు, నా భార్య, సదాచారవంతురాలు, చాల సుఖములతో పెరిగినది, కీర్తిమంతురాలు అయిన ఈ సీత ఎట్లు విరాధుని ఒడిలోనికి లాగబడినదో చూచితివా! 17

మూ. యదభిప్రేతమస్మాసు ప్రియం వరవృతం చ యత్, 18
కైకేయ్యాస్తు సుసంవృత్తం క్షిప్రమద్యైవ లక్ష్మణ.

ప్ర. అ. లక్ష్మణ = ఓ! లక్ష్మణా! అస్మాసు = మన విషయములో, యత్ = ఏది, అభిప్రేతమ్ = ఇష్టమైనదో, యత్ = ఏది, వరవృతం చ = వరముగా కోరబడినదో, అట్టి, కైకేయ్యాః = కైకేయికి, ప్రియమ్ = ప్రియమైన విషయము, అద్యైవ = ఇప్పుడే, క్షిప్రమ్ = శీఘ్రముగా, సుసంవృత్తమ్ = బాగా జరిగిపోయినది.

తా. లక్ష్మణా! కైకేయి మనకు ఏమి జరగవలెనని అభిలషించినదో, వరము ద్వారా కూడ కోరినదో అది, అతిశీఘ్రకాలములోనే, ఇప్పుడే, జరిగిపోయినది. 18

మూ. యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ, 19
యయాహం సర్వభూతానాం ప్రియః ప్రస్థాపితో వనమ్,
అద్యేదానీం సకామా సా యా మాతా మధ్యమా మమ. 20

ప్ర. అ. దీర్ఘదర్శినీ = దీర్ఘాలోచన కల, యా = ఎవ్వతె, పుత్రార్థే = పుత్రునికొరకైన, రాజ్యేన = రాజ్యముచేత, న తుష్యతి = సంతోషించలేదో, యయా = ఎవ్వతెచేత, సర్వభూతానామ్ = సకలప్రాణులకు, ప్రియః = ఇష్టుడనైన, అహమ్ = నేను, వనమ్ = వనమునుగూర్చి, ప్రస్థాపితః = పంపబడితినో, యా = ఎవ్వతె, మమ = నాయొక్క, మధ్యమా మాతా = మధ్యమురాలైన తల్లియో, సా = అట్టి కైకేయి, అద్య = ఇప్పుడు, సకామా = తీరిన కోరిక కలదైనది.

తా. నా తల్లులలో మధ్యమురాలైన ఏ కైకేయి చాల దూరపు టాలోచనతో, తన కుమారునకు రాజ్యము లభించుటతో సంతృప్తి చెందక అందరికీ ఇష్టుడనైన నన్ను అరణ్యానికి పంపినదో ఆమె కోరిక నేడు సఫలమైనది. 20

మూ. పరస్పర్శాత్తు వైదేహ్యాః న దుఃఖతరమస్తి మే,
పితుర్వినాశాత్ సౌమిత్రే స్వరాజ్యహరణాత్తథా. 21

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! వైదేహ్యాః = సీతయొక్క, పరస్పర్శాత్ = పరపురుషస్పర్శకంటె, పితుః = తండ్రియొక్క, వినాశాత్ = మరణముకంటె, తథా = మరియు, స్వరాజ్యహరణాత్ = నా రాజ్యమును హరించుటకంటె, మే = నాకు, దుఃఖతరమ్ = ఎక్కువ దుఃఖమును కలిగించేది, నాస్తి = లేదు.

తా. లక్ష్మణా! సీతను పరపురుషుడు స్పృశించుట, తండ్రి మరణము, నా రాజ్యమును ఇతరులు అపహరించుట-వీటికి మించిన దుఃఖహేతువు, నాకు మరొకటి లేదు. 21

మూ. ఇతి బ్రువతి కాకుత్స్థే బాష్పశోకపరిప్లుతః,
అబ్రవీల్లక్ష్మణః క్రుద్ధో రుద్ధో నాగ ఇవ శ్వసన్.22

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, ఇతి = ఇట్లు, బ్రువతి = పలుకుచుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, బాష్పశోకపరిప్లుతః = బాష్పముతోను, శోకముతోను నిండినవాడై, (వ్యాకులుడై), క్రుద్ధః = కోపించినవాడై, రుద్ధః = అడ్డుకొనబడిన, నాగః ఇవ = సర్పము వలె, శ్వసన్ = నిట్టూర్చుచు, అబ్రవీత్ = పలికెను.

తా. రాముని మాటలు విని, లక్ష్మణుడు, శోకాక్రాంతుడై, బాష్పము విడచుచు, కోపించి, అడ్డగింపబడిన సర్పము వలె బుసలు కొట్టుచు, ఇట్లు పలికెను.

మూ. అనాథ ఇవ భూతానాం నాథ స్త్వం వాసవోపమః,
మయా ప్రేష్యేణ కాకుత్స్థ కిమర్థం పరితప్యసే. 23

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! భూతానామ్ = ప్రాణు లందరికీ, నాథః = నాథుడవు, వాసవోపమః = దేవేంద్రునితో సమానుడవు అయిన, త్వమ్ = నీవు, అనాథః ఇవ = నాథుడు లేనివాడవు వలె, ప్రేష్యేణ = కింకరుడ నైన, మయా = నాతో కూడ ఉండి కూడ, కిమర్థమ్ = ఎందుకు, పరితప్యసే = బాధపడు చున్నావు?

తా. రామా ! నీవు సర్వభూతనాథుడవు. దేవేంద్రునితో సమానుడవు. నేను నీ కింకరుడనై ఉన్నాను. అట్టి నీవు అనాథుడు వలె ఎందుకు చింతించు చున్నావు? 23

మూ. శరేణ నిహతస్యాద్య మయా క్రుద్ధేన రక్షసః,
విరాధస్య గతాసోర్హి మహీ పాస్యతి శోణితమ్. 24

ప్ర. అ. క్రుద్ధేన = కోపించిన, మయా = నాచేత, అద్య = ఇప్పుడు, శరేణ = బాణముచేత, నిహతస్య = కొట్టబడినవాడై, గతాసోః = పోయిన ప్రాణములు గల, రక్షసః = రాక్షసుడైన, విరాధస్య = విరాధునియొక్క, శోణితమ్ = రక్తమును, మహీ = భూమి, పాస్యతి = త్రాగగలదు.

తా. క్రుద్ధుడ నైన నేను బాణమును ప్రయోగించి సంహరించగా, రాక్షసు డైన ఈ విరాధుని రక్తమును భూమి త్రాగగలదు. 24

మూ. రాజ్యకామే మమ క్రోధో భరతే యో బభూవ హ,
తం విరాధే విమోక్ష్యామి వజ్రీ వజ్రమివాచలే. 25

ప్ర. అ. రాజ్యకామే = రాజ్యమునందు కోరిక గల, భరతే = భరతుని యందు, మమ = నాకు, యః = ఏ, క్రోధః = క్రోధము, బభూవ హ = కలిగెనో, తమ్ = ఆ క్రోధమును, వజ్రీ = ఇంద్రుడు, వజ్రమ్ = వజ్రమును, అచలే ఇవ = పర్వతముపైన వలె, విరాధే = విరాధునిమీద, విమోక్ష్యామి = విడువగలను.

తా. రాజ్యమునందు కోరిక గల భరతునిపై నాకు పూర్వము కలిగిన

క్రోధమును, దేవేంద్రుడు వజ్రమును పర్వతముపై విడచి (ప్రయోగించి) నట్లు ఈ విరాధునిపై విడువగలను. (చూపగలను). 25

మూ. మమ భుజబలవేగవేగితః
పతతు శరోఽస్య మహాన్ మహోరసి,
వ్యపనయతు తనోశ్చ జీవితం
పతతు తతశ్చ మహీం విఘూర్ణితః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్వితీయః సర్గః.

ప్ర. అ. మమ=నాయొక్క, భుజబలవేగవేగితః=భుజబలముయొక్క వేగముచేత వేగము కలదిగా చేయబడిన, మహాన్=గొప్పదైన, శరః=బాణము, అస్య=వీనియొక్క, మహోరసి = గొప్ప వక్షఃస్థలముమీద, పతతు = పడుగాక. తనోః=వీని శరీరమునుండి, జీవితమ్ = జీవితమును, వ్యపనయతు=తొలగించుగాక. తతః = అటు పిమ్మట, విఘూర్ణితః = తిరిగిపోవు నట్లు చేయబడినవాడై, మహీమ్ = భూమిని గూర్చి, పతతు = పడుగాక.

తా. నా భుజబలవేగముచే వేగముగా ప్రయోగింపబడిన గొప్ప బాణము ఈ రాక్షసుని విశాలమైన వక్షఃస్థలముమీద పడుగాక. ఈతని శరీరమునుండి ప్రాణములను తొలగించుగాక. అప్పు డీతడు తిరిగిపోవుచు నేలమీద పడిపోవుగాక. 26

''బాలానందిని''అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
రెండవ సర్గ సమాప్తము.

# అథ తృతీయః సర్గః

[విరాధునితో రాముడు సంభాషించుట, రామలక్ష్మణులు విరాధుని పై బాణములు ప్రయోగించుట. విరాధుడు సోదరులిద్దరిని ఎత్తికొని వనములోనికి పోవుట].

మూ. అథోవాచ పునర్వాక్యం విరాధః పూరయన్వనమ్,
పృచ్ఛతో మమ హి బ్రూతం కౌ యువాం క్వ గమిష్యథః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, విరాధః = విరాధుడు, వనమ్ = వనమును, పూరయన్ = శబ్దముచేత నింపుచు, పునః = మరల, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను. పృచ్ఛతః = అడుగుచున్న, మమ = నాకు, బ్రూతమ్ = చెప్పండి. యువామ్ = మీరిద్దరు, కౌ = ఎవరు? క్వ = ఎక్కడికి, గమిష్యథః = వెళ్ళగలరు.

తా. పిమ్మట ఆ విరాధుడు అరణ్యము ప్రతిధ్వనించు నట్లు మరల ఇట్లు పలికెను- "నేను అడుగుచున్నాను; చెప్పుడు- మీరిద్దరు ఎవరు? ఎక్కడికి వెళ్లెదరు?" 1

మూ. తమువాచ తతో రామో రాక్షసం జ్వలితాననమ్,
పృచ్ఛన్తం సుమహాతేజా ఇక్ష్వాకుకులమాత్మనః. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమహాతేజాః = చాల గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, పృచ్ఛన్తమ్ = ప్రశ్నించుచున్న, జ్వలితాననమ్ = మండు చున్న ముఖము గల, తం రాక్షసమ్ = ఆ రాక్షసుని గూర్చి, ఆత్మనః = తన యొక్క, ఇక్ష్వాకుకులమ్ = ఇక్ష్వాకువంశమును, ఉవాచ = చెప్పెను.

తా. పిమ్మట, మహాతేజఃశాలి యైన రాముడు, ఆ విధముగా ప్రశ్నించు చున్న, ప్రజ్వలించుచున్న ముఖము గల ఆ రాక్షసునకు తన ఇక్ష్వాకువంశమును గూర్చి చెప్పెను. 2

మూ. క్షత్రియౌ వృత్తసంపన్నౌ విద్ధి నౌ వనగోచరౌ,
త్వాం తు వేదితుమిచ్ఛావః క స్త్వం చరసి దణ్డకాన్. 3

ప్ర. అ. నౌ = మమ్ములను, వృత్తసంపన్నౌ = సచ్చరిత్రముతో కూడిన, వనగోచరౌ = వనములో సంచరించుచున్న, క్షత్రియౌ = క్షత్రియులనుగా, విద్ధి = తెలుసుకొనుము. త్వాం తు = నిన్ను గూర్చి కూడ, వేదితుమ్ = తెలుసుకొనుటకు, ఇచ్ఛావః = కోరుచున్నాము. దణ్డకాన్ = దండకారణ్యమును, చరసి = సంచరించుచున్నావు; త్వమ్ = నీవు, కః = ఎవ్వడవు ?

తా. వనమునకు వచ్చి ఉన్న మేము మంచి వృత్తము (నడవడిక) గల క్షత్రియులము. నీ వెవరో కూడ తెలుసుకొన గోరుచున్నాము. దండకారణ్యములో సంచరించుచున్నావు. నీ వెవ్వరవు ? 3

మూ. తమువాచ విరాధస్తు రామం సత్యపరాక్రమమ్,
హ న్త వక్ష్యామి తే రాజన్ నిబోధ మమ రాఘవ. 4

ప్ర. అ. విరాధస్తు = విరాధుడు, సత్యపరాక్రమమ్ = సత్య మైన పరాక్రమము గల, తం రామమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను. హ న్త = ఆహా! రాజన్ = రాజా ! రాఘవ = రామా ! తే = నీకు, వక్ష్యామి = చెప్పగలను, మమ = నాకు (నానుండి) నిబోధ = తెలిసికొనుము.

తా. విరాధుడు సత్యమైన పరాక్రమముగల రామునితో ఇట్లనెను- "రామా! నే నెవరో నీకు చెప్పెదను, వినుము". 4

మూ. పుత్రః కిల జవస్యాహం మాతా మమ శతహ్రదా,
విరాధ ఇతి మామాహుః పృథివ్యాం సర్వరాక్షసాః. 5

ప్ర. అ. అహమ్ = నేను, జవస్య = జవునియొక్క, పుత్రః కిల = పుత్రుడను కదా; శతహ్రదా = శతహ్రద, మమ = నాయొక్క, మాతా = తల్లి. పృథివ్యామ్ = భూమిపై ఉన్న, సర్వరాక్షసాః = సకలరాక్షసులు, మామ్ = నన్ను, విరాధః ఇతి = విరాధుడు అని, ఆహుః = అందురు.

తా. నేను జవుని పుత్రుడను. శతహ్రద నా తల్లి. భూమిమీద రాక్షసు లందరూ నన్ను విరాధు డని అందురు. 5

మూ. తపసా చాభిసంప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా,
శస్త్రేణావధ్యతా లోకేఽచ్ఛేద్యాభేద్యత్వమేవ చ. 6

ప్ర. అ. తపసా=తపస్సుచేత, బ్రహ్మణః=బ్రహ్మయొక్క, ప్రసాదజా = అనుగ్రహమువలన కలిగిన, లోకే= లోకమునందు, శస్త్రేణ = శస్త్రముచేత, అవధ్యతా = వధింప శక్యము కాకపోవుట, అభిసంప్రాప్తా = పొందబడినది. అచ్ఛేద్యాభేద్యత్వమేవ చ = ఛేదింప శక్యముకాకపోవుట, భేదింప శక్యముకాకపోవుట కూడ (పొందబడినవి).

తా. నేను తపస్సు చేసి, బ్రహ్మ అనుగ్రహముచే లోకములో ఎవ్వరిచేత ఛేదించుటకు గాని, భేదించుటకు గాని, చంపుటకు గాని శక్యము కాకుండుటను సంపాదించితిని. 6

మూ. ఉత్సృజ్య ప్రమదామేనామనపేక్షౌ యథాగతమ్,
త్వరమాణౌ పలాయేథాం న వాం జీవితమాదదే. 7

ప్ర. అ. ఏనామ్=ఈ, ప్రమదామ్ = స్త్రీని, ఉత్సృజ్య=విడచి, అనపేక్షౌ = ఈమెపై అపేక్ష లేనివారై, త్వరమాణౌ = తొందరపడుచు, యథాగతమ్ = వచ్చినట్లే, పలాయేథామ్ = పారిపొండి. వామ్ = మీఇద్దరియొక్క, జీవితమ్ = జీవితమును, న ఆదదే=గ్రహించను.

తా. మీ రిద్దరూ ఈ స్త్రీపై ఆశ వదలుకొని, ఈమెను విడిచిపెట్టి, వచ్చిన దారినే శీఘ్రముగా పారిపొండి. మీ ప్రాణాలు తీయను. 7

మూ. తం రామః ప్రత్యువాచేదం కోపసంరక్తలోచనః,
రాక్షసం వికృతాకారం విరాధం పాపచేతసమ్. 8

ప్ర. అ. రామః = రాముడు, కోపసంరక్తలోచనః = కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, వికృతాకారమ్ = వికృతమైన ఆకారము గలవాడు, పాపచేతసమ్ = పాపచిత్తము కలవాడు అయిన, తమ్ = ఆ, విరాధం రాక్షసమ్ = విరాధు డను రాక్షసుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రాముడు కోపముతో కళ్ళు ఎఱ్ఱజేసి, వికృత మైన ఆకారము గల, దుష్టబుద్ధి యైన ఆ విరాధరాక్షసునితో ఇట్లు పలికెను. 8

మూ. క్షుద్ర ధిక్త్వాం తు హీనార్థం మృత్యుమన్వేషసే ధ్రువమ్,
రణే ప్రాప్స్యసి సంతిష్ఠ న మే జీవన్ విమోక్ష్యసే. 9

ప్ర. అ. క్షుద్ర = నీచుడా! హీనార్థమ్ = నీచకార్యములు చేయు, త్వామ్ = నిన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక. ధ్రువమ్ = నిశ్చయముగా, మృత్యుమ్ = మృత్యువును, అన్వేషసే = వెదకుచున్నావు. రణే = యుద్ధమునందు, ప్రాప్స్యసి = మృత్యువును పొందగలవు. జీవన్ = బ్రతికి యుండి, మే = నాకు (నానుండి), న విమోక్ష్యసే = విడుదల పొందవు.

తా. ఛీ! దుష్టకార్యము చేయ దలచిన నీచుడా! నీవు నిశ్చయముగా మృత్యువునే అన్వేషించుచున్నావు. యుద్ధములో నీకు మృత్యువు లభించగలదు. నిన్ను ప్రాణాలతో విడువను. 9

మూ. తతః సజ్యం ధనుః కృత్వా రామః సునిశితాన్ శరాన్,
సుశీఘ్రమభిసంధాయ రాక్షసం నిజఘాన హ. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, ధనుః = ధనస్సును, సజ్యమ్ = నారితో కూడిన దానినిగా, కృత్వా = చేసి, సునిశితాన్ = చాల వాడి యైన, శరాన్ = బాణములను, సుశీఘ్రమ్ = చాల శీఘ్రముగా, అభిసంధాయ = సంధించి, రాక్షసమ్ = రాక్షసుని, నిజఘాన హ = కొట్టెను.

తా. పిదప రాముడు ధనస్సును ఎక్కుపెట్టి, శీఘ్రముగా చాల వాడి యైన బాణములు సంధించి, ఆ రాక్షసుని కొట్టెను. 10

మూ. ధనుషా జ్యాగుణవతా సప్త బాణాన్ ముమోచ హ,
రుక్మపుఙ్ఖాన్ మహావేగాన్ సుపర్ణానిలతుల్యగాన్. 11

ప్ర. అ. జ్యాగుణవతా = నారితో కూడిన, ధనుషా = ధనస్సుచేత, రుక్మపుఙ్ఖాన్ = బంగారు పొన్నులు గల, మహావేగాన్ = గొప్ప వేగము గల, సుపర్ణానిలతుల్యగాన్ = గరుత్మంతునితోను వాయువుతోను సమముగా వెళ్లు, సప్త బాణాన్ = ఏడు బాణములను, ముమోచ హ = విడచెను.

తా. రాముడు ధనస్సుకు నారి కట్టి, బంగారు పొన్నులతో, మహావేగము గల, గరుత్మంతుడు వలె, వాయువు వలె ప్రయాణించే ఏడు బాణములు ప్రయోగించెను. 11

మూ. తే శరీరం విరాధస్య భిత్త్వా బర్హిణవాససః,
నిపేతుః శోణితాదిగ్ధా ధరణ్యాం పావకోపమాః. 12

ప్ర. అ. పావకోపమాః = అగ్నితో సమానమైన, తే = ఆ శరములు, బర్హిణవాససః = నెమలి పింఛము వస్త్రముగా గల, విరాధస్య = విరాధుని యొక్క, శరీరమ్ = శరీరమును, భిత్త్వా = బ్రద్దలుకొట్టి, శోణితాదిగ్ధాః = రక్తముచేత పూయబడినవై, ధరణ్యామ్ = నేలమీద, నిపేతుః = పడినవి.

తా. అగ్నితో సమాన మైన ఆ బాణములు, నెమలిపింఛమును వస్త్రముగా ధరించి ఉన్న ఆ విరాధుని శరీరమును ఛేదించి, రక్తముతో తడిసినవై నేలమీద పడినవి. 12

మూ. స విద్ధో న్యస్య వైదేహీం శూలముద్యమ్య రాక్షసః,
అభ్యద్రవత్సుసంక్రుద్ధస్తదా రామం సలక్ష్మణమ్. 13

ప్ర. అ. విద్ధః = కొట్టబడిన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, తదా = అప్పుడు, వైదేహీమ్ = సీతను, న్యస్య = క్రింద ఉంచి, శూలమ్ = శూలమును, ఉద్యమ్య = ఎత్తి, సుసంక్రుద్ధః = చాలా కోపించినవాడై, సలక్షణమ్ = లక్ష్మణ సహితుడైన, రామమ్ = రాముని(కి), అభ్యద్రవత్ = ఎదురుగా పరుగెత్తెను.

తా. బాణముల దెబ్బ తిన్న ఆ రాక్షసుడు సీతను క్రిందికి దింపివేసి, శూలమును పైకెత్తి, చాల కోపముతో రామలక్ష్మణుల మీదికి పరుగెత్తెను. 13

మూ. స వినద్య మహానాదం శూలం శక్రధ్వజోపమమ్,
ప్రగృహ్యాశోభత తదా వ్యాత్తానన ఇవాన్తకః. 14

ప్ర. అ. తదా = అప్పుడు, సః = ఆతడు, మహానాదమ్ = గొప్ప నాదము కలుగునట్లుగా, వినద్య = అరచి, శక్రధ్వజోపమమ్ = ఇంద్రధ్వజముతో సమానమైన, శూలమ్ = శూలమును, ప్రగృహ్య = గ్రహించి, వ్యాత్తాననః = తెరవబడిన ముఖము గల, అన్తక ఇవ = మృత్యుదేవత వలె, అశోభత = ప్రకాశించెను.

తా. అప్పు డా రాక్షసుడు ఇంద్రధ్వజము వలె చాల పొడ వైన ఆ శూలమును పట్టుకొని, గొప్ప నాదము కలుగు నట్లు అరచుచు, నోరు తెరచుకొని వచ్చి మీద పడుచున్న, మృత్యుదేవత వలె ఉండెను. 14

మూ. అథ తౌ భ్రాతరౌ దీప్తం శరవర్షం వవర్షతుః,
విరాధే రాక్షసే తస్మిన్ కాలాన్తకయమోపమే. 15

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తౌ = ఆ, భ్రాతరౌ = సోదరులు, కాలాన్తకయమోపమే = ప్రలయకాలము నందు, సంహారకు డైన యమునితో సమాను డైన, తస్మిన్ = ఆ, రాక్షసే = రాక్షసు డైన, విరాధే = విరాధునిమీద, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, శరవర్షమ్ = బాణవర్షమును, వవర్షతుః = వర్షించిరి.

తా. ప్రలయకాలమునందు సర్వసంహారకు డైన యముని వలె ఉన్న రాక్షసు డైన ఆ విరాధునిపై ఆ సోదరు లిద్దరు, ప్రజ్వలించుచున్న బాణవర్షము కురిపించిరి. 15

మూ. స ప్రహస్య మహారౌద్రః స్థిత్వా జృమ్భత రాక్షసః,
జృమ్భమాణస్య తే బాణాః కాయాన్నిష్పేతురాశుగాః. 16

ప్ర. అ. మహారౌద్రః = చాల భయంకరు డైన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, ప్రహస్య = గట్టిగా నవ్వి, స్థిత్వా = నిలబడి, అజృమ్భత = ఆవులించెను. జృమ్భమాణస్య = ఆవులించుచున్న ఆతనియొక్క, కాయాత్ = శరీరమునుండి, ఆశుగాః = శీఘ్రముగా వెళ్లు, తే బాణాః = ఆ బాణములు, నిష్పేతుః = బైటకు వచ్చినవి.

తా. అతిభయంకరు డైన ఆ రాక్షసుడు, అట్టహాసము చేయుచు, నిలబడి, ఆవులించెను. అత డా విధముగా ఆవులించగానే, వాని శరీరమునుండి బాణము లన్నీ బైటకు వచ్చెను. 16

మూ. స్పర్శాత్తు వరదానేన ప్రాణాన్ సంరోధ్య రాక్షసః,
విరాధః శూలముద్యమ్య రాఘవావభ్యధావత. 17

ప్ర. అ. రాక్షసః = రాక్షసు డైన, విరాధః = విరాధుడు, వరదానేన = వర

దానముతో, స్పర్శాత్ తు = స్పర్శవలన (సంబంధమువలన), ప్రాణాన్ = ప్రాణములను, సంరోధ్య = నిలచునట్లుచేసి, శూలమ్ = శూలమును, ఉద్యమ్య = ఎత్తి, రాఘవౌ = రామలక్ష్మణులను గూర్చి, అభ్యధావత = పరుగెత్తెను.

తా. ఆ విరాధుడు, వరప్రభావమువలన, ప్రాణములు మాత్రము బైటకు పోకుండు నట్లు నిరోధించుకొని శూలమును ఎత్తి రామలక్ష్మణులమీదికి పరుగెత్తెను. 17

మూ. తచ్ఛూలం వజ్రసంకాశం గగనే జ్వలనోపమమ్,
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద రామః శస్త్రభృతాంవరః.

ప్ర. అ. శస్త్రభృతామ్ = శస్త్రధారులలో, వరః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, జ్వలనోపమమ్ = అగ్నితోసమానమైన, వజ్రసంకాశమ్ = వజ్రముతో సమానమైన, తత్ శూలమ్ = ఆ శూలమును, ద్వాభ్యామ్ = రెండు, శరాభ్యామ్ = బాణములచేత, గగనే = ఆకాశమునందు, చిచ్ఛేద = ఛేదించెను.

తా. శస్త్రధారులలో శ్రేష్ఠుడైన రాముడు వజ్రముతో సమానము, అగ్నితుల్యము అయిన ఆ శూలమును రెండు బాణములచేత ఆకాశమునందే ఖండించెను.

మూ. తద్రామవిశిఖైశ్ఛిన్నం శూలం తస్యాపతద్భువి,
పపాతాశనినా చ్ఛిన్నం మేరోరివ శిలాతలమ్. 19

ప్ర. అ. రామవిశిఖైః = రాముని బాణములచేత, ఛిన్నమ్ = ఛేదించబడినదై, తత్ శూలమ్ = ఆ శూలము, భువి = నేలమీద, అపతత్ = పడెను. అశనినా = వజ్రాయుధముచేత, ఛిన్నమ్ = ఛేదించబడిన, మేరోః = మేరుపర్వతముయొక్క శిలాతలమ్ ఇవ = శిలవలె, పపాత = పడెను.

తా. రాముడు బాణములచేత ఛేదించిన ఆ శూలము నేలమీద పడెను. అది వజ్రముచేత ఛేదించబడిన మేరుపర్వతశిలాతలము వలె పడెను. 19

మూ. తౌ ఖడ్గౌ క్షిప్రముద్యమ్య కృష్ణసర్పావివోద్యతౌ,
తూర్ణమాపేతతుస్తస్య తదా ప్రహరతాం బలాత. 20

ప్ర. అ. తదా = అప్పుడు, తౌ = ఆ రామలక్ష్మణులు, ఉద్యతౌ = పైకి

లేచుచున్న, కృష్ణసర్పావివ = త్రాచుపాములవలె ఉన్న, ఖడ్గౌ = రెండుఖడ్గములను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఉద్యమ్య = ఎత్తి, తూర్ణమ్ = శీఘ్రముగా, తస్య = ఆతని సమీపమును గూర్చి, ఆపేతతుః = దుమికిరి. బలాత్ = బలమువలన, ప్రహరతామ్ = కొట్టిరి.

తా. అప్పుడు ఆ రామలక్ష్మణులు వెంటనే పైకి లేచుచున్న త్రాచుపాముల వలె ఉన్న రెండు ఖడ్గములను శీఘ్రముగా ఎత్తి, తొందరగా ఆ రాక్షసుని పైకి దుమికి బలముగా కొట్టిరి. 20

మూ. స వధ్యమానః సుభృశం భుజాభ్యాం పరిగృహ్య తౌ,
అప్రకమ్ప్యౌ నరవ్యాఘ్రౌ రౌద్రః ప్రస్థాతుమైచ్ఛత. 21

ప్ర. అ. వధ్యమానః = కొట్టబడుచున్న, రౌద్రః = భయంకరుడైన, సః = ఆ విరాధుడు, అప్రకమ్ప్యౌ=యుద్ధములో కదల్చశక్యము కానివారైన, నరవ్యాఘ్రౌ = నరులలో శ్రేష్ఠులైన, తౌ = ఆ రామలక్ష్మణులను, భుజాభ్యామ్ = భుజములతో, సుభృశమ్ = గట్టిగా, పరిగృహ్య = పట్టుకొని, ప్రస్థాతుమ్ = ప్రయాణ మగుటకు, ఐచ్ఛత = ఇచ్ఛయించెను.

తా. ఆ రామలక్ష్మణులు ఆ విధముగా కొట్టుచుండగా, ఆ విరాధుడు, యుద్ధములో కదల్చ శక్యము కాని ఆ నరశ్రేష్ఠులను బాహువులతో గట్టిగా పట్టుకొని వెళ్ళవలె నని సంకల్పించెను. 21

మూ. తస్యాభిప్రాయమాజ్ఞాయ రామో లక్ష్మణమబ్రవీత్,
వహత్వయమలం తావత్పథానేన తు రాక్షసః. 22

ప్ర. అ. తస్య=వానియొక్క, అభిప్రాయమ్=అభిప్రాయమును, ఆజ్ఞాయ = తెలుసుకొని, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. అయం రాక్షసః = ఈ రాక్షసుడు, అనేన పథా = ఈ మార్గముచేత, అలమ్ = చక్కగా, వహతు తావత్ = మోయుగాక.

తా. రాము డాతని అభిప్రాయము తెలిసికొని లక్ష్మణునితో ఇట్లు పలికెను. ఈ రాక్షసుడు మనలను ఈ మార్గము మీదుగా మోసికొనిపోయిన మోసుకు పోనిచ్చెదము. 22

మూ. యథా చేచ్ఛతి సౌమిత్రే తథా వహతు రాక్షసః,
అయమేవ హి నః పన్థా యేన యాతి నిశాచరః. 23

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! రాక్షసః = రాక్షసుడు, యథా = ఎట్లు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తథా = అట్లు, వహతు = మోయుగాక. నిశాచరః = ఈ రాక్షసుడు, యేన = ఏ మార్గముచేత, యాతి = వెళ్లుచున్నాడో, అయమేవ = ఇదే, నః = మనయొక్క, పన్థాః హి = మార్గముకదా.

తా. లక్ష్మణా! ఈ రాక్షసున కిష్టము వచ్చినట్లు మనలను మోసికొని పోనిమ్ము. ఈ రాక్షసుడు వెళ్లుచున్న దారిలోనే మనము వెళ్లవలసి ఉన్నది కదా.

మూ. స తు స్వబలవీర్యేణ సముత్క్షిప్య నిశాచరః,
బాలావివ స్కన్ధగతౌ చకారాతిబలోద్ధతః. 24

ప్ర. అ. అతిబలోద్ధతః = అధికమైన బలముచేత గర్వించిన, సః = ఆ, నిశాచరః తు = రాక్షసుడైతే, స్వబలవీర్యేణ = తన బలముచేతను వీర్యముచేతను, సముత్క్షిప్య = ఎత్తి, బాలావివ = చిన్నపిల్లలను వలె, స్కన్ధగతౌ = భుజములపై ఉన్నవారినిగా, చకార = చెసెను.

తా. అధికమైన బలముచేత గర్వించిన ఆ రాక్షసుడు, తన బలపరాక్రమములచేత ఆ రామలక్ష్మణులను పైకెత్తి చిన్న పిల్లలను వలె బుజములపై కూర్చుండపెట్టుకొనెను. 24

మూ. తావారోప్య తతః స్కన్ధం రాఘవౌ రజనీచరః,
విరాధో వినదన్ ఘోరం జగామాభిముఖో వనమ్. 25

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రజనీచరః = రాక్షసుడైన, విరాధః = విరాధుడు, తౌ రాఘవౌ = ఆ రామలక్ష్మణులను, స్కన్ధమ్ = బుజమును, ఆరోప్య = ఎక్కించుకొని, ఘోరమ్ = భయంకరముగా, వినదన్ = ధ్వనిచేయుచు, వనమ్ అభిముఖః = అరణ్యమునకు అభిముఖుడై, జగామ = వెళ్ళెను.

తా. పిమ్మట ఆ రాక్షసుడైన విరాధుడు, ఆ రామలక్ష్మణులను బుజముపై ఎక్కించుకొని, భయంకరముగా ధ్వని చేయుచు అరణ్యము వైపు వెళ్లెను. 25

మూ. వనం మహామేఘనిభం ప్రవిష్టో
ద్రుమైర్మహద్భిర్వివిధై రుపేతమ్,
నానావిధైః పక్షికులైర్విచిత్రం
శివాయుతం వ్యాలమృగైర్వికీర్ణమ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
తృతీయః సర్గః.

ప్ర. అ. మహామేఘనిభమ్ = గొప్ప మేఘముతో సమానమైనది, మహద్భిః = పెద్దవైన, వివిధైః = అనేకవిధములైన, ద్రుమైః = వృక్షములతో, ఉపేతమ్ = కూడినది, నానావిధైః = అనేకవిధములైన, పక్షికులైః = పక్షులసముదాయములచేత, విచిత్రమ్ = విచిత్రమైనది, శివాయుతమ్ = ఆడనక్కలతో కూడినదీ, వ్యాలమృగైః = మదించిన ఏనుగులతోను, మృగములతోను, వికీర్ణమ్ = వ్యాప్తమూ అయిన, వనమ్ = వనమును, ప్రవిష్టః = ప్రవేశించెను.

తా. అనేకవిధము లైన మహావృక్షములతో కూడినది, అనేకవిధము లైన పక్షిసముదాయములచేత విచిత్ర మైనది, ఆడ నక్కలతో నిండి యున్నది, మదించిన ఏనుగులతోను మృగాలతోను వ్యాప్తమూ అయిన అరణ్యములోనికి ఆ విరాధుడు ప్రవేశించెను. 26

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
మూడవ సర్గ సమాప్తము.

# చతుర్థః సర్గః

[రామలక్ష్మణులు విరాధుని చంపుట].

మూ. హ్రియమాణౌ తు కాకుత్స్థౌ దృష్ట్వా సీతా రఘూత్తమౌ,
ఉచ్చైఃస్వరేణ చుక్రోశ ప్రగృహ్య సుమహాభుజౌ. 1

ప్ర. అ. సీతా=సీత, ప్రగృహ్య=గ్రహించి, హ్రియమాణౌ=హరింపబడుచున్నవారు, సుమహాభుజౌ=గొప్పభుజములు కలవారు, కాకుత్స్థౌ=కకుత్స్థవంశసంజాతులు అయిన, రఘూత్తమౌ=రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, ఉచ్చైఃస్వరేణ=ఉన్నతస్వరముతో, చుక్రోశ=అరచెను.

తా. మహాభుజులు, కాకుత్స్థవంశమునందు పుట్టినవారు అయిన రామలక్ష్మణులను విరాధుడట్లు పట్టుకొని తీసికొనిపోవుచుండగా, సీత చూచి బిగ్గరగా ఏడ్చెను.

మూ. ఏష దాశరథీ రామః సత్యవాన్ శీలవాన్ శుచిః,
రక్షసా రౌద్రరూపేణ హ్రియతే సహలక్ష్మణః. 2

ప్ర. అ. సత్యవాన్=సత్యవంతుడు, శీలవాన్=ఉత్తమశీలము కలవాడు, శుచిః=పరిశుద్ధుడు అయిన, ఏషః=ఈ, దాశరథిః=దశరథకుమారుడైన, రామః=రాముడు, సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడ, రౌద్రరూపేణ=భయంకరమైన రూపము గల, రక్షసా=రాక్షసునిచేత, హ్రియతే=అపహరించబడుచున్నాడు.

తా. సత్యవంతుడు, మంచి శీలముకలవాడు, పరిశుద్ధుడు, అయిన ఈ దశరథకుమారుడైన రాముణ్ణి, లక్ష్మణసహితముగా భయంకరాకారము గల ఈ రాక్షసుడు హరించుచున్నాడు. 2

మూ. మామృక్షా భక్షయిష్యన్తి శార్దూలద్వీపినస్తథా,
మాం హరోత్సృజ కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ. 3

ప్ర. అ. మామ్=నన్ను, ఋక్షాః = ఎలుగుబంట్లు, తథా=మరియు, శార్దూలద్వీపినః=పెద్దపులులు చిరుతపులులు, భక్షయిష్యన్తి = భక్షించగలవు. రాక్షసోత్తమ= ఓ! రాక్షసశ్రేష్ఠుడా! మామ్=నన్ను, హర=అపహరించుము. కాకుత్స్థౌ=రామలక్ష్మణులను, ఉత్సృజ=విడిచిపెట్టుము. తే=నీకు, నమః= నమస్కారము.

తా. నన్ను ఎలుగుబంట్లు, చిరుతపులులు, పెద్దపులులు భక్షించివేయును. ఓ! రాక్షసోత్తమా! నీకు నమస్కారము. ఈ రామలక్ష్మణులను విడచి నన్ను తీసికొనిపొమ్ము. 3

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా వైదేహ్యా రామలక్ష్మణౌ,
వేగం ప్రచక్రతుర్వీరౌ వధే తస్య దురాత్మనః. 4

ప్ర. అ. వీరౌ=వీరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, తస్యాః వైదేహ్యాః=ఆ సీతయొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, దురాత్మనః= =దురాత్ముడైన, తస్య=ఆ విరాధునియొక్క, వధే=వధయందు, వేగమ్=వేగమును, ప్రచక్రతుః=చేసిరి.

తా. వీరులైన రామలక్ష్మణులు సీత మాటలు విని, ఆ దురాత్ముడైన విరాధుని చంపుటకు వేగముగా ప్రవర్తించిరి. 4

మూ. తస్య రౌద్రస్య సౌమిత్రిః సవ్యం బాహుం బభఞ్జ హ,
రామస్తు దక్షిణం బాహుం తరసా తస్య రక్షసః. 5

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, రౌద్రస్య=భయంకరుడైన, తస్య= ఆ విరాధునియొక్క, సవ్యం బాహుమ్=ఎడమ చేతిని, బభఞ్జ హ = విరిచివేసెను. రామః తు=రాముడైతే, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, దక్షిణమ్=కుడిదైన, బాహుమ్=బాహువును, తరసా=బలముచేత, విరచెను.

తా. భయంకరుడైన ఆ రాక్షసుని ఎడమ భుజమును లక్ష్మణుడు ఛేదించెను. రాముడు ఆతని కుడి భుజమును బలపూర్వకముగా విరచెను.

మూ. స భగ్నబాహుః సంవిగ్నః పపాతాశు విమూర్ఛితః,
ధరణ్యాం మేఘసంకాశో వజ్రభిన్న ఇవాచలః. 6

ప్ర. అ. భగ్నబాహుః = విరగగొట్టబడిన బాహువులు గల, మేఘసంకాశః = మేఘముతో సమానుడైన, సః = ఆ రాక్షసుడు, సంవిగ్నః = దిగులు చెందినవాడై, విమూర్ఛితః = మూర్ఛచెందినవాడై, వజ్రభిన్నః = వజ్రముచేత ఖేదింపబడిన, అచలః ఇవ = మేఘము వలె, ఆశు = శీఘ్రముగా, ధరణ్యామ్ = నేలపై, పపాత = పడెను.

తా. మేఘము వలె ఉన్న ఆ రాక్షసుడు బాహువులు విరిగిపోవుటచే దిగులు చెంది, మూర్ఛపోయి, వజ్రముచే ఛేదింపబడిన పర్వతము వలె నేలమీద కూలెను. 6

మూ. ముష్టిభిర్బాహుభిః పద్భిః సూదయన్తౌ తు రాక్షసమ్,
ఉద్యమ్యోద్యమ్య చాప్యేనం స్థణ్డిలే నిష్పిపేషతుః. 7

ప్ర. అ. రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, ముష్టిభిః = పిడికిళ్లచేతను, బాహుభిః = బాహువులచేతను, పద్భిః = పాదములచేతను, సూదయన్తౌ = కుమ్ముచున్నవారై, (ఆ రామలక్ష్మణులు) ఏనమ్ = వీనిని, ఉద్యమ్యోద్యమ్య = ఎత్తి ఎత్తి, స్థణ్డిలే = నేలమీద, నిష్పిపేషతుః = పిండిరి.

తా. రామలక్ష్మణులు ఆ రాక్షసుణ్ణి పిడికిళ్ళచేత, బాహువులచేత, పాదాలచేత కుమ్ముచు, ఎత్తి ఎత్తి నేలపై పడవేసి పిండివేసిరి. 7

మూ. స విద్ధో బహుభిర్బాణైః ఖడ్గాభ్యాం చ పరిక్షతః,
నిష్పిష్టో బహుధా భూమౌ న మమార స రాక్షసః. 8

ప్ర. అ. బహుభిః = అనేకమైన, బాణైః = బాణములచేత, విద్ధః = కొట్టబడినవాడు, ఖడ్గాభ్యామ్ = రెండు ఖడ్గములచేత, పరిక్షతః = చీల్చబడినవాడు, బహుధా = అనేకవిధములుగ, భూమౌ = నేలమీద, నిష్పిష్టః = నలగగొట్టబడినవాడు అయినను, సః రాక్షసః = ఆ రాక్షసుడు, న మమార = చావలేదు.

తా. అనేకబాణములచేత కొట్టినా, ఖడ్గాలతో పొడిచినా, నేలపై పడవేసి అనేకవిధముల నలిపివేసినా ఆ రాక్షసుడు చావలేదు. 8

మూ. తం ప్రేక్ష్య రామః సుభృశమవధ్యమచలోపమమ్,
భయేష్వభయదః శ్రీమానిదం వచనమబ్రవీత్. 9

ప్ర. అ. భయేషు=భయ హేతువు లున్నప్పుడు, అభయదః=అభయము నిచ్చు, శ్రీమాన్ = శ్రీమంతుడైన, రామః = రాముడు, అచలోపమమ్ = పర్వతముతో సమానుడైన, తమ్ = ఆ విరాధుని, సుభృశమ్ = మిక్కిలి, అవధ్యమ్= చంపశక్యము కానివానినిగా, ప్రేక్ష్య = చూచి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. భయమునకు తగు కారణము లేవైన కలిగి నప్పుడు అభయ మిచ్చే వాడు, శ్రీమంతుడు అయిన ఆ రాముడు, పర్వతము వంటి శరీరము గల ఆ విరాధుణ్ణి చంపుట అన్ని విధాలా శక్యము కాదనువిషయము గ్రహించి ఇట్లు పలికెను. 9

మూ. తపసా పురుషవ్యాఘ్ర రాక్షసోఽయం న శక్యతే,
శస్త్రేణ యుధి నిర్జేతుం రాక్షసం నిఖనావహే. 10

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! తపసా=తపోబలముచేత, అయం రాక్షసః = ఈ రాక్షసుడు, యుధి = యుద్ధమునందు, శస్త్రేణ= ఆయుధముచేత, నిర్జేతుమ్ = జయించుటకు, న శక్యతే = శక్యమైన వాడు కాడు. రాక్షసమ్ = ఈ రాక్షసుని, నిఖనావహే = పాతిపెట్టెదము.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడ వైన లక్ష్మణా! ఈ విరాధుడు తపోబల మున్నవా డగుటచే ఈతనిని యుద్ధములో శస్త్రముచేత చంప శక్యము కాదు. అందుచేత వీనిని పాతివేయుదము. 10

మూ. కుఞ్జరస్యేవ రౌద్రస్య రాక్షసస్యాస్య లక్ష్మణ,
వనేఽస్మిన్ సుమహచ్ఛ్వభ్రం ఖన్యతాం రౌద్రవర్చసః.11

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! రౌద్రస్య = క్రూరుడైన, రౌద్రవర్చసః = భయంకరమైన కాంతి గల, అస్య రక్షసః=ఈ రాక్షసునకు, కుఞ్జరస్యేవ = ఏనుగునకు వలె, అస్మిన్=ఈ, వనే=వనమునందు, సుమహత్=చాల పెద్దదైన శ్వభ్రమ్=గొయ్యి, ఖన్యతామ్ = తవ్వబడుగాక.

తా. లక్ష్మణా! క్రూరుడూ, భయంకరమైన పరాక్రమము కలవాడూ అయిన ఈ రాక్షసుని ఈ అరణ్యములో పాతిపెట్టుటకు, ఏనుగకొరకు చేసినట్లు పెద్ద గొయ్యి తవ్వుము. 11

మూ. ఇత్యుక్త్వా లక్ష్మణం రామః ప్రదరః ఖన్యతామితి,
తస్థౌ విరాధమాక్రమ్య కణ్ఠే పాదేన వీర్యవాన్. 12

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇతి = ఈ విధముగా, ప్రదరః = గొయ్యి, ఖన్యతామ్ = తవ్వబడుగాక, ఇతి = అని, ఉక్త్వా = పలికి, విరాధమ్ = విరాధుణ్ణి, పాదేన = పాదముచేత, కణ్ఠే = కంఠమునందు, ఆక్రమ్య = ఆక్రమించి, తస్థౌ = నిలచెను.

తా. పరాక్రమవంతుడైన రాముడు ఈ విధముగా లక్ష్మణుని "గొయ్యి తవ్వుము" అని ఆజ్ఞాపించి ఆ విరాధుణ్ణి కంఠముమీద కాలు వేసి త్రొక్కిపట్టి నిలబడెను. 12

మూ. తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం రాక్షసః ప్రశ్రితం వచః,
ఇదం ప్రోవాచ కాకుత్స్థం విరాధః పురుషర్షభమ్. 13

ప్ర. అ. రాక్షసః = రాక్షసుడైన, విరాధః = విరాధుడు, రాఘవేణ = రామునిచేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, పురుషర్షభమ్ = పురుషశ్రేష్ఠుడైన, కాకుత్స్థమ్ = రాముణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ, ప్రశ్రితమ్ = వినయముతో కూడిన, వచః = వచనమును, ప్రోవాచ = పలికెను.

తా. రాముడు పలికిన మాటలు విన్న విరాధుడు, పురుషశ్రేష్ఠుడైన ఆ రామునితో వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 13

మూ. హతోఽహం పురుషవ్యాఘ్ర శక్రతుల్యబలేన వై,
మయా తు పూర్వం త్వం మోహాన్న జ్ఞాతః పురుషర్షభ.

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! శక్రతుల్యబలేన = దేవేంద్రునితో సమానమైన బలము గల నీచేత, అహమ్ = నేను, హతః = చంపబడితిని. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! మయా = నాచేత, మోహాత్ = అజ్ఞానమువలన, త్వమ్ = నీవు, పూర్వమ్ = ముందుగా, న జ్ఞాతః = తెలియబడలేదు.

తా. ఓ! పురుషశ్రేష్ఠుడా! దేవేంద్రునితో సమానమైన బలము గల నీవు నన్ను చంపినావు. అజ్ఞానముచే నేను, ముందుగా నీ వెవ్వరవో తెలిసికొనలేక పోయినాను.

మూ. కౌసల్యాసుప్రజాస్తాత రామ స్త్వం విదితో మయా,
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః. 15

ప్ర. అ. తాత = తండ్రీ! త్వమ్ = నీవు, కౌసల్యాసుప్రజాః = కౌసల్య యొక్క ఉత్తమసంతానమైన, రామః = రాముడవుగా, విదితః = తెలియబడితివి, మహాభాగా = మహాభాగ్యవంతురాలైన, వైదేహీ చ = సీత, మహాయశాః = గొప్ప కీర్తి గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, (తెలియబడినారు).

తా. తండ్రీ! నీవు కౌసల్యాసుపుత్రుడ వైన రాముడ వని తెలిసికొన్నాను. మహాభాగ్యవంతురాలైన సీతను, గొప్ప కీర్తి గల లక్ష్మణుని కూడ గుర్తించినాను.

మూ. అభిశాపాదహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్,
తుమ్బురుర్నామ గన్ధర్వః శప్తో వైశ్రవణేన హి. 16

ప్ర. అ. అహమ్ = నేను, అభిశాపాత్ = శాపమువలన, ఘోరామ్ = భయంకరమైన, రాక్షసీమ్ = రాక్షససంబంధమైన, తనుమ్ = శరీరమును, ప్రవిష్టః = ప్రవేశించినాను. వైశ్రవణేన = కుబేరునిచేత, శప్తః = శపింపబడిన, తుమ్బురుః నామ = తుంబురుడు అను పేరు గల, గన్ధర్వః = గంధర్వుడను.

తా. శాపమువలన నాకీ ఘోరమైన రాక్షసశరీరము వచ్చినది. నేను తుంబురు డను గంధర్వుడను. నన్ను కుబేరుడు శపించెను. 16

మూ. ప్రసాద్యమానశ్చ మయా సోఽబ్రవీన్మాం మహాయశాః,
యదా దాశరథీ రామస్త్వాం వధిష్యతి సంయుగే, 17
తదా ప్రకృతిమాపన్నో భవాన్ స్వర్గం గమిష్యతి.

ప్ర. అ. మయా = నాచేత, ప్రసాద్యమానః = అనుగ్రహింపచేసికొనబడిన వాడై, మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = ఆ కుబేరుడు, మామ్ = నన్ను గూర్చి, అబ్రవీత్ = పలికెను. దాశరథిః = దశరథకుమారుడైన, రామః =

రాముడు, యదా = ఎప్పుడు, త్వామ్ = నిన్ను, సంయుగే = యుద్ధమునందు, వధిష్యతి = చంపగలడో, తదా = అప్పుడు, ప్రకృతిమ్ = సహజస్వరూపమును, ఆపన్నః = పొందినవాడవై, భవాన్ = నీవు, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గమిష్యతి = వెళ్లగలవు.

తా. నేను వేడుకొనగా, మహాయశఃశాలియైన ఆ కుబేరు డిట్లు పలికెను. "దశరథకుమారుడైన రాముడు నిన్నెప్పుడు యుద్ధములో సంహరించునో అప్పుడు నీవు నీ సహజరూపము పొంది స్వర్గము చేరగలవు.'' 17

మూ. అనుపస్థీయమానో మాం స క్రుద్ధో వ్యాజహార హ, 18
ఇతి వైశ్రవణో రాజా రమ్భాసక్తమువాచ హ.

ప్ర. అ. సః = ఆ కుబేరుడు, అనుపస్థీయమానః = సేవార్థమై చేరబడని వాడై, క్రుద్ధః = కోపించినవాడై, మామ్ = నన్ను గూర్చి, వ్యాజహార = ఇట్లు పలికెను. రాజా = ప్రభువైన, వైశ్రవణః = కుబేరుడు, రమ్భాసక్తమ్ = రంభ యందు ఆసక్తుడనై ఉన్న నన్ను గూర్చి, ఇతి = ఇట్లు, వ్యాజహార హ = పలికెను (శపించెను).

తా. నేను రంభాసక్తుడనై ఆ కుబేరుని సేవించుటకు వెళ్లకపోవుటచేత, ఆతడు కోపించి నన్నీ విధముగా శపించి, పిదప అనుగ్రహించినాడు. 18

మూ. తవ ప్రసాదాన్ముక్తోఽహమభిశాపాత్సుదారుణాత్. 19
భువనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరంతప.

ప్ర. అ. తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, సుదారుణాత్ = చాల భయంకరమైన, అభిశాపాత్ = శాపమునుండి, అహమ్ = నేను, ముక్తః = విడువబడితిని. పరంతప = శత్రుసంహారకుడా! స్వమ్ = నా సంబంధమైన, భువనమ్ = లోకమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. వః = మీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక.

తా. శత్రుసంహారకుడవైన ఓ! రామా! నీ అనుగ్రహమువలన, చాల భయంకరమైన ఈ శాపమునుండి విముక్తుడ నైతిని. ఇక నా లోకానికి వెళ్లెదను. మీ కందరికీ క్షేమ మగుగాక. 19

మూ. ఇతో వసతి ధర్మాత్మా శరభఙ్గః ప్రతాపవాన్,        20
అధ్యర్ధయోజనే తాత మహర్షిః సూర్యసంనిభః,
తం క్షిప్రమధిగచ్ఛ త్వం స తే శ్రేయోఽభిధాస్యతి. 21

ప్ర. అ. తాత = తండ్రీ, ఇతః = ఇక్కడినుండి, అధ్యర్ధయోజనే = ఒకటిన్నర యోజనముల దూరమునందు, ధర్మాత్మా = ధర్మాత్ముడు, ప్రతాపవాన్ = ప్రతాపము కలవాడు, సూర్యసంనిభః=సూర్యునితో సమానుడు, అయిన, శరభఙ్గః = శరభంగు డను, మహర్షిః = మహర్షి, వసతి = నివసించుచున్నాడు. త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, తమ్ = ఆ మహర్షిని, అధిగచ్ఛ = పొందుము. సః = ఆతడు, తే = నీకు, శ్రేయః = శ్రేయస్సును కలిగించు ఉపాయమును, అభిధాస్యతి=చెప్పగలడు.

తా. తండ్రీ! ధర్మాత్ముడు, ప్రతాపవంతుడు, సూర్యునితో సమానుడు అయిన శరబంగు డనే మహర్షి ఇక్కడికి ఒకటిన్నర యోజనముల దూరములో నివసించుచున్నాడు. నీవు ఆతని వద్దకు వెళ్లుము. నీ కాతడు శ్రేయస్సును కలిగించు ధర్మమును ఉపదేశించగలడు.        20, 21

మూ. అవటే చాపి మాం రామ నిక్షిప్య కుశలీ వ్రజ.
రక్షసాం గతసత్త్వానామేష ధర్మః సనాతనః.        22
అవటే యే నిధీయన్తే తేషాం లోకాః సనాతనాః.

ప్ర. అ. రామ = రామా ! మామ్ = నన్ను, అవటే = గోతిలో, నిక్షిప్య = ఉంచి, కుశలీ = క్షేమము కలవాడవై, వ్రజ = వెళ్లుము. గతసత్త్వానామ్ = పోయిన ప్రాణము గల, రక్షసామ్ = రాక్షసులకు, ఏషః = ఇది, సనాతనః = ప్రాచీనమైన, ధర్మః = ధర్మము. యే = ఎవరు, అవటే = గోతిలో, వినిక్షిప్యన్తే = ఉంచబడుతారో, తేషామ్ = వారికి, సనాతనాః = శాశ్వతములైన, లోకాః = లోకములు లభించును.

తా. రామా ! నన్ను గోతిలో పాతిపెట్టి క్షేమముగా వెళ్లుము. మరణించిన రాక్షసులకు ఇది ప్రాచీనకాలమునుంచి వచ్చుచున్న ధర్మము. గోతిలో పాతబడే వారికి శాశ్వతములైన లోకములు లభించును.        22

మూ. ఏవముక్త్వా తు కాకుత్థ్సం విరాధః శరపీడితః, 23
బభూవ స్వర్గసంప్రాప్తో న్యస్తదేహో మహాబలః.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, విరాధః = విరాధుడు, కాకుత్థ్సమ్ = రాముణ్ణి గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, శరపీడితః = శరముచేత పీడింపబడినవాడై, న్యస్తదేహః = విడువబడిన దేహము కలవాడై, స్వర్గసంప్రాప్తః = స్వర్గమును పొందినవాడు, బభూవ = ఆయెను.

తా. మహాబలవంతుడైన ఆ విరాధుడు రామునితో ఇట్లు పలికి, బాణము చేత కలిగిన బాధచే శరీరమును విడచి స్వర్గస్థుడయ్యెను. 23

మూ. తచ్ఛ్రుత్వా రాఘవో వాక్యం లక్ష్మణం వ్యాదిదేశ హ.
కుఞ్జరస్యేవ రౌద్రస్య రాక్షసస్యాస్య లక్ష్మణ,
వనేఽస్మిన్ సుమహాన్ శ్వభ్రః ఖన్యతాం రౌద్రకర్మణః,
ఇత్యుక్త్వా లక్ష్మణం రామః ప్రదరః ఖన్యతామితి,
తస్థౌ విరాధమాక్రమ్య కణ్ఠే పాదేన వీర్యవాన్.

ప్ర. అ. రాఘవః = రాముడు, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, లక్ష్మణమ్ = లక్ష్మణుని, వ్యాదిదేశ హ = ఆజ్ఞాపించెను.

తా. రాముడు ఆ వాక్యమును విని లక్ష్మణుని ఇట్లు ఆజ్ఞాపించెను.
25, 26శ్లోకాలకు చూ. 11, 12, శ్లోకాలు. రౌద్రకర్మణః = భయంకరమైన కర్మ గల.

మూ. తతః ఖనిత్రమాదాయ లక్ష్మణః శ్వభ్రముత్తమమ్,
అఖనత్ పార్శ్వతస్తస్య విరాధస్య మహాత్మనః. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, ఖనిత్రమ్ = గునపమును, ఆదాయ = గ్రహించి, మహాత్మనః = మహాత్ముడైన, తస్య విరాధస్య = ఆ విరాధునియొక్క, పార్శ్వతః = ప్రక్క, ఉత్తమమ్ = పెద్దదైన, శ్వభ్రమ్ = గోతిని, అఖనత్ = త్రవ్వెను.

తా. పిమ్మట లక్ష్మణుడొక గునపముతో, మహాత్ముడైన ఆ విరాధునకు ప్రక్కనే ఒక పెద్ద గొయ్యి త్రవ్వెను. 27

మూ. తం ముక్తకణ్ఠముత్క్షిప్య శఙ్కుకర్ణం మహాస్వనమ్,
విరాధం ప్రాక్షిపచ్ఛ్వభ్రే నదన్తం భైరవస్వనమ్. 28

ప్ర. అ. ముక్తకణ్ఠమ్ = విడవబడిన కంఠము గల, మహాస్వనమ్ = గొప్ప ధ్వని గల, శఙ్కుకర్ణమ్ = మొనలు దేలిన (శంకువుల వంటి) చెవులు గల, భైరవస్వనమ్ = భయంకరమైన ధ్వని కలుగునట్లుగా, నదన్తమ్ = ధ్వనిచేయుచున్న, తం విరాధమ్ = ఆ విరాధుణ్ణి, శ్వభ్రే = గోతిలో, ప్రాక్షిపత్ = పడద్రోసెను.

తా. రాముడు మహాధ్వనిచేయుచున్న, మొనలు దేరిన చెవులు గల ఆ విరాధుని కంఠమునుండి కాలు తీసివేసెను. అప్పుడు అతిభయంకర మగు ధ్వని కలుగునట్లు అరచుచున్న ఆ విరాధుని లక్ష్మణుడు గోతిలోనికి పడద్రోసెను. 28

మూ. తమాహవే దారుణమాశువిక్రమౌ
స్థిరావుభౌ సంయతి రామలక్ష్మణౌ,
ముదాన్వితౌ చిక్షిపతుర్భయావహం
నదన్తముత్క్షిప్య బలేన రాక్షసమ్. 29

ప్ర. అ. ఆశువిక్రమౌ = శీఘ్ర మైన పరాక్రమము కలవారు, సంయతి = యుద్ధమునందు, స్థిరౌ = స్థిరులు అయిన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉభౌ = ఇద్దరూ, ముదా = సంతోషముతో, అన్వితౌ = కూడినవారై, ఆహవే = యుద్ధమునందు, దారుణమ్ = చాలక్రూరుడు, భయావహమ్ = భయమును కలిగించువాడు, నదన్తమ్ = ధ్వనిచేయుచున్నవాడు అయిన, తం రాక్షసమ్ = ఆ రాక్షసుని, బలేన = బలముచేత, ఉత్క్షిప్య = ఎత్తి, చిక్షిపతుః = (గోతిలోనికి) విసరివేసిరి.

తా. శీఘ్రమైన పరాక్రమము కలవారు, యుద్ధములో స్థిరులు అయిన ఆ రామలక్ష్మణు లిద్దరూ, సంతోషించుచు, యుద్ధములో క్రూరుడు, భయంకరుడు అయిన ఆ రాక్షసుడు అరచుచుండగా ఎత్తి గోతిలోనికి పడద్రోసిరి. 29

మూ. అవధ్యతాం ప్రేక్ష్య మహాసురస్య తౌ
శితేన శస్త్రేణ తదా నరర్షభౌ,
సమర్థ్య చాత్యర్థవిశారదావుభౌ
బిలే విరాధస్య వధం ప్రచక్రతుః. 30

ప్ర. అ. తదా=అప్పుడు, నరర్షభౌ=నరులలో శ్రేష్ఠులు, అత్యర్థవిశారదౌ =మిక్కిలి నేర్పుగలవారు, అయిన, తౌ ఉభౌ= ఆ రామలక్ష్మణు లిద్దరూ, శితేన = వాడియైన, శస్త్రేణ = ఆయుధముచేత, మహాసురస్య= మహాసురుడైన, తస్య విరాధస్య = ఆ విరాధునియొక్క, అవధ్యతామ్ = చంప శక్యము కాకుండుటను, ప్రేక్ష్య = చూచి, సమర్థ్య=బాగుగా ఆలోచించి, బిలే=గోతిలో, వధమ్=వధను, ప్రచక్రతుః = చేసిరి.

తా. చాల నేర్పు గల నరశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణు లిద్దరూ, మహాసురుడైన ఆ విరాధుడు వాడి యైన ఆయుధములచేత వధింప శక్యము కానివాడు అను విషయమును తెలిసికొని, బాగుగా ఆలోచించి, గోతిలో పూడ్చిపెట్టుట ద్వారా ఆతనిని సంహరించిరి. 30

మూ. స్వయం విరాధేన హి మృత్యుమా(రా)త్మనః
ప్రసహ్య రామేణ యథార్థమీప్సితః,
నివేదితః కాననచారిణా స్వయం
న మే వధః శస్త్రకృతో భవేదితి. 31

ప్ర. అ. విరాధేన = విరాధునిచేత, స్వయమ్ = స్వయముగా, ఆత్మనః= తనయొక్క, మృత్యుః = మృత్యువు, యథార్థమ్ = నిజముగా, ప్రసహ్య = బలాత్కారముగా, రామేణ = రామునిచేత (నుండి), ఈప్సితః = కోరబడినది. కాననచారిణా = అడవిలో సంచరించుచున్న ఆ విరాధునిచేత, మే = నాకు, శస్త్ర కృతః = ఆయుధములచేత చేయబడిన, వధః = వధ, న భవేత్ = కలగదు, ఇతి = అని, స్వయమ్ = స్వయముగా, నివేదితః = తెలపబడినది.

తా. రాముడే బలాత్కారముగా తనను చంపవలె నని విరాధుడే స్వయముగా కోరుకొనుచుండెను. అందుచేతనే అడవిలో సంచరించే ఆ విరాధుడు నాకు శస్త్రములచేత మరణము రాదు అని స్వయముగా చెప్పెను. 32

మూ. తదేవ రామేణ నిశమ్య భాషితం
కృతా మతిస్తస్య బిలప్రవేశనే,
బిలం చ తేనాతిబలేన రక్షసా
ప్రవేశ్యమానేన వనం వినాదితమ్. 32

ప్ర. అ. తత్ = ఆ, భాషితమేవ = వాక్యమునే, నిశమ్య = విని, రామేణ =రామునిచేత, తస్య=ఆ రాక్షసునియొక్క, బిలప్రవేశనే = గోతిలో పడవేయుట యందు, మతిః = బుద్ధి, కృతా = చేయబడినది. బిలమ్ = బిలమును, ప్రవేశ్యమానేన = ప్రవేశపెట్టబడుచున్న, అతిబలేన = చాల బలము గల, తేన రక్షసా = అ రాక్షసునిచేత, వనమ్ = వనము, వినాదితమ్ = ధ్వనింప చేయబడినది.

తా. ఆ మాట విన్నతరవాతనే రాముడు ఆ రాక్షసుని గోతిలో కప్పివేయవలె నని నిర్ణయించెను. ఆ విధముగా గోతిలో త్రోసివేయబడుచున్నప్పుడు ఆ రాక్షసుడు ఆ వనమును శబ్దముచే ప్రతిధ్వనింపచేసెను. 32

మూ. ప్రహృష్టరూపావివ రామలక్ష్మణౌ
విరాధముర్వ్యాం ప్రదరే నిపాత్య తమ్,
ననన్దతుర్వీతభయౌ మహావనే
శిలాభిరన్తర్దధతుశ్చ రాక్షసమ్. 33

ప్ర. అ. ప్రహృష్టరూపావివ=చాల సంతోషించినట్లున్న, రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు, తం విరాధమ్ = ఆ విరాధుణ్ణి, ఉర్వ్యామ్ = భూమిలో, ప్రదరే= గోతిలో, నిపాత్య= పడవేసి, వీతభయౌ = పోయిన భయము కలవారై, మహావనే = ఆ మహారణ్యమునందు, ననన్దతుః=సంతోషించిరి. రాక్షసమ్= రాక్షసుణ్ణి, శిలాభిః = శిలలచేత, అన్తర్దధతుశ్చ = కప్పివేసిరి.

తా. రామలక్ష్మణులు చాల సంతోషించుచు, ఆ విరాధుణ్ణి నేలపై గోతిలో పడవేసి, ఆ మహావనములో భయము లేనివారై ఆనందించిరి. ఆ రాక్షసుణ్ణి శిలలతో కప్పివేసిరి. 33

మూ. తతస్తు తౌ కాఞ్చనచిత్రకార్ముకౌ
నిహత్య రక్షః పరిగృహ్య మైథిలీమ్,
విజహ్రతుస్తౌ ముదితౌ మహావనే
దివి స్థితౌ చన్ద్రదివాకరావివ. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుర్థః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కాఞ్చనచిత్రకార్ముకౌ = బంగారముచేత చిత్రవర్ణము లైన ధనస్సులు గల, తౌ = ఆ రామలక్ష్మణులు, రక్షః = రాక్షసుని, నిహత్య = చంపి, మైథిలీమ్ = సీతను, పరిగృహ్య = తీసికొని, మహావనే = మహావనమునందు, ముదితౌ = ఆనందించుచున్నవారై, దివి = అకాశమునందు, స్థితౌ = ఉన్న, తౌ = అ, చన్ద్రదివాకరావివ = చంద్రసూర్యులు వలె, విజహ్రతుః = విహరించిరి.

తా. పిమ్మట బంగారముచేత చిత్రవర్ణము లైన ధనస్సులను ధరించిన ఆ రామలక్ష్మణులు ఆ రాక్షసుని సంహరించి, సీతను స్వీకరించి, సంతోషించుచు, ఆ మహావనములో, ఆకాశముమీద ఉన్న చంద్రసూర్యులు వలె విహరించిరి.

వి. ఇది గోరఖ్‌పూర్ ప్రతిలోని పాఠము. దాక్షిణాత్యపాఠం (వావిళ్లవారు ప్రచురించినది) కూడ ఇట్లే ఉండవచ్చును. ఈ వృత్తాంతంలో కొంత అనౌచిత్యము కనబడుతూన్నది. విరాధుడు రామలక్ష్మణులను భుజములపైకి ఎక్కించుకొని వెళ్లిపోయి నట్లు అప్పుడు రాముడు సీత విషయమే పట్టించుకొనకుండా మనం వెళ్లవలసినది కూడా ఆ వైపునకే కదా, ఈతడు మనలను మోసికొని పోతే అదీ మనకు మంచిదే అని అంటూ వాహనసౌఖ్యం లభించినందుకు సంతోషిస్తూన్నట్లు ఉండడం కొంతదూరం ఘనారణ్యంలోనికి వెళ్లిపోవడం ఇదంతా రాముని స్వభావానికి విరుద్ధంగా ఉన్నది. ఇంక సీత "అయ్యో! నన్ను మృగాలు భక్షించివేస్తాయి. వాళ్ళిద్దరినీ విడిచిపెట్టి నన్ను తీసికొని వెళ్లు" అనడం కూడా అనుచితంగానే ఉంది. ''వాళ్లతో పాటు నన్ను కూడా తీసికొనిపోయి చంపివెయ్యి'' అంటే కొంత యుక్తంగా ఉంటుందేమో. ఈ సర్గ చివరి 29-33 శ్లోకాలలో వాల్మీకి ముద్ర లేదు. ప్రాచ్యపాఠంలో కథ ఈ విధంగా ఉన్నది. విరాధుడు సీతను గ్రహించడంతో రాముడు విషణ్ణుడౌతాడు. లక్ష్మణుడు ఆయనకు ధైర్యం చెప్పి ఏడుబాణాలు ప్రయోగించగా అవి రాక్షసుని శరీరంలో దూరి బైటకు వచ్చేస్తాయి. విరాధుడు లక్ష్మణునిమీద ప్రయోగించిన శూలాన్ని రాముడు రెండు బాణాలతో ఆకాశంమీదనే ఖండించి ఒక్క బాణంతో వాని వక్షస్థలం చీల్చేస్తాడు. దానితో అతడు నేలపై పడిపోయి, తన పూర్వవృత్తాంతం తెలిపి, రాముని చేతుల్లో చావడానికై కావాలనే ఆతనికి కోపం కలిగించడానికి సీతను గ్రహించినట్లు చెప్పి, రాక్షసధర్మానుసారం తనను గోతిలో కప్పమని కోరి,

శరభంగముని విషయం చెప్పి స్వస్వరూపంతో స్వర్గలోకానికి వెళ్లిపోతాడు". దీనిలో పైన చూచిన అనౌచిత్యం లేదు. విరాధుణ్ణి చంపినది రాముడేకాని రామ లక్ష్మణు లిద్దరూ కలిసి కాదు అని సుందరకాండలో సీత మాటలను పట్టికూడ తెలుస్తుంది.

34

''బాలానందిని'' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో నాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చమః సర్గః

*[సీతాలక్ష్మణసమేతు డైన రాముడు శరభంగాశ్రమమునకు వెళ్ళుట. అక్కడ దేవతలను చూచుట. శరభంగమునితో సంభాషించుట. శరభంగముని బ్రహ్మలోకమునకు వెళ్ళుట.]*

మూ. హత్వా తు తం భీమబలం విరాధం రాక్షసం వనే,
తతః సీతాం పరిష్వజ్య సమాశ్వాస్య చ వీర్యవాన్, 1
అబ్రవీద్భ్రాతరం రామో లక్ష్మణం దీప్తతేజసమ్.

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, రామః = రాముడు, భీమబలమ్ = భయంకర మైన బలము గల, రాక్షసమ్ = రాక్షసు డైన, తం విరాధమ్ = ఆ విరాధుణ్ణి, వనే = వనమునందు, హత్వా = చంపి, తతః = అటు పిమ్మట, సీతామ్ = సీతను, పరిష్వజ్య = కౌగలించుకొని, సమాశ్వాస్య చ = ఓదార్చి, దీప్తతేజసమ్ = ప్రజ్వలించుచున్న తేజస్సు గల, భ్రాతరమ్ = సోదరు డైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పరాక్రమశాలి యైన రాముడు భయంకర మైన బలము గల రాక్షసు డైన ఆవిరాధుణ్ణి వనములో సంహరించి, సీతను కౌగలించుకొని, ఓదార్చి, తేజస్సుతో ప్రకాశించుచున్న సోదరు డైన లక్ష్మణునితో ఇట్లనెను. 1

మూ. కష్టం వనమిదం దుర్గం న చ స్మో వనగోచరాః, 2
అభిగచ్ఛామహే శీఘ్రం శరభఙ్గం తపోధనమ్.

ప్ర. అ. ఇదమ్ = ఈ, దుర్గమ్ = ప్రవేశింప శక్యము కాని. వనమ్ = వనము, కష్టమ్ = కష్టములను కలిగించునది. వనగోచరాః = వనములో నివసించేవాళ్లము, న చ స్మః = కాము. శీఘ్రమ్ = శీఘ్రముగా, తపోధనమ్ = మహర్షి యైన, శరభఙ్గమ్ = శరభంగుణ్ణి, అభిగచ్ఛామహే = పొందుదము.

తా. ఈ దుర్గమారణ్యము చాలా కష్టములకు నిలయమై ఉన్నది. మనము వనవాసమునకు అలవాటుపడినవాళ్ళము కాము. శరభంగమహర్షి దగ్గరకు శీఘ్రముగా వెళ్లెదము. 2

మూ. ఆశ్రమం శరభఙ్గస్య రాఘవోఽభిజగామ హ, 3
తస్య దేవప్రభావస్య తపసా భావితాత్మనః,
సమీపే శరభఙ్గస్య దదర్శ మహదద్భుతమ్. 4

ప్ర. అ. రాఘవః = రాముడు, శరభఙ్గస్య = శరభంగమహర్షియొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అభిజగామ హ = చేరెను. దేవప్రభావస్య=దేవతల వంటి ప్రభావము కలవాడు, తపసా = తపస్సుచేత, భావితాత్మనః = పవిత్రము చేయబడిన మనస్సు కలవాడు అయిన, తస్య శరభఙ్గస్య = ఆ శరభంగముని యొక్క, సమీపే = సమీపమునందు, మహత్ = గొప్ప, అద్భుతమ్ = ఆశ్చర్యమును, దదర్శ = చూచెను.

తా. రాముడు శరభంగముని ఆశ్రమమును చేరి అచట దేవతల వంటి ప్రభావము గలవాడు, తపస్సుచేత పరిశుద్ధమైన మనస్సు కలవాడు, అయిన ఆ శరభంగుని సమీపమున ఒక గొప్ప ఆశ్చర్యకరమైన విషయము చూచెను.

మూ. విభ్రాజమానం వపుషా సూర్యవైశ్వానరప్రభమ్,
రథప్రవరమారూఢమాకాశే విబుధానుగమ్. 5

అసంస్పృశన్తం వసుధాం దదర్శ విబుధేశ్వరమ్,
సంప్రభాభరణం దేవం విరజోఽమ్బరధారిణమ్. 6
తద్విధైరేవ బహుభిః పూజ్యమానం మహాత్మభిః.

ప్ర. అ. వపుషా=శరీరముతో, విభ్రాజమానమ్ = ప్రకాశించుచున్నవాడు, సూర్యవైశ్వానరప్రభమ్ = సూర్యుని వంటి, అగ్ని వంటి కాంతి గలవాడు, రథప్రవరమ్ = శ్రేష్ఠమైన రథమును, ఆరూఢమ్ = ఎక్కినవాడు, ఆకాశే = ఆకాశమునందు, విబుధానుగమ్ = దేవతలు అనుచరులుగా కలవాడు, వసుధామ్ = భూమిని, అస్పృశన్తమ్ = స్పృశించనివాడు, సంప్రభాభరణమ్ = గొప్ప కాంతి గల ఆభరణములు కలవాడు, విరజోఽమ్బరధారిణమ్ = పరాగము లేని వస్త్రము

లను ధరించినవాడు, తద్విధై రేవ = అట్టి విధముగానే ఉన్న, బహుభిః = అనేకులైన, మహాత్మభిః = మహాత్ములచేత, పూజ్యమానమ్ = పూజింపబడుచున్న వాడు అయిన, దేవమ్ = త్రిలోకప్రభువైన, విబుధేశ్వరమ్ = దేవేంద్రుని, దదర్శ = చూచెను.

తా. అక్కడ త్రిలోకాధిపతియైన దేవేంద్రుని చూచెను. ఆతడు తేజోవంతమైన శరీరముతో సూర్యుడు వలె, అగ్ని వలె ప్రకాశించుచుండెను. ఆకాశముమీద నున్న ఒక రథమును అధిష్ఠించి ఉండెను. దేవతలు అనుచరులుగా ఆతని వెంట ఉండిరి. ఆతడు భూమిని స్పృశించక ఆకాశములోనే ఉండెను. పరాగము లేని వస్త్రములను ధరించి ఉన్న ఆతడు అలంకరించుకొన్న భూషణములు అత్యధికముగా ప్రకాశించుచుండెను. అ విధముగానే ఉన్న ఎందరో మహాత్ములు ఆతనిని పూజించుచుండిరి. 4, 5, 6

మూ. హరితైర్వాజిభిర్యుక్తమన్తరిక్షగతం రథమ్, 7
దదర్శాదూరతస్తస్య తరుణాదిత్యసంనిభమ్,
పాణ్డురాభ్రఘనప్రఖ్యం చన్ద్రమణ్డలసంనిభమ్. 8

ప్ర. అ. తస్య = ఆ దేవేంద్రునకు, అదూరతః = సమీపమునందు, హరితైః = ఆకుపచ్చని రంగు గల, వాజిభిః = గుఱ్ఱములచేత, యుక్తమ్ = కట్టబడినది, తరుణాదిత్యసంనిభమ్ = ముదిరిన సూర్యునితో సమానము, పాణ్డురాభ్రఘనప్రఖ్యమ్ = తెల్లని మేఘసముదాయముతో సమానము, చన్ద్రమణ్డలసంనిభమ్ = చంద్రమండలముతో సమానము అయిన, అన్తరిక్షగతమ్ = ఆకాశమునందున్న, రథమ్ = రథమును, దదర్శ = చూచెను.

తా. ఆ దేవేంద్రునకు దగ్గరగా, ఆకాశముమీద ఆకుపచ్చని గుఱ్ఱములు కట్టిన రథమును చూచెను. అది ముదిరిన సూర్యుడు వలె, తెల్లని మేఘసముదాయము వలె, చంద్రమండలము వలె ప్రకాశించుచుండెను. 7, 8

మూ. అపశ్యద్విమలం ఛత్రం చిత్రమాల్యోపశోభితమ్,
చామరవ్యజనే చాగ్ర్యే రుక్మదణ్డే మహాధనే. 9
గృహీతే వరనారీభ్యాం ధూయమానే చ మూర్ధని.

ప్ర. అ. విమలమ్ = నిర్మలమైనది, చిత్రమాల్యోపశోభితమ్ = చిత్రములైన మాలికలచేత ప్రకాశింపచేయబడినది అయిన, ఛత్రమ్ = ఛత్రమును, అగ్ర్యే = శ్రేష్ఠమైనవి, రుక్మదణ్డే = బంగారు దండములు కలవి, మహాధనే = చాల విలువైనవి, వరనారీభ్యామ్ = ఇత్తరుఉత్తమస్త్రీలచేత, గృహీతే = గ్రహింపబడినవి; మూర్ధని = శిరస్సుమీద, ధూయమానే = కదల్చబడుచున్నవి అయిన, చామరవ్యజనే = చమరీమృగమునకు సంబంధించిన వింజామరలను, అపశ్యత్ = చూచెను.

తా. విచిత్రములైన పుష్పమాలలచే ప్రకాశింపచేయబడిన శ్వేతచ్ఛత్రమును, బంగారుదండములు గల, విలువైన రెండు వింజామరలను చూచెను. ఆ వింజామరలను ఇద్దరు ఉత్తమస్త్రీలు ఆ దేవేంద్రుని శిరస్సుపై వీచుచుండిరి. 9

మూ. గన్ధర్వామరసిద్ధాశ్చ బహవః పరమర్షయః, 10
అన్తరిక్షగతం దేవం గీర్భిరగ్ర్యాభిరైడయన్.

ప్ర. అ. గన్ధర్వామరసిద్ధాశ్చ=గంధర్వులు, అమరులు, సిద్ధులు, బహవః = అనేకులు, పరమర్షయః = గొప్పఋషులు, అన్తరిక్షగతమ్ = ఆకాశమునందున్న, దేవమ్ = ఆ దేవుణ్ణి, అగ్ర్యాభిః = శ్రేష్ఠమైన, గీర్భిః = వాక్కులతో(వేదమంత్రములతో), ఐడయన్ = స్తుతించుచుండిరి.

తా. ఆకాశములో ఉన్న ఆ దేవేంద్రుణ్ణి, గంధర్వులు, దేవతలు, సిద్ధులు చాలమంది మహర్షులు వైదికమంత్రములతో స్తుతించుచుండిరి. 10

మూ. సహ సంభాషమాణే తు శరభఙ్గేన వాసవే, 11
దృష్ట్వా శతక్రతుం తత్ర రామో లక్ష్మణమబ్రవీత్.

ప్ర. అ. వాసవే = దేవేంద్రుడు, శరభఙ్గేన=శరభంగమహర్షితో, సంభాషమాణే = మాటలాడుచుండగా, తత్ర = అక్కడ, శతక్రతుమ్ = దేవేంద్రుణ్ణి, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అక్కడ శరభంగమహర్షితో సంభాషణము చేయుచున్న దేవేంద్రుని చూచి, రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను. 11

మూ. రామోఽథ రథ ముద్దిశ్య భ్రాతు ర్దర్శయతాద్భుతమ్. 12
అర్చిష్మన్తం శ్రియా జుష్టమద్భుతం పశ్య లక్ష్మణ,
ప్రతపన్తమివాదిత్యమన్తరిక్షగతం రథమ్. 13

ప్ర. అ. అథ = అటు పిమ్మట, రామః = రాముడు, రథమ్ = రథమును, ఉద్దిశ్య = నిర్దేశించుచు, అద్భుతమ్ = ఆ ఆశ్చర్యమును, భ్రాతుః = సోదరునకు, దర్శయత = చూపెను. లక్ష్మణ = ఓ! లక్ష్మణా! అర్చిష్మన్తమ్ = కాంతులు గలది, శ్రియా = శోభతో, జుష్టమ్ = కూడినది, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనది, ప్రతపన్తమ్ = తపింపచేయుచున్న, ఆదిత్యమివ = సూర్యుడు వలె ఉన్నది అయిన, అన్తరిక్షగతమ్ = ఆకాశములో ఉన్న, రథమ్ = ఆ రథమును, పశ్య = చూడుము.

తా. పిదప రాముడు ఆ రథమును వ్రేలితో నిర్దేశించుచు ఆ ఆశ్చర్యకరమైన విషయమును తమ్మునికి చూపెను. "లక్ష్మణా! ఆకాశములో, ప్రకాశించుచున్న సూర్యుడు వలె ఉన్న ఆ రథమును చూడుము. కాంతితో, శోభతో, ఇది చాలా ఆశ్చర్యకరముగా ఉన్నది".

మూ. యే హయాః పురుహూతస్య పురా శక్రస్య నః శ్రుతాః,
అన్తరిక్షగతా దివ్యాస్త ఇమే హరయో ధ్రువమ్. 14

ప్ర. అ. పురుహూతస్య = అనేకులచేత యాగములందు ఆహ్వానింపబడిన, శక్రస్య = దేవేంద్రునియొక్క, యే = ఏ, హయాః = అశ్వములు, నః = మనకు, పురా = పూర్వము, శ్రుతాః = వినబడినవో, తే = ఆ, హరయః = అశ్వములు, అన్తరిక్షగతాః = ఆకాశములో ఉన్న, దివ్యాః = దివ్యములైన, ఇమే = ఇవియే. ధ్రువమ్ = నిశ్చయము.

తా. అనేకులు యజ్ఞమునందు ఆహ్వానించు దేవేంద్రునకు ఏ అశ్వములు ఉన్నవని పూర్వము మనము విని యున్నామో, అకాశముమీద ఉన్న ఈ అశ్వములు ఆ దివ్యాశ్వములే; సందేహము లేదు. 14

మూ. ఇమే చ పురుషవ్యాఘ్ర యే తిష్ఠన్త్యభితో దిశమ్,
శతం శతం కుణ్డలినో యువానః ఖడ్గపాణయః. 15

విస్తీర్ణవిపులోరస్కాః పరిఘాయతబాహవః,
శోణాంశువసనాః సర్వే వ్యాఘ్రా ఇవ దురాసదాః, 16

ఉరోదేశేషు సర్వేషాం హారా జ్వలనసన్నిభాః,
రూపం బిభ్రతి సౌమిత్రే పఞ్చవింశతివార్షికమ్. 17

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! దిశమ్ అభితః = ఆ దిక్కునందు అంతటా, యే = ఏ, శతం శతమ్ = నూర్గురు నూర్గురు చొప్పున గుంపులుగా ఉన్న, కుణ్డలినః = కుండలములు గలవారు, ఖడ్గపాణయః = ఖడ్గములు హస్తములందు కలవారు, విస్తీర్ణవిపులోరస్కాః = విశాలమైన పెద్దవైన వక్షఃస్థలములు కలవారు, పరిఘాయతబాహవః = పరిఘల వలె పొడవైన బాహువులు కలవారు, శోణాంశువసనాః = ఎఱ్ఱని కిరణములవంటి వస్త్రములు గలవారు అయిన, యువానః = యువకులు ఉన్నారో, ఇమే సర్వే = వీరందరూ, వ్యాఘ్రా ఇవ = పెద్దపులుల వలె, దురాసదాః = చేర శక్యముకానివారు. సర్వేషామ్ = అందరియొక్క, ఉరోదేశేషు = వక్షఃస్థలములందు, జ్వలనసన్నిభాః = అగ్నితో సమానములైన, హారాః = హారములు ఉన్నవి. పఞ్చవింశతివార్షికమ్ = ఇరువదియైదు సంవత్సరముల, రూపమ్ = రూపమును, బిభ్రతి = ధరించి ఉన్నారు.

తా. పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! ఆ దిక్కునందు అంతటా, నూరుగురు నూరుగురు చొప్పున గుంపులుగా ఏర్పడి, కుండలములు అలంకరించుకొన్న యువకులు చేతులందు ఖడ్గములు ధరించి నిలచి ఉన్నారు. వాళ్లందరూ విశాలమైన పెద్ద వక్షఃస్థలములతో, పరిఘల (కోటగడియల) వలె పొడవైన బాహువులతో ఎఱ్ఱని కిరణముల వంటి వస్త్రములను ధరించి ఉన్నారు. వీళ్లందరూ కూడ పెద్దపులుల వలె ఎదిరింప శక్యము కానివారు. వీళ్ల అందరి వక్షఃస్థలముల పైన అగ్ని వంటి హారములు ప్రకాశించుచున్నవి. అందరూ ఇరువదియైదు సంవత్సరాల వయస్సు కలవారి ఆకారములో ఉన్నారు. 15, 16, 17

మూ. ఏతద్ధి కిల దేవానాం వయో భవతి నిత్యదా,
యథేమే పురుషవ్యాఘ్రా దృశ్యన్తే ప్రియదర్శనాః. 18

ప్ర. అ. ప్రియదర్శనాః = ఆనందకరమైన దర్శనము గల, ఇమే = ఈ, పురుషవ్యాఘ్రాః = పురుషశ్రేష్ఠులు, యథా = ఎట్లు, దృశ్యన్తే = చూడబడుచున్నారో,

ఏతత్ = ఇదే, దేవానామ్ = దేవతలయొక్క, వయః = వయస్సు, నిత్యదా = ఎల్లప్పుడూ, భవతి కిల = ఉండునట.

తా. చూచుటకు ఆనందమును కలిగించు ఈ పురుషశ్రేష్ఠులు ఎట్లు కనబడు చున్నారో ఈ వయస్సే దేవతలకు నిత్యము ఉండునట. 18

మూ. ఇహైవ సహ వైదేహ్యా ముహూర్తం తిష్ఠ లక్ష్మణ,
యావజ్జానామ్యహం వ్యక్తం క ఏష ద్యుతిమాన్ రథే. 19

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! వైదేహ్యా సహ = సీతతో కూడ, ముహూర్తమ్ = ముహూర్తకాలము, ఇహైవ = ఇక్కడనే, తిష్ఠ = ఉండుము. యావత్ = ఎంతలో, అహమ్ = నేను, రథే = రథమునందున్న, ఏషః = ఈ, ద్యుతిమాన్ = కాంతిమంతుడు, కః ఇతి = ఎవ్వడో, వ్యక్తమ్ = స్పష్టముగా, జానామి = తెలిసికొందునో.

తా. లక్ష్మణా ! రథములో ఉన్న ఈ కాంతిమంతుడు ఎవరో స్పష్టముగా తెలిసికొని వచ్చెదను; నీవు సీతతో కూడ ఇక్కడనే క్షణకాలము ఉండుము. 19

మూ. తమేవముక్త్వా సౌమిత్రిమిహైవ స్థీయతామితి,
అభిచక్రామ కాకుత్స్థః శరభఙ్గాశ్రమం ప్రతి. 20

ప్ర. అ. ఇహైవ = ఇక్కడనే, స్థీయతామ్ = ఉండబడుగాక (ఉందువు గాక) ఇతి = అని, తం సౌమిత్రిమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, ఉక్త్వా = పలికి, కాకుత్స్థః = రాముడు, శరభఙ్గాశ్రమం ప్రతి = శరభంగముని ఆశ్రమమును గూర్చి, అభిచక్రామ = నడచి వెళ్లెను.

తా. రాముడు "నీవిక్కడే ఉండుము" అని లక్ష్మణునితో పలికి, శరభంగాశ్రమమువైపు వెళ్లెను. 20

మూ. తతః సమభిగచ్ఛన్తం ప్రేక్ష్య రామం శచీపతిః,
శరభఙ్గమనుజ్ఞాప్య విబుధానిదమబ్రవీత్. 21

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శచీపతిః = దేవేంద్రుడు, సమభిగచ్ఛన్తమ్ = వచ్చుచున్న, రామమ్ = రాముణ్ణి, ప్రేక్ష్య = చూచి, శరభఙ్గమ్ = శరభంగ

మునిని, అనుజ్ఞాప్య = అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, విబుధాన్ = దేవతలను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు అటు వైపు వచ్చుచున్నట్లు చూచి, దేవేంద్రుడు శరభంగ ముని అనుజ్ఞ గైకొని, ప్రక్క నున్న దేవతలతో ఇట్లు పలికెను. 21

మూ. ఇహోపయాత్యసౌ రామో యావన్మాం నాభిభాషతే,
నిష్ఠాం నయత తావత్తు తతో మా ద్రష్టుమర్హతి. 22

జితవన్తం కృతార్థం హి తదాహమచిరాదిమమ్,
కర్మ హ్యనేన కర్తవ్యం మహదన్యైః సుదుష్కరమ్. 23

ప్ర. అ. అసౌ = ఈ, రామః = రాముడు, ఇహ = ఇక్కడికి, ఉపయాతి = వచ్చుచున్నాడు. యావత్ = ఎంతలో, మామ్ = నన్ను (నాతో), నాభిభాషతే = మాటలాడడో, తావత్ = అంతలో, నిష్ఠామ్ = ఆతనికార్యసిద్ధిని, నయత = పొందించుడు. తతః = అటుపిమ్మట, మా = నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హతి = తగి యున్నాడు. జితవన్తమ్ = జయించినవాడు, కృతార్థమ్ = చేయబడిన కార్యము కలవాడు అయిన, ఇమమ్ = ఈతనిని, అహమ్ = నేను, అచిరాత్ = కొద్దికాలములో, తదా = అప్పుడు (ద్రక్ష్యామి=చూడగలను). అనేన=ఈతని చేత, అన్యైః = ఇతరులచేత, సుదుష్కరమ్ = ఏ మాత్రము చేయ శక్యము కాని, మహత్ = గొప్ప, కర్మ = పని, కర్తవ్యం హి = చేయబడవలసి యున్నది కదా.

తా. రాము డిటు వైపే వచ్చుచున్నాడు. ఆతడు నాతో మాటలాడుటకు పూర్వము ఈతనికి కార్యసిద్ధి కలుగు నట్లు చేయుడు. (ఈతని కార్యము పూర్తి అయేవరకు నే నీతనితో సంభాషించను అని భావము.) పిమ్మటనే ఇతడు నన్ను చూడవలెను. ఇతడు జయము సంపాదించి, కృతార్థు డైన పిమ్మట అచిరకాలములో ఇతనిని చూడగలను. ఇతడు ఇతరు లెవ్వరూ చేయజాలని కార్యము చేయవలసి యున్నది కదా.

వి. గోరఖ్‌పూర్ ప్రతిలోని ఈ శ్లోకాల సమన్వయం అసంబద్ధంగా ఉన్నది. ప్రాచ్యపాఠంగా స్పష్టంగా ఉన్నది:-

"యాస్యామ్యహమయం రామో యావన్మాం నాభిభాషతే,
కృతార్థమేనమచిరాద్ద్రష్టాస్మ్యహమరిన్దమమ్,
కర్మ హ్యనేన కర్తవ్యం మహద్దేవైః సుదుష్కరమ్,
నిష్ఠాం న యాతో యావద్ధి తావన్న ద్రష్టుమర్హతి."

"ఈ రాముడు నన్ను సమీపించి నాతో మాటలాడే లోపుగా నేను వెళ్ళిపోయెదను. ఈ శత్రుసంహారకుడు తన కర్తవ్యమును పూర్తిచేసికొన్న పిదప ఈతనిని అచిర కాలములో చూచెదను. దేవతలు కూడ చేయజాలని చాల కష్టమైన కార్యము ఇతడు చేయవలసి ఉన్నది. ఇతడు కార్యసమాప్తిని (నిష్ఠామ్) పొందకపూర్వము నే నీతనిని చూడగూడదు,'' అని భావం స్పష్టంగా ఉన్నది. 22, 23

మూ. అథ వజ్రీ తమామన్త్ర్య మానయిత్వా చ తాపసమ్,
రథేన హయయుక్తేన యయౌ దివమరిన్దమః. 24

ప్ర. అ. అథ = అటు పిమ్మట, అరిన్దమః = శత్రుసంహారకుడైన, వజ్రీ = ఇంద్రుడు, తం తాపసమ్ = ఆ శరభంగమునిని, ఆమన్త్ర్య = వీడ్కోలు చెప్పి, మానయిత్వా = గౌరవించి, హయయుక్తేన = గుఱ్ఱములచేత కట్టబడిన, రథేన = రథముచేత, దివమ్ = స్వర్గలోకమును గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. పిమ్మట శత్రుసంహారకుడైన ఇంద్రుడు ఆ శరభంగముని అనుజ్ఞ తీసికొని, ఆతనిని గౌరవించి, గుఱ్ఱములు కట్టిన రథము నెక్కి స్వర్గమునకు వెళ్లెను. 24

మూ. ప్రయాతే తు సహస్రాక్షే రాఘవః సపరిచ్ఛదః,
అగ్నిహోత్రముపాసీనం శరభఙ్గముపాగమత్. 25

ప్ర. అ. సహస్రాక్షే = దేవేంద్రుడు, ప్రయాతే = వెళ్లినవాడగుచుండగా, రాఘవః = రాముడు, సపరిచ్ఛదః = పరివారముతో కూడినవాడై, అగ్నిహోత్రమ్ = అగ్నిహోత్రమును గూర్చి, ఉపాసీనమ్ = కూర్చొని యున్న, శరభఙ్గమ్ = శరభంగమహర్షిని, ఉపాగమత్ = సమీపించెను.

తా. దేవేంద్రుడు వెళ్లిపోయిన పిమ్మట రాముడు సీతాలక్ష్మణులతో కూడి,

అగ్నిహోత్రము చేసికొనుటకై కూర్చొని యున్న శరభంగమహర్షి వద్దకు వెళ్లెను. 25.

మూ. తస్య పాదౌ చ సంగృహ్య రామః సీతా చ లక్ష్మణః,
నిషేదుస్తదనుజ్ఞాతా లబ్ధవాసా నిమన్త్రితాః. 26

ప్ర. అ. రామః = రాముడు, సీతా చ = సీత, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, తస్య = ఆ మునీంద్రునియొక్క, పాదౌ = పాదములను, సంగృహ్య = స్పృశించి, లబ్ధవాసాః = పొందబడిన నివాసము గలవారై, నిమన్త్రితాః = ఆహ్వానింపబడినవారై, తదనుజ్ఞాతాః = ఆతనిచేత అనుజ్ఞ ఇవ్వబడినవారై, నిషేదుః = కూర్చుండిరి.

తా. రాముడు, సీత, లక్ష్మణుడు ఆ శరభంగునకు పాదప్రణామము చేసి, ఆతని అనుజ్ఞ పొంది కూర్చుండిరి. ఆతడు వారిని ఆనాడు అక్కడ నివసించుటకై ఆహ్వానించెను. 26

మూ. తతః శక్రోపయానం తు పర్యపృచ్ఛత రాఘవః,
శరభఙ్గశ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాఘవః = రాముడు, శక్రోపయానమ్ = ఇంద్రుని రాకను గూర్చి, పర్యపృచ్ఛత = అడిగెను. శరభఙ్గశ్చ = శరభంగుడు కూడ, తత్ సర్వమ్ = దాని నంతను, రాఘవాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. పిమ్మట రాముడు ఆ మునిని, "దేవేంద్రుడు ఎందుకు వచ్చినాడు"? అని అడుగగా ఆతడు ఆ విషయమునంతా రామునకు ఇట్లు తెలిపెను. 27

మూ. మామేష వరదో రామ బ్రహ్మలోకం నినీషతి,
జితముగ్రేణ తపసా దుష్ప్రాపమకృతాత్మభిః. 28

ప్ర. అ. రామ = రామా! వరదః = వరముల నిచ్చు, ఏషః = ఈ ఇంద్రుడు, ఉగ్రేణ = ఉగ్రమైన, తపసా = తపస్సుచేత, జితమ్ = జయించబడినదీ, అకృతాత్మభిః = జయించబడని మనస్సు కలవారిచేత, దుష్ప్రాపమ్ = పొంద శక్యము కానిది అయిన, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, మామ్ = నన్ను, నినీషతి = తీసికొనివెళ్ల గోరుచున్నాడు.

తా. రామా! వరముల నిచ్చు ఈ ఇంద్రుడు, ఉగ్ర మైన తపస్సుచేత నేను సంపాదించిన, మనోనిగ్రహము లేనివారిచేత పొంద శక్యము కాని బ్రహ్మ లోకానికి నన్ను తీసికొనివెళ్లుటకై వచ్చినాడు. 28

మూ. అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర వర్తమానమదూరతః,
బ్రహ్మలోకం న గచ్ఛామి త్వామదృష్ట్వా ప్రియాతిథిమ్.

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడవైన ఓ రామా! అహమ్ = నేను, ప్రియాతిథిమ్ = ప్రియుడైన అతిథివైన, త్వామ్ = నిన్ను, అదూరతః = సమీపము నందే, వర్తమానమ్ = ఉంటూన్నవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, అదృష్ట్వా = నిన్ను చూడకుండా, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, న గచ్ఛామి = వెళ్లుటలేదు.

తా. నరులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! నీవు దగ్గరనే ఉన్నట్లు తెలిసికొని నేను, ప్రియాతిథివైన నిన్ను చూడకుండగా బ్రహ్మలోకమునకు వెళ్లుటకు అంగీక రించలేదు. 29

మూ. త్వయాహం పురుషవ్యాఘ్ర ధార్మికేణ మహాత్మనా,
సమాగమ్య గమిష్యామి త్రిదివం చావరం పరమ్. 30

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! అహమ్ = నేను, ధార్మికేణ = ధర్మాత్ముడవు, మహాత్మనా = మహాత్ముడవు అయిన, త్వయా = నీతో, సమాగమ్య = కలిసి, అవరమ్ = అటుపిమ్మట, పరమ్ = అత్యుత్తమమైన, త్రిదివమ్ = స్వర్గమైన బ్రహ్మలోకమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. పురుషశ్రేష్ఠుడా! ధార్మికుడవు, మహాత్ముడవు అయిన నిన్ను కలిసిన పిమ్మట నేను అత్యుత్తమస్వర్గ మైన బ్రహ్మలోకమునకు వెళ్లగోరుచున్నాను. 30

మూ. అక్షయా నరశార్దూల జితా లోకా మయా శుభాః,
బ్రాహ్మ్యాశ్చ నాకపృష్ఠ్యాశ్చ ప్రతిగృహ్ణీష్వ మామకాన్.

ప్ర. అ. నరశార్దూల = నరశ్రేష్ఠుడా ! మయా = నాచేత, శుభాః = శుభ కరములైన, బ్రాహ్మ్యాః = బ్రహ్మకు సంబంధించినవి, నాకపృష్ఠ్యాశ్చ = స్వర్గము

నకు సంబంధించినవీ అయిన, లోకాః = లోకములు, జితాః = జయింపబడినవి. మామకాన్ = నా సంబంధ మైన ఆ లోకములను, ప్రతిగృహ్ణీష్వ = తీసికొనుము.

తా. ఓః నరశ్రేష్ఠాః నేను తపస్సుచేత బ్రహ్మకు సంబంధించిన పుణ్య లోకములను, స్వర్గమునకు సంబంధించిన పుణ్యలోకములను జయించితిని. వాటిని నీ కిచ్చెదను, స్వీకరించుము. 31

మూ. ఏవముక్తో నరవ్యాఘ్రః సర్వశాస్త్రవిశారదః,
ఋషిణా శరభఙ్గేన రాఘవో వాక్యమబ్రవీత్. 32

ప్ర. అ. ఋషిణా = ఋషియైన, శరభఙ్గేన = శరభంగునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, నరవ్యాఘ్రః = నరశ్రేష్ఠుడైన, సర్వశాస్త్రవిశారదః = సకలశాస్త్రములందు పండితుడైన, రాఘవః = రాముడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శరభంగమహర్షి మాటలు విని నరులలో శ్రేష్ఠుడు, సకలశాస్త్రము లలో పండితుడు అయిన రాము డిట్లు పలికెను. 32

మూ. అహమేవాహరిష్యామి సర్వాన్ లోకాన్మహామునే,
ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్టమిహ కాననే. 33

ప్ర. అ. మహామునే = ఓ మహామునీ! అహమేవ = నేనే, సర్వాన్ = సమస్తమైన, లోకాన్ = పుణ్యలోకములను, ఆహరిష్యామి = సంపాదించుకొనెదను. తు = కాని, అహమ్ = నేను, ఇహ = ఇక్కడ, కాననే = అడవియందు, ప్రదిష్టమ్ = నీచే చూపబడిన, ఆవాసమ్ = నివాసస్థానమును, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. మహామునీ! నీవు చెప్పిన ఆ పుణ్యలోకము లన్నీ నేనే సంపాదించు కొనెదను. నీవు నా కీ వనములో ఏదైన నివాసయోగ్యమైన ప్రదేశమును చూపించిన చాలును. 33

మూ. రాఘవేణైవముక్తస్తు శక్రతుల్యబలేన వై,
శరభఙ్గో మహాప్రాజ్ఞః పునరేవాబ్రవీద్వచః. 34

ప్ర. అ. శక్రతుల్యబలేన = దేవేంద్రునితో సమానమైన బలము గల,

రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధి గల, శరభఙ్గః = శరభంగుడు, పునరేవ = మరల, వచః = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దేవేంద్రునితో సమానమైన బలము గల రాముని మాటలు విని; మహాబుద్ధిశాలియైన శరభంగముని మరల ఇట్లు పలికెను. 34

మూ. ఇహ రామ మహాతేజాః సుతీక్ష్ణో నామ ధార్మికః,
వసత్యరణ్యే నియతః స తే శ్రేయో విధాస్యతి. 35

ప్ర. అ. రామ = రామా! ఇహ = ఇక్కడ, అరణ్యే = అరణ్యమునందు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు, ధార్మికః = ధార్మికుడు, నియతః = నియమవంతుడు అయిన, సుతీక్ష్ణో నామ = సుతీక్ష్ణుడను మహర్షి, వసతి = నివసించుచున్నాడు, సః = అతడు, తే = నీకు, శ్రేయః = శ్రేయస్సును, విధాస్యతి = చేయగలడు.

తా. రామా! ఈ అరణ్యమునందే, గొప్ప తేజస్సు కలవాడు, ధార్మికుడు, నియమవంతుడు అయిన సుతీక్ష్ణుడనే ముని నివసించుచున్నాడు. ఆతడు నీకు శ్రేయస్సు కలుగు ఉపాయము చెప్పగలడు. 35

మూ. సుతీక్ష్ణమభిగచ్ఛ త్వం శుచౌ దేశే తపస్వినమ్,
రమణీయే వనోద్దేశే స తే వాసం విధాస్యతి. 36

ప్ర. అ. త్వమ్ = నీవు, శుచౌ = పవిత్రమైన, దేశే = ప్రదేశమునందు, తపస్వినమ్ = మునియైన, సుతీక్ష్ణమ్ = సుతీక్ష్ణుని, అభిగచ్ఛ = చేరుము. సః = అతడు, రమణీయే = సుందరమైన, వనోద్దేశే = వనప్రదేశమునందు, తే = నీకు, వాసమ్ = నివాసమును, విధాస్యతి = ఏర్పరచగలడు.

తా. నీవు పవిత్ర మైన ప్రదేశములో నివసించుచున్న సుతీక్ష్ణమహర్షివద్దకు వెళ్లుము. అతడు అందమైన వనప్రదేశమునందు నీకు నివాసము నేర్పరచును. 36

మూ. ఇమాం మన్దాకినీం రామ ప్రతిస్రోతమనువ్రజ,
నదీం పుష్పోడుపవహాం తతస్తత్ర గమిష్యసి. 37

ప్ర. అ. రామ = రామా! పుష్పోడుపవహామ్ = తెప్పల వంటి పుష్పము లను వహించుచున్న, ఇమామ్ = ఈ, మన్దాకినీమ్ నదీమ్=మందాకినీనదిని, ప్రతి స్రోతమ్ = ప్రవాహమునకు ఎదురుగా, అనువ్రజ=అనుసరించి వెళ్లుము. తతః= అటుపిమ్మట, తత్ర = సుతీక్ష్ణుని ఆశ్రమమునకు, గమిష్యసి = వెళ్లగలవు.

తా. చిన్న చిన్న తెప్పల వలె పుష్పసముదాయములు కొట్టుకొనిపోవుచు ప్రవహించుచున్న ఈ మందాకినీనది ప్రవాహమునకు ఎదురుగా నడచి వెళ్లినచో ఆ సుతీక్ష్ణాశ్రమము వచ్చును.

వి. దండకారణ్యములో మందాకినీప్రసక్తి ఎట్లు వచ్చినదో తెలియదు. ఈ శ్లోకము ప్రాచ్యపాఠములో లేదు. 37

మూ. ఏష పన్థా నరవ్యాఘ్ర ముహూర్తం పశ్య తాత మామ్,
యావజ్జహామి గాత్రాణి జీర్ణాం త్వచమివోరగః. 38

ప్ర. అ. నరవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! ఏషః = ఇదే, పన్థాః=మార్గము. తాత = తండ్రీ! ముహూర్తమ్ = క్షణకాలముపాటు, మామ్ = నన్ను, పశ్య = చూడుము. యావత్ = ఎంతలో, జీర్ణామ్ = జీర్ణమైన, త్వచమ్ = చర్మను, ఉరగః ఇవ = సర్పము వలె, గాత్రాణి=అవయవములను, జహామి=విడతునో.

తా. ఓ నరశ్రేష్ఠా! సుతీక్ష్ణముని ఆశ్రమానికి వెళ్లే మార్గము ఇదే. తండ్రీ! ఒక్క ముహూర్తకాలము ఆగి నన్ను చూడుము. పాము కుబుసమును విడచి నట్లు నా శరీరమును విడిచి వేయుచున్నాను. 38

మూ. తతోఽగ్నిం స సమాధాయ హుత్వా చాజ్యేన మన్త్రవత్,
శరభఙ్గో మహాతేజాః ప్రవివేశ హుతాశనమ్. 39

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః శరభఙ్గః = ఆ శరభంగమహర్షి, అగ్నిమ్ = అగ్నిని, సమాధాయ = ఉంచి, ఆజ్యేన = నేతితో, మన్త్రవత్ = మంత్రపూర్వకముగా, హుత్వా చ = హోమము చేసి, హుతాశనమ్ = ఆ అగ్నిని, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట, మహాతేజఃశాలియైన ఆ శరభంగమహర్షి అగ్నిని నెలకొల్పి, మంత్రపూర్వకముగా ఆజ్యమును హోమముచేసి, ఆ అగ్నిలో ప్రవేశించెను. 39

మూ. తస్య రోమాణి కేశాంశ్చ తదా వహ్ని ర్మహాత్మనః,
జీర్ణాం త్వచం తదస్థీని యచ్చ మాంసం చ శోణితమ్.40

ప్ర. అ. తదా = అప్పుడు, వహ్నిః = అగ్ని, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ శరభంగమహర్షియొక్క, రోమాణి=రోమములను, కేశాంశ్చ= కేశములను, జీర్ణామ్ = జీర్ణమైపోయిన, త్వచమ్ = చర్మను, తదస్థీని = ఆతని ఎముకలను, యత్ = ఏ, మాసమ్=మాంసము, శోణితం చ=రక్తమూ ఉన్నదో వాటిని, (కాల్చివేసెను).

తా. అప్పుడా అగ్ని, మహాత్ముడైన ఆ శరభంగమహర్షి రోమాలను, కేశములను, జీర్ణమైన చర్మమును, మాంసమును, రక్తమును కాల్చివేసెను. 40

మూ. స చ పావకసంకాశః కుమారః సమపద్యత,
ఉత్థాయాగ్నిచయాత్తస్మాచ్ఛరభఙ్గో వ్యరోచత. 41

ప్ర. అ. సః శరభఙ్గః = ఆ శరభంగమహర్షి, పావకసంకాశః=అగ్నితో సమానుడైన, కుమారః = కుమారుడుగా (కౌమారవయస్సులో ఉన్నవాడుగా) సమపద్యత = ఆయెను. తస్మాత్ = ఆ, అగ్నిచయాత్ = అగ్నిరాశినుండి, ఉత్థాయ = లేచి, వ్యరోచత = ప్రకాశించెను.

తా. ఆ శరభంగమహర్షి అగ్నితో సమానుడైన కౌమారవయస్కుడుగా మారిపోయి, ఆ అగ్నికుండమునుండి పైకి లేచి ప్రకాశించెను. 41

మూ. స లోకానాహితాగ్నీనామృషీణాం చ మహాత్మనామ్,
దేవానాం చ వ్యతిక్రమ్య బ్రహ్మలోకం వ్యరోహత. 42

ప్ర. అ. సః = ఆతడు, ఆహితాగ్నీనామ్ = ఆహితాగ్నులయొక్క, మహాత్మనామ్ = మహాత్ములైన, ఋషీణాం చ = ఋషులయొక్క, దేవానాం చ= దేవతలయొక్క, లోకాన్ = లోకములను, వ్యతిక్రమ్య=దాటి, బ్రహ్మలోకమ్= బ్రహ్మలోకమును, వ్యరోహత = ఎక్కెను.

తా. ఆ శరభంగముని ఆహితాగ్నులకు లభించు లోకములను, మహాత్ములైన ఋషీశ్వరులకు లభించు లోకములను, దేవతల లోకములను దాటి బ్రహ్మలోకములో ప్రవేశించెను. 42

మూ. స పుణ్యకర్మా భువనే ద్విజర్షభః
పితామహం సానుచరం దదర్శ హ,
పితామహశ్చాపి సమీక్ష్య తం ద్విజం
ననన్ద సుస్వాగతమిత్యువాచ హ. 43

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చమః సర్గః.

ప్ర. అ. పుణ్యకర్మా = పుణ్యమైన కర్మ గల, సః = ఆ, ద్విజర్షభః = బ్రాహ్మణశ్రేష్ఠుడు, భువనే = బ్రహ్మలోకమునందు, సానుచరమ్ = అనుచరులతో కూడిన, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి, దదర్శ హ = చూచెను. పితామహశ్చాపి = బ్రహ్మదేవుడు కూడ, తం ద్విజమ్ = ఆ బ్రాహ్మణుణ్ణి, సమీక్ష్య = చూచి, ననన్ద = సంతోషించెను. సుస్వాగతమ్ ఇతి = మంచి స్వాగతము అని, ఉవాచ హ = పలికెను.

తా. పుణ్యకర్మ లాచరించిన ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు, బ్రహ్మలోకములో అనుచరులతో కూడిన బ్రహ్మదేవుని దర్శనము చేసెను. బ్రహ్మదేవుడు కూడ ఆ బ్రాహ్మణుని చూచి, సంతోషించి ''సుస్వాగతము'' అని పలికెను. 43

''బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఐదవ సర్గ సమాప్తము.

# అథ షష్ఠః సర్గః

*[రాక్షసులు పెట్టు బాధలనుండి రక్షింపు మని మును లందరు రాముని ప్రార్థించగా రాముడు వాళ్ళకు అభయ మిచ్చుట.]*

మూ. శరభఙ్గే దివం ప్రాప్తే మునిసంఘాః సమాగతాః,
అభ్యగచ్ఛన్త కాకుత్థ్సం రామం జ్వలితతేజసమ్. 1

ప్ర. అ. శరభఙ్గే=శరభంగుడు, దివమ్=స్వర్గమును, ప్రాప్తే=పొందినవా డగుచుండగా, మునిసంఘాః = మునుల సముదాయములు, సమాగతాః = ఒక్కచోట కలిసినవై, కాకుత్థ్సమ్=కకుత్థ్సవంశమునకు చెందినవాడు, జ్వలితతేజసమ్=ప్రజ్వలించుచున్న తేజస్సు కలవాడు అయిన, రామమ్=రాముణ్ణి, అభ్యగచ్ఛన్త=సమీపించినవి.

తా. శరభంగమహర్షి స్వర్గమునకు వెళ్లిన పిమ్మట అక్కడ నివసించు చున్న మునులు చాలమంది ఒక్కచోట చేరి, కకుత్థ్సవంశమునకు చెందినవాడు, ప్రజ్వలించుచున్న తేజస్సు కలవాడు అయిన రాముని వద్దకు వెళ్ళిరి.

మూ. వైఖానసా వాలఖిల్యాః సంప్రక్షాలా మరీచిపాః,
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ తాపసాః. 2

దన్తోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే,
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవానవకాశికాః. 3

మునయః సలిలాహారా వాయుభక్షా స్తథా పరే,
ఆకాశనిలయాశ్చైవ తథా స్థణ్డిలశాయినః. 4

తథోర్ధ్వవాసినో దాన్తా స్తథార్ద్రపటవాససః,
సజపాశ్చ తపోనిష్ఠాస్తథా పఞ్చతపోన్వితాః. 5

సర్వే బ్రాహ్మ్యా శ్రియా యుక్తా దృఢయోగసమాహితాః,
శరభఙ్గాశ్రమే రామమభిజగ్ముశ్చ తాపసాః. 6

ప్ర. అ. వైఖానసాః = ప్రజాపతి నఖములనుండి పుట్టిన ఋషులు, వాలఖిల్యాః=ప్రజాపతి రోమములనుండి పుట్టిన ఋషులు, సంప్రక్షాలాః = ప్రజాపతి పాదప్రక్షాళనమువలన పుట్టిన ఋషులు, మరీచిపాః = చంద్రకిరణములను మాత్రమే త్రాగేవారు, అశ్మకుట్టాశ్చ = ధాన్యములను రాళ్లతో నలిపి తినువారు, పత్రాహారాః = ఆకులే ఆహారముగా గల, బహవః = చాలమంది, తాపసాశ్చ = మునులు, దన్తోలూఖలినశ్చైవ = దంతములే రోళ్లుగా ఉపయోగించువారు, తథైవ = మరియు, ఉన్మజ్జకాః = నీటిపై కంఠమువరకు తేలుచు తపస్సు చేసే, పరే= ఇతరులు, గాత్రశయ్యాః = చెయ్యి మోకాళ్లు మొదలైన అవయవములే శయ్యగా గలవారు, అశయ్యాః = శయ్య లేనివారు, తథైవ = మరియు, అనవకాశికాః = ఇటు అటు కదలుటకు అవకాశము లేని ఇరుకైన స్థలములలో కూర్చుండి తపస్సు చేయువారు, సలిలాహారాః = జలము మాత్రమే ఆహారముగాగల, మునయః = మునులు, తథా = అట్లే, వాయుభక్షాః = వాయువును మాత్రమే భక్షించు, అపరే = ఇతరులు, ఆకాశనిలయాశ్చైవ = ఆకాశములో నిలచి తపస్సు చేయువారు, తథా = మరియు, స్థణ్డిలశాయినః = కటికనేల మీద శయనించువారు, తథా = మరియు, ఊర్ధ్వవాసినః=పర్వతశిఖరాదులందే నివసించువారు, దాన్తాః=ఇంద్రియ నిగ్రహవంతులు, ఆర్ద్రపటవాససః = తడి బట్టలు కట్టుకొనే వారు, సజపాశ్చ = జపముతో కూడినవారు, తపోనిష్ఠాః = తపస్సునందు స్థైర్యము గలవారు. తథా = మరియు, పఞ్చతపోన్వితాః = పంచాగ్నిమధ్య తపస్సు చేయువారు ఆయిన, తాపసాః = మునులు, శరభఙ్గాశ్రమే = శరభంగముని ఆశ్రమములో, రామమ్ = రాముణ్ణి, అభిజగ్ముః = చేరిరి. సర్వే = వారందరూ కూడ, బ్రాహ్మ్యా = బ్రహ్మ (వైదికమైన) సంబంధమైన, శ్రియా = శోభతో, యుక్తాః = కూడినవారు, దృఢయోగసమాహితాః = దృఢముగా యోగమునందు నిలచి ఉన్నవారు.

తా. విఖనసధర్మశాస్త్రాదులను అనుసరించు వైఖానసు లను వానప్రస్థులు, వాలఖిల్యసంప్రదాయమువారు, సంప్రక్షాలులు, చంద్రకిరణములను ఆహారముగా తీసికొనువారు, రాతిపై ధాన్యము నలిపి వాటిని తినువారు, ఆకులు మాత్రమే తిను వారు, దంతములతో ధాన్యములను నమలి తినువారు, నీటిపై తేలుచు తపస్సు

చేసుకొనేవారు, చేతులు మోకాళ్లు మొదలైన అవయవములనే శయ్యగా ఉపయోగించి పండుకొనేవారు, శయ్యలు లేనివారు, అవకాశము లేని ఇరుకుచోట్ల కూర్చుండి తపస్సు చేసుకొనేవారు, జలముమాత్రమే ఆహారముగా తీసికొనువారు, గాలిమాత్రమే పీల్చి జీవించేవారు, ఆకాశముపై నిలచి తపస్సు చేసుకొనేవారు, గట్టి నేలమీద శయనించేవారు, బట్టలు పైపైవు బిగించి కట్టుకొనేవారు, ఇంద్రియ నిగ్రహవంతులు, తడిబట్టలు కట్టుకొనేవారు, జపము చేసేవారు, తపస్సులో స్థిరముగా ఉండువారు, పంచాగ్నితపస్సు చేయువారు, ఈ విధముగ అనేకవిధముల తపస్సు చేయు మును లందరు శరభంగాశ్రమములో రామునివద్దకు వచ్చిరి. వారిలో ప్రతి ఒక్కడు బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించుచుండెను. ప్రతి ఒక్కడు యోగమార్గములో సుస్థిరముగా ఉండెను. 2-6

మూ. అభిగమ్య చ ధర్మజ్ఞా రామం ధర్మభృతాం వరమ్,
ఊచుః పరమధర్మజ్ఞమృషిసంఘాః సమాగతాః. 7

ప్ర. అ. ధర్మజ్ఞాః = ధర్మముల నెరిగిన, సమాగతాః = ఒక్క చోట కలిసిన, ఋషిసంఘాః = ఋషిసముదాయములు, ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారూ, వరమ్ = శ్రేష్ఠుడు, పరమధర్మజ్ఞమ్ = గొప్ప ధర్మవేత్త అయిన, రామమ్ = రాముణ్ణి, అభిగమ్య = సమీపించి, ఊచుః = పలికినవి.

తా. అ ధర్మవేత్తలైన ఋషు లందరూ గుంపుగా చేరి, ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడు, ధర్మములు తెలిసినవాడు అయిన రామునివద్దకు వచ్చి ఇట్లు పలికిరి. 7

మూ. త్వమిక్ష్వాకుకులస్యాస్య పృథివ్యాశ్చ మహారథః,
ప్రధానశ్చాపి నాథశ్చ దేవానాం మఘవానివ. 8

ప్ర. అ. మహారథః = మహారథుడ వైన, త్వమ్ = నీవు, అస్య = ఈ, ఇక్ష్వాకుకులస్య = ఇక్ష్వాకకులమునకు, పృథివ్యాశ్చ = భూమికిని, దేవానామ్ = దేవతలకు, మఘవానివ = దేవేంద్రుడు వలె, ప్రధానశ్చ = ప్రధానుడవు, నాథశ్చ = నాథుడవుకూడ.

తా. మహారథుడ వైన నీవు ఈ ఇక్ష్వాకువంశమునకు, భూమికి కూడ, దేవేంద్రుడు దేవతలకు వలె, ప్రధానమైనవాడవు, నాథుడవు(రక్షకుడవు)కూడ. 8

మూ. విశ్రుతస్త్రిషు లోకేషు యశసా విక్రమేణ చ,
పితృవ్రతత్వం సత్యం చ త్వయి ధర్మశ్చ పుష్కలః. 9

ప్ర. అ. (నీవు) త్రిషు = మూడు, లోకేషు = లోకములయందు, యశసా = కీర్తిచేతను, విక్రమేణ చ = పరాక్రమముచేతను, విశ్రుతః = ప్రసిద్ధుడవు. త్వయి = నీయందు, పితృవ్రతత్వమ్ = పితృభక్తి, సత్యం చ = సత్యము, పుష్కలః = పరిపూర్ణమైన, ధర్మశ్చ = ధర్మము కూడ (ప్రసిద్ధముగా నున్నవి).

తా. కీర్తిచేతను, పరాక్రమముచేతను గూడ నీవు మూడు లోకములందును ప్రసిద్ధుడవు. నీయందు సత్యము, పితృభక్తి, ధర్మము కూడ పరిపూర్ణముగా ఉన్నవి.
9

మూ. త్వామాసాద్య మహాత్మానం ధర్మజ్ఞం ధర్మవత్సలమ్,
అర్థిత్వాన్నాథ వక్ష్యామస్తచ్చ నః క్షన్తుమర్హసి. 10

ప్ర. అ. మహాత్మానమ్ = మహాత్ముడవు, ధర్మజ్ఞమ్ = ధర్మములు తెలిసినవాడవు, ధర్మవత్సలమ్ = ధర్మమునందు ఆసక్తి కలవాడవు అయిన, త్వామ్ = నిన్ను, అర్థిత్వాత్ = యాచకత్వమువలన, ఆసాద్య = పొంది, వక్ష్యామః = చెప్పగలము. నాథ = ఓ! ప్రభూ! నః = మాయొక్క, తత్ = ఆ అర్థిత్వమును, క్షన్తుమ్ = క్షమించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నీవు మహాత్ముడవు. ధర్మములు తెలిసినవాడవు. ధర్మమునందు ఆసక్తి కలవాడవు. అట్టి నీవద్దకు మేము యాచకులముగా వచ్చి ఏమో చెప్ప దలచుకొన్నాము. ప్రభూ! నీవు మమ్ములను ఇట్లు యాచించుచున్నందుకు క్షమించవలెను.
10

మూ. అధర్మః సుమహాన్నాథ భవేత్తస్య తు భూపతేః,
యో హరేద్బలిషడ్భాగం న చ రక్షతి పుత్రవత్. 11

ప్ర. అ. నాథ = ప్రభూ! యః = ఏ రాజు, బలిషడ్భాగమ్ = బలిలో ఆరవ భాగమును, హరేత్ = తీసుకొనునో, పుత్రవత్ = పుత్రులను వలె, న చ రక్షతి = రక్షించడో, తస్య = అట్టి, భూపతేః = రాజునకు, సుమహాన్ = చాల గొప్పదైన, అధర్మః = అధర్మము, భవేత్ = కలుగును.

తా. ప్రభూ ! ఏ రాజు బలి (పంట, తపస్సు మొదలగుదాని)లోని ఆరవ భాగమును పన్నుగా తీసికొనుచు కూడ ప్రజలను పుత్రులను రక్షించినట్లు రక్షించడో ఆ రాజునకు చాల గొప్ప అధర్మము కలుగును. 11

మూ. యుఞ్జానః స్వానివ ప్రాణాన్ ప్రాణైరిష్టాన్ సుతానివ,
నిత్యయుక్తః సదా రక్షన్ సర్వాన్ విషయవాసినః, 12

ప్రాప్నోతి శాశ్వతీం రామ కీర్తిం స బహువార్షికీమ్,
బ్రహ్మణః స్థానమాసాద్య తత్ర చాపి మహీయతే. 13

ప్ర. అ. సర్వాన్ = సమస్తమైన, విషయవాసినః = దేశములో నివసించు వారిని, ప్రాణైః = ప్రాణములచేత, ఇష్టాన్ = ఇష్టులైన, సుతానివ = కుమారులను వలె, స్వాన్ = తన సంబంధమైన, ప్రాణాన్ = ప్రాణములను, యుఞ్జానః ఇవ = సమర్పించుచున్నాడా అన్నట్లు, నిత్యయుక్తః = నిత్యమూ ప్రయత్నశీలుడై, సదా = ఎల్లప్పుడూ, రక్షన్ = రక్షించుచు ఉన్న, సః = ఆ రాజు, శాశ్వతీమ్ = శాశ్వతమైన, బహువార్షికీమ్ = అనేక సంవత్సరములకు సంబంధించిన, కీర్తిమ్ = కీర్తిని, ప్రాప్నోతి = పొందును. బ్రహ్మణః = బ్రహ్మయొక్క, స్థానమ్ = స్థానమును, ఆసాద్య = పొంది, తత్ర చాపి = అక్కడ కూడ, మహీయతే = గౌరవించబడును.

తా. దేశములో ఉన్న ప్రజల నందరినీ, ప్రాణతుల్యులుగా, ఇష్టులైన కుమారులను వలె, తన ప్రాణములను అర్పించుటకు సిద్ధముగా ఉన్నాడా అన్నట్లు సర్వదా రక్షించుచు, నిత్యము జాగరూకుడై ఉండు రాజునకు అనేకసంవత్సరములు స్థిరముగా నిలచు కీర్తి లభించును. ఆతడు బ్రహ్మలోకమునకు వెళ్ళి అక్కడ కూడ పూజింపబడును. 12, 13

మూ. యత్కరోతి పరం ధర్మం మునిర్మూలఫలాశనః,
తత్ర రాజ్ఞశ్చతుర్భాగః ప్రజా ధర్మేణ రక్షతః. 14

ప్ర. అ. ప్రజాః = ప్రజలను, ధర్మేణ = ధర్మముచేత, రక్షతః = రక్షించుచున్న, రాజ్ఞః = రాజునకు, మూలఫలాశనః = మూలములను ఫలములను తిను,

మునిః = ముని, యతి = ఏ, పరమ్ = గొప్ప, ధర్మమ్ = ధర్మమును, కరోతి = చేయునో, తత్ర = దానియందు, చతుర్భాగః = నాల్గవ భాగము లభించును.

తా. ప్రజలను ధర్మానుసారముగా రక్షించు రాజునకు, మూలఫలములు భుజించుచు మునులు చేయు గొప్ప తపస్సులో నాల్గవభాగము లభించును. 14

మూ. సోఽయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణో మహాన్,
త్వన్నాథోఽనాథవద్రామ రాక్షసైర్హన్యతే భృశమ్. 15

ప్ర. అ. రామ = రామా ! త్వన్నాథః = నీవు నాథుడుగా గల, బ్రాహ్మణ భూయిష్ఠః = బ్రాహ్మణులు అధికముగా గల, మహాన్ = గొప్ప దైన, సః అయమ్ = అట్టి ఈ, వానప్రస్థగణః = వానప్రస్థుల సముదాయము, అనాథవత్ = నాథుడు లేనిది వలె, రాక్షసైః = రాక్షసులచేత, భృశమ్ = మిక్కిలి, హన్యతే = పీడింపబడుచున్నది.

తా. రామా ! బ్రాహ్మణులు అధికసంఖ్యలో ఉన్న, పెద్దదైన ఈ వానప్రస్థుల సముదాయమునకు నీవు ప్రభువుగా ఉండగా కూడ రక్షకుడు లేనిదానిని వలె రాక్షసులు దీనిని ఎక్కువ పీడించుచున్నారు. 15

మూ. ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్,
హతానాం రాక్షసైర్ఘోరైర్బహూనాం బహుధా వనే. 16

ప్ర. అ. ఏహి = రమ్ము. వనే = వనమునందు, ఘోరైః = భయంకరులైన, రాక్షసైః = రాక్షసులచేత, బహుధా = అనేకవిధములుగా, హతానామ్ = చంపబడిన, భావితాత్మనామ్ = పవిత్రము చేసికొనబడిన మనస్సు గల, బహూనామ్ = అనేకులైన, మునీనామ్ = మునులయొక్క, శరీరాణి = శరీరములను, పశ్య = చూడుము.

తా. ఈ అరణ్యములో భయంకరులైన రాక్షసులు, తపఃపవిత్రములైన మనస్సులు గల ఎందరో మునులను అనేకవిధముల చంపినారు. రమ్ము; వారి శరీరములను చూడుము. 16

మూ. పమ్పానదీనివాసానామనుమన్దాకినీమపి,
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్. 17

ప్ర. అ. పమ్పానదీనివాసానామ్ = పంపానదీప్రాంతమునందు నివసించే వారియొక్క, అనుమన్దాకినీమపి = మందాకినీనదీతీరమును అనుసరించి నివసించే వారియొక్క, చిత్రకూటాలయానాం చ = చిత్రకూటపర్వతప్రాంతము నివాసముగా కలవారియొక్క, మహత్ = అత్యధికమైన, కదనమ్ = సంహారము, క్రియతే = చేయబడుచున్నది.

తా. పంపానదీప్రాంతమునందు నివసించేవారిని, మందాకినీనదీప్రాంతమునందు నివసించేవారిని, చిత్రకూటపర్వతప్రాంతమునందు నివసించేవారిని చాల ఎక్కువగా చంపుచున్నారు. 17

మూ. ఏతే వయం న మృష్యామో విప్రకారం తపస్వినామ్,
క్రియమాణం వనే ఘోరం రక్షోభిర్భీమకర్మభిః. 18

ప్ర. అ. ఏతే వయమ్ = ఈ మేము, భీమకర్మభిః = భయంకరమైన కర్మ గల, రక్షోభిః = రాక్షసులచేత, వనే = వనమునందు, క్రియమాణమ్ = చేయబడుచున్న, తపస్వినామ్ = మునులయొక్క, ఘోరమ్ = భయంకరమైన, విప్రకారమ్ = అపకారమును, న మృష్యామః = సహింపలేకున్నాము.

తా. భయంకరమైన కర్మ చేయు రాక్షసులు వనములో చేయుచున్న మునుల ఘోరవినాశనమును మేము సహింపజాలకున్నాము. 18

మూ. తతస్త్వాం శరణార్థం చ శరణ్యం సముపస్థితాః,
పరిపాలయ నో రామ వధ్యమానాన్ నిశాచరైః. 19

ప్ర. అ. తతః = ఆ కారణమువలన, రామ = రామా ! శరణ్యమ్ = రక్షకుడవైన, త్వామ్ = నిన్ను, శరణార్థమ్ = రక్షణకొరకు, సముపస్థితాః = చేరినాము. నిశాచరైః = రాక్షసులచేత, వధ్యమానాన్ = చంపబడుచున్న, నః = మమ్ములను, పరిపాలయ = పాలించుము.

తా. రామా ! ఆ కారణముచేత, మేము రక్షకుడవైన నీవద్దకు రక్షణమును కోరుచు వచ్చినాము. రాక్షసులచే చంపబడుచున్న మమ్ములను పాలింపుము

మూ. పరా త్వత్తో గతిర్వీర పృథివ్యాం నోపపద్యతే,
పరిపాలయ నః సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ. 20

ప్ర. అ. వీర = వీరుడా! త్వత్తః = నీకంటె, పరా = గొప్పదైన, గతిః = గతి(రక్షణము), పృథివ్యామ్ = భూమియందు, నోపపద్యతే = కుదరదు. నృపాత్మజ = రాజకుమారా! నః = మమ్ములను, సర్వాన్ = అందరిని, రాక్షసేభ్యః = రాక్షసులనుండి, పరిపాలయ = రక్షించుము.

తా. ఓ! వీరుడా! నిన్ను మించిన రక్షకుడు ఈ పృథివిలో మరెవ్వరూ లభింపడు. ఓ! రాజకుమారా! మమ్ముల నందరినీ రాక్షసులనుండి రక్షించుము.

మూ. ఏతచ్ఛ్రుత్వా తు కాకుత్స్థస్తాపసానాం తపస్వినామ్,
ఇదం ప్రోవాచ ధర్మాత్మా సర్వానేవ తపస్వినః. 21

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, కాకుత్స్థః = రాముడు, తపస్వినామ్ = దీనులైన, తాపసానామ్ = మునులయొక్క, ఏతత్ = ఈ వాక్యమును, శ్రుత్వా తు = విని, సర్వానేవ = సమస్తమైన, తపస్వినః = మునులను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ప్రోవాచ = పలికెను.

తా. ధర్మాత్ముడైన రాముడు దీనులైన ఆ మునీశ్వరుల మాటలు విని, ఆ మునులందరిని ఉద్దేశించి ఇట్లు పలికెను. 21

మూ. నైవమర్హథ మాం వక్తుమాజ్ఞాప్యోఽహం తపస్వినామ్,
కేవలేన స్వకార్యేణ ప్రవేష్టవ్యం వనం మయా. 22

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, మామ్ = నన్ను గూర్చి, వక్తుమ్ = పలుకుటకు, న అర్హథ = తగరు. అహమ్ = నేను, తపస్వినామ్ = మునులకు, ఆజ్ఞాప్యః = ఆజ్ఞాపింపతగినవాడను. కేవలేన = కేవలమైన, స్వకార్యేణ = నా కార్యముచేతనే, మయా = నాచేత, వనమ్ = వనము, ప్రవేష్టవ్యమ్ = ప్రవేశింపదగినది.

తా. మీరు నన్ను ఇట్లు ప్రార్థించకూడదు. మునులు నన్ను ఆజ్ఞాపించవలెను. నేను నా కార్యము నిమిత్తమే ఈ వనములో ప్రవేశించవలసి యున్నది.

మూ. విప్రకారమపాక్రష్టుం రాక్షసైర్భవతామిమమ్,
పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహమిదం వనమ్. 23

ప్ర. అ. అహమ్ = నేను, రాక్షసైః = రాక్షసులచేత, భవతామ్ =

మీయొక్క, ఇమమ్ = ఈ, విప్రకారమ్ = అపకారమును, అపాక్రష్టుమ్ = తొలగించుటకై, పితుః = తండ్రియొక్క, నిర్దేశకరః = ఆజ్ఞను చేయుచున్నవాడనై, ఇదమ్ = ఈ, వనమ్ = వనమును, ప్రవిష్టః = ప్రవేశించితిని.

తా. మీకు రాక్షసులు చేయుచున్న ఈ అపకారమును తొలగించుటకై నేను నా తండ్రిగారి ఆజ్ఞ ప్రకారము, ఈ అరణ్యములోనికి ప్రవేశించినాను. 23

మూ. భవతామర్థసిద్ధ్యర్థమాగతోఽహం యదృచ్ఛయా,
తస్య మేఽయం వనే వాసో భవిష్యతి మహాఫలః. 24

ప్ర. అ. అహమ్ = నేను, భవతామ్ = మీయొక్క, అర్థసిద్ధ్యర్థమ్ = కార్యసిద్ధికొఱకై, యదృచ్ఛయా = దైవవశముచేత, ఆగతః = వచ్చినాను. తస్య = అట్టి, మే = నాయొక్క, అయమ్ = ఈ, వనే వాసః = వననివాసము, మహాఫలః = గొప్ప ఫలము గలది, భవిష్యతి = కాగలదు.

తా. నేను నా అదృష్టవశముచే మీ కార్యమును సాధించుటకై వచ్చినాను. నా వనవాసమునకు చాల గొప్ప ఫలము లభించగలదు. 24

మూ. తపస్వినాం రణే శత్రూన్ హన్తుమిచ్ఛామి రాక్షసాన్,
పశ్యన్తు వీర్యమృషయః సభ్రాతుర్మే తపోధనాః. 25

ప్ర. అ. తపస్వినామ్ = మునులయొక్క, శత్రూన్ = శత్రువులైన, రాక్షసాన్ = రాక్షసులను, రణే = యుద్ధమునందు, హన్తుమ్ = చంపుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తపోధనాః = తపస్సే ధనముగా గల, ఋషయః = ఋషులు, సభ్రాతుః = సోదరునితో కూడిన, మే = నాయొక్క, వీర్యమ్ = పరాక్రమమును, పశ్యన్తు = చూచెదరుగాక.

తా. మునీశ్వరుల శత్రువులైన రాక్షసులను యుద్ధములో సంహరించవలెనని కోరుచున్నాను. తపస్సే ధనముగా గల ఋషు లందరు నా పరాక్రమమును, నా తమ్ముని పరాక్రమమును చూచెదరుగాక. 25

మూ. దత్త్వాభయం చాపి తపోధనానాం
ధర్మే ధృతాత్మా సహ లక్ష్మణేన,
తపోధనైశ్చాపి సహార్యదత్తః
సుతీక్ష్ణమేవాభిజగామ వీరః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షష్ఠః సర్గః.

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, ధృతాత్మా = స్థిరముగా ఉంచబడిన బుద్ధి గల, వీరః = వీరుడైన రాముడు, తపోధనానామ్ = మునులకు, అభయమ్ = అభయమును, దత్త్వా=ఇచ్చి, సహ లక్ష్మణేన = లక్ష్మణునితో కూడ, తపోధనైశ్చాపి = మునులతో కూడినవాడై, సహార్యదత్తః = పూజ్యుడైన జనకునిచే ఇవ్వబడిన సీతతో కూడినవాడై, సుతీక్ష్ణమేవ=సుతీక్ష్ణమహర్షినే గూర్చి, అభిజగామ = వెళ్లెను.

తా. ధర్మమునందు స్థిరబుద్ధి గల, వీరుడైన ఆ రాముడు మునులకు అభయ మిచ్చి లక్ష్మణునితోను, ఆ మునులతోను కలిసి, సీతాసమేతుడై సుతీక్ష్ణ మహర్షివద్దకు వెళ్లెను. 26

“బాలానందిని” యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తమః సర్గః

[సీతాలక్ష్మణసమేతుడైన రాముడు సుతీక్ష్ణమహర్షి ఆశ్రమమునకు వెళ్ళి, ఆయనతో సంభాషించి ఆ రాత్రి అక్కడనే నివసించుట.]

మూ. రామస్తు సహితో భ్రాత్రా సీతయా చ పరంతపః,
సుతీక్ష్ణస్యాశ్రమపదం జగామ సహ తైర్ద్విజైః. 1

ప్ర. అ. పరంతపః = శత్రుసంహారకుడైన, రామస్తు = రాముడు, భ్రాత్రా = సోదరునితోను, సీతయా చ = సీతతోను, సహితః = కూడినవాడై, తైః = ఆ, ద్విజైః సహ = మునులతో కూడ, సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణునియొక్క, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. శత్రుసంహారకు డైన రాముడు, సోదరునితోను, సీతతోను, ఆ మునులతోను కలిసి సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వెళ్ళెను. 1

మూ. స గత్వా దీర్ఘమధ్వానం నదీస్తీర్త్వా బహూదకాః,
దదర్శ విమలం శైలం మహామేరుమివోన్నతమ్. 2

ప్ర. అ. సః = ఆ రాముడు, దీర్ఘమ్ = దీర్ఘమైన, అధ్వానమ్ = మార్గమును, గత్వా = ప్రయాణము చేసి, బహూదకాః = చాల ఉదకము గల, నదీః = నదులను, తీర్త్వా = దాటి, మహామేరుమివ = గొప్ప మేరుపర్వతము వలె, ఉన్నతమ్ = ఉన్నతమైన, విమలమ్ = నిర్మలమైన, శైలమ్ = పర్వతమును, దదర్శ = చూచెను.

తా. ఆ రాముడు చాల దూరము ప్రయాణము చేసి, ఉదకముతో నిండిన నదులను దాటి, మహామేరుపర్వతము వలె ఉన్నతమైన, నిర్మలమైన ఒక పర్వతమును చూచెను. 2

మూ. తత స్తమిక్ష్వాకువరౌ సతతం వివిధైర్ద్రుమైః,
కాననం తౌ వివిశతుః సీతయా సహ రాఘవౌ. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఇక్ష్వాకువరౌ=ఇక్ష్వాకువంశములో శ్రేష్ఠులైన, తౌ రాఘవౌ=ఆ రామలక్ష్మణులు, సీతయా సహ=సీతతో కూడ, వివిధైః=అనేకవిధములైన, ద్రుమైః=వృక్షములతో, సతతమ్=నిండియున్న, కాననమ్= అడవిని, వివిశతుః=ప్రవేశించిరి.

తా. పిమ్మట, ఇక్ష్వాకువంశజులలో శ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు, సీతాసమేతులై, అనేకవిధములైన వృక్షాలతో దట్టముగా ఉన్న అడవిలో ప్రవేశించిరి.

మూ. ప్రవిష్టస్తు వనం ఘోరం బహుపుష్పఫలద్రుమమ్,
దదర్శాశ్రమమేకాన్తే చీరమాలాపరిష్కృతమ్. 4

ప్ర. అ. ఘోరమ్ = భయంకరమైన, బహుపుష్పఫలద్రుమమ్ = అనేక పుష్పవృక్షములు, ఫలవృక్షములూ గల, వనమ్ = వనమును, ప్రవిష్టః = ప్రవేశించిన ఆ రాముడు, ఏకాన్తే=ఒక ప్రక్క, చీరమాలాపరిష్కృతమ్=నారచీరల పంక్తులచే అలంకరించబడిన, ఆశ్రమమ్=ఆశ్రమమును, దదర్శ=చూచెను.

తా. భయంకరమైన ఆ వనము అనేక పుష్పవృక్షములతోను, ఫలవృక్షములతోను నిండి యుండెను. ఆ వనములో ప్రవేశించి రాముడు ఒక ప్రశాంతమైన ప్రదేశమునందు ఆశ్రమమును చూచెను. దాని చుట్టూ అక్కడక్కడ నారచీరలు కట్టుటచే అందముగా ఉండెను. 4

మూ. తత్ర తాపసమాసీనం మలపఙ్కజధారిణమ్,
రామః సుతీక్ష్ణం విధివత్ తపోధనమభాషత. 5

ప్ర. అ. తత్ర = అక్కడ, రామః = రాముడు, మలపఙ్కజధారిణమ్= మురికిచేత ఏర్పడిన పద్మాకారములైన చిహ్నములను ధరించిన, ఆసీనమ్ = కూర్చొని యున్న, తపోధనమ్ = తపస్సే ధనముగా గల, తాపసమ్ = మునియైన, సుతీక్ష్ణమ్ = సుతీక్ష్ణుని, విధివత్ = యథాశాస్త్రముగా చేరి, అభాషత = పలికెను.

తా. రాముడు ఆ ఆశ్రమములో కూర్చొని ఉన్న, తపస్సే ధనముగా గల సుతీక్ష్ణమహర్షిని యథాశాస్త్రముగా సమీపించి, ఆతనితో సంభాషణము చేసెను. ఆ ముని శరీరముమీద మురికిచేత పద్మాకారము లైన మచ్చలు ఏర్పడి ఉండెను.

మూ. రామోఽహమస్మి భగవన్ భవన్తం ద్రష్టుమాగతః,
తన్మాభివద ధర్మజ్ఞ మహర్షే సత్యవిక్రమ. 6

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! అహమ్ = నేను, రామః అస్మి = రాముడను; భవన్తమ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఆగతః = వచ్చినాను. తత్ = ఆ కారణమువలన, ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా ! సత్యవిక్రమ = సత్యమైన తపఃశక్తి గలవాడా ! మహర్షే = ఓ ! మహర్షీ ! మా = నన్ను గూర్చి, అభివద = మాటలాడుము.

తా. ఓ ! పూజ్యుడా ! నేను రాముడను. నిన్ను చూచుటకై వచ్చినాను. ధర్మములు తెలిసిన, సత్యమైన తపఃప్రభావము గల ఓ ! మహర్షీ ! నాతో మాటలాడుము. 6

మూ. స నిరీక్ష్య తతో ధీరో రామం ధర్మభృతాం వరమ్,
సమాశ్లిష్య చ బాహుభ్యామిదం వచనమబ్రవీత్. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధీరః = ధీరుడైన, సః = ఆ సుతీక్ష్ణమహర్షి, ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, వరమ్ = శ్రేష్ఠుడైన, రామమ్ = రాముణ్ణి, నిరీక్ష్య = చూచి, బాహుభ్యామ్ = బాహువులతో, సమాశ్లిష్య చ = కౌగలించుకొని, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. తపోనిష్ఠుడైన ఆ సుతీక్ష్ణమహర్షి, ధర్మమును పోషించేవారిలో శ్రేష్ఠుడైన ఆ రాముణ్ణి చూచి, చేతులతో కౌగలించుకొని, ఇట్లు పలికెను. 7

మూ. స్వాగతం తే రఘుశ్రేష్ఠ రామ సత్యభృతాం వర,
ఆశ్రమోఽయం త్వయాక్రాన్తః సనాథ ఇవ సామ్ప్రతమ్.

ప్ర. అ. రఘుశ్రేష్ఠ = రఘువంశమునందు శ్రేష్ఠుడా ! సత్యభృతామ్ = సత్యపాలకులలో, వర = శ్రేష్ఠుడా! రామ = రామా ! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము. సామ్ప్రతమ్ = ఇప్పుడు, త్వయా = నీచేత, ఆక్రాన్తః = ఆక్రమించ

బడిన (తొక్కబడిన), అయమ్ ఆశ్రమః = ఈ ఆశ్రమము, సనాథః ఇవ = రక్షకునితో కూడినది అయినది.

తా. రఘువంశీయులలో శ్రేష్ఠుడవు, సత్యపరిపాలకులలో అగ్రగణ్యుడవు అయిన రామా! నీకు స్వాగతము. నీవు తొక్కుటచేత నేడు ఈ ఆశ్రమమునకు రక్షకుడు లభించినట్లు అయినది. 8.

మూ. ప్రతీక్షమాణస్త్వామేవ నారోహేఽహం మహాయశః,
దేవలోకమితో వీర దేహం త్యక్త్వా మహీతలే. 9.
చిత్రకూటముపాదాయ రాజ్యభ్రష్టోఽసి మే శ్రుతః.

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి కలవాడా! వీర = వీరుడా! అహమ్ = నేను, త్వామేవ = నిన్నే, ప్రతీక్షమాణః = నిరీక్షించుచున్నవాడనై, మహీతలే = భూలోకమునందు, దేహమ్ = దేహమును, త్యక్త్వా = విడచి, ఇతః = ఇక్కడి నుండి, దేవలోకమ్ = స్వర్గలోకమును, నారోహే = ఎక్కుటలేదు. రాజ్యభ్రష్టః = రాజ్యభ్రష్టుడవై, చిత్రకూటమ్ = చిత్రకూటపర్వతమును, ఉపాదాయ = పొంది, అసి = ఉన్నావు అని, మే = నాకు, శ్రుతః = వినబడితివి.

తా. గొప్ప కీర్తిగల మహావీరుడవైన రామా! నేను నీకొరకే నిరీక్షించుచున్నాను. నీవు రాజ్యభ్రష్టుడవై చిత్రకూటపర్వతముమీద ఉన్నావని వినియుంటిని. అందుచేతనే భూలోకములో ఈ శరీరమును విడచి, స్వర్గానికి వెళ్లలేదు. 9.

మూ. ఇహోపయాతః కాకుత్స్థ దేవరాజః శతక్రతుః, 10
ఉపాగమ్య చ మే దేవో మహాదేవః సురేశ్వరః,
సర్వాన్ లోకాన్ జితానాహ మమ పుణ్యేన కర్మణా. 11

ప్ర. అ. కాకుత్స్థ = రామా! శతక్రతుః = నూరు యజ్ఞములు చేసిన, దేవరాజః = దేవేంద్రుడు, ఇహ = ఇక్కడికి, ఉపయాతః = వచ్చినాడు. మహాదేవః = గొప్ప ప్రభువు, సురేశ్వరః = దేవతాప్రభువు అయిన, దేవః = ఆ దేవేంద్రుడు, ఉపాగమ్య = వచ్చి, మమ = నాయొక్క, పుణ్యేన కర్మణా = పుణ్యకర్మచేత, సర్వాన్ = సమస్తమైన, లోకాన్ = లోకములను, జితాన్ = జయింపబడినవాటినిగా, మే = నాకు, ఆహ = చెప్పినాడు.

తా. రామా! దేవతాప్రభువైన దేవేంద్రుడు ఇక్కడికి వచ్చినాడు. గొప్ప ప్రభువైన ఆ దేవేంద్రుడు నావద్దకు వచ్చి, నా పుణ్యకర్మలచేత నేను సకల లోకములను జయించి నట్లుగా చెప్పినాడు. 11

మూ. తేషు దేవర్షిజుష్టేషు జితేషు తపసా మయా,
మత్ప్రసాదాత్సభార్య స్త్వం విహరస్వ సలక్ష్మణః. 12

ప్ర. అ. మయా = నాచేత, జితేషు = జయింపబడిన, దేవర్షిజుష్టేషు = దేవతలచేతను ఋషులచేతను పొందబడిన, తేషు = ఆ లోకములలో, సభార్యః = భార్యాసహితుడవై, సలక్ష్మణః = లక్ష్మణసమేతుడవై, త్వమ్ = నీవు, మత్ప్రసాదాత్ = నా ప్రసాదమువలన, విహరస్వ = విహరించుము.

తా. నేను దేవతలకు, ఋషులకు నివాసములైన, ఆ లోకము లన్నీ సంతోషపూర్వకముగా నీ కిచ్చుచున్నాను. నేను తపస్సుచేత జయించిన ఆ లోకములలో నీవు సీతాలక్ష్మణసహితుడవై విహరింపుము. 12

మూ. తముగ్రతపసం దీప్తం మహర్షిం సత్యవాదినమ్,
ప్రత్యువాచాత్మవాన్ రామో బ్రహ్మాణమివ వాసవః. 13

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, రామః = రాముడు, ఉగ్రతపసమ్ = ఉగ్రమైన తపస్సు గలవాడు, సత్యవాదినమ్ = సత్యమును పలుకువాడు, దీప్తమ్ = ప్రజ్వలించుచున్నవాడు అయిన, తం మహర్షిమ్ = ఆ మహర్షిని గూర్చి, వాసవః = దేవేంద్రుడు, బ్రహ్మాణమివ = బ్రహ్మను గూర్చి వలె, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. బుద్ధిశాలి యైన రాముడు, ఉగ్రమైన తపస్సుతో ప్రజ్వలించుచున్న, సత్యమును పలుకుచున్న ఆ సుతీక్ష్ణమహర్షితో, దేవేంద్రుడు బ్రహ్మదేవునితో పలికి నట్లు పలికెను. 13

మూ. అహమేవాహరిష్యామి స్వయం లోకాన్ మహామునే,
ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్టమిహ కాననే. 14

ప్ర. అ. తా. చూ. 5వ సర్గలో 33వశ్లోకం, స్వయమ్ = స్వయముగా.

మూ. భవాన్ సర్వత్ర కుశలః సర్వభూతహితే రతః,
ఆఖ్యాతం శరభఙ్గేన గౌతమేన మహాత్మనా. 15

ప్ర. అ. భవాన్ = నీవు, సర్వత్ర = అన్నిటియందు, కుశలః = నేర్పు గలవాడవు అని, సర్వభూతహితే = సకలప్రాణుల హితమునందు, రతః = ఆసక్తికలవాడ వని, గౌతమేన = గౌతమవంశమునకు చెందిన, మహాత్మనా = మహాత్ముడైన, శరభఙ్గేన = శరభంగునిచేత, అఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. నీవు సర్వకార్యములందు నేర్పు గలవాడ వని, సకలప్రాణుల హితమును కోరువాడ వని గౌతమవంశజుడైన మహాత్ము డైన శరభంగముని చెప్పినాడు. 15

మూ. ఏవముక్తస్తు రామేణ మహర్షిర్లోకవిశ్రుతః,
అబ్రవీన్మధురం వాక్యం హర్షేణ మహతా యుతః. 16

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లోకవిశ్రుతః = లోకములో ప్రసిద్ధు డైన, మహర్షిః = ఆ మహర్షి, మహతా = గొప్పదైన, హర్షేణ = సంతోషముతో, యుతః = కూడినవాడై, మధురమ్ = మధురమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. లోకములో ప్రసిద్ధుడైన ఆ సుతీక్ష్ణమహర్షి రాముని మాటలు విని చాల సంతోషించుచు మధురముగా ఇట్లు పలికెను. 16

మూ. అయమేవాశ్రమో రామ గుణవాన్ రమ్యతామితి,
ఋషిసంఘానుచరితః సదా మూలఫలైర్యుతః. 17

ప్ర. అ. రామ = రామా! ఋషిసంఘానుచరితః = ఋషీశ్వరుల సముదాయములచేత సంచరింపబడిన, సదా = ఎల్లప్పుడును, మూలఫలైః = మూలములతోను ఫలములతోను, యుతః = కూడిన, అయమ్ = ఈ, ఆశ్రమః ఏవ = ఆశ్రమమే, గుణవాన్ = మంచి గుణములు గలది. రమ్యతామ్ = క్రీడింపబడుగాక (నీవు క్రీడించెదవు గాక) ఇతి = అని పలికెను.

తా. "రామా! ఈ ఆశ్రమములో ఋషులు సంచరించుచుందురు. మూలములు ఫలములు సర్వదా లభించును. అందుచేత మంచి గుణములు గల ఈ ఆశ్రమములోనే సుఖముగా నివసించుము." 17

మూ. ఇమమాశ్రమమాగమ్య మృగసంఘా మహీయసః,
అహత్వా ప్రతిగచ్ఛన్తి లోభయిత్వాఽ కుతోభయాః. 18

ప్ర. అ. మహీయసః = పెద్దవైన, మృగసంఘాః = మృగసముదాయములు, ఇమమ్ = ఈ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆగమ్య = పొంది, లోభయిత్వా = భయపెట్టి, అహత్వా = చంపకుండగా, అకుతోభయాః = ఎవరినుండి భయము లేనివై, ప్రతిగచ్ఛన్తి = తిరిగి వెళ్ళుచుండును.

తా. "పెద్ద మృగములు గుంపులుగా వచ్చి, ఈ ఆశ్రమవాసులను భయపెట్టి, ఎట్టి భయము లేనివై తిరిగి వెళ్లిపోవుచుండును. కాని అవి ఎవరినీ చంపవు." 18

మూ. నాన్యో దోషో భవేదత్ర మృగేభ్యోఽన్యత్ర విద్ధి వై,
తచ్ఛ్రుత్వా వచనం తస్య మహర్షేర్లక్ష్మణాగ్రజః. 19
ఉవాచ వచనం ధీరో విగృహ్య సశరం ధనుః.

ప్ర. అ. అత్ర = ఇక్కడ, మృగేభ్యః = మృగములకంటె, అన్యత్ర = ఇతరములనుండి, అన్యః = మరొక, దోషః = దోషము, న భవేత్ = ఉండదు. విద్ధి వై = తెలుసుకొనుము. ధీరః = ధీరుడైన, లక్ష్మణాగ్రజః = రాముడు, తస్య మహర్షేః = ఆ మహర్షియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, సశరమ్ = బాణముతో కూడిన, ధనుః = ధనస్సును, విగృహ్య = గ్రహించి, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. "ఈ ఆశ్రమములో మృగములనుండి తప్ప మరి వేటినుండీ అపాయము లేదు అను విషయము తెలిసికొనుము". ధీరుడైన రాముడు ఆ మహర్షి మాటలు విని, బాణముతో కూడిన ధనస్సును పట్టుకొని చూపుచు ఇట్లు పలికెను. 19

మూ. తానహం సుమహాభాగ మృగసంఘాన్ సమాగతాన్, 20
హన్యాం నిశితధారేణ శరేణానతపర్వణా.

ప్ర. అ. సుమహాభాగ = మహాభాగ్యవంతుడవైన ఓ మహర్షీ, సమాగతాన్ = వచ్చిన, తాన్ = ఆ, మృగసంఘాన్ = మృగసముదాయములను, నిశితధారేణ =

వాడియైన అంచుగల, నతపర్వణా = వంగిన కణుపులు గల, శరేణ = బాణముతో, హన్యామ్ = చంపుదును.

తా. మహాభాగ్యశాలివైన మహర్షీ! ఆ మృగసముదాయములు వచ్చినప్పుడు నేను వాడియైన అగ్రభాగము, వంగిన కణుపులు ఉన్న బాణముతో చంపవచ్చును.

మూ. భవాంస్తత్రాభిషజ్యేత కింస్యాత్కృచ్ఛ్రతరం తతః, 21
ఏతస్మిన్నాశ్రమే వాసం చిరం తు న సమర్థయే.

ప్ర. అ. తత్ర = ఆ మృగములయందు, భవాన్ = నీవు, అభిషజ్యేత = ఆసక్తి కలవాడవు కావచ్చును. తతః = దానికంటె, కృచ్ఛ్రతరమ్ = ఎక్కువ కష్టము కలిగించునది, కిం స్యాత్ = ఏమి ఉండును? (అందువలన) ఏతస్మిన్ = ఈ, ఆశ్రమే = ఆశ్రమమునందు, చిరమ్ = చిరకాలము, వాసమ్ = నివాసమును, న సమర్థయే = యుక్త మని భావించను.

తా. నేను ఆ విధముగా చంపే మృగములపై నీకు దయ ఉండవచ్చును. అట్టివాటిని చంపుటవలన కలుగు కష్టముకంటె అధికమైన కష్టము ఏ ముండును? అందుచే ఈ ఆశ్రమములో చిరకాలము ఉండుట మంచిది కాదని తలచుచున్నాను. 21

మూ. తమేవముక్త్వో పరమం రామః సన్ధ్యాముపాగమత్. 22
అన్వాస్య పశ్చిమాం సన్ధ్యాం తత్ర వాసమకల్పయత్.
సుతీక్ష్ణస్యాశ్రమే రమ్యే సీతయా లక్ష్మణేన చ. 23

ప్ర. అ. రామః = రాముడు, తమ్ = ఆ సుతీక్ష్ణుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, ఉపరమమ్ = విరమించి, సన్ధ్యామ్ = సంధ్యను, ఉపాగమత్ = పొందెను (ఉపాసించెను). పశ్చిమాం సన్ధ్యామ్ = సాయంకాలసంధ్యను, అన్వాస్య = ఉపాసించి, సీతయా = సీతతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణునియొక్క, తత్ర = ఆ, రమ్యే = సుందరమైన, ఆశ్రమే = ఆశ్రమమునందు, వాసమ్ = నివాసమును, అకల్పయత్ = ఏర్పరచుకొనెను.

తా. రాముడు ఆ మహర్షితో ఇట్లు పలికి, విరమించి, సంధ్యోపాసన చేసెను. సాయంకాలసంధ్యోపాసనానంతరము రాముడు సీతాలక్ష్మణులతో కలిసి, రమ్యమైన ఆ సుతీక్ష్ణమహాముని ఆశ్రమములో నివాస మేర్పరచుకొనెను. 23

మూ. తతః శుభం తాపసయోగ్యమన్నం
స్వయం సుతీక్ష్ణః పురుషర్షభాభ్యామ్,
తాభ్యాం సుసత్కృత్య దదౌ మహాత్మా
సన్ధ్యానివృత్తౌ రజనీం సమీక్ష్య. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తమః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాత్మా = మహాత్ముడైన, సుతీక్ష్ణః = సుతీక్ష్ణమహర్షి, సన్ధ్యానివృత్తౌ = సంధ్యాకాలము గడచిన పిమ్మట, రజనీమ్ = రాత్రిని, సమీక్ష్య = చూచి, తాభ్యామ్ = ఆ, పురుషర్షభాభ్యామ్ = పురుషశ్రేష్ఠులకు, తాపసయోగ్యమ్ = మునులకు తగిన, అన్నమ్ = అన్నమును, సుసత్కృత్య = బాగుగా సత్కరించి, స్వయమ్ = స్వయముగా, దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట, మహాత్ముడైన ఆ సుతీక్ష్ణమహర్షి, సంధ్యాకాలము గడచి రాత్రి వచ్చిన దని తెలిసికొని, పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులను సత్కరించి, మునులకు తగిన ఆహారమును స్వయముగా వారికి ఇచ్చెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఏడవ సర్గ సమాప్తము.

## అథ అష్టమః సర్గః

[సీతాలక్ష్మణసమేతుడైన రాముడు ప్రాతఃకాలమునందు సుతీక్ష్ణ మహర్షి అనుమతి గైకొని ఆ ఆశ్రమమునుండి బయలుదేరి వెళ్ళుట.]

మూ. రామస్తు సహసౌమిత్రిః సుతీక్ష్ణేనాభిపూజితః,
పరిణామ్య నిశాం తత్ర ప్రభాతే ప్రత్యబుధ్యత. 1

ప్ర. అ. సహసౌమిత్రిః = లక్ష్మణునితో కూడిన, రామస్తు = రాముడు, సుతీక్ష్ణేన = సుతీక్ష్ణమహర్షిచేత, అభిపూజితః = పూజింపబడినవాడై, తత్ర = ఆ ఆశ్రమమునందు, నిశామ్ = రాత్రిని, పరిణామ్య = పరిణమింపచేసి (గడిపి), ప్రభాతే = ప్రాతఃకాలమునందు, ప్రత్యబుధ్యత = మేల్కొనెను.

తా. లక్ష్మణసమేతుడైన రాముడు సుతీక్ష్ణుని ఆతిథ్యము స్వీకరించి, రాత్రి ఆ ఆశ్రమమునందు గడపి ప్రాతఃకాలమునందు మేల్కొనెను. 1

మూ. ఉత్థాయ చ యథాకాలం రాఘవః సహసీతయా,
ఉపస్పృశ్య సుశీతేన తోయేనోత్పలగన్ధినా. 2

ప్ర. అ. రాఘవః = రాముడు, సహసీతయా = సీతతో కూడ, యథా కాలమ్ = కాలానుసారముగా, ఉత్థాయ చ = లేచి, సుశీతేన = చాల చల్లగా ఉన్న, ఉత్పలగన్ధినా = కలవల సువాసన గల, తోయేన = ఉదకముతో, ఉకస్పృశ్య = ఆచమనముచేసి (ప్రయాణోన్ముఖు డయ్యెను).

తా. రాముడు సీతతో కూడ కాలానుసారము మేల్కొని, చాల చల్లని, కలువల సువాసన గల ఉదకము ఆచమనము చేసి (ప్రయాణోన్ముఖు డయ్యెను.)

మూ. అథ తేఽగ్నిం సురాంశ్చైవ వైదేహీ రామలక్ష్మణౌ,
కాల్యం విధివదభ్యర్చ్య తపస్విశరణే వనే. 3

ఉద్యన్తం దినకరం దృష్ట్వా విగతకల్మషాః
సుతీక్ష్ణమభిగమ్యేదం శ్లక్ష్ణం వచనమబ్రువన్. 4

ప్ర. అ. అథ = అటుపిమ్మట, వైదేహీ = సీత, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, తే = వారందరు, కాల్యమ్ = ప్రాతఃకాలమునందు, అగ్నిమ్ = అగ్నిని, సురాంశ్చైవ = దేవతలను, తపస్విశరణే = మునులకు నివాసస్థానమైన, వనే = ఆ వనమునందు, విధివత్ = యథాశాస్త్రముగా, అభ్యర్చ్య = పూజించి, ఉదయన్తమ్ = ఉదయించుచున్న, దినకరమ్ = సూర్యుణ్ణి, దృష్ట్వా = చూచి, విగతకల్మషాః = పోయిన పాపము గలవారై, సుతీక్ష్ణమ్ = సుతీక్ష్ణుని, అభిగమ్య = సమీపించి, శ్లక్ష్ణమ్ = మృదువైన, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట సీతారామలక్ష్మణులు, మహర్షులకు నివాసమైన ఆ ఆశ్రమములో, ప్రాతఃకాలమునందు అగ్నిని, దేవతలను, యథాశాస్త్రముగా పూజించి, ఉదయించుచున్న సూర్యుణ్ణి చూచి, పాపరహితులై, సుతీక్ష్ణుని వద్దకు వెళ్ళి మధురముగా ఇట్లు పలికిరి. 3, 4

మూ. సుఖోషితాః స్మ భగవం స్త్వయా పూజ్యేన పూజితాః,
ఆపృచ్ఛామః ప్రయాస్యామో మునయ స్త్వరయ న్తి నః. 5

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! పూజ్యేన = పూజింపదగిన, త్వయా = నీచేత, పూజితాః = సత్కరించబడినవారమై, సుఖోషితాః = సుఖముగా నివసించిన వారము, స్మః = అయితిమి. ఆపృచ్ఛామః = వెళ్ళుటకు అనుజ్ఞ కోరుచున్నాము. ప్రయాస్యామః = వెళ్లెదము. మునయః = మునులు, నః = మమ్ములను, త్వరయన్తి = తొందరపెట్టుచున్నారు.

తా. మహామునీ! పూజ్యుడవైన నీ ఆతిథ్యము నందుకొని మేము సుఖముగా ఉంటిమి. మేము వెళ్లెదము అనుజ్ఞ ఇమ్ము. ఈ మునులు తొందరపెట్టుచున్నారు. 5

మూ. త్వరామహే వయం ద్రష్టుం కృత్స్నమాశ్రమమణ్డలమ్,
ఋషీణాం పుణ్యశీలానాం దణ్డకారణ్యవాసినామ్. 6

ప్ర. అ. వయమ్ = మేము, పుణ్యశీలానామ్ = పుణ్యమైన శీలము గల, దణ్డకారణ్యవాసినామ్ = దండకారణ్యములో నివసించు, ఋషీణామ్ = ఋషుల యొక్క, కృత్స్నమ్ = సమస్తమైన, ఆశ్రమమణ్డలమ్ = ఆశ్రమమండలమును, ద్రష్టుమ్ = చూచుటకు, త్వరామహే = తొందరపడుచున్నాము.

తా. దండకారణ్యములో నివసించుచున్న, పుణ్యస్వభావము గల ఋషుల ఆశ్రమములను అన్నింటిని చూడవలె నని మేము తొందరపడుచున్నాము. 6

మూ. అభ్యనుజ్ఞాతుమిచ్ఛామః సహైభిర్మునిపుఙ్గవైః,
ధర్మనిత్యైస్తపోదాన్తై ర్విశిఖైరివ పావకైః. 7

ప్ర. అ. ధర్మనిత్యైః = ధర్మమునందు స్థిరులు, తపోదాన్తైః = తపస్సు చేత ఆత్మనిగ్రహము కలవారు, విశిఖైః = జ్వాలలు లేని, పావకైరివ = అగ్నుల వలె ఉన్న, ఏభిః = ఈ, మునిపుఙ్గవైః = మునిశ్రేష్ఠులతో కూడ, అభ్యనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, ఇచ్ఛామః = కోరుచున్నాము.

తా. ఎల్లప్పుడు ధర్మనిరతులు, తపస్సుచేత ఆత్మనిగ్రహము సంపాదించినవారు, జ్వాలలు లేని అగ్నుల వలె ఉన్నవారు అయిన ఈ మునిశ్రేష్ఠులకు మాకు కూడ అనుజ్ఞ ఇవ్వవలె నని కోరుచున్నాము. 7

మూ. అవిషహ్యాతపో యావత్సూర్యో నాతివిరాజతే
అమార్గేణాగతాం లక్ష్మీం ప్రాప్యేవాన్వయవర్జితః, 8

తావదిచ్ఛామహే గన్తుమిత్యుక్త్వా చరణౌ మునేః
వవన్దే సహసౌమిత్రిః సీతయా సహ రాఘవః. 9

ప్ర. అ. అన్వయవర్జితః = సత్కులము లేనివాడు, అమార్గేణ = అన్యాయ మార్గముచేత, ఆగతామ్ = వచ్చిన, లక్ష్మీమ్ = లక్ష్మిని, ప్రాప్యేవ = పొంది వలె, సూర్యః = సూర్యుడు, యావత్ = ఎంతలో, అవిషహ్యాతపః = సహింప శక్యము కాని ఎండ గలవాడై, నాతివిరాజతే = ఎక్కువగా ప్రకాశించడో, తావత్ = అంతలో, గన్తుమ్ = వెళ్ళుటకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము, ఇతి = అని, ఉక్త్వా = పలికి, సీతయా సహ = సీతతో కూడిన, సహసౌమిత్రిః =

లక్ష్మణసమేతుడైన, రామః = రాముడు, మునేః = మునియొక్క, చరణౌ = పాదములను, వవన్దే = నమస్కరించెను.

తా. "అన్యాయముగా ఐశ్వర్యము లభించిన నీచవంశములో పుట్టినవాడు వలె, సూర్యుడు సహింపశక్యము కాని తాపముతో అధికముగా ప్రకాశించుటకు ముందుగానే మేము వెళ్ళవలె నని కోరుచున్నాము"అని పలుకుచు సీతాలక్ష్మణు లతో కూడిన రాముడు ఆ సుతీక్ష్ణుని పాదములకు నమస్కరించెను. 8, 9

మూ. తౌ సంస్పృశన్తౌ చరణావుత్థాప్య మునిపుఙ్గవః,
గాఢమాశ్లిష్య సస్నేహమిదం వచనమబ్రవీత్. 10

ప్ర. అ. మునిపుఙ్గవః = ఆ మునిశ్రేష్ఠుడు, చరణౌ = పాదములను, సంస్పృశన్తౌ = స్పృశించుచున్న, తౌ = వారిద్దరిని, ఉత్థాప్య = లేవదీసి, గాఢమ్ = గాఢముగా, ఆశ్లిష్య = కౌగలించుకొని, సస్నేహమ్ = స్నేహపూర్వకముగా, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ సుతీక్ష్ణమహర్షి తన పాదములను స్పృశించి నమస్కరించుచున్న ఆ రామలక్ష్మణులను లేవదీసి, కౌగలించుకొని, స్నేహపూర్వకముగా ఇట్లు పలికెను. 10

మూ. అరిష్టం గచ్ఛ పన్థానం రామ సౌమిత్రిణా సహ,
సీతయా చానయా సార్ధం ఛాయయేవానువృత్తయా. 11

ప్ర. అ. రామ = రామా! సౌమిత్రిణా సహ = లక్ష్మణునితోను, ఛాయ యేవ = నీడవలె, అనువృత్తయా = అనుసరించుచున్న, అనయా = ఈ, సీతయా సార్ధంచ = సీతతోను, అరిష్టమ్ = మంగళకరమైన, పన్థానమ్ = మార్గమును గూర్చి, గచ్ఛ = వెళ్ళుము.

తా. రామా! లక్ష్మణునితోను, నీడ వలె అనుసరించి వచ్చుచున్న ఈ సీతతోనుకలిసి శుభకర మైన మార్గమునందు ప్రయాణము చేయుము. 11

మూ. పశ్యాశ్రమపదం రమ్యం దణ్డకారణ్యవాసినామ్,
ఏషాం తపస్వినాం వీర తపసా భావితాత్మనామ్. 12

ప్ర. అ. వీర = వీరుడా! దణ్డకారణ్యవాసినామ్ = దండకారణ్యములో నివసించుచున్న, తపసా = తపస్సుచేత, భావితాత్మనామ్ = పవిత్రముచేసికొనబడిన మనస్సు గల, ఏషామ్ = ఈ, తపస్వినామ్ = మునులయొక్క, రమ్యమ్ = సుందరమైన, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, పశ్య = చూడుము.

తా. ఓ వీరుడా! తపస్సుచేత మనస్సును పరిశుద్ధముచేసికొని ఉన్న ఈ దండకారణ్యనివాసులైన మునుల రమ్యములైన ఆశ్రమములను చూడుము. 12

మూ. సుప్రాజ్యఫలమూలాని పుష్పితాని వనాని చ
ప్రశస్తమృగయూథాని శాన్తపక్షిగణాని చ. 13

ఫుల్లపఙ్కజఖణ్డాని ప్రసన్నసలిలాని చ
కారణ్డవవికీర్ణాని తటాకాని సరాంసి చ. 14

ద్రక్ష్యసే దృష్టిరమ్యాణి గిరిప్రస్రవణాని చ
రమణీయాన్యరణ్యాని మయూరాభిరుతాని చ. 15

ప్ర. అ. సుప్రాజ్యఫలమూలాని = చాల అధికమైన ఫలములు మూలములు గలవి, పుష్పితాని = పుష్పించినవి, ప్రశస్తమృగయూథాని = ప్రశస్తమైన మృగముల గుంపులు గలవి, శాన్తపక్షిగణాని చ = శాంతముగా ఉన్న పక్షి సముదాయములు కలవి అయిన, వనాని చ = వనములను, ఫుల్లపఙ్కజఖణ్డాని = వికసించిన పద్మసముదాయములు గల, ప్రసన్నసలిలాని చ = నిర్మలములైన ఉదకములు గల, కారణ్డవవికీర్ణాని = కారండవపక్షులచే వ్యాప్తములైన, తటాకాని = చిన్న చెరువులను, సరాంసి చ = పెద్ద సరస్సులను, దృష్టిరమ్యాణి = దృష్టికి రమ్యములైన, గిరిప్రస్రవణాని చ = సెలయేళ్ళను, మయూరాభిరుతాని = నెమళ్లచేత ధ్వనింపచేయబడిన, రమణీయాని = సుందరములైన, అరణ్యాని = అరణ్యములను, ద్రక్ష్యసే = చూడగలవు.

తా. నీవు ఈ ప్రాంతమునందు సంచరించుచు అనేకరమ్యప్రదేశములను చూడవచ్చును. ఇక్కడ వనములు ఫలములతోను మూలములతోను సమృద్ధములై పుష్పించి ఉండును. ప్రశస్తములైన మృగములు గుంపులు గుంపులుగా

తిరుగుచుండును. పక్షుల సముదాయములు శాంతములై సుఖముగా విహరించు చుండును. ఇక్కడ నున్న చిన్న చెరువులలోను, పెద్ద చెరువులలోను పద్మముల సముదాయములు వికసించి ఉండును. ఉదకములు నిర్మలములై ఉండును. కారండవము లను నీటిపక్షులు ఈ చెరువులలో విహరించుచుండును. కొండలమీద నుండి పడుచున్న జలపాతములు చూచుటకు రమ్యముగా ఉండును. నెమళ్ళ కూతలతో ప్రతిధ్వనించు అరణ్యములు మనోహరములుగా ఉండును. వీటి నన్నింటిని చూడుము. 13, 14, 15

మూ. గమ్యతాం వత్స సౌమిత్రే భవానపి చ గచ్ఛతు,
ఆగన్తవ్యం చ తే దృష్ట్వా పునరేవాశ్రమం ప్రతి. 16

ప్ర. అ. వత్స=వత్సా! రామా! గమ్యతామ్=వెళ్ళెదవుగాక. సౌమిత్రే= లక్ష్మణా, భవానపిచ = నీవుకూడ, గచ్ఛతు = వెళ్ళెదవుగాక. దృష్ట్వా = చూచి, పునరేవ = మరల, ఆశ్రమం ప్రతి = ఈ ఆశ్రమమును గూర్చి, తే=నీకు (వు), ఆగన్తవ్యమ్ = రావలెను.

తా. రామా! నీవు వెళ్లుము; లక్ష్మణా నీవు కూడ వెళ్లుము; వాటి నన్నింటిని చూచిన పిమ్మట మీరు మరల ఈ ఆశ్రమమునకు రావలెను. 16

మూ. ఏవముక్తస్తథేత్యుక్త్వా కాకుత్థ్సః సహలక్ష్మణః,
ప్రదక్షిణం మునిం కృత్వా ప్రస్థాతుముపచక్రమే. 17

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, కాకుత్థ్సః = రాముడు, సహలక్ష్మణః = లక్ష్మణసహితుడై, తథేతి = అట్లే చేసెదను అని, ఉక్త్వా = పలికి, మునిమ్=మునిని, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, ప్రస్థాతుమ్= బయలుదేరుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. లక్ష్మణసహితుడైన రాముడు ఆ ముని మాటలు విని, "అట్లే చేసెదను"అని చెప్పి, ఆ మునికి ప్రదక్షిణనమస్కారములు చేసి, ప్రయాణము నకు సన్నద్ధు డయ్యెను. 17

మూ. తతః శుభతరే తూణీ ధనుషీ చాయతేక్షణా,
దదౌ సీతా తయోర్భ్రాత్రోః ఖడ్గౌ చ విమలౌ తతః. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఆయతేక్షణా=విశాలములైన నేత్రములు గల, సీతా = సీత, తయోః = ఆ, భ్రాత్రోః = సోదరులకు, శుభతరే = చాల శుభకరములైన, తూణీ = అంబులపొదులను, ధనుషీ చ=ధనస్సులను, తతః= పిమ్మట, విమలౌ = నిర్మలములైన, ఖడ్గౌ చ = ఖడ్గములను, దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట, విశాలములైన నేత్రములు గల సీత ఆ సోదరులకు శుభకరము లైన అంబులపొదులను, ధనస్సులను, నిర్మలములైన ఖడ్గములను ఇచ్చెను.

మూ. ఆబధ్య చ శుభే తూణీ చాపే చాదాయ సస్వనే,
నిష్క్రాన్తావాశ్రమాద్గన్తుముభౌ తౌ రామలక్ష్మణౌ. 19

ప్ర. అ. తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, ఉభౌ = ఇద్దరూ, శుభే = సుందరములైన, తూణీ = అంబులపొదులను, ఆబధ్య చ = కట్టుకొని, సస్వనే=ధ్వనితో కూడిన, చాపే చ=ధనస్సులను కూడ, ఆదాయ=గ్రహించి, గన్తుమ్ = వెళ్ళుటకు, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, నిష్క్రాన్తే = బయలుదేరినారు.

తా. ఆ రామలక్ష్మణులు, సుందరములైన అంబులపొదులు భుజములకు కట్టుకొని, ధ్వని చేయుచున్న ధనస్సులు చేతబట్టి ఆ ఆశ్రమమునుండి బయల్దేరిరి. 19

మూ. శీఘ్రం తౌ రూపసంపన్నావనుజ్ఞాతౌ మహర్షిణా,
ప్రస్థితౌ ధృతచాపాసీ సీతయా సహ రాఘవౌ. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర. అ. రూపసంపన్నౌ = మంచి రూపముతో కూడిన, తౌ రాఘవౌ = ఆ రామలక్ష్మణులు, మహర్షిణా = మహర్షిచేత, అనుజ్ఞాతౌ = అనుజ్ఞ ఇవ్వబడినవారై, ధృతచాపాసీ = ధరించబడిన ధనస్సు ఖడ్గములు కలవారై, సీతయా సహ = సీతతో కూడ, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రస్థితౌ = ప్రయాణమైరి.

తా. మనోహరరూపసంపన్నులైన ఆ రామలక్ష్మణులు, ఆ సుతీక్ష్ణమహా ముని అనుజ్ఞ పొంది, ధనస్సులను, ఖడ్గములను ధరించి, సీతాసమేతులై శీఘ్రముగా బయలుదేరిరి. 20

'బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ నవమః సర్గః

[“మనకు ఏ అపకారమూ చేయనివారిని హింసించుట న్యాయము కాదు గాన నీవు అహింసావ్రతమును పాటించుట యుక్తము” అని సీత రాముని ప్రార్థించుట.]

మూ. సుతీక్ష్ణేనాభ్యనుజ్ఞాతం ప్రస్థితం రఘునన్దనమ్,
హృద్యయా స్నిగ్ధయా వాచా భర్తారమిదమబ్రవీత్. 1

ప్ర. అ. సుతీక్ష్ణేన = సుతీక్ష్ణునిచేత, అభ్యనుజ్ఞాతమ్ = అనుమతింపబడిన, ప్రస్థితమ్ = ప్రయాణమైన, భర్తారమ్ = భర్తయైన, రఘునన్దనమ్ = రాముణ్ణి గూర్చి, (సీత) హృద్యయా = మనోహరము, స్నిగ్ధయా = స్నేహపూర్ణము అయిన, వాచా = వాక్కుతో, ఇదమ్ = దీనిని, అబ్రవీత్ = పలికెను.

తా. సుతీక్ష్ణమహర్షి అనుమతి పొంది బయలుదేరిన భర్త యైన రామునితో సీత మనోహరములు, స్నేహభరితములు, అయిన మాటలు పలుకుచు ఇట్లనెను.

మూ. అయం ధర్మః సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్,
నివృత్తేన తు శక్యోఽయం వ్యసనాత్కామజాదిహ. 2

ప్ర. అ. మహాన్ = గొప్పదైన, అయం ధర్మః = ఈ ధర్మము, సుసూక్ష్మేణ = చాల సూక్ష్మమైన, విధినా = విధానముచేత, ప్రాప్యతే = పొందబడును. అయమ్ = ఈ ధర్మము, కామజాత్ = కామమువలన కలిగిన, వ్యసనాత్ = వ్యసనమునుండి, నివృత్తేన = నివర్తించినవానిచేతనే, ఇహ = ఈ లోకమునందు, శక్యః = పొందశక్య మైనది.

తా. మహాధర్మసంపాదనము చాల సూక్ష్మమైన పద్ధతిని అవలంబించి చేయవచ్చును. కామజములైన వ్యసనములకు దూరముగా ఉన్నవాడే, ఈ లోకములో ఈ ధర్మమును సంపాదించగలడు. 2

మూ. త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవన్త్యుత,
మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురుతరావుభౌ. 3
పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా.

ప్ర. అ. అత్ర = ఈ లోకములో, కామజాని = కామమువలన పుట్టిన, వ్యసనాని = వ్యసనములు, త్రీణ్యేవ = మూడే, ఉత = తప్పక, భవన్తి = ఉండును. మిథ్యావాక్యమ్ = అసత్యవాక్యము, పరమకమ్ = గొప్ప వ్యసనము. పరదారాభిగమనమ్ = పరభార్యాగమనము, వినా వైరమ్ = వైరము లేకుండా, రౌద్రతా = క్రూరత్వము అను, ఉభౌ = ఈ రెండు వ్యసనములు, తస్మాత్ = ఆ మిథ్యావాక్యముకంటె కూడ, గురుతరౌ = గొప్పవి (చాల చెడ్డవి).

తా. కామమువలన కలుగు వ్యసనములు మూడు-వాటిలో అసత్యవాక్యము పలుకుట అనేది పెద్ద వ్యసనము. పరభార్యాగమనము, వైరము లేకుండగనే క్రూరముగా ప్రవర్తించుట అనే రెండూ దానికంటె కూడ చాల చెడ్డవి. 3

మూ. మిథ్యావాక్యం న తే భూతం న భవిష్యతి రాఘవ, 4
కుతోఽభిలాషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్.

ప్ర. అ. రాఘవ = రామా! మిథ్యావాక్యమ్ = అసత్యవాక్యము, తే = నీకు, న భూతమ్ = పూర్వ మెన్నడూ లేదు. న భవిష్యతి = మున్ముందు ఉండదు. ధర్మనాశనమ్ = ధర్మమును నశింపచేసే, పరేషామ్ = పరులయొక్క, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, అభిలాషణమ్ = అభిలషించుట, కుతః = నీ కెట్లుండును?

తా. రామా! అసత్యవాక్యమును పూర్వ మెన్నడూ నీ వెరుగవు. ఇటుపైన కూడ అది నీకు ఉండదు. ధర్మనాశమునకు హేతువైన పరస్త్రీవాంఛ నీకు ఉండుట అసంభావ్యము. 4

మూ. తవ నాస్తి మనుష్యేన్ద్ర న చాభూత్తే కదాచన, 5
మనస్యపి తథా రామ న చైతద్విద్యతే క్వచిత్.

ప్ర. అ. మనుష్యేన్ద్ర = మనుష్యుల ప్రభువైన రామా! తవ = నీకు, ఏతత్ = పరదారాభిలాష, నాస్తి = లేదు. తే = నీకు, కదాచన = ఎన్నడును,

న అభూత్ చ = పూర్వము కలగలేదు. రామ = రామా ! తథా = అట్లే, మనస్యపి = మనస్సులో కూడ, క్వచిత్ = ఎక్కడను, న విద్యతే = లేదు.

తా. మనుష్యుల ప్రభువువైన రామా ! పరదారాభిలాష పూర్వము నీ కెన్నడును కలుగలేదు. ఇప్పుడు కూడ లేదు. నీ మనస్సులో కూడ ఏ మూలలోను ఇది లేదు. 5

మూ. స్వదారనిరత స్త్వం చ నిత్యమేవ నృపాత్మజ, 6
ధర్మిష్ఠః సత్యసంధశ్చ పితుర్నిర్దేశకారకః.

ప్ర. అ. నృపాత్మజ = రాజకుమారా ! త్వమ్ = నీవు, నిత్యమేవ = ఎల్లప్పుడు, స్వదారనిరతః = స్వభార్యయందే ఆసక్తి గలవాడవు. ధర్మిష్ఠః = ధర్మాత్ముడవు, సత్యసంధశ్చ = సత్యసంధుడవు, పితుః = తండ్రియొక్క, నిర్దేశకారకః = ఆజ్ఞను పాలించువాడవు.

తా. రాజకుమారా ! నీవు నిత్యము స్వభార్యయందు మాత్రమే ఆసక్తి గలవాడవు. ధర్మాత్ముడవు. సత్యసంధుడవు. తండ్రి ఆజ్ఞను పాలించువాడవు. 6

మూ. సత్యసంధ మహాభాగ శ్రీమన్ లక్ష్మణపూర్వజ,
త్వయి ధర్మశ్చ సత్యం చ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్.

ప్ర. అ. సత్యసంధ = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడా ! మహాభాగ = గొప్ప భాగ్యము గలవాడా! శ్రీమన్ = ఐశ్వర్యవంతుడా; లక్ష్మణపూర్వజ = రామా ! త్వయి = నీయందు, ధర్మశ్చ = ధర్మము, సత్యం చ = సత్యము ఉన్నవి. త్వయి = నీయందే, సర్వమ్ = సమస్తమూ, ప్రతిష్ఠితమ్ = నిలచి ఉన్నది.

తా. సత్యసంధుడవు, మహాభాగ్యవంతుడవు, శ్రీమంతుడవు అయిన ఓ ! రామా ! ధర్మము, సత్యమూ కూడ నీయందే ఉన్నది. ఇతర సద్గుణములు కూడ నీయందే స్థిరముగా ఉన్నవి. 7

మూ. తచ్చ సర్వం మహాబాహో శక్యం ధర్తుం జితేన్ద్రియైః, 8
తవ వశ్యేన్ద్రియత్వం చ జానామి శుభదర్శన.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! తత్ = ఆ, సర్వమ్

= సత్యసంధత్వాదికము అంతయు, జితేన్ద్రియైః = జయించబడిన ఇంద్రియములు కలవారిచేత, ధర్తుమ్ = పాలించుటకు, శక్యమ్ = శక్య మైనది. శుభదర్శన = శుభకరమైన దర్శనము కలవాడా ! తవ = నీయొక్క, వశ్యేన్ద్రియత్వమ్ = వశ్యములైన ఇంద్రియములు కలిగియుంటను, జానామి = నే నెరుగుదును.

తా. ఓ! మహాబాహూ! ఇంద్రియములను జయించినవారు మాత్రమే ఈ సత్యసంధత్వాదులను కాపాడుకొనగలరు. చూచువారికి శుభప్రదుడవైన రామా ! నీవు ఇంద్రియములను వశములో ఉంచుకొన్నవాడవు అను విషయము నే నెరుగుదును. 8

మూ. తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభిహింసనమ్, 9
నిర్వైరం క్రియతే మోహాత్తచ్చ తే సముపస్థితమ్.

ప్ర. అ. నిర్వైరమ్ = వైరము లేకుండా, యత్ = ఏ, ఇదమ్ = ఈ, రౌద్రమ్ = భయంకరమైన, పరప్రాణాభిహింసనమ్ = పరప్రాణములను హింసించుట, మోహాత్ = అజ్ఞానమువలన, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = ఆ, తృతీయమ్ = మూడవ వ్యసనము, తే = నీకు, సముపస్థితమ్ = వచ్చిపడినది.

తా. వైర మేమీ లేకుండగనే, అజ్ఞానముచేత, పరులప్రాణములను తీయుట అను మూడవదైన భయంకరమైన వ్యసనము ఇప్పుడు నీకు ఆకస్మికముగా వచ్చినది. 9

మూ. ప్రతిజ్ఞాతస్త్వయా వీర దణ్డకారణ్యవాసినామ్. 10
ఋషీణాం రక్షణార్థాయ వధః సంయతి రక్షసామ్.

ప్ర. అ. వీర = వీరుడా! దణ్డకారణ్యవాసినామ్ = దండకారణ్యములో నివసించుచున్న, ఋషీణామ్ = ఋషులయొక్క, రక్షణార్థాయ = రక్షణముకొరకు, సంయతి = యుద్ధమునందు, రక్షసామ్ = రాక్షసులయొక్క, వధః = వధ, త్వయా = నీచేత, ప్రతిజ్ఞాతః = ప్రతిజ్ఞచేయబడినది.

తా. "దండకారణ్యములో నివసించు ఋషులను రక్షించుటకై యుద్ధములో రాక్షసులను సంహరించెదను" అని నీవు ప్రతిజ్ఞ చేసినావు. 10

మూ. ఏతన్నిమిత్తం చ వనం దణ్డకా ఇతి విశ్రుతమ్, 11
ప్రస్థితస్త్వం సహ భ్రాత్రా ధృతబాణశరాసనః.

ప్ర. అ. ఏతన్నిమిత్తమ్ = దీనికొరకే, త్వమ్ = నీవు, ధృతబాణశరాసనః = ధరించబడిన బాణములు ధనస్సు కలవాడవై, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, దణ్డకాః ఇతి = దండకారణ్య మని, విశ్రుతమ్ = ప్రసిద్ధమైన, వనమ్ = వనమును గూర్చి, ప్రస్థితః = ప్రయాణ మైనావు.

తా. ఈ కార్యమును పూర్తిచేయుటకే నీవు సోదరునితో కలిసి, ధనుర్బాణములు ధరించి, దండకారణ్యమునకు బయలుదేరినావు. 11

మూ. తతస్త్వాం ప్రస్థితం దృష్ట్వా మమ చిన్తాకులం మనః, 12
త్వద్వృత్తం చిన్తయన్త్యా వై భవేన్నిశ్శ్రేయసం హి తత్.

(''నిశ్శ్రేయసం హితమ్''అని గోరఖ్‌పూర్ ప్రతి పాఠము).

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రస్థితమ్ = బయలుదేరిన, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, మమ = నాయొక్క, మనః = మనస్సు, చిన్తాకులమ్ = చింతచేత వ్యాకుల మైనది. త్వద్వృత్తమ్ = నీ ప్రవర్తనను గూర్చి, చిన్తయన్త్యాః = ఆలోచించుచున్న, నాకు, హితమ్ = హితకరమైన, నిశ్శ్రేయసమ్ = క్షేమము, భవేత్ వై = అగును కదా.

తా. నీవు ఆ విధముగా బయలుదేరుట చూచి నా మనస్సు చింతాకుల మైనది. నీవు ఏ విధముగా ప్రవర్తింతువో, దానిలోని మంచిచెడ్డలను గూర్చి నేను ఆలోచించి నపుడే హితకరమైన క్షేమము కలుగును. అందుచే నేను ఆలోచించ వలసి వచ్చినది.

వి. ప్రాచ్యపాఠంలో అన్వయం చక్కగా కుదురుతుంది.

''త్వాం చైవ ప్రస్థితం దృష్ట్వా రామ చిన్తాకులం మనః,
సర్వతశ్చిన్తయన్త్యా మే తవ నిఃశ్రేయసం నృప.''

అని ఆ పాఠము. ''నీవు అట్లు బయలుదేరుట చూడగానే, అన్ని కోణాలనుండీ

నీ శ్రేయస్సును గూర్చి ఆలోచించే నా మనస్సు చింతాకుల మైనది" అని దాని భావము. 12

మూ. న హి మే రోచతే వీర గమనం దణ్డకాన్ ప్రతి,
కారణం తత్ర వక్ష్యామి వదన్త్యాః శ్రూయతాం మమ.

ప్ర. అ. వీర=ఓ! వీరుడా! దణ్డకాన్ ప్రతి=దండకారణ్యమును గూర్చి, గమనమ్=వెళ్లుట, మే=నాకు, న రోచతే=ఇష్టము కాదు. తత్ర=దానియందు, కారణమ్ = కారణమును, వక్ష్యామి = చెప్పెదను. మమ = నేను, వదన్త్యాః = చెప్పుచుండగా, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. ఓ! వీరుడా! దండకారణ్యమునకు వెళ్లుట నా కిష్టము కాదు. అందుకు కారణము చెప్పెదను వినుము. 13

మూ. త్వం హి బాణధనుష్పాణిర్భ్రాత్రా సహ వనం గతః, 14
దృష్ట్వా వనచరాన్ సర్వాన్ కచ్చిత్కుర్యాః శరవ్యయమ్.

ప్ర. అ. బాణధనుష్పాణిః = బాణములు ధనస్సు హస్తమునందు గల, త్వమ్ = నీవు, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, వనమ్ = వనమును గూర్చి, గతః = వెళ్ళినవాడవై, సర్వాన్ = సమస్తమైన, వనచరాన్ = వనములో సంచరించే మృగాదులను, దృష్ట్వా = చూచి, శరవ్యయమ్ = బాణములవ్యయమును, కచ్చిత్కుర్యాః = చేయుదువు కదా.

తా. నీవు ధనుర్బాణములు ధరించి సోదరునితో అరణ్యములో ప్రవేశించి, అక్కడ ఉన్న మృగాదులను చూచి బాణప్రయోగము చేయుదువు కదా?

వి. ''కచ్చిత్కుర్యాః"అను పాఠమునకు బదులు "కిం న కుర్యాః"అను ప్రాచ్యపాఠము బాగున్నది. 'కిం న కుర్యాః=చేయకుండా ఉందువా?'అని అర్థము. "కచ్చిత్ కామప్రవేదనే"అని చెప్పిన ప్రకారము అట్లు చేయుట యుక్తము; అట్లే చేసెదవు కదా?"అనే అర్థము వచ్చును. 1'

మూ. క్షత్రియాణాం చ హి ధనుర్హుతాశస్యేన్ధనాని చ.
సమీపతః స్థితం తేజో బలముచ్ఛ్రయతే భృశమ్.

ప్ర. అ. క్షత్రియాణామ్ = క్షత్రియులకు, సమీపతః = సమీపమునందు, స్థితమ్ = ఉన్న, ధనుః = ధనస్సు, హుతాశస్య = అగ్నికి సమీపమునం దున్న, ఇన్ధనాని చ = కట్టెలు, భృశమ్ = మిక్కిలి, తేజః = తేజస్సును, బలమ్ = బలమును, ఉచ్ఛ్రయతే = పెంపొందించును.

తా. అగ్నికి సమీపమునం దున్న కట్టెలు ఆ అగ్ని తేజోబలములను వృద్ధిపొందించి నట్లు, ధనస్సు దగ్గర ఉన్నచో అది క్షత్రియుల తేజోబలములను వృద్ధిపొందించును. 15

మూ. పురా కిల మహాబాహో తపస్వీ సత్యవాక్ఛుచిః, 16
కస్మిం శ్చిదభవత్పుణ్యే వనే రతమృగద్విజే.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! పురా = పూర్వము, పుణ్యే = పుణ్యమైన, రతమృగద్విజే = ఆనందించుచున్న మృగములు, పక్షులు గల, కస్మింశ్చిత్ = ఒకానొక, వనే = వనమునందు, సత్యవాత్ = సత్యమైన వాక్కు గలవాడు, శుచిః = పవిత్రుడుఅయిన, తపస్వీ = ముని, అభవత్ కిల = ఉండెడివాడట.

తా. ఓ! మహాబాహూ పూర్వము, మృగములు, పక్షులు సుఖముగా నివసించుచున్న ఒకానొక పవిత్ర మైన ఆశ్రమములో, సత్యమునే వలుకు వాడు, పరిశుద్ధుడు అయిన ఒక ముని నివసించేవాడట. 16

మూ. తస్యైవ తపసో విఘ్నం కర్తుమిన్ద్రః శచీపతిః, 17
ఖడ్గపాణిరథాగచ్ఛదాశ్రమం భటరూపధృత్.

ప్ర. అ. అథ = పిమ్మట, శచీపతిః = శచీదేవి భర్త యైన, ఇన్ద్రః = ఇంద్రుడు, తస్యైవ = ఆ మహర్షియొక్క, తపసః = తపస్సునకు, విఘ్నమ్ = విఘ్నమును, కర్తుమ్ = చేయుటకు, భటరూపధృత్ = భటుని రూపమును ధరించినవాడై, ఖడ్గపాణిః = ఖడ్గము హస్తమునందు కలవాడై, ఆశ్రమమ్ = ఆ ఆశ్రమమును గూర్చి, ఆగచ్ఛత్ = వచ్చెను.

తా. ఒకనాడు, శచీపతి యైన ఇంద్రుడు ఆతని తపస్సుకు విఘ్నము

చేయుటకై, భటుని రూపముతో ఖడ్గమును చేతిలో ధరించి ఆ ఆశ్రమమునకు వచ్చెను. 17

మూ. తస్మింస్తదాశ్రమపదే నిశితః ఖడ్గ ఉత్తమః, 18
స న్యాసవిధినా దత్తః పుణ్యే తపసి తిష్ఠతః.

ప్ర. అ. తదా = అప్పుడు, తస్మిన్ ఆశ్రమపదే = ఆ ఆశ్రమమునందు, పుణ్యే = పుణ్యమైన, తపసి = తపస్సునందు, తిష్ఠతః = ఉంటూన్న ఆ మునికి, నిశితః = వాడి యైన, ఉత్తమః = శ్రేష్ఠమైన, సః ఖడ్గః = ఆ ఖడ్గము, న్యాసవిధినా = న్యాసరూపమున, దత్తః = ఇవ్వబడినది. (కొంత కాలము దాచుటకై ఇచ్చిన వస్తువు న్యాసము).

తా. ఆ ఆశ్రమములో పుణ్యమైన తపస్సు చేయుచున్న ఆ మునీశ్వరునకు దేవేంద్రుడా వాడియైన, శ్రేష్ఠమైన ఖడ్గమును న్యాసముగా "దీనిని కొంత కాలము నీవద్ద ఉంచుము, మరలవచ్చి తీసికొందును"అని చెప్పి ఇచ్చినాడట. 18

మూ. స తచ్ఛస్త్రమనుప్రాప్య న్యాసరక్షణతత్పరః, 19
వనే తు విచరత్యేవ రక్షన్ ప్రత్యయమాత్మనః.

ప్ర. అ. సః తు = ఆమునీశ్వరుడైతే, తత్ = ఆ, శస్త్రమ్ = ఆయుధమును, అనుప్రాప్య = పొంది, ఆత్మనః = తనయొక్క, ప్రత్యయమ్ = నమ్మకమును (విశ్వాసయోగ్యత్వమును), రక్షన్ = రక్షించుచు, న్యాసరక్షణతత్పరః = న్యాసమును రక్షించుటయందు ఆసక్తి కలవాడై, వనే = వనమునందు, విచరత్యేవ = సంచరించుచుండెను.

తా. ఆ మునీశ్వరుడు ఆ ఆయుధము దొరికినది మొదలు తన విశ్వాసయోగ్యత్వమును నిరూపించుకొనుటకై ఆ న్యాసమును రక్షించుటకై అత్యంతము ఆసక్తితో ఆ వనములో (ఆ ఆయుధముతోనే) సంచరించుచుండెను. 19

మూ. యత్ర గచ్ఛత్యుపాదాతుం మూలాని చ ఫలాని చ, 20
న వినా యాతి తం ఖడ్గం న్యాసరక్షణతత్పరః.

ప్ర. అ. న్యాసరక్షణతత్పరః = న్యాసమును రక్షించుటయందు ఆసక్తి గలవాడై, మూలాని చ = మూలములను, ఫలాని చ = ఫలములను, ఉపాదా

తుమ్ = గ్రహించుటకు, యత్ర = ఎక్కడికి, గచ్ఛతి = వెళ్లునో, అక్కడ, తం ఖడ్గం వినా = ఆ ఖడ్గము లేకుండా, స యాతి = వెళ్లడు.

తా. ఆ న్యాసమును రక్షించవలె ననే శ్రద్ధతో ఆ మునీశ్వరుడు, మూలములను ఫలములను గ్రహించుటకు ఎక్కడికి వెళ్ళినను ఆ ఖడ్గము లేకుండా వెళ్ళేవాడు కాదు. 20

మూ. నిత్యం శస్త్రం పరివహన్ క్రమేణ స తపోధనః, 21
చకార రౌద్రీం స్వాం బుద్ధిం త్యక్త్వా తపసి నిశ్చయమ్.

ప్ర. అ. నిత్యమ్ = నిత్యమూ, శస్త్రమ్ = ఆ అయుధమును, పరివహన్ = ధరించుచున్న, సః తపోధనః = ఆ మునీశ్వరుడు, తపసి = తపస్సునందు, నిశ్చయమ్ = నిశ్చయమును, త్యక్త్వా = విడచి, క్రమేణ = క్రమముచేత, స్వామ్ = తనసంబంధమైన, బుద్ధిమ్ = బుద్ధిని, రౌద్రీమ్ = క్రూరమైనదానినిగా, చకార = చేసెను.

తా. నిత్యమూ అయుధమును ధరించుచుండుటచేత ఆ మునీశ్వరునకు క్రమముగా తపస్సుపై శ్రద్ధ తగ్గిపోయెను. కాలక్రమమున అతని బుద్ధి కూడ క్రూరముగా అయ్యెను. 21

మూ. తతః స రౌద్రేఽభిరతః ప్రమత్తోఽధర్మకర్శితః, 22
తస్య శస్త్రస్య సంవాసాజ్జగామ నరకం మునిః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తస్య = ఆ, శస్త్రస్య = అయుధము యొక్క, సంవాసాత్ = సామీప్యమువలన, రౌద్రే = క్రూరకార్యమునందు, అభిరతః = ఆసక్తుడైన, సః మునిః = ఆ మునీశ్వరుడు, ప్రమత్తః = ఏమరిపాటుతో కూడినవాడై, అధర్మకర్శితః = అధర్మముచేత కృశింపచేయబడినవాడై, నరకమ్ = నరకమును, జగామ = వెళ్లెను.

తా. ఆ అయుధము దగ్గరఉండుటచే ఆ మునీశ్వరుడు తన కర్తవ్యమును మరచి, క్రూరమైన హింసయందు అభిరుచి కలిగినవాడై, అధర్మముచేత ధర్మము దుర్బలము కాగా, నరకమును పొందెను. 22

మూ. ఏవమేతత్పురా వృత్తం శస్త్రసంయోగకారణమ్, 23
అగ్నిసంయోగవద్ధేతుః శస్త్రసంయోగ ఉచ్యతే,
స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం న శిక్షయే.

ప్ర. అ. పురా = పూర్వము, ఏతత్ = ఈ, శస్త్రసంయోగకారణమ్ = శస్త్రముతో సంబంధము కారణముగా గల నరకపతనము, వృత్తమ్ = జరిగినది. శస్త్రసంయోగః = శస్త్రముతో సంబంధము, అగ్నిసంయోగవత్ = అగ్నితో సంబంధము వలె, హేతుః = అపాయమునకు హేతువుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది. స్నేహాచ్చ = స్నేహమువలన, బహుమానాచ్చ = గౌరవభావమువలనా, త్వామ్ = నిన్ను, స్మారయే = స్మరింపచేయుచున్నాను. న శిక్షయే = బోధించుటలేదు.

తా. ఈ విధముగ పూర్వము శస్త్రముతో సంబంధమువలన అపాయము కలిగినది. శస్త్రసంబంధము, అగ్నిసంబంధము వలె ప్రమాదమునకు హేతువు. నీపై నాకున్న ప్రేమచేతను, గౌరవభావముచేతను నీకు నేను ఈ విషయమును గుర్తుచేయుచున్నానే కాని నీకు తెలియని విషయముగా బోధించుటలేదు. 23, 24

మూ. న కథంచన సా కార్యా గృహీతధనుషా త్వయా,
బుద్ధిర్వైరం వినా హన్తుం రాక్షసాన్ దణ్డకాశ్రితాన్, 25
అపరాధం వినా హన్తుం లోకాన్ వీర న కామయే.

ప్ర. అ. గృహీతధనుషా = గ్రహింపబడిన ధనస్సు గల, త్వయా = నీచేత, వైరం వినా = వైరము లేకుండా, దణ్డకాశ్రితాన్ = దండకారణ్యమును ఆశ్రయించిన, రాక్షసాన్ = రాక్షసులను, హన్తుమ్ = చంపుటకు, సా బుద్ధిః = అట్టి ఆలోచన, కథంచన = ఏ విధముగాను కూడ, న కార్యా = చేయదగినది కాదు. వీర = వీరుడా! అపరాధం వినా = అపరాధము లేకుండా, లోకాన్ = జనులను, హన్తుమ్ = చంపుటకు, న కామయే = ఇచ్ఛగింపను.

తా. ధనస్సు ధరించిన నీకు, దండకారణ్యములో నివసించు రాక్షసులను, వాళ్లతో ఏ వైరము లేకుండగనే, చంపవలెనను ఆలోచన కలుగుట ఏ మాత్రము మంచిది కాదు. వీరుడా ! ఏ అపరాధమూ చేయని జనులను చంపుట నాకు సంమతము కాదు. 25

మూ. క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనామ్, 26
ధనుషా కార్యమేతావదార్తానాం త్వభిరక్షణమ్.

ప్ర. అ. వనేషు = వనములందు, నిరతాత్మనామ్ = ఆసక్తి గల మనస్సు గల, వీరాణామ్ = వీరులైన, క్షత్రియాణామ్ = క్షత్రియులకు, ఆర్తానామ్ = పీడితులైనవారియొక్క, అభిరక్షణమ్ = రక్షించుట అను, ఏతావత్ = ఇంతమాత్రమే, ధనుషా = ధనస్సుచేత, కార్యమ్ = ప్రయోజనము.

తా. వనములో నివసించు కోరికతో వనములో ఉన్న వీరులైన క్షత్రియులకు ధనస్సువల్ల ప్రయోజన మేమనగా పీడకలిగినవారిని రక్షించుట మాత్రమే.

వి. ఇక్కడ ఉన్న 'వనేషు నిరతాత్మనామ్''అనే పాఠాన్ని పట్టి "వనములో నివసించే క్షత్రియులు ఆర్తత్రాణముకొరకు ధనస్సు పట్టుదురు"అను అర్థము వచ్చును. ఆ అర్థం చెప్పిన పక్షంలో సీత వాదంలోని బలం తగ్గిపోతుంది. అందు చేత ''అరణ్యంలో నివసించే క్షత్రియులు తమ ఎదుట ఎవరికైనా పీడ కలిగితే వాళ్లని రక్షించాలి''అని కొందరు వాఖ్యాతలు అర్థం చెప్పినారు. దీనికంటె-"క్షత్రియాణాం హి శూరాణాం స్వధర్మనిరతాత్మనామ్"అనే ప్రాచ్యపాఠం బాగున్నది. స్వధర్మం పాలించే క్షత్రియులకు ఆర్తరక్షణంకోసం ధనస్సు ఉపయోగపడాలి. ప్రస్తుతం నీవు క్షత్రియధర్మంలో లేవు కదా?"అని సీత అభిప్రాయం. సీత మాటలకు సమాధానం చెపుతూ శ్రీరాముడు ముందుగా ఈ మాటనే ఉట్టంకిస్తూ- "నువ్వే చెప్పినావు కదా క్షత్రియులు ఆర్తరక్షణం కోసం ఆయుధం పట్టాలి అని; ఆ పనే నేను చేస్తున్నాను"అని అంటాడు. అరణ్యంలో ఉన్నంతమాత్రంచేత నేను క్షత్రియధర్మాన్ని విడిచిపెట్టి నట్లు కాదని రాముని అభిప్రాయం. 26

మూ. క్వ చ శస్త్రం క్వ చ వనం క్వ చ క్షాత్రం తపః క్వ చ
వ్యావిద్ధమిదమస్మాభిర్దేశధర్మస్తు పూజ్యతామ్.

ప్ర. అ. శస్త్రమ్ = ఆయుధము, క్వ చ = ఎక్కడ? వనం చ = వనము, క్వ = ఎక్కడ? క్షాత్రమ్ = క్షత్రియధర్మము, క్వ = ఎక్కడ; తపః చ = తపస్సు, క్వ=ఎక్కడ? ఇదమ్=ఇది, వ్యావిద్ధమ్=విరుద్ధ మైనది. అస్మాభిః= మనచేత, దేశధర్మః = దేశధర్మము, పూజ్యతామ్ = పూజింపబడుగాక.

తా. ఆయుధ మెక్కడ, వనమెక్కడ! క్షత్రియధర్మ మెక్కడ, తప స్సెక్కడ! ఇదంతా పరస్పరవిరుద్ధముగా ఉన్నది. మనము ఇపుడు దేశధర్మ మును పూజించవలెను. 27

మూ. తదార్య కలుషా బుద్ధిర్జాయతే శస్త్రసేవనాత్, 28
పునర్గత్వా త్వయోధ్యాయాం క్షత్రధర్మం చరిష్యసి.

ప్ర. అ. ఆర్య = ఓ పూజ్యుడా! తత్ = ఆ కారణమువలన, శస్త్రసేవ నాత్ = ఆయుధము పట్టుటవలన, బుద్ధిః = బుద్ధి, కలుషా = మలినము, జాయతే = అగును. పునః = మరల, గత్వా = వెళ్ళి, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, క్షత్రధర్మమ్ = క్షత్రియధర్మమును, చరిష్యసి = ఆచరించగలవు.

తా. ఓ! పూజ్యుడ వైన రామా! ఆయుధము పట్టుటవలన మనస్సు వికారము చెందును. నీవు తిరిగి అయోధ్యకు వెళ్ళిన పిమ్మట అక్కడ క్షత్రియ ధర్మమును పాలించవచ్చును లెమ్ము. 28

మూ. అక్షయా తు భవేత్ప్రీతిః శ్వశ్రూశ్వశురయోర్మమ, 29
యది రాజ్యం పరిత్యజ్య భవేస్త్వం నిరతో మునిః.

ప్ర. అ. త్వమ్ = నీవు, రాజ్యమ్ = రాజ్యమును, పరిత్యజ్య = విడచి, నిరతః = తపస్సునందు ఆసక్తి గల, మునిః = మునివిగా, భవేః యది = అయితే, మమ = నాయొక్క, శ్వశ్రూశ్వశురయోః = అత్తమామలకు, అక్షయా = అనంత మైన, ప్రీతిః = సంతోషము, భవేత్ = అగును.

తా. నీవు రాజ్యమును విడచిపెట్టి తపోనిరతుడవైన మునివి అయినచో నా అత్తమామలు, తమ వాక్యమును పరిపాలించితివి కదా అని చాలా సంతో షించెదరు. 29

మూ. ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖమ్, 30
ధర్మేణ లభతే సర్వం ధర్మసారమిదం జగత్.

ప్ర. అ. ధర్మాత్ = ధర్మమువలన, అర్థః = అర్థము, ప్రభవతి = పుట్టును. ధర్మాత్ = ధర్మమువలన, సుఖమ్ = సుఖము, ప్రభవతే = పుట్టును, ధర్మేణ =

ధర్మముచేత, సర్వమ్ = సమస్తమును, లభతే = పొందును, ఇదం జగత్ = ఈ జగత్తు, ధర్మసారమ్ = ధర్మమే సారముగా గలది.

తా. ధర్మము అర్థమునకు కారణము. ధర్మము సుఖము నిచ్చును. ధర్మముచే మానవుడు సమస్తమును పొందగలడు. ఈ జగత్తు సార మైనది ధర్మమే.

మూ. ఆత్మానం నియమైస్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః, 31
ప్రాప్యతే నిపుణైర్ధర్మో న సుఖాల్లభ్యతే సుఖమ్.

ప్ర. అ. నిపుణైః = నేర్పు గలవారిచేత, ఆత్మానమ్ = తమను తాము, తైస్తైః = ఆ యా, నియమైః = నియమములచేత, ప్రయత్నతః = ప్రయత్నపూర్వకముగా, కర్శయిత్వా = కృశింపచేసి, ధర్మః = ధర్మము, ప్రాప్యతే = పొందబడును. సుఖాత్ = సుఖమువలన, సుఖమ్ = సుఖము, న లభ్యతే = పొందబడదు.

తా. నేర్పు గల బుద్ధిమంతులు ఆ యా నియమములచే తమను తాము ప్రయత్నపూర్వకముగ కృశింపచేసికొని, ధర్మమును ఆర్జించుచుందురు. సుఖమువలన సుఖము కలుగదు. (కష్టపడినవారికే సుఖము కలుగును.) 31

మూ. నిత్యం శుచిమతిః సౌమ్య చర ధర్మం తపోవనే, 32
సర్వం హి విదితం తుభ్యం త్రైలోక్యమపి తత్త్వతః.

ప్ర. అ. సౌమ్య = ఓ! సౌమ్యుడా! నిత్యమ్ = ఎల్లప్పుడు, శుచిమతిః = పరిశుద్ధమైన బుద్ధి కలవాడవై, తపోవనే = తపోవనమునందు, ధర్మమ్ = ధర్మమును, చర = ఆచరించుము. త్రైలోక్యమ్ = మూడు లోకములకు సంబంధించిన, సర్వమ్ అపి = సమస్తమూ, తుభ్యమ్ = నీకు, తత్త్వతః = యథార్థముగా, విదితం హి = తెలిసినదికదా.

తా. రామా ! నిత్యము నిర్మల మైన బుద్ధితో తపోవనమునందు ధర్మము నాచరింపుము. మూడు లోకములలో ఉన్న సమస్తమును కూడ దాని యథార్థ స్వరూపములో నీ వెరుగుదువు గదా? 32

మూ. స్త్రీచాపలాదేతదుదాహృతం మే
ధర్మం చ వక్తుం తవ కః సమర్థః,
విచార్య బుద్ధ్యా తు సహానుజేన
యద్రోచతే తత్కురు మా చిరేణ. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
నవమః సర్గః.

ప్ర. అ. స్త్రీచాపలాత్ = స్త్రీసహజమైన చపలత్వముచేత, ఏతత్ = ఇది, మే = నాకు (నాచేత), ఉదాహృతమ్ = చెప్పబడినది. తవ = నీకు, ధర్మమ్ = ధర్మమును, వక్తుమ్ = చెప్పుటకు, కః = ఎవడు, సమర్థః = సమర్థుడు? తు = కాని, బుద్ధ్యా = నీ బుద్ధిచేతను, అనుజేన సహ = నీ తమ్మునితోను, విచార్య = ఆలోచించి, యత్ = ఏది, రోచతే = ఇష్టమగునో, తత్ = దానిని, కురు = చేయుము. మా చిరేణ = ఆలస్యము వద్దు.

తా. స్త్రీసహజమైన చపలత్వముచేత ఇది చెప్పుచున్నాను కాని నీకు ధర్మము బోధించగలవా రెవ్వరు? నీ బుద్ధిచేత పరిశీలించి, నీ తమ్మునితో కూడ ఆలోచించి ఎట్లు ఇష్టమో అట్లు చేయుము. ఆలస్యము చేయవద్దు. 33

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
తొమ్మిదవ సర్గ సమాప్తము

## అథ దశమః సర్గః

["మునులను రక్షించుటకై రాక్షసవధ చేసెదను'' అని నేను చేసిన ప్రతిజ్ఞను తప్పక పాలించవలెను అని శ్రీరాముడు చెప్పుట]

మూ. వాక్యమేతత్తు వైదేహ్యా వ్యాహృతం భర్తృభక్తయా,
శ్రుత్వా ధర్మే స్థితో రామః ప్రత్యువాచాథ మైథిలీమ్. 1

ప్ర. అ. భర్తృభక్తయా = భర్తయందు భక్తిగల, వైదేహ్యా = సీతచేత, వ్యాహృతమ్ = పలకబడిన, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ధర్మే = ధర్మమునందు, స్థితః = ఉన్న, రామః = రాముడు, అథ = అటు పిమ్మట, మైథిలీమ్ = సీతనుగూర్చి, ప్రత్యువాచ = తిరిగిపలికెను.

తా. భర్తయందు (తనయందు) భక్తిగల సీత పలికిన మాటలు విని, ధర్మమునందు స్థిరముగా నిలచు రాముడు ఆమెతో ఇట్లనెను. 1

మూ. హితముక్తం త్వయా దేవి స్నిగ్ధయా సదృశం వచః,
కులం వ్యపదిశన్త్యా చ ధర్మజ్ఞే జనకాత్మజే. 2

ప్ర. అ. దేవి = ఓ! దేవీ! ధర్మజ్ఞే = ధర్మము ఎరిగినదానా! జనకాత్మజే = సీతా! కులమ్ = నీ సత్కులమును, వ్యపదిశన్త్యా = ప్రసిద్ధముచేయుచున్న, స్నిగ్ధయా = స్నేహము గల, త్వయా = నీచేత, హితమ్ = హితము, సదృశమ్ = నీకు తగినది అయిన, వచః = వచనము, ఉక్తమ్ = చెప్పబడినది.

తా. ధర్మములు తెలిసినదానవు, జనకుని కుమార్తెవు అయిన ఓ! సీతా! నామీద స్నేహముతో నీవు, నీ ఉత్తమకులము ప్రసిద్ధికి, నీకూ తగిన, హితమైన మాట చెప్పితివి. 2

మూ. కిం ను వక్ష్యామ్యహం దేవి త్వయైవోక్తమిదం వచః,
క్షత్రియైర్ధార్యతే చాపో నార్తశబ్దో భవేదితి. 3

ప్ర. అ. దేవి = ఓ! సీతా! అహమ్ = నేను, కిం ను = ఏమి, వక్ష్యామి = చెప్పుదును. ఆర్తశబ్దః = దుఃఖితులైనవారి శబ్దము, న భవేదితి = రాకూడదు అని, క్షత్రియైః = క్షత్రియులచేత, చాపః = ధనస్సు, ధార్యతే = ధరింపబడుచున్నది అని, ఇదమ్ = ఈ, వచః = వచనము, త్వయైవ = నీచేతనే, ఉక్తమ్ = పలకబడినది.

తా. "పీడితులైనవారి దీనాలాపములు వినబడకుండుటకే క్షత్రియులు ధనస్సు ధరించెదరు"అని నీవే చెప్పినావు కదా? ఇంక నేను చెప్పవలసిన దేమున్నది?. 3

మూ. తే చార్తా దణ్డకారణ్యే మునయః సంశితవ్రతాః,
మాం సీతే స్వయమాగమ్య శరణ్యాః శరణం గతాః. 4

ప్ర. అ. సీతే = సీతా! సంశితవ్రతాః = తీవ్రములైన నియమములు గల, శరణ్యాః = శరణు పొంద దగిన, దణ్డకారణ్యే = దండకారణ్యములోఉన్న, తే మునయః = ఆ మునులు, ఆర్తాః = దుఃఖితులై, స్వయమ్ = స్వయముగా, ఆగమ్య = వచ్చి, మామ్ = నన్ను, శరణం గతాః = శరణుపొందినారు.

తా. తీవ్రము లైన నియమములు గల దండకారణ్యవాసులైన మునులు తాము ఇతరులకు శరణము ఇవ్వగలిగినవారు. అట్టి మునులు దుఃఖితులై, స్వయముగ వచ్చి నన్ను శరణు పొందినారు. 4

మూ. వసన్తో ధర్మనిరతా వనే మూలఫలాశనాః,
న లభన్తే సుఖం భీతా రాక్షసైః క్రూరకర్మభిః. 5

ప్ర. అ. మూలఫలాశనాః = మూలములను ఫలములను తినుచు, ధర్మనిరతాః = ధర్మమునందు ఆసక్తులై, వనే = వనమునందు, వసన్తః = నివసించుచున్న మునులు, క్రూరకర్మభిః = క్రూరమైన కర్మలు గల, రాక్షసైః = రాక్షసుల చేత, భీతాః = భయపడినవారై, సుఖమ్ = సుఖమును, న లభన్తే = పొందుటలేదు.

తా. దుంపలు, ఫలములు తినుచు, ధర్మనిరతులై, వనములో నివసించు ఆ మునులు కూడ, క్రూరకర్మలు చేయు రాక్షసులకు భయపడి సుఖము పొందజాలకున్నారు. 5

మూ. కాలే కాలే చ నిరతా నియమైర్వివిధైర్వనే,
భక్ష్యన్తే రాక్షసైర్భీమైర్నరా మాంసోపజీవిభిః. 6

ప్ర. అ. కాలే కాలే = ఆ యా కాలములందు, వివిధైః = అనేకవిధములైన, నియమైః = నియమములచేత, నిరతాః = ఆసక్తులైన, నరాః = మునులు, వనే = వనమునందు, మాంసోపజీవిభిః = మాంసమును తినే, భీమైః = భయంకరులైన, రాక్షసైః = రాక్షసులచేత, భక్ష్యన్తే = భక్షించబడుచున్నారు.

తా. ఆ యా కాలములలో చేయదగిన అనేకవిధములైన నియమములను శ్రద్ధగా పాటించుచు వనములో నివసించు మునులను, మాంసభక్షకులైన భయంకర రాక్షసులు భక్షించివేయుచున్నారు. 6

మూ. తే భక్ష్యమాణా మునయో దణ్డకారణ్యవాసినః,
అస్మానభ్యవపద్యేతి మామాహుర్ద్విజసత్తమాః. 7

ప్ర. అ. భక్ష్యమాణాః = భక్షించబడుచున్న, దణ్డకారణ్యవాసినః = దండకారణ్యములో నివసించుచున్న, ద్విజసత్తమాః = ద్విజులలో శ్రేష్ఠులైన, తే మునయః = ఆ మునులు, అస్మాన్ = మమ్ములను, అభ్యవపద్య = అనుగ్రహింపుము, ఇతి = అని, మామ్ = నన్ను గూర్చి, ఆహుః = పలుకుచున్నారు (పలికిరి).

తా. దండకారణ్యములో నివసించు ద్విజశ్రేష్ఠులైన ఆ మునులు, భక్షింపబడుచున్నవారై, "మమ్ములను అనుగ్రహింపుము" అని నన్ను కోరినారు. 7

మూ. మయా తు వచనం శ్రుత్వా తేషామేవం ముఖాచ్చ్యుతమ్,
కృత్వా చరణశుశ్రూషాం వాక్యమేతదుదాహృతమ్. 8

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, తేషామ్ = వారియొక్క, ముఖాత్ = ముఖమునుండి, చ్యుతమ్ = వెలువడిన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, మయా = నాచేత, చరణశుశ్రూషామ్ = పాదసేవను, కృత్వా = చేసి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యము, ఉదాహృతమ్ = పలకబడినది.

తా. నేనీ విధముగ వారి ముఖమునుండి వెలువడిన మాటలు విని, వారి పాదసేవ చేసి, ఇట్లు పలికితిని. 8

మూ. ప్రసీదన్తు భవన్తో మే హ్రీరేషా హి మమాతులా,
యదీదృశైరహం విప్రైరుపస్థేయైరుపస్థితః. 9

ప్ర. అ. భవన్తః = మీరు, మే = నాకు, ప్రసీదన్తు = ప్రసన్ను లగుదురు గాక. అహమ్ = నేను, యత్ = ఏ కారణమువలన, ఉపస్థేయైః = సేవింపదగిన, ఈదృశైః = ఇట్టి, విప్రైః = బ్రాహ్మణులచేత, ఉపస్థితః = దగ్గరకు వచ్చి ప్రార్థింపబడుచున్నానో, అందువలన, ఏషా = ఇది, మమ = నాకు, అతులా = సాటి లేని, హ్రీః హి = సిగ్గు కదా?

తా. మీరు నన్ను అనుగ్రహింపుడు. నేనే స్వయముగ దగ్గరకు వెళ్ళి సేవింపదగిన ఇట్టి బ్రాహ్మణులు నా వద్దకు వచ్చి ప్రార్థించుచున్నా రనగా ఇది నాకు చాల సిగ్గుపడవలసిన విషయము. 9

మూ. కిం కరోమీతి చ మయా వ్యాహృతం ద్విజసంనిధౌ,
సర్వైరేతైః సమాగమ్య వాగియం సముదాహృతా. 10

ప్ర. అ. కిమ్ = ఏమి, కరోమి = చేయుదును, ఇతి = అని, మయా = నాచేత, ద్విజసంనిధౌ = ద్విజుల సమీపమునందు, వ్యాహృతమ్ = పలకబడినది. సర్వైః = సమస్తమైన, ఏతైః = వీరిచేత, సమాగమ్య = కలిసి, ఇయమ్ = ఈ, వాక్ = వాక్కు, సముదాహృతా = పలకబడినది.

తా. "నేను మీ కేమి చేయవలెను?" అని నేను ఆ ద్విజులను ప్రశ్నింపగా వారందరూ కలిసి ఇట్లు పలికిరి. 10

మూ. రాక్షసైర్దణ్డకారణ్యే బహుభిః కామరూపిభిః,
అర్దితాః స్మ దృఢం రామ భవాన్నస్తత్ర రక్షతు. 11

ప్ర. అ. రామ = రామా! దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, బహుభిః = అనేకులైన, కామరూపిభిః = స్వేచ్ఛారూపము గల, రాక్షసైః = రాక్షసులచేత, దృఢమ్ = అధికముగా, అర్దితాః స్మ = పీడించబడుచున్నాము. భవాన్ = నీవు, తత్ర = ఆ విషయమున, నః = మమ్ములను, రక్షతు = రక్షించెదవుగాక.

తా. రామా! దండకారణ్యములో, స్వేచ్ఛానుసారముగా రూపములను

ధరించగల అనేకరాక్షసులు మమ్ములను చాల పీడించుచున్నారు. ఆ విషయమున నీవు మమ్ములను రక్షించుము. 11

మూ. హోమకాలేషు సంప్రాప్తాః పర్వకాలేషు చానఘ,
ధర్షయన్తి సుదుర్ధర్షా రాక్షసాః పిశితాశనాః. 12

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! సుదుర్ధర్షాః=ఎదిరించుటకు ఏ మాత్రము శక్యము కాని, పిశితాశనాః=మాంసభక్షకులైన, రాక్షసాః=రాక్షసులు, హోమకాలేషు=హోమసమయములందు, పర్వకాలేషు=పూర్ణిమ, అమావాస్య మొదలైన పర్వకాలములయందు, సంప్రాప్తాః=వచ్చినవారై, ధర్షయన్తి=ఎదిరించుచున్నారు.

తా. దోషములు లేని రామా! ఎదిరించుటకు ఏ మాత్రము శక్యము కాని పచ్చిమాంసము తినే రాక్షసులు హోమములుచేసే సమయములందు, పర్వకాలములందు వచ్చి మమ్ములను పీడించుచున్నారు. 12

మూ. రాక్షసైర్ధర్షితానాం చ తాపసానాం తపస్వినామ్,
గతిం మృగయమాణానాం భవాన్నః పరమా గతిః. 13

ప్ర. అ. రాక్షసైః=రాక్షసులచేత, ధర్షితానామ్=ఎదిరింపబడిన, తపస్వినామ్=తపస్సు గల. తాపసానామ్=దీనుల మైన, గతిమ్=గతిని (శరణమును) మృగయమాణానామ్=వెదకుచున్న, నః=మాకు, భవాన్=నీవు, పరమా=గొప్ప, గతిః=గతివి.

తా. తపస్సు చేసుకొనే మేము రాక్షసులచే పీడితులమై, దీనులమై రక్షకుని కొరకు వెదకుచున్నాము. అట్టి మాకు నీవే గతివి. 13

మూ. కామం తపఃప్రభావేన శక్తా హన్తుం నిశాచరాన్,
చిరార్జితం తు నేచ్ఛామస్తపః ఖణ్డయితుం వయమ్. 14

ప్ర. అ. వయమ్=మేము, తపఃప్రభావేన=తపస్సుయొక్క ప్రభావముచేత, నిశాచరాన్=రాక్షసులను, హన్తుమ్=చంపుటకు, కామం శక్తాః=సమర్థులమే. తు=కాని, చిరార్జితమ్=చిరకాలమునుండి సంపాదింపబడిన, తపః=తపస్సును, ఖణ్డయితుమ్=ఖండించుటకు, నేచ్ఛామః=ఇష్టపడుట లేదు.

తా. తపఃప్రభావముచేత రాక్షసులను చంపుటకు మేమే సమర్థుల మను మాట నిజమే. కాని చిరకాలమునుండి సంపాదించుకొన్న తపస్సును వ్యయము చేయుట మా కిష్టము కాదు. 14

మూ. బహువిఘ్నం తపో నిత్యం దుశ్చరం చైవ రాఘవ,
తేన శాపం న ముఞ్చామో భక్ష్యమాణాశ్చ రాక్షసైః. 15

ప్ర. అ. రామ = రామా ! తపః = తపస్సు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, బహువిఘ్నమ్ = అనేకవిఘ్నములు కలది; దుశ్చరం చైవ = ఆచరించుటకు కష్ట మైనది కూడ. తేన = ఆ కారణముచేత, రాక్షసైః = రాక్షసులచేత, భక్ష్యమాణాః = భక్షింపబడుచున్నవార మైనను, శాపమ్ = శాపమును, న ముఞ్చామః = విడచుటలేదు.

తా. రామా ! తపస్సునకు నిత్యము ఎన్నో విఘ్నములు కలుగుచుండును. తపస్సు ఆచరించుట కూడ చాల కష్ట మైనది. అందుచేతనే రాక్షసులు మమ్ములను భక్షించివేయుచున్నా శాపము ఇవ్వజాల కున్నాము. 15

మూ. తదర్ద్యమానాన్రక్షోభిర్దణ్డకారణ్యవాసిభిః,
రక్ష నస్త్వం సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే.

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, దణ్డకారణ్యవాసిభిః = దండ కారణ్యములో నివసించుచున్న, రక్షోభిః = రాక్షసులచేత, అర్ద్యమానాన్ = పీడించబడుచున్న, నః = మమ్ములను, సహ భ్రాత్రా = సోదరునితో కూడిన, త్వమ్ = నీవు, రక్ష = రక్షించుము. వయమ్ = మేము, వనే = వనమునందు, త్వన్నాథాః హి = నీవే నాథుడు కలవారము గదా.

తా. అందువలన సోదరసహితుడ వైన నీవు, దండకారణ్యములో నివసించే రాక్షసులచేత బాధింపబడుచున్న మమ్ములను రక్షించుము. మాకు నీవే రక్షకు డవుకదా ? 16

మూ. మయా చైతద్వచః శ్రుత్వా కార్త్స్న్యేన పరిపాలనమ్,

ప్ర. అ. జనకాత్మజే=సీతా! మయా చ=నాచేత, ఏతత్=ఈ, వచః=వాక్కును, శ్రుత్వా=విని, దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, ఋషీణామ్=ఋషులయొక్క, కార్త్స్న్యేన=పరిపూర్ణముగా, పరిపాలనమ్ = పాలనము, సంశ్రుతమ్=ప్రతిజ్ఞచేయబడినది.

తా. సీతా! నేను ఈ మాటలు విని దండకారణ్యములో నివసించే మునులను పూర్తిగా పాలించెద నని ప్రతిజ్ఞ చేసితిని. 17

మూ. సంశ్రుత్య చ న శక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్,
మునీనామన్యథా కర్తుం సత్యమిష్టం హి మే సదా. 18

ప్ర. అ. సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి, జీవమానః = జీవించి ఉండగా, మునీనామ్=మునులయొక్క, ప్రతిశ్రవమ్=ప్రతిజ్ఞను, అన్యథా=మరియొక విధముగా, కర్తుమ్=చేయుటకు, న శక్ష్యామి=సమర్థుడను కాను. సదా=ఎల్లప్పుడును, మే=నాకు, సత్యమ్=సత్యము, ఇష్టం హి=ఇష్టము కదా.

తా. నేను ప్రతిజ్ఞ చేసి, మునులకు చేసిన ఆ ప్రతిజ్ఞను, నాలో ప్రాణాలు ఉండగా మరొకవిధముగా చేయజాలను. నాకు సత్యము చాల ఇష్టమైనది కదా.

మూ. అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్,
న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః. 19

ప్ర. అ. సీతే=సీతా! అహమ్=నేను, జీవితమపి = జీవితమునైనా, సలక్ష్మణామ్=లక్ష్మణునితో కూడిన, త్వాం వా=నిన్నైనా, జహ్యామ్=విడతును. తు=కాని, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, విశేషతః=విశేషించి, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి, న=విడువజాలను.

తా. సీతా! నేను ప్రాణాల నైనా, లక్ష్మణు నైనా, నిన్నైనా విడచిపెట్టెదను కాని, ప్రతిజ్ఞను మాత్రము, విశేషించి బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞను మాత్రము, విడువజాలను. 19

మూ. తదవశ్యం మయా కార్యమృషీణాం పరిపాలనమ్,
అనుక్తేనాపి వైదేహి ప్రతిజ్ఞాయ తు కిం పునః. 20

ప్ర. అ. వైదేహి = సీతా! తత్ = ఆ కారణమువలన, మయా = నాచేత, అనుక్తేనాపి = అడగబడకపోయినను, ఋషీణామ్ = ఋషులయొక్క, పరిపాలనమ్ = పాలనము, కార్యమ్ = చేయదగినది. ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, కిం పునః = చెప్పనేల ?

తా. సీతా! ఋషులు నన్ను అడగకపోయినా నేను వాళ్ళను పాలించవలెను. వారికి మాట ఇచ్చిన పిమ్మట వేరే చెప్పవలెనా ? 20

మూ. మమ స్నేహాచ్చ సౌహార్దాదిదముక్తం త్వయానఘే,
పరితుష్టోఽస్మ్యహం సీతే న హ్యనిష్టోఽనుశిష్యతే. 21

ప్ర. అ. అనఘే = దోషములు లేనిదానా! మమ = నాయొక్క, స్నేహాచ్చ = స్నేహమువలన, సౌహార్దాత్ = మంచి హృదయము కలిగియుండుట వలన, త్వయా = నీచేత, ఇదమ్ = ఇది, ఉక్తమ్ = పలకబడినది. సీతే = ఓ! సీతా! అహమ్ = నేను, పరితుష్టః = సంతోషించినవాడను, అస్మి = అయిఉన్నాను. అనిష్టః = ఇష్టుడు కానివాడు, న అనుశిష్యతే హి = ఉపదేశించబడడు కదా.

తా. దోషరహితురాల వైన ఓ! సీతా! నీకు నామీద ఉన్న స్నేహముచేత నీవు మంచి హృదయము కలదాన వగుటచేత ఇట్లు పలికినావు. చాలా సంతోషించుచున్నాను, ఇష్టుడు కానివారికి ఎవ్వరూ ఉపదేశము చేయరు కదా. 21

మూ. సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః,
సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోఽపి గరీయసీ. 22

ప్ర. అ. తవ = నీయొక్క, కులస్య = కులమునకు, ఆత్మనః చ = నీకూ, సదృశమ్ = తగినది; అనుకూలం చ = అనుకూలముగా కూడ ఉన్నది. మే = నాయొక్క, సధర్మచారిణీ = కూడా ధర్మములను ఆచరించు పత్ని వైన, త్వమ్ = నీవు, ప్రాణేభ్యోఽపి = ప్రాణములకంటె కూడ, గరీయసీ = గొప్పదానవు.

తా. నీవు చెప్పినది నీకు, నీ వంశానికీ కూడ తగినదిగా, అనుకూలముగా ఉన్నది. నా సహధర్మచారిణి వైన నీవు నాకు ప్రాణములకంటె కూడ ఎక్కువదానవు. 22

మూ. ఇత్యేవముక్త్వా వచనం మహాత్మా
సీతాం ప్రియాం మైథిలరాజపుత్రీమ్,
రామో ధనుష్మాన్ సహ లక్ష్మణేన
జగామ రమ్యాణి తపోవనాని. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
దశమః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, రామః = రాముడు, ప్రియామ్ = ప్రియురాలు, మైథిలరాజపుత్రీమ్ = జనకమహారాజు కూతురు అయిన, సీతామ్ = సీతను గూర్చి, ఇత్యేవమ్ = ఇట్లు, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, ధనుష్మాన్ = ధనస్సు ధరించినవాడై, సహ లక్ష్మణేన = లక్ష్మణునితో కూడ, రమ్యాణి = సుందరములైన, తపోవనాని = తపోవనములను గూర్చి, జగామ = వెళ్లెను.

తా. మహాత్ముడైన రాముడు, జనకమహారాజు పుత్రికయైన, తన ప్రియురాలు సీతతో ఇట్లు పలికి, ధనస్సు ధరించి, లక్ష్మణసమేతుడై, సుందరములైన తపోవనములకు వెళ్లెను. 23

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో దశమసర్గ సమాప్తము.

## అథ ఏకాదశః సర్గః

[పంచాప్సర స్తీర్థమాండకర్ణి మునుల కథ. రామాదులు వివిధాశ్రమములలో సంచరించి తిరిగి సుతీక్ష్ణమహర్షి ఆశ్రమమునకు వచ్చి కొంత కాలము అక్కడ నివసించుట. పిదప సుతీక్ష్ణుని అనుమతి గైకొని అగస్త్యభ్రాత ఆశ్రమమునకు, అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్ళుట. అగస్త్య ప్రభావవర్ణనము.]

మూ. అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా,
పృష్ఠతస్తు ధనుష్పాణిర్లక్ష్మణోఽనుజగామ హ. 1

ప్ర. అ. రామః = రాముడు, అగ్రతః = ఎదుట, ప్రయయౌ = నడచెను. సుమధ్యమా = అందమైన నడుముగల, సీతా = సీత, మధ్యే = మధ్యయందు నడచెను. ధనుష్పాణిః = ధనస్సు హస్తమునందు కలవాడై, లక్ష్మణః = లక్ష్మణుడు, పృష్ఠతః = వెనుక, అనుజగామ హ = అనుసరించి వెళ్ళెను.

తా. రాముడు ముందు నడచుచుండెను. అందమైన నడుము గల సీత మధ్య నడచుచుండగా, లక్ష్మణుడు ధనుర్ధారియై వారివెనుక అనుసరించి వెళ్లెను.

మూ. తౌ పశ్యమానౌ వివిధాన్ శైలప్రస్థాన్ వనాని చ,
నదీశ్చ వివిధా రమ్యా జగ్మతుః సీతయా సహ. 2

ప్ర. అ. తౌ = ఆ రామలక్ష్మణులు, వివిధాన్ = అనేకవిధములైన, శైలప్రస్థాన్ = పర్వతముల చరియలను, వనాని చ = వనములను, వివిధాః = అనేకవిధములైన, రమ్యాః = సుందరములైన, నదీశ్చ = నదులను, పశ్యమానౌ = చూచుచు, సీతయా సహ = సీతతో కూడ, జగ్మతుః = వెళ్లిరి.

తా. సీతాసమేతులైన ఆ రామలక్ష్మణులు అనేకవిధములైన కొండచరియలను, వనములను, రమ్యములైన అనేకనదులను చూచుచు వెళ్లిరి. 2

మూ. సారసాంశ్చక్రవాకాంశ్చ నదీపులినచారిణః,
సరాంసి చ సపద్మాని యుక్తాని జలజైః ఖగైః. 3

ప్ర. అ. పులినచారిణః = నదుల ఇసుకతిన్నెలమీద సంచరించు చున్న, సారసాన్ = సారసపక్షులను, చక్రవాకాంశ్చ = చక్రవాకపక్షులను, సపద్మాని=పద్మములతో కూడిన, జలజైః=జలమునందు పుట్టిన (సంచరించు), ఖగైః = పక్షులతో, యుక్తాని = కూడిన, సరాంసి చ = సరస్సులను (చూచుచు వెళ్ళిరి).

తా. నదుల ఇసుకతిన్నెల మీద నివసించుచున్న సారసపక్షులను, చక్రవాకములను, పద్మములు, జలపక్షులు ఉన్న సరస్సులను (చూచుచు వెళ్ళిరి.) 3

మూ. యూథబద్ధాంశ్చ పృషతాన్ మదోన్మత్తాన్ విషాణినః,
మహిషాంశ్చ వరాహాంశ్చ నాగాంశ్చ ద్రుమవైరిణః. 4

ప్ర. అ. యూథబద్ధాన్ = గుంపులుగా ఏర్పడిన, పృషతాన్ = చుక్కల జింకలను, మదోన్మత్తాన్ = మదముచేత పిచ్చిఎక్కినవి వలె ఉన్న, విషాణినః= పెద్ద కొమ్ములు గల, మహిషాంశ్చ=దున్నపోతులను, వరాహాంశ్చ=వరాహములను, ద్రుమవైరిణః = వృక్షములకు శత్రువులైన, నాగాంశ్చ = గజములను (చూచుచు వెళ్ళిరి).

తా. గుంపులు గుంపులుగా సంచరించుచున్న చుక్కల జింకలను, చాల మత్తెక్కి ఉన్న, పెద్ద కొమ్ములు గల దున్నపోతులను, వరాహములను, వృక్షములను విరచివేయుచున్న గజములను (చూచుచు వెళ్ళిరి). 4

మూ. తే గత్వా దూరమధ్వానం లమ్బమానే దివాకరే,
దదృశుః సహితా రమ్యం తటాకం యోజనాయతమ్. 5

పద్మపుష్కరసంబాధం గజయూథైరలంకృతమ్,
సారసైర్హంసకాదమ్బైః సంకులం జలచారిభిః. 6

ప్ర. అ. సహితాః = కలిసి ప్రయాణము చేయుచున్న, తే=ఆ సీతారామలక్ష్మణులు, దూరమ్ = దూరమైన, అధ్వానమ్ = మార్గమును, గత్వా = వెళ్ళి,

దివాకరే = సూర్యుడు, లమ్బమానే = (పశ్చిమాకాశమునందు) వ్రేలాడుచుండగా, పద్మపుష్కరసంబాధమ్ = ఎఱ్ఱని తెల్లని పద్మములతో నిండినది, గజయూథైః = ఏనుగుల గుంపులచేత, అలంకృతమ్ = అలంకరింపబడినది, జలచారిభిః = జలముపై సంచరించు, సారసైః = సారసపక్షులచేతను, హంసకాదమ్బైః = హంసలచేతను, కాదంబపక్షులచేతను, సంకులమ్ = వ్యాకుల మైనదీ అయిన, యోజనాయతమ్ = ఒక యోజనము వైశాల్యము గల, రమ్యమ్ = సుందరమైన, తటాకమ్ = సరస్సును, దదృశుః = చూచిరి.

తా. కలిసి ప్రయాణము చేయుచున్న ఆ సీతారామలక్ష్మణులు, చాల దూరము ప్రయాణము చేసి, సూర్యుడు పశ్చిమమున వ్రేలాడుచుండగా, ఆ ప్రాంతమున ఒక యోజనము వైశాల్యము గల, రమ్య మైన సరస్సును చూచిరి. అది ఎఱ్ఱని పద్మములతోను తెల్లని పద్మములతోను నిండి యుండెను. దానిలో ఏనుగుల గుంపులు క్రీడించుచుండెను. సారసపక్షులు, హంసలు, కాదంబములు మొదలైన జలముపై సంచరించు పక్షులతో నిండి యుండెను. 5, 6

మూ. ప్రసన్నసలిలే రమ్యే తస్మిన్ సరసి శుశ్రువే,
గీతవాదిత్రనిర్ఘోషో న తు కశ్చన దృశ్యతే. 7

ప్ర. అ. ప్రసన్నసలిలే=నిర్మలమైన ఉదకము గల, రమ్యే=రమ్యమైన, తస్మిన్ = ఆ, సరసి = సరస్సునందు, గీతవాదిత్రనిర్ఘోషః = గీతవాద్యధ్వని, శుశ్రువే = వినబడెను. తు = కాని, కశ్చన = ఎవ్వడూ, న దృశ్యతే=చూడబడ కుండెను.

తా. నిర్మలమైన ఉదకము గల ఆ రమ్యమైన సరస్సునుండి గీతవాద్యాదుల ధ్వని వినవచ్చుచుండెను కాని అక్కడ ఎవ్వరూ కనబడలేదు. 7

మూ. తతః కౌతూహలాద్రామో లక్ష్మణశ్చ మహాబలః,
మునిం ధర్మభృతం నామ ప్రష్టుం సముపచక్రమే. 8

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, మహాబలః=గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడూ, కౌతూహలాత్ = వేడుకవలన, ధర్మ

భృతం నామ = ధర్మభృత్ అను పేరు గల, మునిమ్ = మునిని, ప్రష్టుమ్ = అడుగుటకు, సముపచక్రమే = ఉపక్రమించెను.

తా. పిమ్మట రాముడు, బలశాలి యైన లక్ష్మణుడు, వేడుకతో, ధర్మభృత్ అనే మునిని ఆ సంగీతకధ్వనిని గూర్చి ఇట్లు ప్రశ్నించిరి. 8

మూ. ఇదమత్యద్భుతం శ్రుత్వా సర్వేషాం నో మహామునే,
కౌతూహలం మహజ్జాతం కిమిదం సాధు కథ్యతామ్. 9
వక్తవ్యం యది చేద్విప్ర నాతిగుహ్యమపి ప్రభో.

ప్ర. అ. మహామునే = మహామునీ! అత్యద్భుతమ్ = చాల ఆశ్చర్యకర మైన, ఇదమ్ = ఈ గీతవాద్యధ్వనిని, శ్రుత్వా = విని, సర్వేషామ్ = సమస్తమైన, నః = మాకు, మహత్ = గొప్ప, కౌతూహలమ్ = వేడుక, జాతమ్ = పుట్టినది. ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి ? సాధు = బాగుగా, కథ్యతామ్ = చెప్పబడుగాక. ప్రభో = సమర్థుడవైన, విప్ర = ఓ! బ్రాహ్మణుడా, నాతిగుహ్యమపి యది చేత్ = చాల రహస్యము కానిచో, వక్తవ్యమ్ = చెప్పదగినది.

తా. మహామునీ! అత్యాశ్చర్యకరమైన ఈ సంగీతవాద్యధ్వని విని మా కందరికి వేడుక కలిగినది. ఇది ఏమో బాగుగా చెప్పుము. ఓ! సమర్థుడవైన బ్రాహ్మణుడా! ఇది అతిరహస్యవిషయము కానిచో చెప్పుము. 9

మూ. తేనైవముక్తో ధర్మాత్మా రాఘవేణ మునిస్తదా, 10
ప్రభవం సరసః కృత్స్నమాఖ్యాతుముపచక్రమే.

ప్ర. అ. తదా = అప్పుడు, తేన = ఆ, రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, మునిః = ముని, సరసః = సరస్సుయొక్క, కృత్స్నమ్ = సమస్తమైన, ప్రభవమ్ = పుట్టుకను గూర్చి, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. రాముని మాటలు విని ధర్మాత్ముడైన ఆ ముని, ఆ సరస్సుపుట్టుకకు సంబంధించిన విషయమును అంతా చెప్పుటకు ప్రారంభించెను. 10

మూ. ఇదం పఞ్చాప్సరో నామ తటాకం సార్వకాలికమ్, 11
నిర్మితం తపసా రామ మునినా మాణ్డకర్ణినా.

ప్ర. అ. రామ = రామా! ఇదమ్ = ఇది, మాణ్డకర్ణినా = మాండకర్ణి అను పేరు గల, మునినా = మునిచేత, తపసా = తపస్సుచేత, నిర్మితమ్ = నిర్మింపబడిన, సార్వకాలికమ్ = సర్వకాలములందు ఉండు, పఞ్చాప్సరః నామ = పంచాప్సరస్సు అను పేరు గల, తటాకమ్ = సరస్సు.

తా. రామా! ఇది సర్వకాలములందు ఒకే విధముగా ఉండే పంచాప్సరః సరస్సు అను పేరు గల సరస్సు. ఇది మాండకర్ణి అను ముని తపస్సుచేత నిర్మింపబడినది. 11

మూ. స హి తేపే తపస్తీవ్రం మాణ్డకర్ణిర్మహామునిః, 12
దశవర్షసహస్రాణి వాయుభక్షో జలాశ్రయః.

ప్ర. అ. మహామునిః = మహామునియైన, సః మాణ్డకర్ణిః = ఆ మాండకర్ణి, వాయుభక్షః = వాయువును మాత్రమే భక్షించుచు, జలాశ్రయః = జలమే ఆశ్రయముగా గలవాడై, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సరములు, తీవ్రమ్ = తీవ్రమైన, తపః = తపస్సు, తేపే = చేసెను.

తా. మహామునియైన ఆ మాండకర్ణి, వాయువును మాత్రమే భక్షించుచు, జలములో నివసించుచు, పదివేలసంవత్సరములు తీవ్రమైన తపస్సు చేసెను. 12

మూ. తతః ప్రవ్యథితాః సర్వే దేవాః సాగ్నిపురోగమాః, 13
అబ్రువన్ వచనం సర్వే పరస్పరసమాగతాః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సాగ్నిపురోగమాః = అగ్ని నాయకుడుగా గల, సర్వే = సమస్తమైన, దేవాః = దేవతలు, ప్రవ్యథితాః = వ్యథ చెందినవారై, సర్వే = వారందరు, పరస్పరసమాగతాః = పరస్పరము కలిసినవారై, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. అప్పుడు అగ్ని మొదలైన దేవత లందరు భయపడినవారై, ఒక్కచోట కలిసి, ఒకరితో ఒకరు ఇట్లు అనుకొనిరి. 13

మూ. అస్మాకం కస్యచిత్ స్థానమేష ప్రార్థయతే మునిః, 14
ఇతి సంవిగ్నమనసః సర్వే తే త్రిదివౌకసః.

ప్ర. అ. ఏషః మునిః = ఈ ముని, అస్మాకమ్ = మనలో, కస్య చిత్ = ఒకానొకనియొక్క, స్థానమ్ = స్థానమును, ప్రార్థయతే = కోరుచున్నాడు. ఇతి = ఈ విధముగా, సర్వే = సమస్తమైన, తే = ఆ, త్రిదివౌకసః = దేవతలు, సంవిగ్న మనసః = దిగులు చెందిన మనస్సు కలవారైరి.

తా. "ఈ ముని మనలో ఒకరి స్థానమును పొందవలెనని కోరుచున్నాడు" ఈ విధముగ ఆ దేవత లందరు మనస్సులో దిగులు చెందిరి. 14

మూ. తత్ర కర్తుం తపోవిఘ్నం దేవైః సర్వైర్నియోజితాః, 15
ప్రధానాప్సరసః పఞ్చ విద్యుచ్చలితవర్చసః.

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, దేవైః = దేవతలచేత, తత్ర = ఆ మునియందు, తపోవిఘ్నమ్ = తపస్సుకు విఘ్నమును, కర్తుమ్ = చేయుటకు, విద్యుచ్చలితవర్చసః = మెరపు వలె కదలుచున్న కాంతి గల, పఞ్చ = ఐదుగురు, ప్రధానాప్సరసః = ప్రధానమైన అప్సరః స్త్రీలు, నియోజితాః = నియమించబడినారు.

తా. దేవత లందరూ కలిసి మెరుపు వలె తళుక్కు మనుచున్న శరీర కాంతి గల ఐదుగురు ప్రధానలైన అప్సరఃస్త్రీలను ఆ ముని తపస్సుకు విఘ్నము చేయుటకై నియమించిరి. 15

మూ. అప్సరోభిస్తతస్తాభిర్మునిర్దృష్టపరావరః, 16
నీతో మదనవశ్యత్వం సురాణాం కార్యసిద్ధయే.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దృష్టపరావరః = చూడబడిన మంచి చెడుగులు గల, మునిః = ముని, తాభిః = ఆ, అప్సరోభిః = అప్సరః స్త్రీలచేత, సురాణామ్ = దేవతలయొక్క, కార్యసిద్ధయే = కార్యసిద్ధికొరకు, మదనవశ్యత్వమ్ = మన్మథునకు వశు డగుటను, నీతః = పొందించబడినాడు.

తా. పిమ్మట ఆ అప్సరఃస్త్రీలు, దేవతల కార్యము సిద్ధించుటకై మంచి చెడ్డల వివేకము గల ఆ మునిని మన్మథుని వశు డగు నట్లు చేసిరి. 16

మూ. తాశ్చైవాప్సరసః పఞ్చ మునేః పత్నీత్వమాగతాః, 17
తటాకే నిర్మితం తాసామస్మిన్నన్తర్హితం గృహమ్.

ప్ర. అ. తాః = ఆ, పఞ్చ = ఐదుగురు, అప్సరసః = అప్సరఃస్త్రీలు, మునేః = మునికి, పత్నీత్వమ్ = భార్యాత్వమును, ఆగతాః = పొందినారు. తాసామ్ = ఆ అప్సరః స్త్రీలయొక్క, గృహమ్ = గృహము, అస్మిన్ = ఈ, తటాకే = సరస్సునందు, అన్తర్హితమ్ = అంతర్హిత మగునట్లుగా, నిర్మితమ్ = నిర్మించబడినది.

తా. ఆ ఐదుగురు అప్సరసలు ఆ మునికి భార్య లైరి. ఆ ముని వారికొరకై ఈ సరస్సులో, పైకి కనబడకుండు నట్లు గృహము నిర్మించెను. 17

మూ. తథైవాప్సరసః పఞ్చ నివసన్త్యో యథాసుఖమ్, 18
రమయన్తి తపోయోగాన్మునిం యౌవనమాస్థితమ్.

ప్ర. అ. తథైవ = అట్లే, పఞ్చ అప్సరసః = ఐదుగురు అప్సరఃస్త్రీలు, యథాసుఖమ్ = సుఖముగా, నివసన్త్యః = నివసించుచు, తపోయోగాత్ = తపఃప్రభావమువలన, యౌవనమ్ = యౌవనమును, ఆస్థితమ్ = అవలంబించిన, మునిమ్ = మునిని, రమయన్తి = ఆనందింపచేయుచున్నారు.

తా. ఆ ఐదుగురు అప్సరసలు సుఖముగా నివసించుచు, తపోబలముచేత యౌవనమును సంపాదించుకొన్న ఆ మునిని ఆనందింపచేయుచున్నారు. 18

మూ. తాసాం సంక్రీడామానానామేష వాదిత్రనిస్స్వనః, 19
శ్రూయతే భూషణోన్మిశ్రో గీతశబ్దో మనోహరః.

ప్ర. అ. సంక్రీడమానానామ్ = క్రీడించుచున్న, తాసామ్ = ఆ అప్సరసలయొక్క, ఏషః = ఈ, వాదిత్రనిస్స్వనః = వాద్యధ్వని, భూషణోన్మిశ్రః = అలంకారములతో కలసిన, మనోహరః = మనోహరమైన, గీతశబ్దః = పాటలధ్వని, శ్రూయతే = వినబడుచున్నవి.

తా. ఆ అప్సరసలు క్రీడించుచుండుటచే ఈ వాద్యధ్వని, అలంకారములధ్వనితో కలిసిన మనోహరమైన గీతధ్వని వినబడుచున్నది. 19

మూ. ఆశ్చర్యమితి తస్యైతద్వచనం భావితాత్మనః, 20
రాఘవః ప్రతిజగ్రాహ సహ భ్రాత్రా మహాయశాః.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రాఘవః = రాముడు, సహ భ్రాత్రా = సోదరునితో కూడ, భావితాత్మనః = పవిత్రము చేసికొనబడిన మనస్సు గల, తస్య = ఆ మునియొక్క, ఏతత్ వచనమ్ = ఈ వచనమును, ఆశ్చర్యమితి = చాల ఆశ్చర్యకరముగా నున్నది అని, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. పవిత్రమైన మనస్సు గల ఆ మునీశ్వరుని మాటలు విని మహాయశఃశాలి యైన రాముడు, లక్ష్మణుడు కూడ "ఇది చాల ఆశ్చర్యకరముగా ఉన్నది" అని పలికిరి. 20

మూ. ఏవం కథయమానస్య దదర్శాశ్రమమణ్డలమ్, 21
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యా లక్ష్మ్యా సమావృతమ్.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, కథయమానస్య = చెప్పుచుండగా, కుశచీరసమాక్షిప్తమ్ = కుశలచేతను, నారచీరలచేతను వ్యాప్తమైన, బ్రాహ్మ్యా = బ్రహ్మసంబంధమైన, లక్ష్మ్యా = శోభతో, సమావృతమ్ = కూడిన, ఆశ్రమమణ్డలమ్ = ఆశ్రమమండలమును, దదర్శ = చూచెను.

తా. ఆ ముని ఆ విధముగ చెప్పుచుండగానే రాముడు ఆశ్రమమండలమును చూచెను. అది కుశలతోను, నారచీరలతోను వ్యాప్తమైయుండెను. అంతటా బ్రహ్మవర్చస్సుతో వెలుగొందుచుండెను. 21

మూ. ప్రవిశ్య సహ వైదేహ్యా లక్ష్మణేన చ రాఘవః, 22
ఉవాస మునిభిః సర్వైః పూజ్యమానో మహాయశాః.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రాఘవః = రాముడు, వైదేహ్యా సహ = సీతతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, ప్రవిశ్య = ప్రవేశించి, సర్వైః = సమస్తమైన, మునిభిః = మునులచేత, పూజ్యమానః = పూజింపబడుచున్నవాడై, ఉవాస = నివసించెను.

తా. గొప్ప కీర్తి గల రాముడు సీతారామలక్ష్మణులతో ఆ ఆశ్రమములోనికి ప్రవేశించి, అక్కడ నున్న మునులందరు పూజించుచుండగా నివసించెను. 22

మూ. తదా తస్మిన్ స కాకుత్థ్సః శ్రీమత్యాశ్రమమణ్డలే, 23
ఉషిత్వా తు సుఖం తత్ర పూజ్యమానో మహర్షిభిః,
జగామ చాశ్రమాంస్తేషాం పర్యాయేణ తపస్వినామ్, 24
యేషాముషితవాన్ పూర్వం సకాశే స మహాస్త్రవిత్.

ప్ర. అ. సః కాకుత్థ్సః = ఆ రామువు, తదా = అప్పుడు, శ్రీమతి = శోభాయుక్తమైన, తస్మిన్ = ఆ, ఆశ్రమమణ్డలే = ఆశ్రమమండలమునందు, సుఖమ్ = సుఖముగా, ఉషిత్వా = నివసించి, తత్ర = అక్కడ, పూజ్యమానః = పూజింపబడుచు, మహాస్త్రవిత్ = మహాస్త్రములను ఎరిగిన, సః = ఆ రాముడు, పూర్వమ్ = పూర్వము, యేషామ్ = ఎవరియొక్క, సకాశే = సమీపమునందు, ఉషితవాన్ = ఉండెనో, తేషామ్ = ఆ, తపస్వినామ్ = మునులయొక్క, ఆశ్రమాన్ = ఆశ్రమములను గూర్చి, పర్యాయేణ = క్రమముగ, జగామ = వెళ్లెను.

తా. ఆ రాముడు శోభాయుక్తమైన ఆ ఆశ్రమమండలములో మహర్షులచే పూజింపబడుచు కొంతకాలము నివసించెను. మహాస్త్రములలో ప్రవీణుడైన ఆ రాముడు, తాను ఏ మునుల సమీపమునందు పూర్వము నివసించెనో వారి ఆశ్రమములకు మరొక పర్యాయము వెళ్లెను. 23, 24

మూ. క్వచిత్పరిదశాన్ మాసానేకం సంవత్సరం క్వచిత్, 25
క్వచిచ్చ చతురో మాసాన్ పఞ్చ షట్చాపరాన్ క్వచిత్,
అపరత్రాధికం మాసాదప్యర్ధమధికం క్వచిత్, 26
త్రీన్ మాసానష్టమాసాంశ్చ రాఘవో న్యవసత్సుఖమ్.

ప్ర. అ. రాఘవః = రాముడు, క్వచిత్ = ఒక ఆశ్రమమునందు, పరిదశాన్ = పదికి దగ్గరగా ఉన్న, మాసాన్ = మాసములను, క్వచిత్ = ఒక ఆశ్రమమునందు, ఏకమ్ = ఒక, సంవత్సరమ్ = సంవత్సరమును, క్వచిత్ = ఒక ఆశ్రమమునందు, చతురః = నాలుగు, మాసాన్ = మాసములను, క్వచిత్ = కొన్ని ఆశ్రమములందు, పఞ్చ = ఐదు మాసములను, అపరాన్ = మరి కొన్ని, షట్చ = అరు మాసములను, అపరత్ర = మరి యొక ఆశ్రమమునందు, మాసాదపి = మాసము కంటె, అధికమ్ = అధిక కాలమును, క్వచిత్ = ఒక ఆశ్రమము

నందు, అర్ధమ్ = సగము మాసము, అధికమ్ = అధికమైన కాలమును, త్రీన్ = మూడు, మాసాన్=మాసములను, సుఖమ్ = సుఖముగా, న్యవసత్=నివసించెను.

తా. రాముడు ఒక ఆశ్రమములో ఇంచుమించు పదిమాసములు, ఒక ఆశ్రమములో ఒక సంవత్సరము, ఒక ఆశ్రమములో నాలుగు మాసములు, ఒక ఆశ్రమములో ఐదు మాసములు, ఒక ఆశ్రమములో ఆరు మాసములు, ఒక ఆశ్రమములో ఒక మాసము కంటె ఎక్కువ కాలము, ఒక ఆశ్రమములో ఒకటి న్నర మాసములు, ఒక ఆశ్రమములో మూడు మాసములు, ఒక ఆశ్రమములో ఎనిమిది మాసములు సుఖముగా నివసించెను. 25, 26

మూ. తదా సంవసతస్తస్య మునీనామాశ్రమేషు వై, 27
రమతశ్చానుకూల్యేన యయుః సంవత్సరా దశ.

ప్ర. అ. తదా = అప్పుడు, తస్య = ఆ రాముడు, ఆశ్రమేషు = ఆశ్రమములయందు, వసతః = నివసించుచుండగా, రమతశ్చ = ఆనందించుచుండగా, దశ = పది, సంవత్సరాః = సంవత్సరములు, ఆనుకూల్యేన = ఆనుకూల్యముతో, యయుః=గడచినవి.

తా. రాముడు ఆ విధముగ ఆశ్రమములలో ఆనందముతో నివసించు చుండగా పది సంవత్సరములు అనుకూలముగా గడచిపోయినవి. 27

మూ. పరిసృత్య చ ధర్మజ్ఞో రాఘవః సహ సీతయా, 28
సుతీక్ష్ణస్యాశ్రమం శ్రీమాన్ పునరేవాజగామ హ.

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మములను ఎరిగిన, శ్రీమాన్ = శ్రీమంతుడైన, రాఘవః=రాముడు, సీతయా సహ=సీతతో కూడ, పరిసృత్య=సంచరించి, పున రేవ = మరల, సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణమహర్షియొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, ఆజగామ హ = వచ్చెను.

తా. ధర్మము లన్నీ తెలిసిన, శోభావంతుడైన రాముడు సీతాసమేతుడై, ఆ యా ఆశ్రమములలో సంచరించుచు మరల సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వచ్చెను. 28

మూ. స తమాశ్రమమాసాద్య మునిభిః ప్రతిపూజితః, 29
తత్రాపి న్యవసద్రామః కంచిత్కాలమరిందమః.

ప్ర. అ. అరిందమః = శత్రుసంహారకుడైన, సః రామః = ఆ రాముడు, తమ్ = ఆ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆసాద్య = పొంది, మునిభిః = మునుల చేత, ప్రతిపూజితః = పూజింపబడినవాడై, తత్రాపి = అక్కడ కూడ, కంచిత్ కాలమ్ = కొంత కాలము, న్యవసత్ = నివసించెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు ఆ ఆశ్రమము చేరి, మునులచే పూజింపబడినవాడై, అక్కడ కూడ కొంతకాలము నివసించెను. 29

మూ. అథాశ్రమస్థో వినయాత్కదాచిత్తం మహామునిమ్, 30
ఉపాసీనః స కాకుత్స్థః సుతీక్ష్ణమిదమబ్రవీత్.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, ఆశ్రమస్థః = ఆశ్రమములో ఉన్న, కాకుత్స్థః = రాముడు, కదాచిత్ = ఒకనాడు, మహామునిమ్ = మహామునియైన, సుతీక్ష్ణమ్ = సుతీక్ష్ణుని, ఉపాసీనః = సమీపమునందు కూర్చున్నవాడై, వినయాత్ = వినయమువలన, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆశ్రమములో నివసించుచున్న రాముడు ఒకనాడు ఆ సుతీక్ష్ణమహా మునిసమీపమునందు కూర్చుండి వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 30

మూ. అస్మిన్నరణ్యే భగవానగస్త్యో మునిసత్తమః, 31
వసతీతి మయా నిత్యం కథాః కథయతాం శ్రుతమ్.

ప్ర. అ. భగవాన్ = మాహాత్మ్యము గల, మునిసత్తమః = మునులలో శ్రేష్ఠుడైన, అగస్త్యః = అగస్త్యుడు, అస్మిన్ = ఈ, అరణ్యే = అరణ్యమునందు, వసతీతి = నివసించుచున్నాడు అని, నిత్యమ్ = ఎల్లప్పుడు, కథాః = కథలను, కథయతామ్ = చెప్పుచున్నవారినుండి, శ్రుతమ్ = వినబడినది.

తా. మాహాత్మ్యము కలవాడు, మునిశ్రేష్ఠుడు అయిన అగస్త్యుడు ఈ అరణ్యమునందే నివసించుచున్నాడని, ఆ యా కథలు చెప్పుచున్నవారినుండి నేను అప్పుడప్పుడు విన్నాను. 31

మూ. న తు జానామి తం దేశం వనస్యాస్య మహత్తయా, 32.
కుత్రాశ్రమపదం పుణ్యం మహర్షేస్తస్య ధీమతః.

ప్ర. అ. తు = కాని, అస్య = ఈ, వనస్య=వనము, మహత్తయా = గొప్ప దగుటచేత, తం దేశమ్ = ఆ ప్రదేశమును, న జానామి = ఎరుగను. ధీమతః = బుద్ధిమంతుడైన, తస్య మహర్షేః = ఆ మహర్షియొక్క, పుణ్యమ్ = పవిత్రమైన, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానము, కుత్ర = ఎక్కడ ఉన్నది ?

తా. ఈ అరణ్యము అతి విశాలమైన దగుటచేత ఆ ప్రదేశ మేదో నాకు తెలియలేదు. మహాబుద్ధిమంతుడైన ఆ మహర్షి పవిత్రమైన ఆశ్రమము ఎక్కడ ఉన్నది? 32.

మూ. ప్రసాదాత్తత్ర భవతః సానుజః సహ సీతయా, 33.
అగస్త్యమభిగచ్ఛేయమభివాదయితుం మునిమ్.

ప్ర. అ. భవతః=నీయొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, సానుజః = తమ్మునితో కూడినవాడనై, సహ సీతయా = సీతతో కూడ, మునిమ్=మునియైన, అగస్త్యమ్ = అగస్త్యుని, అభివాదయితుమ్ = నమస్కరించుటకు, తత్ర = అక్కడికి, అభిగచ్ఛేయమ్ = వెళ్లెదను.

తా. నీవు అనుగ్రహించినట్లయితే, తమ్మునితోను, సీతతోను కలసి ఆ అగస్త్యమహామునికి నమస్కరించుటకు అక్కడికి వెళ్లెదను. 33.

మూ. మనోరథో మహానేష హృది మే పరివర్తతే, 34
యద్యహం తం మునివరం శుశ్రూషేయమపి స్వయమ్.

ప్ర. అ. తమ్ = ఆ, మునివరమ్ = మునిశ్రేష్ఠుణ్ణి, స్వయమ్ = స్వయముగా, అహమ్ = నేను, శుశ్రూషేయమపి యది = సేవింపగలనా అని, ఏషః = ఈ, మహన్ = గొప్ప, మనోరథః = మనోరథము, మే = నాయొక్క, హృది =హృదయమునందు, పరివర్తతే = దొర్లుచున్నది.

తా. మునులలో శ్రేష్ఠుడైన ఆ అగస్త్యుని ఏనాడైన స్వయముగా సేవించ కలుగుదునా అను గొప్ప కోరిక నా హృదయములో తిరుగాడుచున్నది. 34.

మూ. ఇతి రామస్య స మునిః శ్రుత్వా ధర్మాత్మనో వచః. 35
సుతీక్ష్ణః ప్రత్యువాచేదం ప్రీతో దశరథాత్మజమ్.

ప్ర. అ. సః=ఆ, సుతీక్ష్ణః మునిః=సుతీక్ష్ణముని, ధర్మాత్మనః=ధర్మాత్ముడైన, రామస్య=రామునియొక్క, ఇతి = ఇట్లు, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రీతః= సంతోషించినవాడై, దశరథాత్మజమ్ = రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ఆ సుతీక్ష్ణముని, ధర్మాత్ముడైన రాముని మాటలు విని, సంతోషించినవాడై, ఆ రామునితో ఇట్లు పలికెను. 35

మూ. అహమప్యేతదేవ త్వాం వక్తుకామః సలక్ష్మణమ్, 36
అగస్త్యమభిగచ్ఛేతి సీతయా సహ రాఘవ.

ప్ర. అ. రాఘవ= రామా! అహమపి=నేను కూడ, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, త్వామ్=నిన్ను గూర్చి, సీతయాసహ=సీతతో కూడ, అగస్త్యమ్= అగస్త్యుణ్ణిగూర్చి, అభిగచ్ఛ = వెళ్లుము, ఇతి = అని, ఏతదేవ = దీనినే, వక్తుకామః=చెప్పుటకు కోరికకలవాడను.

తా. రామా! "సీతతో కలిసి నీవు లక్ష్మణసమేతుడవై అగస్త్యుని వద్దకు వెళ్లుము" అని నేను కూడ ఈ విషయమే చెప్పవలెనని అనుకొనుచుంటిని. 36

మూ. దిష్ట్యా త్విదానీమర్థేఽస్మిన్ స్వయమేవ బ్రవీషి మామ్, 37
అహమాఖ్యామి తే వత్స యత్రాగస్త్యో మహామునిః.

ప్ర. అ. దిష్ట్యా= దైవముచేత, ఇదానీమ్ = ఇప్పుడు, అస్మిన్ = ఈ, అర్థే= విషయమునందు, స్వయమేవ = స్వయముగానే, మామ్ = నన్ను గూర్చి, బ్రవీషి = మాటలాడుచున్నావు. వత్స= ఓ! వత్సా, మహామునిః = మహామునియైన, అగస్త్యః=అగస్త్యుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో, అహమ్=నేను, తే=నీకు, ఆఖ్యామి=చెప్పెదను.

తా. దైవవశముచేత నీవే స్వయముగ ఈ విషయమును గూర్చి నాతో ముచ్చటించినావు. నాయనా! అగస్త్యమహాముని నివసించు ప్రదేశమును నీకు చెప్పెదను. 37

మూ. యోజనాన్యాశ్రమాత్తాత యాహి చత్వారి వై తతః, 38
దక్షిణేన మహాన్ శ్రీమానగస్త్యభ్రాతురాశ్రమః.

ప్ర. అ. తాత = తండ్రీ! ఆశ్రమాత్ = ఈ ఆశ్రమమునుండి, చత్వారి = నాలుగు, యోజనాని = యోజనములు, యాహి = వెళ్లుము. తతః = పిమ్మట, దక్షిణేన = దక్షిణము వైపున, అగస్త్యభ్రాతుః = అగస్త్యుని సోదరునియొక్క. మహాన్ = గొప్ప, శ్రీమాన్ = శోభాయుక్తమైన, ఆశ్రమః = ఆశ్రమ మున్నది.

తా. నాయనా! ఈ ఆశ్రమమునుండి నాలుగు యోజనముల దూరము వెళ్లుము. అక్కడ దక్షిణపు దిశయందు అగస్త్యుని సోదరుని, గొప్ప, శోభాయుక్తమైన ఆశ్రమము కనబడును. 38

మూ. స్థలప్రాయే వనోద్దేశే పిప్పలీవనశోభితే, 39
బహుపుష్పఫలే రమ్యే నానాశకునినాదితే.

ప్ర. అ. పిప్పలీవనశోభితే = పిప్పలీవనముచేత ప్రకాశింపచేయబడినది, బహుపుష్పఫలే = అనేకమైన పుష్పములు, ఫలములు కలది, రమ్యే = రమ్యమైనది, నానాశకునినాదితే = అనేకపక్షులచేత ధ్వనింపచేయబడినది అయిన, స్థలప్రాయే = అధికముగా మెట్టగా ఉన్న, వనోద్దేశే = వనప్రదేశమునందు (ఆ ఆశ్రమమున్నది).

తా. ఆ ఆశ్రమము ఎక్కువ మెట్టగా ఉన్న అరణ్యప్రదేశములో ఉన్నది. ఆ ప్రదేశమునందు పిప్పలీవనము ఉండును. అనేక పుష్పములు, ఫలములు ఉండును. రమ్యమైన ఆ ప్రదేశమునందు అనేకవిధములైన పక్షులు ధ్వనిచేయుచుండును. 39

మూ. పద్మిన్యో వివిధాస్తత్ర ప్రసన్నసలిలాః శివాః, 40
హంసకారణ్డవాకీర్ణాశ్చక్రవాకోపశోభితాః,
తత్రైకాం రజనీం వ్యుష్య ప్రభాతే రామ గమ్యతామ్. 41

ప్ర. అ. తత్ర = అక్కడ, ప్రసన్నసలిలాః = నిర్మలమైన ఉదకము గలవి, శివాః = మంగళప్రదమైనవి, హంసకారణ్డవాకీర్ణాః = హంసలచేత, కారండపక్షులచేత వ్యాప్తమైనవి, చక్రవాకోపశోభితాః = చక్రవాకపక్షులచేత ప్రకాశింపచేయ

బడినవి అయిన, వివిధాః=అనేకవిధములైన, పద్మిన్యః=పద్మసరస్సులు ఉండును. రామ = రామా ! తత్ర=ఆ ఆశ్రమమునందు, ఏకామ్=ఒక, రజనీమ్=రాత్రిని, వ్యుష్య = ఉండి, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, గమ్యతామ్ = వెళ్లెదవుగాక.

తా. అక్కడ నిర్మలమైన జలములతో మంగళప్రదములై, హంస-కారండవ-చక్రవాకాదిపక్షులతో వ్యాప్తములైన అనేకవిధములైన పద్మసరస్సులు ఉన్నవి. రామా ! నీ వక్కడ ఒక్క రాత్రి ఉండి మరునాడు ఉదయముననే వెళ్లుము. 40, 41

మూ. దక్షిణాం దిశమాస్థాయ వనషణ్డస్య పార్శ్వతః,
తత్రాగస్త్యాశ్రమపదం గత్వా యోజనమన్తరమ్. 42

ప్ర. అ. వనషణ్డస్య=వృక్షముల గుంపుయొక్క, పార్శ్వతః=ప్రక్కన, దక్షిణామ్= దక్షిణపు, దిశమ్ = దిక్కును, ఆస్థాయ = అవలంబించి, యోజనమ్ = ఒక యోజనము, అన్తరమ్ = దూరము, గత్వా = వెళ్ళి, తత్ర = అక్కడ, అగస్త్యాశ్రమపదమ్ = అగస్త్యుని ఆశ్రమస్థానము ఉన్నది.

తా. ఆ వృక్షముల గుంపుకు ప్రక్కన దక్షిణము వైపు ప్రయాణము చేసి ఒక యోజనముదూరము వెళ్ళినచో అక్కడ అగస్త్యుని ఆశ్రమ మున్నది. 42

మూ. రమణీయే వనోద్దేశే బహుపాదపసంవృతే,
రంస్యతే తత్ర వైదేహీ లక్ష్మణశ్చ సహ త్వయా, 43
స హి రమ్యో వనోద్దేశో బహుపాదపసంకులః.

ప్ర. అ. రమణీయే = సుందరమైన, బహుపాదపసంకులే = అనేకవృక్షములచే చుట్టబడిన, తత్ర = ఆ, వనోద్దేశే = వనప్రదేశమునందు, వైదేహీ=సీత, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, త్వయా సహ=నీతో కూడ, రంస్యతే=ఆనందించును. బహుపాదపసంకులః = అనేకవృక్షములతో నిండిన, సః = ఆ, వనోద్దేశః = వనప్రదేశము, రమ్యః హి = చాల సుందరమైనది కదా.

తా. చుట్టూ అనేకవృక్షము లున్న ఆ సుందరమైన వనప్రదేశమునందు, నీవు, సీత, లక్ష్మణుడు కూడ ఆనందముగా ఉండగలరు. అనేకవృక్షములతో నిండి ఉండుటచే ఆ ప్రదేశము చాల రమ్యముగా ఉండును కదా ? 43

మూ. యది బుద్ధిః కృతా ద్రష్టుమగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః.

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి కలవాడా ! మహామునిమ్ = మహా ముని యైన, తమ్ = ఆ, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి, ద్రష్టుమ్ = చూచుటకు, బుద్ధిః = బుద్ధి, కృతా యది = చేయబడినట్లయితే, అద్యైవ = ఇప్పుడే, గమనే = వెళ్లుట యందు, బుద్ధిమ్ = బుద్ధిని, రోచయస్వ = ఇష్టముకలదానిని చేయుము.

తా. గొప్ప కీర్తి గల రామా ! ఆ అగస్త్యమహామునిని చూడవలె నను అభిప్రాయ మున్నచో ఇప్పుడే బయలుదేరుటకు నిశ్చయించుకొనుము. 44

మూ. ఇతి రామో మునేః శ్రుత్వా సహ భ్రాత్రాభివాద్య చ, 45
ప్రతస్థేఽగస్త్యముద్దిశ్య సానుజః సీతయా సహ.

ప్ర. అ. రామః = రాముడు, మునేః = మునియొక్క, ఇతి = ఇట్లు పలికిన మాటలను, శ్రుత్వా = విని, సహ భ్రాత్రా = సోదరునితో కూడ, అభివాద్య చ = నమస్కరించి, సానుజః = తమ్మునితో కూడినవాడై, సీతయా సహ = సీతతో కూడ, అగస్త్యమ్ = అగస్త్యుని, ఉద్దిశ్య = ఉద్దేశించి, ప్రతస్థే = ప్రయాణ మాయెను.

తా. రాముడు ముని మాటలు విని, లక్ష్మణసహితుడై, ఆ మునికి నమస్కరించి, తమ్మునితోను, సీతతోను కలసి అగస్త్యుని ఆశ్రమమునకు బయలుదేరెను.

మూ. పశ్యన్వనాని రమ్యాణి పర్వతాంశ్చాభ్రసన్నిభాన్, 46
సరాంసి సరితశ్చైవ పథి మార్గవశానుగాః,
సుతీక్ష్ణేనోపదిష్టేన గత్వా తేన పథా సుఖమ్, 47
ఇదం పరమసంహృష్టో వాక్యం లక్ష్మణమబ్రవీత్.

ప్ర. అ. రమ్యాణి = సుందరమైన, వనాని = వనములను, అభ్రసన్నిభాన్ = ఆకాశముతో సమానములైన, పర్వతాంశ్చ = పర్వతములను, సరాంసి = సరస్సులను, పథి = మార్గమునందు, మార్గవశానుగాః = మార్గము ననుసరించి ప్రవహించుచున్న, సరితశ్చ = నదులను, పశ్యన్ = చూచుచు, సుతీక్ష్ణేన = సుతీక్ష్ణుని చేత, ఉపదిష్టేన = చెప్పబడిన, తేన పథా = ఆ మార్గముచేత, యథాసుఖమ్ =

సుఖముగా, గత్వా = వెళ్ళి, పరమసంహృష్టః = చాల సంతోషించినవాడై, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు సుందరములైన వనములను, మేఘములతో సమానములైన పర్వతములను, సరస్సులను, మార్గమునందు ప్రవహించుచున్న నదులను చూచుచు సుతీక్ష్ణుడు చెప్పిన మార్గమునందు సుఖముగా ప్రయాణము చేసి, చాల సంతోషించుచు, లక్ష్మణునితో ఇట్లు పలికెను. 46, 47

మూ. ఏతదేవాశ్రమపదం నూనం తస్య మహాత్మనః, 48
అగస్త్యస్య మునేర్భ్రాతుర్దృశ్యతే పుణ్యకర్మణః.

ప్ర. అ. ఏతదేవ = ఇదే, మహాత్మనః = మహాత్ముడు, పుణ్యకర్మణః = పుణ్యమైన కర్మ కలవాడు, అగస్త్యస్య మునేః = అగస్త్యమునియొక్క, భ్రాతుః = సోదరుడూ అయిన, తస్య = ఆ మునీశ్వరునియొక్క, ఆశ్రమపదమ్ = ఆశ్రమముగా, దృశ్యతే = కనబడుచున్నది. నూనమ్ = నిశ్చయము.

తా. మహాత్ముడు, పుణ్యకర్మల నాచరించినవాడు అయిన ఆ అగస్త్య భ్రాత ఆశ్రమము ఇదే అయి ఉండును. నిశ్చయము. 48

మూ. యథా హి మే వనస్యాస్య జ్ఞాతాః పథి సహస్రశః, 49
సన్నతాః ఫలభారేణ పుష్పభారేణ చ ద్రుమాః.

ప్ర. అ. పథి = మార్గమునందు, ఫలభారేణ = ఫలభారముచేతను, పుష్పభారేణ చ = పుష్పభారముచేతను, సంనతాః = వంగిన, సహస్రశః = వేలకొలది, అస్య వనస్య = ఈ వనముయొక్క, ద్రుమాః = వృక్షములు, యథా హి = ఎట్లు, మే = నాకు, జ్ఞాతాః = తెలియబడినవో (చూడబడినవో) "దానిచే ఇది ఆ అగస్త్య భ్రాత ఆశ్రమమే" అని పూర్వశ్లోకముతో అన్వయము.

తా. ఫలభారముచేతను, పుష్పభారముచేతను వంగిన ఈ వనమునకు సంబంధించిన వేలకొలది వృక్షములు మార్గములో నాకు కనబడుచుండుటను బట్టి ఇది తప్పక అగస్త్యభ్రాత ఆశ్రమమే. 49

మూ. పిప్పలీనాం చ పక్వానాం వనాదస్మాదుపాగతః, 50
గన్ధోఽయం పవనోత్క్షిప్తః సహసా కటుకోదయః.

ప్ర. అ. సహసా=హటాత్తుగా, పవనోత్క్షిప్తః=వాయువుచేత ఎగురగొట్టబడిన, కటుకోదయః=వెగటుగా ఉన్న ఆవిర్భావము గల, పక్వానామ్=పక్వమైన, పిప్పలీనామ్=పిప్పళ్లయొక్క, అయం గన్ధః=ఈ వాసన, అస్మాత్=ఈ, వనాత్=వనమునుండి, ఉపాగతః=వచ్చినది.

తా. ఈ వనమునుండి పండిన పిప్పళ్ళ వెగటైన వాసన హటాత్తుగా గాలిచే ఎగురగొట్టబడినదై వచ్చుచున్నది. 50

మూ. తత్ర తత్ర చ దృశ్యన్తే సంక్షిప్తాః కాష్ఠసంచయాః, 51
లూనాశ్చ పథి దృశ్యన్తే దర్భా వైడూర్యవర్చసః.

ప్ర. అ. తత్ర తత్ర=అక్కడక్కడ, సంక్షిప్తాః=ప్రోగు చేయబడిన, కాష్ఠసంచయాః=కట్టెల ప్రోగులు, దృశ్యన్తే=చూడ బడుచున్నవి. లూనాః=తెలపబడిన, వైడూర్యవర్చసః=వైడూర్యమణుల వంటి కాంతి గల, దర్భాశ్చ=దర్భలు కూడ, పథి=మార్గమునందు, దృశ్యన్తే=చూడబడుచున్నవి.

తా. అక్కడక్కడ ప్రోగులుగా పెట్టిన కట్టెలు కనబడుచున్నవి. మార్గమునందు త్రుంచబడిన, వైడూర్యమాణిక్యముల వలె ఆకుపచ్చగా ఉన్న దర్భలు కనబడుచున్నవి. 51

మూ. ఏతచ్చ వనమధ్యస్థం కృష్ణాభ్రశిఖరోపమమ్, 52
పావకస్యాశ్రమస్థస్య ధూమాగ్రం సంప్రదృశ్యతే.

ప్ర. అ. ఆశ్రమస్థస్య=ఆశ్రమములో ఉన్న, పావకస్య=అగ్నియొక్క, కృష్ణాభ్రశిఖరోపమమ్=నల్లని మేఘము అగ్రభాగముతో సమానమైన, వనమధ్యస్థమ్=వనమధ్యమునందున్న, ఏతత్=ఈ, ధూమాగ్రమ్=ధూమము యొక్క అగ్రభాగమ్, సంప్రదృశ్యతే=చూడబడుచున్నది.

తా. ఆశ్రమములోని అగ్నినుండి బయలుదేరిన ధూమము అగ్రభాగము, ఇదిగో, వనమధ్యమునందు కనబడుచున్నది. ఇది నల్లని మేఘము చివరి భాగము వలె ఉన్నది. 52

మూ. వివిక్తేషు చ తీర్థేషు కృతస్నానా ద్విజాతయః, 53
పుష్పోపహారం కుర్వన్తి కుసుమైః స్వయమార్జితైః.

ప్ర. అ. వివిక్తేషు = పవిత్రములైన, తీర్థేషు = తీర్థములందు, కృతస్నానాః = చేయబడిన స్నానము గల, ద్విజాతయః = ద్విజులు, స్వయమ్ = స్వయముగా, ఆర్జితైః = సంపాదించబడిన, కుసుమైః = పుష్పములతో, పుష్పోపహారమ్ = పుష్పబలిని, కుర్వన్తి = చేయుచున్నారు.

తా. ద్విజులు పవిత్రములైన తీర్థములలో స్నానము చేసి, తాము స్వయముగా కోసికొని వచ్చిన పుష్పాలను దేవతలకు సమర్పించి పూజించుచున్నారు. 53

మూ. తత్సుతీక్ష్ణస్య వచనం యథా సౌమ్య మయా శ్రుతమ్, 54
అగస్త్యస్యాశ్రమో భ్రాతుర్నూనమేష భవిష్యతి.

ప్ర. అ. సౌమ్య = ఓ ! సౌమ్యుడా ! తత్ = ఆ కారణమువలన, సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణునియొక్క, వచనమ్ = వచనము, మయా = నాచేత, యథా = ఎట్లు, శ్రుతమ్ = వినబడినదో, ఏషః = ఇది, నూనమ్ = నిశ్చయముగా, అగస్త్యస్య = అగస్త్యునియొక్క, భ్రాతుః = సోదరునియొక్క, ఆశ్రమః = ఆశ్రమము, భవిష్యతి = కాగలదు.

తా. సౌమ్యుడవైన లక్ష్మణా ! అందువలన, నేను సుతీక్ష్ణునినుండి వినినట్లు ఇది తప్పక అగస్త్యుని సోదరుని ఆశ్రమమై ఉండును. 54

మూ. నిగృహ్య తపసా మృత్యుం లోకానాం హితకామ్యయా,
యస్య భ్రాత్రా కృతేయం దిక్ఛరణ్యా పుణ్యకర్మణా.

ప్ర. అ. యస్య=ఎవ్వనియొక్క, భ్రాత్రా=సోదరుడైన, పుణ్యకర్మణా= పుణ్యకర్మలు గల అగస్త్యునిచేత, లోకానామ్=ప్రజలయొక్క, హితకామ్యయా= హితమునందు కోరికచేత, తపసా = తపస్సుచేత, మృత్యుమ్ = మృత్యువును, నిగృహ్య = నిగ్రహించి, ఇయమ్ = ఈ, దిక్ =దక్షిణదిక్కు, శరణ్యా=నివాసయోగ్యముగా, కృతా = చేయబడినదో (అట్టి ముని ఆశ్రమ మిదే).

తా. ఎవ్వని సోదరుడైన, పుణ్యాత్ముడైన అగస్త్యుడు లోకులకు హితము కోరుచు తపస్సుచేత మృత్యుదేవతను నిగ్రహించి ఈ దక్షిణదిక్కు మునులకు నివాసయోగ్య మగు నట్లు చేసెనో ఆ మునీశ్వరుని ఆశ్రమ మిదే అయి ఉండును.

మూ. ఇహైకదా కిల క్రూరో వాతాపిరపి చేల్వలః, 56
భ్రాతరౌ సహితావాస్తాం బ్రాహ్మణఘ్నౌ మహాసురౌ.

ప్ర. అ. ఏకదా = ఒకప్పుడు, ఇహ = ఈ ప్రాంతమునందు, బ్రాహ్మణఘ్నౌ = బ్రాహ్మణులను చంపేవారైన, క్రూరః = క్రూరుడైన, వాతాపిః = వాతాపి, ఇల్వలశ్చ = ఇల్వలుడు అనే, భ్రాతరౌ = సోదరులైన, మహాసురౌ = గొప్ప రాక్షసులు, సహితౌ = కలిసినవారై, ఆస్తాం కిల = ఉండి రట.

తా. ఒకానొకప్పుడు, ఈ ప్రాంతమునందు క్రూరులైన వాతాపి, ఇల్వలుడు అనే సోదరులైన బలవంతులైన రాక్షసులు ఉండేవారట. వాళ్ళు బ్రాహ్మణులను చంపుచుండేవారు. 56

మూ. ధారయన్ బ్రాహ్మణం రూపమిల్వలః సంస్కృతం వదన్,
ఆమన్త్రయతి విప్రాన్ స్మ శ్రాద్ధముద్దిశ్య నిర్ఘృణః.

ప్ర. అ. ఇల్వలః = ఇల్వలుడు, బ్రాహ్మణమ్ = బ్రాహ్మణసంబంధమైన, రూపమ్ = రూపమును, ధారయన్ = ధరించుచు, సంస్కృతమ్ = సంస్కృతముగా, వదన్ = మాటలాడుచు, నిర్ఘృణః = జాలిలేనివాడై, శ్రాద్ధముద్దిశ్య = శ్రాద్ధమును గూర్చి, విప్రాన్ = బ్రాహ్మణులను, ఆమన్త్రయతి స్మ = పిలుచుచుండెను.

తా. ఇల్వలుడు బ్రాహ్మణరూపము ధరించి, నిర్దుష్టమైన భాషలో మాటలాడుచు, జాలి లేనివాడై, బ్రాహ్మణులను శ్రాద్ధమునందు భోక్తలనుగా ఆహ్వానించేవాడు. 57

మూ. భ్రాతరం సంస్కృతం కృత్వా తత స్తం మేషరూపిణమ్,
తాన్ ద్విజాన్ భోజయామాస శ్రాద్ధదృష్టేన కర్మణా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మేషరూపిణమ్ = గొఱ్ఱె రూపములో ఉన్న, తం భ్రాతరమ్ = ఆ సోదరుడైన వాతాపిని, సంస్కృతమ్ = పాకముచేత

సంస్కరింపబడినవానినిగా, కృత్వా = చేసి, తతః = అటుపిమ్మట, శ్రాద్ధ దృష్టేన = శ్రాద్ధకల్పమునందు చూడబడిన, కర్మణా = కర్మచేత, తాన్ ద్విజాన్ = ఆ బ్రాహ్మణులను, భోజయామాస = భుజింపచేసెను.

తా. గొఱ్ఱె రూపములో ఉన్న సోదరుడైన వాతాపిని వండి, శ్రాద్ధ కల్పమునందు చెప్పిన విధిప్రకారము ఆ బ్రాహ్మణులకు భోజనము పెట్టేవాడు.

మూ. తతో భుక్తవతాం తేషాం విప్రాణామిల్వలోఽబ్రవీత్, 59
వాతాపే నిష్క్రమస్వేతి స్వరేణ మహతా వదన్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తేషాం విప్రాణామ్ = ఆ బ్రాహ్మణులు, భుక్తవతామ్ = భుజించినవారగుచుండగా, ఇల్వలః = ఇల్వలుడు, మహతా = పెద్ద, స్వరేణ = స్వరముతో, వదన్ = అరచుచు, వాతాపే = వాతాపీ ! నిష్క్రమస్వ = బైటకు రమ్ము, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ బ్రాహ్మణులు భుజించిన పిమ్మట ఇల్వలుడు బిగ్గరగా అరచుచు "వాతాపీ బైటకు రమ్ము''అని పలుకుచుండేవాడు. 59

మూ. తతో భ్రాతుర్వచః శ్రుత్వా వాతాపిర్మేషవన్నదన్, 60
భిత్త్వా భిత్త్వా శరీరాణి బ్రాహ్మణానాం వినిష్పతత్.

ప్ర. అ. తతః = పిమ్మట, వాతాపిః = వాతాపి, భ్రాతుః = సోదరుని యొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, మేషవత్ = గొఱ్ఱె వలె, నదన్ = అరచుచు, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులయొక్క, శరీరాణి = శరీరములను, భిత్త్వా భిత్త్వా = బ్రద్దలుకొట్టి బ్రద్దలుకొట్టి, వినిష్పతత్ = బైటకు వచ్చేవాడు.

తా. పిమ్మట వాతాపి సోదరుని మాట విని, గొఱ్ఱె వలె అరచుచు, బ్రాహ్మణుల శరీరములను బ్రద్దలుకొట్టుకొని బైటకు వచ్చేవాడు. 60

మూ. బ్రాహ్మణానాం సహస్రాణి తైరేవం కామరూపిభిః, 61
వినాశితాని సంహత్య నిత్యశః పిశితాశనైః.

('తైః' అనే బహువచనం కుదరదు ''....తాభ్యామేవం పరంతప........ పిశితాశయా"అనే ప్రాచ్యపాఠము బాగున్నది.

ప్ర. అ. పరంతప=శత్రువినాశకుడ వైన లక్ష్మణా! తాభ్యామ్=వారిద్దరి చేత, సంహత్య=కలిసి, పిశితాశయా=మాంసమునందు ఆశచేత, బ్రాహ్మ ణానామ్=బ్రాహ్మణులయొక్క, సహస్రాణి = సహస్రములు, ఏవమ్=ఈ విధముగ, నిత్యశః=నిత్యము, వినాశితాని=నశింపచేయబడినవి.

తా. శత్రుసంహారకుడ వైన లక్ష్మణా! ఆ రాక్షసు లిద్దరూ కలిసి ఈ విధముగ నిత్యము చేయుచు మాంసముకొరకే వేలకొలది బ్రాహ్మణులను చంపి వేసిరి. 61

మూ. అగస్త్యేన తదా దేవైః ప్రార్థితేన మహర్షిణా, 62
అనుభూయ కిల శ్రాద్ధే భక్షితః స మహాసురః.

ప్ర. అ. తదా=అప్పుడు, దేవైః=దేవతలచేత, ప్రార్థితేన=ప్రార్థింప బడిన, మహర్షిణా=మహర్షియైన, అగస్త్యేన=అగస్త్యునిచేత, శ్రాద్ధే=శ్రాద్ధము నందు, అనుభూయ=అనుభవించి, సః మహాసురః=ఆ మహారాక్షసుడు, భక్షితః కిల=భక్షించబడినా డట.

తా. అప్పుడు దేవతలు ప్రార్థించగా అగస్త్యమహర్షి శ్రాద్ధములో ఆ మహా సురుణ్ణి తిని జీర్ణముచేసుకొన్నా డట. 62

మూ. తతః సంపన్నమిత్యుక్త్వా దత్త్వా హస్తావసేచనమ్, 63
భ్రాతరం నిష్క్రమస్వేతి చేల్వలః సోఽభ్యభాషత.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సః ఇల్వలః=ఆ ఇల్వలుడు, సంప న్నమ్=శ్రాద్ధము సంపన్న మైనట్లేనా? ఇతి=అని, ఉక్త్వా=పలికి, హస్తావ సేచనమ్=ఉత్తరాపోశనమును, దత్త్వా=ఇచ్చి, నిష్క్రమస్వ=బైటకు రమ్ము, ఇతి=అని, భ్రాతరమ్=సోదరుని గూర్చి, అభ్యభాషత=పలికెను.

తా. పిమ్మట ఇల్వలుడు శ్రాద్ధము సంపన్న మైనది కదా అని అగస్త్యుని ప్రశ్నించి, ఆతనికి ఉత్తరాపోశనము వడ్డించి, "బైటకు రమ్ము"అని సోదరుని పిలచెను. 63

మూ. స తం తథా భాషమాణం భ్రాతరం విప్రఘాతినమ్, 64
అబ్రవీత్ప్రహసన్ ధీమానగస్త్యో మునిసత్తమః.

ప్ర. అ. ధీమాన్=బుద్ధిమంతుడు, మునిసత్తమః=మునిశ్రేష్ఠుడు అయిన, అగస్త్యః=అగస్త్యుడు, భ్రాతరమ్=సోదరుని గూర్చి, తథా=అట్లు, భాషమాణమ్=పలుకుచున్న, విప్రఘాతినమ్=బ్రాహ్మణులను చంపిన, తమ్=ఆ ఇల్వలుణ్ణి గూర్చి, ప్రహసన్=నవ్వుచు, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు బుద్ధిశాలి, మునిశ్రేష్ఠుడూ అయిన అగస్త్యుడు, ఆ విధముగ తన సోదరుని పిలచుచున్న, బ్రాహ్మణహింసకుడైన ఆ ఇల్వలుని చూచి నవ్వుచు ఇట్లు పలికెను. 64

మూ. కుతో నిష్క్రమితుం శక్తిర్మయా జీర్ణస్య రక్షసః, 65
భ్రాతుస్తే మేషరూపస్య గతస్య యమసాదనమ్.

ప్ర. అ. మయా=నాచేత, జీర్ణస్య=జీర్ణముచేయబడినవాడు, రక్షసః=రాక్షసుడు, మేషరూపస్య=మేషరూపము ధరించినవాడు, యమసాదనమ్=యముని గృహమును గూర్చి, గతస్య=వెళ్ళినవాడు అయిన, తే భ్రాతుః=నీ సోదరునకు, నిష్క్రమితుమ్=బైటకు వచ్చుటకు, శక్తిః=శక్తి, కుతః=ఎక్కడిది ?

తా. మేషరూపమును ధరించిన రాక్షసుడైన, నీ సోదరుణ్ణి నేను జీర్ణము చేసికొన్నాను. అతడు యమలోకమునకు వెళ్ళిపోయినాడు. ఇంక పైకివచ్చే శక్తి వాని కెక్కడిది ? 65

మూ. అథ తస్య వచః శ్రుత్వా భ్రాతుర్నిధనసంశ్రయమ్, 66
ప్రధర్షయితుమారేభే మునిం క్రోధాన్నిశాచరః.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, భ్రాతుః=సోదరునియొక్క, నిధనసంశ్రయమ్=మరణమునకు సంబంధించిన, తస్య=ఆ అగస్త్యునియొక్క, వచః=వాక్కును, శ్రుత్వా=విని, నిశాచరః=ఆ రాక్షసుడు, క్రోధాత్=కోపము వలన, ప్రధర్షయితుమ్=ఎదిరించుటకు, ఆరేభే=ప్రారంభించెను.

తా. ఇల్వలుడు తన సోదరుడు మరణించినట్లు ఆ అగస్త్యుడు చెప్పిన మాటలు విని, కోపముతో అతనిమీదికి వెళ్ళెను. 66

మూ. సోఽభిద్రవన్మునిశ్రేష్ఠం మునినా దీప్తతేజసా, 67
చక్షుషానలకల్పేన నిర్దగ్ధో నిధనం గతః.

ప్ర. అ. సః = ఆ రాక్షసుడు, మునిశ్రేష్ఠమ్ = మునిశ్రేష్ఠుడైన అగస్త్యుని గూర్చి, అభ్యద్రవత్ = చంపుటకై వెళ్ళెను. దీప్తతేజసా = ప్రకాశించుచున్న తేజస్సు గల, మునినా = మునిచేత, అనలకల్పేన = అగ్నితో సమాన మైన, చక్షుషా = నేత్రముచేత, నిర్దగ్ధః = కాల్చబడినవాడై, నిధనమ్ = మరణమును, గతః = పొందెను.

తా. ఆ రాక్షసుడు మునులలో శ్రేష్ఠుడైన ఆ అగస్త్యునిమీదికి దుమికెను. అప్పుడు ప్రజ్వలించుచున్న తేజస్సు గల ఆ మహాముని అగ్నితుల్యమైన నేత్రముతో కాల్చివేయగా ఆ రాక్షసుడు మరణించెను. 67

మూ. తస్యాయమాశ్రమో భ్రాతు స్తటాకవనశోభితః, 68
విప్రానుకమ్పయా యేన కర్మేదం దుష్కరం కృతమ్.

ప్ర. అ. తటాకవనశోభితః = సరస్సులచేతను వనములచేతను శోభింపచేయబడిన, అయమ్ = ఈ ఆశ్రమము, యేన = ఏ అగస్త్యునిచేత, విప్రానుకమ్పయా = బ్రాహ్మణులయందు జాలిచేత, ఇదమ్ = ఈ, దుష్కరమ్ = చేయశక్యము కాని, కర్మ = కర్మ, కృతమ్ = చేయబడినదో, తస్య = అట్టి అగస్త్యుని యొక్క, భ్రాతుః = సోదరునియొక్క, ఆశ్రమః = ఆశ్రమము.

తా. తటాకములతోను, వనములతోను శోభించుచున్న ఈ ఆశ్రమము, బ్రాహ్మణులమీద దయచేత ఈ చేయశక్యము కాని పని చేసిన అగస్త్యుని సోదరుని ఆశ్రమము. 68

మూ. ఏవం కథయమానస్య తస్య సౌమిత్రిణా సహ, 69
రామస్యాస్తం గతః సూర్యః సంధ్యాకాలోఽభ్యవర్తత.

ప్ర. అ. తస్య రామస్య = ఆ రాముడు, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో, ఏవమ్ = ఇట్లు, కథయమానస్య = చెప్పుచుండగా, సూర్యః = సూర్యుడు, అస్తం గతః = అస్తమించెను. సంధ్యాకాలః = సంధ్యాకాలము, అభ్యవర్తత = వచ్చెను.

తా. రాముడు లక్ష్మణునితో ఇట్లు అగస్త్యుని కథ చెప్పుచుండగా సూర్యు డస్తమించెను. సంధ్యాకాలము వచ్చెను. 69

మూ. ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సహ భ్రాత్రా యథావిధి, 70
ప్రవివేశాశ్రమపదం తమృషిం సోఽభ్యవాదయత్.

ప్ర. అ. సః = రాముడు, సహ భ్రాత్రా = సోదరునితో కూడ, యథావిధి = యథాశాస్త్రముగా, పశ్చిమామ్ = పశ్చిమదిక్కుకు సంబంధించిన, సంధ్యామ్ =సంధ్యను, ఉపాస్య= ఉపాసించి, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, ప్రవివేశ= ప్రవేశించెను. తమ్=ఆ, ఋషిమ్ = ఋషిని, అభ్యవాదయత్ = నమస్కరించెను.

తా. లక్ష్మణసమేతుడైన రాముడు సాయంసంధ్యను యథావిధిగా ఉపాసించి, ఆ ఆశ్రమములోనికి ప్రవేశించి, ఆ ఋషీశ్వరునికి అభివాదనము చేసెను.

మూ. సమ్యక్ ప్రతిగృహీతశ్చ మునినా తేన రాఘవః, 71
న్యవసత్తాం నిశామేకాం ప్రాశ్య మూలఫలాని చ.

ప్ర. అ. రాఘవః = రాముడు, తేన మునినా = ఆ మునిచేత, సమ్యక్ = బాగుగా, ప్రతిగృహీతః = ప్రతిగ్రహింపబడినవాడై, మూలఫలాని = దుంపలను, పండ్లను, ప్రాశ్య= భుజించి, తామ్ = ఆ, ఏకామ్ = ఒక, నిశామ్ = రాత్రిని, న్యవసత్ = నివసించెను.

తా. అగస్త్యభ్రాతయైన ఆ ముని రాముణ్ణి గౌరవపురస్సరముగా ప్రతిగ్రహించెను. రాముడు మూలములు, ఫలములు భుజించి ఆ రాత్రి అక్కడనే గడపెను. 71

మూ. తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం విమలే సూర్యమణ్డలే, 72
భ్రాతరం తమగస్త్యస్య హ్యామన్త్రియత రాఘవః.

ప్ర. అ. తస్యాం రాత్ర్యామ్ = ఆ రాత్రి, వ్యతీతాయామ్=గడచినదగుచుండగా, సూర్యమణ్డలే=సూర్యమండలము, విమలే=నిర్మలమైనదగుచుండగా, రాఘవః = రాముడు, అగస్త్యస్య = అగస్త్యునియొక్క, భ్రాతరమ్ = సోదరుడైన, తమ్ = ఆ మునిని, ఆమన్త్రయత = వీడ్కొనెను.

తా. ఆ రాత్రి గడచి సూర్యుడు ప్రకాశించుచుండగా, రాముడు అగస్త్య సోదరుడైన ఆ ముని అనుమతి తీసికొనెను. 72

మూ. అభివాదయే త్వాం భగవన్ సుఖమధ్యుషితో నిశామ్, 73
ఆమన్త్రయే త్వాం గచ్ఛామి గురుం తే ద్రష్టుమగ్రజమ్.

ప్ర. అ. భగవన్=పూజ్యుడా ! నిశామ్=రాత్రిని, సుఖమ్=సుఖముగా, అధ్యుషితః= నివసించినాను. త్వామ్ = నిన్ను, అభివాదయే = నమస్కరించుచున్నాను. త్వామ్ = నిన్ను, ఆమన్త్రయామి=వీడ్కొలుపుచున్నాను. తే=నీకు, గురుమ్ = పూజ్యుడైన, అగ్రజమ్ = నీ అన్నగారిని, ద్రష్టుమ్ = చూచుటకు, గచ్ఛామి = వెళ్లుచున్నాను.

తా. మహర్షీ ! రాత్రి నీ ఆశ్రమములో సుఖముగా నివసించినాను. నీకు అభివాదనము చేసి నీ అనుమతి కోరుచున్నాను. నీకు పూజ్యుడు, అన్నగారు అయిన అగస్త్యమహర్షిని చూచుటకు వెళ్ళెదను. 73

మూ. గమ్యతామితి తేనోక్తో జగామ రఘునన్దనః, 74
యథోద్దిష్టేన మార్గేణ వనం తచ్చావలోకయన్.

ప్ర. అ. గమ్యతామ్ = వెళ్ళెదవుగాక, ఇతి = అని, తేన = ఆ మునిచేత, ఉక్తః = పలకబడిన, రఘునన్దనః = రాముడు, తత్ = ఆ, వనమ్ = వనమును, అవలోకయన్ = చూచుచు, యథోద్దిష్టేన = చెప్పబడిన, మార్గేణ=మార్గముచేత, జగామ = వెళ్లెను.

తా. "అట్లే వెళ్లుము"అని ఆ ముని పలుకగా రాముడు, ఆ వనమును చూచుచు, చెప్పిన మార్గమును అనుసరించి వెళ్లెను. 74

మూ. నీవారాన్ పనసాం స్తాలాం స్తిమిశాన్ వఞ్జులాన్ ధవాన్,
చిరిబిల్వాన్ మధూకాంశ్చ బిల్వానపి చ తిన్దుకాన్.

ప్ర. అ. నీవారాన్ = నెవరుధాన్యములను, పనసాన్=పనసవృక్షములను, తాలాన్ = తాటిచెట్లను, తిమిశాన్ = తినాసపుచెట్లను, వఞ్జులాన్ = పొగడచెట్లను, ధవాన్ = చంద్రచెట్లను, చిరిబిల్వాన్ = కానుగచెట్లను, మధూకాంశ్చ = ఇప్ప

చెట్లను, బిల్వానపి చ = మారేడుచెట్లను, తిన్దుకాన్ = తుమ్మికిచెట్లను (దదర్శ = చూచెను.)

తా. రాముడు ఆ వనమునందు నెవరుధాన్యములు, పనసవృక్షములు, తాటిచెట్లు, తినాసపుచెట్లు, పొగడచెట్లు, చంద్రచెట్లు, కానుగచెట్లు, ఇప్పచెట్లు, మారేడుచెట్లు, తిమ్మికిచెట్లు చూచెను. 75

మూ. పుష్పితాన్ పుష్పితాగ్రాభిర్లతాభిరనువేష్టితాన్, 76
దదర్శ రామః శతశస్తత్ర కాన్తారపాదపాన్.

హస్తిహస్తైర్విమృదితాన్ వానరైరుపశోభితాన్, 77
మత్తైః శకునిసంఘైశ్చ శతశశ్చ ప్రణాదితాన్.

ప్ర. అ. రామః = రాముడు, హస్తిహస్తైః = ఏనుగుల తొండములచేత, విమృదితాన్ = నలగకొట్టబడినవి, వానరైః = కోతులచేత, ఉపశోభితాన్ = ప్రకాశింపచేయబడినవి, మత్తైః = మదించిన, శతశః = వందలకొలది, శకునిసంఘైశ్చ = పక్షుల గుంపులచేత, ప్రణాదితాన్ = ధ్వనింపచేయబడినవి, పుష్పితాన్ = పుష్పించినవి, పుష్పితాగ్రాభిః = పుష్పించిన అగ్రభాగములు గల, లతాభిః = లతలచేత, అనువేష్టితాన్ = చుట్టబడినవి అయిన, శతశః = వందలకొలది, కాన్తారపాదపాన్ = అడవిచెట్లను, దదర్శ = చూచెను.

తా. రామునకు అక్కడ వందల కొలది పుష్పించిన అడవిచెట్లు కనబడెను. పుష్పించిన అగ్రభాగములు గల లతలు ఆ చెట్లకు చుట్టుకొని ఉండెను. వాటిని ఏనుగులు తొండములతో మర్దించుచుండెను. వాటి కొమ్మలపై కోతులుకూర్చుండెను. వందలకొలది పక్షుల గుంపులు మదించి ఆ చెట్లపై ధ్వని చేయుచుండెను. 76, 77

మూ. తతోఽబ్రవీత్సమీపస్థం రామో రాజీవలోచనః, 78
పృష్ఠతోఽనుగతం వీరం లక్ష్మణం లక్ష్మివర్ధనమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు గల, రామః = రాముడు, పృష్ఠతః = వెనుకనే, అనుగతమ్ = అనుసరించి వచ్చుచున్న, వీరమ్ = వీరుడైన, లక్ష్మివర్ధనమ్ = లక్ష్మిని వృద్ధి పొందించు,

సమీపస్థమ్ = సమీపమునం దున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట పద్మముల వంటి నేత్రములు గల రాముడు, తన వెనుకనే వచ్చుచు సమీపమునం దున్న, వీరుడు, లక్ష్మిని వృద్ధిపొందించువాడు అయిన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 78

మూ. స్నిగ్ధపత్రా యథా వృక్షా యథా క్షాన్తా మృగద్విజాః, 79
ఆశ్రమో నాతిదూరస్థో మహర్షేర్భావితాత్మనః.

ప్ర. అ. వృక్షాః = వృక్షములు, యథా = ఎట్లు, స్నిగ్ధపత్రాః = నున్నని ఆకులు గలవో, మృగద్విజాః = మృగములు, పక్షులు, యథా = ఎట్లు, క్షాన్తాః = ఓర్పుతో ఉన్నవో, దీనిని పట్టి, భావితాత్మనః = పవిత్రముచేసికొనబడిన మనస్సు గల, మహర్షేః = మహర్షియొక్క, ఆశ్రమః = ఆశ్రమము, నాతిదూరస్థః = సమీపమునందే ఉన్నది.

తా. ఇక్కడ చెట్ల ఆకులు చక్కగా నిగనిగ లాడుచున్నవి. మృగములు పక్షులు కూడ పరస్పరస్నేహభావముతో ఉన్నవి. దీనిని పట్టి పరిశుద్ధ మైన మనస్సుగల అగస్త్యమహాముని ఆశ్రమము దగ్గరనే ఉన్న దని తోచుచున్నది.

మూ. అగస్త్య ఇతి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా, 80
ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాన్తశ్రమాపహః.

ప్ర. అ. స్వేన = తన సంబంధమైన, కర్మణైవ = కర్మచేతనే, లోకే = లోకమునందు, అగస్త్యః ఇతి = అగస్త్యు డని (అగమును అనగా పర్వతమును నిలిపినవాడు అని), విఖ్యాతః = ఏ ముని ప్రసిద్ధుడో, తస్య = ఆ మునియొక్క పరిశ్రాన్తశ్రమాపహః = అలసినవారి అలసటను తొలగించు, ఆశ్రమః = ఆశ్రమము, దృశ్యతే = కనబడుచున్నది.

తా. వింధ్యపర్వతమును పైకి ఎగరకుండా అపుచేయుట అను పనిచేత ఏ మహాముని లోకములో "అగస్త్యుడు" అని ప్రసిద్ధి గాంచినాడో అట్టి మహాముని ఆశ్రమము, అదిగో, కనబడుచున్నది. ఇది అలసినవారి అలసటను తొలగించును.

మూ. ప్రాజ్యధూమాకులవనశ్చీరమాలాపరిష్కృతః, 81
ప్రశాన్తమృగయూథశ్చ నానాశకునినాదితః.

ప్ర. అ. ప్రాజ్యధూమాకులవనః = అధికమైన పొగచేత వ్యాకులమైన వనము గలది, చీరమాలాపరిష్కృతః = నారచీరల పంక్తిచే అలంకరించబడినది, ప్రశాన్తమృగయూథశ్చ = ప్రశాంతముగా ఉన్న మృగముల గుంపులు గలది, నానాశకునినాదితః = అనేకవిధములైన పక్షులచేత ధ్వనింపచేయబడినది అయిన (ఆశ్రమము కనబడుచున్నది.)

తా. ఈ ఆశ్రమమునకు దగ్గర నున్న వనము అధికమైన ధూమముచేత వ్యాకులముగా ఉన్నది. నారచీరల పంక్తులచేత అలంకరించిన ట్లున్నది. ఇక్కడ ఉన్న మృగముల గుంపులు ప్రశాంతముగా ఉన్నవి. అనేకపక్షులు ధ్వని చేయుచున్నవి. 81

మూ. తస్యేదమాశ్రమపదం ప్రభావాద్యస్య రాక్షసైః, 82
దిగియం దక్షిణా త్రాసాద్దృశ్యతే నోపభుజ్యతే.

ప్ర. అ. యస్య = ఎవనియొక్క, ప్రభావాత్ = ప్రభావమువలన, రాక్షసైః=రాక్షసులచేత, ఇయమ్=ఈ, దక్షిణా దిక్=దక్షిణదిక్కు, త్రాసాత్= భయమువలన, దృశ్యతే=చూడబడుచున్నదో, నోపభుజ్యతే=అనుభవించబడుట లేదో, తస్య=అట్టి అగస్త్యునియొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమస్థానము, ఇదమ్= ఇదే.

తా. ఏ అగస్త్యమహర్షి ప్రభావమువలన రాక్షసులు ఈ దక్షిణదిక్కు వైపు భయపడుచు చూచుచుందురో, ఇక్కడ నివసించుటకు సాహసించరో అట్టి అగస్త్య మహాముని ఆశ్రమము ఇదే. 82

మూ. యదా ప్రభృతి చాక్రాన్తా దిగియం పుణ్యకర్మణా, 83
తదా ప్రభృతి నిర్వైరాః ప్రశాన్తా రజనీచరాః.

ప్ర. అ. యదా ప్రభృతి = ఎప్పుడు మొదలుకొని, పుణ్యకర్మణా = పుణ్యమైన కర్మలు గల ఈ అగస్త్యునిచేత, ఇయం దిక్ = ఈ దిక్కు, ఆక్రాన్తా

ఆక్రమించబడినదో, తదా ప్రభృతి = అది మొదలు, రజనీచరాః = రాక్షసులు, నిర్వైరాః = వైరము లేనివారై, ప్రశాన్తాః = శాంతముగా ఉన్నారు.

తా పుణ్యాత్ముడైన ఈ అగస్త్యముని నివసించుచున్నప్పటినుండీ ఈ దక్షిణ దిగ్దేశమునం దున్న రాక్షసులు వైరము విడచి ప్రశాంతముగా ఉన్నారు. 83

మూ. నామ్నా చేయం భగవతో దక్షిణా దిక్ప్రదక్షిణా, 84
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూరకర్మభిః.

ప్ర. అ. ప్రదక్షిణా = చాల సామర్థ్యము గల, ఇయమ్ = ఈ, దక్షిణా దిక్ = దక్షిణదిక్కు, భగవతః = పూజ్యుడైన ఈ అగస్త్యమహర్షియొక్క, నామ్నా = పేరుతో, త్రిషు = మూడు, లోకేషు = లోకములందు, ప్రథితా = ప్రసిద్ధమైనదై, క్రూరకర్మభిః = క్రూరమైన కర్మ కలవారిచేత, దుర్ధర్షా = ఎదిరింప శక్యము కానిది అయి ఉన్నది.

తా. మంచి సామర్థ్యము గల ఈ దక్షిణ దిక్కు, పూజ్యుడైన ఈ అగస్త్య మహాముని పేరుతో మూడు లోకములలోను ప్రసిద్ధి పొంది, క్రూరులచేత ఎది రింప శక్యముకాకుండ ఉన్నది. 84

మూ. మార్గం నిరోద్ధుం నిరతో భాస్కరస్యాచలోత్తమః, 85
నిదేశం పాలయన్యస్య విన్ధ్యశైలో న వర్ధతే.
అయం దీర్ఘాయుషస్తస్య లోకే విశ్రుతకర్మణః, 86
అగస్త్యస్యాశ్రమః శ్రీమాన్వినీతజనసేవితః.

ప్ర. అ. శ్రీమాన్ = శోభ కలది, వినీతజనసేవితః = వినయవంతులైన జనులచే సేవించబడినది అయిన, అయమ్ = ఈ ఆశ్రమము, భాస్కరస్య = సూర్యునియొక్క, మార్గమ్ = మార్గమును, నిరోద్ధుమ్ = అడ్డుకొనుటకు, నిరతః = ఆసక్తి గల, అచలోత్తమః = పర్వతములలో ఉత్తమ అయిన, విన్ధ్యః = వింధ్య పర్వతము, యస్య = ఎవనియొక్క, నిదేశమ్ = ఆజ్ఞను, పాలయన్ = పాలించుచు, న వర్ధతే = వృద్ధి పొందుటలేదో, తస్య = అట్టి, లోకే = లోకము నందు, విశ్రుతకర్మణః = ప్రసిద్ధమైన పనులు కలవాడు, దీర్ఘాయుషః = దీర్ఘా యుర్దాయవంతుడు అయిన, అగస్త్యస్య = అగస్త్యుని యొక్క, ఆశ్రమః = ఆశ్రమము.

తా. శోభాయుక్తము, వినయవంతులైన జనుల నివాసస్థానము అయిన ఈ ఆశ్రమము లోకములో ప్రసిద్ధమైన పనులు చేసినవాడు, దీర్ఘాయుర్దాయవంతుడు అయిన అగస్త్యమహాముని ఆశ్రమము. ఈ మహాముని ఆజ్ఞను పాలించుచునే, సూర్యుని మార్గమును అడ్డుకొనుటకై పెరుగుటకు ప్రారంభించిన పర్వతశ్రేష్ఠమైన వింధ్యము పెరగకుండా ఆగిపోయినది. 85, 86

మూ. ఏష లోకార్చితః సాధుర్హితే నిత్యరతః సతామ్, 87
అస్మానభిగతానేష శ్రేయసా యోజయిష్యతి.

ప్ర. అ. లోకార్చితః = లోకములచేత పూజింపబడినవాడు, సాధుః = సత్పురుషుడు అయిన, ఏషః = ఈ మహాముని, సతామ్ = సత్పురుషులయొక్క, హితే = హితమునందు, నిత్యరతః = నిత్యము ఆసక్తి కలవాడు. ఏషః = ఇతడు, అభిగతాన్ = దగ్గరకు చేరిన, అస్మాన్ = మనలను, శ్రేయసా = శ్రేయస్సుతో యోజయిష్యతి = కూర్చగలడు.

తా. ఈ అగస్త్యమహాముని జనులచే పూజింపబడినవాడు. సత్పురుషుడు. సత్పురుషులకు హితము చేయుటయందు ఆసక్తి కలవాడు. మనము ఆయన వద్దకు వెళ్ళినప్పుడు మనకు శ్రేయస్సు కలిగించగలడు. 87

మూ. ఆరాధయిష్యామ్యత్రాహమగస్త్యం తం మహామునిమ్, 88
శేషం చ వనవాసస్య సౌమ్య వత్స్యామ్యహం ప్రభో.

ప్ర. అ. ప్రభో = సమర్థుడా! వత్స = వత్సా! అహమ్ = నేను, అత్ర = ఇక్కడ, తమ్ = ఆ, మహామునిమ్ = మహామునియైన, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి, ఆరాధయిష్యామి = సేవించెదను. వనవాసస్య = వనవాసముయొక్క, శేషమ్ = మిగిలిన భాగమును, అహమ్ = నేను, వత్స్యామి = ఇక్కడ నివసించెదను.

తా. సమర్థుడవైన ఓ! లక్ష్మణా! నేను మహామునియైన అగస్త్యుని సేవించుచు మిగిలిన వనవాసకాలమును ఇక్కడనే గడపెదను. 88

మూ. అత్ర దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః, 89
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే.

ప్ర. అ. సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=గొప్ప ఋషీశ్వరులు, అత్ర = ఇక్కడ, నియతాహారమ్ = నియతమైన, (నియమబద్ధమైన) ఆహారము గల, అగస్త్యమ్ =అగస్త్యుణ్ణి, సతతమ్ = ఎల్లప్పుడు, పర్యుపాసతే= సేవించుచుందురు.

తా. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఈ ఆశ్రమమునకు వచ్చి, నియమానుసారము ఆహారము భుజించు ఈ అగస్త్యమహామునిని సేవించు చుందురు. 89

మూ. నాత్ర జీవేన్మృషావాదీ క్రూరో వా యది వా శఠః, 90
నృశంసః కామవృత్తో వా మునిరేష తథావిధః.

ప్ర. అ. మృషావాదీ = అసత్యము పలుకువాడు కాని, క్రూరో వా = క్రూరుడు గాని, యది వా = లేక, శఠః= వంచకుడు, నృశంసః=మానవులను పీడించువాడు గాని, కామవృత్తో వా= స్వేచ్ఛగా ప్రవర్తించువాడు గాని, అత్ర = ఈ ఆశ్రమమునందు, న జీవేత్=జీవించడు. ఏషః మునిః= ఈ ముని, తథావిధః = అట్టివాడు.

తా. అసత్యము పలికేవాడు కాని, క్రూరుడు కాని, వంచకుడు గాని, మానవులను హింసించేవాడు కాని, స్వేచ్ఛగా ప్రవర్తించేవాడు గాని ఈ ఆశ్రమములో జీవించజాలడు. ఈ మహాముని ప్రభావము అలాంటిది. 90

మూ. అత్ర దేవాశ్చ యక్షాశ్చ నాగాశ్చ పతగైః సహ, 91
వసన్తి నియతాహారా ధర్మమారాధయిష్ణవః.

ప్ర. అ. దేవాశ్చ = దేవతలు, యక్షాశ్చ = యక్షులు, పతగైశ్చ సహ= పక్షులతో కూడ, నాగాశ్చ=నాగులు, నియతాహారాః = నియమిత మైన ఆహారము కలవారై, ధర్మమ్ = ధర్మమును, ఆరాధయిష్ణవః = ఆరాధించువారై, అత్ర = ఈ ఆశ్రమమునందు, వసన్తి = నివసించుచుందురు.

తా. దేతవలు, యక్షులు, నాగులు, పక్షులు కూడ నియమపూర్వకముగ, ఆహారమును భుజించుచు, (ఇంద్రియార్థములను అనుభవించుచు) ధర్మారాధన తత్పరులై నివసించుచుందురు. 91

మూ. అత్ర సిద్ధా మహాత్మానో విమానైః సూర్యసంనిభైః, 92
త్యక్తదేహా నవైర్దేహైః స్వర్యాతాః పరమర్షయః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, పరమర్షయః = మహర్షులు, అత్ర = ఈ ఆశ్రమమునందు, సిద్ధాః = తపఃసిద్ధులై, త్యక్తదేహాః = విడువబడిన దేహములు కలవారై, నవైః = నూతనములైన, దేహైః = దేహములతో, సూర్య సంనిభైః = సూర్యునితో సమానములైన, విమానైః = విమానములచేత, స్వర్యాతాః = స్వర్గమునకు వెళ్ళినారు.

తా. మహాత్ములైన మహర్షులు ఈ ఆశ్రమములో తపస్సిద్ధి సంపాదించుకొని, తమ పార్థివదేహములు విడచి నూతనములైన దేహములు ధరించి సూర్యుడు వలె ప్రకాశించుచున్న విమానము లెక్కి స్వర్గమునకు వెళ్ళిరి. 92

మూ. యక్షత్వమమరత్వం చ రాజ్యాని వివిధాని చ, 93
అత్ర దేవాః ప్రయచ్ఛన్తి భూతైరారాధితాః శుభైః.

ప్ర. అ. శుభైః = పుణ్యాత్ములైన, భూతైః = ప్రాణులచేత, అత్ర = ఈ ఆశ్రమమునందు, ఆరాధితాః = ఆరాధించబడిన, దేవాః = దేవతలు, యక్షత్వమ్ = యక్షత్వమును, అమరత్వం చ = దేవత్వమును, వివిధాని = అనేక విధములైన, రాజ్యాని చ = రాజ్యములను, ప్రయచ్ఛన్తి = ఇచ్చుచుందురు.

తా. పుణ్యాత్ములైన ఈ ఆశ్రమములో నివసించేవారు దేవతలను ఆరాధించినచో వారికి దేవతలు యక్షత్వమును, దేవత్వమును, అనేకవిధములైన రాజ్యములను ప్రసాదించుచుందురు. 93

మూ. ఆగతాః స్మాశ్రమపదం సౌమిత్రే ప్రవిశాగ్రతః, 94
నివేదయేహ మాం ప్రాప్తమృషయే సీతయా సహ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును గూర్చి, ఆగతాః స్మ = వచ్చినాము. అగ్రతః = ముందు, ప్రవిశ = ప్రవే

శించుము. మామ్ = నన్ను, సీతయా సహ = సీతతో కూడ, ఇహ = ఇక్కడికి ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, ఋషయే = అగస్త్యమహర్షికి, నివేదయ = తెలుపుము.

తా. లక్ష్మణా! ఆశ్రమము చేరినాము. నీవు ముందు ప్రవేశించి, నేను సీతా వచ్చినా మని అగస్త్యమహర్షికి తెలుపుము. 94

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పదకొండవ సర్గ సమాప్తము.

## అథ ద్వాదశః సర్గః

[సీతారామలక్ష్మణులు అగస్త్యాశ్రమములో ప్రవేశించుట. అగస్త్యుడు వారిని గౌరవించుట. రాముసకు దివ్యాస్త్రము లిచ్చుట].

మూ. స ప్రవిశ్యాశ్రమపదం లక్ష్మణో రాఘవానుజః,
అగస్త్యశిష్యమాసాద్య వాక్యమేతదువాచ హ. 1

ప్ర. అ. రాఘవానుజః = రాముని తమ్ముడైన, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, ప్రవిశ్య = ప్రవేశించి, అగస్త్యశిష్యమ్ = అగస్త్యుని శిష్యుని, ఆసాద్య = సమీపించి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును ఉవాచ హ = పలికెను.

తా. రాముని తమ్ముడు, లక్ష్మణుడు ఆశ్రమములో ప్రవేశించి, అగస్త్య మహాముని శిష్యుని వద్దకు వెళ్ళి ఇట్లు పలికెను. 1

మూ. రాజా దశరథో నామ జ్యేష్ఠస్తస్య సుతో బలీ,
రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయా సహ సీతయా.

ప్ర. అ. దశరథో నామ = దశరథు డను పేరు గల, రాజా = రాజు ఉండెను. తస్య = ఆ దశరథుని యొక్క, జ్యేష్ఠః సుతః = జ్యేష్ఠకుమారుడు, బలీ = బలశాలి అయిన, రామః = రాముడు, భార్యయా = భార్య అయిన, సీతయా సహ = సీతతో కూడ, మునిమ్ = అగస్త్యమహామునిని, ద్రష్టుమ్ = చూచుటకు, ప్రాప్తః = వచ్చినాడు.

తా. దశరథమహారాజు పెద్ద కుమారుడు, మహాబలశాలీ అయిన రాముడు, భార్య యైన సీతతో, అగస్త్యమహామునిని చూచుటకై వచ్చినాడు. 2

మూ. లక్ష్మణో నామ తస్యాహం భ్రాతా త్వవరజో హితః,
అనుకూలశ్చ భక్తశ్చ యది తే శ్రోత్రమాగతః. 3

ప్ర. అ. అహం తు = నేనైతే, తస్య = ఆ రామునియొక్క, అవరజః = వెనుక పుట్టిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డను పేరు గల, భ్రాతా = సోదరు డను. హితః = హితుడను. అనుకూలశ్చ = అనుకూలముగా ఉండువాడను. భక్తశ్చ = భక్తుడను. తే = నీయొక్క, శ్రోత్రమ్ = చెవిని, ఆగతో యది = పొంది ఉండవచ్చును.

తా. నేను ఆ రాముని తమ్ముడ నైన లక్ష్మణుడను. అతని హితము కోరు వాడను. సర్వదా ఆతనికి అనుకూలముగా ప్రవర్తించు భక్తుడను. నీవు విని యుండవచ్చును. 3

మూ. తే వయం వనమత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్,
ద్రష్టుమిచ్ఛామహే సర్వే భగవన్తం నివేద్యతామ్. 4

ప్ర. అ. తే వయమ్ = అట్టి మేము, పితృశాసనాత్ = తండ్రి ఆజ్ఞవలన, అత్యుగ్రమ్ = చాల భయంకరమైన, వనమ్ = వనమును, ప్రవిష్టాః = ప్రవేశించి నాము. సర్వే = మేమందరము, భగవన్తమ్ = అగస్త్యమహామునిని, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము. నివేద్యతామ్ = ఆయనకు తెలుపబడు గాక.

తా. మేము తండ్రిగారి ఆజ్ఞచేత చాల భయంకరమైన అరణ్యములోనికి ప్రవేశించితిమి. మే మందరము అగస్త్యమహాముని దర్శనము చేయ గోరుచున్నాము. ఆయనకు తెలుపుము. 4

మూ. తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య తపోధనః,
తథేత్యుక్త్వాగ్నిశరణం ప్రవివేశ నివేదితుమ్. 5

ప్ర. అ. తపోధనః = అగస్త్యశిష్యుడైన ఆ ముని, తస్య లక్ష్మణస్య = ఆ లక్ష్మణుని యొక్క, తత్ వచనమ్ = ఆ మాటను, శ్రుత్వా = విని, తథేతి = అట్లే చెప్పెదను అని, ఉక్త్వా = పలికి, నివేదితుమ్ = తెలుపుటకు, అగ్నిశరణమ్ = అగ్నిగృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. లక్ష్మణుని మాటలు విని ఆ అగస్త్యశిష్యుడు "అట్లే చెప్పెదను"అని పలికి రాముని రాకను అగస్త్యునకు తెలుపుటకై అగ్నిగృహములోనికి వెళ్లెను. 5

మూ. స ప్రవిశ్య మునిశ్రేష్ఠం తపసా దుష్ప్రధర్షణమ్,
కృతాఞ్జలిరువాచేదం రామాగమనమఞ్జసా. 6
యథోక్తం లక్ష్మణేనైవ శిష్యోఽగస్త్యస్య సంమతః.

ప్ర. అ. అగస్త్యస్య = అగస్త్యునకు, సంమతః = ఇష్టుడైన, శిష్యః = శిష్యుడైన, సః = ఆ ముని, అఞ్జసా = శీఘ్రముగ, ప్రవిశ్య = ప్రవేశించి, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, యథోక్తమేవ = ఎట్లు చెప్పబడినదో ఆ విధముగ, తపసా = తపస్సుచేత, దుష్ప్రధర్షణమ్ = ఎదిరింప శక్యము కాని, మునిశ్రేష్ఠమ్ = మునిశ్రేష్ఠుని గూర్చి, రామాగమనమ్ = రాముని రాకను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అగస్త్యుని ప్రియశిష్యుడైన ఆ ముని శీఘ్రముగా అగ్నిగృహములో ప్రవేశించి, అంజలి ఘటించి, ఎవ్వరిచేత ఎదిరింప శక్యము కాని తపోబలము గల ఆ మునిశ్రేష్ఠునితో, లక్ష్మణుడు చెప్పిన విధముగ, రాముని రాకను గూర్చి ఇట్లు పలికెను. 6

మూ. పుత్రౌ దశరథస్యేమౌ రామో లక్ష్మణ ఏవ చ, 7
ప్రవిష్టావాశ్రమపదం సీతయా సహ భార్యయా.

ప్ర. అ. రామః = రాముడు, లక్ష్మణ ఏవ చ = లక్ష్మణుడు అను, దశరథస్య = దశరథునియొక్క, ఇమౌ = ఈ, పుత్రౌ = పుత్రులు, భార్యయా = రాముని భార్యయైన, సీతయా సహ = సీతతో కూడ, ఆశ్రమపదమ్ = ఆశ్రమమును, ప్రవిష్టౌ = ప్రవేశించినారు.

తా. దశరథుని పుత్రులైన ఈ రామలక్ష్మణులు, సీతతో కూడ ఆశ్రమమునకు వచ్చి ఉన్నారు. 7

మూ. ద్రష్టుం భవన్తమాయాతౌ శుశ్రూషార్థమరిందమౌ, 8
యదత్రానన్తరం తత్త్వమాజ్ఞాపయితుమర్హసి.

ప్ర. అ. అరిందమౌ = శత్రుసంహారకులైన ఆ రామలక్ష్మణులు, భవన్తమ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, శుశ్రూషార్థమ్ = నిన్ను సేవించుటకు, ఆయాతౌ = వచ్చినారు. అత్ర = ఈ విషయమునందు, యత్ = ఏది, అనన్త

రమ్= వెంటనే చేయ దగినదో, తత్=దానిని, త్వమ్=నీవు, ఆజ్ఞాపయితుమ్= ఆజ్ఞాపించుటకు, అర్హసి= తగి యున్నావు.

తా. శత్రుసంహారకు లైన ఆ రామలక్ష్మణులు నీ దర్శనముకొరకు, నీ సేవకొరకు వచ్చి ఉన్నారు. ఇప్పు డేమి చేయవలెనో ఆజ్ఞాపింపుము. 8

మూ. తతః శిష్యాదుపశ్రుత్య ప్రాప్తం రామం సలక్ష్మణమ్, 9
వైదేహీం చ మహాభాగామిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తతః= అటుపిమ్మట, శిష్యాత్ = శిష్యునినుండి, సలక్ష్మణమ్= లక్ష్మణునితో కూడిన, రామమ్ = రాముణ్ణి, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, ఉప శ్రుత్య = విని, మహాభాగామ్ = మహాభాగ్యవంతురాలైన, వైదేహీం చ = సీతను కూడ వచ్చిన దానినిగా విని, ఇదం వచనమ్ = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను

తా. అగస్త్యుడు లక్ష్మణసమేతుడైన రాముడు, మహాభాగ్యవంతురాలైన సీత వచ్చినా రని శిష్యునినుండి విని, ఇట్లు పలికెను. 9

మూ. దిష్ట్యా రామశ్చిరస్యాద్య ద్రష్టుం మాం సముపాగతః,10
మనసా కాఙ్క్షితం హ్యాస్య మయా హ్యాగమనం ప్రతి.

ప్ర. అ. దిష్ట్యా = భాగ్యవశముచేత, రామః = రాముడు, చిరస్య = చిర కాలమునకు, మామ్ = నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, అద్య = ఇప్పుడు, సముపా గతః = వచ్చినాడు. అస్య = ఈతనియొక్క, ఆగమనం ప్రతి = ఆగమనమును గూర్చి, మయా = నాచేత, మనసా = మనస్సుచేత, కాఙ్క్షితం హి = కోరబడినది కదా.

తా. అదృష్టవశముచేత రాముడు ఇంత కాలమునకు నన్ను చూచుటకై నేడు వచ్చినాడు. ఆతడు వచ్చిన బాగుండు నని నేను కూడ మనస్సులో అను కొనుచున్నాను. 10

మూ. గమ్యతాం సత్కృతో రామః సభార్యః సహలక్ష్మణః,11
ప్రవేశ్యతాం సమీపం మే కిం చాసౌ న ప్రవేశితః.

ప్ర. అ. గమ్యతామ్ = వెళ్ళెదవుగాక. సభార్యః = భార్యతో కూడిన, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, సత్కృతః = ఆదరించబడినవాడై, మే = నాయొక్క, సమీపమ్ = సమీపమును, ప్రవేశ్యతామ్ = ప్రవేశపెట్టబడుగాక., అసౌ = ఇతడు, కిమ్ = ఎందువలన, న ప్రవేశితః = ప్రవేశపెట్టబడలేదు ?

తా. వెంటనే వెళ్ళి భార్యతోను, లక్ష్మణునితోను కలిసి వచ్చిన ఆ రాముణ్ణి గౌరవించి, నా దగ్గరకు తీసికొని రమ్ము. నాకు తెలుపకుండగనే ఎందుకు తీసికొని రాలేదు ? 11

మూ. ఏవముక్తస్తు మునినా ధర్మజ్ఞేన మహాత్మనా, 12
అభివాద్యాబ్రవీచ్ఛిష్యస్తథేతి నియతాఞ్జలిః.

ప్ర. అ. ధర్మజ్ఞేన = ధర్మములు తెలిసినవాడు, మహాత్మనా = మహాత్ముడూ అయిన, మునినా = మునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, శిష్యః = శిష్యుడు, నియతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, అభివాద్య = నమస్కరించి, తథేతి = అట్లే చేసెదను అని, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ శిష్యుడు ధర్మములు తెలిసినవాడు, మహాత్ముడు అయిన అగస్త్య మహాముని మాటలు విని, అంజలి ఘటించి- "అట్లే చేసెదను" అని పలికెను. 12

మూ. తతో నిష్క్రమ్య సంభ్రాన్తః శిష్యో లక్ష్మణమబ్రవీత్. 13
క్వాసౌ రామో మునిం ద్రష్టుమేతు ప్రవిశతు స్వయమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శిష్యః = శిష్యుడు, సంభ్రాన్తః = తొందరపడుచున్నవాడై, నిష్క్రమ్య = బైటకు వెళ్ళి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. అసౌ = ఈ, రామః = రాముడు, క్వ = ఎక్కడ ఉన్నాడు? మునిమ్ = మునిని, ద్రష్టుమ్ = చూచుటకు, ఏతు = వచ్చుగాక. స్వయమ్ = స్వయముగనే, ప్రవిశతు = ప్రవేశించుగాక.

తా. పిమ్మట శిష్యుడు తొందరగా బైటకు వచ్చి లక్ష్మణునితో ఇట్లు పలికెను. "రాము డెక్కడ ఉన్నాడు? మునిని చూచుటకు అతడె లోనికి వెళ్ళవచ్చును; ఇతరుల అనుమతి అవసరము లేదు". 13

మూ. తతో గత్వాశ్రమద్వారం శిష్యేణ సహ లక్ష్మణః, 14
దర్శయామాస కాకుత్స్థం సీతాం చ జనకాత్మజామ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, శిష్యేణ సహ = శిష్యునితో కూడ, ఆశ్రమద్వారమ్ = ఆశ్రమద్వారమును గూర్చి, గత్వా = వెళ్ళి, కాకుత్స్థమ్ = రాముణ్ణి, జనకాత్మజామ్ = జనకుని కూతురైన, సీతాం చ = సీతను, దర్శయామాస = చూపించెను.

తా. పిమ్మట లక్ష్మణుడు, శిష్యునితో కలిసి ఆశ్రమద్వారము వద్దకు వెళ్ళి అక్కడ ఉన్న రాముణ్ణి, జనకరాజపుత్రియైన సీతను చూపెను. 14

మూ. తం శిష్యః ప్రశ్రితో వాక్యమగస్త్యవచనం బ్రువన్,
ప్రావేశయద్యథాన్యాయం సత్కారార్హం సుసత్కృతమ్.

ప్ర. అ. శిష్యః = శిష్యుడు, ప్రశ్రితః = వినయవంతుడై, అగస్త్యవచనమ్ = అగస్త్యుని వచనమునుగా, వాక్యమ్ = వాక్యమును, బ్రువన్ = పలుకుచు, సత్కారార్హమ్ = సత్కరించుటకు తగిన, సుసత్కృతమ్ = బాగుగా సత్కరించబడిన, తమ్ = ఆ రాముణ్ణి, యథాన్యామ్ = న్యాయానుసారముగా, ప్రావేశయత్ = ప్రవేశపెట్టెను.

తా. ఆ శిష్యుడు సవినయముగా, అగస్త్యుడు చెప్పిన మాటలు చెప్పి, సత్కారములకు తగిన ఆ రాముణ్ణి, బాగుగా సత్కరించి, న్యాయానుసారముగా ఆశ్రమములోనికి ప్రవేశపెట్టెను. 15

మూ. ప్రవివేశ తతో రామః సీతయా సహలక్ష్మణః, 16
ప్రశాన్తహరిణాకీర్ణమాశ్రమం హ్యవలోకయన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, సీతయా = సీతతో, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, ప్రశాన్తహరిణాకీర్ణమ్ = శాంతమైన లేళ్లతో నిండిన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అవలోకయన్ = చూచుచు, ప్రవివేశ = ప్రవేశించెను.

మూ. స తత్ర బ్రహ్మణః స్థానమగ్నేః స్థానం తథైవ చ, 17
విష్ణోః స్థానం తథేన్ద్రస్య స్థానం చైవ వివస్వతః,

సోమస్థానం భగస్థానం స్థానం కౌబేరమేవ చ, 18
ధాతుర్విధాతుః స్థానే చ వాయోః స్థానం తథైవ చ,

నాగరాజస్య చ స్థానమనన్తస్య మహాత్మనః, 19
స్థానం తథైవ గాయత్ర్యా వసూనాం స్థానమేవ చ,

స్థానం చ పాశహస్తస్య వరుణస్య మహాత్మనః, 20
కార్తికేయస్య చ స్థానం ధర్మస్థానం చ పశ్యతి.

ప్ర. అ. సః = ఆ రాముడు, తత్ర = ఆ ఆశ్రమమునందు, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, స్థానమ్ = స్థానమును, తథైవ చ = మరియు, అగ్నేః = అగ్నియొక్క, స్థానమ్ = స్థానమును, విష్ణోః = విష్ణువుయొక్క, స్థానమ్ = స్థానమును, తథా = మరియు, ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క స్థానమును, వివస్వతః = సూర్యుని యొక్క, స్థానం చైవ = స్థానమును, సోమస్థానమ్ = సోముని స్థానమును, భగస్థానమ్ = భగుని స్థానమును, కౌబేరమ్ = కుబేరుని సంబంధమైన, స్థానమేవ చ = స్థానమును, ధాతుః = ధాతయొక్క, విధాతుః = విధాతయొక్క, స్థానే చ = స్థానములను, తథైవ చ = మరియు, వాయోః = వాయువుయొక్క, స్థానమ్ = స్థానమును, నాగరాజస్య = నాగరాజైన, మహాత్మనః = మహాత్ముడైన, అనన్తస్య = అనంతునియొక్క, స్థానమ్ = స్థానమును, తథైవ = మరియు, గాయత్ర్యాః = గాయత్రియొక్క, స్థానమ్ = స్థానమును, వసూనామ్ = వసువులయొక్క, స్థానమేవ చ = స్థానమును, పాశహస్తస్య = పాశము హస్తమునందు గల, మహాత్మనః = మహాత్ముడైన, వరుణస్య = వరుణునియొక్క, స్థానం చ = స్థానమును, కార్తికేయస్య = కుమారస్వామియొక్క, స్థానం చ = స్థానమును, ధర్మస్థానం చ = యమధర్మరాజుయొక్క స్థానము, పశ్యతి = చూచెను.

రాముడు ఆ ఆశ్రమమునందు, బ్రహ్మ, అగ్ని, విష్ణువు, ఇంద్రుడు, వివస్వంతుడు, సోముడు, భగుడు, కుబేరుడు, ధాత, విధాత, వాయువు, నాగరాజు మహాత్ముడు అయిన ఆదిశేషుడు, గాయత్రి, వసువులు, పాశములు హస్తమునందు

గల మహాత్ముడైన వరుణుడు, కుమారస్వామి, యమధర్మరాజు– వీరి స్థానములను చూచుచు వెళ్లెను.

వి. రామాయణంలో వాల్మీకి అత్రి-భరద్వాజ-శరభంగ-సుతీక్ష్ణాదిమునుల ఆశ్రమాలను వర్ణించినాడు కాని ఇక్కడ వర్ణించినట్లుగా ఆ యా దేవతల స్థానాలు ఉన్నట్లు వర్ణించలేదు. ఈ ఘట్టంలో కూడా, అనేకఇతరఘట్టాలలో వలెనే, వాల్మీకి హృదయాన్ని విశదీకరిస్తూ గోవిందరాజులు ఇవన్నీ అగస్త్యుడు పూజించే ఆయా దేవతలను స్థాపించిన స్థానా లని వాఖ్యానించి శివుడు పూజానర్హుడు గాన ఆతని స్థానం చెప్పలే దనీ, కొందరు ఇప్పుడు శివుణ్ణి పూజిస్తున్నా రంటే అందుకు వారి తామస శాస్త్రాలమీద నమ్మకమే కారణ మనీ ప్రతిపాదించారు. "అత్ర పూజ్య దైవతేషు రుద్రస్యానుపాదానాత్ అపూజ్యత్వముక్తమ్. అధునా కైశ్చిత్ పూజ్యమానతా తు తామసశాస్త్రానురోధేనేతి బోధ్యమ్" (గోవిందరాజవ్యాఖ్య).

అప్పయ్యదీక్షితులు శ్రీరామాయణ తాత్పర్యసారసంగ్రహస్తోత్రంలో ఈ ఘట్టాన్నే నిర్దేశిస్తూ–"అగస్త్యాశ్రమంలోనికి ప్రవేశించే టప్పుడు రాముడు లక్ష్మణునితో సకలదేవతలు ఈ అగస్త్యుని ఆరాధిస్తూ ఉంటా రని చెప్పి ఉన్నాడు. ఇక్కడ చెప్పిన దేవతాస్థానాలు అగస్త్యుణ్ణి ఉపాసించడంకోసం వచ్చే దేవతలు ఏర్పరచుకొన్న స్థానాలే. వీటిలో రుద్రస్థానం చెప్పకపోవడాన్ని పట్టి బ్రహ్మవిష్ణ్వాదులే అగస్త్యోపాసకులు. శివుడు అగస్త్యుణ్ణి ఉపాసించేవాడు కాదు. అందుచేత అందరి దేవలకంటె శివుడే ఉత్కృష్టుడు అని సూచితం అవుతున్నది" అని ప్రతిపాదించారు. "తస్మాత్ బ్రహ్మవిష్ణ్వాదయ ఏవ అగస్త్యోపాసకాః న తు శివః ఇతి ద్యోతనేన శివస్యతదతిశయమహిమా వ్యఞ్జితః" (శ్రీ.రా.తా.సం.స్తోత్రం. 2) వివిధదేవతల స్థానాలను వర్ణించే ఈ నాలుగు శ్లోకాలూ కూడా ప్రాచ్యప్రతిలో లేకపోవుట గమనార్హం. 17–20

మూ. తతః శిష్యైః పరివృతో మునిరప్యభినిష్పతత్, 21
తం దదర్శాగ్రతో రామో మునీనాం దీప్తతేజసామ్.

ప. అ. తతః = అటు పిమ్మట, శిష్యైః = శిష్యులతో, పరివృతః = కూడిన, మునిరపి = అగస్త్యముని కూడ, అభినిష్పతత్ = శీఘ్రముగా ఎదురు వచ్చెను. రామః = రాముడు, దీప్తతేజసామ్ = ప్రజ్వలించుచున్న తేజస్సు గల,

మునీనామ్ = మునులయొక్క, అగ్రతః=ఎదుట, తమ్=ఆ అగస్త్యమహామునిని, దదర్శ = చూచెను.

తా. పిమ్మట ఆ అగస్త్యుడు శిష్యగణపరివృతుడై శీఘ్రముగా రామునకు ఎదురు వచ్చెను. రాముడు ప్రజ్వలించుచున్న తేజస్సు గల ఆ మునుల ముందట నున్న ఆ మునిని చూచెను. 21

మూ. అబ్రవీద్వచనం వీరో లక్ష్మణం లక్ష్మివర్ధనమ్, 22
ఏష లక్ష్మణ నిష్క్రామత్యగస్త్యో భగవాన్ ఋషిః,
ఔదార్యేణావగచ్ఛామి నిధానం తపసామిమమ్. 23

ప్ర. అ. వీరః=వీరుడైన రాముడు, లక్ష్మివర్ధనమ్=లక్ష్మిని వృద్ధిచేయు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను. లక్ష్మణ = లక్ష్మణా ! భగవాన్ = పూజ్యుడైన, ఏషః = ఈ, అగస్త్యః ఋషిః= అగస్త్యమహర్షి, నిష్క్రామతి = బైటకువచ్చుచున్నాడు. ఔదార్యేణ = తేజోవిశేషముచేత, ఇమమ్ = ఈతనిని, తపసామ్ = తపస్సులకు, నిధానమ్ = నిధియైన వానినిగా, అవగచ్ఛామి = తెలుసుకొనుచున్నాను.

తా. వీరుడైన రాముడు, లక్ష్మిని వృద్ధి పొందించు లక్ష్మణునితో ఇట్లు పలికెను. లక్ష్మణా ! ఇడిగో; పూజ్యుడైన అగస్త్యమహర్షి బైటకు వచ్చుచున్నాడు. తేజోవిశేషమును పట్టి ఇతడు తపస్సులకు నిధి యని భావించుచున్నాను. 23

మూ. ఏవముక్త్వా మహాబాహురగస్త్యం సూర్యవర్చసమ్,
జగ్రాహ పరమప్రీతస్తస్య పాదౌ పరంతపః. 24

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, పరంతపః = శత్రుసంహారకుడు అయిన రాముడు, సూర్యవర్చసమ్ = సూర్యుని వంటి కాంతి గల, అగస్త్యమ్ = అగస్త్యుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, తస్య = ఆ అగస్త్యునియొక్క, పాదౌ =పాదములను, జగ్రాహ = గ్రహించెను.

తా. గొప్ప బాహువులు కలవాడు, శత్రుసంహారకుడు అయిన ఆ రాముడు

సూర్యునివంటి తేజస్సు గల అగస్త్యమహాముని గూర్చి లక్ష్మణునితో ఇట్లు పలికి, చాల సంతోషముతో ఆ మహాముని పాదములు గ్రహించెను. 24

మూ. అభివాద్య తు ధర్మాత్మా తస్థౌ రామః కృతాఞ్జలిః,
సీతయా సహ వైదేహ్యా తదా రామః సలక్ష్మణః. 25

ప్ర. అ. తదా = అప్పుడు, ధర్మాత్మా = ధర్మాత్ముడు, రామః = మనోహరుడు అయిన, రామః = రాముడు, వైదేహ్యా = విదేహదేశాధిపతి కూతురైన, సీతయా = సీతతో కూడినవాడై, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, అభివాద్య = నమస్కరించి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, తస్థౌ = నిలచెను.

తా. అప్పుడు సీతాలక్ష్మణసమేతుడు, ధర్మాత్ముడు, సకలజనమనోభిరాముడు అయిన రాముడు అగస్త్యునకు అభివాదనము చేసి, అంజలి ఘటించి నిలచెను. 25

మూ. ప్రతిజగ్రాహ కాకుత్స్థమర్చయిత్వాసనోదకైః,
కుశలప్రశ్నముక్త్వా చ హ్యాస్యతామితి చాబ్రవీత్. 26

ప్ర. అ. ఆసనోదకైః = ఆసనముచేతను, ఉదకముచేతను, అర్చయిత్వా = పూజించి, కాకుత్స్థమ్ = రాముణ్ణి, ప్రతిజగ్రాహ = ప్రతిగ్రహించెను. కుశలప్రశ్నమ్ = కుశలప్రశ్నను, ఉక్త్వా = పలికి, ఆస్యతామ్ = కూర్చుందువుగాక, ఇతి చ = అని కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. అగస్త్యుడు రామునకు ఆసనము, ఉదకము సమర్పించి, సగౌరవముగా ఆతనిని ప్రతిగ్రహించి, కుశలప్రశ్న వేసి, "కూర్చుండుము" అని పలికెను.

మూ. అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్యమతిథీన్ ప్రతిపూజ్య చ,
వానప్రస్థేన ధర్మేణ స తేషాం భోజనం దదౌ. 27

ప్ర. అ. సః = అగస్త్యమహాముని, అగ్నిమ్ = అగ్నిని, హుత్వా = హోమము చేసి, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, ప్రదాయ = ఇచ్చి, అతిథీన్ = అతిథులను, ప్రతిపూజ్య చ = పూజించి, వానప్రస్థేన = వానప్రస్థాశ్రమమునకు సంబంధించిన,

ధర్మేణ = ధర్మముచేత, తేషామ్ = వారికి, భోజనమ్ = భోజనమును, దదౌ = ఇచ్చెను.

తా. అగస్త్యుడు అగ్నిహోమాదులు ముగించుకొని, అర్ఘ్యప్రదానాదులచేత అతిథులను పూజించి, వారికి వానప్రస్థధర్మానుసారముగ భోజనము పెట్టెను. 27

మూ. ప్రథమం చోపవిశ్యాథ ధర్మజ్ఞో మునిపుఙ్గవః,
ఉవాచ రామమాసీనం ప్రాఞ్జలిం ధర్మకోవిదమ్. 28

ప్ర. అ. అథ=అటు పిమ్మట, ధర్మజ్ఞః=ధర్మము నెరిగిన, మునిపుఙ్గవః = ఆ మునిశ్రేష్ఠుడు, ప్రథమమ్ = ముందుగా, ఉపవిశ్య = కూర్చుండి, ఆసీనమ్ =కూర్చొని ఉన్నవాడు, ప్రాఞ్జలిమ్=కట్టబడిన దోసిలి కలవాడు, ధర్మకోవిదమ్ = ధర్మములను ఎరిగినవాడు అయిన, రామమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. ధర్మములు తెలిసిన ఆ అగస్త్యుడు తాను ముందు కూర్చుండి, తన ప్రక్కనే అంజలి ఘటించి కూర్చొని ఉన్న, ధర్మకోవిదుడైన రామునితో ఇట్లు పలికెను. 28

మూ. అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్యమతిథిం ప్రతిపూజయేత్,
అన్యథా ఖలు కాకుత్స్థ తపస్వీ సముదాచరన్. 29
దుఃసాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్.

ప్ర. అ. అగ్నిమ్ = అగ్నిని, హుత్వా = హోమము చేసి, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, ప్రదాయ = ఇచ్చి, అతిథిమ్ = అతిథిని, ప్రతిపూజయేత్=పూజించవలెను. కాకుత్స్థ= రామా ! అన్యథా = మరొక విధముగా, సముదాచరన్ = చేయుచున్న, తపస్వీ = మహర్షి, దుఃసాక్షీవ = అసత్యమైన సాక్ష్యము చెప్పినవాడు వలె, పరే లోకే=పరలోకమునందు, స్వాని=తన సంబంధమైన, మాంసాని = మాంసములను, భక్షయేత్ = భక్షించును.

తా. రామా ! ముందుగా అగ్నిహోమము (వైశ్వదేవము) చేసి, పిమ్మట అతిథులకు అర్ఘ్య మిచ్చి పూజించవలెను. అట్లు కాక మరొక విధముగ చేయు ముని, అసత్యసాక్ష్యము చెప్పినవాడు వలె పరలోకములో తన మాంసమును భక్షించును. 29

మూ. రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః, 30
పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః.

ప్ర. అ. సర్వస్యలోకస్య = సమస్తలోకమునకు, రాజా = రాజువు, ధర్మచారీ = ధర్మమును ఆచరించేవాడవు, మహారథః = మహారథుడవు, పూజనీయశ్చ = పూజింపదగినవాడవు, మాన్యశ్చ = గౌరవించదగినవాడవు అయిన, భవాన్ = నీవు, ప్రియాతిథిః = ప్రియమైన అతిథివిగా, ప్రాప్తః = వచ్చినావు.

తా. నీవు సకలలోకములకు రాజువు. ధర్మాచరణశీలుడవు; మహారథుడవు; పూజింప దగినవాడవు. గౌరవింపదగినవాడవు. అట్టి నీవు మాకు ప్రియాతిథిగా వచ్చినావు. 30

మూ. ఏవముక్త్వా ఫలైర్మూలైః పుష్పైరన్యైశ్చ రాఘవమ్, 31
పూజయిత్వా యథాకామం పునరేవ తతోఽబ్రవీత్.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, రాఘవమ్ = రాముణ్ణి, ఫలైః = ఫలములచేతను, మూలైః = మూలములచేతను, పుష్పైః = పుష్పములచేతను, అన్యైశ్చ = ఇతరవస్తువులచేతను, యథాకామమ్ = తన కోరిక తీరు నట్లు, పూజయిత్వా = పూజించి, తతః = అటు పిమ్మట, పునరేవ = మరల, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగపలికి, రామునకు ఫలములు, మూలములు, పుష్పములు, ఇతరవస్తువులు సమర్పించి తన కోరిక తీరు నట్లు పూజించి, మరల ఇట్లుపలికెను.

మూ. ఇదం దివ్యం మహచ్చాపం హేమరత్నవిభూషితమ్, 32
వైష్ణవం పురుషవ్యాఘ్ర నిర్మితం విశ్వకర్మణా,
అమోఘః సూర్యసంకాశో బ్రహ్మదత్తః శరోత్తమః. 33

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా ! హేమరత్నవిభూషితమ్ = బంగారముచేతను, రత్నములచేతను అలంకరించబడిన, దివ్యమ్ = దివ్యమైన, మహత్ = గొప్పదైన, ఇదం చాపమ్ = ఈ ధనస్సు, వైష్ణవమ్ = విష్ణువుకు సంబంధించినది. విశ్వకర్మణా = విశ్వకర్మ చేత, నిర్మితమ్ = నిర్మించబడినది. సూర్యసంకాశః

= సూర్యునితో సమానమైన, అమోఘః = వ్యర్థము కాని, శరోత్తమః = ఉత్తమమైన ఈ శరము, బ్రహ్మదత్తః = బ్రహ్మచేత ఇవ్వబడినది.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన రామా ! బంగారముతోను, రత్నములతోను అలంకరించిన దివ్యమైన ఈ గొప్ప ధనస్సు విష్ణుదేవునిది. దీనిని విశ్వకర్మ నిర్మించెను. సూర్యునివంటి ఈ ఉత్తమమైన బాణము అమోఘమైనది. దీనిని బ్రహ్మ ఇచ్చెను. 32, 33

మూ. దత్తౌ మమ మహేన్ద్రేణ తూణీ చాక్షయసాయకౌ,
సంపూర్ణౌ నిశితైర్బాణైర్జ్వలద్భిరివ పావకైః, 34
మహారజతకోశోఽయమసిర్హేమవిభూషితః.

ప్ర. అ. అక్షయసాయకౌ = అక్షయమైన బాణములు గలవి, నిశితైః = వాడియైన, జ్వలద్భిః = ప్రజ్వలించుచున్న, పావకైరివ = అగ్ని వలె ఉన్న, బాణైః = బాణములతో, సంపూర్ణౌ = నిండిన, తూణీ = అంబులపొదులు, మమ = నాకు, మహేన్ద్రేణ = మహేంద్రునిచేత, దత్తౌ = ఇవ్వబడినవి. మహారజతకోశః = బంగారపు ఒర గల, అయమ్ = ఈ, హేమవిభూషితః = బంగారముచేత అలంకరించబడిన, అసిః = ఖడ్గము (దేవేంద్రునిచేత ఇవ్వబడినది).

తా. మండుచున్న అగ్ని వలె వాడియైన బాణములతో నిండిన ఈ అక్షయ తూణీరములను, బంగారు ఒరలో ఉన్న ఈ సువర్ణాలంకృతమైన ఖడ్గమును దేవేంద్రుడు నా కిచ్చినాడు. 34

మూ. అనేన ధనుషా రామ హత్వా సంఖ్యే మహాసురాన్, 35
ఆజహార శ్రియం దీప్తాం పురా విష్ణుర్దివౌకసామ్.

ప్ర. అ. రామ = రామా ! పురా = పూర్వము, విష్ణుః = విష్ణుమూర్తి, సంఖ్యే = యుద్ధమునందు, అనేన ధనుషా = ఈ ధనస్సుచేత, మహాసురాన్ = గొప్ప రాక్షసులను, హత్వా = చంపి, దివౌకసామ్ = దేవతలయొక్క, దీప్తామ్ = ప్రకాశించుచున్న, శ్రియమ్ = లక్ష్మిని, ఆజహార = తీసికొనివచ్చెను.

తా. రామా ! పూర్వము విష్ణువు, ఈ ధనస్సుచేత, యుద్ధములో గొప్ప అసురులను చంపి, దేవతలకు ప్రకాశించుచున్న లక్ష్మిని తిరిగి సంపాదించి పెట్టెను. 35

మూ. తద్ధనుస్తౌ చ తూణీరౌ శరం ఖడ్గం చ మానద, 36
జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా.

ప్ర. అ. మానద = గౌరవమును ఇచ్చువాడా ! తత్ = ఆ, ధనుః = ధనస్సును, తౌ = ఆ, తూణీరౌ = అంబులపొదులను, శరమ్ = శరమును, ఖడ్గం చ = ఖడ్గమును, వజ్రధరః = దేవేంద్రుడు, వజ్రం యథా = వజ్రమును వలె, జయాయ = జయముకొరకు, ప్రతిగృహ్ణీష్వ=స్వీకరించుము.

తా. ఆశ్రితుల మానమును కాపాడు రామా ! ఇంద్రుడు వజ్రాయుధమును ధరించి నట్లు, ఈ ధనస్సును, ఈ అంబులపొదులను, బాణమును, ఖడ్గమును జయమునిమిత్తమై స్వీకరించుము. 36

మూ. ఏవముక్త్వా మహాతేజాః సమస్తం తద్వరాయుధమ్, 37
దత్వా రామాయ భగవానగస్త్యః పునరబ్రవీత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్వాదశః సర్గః.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, భగవాన్ = భగవంతుడైన, అగస్త్యః = అగస్త్యుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా=పలికి, సమస్తమ్=సమస్తమైన, తత్ = ఆ, వరాయుధమ్ = శ్రేష్ఠమైన ఆయుధమును, రామాయ = రామునకు, దత్వా=ఇచ్చి, పునః=మరల, అబ్రవీత్=పలికెను.

తా. మహాతేజఃశాలి, పూజ్యుడు అయిన అగస్త్యుడు ఇట్లు పలికి, శ్రేష్ఠములైన ఆ ఆయుధముల నన్నింటిని రామునకు ఇచ్చి మరల ఇట్లనెను. 37

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
పన్నెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోదశః సర్గః

[అగస్త్యుడు తనను చూచుటకై రాముడు వచ్చినందుకు సంతోషము ప్రకటించుట సీతను ప్రశంసించుట; పంచవటిలో నివసింపుమని రామునకు చెప్పుట; రాముడు అక్కడికి ప్రయాణ మగుట].

మూ. రామ ప్రీతోఽస్మి భద్రం తే పరితుష్టోఽస్మి లక్ష్మణ,
అభివాదయితుం యన్మాం ప్రాప్తౌ స్థః సహ సీతయా. 1

ప్ర. అ. రామ = రామా! ప్రీతః = సంతోషించినవాడను, అస్మి = అయి ఉన్నాను. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. లక్ష్మణ = లక్ష్మణా! పరితుష్టః అస్మి = సంతోషించినాను, యత్ = ఏ కారణమువలన, సీతయాసహ = సీతతో కూడ, మామ్ = నన్ను, అభివాదయితుమ్ = నమస్కరించుటకు, ప్రాప్తౌ స్థః = వచ్చినారో.

తా. రామా! చాలా సంతోషించుచున్నాను; నీకు మంగళ మగుగాక; లక్ష్మణా! సంతోషించుచున్నాను; మీ రిద్దరు సీతాసహితులై నాకు అభివాదనము చేయుటకు వచ్చినారు. 1

మూ. అధ్వశ్రమేణ వాం ఖేదో బాధతే ప్రచురశ్రమః,
వ్యక్తముత్కణ్ఠతే చాపి మైథిలీ జనకాత్మజా. 2

ప్ర. అ. అధ్వశ్రమేణ = మార్గశ్రమచేత, ప్రచురశ్రమః = అధికమైన శ్రమ గల, ఖేదః = ఖేదము, వామ్ = మీ ఇద్దరిని, బాధతే = బాధించుచున్నది. జనకాత్మజా = జనకుని కుమార్తెయైన, మైథిలీ చాపి = సీత కూడ, వ్యక్తమ్ = స్పష్టముగా, ఉత్కణ్ఠతే = విశ్రాంతిని కోరుచున్నది.

తా. చాల దూరము నడచుటవలనను, మార్గములో కలిగిన ఇతర శ్రమలవలనను మీకు అలసట కలిగి మిమ్ములను బాధించు చుండును. జనకుని కూతు

రైన సీత కూడ అలసిపోయి విశ్రాంతి కోరుచున్న దని స్పష్టముగా తెలియు చున్నది. 2

మూ. ఏషా హి సుకుమారీ చ దుఃఖైశ్చ న విమానితా,
ప్రాజ్యదోషం వనం ప్రాప్తా భర్తృస్నేహప్రచోదితా. 3

ప్ర. అ. సుకుమారీ చ = సుకుమారురాలు, దుఃఖైశ్చ = దుఃఖముల చేత, న విమానితా = బాధింపబడనిది అయిన, ఏషా = ఈమె, భర్తృస్నేహ ప్రచోదితా = భర్తయందు స్నేహముచేత ప్రేరేపించబడినదై, ప్రాజ్యదోషమ్ = అధికమైన దోషములు గల, వనమ్ = వనమును గూర్చి, ప్రాప్తా = వచ్చినది.

తా. సుకుమారురాలు, దుఃఖములచేత ఎన్నడూ బాధపడనిదీ అయిన ఈ సీత భర్తపై నున్న స్నేహముచేత ప్రేరితురాలై అత్యధికమైన దోషములు గల వనమునకు వచ్చినది. 3

మూ. యథైషా రమతే రామ ఇహ సీతా తథా కురు,
దుష్కరం కృతవత్యేషా వనే త్వామనుగచ్ఛతీ. 4

ప్ర. అ. రామ = రామా! ఏషా సీతా = ఈ సీత, ఇహ = ఇక్కడ, యథా = ఎట్లు, రమతే = ఆనందముగా ఉండునో, తథా = అట్లు, కురు = చేయుము. ఏషా = ఈమె, వనే = వనమునందు, త్వామ్ = నిన్ను, అనుగచ్ఛతీ = అనుసరించు చున్నదై, దుష్కరమ్ = చేయ శక్యము కాని పనిని, కృతవతీ = చేసినది.

తా. ఈ సీత ఇక్కడ సుఖముగా ఉండు నట్లు చూచుకొనుము. నీ వెను కనే అరణ్యమునకు వచ్చిన ఈమె ఎవ్వరూ చేయజాలని పని చేసినది. 4

మూ. ఏషా హి ప్రకృతిః స్త్రీణామాసృష్టే రఘునన్దన,
సమస్థమనురజ్జన్తి విషమస్థం త్యజన్తి చ. 5

ప్ర. అ. రఘునన్దన = రామా ! ఆ సృష్టేః = సృష్టి మొదలు, ఏషా = ఇది స్త్రీణామ్ = స్త్రీలయొక్క, ప్రకృతిర్హి = స్వభావము కదా; సమస్థమ్ = చక్కని పరిస్థితిలో ఉన్న భర్తను (పై), అనురజ్జన్తి = అనురాగము చూపుదురు; విషమ స్థమ్ = కష్టములలో ఉన్నవానిని, త్యజన్తి చ = విడచుదురు.

తా. రామా! స్త్రీలు సుఖస్థితిలో ఉన్న భర్తపై అనురాగము చూపుదురు. కష్టాలలో ఉన్నవానిని విడచివేయుదురు. సృష్టి ప్రారంభమునుండి ఇది స్త్రీలతో ఉన్న స్వభావము. 5

మూ. శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా,
గరుడానిలయోః శైఘ్ర్యమనుగచ్ఛన్తి యోషితః. 6

ప్ర. అ. యోషితః = స్త్రీలు, శతహ్రదానామ్ = మెరుపులయొక్క, లోలత్వమ్ = చంచలత్వమును, శస్త్రాణామ్ = ఆయుధములయొక్క, తీక్ష్ణతామ్ = తీక్ష్ణత్వమును, తథా = మరియు, గరుడానిలయోః = గరుత్మంతునియొక్క, వాయువుయొక్క, శైఘ్ర్యమ్ = వేగమును, అనుగచ్ఛన్తి = అనుసరించి ఉందురు.

తా. స్త్రీలలో మెరపుల కున్న చంచలత్వము, ఆయుధాల కున్న తీక్ష్ణత్వము, గరుత్మంతునికి, వాయువునకు ఉన్న వేగము ఉన్నవి. 6

మూ. ఇయం తు భవతో భార్యా దోషైరేతైర్వివర్జితా,
శ్లాఘ్యా చ వ్యపదేశ్యా చ యథా దేవీ హ్యరున్ధతీ. 7

ప్ర. అ. భవతః = నీయొక్క, భార్యా = భార్యయైన, ఇయం తు = ఈ సీత యైతే, ఏతైః = ఈ, దోషైః = దోషములతో, వివర్జితా = శూన్యురాలై, దేవీ = దేవియైన, అరున్ధతీ యథా = అరుంధతి వలె, శ్లాఘ్యా చ = శ్లాఘించ దగినది, వ్యపదేశ్యా చ = చెప్పుకొనదగినది.

తా. కాని నీ భార్యయైన సీత మాత్రము ఈ దోషము లేవీ లేనిదై, అరుంధతీదేవి వలె శ్లాఘించదగినది, చెప్పుకొనదగినది. 7

మూ. అలంకృతోఽయం దేశశ్చ యత్ర సౌమిత్రిణా సహ,
వైదేహ్యా చానయా రామ వత్స్యసి త్వమరిందమ. 8

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడవైన, రామ = రామా! సౌమిత్రిణా సహ = లక్ష్మణునితోను, అనయా = ఈ, వైదేహ్యా చ = సీతతోను, యత్ర = ఎక్కడ, వత్స్యసి = నివసించగలవో, అయమ్ = ఈ, దేశశ్చ = దేశము, అలంకృతః = అలంకరింపబడినది.

తా. శత్రుసంహారకుడవైన రామా! నీవు లక్ష్మణునితోను, సీతతోను కలిసి ఏ ప్రదేశములో నివసించెదవో ఆ ప్రదేశము అలంకరింపబడినది అగును.

మూ. ఏవముక్తః స మునినా రాఘవః సంయతాఞ్జలిః,
ఉవాచ ప్రశ్రితం వాక్యమృషిం దీప్తమివానలమ్. 9

ప్ర. అ. మునినా = అగస్త్యమహామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః = ఆ, రాఘవః = రాముడు, సంయతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, అనలమివ = అగ్ని వలె ఉన్న, ఋషిమ్ = ఆ ఋషీశ్వరుని గూర్చి, ప్రశ్రితమ్ = వినయముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును ఉవాచ = పలికెను.

తా. ఆ అగస్త్యమహాముని మాటలు విని రాముడు, అంజలి ఘటించి, ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న ఆ మహర్షితో, వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 9

మూ. ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుఙ్గవః,
గుణైః సభ్రాతృభార్యస్య వరదః పరితుష్యతి. 10

ప్ర. అ. సభ్రాతృభార్యస్య = సోదరునితోను భార్యతోను కూడిన, యస్య మే = ఏ నాయొక్క, గుణైః = గుణములచేత, వరదః = వరముల నిచ్చే, ముని పుఙ్గవః = మునిశ్రేష్ఠుడు, పరితుష్యతి = సంతోషించుచున్నాడో, అట్టి నేను, ధన్యః = ధన్యుడను, అస్మి = అయితిని. అనుగృహీతః = అనుగ్రహింపబడినవాడను, అస్మి = అయితిని.

తా. నా భార్య గుణములను, నా తమ్ముని గుణములను, నా గుణములను చూచి, వరములను ఇవ్వ సమర్థుడైన నీవంటి మునిశ్రేష్ఠుడు సంతోషించుటచేత నేను ధన్యుడను అయినాను. మీ అనుగ్రహమునకు పాత్రుడను అయినాను. 10

మూ. కిం తు వ్యాదిశ మే దేశం సోదకం బహుకాననమ్,
యత్రాశ్రమపదం కృత్వా వసేయం నిరతః సుఖమ్. 11

ప్ర. అ. కిం తు = కాని, యత్ర = ఎక్కడ, ఆశ్రమపదమ్ = ఆశ్రమ

మును, కృత్వా = నిర్మించుకొని, నిరతః = ఏకాగ్ర చిత్తుడనై, సుఖమ్ = సుఖముగా, వసేయమ్ = నివసింతునో అట్టి, సోదకమ్ = ఉదకముతో కూడినది, బహుకాననమ్ = అధికమైన వనములు కలది అయిన, దేశమ్ = ప్రదేశమును, మే = నాకు, వ్యాదిశ = చెప్పుము.

తా. కాని నేను పర్ణశాల నిర్మించుకొని ఏకాగ్రచిత్తముతో, సుఖముగా నివసించుటకు యోగ్యమైన, ఉదకసమృద్ధి గల, అధికవృక్షము లున్న ప్రదేశమేదో చెప్పుము. 11

మూ. తతోఽబ్రవీన్మునిశ్రేష్ఠః శ్రుత్వా రామస్య తద్వచః,
ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ధర్మాత్మా = ధర్మాత్ముడు, ధీరః = బుద్ధిమంతుడు అయిన, మునిశ్రేష్ఠః = ఆ మునిశ్రేష్ఠుడు, రామస్య = రాముని యొక్క, తత్ = ఆ, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, ముహూర్తమ్ = ముహూర్తకాలముపాటు, ధ్యాత్వా = ధ్యానించి, ధీరతరమ్ = మిక్కిలి తెలివితో కూడిన, వచః = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మాత్ముడు, బుద్ధిశాలీ అయిన ఆ మునిశ్రేష్ఠుడు రాముని మాటలు విని, కొంచెము సేపు ఆలోచించి చాల తెలివైన మాట పలికెను. 12

మూ. ఇతో ద్వియోజనే తాత బహుమూలఫలోదకః,
దేశో బహుమృగః శ్రీమాన్ పఞ్చవట్యభివిశ్రుతః. 13

ప్ర. అ. తాత = తండ్రీ ! బహుమూలఫలోదకః = అధికమైన మూలములు, ఫలములు, ఉదకము గల, బహుమృగః = అనేకమృగములు గల, శ్రీమాన్ = శోభాయుక్తమైన, పఞ్చవట్యభివిశ్రుతః = పంచవటి అని ప్రసిద్ధమైన, దేశః = ప్రదేశము, ఇతః = ఇక్కడినుండి, ద్వియోజనే = రెండు యోజనముల దూరమునందున్నది.

తా. నాయనా ! ఇక్కడికి రెండు యోజనముల దూరములో పంచవటి అను ఒక చాల అందమైన ప్రదేశ మున్నది. అక్కడ మూలములు, ఫలములు, ఉదకము సమృద్ధిగా లభించును. అక్కడ అనేకమృగములు సంచరించుచుండును.

మూ. తత్ర గత్వాశ్రమపదం కృత్వా సౌమిత్రిణా సహ,
రంస్యసే త్వం పితుర్వాక్యం యథోక్తమనుపాలయన్.

ప్ర. అ. త్వమ్ = నీవు, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడ, తత్ర = అక్కడికి, గత్వా = వెళ్లి, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, కృత్వా = నిర్మించుకొని, యథోక్తమ్ = చెప్పిన విధముగ, పితుః = తండ్రియొక్క, వాక్యమ్ = వాక్యమును, అనుపాలయన్ = పాలించుచు, రంస్యసే = విహరించగలవు.

తా. నీవు అక్కడికి లక్ష్మణునితో కలిసి వెళ్ళి, పర్ణశాల నిర్మించుకొని, నీ తండ్రిచెప్పిన మాటను పాలించుచు సుఖముగా నివసించవచ్చును. 14

మూ. కాలోఽయం గతభూయిష్ఠో యః కాల స్తవ రాఘవ.
సమయో యో నరేన్ద్రేణ కృతో దశరథేన తే, 15
తీర్ణప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖం రాజ్యే నివత్స్యసి.

ప్ర. అ. రాఘవ = రామా ! తే = నీకు, దశరథేన నరేన్ద్రేణ = దశరథ మహారాజుచేత, యః = ఏది, సమయః = నిర్ణీతసమయముగా, కృతః = చేయబడినదో, యః = ఏది, తవ = నీయొక్క, కాలః = అరణ్యములో గడపవలసిన కాలమో, అయం కాలః = ఈ కాలము, గతభూయిష్ఠః = చాలవరకు గడచిపోయినది. కాకుత్స్థ = రామా ! తీర్ణప్రతిజ్ఞః = దాటబడిన ప్రతిజ్ఞ కలవాడవై, రాజ్యే = రాజ్యమునందు, సుఖమ్ = సుఖముగా, నివత్స్యసి = నివసించగలవు.

తా. రామా ! నీకు దశరథమహారాజు విధించిన అరణ్యనివాసకాలము చాలవరకు గడచిపోయినది. నీవు ప్రతిజ్ఞ పూర్తిచేసికొని రాజ్యములో సుఖముగ ఉండగలవు. 15

మూ. ధన్యస్తే జనకో రామ స రాజా రఘునన్దన. 16
యస్త్వయా జ్యేష్ఠపుత్రేణ యయాతిరివ తారితః,

ప్ర. అ. రఘునన్దన = రఘువంశమునకు ఆనందమును కలిగించు, రామ = రామా ! తే జనకః = నీ తండ్రియైన, సః = ఆ, రాజా = దశరథమహారాజు, ధన్యః = ధన్యుడు; యః = ఏ దశరథుడు, జ్యేష్ఠపుత్రేణ = జ్యేష్ఠపుత్రుడవైన,

త్వయా = నీచేత, యయాతిరివ = యయాతి వలె, తారితః = తరింపచేయ బడినాడో.

తా. రఘువంశమునకు ఆనందము కలిగించు రామా ! నీ తండ్రియైన దశరథమహారాజు ధన్యుడు. యయాతిని ఆతని జ్యేష్ఠపుత్రుడు తరింపచేసి నట్లు నీవు ఆ దశరథమహారాజును తరింపచేసినావు. 16

మూ. విదితో హ్యేష వృత్తాన్తో మమ సర్వస్తవానఘ, 17
తపసశ్చ ప్రభావేణ స్నేహాద్దశరథస్య చ.

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా ! తపసః = తపస్సుయొక్క, ప్రభావేణ = ప్రభావముచేతను, దశరథస్య = దశరథునియొక్క, స్నేహాత్ = స్నేహమువలనను, తవ = నీయొక్క, ఏషః = ఈ, సర్వః = సమస్తమైన, వృత్తాన్తః = వృత్తాంతము, మమ = నాకు, విదితః = తెలియబడినది.

తా. దోషరహితుడవైన శ్రీరామా ! తపఃప్రభావముచేతను, దశరథుని విషయమున నా కున్న స్నేహముచేతను నాకు నీ విషయ మంతా తెలిసినది. 17

మూ. హృదయస్థశ్చ తే ఛన్దో విజ్ఞాతస్తపసా మయా, 18
ఇహావాసం ప్రతిజ్ఞాయ మయా సహ తపోవనే,
అతశ్చ త్వామహం బ్రూమి గచ్ఛ పఞ్చవటీమితి. 19

ప్ర. అ. తే = నీయొక్క, హృదయస్థః = హృదయమునందున్న, ఛన్దః = కోరిక, మయా = నాచేత, తపసా = తపస్సుచేత, విజ్ఞాతః = తెలియబడినది. అతః = అందువలన, మయాసహ = నాతో కూడ, ఇహ = ఈ, తపోవనే = తపోవనమునందు, ఆవాసమ్ = నివాసమును, ప్రతిజ్ఞాయ = తెలిపి, పఞ్చవటీమ్ = పంచవటిని గూర్చి, గచ్ఛ = వెళ్లుము, ఇతి = అని, త్వామ్ = నిన్ను గూర్చి, అహమ్ = నేను, బ్రూమి = చెప్పుచున్నాను.

తా. తపోబలముచేత నేను నీ మనస్సులో ఉన్న అభిలాషను తెలుసుకొన్నాను. అందుచేతనే నాతో కూడ ఈ ఆశ్రమములో ఉండు మని మొదట చెప్పి, పంచవటికి వెళ్లుమని చెప్పుచున్నాను. 18, 19

మూ. స హి రమ్యో వనోద్దేశో మైథిలీ తత్ర రంస్యతే,
స దేశః శ్లాఘనీయశ్చ నాతిదూరే చ రాఘవ. 20

ప్ర. అ. రాఘవ = రామా ! సః = ఆ, వనోద్దేశః = వనప్రదేశము, రమ్యః హి = రమ్యమైనది కదా. సః దేశః = ఆ ప్రదేశము, శ్లాఘనీయశ్చ = శ్లాఘించ దగినది. నాతిదూరే చ = చాల దూరమునందు లేదు. మైథిలీ = సీత, తత్ర = అక్కడ, రంస్యతే = క్రీడించగలదు.

తా. రామా ! ఆ వనప్రదేశము సుందర మైనది. శ్లాఘింపదగినది. ఇక్కడికి చాల దగ్గరగా ఉన్నది. సీత అక్కడ ఆనందముతో నివసించగలదు. 20

మూ. గోదావర్యాః సమీపే చ మైథిలీ తత్ర రంస్యతే,
ప్రాజ్యమూలఫలశ్చైవ నానాద్విజగణాయుతః, 21
వివిక్తశ్చ మహాబాహో పుణ్యో రమ్యస్తథైవ చ.

ప్ర. అ. మైథిలీ = సీత, తత్ర = అక్కడ, గోదావర్యాః = గోదావరి యొక్క, సమీపే = సమీపమునందు. రంస్యతే = క్రీడించగలదు. ప్రాజ్యమూలఫలశ్చైవ = అధికమైన మూలములు, ఫలములు కలది. నానాద్విజగణాయుతః = అనేక విధములైన పక్షుల సముదాయముతో కూడినది. మహాబాహో = గొప్పబాహువులు కలవాడా ! వివిక్తశ్చ = జనసంచారము లేనిది. పుణ్యః = పుణ్యమైనది. తథైవచ = మరియు, రమ్యః = రమ్యమైనది.

తా. సీత, అక్కడ, గోదావరీసమీపమునందు క్రీడించగలదు. ఓ! మహాబాహూ ! ఆ ప్రదేశమునందు మూలములు, ఫలములు సమృద్ధిగా లభించును. అక్కడ అనేకవిధములైన పక్షులు గుంపులు గుంపులుగా తిరుగుచుండును. జనసంచారము లేక పుణ్యమై, రమ్యముగా ఉండును. 21

మూ. భవానపి సదారశ్చ శక్తశ్చ పరిరక్షణే, 22
అపి చాత్ర వసన్ రామ తాపసాన్ పాలయిష్యసి.

ప్ర. అ. రామ = రామా ! భవానపి = నీవు కూడ, సదారశ్చ = భార్యతో కూడినవాడవు. పరిరక్షణే = రక్షించుటయందు, శక్తశ్చ = సమర్థుడవు. అపి చ

= మరియు, అత్ర = ఇక్కడ, వసన్ = నివసించుచు, తాపసాన్ = మునులను, పాలయిష్యసి=పాలించగలవు.

తా. రామా! నీవు భార్యాసమేతుడవు. రక్షించుకొనుటయందు సమర్థుడవు. మరియు నీవు ఇక్కడ నివసించినచో మునులను కూడ పాలించవచ్చును. 22

మూ. ఏతదాలక్ష్యతే వీర మధూకానాం మహద్వనమ్, 23
ఉత్తరేణాస్య గన్తవ్యం న్యగ్రోధమభిగచ్ఛతా.

ప్ర. అ. వీర=ఓ! వీరుడా! ఏతత్=ఈ, మధూకానామ్=ఇప్పచెట్లయొక్క, మహత్=గొప్ప, వనమ్=వనము, ఆలక్ష్యతే=చూడబడుచున్నది. అస్య=దీనికి, ఉత్తరేణ=ఉత్తరముగా, న్యగ్రోధమ్=మఱ్ఱిచెట్టును గూర్చి, అభిగచ్ఛతా= ఎదురుగా వెళ్ళువాడుగా, గన్తవ్యమ్=వెళ్ళదగి యున్నది.

తా. ఇదిగో! ఈ పెద్ద మధూకవృక్షముల వనము కనబడు చున్నది. దానికి ఉత్తరముగా, మఱ్ఱి చెట్టునకు ఎదురుగా వెళ్ళవలెను. 23

మూ. తతః స్థలముపారుహ్య పర్వతస్యావిదూరతః, 24
ఖ్యాతః పఞ్చవటీత్యేవ నిత్యపుష్పితకాననః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, స్థలమ్=మెట్టప్రదేశమును, ఉపారుహ్య =ఎక్కి, పర్వతస్య=పర్వతమునకు, అవిదూరతః=సమీపమునందు, పఞ్చవటీత్యేవ=పంచవటి అను, ఖ్యాతః=ప్రసిద్ధమైన, నిత్యపుష్పితకాననః= నిత్యము పుష్పించిన వనము (ఉన్నది).

తా. అక్కడనుండి, పర్వతమునకు దగ్గరగా, మెట్టమీదికి ఎక్కి (చూడగా), నిత్యము పుష్పించిన పంచవటి అను వనము ఉన్నది. 24

మూ. అగస్త్యేనైవముక్తస్తు రామః సౌమిత్రిణా సహ, 25
సత్కృత్యామన్త్రయామాస తమృషిం సత్యవాదినమ్.

ప్ర. అ. అగస్త్యేన = అగస్త్యునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, సత్యా

వాదినమ్ = సత్యమును పలుకు, తమ్ = ఆ, ఋషిమ్ = ఋషిని, సత్కృత్య = సత్కరించి, ఆమన్త్రియామాస = వీడ్కొనెను.

తా. లక్ష్మణసమేతుడైన రాముడు, అగస్త్యుని మాటలు విని, సత్యమును పలుకు ఆ ఋషీశ్వరునకు నమస్కరించి, వెళ్లుటకు అనుమతి గైకొనెను. 25

మూ. తౌ తు తేనాభ్యనుజ్ఞాతౌ కృతపాదాభివన్దనౌ, 26
తదాశ్రమాత్పఞ్చవటీం జగ్మతుః సీతయా సహ.

ప్ర. అ. తేన = ఆ అగస్త్యునిచేత, అభ్యనుజ్ఞాతౌ = అనుమతింపబడిన, తౌ = ఆ రామలక్ష్మణులు, కృతపాదాభివన్దనౌ = చేయబడిన పాదాభివందనము గలవారై, సీతయా సహ = సీతతో కూడ, తదాశ్రమపదాత్ = అగస్త్యుని ఆశ్రమమునుండి, పఞ్చవటీమ్ = పంచవటినిగూర్చి, జగ్మతుః = వెళ్ళిరి.

తా. అగస్త్యమహాముని అనుజ్ఞ పొందిన ఆ రామలక్ష్మణులు ఆతనికి పాదాభివందనము చేసి, సీతాసమేతులై, ఆ అగస్త్యుని ఆశ్రమమునుండి పంచవటికి వెళ్ళిరి. 26

మూ. గృహీతచాపౌ తు నరాధిపాత్మజౌ
విషక్తతూణౌ సమరేష్వకాతరౌ,
యథోపదిష్టేన పథా మహర్షిణా
ప్రజగ్మతుః పఞ్చవటీం సమాహితౌ. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర. అ. సమరేషు = యుద్ధములందు, అకాతరౌ = భయము లేనివారైన, నరాధిపాత్మజౌ = రాజకుమారులైన రామలక్ష్మణులు, గృహీతచాపౌ = గ్రహింపబడిన ధనస్సులు కలవారై, విషక్తతూణౌ = కట్టబడిన అంబులపొదులు కలవారై, సమాహితౌ = సావధానచిత్తులై, మహర్షిణా = మహర్షిచేత, యథోపదిష్టేన = చెప్పబడిన, పథా = మార్గముచేత, పఞ్చవటీమ్ = పంచవటిని గూర్చి, ప్రజగ్మతుః = వెళ్ళిరి.

తా. యుద్ధములలో భయము లేని రాజకుమారులైన ఆ రామలక్ష్మణులు, ధనస్సులు ధరించి, అంబులపొదులు కట్టుకొని, సావధానచిత్తులై, మహర్షి చెప్పిన మార్గమున పంచవటికి వెళ్ళుటకు ప్రయాణ మైరి. 27

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పదమూడవ సర్గ సమాప్తము

# అథ చతుర్దశః సర్గః

[రాముడు పంచవటికి వెళ్ళుచు జటాయువును కలియుట. అతడు తనను గూర్చి సవిస్తరముగ రామునకు చెప్పుట.]

మూ. అథ పఞ్చవటీం గచ్ఛన్నన్తరా రఘునన్దనః,
ఆససాద మహాకాయం గృధ్రం భీమపరాక్రమమ్. 1

ప్ర. అ. అథ = అటు పిమ్మట, రఘునన్దనః = రాముడు, పఞ్చవటీమ్ = పంచవటిని గూర్చి, గచ్ఛన్ = వెళ్ళుచు, అన్తరా = మధ్యయందు, మహాకాయమ్ = పెద్ద శరీరము గల, భీమ పరాక్రమమ్ = భయంకరమైన పరాక్రమము గల, గృధ్రమ్ = గృధ్రమును, ఆససాద = పొందెను.

తా. పిమ్మట పంచవటికి వెళ్ళుచున్న రాముడు మార్గమధ్యమునందు, పెద్ద శరీరము గల, మహాపరాక్రమవంతుడైన గృధ్రమును (గ్రద్దను) చూచెను.

మూ. తం దృష్ట్వా తౌ మహాభాగౌ వటస్థం రామలక్ష్మణౌ,
మేనాతే రాక్షసం పక్షిం బ్రువాణౌ కో భవానితి. 2

ప్ర. అ. మహాభాగౌ = మహాభాగ్యవంతులైన, తౌ రామలక్షణౌ = ఆ రామలక్ష్మణులు, వటస్థమ్ = వటవృక్షముమీద ఉన్న, తం పక్షిమ్ = ఆ పక్షిని, దృష్ట్వా = చూచి, భవాన్ = నీవు, కః = ఎవ్వడవు, ఇతి = అని, బ్రువాణౌ = పలుకుచున్నవారై, రాక్షసమ్ = రాక్షసునిగా, మేనాతే = తలచిరి.

తా. మహాభాగ్యవంతులైన ఆ రామలక్ష్మణులు వటవృక్షముమీద ఉన్న ఆ గృధ్రమును చూచి, రాక్షసుడని తలచి, "నీవు ఎవ్వడవు ?" అని ప్రశ్నించిరి.

మూ. స తౌ మధురయా వాచా సౌమ్యయా ప్రీణయన్నివ,
ఉవాచ వత్స మాం విద్ధి వయస్యం పితురాత్మనః. 3

ప్ర. అ. సః = ఆ పక్షి, తౌ = వారిద్దరిని, మధురయా = మధురము, సౌమ్యయా = మృదువు అయిన, వాచా = వాక్కుతో, ప్రీణయన్నివ = సంతోష పెట్టుచున్నవాడు వలె, ఉవాచ = పలికెను. వత్స = వత్సా ! మామ్ = నన్ను, ఆత్మనః = నీయొక్క, వయస్యమ్ = మిత్రునిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. ఆ పక్షి మధురము, మృదువు అయిన వాక్కుతో ఆ రామలక్ష్మణులను సంతోషపెట్టుచు ఇట్లు పలికెను. "నాయనా ! నేను నీ తండ్రి స్నేహితుడను అని తెలిసి కొనుము." 3

మూ. స తం పితృసఖం బుద్ధ్వా పూజయామాస రాఘవః,
స తస్య కులమవ్యగ్రమథ పప్రచ్ఛ నామ చ. 4

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, తమ్ = ఆ పక్షిని, పితృసఖమ్ = తన తండ్రి మిత్రునిగా, బుద్ధ్వా = తెలిసికొని, పూజయామాస = పూజించెను. అథ = అటుపిమ్మట, సః = ఆ రాముడు, అవ్యగ్రమ్ = కంగారు లేకుండగా, తస్య = ఆ పక్షియొక్క, కులమ్ = కులమును, నామ చ = పేరును, పప్రచ్ఛ = అడిగెను.

తా. రాముడు ఆ పక్షి తన తండ్రిమిత్రు డని తెలిసికొని ఆతనిని పూజించెను. పిమ్మట తగు గౌరవము చూపుచు ఆ పక్షి కులమును, పేరును గూర్చి ప్రశ్నించెను. 4

మూ. రామస్య వచనం శ్రుత్వా సర్వభూతసముద్భవమ్,
ఆచచక్షే ద్విజస్తస్మై కులమాత్మానమేవ చ. 5

ప్ర. అ. ద్విజః = ఆ పక్షి, రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సర్వభూతసముద్భవమ్ = సకలప్రాణుల ఉత్పత్తిని, కులమ్ = కులము, ఆత్మానమేవ చ = తనను గూర్చి, తస్మై = ఆ రామునకు, ఆచచక్షే = చెప్పెను.

తా. ఆ పక్షి రాముని వచనమును విని సకలభూతముల ఉత్పత్తిని, తన కులమును, పేరును రామునకు చెప్పెను. 5

మూ. పూర్వకాలే మహాబాహో యే ప్రజాపతయోఽభవన్,
తాన్మే నిగదతః సర్వానాదితః శృణు రాఘవ. 6

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా ! రాఘవ=రామా ! పూర్వకాలే=పూర్వకాలమునందు, యే=ఏ, ప్రజాపతయః=ప్రజాపతులు, అభవన్=ఉండిరో, తాన్ సర్వాన్=వారి నందరినీ గూర్చి, మే=నేను, నిగదతః=చెప్పుచుండగా, ఆదితః=ప్రారంభమునుండీ, శృణు=వినుము.

తా. మహాబాహువైన రామా ! పూర్వము ఉన్న ప్రజాపతు లెవ్వరో వారి నందరినీ గూర్చి మొదటినుండీ చెప్పెదను; వినుము. 6

మూ. కర్దమః ప్రథమస్తేషాం విక్రీత స్తదనన్తరః
శేషశ్చ సంశ్రయశ్చైవ బహుపుత్రశ్చ వీర్యవాన్. 7

స్థాణుర్మరీచిరత్రిశ్చ క్రతుశ్చైవ మహాబలః
పులస్త్యశ్చాఙ్గిరాశ్చైవ ప్రచేతాః పులహ స్తథా 8

దక్షో వివస్వానపరోఽరిష్టనేమిశ్చ రాఘవ
కాశ్యపశ్చ మహాతేజాస్తేషామాసీచ్చ పశ్చిమః. 9

ప్ర. అ. రాఘవ=రామా ! తేషామ్=వారిలో, ప్రథమః=మొదటివాడు, కర్దమః=కర్దముడు. విక్రీతః=విక్రీతుడు, తదనన్తరః=ఆతని తరువాతివాడు. శేషశ్చ=శేషుడు, బహుపుత్రః=అనేకపుత్రులు గల, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సంశ్రయశ్చైవ=సంశ్రయుడు, స్థాణుః=స్థాణువు, మరీచిః=మరీచి, అత్రిశ్చ=అత్రి, మహాబలః=గొప్ప బలము గల, క్రతుశ్చ=క్రతువు, పులస్త్యః=పులస్త్యుడు, అఙ్గిరాశ్చైవ=అంగిరసుడు, ప్రచేతాః=ప్రచేతసుడు, తథా=మరియు, పులహః=పులహుడు, దక్షః=దక్షుడు, అపరః=తరువాతివాడైన, వివస్వాన్=వివస్వంతుడు (ఉండిరి). అరిష్టనేమిశ్చ=అరిష్టనేమి అను నామాంతరము గల, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, కాశ్యపశ్చ=కాశ్యపుడు, తేషామ్=వారిలో, పశ్చిమః=చివరివాడు, ఆసీచ్చ=ఉండెను.

తా. ఆ ప్రజాపతులలో మొదటివాడు కర్దముడు, తరువాతివాడు విక్రీతుడు. పిమ్మట శేషుడు, చాలమంది పుత్రులు కలవాడు, వీర్యవంతుడు అయిన సంశ్ర

యుడు, స్థాణువు, మరీచి, అత్రి, మహాబలశాలియైన క్రతువు, పులస్త్యుడు, అంగిరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వంతుడు ఉండిరి. అరిష్టనేమి అను నామాంతరము గల, తేజఃశాలియైన కాశ్యపుడు వారిలో చివరివాడుగా ఉండెను.

మూ. ప్రజాపతేస్తు దక్షస్య బభూవురితి విశ్రుతమ్,
షష్టిర్దుహితరో రామ యశస్విన్యో మహాయశః. 10

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గల, రామ=రామా ! ప్రజాపతేః= ప్రజాపతియైన, దక్షస్య = దక్షునకు, షష్టిః = అరవైమంది, యశస్విన్యః = కీర్తి గల, దుహితరః = కుమార్తెలు, బభూవుః ఇతి = ఉండిరి అని, విశ్రుతమ్ = ప్రసిద్ధము.

తా. గొప్ప కీర్తి గల రామా ! ప్రజాపతియైన దక్షునకు కీర్తి గల అరవై మంది కుమార్తెలు ఉండేవా రని ప్రసిద్ధము. 10

మూ. కాశ్యపః ప్రతిజగ్రాహ తాసామష్టౌ సుమధ్యమాః,
అదితిం చ దితిం చైవ దనుమప్యథ కాళికామ్ 11
తామ్రాం క్రోధవశాం చైవ మనుం చాప్యనలామపి.

ప్ర. అ. కాశ్యపః = కాశ్యపుడు, తాసామ్ = వారిలో, అదితిం చ = అదితిని, దితిం చైవ = దితిని, దనుమపి = దనువును, అథ = మరియు, కాళికామ్ = కాళికను, తామ్రామ్ = తామ్రను, క్రోధవశాం చైవ=క్రోధవశను, మనుం చ = మనువును, అనలామపి=అనలను, అష్టౌ=ఎనమండుగురు, సుమధ్యమాః= అందమైన నడుము గల స్త్రీలను, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. కాశ్యపుడు వారిలో, అదితి, దితి, దనువు, కాళిక, తామ్ర, క్రోధవశ, మను, అనల అను ఎనమండుగురు కన్యలను వివాహమాడెను. 11

మూ. తాస్తు కన్యాస్తతః ప్రీతః కాశ్యపః పునరబ్రవీత్. 12
పుత్రాంస్త్రైలోక్యభర్తౄన్ వై జనయిష్యథ మత్సమాన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రీతః = సంతోషించిన, కాశ్యపః = కాశ్యపుడు, తాః కన్యాః = ఆ కన్యలను గూర్చి, పునః = మరల, అబ్రవీత్ =

పలికెను, త్రైలోక్యభర్తౄన్ = మూడు లోకములను పోషించు, మత్సమాన్ = నాతో సమానులైన, పుత్రాన్ = పుత్రులను, జనయిష్యథ = కనగలరు.

తా. పిమ్మట కాశ్యపుడు సంతోషించి, ఆ కన్యలతో "మీరు నాతో సమానులు, మూడు లోకములను పోషించేవారు అయిన కుమారులను కనండి" అని పలికెను. 12

మూ. అదితిస్తన్మనా రామ దితిశ్చ మనుజర్షభ, 13
కాళికా చ మహాబాహో శేషాస్త్వమనసోఽభవన్.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, మనుజర్షభ = మనుష్యులలో శ్రేష్ఠుడవైన, రామ = రామా ! అదితిః = అదితి, తన్మనాః = ఆమాటయందు మనస్సు కలదిగా ఉండెను. దితిశ్చ = దితి, కాళికా చ = కాళిక కూడ, (అట్లే ఉండిరి). శేషాస్తు = మిగిలినవాళ్లు, అమనసః = మనస్సు లేనివాళ్లు, అభవన్ = అయిరి.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడవు మహాబాహువూ అయిన రామా ! అదితి, దితి, కాళికా అనువారు కాశ్యపుని మాటపై శ్రద్ధ చూపిరి. ఇతరభార్యలు శ్రద్ధ చూపలేదు. 13

మూ. అదిత్యాం జజ్ఞిరే దేవాస్త్రయస్త్రింశదరిందమ, 14
ఆదిత్యా వసవో రుద్రా హ్యశ్వినౌ చ పరంతప.

ప్ర. అ. అరిందమ = శత్రువులను పీడించువాడా ! పరంతప = శత్రువినాశకుడా ! అదిత్యామ్ = అదితియందు, ఆదిత్యాః = ఆదిత్యులు, వసవః = వసువులు, రుద్రాః = రుద్రులు, అశ్వినౌ = అశ్వినీదేవతలు అను, త్రయస్త్రింశత్ = ముప్పదిముగ్గురు, దేవాః = దేవతలు, జజ్ఞిరే = పుట్టిరి.

తా. శత్రుసంహారకుడవైన రామా ! అదితికి పన్నెండుగురు ఆదిత్యులు, ఎనమండుగురు వసువులు, పదకొండుగురు రుద్రులు, ఇద్దరు అశ్వినులు అను ముప్పదిముగ్గురు దేవతలు పుట్టిరి. 14

మూ. దితిస్త్వజనయత్పుత్రాన్ దైత్యాంస్తాత యశస్వినః, 15
తేషామియం వసుమతీ పురాసీత్సవనార్ణవా.

ప్ర. అ. తాత = తండ్రీ ! దితిస్తు = దితి, యశస్వినః = కీర్తిమంతులైన, దైత్యాన్ = దైత్యులను, పుత్రాన్ = పుత్రులనుగా, అజనయత్ = కనెను. సవనార్ణవా = వనములతోను అర్ణవములతోను కూడిన, ఇయమ్ = ఈ, వసుమతీ = భూమి, తేషామ్ = వారిదిగా, ఆసీత్ = అయి ఉండెను.

తా. దితికి కీర్తిమంతులైన దైత్యులను పుత్రులు జనించిరి. వనములతోను, సముద్రములతోను కూడిన ఈ భూమి పూర్వము ఈ దేవతలకు దైత్యులకు సంబంధించి ఉండెను. 15

మూ. దనుస్త్వజనయత్పుత్రమశ్వగ్రీవమరిందమ. 16
నరకం కాలకం చైవ కాళికాపి వ్యజాయత.

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడా ! దనుః = దనువు, అశ్వగ్రీవమ్ = హయగ్రీవుడను, పుత్రమ్ = పుత్రుని, అజనయత్ = కనెను. కాళికాపి = కాళిక కూడ, నరకమ్ = నరకుని, కాలకం చైవ = కాలకుని, వ్యజాయత = కనెను.

తా. శత్రుసంహారకుడవైన రామా ! దనువు హయగ్రీవుడను పుత్రుని కనెను. కాళిక నరకుణ్ణి, కాలకుణ్ణి కనెను. 16

మూ. క్రౌఞ్చీం భాసీం తథా శ్యేనీం ధృతరాష్ట్రీం తథా శుకీమ్,
తామ్రాపి సుషువే కన్యాః పఞ్చైతా లోకవిశ్రుతాః.

ప్ర. అ. తామ్రాపి = తామ్ర కూడ, క్రౌఞ్చీమ్ = క్రౌంచిని, భాసీమ్ = భాసిని, తథా = మరియు, శ్యేనీమ్ = శ్యేనిని, ధృతరాష్ట్రీమ్ = ధృతరాష్ట్రిని, తథా = మరియు, శుకీమ్ = శుకిని, ఏతాః = ఈ, లోకవిశ్రుతాః = లోకమునందు ప్రసిద్ధలైన, పఞ్చ = ఐదుగురు, కన్యాః = కన్యలను, సుషువే = కనెను.

తా. తామ్ర కూడ, క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి అను లోకప్రసిద్ధలైన ఐదుగురు కన్యలను కనెను. 17

మూ. ఉలూకాన్ జనయత్ క్రౌఞ్చీ భాసీ భాసాన్ వ్యజాయత,
శ్యేనీ శ్యేనాంశ్చ గృధ్రాంశ్చ వ్యజాయత సుతేజసః,
ధృతరాష్ట్రీ తు హంసాంశ్చ కలహంసాంశ్చ సర్వశః. 19

ప్ర. అ. క్రౌఞ్చీ = క్రౌంచి, ఉలూకాన్ = గుడ్లగూబలను, జనయత్ = కనెను. భాసీ = భాసి, భాసాన్ = భాసపక్షులను, వ్యజాయత = కనెను. శ్యేనీ = శ్యేని, సుతేజసః = మంచి తేజస్సు గల, శ్యేనాంశ్చ = డేగలను, గృధ్రాంశ్చ = గ్రద్దలను, వ్యజాయత = కనెను. ధృతరాష్ట్రీ తు = ధృతరాష్ట్రి, హంసాంశ్చ = హంసలను, సర్వశః = సమస్తమైన, కలహంసాంశ్చ = కలహంసలను (కనెను).

తా. క్రౌంచి గుడ్లగూబలను, భాసి భాసపక్షులను, శ్యేని గొప్ప తేజస్సు గల డేగలను, గ్రద్దలను, ధృతరాష్ట్రి సమస్త మైన హంసలను, కనెను. 18 19

మూ. చక్రవాకాంశ్చ భద్రం తే విజజ్ఞే సాపి భామినీ,
శుకీ నతాం విజజ్ఞే తు నతాయా వినతా సుతా. 20

ప్ర. అ. సా = ఆ, భామినీ = స్త్రీ, చక్రవాకాంశ్చాపి = చక్రవాకపక్షులను కూడ, విజజ్ఞే = కనెను. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. శుకీ = శుకి, నతామ్ = నతను, విజజ్ఞే = కనెను. వినతా = వినత, నతాయాః = నత యొక్క, సుతా = కుమార్తె.

తా. రామా! నీకు మంగళ మగు గాక. ఆ ధృతరాష్ట్రి చక్రవాకపక్షులను కూడ కనెను. శుకి నతను కనెను. నత కుమార్తె వినత. 20

మూ. దశ క్రోధవశా రామ విజజ్ఞే హ్యాత్మసంభవాః,
మృగీం చ మృగమన్దాం చ హరీం భద్రమదామపి, 21

మాతఙ్గీమపి శార్దూలీం శ్వేతాం చ సురభిం తథా,
సర్వలక్షణసంపన్నాం సురసాం కద్రుకామపి. 22

ప్ర. అ. రామ = రామా! క్రోధవశా = క్రోధవశ, మృగీం చ = మృగిని, మృగమన్దాం చ = మృగమందను, హరిమ్ = హరిని, భద్రమదామపి = భద్రమదను, మాతఙ్గీమపి = మాతంగిని, శార్దూలీమ్ = శార్దూలిని, శ్వేతామ్ = శ్వేతను, తథా = మరియు, సురభిమ్ = సురభిని, సర్వలక్షణసంపన్నామ్ = అన్ని లక్షణములతో కూడిన, సురసామ్ = సురసను, కద్రుకామపి = కద్రుకను, దశ = పదిమంది, ఆత్మసంభవాః = కుమార్తెలను, విజజ్ఞే = కనెను.

తా. రామా ! మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సర్వలక్షణసంపన్నురాలైన సురస, కద్రువ అను పదిమంది కుమార్తెలను క్రోధవశ కనెను. 21, 22

మూ. అపత్యం తు మృగాః సర్వే మృగ్యా నరవరోత్తమ,
ఋక్షాశ్చ మృగమన్దాయాః సృమరాశ్చమరా స్తథా. 23

ప్ర. అ. నరవరోత్తమ = నరశ్రేష్ఠులలో ఉత్తముడవైన రామా ! సర్వే = సమస్తమైన, మృగాః = లేళ్లు, మృగ్యాః = మృగియొక్క, అపత్యమ్ = సంతానము. ఋక్షాశ్చ = ఎలుగుబంట్లు, సృమరాః = సృమరములు, తథా = మరియు, చమరాశ్చ = చమరమృగములు, మృగమన్దాయాః = మృగమందయొక్క (సంతానము).

తా. రామా ! లేళ్లు అన్నీ మృగి సంతానము. ఎలుగుబంట్లు, సృమరములు చమరమృగములు మృగమంద సంతానము. 23

మూ. హర్యాశ్చ హరయోఽపత్యం వానరాశ్చ తరస్వినః,
తత స్త్విరావతీం నామ జజ్ఞే భద్రమదా సుతామ్. 24

ప్ర. అ. హరయః = సింహములు, తరస్వినః = బలము గల, వానరాశ్చ = వానరములు, హర్యాః = హరియొక్క, అపత్యమ్ = సంతానము. తతః = అటుపిమ్మట, భద్రమదా = భద్రమద, ఇరావతీం నామ = ఇరావతి అను పేరు గల, సుతామ్ = కుమార్తెను, జజ్ఞే = కనెను.

తా. సింహములు, బలము గల వానరములు హరి సంతానము. పిమ్మట భద్రమద ఇరావతి అను కుమార్తెను కనెను. 24

మూ. తస్యాస్త్వైరావతః పుత్రో లోకనాథో మహాగజః,
మాతఙ్గాస్త్వథ మాతఙ్గ్యా అపత్యం మనుజర్షభ. 25

ప్ర. అ. లోకనాథః = లోకములకు ప్రభువైన, ఐరావతః = ఐరావత మను, మహాగజః = మహాగజము, తస్యాః = ఆ ఇరావతియొక్క, పుత్రః = పుత్రుడు. మనుజర్షభ = మనుష్యులలో శ్రేష్ఠుడా ! అథ = మరియు, మాతఙ్గాః = ఏనుగులు, మాతఙ్గ్యాః = మాతంగియొక్క, అపత్యమ్ = సంతానము.

తా. మానవులలో శ్రేష్ఠుడ వైన రామా ! లోకములకు ప్రభు వైన ఐరావత మనే మహాగజము ఆ ఇరావతి పుత్రుడు. ఏనుగులు మాతంగి సంతానము. 25

మూ. గోలాఙ్గూలాంశ్చ శార్దూలీ వ్యాఘ్రాంశ్చాజనయత్సుతాన్,
దిశాగజాంశ్చ కాకుత్థ్స శ్వేతాప్యజనయత్సుతాన్. 26

ప్ర. అ. కాకుత్థ్స=రామా ! శార్దూలీ = శార్దూలి, గోలాఙ్గూలాంశ్చ= కొండముచ్చులను, వ్యాఘ్రాంశ్చ= పెద్దపులులను, సుతాన్ = పుత్రులనుగా, అజనయత్ = కనెను. శ్వేతాపి=శ్వేత, దిశాగజాంశ్చ=దిగ్గజములను, సుతాన్ = పుత్రులనుగా, అజనయత్ = కనెను.

తా. రామా ! శార్దూలికి కొండముచ్చులు, పెద్దపులులు పుత్రులుగా పుట్టిరి. శ్వేతకు దిగ్గజములు పుత్రులుగా పుట్టెను. 26

మూ. తతో దుహితరౌ రామ సురభిర్దేవ్యజాయత,
రోహిణీం నామ భద్రం తే గన్ధర్వీం చ యశస్వినీమ్. 27

ప్ర. అ. రామ = రామా : తతః = అటు పిమ్మట, సురభిః దేవీ=సురభి దేవి, రోహిణీం నామ = రోహిణి అను పేరు గలదానిని, యశస్వినీమ్ = కీర్తి గల, గన్ధర్వీం చ=గంధర్విని, దుహితరౌ=కుమార్తెలనుగా, అజాయత=కనెను. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. రామా ! సురభి రోహిణి, కీర్తిమంతురాలైన గంధర్వి అను ఇద్దరు కుమార్తెలను కనెను. నీకు భద్ర మగుగాక. 27

మూ. రోహిణ్యజనయద్గా వై గన్ధర్వీ వాజినః సుతాన్,
సురసాఽజనయన్నాగాన్ రామ కద్రూస్తు పన్నగాన్. 28

ప్ర. అ. రామ = రామా : రోహిణీ = రోహిణి, గాః = గోవులను, అజ నయత్ = కనెను. గన్ధర్వీ=గంధర్వి, వాజినః=అశ్వములను, సుతాన్ = పుత్రులనుగా, కనెను. సురసా = సురస, నాగాన్ = చాల తలలు గల నాగములను, కద్రూస్తు = కద్రువు, పన్నగాన్=సాధారణసర్పములను, అజనయత్ = కనెను.

తా. రామా ! రోహిణికి గోవులు, గంధర్వికి అశ్వములు, సురసకు అనేక శిరస్సులు గల నాగములు, కద్రుకు సాధారణసర్పములు సంతానముగ పుట్టెను.

మూ. మనుర్మనుష్యాన్ జనయద్రామ పుత్రాన్ యశస్వినః,
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాంశ్చ మనుజర్షభ.

ప్ర. అ. మనుజర్షభ=మనుష్యులలో శ్రేష్ఠుడవైన, రామ=రామా ! మనుః =మనువు, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, క్షత్రియాన్ = క్షత్రియులను, వైశ్యాన్=వైశ్యులను, శూద్రాంశ్చ = శూద్రులను, యశస్వినః=కీర్తిగల, మనుష్యాన్ = ఈ మనుష్యులను, పుత్రాన్=పుత్రులనుగా, అజనయత్=కనెను.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడవైన రామా ! మనువు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను కీర్తిమంతులైన మనుష్యులను పుత్రులనుగా కనెను. 29

మూ. సర్వాన్ పుణ్యఫలాన్ వృక్షాననలాపి వ్యజాయత,
వినతా చ శుకీపౌత్రీ కద్రూశ్చ సురసాస్వసా. 30

ప్ర. అ. అనలాపి = అనల, పుణ్యఫలాన్ = మంచి ఫలములు గల, సర్వాన్ = సమస్తమైన, వృక్షాన్ = వృక్షములను, వ్యజాయత = కనెను. వినతా చ=వినత, శుకీపౌత్రీ=శుకికి పౌత్రి (ఇక్కడ దౌహిత్రి అని అర్థము). కద్రూశ్చ =కద్రువు, సురసాస్వసా = సురస సోదరి.

తా. అనల మంచి ఫలముల నిచ్చు వృక్షములను అన్నింటిని కనెను. ఇపుడు శుకికి దౌహిత్రియైన వినతను గూర్చి, సురస సోదరి యైన కద్రువును గూర్చి చెప్పెదను.

మూ. కద్రూర్నాగం సహస్రాస్యం విజజ్ఞే ధరణీధరమ్,
ద్వౌ పుత్రౌ వినతాయాస్తు గరుడోఽరుణ ఏవ చ. 31

ప్ర. అ. కద్రూః = కద్రువ, సహస్రాస్యమ్ = వెయ్యి పడగలు గల, ధరణీధరమ్ = భూమిని మోయు, నాగమ్ = నాగమును, విజజ్ఞే = కనెను. వినతాయాస్తు=వినతకు, గరుడః = గరుడుడు, అరుణ ఏవ చ = అరుణుడు అను, ద్వౌ = ఇద్దరు, పుత్రౌ = పుత్రులు, (పుట్టిరి).

తా. కద్రువు భూమిని మోసే వేయి పడగలు గల నాగమును(ఆదిశేషుని) కనెను. వినతకు గరుడుడు, అరుణుడు అని ఇద్దరు పుత్రులు పుట్టిరి. 31

మూ. అస్మాజ్జాతోఽహ మరుణాత్సంపాతిస్తు మమాగ్రజః,
జటాయురితి మాం విద్ధి శ్యేనీపుత్రమరిందమ. 32

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడా ! అహమ్ = నేను, అస్మాత్ = ఈ, అరుణాత్ = అరుణునినుండి, జాతః = పుట్టితిని. సంపాతిః = సంపాతి, మమ = నాయొక్క, అగ్రజః = అన్న. శ్యేనీపుత్రమ్ = శ్యేనిపుత్రుడ నైన, మామ్ = నన్ను, జటాయురితి = జటాయువు అని, విద్ధి = తెలుసుకొనుము.

తా. శత్రుసంహారకుడవైన రామా ! నేను ఈ అరుణుని కుమారుడను. సంపాతి మా అన్నగారు. శ్యేని పుత్రుడనైన నా పేరు జటాయువు అని తెలిసికొనుము. 32

మూ. సోఽహం వాససహాయస్తే భవిష్యామి యదీచ్ఛసి,
ఇదం దుర్గం హి కాన్తారం మృగరాక్షససేవితమ్. 33
సీతాం చ తాత రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే.

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, ఇచ్ఛసి యది = నీవు కోరినట్లయితే, తే = నీకు, వాససహాయః = నివాసమునందు సహాయుడనుగా, భవిష్యామి = కాగలను. దుర్గమ్ = ప్రవేశింప శక్యము కాని, ఇదం కాన్తారమ్ = ఈ అరణ్యము, మృగరాక్షస సేవితమ్ = మృగములచేతను, రాక్షసులచేతను సేవింపబడినది కదా. తాత = తండ్రీ ! సలక్ష్మణే = లక్ష్మణునితో కూడిన, త్వయి = నీవు, యాతే = వెళ్ళినవాడ వగుచుండగా, సీతామ్ = సీతను, రక్షిష్యే = రక్షించగలను.

తా. నీ కిష్ట మైనచో నేను నీకు వనవాసమునందు సహాయుడుగా ఉండెదను. ఎందుచేత ననగా- ప్రవేశింప శక్యము కాని ఈ అరణ్యము మృగములకు, రాక్షసులకు నివాసస్థానము. తండ్రీ ! నీవు, లక్ష్మణుడూ కూడ బైటకు వెళ్ళినప్పుడు నేను సీతను రక్షించుచుందును. 33

మూ. జటాయుషం తం ప్రతిపూజ్య రాఘవో
ముదా పరిష్వజ్య చ సంనతోఽభవత్,
పితుర్హి శుశ్రావ సఖిత్వమాత్మవాన్
జటాయుషా సంకథితం పునః పునః. 34

ప్ర. అ. రాఘవః = రాముడు, తం జటాయుషమ్ = ఆ జటాయువును, ప్రతిపూజ్య=పూజించి, ముదా=సంతోషముతో, పరిష్వజ్య చ = కౌగలించుకొని, సంనతః = నమస్కరించువాడు, అభవత్ = ఆయెను. ఆత్మవాన్ = బుద్ధిశాలియైన ఆ రాముడు, జటాయుషా = జటాయువుచేత, పునః పునః = మాటిమాటికి, సంకథితమ్ = చెప్పబడిన, పితుః = తండ్రియొక్క, సఖిత్వమ్=మిత్రత్వమును, శుశ్రావ = వినెను.

తా. రాముడు ఆ జటాయువును పూజించి, సంతోషముతో కౌగలించుకొని నమస్కరించెను. బుద్ధిశాలియైన ఆ రాముడు జటాయువునకు, తన తండ్రికి ఉన్న స్నేహమును గూర్చి ఆతడు మాటిమాటికి చెప్పగా వినెను. 34

మూ. స తత్ర సీతాం పరిదాయ మైథిలీం
సహైవ తేనాతిబలేన పక్షిణా,
జగామ తాం పఞ్చవటీం సలక్ష్మణో
రిపూన్ దిధక్షన్ శలభానివానలః. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే చతుర్దశః సర్గః.

ప్ర. అ. సః = ఆ రాముడు, మైథిలీమ్ = మిథిలారాజపుత్రియైన, సీతామ్ సీతను, పరిదాయ = గ్రహించి, సలక్ష్మణః = లక్ష్మణసమేతుడై, అతిబలేన = గొప్ప బలము గల, తేన = ఆ, పక్షిణా సహైవ = పక్షితో కూడినవాడై, అనలః = అగ్ని, శలభానివ = మిడతలను వలె, రిపూన్ = శత్రువులను, దిధక్షన్ = కాల్చదలచినవాడై, తాం పఞ్చవటీమ్=ఆ పంచవటిని గూర్చి, జగామ=వెళ్ళెను.

తా. ఆ రాముడు, అగ్ని మిడతలను కాల్చినట్లు శత్రువులను కాల్చివేయ గోరుచున్నవాడై, సీతను వెంటబెట్టుకొని, లక్ష్మణసమేతుడై, ఆ జటాయువుకూడ వెంట రాగా, పంచవటికి వెళ్లెను. 35

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పదునాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చదశః సర్గః

[శ్రీరాముని ఆజ్ఞ ప్రకారము లక్ష్మణుడు పంచవటిలో ఒక సుందర మైన పర్ణశాలను నిర్మించుట. సీతాలక్ష్మణులతో రాముడు ఆ పర్ణశాలలో నివసించుట].

మూ. తతః పఞ్చవటీం గత్వా నానావ్యాళమృగాయుతామ్,
ఉవాచ భ్రాతరం రామః సౌమిత్రిం దీప్తతేజసమ్.. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, నానావ్యాళమృగాయుతామ్ = అనేకవిధములైన దుష్టసర్పములతోను, మృగములతోను కూడిన, పఞ్చవటీమ్ = పంచవటిని గూర్చి, గత్వా = వెళ్ళి, దీప్తతేజసమ్ = ప్రజ్వలించు చున్న తేజస్సు గల, భ్రాతరమ్ = సోదరుడైన, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట రాముడు అనేకవిధములైన దుష్టసర్పములతోను (లేదా మదించిన ఏనుగులతోను) ఇతర మృగములతోను వ్యాప్తమైన, పంచవటి చేరి, తేజస్సుతో ప్రకాశించుచున్న, సోదరుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 1

మూ. ఆగతాః స్మ యథోద్దిష్టమముం దేశం మహర్షిణా,
అయం పఞ్చవటీదేశః సౌమ్య పుష్పితకాననః. 2

ప్ర. అ. సౌమ్య = ఓ! సౌమ్యుడా! మహర్షిణా = మహర్షిచేత, యథోద్దిష్టమ్ = చెప్పబడిన విధముగ, అముమ్ = ఈ, దేశమ్ = ప్రదేశమును గూర్చి, ఆగతాః స్మ = వచ్చినాము. పుష్పితకాననః = పుష్పించిన అడవి గల, అయమ్ = ఈ, దేశః = ప్రదేశమే, పఞ్చవటీ = పంచవటి.

తా. ఓ! సౌమ్యుడా! అగస్త్యమహర్షి చెప్పిన ప్రదేశమునకు వచ్చినాము, ఇక్కడ అరణ్యము అంతా పుష్పించి ఉన్నది. ఈ ప్రదేశమే పంచవటి. 2

మూ. సర్వతశ్చార్యతాం దృష్టిః కాననే నిపుణో హ్యసి,
ఆశ్రమః కతరస్మిన్నో దేశే భవతి సంమతః. 3

ప్ర. అ. కతరస్మిన్ = ఏ, దేశే = ప్రదేశమునందు, నః = మనయొక్క, ఆశ్రమః = ఆశ్రమము, సంమతః = ఇష్టము, భవతి = అగునో, కాననే = అడవియందు, సర్వతః = అంతటా, దృష్టిః = దృష్టి, చార్యతామ్ = ప్రసరింపచేయబడుగాక. నిపుణః = నేర్పరివి, అసి హి = అయి ఉన్నావు కదా.

తా. మనము ఏ ప్రదేశమునందు ఆశ్రమము నిర్మించుకొన్న బాగుండునో ఈ అరణ్యము నంతా పరికించుము. నీ వీ కార్యమునందు నేర్పు గలవాడవు కదా.

మూ. రమతే యత్ర వైదేహీ త్వమహం చైవ లక్ష్మణ,
తాదృశో దృశ్యతాం దేశః సంనికృష్టజలాశయః. 4

వనరామణ్యకం యత్ర స్థలరామణ్యకం తథా,
సంనికృష్టం చ యత్ర స్యాత్సమిత్పుష్పకుశోదకమ్. 5

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! యత్ర = ఎక్కడ, వైదేహీ = సీత, రమతే = క్రీడించునో, త్వమ్ = నీవు, అహం చ = నేనూ, క్రీడింతుమో, యత్ర = ఎక్కడ, వనరామణ్యకమ్ = వనముయొక్క సౌందర్యము, తథా = మరియు, స్థలరామణ్యకమ్ = స్థలముయొక్క సౌందర్యము ఉండునో, యత్ర = ఎక్కడ, సమిత్పుష్పకుశోదకమ్ = సమిధలు, పుష్పములు, కుశలు, ఉదకము, సంనికృష్టమ్ = సమీపమునం దుండునో, తాదృశః = అట్టి, సంనికృష్టజలాశయః = సమీపమునందున్న జలస్థానము గల, దేశః = ప్రదేశము, దృశ్యతామ్ = చూడబడుగాక.

తా. లక్ష్మణా! ఏ ప్రదేశమునందు సీత, నీవు నేను సుఖముగా నివసించగలుగుదుమో, ఏ ప్రదేశమునందు వనసౌందర్యము, స్థలసౌందర్యము ఉండునో, ఏ ప్రదేశమునందు సమిధలు, పుష్పములు, కుశలు, ఉదకము దగ్గరగా ఉండునో, అట్టి, జలాశయమునకు దగ్గరగా ఉండు ప్రదేశమును చూడుము. 4,5

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః సంయతాఞ్జలిః,
సీతాసమక్షం కాకుత్స్థమిదం వచనమబ్రవీత్. 6

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లక్ష్మణః = లక్ష్మణుడు, సంయతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, సీతా సమక్షమ్ = సీత ఎదుట, కాకుత్థ్సమ్ = రాముణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముని మాటలు విని లక్ష్మణుడు అంజలి ఘటించి, సీత సమక్షమున రామునితో ఇట్లు పలికెను. 6

మూ. పరవానస్మి కాకుత్థ్స త్వయి వర్షశతం స్థితే,
స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద. 7

ప్ర. అ. కాకుత్థ్స = రామా! త్వయి = నీవు, వర్షశతమ్ = నూరు (అనేక) సంవత్సరములు, స్థితే = ఉండగా, పరవాన్ = పరతంత్రుడను, అస్మి = అయిఉన్నాను. రుచిరే = అందమైన, దేశే = ప్రదేశమునందు, క్రియతామ్ = చేయబడుగాక, ఇతి = అని, మామ్ = నన్ను, వద = చెప్పుము.

తా. రామా! నీవు ఎన్ని సంవత్సరము లున్నను, నీవున్నంత కాలము నేను నీవు చెప్పినట్లు చేయవలసినవాడనే కాని స్వతంత్రుడను కాను. అందుచే నీవే ఒక రమ్యప్రదేశమును నిర్ణయించి అక్కడ ఆశ్రమము నిర్మించు మని నన్ను ఆజ్ఞాపించుము. 7

మూ. సుప్రీతస్తేన వాక్యేన లక్ష్మణస్య మహాత్మనః,
విమృశన్రోచయామాస దేశం సర్వగుణాన్వితమ్. 8

ప్ర. అ. మహాత్మనః = గొప్ప బుద్ధి గల, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, తేన వాక్యేన = ఆ వాక్యముచేత, సుప్రీతః = చాల సంతోషించినవాడై, (రాముడు) విమృశన్ = విమర్శించుచు, సర్వగుణాన్వితమ్ = సమస్తగుణములతో కూడిన, దేశమ్ = ప్రదేశమును, రోచయామాస = ఇష్టపడెను.

తా. రాముడు, మహాత్ముడైన లక్ష్మణుడు పలికిన ఆ మాటలకు సంతోషించి, బాగుగా విమర్శ చేసి, సకలగుణములతో కూడిన ఒక ప్రదేశమును ఎన్నుకొనెను. 8

మూ. స తం రుచిరమాక్రమ్య దేశమాశ్రమకర్మణి,
హస్తే గృహీత్వా హస్తేన రామః సౌమిత్రిమబ్రవీత్. 9

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, తమ్ = ఆ, రుచిరమ్ = సుందరమైన, దేశమ్ = ప్రదేశమును, ఆశ్రమకర్మణి = ఆశ్రమకర్మయందు, (ఆశ్రమము నిమిత్తము), ఆక్రమ్య = ఆక్రమించి, హస్తేన = హస్తముతో, సౌమిత్రిమ్ = లక్ష్మణుని, హస్తే = హస్తమునందు, గృహీత్వా = పట్టుకొని, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాముడు, రమ్యమైన ఆ ప్రదేశము ఆశ్రమమునకై ఉపయుక్తమని చెప్పుచు దానిపై నడచి వెళ్ళుచు, లక్ష్మణుని హస్తమును హస్తముతో గ్రహించి ఇట్లు పలికెను. 9

మూ. అయం దేశః సమః శ్రీమాన్ పుష్పితైస్తరుభిర్వృతః,
ఇహాశ్రమపదం సౌమ్య యథావత్కర్తుమర్హసి. 10

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! పుష్పితైః = పుష్పించిన, తరుభిః = వృక్షములతో, వృతః = కూడిన, అయం దేశః = ఈ ప్రదేశము, సమః = సమముగా ఉన్నది. శ్రీమాన్ = శోభాయుక్తమైనది. ఇహ = ఇక్కడ, యథావత్ = యథాశాస్త్రముగ, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, కర్తుమ్ = నిర్మించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. సౌమ్యుడవైన ఓ! లక్ష్మణా ! చుట్టూ పుష్పించిన వృక్షము లున్న, శోభాయుక్తమైన ఈ ప్రదేశము సమముగా ఎత్తుపల్లములు లేకుండగా ఉన్నది. ఇక్కడ యథావిధిగ పర్ణశాలను నిర్మింపుము. 10

మూ. ఇయమాదిత్యసంకాశైః పద్మైః సురభిగన్ధిభిః,
అదూరే దృశ్యతే రమ్యా పద్మినీ పద్మశోభితా. 11

ప్ర. అ. పద్మశోభితా = పద్మములచేత శోభింపచేయబడిన, రమ్యా = రమ్యమైన, ఇయం పద్మినీ = ఈ పద్మసరస్సు, ఆదిత్యసంకాశైః = సూర్యునితో సమానమైన, సురభిగన్ధిభిః = మంచి గంధము గల, పద్మైః = పద్మములతో, అదూరే = సమీపమునందు, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. పద్మములతో శోభించుచున్న రమ్య మైన ఈ పద్మసరస్సు, సూర్యుని వంటి సుగంధయుక్తములైన పద్మములతో సమీపమునందే కనబడుచున్నది. 11

మూ. యథాఖ్యాతమగస్త్యేన మునినా భావితాత్మనా,
ఇయం గోదావరీ రమ్యా పుష్పితైస్తరుభిర్వృతా. 12
హంసకారణ్డవాకీర్ణా చక్రవాకోపశోభితా.

ప్ర. అ. భావితాత్మనా = పరిశుద్ధ మైన మనస్సు గల, అగస్త్యేన మునినా = అగస్త్యమునిచేత, యథా = ఎట్లు, ఆఖ్యాతమ్ = చెప్పబడినదో అట్లే, రమ్యా = సుందరమూ, పుష్పితైః = పుష్పించిన, తరుభిః = వృక్షములతో, వృతా = కూడినదీ, హంసకారణ్డవాకీర్ణా = హంసలచేతను కారండవపక్షులచేతను వ్యాప్తమూ, చక్రవాకోపశోభితా = చక్రవాకపక్షులచేత శోభింపచేయబడినది అయిన, ఇయం గోదావరీ = ఈ గోదావరీనది, చూడబడుచున్నది.

తా. పరిశుద్ధమైన మనస్సు గల అగస్త్యమహాముని చెప్పిన విధముగ, పుష్పించిన వృక్షములచేత ఆవరింపబడినదీ, హంసకారండవపక్షులచే వ్యాప్తమైనదీ, చక్రవాక పక్షులచేత ప్రకాశింపచేయబడినదీ అయిన, రమ్యమైన ఈ గోదావరినది కూడ కనబడుచున్నది.

మూ. నాతిదూరే న చాసన్నే మృగయూథనిపీడితాః, 13
మయూరనాదితా రమ్యాః ప్రాంశవో బహుకన్దరాః,
దృశ్యన్తే గిరయః సౌమ్య ఫుల్లైస్తరుభిరావృతాః. 14

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మృగయూథనిపీడితాః = మృగముల గుంపులచేత పీడింపబడినవి, మయూరనాదితాః = నెమళ్ళచేత ధ్వనిచేయింపబడినవి, రమ్యాః = సుందరమైనవీ, ప్రాంశవః = ఎత్తైనవి, బహుకన్దరాః = చాలా గుహలు కలవీ, ఫుల్లైః = వికసించిన, తరుభిః = వృక్షములచేత, ఆవృతాః = ఆవరింపబడినవి అయిన, గిరయః = పర్వతములు, నాతిదూరే = చాలదూరమునందు కాక, న చ ఆసన్నే = చాల దగ్గర కాక, దృశ్యన్తే = కనబడుచున్నవి.

తా. సౌమ్యుడా ! మృగముల గుంపులతో నిండిన రమ్యములైన పర్వతములు కనబడుచున్నవి. అవి చాల దూరమునందు గాని, దగ్గరకాని లేవు. నెమళ్ల

ధ్వనులచేత ప్రతిధ్వనించుచున్నవి. ఇవి చాల ఎత్తుగా ఉన్నవి. వాటిలో అనేకము లైన గుహ లున్నవి. వాటికి నలువైపులా వికసించిన వృక్షములు ఉన్నవి.13. 14

మూ. సౌవర్ణై రాజతైస్తామ్రైర్దేశే దేశే చ ధాతుభిః,
గవాక్షితా ఇవాభాన్తి గజాః పరమభక్తిభిః. 15

("పరమ భిత్తిభిః"అను వావిళ్ళవారి ప్రతిలోని పాఠము, తద్వ్యాఖ్యానము కూడ సంతృప్తికరంగా లేవు.)

ప్ర. అ. సౌవర్ణైః = బంగారువికారములు, రాజతైః = రజతవికారములు, తామ్రైః = రాగి వికారములు అయిన, ధాతుభిః = ధాతువులచేత, దేశే దేశే = ఆ యా ప్రదేశములందు, గవాక్షితాః = గవాక్షములు కలవిగా చేయబడిన ఈ పర్వతములు, పరమభక్తిభిః = మంచి వర్ణరచనలచేత, గజాః ఇవ = ఏనుగుల వలె, భాన్తి = ప్రకాశించుచున్నవి.

తా. ఈ పర్వతములు అన్ని ప్రదేశములందు, బంగారు ధాతువులచేతను, వెండి ధాతువులచేతను, రాగి ధాతువులచేతను గవాక్షితములై, అందమైన వర్ణ రచనలచేత ఏనుగులు వలె ప్రకాశించుచున్నవి.

వి. గవాక్ష మనగా ఆవు కన్నుల ఆకారములో ఉన్న రంధ్రాలు గల కిటికీ. పర్వతాలమీద అనేక ప్రదేశములలో బంగారు ధాతువుల రేఖలు, వెండి ధాతువుల రేఖలు, రాగి ధాతువుల రేఖలు గవాక్షముల ఆకారములలో కనబడు చున్నవి. ఏనుగులకు అలంకారార్థమై వాటి శరీరములమీద ఆ యా రంగుల గీతలు తీర్చి గీయుదురు. దానికి "భక్తి"అని పేరు. అందుచేత ఈ విధము సువర్ణాది ధాతువులచేత గవాక్షితము లైన కొండలు, భక్తులచే అలంకరించిన ఏనుగుల వలె ఉన్నట్లు మహారాజాధిరాజైన రామునకు కనబడుట సహజము. 15

మూ. సాలైస్తాలైస్తమాలైశ్చ ఖర్జూరపనసామ్రకైః,
నివారైస్తిమిశైశ్చైవ పున్నాగైశ్చోపశోభితాః, 16

చూతైరశోకైస్తిలకైశ్చమ్పకైః కేతకైరపి,
పుష్పగుల్మలతోపేతైస్తైస్తైస్తరుభిరావృతాః, 17

చన్దనైః స్పన్దనైర్నీపైః పార్ణాసైర్లికుచైరపి,
ధవాశ్వకర్ణఖదిరైః శమీకింశుకపాటలైః. 18

ప్ర. అ. (ఈ పర్వతములు), సాలైః = మద్దిచెట్లచేతను, తాలైః = తాటిచెట్లచేతను, తమాలైశ్చ = తమాలవృక్షములచేతను, ఖర్జూరపనసామ్రకైః = ఖర్జూర-పనస-ఆమ్ర (మామిడి) వృక్షములచేతను, నివారైః = జలకంబ వృక్షములచేతను, తిమిశైశ్చైవ = నేమివృక్షములచేతను, పున్నాగైః = పున్నాగవృక్షములచేతను, ఉపశోభితాః = ప్రకాశింపచేయబడినవి. చూతైః = తియ్యమామిడిచెట్లచేత, అశోకైః = అశోకములచేత, తిలకైః = తిలకములచేత, చమ్పకైః = సంపెంగచెట్లచేత, కేతకైః = మొగలిచెట్లచేత, పుష్పగుల్మలతోపేతైః = పుష్పములతోను ,పొదలతోను, లతలతోను కూడిన, తైస్తైః = ఆ యా, తరుభిః = వృక్షములచేత, ఆవృతాః = ఆవరింపబడినవి. చన్దనైః = చందనవృక్షములచేత, స్పన్దనైః = స్పందనములచేత, నీపైః = నీపవృక్షములచేత, పార్ణాసైః = పార్ణాస వృక్షములచేత, లికుచైరపి = నిమ్మచెట్లచేత, ధవాశ్వకర్ణఖదిరైః = ఉమ్మెత-ఇనుమద్ది-చంద్రచెట్లచేత, శమీకింశుకపాటలైః = జమ్మిచెట్లచేత, మోదుగచెట్లచేత, గలిగొట్టుచెట్లచేత ఆవృతములై ఉన్నవి.

తా. ఈ పర్వతములు సాల-తాల-తమాల-పనస-ఆమ్ర-నివార-తిమిశ-పున్నాగ వృక్షములతో ప్రకాశించుచున్నవి. చూత-అశోక-తిలక-చంపక-కేతక వృక్షములచేతను, పువ్వులతో నిండిన పొదలు, లతలు చుట్టుకొన్న ఇతరవృక్షములచేతను ఆవరింపబడి యున్నవి. చందన-స్పందన-నీప-పార్ణాస-లికుచ-ధవ-అశ్వకర్ణ-ఖదిర-శమీ - కింశుక - పాటలవృక్షములచేత కూడ ఆవరింపబడి ఉన్నవి. 16-18

మూ. ఇదం పుణ్యమిదం మేధ్యమిదం బహుమృగద్విజమ్,
ఇహ వత్స్యామి సౌమిత్రే సార్ధమేతేన పక్షిణా. 19

ప్ర. అ. ఇదమ్ = ఇది, పుణ్యమ్ = పుణ్యమైనది. ఇదమ్ = ఇది, మేధ్యమ్ = పవిత్రమైనది. ఇదమ్ = ఇది, బహుమృగద్విజమ్ = అనేకమైన మృగములు పక్షులు కలది. ఏతేన = ఈ, పక్షిణా సార్ధమ్ = పక్షితో కూడ, ఇహ = ఇక్కడ, వత్స్యామి = నివసించెదను.

తా. లక్ష్మణా! ఇది పుణ్యమైనది; పవిత్రమైనది, అనేకమృగపక్షులతో నిండి యున్నది. అందుచేత ఈ జటాయువుతో కూడ ఇక్కడ నివసించెదను.

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా,
అచిరేణాశ్రమం భ్రాతుశ్చకార సుమహాబలః. 20

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, పరవీరహా = శత్రువీరులను సంహరించు, సుమహాబలః = చాల గొప్ప బలము గల, లక్ష్మణుడు, భ్రాతుః = సోదరునకు, అచిరేణ = అల్పకాలముచేత (లో), ఆశ్రమమ్ = ఆశ్రమమును, చకార = నిర్మించెను.

తా. శత్రువీరులను సంహరించేవాడు, మహాబలశాలీ అయిన లక్ష్మణుడు రాముని మాటలు విని, ఆతనికొరకై అతిశీఘ్రముగ ఒక ఆశ్రమమును నిర్మించెను.

మూ. పర్ణశాలాం సువిపులాం తత్ర సంఘాతమృత్తికామ్,
సుస్తమ్భాం మస్కరైర్దీర్ఘైః కృతవంశాం సుశోభనామ్,

శమీశాఖాభిరాస్తీర్య దృఢపాశావపాశితామ్,
కుశకాశశరైః పర్ణైః సుపరిచ్ఛాదితాం తథా, 22

సమీకృతతలాం రమ్యాం చకార లఘువిక్రమః,
నివాసం రాఘవస్యార్థే ప్రేక్షణీయమనుత్తమమ్. 23

ప్ర. అ. లఘువిక్రమః = శీఘ్రమైన పరాక్రమము గల ఆ లక్ష్మణుడు, తత్ర = అక్కడ, సంఘాతమృత్తికామ్ = ఎత్తుగా చేయబడిన మట్టి గలది, సుస్తమ్భామ్ = మంచి స్తంభములు గలది, దీర్ఘైః = పొడవైన, మస్కరైః = వెదుళ్ళ చేత, కృతవంశామ్ = చేయబడిన వెన్ను దూలము గలదీ, సుశోభనామ్ = బాగుగా ప్రకాశించునదీ, శమీశాఖాభిః = జమ్మికొమ్మలచేత, ఆస్తీర్య = పరచి, దృఢపాశావపాశితామ్ = దృఢమైన త్రాళ్లచేత కట్టబడినదీ, తథా = మరియు కుశకాశశరైః=దర్భలచేత, రెల్లుగడ్డిచేత, పర్ణైః=ఆకులచేత, సుపరిచ్ఛాదితామ్ బాగుగా కప్పబడినదీ, సమీకృతతలామ్ = సమముచేయబడిన తలముగలది రమ్యామ్ = రమ్యమూ, సువిపులామ్ = చాలవిశాలమూ అయిన, పర్ణశాలామ్ =

పర్ణశాలను, రాఘవస్యార్థే = రామునికొరకై, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, ప్రేక్షణీయమ్ = చూడ ముచ్చట గొల్పు, నివాసమ్ = నివాసమునుగా, చకార = చేసెను.

తా. శీఘ్రమైన పరాక్రమము గల ఆ లక్ష్మణుడు, మట్టిని ఎత్తుగా చేసెను. మంచి స్తంభముల నిలిపెను. పొడవైన వెదుళ్లతో వెనుబద్ద ఏర్పాటు చేసెను. జమ్మికొమ్మలు పరచి దృఢమైన పాశములతో వాటిని కట్టి, దానిపై దర్భలు, రెల్లుగడ్డి, ఆకులు కప్పెను. నేలను సమము చేసెను. ఈ విధముగ విశాలముగాను, అందముగాను, చూడ ముచ్చట గొల్పునట్లుగాను ఉన్న పర్ణశాలను రాముని నివాసము కొరకై నిర్మించెను. 21-23

మూ. సహసా లక్ష్మణః శ్రీమాన్ నదీం గోదావరీం తదా,
స్నాత్వా పద్మాని చాదాయ సఫలః పునరాగతః. 24

ప్ర. అ. తదా = అప్పుడు, శ్రీమాన్ = శోభాయుక్తుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, సహసా = శీఘ్రముగా, గోదావరీం నదీమ్ = గోదావరి నదినిగూర్చి వెళ్ళి, స్నాత్వా = స్నానము చేసి, పద్మాని చ = పద్మములను, ఆదాయ = గ్రహించి, సఫలః = ఫలములతో కూడినవాడై, పునః = మరల, ఆగతః = వచ్చెను.

తా. శోభాసంపన్నుడైన ఆ లక్ష్మణుడు అప్పుడు గోదావరీనదికి వెళ్ళి, స్నానము చేసి, కొన్ని పద్మములు తీసికొని ఫలములు గూడ పట్టుకొని తిరిగి వచ్చెను. 24

మూ. తతః పుష్పబలిం కృత్వా శాన్తిం చ స యథావిధి,
దర్శయామాస రామాయ తదాశ్రమపదం కృతమ్. 25

ప్ర. అ తతః = అటు పిమ్మట, సః = అతడు, పుష్పబలిమ్ = పుష్పపూజను, కృత్వా = చేసి, యథావిధి = యథాశాస్త్రముగా, శాన్తిం చ = శాంతిని కూడ చేసి, కృతమ్ = నిర్మింపబడిన, తత్ = ఆ, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమును, రామాయ = రామునకు, దర్శయామాస = చూపెను.

తా. లక్ష్మణుడు, పిమ్మట, పుష్పములతో దేవతాపూజ చేసి, యథాశాస్త్రముగా శాంతికూడ చేసి, ఆశ్రమస్థానము సిద్ధమైనదని చెప్పి రామునకు చూపెను.

మూ. స తం దృష్ట్వా కృతం సౌమ్యమాశ్రమం సీతయా సహ,
రాఘవః పర్ణశాలాయాం హర్షమాహారయద్భృశమ్. 26

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, సీతయా సహ = సీతతో కూడ, తమ్ = ఆ, కృతమ్ = నిర్మింపబడిన, సౌమ్యమ్ = సుందరమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, సీతయా సహ = సీతతో కూడ, దృష్ట్వా = చూచి, పర్ణశాలాయామ్ = పర్ణశాలయందు, భృశమ్ = మిక్కిలి, హర్షమ్ = సంతోషమును, ఆహారయత్ = పొందెను.

తా. రాముడు సీతాసమేతుడై, లక్ష్మణుడు నిర్మించిన ఆ సుందరమైన ఆశ్రమమును చూచి, ఆ పర్ణశాలయందు చాల సంతోషమును పొందెను. 26

మూ. సుసంహృష్టః పరిష్వజ్య బాహుభ్యాం లక్ష్మణం తదా,
అతిస్నిగ్ధం చ గాఢం చ వచనం చేదమబ్రవీత్. 27

ప్ర. అ. తదా = అప్పుడు, సుసంహృష్టః = చాల సంతోషించినవాడై, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, బాహుభ్యామ్ = బాహువులతో, గాఢమ్ = గాఢముగా, పరిష్వజ్య = కౌగలించుకొని, అతిస్నిగ్ధమ్ = చాల స్నేహముతో కూడిన, ఇదమ్ ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు రాముడు చాల సంతోషించి, బాహువులతో లక్ష్మణుని గాఢముగా కౌగలించుకొని, చాల స్నేహయుక్తమైన ఈ వచనమును పలికెను.

మూ. ప్రీతోఽస్మి తే మహత్కర్మ త్వయా కృతమిదం ప్రభో,
ప్రదేయో యన్నిమిత్తం తే పరిష్వఙ్గో మయా కృతః. 28

ప్ర. అ. ప్రభో = సమర్థుడవైన లక్ష్మణా! త్వయా = నీచేత, మహత్ = గొప్పదైన, కర్మ = పని, కృతమ్ = చేయబడినది. తే = నీ విషయమునందు, ప్రీతః అస్మి = సంతోషించినాను. యన్నిమిత్తమ్ = దేని నిమిత్తమై, తే = నీకు, ప్రదేయః = ఇవ్వదగిన, పరిష్వఙ్గః = ఆలింగనము, మయా = నాచేత, కృతః = చేయబడినదో.

తా. లక్ష్మణా! నీవు సర్వసమర్థుడవు. నీవు చాల గొప్ప పని చేసితివి. నీ

విషయమున సంతోషించినాను. అందుచేతనే నీకు పారితోషికముగా ఇవ్వదగిన ఈ ఆలింగనమును నీ కిచ్చుచున్నాను. 28

మూ. భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ,
త్వయా నాథేన ధర్మాత్మా న సంవృత్తః పితా మమ. 29

ప్ర. అ. భావజ్ఞేన=భావమును ఎరిగినవాడవు, కృతజ్ఞేన = కార్యము తెలిసిన వాడవు, ధర్మజ్ఞేన చ=ధర్మములు తెలిసినవాడవు అయిన, నాథేన = రక్షకుడ వైన, త్వయా = నీచేత, మమ = నాయొక్క, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, పితా=తండ్రి, న సంవృత్తః=మరణించలేదు.

తా. లక్ష్మణా! నీవు ఇతరుల భావము తెలిసికొనగలవాడవు, చేయదగిన కార్యములు తెలిసినవాడవు, ధర్మములు తెలిసినవాడవు, అట్టి నీవు నాకు రక్షకుడవుగా ఉండుటచే, ధర్మాత్ముడైన నా తండ్రి మరణించనట్లే. 29

మూ. ఏవం లక్ష్మణముక్త్వా తు రాఘవో లక్ష్మివర్ధనః,
తస్మిన్ దేశే బహుఫలే న్యవసత్ సుసుఖం వశీ. 30

ప్ర. అ. లక్ష్మివర్ధనః = ఐశ్వర్యమును వృద్ధి పొందించువాడు, వశీ = ఇంద్రియనిగ్రహవంతుడు అయిన, రాఘవః=రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, బహుఫలే = అనేక ఫలములు గల, తస్మిన్ దేశే = ఆ దేశమునందు, సుసుఖమ్ = చాల సుఖముగా, న్యవసత్ = నివసించెను.

తా. లక్ష్మిని వృద్ధి పొందించువాడు, ఇంద్రియనిగ్రహవంతుడు అయిన రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికి, అనేక ఫలములు గల ప్రదేశమునందు చాల సుఖముగ నివసించెను. 30

మూ. కంచిత్కాలం స ధర్మాత్మా సీతయా లక్ష్మణేన చ,
అన్వాస్యమానో న్యవసత్స్వర్గలోకే యథామరః. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చదశః సర్గః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆ రాముడు, సీతయా = సీతచేత, లక్ష్మణేన చ = లక్ష్మణునిచేత, అన్వాస్యమానః = సేవింపబడుచున్నవాడై, స్వర్గలోకే = స్వర్గలోకమునందు, అమరః యథా = దేవేంద్రుడు వలె, కంచిత్ కాలమ్ = కొంచెము కాలము, న్యవసత్ = నివసించెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఆ ఆశ్రమములో సీత, లక్ష్మణుడు సేవింపగా స్వర్గలోకములో దేవేంద్రుడు నివసించినట్లు కొంతకాలము నివసించెను. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పదునైదవ సర్గ సమాప్తము.

# అథ షోడశః సర్గః

[లక్ష్మణుడు హేమంతర్తువును వర్ణించుట, భరతుని ప్రశంసించుట, రాముడు సీతాలక్ష్మణసమేతుడై గోదావరిలో స్నానము చేయుట].

మూ. వసతస్తస్య తు సుఖం రాఘవస్య మహాత్మనః,
శరద్వ్యపాయే హేమన్తఋతురిష్టః ప్రవర్తత. 1

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాఘవస్య = ఆ రాముడు, సుఖమ్ = సుఖముగా, వసతః = నివసించుచుండగా, శరద్వ్యపాయే = శరత్కాలము గడచిన పిమ్మట, ఇష్టః = ఇష్టమైన, హేమన్తఋతుః = హేమంతఋతువు, ప్రవర్తత = ప్రారంభ మయ్యెను.

తా. మహాత్ముడైన ఆ రాముడు సుఖముగా నివసించుచుండగా, శరదృతువు గడచి, ఆనందకరమైన హేమంతఋతువు ప్రారంభ మయ్యెను. 1

మూ. స కదాచిత్ప్రభాతాయాం శర్వర్యాం రఘునన్దనః,
ప్రయయావభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీమ్. 2

ప్ర. అ. కదాచిత్ = ఒక రోజున, సః రఘునన్దనః = ఆ రాముడు, శర్వర్యామ్ = రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారిన దగుచుండగా, రమ్యామ్ = సుందరమైన, గోదావరీం నదీమ్ = గోదావరీనదిని గూర్చి, అభిషేకార్థమ్ = స్నానము కొరకు, ప్రయయౌ = వెళ్లెను.

తా. ఒకనాడు ఆ రాముడు రాత్రి గడచి తెల్లవారిన పిమ్మట స్నానము చేయుటకై సుందరమైన గోదావరీనదికి వెళ్లెను. 2

మూ. ప్రహ్వః కలశహస్తస్తం సీతయా సహ వీర్యవాన్,
పృష్ఠతోఽనువ్రజన్ భ్రాతా సౌమిత్రిరిదమబ్రవీత్. 3



ప్ర. అ. భ్రాతా =
= లక్ష్మణుడు, ప్రహ్వః =
కలవాడై, పృష్ఠతః = వెనుక
అనుసరించి వెళ్లుచు, ఇదమ్

తా. వీర్యవంతుడైన
వెళ్లిరి. లక్ష్మణుడు చేతిలో
వినయముతో (రామునితో)

మూ. అయం
అలంకృ

ప్ర. అ. ప్రియం
= నీకు, ప్రియః = ఇష్టమైన
= వచ్చినది. యేన = దేనిచే
రము, అలంకృతః ఇవ
చున్నదో.

తా. ప్రియముగా
ఏ కాలము మంగళకర మై
కాలము వచ్చినది.

మూ. నీహారప
జలాన్య

ప్ర. అ. లోకః =
రములు కలదై ఉన్నది.
చున్నది. జలాని = ఉదక
కాకుండా ఉన్నవి. హవ్య

తా. ప్రాణుల శరీ
ప్రకాశించుచున్నది. ఉ
సుఖకరముగా ఉన్నది.

ప్ర. అ. భ్రాతా=సోదరుడైన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సౌమిత్రిః =లక్ష్మణుడు, ప్రహ్వః= వినీతుడై, కలశహస్తః= కలశము హస్తమునందు కలవాడై, పృష్ఠతః= వెనుకనే, సీతయా సహ= సీతతో కూడ, అనువ్రజన్= అనుసరించి వెళ్లుచు, ఇదమ్= ఈ వాక్యము, అబ్రవీత్= పలికెను.

తా. వీర్యవంతుడైన సోదరుడు లక్ష్మణుడు, సీత ఆ రాముని అనుసరించి వెళ్ళిరి. లక్ష్మణుడు చేతిలో కలశమును తీసికొని వెళ్లెను. అప్పుడాతడు చాల వినయముతో (రామునితో) ఇట్లు పలికెను. 3

మూ. అయం స కాలః సంప్రాప్తః ప్రియో యస్తే ప్రియంవద,
అలంకృత ఇవాభాతి యేన సంవత్సరః శుభః. 4

ప్ర. అ. ప్రియంవద =ప్రియముగా మాటలాడేవాడా! యః=ఏది, తే =నీకు, ప్రియః=ఇష్టమైనదో, సః అయం కాలః=అట్టి ఈ కాలము, సంప్రాప్తః =వచ్చినది. యేన=దేనిచేత, శుభః=మంగళప్రదమైన, సంవత్సరః=సంవత్సరము, అలంకృతః ఇవ= అలంకరింపబడినది వలె, ఆభాతి = ప్రకాశించుచున్నదో.

తా. ప్రియముగా మాటలాడు రామా! ఏ కాలము నీకు చాల ఇష్టమైనదో, ఏ కాలము మంగళకరమైన సంవత్సరమును అలంకరించునట్లు ఉండునో అట్టి కాలము వచ్చినది. 4

మూ. నీహారపరుషో లోకః పృథివీ సస్యశాలినీ,
జలాన్యనుపభోగ్యాని సుభగో హవ్యవాహనః. 5

ప్ర. అ. లోకః = జనము, నీహారపరుషః= మంచుచేత బిరుసెక్కిన శరీరములు కలదై ఉన్నది. పృథివీ=భూమి, సస్యశాలినీ=సస్యములతో ప్రకాశించుచున్నది. జలాని= ఉదకములు, అనుపభోగ్యాని = అనుభవించుటకు శక్యము కాకుండా ఉన్నవి. హవ్యవాహనః= అగ్ని, సుభగః= మనోహరముగా ఉన్నది.

తా. ప్రాణుల శరీరాలు మంచుచేత బిరుసెక్కినవి. భూమి సస్యములతో ప్రకాశించుచున్నది. ఉదకములు స్నానాదులకు అనుకూలముగా లేవు. అగ్ని సుఖకరముగా ఉన్నది. 5

మూ. నవాగ్రయణపూజాభిరభ్యర్చ్య పితృదేవతాః,
కృతాగ్రయణకాః కాలే సన్తో విగతకల్మషాః. 6

ప్ర. అ. సన్తః = సత్పురుషులు, నవాగ్రయణపూజాభిః = (నూతన ధాన్యము భుజించుటకు ముందు చేయవలసిన) నూతనములైన ఆగ్రయణపూజల చేత, పితృదేవతాః= పితృదేవతలను, అభ్యర్చ్య= పూజించి, కాలే= తగిన కాలము నందు, కృతాగ్రయణాః = చేయబడిన ఆగ్రయణము కలవారై, విగతకల్మషాః = పోయిన పాపములు గలవారు.

తా. సత్పురుషులు నవాగ్రయణపూజలచేత, అనగా క్రొత్తధాన్యము తినుటకు ముందు చేయవలసిన ఆగ్రయణపూజలచేత, పితృదేవతలను పూజించి, ఆ విధముగ సకాలమున ఆగ్రయణము చేయుటచే పాపరహితులుగా ఉన్నారు. 6

మూ. ప్రాజ్యకామా జనపదాః సంపన్నతరగోరసాః,
విచరన్తి మహీపాలా యాత్రాస్థా విజిగీషవః. 7

ప్ర. అ. సంపన్నతరగోరసాః = చాల సమృద్ధముగా ఉన్న ఆవు పాడి గలవై, జనపదాః = పల్లెలు, ప్రాజ్యకామాః = అధికమైన (తీరిన) కోరిక కలవై ఉన్నవి. మహీపాలాః = రాజులు, విజిగీషవః = జయించ కోరుచున్నవారై, యాత్రాస్థాః = యాత్రలయందు ఉన్నవారై, విచరన్తి = సంచరించుచున్నారు.

తా. ఆవుల పాడి సమృద్ధముగా ఉండుటచేత పల్లెలు తీరిన కోరికలుకలవై సుఖముగా ఉన్నవి. రాజులు జయాభిలాషతో, యుద్ధయాత్రకు వెడలి సంచరించు చున్నారు. 7

మూ. సేవమానే దృఢం సూర్యే దిశమన్తకసేవితామ్,
విహీనతిలకేవ స్త్రీ నోత్తరా దిక్ ప్రకాశతే. 8

ప్ర. అ. సూర్యే = సూర్యుడు, అన్తకసేవితామ్ = యమునిచేత సేవింపబడిన, దిశమ్=దిక్కును, దృఢమ్=అధికముగా, సేవమానే= సేవించుచుండగా, ఉత్తరా దిక్ = ఉత్తరదిక్కు, విహీనతిలకా = తిలకములేని, స్త్రీవ = స్త్రీవలె, న ప్రకాశతే = ప్రకాశించుటలేదు.

తా. సూర్యుడు అంతకుడు సేవించు దిక్కును (దక్షిణదిక్కును)ఎక్కువగా సేవించుచుండుటచేత ఉత్తరదిక్కు తిలకములేని స్త్రీవలె ప్రకాశించుట లేదు. 8

మూ. ప్రకృత్యా హిమకోశాఢ్యో దూరసూర్యశ్చ సాంప్రతమ్,
యథార్థనామా సువ్యక్తం హిమవాన్ హిమవాన్ గిరిః. 9

ప్ర. అ. ప్రకృత్యా = స్వభావముచేత, హిమకోశాఢ్యః = హిమ (మంచు) సంపదతో నిండినదీ, సాంప్రతమ్ = ఇప్పుడు, దూరసూర్యశ్చ = దూరమైన సూర్యుడు కలదీ అయిన, హిమవాన్ గిరిః = హిమవత్పర్వతము, హిమవాన్ = మంచుకలదై, సువ్యక్తమ్ = స్పష్టముగా, యథార్థనామా = యథార్థమైన పేరు గలది.

తా. సహజముగానే సమృద్ధిగా మంచు కలదై, ఇప్పుడు సూర్యునకు దూరము కూడ అగుటచేత హిమవత్పర్వతము, అత్యధికమైన మంచుతో కప్పబడుటచే, దాని పేరు పూర్తిగా సార్థక మైనది. 9

మూ. అత్యన్తసుఖసంచారా మధ్యాహ్నే స్పర్శతః సుఖాః,
దివసాః సుభగాదిత్యాశ్ఛాయాసలిలదుర్భగాః. 10

ప్ర. అ. మధ్యాహ్నే = మధ్యాహ్నమునందు, స్పర్శతః = స్పర్శచేత, సుఖాః = సుఖకరములు, అత్యన్తసుఖసంచారాః = చాల సుఖముగా ఉన్న సంచారము కలవి అయిన, దివసాః = పగళ్లు, సుభగాదిత్యాః = సుఖకరమైన సూర్యుడు గలవి. ఛాయాసలిలదుర్భగాః = దుఃఖకరమైన నీడలు, నీళ్లు గలవి.

తా. పగళ్లు మధ్యాహ్నసమయమునందు సుఖస్పర్శ నిచ్చుచు, సంచరించుటకు సుఖకరముగా ఉన్నవి. సూర్యుడు సుఖకరముగాను, నీడలు, నీళ్ళు దుఃఖజనకములుగాను ఉన్నవి. 10

వి. ఇక్కడ ఉన్న ప్రాచ్యపాఠము బాగున్నది.

"ప్రత్యూషే దుఃఖసంచారా మధ్యాహ్నసమయే సుఖాః,
దివసాః సుభగాః పుణ్యాస్త్వరితా వ్యతియాన్తి నః."

"ఇప్పుడు పగటిభాగములలో ప్రాతఃకాలమునందు సంచారము దుఃఖకర

ముగా ఉన్నది. మధ్యాహ్నసమయమునందు సుఖకరముగా ఉన్నది. ఇట్టి పుణ్యమైన, అందమైన దివసములు, మనకు, శీఘ్రముగా గడచిపోవుచున్నవి" అని దీని భావము.

మూ. మృదుసూర్యాః సనీహారాః పటుశీతాః సమారుతాః,
శూన్యారణ్యా హిమధ్వస్తా దివసా భాన్తి సామ్ప్రతమ్. 11

ప్ర. అ. సామ్ప్రతమ్ = ఇప్పుడు, హిమధ్వస్తాః = మంచుచేత పీడింపబడిన, దివసాః = పగటిభాగములు, మృదుసూర్యాః = మృదువైన (తీవ్రముగా లేని) సూర్యుడు గలవై, సనీహారాః = మంచుతో కూడినవై, పటుశీతాః = సమర్థమైన చలిగలవై, సమారుతాః = వాయువుతో కూడినవై, శూన్యారణ్యాః = శూన్యమైన అరణ్యములు గలవై, భాన్తి = ప్రకాశించుచున్నవి.

తా. ఇప్పుడు మంచుచేత పీడింపబడిన పగటిభాగములలో సూర్యుడు తీక్ష్ణముగా లేడు. పొగమంచు కప్పి ఉన్నది. చలి అధికముగా ఉన్నది. గాలి అధికముగా వీచుచున్నది. అరణ్యము లన్నీ జంతుసంచారశూన్యములై ఉన్నవి.

మూ. నివృత్తాకాశశయనాః పుష్యనీతా హిమారుణాః,
శీతా వృద్ధతరాయామాస్త్రియామా యాన్తి సామ్ప్రతమ్.

ప్ర. అ. సామ్ప్రతమ్ = ఇప్పుడు, నివృత్తాకాశశయనాః = నివర్తించిన ఆకాశశయనము (బైట పండుకొనుట) గలవి, పుష్పహీనాః = పుష్పములతో శూన్యముగా ఉన్నవీ, హిమారుణాః = మంచుచేత అరుణవర్ణముగా (ధూసరవర్ణముగా) ఉన్నవి, శీతాః = చల్లనివి, వృద్ధతరాయామాః = చాల పెరిగిన దీర్ఘత్వము గలవి అయిన, పుష్యనీతాః = పుష్యమాసముచే పొందింపబడిన, త్రియామాః = రాత్రులు. యాన్తి = గడచుచున్నవి.

తా. ఇప్పుడు పుష్యమాసమునకు సంబంధించిన రాత్రులలో ఎవ్వరూ బైట పండుకొనుటలేదు. ఇవి మంచుచేత, చల్లగా ధూసరవర్ణముగా ఉన్నవి. వీటి దీర్ఘత్వము చాల పెరిగినది. ఈ విధముగ ఈ రాత్రులు గడచుచున్నవి. 12

మూ. రవిసంక్రాన్తసౌభాగ్యస్తుషారారుణమణ్డలః,
నిఃశ్వాసాన్ధ ఇవాదర్శశ్చన్ద్రమా న ప్రకాశతే. 13

ప్ర. అ. రవిసంక్రాన్తసౌభాగ్యః = సూర్యునియందు సంక్రమించిన సౌందర్యము కలవాడు, తుషారారుణమణ్డలః = పొగమంచుచేత ఎఱ్ఱగా నున్న మండలము గలవాడు అయిన, చన్ద్రమాః = చంద్రుడు, నిఃశ్వాసాన్ధః=నిట్టూర్పు చేత గ్రుడ్డిదైన, ఆదర్శ ఇవ = అద్దము వలె, న ప్రకాశతే = ప్రకాశించుటలేదు.

తా. ఇప్పుడు చంద్రుని సౌందర్యము సూర్యునకు సంక్రమించినది. చంద్రమండలము పొగమంచుచేత ఎఱ్ఱగా కనబడుచున్నది. అట్టి చంద్రమండలము నోటిగాలి తగులుటచేత గ్రుడ్డిదిగా (ప్రతిబింబము కనబడనదిగా) అయిపోయిన అద్దము వలె, ప్రకాశహీనమై ఉన్నది. 13

మూ. జ్యోత్స్నా తుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే,
సీతేవ చాతపశ్యామా లక్ష్యతే న తు శోభతే. 14

ప్ర. అ. పౌర్ణమాస్యామ్=పౌర్ణమాసియందు, తుషారమలినా=మంచుచేత మలినమైన, జ్యోత్స్నా=వెన్నెల, న రాజతే=ప్రకాశించుటలేదు. అతపశ్యామా= ఎండచేత నల్లబడిన, సీతేవ = సీత వలె, లక్ష్యతే = కనబడుచున్నది కాని, న తు శోభతే = శోభించుటలేదు.

తా. పూర్ణిమనాటి వెన్నెల కూడ మంచుచేత మలినమై, ప్రకాశవంతముగా లేదు. ఎండ తగులుటచే నల్లబడిన శరీరచ్ఛాయ గల సీత వలె ఈ వెన్నెల కనబడుచున్నది గాని శోభించుటలేదు. 14

మూ. ప్రకృత్యా శీతలస్పర్శో హిమవిద్ధశ్చ సామ్ప్రతమ్,
ప్రవాతి పశ్చిమో వాయుః కాలే ద్విగుణశీతలః. 15

('కాలే'కు బదులు "కల్యమ్"అను ప్రాచ్యపాఠము బాగున్నది)

ప్ర. అ. ప్రకృత్యా = స్వభావముచేత, శీతలస్పర్శః = చల్లని స్పర్శ గలది, సామ్ప్రతమ్=ఇప్పుడు, హిమవిద్ధశ్చ=మంచుచేత వ్యాప్తమైన, పశ్చిమః వాయుః = పశ్చిమవాయువు, కల్యమ్ = ప్రాతఃకాలమునందు, ద్విగుణశీతలః= రెట్టింపు చల్లనిదై, వాతి = వీచుచున్నది.

తా. సహజముగానే చల్లగా ఉండి, ఇప్పుడు మంచు కూడ కలియుటచే పశ్చిమవాయువు రెట్టింపు చల్లగా వీచుచున్నది. 15

మూ. బాష్పచ్ఛన్నాన్యరణ్యాని యవగోధూమవన్తి చ,
శోభన్తేఽభ్యుదితే సూర్యే నదద్భిః క్రౌఞ్చసారసైః. 16

ప్ర. అ. బాష్పచ్ఛన్నాని = ఆవిరివంటి మంచుచేత కప్పబడిన, యవగోధూమవన్తి చ = యవలు గోధుమలు గల, అరణ్యాని = అరణ్యములు, సూర్యే = సూర్యుడు, అభ్యుదితే = ఉదయించిన వా డగుచుండగా, నదద్భిః = ధ్వని చేయుచున్న, క్రౌఞ్చసారసైః = క్రౌంచపక్షులతోను సారసపక్షులతోను, శోభన్తే = ప్రకాశించుచున్నది.

తా. యవల చేలు, గోధుమల చేలు ఉన్న అరణ్యప్రదేశములు పొగమంచుచేత కప్పబడినవి. సూర్యు డుదయించగానే అవి ధ్వనిచేయుచున్న క్రౌంచపక్షులతోను, సారసపక్షులతోను అందముగా కనబడుచున్నవి. 16

మూ. ఖర్జూరపుష్పాకృతిభిః శిరోభిః పూర్ణతణ్డులైః,
శోభన్తే కించిదానమ్రాః శాలయః కనకప్రభాః. 17

ప్ర. అ. కనకప్రభాః = బంగారు కాంతి గల, శాలయః = వరిచేలు, ఖర్జూరపుష్పాకృతిభిః = ఖర్జూరపుష్పము వంటి ఆకారము గలవి, పూర్ణతణ్డులైః = తండులములతో నిండినవి అయిన, శిరోభిః = శిరస్సులతో, కించిత్ = కొంచెము, ఆనమ్రాః = వంగినవై, శోభన్తే = ప్రకాశించుచున్నవి.

తా. బంగారు రంగు గల వరిచేలు ఖర్జూరపుష్పము వంటి ఆకారముగల, బియ్యముతో నిండిన శిరస్సులతో కొంచెము వంగి చూచుటకు అందముగా ఉన్నవి. 17

మూ. మయూఖైరుపసర్పద్భిర్హిమనీహారసంవృతైః,
దూరమభ్యుదితః సూర్యః శశాఙ్క ఇవ లక్ష్యతే. 18

ప్ర. అ. హిమనీహారసంవృతైః = చల్లని పొగమంచుచేత కప్పబడిన, ఉపసర్పద్భిః = ప్రసరించుచున్న, మయూఖైః = కిరణములతో, సూర్యః = సూర్యుడు, దూరమ్ = పైకి, అభ్యుదితః = వచ్చినవాడైనను, శశాఙ్కః ఇవ = చంద్రుడు వలె, లక్ష్యతే = కనబడుచున్నాడు.

తా. వ్యాపించుచున్న కిరణములు చల్లని పొగమంచుచేత కప్పబడి ఉండుటచే సూర్యుడు బాగా పైకి వచ్చిన తరవాత కూడ చంద్రుడు వలె కనబడుచున్నాడు. 18

మూ. అగ్రాహ్యవీర్యః పూర్వాహ్ణే మధ్యాహ్నే స్పర్శతః సుఖః,
సంరక్తః కించిదాపాణ్డురాతపః శోభతే క్షితౌ. 19

ప్ర. అ. పూర్వాహ్ణే = ప్రాతఃకాలసమయమునందు, అగ్రాహ్యవీర్యః = గ్రహింపబడని శక్తిగలది, మధ్యాహ్నే = మధ్యాహ్నమునందు, స్పర్శతః = స్పర్శచేత, సుఖః = సుఖకరము, సంరక్తః = ఎఱ్ఱగా ఉన్నది, కించిత్ = కొంచెము ఆపాణ్డుః = తెల్లగా నున్నది అయిన, ఆతపః = ఎండ, క్షితౌ = నేలపై, శోభతే = ప్రకాశించుచున్నది.

తా. ఎఱ్ఱగాను కొంచెము తెల్లగాను ఉన్న ఎండ నేలపై పడుచున్నది. ప్రాతఃకాలమునందు దీని వేడిమి తెలియుటలేదు మధ్యాహ్నమునందు ఇది సుఖకరముగా ఉన్నది. 19

మూ. అవశ్యాయనిపాతేన కించిత్ప్రక్లిన్నశాద్వలా,
వనానాం శోభతే భూమిర్నివిష్టతరుణాతపా. 20

ప్ర. అ. అవశ్యాయనిపాతేన = మంచు పడుటచేత, కించిత్ = కొంచెము, ప్రక్లిన్నశాద్వలా = తడసిన పచ్చిక బీడులు కలది, నివిష్టతరుణాతపా = ప్రసరించిన లేత ఎండ గలదీ అయిన, వనానామ్ = వనములయొక్క, భూమిః = భూమి, శోభతే = ప్రకాశించుచున్నది.

తా. ఈ వనప్రదేశములో ఉన్న పచ్చిక బైళ్ళపై మంచు పడుటచే అవి కొంచెము తడిగా ఉన్నవి. వాటిపై లేత ఎండ ప్రసరించుటచే ఈ ప్రదేశము చూచుటకు అందముగా ఉన్నది. 20

మూ. స్పృశంస్తు విమలం శీతముదకం ద్విరదః సుఖమ్,
అత్యన్తతృషితో వన్యః ప్రతిసంహరతే కరమ్. 21

ప్ర. అ. అత్యన్తతృషితః = మిక్కిలి దప్పికొన్న, వన్యః = వనమునకు సంబంధించిన, ద్విరదః = ఏనుగ, విమలమ్ = నిర్మలము, శీతమ్ = చల్లనిదీ

అయిన, ఉదకమ్ = ఉదకమును, సుఖమ్=సుఖముగా, స్పృశన్=స్పృశించుచు, కరమ్ = తొండమును, ప్రతిసంహరతి = వెనుకకు లాగికొనుచున్నది.

తా. చాల దప్పి గొన్న ఈ అడవి ఏనుగు నిర్మలమైన చల్లని ఉదకమును సుఖముగా స్పృశించి వెంటనే తొండమును వెనుకకు లాగికొనుచున్నది.

మూ. ఏతే హి సముపాసీనా విహగా జలచారిణః,
నావగాహన్తి సలిలమప్రగల్భా ఇవాహవమ్. 22

ప్ర. అ. సముపాసీనాః = సమీపమునందు కూర్చొని ఉన్న, ఏతే = ఈ, జలచారిణః = నీటిలో సంచరించే, విహగాః = పక్షులు, అప్రగల్భాః=పిరికివాళ్ళు, ఆహవమ్ ఇవ = యుద్ధమును వలె, సలిలమ్ = ఉదకమును, నావగాహన్తి = ప్రవేశించుటలేదు.

తా. నీటికి దగ్గరనే కూర్చున్న ఈ నీటిపక్షులు పిరికివాళ్ళు యుద్ధములో ప్రవేశించనట్లు, నీటిలో ప్రవేశించుటలేదు.

మూ. అవశ్యాయతమోనద్ధా నీహారతమసా వృతాః,
ప్రసుప్తా ఇవ లక్ష్యన్తే విపుష్పా వనరాజయః. 27

ప్ర. అ. ("అవశ్యాయపరిక్లిన్నాః" అను ప్రాచ్యపాఠము బాగున్నది.) అవశ్యాయపరిక్లిన్నాః = మంచుచేత తడిసినవి, నీహారతమసా = చీకటి వంటి పొగమంచుచేత, ఆవృతాః = ఆవరింపబడినవి అయిన, విపుష్పాః = పుష్పములు లేని, వనరాజయః = వనపంక్తులు, ప్రసుప్తాః ఇవ = నిద్రపోవుచున్నవి వలె, లక్ష్యన్తే = కనబడుచున్నవి.

తా. మంచుకు తడిసి చీకటి వంటి పొగమంచుచేత కప్పబడిన, పుష్పశూన్యము లైన వనపంక్తులు నిద్రించుచున్నట్లు ఉన్నవి. 23

మూ. బాష్పసంఛన్నసలిలా రుతవిజ్ఞేయసారసాః,
హిమార్ద్రవాలుకైస్తీరైః సరితో భాన్తి సామ్ప్రతమ్. 24

ప్ర. అ. సామ్ప్రతమ్= ఇప్పుడు, బాష్పసంఛన్నసలిలాః = ఆవిరిచేత కప్పబడిన ఉదకము గల, రుతవిజ్ఞేయసారసాః = కూతలచేతనే తెలియదగిన

సారసపక్షులు గల, సరితః = నదులు, హిమార్ద్రవాలుకైః = మంచుచేత తడిసిన ఇసుక గల, తీరైః = తీరములతో, భాన్తి = ప్రకాశించుచున్నవి.

తా. నదులలోని నీటిపై ఆవిరి ఉండుటచేత నీరు కప్పబడిపోయి, ఆ నీటిలో ఉన్న సారసపక్షులు కూడ కంటికి కనబడుటలేదు. వాటి కూతలను పట్టి మాత్రమే అవి అక్కడ ఉన్నట్లు తెలియుచున్నది. అట్టి నదులు మంచుకు తడిసిన ఇసుక గల తీరములతో శోభించుచున్నవి. 24

మూ. తుషారపతనాచ్చైవ మృదుత్వాద్భాస్కరస్య చ,
శైత్యాదగాధస్థమపి ప్రాయేణ రసవజ్జలమ్. 25

ప్ర. అ. తుషారపతనాచ్చైవ = మంచు పడుటవలనను, భాస్కరస్య = సూర్యుడు, మృదుత్వాత్ = మృదువుగా (తీక్ష్ణము కాకుండగా) ఉండుటవలనను, శైత్యాత్ = శైత్యమువలనను, రసవత్ = రుచి గల, జలమ్ = జలము, అగాధస్థమపి = లోతుగా ఉన్నను, ప్రాయేణ = సాధారణముగా (అపేయమ్ = త్రాగుటకు తగినదిగా లేదు.)

తా. మంచు పడుటవలనను, సూర్యుడు అంతగా వేడిగా లేకపోవుటవలనను, శీతముగా ఉండుటవలనను, లోతుగా ఉన్న నీరు కూడ చాలవరకు త్రాగ వీలుగా లేదు.

వి. ఇది ప్రాచీనవ్యాఖ్యానము "అపేయమ్"అనే పదం అధ్యాహారం తెచ్చుకొని అర్థం చెప్పినారు. ఇలాంటి జలము త్రాగుటకు తగనిది ఎందుచేత అగునో తెలియదు. వాస్తవానికి లోతైన కూపాదిజలం శీతకాలంలో వెచ్చగా ఉండి పేయంగానే ఉంటుంది కదా. అందుచేత "శైత్యాదగాగ్రస్థమపి"అనే గోరఖ్‌పూర్ప్రతిలోని పాఠము. ప్రాచ్యపాఠము బాగున్నది. పైన చెప్పిన కారణాలచేత సాధారణంగా త్రాగడానికి అనుకూలంగా ఉండని కొండపైన ఉండే జలం కూడ చల్లగా పేయముగా ఉండును. "అగాగ్రస్థమపి = కొండమీద ఉన్నదైనను, జలమ్ = జలము, ప్రాయేణ = సాధారణముగా (చాలవరకు), రసవత్ = మంచి రుచిగలది"అని అర్థము. 25

మూ. జరాజర్జరితైః పద్మైః శీర్ణకేసరకర్ణికైః,
నాళశేషైర్హిమధ్వస్తైర్న భాన్తి కమలాకరాః. 26

ప్ర. అ. కమలాకరాః = పద్మసరస్సులు, జరాజర్జరితైః = ముసలితనము చేత (వాడిపోవుటచేత) శిథిలముగా చేయబడిన, శీర్ణకేసరకర్ణికైః=రాలిపోయిన కింజల్కములు, మధ్యనున్న దుద్దులు గల, నాళశేషైః = కాడలే మిగిలినవిగా గల, హిమధ్వస్తైః = మంచుచేత నశింపచేయబడిన, పద్మైః = పద్మములతో, న భాన్తి = ప్రకాశించుటలేదు.

తా. పద్మసరస్సులలోని పద్మములు మంచుచేత నశింపచేయబడినవై, వాడి, శిథిలమైపోయినవి. పద్మాలలోని కింజల్కములు, దుద్దులు రాలిపోయినవి. కాడలు మాత్రము మిగిలినవి. అట్టి పద్మములతో పద్మసరస్సులు శోభావిహీన ముగా ఉన్నవి. 26

మూ. అస్మింస్తు పురుషవ్యాఘ్రః కాలే దుఃఖసమన్వితః,
తపశ్చరతి ధర్మాత్మా త్వద్భక్త్యా భరతః పురే. 27

ప్ర. అ. అస్మిన్ కాలే = ఈ కాలమునందు, పురుషవ్యాఘ్రః = పురుషులలో శ్రేష్ఠుడు, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, భరతః = భరతుడు, దుఃఖ సమన్వితః = దుఃఖముతో కూడినవాడై, త్వద్భక్త్యా=నీయందు భక్తితో, పురే= పట్టణమునందు, తపః = తపస్సు, చరతి = ఆచరించుచున్నాడు.

తా. పురుషశ్రేష్ఠుడు, ధర్మాత్ముడు అయిన భరతుడు ఈ కాలములో కూడ దుఃఖించుచు, నీయందు భక్తితో, పట్టణములో, తపస్సు చేయుచున్నాడు.

మూ. త్యక్త్వా రాజ్యం చ మానం చ భోగాంశ్చ వివిధాన్ బహూన్
తపస్వీ నియతాహారః శేతే శీతే మహీతలే. 28

ప్ర. అ. రాజ్యం చ = రాజ్యమును, మానమ్ = మానమును, వివిధాన్ = అనేకవిధములైన, బహూన్ = అనేకవిధములైన, భోగాంశ్చ = భోగములను, త్యక్త్వా = విడచి, తపస్వీ = తపస్సు కలవాడై, నియతాహారః = నియత మైన ఆహారము కలవాడై, శీతే = చల్లని, మహీతలే = నేలమీద, శేతే = శయనించు చున్నాడు.

తా. ఆతడు రాజ్యమును, ఆత్మసంమానమును, వివిధములైన అనేక భోగములను విడచి, ఆహారనియమము పాటించుచు, తపస్సు ఆచరించుచు చల్లని నేలమీద శయనించుచున్నాడు. 28

మూ. సోఽపి వేళామిమాం నూనమభిషేకార్థముద్యతః,
వృతః ప్రకృతిభిర్నిత్యం ప్రయాతి సరయూం నదీమ్.

ప్ర. అ. సోఽపి = ఆ భరతుడు, ఇమాం వేళామ్ = ఈ సమయమును (సమయమునందు), అభిషేకార్థమ్ = స్నానముకొరకు, ఉద్యతః = ఉద్యుక్తుడై, ప్రకృతిభిః = మంత్రులతో, వృతః = కూడినవాడై, నిత్యమ్ = నిత్యము, సరయూం నదీమ్ = సరయూనదిని గూర్చి, ప్రయాతి = వెళ్లుచుండును. నూనమ్ = నిశ్చయము.

తా. ఆ భరతుడు కూడ నిత్యము ఇదే సమయమునందు స్నానార్థమై బయలుదేరి, మంత్రులతో కూడినవాడై, సరయూనదికి వెళ్ళుచుండును. 29

మూ. అత్యన్తసుఖసంవృద్ధః సుకుమారః సుఖోచితః,
కథం న్వపరరాత్రేషు సరయూమవగాహతే. 30

ప్ర. అ. అత్యన్తసుఖసంవృద్ధః = మిక్కిలి సుఖముగా పెరిగినవాడు, సుకుమారః = సుకుమారుడు, సుఖోచితః = సుఖాలకు అలవాటుపడినవాడు అయిన భరతుడు, అపరరాత్రేషు = రాత్రుల చివరి భాగములందు, కథం ను = ఎట్లు, సరయూమ్ = సరయూనదిని, అవగాహతే = ప్రవేశించుచున్నాడో కదా.

తా. భరతుడు చాల సుఖాలతో పెరిగినాడు, సుకుమారుడు, సుఖాలకు అలవాటుపడినాడు. అట్టి భరతుడు తెల్లవారుజాములందు సరయూస్నాన మెట్లు చేయుచున్నాడో కదా. 30

మూ. పద్మపత్రేక్షణో వీరః శ్యామో నిరుదరో మహాన్,
ధర్మజ్ఞః సత్యవాదీ చ హ్రీనిషేధో జితేన్ద్రియః. 31

ప్రియాభిభాషీ మధురో దీర్ఘబాహురరిందమః,
సంత్యజ్య వివిధాన్ భోగానార్యం సర్వాత్మనా శ్రితః. 32

ప్ర. అ. పద్మపత్రేక్షణః = పద్మము రేకుల వంటి నేత్రములు కలవాడు, వీరః = వీరుడు, శ్యామః = నల్లనివాడు, నిరుదరః = పొట్టలేనివాడు, (సన్నని నడుము గలవాడు), మహాన్ = గొప్పవాడు, ధర్మజ్ఞః = ధర్మము లెరిగినవాడు, సత్యవాదీ చ = సత్యమునే పలుకువాడు, హ్రీనిషేధః = సిగ్గుచేత చెడ్డ కార్యముల

నుండి మరలువాడు (ఇది క్లిష్టార్థము "హ్రీనిషేవీ"అను ప్రాచ్యపాఠము బాగున్నది సిగ్గును సేవించువాడు, అనగా సిగ్గు గలవాడు అని అర్థము), జితేన్ద్రియః= జయింపబడిన ఇంద్రియములు కలవాడు, ప్రియాభిభాషీ=ప్రియముగా మాటలాడువాడు, మధురః= తీయని స్వభావము గలవాడు, దీర్ఘబాహుః= దీర్ఘములైన బాహువులు కలవాడు, అరిందమః= శత్రుసంహారకుడు అయిన భరతుడు, వివిధాన్ = అనేకవిధములైన, భోగాన్ = భోగములను, సంత్యజ్య = విడచి, సర్వాత్మనా = అన్ని విధముల, ఆర్యమ్= పూజ్యుడవైన నిన్ను, శ్రితః= ఆశ్రయించినాడు.

తా. పద్మము రేకుల వంటి నేత్రములు గల భరతుడు వీరుడు. నల్లని శరీరకాంతి గలవాడు. మహాత్ముడైన అతని నడుము సన్నముగా ఉండును. ధర్మములు తెలిసినవాడు; సత్యమునే పలుకును; సిగ్గు గలవాడు; ఇంద్రియములను జయించినవాడు; ప్రియముగా మాటలాడును. అతని స్వభావము మధురమైనది. అతని బాహువులు చాల పొడవైనవి. శత్రువినాశకుడు. అట్టి భరతుడు అనేక విధములైన భోగములను, విడచి సర్వవిధముల పూజ్యుడవైన నిన్నే ఆశ్రయించినాడు. 31, 32

మూ. జితః స్వర్గస్తవ భ్రాతా భరతేన మహాత్మనా,
వనస్థమపి తాపస్యే యస్త్వామనువిధీయతే. 33

ప్ర. అ. యః= ఏ భరతుడు, వనస్థమపి=వనములో ఉన్నవాడవైనను, త్వామ్= నిన్ను, తాపస్యే= తపశ్చరణమునందు, అనువిధీయతే= అనుసరించుచున్నాడో, అట్టి తవ భ్రాతా= నీ సోదరుడైన, మహాత్మనా= మహాత్ముడైన, భరతేన= భరతునిచేత, స్వర్గః= స్వర్గము, జితః= జయింపబడినది.

తా. భరతుడు నీవు అరణ్యములో ఉన్నా నిన్నే అనుకరించుచు తపస్సు చేయుచున్నాడు. అట్టి మహాత్ముడైన, నీ సోదరుడు, భరతుడు స్వర్గమును జయించినాడు. 33

మూ. న పిత్ర్యమనువర్తన్తే మాతృకం ద్విపదా ఇతి,
ఖ్యాతో లోకప్రవాదోఽయం భరతేనాన్యథా కృతః. 34

ప్ర. అ. ద్విపదాః= మానవులు, పిత్ర్యమ్= తండ్రి స్వభావమును, న

అనువర్తన్తే = అనుసరించరు. మాతృకమ్ = తల్లి స్వభావమునే, అనుకరింతురు, ఇతి = అని, ఖ్యాతః = ప్రసిద్ధమైన, అయమ్ = ఈ, లోకప్రవాదః = లోకములోని ప్రవాదము, భరతేన = భరతునిచేత, అన్యథా = మరొకవిధముగా, కృతః = చేయబడినది.

తా. "మానవులు తండ్రి స్వభావమును అనుసరించరు; తల్లి స్వభావమును అనుకరింతురు"అని లోకములో ప్రసిద్ధముగా ఉన్న ఈ ప్రవాదమును (లోకోక్తిని) భరతుడు తారుమారుచేసినాడు; తల్లి స్వభావమును అనుసరించలేదు. 34

మూ. భర్తా దశరథో యస్యాః సాధుశ్చ భరతః సుతః,
కథం ను సామ్బా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ. 35

ప్ర. అ. యస్యాః = ఎవతెకు, దశరథః = దశరథుడు, భర్తా = భర్తయో, సాధుః = సత్పురుషుడైన, భరతః = భరతుడు, సుతః = కుమారుడో, సా = అట్టి, అమ్బా = మన తల్లి, కైకేయీ = కైకేయి, తాదృశీ = అంతటి, క్రూరశీలినీ = క్రూరస్వభావము కలది, కథం ను = ఎట్లయినదో ?

తా, దశరథమహారాజు భర్తగా ఉండి, సత్పురుషుడైన భరతుణ్ణి కన్న మన తల్లి కైకేయికి అంతటి క్రూరస్వభావము ఎట్లు వచ్చెనో కదా ! 35

మూ. ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహాద్బ్రువతి ధార్మికే,
పరివాదం జనన్యాస్తమసహన్రాఘవోఽబ్రవీత్. 36

ప్ర. అ. ధార్మికే = ధార్మికుడైన, లక్ష్మణే = లక్ష్మణుడు, స్నేహాత్ = భ్రాతృస్నేహమువలన, ఇత్యేవమ్ = ఇట్లు, వాక్యమ్ = వాక్యమును, బ్రువతి = పలుకుచుండగా, రాఘవః = రాముడు, జనన్యాః = తల్లియొక్క, తమ్ = ఆ, పరివాదమ్ = నిందను, అసహన్ = సహించనివాడై, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మాత్ముడైన లక్ష్మణుడు సోదరులపై తన కున్న స్నేహమును పురస్కరించుకొని ఈ విధముగా మాటలాడుచుండగా, రాముడు తల్లియైన కైకేయి నిందను సహింప జాలక ఇట్లు పలికెను. 36

మూ. న తేఽమ్బా మధ్యమా తాత గర్హితవ్యా కథం చన,
తామేవేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు. 37

ప్ర. అ. తాత = తండ్రీ! మధ్యమా = మధ్యమురాలైన, అమ్బా = తల్లి, కథం చన = ఏ విధముగానూ కూడ, తే = నీకు, న గర్హితవ్యా = నిందింప దగినది కాదు. ఇక్ష్వాకునాథస్య = ఇక్ష్వాకువంశప్రభువైన, భరతస్య = భరతుని యొక్క, తాం కథామేవ = ఆ కథనే, కురు = చేయుము.

తా. నాయనా! లక్ష్మణా! నీ వెట్టి పరిస్థితులలోను మన మధ్యమమాతయైన కైకేయిని నిందించగూడదు. ఇక్ష్వాకువంశప్రభువైన భరతునకు సంబంధించిన ఆ మాటలే చెప్పుము. 37

మూ. నిశ్చితాపి హి మే బుద్ధిర్వనవాసే దృఢవ్రతా,
భరతస్నేహసంతప్తా బాలిశ్క్రియతే పునః. 37

ప్ర. అ. మే = నాయొక్క, బుద్ధిః = బుద్ధి, నిశ్చితాపి = నిశ్చయము చేసి కొన్నదైనను, వనవాసే = వనవాసమువిషయమునందు, దృఢవ్రతా = దృఢమైన వ్రతము కలదైనను, భరతస్నేహసంతప్తా = భరతునియందు స్నేహముచేత పీడింపబడినదై, పునః = మరల, బాలిశ్క్రియతే = మూఢము చేయబడుచున్నది.

తా. నేను వనవాసవ్రతము చేయవలె నని దృఢముగా నిశ్చయించుకొని వనవాసము చేయుచున్నాను. అయినను భరతుని స్నేహముచేత దుఃఖించుచు, "అయ్యో! భరతుడు దగ్గర లేడు కదా" అని నా బుద్ధి చలించిపోవుచుండును. 38

మూ. సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ,
హృద్యాన్యమృతకల్పాని మనఃప్రహ్లాదనాని చ. 39

ప్ర. అ. ప్రియాణి = ప్రియమైనవి, మధురాణి = మధురముగా ఉన్నవి, హృద్యాని = మనోహరములైనవి, అమృతకల్పాని = అమృతముతో సమానమైనవి, మనఃప్రహ్లాదనాని చ = మనస్సుకు ఆనందము కలిగించునవి అయిన, అస్య వాక్యాని = ఈతని మాటలను, సంస్మరామి = స్మరించుచున్నాను.

తా. భరతుని మాటలు చాల ప్రియముగా, మధురముగా ఉండును. హృదయమునకు హత్తుకొని, అమృతము వలె మనస్సుకు ఆనందము కలిగించేవిగా ఉండును. ఆ మాట లింకను నా మనస్సులో మెదులుచున్నవి. 39

మూ. కదా న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా,
శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునన్దన. 40

ప్ర. అ. రఘునన్దన=లక్ష్మణా ! అహమ్=నేను, మహాత్మనా=మహాత్ము డైన, భరతేన=భరతునితోను, వీరేణ=వీరుడైన, శత్రుఘ్నేన చ=శత్రుఘ్నుని తోను, త్వయా చ=నీతోను, కదా ను=ఎప్పుడు, సమేష్యామి=కలుసు కొందునో !

తా. లక్ష్మణా ! నేను మహాత్ముడైన భరతునితోను, వీరుడైన శత్రుఘ్నుని తోను, నీతోను ఎప్పుడు కలిసి ఉండగలనో ! 40

మూ. ఇత్యేవం విలపంస్తత్ర ప్రాప్య గోదావరీం నదీమ్,
చక్రేఽభిషేకం కాకుత్స్థః సానుజః సహ సీతయా. 41

ప్ర. అ. కాకుత్స్థః=రాముడు, తత్ర=అక్కడ, ఇత్యేవమ్=ఇట్లు, విలపన్=దుఃఖించుచు, గోదావరీం నదీమ్=గోదావరీనదిని, ప్రాప్య=పొంది, సానుజః=తమ్మునితో కూడినవాడై, సీతయా సహ=సీతతో కూడ, అభిషేకమ్ =స్నానమును, చక్రే=చేసెను.

తా. రాముడు అక్కడ ఈ విధముగ దుఃఖించుచు, గోదావరీనదిని చేరి, తమ్మునితోను, సీతతోను కలిసి, ఆ గోదావరీనదిలో స్నానము చేసెను. 41

మూ. తర్పయిత్వాథ సలిలైస్తే పితౄన్ దైవతాని చ,
స్తువన్తి స్మోదితం సూర్యం దేవతాశ్చ సమాహితాః. 42

ప్ర. అ. అథ=అటుపిమ్మట, తే=ఆ సీతారామలక్ష్మణులు, సలిలైః= ఉదకములచేత, పితౄన్=పితృదేవతలను, దైవతాని చ=దేవతలను, తర్ప యిత్వా=తృప్తి పొందించి, ఉదితమ్=ఉదయించిన, సూర్యమ్=సూర్యుణ్ణి, దేవతాశ్చ=ఇతరదేవతలను, సమాహితాః=సావధానచిత్తులై, స్తువన్తి స్మ= స్తుతించిరి.

తా. ఆ సీతారామలక్ష్మణులు గోదావరీజలములతో పితృతర్పణము, దేవతాతర్పణము చేసి, ఉదయించిన సూర్యుణ్ణి, ఇతరదేవతలను ఏకాగ్రచిత్తముతో స్తుతించిరి. 42

మూ. కృతాభిషేకః స రరాజ రామః
సీతాద్వితీయః సహ లక్ష్మణేన,
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా
రుద్రః సనన్దీ భగవానివేశః. 43

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షోడశః సర్గః.

ప్ర. అ. సీతాద్వితీయః = సీతతో కూడిన, సః రామః = ఆ రాముడు, కృతాభిషేకః = చేయబడిన స్నానము గలవాడై, సహలక్ష్మణేన = లక్ష్మణునితో కూడినవాడై, గిరిరాజపుత్ర్యా = పార్వతీదేవితో, కృతాభిషేకః = చేయబడిన స్నానము గల, సనన్దీ = నందికేశ్వరునితో కూడిన, ఈశః = జగత్ప్రభు వైన, రుద్రః ఇవ = రుద్రుడు వలె, రరాజ = ప్రకాశించెను.

తా. సీతతో కలిసి స్నానము చేసిన లక్ష్మణసహితుడైన ఆ రాముడు, పార్వతీదేవితో కలసి స్నానము చేసిన, నందికేశ్వరసహితుడు అయిన, సకల లోకప్రభువైన, రుద్రుడు వలె ప్రకాశించెను. 43

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
పదహారవ సర్గ సమాప్తము.

## అథ సప్తదశః సర్గః

[రాముని పర్ణశాలవద్దకు శూర్పణఖ వచ్చి రాముణ్ణి గూర్చి తెలుసుకొని, తనను గూర్చి అతనికి తెలిపి, "నన్ను భార్యాగా స్వీకరింపుము" అని అతనిని కోరుట].

మూ. కృతాభిషేకో రామస్తు సీతా సౌమిత్రిరేవ చ,
తస్మాద్ గోదావరీతీరాత్తతో జగ్ముః స్వమాశ్రమమ్. 1

ప్ర. అ. కృతాభిషేకః=చేయబడిన స్నానము గల, రామస్తు=రాముడు, సీతా=సీత, సౌమిత్రిరేవ చ = లక్ష్మణుడు, తతః= అటు పిమ్మట, తస్మాత్ = ఆ, గోదావరీతీరాత్ = గోదావరీతీరమునుండి, స్వమ్ = తమ సంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. స్నానము చేసిన పిమ్మట, రాముడు, సీత, లక్ష్మణుడు ఆ గోదావరీ తీరమునుండి తమ ఆశ్రమమునకు వెళ్ళిరి. 1

మూ. ఆశ్రమం తముపాగమ్య రాఘవః సహ లక్ష్మణః,
కృత్వా పౌర్వాహ్ణికం కర్మ పర్ణశాలాముపాగమత్. 2

ప్ర. అ. సహలక్ష్మణః = లక్ష్మణునితో గూడిన, రాఘవః=రాముడు, తమ్ = ఆ, ఆశ్రమమ్=ఆశ్రమమును, ఉపాగమ్య = చేరి, పౌర్వాహ్ణికమ్=పూర్వాహ్ణమునకు సంబంధించిన, కర్మ = కర్మను, కృత్వా = చేసి, పర్ణశాలామ్ = పర్ణశాలను, ఉపాగమత్ = చేరెను.

తా. లక్ష్మణసమేతుడైన రాముడు ఆ ఆశ్రమము చేరి, పూర్వాహ్ణమునందు చేయదగిన కర్మలు నిర్వర్తించుకొని పర్ణశాలకు వెళ్ళెను. 2

మూ. ఉవాస సుఖిత స్తత్ర పూజ్యమానో మహర్షిభిః,
లక్ష్మణేన సహ భ్రాతా చకార వివిధాః కథాః. 3

ప్ర. అ. మహర్షిభిః = మహర్షులచేత, పూజ్యమానః = పూజింపబడుచున్నవాడై, తత్ర = అక్కడ, సుఖితః = సుఖముకలవాడై, ఉవాస = నివసించెను.

భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడ, వివిధాః = అనేక విధములైన, కథాః = మాటలను, చకార = చేసెను.

తా. రాముడు మహర్షులచేత ఆదరింపబడుచు, ఆ ఆశ్రమమునందు సుఖముగా నివసించెను. సోదరుడైన లక్ష్మణునితో కలిసి అనేకవిధములైన సంభాషణలు చేయుచుండెను. 3

మూ. స రామః పర్ణశాలాయామాసీనః సహ సీతయా,
విరరాజ మహాబాహుశ్చిత్రయా చన్ద్రమా ఇవ. 4

ప్ర. అ. సీతయా సహ = సీతతో కూడ, పర్ణశాలాయామ్ = పర్ణశాలయందు, ఆసీనః = కూర్చొని ఉన్న, మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః రామః = ఆ రాముడు, చిత్రయా = చిత్తానక్షత్రముతో కూడిన, చన్ద్రమాః ఇవ = చంద్రుడు వలె, విరరాజ = ప్రకాశించెను.

తా. సీతాసమేతుడై పర్ణశాలలో కూర్చొని ఉన్న మహాబాహువైన ఆ రాముడు, చిత్తానక్షత్రముతో కూడి యున్న చంద్రుడు వలె ప్రకాశించెను. 4

మూ. తథాసీనస్య రామస్య కథాసంసక్తచేతసః,
తం దేశం రాక్షసీ కాచిదాజగామ యదృచ్ఛయా. 5

ప్ర. అ. రామస్య = రాముడు, కథాసంసక్తచేతసః = సంభాషణలో ఆసక్తి గల చిత్తము కలవాడై, తథా = అట్లు, ఆసీనస్య = కూర్చొని యుండగా, కాచిత్ = ఒకానొక, రాక్షసీ = రాక్షసస్త్రీ, యదృచ్ఛయా = దైవవశముచేత, తం దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. రాముడా విధముగ ఆసక్తమైన మనస్సుతో సంభాషణలో మునిగియుండగా, దైవవశముచేత ఒక రాక్షసస్త్రీ ఆ ప్రదేశమునకు వచ్చెను. 5

మూ. సా తు శూర్పణఖా నామ దశగ్రీవస్య రక్షసః,
భగినీ రామమాసాద్య దదర్శ త్రిదశోపమమ్. 6

ప్ర. అ. రక్షసః = రాక్షసుడైన, దశగ్రీవస్య = రావణునియొక్క, భగినీ = సోదరియైన, శూర్పణఖా నామ = శూర్పణఖ అను పేరు గల, సా తు = ఆ

రాక్షసస్త్రీ, త్రిదశోపమమ్ = దేవతాపురుషునితో సమానుడైన, రామమ్ = రాముణ్ణి, ఆసాద్య = సమీపించి, దదర్శ = చూచెను.

తా. రావణు డనే రాక్షసుని సోదరియైన శూర్పణఖ అను పేరు గల ఆ రాక్షసి, దేవతాపురుషుడు వలె ఉన్న ఆ రామునికి దగ్గరగా వచ్చి ఆతనిని చూచెను. 6

మూ. సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణమ్,
ఆజానుబాహుం దీప్తాస్యమతీవ ప్రియదర్శనమ్. 7

గజవిక్రాన్తగమనం జటామణ్డలధారిణమ్,
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యఞ్జనాన్వితమ్. 8

రామమిన్దీవరశ్యామం కన్దర్పసదృశప్రభమ్,
బభూవేన్ద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా. 9

ప్ర. అ. సింహోరస్కమ్=సింహము వంటి పక్షఃస్థలము కలవాడు, మహాబాహుమ్ = బలిష్ఠమైన బాహువులు గలవాడు, పద్మపత్రనిభేక్షణమ్ = పద్మము రేకుల వంటి నేత్రములు కలవాడు, ఆజానుబాహుమ్ = మోకాళ్లవరకు పొడవైన బాహువులు కలవాడు, దీప్తాస్యమ్ = ప్రకాశించుచున్న ముఖము కలవాడు, అతీవ =మిక్కిలి, ప్రియదర్శనమ్=ఆనందకరమైన దర్శనము కలవాడు, గజవిక్రాన్తగమనమ్ = గజగమనము వంటి గమనము గలవాడు, జటామణ్డలధారిణమ్ = జటామండలమును ధరించినవాడు, సుకుమారమ్ = సుకుమారుడు, మహాసత్త్వమ్ = గొప్ప బలము గలవాడు, పార్థివవ్యఞ్జనాన్వితమ్ = రాజలక్షణములతో కూడినవాడు, ఇన్దీవరశ్యామమ్ = నల్లకలువ వలె శ్యామవర్ణము గలవాడు, కన్దర్పసదృశప్రభమ్=మన్మథునితో సమానమైన కాంతి గలవాడు; ఇన్ద్రోపమమ్=ఇంద్రునితో సమానుడు అయిన, రామమ్=రాముణ్ణి, దృష్ట్వా=చూచి, రాక్షసీ=ఆ శూర్పణఖ, కామమోహితా = కామముచేత మోహితురాలు, బభూవ = ఆయెను.

తా. బలిష్ఠమైన బాహువులు గల ఆ రాముని వక్షఃస్థలము సింహము వక్షఃస్థలము వలె విశాలముగా ఉండెను. నేత్రములు పద్మము రేకుల వలె ఉండెను. మోకాళ్ల వరకు వ్రేలాడు దీర్ఘమైన బాహువులతో, తేజస్సుతో వెలుగొందుచున్న

ముఖముతో ఆ రాముడు చూచువారికి ఆనందము కలిగించుచుండెను. ఏనుగ వలె అందముగా, హుందాతనము ఉట్టిపడు నట్లు నడచే ఆ రాముడు జటామండలము ధరించి ఉండెను. సుకుమారుడు, మహాబలశాలీ అయిన ఆ రామునిలో మహారాజ లక్షణము లన్నీ కనబడు చుండెను. నల్లకలువ వంటి శరీరచ్ఛాయ గలిగి, మన్మ థునివంటి సౌందర్యముతో, మహేంద్రుడు వలె ఉన్న ఆ రాముణ్ణి చూడగానే ఆ శూర్పణఖ కామమోహితురా లయ్యెను. 7, 8, 9

మూ. సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ,
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా. 10

ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వరా,
తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ. 11

న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియమప్రియదర్శనా,
శరీరజసమావిష్టా రాక్షసీ వాక్యమబ్రవీత్. 12

ప్ర. అ. దుర్ముఖీ = చెడ్డ ముఖము కలది, మహోదరీ = పెద్ద పొట్ట గలది, విరూపాక్షీ = వికృతమైన నేత్రములు కలది. తామ్రమూర్ధజా = ఎఱ్ఱని కేశములు గలది, విరూపా = వికృతరూపము గలది, భైరవస్వరా = కటుస్వరము గలది, దారుణా వృద్ధా = భయంకరముగా ఉన్న వృద్ధురాలు, వామభాషిణీ = చెడ్డగా మాటలాడునది, సుదుర్వృత్తా = చాలా చెడ్డ నడవడిక గలది, అప్రియదర్శనా = అప్రియమైన దర్శనముగలది అయిన, రాక్షసీ = ఆ రాక్షసి, సుముఖమ్ = అంద మైన ముఖము గలవాడు, వృత్తమధ్యమ్ = సన్నని నడుము గలవాడు, విశాలా క్షమ్ = విశాలములైన నేత్రములు కలవాడు, సుకేశమ్ = మంచి జుట్టుకలవాడు, ప్రీతిరూపమ్ = ఆనందమును కలిగించు రూపము కలవాడు, సుస్వరమ్ = మధుర మైన కంఠధ్వని గలవాడు, తరుణమ్ = యువకుడు, దక్షిణమ్ = (మాటలలో) నేర్పరి, న్యాయవృత్తమ్ = న్యాయమైన ప్రవృత్తి గలవాడు, ప్రియమ్ = చూచుటకు సంతోషము కలిగించువాడు అయిన, రామమ్ = రాముణ్ణి గూర్చి, శరీరజసమావిష్టా = మన్మథునిచేత ఆవహింపబడినదై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాక్షసి రాముణ్ణి చూడగానే మన్మథునిచే ఆవహింపబడెను. ఆ

రాముని ముఖము చాల అందమైనది; ఆమె ముఖము వికృతముగా ఉన్నది. ఆతని నడుము సన్నగా నున్నది; ఆమె పొట్ట చాల పెద్దది. ఆతని నేత్రములు విశాలమైనవి; ఆమె నేత్రములు వికృతముగా ఉన్నవి. ఆతని జుట్టు నల్లగా అందముగా ఉన్నది; ఆమె జుట్టు ఎఱ్ఱగా ఉన్నది. చూచువారికి ఆనందము కలిగించే రూపమాతనిది; ఆమెది వికృతమైన రూపము. ఆతని కంఠధ్వని మధురమైనది. ఆమె కంఠధ్వని కర్ణకఠోరము. ఆతడు నవయౌవనవంతుడు; ఆమె వెగటు కలిగించు వృద్ధురాలు. ఆతడు మాటలలో నేర్పరి, ఆమె గ్రామ్యభాషలు మాట లాడును. ఆతని నడవడిక న్యాయసమ్మతమై ఉండును; ఆమె చాలా చెడ్డ నడత గలది. ఆతడు చూచువారికి ఆనందమును కలిగించును; ఆమె చూచువారికి ఏవగింపు కలిగించును. అట్టి ఆ రాక్షసి రామునితో ఇట్లు పలికెను. 10, 11, 12

మూ. జటీ తాపసరూపేణ సభార్యః శరచాపధృత్,
ఆగత స్త్వమిమం దేశం కథం రాక్షససేవితమ్, 13
కిమాగమనకృత్యం తే త త్త్వమాఖ్యాతుమర్హసి.

ప్ర. అ. త్వమ్ = నీవు, జటీ = జటాధారివై, సభార్యః=భార్యతో కూడినవాడవై, శరచాపధృత్ = శరములను ధనస్సును ధరించినవాడవై, తాపసరూపేణ =మునివేషముచేత, రాక్షససేవితమ్ = రాక్షసులచేత సేవింపబడిన, ఇమం దేశమ్ = ఈ ప్రదేశమును గూర్చి, కథమ్ = ఎట్లు, ఆగతః = వచ్చినావు ? తే = నీయొక్క, ఆగమనకృత్యమ్ = రాకయొక్క పని, కిమ్ = ఏమి ? తత్త్వమ్ = యథార్థమును, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. నీవు భార్యాసమేతుడవై, ధనుర్బాణములు ధరించి, జటాధారివై, మునివేషముతో, రాక్షసుల నివాసమైన ఈ ప్రదేశమునకు ఎందుకు వచ్చినావు ? నీవు ఇక్కడకు వచ్చిన పని ఏమి? యథార్థముగా చెప్పుము. 13

మూ. ఏవముక్తస్తు రాక్షస్యా శూర్పణఖ్యా పరంతపః, 14
ఋజుబుద్ధితయా సర్వమాఖ్యాతుముపచక్రమే.

ప్ర. అ. రాక్షస్యా=రాక్షసియైన, శూర్పణఖ్యా=శూర్పణఖచేత, ఏవమ్= ఇట్లు, ఉక్తః = పలకబడిన, పరంతపః = శత్రుపీడకుడగు రాముడు, ఋజు

బుద్ధితయా=కుటిలత్వము లేని బుద్ధి కలవాడగుటచేత, సర్వమ్=సమస్తమును, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. శత్రుపీడకుడైన రాముడు రాక్షసి యైన శూర్పణఖ మాటలు విని, ఋజుబుద్ధి కలవాడగుటచేత విషయము నంతను ఉన్నదున్నట్లు చెప్పుటకు ప్రారంభించెను. 14

మూ. అనృతం న హి రామస్య కదాచిదపి సంమతమ్, 15
విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ.

ప్ర. అ. రామస్య = రామునకు, అనృతమ్ = అసత్యము, కదాచిదపి = ఎన్నడూ, న సంమతం హి = ఇష్టము కాదు కదా. ఆశ్రమస్థస్య = ఆశ్రమములో ఉండగాను, స్త్రీజనస్య = స్త్రీలయొక్క, సమీపే . చ = సమీపమునందును, విశేషేణ = విశేషించి, న సంమతమ్ = సంమతము కాదు.

తా. రామునకు ఎన్నడూ అసత్యము ఇష్టము కాదు. విశేషించి, ఆతడు ఆశ్రమములో ఉన్నప్పుడు, స్త్రీల ఎదుట అసత్యము ఆతనికి ఇష్టము కాదు. 15

మూ. ఆసీద్దశరథో నామ రాజా త్రిదశవిక్రమః, 16
తస్యాహమగ్రజః పుత్రో రామో నామ జనైః శ్రుతః.

ప్ర. అ. త్రిదశవిక్రమః = దేవతలవంటి పరాక్రమము గల, దశరథో నామ = దశరథు డను పేరు గల, రాజా = రాజు, ఆసీత్ = ఉండెను. అహమ్ = నేను, తస్య = ఆతనియొక్క, అగ్రజః = జ్యేష్ఠుడనైన, పుత్రః = పుత్రుడను; రామో నామ = రాము డను పేరు గలవాడుగా, జనైః = జనులచేత, శ్రుతః = వినబడినవాడను.

తా. దేవతల వంటి పరాక్రమము గల, దశరథు డను రాజు ఉండెను. నేను ఆతని జ్యేష్ఠపుత్రుడను. నన్ను రాము డని జనులు అందురు. 16

మూ. భ్రాతాయం లక్ష్మణో నామ యవీయాన్మామనువ్రతః, 17
ఇయం భార్యా చ వైదేహీ మమ సీతేతి విశ్రుతా.

ప్ర. అ. అయమ్ = ఇతడు, లక్ష్మణో నామ=లక్ష్మణు డనే పేరు గల,

యవీయాన్ = చిన్నవాడైన, భ్రాతా = సోదరుడు, మామ్ = నన్ను, అనువ్రతః = అనుసరించి నియమమును పాటించువాడు. వైదేహీ = విదేహదేశరాజు కూతురైన, ఇయమ్ = ఈమె, మమ = నాయొక్క, భార్యా = భార్య. సీతేతి = సీత అని, విశ్రుతా = ప్రసిద్ధ మైనది.

తా. లక్ష్మణు డను పేరు గల ఇతడు నా తమ్ముడు. నన్ను అనుసరించి నియమపాలనము చేయుచున్నాడు. విదేహరాజపుత్రియైన ఈమె నా భార్య. ఈమె పేరు సీత. 17

మూ. నియోగాత్తు నరేన్ద్రస్య పితుర్మాతుశ్చ యన్త్రితః, 18
ధర్మార్థం ధర్మకాఙ్క్షీ చ వనం వస్తుమిహాగతః.

ప్ర. అ. నరేన్ద్రస్య = రాజైన, పితుః = తండ్రియొక్క, మాతుశ్చ = తల్లియొక్క, నియోగాత్ = ఆజ్ఞవలన, యన్త్రితః = నియమితుడనై, ధర్మకాఙ్క్షీ చ = ధర్మమును కోరుచున్నవాడనై, ధర్మార్థమ్ = ధర్మము నిమిత్తము, ఇహ = ఇక్కడ, వస్తుమ్ = నివసించుటకు, వనమ్ = వనమును గూర్చి, ఆగతః = వచ్చినాను.

తా. నేను రాజైన తండ్రి, తల్లి ఇచ్చిన ఆజ్ఞకు బద్ధుడనై ధర్మమును అనుసరించవలె నను కోరికతో, ధర్మముకొరకై ఇక్కడ నివసించుటకు ఈ వనమునకు వచ్చితిని. 18

మూ. త్వాం తు వేదితుమిచ్ఛామి కథ్యతాం క్వాసి కస్య వా, 19
న హి తావన్మనోజ్ఞాఙ్గీ రాక్షసీ ప్రతిభాసి మా.

ప్ర. అ. త్వామ్ = నిన్ను గూర్చి, వేదితుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను; కథ్యతామ్ = చెప్పబడుగాక. క్వ = ఎక్కడ, అసి = ఉన్నావు ? కస్య వా = ఎవనికి సంబంధించినదానవు ? మనోజ్ఞాఙ్గీ = సుందరమైన శరీరము గల నీవు, రాక్షసీ = రాక్షసస్త్రీగా, మా = నన్ను గూర్చి (నాకు), న ప్రతిభాసి = తోచుటలేదు.

తా. నీ వెవ్వరివో తెలిసికొన గోరుచున్నాను. ఎక్కడ నివసింతువు

ఎవరి భార్యవు ? చెప్పుము. ఇంత సుందరమైన శరీరము గల నీవు రాక్షస్త్రీ వని నాకు తోచుటలేదు.

వి. ఈ ప్రతిలో ఇంతకు ముందు ఎక్కడా శూర్పణఖ సుందరస్త్రీవేషము ధరించి వచ్చి నట్లు చెప్పలేదు. అందుచేత "న హి తావన్మనోజ్ఞాఙ్గీ" ఇత్యాది వాక్యము అసంగతంగా కనబడుతుంది. గోరఖ్‌పూర్ ప్రతిలో-"త్వం హి తావన్మనోజ్ఞాఙ్గీ రాక్షసీ ప్రతిభాతి మే"అను పాఠ మున్నది. "మనోహర మైన శరీరము గల నీవు రాక్షసస్త్రీవి అయి ఉందు వని నాకు తోచుచున్నది"అని దాని అర్థము. ఇక్కడ రాముడు "మనోజ్ఞాఙ్గీ"అని పరిహాసపూర్వకముగా అని యుండును. ఈ పాఠము బాగున్నట్లు తోచుచున్నది.

ప్రాచ్యపాఠములో మాత్రము కథలో కొంత మార్పు ఉన్నది. రాముడు గోదావరిస్నానము చేసి వచ్చిన తరువాత జటాయువు వచ్చి, తాను తన బంధుమిత్రాదులను చూచుటకై మరొక ప్రాంతమునకు వెళ్ళుచున్నట్లు చెప్పి రామాదుల అనుమతి తీసికొనివెళ్ళను. పిమ్మట శూర్పణఖ లోకోత్తరసౌందర్యము గల స్త్రీ రూపముతో వచ్చి నట్లు మూడు నాలుగు శ్లోకాలలో వర్ణింపబడినది. కాని దానిలో ఈ శ్లోకం మాత్రం లేదు. 19

మూ. ఇహ వా కిం నిమిత్తం త్వమాగతా బ్రూహి తత్త్వతః,20
సాబ్రవీద్వచనం శ్రుత్వా రాక్షసీ మదనార్దితా.

ప్ర. అ. ఇహ = ఇక్కడికి, కింనిమిత్తమ్ = ఎందునిమిత్తము, త్వమ్ = నీవు, ఆగతా వా = వచ్చినావో, తత్త్వతః = యథార్థముగా, బ్రూహి = చెప్పుము. వచనమ్ = ఈ వచనమును, శ్రుత్వా = విని, మదనార్దితా = మన్మథునిచేత పీడించబడిన, సా రాక్షసీ = ఆ రాక్షసస్త్రీ, అబ్రవీత్ = పలికెను.

తా. "నీవు ఎందుకొరకై ఇక్కడకు వచ్చినావు? యథార్థముగా చెప్పుము". ఆ శూర్పణఖ రాముని మాటలు విని, మన్మథునిచేత పీడింపబడినదై ఇట్లు చెప్పెను. 20

మూ. శ్రూయతాం రామ వక్ష్యామి తత్త్వార్థం వచనం మమ. 21
అహం శూర్పణఖా నామ రాక్షసీ కామరూపిణీ
అరణ్యం విచరామీదమేకా సర్వభయంకరా. 22

ప్ర. అ. అహమ్ = నేను, శూర్పణఖా నామ = శూర్పణఖ అను పేరు గల, కామరూపిణీ = ఇచ్ఛానుసారము రూపము గల, రాక్షసీ = రాక్షసస్త్రీని. ఏకా = నే నొక్కదాననే, సర్వభయంకరా = అందరికీ భయముకలిగించుచు, ఇదమ్ = ఈ, అరణ్యమ్ = అరణ్యమును, విచరామి = సంచరించుచుందును.

తా. నేను శూర్పణఖ అను రాక్షసస్త్రీని; కోరిన రూపము ధరింప శక్తి గలదానను; నేను ఒక్కదానినే, అందరికీ భయము కలిగించుచు ఈ అరణ్యములో సంచరించుచుందును. 21,22

మూ. రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః,
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్రమాగతః. 23

ప్ర. అ. బలీయాన్ = అధికబలము గలవాడు, వీరః = వీరుడు, విశ్రవసః = విశ్రవసునియొక్క, పుత్రః = పుత్రుడూ అయిన, రావణో నామ = రావణు డనే పేరు గల, రాక్షసేశ్వరః = రాక్షసరాజు, మే = నాయొక్క, భ్రాతా = సోదరుడు, తే = నీయొక్క, శ్రోత్రమ్ = చెవిని, ఆగతః యది = పొందిఉండవచ్చును.

తా. అధికబలశాలి, వీరుడు, విశ్రవసుని పుత్రుడు అయిన రావణు డనే రాక్షసరాజు నా సోదరుడు. నీ వాతనిని గూర్చి వినియే ఉందువు. 23

మూ. ప్రవృద్ధనిద్రశ్చ సదా కుమ్భకర్ణో మహాబలః,
విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షసచేష్టితః 24
ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ.

ప్ర. అ. సదా = ఎల్లప్పుడు, ప్రవృద్ధనిద్రః = వృద్ధి పొందిన నిద్ర గల, మహాబలః = గొప్ప బలము గల, కుమ్భకర్ణః చ = కుంభకర్ణుడు కూడ, నా సోదరుడు. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, విభీషణస్తు = విభీషణుడు కూడ నా సోదరుడు. తు = కాని, రాక్షసచేష్టితః = రాక్షసప్రవృత్తి కలవాడు, న = కాడు. రణే = యుద్ధమునందు, ప్రఖ్యాతవీర్యౌ = ప్రసిద్ధమైన వీర్యము గల, ఖరదూషణౌ చ = ఖరదూషణులు కూడ, భ్రాతరౌ = నా సోదరులు.

తా. ఎల్లప్పుడూ అత్యధికమైన నిద్ర గల, మహాబలవంతుడైన కుంభ

క్తుడు, ధర్మాత్ముడు రాక్షసప్రవృత్తి లేనివాడు అయిన విభీషణుడు నా సోద రులు. యుద్ధములో ప్రసిద్ధమైన పరాక్రమము గల ఖరదూషణులు కూడ నా సోదరులు. 24

మూ. తానహం సమతిక్రాన్తా రామ త్వా పూర్వదర్శనాత్, 25
సముపేతాస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్.

ప్ర. అ. రామ = రామా ! అహమ్ = నేను, తాన్ = వాళ్లనందరినీ, సమతి క్రాన్తా = అతిక్రమించి ఉన్నాను. పూర్వదర్శనాత్ = మొట్టమొదటి దర్శనము నుండి, పురుషోత్తమమ్ = పురుషశ్రేష్ఠుడవైన, త్వా = నిన్ను, భర్తారమ్ = భర్త నుగా, భావేన = మనోభావముచేత, సముపేతా = పొందినదానను, అస్మి = అయి నాను.

తా. రామా ! నేను వాళ్ళ నెవ్వరినీ లెక్కచేయను. తొలి సారిగ చూచినది మొదలు, పురుషులలో శ్రేష్ఠుడ వైన నిన్ను, మనోభావముచేత, భర్తగా పొంది నాను. 25

మూ. అహం ప్రభావసంపన్నా స్వచ్ఛన్దబలగామినీ, 26
చిరాయ భవ మే భర్తా సీతయా కిం కరిష్యసి.

ప్ర. అ. అహమ్ = నేను, ప్రభావసంపన్నా = ప్రభావముతో కూడిన దానను; స్వచ్ఛన్దబలగామినీ = బలముతో స్వేచ్ఛగా వెళ్లేదానను. చిరాయ = చాల కాలము, మే = నాకు, భర్తా = భర్తవుగా, భవ = అగుము. సీతయా = సీతతో, కిం కరిష్యసి = ఏమి చేసెదవు ?

తా. నేను గొప్ప ప్రభావము కలదానను. బలముతో స్వేచ్ఛగా ఇష్టము వచ్చిన చోటికి వెళ్ళగలను. చాల కాలముపాటు నాకు భర్తవుగా ఉండుము ఈ సీతతో నీ కేమి పని ? 26

మూ. వికృతా చ విరూపా చ న చేయం సదృశీ తవ, 27
అహమేవానురూపా తే భార్యా రూపేణ పశ్య మామ్.

ప్ర. అ. వికృతా చ = వికారముగా ఉన్నది, విరూపా చ = వికృతముగా ఉన్న రూపము కలది అయిన, ఇయమ్ = ఈ సీత, తవ = నీకు, న సదృశీ =

తగినది కాదు. తే = నీకు, అహమేవ = నేనే, అనురూపా = తగినదానను. మామ్ = నన్ను, భార్యారూపేణ = భార్యారూపముచేత, పశ్య = చూడుము.

తా. ఈ సీత ఆకారము, రూపము కూడ వికారముగా ఉన్నది. ఈమె నీకు తగినది కాదు. నేనే నీకు తగినదానను. నన్ను భార్యనుగా చూడుము. 27

మూ. ఇమాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీమ్, 28
అనేన తే సహ భ్రాత్రా భక్షయిష్యామి మానుషీమ్.

ప్ర. అ. విరూపామ్ = వికృతమైన రూపము కలది, అసతీమ్ = చెడ్డ స్వభావము గలది, కరాళామ్ = భయంకరురాలు, నిర్ణతోదరీమ్ = అణిగిపోయిన కడుపు కలది అయిన, ఇమాం మానుషీమ్ = ఈ మనుష్యస్త్రీని, తే భ్రాత్రా సహ = నీ సోదరునితో కూడ, భక్షయిష్యామి = భక్షించెదను.

తా. ఈ మనుష్యస్త్రీ వికృతరూపము గలది. ఈమె స్వభావము చెడ్డది. భయంకరురాలు. ఈమె పొట్ట అణగి పోయి వికృతముగా ఉన్నది. నేను ఈమెను, నీ సోదరునీ కూడ భక్షించివేసెదను. 28

మూ. తతః పర్వతశృఙ్గాణి వనాని వివిధాని చ, 29
పశ్యన్ సహ మయా కాన్త దణ్డకాన్విచరిష్యసి.

ప్ర. అ. కాన్త = మనోహరా! తతః = అటుపిమ్మట, పర్వతశృఙ్గాణి = పర్వతశిఖరములను, వివిధాని = అనేకవిధములైన, వనాని చ = వనములను, పశ్యన్ = చూచుచు, మయా సహ = నాతో కూడ, దణ్డకాన్ = దండకారణ్యమును, విచరిష్యసి = సంచరించగలవు.

తా. ఓ! మనోహరా! అటు పిమ్మట నీవు నాతో కలిసి పర్వతశిఖరములను, అనేకవిధములైన వనములను చూచుచు దండకారణ్యములో సంచరించవచ్చును. 29

మూ. ఇత్యేవముక్తః కాకుత్థ్సః ప్రహస్య మదిరేక్షణామ్, 30
ఇదం వచనమారేభే వక్తుం వాక్యవిశారదః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తదశః సర్గః.

ప్ర. అ. ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, వాక్యవిశారదః = మాటలలో నేర్పరియైన, కాకుత్థ్సః = రాముడు, ప్రహస్య = నవ్వి, మదిరేక్షణామ్ = ఆ స్త్రీని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వచనమును, వక్తుమ్ = చెప్పుటకు, ఆరేభే = ప్రారంభించెను.

తా. మాటలలో నేర్పరి యైన రాముడు ఆ మాటలు విని, నవ్వుచు, ఆ రాక్షసస్త్రీతో ఈ విధముగ పలుకుటకు ప్రారంభించెను. 30

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పదిహేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాదశః సర్గః

[రామునిచేత నిరాకరింపబడిన శూర్పణఖ లక్ష్మణునివద్దకు వెళ్లి తనను భార్యగా స్వీకరింపుమని కోరుట. అతడు కూడ నిరాకరించగా సీతను చంపుటకు ఉద్యమించుట. లక్ష్మణు డామె ముక్కు చెవులు కోయుట.]

మూ. తతః శూర్పణఖాం రామః కామపాశావపాశితామ్,
స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వమథాబ్రవీత్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, కామపాశావపాశితామ్ = మన్మథపాశముచేత కట్టబడిన, శూర్పణఖామ్ = శూర్పణఖను గూర్చి, స్వచ్ఛయా = పరిశుద్ధము, శ్లక్ష్ణయా = మృదువు అయిన, వాచా = వాక్కుతో, స్మితపూర్వమ్ = చిరునవ్వు పూర్వమునందు కలుగునట్లుగా, అథ = అనంతరము, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట రాముడు కామ (మన్మథుని) పాశముచేత బంధింపబడి ఉన్న ఆ శూర్పణఖతో, చిరునవ్వు నవ్వుచు, పరిశుద్ధము, మృదువు అయిన మాట ఈ విధముగా పలికెను.

మూ. కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితా మమ,
త్వద్విధానాం తు నారీణాం సుదుఃఖా ససపత్నతా. 2

ప్ర. అ. భవతి = ఓః పూజ్యురాలా! కృతదారః = వివాహము చేసికొన్న వాడనుగా, అస్మి = అయి ఉన్నాను. ఇయమ్ = ఈమె, మమ = నాకు, దయితా = ఇష్టురాలైన, భార్యా = భార్య. త్వద్విధానామ్ = నీవంటి, నారీణామ్ = స్త్రీలకు, ససపత్నతా = సవతికలిగియుండుట, సుదుఃఖా = చాల దుఃఖకర మైనది.

తా. పూజ్యురాలా! నాకు వివాహ మైనది. ఈమె నాకు చాల ఇష్టురాలైన భార్య. నీవంటి ఆడవాళ్ళు సవతి ఉండుటను ఏ మాత్రము సహించజాలరు. 2

మూ. అనుజస్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః,
శ్రీమానకృతదారశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్. 3

ప్ర. అ. లక్ష్మణో నామ = లక్ష్మణు డను పేరు గల, ఏషః = ఇతడు, మే = నాయొక్క, అనుజః = తమ్ముడైన, భ్రాతా = సోదరుడు. శీలవాన్ = మంచి శీలము గలవాడు. ప్రియదర్శనః = సుఖకరమైన దర్శనము కలవాడు. శ్రీమాన్ = శోభాయుక్తుడు. అకృతదారశ్చ = వివాహము కానివాడు. వీర్యవాన్ = పరాక్రమవంతుడు.

తా. లక్ష్మణు డను పేరు గల ఈతడు నా తమ్ముడు. మంచి శీలము కలవాడు. చూచువారికి ఆనందము కలిగించువాడు. శోభ కలవాడు. వివాహము కానివాడు. పరాక్రమవంతుడు. 3

మూ. అపూర్వీ భార్యయా చార్థీ తరుణః ప్రియదర్శనః,
అనురూపశ్చ తే భర్తా రూపస్య చ భవిష్యతి. 4

ప్ర. అ. అపూర్వీ = పూర్వము భార్యాసౌఖ్యము తెలియనివాడు. భార్యయా = భార్యచేత, అర్థీ = కోరికగలవాడు, తరుణః = యువకుడు. ప్రియదర్శనః = ఆనందకరమైన దర్శనము గల వాడు. తే = నీయొక్క, రూపస్య = రూపమునకు, అనురూపః = తగిన, భర్తా = భర్తగా, భవిష్యతి = కాగలడు.

తా. ఇత డింతవరకు భార్యాసౌఖ్యము తెలియనివాడు. భార్య కావలె నను కోరిక గలవాడు. చూచుటకు అందమైన యువకుడు. ఇతడు నీ రూపమునకు తగిన భర్త కాగలడు. 4

మూ. ఏనం భజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ,
అసపత్నా వరారోహే మేరుమర్కప్రభా యథా. 5

ప్ర. అ. విశాలాక్షి = విశాలమైన నేత్రములు గలదానా ! వరారోహే = శ్రేష్ఠ మైన కటిప్రదేశము గలదానా! ఏనమ్ = ఈ, మమ భ్రాతరమ్ = నా సోదరుని, అర్కప్రభా = సూర్యుని కాంతి, మేరుం యథా = మేరు పర్వతమును వలె, అసపత్నా = సవతి బాధ లేనిదానవై, భజ = సేవించుము.

తా. అందమైన కటిప్రదేశము గల ఓ! విశాలాక్షీ! నా సోదరుడైన ఇతనిని

సూర్యుని కాంతి మేరుపర్వతమును ఆశ్రయించి నట్లు, సేవింపుము. నీకు సవతి బాధ ఉండదు. 5

మూ. ఇతి రామేణ సా ప్రోక్తా రాక్షసీ కామమోహితా,
విసృజ్య రామం సహసా తతో లక్ష్మణమబ్రవీత్. 6

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఇతి = ఇట్లు, ప్రోక్తా = పలకబడిన, రాక్షసీ = ఆ రాక్షసి, కామమోహితా = కామముచేత మోహితురాలై, సహసా = వెంటనే, రామమ్ = రాముణ్ణి, విసృజ్య = విడచి, తతః = పిమ్మట, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. కామమోహితురాలైన ఆ రాక్షసస్త్రీ రాముని మాటలు విని, వెంటనే రాముణ్ణి విడచి లక్ష్మణుని వద్దకు వెళ్ళి ఇట్లు పలికెను. 6

మూ. అస్య రూపస్య తే యుక్తా భార్యాహం వరవర్ణినీ,
మయా సహ సుఖం సర్వాన్ దణ్డకాన్ విచరిష్యసి. 7

ప్ర. అ. తే = నీయొక్క, అస్య రూపస్య = ఈ రూపమునకు, వరవర్ణినీ = శ్రేష్ఠమైన వర్ణము గల, అహమ్ = నేను, యుక్తా = తగిన, భార్యా = భార్యను. మయా సహ = నాతోకూడ, సుఖమ్ = సుఖముగా, దణ్డకాన్ = దండకారణ్యమును, విచరిష్యసి = సంచరించగలవు.

తా. నీ కున్న ఈ సౌందర్యానికి మంచి శరీరచ్ఛాయ గల నేనే తగిన భార్యను. నీవు నాతో కూడ కలిసి, దండకారణ్యములో సంచరించగలవు. 7

మూ. ఏవముక్తస్తు సౌమిత్రీ రాక్షస్యా వాక్యకోవిదః,
తతః శూర్పణఖీం స్మిత్వా లక్ష్మణో యుక్తమబ్రవీత్. 8

ప్ర. అ. రాక్షస్యా = ఆ రాక్షసస్త్రీచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, వాక్యకోవిదః = వాక్యములను ఎరిగిన, సౌమిత్రిః = సుమిత్ర కుమారుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, తతః = అటు పిమ్మట, స్మిత్వా = చిరునవ్వు నవ్వి, శూర్పణఖీమ్ = శూర్పణఖను గూర్చి, యుక్తమ్ = యుక్తముగా, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాక్షసస్త్రీ మాటలు విని, మాటలలో నేర్పరి, సుమిత్ర కుమారుడు అయిన లక్ష్మణుడు చిరునవ్వు నవ్వి, ఆమెతో యుక్తముగా ఇట్లు పలికెను. 8

మూ. కథం దాసస్య మే దాసీ భార్యా భవితుమిచ్ఛసి,
సోఽహమార్యేణ పరవాన్ భ్రాత్రా కమలవర్ణిని. 9

ప్ర. అ. కమలవర్ణిని = పద్మము వంటి వర్ణము గలదానా ! దాసస్య = దాసుడనైన, మే = నాయొక్క, భార్యా = భార్యవై, దాసీ = దాసీగా, భవితుమ్ = అగుటకు, కథమ్ = ఎట్లు, ఇచ్ఛసి = కోరుచున్నావు. సః అహమ్ = అట్టి నేను, ఆర్యేణ = పూజ్యుడైన అన్నగారిచేత(కి), పరవాన్ = పరాధీనుడ నైన, భ్రాతా = సోదరుడను.

తా. పద్మము వంటి రంగు గలదానా ! నేను పూజ్యుడైన నా అన్నగారికి అధీనుడనైన సోదరుడను. దాసుడ నైన నాకు భార్యవై నీవు కూడ దాసి వగుటకు కోరుచున్నావేమి ? 9

మూ. సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితామలవర్ణినీ,
ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యా భవ యవీయసీ. 10

ప్ర. అ. విశాలాక్షి = విశాలమైన నేత్రములు గలదానా ! అమలవర్ణినీ = నిర్మలమైన వర్ణము గలదానవైన, త్వమ్ = నీవు, సమృద్ధార్థస్య = సమృద్ధమైన ప్రయోజనము గల, ఆర్యస్య = పూజ్యుడైన నా అన్నగారికి, యవీయసీ = చిన్న, భార్యా = భార్యవై, సిద్ధార్థా = సిద్ధించిన ప్రయోజనము కలదానవై, ముదితా = సంతోషించినదానవు, భవ = అగుము.

తా. ఓ ! విశాలాక్షీ ! నిర్మలమైన శరీరచ్ఛాయ గల నీవు, అన్ని విషయములందు సఫలుడైన మా అన్నగారి చిన్న భార్యవై, నీ కోరిక సిద్ధించగా, ఆనందించుము. 10

మూ. ఏనాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీమ్,
భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైష భజిష్యతి. 11

ప్ర. అ. ఏషః = ఈ రాముడు, విరూపామ్ = వికృతరూపము కలది, అసతీమ్ = చెడ్డది, కరాళామ్ = భయంకరురాలు, నిర్ణతోదరీమ్ = అణిగి పోయిన

ఉదరము గలది, వృద్ధామ్ = వృద్ధురాలు అయిన, ఏనామ్ = ఈ, భార్యామ్ = భార్యను, పరిత్యజ్య = విడచి, త్వామేవ = నిన్నే, భజిష్యతి = పొందగలడు.

తా. వికృతరూపముతో అణిగిపోయిన పొట్టతో భయంకరురాలుగా ఉన్న ఈ పెద్ద ముసలి భార్యను విడచి రాముడు నిన్నే పొందగలడు. 11

మూ. కో హి రూపమిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని,
మానుషీషు వరారోహే కుర్యాద్భావం విచక్షణః. 12

ప్ర. అ. వరవర్ణిని = శ్రేష్ఠమైన వర్ణము గలదానా ! వరారోహే = అందమైన కటిప్రదేశము గలదానా ! విచక్షణః = బుద్ధిమంతుడైన, కో హి = ఎవడు, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన, ఇదం రూపమ్ = ఈ రూపమును, సంత్యజ్య = విడచి, మానుషీషు = మనుష్యస్త్రీలయందు, భావమ్ = అభిప్రాయమును, కుర్యాత్ = చేయును ?

తా. ఉత్తమమైన రంగు, అందమైన కటిప్రదేశము కలదానా ! శ్రేష్ఠమైన ఇట్టి సౌందర్యమును విడచి, బుద్ధిమంతు డెవడైనా మనుష్యస్త్రీలయందు ఆసక్తుడగునా ! 12

మూ. ఇతి సా లక్ష్మణేనోక్తా కరాళా నిర్ణతోదరీ,
మన్యతే తద్వచ స్తథ్యం పరిహాసావిచక్షణా. 13

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఇతి = ఇట్లు, ఉక్తా = పలకబడినదై, కరాళా = భయంకరురాలూ, నిర్ణతోదరీ = వంగిన కడుపు కలది, పరిహాసావిచక్షణా = పరిహాసమునందు నేర్పు లేనిదీ అయిన, సా = ఆ శూర్పణఖ, తద్వచః = ఆ లక్ష్మణుని వచనమును, తథ్యమ్ = యథార్థమునుగా, మన్యతే = తలచెను.

తా. భయంకరురాలు, వంగిన పొట్ట గలదీ అయిన ఆ శూర్పణఖ, లక్ష్మణుని మాటలు విని, పరిహాసమునందు నేర్పు లేని దగుటచే, అది నిజమే అని తలచెను. 13

మూ. సా రామం పర్ణశాలాయాముపవిష్టం పరంతపమ్,
సీతయా సహ దుర్ధర్షమబ్రవీత్కామమోహితా. 14

ప్ర. అ. కామమోహితా = కామముచేత మోహితురాలైన, సా = ఆమె, సీతయా సహ = సీతతో కూడ, పర్ణశాలాయామ్ = పర్ణశాలయందు, ఉపవిష్టమ్ = కూర్చొనియున్న, పరంతపమ్ = శత్రుసంహారకుడైన, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని, రామమ్ = రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. కామమోహితురాలైన ఆ శూర్పణఖ, సీతాసమేతుడై పర్ణశాలలో కూర్చొని ఉన్న, శత్రుసంహారకుడు, ఎదిరింప శక్యము కానివాడు అయిన రాముని తో ఇట్లు పలికెను. 14

మూ. ఏనాం విరూపామసతీం కరాళాం నిర్ణతోదరీమ్,
వృద్ధాం భార్యామవష్టభ్య మాం న త్వం బహుమన్యసే. 15

ప్ర. అ. విరూపామ్=వికృతరూపము గలది, అసతీమ్=చెడ్డది, కరాళామ్ = భయంకరురాలుగా ఉన్నది. నిర్ణతోదరీమ్ = అణిగిపోయిన ఉదరము కలది, వృద్ధామ్ = వృద్ధురాలు అయిన, ఏనామ్ = ఈ, భార్యామ్ = భార్యను, అవష్టభ్య = ఊతగా గొని, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, న బహుమన్యసే = గౌరవించుటలేదు.

తా. నీ భార్య వికృతరూపవంతురాలు. చెడ్డది. భయంకరురాలు. అణగిన పొట్ట గలది. వృద్ధురాలు. ఇట్టి భార్యను చూచుకొని నీవు నన్ను గౌరవించుటలేదు.

మూ. అద్యేమాం భక్షయిష్యామి పశ్యత స్తవ మానుషీమ్,
త్వయా సహ చరిష్యామి నిఃసపత్నా యథాసుఖమ్. 16

ప్ర. అ. తవ = నీవు. పశ్యతః = చూచుచుండగనే, అద్య = ఇప్పుడు, ఇమామ్ = ఈ, మానుషీమ్ = మనుష్యస్త్రీని, భక్షయిష్యామి = భక్షించెదను. నిఃసపత్నా = సవతిలేనిదాననై, త్వయా సహ = నీతో కూడ, యథాసుఖమ్ = సుఖముగా, చరిష్యామి = సంచరించెదను.

తా. నీవు చూచుచుండగనే ఇప్పుడు ఈ మనుష్యస్త్రీని భక్షించెదను. సవతి పోరు లేకుండగా చేసికొని నీతో సుఖముగా విహరించెదను. 16

మూ. ఇత్యుక్త్వా మృగశాబాక్షీమలాతసదృశేక్షణా,
అభ్యధావత్సుసంక్రుద్ధా మహోల్కా రోహిణీమివ. 17

ప్ర. అ. అలాతసదృశేక్షణా = కొరవి వంటి నేత్రములు గల ఆ శూర్పణఖ, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, సుసంక్రుద్ధా = చాల కోపించినదై, మహోల్కా = పెద్ద ఉల్క (ఆకాశమునుండి పడే కొరవి), రోహిణీమివ = రోహిణిని వలె, మృగశాబాక్షీమ్ = లేడిపిల్ల వంటి నేత్రములు గల సీతను గూర్చి, అభ్యధావత్ = పరుగెత్తెను.

తా. కొరవి వంటి నేత్రములు గల ఆ శూర్పణఖ, ఇట్లు పలికి, మిక్కిలి కోపముతో, పెద్ద ఉల్క రోహిణిమీదకు వచ్చినట్లు, లేడి కళ్ల వంటి కళ్లు గల సీతమీదకు పరుగెత్తెను. 17

మూ. తాం మృత్యుపాశప్రతిమామాపతన్తీం మహాబలః,
నిగృహ్య రామః కుపితస్తతో లక్ష్మణమబ్రవీత్. 18

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, రామః = రాముడు, కుపితః = కోపించినవాడై, ఆపతన్తీమ్ = వచ్చి మీద పడుచున్న, మృత్యుపాశప్రతిమామ్ = మృత్యుపాశముతో సమానురాలైన, తామ్ = ఆమెను, నిగృహ్య = నిగ్రహించి, తతః = పిమ్మట, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మహాబలశాలియైన రాముడు మృత్యుపాశము వలె వచ్చి మీద పడుచున్న, ఆమెను అడ్డుకొని, లక్ష్మణునితో ఇట్లు పలికెను. 18

మూ. క్రూరైరనార్యైః సౌమిత్రే పరిహాసః కథంచన,
న కార్యః పశ్య వైదేహీం కథంచిత్సౌమ్య జీవతీమ్. 19

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! సౌమిత్రే = లక్ష్మణా! క్రూరైః = క్రూరులైన, అనార్యైః = చెడ్డవాళ్లతో, కథంచన = ఏ విధముగాను కూడ, పరిహాసః = పరిహాసము, న కార్యః = చేయ దగినది కాదు, కథంచిత్ = ఎట్లో, జీవతీమ్ = జీవించి యున్న, వైదేహీమ్ = సీతను, పశ్య = చూడుము.

తా. సౌమ్యా! లక్ష్మణా! క్రూరులైన చెడ్డవారితో ఎన్నడూ పరిహాసము చేయకూడదు. వైదేహి ఈమెచేతిలో మరణించవలసినది, ఎట్లో జీవించి ఉన్నది; చూడుము. 19

మూ. ఇమాం విరూపామసతీమతిమత్తాం మహోదరీమ్,
రాక్షసీం పురుషవ్యాఘ్ర విరూపయితుమర్హసి. 20

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = ఓ! పురుషశ్రేష్ఠుడా! విరూపామ్ = వికృత రూపము కలది, అసతీమ్ = చెడ్డది, అతిమత్తామ్ = మిక్కిలి మదించినది, మహోదరీమ్ = పెద్ద ఉదరముకలది అయిన, ఇమాం రాక్షసీమ్ = ఈ రాక్షసస్త్రీని, విరూపయితుమ్ = విరూపము కల దానినిగా చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ! పురుషశ్రేష్ఠుడా! ఈ రాక్షసస్త్రీ వికృతమైన రూపముతో, పెద్ద ఉదరముతో చాల మదించి ఉన్నది. చెడ్డ స్వభావము గలది. అందుచే ఈమె ఆకారమును అంగవిహీనమై వికృతముగా నుండు నట్లు చేయుము. 20

మూ. ఇత్యుక్తో లక్ష్మణస్తస్యాః క్రుద్ధో రామస్య పార్శ్వతః,
ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః. 21

ప్ర. అ. ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాబలః = గొప్ప బలము గల, లక్ష్మణః = లక్ష్మణుడు, క్రుద్ధః = కోపించినవాడై, రామస్య = రాముని యొక్క, పార్శ్వతః = పార్శ్వమునుండి, ఖడ్గమ్ = ఖడ్గమును, ఉద్ధృత్య = పైకి తీసి, తస్యాః = ఆమెయొక్క, కర్ణనాసమ్ = కర్ణములను, ముక్కును, చిచ్ఛేద = ఛేదించెను.

తా. మహాబలశాలి యైన లక్ష్మణుడు రాముని మాటలు విని, కోపించి, రాముని పార్శ్వమునందున్న ఖడ్గమును తీసికొని ఆమె ముక్కు, చెవులు కోసి వేసెను. 21

మూ. నికృత్తకర్ణనాసా తు విస్వరం సా వినద్య చ,
యథాగతం ప్రదుద్రావ ఘోరా శూర్పణఖా వనమ్. 22

ప్ర. అ. ఘోరా = భయంకరురాలైన, సా శూర్పణఖా = ఆ శూర్పణఖ, నికృత్తకర్ణనాసా = ఛేదింపబడిన చెవులు ముక్కు గలదై, విస్వరమ్ = వికృత స్వరము కలుగునట్లుగా, వినద్య చ = అరచి, యథాగతమ్ = వచ్చినట్లుగానే, వనమ్ = వనమును గూర్చి, ప్రదుద్రావ = పరుగెత్తెను.

తా. భయంకరురాలైన ఆ శూర్పణఖ, లక్ష్మణుడు ఆ విధముగా చెవులు, ముక్కు ఛేదించగా, వికృతస్వరముతో అరచుచు, వచ్చిన దారినే అడవిలోనికి పారిపోయెను. 22

మూ. సా విరూపా మహాఘోరా రాక్షసీ శోణితోక్షితా,
నానాద వివిధాన్నాదాన్ యథా ప్రావృషి తోయదః. 23

ప్ర. అ. విరూపా = వికృతమైన రూపము కలది, మహాఘోరా = చాల భయంకరముగా ఉన్నది, శోణితోక్షితా = రక్తముచేత తడపబడినది అయిన, సా రాక్షసీ = ఆ శూర్పణఖ, ప్రావృషి = వర్షకాలమునందు, తోయదః యథా = మేఘము వలె, వివిధాన్ = అనేకవిధములైన, నాదాన్ = ధ్వనులను, ననాద = అరచెను.

తా. అవయవములు ఛేదించుటచేత వికృతమైన ఆకారముతో చాల భయంకరముగా ఉన్న ఆ శూర్పణఖ, రక్తముతో తడియుచు, వర్షాకాలమేఘము వలె, అనేకవిధములైన ధ్వనులు కలుగునట్లు అరచెను. 23

మూ. సా విక్షరన్తీ రుధిరం బహుధా ఘోరదర్శనా,
ప్రగృహ్య బాహూ గర్జన్తీ ప్రవివేశ మహావనమ్. 24

ప్ర. అ. ఘోరదర్శనా = భయంకరమైన దర్శనము గల, సా = ఆమె, బహుధా = అనేకవిధములుగ, రుధిరమ్ = రక్తమును, విక్షరన్తీ = స్రవించుచు, బాహూ = బాహువులను, ప్రగృహ్య = పట్టుకొని, గర్జన్తీ = గర్జించుచున్నదై, మహావనమ్ = మహారణ్యమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. చూచుటకు భయంకరముగా ఉన్న ఆ శూర్పణఖ అనేకవిధముల రక్తము స్రవించుచు, బాహువులు పట్టుకొని, గర్జించుచు, మహారణ్యములోనికి ప్రవేశించెను. 24

మూ. తతస్తు సా రాక్షససంఘసంవృతం
ఖరం జనస్థానగతం విరూపితా,

ఉపేత్య తం భ్రాతరముగ్రదర్శనం
పపాత భూమౌ గగనాద్యథాశనిః. 25

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విరూపితా = విరూపము కలదిగా చేయబడిన, సా = ఆమె, రాక్షససంఘసంవృతమ్ = రాక్షసుల సముదాయముచేత ఆవరింపబడినవాడు, జనస్థానగతమ్ = జనస్థానములో ఉన్నవాడు, ఉగ్రదర్శనమ్ = భయంకరమైన దర్శనము గలవాడు అయిన, భ్రాతరమ్ = సోదరుడైన, తం ఖరమ్ = ఆ ఖరుణ్ణి, ఉపేత్య = సమీపించి, గగనాత్ = ఆకాశమునుండి, అశనిః యథా = పిడుగు వలె, భూమౌ = భూమిమీద, పపాత = పడెను.

తా. ఈ విధముగ అంగవికారము కలుగు నట్లు చేయబడిన ఆ శూర్పణఖ, జనస్థానములో రాక్షసుల సముదాయముతో కలిసి ఉన్న, చూచుటకు భయంకరుడైన, సోదరుడైన ఖరునివద్దకు వెళ్ళి ఆకాశమునుండి పిడుగు వలె నేలమీద వ్రాలెను. 25

మూ. తతః సభార్యం భయమోహమూర్ఛితా
సలక్ష్మణం రాఘవమాగతం వనమ్,
విరూపణం చాత్మని శోణితోక్షితా
శశంస సర్వం భగినీ ఖరస్య సా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టాదశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరస్య = ఖరునియొక్క, భగినీ = సోదరియైన, సా = ఆ శూర్పణఖ, భయమోహమూర్ఛితా = భయమోహములతో వ్యాప్తురాలై, శోణితోక్షితా = రక్తముచేత తడపబడినదై, వనమ్ = వనమును గూర్చి, ఆగతమ్ = వచ్చిన, సభార్యమ్ = భార్యతో కూడిన, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఆత్మని = తనయందు, విరూపణం చ = వికృతరూపము కలిగించుటనుగూర్చి, సర్వమ్ = సమస్తమును, శశంస = చెప్పెను.

తా. పిమ్మట, ఖరుని సోదరియైన ఆ శూర్పణఖ, భయమోహములతో వ్యాకులత చెందినదై, రక్తముతో తడిసినదై, రాముడు భార్యాలక్ష్మణులతో కలిసి అరణ్యమునకు వచ్చి నట్లును, తన అవయవములను ఛేదించినట్లును, అన్ని విషయములు ఆ ఖరునకు చెప్పెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో పద్దెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనవింశః సర్గః

[శూర్పణఖకు జరిగిన అవమానమును గుఱించి విని ఖరుడు రామాదులను చంప మని ఆదేశించి పదునలుగురు రాక్షసులను పంపుట.]

మూ. తాం తథా పతితాం దృష్ట్వా విరూపాం శోణితోక్షితామ్,
భగినీం క్రోధసంతప్తః ఖరః పప్రచ్ఛ రాక్షసః. 1

ప్ర. అ. తథా = ఆ విధముగా, పతితామ్ = నేలమీద పడిన, విరూపామ్ = అంగవిహీనమైన రూపము గల, శోణితోక్షితామ్ = రక్తముచేత తడపబడిన, తాం భగినీమ్ = ఆ సోదరిని, దృష్ట్వా = చూచి, రాక్షసః = రాక్షసుడైన, ఖరః = ఖరుడు, క్రోధసంతప్తః = క్రోధముచేత తపింపచేయబడినవాడై, పప్రచ్ఛ = అడిగెను.

తా. అంగవిహీనురాలై, రక్తము స్రవించుచు, ఆ విధముగా నేలపై పడిన సోదరియైన ఆ శూర్పణఖను చూచి రాక్షసుడైన ఖరుడు క్రోధముతో వ్యాకులుడై ప్రశ్నించెను.

మూ. ఉత్తిష్ఠ తావదాఖ్యాహి ప్రమోహం జహి సంభ్రమమ్,
వ్యక్తమాఖ్యాహి కేన త్వమేవంరూపా విరూపితా. 2

ప్ర. అ. ఉత్తిష్ఠ = లెమ్మ, ఆఖ్యాహి తావత్ = చెప్పుము; ప్రమోహమ్ = ·హమును, సంభ్రమమ్ = తొందరను, జహి = చంపుము; (విడిచిపెట్టుము). ం = నీవు, కేన = ఎవనిచేత, ఏవంరూపా = ఇట్టి రూపము గలదానవుగా, ·పితా = విరూపము కలదానవుగా చేయబడితివో, వ్యక్తమ్ = స్పష్టముగా, ·ఖ్యాహి = చెప్పుము.

తా. లెమ్మ, చెప్పుము. మోహమును, తొందరను విడచి, నీకు ఈ విధముగా అంగవైకల్యము కలిగించినవా డెవడో స్పష్టముగా చెప్పుము. 2

మూ. కః కృష్ణసర్పమాసీనమాశీవిషమనాగసమ్,
తుదత్యభిసమాపన్నమఙ్గుల్యగ్రేణ లీలయా. 3

ప్ర. అ. అభిసమాపన్నమ్ = సమీపమునందున్న, ఆశీవిషమ్ = కోరలలో విషము గల, అనాగసమ్ = అపరాధము లేని, ఆసీనమ్ = కూర్చొని ఉన్న, కృష్ణసర్పమ్ = త్రాచుపామును, కః = ఎవడు, లీలయా = లీలచేత, అఙ్గుల్యగ్రేణ = వ్రేలి కొనచేత, తుదతి = పీడించుచున్నాడు ?

తా. ఎట్టి బాధా కలిగించకుండా దగ్గర కూర్చొని ఉన్న, విషముతో నిండిన కోరలు గల త్రాచుపామును విలాసంగా వ్రేలి కొనతో పొడుచుచున్నవాడెవడు ? 3

మూ. కాలపాశం సమాసజ్య కణ్ఠే మోహాన్న జానతే,
యస్త్వామద్య సమాసాద్య పీతవాన్విషముత్తమమ్. 4

ప్ర. అ. యః = ఎవడు, అద్య = ఇప్పుడు, త్వామ్ = నిన్ను, సమాసాద్య = పొంది (స్పృశించి), ఉత్తమమ్ = ఉత్తమమైన, విషమ్ = విషమును, పీతవాన్ = త్రాగినాడో, అట్టి, కః = ఎవడు, కాలపాశమ్ = యమపాశమును, మోహాత్ = అజ్ఞానమువలన, కణ్ఠే = కంఠమునందు, సమాసజ్య = తగల్చుకొని, న జానతే = తెలుసుకొనకున్నాడు ?

తా. ఎవడు భయంకరమైన విషము త్రాగి, కాలపాశమును కంఠానికి తగల్చుకొని, అజ్ఞానమువలన తెలుసుకొనజాల కున్నాడో, నిన్ను అవమానించిన అట్టివాడు ఎవడు ? 4

మూ. బలవిక్రమసంపన్నా కామగా కామరూపిణీ,
ఇమామవస్థాం నీతా త్వం కేనాన్తకసమా గతా. 5

ప్ర. అ. బలవిక్రమసంపన్నా = బలముతోను పరాక్రమముతోను కూడిన దానవు, కామగా = స్వేచ్ఛగా సంచరించకలదానవు, కామరూపిణీ = స్వేచ్ఛా రూపము కలదానవు, అన్తకసమా = యమునితో సమానురాలవు అయిన, త్వమ్ = నీవు, గతా = వెళ్ళినదానవై, కేన = ఎవనిచేత, ఇమామ్ = ఈ, అవస్థామ్ = అవస్థను, నీతా = పొందించబడితివి ?

తా. నీవు బలపరాక్రమ సంపన్నురాలవు. స్వేచ్ఛగా సంచరించ గల దానవు. స్వేచ్ఛారూపము గలదానవు. యమునితో సమానురాలవు. అట్టి నీవు ఎవనివద్దకు వెళ్ళగా ఆతడు నీకు ఇట్టి అవస్థ కలిగించినాడు ? 5

మూ. దేవగన్ధర్వభూతానామృషీణాం చ మహాత్మనామ్,
కోఽయమేవం విరూపాం త్వాం మహావీర్యశ్చకార హ. 6

ప్ర. అ. దేవగన్ధర్వభూతానామ్ = దేవ-గంధర్వ-భూతములలోను, మహాత్మనామ్ = మహాత్ములైన, ఋషీణాం చ = ఋషులలోను, మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, కః = ఎవడు, త్వామ్ = నిన్ను, ఏవమ్ = ఇట్లు, విరూపామ్ = వికృతరూపము గలదానినిగా, చకార హ = చేసెను ?

తా. దేవ - గంధర్వ - భూతములలో గాని, మహాత్ములైన ఋషులలో గాని, మహాపరాక్రమవంతుడైన ఎవ్వడు నిన్ను ఈ విధముగ వికృతరూపము కలదానిని చేసినాడు ? 6

మూ. న హి పశ్యామ్యహం లోకే యః కుర్యాన్మమ విప్రియమ్,
అమరేషు సహస్రాక్షం మహేన్ద్రం పాకశాసనమ్. 7

ప్ర. అ. లోకే = లోకములో, యః = ఎవడు, మమ = నాకు, విప్రియమ్ = అపకారమును, కుర్యాత్ = చేయునో అట్టివానిని, అమరేషు = దేవతలలో, సహస్రాక్షమ్ = వేయి కన్నులు కలవాడు, పాకశాసనమ్ = పాకాసురుని సంహరించినవాడు అయిన, మహేన్ద్రమ్ = మహేంద్రుని కూడ, అహమ్ = నేను, న హి పశ్యామి = చూడను గదా.

తా. ఈ లోకములో నాకు అపకారము చేయగలిగిన వాడు ఎవ్వడూ నాకు కనబడడు. దేవతలలో సహస్రాక్షుడు, పాకాసురిని సంహరించినవాడు అయిన దేవేంద్రుడు కూడ నాకు అపకారము చేయ సాహసించడు. 7

మూ. అద్యాహం మార్గణైః ప్రాణానాదాస్యే జీవితాన్తకైః,
సలిలే క్షీరమాసక్తం నిష్పిబన్నివ సారసః. 8

ప్ర. అ. అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, సలిలే = ఉదకమునందు, ఆసక్తమ్ = కలపబడిన, క్షీరమ్ = పాలను, నిష్పిబన్ = త్రాగుచున్న, సారసః

ఇవ = సారసపక్షి వలె, జీవితాన్తకైః = ప్రాణములను నశింపచేయు, మార్గణైః = బాణములచేత, ప్రాణాన్ = ప్రాణములను, ఆదాస్యే = గ్రహించగలను.

తా. ఉదకములో కలిపిన పాలను సారసపక్షి త్రాగినట్లు, నేను ఇప్పుడు ప్రాణాంతకములైన బాణములచేత నిన్ను అవమానించిన వాని ప్రాణములను తీసివేసెదను. 8

మూ. నిహతస్య మయా సంఖ్యే శరసంకృత్తమర్మణః,
సఫేనం రుధిరం రక్తం మేదినీ కస్య పాస్యతి. 9

ప్ర. అ. మయా = నాచేత, సంఖ్యే = యుద్ధమునందు, నిహతస్య = చంపబడినవాడు, శరసంకృత్తమర్మణః = బాణములచేత ఛేదించబడిన మర్మస్థానములు కలవాడు అయిన, కస్య = ఎవనియొక్క, సఫేనమ్ = నురుగుతో కూడిన, రక్తమ్ = ఎఱ్ఱని, రుధిరమ్ = రక్తమును, మేదినీ = భూమి, పాస్యతి = త్రాగగలదు ?

తా. నేను యుద్ధములో బాణములచేత మర్మస్థానములను ఛేదించి, సంహరించిన ఎవని నురుగుతో నిండిన ఎఱ్ఱని రక్తమును భూమి త్రాగుటకు కోరుచున్నది ?

మూ. కస్య పత్రరథాః కాయాన్మాంసముత్కృత్య సంగతాః,
ప్రహృష్టా భక్షయిష్యన్తి నిహతస్య మయా రణే. 10

ప్ర. అ. మయా = నాచేత, రణే = యుద్ధమునందు, నిహతస్య = చంపబడిన, కస్య = ఎవనియొక్క, కాయాత్ = శరీరమునుండి, పత్రరథాః = పక్షులు, సంగతాః = గుమిగూడినవై, ప్రహృష్టాః = సంతోషించినవై, మాంసమ్ = మాంసమును, ఉత్కృత్య = పెకలించి, భక్షయిష్యన్తి = భక్షించగలవు ?

తా. పక్షు లన్నీ గుమిగూడి, సంతోషించుచు, నాచేత చంపబడిన ఎవని శరీరమునుండి మాంసమును పెకలించి భక్షించవలెను ? 10

మూ. తం న దేవా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః,
మయాపకృష్టం కృపణం శక్తాస్త్రాతుమిహాహవే. 11

ప్ర. అ. ఇహ = ఇప్పుడు, ఆహవే = యుద్ధమునందు, మయా = నాచేత, అపకృష్టమ్ = ఈడ్చబడిన, తం కృపణమ్ = ఆ దీనుణ్ణి, త్రాతుమ్ = రక్షించుటకు, దేవాః = దేవతలు, న శక్తాః = సమర్థులు కారు. పిశాచాః = పిశాచములు, న = సమర్థులు కారు; గన్ధర్వాః = గంధర్వులు, న = కారు; రాక్షసాః = రాక్షసులు, న = కారు.

తా. నేనిప్పుడు యుద్ధములో ఎవనిని క్రిందికి పడవేసి ఈడ్చెదనో వానిని దేవతలు గాని, గంధర్వులు గాని, పిశాచములు గాని, రాక్షసులు గాని రక్షింప జాలరు. 11

మూ. ఉపలభ్య శనైః సంజ్ఞాం తం మే శంసితుమర్హసి,
యేన త్వం దుర్వినీతేన వనే విక్రమ్య నిర్జితా. 12

ప్ర. అ. దుర్వినీతేన = చెడ్డవాడైన, యేన = ఎవనిచేత, త్వమ్ = నీవు, విక్రమ్య = పరాక్రమించి, వనే = వనమునందు, నిర్జితా = జయింపబడితివో, తమ్ = వానిని గూర్చి, శనైః = మెల్లగా, సంజ్ఞామ్ = సంజ్ఞను, లబ్ధ్వా = పొంది, మే = నాకు, శంసితుమ్ = చెప్పుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. నీవు మెల్లగా కోలుకొని, ఏ దురాత్ముడు నిన్ను పరాక్రమముచేత వనములో జయించినాడో చెప్పుము. 12

మూ. ఇతి భ్రాతుర్వచః శ్రుత్వా క్రుద్ధస్య చ విశేషతః,
తతః శూర్పణఖా వాక్యం సబాష్పమిదమబ్రవీత్. 13

ప్ర. అ. భ్రాతుః = సోదరునియొక్క, విశేషతః = విశేషించి, క్రుద్ధస్య = కోపించిన ఆతనియొక్క, ఇతి = ఇట్లు, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, తతః = అటుపిమ్మట, శూర్పణఖా = శూర్పణఖ, సబాష్పమ్ = కన్నీటితో కూడి నట్లుగా, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శూర్పణఖ సోదరుని మాటలు, విశేషించి కోపించిన సోదరుని మాటలు విని, కన్నీళ్లు కార్చుచు ఇట్లు పలికెను. 13

మూ. తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ,
పుణ్డరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినామ్బరౌ. 14

ఫలమూలాశనౌ దాన్తౌ తాపసౌ ధర్మచారిణౌ,
పుత్రౌ దశరథస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ. 15

ప్ర. అ. తరుణౌ=యువకులు, రూపసంపన్నౌ=సౌందర్యముతో కూడిన వారు, సుకుమారౌ = సుకుమారులు, మహాబలౌ = గొప్ప బలము గలవారు, పుణ్డరీకవిశాలాక్షౌ = పద్మముల వంటి విశాలనేత్రములు గలవారు, చీరకృష్ణాజినామ్బరౌ = నారచీరలు కృష్ణాజినము వస్త్రములుగా కలవారు, ఫలమూలాశనౌ = ఫలములను దుంపలను తినువారు, దాన్తౌ = ఇంద్రియనిగ్రహవంతులు, తాపసౌ =మునులు, ధర్మచారిణౌ = ధర్మమును ఆచరించువారు, దశరథస్య=దశరథుని యొక్క, పుత్రౌ = పుత్రులు అయిన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణు లను, భ్రాతరౌ = సోదరులు, ఆస్తామ్ = ఉండిరి (ఉన్నారు).

తా. దశరథుని కుమారులైన రామలక్ష్మణు లనే సోదరులు ఇద్దరు ఉన్నారు. వాళ్ళు యువకులు; అందమైనవాళ్ళు; సుకుమారులు; బలశాలులు; పద్మముల వలె విశాలములైన నేత్రములు కలవారు. వాళ్ళు నారచీరలను, కృష్ణాజినమును వస్త్రములుగా ధరించి, ఫలమూలములను మాత్రమే తినుచు ఇంద్రియ నిగ్రహముతో ధర్మము నాచరించుచున్న మునులు. 14, 15

మూ. గన్ధర్వరాజప్రతిమౌ పార్థివవ్యఞ్జనాన్వితౌ,
దేవౌ వా మానుషౌ వా తౌ న తర్కయితుముత్సహే. 16

ప్ర. అ. గన్ధర్వరాజప్రతిమౌ=గంధర్వరాజుతో సమానులు, పార్థివవ్యఞ్జనాన్వితౌ = రాజచిహ్నములతో కూడినవారు అయిన, తౌ = వారిరువురు, దేవౌ వా = దేవతలో, మానుషౌ వా = మనుష్యులో, తర్కయితుమ్ = ఊహించుటకు, న ఉత్సహే = సమర్థురాలను కాను.

తా. రాజలక్షణములు కలిగి యుండి గంధర్వరాజుతో సమానులైన ఆ ఇద్దరూ, దేవతలో మనుష్యులో నేను చెప్పజాలను. 16

మూ. తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా,
దృష్టా తత్ర మయా నారీ తయోర్మధ్యే సుమధ్యమా. 17

ప్ర. అ. తత్ర = అక్కడ, తయోః = వారిద్దరియొక్క, మధ్యే = మధ్య

యందు, తరుణీ = యువతి, రూపసంపన్నా = సౌందర్యసంపన్నురాలు, సర్వాభరణభూషితా = సకలాలంకారములచే అలంకరించబడినది, సుమధ్యమా = మంచి నడుముకలది అయిన, నారీ = స్త్రీ, దృష్టా = చూడబడినది.

తా. అక్కడ వారిరువురి మధ్య సౌందర్యవతియైన ఒక యువతిని చూచితిని. అందమైన నడుము గల ఆమె సకలాలంకారములు అలంకరించుకొని ఉన్నది. 17

మూ. తాభ్యాముభాభ్యాం సంభూయ ప్రమదామధికృత్య తామ్,
ఇమామవస్థాం నీతాహం యథానాథా సతీ తథా. 18

ప్ర. అ. తామ్ = ఆ, ప్రమదామ్ అధికృత్య = స్త్రీని గూర్చి, తాభ్యామ్ = ఆ, ఉభాభ్యామ్ = ఇద్దరిచేత, అహమ్ = నేను, అనాథా సతీ యథా = రక్షకుడు లేనిది ఎట్లో, తథా = అట్లు, ఇమామ్ = ఈ, అవస్థామ్ = అవస్థను, నీతా = పొందింపబడితిని. 18

తా. ఆ స్త్రీ మూలమున వాళ్ళిద్దరూ కలిసి, రక్షకు లెవ్వరూ లేని స్త్రీకి చేసినట్లు నాకు ఇట్టి అవస్థను కలిగించినారు. 18

మూ. తస్యాశ్చానృజువృత్తాయా స్తయోశ్చ హతయోరహమ్,
సఫేనం పాతుమిచ్ఛామి రుధిరం రణమూర్ధని. 19

ప్ర. అ. అహమ్ = నేను, రణమూర్ధని = యుద్ధరంగము అగ్రభాగమునందు, అనృజువృత్తాయాః = కుటిలమైన ప్రవృత్తిగల, తస్యాః చ = ఆ స్త్రీయొక్క, హతయోః = చంపబడిన, తయోశ్చ = ఆ ఇద్దరియొక్క, సఫేనమ్ = నురుగుతో కూడిన, రుధిరమ్ = రక్తమును, పాతుమ్ = త్రాగుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. కుటిలమైన ప్రవృత్తి గల ఆ స్త్రీని, ఆ ఇద్దరినీ చంపగా, రణరంగము అగ్రభాగమునందు, వాళ్ల, నురుగుతో నిండిన క్రొత్త రక్తమును త్రాగవలెనని నేను కోరుచున్నాను. 19

మూ. ఏష మే ప్రథమః కామః కృతస్తాత త్వయా భవేత్,
తస్యాస్తయోశ్చ రుధిరం పిబేయమహమాహవే. 20

ప్ర. అ. తాత = నాయనా! మే = నాయొక్క, ఏషః = ఈ, ప్రథమః = మొట్టమొదటి, కామః = కోరిక, త్వయా = నీచేత, కృతః = చేయబడినది, భవేత్ = అగుగాక. అహమ్ = నేను, ఆహవే = యుద్ధమునందు, తస్యాః = ఆ స్త్రీయొక్క, తయోశ్చ = ఆ ఇద్దరియొక్క, రుధిరమ్ = రక్తమును, పిబేయమ్ = త్రాగుదును గాక.

తా. నాయనా! నేను యుద్ధములో ఆ స్త్రీ రక్తమును, ఆ యువకు లిద్దరి రక్తమును త్రాగవలెను. నీవు నా మొట్టమొదటి కోరికను తీర్చవలెను. 20

మూ. ఇతి తస్యాం బ్రువాణాయాం చతుర్దశ మహాబలాన్,
వ్యాదిదేశ ఖరః క్రుద్ధో రాక్షసానన్తకోపమాన్. 21

ప్ర. అ. తస్యామ్ = ఆమె, ఇతి = ఇట్లు, బ్రువాణాయామ్ = పలుకు చుండగా, ఖరః = ఖరుడు, క్రుద్ధః = కోపించినవాడై, మహాబలాన్ = గొప్ప బలము గల, అన్తకోపమాన్ = యమునితో సమానులైన, చతుర్దశ రాక్షసాన్ = పదు నలుగురు రాక్షసులను, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. ఆమె మాటలు విని ఖరుడు కోపించినవాడై, మహాబలవంతులు, యమునితో సమానులు అయిన పదునలుగురు రాక్షసులను ఆజ్ఞాపించెను. 21

మూ. మానుషౌ శస్త్రసంపన్నౌ చీరకృష్ణాజినామ్బరౌ,
ప్రవిష్టౌ దణ్డకారణ్యం ఘోరం ప్రమదయా సహ. 22

ప్ర. అ. శస్త్రసంపన్నౌ = ఆయుధములతో కూడినవారు, చీరకృష్ణాజినామ్బరౌ = నారచీరలు, కృష్ణాజినములు వస్త్రములుగా కలవారు అయిన, మానుషౌ = ఇద్దరు మనుష్యులు, ప్రమదయా సహ = స్త్రీతో కూడ, ఘోరమ్ = భయంకరమైన, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, ప్రవిష్టౌ = ప్రవేశించినారు.

తా. నారచీరలు, కృష్ణాజినములు వస్త్రములుగా ధరించిన ఇద్దరు మానవులు, శస్త్రములు ధరించి ఒక స్త్రీతో కూడ ఘోరమైన దండకారణ్యములో ప్రవేశించినారట. 22

మూ. తౌ హత్వా తాంచ దుర్వృత్తామపావర్తితుమర్హథ,
ఇయం చ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి. 23

ప్ర. అ. తౌ = పౌరిద్దరిని, దుర్వృత్తామ్ = చెడ్డ నడవడిక గల, తాం చ = ఆ స్త్రీని, హత్వా = చంపి, అపావర్తితుమ్ = తిరిగి వచ్చుటకు, అర్హథ = తగుదురు. మమ = నాయొక్క, ఇయం భగినీ = ఈ సోదరి, తేషామ్ = వారి యొక్క, రుధిరమ్ = రక్తమును, పాస్యతి = త్రాగగలదు.

తా. ఆ మానవు లిద్దరిని, చెడ్డ నడవడిక గల ఆ స్త్రీని చంపి తిరిగిరండి. నా సోదరి యైన ఈమె వాళ్ల రక్తము త్రాగగలదు. 23

మూ. మనోరథోఽయమిష్టోఽస్యా భగిన్యా మమ రాక్షసాః,
శీఘ్రం సంపాద్యతాం తౌ చ ప్రమథ్య స్వేన తేజసా. 24

ప్ర. అ. రాక్షసాః = రాక్షసులారా ! స్వేన = మీ సంబంధమైన, తేజసా = తేజస్సుచేత, తౌ = వాళ్ళిద్దరిని, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రమథ్య = నశింప జేసి, అస్యాః = ఈ, మమ భగిన్యాః = నా సోదరియొక్క, ఇష్టః = ఇష్టమైన, మనోరథః = మనోరథము, శీఘ్రమ్ = శీఘ్రముగా, సంపాద్యతామ్=సంపాదింప బడుగాక.

తా. ఓ ! రాక్షసులారా ! మీ పరాక్రమముచేత ఆ మానవు లిద్దరినీ శీఘ్రముగా సంహరించి, ఈ నా సోదరి కిష్టమైన కోరికను తీర్చండి. 24

మూ. ఇతి ప్రతిసమాదిష్టా రాక్షసాస్తే చతుర్దశ,
తత్ర జగ్ముస్తయా సార్ధం ఘనా వాతేరితా యథా. 25

ప్ర. అ. ఇతి = ఇట్లు, ప్రతిసమాదిష్టాః = ఆజ్ఞాపింపబడిన, తే = ఆ, చతుర్దశ = పదునలుగురు, రాక్షసాః = రాక్షసులు, తయా సార్ధమ్ = ఆ శూర్పణఖతో కూడ, వాతేరితాః = వాయువుచేత ప్రేరేపింపబడిన, ఘనాః యథా = మేఘములువలె, తత్ర = అచటకు, జగ్ముః = వెళ్ళిరి.

తా. ఖరు డీ విధముగ ఆజ్ఞాపింపగా ఆ పదునలుగురు రాక్షసులు, గాలిచేత ఎగురగొట్టబడిన మేఘములు వలె ఆ శూర్పణఖతో కూడ వెళ్ళిరి. 25

మూ. తతస్తు తే తం సముదగ్రతేజసం
తథాపి తీక్ష్ణప్రదరా నిశాచరాః,

న శేకురేనం సహసా ప్రమర్దితుం
వనద్విపా దీప్తమివాగ్నిముత్థితమ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తథా = అట్లు, తీక్ష్ణప్రదరాః = తీక్ష్ణమైన బాణములు కలవారైనను, తే నిశాచరాః = ఆ రాక్షసులు, వనద్విపాః = వనమునందలి ఏనుగులు, ఉత్థితమ్ = లేచిన, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, అగ్నిమ్ ఇవ = అగ్నిని వలె, సముదగ్రతేజసమ్ = తీక్ష్ణమైన తేజస్సుగల, తమ్ = ఆ, ఏనమ్ = ఈ రాముని, సహసా = శీఘ్రముగా, ప్రమర్దితుమ్ = కొట్టుటకు, న శేకుః = సమర్థులు కాలేదు.

తా. పిమ్మట ఆ రాక్షసులు, తమ వద్ద తీక్ష్ణములైన బాణము లున్నా కూడ, తీవ్రమైన తేజస్సు గల ఆ రాముణ్ణి, అరణ్యగజములు పైకి లేచి ప్రజ్వలించుచున్న అగ్నిని వలె, వెంటనే ఎదిరింపజాలక పోయిరి.

వి. ఈ శ్లోకం ఇక్కడ అసంగతంగా ఉన్నది. ఇంకా ఈ రాక్షసులకు శూర్పణఖ రాముణ్ణి చూపవలసి ఉన్నది. రాముడు బైటకు రావలసి ఉన్నది. ఈ లోపుగా ఈ శ్లోకములో వాళ్లు రాముణ్ణి ఎదిరించ జాలకపోయిరి అని చెప్పుట అసంగతము కదా? రాబోయే సర్గలోని కథను సూచించడం వెనుకటిసర్గ చివర జరుగుతుంది. కాని ఈ విధంగా ఉండదు. అందుచేతనే గోరఖ్‌పూర్‌ప్రతిలో ఈ శ్లోకంలేదు. ప్రాచ్యప్రతిలో ఇదే వృత్తములో సర్గాంతశ్లోకం ఉన్నది కాని "వాళ్ళు ఆమెతో వెళ్ళినారు"అని మాత్రమే మరల చెప్పబడినది. 26

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో పందొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ వింశః సర్గః

[ఖరుడు పంపిన పదునలుగురు రాక్షసులను రాముడు సంహరించుట].

మూ. తతః శూర్పణఖా ఘోరా రాఘవాశ్రమమాగతా,
రాక్షసానాచచక్షే తౌ భ్రాతరౌ సహ సీతయా. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ఘోరా=భయంకరురాలైన, శూర్పణఖా =శూర్పణఖ, రాఘవాశ్రమమ్=రాముని ఆశ్రమమును గూర్చి, ఆగతా=వచ్చినదై, రాక్షసాన్=రాక్షసులనుగూర్చి, సహ సీతయా=సీతతో కూడ, భ్రాతరౌ సోదరులైన, తౌ=ఆ రామలక్ష్మణులను గూర్చి, ఆచచక్షే=చెప్పెను.

తా. పిమ్మట భయంకరురాలైన ఆ శూర్పణఖ రాముని ఆశ్రమమునకు వెళ్ళి సీతను, రామలక్ష్మణులను ఆ రాక్షసులకు చూపెను. 1

మూ. తే రామం పర్ణశాలాయాముపవిష్టం మహాబలమ్,
దదృశుః సీతయా సార్ధం వైదేహ్యా లక్ష్మణేన చ. 2

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, వైదేహ్యా=విదేహరాజకుమారియైన, సీతయా సార్ధమ్=సీతతోను, లక్ష్మణేన చ=లక్ష్మణునితోను, పర్ణశాలాయామ్=పర్ణశాలయందు, ఉపవిష్టమ్=కూర్చున్న, మహాబలమ్=గొప్ప బలము గల, రామమ్ =రాముణ్ణి, దదృశుః=చూచిరి.

తా. ఆ రాక్షసులు, జనకరాజపుత్రి యైన సీతతోను, లక్ష్మణునితోను పర్ణశాలలో కూర్చొని ఉన్న మహాబలశాలియైన రాముణ్ణి చూచిరి. 2

మూ. తాన్ దృష్ట్వా రాఘవః శ్రీమానాగతాన్ తాం చ రాక్షసీమ్,
అబ్రవీద్భ్రాతరం రామో లక్ష్మణం దీప్తతేజసమ్. 3

ప్ర. అ. శ్రీమాన్ = శోభగల, రాఘవః=రఘువంశ సంజాతుడైన,

రామః = రాముడు, ఆగతాన్ = వచ్చిన, తాన్ = ఆ రాక్షసులను, తాం రాక్షసీం చ = ఆ రాక్షసిని, దృష్ట్వా = చూచి, దీప్తతేజసమ్ = ప్రజ్వలించుచున్న కాంతి గల, భ్రాతరమ్ = సోదరుడైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రీమంతుడు, రఘువంశసంజాతుడు అయిన రాముడు వచ్చిన ఆ రాక్షసులను, ఆ రాక్షసిని చూచి, తేజస్సుతో ప్రజ్వలించుచున్న తమ్ముడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 3

మూ. ముహూర్తం భవ సౌమిత్రే సీతాయాః ప్రత్యనన్తరః,
ఇమానస్యా వధిష్యామి పదవీమాగతానిహ. 4

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! ముహూర్తమ్ = ముహూర్తకాలమును, సీతాయాః = సీతకు, ప్రత్యనన్తరః = సమీపమునందు ఉన్నవాడవు, భవ = అగుము. అస్యాః = ఈ రాక్షసియొక్క, పదవీమ్ = మార్గమును అనుసరించి, ఇహ = ఇక్కడికి, ఆగతాన్ = వచ్చిన, ఇమాన్ = ఈ రాక్షసులను, వధిష్యామి = చంపగలను.

తా. లక్ష్మణా ! ముహూర్తకాలము పాటు సీత దగ్గర ఉండి ఆమెను రక్షించుము. ఈ రాక్షసిని అనుసరించి ఇక్కడికి వచ్చిన ఈ రాక్షసులను చంపెదను. 4

మూ. వాక్యమేతత్తతః శ్రుత్వా రామస్య విదితాత్మనః,
తథేతి లక్ష్మణో వాక్యం రామస్య ప్రత్యపూజయత్. 5

ప్ర. అ. తతః = అటు పిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, విదితాత్మనః = ప్రసిద్ధమైన బుద్ధి గల, రామస్య = రామునియొక్క, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తథేతి = అటులనే చేసెదను అని, రామస్య = రామునియొక్క, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యపూజయత్ = పూజించెను.

తా. పిమ్మట లక్ష్మణుడు, ప్రసిద్ధమైన బుద్ధి గల రాముని మాటలు విని, "అట్లులనే చేసెదను"అని పలుకుచు ఆ రాముని వాక్యమును గౌరవించెను. 5

మూ. రాఘవోఽపి మహచ్చాపం చామీకరవిభూషితమ్,
చకార సజ్యం ధర్మాత్మా తాని రక్షాంసి చాబ్రవీత్. 6

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాఘవోఽపి = రాముడు, చామీకర విభూషితమ్ = బంగారముచేత అలంకరించబడిన, మహత్ = గొప్పదైన, చాపమ్ = ధనస్సును, సజ్యమ్ = నారితో కూడినదానినిగా, చకార = చేసెను. తాని = ఆ, రక్షాంసి = రాక్షసులను గూర్చి, అబ్రవీత్ చ = పలికెను.

తా. ధర్మాత్ముడైన రాముడు బంగారముతో అలంకరించబడిన గొప్ప ధనస్సుకు నారి కట్టి, ఆ రాక్షసులతో ఇట్లు పలికెను. 6

మూ. పుత్రౌ దశరథస్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ,
ప్రవిష్టౌ సీతయా సార్ధం దుశ్చరం దణ్డకావనమ్. 7

ప్ర. అ. అవామ్ = మేమిద్దరము, దశరథస్య = దశరథుని యొక్క, పుత్రౌ = పుత్రులము, భ్రాతరౌ = సోదరులము అయిన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులము. సీతయా సార్ధమ్ = సీతతో కూడ, దుశ్చరమ్ = సంచరింప శక్యము కాని, దణ్డకావనమ్ = దండకారణ్యమును, ప్రవిష్టౌ = ప్రవేశించినాము.

తా. రామలక్ష్మణు లను పేర్లు గల మే మిద్దరము దశరథుని కుమారులము. సంచరించుటకు చాల కష్ట మైన ఈ దండకారణ్యములోనికి సీతతో కూడ ప్రవేశించినాము. 7

మూ. ఫలమూలాశనౌ దాన్తౌ తాపసౌ ధర్మచారిణౌ,
వసన్తౌ దణ్డకారణ్యే కిమర్థముపహింసథ. 8

ప్ర. అ. ఫలమూలాశినౌ = ఫలములను మూలములను తినుచున్నవారము. దాన్తౌ = ఇంద్రియనిగ్రహము కలవారము, ధర్మచారిణౌ = ధర్మమును ఆచరించుచున్నవారము, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, వసన్తౌ = నివసించుచున్నవారము, తాపసౌ = మునులము అయిన మమ్ము, కిమర్థమ్ = ఎందుకు ఉపహింసథ = బాధపెట్టుచున్నారు

తా. ఫలములను మూలములను భుజించుచు, ఇంద్రియనిగ్రహముతో

ధర్మమును ఆచరించుచు దండకారణ్యములో తాపసులుగా నివసించుచున్న మమ్ము లను మీ రెందుకు బాధించుచున్నారు? 8

మూ. యుష్మాన్ పాపాత్మకాన్ హన్తుం విప్రకారాన్మహాహవే,
ఋషీణాం తు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః. 9

ప్ర. అ. అహమ్ = నేను, పాపాత్మకాన్ = పాపాత్ములు, విప్రకారాన్ = అపకారము చేయువారు అయిన, యుష్మాన్ = మిమ్ములను, ఆహవే = యుద్ధము నందు, హన్తుమ్ = చంపుటకు, సశరాయుధః = శరీరములతో ఆయుధములతో కూడినవాడనై, ఋషీణామ్ = ఋషులయొక్క, నియోగేన = ఆజ్ఞచేత, ప్రాప్తః = వచ్చినాను.

తా. హింస చేయు పాపాత్ములైన మిమ్ములను యుద్ధములో చంపుటకై నేను ఋషుల ఆజ్ఞచే బాణములు, ఆయుధములు ధరించి వచ్చినాను. 9

మూ. తిష్ఠతైవాత్ర సందుష్టా నోపావర్తితుమర్హథ,
యది ప్రాణైరిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః. 10

ప్ర. అ. సందుష్టాః = దుష్టులైన, నిశాచరాః = రాక్షసులారా! అత్రైవ = ఇక్కడనే, తిష్ఠత = నిలబడండి. ఉపావర్తితుమ్ = తిరిగి వెళ్లుటకు, న అర్హథ = తగరు. యది వా = లేక, ప్రాణైః = ప్రాణములతో, అర్థః = ప్రయోజన మున్నచో, నివర్తధ్వమ్ = మరలిపొండి.

తా. చాలా దుష్టులైన ఓ! రాక్షసులారా! అక్కడనే నిలబడండి. తిరిగి వెళ్లకండి. ప్రాణాలమీద ఆశ ఉన్నచో తిరిగి వెళ్ళిపొండి. 10

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాస్తే చతుర్దశ,
ఊచుర్వాచం సుసంక్రుద్ధా బ్రహ్మఘ్నాః శూలపాణయః.

ప్ర. అ. తస్య = రామునియొక్క. తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, బ్రహ్మఘ్నాః = బ్రహ్మహత్యలు చేసినవాళ్ళు, శూలపాణయః = శూలములు హస్తములందు కలవాళ్లు అయిన, తే = ఆ, చతుర్దశ రాక్షసాః = పదు నలుగురు రాక్షసులు, సుసంక్రుద్ధాః = చాల కోపించినవారై, వాచమ్ = వాక్కును, ఊచుః = పలికిరి.

తా. శూలములు హస్తములలో ధరించిఉన్న, బ్రహ్మహత్యాపాతకులైన ఆ పదునలుగురు రాక్షసులు రాముని మాటలు విని, చాలా కోపించినవారై ఇట్లు పలికిరి. 11

మూ. క్రోధముత్పాద్య నో భర్తుః ఖరస్య సుమహాత్మనః,
త్వమేవ హాస్యసే ప్రాణానద్యాస్మాభిర్హతో యుధి. 12

ప్ర. అ. నః = మాయొక్క, భర్తుః = ప్రభువు, సుమహాత్మనః = చాల గొప్పవాడు అయిన, ఖరస్య = ఖరునకు, క్రోధమ్ = క్రోధమును, ఉత్పాద్య = పుట్టించి, అద్య = ఇప్పుడు, అస్మాభిః = మాచేత, యుధి = యుద్ధమునందు, హతః = చంపబడినవాడవై, త్వమేవ = నీవే, ప్రాణాన్ = ప్రాణములను, హాస్యసే = విడువగలవు.

తా. మా ప్రభువు, చాల గొప్పవాడు అయిన ఖరునకు కోపము కలిగించిన నీవే ఇప్పుడు మాచేత యుద్ధమునందు చంపబడి ప్రాణములు విడువగలవు.

మూ. కా హి తే శక్తిరేకస్య బహూనాం రణమూర్ధని,
అస్మాకమగ్రతః స్థాతుం కిం పునర్యోద్ధుమాహవే. 13

ప్ర. అ. బహూనామ్ = అనేకులమైన, అస్మాకమ్ = మాయొక్క, అగ్రతః = ఎదుట, రణమూర్ధని = రణాగ్రమునందు, స్థాతుమ్ = నిలచుటకు, ఏకస్య = ఒక్క, తే = నీకు, కా శక్తిః = ఏమి శక్తి ఉన్నది? ఆహవే = యుద్ధమునందు, యోద్ధుమ్ = యుద్ధముచేయుటకు, కిం పునః = చెప్పనేల?

తా. మా చాలామంది ముందు యుద్ధరంగాగ్రభాగమున నిలచుటకు ఏకాకివైన నీకు శక్తి ఎక్కడిది? నీవు రణములో మాతో యుద్ధము చేయుట కూడనా! 13

మూ. ఏహి బాహుప్రయుక్తైర్నః పరిఘైః శూలపట్టిసైః,
ప్రాణాంస్త్యక్షసి వీర్యం చ ధనుశ్చ కరపీడితమ్. 14

ప్ర. అ. ఏహి = రమ్ము. నః = మా యొక్క, బాహుప్రయుక్తైః = బాహువులచేత ప్రయోగింపబడిన, పరిఘైః = పరిఘలచేతను, శూలపట్టిసైః = శూలముల

చేతను, పట్టిసములచేతను, ప్రాణాన్ = ప్రాణములను, వీర్యం చ = పరాక్రమమును, కరపీడితమ్ = చేతిచేత పీడింపబడిన, ధనుశ్చ = ధనస్సును, త్యక్ష్యసి = విడువగలవు.

తా. మేము ప్రయోగించిన పరిఘలచేతను, శూలములచేతను, పట్టిసముల చేతను నీ ప్రాణములను, పరాక్రమమును, చేతిలో ధరించిన ధనస్సును కూడ విడచి వేసెదవులే. రమ్ము. 14

మూ. ఇత్యేవముక్త్వా సంక్రుద్ధా రాక్షసాస్తే చతుర్దశ,
చిక్షిపుస్తాని శూలాని రాఘవం ప్రతి దుర్జయమ్. 15

ప్ర. అ. సంక్రుద్ధాః = కోపించిన, తే = ఆ, చతుర్దశ రాక్షసాః = పదునలుగురు రాక్షసులు, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తాని శూలాని = ఆ శూలములను, దుర్జయమ్ = జయింప శక్యము కాని, రాఘవం ప్రతి = రాముణ్ణి గూర్చి, చిక్షిపుః = విసరిరి.

తా. ఆ పదునలుగురు రాక్షసులు కోపముతో ఇట్లు పలికి, శూలములను జయింపశక్యముకాని రాముని మీదికి ప్రయోగించిరి. 15

మూ. తాని శూలాని కాకుత్స్థః సమస్తాని చతుర్దశ,
తావద్భిరేవ చిచ్ఛేద శరైః కాఞ్చనభూషణైః. 16

తా. కాకుత్స్థః = రాముడు, చతుర్దశ = పదునాలుగు, తాని శూలాని = ఆ శూలములను, సమస్తాని = అన్నింటిని, తావద్భిః ఏవ = అన్నియే యైన, కాఞ్చనభూషణైః = బంగారు అలంకారములు గల, శరైః = బాణములచేత, చిచ్ఛేద = ఛేదించెను.

తా. ఆ పదునాలుగు శూలములను అన్నింటిని కూడ రాముడు బంగారు అలంకారము గల పదునాలుగు బాణములతో ఛేదించెను. 16

మూ. తతః పశ్చాన్మహాతేజా నారాచాన్ సూర్యసన్నిభాన్,
జగ్రాహ పరమక్రుద్ధశ్చతుర్దశ శిలాశితాన్. 17

ప్ర. అ. తతః పశ్చాత్ = అటు పిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు

గల రాముడు, పరమక్రుద్ధః = చాలా కోపించినవాడై, శిలాశితాన్ = జాతిపై సానబెట్టబడిన, సూర్యసన్నిభాన్ = సూర్యునితో సమానమైన, చతుర్దశ = పదు నాలుగు, నారాచాన్ = నారాచబాణములను, జగ్రాహ = గ్రహించెను.

తా. పిమ్మట మహాతేజఃశాలియైన రాముడు చాల క్రుద్ధుడై, జాతిపై సాన బెట్టిన, సూర్యుని వలె ప్రకాశించుచున్న పదునాలుగు నారాచబాణములు గ్రహించెను. 17

మూ. గృహీత్వా ధనురాయమ్య లక్ష్యానుద్దిశ్య రాక్షసాన్,
ముమోచ రాఘవో బాణాన్ వజ్రానివ శతక్రతుః. 18

ప్ర. అ. రాఘవః = రాముడు, ధనుః = ధనస్సును, గృహీత్వా = గ్రహించి, ఆయమ్య = వంచి, లక్ష్యాన్ = లక్ష్యమైన, రాక్షసాన్ = రాక్షసులను, ఉద్దిశ్య = ఉద్దేశించి, శతక్రతుః = దేవేంద్రుడు, వజ్రానివ = వజ్రములను వలె, బాణాన్ = బాణములను, ముమోచ = విడచెను.

తా. రాముడు ధనస్సు గ్రహించి, దానిని వంచి, రాక్షసులను గురి చూచి దేవేంద్రుడు వజ్రాయుధములను విడచి నట్లు బాణములను విడచెను.

మూ. రుక్మపుఙ్ఖాశ్చ విశిఖా దీప్తా హేమవిభూషితాః,
తే భిత్త్వా రక్షసాం వేగాద్వక్షాంసి రుధిరాప్లుతాః, 19
వినిష్పేతుస్తతో భూమౌ న్యమజ్జన్తాశనిస్వనాః.

ప్ర. అ. రుక్మపుఙ్ఖాః = బంగారు పొన్నులు గలవి, దీప్తాః = ప్రజ్వలించు చున్నవి, హేమవిభూషితాః = బంగారముచేత భూషింపబడినవి అయిన, తే విశిఖాః = ఆ బాణములు, వేగాత్ = వేగమువలన, రక్షసామ్ = రాక్షసులయొక్క, వక్షాంసి = వక్షః స్థలములను, భిత్త్వా = చేదించి, రుధిరాప్లుతాః = రక్తముచేత పూయబడినవై, తదా = అప్పుడు, వినిష్పేతుః = బైటకు వచ్చినవి. అశనిస్వనాః = ఉరుమువంటి ధ్వని గలవై, భూమౌ = నేలలో, న్యమజ్జన్త = భేదించుకొని మునిగిపోయినవి.

తా. బంగారు పొన్నులతో ప్రజ్వలించుచున్న, బంగారముచేత అలంక రింపబడిన ఆ బాణములు వేగముగా రాక్షసుల వక్షఃస్థలములను బేదించి, రక్తము

చేత తడపబడినవై, వాళ్ల శరీరములనుండి బైటకు వచ్చి, ఉరుమువంటి ధ్వనితో భూమిని భేదించుకొని దానిలో ప్రవేశించినవి. 19

మూ. తే భిన్నహృదయా భూమౌ ఛిన్నమూలా ఇవ ద్రుమాః,
నిపేతుః శోణితార్ద్రాఙ్గాః వికృతా విగతాసవః.

ప్ర. అ. తే = ఆ రాక్షసులు, భిన్నహృదయాః = బ్రద్దలు కొట్టబడిన హృదయములు కలవారై, శోణితార్ద్రాఙ్గాః = రక్తముచేత ఎఱ్ఱనైన శరీరములు కలవారై, వికృతాః = వికారము కలవారై, విగతాసవః = పోయిన ప్రాణములు కలవారై, ఛిన్నమూలాః = ఛేదింపబడిన మొదళ్లు గల, ద్రుమాః ఇవ = చెట్లువలె, భూమౌ = నేలపై, నిపేతుః = పడిపోయిరి.

తా. ఆ రాక్షసుల హృదయములు బ్రద్దలై పోయెను. శరీరములు రక్తముతో తడిసెను. ఈ విధముగ ఆ రాక్షసులు ప్రాణములు విడచి, వికృతరూపములతో మొదళ్లు నరికిన చెట్లవలె నేలపై పడిరి. 20

మూ. తాన్ దృష్ట్వా పతితాన్ భూమౌ రాక్షసీ క్రోధమూర్ఛితా,
పరిత్రస్తా పునస్తత్ర వ్యసృజద్భైరవస్వనాన్-

ప్ర. అ. భూమౌ = నేలపై, పతితాన్ = పడిపోయిన, తాన్ = వాళ్ళను, దృష్ట్వా = చూచి, రాక్షసీ = ఆ శూర్పణఖ, క్రోధమూర్ఛితా = క్రోధముచే వ్యాప్తురాలై, పరిత్రస్తా = భయబడినదై, తత్ర = అక్కడ, పునః = మరల, భైరవస్వనాన్ = భయంకర ధ్వనులను, వ్యసృజత్ = విడచెను.

తా. శూర్పణఖ నేలపై పడిపోయిన ఆ రాక్షసులను చూచి, కోపభయములతో అక్కడ మరల భయంకరములైన ధ్వనులను చేయుచు అరచెను. 21

మూ. ఉపగమ్య ఖరం సా తు కించిత్సంశుష్కశోణితా, 22
పపాత పునరేవార్తా సనిర్యాసేవ సల్లకీ.

ప్ర. అ. కించిత్ = కొంచెము, సంశుష్కశోణితా = ఎండిన రక్తముగలదై, సనిర్యాసా = జిగురుతో కూడిన, సల్లకీ ఇవ = లతవలె ఉన్న, సా తు =

ఆ శూర్పణఖ, ఆర్తా = దుఃఖితురాలై, ఖరమ్ = ఖరుణ్ణి, ఉపగమ్య = పొంది, పునరేవ = మరల, పపాత = నేలమీద పడెను.

తా. ఆ శూర్పణఖ కొంచెము ఎండిన రక్తముతో జిగురు కారుచున్న లత వలె మరల ఖరునివద్దకు వచ్చి దుఃఖితురాలై నేలమీద పడెను. 22

మూ. భ్రాతుః సమీపే శోకార్తా ససర్జ నినదం ముహుః, 23
సస్వరం ముముచే బాష్పం విషణ్ణవదనా తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, శోకార్తా = శోకముచేత పీడితురాలై, భ్రాతుః = సోదరునియొక్క, సమీపే = = సమీపమునందు, ముహుః = మాటిమాటికి, నినదమ్ = ధ్వనిని, ససర్జ = విడచెను. విషణ్ణవదనా = దిగులుచెందిన ముఖము గలదై, సస్వరమ్=స్వరముతో కూడినట్లుగా, బాష్పమ్ = కన్నీటిని, ముముచే= విడచెను.

తా. ఆమె సోదరుని దగ్గర బిగ్గరగా ఏడ్చుచు, దుఃఖపీడితురాలై, దిగులు చెందిన ముఖముతో కన్నీళ్ళు కార్చెను. 24

మూ. నిపాతితాన్ దృశ్య రణే తు రాక్షసాన్
ప్రధావితా శూర్పణఖా పునస్తతః,
వధం చ తేషాం నిఖిలేన రక్షసాం
శశంస సర్వం భగినీ ఖరస్య సా. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
వింశః సర్గః.

ప్ర. అ. శూర్పణఖా = శూర్పణఖ, రణే = యుద్ధమునందు, నిపాతితాన్ = పడగొట్టబడిన, రాక్షసాన్ = రాక్షసులను, దృశ్య = చూచి, పునః = మరల, తతః = అక్కడినుండి, ప్రధావితా = పరుగెత్తినది. భగినీ = ఖరుని సోదరియైన ఆమె, రక్షసామ్ = ఆ రాక్షసులయొక్క, వధమ్ = వధను గూర్చి, సర్వమ్ = సమస్తమును, నిఖిలేన = పూర్తిగా, ఖరస్య = ఖరునకు, శశంస = చెప్పెను.

తా. శూర్పణఖ ఆ రాక్షసులు రణమునందు చంపబడుట చూచి మరల పరుగెత్తి వెళ్లి, ఆ రాక్షసు లందరు మరణించిన విషయమును పూర్తిగా ఖరునకు చెప్పెను. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఇరువదవ సర్గ సమాప్తము.

# అథ ఏకవింశః సర్గః

[శూర్పణఖ రాక్షసుల వధను ఖరునకు తెలిపి, రామునివలన గొప్ప ఆపద సంభవించిన దని చెప్పుచు అతనిని యుద్ధానికై ప్రోత్స హించుట].

మూ. స పునః పతితాం దృష్ట్వా క్రోధాచ్ఛూర్పణఖాం ఖరః,
ఉవాచ వ్యక్తయా వాచా తామనర్థార్థమాగతామ్. 1

ప్ర. అ. సః ఖరః=ఆ ఖరుడు, పునః = మరల, పతితామ్=నేలపై పడిన, శూర్పణఖామ్ = శూర్పణఖను, దృష్ట్వా = చూచి, అనర్థార్థమ్ = అనర్థము కొరకై, ఆగతామ్ = వచ్చిన, తామ్ = ఆమెను గూర్చి, వ్యక్తయా = స్పష్టమైన, వాచా=వాక్కుతో, క్రోధాత్=కోపమువలన, ఉవాచ = పలికెను.

తా. ఆ ఖరుడు తనకు అనర్థము చేకూర్చుటకే మరల వచ్చి నేలమీద పడిన శూర్పణఖను చూచి, స్పష్టమైన మాటలో, కోపముతో ఇట్లు పలికెను. 1

మూ. మయాత్విదానీం శూరాస్తే రాక్షసా రుధిరాశనాః,
త్వత్ప్రియార్థం వినిర్దిష్టాః కిమర్థం రుద్యతే పునః. 2

ప్ర. అ. మయా = నాచేత, త్వత్ప్రియార్థమ్ = నీ ప్రియముకొరకు, ఇదానీమ్ = ఇప్పుడే, రుధిరాశనాః = రక్తము ఆహారముగా గల, శూరాః = శూరులైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, వినిర్దిష్టాః=ఆజ్ఞాపింపబడినారు. పునః= మరల, కిమర్థమ్ = ఎందుకు, రుద్యతే = రోదనము చేయబడుచున్నది ?

తా. నీకు ప్రియము చేకూర్చుటకై ఇప్పుడేకదా నేను, రక్తము త్రాగే శూరులైన రాక్షసులను పంపినాను ? ఎందుకు ఏడ్చుచున్నావు ? 2

మూ. భక్తాశ్చైవానురక్తాశ్చ హితాశ్చ మమ నిత్యశః,
హన్యమానా న హన్యన్తే న న కుర్యుర్వచో మమ. 3

ప్ర. అ. (ఆ రాక్షసులు) భక్తాశ్చైవ = భక్తులు, అనురక్తాశ్చ = నాపై ప్రేమగలవారు, నిత్యశః = ఎల్లప్పుడు, మమ = నాకు, హితాశ్చ = హితులు, హన్యమానాః = చంపబడుచున్న వారైనను, న హన్యన్తే = చంపబడరు. మమ = నాయొక్క, వచః = వచనమును, న న కుర్యుః = చేయరు అన్న మాట లేదు.

తా. ఆ రాక్షసులు స్వామిభక్తులు; ప్రేమ కలవారు; ఎల్లప్పుడు నా హితము కోరువారు. ఎవరు ఎంత ప్రయత్నించినను చంప శక్యము కానివారు. వాళ్ళు నా ఆజ్ఞను నిర్వర్తించకుండు ప్రసక్తియే లేదు. 3

మూ. కిమేతచ్ఛ్రోతుమిచ్ఛామి కారణం యత్కృతే పునః,
హా నాథేతి వినర్దన్తీ సర్పవల్లుఠసి క్షితౌ. 4

ప్ర. అ. యత్కృతే = దేనినిమిత్తమై, హా నాథ ఇతి = "హా నాథా"అని, వినర్దన్తీ = అరచుచున్నదానవై, పునః = మరల, సర్పవత్ = సర్పము వలె, క్షితౌ = భూమిపై, లుఠసి = దొర్లుచున్నావో, ఏతత్ = ఈ, కారణమ్ = కారణము, కిమ్ = ఏమో, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. నీవు మళ్ళీ వచ్చి "అయ్యో! నాథా!"అని అరచుచు సర్పము వలె నేలమీద దొర్లుటకు కారణ మేమో తెలిసికొనగోరుచున్నాను. 4

మూ. అనాథవద్విలపసి నాథే తు మయి సంస్థితే,
ఉత్తిష్ఠోత్తిష్ఠ మాభైషీర్వైక్లబ్యం త్యజ్యతామిహ. 5

ప్ర. అ. నాథే = రక్షకుడనైన, మయి = నేను, సంస్థితే = ఉండగా, అనాథవత్ = రక్షకుడు లేనిదానవు వలె, విలపసి = విలపించుచున్నావు, ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము; మాభైః షీ = భయపడకుము. ఇహ = ఇప్పుడు, వైక్లబ్యమ్ = మనోవైకల్యము, త్యజ్యతామ్ = విడువబడుగాక.

తా. నీకు రక్షకుడుగా నేను ఉండగా రక్షకుడు లేనిదానవు వలె ఏడ్చుచున్నా వేమి? లెమ్ము; లెమ్ము, భయపడకుము, అధైర్యమును విడువుము. 5

మూ. ఇత్యేవముక్తా దుర్ధర్షా ఖరేణ పరిసాన్త్వితా,
విమృజ్య నయనే సాస్రే ఖరం భ్రాతర మబ్రవీత్. 6

ప్ర. అ. ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడినదై, ఖరేణ = ఖరునిచేత, పరిసాన్త్వితా = ఓదార్చబడిన, దుర్ధర్షా = ఎదిరింప శక్యము కాని ఆ శూర్పణఖ, సాస్రే = కన్నీళ్లతో కూడిన, నయనే = నేత్రములను, విమృజ్య = తుడుచుకొని, భ్రాతరమ్ = సోదరుడైన, ఖరమ్ = ఖరుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఖరుడు ఈ విధముగ పలుకుచు ఓదార్చగా, ఎదిరింప శక్యము కాని ఆ శూర్పణఖ కన్నీళ్ళు తుడుచుకొనుచు, సోదరుడైన ఆ ఖరునితో ఇట్లనెను. 6

మూ. అస్మీదానీమహం ప్రాప్తా హృతశ్రవణనాసికా,
శోణితౌఘపరిక్లిన్నా త్వయా చ పరిసాన్త్వితా. 7

ప్ర. అ. హృతశ్రవణనాసికా = హరించబడిన చెవులు, ముక్కు గల, అహమ్ = నేను, శోణితౌఘపరిక్లిన్నా = రక్తప్రవాహముచేత తడిసినదాననై, ఇదానీమ్=ఇప్పుడు, ప్రాప్తా అస్మి=వచ్చి ఉన్నాను. త్వయా=నీచేత, పరిసాన్త్వితా చ = ఓదార్చబడితిని కూడ.

తా. ముక్కు చెవులు కోసివేయగా రక్తప్రవాహముతో తడియుచు నేను ఇప్పుడే నీవద్దకు వచ్చితిని. నీవు కూడ ఓదార్చితివి కదా. 7

మూ. ప్రేషితాశ్చ త్వయా వీర రాక్షసాస్తే చతుర్దశ,
నిహన్తుం రాఘవం క్రోధాన్మత్ప్రియార్థం సలక్ష్మణమ్. 8

ప్ర. అ. వీర = వీరుడా ! త్వయా = నీచేత, క్రోధాత్ = కోపమువలన, మత్ప్రియార్థమ్ = నా ప్రియముకొరకై, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో గూడిన, రాఘవమ్ = రాముణ్ణి, నిహన్తుమ్ = చంపుటకు, తే = ఆ, చతుర్దశ = పదునలుగురు, రాక్షసాః = రాక్షసులు, ప్రేషితాః = పంపబడిరి.

తా. ఓ ! ఖరుడా ! నీవు అప్పుడు క్రుద్ధుడవై, నాకు ప్రియము చేయుటకై, రామలక్ష్మణులను చంపుటకు పదునలుగురు రాక్షసులను పంపితివి. 8

మూ. తే తు రామేణ సామర్షాః శూలపట్టిసపాణయః.
సమరే నిహతాః సర్వే సాయకైర్మర్మభేదిభిః. 9

ప్ర. అ. సామర్షాః = కోపముతో కూడిన, శూలపట్టిసపాణయః = శూల

ములు పట్టిసములు హస్తములందు గల, తే = ఆ, సర్వే = అందరూ, రామేణ = రామునిచేత, మర్మభేదిభిః = మర్మస్థలములను భేదించు, సాయకైః = బాణములతో, నిహతాః = చంపబడినారు.

తా. కోపముతో శూలములు, పట్టిసములు ధరించి వచ్చిన ఆ రాక్షసుల నందరినీ రాముడు, మర్మస్థానములను భేదించు బాణములతో హతమార్చినాడు. 9

మూ. తాన్ దృష్ట్వా పతితాన్ భూమౌ క్షణేనైవ మహాబలాన్,
రామస్య చ మహత్కర్మ మహాంస్త్రాసోఽభవన్మమ. 10

ప్ర. అ. క్షణేనైవ = క్షణకాలములోనే, భూమౌ = నేలపై, పతితాన్ = పడిన, మహాబలాన్ = గొప్ప బలము గల, తాన్ = ఆ రాక్షసులను, రామస్య = రామునియొక్క, మహత్ = గొప్పదైన, కర్మ చ = ఆ పనిని, దృష్ట్వా = చూచి, మమ = నాకు, మహాన్ = గొప్ప, త్రాసః = భయము, అభవత్ = ఆయెను.

తా. క్షణకాలములోనే నేలపై ఆ మహాబలశాలులైన రాక్షసు లందరూ పడిపోవుటను, రాముని ఆ మహాకార్యమును చూడగానే నాకు గొప్ప భయము కలిగినది. 10

మూ. అహమస్మి సముద్విగ్నా విషణ్ణా చ నిశాచర,
శరణం త్వాం పునః ప్రాప్తా సర్వతోభయదర్శినీ. 11

ప్ర. అ. నిశాచర = ఖరుడా ! అహమ్ = నేను, సముద్విగ్నా = భయపడినదానను, విషణ్ణా చ = దిగులుచెందినదానను, అస్మి = అయితిని. సర్వతః = అన్ని వైపులనుండీ, భయదర్శినీ = భయమును చూచుచున్నదాననై, పునః = మరల, త్వామ్ = నిన్ను, శరణం ప్రాప్తా = శరణుజొచ్చితిని.

తా. ఓ ! ఖరుడా ! నేను చాల భయపడుచున్నాను. దిగులుచెంది ఉన్నాను. ఏ వైపునుండి యైనా ప్రమాదము వాటిల్లవచ్చు నను భయముతో మరల నీదగ్గరకు రక్షణము నిమిత్తము వచ్చినాను. 11

మూ. విషాదనక్రాధ్యుషితే పరిత్రాసోర్మిమాలిని,
కిం మాం న త్రాయసే మగ్నాం విపులే శోకసాగరే. 12

ప్ర. అ. విషాదనక్రాధ్యుషితే = దిగులు అను మొసలిచేత అధిష్ఠింపబడి నది, పరిత్రాసోర్మిమాలిని = భయ మను తరంగపంక్తి గలది అయిన, విపులే = విశాలమైన, శోకసాగరే = శోకసముద్రమునందు, మగ్నామ్ = మునిగిన, మామ్ = నన్ను, కిమ్ = ఎందువలన, న త్రాయసే = రక్షించవు ?

తా. నేను, విషాద మనే మొసలి, భయ మనే తరంగపంక్తులు గల విశాలమైన దుఃఖసముద్రములో మునిగి యున్నాను; నన్నెందుకు రక్షించవు ?

మూ. ఏతే చ నిహతా భూమౌ రామేణ నిశితైః శరైః,
యేఽపి మే పదవీం ప్రాప్తా రాక్షసాః పిశితాశనాః. 13

ప్ర. అ. పిశితాశనాః = మాంసమే ఆహారముగా గల, యే = ఏ, రాక్షసాః = రాక్షసులు, మే = నాయొక్క, పదవీమ్ = మార్గమును, ప్రాప్తాః = పొందినారో, ఏతే చ = వీళ్లు కూడ, రామేణ = రామునిచేత, భూమౌ = నేలమీద, నిశితైః = వాడియైన, శరైః = బాణములచేత, నిహతాః = చంపబడినారు.

తా. నాతో వచ్చిన మాంసభక్షకులైన రాక్షసులను రాముడు వాడియైన బాణములచేత చంపి నేలపై పడవేసినాడు. 13

మూ. మయి తే యద్యనుక్రోశో యది రక్షస్సు తేషు చ,
రామేణ యది తే శక్తిస్తేజో వాస్తి నిశాచర, 14
దణ్డకారణ్యనిలయం జహి రాక్షసకణ్టకమ్.

ప్ర. అ. నిశాచర = ఓ ! ఖరుడా ! తే = నీకు, మయి = నాయందు, తేషు = ఆ, రక్షస్సు చ = రాక్షసులయందు, అనుక్రోశః = జాలి, అస్తి యది = ఉన్నట్లయితే, తే = నీకు, రామేణ = రామునితో, శక్తిః = శక్తి, తేజో వా = తేజస్సు, అస్తి యది = ఉన్నట్లయితే, దణ్డకారణ్యనిలయమ్ = దండకారణ్యములో నివసించి ఉన్న, రాక్షసకణ్టకమ్ = రాక్షసులకు ముల్లువంటి వాడైన రాముణ్ణి, జహి = చంపుము.

తా. ఓ ! ఖరుడా ! నీకు నాయందు, ఆ రాక్షసులయందు జాలి ఉన్నట్లయితే, రాముణ్ణి ఎదిరించుటకు శక్తి, తేజస్సు ఉన్నట్లయితే, దండకారణ్యములో నివాస మేర్పరచుకొని ఉన్న, రాక్షసకంటకుడైన ఆ రాముణ్ణి చంపుము. 14

మూ. యది రామం మమామిత్రం న త్వమద్యవధిష్యసి, 15
తవ చైవాగ్రతః ప్రాణాంస్త్యక్ష్యామి నిరపత్రపా.

ప్ర. అ. మమ=నాయొక్క, అమిత్రమ్=శత్రువైన, రామమ్=రాముణ్ణి, త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, న వధిష్యసి యది=చంపకపోయినట్లయితే, నిరపత్రపా=సిగ్గులేనిదాననై, తవ=నీయొక్క, అగ్రతః=ఎదుట, ప్రాణాన్ =ప్రాణములను, త్యక్ష్యామి=విడువగలను.

తా. నీవు నా శత్రువైన రాముణ్ణి ఇప్పుడు చంపకపోయినట్లయితే, నేను, ఏ మాత్రము సంకోచించక, నీ ఎదుటనే ప్రాణాలను విడువగలను. 15

మూ. బుద్ధ్యాహమనుపశ్యామి న త్వం రామస్య సంయుగే,
స్థాతుం ప్రతిముఖే శక్తః సబలశ్చ మహాత్మనః. 16

ప్ర. అ. త్వమ్=నీవు, సబలశ్చ=సైన్యముతో కూడినవాడవై కూడ, సంయుగే=యుద్ధమునందు, మహాత్మనః=గొప్ప బలము గల, రామస్య=రామునియొక్క, ప్రతిముఖే=ఎదుట, స్థాతుమ్=నిలచుటకు, న శక్తః=సమర్థుడవు కావు అని, అహమ్=నేను, బుద్ధ్యా=బుద్ధిచేత, అనుపశ్యామి=ఊహించుచున్నాను.

తా. నీవు సైన్యముతో కూడినవాడవైనా, యుద్ధములో, మహాపరాక్రమవంతుడైన రాముని ఎదుట నిలువజాలవని నా అభిప్రాయము. 16

మూ. శూరమానీవ శూరస్త్వం మిథ్యారోపితవిక్రమః,
మానుషౌ యో న శక్నోషి హన్తుం తౌ రామలక్ష్మణౌ. 17

ప్ర. అ. యః=ఏ నీవు, మానుషౌ=మనుష్యులైన, తౌ రామలక్ష్మణౌ =ఆ రామలక్ష్మణులను, హన్తుమ్=చంపుటకు, న శక్నోషి=సమర్థుడవు కావో, త్వమ్=అట్టి నీవు, శూరమానీ = శూరుడ నని అనుకొనుచు, శూరః ఇవ= శూరుడవు వలె, మిథ్యారోపితవిక్రమః=అసత్యముగా ఆరోపించుకొనబడిన పరాక్రమము గలవాడవు.

తా. నీవు మానవులైన రామలక్ష్మణులను కూడ చంపజాలకున్నావు. నీవు శూరుడ వని అనుకొనుచు, మహాశూరుడవు వలె నిజముగా లేని పరాక్రమము నీకున్నట్లు ఆరోపించుకొనుచున్నావు. 17

మూ. రామేణ యది తే శక్తిస్తేజో వాస్తి నిశాచర, 18
దణ్డకారణ్యనిలయం జహి తం కులపాంసన.

ప్ర. అ. కులపాంసన = కులమునకు అపకీర్తి తెచ్చిన, నిశాచర = ఓ ఖరుడా ! రామేణ = రామునితో, తే = నీకు, శక్తిః = శక్తి గాని, తేజో వా = తేజస్సు కాని, అస్తి యది = ఉన్నట్లయితే, దణ్డకారణ్యనిలయమ్ = దండకారణ్యము నివాసస్థానముగా గల, తమ్ = ఆ రాముణ్ణి, జహి = చంపుము.

తా. కులము చెడ బుట్టిన ఓ ఖరుడా ! నీకు రాముణ్ణి ఎదిరించే శక్తి గాని, తేజస్సు గాని ఉన్నచో దండకారణ్యములో నివాస మేర్పరచుకొని ఉన్న అతనిని చంపుము. 18

మూ. నిఃసత్వస్యాల్పవీర్యస్య వాసస్తే కీదృశస్త్విహ. 19
అపయాహి జనస్థానాత్త్వరితః సహబాన్ధవః.

ప్ర. అ. నిఃసత్వస్య = బలము లేనివాడవు, అల్పవీర్యస్య = అల్పమైన పరాక్రమము కలవాడవు అయిన, తే = నీకు, ఇహ = ఇక్కడ, వాసః = నివాసము, కీదృశః = ఎట్టిది ? సహబాన్ధవః = బంధువులతో కూడినవాడవై, త్వరితః = తొందర గలవాడవై, జనస్థానాత్ = జనస్థానమునుండి, అపయాహి = తొలగి పొమ్ము.

తా. నీవు దుర్బలుడవు; నీ పరాక్రమము అత్యల్పము. అట్టి నీకు ఇక్కడ నివాసమేమిటి ? బంధువులతో కలిసి, శీఘ్రముగా ఈ జనస్థానమును విడచి పారి పొమ్ము. 19

మూ. రామతేజోభిభూతో హి త్వం క్షిప్రం వినశిష్యసి, 20
స హి తేజఃసమాయుక్తో రామో దశరథాత్మజః,
భ్రాతా చాస్య మహావీర్యో యేన చాస్మి విరూపితా. 21

ప్ర. అ. త్వమ్ = నీవు, రామతేజోభిభూతః = రాముని తేజస్సుచేత తిరస్కరించబడినవాడవై, క్షిప్రమ్ = శీఘ్రముగా, వినశిష్యసి హి = నశించగలవు. దశరథాత్మజః = దశరథకుమారుడైన, సః రామః = ఆ రాముడు, తేజఃసమాయుక్తః హి = తేజస్సుతో కూడినవాడు కదా. యేన = ఎవనిచేత, విరూపితా అస్మి

= వికృతరూపము కలదాననుగా చేయబడితినో, అట్టి, అస్య భ్రాతా చ = ఇతని సోదరుడు కూడ, మహావీర్యః = గొప్ప పరాక్రమము కలవాడు.

తా. నీవు రాముని తేజస్సుచేత తిరస్కరింపబడి శీఘ్రముగా నశించగలవు. దశరథకుమారుడైన ఆ రాముడు గొప్ప తేజస్సు కలవాడు. ఆతని సోదరుడు కూడ చాల పరాక్రమముగలవాడు. ఆతడే నా ముక్కుచెవులు ఛేదించినాడు. 21

మూ. ఏవం విలప్య బహుశో రాక్షసీ ప్రథితోదరీ,
కరాభ్యాముదరం హత్వా రురోద భృశదుఃఖితా. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. ప్రథితోదరీ = పెద్ద ఉదరము గల, రాక్షసీ = ఆ శూర్పణఖ, బహుశః = అనేకవిధములుగా, ఏవమ్ = ఇట్లు, విలప్య = విలపించి, భృశదుఃఖితా = మిక్కిలి దుఃఖించినదై, కరాభ్యామ్ = చేతులతో, ఉదరమ్ = ఉదరమును, హత్వా = బాదుకొని, రురోద = ఏడ్చెను.

తా. పెద్ద పొట్ట గల ఆ రాక్షసి ఇట్లు అనేకవిధముల విలపించుచు, చాల దుఃఖితురాలై, చేతులతో ఉదరము బాదుకొనుచు ఏడ్చెను. 22

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఇరువదిఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వావింశః సర్గః

[ఖరదూషణులు పదునాలుగువేల రాక్షసులతో జనస్థానమునుండి పంచవటికి బయలుదేరుట].

మూ. ఏవమాధర్షితః శూరః శూర్పణఖ్యా ఖర స్తతః,
ఉవాచ రక్షసాం మధ్యే ఖరః ఖరతరం వచః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శూర్పణఖ్యా = శూర్పణఖచేత, ఏవమ్= ఇట్లు, రక్షసామ్ = రాక్షసులయొక్క, మధ్యే = మధ్యయందు, ఆధర్షితః = అవమానింపబడిన, శూరః = శూరుడైన, ఖరః = ఖరుడు, ఖరః = ఉగ్రుడై, ఖరతరమ్ = చాలకఠోరమైన, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. శూర్పణఖ ఆ విధముగ రాక్షసుల మధ్య అవమానించగా, శూరుడైన ఆ ఖరుడు చాల ఉగ్రుడై, అతిపరుషమైన వచనమును పలికెను. 1

మూ. తవావమానప్రభవః క్రోధోఽయమతులో మమ,
న శక్యతే ధారయితుం లవణామ్భ ఇవోల్బణమ్. 2

ప్ర. అ. తవ=నీయొక్క, అవమానప్రభవః = అవమానమువలన పుట్టిన, మమ = నాయొక్క, అతులః = సాటి లేని, అయం క్రోధః = ఈ కోపము, ఉల్బణమ్ = తీవ్రమైన, లవణామ్భః ఇవ = ఉప్పునీరు వలె, ధారయితుమ్=ఇముడ్చుకొనుటకు, న శక్యతే = శక్యము కాదు.

తా. నీకు జరిగిన అవమానమువలన నాకు కలిగిన ఈ తీవ్రమైన కోపమును తగ్గించుకొనుట, త్రాగిన అతితీవ్రమైన ఉప్పునీరును ఇమడ్చుకొనుట ఎంత కష్టమో అంతకష్టముగా ఉన్నది. 2

మూ. న రామం గణయే వీర్యాన్మానుషం క్షణజీవితమ్,
ఆత్మదుశ్చరితైః ప్రాణాన్ హతో యోఽద్య విమోక్ష్యతి.

ప్ర. అ. మానుషమ్ = మానవుడు, క్షణజీవితమ్ = క్షణకాలము జీవితము కలవాడు అయిన, రామమ్ = రాముణ్ణి, వీర్యాత్ = పరాక్రమమువలన, న గణయే = లెక్కచేయను, యః = ఏ రాముడు, ఆత్మదుశ్చరితైః = తాను చేసిన చెడ్డ పనులచేత, హతః = చంపబడినవాడై, అద్య = ఇప్పుడు, ప్రాణాన్ = ప్రాణములను, విమోక్ష్యతి = విడువగలడో.

తా. అల్పాయుర్దాయవంతుడు, మానవుడు అయిన రాముని పరాక్రమమును నేను లెక్కచేయను. అతడు ఇప్పుడు, తను చేసిన పాపాలకు ఫలితముగా హతుడై ప్రాణాలను విడువగలడు. 3

మూ. బాష్పః సంహ్రియతామేష సంభ్రమశ్చ విముచ్యతామ్,
అహం రామం సహ భ్రాత్రా నయామి యమసాదనమ్. 4

ప్ర. అ. ఏషః = ఈ, బాష్పః = కన్నీరు, సంహ్రియతామ్ = నిలుపబడుగాక. సంభ్రమశ్చ = తొందర కూడ, విముచ్యతామ్ = విడువబడుగాక. అహమ్ = నేను, రామమ్ = రాముణ్ణి, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, యమసాదనమ్ = యముని గృహమును, నయామి = పొందించెదను.

తా. కన్నీళ్ళు నిలుపుచేయుము, భయపడకుము. నేను రాముణ్ణీ, ఆతని సోదరుణ్ణి కూడ యమలోకమునకు పంపెదను. 4

మూ. పరశ్వథహతస్యాద్య మన్దప్రాణస్య సంయుగే,
రామస్య రుధిరం రక్తముష్ణం పాస్యసి రాక్షసి. 5

ప్ర. అ. రాక్షసి = ఓ ! శూర్పణఖా ! అద్య = ఇప్పుడు, సంయుగే = యుద్ధమునందు, పరశ్వథహతస్య = గండ్రగొడ్డలిచేత చంపబడిన, మన్దప్రాణస్య = అల్పాయుర్దాయవంతుడైన, రామస్య = రామునియొక్క, రక్తమ్ = ఎఱ్ఱని, ఉష్ణమ్ = వేడియైన, రుధిరమ్ = రక్తమును, పాస్యసి = త్రాగగలవు.

తా. ఓ ! శూర్పణఖా ! అల్పాయుర్దాయవంతుడైన ఆ రాముణ్ణి నేను యుద్ధములో గండ్రగొడ్డలిచేత నరికివేసెదను. అప్పుడు నీవు గోరువెచ్చగానున్న ఆతని ఎఱ్ఱని రక్తమును త్రాగగలవు. 5

మూ. సా ప్రహృష్టా వచః శ్రుత్వా ఖరస్య వదనాచ్చ్యుతమ్,
ప్రశశంస పునర్మౌర్ఖ్యాద్భ్రాతరం రక్షసాం వరమ్. 6

ప్ర. అ. సా = ఆమె, ఖరస్య = ఖరునియొక్క, వదనాత్ = ముఖము నుండి, చ్యుతమ్ = జారిన, వచః = మాటను, శ్రుత్వా = విని, ప్రహృష్టా = చాలా సంతోషించినదై, మౌర్ఖ్యాత్ = మూర్ఖత్వమువలన, భ్రాతరమ్ = ఆ సోదరుణ్ణి, రక్షసామ్ = రాక్షసులలో, వరమ్ = శ్రేష్ఠుణ్ణిగా, పునః = మరల, ప్రశశంస = ప్రశంసించెను.

తా. ఖరుని నోటినుండి వెలువడిన ఆ మాటలు విని, ఆ శూర్పణఖ చాల సంతోషించుచు మూర్ఖురా లగుటచే, నీవు రాక్షసులలో శ్రేష్ఠుడవు అని ఆతనిని మరల ప్రశంసించెను. 6

మూ. తయా పరుషితః పూర్వం పునరేవ ప్రశంసితః,
అబ్రవీద్దూషణం నామ ఖరః సేనాపతిం తదా. 7

ప్ర. అ. తయా = ఆమెచేత, పూర్వమ్ = ముందుగా, పరుషితః = దూషింప బడినవాడై, పునరేవ = మరల, ప్రశంసితః = పొగడబడిన, ఖరః = ఖరుడు, తదా = అప్పుడు, దూషణం నామ = దూషణుడను పేరు గల, సేనాపతిమ్ = సేనాపతిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగ శూర్పణఖచేత ముందు దూషింపబడి, మరల ప్రశం సింపబడిన ఆ ఖరుడు దూషణు డనే సేనాపతితో ఇట్లు పలికెను. 7

మూ. చతుర్దశ సహస్రాణి మమ చిత్తానువర్తినామ్,
రక్షసాం భీమవేగానాం సమరేష్వనివర్తినామ్. 8

ప్ర. అ. మమ = నాయొక్క, చిత్తానువర్తినామ్ = చిత్తమును అనుసరించే వారు, భీమవేగానామ్ = భయంకరమైన వేగము గలవారు, సమరేషు = యుద్ధము లందు, అనివర్తినామ్ = వెనకకు మరలనివారు అయిన, రక్షసామ్ = రాక్షసుల యొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = సహస్రములు ఉన్నవి.

తా. నా ఇచ్ఛ ప్రకారము ప్రవర్తించే వాళ్లు భయంకరమైన వేగము గల

వాళ్ళు, యుద్ధములో వెనుకంజ వేయనివాళ్ళు అయిన పదునాలుగువేలమంది రాక్షసు లున్నారు కదా. 8

మూ. నీలజీమూతవర్ణానాం లోకహింసావిహారిణామ్,
సర్వోద్యోగముదీర్ణానాం రక్షసాం సౌమ్య కారయ. 9

ప్ర. అ. సౌమ్య = ఓ ! సౌమ్యుడా ! నీలజీమూతవర్ణానామ్ = నల్లని మేఘము వంటి వర్ణము గలవాళ్ళు, లోకహింసావిహారిణామ్ = లోకహింసతో విహరించువాళ్లు, ఉదీర్ణానామ్ = గర్వము గలవాళ్లు అయిన, రక్షసామ్ = ఆ రాక్షసులయొక్క, సర్వోద్యోగమ్ = ఒక్కుమ్మడి ఉద్యమమును, కారయ = చేయించుము.

తా. సౌమ్యుడా! ఆ రాక్షసులు నల్ల మేఘము వంటి వర్ణము గలవారు. లోకులను హింసించుచు విహరించుచుందురు. గర్వము గలవారు. అట్టి ఆ రాక్షసులు ఒక్కుమ్మడిగ యుద్ధానికి సన్నద్ధు లగు నట్లు చేయుము. 9

మూ. ఉపస్థాపయ మే క్షిప్రం రథం సౌమ్య ధనూంషి చ,
శరాంశ్చిత్రాంశ్చ ఖడ్గాంశ్చ శక్తీశ్చ వివిధాః శితాః. 10

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మే = నాకొరకు, రథమ్ = రథమును, ధనూంషి చ = ధనస్సులను, శరాన్ = బాణములను, చిత్రాన్ = చిత్రములైన, ఖడ్గాంశ్చ = ఖడ్గములను, వివిధాః = అనేకవిధములైన, శితాః = వాడియైన, శక్తీశ్చ = శక్తులను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఉపస్థాపయ = తీసికొని రమ్ము.

తా. సౌమ్యుడా ! నాకొరకై, రథమును, ధనస్సులను, బాణములను, చిత్రములైన ఖడ్గములను, వాడిగా ఉన్న అనేకవిధములైన శక్తులను శీఘ్రముగా ఏర్పరచుము. 10

మూ. అగ్రే నిర్యాతుమిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనామ్,
వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిద. 11

ప్ర. అ. రణకోవిద = యుద్ధములో సమర్థుడా! దుర్వినీతస్య = దుష్ట స్వభావము గల, రామస్య = రామునియొక్క, వధార్థమ్ = వధకొరకు, మహాత్మ

నామ్ = మహాత్ములైన, పౌలస్త్యానామ్ = రాక్షసులయొక్క, అగ్రే = అగ్రము నందు, నిర్యాతుమ్ = వెళ్ళుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. యుద్ధములో నిష్ణాతుడ వైన వాడా! దుష్టబుద్ధి యైన రాముణ్ణి సంహరించుటకై, మహాత్ములైన రాక్షసుల సైన్యమునకు ముందు వెళ్లవలె నని కోరుచున్నాను. 11

మూ. ఇతి తస్య బ్రువాణస్య సూర్యవర్ణం మహారథమ్,
సదశ్వైః శబలైర్యుక్తమాచచక్షేఽథ దూషణః. 12

ప్ర. అ. తస్య = ఆ ఖరుడు, ఇతి = ఇట్లు, బ్రువాణస్య = చెప్పుచుండగా, అథ = అటుపిమ్మట, దూషణః = దూషణుడు, సూర్యవర్ణమ్ = సూర్యుని వంటి వర్ణము గల, మహారథమ్ = మహారథమును, శబలైః = విచిత్రవర్ణములైన, సదశ్వైః = ఉత్తమాశ్వములతో, యుక్తమ్ = కూర్చబడినదానినిగా, ఆచచక్షే = చెప్పెను.

తా. ఆ ఖరుడు అట్లు చెప్పుచుండగానే, "సూర్యునితో సమానమైన మహారథము విచిత్రవర్ణములైన అశ్వములు కూర్చి సిద్ధముగా ఉన్నది" అని దూషణుడు తెలిపెను. 12

మూ. తం మేరుశిఖరాకారం తప్తకాఞ్చనభూషణమ్,
హేమచక్రమసంబాధం వైదూర్యమయకూబరమ్. 13
మత్స్యైః పుష్పైర్ద్రుమైః శైలైశ్చన్ద్రసూర్యైశ్చ కాఞ్చనైః
మఙ్గలైః పక్షిసంఘైశ్చ తారాభిరభిసంవృతమ్, 14
ధ్వజనిస్త్రింశసంపన్నం కిఙ్కిణీకవిరాజితమ్,
సదశ్వయుక్తం సోఽమర్షాదారురోహ ఖరో రథమ్. 15

ప్ర. అ. సః ఖరః = ఆ ఖరుడు, మేరుశిఖరాకారమ్ = మేరుపర్వత శిఖరము వంటి ఆకారము గలది, తప్తకాఞ్చనభూషణమ్ = కరిగించిన బంగారు అలంకారములు కలది, హేమచక్రమ్ = బంగారు చక్రములు గలది, అసంబాధమ్ = ఇరుకు లేనిది, వైదూర్యమయకూబరమ్ = వైదూర్యమాణిక్యవికారమైన నొగ గలది, కాఞ్చనైః = బంగారువికారమైన, మత్స్యైః = మత్స్యములచేత, పుష్పైః = పుష్పములచేత, ద్రుమైః = వృక్షములచేత, శైలైః = పర్వతములచేత,

చన్ద్రసూర్యైశ్చ = చంద్రసూర్యులచేత, మఙ్గలైః = మంగళకరమైన, పక్షిసంఘైశ్చ = పక్షిసముదాయములచేత, తారాభిః = నక్షత్రములచేత, అభిసంవృతమ్ = చుట్టబడినది, ధ్వజనిస్త్రింశసంపన్నమ్ = ధ్వజములతోను, ఖడ్గములతోను కూడినది, కిఙ్కిణీకవిరాజితమ్ = మువ్వలచేత ప్రకాశింపచేయబడినది, సదశ్వయుక్తమ్ = మంచిగుఱ్ఱములతో కూర్చబడినది అయిన, రథమ్ = రథమును, అమర్షాత్ = కోపమువలన, ఆరురోహ = ఎక్కెను.

తా. ఆ ఖరుడు క్రుద్ధుడై, మంచి గుఱ్ఱములు కట్టిన మేరుపర్వతశిఖరమువలె ఉన్న ఆ రథమును ఎక్కెను. కరిగించి శుద్ధముచేసిన బంగారముచే అది అలంకృతమై ఉండెను. బంగారు చక్రములతో, వైదూర్యమాణిక్యవికారమైన నాగతో (కాడి కట్టే దూలము) విశాలముగా ఉండెను. ఆ రథము చుట్టూ బంగారముతో చేసిన మత్స్యములు, పుష్పములు, వృక్షములు, పర్వతములు, చంద్రసూర్యులు, మంగళకరములైన పక్షులు, నక్షత్రములు కూర్చబడి యుండెను. ధ్వజములు, ఖడ్గములు అమర్చబడియుండెను. చిరుగంటలచేత అలంకరింపబడెను. 13, 14, 15.

మూ. నిశామ్య తు రథస్థం తం రాక్షసా భీమవిక్రమాః,
తస్థుః సంపరివార్యైనం దూషణం చ మహాబలమ్. 16

ప్ర. అ. భీమవిక్రమాః = భయంకరమైన పరాక్రమము గల, రాక్షసాః = రాక్షసులు, రథస్థమ్ = రథమునందున్న, తమ్ = ఆతనిని, నిశామ్య = చూచి, ఏనమ్ = ఇతనిని, మహాబలమ్ = గొప్ప బలము గల, దూషణం చ = దూషణుణ్ణి, సంపరివార్య = చుట్టి, తస్థుః = నిలచిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల రాక్షసులు ఆ ఖరుడు రథముపై ఎక్కుట చూచి, ఆతనికిని, మహాబలుడైన దూషణునికిని చుట్టూ నిలచిరి. 16

మూ. ఖరస్తు తాన్ మహేష్వాసాన్ ఘోరవర్మాయుధధ్వజాన్,
నిర్యాతేత్యబ్రవీద్దృష్ట్వా రథస్థః సర్వరాక్షసాన్. 17

ప్ర. అ. రథస్థః = రథమునందున్న, ఖరస్తు = ఖరుడు, మహేష్వాసాన్ = గొప్ప ధనస్సులు కలవారు, ఘోరవర్మాయుధధ్వజాన్ = భయంకరమైన కవచ

ములు, ఆయుధములు, ధ్వజములు గలవారు అయిన, తాన్ సర్వరాక్షసాన్ = ఆ సమస్తరాక్షసులను, దృష్ట్వా = చూచి, నిర్యాత = బయలుదేరండి, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. రథము నెక్కిన ఖరుడు గొప్ప ధనుస్సులను, భయంకరములైన కవచములను, ఆయుధములను, ధ్వజములను ధరించి ఉన్న ఆ రాక్షసుల నందరినీ చూచి "బయలుదేరండి" అని పలికెను. 17

మూ. తత స్తద్రాక్షసం సైన్యం ఘోరవర్మాయుధధ్వజమ్,
నిర్జగామ జనస్థానాన్మహానాదం మహాజవమ్. 18

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఘోరవర్మాయుధధ్వజమ్ = భయంకరములైన కవచములు, ఆయుధములు, ధ్వజములు గల, తత్ = ఆ, రాక్షసం సైన్యమ్ = రాక్షససైన్యము, మహానాదమ్ = గొప్ప ధ్వని గలదై, మహాజవమ్ = గొప్ప వేగము గలదై, జనస్థానాత్ = జనస్థానమునుండి, నిర్జగామ = బయలు దేరెను.

తా. పిమ్మట ఆ రాక్షససైన్యము, భయంకరములైన కవచములను, ఆయుధములను, ధ్వజములను ధరించి, గొప్ప ధ్వని చేయుచు, మహావేగముతో జనస్థానమునుండి బయలు దేరెను. 18

మూ. ముద్గరైః పట్టిసైః శూలైః సుతీక్ష్ణైశ్చ పరశ్వధైః,
ఖడ్గైశ్చక్రైశ్చ హస్తస్థైర్భ్రాజమానైశ్చ తోమరైః, 19

శక్తిభిః పరిఘైర్ఘోరైరతిమాత్రైశ్చ కార్ముకైః,
గదాసిముసలైర్వజ్రైర్గృహీతైర్భీమదర్శనైః. 20

రాక్షసానాం సుఘోరాణాం సహస్రాణి చతుర్దశ,
నిర్యాతాని జనస్థానాత్ఖరచిత్తానువర్తినామ్. 21

ప్ర. అ. గృహీతైః = గ్రహింపబడిన, హస్తస్థైః = హస్తములలో ఉన్న, ముద్గరైః = ముద్గరములతోను, పట్టిసైః = పట్టిసములతోను, శూలైః = శూలముల

తోను, సుతీక్ష్ణైః = చాల తీక్ష్ణమైన, పరశ్వధైః = గండ్రగొడ్డళ్లతోను, ఖడ్గైః = ఖడ్గములతోను, చక్రైశ్చ = చక్రములతోను, భ్రాజమానైః = ప్రకాశించుచున్న, తోమరైః = తోమరములతోను, శక్తిభిః = శక్తులతోను, ఘోరైః = భయంకరములైన, పరిఘైః = పరిఘలతోను, అతిమాత్రైః = అధికప్రమాణము గల, కార్ముకైః = ధనస్సులతోను, గదాసిముసలైః = గదలతోను, కత్తులతోను, రోకళ్లతోను, భీమదర్శనైః = భయంకరమైన దర్శనము గల, వజ్రైః = వజ్రములతోను, ఖరచిత్తానువర్తినామ్ = ఖరుని చిత్తమును అనుసరించు, సుఘోరాణామ్ = చాల భయంకరులైన, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ సహస్రాణి = పదునాలుగు వేలు, జనస్థానాత్ = జనస్థానమునుండి, నిర్యాతాని = బయలుదేరినవి.

తా. ఖరుని ఆజ్ఞను పాలించు పదునాలుగువేలమంది భయంకరులైన రాక్షసులు చేతులలో ముద్గరములు, పట్టిసములు, శూలములు, చాల తీక్ష్ణములైన గండ్రగొడ్డళ్లు, ఖడ్గములు, చక్రములు, తోమరములు, శక్తులు, భయంకరములైన పరిఘలు, పెద్ద ధనస్సులు, గదలు, కత్తులు, రోకళ్లు, చూచుటకు భయంకరములుగా ఉన్న వజ్రాయుధములు ధరించి జనస్థానమునుండి బయలుదేరిరి. 19,20,21

మూ. తాంస్త్వభిద్రవతో దృష్ట్వా రాక్షసాన్ భీమవిక్రమాన్,
ఖరస్యాపి రథః కించిజ్జగామ తదనన్తరమ్. 22

ప్ర. అ. అభిద్రవతః = పరుగెత్తుచున్న, భీమవిక్రమాన్ = భయంకరమైన పరాక్రమము గల, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, దృష్ట్వా = చూచి, కించిత్ = కొంచెము, తదనన్తరమ్ = వాళ్ళ వెనుకనే, ఖరస్య = ఖరునియొక్క, రథః అపి = రథము కూడ, జగామ = వెళ్లెను.

తా. పరుగెత్తుచున్న, భయంకరపరాక్రమవంతులైన ఆ రాక్షసులను చూచి, ఖరుని రథము కూడ, కొంచెము వాళ్ల వెనుకనే నడచెను. 22

మూ. తతస్తాన్ శబలానశ్వా న్తప్తకాఞ్చనభూషితాన్,
ఖరస్యమతిమాజ్ఞాయ సారథిః సమచోదయత్. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సారథిః = సారథి, తప్తకాఞ్చనభూషి

తాన్ = కరిగింపబడిన బంగారముచేత అలంకరింపబడిన, శబలాన్ = చిత్ర వర్ణములు గల, తాన్ = ఆ, అశ్వాన్ = అశ్వములను, ఖరస్య = ఖరునియొక్క, మతిమ్ = బుద్ధిని, ఆజ్ఞాయ = తెలుసుకొని, సమచోదయత్ = తోలెను.

తా. పిమ్మట, సారథి, ఖరుని అభిప్రాయము తెలుసుకొని, కరిగించి శుద్ధి చేసిన బంగారముచేత అలంకరింపబడిన, చిత్రవర్ణములైన ఆ అశ్వములను తోలెను. 23

మూ. స చోదితో రథః శీఘ్రం ఖరస్య రిపుఘాతినః,
శబ్దేనాపూరయామాస దిశశ్చ ప్రదిశస్తదా. 24

ప్ర. అ. తదా = అప్పుడు, రిపుఘాతినః = శత్రువులను సంహరించు, ఖరస్య = ఖరునియొక్క, శీఘ్రమ్ = శీఘ్రముగా, చోదితః = ప్రేరేపింపబడిన, సః రథః = ఆ రథము, దిశశ్చ = దిక్కులను, ప్రదిశశ్చ = విదిక్కులను, శబ్దేన = శబ్దముచేత, ఆపూరయామాస = నింపెను.

తా. శీఘ్రముగా నడుపబడిన శత్రుసంహారకుడైన ఖరుని ఆ రథము, అప్పుడు, దిక్కులను, విదిక్కులను కూడ ధ్వనితో నింపెను. 24

మూ. ప్రవృద్ధమన్యుస్తు ఖరః ఖరస్వనో
రిపోర్వధార్థం త్వరితో యథాన్తకః,
అచూచుదత్సారథిమున్నదన్ ఘనం
మహాబలో మేఘ ఇవాశ్మవర్షవాన్. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్వావింశః సర్గః.

ప్ర. అ. ప్రవృద్ధమన్యుః = అధికమైన కోపము గల, ఖరస్వనః = కటువైన ధ్వని గల, ఖరః = ఖరుడు, రిపోః = శత్రువుయొక్క, వధార్థమ్ = వధ నిమిత్తమై, త్వరితః = తొందరపడుచు, అన్తకః యథా = యముడు వలె, అశ్మవర్షవాన్ = రాళ్ల వర్షము గల, మహాబలః = గొప్ప బలము గల, మేఘః ఇవ = మేఘము వలె, ఘనమ్ = అధికముగా, ఉన్నదన్ = అరచుచు, సారథిమ్ = సారథిని, అచూచుదత్ = ప్రేరేపించెను.

తా. పరుషమైన కంఠధ్వని గల ఆ ఖరుడు అధికమైన క్రోధముతో, శత్రువును చంపుటకై తొందరపడుచు, యముడు వలె, రాళ్ళు కురియుచున్న గొప్ప బలము గల మేఘము వలె బిగ్గరగా అరచుచు, సారథిని ప్రేరేపించెను.

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువది రెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోవింశః సర్గః

[భయంకరములైన శకునములను చూచికూడ వాటిని లెక్క చేయక ఖరుడు సైన్యముతో రాముని ఆశ్రమము వైపు వెళ్ళుట].

మూ. తత్ప్రయాతం బలం ఘోరమశివం శోణితోదకమ్,
అభ్యవర్షన్మహామేఘస్తుములో గర్దభారుణః. 1

ప్ర. అ. గర్దభారుణః = గాడిద వలె ధూసరవర్ణము గల, తుములః = వ్యాకులమైన, మహామేఘః = గొప్ప మేఘము, ప్రయాతమ్ = వెళ్లుచున్న, తత్ = ఆ, ఘోరమ్ = భయంకరమైన, బలమ్ = సైన్యమును గూర్చి, అశివమ్ = అమంగళమైన, శోణితోదకమ్ = రక్తరూపమైన జలమును, అభ్యవర్షత్ = వర్షించెను.

తా. గాడిదరంగులో ఉన్న వ్యాకులమైన మహామేఘము, బయలుదేరిన భయంకరమైన అ సైన్యముమీద అమంగళకరమైన రక్తమును వర్షించెను. 1

మూ. నిపేతుస్తురగాస్తస్య రథయుక్తా మహాజవాః,
సమే పుష్పచితే దేశే రాజమార్గే యదృచ్ఛయా. 2

ప్ర. అ. రథయుక్తాః = రథమునకు కట్టబడిన, మహాజవాః = గొప్ప వేగము గల, తస్య = ఆ ఖరునియొక్క, తురగాః = గుఱ్ఱములు, రాజమార్గే = రాజమార్గమునందు, పుష్పచితే = పుష్పములచేత వ్యాప్తమైన, సమే = సమమైన, దేశే = దేశమునందు, యదృచ్ఛయా = హటాత్తుగా, నిపేతుః = తొట్రుపడినవి.

తా. ఆ ఖరుని రథమునకు కట్టిన, మహావేగము గల గుఱ్ఱములు, రాజవీధిలో, పువ్వులు చల్లిన సమప్రదేశమునందు కూడ హటాత్తుగా తొట్రుపడినవి.

మూ. శ్యామం రుధిరపర్యన్తం బభూవ పరివేషణమ్,
అలాతచక్రప్రతిమం పరిగృహ్య దివాకరమ్. 3

ప్ర. అ. దివాకరమ్=సూర్యుని, పరిగృహ్య=చుట్టి, శ్యామమ్ = ఆ నల్లని, రుధిరపర్యన్తమ్ = నెత్తురురంగు అంచు గల, అలాతచక్రప్రతిమమ్ = కొరవి త్రిప్పగా ఏర్పడు చక్రముతో సమానమైన, పరివేషణమ్ = పరివేషణము (చుట్టూ కట్టిన గూడు), బభూవ = ఏర్పడెను.

తా. సూర్యుని చుట్టూ నల్లనిది, రక్తము వంటి రంగు గల అంచులుకలది, అలాతచక్రముతో (కొరవిని వేగముగా త్రిప్పుటచే ఏర్పడిన చక్రముతో సమానము) అయిన, గూడు కట్టెను. 3

మూ. తతో ధ్వజముపాగమ్య హేమదణ్డం సముచ్ఛ్రితమ్,
సమాక్రమ్య మహాకాయస్తస్థౌ గృధ్రః సుదారుణః. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట. మహాకాయః = పెద్ద శరీరము గల, సుదారుణః = చాల భయంకరమైన, గృధ్రః = గ్రద్ద, హేమదణ్డమ్ = బంగారు దండము గల, సముచ్ఛ్రితమ్ = ఎత్తైన, ధ్వజమ్ = ధ్వజమును, ఉపాగమ్య = చేరి, హేమదణ్డమ్ = బంగారుదండమును, సమాక్రమ్య = ఆక్రమించి, తస్థౌ = నిలచెను.

తా. అంతలో పెద్ద శరీరము గల భయంకరమైన ఒక గ్రద్ద పైకి ఎగురవేయబడిన ధ్వజమువద్దకు వచ్చి, దాని బంగారుదండమును ఆక్రమించి నిలచెను. 4

మూ. జనస్థానసమీపే తు సమాగమ్య ఖరస్వనాః,
విస్వరాన్వివిధాంశ్చక్రుర్మాంసాదా మృగపక్షిణః. 5

ప్ర. అ. ఖరస్వనాః = పరుషమైన ధ్వని గల, మాంసాదాః = మాంసమును తినే, మృగపక్షిణః = మృగములు, పక్షులు, జనస్థానసమీపే=జనస్థానము సమీపమునందు, సమాగమ్య = గుమిగూడి, వివిధాన్ = అనేకవిధములైన, విస్వరాన్ = విపరీతధ్వనులను, చక్రుః = చేసినవి.

తా. పరుషమైన ధ్వనులు గల మాంసాహారులైన మృగములు, పక్షులు జనస్థానము సమీపమునందు గుమిగూడి, అనేకవిధములైన విపరీతధ్వనులు చేసెను.

మూ. వ్యాజహ్రుశ్చ ప్రదీప్తాయాం దిశి వై భైరవస్వనమ్,
అశివం యాతుధానానాం శివా ఘోరా మహాస్వనాః. 6

ప్ర. అ. ఘోరాః = భయంకరములైన, మహాస్వనాః = గొప్ప ధ్వని గల, శివాః = నక్కలు, ప్రదీప్తాయామ్ = మండుచున్న, దిశి = దిక్కునందు, భైరవస్వనమ్ = భయంకరమైన ధ్వని కలుగునట్లుగా, యాతుధానానామ్ = రాక్షసులకు, అశివమ్ = అమంగళమును, వ్యాజహ్రుః = పలికినవి.

తా. భయంకరములు, గొప్ప ధ్వని కలవి అయిన నక్కలు, మంటలు రేగుచున్న దిక్కు వైపు చేరి, భయంకరముగా అరచుచు, రాక్షసులకు అమంగళము రానున్నదని సూచించినవి. 6

మూ. ప్రభిన్నగిరిసంకాశాస్తోయశోణితధారిణః,
అనాకాశం తదాకాశం చక్రుర్భీమా వలాహకాః. 7

ప్ర. అ. ప్రభిన్నగిరిసంకాశాః = పగిలిన పర్వతములతో సమానములు, తోయశోణితధారిణః = రక్తమువంటి జలమును ధరించుచున్నవి, భీమాః = భయంకరములు అయిన, వలాహకాః = మేఘములు, తదా = అప్పుడు, ఆకాశమ్ = ఆకాశమును, అనాకాశమ్ = అవకాశము లేనిదానినిగా, చక్రుః = చేసినవి.

తా. బ్రద్దలైన పర్వతముల వలె ఉన్న భయంకరములైన మేఘములు, అప్పుడు, రక్తమువంటి జలముతో నిండినవై ఆకాశమును అవకాశము లేనిదానినిగా చేసినవి. 7

మూ. బభూవ తిమిరం ఘోరముద్ధతం రోమహర్షణమ్,
దిశో వా విదిశో వాపి న చ వ్యక్తం చకాశిరే. 8

ప్ర. అ. ఘోరమ్ = భయంకరము, ఉద్ధతమ్ = అత్యధికము, రోమహర్షణమ్ = రోమాంచము కలిగించునది అయిన, తిమిరమ్ = చీకటి, బభూవ = ఏర్పడెను. దిశో వా = దిక్కులు గాని, విదిశో వాపి = విదిక్కులు గాని, వ్యక్తమ్ = స్పష్టముగా, న చకాశిరే = ప్రకాశించలేదు.

తా. రోమాంచము కలిగించే భయంకరమైన చీకటి చాల దట్టముగా వ్యాపించెను. దిక్కులు గాని, విదిక్కులు గాని స్పష్టముగా ప్రకాశించలేదు. 8

మూ. క్షతజార్ద్రసవర్ణాభా సన్ధ్యాకాలం వినా బభౌ.
ఖరస్యాభిముఖా నేదుస్తదా ఘోరమృగాః ఖగాః, 9
కఙ్కగోమాయుగృధ్రాశ్చ చుక్రుశుర్భయశంసినః.

ప్ర. అ. కాలం వినా = కాలము కాకుండానే, క్షతజార్ద్రసవర్ణాభా = రక్తముతో సమానమైన వర్ణము కాంతి గల, సన్ధ్యా = సంధ్య, బభౌ = ప్రకాశించెను. తదా = అప్పుడు, ఘోరమృగాః = ఘోరములైన మృగములు, ఖగాః = పక్షులు, ఖరస్య = ఖరునకు, అభిముఖాః = అభిముఖమైనవై, నేదుః = ధ్వనిచేసినవి. కఙ్కగోమాయుగృధ్రాశ్చ = డేగలు, నక్కలు, గ్రద్దలు కూడ, భయశంసినః = భయమును సూచించుచు, చుక్రుశుః = అరచినవి.

తా. కాలము కాని కాలములో రక్తము వలె ఎఱ్ఱనైన సంధ్య ఏర్పడెను. భయంకరములైన మృగములు, పక్షులు ఖరునికి ఎదురుగా నిలచి అరచెను. డేగలు, నక్కలు, గ్రద్దలు కూడ రాబోయే భయమును సూచించుచు అరచినవి.

మూ. నిత్యాశుభకరా యుద్ధే శివా ఘోరనిదర్శనాః, 10
నేదుర్బలస్యాభిముఖం జ్వాలోద్గారిభిరాననైః.

ప్ర. అ. యుద్ధే = యుద్ధమునందు, నిత్యాశుభకరాః = తప్పక అశుభమును చేయు, ఘోరనిదర్శనాః = భయంకరమైన నిదర్శనము (దృష్టాంతము) గల, శివాః = నక్కలు, జ్వాలోద్గారిభిః = మంటలను కక్కుచున్న, ఆననైః = ముఖములతో, బలస్య = సైన్యమునకు, అభిముఖమ్ = అభిముఖముగా, నేదుః = ధ్వనిచేసినవి.

తా. నక్కలు కూసినచో యుద్ధములో తప్పక అమంగళము కలుగును. వాటి దృష్టాంతము చాల భయంకరముగా ఉండును. అట్టి నక్కలు మంటలు కక్కుచున్న నోళ్లతో, సైన్యమునకు ఎదురుగా తిరిగి అరచినవి. 10

మూ. కబన్ధః పరిఘాభాసో దృశ్యతే భాస్కరాన్తికే, 11
జగ్రాహ సూర్యం స్వర్భానురపర్వణి మహాగ్రహః,
ప్రవాతి మారుతః శీఘ్రం నిష్ప్రభోఽభూద్దివాకరః. 12

ప్ర. అ. భాస్కరాన్తికే = సూర్యుని సమీపమునందు, పరిఘాభాసః = ఇనుపగుదియవలె ఉన్న, కబన్ధః = మనిషి మొండెము, దృశ్యతే = కనబడెను. మహా

గ్రహః = గొప్ప గ్రహమైన, స్వర్భానుః = రాహువు, అపర్వణి = పర్వము కాని కాలమునందు, సూర్యమ్ = సూర్యుణ్ణి, జగ్రాహ = పట్టుకొనెను. మారుతః=గాలి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రవాతి = వీచెను. దివాకరః = సూర్యుడు, నిష్ప్రభః = కాంతి లేనివాడు, అభూత్ = ఆయెను.

తా. సూర్యుని దగ్గర ఇనుప గుడియవంటి మనిషి మొండెము కనబడెను. మహాగ్రహమైన రాహువు, పర్వము కాని కాలమునందు కూడ సూర్యుణ్ణి గ్రసించెను. గాలి వేగముగా వీచెను. సూర్యుని కాంతి తగ్గెను. 12

మూ. ఉత్పేతుశ్చ వినా రాత్రిం తారాః ఖద్యోతసప్రభాః,
సంలీనమీనవిహగా నళిన్యః శుష్కపఙ్కజాః, 13
తస్మిన్ క్షణే బభూవుశ్చ వినా పుష్పఫలైర్ద్రుమాః.

ప్ర. అ. ఖద్యోతసప్రభాః = మినుగుడు పురుగులతో సమానమైన కాంతి గల, తారాః = నక్షత్రములు, వినా రాత్రిమ్ = రాత్రి కాకుండగనే, ఉత్పేతుః = బయలుదేరినవి (కనబడినవి). సంలీనమీనవిహగాః = అణగిన మీనములు, పక్షులు గల, నలిన్యః = పద్మసరస్సులు, శుష్కపఙ్కజాః = ఎండిన పద్మములు గలవి. తస్మిన్ = ఆ, క్షణే = క్షణమునందు, ద్రుమాః = వృక్షములు, పుష్పఫలైః వినా = పుష్పములు ఫలములు లేనివై, బభూవుశ్చ = అయినవి.

తా. రాత్రి కాకపోయినను మిణుగుడుపురుగుల వలె నక్షత్రములు మెరియ నారంభించినవి. పద్మసరస్సులలోని మీనములు, పక్షులు అణిగి కదలకుండ ఉండగా, పద్మాలు ఎండిపోయినవి. ఆ క్షణములో చెట్లనుండి పుష్పములు, ఫలములు రాలిపోయినవి. 13

మూ. ఉద్ధూతశ్చ వినా వాతం రేణుర్జలధరారుణః, 14
వీచీకూచీతి వాశ్యన్త్యో బభూవుస్తత్ర శారికాః.

ప్ర. అ. వినా వాతమ్=వాయువు లేకుండగానే, జలధరారుణః=మేఘము వలె ఎఱ్ఱనైన, రేణుః = పరాగము, ఉద్ధూతః = ఎగరగొట్టబడినది. తత్ర = అక్కడ, శారికాః = గోరింకలు, వీచీకూచీతి = వీచీ కూచీ అని, వాశ్యన్త్యః = అరచుచున్నవై, బభూవుః = ఉండెను.

తా. గాలి లేకపోయినను మేఘము వలె ధూసరవర్ణమైన పరాగము పైకి ఎగిరెను. అక్కడ గోరింకలు వీచీ కూచీ అని కూయ మొదలిడెను. 14

మూ. ఉల్కాశ్చాపి సనిర్ఘాతా నిపేతుర్ఘోరదర్శనాః, 15
ప్రచచాల మహీ సర్వా సశైలవనకాననా.

ప్ర. అ. ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము గల, సనిర్ఘాతాః = పిడుగులతో కూడిన, ఉల్కాశ్చాపి = ఉల్కలు కూడ, నిపేతుః = పడినవి. సశైలవనకాననా = శైలములతోను, వనములతోను, అడవులతోను కూడిన, సర్వా = సమస్తమైన. మహీ = భూమి, ప్రచచాల = కదలెను.

తా. చూచువారికి భయము కలిగించే ఉల్కలు (అగ్నిపిండము) ఉరుములతో క్రింద పడినవి. పర్వతములతో, చిన్న అడవులతో, పెద్ద అడవులతో సహా భూమి అంతా కంపించినది. 15

మూ. ఖరస్య చ రథస్థస్య నర్దమానస్య ధీమతః, 16
ప్రాకమ్పత భుజః సవ్యః స్వరశ్చాస్యావసజ్జత.

ప్ర. అ. రథస్థస్య = రథమునందు ఉన్న, నర్దమానస్య = అరచుచున్న, ధీమతః = బుద్ధిమంతుడైన, ఖరస్య = ఖరుని యొక్క, సవ్యః = ఎడమ, భుజః = భుజము, ప్రాకమ్పత = కదలెను. అస్య = ఇతని యొక్క, స్వరశ్చ = కంఠస్వరము కూడ, అవసజ్జత = తడబడెను.

తా. రథముపై కూర్చుండి గర్జించుచున్న, బుద్ధిమంతుడైన ఆ ఖరుని ఎడమ భుజము అదిరెను. కంఠస్వరము తడబడెను. 16

మూ. సాస్రా సంపద్యతే దృష్టిః పశ్యమానస్య సర్వతః, 17
లలాటే చ రుజా జాతా న చ మోహాన్న్యవర్తత.

ప్ర. అ. సర్వతః = అన్ని వైపులా, పశ్యమానస్య = చూచుచున్న అతని యొక్క, దృష్టిః = దృష్టి, సాస్రా = కన్నీళ్లతో కూడినది, సంపద్యతే = అయ్యెను. లలాటే = లలాటమునందు, రుజా చ = పీడ కూడ, జాతా = పుట్టినది. మోహాత్ = అజ్ఞానమువలన, న చ న్యవర్తత = వెనుకకు మరలలేదు.

తా. నలు మూలల చూచుచున్నప్పుడు ఆతని కళ్ళు కన్నీళ్లతో నిండెను. నుదుటిపై నొప్పి కలిగెను. అయినను అతడు అజ్ఞానవశముచేత వెనుకకు మరలి వెళ్లలేదు. 17

మూ. తాన్సమీక్ష్య మహోత్పాతానుత్థితాన్ రోమహర్షణాన్, 18
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్ ప్రహసన్ స ఖరస్తదా.

ప్ర. అ. సః ఖరః = ఆ ఖరుడు, తదా = అప్పుడు, ఉత్థితాన్ = బయలుదేరిన, రోమహర్షణాన్ = రోమాంచమును కలిగించు, తాన్ = ఆ, మహోత్పాతాన్ = గొప్ప ఉత్పాతములను (రాబోవు ఉపద్రవమును సూచించు దుఃశకునములను), సమీక్ష్య = చూచి, ప్రహసన్ = నవ్వుచు, సర్వాన్ = సమస్తమైన, రాక్షసాన్ = రాక్షసులను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఖరుడు అప్పుడు కనబడిన, భయంకరములైన ఆ మహోత్పాతములను చూచి నవ్వుచు, ఆ రాక్షసు లందరితో ఇట్లు పలికెను. 18

మూ. మహోత్పాతానిమాన్సర్వానుత్థితాన్ ఘోరదర్శనాన్, 19
న చిన్తయామ్యహం వీర్యాద్బలవాన్ దుర్బలానివ.

ప్ర. అ. ఉత్థితాన్ = బయలుదేరిన, ఘోరదర్శనాన్ = భయంకరమైన దర్శనము గల, ఇమాన్ = ఈ, మహోత్పాతాన్ = గొప్ప ఉత్పాతములను, సర్వాన్ = అన్నింటినీ, అహమ్ = నేను, వీర్యాత్ = పరాక్రమమువలన, బలవాన్ = బలవంతుడు, దుర్బలానివ = దుర్బలులను వలె, న చిన్తయామి = లెక్క చేయను.

తా. చూచుటకు భయంకరములుగా ఉన్న గొప్ప ఉత్పాతములు కనబడుచున్నవి. కాని నేను మహాపరాక్రమశాలి నగుటచే బలవంతుడు దుర్బలులను లెక్కచేయ నట్లు వీటి నన్నింటిని లెక్కచేయను. 19

మూ. తారా అపి శరైస్తీక్ష్ణైః పాతయామి నభఃస్థలాత్, 20
మృత్యుం మరణధర్మేణ సంక్రుద్ధో యోజయామ్యహమ్.

ప్ర. అ. అహమ్ = నేను, తారాః అపి = నక్షత్రములను కూడ, తీక్ష్ణైః =

తీక్ష్ణములైన, శరైః = బాణములచేత, నభస్తలాత్ = ఆకాశమునుండి, పాతయామి = పడవేసెదను. సంక్రుద్ధః = కోపించినవాడనై, మృత్యుమ్ = మృత్యువును, మరణధర్మేణ = మరణధర్మముతో, యోజయామి = కూడు నట్లు చేసెదను.

తా. నేను తీక్ష్ణములైన బాణములతో నక్షత్రములను కూడ ఆకాశమునుండి రాల్చివేయగలను. కోపించినచో మృత్యుదేవతకు కూడ మృత్యువు కల్పించగలను.

మూ. రాఘవం తం బలోత్సిక్తం భ్రాతరం చాస్య లక్ష్మణమ్, 21
అహత్వా సాయకైస్తీక్ష్ణైర్నోపావర్తితుముత్సహే.

ప్ర. అ. బలోత్సిక్తమ్ = బలముచేత గర్వించిన, తం రాఘవమ్ = ఆ రాముణ్ణి, అస్య = ఈతనియొక్క, భ్రాతరమ్ = సోదరుడైన, లక్ష్మణం చ = లక్ష్మణుణ్ణీ, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, సాయకైః = బాణములచేత, అహత్వా = చంపక, ఉపావర్తితుమ్ = తిరిగి వచ్చుటకు, నోత్సహే = ఉత్సహింపను.

తా. బలముచేత గర్వించిన రాముణ్ణి, అతని సోదరుడైన లక్ష్మణుణ్ణీ తీక్ష్ణములైన బాణములతో చంపకుండగా తిరిగి వచ్చుటకు ఇచ్ఛగింపను. 21

మూ. సకామా భగినీ మేఽస్తు పీత్వా తు రుధిరం తయోః, 22
యన్నిమిత్తస్తు రామస్య లక్ష్మణస్య విపర్యయః.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, విపర్యయః = విపరీతప్రవర్తన, యన్నిమిత్తః = ఎవ్వతె నిమిత్తముగా కలదో అట్టి, మే భగినీ = నా సోదరి, తయోః = వాళ్లయొక్క, రుధిరమ్ = రక్తమును, పీత్వా = త్రాగి, సకామా = తీరిన కోరిక గలది, అస్తు = అగుగాక.

తా. నా సోదరియైన ఏ శూర్పణఖవిషయమున రాముడు, లక్ష్మణుడు చెడ్డగా ప్రవర్తించినారో అట్టి నా సోదరి వాళ్ల రక్తము త్రాగి తన కోరిక తీర్చుకొనుగాక. 22

మూ. న క్వచిత్ప్రాప్తపూర్వో మే సంయుగేషు పరాజయః, 23
యుష్మాకమేతత్ప్రత్యక్షం నానృతం కథయామ్యహమ్.

ప్ర. అ. మే = నాకు, సంయుగేషు = యుద్ధములలో, క్వచిత్ = ఎక్కడా కూడ, పరాజయః = పరాజయము, న ప్రాప్తపూర్వః = పూర్వ మెన్నడు పొంద బడలేదు. ఏతత్ = ఇది, యుష్మాకమ్ = మీకు, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షమే. అహమ్ = నేను, అనృతమ్ = అసత్యమును, న కథయామి = చెప్పుటలేదు.

తా. నే నెన్నడూ యుద్ధములో పరాజయమును పొందలేదు. ఇది మీకంద రికి తెలిసిన విషయమే కదా. నేను అసత్యము చెప్పుటలేదు. 23

మూ. దేవరాజమపి క్రుద్ధో మత్తైరావతయాయినమ్, 24
వజ్రహస్తం రణే హన్యాం కిం పునస్తౌ కుమానుషౌ.

ప్ర. అ. క్రుద్ధః = కోపగించినవాడనై, మత్తైరావతయాయినమ్ = మదించిన ఐరావతముమీద వెళ్ళే, వజ్రహస్తమ్ = వజ్రము హస్తమునందు గల, దేవరాజ మపి = దేవేంద్రుని కూడ, రణే = యుద్ధమునందు, హన్యామ్ = చంపుదును. తౌ = ఆ, కుమానుషౌ = చెడ్డ మానవమాత్రులను, కిం పునః = చెప్పనేల ?

తా. నేను కోపించినచో, మదించిన ఐరావతముమీద ఎక్కి సంచరించే, వజ్రాయుధధారియైన దేవేంద్రుని కూడ యుద్ధములో సంహరించగలను. ఈ క్షుద్ర మానవమాత్రుల విషయము చెప్పవలెనా ?

మూ. సా తస్య గర్జితం శ్రుత్వా రాక్షసస్య మహాచమూః, 25
ప్రహర్షమతులం లేభే మృత్యుపాశావపాశితా.

ప్ర. అ. మృత్యుపాశావపాశితా = మృత్యుపాశముచేత బంధింపబడిన, సా = ఆ, మహాచమూః = మహాసేన, తస్య రాక్షసస్య = ఆ రాక్షసుని యొక్క, గర్జితమ్ = గర్జితమును, శ్రుత్వా = విని, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను.

తా. మృత్యుపాశముచేత బంధింపబడిన ఆ మహాసేన ఆ రాక్షసుని గర్జిత మును విని, గొప్ప సంతోషమును పొందెను. 25

మూ. సమీయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాఙ్క్షిణః,
ఋషయో దేవగన్ధర్వాః సిద్ధాశ్చ సహచారణైః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, ఋషయః = ఋషులు, దేవ గన్ధర్వాః = దేవతలు గంధర్వులు, సిద్ధాశ్చ = సిద్ధులు, చారణైః సహ = చారణులతో కూడ, యుద్ధదర్శనకాఙ్క్షిణః = యుద్ధముయొక్క దర్శనమును కోరుచున్నవారై, సమీయుః = కలిసి వచ్చిరి.

తా. ఆ యుద్ధము చూడవలె నను అభిలాషతో మహాత్ములైన ఋషులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు కలిసివచ్చిరి. 26

మూ. సమేత్య చోచుః సహితాస్తేఽన్యోన్యం పుణ్యకర్మణః, 27
స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకానాం యేఽభిసంగతాః.

ప్ర. అ. ("లోకేభ్యశ్చైవ సర్వశః"అను ప్రాచ్యపాఠము బాగున్నది). పుణ్యకర్మణః=పుణ్యకర్మ గల, తే=వారు, సమేత్య=ఒక్కచోట చేరి, అన్యోన్యమ్=పరస్పరము, సహితాః = కలిసినవారై, గోబ్రాహ్మణేభ్యః=గోవులకు, బ్రాహ్మణులకు, లోకేభ్యశ్చ = సకలజనులకు, సర్వశః=అన్నివిధముల, స్వస్తి=క్షేమము, అస్తు = అగుగాక అని, ఊచుః = పలికిరి.

తా. పుణ్యాత్ములైన వారందరు ఒక్క చోట చేరి, ఒకరితో ఒకరు కలిసి గోవులకు, బ్రాహ్మణులకు, సకలజనులకు అన్ని విధముల క్షేమ మగుగాక అని అనుకొనిరి. 27

మూ. జయతాం రాఘవః సంఖ్యే పౌలస్త్యాన్ రజనీచరాన్, 28
చక్రహస్తో యథా యుద్ధే సర్వానసురపుఙ్గవాన్.

ప్ర. అ. చక్రహస్తః=మహావిష్ణువు, యుద్ధే=యుద్ధమునందు, సర్వాన్=సమస్తమైన, అసురపుఙ్గవాన్=అసురశ్రేష్ఠులను, యథా=ఎట్లో అట్లు, రాఘవః=రాముడు, సంఖ్యే = యుద్ధమునందు, పౌలస్త్యాన్ = పులస్త్యవంశమునందు పుట్టిన, రజనీచరాన్ = రాక్షసులను, జయతామ్ = జయించుగాక.

తా. చక్రమును ధరించిన మహావిష్ణువు యుద్ధములో సమస్తమైన అసురులను జయించినట్లు రాముడు, యుద్ధములో, పులస్త్యవంశీయులైన రాక్షసులనందరిని జయించుగాక.

మూ. ఏతచ్చాన్యచ్చ బహుశో బ్రువాణాః పరమర్షయః, 29
జాతకౌతూహలాస్తత్ర విమానస్థాశ్చ దేవతాః,
దదృశుర్వాహినీం తేషాం రాక్షసానాం గతాయుషామ్. 30

ప్ర. అ. ఏతచ్చ = దీనిని, అన్యచ్చ = మరి ఇతరవిషయమును, బహుశః = అధికముగా, బ్రువాణాః = పలుకుచున్న, పరమర్షయః = గొప్ప ఋషులు, తత్ర = అక్కడ, విమానస్థాః = విమానములందున్న, దేవతాశ్చ = దేవతలు, జాతకౌతూహలాః = పుట్టిన కుతూహలము కలవారై, గతాయుషామ్ = గడచిన ఆయుర్దాయము గల, తేషామ్ = ఆ, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వాహినీమ్ = సేనను, దదృశుః = చూచిరి.

తా. ఈ విధముగాను, ఇంకను అనేక ఇతరవిషయములను చెప్పుకొనుచున్న మహర్షులు, విమానములపై ఉన్న దేవతలు, అధికమైన కుతూహలముతో, ఆయుర్దాయము చెల్లిన ఆ రాక్షసుల సైన్యమును చూచిరి. 29, 30

మూ. రథేన తు ఖరో వేగాదుగ్రసైన్యో వినిస్సృతః,
తం దృష్ట్వా రాక్షసం భూయో రాక్షసాశ్చ వినిస్సృతాః.

ప్ర. అ. ఉగ్రసైన్యః = భయంకరమైన సైన్యము గల, ఖరః = ఖరుడు, రథేన = రథముచేత, వేగాత్ = వేగమువలన, వినిస్సృతః = బయలుదేరెను. తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, దృష్ట్వా = చూచి, భూయః = మరల, రాక్షసాః చ = రాక్షసులు కూడ, వినిస్సృతాః = బయలుదేరిరి.

తా. భయంకరమైన సైన్యముతో కూడిన ఖరుడు రథము నెక్కి బయలుదేరగా ఆతనిని చూచి ఇతరులైన రాక్షసనాయకులు కూడ బయలుదేరిరి. 31

మూ. శ్యేనగామీ పృథుగ్రీవో యజ్ఞశత్రు ర్విహఙ్గమః,
దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః, 32

మేఘమాలీ మహామాలీ సర్వాస్యో రుధిరాశనః,
ద్వాదశైతే మహావీర్యాః ప్రతస్థు రభితః ఖరమ్. 33

ప్ర. అ. శ్యేనగామీ = శ్యేనగామి, పృథుగ్రీవః = పృథుగ్రీవుడు, యజ్ఞ

శ|త్రుః = యజ్ఞశ|త్రువు, విహఙ్గమః = విహంగముడు, దుర్జయః = దుర్జయుడు, కరవీరాక్షః = కరవీరాక్షుడు, పరుషః = పరుషుడు, కాలకార్ముకః = కాలకార్ముకుడు, మేఘమాలీ = మేఘమాలి, మహామాలీ = మహామాలి, సర్పాస్యః = సర్పాస్యుడు, రుధిరాశనః = రుధిరాశనుడు, మహావీర్యాః = గొప్ప పరా|క్రమము గల, ఏతే = ఈ, ద్వాదశ = పం|డెండుగురు, ఖరమ్ అభితః = ఖరుని చుట్టూ ఉండి, |ప్రతస్థుః = |ప్రయాణ మైరి.

తా. శ్యేనగామి, పృథు|గ్రీవుడు, యజ్ఞశ|త్రువు, విహంగముడు, దుర్జయుడు. కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు, అను మహాపరా|క్రమవంతు లైన పన్నెండుగురు రాక్షసులు ఖరుని చుట్టూ చేరి బయలుదేరిరి. 32, 33

మూ. మహాకపాలిః స్థూలాక్షః |ప్రమాథీ |త్రిశిరా స్తథా,
చత్వార ఏతే సేనాన్యో దూషణం పరితో యయుః. 34

|ప్ర. అ. మహాకపాలిః = మహాకపాలి, స్థూలాక్షః = స్థూలాక్షుడు, |ప్రమాథీ = |ప్రమాథి, తథా = మరియు, |త్రిశిరాః = |త్రిశిరస్సు, ఏతే = ఈ, చత్వారః = నలుగురు, సేనాన్యః = సేనానాయకులు, దూషణం పరితః = దూషణుని చుట్టూ చేరి, యయుః = వెళ్ళిరి.

తా. మహాకపాలి, స్థూలాక్షుడు, |ప్రమాథి, |త్రిశిరస్సు అను నలుగురు సేనానాయకులు దూషణుని చుట్టూ చేరి వెళ్ళిరి. 34

మూ. సా భీమవేగా సమరాభికామా
మహాబలా రాక్షసవీర సేనా,
తౌ రాజపు|తౌ సహసాభ్యుపేతా
మాలా |గ్రహాణామివ చన్ద్రసూర్యౌ. 35

ఇత్యార్షే శ్రీమ|ద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
|త్రయోవింశః సర్గః.

|ప్ర. అ. భీమవేగా = భయంకర మైన వేగము గలది, సమరాభికామా = యుద్ధమునందు ఆసక్తి గలది, మహాబలా = గొప్ప బలము గలది అయిన,

సా = ఆ, రాక్షసవీరసేనా = రాక్షసవీరుల సేన, సహసా = శీఘ్రముగా, గ్రహాణామ్ = గ్రహములయొక్క, మాలా = పంక్తి, చన్ద్రసూర్యౌ ఇవ = చంద్రసూర్యులను వలె, తౌ = ఆ, రాజపుత్రౌ = రాజపుత్రులను, అభ్యుపేతా = సమీపించినది.

తా. గొప్ప బలము గల ఆ రాక్షసవీరుల సేన, యుద్ధమునందు ఆసక్తి గలదై, భయంకరమైన వేగముతో, గ్రహముల పంక్తి చంద్రసూర్యులను సమీపించి నట్లు, అతిశీఘ్రముగ ఆ రాజపుత్రులను సమీపించెను. 35

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుర్వింశః సర్గః

[ఆ శకునములు చూచి రాముడు రాక్షసులకు వినాశము రానున్న దని, తనకు విజయము లభించనున్న దని తెలిసికొని "ఆ పర్వత గుహలోనికి సీతను తీసికొనివెళ్ళి అక్కడ ఆమెను రక్షించుచుండుము" అని లక్ష్మణుని ఆదేశించుట.]

మూ. ఆశ్రమం ప్రతి యాతే తు ఖరే ఖరపరాక్రమే,
తానేవౌత్పాతికాన్ రామః సహ భ్రాత్రా దదర్శ హ. 1

ప్ర. అ. ఖరపరాక్రమే = తీవ్రమైన పరాక్రమము గల, ఖరే = ఖరుడు, ఆశ్రమం ప్రతి = ఆశ్రమమును గూర్చి, యాతే = ప్రయాణమైనవా డగుచుండగా, రామః = రాముడు, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, ఔత్పాతికాన్ = ఉత్పాతమునకు సంబంధించిన, తానేవ = ఆ శకునములనే, దదర్శ హ = చూచెను.

తా. తీవ్ర మైన పరాక్రమము గల ఖరుడు తమ ఆశ్రమమునకు బయలు దేరి నపుడు కనబడిన ఆ ఉత్పాతములను రామలక్ష్మణులు కూడ చూచిరి.

మూ. తానుత్పాతాన్ మహాఘోరానుత్థితాన్ రోమహర్షణాన్,
ప్రజానామహితాన్ దృష్ట్వా రామో లక్ష్మణమబ్రవీత్. 2

ప్ర. అ. మహాఘోరాన్ = చాల భయంకరములు, రోమహర్షణాన్ = రోమాంచము కలిగించేవి, ప్రజానామ్ = ప్రజలకు, అహితాన్ = హితము కానివి అయిన, తాన్ = ఆ, ఉత్పాతాన్ = ఉత్పాతములను, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. చాలా భయంకరములై రోమాంచమును కలిగించునవి, ప్రజలకు హితములు కానివి అయిన ఆ ఉత్పాతములను చూచి రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను.

మూ. ఇమాన్ పశ్య మహాబాహో సర్వభూతాపహారిణః,
సముత్థితాన్ మహోత్పాతాన్ సంహర్తుం సర్వరాక్షసాన్. 3

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల లక్ష్మణా ! సర్వభూతాపహారిణః = సకలప్రాణులను సంహరించునవి, సర్వరాక్షసాన్ = సకలరాక్షసులను, సంహర్తుమ్ = సంహరించుటకు, సముత్థితాన్ = లేచినవి అయిన, ఇమాన్ ఈ, మహోత్పాతాన్ = గొప్ప ఉత్పాతములను, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! సకలభూతముల వినాశమును చేయ గల గొప్ప ఉత్పాతములు బయలుదేరినవి. ఇవి సకలరాక్షసుల వినాశమును సూచించుచున్నవి. వీటిని చూడుము. 3

మూ. అమీ రుధిరధారాస్తు విసృజన్తః ఖరస్వనాః,
వ్యోమ్ని మేఘా వివర్తన్తే పరుషా గర్దభారుణాః. 4

ప్ర. అ. రుధిరధారాః = రక్తధారలను, విసృజన్తః = విడచుచున్నవి, ఖరస్వనాః = పరుషమైన ధ్వని గలవి, పరుషాః = పరుషముగా ఉన్నవి, గర్దభారుణాః = గాడిదల వలె ఎఱ్ఱగా ఉన్నవి అయిన, అమీ = ఈ, మేఘాః = మేఘములు, వ్యోమ్ని = ఆకాశమునందు, వివర్తన్తే = దొర్లుచున్నవి.

తా. పరుషమైన ధ్వనులతో, గాడిద వలె ధూసరవర్ణము కలిగి చూచుటకు వికృతములుగా ఉన్న ఈ మేఘములు రక్తధారలను వర్షించుచు ఆకాశముమీద దొర్లుచున్నవి. 4

మూ. సధూమాశ్చ శరాః సర్వే మమ యుద్ధాభినన్దితాః,
రుక్మపృష్ఠాని చాపాని వివేష్టన్తే చ లక్ష్మణ. 5

ప్ర. అ. ("మహాయుద్ధాభినన్దినః" అను ప్రాచ్యపాఠము బాగున్నది). యుద్ధాభినన్దినః = గొప్ప యుద్ధమునకై ఉత్సాహము చూపుచు, సర్వే = సమస్తమైన, మమ శరాః = నా బాణములు, సధూమాశ్చ = ధూమముతో కూడినవి. లక్ష్మణ = లక్ష్మణా! రుక్మపృష్ఠాని = బంగారు పృష్ఠభాగములు గల, చాపాని చ = ధనస్సులు కూడ, వివేష్టన్తే = దొర్లుచున్నవి.

తా. లక్ష్మణా: బాణము లన్నీ ధూమముతో కూడినవై మహాయుద్ధము నకై ఉత్సాహము చూపుచున్నవి. బంగారు పైభాగములు గల ధనస్సులు ఎగిరి పడుచున్నవి. 5

మూ. యాదృశా ఇహ కూజన్తి పక్షిణో వనచారిణః,
అగ్రతో నో భయం ప్రాప్తం సంశయో జీవితస్య చ. 6

ప్ర. అ. ఇహ = ఇక్కడ, వనచారిణః = వనమునందు సంచరించు, పక్షిణః = పక్షులు, యాదృశాః = ఎట్టి విధము కలవై, కూజన్తి = కూయుచున్నవో, దానిని పట్టి, నః = మనకు, అగ్రతః = ఎదుటనే, భయమ్ = భయము, ప్రాప్తమ్ = వచ్చి ఉన్నది. జీవితస్య = జీవితముయొక్క, సంశయః చ = సంశయము కూడ వచ్చి ఉన్నది.

తా. అరణ్యములో సంచరించు పక్షులు కూసే పద్ధతిని పట్టి మనకు అపాయము దగ్గరలోనే రానున్నట్లు జీవితము కూడ సంశయాస్పదమైనట్లు తోచుచున్నది. 6

మూ. సంప్రహారస్తు సుమహాన్ భవిష్యతి న సంశయః,
అయమాఖ్యాతి మే బాహుః స్ఫురమాణో ముహుర్ముహుః.

సంనికర్షే తు నః శూర జయం శత్రోః పరాజయమ్,
సప్రభం చ ప్రసన్నం చ తవ వక్త్రం హి లక్ష్యతే.

ప్ర. అ. సుమహాన్ = చాల గొప్పదైన, సంప్రహారస్తు = యుద్ధమైతే, భవిష్యతి = కాగలదు. సంశయః = సంశయము, న = లేదు. శూర = ఓ! శూరుడా! ముహుః ముహుః = మాటి మాటికి, స్ఫురమాణః = అదురుచున్న, అయమ్ = ఈ, మే బాహుః = నా బాహువు, సంనికర్షే = సమీపమునందు, నః = మనయొక్క, జయమ్ = జయమును, శత్రోః = శత్రువుయొక్క, పరాజయమ్ = పరాజయమును, ఆఖ్యాతి = చెప్పుచున్నది. తవ = నీయొక్క, వక్త్రమ్ = ముఖము, సప్రభం చ = కాంతితో కూడినది గాను, ప్రసన్నం చ = ప్రసన్నముగాను, లక్ష్యతే హి = చూడబడుచున్నది కదా.

తా. ఓ! శూరుడా! చాల గొప్ప యుద్ధము జరుగనున్నది. సందేహము

లేదు. మాటిమాటికి అదురు చున్న నా బాహువు మనకు జయము, శత్రువుకు పరాజయము సమీపమునందే ఉన్నట్లు చెప్పుచున్నది. నీ ముఖము కూడ కాంతిమంతమై, ప్రసన్నముగా కనబడుచున్నది. ఇది కూడ మన జయమును సూచించుచున్నది. 7, 8

మూ. ఉద్యతానాం హి యుద్ధార్థం యేషాం భవతి లక్ష్మణ,
నిష్ప్రభం వదనం తేషాం భవత్యాయుఃపరిక్షయః. 9

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! యుద్ధార్థమ్ = యుద్ధముకొరకై, ఉద్యతానామ్ = ఉద్యుక్తులైన, యేషామ్ = ఎవరియొక్క, వదనమ్ = ముఖము, నిష్ప్రభమ్ = కాంతి లేనిది, భవతి = అగునో, తేషామ్ = వారియొక్క, ఆయుః పరిక్షయః = ఆయుర్దాయము యొక్క, క్షయము, భవతి = అగును.

తా. లక్ష్మణా! యుద్ధమునకై ఉద్యుక్తులైన ఎవరి ముఖము కాంతివిహీనమగునో వారి ఆయుర్దాయము క్షీణించిన దని అర్థము. 9

మూ. రక్షసాం నర్దతాం ఘోరః శ్రూయతే చ మహాధ్వనిః,
ఆహతానాం చ భేరీణాం రాక్షసైః క్రూరకర్మభిః. 10

ప్ర. అ. నర్దతామ్ = అరచుచున్న, రక్షసామ్ = రాక్షసులయొక్క, క్రూరకర్మభిః=క్రూరములైన కర్మలు గల, రాక్షసైః = రాక్షసులచేత, ఆహతానామ్ = మ్రోగించబడిన, భేరీణాం చ = భేరీలయొక్క, ఘోరః = భయంకరమైన, మహాధ్వనిః=గొప్ప ధ్వని, శ్రూయతే చ = వినబడుచున్నది.

తా. రాక్షసుల అరపులు, క్రూరకర్మలు చేయు ఆ రాక్షసులు మ్రోగించుచున్న భేరీల భయంకరమైన మహాధ్వని వినవచ్చుచున్నవి. 10

మూ. అనాగతవిధానం హి కర్తవ్యం శుభమిచ్ఛతా,
ఆపదం శఙ్కమానేన పురుషేణ విపశ్చితా. 11

ప్ర. అ. ఆపదమ్ = ఆపదను, శఙ్కమానేన=శంకించుచున్న, శుభమ్= శుభమును, ఇచ్ఛతా = కోరుచున్న, విపశ్చితా = విద్వాంసుడైన, పురుషేణ= పురుషునిచేత, అనాగతవిధానమ్ = రాబోవుదానికి ప్రతిక్రియ, కర్తవ్యం హి = చేయదగినది కదా?

తా. ఆపద రానున్న దని ఆశంక కలిగినపుడు, శుభమును కోరు బుద్ధి మంతుడైన పురుషుడు రాబోవుదానికి ప్రతిక్రియ చేసుకొనవలెను కదా! 11

మూ. తస్మాద్గృహీత్వా వైదేహీం శరపాణిర్ధనుర్ధరః,
గుహామాశ్రయ శైలస్య దుర్గాం పాదపసంకులామ్. 12

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, వైదేహీమ్ = సీతను, గృహీత్వా = గ్రహించి, శరపాణిః = బాణములు హస్తమునందు కలవాడవై, ధనుర్ధరః = ధనస్సును ధరించినవాడవై, శైలస్య = పర్వతముయొక్క, దుర్గామ్ = ప్రవేశింప శక్యము కాని, పాదపసంకులామ్ = వృక్షములచే వ్యాకులమైన, గుహామ్ = గుహను, ఆశ్రయ = ఆశ్రయించుము.

తా. అందుచేత నీవు ధనుర్బాణములు ధరించి, సీతను నీవెంట గైకొని వెళ్ళి, వృక్షములచేత వ్యాప్తమై ప్రవేశింప శక్యము కాని పర్వతగుహలో ఉండుము.

మూ. ప్రతికూలితు మిచ్ఛామి న హి వాక్యమిదం త్వయా,
శాపితో మమ పాదాభ్యాం గమ్యతాం వత్స మా చిరమ్.

ప్ర. అ. ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, త్వయా = నీచేత, ప్రతికూలితుమ్ = ప్రతికూలము చేయుటకు, న ఇచ్ఛామి = ఇష్టపడను. వత్స = వత్సా! మమ పాదాభ్యామ్ = నా పాదములచేత, శాపితః అసి = ఒట్టుపెట్టబడితివి. గమ్యతామ్ = వెళ్ళెదవుగాక. చిరమ్ = ఆలస్యము, మా = వద్దు.

తా. "నేనే రాక్షసులను సంహరించెదను" మొదలైన మాటలు చెప్పి నా మాటకు నీవు అడ్డు చెప్పుట నా కిష్టము లేదు. నా పాదాలపై ఒట్టు పెట్టి చెప్పు చున్నాను. నాయనా! వెంటనే వెళ్లుము; ఆలస్యము చేయవద్దు. 13

మూ. త్వం హి శూరశ్చ బలవాన్ హన్యా హ్యేతాన్న సంశయః,
స్వయం తు హన్తుమిచ్ఛామి సర్వానేవ నిశాచరాన్. 14

ప్ర. అ. త్వమ్ = నీవు, శూరశ్చ = శూరుడవు, బలవాన్ = బలవంతుడవు. ఏతాన్ = ఈ రాక్షసులను, హన్యాః హి = చంపగలవు. తు = కాని, సర్వానేవ = సమస్తమైన, నిశాచరాన్ = రాక్షసులను, స్వయమ్ = స్వయముగా, హన్తుమ్ = చంపుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. నీవు శూరుడవు; బలవంతుడవు, అందుచేత నీవే ఈ రాక్షసులను చంపగలవు; సందేహము లేదు. కాని ఈ రాక్షసుల నందరినీ నేనే స్వయముగా చంపవలె నని కోరుచున్నాను. 14

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః సహ సీతయా,
శరానాదాయ చాపం చ గుహాం దుర్గాం సమాశ్రయత్. 15

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లక్ష్మణః = లక్ష్మణుడు, శరాన్ = బాణములను, చాపం చ = ధనస్సును, ఆదాయ = గ్రహించి, సీతయా సహ = సీతతో కూడ, దుర్గామ్ = ప్రవేశింప శక్యము కాని, గుహామ్ = గుహను, సమాశ్రయత్ = ఆశ్రయించెను.

తా. లక్ష్మణుడు రాముని ఆజ్ఞ ప్రకారము, ధనుర్బాణములు ధరించి, సీతను వెంట తీసికొని, ప్రవేశింప శక్యము కాని గుహలోనికి ప్రవేశించెను. 15

మూ. తస్మిన్ ప్రవిష్టే తు గుహాం లక్ష్మణే సహ సీతయా,
హన్త నిర్యుక్తమిత్యుక్త్వా రామః కవచమావిశత్. 16

ప్ర. అ. తస్మిన్ = ఆ, లక్ష్మణే = లక్ష్మణుడు, సీతయా సహ = సీతతో కూడ, గుహామ్ = గుహను, ప్రవిష్టే = ప్రవేశించినవా డగుచుండగా, రామః = రాముడు, హన్త = అమ్మయ్య ! నిర్యుక్తమ్ = మంచిఉపాయము ! ఇతి = అని, ఉక్త్వా = పలికి, కవచమ్ = కవచమును, ఆవిశత్ = ప్రవేశించెను.

తా. లక్ష్మణుడు సీతతో గుహలో ప్రవేశించిన పిదప రాముడు "అమ్మయ్య! మంచి పని చేసితిని !" అని అనుకొనుచు కవచమును తొడుగుకొనెను. 16

మూ. స తేనాగ్నినికాశేన కవచేన విభూషితః,
బభూవ రామ స్తిమిరే విధూమోఽగ్నిరివోత్థితః. 17

ప్ర. అ. అగ్నినికాశేన = అగ్నితో సమానమైన, తేన = ఆ, కవచేన = కవచముచేత, విభూషితః = అలంకరించబడిన, సః రామః = ఆ రాముడు, తిమిరే = చీకటియందు, ఉత్థితః = పైకిఎగసిన, విధూమః = ధూమము లేని, అగ్నిరివ = అగ్నివలె, బభూవ = ఉండెను.

తా. అగ్నితో సమానమైన ఆ కవచముచేత అలంకృతుడై రాముడు, చీకట్లో ప్రజ్వలించుచున్న, ధూమము లేని అగ్ని వలె ప్రకాశించెను. 17

మూ. స చాపముద్యమ్య మహచ్ఛరానాదాయ వీర్యవాన్,
బభూవావస్థిత స్తత్ర జ్యాస్వనైః పూరయన్ దిశః. 18

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః = ఆ రాముడు, మహత్ = గొప్పదైన, చాపమ్ = ధనస్సును, ఉద్యమ్య = ఎత్తి, జ్యాస్వనైః = నారి ధ్వనులచేత, దిశః = దిక్కులను, పూరయన్ = నింపుచు, తత్ర = అక్కడ, అవస్థితః = నిలచినవాడు, బభూవ = ఆయెను.

తా. పరాక్రమశాలియైన ఆ రాముడు గొప్ప ధనస్సును ఎత్తి, బాణములు గ్రహించి, టంకారధ్వనులచేత దిక్కులను నింపుచు అక్కడ నిలచెను. 18

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ సహ చారణైః,
సమేయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాఙ్క్షిణః. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో గూడిన, దేవాః = దేవతలు, మహాత్మానః = మహాత్ములైన, సిద్ధాశ్చ = సిద్ధులు, చారణైః సహ = చారణులతో కూడ, యుద్ధదర్శనకాఙ్క్షిణః = యుద్ధముయొక్క దర్శనమును కోరుచు, సమేయుః = కలసివచ్చిరి.

తా. పిమ్మట, ఆయుద్ధమును చూచుటకై మహాత్ములైన దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు కలిసి వచ్చిరి. 19

మూ. ఋషయశ్చ మహాత్మానో లోకే బ్రహ్మర్షిసత్తమాః,
సమేత్య చోచుః సహితా అన్యోన్యం పుణ్యకర్మణః. 20

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, ఋషయశ్చ = ఋషులు, లోకే = లోకమునందలి, బ్రహ్మర్షిసత్తమాః = శ్రేష్ఠులైన బ్రహ్మర్షులు వచ్చిరి. పుణ్యకర్మణః = పుణ్యకర్మలుగల వారందరు, సమేత్య = దగ్గరగా, అన్యోన్యమ్ = పరస్పరము, సహితాః = కలసినవారై, ఊచుః = ఇట్లు పలికిరి.

తా. మహాత్ములైన ఋషీశ్వరులు, లోకములో ఉన్న శ్రేష్ఠులైన బ్రహ్మర్షులు కూడ వచ్చిరి. ఆ పుణ్యాత్ము లందరు కలిసి ఒకరితో ఒకరు ఇట్లనిరి. 20

మూ. స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకానాం యేఽభిసంగతాః,
జయతాం రాఘవో యుద్ధే పౌలస్త్యాన్ రజనీచరాన్, 21
చక్రహస్తో యథా యుద్ధే సర్వానసురపుఙ్గవాన్.

ప్ర. అ. తా.చూ. 23వ సర్గ శ్లో. 27, 28.

ఈ శ్లోకాలు ప్రాచ్యపాఠంలో ఇక్కడ లేవు.

మూ. ఏవముక్త్వా పునః ప్రోచురాలోక్య చ పరస్పరమ్, 22
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి. 23

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, ఆలోక్య చ = చూచి, పరస్పరమ్ = పరస్పరము, పునః = మరల, ప్రోచుః = పలికిరి. భీమకర్మణామ్ = భయంకరమైన పనులు గల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదు నాలుగు, సహస్రాణి = వేలు ఉన్నవి. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామశ్చ = రాముడు, ఏకః = ఒక్కడే; యుద్ధమ్ = యుద్ధము, కథమ్ = ఎట్లు, భవిష్యతి = కాగలదో.

తా. ఈ విధముగా పలికి ఆ దేవతాదులు పరస్పరము చూచుకొనుచు మరల ఇట్లు అనుకొనిరి. "భయంకరములైన పనులు చేయు రాక్షసులు పదునాలుగు వేలమంది ఉన్నారు. ధర్మాత్ముడైన రాము డొక్కడే ఉన్నాడు. యుద్ధము ఎట్లు జరుగునో కదా." 22, 23

మూ. ఇతి రాజర్షయః సిద్ధాః సగణాశ్చ ద్విజర్షభాః,
జాతకౌతూహలా స్తస్థుర్విమానస్థాశ్చ దేవతాః. 24

ప్ర అ. రాజర్షయః = రాజర్షులు, సగణాః = గణములతో కూడిన, సిద్ధాః = సిద్ధులు, ద్విజర్షభాః = ద్విజ శ్రేష్ఠులు, విమానస్థాః = విమానములం

దున్న, దేవతాశ్చ = దేవతలు, ఇతి = ఇట్లు, జాతకౌతూహలాః = పుట్టిన వేడుక గలవారై, తస్థుః = ఉండిరి.

తా. రాజర్షులు, సిద్ధులు, గణములు, ద్విజశ్రేష్ఠులు, విమానాలలో ఉన్న దేవతలు ఈ విధముగా మాటలాడుకొనుచు, మిక్కిలి వేడుకతో నిలచి ఉండిరి.

మూ. ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని భయాద్వివ్యథిరే తదా. 25

ప్ర. అ. తదా = అప్పుడు, సంగ్రామశిరసి = యుద్ధమునకు అగ్రభాగమునందు, స్థితమ్ = నిలచియున్న, తేజసా = తేజస్సుచేత, ఆవిష్టమ్ = ఆవేశింపబడి ఉన్న, రామమ్ = రాముణ్ణి, దృష్ట్వా = చూచి, సర్వాణి = సమస్తమైన, భూతాని = ప్రాణులు, భయాత్ = భయమువలన, వివ్యథిరే = వ్యథ చెందినవి.

తా. ఆ సమయమునందు, యుద్ధము చేయుటకై నిలచిన ఆ రాముణ్ణి ఒక అద్భుతమైన తేజస్సు ఆవహించి ఉండెను. అట్టి ఆ రాముణ్ణి చూచి అక్కడ నున్న ప్రాణు లన్నీ భయముతో కలత చెందెను. 25

మూ. రూపమప్రతిమం తస్య రామస్యాక్లిష్టకర్మణః,
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ మహాత్మనః. 26

ప్ర. అ. అక్లిష్టకర్మణః = శ్రమపడకుండా పనిచేయు, తస్య రామస్య = ఆ రాముని యొక్క, అప్రతిమమ్ = సాటి లేని, రూపమ్ = రూపము, క్రుద్ధస్య = క్రుద్ధుడైన, మహాత్మనః = మహాత్ముడైన, రుద్రస్య = రుద్రునియొక్క, రూపమివ = రూపమువలె, బభూవ = ఉండెను.

తా. శ్రమపడకుండ పనులు చేయు రాముని సాటి లేని ఆ రూపము, కోపించిన మహాత్ముడైన రుద్రుని రూపము వలె ఉండెను. (పోల్చినచో ఆ రుద్రుని రూపముతో పోల్చవలెను కాని మరొకటి ఏదీ లేదని భావము). 26

మూ. తతో గమ్భీరనిర్హ్రాదం ఘోరవర్మాయుధధ్వజమ్,
అనీకం యాతుధానానాం సమన్తాత్ప్రత్యదృశ్యత. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గమ్భీరనిర్హ్రాదమ్ = గంభీరమైన ధ్వని

కలది, ఘోరవర్మాయుధధ్వజమ్ = భయంకరములైన కవచములు, ఆయుధ ములు, ధ్వజములు గలది అయిన, యాతుధానానామ్ = రాక్షసులయొక్క, అనీకమ్ = సేన, సమన్తాత్ = అంతటా, ప్రత్యదృశ్యత = చూడబడెను.

తా. ఇంతలో గంభీరమైన ధ్వని చేయుచు, భయంకరములైన కవచ ములు, ఆయుధములు, ధ్వజములు ధరించి వచ్చుచున్న రాక్షసుల సైన్యము నలుమూలల కనబడెను. 27

మూ. సింహనాదం విసృజతామన్యోన్యమభిగర్జతామ్
చాపాని విస్ఫారయతాం జృమ్భతామప్యభీక్ష్ణశః, 28

విప్రఘుష్టస్వనానాం చ దున్దుభీశ్చాపి నిఘ్నతామ్
తేషాం సుతుములః శబ్దః పూరయామాస తద్వనమ్. 29

ప్ర. అ. సింహనాదమ్ = సింహనాదమును, విసృజతామ్ = విడచుచున్న వాళ్ళు, అన్యోన్యమ్ = పరస్పరము, అభిగర్జతామ్ = ఎదురుగా నిలచి గర్జించు చున్నవాళ్ల, చాపాని = ధనస్సులను, విస్ఫారయతామ్ = చరచుచున్నవాళ్ళు, అభీక్ష్ణశః = ఎక్కువగా, జృమ్భతామపి = ఆవులించుచున్నవాళ్ళు, విప్రఘుష్ట స్వనానాం చ = అరపుల ధ్వనులు కలవాళ్లు, దున్దుభీశ్చ అపి = దుందుభులను, నిఘ్నతామ్ = కొట్టుచున్న వాళ్ల అయిన, తేషామ్ = వాళ్ళయొక్క, సుతుములః = చాల వ్యాకులమైన, శబ్దః = శబ్దము, తద్వనమ్ = ఆ వనమును, పూరయామాస = నింపెను.

తా. ఆ రాక్షసులలో కొందరు సింహనాదములు చేయగా, మరి కొందరు ఒకరి వైపు మరొకరు తిరిగి గర్జించుచుండిరి. కొందరు ధనుష్టంకారము చేయు చుండిరి. కొందరు ఎక్కువగా ఆవులించుచుండిరి. కొందరు చాల గట్టిగా అరచు చుండిరి. కొందరు దుందుభులు మ్రోగించుచుండిరి. ఈ విధముగ ఆ రాక్షసులు చేయు వ్యాకులమైన శబ్దము ఆ వనమును నింపివేసెను. 28, 29

మూ. తేన శబ్దేన విత్రస్తాః శ్వాపదా వనచారిణః,
దుద్రువుర్యత్ర నిఃశబ్దం పృష్ఠతో న వ్యలోకమన్. 30

ప్ర. అ. తేన శబ్దేన = ఆ ధ్వనిచేత, సంత్రస్తాః = భయపడిన, వన

చారిణః = వనమునందు సంచరించు, శ్వాపదాః = క్రూరమృగములు, యత్ర = ఎక్కడ, నిఃశబ్దమ్ = శబ్దము లేదో అక్కడికి, దుద్రువుః = పరుగెత్తినవి; పృష్ఠతః = వెనుకకు, న వ్యలోకమన్ = చూడలేదు.

తా. ఆ ధ్వనికి భయపడి వనములో సంచరించే క్రూరమృగములు, వెనుకకు తిరిగి చూడకుండా ధ్వని లేని చోటికి పారిపోయినవి. 30

మూ. తత్త్వనీకం మహాఘోరం రామం సముపసర్పత,
ధృతనానాప్రహరణం గమ్భీరం సాగరోపమమ్. 31

ప్ర. అ. మహాఘోరమ్ = చాల భయంకరము, ధృతనానాప్రహరణమ్= ధరించబడిన అనేక విధములైన ఆయుధములు కలది, గమ్భీరమ్ = గంభీరము, సాగరోపమమ్ = సముద్రముతో సమానము అయిన, తత్ అనీకమ్ = ఆ సేన, రామమ్ = రాముణ్ణి, సముపసర్పత = చేరెను.

తా. సముద్రము వలె చాల గంభీరమై చాల భయంకరముగా ఉన్న ఆ సైన్యము అనేకవిధములైన ఆయుధములు ధరించి రాముణ్ణి సమీపించెను. 31

మూ. రామోఽపి చారయంశ్చక్షుః సర్వతో రణపణ్డితః,
దదర్శ ఖరసైన్యం తద్యుద్ధాభిముఖముత్థితమ్. 32

ప్ర. అ. రణపణ్డితః = యుద్ధమునందు పండితుడైన, రామోఽపి = రాముడు కూడ, చక్షుః = నేత్రమును (దృష్టిని), సర్వతః = అన్నివైపులా, చారయన్ = ప్రసరింపచేయుచు, యుద్ధాభిముఖమ్=యుద్ధమునకు అభిముఖమైన, ఉత్థితమ్ = బయలుదేరి వచ్చిన, తత్ = ఆ, ఖరసైన్యమ్ = ఖరుని సైన్యమును, దదర్శ = చూచెను.

తా. యుద్ధములో చాల సమర్థుడైన రాముడు కూడ తన దృష్టిని అన్నివైపులా ప్రసరింపచేసి, తనతో యుద్ధమునకై లేచి వచ్చిన ఖరుని సైన్యమును చూచెను. 32

మూ. వితత్య చ ధనుర్భీమం తూణ్యాశ్చోద్ధృత్య సాయకాన్,
క్రోధమాహారయత్తీవ్రం వధార్థం సర్వరక్షసామ్. 33

ప్ర. అ. భీమమ్ = భయంకరమైన, ధనుః = ధనస్సును, వితత్య = విస్తరింపచేసి, తూణ్యాః = అంబులపొదినుండి, సాయకాన్ = బాణములను, ఉద్ధృత్య = ఎత్తి (పైకి తీసి), సర్వ రక్షసామ్ = సమస్తరాక్షసులయొక్క, వధార్థమ్ = వధ కొరకు, తీవ్రమ్ = తీవ్రమైన, క్రోధమ్ = క్రోధమును, ఆహారయత్ = తెప్పించుకొనెను.

తా. రాముడు భయంకరమైన ధనస్సును చారించి, అంబులపొది నుండి బాణములు పైకి తీసి, సకలరాక్షసుల వధకొరకై తీవ్రమైన క్రోధము తెప్పించుకొనెను. 33

మూ. దుష్ప్రేక్షః సోఽభవత్క్రుద్ధో యుగాన్తాగ్నిరివ జ్వలన్,
తం దృష్ట్వా తేజసావిష్టం ప్రాద్రవన్ వనదేవతాః. 34

ప్ర. అ. క్రుద్ధః = క్రుద్ధుడైన, సః = ఆ రాముడు, జ్వలన్ = ప్రజ్వలించుచున్న, యుగాన్తాగ్నిరివ = ప్రలయకాలాగ్ని వలె, దుష్ప్రేక్షః = చూచుటకు శక్యము కానివాడు, అభవత్ = ఆయెను. తేజసా = తేజస్సుచేత, ఆవిష్టమ్ = ఆవేశింపబడిన, తమ్ = ఆ రాముణ్ణి, దృష్ట్వా = చూచి, వనదేవతాః = వనదేవతలు, ప్రాద్రవన్ = పారిపోయిరి.

తా. క్రుద్ధుడైన ఆ రాముడు, ప్రజ్వలించుచున్న ప్రలయకాలాగ్ని వలె చూచుటకు భయంకరుడుగా ఉండెను. గొప్ప తేజస్సుతో నిండి యున్న ఆ రాముణ్ణి చూచి భయపడి వనదేవతలు పారిపోయిరి. 34

మూ. తస్య క్రుద్ధస్య రూపం తు రామస్య దదృశే తదా,
దక్షస్యేవ క్రతుం హన్తుముద్యతస్య పినాకినః. 35

ప్ర. అ. తదా = అప్పుడు, క్రుద్ధస్య = కోపించిన, తస్య = ఆ రాముని యొక్క, రూపమ్ = రూపము, దక్షస్య = దక్షునియొక్క, క్రతుమ్ = యాగమును, హన్తుమ్ = ధ్వంసము చేయుటకు, ఉద్యతస్య = ఉద్యుక్తుడైన, పినాకినః ఇవ = శివుని రూపము వలె, దదృశే = చూడబడెను.

తా. కోపించిన ఆ రాముని రూపము, దక్షుని యజ్ఞముధ్వంసము చేయుటకు

ఉద్యమించి పినాక మను ధనస్సును హస్తమునందు ధరించిన రుద్రుని రూపము వలె ఉండెను. 35

మూ. ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః. 36

ప్ర. అ. తేజసా = తేజస్సుచేత, ఆవిష్టమ్ = ఆవేశింపబడిన, సంగ్రామ శిరసి = యుద్ధాగ్రమునందు, స్థితమ్ = నిలచిన, రామమ్ = రాముణ్ణి, దృష్ట్వా = చూచి, సర్వాణి = సమస్తమైన, భూతాని = ప్రాణులు, భయార్తాని = భయముచేత పీడింపబడినవై, ప్రదుద్రువుః = పారిపోయినవి.

తా. అద్భుతమైన తేజస్సు ఆవరింపగా యుద్ధాగ్రభాగమునందు నిలచి ఉన్న ఆ రాముణ్ణి చూచి సకలభూతములు భయముచేత పీడితములై పారిపోయినవి. 36

మూ. తత్కార్ముకైరాభరణైర్ధ్వజైశ్చ
తైర్వర్మభిశ్చాగ్నిసమానవర్ణైః,
బభూవ సైన్యం పిశితాశనానాం
సూర్యోదయే నీలమివాభ్రబృన్దమ్. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుర్వింశః సర్గః.

ప్ర. అ. పిశితాశనానామ్ = రాక్షసులయొక్క, తత్ = ఆ, సైన్యమ్ = సైన్యము, కార్ముకైః = ధనస్సులచేతను, ఆభరణైః = ఆభరణములచేతను, ధ్వజైశ్చ = ధ్వజములచేతను, అగ్నిసమానవర్ణైః = అగ్నితో సమానమైన వర్ణము గల, తైః = ఆ, వర్మభిః = కవచములచేతను, సూర్యోదయే = సూర్యోదయ సమయమునందు, నీలమ్ = నల్లని, అభ్రబృన్దమివ = మేఘముల సముదాయము వలె, బభూవ = ఉండెను.

తా. ఆ రాక్షససైన్యము ధనస్సులతోను, ఆభరణములతోను, ధ్వజముల

తోను, అగ్నితో సమానమైన వర్ణము గల కవచములతోను నిండి యుండుటచేత సూర్యోదయసమయమునందు సూర్యకాంతి ప్రసరించుచున్న నల్లని మేఘసముదాయము వలె ఉండెను. 32

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చవింశః సర్గః

[రాముడు యుద్ధానికి వచ్చిన రాక్షసులను సంహరించుట].

మూ. అవష్టబ్ధధనుం రామం క్రుద్ధం చ రిపుఘాతినమ్,
దదర్శాశ్రమమాగమ్య ఖరః సహ పురఃసరైః. 1

ప్ర. అ. ఖరః = ఖరుడు, పురఃసరైః సహ = తన ముందు నడచు సైనికులతో కూడ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆగమ్య = చేరి, అవష్టబ్ధధనుమ్ = నిలబెట్టబడిన ధనస్సు కలవాడు, క్రుద్ధమ్ = కోపించినవాడు, రిపుఘాతినమ్ = శత్రువులను సంహరించువాడు అయిన, రామమ్ = రాముణ్ణి, దదర్శ = చూచెను.

తా. ఖరుడు తన ముందు నడచి వచ్చు సైనికులతో కూడ కలసి ఆశ్రమము చేరి, అక్కడ క్రుద్ధుడై ధనస్సును నేలపై నిలబెట్టి పట్టుకొని ఉన్న శత్రుసంహారకుడైన రాముణ్ణి చూచెను. 1

మూ. తం దృష్ట్వా సశరం చాపముద్యమ్య ఖరనిస్స్వనమ్,
రామస్యాభిముఖం సూతం చోద్యతామిత్యచోదయత్. 2

ప్ర. అ. తమ్ = ఆ రాముణ్ణి, దృష్ట్వా = చూచి, ఖరనిస్స్వనమ్ = పరుషమైన ధ్వని గల, సశరమ్ = శరములతో కూడిన, చాపమ్ = ధనస్సును, ఉద్యమ్య = ఎత్తి, రామస్య = రామునకు, అభిముఖమ్ = ఎదురుగా, చోద్యతామ్ = తోలబడుగాక, ఇతి = అని, సూతమ్ = సారథిని, అచోదయత్ = ప్రేరేపించెను.

తా. ఖరుడు ఆ రాముణ్ణి చూచి, పరుషముగా ధ్వని చేయు, బాణసహితమైన ధనస్సును పైకి ఎత్తి "రథమును రాముని వద్దకు తీసికొని వెళ్ళుము" అని సారథిని ప్రేరేపించెను. 2

మూ. స ఖరస్యాజ్ఞయా సూతస్తురగాన్ సమచోదయత్,
యత్ర రామో మహాబాహురేకో ధూన్వన్ స్థితో ధనుః. 3

ప్ర. అ. సః సూతః = ఆ సారథి, ఖరస్య = ఖరునియొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, మహాబాహుః = గొప్ప బాహువులు గల, ఏకః = ఒంటరిగా ఉన్న, రామః = రాముడు, యత్ర = ఎక్కడ, ధనుః = ధనస్సును, ధూన్వన్ = కదల్చును, స్థితః = నిలచెనో అక్కడికి, తురగాన్ = గుఱ్ఱములను, సమచోదయత్ = త్రోలెను.

తా. ఆ సారథి ఖరుని ఆజ్ఞ ననుసరించి, మహాబాహువైన రాముడు ధనస్సు కదల్చుచు ఏకాకిగా నిలచి ఉన్న ప్రదేశమునకు రథమును తీసికొనివెళ్లెను. 3

మూ. తం తు నిష్పతితం దృష్ట్వా సర్వే తే రజనీచరాః,
నర్దమానా మహానాదం సచివాః పర్యవారయన్. 4

ప్ర. అ. నిష్పతితమ్ = ముందుకు వచ్చిన, తమ్ = ఆ ఖరుణ్ణి, దృష్ట్వా = చూచి, సచివాః = మంత్రులైన, తే = ఆ, సర్వే = సమస్తమైన, రజనీచరాః = రాక్షసులు, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగు నట్లుగా, నర్దమానాః = ధ్వని చేయుచు, పర్యవారయన్ = ఆతని చుట్టు చేరిరి.

తా. ఖరుడు ముందుకు వచ్చుట చూచి ఆతని మంత్రులైన రాక్షసు లందరు బిగ్గరగా అరచుచు ఆతని చుట్టూ చేరిరి. 4

మూ. స తేషాం యాతుధానానాం మధ్యే రథగతః ఖరః,
బభూవ మధ్యే తారాణాం లోహితాఙ్గ ఇవోదితః. 5

ప్ర. అ. తేషాం యాతుధానానామ్ = ఆ రాక్షసులయొక్క, మధ్యే = మధ్యయందు, రథగతః = రథమునం దున్న, ఖరః = ఖరుడు, తారాణామ్ = నక్షత్రములయొక్క, మధ్యే = మధ్యయందు, ఉదితః = ఉదయించిన, లోహితాఙ్గ ఇవ = కుజుడు వలె, బభూవ = ఉండెను.

తా. ఆ రాక్షసుల మధ్య రథముపై ఉన్న ఆ ఖరుడు, నక్షత్రముల మధ్య ఉదయించిన కుజగ్రహము వలె ఉండెను. 5

మూ. తతః శరసహస్రేణ రామమప్రతిమౌజసమ్,
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. 6

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఖరః = ఖరుడు, సమరే = యుద్ధమునందు, శరసహస్రేణ = అనేకబాణములతో, అప్రతిమౌజసమ్ = సాటి లేని కాంతి గల, రామమ్ = రాముణ్ణి, అర్దయిత్వా = పీడించి, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననాద = అరచెను.

తా. పిమ్మట ఖరుడు సాటి లేని కాంతి గల రాముణ్ణి, యుద్ధమునందు, అనేక బాణములు ప్రయోగించి పీడించి బిగ్గరగా అరచెను. 6

మూ. తతస్తం భీమధన్వానం క్రుద్ధాః సర్వే నిశాచరాః,
రామం నానావిధైః శస్త్రైరభ్యవర్షన్త దుర్జయమ్. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, క్రుద్ధాః=కోపించిన, నిశాచరాః = రాక్షసులు, భీమధన్వానమ్ = భయంకరమైన ధనస్సు గల, దుర్జయమ్ = జయింప శక్యము కాని, తం రామమ్ = ఆ రాముణ్ణి, నానావిధైః=అనేక విధములైన, శస్త్రైః = ఆయుధములచేత, అభ్యవర్షన్ = వర్షించిరి.

తా. పిమ్మట ఆ రాక్షసు లందరూ కూడ కోపముతో, భయంకరమైన ధనస్సు ధరించి ఉన్న, జయింప శక్యము కాని ఆ రామునిపై అనేకవిధములైన శస్త్రములు కురిపించిరి. 7

మూ. ముద్గరైః పట్టిసైః శూలైః ప్రాసైః ఖడ్గైః పరశ్వథైః,
రాక్షసాః సమరే రామం నిజఘ్నూ రోషతత్పరాః. 8

ప్ర. అ. రాక్షసాః = రాక్షసులు, రోషతత్పరాః = రోషావిష్టులై, ముద్గరైః = ముద్గరములచేత, పట్టిసైః=పట్టిసములచేత, శూలైః = శూలములచేత, ప్రాసైః = ప్రాసములచేత, ఖడ్గైః=ఖడ్గములచేత, పరశ్వథైః = గండ్రగొడ్డళ్లచేత, సమరే = యుద్ధమునందు, రామమ్ = రాముణ్ణి, నిజఘ్నుః = కొట్టిరి.

తా. రాక్షసులు రోషావేశముతో ఆ రాముణ్ణి, యుద్ధములో, ముద్గరములు, పట్టిసములు, శూలములు, ప్రాసలు, ఖడ్గములు, గండ్రగొడ్డళ్ళు మొదలైన ఆయుధాలతో కొట్టిరి. 8

మూ. తే వలాహకసంకాశా మహానాదా మహౌజసః,
అభ్యధావన్త కాకుత్థ్సం రథై ర్వాజిభిరేవ చ, 9
గజైః పర్వతకూటాభై రామం యుద్ధే జిఘాంసవః.

ప్ర. అ. వలాహకసంకాశాః = మేఘములతో సమానులు, మహానాదాః = గొప్ప ధ్వనులు కలవారు, మహౌజసః = గొప్ప తేజస్సు కలవారు అయిన, తే = ఆ రాక్షసులు, రథైః = రథములతోను, వాజిభిరేవ చ = గుఱ్ఱములతోను, పర్వత కూటాభైః = పర్వతశిఖరములతో సమానములైన, గజైః = ఏనుగులతోను, యుద్ధే = యుద్ధమునందు, జిఘాంసవః = (రాముణ్ణి) చంప దలచినవారై, రామమ్ = రాముణ్ణి గూర్చి, అభ్యధావన్త = పరుగెత్తిరి.

తా. మేఘాల వంటి ఆకారములు గల మహాతేజఃశాలు లైన ఆ రాక్షసులు, గొప్ప ధ్వని చేయుచు, యుద్ధములో రాముణ్ణి సంహరించవలె నను కోరికతో, రథములు, గుఱ్ఱములు, పర్వతశిఖరములవంటి ఏనుగులు ఎక్కి ఆ రాముని మీదకు వెళ్ళిరి. 9

మూ. తే రామే శరవర్షాణి వ్యసృజన్ రక్షసాం గణాః, 10
శైలేన్ద్రమివ ధారాభిర్వర్షమాణా వలాహకాః.

ప్ర. అ. తే = ఆ, రక్షసామ్ = రాక్షసులయొక్క, గణాః = గణములు, రామే = రామునిమీద, వర్షమాణాః = వర్షించుచున్న, వలాహకాః = మేఘములు, ధారాభిః = జలధారలచేత, శైలేన్ద్రమివ = పర్వతరాజునువలె, శరవర్షాని = బాణ వర్షములను, వ్యసృజన్ = విడచినవి.

తా. ఆ రాక్షసగణములు వర్షించుచున్న మేఘము పర్వతరాజుపై జల ధారలు కురిపించి నట్లు, రామునిపై బాణవర్షములను కురిపించిరి. 10

మూ. స తైః పరివృతో ఘోరైః రాఘవో రక్షసాం గణైః, 11
తిథిష్వివ మహాదేవో వృతః పారిషదాం గణైః.

ప్ర. అ. సః = ఆ, రాఘవః = రాముడు, ఘోరైః = భయంకరములైన, రక్షసాం గణైః = రాక్షసుల గణములచేత, మహాదేవః = రుద్రుడు, తిథిషు =

ఆ యా తిథులయందు, పారిషదామ్ = అనుచరులయొక్క, గణైరివ = గణముల చేత వలె, పరివృతః = చుట్టువారుకొనబడెను.

తా. ఆ యా తిథులలో ప్రమథగణములు మహాదేవుని చుట్టి నిలచి నట్లు, భయంకరులైన ఆ రాక్షసులు గుంపులు గుంపులుగా ఆ రాముని చుట్టి నిలచిరి.

మూ. తాని ముక్తాని శస్త్రాణి యాతుధానైః స రాఘవః,
ప్రతిజగ్రాహ విశిఖై ర్నద్యోఘానివ సాగరః. 12

ప్ర. అ. సః = ఆ, రాఘవః = రాముడు, యాతుధానైః = రాక్షసులచేత, ముక్తాని = విడువబడిన, తాని = ఆ, శస్త్రాణి = శస్త్రములను, సాగరః = సముద్రము, నద్యోఘానివ = నదీప్రవాహములను వలె, విశిఖైః = బాణములచేత, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. ఆ రాక్షసులు ప్రయోగించిన ఆయుధములను రాముడు, బాణములు ప్రయోగించి, నదీప్రవాహములను సముద్రము స్వీకరించి నట్లు స్వీకరించెను. 12

మూ. స తైః ప్రహరణైర్ఘోరైర్భిన్నగాత్రో న వివ్యథే,
రామః ప్రదీప్తైర్బహుభిర్వజ్రైరివ మహాచలః. 13

ప్ర. అ. ఘోరైః = భయంకరములైన, తైః = ఆ, ప్రహరణైః = ఆయుధములచేత, భిన్నగాత్రః = బద్దలుకొట్టబడిన శరీరము గల, సః రామః = ఆ రాముడు, ప్రదీప్తైః = ప్రజ్వలించుచున్న, బహుభిః = అనేకమైన, వజ్రైః = వజ్రాయుధములచేత, మహాచల ఇవ = గొప్ప పర్వతము వలె, న వివ్యథే = వ్యథ చెందలేదు.

తా. భయంకరములైన ఆ ఆయుధములచేత శరీరమునకు చాల దెబ్బలు తగిలినా కూడ రాముడు, ప్రజ్వలించుచున్న వజ్రము లెన్ని ప్రయోగించినా మహాపర్వతము చలించ నట్లు, ఏ మాత్రము వ్యథ చెందలేదు. 13

మూ. స విద్ధః క్షతజాదిగ్ధః సర్వగాత్రేషు రాఘవః,
బభూవ రామః సంధ్యాభ్రైర్దివాకర ఇవావృతః. 14

ప్ర. అ. విద్ధః = కొట్టబడినవాడై, సర్వగాత్రేషు = సమస్తఅవయవముల

యందు, క్షతజాదిగ్ధః = రక్తముచేత పూయబడిన, రాఘవః = రఘువంశసంజాతుడైన, సః రామః = ఆ రాముడు, సంధ్యాభ్రైః = సంధ్యాకాలమేఘములచేత, ఆవృతః = కప్పబడిన, దివాకరః ఇవ = సూర్యుడు వలె, బభూవ = ఉండెను.

తా. ఆయుధముల ప్రహారము తగులుటచేత అన్ని అవయవములందు రక్తము స్రవించుచున్న ఆ రాముడు సంధ్యాకాలమేఘములచే కప్పబడిన సూర్యుడు వలె ప్రకాశించెను. 14

మూ. విషేదుర్దేవగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః
ఏకం సహస్రైర్బహుభిస్తదా దృష్ట్వా సమావృతమ్. 15

ప్ర. అ. తదా = అప్పుడు, బహుభిః = అనేకములైన, సహస్రైః = సహస్రములచేత, సమావృతమ్ = కప్పబడిన, ఏకమ్ = ఏకాకియైన రాముణ్ణి, దృష్ట్వా = చూచి, దేవగన్ధర్వాః = దేవతలు, గంధర్వులు, సిద్ధాశ్చ = సిద్ధులు, పరమర్షయః = గొప్ప ఋషులు, విషేదుః = దిగులు చెందిరి.

తా. ఏకాకిగా ఉన్న రాముణ్ణి ఎన్నో వేలమంది రాక్షసులు చుట్టుముట్టుట చూచి, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు విషాదము చెందిరి. 15

మూ. తతో రామః సుసంక్రుద్ధో మణ్డలీకృతకార్ముకః,
ససర్జ నిశితాన్ బాణాన్ శతశోఽథ సహస్రశః. 16

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, సుసంక్రుద్ధః = చాల కోపించినవాడై, మణ్డలీకృతకార్ముకః = మండలాకారముగా వంచబడిన ధనస్సు కలవాడై, శతశః = వందలకొలది, అథ = మరియు, సహస్రశః = వేలకొలది, నిశితాన్ = వాడియైన, బాణాన్ = బాణములను, ససర్జ = విడచెను.

తా. పిమ్మట రాముడు చాల కోపించి, ధనస్సును మండలాకారముగా ఉండు నట్లు వంచి, వందలకొలది, వేలకొలది, వాడియైన బాణాలను విడచెను. 16

మూ. దురావారాన్ దుర్విషహాన్ కాలదణ్డోపమాన్ రణే,
ముమోచ లీలయా రామః కఙ్కపత్రానజిహ్మగాన్. 17

ప్ర. అ. రామః = రాముడు, రణే = యుద్ధమునందు, దురావారాన్ =

= నివారింప శక్యము కానివి, దుర్విషహాన్ = సహింప శక్యము కానివి, కాల దణ్డోపమాన్ = యమదండముతో సమానమైనవి, అజిహ్మగాన్ = వక్రత్వము లేకుండా పోవునవి అయిన, కఙ్కపత్రాన్ = గ్రద్దరెక్కలు కట్టిన బాణములను, లీలయా = విలాసతో, ముమోచ = విడచెను.

తా. రాముడు, యుద్ధములో నివారింప శక్యము కానివి, సహించుటకు శక్యము కానివి, యమదండముతో సమానములూ, వంకరగా కాక తిన్నగా పోవునవి అయిన బాణాలను అనాయాసముగా ప్రయోగించెను. 17

మూ. తే శరాః శత్రుసైన్యేషు ముక్తా రామేణ లీలయా,
ఆదదూ రక్షసాం ప్రాణాన్ పాశాః కాలకృతా ఇవ. 18

ప్ర. అ. రామేణ = రామునిచేత, లీలయా = అనాయాసముగా, శత్రు సైన్యేషు = శత్రుసైన్యములమీద, ముక్తాః = విడువబడిన, తే శరాః = ఆ బాణ ములు, కాలకృతాః = యమునిచేత ప్రయోగింపబడిన, పాశాః ఇవ = పాశముల వలె, రక్షసామ్ = రాక్షసులయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, ఆదదుః = గ్రహించినవి.

తా. రాముడు అనాయాసముగా శత్రుసైన్యములమీద విడచిన ఆ బాణ ములు, యముడు ప్రయోగించిన పాశముల వలె, రాక్షసుల ప్రాణములను హరించినవి. 18

మూ. భిత్త్వా రాక్షసదేహాంస్తాంస్తే శరా రుధిరాప్లుతాః,
అన్తరిక్షగతా రేజుర్దీప్తాగ్నిసమతేజసః. 19

ప్ర. అ. తే శరాః = ఆ బాణములు, తాన్ = ఆ, రాక్షసదేహాన్ = రాక్షసుల దేహములను, భిత్త్వా = భేదించి, రుధిరాప్లుతాః = రక్తముచేత పూయ బడినవై, అన్తరిక్షగతాః = ఆకాశమును పొందినవై, దీప్తాగ్నిసమతేజసః = ప్రజ్వ లించుచున్న అగ్నితో సమానమైన తేజస్సు గలవై, రేజుః = ప్రకాశించినవి.

తా. ఆ బాణములు రాక్షసుల దేహములను భేదించి బైటకు వచ్చి రక్తము చేత పూయబడినవై, ఆకాశమునందు ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన తేజస్సుతో ప్రకాశించెను. 19

మూ. అసంఖ్యేయాస్తు రామస్య సాయకాశ్చాపమణ్డలాత్,
వినిష్పేతురతీవోగ్రా రక్షఃప్రాణాపహారిణః. 20

ప్ర. అ. రామస్య = రామునియొక్క, చాపమండలాత్ = మండలాకారములో నున్న ధనస్సునుండి, అతీవ = మిక్కిలి, ఉగ్రాః = భయంకరములు, రక్షఃప్రాణాపహారిణః = రాక్షసుల ప్రాణములను అపహరించునవి అయిన, అసంఖ్యేయాః = లెక్కించ శక్యము కాని, సాయకాః = బాణములు, వినిష్పేతుః = బయల్వెడలినవి.

తా. మండలాకారముగా ఉన్న రాముని ధనస్సునుండి చాలా భయంకరములైన బాణములు లెక్కపెట్టుటకు శక్యము కాని సంఖ్యలో బయల్వెడలి, రాక్షసుల ప్రాణములను హరించెను. 20

మూ. తైర్ధనూంషి ధ్వజాగ్రాణి వర్మాణి చ శిరాంసి చ,
బాహూన్ సహస్తాభరణానూరూన్ కరికరోపమాన్. 21
చిచ్ఛేద రామః సమరే శతశోఽథ సహస్రశః.

ప్ర అ. రామః = రాముడు, సమరే = యుద్ధమునందు, తైః = ఆ బాణములచేత, శతశః = వందలకొలది, అథ = మరియు, సహస్రశః = వేలకొలది, ధనూంషి = ధనస్సులను, ధ్వజాగ్రాణి = ధ్వజముల అగ్రభాగములను, వర్మాణి చ = కవచములను, శిరాంసి చ = శిరస్సులను, సహస్తాభరణాన్ = హస్తాభరణములతో కూడిన, బాహూన్ = బాహువులను, కరికరోపమాన్ = ఏనుగ తొండముల వంటి, ఊరూన్ = తొడలను, చిచ్ఛేద = ఛేదించెను.

తా యుద్ధములో రాముడు ఆ బాణములతో, వందలకొలది, వేలకొలది, ధనస్సులను, ధ్వజముల అగ్రములను, కవచములను, శిరస్సులను, ఆభరణములతో కూడిన బాహువులను, ఏనుగ తొండముల వంటి తొడలను ఛేదించెను. 21

మూ. హయాన్ కాఞ్చనసన్నాహాన్ రథయుక్తాన్ ససారథీన్. 22
గజాంశ్చ సగజారోహాన్ సహయాన్ సాదినస్తథా,
పదాతీన్ సమరే హత్వా హ్యనయద్యమసాదనమ్. 23

ప్ర. అ. కాఞ్చనసంన్నాహాన్ = బంగారు అలంకారములు గల, రథయుక్తాన్ = రథమునకు కూర్చబడిన, ససారథీన్ = సారథులతో కూడిన, హయాన్ = గుఱ్ఱములను, సగజారోహాన్ = గజముల నెక్కిన పురుషులతో కూడిన, గజాంశ్చ = ఏనుగులను, తథా = మరియు, సహయాన్ = గుఱ్ఱములతో కూడిన, సాదినః = గుఱ్ఱములపై నున్న భటులను, పదాతీన్ = కాలిబంట్లను, సమరే = యుద్ధమునందు, హత్వా = చంపి, యమసాదనమ్ = యముని గృహమును, అనయత్ = పొందించెను.

తా. రాము డా యుద్ధములో బంగారు అలంకారములు గల, రథములకు కట్టిన అశ్వములను, రథసారథులను, గజములను, గజముల నెక్కిన యోధులను, గుఱ్ఱములను, వాటిపై ఎక్కిన యోధులను, కాలిబంట్లను చంపి యమలోకమునకు పంపెను. 22, 23

మూ. తతో నాళీకనారాచైస్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః,
భీమమార్తస్వరం చక్రుర్భిద్యమానా నిశాచరాః. 24

ప్ర. అ. తతః = అటు పిమ్మట, నాళీకనారాచైః = గొట్టముల వంటి బాణములచేతను, ఇనుపబాణములచేతను, తీక్ష్ణాగ్రైః = తీక్ష్ణమైన అగ్రభాగములు గల, వికర్ణిభిః = చివర వంపులు గల బాణములచేతను, భిద్యమానాః = భేదింపబడుచున్నవారై, నిశాచరాః = రాక్షసులు, భీమమ్ = భయంకరముగా, ఆర్తస్వరమ్ = దీనమైన స్వరమును, చక్రుః = చేసిరి.

తా. పిమ్మట ఆ రాక్షసులు నాళీకబాణములచేతను, నారాచములచేతను, తీక్ష్ణమైన అగ్రభాగములు గల వికర్ణిబాణములచేతను భేదింపబడుచున్నవారై, భయము కలుగు నట్లుగాను, దీనముగాను అరచిరి. 24

మూ. తత్సైన్యం నిశితైర్బాణైరర్దితం మర్మభేదిభిః,
రామేణ న సుఖం లేభే శుష్కం వనమివాగ్నినా. 25

ప్ర. అ. రామేణ = రామునిచేత, మర్మభేదిభిః = మర్మస్థానములను భేదించు, నిశితైః = వాడియైన, బాణైః = బాణములచేత, అర్దితమ్ = పీడింపబడిన,

తత్ సైన్యమ్ = ఆ సైన్యము, శుష్కమ్ = ఎండిపోయిన, వనమ్ = వనము, అగ్నినా ఇవ = అగ్ని చేత కాల్చబడి వలె, సుఖమ్ = సుఖమును, న లేభే = పొందలేదు.

తా. రాముడా విధముగ మర్మస్థానములను భేదించు బాణములతో పీడించగా ఆ సైన్యము, అగ్నిచేత కాల్చబడిన ఎండిపోయిన వనము వలె సుఖమును పొందలేదు. 25

మూ. కేచిద్భీమబలాః శూరాః శూలాన్ ఖడ్గాన్పరశ్వథాన్,
రామస్యాభిముఖం గత్వా చిక్షిపుః పరమాయుధాన్. 26

ప్ర. అ. భీమబలాః = భయంకరమైన బలము గల, కేచిత్ = కొందరు, శూరాః = శూరులు, రామస్య = రామునకు, అభిముఖమ్ = ఎదురుగా, గత్వా = వెళ్ళి, పరమాయుధాన్ = శ్రేష్ఠములైన ఆయుధములైన, శూలాన్ = శూలములను, ఖడ్గాన్ = ఖడ్గములను, పరశ్వథాన్ = గండ్రగొడ్డళ్లను, చిక్షిపుః = విసిరిరి.

తా. భయంకరమైన బలము గల కొందరు శూరులు, రామునకు ఎదురుగా వెళ్ళి, ఉత్తమాయుధములైన శూలములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్లను రామునిపై విసిరిరి. 26

మూ. తేషాం బాణైర్మహాబాహుః శస్త్రాణ్యావార్య రాఘవః,
జహార సమరే ప్రాణాంశ్చిచ్ఛేద చ శిరోధరాన్. 27

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులుగల, రాఘవః = రాముడు, సమరే = యుద్ధమునందు, బాణైః = బాణములచేత, తేషామ్ = వాళ్లయొక్క, శస్త్రాణి = ఆయుధములను, ఆవార్య = నివారించి, ప్రాణాన్ = ప్రాణములను, జహార = హరించెను. శిరోధరాన్ = కంఠములను, చిచ్ఛేద = ఛేదించెను.

తా, మహాబాహువైన రాముడు బాణములచేత వాళ్ళు ప్రయోగించిన ఆయుధాలను నివారించి, యుద్ధములో వాళ్ళ కంఠములను ఖండించి, ప్రాణములను హరించెను. 27

మూ. తే ఛిన్నశిరసః పేతుశ్ఛిన్నవర్మశరాసనాః,
సుపర్ణవాతవిక్షిప్తా జగత్యాం పాదపా యథా. 28

ప్ర. అ. తే = ఆ రాక్షసులు, ఛిన్నశిరసః = ఛేదింపబడిన శిరస్సులు కలవారై, ఛిన్నవర్మశరాసనాః = ఛేదింపబడిన కవచములు ధనస్సులు కలవారై, సుపర్ణవాతవిక్షిప్తాః = గరుత్మంతుని వాయువుచేత చిమ్మివేయబడిన, పాదపాః యథా = వృక్షములు వలె, జగత్యామ్ = భూమిపై, పేతుః = పడిరి.

తా. శిరస్సు తెగిపోయి, కవచములు, ధనస్సులు ముక్కముక్కలై పోగా ఆ రాక్షసులు గరుత్మంతుని వేగమువలన కలిగిన గాలిచే కదల్చివేయబడిన వృక్షముల వలె నేలమీద పడిపోయిరి. 28

మూ. అవశిష్టాశ్చ యే తత్ర విషణ్ణాశ్చ నిశాచరాః,
ఖరమేవాభ్యధావన్త శరణార్థం శరార్దితాః. 29

ప్ర. అ. తత్ర = అక్కడ, అవశిష్టాః = మిగిలిన, యే = ఏ, నిశాచరాః = రాక్షసులు కలరో వాళ్ళు, శరార్దితాః = బాణములచేత పీడితులై, విషణ్ణాశ్చ = దిగులు చెందినవారై, ఖరమేవ = ఖరుణ్ణి గూర్చియే, శరణార్థమ్ = రక్షణము కొరకు, అభ్యధావన్త = పరుగెత్తిరి.

తా. అక్కడ మిగిలిన రాక్షసులు బాణముల దెబ్బలకు తట్టుకొనజాలక, దిగులు చెంది, రక్షింపు మని వేడుచు ఖరుని దగ్గరకు వెళ్ళిరి. 29

మూ. తాన్ సర్వాన్ పునరాదాయ సమాశ్వాస్య చ దూషణః,
అభ్యధావత కాకుత్థ్సం క్రుద్ధో రుద్రమివాన్తకః. 30

ప్ర. అ. దూషణః = దూషణుడు, తాన్ సర్వాన్ = వాళ్ళ నందరిని, సమాశ్వాస్య = ఓదార్చి. పునః = మరల, ఆదాయ = తీసికొని, క్రుద్ధః = కోపించినవాడై, అన్తకః = యముడు, రుద్రమివ = రుద్రుణ్ణి వలె, కాకుత్థ్సమ్ = రాముణ్ణి గూర్చి, అభ్యధావత = పరుగెత్తెను.

తా. దూషణుడు ఆ రాక్షసుల నందరిని ఓదార్చి, తన వెంటబెట్టుకొని, యముడు రుద్రునిమీదకు వెళ్ళినట్లు, కోపముతో రామునిమీదికి వెళ్లెను. 30

మూ. నివృత్తాస్తు పునః సర్వే దూషణాశ్రయసంశ్రితాః,
రామమేవాభ్యధావన్త సాలతాలశిలాయుధాః. 31

ప్ర. అ. సర్వే = ఆ రాక్షసు లందరూ, దూషణాశ్రయసంశ్రయాః = దూషణుని ఆశ్రయమును పొందినవారై, పునః = మరల, నివృత్తాః = మరలిన వారై, సాలతాలశిలాయుధాః = మద్దెచెట్లు, తాటిచెట్లు, శిలలు ఆయుధములుగా గలవారై, రామమేవ = రాముణ్ణి గూర్చియే, అభ్యధావన్త = పరుగెత్తిరి.

తా. ఆ రాక్షసు లందరూ దూషణుని ఆశ్రయించి, మద్దెచెట్లు, తాటిచెట్లు శిలలు ఆయుధములుగా ధరించి రామునిమీదికి వెళ్ళిరి. 31

మూ. శూలముద్గరహస్తాశ్చ చాపహస్తా మహాబలాః,
సృజన్తః శరవర్షాణి శస్త్రవర్షాణి సంయుగే, 32
ద్రుమవర్షాణి ముఞ్చన్తః శిలావర్షాణి రాక్షసాః.

ప్ర. అ. శూలముద్గరహస్తాశ్చ=శూలములు, ముద్గరములు హస్తములందు కలవారు, చాపహస్తాః = ధనస్సులు హస్తములందు కలవారు, మహాబలాః=గొప్ప బలము గలవారు అయిన, రాక్షసాః = రాక్షసులు, సంయుగే = యుద్ధమునందు, శరవర్షాణి = బాణవర్షములను, శస్త్రవర్షాణి=ఆయుధముల వర్షములను, సృజన్తః =సృష్టించుచు, ద్రుమవర్షాణి = వృక్షముల వర్షములను, శిలావర్షాణి=శిలల వర్ష ములను, ముఞ్చన్తః = విడచుచు (యుద్ధము చేసిరి).

తా. గొప్ప బలము గల ఆ రాక్షసులు హస్తములలో శూలములు, ముద్గర ములు, ధనస్సులు ధరించి, బాణవర్షము, ఆయుధముల వర్షము, వృక్షముల వర్షము, శిలల వర్షము కుపిరించుచు యుద్ధము చేసిరి. 32

మూ. తద్బభూవాద్భుతం యుద్ధం తుములం రోమహర్షణమ్, 33
రామస్య చ మహాఘోరం పునస్తేషాం చ రక్షసామ్.

ప్ర. అ. పునః = మరల, రామస్య = రామునకు, తేషాం రక్షసాం చ = ఆ రాక్షసులకు, తుములమ్ = వ్యాకులము, అద్భుతమ్ = ఆశ్చర్యకరము, రోమ

హర్షణమ్ = రోమాంచము కలిగించునది, మహాఘోరమ్ = చాల భయంకరము, అయిన, తత్ యుద్ధమ్ = ఆ యుద్ధము, బభూవ = ఆయెను.

తా. రామునకు, రాక్షసులకు మధ్య మరల మహాఘోరమైన యుద్ధము జరిగెను. వ్యాకులముగా జరిగిన ఆ యుద్ధము, ఆశ్చర్యకరముగాను, రోమాంచము కలిగించేదిగాను ఉండెను. 33

మూ. తే సమన్తాదభిక్రుద్ధా రాఘవం పునరభ్యయుః, 34
త్రైశ్చ సర్వా దిశో దృష్ట్వా ప్రదిశశ్చ సమావృతాః,
రాక్షసైరుద్యతప్రాసైః శరవర్షాభివర్షిభిః, 35
స కృత్వా భైరవం నాదమస్త్రం పరమభాస్వరమ్,
సంయోజయత గాన్ధర్వం రాక్షసేషు మహాబలః. 36

ప్ర. అ. తే = ఆ రాక్షసులు, అభిక్రుద్ధాః = కోపించినవారై, పునః = మరల, రాఘవమ్ = రాముణ్ణి, సమన్తాత్ = నలుమూలల, అభ్యయుః = చేరిరి. మహాబలః = గొప్ప బలము గల, సః = ఆ రాముడు, ఉద్యతప్రాసైః = ఎత్తబడిన ప్రాసలు కలవారు, శరవర్షాభివర్షిభిః = బాణవర్షమును వర్షించుచున్నవారు అయిన, తైః = ఆ రాక్షసులచేత, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రదిశశ్చ = విదిక్కులను, సమావృతాః = కప్పబడినవాటినిగా, దృష్ట్వా = చూచి, భైరవమ్ = భయంకరమైన, నాదమ్ = ధ్వనిని, కృత్వా = చేసి, రాక్షసేషు = ఆ రాక్షసులయందు, పరమభాస్వరమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న, గాన్ధర్వమ్ అస్త్రమ్ = గాంధర్వాస్త్రమును, సంయోజయత = ప్రయోగించెను.

తా. ఆ రాక్షసు లందరు చాల కోపముతో మరల రాముణ్ణి చుట్టుముట్టిరి. మహాబలశాలియైన ఆ రాముడు, ఆ రాక్షసు లందరు ప్రాసలను ధరించి, బాణ వర్షము కురిపించుచు దిక్కులను, విదిక్కులను పూర్తిగా కప్పివేసి ఉండుట చూచి, భయంకరముగ సింహనాదము చేసి, మిక్కిలి ప్రకాశించుచున్న గాంధర్వాస్త్రమును ఆ రాక్షసులపై ప్రయోగించెను. 34, 35, 36

మూ. తతః శరసహస్రాణి నిర్యయుశ్చాపమణ్డలాత్,
సర్వా దశ దిశో బాణైరవార్యన్త సమాగతైః. 37

ప్ర. అ. తతః = అటు పిమ్మట, చాపమణ్డలాత్ = ధనుర్మండలమునుండి, శరసహస్రాణి = వేలకొలది బాణములు, నిర్యయుః = బయలువెడలినవి. సమాగతైః = వచ్చిన, బాణైః = బాణములచేత, సర్వాః = సమస్తమైన, దశ = పది, దిశః = దిక్కులు, అవార్యన్త = కప్పబడినవి.

తా. అప్పుడు మండలాకారములో ఉన్న ధనస్సునుండి వేలకొలది బాణములు బయల్వెడలినవి. ఆ విధముగ బయలువెడలిన బాణములచేత, పది దిక్కులు కప్పివేయబడెను. 37

మూ. నాదదానం శరాన్ ఘోరాన్ న ముఞ్చన్తం శిలీముఖాన్,
వికర్షమాణం పశ్యన్తి రాక్షసాస్తే శరార్దితాః. 38

ప్ర. అ. శరార్దితాః = బాణములచేత పీడింపబడిన, తే రాక్షసాః = ఆ రాక్షసులు, ఘోరాన్ = భయంకరములైన, శరాన్ = శరములను, ఆదదానమ్ = గ్రహించువానిని, న పశ్యన్తి = చూడలేదు. శిలీముఖాన్ = బాణములను, ముఞ్చన్తమ్ = విడచుచున్నవానిని, న = చూడలేదు. వికర్షమాణమ్ = లాగుచున్నవానిని, చూడలేదు.

తా. బాణములచేత పీడితులైన ఆ రాక్షసులకు రాముడు బాణములు పైకి తీయుటగాని, వాటిని విడచుట గాని, ధనస్సు లాగుట గాని కనబడలేదు. 38

మూ. శరాన్ధకారమాకాశమావృణోత్సదివాకరమ్,
బభూవావస్థితో రామః ప్రవమన్నివ తాన్ శరాన్. 39

ప్ర. అ. శరాన్ధకారమ్ = బాణముల అంధకారము, సదివాకరమ్ = సూర్యునితో కూడిన, ఆకాశమ్ = ఆకాశమును, ఆవృణోత్ = ఆవరించెను. రామః = రాముడు, తాన్ = ఆ, శరాన్ = బాణములను, ప్రవమన్నివ = కక్కుచున్నాడా అన్నట్లు, అవస్థితః బభూవ = నిలచి ఉండెను.

తా. బాణాలవలన ఏర్పడిన చీకటి సూర్యునితో సహా ఆకాశమును కప్పివేసెను. రాముడు ఆ బాణములను తన నోటినుండి విడచుచున్నాడా అన్నట్లు నిలచి ఉండెను. 39

మూ. యుగపత్పతమానైశ్చ యుగపచ్చ హతైర్భృశమ్,
యుగపత్పతితైశ్చైవ వికీర్ణా వసుధా భవత్. 40

ప్ర. అ. వసుధా = భూమి, యుగపత్ = ఒక్కమారుగా, పతమానైశ్చ = పడుచున్న రాక్షసులచేతను, యుగపత్ = ఒక్కమారుగా, హతైశ్చ = చంపబడినవారిచేతను, యుగపత్ = ఒక్కమారుగా, పతితైశ్చైవ = పడినవారిచేతను, భృశమ్ = మిక్కిలి, వికీర్ణా = వ్యాప్తము, అభవత్ = ఆయెను.

తా. గుంపులు గుంపులుగా పడుచున్న రాక్షసులచేతను, గుంపులు గుంపులుగా చంపబడిన రాక్షసులచేతను, గుంపులు గుంపులుగా పడి ఉన్న రాక్షసుల చేతను భూమి కప్పబడి ఉండెను. 40

మూ. నిహతాః పతితాః క్షీణాశ్ఛిన్నా భిన్నా విదారితాః,
తత్ర తత్ర స్మ దృశ్యన్తే రాక్షసాస్తే సహస్రశః. 41

ప్ర. అ. తే రాక్షసాః = ఆ రాక్షసులు, తత్ర తత్ర = అక్కడక్కడ, సహస్రశః = వేల కొలది, నిహతాః = చంపబడినవారై, పతితాః = పడిపోయినవారై, క్షీణాః = క్షీణించినవారై, ఛిన్నాః = ఛేదింపబడినవారై, భిన్నాః = బ్రద్దలుకొట్టబడినవారై, విదారితాః = చీల్చివేయబడినవారై, దృశ్యన్తే స్మ = కనబడిరి.

తా. అక్కడక్కడ రాక్షసులు వేల సంఖ్యలో చచ్చి పడి ఉండిరి. కొందరు అవయవములు తెగి ఉండిరి. కొందరు నరకబడి, కొందరు బ్రద్దలు కొట్టబడి, మరికొందరు చీల్చబడి పడి ఉండిరి. 41

మూ. సోష్ణీషైరుత్తమాఙ్గైశ్చ సాఙ్గదైర్బాహుభిస్తథా,
ఊరుభిర్జానుభిశ్ఛిన్నైర్నానారూపవిభూషణైః. 42

హయైశ్చ ద్విపముఖ్యైశ్చ రథైర్భిన్నైరనేకశః,
చామరైర్వ్యజనైశ్ఛత్రైర్ధ్వజైర్నానావిధైరపి. 43

రామస్య బాణాభిహతై ర్విచిత్రైః శూలపట్టిసైః,
ఖడ్గైః ఖణ్డీకృతైః ప్రాసైర్వికీర్ణైశ్చ పరశ్వథైః. 44

చూర్ణితాభిః శిలాభిశ్చ శరై శ్చిత్రై రనేకశః,
విచ్ఛిన్నైః సమరే భూమిర్వికీర్ణాఽభూద్భయఙ్కరా. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చవింశః సర్గః.

ప్ర. అ. సమరే = యుద్ధమునందు, సోష్ణీషైః = తలపాగలతో కూడిన, ఉత్తమాఙ్గైశ్చ = శిరస్సులతోను, తథా = మరియు, సాఙ్గదైః = బాహుపురులతో కూడిన, బాహుభిః = బాహువులతోను, ఛిన్నైః = తెగగొట్టబడిన, ఊరుభిః = తొడలతోను, జానుభిః = మోకాళ్లతోను, నానారూపవిభూషణైః = అనేకవిధములైన రూపములు గల అలంకారములతోను, అనేకశః = అనేకమైన, హయైశ్చ = గుఱ్ఱములతోను, ద్విపముఖ్యైశ్చ = ఉత్తమములైన ఏనుగులతోను, భిన్నైః = బ్రద్దలుకొట్టబడిన, రథైః = రథములతోను, చామరైః = చమరీమృగములకు సంబంధించిన, వ్యజనైః = వింజామరలతోను, ఛత్రైః = ఛత్రములతోను, నానావిధైః = అనేకవిధములైన, ధ్వజైః = ధ్వజములతోను, రామస్య = రాముని యొక్క, బాణాభిహతైః = బాణములచేత కొట్టబడిన, విచిత్రైః = విచిత్రములైన, శూలపట్టిసైః = శూలములతోను, పట్టిసములతోను, ఖణ్డీకృతైః = ముక్కలు చేయబడిన, ఖడ్గైః = ఖడ్గములతోను, ప్రాసైః = ప్రాసలతోను, వికీర్ణైః = చెల్లాచెదరై ఉన్న, పరశ్వథైః = గండ్రగొడ్డళ్లతోను, చూర్ణితాభిః = చూర్ణము చేయబడిన, శిలాభిశ్చ = శిలలతోను, అనేకశః = అనేకవిధములుగ, విచ్ఛిన్నైః = తెగగొట్టబడిన, శరైః = బాణములతోను, వికీర్ణా = వ్యాప్తమై యున్న, భూమిః = భూమి, భయంకరా = భయంకరముగా, అభూత్ = ఉండెను.

తా. రాముని బాణములచేత ఛేదింపబడిన తలపాగలతో కూడిన తలలు, బాహుపురులతో కూడిన బాహువులు, తొడలు, మోకాళ్లు, అనేక ఆకారములలో ఉన్న అలంకారములు, అనేక అశ్వములు, ఉత్తమగజములు, రథములు, చామరములు, ఛత్రములు, అనేకవిధములైన ధ్వజములు, విచిత్రములైన శూల

ములు, పట్టిసములు, ఖడ్గములు, ప్రాసలు, గండ్రగొడ్డళ్లు, చూర్ణమైపోయిన శిలలు, చిత్రములైన శరములు అంతటా పడి ఉండుటచే ఆ యుద్ధభూమి చాల భయంకరముగా ఉండెను. 42-45

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువదియైదవ సర్గ సమాప్తము.

## అథ షడ్వింశః సర్గః

[రాముడు దూషణసహితులైన పదునాలుగువేలమంది రాక్షసులను చంపుట].

మూ. దూషణస్తు స్వకం సైన్యం హన్యమానం నిరీక్ష్య సః,
సందిదేశ మహాబాహుర్భీమవేగాన్నిశాచరాన్, 1
రాక్షసాన్ పఞ్చసాహస్రాన్ సమరేష్వనివర్తినః.

ప్ర. అ. సః = ఆ, మహాబాహుః = గొప్ప బాహువులు గల, దూషణః = దూషణుడు, హన్యమానమ్ = చంపబడుచున్న, స్వకమ్ = తన సంబంధమైన, సైన్యమ్ = సైన్యమును, నిరీక్ష్య = చూచి, భీమవేగాన్ = భయంకరమైన వేగము గల వాళ్ళు, నిశాచరాన్ = రాత్రులందు సంచరించేవాళ్లు, సమరేషు = యుద్ధములందు, అనివర్తినః = వెనుకకు తిరగనివాళ్ళు అయిన, పఞ్చ సాహస్రాన్ = ఐదువేలమంది, రాక్షసాన్ = రాక్షసులను, సందిదేశ = ఆజ్ఞాపించిపంపెను.

తా. మహాబాహువైన ఆ దూషణుడు తన సైన్యము అంతా సంహరింపబడుట చూచి, భయంకరమైన వేగము కలవాళ్ళు, యుద్ధములో వెనుకకు మరలని వాళ్లు అయిన ఐదువేలమంది రాక్షసులను, రామునితో యుద్ధముచేయు డని ఆజ్ఞాపించెను. 1

మూ. తే శూలైః పట్టిసైః ఖడ్గైః శిలావర్షైర్ద్రుమైరపి, 2
శరవర్షైరవిచ్ఛిన్నం వవర్షుస్తం సమన్తతః.

ప్ర. అ. తే = ఆ రాక్షసులు, శూలైః = శూలములచేతను, పట్టిసైః = పట్టిసములచేతను, ఖడ్గైః = ఖడ్గములచేతను, శిలావర్షైః = శిలావర్షములచేతను, ద్రుమైరపి = వృక్షములచేతను, శరవర్షైః = బాణవర్షములచేతను, అవిచ్ఛిన్నమ్ =

ఎడతెరిపి లేకుండా, సమన్తతః = నలు వైపుల, తమ్ = ఆ రాముణ్ణి, వవర్షుః = వర్షించిరి.

తా. ఆ రాక్షసు లందరు రాముణ్ణి చుట్టుముట్టి ఆతనిపై శూలములు, పట్టిసములు, ఖడ్గములు, శిలలు, వృక్షములు, బాణములు, అవిచ్ఛిన్నముగా కురిపించిరి. 2

మూ. స ద్రుమాణాం శిలానాం చ వర్షం ప్రాణహరం మహత్,
ప్రతిజగ్రాహ ధర్మాత్మా రాఘవస్తీక్ష్ణసాయకైః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః రాఘవః = ఆ రాముడు, ప్రాణహరమ్ = ప్రాణములను హరించే, మహత్ = గొప్పదైన, ద్రుమాణామ్ = వృక్షములయొక్క, శిలానాం చ = శిలలయొక్క, వర్షమ్ = వర్షమును, తీక్ష్ణ సాయకైః = తీక్ష్ణములైన బాణములతో, ప్రతిజగ్రాహ = ఎదుర్కొని స్వీకరించెను.

తా. ధర్మాత్ముడైన ఆ రాముడు, ప్రాణములను హరించే గొప్పదైన ఆ వృక్షవర్షమును, శిలావర్షమును తీక్ష్ణములైన బాణములతో ఎదుర్కొనెను. 3

మూ. ప్రతిగృహ్య చ తద్వర్షం నిమీలిత ఇవర్షభః, 4
రామః క్రోధం పరం లేభే వధార్థం సర్వరక్షసామ్.

ప్ర. అ. రామః = రాముడు, నిమీలితః = కళ్ళుమూసుకొన్న, ఋషభః ఇవ = వృషభము వలె, తత్ = ఆ, వర్షమ్ = శస్త్రవర్షమును, ప్రతిగృహ్య = స్వీకరించి, సర్వరక్షసామ్ = సమస్తరాక్షసులయొక్క, వధార్థమ్ = వధకొరకు, పరమ్ = అధికమైన, క్రోధమ్ = క్రోధమును, లేభే = పొందెను. 4

తా. వృషభము వాన కురియుచున్నప్పుడు కళ్ళు మూసికొని దానిని స్వీకరించినట్లు, రాముడు ఆ ఆయుధవర్షమును స్వీకరించి ఆ సమస్తరాక్షసుల సంహారము నిమిత్తము గొప్ప క్రోధమును కనబర్చెను. 4

మూ. తతః క్రోధసమావిష్టః ప్రదీప్త ఇవ తేజసా, 5
శరైరవాకిరత్సైన్యం సర్వతః సహదూషణమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రోధసమావిష్టః=క్రోధముచేత ఆవిష్టుడై, తేజసా = తేజస్సుతో, ప్రదీప్త ఇవ = మండుచున్నవాడు వలె, సహదూషణమ్= దూషణునితో కూడిన, సైన్యమ్ = సైన్యమును, సర్వతః = అన్ని వైపులందు, శరైః= బాణములతో, అవాకిరత్ = వర్షించెను.

తా. పిమ్మట రాముడు క్రోధావేశముతో నిండి, తేజస్సుతో మండుచున్నట్లు కనబడుచు, ఆ దూషణుణ్ణి, ఆతని సైన్యమును నలువైపుల, బాణములతో నింపెను. 5

మూ. తతః సేనాపతిః క్రుద్ధో దూషణః శత్రుదూషణః, 6
శరైరశనికల్పైస్తం రాఘవం సమవాకిరత్.

ప్ర. అ. తతః= అటు పిమ్మట, సేనాపతిః= సేనాపతీ, శత్రుదూషణః = శత్రువులను హింసించువాడు అయిన, దూషణః= దూషణుడు, క్రుద్ధః= కోపించినవాడై, అశనికల్పైః= వజ్రములతో సమానములైన, శరైః= బాణములతో, తం రాఘవమ్= ఆ రాముణ్ణి, సమవాకిరత్= చల్లి కప్పివేసెను.

తా. అపుడు, సేనాపతి, శత్రువులను హింసించువాడు అయిన దూషణుడు, క్రుద్ధుడై, వజ్రాయుధములవంటి బాణములతో ఆ రాముణ్ణి కప్పివేసెను. 6

మూ. తతో రామః సుసంక్రుద్ధః క్షురేణాస్య మహద్ధనుః, 7
చిచ్ఛేద సమరే వీరశ్చతుర్భిశ్చతురో హయాన్.

ప్ర. అ. తతః= అటు పిమ్మట, సుసంక్రుద్ధః=చాల కోపించిన, సమరే = యుద్ధమునందు, వీరః= వీరుడైన, రామః= రాముడు, క్షురేణ= అర్ధచంద్ర బాణముచేత, అస్య= ఈ దూషణునియొక్క, మహత్= గొప్పదైన, ధనుః= ధనస్సును, చతుర్భిః= నాలుగు బాణములచేత, చతురః= నాలుగు, హయాన్= గుఱ్ఱములను, చిచ్ఛేద= ఛేదించెను.

తా. అప్పుడు యుద్ధములో మహావీరుడైన రాముడు చాల కోపించి, అర్ధ చంద్రబాణముతో ఆ దూషణుని గొప్ప ధనస్సును ఛేదించి నాలుగు బాణములతో నాలుగు గుఱ్ఱములను చంపెను. 7

మూ. హత్వా చాశ్వాన్ శరై స్తీక్ష్ణైరర్ధచన్ద్రేణ సారథేః, 8
శిరో జహార తద్రక్షస్త్రిభిర్వివ్యాధ వక్షసి.

ప్ర. అ. తీక్ష్ణైః = తీక్ష్ణములైన, శరైః = బాణములచేత, అశ్వాన్ = గుఱ్ఱములను, హత్వా = చంపి, అర్ధచన్ద్రేణ = అర్ధచంద్రబాణముచేత, సారథేః = సారథియొక్క, శిరః = శిరస్సును, జహార = హరించెను. త్రిభిః = మూడు బాణములచేత, తత్ = ఆ, రక్షః = రాక్షసుని, వక్షసి = వక్షఃస్థలమునందు, వివ్యాధ = కొట్టెను.

తా. తీక్ష్ణములైన శరములచేత అశ్వములను చంపి, అర్ధచంద్రబాణముచేత సారథి శిరస్సు ఛేదించి, మూడు బాణములతో ఆ దూషణుని కొట్టెను. 8

మూ. స ఛ్చిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః, 9
జగ్రాహ గిరిశృఙ్గాభం పరిఘం రోమహర్షణమ్,
వేష్టితం కాఞ్చనైః పట్టైర్దేవసైన్యప్రమర్దనమ్, 10

ఆయసైః శఙ్కుభిస్తీక్ష్ణైః కీర్ణం పరవసోక్షితమ్,
వజ్రాశనిసమస్పర్శం పరగోపురదారణమ్. 11

ప్ర. అ. ఛిన్నధన్వా = ఛేదింపబడిన ధనస్సు కలవాడు, విరథః = రథము లేనివాడు, హతాశ్వః = చంపబడిన అశ్వములు గలవాడు, హతసారథిః = చంపబడిన సారథి కలవాడు అయిన, సః = ఆ దూషణుడు, గిరిశృఙ్గాభమ్ = పర్వతశిఖరము వంటి కాంతి గలది, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించునది, కాఞ్చనైః = బంగారువికారమైన, పట్టైః = పట్టీలతో, వేష్టితమ్ = చుట్టబడినది, దేవసైన్యప్రమర్దనమ్ = దేవతలసైన్యమును మర్దించునది, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, ఆయసైః = బంగారు వికారమైన, శఙ్కుభిః = మేకులతో, కీర్ణమ్ = వ్యాప్తమైనది, పరవసోక్షితమ్ = శత్రువుల వసచేత తడుపబడినది, వజ్రాశనిసమస్పర్శమ్ = వజ్రముతోను, పిడుగుతోను సమానమైన స్పర్శ గలది, పరగోపురదారణమ్ = శత్రువుల గోపురములను బ్రద్దలుగొట్టినది అయిన, పరిఘమ్ = పరిఘను, జగ్రాహ = గ్రహించెను.

తా. ఈ విధముగ ఆ దూషణుని ధనస్సు విరిగిపోయెను. అశ్వములను, సారథిని రాముడు చంపివేయుటచే రథము లేకుండా పోయెను. అప్పు డా దూషణుడు రామునిపై ప్రయోగించుటకై, పర్వతశిఖరము వంటి చాల భయంకరమైన పరిఘను గ్రహించెను. దాని చుట్టూ బంగారు పట్టీలు, అంతటా ఇనుప మేకులు ఉండెను. దేవతల సైన్యమును కూడ అనేకపర్యాయములు మర్దించిన ఆ పరిఘకు శత్రువుల వస దట్టముగా అంటి ఉండెను. వజ్రముతోను, పిడుగుతోను సమానమైన స్పర్శ గల ఆ పరిఘ పూర్వము శత్రువుల గోపురములను బ్రద్దలు కొట్టెను. 9, 10, 11

మూ. తం మహోరగసంకాశం ప్రగృహ్య పరిఘం రణే,
దూషణోఽభ్యద్రవద్రామం క్రూరకర్మా నిశాచరః. 12

ప్ర. అ. క్రూరకర్మా = క్రూరమైన కర్మలు చేయు, నిశాచరః = రాక్షసుడైన, దూషణః=దూషణుడు, రణే=యుద్ధమునందు, మహోరగసంకాశమ్ = మహాసర్పముతో సమానమైన, తం పరిఘమ్ = ఆ పరిఘను, ప్రగృహ్య= గ్రహించి, రామమ్ = రాముణ్ణి గూర్చి, అభ్యద్రవత్ = పరుగెత్తెను.

తా. క్రూరమైన పనులు చేయు ఆ రాక్షసుడు, దూషణుడు, యుద్ధములో మహాసర్పము వలె ఉన్న ఆ పరిఘను తీసికొని రామునిమీదకు దుమికెను. 12

మూ. తస్యాభిపతమానస్య దూషణస్య స రాఘవః,
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద సహస్తాభరణౌ భుజౌ. 13

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, అభిపతమానస్య = మీదికి వచ్చుచున్న, తస్య దూషణస్య = ఆ దూషణునియొక్క, సహస్తాభరణౌ = హస్తాభరణములతో కూడిన, భుజౌ = భుజములను, ద్వాభ్యామ్ = రెండు, శరాభ్యామ్ = బాణములచేత, చిచ్ఛేద = ఛేదించెను.

తా. రాముడు తన మీదికి వచ్చుచున్న ఆ దూషణుని హస్తాలంకారసహితములైన రెండు భుజములను, రెండు బాణములతో ఛేదించెను. 13

మూ. భ్రష్టస్తస్య మహాకాయః పపాత రణమూర్ధని,
పరిఘశ్ఛిన్నహస్తస్య శక్రధ్వజ ఇవాగ్రతః. 14

ప్ర. అ. రణమూర్ధని = యుద్ధరంగము అగ్రభాగమునందు, ఛిన్న హస్తస్య = ఛేదించబడిన హస్తములు గల, తస్య = ఆ దూషణునియొక్క, మహా కాయః = పెద్ద ఆకారము గల, పరిఘః = పరిఘ, భ్రష్టః = జారినదై, శక్రధ్వజః ఇవ = ఇంద్రధ్వజము వలె, అగ్రతః = వాని ముందట, పపాత = పడెను.

తా. రణాగ్రమునందు ఆ దూషణుని హస్తములు ఛేదించివేయగానే పెద్ద ఆకారము గల ఆ పరిఘ క్రిందికి జారి, ఇంద్రధ్వజము వలె ఆతని ఎదుట పడెను. 14

మూ. స కరాభ్యాం వికీర్ణాభ్యాం పపాత భువి దూషణః,
విషాణాభ్యాం విశీర్ణాభ్యాం మనస్వీవ మహాగజః. 15

ప్ర. అ. సః దూషణః = ఆ దూషణుడు, వికీర్ణాభ్యామ్ = నేలపై విసిరి వేయబడిన, కరాభ్యామ్ = చేతులతో, విశీర్ణాభ్యామ్ = విరిగిపోయిన, విషాణాభ్యామ్ = దంతములతో, మనస్వీ = కోపము గల, మహాగజః ఇవ = గొప్ప ఏనుగ వలె, భువి = నేలమీద, పపాత = పడెను.

తా. చేతులు రెండూ నేలపై విసరివేయబడగా, ఆ దూషణుడు, దంతములు విరిగిపోయిన, మంచి పౌరుషము గల మహాగజము వలె నేలపై పడిపోయెను. 15

మూ. తం దృష్ట్వా పతితం భూమౌ దూషణం నిహతం రణే,
సాధుసాధ్వితి కాకుత్థ్సం సర్వభూతాన్యపూజయన్. 16

ప్ర. అ. రణే = యుద్ధమునందు, నిహతమ్ = చంపబడి, భూమౌ = నేలపై, పతితమ్ = పడిన, తం దూషణమ్ = ఆ దూషణుణ్ణి, దృష్ట్వా = చూచి, సర్వభూతాని = సకలప్రాణులు, కాకుత్థ్సమ్ = రాముణ్ణి, సాధు సాధు ఇతి = బాగు బాగు అని, అపూజయన్ = పూజించినవి.

తా. యుద్ధములో నిహతుడై నేలపై పడిపోయిన ఆ దూషణుణ్ణి చూచి, సకలభూతములు కూడ "బాగు! బాగు!" అని రాముణ్ణి ప్రశంసించిరి. 16

మూ. ఏతస్మిన్నన్తరే క్రుద్ధాస్త్రయః సేనాగ్రయాయినః,
సంహృత్యాభ్యద్రవన్ రామం మృత్యుపాశావపాశితాః, 17
మహాకపాలః స్థూలాక్షః ప్రమాథీ చ మహాబలః.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యయందు, క్రుద్ధాః = కోపించిన, మహాకపాలః = మహాకపాలుడు, స్థూలాక్షః = స్థూలాక్షుడు, మహాబలః = గొప్ప బలము గల, ప్రమాథీ చ = ప్రమాథి అను, త్రయః = ముగ్గురు, సేనాగ్రయాయినః = సేనానాయకులు, మృత్యుపాశావపాశితాః = యమపాశముచేత బంధింపబడినవారై, సంహృత్య = కలిసి, రామమ్ = రాముణ్ణిగూర్చి, అభ్యద్రవన్ = ఎదురుగా పరుగెత్తిరి.

తా. ఇంతలో మహాకపాలుడు, స్థూలాక్షుడు, మహాబలశాలియైన ప్రమాథి అను ముగ్గురు సేనానాయకులు కలిసి, చావు మూడుటచే, రామునిమీదికి వెళ్ళిరి.

మూ. మహాకపాలో విపులం శూలముద్యమ్య రాక్షసః, 18
స్థూలాక్షః పట్టిసం గృహ్య ప్రమాథీ చ పరశ్వథమ్.

ప్ర. అ. మహాకపాలః = మహాకపాలుడు, విపులమ్ = పెద్దదైన, శూలమ్ = శూలమును, ఉద్యమ్య = ఎత్తి, స్థూలాక్షః = స్థూలాక్షు డను, రాక్షసః = రాక్షసుడు, పట్టిసమ్ = పట్టిసమును, గృహ్య = గ్రహించి, ప్రమాథీ చ = ప్రమాథి, పరశ్వథం చ = గండ్రగొడ్డలిని గ్రహించి (వెళ్ళిరి).

తా. మహాకపాలుడు పెద్ద శూలమును పైకెత్తి వెళ్లెను. స్థూలాక్షుడు పట్టిసమును, ప్రమాథి గండ్రగొడ్డలిని పట్టుకొని వెళ్ళిరి. 18

మూ. దృష్ట్వైవాపతతస్తూర్ణం రాఘవః సాయకైః శితైః, 19
తీక్ష్ణాగ్రైః ప్రతిజగ్రాహ సంప్రాప్తానతిథీనివ.

ప్ర. అ. రాఘవః = రాముడు, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆపతతః = వచ్చుచున్న ఆ రాక్షసులను, దృష్ట్వైవ = చూడగానే, శితైః = వాడియైన, తీక్ష్ణాగ్రైః = తీక్ష్ణమైన అగ్రభాగములు గల, సాయకైః = బాణములతో, సంప్రాప్తాన్ = వచ్చిన, అతిథీనివ = అతిథులను వలె, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. రాముడు శీఘ్రముగా వచ్చి మీద పడుచున్న ఆ రాక్షసులను తీక్ష్ణమైన అగ్రములతో వాడిగా ఉన్న బాణములను ప్రయోగించి, అతిథులను స్వీకరించి నట్లు స్వీకరించెను. 19

మూ. మహాకపాలస్య శిరశ్చిచ్ఛేద పరమేషుభిః, 20
అసంఖ్యేయైస్తు బాణౌఘైః ప్రమమాథ ప్రమాథినమ్.
స పపాత హతో భూమౌ విటపీవ మహాద్రుమః. 21

ప్ర. అ. పరమేషుభిః = ఉత్తమములైన బాణములచేత, మహాకపాలస్య = మహాకపాలుని యొక్క, శిరః = శిరస్సును, చిచ్ఛేద = ఛేదించెను. అసంఖ్యేయైః = లెక్కింప శక్యము కాని, బాణౌఘైః = బాణసముదాయములచేత, ప్రమాథినమ్ = ప్రమాథిని, ప్రమమాథ = చంపెను. సః = ఆ ప్రమాథి, హతః = చంపబడినవాడై, విటపీ = కొమ్మలు గల, మహాద్రుమః ఇవ = మహావృక్షము వలె, భూమౌ = నేలమీద, పపాత = పడెను.

తా. రాముడు ఉత్తమములైన బాణములు ప్రయోగించి మహాకపాలుని శిరస్సు ఛేదించెను. లెక్కకు మించిన బాణసముదాయములచేత ప్రమాథిని చంపెను. ఆ ప్రమాథి కొమ్మలతో నిండి ఉన్న మహావృక్షము వలె, చచ్చి నేలపై పడెను. 20, 21

మూ. స్థూలాక్షస్యాక్షిణీ తీక్ష్ణైః పూరయామాస సాయకైః,
దూషణస్యానుగాన్ పఞ్చసహస్రాన్ కుపితః క్షణాత్. 22
బాణౌఘైః పఞ్చసాహస్రైరనయద్యమసాదనమ్.

ప్ర. అ. స్థూలాక్షస్య = స్థూలాక్షునియొక్క, అక్షిణీ = నేత్రములను, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, సాయకైః = బాణములతో, పూరయామాస = నింపెను. కుపితః = కోపించినవాడై, పఞ్చసాహస్రైః = ఐదు వేల, బాణౌఘైః = బాణసముదాయములచేత, దూషణస్య = దూషణునియొక్క, పఞ్చసాహస్రాన్ = ఐదు వేల, అనుగాన్ = అనుచరులను, క్షణాత్ = క్షణకాలములో, యమసాదనమ్ = యమలోకమును, అనయత్ = పొందించెను.

తా. రాముడు స్థూలాక్షుని కళ్లను తీక్ష్ణములైన బాణములతో నింపెను.

కోపించినవాడై, ఐదు వేల బాణములు ప్రయోగించి దూషణుని ఐదు వేలమంది అనుచరులను క్షణకాలములో యమలోకమునకు పంపెను. 22

మూ. దూషణం నిహతం దృష్ట్వా తస్య చైవ పదానుగాన్, 23
వ్యాదిదేశ ఖరః క్రుద్ధః సేనాధ్యక్షాన్ మహాబలాన్.

ప్ర. అ. దూషణమ్ = దూషణుణ్ణి, నిహతమ్ = చంపబడినవానినిగాను, తస్య = అతనియొక్క, పదానుగాన్ = అడుగులను అనుసరించి వెళ్లేవారిని కూడ (చంపబడినవారినిగా), దృష్ట్వా = చూచి, ఖరః = ఖరుడు, క్రుద్ధః = కోపించినవాడై, మహాబలాన్ = గొప్ప బలము గల, సేనాధ్యక్షాన్ = సేనానాయకులను, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. దూషణుడు, ఆతని అనుచరులు మరణించుట చూచి, ఖరుడు కోపించి, గొప్ప బలము గల సేనానాయకులను ఆజ్ఞాపించెను. 23

మూ. అయం వినిహతః సంఖ్యే దూషణః సపదానుగః, 24
మహత్యా సేనయా సార్ధం యుద్ధ్వా రామం కుమానుషమ్,
శస్త్రైర్నానావిధాకారైర్హనధ్వం సర్వరాక్షసాః. 25

ప్ర. అ. అయం = ఈ, సపదానుగః = అనుచరులతో కూడిన, దూషణః = దూషణుడు, సంఖ్యే = యుద్ధమునందు, నిహతః = చంపబడినాడు. సర్వ రాక్షసాః = సకలరాక్షసులారా ! మహత్యా = గొప్ప, సేనయా సార్ధమ్ = సేనతో కూడ, యుద్ధ్వా = యుద్ధము చేసి, నానావిధైః = అనేకవిధములైన, శస్త్రైః = ఆయుధములచేత, కుమానుషమ్ = చెడ్డ మానవుడైన, రామమ్ = రాముణ్ణి, హనధ్వమ్ = చంపుడు.

తా. దూషణుడూ ఆతని అనుచరులు కూడ యుద్ధములో మరణించినారు. సకలరాక్షసులారా ! మీరు పెద్ద సైన్యముతో వెళ్ళి యుద్ధము చేసి, అనేకవిధములైన ఆకారములలో ఉన్న ఆయుధములు ప్రయోగించి, చెడ్డ మానవుడైన రాముణ్ణి చంపివేయుడు. 24, 25

మూ. ఏవముక్త్వా ఖరః క్రుద్ధో రామమేవాభిదుద్రువే,
శ్యేనగామీ పృథుగ్రీవో యజ్ఞశత్రుర్విహంగమః. 26

దుర్జయః కరవీరాక్షః పరుషః కాలకార్ముకః,
మేఘమాలీ మహామాలీ సర్పాస్యో రుధిరాశనః. 27

ద్వాదశైతే మహావీర్యా బలాధ్యక్షాః ససైనికాః,
రామమేవాభ్యధావన్త విసృజన్తః శరోత్తమాన్. 28

ప్ర. అ. ఖరః = ఖరుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, క్రుద్ధః = కోపించినవాడై, రామమేవ = రాముని వైపే, అభిదుద్రువే = పరుగెత్తెను. శ్యేనగామీ = శ్యేనగామి, పృథుగ్రీవః = పృథుగ్రీవుడు, యజ్ఞశత్రుః = యజ్ఞశత్రువు, విహంగమః = విహంగముడు, దుర్జయః = దుర్జయుడు, కరవీరాక్షః = కరవీరాక్షుడు, పరుషః = పరుషుడు, కాలకార్ముకః = కాలకార్ముకుడు, మేఘమాలీ = మేఘమాలి, మహామాలీ = మహామాలి, సర్పాస్యః = సర్పాస్యుడు, రుధిరాశనః = రుధిరాశనుడు అను, ఏతే = ఈ, మహావీర్యాః = గొప్ప పరాక్రమము గల, ద్వాదశ = పంద్రెండుగురు, బలాధ్యక్షాః = సేనానాయకులు, ససైనికాః = సైనికులతో కూడినవారై, శరోత్తమాన్ = ఉత్తమములైన శరములను, విసృజన్తః = విడుచుచు, రామమేవ = రాముణ్ణి గూర్చియే, అభ్యధావన్త = పరుగెత్తిరి.

తా. ఖరుడు ఈ విధముగా పలికి కోపముతో రాముని వైపే పరుగెత్తెను. శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు అను మహాపరాక్రమవంతులైన పన్నెండుగురు సేనానాయకులు, సైన్యములతో కూడి, ఉత్తమములైన బాణములు ప్రయోగించుచు, రాముని ఎదిరించిరి. 26-28

మూ. తతః పావకసంకాశైర్హేమవజ్రవిభూషితైః,
జఘాన శేషం తేజస్వీ తస్య సైన్యస్య సాయకైః. 29

ప్ర. అ. తేజస్వీ = తేజఃశాలియైన రాముడు, తతః = అటుపిమ్మట, పావకసంకాశైః = అగ్నితో సమానములు, హేమవజ్రవిభూషితైః = బంగారముచేతను, వజ్రములచేతను అలంకరింపబడినవి అయిన, సాయకైః = బాణములచేత, తస్య = ఆ, సైన్యస్య = సైన్యముయొక్క, శేషమ్ = మిగిలిన భాగమును, జఘాన = చంపెను.

తా. పిమ్మట, తేజఃశాలియైన ఆ రాముడు అగ్నితో సమానములు, బంగారముచేతను, వజ్రములచేతను అలంకరింపబడినవి అయిన బాణములచేత మిగిలిన సైన్యమును సంహరించెను. 29

మూ. తే రుక్మపుఙ్ఖా విశిఖాః సధూమా ఇవ పావకాః,
నిజఘ్నుస్తాని రక్షాంసి వజ్రా ఇవ మహాద్రుమాన్. 30

ప్ర. అ. రుక్మపుఙ్ఖాః = బంగారు పొన్నులు కలవై, సధూమాః = ధూమముతో కూడిన, పావకాః ఇవ = అగ్నుల వలె ఉన్న, తే విశిఖాః = ఆ బాణములు, వజ్రాః = వజ్రములు, మహాద్రుమానివ = పెద్ద వృక్షములను వలె, తాని = ఆ, రక్షాంసి = రాక్షసులను, నిజఘ్నుః = చంపినవి.

తా. బంగారుపొన్నులతో, ధూమముతో కూడిన అగ్నుల వలె ఉన్న ఆ బాణములు మహావృక్షములను వజ్రాయుధములు పడగొట్టినట్లు ఆ రాక్షసులను చంపివేసినవి. 30

మూ. రక్షసాం తు శతం రామః శతేనైకేన కర్ణినామ్,
సహస్రం చ సహస్రేణ జఘాన రణమూర్ధని. 31

ప్ర. అ. రామః = రాముడు, రక్షసామ్ = రాక్షసులయొక్క, శతమ్ = శతమును, కర్ణినామ్ = కర్ణిబాణములయొక్క, ఏకేన శతేన = ఒక శతముచేతను, సహస్రమ్ = సహస్రమును, సహస్రేణ = సహస్రముచేతను, రణమూర్ధని = యుద్ధశిరస్సునందు, జఘాన = చంపెను.

తా. రాముడు ఆ రణరంగములో నూరుగురు రాక్షసులను నూరు కర్ణిబాణములచేత, వెయ్యిమంది రాక్షసులను వెయ్యి బాణములచేత సంహరించెను.

మూ. తైర్భిన్నవర్మాభరణాశ్ఛిన్నభిన్నశరాసనాః,
నిపేతుః శోణితాదిగ్ధా ధరణ్యాం రజనీచరాః. 32

ప్ర. అ. తైః = ఆ బాణములచేత, భిన్నవర్మాభరణాః = బ్రద్దలుకొట్టబడిన కవచములు ఆభరణములు గల, ఛిన్నభిన్నశరాసనాః = ఛేదింపబడిన, బ్రద్దలుకొట్టబడిన ధనస్సులు గల, రజనీచరాః = రాక్షసులు, శోణితాదిగ్ధాః = రక్తముచేత పూయబడినవారై, ధరణ్యామ్ = నేలపై, నిపేతుః = పడిరి.

తా. ఆ బాణములు రాక్షసుల కవచములను, ఆభరణములను బ్రద్దలు కొట్టెను. వాళ్ళ ధనస్సులను తెగగొట్టి బ్రద్దలుకొట్టెను. ఈ విధముగ ఆ రాక్షసులు రక్తముతో నిండిన దేహములతో నేలమీద పడిపోయిరి. 32

మూ. తైర్ముక్తకేశైః సమరే పతితైః శోణితోక్షితైః,
ఆస్తీర్ణా వసుధా కృత్స్నా మహావేదిః కుశైరివ. 33

ప్ర. అ. సమరే = యుద్ధమునందు, పతితైః = పడిపోయిన, ముక్తకేశైః = విడిపోయిన కేశబంధముగల, శోణితోక్షితైః = రక్తముచేత పూయబడిన, తైః = ఆ రాక్షసులచేత, కృత్స్నా = సమస్తమైన, వసుధా = భూమి, మహావేదిః = గొప్ప వేది, కుశైరివ = దర్భలచేత వలె, ఆస్తీర్ణా = పరవబడెను.

తా. విడిపోయిన జుట్టుతో, రక్తముచేత తడిసిన శరీరములతో, యుద్ధములో పడిపోయిన ఆ రాక్షసులు, కుశలు మహావేది చుట్టూ కప్పినట్లు, భూమిని కప్పివేసెను. 33

మూ. క్షణేన తు మహాఘోరం వనం నిహతరాక్షసమ్,
బభూవ నిరయప్రఖ్యం మాంసశోణితకర్దమమ్. 34

ప్ర. అ. నిహతరాక్షసమ్ = చంపబడిన రాక్షసులు గల, వనమ్ = ఆ వనము, క్షణేన = క్షణకాలములో, మహాఘోరమ్ = చాల భయంకరముగాను, మాంసశోణితకర్దమమ్ = మాంసము రక్తము అను బురద కలదిగాను, నిరయప్రఖ్యమ్ = నరకముతో సమానముగాను, బభూవ = అయ్యెను.

తా. రాక్షసుల నందరిని చంపివేయగా వాళ్ల మాంసములు, రక్తము అనే బురదతో నిండి చాల భయంకరముగా ఉన్న ఆ వనము, క్షణకాలములో నరకము వలె అయ్యెను. 34

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
హతాన్యేకేన రామేణ మానుషేణ పదాతినా. 35

ప్ర. అ. మానుషేణ = మానవుడు, పదాతినా = పాదములతో నడచువాడు అయిన, రామేణ = రామునిచేత, ఏకేన = ఒక్కనిచేతనే, భీమకర్మణామ్ =

భయంకరమైన కర్మ గల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదు నాలుగు, సహస్రాణి = వేలు, హతాని = చంపబడినవి.

తా. ఏ వాహనమూ లేని మానవుడైన ఒక్క రాముడు ఈ విధముగ, భయంకరమైన కర్మ గల పదునాలుగువేలమంది రాక్షసులను చంపివేసెను. 35

మూ. తస్య సైన్యస్య సర్వస్య ఖరః శేషో మహారథః,
రాక్షసస్త్రిశిరాశ్చైవ రామశ్చ రిపుసూదనః. 36

("రామశ్చ రిపుసూదనః" అను పాఠమునకు బదులు "హతశేషౌ నిశాచరౌ" అను ప్రాచ్యపాఠము బాగున్నది.)

ప్ర. అ. సర్వస్య = సమస్తమైన, తస్య సైన్యస్య = ఆ సైన్యమునకు, మహారథః = మహారథుడైన, ఖరః = ఖరుడు, శేషః = మిగిలినవాడు. త్రిశిరాః = త్రిశిరస్సు అను, రాక్షసశ్చ = రాక్షసుడు కూడ, మిగిలినవాడు. నిశాచరౌ = ఆ ఇద్దరు రాక్షసులే, హతశేషౌ = చంపగా మిగిలినవాళ్ళు.

తా. ఆ మొత్తము సేన అంతలోను మహారథుడైన ఖరుడు, త్రిశిరస్సు అను రాక్షసుడు మిగిలిరి. అందరూ చావగా మిగిలినవాళ్ళు ఆ నిశాచరు లిద్దరు మాత్రమే. 36

మూ. శేషా హతా మహాసత్త్వా రాక్షసా రణమూర్ధని,
ఘోరా దుర్విషహాః సర్వే లక్ష్మణస్యాగ్రజేన తే. 37

ప్ర. అ. మహాసత్త్వాః = గొప్ప బలము గలవాళ్లు, ఘోరాః = భయంకరులు, దుర్విషహాః = సహింప శక్యము కానివాళ్లు, అయిన, సర్వే = సమస్తమైన, శేషాః = మిగిలిన, తే = వాళ్ళు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, అగ్రజేన = అన్నచేత, రణమూర్ధని = యుద్ధాగ్రభాగమునందు, హతాః = చంపబడినారు.

తా. ఈ ఇద్దరూ తప్ప మిగిలిన మహాబలవంతులు, భయంకరులు, సహింప శక్యము కానివాళ్ళు అయిన రాక్షసు లందరినీ రాముడు యుద్ధరంగమునందు హతమార్చెను. 37

మూ. తతస్తు తద్భీమబలం మహాహవే
సమీక్ష్య రామేణ హతం బలీయసా,

రథేన రామం మహతా ఖరస్తదా
సమాససాదేన్ద్రి ఇవోద్యతాశనిః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షడ్వింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరః = ఖరుడు, మహాహవే = గొప్ప యుద్ధమునందు, బలీయసా = గొప్ప బలము గల, రామేణ = రామునిచేత, హతమ్ = చంపబడిన, తత్ = ఆ, భీమబలమ్ = భయంకరమైన సేనను, సమీక్ష్య = చూచి, తదా = అప్పుడు, ఉద్యతాశనిః = ఎత్తబడిన వజ్రాయుధము గల, ఇన్ద్రిః ఇవ = ఇంద్రుడు వలె, మహతా = గొప్ప, రథేన = రథముతో, రామమ్ = రాముణ్ణి, సమాససాద = చేరెను.

తా. ఆ మహాయుద్ధములో మహాబలశాలియైన రాముడు భయంకరమైన బలము గల రాక్షససైన్యమును అంతను చంపివేయుట చూచి, ఖరుడు పెద్ద రథమును అధిరోహించి, వజ్రాయుధమును ధరించిన దేవేంద్రుడు వలె భయంకరుడై, రామునిమీదికి వెళ్లెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువదిఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తవింశః సర్గః

[రాముడు త్రిశిరస్సును సంహరించుట].

మూ. ఖరం తు రామాభిముఖం ప్రయాన్తం వాహినీపతిః,
రాక్షసస్త్రిశిరా నామ సంనిపత్యేదమబ్రవీత్. 1

ప్ర. అ. రామాభిముఖమ్ = రామునకు అభిముఖముగా, ప్రయాన్తమ్ = వెళ్లుచున్న, ఖరమ్ = ఖరుణ్ణి, వాహినీపతిః = సేనాపతియైన, త్రిశిరాః నామ = త్రిశిరస్సు అను పేరు గల, రాక్షసః = రాక్షసుడు, సంనిపత్య = నమస్కరించి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముని వైపు వెళ్ళుచున్న ఖరుణ్ణి చూచి త్రిశిరస్సు అను సేనాపతియైన రాక్షసుడు ఆతనికి నమస్కరించి ఇట్లు పలికెను. 1

మూ. మాం నియోజయ విక్రాన్త సంనివర్తస్వ సాహసాత్,
పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితమ్. 2

ప్ర. అ. విక్రాన్త = ఓ! పరాక్రమవంతుడా ! మామ్ = నన్ను, నియోజయ = నియమింపుము. సాహసాత్ = సాహసమునుండి, నివర్తస్వ = మరలుము. సంయుగే = యుద్ధమునందు, వినిపాతితమ్ = పడవేయబడిన, మహాబాహుమ్ = గొప్ప బాహువులు గల, రామమ్ = రాముణ్ణి, పశ్య = చూడుము.

తా. ఓ ! పరాక్రమవంతుడా ! నీవు నాకు ఆజ్ఞ ఇమ్ము. ఈ సాహసమునుండి విరమించుము. మహాబాహువైన రాముణ్ణి యుద్ధములో సంహరించెదను. చూడుము. 2

మూ. ప్రతిజానామి తే సత్యమాయుధం చాహమాలభే,
యథా రామం వధిష్యామి వధార్హం సర్వరక్షసామ్. 3

ప్ర. అ. అహమ్ = నేను, తే = నీకు, సత్యమ్=నిజముగా, ప్రతిజానామి = ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఆయుధం చ = ఆయుధమును కూడ, ఆలభే = స్పృశించుచున్నాను. యథా = ఏమనగా, సర్వరక్షసామ్ = సకలరాక్షసులకు, వధార్హమ్ = చంపుటకు తగిన, రామమ్ = రాముణ్ణి, వధిష్యామి = వధించెదను.

తా. నీకు నిజముగా ప్రతిజ్ఞ చేసి, ఆయుధముపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. ఏమనగా అందరు రాక్షసులకు చంపదగిన ఈ రాముణ్ణి చంపెదను.

మూ. అహం వాస్య రణే మృత్యురేష వా సమరే మమ,
వినివృత్య రణోత్సాహాన్ముహూర్తం ప్రాశ్నికో భవ. 4

ప్ర. అ. రణోత్సాహాత్ = యుద్ధోత్సాహమునుండి, వినివృత్య = మరలి, (నీవు), రణే = యుద్ధమునందు, అహమ్ = నేను, అస్య = ఈతనికి, మృత్యుః = మృత్యు వగుదునా, వా = లేక, సమరే = యుద్ధమునందు, ఏషః = ఇతడు, మమ = నాకు మృత్యు వగునా అని, ముహూర్తమ్ = క్షణకాలము పాటు, ప్రాశ్నికః = ప్రశ్న వేసుకొనువాడవు, భవ = అగుము.

తా. నీవు ఈ యుద్ధోత్సాహమునుండి విరమించి, రణరంగములో నేను రామునకు మృత్యుదేవత అగుదునో లేక అతడు నాకే మృత్యుదేవత అగునో, ముహూర్తకాలము ప్రశ్నించుకొనుచు నిరీక్షించుము. 4

మూ. ప్రహృష్టో వా హతే రామే జనస్థానం ప్రయాస్యసి,
మయి వా నిహతే రామం సంయుగాయోపయాస్యసి. 5

ప్ర. అ. రామే=రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, ప్రహృష్టః = సంతోషించుచు, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, ప్రయాస్యసి వా = వెళ్లనైన వెళ్లెదవు. మయి = నేను, నిహతే = చంపబడినవాడ నగుచుండగా, సంయుగాయ = యుద్ధముకొరకు, రామమ్ = రాముణ్ణి గూర్చి, ఉపయాస్యసి వా = వెళ్ల నైన వెళ్లెదవు.

తా. నేనే రాముణ్ణి చంపినచో నీవు ఆనందముతో జనస్థానమునకు వెళ్ళవచ్చును. లేదా నన్నే అతడు సంహరించినచో నీవు రామునిపై యుద్ధానికి వెళ్లవచ్చును. 5

మూ. ఖరస్త్రిశిరసా తేన మృత్యులోభాత్ప్రసాదితః,
గచ్ఛ యుధ్యేత్యనుజ్ఞాతో రాఘవాభిముఖో యయౌ. 6

ప్ర. అ. ఖరః = ఖరుడు, తేన = ఆ, త్రిశిరసా = త్రిశిరస్సుచేత, మృత్యులోభాత్ = మృత్యువునందు ఆసక్తివలన, ప్రసాదితః = అనుగ్రహింపచేసికొనబడినాడు. గచ్ఛ = వెళ్లుము, యుధ్య = యుద్ధము చేయుము, ఇతి = అని, అనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడినవాడై, త్రిశిరస్సు, రాఘవాభిముఖః = రామునకు అభిముఖుడై, యయౌ = వెళ్లెను.

తా. ఈ విధముగ త్రిశిరస్సు, చావు కోరుకొని, ఖరుణ్ణి అనుగ్రహింపచేసుకొనెను. "వెళ్ళుము, యుద్ధము చేయుము" అని ఖరుడు అనుమతింపగా ఆ త్రిశిరస్సు రాము డున్న ప్రదేశమునకు వెళ్లెను. 6

మూ. త్రిశిరాపి రథేనైవ వాజియుక్తేన భాస్వతా,
అభ్యద్రవద్రణే రామం త్రిశృఙ్గ ఇవ పర్వతః. 7

ప్ర. అ. త్రిశిరాపి = త్రిశిరస్సు కూడ, వాజియుక్తేన = గుఱ్ఱములు కట్టిన, భాస్వతా = ప్రకాశించుచున్న, రథేనైవ = రథముచేతనే, త్రిశృఙ్గః = మూడు శిఖరములు గల, పర్వతః ఇవ = పర్వతము వలె, రణే = యుద్ధమునందు, రామమ్ = రాముణ్ణి గూర్చి, అభ్యద్రవత్ = ఎదురుగా పరుగెత్తెను.

తా. త్రిశిరస్సు గుఱ్ఱములు కట్టిన, ప్రకాశించుచున్న రథము నెక్కి, మూడు శిఖరము లున్న పర్వతము వలె, రాముని ఎదిరించుచు వెళ్ళెను. 7

మూ. శరధారాసమూహాన్స మహామేఘ ఇవోత్సృజన్,
వ్యసృజత్సదృశం నాదం జలార్ద్రస్య తు దున్దుభేః. 8

ప్ర. అ. సః = అతడు, మహామేఘ ఇవ = పెద్ద మేఘమువలె, శరధారాసమూహాన్ = జలధారలవంటి శరముల సముదాయములను, ఉత్సృజన్ = విడచుచు, జలార్ద్రస్య = జలముచేత తడిసిన, దున్దుభేః = దుందుభికి, సదృశమ్ = సమానమైన, నాదమ్ = ధ్వనిని, వ్యసృజత్ = సృష్టించెను.

తా. ఆ త్రిశిరస్సు పెద్ద మేఘము వలె, జలధారల వంటి బాణసముదాయములను విడచుచు, నీటికి తడిసిన దుందుభి వంటి ధ్వనిని చేసెను. 8

మూ. ఆగచ్ఛన్తం త్రిశిరసం రాక్షసం ప్రేక్ష్య రాఘవః,
ధనుషా ప్రతిజగ్రాహ విధూన్వన్ సాయకాన్ శితాన్. 9

ప్ర. అ. రాఘవః = రాముడు, ఆగచ్ఛన్తమ్ = వచ్చుచున్న, రాక్షసమ్ = రాక్షసుడైన, త్రిశిరసమ్ = త్రిశిరస్సును, ప్రేక్ష్య = చూచి, శితాన్ = వాడియైన, సాయకాన్ = బాణములను, ధనుషా = ధనస్సుచేత, విధూన్వన్ = ప్రయోగించుచు, ప్రతిజగ్రాహ = స్వీకరించెను.

తా. రాముడు వచ్చుచున్న ఆ త్రిశిరోరాక్షసుని చూచి, ధనస్సుచేత వాడియైన బాణాలను ప్రయోగించుచు ఆతనిని స్వీకరించెను. 9

మూ. స సంప్రహారస్తుములో రామత్రిశిరసోర్మహాన్,
బభూవాతీవ బలినోః సింహకుఞ్జరయోరివ. 10

ప్ర. అ. రామత్రిశిరసోః = రామునియొక్క, త్రిశిరస్సుయొక్క, తుములః = వ్యాకులమైన, మహాన్ = గొప్పదైన, సః సంప్రహారః = ఆ యుద్ధము, అతీవ = మిక్కిలి, బలినోః = బలము గల, సింహకుఞ్జరయోః ఇవ = సింహము యొక్క ఏనుగయొక్క యుద్ధము వలె, బభూవ = ఆయెను.

తా. రామత్రిశిరస్సుల మధ్య జరిగిన తుములమైన ఆ గొప్ప యుద్ధము, చాల బలము గల సింహమునకు గజమునకు మధ్య జరిగిన యుద్ధము వలె ఉండెను 10

మూ. తతస్త్రిశిరసా బాణైర్లలాటే తాడితస్త్రిభిః,
అమర్షీ కుపితో రామః సంరబ్ధమిదమబ్రవీత్. 11

ప్ర. అ. తతః = ఆటుపిమ్మట, అమర్షీ = అధికమైన కోపము గల, రామః = రాముడు, త్రిశిరసా = త్రిశిరస్సుచేత, త్రిభిః = మూడు, బాణైః = బాణములచేత, లలాటే = లలాటమునందు, తాడితః = కొట్టబడినవాడై, కుపితః = కోపించినవాడై, సంరబ్ధతరమ్ = ఎక్కువ తొందరగా, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట ఆ త్రిశిరస్సు క్రోధావిష్టుడైన ఆ రాముని లలాటముపై

మూడు బాణములు ప్రయోగించగా, రాముడు ఇంకను కుపితుడై, తొందరగా ఇట్లు పలికెను. 11

మూ. అహో విక్రమశూరస్య రాక్షసస్యేదృశం బలమ్,
పుష్పైరివ శరైర్యస్య లలాటేఽస్మి పరిక్షతః. 12

ప్ర. అ. అహో = ఆహా! విక్రమశూరస్య = పరాక్రమముచేత శూరుడైన, రాక్షసస్య = రాక్షసునియొక్క, బలమ్ = బలము, ఈదృశమ్ = ఇట్టిదికదా! యస్య = ఎవనియొక్క, శరైః = బాణములచేత, పుష్పైరివ = పుష్పములచేత వలె, లలాటే = లలాటమునందు, పరిక్షతః అస్మి = కొట్టబడితినో.

తా. "ఆహా! పరాక్రమముచేత శూరుడైన రాక్షసుని బలము ఏమి బలము! నీవు ప్రయోగించిన బాణములు నా లలాటము మీద పువ్వులు తగిలి నట్లు తగిలినవి!" 12

మూ. మమాపి ప్రతిగృహ్ణీష్వ శరాంశ్చాపగుణచ్యుతాన్,
ఏవముక్త్వా తు సంరబ్ధః శరానాశీవిషోపమాన్, 13
త్రిశిరోవక్షసి క్రుద్ధో నిజఘాన చతుర్దశ.

ప్ర. అ. మమ = నాయొక్క, చాపగుణచ్యుతాన్ = ధనస్సు నారినుండి బైటకు వచ్చిన, శరానపి = బాణములను కూడ, ప్రతిగృహ్ణీష్వ = గ్రహించుము. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సంరబ్ధః = వేగముతో కూడినవాడై, (రాముడు), క్రుద్ధః = కోపించినవాడై, ఆశీవిషోపమాన్ = సర్పములతో సమానములైన, చతుర్దశ = పదునాలుగు, శరాన్ = బాణములను, త్రిశిరోవక్షసి = త్రిశిరస్సు వక్షఃస్థలముమీద, నిచఖాన = పాతెను.

తా. "నా ధనస్సు నారినుండి వెలువడిన బాణములను కూడ స్వీకరించుము" అని పలికి రాముడు, క్రుద్ధుడై, వేగముగా, సర్పముల వంటి పదునాలుగు బాణములు ఆ త్రిశిరస్సు వక్షఃస్థలముమీద నాటెను. 13

మూ. చతుర్భిస్తురగానస్య శరైః సన్నతపర్వభిః, 14
న్యపాతయత తేజస్వీ చతురస్తస్య వాజినః.

ప్ర. అ. తేజస్వీ = తేజఃశాలియైన రాముడు, సన్నతపర్వభిః = వంగిన కణుపులు గల, చతుర్భిః = నాలుగు, శరైః = బాణములచేత, తస్య = అట్టి, అస్య = ఈ త్రిశిరస్సుయొక్క, తురగాన్ = శీఘ్రముగా నడచు, చతురః = నాలుగు, వాజినః = గుఱ్ఱములను, న్యపాతయత్ = పడగొట్టెను.

తా. తేజఃశాలియైన రాముడు వంగిన కణుపులు గల నాలుగు బాణముల చేత, ఆ త్రిశిరస్కుని శీఘ్రముగా నడచు నాలుగు గుఱ్ఱములను చంపెను. 14

మూ. అష్టభిః సాయకైః సూతం రథోపస్థాన్న్యపాతయత్, 15
రామశ్చిచ్ఛేద బాణేన ధ్వజం చాస్య సముచ్ఛ్రితమ్.

ప్ర. అ. రామః = రాముడు, అష్టభిః = ఎనిమిది, సాయకైః = బాణముల చేత, సూతమ్ = సారథిని, రథోపస్థాత్ = రథము పైభాగమునుండి, న్యపాతయత్ = పడగొట్టెను. బాణేన = ఒక బాణముచేత, అస్య = వీనియొక్క, సముచ్ఛ్రితమ్ = ఎత్తుగా ఎగురవేయబడిన, ధ్వజమ్ = ధ్వజమును, చిచ్ఛేద = ఛేదించెను.

తా. రాముడు ఎనిమిది బాణములు ప్రయోగించి సారథిని చంపి రథము పైభాగమునుండి క్రిందికి పడవేసెను. ఒక బాణముచేత ఎత్తుగా ఎగురుచున్న ధ్వజమును ఛేదించెను. 15

మూ. తతో హతరథాత్తస్మాదుత్పతన్తం నిశాచరమ్, 16
బిభేద రామస్తం బాణైర్హృదయే సోఽభవజ్జడః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, తస్మాత్ = ఆ, హతరథాత్ = కొట్టబడిన రథమునుండి, ఉత్పతన్తమ్ = పైకి ఎగురుచున్న, తం నిశాచరమ్ = ఆ రాక్షసుణ్ణి, బాణైః = బాణములచేత, హృదయే = హృదయము నందు, బిభేద = బద్దలుకొట్టెను. సః = అతడు, జడః = జడుడు, అభవత్ = ఆయెను.

తా. విరిగిపోయిన రథమునుండి ఆ రాక్షసుడు పైకి ఎగరబోగా రాముడు ఆతని వక్షస్థలమును బాణములచేత బ్రద్దలుకొట్టెను. అప్పుడు అతడు ఏమీ చేయ లేని స్థితిలో ఉండెను. 16

మూ. సాయకైశ్చాప్రమేయాత్మా సామర్ష స్తస్య రక్షసః, 17
శిరాంస్యపాతయద్రామో వేగవద్భిస్త్రిభిః శితైః.

ప్ర. అ. అప్రమేయాత్మా = ఊహింప శక్యము కాని బుద్ధి గల, రామః = రాముడు, సామర్షః = కోపముతో కూడినవాడై, వేగవద్భిః = వేగము గల, శితైః = వాడియైన, త్రిభిః = మూడు, సాయకైః = బాణములచేత, తస్య రక్షసః = ఆ రాక్షసునియొక్క, శిరాంసి = శిరస్సులను, అపాతయత్ = పడగొట్టెను.

తా. ఊహించుటకు కూడ శక్యము కాని బుద్ధి గల రాముడు, చాల కోపముతో, వేగము గల, వాడియైన మూడు బాణములతో ఆతని శిరస్సులను ఖండించెను. 17

మూ. స భూమౌ రుధిరోద్గారీ రామబాణాభిపీడితః, 18
న్యపతత్పతితైః పూర్వం స్వశిరోభిర్నిశాచరః.

ప్ర. అ. రామబాణాభిపీడితః = రాముని బాణములచేత పీడింపబడిన, సః నిశాచరః = ఆ రాక్షసుడు, రుధిరోద్గారీ = రక్తమును కక్కుచున్నవాడై, పూర్వమ్ = ముందుగా, పతితైః = క్రిందపడిన, స్వశిరోభిః = తన శిరస్సులతో కూడ, న్యపతత్ = పడెను.

తా. రాముని బాణములచేత పీడింపబడిన ఆ త్రిశిరస్సు రక్తమును చిమ్ముచు, తన శిరస్సులు ముందుగా నేలపై పడగా, పిదప తాను పడెను. 18

మూ. హతశేషా స్తతో భగ్నా రాక్షసాః ఖరసంశ్రయాః, 19
ద్రవన్తి స్మ న తిష్ఠన్తి వ్యాఘ్రత్రస్తా మృగా ఇవ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరసంశ్రయాః = ఖరుడు ఆశ్రయముగా గల, హతశేషాః = చంపబడగా మిగిలిన, రాక్షసాః = రాక్షసులు, భగ్నాః = ఓడిపోయినవారై, వ్యాఘ్రత్రస్తాః = పెద్దపులినుండి భయపడిన, మృగాః యథా = లేళ్లవలె, ద్రవన్తి స్మ = పారిపోయిరి. న తిష్ఠన్తి = నిలవలేదు.

తా. చంపగా మిగిలిన ఖరుని అనుచరులైన రాక్షసులు ఓడిపోయి, పెద్దపులినుండి భయపడిన లేళ్లవలె, నిలబడకుండ పారిపోయిరి. 19

మూ. తాన్ ఖరో ద్రవతో దృష్ట్వా నివర్త్య రుషితః స్వయమ్,
రామమేవాభిదుద్రావ రాహుశ్చన్ద్రమసం యథా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తవింశః సర్గః.

ప్ర. అ. రుషితః = కోపించిన, ఖరః = ఖరుడు, ద్రవతః = పారిపోవుచున్న, తాన్ = వాళ్ళను, దృష్ట్వా = చూచి, స్వయమ్ = స్వయముగా, నివర్త్య = మరల్చి, రాహుః = రాహువు, చన్ద్రమసం యథా = చంద్రుణ్ణిగూర్చి వలె, రామమేవ = రాముణ్ణి గూర్చియే, అభిదుద్రావ = పరుగెత్తెను.

తా. కోపించిన ఖరుడు పారిపోవుచున్న ఆ రాక్షసులను చూచి, స్వయముగా వాళ్లను వెనుకకు మరల్చి, రాహువు చంద్రునిమీదికి వెళ్ళినట్లు రాముని మీదికి వెళ్లెను. 20

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఇరువదివ ఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశః సర్గః

## [ఖరునితో రాముడు ఘోరముగా పోరాడుట]

మూ. నిహతం దూషణం దృష్ట్వా రణే త్రిశిరసా సహ,
ఖరస్యాప్యభవత్త్రాసో దృష్ట్వా రామస్య విక్రమమ్. 1

ప్ర. అ. రణే = యుద్ధమునందు, త్రిశిరసా సహ = త్రిశిరస్సుతో కూడ, నిహతమ్ = చంపబడిన, దూషణమ్ = దూషణుణ్ణి, దృష్ట్వా = చూచి, రామస్య = రామునియొక్క, విక్రమమ్ = పరాక్రమమును, దృష్ట్వా = చూచి, ఖరస్యాపి = ఖరునకు కూడ, త్రాసః = భయము, అభవత్ = ఆయెను.

తా. యుద్ధములో దూషణుణ్ణీ, త్రిశిరస్సునూ చంపిన రాముని పరాక్రమము చూడగానే ఖరునకు కూడ భయము కలిగెను. 1

మూ. స దృష్ట్వా రాక్షసం సైన్యమవిషహ్యం మహాబలః,
హతమేకేన రామేణ త్రిశిరోదూషణావపి. 2

తద్బలం హతభూయిష్ఠం విమనాః ప్రేక్ష్య రాక్షసః,
ఆససాద ఖరో రామం నముచిర్వాసవం యథా. 3

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, రాక్షసః = రాక్షసుడైన, ఖరః = ఖరుడు, అవిషహ్యమ్ = సహింప శక్యము కాని, రాక్షసమ్ = రాక్షసులసంబంధమైన, సైన్యమ్ = సైన్యమును, ఏకేన = ఒక్క, రామేణ = రామునిచేత, హతమ్ = చంపబడినదానినిగా, త్రిశిరోదూషణావపి = త్రిశిరస్సును, దూషణునీ కూడ, (చంపబడినవారినిగా), దృష్ట్వా = చూచి, హతభూయిష్ఠమ్ = చాలవరకు చంపివేయబడిన, తత్ బలమ్ = ఆ సైన్యమును, ప్రేక్ష్య = చూచి, నముచిః = నముచిఅనే రాక్షసుడు, వాసవం యథా = దేవేంద్రుని వలె, రామమ్ = రాముణ్ణి, ఆససాద = సమీపించెను.

తా. మహాబలము గల ఆ రాక్షసుడు, ఖరుడు, ఎదిరింప శక్యము కాని ఆ రాక్షససైన్యమును, త్రిశిరోదూషణులను కూడ ఒక్క రాముడు సంహరించుట చూచి, సైన్యము చాలవరకు నశించిన దను విషయము గమనించి, నముచి దేవేంద్రుణ్ణి ఎదిరించి నట్లు రాముణ్ణి ఎదిరించుటకై వెళ్ళెను. 2,3

మూ. వికృష్య బలవచ్చాపం నారాచాన్ రక్తభోజనాన్,
ఖరశ్చిక్షేప రామాయ క్రుద్ధానాశీవిషానివ. 4

ప్ర. అ. ఖరః = ఖరుడు, బలవత్ = బలముతో, చాపమ్ = ధనస్సును, వికృష్య = లాగి, క్రుద్ధాన్ = కోపించిన, ఆశీవిషానివ = సర్పములు వలె ఉన్న, రక్తభోజనాన్ = రక్తము భోజనముగా గల, నారాచాన్ = నారాచబాణములను, రామాయ = రామునికొరకు, చిక్షేప = విసిరెను.

తా. ఖరుడు ధనస్సును బలముగా లాగి, కోపించిన సర్పముల వలె ఉన్న, రక్తమును భుజించు నారాచములను రామునిపై ప్రయోగించెను. 4

మూ. జ్యాం విధూన్వన్ సుబహుశః శిక్షయాస్త్రాణి దర్శయన్,
చచార సమరే మార్గాన్ శరై రథగతః ఖరః. 5

ప్ర. అ. రథగతః = రథమును పొందిన, ఖరః = ఖరుడు, సుబహుశః = అనేకవిధములుగ, జ్యామ్ = నారిని, విధూన్వన్ = లాగుచు, శిక్షయా = అభ్యాసముచేత, అస్త్రాణి = అస్త్రములను, దర్శయన్ = చూపుచు, సమరే = యుద్ధమునందు, శరైః = బాణములతో, మార్గాణి = మార్గములను, చచార = చేసెను.

తా. రథము నెక్కి యున్న ఆ ఖరుడు, ధనస్సు నారిని అనేకవిధముల లాగుచు, అభ్యాసపాటవముతో అస్త్రాలను ప్రదర్శించుచు, బాణములు విడచుచు అనేకవిధముల సంచరించెను. 5

మూ. స సర్వాశ్చ దిశో బాణైః ప్రదిశశ్చ మహారథః,
పూరయామాస తం దృష్ట్వా రామోఽపి సుమహద్ధనుః. 6

ప్ర. అ. మహారథః = మహారథుడైన, సః = ఆ ఖరుడు, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రదిశశ్చ = విదిక్కులను, బాణైః = బాణముల

చేత, పూరయామాస = నింపెను, తమ్ = వానిని. దృష్ట్వా = చూచి, రామోఽపి = రాముడు కూడ, సుమహత్ = చాలగొప్పదైన, ధనుః = ధనస్సును, పూరయామాస = పూరించెను.

తా. మహారథుడైన ఆ ఖరుడు బాణములతో దిక్కులను, విదిక్కులను కూడ నింపివేసెను. రాముడు వానిని చూచి తన గొప్ప ధనస్సును ఎక్కుపెట్టెను.

మూ. స సాయకైర్దుర్విషహైః సస్ఫులిఙ్గైరివాగ్నిభిః,
నభశ్చకారావివరం పర్జన్య ఇవ వృష్టిభిః. 7

ప్ర. అ. సః = ఆ రాముడు, దుర్విషహైః = సహింప శక్యము కాని, సస్ఫులిఙ్గైః = అగ్నికణములతో కూడిన, అగ్నిభిః ఇవ = అగ్నుల వలె ఉన్న, సాయకైః = బాణములచేత, పర్జన్యః = మేఘము, వృష్టిభిః ఇవ = వర్షములచేత వలె, నభః = ఆకాశమును, అవివరమ్ = అవకాశము లేనిదానినిగా, చకార = చేసెను.

తా. రాముడు, నిప్పురవ్వలతో కూడిన అగ్నుల వలె సహింప శక్యము కాని బాణములచేత, మేఘము వర్షములచేత వలె, ఆకాశములో అవకాశము లేకుండ చేసెను. 7

మూ. తద్బభూవ శితైర్బాణైః ఖరరామవిసర్జితైః,
పర్యాకాశమనాకాశం సర్వతః శరసంకులమ్. 8

ప్ర. అ. ఖరరామవిసర్జితైః = ఖరునిచేత, రామునిచేత విడువబడిన, శితైః = వాడియైన, బాణైః = బాణములచేత, తత్ = ఆ, పర్యాకాశమ్ = చుట్టుప్రక్కలనున్న ఆకాశము, సర్వతః = అంతటా, శరసంకులమ్ = శరములచేత వ్యాకులమై, అనాకాశమ్ = అవకాశము లేనిదై, బభూవ = అయెను.

తా. ఖరుడు, రాముడు విడచిన వాడియైన బాణములచేత, అంతట నిండిన అక్కడి ఆకాశప్రాంతము అవకాశములేనిది అయ్యెను. 8

మూ. శరజాలావృతః సూర్యో న తదా స్మ ప్రకాశతే,
అన్యోన్యవధసంరమ్భాదుభయోః సంప్రయుధ్యతోః. 9

ప్ర. అ. అన్యోన్యవధసంరమ్భాత్ = పరస్పరము చంపుటకు పట్టుదలతో, ఉభయోః = వాళ్ళిద్దరూ, సంప్రయుధ్యతోః = యుద్ధము చేయుచుండగా, తదా = అప్పుడు, శరజాలావృతః = బాణసముదాయముచేత కప్పబడిన, సూర్యః = సూర్యుడు, న ప్రకాశతే స్మ = ప్రకాశించలేదు.

తా. ఒకరి నొకరు చంపవలె నను పట్టుదలతో వారిద్దరు యుద్ధము చేయుచుండగా, బాణసముదాయముచేత కప్పబడిన సూర్యుడు ప్రకాశించలేదు. 9

మూ. తతో నాళీకనారాచై స్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః,
ఆజఘాన ఖరో రామం తోత్త్రైరివ మహాద్విపమ్. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరః = ఖరుడు, నాళీకనారాచైః = నాళీక బాణములచేతను, నారాచ బాణములచేతను, తీక్ష్ణాగ్రైః = తీక్ష్ణమైన అగ్రభాగములు గల, వికర్ణిభిః = వికర్ణిబాణములచేతను, రామమ్ = రాముణ్ణి, తోత్త్రైః = అంకుశములచేత, మహాద్విపమివ = గొప్ప ఏనుగును వలె, ఆజఘాన = కొట్టెను.

తా. పిదప ఖరుడు, రాముణ్ణి నాళీకబాణములతోను, నారాచబాణములతోను, తీక్ష్ణములైన అగ్రభాగములు గల వికర్ణిబాణములతోను, అంకుశములతో మహాగజమును కొట్టినట్లు కొట్టెను. 10

మూ. తం రథస్థం ధనుష్పాణిం రాక్షసం పర్యవస్థితమ్,
దదృశుః సర్వభూతాని పాశహస్తమివాన్తకమ్. 11

ప్ర. అ. రథస్థమ్ = రథముమీద ఉన్నవాడు, ధనుష్పాణిమ్ = ధనస్సు హస్తమునందు కలవాడు, పర్యవస్థితమ్ = నిలచి ఉన్నవాడు అయిన, తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, పాశహస్తమ్ = పాశము హస్తమునందు గల, అన్తకమ్ ఇవ = యముని వలె, సర్వభూతాని = సకలభూతములు, దదృశుః = చూచినవి.

తా. రథము నెక్కి, ధనస్సు ధరించి, యుద్ధానికి సిద్ధముగా ఉన్న ఆ ఖరుడు, అక్కడ ఉన్న ప్రాణు లందరికి పాశము చేతిలో ధరించిన యముడు వలె కనబడెను. 11

మూ. హన్తారం సర్వసైన్యస్య పౌరుషే పర్యవస్థితమ్,
పరిశ్రాన్తం మహాసత్త్వం మేనే రామం ఖరస్తదా. 12

ప్ర. అ. ఖరః = ఖరుడు, సర్వసైన్యస్య = సమస్తసైన్యమునకు(ను), హన్తారమ్ = చంపినవాడు, పౌరుషే = పౌరుషమునందు, పర్యవస్థితమ్ = నిలచినవాడు, మహాసత్త్వమ్ = చాల బలము గలవాడు అయిన, రామమ్ = రాముణ్ణి, తదా = అప్పుడు, పరిశ్రాన్తమ్ = అలసినవానినిగా, మేనే = తలచెను.

తా. పౌరుషమును చూపి, సకలసైన్యమును చంపిన, మహాబలవంతుడైన రాముడు, అప్పుడు అలసి ఉండు నని ఖరుడు భావించెను. 12

మూ. తం సింహమివ విక్రాన్తం సింహవిక్రాన్తగామినమ్,
దృష్ట్వా నోద్విజతే రామః సింహః క్షుద్రమృగం యథా.

ప్ర. అ. ("సింహః క్షుద్రమృగం యథా" అనుటకు బదులు "సింహః సింహమివాపరమ్"అను ప్రాచ్యపాఠము బాగున్నది. మొదట ఖరుణ్ణి సింహముతో పోల్చి వెంటనే నీచమృగముతో పోల్చుట యుక్తముగా లేదు. అట్లు చేయదలచినచో ముందు సింహముతో పోల్చి ఉండగూడదు).

సింహమివ = సింహమువలె, విక్రాన్తమ్ = పరాక్రమించుచున్నవాడు, సింహవిక్రాన్తగామినమ్ = సింహము నడకతో నడచువాడు అయిన, తమ్ = ఆ ఖరుణ్ణి, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, సింహః = సింహము, అపరం సింహమివ = మరియొక సింహమును చూచివలె, నోద్విజతే = భయపడలేదు.

తా. సింహము వలె నడచుచు, సింహపరాక్రమము వంటి పరాక్రమము చూపుచున్న ఆ ఖరుణ్ణి చూచి, రాముడు, ఒక సింహము మరొక సింహమును చూచి ఎట్లు భయపడదో అట్లే భయపడలేదు. 13

మూ. తతః సూర్యనికాశేన రథేన మహతా ఖరః,
ఆససాద రణే రామం పతఙ్గ ఇవ పావకమ్. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరః = ఖరుడు, సూర్యనికాశేన = సూర్యునితో సమానమైన, మహతా = గొప్పదైన, రథేన = రథముతో, రామమ్ = రాముణ్ణి, పతఙ్గః = మిడత, పావకమ్ ఇవ = అగ్నిని వలె, రణే = యుద్ధమునందు, ఆససాద = సమీపించెను.

తా. పిమ్మట ఖరుడు సూర్యునితో సమానమైన పెద్ద రథము నెక్కి, మిడత అగ్ని దగ్గరకు వెళ్ళి నట్లు, యుద్ధములో రామునిమీదికి వెళ్లెను. 14

మూ. తతోఽస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః,
ఖరశ్చిచ్ఛేద రామస్య దర్శయన్ పాణిలాఘవమ్. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరః = ఖరుడు, పాణిలాఘవమ్ = హస్త లాఘవమును, దర్శయన్ = చూపుచు, మహాత్మనః = మహాత్ముడైన, అస్య రామస్య = ఈ రామునియొక్క, సశరమ్ = బాణముతో కూడిన, చాపమ్ = ధను స్సును, ముష్టిదేశే = పిడికిలిదగ్గర, చిచ్ఛేద = ఛేదించెను.

తా. పిమ్మట ఖరుడు తన నేర్పు చూపించుచు, మహాత్ముడైన ఆ రాముని బాణసహితమైన ధనస్సును పిడికిలి దగ్గర ఛేదించెను. 15

మూ. స పునస్త్వపరాన్ సప్త శరానాదాయ వర్మణి,
నిజఘాన ఖరః క్రుద్ధః శక్రాశనిసమప్రభాన్. 16

ప్ర. అ. సః ఖరః = ఆ ఖరుడు, క్రుద్ధః = కోపించినవాడై, పునః = మరల, శక్రాశనిసమప్రభాన్ = ఇంద్రుని వజ్రాయుధముతో సమానమైన కాంతి గల, అపరాన్ = ఇతరమైన, సప్త = ఏడు, శరాన్ = బాణములను, ఆదాయ = గ్రహించి, వర్మణి = కవచమునందు, నిజఘాన = కొట్టెను.

తా. ఆ ఖరుడు క్రుద్ధుడై మరల, ఇంద్రుని వజ్రాయుధము వంటి, మె ఏడు బాణములు తీసికొని వాటితో రాముని కవచమును కొట్టెను. 16

మూ. తతస్తత్ప్రహతం బాణైః ఖరముక్తైః సుపర్వభిః,
పపాత కవచం భూమౌ రామస్యాదిత్యవర్చసః. 17

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరముక్తైః = ఖరునిచేత విడువబడిన, సుపర్వభిః = మంచి కణుపులు గల, బాణైః = బాణములచేత, ప్రహతమ్ = కొట్ట బడినదై, ఆదిత్యవర్చసః = సూర్యుని వంటి కాంతి గల, రామస్య = రామునియొక్క, తత్ = ఆ, కవచమ్ = కవచము, భూమౌ = నేలమీద, పపాత = పడెను.

తా. మంచి కణుపులు గల బాణములను ప్రయోగించి ఖరుడు కొట్టగా, సూర్యుని వంటి కాంతి గల రాముని కవచము నేలపై పడెను. 17

మూ. తతః శరసహస్రేణ రామమప్రతిమౌజసమ్,
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఖరః = ఖరుడు, అప్రతిమౌజసమ్ = సాటి లేని కాంతి గల, రామమ్ = రాముణ్ణి, శరసహస్రేణ = వేయి బాణములచేత, అర్దయిత్వా = పీడించి, సమరే = యుద్ధమునందు, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగు నట్లుగా, ననాద = అరచెను.

తా. పిమ్మట ఖరుడు, సాటి లేని తేజస్సు గల రాముణ్ణి అనేకబాణముల చేత పీడించి, యుద్ధములో గట్టిగా అరచెను. 18

మూ. స శరైరర్దితః క్రుద్ధః సర్వగాత్రేషు రాఘవః,
రరాజ సమరే రామో విధూమోఽగ్నిరివ జ్వలన్. 19

ప్ర. అ. శరైః = బాణములచేత, సర్వగాత్రేషు = అన్ని అవయవముల యందు, అర్దితః = పీడింపబడిన, రాఘవః = రఘువంశసంజాతుడైన, సః రామః = ఆ రాముడు, క్రుద్ధః = కోపించినవాడై, విధూమః = ధూమము లేని, జ్వలన్ = మండుచున్న, అగ్నిరివ = అగ్ని వలె, సమరే = యుద్ధమునందు, రరాజ = ప్రకాశించెను.

తా. అన్ని అవయవములందు బాణములచేత కొట్టబడి, క్రుద్ధుడైన ఆ రాముడు, యుద్ధరంగములో, ధూమము లేని, ప్రజ్వలించుచున్న అగ్నివలె ప్రకాశించెను. 19

మూ. తతో గమ్భీరనిర్హ్రాదం రామః శత్రునిబర్హణః,
చకారాన్తాయ స రిపోః సజ్యమన్యన్మహద్ధనుః. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శత్రునిబర్హణః = శత్రువినాశకుడైన, సః రామః = ఆ రాముడు, రిపోః = శత్రువుయొక్క, అన్తాయ = అంతముకొరకు, గమ్భీరనిర్హ్రాదమ్ = గంభీరమైన ధ్వని కల, అన్యత్ = మరియొక, మహత్ =

గొప్పదైన, ధనుః = ధనస్సును, సజ్యమ్ = నారితో కూడినదానినిగా, చకార = చేసెను.

తా. పిమ్మట, శత్రుసంహారకుడైన రాముడు, ఆ శత్రువును సంహరించుటకై, గంభీరమైన ధ్వని గల మరి యొక గొప్ప ధనస్సునకు నారి కట్టెను. 20

మూ. సుమహద్వైష్ణవం యత్తదతిసృష్టం మహర్షిణా.
వరం తద్ధనురుద్యమ్య ఖరం సమభిధావత. 21

ప్ర. అ. తత్ = ప్రసిద్ధమైన, యత్ = ఏ, సుమహత్ = చాల పెద్దదైన, వైష్ణవమ్ = విష్ణుసంబంధమైన, ధనుః = ధనస్సు, మహర్షిణా = అగస్త్యమహర్షి చేత, అతిసృష్టమ్ = ఇవ్వబడినదో, వరమ్ = శ్రేష్ఠమైన, తత్ = దానిని, ఉద్యమ్య = ఎత్తి, ఖరమ్ = ఖరుణ్ణి, సమభిధావత = ఎదుర్కొనుటకు వెళ్లెను.

తా. అగస్త్యమహర్షి ఇచ్చిన, శ్రేష్ఠమైన, ఆ గొప్ప వైష్ణవధనస్సును గ్రహించి ఖరుణ్ణి ఎదిరించుటకు శీఘ్రముగా వెళ్ళెను. 21

మూ. తతః కనకపుఙ్ఖైస్తు శరైః సంనతపర్వభిః,
బిభేద రామః సంక్రుద్ధః ఖరస్య సమరే ధ్వజమ్. 22

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, సంక్రుద్ధః = కోపించినవాడై, కనకపుఙ్ఖైః = బంగారు పొన్నులు గల, సంనతపర్వభిః = వంగిన కణుపులు గల, శరైః = బాణములచేత, సమరే = యుద్ధమునందు, ఖరస్య = ఖరునియొక్క, ధ్వజమ్ = ధ్వజమును, బిభేద = భేదించెను.

తా. పిమ్మట రాముడు కుపితుడై, బంగారు పొన్నులు, వంగిన కణుపులు గల బాణములచేత, యుద్ధములో ఖరుని ధ్వజమును ఎగురగొట్టెను. 22

మూ. స దర్శనీయో బహుధా వికీర్ణః కాఞ్చనధ్వజః,
జగామ ధరణీం సూర్యో దేవతానామివాజ్ఞయా. 23

ప్ర. అ. బహుధా = అనేకవిధములుగ, వికీర్ణః = చిమ్మివేయబడిన, దర్శనీయః = సుందరమైన, సః = ఆ, కాఞ్చనధ్వజః = బంగారు ధ్వజము,

దేవతానామ్ = దేవతలయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, సూర్యః ఇవ = సూర్యుడు వలె, ధరణీమ్ = భూమిని, జగామ = పొందెను.

తా. ఎన్నో ముక్కలుగా ఖండింపబడి విసరివేయబడిన అందమైన ఆ బంగారు ధ్వజము దేవతల ఆజ్ఞచే సూర్యుడు నేలమీదికి వచ్చినాడా అన్నట్లు, నేలమీద పడెను. 23

మూ. తం చతుర్భిః ఖరః క్రుద్ధో రామం గాత్రేషు మార్గణైః,
వివ్యాధ యుధి మర్మజ్ఞో మాతఙ్గమివ తోమరైః. 24

ప్ర. అ. క్రుద్ధః = కోపించిన, మర్మజ్ఞః = మర్మస్థానములను లేదా యుద్ధ రహస్యములను ఎరిగిన, ఖరః = ఖరుడు, యుధి = యుద్ధమునందు, తం రామమ్ = ఆ రాముణ్ణి, చతుర్భిః = నాలుగు, మార్గణైః = బాణములచేత, మాతఙ్గమ్ = ఏనుగును, తోమరైరివ = తోమరములచేత వలె, గాత్రేషు = అవయవములయందు, వివ్యాధ = కొట్టెను.

తా. మర్మస్థానములు తెలిసిన ఖరుడు కోపించి, యుద్ధములో, ఆ రాముణ్ణి నాలుగు బాణములతో, గజమును తోమరములతో కొట్టినట్లు, అవయవములమీద కొట్టెను. 24

మూ. స రామో బహుభిర్బాణైః ఖరకార్ముకనిఃసృతైః,
విద్ధో రుధిరసిక్తాఙ్గో బభూవ రుషితో భృశమ్. 25

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, ఖరకార్ముకనిఃసృతైః = ఖరుని ధనస్సునుండి బయలుదేరిన, బహుభిః = అనేకమైన, బాణైః = బాణములచేత, విద్ధః = కొట్టబడినవాడై, రుధిరసిక్తాఙ్గః = రక్తముచేత తడపబడిన శరీరము గలవాడై, భృశమ్ = మిక్కిలి, రుషితః = కోపించినవాడు, బభూవ = ఆయెను.

తా. ఖరుని ధనస్సునుండి బయల్వెడలిన అనేకబాణములు తగిలి, రక్తముతో తడిసిన శరీరము గల ఆ రాముడు, చాల కోపము చెందెను. 25

మూ. స ధనుర్ధన్వినాం శ్రేష్ఠః ప్రగృహ్య పరమాహవే,
ముమోచ పరమేష్వాసః షట్ఛరానభిలక్షితాన్. 26

ప్ర. అ. పరమాహవే = ఆ గొప్ప యుద్ధమునందు, ధన్వినామ్ = ధనుర్ధరులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు, పరమేష్వాసః = గొప్ప ధనస్సు కలవాడు అయిన, సః = ఆ రాముడు, ధనుః = ధనస్సును, ప్రగృహ్య = గ్రహించి, అభిలక్షితాన్ = గురిని గుర్తించిన, షట్ = ఆరు, శరాన్ = బాణములను, ముమోచ = విడచెను.

తా. ధనుర్ధరులలో శ్రేష్ఠుడు, గొప్ప ధనస్సు ధరించినవాడు అయిన ఆ రాముడు, ఆ మహాయుద్ధములో ధనస్సు ధరించి, బాగుగా గురి చూచి ఆరు బాణములు విడచెను. 26

మూ. శిరస్యేకేన బాణేన ద్వాభ్యాం బాహ్వోరథార్దయత్,
త్రిభిశ్చన్ద్రార్ధవక్త్రైశ్చ వక్షస్యభిజఘాన హ. 27

ప్ర. అ. ఏకేన = ఒక, బాణేన = బాణముచేత, శిరసి = శిరస్సునందు, అథ = పిమ్మట, ద్వాభ్యామ్ = రెండింటిచేత, బాహ్వోః = బాహువులమీద, అర్దయత్ = పీడించెను. త్రిభిః = మూడు, చన్ద్రార్ధవక్త్రైః = అర్ధచంద్రాకారమైన ముఖములు గల బాణములచేత, వక్షసి = వక్షఃస్థలముమీద, అభిజఘాన హ = కొట్టెను.

తా. ఆ ఖరుని శిరస్సుమీద ఒక బాణమును, బాహువులపై రెండు బాణములను, వక్షఃస్థలమునందు మూడు అర్ధచంద్రాకారబాణములను ప్రయోగించెను. 27

మూ. తతః పశ్చాన్మహాతేజా నారాచాన్ భాస్కరోపమాన్,
జిఘాంసూ రాక్షసం క్రుద్ధస్త్రయోదశ సమాదదే. 28

ప్ర. అ. తతః పశ్చాత్ = దాని తరువాత, మహాతేజాః = గొప్ప తేజస్సు గల రాముడు, క్రుద్ధః = కోపించినవాడై, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, జిఘాంసుః = చంప దలచినవాడై, భాస్కరోపమాన్ = సూర్యునితో సమానమైన, త్రయోదశ = పదమూడు, నారాచాన్ = నారాచబాణములను, సమాదదే = గ్రహించెను.

తా. మహాతేజశ్శాలియైన రాముడు అటు పిమ్మట, చాల కోపించి, ఆ రాక్షసుని చంపవలె నని నిశ్చయించుకొని సూర్యునివంటి కాంతి గల పదమూడు నారాచబాణములను గ్రహించెను. 28

మూ. రథస్య యుగమేకేన చతుర్భిశ్చతురో హయాన్,
షష్ఠేన తు శిరః సంఖ్యే ఖరస్య రథసారథేః. 29

త్రిభిస్త్రివేణుం బలవాన్ ద్వాభ్యామక్షం మహాబలః,
ద్వాదశేన తు బాణేన ఖరస్య సశరం ధనుః. 30

భిత్త్వా వజ్రనికాశేన రాఘవః ప్రహసన్నివ,
త్రయోదశేనేన్ద్రసమో బిభేద సమరే ఖరమ్. 31

ప్ర. అ. ఇన్ద్రసమః = ఇంద్రునితో సమానుడు, బలవాన్ = బలవంతుడు, మహాబలః = గొప్ప బలము గలవాడు అయిన, రాఘవః = రాముడు, సంఖ్యే = యుద్ధమునందు, ఏకేన = ఒక బాణముచేత, అస్య = ఖరునియొక్క, రథస్య = రథముయొక్క, యుగమ్ = కాడిని, చతుర్భిః = నాలుగు బాణములచేత, చతురః = నాలుగు, హయాన్ = అశ్వములను, షష్ఠేన = ఆరవ బాణముచేత, ఖరస్య = ఖరునియొక్క, రథసారథేః = రథము సారథియొక్క, శిరః = శిరస్సును, త్రిభిః = మూడింటిచేత, త్రివేణుమ్ = రథము ముందుభాగమును, ద్వాభ్యామ్ = రెండింటిచేత, అక్షమ్ = ఇరుసును, ద్వాదశేన = పండ్రెండవదైన, బాణేన = బాణముచేత, ఖరస్య = ఖరునియొక్క, సశరమ్ = బాణముతో కూడిన, ధనుః = ధనస్సును, భిత్త్వా = భేదించి, ప్రహసన్నివ = నవ్వుచున్నవాడువలె, సమరే = యుద్ధమునందు, వజ్రనికాశేన = వజ్రమువంటి, త్రయోదశేన = పదమూడవ బాణముచేత, ఖరమ్ = ఖరుణ్ణి, బిభేద = భేదించెను (కొట్టెను).

తా. దేవేంద్రునితో సమానుడు, బలవంతుడు, మహాబలశాలి అయిన రాముడు, యుద్ధములో ఒక బాణముచేత రథము కాడిని, నాలిగింటిచేత నాలుగు గుఱ్ఱాలను, ఆరవ బాణముచేత ఖరుని రథసారథి శిరస్సును, మూడింటిచేత రథము ముందు భాగమును, రెండింటిచేత ఇరుసును, పండ్రెండవ బాణముచేత ఖరుని బాణముతో కూడిన ధనస్సును భేదించెను. మరల యుద్ధములో నవ్వుచున్నాడా అన్నట్లు, వజ్రముతో సమానమైన పదమూడవ బాణముతో ఖరుణ్ణి కొట్టెను.

మూ. ప్రభగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః,
గదాపాణిరవప్లుత్య తస్థౌ భూమౌ ఖరస్తదా. 32

ప్ర. అ. తదా = అప్పుడు, ప్రభగ్నధన్వా = విరిగిపోయిన ధనస్సు కల వాడు, విరథః = రథము లేనివాడు. హతాశ్వః = చంపబడిన అశ్వములు కల వాడు, హతసారథిః = చంపబడిన సారథి కలవాడు అయిన, ఖరః = ఖరుడు, గదాపాణిః = గద హస్తమునందు కలవాడై, అవప్లుత్య = క్రిందికి దుమికి, భూమౌ = నేలపై, తస్థౌ = నిలబడెను.

తా. ధనస్సు విరిగిపోయెను. రథము భగ్న మయ్యెను. గుఱ్ఱములు సారథి కూడ చచ్చెను. అపుడు ఆ ఖరుడు, చేతిలో గద ధరించి, రథమునుండి దుమికి నేలపై నిలచెను. 32

మూ. తత్కర్మ రామస్య మహారథస్య
సమేత్య దేవాశ్చ మహర్షయశ్చ,
అపూజయన్ ప్రాఞ్జలయః ప్రహృష్టా
స్తదా విమానాగ్రగతాః సమేతాః. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టావింశః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, దేవాశ్చ = దేవతలు, మహర్షయశ్చ = మహర్షులు, సమేతాః = కలసినవారై, విమానాగ్రగతాః = విమానాగ్రములందు ఉన్నవారై, సమేత్య = వచ్చి, ప్రహృష్టాః = సంతోషించినవారై, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్లు గలవారై, మహారథస్య = మహారథుడైన, రామస్య = రాముని యొక్క, తత్ కర్మ = ఆ పనిని, అపూజయన్ = పూజించిరి.

తా. దేవతలు, మహర్షులు కలిసి వచ్చి, విమానాగ్రములందు నిలచి, సంతోషించుచు, అంజలులు ఘటించి, మహారథుడైన రాముడు చేసిన ఆ కార్యమును ప్రశంసించిరి. 33

''బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఇరువది ఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనత్రింశః సర్గః

*[రాముడు ఖరుణ్ణి నిందించుట, ఖరుడు కూడ రాముణ్ణి నిందించి గదను ప్రయోగించుట; ఆ గదను రాముడు ఖండించుట]*

మూ. ఖరం తు విరథం రామో గదాపాణిమవస్థితమ్,
మృదుపూర్వం మహాతేజాః పరుషం వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, విరథమ్ = పోయిన రథము గల, గదాపాణిమ్ = గద హస్తమునందు గల, అవస్థితమ్ = నిలచి ఉన్న, ఖరమ్ = ఖరుణ్ణి గూర్చి, మృదుపూర్వమ్ = మృదువాక్యములు పూర్వమునందు కలుగునట్లుగా, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రథము నశించగా గద చేతిలో ధరించి నిలచి ఉన్న ఆ ఖరుణ్ణి చూచి మహాతేజఃశాలియైన రాముడు, పైకి మృదువుగా కనబడు పరుషవాక్యములను పలికెను. 1

మూ. గజాశ్వరథసంబాధే బలే మహతి తిష్ఠతా,
కృతం సుదారుణం కర్మ సర్వలోకజుగుప్సితమ్. 2

ప్ర. అ. గజాశ్వరథసంబాధే = గజములతోను, అశ్వములతోను, రథములతోను కిక్కిరిసి ఉన్న, మహతి = గొప్పదైన, బలే = సైన్యమునందు, తిష్ఠతా = ఉంటూన్న నీ చేత, సర్వలోకజుగుప్సితమ్ = అందరు జనుల చేతను అసహ్యించుకొనబడు, సుదారుణమ్ = చాల భయంకరమైన, కర్మ = కర్మ, కృతమ్ = చేయబడినది.

తా. నీవు గజ - అశ్వ - రథములతో నిండిన మహాసైన్యమునకు అధిపతివిగా ఉండి లోకు లందరూ నిందించే, చాల భయంకరమైన పని చేసితివి. 2

మూ. ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్,
త్రయాణామపి లోకానామీశ్వరోఽపి న తిష్ఠతి. 3

ప్ర. అ. భూతానామ్=ప్రాణులకు, ఉద్వేజనీయః=దుఃఖము కలిగించువాడు, పాపకర్మకృత్=పాపకర్మలు చేయువాడు అయిన, నృశంసః=క్రూరుడు, త్రయాణామ్=మూడు, లోకానామ్=లోకములకు, ఈశ్వరోఽపి=ప్రభువైనను, న తిష్ఠతి=నిలువడు.

తా. ప్రాణులందరికి భయము కలిగించుచు, పాపకర్మలు ఆచరించు క్రూరుడు, మూడు లోకాలకు ప్రభువే అయినను చాల కాలము సుఖముగా జీవించజాలడు. 3

మూ. కర్మ లోకవిరుద్ధం తు కుర్వాణం క్షణదాచర,
తీక్ష్ణం సర్వజనో హన్తి సర్పం దుష్టమివాగతమ్. 4

ప్ర. అ. క్షణదాచర=రాక్షసుడా! లోకవిరుద్ధమ్=లోకమునకు విరుద్ధమైన, కర్మ=కర్మను, కుర్వాణమ్=చేయుచున్న, తీక్ష్ణమ్=క్రూరుణ్ణి, సర్వజనః=సకలజనము, ఆగతమ్=వచ్చిన, దుష్టమ్=దుష్టమైన, సర్పమివ=సర్పమును వలె, హన్తి=చంపివేయును.

తా. ఓ! రాక్షసుడా! లోకమునకు విరుద్ధముగా ఉన్న కర్మను చేయు క్రూరాత్ముణ్ణి, జనులు, తమ దగ్గరకు వచ్చిన దుష్టసర్పమును చంపివేసినట్లు చంపివేయుదురు. 4

మూ. లోభాత్పాపాని కుర్వాణః కామాద్వా యో న బుధ్యతే,
భ్రష్టః పశ్యతి తస్యాన్తం బ్రాహ్మణీ కరకాదివ. 5

ప్ర. అ. లోభాత్=దురాశవలనగాని, కామాద్వా=కామమువలనగాని, యః=ఎవడు, పాపాని=పాపములను, కుర్వాణః=చేయుచు, న బుధ్యతే=తెలుసుకొనడో, అతడు, భ్రష్టః=భ్రష్టుడై, కరకాత్=వడగల్లును తిన్న, బ్రాహ్మణీవ=నలికెల్లపాము వలె, తస్య=చేసినదానియొక్క, అన్తమ్=ఫలమును, పశ్యతి=చూచును.

తా. దురాశవలన గాని, కామమువలన గాని పాపములు చేయుచు తన

తప్పిదమును గ్రహించనివాడు, భ్రష్టుడై వడగల్లు తిన్న నలికెళ్లపాము వలె, తను చేసిన పని ఫలమును అనుభవించును.

వి. వడగళ్లవాన కురిసి నపుడు ఆ జలఘనమును నలికెళ్లపాము తిన్నచో అది చచ్చిపోవు నను ప్రసిద్ధి యున్న దని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ప్రాచ్యపాఠ ములో ఉత్తరార్ధము "భ్రష్టః పశ్యతి దుఃఖం స బ్రాహ్మణః పరవానివ"అని ఉన్నది. "పరాధీనుడైన, అనగా సేవావృత్తిలో ఉన్న బ్రాహ్మణుడు వలె భ్రష్టుడై అతడు దుఃఖము పొందును"అని దాని భావము. ఈ పాఠము బాగున్నది. పై పాఠములో 'తస్య' అనేదానికి పాపశబ్దముతో (పాపానామ్) సంబంధము కుదరదు గాన "చేసిన ఆ పనియొక్క"అనే అర్థం కల్పించవలసిఉన్నది. సేవావృత్తిలో ఉన్న బ్రాహ్మణుడు కూడ పాపాచరణముచేత భ్రష్టు డగును గాన ఆతనిని ఉపమాన ముగా చెప్పుట యుక్తముగా ఉన్నది. 5

మూ. వసతో దణ్డకారణ్యే తాపసాన్ ధర్మచారిణః,
కిం ను హత్వా మహాభాగాన్ ఫలం ప్రాప్స్యసి రాక్షస.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడా ! దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, వసతః = నివసించుచున్న, ధర్మచారిణః = ధర్మములను ఆచరించు, మహాభాగాన్ = గొప్ప పుణ్యాత్ములైన, తాపసాన్ = మునులను, హత్వా = చంపి, కిం ను = ఏమి, ఫలమ్ = ఫలమును, ప్రాప్స్యసి = పొందగలవు.

తా. రాక్షసా ! దండకారణ్యములో నివసించి ధర్మము నాచరించుచున్న, పుణ్యాత్ములైన మునులను చంపుటచే నీకు ఏమి ప్రయోజనము లభించును? 6

మూ. న చిరం పాపకర్మాణః క్రూరా లోకజుగుప్సితాః,
ఐశ్వర్యం ప్రాప్య తిష్ఠన్తి శీర్ణమూలా ఇవ ద్రుమాః. 7

ప్ర. అ. పాపకర్మాణః = పాపమైన కర్మ గల, లోకజుగుప్సితాః = లోక ములో నిందితులైన, క్రూరాః = క్రూరులు, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును, ప్రాప్య = పొంది, శీర్ణమూలాః = శిథిలమైన మొదళ్ళు గల, ద్రుమాః ఇవ = వృక్షములు వలె, చిరమ్ = చిరకాలము, న తిష్ఠన్తి = ఉండజాలరు.

తా. లోకములో అందరిచేత నిందింపబడే పాపాత్ములైన క్రూరులకు ఐశ్వ

ర్యము లభించినను, వాళ్లు, మొదళ్లు బులికిపోయిన చెట్ల వలె చాలకాలము నిలవ జాలరు. 7

మూ. అవశ్యం లభతే జన్తుః ఫలం పాపస్య కర్మణః,
ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్పమివార్తవమ్. 8

ప్ర. అ. కాలే = తగినసమయము, పర్యాగతే = వచ్చిన దగుచుండగా, జన్తుః = ప్రాణి, పాపస్య = పాపమైన, కర్మణః = కర్మయొక్క, ఘోరమ్ = భయంకరమైన, ఫలమ్ = ఫలమును, ద్రుమాః = వృక్షములు, ఆర్తవమ్ = ఋతువుకు సంబంధించిన, పుష్పమివ = పుష్పమును వలె, అవశ్యమ్ = తప్పక, లభతే = పొందును.

తా. ప్రతి ప్రాణీ కూడ, సమయము వచ్చినపుడు, భయంకరమైన పాపకర్మఫలమును, ఆ యా ఋతువులు వచ్చి నప్పుడు వృక్షములు పుష్పములను పొంది నట్లు, తప్పక పొందును. 8

మూ. నచిరాత్ప్రాప్యతే లోకే పాపానాం కర్మణాం ఫలమ్,
సవిషాణామివాన్నానాం భుక్తానాం క్షణదాచర. 9

ప్ర. అ. క్షణదాచర = ఓ! రాక్షసుడా! లోకే = లోకమునందు, పాపానామ్ = పాపములైన, కర్మణామ్ = కర్మలయొక్క, ఫలమ్ = ఫలము, భుక్తానామ్ = తినబడిన, సవిషాణామ్ = విషముతో కూడిన, అన్నానామివ = అన్నముల ఫలము వలె, నచిరాత్ = అచిరకాలములో, ప్రాప్యతే = పొందబడును.

తా. రాక్షసుడా! లోకములో పాపకర్మల ఫలము, భుజించిన విషము కలిసిన పదార్థముల ఫలము వలె, అచిరకాలములోనే లభించును. 9

మూ. పాపమాచరతాం ఘోరం లోకస్యాప్రియమిచ్ఛతామ్,
అహమాసాదితో రాజా ప్రాణాన్ హన్తుం నిశాచర. 10

ప్ర. అ. నిశాచర = రాక్షసుడా! ఘోరమ్ = భయంకరమైన, పాపమ్ = పాపమును, ఆచరతామ్ = ఆచరించుచున్నవారియొక్క, లోకస్య = లోకమునకు, అప్రియమ్ = అప్రియమును, ఇచ్ఛతామ్ = కోరుచున్నవారియొక్క, ప్రాణాన్ =

ప్రాణములను, హన్తుమ్ = చంపుటకు, రాజా = రాజైన, అహమ్ = నేను, ఆసాదితః = పొందబడితిని.

తా. ఘోరమైన పాపమును ఆచరించేవారి ప్రాణములను, లోకమునకు అప్రియము చేయ గోరువారి ప్రాణములను నశింపచేయుటకై రాజునైన నన్ను (మునులు మొదలైనవారు) చేరిరి. 10

మూ. అద్య హి త్వా మయా ముక్తాః శరాః కాఞ్చనభూషణాః,
విదార్యాతిపతిష్యన్తి వల్మీకమివ పన్నగాః. 11

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మయా = నాచేత, ముక్తాః = విడువబడిన, కాఞ్చనభూషణాః = బంగారు అలంకారములు గల, శరాః = బాణములు, పన్నగాః = సర్పములు, వల్మీకమివ = పుట్టను వలె, త్వా = నిన్ను, విదార్య = చీల్చి, అతిపతిష్యన్తి = పైకి పోగలవు.

తా. ఇప్పుడు నేను ప్రయోగించు బంగారు అలంకారములు గల బాణములు, సర్పములు పుట్టను చీల్చి నట్లు నిన్ను చీల్చి, బైటకు వెళ్లగలవు. 11

మూ. యే త్వయా దణ్డకారణ్యే భక్షితా ధర్మచారిణః,
తానద్య నిహతః సంఖ్యే ససైన్యోఽనుగమిష్యసి. 12

ప్ర. అ. త్వయా = నీచేత, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, యే = ఏ, ధర్మచారిణః = ధర్మమును ఆచరించు మునులు, భక్షితాః = భక్షింపబడినారో, తాన్ = వాళ్లను, అద్య = నేడు, సంఖ్యే = యుద్ధమునందు, నిహతః = చంపబడినవాడవై, ససైన్యః = సైన్యసహితుడవై, అనుగమిష్యసి = అనుసరించగలవు.

తా. ఇప్పుడు నాచేత యుద్ధములో చంపబడిన నీవు, సైన్యసమేతుడవై, ఇంతవరకు నీవు దండకారణ్యములో ఏ మునులను భక్షించినావో వారిని అనుసరించి వెళ్లగలవు. 12

మూ. అద్య త్వాం నిహతం బాణైః పశ్యన్తు పరమర్షయః,
నిరయస్థం విమానస్థా యే త్వయా హింసితాః పురా. 13

ప్ర. అ. పురా = పూర్వము, త్వయా = నీచేత, యే = ఎవరు, హింసితాః =

చంపబడినారో, అట్టి, పరమర్షయః = మహర్షులు, విమానస్థాః = విమానములలో ఉన్నవారై, అద్య = ఇప్పుడు, బాణైః = బాణములచేత, నిహతమ్=చంపబడిన, నిరయస్థమ్ = నరకములో ఉన్న, త్వామ్ = నిన్ను, పశ్యన్తు = చూచెదరుగాక.

తా. పూర్వము నీవు హింసించిన ముని లందరూ విమానములపై ఎక్కి, ఇపుడు బాణములచేత చంపబడి నరకములో ఉన్న నిన్ను చూచెదరుగాక. 13

మూ. ప్రహర త్వం యథాకామం కురు యత్నం కులాధమ,
అద్య తే పాతయిష్యామి శిరస్తాలఫలం యథా. 14

ప్ర. అ. కులాధమ = కులమునందు అధముడా ! త్వమ్ = నీవు, యథా కామమ్ = నీకు ఇష్టము వచ్చి నట్లు, ప్రహర=కొట్టుము. యత్నమ్=ప్రయత్నమును, కురు = చేయుము. అద్య = ఇప్పుడు, తే=నీయొక్క, శిరః=శిరస్సును, తాళఫలం యథా = తాటిపండును వలె, పాతయిష్యామి = పడగొట్టెదను.

తా. కులపాంసనుడా ! నీకు ఇష్టము వచ్చి నట్లు నన్ను కొట్టుము. ప్రయత్నము చేయుము. ఇప్పుడు నీ శిరస్సును తాటిపండును వలె క్రింద పడ వేసెదను. 14

మూ. ఏవముక్తస్తు రామేణ ఖరః సంరక్తలోచనః,
ప్రత్యువాచ తతో రామం ప్రహసన్ క్రోధమూర్ఛితః.15

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ఖరః = ఖరుడు, సంరక్తలోచనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, తతః = పిమ్మట, ప్రహసన్ = నవ్వుచు, క్రోధమూర్ఛితః = క్రోధముచేత ఆవహింపబడినవాడై, రామమ్ = రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగిపలికెను.

తా. రాముని మాటలు విన్న ఖరుడు ఎఱ్ఱబడిన నేత్రములు కలవాడై, క్రోధావేశముతో నవ్వుచు రామునితో ఇట్లు పలికెను. 15

మూ. ప్రాకృతాన్ రాక్షసాన్ హత్వా యుద్ధే దశరథాత్మజ,
ఆత్మనా కథమాత్మానమప్రశస్యం ప్రశంససి. 16

ప్ర. అ. దశరథాత్మజ=రామా! యుద్ధే=యుద్ధమునందు, ప్రాకృతాన్=

సామాన్యులైన, రాక్షసాన్ = రాక్షసులను, హత్వా = చంపి, అప్రశస్యమ్ = ప్రశంసింప తగని, ఆత్మానమ్ = తనను గూర్చి, ఆత్మనా = స్వయముగానే, కథమ్ = ఎట్లు, ప్రశంససి = ప్రశంసించుచున్నావు ?

తా. రామా ! యుద్ధములో సామాన్యులైన రాక్షసులను చంపి, ప్రశంసకు అనర్హుడ వైన నిన్ను నీవే ఎందుకు ప్రశంసించుకొనుచున్నావు ? 16

మూ. విక్రాన్తా బలవన్తో వా యే భవన్తి నరర్షభాః,
కథయన్తి న తే కించిత్తేజసా స్వేన గర్వితాః. 17

ప్ర. అ. యే = ఏ, నరర్షభాః = నరశ్రేష్ఠులు, విక్రాన్తాః = పరాక్రమము కలవారు గాని, బలవన్తో వా = బలవంతులు గాని, భవన్తి = అగుదురో, తే = వాళ్ళు, స్వేన = తమ సంబంధమైన, తేజసా = తేజస్సుచేత, గర్వితాః = గర్వించిన వారై, కించిత్ = ఏమియు, న కథయన్తి = చెప్పరు.

తా. పరాక్రమవంతులు, బలశాలులు అయిన నరశ్రేష్ఠులు తమ ప్రభావమునకు గర్వించరు ; ఏమీ మాటలాడరు. 17

మూ. ప్రాకృతాస్త్వకృతాత్మానో లోకే క్షత్రియపాంసనాః,
నిరర్థకం వికత్థన్తే యథా రామ వికత్థసే. 18

ప్ర. అ. రామ = రామా ! లోకే = లోకమునందు, అకృతాత్మానః = వినయము లేని బుద్ధులు గల, ప్రాకృతాస్తు = సామాన్యులైన, క్షత్రియపాంసనాః = క్షత్రియాధము లైతే, యథా = ఎట్లు, వికత్థసే = బడాయి చెప్పుకొనుచున్నావో, అట్లే, నిరర్థకమ్ = వ్యర్థముగా, వికత్థన్తే = విఱ్ఱవీగుచుందురు.

తా. వినయము లేని సామాన్యు లైన క్షత్రియాధములు మాత్రము, నీ విపుడు ఎట్లు బడాయిలు చెప్పుకొనుచున్నావో, అట్లే బడాయిలు చెప్పుకొనుచుందురు. 18

మూ. కులం వ్యపదిశన్వీరః సమరే కోఽభిధాస్యతి,
మృత్యుకాలే హి సంప్రాప్తే స్వయమప్రస్తవే స్తవమ్. 19

ప్ర. అ. మృత్యుకాలే = మరణసమయము, సంప్రాప్తే = వచ్చియుండగా,

వీరః = వీరుడైన, కః = ఎవ్వడు, సమరే = యుద్ధమునందు, కులమ్ = కులమును, వ్యపదిశన్ = చెప్పుకొనుచు, అప్రస్తవే = ప్రస్తుతము కాని సమయమునందు, స్వయమ్ = స్వయముగా, స్తవమ్ = స్తోత్రమును, అభిధాస్యతి = చెప్పగలడు ?

తా. వీరుడైన వా డెవ్వడైనా, యుద్ధములో మృత్యుసమయము ఆసన్నమైనపుడు, తన కులమును గూర్చి చెప్పుకొనుచు, సమయము కాని సమయమునందు తన్ను తానే పొగడుకొనునా ! 19

మూ. సర్వథైవ లఘుత్వం తే కత్థనేన విదర్శితమ్,
సువర్ణప్రతిరూపేణ తప్తేనేవ కుశాగ్నినా. 20

ప్ర. అ. కత్థనేన = పొగడుకొనుటచేత, (నీచేత), తప్తేన = కాల్చబడిన, సువర్ణప్రతిరూపేణ = బంగారము వంటి రూపముగల, కుశాగ్నినా ఇవ = దర్భాగ్ని చేత వలె, సర్వథైవ = అన్ని విధముల, తే = నీయొక్క, లఘుత్వమ్ = లఘుత్వము, విదర్శితమ్ = చూపబడినది.

తా. దర్భను కాల్చగా ఆ దర్భ బంగారము వలె ఉన్నను ఎట్లు నిస్సారమో, అట్లే నీవు, బడాయి చెప్పుకొనుచు, అన్ని విధాల నీ తేలిక స్వభావమును చూపినావు ! 20

మూ. నను మామిహ తిష్ఠన్తం పశ్యసి త్వం గదాధరమ్,
ధరాధరమివాకమ్ప్యం పర్వతం ధాతుభిశ్చితమ్. 21

ప్ర. అ. త్వమ్ = నీవు, గదాధరమ్ = గదను ధరించిన వాడను, ఇహ = ఇక్కడ, తిష్ఠన్తమ్ = నిలచి ఉన్నవాడను, ధాతుభిః = ధాతువులచే, చితమ్ = వ్యాప్తమైన, పర్వతమ్ = కణుపులు గల, ధరాధరమివ = పర్వతము వలె, అకమ్ప్యమ్ = కదల్చ శక్యముకానివాడను అయిన, మామ్ = నన్ను, పశ్యసినను = చూచుచున్నావు కదా !

తా. గద ధరించి, ధాతువులచేత వ్యాప్తమైన, దృఢములైన పర్వములు (కణుపులు)గల పర్వతము వలె, కదల్ప శక్యము కాని, ఇక్కడ నిలచి ఉన్న నన్ను చూచుచున్నావు కదా? 21

మూ. పర్యాప్తోఽహం గదాపాణిర్హన్తుం ప్రాణాన్ రణే తవ,
త్రయాణామపి లోకానాం పాశహస్త ఇవాన్తకః. 22

ప్ర. అ. పాశహస్తః=పాశము హస్తమునందు గల, అన్తకః=యముడు, త్రయాణామ్ = మూడు, లోకానామపి ఇవ = లోకముల ప్రాణములను వలె, రణే = యుద్ధమునందు, తవ = నీయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, హన్తుమ్= చంపుటకు, గదాపాణిః = గద హస్తమునందు గల, అహమ్ = నేను, పర్యాప్తః = చాలినవాడను.

తా. పాశమును హస్తమునందు ధరించిన యముడు ఏ విధముగా మూడు లోకముల ప్రాణములను హరింప సమర్థుడో అట్లే గద ధరించిన నేను నీ ప్రాణములు తీయుటకు సమర్థుడను. 22

మూ. కామం బహ్వపి వక్తవ్యం త్వయి వక్ష్యామి న త్వహమ్,
అస్తం గచ్ఛేద్ధి సవితా యుద్ధవిఘ్నస్తతో భవేత్. 23

ప్ర. అ. త్వయి = నీ విషయమునందు, బహు = చాలా, వక్తవ్యమపి కామమ్ = తప్పక చెప్పదగి యున్నది. తు = కాని, అహమ్=నేను, న వక్ష్యామి = చెప్పను. సవితా = సూర్యుడు, అస్తం గచ్ఛేత్ = అస్తమించును. తతః = అప్పుడు, యుద్ధవిఘ్నః = యుద్ధమునకు విఘ్నము, భవేత్ = అగును.

తా. నీ విషయములో కూడ చాల చెప్పవలసి ఉన్నది కాని నే నేమీ చెప్పను. ఎందుచేత ననగా సూర్యుడు అస్తమించినచో యుద్ధానికి విఘ్నము వచ్చును. 23

మూ. చతుర్దశ సహస్రాణి రాక్షసానాం హతాని తే,
త్వద్వినాశాత్కరోమ్యేష తేషామశ్రుప్రమార్జనమ్. 24

ప్ర అ. తే = నీకు(నీచేత), రాక్షసానామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = సహస్రములు, హతాని = చంపబడినవి, ఏషః = ఈ నేను, త్వద్వినాశాత్ = నిన్ను చంపుటవలన, తేషామ్ = వాళ్లయొక్క, అశ్రుప్రమార్జనమ్ = కన్నీళ్ళు తుడుచుటను, కరోమి = చేసెదను.

తా. నీవు పదునాలుగువేలమంది రాక్షసులను చంపితివి కదా. నే నిపుడు నిన్ను చంపి వాళ్ల (బంధువుల) కన్నీరు తుడిచెదను. 24

మూ. ఇత్యుక్త్వా పరమక్రుద్ధస్తాం గదాం పరమాఙ్గదః,
ఖరశ్చిక్షేప రామాయ ప్రదీప్తామశనిం యథా. 25

ప్ర. అ. పరమాఙ్గదః=శ్రేష్ఠము లైన బాహుపురులు గల, ఖరః=ఖరుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, ప్రదీప్తామ్=ప్రజ్వలించుచున్న, అశనిం యథా=వజ్రాయుధము వలె ఉన్న, తాం గదామ్=ఆ గదను, రామాయ=రామునకై, చిక్షేప=విసరెను.

తా. శ్రేష్ఠములైన బాహుపురులు ధరించి ఉన్న ఆ ఖరుడు ఇట్లు పలికి, చాలా కోపించినవాడై, ప్రజ్వలించుచున్న వజ్రాయుధము వలె ఉన్న ఆ గదను రామునిపైకి విసరెను. 25

మూ. ఖరబాహుప్రయుక్తా సా ప్రదీప్తా మహతీ గదా,
భస్మవృక్షాంశ్చ గుల్మాంశ్చ కృత్వాగాత్తత్సమీపతః. 26

ప్ర. అ. ఖరబాహుప్రయుక్తా=ఖరుని బాహువులచేత ప్రయోగింపబడిన, ప్రదీప్తా=ప్రజ్వలించుచున్న, మహతీ=గొప్పదైన, గదా=గద, వృక్షాంశ్చ=వృక్షములను, గుల్మాంశ్చ=పొదలను, భస్మ=భస్మగా, కృత్వా=చేసి, తత్సమీపతః=ఆతని సమీపమునుండి, అగాత్=వెళ్లెను.

తా. ఖరుడు తన బాహువులతో ప్రయోగించిన, ఆ గొప్ప గద, మండుచు వృక్షములను, పొదలను భస్మము చేయుచు ఆతని వద్దనుండి రామునిమీదికి వెళ్ళెను. 26

మూ. తామాపతన్తీం జ్వలితాం మృత్యుపాశోపమాం గదామ్,
అన్తరిక్షగతాం రామశ్చిచ్ఛేద బహుధా శరైః. 27

ప్ర. అ. ఆపతన్తీమ్=వచ్చి పడుచున్నది, జ్వలితామ్=మండుచున్నది, మృత్యుపాశోపమామ్=మృత్యుపాశముతో సమానమూ అయిన, తాం గదామ్=ఆ గదను, అన్తరిక్షగతామ్=ఆకాశములో ఉండగానే, రామః=రాముడు, శరైః=బాణములచేత, బహుధా=అనేక విధములుగ, చిచ్ఛేద=ఛేదించెను.

తా. మండుచు, మృత్యుపాశము వలె వచ్చి మీద పడుచున్న ఆ గదను, రాముడు, అది ఆకాశములో ఉండగానే, బాణములతో చాల ముక్కలుగా ఖండించెను. 27

మూ. సా వికీర్ణా శరైర్భగ్నా పపాత ధరణీతలే,
గదా మన్త్రౌషధబలైర్వ్యాళీవ వినిపాతితా. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. శరైః = బాణములచేత, భగ్నా = విరగగొట్టబడిన, సా గదా = ఆ గద, మన్త్రౌషధబలైః = మంత్రౌషధముల బలములచేత, వినిపాతితా = పడగొట్టబడిన, వ్యాళీవ = ఆడ సర్పము వలె, వికీర్ణా = (ముక్కముక్కలుగా) చిమ్మబడినదై, ధరణీతలే = నేలమీద, పపాత = పడెను.

తా. బాణములచేత విరగగొట్టబడిన ఆ గద, మంత్రౌషధముల బలముచేత పడగొట్టబడిన ఆడ సర్పము వలె, ముక్కముక్కలుగా చిమ్మబడినదై నేలమీద పడెను. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఇరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ త్రింశః సర్గః

[రాముడు పరుషముగా మాటలాడగా ఖరుడు మరల రామునితో పరుషముగా మాటలాడి మద్దె చెట్టును విసరగా రాముడు దానిని ఖండించి ఖరుణ్ణి సంహరించుట. దేవతలు మునులు రాముణ్ణి స్తుతించుట].

మూ. భిత్త్వా తు తాం గదాం బాణై రాఘవో ధర్మవత్సలః,
స్మయమానః ఖరం వాక్యం సంరబ్ధమిదమబ్రవీత్. 1

ప్ర. అ. ధర్మవత్సలః=ధర్మమునందు ఆసక్తి గల, రాఘవః=రాముడు, తాం గదామ్ = ఆ గదను, బాణైః=బాణములచేత, భిత్త్వా = విరుగగొట్టి, స్మయమానః = నవ్వుచు, సంరబ్ధమ్ = భ్రాంతిచెందిన, ఖరమ్ = ఖరుణ్ణిగూర్చి, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మమునందు ఆసక్తి గల రాముడు, బాణములచేత ఆ గదను విరుగగొట్టి, నవ్వుచు, నివ్వెరబోయిన ఆ ఖరునితో ఇట్లు పలికెను. 1

మూ. ఏతత్తే బలసర్వస్వం దర్శితం రాక్షసాధమ,
శక్తిహీనతరో మత్తో వృథా త్వమవగర్జసి. 2

ప్ర. అ. రాక్షసాధమ = ఓ ! రాక్షసాధమా ! తే = నీయొక్క, ఏతత్ = ఈ, బలసర్వస్వమ్ = బలముయొక్క సర్వస్వము (సమస్తధనము), దర్శితమ్= చూపబడినది. మత్తః = నాకంటె, శక్తిహీనతరః = చాలా శక్తివిహీనుడవైన, త్వమ్ = నీవు, వృథా = వ్యర్థముగా, అవగర్జసి = గర్జించుచున్నావు.

తా. రాక్షసాధమా! నీ కున్న బలము నంతా చూపించినావు! నీవు నాకంటె చాలా శక్తిహీనుడవు. అయినను వ్యర్థముగా గర్జించుచున్నావు. 2

మూ. ఏషా బాణవినిర్భిన్నా గదా భూమితలం గతా,
అభిధానప్రగల్భస్య తవ ప్రత్యయఘాతినీ. 3

ప్ర. అ. ఏషా = ఈ, గదా = గద, బాణవినిర్భిన్నా = బాణములచేత విరగగొట్టబడినదై, అభిధానప్రగల్భస్య = మాటలలో ప్రగల్భుడ వైన, తవ = నీయొక్క, ప్రత్యయఘాతినీ = నమ్మకమును వమ్ముచేసినదై, భూమితలమ్ = భూమిని, గతా = పొందినది.

తా. ఈ గద బాణములచేత బ్రద్దలుకొట్టబడినదై, మాటలలో ప్రగల్భుడ వైన నీ నమ్మకమును వమ్ముచేసి, నేలమీద పడిపోయినది. 3

మూ. యత్త్వయోక్తం వినష్టానామహమశ్రుప్రమార్జనమ్,
రాక్షసానాం కరోమీతి మిథ్యా తదపి తే వచః. 4

ప్ర. అ. అహమ్ = నేను, వినష్టానామ్ = మరణించిన, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, అశ్రుప్రమార్జనమ్ = కన్నీళ్లు తుడుచుటను, కరోమీతి = చేసెదను అని, త్వయా = నీచేత, యత్ = ఏ వచనము, ఉక్తమ్ = పలకబడినదో, తే = నీయొక్క, తత్ = ఆ, వచః అపి = వచనము కూడ, మిథ్యా = అసత్యమే.

తా. "నేను వెళ్ళి మరణించిన రాక్షసుల కన్నీళ్ళు తుడిచెదను"అని నీవు పలికిన మాట కూడ అసత్యమే కాగలదు. 4

మూ. నీచస్య క్షుద్రశీలస్య మిథ్యావృత్తస్య రక్షసః,
ప్రాణానహం హరిష్యామి గరుత్మానమృతం యథా. 5

ప్ర. అ. నీచస్య = నీచుడవు, క్షుద్రశీలస్య = దుష్టస్వభావము కలవాడవు, మిథ్యావృత్తస్య = చెడ్డ ప్రవృత్తి కలవాడవు, రక్షసః = రాక్షసుడవు అయిన నీయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, అహమ్ = నేను, గరుత్మాన్ = గరుత్మంతుడు, అమృతం యథా = అమృతమును వలె, హరిష్యామి = హరించగలను.

తా. నీవు నీచుడవు. దుష్టస్వభావము కలవాడవు, చెడ్డ నడవడిక కల రాక్షసుడవు. అట్టి నీ ప్రాణములను, గరుత్మంతుడు అమృతమును హరించి నట్లు హరించగలను. 5

మూ. అద్య తే భిన్నకణ్ఠస్య ఫేనబుద్బుదభూషితమ్,
విదారితస్య మద్బాణైర్మహీ పాస్యతి శోణితమ్. 6

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మద్బాణైః = నా బాణములచేత, విదారితస్య = చీల్చివేయబడిన, ఛిన్నకణ్ఠస్య = ఛేదించబడిన కంఠము గల, తే = నీయొక్క, ఫేనబుద్బుదభూషితమ్ = నురుగుచేతను, బుడగలచేతను అలంకరించబడిన, శోణితమ్ = రక్తమును, మహీ = భూమి, పాస్యతి = త్రాగగలదు.

తా. ఇప్పుడు నా బాణములచే చీల్చబడి, కంఠము తెగి పడిపోయెదవు. నురుగుచేత, బుడగలచేత అలంకరింపబడిన నీ రక్తమును భూమి త్రాగగలదు. 6

మూ. పాంసురూషితసర్వాఙ్గః స్రస్తన్యస్తభుజద్వయః,
స్వప్స్యసే గాం సమాలిఙ్గ్య దుర్లభాం ప్రమదామివ. 7

ప్ర. అ. పాంసురూషితసర్వాఙ్గః = పరాగములచేత పూయబడిన సకల దేహము కలవాడవై, స్రస్తన్యస్తభుజద్వయః = జారిపోవునట్లు పడవేయబడిన రెండు భుజములు కలవాడవై, దుర్లభామ్ = పొందుటకు శక్యము కాని, ప్రమదామివ = యువతిని వలె, గామ్ = భూమిని, సమాలిఙ్గ్య = కౌగలించుకొని, స్వప్స్యసే = నిద్రించగలవు.

తా. దేహమంతా పరాగము పూసికొని, చేతులు రెండూ జారవిడచి, అతి కష్టముమీద లభించిన యువతిని వలె, భూమిని కౌగలించుకొని నిద్రించగలవు.

మూ. ప్రబద్ధనిద్రే శయితే త్వయి రాక్షసపాంసనే,
భవిష్యన్తి శరణ్యానాం శరణ్యా దణ్డకా ఇమే. 8

ప్ర. అ. రాక్షసపాంసనే = రాక్షసాధముడవైన, త్వయి = నీవు, ప్రబద్ధనిద్రే = కట్టబడిన నిద్ర గలవాడవై, శయితే = శయనించగా, ఇమే = ఈ, దణ్డకాః = దండకారణ్యములు, శరణ్యానామ్ = శరణు పొందదగిన ఋషుల, శరణ్యాః = రక్షకములుగా, భవిష్యన్తి = కాగలవు.

తా. రాక్షసాధముడవైన నీవు దీర్ఘనిద్ర వహించి శయనించిన పిమ్మట ఈ దండకారణ్యము, సర్వరక్షణసమర్థులైన మునులకు ఆశ్రయము కాగలదు. 8

మూ. జనస్థానే హతస్థానే తవ రాక్షస మచ్ఛరైః,
నిర్భయా విచరిష్యన్తి సర్వతో మునయో వనే. 9

తా. రాక్షస = ఓ! రాక్షసుడా! తవ = నీయొక్క, జనస్థానే=జనస్థానము, మచ్ఛరైః = నా బాణములచేత, హతస్థానే = కొట్టబడిన రాక్షస నివాసము కల దగుచుండగా, మునయః = మునులు, నిర్భయాః = భయము లేనివారై, సర్వత్ర = అంతటా, వనే = వనమునందు, విచరిష్యన్తి=సంచరించగలరు.

తా. ఓ రాక్షసుడా ! నీ జనస్థానమునం దున్న రాక్షసనివాసముల నన్నింటిని నేను బాణములచేత నశింపచేసిన పిమ్మట మునులు ఈ వనమునందు అంతటా నిర్భయముగా సంచరించగలరు. 9

మూ. అద్య విప్రసరిష్యన్తి రాక్షస్యో హతబాన్ధవాః,
బాష్పార్ద్రవదనా దీనా భయాదన్యభయావహాః. 10

ప్ర. అ. అన్యభయావహాః=ఇతరులకు భయము కలిగించు, రాక్షస్యః= = రాక్షసస్త్రీలు, హతబాన్ధవాః = చంపబడిన బంధువులు గలవారై, బాష్పార్ద్ర వదనాః=కన్నీటితో తడిసిన ముఖములు కలవారై, భయాత్ = భయమువలన, దీనాః = దీనలై, అద్య = ఇప్పుడు, విప్రసరిష్యన్తి = పరుగెత్తెదరు.

తా. ఇంతవరకు ఇతరులకు భయము కలిగించే రాక్షసస్త్రీలు ఇప్పుడు బంధువులు మరణించుటచే కన్నీళ్లతో తడిసిన ముఖములతో, భయముచేత దీనలై పరుగెత్తగలరు. 10

మూ. అద్య శోకరసజ్ఞాస్తా భవిష్యన్తి నిరర్థకాః,
అనురూపకులాః పత్న్యో యాసాం త్వం పతిరీదృశః.

ప్ర. అ. యాసామ్ = ఏ స్త్రీలకు, ఈదృశః = ఇట్టివాడవైన, త్వమ్ = నీవు, పతిః = భర్తవో, అనురూపకులాః=నీకు తగిన కులమునందు పుట్టిన, తాః = ఆ, పత్న్యః = భార్యలు, అద్య=ఇప్పుడు, నిరర్థకాః=ప్రయోజనము లేని వారై , శోకరసజ్ఞాః=శోకము యొక్క రుచిని ఎరిగినవారు, భవిష్యన్తి=కాగలరు.

తా. నీకు తగిన కులములలో పుట్టి, ఇట్టి నిన్ను భర్తగా పొందిన నీ భార్య లందరు ఇపుడు తమ జీవితము ప్రయోజనరహిత మైపోవుటచేత దుఃఖము రుచిని తెలుసుకొనగలరు. 11

మూ. నృశంస నీచ క్షుద్రాత్మన్నిత్యం బ్రాహ్మణకణ్టక,
యత్కృతే శఙ్కితైరగ్నౌ మునిభిః పాత్యతే హవిః. 12

ప్ర. అ. నృశంశ = క్రూరుడా! నీచ = నీచుడా! క్షుద్రాత్మన్ = నీచబుద్ధి కలవాడా! నిత్యమ్ = ఎల్లప్పుడూ, బ్రాహ్మణకణ్టక = బ్రాహ్మణులకు కంటకమైన వాడా! యత్కృతే = ఏ నీ నిమిత్తమున, శఙ్కితైః = భయపడుచున్న, మునిభిః = మునులచేత, హవిః = హవిస్సు, అగ్నౌ = అగ్నియందు, పాత్యతే = వేయబడుచున్నదో.

తా. నీవు క్రూరుడవు. నీచుడవు. నీచబుద్ధివి. నిత్యము బ్రాహ్మణులను బాధించువాడవు. మునులు హవిస్సును అగ్నిలో హోమముచేయుచున్నప్పుడు నీకు భయపడుచున్నారు. 12

మూ. తమేవమభిసంరబ్ధం బ్రువాణం రాఘవం రణే,
ఖరో నిర్భర్త్సయామాస రోషాత్ఖరతరస్వరః. 13

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, రణే = యుద్ధమునందు, అభిసంరబ్ధమ్ = తొందరగా, బ్రువాణమ్ = పలుకుచున్న, తం రాఘవమ్ = ఆ రాముణ్ణి, రోషాత్ = రోషమువలన, ఖరతరస్వరః = అధికముగా పరుషమైన స్వరముగలవాడై, ఖరః = ఖరుడు, నిర్భర్త్సయామా స = భయపెట్టెను.

తా. యుద్ధరంగములో ఈ విధముగా కోపావేశముతో మాటలాడుచున్న ఆ రాముణ్ణి చూచి, ఖరుడు, కోపమువలన ఇంకను పరుషమైన స్వరముతో ఇట్లు బెదిరించెను. 13

మూ. దృఢం ఖల్వవలిప్తోఽసి భయేష్వపి చ నిర్భయః,
వాచ్యావాచ్యం తతో హి త్వం మృత్యువశ్యో న బుధ్యసే.

ప్ర. అ. భయేష్వపి = భయసమయములందు కూడ, నిర్భయః = భయము లేని, త్వమ్ = నీవు, దృఢమ్ = అధికముగా, అవలిప్తః అసి = గర్వించి ఉన్నావు. తతః = ఆ కారణములవలనే, మృత్యువశ్యః = మృత్యువునకు వశుడవైన నీవు, వాచ్యావాచ్యమ్ = చెప్పదగిన దానిని, చెప్పదగనిదానిని, న బుధ్యసే = తెలుసుకొనజాలకున్నావు.

తా. నీకు చాల గర్వము కలిగిన ట్లున్నది. భయపడవలసిన సమయములో కూడ భయపడుటలేదు. అందుచేతనే, మృత్యువుకు వశుడవైన నీవు ఏమి మాటలాడవలెనో, ఏమి మాటలాడకూడడో తెలిసికొనజాలకున్నావు. 14

మూ. కాలపాశపరిక్షిప్తా భవన్తి పురుషా హి యే,
కార్యాకార్యం న జానన్తి తే నిరస్తషడిన్ద్రియాః. 15

ప్ర. అ. యే పురుషాః=ఏ పురుషులు, కాలపాశపరిక్షిప్తాః=కాలపాశముచేత చుట్టబడినవారు, భవన్తి=అగుదురో, తే = వారు, నిరస్తషడిన్ద్రియాః = చెడిన ఆరు ఇంద్రియములు కలవారై (మనస్సుతో జ్ఞానేంద్రియాలు ఆరు), కార్యాకార్యమ్ = కార్యాకార్యములను, న జానన్తి = ఎరుగరు.

తా. కాలపాశముచే చుట్టబెట్టబడిన పురుషులు ఆరు ఇంద్రియములు సరిగా పనిచేయక ఏది చేయదగినదో, ఏది చేయదగనిదో తెలియజాలరు. 15

మూ. ఏవముక్త్వా తతో రామం సంరుధ్య భ్రుకుటీం తతః,
స దదర్శ మహాసాలమవిదూరే నిశాచరః, 16
రణే ప్రహరణస్యార్థే సర్వతో హ్యవలోకయన్.

ప్ర. అ. సః నిశాచరః = ఆ రాక్షసుడు, రామమ్ = రాముణ్ణి గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = అటుపిమ్మట, భ్రుకుటీమ్=భ్రుకుటిని, సంరుధ్య = కట్టి, రణే = యుద్ధమునందు, ప్రహరణస్య అర్థే = ఆయుధముకొరకై, సర్వతః=నలువైపుల, అవలోకయన్ = చూచుచు, అవిదూరే = సమీపమునందు, మహాసాలమ్ = గొప్ప సాలవృక్షమును, దదర్శ=చూచెను.

తా. ఖరుడు రామునితో ఇట్లు పలికి, కోపముతో కనుబొమ్మలు విరచి, యుద్ధములో ఆయుధము నిమిత్తము నలుమూలల వెదకుచు, సమీపమునందే గొప్ప సాలవృక్షమును చూచెను. 16

మూ. స తముత్పాటయామాస సందశ్య దశనచ్ఛదమ్, 17
తం సముత్క్షిప్య బాహుభ్యాం వినద్య చ మహాబలః,
రామముద్దిశ్య చిక్షేప హతస్త్వమితి చాబ్రవీత్. 18

ప్ర. అ. సః = అతడు, దశనచ్ఛదమ్ = అధరోష్ఠమును, సందశ్య = కరచి, తమ్ = ఆ వృక్షమును, ఉత్పాటయామాస = పెకిలించెను. మహాబలః = గొప్ప బలము గల ఆ ఖరుడు, తమ్ = దానిని, బాహుభ్యామ్ = బాహువులచేత, సముత్క్షిప్య = ఎత్తి, వినద్య = బిగ్గరగా అరచి, రామమ్ ఉద్దిశ్య = రాముణ్ణి ఉద్దేశించి, చిక్షేప = విసిరెను. త్వమ్ = నీవు, హతః = చంపబడితివి, ఇతి = అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. అతడు పెదవులు గట్టిగా బిగించి ఆ చెట్టును పెకిలించెను. మహా బలవంతుడైన ఆతడు దానిని రెండు చేతులతో ఎత్తి, బిగ్గరగా అరచుచు, రాముని పైకి విసిరి, "చచ్చినావు"అని అరచెను: 17, 18

మూ. తమాపతన్తం బాణౌఘైశ్ఛిత్త్వా రామః ప్రతాపవాన్,
రోషమాహారయత్తీవ్రం నిహన్తుం సమరే ఖరమ్. 19

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపము గల, రామః = రాముడు, ఆపతన్తమ్ = వచ్చిపడుచున్న, తమ్ = ఆ వృక్షమును, బాణౌఘైః = బాణసముదాయములచేత, ఛిత్త్వా = ఛేదించి, సమరే = యుద్ధమునందు, ఖరమ్ = ఖరుణ్ణి, నిహన్తుమ్ = చంపుటకు, తీవ్రమ్ = తీవ్రమైన, రోషమ్ = కోపమును, ఆహారయత్ = తెప్పించుకొనెను.

తా. ప్రతాపవంతుడైన రాముడు మీద పడుచున్న ఆ సాలవృక్షమును బాణసముదాయములచేత ఖండించి, యుద్ధములో ఖరుణ్ణి చంపుటకు తీవ్రమైన రోషమును తెప్పించుకొనెను. 19

మూ. జాతస్వేదస్తతో రామో రోషాద్రక్తాన్తలోచనః,
నిర్బిభేద సహస్రేణ బాణానాం సమరే ఖరమ్. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, జాతస్వేదః = పుట్టిన చెమట గలిగిన వాడు, రోషాత్ = రోషమువలన, రక్తాన్తలోచనః = ఎఱ్ఱనైన నేత్రాంతములు గల వాడు అయిన, రామః = రాముడు, బాణానామ్ = బాణముల యొక్క, సహస్రేణ = సహస్రముచేత, సమరే = యుద్ధమునందు, ఖరమ్ = ఖరుణ్ణి, నిర్బిభేద = భేదించెను.

తా. పిమ్మట బాగుగా చెమట పట్టి, రోషముతో ఎఱ్ఱనైన నేత్రాంతము

లతో ఉన్న రాముడు యుద్ధములో వేయి బాణములు ప్రయోగించి ఖరుని శరీరము బ్రద్దలుకొట్టెను. 20

మూ. తస్య బాణాన్తరాద్రక్తం బహు సుస్రావ ఫేనిలమ్,
గిరేః ప్రస్రవణస్యేవ తోయధారాపరిస్రవః. 21

ప్ర. అ. తస్య = ఆ ఖరునియొక్క, ఫేనిలమ్ = నురుగు గల, బహు = అత్యధికము అయిన, రక్తమ్ = రక్తము, బాణాన్తరాత్ = బాణముల రంధ్రముల నుండి, ప్రస్రవణస్య = ప్రస్రవణపర్వతము యొక్క, తోయధారాపరిస్రవః ఇవ = జలధారాస్రావము వలె, సుస్రావ = స్రవించెను.

తా. ఆతని శరీరముపై నాటిన బాణములు చేసిన రంధ్రములనుండి నురుగుతో కూడి అత్యధికమైన రక్తము, ప్రస్రవణపర్వతమునుండి జలధారాస్రావము వలె స్రవించెను. 21

మూ. విహ్వలః స కృతో బాణైః ఖరో రామేణ సంయుగే,
మత్తో రుధిరగన్ధేన తమేవాభ్యద్రవద్ద్రుతమ్. 22

ప్ర. అ. సంయుగే = యుద్ధమునందు, రామేణ = రామునిచేత, బాణైః = బాణములచేత; విహ్వలః = వ్యాకులుడుగా, కృతః = చేయబడిన, మత్తః = మదించిన, సః ఖరః = ఆ ఖరుడు, రుధిరగన్ధేన = రక్త దుర్గంధముతో, ద్రుతమ్ = శీఘ్రముగా, తం రామమేవ = ఆ రాముణ్ణే, అభ్యద్రవత్ = ఎదిరించి మీదికి పరుగెత్తెను.

తా. యుద్ధరంగమునందు రాముడు బాణములు ప్రయోగించి ఆ ఖరుణ్ణి చాల వ్యాకులుడగునట్లు చేసెను. మదించిన ఆ ఖరుడు, అప్పుడు, రక్తదుర్గంధముతో నిండి, ఆ రాముని మీదికి పరుగెత్తెను. 22

మూ. తమాపతన్తం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతమ్,
అపాసర్పద్ద్విత్రిపదం కించిత్త్వరితవిక్రమః. 23

ప్ర. అ. కృతాస్త్రః = చేయబడిన (నేర్వబడిన) అస్త్రములు గల, రామః = రాముడు, ఆపతన్తమ్ = వచ్చి మీద పడుచున్న, రుధిరాప్లుతమ్ = రక్తముచేత

పూయబడిన, సంరబ్ధమ్=కోపావేశముతో ఉన్న, తమ్=ఆతనిని(చూచి), త్వరిత విక్రమః = శీఘ్రమైన పాదవిన్యాసము గలవాడై, ద్వి(త్రి)పదమ్ = రెండు మూడు అడుగులు, కించిత్ = కొంచెము, అపాసర్పత్ = దూరముగా తొలగెను.

తా. కోపావేశముతో మీదికి వచ్చుచున్న, రక్తముతో తడిసిన ఆ ఖరుణ్ణి చూచి, అస్త్రములందు నిపుణుడైన ఆ రాముడు శీఘ్రముగ అడుగులు వేసి రెండు మూడు అడుగులు, కొంచెము దూరము తొలగెను.

వి. "ప్రతిపదమ్"అను వావిళ్ళప్రతి పాఠమునకు బదులు "ద్వి(త్రి)పదమ్" అను గోరఖ్‌పూర్ ప్రతి పాఠము గ్రహింపబడినది. "ప్రతిపదమ్"అనుదాని అర్థము స్పష్టముగా లేదు. 'ఎదురుమార్గముగా'అను అర్థము ఎట్లు వచ్చినదో తెలియదు. "ప్రతిపదమ్ = ప్రతి అడుగునందు, త్వరితవిక్రమః = శీఘ్రమైన పాదన్యాసము కలవాడై"అని చెప్పుట యుక్తము. ప్రాచ్యపాఠము వేరుగా ఉన్నది.

"తమాపతన్తం వేగేన దీప్తాస్యం రుధిరప్లుతమ్
అపసృత్య తతః స్థానాత్ దృష్ట్వా త్వరితవిక్రమః"

"ప్రజ్వలించుచున్న ముఖముతో వేగముగా మీదికి వచ్చుచున్న, రక్తముతో నిండిన వానిని చూచి తొందరగా అడుగులు వేసి ఆ స్థానమునుండి తొలగి......" అని అర్థము. 23

మూ. తతః పావకసంకాశం వధాయ సమరే శరమ్,
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదణ్డమివాపరమ్. 24

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, ఖరస్య = ఖరుని యొక్క, వధాయ = వధకొరకు, పావకసంకాశమ్ = అగ్నితో సమానమూ, అపరమ్ = రెండవ, బ్రహ్మదణ్డమివ = బ్రహ్మదండము వలె ఉన్నదీ అయిన, శరమ్ = బాణమును, సమరే = యుద్ధమునందు, జగ్రాహ = గ్రహించెను.

తా. పిమ్మట రాముడు, యుద్ధములో, ఖరుణ్ణి సంహరించుటకై అగ్నితో సమానము, రెండవ బ్రహ్మదండము వలె ఉన్నదీ అయిన శరమును గ్రహించెను.

మూ. స తం దత్తం మఘవతా సురరాజేన ధీమతా,
సందధే చాపి ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి. 25

24)

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆ రాముడు, ధీమతా = బుద్ధిమంతుడు, మఘవతా = ఐశ్వర్యసంపన్నుడు అయిన, సురరాజేన = దేవేంద్రునిచేత, దత్తమ్ = ఇవ్వబడిన, తమ్ = ఆ బాణమును, సందదే = సంధించెను. ఖరం ప్రతి = ఖరుని గూర్చి, ముమోచ చ = విడచెను కూడ.

తా. రాముడు, ఐశ్వర్యసంపన్నుడూ, బుద్ధిమంతుడూ అయిన దేవేంద్రుడిచ్చిన ఆ బాణమును సంధించి ఖరునిపై ప్రయోగించెను. 25

మూ. స విముక్తో మహాబాణో నిర్ఘాతసమనిస్వనః,
రామేణ ధనురాయమ్య ఖరస్యోరస్యపాతయత్. 26

ప్ర. అ. రామేణ = రామునిచేత, ధనుః = ధనస్సును, ఆయమ్య = వంచి, ఖరస్య = ఖరునియొక్క, ఉరసి = వక్షఃస్థలమునందు, విముక్తః = విడువబడిన, నిర్ఘాతసమనిస్వనః = ఉరుముతో సమానమైన ధ్వని గల, సః బాణః = ఆ బాణము, అపాతయత్ = వానిని పడవేసెను.

తా. రాముడు ధనస్సును బాగా లాగి ఖరుని వక్షఃస్థలముమీద విడచిన ఆ బాణము, పిడుగుతో సమానమైన ధ్వనితో వెళ్ళి ఖరుణ్ణి నేలమీద పడవేసెను. 26

మూ. స పపాత ఖరో భూమౌ దహ్యమానః శరాగ్నినా,
రుద్రేణేవ వినిర్దగ్ధః శ్వేతారణ్యే యథాన్ధకః. 27

ప్ర. అ. శరాగ్నినా = బాణాగ్నిచేత, దహ్యమానః = కాల్చబడుచున్న, సః = ఆ, ఖరః = ఖరుడు, శ్వేతారణ్యే = శ్వేతారణ్యమునందు, రుద్రేణ = రుద్రునిచేత, వినిర్దగ్ధః = కాల్చబడిన, అన్ధకః యథా = అంధకాసురుడు వలె, భూమౌ = నేలమీద, పపాత = పడెను.

తా. ఆ బాణాగ్ని కాల్చివేయుచుండగా ఖరుడు, శ్వేతారణ్యమునందు రుద్రునిచే కాల్చబడిన అంధకాసురుడు వలె నేలపై పడిపోయెను. 27

మూ. స వృత్ర ఇవ వజ్రేణ ఫేనేన నముచిర్యథా,
బలోవేన్ద్రాశనిహతో నిపపాత హతః ఖరః. 28

ప్ర. అ. సః ఖరః = ఆ ఖరుడు, హతః = చంపబడినవాడై, వజ్రేణ =

వజ్రముచేత చంపబడిన, వృత్ర ఇవ = వృత్రాసురుడు వలె, ఫేనేన = నురుగు చేత చంపబడిన, నముచిర్యథా = నముచి అనే రాక్షసుడు వలె, ఇన్ద్రాశనిహతః = ఇంద్రుని వజ్రాయుధముచేత చంపబడిన, బలో వా = బలాసురుడు వలె, నిపపాత = పడెను.

తా. రామబాణముచేత చంపబడిన ఖరుడు, వజ్రముచేత చంపబడిన వృత్రాసురుడు వలె, నురుగుచేత చంపబడిన నముచి వలె, ఇంద్రుని వజ్రముచేత చంపబదిన బలాసురుడు వలె నేలపై పడెను. 28

మూ. తతో రాజర్షయః సర్వే సంగతాః పరమర్షయః,
సభాజ్య ముదితా రామమిదం వచనమబ్రువన్. 29

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సర్వే = సమస్తమైన, రాజర్షయః = రాజర్షులు, పరమర్షయః = పరమర్షులు, సంగతాః = కలిసినవారై, ముదితాః = సంతోషించినవారై, రామమ్ = రాముణ్ణి, సభాజ్య = గౌరవించి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట రాజర్షులు, మహర్షులు అందరు కలిసి, సంతోషించుచు, రాముణ్ణి గౌరవించి, ఇట్లు పలికిరి. 29

మూ. ఏతదర్థం మహాతేజా మహేన్ద్రః పాకశాసనః,
శరభఙ్గాశ్రమం పుణ్యమాజగామ పురన్దరః. 30

ప్ర. అ. పాకశాసనః = పాకాసురుణ్ణి సంహరించిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, పురన్దరః = శత్రుపురసంహారకుడైన, మహేన్ద్రః = మహేంద్రుడు, ఏతదర్థమ్ = ఈ కార్యమునిమిత్తమే, పుణ్యమ్ = పుణ్యమైన, శరభఙ్గాశ్రమమ్ = శరభంగాశ్రమమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. పాకాసురుణ్ణి సంహరించినవాడు, శత్రుపురములను నశింపచేసిన వాడు, మహాతేజఃశాలీ అయిన దేవేంద్రుడు ఈ కార్యమునే గూర్చి పుణ్యమైన శర భంగాశ్రమమునకు వచ్చెను. 30

మూ. ఆనీతస్త్వమిమం దేశముపాయేన మహర్షిభిః,
ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్. 31

ప్ర. అ. క్రూరాణామ్ = క్రూరులు, పాపకర్మణామ్ = పాపకర్మ గల వారు, అయిన, ఏషామ్ = ఈ, రక్షసామ్ = రాక్షసులయొక్క, వధార్థమ్ = వధ కొరకే, త్వమ్ = నీవు, మహర్షిభిః = మహర్షులచేత, ఉపాయేన = ఉపాయముచేత, ఇమమ్ = ఈ, దేశమ్ = దేశమును గూర్చి, ఆనీతః = తీసికొనిరాబడితివి.

తా. క్రూరులు, పాపాత్ములూ అయిన ఈ రాక్షసులను వధించుటకొరకే నిన్ను మహర్షు లందరు, ఉపాయముచేత ఈ ప్రదేశమునకు తీసికొనివచ్చిరి. 31

మూ. తదిదం నః కృతం కార్యం త్వయా దశరథాత్మజ,
సుఖం ధర్మం చరిష్యన్తి దణ్డకేషు మహర్షయః. 32

ప్ర. అ. దశరథాత్మజ = రామా! నః = మాయొక్క, తత్ = అ, ఇదమ్ = ఈ, కార్యమ్ = కార్యము. కృతమ్ = చేయబడినది. మహర్షయః = మహర్షులు, దణ్డకేషు = దండకారణ్యములందు, సుఖమ్ = సుఖముగా, ధర్మమ్ = ధర్మమును, చరిష్యన్తి = ఆచరించగలరు.

తా. రామా! నీవు ఈ మా కార్యమును పూర్తిచేసినావు. మహర్షులు దండకారణ్యములో సుఖముగా ధర్మమును ఆచరించగలరు. 32

మూ. ఏతస్మిన్నన్తరే దేవాశ్చారణైః సహ సంగతాః,
దున్దుభీంశ్చాభినిఘ్నన్తః పుష్పవర్షం సమన్తతః. 33
రామస్యోపరి సంహృష్టా వవృషుర్విస్మితాస్తదా.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఇంతలో, దేవాః = దేవతలు, చారణైః సహ = చారణులతో, సంగతాః = కలిసినవారై, సంహృష్టాః = సంతోషించినవారై, దున్దుభీన్ = దుందుభులను, అభినిఘ్నన్తః = మ్రోగించుచున్నవారై, తదా = అప్పుడు, విస్మితాః = ఆశ్చర్యపడినవారై, రామస్య = రామునియొక్క, ఉపరి = పైన, సమన్తతః = నలుమూలలనుండి, పుష్పవర్షమ్ = పుష్పవర్షమును, వవృషుః = వర్షించిరి.

తా. ఇంతలో దేవతలు, చారణులు కలిసి వచ్చి, ఆశ్చర్యచకితులై, ఆనందించుచు, దుందుభులను మ్రోగించుచు, నలుమూలలనుండి రామునిమీద పుష్పవర్షము కురిపించిరి. 33

మూ. అర్ధాధికముహూర్తేన రామేణ నిశితైః శరైః, 34
చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఖరదూషణముఖ్యానాం నిహతాని మహాహవే. 35

ప్ర. అ. రామేణ = రామునిచేత, అర్ధాధికముహూర్తేన = అర్ధము అధికముగా గల ఒక ముహూర్తకాలముచేత (నందు), నిశితైః = వాడియైన, శరైః = బాణములచేత, మహాహవే = మహాయుద్ధమునందు, భీమకర్మణామ్ = భయంకరమైన కర్మలు గల, ఖరదూషణముఖ్యానామ్ = ఖరుడు, దూషణుడు మొదలైన, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = సహస్రములు, నిహతాని = చంపబడినవి.

తా. రాముడు మహాయుద్ధములో, వాడియైన బాణములచేత, భయంకరములైన పనులు చేయు ఖరుడు, దూషణుడు మొదలైన పదునాలుగువేల రాక్షసులను సార్ధముహూర్తకాలములో(ఒకటిన్నర ముహూర్తము, అనగా ఒక గంట పన్నెండు నిముషముల కాలములో) సంహరించెను. 34,35

మూ. అహో బత మహత్కర్మ రామస్య విదితాత్మనః,
అహో వీర్యమహో దాక్ష్యం విష్ణోరివ హి దృశ్యతే. 36
ఇత్యేవముక్త్వా తే సర్వే జగ్ముర్దేవా యథాగతమ్.

ప్ర. అ. విదితాత్మనః = ప్రసిద్ధమైన బుద్ధి గల, రామస్య = రామునియొక్క, మహత్ = గొప్పదైన, కర్మ = పని, అహో బత = ఎంతటి ఆశ్చర్యకరము. వీర్యమ్ = పరాక్రమము, అహో = ఎంత ఆశ్చర్యకరమైనది. దాక్ష్యమ్ = నేర్పు, అహో = ఎంత ఆశ్చర్యకరమైనది! విష్ణోరివ = విష్ణువుయొక్క వీర్యమువలె దాక్ష్యము వలె, దృశ్యతే = కనబడుచున్నది. ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సర్వే = సమస్తమైన, తే దేవాః = ఆ దేవతలు, యథాగతమ్ = వచ్చినట్లుగానే, జగ్ముః = వెళ్ళిరి.

తా. "ప్రసిద్ధమైన బుద్ధి గల రాముడు చేసిన ఈ మహాకార్యము ఎంత ఆశ్చర్యకరము! ఈతని వీర్యము, నేర్పు కూడ విష్ణువు వీర్యము, నేర్పు వలె కనబడుచున్నది. ఎంత ఆశ్చర్యము! ఇట్లు పలికి ఆ దేవతలందరు వచ్చిన దారినే వెళ్ళిరి. 36

మూ. ఏతస్మిన్నన్తరే వీరో లక్ష్మణః సహ సీతయా, 37
గిరిదుర్గాద్వినిష్క్రమ్య స వివేశాశ్రమం సుఖీ.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యసమయమునందు, వీరః = వీరుడైన, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, సీతయా సహ = సీతతో కూడ, గిరిదుర్గాత్ = పర్వతమునందలి ప్రవేశింప శక్యము కాని ప్రదేశమునుండి, వినిష్క్రమ్య = బైటకు వచ్చి, సుఖీ = సంతోషము కలవాడై, ఆశ్రమమ్ = ఆశ్రమమును, వివేశ = ప్రవేశించెను.

తా. ఇంతలో వీరుడైన ఆ లక్ష్మణుడు సీతతో కూడ పర్వతగుహనుండి బైటకు వచ్చి సంతోషించుచు ఆశ్రమములో ప్రవేశించెను. 37

మూ. తతో రామస్తు విజయీ పూజ్యమానో మహర్షిభిః, 38
ప్రవివేశాశ్రమం వీరో లక్ష్మణే నాభిపూజితః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విజయీ = విజయవంతుడైన, వీరః = వీరుడైన, రామస్తు = రాముడు, మహర్షిభిః = మహర్షులచేత, పూజ్యమానః = పూజింపబడుచు, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, అభిపూజితః = ఎదురుగా వచ్చి పూజింపబడినవాడై, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట యుద్ధములో విజయమును పొందిన మహావీరుడైన రాముడు మహర్షులు పూజించుచుండగా, లక్ష్మణుడు ఎదురుగా వచ్చి అభినందించుచుండగా ఆశ్రమములో ప్రవేశించెను. 38

మూ. తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహమ్,
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే.

ప్ర. అ. వైదేహీ = సీత, శత్రుహన్తారమ్ = శత్రువులను సంహరించినవాడు, మహర్షీణామ్ = మహర్షులకు, సుఖావహమ్ = సుఖము కలిగించినవాడు అయిన, తమ్ = ఆ, భర్తారమ్ = భర్తను, దృష్ట్వా = చూచి, హృష్టా = సంతోషించినది, బభూవ = ఆయెను. పరిషస్వజే = కౌగలించుకొనెను.

తా. శత్రువులను సంహరించి మహర్షులకు ఆనందము కలిగించిన భర్తను చూచి, సీత సంతోషించుచు అతని కౌగలించుకొనెను. 39

మూ. ముదా పరమయా యుక్తా దృష్ట్వా రక్షోగణాన్ హతాన్,
రామం చైవావ్యథం దృష్ట్వా తుతోష జనకాత్మజా.

ప్ర. అ. జనకాత్మజా = సీత, హతాన్ = చంపబడిన, రక్షోగణాన్ = రాక్షససముదాయములను, దృష్ట్వా = చూచి, పరమయా = గొప్పదైన, ముదా = సంతోషముతో, యుక్తా = కూడినదై, రామం చైవ = రాముణ్ణి కూడ, అవ్యథమ్ = బాధ లేనివానినిగా, దృష్ట్వా = చూచి, తుతోష = సంతోషించెను.

తా. సీత రామునిచే వధింపబడిన రాక్షసుల నందరిని చూచి చాల సంతోషించెను. రామునకు ఏ విధమైన వ్యథ కలుగకపోవుటను కూడ చూచి సంతోషించెను. 40

మూ. తతస్తు తం రాక్షససంఘమర్దనం
సభాజ్యమానం ముదితైర్మహర్షిభిః,
పునః పరిష్వజ్య శశిప్రభాననా
బభూవ హృష్టా జనకాత్మజా తదా. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే ఆదికావ్యే అరణ్యకాణ్డే త్రింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శశిప్రభాననా = చంద్రుని కాంతి వంటి కాంతి గల ముఖము గల, జనకాత్మజా = సీత, రాక్షససంఘమర్దనమ్ = రాక్షస సముదాయమును సంహరించినవాడు, ముదితైః = సంతోషించిన, మహర్షిభిః = మహర్షులచేత, సభాజ్యమానమ్ = గౌరవింపబడుచున్నవాడు అయిన, తమ్ = ఆ రాముణ్ణి, పునః = మరల, పరిష్వజ్య = కౌగలించుకొని, తదా = అప్పుడు, హృష్టా = సంతోషించినది, బభూవ = ఆయెను.

తా. రాక్షససముదాయమును సంహరించుటచే ఆనందించుచున్న మహర్షుల చేత గౌరవింపబడుచున్న రాముణ్ణి, చంద్రుని వంటి ముఖకాంతి గల సీత మరల మరల కౌగలించుకొని సంతోషముతో ఉండెను. 41

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ముప్పదవ సర్గ సమాప్తము.

## అథ ఏకత్రింశః సర్గః

[ఖరుడు మొదలైనవారి మరణమును అకంపనుడు చెప్పగా విని రావణుడు సీతను హరించుటకై ఉద్యమించుట, మారీచుని ఉపదేశముచే ఆ కార్యమునుండి విరమించుట].

మూ. త్వరమాణస్తతో గత్వా జనస్థానాదకమ్పనః,
ప్రవిశ్య లఙ్కాం వేగేన రావణం వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అకమ్పనః = అకంపనుడు, త్వరమాణః = తొందరపడుచు, జనస్థానాత్ = జనస్థానమునుండి, గత్వా = వెళ్ళి, వేగేన = వేగముతో, లఙ్కామ్ = లంకను, ప్రవిశ్య = ప్రవేశించి, రావణమ్ = రావణుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట అకంపను డను రాక్షసుడు తొందరపడుచు, జనస్థానము నుండి బయలుదేరి, వేగముగా లంక చేరి, రావణునితో ఇట్లు పలికెను. 1

మూ. జనస్థానస్థితా రాజన్ రాక్షసా బహవో హతాః,
ఖరశ్చ నిహతః సంఖ్యే కథం చిదహమాగతః. 2

ప్ర. అ. రాజన్ = రాజా! జనస్థానస్థితాః = జనస్థానములో ఉన్న, బహవః = చాలమంది, రాక్షసాః = రాక్షసులు, హతాః = చంపబడినారు. సంఖ్యే = యుద్ధమునందు, ఖరశ్చ = ఖరుడు కూడ, నిహతః = చంపబడినాడు. అహమ్ = నేను, కథం చిత్ = ఎట్లో, ఆగతః = వచ్చినాను.

తా. రాజా! జనస్థానములో ఉన్న చాలామంది రాక్షసులు చంపబడినారు. యుద్ధములో ఖరుడు కూడ చంపబడినాడు. నేను మాత్రం ఎట్లో తప్పించుకొని వచ్చినాను. 2

మూ. ఏవముక్తో దశగ్రీవః క్రుద్ధః సంరక్తలోచనః,
అకమ్పనమువాచేదం నిర్దహన్నివ చక్షుషా. 3

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దశగ్రీవః = రావణుడు, క్రుద్ధః = కోపించినవాడై, కోపసంరక్తలోచనః = కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, చక్షుషా = నేత్రముతో, నిర్దహన్నివ = కాల్చుచున్నవాడువలె, అకమ్పనమ్ = అకంపనుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ మాటలు విన్న రావణుడు కోపముతో ఎఱ్ఱనైన నేత్రములు కల వాడై చూపుతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు చూచుచు, అకంపనునితో ఇట్లు పలికెను. 3

మూ. కేన రమ్యం జనస్థానం హతం మమ పరాసునా,
కో హి సర్వేషు లోకేషు గతిం నాధిగమిష్యతి. 4

ప్ర. అ. పరాసునా = పోయిన ప్రాణములు గల, కేన = ఎవనిచేత, మమ = నాయొక్క, రమ్యమ్ = రమ్యమైన, జనస్థానమ్ = జనస్థానము, హతమ్ = నశింపచేయబడినది? సర్వేషు = సమస్తమైన, లోకేషు = లోకములయందు, కః = ఎవ్వడు, గతిమ్ = గతిని, నాధిగమిష్యతి = పొందడు?

తా. రమ్యమైన నా జనస్థానమును పాడుచేసిన ఆ క్షీణాయుర్దాయవంతుడు ఎవడు? నాకు అపకారము చేసి ఏ లోకములోను గతిలేకుండా పోవలసిన అతడు ఎవడు? 4

మూ. న హి మే విప్రియం కృత్వా శక్యం మఘవతా సుఖమ్,
ప్రాప్తుం వైశ్రవణేనాపి న యమేన న విష్ణునా. 5

ప్ర. అ. మే = నాకు, విప్రియమ్ = అపకారమును, కృత్వా = చేసి, మఘవతా = దేవేంద్రునిచేత కూడ, సుఖమ్ = సుఖము, ప్రాప్తుమ్ = పొందుటకు, న శక్యం హి = శక్యము కాదు కదా? వైశ్రవణేనాపి = కుబేరునిచేత నైనా, న = సుఖము పొంద శక్యముకాదు. యమేన = యమునిచేత, న = పొంద శక్యము కాదు. విష్ణునా = విష్ణువుచేత, న = పొంద శక్యము కాదు.

తా. నాకు అపకారము చేసి దేవేంద్రుడైనను, కుబేరుడైనను, యముడైనను, విష్ణువైనను సుఖముగా ఉండజాలడు కదా? 5

మూ. కాలస్య చాప్యహం కాలో దహేయమపి పావకమ్,
మృత్యుం మరణధర్మేణ సంయోజయితుముత్సహే. 6

ప్ర. అ. అహమ్ = నేను, కాలస్య చాపి = యమునకు కూడ, కాలః = యముడను. పావకమపి = అగ్నిని కూడ, దహేయమ్ = కాల్చివేయుదును. మృత్యుమ్ = మృత్యువును, మరణధర్మేణ = మరణముతో, సంయోజయితుమ్ = = కూర్చుటకు, ఉత్సహే = ఉత్సహించెదను.

తా. నేను యమునకు కూడ యముడను. అగ్నిని కూడ కాల్చివేయగలను. మృత్యుదేవతకు కూడ మరణము కూర్చ సమర్థుడను. 6

మూ. దహేయమపి సంక్రుద్ధస్తేజసాదిత్యపావకౌ,
వాతస్య తరసా వేగం నిహన్తుమహముత్సహే. 7

ప్ర. అ. సంక్రుద్ధః = కోపించినవాడనై, తేజసా = తేజస్సుచేత, ఆదిత్యపావకౌ అపి = సూర్యాగ్నులను కూడ, దహేయమ్ = కాల్చివేయుదును. తరసా = వేగముచేత, వాతస్య = వాయువుయొక్క, వేగమ్ = వేగమును, నిహన్తుమ్ = కొట్టుటకు, అహమ్ = నేను, ఉత్సహే = ఉత్సహింతును.

తా. నాకు కోపము వచ్చినచో తేజస్సుచేత సూర్యాగ్నులను కూడ కాల్చివేయగలను. వేగముచేత వాయువేగమును కూడ అణచివేయగలను. 7

మూ. తథా క్రుద్ధం దశగ్రీవం కృతాఞ్జలిరకమ్పనః,
భయాత్సన్దిగ్ధయా వాచా రావణం యాచతేఽభయమ్. 8

ప్ర. అ. అకమ్పనః = అకంపనుడు, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, తథా = ఆ విధముగా, క్రుద్ధమ్ = కోపించిన, రావణమ్ = రావణుణ్ణి, భయాత్ = భయమువలన, సందిగ్ధయా = సందేహముతో కూడిన, వాచా = వాక్కుతో, అభయమ్ = అభయమును, యాచతే = యాచించుచున్నాడు (యాచించెను).

తా. అకంపనుడు అంజలి ఘటించి, భయముచేత తొట్రుపడుచున్న మాటలతో ఆ విధముగా కోపించిన దశకంఠుడైన రావణుణ్ణి అభయము ఇమ్మని ప్రార్థించెను. 8

మూ. దశగ్రీవోఽభయం తస్మై ప్రదదౌ రక్షసాం వరః,
స విస్రబ్ధోఽబ్రవీద్వాక్యమసందిగ్ధమకమ్పనః. 9

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులలో, వరః = శ్రేష్ఠుడైన, దశగ్రీవః = =రావణుడు, తస్మై = వానికొరకు, అభయమ్ = అభయమును, ప్రదదౌ = ఇచ్చెను. సః అకమ్పనః = ఆ అకంపనుడు, విస్రబ్ధః = విశ్వాసము కలవాడై, అసందిగ్ధమ్ = సందేహము లేని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన రావణుడు అతనికి అభయ మిచ్చెను. అప్పుడు ఆ అకంపనుడు నమ్మకముతో, ఏ మాత్రము సందేహమునకు తావు లేని మాటలతో ఇట్లు చెప్పెను. 9

మూ. పుత్రో దశరథస్యాస్తి సింహసంహననో యువా,
రామో నామ వృషస్కన్ధో వృత్తాయతమహాభుజః. 10

ప్ర. అ. సింహసంహననః = సింహము ఆకారము వంటి ఆకారము కలవాడు, యువా = యువకుడు, దశరథస్య=దశరథునియొక్క, పుత్రః=పుత్రుడు, వృషస్కన్ధః = వృషభము వంటి మూపు గలవాడు, వృత్తాయతమహాభుజః = గుండ్రని, దీర్ఘమైన బలమైన భుజములు కలవాడు అయిన, రామో నామ = రాముడనువాడు, అస్తి = ఉన్నాడు.

తా. దశరథకుమారుడైన రాముడను ఒక యువకుడు ఉన్నాడు. అతని ఆకారము సింహము ఆకారము వలె గంభీరముగా ఉండును. ఆతని మూపు, వృషభము మూపువలె బలముగా ఉండును. బలిష్ఠములైన అతని భుజములు గుండ్రముగా, దీర్ఘముగా ఉండును. 10

మూ. వీరః పృథుయశాః శ్రీమా నతుల్యబలవిక్రమః,
హతం తేన జనస్థానం ఖరశ్చ సహ దూషణః. 11

ప్ర. అ. (ఆ రాముడు), వీరః = వీరుడు. పృథుయశాః = గొప్ప కీర్తి గలవాడు. అతుల్యబలవిక్రమః = సాటిలేని బలపరాక్రమములు కలవాడు. తేన = ఆ రామునిచేత, జనస్థానమ్ = జనస్థానము, హతమ్ = చంపబడినది. సహ దూషణః = దూషనితో కూడిన, ఖరశ్చ = ఖరుడు కూడ, చంపబడినాడు.

తా. ఆ రాముడు గొప్ప వీరుడు, గొప్ప కీర్తి గలవాడు, శోభ గలవాడు. సాటి లేని బలపరాక్రమములు కలవాడు. అతడు జనస్థానములోని సర్వరాక్షసులను దూషణసహితుడైన ఖరుణ్ణి సంహరించినాడు. 11

మూ. అకమ్పనవచః శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
నాగేన్ద్ర ఇవః నిఃశ్వస్య వచనం చేదమబ్రవీత్. 12

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షస రాజైన, రావణః = రావణుడు, అకమ్పన వచః = అకంపనుని వచనమును, శ్రుత్వా = విని, నాగేన్ద్రః ఇవ = మహాసర్పము వలె, నిఃశ్వస్య = నిట్టూర్చి, ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు అకంపనుని మాటలు విని, మహాసర్పము వలె నిట్టూర్చుచు ఇట్లు పలికెను. 12

మూ. స సురేన్ద్రేణ సంయుక్తో రామః సర్వామరైః సహ,
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చిదకమ్పన. 13

ప్ర. అ. అకమ్పన = ఓ! అకంపనుడా! సః రామః = ఆ రాముడు, సురేన్ద్రేణ = దేవేంద్రునితోను, సర్వామరైః సహ = సకలదేవతలతోను, సంయుక్తః = కూడినవాడై, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, ఉపయాతః కచ్చిత్ = వచ్చినాడా? బ్రూహి = చెప్పుము.

తా. అకంపనా! ఆ రాముడు దేవేంద్రునితోను, సకలదేవతలతోను కలిసి జనస్థానమునకు వచ్చినాడా? చెప్పుము. 13

మూ. రావణస్య పునర్వాక్యం నిశమ్య తదకమ్పనః,
ఆచచక్షే బలం తస్య విక్రమం చ మహాత్మనః. 14

ప్ర. అ. అకమ్పనః = అకంపనుడు, రావణస్య = రావణునియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, నిశమ్య = విని, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ రామునియొక్క, బలమ్ = బలమును, విక్రమం చ = పరాక్రమమును గూర్చి, పునః = మరల, ఆచచక్షే = చెప్పెను.

తా. అకంపనుడు రావణుని మాటలు విని, మహాత్ముడైన ఆ రాముని బలమును, పరాక్రమమును గూర్చి మరల చెప్పెను. 14

మూ. రామో నామ మహాతేజాః శ్రేష్ఠః సర్వధనుష్మతామ్,
దివ్యాస్త్రగుణసంపన్నః పురన్దరసమో యుధి. 15

ప్ర. అ. రామో నామ = రాము డనగా, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు. సర్వధనుష్మతామ్ = సకలధనుర్ధరులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు. దివ్యాస్త్రగుణసంపన్నః = దివ్యములైన అస్త్రము లుండుట అనే వైశిష్ట్యముతో కూడినవాడు. యుధి = యుద్ధమునందు, పురన్దరసమః = దేవేంద్రునితో సమానుడు.

తా. రాము డనగా గొప్ప తేజస్సు కలవాడు. ధనుర్ధరు లందరిలోను శ్రేష్ఠుడు. దివ్యములైన అస్త్రములు కలిగియుండుట అనే వైశిష్ట్యము కలవాడు. యుద్ధములో దేవేంద్రునితో సమానుడు. 15

మూ. తస్యానురూపో బలవాన్ రక్తాక్షో దున్దుభిస్వనః,
కనీయాన్ లక్ష్మణో నామ భ్రాతా శశినిభాననః. 16

ప్ర. అ. బలవాన్ = బలవంతుడు, రక్తాక్షః = ఎఱ్ఱని నేత్రములు కలవాడు, దున్దుభిస్వనః = దుందుభి వంటి ధ్వని కలవాడు, శశినిభాననః = చంద్రునితో సమానమైన ముఖము గలవాడు, అయిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డను వాడు, తస్య = ఆ రామునకు, అనురూపః = తగిన, కనీయాన్ = చిన్నవాడైన, భ్రాతా = సోదరుడు.

తా. ఆ రామునకు తగిన లక్ష్మణు డనే ఒక తమ్ము డున్నాడు. అతడు బలశాలి. ఎఱ్ఱని నేత్రములు, దుందుభిధ్వని వంటి గంభీరమైన కంఠధ్వని, చంద్రుని వంటి ముఖము కలవాడు. 16

మూ. స తేన సహ సంయుక్తః పావకేనానిలో యథా,
శ్రీమాన్ రాజవరస్తేన జనస్థానం నిపాతితమ్. 17

ప్ర. అ. శ్రీమాన్ = శోభకలవాడు, రాజవరః = రాజశ్రేష్ఠుడు అయిన, సః = ఆ రాముడు, అనిలః = వాయువు, పావకేన యథా = అగ్నితో వలె, తేన సహ = ఆ లక్ష్మణునితో, సంయుక్తః = కూడిఉన్నాడు. తేన = ఆ రామునిచేత, జనస్థానమ్ = జనస్థానము, నిపాతితమ్ = పడగొట్టబడినది.

తా. శ్రీమంతుడు, రాజశ్రేష్ఠుడూ అయిన ఆ రాముడు వాయువు అగ్నితో కలిసి ఉన్నట్లు కలిసి ఉన్నాడు. ఆ రాముడు జనస్థానమును నశింపచేసినాడు.

వి. రాక్షసులను చంపినది రాముడు గాన, రాముణ్ణి అగ్నితోను, లక్ష్మణుణ్ణి వాయువుతోను పోల్చుట యుక్తము. అందుచేత "రాజవరః = రాజులలో శ్రేష్ఠుడైన (రాజకుమారులలో శ్రేష్ఠుడైన) శ్రీమాన్ సః = శ్రీమంతుడైన ఆ లక్ష్మణుడు. వాయువు అగ్నితో చేరినట్లు రామునితో కలిసి ఉన్నాడు. ఆ రాముడు జనస్థానాన్ని నశింపచేసినాడు"అని అర్థము చెప్పినచో యుక్తముగా ఉండును. 17

మూ. నైవ దేవా మహాత్మానో నాత్ర కార్యా విచారణా,
శరా రామేణ తూత్సృష్టా రుక్మపుఙ్ఖాః పతత్రిణః, 18
సర్పాః పఞ్చాననా భూత్వా భక్షయన్తి స్మ రాక్షసాన్.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, దేవాః = దేవతలు, నైవ = కారు. అత్ర = ఈ విషయమునందు, విచారణా = సందేహము, న కార్యా = చేయదగినది కాదు. రామేణ = రామునిచేత, ఉత్సృష్టాః = విడువబడిన, రుక్మపుఙ్ఖాః = బంగారు పొన్నులు గల, పతత్రిణః = రెక్కలు గల, శరాః = బాణములు, పఞ్చాననాః = ఐదు ముఖములు గల, సర్పాః = సర్పములుగా, భూత్వా = అయి, రాక్షసాన్ = రాక్షసులను, భక్షయన్తి స్మ = భక్షించినవి.

తా. మహాత్ములైన దేవతలు ఎవ్వరూ జనస్థానమునకు రాలేదు. ఈ విషయములో సందేహము లేదు. రాముడు ప్రయోగించిన, బంగారు పొన్నులు, రెక్కలూ గల బాణములు ఐదు తలల సర్పములుగా మారి రాక్షసులను భక్షించి వేసినవి. 18

మూ. యేన యేన చ గచ్ఛన్తి రాక్షసా భయకర్శితాః, 19
తేన తేన స్మ పశ్యన్తి రామమేవాగ్రతః స్థితమ్
ఇత్థం వినాశితం తేన జనస్థానం తవానఘ. 20

ప్ర. అ. భయకర్శితాః = భయముచేత కృశింపచేయబడిన, రాక్షసాః = రాక్షసులు, యేన యేన=ఏ యే మార్గమున, గచ్ఛన్తి = వెళ్లుచుండిరో, తేన తేన ఆ యా మార్గముచేత, అగ్రతః=ఎదుట, స్థితమ్=నిలచిన, రామమేవ=రాముణ్ణే, పశ్యన్తి స్మ = చూచుచుండిరి. అనఘ=దోషములు లేనివాడా! తేన = ఆ రాముని చేత, తవ = నీయొక్క, జనస్థానమ్ = జనస్థానము, ఇత్థమ్ = ఈ విధముగా, వినాశితమ్ = నశింపచేయబడినది.

తా. భయముచేత కృశించి రాక్షసులు ఏ మూలకు వెళ్ళినా ఆ మూలనే వాళ్లకు రాముడు ఎదుట నిలచి ఉన్నట్లు కనబడెను. దోషములు లేని రాక్షసరాజా! ఆ రాముడు నీ జనస్థానమును ఈ విధముగా నశింపచేసినాడు. 19, 20

మూ. అకమ్పనవచః శ్రుత్వా రావణో వాక్యమబ్రవీత్,
జనస్థానం గమిష్యామి హన్తుం రామం సలక్ష్మణమ్. 21

ప్ర. అ. అకమ్పనవచః = అకంపనుని వచనమును, శ్రుత్వా = విని, రావణః=రావణుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, రామమ్ = రాముణ్ణి, హన్తుమ్=చంపుటకు, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. అకంపనుని మాటలు విని రావణుడు- "రామలక్ష్మణులను చంపుటకై జనస్థానమునకు వెళ్లెదను"అని పలికెను. 21

మూ. అథైవముక్తే వచనే ప్రోవాచేదమకమ్పనః,
శృణు రాజన్ యథావృత్తం రామస్య బలపౌరుషమ్. 22

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, వచనే = వచనము, ఉక్తే = పలకబడినదగుచుండగా, అకమ్పనః = అకంపనుడు, ఇదమ్ = ఈ వాక్యమును, ప్రోవాచ = పలికెను. రాజన్ = రాజా! యథావృత్తమ్ = యథార్థమైన, రామస్య = రాముని యొక్క, బలపౌరుషమ్ = బలమును పౌరుషమును, శృణు = వినుము.

తా. రావణుని వచనము విని అకంపనుడు ఇట్లు పలికెను. "రాజా! రాముని బలము పౌరుషము, యథార్థముగ ఎట్టివో వినుము." 22

మూ. అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః,
ఆపగాయాః సుపూర్ణాయా వేగం పరిహరేచ్ఛరైః. 23

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రామః = రాముడు, విక్రమేణ = పరాక్రమముచేత, అసాధ్యః = జయింప శక్యము కానివాడు. కుపితః = కోపించిన ఆ రాముడు, సుపూర్ణాయాః = బాగా నిండి ఉన్న, ఆపగాయాః = నది యొక్క, వేగమ్ = వేగమును, శరైః = బాణములచేత, పరిహరేత్ = నిలిపి వేయును.

తా. గొప్ప కీర్తి గల రాముణ్ణి పరాక్రమముచేత జయించుట శక్యము కాని పని. ఆతడు కోపించినచో బాగా నిండి ఉన్న నది ప్రవాహమును కూడ బాణాలతో నిలిపివేయగలడు. 23

మూ. సతారగ్రహనక్షత్రం నభశ్చాప్యవసాదయేత్.
అసౌ రామస్తు సీదన్తీం శ్రీమానభ్యుద్ధరేన్మహీమ్. 24

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, అసౌ రామస్తు = ఈ రాముడు, సతారగ్రహనక్షత్రం = తారలతో, గ్రహములతో, నక్షత్రములతో కూడిన, నభః చాపి = ఆకాశమును కూడా. అవసాదయేత్ = నశింపజేయగలడు. సీదన్తీమ్ = క్రుంగిపోవుచున్న, మహీమ్ = భూమిని, అభ్యుద్ధరేత్ = ఎత్తగలడు.

తా. శ్రీమంతుడైన ఈ రాముడు తారలతోను, గ్రహములతోను, నక్షత్రములతోను కూడిన ఆకాశమును కూడ నశింపచేయగలడు. క్రుంగిపోవు చున్న భూమిని ఎత్తగలడు. 24

మూ. భిత్త్వా వేలాం సముద్రస్య లోకానాప్లావయేద్విభుః,
వేగం వాపి సముద్రస్య వాయుం వా విధమేచ్ఛరైః. 25

ప్ర. అ. విభుః = ప్రభువైన రాముడు, సముద్రస్య = సముద్రము యొక్క, వేలామ్ = తీరమును, భిత్త్వా = బ్రద్దలు కొట్టి, లోకాన్ = లోకములను, ఆప్లావ

యేత్ = ముంచివేయును. సముద్రస్య = సముద్రముయొక్క, వేగం వాపి = వేగమునైనను, వాయుం వా = వాయువు నైనను, శరైః = బాణములచేత, విధమేత్ = నశింపచేయును.

తా. ప్రభువైన ఆ రాముడు సముద్రతీరమును బ్రద్దలు కొట్టి లోకముల నన్నింటినీ ముంచివేయ సమర్థుడు. సముద్రవేగమును, వాయువును కూడ బాణాల చేత నశింపచేయగలడు. 25

మూ. సంహృత్య వా పునర్లోకాన్ విక్రమేణ మహాయశాః,
శక్తః స పురుషవ్యాఘ్రః స్రష్టుం పునరపి ప్రజాః. 26

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = ఆ, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడు, పునః = మరల, లోకాన్ = లోకములను, విక్రమేణ = పరాక్రమముచేత, సంహృత్య = సంహరించి, ప్రజాః = ప్రజలను, పునఃరపి = మరల, స్రష్టుమ్ = సృజించుటకు, శక్తః = సమర్థుడు.

తా. గొప్ప కీర్తి గల ఆ పురుషశ్రేష్ఠుడు పరాక్రమముచేత లోకముల నన్నింటిని సంహరించి మరల ప్రజలను సృజించుటకు కూడ సమర్థుడు. 26

మూ. న హి రామో దశగ్రీవ శక్యో జేతుం త్వయా యుధి,
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనైరివ. 27

ప్ర. అ. దశగ్రీవ = ఓ! రావణా! రామః = రాముడు, యుధి = యుద్ధమునందు, త్వయా = నీచేతగాని, రక్షసామ్ = రాక్షసులయొక్క, లోకేన వాపి = సముదాయముచేత గాని, జేతుమ్ = జయించుటకు, స్వర్గః = స్వర్గము, పాపజనైరివ = పాపాత్ములచేత వలె, న శక్యః = శక్యమైనవాడు కాడు.

తా. రావణా! రాముణ్ణి నీవు గాని, రాక్షసు లందరు కలిసి గాని యుద్ధములో, పాపాత్ములు స్వర్గమును ఎట్లు జయింప (పొంద) జాలరో అట్లే జయింప జాలరు. 27

మూ. న తం వధ్యమహం మన్యే సర్వైర్దేవాసురైరపి,
అయమస్య వధోపాయస్తన్మమైకమనాః శృణు. 28

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, దేవాసురైరపి = దేవాసురులచేత కూడ, తమ్ = ఆ రాముణ్ణి, వధ్యమ్=చంపశక్యమైనవానినిగా, అహమ్=నేను, న మన్యే =తలవను. అస్య = ఈతనియొక్క, వధోపాయః = వధకు ఉపాయము, అయమ్ = ఇది. తత్ = దానిని, మమ = నానుండి, ఏకమనాః=ఏకాగ్రచిత్తుడవై, శృణు = వినుము.

తా. సమస్తమైన దేవాసురులు కలిసినా కూడ ఆతనిని చంపుటకు శక్యమగు నని నేను అనుకొనను. ఈతనిని చంపుటకు ఇది ఒక ఉపాయ మున్నది. సావధానచిత్తుడవై వినుము. 28

మూ. భార్యా తస్యోత్తమా లోకే సీతా నామ సుమధ్యమా,
శ్యామా సమవిభక్తాఙ్గీ స్త్రీరత్నం రత్నభూషితా. 29

ప్ర. అ. లోకే= లోకమునందు, ఉత్తమా = ఉత్తమురాలు, శ్యామా = యౌవనమధ్యమునందు ఉన్నది, సమవిభక్తాఙ్గీ= సమముగా విభజింపబడిన అవయవములు కలదీ, స్త్రీరత్నమ్ = స్త్రీలలో రత్నము, రత్నభూషితా=రత్నముల చేత భూషింపబడినదీ అయిన, సీతా నామ = సీత అను పేరు గల, సుమధ్యమా= మంచి నడుము గల స్త్రీ, తస్య = ఆ రామునియొక్క, భార్యా = భార్య.

తా. లోకములో ఉత్తమురాలైన సీత అనే మంచి నడుము గల ఒక వనిత ఆతని భార్య. ఆమె యౌవనమధ్యమునం దున్నది. ఆమె అవయవములు ఎచ్చు తగ్గులు లేకుండగా సమముగా విభజింపబడి యున్నవి. స్త్రీలలో రత్నమైన ఆమె రత్నములచేత అలంకరింపబడి ఉన్నది. 29

మూ. నైవ దేవీ న గన్ధర్వీ నాప్సరా నాపి దానవీ,
తుల్యా సీమన్తినీ తస్యా మానుషీషు కుతో భవేత్. 30

ప్ర. అ. తస్యాః = ఆమెకు. తుల్యా = సమానురాలైన, సీమన్తినీ = స్త్రీ, దేవీ = దేవతాస్త్రీ, నైవ = లేదు. గన్ధర్వీ = గంధర్వస్త్రీ, న = లేదు, అప్సరాః = అప్సరః స్త్రీ, న = లేదు, దానవీ అపి = దానవస్త్రీ కూడ, న=లేదు. మానుషీషు= మనుష్యస్త్రీలలో, కుతః = ఎట్లు, భవేత్ = ఉండును.

తా. ఆమెతో సమానమైన స్త్రీ దేవతాస్త్రీలలో కాని, గంధర్వస్త్రీలలో

గాని, అప్సరసలలో గాని, దానవస్త్రీలలో కాని లేదు. మనుష్యస్త్రీలలో ఎట్లు ఉండును? 30

మూ. తస్యాపహర భార్యాం త్వం ప్రమథ్య తు మహావనే,
సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితమ్. 31

ప్ర. అ. త్వమ్ = నీవు, మహావనే = మహావనమునందు, ప్రమథ్య = బలాత్కరించి, తస్య = ఆ రామునియొక్క, భార్యామ్ = భార్యను, అపహర = అపహరించుము. కామీ = కాముకుడైన, రామః = రాముడు, సీతయా = సీతతో, రహితః = శూన్యుడై, జీవితమ్ = జీవితమును, హాస్యతి = విడువగలడు.

తా. నీవు మహావనమునందు బలాత్కారముగా ఆతని భార్యను అపహరించుము. సీత మీద అత్యధికప్రేమ గల ఆ రాముడు, సీత లేకపోవుటచే ప్రాణములను విడువగలడు. 31

మూ. అరోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః,
చిన్తయిత్వా మహాబాహురకమ్పనమువాచ హ. 32

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, తత్ వాక్యమ్ =ఆ వాక్యమును, అరోచయత = ఇష్టపడెను. మహాబాహుః = గొప్ప బాహువులు గల ఆతడు, చిన్తయిత్వా= ఆలోచించి, అకమ్పనమ్ = అకంపనుని గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. రాక్షసరాజైన రావణునకు ఆ మాటలు ఇష్ట మయ్యెను. అప్పుడు ఆ మహాబాహువైన రావణుడు, ఆలోచించి అకంపనునితో ఇట్లు పలికెను. 32

మూ. బాఢం కాల్యం గమిష్యామి హ్యేకః సారథినా సహ,
ఆనయిష్యామి వైదేహీమిమాం హృష్టో మహాపురీమ్. 33

ప్ర. అ. బాఢమ్ = తప్పక, కాల్యమ్ = ప్రాతఃకాలమునందే, ఏకః = నేనొక్కడను, సారథినా సహ = సారథితో కూడ, గమిష్యామి = వెళ్ళగలను. హృష్టః = సంతోషించినవాడనై, వైదేహీమ్ = సీతను, ఇమాం పురీమ్ = ఈ పట్టణమును గూర్చి, ఆనయిష్యామి = తీసికొనివచ్చెదను.

తా. ప్రాతఃకాలమునందు నే నొక్కడనే సారథితో కూడ వెళ్ళి సీతను, ఆనందపూర్వకముగా ఈ మహాపురమునకు తీసికొనివచ్చెదను. 33

మూ. అథైవముక్త్వా ప్రయయౌ ఖరయుక్తేన రావణః,
రథేనాదిత్యవర్ణేన దిశః సర్వాః ప్రకాశయన్. 34

ప్ర. అ. రావణః = రావణుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, అథ = అటుపిమ్మట, ఖరయుక్తేన = గాడిదలతో కూర్చబడిన, ఆదిత్యవర్ణేన = సూర్యునివంటి వర్ణము గల, రథేన = రథముచేత, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రకాశయన్ = ప్రకాశింపచేయుచు, ప్రయయౌ = వెళ్ళెను.

తా. రావణుడు ఇట్లు పలికి, పిమ్మట సూర్యునివంటి వర్ణము గల గాడిదలు కట్టిన రథముచేత అన్ని దిక్కులను ప్రకాశింపచేయుచు వెళ్ళెను. 34

మూ. స రథో రాక్షసేన్ద్రస్య నక్షత్రపథగో మహాన్,
సంచార్యమాణః శుశుభే జలదే చన్ద్రమా ఇవ. 35

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, సంచార్యమాణః=సంచరింపచేయబడుచున్న, నక్షత్రపథగః = నక్షత్రమార్గమునందు వెళ్లుచున్న, మహాన్ = గొప్పదైన, సః = ఆ, రథః = రథము, జలదే = మేఘమునందు, చన్ద్రమాః ఇవ = చంద్రుడు వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. నడుపబడి ఆకాశమార్గమునందు సంచరించుచున్న గొప్పదైన ఆ రావణుని రథము మేఘములోని చంద్రుడు వలె ప్రకాశించెను. 35

మూ. స మారీచాశ్రమం ప్రాప్య తాటకేయముపాగమత్,
మారీచేనార్చితో రాజా భక్ష్యభోజ్యైరమానుషైః. 36

ప్ర. అ. సః=ఆ రావణుడు, మారీచాశ్రమమ్ = మారీచుని ఆశ్రమమును, ప్రాప్య = పొంది, తాటకేయమ్ = మారీచుణ్ణి, ఉపాగమత్ = పొందెను. రాజా = రాజైన ఆ రావణుడు, అమానుషైః = మనుష్యులకు దుర్లభములైన, భక్ష్యభోజ్యైః = భక్ష్యములతోను, భోజ్యములతోను (భక్ష్యము లనగా పిండివంటలు. భోజ్యము లనగా అన్నాదులు). మారీచేన= మారీచునిచేత, అర్చితః = పూజింపబడెను.

తా. రావణుడు మారీచుని ఆశ్రమమునకు వెళ్ళి ఆతనిని కలిసెను. మారీచుడు రాజైన రావణుని మనుష్యులకు దుర్లభములైన భక్ష్యములను, భోజ్యములను ఇచ్చి పూజించెను. 36

మూ. తం స్వయం పూజయిత్వా తు ఆసనే నోదకేన చ,
అర్థోపహితయా వాచా మారీచో వాక్యమబ్రవీత్. 37

ప్ర. అ. మారీచః = మారీచుడు, తమ్ = ఆ రావణుణ్ణి, ఆసనేన = ఆసనముచేత, ఉదకేన చ = ఉదకముచేత, స్వయమ్ = స్వయముగా, పూజయిత్వా = పూజించి, అర్థోపహితయా = అర్థముతో కూడిన, వాచా = వాక్కుతో, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మారీచుడు ఆ రావణునకు స్వయముగా ఆసనము, ఉదకము ఇచ్చి సత్కరించి అర్థముతో కూడిన వాక్కుతో ఇట్లు పలికెను. 37

మూ. కచ్చిత్సుకుశలం రాజన్ లోకానాం రాక్షసేశ్వర,
ఆశఙ్కే నాథ జానే త్వం యతస్తూర్ణమిహాగతః. 38

ప్ర. అ. రాక్షసేశ్వర = రాక్షసులకు ప్రభువైన, రాజన్ = రాజా! లోకానామ్ = ప్రజలకు, సుకుశలం కచ్చిత్ = బాగుగా క్షేమమే కదా. నాథ = ప్రభూ! యతః = ఏ కారణమువలన, త్వమ్ = నీవు, తూర్ణమ్ = శీఘ్రముగా, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావో, అందువలన, ఆశఙ్కే = సందేహించుచున్నాను. జానే = ఎరుగుదును.

తా. రాక్షసుల ప్రభువైన ఓ ! రాజా ! ప్రజ లందరికి క్షేమమే కదా! నీవు శీఘ్రముగా ఇక్కడికి వచ్చుటచే నాకు సంశయము కలుగుచున్నది. ఏదో తొందర పని ఉన్న దని నేను ఊహించుచున్నాను. 38

మూ. ఏవముక్తో మహాతేజా మారీచేన స రావణః,
తతః పశ్చాదిదం వాక్యమబ్రవీద్వాక్యకోవిదః. 39

ప్ర. అ. మారీచేన = మారీచునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, వాక్యకోవిదః = మాటలలో నేర్పరి యైన,

సః = ఆ, రావణః = రావణుడు, తతః పశ్చాత్ = అటు పిమ్మట, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజఃశాలి, మాటలలో నేర్పరి అయిన ఆ రావణుడు మారీచుని మాటలు విని పిమ్మట ఇట్లు పలికెను. 39

మూ. ఆరక్షో మే హతస్తాత రామేణాక్లిష్టకర్మణా.
జనస్థానమవధ్యం తత్సర్వం యుధి నిపాతితమ్, 40
తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే.

ప్ర. అ. తాత = తండ్రీ! అక్లిష్టకర్మణా = శ్రమపడకుండా పనులుచేయు, రామేణ = రామునిచేత, మే = నాయొక్క, ఆరక్షః = రక్షణచేసే సైన్యము, హతః = చంపబడినది. తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, అవధ్యమ్ = చంపశక్యము కాని, జనస్థానమ్ = జనస్థానము, యుధి = యుద్ధమునందు, నిపాతితమ్ = పడగొట్టబడినది. తస్య మే = అట్టి నాకు, తస్య = ఆ రామునియొక్క, భార్యాపహారణే = భార్యను హరించుటయందు, సాచివ్యమ్ = సాహాయ్యమును, కురు = చేయుము.

తా. మారీచుడా! శ్రమపడకుండా పనులు చేయు రాముడు దండకారణ్యమునందు రక్షణార్థమై నిలుపబడిన సైన్యమును చంపివేసినాడు. చంపుటకు శక్యము కాని ఆ జనస్థాన మంతా యుద్ధములో చంపబడినది. అందుచే ఆ రాముని భార్యను అపహరించుటలో నాకు సాహాయ్యము చేయుము. 40

మూ. రాక్షసేన్ద్రవచః శ్రుత్వా మారీచో వాక్యమబ్రవీత్. 41
ఆఖ్యాతా కేన సీతా సా మిత్రరూపేణ శత్రుణా,
త్వయా రాక్షసశార్దూల కో న నన్దతి నిన్దితః. 42

ప్ర. అ. రాక్షసేన్ద్రవచః = రావణుని వచనమును, శ్రుత్వా = విని, మారీచః = మారీచుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మిత్రరూపేణ = మిత్రు డనే రూపము గల, శత్రుణా = శత్రువైన, కేన = ఎవనిచేత, సా సీతా = ఆ సీత, ఆఖ్యాతా = చెప్పబడినది? రాక్షసశార్దూల = రాక్షసశ్రేష్ఠుడా! నిన్దితః = నిందింపదగిన, కః = ఎవడు, త్వయా = నీచేత, న నన్దతి = సంతోషించుట లేదు?

తా. రావణుని మాటలు విని మారీచుడు ఇట్లు పలికెను. రాక్షసులలో

శ్రేష్ఠుడవైన ఓ రావణా! నీకు సీతను గూర్చి చెప్పిన ఆ మిత్రుడు వలె కనబడే శత్రువు ఎవడు? నిన్ను చూచి కిట్టని ఆ దుష్టుడు ఎవడు? 42

మూ. సీతామిహానయస్వేతి కో బ్రవీతి బ్రవీహి మే,
రక్షోలోకస్య సర్వస్య కః శృఙ్గం ఛేత్తుమిచ్ఛతి. 43

ప్ర. అ. సీతామ్ = సీతను, ఇహ = ఇక్కడికి, ఆనయస్వ = తీసికొని రమ్ము, ఇతి = అని, కః = ఎవడు, బ్రవీతి = చెప్పుచున్నాడు? మే = నాకు, బ్రవీహి = చెప్పుము. కః = ఎవడు, సర్వస్య = సమస్తమైన, రక్షోలోకస్య = రాక్షససముదాయముయొక్క, శృఙ్గమ్ = శిఖరమును, ఛేత్తుమ్ = విరగగొట్టుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు?

తా. "సీతను ఇక్కడికి తీసికొని రమ్ము" అని నీతో చెప్పినవా డెవడో నాకు చెప్పుము. సమస్త రాక్షససముదాయము శిఖరమును (గొప్పతనమును) భగ్నముచేయ దలచుచున్న అత డెవడు? 43

మూ. ప్రోత్సాహయతి కశ్చిత్త్వాం స చ శత్రురసంశయః,
ఆశీవిషముఖాద్దంష్ట్రాముద్ధర్తుం చేచ్ఛతి త్వయా. 44

ప్ర. అ. కశ్చిత్ = ఎవ్వడో, త్వామ్ = నిన్ను, ప్రోత్సాహయతి = ప్రోత్సహించుచున్నాడు. స చ = వాడు, శత్రుః = శత్రువు; అసంశయః = సంశయము లేదు. త్వయా = నీచేత, ఆశీవిషముఖాత్ = సర్పము నోటినుండి, దంష్ట్రామ్ = కోరను, ఉద్ధర్తుమ్ = ఊడపీకించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు.

తా. నిన్ను ఇందుకు ప్రోత్సహించుచున్నవా డెవ్వడో గాని అతడు నిస్సంశయముగ నీకు శత్రువు. అతడు నీచేత పాము నోటినుండి కోరను పీకించుటకు కోరుచున్నాడు. 44

మూ. కర్మణా కేన కేనాసి కాపథం ప్రతిపాదితః,
సుఖసుప్తస్య తే రాజన్ ప్రహృతం కేన మూర్ధని. 45

ప్ర. అ. కేన = ఎవ్వనిచేత, కేన = ఏ, కర్మణా = పనిచేత, కాపథమ్ = చెడు మార్గమును, ప్రతిపాదితః = పొందింపబడినవాడవు, అసి = అయితివి?

రాజన్ = రాజా ! సుఖసుప్తస్య=సుఖముగా నిద్రించిన, తే=నీయొక్క, మూర్ధని = శిరస్సుమీద, కేన = ఎవనిచేత, ప్రహృతమ్=కొట్టుట ?

తా. రాజా ! నిన్ను ఎవ్వడు, ఏ కార్యము నిమిత్తమై ఈ చెడు మార్గము పట్టించుచున్నాడు ? సుఖముగా నిద్రించుచున్న నీ తలపై ఎవడు కొట్టినాడు ?

మూ. విశుద్ధవంశాభిజనాగ్రహస్త
స్తేజోమదః సంస్థితదోర్విషాణః,
ఉదీక్షితుం రావణ నేహ యుక్తః
స సంయుగే రాఘవగన్ధహస్తీ. 46

ప్ర. అ. రావణ = రావణా ! విశుద్ధవంశాభిజనాగ్రహస్తః = పరిశుద్ధమైన వంశము, బంధుజనము అను తొండము గలది, తేజోమదః=తేజస్సు అనే మదము గలది, సంస్థితదోర్విషాణః = స్థిరముగా ఉన్న బాహువులనే దంతములు గలది అయిన, సః = ఆ, రాఘవగన్ధహస్తీ = రాముడనే మదగజము, సంయుగే= యుద్ధమునందు, ఉదీక్షితుమ్ = చూచుటకు, ఇహ=ఇప్పుడు, న యుక్తః=తగినది కాదు.

తా. రావణా ! రాము డనే మదగజమును యుద్ధములో కన్నెత్తి చూచుటకు కూడ శక్యముకాదు. పరిశుద్ధమైన వంశము బంధుజనము అనునవే దాని తొండము. తేజస్సే మదము. బలము గల బాహువులే దంతములు. 46

మూ. అసౌ రణాన్తఃస్థితిసంధివాలో
విదగ్ధరక్షోమృగహా నృసింహః,
సుప్తస్త్వయా బోధయితుం న యుక్తః
శరాఙ్గపూర్ణో నిశితాసిదంష్ట్రః. 47

ప్ర. అ. రణాన్తఃస్థితిసంధివాలః = రణమధ్యములో ఉండుట అను నడుమునకు చుట్టిన తోక గలది, విదగ్ధరక్షోమృగహా = నేర్పు గల రాక్షసు లనే లేళ్ళను చంపునది, శరాఙ్గపూర్ణః = బాణము లనెడు అవయవములతో నిండినది, నిశితాసిదంష్ట్రః = వాడియైన ఖడ్గమనే కోరలు కలది అయిన, సుప్తః = నిద్రించిన, అసౌ = ఈ, నృసింహః = నరుడనే (రాముడనే) సింహము, త్వయా = నీచేత, బోధయితుమ్ = లేపుటకు, న యుక్తః = యుక్తము కాదు.

తా. నిద్రించుచున్న రాము డనే ఈ సింహమును లేపుట నీకు మంచిది కాదు. రణమధ్యమునందు నిలుచుట అనునదే దీని నడుమునకు చుట్టుకొనిన తోక. ఇది శరము లనే గోళ్ళు మొదలైన అవయవములతో పరిపూర్ణముగా ఉన్నది. ఖడ్గములే దీని కోరలు. ఇది నేర్పు గల రాక్షసు లనే లేళ్లను చంపివేయగలదు.

మూ. చాపావహారే భుజవేగపఙ్కే
శరోర్మిమాలే సుమహాహవౌఘే,
న రామపాతాళముఖేఽతిఘోరే
ప్రస్కన్దితుం రాక్షసరాజ యుక్తమ్. 48

ప్ర. అ. రాక్షసరాజ=ఓ! రాక్షసరాజా! చాపావహారే=ధనస్సే మొసలిగా కలది, భుజవేగపఙ్కే = భుజముల వేగమే బురదగా గలది, శరోర్మిమాలే = బాణములే తరంగపంక్తులుగా కలది, సుమహాహవౌఘే=చాల గొప్పదైన యుద్ధమే జలప్రవాహముగా గలది, అతిఘోరే = చాల భయంకరము అయిన, రామ పాతాళముఖే = రాముడనే పాతాళపు ముఖమునందు, ప్రస్కన్దితుమ్ = జారిపడుటకు, న యుక్తమ్ = యుక్తము కాదు.

తా. రాక్షసరాజా! అతిభయంకరమైన రాముడనే పాతాళము ముఖమునందు జారిపడుట మంచిదికాదు. ధనస్సే దానిలోని మొసలి. భుజముల వేగమే పంకము. శరములే తరంగపంక్తులు. గొప్పయుద్ధమే దీనిలోని జలప్రవాహము. 48

మూ. ప్రసీద లఙ్కేశ్వర రాక్షసేన్ద్ర
లఙ్కాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ,
త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం
రామః సభార్యో రమతాం వనేషు. 49

ప్ర. అ. లఙ్కేశ్వర = లంకాధీశా! రాక్షసేన్ద్ర = రాక్షసరాజా! ప్రసీద = అనుగ్రహించుము. సాధు = బాగుగా, లఙ్కామ్ = లంకను గూర్చి, గచ్ఛ = వెళ్ళుము. ప్రసన్నః = ప్రసన్నుడవు, భవ = అగుము. త్వమ్ = నీవు, నిత్యమ్ = నిత్యమూ, స్వేషు = నీసంబంధమైన, దారేషు = భార్యలయందు, రమస్వ =

క్రీడించుము. రామః = రాముడు, సభార్యః = భార్యతో కూడినవాడై, వనేషు = వనములలో, రమతామ్ = క్రీడించుగాక.

తా. లంకాధిపతియైన రాక్షసరాజా ! అనుగ్రహించుము. బాగుగా లంకకు వెళ్లుము. ప్రసన్నుడవు అగుము. నీవు నిత్యము నీ భార్యలతో క్రీడించుము. రాముణ్ణి తన భార్యతో వనములలో సుఖముగా ఉండనిమ్ము. 49

మూ. ఏవముక్తో దశగ్రీవో మారీచేన స రావణః,
న్యవర్తత పురీం లఙ్కాం వివేశ చ గృహోత్తమమ్. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకత్రింశః సర్గః.

ప్ర. అ. మారీచేన = మారీచునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దశగ్రీవః = పది కంఠములు గల, సః రావణః = ఆ రావణుడు, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును గూర్చి, న్యవర్తత = మరలెను. గృహోత్తమమ్ = గృహశ్రేష్ఠమును, వివేశ చ = ప్రవేశించెను కూడ.

తా. పది కంఠములు గల రావణుడు మారీచుని మాటలు విని, లంకకు తిరిగి వెళ్లి తన గృహములో ప్రవేశించెను.

వి. ఈ 50 శ్లోకాల సర్గ ప్రక్షిప్త మని తోస్తుంది. ఆకాశమార్గంలో ప్రయాణము చేయ గలిగిన శూర్పణఖకంటె ముందుగా అకంపనుడు రావణుని వద్దకు వెళ్ళి జనస్థానవృత్తాంతం నివేదించడం అసంగతము. అట్లు చేసినా విషయమును చెప్పి ఊరుకోవాలి. కాని రాముడు ప్రపంచకాన్నంతనీ సంహరించి మళ్ళీ సృష్టించగలడు ఇత్యాది విధంగా మాటలాడడం అయుక్తం. రాముడు అంతటివా డని మన వ్యాఖ్యాతలకు తెలియునేమో కాని ఆ రాక్షసుని కెట్లు తెలిసింది? వాని మాటలు వినగానే "సరే అలాగే చేస్తాను. వాని భార్యను అపహరిస్తాను" అని అంటూ రావణుడు మారీచుని దగ్గరికి వెళ్ళ మాకీచుడు ఏమేమో చెప్పగానే మళ్ళీ మాట్లాడకుండా వెళ్ళిపోతాడా ! మరొక విషయ మేమనగా శూర్పణఖ ప్రేరేపించగా రావణుడు మారీచుని ఆశ్రమానికి వచ్చినా డని చెప్పే సందర్భంలో 35వ సర్గలో 26 శ్లోకాలలో ఆశ్రమం వర్ణింపబడింది. ఆ వర్ణన రావణుడు

మారీచాశ్రమానికి మొదట వెళ్ళినప్పుడే ఉండాలి కదా ? ఈ సర్గ రచనలోను, శైలిలోను వాల్మీకి ముద్ర కనబడదు. 46-49 శ్లోకాలు చాలా సామాన్యశక్తి గల కవి రచనగా కనబడతాయి. ఎవరైన ఒక ప్రముఖవ్యక్తిని గాని, నగరాన్ని గాని, అరణ్యాన్ని గాని, సముద్రాన్ని గాని ప్రప్రథమంగా ప్రవేశపెట్టినపుడు సుదీర్ఘంగా వర్ణించడం వాల్మీకి రచనలో అంతలో కనబడుతుంది. శూర్పణఖ రావణునివద్దకు వెళ్ళినప్పుడు తొలి సారిగా రావణుణ్ణి పాఠకుల ముందు ఉంచుతున్నాడు కనుకనే వాల్మీకి అతని వర్ణనకై ఒక సర్గ పూర్తిగా వినియోగించినాడు. అకంపనవృత్తాంతమే నిజమైనపక్షంలో ఈ రావణవర్ణన అక్కడ ఉండేది. ఈ సర్గ ప్రాచ్యపాఠంలో లేదు. ఖరాదులు సంహరింపబడిన తరువాత శూర్పణఖయే రావణుని దగ్గరకు వెళ్ళినట్లు మాత్రమే ఉంది. అకంపనుని మాటల్లో విశేషార్థాలు చెప్పే వ్యాఖ్యాతల వ్యాఖ్యానాలు ఎంత అసంగతాలో వేరుగా చెప్ప పనిలేదు. 23వ శ్లోకంలో రాముడు నదీప్రవాహాన్ని కూడ ఆపివేయ గల డని చెప్పి వాల్మీకి కృష్ణావతారంలో జరగబోయే కథను సూచించినాడట. 24వ శ్లోక పూర్వార్ధంలో త్రివిక్రమావతారం సూచింపబడినదట. ఉత్తరార్ధంలో వరాహావతారం సూచింపబడిన దట. 25వ శ్లోకంలో "రాముడు సముద్రజలముచేత లోకాన్ని ముంచును" అని చెప్పడంచేత రాముడే జగత్సంహర్త అనీ, "సముద్రాన్ని నిలుపుతాడు'' అని చెప్పడంచేత భవిష్యత్సేతుబంధనమూ సూచింపబడిన వట. 26వ శ్లోకంలో రాముడే పరమాత్ము డని సూచింపబడినదట ! 50

''బాలానందిని'' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ముప్పదిఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వాత్రింశః సర్గః

### [శూర్పణఖ రావణునివద్దకు వెళ్ళుట]

మూ. తతః శూర్పణఖా దృష్ట్వా సహస్రాణి చతుర్దశ,
హతాన్యేకేన రామేణ రక్షసాం భీమకర్మణామ్. 1

దూషణం చ ఖరం చైవ హతం త్రిశిరసా సహ,
దృష్ట్వా పునర్మహానాదం ననాద జలదో యథా. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శూర్పణఖా = శూర్పణఖ, ఏకేన = ఒక్క, రామేణ = రామునిచేత, భీమకర్మణామ్ = భయంకరములైన కర్మలు గల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశసహస్రాణి = పదునాలుగువేలను, హతాని = చంపబడినవాటినిగా, దృష్ట్వా = చూచి, దూషణం చ = దూషణుణ్ణి, ఖరం చైవ = ఖరుణ్ణి, త్రిశిరసా సహ = త్రిశిరస్సుతో కూడ, హతమ్ = చంపబడిన వానినిగా, దృష్ట్వా = చూచి, పునః = మరల, జలదః యథా = మేఘము వలె, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగు నట్లుగా, ననాద = ధ్వనిచేసెను.

తా. శూర్పణఖ, భయంకరములైన పనులు చేయు పదునాలుగు వేల మంది రాక్షసులను, త్రిశిరస్సును, దూషణుణ్ణి, ఖరుణ్ణి ఒక్క రాముడు చంపి వేయుట చూచి మేఘము వలె చాల బిగ్గరగా అరచెను. 1, 2

మూ. సా దృష్ట్వా కర్మ రామస్య కృతమన్యైః సుదుష్కరమ్,
జగామ పరమోద్విగ్నా లఙ్కాం రావణపాలితామ్. 3

ప్ర. అ. సా = ఆమె, అన్యైః = ఇతరులచేత, సుదుష్కరమ్ = ఏమాత్రము చేయ శక్యము కాని, రామస్య = రామునియొక్క, కృతమ్ = చేయబడిన, కర్మ = పనిని, దృష్ట్వా = చూచి, పరమోద్విగ్నా = మిక్కిలి భయ

పడినదై, రావణపాలితామ్ = రావణునిచేత పాలింపబడిన, లఙ్కామ్ = లంకను గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ఆమె ఇతరు లెవ్వరూ చేయజాలని, రాముడు చేసిన పని చూచి, చాల భయపడినదై రావణుడు పాలించుచున్న లంకకు వెళ్లెను. 3

మూ. సా దదర్శ విమానాగ్రే రావణం దీప్తతేజసమ్,
ఉపోపవిష్టం సచివై ర్మరుద్భిరివ వాసవమ్. 4

ప్ర. అ. సా = ఆమె, మరుద్భిః = మరుత్తులచేత, వాసవమ్ ఇవ = దేవేంద్రుడు వలె, సచివైః = మంత్రులచేత, ఉపోపవిష్టమ్ = సమీపమునందు కూర్చుండి సేవింపబడుచున్న, దీప్తతేజసమ్ = ప్రజ్వలించుచున్న తేజస్సు గల, రావణమ్ = రావణుణ్ణి, విమానాగ్రే = భవనము పైభాగమునందు, దదర్శ = చూచెను.

తా. మరుత్తులను దేవతాగణముచేత సమీపమున కూర్చుండి సేవింపబడుచున్న దేవేంద్రుడు వలె సమీపమున కూర్చున్న మంత్రులచే సేవింపబడుచున్న ప్రజ్వలించుచున్న తేజస్సు గల రావణుణ్ణి, ఆ శూర్పణఖ రాజభవనాగ్రమునందు చూచెను. 4

మూ. ఆసీనం సూర్యసంకాశం కాఞ్చనే పరమాసనే,
రుక్మవేదిగతం ప్రాజ్యం జ్వలన్తమివ పావకమ్. 5

ప్ర. అ. సూర్యసంకాశమ్ = సూర్యునితో సమానుడు, కాఞ్చనే = బంగారు వికారమైన, పరమాసనే = గొప్ప ఆసనమునందు, ఆసీనమ్ = కూర్చున్నవాడు, రుక్మవేదిగతమ్ = బంగారు వేదియందున్న, ప్రాజ్యమ్ = అధికమైన ఆజ్యము గల, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, పావకమ్ ఇవ = అగ్ని వలె ఉన్న (రావణుణ్ణి చూచెను).

తా. సూర్యునితో సమానుడైన ఆ రావణుడు బంగారు సింహాసనముమీద కూర్చుండెను. అధికమైన నెయ్యి హోమము చేయుటచే ప్రజ్వలించుచున్న, బంగారు వేదియందున్న అగ్ని వలె ప్రకాశించుచుండెను. 5

మూ. దేవగన్ధర్వభూతానామృషీణాం చ మహాత్మనామ్,
అజేయం సమరే శూరం వ్యాత్తాననమివాన్తకమ్. 6

ప్ర. అ. దేవగన్ధర్వభూతానామ్ = దేవతలకు, గంధర్వులకు, భూతములకు, మహాత్మనామ్ = మహాత్ములైన, ఋషీణాం చ = ఋషులకు, సమరే = యుద్ధమునందు, అజేయమ్ = జయింప శక్యము కానివాడు, శూరమ్ = శూరుడు, వ్యాత్తాననమ్ = తెరవబడిన నోరు గల, అన్తకమ్ ఇవ = యముడు వలె ఉన్న (రావణుని చూచెను).

తా. శూరుడైన ఆ రావణుణ్ణి, యుద్ధములో, దేవతలుగాని, గంధర్వులు గాని, భూతములు గాని, మహాత్ములైన ఋషులు గాని జయింపజాలరు. అతడు నోరు తెరచుకొని ఉన్న యముడు వలె ఉండెను. 6

మూ. దేవాసురవిమర్దేషు వజ్రాశనికృతవ్రణమ్,
ఐరావతవిషాణాగ్రైరుత్కృష్టకిణవక్షసమ్. 7

ప్ర. అ. దేవాసురవిమర్దేషు = దేవతలకు అసురులకు జరిగిన యుద్ధములందు, వజ్రాశనికృతవ్రణమ్ = వజ్రాయుధముచేత చేయబడిన గాయములు కలవాడు, ఐరావతవిషాణాగ్రైః = ఐరావతము దంతముల అగ్రభాగములచేత, ఉత్కృష్టకిణవక్షసమ్ = గీయుటచే ఏర్పడిన కాయలు గల వక్షస్థలము గల (రావణుని చూచెను). 7

తా. ఆ రావణునకు దేవాసురయుద్ధములలో అనేకపర్యాయముల వజ్ర ప్రహారముచేత గాయములు తగిలి యుండెను. ఐరావతము దంతాగ్రములచేత పొడవగా అతని శరీరము మీద తగిలిన దెబ్బలు కాయలు కాసి ఉండెను. 7

మూ. వింశద్భుజం దశగ్రీవం దర్శనీయపరిచ్ఛదమ్,
విశాలవక్షసం వీరం రాజలక్షణశోభితమ్. 8

ప్ర. అ. వింశద్భుజమ్ = ఇరువది భుజములు గలవాడు, దశగ్రీవమ్ = పది కంఠములు గలవాడు, దర్శనీయపరిచ్ఛదమ్ = అందమైన ఛత్రచామరాద్యుపకరణములు కలవాడు, విశాలవక్షసమ్ = విశాలమైన వక్షఃస్థలము గలవాడు,

వీరమ్ = వీరుడు, రాజలక్షణశోభితమ్ = రాజలక్షణములతో ప్రకాశించుచున్నవాడు అయిన (రావణుణ్ణి చూచెను).

తా. విశాలమైన వక్షఃస్థలము గల వీరుడైన ఆ రావణుడు ఇరువది భుజములతో, పది తలలతో రాజలక్షణములతో ప్రకాశించుచుండెను. ఆతని సమీపమునందున్న ఛత్రచామరాద్యుపకరణములు చాల సుందరముగా ఉండెను. 8

మూ. స్నిగ్ధవైడూర్యసంకాశం తప్తకాఞ్చనకుణ్డలమ్,
సుభుజం శుక్లదశనం మహాస్యం పర్వతోపమమ్. 9

ప్ర. అ. స్నిగ్ధవైడూర్యసంకాశమ్ = నున్నని వైడూర్యమాణిక్యముతో సమానుడు, తప్తకాఞ్చనకుణ్డలమ్ = పరిశుద్ధమైన బంగారు కుండలములు గలవాడు, సుభుజమ్ = అందమైన భుజములు కలవాడు, శుక్లదశనమ్ = తెల్లని దంతములు కలవాడు, మహాస్యమ్ = పెద్ద నోరు కలవాడు, పర్వతోపమమ్ = పర్వతముతో సమానుడు (అయిన రావణుని చూచెను).

తా. ఆ రావణుని శరీరకాంతి నున్నని వైడూర్యమాణిక్యము కాంతి వలె ఉండెను. అతడు కాల్చి శుద్ధము చేసిన బంగారము కుండలములను ధరించెను. అతని భుజములు అందముగా ఉండెను. దంతములు తెల్లగా ఉండెను. పెద్ద ముఖము గల ఆతడు పర్వతము వలె ఉండెను. 9

మూ. విష్ణుచక్రనిపాతైశ్చ శతశో దేవసంయుగే,
అన్యైః శస్త్రప్రహారైశ్చ మహాయుద్ధేషు తాడితమ్. 10

ప్ర. అ. దేవసంయుగే = దేవతాయుద్ధమునందు, శతశః = వందలకొలది, విష్ణుచక్రనిపాతైశ్చ = విష్ణుచక్రముయొక్క ప్రహారములచేతను, మహాయుద్ధేషు = మహాయుద్ధములయందు, అన్యైః = ఇతరములైన, శస్త్రప్రహారైశ్చ = ఆయుధముల ప్రహారములచేతను, తాడితమ్ = కొట్టబడిన (రావణుని చూచెను).

తా. దేవతలతో యుద్ధము చేసినపుడు విష్ణుచక్రముచేత తగిలిన దెబ్బల ఆనవాళ్ళు వందలకొలది అతని శరీరముపై ఉండెను. మహాయుద్ధములలో ఆతడు ఇతరములైన ఆయుధముల ప్రహారములను కూడ పొంది ఉండెను. 10

మూ. ఆహతాఙ్గం సమస్తైశ్చ దేవప్రహరణై స్తథా,
అక్షోభ్యాణాం సముద్రాణాం క్షోభణం క్షిప్రకారిణమ్. 11

ప్ర. అ. తథా = మరియు, సమస్తైః = సమస్తమైన, దేవప్రహరణైః = దేవతల ఆయుధములచేత, ఆహతాఙ్గమ్ = కొట్టబడిన శరీరము కలవాడు, అక్షోభ్యాణామ్ = క్షోభింప శక్యము కాని, సముద్రాణామ్ = సముద్రములకు, క్షోభణమ్ = క్షోభ చేయువాడు, క్షిప్రకారిణమ్ = శీఘ్రముగా పనులు చేయువాడు అయిన (రావణుని చూచెను).

తా. ఆ రావణుని శరీరము సమస్తదేవతల ఆయుధముల దెబ్బలు తిని ఉండెను. ఆతడు క్షోభింపచేయ శక్యము కాని సముద్రములను కూడ క్షోభింప చేయ సమర్థుడు. అతడు కార్యములను శీఘ్రముగా సాధించువాడు.

మూ. క్షేప్తారం పర్వతేన్ద్రాణాం సురాణాం చ ప్రమర్దనమ్,
ఉచ్ఛేత్తారం చ ధర్మాణాం పరదారాభిమర్శనమ్. 12

ప్ర. అ. పర్వతేన్ద్రాణామ్ = పర్వతశ్రేష్ఠములకు (ను), క్షేప్తారమ్ = విసిరివేయగలవాడు, సురాణాం చ = దేవతలకు కూడ, ప్రమర్దనమ్ = సంహారకుడు, ధర్మాణామ్ = ధర్మములకు, ఉచ్ఛేత్తారమ్ = వినాశకుడు, పరదారాభిమర్శనమ్ = పరభార్యలను స్పృశించువాడు అయిన (రావణుని చూచెను).

తా. ఆ రావణుడు శ్రేష్ఠములైన పర్వతములను విసిరివేయగలవాడు. దేవతలను కూడ జయించినవాడు. ధర్మములను నశింపచేయువాడు, పరభార్యాగమనము చేయువాడు. 12

మూ. సర్వదివ్యాస్త్రయోక్తారం యజ్ఞవిఘ్నకరం సదా,
పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్య చ వాసుకిమ్, 13
తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః.

ప్ర. అ. సర్వదివ్యాస్త్రయోక్తారమ్ = సమస్తమైన దివ్యాస్త్రములను ప్రయోగించువాడు, సదా = ఎల్లప్పుడు, యజ్ఞవిఘ్నకరమ్ = యజ్ఞములకు విఘ్నము చేయువాడు అయిన (రావణుని చూచెను). యః = ఎవ్వడు, భోగవతీమ్ = భోగవతి అను, పురీమ్ = పట్టణమును, ప్రాప్య = పొంది, వాసుకిమ్ = వాసుకిని,

పరాజిత్య చ = ఓడించి, తక్షకస్య = తక్షకునియొక్క, ప్రియామ్ = ప్రియురాలైన, భార్యామ్ = భార్యను, పరాజిత్య = బలాత్కరించి, జహార = హరించెనో (అట్టి రావణుని చూచెను).

తా. ఆ రావణుడు దివ్యాస్త్రములను అన్నింటిని ప్రయోగించుటకు సమర్థుడు. యజ్ఞములకు విఘ్నము చేయువాడు. భోగవతీనగరమునకు వెళ్ళి, వాసుకిని ఓడించి, తక్షకుని ప్రియురాలైన భార్యను బలాత్కారముగా హరించినాడు. 13

మూ. కైలాసపర్వతం గత్వా విజిత్య నరవాహనమ్, 14
విమానం పుష్పకం తస్య కామగం వై జహార యః.

ప్ర. అ. యః = ఏ రావణుడు, కైలాసపర్వతమ్ = కైలాసపర్వతమును గూర్చి, గత్వా = వెళ్ళి, నరవాహనమ్ = కుబేరుణ్ణి, విజిత్య = జయించి, తస్య = ఆతనియొక్క, కామగమ్ = ఇచ్ఛానుసారము ప్రయాణముచేయు, పుష్పకమ్ = పుష్పకమును, జహార = హరించెనో (అట్టి రావణుని చూచెను).

తా. ఆ రావణుడు కైలాసపర్వతమునకు వెళ్ళి, కుబేరుణ్ణి జయించి, ఆతనికి చెందిన, ఇచ్ఛానుసారము ప్రయాణము చేసే పుష్పకవిమానమును అపహరించెను. 14

మూ. వనం చైత్రరథం దివ్యం నళినీం నన్దనం వనమ్, 15
వినాశయతి యః క్రోధాద్దేవోద్యానాని వీర్యవాన్.

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, యః = ఏ రావణుడు, దివ్యమ్ = దివ్యమైన, చైత్రరథమ్ = చైత్రరథ మనే, వనమ్ = వనమును, నళినీమ్ = పద్మసరస్సును, నన్దనం వనమ్ = నందనవనమును, దేవోద్యానాని = దేవతల ఇతరములైన ఉద్యానములను, క్రోధాత్ = క్రోధమువలన, వినాశయతి = నశింపచేయునో (ఆ రావణుని చూచెను).

తా. పరాక్రమవంతుడైన ఆ రావణుడు కోపము వచ్చినప్పుడు చైత్రరథమను వనమును, పద్మసరస్సును, నందనవనమును, దేవతల ఇతరోద్యానములను నశింపచేయుచుండును. 15

మూ. చన్ద్రసూర్యౌ మహాభాగావుత్తిష్ఠన్తౌ పరంతపః, 16
నివారయతి బాహుభ్యాం యః శైలశిఖరోపమః.

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించువాడు, శైలశిఖరోపమః = పర్వతశిఖరముతో సమానుడు అయిన, యః = ఏ రావణుడు, ఉత్తిష్ఠన్తౌ = పైకి లేచుచున్న, మహాభాగౌ = గొప్ప భాగ్యము గల, చన్ద్రసూర్యౌ = చంద్రసూర్యులను, బాహుభ్యామ్ = బాహువులచేత, నివారయతి = నివారించునో (అట్టి రావణుని చూచెను).

తా. శత్రువులను పీడించేవాడు, పర్వతశిఖరముతో సమానుడూ అయిన ఆ రావణుడు ఉదయించుచున్న, మహాభాగ్యవంతులైన చంద్రసూర్యులను బాహువులతో అడ్డుకొనగలడు. 16

మూ. దశవర్షసహస్రాణి తపస్తప్త్వా మహావనే, 17
పురా స్వయంభువే ధీరః శిరాంస్యుపజహార యః.

ప్ర. అ. ధీరః = ధీరుడైన, యః = ఏ రావణుడు, పురా = పూర్వము, మహావనే = మహారణ్యమునందు, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సరములు, తపః = తపస్సు, తప్త్వా = చేసి, స్వయంభువే = బ్రహ్మదేవునకు, శిరాంసి = శిరస్సులను, ఉపజహార = సమర్పించెనో.

తా. ధీరుడైన ఆ రావణుడు, పూర్వము, మహారణ్యములో పదివేల సంవత్సరములు తపస్సుచేసి బ్రహ్మదేవునకు శిరస్సులను సమర్పించెను. 17

మూ. దేవదానవగన్ధర్వపిశాచపతగోరగైః, 18
అభయం యస్య సంగ్రామే మృత్యుతో మానుషాదృతే.

ప్ర. అ. యస్య = ఎవనికి, సంగ్రామే = యుద్ధమునందు, మానుషాత్ ఋతే = మనుష్యునినుండి తప్ప, దేవదానవగన్ధర్వపిశాచపతగోరగైః = దేవతలచేత, దానవులచేత, గంధర్వులచేత, పిశాచములచేత, పక్షులచేత, సర్పములచేత, మృత్యుతః = మృత్యువునుండి, అభయమ్ = అభయమో (అట్టి రావణుని చూచెను).

తా. ఆ రావణుడు, యుద్ధములో మనుష్యులనుండి తప్ప, దేవతలు, దాన

వులు, గంధర్వులు, పిశాచములు, పక్షులు, సర్పములు- వీటినుండి మరణము కలుగకుండ అభయమును సంపాదించి ఉండెను. 18

మూ. మన్త్రైరభిష్టుతం పుణ్యమధ్వరేషు ద్విజాతిభిః, 19
హవిర్ధానేషు యః సోమముపహన్తి మహాబలః.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, యః = ఏ రావణుడు, అధ్వరేషు = యజ్ఞములయందు, హవిర్ధానేషు = హవిస్సు ఉంచే పాత్రలలో, ద్విజాతిభిః = బ్రాహ్మణులచేత, అభిష్టుతమ్ = తీసి ఉంచబడిన, మన్త్రైః = మంత్రములచేత, పుణ్యమ్ = పుణ్యమైన, సోమమ్ = సోమమును, ఉపహన్తి = నశింపచేయుచుండునో (అట్టి రావణుని చూచెను).

తా. మహాబలశాలియైన ఆ రావణుడు, యజ్ఞములయందు బ్రాహ్మణులు తీసి హవిస్సు ఉంచే పాత్రలలో పోసి మంత్రములచేత పవిత్రము చేసిన సోమమును దేవతలకు చెందకుండా నశింపచేయుచుండును. 19

మూ. ప్రాప్తయజ్ఞహరం క్రూరం బ్రహ్మఘ్నం దుష్టచారిణమ్,
కర్కశం నిరనుక్రోశం ప్రజానామహితే రతమ్.

ప్ర. అ. ప్రాప్తయజ్ఞహరమ్ = పూర్తికావచ్చిన యజ్ఞములను హరించువాడు, క్రూరమ్ = క్రూరుడు, బ్రహ్మఘ్నమ్ = బ్రాహ్మణులను చంపేవాడు, దుష్టచారిణమ్ = దుష్టముగా ప్రవర్తించువాడు, కర్కశమ్ = కఠినుడు, నిరనుక్రోశమ్ = జాలి లేనివాడు, ప్రజానామ్ = ప్రజలయొక్క, అహితే = హితముకాని కార్యమునందు, రతమ్ = ఆసక్తుడు అయిన (రావణుని చూచెను).

తా. ఆ రావణుడు పూర్తి కావచ్చిన యజ్ఞములను ధ్వంసము చేయును. క్రూరుడు. బ్రహ్మహత్యలు చేసినవాడు. దుష్టప్రవృత్తి కలవాడు. కఠినుడు. జాలి లేనివాడు. ప్రజలకు అహితమును చేయుటయందే ఆసక్తి కలవాడు. 20

మూ. రావణం సర్వభూతానాం సర్వలోకభయావహమ్, 21
రాక్షసీ భ్రాతరం శూరం సా దదర్శ మహాబలమ్.

ప్ర. అ. సా = ఆ, రాక్షసీ = శూర్పణఖ, సర్వభూతానామ్ = సకలభూతములకు, రావణమ్ = ఏడ్పించేవాడు, సర్వలోకభయావహమ్ = సకలలోకములకు

భయము కలిగించువాడు, శూరమ్ = శూరుడు, మహాబలమ్ = గొప్ప బలము గలవాడు అయిన, భ్రాతరమ్ = సోదరుని, దదర్శ = చూచెను.

తా. ఆ శూర్పణఖ, సర్వభూతములను ఏడ్పించినవాడు, సకలలోకములకు భయము కలిగించినవాడు, శూరుడు, మహాబలశాలి అయిన సోదరుడైన రావణుణ్ణి చూచెను. 21

మూ. తం దివ్యవస్త్రాభరణం దివ్యమాల్యోపశోభితమ్, 22
ఆసనే సూపవిష్టం చ కాలకాలమివోద్యతమ్.

ప్ర. అ. దివ్యవస్త్రాభరణమ్ = దివ్యములైన వస్త్రములు అలంకారములు కలవాడు, దివ్యమాల్యోపశోభితమ్ = దివ్యములైన పుష్పమాలలచేత ప్రకాశింపచేయబడినవాడు, ఆసనే = ఆసనమునందు, సూపవిష్టమ్ = బాగుగా కూర్చున్నవాడు, ఉద్యతమ్ = బయలుదేరిన, కాలకాలమివ = కాలమునకు కాలుడు వలె ఉన్న, తమ్ = ఆ రావణుని (చూచెను).

తా. ఆ రావణుడు దివ్యములైన వస్త్రములు, అలంకారములు, పుష్పమాలలు ధరించి ఆసనముపై చక్కగా కూర్చుండి యుండెను. ఆతడు విజృంభించిన మృత్యుదేవతకు మృత్యుదేవత వలె ఉండెను. 22

మూ. రాక్షసేన్ద్రం మహాభాగం పౌలస్త్యకులనన్దనమ్, 23
రావణం శత్రుహన్తారం మన్త్రిభిః పరివారితమ్,
అభిగమ్యాబ్రవీద్వాక్యం రాక్షసీ భయవిహ్వలా. 24

ప్ర. అ. రాక్షసీ = శూర్పణఖ, భయవిహ్వలా = భయముచేత వ్యాకులురాలై, రాక్షసేన్ద్రమ్ = రాక్షసుల ప్రభువు, మహాభాగమ్ = గొప్ప భాగ్యము కలవాడు, పౌలస్త్యకులనన్దనమ్ = పౌలస్త్యవంశమునకు ఆనందము కలిగించువాడు, శత్రుహన్తారమ్ = శత్రువులకు సంహారకుడు, మన్త్రిభిః = మంత్రులచేత, పరివారితమ్ = చుట్టుకొనబడి ఉన్నవాడు అయిన, రావణమ్ = రావణుణ్ణి, అభిగమ్య = సమీపించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భయముతో వ్యాకులురాలైన ఆ శూర్పణఖ మంత్రులతో కూడియున్న,

రాక్షసుల ప్రభువు మహాభాగ్యవంతుడు, పౌలస్త్యవంశమునకు ఆనందకరుడు, శత్రుసంహారకుడు అయిన రావణునివద్దకు వెళ్ళి ఇట్లు పలికెను. 23. 24

మూ. తమబ్రవీద్దీప్తవిశాలలోచనం
ప్రదర్శయిత్వా భయమోహమూర్ఛితా,
సుదారుణం వాక్యమభీతచారిణీ
మహాత్మనా శూర్పణఖా విరూపితా. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్వాత్రింశః సర్గః.

ప్ర. అ. అభీతచారిణీ = నిర్భయముగా సంచరించునది, మహాత్మనా = మహాత్ముడైన లక్ష్మణునిచేత, విరూపితా = విరూపముకలదిగా చేయబడినది అయిన, శూర్పణఖా = శూర్పణఖ, భయమోహమూర్ఛితా = భయముతోను, మోహముతోను వ్యాప్తురాలై, ప్రదర్శయిత్వా = తన స్థితిని చూపి, దీప్తవిశాలలోచనమ్ = ప్రజ్వలించుచున్న విశాలములైన నేత్రములు గల, తమ్ = ఆ రావణుని గూర్చి, సుదారుణమ్ = చాల దారుణమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. నిర్భయముగా సంచరించుటకు అలవాటుపడిన శూర్పణఖ, మహాత్ముడైన లక్ష్మణుడు వికృతరూపవంతురాలినిగా చేయుటచే భయమోహములతో నిండిన మనస్సు గలదై, తన దుఃస్థితిని చూపుచు, ప్రజ్వలించుచున్న విశాలనేత్రములు గల ఆ రావణునితో ఇట్లు పలికెను. 25

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయస్త్రింశః సర్గః

[శూర్పణఖ రావణుని నిందించుట].

మూ. తతః శూర్పణఖా దీనా రావణం లోకరావణమ్,
అమాత్యమధ్యే సంక్రుద్ధా పరుషం వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దీనా = దీనురాలైన, శూర్పణఖా = శూర్పణఖ, సంక్రుద్ధా = కోపించినదై, అమాత్యమధ్యే = మంత్రుల మధ్యయందు, లోకరావణమ్ = లోకములను ఏడ్పించు, రావణమ్ = రావణుని గూర్చి, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట దీనురాలైన శూర్పణఖ, లోకములను ఏడ్పించిన రావణునితో, మంత్రుల సమక్షమున, కోపముతో పరుష మైన వాక్యము పలికెను. 1

మూ. ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరఙ్కుశః,
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. 2

ప్ర. అ. ప్రమత్తః = చాల మదించినవాడవై, కామభోగేషు = కామముల భోగములయందు, స్వైరవృత్తః = స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నవాడవై, నిరఙ్కుశః = అడ్డులేనివాడవై, బోద్ధవ్యమ్ = తెలిసికొన దగిన, సముత్పన్నమ్ = పుట్టిన, ఘోరమ్ = ఘోరమైన, భయమ్ = భయమును, నావబుధ్యసే = తెలిసికొనకున్నావు.

తా. నీవు చాల గర్వముతో, స్వేచ్ఛగా కామములను అనుభవించుచు, నిరంకుశముగా ప్రవర్తించుచు వచ్చిపడిన ఘోరమైన ఆపదను తెలిసికొనవలసి ఉండి కూడ తెలుసుకొనుటలేదు. 2

మూ. సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిమ్,
లుబ్ధం న బహుమన్యన్తే శ్మశానాగ్నిమివ ప్రజాః. 3

ప్ర. అ. గ్రామ్యేషు = నీచములైన, భోగేషు = భోగములయందు, సక్తమ్ = ఆసక్తుడు, కామవృత్తమ్ = స్వేచ్ఛగా సంచరించువాడూ, లుబ్ధమ్ = దురాశకలవాడూ అయిన, మహీపతిమ్ = రాజును, ప్రజాః = ప్రజలు, శ్మశానాగ్నిమివ = శ్మశానములోని అగ్నిని వలె, న బహుమన్యన్తే = గౌరవించరు.

తా. స్వేచ్ఛగా ప్రవర్తించుచు, దురాశాపరుడై, నీచములైన భోగములలో ఆసక్తి గల రాజును ప్రజలు శ్మశానములో ఉన్న అగ్నిని వలె గౌరవించరు. 3

మూ. స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః,
స తు వై సహ రాజ్యేన తైశ్చ కార్యైర్వినశ్యతి. 4

ప్ర. అ. యః = ఏ, పార్థివః = రాజు, కాలే = తగిన కాలమునందు, కార్యాణి = కార్యములను, స్వయమ్ = స్వయముగా, నానుతిష్ఠతి = ఆచరించడో, సః = అతడు, రాజ్యేన సహ = రాజ్యముతోను, తైః = ఆ, కార్యైశ్చ సహ = కార్యములతోను, వినశ్యతి = నశించును.

తా. రాజు తాను చేయవలసిన పనులను తగు సమయమునందు స్వయముగా చేయనిచో, ఆ రాజు, ఆతని పనులు, ఆతని రాజ్యము కూడ నశించును.

మూ. అయుక్తచారం దుర్దర్శమస్వాధీనం నరాధిపమ్,
వర్జయన్తి నరా దూరాన్నదీపఙ్కమివ ద్విపాః. 5

ప్ర. అ. అయుక్తచారమ్ = ఏర్పరుపబడని గూఢచారులు కలవాడు, దుర్దర్శమ్ = చూచుటకు శక్యము కానివాడు, అస్వాధీనమ్ = తన అధీనములో లేనివాడు అయిన, నరాధిపమ్ = రాజును, నరాః = నరులు, ద్విపాః = ఏనుగులు, నదీపఙ్కమివ = నదియందలి బురదను వలె, దూరాత్ = దూరమునుండియే, వర్జయన్తి = పరిహరింతురు.

తా. గూఢచారుల ద్వారా విషయములు తెలిసికొనక, ప్రజలు చూచుటకు అందుబాటులో లేక, తననే తాను అదుపులో ఉంచుకొన జాలని రాజును ప్రజలు నదిలోని బురదను ఏనుగులు దూరమునుండియే పరిహరించినట్లు, పరిహరింతురు. 5

మూ. యే న రక్షన్తి విషయమస్వాధీనా నరాధిపాః,
తే న వృద్ధ్యా ప్రకాశన్తే గిరయః సాగరే యథా. 6

ప్ర. అ. అస్వాధీనాః = తామే తమ అధీనములో లేని, యే = ఏ, నరాధిపాః = రాజులు, విషయమ్ = దేశమును, న రక్షన్తి = రక్షించరో, తే = వాళ్లు, వృద్ధ్యా = అభివృద్ధితో, సాగరే = సముద్రములో ఉన్న, గిరయః యథా = పర్వతముల వలె, న ప్రకాశన్తే = ప్రకాశించరు.

తా. తమను తామే అదుపులో ఉంచుకొనజాలక దేశమును రక్షించని రాజులు, సముద్రములో మునిగి ఉన్న పర్వతముల వలె, అభివృద్ధితో ప్రకాశింపజాలరు. 6

మూ. ఆత్మవద్భిర్విగృహ్య త్వం దేవగన్ధర్వదానవైః,
అయుక్తచారశ్చపలః కథం రాజా భవిష్యసి. 7

ప్ర. అ. త్వమ్ = నీవు, ఆత్మవద్భిః = బుద్ధిమంతులైన, దేవగన్ధర్వదానవైః = దేవతలతోను, గంధర్వులతోను, దానవులతోను, విగృహ్య = విరోధము చేసి, అయుక్తచారః = ఏర్పరచుకొనబడని గూఢచారులు కలవాడవై, చపలః = చపలుడవై, కథమ్ = ఎట్లు, రాజా = రాజువుగా, భవిష్యసి = కాగలవు?

తా. నీవు బుద్ధిమంతులైన దేవగంధర్వదానవులతో విరోధము పెట్టుకొన్నావు. కాని గూఢచారులను ఏర్పరచుకొనక చపలచిత్తుడవుగా ప్రవర్తించుచున్నావు. అట్టి నీవు రాజు ఎట్లు కాగలవు? 7

మూ. త్వం తు బాలస్వభావశ్చ బుద్ధిహీనశ్చ రాక్షస,
జ్ఞాతవ్యం తు న జానీషే కథం రాజా భవిష్యసి. 8

ప్ర. అ. రాక్షస = ఓ! రాక్షసుడా! త్వం తు = నీవైతే, బాలస్వభావశ్చ = బాలుల స్వభావము వంటి స్వభావము కలవాడవు. బుద్ధిహీనశ్చ = బుద్ధి లేనివాడవు. జ్ఞాతవ్యమ్ = తెలిసికొనదగిన దానిని, న జానీషే = తెలుసుకొనుట లేదు. కథం = ఎట్లు, రాజా = రాజువుగా, భవిష్యసి = కాగలవు?

తా. ఓ! రాక్షసా! నీవు చపలస్వభావము కలవాడవు. బుద్ధిహీనుడవు, తెలిసికొనదగిన విషయాలు తెలిసికొనుటలేదు. నీవు రాజు ఎట్లు అగుదువు? 8

మూ. యేషాం చారశ్చ కోశశ్చ నయశ్చ జయతాం వర,
అస్వాధీనా నరేన్ద్రాణాం ప్రాకృతైస్తే జనైః సమాః. 9

ప్ర. అ. జయతామ్=జయించువారిలో, వర=శ్రేష్ఠుడా ! యేషామ్=ఏ, నరేన్ద్రాణామ్=రాజులకు, చారశ్చ=గూఢచారి, కోశశ్చ=ధనాగారము, నయశ్చ=నీతి, అస్వాధీనాః=స్వాధీనములు కావో, తే=వాళ్ళు, ప్రాకృతైః=సామాన్యులైన, జనైః=జనులతో, సమాః=సమానులు.

తా. జయించువారిలో శ్రేష్ఠుడవైన రావణా ! గూఢచారులను, కోశాగారమును, పరిపాలనావ్యవహారమును, ఏ రాజులు తమ అధీనములో ఉంచుకొనజాలరో ఆ రాజులు సామాన్యజనులతో సమానులు. 9

మూ. యస్మాత్పశ్యన్తి దూరస్థాన్ సర్వానర్థాన్నరాధిపాః,
చారేణ తస్మాదుచ్యన్తే రాజానో దీర్ఘచక్షుషః. 10

ప్ర. అ. నరాధిపాః=రాజులు, యస్మాత్=ఏ కారణమువలన, దూరస్థాన్=దూరమునందున్న, సర్వాన్=సమస్తమైన, అర్థాన్=విషయములను, చారేణ=గూఢచారి ద్వారా, పశ్యన్తి=చూచుచున్నారో, తస్మాత్=ఆ కారణమువలన, రాజానః=రాజులు, దీర్ఘచక్షుషః=దీర్ఘమైన దృష్టి కలవారుగా, ఉచ్యన్తే=చెప్పబడుచున్నారు.

తా. రాజులు దూరముగా ఉన్న విషయములను గూఢచారుల ద్వారా చూడగలుగుచున్నారు గాన రాజులు దీర్ఘదృష్టిగలవా రని చెప్పబడుదురు. 10

మూ. అయుక్తచారం మన్యే త్వాం ప్రాకృతైః సచివైర్వృతమ్,
స్వజనం తు జనస్థానం (నే)హతం యో నావబుద్ధ్యసే. 11

ప్ర. అ. అయుక్తచారమ్=సమకూర్చుకొనబడని గూఢచారులు గల, త్వామ్=నిన్ను, ప్రాకృతైః=సామాన్యులైన, సచివైః=మంత్రులతో, వృతమ్=కూడినవానినిగా, మన్యే=తలచుచున్నాను. యః=ఏ నీవు, జనస్థానే=జనస్థానమునందు, స్వజనమ్=నీ జనమును, హతమ్=చంపబడినదానినిగా, నావబుద్ధ్యసే=తెలుసుకొనుటలేదో.

తా. గూఢచారులను ఏర్పాటు చేసికొనకుండా ఉన్న నీ చుట్టూ ఉన్న మంత్రు లందరూ సామాన్యు లని తలచెదను. అందుచేతనే నీవు, జనస్థానములోని నీవాళ్ళందరూ చంపబడిరను విషయమును తెలుసుకొనలేకపోయితివి. 11

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం క్రూరకర్మణామ్,
హతాన్యేకేన రామేణ ఖరశ్చ సహ దూషణః. 12

ప్ర. అ. ఏకేన = ఒక్క, రామేణ = రామునిచేత, క్రూరకర్మణామ్ = క్రూరమైన కర్మ గల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = వేలు, హతాని = చంపబడినవి. సహదూషణః = దూషణునితో కూడిన, ఖరశ్చ = ఖరుడు కూడ (చంపబడినాడు).

తా. ఒక్క రాముడు, క్రూరమైన కర్మ గల పదునాలుగువేలమంది రాక్షసులను, ఖరదూషణులను కూడ చంపివేసినాడు. 12

మూ. ఋషీణామభయం దత్తం కృతక్షేమాశ్చ దణ్డకాః,
ధర్షితం చ జనస్థానం రామేణాక్లిష్టకర్మణా. 13

ప్ర. అ. అక్లిష్టకర్మణా = శ్రమపడకుండా పనిచేయు, రామేణ = రాముని చేత, ఋషీణామ్ = ఋషులకు, అభయమ్ = అభయము, దత్తమ్ = ఇవ్వబడినది. దణ్డకాః = దండకారణ్యము, కృతక్షేమాశ్చ = చేయబడిన క్షేమము గలవి. జనస్థానమ్ = జనస్థానము, ధర్షితం చ = ఎదిరింపబడినది.

తా. శ్రమపడకుండ కార్యములు సాధించు రాముడు ఋషీశ్వరులకు అభయము ఇచ్చినాడు. దండకారణ్యమునకు క్షేమము చేకూర్చినాడు. జనస్థానమును ఓడించినాడు. 13

మూ. త్వం తు లుబ్ధః ప్రమత్తశ్చ పరాధీనశ్చ రావణ,
విషయే స్వే సముత్పన్నం భయం యో నావబుధ్యసే. 14

ప్ర. అ. రావణ = రావణా! త్వం తు = నీవైతే, లుబ్ధః = దురాశ కలవాడవు. ప్రమత్తః = మదించి ఉన్నావు. పరాధీనశ్చ = పరాధీనుడవు, యః = ఏ

నీవు, స్వే = తనసంబంధమైన, విషయే = దేశమునందు, ఉత్పన్నమ్ = పుట్టిన, భయమ్ = భయమును, నావబుధ్యసే = తెలుసుకొనుటలేదో.

తా. రావణా! నీవు దురాశాపరుడవు. మదించి యున్నావు. ఇతరుల అధీనములో ఉన్నావు. అందుచేతనే నీ దేశములో వచ్చిన భయమును తెలుసుకొనజాలకున్నావు. 14

మూ. తీక్ష్ణమల్పప్రదాతారం ప్రమత్తం గర్వితం శఠమ్,
వ్యసనే సర్వభూతాని నాభిధావన్తి పార్థివమ్. 15

ప్ర. అ. తీక్ష్ణమ్ = తీక్ష్ణమైనవాడు, అల్పప్రదాతారమ్ = అల్పముగా ఇచ్చేవాడు, ప్రమత్తమ్ = ఏమరిపాటుతో ఉన్నవాడు, గర్వితమ్ = గర్వించినవాడు, శఠమ్=రహస్యముగా అప్రియకార్యము చేయువాడు అయిన, పార్థివమ్=రాజును, వ్యసనే = వ్యసనము కలిగినప్పుడు, సర్వభూతాని = సమస్తభూతములు, నాభిధావన్తి = పరుగెత్తి వెళ్ళి చేరవు.

తా. తీక్ష్ణమైన స్వభావము కలవాడు, అల్పముగానే ఇచ్చేవాడు, ఏమరిపాటుతో ఉన్నవాడు, గర్వించినవాడు, శఠుడు అయిన రాజుకు ఏ మైన కష్టము కలిగినప్పుడు ఎవ్వరూ ఆతని వద్దకు వెళ్ళరు. 15

మూ. అతిమానినమగ్రాహ్యమాత్మసంభావితం నరమ్,
క్రోధినం వ్యసనే హన్తి స్వజనోఽపి మహీపతిమ్. 16

ప్ర. అ. అతిమానినమ్ = అధికమైన గర్వము గలవాడు, అగ్రాహ్యమ్= గ్రహింప(చేర) తగనివాడు, ఆత్మసంభావితం నరమ్ = తనను గొప్పవానినిగా తలచే నరుడు, క్రోధినమ్ = కోపము గలవాడు, అయిన, మహీపతిమ్ = రాజును, స్వజనోఽపి = స్వజనము కూడ, వ్యసనే = కష్టకాలమునందు, హన్తి = చంపును.

తా. చాల గర్వము గలవాడు, దగ్గరకు వెళ్ళుటకు శక్యము కానివాడు, తనను తానే గొప్పగా భావించువాడు, కోపస్వభావుడు అయిన రాజును, ఆపత్కాలములో స్వజనమే చంపివేయును. 16

మూ. నానుతిష్ఠతి కార్యాణి భయేషు న బిభేతి చ,
క్షిప్రం రాజ్యాచ్చ్యుతో దీనస్తృణైస్తుల్యో భవిష్యతి. 17

ప్ర. అ. (ఏ రాజు), కార్యాణి = చేయవలసిన పనులను, నానుతిష్ఠతి = చేయడో, భయేషు = భయములందు, న బిభేతి చ = భయపడడో, (ఆ రాజు), క్షిప్రమ్ = శీఘ్రముగా, రాజ్యాత్ = రాజ్యమునుండి, చ్యుతః = భ్రష్టుడై, దీనః = దీనుడై, తృణైః = గడ్డిపరకలతో, తుల్యః = సమానుడు, భవిష్యతి = కాగలడు.

తా. భయపడవలసిన సమయములలో కూడ భయము చెందక, చేయవలసిన పనులు చేయని రాజు శీఘ్రముగా రాజ్యభ్రష్టుడై గడ్డిపరకతో సమానుడగును. 17

మూ. శుష్కైః కాష్ఠైర్భవేత్కార్యం లోష్టైరపి చ పాంసుభిః,
న తు స్థానాత్పరిభ్రష్టైః కార్యం స్యాద్వసుధాధిపైః. 18

ప్ర. అ. శుష్కైః = ఎండిన, కాష్ఠైః = కట్టెలచేతను, లోష్టైరపి = మట్టిబెడ్డలచేతను, పాంసుభిరపి చ = పరాగములచేతను కూడ, కార్యమ్ = కార్యము, భవేత్ = ఉండవచ్చును. తు = కాని, స్థానాత్ = స్థానమునుండి, పరిభ్రష్టైః = భ్రష్టులైన, వసుధాధిపైః = రాజులచేత, కార్యమ్ = కార్యము, న స్యాత్ = ఉండదు.

తా. ఎండిన కట్టెలు, మట్టిబెడ్డలు, బూడిద కూడ దేనికైన ఉపయోగించును కాని స్థానభ్రష్టులైన రాజులవలన ప్రయోజన మేమీ ఉండదు. 18

మూ. ఉపభుక్తం యథా వాసః స్రజో వా మృదితా యథా,
ఏవం రాజ్యాత్పరిభ్రష్టః సమర్థోఽపి నిరర్థకః. 19

ప్ర. అ. ఉపభుక్తమ్ = అనుభవించబడిన, వాసః = వస్త్రము, యథా = ఎట్లో, మృదితాః = నలిగిపోయిన, స్రజో వా = మాలికలు, యథా = ఎట్లో, ఏవమ్ = ఇట్లు, రాజ్యాత్ = రాజ్యమునుండి, పరిభ్రష్టః = భ్రష్టుడైన రాజు, సమర్థోఽపి = సమర్థుడే అయినను, నిరర్థకః = వ్యర్థుడు.

తా. రాజ్యభ్రష్టుడైన రాజు, ఎంత సమర్థుడైనను, కట్టి విడిచిన వస్త్రము వలె, నలిగిపోయిన పూల దండ వలె, వ్యర్థుడు. 19

మూ. అప్రమత్తశ్చ యో రాజా సర్వజ్ఞో విజితేన్ద్రియః,
కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరమ్. 20

ప్ర. అ. యః రాజా = ఏ రాజు, అప్రమత్తః = ఏమరిపాటు లేనివాడో, సర్వజ్ఞః = అన్ని విషయములు తెలిసినవాడో, విజితేన్ద్రియః = జయించబడిన ఇంద్రియములు కలవాడో, కృతజ్ఞః = కృతజ్ఞుడో, ధర్మశీలశ్చ = ధర్మస్వభావము గలవాడో, సః రాజా = ఆ రాజు, చిరమ్ = చిరకాలము, తిష్ఠతి = ఉండును.

తా. ఏమరిపాటు లేక, అన్ని విషయములు తెలిసికొనుచు, ఇంద్రియ నిగ్రహముతో, కృతజ్ఞుడై, ధర్మస్వభావము గల రాజు చాల కాలము స్థిరముగా ఉండును. 20

మూ. నయనాభ్యాం ప్రసుప్తోఽపి జాగర్తి నయచక్షుషా,
వ్యక్తక్రోధప్రసాదశ్చ స రాజా పూజ్యతే జనైః. 21

ప్ర. అ. ("త్యక్తక్రోధోఽప్రమాదశ్చ"అను ప్రాచ్యపాఠము బాగున్నది. (ఏ రాజు), నయనాభ్యామ్ = నేత్రములచేత, ప్రసుప్తోఽపి = నిద్రపోవుచున్నను, నయచక్షుషా = నీతి అనే నేత్రముతో, జాగర్తి = మేల్కొని ఉండునో, త్యక్తక్రోధః = విడువబడిన క్రోధము గలవాడూ, అప్రమాదశ్చ = ఏమరిపాటు లేనివాడు అయిన, సః రాజా = ఆ రాజు, జనైః = జనులచేత, పూజ్యతే = పూజింపబడును.

తా. ఏ రాజు, కళ్ళు మూసుకొని నిద్రపోవుచున్నా నీతి అనే నేత్రముతో మేల్కొని ఉండునో, క్రోధమును విడచి, ఏమరిపాటు లేనివాడై ప్రవర్తించునో అతనిని జనులు పూజింతురు. 21

మూ. త్వం తు రావణ దుర్బుద్ధిర్గుణైరేతైర్వివర్జితః,
యస్య తేఽవిదితశ్చారైః రక్షసాం సుమహాన్వధః. 22

ప్ర. అ. రావణ = రావణా! దుర్బుద్ధిః = దుర్బుద్ధివైన, త్వం తు = నీవైతే, ఏతైః = ఈ, గుణైః = గుణములతో, వివర్జితః = శూన్యుడవు, యస్య = ఏ, తే = నీకు, రక్షసామ్ = రాక్షసులయొక్క, సుమహాన్ = చాలగొప్పదైన, వధః = వధ, చారైః = గూఢచారులద్వారా, అవిదితః = తెలియబడలేదో.

తా. రావణా! దుర్బుద్ధి వైన నీలో ఈ గుణము లేవీ లేవు. రాక్షసుల వధను గూర్చిన విషయము కూడ నీవు గూఢచారుల ద్వారా తెలిసికొనలేకపోయి నావు. 22

మూ. పరావమన్తా విషయేషు సంగతో
న దేశకాలప్రవిభాగతత్త్వవిత్,
అయుక్తబుద్ధిర్గుణదోషనిశ్చయే
విపన్నరాజ్యో నచిరాద్విపత్స్యసే. 23

ప్ర. అ. పరావమన్తా=పరులను అవమానము చేసేవాడవు, విషయేషు= భోగములయందు, సంగతః= ఆసక్తుడవు, న దేశకాలప్రవిభాగతత్త్వవిత్ = దేశముయొక్క, కాలముయొక్క, విభాగమునందలి తత్త్వమును ఎరుగని వాడవు, గుణదోషనిశ్చయే = గుణములయొక్క దోషములయొక్క నిశ్చయమునందు, అయుక్తబుద్ధిః= కూర్చబడని బుద్ధి కలవాడవు అయిన నీవు, విపన్నరాజ్యః= నశించిన రాజ్యము కలవాడవై, నచిరాత్= అనతికాలములో, విపత్స్యసే= ఆపద చెందగలవు.

తా. నీవు పరులను అవమానించుచు భోగములయందు సక్తుడవై ఉన్నావు. ఏ దేశమునందు, ఏ కాలమునందు ఏ పని చేయవలెనో తెలియక ఏది మంచిదో, ఏది చెడ్డదో నిర్ణయింప జాలని బుద్ధితో ప్రవర్తించుచున్నావు. అందుచే అతిశీఘ్ర కాలములో నీ రాజ్యము నశించును; నీవు ఆపదలలో చిక్కుకొనగలవు. 23

మూ. ఇతి స్వదోషాన్ పరికీర్తితాంస్తయా
సమీక్ష్య బుద్ధ్యా క్షణదాచరేశ్వరః,
ధనేన దర్పేణ బలేన చాన్వితో
విచిన్తయామాస చిరం స రావణః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. క్షణదాచరేశ్వరః= రాక్షసుల ప్రభువు, ధనేన= ధనముతోను, దర్పేణ= దర్పముతోను, బలేన చ= బలముతోను, అన్వితః= కూడిన, సః

రావణః = ఆ రావణుడు, ఇతి = ఈ విధముగా, తయా = ఆమెచేత, పరికీర్తితాన్ = చెప్పబడిన, స్వదోషాన్ = తన దోషములను, బుద్ధ్యా = బుద్ధితో, సమీక్ష్య = పరిశీలించి, చిరమ్ = చాలకాలము, విచిన్తయామాస = ఆలోచించెను.

తా. అత్యధికమైన ధనము, దర్పము, బలము గల రాక్షసరాజైన ఆ రావణుడు ఆమె వర్ణించి చెప్పిన తన దోషములను గూర్చి పరిశీలించి, కారణము ఏమై ఉండును అని చాలసేపు ఆలోచించెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ముప్పదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుస్త్రింశః సర్గః

[రావణుడు ప్రశ్నించగా శూర్పణఖ అతనికి సీతాలక్ష్మణసమేతుడైన రాముని గూర్చి చెప్పి, "సీతను భార్యగా చేసికొనుము" అని అతనిని ప్రోత్సహించుట.]

మూ. తతః శూర్పణఖాం దృష్ట్వా బ్రువన్తీం పరుషం వచః,
అమాత్యమధ్యే సంక్రుద్ధః పరిపప్రచ్ఛ రావణః. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అమాత్యమధ్యే = మంత్రుల మధ్యయందు, పరుషమ్ = పరుషమైన, వచః = వచనమును, బ్రువన్తీమ్ = పలుకుచున్న, శూర్పణఖామ్ = శూర్పణఖను, దృష్ట్వా = చూచి, సంక్రుద్ధః = కోపించినవాడై, రావణః = రావణుడు, పరిపప్రచ్ఛ = అడిగెను.

తా. అమాత్యుల సమక్షములో ఈ విధముగ పరుషమైన మాటలు పలుకుచున్న శూర్పణఖను చూచి, రావణుడు కోపముతో ఇట్లు పలికెను. 1

మూ. కశ్చ రామః కథంవీర్యః కింరూపః కింపరాక్రమః,
కిమర్థం దణ్డకారణ్యం ప్రవిష్టః సుదురాసదమ్. 2

ప్ర. అ. రామః = రాముడు, కః = ఎవడు ? కథంవీర్యః = ఎట్టి బలము కలవాడు ? కింరూపః = ఎట్టి రూపము కలవాడు ? కింపరాక్రమః = ఎట్టి పరాక్రమము కలవాడు ? సుదురాసదమ్ = ప్రవేశించుటకు చాల కష్టమైన, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, కిమర్థమ్ = ఎందునిమిత్తము, ప్రవిష్టః = ప్రవేశించినాడు?

తా. ఆ రాముడు ఎవ్వడు? ఆతని బలము ఎట్టిది? ఆతని రూపము ఎట్లుండును ? ఆతని పరాక్రమము ఎట్టిది ? ప్రవేశించుటకు చాల కష్టమైన దండకారణ్యములోనికి ఎందుకు ప్రవేశించినాడు ? 2

మూ. ఆయుధం కిం చ రామస్య నిహతా యేన రాక్షసాః,
ఖరశ్చ నిహతః సంఖ్యే దూషణస్త్రిశిరాస్తథా. 3

ప్ర. అ. యేన=ఏ రామునిచేత, రాక్షసాః=రాక్షసులు, ఖరశ్చ=ఖరుడు, దూషణః = దూషణుడు, తథా = మరియు, త్రిశిరాః = త్రిశిరస్సు, సంఖ్యే = యుద్ధమునందు, నిహతాః = చంపబడినారో, రామస్య = అట్టి రాముని యొక్క, ఆయుధమ్ = ఆయుధము, కిమ్ = ఏమి ?

తా. యుద్ధములో రాక్షసులను, ఖరుణ్ణి,దూషణుణ్ణి, త్రిశిరస్సును చంపిన ఆ రాముని ఆయుధము ఏమి ? 3

మూ. ఇత్యుక్తా రాక్షసేన్ద్రేణ రాక్షసీ క్రోధమూర్ఛితా,
తతో రామం యథాతత్త్వమాఖ్యాతుముపచక్రమే. 4

ప్ర. అ. రాక్షసేన్ద్రేణ = రావణునిచేత, ఇతి = ఇట్లు, ఉక్తా=పలకబడిన, క్రోధమూర్ఛితా=కోపముతో నిండిన, రాక్షసీ=శూర్పణఖ, తతః=అటుపిమ్మట, రామమ్ = రాముణ్ణి గూర్చి, యథాతత్త్వమ్=ఉన్నది ఉన్నట్లుగా, ఆఖ్యాతుమ్= చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. క్రోధావిష్టురాలైన ఆ శూర్పణఖ రావణుని మాటలు విని, రాముణ్ణి గూర్చి ఉన్నది ఉన్నట్లు చెప్పుటకు ప్రారంభించెను. 4

మూ. దీర్ఘబాహుర్విశాలాక్షశ్చీరకృష్ణాజినామ్బరః,
కన్దర్పసమరూపశ్చ రామో దశరథాత్మజః. 5

ప్ర. అ. దశరథాత్మజః = దశరథుని కుమారుడైన, రామః = రాముడు, దీర్ఘబాహుః = దీర్ఘమైన బాహువులు కలవాడు. విశాలాక్షః = విశాలములైన నేత్రములు కలవాడు. చీరకృష్ణాజినామ్బరః = నారచీరలు, కృష్ణాజినము వస్త్రములుగా కలవాడు. కన్దర్పసమరూపశ్చ = మన్మథునితో సమానమైన రూపము కలవాడు.

తా. దశరథుని కుమారుడైన రాముడు ఆజానుబాహువు, విశాలములైన నేత్రములు కలవాడు. నారచీరను, కృష్ణాజినమును వస్త్రముగా ధరించినవాడు. మన్మథునితో సమానమైన సౌందర్యము కలవాడు. 5

మూ. శక్రచాపనిభం చాపం వికృష్య కనకాఙ్గదమ్,
దీప్తాన్ క్షిపతి నారాచాన్ సర్పానివ మహావిషాన్. 6

ప్ర. అ. శక్రచాపనిభమ్ = ఇంద్రధనస్సుతో సమానమైన, కనకాఙ్గదమ్ = బంగారు కట్లు గల, చాపమ్ = ధనస్సును, వికృష్య = లాగి, మహావిషాన్ = గొప్ప విషము గల, సర్పానివ = సర్పముల వంటి, దీప్తాన్ = ప్రకాశించుచున్న, నారాచాన్ = నారాచబాణములను, క్షిపతి = చిమ్మును.

తా. ఇంద్రధనస్సు వలె ఉన్న, బంగారు కట్లు కట్టిన ధనస్సును లాగి, మహావిషము గల సర్పముల వలె ఉన్న, ప్రజ్వలించుచున్న నారాచబాణములను ప్రయోగించును. 6

మూ. నాదదానం శరాన్ఘోరాన్న ముఞ్చన్తం శిలీముఖాన్,
న కార్ముకం వికర్షన్తం రామం పశ్యామి సంయుగే. 7

ప్ర. అ. సంయుగే = యుద్ధమునందు, ఘోరాన్ = భయంకరములైన, శరాన్ = బాణములను, ఆదదానమ్ = గ్రహించుచున్న, రామమ్ = రాముణ్ణి, న పశ్యామి = చూడను. శిలీముఖాన్ = బాణములను, ముఞ్చన్తమ్ = విడచుచున్న వానిని, న = చూడను. కార్ముకమ్ = ధనస్సును, వికర్షన్తమ్ = లాగుచున్న వానిని, న = చూడను.

తా. రాముడు భయంకరములైన బాణములను ఎప్పుడు తీయుచుండెనో, ధనస్సును ఎప్పుడు లాగుచుండెనో, బాణాలను ఎప్పుడు ప్రయోగించుచుండెనో నాకు కనబడలేదు. 7

మూ. హన్యమానం తు తత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః,
ఇన్ద్రేణేవోత్తమం సస్యమాహతం త్వశ్మవృష్టిభిః. 8

ప్ర. అ. ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, అశ్మవృష్టిభిః = రాళ్ల వానలచేత, ఆహతమ్ = కొట్టబడిన, సస్యమివ = సస్యమును వలె, శరవృష్టిభిః = బాణవర్షముల చేత, హన్యమానమ్ = చంపబడుచున్న, తత్ సైన్యమ్ = ఆ సైన్యమును మాత్రమే, పశ్యామి = చూచుచున్నాను (చూచితిని).

తా. ఇంద్రుడు వర్షించిన రాళ్ళవానచే సస్యము నశించినట్లు బాణవర్షముచేత ఆ సైన్యము చచ్చుచుండుట మాత్రమే నాకు కనబడినది. 8

మూ. రక్షసాం భీమరూపాణాం సహస్రాణి చతుర్దశ,
నిహతాని శరై స్తీక్ష్ణైస్తేనైకేన పదాతినా. 9
అర్ధాధికముహూర్తేన ఖరశ్చ సహదూషణః.

ప్ర. అ. పదాతినా = పాదచారియైన, ఏకేన = ఒక్క, తేన = ఆ రాముని చేత, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, శరైః = బాణములచేత, అర్ధాధికముహూర్తేన = సగము అధికముగా గల ఒక ముహూర్తకాలముచేత, భీమరూపాణామ్ = భయంకరమైన రూపముగల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = సహస్రములు, నిహతాని = చంపబడినవి. సహదూషణః = దూషణునితో కూడిన, ఖరశ్చ = ఖరుడు కూడ, చంపబడినాడు.

తా. ఒంటరివాడైన ఆ రాముడు పాదచారిగా ఉండి, ఒకటిన్నర ముహూర్తముల కాలములో (1-12 గంటల కాలములో), భయంకరములైన రూపములు గల పదునాలుగు వేల మంది రాక్షసులను, ఖరుణ్ణి, దూషణుణ్ణి వాడియైన బాణములచేత సంహరించినాడు. 9

మూ. ఋషీణామభయం దత్తం కృతక్షేమాశ్చ దణ్డకాః, 10
ఏకా కథంచిన్ముక్తాహం పరిధూయ మహాత్మనా,
స్త్రీవధం శఙ్కమానేన రామేణ విదితాత్మనా. 11

ప్ర. అ. ఋషీణామ్ = ఋషులకు, అభయమ్ = అభయము, దత్తమ్ = ఇవ్వబడినది. దణ్డకాః = దండకారణ్యము, కృతక్షేమాశ్చ = ఏర్పరుపబడిన క్షేమము గలవి. మహాత్మనా = మహాత్ముడు, విదితాత్మనా = ప్రసిద్ధమైన బుద్ధి గలవాడు, స్త్రీవధమ్ = స్త్రీవధను గూర్చి, శఙ్కమానేన = శంకించుచున్న వాడు అయిన, రామేణ = రామునిచేత, అహమ్ = నేను, ఏకా = ఒక్కదానను, పరిధూయ = తిరస్కరించి, కథంచిత్ = ఎట్లో, ముక్తా = విడువబడితిని.

తా. రాముడు ఋషులకు అభయ మిచ్చి దండకారణ్యమునకు క్షేమము కూర్చినాడు. మహాత్ముడు, ప్రసిద్ధమైన బుద్ధి గలవాడు అయిన ఆ రాముడు స్త్రీని

చంపుటకు శంకించి, ఎట్లో నన్నొక్కదానిని మాత్రము తిరస్కరించి, చంప కుండ విడచినాడు. 10,11

మూ. భ్రాతా చాస్య మహాతేజా గుణవాంస్తుల్యవిక్రమః,
అనురక్తశ్చ భక్తశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్. 12

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు, గుణవాన్ = గుణవంతుడు, తుల్యవిక్రమః = రామునితో సమానమైన పరాక్రమము గలవాడు, అనురక్తశ్చ = అనురాగము గలవాడు, భక్తశ్చ = భక్తుడు, వీర్యవాన్ = బలవంతుడు అయిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డను పేరు గలవాడు, అస్య = ఈ రాముని యొక్క, భ్రాతా = సోదరుడు.

తా. ఆ రామునకు ఆతనితో సమానమైన పరాక్రమము గలవాడు, గొప్ప తేజస్సు, సద్గుణములు కలవాడు, అన్నమీద ప్రేమభక్తులు కలవాడు, బలశాలి అయిన లక్ష్మణు డనే సోదరు డున్నాడు. 12

మూ. అమర్షీ దుర్జయో జేతా విక్రాన్తో బుద్ధిమాన్ బలీ,
రామస్య దక్షిణో బాహుర్నిత్యం ప్రాణో బహిశ్చరః. 13

ప్ర. అ. అమర్షీ = కోపముగలవాడు, దుర్జయః = జయింప శక్యముకానివాడు, జేతా = జయించువాడు, విక్రాన్తః = పరాక్రమవంతుడు, బుద్ధిమాన్ = బుద్ధిగలవాడు, బలీ = బలశాలి అయిన ఆ లక్ష్మణుడు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, రామస్య = రామునియొక్క, దక్షిణః బాహుః = కుడిచెయ్యి. బహిశ్చరః = బైట సంచరించు, ప్రాణః = ప్రాణము.

తా. చాల కోపము కలవాడు, జయింప శక్యముకానివాడు, జయించువాడు, పరాక్రమవంతుడు, బుద్ధిమంతుడు, బలశాలి అయిన ఆ లక్ష్మణుడు ఎల్లప్పుడు రామునకు కుడి చేయి వలె ఉండును. అతడు రాముని బైట సంచరించు ప్రాణము. 13

మూ. రామస్య తు విశాలాక్షీ పూర్ణేన్దుసదృశాననా,
ధర్మపత్నీ ప్రియా భర్తుర్నిత్యం ప్రియహితే రతా. 14

ప్ర. అ. విశాలాక్షీ = విశాలములైన నేత్రములు కలది, పూర్ణేన్దుసదృశాననా = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము కలది అయిన, రామస్య =

రామునియొక్క, ధర్మపత్నీ = ధర్మపత్ని, భర్తుః = భర్తకు, ప్రియా = ప్రియురాలు. నిత్యమ్ = ఎల్లప్పుడు, ప్రియహితే = ప్రియుని హితమునందు, రతా = ఆసక్తిగలది.

తా. రాముని భార్య విశాలములైన నేత్రములు, పూర్ణచంద్రుని వంటి ముఖము గలది. భర్తకు చాల ప్రియురాలు. ఆమె ఎల్లప్పుడు భర్త హితమునే కోరును. 14

మూ. సా సుకేశీ సునాసోరుః సురూపా చ యశస్వినీ,
దేవతేవ వనస్యాస్య రాజతే శ్రీరివాపరా. 15

ప్ర. అ. సుకేశీ = మంచి కేశములు గలది, సునాసోరుః = అందమైన ముక్కు తొడలు కలది, సురూపా చ = మంచి రూపము గలది, యశస్వినీ = కీర్తి గలది అయిన, సా = ఆమె, అస్య = ఈ, వనస్య = వనముయొక్క, దేవతేవ = దేవత వలె, అపరా = రెండవ, శ్రీరివ = లక్ష్మీదేవి వలె, రాజతే = ప్రకాశించు చున్నది.

తా. అందమైన జుట్టు, ముక్కు, తొడలు గల, సౌందర్యవతి యైన ఆ కీర్తిమంతురాలు జనస్థానమునకు దేవత వలె, రెండవ లక్ష్మీదేవి వలె ప్రకాశించు చున్నది. 15

మూ. తప్తకాఞ్చనవర్ణాభా రక్తతుఙ్గనఖీ శుభా,
సీతా నామ వరారోహా వైదేహీ తనుమధ్యమా. 16

ప్ర. అ. తప్తకాఞ్చనవర్ణాభా = కాల్చి శుద్ధిచేసిన బంగారము వర్ణము వంటి కాంతి గలది, రక్తతుఙ్గనఖీ = ఎఱ్ఱని ఎత్తైన గోళ్ళు గలది, శుభా = మంగళప్రదురాలు, వైదేహీ = విదేహరాజుకూతురు. తనుమధ్యమా = సన్నని నడుము కలది అయిన ఆమె, సీతా నామ = సీత అను పేరు గలది.

తా. ఆమె శరీరకాంతి శుద్ధమైన బంగారము వర్ణము వంటిది. మంగళప్రదురాలైన ఆమె గోళ్లు ఎఱ్ఱగాను, ఎత్తుగాను ఉండును. నడుము సన్నగా ఉండును. విదేహరాజకుమారి యైన ఆమె పేరు సీత. 16

మూ. నైవ దేవీ న గన్ధర్వీ న యక్షీ న చ కింనరీ,
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే. 17

ప్ర. అ. ఏవంరూపా = ఇట్టి రూపము గల, దేవీ = దేవతాస్త్రీ, మయా = నాచేత, నైవ దృష్టపూర్వా = పూర్వము చూడబడలేదు. గన్ధర్వీ = గంధర్వస్త్రీ, న = చూడబడలేదు. యక్షీ = యక్షస్త్రీ, న = చూడబడలేదు. కింనరీ = కింనర స్త్రీ, న = చూడబడలేదు. నారీ = మనుష్యస్త్రీ, మహీతలే = భూలోకములో, న = చూడబడలేదు.

తా. ఇట్టి సౌందర్యము గల దేవతాస్త్రీని గాని, గంధర్వస్త్రీని గాని, యక్ష స్త్రీని గాని, కింనరస్త్రీని గాని, భూలోకములో ఉండే మనుష్యస్త్రీని గాని నేనెన్నడూ చూడలేదు. 17

మూ. యస్య సీతా భవేద్భార్యా యం చ హృష్టా పరిష్వజేత్,
అతిజీవేత్స సర్వేషు లోకేష్వపి పురన్దరాత్. 18

ప్ర. అ. యస్య = ఎవనికి, సీతా = సీత, భార్యా = భార్యగా, భవేత్ = అగునో, హృష్టా = సంతోషించినదై, యమ్ = ఎవనిని, పరిష్వజేత్ = కౌగలించుకొనునో, సః = అతడు, సర్వేషు = సమస్తమైన, లోకేషు = లోకములయందు, పురన్దరాత్ అపి = దేవేంద్రునికంటె గూడ, అతిజీవేత్ = అతిశయించి జీవించును.

తా. సీతను భార్యగా పొందగలిగినవాడు, సీత ఆనందపూర్వకముగా ఎవనిని కౌగలించుకొనునో అతడు, అన్ని లోకములలోను దేవేంద్రునికంటె కూడ గొప్పవాడుగా జీవించును. 18

మూ. సా సుశీలా వపుఃశ్లాఘ్యా రూపేణాప్రతిమా భువి,
తవానురూపా భార్యా స్యాత్త్వం చ తస్యాస్తథా పతిః. 19

ప్ర. అ. సుశీలా = మంచి శీలము కలది, వపుఃశ్లాఘ్యా = దేహముచేత శ్లాఘింపదగినది, రూపేణ = సౌందర్యముచేత, భువి = భూలోకమునందు, అప్రతిమా = సాటి లేనిది అయిన, సా = ఆమె, తవ = నీకు, అనురూపా = తగిన, భార్యా = భార్య, స్యాత్ = అగును. తథా = అట్లే, త్వమ్ = నీవు, తస్యాః = ఆమెకు తగిన, పతిః = భర్తవు అగుదువు.

తా. మంచి శీలము, శ్లాఘించదగిన శరీరము, భూలోకములో సాటి లేని రూపము గల ఆమె నీకు తగిన భార్య అగును. నీవు ఆమెకు తగిన భర్తవు అగుదువు. 19

మూ. తాం తు విస్తీర్ణజఘనాం పీనశ్రోణిపయోధరామ్,
భార్యార్థే తు తవానేతుముద్యతాహం వరాననామ్, 20
విరూపితాస్మి క్రూరేణ లక్ష్మణేన మహాభుజ.

ప్ర. అ. మహాభుజ = గొప్ప భుజములు కలవాడా ! విస్తీర్ణజఘనామ్ = విశాలమైన జఘనము కలది, ప్రీనశ్రోణిపయోధరామ్ = బలిసిన కటిప్రదేశము, స్తనములూ కలది అయిన, తాం వరాననామ్ = సుందరమైన ముఖము గల ఆ సీతను, తవ = నీయొక్క, భార్యార్థే = భార్య అగుటకై, ఆనేతుమ్ = తీసికొని వచ్చుటకు, ఉద్యతా = ఉద్యుక్తురాలనైన, అహమ్ = నేను, క్రూరేణ = క్రూరుడైన, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, విరూపితా అస్మి = విరూపము కలదానినిగా చేయబడితిని.

తా. గొప్ప భుజములు కలవాడా ! విశాలమైన జఘనము, బలిసిన కటి ప్రదేశము, స్తనములు, సుందరమైన ముఖము గల ఆ సీతను నీకు భార్యగా చేయుటకై తీసికొనివచ్చుటకు నేను ప్రయత్నము చేయగా, క్రూరుడైన లక్ష్మణుడు నన్ను అవయవములు ఖండించి విరూపను చేసినాడు. 20

మూ. తాం తు దృష్ట్వాద్య వైదేహీం పూర్ణచన్ద్రనిభాననామ్,
మన్మథస్య శరాణాం వై త్వం విధేయో భవిష్యసి.

ప్ర. అ. పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల, తామ్ = ఆ, వైదేహీమ్ = సీతను, అద్య = ఇప్పుడు, దృష్ట్వా = చూచి, త్వమ్ = నీవు, మన్మథస్య = మన్మథునియొక్క, శరాణామ్ = బాణములకు, విధేయః = విధేయుడవు, భవిష్యసి = కాగలవు.

తా. పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల ఆ సీతను నీవు ఇప్పుడు చూచినచో మన్మథుని బాణములకు లొంగిపోవుదువు. 21

మూ. యది తస్యామభిప్రాయో భార్యార్థే తవ జాయతే, 22
శీఘ్రముద్ధ్రియతాం పాదో జయార్థమిహ దక్షిణః.

ప్ర. అ. తస్యామ్ = ఆమెయందు, తవ = నీకు, భార్యార్థే=భార్యగా చేసికొనుటకై, అభిప్రాయః = అభిప్రాయము, జాయతే యది = పుట్టిన ట్లయితే, ఇహ = ఇప్పుడే, జయార్థమ్=జయమునిమిత్తము, దక్షిణః పాదః=కుడి పాదము, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఉద్ధ్రియతామ్ = ఎత్తబడుగాక.

తా. ఆమెను భార్యగా పొందవలె నని నీకు అభిప్రాయము కలిగినచో, ఇప్పుడే శీఘ్రముగా, విజయమునిమిత్తమై కుడి పాదమును ఎత్తుము (బయలుదేరుము).
22

మూ. కురు ప్రియం తథా తేషాం రక్షసాం రాక్షసేశ్వర, 23
వధాత్తస్య నృశంసస్య రామస్యాశ్రమవాసినః.

ప్ర. అ. రాక్షసేశ్వర = రాక్షసరాజా ! తథా = మఱియు, నృశంసస్య = క్రూరుడైన, ఆశ్రమవాసినః = ఆశ్రమములో నివసించుచున్న, తస్య రామస్య = ఆ రామునియొక్క, వధాత్ = వధవలన, తేషామ్ = ఆ, రక్షసామ్=రాక్షసులకు, ప్రియమ్ = ప్రియమును, కురు = చేయుము.

తా. రాక్షసరాజా! ఆశ్రమములో నివసించుచున్న, క్రూరుడైన ఆ రాముణ్ణి చంపుటచే ఆతనిచే చంపబడిన రాక్షసు లందరికీ ప్రియము చేసినవాడవు కూడ అగుదువు.
23

మూ. తం శరైర్నిశితైర్హత్వా లక్ష్మణం చ మహారథమ్, 24
హతనాథాం సుఖం సీతాం యథావదుపభోక్ష్యసి.

ప్ర. అ. మహారథమ్=మహారథుడైన, తం=ఆ రాముని, లక్ష్మణం చ= ఆ లక్ష్మణునీ, నిశితైః = వాడియైన, శరైః = బాణములచేత, హత్వా = చంపి, హతనాథామ్ = చంపబడిన నాథుడు గల, సీతామ్ = సీతను, సుఖమ్ = సుఖముగ, యథావత్ = తగు విధముగ, ఉపభోక్ష్యసి = అనుభవించగలవు.

తా. మహారథుడైన రాముణ్ణి, లక్ష్మణుణ్ణి కూడ వాడియైన బాణాలచేత

చంపి, నీవు, నాథుడు మరణించిన సీతను సుఖముగా యథేష్టముగా అనుభవించ వచ్చును.

వి. పై రెండు శ్లోకాలు గోరఖ్‌పూర్ ప్రతిలో లేవు. 24

మూ. రోచతే యది తే వాక్యం మమైతద్రాక్షసేశ్వర,
క్రియతాం నిర్విశఙ్కేన వచనం మమ రావణ. 25

ప్ర. అ. రాక్షసేశ్వర = రాక్షసప్రభువైన, రావణ = రావణా ! మమ = నాయొక్క, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యము, తే = నీకు, రోచతే యది = ఇష్టమైన ట్లయితే, నిర్విశఙ్కేన = శంక లేని నీచేత, మమ = నాయొక్క, వచనమ్ = వచనము, క్రియతామ్ = చేయబడుగాక.

తా. రాక్షసరాజువైన రావణా ! నీకు నా మాట ఇష్టమైనచో, ఎట్టి సందేహమూ లేకుండా నేను చెప్పినట్లు చేయుము. 25

మూ. విజ్ఞాయేహాత్మశక్తిం చ హ్రియతామబలా బలాత్,
సీతా సర్వానవద్యాఙ్గీ భార్యార్థే రాక్షసేశ్వర. 26

ప్ర. అ. రాక్షసేశ్వర = రాక్షసరాజా ! ఆత్మశక్తిమ్ = నీ శక్తిని, విజ్ఞాయ = తెలుసుకొని, సర్వానవద్యాఙ్గీ = దోషములులేని అన్ని అవయవములు కలది, అబలా = దుర్బలురాలు అయిన, సీతా = సీత, భార్యార్థే = భార్యగా అగుటకు, బలాత్ = బలాత్కారమువలన, హ్రియతామ్ = అపహరించబడుగాక.

తా. రాక్షసరాజా ! నీవు మహాబలవంతుడవను విషయమును కూడ గుర్తు ఉంచుకొని, ఎట్టి దోషములు లేని సకలావయవములు గల, దుర్బలురాలైన సీతను బలాత్కారముగా అపహరించి తీసికొని వచ్చి భార్యగా చేసికొనుము. 26

మూ. నిశమ్య రామేణ శరైరజిహ్మగై
ర్హతాన్ జనస్థానగతాన్ నిశాచరాన్,
ఖరం చ బుద్ధ్వా నిహతం చ దూషణం
త్వమత్ర కృత్యం ప్రతిపత్తుమర్హసి. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుస్త్రింశః సర్గః.

ప్ర. అ. రామేణ = రామునిచేత, అజిహ్మగైః = వంకర లేకుండా పోవు నట్టి, శరైః = బాణములచేత, జనస్థానగతాన్ = జనస్థానములో ఉన్న, నిశాచరాన్ = రాక్షసులను, హతాన్ = చంపబడిన వానినిగా, నిశమ్య = విని, ఖరం చ = ఖరుణ్ణి, దూషణం చ = దూషణుణ్ణి, నిహతమ్ = చంపబడిన వానినిగా, బుద్ధ్వా = తెలిసికొని, త్వమ్ = నీవు, అత్ర = ఈ విషయమునందు, కృత్యమ్ = చేయదగిన పనిని, ప్రతిపత్తుమ్ = నిర్ణయించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. వంకరగా కాక తిన్నగా పోవు బాణములచేత రాముడు జనస్థానములో ఉన్న రాక్షసులను ఖరదూషణులను కూడ సంహరించినా డన్న విషయము తెలిసికొని నీవు ఇప్పుడు ఏమి చేయవలెనో నిర్ణయించుకొనుము. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ముప్పది నాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చత్రింశః సర్గః

[రావణుడు సాగరము ప్రక్కనున్న జలప్రాయదేశము చూచుచు మారీచునివద్దకు వెళ్ళుట].

మూ. తతః శూర్పణఖావాక్యం తచ్ఛ్రుత్వా రోమహర్షణమ్,
సచివానభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ హ. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట.(రావణుడు), రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించు (భయంకరమైన) తత్ = ఆ, శూర్పణఖావాక్యమ్=శూర్పణఖ వాక్యమును, శ్రుత్వా = విని, సచివాన్ = మంత్రులను, అభ్యనుజ్ఞాయ=వెళ్లుటకు అనుమతించి, కార్యమ్ = చేయవలసిన పనిని, బుద్ధ్వా = తెలిసికొని, జగామ హ = వెళ్లెను.

తా. రావణుడు శూర్పణఖ చెప్పిన భయంకరమైన విషయమును విని, మంత్రులకు వెళ్లుటకై అనుమతి ఇచ్చి, చేయవలసిన కార్యమును నిర్ణయించుకొని వెళ్లెను. 1

మూ. తత్కార్యమనుగమ్యాథ యథావదవబుద్ధ్య చ,
దోషాణాం చ గుణానాం చ సంప్రధార్య బలాబలమ్. 2

ఇతి కర్తవ్యమిత్యేవ కృత్వా నిశ్చయమాత్మనః,
స్థిరబుద్ధిస్తతో రమ్యాం యానశాలాం జగామ హ. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తత్ = ఆ, కార్యమ్ = కార్యమును, అనుగమ్య = ఆలోచించి, యథావత్ = తగిన రీతిగా, అవబుద్ధ్య చ = తెలిసికొని, దోషాణామ్ = దోషములయొక్క, గుణానాం చ = గుణములయొక్క, బలాబలమ్ = బలాబలములను, సంప్రధార్య = నిర్ణయించుకొని, ఇతి = ఈ విధముగా, కర్తవ్యమ్ ఇత్యేవ = చేయవలెను అని. ఆత్మనః = తనయొక్క, నిశ్చయమ్ =

నిశ్చయమును, కృత్వా = చేసికొని, స్థిరబుద్ధిః = స్థిరమైన బుద్ధి కలవాడై, తతః = అటు పిమ్మట, యానశాలామ్ = వాహనముల శాలను గూర్చి, జగామ హ = వెళ్లెను.

తా. పిమ్మట రావణుడు ఆ కార్యమును గూర్చి బాగా ఆలోచించి, విషయమును ఉన్నదున్నట్లు గ్రహించెను. గుణములు అధికముగా ఉన్నవా దోషములు అధికముగా ఉన్నవా అని జాగరూకతగా పరిశీలించి "ఈ విధముగానే చేయవలెను" అని తన కర్తవ్యమును నిర్ణయించుకొని, స్థిరమైన బుద్ధితో వాహనశాలకు వెళ్లెను. 2, 3

మూ. యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః,
సూతం సంచోదమామాస రథః సంయోజ్యతామితి. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాక్షసాధిపః = రావణుడు, ప్రచ్ఛన్నః = దాగి ఉన్నవాడై, యానశాలామ్ = వాహనశాలను గూర్చి, గత్వా = వెళ్ళి, రథః = రథము, సంయోజ్యతామ్ = కట్టబడుగాక, ఇతి = అని, సూతమ్ = సారథిని, సంచోదయామాస = ప్రేరేపించెను.

తా. పిమ్మట రావణుడు రహస్యముగా వాహనశాలకు వెళ్ళి, "రథమును కట్టుము"అని సారథిని ఆజ్ఞాపించెను. 4

మూ. ఏవముక్తః క్షణేనైవ సారథిర్లఘువిక్రమః,
రథం సంయోజయామాస తస్యాభిమతముత్తమమ్. 5

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లఘువిక్రమః = శీఘ్రమైన గమనముగల, సారథిః = సారథి, తస్య=ఆతనికి, అభిమతమ్=ఇష్టమైన, ఉత్తమమ్ = ఉత్తమమైన, రథమ్ = రథమును, క్షణేనైన = క్షణకాలముచేతనే, సంయోజయామాస = కూర్చెను.

తా. రావణుని ఆజ్ఞ ప్రకారము, సారథి శీఘ్రముగా ప్రవర్తించుచు, ఆ రావణునికి ఇష్టమైన, ఉత్తమమైన రథమును క్షణకాలములో సిద్ధము చేసెను. 5

మూ. కాఞ్చనం రథమాస్థాయ కామగం రత్నభూషితమ్,
పిశాచవదనైర్యుక్తం ఖరైః కాఞ్చనభూషణైః. 6

మేఘప్రతిమనాదేన స తేన ధనదానుజః,
రాక్షసాధిపతిః శ్రీమాన్ యయౌ నదనదీపతిమ్. 7

ప్ర. అ. ధనదానుజః = కుబేరుని తమ్ముడు, శ్రీమాన్ = శోభాయుక్తుడు అయిన, సః రాక్షసాధిపతిః = ఆ రావణుడు, కాఞ్చనభూషణైః = బంగారు అలంకారములు గల, పిశాచవదనైః = పిశాచముల వంటి ముఖములు గల, ఖరైః = గాడిదలతో, యుక్తమ్ = కూర్చబడిన, కాఞ్చనమ్ = బంగారువికారమైన, కామగమ్ = ఇష్టానుసారము నడచు, రత్నభూషితమ్ = రత్నములచేత అలంకరించ బడిన, రథమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, మేఘప్రతిమనాదేన = మేఘముతో సమానమైన ధ్వని గల, తేన = ఆ రథముచేత, నదనదీపతిమ్ = (పశ్చిమముఖముగా ప్రవహించు) నదములకు, (తూర్పుముఖముగా ప్రవహించు) నదులకు ప్రభువైన సముద్రమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. కుబేరుని తమ్ముడు, శ్రీమంతుడు అయిన రావణుడు ఆ బంగారు రథము నెక్కెను. రథికుని ఇష్టానుసారము ప్రయాణము చేయు ఆ రథము రత్నములచేత అలంకరింపబడెను. బంగారు అలంకారములు అలంకరించిన గాడిదలు దానికి కట్టబడెను. వాటి ముఖములు పిశాచముల ముఖములు వలె ఉండెను. మేఘ ధ్వనితో సమానమైన ధ్వని గల అట్టి రథము నెక్కి అతడు నదములకు, నదులకు భర్తయైన సముద్రము వైపు వెళ్లెను. 6, 7

మూ. స శ్వేతవాలవ్యజనః శ్వేతచ్ఛత్రో దశాననః,
స్నిగ్ధవైదూర్యసంకాశ స్తప్తకాఞ్చనకుణ్డలః. 8

వింశద్భుజో దశగ్రీవో దర్శనీయపరిచ్ఛదః,
త్రిదశారిర్మునీన్ద్రఘ్నో దశశీర్ష ఇవాద్రిరాట్. 9

కామగం రథమాస్థాయ శుశుభే రాక్షసేశ్వరః,
విద్యున్మణ్డలవాన్మేఘః సబలాక ఇవామ్బరే. 10

ప్ర. అ. శ్వేతవాలవ్యజనః = తెల్లని వింజామరలు కలవాడు, శ్వేతచ్ఛత్రః = తెల్లని ఛత్రము కలవాడు, దశాననః = పది ముఖములు కలవాడు, స్నిగ్ధవైదూర్య సంకాశః = నున్నని వైడూర్యమాణిక్యముతో సమానుడు, తప్తకాఞ్చనః కుణ్డలః

= పరిశుద్ధమైన బంగారపు కుండలములు కలవాడు, వింశద్భుజః = నూరు భుజములు గలవాడు, దశగ్రీవః = పది కంఠములు కలవాడు, దర్శనీయపరిచ్ఛదః = అందమైన రాజచిహ్నములు కలవాడు, త్రిదశారిః=దేవతల శత్రువు, మునీన్ద్రఘ్నః = మునీంద్రులను చంపువాడు, దశశీర్షః=పది శిఖరములు గల, అద్రిరాడివ= పర్వతరాజు వలె ఉన్నవాడు అయిన, సః రాక్షసేశ్వరః = ఆ రావణుడు, కామగమ్ = ఇచ్ఛానుసారము వెళ్ళు. రథమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, అమ్బరే = ఆకాశమునందు, విద్యున్మణ్డలవాన్ = మెరుపుల మండలము గల, సబలాకః = కొంగలతో కూడిన, మేఘః ఇవ = మేఘము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. నున్నగా ఉన్న వైడూర్యమణి వంటి శరీరచ్ఛాయ గల ఆ రావణుడు శుద్ధమైన బంగారముతో చేసిన కుండలములు ధరించెను. ఆతని ప్రక్క నున్న శ్వేతచ్ఛత్రము, తెల్లని వింజామరలు మొదలైన రాజచిహ్నములు చూచుటకు మనోహరములై ఉండెను. ఇరువది భుజములు గల ఆ రావణుడు, పది ముఖములతో, పది కంఠములతో, పది శిఖరము లున్న పర్వతము వలె ప్రకాశించుచుండెను. దేవతల శత్రువు, మునులను హింసించువాడు అయిన ఆ రావణుడు ఇచ్ఛానుసారము ప్రయాణము చేసే రథమునెక్కి వెళ్ళుచు, ఆకాశమునందు, చుట్టూ మెరపుల మండలము ఉన్న, కొంగలతో కూడిన మేఘము వలె ప్రకాశించెను. 8,9,10

మూ. స శైలం సాగరానూపం వీర్యవానవలోకయన్,
నానాపుష్పఫలైర్వృక్షైరనుకీర్ణం సహస్రశః. 11

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః = ఆ రావణుడు, శైలమ్ = పర్వతమును, సహస్రశః = వేలకొలది, నానాపుష్పఫలైః = అనేకవిధములైన పుష్పములు ఫలములు గల, వృక్షైః=వృక్షములచేత, అనుకీర్ణమ్=వ్యాప్తమయిన, సాగరానూపమ్=సముద్రము దగ్గర ఉన్న జలప్రాయప్రదేమును, అవలోకయన్ చూచుచు, వెళ్లెను.

తా. పరాక్రమవంతుడైన ఆ రావణుడు పర్వతమును, అనేక విధములైన పుష్పములు, ఫలములు గల వేలకొలది చెట్లతో నిండి ఉన్న సముద్రతీరమునందలి జలప్రాయదేశమును చూచుచు వెళ్ళెను. 11

మూ. శీతమజ్గలతోయాభిః పద్మినీభిః సమన్తతః,
విశాలైరాశ్రమపదైర్వేదిమద్భిః సమావృతమ్. 13

ప్ర. అ. శీతమజ్గలతోయాభిః = చల్లని. మంగళప్రదములైన ఉదకములు గల, పద్మినీభిః = పద్మసరస్సులచేతను, వేదిమద్భిః = వేదులు (అగ్నివేదులు) గల, విశాలైః = విశాలమైన, ఆశ్రమపదైః = ఆశ్రమములచేతను, సమన్తతః = అంతటా, సమావృతమ్ = కప్పబడిన (సముద్రతీరమును చూచుచు వెళ్లెను).

తా. ఆ సముద్రతీరమునందు అంతటా, చల్లని మంగళకరములైన ఉదకములున్న పద్మసరస్సులు, యాగవేదికలతో కూడిన విశాలమునైన ఆశ్రమములు ఉండెను. 13

మూ. కదళ్యాఢకిసంబాధం నారికేళోపశోభితమ్,
సాలైస్తాలైస్తమాలైశ్చ పుష్పితైస్తరుభిర్వృతమ్. 14

ప్ర. అ. కదళ్యాఢకిసంబాధమ్ = అరటిచెట్లతోను. కందిచెట్లతోను ఇరుకుగా ఉన్నది, నారికేలోపశోభితమ్ = కొబ్బరిచెట్లచేత శోభింపచేయబడినది, పుష్పితైః = పుష్పించిన, సాలైః = మద్దిచెట్లతోను, తాలైః = తాళవృక్షములతోను, తమాలైః = తమాలవృక్షములతోను, తరుభిః = ఇతరవృక్షములతోను, వృతమ్ = కూడినదీ అయిన (సముద్రతీరమును చూచుచు వెళ్ళెను).

తా. ఆ సముద్రతీరమునందు అరటిచెట్లు, కందిచెట్లు దట్టముగా ఉండెను. అది కొబ్బరిచెట్లతో ప్రకాశించుచుండెను. ఆ ప్రదేశమునందు అంతటా పుష్పించిన మద్దిచెట్లు, తాటిచెట్లు, తమాలవృక్షములు ఇతరవృక్షములు వ్యాపించి ఉండెను. 14

మూ. నాగైః సుపర్ణైర్గన్ధర్వైః కిన్నరైశ్చ సహస్రశః,
అజైర్వైఖానసైర్మాషైర్వాలఖిల్యైర్మరీచిపైః,
అత్యన్తనియతాహారైః శోభితం పరమర్షిభిః,
జితకామైశ్చ సిద్ధైశ్చ చారణైరుపశోభితమ్. 16

ప్ర. అ. నాగైః = నాగులచేతను, సుపర్ణైః = పక్షులచేతను, గన్ధర్వైః =

గంధర్వులచేతను, సహస్రశః = వేలకొలది, కిన్నరైశ్చ=కింనరులచేతను, అజైః = బ్రహ్మపుత్రులైన, వైఖానసైః = వైఖానసులచేతను, మాషైః = మాష గోత్రమువారిచేతను, మరీచిపైః = చంద్రకిరణములను త్రాగు, వాలఖిల్యైః = వాలఖిల్యులచేతను, అత్యన్తనియతాహారైః=మిక్కిలి నియమితమైన ఆహారము గల, పరమర్షిభిః = గొప్ప ఋషులచేతను, శోభితమ్ = ప్రకాశింపచేయబడిన, జితకామైః = జయించబడిన కామములు గల, సిద్ధైశ్చ = సిద్ధులచేతను, చారణైః = చారణులచేతను, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడిన (సముద్రప్రాంతమును చూచుచు వెళ్ళెను.)

తా. ఆ సముద్రతీరమునందు వేలకొలది నాగులు, పక్షులు, గంధర్వులు, కింనరులు, బ్రహ్మపుత్రులైన వైఖానసులు, మాషగోత్రికులు, చంద్రకిరణములు మాత్రమే ఆహారముగా భుజించు వాలఖిల్యులు, ఎక్కువగా ఆహారనియమము పాటించు మహర్షులు, కామములను జయించిన సిద్ధులు, చారణులు నివసించుచు దానిని శోభింపచేయుచుండిరి. 16

మూ. దివ్యాభరణమాల్యాభిర్దివ్యరూపాభిరావృతమ్,
క్రీడారతివిధిజ్ఞాభిరప్సరోభిః సహస్రశః. 17

ప్ర. అ. దివ్యాభరణమాల్యాభిః = దివ్యములైన అలంకారములు, మాలికలు గల, దివ్యరూపాభిః = దివ్యమైన రూపము గల క్రీడారతివిధిజ్ఞాభిః = రతిక్రీడల విధానములను ఎరిగిన, సహస్రశః = వేలకొలది, అప్సరోభిః = అప్సరఃస్త్రీలచేత, ఆవృతమ్ = వ్యాప్తమైన (సముద్రతీరమును చూచుచు వెళ్ళెను.)

తా. ఆ సముద్రతీరమునందు దివ్యమైన రూపము గల అప్సరఃస్త్రీలు ఉండిరి. వాళ్ళు అందరూ దివ్యములైన అలంకారములు, పుష్పమాలలు ధరించిరి. అందరూ కూడ రతిక్రీడావిధానము లన్నీ బాగా తెలిసినవాళ్లు. 17

మూ. సేవితం దేవపత్నీభిః శ్రీమతీభిః శ్రియా వృతమ్,
దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతార్థిభిః 18

ప్ర. అ. శ్రీమతీభిః = శోభ గల, దేవపత్నీభిః = దేవతల భార్యలచేత, సేవితమ్= సేవింపబడినది, శ్రియా =శోభతో, వృతమ్ = కూడినది, అమృతార్థిభిః

=అమృతమును కోరు, దేవదానవసంఘైశ్చ=దేవతలయొక్క, దానవులయొక్క సంఘములచేత, చరితమ్ = సంచరించబడినది అయిన (సముద్రతీరమును చూచుచు వెళ్లెను).

తా. ఆ సముద్రతీరమునందు శోభావతులైన దేవభార్యలు నివసించుచుండిరి. శోభాయమానముగా ఉన్న తీరమునందు అమృతమునందు ఆసక్తి గల దేవదానవ సంఘములు సంచరించుచుండెను.

వి. "అమృతాశిభిః" అను పాఠమునకు బదులు "అమృతార్థిభిః" అను ప్రాచ్యపాఠము గ్రహింపబడినది. దానవులు అమృతమును తినలేదు గాన వారు అమృతాశులు కారు కదా. దేవతలు అమృతమును తిన్నవారే గావున వారికి కూడ "అమృతార్థిభిః" అన్న విశేషణము కుదరదు. అమృతోత్పత్తికి పూర్వము దేవ దానవులు ఈ తీరమున అమృతాభిలాషులై తిరిగేవారు అని అర్థం చెప్పవలెను.

మూ. హంసక్రౌఞ్చప్లవాకీర్ణం సారసైః సంప్రణాదితమ్,
వైడూర్యప్రస్తరం రమ్యం స్నిగ్ధం సాగరతేజసా. 18

ప్ర. అ. హంసక్రౌఞ్చప్లవాకీర్ణమ్ = హంసలతోను, క్రౌంచపక్షులతోను, కప్పలతోను వ్యాప్తమైనది, సారసైః = సారసపక్షులచేత, సంప్రణాదితమ్ = ధ్వనింపచేయబడినది, వైడూర్యప్రస్తరమ్ = వైడూర్యమాణిక్యవికారములైన శిలా ఫలకములు కలది, రమ్యమ్ = సుందరము, సాగరతేజసా = సముద్రకాంతిచేత, స్నిగ్ధమ్ = నునుపుగా ఉన్నది అయిన (సముద్రతీరప్రాంతమును చూచుచు వెళ్లెను).

తా. సముద్రకాంతి ప్రసరించి నున్నగా ఉన్నట్లు కనబడుచున్న ఆ సముద్రతీరము హంసలతోను, క్రౌంచపక్షులతోను, కప్పలతోను నిండి యుండెను. సారసపక్షుల ధ్వనులతో ప్రతిధ్వనించుచుండెను. అక్కడ వైడూర్యమాణిక్య ముల వికారములైన శిలాఫలకము లుండెను. 18

మూ. పాణ్డరాణి విశాలాని దివ్యమాల్యయుతాని చ,
తూర్యగీతాభిజుష్టాని విమానాని సమన్తతః. 19

తపసా జితలోకానాం కామగాన్యభిసంపతన్,
గన్ధర్వాప్సరసశ్చైవ దదర్శ ధనదానుజః. 20

ప్ర. అ. అభిపతన్ = తొందరగా వెళ్ళుచున్న, ధనదానుజః = రావణుడు, తపసా = తపస్సుచేత, జితలోకానామ్ = జయింపబడిన స్వర్గాదిలోకములుకల వారియొక్క, పాణ్డరాణి = తెల్లనివి, విశాలాని = విశాలములు, దివ్యమాల్యయుతాని చ = దివ్యములైన మాలలతో కూడినవి, తూర్యగీతాభిజుష్టాని = వాద్యములతోను, గీతములతోను కూడినవి, కామగాని = స్వేచ్ఛగా సంచరించునవి అయిన, విమానాని = విమానములను, సమన్తతః = అంతటా, గన్ధర్వాప్సరసశ్చైవ = గంధర్వులను, అప్సరఃస్త్రీలను, దదర్శ = చూచెను.

తా. తొందరగా ప్రయాణము చేయుచున్న ఆ రావణుడు మార్గమునందు అంతటా, గంధర్వులను, అప్సరఃస్త్రీలను, తపస్సుచేత స్వర్గాదిలోకములను జయించిన పుణ్యాత్ముల విశాలములైన విమానములను చూచెను. తెల్లగా ఉన్న ఆ విమానములు దివ్యములైన మాలలతో అలంకరింపబడి వాద్యగీతధ్వనులతో మారు మ్రోగుచుండెను. 19,20

మూ. నిర్యాసరసమూలానాం చన్దనానాం సహస్రశః,
వనాని పశ్యన్ సౌమ్యాని ఘ్రాణతృప్తికరాణి చ. 21

ప్ర. అ. నిర్యాసరసమూలానామ్ = బంకయొక్క రసము మొదళ్లలో గల, చన్దనానామ్ = మంచిగంధపు చెట్లయొక్క, సౌమ్యాని = అందమైన, ఘ్రాణతృప్తికరాణి చ = ఘ్రాణేంద్రియమునకు తృప్తికలిగించు, సహస్రశః = వేలకొలది, వనాని = వనములను. పశ్యన్ = చూచుచు, వెళ్లెను.

తా. ఆ రావణుడు, సుందరములు, ఘ్రాణేంద్రియమునకు తృప్తి కలిగించేవి అయిన వేలకొలది చందనవృక్షముల వనములను చూచెను. ఆ వృక్షముల మొదళ్లలో పల్చని జిగురు కారుచుండెను. 21

మూ. అగురూణాం చ ముఖ్యానాం వనాన్యుపవనాని చ,
తక్కోలానాం చ జాత్యానాం ఫలినాం చ సుగన్ధినామ్.

ప్ర. అ. ముఖ్యానామ్ = శ్రేష్ఠములైన, అగురూణామ్ = అగురువృక్షముల

యొక్క, వనాని = వనములను, ఉపవనాని చ = ఉద్యానవనములను, తక్కోలానామ్ = తక్కోలవృక్షములయొక్క, ఫలినామ్ = ఫలములు గల, సుగన్ధినామ్ = సువాసన గల, జాత్యానామ్ = జాజిచెట్లయొక్క వనములను చూచుచు వెళ్లెను.

తా. శ్రేష్ఠములైన అగురుచెట్లు, తక్కోలవృక్షములు, ఫలములున్న, మంచి సువాసన గల జాజిచెట్లు ఉన్న వనములను, ఉద్యానములను చూచుచు వెళ్ళెను.

మూ. పుష్పాణి చ తమాలస్య గుల్మాని మరిచస్య చ,
ముక్తానాం చ సమూహాని శుష్యమాణాని తీరతః. 23

ప్ర. అ. తమాలస్య = తమాలవృక్షముయొక్క, పుష్పాణి = పుష్పములను, మరిచస్య = మిరియముయొక్క, గుల్మాని = పొదలను, తీరతః = తీరమునందు, శుష్యమాణాని = ఎండుచున్న, ముక్తానామ్ = ముత్యములయొక్క, సమూహాని చ = సముదాయములను చూచుచు వెళ్లెను.

తా. ఆ ప్రాంతమునందు తమాలవృక్షముల పుష్పములు, మిరియపు కొంకలు, తీరముమీద ఎండుచున్న ముత్యముల ప్రోగులు ఉండెను. 23

మూ. శఙ్ఖానాం ప్రస్తరం చైవ ప్రవాళనిచయం తథా,
కాఞ్చనాని చ శైలాని రాజతాని చ సర్వశః. 24

ప్ర. అ. శఙ్ఖానామ్ = శంఖములయొక్క, ప్రస్తరం చైవ = సముదాయమును, తథా = మరియు, ప్రవాళనిచయమ్ = పొగడముల సముదాయమును, సర్వశః = అన్ని వైపులా, కాఞ్చనాని = బంగారు వికారమైన, రాజతాని చ = వెండి వికారమైన, శైలాని = పర్వతములను, (చూచుచు వెళ్ళెను).

తా. అక్కడ శంఖాల సముదాయములు, పొగడాల ప్రోగులు, నలువైపులందు బంగారు కొండలు, వెండి కొండలు ఉండెను. 24

మూ. ప్రస్రవాణి మనోజ్ఞాని ప్రసన్నాని హ్రదాని చ,
ధనధాన్యోపపన్నాని స్త్రీరత్నైః శోభితాని చ. 25
హస్త్యశ్వరథగాఢాని నగరాణ్యవలోకయన్.

ప్ర. అ. మనోజ్ఞాని = మనోహరములైన, ప్రస్రవాణి = సెలయేళ్లను,

ప్రసన్నాని = నిర్మలములైన, హ్రదాని చ = మడుగులను, ధనధాన్యోపపన్నాని =ధనధాన్యములతో కూడిన, స్త్రీరత్నైః=శ్రేష్ఠలైన స్త్రీలచేత, శోభితాని=శోభింప బడిన, హస్త్యశ్వరథగాఢాని = గజములతోను, అశ్వములతోను, రథములతోను కిక్కిరిసిఉన్న, నగరాణి = నగరములను, అవలోకయన్ = చూచుచు(వెళ్లెను).

తా. రావణుడు మార్గమధ్యమునందు మనోహరములైన సెలయేళ్ళను, నిర్మలములైన చెరువులను, ధనధాన్యసమృద్ధములు, ఉత్తమస్త్రీలతో శోభించు చున్నవి, గజములతోను, అశ్వములతోను, రథములతోను కిక్కిరిసి ఉన్నవి అయిన నగరములను చూచెను. 25

మూ. తం సమం సర్వతః స్నిగ్ధం మృదుసంస్పర్శమారుతమ్,
అనూపం సిన్ధురాజస్య దదర్శ త్రిదశోపమమ్. 26

ప్ర. అ. ("త్రిదివోపమమ్"అను గోరఖ్‌పూర్ ప్రతి పాఠము బాగున్నది) సర్వతః = అంతటా, సమమ్ = సమముగా ఉన్నది, స్నిగ్ధమ్ = సుందరము, మృదుసంస్పర్శమారుతమ్ = మృదువైన స్పర్శ గల వాయువు గలది, త్రిదివోపమమ్ = స్వర్గమువలె ఉన్న, సిన్ధురాజస్య = సముద్రముయొక్క, తమ్ అనూపమ్ = ఆ జలప్రాయప్రదేశమును, దదర్శ = చూచెను.

తా. సముద్రము దగ్గరనున్న ఆ జలప్రాయప్రదేశము అంతటా సమముగా, సుందరముగా ఉండెను. వాయువు స్పర్శానుకూలముగా ఉండెను. ఆ విధముగ అది స్వర్గలోకము వలె ఉండెను.

వి. ఇక్కడ ప్రాచ్యపాఠం వేరుగా ఉన్నది-

"స పశ్యన్నథ సంప్రాప్త ఆశ్రమం పుణ్యకర్మణః,
సిన్ధురాజస్య తు మునేర్జటామణ్డలధారిణః''.

''అతడు ఆ నగరాదులను చూచుచు పుణ్యాత్ముడు, జటామండలము ధరించినవాడు అయిన సింధురాజు అనే ముని ఆశ్రమమును చేరెను''అని అర్థము. 26

మూ. తత్రాపశ్యత్స మేఘాభం న్యగ్రోధమృషిభిర్వృతమ్. 27
సమన్తాద్యస్య తాః శాఖాః శతయోజనమాయతాః.

ప్ర. అ. తత్ర = అక్కడ, సః = ఆ రావణుడు, యస్య = దేనియొక్క, తాః శాఖాః = ఆ కొమ్మలు, సమన్తాత్ = నలుమూలల, శతయోజనమ్ = నూరు యోజనములు, ఆయతాః = పొడవైనవో, అట్టి, మేఘాభమ్ = మేఘమువంటి కాంతి గల, ఋషిభిః వృతమ్ = ఋషులతో కూడిన, న్యగ్రోధమ్ = మఱ్ఱిచెట్టును, అపశ్యత్ = చూచెను.

తా. అక్కడ ఆతడు మేఘము వంటి కాంతి గల ఒక వటవృక్షమును చూచెను. దాని చుట్టూ నూరు యోజనముల పొడవైన శాఖలు ఉండెను. దానిపై ఎందరో ఋషులు నివసించుచుండిరి. 27

మూ. యస్య హస్తినమాదాయ మహాకాయం చ కచ్ఛపమ్, 28
భక్షార్థం గరుడః శాఖామాజగామ మహాబలః.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, గరుడః = గరుత్మంతుడు, భక్షార్థమ్ = భక్షణమునిమిత్తము, హస్తినమ్ = గజమును, మహాకాయమ్ = పెద్ద దేహము గల, కచ్ఛపం చ = తాబేలును, ఆదాయ = గ్రహించి, యస్య = ఏ వటవృక్షముయొక్క, శాఖామ్ = శాఖనుగూర్చి, ఆజగామ = వచ్చెనో.

తా. పూర్వము మహాబలశాలియైన గరుత్మంతుడు ఈ వటవృక్షము కొమ్మపై కూర్చుండి తినుటకై పెద్ద గజమును, పెద్ద శరీరము గల తాబేలును తెచ్చుకొనెను. 28

మూ. తస్య తాం సహసా శాఖాం భారేణ పతగోత్తమః, 29
సుపర్ణః పర్ణబహులాం బభఞ్జ చ మహాబలః.

ప్ర. అ. పతగోత్తమః = పక్షులలో ఉత్తముడైన, మహాబలః = గొప్ప బలము గల, సుపర్ణః = ఆ గరుత్మంతుడు, తస్య = ఆ వృక్షముయొక్క, తాం శాఖామ్ = ఆ శాఖను. భారేణ = భారముచేత, సహసా = హటాత్తుగా, బభఞ్జ = విరచెను.

తా. పక్షులలో శ్రేష్ఠుడు, మహాబలశాలి అయిన ఆ గరుత్మంతుడు కూర్చున్న వెంటనే ఆ వృక్షము కొమ్మ, బరువుకు విరిగిపోయెను. 29

మూ. తత్ర వైఖానసా మాషా వాలఖిల్యా మరీచిపాః, 30
అజా బభూవుర్ధూమ్రాశ్చ సంగతాః పరమర్షయః.

ప్ర. అ. వైఖానసాః = వైఖానసులు, మాషాః = మాషగోత్రమువారు, మరీచిపాః = కిరణములు మాత్రము త్రాగు, వాలఖిల్యాః = వాలఖిల్యులు, అజాః = బ్రహ్మపుత్రులు, ధూమ్రాశ్చ = ధూమపానముచేయు, పరమర్షయశ్చ = గొప్ప ఋషీశ్వరులు, తత్ర = ఆ కొమ్మమీద, సంగతాః = కలసినవారై, బభూవుః = ఉండిరి.

తా. వైఖానసులు, మాషగోత్రమునకు చెందిన మహర్షులు, చంద్రకిరణములు మాత్రమే ఆహారముగా త్రాగు వాలఖిల్యులు, బ్రహ్మపుత్రులైన మహర్షులు తలక్రిందుగా వ్రేలాడుచు, ధూమమును త్రాగుచు తపస్సు చేసే మహర్షులు కలిసి ఆ కొమ్మను అంటిపెట్టుకొని ఉండిరి. 30

మూ. తేషాం దయార్థం గరుడస్తాం శాఖాం శతయోజనామ్, 31
జగామాదాయ వేగేన తౌ చోభౌ గజకచ్ఛపౌ.

ప్ర. అ. గరుడః = గరుత్మంతుడు, తేషామ్ = ఆ మహర్షుల, దయార్థమ్ = దయకొరకు, శతయోజనామ్ = నూరు యోజనముల పొడవైన, తాం శాఖామ్ = ఆ కొమ్మను, తౌ = ఆ, ఉభౌ = రెండు, గజకచ్ఛపౌ = గజమును తాబేలును, ఆదాయ = గ్రహించి, వేగేన = వేగముతో, జగామ = వెళ్ళెను.

తా. గరుత్మంతుడు ఆ మహర్షులమీద దయచేత, నూరు యోజనముల పొడవైన ఆ శాఖను, ఆ గజకచ్ఛపములు రెండింటిని తీసికొని వేగముగా వెళ్లెను. 31

మూ. ఏకపాదేన ధర్మాత్మా భక్షయిత్వా తదామిషమ్, 32
నిషాదవిషయం హత్వా శాఖయా పతగోత్తమః,
ప్రహర్షమతులం లేభే మోక్షయిత్వా మహామునీన్. 33

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, పతగోత్తమః = పక్షులలో ఉత్తముడైన ఆ గరుత్మంతుడు, తత్ = ఆ, ఆమిషమ్ = మాంసమును, ఏకపాదేన = ఒక్క పాదముచేత, భక్షయిత్వా = భక్షించి, శాఖయా = కొమ్మచేత, నిషాదవిష

యమ్ = నిషాదుల దేశమును, హత్వా = చంపి, మహామునీన్ = మహామునులను, మోక్షయిత్వా = విడిపింపచేసి, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = ఆనందమును, లేభే = పొందెను.

తా. ధర్మాత్ముడు, పక్షులలో ఉత్తముడూ అయిన ఆ గరుత్మంతుడు ఆ గజకచ్ఛపముల మాంసమును ఒక పాదముతో పట్టుకొని తిని, ఆ కొమ్మతో నిషాదులను (ఆటవికులను) చంపి, కొమ్మను ఆశ్రయించి ఉన్న మహామునులకు ఆపద కలగకుండు నట్లు వారిని విడిపించి చాల సంతోషించెను. 32, 33

మూ. స తేనైవ ప్రహర్షేణ ద్విగుణీకృతవిక్రమః,
అమృతానయనార్థం వై చకార మతిమాన్ మతిమ్. 34

ప్ర. అ. మతిమాన్ = బుద్ధిమంతుడైన, సః = ఆ గరుత్మంతుడు, తేనైవ ప్రహర్షేణ = ఆ ఆనందముచేతనే, ద్విగుణీకృతవిక్రమః = రెట్టింపు చేయబడిన పరాక్రమము కలవాడై, అమృతానయనార్థమ్ = అమృతమును తీసికొనివచ్చుటకు, మతిమ్ = ఆలోచనను; చకార = చేసెను.

తా. బుద్ధిమంతుడైన గరుత్మంతుడు ఆ సంతోషముచేత రెట్టింపు అయిన పరాక్రమముతో అమృతమును తీసికొనివచ్చుటకు నిర్ణయము చేసెను. 34

మూ. అయోజాలాని నిర్మథ్య భిత్త్వా రత్నమయం గృహమ్,
మహేన్ద్రభవనాద్గుప్తమాజహారామృతం తతః. 35

ప్ర. అ. అయోజాలాని = ఇనుపకటకటాలను, నిర్మథ్య = విరగగొట్టి, రత్నమయమ్ = రత్నవికారమైన, గృహమ్ = గృహమును, భిత్త్వా = భేదించి, తతః = ఆ, మహేన్ద్రభవనాత్ = మహేంద్రుని భవనమునుండి, గుప్తమ్ = దాచి ఉంచబడిన, అమృతమ్ = అమృతమును, ఆజహార = హరించెను.

తా. గరుత్మంతుడు ఇనుప కటకటాలను విరగగొట్టి, రత్నములతో నిర్మించిన గృహమును బ్రద్దలుకొట్టి, ఆ మహేంద్రభవనమునందు, రహస్యముగా దాచి ఉంచిన అమృతమును తీసికొనివచ్చెను. 35

మూ. తం మహర్షిగణైర్జుష్టం సువర్ణకృతలక్షణమ్,
నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః. 36

ప్ర. అ. ధనదానుజః = రావణుడు, మహర్షిగణైః = మహర్షుల సముదాయముచేత, జుష్టమ్ = పొందబడినది, సుపర్ణకృతలక్షణమ్ = గరుత్మంతునిచేత చేయబడిన గుర్తులు కలది, నామ్నా = పేరుచేత, సుభద్రమ్ = సుభద్ర మను, తం న్యగ్రోధమ్ = ఆ వటవృక్షమును, దదర్శ = చూచెను.

తా. రావణుడు సుభద్ర మనే ఆ న్యగ్రోధవృక్షమును చూచెను. గుంపులు గుంపులుగా మహర్షులు దానిని ఆశ్రయించి ఉండిరి. గరుత్మంతుడు దానిపై కొన్ని గుర్తులు ఏర్పడు నట్లు చేసెను. 36

మూ. తం తు గత్వా పరం పారం సముద్రస్య నదీపతేః,
దదర్శాశ్రమమేకాన్తే రమ్యే పుణ్యే వనాన్తరే. 37

ప్ర. అ. నదీపతేః = నదులకు ప్రభువైన, సముద్రస్య = సముద్రము యొక్క, తమ్ = ఆ, పరమ్ = అవతలఉన్న, పారమ్ = ఒడ్డును, గత్వా = పొంది, రమ్యే = సుందరము, పుణ్యే = పవిత్రము అయిన, వనాన్తరే = వనమధ్యమునందు, ఏకాన్తే = ఏకాంతప్రదేశమునందు, ఆశ్రమమ్ = ఆశ్రమమును, దదర్శ = చూచెను.

తా. రావణుడు నదుల ప్రభువైన సముద్రము అవతలి ఒడ్డు చేరి, అక్కడ సుందరము, పవిత్రము, ఏకాంతము అయిన వనమధ్యమునందు ఉన్న ఆశ్రమమును చూచెను. 37

మూ. తత్ర కృష్ణాజినధరం జటావల్కలధారిణమ్,
దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసమ్. 38

ప్ర. అ. తత్ర = అక్కడ, కృష్ణాజినధరమ్ = కృష్ణాజినమును ధరించినవాడు, జటావల్కలధారిణమ్ = జటలను, నారచీరను ధరించినవాడు, నియతాహారమ్ = నియమితమైన ఆహారము కలవాడు అయిన, మారీచం నామ = మారీచుడు అనే పేరు గల, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, దదర్శ = చూచెను.

తా. రావణుడు అక్కడ, కృష్ణాజినమును, జటలను, నారచీరను ధరించి ఆహారనియమము పాటించుచు, మునివృత్తిలో ఉన్న మారీచు డనే రాక్షసుణ్ణి చూచెను. 38

మూ. స రావణః సమాగమ్య విధివత్తేన రక్షసా,
మారీచేనార్చితో రాజా సర్వకామైరమానుషైః. 39

ప్ర. అ. రాజా = రాజైన, సః రావణః = ఆ రావణుడు, సమాగమ్య = సమీపించి, రక్షసా = రాక్షసుడైన, తేన మారీచేన = ఆ మారీచునిచేత, అమానుషైః = మనుష్యసులభములు కాని, సర్వకామైః = సమస్తభోగ్యవస్తువులచేతను, విధివత్ = యథావిధిగా, అర్చితః = పూజింపబడెను.

తా. మారీచుడు తన ఆశ్రమమునకు వచ్చిన రాక్షసరాజైన ఆ రావణుని మనుష్యదుర్లభములైన సకలభోగ్యవస్తువులను సమర్పించి, యథావిధిగా గౌరవించెను. 39

మూ. తం స్వయం పూజయిత్వా తు భోజనేనోదకేన చ,
అర్థోపహితయా వాచా మారీచో వాక్యమబ్రవీత్. 40

ప్ర. అ. మారీచః = మారీచుడు, తమ్ = ఆతనిని, భోజనేన = భోజనముచేతను, ఉదకేన చ = ఉదకముచేతను, స్వయమ్ = స్వయముగా, పూజయిత్వా = పూజించి, అర్థోపహితయా = అర్థముతో కూడిన, వాచా = వాక్కుతో, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మారీచుడు ఆ రావణునకు భోజనము, ఉదకము సమర్పించి స్వయముగా పూజించి, మంచి అర్థము గల మాటలు ఈ విధముగ పలికెను. 40

మూ. కచ్చిత్సుకుశలం రాజన్ లఙ్కాయాం రాక్షసేశ్వర,
కేనార్థేన పునస్త్వం వై తూర్ణమేవమిహాగతః. 41

ప్ర. అ. రాక్షసేశ్వర = రాక్షసప్రభువైన, రాజన్ = రాజా, లఙ్కాయామ్ = లంకయందు, సుకుశలం కచ్చిత్ = కుశలమే కదా! త్వమ్ = నీవు, కేన = ఏ, అర్థేన = ప్రయోజనముచేత, తూర్ణమ్ = శీఘ్రముగా, ఏవమ్ = ఇట్లు, పునః = మరల, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావు?

తా. రాక్షసరాజా! లంకలో అంతా క్షేమమే కదా! ఇంత శీఘ్రముగా నీవు మరల ఇక్కడకు ఎందుకు వచ్చినావు?

వి. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. 41

మూ. ఏవముక్తో మహాతేజా మారీచేన స రావణః,
తతః పశ్చాదిదం వాక్యమబ్రవీద్వాక్యకోవిదః. 42

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చత్రింశః సర్గః.

ప్ర. అ. మారీచేన = మారీచునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, వాక్యకోవిదః = మాటలలో నేర్పరి యైన, సః రావణః = ఆ రావణుడు, తతః పశ్చాత్ = దాని పిమ్మట, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజఃశాలీ, మాటలలో నేర్పరీ అయిన ఆ రావణుడు మారీచుని మాటలు విని ఇట్లు పలికెను. 42

వి. రావణుడు మారీచాశ్రమానికి వెళ్ళే దారిలో అనేక జనపదాలు దాటి, చాలా దూరం ప్రయాణం చేసి ఆ ఆశ్రమం చేరుకున్నట్లు ఈ సర్గలో వర్ణించబడింది. ఈ వర్ణన పట్టి చూడగా అవి దేవభూము లన్నట్లు కనబడుతుంది. లంక సముద్ర తీరంమీదనే ఉన్నట్లు సుందరకాండాదులలో ఉన్న వర్ణనలను పట్టి తెలుస్తూన్నది. అందుచేత మారీచుని ఆశ్రమం లంక పక్కనే ఉన్న సముద్రతీరంలో ఉన్న దని చెప్పడానికి వీలు లేదు. లంకకు దక్షిణంగా చాలాదూరంలో ఉన్న సముద్రతీరమా లేక హిమాలయాదులు దాటిన తరవాత ఉన్నట్లు భావించబడే ఉత్తరసముద్ర తీరమా ఏదని చెప్పవలెనో తెలియడంలేదు. గరుత్మంతుడు అమృతహరణం కోసం వెళ్లేటప్పుడు గజకచ్ఛపాలను భక్షించడానికై వటవృక్షంమీద వాలినట్లు, ఆ కొమ్మ విరిగిపోయినట్లూ, దానిని ఆశ్రయించుకొని ఉన్న మునులను ఏలాగో రక్షించినట్లు ఈ కథ మహాభారతంలో కూడా ఉంది. ఆ వటవృక్షం దక్షిణ సముద్రతీరంలో ఉందా ఉత్తరసముద్రతీరంలో ఉందా అనే విషయం అక్కడ కూడా స్పష్టంగా లేదు కాని అమృతమథనం కోసం దేవదానవాదులు మంతనాలు చేయడం మేరుపర్వతంమీద జరిగినట్లు చెప్పి తరవాత గరుడోత్పత్త్యాదులు వర్ణించడంచేత బహుశా భారతం ప్రకారం ఈ వటవృక్షం ఉత్తరసముద్రతీరంలో ఉన్న

దని చెప్పడానికి వీలున్నట్లు కనబడుతుంది. రావణుని మార్గాన్ని వర్ణించే ఈ ఘట్టంలో ప్రాచ్యపాఠంలో—

"ఉత్తరాంశ్చ కురూన్ పశ్యన్ పశ్యంశ్చైవ నగోత్తమాన్,
దేవదానవసంఘైశ్చ సేవితం హ్యమృతార్థిభిః.

అనే శ్లోకం ఉన్నది. ఉత్తరకురుదేశ మనగా కురుక్షేత్రానికి చాలా దూరాన ఉత్తరంగా ఉన్న దేశం. అది దేవభూమి అని సంప్రదాయం. అందుచే మారీచాశ్రమం హిమాలయాలు దాటి ఉత్తరాన ఉన్న దని ఊహించవచ్చును. ఏమైనా ఇంకా విజ్ఞులు పరిశీలించవలసిన విషయం.

"బాలానందిని'' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ముప్పదియైదవ సర్గ సమాప్తము.

## అథ షట్త్రింశః సర్గః

[రావణుడు రాముని అపరాధమును వర్ణించి చెప్పి, ఆతని భార్యయైన సీతను హరించుటకు సాహాయ్యము చేయుమని మారీచుని కోరుట].

మూ. మారీచ శ్రూయతాం తాత వచనం మమ భాషతః,
ఆర్తోఽస్మి మమ చార్తస్య భవాన్హి పరమా గతిః. 1

ప్ర. అ. తాత = తండ్రీ! మారీచ = మారీచుడా! భాషతః = మాటలాడుచున్న, మమ = నాయొక్క, వచనమ్ = వచనము, శ్రూయతామ్ = వినబడుగాక. ఆర్తః = దుఃఖితుడను, అస్మి = అయిఉన్నాను. ఆర్తస్య = దుఃఖితుడనైన, మమ = నాకు; భవాన్ = నీవు; పరమా = గొప్ప, గతిః హి = గతి కదా?

తా. తండ్రీ ! మారీచా ! నేను చెప్పుచున్న మాట వినుము. నేను ఆపదలో ఉన్నాను. నేను ఆపదలో ఉన్నప్పుడు నీవే నాకు గతివి కదా? 1

మూ. జానీషే త్వం జనస్థానే యథా భ్రాతా ఖరో మమ,
దూషణశ్చ మహాబాహుః స్వసా శూర్పణఖా చ మే. 2

త్రిశిరాశ్చ మహాతేజా రాక్షసః పిశితాశనః,
అన్యే చ బహవః శూరా లబ్ధలక్షా నిశాచరాః. 3

వసన్తి మన్నియోగేన రతివాసం చ రాక్షసాః,
బాధమానా మహారణ్యే మునీన్ వై ధర్మచారిణః. 4

ప్ర. అ. మమ = నాయొక్క, భ్రాతా = సోదరుడైన, ఖరః = ఖరుడు, మహాబాహుః = గొప్పబాహువులు గల, దూషణశ్చ = దూషణుడు, మే = నాయొక్క, స్వసా = సోదరియైన, శూర్పణఖా చ = శూర్పణఖ, మహాతేజాః = గొప్పతేజస్సు

గల, పిశితాశనః=మనుష్యమాంసమును తిను, రాక్షసః=రాక్షసుడైన, త్రిశిరాశ్చ =త్రిశిరస్సు, శూరాః=శూరులు, లబ్ధలక్షాః=లక్ష్యమును కొట్టుటకు సమర్థులు అయిన, అన్యే=ఇతరులైన, బహవః=అనేకులు, నిశాచరాః రాక్షసాః=నిశాచరులైన రాక్షసులు, మన్నియోగేన=నా ఆజ్ఞచేత, మహారణ్యే=మహారణ్యము నందు, ధర్మచారిణః=ధర్మమును ఆచరించు, మునీన్=మునులను, బాధమానాః =బాధించుచు, జనస్థానే=జనస్థానమునందు, యథా=ఎట్లు, రతివాసం వసన్తి= ఆనందకర మగు నివాసము కలుగు నట్లుగా నివసించుచున్నారో, త్వమ్=నీవు, జానీషే=ఎరుగుదువు కదా ?

తా. నా సోదరుడైన ఖరుడు, మహాబాహువైన దూషణుడు, నా సోదరియైన శూర్పణఖ మనుష్యమాంసమును భుజించు మహాతేజఃశాలియైన త్రిశిరస్సు, శూరులు, గురి తప్పకుండ ఆయుధములు ప్రయోగించగలవారు అయిన ఇంకా ఎందరో ఇతరరాక్షసులు, మహారణ్యములో ధర్మములు ఆచరించుచున్న మునులను బాధించుచు, నా ఆజ్ఞ ప్రకారము. జనస్థానములో సుఖముగా నివసించుచున్నా రను విషయము నీకు తెలియును కదా ? 2-4

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
శూరాణాం లబ్ధలక్షాణాం ఖరచిత్తానువర్తినామ్. 5

ప్ర. అ. భీమకర్మణామ్=భయంకరమైన కర్మలు చేయువారు, శూరాణామ్=శూరులు, లబ్ధలక్షాణామ్=లక్ష్యమును కొట్టగలవారు, ఖరచిత్తానువర్తినామ్ =ఖరుని చిత్తమును అనుసరించి ఉన్నవారు అయిన, రక్షసామ్=రాక్షసుల యొక్క, చతుర్దశ సహస్రాణి=పదునాలుగు సహస్రములు, నివసించుచున్నారు కదా ?

తా. భయంకరములైన పనులు చేయువాళ్లు, శూరులు, గురి తప్పనివాళ్ళు, ఖరుని చిత్తమును అనుసరించి ప్రవర్తించువాళ్లు అయిన పదునాలుగువేలమంది రాక్షసులు అక్కడ ఉన్నారు కదా ? 5

మూ. తే త్విదానీం జనస్థానే వసమానా మహాబలాః,
సంగతాః పరమాయత్తా రామేణ సహ సంయుగే. 6
నానాప్రహరణోపేతాః ఖరప్రముఖరాక్షసాః.

ప్ర. అ. జనస్థానే = జనస్థానమునందు, వసమానాః = నివసించుచున్న, మహాబలాః = గొప్ప బలము గల, తే = ఆ, ఖరప్రముఖరాక్షసాః = ఖరుడు మొదలైన రాక్షసులు, ఇదానీమ్ = ఇప్పుడు, పరమాయత్తాః = బాగుగా సన్నద్ధులై, నానాప్రహరణోపేతాః = అనేకవిధములైన ఆయుధములతో కూడినవారై, సంయుగే = యుద్ధమునందు, రామేణ సహ = రామునితో కూడ, సంగతాః = కలిసినారు.

తా. జనస్థానములో నివసించుచున్న, మహాబలుడైన ఆ ఖరుడు మొదలైన రాక్షసులు బాగుగా సన్నద్ధులైన, అనేకవిధములైన ఆయుధములు ధరించి, ఈ మధ్య, రామునితో యుద్ధమునకు తలపడిరి. 6

మూ. తేన సంజాతరోషేణ రామేణ రణమూర్ధని, 7
అనుక్త్వా పరుషం కించిచ్ఛరైర్వ్యాపారితం ధనుః.

ప్ర. అ. సంజాతరోషేణ = పుట్టిన కోపము గల, తేన రామేణ = ఆ రామునిచేత, రణమూర్ధని = యుద్ధాగ్రమునందు, పరుషమ్ = పరుషముగా, కించిత్ = ఏమీ, అనుక్త్వా = పలకకుండా, ధనుః = ధనస్సు, శరైః = బాణములతో, వ్యాపారితమ్ = పనిచేయునట్లు చేయబడినది.

తా. కోపించిన ఆ రాముడు యుద్ధాగ్రమునందు ఏమీ పరుషముగా మాటలాడకుండా, బాణములను ధనుస్సుపై ఆరోపించెను. 7

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాముగ్రతేజసామ్, 8
నిహతాని శరైస్తీక్ష్ణైర్మానుషేణ పదాతినా.

ప్ర. అ. పదాతినా = పాదచారియైన, మానుషేణ = మానవుడైన ఆ రామునిచేత, ఉగ్రతేజసామ్ = ఉగ్రమైన తేజస్సు గల, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = సహస్రములు, తీక్ష్ణైః = వాడియైన, శరైః = బాణములచేత, నిహతాని = చంపబడినవి.

తా. మనుష్యమాత్రుడైన ఆ రాముడు పాదచారిగా ఉండి, వాడియైన బాణములచేత ఉగ్రమైన తేజస్సు గల పదునాలుగు వేలమంది రాక్షసులను చంపినాడు. 8

మూ. ఖరశ్చ నిహతః సంఖ్యే దూషణశ్చ నిపాతితః, 9
హతశ్చ త్రిశిరాశ్చాపి నిర్భయా దణ్డకాః కృతాః.

ప్ర. అ. సంఖ్యే = యుద్ధమునందు, ఖరశ్చ = ఖరుడు, నిహతః = చంపబడినాడు. దూషణశ్చ = దూషణుడు, నిపాతితః = పడగొట్టబడినాడు. త్రిశిరాశ్చాపి = త్రిశిరస్సు కూడ, హతః = చంపబడినాడు. దణ్డకాః = దండకారణ్యము, నిర్భయాః = భయములేనిదిగా, కృతాః = చేయబడినది.

తా. రాముడు యుద్ధములో ఖరుణ్ణి దూషణుణ్ణి, త్రిశిరస్సును చంపి దండకారణ్యమును నిర్భయము చేసినాడు. 9

మూ. పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః, 10
స హన్తా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః.

ప్ర. అ. క్రుద్ధేన = కోపించి, పిత్రా = తండ్రిచేత, సభార్యః = భార్యాసహితుడుగా, నిరస్తః = వెడలగొట్టబడిన, క్షీణజీవితః = అల్పాయుష్కుడైన, క్షత్రియపాంసనః = క్షత్రియాధముడైన, సః రామః = ఆ రాముడు, తస్య సైన్యస్య = ఆ సైన్యమునకు, హన్తా = వినాశకుడు.

తా. తండ్రి కోపించి, భార్యాసహితుడైన ఆ రాముణ్ణి దేశమునుండి వెడలగొట్టినాడు. ఆతని ఆయుర్దాయము క్షీణించినది. క్షత్రియాధముడైన ఆ రాముడు, ఆ సైన్యమునంతా చంపివేసినాడు. 10

మూ. దుశ్శీలః కర్కశస్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధోఽజితేన్ద్రియః, 11
త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానామహితే రతః.

ప్ర. అ. (రాముడు) దుఃశీలః = చెడ్డ స్వభావము కలవాడు. కర్కశః = కఠినుడు. తీక్ష్ణః = తీక్ష్ణమైనవాడు. మూర్ఖః = మూర్ఖుడు. లుబ్ధః = దురాశాపరుడు. అజితేన్ద్రియః = జయింపబడని ఇంద్రియములు కలవాడు. త్యక్తధర్మః = విడువబడిన ధర్మము కలవాడు. అధర్మాత్మా = ధర్మాత్ముడు కానివాడు. భూతానామ్ = ప్రాణులయొక్క, అహితే = కీడునందు, రతః = ఆసక్తి కలవాడు.

తా. రాముని స్వభావము చాల చెడ్డది. అతడు కఠినుడు. తీక్ష్ణమైనవాడు.

లుబ్ధుడు. ఇంద్రియజయము లేనివాడు, ధర్మమును విడచిన అధర్మాత్ముడు. ప్రాణుల కీడును కోరేవాడు. 11

మూ. యేన వైరం వినారణ్యే సత్త్వమాశ్రిత్య కేవలమ్, 12
కర్ణనాసాపహరణాద్భగినీ మే విరూపితా,
తస్య భార్యాం జనస్థానాత్సీతాం సురసుతోపమామ్, 13
ఆనయిష్యామి విక్రమ్య సహాయస్తత్ర మే భవ.

ప్ర. అ. యేన = ఏ రామునిచేత, వైరం వినా = వైరమేమీ లేకుండగనే, కేవలమ్ = కేవలము, సత్త్వమ్ = బలమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, కర్ణనాసాపహరణాత్ = చెవులను, ముక్కును కోయుటవలన, మే భగినీ = నా సోదరి, విరూపితా = విరూపము కలదిగా చేయబడినదో, తస్య = అట్టి రామునియొక్క, భార్యామ్ = భార్యయైన, సురసుతోపమామ్ = దేవకన్యతో సమానురాలైన, సీతామ్ = సీతను, విక్రమ్య = పరాక్రమము చూపి, జనస్థానాత్ = జనస్థానము నుండి, ఆనయిష్యామి = తీసికొనివచ్చెదను. తత్ర = దాని విషయమునందు, మే = నాకు, సహాయః = సహాయుడవుగా, భవ = అగుము.

తా. రాముడు ఎట్టి వైరకారణము లేకుండగా, బలము ఉన్నది కదా అని నా సోదరియైన శూర్పణఖ చెవులు, ముక్కు ఛేదించి ఆమెను వికృతరూపవతినిగా చేసినాడు. ఆతని భార్యయైన, దేవకన్యతో సమానురాలైన సీతను బలాత్కారముగా జనస్థానమునుండి తీసికొని రావలె నని అనుకొనుచున్నాను. ఈ కార్యమునందు నీవు నాకు సాహాయ్యము చేయవలెను. 12, 13

మూ. త్వయా హ్యహం సహాయేన పార్శ్వస్థేన మహాబల, 14
భ్రాతృభిశ్చ సురాన్ యుద్ధే సమగ్రాన్నాభిచిన్తయే,
తత్సహాయో భవ త్వం మే సమర్థో హ్యసి రాక్షస. 15

ప్ర. అ. మహాబల = గొప్ప బలము కలవాడా! సహాయేన = సహాయుడుగా, పార్శ్వస్థేన = ప్రక్కన ఉన్న, త్వయా = నీచేతను, భ్రాతృభిశ్చ = వరులచేతను, యుద్ధే = యుద్ధమునందు, సమగ్రాన్ = సమస్తమైన, సురాన్ = దేవతలను కూడ, నాభిచిన్తయే = లెక్కచేయను. రాక్షస = ఓ! మారీచా! తత్ =

ఆ కారణమువలన, త్వమ్ = నీవు, మే = నాకు, సహాయః = సహాయుడవు, భవ = అగుము. సమర్థః = సమర్థుడవు, అసి హి = అయిఉన్నావు కదా।

తా. ఓ! మహాబలవంతుడా! నీవు, నా సోదరులు సహాయులుగా నా ప్రక్క నిలచినచో దేవత లందరూ యుద్ధానికి వచ్చినా కూడా లెక్కచేయను. అందుచేత, ఓ! మారీచా! నీవు నాకు సాహాయ్యము చేయుము. నీవు అందుకు సమర్థుడవు. 14, 15

మూ. వీర్యే యుద్ధే చ దర్పే చ న హ్యాస్తి సదృశ స్తవ,
ఉపాయజ్ఞో మహాన్ శూరః సర్వమాయావిశారదః. 16

ప్ర. అ. వీర్యే = వీర్యమునందు, యుద్ధే చ = యుద్ధమునందు, దర్పే చ = దర్పమునందు, తవ = నీకు, సదృశః = సమానుడు, నాస్తి హి = లేడు కదా? (నీవు), ఉపాయజ్ఞః = ఉపాయములెరిగినవాడవు, మహాన్ = గొప్పవాడవు, శూరః = శూరుడవు, సర్వమాయావిశారదః = సమస్తమైన మాయలలో నేర్పు గలవాడవు.

తా. వీర్యమునందు గాని, యుద్ధమునందు గాని, దర్పమునందు గాని నీకు పోల్చదగిన వారెవ్వరూ లేరు. నీవు చాలా గొప్పవాడవు. ఉపాయములు తెలిసినవాడవు. శూరుడవు. సకలమాయలలో నేర్పు గలవాడవు. 16

మూ. ఏతదర్థమిహ ప్రాప్తస్త్వత్సమీపం నిశాచర,
శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనాన్మమ.

ప్ర. అ. నిశాచర = మారీచా! ఏతదర్థమ్ = ఇందునిమిత్తమే, ఇహ = ఇక్కడికి, త్వత్సమీపమ్ = నీ సమీపమును గూర్చి, ప్రాప్తః = వచ్చినాను, మమ = నాయొక్క, వచనాత్ = వచనమువలన, సాహాయ్యే = సాహాయ్యమునిమిత్తము, యత్ = ఏది, కార్యమ్ = చేయదగినదో, తత్ కర్మ = ఆ పనిని, శృణు = వినుము.

తా. ఓ! మారీచా! ఇందుకోసమే నే నిచటికి, నీ దగ్గరకు వచ్చినాను. నా కోరిక ప్రకారము, నా సాహాయ్యముకొరకై నీవు చేయవలసిన కార్యమును వినుము. 17

మూ. సౌవర్ణస్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిన్దుభిః,
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర. 18

ప్ర. అ. త్వమ్ = నీవు, రజతబిన్దుభిః = వెండి చుక్కలచేత, చిత్రః = విచిత్రమైన, సౌవర్ణః = బంగారము వికారమైన, మృగః = మృగముగా, భూత్వా = అయి, తస్య రామస్య = ఆ రామునియొక్క, ఆశ్రమే = ఆశ్రమమునందు, సీతాయాః = సీతయొక్క, ప్రముఖే = ఎదుట, చర = సంచరించుము.

తా. నీవు వెండి చుక్క లున్న బంగారు లేడి రూపము గ్రహించి, రాముని ఆశ్రమములో, సీత ఎదుట సంచరించుము. 18

మూ. త్వాం తు నిఃసంశయం సీతా దృష్ట్వా తు మృగరూపిణమ్,
గృహ్యతామితి భర్తారం లక్ష్మణం చాభిధాస్యతి. 19

ప్ర. అ. సీతా = సీత, మృగరూపిణమ్ = మృగరూపము గల, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, గృహ్యతామ్ = పట్టుకొనబడుగాక, ఇతి = అని, భర్తారమ్ = భర్తను గూర్చి, లక్ష్మణం చ = లక్ష్మణుని గూర్చి, నిఃసంశయమ్ = నిస్సంశయముగా, అభిధాస్యతి = చెప్పగలదు.

తా. మృగరూపములో ఉన్న నిన్ను చూడగానే సీత "దీనిని పట్టుకొనుడు" అని భర్తను, లక్ష్మణుణ్ణీ తప్పక కోరగలదు. 19

మూ. తతస్తయోరపాయే తు శూన్యే సీతాం యథాసుఖమ్,
నిరాబాధో హరిష్యామి రాహుశ్చన్ద్రప్రభామివ. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తయోః = వారిద్దరియొక్క, అపాయే తు = దూరముగా తొలగుట జరుగగానే, శూన్యే = శూన్యమైన ప్రదేశమునందు, యథాసుఖమ్ = సుఖముగా, నిరాబాధః = బాధ లేనివాడనై, సీతామ్ = సీతను, రాహుః = రాహువు, చన్ద్రప్రభామివ = చంద్రకాంతిని వలె, హరిష్యామి = హరించెదను.

తా. రామలక్ష్మణు లిద్దరూ దూరముగా వెళ్ళిపోయిన పిమ్మట ఎట్టి ఆటంకమూ లేకుండగా, సుఖముగా, సీతను, రాహువు చంద్రకాంతిని హరించినట్లు హరించెదను. 20

మూ. తతః పశ్చాత్సుఖం రామే భార్యాహరణకర్శితే,
విస్రబ్ధం ప్రహరిష్యామి కృతార్థేనాన్తరాత్మనా. 21

ప్ర. అ. తతః పశ్చాత్ = అటు పిమ్మట, భార్యాహరణకర్శితే = భార్యను హరించుటచేత దుర్బలుడుగా చేయబడిన, రామే = రామునియందు, కృతార్థేన = కృతార్థమైన, అన్తరాత్మనా = మనస్సుతో, సుఖమ్ = సుఖముగా, విస్రబ్ధమ్ = నమ్మకముగా, ప్రహరిష్యామి = కొట్టెదను.

తా. రాముడు, భార్య హరింపబడుటచే దుర్బలుడైపోవును. అప్పుడు నేను చరితార్థమైన మనస్సుతో, సుఖముగా, నిర్భయముగా, రాముణ్ణి కొట్టివేయగలను.

మూ. తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః,
శుష్కం సమభవద్వక్త్రం పరితప్తో బభూవ హ. 22

ప్ర. అ. రామకథామ్ = రాముని కథను, శ్రుత్వా = విని, మహాత్మనః = మహాత్ముడైన, తస్య మారీచస్య = ఆ మారీచునియొక్క, వక్త్రమ్ = ముఖము, శుష్కమ్ = ఎండినది, సమభవత్ = ఆయెను. పరితప్తః = భయపడినవాడుగా బభూవ హి = ఆయెను.

తా. రాముని పేరు వినగానే మహాత్ముడైన ఆ మారీచుని ముఖము వాడిపోయెను. ఆతడు చాల భయపడిపోయెను. 22

మూ. ఓష్ఠౌ పరిలిహన్ శుష్కౌ నేత్రైరనిమిషైరివ,
మృతభూత ఇవార్తస్తు రావణం సముదైక్షత. 23

ప్ర. అ. శుష్కౌ = ఎండిన, ఓష్ఠౌ = పెదవులను, పరిలిహన్ = నాకుచు, అనిమిషైరివ = రెప్పపాటు లేనివానివలె ఉన్న, నేత్రైః = చూపులతో, మృతభూత ఇవ = చచ్చినవాడువలె అయి, ఆర్తస్తు = దీనుడై, రావణమ్ = రావణుని, సముదైక్షత = చూచెను.

తా. ఎండిపోయిన పెదవులు నాకుచు, మరణించినవాడువలె, దీనుడై, రెప్పపాటు లేని చూపులలో రావణుని వైపు చూచెను. 23

మూ. స రావణం త్రస్తవిషణ్ణచేతా
మహావనే రామపరాక్రమజ్ఞః,

కృతాఞ్జలి స్తత్త్వమువాచ వాక్యం
హితం చ తస్మై హితమాత్మనశ్చ. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షట్త్రింశః సర్గః.

ప్ర. అ. మహావనే = మహావనమునందు, రామపరాక్రమజ్ఞః = రాముని పరాక్రమమును ఎరిగిన, సః = ఆ మారీచుడు, త్రస్తవిషణ్ణచేతాః = భయపడిన, దుఃఖించుచున్న చిత్తముకలవాడై, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలికలవాడై, తస్మై = రావణునకు, హితమ్ = హితమైన, ఆత్మనశ్చ = తనకు కూడ, హితమ్ = హితమైన, తత్త్వమ్ = యథార్థమైన, వాక్యమ్ = వాక్యమును, రావణమ్ = రావణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. మహావనములో రాముని పరాక్రమమును గూర్చి బాగా తెలిసికొనిన ఆ మారీచుని మనస్సు భయముతో క్రుంగిపోయెను. అతడు అంజలి ఘటించి ఆ రావణునితో, ఆతనికి, తనకూ కూడ హితమైన వాక్యమును ఇట్లు పలికెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్య కాండలో ముప్పది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తత్రింశః సర్గః

*[మారీచుడు రాముని గుణప్రభావాదులను వర్ణించి చెప్పి సీతాహరణప్రయత్నమునుండి విరమింపుమని రావణునకు ఉపదేశించుట].*

మూ. తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రస్య వాక్యం వాక్యవిశారదః,
ప్రత్యువాచ మహాతేజా మారీచో రాక్షసేశ్వరమ్. 1

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, వాక్యవిశారదః = మాటలలో నేర్పరీ, మహాతేజాః = గొప్ప తేజస్సుకలవాడూ అయిన, మారీచః = మారీచుడు, రాక్షసేశ్వరమ్ = రావణున్ని గూర్చి, ప్రత్యువాచ = తిరిగిపలికెను.

తా. మాటలలో నేర్పరి మహాతేజఃశాలీ అయిన మారీచుడు, రావణుని మాటలు విని ఆతనితో ఇట్లు పలికెను. 1

మూ. సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః,
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. 2

ప్ర. అ. రాజన్ = రాజా ! ప్రియవాదినః = ప్రియముగా మాటలాడు, పురుషాః = పురుషులు, సతతమ్ = ఎల్లప్పుడూ, సులభాః = సులభమైనవారు. అప్రియస్య = ప్రియము కానిది, తు = కాని, పథ్యస్య = పథ్యము అయినదానికి, వక్తా = చెప్పేవాడు, శ్రోతా చ = వినేవాడూ కూడ, దుర్లభః = దుర్లభుడు.

తా. రాజా ! ప్రియముగా మాటలాడేవాళ్లు ఎల్లప్పుడూ అనాయాసంగా లభించుదురు. ప్రియముకాని, కాని హితకరము అయిన విషయము చెప్పేవాళ్లు వినేవాళ్లూ కూడ చాల అరుదు. 2

మూ. న నూనం బుధ్యసే రామం మహావీర్యం గుణోన్నతమ్,
అయుక్తచారశ్చపలో మహేన్ద్రవరుణోపమమ్. 3

ప్ర. అ. అయుక్తచారః = ఏర్పరచుకొనబడని గూఢచారులు కలవాడవు, చపలః = చపలస్వభావము గలవాడవు అయిన నీవు, మహావీర్యమ్ = గొప్ప పరాక్రమము గలవాడు, గుణోన్నతమ్ = గుణములచేత ఉన్నతుడు, మహేన్ద్రవరుణోపమమ్ = మహేంద్రవరుణులతో సమానుడూ అయిన, రామమ్ = రాముణ్ణి గూర్చి, నూనమ్ = నిశ్చయముగా, న బుధ్యసే = తెలుసుకొనుటలేదు.

తా. చపలస్వభావుడవైన నీవు గూఢచారులను నియమించుటలో అశ్రద్ధ వహించుచున్నావు. అందుచేతనే గొప్ప పరాక్రమము కలవాడు, సద్గుణములచేత ఉత్తముడు, ఇంద్రవరుణులతో సమానుడూ అయిన రాముణ్ణి గూర్చి ఏమాత్రము తెలియకుండా ప్రవర్తించుచున్నావు. నిజము. 3

మూ. అపి స్వస్తి భవేత్తాత సర్వేషాం భువి రక్షసామ్,
అపి రామో సుసంక్రుద్ధః కుర్యాల్లోకమరాక్షసమ్. 4

ప్ర. అ. తాత = నాయనా! భువి = భూలోకమునందు, సర్వేషామ్ = సమస్తమైన, రక్షసామ్ = రాక్షసులకు, స్వస్తి = క్షేమము, అపి భవేత్ = అగును కదా! రామః = రాముడు, సుసంక్రుద్ధః = బాగుగా కోపించినవాడై, లోకమ్ = లోకమును, అరాక్షసమ్ = రాక్షసులు లేనిదానినిగా, అపి న కుర్యాత్ = చేయడు కదా!

తా. నాయనా! భూలోకములో రాక్షసులందరూ క్షేమముగా ఉందురా? రాముడు చాల కోపించి ఈ లోకములో రాక్షసులే లేకుండ చేయడు కదా! 4

మూ. అపి తే జీవితాన్తాయ నోత్పన్నా జనకాత్మజా,
అపి సీతానిమిత్తం చ న భవేద్వ్యసనం మమ. 5

ప్ర. అ. జనకాత్మజా = సీత, తే = నీయొక్క, జీవితాన్తాయ = జీవితముయొక్క అంతముకొరకు, అపి నోత్పన్నా = పుట్టలేదుకద. సీతానిమిత్తమ్ = సీతానిమిత్తముచేత, మమ = నాకు, వ్యసనమ్ = ఆపద, అపి న భవేత్ = కలుగదు కదా!

తా. సీత నీ ప్రాణములు తీయుటకే పుట్టలేదు కద! సీతమూలాన నాకు కూడ ముప్పు వాటిల్లదు కద!

5

మూ. అపి త్వామీశ్వరం ప్రాప్య కామవృత్తం నిరఙ్కుశమ్,
న వినశ్యేత్పురీ లఙ్కా త్వయా సహ సరాక్షసా. 6

ప్ర. అ. కామవృత్తమ్ = స్వేచ్ఛగా ప్రవర్తించువాడవు, నిరఙ్కుశమ్ = అడ్డు లేకుండా ఉన్నవాడవు అయిన, త్వామ్ = నిన్ను, ఈశ్వరమ్ = ప్రభువునుగా, ప్రాప్య = పొంది, సరాక్షసా = రాక్షసులతో కూడిన, పురీ లఙ్కా = లంకా పట్టణము, త్వయా సహ = నీతో కూడ, న వినశ్యేదపి = నశించదు కద!

తా. స్వేచ్ఛగా, నిరంకుశముగా ప్రవర్తించే నీవు రాజుగా ఉన్నందుకు లంకాపట్టణము, రాక్షసులతోను, నీతోను కూడ నశించదు కద! 6

మూ. త్వద్విధః కామవృత్తో హి దుఃశీలః పాపమన్త్రితః,
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హన్తి దుర్మతిః. 7

ప్ర. అ. కామవృత్తః = స్వేచ్ఛగా ప్రవర్తించువాడు, దుఃశీలః = చెడ్డ స్వభావము కలవాడు, పాపమన్త్రితః = చెడ్డ ఆలోచన కలవాడు, దుర్మతిః = చెడ్డ బుద్ధి కలవాడు అయిన, త్వద్విధః = నీవంటి, సః రాజా = రాజు, ఆత్మానమ్ = తనను, స్వజనమ్ = స్వజనమును, రాష్ట్రమ్ = రాష్ట్రమును, హన్తి హి = నశింపచేయును కదా ?

తా. చెడ్డ స్వభావముతో స్వేచ్ఛగా ప్రవర్తించుచు, పాపపు ఆలోచనలు చెడ్డ బుద్ధి గల నీవంటి రాజు తనను, స్వజనమును, రాష్ట్రమును కూడ నశింపచేయును. 7

మూ. న చ పిత్రా పరిత్యక్తో నామర్యాదః కథంచన,
న లుబ్ధో న చ దుఃశీలో న చ క్షత్రియపాంసనః, 8

న చ ధర్మగుణైర్హీనః కౌసల్యానన్దవర్ధనః
న తీక్ష్ణో న చ భూతానాం సర్వేషామహితే రతః. 9

ప్ర. అ. కౌసల్యానన్దవర్ధనః = కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించు ఆ రాముడు, పిత్రా = తండ్రిచేత, న చ పరిత్యక్తః = విడువబడలేదు. కథంచన = ఏ విధముగాను కూడ, అమర్యాదః = కట్టుబాట్లు లేనివాడు, న =

కాడు, లుబ్ధః = లోభముకలవాడు, న = కాడు. దుఃశీలః = చెడ్డ స్వభావము కలవాడు. న చ = కాడు. క్షత్రియపాంసనః చ = దుష్టక్షత్రియుడు కూడ, న = కాడు. ధర్మగుణైః = ధర్మముతోను, సద్గుణములతోను, హీనః = హీనుడు, న = కాడు. తీక్ష్ణః = తీక్ష్ణుడు, న = కాడు. సర్వేషామ్ = సమస్తమైన, భూతానామ్ = ప్రాణుల, అహితే = అహితమునందు, రతః = ఆసక్తుడు, న = కాడు.

తా. కౌసల్యాప్రియపుత్రుడైన రాముడు నీవు అనుకున్నట్లు తండ్రిచేత వెడలగొట్టబడలేదు. అతడు ఏ విధముగాను కట్టుబాట్లను అతిక్రమించేవాడు కాడు. అతడు లుబ్ధుడు గాని, దుష్టస్వభావవంతుడు గాని, దుష్టక్షత్రియుడు గాని, ధర్మము, సద్గుణములు లేనివాడు గాని, తీక్ష్ణుడు గాని, సకలభూతముల చెడును కోరువాడు గాని కాడు.
8, 9

మూ. వఞ్చితం పితరం దృష్ట్వా కైకేయ్యా సత్యవాదినమ్,
కరిష్యామీతి ధర్మాత్మా తాత ప్రవ్రజితో వనమ్. 10

ప్ర. అ. తాత = నాయనా! సత్యవాదినమ్ = సత్యమునే పలుకు, పితరమ్ = తండ్రిని, కైకేయ్యా = కైకేయి చేత, వఞ్చితమ్ = వంచింపబడినవానినిగా, దృష్ట్వా = చూచి, ధర్మాత్మా = ధర్మాత్ముడైన రాముడు, కరిష్యామి ఇతి = తండ్రి ఆజ్ఞను చేసెదను అని, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రజితః = వెళ్ళినాడు.

తా. నాయనా! సత్యవాదియైన తన తండ్రిని కైకేయి వంచించుట చూచి ధర్మాత్ముడైన రాముడు "తండ్రి ఆజ్ఞప్రకారము చేసెదను"అని పలికి వనమునకు వెళ్ళినాడు.
10

మూ. కైకేయ్యాః ప్రియకామార్థం పితుర్దశరథస్య చ,
హిత్వా రాజ్యం చ భోగాంశ్చ ప్రవిష్టో దణ్డకావనమ్. 11

ప్ర. అ. కైకేయ్యాః = కైకేయియొక్క, పితుః = తండ్రియైన, దశరథస్య చ = దశరథునియొక్క, ప్రియకామార్థమ్ = ప్రియమైన కోరికకొరకు, రాజ్యమ్ = రాజ్యమును, భోగాంశ్చ = భోగములను, హిత్వా = విడచి, దణ్డకావనమ్ = దండకావనమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. కైకేయికి, తండ్రియైన దశరథునకు ప్రియమైన కోరికను తీర్చుట నిమిత్తము రాజ్యమును, భోగములను విడచి దండకారణ్యములో ప్రవేశించినాడు.

మూ. న రామః కర్కశస్తాత నావిద్వాన్నాజితేన్ద్రియః,
అనృతం దుఃశ్రుతం చైవ నైవ త్వం వక్తుమర్హసి. 12

ప్ర. అ. తాత = నాయనా ! రామః = రాముడు, కర్కశః = కఠినుడు, న = కాడు. అవిద్వాన్ = అపండితుడు, న = కాడు. అజితేన్ద్రియః = ఇంద్రియములను జయించనివాడు, న = కాడు. త్వమ్ = నీవు, అనృతమ్ = అసత్యము, దుఃశ్రుతం చైవ = చెడ్డగా వినబడినదీ అయిన విషయమును, వక్తుమ్ = చెప్పుటకు, నార్హసి = తగవు.

తా. నాయనా ! రాముడు కఠినుడుగాని, అపండితుడు కాని, ఇంద్రియములను జయింపజాలనివాడు గాని కాడు. నీవు పొరబాటుగా విన్న అసత్యవిషయమును చెప్పకూడదు. 12

మూ. రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః,
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ. 13

ప్ర. అ. రామః = రాముడు, విగ్రహవాన్ = శరీరము గల, ధర్మః = ధర్మము. సాధుః = సత్పురుషుడు. సత్యపరాక్రమః = సత్యమైన పరాక్రమము కలవాడు. దేవానామ్ = దేవతలకు, మఘవానివ = ఇంద్రుడు వలె, సర్వస్య = సమస్తమైన, లోకస్య = లోకమునకు, రాజా = రాజు.

తా. రాముడు మూర్తీభవించిన ధర్మము, సత్పురుషుడు, సత్యమైన పరాక్రమము కలవాడు, దేవతలకు దేవేంద్రుడు వలె సకలలోకమునకు ప్రభువు.

మూ. కథం త్వం తస్య వైదేహీం రక్షితాం స్వేన తేజసా,
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః. 14

ప్ర. అ. త్వమ్ = నీవు, తస్య = ఆ రామునియొక్క, స్వేన = తన సంబంధమైన, తేజసా = తేజస్సుచేత, రక్షితామ్ = రక్షింపబడిన, వైదేహీమ్ = సీతను, వివస్వతః = సూర్యునియొక్క, ప్రభామివ = కాంతిని వలె, ప్రసభమ్ = బలాత్కారముగా, హర్తుమ్ = హరించుటకు, కథమ్ = ఎట్లు, ఇచ్ఛసి = కోరుచున్నావు ?

తా. రాముని తేజస్సుచేత రక్షింపబడుచున్న ఆ సీతను, సూర్యునినుండి కాంతిని హరించుటకు కోరుచున్నట్లు, బలాత్కారముగా హరించుటకై నీకు కోరిక ఎట్లు కలిగినది? 14

మూ. శరార్చిషమనాధృష్యం చాపఖడ్గేన్ధనం రణే,
రామాగ్నిం సహసా దీప్తం న ప్రవేష్టుం త్వమర్హసి. 15

ప్ర. అ. శరార్చిషమ్ = బాణములు అను జ్వాలలు కలది, అనాధృష్యమ్ = ఎదిరించ శక్యము కానిది, చాపఖడ్గేన్ధనమ్ = ధనస్సు, ఖడ్గము అను కట్టెలు కలది అయిన, రణే = యుద్ధరంగమునందు, దీప్తమ్ = మండుచున్న, రామాగ్నిమ్ = రాము డనే అగ్నిని, సహసా = శీఘ్రముగా, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, త్వమ్ = నీవు, న అర్హసి = తగవు.

తా. బాణము లనే మంటలతో, ధనస్సు, ఖడ్గము అను కట్టెలతో రణరంగములో ప్రజ్వలించుచున్న, ఎదిరింప శక్యము కాని రాము డనే అగ్నిలోనికి తొందరపడి దుమకుము. 15

మూ. ధనుర్వ్యాదితదీప్తాస్యం శరార్చిషమమర్షణమ్,
చాపబాణధరం తీక్ష్ణం, శత్రుసైన్యప్రహారిణమ్. 16

రాజ్యం సుఖం చ సంత్యజ్య జీవితం చేష్టమాత్మనః,
నాత్యాసాదయితుం తాత రామాన్తకమిహార్హసి. 17

ప్ర. అ. తాత = నాయనా! ధనుర్వ్యాదితదీప్తాస్యమ్ = ధనస్సు అనే తెరవబడిన మండుచున్న ముఖముకలవాడు, శరార్చిషమ్ = బాణములే జ్వాలలు కలవాడు, అమర్షణమ్ = కోపము కలవాడు, చాపబాణధరమ్ = చాపబాణములను ధరించినవాడు, తీక్ష్ణమ్ = తీక్ష్ణమైనవాడు, శత్రుసైన్యప్రహారిణమ్ = శత్రుసైన్యమును సంహరించువాడు అయిన, రామాన్తకమ్ = రాము డనే యముణ్ణి, ఆత్మనః = నీయొక్క, ఇష్టమ్ = ఇష్టమైన, రాజ్యమ్ = రాజ్యమును, సుఖం చ = సుఖమును, జీవితం చ = జీవితమును, సంత్యజ్య = విడచి, ఇహ = ఇప్పుడు, అత్యాసాదయితుమ్ = దగ్గరగా చేరుటకు, న అర్హసి = తగవు.

తా. నాయనా! చాపబాణములు ధరించిన రాము డనే యముడు ధనస్సు

అను ప్రజ్వలించుచున్న నోరు తెరచుకొని, బాణము లనే మంటలు కక్కుచు, మహాక్రోధముతో శత్రుసైన్యమును నశింపచేయుచుండును. నీవు నీకిష్టమైన రాజ్యమును, సుఖమును, జీవితమును విడచి, అతని దరిదాపులకు కూడ వెళ్ళుట మంచిది కాదు. 16, 17

మూ. అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా,
న త్వం సమర్థస్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే. 18

ప్ర. అ. సా = ఆ, జనకాత్మజా = సీత, యస్య = ఏ రాముని భార్యయో, తత్ = అది, (ఆ రాముడు), అప్రమేయమ్ = ఇంత అని చెప్పుటకు శక్యము కాని, తేజః హి = తేజస్సు కదా ; వనే = వనమునందు, రామచాపాశ్రయామ్ = రాముని ధనస్సు ఆశ్రయముగా గల, తామ్ = ఆ సీతను, హర్తుమ్ = హరించుటకు, త్వమ్ = నీవు, సమర్థః = సమర్థుడవు, న = కాదు.

తా. సీత ఏ రాముని భార్యయో ఆ రాముడు ఇంత అని కొలచి చెప్పుటకు శక్యము కాని మహాతేజస్సు. అరణ్యములో రాముని ధనస్సును ఆశ్రయించి నివసించుచున్న ఆ సీతను నీవు హరించజాలవు. 18

మూ. తస్య సా నరసింహస్య సింహోరస్కస్య భామినీ,
ప్రాణేభ్యోఽపి ప్రియతరా భార్యా నిత్యమనువ్రతా. 19

ప్ర. అ. సా భామినీ = ఆ సీత, సింహోరస్కస్య = సింహము వంటి వక్షఃస్థలము గల, తస్య = ఆ, నరసింహస్య = నరులలో శ్రేష్ఠుడైన రాముని యొక్క, ప్రాణేభ్యోఽపి = ప్రాణములకంటె కూడ, ప్రియతరా = ఎక్కువ ప్రియమైన, భార్యా = భార్య. నిత్యమ్ = ఎల్లప్పుడు, అనువ్రతా = అతనినే అనుసరించుట అనువ్రతము కలది.

తా. ఆ సీత సింహమువంటి వక్షఃస్థలముగలవాడు, మానవులలో శ్రేష్ఠుడు అయిన రామునకు ప్రాణములకంటె కూడ ఎక్కువ ప్రియురాలైన భార్య. ఎల్లప్పుడు అతనినే అనుసరించుట అనే వ్రతము గలది. 19

మూ. న సా ధర్షయితుం శక్యా మైథిల్యోజస్వినః ప్రియా,
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా. 20

ప్ర. అ. మైథిలీ = మిథిలకు సంబంధించినది, ఓజస్వినః = తేజఃశాలి యైన రామునియొక్క, ప్రియా = ప్రియురాలు, సుమధ్యమా = సుందరమైన నడుము గలది అయిన, సా సీతా = ఆ సీత, దీప్తస్య = మండుచున్న, హుతాశస్య = అగ్నియొక్క, శిఖా ఇవ = జ్వాలవలె, ధర్షయితుమ్ = అవమానించుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. మిథిలారాజు కూతురు, తేజఃశాలియైన రాముని ప్రియురాలు, చక్కని నడుము గలది అయిన ఆ సీతను, ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలను వలె ఎవ్వరూ ఎదిరించజాలరు.

20

మూ. కిముద్యమమిమం వ్యర్థం కృత్వా తే రాక్షసాధిప,
దృష్టశ్చేత్త్వం రణే తేన తదన్తం తవ జీవితమ్. 21

ప్ర. అ. రాక్షసాధిప = రాక్షసరాజా ! వ్యర్థమ్ = వ్యర్థమైన, ఇమమ్ = ఈ, ఉద్యమమ్ = ఉద్యమమును, కృత్వా = చేసి, తే = నీకు, కిమ్ = ఏమి, ప్రయోజనము ? త్వమ్ = నీవు, రణే = యుద్ధమునందు, తేన = ఆ రామునిచేత, దృష్టః చేత్ = చూడబడినట్లయితే, తవ = నీయొక్క, జీవితమ్ = జీవితము; తదన్తమ్ = అదే అంతము కలది.

వా. రావణా! వ్యర్థమైన ఈ కార్యము చేయుటకు ఎందుకు ఉద్యమించుచున్నావు? రాముడు నిన్ను రణరంగములో ఎప్పుడు చూచునో అప్పుడే నీ జీవితము అంతమగును.

21

మూ. జీవితం చ సుఖం చైవ రాజ్యం చైవ సుదుర్లభమ్,
యదీచ్ఛసి చిరం భోక్తుం మా కృథా రామవిప్రియమ్.

ప్ర. అ. జీవితం చ = జీవితమును, సుఖం చైవ = సుఖమును, సుదుర్లభమ్ = చాల కష్టముగా కాని లభించని, రాజ్యం చైవ = రాజ్యమును, చిరమ్ = చిరకాలము, భోక్తుమ్ = అనుభవించుటకు, ఇచ్ఛసి యది = (నీవు) కోరినట్లయితే, రామవిప్రియమ్ = రామునకు అపకారమును, మా కృథాః = చేయకుము.

తా. జీవితమును, సుఖమును, దుర్లభమైన ఈ రాజ్యమును చాల కాలము

పాటు అనుభవించవలె నని నీకు కోరిక ఉన్నచో రామునకు అపకారము చేయ కుము. 22

మూ. స సర్వైః సచివైః సార్ధం విభీషణపురోగమైః,
మన్త్రయిత్వా తు ధర్మిష్ఠైః కృత్వా నిశ్చయమాత్మనః

దోషాణాం చ గుణానాం చ సంప్రధార్య బలాబలమ్,
ఆత్మనశ్చ బలం జ్ఞాత్వా రాఘవస్య చ తత్త్వతః. 24
హితాహితం వినిశ్చిత్య క్షమం త్వం కర్తు మర్హసి.

ప్ర. అ. సః త్వమ్ = అట్టి నీవు, ధర్మిష్ఠైః=ధర్మాతులైన, విభీషణపురోగమైః = విభీషణుడు మొదలుగాగల, సర్వైః = సమస్తమైన, సచివైః సార్ధమ్= మంత్రులతో కూడ, మన్త్రయిత్వా = అలోచించి, ఆత్మనః = నీయొక్క, నిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, దోషాణాం చ = దోషములయొక్క, గుణానాం చ = గుణములయొక్క, బలాబలమ్ = బలాబలమును, సంప్రధార్య= నిర్ణయించి, ఆత్మనశ్చ = నీయొక్క, రాఘవస్య చ = రామునియొక్క, బలమ్ = బలమును, తత్త్వతః = యథార్థముగా, జ్ఞాత్వా = తెలిసికొని, హితాహితమ్ హితమును అహితమును, వినిశ్చిత్య = నిశ్చయించి, క్షమమ్ = తగిన దానిని, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. అందుచేత నీవు విభీషణుడుమొదలైన ధర్మాత్ములైన మంత్రు లందరితో ఆలోచించి, నీ నిర్ణయము చేసికొని, గుణదోషముల బలాబలములను నిశ్చయించుకొని, నీ బల మెంతో రాముని బల మెంతో సరిగా తెలిసికొని, ఏది హితమో ఏది అహితమో నిర్ణయించుకొని తగు విధముగా చేయుము. 23, 24

మూ. అహం తు మన్యే తవ న క్షమం రణే,
సమాగమం కోసలరాజసూనునా,
ఇదం హి భూయః శృణు వాక్యముత్తమం
క్షమం చ యుక్తం చ నిశాచరేశ్వర. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. నిశాచరేశ్వర = రాక్షసరాజా! అహం తు = నేనైతే, తవ = నీకు, రణే = యుద్ధమునందు, కోసలరాజసూనునా = రామునితో, సమాగమమ్ = కలియుటను, క్షమమ్ = యుక్తమైనదానినిగా, న మన్యే = తలవను. ఉత్తమమ్ = ఉత్తమము, క్షమమ్ = తగినది, యుక్తం చ = యుక్తిసంమతము అయిన, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, భూయః = మరల, శృణు = వినుము.

తా. రాక్షసరాజా ! నీవు యుద్ధములో రామునితో తలబడుట యుక్తము కాదనియే నా అభిప్రాయము. యుక్తియుక్తమైన, తగిన ఉత్తమమైన మాట ఒకటి చెప్పుచున్నాను ; మరల వినుము.

25

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ముప్పది ఏడవ సర్గ సమాప్తము.

## అథ అష్టత్రింశః సర్గః

[రాముని పరాక్రమాదుల విషయమున తన అనుభవమును చెప్పుచు మారీచుడు రామునకు అపకారము చేయవద్దని రావణునకు ఉపదేశించుట]

మూ. కదాచిదప్యహం వీర్యాత్పర్యటన్ పృథివీమిమామ్,
బలం నాగసహస్రస్య ధారయన్ పర్వతోపమః. 1

నీలజీమూతసంకాశ స్తప్తకాఞ్చనకుణ్డలః,
భయం లోకస్య జనయన్ కిరీటీ పరిఘాయుధః. 2
వ్యచరం దణ్డకారణ్యమృషిమాంసాని భక్షయన్.

ప్ర. అ. కదాచిత్ = ఒకానొకప్పుడు, అహమపి = నేను కూడ, వీర్యాత్ = పరాక్రమమువలన, ఇమామ్ = ఈ, పృథివీమ్ = భూమిని, పర్యటన్ = తిరుగుచు, నాగసహస్రస్య = ఏనుగుల సహస్రముయొక్క, బలమ్ = బలమును, ధారయన్ = ధరించుచు, పర్వతోపమః = పర్వతముతో సమానుడనై, నీలజీమూతసంకాశః = నల్లని మేఘముతో సమానుడనై, తప్తకాఞ్చనకుణ్డలః = పరిశుద్ధమైన బంగారు కుండలములు కలవాడనై, కిరీటీ = కిరీటము కలవాడనై, పరిఘాయుధః = పరిఘ ఆయుధముగా కలవాడనై, లోకస్య = లోకమునకు, భయమ్ = భయమును, జనయన్ = పుట్టించుచు, ఋషిమాంసాని = ఋషుల మాంసములను, భక్షయన్ = భక్షించుచు, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, వ్యచరమ్ = సంచరించితిని.

తా. ఒకప్పుడు నేను పర్వతము వంటి శరీరముతో, వేయి ఏనుగుల బలముతో పరాక్రమశాలినై ఈ భూమిపై సంచరించితిని. నల్లటి మేఘము వలె ఉన్న నేను శుద్ధమైన బంగారు కుండలములు, కిరీటము ధరించి, పరిఘ అనే ఆయుధమును గ్రహించి, లోకములకు భయము కలిగించుచు, ఋషుల మాంసములు తినుచు దండకారణ్యములో సంచరించితిని. 1, 2

మూ. విశ్వామిత్రోఽథ ధర్మాత్మా మద్విత్రస్తో మహామునిః 3
స్వయం గత్వా దశరథం నరేన్ద్రమిదమబ్రవీత్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విశ్వామిత్రః=విశ్వామిత్రుడనే, మహామునిః=మహాముని, మద్విత్రస్తః = నానుండి భయపడినవాడై, స్వయమ్=స్వయముగా, నరేన్ద్రమ్=రాజైన, దశరథమ్=దశరథుని గూర్చి, గత్వా=వెళ్లి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు ధర్మాత్ముడైన విశ్వామిత్రు డనే మహాముని స్వయముగా దశరథమహారాజువద్దకు వెళ్ళి ఇట్లు పలికెను. 3

మూ. అద్య రక్షతు మాం రామః పర్వకాలే సమాహితః, 4
మారీచాన్మే భయం ఘోరం సముత్పన్నం నరేశ్వర.

ప్ర. అ. నరేశ్వర=రాజా! మారీచాత్=మారీచునినుండి, మే=నాకు, మహత్=గొప్ప, భయమ్=భయము, సముత్పన్నమ్=పుట్టినది. అద్య=ఇప్పుడు, రామః=రాముడు, సమాహితః = సావధానచిత్తుడై, పర్వకాలే=పర్వకాలమునందు, మామ్=నన్ను, రక్షతు=రక్షించుగాక.

తా. రాజా! నాకు మారీచునినుండి ఘోరమైన భయము ఏర్పడినది. ఇప్పుడు, రాముడు సావధానచిత్తుడై పర్వకాలములో నన్ను రక్షించు నట్లు చేయుము. 4

మూ. ఇత్యేవముక్తో ధర్మాత్మా రాజా దశరథస్తదా, 5
ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిమ్.

ప్ర. అ. ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రాజా=రాజైన, దశరథః=దశరథుడు, తదా=అప్పుడు, మహాభాగమ్=గొప్పభాగ్యము గల, మహామునిమ్=మహామునియైన, విశ్వామిత్రమ్=విశ్వామిత్రుని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. ధర్మాత్ముడైన ఆ దశరథమహారాజు విశ్వామిత్రుని మాటలు విని, మహాభాగ్యవంతుడైన ఆ మహామునితో ఇట్లు పలికెను. 5

మూ. బాలో ద్వాదశవర్షోఽయమకృతాస్త్రశ్చ రాఘవః, 6
కామం తు మమ యత్సైన్యం మయా సహ గమిష్యతి.

ప్ర. అ. అయమ్ = ఈ, రాఘవః = రాముడు, బాలః = బాలుడు. అకృతాస్త్రశ్చ = అస్త్రములు నేర్వనివాడు. మమ = నాయొక్క, యత్ = ఏ, సైన్యమ్ = సైన్యమున్నదో, అది, కామమ్ = తప్పక, మయా సహ = నాతో కూడ, గమిష్యతి = వెళ్ళగలదు.

తా. ఈ రాముడు బాలుడు. అస్త్రములను ఇంకా నేర్వనివాడు. అందుచేత నేను సైన్యముతో తప్పక నీ వెంట వచ్చెదను. 6

మూ. బలేన చతురఙ్గేణ స్వయమేత్య నిశాచరాన్, 7
వధిష్యామి మునిశ్రేష్ఠ శత్రూంస్తే మనసేప్సితాన్.

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునులలో శ్రేష్ఠుడా! చతురఙ్గేన = నాలుగు అంగములు గల, బలేన = సేనతో, స్వయమ్ = స్వయముగా, ఏత్య = వచ్చి, తే = నీయొక్క, శత్రూన్ = శత్రువులు, మనసా = నా మనస్సుచేత, ఈప్సితాన్ = (చంపబడుటకై) ఇష్టులూ అయిన, నిశాచరాన్ = రాక్షసులను, వధిష్యామి = చంపగలను.

తా. ఓ! మహామునీ! నేను చతురంగబలముతో స్వయముగా వచ్చి నీవు ఎవరిని చంపవలె నని చెప్పుదువో, నీ శత్రువులైన ఆ రాక్షసులను చంపెదను. 7

మూ. ఇత్యేవముక్తః స మునీ రాజానమిదమబ్రవీత్, 8
రామాన్నాన్యద్బలం లోకే పర్యాప్తం తస్య రక్షసః.

ప్ర. అ. ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః మునిః = ఆ ముని, రాజానమ్ = రాజునుగూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రామాత్ = రామునికంటె, అన్యత్ = భిన్నమైన, బలమ్ = బలము, తస్య రక్షసః = ఆ రాక్షసునకు, లోకే = ఈలోకమునందు, న పర్యాప్తమ్ = సరిపోవు నది

తా. విశ్వామిత్రుడు ఆ మాటలు విని రాజుతో ఇట్లు పలికెను. "ఈ లోకములో రాముడు తప్ప మరియే ఇతరబలమూ కూడ ఆ రాక్షసుని చంపుటకు చాలదు." 8

మూ. దేవతానామపి భవాన్సమరేష్వభిపాలకః, 9
ఆసీత్తవ కృతం కర్మ త్రిలోకే విదితం నృప.

ప్ర. అ. నృప = రాజా ! భవాన్ = నీవు, సమరేషు = యుద్ధములయందు, దేవానామపి = దేవతలకు కూడ, అభిపాలకః = రక్షకుడవు. కృతమ్ = చేయబడిన, తవ = నీ యొక్క, కర్మ = పని, త్రిలోకే = మూడు లోకములందూ, విదితమ్ ఆసీత్ = ప్రసిద్ధమైనది.

తా. "రాజా! నీవు యుద్ధములలో దేవతలను కూడ రక్షించినావు. నీవు పూర్వము చేసిన ఆ పని మూడులోకాలలోను ప్రసిద్ధి గాంచినది." 9

మూ. కామమస్తు మహత్సైన్యం తిష్ఠత్విహ పరంతప, 10
బాలోఽప్యేష మహాతేజాః సమర్థస్తస్య నిగ్రహే,
గమిష్యే రామమాదాయ స్వస్తి తేఽస్తు పరంతప. 11

ప్ర. అ. పరంతప = శత్రుసంహారకుడా, మహత్ = గొప్పదైన, సైన్యమ్ = సైన్యము, అస్తు కామమ్ = ఉండిన ఉండు గాక. ఇహ = ఇక్కడనే, తిష్ఠతు = ఉండుగాక, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ఏషః = ఈ రాముడు, బాలోఽపి = చిన్నవాడైనా, తస్య = ఆ మారీచునియొక్క, నిగ్రహే = నిగ్రహించుటయందు, సమర్థః = సమర్థుడు. పరంతప = ఓ! శత్రుసంహారకుడా ! రామమ్ = రాముణ్ణి, ఆదాయ = తీసికొని, గమిష్యే = వెళ్లగలను. తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక.

తా. "శత్రుసంహారకుడవైన ఓ! రాజా! నీ సైన్యము చాల గొప్పదే కావచ్చును, దానిని ఇక్కడనే ఉండనిమ్ము. మహాతేజఃశాలియైన ఈ రాముడు బాలుడే అయినా ఆ మారీచుణ్ణి నిగ్రహించుటకు సమర్థుడు. అందుచే రాముణ్ణి తీసికొనివెళ్లెదను. నీకు క్షేమ మగుగాక." 10, 11

మూ. ఏవముక్త్వా తు స మునిస్తమాదాయ నృపాత్మజమ్,
జగామ పరమప్రీతో విశ్వామిత్రః స్వమాశ్రమమ్. 12

ప్ర. అ. సః = ఆ, విశ్వామిత్రః మునిః = విశ్వామిత్రమహర్షి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, పరమప్రీతః = చాలా సంతోషించినవాడై, తమ్ = ఆ, నృపాత్మజమ్ = రాజకుమారుణ్ణి, ఆదాయ = తీసికొని, స్వమ్ = తన సంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. ఆ విశ్వామిత్రమహర్షి ఇట్లు పలికి, చాల సంతోషించుచు, ఆ రాజకుమారుని తీసికొని తన ఆశ్రమమునకు వెళ్లెను. 12

మూ. తం తదా దణ్డకారణ్యే యజ్ఞముద్దిశ్య దీక్షితమ్,
బభూవోపస్థితో రామశ్చిత్రం విష్ఫారయన్ ధనుః. 13

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, యజ్ఞమ్ = యజ్ఞమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, దీక్షితమ్ = దీక్షవహించిన, తమ్ = ఆ విశ్వామిత్రుని, ఉపస్థితః = సమీపించినవాడై, చిత్రమ్ = చిత్రమైన, ధనుః = ధనస్సును, విష్ఫారయన్ = చరచుచు, బభూవ = ఉండెను.

తా. అప్పుడు చిత్రమైన ధనస్సును చరచుచు ఆ రాముడు యజ్ఞదీక్ష వహించిన ఆ విశ్వామిత్రుని దగ్గరనే ఉండెను. 13

మూ. అజాతవ్యఞ్జనః శ్రీమాన్ పద్మపత్రనిభేక్షణః,
ఏకవస్త్రధరో ధన్వీ శిఖీ కనకమాలయా. 14

శోభయన్ దణ్డకారణ్యం దీప్తేన స్వేన తేజసా,
అదృశ్యత తతో రామో బాలచన్ద్ర ఇవోదితః. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట (అప్పుడు), అజాతవ్యఞ్జనః = పుట్టని పురుషచిహ్నములుకలవాడు, శ్రీమాన్ = శ్రీమంతుడు, పద్మపత్రనిభేక్షణః = పద్మపత్రములతో సమానమైన నేత్రములు కలవాడు, ఏకవస్త్రధరః = ఒకే వస్త్రమును ధరించినవాడు, ధన్వీ = ధనుర్ధరుడు, శిఖీ = శిఖగలవాడు, కనకమాలయా = బంగారుమాలతో కూడినవాడు, దీప్తేన = ప్రజ్వలించుచున్న, స్వేన =

తనదైన, తేజసా = తేజస్సుచేత, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, శోభయన్ = ప్రకాశింపచేయుచున్నవాడు అయిన, రామః = రాముడు, ఉదితః = ఉదయించిన, బాలచన్ద్రః ఇవ = బాలచంద్రుడు వలె, అదృశ్యత = చూడబడెను.

తా. పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, శోభాసంపన్నుడు అయిన ఆ రామునకు ఆ నాటికి ఇంకను మీసము మొదలైన పురుషచిహ్నము లేవీ ఉదయించలేదు. ఆతడు బ్రహ్మచారి అగుటచే ఒకే వస్త్రము ధరించి ఉండెను. బంగారు మాల ధరించి, తలమీద జుట్టు ముడిపెట్టుకొని, ధనస్సును ధరించిన ఆతడు ప్రజ్వలించుచున్న తన తేజస్సుచేత ఆ దండకారణ్యము నంతా ప్రకాశింపచేయుచుండెను. అట్టి రాముడు ఉదయించిన బాలచంద్రుడు వలె కనబడుచుండెను.

14, 15

మూ. తతోఽహం మేఘసంకాశ స్తప్తకాఞ్చనకుణ్డలః,
బలీ దత్తవరో దర్పాదాజగామ తదాశ్రమమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మేఘసంకాశః = మేఘముతో సమానుడను, తప్తకాఞ్చనకుణ్డలః = పరిశుద్ధమైన బంగారు కుండలములు కలవాడను, బలీ = బలవంతుడను, దత్తవరః = ఇవ్వబడిన వరములు గలవాడను అయిన, అహమ్ = నేను, దర్పాత్ = దర్పము వలన, తదాశ్రమమ్ = ఆ విశ్వామిత్రుని, ఆశ్రమమును, ఆజగామ = చేరితిని.

తా. అప్పుడు, వరములను పొంది యుండుటచే మహాబలముతో గర్వించిన నేను మేఘముతో సమానమైన ఆకారముతో బంగారు కుండలములు ధరించి ఆ విశ్వామిత్రుని ఆశ్రమమునకు వెళ్ళితిని.

16

మూ. తేన దృష్టః ప్రవిష్టోఽహం సహసైవోద్యతాయుధః,
మాం తు దృష్ట్వా ధనుః సజ్యమసంభ్రాన్తశ్చకార సః. 17

ప్ర. అ. ఉద్యతాయుధః = ఎత్తబడిన ఆయుధము కలవాడనై, ప్రవిష్టః = ప్రవేశించిన, అహమ్ = నేను, సహసైవ = వెంటనే, తేన = అతనిచేత, దృష్టః = చూడబడినాను. సః = ఆతడు, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, అసంభ్రాన్తః =

కంగారులేనివాడై, ధనుః = ధనస్సును, సజ్యమ్ = నారితో కూడినదానినిగా, చకార = చేసెను.

తా. నేను ఆయుధము ధరించి ఆశ్రమములోనికి ప్రవేశించుచుండగానే ఆ రాముడు నన్ను చూచి, ఏ మాత్రము భయపడక ధనస్సుకు నారి కట్టెను. 17

మూ. అవజానన్నహం మోహాద్బాలోఽయమితి రాఘవమ్,
విశ్వామిత్రస్య తాం వేదిమభ్యధావం కృతత్వరః. 18

ప్ర. అ. అహమ్ = నేను, మోహాత్ = అజ్ఞానమువలన, అయమ్ = ఇతడు, బాలః = బాలుడేకదా, ఇతి = అని, రాఘవమ్ = రాముణ్ణి, అవజానన్ = అవమానించుచు, కృతత్వరః = చేయబడిన తొందర కలవాడనై, విశ్వామిత్రస్య = విశ్వామిత్రునియొక్క, తామ్ = ఆ, వేదిమ్ = వేదిని గూర్చి, అభ్యధావమ్ = పరుగెత్తితిని.

తా. ఇతడు బాలుడే కదా అని అజ్ఞానముచేత రాముని విషయములో నిర్లక్ష్యభావముతో నేను తొందరగా విశ్వామిత్రుని యజ్ఞవేది దగ్గరకు వెళ్ళితిని.

మూ. తేన ముక్తస్తతో బాణః శితః శత్రునిబర్హణః,
తేనాహం త్వాహతః క్షిప్తః సముద్రే శతయోజనే. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేన = ఆ రామునిచేత, శత్రునిబర్హణః = శత్రువులను సంహరించు, శితః = వాడియైన, బాణః = బాణము, ముక్తః = విడువబడినది. అహమ్ = నేను, తేన = ఆ బాణముచేత, ఆహతః = కొట్టబడినవాడనై, శతయోజనే = నూరు యోజనముల దూరమునం దున్న, సముద్రే = సముద్రమునందు, ఆహతః = కొట్టబడినాను.

తా. అప్పుడు రాముడు శత్రువులను సంహరించు బాణము నొకదానిని నాపై ప్రయోగించెను. అది నన్ను నూరు యోజనముల దూరమునం దున్న సముద్రములో పడవేసెను. 19

మూ. నేచ్ఛతా తాత మాం హన్తుం తదా వీరేణ రక్షితః,
రామస్య శరవేగేన నిరస్తోఽహమచేతనః. 20

ప్ర. అ. తాత = నాయనా! తదా = అప్పుడు, మామ్ = నన్ను, హన్తుమ్ = చంపుటకు, నేచ్ఛతా = ఇష్టపడని, వీరేణ = వీరుడైన రామునిచేత, రక్షితః = రక్షింపబడితిని. రామస్య = రామునియొక్క, శరవేగేన = బాణముయొక్క వేగముచేత, అచేతనః = చైతన్యము లేని, అహమ్ = నేను, నిరస్తః = దూరముగా ఎగురగొట్టబడితిని.

తా. నాయనా! అప్పుడు రామునకు నన్ను చంపవలె నను ఇచ్ఛ లేక పోవుటచేత చంపకుండా రక్షించినాడు. నన్ను శరవేగముచేత స్పృహ కోల్పోవు నట్లు చేసి దూరముగా ఎగురగొట్టినాడు.

మూ. పాతితోఽహం తదా తేన గమ్భీరే సాగరామ్భసి,
ప్రాప్య సంజ్ఞాం చిరాత్తాత లఙ్కాం ప్రతిగతః పురీమ్.21

ప్ర. అ. తాత = నాయనా! తదా = అప్పుడు, అహమ్ = నేను, గమ్భీరే = గంభీరమైన, సాగరామ్భసి = సముద్రజలమునందు, పాతితః = పడవేయబడితిని. చిరాత్ = చాలసమయమునకు, సంజ్ఞామ్ = సంజ్ఞను, ప్రాప్య = పొంది, లఙ్కాం పురీమ్ = లంకాపురమును, ప్రతిగతః = తిరిగి చేరితిని.

తా. నాయనా! ఆ విధముగా ఆ రాముడు నన్ను లోతైన సముద్రజలములో పడవేయగా, చాలసేపటికి స్పృహ వచ్చి నేను లంకాపురమును మరల చేరితిని.

మూ. ఏవమస్మి తదా ముక్తః సహాయాస్తు నిపాతితాః,
అకృతాస్త్రేణ బాలేన రామేణాక్లిష్టకర్మణా. 22

ప్ర. అ. తదా = అప్పుడు, అకృతాస్త్రేణ = నేర్వబడని అస్త్రములు గల, బాలేన = బాలుడైన, అక్లిష్టకర్మణా = శ్రమపడకుండా కార్యముసాధించు, రామేణ = రామునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ముక్తః అస్మి = విడువబడితిని. సహాయాస్తు = నా సహాయులైన రాక్షసులైతే, నిపాతితాః = చంపబడినారు.

తా. అప్పటికి రాముడు బాలుడుగా ఉండుటచేత అస్త్రవిద్యను పూర్తిగా అభ్యసించలేదు. శ్రమపడకుండా కార్యములు నిర్వర్తించు అట్టి రాముడు నన్ను ఆ విధముగా విడచిపెట్టి నా సహాయుల నందరినీ మాత్రము సంహరించినాడు.22

మూ. తన్మయా వార్యమాణ స్త్వం యది రామేణ విగ్రహమ్,
కరిష్యస్యాపదం ఘోరాం క్షిప్రం ప్రాప్స్యసి రావణ. 23

ప్ర. అ. రావణ = ఓ! రావణా; తత్ = ఆ కారణమువలన, మయా = నాచేత, వార్యమాణః = నివారింపబడుచున్న, త్వమ్=నీవు, రామేణ=రామునితో, విగ్రహమ్=విరోధమును, కరిష్యసి యది=చేసినట్లయితే, క్షిప్రమ్=శీఘ్రముగా, ఘోరామ్ = ఘోరమైన, ఆపదమ్ = ఆపదను, ప్రాప్స్యసి = పొందగలవు.

తా. రావణా! అందువలన, నేను నివారించుచున్నా వినక నీవు రామునితో విరోధము పెట్టుకొన్నచో, శీఘ్రముగానే ఘోరమైన ఆపద పొందగలవు. 23

మూ. క్రీడారతివిధిజ్ఞానాం సమాజోత్సవశాలినామ్,
రక్షసాం చైవ సంతాపమనర్థం చాహరిష్యసి. 24

ప్ర. అ. క్రీడారతివిధిజ్ఞానామ్ = క్రీడలయొక్క, రతియొక్క పద్ధతులను ఎరిగినవారు, సమాజోత్సవశాలినామ్ = సమాజముల ఉత్సవములతో ప్రకాశించువారు అయిన, రక్షసాం చైవ=రాక్షసులకు కూడ, సంతాపమ్=తాపమును, అనర్థం చ = కీడును, ఆహరిష్యసి = సంపాదించగలవు.

తా. రాక్షసు లందరూ అనేకవిధములైన ఆటలకు సంబంధించిన పద్ధతులను, రతికి సంబంధించిన పద్ధతులను తెలుసుకొని సుఖముగా ఉన్నారు. సమాజములుగా ఏర్పడి ఆ యా ఉత్సవములు చేసికొని ఆనందించుచున్నారు. అట్టి రాక్షసులకు కూడ కష్టమును, ఆపదను తెచ్చిపెట్టినవాడ వగుదువు. 24

మూ. హర్మ్యప్రాసాదసంబాధాం నానారత్నవిభూషితామ్,
ద్రక్ష్యసి త్వం పురీం లఙ్కాం వినష్టాం మైథిలీకృతే. 25

ప్ర. అ. హర్మ్యప్రాసాదసంబాధామ్ = మేడలతోను, ప్రాసాదములతోను ఇరుకుగా నున్న, నానారత్నవిభూషితామ్ = అనేకవిధములైన రత్నములచేత అలంకరించబడిన, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును, త్వమ్ = నీవు, మైథిలీ కృతే = సీత నిమిత్తమై, వినష్టామ్ = నశించినదానినిగా, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. మేడలతోను, రాజభవనములతోను కిక్కిరిసి ఉన్న, అనేకరత్న

ములచేత అలంకరింపబడిన లంకాపట్టణము సీత మూలాన నశించుటను నీవు చూడగలవు.

25

మూ. అకుర్వన్తో௨పి పాపాని శుచయః పాపసంశ్రయాత్,
పరపాపైర్వినశ్యన్తి మత్స్యా నాగహ్రదే యథా. 26

ప్ర. అ. పాపాని = పాపములను, అకుర్వన్తో௨పి = చేయనివారైనా, శుచయః=పరిశుద్ధమైనవాళ్ళు, పాపసంశ్రయాత్=పాపాత్ములయొక్క సంబంధమువలన, నాగహ్రదే= సర్పము లుండు మడుగులోని, మత్స్యాః యథా= మత్స్యములు వలె, పరపాపైః = ఇతరులు చేసిన పాపములచేత, వినశ్యన్తి= నశింతురు.

4

తా. ఏ పాపమూ ఎరుగని మంచివాళ్ళు కూడ, పాపాత్ములతో సంబంధము వలన, సర్పములు నివసించు మడుగులోని మత్స్యముల వలె, ఇతరుల పాపాల మూలమున నశించుచుందురు.

26

మూ. దివ్యచన్దనదిగ్ధాఙ్గాన్దివ్యాభరణభూషితాన్,
ద్రక్ష్యస్యభిహతాన్ భూమౌ తవ దోషాత్తు రాక్షసాన్. 27

ప్ర. అ. దివ్యచన్దనదిగ్ధాఙ్గాన్ = దివ్యమైన చందనముచేత పూయబడిన శరీరముకలవారు, దివ్యాభరణభూషితాన్=దివ్యములైన ఆభరణములచేత అలంకరించబడినవారు అయిన, రాక్షసాన్ = రాక్షసులను, తవ = నీయొక్క, దోషాత్ = దోషమువలన, భూమౌ = భూమి మీద, అభిహతాన్ = చంపబడినవారినిగా, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. దివ్యమైన చందనమును శరీరములకు పూసుకొని, దివ్యములైన అలంకారములతో అలంకరించుకొని సుఖముగా ఉన్న రాక్షసు లందరు నీవు చేసిన తప్పుకు ఫలితముగా మరణించి నేలపై పడి యుండుట చూడగలవు. 27

మూ. హృతదారాన్సదారాంశ్చ దశ విద్రవతో దిశః,
హతశేషానశరణాన్ ద్రక్ష్యసి త్వం నిశాచరాన్. 28

ప్ర. అ. హతశేషాన్=చంపబడగా మిగిలిన, నిశాచరాన్=రాక్షసులను,

హృతదారాన్ = హరింపబడిన భార్యలు కలవారై, సదారాంశ్చ = భార్యలతో కూడినవారై, అశరణాన్ = రక్షకుడు లేక, దశ దిశః = పది దిక్కులను గూర్చి, విద్రవతః = పారిపోవుచున్నవారినిగా, త్వమ్ = నీవు, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. చావగా మిగిలిన రాక్షసులలో కొందరు హరింపబడిన భార్యలు కలవారై, కొందరు భార్యలతో కూడినవారై రక్షకులు లేక పది దిక్కులకు పారిపోవుచుండగా చూడగలవు. 28

మూ. శరజాలపరిక్షిప్తా మగ్నిజ్వాలాసమావృతామ్,
ప్రదగ్ధభవనాం లఙ్కాం ద్రక్ష్యసి త్వం న సంశయః. 29

ప్ర. అ. శరజాలపరిక్షిప్తామ్ = బాణముల సముదాయముచేత వ్యాపింపబడినది, అగ్నిజ్వాలాసమావృతామ్ = అగ్నిజ్వాలలచేత ఆవరింపబడినది, ప్రదగ్ధభవనామ్ = కాల్చబడిన భవనములు కలది అయిన, లఙ్కామ్ = లంకను, త్వమ్ = నీవు, ద్రక్ష్యసి = చూడగలవు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఈ లంకాపట్టణ మంతా బాణముల సముదాయముచేత చుట్టబడి అగ్నిజ్వాలలచేత కప్పబడి ఉండగా, ఈ పట్టణములోని భవనము లన్నీ మండిపోవుచుండగా చూడగలవు. సందేహము లేదు. 29

మూ. పరదారాభిమర్శాత్తు నాన్యత్పాపతరం మహత్,
ప్రమదానాం సహస్రం చ తవ రాజన్ పరిగ్రహః. 30

ప్ర. అ. పరదారాభిమర్శాత్ = పరభార్యాగమనముకంటె, పాపతరమ్ = ఎక్కువ పాపమైన, మహత్ = గొప్ప పాపము, అన్యత్ = మరి యొకటి, న = లేదు. రాజన్ = రాజా! ప్రమదానామ్ = స్త్రీలయొక్క, సహస్రమ్ = సహస్రము, తవ = నీయొక్క, పరిగ్రహః = భార్యలు కదా.

తా. పరభార్యాగమనమును మించిన మరొక పాప మేదీ లేదు. రాజా! నీకు వేలకొలది స్త్రీలు భార్యలుగా ఉన్నారు కదా! 30

మూ. భవ స్వదారనిరతః స్వకులం రక్ష రాక్షస,
మానమృద్ధిం చ రాజ్యం చ జీవితం చేష్టమాత్మనః. 31

ప్ర. అ. రాక్షస = రావణా! స్వదారనిరతః = నీ భార్యలయందు ఆసక్తి కలవాడవు, భవ = అగుము. స్వకులమ్ = నీ కులమును, రక్ష = రక్షించుకొనుము. మానమ్ = గౌరవమును, బుద్ధిం చ = ఐశ్వర్యమును, రాజ్యం చ = రాజ్యమును, ఆత్మనః = నీకు, ఇష్టమ్ = ఇష్టమైన, జీవితం చ = జీవితమును, రక్షించుకొనుము.

తా. రావణా! నీవు భార్యలయందు మాత్రమే ఆసక్తి కలవాడవై నీకులమును, గౌరవమును, ఐశ్వర్యమును, రాజ్యమును, నీకత్యంతప్రియమైన నీ జీవితమును రక్షించుకొనుము. 31

మూ. కళత్రాణి చ సౌమ్యాని మిత్రవర్గం తథైవ చ,
యదీచ్ఛసి చిరం భోక్తుం మా కృథా రామవిప్రియమ్. 32

ప్ర. అ. సౌమ్యాని = సౌందర్యవతులైన, కళత్రాణి = భార్యలను, తథైవ చ = అట్లే, మిత్రవర్గమ్ = మిత్రుల సముదాయమును, చిరమ్ = చిరకాలము, భోక్తుమ్ = అనుభవించుటకు, ఇచ్ఛసి యది = ఇచ్ఛయించుచున్నచో, రామవిప్రియమ్ = రామునకు అపకారమును, మా కృథాః = చేయకుము.

తా. సౌందర్యవతులైన భార్యలతోను, మిత్రులతోను చాల కాలము సుఖముగా ఉండదలచినచో నీవు రామునకు అపకారము చేయకుము. 32

మూ. నివార్యమాణః సుహృదా మయా భృశం
ప్రసహ్య సీతాం యది ధర్షయిష్యసి,
గమిష్యసి క్షీణబలః సబాన్ధవో
యమక్షయం రామశరాత్తజీవితః. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టత్రింశః సర్గః.

ప్ర. అ. సుహృదా = స్నేహితుడనైన, మయా = నాచేత, భృశమ్ = మిక్కిలి, నివార్యమాణః = నివారింపబడుచున్నను, సీతామ్ = సీతను, ప్రసహ్య = బలాత్కరించి, ధర్షయిష్యసి యది = అవమానించినచో, క్షీణబలః = క్షీణమైన సైన్యము కలవాడవై, సబాన్ధవః = బంధుసహితుడవై, రామశరాత్తజీవితః =

రాముని బాణములచేత గ్రహింపబడిన జీవితము కలవాడవై, యమక్షయమ్ = యమలోకమును గూర్చి, గమిష్యసి = వెళ్లగలవు.

తా. నేను నీ మంచి కోరి నివారించుచున్నా వినక సీతను బలాత్కారముగా అవమానించినచో నీవు నీ సైన్యమంతా నశించగా, రాముని బాణములు ప్రాణములను హరింపగా, బంధుసహితముగ యమలోకమునకు వెళ్లెదవు. 33

''బాలానందిని'' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ముప్పదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనచత్వారింశః సర్గః

[మారీచుడు రావణునకు ఉపదేశించుట].

మూ. ఏవమస్మి తదా ముక్తః కథం చిత్తేన సంయుగే,
ఇదానీమపి యద్వృత్తం తచ్ఛృణుష్వ యదుత్తరమ్. 1

ప్ర. అ. తదా = అప్పుడు, తేన = ఆ రామునిచేత, సంయుగే = యుద్ధమునందు, కథంచిత్ = ఎట్లో, ఏవమ్ = ఈ విధముగా, ముక్తః అస్మి = విడువబడితిని. ఇదానీమపి = ఇప్పుడు కూడ, యత్ = ఏది, వృత్తమ్ = జరిగినదో, యత్ = ఏది, ఉత్తరమ్ = తరువాత జరిగినదో, తత్ = దానిని, శృణుష్వ = వినుము.

తా. ఈ విధముగా, రాము డా నాడు యుద్ధములో నన్ను ఎట్లో విడిచి పెట్టినాడు. దాని తరువాత ఈ మధ్యకాలమున ఏమి జరిగినదో వినుము. 1

మూ. రాక్షసాభ్యామహం ద్వాభ్యామనిర్విణ్ణస్తథా కృతః,
సహితో మృగరూపాభ్యాం ప్రవిష్టో దణ్డకావనమ్. 2

ప్ర. అ. తథాకృతః = ఆ విధముగా చేయబడినవాడనైనా, అనిర్విణ్ణః = వైరాగ్యము చెందని, అహమ్ = నేను, మృగరూపాభ్యామ్ = మృగరూపము గల, ద్వాభ్యామ్ = ఇద్దరు, రాక్షసాభ్యామ్ = రాక్షసులతో, సహితః = కూడినవాడనై, దణ్డకావనమ్ = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించితిని.

తా. రాము డా విధముగా చేసినా కూడ వైరాగ్యము చెందక నేను, మృగరూపము ధరించిన ఇద్దరు రాక్షసులతో కలిసి దండకారణ్యమునకు వెళ్ళితిని. 2

మూ. దీప్తజిహ్వో మహాకాయస్తీక్ష్ణదంష్ట్రో మహాబలః,
వ్యచరం దణ్డకారణ్యం మాంసభక్షో మహామృగః. 3

ప్ర. అ. దీప్త జిహ్వః = ప్రజ్వలించుచున్న జిహ్వగలది, మహాకాయః

=పెద్ద శరీరము కలది, తీక్ష్ణదంష్ట్రః=తీక్ష్ణములైన కోరలు గలది, మహాబలః= గొప్ప బలము గలది, మాంసభక్షః = మాంసమును భక్షించేది అయిన, మహా మృగః = గొప్ప మృగముగా అయి, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, వ్యచరమ్ = సంచరించితిని.

తా. మండుచున్న నాలుక, పెద్దదేహము, తీక్ష్ణములైన కోరలు, గొప్ప బలమూ గల మాంసమును భక్షించే ఒక మహామృగముగా అయి దండకారణ్యములో సంచరించితిని. 3

మూ. అగ్నిహోత్రేషు తీర్థేషు చైత్యవృక్షేషు రావణ,
అత్యన్తఘోరో వ్యచరం తాపసాన్ సంప్రధర్షయన్. 4

ప్ర. అ. రావణ = రావణా! అత్యన్తఘోరః = చాలభయంకరుడనై, అగ్నిహోత్రేషు = అగ్నిహోత్రములందు, తీర్థేషు=తీర్థములందు, చైత్యవృక్షేషు= చైత్యవృక్షముల సమీపములందు, తాపసాన్ = మునులను, సంప్రధర్షయన్ = ఎదిరించుచు, వ్యచరమ్ = సంచరించితిని.

తా. రావణా! నేను మిక్కిలి భయము కలిగించు రూపము దాల్చి, అగ్నిహోత్రములు జరుగు ప్రదేశములందు, పుణ్యతీర్థములందు, చైత్యవృక్షాల సమీపమునందు ఉండే మునులను ఎదిరించుచు సంచరించితిని. 4

మూ. నిహత్య దణ్డకారణ్యే తాపసాన్ ధర్మచారిణః,
రుధిరాణి పిబంస్తేషాం తథా మాంసాని భక్షయన్. 5

ప్ర. అ. దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, ధర్మచారిణః = ధర్మమును ఆచరించుచున్న, తాపసాన్ = మునులను, నిహత్య = చంపి, తేషామ్ = వారియొక్క, రుధిరాణి = రక్తములను, పిబన్ = త్రాగుచు, తథా = మరియు, మాంసాని = మాంసములను, భక్షయన్ = భక్షించుచు ("రామమ్ ఆసాదయమ్' "రాముణ్ణి సమీపించితిని'' అని ఏడవ శ్లోకముతో ఉన్న దానితో అన్వయము).

తా. దండకారణ్యములో తపస్సు చేసుకొనుచున్న మునులను చంపి వారి రక్తము త్రాగుచు, వారి మాంసములు భక్షించుచు రామునివద్దకు వెళ్ళితిని. 5

ప్ర. అ. వజ్రసంకాశాః = వజ్రాయుధముతో సమానములు, రక్తభోజనాః = రక్తము భోజనముగా కలవి, సంనతపర్వాణః = వంగిన కణుపులు గలవీ అయిన, సర్వే = సమస్తమైన, తే త్రయః బాణాః = ఆ మూడు బాణములు, సుముక్తాః = బాగుగా విడువబడినవై, సహితాః = కలసినవై, ఆజగ్ముః = వచ్చినవి.

తా. వజ్రముతో సమానములు, రక్తము భుజించునవి, వంగిన కణుపులు గలవి అయిన ఆ మూడు బాణములు బాగుగా ప్రయోగింపబడినవై మా వైపు వచ్చినవి. 11

మూ. పరాక్రమజ్ఞో రామస్య శరో దృష్టభయః పురా,
సముద్భ్రాన్తస్తతోముక్తస్తావుభౌ రాక్షసౌ హతౌ. 12

ప్ర. అ. రామస్య = రామునియొక్క, శరః = బాణము, పురా = పూర్వమునందు, దృష్టభయః = (నాచేత) చూడబడిన భయము గలది. పరాక్రమజ్ఞః = రాముని పరాక్రమమును ఎరిగిన నేను, సముద్భ్రాన్తః = ఇటు అటు తిరిగితిని. తతః = ఆ కారణమువలన, ముక్తః = విడువబడితిని. తౌ = ఆ, రాక్షసౌ = రాక్షసులు, ఉభౌ = ఇద్దరూ, హతౌ = చంపబడినారు.

తా. రాముని బాణము ఎంత భయంకరమైనదో నేను పూర్వము చూచి ఉండుటచేత, ఆతని పరాక్రమమును ఎరిగినవాడనగుటచేత, ఇటుఅటు తిరిగిపోయితిని. అందుచే నేను రక్షింపబడితిని గాని ఆ రాక్షసు లిద్దరూ మాత్రము చంపబడిరి.

వి. ఈ శ్లోకం అన్వయం క్లిష్టంగా ఉన్నది. దీనికన్న గోరఖ్‌పూర్ ప్రతిలోని పాఠం బాగున్నది.

"పరాక్రమజ్ఞో రామస్య శఠో దృష్టభయః పురా,
సముత్క్రాన్తస్తతో ముక్తస్తావుభౌ రాక్షసౌ హతౌ."

"రాముని పరాక్రమము తెలిసినవాడను, వంచన చేయ సమర్థుడను అయిన నేను పూర్వము రామునివలన భయము చూచి ఉన్నవాడనగుటచేత ఆచటినుండి తొలగిపోయితిని. ఆ రాక్షసు లిద్దరూ మాత్రము మరణించినారు'' అని భావము.

మొదటి పాఠంలోని చిక్కంతా 'శఠః' అనేదాన్ని "శరః" అని గ్రహించడంవలన వచ్చినది. ఈ ఘట్టంలో ప్రాచ్యపాఠంలో ఉన్న రెండు శ్లోకాలు బాగున్నవి.

''పరాక్రమజ్ఞో రామస్య తథా దృష్టభయః పురా
ఆపతన్తం శరం దృష్ట్వా మేఘగమ్భీరనిస్స్వనమ్.
తతోఽహం వేగవాంస్తత్ర వాతరంహా నిమేషతః
అపక్రాన్తః పరం పారం నివృత్తః సాగరాచ్ఛరః''

"రాముని పరాక్రమము తెలిసినవాడను, పూర్వము భయము చూచిన వాడను అయిన నేను మేఘమువంటి గంభీరధ్వనితో వచ్చుచున్న ఆ బాణమును చూడగానే వాయువేగముతో, కనురెప్పపాటు కాలములో, సముద్రము అవతలి ఒడ్డునకు పారిపోయినాను. రాముని బాణము సముద్రముదాక వచ్చి అక్కడి నుండి వెనుకకు మరలినది'' అని వాటి భావము. ఇది రాముని బాణము ప్రభావానికి అనుగుణంగా ఉన్నది. 12

మూ. శరేణ ముక్తో రామస్య కథంచిత్ప్రాప్య జీవితమ్, 13
ఇహ ప్రవ్రాజితో యుక్తస్తాపసోఽహం సమాహితః.

ప్ర. అ. అహమ్ = నేను, రామస్య=రామునియొక్క, శరేణ = బాణము చేత, కథంచిత్ = ఎట్లో, ముక్తః = విడవబడినవాడనై, జీవితమ్ = జీవితమును, ప్రాప్య = పొంది, యుక్తః = యోగమార్గము నవలంబించినవాడనై, సమాహితః = ఏకాగ్రచిత్తము కలవాడనై, తాపసః = తాపసుడనై, ఇహ = ఇక్కడికి, ప్రవ్రాజితః = సంన్యసించి వచ్చినాను.

తా. నేను రాముని బాణమునుండి ఎట్లో తప్పించుకొని, ప్రాణాలు దక్కించుకొని, మనస్సును ఏకాగ్రము చేసికొని, యోగమార్గమును అవలంబించి, సంన్యాసినై ఇక్కడ నివసించుచున్నాను. 13

మూ. వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినామ్బరమ్, 41
గృహీతధనుషం రామం పాశహస్తమివాన్తకమ్.

ప్ర. అ. చీరకృష్ణాజినామ్బరమ్ = నారచీరలు, కృష్ణాజినము వస్త్రము

లుగా కలవాడు, గృహీతధనుషమ్ = గ్రహింపబడిన ధనస్సు కలవాడు అయిన, పాశహస్తమ్ = పాశము హస్తమునందు గల, అన్తకమివ = యముడు వలె ఉన్న, రామమ్ = రాముణ్ణి, వృక్షే వృక్షే = ప్రతి చెట్టు మీదా, పశ్యామి=చూచు చున్నాను.

తా. అది మొదలు ప్రతిచెట్టుమీదా, నారచీరలు, కృష్ణాజినము ధరించి, ధనస్సు చేత బూని, పాశము చేతిలో ధరించిన యముడు వలె ఉన్న రాముడే నాకు కనబడుచున్నాడు. 14

మూ. అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ, 15
రామభూతమిదం సర్వమరణ్యం ప్రతిభాతి మే.

ప్ర. అ. రావణ = రావణా! భీతః = భయపడిన నేను, రామసహస్రాణ్యపి = వేలకొలది రాములను కూడా, పశ్యామి = చూచుచున్నాను. ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, అరణ్యమ్=అరణ్యము, రామభూతమ్=రాముడుగా అయినదిగా, మే = నాకు, ప్రతిభాతి = కనబడుచున్నది.

తా. రావణా! భయభ్రాంతుడనైన నాకు వేలకొలది రాములు కనబడుచున్నారు. ఈ అరణ్య మంతా నాకు రామమయముగా కనబడుచున్నది. 15

మూ. రామమేవ హి పశ్యామి రహితే రాక్షసాధిప, 16
దృష్ట్వా స్వప్నగతం రామముద్భ్రమామి విచేతనః.

ప్ర. అ. రాక్షసాధిప = రావణా! రహితే=ఎవరూ లేని ప్రదేశమునందు, రామమేవ = రాముణ్ణే. పశ్యామి = చూచుచున్నాను. స్వప్నగతమ్ = స్వప్నములోనికి వచ్చిన, రామమ్ = రాముణ్ణి, దృష్ట్వా = చూచి, విచేతనః = చైతన్యము లేనివాడనై, ఉద్భ్రమామి = భ్రాంతి చెందుచున్నాను.

తా. ఓ! రాక్షసరాజా! ఎవ్వరూ లేని ప్రదేశములో కూడ నాకు రాముడే కనబడుచున్నాడు. స్వప్నములో రాముణ్ణి చూచి, ఉలికిపడి, స్పృహ కోల్పోవు చున్నాను. 16

మూ. రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ, 17
రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయన్తి మే.

ప్ర. అ. రావణ = ఓ! రావణా! రామత్ర స్తస్య = రామునినుండి భయ పడిన, మే = నాకు, రకారాదీని = రకారము ప్రారంభమునందు గల, నామాని = పేర్లు, రత్నాని = రత్నములు, రథాశ్చైవ = రథములు, త్రాసమ్ = భయ మును, సంజనయ న్తి = పుట్టించుచున్నవి.

తా. రావణా! రామునివలన భయపడిన నాకు, రత్నములు, రథములు మొదలైన, రేఫతో ప్రారంభమయే పేర్లు వినగానే భయము కలుగుచున్నది. 17

మూ. అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమమ్, 18
బలిం వా నముచిం వాపి హన్యాద్ధి రఘునన్దనః.

ప్ర. అ. అహమ్ = నేను, తస్య = ఆ రామునియొక్క, ప్రభావజ్ఞః = ప్రభావము తెలిసినవాడను. తే = నీకు, తేన = ఆ రామునితో, యుద్ధమ్ = యుద్ధము, క్షమమ్ = తగినది, న = కాదు. రఘునన్దనః = రాముడు, బలిం వా = బలిచక్ర వర్తినైనా, నముచిం వాపి = నముచినైనా, హన్యాద్ధి = చంపగలడు కదా.

తా. నాకు ఆ రాముని ప్రభావము తెలియును. ఆతనితో నీకు యుద్ధము తగదు. రాముడు బలిచక్రవర్తినైనా, నముచినైనా కూడ చంపగలడు. 18

మూ. రణే రామేణ యుధ్యస్వ క్షమాం వా కురు రాక్షస, 19
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టుమిచ్ఛసి.

ప్ర. అ. రాక్షస = రావణా! రణే = యుద్ధమునందు, రామేణ = రామునితో, యుధ్యస్వ = యుద్ధము చేయుము. క్షమాం వా = ఓర్పునైనా, కురు = చేయుము. మామ్ = నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛసి యది = నీవు కోరినట్లయితే, తే = నీకు, రామకథా = రాముని కథ, న కార్యా = చేయదగినది కాదు.

తా. రావణా! నీవు రామునితో యుద్ధము చేయవలె నని ఉన్నచో యుద్ధము చేయుము; లేనిచో మానివేయుము. కాని నేను కొంతకాలము జీవించ వలె నను అభిప్రాయము నీకు ఉన్నచో నా ఎదుట రాముని మాటలు చెప్పకుము.

మూ. బహవః సాధవో లోకే యుక్తా ధర్మమనుష్ఠితాః, 20
పరేషామపరాధేన వినష్టాః సపరిచ్ఛదాః.

ప్ర. అ. లోకే = లోకమునందు, యుక్తాః = యోగ్యులు, ధర్మమ్ = ధర్మమును, అనుష్ఠితాః = అనుష్ఠించినవారు అయిన, బహవః = చాలమంది, సాధవః = సత్పురుషులు, పరేషామ్ = ఇతరులయొక్క, అపరాధేన = అపరాధముచేత, సపరిచ్ఛదాః = పరివారసమేతులై, వినష్టాః = నశించినారు.

తా. లోకములో యోగ్యులై, ధర్మాచరణము చేయు ఎందరో సత్పురుషులు, ఇతరులు చేసిన అపరాధములకు, పరివారసమేతులై నశించినారు. 20

మూ. సోఽహం తవాపరాధేన వినశ్యేయం నిశాచర, 21
కురు యత్తే క్షమం తత్త్వమహం త్వా నానుయామి హ.

ప్ర. అ. నిశాచర = రావణా! సః అహమ్ = అట్టి నేను, తవ = నీయొక్క, అపరాధేన = అపరాధముచేత, వినశ్యేయమ్ = నశింతును. తే = నీకు, యత్ = ఏది, క్షమమ్ = తగినదో, తత్ = దానిని, త్వమ్ = నీవు, కురు = చేయుము. అహమ్ = నేను, త్వా = నిన్ను, న అనుయామి హ = అనుసరించను.

తా. రావణా! నీవు చేసే అపరాధానికి నేను నశించవలసి ఉన్నది. అందుచే నీకు ఏది యుక్తమని తోచునో అది చేసికొనుము. నేను మాత్రము నీతో రాను. 21

మూ. రామశ్చ హి మహాతేజా మహాసత్త్వో మహాబలః, 22
అపి రాక్షసలోకస్య న భవేదన్తకో హి సః.

ప్ర. అ. రామశ్చ = రాముడు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు. మహాసత్త్వః = గొప్ప ధైర్యము గలవాడు. మహాబలః = గొప్ప బలము గలవాడు. సః = ఆ రాముడు, రాక్షసలోకస్య = రాక్షససముదాయమునకు, అన్తకః = యముడుగా, న భవేదపి = కాడు కదా!

తా. గొప్ప తేజస్సు, ధైర్యము, బలము గల రాముడు అందరు రాక్షసుల పాలిటి మృత్యుదేవత కాడు కదా! 22

మూ. యది శూర్పణఖాహేతోర్జనస్థానగతః ఖరః, 23
అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా,
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః.

ప్ర. అ. జనస్థానగతః = జనస్థానములో ఉన్న, ఖరః = ఖరుడు, శూర్ప ణఖా హేతోః = శూర్పణఖ నిమిత్తమై, పూర్వమ్ = ముందుగా, అతివృత్తః = మర్యాదను ఉల్లంఘించినవాడై, అక్లిష్టకర్మణా = శ్రమ లేకుండా పనులు చేయు, రామేణ = రామునిచేత, హతః యది = చంపబడినట్లయితే, అత్ర = ఈ విష యమునందు, రామస్య = రామునియొక్క, వ్యతిక్రమః = పొరబాటు, కః = ఏమి? యథాతత్త్వమ్ = యథార్థముగా, బ్రూహి = చెప్పుము.

తా. జనస్థానములో ఉన్న ఖరుడు శూర్పణఖ మాట విని ముందుగా రామునకు అపకారము తలబెట్టగా, అప్పుడు, శ్రమపడకుండా కార్యములు సాధించు రాముడు ఆతనిని సంహరించినచో ఇందులో రాముని తప్పేమో నీవే యథార్థముగా చెప్పుము. 24

మూ. హితం వచో బన్ధుహితార్థినా మయా
యథోచ్యమానం యది నాభిపత్స్యసే,
సబాన్ధవస్త్యక్షసి జీవితం రణే
హతోఽద్య రామేణ శరైరజిహ్మగైః. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. బన్ధుహితార్థినా = బంధువుల హితమును కోరుచున్న, మయా = నాచేత, ఉచ్యమానమ్ = చెప్పబడుచున్న, వచః = వచనమును, యథా = చెప్పి నట్లు, నాభిపత్స్యసే యది = అంగీకరించకపోయినట్లయితే, సబాన్ధవః = బంధు సహితుడవైన నీవు, అద్య = ఇప్పుడు, రామేణ = రామునిచేత, అజిహ్మగైః = వక్రత్వము లేకుండా వెళ్లు, శరైః = బాణములచేత, హతః = చంపబడినవాడవై, రణే = యుద్ధమునందు, జీవితమ్ = జీవితమును, త్యక్ష్యసి = విడువగలవు.

తా. రావణా! బంధువుల హితము కోరి నేను చెప్పుచున్న మాటలు విన నిచో, నీవు, నీ బంధువులూ కూడ రణరంగములో సూటిగా ప్రయాణము చేయు బాణములచేత రాముడు చంపివేయగా ప్రాణములు విడువగలరు. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ముప్పదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ చత్వారింశః సర్గః

[రావణుడు మారీచుని భయపెట్టి సీతను అపహరించుటకు సాహాయ్యము చేయవలె నని ఆజ్ఞాపించుట].

మూ. మారీచస్య తు తద్వాక్యం క్షమం యుక్తం చ రావణః,
ఉక్తో న ప్రతిజగ్రాహ మర్తుకామ ఇవౌషధమ్. 1

ప్ర. అ. ఉక్తః = ఇట్లు పలకబడిన, రావణః = రావణుడు, మారీచస్య = మారీచునియొక్క, క్షమమ్ = యోగ్యము, యుక్తం చ = యుక్తియుక్తము అయిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, మర్తుకామః = మరణించుటకు కోరిక గలవాడు, ఔషధమ్ ఇవ = ఔషధమును పలె, న ప్రతిజగ్రాహ = అంగీకరించలేదు.

తా. మారీచుడు ఈ విధముగా ఉపదేశింపగా రావణుడు తగినదీ, యుక్తి సంమతమూ అయిన ఆతని మాటను, మరణించ నున్నవాడు ఔషధమును నిరాకరించి నట్లు నిరాకరించెను. 1

మూ. తం పథ్యహితవక్తారం మారీచం రాక్షసాధిపః,
అబ్రవీత్పరుషం వాక్యమయుక్తం కాలచోదితః. 2

ప్ర. అ. రాక్షసాధిపః = రావణుడు, కాలచోదితః = కాలముచేత ప్రేరేపింపబడినవాడై, పథ్యహితవక్తారమ్ = మంచిని చేయు ఉపదేశవాక్యములు చెప్పిన, తం మారీచమ్ = ఆ మారీచుణ్ణి గూర్చి, అయుక్తమ్ = అయుక్తమైన, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రావణుడు కాలముచేత ప్రేరేపింపబడినవాడై, క్షేమకరములైన హితవాక్యములు చెప్పిన ఆ మారీచునితో పరుషములు, అయుక్తములు అయిన మాటలు పలికెను. 2

మూ. యత్కిలైతదయుక్తార్థం మారీచ మయి కథ్యతే,
వాక్యం నిష్ఫలమత్యర్థముప్తం బీజమివోషరే. 3

ప్ర. అ. మారీచ = మారీచుడా ! అయుక్తార్థమ్ = అయుక్తమైన అర్థము గల, యత్ = ఏ, ఏతత్ వాక్యమ్ = ఈ వాక్యము, మయి = నాయందు (నాతో), కథ్యతే = చెప్పబడుచున్నదో, అది, ఊషరే = చవటనేలయందు, ఉప్తమ్ = నాటబడిన, బీజమివ = విత్తనము వలె, అత్యర్థమ్ = మిక్కిలి, నిష్ఫలమ్ = వ్యర్థమైనది.

తా. మారీచుడా ! నీ వేవో అయుక్తమైన అర్థము గల మాటలు నాతో చెప్పుచున్నావు; అవన్నీ చవటనేలలో వేసిన విత్తనము వలె వ్యర్థములు. 3

మూ. త్వద్వాక్యైర్న తు మాం శక్యం భేతుంరామస్య సంయుగే
పాపశీలస్య మూర్ఖస్య మానుషస్య విశేషతః. 4

ప్ర. అ. త్వద్వాక్యైః = నీ మాటలచేత, పాపశీలస్య = పాపస్వభావము కలవాడు, మూర్ఖస్య=మూర్ఖుడు, విశేషతః=విశేషించి, మానుషస్య=మానవుడూ అయిన, రామస్య = రామునకు, (రామునినుండి), మామ్ = నన్ను, సంయుగే= యుద్ధమునందు, భేతుమ్=భయపడుటకు (భయపెట్టుటకు), న శక్యమ్=శక్యము కాదు, (''భేత్తుమ్''అన్న దాక్షిణాత్యపాఠంలో అన్వయం కుదురుటలేదు).

తా. రాముడు పాపస్వభావము కలవాడు, మూర్ఖుడు. అన్నింటినీ మించి మానవమాత్రుడు. అట్టి రామునినుండి నీవు నీ మాటల ద్వారా నన్ను యుద్ధములో భయపెట్టజాలవు. 4

మూ. యస్త్యక్త్వా సుహృదో రాజ్యం మాతరం పితరం తథా,
స్త్రీవాక్యం ప్రాకృతం శ్రుత్వా వనమేకపదే గతః. 5

ప్ర. అ. యః=ఏ రాముడు, ప్రాకృతమ్=సాధారణమైన, స్త్రీవాక్యమ్= స్త్రీవాక్యమును, శ్రుత్వా = విని, సుహృదః = మిత్రులను, రాజ్యమ్ = రాజ్యమును, మాతరమ్ = తల్లిని, తథా = మరియు, పితరమ్ = తండ్రిని, త్యక్త్వా = విడచి, ఏకపదే = ఒక్క క్షణములో, వనమ్ = వనమును గూర్చి, గతః = వెళ్ళినాడో, (ఆతనినుండి భయపెట్టజాలవు).

తా. ఈ రాముడు ఒక ఆడదాని మాట విని, మిత్రులను, రాజ్యమును, తలిదండ్రులను విడచి హటాత్తుగా అరణ్యమునకు వెళ్ళిపోయినాడు. 5

మూ. అవశ్యం తు మయా తస్య సంయుగే ఖరఘాతినః, 6
ప్రాణైః ప్రియతరా సీతా హర్తవ్యా తవ సన్నిధౌ.

ప్ర. అ. సంయుగే = యుద్ధమునందు, ఖరఘాతినః = ఖరుణ్ణి చంపిన, తస్య = ఆతనియొక్క, ప్రాణైః = ప్రాణములచేత (కంటె), ప్రియతరా = ఎక్కువ ప్రియురాలైన, భార్యా = భార్యయైన, సీతా = సీత, తవ = నీయొక్క, సంనిధౌ = సమక్షమునందు, అవశ్యమ్ = తప్పక, మయా = నాచేత, హర్తవ్యా = హరించదగినది.

తా. యుద్ధములో ఖరుణ్ణి సంహరించిన ఆ రామునికి ప్రాణాలకంటె కూడ అధికముగా ప్రియురాలైన ఆతని భార్యను నేను నీ సాహాయ్యముతో హరించితీరెదను. 6

మూ. ఏవం మే నిశ్చితా బుద్ధిర్హృది మారీచ వర్తతే,
న వ్యావర్తయితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః. 7

ప్ర. అ. మారీచ = మారీచుడా! మే = నాయొక్క, బుద్ధిః = బుద్ధి, ఏవమ్ = ఇట్లు, నిశ్చితా = నిశ్చయింపబడినదై, హృది = హృదయమునందు, వర్తతే = ఉన్నది, సేన్ద్రైః = ఇంద్రునితో కూడిన, సురాసురైరపి = దేవాసురుల చేత కూడ, వ్యావర్తయితుమ్ = త్రిప్పుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. మారీచుడా! నా బుద్ధి, నా హృదయములో, ఈ విధముగా నిశ్చయింపబడి ఉన్నది. దీనిని సురాసురులు అందరు ఇంద్రునితో కలిసి వచ్చినా మార్చజాలరు. 7

మూ. దోషం గుణం వా సంపృష్టస్త్వమేవం వక్తుమర్హసి,
అపాయం వాప్యుపాయం వా కార్యస్యాస్య వినిశ్చయే. 8

ప్ర. అ. అస్య కార్యస్య = ఈ కార్యముయొక్క, వినిశ్చయే = నిశ్చయము విషయమున, దోషమ్ = దోషమును గాని, గుణం వా = గుణమును గాని, అపా

యమ్=అపాయమును గాని, ఉపాయం వా=ఉపాయమును గాని, సంపృష్టః= అడగబడినట్లయితే, త్వమ్ = నీవు, ఏవమ్ = ఇట్లు, వక్తుమ్ = పలుకుటకు, అర్హసి = తగుదువు.

తా. ఈ కార్యమును నిర్ణయించే విషయములో దోష మేమి, గుణ మేమి అని గాని, ఉపాయ మేది, నష్ట మేది అని కాని నేను నిన్ను అడిగి యున్నట్లయితే నీ వీ విధముగా చెప్పుట యుక్తము (నేనట్లు అడగనప్పుడు నీ విట్లు మాట్లాడ కూడదు). 8

మూ. సంపృష్టేన తు వక్తవ్యం సచివేన విపశ్చితా,
ఉద్యతాఞ్జలినా రాజ్ఞే య ఇచ్ఛేద్భూతిమాత్మనః. 9

ప్ర. అ. యః = ఎవ్వడు, ఆత్మనః = తనకు, భూతిమ్ = ఐశ్వర్యమును, ఇచ్ఛేత్ = కోరునో, అట్టి, సంపృష్టేన = అడగబడిన, విపశ్చితా = పండితుడైన, సచివేన = మంత్రిచేత, ఉద్యతాఞ్జలినా = ఎత్తబడిన దోసిలి కలవాడై ఉండి, రాజ్ఞే = రాజునకు, వక్తవ్యమ్ = చెప్పదగినది.

తా. తన అభివృద్ధిని కోరు బుద్ధిమంతుడైన మంత్రి, రాజు ఏదైన అడిగినప్పుడు దోసిలి కట్టి సవినయముగా సమాధానము చెప్పవలెను. 9

మూ. వాక్యమప్రతికూలం తు మృదుపూర్వం హితం శుభమ్,
ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః. 10

ప్ర. అ. వసుధాధిపః = రాజు, అప్రతికూలమ్ = ప్రతికూలము కానిది, మృదుపూర్వమ్=మృదువైన మాటలు పూర్వమునందు కలది, హితమ్=హితము, శుభమ్ = శుభకరము, ఉపచారేణ=వినయముతో, యుక్తమ్ = కూడినది అయిన, వాక్యమ్ = వాక్యమును, వక్తవ్యః = చెప్పదగినవాడు.

తా. రాజుతో చెప్పే మాటలు ప్రతికూలము కానివి, మృదువైనవి, హితములు, శుభకరములు, వినయముతో కూడినవి అయిఉండవలెను. 10

మూ. సావమర్దం తు యద్వాక్యం మారీచ హితముచ్యతే,
నాభినన్దతి తద్రాజా మానార్హో మానవర్జితమ్. 11

ప్ర. అ. మారీచ = మారీచా! మానవర్జితమ్ = గౌరవముతో శూన్యమైన, యత్ = ఏ, హితమ్=హితమైన, వాక్యమ్=వాక్యము, సావమర్దమ్=తిరస్కార పూర్వకముగా, ఉచ్యతే = చెప్పబడునో, తత్ = దానిని, మానార్హః = గౌరవమునకు తగిన, రాజా = రాజు, న అభినన్దతి = అభినందించడు.

తా. మారీచుడా! ఎంత హితమైన వాక్యమైనను, గౌరవభావము లేకుండగా, తిరస్కారబుద్ధితో చెప్పినచో, దానిని, గౌరవార్హుడైన రాజు అభినందించడు. 11

మూ. పఞ్చ రూపాణి రాజానో ధారయన్త్యమితౌజసః,
అగ్నేరిన్ద్రస్య సోమస్య వరుణస్య యమస్య చ. 12

ప్ర. అ. అమితౌజసః = అపరిమితమైన తేజస్సు గల, రాజానః=రాజులు అగ్నేః = అగ్నియొక్క, ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, సోమస్య = చంద్రుని యొక్క, వరుణస్య = వరుణుని యొక్క, యమస్య చ = యమునియొక్క, పఞ్చ = ఐదు, రూపాణి = రూపాలను, ధారయన్తి = ధరించుచున్నారు.

తా. అపరిమితమైన తేజస్సు గల రాజులలో అగ్ని, ఇంద్రుడు, చంద్రుడు వరుణుడు, యముడు అను ఐదుగురు దేవతల అంశములు ఉండును. 12

వి. "అగ్నేరిన్ద్రస్య సోమస్య యమస్య ధనదస్య చ"అని ప్రాచ్యపాఠము.

మూ. ఔష్ణ్యం తథా విక్రమం చ సౌమ్యం దణ్డం ప్రసన్నతామ్,
ధారయన్తి మహాత్మానో రాజానః క్షణదాచర. 13
తస్మాత్సర్వాస్వవస్థాసు మాన్యాః పూజ్యాశ్చ పార్థివాః.

ప్ర. అ. క్షణదాచర = ఓ! రాక్షసుడా! మహాత్మానః = మహాత్ములైన, రాజానః = రాజులు, ఔష్ణ్యమ్ = వేడిని, తథా = మరియు, విక్రమం చ = పరాక్రమమును, సౌమ్యమ్ = సౌమ్యత్వమును, దణ్డమ్ = దండమును, ప్రసన్నతామ్=ప్రసన్నత్వమును, ధారయన్తి=ధరించుచున్నారు. తస్మాత్=ఆకారణము వలన, పార్థివాః = రాజులు, సర్వాసు = సమస్తమైన, అవస్థాసు=అవస్థలయందు, మాన్యాః = గౌరవింపదగినవారు, పూజ్యాశ్చ = పూజింపదగినవారుకూడ.

తా. మారీచా! మహాత్ములైన రాజులలో అగ్నిదేవుని ఉష్ణత్వము, ఇంద్రుని పరాక్రమము, చంద్రుని సౌమ్యత్వము, యముని దండమును, వరుణుని ప్రసన్నత్వము ఉండును. అందుచేత రాజులను సర్వదా గౌరవించి పూజించవలెను.

వి. పైన చూపిన ప్రాచ్యపాఠము బాగున్నది. అక్కడ చెప్పిన దేవతల వరుసలో ''ఉష్ణత్వము, పరాక్రమము, సౌమ్యత్వము, దండము, ప్రసన్నత్వము రాజులలో ఉండు''నని తాత్పర్యము. ఈ శ్లోకము ప్రాచ్యపాఠములో లేదు. ఆ దేవతల వలె రాజులు కూడ నిగ్రహానుగ్రహసమర్థు లని మరొక శ్లోక మున్నది.

మూ. త్వం తు ధర్మమవిజ్ఞాయ కేవలం మోహమాస్థితః, 14
అభ్యాగతం మాం దౌరాత్మ్యాత్పరుషం వక్తుమిచ్ఛసి.

ప్ర. అ. త్వం తు = నీవైతే, ధర్మమ్ = ధర్మమును, అవిజ్ఞాయ = తెలుసుకొనక, కేవలమ్ = కేవలము, మోహమ్ = అజ్ఞానమును, అస్థితః = అవలంబించినవాడవై, అభ్యాగతమ్ = నీ యింటికి వచ్చిన, మామ్ = నన్ను గూర్చి, దౌరాత్మ్యత్ = దుష్టబుద్ధివలన, పరుషమ్ = పరుషముగా, వక్తుమ్ = పలుకుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. కాని నీవు ఈ ధర్మమును గుర్తించక కేవలము అజ్ఞానముచేత దుష్టబుద్ధి కలవాడవై, నీ యింటికి వచ్చిన నాతో పరుషముగా మాటలాడుచున్నావు!. 14

మూ. గుణదోషౌ న పృచ్ఛామి క్షమం చాత్మని రాక్షస,
మయోక్తం తవ చైతావత్సంప్రత్యమితవిక్రమ. 15

ప్ర. అ. రాక్షస = మారీచా! గుణదోషౌ = గుణదోషములను గాని, ఆత్మని = నా విషయమున, క్షమమ్ = ఏది తగును అను విషయమును గాని, న పృచ్ఛామి = అడుగుట లేదు. అమితవిక్రమ = కొలవ శక్యము కాని పరాక్రమము గలవాడా! సంప్రతి = ఇప్పుడు, తవ = నీకు, ఏతావత్ = ఇంత మాత్రము, మయా = నా చేత, ఉక్తమ్ = చెప్పబడినది.

తా. అపరిమిత మైన పరాక్రమము గల మారీచా! ఈ పని మంచిదా, చెడ్డదా అని గాని, నాకీ విషయమునందు సామర్థ్యము ఉన్నదా లేదా అని కాని

నేను నిన్ను అడుగుటలేదు. నేను నిన్ను అడిగిన దల్లా ఈ కార్యమునందు నాకు సాహాయ్యము చేయు మని మాత్రమే. 15

మూ. అస్మింస్తు త్వం మహాకృత్యే సాహాయ్యం కర్తుమర్హసి,
శృణు తత్కర్మ సాహాయ్యే యత్కార్యం వచనాన్మమ.

ప్ర. అ. అస్మిన్ = ఈ, మహాకృత్యే = గొప్ప కార్యమునందు, త్వమ్ = నీవు, సాహాయ్యమ్ = సాహాయ్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు. మమ = నాయొక్క, వచనాత్ = వచనమువలన, సాహాయ్యే = సాహాయ్యమునందు, యత్ = ఏది, కార్యమ్ = చేయగగినదో, తత్ = ఆ, కర్మ = పనిని, శృణు = వినుము.

తా. నేను చేయ తలపెట్టిన ఈ మహాకార్యమునందు నీవు సాహాయ్యము చేయవలెను. నా ఆజ్ఞ ప్రకారము, నా సాహాయ్యమునకై నీవేమి చేయవలెనో వినుము. 16

మూ. సౌవర్ణస్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిన్దుభిః,
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర,
ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గన్తుమర్హసి. 18

ప్ర. అ. త్వమ్ = నీవు, రజతబిన్దుభిః = వెండి చుక్కలచేత, చిత్రః = చిత్రమైన, సౌవర్ణః = బంగారము వికారమైన, మృగః = మృగముగా, భూత్వా = అయి, తస్య = ఆ, రామస్య = రామునియొక్క, ఆశ్రమే = ఆశ్రమమునందు, సీతాయాః = సీతయొక్క, ప్రముఖే = ఎదుట, చర = సంచరించుము. వైదేహీమ్ = సీతను, ప్రలోభయిత్వా = లోభపెట్టి, యథేష్టమ్ = నీకు ఇష్టము వచ్చినట్లు, గన్తుమ్ = వెళ్ళుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నీవు వెండి చుక్కలచేత చిత్రవర్ణమైన బంగారు లేడి రూపము ధరించి, రాముని ఆశ్రమములో సీత ఎదుట సంచరించవలెను. ఆమెకు ఆసక్తి కలిగించి అటుపిమ్మట నీ కిష్టమైన చోటికి వెళ్ళిపోవచ్చును. 17,18

మూ. త్వాం తు మాయామృగం దృష్ట్వా కాఞ్చనం జాతవిస్మయా
ఆనయైనమితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. 19

ప్ర. అ. మైథిలీ = సీత, కాఞ్చనమ్ = బంగారు, మాయామృగమ్ = మాయామృగమైన, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, జాతవిస్మయా = పుట్టిన ఆశ్చర్యము కలదై, ఏనమ్ = దీనిని, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆనయ = తీసికొని రమ్ము, ఇతి = అని, రామమ్ = రాముణ్ణి గూర్చి, వక్ష్యతి = చెప్పగలదు.

తా. బంగారు మాయామృగము రూపములో ఉన్న నిన్ను చూచి సీత, ఆశ్చర్యభరితురాలై, "ఈ మృగమును శీఘ్రముగా పట్టి తీసికొనిరమ్ము" అని రాముణ్ణి అడగగలదు. 19

మూ. అపక్రాన్తే తు కాకుత్స్థే దూరం యాత్వాప్యుదాహర,
హా సీతే లక్ష్మణేత్యేవం రామవాక్యానురూపకమ్. 20

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, అపక్రాన్తే = బైటకు వచ్చినవాడగు చుండగా, దూరమ్ = దూరముగా, యాత్వా = వెళ్ళి, రామవాక్యానురూపకమ్ = రాముని మాటలకు అనురూపముగా, హా సీతే = అయ్యో! సీతా! హా లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! ఇత్యేవమ్ = ఇట్లు, ఉదాహర అపి = పలుకుము కూడ.

తా. రాముడు ఆశ్రమమునుండి బైటకు వచ్చిన తరువాత, నీ వింకా దూరము వెళ్ళి, రాముని కంఠధ్వని ఏ విధముగా ఉండునో ఆ విధముగా "అయ్యో! సీతా! అయ్యో! లక్ష్మణా!" అని అరపులు కూడ అరుచుము. 20

మూ. తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయా చ ప్రచోదితః,
అనుగచ్ఛతి సంభ్రాన్తః సౌమిత్రిరపి సౌహృదాత్. 21

ప్ర. అ. సౌమిత్రిరపి = లక్ష్మణుడు కూడ, తత్ = దానిని, శ్రుత్వా = విని, సీతయా చ = సీతచేత కూడ, ప్రచోదితః = ప్రేరేపించబడినవాడై, సంభ్రాన్తః = కంగారుపడుచున్నవాడై, సౌహృదాత్ = రామునిమీద నున్న ప్రేమవలన, రామపదవీమ్ = రాముని మార్గమును, అనుగచ్ఛతి = అనుసరించును.

తా. లక్ష్మణుడు కూడ ఆ అరపులు వినును. అప్పుడు సీత ప్రేరేపించగా ఆతడు కంగారుపడుచు, రామునిమీద ఉన్న ప్రేమవలన రాముడు వెళ్ళిన మార్గమునందు అతనిని వెదకుచు వెళ్లును. 21

మూ. అపక్రాన్తే చ కాకుత్స్థే లక్ష్మణే చ యథాసుఖమ్,
ఆనయిష్యామి వైదేహీం సహస్రాక్షః శచీమివ. 22

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, లక్ష్మణే చ = లక్ష్మణుడు, అపక్రాన్తే = దూరముగా వెళ్ళిపోగా, వైదేహీమ్ = సీతను, సహస్రాక్షః = దేవేంద్రుడు, శచీమివ = శచీదేవినివలె, యథాసుఖమ్ = సుఖముగా, ఆనయిష్యామి = తీసికొని వచ్చెదను. 22

తా. రాముడు, లక్ష్మణుడు దూరముగా వెళ్లి పోయిన పిమ్మట, దేవేంద్రుడు శచీదేవిని వలె సీతను అనాయాసముగా తీసికొనివచ్చెదను. 22

మూ. ఏవం కృత్వా త్విదం కార్యం యథేష్టం గచ్ఛ రాక్షస,
రాజ్యస్యార్ధం ప్రయచ్ఛామి మారీచ తవ సువ్రత. 23

ప్ర. అ. రాక్షస = మారీచుడా! ఇదమ్ = ఈ, కార్యమ్ = కార్యమును, ఏవమ్ = ఇట్లు, కృత్వా = చేసి, యథేష్టమ్ = నీ ఇష్టము వచ్చినట్లుగా, గచ్ఛ = వెళ్లుము. సువ్రత = మంచి వ్రతములు కలవాడా! మారీచ = ఓ! మారీచా! తవ = నీకు, రాజ్యస్య = రాజ్యముయొక్క, అర్ధమ్ = అర్ధమును, ప్రయచ్ఛామి = ఇచ్చెదను.

తా. మంచి వ్రతములు గల ఓ! మారీచా! నీవు ఈ పని చేసిన పిమ్మట నీ కిష్టము వచ్చినట్లుగా వెళ్లిపోవచ్చును. నీకు నా రాజ్యములో సగము ఇచ్చెదను. 23

మూ. గచ్ఛ సౌమ్య శివం మార్గం కార్యస్యాస్య వివృద్ధయే,
అహం త్వానుగమిష్యామి సరథో దణ్డకావనమ్. 24

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! అస్య = ఈ, కార్యస్య = కార్యముయొక్క, వివృద్ధయే = అభివృద్ధికొరకు, శివమ్ = మంగళకరమైన, మార్గమ్ = మార్గమును గూర్చి, గచ్ఛ = వెళ్ళుము. అహమ్ = నేను, సరథః = రథముతో కూడినవాడనై, దణ్డకావనమ్ = దండకావనమును గూర్చి, అనుగమిష్యామి = అనుసరించి వచ్చెదను.

తా. సౌమ్యుడా! ఈ కార్యమును సాధించుటకు వెళ్ళుము. నీ మార్గము మంగళకర మగుకాక! నేను రథము నెక్కి నీ వెనుకను వచ్చెదను. 24

మూ. ప్రాప్య సీతామయుద్ధేన వఞ్చయిత్వా తు రాఘవమ్,
లఙ్కాం ప్రతిగమిష్యామి కృతకార్యః సహ త్వయా.

ప్ర. అ. రాఘవమ్ = రాముణ్ణి, వఞ్చయిత్వా = వంచించి, సీతామ్ = సీతను, అయుద్ధేన = యుద్ధములేకుండగానే, ప్రాప్య = పొంది, కృతకార్యః = చేయబడిన కార్యము గలవాడనై, త్వయా సహ = నీతో కూడ, లఙ్కాం ప్రతి = లంకను గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. ఈ విధముగ రాముణ్ణి వంచించి, యుద్ధము చేయకుండగనే సీతను పొంది, కృతకృత్యుడనై నీతో కలిసి లంకకు తిరిగి వెళ్ళెదను. 25

మూ. న చేత్కరోషి మారీచ హన్మి త్వామహమద్య వై,
ఏతత్కార్యమవశ్యం మే బలాదపి కరిష్యసి,
రాజ్ఞో హి ప్రతికూలస్థో న జాతు సుఖమేధతే. 26

ప్ర. అ. మారీచ = మారీచుడా! న కరోషి చేత్ = ఇట్లు చేయకపోయినచో, అహమ్ = నేను, అద్య వై = ఇప్పుడే, హన్మి = చంపివేయుదును. మే = నాయొక్క, ఏతత్ = ఈ, కార్యమ్ = కార్యమును, బలాదపి = బలాత్కారము వలననైనను, అవశ్యమ్ = అవశ్యము, కరిష్యసి = చేయగలవు. రాజ్ఞః = రాజునకు, ప్రతికూలస్థః = ప్రతికూలముగా ఉన్నవాడు, జాతు = ఎన్నడును, సుఖమ్ = సుఖముగా, న ఏధతే హి = వృద్ధి పొందడు కదా!

తా. మారీచా! నేను చెప్పినట్లు చేయకపోయినచో నిన్ను ఇప్పుడే చంపి వేసెదను. ఈ కార్యమును బలాత్కారముచేత నైనా నీచేత చేయించెదను. రాజునకు ప్రతికూలముగా ఉన్నవాడు సుఖముగా అభివృద్ధి చెందజాలడను విషయము తెలిసికొనుము. 26

మూ. ఆసాద్య తం జీవితసంశయస్తే
మృత్యుర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య,
ఏతద్యథావత్ప్రతిగృహ్య బుద్ధ్యా
యదత్ర పథ్యం కురు తత్తథా త్వమ్. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చత్వారింశః సర్గః.

ప్ర. అ. తమ్ = ఆ రాముణ్ణి, ఆసాద్య = పొంది, తే = నీకు, జీవిత సంశయః = జీవితమునందు సంశయము. మయా = నాతో, విరుధ్య = విరోధము పెట్టుకొని, అద్య = ఇప్పుడు. మృత్యుః = మృత్యువు, ధ్రువః = నిశ్చితము. ఏతత్ = దీనిని, బుద్ధ్యా = బుద్ధిచేత, యథావత్ = తగు విధముగా, ప్రతిగృహ్య = గ్రహించి, అత్ర = ఈ విషయమునందు, యత్ = ఏది, పథ్యమ్ = హితమో, తత్ = దానిని, త్వమ్ = నీవు, తథా = అట్లు, కురు = చేయుము.

తా. నీవు రామునివద్దకు వెళ్ళినచో మరణించవచ్చును. మరణించక పోవచ్చును. నాతో విరోధము పెట్టుకొన్నచో ఇప్పుడే నీకు మరణము తప్పదు. అందుచేత ఈ విషయమునందు బాగుగా ఆలోచించుకొని నీకు ఏది హితమో ఆ పని చేయుము.

27

బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
నలుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకచత్వారింశః సర్గః

[“నీవు వినాశము కలుగును” అని భయపెట్టుచు మారీచుడు మరల రావణునకు ఉపదేశించుట].

మూ. ఆజ్ఞప్తో రాజవద్వాక్యం ప్రతికూలం నిశాచరః,
అబ్రవీత్పరుషం వాక్యం మారీచో రాక్షసాధిపమ్. 1

(“ఆజ్ఞప్తో రావణేనేత్థం ప్రతికూలం చ రాజవత్” అను గోరఖ్‌పూర్ ప్రతి పాఠము బాగున్నది).

ప్ర. అ. రావణేన = రావణునిచేత, ఇత్థమ్ = ఈవిధముగా, ప్రతికూలమ్ = ప్రతికూలముగా, రాజవత్ = రాజుగా, ఆజ్ఞప్తః = ఆజ్ఞాపించబడిన, మారీచః = మారీచుడు, రాక్షసాధిపమ్ = రావణుని గూర్చి, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా రావణుడు, రాజుగా తనకు ఇష్టము కాని పని చేయటకు ఆజ్ఞాపించగా, మారీచుడు ఆ రావణునితో పరుషమైన వాక్యము పలికెను. 1

మూ. కేనాయముపదిష్టస్తే వినాశః పాపకర్మణా,
సపుత్రస్య సరాష్ట్రస్య సామాత్యస్య నిశాచర. 2

ప్ర. అ. నిశాచర = రావణా! సపుత్రస్య=పుత్రసహితుడవు, సరాష్ట్రస్య = రాష్ట్రసహితుడవు, సామాత్యస్య = అమాత్యసహితుడవు అయిన, తే = నీ యొక్క, అయమ్ = ఈ, వినాశః = వినాశము, పాపకర్మణా = పాపాత్ముడైన, కేన = ఎవనిచేత, ఉపదిష్టః = ఉపదేశించబడినది?

తా. రావణా! నీవు, నీ పుత్రులు, నీ రాష్ట్రము, నీ అమాత్యులు— ఈ అందరూ నశించే పని నీకు ఏ పాపాత్ముడు ఉపదేశించినాడు? 2

మూ. కస్త్వయా సుఖినా రాజన్నాభినన్దతి పాపకృత్,
కేనేదముపదిష్టం తే మృత్యుద్వారముపాయతః. 3

ప్ర. అ. రాజన్ = ఓ ! రాజా ! కః = ఏ, పాపకృత్ = పాపాత్ముడు, సుఖినా = సుఖవంతుడవైన, త్వయా = నీచేత, నాభినన్దతి = సంతోషించుటలేదు? మృత్యుద్వారమ్ = మృత్యువునకు ద్వారమైన, ఇదమ్ = ఈ కార్యము, కేన = ఎవనిచేత, తే = నీకు, ఉపాయతః = ప్రయత్నపూర్వకముగా, ఉపదిష్టమ్ = ఉపదేశించబడినది ?

తా. రాజా ! నీవు సుఖముగా ఉండుట చూచి ఏ పాపాత్ముడు సహించలేకున్నాడు ? మృత్యువునకు ద్వారమైన ఈ పని నీకు ప్రయత్నపూర్వకముగా ఉపదేశించినవాడు ఎవడు ? 3

మూ. శత్రవస్తవ నిఃశఙ్కం హీనవీర్యా నిశాచరాః,
ఇచ్ఛన్తి త్వాం వినశ్యన్తముపరుద్ధం బలీయసా. 4

ప్ర. అ. తవ = నీయొక్క, శత్రవః = శత్రువులు, హీనవీర్యాః = అల్పమైన పరాక్రమము కలవారు అయిన, నిశాచరాః = రాక్షసులు, త్వామ్ = నిన్ను, బలీయసా = అధికమైన బలము గలవానిచేత, ఉపరుద్ధమ్ = ఎదుర్కొనబడినవానినిగాను, వినశ్యన్తమ్ = నశించుచున్న వానినిగాను, ఇచ్ఛన్తి = కోరుచున్నారు. నిఃశఙ్కమ్ = సందేహము లేదు.

తా. నిస్సందేహముగా, నీకు శత్రువులూ, అల్పపరాక్రమవంతులూ అయిన ఆ రాక్షసు లెవరో, నీవు అధికబలవంతుడైన ఆ రామునిచేతిలో నశించగా చూడవలె నని కోరుచున్నారు. 4

మూ. కేనేదముపదిష్టం తే క్షుద్రేణాహితవాదినా,
యస్త్వామిచ్ఛతి నశ్యన్తం స్వకృతేన నిశాచర. 5

ప్ర. అ. నిశాచర = రావణా; యః = ఎవడు, త్వామ్ = నిన్ను, స్వకృతేన = స్వయముగా చేసిన పనిచేత, నశ్యన్తమ్ = నశించుచున్నవానినిగా, ఇచ్ఛతి = కోరుచున్నాడో, అట్టి, క్షుద్రేణ = నీచుడు, అహితవాదినా = అహితమును

చెప్పువాడు ఆయిన, కేన = ఎవనిచేత, ఇదమ్ = ఇది, తే = నీకు, ఉపదిష్టమ్ = ఉపదేశించబడినది?

తా. రావణా! స్వకృతాపరాధముచేతనే నీవు నశించవలె నని కోరుచు, హితము కాని ఈ పని చేయు మని నీకు ఉపదేశించిన ఆ నీచుడు ఎవడు? 5

మూ. వధ్యాః ఖలు న హన్యన్తే సచివాస్తవ రావణ,
యే త్వాముత్పథమారూఢం న నిగృహ్ణన్తి సర్వశః. 6

ప్ర. అ. రావణ = రావణా! ఉత్పథమ్ = అమార్గమును, ఆరూఢమ్ = ఎక్కిన, త్వామ్ = నిన్ను, యే = ఎవరు, సర్వశః = అన్ని విధముల, న నిగృహ్ణన్తి = నిగ్రహించుటలేదో, అట్టి, తవ సచివాః = నీ మంత్రులు, వధ్యాః ఖలు = వధించతగినవారు కదా. న హన్యన్తే = చంపబడుటలేదు.

తా. రావణా! నీవు అమార్గములో వెళ్ళుచున్నప్పుడు నిన్ను అన్ని విధములా అడ్డగించుట నీ మంత్రుల కర్తవ్యము. అట్లు చేయకపోవుటచే ఆ మంత్రులు చంపదగినవారు. కాని వారిని అట్లు చంపుట జరగలేదు. 6

మూ. అమాత్యైః కామవృత్తో హి రాజా కాపథమాశ్రితః,
నిగ్రాహ్యః సర్వథా సద్భిర్న నిగ్రాహ్యో నిగృహ్యసే. 7

ప్ర. అ. కామవృత్తః = స్వేచ్ఛగా ప్రవర్తించుచు, కాపథమ్ = చెడ్డ మార్గమును, ఆశ్రితః = ఆశ్రయించిన, రాజా = రాజు, సద్భిః = మంచివారైన, అమాత్యైః = మంత్రులచేత, సర్వథా = అన్ని విధములా, నిగ్రాహ్యః హి = నిగ్రహింపదగినవాడు కదా. నిగ్రాహ్యః = ఆ విధముగా నిగ్రహింపబడదగిన నీవు, న నిగృహ్యసే = నిగ్రహింపబడుటలేదు.

తా. స్వేచ్ఛగా ప్రవర్తించుచు, అమార్గమును అవలంబించిన రాజును అన్ని విధాల ఉత్తములైన మంత్రులు నిగ్రహించవలెను. కాని నిగ్రహించుటకు తగిన నిన్ను నీ మంత్రులు నిగ్రహించుటలేదు! 7

మూ. ధర్మమర్థం చ కామం చ యశశ్చ జయతాం వర,
స్వామిప్రసాదాత్సచివాః ప్రాప్నువన్తి నిశాచర. 8

ప్ర. అ. జయతామ్ = జయించేవారిలో, వర = శ్రేష్ఠుడా ! నిశాచర = ఓ! రావణా ! సచివాః = మంత్రులు, ధర్మమ్ = ధర్మమును, అర్థం చ = అర్థమును, కామం చ = కామమును, యశశ్చ = కీర్తిని, స్వామిప్రసాదాత్ = ప్రభువు యొక్క అనుగ్రహమునవలననే, ప్రాప్నువన్తి = పొందుచున్నారో.

తా. విజయవంతులలో శ్రేష్ఠుడవైన ఓ! రావణా! మంత్రులకు ధర్మము, అర్థము, కామము, యశస్సు ప్రభువు వలననే లభించును. 8

మూ. విపర్యయే తు తత్సర్వం వ్యర్థం భవతి రావణ,
వ్యసనం స్వామివైగుణ్యాత్ప్రాప్నువన్తీతరే జనాః. 9

ప్ర. అ. రావణ = రావణా! విపర్యయే = విపరీతముగా ఉన్నప్పుడు, తత్ = అది, సర్వమ్ = అంతా, వ్యర్థం భవతి = వ్యర్థము అగును. స్వామివైగుణ్యాత్ = ప్రభువుయొక్క చెడ్డతనమువలన, ఇతరే జనాః = ఇతరులైన జనులు, వ్యసనమ్ = వ్యసనమును, ప్రాప్నువన్తి = పొందుదురు.

తా. రావణా! రాజు విపరీతముగా ప్రవర్తించినచో ఇదంతా వ్యర్థమై పోవును. ప్రభువు చెడ్డవాడైనచో ప్రజలందరూ కష్టముల పాలగుదురు. 9

మూ. రాజమూలో హి ధర్మశ్చ జయశ్చ జయతాం వర,
తస్మాత్సర్వాస్వవస్థాసు రక్షితవ్యా నరాధిపాః. 10

ప్ర. అ. జయతామ్ = జయించువారిలో, వర = శ్రేష్ఠుడా ! ధర్మశ్చ = ధర్మము, జయశ్చ = జయము, రాజమూలః హి = రాజే మూలముగా కలది కదా, తస్మాత్ = ఆ కారణమువలన, సర్వాసు = సమస్తమైన, అవస్థాసు = అవస్థలయందు, నరాధిపాః = రాజులు, రక్షితవ్యాః = రక్షించదగినవారు.

తా. విజయవంతులలో శ్రేష్ఠుడవైన ఓ! రావణా ! ధర్మానికి, జయానికి కూడ మూలము రాజే. అందుచే అన్ని పరిస్థితులలోను రాజును రక్షించుకొనవలెను. 10

మూ. రాజ్యం పాలయితుం శక్యం న తీక్ష్ణేన నిశాచర,
న చాపి ప్రతికూలేన నావినీతేన రాక్షస. 11

ప్ర. అ. రాక్షస = రాక్షసుడవైన, నిశాచర=రావణా ! తీక్ష్ణేన=తీక్ష్ణముగా ప్రవర్తించు రాజుచేత, రాజ్యమ్ = రాజ్యము, పాలయితుమ్ = పాలించుటకు, న శక్యమ్ = శక్యము కాదు. ప్రతికూలేన = ప్రతికూలముగా ప్రవర్తించువానిచేత, న=శక్యము కాదు. అవినీతేన=వినయము లేనివానిచేత కూడ, న=శక్యముకాదు.

తా. రావణా! తీక్ష్ణమైన స్వభావము కలవాడు గాని, ప్రజలకు ప్రతికూలముగా ప్రవర్తించువాడుగాని, వినయము లేనివాడు గాని రాజ్యమును పాలింపజాలడు.

11

మూ. యే తీక్ష్ణమన్త్రాః సచివా భజ్యన్తే సహ తేన వై,
విషమే తురగాః శీఘ్రా మన్దసారథయో యథా. 12

ప్ర. అ. యే = ఏ, సచివాః = మంత్రులు, తీక్ష్ణమన్త్రాః = తీక్ష్ణమైన ఆలోచనలు కలవారో, వాళ్లు, మన్దసారథయః = అసమర్థుడైన సారథి గల, శీఘ్రాః = వేగముగా పరుగెత్తు, తురగాః = గుఱ్ఱములు, విషమే యథా = విషమ ప్రదేశమునందు వలె, తేన సహ = ఆ రాజుతో కూడ, భజ్యన్తే వై = భగ్నులు అగుదురు.

తా. అసమర్థుడైన సారథి నడుపగా మహావేగముగా పరుగెత్తుచున్న గుఱ్ఱములు ఎగుడుదిగుడుగా ఉన్న ప్రదేశములో ఆ సారథితోపాటు దెబ్బతినును. అట్లే, తీక్ష్ణములైన ఆలోచనలు గల మంత్రులు తమ రాజుతో సహా నశింతురు.

మూ. బహవః సాధవో లోకే యుక్తా ధర్మమనుష్ఠితాః,
పరేషామపరాధేన వినష్టాః సపరిచ్ఛదాః. 13

ప్ర. అ. లోకే = లోకమునందు, యుక్తాః = సన్మార్గమునందున్నవారు, ధర్మమ్ = ధర్మమును, అనుష్ఠితాః = అనుసరించిఉన్నవారు అయిన, బహవః = అనేకులైన, సాధవః = సత్పురుషులు, పరేషామ్ = ఇతరులయొక్క, అపరాధేన = అపరాధముచేత, సపరిచ్ఛదాః = పరివారసమేతులై, వినష్టాః = నశించినారు.

తా. ఈ లోకములో, సన్మార్గమునందు నడచుచు, ధర్మమును ఆచరించుచు ఉన్న ఎందరో సత్పురుషులు ఇతరులు చేసిన అపరాధముల మూలమున సపరివారముగా నశించినారు.

13

మూ. స్వామినా ప్రతికూలేన ప్రజా స్తీక్ష్ణేన రావణ,
రక్ష్యమాణా న వర్ధన్తే మేషా గోమాయునా యథా. 14

ప్ర. అ. రావణ = రావణా ! ప్రతికూలేన = ప్రతికూలమైనవాడు, తీక్ష్ణేన = తీక్ష్ణస్వభావము కలవాడు అయిన, స్వామినా = ప్రభువు చేత, రక్ష్యమాణాః = రక్షింపబడుచున్న, ప్రజాః = ప్రజలు, గోమాయునా = నక్కచేత రక్షింపబడు చున్న, మేషాః యథా = గొఱ్ఱెల వలె, న వర్ధన్తే = వృద్ధి పొందరు.

తా. రావణా ! ప్రతికూలుడు, తీక్ష్ణస్వభావము గలవాడు అయిన ప్రభువు పరిపాలనలో ఉన్న ప్రజలు, నక్కచేత రక్షింపబడుచున్న గొఱ్ఱెల వలె వృద్ధి పొందరు.
14

మూ. అవశ్యం వినశిష్యన్తి సర్వే రావణ రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధిరజితేన్ద్రియః. 15

ప్ర. అ. రావణ = రావణా! యేషామ్ = ఏ రాక్షసులకు, కర్కశః = క్రూరుడవు, దుర్బుద్ధిః = దుర్బుద్ధి కలవాడవు, అజితేన్ద్రియః = జయింపబడని ఇంద్రియములు కలవాడవు అయిన, త్వమ్ = నీవు, రాజా = రాజువో, అట్టి, సర్వే = సమస్తమైన, రాక్షసాః = రాక్షసులు, అవశ్యమ్ = తప్పక, వినశిష్యన్తి = నశించగలరు.

తా. రావణా! ఏ రాక్షసులకు క్రూరుడవు, దుర్బుద్ధివి, ఇంద్రియములను జయింపజాలనివాడవు అయిన నీవు రాజుగా ఉన్నావో ఆ రాక్షసు లందరు, తప్పక నశించగలరు.
15

మూ. తదిదం కాకతాళీయం ఘోరమాసాదితం మయా,
అత్ర కిం శోచనీయస్త్వం ససైన్యో వినశిష్యసి. 16

ప్ర. అ. మయా = నాచేత, కాకతాళీయమ్ = కాకతాళీయముగా, ఘోరమ్ = భయంకరమైన, తత్ = ఆ, ఇదమ్ = ఇది, ఆసాదితమ్ = పొందబడినది. అత్ర = ఈ విషయమునందు, కిమ్ = ఏమున్నది ? త్వమ్ = నీవు, శోచనీయః = విచారించదగినవాడవు, ససైన్యః = సేనాసహితుడవై, వినశిష్యసి = నశించ గలవు.

తా. నాకు అకస్మికముగా ఇప్పుడీ ఆపద వచ్చి పడినది. ఇందుకు నాకేమీ విచారము లేదు. నిన్ను గూర్చియే నాకు విచారము. ఎందుచేత ననగా నీవు సైన్యముతో సహా నశించనున్నావు. 16

మూ. మాం నిహత్య తు రామస్తు న చిరాత్త్వాం వధిష్యతి,
అనేన కృతకృత్యోఽస్మి మ్రియేయమరిణా హతః. 17

ప్ర. అ. రామః = రాముడు, మామ్ = నన్ను, నిహత్య = చంపి, నచిరాత్ = కొద్ది కాలములో, త్వామ్ = నిన్ను, వధిష్యతి = చంపగలడు. అరిణా = శత్రువుచేత, హతః = చంపబడినవాడనై, మ్రియేయమ్ = మరణింతును; అనేన = ఈ కారణముచేత, కృతకృత్యః = కృతకృత్యుడను, అస్మి = అవుచున్నాను.

తా. నన్ను చంపిన కొంచెము కాలమునకే రాముడు నిన్ను కూడ చంపగలడు. నేను శత్రువు చేతిలో మరణించుటచే కృతార్థుడను అయ్యెదను. 17

మూ. దర్శనాదేవ రామస్య హతం మామవధారయ,
ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం సబాన్ధవమ్.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, దర్శనాదేవ = దర్శనమువలననే, మామ్ = నన్ను, హతమ్ = చంపబడినవానినిగా, అవధారయ = నిర్ణయించుకొనుము. సీతామ్ = సీతను, హృత్వా = హరించి, సబాన్ధవమ్ = బంధువులతో కూడిన, ఆత్మానమ్ = తనను, హతమ్ = చంపబడినవానినిగా, విద్ధి = తెలిసికొనుము.

తా. రాముడు నన్ను చూడగానే నేను చచ్చిపోవుదు నని నిర్ణయించుకొనుము. సీతను హరించిన వెంటనే నీవు కూడ, నీ బంధువులతో సహా చంపబడగల వను విషయము తెలిసికొనుము. 18

మూ. ఆనయిష్యసి చేత్సీతామాశ్రమాత్సహితో మయా,
నైవ త్వమసి నాహం చ నైవ లఙ్కా న రాక్షసాః. 19

ప్ర. అ. మయా = నాతో, సహితః = కూడినవాడవై, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, సీతామ్ = సీతను, ఆనయిష్యసి చేత్ = తీసికొనివచ్చినట్లయితే,

త్వమ్ = నీవు, నైవ అసి = లేనట్లే, అహం చ = నేను కూడ, న = లేను. లఙ్కా = లంక, నైవ = లేదు. రాక్షసాః = రాక్షసులు, న = లేరు.

తా. నీవు నాతో కలిసి వెళ్ళి రాముని ఆశ్రమమునుండి సీతను తీసికొని వచ్చినట్లయితే, నీవు ఉండవు; నేనూ ఉండను; లంక ఉండదు; రాక్షసులు కూడ ఉండరు. 19

మూ. నివార్యమాణస్తు మయా హితైషిణా
న మృష్యసే వాక్యమిదం నిశాచర,
పరేతకల్పా హి గతాయుషో నరా
హితం న గృహ్ణన్తి సుహృద్భిరీరితమ్. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. నిశాచర = రావణా! హితైషిణా = నీ హితమును కోరుచున్న, మయా = నాచేత, నివార్యమాణః = నివారింపబడుచున్నవాడవైనను, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, న మృష్యసే = సహించుటలేదు. గతాయుషః = పూర్తియైన ఆయుర్దాయము గల, పరేతకల్పాః = మరణించినవారితో సమానులైన, నరాః = నరులు, సుహృద్భిః = స్నేహితులచేత, ఈరితమ్ = పలకబడిన, హితమ్ = హితమును, న గృహ్ణన్తి హి = గ్రహించరు కదా.

తా. రావణా! నీ హితమును కోరి నేను నిన్ను నివారించుచు పలుకుచున్న ఈ మాటలు నీవు అంగీకరించుట లేదు. ఆయువు మూడి, మరణించిన వారితో సమానులైన నరులు స్నేహితులు చెప్పిన హితవాక్యములను వినరు కదా? 20

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో నలుబదిఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

*[మారీచుడు బంగారులేడి రూపము ధరించి రాముని ఆశ్రమము నకు వెళ్ళుట; సీత దానిని చూచుట.]*

మూ. ఏవముక్త్వా తు వచనం మారీచో రావణం తతః,
గచ్ఛావేత్యబ్రవీద్దీనో భయాద్రాత్రించరప్రభోః. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మారీచః = మారీచుడు, ఏవమ్ = ఇట్లు, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, రాత్రించరప్రభోః = ఆ రాక్షసరాజు నుండి, భయాత్ = భయమువలన, దీనః = దీనుడై, గచ్ఛావ = వెళ్ళుదము, ఇతి = అని, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మారీచుడు ఈ విధముగా హితము ఉపదేశించి, పిమ్మట ఆ రావణునికి భయపడుచు, దీనుడై, ''వెళ్లుదము'' అని అతనితో పలికెను. 1

మూ. దృష్టశ్చాహం పునస్తేన శరచాపాసిధారిణా,
మద్వధోద్యతశస్త్రేణ వినష్టం జీవితం చ మే. 2

ప్ర. అ. అహమ్ = నేను, శరచాపాసిధారిణా = బాణములను, ధనస్సును, ఖడ్గమును ధరించిన, మద్వధోద్యతశస్త్రేణ = నన్ను వధించుటకు ఎత్తబడిన ఆయుధములు గల, తేన = ఆ రామునిచేత, పునః = మరల, దృష్టః = చూడబడినాను. మే = నాయొక్క, జీవితం చ = జీవితము, వినష్టమ్ = నశించినది.

తా. శరములు, ధనస్సు, ఖడ్గము ధరించిన ఆ రాముడు మరల నన్ను చూచి, నన్ను చంపుటకై ఆయుధము ఎత్తినాడా, ఇంక నేను మరణించినట్లే ; 2

మూ. న హి రామం పరాక్రమ్య జీవన్ ప్రతినివర్తతే,
వర్తతే ప్రతిరూపోఽసౌ యమదణ్డహతస్య తే. 3

ప్ర. అ. రామమ్ = రాముణ్ణి గూర్చి, పరాక్రమ్య = పరాక్రమించి, జీవన్ = జీవించి, న ప్రతినివర్తతే హి = తిరిగి రాడు కదా ? యమదణ్డహతస్య = యమదండముచేత చంపబడిన నాయొక్క, అసౌ = ఈ, ప్రతిరూపః = ప్రతిబింబము మాత్రమే, తే = నీ ఎదుట, వర్తతే = ఉన్నది.

తా. రాముని విషయములో పరాక్రమము చూపినవాడు సజీవుడై తిరిగి వచ్చుట కల్ల. యముని దండముచే కొట్టబడి నేనెప్పుడో చనిపోయినాను. ఇప్పుడు నీ ఎదుట ఉన్నది నా బొమ్మ మాత్రమే. 3

మూ. కిం ను శక్యం మయా కర్తుమేవం త్వయి దురాత్మని,
ఏష గచ్ఛామ్యహం తాత స్వస్తి తేఽస్తు నిశాచర. 4

ప్ర. అ. త్వయి = నీవు, ఏవమ్ = ఇట్లు, దురాత్మని = దురాత్ముడవై యుండగా, మయా = నాచేత, కిమ్ = ఏమి, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యమైనది ? తాత = నాయనా ! నిశాచర = రావణా ! ఏషః = ఈ, అహమ్ = నేను, గచ్ఛామి = వెళ్లెదను. తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక.

తా. నాయనా ! రావణా ! నీవు ఈ విధముగా దురాత్ముడవై ఉన్నప్పుడు నేనేమి చేయగలను ? ఇదిగో నేను వెళ్ళుచున్నాను. నీకు క్షేమ మగుగాక. 4

మూ. ప్రహృష్టస్త్వభవత్తేన వచనేన స రావణః,
పరిష్వజ్య సుసంశ్లిష్టమిదం వచనమబ్రవీత్. 5

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, తేన వచనేన = ఆ మాటచేత, ప్రహృష్టః = చాలా సంతోషించినవాడు, అభవత్ = ఆయెను. సుసంశ్లిష్టమ్ = చాలా దగ్గర అగునట్లు (గాఢముగా), పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రావణుడు ఆ మాట విని చాలా సంతోషించి, మారీచుణ్ణి గాఢముగా కౌగలించుకొని ఇట్లు పలికెను. 5

మూ. ఏతచ్ఛౌణ్డీర్యయుక్తం తే మచ్ఛన్దవశవర్తినః,
ఇదానీమసి మారీచః పూర్వమన్యో నిశాచరః. 6

ప్ర. అ. మచ్ఛన్దవశవర్తినః = నా ఇచ్ఛకు వశమునం దున్న, తే = నీయొక్క, ఏతత్ = ఈ వాక్యము, శౌణ్డీర్యయుక్తమ్ = దర్పముతో కూడినది. ఇదానీమ్ = ఇప్పుడు, మారీచః = మారీచుడవు, అసి = అయి ఉన్నావు. పూర్వమ్ = పూర్వము, అన్యః = మరియొక, రాక్షసః హి = రాక్షసుడవు కదా.

తా. నీవు నా ఇచ్ఛ ప్రకారము ప్రవర్తించుటచే ఇప్పుడు నీ మాటలు దర్పముతో కూడి ఉన్నవి. ఇప్పుడు నీవు నిజమైన మారీచుడవు. ఇంతకు ముందు నీవు మారీచుడవు వలె ప్రవర్తించలేదు. 6

మూ. ఆరుహ్యతామయం శీఘ్రం రథో రత్నవిభూషితః,
మయా సహ తథా యుక్తః పిశాచవదనైః ఖరైః. 7

ప్ర. అ. తథా = అట్లు, పిశాచవదనైః = పిశాచముఖములు గల, ఖరైః = గాడిదలతో, యుక్తః = కూర్చబడిన, రత్నవిభూషితః = రత్నములచేత అలంకరించబడిన, అయం రథః = ఈ రథము, శీఘ్రమ్ = శీఘ్రముగా, మయా సహ = నాతో కూడ, ఆరుహ్యతామ్ = ఎక్కబడుగాక.

తా. పిశాచముల ముఖముల వంటి ముఖములు గల గాడిదలు కట్టిన, రత్నాలంకృతమైన ఈ రథమును నాతో కూడ శీఘ్రముగా ఎక్కుము. 7

మూ. ప్రలోభయిత్వా వైదేహీం యథేష్టం గన్తుమర్హసి,
తాం శూన్యే ప్రసభం సీతామానయిష్యామి మైథిలీమ్. 8

ప్ర. అ. వైదేహీమ్ = సీతను, ప్రలోభయిత్వా = లోభపెట్టి, యథేష్టమ్ = నీకు ఇష్టము వచ్చినట్లు, గన్తుమ్ = వెళ్లుటకు, అర్హసి = తగియున్నావు. శూన్యే = శూన్యమైన ప్రదేశమునందు, మైథిలీమ్ = మిథిలానగరరాజకుమారియైన, తాం సీతామ్ = ఆ సీతను, ప్రసభమ్ = బలాత్కారముగా, ఆనయిష్యామి = తీసికొని వచ్చెదను.

తా. సీతను లోభపెట్టిన తరువాత నీవు నీ ఇష్టము వచ్చినట్లు వెళ్ళవచ్చును. అప్పుడు శూన్యముగా నున్న ఆ ఆశ్రమమునుండి నేను సీతను బలాత్కారముగా తీసికొనివచ్చెదను. 8

మూ. తతో రావణమారీచౌ విమానమివ తం రథమ్,
ఆరుహ్య యయతుః శీఘ్రం తస్మాదాశ్రమమణ్డలాత్. 9

ప్ర. అ తతః = అటుపిమ్మట, రావణమారీచౌ = ఆ రావణమారీచులు, తం రథమ్ = ఆ రథమును, విమానమివ = విమానమును వలె, ఆరుహ్య = ఎక్కి, తస్మాత్ = ఆ, ఆశ్రమమణ్డలాత్ = ఆశ్రమమండలమునుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, యయతుః = వెళ్ళిరి.

తా. పిమ్మట ఆ రావణమారీచులు విమానము వలె ఉన్న ఆ రథము నెక్కి, ఆ ఆశ్రమమునుండి బయలుదేరి శీఘ్రముగా వెళ్ళిరి. 9

మూ. తథైవ తత్ర పశ్యన్తౌ పత్తనాని వనాని చ,
గిరీంశ్చ సరితః సర్వా రాష్ట్రాణి నగరాణి చ. 10

ప్ర. అ. తథైవ = అట్లే, తత్ర = అక్కడ, పత్తనాని = పట్టణములను, వనాని చ = వనములను, గిరీంశ్చ = పర్వతములను, సర్వాః = సమస్తమైన, సరితః = నదులను, రాష్ట్రాణి = రాష్ట్రములను, నగరాణి చ = నగరములను, పశ్యన్తౌ = చూచుచున్నవారై, వెళ్ళిరి.

తా. మార్గమధ్యమునందు పట్టణములు, అరణ్యములు, పర్వతములు, సమస్తమైన నదులు, రాష్ట్రములు, నగరములు చూచుచు వెళ్ళిరి. 10

మూ. సమేత్య దణ్డకారణ్యం రాఘవస్యాశ్రమం తతః,
దదర్శ సహ మారీచో రావణో రాక్షసాధిపః. 11

ప్ర. అ. సహమారీచః = మారీచునితో కూడిన, రాక్షసాధిపః = రాక్షస రాజైన, రావణః = రావణుడు, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, సమేత్య = చేరి, తతః = అటుపిమ్మట, రాఘవస్య = రాముని యొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమ మును, దదర్శ = చూచెను.

తా. రాక్షసరాజైన రావణుడు, మారీచుచితో కలిసి వెళ్ళి, దండకారణ్య మును, దానియందున్న రాముని ఆశ్రమమును చూచెను. 11

మూ. అవతీర్య రథాత్తస్మాత్తతః కాఞ్చనభూషణాత్,
హస్తే గృహీత్వా మారీచం రావణో వాక్యమబ్రవీత్. 12

ప్ర. అ. రావణః = రావణుడు, కాఞ్చనభూషణాత్ = బంగారు అలంకారములు గల, తస్మాత్ = ఆ, రథాత్ = రథమునుండి, అవతీర్య = దిగి, తతః = అటు పిమ్మట, మారీచమ్ = మారీచుణ్ణి, హస్తే = హస్తమునందు, గృహీత్వా = గ్రహించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రావణుడు బంగారు అలంకారములు గల ఆ రథమునుండి దిగి, మారీచుని చెయ్యి పట్టుకొని ఆతనితో ఇట్లు పలికెను. 12

మూ. ఏతత్తదాశ్రమపదం దృశ్యతే కదళీవృతమ్,
క్రియతాం తత్సఖే శీఘ్రం యదర్థం వయమాగతాః. 13

ప్ర. అ. సఖే = మిత్రుడా ! కదళీవృతమ్ = అరటిచెట్లచేత ఆవరింపబడిన, ఏతత్ = ఈ, తత్ ఆశ్రమపదమ్ = ఆ ఆశ్రమము, దృశ్యతే = చూడబడుచున్నది. వయమ్ = మనము, యదర్థమ్ = ఏ కార్యము నిమిత్తమై, ఆగతాః = వచ్చినామో, తత్ = ఆ కార్యము, శీఘ్రమ్ = శీఘ్రముగా, క్రియతామ్ = చేయబడుగాక.

తా. మిత్రుడా ! ఇదిగో చుట్టూ అరటి చెట్లు ఉన్న ఆశ్రమము కనబడుచున్నది. మనము వచ్చిన పని శీఘ్రముగా చేయుము. 13

మూ. స రావణవచః శ్రుత్వా మారీచో రాక్షసస్తదా,
మృగో భూత్వాఽఽశ్రమద్వారే రామస్య విచచార హ. 14

ప్ర. అ. తదా = అప్పుడు, సః = ఆ, రాక్షసః = రాక్షసుడైన, మారీచః = మారీచుడు, రావణవచః = రావణుని వచనమును, శ్రుత్వా = విని, మృగః = మృగముగా, భూత్వా = అయి, రామస్య = రామునియొక్క, ఆశ్రమద్వారే = ఆశ్రమద్వారమునందు, విచచార హ = సంచరించెను.

తా. అప్పుడు ఆ రాక్షసుడైన మారీచుడు రావణుని మాటలు విని, మృగరూపము ధరించి, రాముని ఆశ్రమద్వారమునందు సంచరించెను. 14

మూ. స తు తద్రూపమాస్థాయ మహదద్భుతదర్శనమ్,
మణిప్రవరశృఙ్గాగ్రః సితాసితముఖాకృతిః. 15

ప్ర. అ. సః = ఆ మారీచుడు, అద్భుతదర్శనమ్ = ఆశ్చర్యకరమైన దర్శనము గల, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, రూపమ్ = రూపమును, ఆస్థాయ = గ్రహించి, మణిప్రవరశృఙ్గాగ్రః = శ్రేష్ఠములైన మణులు గల శృంగముల అగ్రములు కల, సితాసితముఖాకృతిః = తెల్లగాను నల్లగాను ఉన్న ముఖాకారము గల (మృగముగా అయ్యెను).

తా. ఆ మారీచుడు చూచుటకు ఆశ్చర్యకరముగా ఉన్న గొప్పదైన ఆ మృగరూపమును ధరించెను. దాని కొమ్ముల చివరి భాగములు శ్రేష్ఠములైన మణుల వలె ఉండెను. ముఖము కొంత భాగము తెల్లగాను, కొంత భాగము నల్లగాను ఉండెను. 15

మూ. రక్తపద్మోత్పలముఖ ఇన్ద్రనీలోత్పలశ్రవాః,
కించిదభ్యున్నతగ్రీవ ఇంద్రనీలదలాధరః. 16

ప్ర. అ. రక్తపద్మోత్పలముఖః = ఎఱ్ఱని పద్మము వంటి, నల్లకలవ వంటి ముఖముగల, ఇన్ద్రనీలోత్పలశ్రవాః = ఇంద్రనీలమాణిక్యము వంటి, నల్ల కలువ వంటి చెవులు గల, కించిత్ = కొంచెము, అభ్యున్నతగ్రీవః = ఎత్తైన కంఠము గల, ఇన్ద్రనీలదళాధరః = ఇంద్రనీలదలము వంటి క్రింది పెదవి గల (మృగముగా ఆయెను).

తా. దాని ముఖము ఒక చోట ఎఱ్ఱని పద్మము వలె, మరొక చోట నల్ల కలువ వలె ఉండెను. చెవులు ఇంద్రనీలముల వలె, నల్లకలువల వలె ఉండెను. మెడ కొంచెము ఎత్తుగాను క్రింది పెదవి ఇంద్రనీలదళము వలెను ఉండెను. 16

మూ. కున్దేన్దువజ్రసంకాశముదరం చాస్య భాస్వరమ్,
మధూకనిభపార్శ్వశ్చ పద్మకిఞ్జల్కసంనిభః, 17
వైడూర్యసంకాశఖురస్తనుజఙ్ఘః సుసంహతః.

ప్ర. అ. అస్య = ఈ మృగముయొక్క, భాస్వరమ్ = ప్రకాశించుచున్న, ఉదరమ్ = ఉదరము, కున్దేన్దువజ్రసంకాశమ్ = మల్లిపూవుతోను, చంద్రునితోను,

వజ్రముతోను సమానముగా ఉండెను. (ఆ మృగము) మధూకనిభపార్శ్వశ్చ = ఇప్పపువ్వుతో సమానమైన పార్శ్వములు కలదిగాను, పద్మకిఞ్జల్కసంనిభః = పద్మముల కింజల్కములతో సమానముగాను, వైడూర్యసంకాశఖురః = వైడూర్య మాణిక్యములతో సమానమైన డెక్కలుకలదిగాను, తనుజఙ్ఘః = సన్నని పిక్కలు కలదిగాను, సుసంహతః = చక్కగా కుదిమట్టము గాను, ఉండెను.

తా. దాని ఉదరము మల్లిపూవు వలె, చంద్రుడు వలె, వజ్రము వలె ప్రకాశించుచుండెను. దాని పార్శ్వములు ఇప్పపువ్వు రంగులోను కొంతదేహము పద్మకింజల్కముల రంగులోను ఉండెను. డెక్కలు వైడూర్యమాణిక్యముల వలె ఉండెను. పిక్కలు సన్నముగా ఉండెను. ఈ విధముగ ఆ మృగము చక్కగా కూర్చిన అవయవములతో కుదిమట్టముగా ఉండెను. 17

మూ. ఇన్ద్రాయుధసవర్ణేన పుచ్ఛేనోర్ధ్వం విరాజతా, 18
మనోహరః స్నిగ్ధవర్ణో రత్నైర్నానావిధైర్వృతః.

ప్ర. అ. ఊర్ధ్వమ్ = పైకి, విరాజతా = ప్రకాశించుచున్న, ఇన్ద్రాయుధ సవర్ణేన = ఇంద్రాయుధముతో సమానమైన వర్ణము గల, పుచ్ఛేన = తోకతో కూడినదై, మనోహరః = మనోహరమై, స్నిగ్ధవర్ణః = మెరియుచున్న వర్ణము గలదై, నానావిధైః = అనేకవిధములైన, రత్నైః = రత్నములతో, వృతః = కూడినదై, ఉండెను.

తా. ఆ మృగము తోక ఇంద్రాయుధముతో సమానమైన వర్ణముతో పైకి లేచి ఉండెను. అనేకవిధములైన రత్నములతో మనోహరముగా నుండెను. దాని రంగు మెరయుచుండెను. 18

మూ. క్షణేన రాక్షసో జాతో మృగః పరమశోభనః, 19
వనం ప్రజ్వలయన్ రమ్యం రామాశ్రమపదం చ తత్.

ప్ర. అ. రాక్షసః = రాక్షసుడు, వనమ్ = వనమును, రమ్యమ్ = రమ్యమైన, తత్ రామాశ్రమపదమ్ = ఆ రాముని ఆశ్రమమును, ప్రజ్వలయన్ = ప్రకాశింప చేయుచు, క్షణేన = క్షణకాలముచేత, పరమశోభనః = చాలా అందమైన, మృగః = మృగముగా, జాతః = అయినాడు.

తా. ఆ మారీచుడు క్షణకాలములో చాల అందమైన మృగముగా మారి, ఆ వనమును రమ్యమైన, రాముని ఆశ్రమమును ప్రకాశింపచేసెను. 19

మూ. మనోహరం దర్శనీయం రూపం కృత్వా స రాక్షసః, 20
ప్రలోభనార్థం వైదేహ్యా నానాధాతువిచిత్రితమ్,
విచరన్ గచ్ఛతే తస్మాచ్ఛాద్వలాని సమన్తతః. 21

ప్ర. అ. సః రాక్షసః = ఆ రాక్షసుడు, నానాధాతువిచిత్రితమ్ = అనేక విధములైన ధాతువుల వర్ణములచే చిత్రితమైన, మనోహరమ్ = మనోహరము, దర్శనీయమ్ = సుందరమూ అయిన, రూపమ్ = రూపమును, కృత్వా = చేసి (ధరించి), వైదేహ్యాః = సీతయొక్క, ప్రలోభనార్థమ్ = ప్రలోభనముకొరకు, విచరన్ = సంచరించుచు, తస్మాత్ = ఆ ప్రదేశమునుండి, సమన్తతః = నలువైపులా ఉన్న, శాద్వలాని = పచ్చికబీళ్లను గూర్చి, గచ్ఛతే = వెళ్ళుచుండెను.

తా. ఆ రాక్షసుడు అనేకవిధములైన ధాతువుల రంగుల వంటి రంగులచేత చిత్రింపబడిన, మనోహరము, చూడ ఇంపైనది అయిన రూపము ధరించి, సీతను లోభపెట్టుటకై ఇటు అటు తిరుగుచు, ఆ ప్రదేశమునుండి చుట్టుప్రక్కల నున్న పచ్చికబీళ్ళ వైపు వెళ్ళుచుండెను. 20, 21

మూ. రూప్యైర్బిన్దుశతైశ్చిత్రో భూత్వా స ప్రియదర్శనః,
విటపీనాం కిసలయాన్ భఙ్క్త్వాదన్ విచచార హ. 22

ప్ర. అ. సః = ఆ మృగము, రూప్యైః = వెండిరంగు గల, బిన్దుశతైః = వందలకొలది చుక్కలచేత, చిత్రః = చిత్రవర్ణము కలదిగా, భూత్వా = అయి, ప్రియదర్శనః = ఆనందకరమైన దర్శనము కలదై, విటపీనామ్ = చెట్లయొక్క, కిసలయాన్ = చిగుళ్లను, భఙ్క్త్వా = విరిచి, అదన్ = తినుచు, విచచార హ = సంచరించెను.

తా. వెండి వలె తెల్లగా నున్న వందలకొలది చుక్కలతో చిత్రవర్ణమై చూచువారికి ఆనందము కలిగించు ఆ మృగము, చెట్ల చిగుళ్ళు విరచి తినుచు సంచరించెను. 22

మూ. కదళీగృహకం గత్వా కర్ణికారానితస్తతః,
సమాశ్రయన్మన్దగతిః సీతాసందర్శనం తథా. 23

ప్ర. అ. కదళీగృహకమ్ = అరటిచెట్ల తోపును గూర్చి, గత్వా = వెళ్ళి, కర్ణికారాన్ ఇతస్తతః = కర్ణికారవృక్షములకు ఇటు అటు, మన్దగతిః = మంద గమనము కలదై, తథా = అట్లే, సీతాసన్దర్శనమ్ = సీత దృష్టిపడు ప్రదేశమును, సమాశ్రయత్ = ఆశ్రయించెను.

తా. ఆ మృగము అరటితోపులోనికి వెళ్ళి, కర్ణికారవృక్షములకు ఇటు అటు మందముగా నడచుచు, సీత దృష్టి పడే ప్రదేశమునకు వెళ్లెను. 23

మూ. రాజీవచిత్రపృష్ఠః స విరరాజ మహామృగః,
రామాశ్రమపదాభ్యాశే విచచార యథాసుఖమ్. 24

ప్ర. అ. సః = ఆ, మహామృగః = గొప్ప మృగము, రాజీవచిత్రపృష్ఠః = పద్మము వలె చిత్రమైన పృష్ఠభాగము కలదై, విరరాజ = ప్రకాశించెను. రామాశ్రమపదాభ్యాశే = రాముని ఆశ్రమము సమీపమునందు, యథాసుఖమ్ = సుఖముగా, విచచార = సంచరించెను.

తా. పద్మమువలె ఆశ్చర్యకరమైన పృష్ఠభాగముతో ఆ గొప్ప మృగము చాల అందముగా ఉండెను. అది రాముని ఆశ్రమము సమీపమునందు సుఖముగా సంచరించెను. 24

మూ. పునర్గత్వా నివృత్తశ్చ విచచార మృగోత్తమః,
గత్వా ముహూర్తం త్వరయా పునః ప్రతినివర్తతే. 25

ప్ర. అ. మృగోత్తమః = ఆ శ్రేష్ఠమైన మృగము, గత్వా = వెళ్ళి, పునః = మరల, నివృత్తశ్చ = మరలినదై, విచచార = సంచరించెను. ముహూర్తమ్ = క్షణకాలముపాటు, గత్వా = బైటకు వెళ్ళి, పునః = మరల, త్వరయా = తొందరతో, ప్రతినివర్తతే = తిరిగివచ్చును.

తా. శ్రేష్ఠమైన ఆ మృగము ఒకసారి బైటకు వెళ్ళి, మరల తిరిగి వచ్చుచు సంచరించెను. క్షణకాలము బైటకు వెళ్ళి, వెంటనే తొందరగా తిరిగి వచ్చుచుండెను. 25

మూ. విక్రీడంశ్చ క్వచిద్భూమౌ పునరేవ నిషీదతి,
ఆశ్రమద్వారమాగమ్య మృగయూథాని గచ్ఛతి. 26

ప్ర. అ. విక్రీడంశ్చ = ఆడుకొనుచు, పునరేవ = మరల, క్వచిత్ = ఒకానొక చోట, భూమౌ = నేలమీద, పునరేవ = మరల, నిషీదతి = కూర్చుండును. ఆశ్రమద్వారమ్ = ఆశ్రమముయొక్క ద్వారమును, ఆగమ్య = చేరి, మృగయూథాని = లేళ్ల గుంపులను గూర్చి, గచ్ఛతి = వెళ్ళుచుండును.

తా. కొంతసేపు ఆడుకొని ఒక్క చోట నేలమీద కూర్చుండును. ఆశ్రమ ద్వారమువద్దకు వచ్చి మరల లేళ్లగుంపుల వైపు పరుగెత్తుచుండెను. 26

మూ. మృగయూథైరనుగతః పునరేవ నివర్తతే,
సీతాదర్శనమాకాఙ్క్షన్ రాక్షసో మృగతాం గతః, 27
పరిభ్రమతి చిత్రాణి మణ్డలాని వినిష్పతన్.

ప్ర. అ. మృగతామ్ = మృగత్వమును, గతః = పొందిన, రాక్షసః = రాక్షసుడు, సీతాదర్శనమ్ = సీతయొక్క దర్శనమును, ఆకాఙ్క్షన్ = కోరుచున్నదై, మృగయూథైః = లేళ్ళ గుంపులచేత, అనుగతః = అనుసరింపబడినదై, పునరేవ = మరల, నివర్తతే = తిరిగి వచ్చును. వినిష్పతన్ = శీఘ్రముగా వచ్చుచు, చిత్రాణి = చిత్రములైన, మణ్డలాని = మండలములను, పరిభ్రమతి = తిరుగుచుండును.

తా. మృగరూపము ధరించిన ఆ మారీచుడు, సీత తనను చూడవలె నని కోరుచు, లేళ్ళగుంపులు వెంబడింపగా తిరిగి వెనుకకు వచ్చుచుండెను. హటాత్తుగా ఎగిరి గంతువేసి అందముగా, గుండ్రముగా తిరుగుచుండెను. 27

మూ. సముద్వీక్ష్య చ తే సర్వే మృగా హ్యన్యే వనేచరాః, 28
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవన్తి దిశో దశ.

ప్ర. అ. వనేచరాః = వనమునందు సంచరించుచున్న, అన్యే = ఇతరములైన, తే = ఆ, సర్వే = సమస్తమైన, మృగాః = మృగములు, సముద్వీక్ష్య = చూచి, ఉపాగమ్య = సమీపించి, సమాఘ్రాయ = వాసనచూచి, దశ దిశః = పది దిక్కులను గూర్చి, విద్రవన్తి = పారిపోవును.

తా. వనములో సంచరించే ఇతరములైన మృగము లన్నీ, ఈ మృగమును చూచి, సమీపించి, వాసనచూచి, పది దిక్కులకు పారిపోయెను. 28

మూ. రాక్షసః సోఽపి తాన్వన్యాన్మృగాన్మృగవధే రతః, 29
ప్రచ్ఛాదనార్థం భావస్య న భక్షయతి సంస్పృశన్.

ప్ర. అ. మృగవధే=మృగములను చంపుటయందు, రతః=ఆసక్తి గల, సః = ఆ, రాక్షసోఽపి=రాక్షసుడు కూడ, వన్యాన్=వనమునకు సంబంధించిన, తాన్ మృగాన్ = ఆ మృగములను, సంస్పృశన్ = స్పృశించుచు, భావస్య = తన స్వభావముయొక్క, ప్రచ్ఛాదనార్థమ్ = కప్పిపుచ్చుకొనుటకొరకు, న భక్షయతి = భక్షించుటలేదు.

తా. మృగములను చంపుటయందు ఆసక్తి కలవాడైనను, ఆ రాక్షసుడు, వాటిని స్పృశించి కూడ, తన స్వరూపమును కప్పిపుచ్చుకొనుటకు, వాటిని భక్షించలేదు. 29

మూ. తస్మిన్నేవ తతః కాలే వైదేహీ శుభలోచనా, 30
కుసుమావచయవ్యగ్రా పాదపానభ్యవర్తత.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తస్మిన్నేవ కాలే = ఆ సమయమునందే, శుభలోచనా = మంగళప్రదములైన నేత్రములు గల, వైదేహీ = సీత, కుసుమావచయవ్యగ్రా=పుష్పములను కోయుటయందు ఆసక్తురాలై, పాదపాన్=వృక్షములను, అభ్యవర్తత = సమీపించెను.

తా. మంగళకరములైన నేత్రములు గల సీత అదే సమయమునందు పుష్పములను కోయుటకై చెట్లవైపు వెళ్లెను. 30

మూ. కర్ణికారానశోకాంశ్చ చూతాంశ్చ మదిరేక్షణా, 31
కుసుమాన్యవచిన్వన్తీ చచార రుచిరాననా.

ప్ర. అ. మదిరేక్షణా=మదజనకములైన నేత్రములు గల, రుచిరాననా= సుందరమైన ముఖము గల ఆ సీత, కర్ణికారాన్ = కర్ణికారవృక్షములను, అశోకాంశ్చ = అశోకవృక్షములను, చూతాంశ్చ = చూతవృక్షములను, కుసుమాని= పుష్పములను, అవచిన్వన్తీ = కోయుచున్నదై, చచార = సంచరించెను.

తా. మత్తు కలిగించే నేత్రములు, అందమైన ముఖమూ గల ఆ సీత కర్ణికారవృక్షములనుంచి, అశోకవృక్షములనుంచి, చూతవృక్షములనుంచి పుష్పములు కోయుచు సంచరించెను. 31

మూ. అనర్హారణ్యావాసస్య సా తం రత్నమయం మృగమ్, 32
ముక్తామణివిచిత్రాఙ్గం దదర్శ పరమాఙ్గనా.

ప్ర. అ. అరణ్యావాసస్య = అరణ్యావాసమునకు, అనర్హా = తగని, సా = ఆ, పరమాఙ్గనా = ఉత్తమస్త్రీ యైన సీత, రత్నమయమ్ = రత్నవికారము, ముక్తామణివిచిత్రాఙ్గమ్ = ముత్యములచేతను, మణులచేతను విచిత్రమైన అవయవములు కలది అయిన, తం మృగమ్ = ఆ మృగమును, దదర్శ = చూచెను.

తా. అరణ్యావాసమునకు తగని ఆ సీత రత్నవికారము, ముత్యములచేతను, మణులచేతను విచిత్రమైన అవయవములు కలది అయిన ఆ మృగమును చూచెను. 32

మూ. సా తం రుచిరదన్తోష్ఠీ రూప్యధాతుతనూరుహమ్, 33
విస్మయోత్ఫుల్లనయనా సస్నేహం సముదైక్షత.

ప్ర. అ. రుచిరదన్తోష్ఠీ = అందమైన దంతములు, ఓష్ఠములు గల, సా = ఆ సీత, రూప్యధాతుతనూరుహమ్ = వెండివంటి, ధాతువులవంటి రోమములు గల, తమ్ = ఆ మృగమును, విస్మయోత్ఫుల్లనయనా = ఆశ్చర్యముచేత వికసించిన నేత్రములు కలదై, సస్నేహమ్ = స్నేహపూర్వకముగా, సముదైక్షత = చూచెను.

తా. అందమైన దంతములు, ఓష్ఠములు గల ఆ సీత, వెండి వలె, ధాతువుల వలె ఉన్న రోమములు గల ఆ మృగమును, ఆశ్చర్యముచేత వికసించిన నేత్రములతో స్నేహపూర్వకముగా చూచెను. 33

మూ. స చ తాం రామదయితాం పశ్యన్ మాయామయో మృగః,
విచచార పునశ్చిత్రం దీపయన్నివ తద్వనమ్.

ప్ర. అ. మాయామయః = మాయామయమైన, సః మృగశ్చ = ఆ మృగము కూడ, తాం రామదయితామ్ = ఆ రాముని భార్యను, పశ్యన్ = చూచుచు, తత్

వనమ్ = ఆ వనమును, దీపయన్నివ = ప్రకాశింపచేయుచున్నది వలె, పునః = మరల, చిత్రమ్ = చిత్రముగా, విచచార = సంచరించెను.

తా. ఆ మాయామృగము కూడ రాముని భార్య యైన సీతను చూచుచు, ఆ వనమును ప్రకాశింపచేయుచున్నట్లు మరల చిత్రవిచిత్రగతులతో సంచరించెను.

మూ. అదృష్టపూర్వం తం దృష్ట్వా నానారత్నమయం మృగమ్
విస్మయం పరమం సీతా జగామ జనకాత్మజా. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
**ద్విచత్వారింశః సర్గః.**

ప్ర. అ. అదృష్టపూర్వమ్=పూర్వము చూడబడని, నానారత్నమయమ్= అనేకరత్నవికారమైన, తం మృగమ్ = ఆ మృగమును, దృష్ట్వా = చూచి, జనకాత్మజా = జనకుని కుమార్తెయైన, సీతా = సీత, పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును; జగామ = పొందెను.

తా. జనకనందిని యైన సీత, పూర్వ మెన్నడూ చూడని, అనేకరత్నముల వంటి రంగులు గల ఆ మృగమును చూచి చాల ఆశ్చర్యము పొందెను.

"వి. మృగాన్నీ దాని సంచారాన్నీ వర్ణిస్తూ వ్రాసిన ఈ సర్గలోని శ్లోకాలు (16-35) ప్రాచ్యప్రతిలో లేవు. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో నలుబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిచత్వారింశః సర్గః

[ఆ మాయామృగమును చూచి లక్ష్మణునకు సందేహము కలుగుట. ఆ మృగమును సజీవముగా గాని, చంపి గాని తీసికొనిరమ్మని సీత రాముని కోరుట. రాముడు "సీతను రక్షించుచుండుము" అని లక్ష్మణుని ఆదేశించి ఆ మృగముకొరకు వెళ్ళుట]

మూ. సా తం సంప్రేక్ష్య సుశ్రోణీ కుసుమాని విచిన్వతీ,
హేమరాజతవర్ణాభ్యాం పార్శ్వాభ్యాముపశోభితమ్. 1

ప్రహృష్టా చానవద్యాఙ్గీ మృష్టహాటకవర్ణినీ,
భర్తారమపి చక్రన్ద లక్ష్మణం చైవ సాయుధమ్. 2

ప్ర. అ. సుశ్రోణీ = అందమైన కటిప్రదేశము గలది, అనవద్యాఙ్గీ = దోషములు లేని అవయవములు గలది, మృష్టహాటకవర్ణినీ = పరిశుద్ధమైన బంగారము చాయ గలది, కుసుమాని = పుష్పములను, విచిన్వతీ = కోయుచున్నది. అయిన, సా = ఆ సీత, హేమరాజతపార్శ్వాభ్యామ్ = వెండి బంగారము వంటి పార్శ్వములచేత, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడిన, తమ్ = ఆ మృగమును, సంప్రేక్ష్య = చూచి, ప్రహృష్టా = సంతోషించినదై, భర్తారమపి = భర్తను, సాయుధమ్ = ఆయుధముతో కూడిన, లక్ష్మణం చైవ = లక్ష్మణుణ్ణీ, చక్రన్ద = పిలిచెను.

తా. అందమైన కటిప్రదేశము, దోషములు లేని అవయవములు, పరిశుద్ధమైన బంగారము వర్ణము వంటి వర్ణము గల ఆ సీత, పుష్పములను కోయుచు, వెండిరంగు బంగారురంగు గల పార్శ్వములతో ప్రకాశించుచున్న ఆ మృగమును చూచి, సంతోషించినదై, భర్తను, ఆయుధసహితుడైన లక్ష్మణుణ్ణి బిగ్గరగా పిలచెను. 1, 2

మూ. తయాహూతౌ నరవ్యాఘ్రౌ వైదేహ్యా రామలక్ష్మణౌ,
వీక్షమాణౌ తు తౌ దేశం తదా దదృశతుర్మృగమ్. 3

ప్ర. అ. తయా = ఆ, వైదేహ్యా = సీతచేత, ఆహూతౌ = పిలవబడిన, నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, తం దేశమ్ = ఆ ప్రదేశమును, వీక్షమాణౌ = చూచుచున్నవారై, తదా = అప్పుడు, మృగమ్ = మృగమును, దదృశతుః = చూచిరి.

తా. అప్పుడు ఆ సీత పిలవగా రామలక్ష్మణులు ఆ ప్రదేశమును చూచుచు అక్కడ మృగమును చూచిరి. 3

మూ. శఙ్కమానస్తు తం దృష్ట్వా లక్ష్మణో రామమబ్రవీత్,
తమేవైనమహం మన్యే మారీచం రాక్షసం మృగమ్. 4

ప్ర. అ. తమ్ = ఆ మృగమును, దృష్ట్వా = చూచి, శఙ్కమానః = సందేహించుచున్నవాడై, లక్ష్మణః = లక్ష్మణుడు, రామమ్ = రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను. అహమ్ = నేను, ఏనమ్ = ఈ, మృగమ్ = మృగమును, తమ్ = ఆ, మారీచమేవ = మారీచుణ్ణిగానే, మన్యే = తలచుచున్నాను.

తా. లక్ష్మణుడు ఆ మృగమును చూచి, శంకించుచు, రామునితో ఇట్లనెను "ఈ మృగము ఆ మారీచుడే అని తలచెదను." 4

మూ. చరన్తో మృగయాం హృష్టాః పాపేనోపాధినా వనే,
అనేన నిహతా రాజన్ రాజానః కామరూపిణా. 5

ప్ర. అ. రాజన్ = రాజా, హృష్టాః = సంతోషించుచున్నవారై, మృగయాం చరన్తః = వేటాడుచున్న, రాజానః = రాజులు, కామరూపిణా = స్వేచ్ఛారూపము గల, అనేన = ఈ, పాపేన = పాపాత్మునిచేత, వనే = వనమునందు, ఉపాధినా = వేషముచేత, నిహతాః = చంపబడినారు.

తా. రామా ! ఆనందముగా వేటాడుచున్న రాజులను, స్వేచ్ఛగా రూపమును ధరించ గల ఈ పాపాత్ముడు ఆ యా వేషములు ధరించి చంపినాడు.

వి. "ఉపధినా''అను పాఠమున్నచో యుక్తముగా ఉండును. ''కపటము చేత''అని అర్థము. 5

మూ. అస్య మాయావిదో మాయామృగరూపమిదం కృతమ్,
భానుమత్పురుషవ్యాఘ్ర గన్ధర్వపురసన్నిభమ్. 6

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా ! మాయావిదః = మాయలను ఎరిగిన, అస్య = ఈ మారీచునియొక్క, భానుమత్ = కాంతి గలది, గన్ధర్వపుర సన్నిభమ్ = గంధర్వపురముతో సమానము అయిన, ఇదమ్ = ఈ, మాయా మృగరూపమ్ = మాయామృగరూపము, కృతమ్ = చేయబడినది.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన రామా! మాయలలో ఆరితేరిన ఈ మారీచుడు కాంతి గలది, ఇంద్రజాలికుడు నిర్మించు మాయానగరము వంటిదీ అయిన ఈ మాయామృగరూపమును నిర్మించినాడు. 6

మూ. మృగో హ్యేవంవిధో రత్నవిచిత్రో నాస్తి రాఘవ,
జగత్యాం జగతీనాథ మాయైషా హి న సంశయః. 7

ప్ర. అ. జగతీనాథ = భూమికి అధిపతివైన, రాఘవ = రామా ! జగత్యామ్ = భూమియందు, రత్నవిచిత్రః = రత్నములచేత విచిత్రమైన, ఏవంవిధః = ఈ విధమైన, మృగః = మృగము, నాస్తి హి = లేదు కదా ? ఏషా = ఇది, మాయా = మాయయే. సంశయః = సంశయము, న = లేదు.

తా. భూమండలమునకు ప్రభువైన రామా ! రత్నములవంటి బిందువుల చేత విచిత్రమైన ఇట్టి మృగము భూలోకములో ఉండదు. ఇది మాయయే. సంశయము లేదు. 7

మూ. ఏవం బ్రువాణం కాకుత్థ్సం ప్రతివార్య శుచిస్మితా,
ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా. 8

ప్ర. అ. శుచిస్మితా = తెల్లని చిరునవ్వు గలది, చర్మణా = (ఆ మృగము యొక్క) చర్మముచేత, హృతచేతనా = హరించబడిన మనస్సుకలది, హృష్టా = సంతోషించినది అయిన, సీతా = సీత, ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, కాకుత్థ్సమ్ = లక్ష్మణుని, ప్రతివార్య = నివారించి, ఉవాచ = పలికెను.

తా. అందమైన చిరునవ్వు గల ఆ సీత మనస్సును ఆ మృగముచర్మము ఆకర్షించుటచే ఆమె సంతోషించుచు, ఇట్లు పలుకుచున్న ఆ లక్ష్మణునికి అడ్డు తగిలి ఇట్లు పలికెను. 8

మూ. ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః,
ఆనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. 9

ప్ర. అ. ఆర్యపుత్ర = ఆర్యపుత్రా! అభిరామః = మనోహరమైన, అసౌ = ఈ, మృగః = మృగము, మే = నాయొక్క, మనః = మనస్సును, హరతి = హరించుచున్నది. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! ఏనమ్ = దీనిని, ఆనయ = తీసికొనిరమ్ము. నః = మనయొక్క, క్రీడార్థమ్ = ఆటకొరకు, భవిష్యతి = కాగలదు.

తా. ఆర్యపుత్రా! సుందరమైన ఈ మృగము నా మనస్సును హరించుచున్నది. ఓ! మహాబాహూ! దీనిని పట్టి తీసికొనిరమ్ము. మనము దీనితో వినోదించవచ్చును. 9

మూ. ఇహాశ్రమపదేఽస్మాకం బహవః పుణ్యదర్శనాః,
మృగాశ్చరన్తి సహితాః సృమరాశ్చమరాస్తథా. 10

ప్ర. అ. అస్మాకమ్ = మనయొక్క, ఇహ = ఈ, ఆశ్రమపదే = ఆశ్రమమునందు, పుణ్యదర్శనాః = మంచి దర్శనము గల, బహవః = అనేకమైన, మృగాః = మృగములు, సృమరాః = సృమరములు, తథా = మరియు, చమరాః = చమరమృగములు, సహితాః = కలిసినవై, చరన్తి = సంచరించుచున్నవి.

తా. మన ఈ ఆశ్రమములో, చూచుటకు అందమైన ఎన్నోలేళ్ళు, సృమరములు, చమరములు గుంపులు గుంపులుగా తిరుగుచుండును. 10

మూ. ఋక్షాః పృషతసంఘాశ్చ వానరాః కిన్నరాస్తథా,
విచరన్తి మహాబాహో రూపశ్రేష్ఠా మనోహరాః. 11

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! రూపశ్రేష్ఠాః = రూపముచేత శ్రేష్ఠములైన, మనోహరాః = మనస్సును ఆకర్షించు, ఋక్షాః = ఎలుగు

బంట్లు, పృషతసంఘాశ్చ = చుక్కల లేళ్ల గుంపులు, వానరాః = కోతులు, తథా = మరియు, కింనరాః = కింనరులు, విచరన్తి = సంచరించుచున్నవి.

తా. గొప్ప బాహువులు గల రామా! అందమైన రూపము గలవి, మనోహరములు అయిన ఎలుగుబంట్లు, చుక్కల లేళ్ళు, కోతులు, కింనరులు సంచరించుచుండును. 11

మూ. న చాస్య సదృశో రాజన్ దృష్టపూర్వో మృగో మయా,
తేజసా క్షమయా దీప్త్యా యథాయం మృగసత్తమః. 12

ప్ర. అ. రాజన్ = రాజా! అయమ్ = ఈ, మృగసత్తమః = శ్రేష్ఠమైన మృగము, యథా = ఎట్లో అట్లు, తేజసా = తేజస్సుచేతను, క్షమయా = ఓర్పుచేతను, దీప్త్యా = కాంతిచేతను, అస్య = దీనికి, సదృశః = సమానమైన, మృగః = మృగము, మయా = నాచేత, న దృష్టపూర్వః = పూర్వము చూడబడలేదు.

తా. రాజా! ఈ శ్రేష్ఠమైన మృగము తేజస్సుచేతను, ఓర్పుచేతను, కాంతిచేతను ఏ విధముగా ఉన్నదో ఆవిధముగా ఉండే మరొక మృగమును నేనెన్నడూ చూడలేదు. 12

మూ. నానావర్ణవిచిత్రాఙ్గో రత్నబిన్దుసమాచితః,
ద్యోతయన్వనమవ్యగ్రం శోభతే శశిసన్నిభః. 13

ప్ర. అ. నానావర్ణవిచిత్రాఙ్గః = అనేకవిధములైన రంగులచేత విచిత్రమైన శరీరము గలది, రత్నబిన్దుసమాచితః = రత్నముల వంటి చుక్కలచేత వ్యాప్తమూ అయిన, శశిసన్నిభః = చంద్రునితో సమానమైన ఈ మృగము, అవ్యగ్రమ్ = కంగారు లేకుండా, వనమ్ = వనమును, ద్యోతయన్ = కాంతి కలదానినిగా చేయుచు, శోభతే = ప్రకాశించుచున్నది.

తా. దీని శరీరము అనేకవిధములైన రంగులతో విచిత్రముగా ఉన్నది. రత్నముల వంటి చుక్కలతో నిండి యున్నది. ఇది ఏ మాత్రము భయపడుట లేదు. చంద్రుడు వలె ఈ అరణ్యమును కాంతిభరితము చేయుచు ప్రకాశించుచున్నది. 13

మూ. అహో రూపమహో లక్ష్మీః స్వరసంపచ్చ శోభనా,
మృగోఽద్భుతో విచిత్రాఙ్గో హృదయం హరతీవ మే. 14

ప్ర. అ. రూపమ్ = రూపము, అహో = ఎంత ఆశ్చర్యకరముగా ఉన్నది! లక్ష్మీః = శోభ, అహో = ఎంత ఆశ్చర్యకరముగా ఉన్నది! స్వరసంపచ్చ = స్వరసంపద కూడ, శోభనా = బాగున్నది. అద్భుతః = ఆశ్చర్యకరము, విచిత్రాఙ్గః = విచిత్రమైన శరీరము గలది అయిన, మృగః = ఈ మృగము, మే = నాయొక్క, హృదయమ్ = హృదయమును, హరతీవ = హరించుచున్నట్లున్నది.

తా. ఏమి రూపము! ఏమి సౌందర్యము! ఏమి స్వరమాధుర్యము! విచిత్రమైన శరీరముతో ఆశ్చర్యకరముగా ఉన్న ఈ మృగము నా మనస్సును హరించుచున్నట్లు ఉన్నది. 14

మూ. యది గ్రహణమభ్యేతి జీవన్నేవ మృగస్తవ,
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి. 15

ప్ర. అ. మృగః = మృగము, జీవన్నేవ = జీవించి ఉన్నదగుచునే, తవ = నీయొక్క, గ్రహణమ్ = గ్రహణమును, అభ్యేతి యది = పొందినట్లయితే, ఆశ్చర్యభూతమ్ = ఆశ్చర్యకరము, భవతి = అగును. విస్మయమ్ = ఆశ్చర్యమును, జనయిష్యతి = పుట్టించును.

తా. ఈ మృగము సజీవముగానే నీకు లభించినచో ఇది ఆశ్చర్యకరముగా ఉండును. చూచేవారందరికి ఆశ్చర్యము కలిగించును. 15

మూ. సమాప్తవనవాసానాం రాజ్యస్థానాం చ నః పునః,
అన్తఃపురవిభూషార్థో మృగ ఏష భవిష్యతి. 16

ప్ర. అ. ఏషః మృగః = ఈ మృగము, సమాప్తవనవాసానామ్ = సమాప్తమైన వనవాసము గలవారము, పునః = మరల, రాజ్యస్థానామ్ = రాజ్యమునందు ఉన్నవారము అయిన, నః = మనయొక్క, అన్తఃపురవిభూషార్థః = అంతఃపురమునకు అలంకరణముకొరకు, భవిష్యతి = కాగలదు.

తా. మనము వనవాసము పూర్తిచేసికొని మరల రాజ్యమును పొందిన పిమ్మట, ఈ మృగము, మన అంతఃపురానికి అలంకారముగా ఉండగలదు. 16

మూ. భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూపమిదం వ్యక్తమాశ్చర్యం జనయిష్యతి. 17

ప్ర. అ. ప్రభో = ఓ! ప్రభూ! ఇదమ్ = ఈ, మృగరూపమ్ = మృగము యొక్క రూపము, భరతస్య = భరతునకు, ఆర్యపుత్రస్య = ఆర్యపుత్రునకు, శ్వశ్రూణామ్ = అత్తగార్లకు, మమ చ = నాకు, వ్యక్తమ్ = సత్యముగా, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యమును, జనయిష్యతి = పుట్టించగలదు.

తా. నాథా! ఈ మృగరూపము, భరతునకు, నీకు, అత్తలకు, నాకు కూడ తప్పక ఆశ్చర్యమును (ఆనందమును) కలిగించగలదు. 17

మూ. జీవన్న యది తేఽభ్యేతి గ్రహణం మృగసత్తమః,
అజినం నరశార్దూల రుచిరం మే భవిష్యతి. 18

ప్ర. అ. నరశార్దూల = నరులలో శ్రేష్ఠుడా! మృగసత్తమః = ఉత్తమమైన ఈ మృగము, జీవన్ = జీవించిఉన్నదై, తే = నీయొక్క, గ్రహణమ్ = గ్రహణమును, న అభ్యేతి యది = పొందకపోయినచో, మే = నాకు, రుచిరమ్ = అందమైన, అజినమ్ = దీని చర్మము, భవిష్యతి = ఉండగలదు.

తా. మానవులలో శ్రేష్ఠుడవైన ఓ! రామా! ఉత్తమమైన ఈ మృగము సజీవముగా నీకు లభించనిచో అందమైన దీని చర్మము నాకు ఉండును. 18

మూ. నిహతస్యాస్య సత్త్వస్య జామ్బూనదమయత్వచి,
శష్పబ్రుస్యాం వినీతాయామిచ్ఛామ్యహముపాసితుమ్. 19

ప్ర. అ. శష్పబ్రుస్యామ్ = లేతగడ్డితో ఏర్పరుపబడిన ఆసనమునందు, వినీతాయామ్ = పరవబడిన, నిహతస్య = చంపబడిన, అస్య సత్త్వస్య = ఈ మృగముయొక్క, జామ్బూనదమయత్వచి = బంగారు చర్మమీద, అహమ్ = నేను, ఉపాసితుమ్ = కూర్చుండుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. ఈ మృగమును చంపివేసినచో దీని బంగారు చర్మను లేతగడ్డితో ఏర్పరచిన ఆసనముమీద పరచుకొని కూర్చుండవలెనని నాకు కోరిక ఉన్నది.

మూ. కామవృత్తమిదం రౌద్రం స్త్రీణామసదృశం మతమ్,
వపుషా త్వస్య సత్త్వస్య విస్మయో జనితో మమ. 20

ప్ర. అ. రౌద్రమ్ = భయంకరమైన, ఇదమ్ = ఈ, కామవృత్తమ్ = స్వేచ్ఛాప్రవృత్తి, స్త్రీణామ్ = స్త్రీలకు, అసదృశమ్ = తగనిదిగా, మతమ్ = చెప్పబడినది. తు = కాని, అస్య = ఈ, సత్త్వస్య = జంతువుయొక్క, వపుషా = శరీరముచేత, మమ = నాకు, విస్మయః = ఆశ్చర్యము, జనితః = పుట్టించబడినది.

తా. స్త్రీలకు భయంకరమైన ఇట్టి కోరిక తగ దను మాట నిజమే. కాని ఈ మృగము రూపమును చూడగానే నాకు ఆశ్చర్యము కలిగినది. 20

మూ. తేన కాఞ్చనవర్ణేన మణిప్రవరశృఙ్గిణా,
తరుణాదిత్యవర్ణేన నక్షత్రపథవర్చసా, 21
బభూవ రాఘవస్యాపి మనో విస్మయమాగతమ్.

ప్ర. అ. కాఞ్చనరూపేణ = బంగారు రూపము గలది, మణిప్రవరశృఙ్గిణా = శ్రేష్ఠములైన మణుల వంటి కొమ్ములు గలది, తరుణాదిత్యవర్ణేన = లేతసూర్యుని వంటి రంగు గలది, నక్షత్రపథవర్చసా = నక్షత్రమార్గము వంటి కాంతి గలది అయిన, తేన = ఆ మృగముచేత, రాఘవస్య = రామునియొక్క, మనః అపి = మనస్సు కూడ, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగతమ్ = పొందినది.

తా. బంగారు రూపము, శ్రేష్ఠములైన మణుల వంటి కొమ్ములు, బాలసూర్యుని వంటి రంగు, నక్షత్రములతో కూడిన ఆకాశము వంటి తేజస్సు-వీటితో కూడిన ఆ మృగమును చూడగానే రామునకు కూడ ఆశ్చర్యము కలిగెను. 21

మూ. ఏవం సీతావచః శ్రుత్వా తం దృష్ట్వా మృగమద్భుతమ్ 22
లోభితస్తేన రూపేణ సీతయా చ ప్రచోదితః.
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. 23

ప్ర. అ. రాఘవః = రాముడు, ఏవమ్ = ఇట్లు, సీతావచః = సీతయొక్క వచనమును, శ్రుత్వా = విని, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, తం మృగమ్ = ఆ మృగమును, దృష్ట్వా = చూచి, తేన రూపేణ = ఆ రూపముచేత, లోభితః = లోభ పెట్టబడినవాడై, సీతయా చ = సీతచేత కూడ, ప్రచోదితః = ప్రేరేపించ

బడినవాడై, హృష్టః=సంతోషించినవాడై, భ్రాతరమ్=సోదరుడైన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు సీత మాటలు విని, ఆశ్చర్యకరమైన ఆ మృగమును చూచి, దాని రూపముచేత ఆకర్షింపబడినవాడై, సీత కూడ ప్రేరేపింపగా, సంతోషముతో సోదరుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 22, 23

మూ. పశ్య లక్ష్మణ వైదేహ్యాః స్పృహాం మృగగతామిమామ్,
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి. 24

న వనే నన్దనోద్దేశే న చైత్రరథసంశ్రయే,
కుతః పృథివ్యాం సౌమిత్రే యోఽస్య కశ్చిత్సమో మృగః.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణుడా ! వైదేహ్యాః = సీతయొక్క, మృగగతామ్ = మృగమునకు సంబంధించిన, స్పృహామ్=ఆసక్తిని, పశ్య=చూడుము. సౌమిత్రే = లక్ష్మణా! అద్య = ఇప్పుడు, రూపశ్రేష్ఠతయా = రూపముచేత శ్రేష్ఠమగుటచే, ఏషః మృగః=ఈ మృగము, వనే=ఈ వనమునందు, న భవిష్యతి= ఉండదు; నన్దనోద్దేశే= నందనవనప్రాంతమునందు, న = ఉండదు; చైత్రరథసంశ్రయే = చైత్రరథ మనే వనమునందు, న = ఉండదు. యః = ఏ మృగము, అస్య = దీనికి, సమః = సమానమైనదో అది, పృథివ్యామ్ = భూమియందు, కుతః = ఎట్లు ?

తా. లక్ష్మణా! సీతకు ఈ మృగమునందు ఎంత ఆసక్తి ఉన్నదో చూచితివా! ఇంత శ్రేష్ఠమైన రూపము గల మృగము ఈ వనములో మరేదీ ఉండదు. నందనవనములో గాని, చైత్రరథ మను ఉద్యానములో గాని ఉండదు. ఇంక భూలోకములో ఎట్లు ఉండును ? 24, 25

మూ. ప్రతిలోమానులోమాశ్చ రుచిరా రోమరాజయః,
శోభన్తే మృగమాశ్రిత్య చిత్రాః కనకబిన్దుభిః. 26

ప్ర. అ. ప్రతిలోమానులోమాః చ = ఎదురుతిరిగినవి వాలుగా ఉన్నవి అయినవి, రుచిరాః = అందమైనవి, కనకబిన్దుభిః = బంగారు రంగు చుక్కల

చేత, చిత్రాః = చిత్రములూ అయిన, రోమరాజయః = రోమముల పంక్తులు, మృగమ్ = మృగమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, శోభన్తే = ప్రకాశించుచున్నవి.

తా. ఈ మృగము శరీరము మీద అందమైన రోమపంక్తులు కొన్ని చోట్ల ఎదురు తిరిగి ఉన్నవి; కొన్ని చోట్ల వాలుగా ఉన్నవి. బంగారపు చుక్కలచేత చిత్రముగా ఉన్నవి. 26

మూ. పశ్యాస్య జృమ్భమాణస్య దీప్తామగ్నిశిఖోపమామ్,
జిహ్వాం ముఖాన్నిస్సరన్తీం మేఘాదివ శతహ్రదామ్. 27

ప్ర. అ. జృమ్భమాణస్య = ఆవులించుచున్న, అస్య = దీనియొక్క, ముఖాత్ = ముఖమునుండి, నిస్సరన్తీమ్ = బయలుదేరుచున్న, దీప్తామ్ = ప్రకాశించుచున్న, అగ్నిశిఖోపమామ్ = అగ్నిజ్వాలతో సమానమైన, మేఘాత్ = మేఘమునుండి బయలుదేరుచున్న, శతహ్రదామ్ ఇవ = మెరుపు వలె ఉన్న, జిహ్వామ్ = జిహ్వను, పశ్య = చూడుము.

తా. ఇది ఆవులించినప్పుడు దీని నోటినుండి అగ్నిజ్వాల వలె ప్రకాశించుచున్న నాలుక పైకి వచ్చుచున్నది. ఇది మేఘమునుండి బైటకు వచ్చుచున్న మెరుపు వలె ఉన్నది; చూడుము. 27

మూ. మసారగల్లర్కముఖః శఙ్ఖముక్తానిభోదరః,
కస్య నామానిరూప్యోఽసౌ న మనో లోభయేన్మృగః. 28

ప్ర. అ. మసారగల్లర్కముఖః = ఇంద్రనీలమణివికారమైన పాత్ర వంటి ముఖము గలది, శఙ్ఖముక్తానిభోదరః = శంఖముతోను, ముత్యముతోను సమానమైన పొట్టగలది, అనిరూప్యః = వర్ణింప శక్యము కానిది అయిన, అసౌ మృగః = ఈ మృగము, కస్య నామ = ఎవనియొక్క, మనః = మనస్సును, న లోభయేత్ = లోభపెట్టదు ?

తా. వర్ణింప శక్యము కాని సౌందర్యము గల ఈ మృగము ముట్టి ఇంద్రనీలములు మాటిన పాత్ర వలె ఉన్నది. ఉదరము శంఖము వలె, ముత్యము వలె తెల్లగా నున్నగా ఉన్నది. అట్టి ఈ మృగము ఎవరి మనస్సును ఆకర్షించకుండా ఉండును ? 28

మూ. కస్య రూపమిదం దృష్ట్వా జామ్బూనదమయం ప్రభో,
నానారత్నమయం దివ్యం న మనో విస్మయం వ్రజేత్.

ప్ర. అ. ప్రభో = సమర్థుడ వైన లక్ష్మణా! జామ్బూనదమయమ్ = బంగారు వికారము, నానారత్నమయమ్ = అనేకరత్నముల వికారము, దివ్యమ్ = అద్భుతము అయిన, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపమును, దృష్ట్వా = చూచి, కస్య = ఎవనియొక్క, మనః = మనస్సు, విస్మయమ్ = ఆశ్చర్యమును, న వ్రజేత్ = పొందకుండును.

తా. లక్ష్మణా! బంగారు వికారము, అనేకరత్నములతో నిండినది, అద్భుతము అయిన ఈ రూపమును చూచిన పిమ్మట ఎవనికి ఆశ్చర్యము కలుగదు?

మూ. మాంసహేతోరపి మృగాన్ విహారార్థం చ ధన్వనః,
ఘ్నన్తి లక్ష్మణ రాజానో మృగమాయాం మహావనే. 30

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! రాజానః = రాజులు, మహావనే = మహావనమునందు, మృగయాయామ్ = వేటయందు, మాంసహేతోః = మాంసముకొరకు, ధన్వనః = ధనస్సుయొక్క, విహారార్థమ్ = విహారముకొరకు, మృగాన్ = మృగములను, ఘ్నన్తి = చంపుచున్నారు.

తా. లక్ష్మణా! రాజులు మహావనములో వేటాడుచు, మృగములను మాంసముకొరకు, ధనస్సును ఉపయోగించి వినోదము పొందుటకు, చంపుచుందురు.

మూ. ధనాని వ్యవసాయేన విచీయన్తే మహావనే,
ధాతవో వివిధాశ్చాపి మణిరత్నసువర్ణినః. 31

ప్ర. అ. మహావనే = మహావనమునందు, వ్యవసాయేన = ప్రయత్నము చేయుటచేత, ధనాని = ధనములు, మణిరత్నసువర్ణినః = మణులు, రత్నములు, బంగారము గల, వివిధాః = అనేకవిధములైన, ధాతవః = ధాతువులు, విచీయన్తే = ప్రోగుచేసికొనబడుచున్నవి.

తా. మహావనమునందు ఉద్యమము చేసి ధనములను, వివిధధాతువులను, మణులను, రత్నములను, బంగారమును ప్రోగుచేసికొనవలెను. 31

మూ. తత్సారమఖిలం నృణాం ధనం నిచయవర్ధనమ్,
మనసా చిన్తితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ. 32

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! అఖిలమ్ = సమస్తమైన, తత్ = ఆ, సారమ్ = శ్రేష్ఠమైన, ధనమ్ = అరణ్యములో లభించు ధనము, నృణామ్ = మనుష్యులకు, మనసా = మనస్సుచేత, చిన్తితమ్ = ఆలోచించబడిన, సర్వమ్ = సమస్తమూ, శుక్రస్య యథా = శుక్రునకు ఎట్లో అట్లు, నిచయవర్ధనమ్ = కోశమును వృద్ధిపొందించును.

తా. లక్ష్మణా! అరణ్యములో లభించు సంపద అంతా, మనస్సుచేత ఆలోచించిన దంతా శుక్రుని కోశాగారమును అనాయాసముగా నింపి నట్లు, మానవుల కోశాగారమును నింపును.

వి. ఎవరైన గొంతెమ్మకోరికలు కోరుకొనగా అవి ఫలించనిచో, అతడు కోరిన వన్నీ శుక్రుని ధనాగారములో చేరుచుండును అని పురాణాదిప్రసిద్ధి. 32

మూ. అర్థీ యేనార్థకృత్యేన సంవ్రజత్యవిచారయన్,
తమర్థమర్థశాస్త్రజ్ఞాః ప్రాహురర్థ్యాశ్చ లక్ష్మణ. 33

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! అర్థీ = అర్థమునుకోరువాడు, యేన = ఏ, అర్థకృత్యేన = అర్థమునకు సంబంధించిన పనిచేత, అవిచారయన్ = ఆలోచించకుండగా, సంవ్రజతి = ముందుకు పోవునో, తమ్ = దానిని, అర్థశాస్త్రజ్ఞాః = అర్థశాస్త్రము తెలిసినవాళ్ళు, అర్థ్యాః = అర్థమును సంపాదించకలవాళ్ళు, అర్థమ్ = అర్థమునుగా, ప్రాహుః = చెప్పుదురు.

తా. లక్ష్మణా! ఏదైన ధనమును కోరు ఎవడు ఆ ధనమును సంపాదించుటకై, ముందువెనుకలాడక, ముందుకే పోవునో ఆతడు సంపాదించిన ధనమే ధన మని అర్థశాస్త్రజ్ఞులు, అర్థసంపాదననిపుణులు చెప్పుదురు. 33

మూ. ఏతస్య మృగరత్నస్య పరార్ధ్యే కాఞ్చనత్వచి,
ఉపవేక్ష్యతి వైదేహీ మయా సహ సుమధ్యమా. 34

ప్ర. అ. సుమధ్యమా = అందమైన నడుము గల, వైదేహీ = సీత,

ఏతస్య = ఈ, మృగరత్నస్య = శ్రేష్ఠమైన మృగముయొక్క, పరార్ధ్యే = శ్రేష్ఠమైన, కాఞ్చనత్వచి = బంగారు చర్మముమీద, మయా సహ = నాతో కూడ, ఉపవేక్ష్యతి = కూర్చుండగలదు.

తా. అందమైన నడుము గల సీత ఈ శ్రేష్ఠమృగము అమూల్యమైన బంగారు చర్మమీద నాతో కూడ కూర్చుండును. 34

మూ. న కాదళీ న ప్రియకీ న ప్రవేణీ న చావికీ,
భవేదేతస్య సదృశీ స్పర్శనేనేతి మే మతిః. 35

ప్ర. అ. స్పర్శనేన = స్పర్శచేత, కాదళీ = కదళీమృగముచర్మ, ఏతస్య = దీనికి, సదృశీ = సమానము, న భవేత్ = కాజాలదు, ప్రియకీ = ప్రియకమృగ చర్మ, న = కాదు, ప్రవేణీ = ప్రవేణి చర్మ, న = కాదు, అవికీ చ = గొఱ్ఱె చర్మ కూడ, న = కాదు, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = అభిప్రాయము.

తా. కదళీమృగచర్మము గాని, ప్రియకమృగచర్మము గాని, ప్రవేణీ మృగచర్మము గాని, అవిచర్మము గాని మృదుస్పర్శవిషయమునందు దీనికి సాటి రాదని నా అభిప్రాయము. 35

మూ. ఏష చైవ మృగః శ్రీమాన్ యశ్చ దివ్యో నభశ్చరః,
ఉభావేతౌ మృగౌ దివ్యౌ తారామృగమహీమృగౌ. 36

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తమైన, ఏషః = ఈ, మృగశ్చైవ = మృగము, నభశ్చరః = ఆకాశముపై సంచరించు, యశ్చ = ఏ, దివ్యః = శ్రేష్ఠమైన మృగ మున్నదో అది, దివ్యౌ = దివ్యములైన, ఏతౌ = ఈ, తారామృగమహీమృగౌ = నక్షత్రమండలములో (చంద్రునిలో) ఉన్న మృగము, భూమిమీద ఉన్న మృగము, ఉభౌ = ఈ రెండు మృగములే, మృగౌ = మృగములు.

తా. శోభాయుక్తమైన ఈ మృగము, దివ్యమైన ఆకాశమునందు సంచరించే మృగము, చంద్రునిపైన, భూమిమీద ఉన్న ఈ రెండు దివ్యమృగములే నిజమైన మృగములు. 36

మూ. యది వాయం తథా యన్మాం భవేద్వదసి లక్ష్మణ,
మాయైషా రాక్షసస్యేతి కర్తవ్యోఽస్య వధో మయా. 37

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! ఏషా = ఇది, రాక్షసస్య = రాక్షసుని యొక్క, మాయా = మాయ, ఇతి = అని, మామ్ = నన్ను గూర్చి, యత్ = ఏ మాట, వదసి = చెప్పుచున్నావో, తథా = అట్లు, అయమ్ = ఇది, భవేద్యది వా = అయినను కూడ, మయా = నాచేత, అస్య = దీనియొక్క, వధః = వధ, కర్తవ్యః = చేయదగినది.

తా. లక్ష్మణా! నీవు చెప్పినట్లు ఇది రాక్షసుని మాయయే అయినను, నేను ఈ రాక్షసుని చంపివేయవలెను. 37

మూ. ఏతేన హి నృశంసేన మారీచేనాకృతాత్మనా,
వనే విచరతా పూర్వం హింసితా మునిపుఙ్గవాః. 38

ప్ర. అ. నృశంసేన = క్రూరుడు, అకృతాత్మనా = దుష్టబుద్ధికలవాడు, వనే = వనమునందు, విచరతా = సంచరించుచున్నవాడు అయిన, ఏతేన = ఈ, మారీచేన = మారీచునిచేత, పూర్వమ్ = పూర్వము, మునిపుఙ్గవాః = మునిశ్రేష్ఠులు, హింసితాః = హింసింపబడినవారు.

తా. దుష్టబుద్ధి, క్రూరుడు అయిన ఈ మారీచుడు అరణ్యములో సంచరించుచు, పూర్వము ఎందరో మునీశ్వరులను చంపివేసినాడు. 38

మూ. ఉత్థాయ బహవో యేన మృగయాయాం జనాధిపాః,
నిహతాః పరమేష్వాసాస్తస్మాద్వధ్యస్త్వయం మృగః. 39

ప్ర. అ. యేన = ఏ కారణముచేత, పూర్వమ్ = పూర్వము, ఉత్థాయ = లేచి (ఎదిరించి), మృగయాయామ్ = వేటయందు, బహవః = అనేకులైన, పరమేష్వాసాః = గొప్ప ధనస్సు గల, జనాధిపాః = రాజులు, నిహతాః = చంపబడినారో, తస్మాత్ = ఆ కారణమువలన, అయం మృగః = ఈ మృగము, వధ్యః తు = చంపదగినదే.

తా. పూర్వము ఈ మృగము, ధనుర్ధరులై వేటకు వచ్చిన ఎందరో రాజులను ఎదిరించి వారిని చంపివేసినది. అందుచేత దీనిని చంపవలసి ఉన్నది. 39

మూ. పురస్తాదిహ వాతాపిః పరిభూయ తపస్వినః,
ఉదరస్థో ద్విజాన్ హన్తి స్వగర్భోఽశ్వతరీమివ. 40

ప్ర. అ. పురస్తాత్ = పూర్వము, ఇహ = ఈ ప్రాంతమునందు, వాతాపిః = వాతాపి, తపస్వినః = మునులను, పరిభూయ = తిరస్కరించి, ఉదరస్థః = ఉదరములో ఉన్నవాడై, అశ్వతరీమ్ = కంచరిగాడిదను, స్వగర్భః ఇవ = తన గర్భము వలె, ద్విజాన్ = ఆ బ్రాహ్మణులను, హన్తి = చంపెడివాడు.

తా. పూర్వము ఈ ప్రదేశమునందు, వాతాపి మునీశ్వరులను తిరస్కరించి వాళ్ళ ఉదరములో ప్రవేశించి, కంచరిగాడిదను దాని గర్భమునం దున్న శిశువు, గర్భమును చీల్చుకొని వచ్చుటచే చంపి నట్లు, ఆ బ్రాహ్మణులను, ఉదరములను చీల్చి బైటకు వచ్చి చంపుచుండెడివాడు. 40

మూ. స కదాచిచ్చిరాల్లోభాదాససాద మహామునిమ్,
అగస్త్యం తేజసా యుక్తం భక్షస్తస్య బభూవ హ. 41

ప్ర. అ. సః = ఆ వాతాపి, చిరాత్ = చిరకాలమునకు, కదాచిత్ = ఒక నాడు, లోభాత్ = దురాశవలన, తేజసా = తేజస్సుతో, యుక్తమ్ = కూడినవాడు, మహామునిమ్ = మహామునీ అయిన, అగస్త్యమ్ = అగస్త్యుని, ఆససాద = పొందెను. తస్య = ఆ అగస్త్యునకు, భక్షః = ఆహారముగా, బభూవ హ = అయ్యెను.

తా. చాల కాలానికి ఆత డొక రోజున మహాతేజఃశాలియైన అగస్త్య మహామునిని ఆహ్వానించి ఆతనికి ఆహారముగా ఆయెను. 41

మూ. సముత్థానే చ తద్రూపం కర్తుకామం సమీక్ష్య తమ్,
ఉత్స్మయిత్వా తు భగవాన్ వాతాపిమిద మబ్రవీత్. 42

ప్ర. అ. సముత్థానే = తిరిగి లేచుట విషయమై, తత్ = ఆ, రూపమ్ = రూపమును, కర్తుకామమ్ = చేయుటకు కోరిక గల; తమ్ = ఆ, వాతాపిమ్ = వాతాపిని, సమీక్ష్య = చూచి, భగవాన్ = పూజ్యుడైన అగస్త్యుడు, ఉత్స్మయిత్వా = నవ్వి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పూజ్యుడైన ఆ అగస్త్యుడు, ఆ వాతాపి మరల తన రూపము ధరించి లేచుటకై ప్రయత్నము చేయుచున్నట్లు చూచి, నవ్వుచు ఇట్లు పలికెను. 42

మూ. త్వయాఽవిగణ్య వాతాపే పరిభూతాః స్వతేజసా,
జీవలోకే ద్విజశ్రేష్ఠాస్తస్మాదసి జరాం గతః. 43

ప్ర. అ. వాతాపే = వాతాపీ! జీవలోకే = ఈ భూలోకమునందు, ద్విజ శ్రేష్ఠాః = శ్రేష్ఠులైన బ్రాహ్మణులు, త్వయా = నీచేత, అవిగణ్య = లెక్క చేయక, స్వతేజసా = తన బలముచేత, పరిభూతాః = తిరస్కరింపబడినారు. తస్మాత్ = ఆ కారణమువలన, జరాం గతః = జీర్ణించినవాడవు, అసి = అయితివి.

తా. వాతాపీ నీవు ఈ లోకములోని ఎందరో ఉత్తమబ్రాహ్మణులను, లెక్కచేయక, నీ బలముచేత అవమానించి చంపితివి. అందుచేతనే నీవిప్పుడు జీర్ణమైపోవుచున్నావు. 43

మూ. ఏవం తన్న భవేద్రక్షోవాతాపిరివ లక్ష్మణ
మద్విధం యోఽతిమన్యేత ధర్మనిత్యం జితేన్ద్రియమ్.44
భవేద్ధతోఽయం వాతాపిరగస్త్యేనేవ మా గతః.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! ఏవమ్ = ఇట్లు, వాతాపిరివ = వాతాపి వలె, తత్ = ఆ, రక్షః = రాక్షసుడు, న భవేత్ = ఉండడు. యః = ఏ రాక్షసుడు, ధర్మనిత్యమ్=ధర్మమునందు నిత్యము ప్రవర్తించువాడు, జితేన్ద్రియమ్= జితేంద్రియుడు అయిన, మద్విధమ్=నావంటివానిని, అవమన్యేత=ఎదిరించునో, అయమ్ = అట్టి ఈ రాక్షసుడు, మా=నన్ను, గతః=పొందినవాడై, అగస్త్యేన= అగస్త్యునిచేత, వాతాపిరివ = వాతాపి వలె, హతః = చంపబడినవాడు, భవేత్= అగును.

తా. లక్ష్మణా! ఆ రాక్షసుడు కూడ వాతాపి వలె, ఇంక ఉండడు. నిత్యము ధర్మపరాయణుడు, జితేంద్రియుడు అయిన నావంటివానిని ఎదిరించి ఈ రాక్షసుడు నామీదకు వచ్చినచో, అగస్త్యుని చేతిలో వాతాపి మరణించి నట్లు మరణించగలడు. 44

మూ. ఇహ త్వం భవ సంనద్ధో యన్త్రితో రక్ష మైథిలీమ్, 45
అస్యామాయత్తమస్మాకం యత్కృత్యం రఘునన్దన.

ప్ర. అ. రఘునన్దన = లక్ష్మణా! త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడ, సంనద్ధః = ఆయుధములుధరించి సిద్ధముగా ఉన్నవాడవు, భవ = అగుము.

యన్త్రితః = ఏకాగ్రచిత్తుడవై, మైథిలీమ్ = సీతను, రక్ష = రక్షించుము. అస్మాకమ్ = మనయొక్క, యత్ = ఏ, కృత్యమ్ = కృత్యము కలదో అది, అస్యామ్ = ఈమెయందు, ఆయత్తమ్ = అధీనమై ఉన్నది.

తా. లక్ష్మణా! నీవు ఆయుధములు ధరించి, సావధానచిత్తముతో సీతను రక్షించుము. మన కార్యము లన్నీ ఈమెమీదనే ఆధారపడి ఉన్నవి.

వి. ఈ శ్లోకములోని ఉత్తరార్ధం భావం ఏమిటో అస్పష్టంగా ఉన్నది. "మనము వచ్చిన రావణసంహారకార్యము ఈమెపై ఆధారపడి ఉన్నది" అని విశేషార్థమని వ్యాఖ్యాతలు వ్రాసినారు. విశేషార్థం మాట ఎలా గున్నా మామూలుగా పైకి చెప్పవలసిన భావం ఉండాలి కదా? అదేమిటి? ఈ విశేషార్థం కూడా అసంగతమే. "మన పని" పూర్తికావాలంటే సీతను లక్ష్మణుడు రక్షించకూడదు కదా? ప్రాచ్యప్రతిలో ఈ శ్లోకార్ధము లేదు. 45

మూ. అహమేనం వధిష్యామి గ్రహీష్యామ్యపి వా మృగమ్, 46
యావద్గచ్ఛామి సౌమిత్రే మృగమానయితుం ద్రుతమ్.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! అహమ్ = నేను, ఏనమ్ = ఈ, మృగమ్ = మృగమును, వధిష్యామి = చంపగలను. అపి వా = లేక, గ్రహీష్యామి = గ్రహించగలను. మృగమ్ = మృగమును, ఆనయితుమ్ = తీసికొనివచ్చుటకు, ద్రుతమ్ = శీఘ్రముగా, యావద్గచ్ఛామి = వెళ్ళెదను.

తా. లక్ష్మణా! నే నీ మృగమును పట్టుకొనెదను, లేదా చంపివేసెదను. ఈ మృగమును తీసికొనివచ్చుటకై శీఘ్రముగా వెళ్లెదను. 46

మూ. పశ్య లక్ష్మణ వైదేహీం మృగత్వచి గతస్పృహామ్, 47
త్వచా ప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! మృగత్వచి = మృగచర్మమునందు, గతస్పృహామ్ = పొందబడిన ఆసక్తి గల, వైదేహీమ్ = సీతను, పశ్య = చూడుము. ప్రధానయా = ప్రధానమైన, త్వచా = చర్మచేత, ఏషః మృగః = ఈ మృగము, అద్య = ఇప్పుడు, న భవిష్యతి = ఉండదు.

తా. లక్ష్మణా! సీతకు ఈ మృగము చర్మమీద ఎంత ఆసక్తి ఉన్నదో చూడుము. దీని చర్మమే ప్రధానమైనది గాన ఈ మృగము ఇంక జీవించదు. 47

మూ. అప్రమత్తేన తే భావ్యమాశ్రమస్థేన సీతయా, 48
యావత్పృషతమేకేన సాయకేన నిహన్మ్యహమ్,
హత్వైతచ్చర్మ చాదాయ శీఘ్రమేష్యామి లక్ష్మణ. 49

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా: ఆశ్రమస్థేన = ఆశ్రమములో ఉన్న, తే = నీకు (నీచేత) సీతయా = సీతతో కూడ, అప్రమత్తేన = ఏమరిపాటు లేకుండ, భావ్యమ్ = కావలెను. పృషతమ్ = ఈచుక్కల జింకను, ఏకేన = ఒక్క, బాణేన = బాణముచేత, అహమ్ = నేను, యావత్ నిహన్మి = చంపెదను. హత్వా = చంపి, ఏతచ్చర్మ = దీని చర్మను, ఆదాయ = గ్రహించి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఏష్యామి = రాగలను.

తా. నేనీ మృగమును ఒక్క బాణముచేత చంపి దీని చర్మను తీసికొని శీఘ్రముగా వచ్చెదను. అంతవరకు ఆశ్రమములో నీవు, సీతా కూడ ఏమరిపాటు లేకుండా ఉండవలెను. 49

మూ. ప్రదక్షిణేనాతిబలేన పక్షిణా
జటాయుషా చాతిబలేన లక్ష్మణ,
భవాప్రమత్తః పరిగృహ్య మైథిలీం
ప్రతిక్షణం సర్వత ఏవ శఙ్కితః. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా: మైథిలీమ్ = సీతను, పరిగృహ్య = తీసికొని, (దగ్గర ఉంచుకొని), ప్రతిక్షణమ్ = ప్రతీక్షణమునందు, సర్వతః ఏవ = అంతటినుండీ, శఙ్కితః = శంకించుచున్నవాడవై, ప్రదక్షిణేన = చాల సమర్థుడు, అతిబలేన = చాల బలము కలవాడు, బుద్ధిమతా = బుద్ధిమంతుడుఅయిన, పక్షిణా = పక్షియైన, జటాయుషా = జటాయువుతోకూడ, అప్రమత్తః = ఏమరిపాటు లేని వాడవై, భవ = ఉండుము.

తా. నీవు సీతను ఇక్కడనే ఉంచుకొని, అపాయము ఏ వైపునుండైనా రావచ్చు నని శంకించుచు, చాల సమర్థుడు, మహాబలశాలి, బుద్ధిమంతుడు అయిన జటాయువుతో కలిసి ఏమరిపాటు లేకుండా ఉండుము.

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో నలుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుశ్చత్వారింశః సర్గః

*[రాముడు మారీచుని చంపుట, మారీచుడు సీతాలక్ష్మణుల పేర్లు పెట్టి అరచుట చూచి రాముడు చింతాక్రాంతు డగుట.]*

మూ. తథా తు తం సమాదిశ్య భ్రాతరం రఘునన్దనః,
బబన్ధాసిం మహాతేజా జామ్బూనదమయత్సరుమ్. 1

ప్ర అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రఘునన్దనః = రాముడు, భ్రాతరమ్ = సోదరుడైన, తమ్ = ఆ లక్ష్మణుణ్ణి, తథా = అట్లు, సమాదిశ్య = ఆజ్ఞాపించి, జామ్బూనదమయత్సరుమ్ = బంగారు పిడి గల, అసిమ్ = ఖడ్గమును, బబన్ధ = కట్టెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ రాముడు సోదరుడైన ఆ లక్ష్మణుణ్ణి ఈ విధముగా ఆజ్ఞాపించి బంగారు పిడి గల ఖడ్గమును నడుమునకు కట్టుకొనెను. 1

మూ. తతస్త్రివినతం చాపమాదాయాత్మవిభూషణమ్,
ఆబధ్య చ కలాపౌ ద్వౌ జగామోదగ్రవిక్రమః. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఉదగ్రవిక్రమః = అధికమైన పరాక్రమము గల రాముడు, త్రివినతమ్ = మూడు చోట్ల వంగిన, ఆత్మవిభూషణమ్ = తనకు అలంకారమైన, చాపమ్ = ధనస్సును, ఆదాయ = గ్రహించి, ద్వౌ = రెండు, కలాపౌ = అంబుల పొదులను, ఆబధ్య = కట్టి, జగామ = వెళ్ళెను.

తా. పిమ్మట, అధికమైన పరాక్రమము గల ఆ రాముడు తన అలంకారము వంటి, మూడు వంపు లున్న ధనస్సును గ్రహించి, రెండు అంబుల పొదులను కట్టుకొని బయలుదేరెను. 2

మూ. తం వఞ్చయానో రాజేన్ద్రమాపతన్తం నిరీక్ష్య వై
బభూవాన్తర్హితస్త్రాసాత్పునః సందర్శనేఽభవత్ 3
బద్ధాసిర్ధనురాదాయ ప్రదుద్రావ యతో మృగః.

ప్ర. అ. (మృగము), ఆపతన్తమ్=శీఘ్రముగా వచ్చుచున్న, రాజేన్ద్రమ్=రాజులలో శ్రేష్ఠుడైన, తమ్=ఆ రాముణ్ణి, నిరీక్ష్య= చూచి, వఞ్చయానః=అతనిని వంచించుచు, త్రాసాత్=భయమువలన, అన్తర్హితః=అంతర్ధానము చెందినది, బభూవ=ఆయెను. పునః=మరల, సందర్శనే=చూపునందు, అభవత్=ఉండెను. (రాముడు), బద్ధాసిః=కట్టబడిన ఖడ్గము కలవాడై, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి, మృగః=మృగము, యతః = ఎటువైపున ఉన్నదో అటువైపు, ప్రదుద్రావ=పరుగెత్తెను.

తా. తన వైపు శీఘ్రముగా వచ్చుచున్న రాజాధిరాజైన ఆ రాముణ్ణి చూచి భయపడి ఆ మృగము అతనిని వంచించుచు, కనబడకుండపోయెను. మరల కనబడెను. రాముడు ఖడ్గము బంధించి ధనస్సు ధరించి మృగ మున్న వైపునకు శీఘ్రముగా వెళ్లెను. 3

మూ. తం స్మ పశ్యతి రూపేణ ద్యోతమానమివాగ్రతః 4
అవేక్ష్యావేక్ష్య ధావన్తం ధనుష్పాణిర్మహావనే,
అతివృత్తమిషోః పాతాల్లోభయానం కదాచన 5

శఙ్కితం తు సముద్భ్రాన్తముత్పతన్తమివామ్బరే
దృశ్యమానమదృశ్యం చ వనోద్దేశేషు కేషు చిత్. 6
ఛిన్నాభ్రైరివ సంవీతం శారదం చన్ద్రమణ్డలమ్.

ప్ర. అ. ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు గల రాముడు, అవేక్ష్య అవేక్ష్య=తన వైపు చూచి చూచి, మహావనే=మహారణ్యములోనికి, ధావన్తమ్=పరుగెత్తుచున్న, తమ్=దానిని, రూపేణ=రూపముతో, అగ్రతః = ఎదుట, పశ్యతి స్మ=చూచుచుండెను. కదాచన=ఒకప్పుడు, ఇషోః=బాణముయొక్క, పాతాత్=పాతమునుండి, అతివృత్తమ్=దాటిపోయినదై, లోభయానమ్=ఆశ కల్గించుచున్న (దానిని చూచెను). శఙ్కితమ్=భయపడినదై, సముద్భ్రాన్తమ్=

కంగారు పడుచున్నదై, అమ్బరే = ఆకాశమునందు, ఉత్పతన్తమివ = ఎగురుచున్నది వలె ఉన్న ఆ మృగమును చూచెను. ఛిన్నాభ్రైః = ముక్కలు ముక్కలుగా ఉన్న మేఘములచేత, సంవీతమ్ = ఆవరింపబడినదై, శారదమ్ = శరత్కాలసంబంధమైన, చన్ద్రమణ్డలమ్ ఇవ = చంద్రమండలము వలె, కేషుచిత్ = కొన్ని, వనోద్దేశేషు = వనప్రదేశములందు, దృశ్యమానమ్ = కనబడుచున్నది, అదృశ్యం చ = కనబడకున్నదీ అయిన ఆ మృగమును చూచెను.

తా. ధనస్సును ధరించిన రామునకు, ఆ మృగము తనను చూచి చూచి, అరణ్యములోనికి పారిపోవుచున్నట్లు, మరు క్షణములో అది తన ముందటనే అద్భుత రూపముతో ప్రకాశించుచున్నట్లు కనబడెను. మరొక క్షణములో తనను లోభపెట్టుచు బాణము పడకుండా తప్పించుకొనుచున్నట్లు కనబడెను. మరొక క్షణమున అది భయపడి కంగారుతో ఆకాశములోనికి ఎగురుచున్నట్లు కనబడెను. మరొక క్షణమున ఆ మృగము మేఘము ముక్కల వెనుకనున్న శరత్కాలచంద్రమండలము వలె కొన్ని వనప్రాంతములయందు కనబడి కనబడకుండా ఉండెను. 4,5,6

మూ. ముహూర్తాదేవ దదృశే ముహుర్దూరాత్ప్రకాశతే, 7
దర్శనాదర్శనాదేవ సోఽపాకర్షత రాఘవమ్,
సుదూరమాశ్రమస్యాస్య మారీచో మృగతాం గతః. 8

ప్ర. అ. మృగతామ్ = మృగత్వమును, గతః = పొందిన, సః మారీచః = ఆ మారీచుడు, ముహూర్తాదేవ = ఒక ముహూర్తమునందే, దదృశే = చూడబడెను. ముహూర్తాత్ = మరొక ముహూర్తమున, దూరాత్ = దూరమునుండి, ప్రకాశతే = ప్రకాశించుచుండెను. ఈ విధముగా అతడు ఒక మాటు కనబడుచు, మరొక మాటు కనబడక, రాముణ్ణి ఆశ్రమమునుండి చాలదూరము తీసికొనిపోయెను.

తా. మృగరూపము ధరించిన ఆ మారీచుడు, ఒక క్షణములో దగ్గరగా కనబడి, మరుక్షణములో దూరమునందు ప్రకాశించెను. ఈ విధముగ ఒక మాటు కనబడుచు, ఒక మాటు కనబడక రాముణ్ణి ఆశ్రమమునుండి చాలా దూరము తీసికొనిపోయెను. 7, 8

మూ. ఆసీత్ క్రుద్ధస్తు కాకుత్స్థో వివశస్తేన మోహితః,
అథావతస్థే సుశ్రాన్తశ్ఛాయామాశ్రిత్య శాద్వలే. 9

ప్ర. అ. తేన = దానిచేత, మోహితః = వంచింపబడిన, కాకుత్స్థః = రాముడు, వివశః = వివశుడై, క్రుద్ధః = కోపగించినవాడు, ఆసీత్ = ఆయెను. అథ = అటుపిమ్మట, సుశ్రాన్తః = చాల అలసిపోయినవాడై, ఛాయామ్ = నీడను, ఆశ్రిత్య = ఆశ్రయించి, శాద్వలే = పచ్చికబీడుమీద, అవతస్థే = ఉండెను.

తా. ఈ విధముగా ఆ మృగము వంచించుటచే ఏమీ చేయజాలని రామునకు కోపము వచ్చెను. పిదప అతడు చాల అలసిపోయి, నీడలో పచ్చికబీడుమీద కూర్చుండెను. 9

మూ. స తమున్మాదయామాస మృగరూపో నిశాచరః,
మృగైః పరివృతో వన్యైరదూరాత్ప్రత్యదృశ్యత. 10

ప్ర. అ. మృగరూపః = మృగరూపము గల, సః నిశాచరః = ఆ రాక్షసుడు, తమ్ = ఆ రాముణ్ణి, ఉన్మాదయామాస = భ్రాంతచిత్తునిగా చేసెను. వన్యైః = వనమునకు సంబంధించిన, మృగైః = మృగములచేత, పరివృతః = చుట్టు వారుకొనబడినదై, అదూరాత్ = సమీపమునందే, అదృశ్యత = చూడబడెను.

తా. మృగరూపము ధరించిన ఆ రాక్షసుడు ఈ విధముగ రామునకు చిత్త విభ్రాంతి కలిగించెను. ఇంతలో ఆ మృగము కొన్ని వన్యమృగములతో కలిసి సమీపమునందే కనబడెను. 10

మూ. గ్రహీతుకామం దృష్ట్వైనం పునరేవాభ్యధావత,
తత్క్షణాదేవ సంత్రాసాత్పునరన్తర్హితోఽభవత్. 11

ప్ర. అ. గ్రహీతుకామమ్ = పట్టుకొనుటకు కోరిక గల, ఏనమ్ = ఈ రాముణ్ణి, దృష్ట్వా = చూచి, పునరేవ = తిరిగి, అభ్యధావత = దగ్గరగా పరుగెత్తి కొని వచ్చెను. తత్క్షణాదేవ = వెంటనే, పునరేవ = మరల, త్రాసాత్ = భయము వలన, అన్తర్హితః = అంతర్ధానము చెందినది, అభవత్ = ఆయెను.

తా. ఆ రాముడు తనను పట్టుకొనకోరుచున్నాడని చూచి, ఆతనికి దొరక

నున్నదా అన్నట్లు ఆతని వైపు పరుగెత్తి, మరల వెంటనే భయముతో కనబడ కుండ పోయెను. 11

మూ. పునరేవ తతో దూరాద్వృక్షషణ్డాద్వినిఃసృతమ్,
దృష్ట్వా రామో మహాతేజాస్తం హన్తుం కృతనిశ్చయః. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, పునరేవ = మరల, దూరాత్ = దూరమునందున్న, వృక్షషణ్డాత్ = వృక్షముల సమూహమునుండి, వినిస్సృతమ్ = బైటకు వచ్చిన, తమ్ = ఆ మృగమును, దృష్ట్వా = చూచి, హన్తుమ్ = చంపుటకు, కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము కలవాడు (ఆయెను).

తా. మహాతేజఃశాలియైన రాముడు మరల దూరముగా ఉన్న చెట్ల గుంపు నుండి బైటకు వచ్చుచున్న ఆ మృగమును చూచి దానిని చంపుటకు నిశ్చయించు కొనెను. 12

మూ. భూయస్తు శరముద్ధృత్య కుపితస్తత్ర రాఘవః,
సూర్యరశ్మిప్రతీకాశం జ్వలన్తమరిమర్దనః. 13

సంధాయ సుదృఢే చాపే వికృష్య బలవద్బలీ,
తమేవమృగముద్దిశ్య శ్వసన్తమివ పన్నగమ్. 14
ముమోచ జ్వలితం దీప్తమస్త్రం బ్రహ్మవినిర్మితమ్.

ప్ర. అ. తత్ర = ఆ సమయమునందు, భూయః = మిక్కిలి, కుపితః = కోపించిన, అరిమర్దనః = శత్రుసంహారకుడైన, బలీ = బలశాలియైన, రాఘవః = రాముడు, సూర్యరశ్మిప్రతీకాశమ్ = సూర్యకిరణముతో సమానమైన, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, శరమ్ = బాణమును, ఉద్ధృత్య = పైకి తీసి, సుదృఢే = చాలదృఢమైన, చాపే = ధనస్సునందు, సంధాయ = సంధించి, బలవత్ = బలముగా, వికృష్య = లాగి, శ్వసన్తమ్ = బుసలుకొట్టుచున్న, పన్నగమ్ ఇవ = సర్పము వలెఉన్న, జ్వలితమ్ = మండుచున్న, దీప్తమ్ = ప్రకాశించుచున్న, బ్రహ్మనిర్మితమ్ = బ్రహ్మచేత నిర్మించబడిన, అస్త్రమ్ = అస్త్రమును, తమ్ = ఆ, మృగమేవ = మగమునే, ఉద్దిశ్య = ఉద్దేశించి, ముమోచ = విడచెను.

తా. అప్పుడు, శత్రుసంహారకుడు, బలశాలి అయిన రాముడు చాల కోపించినవాడై, సూర్యకిరణము వలె ప్రకాశించుచున్న బాణమును పైకి తీసి, దానిని చాల దృఢమైన ధనస్సుపై ఎక్కుపెట్టి, గట్టిగా లాగి, బుసలుకొట్టుచున్న సర్పము వలె ఉన్న, ప్రజ్వలించుచు ప్రకాశించుచున్న బ్రహ్మాస్త్రమును ఆ లేడిపై ప్రయోగించెను. 13, 14

మూ. శరీరం మృగరూపస్య వినిర్భిద్య శరోత్తమః, 15
మారీచస్యైవ హృదయం బిభేదాశనిసన్నిభః.

ప్ర. అ. అశనిసన్నిభః = వజ్రాయుధముతో సమానమైన, శరోత్తమః = శ్రేష్ఠమైన ఆ బాణము, మృగరూపస్య = మృగరూపముయొక్క, శరీరమ్ = శరీరమును, వినిర్భిద్య = భేదించి, మారీచస్య = మారీచునియొక్క, హృదయమేవ = హృదయమునే, బిభేద = భేదించెను.

తా. వజ్రాయుధము వంటి ఆ శ్రేష్ఠమైన బాణము మృగరూపములో ఉన్న ఆ శరీరమును భేదించి మారీచుని హృదయమునే బ్రద్దలుకొట్టెను. 15

మూ. తాలమాత్రమథోత్ప్లుత్య న్యపతత్స శరాతురః, 16
వినదన్ భైరవం నాదం ధరణ్యామల్పజీవితః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సః = మారీచుడు, శరాతురః = బాణముచేత పీడితుడై, అల్పజీవితః = అల్పమైన జీవితము కలవాడై, భైరవం నాదమ్ = భయంకరమైన ధ్వనిని, వినదన్ = ధ్వనిచేయుచు, తాలమాత్రమ్ = తాటిచెట్టు ఎత్తు, ఉత్ప్లుత్య = ఎగిరి, ధరణ్యామ్ = భూమిమీద, న్యపతత్ = పడెను.

తా. ఆ మారీచుడు బాణముచేత పీడితుడై, అల్పమైన జీవితముతో, తాటిచెట్టు ఎత్తు ఎగిరి, భయంకరముగా ధ్వని చేయుచు నేలమీద పడెను. 16

మూ. మ్రియమాణస్తు మారీచో జహౌ తాం కృత్రిమాం తనుమ్,
స్మృత్వా తద్వచనం రక్షో దధ్యౌ కేన తు లక్ష్మణమ్,
ఇహ ప్రస్థాపయేత్సీతా శూన్యే తాం రావణో హరేత్. 18

ప్ర. అ. మారీచః = మారీచుడు, మ్రియమాణః = మరణించుచు, కృత్రి

మామ్ = కృత్రిమమైన, తామ్ = ఆ, తనుమ్ = శరీరమును, జహౌ = విడచెను. రక్షః = మారీచుడు, తద్వచనమ్ = ఆ రావణుని వచనమును, స్మృత్వా = స్మరించి, దధ్యౌ = ఆలోచించెను. సీతా = సీత, కేన = దేనిచేత, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ఇహ = ఇచటికి, ప్రస్థాపయేత్ = పంపివేయును. శూన్యే = శూన్యప్రదేశమునందున్న, తామ్ = ఆమెను, రావణః = రావణుడు, హరేత్ = హరించును.

తా. మారీచుడు మరణించుచు కృత్రిమమైన ఆ మృగరూపమును విడచి వేసెను. ఆతడు రావణుని మాటలు స్మరించుచు, ''నేను ఇపుడేమి చేసిన సీత లక్ష్మణుని ఇక్కడికి పంపివేయును? శూన్యప్రదేశమునం దున్న ఆమెను రావణుడు ఎట్లు హరించుటకు శక్య మగును?'' అని ఆలోచించెను. 17, 18

మూ. స ప్రాప్తకాలమాజ్ఞాయ చకార చ తతః స్వనమ్,
సదృశం రాఘవస్యేహ హా సీతే లక్ష్మణేతి చ. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ మారీచుడు, ప్రాప్తకాలమ్ = సమయమునకు తగిన ఉపాయమును, ఆజ్ఞాయ = తెలుసుకొని, ఇహ = ఇక్కడ రాఘవస్య = రామునకు, సదృశమ్=తగిన (పోలిన), హా సీతే = అయ్యో! సీతా!, లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! ఇతిచ=అని, స్వనమ్=ధ్వనిని, చకార=చేసెను.

తా. పిమ్మట ఆ మారీచుడు ఆ సమయమునకు తగిన ఉపాయమును ఆలోచించి, రాముని కంఠస్వరముతో సమానమైన స్వరముతో, ''అయ్యో! సీతా, అయ్యో! లక్ష్మణా!" అని అరచెను. 19

మూ. తేన మర్మణి నిర్విద్ధం శరేణానుపమేన హి,
మృగరూపం తు తత్త్యక్త్వా రాక్షసం రూపమాస్థితః. 20
చక్రే స సుమహాకాయం మారీచో జీవితం త్యజన్.

ప్ర. అ. సః మారీచః = ఆ మారీచుడు, తేన = ఆరామునిచేత, అనుపమేన = సాటిలేని, శరేణ = బాణముచేత, మర్మణి = మర్మప్రదేశమునందు, నిర్విద్ధమ్ = కొట్టబడిన, తత్ = ఆ, మృగరూపమ్ = మృగరూపమును, త్యక్త్వా = విడచి, రాక్షసం రూపమ్ = రాక్షసరూపమును, ఆస్థితః = గ్రహించినవాడై,

జీవితమ్ = జీవితమును, త్యజన్ = విడచుచు, సుమహాకాయమ్ = చాల పెద్ద శరీరమును, చక్రే = చేసెను.

తా. ఆ రాముడు సాటిలేని బాణముచేత మర్మస్థానమునందు కొట్టగా, మారీచుడు, ప్రాణములను విడచుచు, మృగరూపమును విడచి రాక్షసరూపము ధరించి, చాల పెద్ద శరీరముతో ఉండెను. 20

మూ. తం దృష్ట్వా పతితం భూమౌ రాక్షసం భీమదర్శనమ్,
రామో రుధిరసిక్తాఙ్గం చేష్టమానం మహీతలే
జగామ మనసా సీతాం లక్ష్మణస్య వచః స్మరన్. 22

ప్ర. అ. రామః = రాముడు, భూమౌ = నేలమీద, పతితమ్ = పడిన, భీమదర్శనమ్ = భయంకరమైన దర్శనము గల, రుధిరసిక్తాఙ్గమ్ = రక్తముచేత తడపబడిన శరీరము గల, మహీతలే = భూమియందు, చేష్టమానమ్ = దొర్లుచున్న, తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, దృష్ట్వా = చూచి, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, వచః = వచనమును, స్మరన్ = స్మరించుచు, మనసా = మనస్సుతో సీతామ్ = సీతను, జగామ = పొందెను.

తా. చూచుటకు భయంకరుడుగా ఉన్న ఆ రాక్షసుడు నేలమీదపడి, రక్తముచే తడిసిన శరీరముతో నేలపై దొర్లుచుండగా చూచి రాముడు లక్ష్మణుని మాటలు స్మరించుచు, సీతను గూర్చి ఆలోచించుటకు ప్రారంభించెను. 21,22

మూ. మారీచస్య తు మాయైషా పూర్వోక్తం లక్ష్మణేన తు,
తత్తథా హ్యభవచ్చాద్య మారీచోఽయం మయా హతః.

ప్ర. అ. ఏషా = ఇది. మారీచస్య = మారీచునియొక్క, మాయా = = మాయ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, పూర్వోక్తమ్ = పూర్వము చెప్పబడిన, తత్ = అది, తథా = అట్లే, అభవత్ హి = అయినది కదా! మయా = నాచేత, హతః = చంపబడిన, అయమ్ = ఇతడు, మారీచః = మారీచుడు.

తా. "ఇది మారీచుని మాయయే, లక్ష్మణుడు ముందుగా ఏది చెప్పినాడో అదే సత్యమైనది. నేను చంపినవాడు మారీచుడే''. 23

మూ. హా సీతే లక్ష్మణేత్యేవమాక్రుశ్య చ మహాస్వరమ్,
మమార రాక్షసః సోఽయం శ్రుత్వా సీతా కథం భవేత్.
లక్ష్మణశ్చ మహాబాహుః కామవస్థాం గమిష్యతి,
ఇతి సంచిన్త్య ధర్మాత్మా రామో హృష్టతనూరుహః.

ప్ర. అ. సః = అట్టి, అయం రాక్షసః = ఈ రాక్షసుడు, హాసీతే = అయ్యో! సీతా!, లక్ష్మణ = అయ్యో లక్ష్మణా! ఇత్యేవమ్ = ఇట్లు, మహాస్వరమ్ = గొప్ప స్వరము కలుగునట్లుగా, ఆక్రుశ్య = అరచి, మమార = మరణించెను. శ్రుత్వా = ఇదివిని, సీతా = సీత, కథమ్ = ఎట్లు, భవేత్ = అగునో! మహాబాహుః = గొప్ప బాహువులు గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, కామ్ = ఏ, అవస్థామ్ = అవస్థను, గమిష్యతి = పొందగలడో! ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామః = రాముడు, ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, హృష్టతనూరూహః = గగుర్పొడిచిన రోమములు కలవాడు, (ఆయెను).

తా. "ఈ రాక్షసుడు "అయ్యో! సీతా!, అయ్యో! లక్ష్మణా!" అని గట్టిగా అరచి మరణించినాడు. ఇది విని సీత ఏమగునో! మహాబాహువైన లక్ష్మణుడు కూడ ఏ అవస్థ పొందునో" ధర్మాత్ముడైన రామునకు ఈ ఆలోచన కలగగానే అతని ఒడలు జలదరించెను. 24, 25

మూ. తత్ర రామం భయం తీవ్రమావివేశ విషాదజమ్,
రాక్షసం మృగరూపం తం హత్వా శ్రుత్వా చ తత్స్వరమ్.

ప్ర. అ. మృగరూపమ్ = మృగరూపము గల, రాక్షసమ్ = రాక్షసుని, హత్వా = చంపి, తత్స్వరమ్ = వానిస్వరమును, శ్రుత్వాచ = విని, తత్ర = అక్కడ, రామమ్ = రాముణ్ణి, విషాదజమ్ = దుఃఖమువలన కలిగిన, తీవ్రమ్ = తీవ్రమైన, భయమ్ = భయము, ఆవివేశ = ఆవేశించెను.

తా. అక్కడ ఆ మృగమును చంపి, దాని స్వరమును విన్న రామునకు దుఃఖమువలన జనించిన గొప్ప భయము కలిగెను. 26

మూ. నిహత్య పృషతం చాన్యం మాంసమాదాయ రాఘవః,
త్వరమాణో జనస్థానం ససారాభిముఖస్తదా. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, రాఘవః = రాముడు, అన్యమ్ = మరియొక, పృషతమ్ = చుక్కల జింకను, నిహత్య = చంపి, మాంసమ్ = మాంసమును, ఆదాయ = గ్రహించి, త్వరమాణః = తొందరపడుచు, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, అభిముఖః = అభిముఖుడై, ససార = వెళ్ళెను.

తా. అప్పుడు రాముడు మరొక చుక్కల లేడిని చంపి, దాని మాంసము తీసికొని, తొందరపడుచు, జనస్థానము వైపు వెళ్లెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్య కాండలో నలుబది నాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చచత్వారింశః సర్గః

[పరుషవాక్యములు పలికి సీత పంపగా లక్ష్మణుడు రామునివద్దకు వెళ్ళుట]

మూ. ఆర్తస్వరం తు తం భర్తుర్విజ్ఞాయ సదృశం వనే,
ఉవాచ లక్ష్మణం సీతా గచ్ఛ జానీహి రాఘవమ్. 1

ప్ర. అ. సీతా = సీత, వనే = వనమునందు, భర్తుః = భర్తయొక్క స్వరమునకు, సదృశమ్ = సమానమైన, తమ్ = ఆ, ఆర్తస్వరమ్ = దీనస్వరమును, విజ్ఞాయ = గుర్తించి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను. గచ్ఛ = వెళ్ళుము. రాఘవమ్ = రాముని గూర్చి, జానీహి = తెలిసికొనుము.

తా. వనమునుండి వినవచ్చుచున్న తన భర్త స్వరమువంటి ఆ దీనస్వరమును గుర్తించి సీత లక్ష్మణునితో ''వెళ్ళి రాముని క్షేమైనదో తెలిసికొనుము'' అని పలికెను. 1

మూ. న హి మే హృదయం స్థానే జీవితం వావతిష్ఠతి,
క్రోశతః పరమార్తస్య శ్రుతః శబ్దో మయా భృశమ్, 2
ఆక్రన్దమానం తు వనే భ్రాతరం త్రాతుమర్హసి.

ప్ర. అ. భృశమ్ = మిక్కిలి, క్రోశతః = అరచుచున్నవాడు, పరమార్తస్య = మిక్కిలి దుఃఖితుడు అయిన రామునియొక్క, శబ్దః = స్వరము, మయా = నాచేత, శ్రుతః = వినబడినది. మే = నాయొక్క, హృదయమ్ = హృదయము గాని, జీవితం వా = జీవితము కాని, స్థానే = స్థానమునందు, న అవతిష్ఠతిహి = ఉండుటలేదు. వనే = వనమునందు, ఆక్రన్దమానమ్ = అరచుచున్న, భ్రాతరమ్ = సోదరుని, త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. చాల దుఃఖముతో బిగ్గరగా అరచుచున్న రాముని అరపు విని నా

హృదయము కాని, ప్రాణములు కాని నిలచుటలేదు. అరణ్యములో అరచుచున్న నీ సోదరుని రక్షింపుము. 2

మూ. తం క్షిప్రమభిధావ త్వం భ్రాతరం శరణైషిణమ్, 3
రక్షసాం వశమాపన్నం సింహానామివ గోవృషమ్.

ప్ర. అ. సింహానామ్ = సింహములకు వశమైన, గోవృషమివ = ఎద్దును వలె, రక్షసామ్ = రాక్షసులకు, వశమ్ = వశమును, ఆపన్నమ్ = పొందిన, శరణైషిణమ్ = రక్షణమును కోరుచున్న, తం భ్రాతరమ్ = ఆ సోదరుని గూర్చి, క్షిప్రమ్ = శీఘ్రముగా, త్వమ్ = నీవు, అభిధావ = పరుగెత్తుము.

తా. ఎద్దు సింహాలకు వశమైపోయి నట్లు రాక్షసులకు వశుడైపోయి నీ సోదరుడు, రక్షణ కోరుచున్నాడు. ఆతనివద్దకు శీఘ్రముగా వెళ్లుము. 3

మూ. న జగామ తథోక్తస్తు భ్రాతురాజ్ఞాయ శాసనమ్, 4
తమువాచ తతస్తత్ర కుపితా జనకాత్మజా.

ప్ర. అ. తథా = ఆ విధముగా, ఉక్తస్తు = పలకబడినవాడైనను, భ్రాతుః = సోదరునియొక్క, శాసనమ్ = ఆజ్ఞను, ఆజ్ఞాయ = తెలిసికొని, న జగామ = వెళ్లలేదు. తతః = అటుపిమ్మట, కుపితా = కోపించిన, జనకాత్మజా = సీత, తత్ర = అక్కడ, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. సీత ఆ విధముగా చెప్పినను లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞను స్మరించుచు వెళ్లలేదు. అప్పుడు సీత కుపితురాలై ఇట్లు పలికెను. 4

మూ. సౌమిత్రే మిత్రరూపేణ భ్రాతుస్త్వమసి శత్రువత్, 5
యస్త్వమస్యామవస్థాయాం భ్రాతరం నాభిపత్స్యసే.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! యః = ఏ, త్వమ్ = నీవు, అస్యామ్ = ఈ, అవస్థాయామ్ = అవస్థయందు, భ్రాతరమ్ = సోదరుని, నాభిపత్స్యసే = పొందవో, అట్టి, త్వమ్ = నీవు, భ్రాతుః = నీ సోదరునికి, మిత్రరూపేణ = మిత్రముతో ఉన్న, శత్రువత్ = శత్రువు వలె, అసి = అయి ఉన్నావు.

తా. లక్ష్మణా! ఇట్టి కష్టావస్థలో కూడ నీవు నీ సోదరునికి సాహాయ్యము చేయుటకు వెళ్ళుటలేదు! నీవు రామునకు పైకి మిత్రుడు వలె కనబడే శత్రువు. 5

మూ. ఇచ్ఛసి త్వం వినశ్యన్తం రామం లక్ష్మణ మత్కృతే, 6
లోభాత్త్వం మత్కృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! త్వమ్ = నీవు, రామమ్ = రాముణ్ణి, వినశ్యన్తమ్ = నశించుచున్నవానినిగా, మత్కృతే = నానిమిత్తమై, ఇచ్ఛసి = కోరుచున్నావు. త్వమ్ = నీవు, మత్కృతే = నా నిమిత్తమై, లోభాత్ = ఆశవలన, రామమ్ = రాముణ్ణి, నానుగచ్ఛసి = అనుసరించుటలేదు. నూనమ్ = సత్యము.

తా. లక్ష్మణా! నీకు నాపై ఆసక్తి ఉండుటచేత, రాముడు నశించవలెనని కోరుకొనుచున్నావు. నామీద ఉన్న ఆశవలననే రామునివద్దకు వెళ్లుటలేదు. 6

మూ. వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే, 7
తేన తిష్ఠసి విశ్రబ్ధస్తమపశ్యన్ మహాద్యుతిమ్.

ప్ర. అ. తే = నీకు, వ్యసనమ్ = (రామునికి కలుగు) వ్యసనమే, ప్రియమ్ = ఇష్టమైన దని, మన్యే = తలచెదను. తే = నీకు, భ్రాతరి = సోదరునియందు, స్నేహః = స్నేహము, నాస్తి = లేదు. తేన = ఆ కారణముచేతనే, మహాద్యుతిమ్ = గొప్ప కాంతిగల, తమ్ = ఆ రాముణ్ణి, అపశ్యన్ = చూడనివాడవై, విశ్రబ్ధమ్ = నమ్మకముగా, తిష్ఠసి = ఉన్నావు.

తా. రామునకు కష్టము కలుగవలెననియే నీవు కోరుకొనుచున్నావు. నీకు సోదరునిపై ప్రేమ లేదు. అందుచేతనే మహాతేజఃశాలియైన ఆతడు కనబడకపోవుటచే నమ్మకముగా ఉన్నావు. 7

మూ. కిం హి సంశయమాపన్నే తస్మిన్నిహ మయా భవేత్, 8
కర్తవ్యమిహ తిష్ఠన్త్యా యత్ప్రధానస్త్వమాగతః.

ప్ర. అ. త్వమ్ = నీవు, యత్ప్రధానః = ఏ రాముడు ప్రధానుడుగా కలవాడవై, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావో, తస్మిన్ = ఆ రాముడు, సంశయమ్ = సంశయమును, ఆపన్నే = పొందినవాడగుచుండగా, ఇహ = ఇపుడు,

తిష్ఠన్త్యా = ఉన్న, మయా = నాతో, కిమ్ = ఏమి, కర్తవ్యమ్ = చేయదగినది, భవేత్ = ఉండును?

తా. ప్రధానముగా ఏ రామునికొరకై నీవు ఇక్కడికి వచ్చినావో ఆ రామునకు ప్రాణసంశయము ఏర్పడిన పిమ్మట ఇప్పుడు ఇక్కడ నున్న నాతో నీకు ప్రయోజన మేమి? అనగా నీకు రాముణ్ణి రక్షించుట ప్రధానకర్తవ్యము కాని, నన్ను రక్షించుట కాదు. 8

మూ. ఇతి బ్రువాణాం వైదేహీం బాష్పశోకపరిప్లుతామ్, 9
అబ్రవీల్లక్ష్మణస్త్రస్తాం సీతాం మృగవధూమివ.

ప్ర. అ. ఇతి = ఇట్లు, బ్రువాణామ్ = పలుకుచున్నది, బాష్పశోకపరిప్లుతామ్ = కన్నీళ్లతోను శోకముతోను నిండినది, త్రస్తామ్ = భయపడిన, మృగవధూమివ = ఆడలేడి వలె ఉన్నది, వైదేహీమ్ = విదేహరాజకుమారీ అయిన, సీతామ్ = సీతను గూర్చి, లక్ష్మణః = లక్ష్మణుడు, అబ్రవీత్ = పలికెను.

తా. విదేహరాజకుమారి యైన సీత కన్నీళ్లు కార్చుచు, దుఃఖాక్రాంతయై, ఆడలేడి వలె భయపడిపోయి, ఈ విధముగా పలుకుచుండగా లక్ష్మణుడు ఆమెతో ఇట్లనెను. 9

మూ. పన్నగాసురగన్ధర్వదేవమానుషరాక్షసైః, 10
అశక్యస్తవ వైదేహి భర్తా జేతుం న సంశయః.

ప్ర. అ. వైదేహి = సీతా! తవ = నీయొక్క, భర్తా = భర్త, పన్నగాసురగన్ధర్వదేవమానుషరాక్షసైః = పన్నగులచేత, అసురులచేత, గంధర్వులచేత, దేవతలచేత, మనుష్యులచేత, రాక్షసులచేత, జేతుమ్ = జయించుటకు, అశక్యః = శక్యమైనవాడు కాదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఓ! సీతా పన్నగులు గాని, అసురులు గాని, గంధర్వులు గాని, దేవతలు గాని, మానవులు గాని, రాక్షసులు గాని, నీ భర్తను జయించజాలరు. సందేహము లేదు.

మూ. దేవి దేవమనుష్యేషు గన్ధర్వేషు పతత్త్రిషు 11
రాక్షసేషు పిశాచేషు కిన్నరేషు మృగేషు చ,

దానవేషు చ ఘోరేషు స న విద్యేత శోభనే 12
యో రామం ప్రతియుధ్యేత సమరే వాసవోపమమ్.

ప్ర. అ. శోభనే=మంగళప్రదురాలా ! దేవి=ఓ ! దేవీ ! సమరే=యుద్ధము నందు, వాసవోపమమ్=దేవేంద్రునితో సమానుడైన, రామమ్=రాముణ్ణి, యః= ఎవడు, ప్రతియుధ్యేత = ఎదిరించి యుద్ధము చేయనో అట్టివాడు, దేవమనుష్యేషు = దేవతలలోను మనుష్యులలోను, గన్ధర్వేషు = గంధర్వులలోను, పతత్త్రిషు = పక్షులలోను, రాక్షసేషు = రాక్షసులలోను, పిశాచేషు = పిశాచములలోను, కిన్నరేషు=కింనరులలోను, మృగేషుచ=మృగములలోను, ఘోరేషు=భయంకరులైన, దానవేషు = దానవులలోను, న విద్యేత = ఉండదు.

తా. మంగళప్రదురాలవైన ఓ ! దేవీ ! యుద్ధములో, దేవేంద్రునితో సమానుడైన రాముని ఎదిరించి యుద్ధము చేయగలవాడు దేవతలలో గాని, మనుష్యులలో గాని, గంధర్వులలో గాని, పక్షులలో గాని, రాక్షసులలో గాని, పిశాచాలలో గాని, కింనరులలో గాని, మృగాలలో గాని, భయంకరులైన దానవులలో గాని ఉండడు. 11, 12

మూ. అవధ్యః సమరే రామో నైవం త్వం వక్తుమర్హసి, 13
న త్వామస్మిన్వనే హాతుముత్సహే రాఘవం వినా.

ప్ర. అ. రామః = రాముడు, సమరే=యుద్ధమునందు, అవధ్యః = చంప శక్యము కానివాడు. త్వమ్ = నీవు, ఏవమ్ = ఇట్లు, వక్తుమ్ = పలుకుటకు, నార్హసి = తగవు. త్వామ్ = నిన్ను, రాఘవం వినా = రాముడు లేకుండా, అస్మిన్ = ఈ, వనే = వనమునందు, హాతుమ్ = విడచుటకు, న ఉత్సహే = ఇచ్ఛయించను.

తా. రాముణ్ణి యుద్ధములో ఎవ్వరూ సంహరించజాలరు. నీవు ఈ విధముగా మాటలాడుట తగదు. రాముడు లేనప్పుడు నిన్ను ఈ వనములో ఒంటరిగా విడచుట నా కిష్టము కాదు.

మూ. అనివార్యం బలం తస్య బలైర్బలవతామపి, 14
త్రిభిర్లోకైః సముద్యుక్తైః సేశ్వరైరపి సామరైః,

ప్ర. అ. బలవతామ్ = బలవంతులయొక్క, బలైరపి = సేనలచేత కూడ, సేశ్వరైః = ప్రభువుతో కూడిన, సామరైరపి = దేవతలతో కూడిన, సముద్యతైః = దండెత్తి వచ్చిన, త్రిభిః లోకైః = మూడు లోకములచేతను కూడ, తస్య = ఆ రామునియొక్క, బలమ్ = బలము, అనివార్యమ్ = నివారింప శక్యము కానిది.

తా. బలవంతుల సైన్యము లన్నీ వచ్చినా, దేవేంద్రునితోను దేవతలతోను కలిసి మూడు లోకములు దండెత్తివచ్చినా రాముని బలమును ఎదుర్కొనజాలరు. 14

మూ. హృదయం నిర్వృతం తేఽస్తు సంతాపస్త్యజ్యతామయమ్,
ఆగమిష్యతి తే భర్తా శీఘ్రం హత్వా మృగోత్తమమ్.

ప్ర. అ. తే = నీయొక్క, హృదయమ్ = హృదయము, నిర్వృతమ్ = ఊరడిల్లినది, అస్తు = అగుగాక. అయమ్ = ఈ, సంతాపః = దుఃఖము, త్యజ్యతామ్ = విడువబడుగాక. తే భర్తా = నీ భర్త, మృగోత్తమమ్ = ఉత్తమమైన ఆ మృగమును, హత్వా = చంపి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆగమిష్యతి = రాగలడు.

తా. నీ మన్సునకు ఊరట కలుగుగాక. ఈ దుఃఖమును విడువుము. నీ భర్త ఆ మృగమును చంపి శీఘ్రముగా రాగలడు. 15

మూ. న చ తస్య స్వరో వ్యక్తం మాయయా కేన చిత్కృతః.
గన్ధర్వనగరప్రఖ్యా మాయా సా తస్య రక్షసః. 16

ప్ర. అ. (అది), తస్య = ఆ రామునియొక్క, స్వరః = స్వరము, న = కాదు. వ్యక్తమ్ = ఈ విషయము స్పష్టమే. కేన చిత్ = ఎవనిచేతనో, మాయయా = మాయచేత, కృతః = చేయబడినది. సా = అది, తస్య రక్షసః = ఆ రాక్షసుని యొక్క, గన్ధర్వనగరప్రఖ్యా = గంధర్వనగరము వంటి, మాయా = మాయ.

తా. నిజముగా అది రాముని స్వరము కాదు. ఇది ఎవరో మాయచేత అరచిన అరుపు. ఇది ఆ మారీచుడు చేసిన మాయ, ఐంద్రజాలికుడు చూపించే నగరము వంటిది. 16

మూ. న్యాసభూతాసి వైదేహి న్యస్తా మయి మహాత్మనా, 17
రామేణ త్వం వరారోహే న త్వాం త్యక్తుమిహోత్సహే.

ప్ర. అ. వరారోహే = ఉత్తమస్త్రీవైన, వైదేహి=సీతా ! న్యాసభూతాసి= నీవు న్యాసముగా ఉన్నావు. మహాత్మనా = మహాత్ముడైన, రామేణ = రామునిచేత, మయి=నాయందు (వద్ద), న్యస్తా=రక్షించుటకై ఉంచబడితివి. ఇహ=ఇక్కడ, త్వామ్ = నిన్ను త్యక్తుమ్ = విడచుటకు, నోత్సహే = అంగీకరించను.

తా. సీతా ! మహాత్ముడైన రాముడు రక్షింపు మని చెప్పి నాదగ్గర నిన్ను ఉంచినాడు. అందుచేత నీవు న్యాసముగా ఉన్నావు. అట్టి నిన్ను విడచుటకు నేను ఇష్టపడను. 17

మూ. కృతవైరాశ్చ వైదేహి వయమేతైర్నిశాచరైః, 18
ఖరస్య నిధనాదేవ జనస్థానవధం ప్రతి.

ప్ర. అ. వైదేహి = సీతా: ఖరస్య = ఖరునియొక్క, నిధనాదేవ = చావువలన, జనస్థానవధం ప్రతి = జనస్థానమునం దున్నవారి సంహారమును గూర్చి, వయమ్ = మనము, ఏతైః = ఈ, నిశాచరైః = రాక్షసులతో, కృతవైరాః = చేయబడిన వైరము గలవారము.

తా. సీతా! జనస్థానములోని రాక్షసులను, ఖరుణ్ణి చంపుటచేత ఈ రాక్షసులందరూ మనతో వైరము పూని ఉన్నారు. 18

మూ. రాక్షసా వివిధా వాచో విసృజన్తి మహావనే, 19
హింసావిహారా వైదేహి న చిన్తయితుమర్హసి.

ప్ర. అ, వైదేహి = సీతా! మహావనే = ఈ మహావనమునందు, హింసావిహారాః = హింసతో విహరించు, రాక్షసాః = రాక్షసులు, వివిధాః = అనేకవిధములైన, వాచః = వాక్కులను, విసృజన్తి = విడచుచుందురు (చేయుచుందురు). చిన్తయితుమ్ = విచారించుటకు, నార్హసి = తగవు.

తా. సీతా! ఈ మహావనములో హింసావృత్తితో విహరించే రాక్షసులు అనేకవిధములైన అరపులతో, మాటలు పలుకుచుందురు. నీవు విచారించకూడదు.

మూ. లక్ష్మణేనైవముక్తా సా క్రుద్ధా సంరక్తలోచనా, 20
అబ్రవీత్పరుషం వాక్యం లక్ష్మణం సత్యవాదినమ్.

ప్ర. అ. లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, సా=ఆమె, క్రుద్ధా=కోపించినదై, సంరక్తలోచనా=ఎఱ్ఱనైన నేత్రములు కలదై, సత్యవాదినమ్=సత్యమును పలుకుచున్న, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సీత లక్ష్మణుని మాటలు విని చాల కోపించినదై, ఎఱ్ఱని నేత్రములు కలదై, సత్యము పలికిన ఆ లక్ష్మణునితో పరుషమైన వాక్యమును పలికెను. 20

మూ. అకార్యకరణారమ్భ నృశంస కులపాంసన, 21
అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్.

ప్ర. అ. అకార్యకరణారమ్భ=అకార్యము చేయుటకు ప్రారంభించుచున్నవాడా! నృశంస=క్రూరుడా! కులపాంసన=కులమును అపవిత్రము చేసినవాడా! రామస్య=రామునియొక్క, మహత్=గొప్పదైన, వ్యసనమ్=వ్యసనమును, తవ=నీకు, ప్రియమ్=ఇష్టమైనదానినిగా, అహమ్=నేను, మన్యే=తలచుచున్నాను.

తా. కులము చెడ బుట్టిన ఓ! క్రూరుడా! చేయగూడని పని చేయుటకు ప్రారంభించుచున్నావు, రామునకు పెద్ద కష్టము రావలె ననియే నీవు కోరుకొనుచున్నా వని నా అభిప్రాయము. 21

మూ. రామస్య వ్యసనం దృష్ట్వా తేనైతాని ప్రభాషసే, 22
నైతచ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ యద్ భవేత్,
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు. 23

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! రామస్య=రామునియొక్క, వ్యసనమ్=వ్యసనమును, దృష్ట్వా=చూచి, తేన=ఆ కారణముచేత, ఏతాని=ఈ మాటలు, భాషసే=పలుకుచున్నావు. నిత్యమ్=ఎల్లప్పుడు, ప్రచ్ఛన్నచారిషు=రహస్యముగా ప్రవర్తించు, నృశంసేషు=క్రూరులైన, త్వద్విధేషు=నీవంటి, సపత్నేషు=

శత్రువులయందు, పాపమ్ = పాపము, భవేత్ ఇతియత్ = ఉండు ననునది ఏది కలదో, ఏతత్ = ఇది, చిత్రమ్ = ఆశ్చర్యకరము, న = కాదు.

తా. లక్ష్మణా! ఇప్పుడు రామునకు ఆపద సంభవించినదను విషయము చూచుటచే నీ విట్లు మాటలాడుచున్నావు. రహస్యముగా ప్రవర్తించే నీవంటి క్రూరులైన శత్రువులు ఇట్టి పాపానికి ఒడికట్టుచున్నారనగా దీనిలో ఆశ్చర్యమేమీ లేదు. 22, 23

మూ. సుదుష్టస్త్వం వనే రామమేకమేకోఽనుగచ్ఛసి,
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేన వా 24

ప్ర. అ. సుదుష్టః = చాలా చెడ్డవాడవైన, త్వమ్ = నీవు, ఏకః = ఒంటరివాడవై, ప్రతిచ్ఛన్నః = కప్పబడినవాడవై, మమ హేతోః = నాకొరకు గాని, భరతేన = భరతునిచేత, ప్రయుక్తః వా = ప్రేరేపించబడి గాని, ఏకమ్ = ఒంటరియైన, రామమ్ = రాముణ్ణి, వనే = వనమునందు, అనుగచ్ఛసి = అనుసరించుచున్నావు.

తా. దుష్టబుద్ధి వైన నీవు ఒంటరిగా, నీ భావము పైకి ఏమీ తెలియనీయక, నా నిమిత్తమై, లేదా భరతుని ప్రేరణచేత, అరణ్యములో ఒంటరిగా ఉన్న రాముణ్ణి అనుసరించి వచ్చుచున్నావు. 24

మూ. తన్న సిధ్యతి సౌమిత్రే తవ వా భరతస్య వా,
కథమిన్దీవరశ్యామం పద్మపత్రనిభేక్షణమ్, 25
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! తవ వా = నీయొక్క గాని, భరతస్య వా = భరతునియొక్క గాని, తత్ = ఆ ఆలోచన, న సిధ్యతి = సిద్ధించదు. పద్మపత్రనిభేక్షణమ్ = పద్మపత్రములతో సమానమైన నేత్రములు కలవాడు, ఇన్దీవరశ్యామమ్ = నల్లకలువ వలె శ్యామవర్ణము కలవాడు అయిన, రాముణ్ణి, భర్తారమ్ = భర్తనుగా, ఉపసంశ్రిత్య = ఆశ్రయించి, పృథగ్జనమ్ = అన్యజనుణ్ణి, కథమ్ = ఎట్లు, కామయేయమ్ = కోరుదును.

తా. లక్ష్మణా! ఇది నీ పన్నాగ మైనను, భరతుని పన్నాగ మైనను,

ఇది సిద్ధించదు. పద్మపత్రముల వంటి నేత్రములు, నల్లకలువ వంటి శ్యామ వర్ణము గల రాముణ్ణి భర్తగా ఆశ్రయించిన నేను ఇతరజనుణ్ణి ఎట్లు కోరుదును?

మూ. సమక్షం తవ సౌమిత్రే ప్రాణాంస్త్యక్ష్యే న సంశయః,
రామం వినా క్షణమపి న హి జీవామి భూతలే.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! తవ = నీయొక్క, సమక్షమ్ = ఎదుటనే, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యే = విడచెదను, సంశయః = సంశయము, న = లేదు. రామం వినా = రాముడు లేకుండా, క్షణమపి = క్షణకాలమైనా, భూతలే = భూతలమునందు, న జీవామి హి = జీవించను కదా.

తా. నీ ఎదుట నేను ప్రాణాలు విడచెదను; సందేహము లేదు. రాముడు లేకుండా ఈ భూతలముమీద క్షణకాలమైనా జీవించను కదా! 26

మూ. ఇత్యుక్తః పరుషం వాక్యం సీతయా రోమహర్షణమ్, 27
అబ్రవీల్లక్ష్మణః సీతాం ప్రాఞ్జలిర్విజితేన్ద్రియః.

ప్ర. అ. విజితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు గల, లక్ష్మణః = లక్ష్మణుడు, సీతయా = సీతచేత, ఇతి = ఇట్లు, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించే, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, ఉక్తః = పలకబడినవాడై, ప్రాఞ్జలిః = ఎత్తబడిన దోసిలి కలవాడై, సీతామ్ = సీతను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. రోమాంచమును కలిగించే పరుషములైన సీత మాటలు విని, ఇంద్రియనిగ్రహవంతుడైన లక్ష్మణుడు అంజలి ఘటించి నమస్కరించుచు సీతతో ఇట్లు పలికెను. 27

మూ. ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ, 28
వాక్యమప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి.
స్వభావస్త్వేష నారీణామేవం లోకేషు దృశ్యతే. 29

ప్ర. అ. మైథిలి = సీతా; ఉత్తరమ్ = సమాధానమును, వక్తుమ్ = చెప్పుటకు, నోత్సహే = ఇచ్ఛయించను. భవతీ = నీవు, మమ = నాకు, దైవతమ్ = దైవతము, అప్రతిరూపమ్ = సాటి లేని, వాక్యమ్ = ఈ వాక్యము, స్త్రీషు = స్త్రీలయందు,

చిత్రమ్ = ఆశ్చర్యకరమైనది, న = కాదు, ఏషః = ఇది, నారీణామ్ = స్త్రీల యొక్క, స్వభావస్తు = స్వభావము కదా? లోకేషు = లోకములలో, ఏవమ్ = ఇట్లే, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. ''సీతా! నీ మాటలకు బదులు చెప్పుటకు నాకిష్టము లేదు. నీవు నాకు దైవతము. సాటి లేని ఈ విధములైన మాటలు స్త్రీల విషయములో ఆశ్చర్యకరములు కావు. ఇది స్త్రీల స్వభావమే; ఇది లోకములో ప్రసిద్ధమైన విషయము.''

మూ. విముక్తధర్మాశ్చపలా స్తీక్ష్ణా భేదకరాః స్త్రియః,
న సహే హీదృశం వాక్యం వైదేహి జనకాత్మజే. 30
శ్రోత్రయోరుభయోర్మే ఽద్య తప్తనారాచసంనిభమ్.

ప్ర. అ. స్త్రియః = స్త్రీలు, విముక్తధర్మాః = విడవబడిన ధర్మము కలవారు. చపలాః = చపలస్వభావము గలవారు. తీక్ష్ణాః = తీక్ష్ణమైన ప్రకృతి కలవారు, భేదకరాః = భేదమును పుట్టించువారు. జనకాత్మజే = జనకుని కుమార్తెవైన, వైదేహి = సీతా! మే = నాయొక్క, ఉభయోః = రెండు, శ్రోత్రయోః = చెవులలో, తప్తనారాచసంనిభమ్ = కాల్చబడిన నారాచబాణములతో సమానమైన, ఈదృశమ్ ఈ విధమైన, వాక్యమ్ = వాక్యమును, అద్య = ఇప్పుడు, న సహే హి = సహించజాలను.

తా. స్త్రీలు ధర్మమును పరిత్యజించి చపలస్వభావముతో తీక్ష్ణముగా ప్రవర్తించుచు భేదమును (విరోధమును) కలిగింతురు. జనకుని కుమార్తెవైన సీతా! కాల్చిన నారాచబాణముల వలె నా చెవులలో గుచ్చుకొనిన ఇట్టి పరుషవాక్యమును సహించజాలను. 30

మూ. ఉపశృణ్వన్తు మే సర్వే సాక్షిభూతా వనేచరాః, 31
న్యాయవాదీ యథాఽన్యాయముక్తోఽహం పరుషం త్వయా,

ప్ర. అ. న్యాయవాదీ = న్యాయమును చెప్పుచున్న, అహమ్ = నేను, త్వయా = నీచేత, యథా = ఎట్లు, పరుషమ్ = పరుషమైన, అన్యాయమ్ = అన్యాయమును, ఉక్తః = పలుకబడితినో, మే = నాకు, సాక్షిభూతాః = సాక్షులై, సర్వే = సమస్తమైన, వనేచరాః = వనములో నివసించు దేవతలు, ఉపశృణ్వన్తు = విందురు గాక.

తా. యుక్తముగా మాటలాడుచున్న నన్ను నీవు పరుషముగా, ధర్మ విరుద్ధముగా ఎట్లు నిందించుచున్నావో ఈ వనదేవతలందరూ నాకు సాక్షులుగా నిలచి విందురుగాక. 31

మూ. ధిక్ త్వామద్య ప్రణశ్య త్వం యన్మామేవం విశఙ్కసే,
స్త్రీత్వాద్దుష్టస్వభావేన గురువాక్యే వ్యవస్థితమ్. 32

ప్ర. అ. త్వామ్ = నిన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక. స్త్రీత్వాత్ = స్త్రీత్వమువలన, దుష్టస్వభావేన=దుష్టస్వభావముతో, త్వమ్ = నీవు, గురువాక్యే = అన్నగారి వాక్యమునందు, వ్యవస్థితమ్ = నిలిచిన, మామ్ = నన్ను, యత్= ఏ కారణమువలన, ఏవమ్ = ఇట్లు, విశఙ్కసే = శంకించుచున్నావో, అందు వలన, ప్రణశ్య = నశించుము.

తా. స్త్రీవగుటచే, దుష్టమైన స్వభావముతో నీవు, అన్నగారి ఆజ్ఞను పాటించుచున్న నన్ను ఈ విధముగా శంకించుచున్నావు: ఛీ: నీ విప్పుడు నశించెదవుగాక! 32

మూ. గమిష్యే యత్ర కాకుత్థ్సః స్వస్తి తేఽస్తు వరాననే, 33
రక్షన్తు త్వాం విశాలాక్షి సమగ్రా వనదేవతాః.

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠమైన ముఖము గలదానా! కాకుత్థ్సః=రాముడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో అక్కడికి, గమిష్యే = వెళ్ళగలను. తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక. విశాలాక్షి = విశాలమైన నేత్రములు కల దానా! త్వామ్ = నిన్ను. సమగ్రాః = సమస్తమైన, వనదేవతాః = వనదేవతలు, రక్షన్తు = రక్షించెదరుగాక.

తా. శ్రేష్ఠమైన ముఖము గల ఓ! సీతా! నేను రాముడున్న చోటుకు వెళ్లెదను. నీకు క్షేమ మగుగాక. ఓ! విశాలాక్షి! నిన్ను వనదేవత లందరూ రక్షింతురుగాక. 33

మూ. నిమిత్తాని చ ఘోరాణి యాని ప్రాదుర్భవన్తి మే, 34
అపి త్వాం సహ రామేణ పశ్యేయం పునరాగతః.
న వేత్యేతన్న జానామి వైదేహి జనకాత్మజే, 35

ప్ర. అ. జనకాత్మజే=జనకుని కుమార్తెవైన, వైదేహి = సీతా! ఘోరాణి

= భయంకరములైన, యాని = ఏ, నిమిత్తాని = శకునములు, మే = నాకు, ప్రాదుర్భవన్తి = పుట్టుచున్నవో, వాటిని పట్టి, పునః = తిరిగి, ఆగతః = వచ్చినవాడనై, త్వామ్ = నిన్ను. రామేణ సహ = రామునితో కూడ, అపి పశ్యేయమ్ = చూచెదనా, న వా = చూడనా, ఇత్యేతత్ = అను ఈ విషయమును, న జానామి = ఎరుగను.

తా. జనకుని కుమార్తెవైన సీతా! నాకు కనబడుచున్న భయంకరములైన శకునములను పట్టి, నేను తిరిగి వచ్చి రాముడూ నువ్వూ క్షేమముగా కలిసి ఉండగా చూడగలనా చూడలేనా అని సందేహము కలుగుచున్నది. 34, 35

మూ. లక్ష్మణేనైవముక్తా సా రుదన్తీ జనకాత్మజా,
ప్రత్యువాచ తతో వాక్యం తీవ్రం బాష్పపరిప్లుతా. 36

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, సా జనకాత్మజా = ఆ సీత, తతః = అటుపిమ్మట, రుదన్తీ = ఏడ్చుచున్నదై, బాష్పపరిప్లుతా = కన్నీళ్ళచేత వ్యాప్తురాలై, తీవ్రమ్ = తీవ్రమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగిపలికెను.

తా. లక్ష్మణుడు ఈ విధముగ పలుకగా ఆ మాటలు విని సీత, ఏడ్చుచు, కన్నీళ్ళతో నిండినదై పరుషమైన వాక్యములు పలికెను. 36

మూ. గోదావరీం ప్రవేక్ష్యామి వినా రామేణ లక్ష్మణ,
ఆబన్ధిష్యేఽథవా త్యక్ష్యే విషమే దేహమాత్మనః. 37

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! రామేణ వినా = రాముడు లేకున్నచో, గోదావరీమ్ = గోదావరిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను. అథవా = లేక, ఆబన్ధిష్యే = ఉరిపోసికొనెదను. విషమే = ఎత్తైన ప్రదేశమునందు, ఆత్మనః = నాయొక్క, దేహమ్ = దేహమును, త్యక్ష్యే = విడచెదను.

తా. లక్ష్మణా! రాముడు లేనిచో నేను గోదావరిలో పడెదను. లేదా ఉరి పోసుకొనెదను. లేదా ఎత్తునుండి దుమికి దేహము విడచెదను. 37

మూ. పిబామ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనమ్,
న త్వహం రాఘవాదన్యం పదాపి పురుషం స్పృశే. 38

ప్ర. అ. అహమ్ = నేను, తీక్ష్ణమ్ = తీక్ష్ణమైన, విషమ్ = విషమును, పిబామి = త్రాగెదను, హుతాశనమ్ = అగ్నిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను. తు = కాని, అహమ్ = నేను, రాఘవాత్ = రామునికంటె, అన్యమ్ = ఇతరుడైన, పురుషమ్ = పురుషుణ్ణి, పదాపి = పాదముచేతకూడ, న స్పృశే = స్పృశించను.

తా. నేను తీక్ష్ణమైన విషమును త్రాగెదను. అగ్నిలో పడెదను. అంతేకాని రామునికంటె అన్యుడైన పురుషుణ్ణి పాదముతో కూడ స్పృశించను. 38

మూ. ఇతి లక్ష్మణమాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా,
పాణిభ్యాం రుదతీ దుఃఖాదుదరం ప్రజఘాన హ. 39

ప్ర. అ. సీతా = సీత, ఇతి = ఇట్లు, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ఆక్రుశ్య = దూషించి, దుఃఖసమన్వితా = దుఃఖముతో కూడినదై, రుదతీ = ఏడ్చుచున్నదై, దుఃఖాత్ = దుఃఖమువలన, పాణిభ్యామ్ = చేతులతో, ఉదరమ్ = పొట్టను, ప్రజఘాన హ = బాదుకొనెను.

తా. దుఃఖాక్రాంతురాలైన ఆ సీత లక్ష్మణుణ్ణి ఈ విధముగా దూషించి, దుఃఖము చేత చేతులతో ఉదరము బాదుకొనుచు ఏడ్చెను. 39

మూ. తామార్తరూపాం విమనా రుదన్తీం,
సౌమిత్రిరాలోక్య విశాలనేత్రామ్,
ఆశ్వాసయామాస న చైవ భర్తు
స్తం భ్రాతరం కించిదువాచ సీతా. 40

ప్ర. అ. సౌమిత్రిః = లక్ష్మణుడు, విమనాః = దుఃఖించిన మనస్సు కలవాడై, ఆర్తరూపామ్ = చాల దుఃఖించుచున్నదీ, రుదన్తీమ్ = ఏడ్చుచున్నదీ అయిన, తామ్ = ఆ, విశాలనేత్రామ్ = విశాలములైన నేత్రములు గల సీతను, ఆలోక్య = చూచి ఆశ్వాసయామాస = ఓదార్చెను. సీతా = సీత, భర్తుః = భర్తయొక్క, భ్రాతరమ్ = సోదరుడైన, తమ్ = అతనిని గూర్చి, కించిత్ = ఏమీ, న ఉవాచ = పలకలేదు.

తా. విశాలనేత్రయైన ఆ సీత చాలా దుఃఖించుచు ఏడ్చుచుండగా చూచి

లక్ష్మణుడు దుఃఖించుచు ఓదార్చెను. కాని సీత తన భర్త సోదరుడైన లక్ష్మణునకు ఏమీ బదులు చెప్పలేదు. 40

మూ. తతస్తు సీతామభివాద్య లక్ష్మణః
కృతాఞ్జలిః కించిదభిప్రణమ్య చ,
అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీమ్
జగామ రామస్య సమీపమాత్మవాన్. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చచత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, సీతామ్ = సీతను, అభివాద్య = నమస్కరించి. కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, కించిత్ = కొంచెము, అభిప్రణమ్య = అభిముఖముగా వెళ్ళి నమస్కరించి, బహుశః = అనేకపర్యాయములు, మైథిలీమ్ = ఆ సీతను, అన్వీక్షమాణః = చూచుచు, రామస్య = రామునియొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి. జగామ = వెళ్లెను.

తా. పిమ్మట, బుద్ధిమంతుడైన లక్ష్మణుడు సీతకు అభివాదనము చేసి, అంజలి ఘటించి కొంచెము ఎదురుగా వెళ్ళి నమస్కరించి, మాటిమాటికి వెనుకకు తిరిగి సీతనే చూచుచు రాముని దగ్గరకు వెళ్ళెను. 41

'బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
నలుబది యైదవ సర్గ సమాప్తము.

# అథ షట్చత్వారింశః సర్గః

[రావణుడు సంన్యాసివేషములో సీతదగ్గరకు వెళ్ళి ఆమెను గూర్చి అడుగుట సీత అతనికి అతిథిసత్కారము చేయుట]

మూ. తయా పరుషముక్తస్తు కుపితో రాఘవానుజః,
స వికాఙ్క్షన్ భృశం రామం ప్రతస్థే నచిరాదివ. 1

ప్ర. అ. తయా = ఆసీతచేత, పరుషమ్ = పరుషముగా, ఉక్తః = పలకబడిన, సః = ఆ, రాఘవానుజః = లక్ష్మణుడు. కుపితః = కోపించినవాడై, భృశమ్ = మిక్కిలి, వికాఙ్క్షన్ = (రాముణ్ణి చూడవలె నని) కోరుచు, నచిరాదివ = వెంటనే, రామమ్ = రాముణ్ణి గూర్చి, ప్రతస్థే = ప్రయాణమాయెను.

తా. సీత పరుషవాక్యములు విని లక్ష్మణుడు, కోపించినవాడై రాముణ్ణి చూడవలె నని ఎక్కువ ఆతురుడై వెంటనే ఆతనివద్దకు బయలుదేరెను. 1

మూ. తదాసాద్య దశగ్రీవః క్షిప్రమన్తరమాస్థితః,
అభిచక్రామ వైదేహీం పరివ్రాజకరూపధృత్. 2

ప్ర. అ. అన్తరమ్ = అవకాశమును, ఆస్థితః = అవలంబించి ఉన్న (ఎదురు చూచుచున్న), దశగ్రీవః = రావణుడు, తత్ = ఆ అవకాశమును, ఆసాద్య = పొంది, పరివ్రాజకరూపధృత్ = సంన్యాసివేషమును ధరించినవాడై, వైదేహీమ్ = సీతాదేవిని గూర్చి, అభిచక్రామ = వెళ్లెను.

తా. అవకాశముకొరకై వేచియున్న రావణుడు ఆ అవకాశమును పొంది సంన్యాసి రూపము ధరించి, సీత దగ్గరకు వెళ్ళెను. 2

మూ. శ్లక్ష్ణకాషాయసంవీతః శిఖీ ఛత్రీ ఉపానహీ,
వామే చాంసేఽవసజ్యాథ శుభే యష్టికమణ్డలూ. 3
పరివ్రాజకరూపేణ వైదేహీమన్వపద్యత.

ప్ర. అ. అథ = పిమ్మట, శ్లక్ష్ణకాషాయసంవీతః = మృదువైన కాషాయ

వస్త్రముచేత చుట్టబడినవాడై, శిఖీ = శిఖగలవాడై, ఛత్రీ = ఛత్రము గలవాడై, ఉపానహీ = పాదుకలు కలవాడై, వామే అంసే = ఎడమ బుజమునందు, శుభే = మంగళకరములైన, యష్టికమణ్డలూ = దండమును కమండలువును, ఆసజ్య = తగల్చి, పరివ్రాజకరూపేణ = సంన్యాసిరూపముతో, వైదేహీమ్ = సీతను, అన్వపద్యత = సమీపించెను.

తా. ఆ రావణుడు మృదువైన కాషాయవస్త్రమును, శిఖను, ఛత్రమును, పాదుకలను ధరించి, మంగళకరములైన దండకమండలములు ఎడమ బుజానికి తగల్చుకొని సంన్యాసివేషముతో సీత దగ్గరకు వెళ్ళెను. 3

మూ. తామాససాదాతిబలో భ్రాతృభ్యాం రహితాం వనే, 4
రహితాం చన్ద్రసూర్యాభ్యాం సన్ధ్యామివ మహత్తమః.

ప్ర. అ. అతిబలః = అధికమైన బలము గల ఆ రావణుడు, వనే = వనమునందు, భ్రాతృభ్యామ్ = (సోదరులైన) రామలక్ష్మణులతో, రహితామ్ = శూన్యురాలైన, తామ్ = ఆ సీతను, చన్ద్రసూర్యాభ్యామ్ = చంద్రసూర్యులతో, రహితామ్ = శూన్యురాలైన, సన్ధ్యామ్ = సంధ్యను, మహత్ = గొప్పదైన, తమః ఇవ = చీకటి వలె, ఆససాద = సమీపించెను.

తా. చాల బలవంతుడైన ఆ రావణుడు వనమునందు రామలక్ష్మణులు దగ్గర లేని ఆ సీతను, చంద్రసూర్యులు లేని సంధ్యను అంధకారము ఆవరించినట్లు, సమీపించెను. 4

మూ. తామపశ్యత్తతో బాలాం రామపత్నీం యశస్వినీమ్, 5
రోహిణీం శశినా హీనాం గ్రహవద్భృశదారుణః.

ప్ర. అ. తతః = పిమ్మట, భృశదారుణః = చాల క్రూరుడైన ఆ రావణుడు, యశస్వినీమ్ = కీర్తి గలది, రామపత్నీమ్ = రాముని భార్యా, బాలామ్ = చిన్న వయస్సు కలదీ అయిన, తామ్ = ఆ సీతను, శశినా = చంద్రునితో, హీనామ్ = హీనురాలైన, రోహిణీమ్ = రోహిణిని, గ్రహవత్ = క్రూరగ్రహము వలె, అపశ్యత్ = చూచెను.

తా. చాలక్రూరుడైన ఆ రావణుడు కీర్తి కలది, రాముని భార్య, చిన్న

వయస్సులో ఉన్నది అయిన ఆ సీతను, చంద్రుడు దగ్గర లేని రోహిణిని క్రూర గ్రహము చూచి నట్లు చూచెను. 5

మూ. తముగ్రతేజఃకర్మాణం జనస్థానరుహో ద్రుమాః, 6
సమీక్ష్య సంప్రకమ్పన్తే న ప్రవాతి చ మారుతః.

ప్ర. అ. ఉగ్రతేజఃకర్మాణమ్ = ఉగ్రమైన తేజస్సు, కర్మ గల, తమ్ = అతనిని, సమీక్ష్య = చూచి, జనస్థానరుహః = జనస్థానమునందు మొలచిన, మహా ద్రుమాః = పెద్దవృక్షములు, సంప్రకమ్పన్తే = వణికిపోయినవి. మారుతః చ = వాయువు కూడ, న ప్రవాతి = వీచలేదు.

తా. ఉగ్రమైన తేజస్సు గలిగి భయంకరములైన పనులు చేయు ఆ రావణుణ్ణి చూచి జనస్థానములోని వృక్షాలన్నీ వణికిపోయినవి. గాలి కూడ వీచలేదు.

మూ. శీఘ్రస్రోతాశ్చ తం దృష్ట్వా వీక్షన్తం రక్తలోచనమ్. 7
స్తిమితం గన్తుమారేభే భయాద్గోదావరీ నదీ,

ప్ర. అ. శీఘ్రస్రోతాః = శీఘ్రముగా ప్రవహించు ప్రవాహముగల, గోదావరీనదీ = గోదావరీనది, రక్తలోచనమ్ = ఎఱ్ఱని నేత్రములు గల, వీక్షన్తమ్ = చూచుచున్న, తమ్ = వానిని, దృష్ట్వా = చూచి, భయాత్ = భయమువలన, స్తిమితమ్ = మందముగా, గన్తుమ్ = వెళ్లుటకు, ఆరేభే = ప్రారంభించెను.

తా. శీఘ్రముగా ప్రవహించుచున్న గోదావరీనది ఇటు నటు చూచుచున్న ఎఱ్ఱని నేత్రములు గల, ఆ రావణుణ్ణి చూచి, భయపడి మెల్లగా ప్రవహించ సాగెను. 7

మూ. రామస్య త్వన్తరప్రేప్సుర్దశగ్రీవస్తదన్తరే, 8
ఉపతస్థే చ వైదేహీం భిక్షురూపేణ రావణః.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, అన్తరప్రేప్సుః = ఛిద్రమును (పొరబాటును) కోరుచున్న, దశగ్రీవః = పది కంఠములు గల, రావణః = రావణుడు, తదన్తరే = ఆ మధ్యయందు, భిక్షురూపేణ = సంన్యాసిరూపముతో, వైదేహీమ్ = సీతను, ఉపతస్థే = సమీపించెను.

తా. రామునిలో ఏదైన పొరబాటు దొరుకునా అని వేచి యున్న, ఆ పది తలల రావణుడు, ఆ అవకాశమును చూచుకొని, సంన్యాసిరూపముతో సీత దగ్గరకు వచ్చెను. 8

మూ. అభవ్యో భవ్యరూపేణ భర్తారమనుశోచతీమ్, 9
అభ్యవర్తత వైదేహీం చిత్రామివ శనైశ్చరః.

ప్ర. అ. అభవ్యః = అమంగళస్వభావుడైన రావణుడు, భర్తారమ్ = భర్తను గూర్చి, అనుశోచతీమ్ = విచారించుచున్న, వైదేహీమ్ = సీతను, భవ్య రూపేణ = మంగళప్రదమైన సంన్యాసిరూపముతో, శనైశ్చరః = శని, చిత్రామివ = చిత్రానక్షత్రమును వలె, అభ్యవర్తత = సమీపించెను.

తా. చెడ్డవాడైన ఆ రావణుడు, భర్తను గూర్చి విచారించుచున్న సీత దగ్గరకు మంగళప్రదమైన సంన్యాసివేషముతో, శని చిత్రానక్షత్రము దగ్గరకు వచ్చినట్లు వచ్చెను. 9

మూ. స పాపో భవ్యరూపేణ తృణైః కూప ఇవావృతః, 10
అతిష్ఠత్ప్రేక్ష్య వైదేహీం రామపత్నీం యశస్వినీమ్.

ప్ర. అ. కూపః = కూపము, తృణైరివ = తృణములచేత వలె, భవ్యరూపేణ = మంగళకరమైన రూపముచేత, ఆవృతః = కప్పబడిన, సః పాపః = ఆ పాపాత్ముడు, యశస్వినీమ్ = కీర్తి గలది, రామపత్నీమ్ = రాముని భార్య అయిన, వైదేహీమ్ = సీతను, ప్రేక్ష్య = చూచి, అతిష్ఠత్ = నిలచెను.

తా. తృణములచేత కప్పబడిన కూపము వలె, మంగళకరమైన వేషము చేత కప్పబడిన ఆ పాపాత్ముడు, కీర్తి గలది, రాముని భార్యా అయిన సీతను చూచి నిలబడెను. 10

మూ. శుభాం రుచిరదన్తోష్ఠీం పూర్ణచన్ద్రనిభాననామ్, 11
ఆసీనాం పర్ణశాలాయాం బాష్పశోకాభిపీడితామ్,
స తాం పద్మపలాశాక్షీం పీతకౌశేయవాసినీమ్, 12
అభ్యగచ్ఛత వైదేహీం దుష్టచేతా నిశాచరః.

ప్ర. అ. దుష్టచేతాః = దుష్టమైన చిత్తము గల, సః నిశాచరః = ఆ రాక్షసుడు, శుభామ్ = మంగళప్రదురాలు, రుచిరదన్తోష్ఠీమ్ = అందమైన దంతములు ఓష్ఠములు కలది, పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రుని వంటి ముఖము గలది, పర్ణశాలాయామ్ = పర్ణశాలలో, ఆసీనామ్ = కూర్చున్నది, బాష్పశోకాభిపీడితామ్ = కన్నీటిచేతను శోకముచేతను పీడింపబడినది, పద్మపలాశాక్షీమ్ = పద్మము రేకుల వంటి నేత్రములు కలది, పీతకౌశేయవాసినీమ్ = పచ్చని పట్టుబట్ట ధరించినది అయిన, తాం వైదేహీమ్ = ఆ సీతను, అభ్యగచ్ఛత = సమీపించెను.

తా. అందమైన దంతములు, ఓష్ఠములు, పూర్ణచంద్రుని వంటి ముఖము, పద్మము రేకుల వంటి నేత్రములు గల మంగళప్రదురాలైన ఆ సీత కన్నీరు కార్చుచు, దుఃఖాక్రాంతయై పర్ణశాలలో కూర్చొని ఉండెను. పచ్చని పట్టు బట్ట కట్టుకొనెను. దుష్టబుద్ధియైన ఆ రాక్షసుడు అట్టి సీతదగ్గరకు వెళ్ళెను. 11, 12

మూ. స మన్మథశరావిష్టో బ్రహ్మఘోషముదీరయన్, 13
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం రహితే రాక్షసాధిపః.

ప్ర. అ. మన్మథశరావిష్టః = మన్మథుని బాణములచేత వ్యాపింపబడిన, సః రాక్షసాధిపః = ఆ రావణుడు, బ్రహ్మఘోషమ్ = వేద ఘోషను, ఉదీరయన్ = పలుకుచు, రహితే = జనశూన్యమైన ఆ ప్రదేశమునందు, ప్రశ్రితమ్ = వినయముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మన్మథబాణములచేత పీడింపబడిన ఆ రావణుడు వేద ఘోష చేయుచు, జనులెవ్వరూ లేని ఆ ప్రదేశమునందు వినయపూర్వకముగా సీతతో ఇట్లు పలికెను. 13

మూ. తాముత్తమాం స్త్రియం లోకే పద్మహీనామివ శ్రియమ్, 14
విభ్రాజమానాం వపుషా రావణః ప్రశశంస హ.

ప్ర. అ. లోకే = లోకమునందు, ఉత్తమామ్ = ఉత్తమురాలైన, స్త్రియమ్ = స్త్రీయైన, పద్మహీనామ్ = పద్మము లేని, శ్రియమ్ ఇవ = లక్ష్మీదేవి వలె ఉన్న, వపుషా = దేహముతో, విభ్రాజమానామ్ = ప్రకాశించుచున్న, తామ్ = ఆమెను, రావణః = రావణుడు, ప్రశశంస హ = ప్రశంసించెను.

తా. లోకములో ఉత్తమస్త్రీ యైన ఆ సీత శరీరసౌందర్యముతో పద్మము లేని లక్ష్మీదేవి వలె ప్రకాశించుచుండెను. రావణుడు ఆమెను ఇట్లు ప్రశంసించెను. 14

మూ. కా త్వం కాఞ్చనవర్ణాభే పీతకౌశేయవాసిని, 15
కమలానాం శుభాం మాలాం పద్మినీవ హి బిభ్రతీ.

ప్ర. అ. కాఞ్చనవర్ణాభే = బంగారము రంగు వంటి కాంతి గలదానా! పీతకౌశేయవాసిని = పచ్చని పట్టువస్త్రము ధరించినదానా! పద్మినీవ = పద్మలత వలె, కమలానామ్ = పద్మములయొక్క, శుభామ్ = అందమైన, మాలామ్ = మాలను, బిభ్రతీ = ధరించుచున్న, త్వమ్ = నీవు, కా = ఎవ్వతెవు?

తా. బంగారు శరీరచ్ఛాయతో, పచ్చని పట్టువస్త్రమును ధరించి ఉన్నదానా! పద్మలత వలె పద్మముల పంక్తిని, అనగా పద్మముల వంటి ముఖము, హస్తములు, పాదములు, నేత్రములు-వీటిని, ధరించిన నీవు ఎవ్వరవు? 15

మూ. హ్రీః కీర్తిః శ్రీః శుభా లక్ష్మీరప్సరా వా శుభాననే, 16
భూతిర్వా త్వం వరారోహే రతిర్వా స్వైరచారిణీ.

ప్ర. అ. శుభాననే = మంగళకరమైన ముఖము గలదానా! వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా! త్వమ్ = నీవు, హ్రీః = పార్వతివా? కీర్తిః = కీర్తివా? శుభా = మంగళకరమైన, శ్రీః = కాంతివా? లక్ష్మీః = లక్ష్మివా? అప్సరా వా = అప్సరఃస్త్రీవా? భూతిర్వా = భూతివా? స్వైరచారిణీ = స్వేచ్ఛగా సంచరించుచున్న, రతిర్వా = రతివా?

తా. శుభకరమైన ముఖము, శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా! నీవు పార్వతివా ? కీర్త్యధిష్ఠానదేవతవా ? కాంత్యధిష్ఠానదేవతవా ? మంగళప్రదురాలైన లక్ష్మివా ? అప్సరసవా ? ఐశ్వర్యాధిష్ఠానదేవతవా ? స్వేచ్ఛగా సంచరించుచున్న రతీదేవివా ? 16

మూ. సమాః శిఖరిణః స్నిగ్ధాః పాణ్డురా దశనాస్తథా, 17
విశాలే విమలే నేత్రే రక్తాన్తే కృష్ణతారకే.

ప్ర. అ. దశనాః=నీదంతములు, సమాః=సమములు, శిఖరిణః=కొనలు గలవి. స్నిగ్ధాః= నున్నగా ఉన్నవి. తథా= మరియు, పాణ్డురాః = తెల్లగా ఉన్నవి. నేత్రే=నేత్రములు, విశాలే=విశాలములు. విమలే=నిర్మలములు, రక్తాన్తే =ఎఱ్ఱని కొనలు గలవి. కృష్ణతారకే= నల్లని గ్రుడ్లు గలవి.

తా. నీ తెల్లని దంతములు సమములై, కొనలు దేరి, నున్నగా ఉన్నవి. విశాలములైన నీ నేత్రములు నిర్మలములుగా ఉన్నవి. వీటి కొనలు ఎఱ్ఱగా ఉన్నవి. గ్రుడ్లు నల్లగా ఉన్నవి. 17

మూ. విశాలం జఘనం పీనమూరూ కరికరోపమౌ 18
ఏతావుపచితౌ వృత్తౌ సంహతౌ సంప్రవల్గితౌ
పీనోన్నతముఖౌ కాన్తౌ స్నిగ్ధౌ తాలఫలోపమౌ. 19
మణిప్రవేకాభరణౌ రుచిరౌ తే పయోధరౌ.

ప్ర. అ. విశాలమ్= విశాలమైన, జఘనమ్= జఘనము, పీనమ్= బలిసి యున్నది. ఊరూ= తొడలు, కరికరోపమౌ= ఏనుగు తొండముతో సమానములు. తే= నీయొక్క, ఏతౌ = ఈ, మణిప్రవేకాభరణౌ = శ్రేష్ఠములైన మణులు ఆభరణముగా గల, పయోధరౌ= స్తనములు, ఉపచితౌ = చక్కగా పెరిగినవి, వృత్తౌ= గుండ్రముగా ఉన్నవి, సంహతౌ= కలిసిఉన్నవి, సంప్రవల్గితౌ= కదలుచున్నవి. పీనోన్నతముఖౌ=బలిసిన ఎత్తుగా ఉన్న ముఖములు గలవి. కాన్తౌ=మనోహరముగా ఉన్నవి, స్నిగ్ధౌ=కాంతిగలవి, తాలఫలోపమౌ= తాటిపండ్లతో సమానములు, రుచిరౌ= అందముగా ఉన్నవి.

తా. విశాలమైన నీ జఘనము బలిసి ఉన్నది. తొడలు ఏనుగతొండము వలె ఉన్నవి, శ్రేష్ఠములైన మణులచేత అలంకరింపబడిన అందమైన ఈ స్తనములు దగ్గరగా, గుండ్రముగా పెరిగిఉన్నవి. కొంచెము కదలుచున్నవి. బలిసి ఎత్తుగా ఉన్న ముఖములతో మనోహరములై కాంతి గల ఈ స్తనములు తాటి పండ్ల వలె ఉన్నవి. 18, 19

మూ. చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని 20
మనో హరసి మే కాన్తే నదీ కూలమివామ్బసా
కరాన్తమితమధ్యాసి సుకేశీ సంహతస్తనీ. 21

ప్ర. అ. చారుస్మితే = అందమైన చిరునవ్వు కలదానా! చారుదతి = అందమైన దంతములు కలదానా! చారునేత్రే = అందమైన నేత్రములు కలదానా! విలాసిని = విలాసలు కలదానా! కాన్తే = సౌందర్యము కలదానా! నదీ = నది, అమ్భసా = నీటిచేత, కూలమివ = ఒడ్డును వలె, మే = నాయొక్క, మనః = మనస్సును, హరసి = హరించుచున్నావు, కరాన్తమితమధ్యా = పిడికిలిచేత కొలవదగిన నడుము గలదానవు, సుకేశీ = అందమైన కేశపాశము కలదానవు, సంహతస్తనీ = దగ్గరగా ఉన్న స్తనములు కలదానవు, అసి = అయి ఉన్నావు.

తా. అందమైన చిరునవ్వు, సుందరములైన దంతములు! చక్కని నేత్రములు గల విలాసవతి వైన ఓ! కాన్తా! నది నీటిప్రవాహముచేత ఒడ్డును హరించునట్లు నా మనస్సును హరించుచున్నావు. నీ నడుము పిడికిలితో కొలుచుటకు వీలుగా ఉన్నది. కేశపాశము చక్కగా ఉన్నది. స్తనములు దగ్గరగా కలిసి ఉన్నవి. 20, 21

మూ. నైవ దేవీ న గన్ధర్వీ న యక్షీ న చ కిన్నరీ,
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే. 22

ప్ర. అ. మయా = నాచేత, మహీతలే = ఈ భూతలమునందు, ఏవంరూపా = ఇట్టి రూపము గల, నారీ = మనుష్యస్త్రీ, న దృష్టపూర్వా = పూర్వమెన్నడూ చూడబడలేదు. దేవీ = దేవతాస్త్రీ, నైవ = చూడబడలేదు, గన్ధర్వీ = గంధర్వస్త్రీ, న = చూడబడలేదు, యక్షీ = యక్షస్త్రీ, న = చూడబడలేదు. కిన్నరీ = కింనరస్త్రీ, న = చూడబడలేదు.

తా. నేనీ భూతలమునందు ఇట్టి రూపము గల మనుష్యస్త్రీని పూర్వమెన్నడూ చూడలేదు. దేవతాస్త్రీని గాని, గంధర్వస్త్రీని గాని, యక్షస్త్రీని గాని, కింనరస్త్రీని గాని చూడలేదు. 22

మూ. రూపమగ్ర్యం చ లోకేషు సౌకుమార్యం వయశ్చ తే,
ఇహ వాసశ్చ కాన్తారే చిత్తమున్మాదయన్తి మే. 23

ప్ర. అ. లోకేషు = లోకములలో, అగ్ర్యమ్ = శ్రేష్ఠమైన, తే = నీయొక్క, రూపమ్ = రూపము, సౌకుమార్యమ్ = సౌకుమార్యము, వయశ్చ = వయస్సు,

ఇహ = ఈ, కాన్తారే = అడవియందు, వాసశ్చ = నివాసము, మే = నాయొక్క, చిత్తమ్ = మనస్సును, ఉన్మాదయన్తి = కలతపెట్టుచున్నవి.

తా. మూడు లోకములలో శ్రేష్ఠమైన రూపము, సౌకుమార్యము గల నీవు ఈ వయస్సునందు, ఈ అరణ్యములో నివసించుట చూచి నా మనస్సు కలత చెందుచున్నది. 23

మూ. సా ప్రతిక్రామ భద్రం తే నైవ వస్తుమిహార్హసి,
రాక్షసానామయం వాసో ఘోరాణాం కామరూపిణామ్. 24

ప్ర. అ. సా = అట్టినీవు, ప్రతిక్రామ = ఇక్కడినుండి వెళ్ళిపొమ్ము. తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక. ఇహ = ఇక్కడ, ఏవమ్ = ఈ విధముగా, వస్తుమ్ = నివసించుటకు, న అర్హసి = తగవు. అయమ్ = ఇది, ఘోరాణామ్ = భయంకరులు, కామరూపిణామ్ = స్వేచ్ఛారూపులూ అయిన, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వాసః = నివాసము.

తా. అట్టి నీవు ఇక్కడనుండి వెళ్ళిపొమ్ము. నీకు క్షేమ మగుగాక. నీవు ఇక్కడ నివసించకూడదు. ఇది స్వేచ్ఛానుసారము రూపమును ధరించగల భయంకరులైన రాక్షసుల నివాసస్థానము. 24

మూ. ప్రాసాదాగ్రాణి రమ్యాణి నగరోపవనాని చ,
సంపన్నాని సుగన్ధీని యుక్తాన్యాచరితుం త్వయా. 25

ప్ర. అ. ప్రాసాదాగ్రాణి = ప్రాసాదముల పైభాగములు, రమ్యాణి = సుందరములు, సంపన్నాని = ఐశ్వర్యసమృద్ధములు, సుగన్ధీని = మంచి సువాసనలు కలవి అయిన, నగరోపవనానిచ = నగరములలోని ఉద్యానములు, త్వయా = నీచేత, ఆచరితుమ్ = సంచరించుటకు, యుక్తాని = తగినవి.

తా. ప్రాసాదముల పైభాగములు, రమ్యములు, ఐశ్వర్యముతో నిండినవి, మంచి సువాసనలు కలవి అయిన నగరప్రాంతములం దున్న ఉద్యానములు నీవు సంచరించుటకు తగినవి. 25

మూ. వరం మాల్యం వరం భోజ్యం వరం వస్త్రం చ శోభనే,
భర్తారం చ వరం మన్యే త్వద్యుక్తమసితేక్షణే. 26

ప్ర. అ. అసితేక్షణే = నల్లని నేత్రములు కలదానా ! శోభనే = సుందరీ ! వరమ్ = శ్రేష్ఠమైన, మాల్యమ్ = మాలను, వరమ్ = శ్రేష్ఠమైన, భోజ్యమ్ = భోజ్యపదార్థమును, వరమ్ = శ్రేష్ఠమైన, వస్త్రమ్ = వస్త్రమును, వరమ్ = శ్రేష్ఠుడైన, భర్తారం చ = భర్తను, త్వద్యుక్తమ్ = నీకుతగినదానినిగా, మన్యే = తలచుచున్నాను.

తా. నల్లని నేత్రములు గల సుందరీ ! శ్రేష్ఠములైన పుష్పమాలలు, శ్రేష్ఠమైన ఆహారము, శ్రేష్ఠమైన వస్త్రము, శ్రేష్ఠుడైన భర్త నీకు ఉండుట యుక్త మని తలచెదను. 26

మూ. కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే,
వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసి మే. 27

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠమైన ముఖము గలదానా ! వరారోహే = సుందరమైన కటిప్రదేశము గలదానా ! త్వమ్ = నీవు, కా భవసి = ఎవ్వతెవై ఉన్నావు ? రుద్రాణామ్ = రుద్రులదానవా, మరుతాం వా = మరుత్తులదానవా, వసూనాం వా = వసుపులదానవా? మే = నాకు, దేవతా = దేవతవుగా, ప్రతిభాసి = తోచుచున్నావు.

తా. శ్రేష్ఠమైన ముఖము, కటిప్రదేశము గలదానా ! నీవెవ్వరవు ? రుద్రులకు గాని, మరుత్తులకు గాని, వసువులకు గాని సంబంధించిన దానవా ? నీవు నాకు దేవతాస్త్రీగానే కనబడుచున్నావు. 27

మూ. నేహ గచ్ఛన్తి గన్ధర్వా న దేవా న చ కిన్నరాః,
రాక్షసానామయం వాసః కథం ను త్వమిహాగతా. 28

ప్ర. అ. ఇహ = ఇక్కడికి, గన్ధర్వాః = గంధర్వులు, న గచ్ఛన్తి = రారు, దేవాః = దేవతలు, న = రారు, కిన్నరాః చ = కిన్నరులు కూడ, న = రారు, అయమ్ = ఇది, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వాసః = నివాసము. త్వమ్ = నీవు, కథమ్ = ఎట్లు, ఇహ = ఇక్కడికి, ఆగతా = వచ్చినావు ?

తా. ఇది రాక్షసులు నివసించు ప్రదేశము. ఇక్కడికి గంధర్వులు గాని, దేవతలు గాని, కింనరులు గాని రారు, నీవెట్లు వచ్చినావు ?

మూ. ఇహ శాఖామృగాః సింహా ద్వీపివ్యాఘ్రమృగాస్తథా,
యక్షాస్తరక్షవః కఙ్కాః కథం తేభ్యో న బిభ్యసి. 29

ప్ర. అ. ఇహ = ఇక్కడ, శాఖామృగాః = వానరములు, సింహాః = సింహములు, ద్వీపివ్యాఘ్రమృగాః = చిరుతపులులు, చుక్కలపులులు, మృగములు, తథా = అట్లే, యక్షాః = యక్షులు, తరక్షవః = పెద్దపులులు, కఙ్కాః = రాబందులు (ఉండును). తేభ్యః = వాటినుండి, కథమ్ = ఎట్లు, న బిభ్యసి = (నీవు) భయపడుటలేదు.

తా. ఇక్కడ కోతులు, సింహాలు, చారలపులులు, చుక్కలపులులు, యక్షులు, పెద్దపులులు, రాబందులు తిరుగుచుండును. వాటిని చూచి నీకు భయము కలుగుటలేదా ? 29

మూ. మదాన్వితానాం ఘోరాణాం కుఞ్జరాణాం తరస్వినామ్,
కథమేకా మహారణ్యే న బిభేషి వరాననే. 30

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠమైన ముఖము గలదానా ! మహారణ్యే = ఈ మహారణ్యములో, మదాన్వితానామ్ = మదముతో కూడిన, ఘోరాణామ్ = భయంకరములైన, తరస్వినామ్ = బలము గల, కుఞ్జరాణామ్ = ఏనుగులకు, ఏకా = ఒంటరిదానవై ననీవు, కథమ్ = ఎట్లు, న బిభేషి = భయపడుటలేదు ?

తా. సుందరమైన ముఖము గలదానా, ఈ అరణ్యములో ఒంటరిగా ఉన్న నీవు భయంకరములైన, మదించిన మహాబలము గల ఏనుగులకు ఎట్లు భయపడకున్నావు ? 30

మూ. కాసి కస్య కుతశ్చిత్త్వం కిం నిమిత్తం చ దణ్డకాన్,
ఏకా చరసి కల్యాణి ఘోరాన్ రాక్షససేవితాన్. 31

ప్ర. అ. కల్యాణి = మంగళప్రదురాలా ! త్వమ్ = నీవు, కా అసి = ఎవరవు ? కస్య = ఎవని దానవు ? కుతశ్చిత్ = ఎక్కడినుండి వచ్చినావు ? రాక్షససేవితాన్ = రాక్షసులచేత సేవింపబడిన, ఘోరాన్ = భయంకరములైన, దణ్డకాన్ = దండకారణ్యమును, ఏకా = ఒంటరిదానవై, కిం నిమిత్తమ్ = ఎందువలన, చరసి = సంచరించుచున్నావు ?

తా. మంగళ ప్రదురాలా ! నీవు ఎవరవు ? ఎవరిదానవు ? ఎక్కడినుండి వచ్చినావు ? రాక్షసులకు ఆశ్రయమైన భయంకరమైన ఈ దండకారణ్యములో (ఒంటరిగా) ఎందుకు సంచరించుచున్నావు ? 31

మూ. ఇతి ప్రశస్తా వైదేహీ రావణేన దురాత్మనా,
ద్విజాతివేషేణ హి తం దృష్ట్వా రావణమాగతమ్. 32
సర్వైరతిథిసత్కారైః పూజయామాస మైథిలీ

ప్ర. అ. దురాత్మనా = దురాత్ముడైన, రావణేన = రావణునిచేత, ఇతి = ఇట్లు, ప్రశస్తా = ప్రశంసించబడిన, మైథిలీ = జనకుని కూతురైన, వైదేహీ = సీత, ద్విజాతివేషేణ = బ్రాహ్మణవేషముతో, ఆగతమ్ = వచ్చిన, తం రావణమ్ = ఆ రావణుని, దృష్ట్వా = చూచి, సర్వైః = సమస్తమైన, అతిథిసత్కారైః = అతిథి సత్కారములతో, పూజయామాస = పూజించెను.

తా. దురాత్ముడైన రావణుడు ఈ విధముగా ప్రశంసించగా, జనకరాజ నందినియైన సీత, బ్రాహ్మణవేషములో వచ్చిన ఆ రావణుని చూచి, సమస్తమైన అతిథిసత్కారములతో పూజించెను. 32

మూ. ఉపనీయాసనం పూర్వం పాద్యేనాభినిమన్త్ర్య చ, 33
అబ్రవీత్సిద్ధమిత్యేవ తదా తం సౌమ్యదర్శనమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, పూర్వమ్ = ముందుగా, ఆసనమ్ = ఆసనమును, ఉపనీయ = సమర్పించి, పాద్యేన = పాద్యముతో, అభినిమన్త్ర్య చ = ఆమంత్రణము చేసి, సౌమ్యదర్శనమ్ = సౌమ్యమైన దర్శనము గల, తమ్ = ఆతనిని గూర్చి, సిద్ధమ్ ఇత్యేవ = సిద్ధమైన దని, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు సీత ఆతనికి ముందు ఆసన మిచ్చి, పాద్యము కూడ ఇచ్చి, సౌమ్యుడుగా కనబడుచున్న ఆతనితో ''ఆహారము కూడ సిద్ధముగా ఉన్నది" అని పలికెను. 33

మూ. ద్విజాతివేషేణ సమీక్ష్య మైథిలీ
సమాగతం పాత్రకుసుమ్భధారిణమ్,

అశక్యముద్వేష్టుమపాయదర్శనమ్
న్యమన్త్రయద్బ్రాహ్మణవత్తదాఙ్గనా. 24

ప్ర. అ. తదా = అప్పుడు, మైథిలీ = మిధిలారాజకుమారియైన, అఙ్గనా = సీత, ద్విజాతివేషేణ = బ్రాహ్మణవేషముతో, సమాగతమ్ = వచ్చినవాడు, పాత్ర కుసుమ్భధారిణమ్=కమండలమును కాషాయవస్త్రమును ధరించినవాడు, ఉద్వేష్టుమ్ = ద్వేషించుటకు, అశక్యమ్ = శక్యము కానివాడు, అపాయదర్శనమ్=అపాయమునందు దృష్టి గలవాడు అయిన ఆతనిని, బ్రాహ్మణవత్ = బ్రాహ్మణుని వలె, న్యమన్త్రయత్ = ఆతిథ్యమునకై పిలచెను.

తా. కమండలమును కాషాయవస్త్రమును ధరించి బ్రాహ్మణవేషముతో వచ్చిన ఆ రావణుడు ద్వేషింపరాని ప్రశాంతుడైన వ్యక్తిగా కనబడుచుండెను. కాని ఆతడు సీతకు అపాయమునే తలబెట్టుచుండెను. అట్టి ఆ రావణుని చూచి ఆమె బ్రాహ్మణుణ్ణి ఎట్లు ఆతిథ్యమునకు నిమంత్రించవలెనో అట్లు నిమంత్రించెను. 34

మూ. ఇయం బృసీ బ్రాహ్మణ కామమాస్యతా
మిదం చ పాద్యం ప్రతిగృహ్యతామితి,
ఇదం చ సిద్ధం వనజాతముత్తమం
త్వదర్థమవ్యగ్రమిహోపభుజ్యతామ్. 35

ప్ర. అ. బ్రాహ్మణ = బ్రాహ్మణుడా! ఇయమ్ = ఇది, బృసీ = ఆసనము. కామమ్ = సుఖముగా, ఆస్యతామ్ = కూర్చుందువుగాక. ఇదమ్ = ఇది, పాద్యమ్ = పాద్యము, ప్రతిగృహ్యతామ్ = స్వీకరించబడుగాక. ఇతి = అని పలికెను. ఇదమ్ = ఇది, ఉత్తమమ్ = ఉత్తమమైన, వనజాతమ్ = వనములో పుట్టిన ఫలాదికము, త్వదర్థమ్ = నీకొరకు, సిద్ధమ్ = సిద్ధముగా ఉన్నది. ఇహ = ఇపుడు, అవ్యగ్రమ్ = తొందరలేకుండా, ఉపభుజ్యతామ్ = తినబడుగాక.

తా. ''ఓ! బ్రాహ్మణుడా ! ఇదిగో మునులు కూర్చుండే ఆసనము. సుఖముగా కూర్చుండుము ఇదిగో పాద్యము. స్వీకరింపుము. నీవు తినుటకై ఉత్తమమైన వనములో లభించే ఫలాదికము సిద్ధముగా ఉన్నది. తొందర లేకుండా తినుము.'' అని సీత పలికెను. 35

మూ. నిమన్త్ర్యమాణః ప్రతిపూర్ణభాషిణీం
నరేన్ద్రపత్నీం ప్రసమీక్ష్య మైథిలీమ్,
ప్రసహ్య తస్యాహరణే ధృతం మనః
సమర్పయత్స్వాత్మవధాయ రావణః. 36

ప్ర. అ. నిమన్త్ర్యమాణః = ఈ విధముగా నిమంత్రింపబడుచున్న, రావణః = రావణుడు, ప్రతిపూర్ణభాషిణీమ్ = నిండుగా మాటలాడుచున్న, నరేన్ద్రపత్నీమ్ = రాముని భార్యయైన, మైథిలీమ్ = సీతను, ప్రసమీక్ష్య = చూచి, స్వాత్మవధాయ = తన చావుకొరకే, ప్రసహ్య = బలాత్కరించి, తస్యాః = ఆమెయొక్క, హరణే = హరణమునందు, మనః = మనస్సును, ధృతమ్ = స్థిరముగా, సమర్పయత్ = సమర్పించెను.

తా. ఈ విధముగా నిండుగా మాటలాడుచు, ఆతిథ్యమును స్వీకరింపుమని పిలుచుచున్న ఆ సీతను చూచి రావణుడు ఆమెను బలాత్కారముగా అపహరింపవలె నని, తన చావునకే, మనస్సులో నిశ్చయముచేసుకొనెను. 36

మూ. తతః సువేషం మృగయాగతం పతిం
ప్రతీక్షమాణా సహలక్ష్మణం తదా,
వివీక్షమాణా హరితం దదర్శ త
న్మహద్వనం నైవ తు రామలక్ష్మణౌ. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సువేషమ్ = సుందరమైన ఆకారము గలవాడు, మృగయాగతమ్ = వేటకొరకు వెళ్ళినవాడూ అయిన, సహలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, పతిమ్ = భర్తను గూర్చి, ప్రతీక్షమాణా = నిరీక్షించుచున్న సీత, తదా = అప్పుడు, వివీక్షమాణా = నలువైపులా చూచుచు, హరితమ్ = ఆకుపచ్చని రంగు గల, తత్ = ఆ, మహత్ = గొప్పదైన, వనమ్ = వనమును, దదర్శ = చూచెను. రామలక్ష్మణౌ తు = రామలక్ష్మణులనైతే, నైవ = చూడలేదు.

తా. వేటకై వెళ్ళిన, సుందరమైన ఆకారము గల లక్ష్మణసమేతుడైన రామునికొరకై నిరీక్షించుచు, నలువైపులా చూచుచున్న సీతకు ఆకుపచ్చని ఆ మహారణ్యమే కనబడెను. రామలక్ష్మణులు మాత్రము కనబడలేదు. 37

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో నలుబదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తచత్వారింశః సర్గః

[సీత రాముణ్ణి గుర్చి తనను గూర్చి రావణునకు చెప్పి తాము వనమునకు ఎందుచేత వచ్చినారో చెప్పుట. నా పట్టపురాణివి కమ్మని రావణుడు ఆమెను కోరుట. సీత అతనిని నిందించుట].

మూ. రావణేన తు వైదేహీ తదా పృష్టా జిహీర్షుణా,
పరివ్రాజకరూపేణ శశంసాత్మానమాత్మనా. 1

ప్ర. అ. తదా = అప్పుడు, జిహీర్షుణా = అపహరించుటకు కోరుచున్న, పరివ్రాజకరూపేణ = సంన్యాసిరూపములో ఉన్న, రావణేన = రావణునిచేత, పృష్టా = అడగబడిన, వైదేహీ = సీత, ఆత్మానమ్ = తనను గూర్చి, ఆత్మనా = స్వయముగా, శశంస = చెప్పెను.

తా. తనను అపహరించుటకై కోరుచున్న, సంన్యాసిరూపము ధరించిన, రావణుడు ఇట్లు ప్రశ్నించగా సీత తనను గూర్చి తానే ఇట్లు చెప్పెను. 1

మూ. బ్రాహ్మణశ్చాతిథిశ్చాయమనుక్తో హి శపేత మామ్,
ఇతి ధ్యాత్వా ముహూర్తం తు సీతా వచనమబ్రవీత్. 2

ప్ర. అ. బ్రాహ్మణశ్చ = బ్రాహ్మణుడు, అతిథిశ్చ = అతిథీ అయిన, అయమ్ = ఇతడు, అనుక్తః = చెప్పబడనివాడై, మామ్ = నన్ను, శపేత హి = శపించును కదా. ఇతి = అని, ముహూర్తమ్ = క్షణకాలము, ధ్యాత్వా = ఆలోచించి, సీతా = సీత, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ''ఇతడు బ్రాహ్మణుడు, అతిథిగా కూడ వచ్చినాడు; నేను చెప్పనిచో శపించవచ్చును''అని క్షణకాలము ఆలోచించి సీత ఇట్లు పలికెను. 2

మూ. దుహితా జనకస్యాహం మైథిలస్య మహాత్మనః,
సీతా నామ్నాస్మి భద్రం తే రామభార్యా ద్విజోత్తమ. 3

ప్ర. అ. ద్విజోత్తమ = ఓ! బ్రాహ్మణశ్రేష్ఠుడా! అహమ్ = నేను, మైథిలస్య = మిథిలాధిపతి, మహాత్మనః = మహాత్ముడు అయిన, జనకస్య = జనకుని యొక్క, దుహితా = కుమార్తెను. నామ్నా = పేరుచేత, సీతా అస్మి = సీతను. రామభార్యా = రాముని భార్యను, తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. ఓ! బ్రాహ్మణోత్తమా! నేను మిథిలాధిపతియైన మహాత్ముడైన జనకుని కుమార్తెను. రాముని భార్యను. నా పేరు సీత. నీకు క్షేమ మగుగాక. 3

మూ. ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే,
భుఞ్జానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ. 4

ప్ర. అ. ద్వాదశ = పన్రెండు, సమాః = సంవత్సరములు, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజులయొక్క, నివేశనే = గృహమునందు, ఉషిత్వా = ఉండి, మానుషాన్ = మనుష్యులకు లభ్యములైన, భోగాన్ = భోగములను, భుఞ్జానా = అనుభవించుచున్నదాననై, సర్వకామసమృద్ధినీ = సమస్తభోగముల సమృద్ధి కల దాననై (ఉంటిని).

తా. నేను సకలభోగములు సమృద్ధిగా లభింపగా, మనుష్యులు ఏ యే భోగములు అనుభవించగలరో ఆ భోగము లన్నీ అనుభవించుచు, పన్నెండు సంవత్సరములు ఇక్ష్వాకువంశీయుడైన దశరథుని గృహములో ఉంటిని. 4

మూ. తతస్త్రియోదశే వర్షే రాజామన్త్రియత ప్రభుః,
అభిషేచయితుం రామం సమేతో రాజమన్త్రిభిః. 5

ప్ర.అ. తతః = అటుపిమ్మట, ప్రభుః = ప్రభువైన, రాజా = దశరథమహారాజు, త్రయోదశే వర్షే = పదమూడవ సంవత్సరమునందు, రాజమన్త్రిభిః = రాజమంత్రులతో, సమేతః = కూడినవాడై, రామమ్ = రాముణ్ణి, అభిషేచయితుమ్ = అభిషిక్తునిచేయుటకు, అమన్త్రయత = ఆలోచించెను.

తా. పిదప, పదమూడవ సంవత్సరమునందు, ప్రభువైన దశరథమహారాజు, రామునకు పట్టాభిషేకము చేయవలె నని తన మంత్రులతో ఆలోచించెను.

మూ. తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవస్యాభిషేచనే,
కైకేయీ నామ భర్తారమార్యా సా యాచతే వరమ్. 6

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, తస్మిన్ = ఆ, అభిషేచనే = అభిషేకము, సంభ్రియమాణే = ఏర్పరుపబడుచున్న దగుచుండగా, కైకేయీ నామ = కైకేయిఅను, సా = ఆ, ఆర్యా = పూజ్యురాలు, వరమ్ = వరమును, యాచతే = యాచించెను.

తా. రామునకు రాజ్యాభిషేకము చేయుటకు ఏర్పాట్లు జరుగుచుండగా కైకేయి అనే మా అత్త వరమును కోరెను. 6

మూ. ప్రతిగృహ్య తు కైకేయీ శ్వశురం సుకృతేన మే,
మమ ప్రవ్రాజనం భర్తుర్భరతస్యాభిషేచనమ్. 7
ద్వావయాచత భర్తారం సత్యసన్ధం నృపోత్తమమ్.

ప్ర. అ. కైకేయీ = కైకేయి, మే శ్వశురమ్ = నా మామగారిని, సుకృతేన = (తాను ఆతనికి చేసిన) ఉపకారముచేత, ప్రతిగృహ్య = నిగ్రహించి, సత్యసన్ధమ్ = సత్యమైన ప్రతిజ్ఞగల, నృపోత్తమమ్ = రాజులలో శ్రేష్ఠుడైన, భర్తారమ్ = భర్తను, మమ భర్తుః = నా భర్తయొక్క, ప్రవ్రాజనమ్ = అడవికి పంపుట, భరతస్య = భరతునియొక్క, అభిషేచనమ్ = అభిషేకము అను, ద్వౌ = ఈ రెండింటిని, అయాచత = కోరెను.

తా. కైకేయి, తాను పూర్వము చేసిన ఉపకారమును చూపి మా మామగారిని నిర్బంధించి, నా భర్తయైన రాముణ్ణి అరణ్యమునకు పంపుట, భరతునకు రాజ్యాభిషేకము చేయుట అను రెండువరము లిమ్మని సత్యసంధుడు, తన భర్త అయిన ఆ దశరథమహారాజును కోరెను. 7

మూ. నాద్య భోక్ష్యే న చ స్వప్స్యే న పాస్యే చ కథంచన, 8
ఏష మే జీవితస్యాన్తో రామో యద్యభిషిచ్యతే.

ప్ర. అ. అద్య = ఇప్పుడు, రామః = రాముడు, అభిషిచ్యతే యది = అభిషేకించబడినట్లయితే, న భోక్ష్యే = భుజించను. న చ స్వప్స్యే = నిద్రించను.

కథంచన = ఏవిధముగాను కూడ, న పాస్యే చ = పానముచేయను. ఏషః = ఇదే, మే = నాయొక్క, జీవితస్య = జీవితముయొక్క, అన్తః = అంతము.

తా. "ఇప్పుడు రామునకు పట్టాభిషేకము చేసినచో, ఏమైనను నేను అన్నము తినను; నీరు త్రాగను; నిద్రపోను. ఇదే నా జీవితానికి అంతము''. 8

మూ. ఇతి బ్రువాణాం కైకేయీం శ్వశురో మే స మానదః, 9
అయాచతార్థైరన్వర్థైర్న చ యాచ్ఞాం చకార సా,

ప్ర. అ. ఇతి = ఇట్లు, బ్రువాణామ్ = పలుకుచున్న, కైకేయీమ్ = కైకేయిని, మానదః = గౌరవమును ఇచ్చువాడైన, సః = ఆ, మే శ్వశురః = నా మామగారు, అన్వర్థైః = యథార్థములైన, అర్థైః = ధనములచేత, అయాచత = యాచించెను. సా = ఆమె, యాచ్ఞామ్ = ఆ యాచనను, న చ చకార = చేయలేదు.

తా. ఈ విధముగా పలుకుచున్న కైకేయి మాటలు విని, సత్కారములు చేయు నా మామగారు నిజమైన సుఖముల నిచ్చు ధనములను ఇచ్చెద నని చెప్పి ప్రార్థించెను. కాని ఆమె ఆ ప్రార్థనను వినలేదు. 9

మూ. మమ భర్తా మహాతేజా వయసా పఞ్చవింశకః, 10
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మమ భర్తా = నా భర్త, వయసా = వయస్సుచేత, పఞ్చవింశకః = ఇరువదియైదు సంవత్సరములవాడు. మమ = నాకు, జన్మని = జన్మయందు (నుండి), అష్టాదశ = పద్దెనిమిది, వర్షాణి = సంవత్సరములు, గణ్యతే = లెక్కింపబడుచున్నది.

తా. ఆ నాటికి నా భర్త వయస్సు ఇరువదియైదు సంవత్సరాలు. నా వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు.

వి. ఈ శ్లోకం ప్రాచ్యప్రతిలో లేదు. 10

మూ. రామేతి ప్రథితో లోకే గుణవాన్ సత్యవాన్ శుచిః, 11
విశాలాక్షో మహాబాహుః సర్వభూతహితే రతః.

ప్ర. అ. రామేతి = రాముడుఅని, లోకే = లోకమునందు, ప్రథితః = ప్రసిద్ధుడు, గుణవాన్ = గుణవంతుడు, సత్యవాన్ = సత్యవంతుడు, శుచిః = పరిశుద్ధుడు. విశాలాక్షః=విశాలములైన నేత్రములు కలవాడు, మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడు. సర్వభూతహితే = సమస్తభూతముల హితమునందు, రతః = ఆసక్తుడు.

తా. రాముడనే పేరుతో లోకములో ప్రసిద్ధుడైన నా భర్త గుణవంతుడు. సత్యవంతుడు. మనోవాక్కాయములందు పరిశుద్ధమైనవాడు, విశాలములైన నేత్రములు, గొప్ప బాహువులు కలవాడు. సకలభూతములకు హితమును కూర్చుటకు ఆసక్తికలవాడు. 11

మూ. కామార్తస్తు మహాతేజాః పితా దశరథః స్వయమ్, 12
కైకేయ్యాః ప్రియకామార్థం తం రామం నాభ్యషేచయత్.

ప్ర. అ. కామార్తః = కామముచేత పీడితుడైన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, పితా = తండ్రియైన, దశరథః = దశరథుడు, స్వయమ్ = స్వయముగా, కైకేయ్యాః=కైకేయియొక్క, ప్రియకామార్థమ్=ఇష్టమైన కోరికకొరకు, తం రామమ్ = ఆ రాముణ్ణి, నాభ్యషేచయత్ = అభిషేకించలేదు.

తా. మహాతేజఃశాలియైన దశరథుడు కామార్తుడై, కైకేయికి ప్రియమును చేయుటకై, స్వయముగ రాముణ్ణి రాజ్యాభిషిక్తుని చేయలేదు. 12

మూ. అభిషేకాయ తు పితుః సమీపం రామమాగతమ్, 13
కైకేయీ మమ భర్తారమిత్యువాచ ధృతం వచః.

ప్ర. అ. అభిషేకాయ = అభిషేకముకొరకు, పితుః = తండ్రియొక్క, సమీపమ్ = సమీపమునుగూర్చి, ఆగతమ్ = వచ్చిన, మమ భర్తారమ్ = నా భర్తయైన, రామమ్ = రాముణ్ణిగూర్చి, ఇతి = ఇట్లు, ధృతమ్ = నిశ్చితమైన, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. నా భర్తయైన రాముడు అభిషేకము నిమిత్తము తండ్రి దగ్గరకు వెళ్ళినపుడు కైకేయి, నిశ్చితముగా ఇట్లు పలికెను. 13

మూ. తవ పిత్రా సమాజ్ఞప్తం మమేదం శృణు రాఘవ. 14
భరతాయ ప్రదాతవ్యమిదం రాజ్యమకణ్టకమ్.

ప్ర. అ. రాఘవ = రామా! తవ = నీయొక్క, పిత్రా = తండ్రిచేత, సమాజ్ఞప్తమ్ = ఆజ్ఞాపించబడిన, ఇదమ్ = దీనిని, మమ = నాకు (నుండి), శృణు = వినుము. అకణ్టకమ్ = శత్రుబాధ లేని, ఇదం రాజ్యమ్ = ఈ రాజ్యము, భరతాయ = భరతునకు, ప్రదాతవ్యమ్ = ఇవ్వదగినది.

తా. "రామా! నీ తండ్రి ఆజ్ఞాపించిన విషయమును వినుము శత్రుబాధ లేవీ లేని ఈ రాజ్యము భరతునకు ఇవ్వవలెను.'' 14

మూ. త్వయా హి ఖలు వస్తవ్యం నవ వర్షాణి పఞ్చ చ, 15
వనే ప్రవ్రజ కాకుత్స్థ పితరం మోచయానృతాన్.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! త్వయా = నీచేత, నవ పఞ్చ చ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, వనే = వనమునందు, వస్తవ్యమ్‌ఖలు = నివసించ వలసి యున్నది; ప్రవ్రజ = అడవికి వెళ్ళుము. పితరమ్ = తండ్రిని, అనృతాత్ = అసత్యమునుండి, మోచయ = విడిపించుము.

తా. ''రామా! నీవు పదునాలుగు సంవత్సరములు అరణ్యములో నివసించవలెను, అందుచే నీవు వనమునకు వెళ్ళుము, నీ తండ్రిని అసత్యమునుండి కాపాడుము." 15

మూ. తథేత్యుక్త్వా చ తాం రామః కైకేయీమకుతోభయః, 16
చకార తద్వచస్తస్యా మమ భర్తా దృఢవ్రతః.

ప్ర. అ. అకుతోభయః = ఏ వైపునుండి భయము లేనివాడు, దృఢవ్రతః = దృఢమైన నియమము కలవాడు అయిన, మమ భర్తా = నా భర్తయైన, రామః = రాముడు, తథేతి = "అట్లే"అని, తామ్ = ఆ, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఉక్త్వా = పలికి, తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వచః = వచనమును, చకార = చేసెను.

తా. దేనికీ భయపడని వాడు, దృఢమైన నిశ్చయము కలవాడు అయిన

నా భర్త, రాముడు, ''అట్లే చేసెదను''అని ఆమెతో చెప్పి ఆమె మాట ప్రకారము చేసెను. 16

మూ. దద్యాన్న ప్రతిగృహ్ణీయాత్సత్యం బ్రూయాన్న చానృతమ్,
ఏతద్బ్రాహ్మణ రామస్య ధ్రువం వ్రతమనుత్తమ.

ప్ర. అ. దద్యాత్ = ఇచ్చును; న ప్రతిగృహ్ణీయాత్ = ప్రతిగ్రహించడు, సత్యమ్ = సత్యమును, బ్రూయాత్ = పలుకును, అనృతమ్ = అసత్యమును, న చ = పలకడు. బ్రాహ్మణ = ఓ ! బ్రాహ్మణుడా ! ఏతత్ = ఇది, రామస్య = రామునియొక్క, ధ్రువమ్ = నిశ్చితమైన, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, వ్రతమ్ = నియమము.

తా. బ్రాహ్మణుడా ! రాముడు ఇతరులకు దానము చేయును కాని తా నెన్నడు ఇతరులనుండి ప్రతిగ్రహించడు. సత్యమే పలుకును. అసత్యమును పలకడు. ఇది రాముని అత్యుత్తమమైన, స్థిరమైన నియమము. 17

మూ. తస్య భ్రాతా తు ద్వైమాత్రో లక్ష్మణో నామ వీర్యవాన్,
రామస్య పురుషవ్యాఘ్రః సహాయః సమరేఽరిహా.

ప్ర. అ. తస్య రామస్య = ఆ రామునియొక్క, ద్వైమాత్రః భ్రాతా = సవతి తమ్ముడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడు అయిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డనువాడు, సమరే = యుద్ధమునందు, సహాయః = సహాయుడు.

తా. పరాక్రమశాలి, పురుషులలో శ్రేష్ఠుడు, యుద్ధములో శత్రుసంహారము చేయువాడు, అయిన లక్ష్మణుడు రామునకు సవతి తమ్ముడు. అతడు రామునకు యుద్ధములలో సాహాయ్యము చేయుచుండును. 18

మూ. స భ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః, 19
అన్వగచ్ఛద్ధనుష్పాణిః ప్రవ్రజన్తం మయా సహ.

ప్ర. అ. ధర్మచారీ = ధర్మమును ఆచరించువాడు, దృఢవ్రతః = దృఢమైన నియమము కలవాడు అయిన, లక్ష్మణో నామ = లక్ష్మణు డను పేరు గల,

సః భ్రాతా = ఆ సోదరుడు, ధనుష్పాణిః = ధనస్సు హస్తమునందు కలవాడై, మయా సహ = నాతో కూడ, ప్రవ్రజన్తమ్ = అరణ్యమునకు వెళ్లుచున్న రాముణ్ణి, అన్వగచ్ఛత్ = అనుసరించెను.

తా. ధర్మము ఆచరించువాడు, దృఢమైన నియమము కలవాడు అయిన లక్ష్మణు డనే పేరు గల సోదరుడు, నాతో కలిసి అరణ్యమునకు వెళ్ళుచున్న ఆ రాముని వెనుక, ధనస్సు ధరించి అరణ్యమునకు వచ్చెను. 19

మూ. జటీ తాపసరూపేణ మయా సహ సహానుజః, 20
ప్రవిష్టో దణ్డకారణ్యం ధర్మనిత్యో జితేన్ద్రియః.

ప్ర. అ. ధర్మనిత్యః = నిత్యము ధర్మమునందే ఆసక్తి గల వాడు, జితేన్ద్రియః = జయించబడిన ఇంద్రియములు కలవాడు అయిన ఆ రాముడు, జటీ = జటలు కలవాడై, మయా సహ = నా తోను, సహానుజః = తమ్మునితో కూడినవాడై, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. నిత్యము ధర్మమును ఆచరించు స్వభావము గలవాడు, జితేంద్రియుడు అయిన రాముడు జటాధారియై, నాతోను, తమ్మునితోను కలిసి దండకారణ్యమునకు వచ్చినాడు. 20

మూ. తే వయం ప్రచ్యుతా రాజ్యాత్కైకేయ్యాస్తు కృతే త్రయః
విచరామో ద్విజశ్రేష్ఠ వనం గమ్భీరమోజసా.

ప్ర. అ. ద్విజశ్రేష్ఠ = బ్రాహ్మణశ్రేష్ఠుడా ! తే = అట్టి, వయమ్ = మేము, త్రయః = ముగ్గురము, కైకేయ్యాః కృతే = కైకేయి నిమిత్తమై, రాజ్యాత్ = రాజ్యమునుండి, ప్రచ్యుతాః = భ్రష్టులమై, ఓజసా = తేజస్సుచేత, గమ్భీరమ్ = గంభీరమైన, వనమ్ = వనమును, విచరామః = సంచరించుచున్నాము.

తా. బ్రాహ్మణశ్రేష్ఠుడా ! మేము ముగ్గురము కైకేయి మూలాన రాజ్యభ్రష్టులమై కేవలము బలసాహాయ్యముతో, ఈ గంభీరమైన వనములో సంచరించుచున్నాము.

మూ. సమాశ్వస ముహూర్తం తు శక్యం వస్తుమిహ త్వయా, 22
ఆగమిష్యతి మే భర్తా వన్యమాదాయ పుష్కలమ్.
రురూన్ గోధా వరాహాంశ్చ హత్వాదాయామిషాన్ బహూన్

ప్ర. అ. ముహూర్తమ్ = ముహూర్తకాలము పాటు, సమాశ్వస = విశ్రమించుము. త్వయా = నీచేత, ఇహ = ఇక్కడ, వస్తుమ్ = నివసించుటకు, శక్యమ్ = శక్యము, మే భర్తా = నా భర్త, రురూన్ = జింకలను, గోధాః = ఉడుములను, వరాహాంశ్చ = అడవిపందులను, హత్వా = చంపి, బహూన్ = అనేకమైన, ఆమిషాన్ = మాంసములను, ఆదాయ = గ్రహించి, పుష్కలమ్ = సమృద్ధముగా, వన్యమ్ = వనమునందు లభించు పదార్థజాతమును, ఆదాయ = గ్రహించి, ఆగమిష్యతి = రాగలడు.

తా. ఒక్క ముహూర్తము పాటు వేచి ఉండుము, నీవు ఇక్కడ నివసించవచ్చును. నా భర్త జింకలను, ఉడుములను, వరాహములను చంపి వాటి మాంసములను, ఇంకా ఇతరవన్యపదార్థములను సమృద్ధిగా తీసికొనివచ్చును.

మూ. స త్వం నామ చ గోత్రం చ కులం చాచక్ష్వ తత్త్వతః,
ఏకశ్చ దణ్డకారణ్యే కిమర్థం చరసి ద్విజ. 24

ప్ర. అ. ద్విజ = బ్రాహ్మణుడా ! సఃత్వమ్ = ఆ ఈనీవు, నామచ = నీపేరును, గోత్రంచ = గోత్రమును, కులంచ = కులమును, తత్త్వతః = యథార్థముగా, ఆచక్ష్వ = చెప్పుము. ఏకఃచ = ఒంటరిగా, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, కిమర్థమ్ = ఎందుకు, చరసి = సంచరించుచున్నావు ?

తా. బ్రాహ్మణుడా ! నీవు నీ పేరు, గోత్రము, కులము యథార్థముగా చెప్పుము; నీవు ఒంటరిగా దండకారణ్యములో ఎందుకు తిరుగుచున్నావు ? 24

మూ. ఏవం బ్రువన్త్యాం సీతాయాం రామపత్న్యాం మహాబలః,
ప్రత్యువాచోత్తరం తీవ్రం రావణో రాక్షసాధిపః. 25

ప్ర. అ. రామపత్న్యామ్ = రాముని భార్యయైన, సీతాయామ్ = సీత, ఏవమ్ = ఇట్లు, బ్రువన్త్యామ్ = పలుకుచుండగా, మహాబలః = గొప్ప బలముగల, రాక్షసాధిపః = రాక్షసప్రభువైన, రావణః = రావణుడు, తీవ్రమ్ = తీవ్రమైన, ఉత్తరమ్ = బదులును, ప్రత్యువాచ = పలికెను.

తా. రాముని భార్యయైన సీత మాటలు విని, మహాబలశాలి రాక్షసప్రభువు అయిన రావణుడు తీవ్రమైన బదులు చెప్పెను. 25

మూ. యేన విత్రాసితా లోకాః సదేవాసురపన్నగాః,
అహం తు రావణో నామ సీతే రక్షోగణేశ్వరః. 26

ప్ర. అ. సీతే = సీతా ! అహమ్ = నేను, యేన = ఎవనిచేత, సదేవాసుర పన్నగాః = దేవతలతోను, అసురులతోను, పన్నగులతోను కూడిన, లోకాః = లోకములు, విత్రాసితాః = భయపెట్టబడినవో, అట్టి, రక్షోగణేశ్వరః = రాక్షస గణముల ప్రభువైన, రావణో నామ = రావణు డనువాడను.

తా. సీతా! నేను, దేవ-అసుర-పన్నగులతో సహా సకలలోకములను భయ పెట్టిన, రాక్షసరాజైన రావణుడను. 26

మూ. త్వాం తు కాఞ్చనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినామ్,
రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛామ్యనిన్దితే. 27

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడనిదానా ! కాఞ్చనవర్ణాభామ్ = బంగారు వర్ణముకాంతి గల, కౌశేయవాసినీమ్ = పట్టువస్త్రము ధరించిన, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, స్వకేషు = నాసంబంధమైన, దారేషు = భార్యలయందు, రతిమ్ = ఆనందమును, నాధిగచ్ఛామి = పొందజాలకున్నాను.

తా. దోషములు లేనిదానా ! బంగారము రంగు కాంతిగలిగి, పట్టువస్త్రము ధరించి యున్న నిన్ను చూచిన పిమ్మట నా భార్యలనుండి ఆనందము పొంద లేకుండా ఉన్నాను. 27

మూ. బహ్వీనాముత్తమస్త్రీణామాహృతానామిత స్తతః,
సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ. 28

ప్ర. అ. ఇత స్తతః = ఇక్కడినుంచి అక్కడినుంచి, ఆహృతానామ్ = తీసి కొనిరాబడిన, బహ్వీనామ్ = అనేకమైన, సర్వాసామేవ = సమస్తమైన, ఉత్తమస్త్రీ ణామ్ = ఉత్తమమైన స్త్రీలలో, మమ = నాయొక్క, అగ్రమహిషీ = ప్రధానమైన పట్టపురాణివిగా, భవ = అగుము. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. నేను ఎందరో ఉత్తమస్త్రీలను అనేకప్రదేశములనుండి తీసికొని వచ్చి నాను. నీవు వాళ్ల అందరిలోను ప్రధానురాలైన పట్టమహిషివి అగుము. నీకు మంగళ మగుగాక. 28

మూ. లఙ్కానామ సముద్రస్య మమ మధ్యే మహాపురీ,
సాగరేణ పరిక్షిప్తా నివిష్టా నగమూర్ధని. 29

ప్ర. అ. లఙ్కా నామ = లంక అను పేరు గల, మమ = నాయొక్క, మహాపురీ = గొప్ప పట్టణము, సముద్రస్య = సముద్రముయొక్క, మధ్యే=మధ్య యందున్నది. సాగరేణ = సముద్రముచేత, పరిక్షిప్తా = చుట్టబడిన ఆ లంక, నగ మూర్ధని = పర్వతాగ్రము మీద, నివిష్టా = ఏర్పరుపబడినది.

తా. నా నగరము పేరు లంక. అది సముద్రమధ్యమునం దున్నది; నాల్గు ప్రక్కల సముద్ర మున్న ఆ పట్టణము పర్వతాగ్రమునందు నిర్మింపబడినది. 29

మూ. తత్ర సీతే మయా సార్ధం వనేషు విహరిష్యసి,
న చారణ్యస్య వాసస్య స్పృహయిష్యసి భామిని. 30

ప్ర. అ. సీతే = సీతా! తత్ర = అక్కడ, మయా సార్ధమ్=నాతో కూడ, వనేషు = ఉద్యానవనములందు, విహరిష్యసి = విహరించగలవు. భామిని = ఓ ! సీతా! ఆరణ్యస్య=అరణ్యమునకు సంబంధించిన, వాసస్య=నివాసమునకు, న చ స్పృహయిష్యసి = అభిలషించవు.

తా. సీతా ! అక్కడ నీవు నాతో కలిసి ఉద్యానములలో విహరించవచ్చును. అప్పు డింక అరణ్యవాసమునందు నీకు అభిలాష ఉండదు. 30

మూ. పఞ్చ దాస్యః సహస్రాణి సర్వాభరణభూషితాః,
సీతే పరిచరిష్యన్తి భార్యా భవసి మే యది. 31

ప్ర. అ. సీతే=సీతా ! మే=నాయొక్క, భార్యా = భార్యవు, భవసి యది = అయినట్లయితే, సర్వాభరణభూషితాః = సమస్తమైన అభరణములచేత అలంక రించబడిన, పఞ్చ సహస్రాణి = ఐదు వేల, దాస్యః = దాసీలు, పరిచరిష్యన్తి = సేవ చేయగలరు.

తా. సీతా ! నీవు నాకు భార్యవైనట్లయితే అన్ని విధముల అలంకారములు అలంకరించుకొని ఉన్న ఐదు వేలమంది దాసీలు నీకు సేవచేయగలరు. 31

మూ. రావణేనైవముక్తా తు కుపితా జనకాత్మజా,
ప్రత్యువాచానవద్యాఙ్గీ తమనాదృత్య రాక్షసమ్. 32

ప్ర. అ. రావణేన = రావణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, అనవద్యాఙ్గీ = దోషములు లేని శరీరము గల, జనకాత్మజా = సీత, కుపితా = కోపించినదై, తమ్ = ఆ, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, అనాదృత్య = అనాదరముచేసి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ఎట్టి దోషములూ లేని శరీరము గల సీత రావణుని మాటలు విని, కోపించినదై, ఆ రాక్షసుణ్ణి నిందించుచు, ఇట్లు పలికెను. 32

మూ. మహాగిరిమివాకమ్ప్యం మహేన్ద్రసదృశం పతిమ్,
మహోదధిమివాక్షోభ్యమహం రామమనువ్రతా. 33

ప్ర. అ. మహాగిరిమివ = మహాపర్వతము వలె, అకమ్ప్యమ్ = కదల్చ శక్యము కానివాడు, మహేన్ద్రసదృశమ్ = మహేంద్రునితో సమానుడు, మహోదధిమివ = మహాసముద్రము వలె, అక్షోభ్యమ్ = క్షోభపెట్ట శక్యము కానివాడు, పతిమ్ = నా భర్త అయిన, రామమ్ = రాముణ్ణే, అహమ్ = నేను, అనువ్రతా = అనుసరించిన వ్రతము కలదానను.

తా. నా భర్తయైన రాముడు మహాపర్వతము వలె కదల్చ శక్యము కానివాడు. మహేంద్రుడు వంటివాడు. మహాసముద్రము వలె క్షోభింప చేయ శక్యము కానివాడు. నేను అట్టి రాముని విషయమునందే వ్రతము కలదానను. 33

మూ. సర్వలక్షణసంపన్నం న్యగ్రోధపరిమణ్డలమ్,
సత్యసన్ధం మహాభాగమహం రామమనువ్రతా. 34

ప్ర అ. అహమ్ = నేను, సర్వలక్షణసంపన్నమ్ = సకలలక్షణములతో కూడినవాడు, న్యగ్రోధపరిమణ్డలమ్ = వటవృక్షము వంటి వైశాల్యము కలవాడు, సతస్యన్ధమ్ = సత్యసంధుడు, మహాభాగమ్ = గొప్ప భాగ్యము కలవాడు అయిన, రామమ్ = రాముణ్ణి, అనువ్రతా = అనుసరించిన వ్రతము కలవాడను.

తా. రాముడు సర్వలక్షణసంపన్నుడు. వటవృక్షము వలె ఆశ్రితులకు

సుఖము కలిగించువాడు. సత్యసంధుడు. మహాభాగ్యవంతుడు. నేను అట్టి రాముణ్ణి మాత్రమే అనుసరించుట అను వ్రతము కలదానను. 34

మూ. మహాబాహుం మహోరస్కం సింహవిక్రాన్తగామినమ్,
నృసింహం సింహసంకాశమహం రామమనువ్రతా. 35

ప్ర. అ. అహమ్ = నేను, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడు, మహోరస్కమ్ = గొప్ప వక్షఃస్థలము కలవాడు, సింహవిక్రాన్తగామినమ్ = సింహమువంటి గమనము గలవాడు, నృసింహమ్ = మనుష్యులలో శ్రేష్ఠుడు, సింహసంకాశమ్ = సింహముతో సమానుడు అయిన, రామమ్ = రాముణ్ణి, అనువ్రతా = అనుసరించిన వ్రతము కలదానను.

తా. రాముడు మహాబాహువు, విశాలమైన వక్షస్థలము గలవాడు. నరులలో శ్రేష్ఠుడు. సింహము వంటివాడు. సింహము వలె నడచువాడు. నేను అట్టి రాముని యందే వ్రతము కలదానను. 35

మూ. పూర్ణచన్ద్రాననం రామం రాజవత్సం జితేన్ద్రియమ్,
పృథుకీర్తిం మహాత్మానమహం రామమనువ్రతా. 36

ప్ర. అ. అహమ్ = నేను, పూర్ణచన్ద్రాననమ్ = పూర్ణచంద్రునివంటి ముఖము కలవాడు, రాజవత్సమ్ = రాజకుమారుడు, జితేన్ద్రియమ్ = జయించబడిన ఇంద్రియములు కలవాడు, పృథుకీర్తిమ్ = గొప్ప కీర్తి గలవాడు, మహాత్మానమ్ = మహాత్ముడూ అయిన, రామమ్ = రాముణ్ణి, అనువ్రతా = అనుసరించిన వ్రతము కలదానను.

తా. రాజకుమారుడైన రాముడు పూర్ణచంద్రునివంటి ముఖము కలవాడు. ఇంద్రియములను జయించినవాడు. గొప్ప కీర్తి గల మహాత్ముడు. అట్టి రాముని యందే నేను వ్రతము కలదానను. 36

మూ. త్వం పునర్జమ్బుకః సింహీం మామిచ్ఛసి సుదుర్లభామ్,
నాహం శక్యా త్వయా స్ప్రష్టుమాదిత్యస్య ప్రభా యథా. 37

ప్ర. అ. జమ్బుకః = నక్కవైన, త్వం పునః = నాకైతే, సుదుర్లభామ్ = ఏ మాత్రము లభ్యురాలు కాని, సింహీమ్ = ఆడ సింహమైన, మామ్ = నన్ను,

ఇచ్ఛసి = కోరుచున్నావు, ఆదిత్యస్య = సూర్యునియొక్క, ప్రభా యథా = కాంతి వలె, అహమ్ = నేను, త్వయా = నీచేత, ప్రష్టుమ్ = స్పృశించుటకు, న శక్యా = శక్యురాలను కాను.

తా. నక్కవైన నీవు ఏ మాత్రము లభ్యురాలు కాని ఆడ సింహమైన నన్ను కోరుచున్నావు. సూర్యుని కాంతిని వలె నన్ను నీవు స్పృశించజాలవు. 37

మూ. పాదపాన్ కాఞ్చనాన్నూనం బహూన్ పశ్యసి మన్దభాక్,
రాఘవస్య ప్రియాం భార్యాం య స్త్వమిచ్ఛసి రావణ. 38

ప్ర. అ. రావణ = రావణా ! యః = ఏ, త్వమ్ = నీవు, రాఘవస్య = రామునియొక్క, ప్రియామ్ = ప్రియురాలైన, భార్యామ్ = భార్యను, ఇచ్ఛసి = కోరుచున్నావో, మన్దభాక్ = అల్పమైన ఆయుర్దాయాదులను పొందిన అట్టి నీవు, నూనమ్ = నిశ్చయముగా, కాఞ్చనాన్ = బంగారువికారమైన, పాదపాన్ = వృక్షములను, పశ్యసి = చూచుచున్నావు.

తా. రావణా : రాముని ప్రియురాలైన భార్యను కోరుచున్న మందమైన ఆయుర్దాయాదులు గల నీవు నిజముగా అనేకములైన బంగారు వృక్షములను చూచుచున్నావు. (మరణ మాసన్నమైన వారికి బంగారు వృక్షములు కనబడు నని ప్రసిద్ధి). 38

మూ. క్షుధితస్య హి సింహస్య మృగశత్రో స్తరస్వినః,
ఆశీవిషస్య వదనాద్దంష్ట్రామాదాతుమిచ్ఛసి. 39

ప్ర. అ. మృగశత్రోః = మృగముల శత్రువు, తరస్వినః = బలము కలది అయిన, క్షుధితస్య = ఆకలికొన్న, సింహస్య = సింహముయొక్క, ఆశీవిషస్య = సర్పముయొక్క, వదనాత్ = ముఖమునుండి, దంష్ట్రామ్ = కోరను, ఆదాతుమ్ = గ్రహించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. మృగాలకు శత్రువు చాలా బలము కలది అయిన ఆకలిగొన్న సింహము కోరను, మహాసర్పముకోరను లాగవలె నని కోరుచున్నావు. 39

మూ. మన్దరం పర్వతశ్రేష్ఠం పాణినా హర్తుమిచ్ఛసి,
కాలకూటం విషం పీత్వా స్వస్తిమాన్ గన్తుమిచ్ఛసి. 40

ప్ర. అ. పర్వతశ్రేష్ఠమ్=పర్వతములలో శ్రేష్ఠమైన, మన్దరమ్=మందర పర్వతమును, పాణినా = హస్తముతో, హర్తుమ్ = గ్రహించుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు. కాలకూటం విషమ్=కాలకూటవిషమును, పీత్వా = త్రాగి, స్వస్తిమాన్ = క్షేమవంతుడవై, గన్తుమ్ = వెళ్లుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. నీవు, పర్వతములలో శ్రేష్ఠమైన మందరపర్వతమును హస్తముతో గ్రహించవలె నని కోరుచున్నావు. కాలకూటవిషము త్రాగి సుఖముగా ఉండవలె ననుకొనుచున్నావు. 40

మూ. అక్షి సూచ్యా ప్రమృజసి జిహ్వయా లేక్షి చ క్షురమ్,
రాఘవస్య ప్రియాం భార్యాం యోఽధిగన్తుం త్వమిచ్ఛసి.

ప్ర. అ. యఃత్వమ్=ఏ నీవు, రాఘవస్య=రామునియొక్క, ప్రియామ్=ప్రియురాలైన, భార్యామ్ = భార్యను, అధిగన్తుమ్ = పొందుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావో, అట్టి నీవు, సూచ్యా = సూదితో, అక్షి = నేత్రమును, ప్రమృజసి = తుడుచుకొనుచున్నావు. జిహ్వయా = నాలుకతో, క్షురమ్ = కత్తిని, లేక్షి = నాకుచున్నావు.

తా. రాముని ప్రియురాలైన భార్యను నీవు పొందవలె నని కోరుచున్నావనగా నీవు సూదితో నేత్రము తుడుకొనుచున్నావు, నాలుకతో మంగలి కత్తి నాకుచున్నావు. 41

మూ. అవసజ్య శిలాం కణ్ఠే సముద్రం తర్తుమిచ్ఛసి,
సూర్యాచన్ద్రమసౌ చోభౌ పాణిభ్యాం హర్తుమిచ్ఛసి. 42
యో రామస్య ప్రియాం భార్యాం ప్రధర్షయితుమిచ్ఛసి.

ప్ర. అ. యః = ఏ నీవు, రామస్య = రామునియొక్క, ప్రియామ్ = ప్రియురాలైన, భార్యామ్ = భార్యను, ప్రధర్షయితుమ్ = అవమానించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, అట్టి నీవు, కణ్ఠే = కంఠమునందు, శిలామ్ = శిలను, అవసజ్య = కట్టుకొని, సముద్రమ్ = సముద్రమును, తర్తుమ్ = దాటుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు, సూర్యాచన్ద్రమసౌ = సూర్యచంద్రులను, ఉభౌ = ఇద్దరినీ, పాణిభ్యామ్ = హస్తములచేత, హర్తుమ్ = హరించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. రాముని ప్రియురాలైన భార్యను అవమానింపదలచుచున్నా వనగా నీవు పెద్ద జాతిబండను మెడకు కట్టుకొని సముద్రము దాట గోరుచున్నావు. చేతులతో సూర్యచంద్రుల నిద్దరిని హరించ వలె నని కోరుచున్నావు. 42

మూ. అగ్నిం ప్రజ్వలితం దృష్ట్వా వస్త్రేణాహర్తుమిచ్ఛసి, 43
కాల్యాణవృత్తాం రామస్య యో భార్యాం హర్తుమిచ్ఛసి.

ప్ర. అ. యః = ఏ నీవు, రామస్య = రామునియొక్క, కల్యాణవృత్తామ్ = మంగళకర మైన చరిత్ర గల, భార్యామ్ = భార్యను, హర్తుమ్ = హరించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో అట్టి నీవు, ప్రజ్వలితమ్ = మండుచున్న, అగ్నిమ్ = అగ్నిని, దృష్ట్వా = చూచి, వస్త్రేణ = వస్త్రముచేత, ఆహర్తుమ్ = గ్రహించి తీసికొని వచ్చుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. నీవు ఉత్తమచరిత్రవంతురాలైన రాముని భార్యను హరింపకోరుచున్నా వనగా, మండుచున్న అగ్నిని చూచి, దానిని వస్త్రములో మూటకట్టుకొనుటకు కోరుచున్నావు. 43

మూ. అయోముఖానాం శూలానామగ్రే చరితుమిచ్ఛసి, 44
రామస్య సదృశీం భార్యాం యోఽధిగన్తుం త్వమిచ్ఛసి.

ప్ర. అ. యః త్వమ్ = ఏ నీవు, రామస్య = రామునియొక్క, సదృశీమ్ = తగిన, భార్యామ్ = భార్యను, అధిగన్తుమ్ = పొందుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, అట్టి నీవు, అయోముఖానామ్ = ఇనుపకొనలు గల, శూలానామ్ = శూలముల యొక్క, అగ్రే = చివరి భాగముల మీద, చరితుమ్ = నడుచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. రామునికి తగిన అతని భార్యను పొందకోరుచున్నా వనగా, నీవు ఇనుప కొన లున్న శూలముల చివరి భాగముల మీద నడవవలె నని కోరు చున్నావు. 44

మూ. యదన్తరం సింహశృగాలయోర్వనే
యదన్తరం స్యన్దినికా సముద్రయోః.
సురాగ్ర్యసౌవీరకయోర్యదన్తరం
తదన్తరం వై తవ రాఘవస్య చ. 45

ప్ర. అ. వనే = వనమునందు, సింహశృగాలయోః = సింహమునకు నక్కకు, యత్ = ఏ, అన్తరమ్ = భేద మున్నదో, స్యన్దినికాసముద్రయోః = బోదెకాలువకు సముద్రానికి, యత్ = ఏ, అన్తరమ్ = భేదమున్నదో, సురాగ్ర్య సౌవీరకయోః = అమృతమునకు (లేదా శ్రేష్ఠమైన మద్యమునకు) కడుగునీళ్లకు, యత్ = ఏ, అన్తరమ్ = భేదమున్నదో, తవ = నీకు, రాఘవస్య చ = రామునకు తత్ = ఆ, అన్తరమ్ = భేదమున్నది.

తా. వనములో నివసించే సింహానికి నక్కకి ఎంత భేదమో, చిన్న బోదికాలవకు సముద్రానికి ఎంత భేదమో, ఉత్తమమైన మద్యానికి కడుగునీళ్లకు ఎంత భేదమో, నీకూ రామునకూ కూడ అంత భేద మున్నది. 45

మూ. యదన్తరం కాఞ్చనసీసలోహయో
ర్యదన్తరం చన్దనవారిపఙ్కయోః,
యదన్తరం హస్తిబిడాలయోర్వనే
తదన్తరం దాశరథేస్తవైవ చ. 46

ప్ర. అ. కాఞ్చనసీసలోహయోః = బంగారమునకు, సీసమునకు, యత్ = ఏ, అన్తరమ్ = భేదమో, చన్దనవారిపఙ్కయోః = మంచిగంధమునీటికి బురదకు, యత్ = ఏ, అన్తరమ్ = భేదమో, దాశరథేః = రామునకు, తవైవ చ = నీకూ, తత్ = అదే, అన్తరమ్ = భేదము.

తా. బంగారానికి సీసానికి ఎంత భేదమో, మంచి గంధము నీటికి బురదకు ఎంత భేదమో, వనములో నివసించే ఏనుగకు పిల్లికీ ఎంత భేదమో, నీకు రామునకు ఉన్న భేదము కూడ అంతే. 46

మూ. యదన్తరం వాయసవైనతేయయో
ర్యదన్తరం మద్గుమయూరయోరపి,
యదన్తరం సారసగృధ్రయోర్వనే
తదన్తరం దాశరథేస్తవైవ చ. 47

ప్ర. అ. వాయసవైనతేయయోః = కాకికి గరుత్మంతునికి, యత్ = ఏ, అన్తరమ్ = భేదమో, మద్గుమయూరయోరపి = నీటికాకికి నెమలికి, యత్ = ఏ.

అన్తరమ్=భేదమో, వనే=వనమునందు, సారసగృధ్రయోః=హంసకు, గ్రద్దకు, యత్ = ఏ, అన్తరమ్ = భేదమో, దాశరథేః = రామునకు, తవైవ చ = నీకూ, తత్ = ఆ, అన్తరమ్ = భేదమే.

తా. కాకికి గరుత్మంతునకూ ఎంత భేదమో, నీటికాకికి నెమలికి ఎంత భేదమో, వనములో హంసకూ గ్రద్దకూ ఎంత భేదమో, రామునకూ నీకూ అంతే భేదము. 47

మూ. తస్మిన్సహస్రాక్షసమప్రభావే
రామే స్థితే కార్ముకబాణపాణౌ,
హృతాపి తేఽహం న జరాం గమిష్యే
వజ్రం యథా మక్షికయావగీర్ణమ్. 48

ప్ర. అ. హృతాపి = హరింపబడినదాననైనను, అహమ్ = నేను, సహస్రాక్షసమప్రభావే = దేవేంద్రునితో సమానమైన ప్రభావము గల, కార్ముకబాణపాణౌ=ధనస్సు బాణములూ హస్తములందు గల, తస్మిన్ = ఆ, రామే= రాముడు, స్థితే = నిలచియుండగా, మక్షికయా = ఈగచేత, అవగీర్ణమ్=మ్రింగబడిన, వజ్రం యథా = వజ్రము వలె, తే = నీకు, జరాం న గమిష్యే = జీర్ణము కాను.

తా. నీవు నన్ను అపహరించినా కూడ, ఇంద్రునితో సమానమైన ప్రభావము గల ఆ రాముడు ధనుర్బాణములు ధరించి నిలబడినచో ఈగ మింగిన వజ్రమునువలె నీవు నన్ను జీర్ణము చేసికొనజాలవు. 48

మూ. ఇతీవ తద్వాక్యమదుష్టభావా
సుదుష్టముక్త్వా రజనీచరం తమ్,
గాత్రప్రకమ్పాద్వ్యథితా బభూవ
వాతోద్ధతా సా కదలీవ తన్వీ. 49

ప్ర. అ. అదుష్టభావా = దుష్టము కాని భావము గల, తన్వీ = సన్నని శరీరము గల, సా = ఆసీత, సుదుష్టమ్ = చాలా దుష్టమైన, తం రజనీచరమ్= ఆ రాక్షసుణ్ణి గూర్చి, తత్ =ఆ, వాక్యమ్=వాక్యమును, ఇతి = ఇట్లు, ఉక్త్వా =

పలికి, గాత్రప్రకమ్పాత్ = శరీరముయొక్క వణకువలన, వాతోద్ధతా = గాలి చేత ఎగురకొట్టబడిన, కదలీవ = అరటిచెట్టు వలె, వ్యథితా = వ్యథ చెందినది, బభూవ = ఆయెను.

తా. పరిశుద్ధమైన మనోభావము గల ఆ సీత చాల దుష్టుడైన ఆ రాక్షసునితో ఇట్లు పలికి, గాలికి ఊపివేయబడిన అరటి చెట్టు వలె, శరీరము వణకిపోగా వ్యథ పొందెను. 49

మూ. తాం వేపమానాముపలక్ష్య సీతాం
స రావణో మృత్యుసమప్రభావః,
కులం బలం నామ చ కర్మ చాత్మనః
సమాచచక్షే భయకారణార్థమ్. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. మృత్యుసమప్రభావః = మృత్యుదేవతతో సమానమైన ప్రభావము గల, సః = ఆ, రావణః = రావణుడు, వేపమానామ్ = వణకుచున్న, తామ్ = ఆమెను, ఉపలక్ష్య = చూచి, భయకారణార్థమ్ = భయముకొరకు, ఆత్మనః = తనయొక్క, కులమ్ = కులమును, బలం చ = బలమును, కర్మ చ = పనిని, సమాచచక్షే = చెప్పెను.

తా. మృత్యుదేవతతో సమానమైన ప్రభావము గల ఆ రావణుడు వణకిపోవుచున్న ఆ సీతను చూచి, ఆమెకు భయము కలిగించుటకై తన కులమును, బలమును, కర్మను గూర్చి చెప్పెను.

''బాలానందిని''అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో నలుబదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టచత్వారింశః సర్గః

[రావణుడు తన పరాక్రమమును వర్ణించి చెప్పుట. సీత ఆతనిని భయపెట్టుట.]

మూ. ఏవం బ్రువన్త్యాం సీతాయాం సంరబ్ధః పరుషం వచః,
లలాటే భ్రుకుటిం కృత్వా రావణః ప్రత్యువాచ హ. 1

ప్ర. అ. సీతాయామ్=సీత, ఏవమ్=ఇట్లు, బ్రువన్త్యామ్=చెప్పుచుండగా, రావణః=రావణుడు, సంరబ్ధః=కోపించినవాడై, లలాటే=లలాటమునందు, భ్రుకుటిమ్=భ్రుకుటిని, కృత్వా=చేసి, పరుషమ్ = పరుషమైన, వచః= వచనమును, ప్రత్యువాచ=తిరిగిపలికెను.

తా. రావణుడు సీత మాటలు విని, కుపితుడై, కనుబొమ్మలు విరచి పరుషముగా ఇట్లు పలికెను. 1

మూ. భ్రాతా వైశ్రవణస్యాహం సాపత్న్యో వరవర్ణిని,
రావణో నామ భద్రం తే దశగ్రీవః ప్రతాపవాన్. 2

ప్ర. అ. వరవర్ణిని=శ్రేష్ఠమైన శరీరవర్ణము గల సీతా ! అహమ్=నేను, వైశ్రవణస్య = కుబేరునియొక్క, సాపత్న్యః భ్రాతా=సవతితమ్ముడను. దశగ్రీవః=పది కంఠములు గల, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, రావణో నామ= రావణు డను ప్రసిద్ధి కలవాడను. తే=నీకు, భద్రమ్=మంగళ మగుగాక.

తా. సీతా ! నీకు మంగళ మగుగాక. పదికంఠములు కలవాడను, ప్రతాపవంతుడను అయిన నేను కుబేరుని సవతి తమ్ముడను; రావణు డని ప్రసిద్ధి పొందినవాడను. 2

మూ. యస్య దేవాః సగన్ధర్వాః పిశాచపతగోరగాః,
విద్రవన్తి భయాద్భీతా మృత్యోరివ సదా ప్రజాః. 3

ప్ర. అ. ప్రజాః = ప్రజలు, మృత్యోరివ = మృత్యువుయొక్క భయము వలన వలె, యస్య = ఎవనియొక్క, భయాత్ = భయమువలన, భీతాః = భయ పడినవారై, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, పిశాచపత గోరగాః = పిశాచములు, పతగములు, ఉరగములు, విద్రవన్తి = పారిపోవునో, (అట్టి రావణుడను).

తా. మత్యువునకు భయపడి జనులు పారిపోవునట్లు, నన్ను చూచి భయ పడి దేవతలు, గంధర్వులు, పిశాచములు, పతగములు, ఉరగములు దూరముగా పారిపోవుదురు. 3

మూ. యేన వైశ్రవణో రాజా ద్వైమాత్రః కారణాన్తరే,
దంద్వమాసాదితః క్రోధాద్రణే విక్రమ్య నిర్జితః. 4

ప్ర. అ. యేన = ఎవనిచేత, కారణాన్తరే = ఒకానొక కారణమునందు, క్రోధాత్ = కోపమువలన, ద్వన్ద్వమ్ ఆసాదితః = ద్వంద్వ యుద్ధమును పొందింప బడిన, ద్వైమాత్రః = సవతితల్లి కొడుకైన, వైశ్రవణః రాజా = కుబేరుడు, రణే = యుద్ధమునందు, విక్రమ్య = పరాక్రమించి, నిర్జితః = జయింపబడినాడో.

తా. నేను కారణాంతరములచే కోపించి, నా సవతితల్లి కుమారుడైన కుబేరునితో యుద్ధము చేసి పరాక్రమముచేత ఆతనిని జయించితిని. 4

మూ. యద్భయార్తః పరిత్యజ్య స్వమధిష్ఠానమృద్ధిమత్,
కైలాసం పర్వతశ్రేష్ఠమధ్యాస్తే నరవాహనః. 5

ప్ర. అ. నరవాహనః = కుబేరుడు, యద్భయార్తః = ఎవనినుండి భయము వలన పీడితుడై, ఋద్ధిమత్ = ఐశ్వర్యసంపన్నమైన, స్వమ్ = తన సంబంధమైన, అధిష్ఠానమ్ = స్థానమును, పరిత్యజ్య = విడచి, పర్వతశ్రేష్ఠమ్ = పర్వతములలో శ్రేష్ఠమైన, కైలాసమ్ = కైలాసమును, అధ్యాస్తే = అధిష్ఠించి యున్నాడో.

తా. కుబేరుడు నా భయముచే పీడితుడై ఐశ్వర్యసంపన్నమైన తన నివాసనగరమును విడచి పర్వతశ్రేష్ఠమైన కైలాసముమీద నివసించుచున్నాడు. 5

మూ. యస్య తత్పుష్పకం నామ విమానం కామగం శుభమ్,
వీర్యాదేవార్జితం భద్రే యేన యామి విహాయసమ్. 6

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా! యస్య = ఏ కుబేరునియొక్క, తత్ = ఆ, పుష్పకం నామ = పుష్పక మను పేరు గల, కామగమ్ = ఇచ్ఛాను సారము వెళ్లే, శుభమ్ = మంగళకరమైన, విమానమ్ = విమానము, వీర్యాదేవ = పరాక్రమమువలననే, (నాచేత), ఆర్జితమ్ = సంపాదింపబడినదో. యేన = ఏ విమానముచేత, విహాయసమ్ = ఆకాశమును గూర్చి, యామి = వెళ్లుచున్నానో.

తా. మంగళప్రదురాలా! ఇచ్ఛానుసారము ప్రయాణము చేసే, మంగళ ప్రదమైన పుష్పకమను పేరు గల విమానము ఆ కుబేరునిదే. నేను దానిని పరాక్రమముచేత ఆతనినుండి సంపాదించి, దానిపై ఎక్కి ఆకాశమునందు సంచరించుచుందును. 6

మూ. మమ సంజాతరోషస్య ముఖం దృష్ట్వైవ మైథిలి,
విద్రవన్తి పరిత్రస్తాః సురాః శక్రపురోగమాః. 7

ప్ర. అ. మైథిలి = సీతా! సంజాతరోషస్య = పుట్టిన కోపము గల, మమ = నాయొక్క, ముఖమ్ = ముఖమును, దృష్ట్వైవ = చూడగానే, పరిత్రస్తాః = భయపడినవారై, శక్రపురోగమాః = దేవేంద్రుడు నాయకుడుగా గల, సురాః = దేవతలు, విద్రవన్తి = పారిపోవుదురు.

తా. సీతా! నాకు కోపము వచ్చి నట్లు చూడగానే, భయపడిపోయి, దేవేంద్రుడు మొదలైన దేవత లందరూ పారిపోవుదురు. 7

మూ. యత్ర తిష్ఠామ్యహం తత్ర మారుతో వాతి శఙ్కితః,
తీవ్రాంశుః శిశిరాంశుశ్చ భయాత్సంపద్యతే రవిః. 8

ప్ర. అ. అహమ్ = నేను, యత్ర = ఎక్కడ, తిష్ఠామి = ఉందునో, తత్ర = అక్కడ, మారుతః = వాయువు, శఙ్కితః = భయపడుచున్నవాడై. వాతి = వీచును. తీవ్రాంశుః = తీవ్రమైన కిరణములు గల, రవిః చ = సూర్యుడు కూడ, భయాత్ = భయమువలన, శిశిరాంశుః = చల్లని కిరణములు కలవాడుగా, సంపద్యతే = అగును.

తా. నేను నిలచి ఉన్న చోట వాయువు భయపడుచూ వీచును. తీవ్రములైన కిరణములు గల సూర్యుడు కూడ తన కిరణములను చల్లగా చేయును. 8

మూ. నిష్కమ్పపత్రాస్తరవో నద్యశ్చ స్తిమితోదకాః,
భవన్తి యత్ర యత్రాహం తిష్ఠామి విచరామి చ. 9

ప్ర. అ. అహమ్ = నేను, యత్ర యత్ర = ఎక్కడెక్కడ, తిష్ఠామి = నిలబడుదునో, విచరామి చ = సంచరించుదునో అక్కడ, తరవః=వృక్షములు, నిష్కమ్పపత్రాః = కదలని ఆకులు కలవిగాను, నద్యశ్చ = నదులు, స్తిమితోదకాః = నిశ్చలమైన ఉదకము కలవిగాను, భవన్తి = అగును.

తా. నేను ఎక్కడ ఉందునో, నేను ఎక్కడ సంచరింతునో అక్కడ చెట్లు ఆకులు కూడ కదల్చవు; నదులు మందముగా ప్రవహించును. 9

మూ. మమ పారే సముద్రస్య లఙ్కా నామ పురీ శుభా,
సంపూర్ణా రాక్షసైర్ఘోరైర్యథేన్ద్రస్యామరావతీ. 10

ప్ర. అ. ఘోరైః=భయంకరులైన, రాక్షసైః=రాక్షసులతో, సంపూర్ణా= నిండినదీ, లఙ్కా నామ = లంక అను పేరు గలదీ, శుభా = సుందరమైనదీ, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, అమరావతీవ = అమరావతి వంటిదీ అయిన, మమ = నాయొక్క, పురీ = పట్టణము, సముద్రస్య = సముద్రముయొక్క, పారే = అవతలి ఒడ్డునందు ఉన్నది.

తా. సుందరమైన నా లంకాపట్టణము ఇంద్రుని అమరావతి వంటిది. భయంకరులైన రాక్షసులతో నిండిన ఆ పట్టణము సముద్రము అవలి ఒడ్డునందున్నది. 10

మూ. ప్రాకారేణ పరిక్షిప్తా పాణ్డురేణ విరాజతా,
హేమకక్ష్యా పురీ రమ్యా వైడూర్యమయతోరణా. 11

ప్ర. అ. రమ్యా=సుందరమైన, పురీ=ఆ పట్టణము, పాణ్డురేణ=తెల్లని, విరాజతా = ప్రకాశించుచున్న, ప్రాకారేణ = ప్రాకారముచేత, పరిక్షిప్తా = చుట్టబడినది. హేమకక్ష్యా=బంగారు మేడలు గలది; వైడూర్యమయతోరణా=వైడూర్యమాణిక్యవికారమైన తోరణములు గలది.

తా. సుందరమైన ఆ లంకాపట్టణము చుట్టూ తెల్లగా ప్రకాశించుచున్న

ప్రాకారము, దానిలో బంగారు మేడలు, వైదూర్యమణివికారమైన తోరణములు ఉన్నవి. 11

మూ. హస్త్యశ్వరథసంబాధా తూర్యనాదవినాదితా,
సర్వకాలఫలైర్వృక్షైః సంకులోద్యానశోభితా. 12

ప్ర. అ. హస్త్యశ్వరథసంబాధా = గజములతోను, అశ్వములతోను, రథములతోను ఇరుకుగా ఉన్నది. తూర్యనాదవినాదితా = తూర్యముల ధ్వనులచేత ధ్వనింపచేయబడినది, సర్వకాలఫలైః = సర్వకాలములయందు ఫలములు గల, వృక్షైః = వృక్షములతో, సంకులోద్యానశోభితా = నిండిన ఉద్యానములచేత ప్రకాశింపచేయబడినది.

తా. ఆ లంకాపట్టణము ఏనుగులతోను, అశ్వములతోను, రథములతోను కిక్కిరిసి ఉండును. మంగళవాద్యముల ధ్వనులతో మారుమ్రోగుచుండును. అన్ని కాలములందు ఫలముల నిచ్చే వృక్షములతో నిండిన ఉద్యానవనములతో శోభించుచుండును. 12

మూ. తత్ర త్వం వసతీ సీతే రాజపుత్రి మయా సహ,
న స్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్విని. 13

ప్ర. అ. రాజపుత్రి = రాజకుమారీ ! మనస్విని = మానవంతురాలా ! సీతే = సీతా ! తత్ర = ఆ లంకాపట్టణమునందు, మయా సహ = నాతో కూడ, వసతీ = నివసించుచున్నదానవై, మానుషీణామ్ = మనుష్యజాతికి సంబంధించిన, నారీణామ్ = స్త్రీలకు (ను), న స్మరిష్యసి = స్మరించవు.

తా. రాజపుత్రివి, మానవంతురాలూ అయిన సీతా ! నీవు నాతో కలిసి ఆ లంకాపట్టణములో నివసించినట్లయితే మనుష్యస్త్రీల నెవరినీ స్మరించవు. 13

మూ. భుఞ్జానా మానుషాన్ భోగాన్ దివ్యాంశ్చ వరవర్ణిని,
న స్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః. 14

ప్ర. అ. వరవర్ణిని = శ్రేష్ఠమైన వర్ణము గల సీతా ! మానుషాన్ = మనుష్యులకు సంబంధించిన, భోగాన్ = భోగములను, దివ్యాంశ్చ = దివ్యములైన భోగము

లను, భుఞ్జానా = అనుభవించుచున్నదానవై, మానుషస్య = మానవుడు, గతాయుషః = గడచి పోయిన ఆయుర్దాయము కలవాడు అయిన, రామస్య = రామునకు, న స్మరిష్యసి = స్మరించవు.

తా. ఓ ! సీతా ! మనుష్యులకు లభించే భోగాలను, దేవతలకు లభించే భోగాలను అనుభవించుచు నీవు ఆయుర్దాయము చెల్లిపోయిన సామాన్యమానవుడైన రాముణ్ణి స్మరించవు. 14

మూ. స్థాపయిత్వా ప్రియం పుత్రం రాజ్ఞా దశరథేన యః,
మన్దవీర్యః సుతో జ్యేష్ఠస్తతః ప్రస్థాపితో వనమ్. 15

ప్ర. అ. మన్దవీర్యః=మందమైన పరాక్రమము కలవాడు, జ్యేష్ఠః సుతః= జ్యేష్ఠకుమారుడు అయిన, యః = ఏ రాముడు, రాజ్ఞా = రాజైన, దశరథేన=దశరథునిచేత, ప్రియమ్ = ప్రియుడైన, పుత్రమ్=పుత్రుణ్ణి, స్థాపయిత్వా=స్థాపించి, తతః = అక్కడినుండి, వనమ్ = వనమును గూర్చి, ప్రస్థాపితః=పంపబడినాడో.

తా. రాముడు జ్యేష్ఠపుత్రుడే యైనను అల్పమైన పరాక్రమము కలవాడగుటచే, దశరథమహారాజు, తన ప్రియపుత్రుడైన భరతునకు రాజ్య మిచ్చి ఇతనిని అరణ్యమునకు పంపివేసినాడు. 15

మూ. తేన కిం భ్రష్టరాజ్యేన రామేణ గతచేతసా,
కరిష్యసి విశాలాక్షి తాపసేన తపస్వినా. 16

ప్ర. అ. విశాలాక్షి = విశాలమైన నేత్రములు కలదానా ! భ్రష్టరాజ్యేన= రాజ్యభ్రష్టుడు, గతచేతసా = పోయిన బుద్ధికలవాడు, తాపసేన = దీనుడు, తపస్వినా = ముని అయిన, తేన రామేణ = ఆ రామునితో, కిం కరిష్యసి = ఏమి చేయుదువు ?

తా. ఓ ! విశాలనేత్రములు గల సీతా ! రాముడు రాజ్యభ్రష్టుడు, బుద్ధివిహీనుడు, దీనుడు, మునివృత్తిలో ఉన్నవాడు. అట్టివానితో నీవేమి చేసెదవు ? 16

మూ. సర్వరాక్షసభర్తారం కామాత్స్వయమిహాగతమ్,
న మన్మథశరావిష్టం ప్రత్యాఖ్యాతుం త్వమర్హసి. 17

ప్ర. అ. కామాత్ = కామమువలన, స్వయమ్ = స్వయముగా, ఇహ = ఇక్కడికి, ఆగతమ్ = వచ్చిన, మన్మథశరావిష్టమ్ = మన్మథబాణములచేత వ్యాప్తుడైన, సర్వరాక్షసభర్తారమ్ = సకలరాక్షసుల ప్రభువునైన నన్ను, త్వమ్ = నీవు, ప్రత్యాఖ్యాతుమ్ = ప్రత్యాఖ్యానము చేయుటకు, న అర్హసి = తగవు.

తా. సకలరాక్షసులకు ప్రభువునైన నేను, మన్మథబాణములచేత పీడించబడినవాడనై కామముతో స్వయముగా నీవద్దకు వచ్చినాను. అట్టి నన్ను నీవు నిరాకరించకూడదు. 17

మూ. ప్రత్యాఖ్యాయ హి మాం భీరు పరితాపం గమిష్యసి,
చరణేనాభిహత్యేవ పురూరవసమూర్వశీ. 18

ప్ర. అ. భీరు = భయస్వభావము గలదానా ! మామ్ = నన్ను, ప్రత్యాఖ్యాయ = నిరాకరించి, పురూరవసమ్ = పురూరవుసుణ్ణి, చరణేన = పాదముచేత, అభిహత్య = తన్ని, ఊర్వశీవ = ఊర్వశి వలె, పరితాపమ్ = పశ్చాత్తాపమును, గమిష్యసి = పొందగలవు.

తా. సీతా ! పూర్వము ఊర్వశి కాళ్లమీద పడిన పురూరవసుణ్ణి నిరాకరించి పశ్చాత్తాపము చెంది నట్లు, నీవు కూడా నన్ను నిరాకరించినచో పశ్చాత్తాపము చెందగలవు. 18

మూ. అఙ్గుల్యా న సమో రామో మమ యుద్ధే స మానుషః,
తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని. 19

ప్ర. అ. వరవర్ణిని = శ్రేష్ఠమైన శరీరవర్ణము గల సీతా ! మానుషః = మానవుడైన, సః రామః = ఆ రాముడు, యుద్ధే = యుద్ధమునందు, మమ = నా యొక్క, అఙ్గుల్యా = వ్రేలితో కూడ, సమః = సమానుడు, న = కాడు. తవ = నీయొక్క, భాగ్యేన = అదృష్టముచేత, సంప్రాప్తమ్ = లభించిన నన్ను, భజస్వ = పొందుము.

తా. సీతా ! మానవమాత్రుడైన ఆ రాముడు యుద్ధములో నా వ్రేలికి కూడ పోలడు. నేను నీ అదృష్టవశముచేత వచ్చినాను. అట్టి నన్ను అంగికరించుము. 19

మూ. ఏవముక్తా తు వైదేహీ క్రుద్ధా సంరక్తలోచనా,
అబ్రవీత్పరుషం వాక్యం రహితే రాక్షసాధిపమ్. 20

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, వైదేహీ = సీత, క్రుద్ధా = కోపించినదై, సంరక్తలోచనా = ఎఱ్ఱనైన నేత్రములు గలదై, రహితే = జనులు లేని ఆ ప్రదేశమునందు, రాక్షసాధిపమ్ = రావణుని గూర్చి, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సీత ఆ మాటలు విని, కోపముచేత ఎఱ్ఱబడిన కన్నులు కలదై, జనశూన్యమైన ఆ ప్రదేశములో రాక్షసాధిపుడైన రావణునితో ఇట్లు పలికెను. 20

మూ. కథం వైశ్రవణం దేవం సర్వభూతనమస్కృతమ్,
భ్రాతరం వ్యపదిశ్య త్వమశుభం కర్తుమిచ్ఛసి. 21

ప్ర. అ. సర్వభూతనమస్కృతమ్ = సకలప్రాణులచేతను నమస్కరించబడిన, దేవమ్ = దేవుడైన, వైశ్రవణమ్ = కుబేరుణ్ణి, భ్రాతరమ్ = సోదరునిగా, వ్యపదిశ్య = చెప్పి, త్వమ్ = నీవు, అశుభమ్ = అశుభమైన కార్యమును, కర్తుమ్ = చేయుటకు, కథమ్ = ఎట్లు, ఇచ్ఛసి = ఇచ్ఛయించుచున్నావు?

తా. సకలప్రాణులచేత నమస్కరింపబడిన కుబేరుడు నా సోదరుడని చెప్పుకొనుచు నీవు ఈ అకార్యము చేయుటకు ఎట్లు పూనుకున్నావు? 21

మూ. అవశ్యం వినశిష్యన్తి సర్వే రావణ రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధిరజితేన్ద్రియః. 22

ప్ర. అ. రావణ = రావణా! కర్కశః = క్రూరుడవు, దుర్బుద్ధిః = చెడ్డబుద్ధి కలవాడవు, అజితేన్ద్రియః = జయింపబడని ఇంద్రియములు కలవాడవు అయిన, త్వమ్ = నీవు, యేషామ్ = ఏ రాక్షసులకు, రాజా = రాజువో, అట్టి, సర్వే = సమస్తమైన, రాక్షసాః = రాక్షసులు, అవశ్యమ్ = తప్పక, వినశిష్యన్తి = నశించగలరు.

తా. రావణా! క్రూరుడవు, దుర్బుద్ధివి, ఇంద్రియనిగ్రహము లేనివాడవు అయిన నీవు రాజుగా ఉన్న రాక్షసు లందరూ నశించగలరు. 22

మూ. అపహృత్య శచీం భార్యాం శక్యమిన్ద్రస్య జీవితుమ్,
న చ రామస్య భార్యాం మామపనీయాస్తి జీవితమ్. 23

ప్ర. అ. ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, భార్యామ్ = భార్యయైన, శచీమ్ = శచీదేవిని, అపహృత్య = అపహరించి, జీవితుమ్ = జీవించుటకు, శక్యమ్ = శక్యమైనది. రామస్య = రామునియొక్క, భార్యామ్ = భార్యనైన. మామ్ = నన్ను, అపనీయ = అపహరించి, జీవితమ్ = జీవితము, నాస్తి = లేదు.

తా. ఇంద్రుని భార్యయైన శచీదేవిని అపహరించి యైనా జీవించవచ్చునేమో కాని, రాముని భార్యనైన నన్ను అపహరించినచో జీవితము లేదు. 23

మూ. జీవేచ్చిరం వజ్రధరస్య హస్తా
చ్ఛచీం ప్రధృష్యాప్రతిరూపరూపామ్,
న మాదృశీం రాక్షస దూషయిత్వా
పీతామృతస్యాపి తవాస్తి మోక్షః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టచత్వారింశః సర్గః.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడా ! అప్రతిరూపరూపామ్ = సాటి లేని రూపము గల, శచీమ్ = శచీదేవిని, వజ్రధరస్య = ఇంద్రునియొక్క, హస్తాత్ = హస్తమునుండి, ప్రధృష్య = బలాత్కారముగా లాగికొని, చిరమ్ = చిరకాలము, జీవేత్ = జీవించవచ్చును. మాదృశీమ్ = నావంటిదానిని, దూషయిత్వా = దూషించి, పీతామృతస్యాపి = త్రాగబడిన అమృతము కలవాడవైనను, తవ = నీకు, మోక్షః = విడుదల, న = లేదు.

తా. ఓ! రాక్షసుడా ! సాటి లేసి సౌందర్యము గల శచీదేవిని వజ్రాయుధము ధరించిన ఇంద్రుని హస్తమునుండి బలాత్కారముగా అపహరించుకొనిపోయి కూడ చిరకాలము జీవించవచ్చునేమో ! నావంటిదానిని దూషించినచో నీవు అమృతము తాగినా కూడ నీకు విడుదల ఉండదు. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో నలుబది ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోపఞ్చాశః సర్గః

[రావణుడు సీతను అపహరించుట. ఆమె విలపించుట. జటాయువు కనబడుట.]

మూ. సీతాయా వచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్,
హస్తే హస్తం సమాహత్య చకార సుమహద్వపుః. 1

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, దశగ్రీవః = రావణుడు, సీతాయాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, హస్తే = హస్తమునందు, హస్తమ్ = హస్తమును, సమాహత్య = కొట్టి, సుమహత్ = చాల పెద్దదైన, వపుః = శరీరమును, చకార = చేసెను.

తా. ప్రతాపవంతుడైన రావణుడు సీత మాటలు విని, ఒక చేతిలో మరొక చేయి వేసి చరచి, శరీరమును పెద్దగా చేసెను. 1

మూ. స మైథిలీం పునర్వాక్యం బభాషే వాక్యకోవిదః,
నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ. 2

ప్ర. అ. వాక్యకోవిదః=మాటలలో నేర్పరియైన, సః=అతడు, మైథిలీమ్ = సీతను గూర్చి, పునః = మరల, వాక్యమ్ = వాక్యమును, బభాషే=పలికెను. ఉన్మత్తయా = ఉన్మత్తురాలవైన నీచేత, మమ = నాయొక్క, వీర్యపరాక్రమౌ = వీర్యపరాక్రమములు, న శ్రుతౌ = వినబడలేదు అని, మన్యే = తలచెదను.

తా. మాటలలో నేర్పరియైన ఆ రావణుడు సీతతో మరల ఇట్లు పలికెను. నీకు పిచ్చిఉన్నది కాబోలు, అందుచేతనే నా వీర్యమును గూర్చి పరాక్రమమును గూర్చి నేను వర్ణించిచెప్పినా నీవు వినలేదని అనుకొనుచున్నాను. 2

మూ. ఉద్వహేయం భుజాభ్యాం తు మేదినీమమ్బరే స్థితః,
ఆపిబేయం సముద్రం చ హన్యాం మృత్యుం రణే స్థితః. 3

ప్ర. అ. అమ్బరే = ఆకాశమునందు, స్థితః = ఉన్నవాడనై, భుజాభ్యామ్ = భుజములతో, మేదినీమ్ = భూమిని, ఉద్వహేయమ్ = మోయగలను. సముద్రం చ = సముద్రమును కూడ, ఆపిబేయమ్ = త్రాగివేయుదును. రణే = యుద్ధమునందు, స్థితః = ఉన్నవాడనై, మృత్యుమ్ = మృత్యువును, హన్యామ్ = చంపుదును.

తా. ఆకాశమునందు నిలచి రెండు చేతులతో భూమిని ఎత్తి మోయుదును. సముద్రమును త్రాగుదును. యుద్ధరంగములో నిలచి మృత్యువును కూడ చంపుదును.

3

మూ. అర్కం రున్ధ్యాం శరైస్తీక్ష్ణైర్విభిన్ద్యాం హి మహీతలమ్,
కామరూపిణమున్మత్తే పశ్య మాం కామదం పతిమ్. 4

ప్ర. అ. అర్కమ్ = సూర్యుణ్ణి, రున్ధ్యామ్ = అడ్డుకొనెదను. తీక్ష్ణైః = తీక్ష్ణములైన, శరైః = బాణములచేత, మహీతలమ్ = భూమిని, విభిన్ద్యామ్ = బ్రద్దలు కొట్టెదను. ఉన్మత్తే = పిచ్చిదానా! కామదమ్ = కోరికలను ఇచ్చే, పతిమ్ = భర్తనైన, కామరూపిణమ్ = స్వేచ్ఛారూపము గల, మామ్ = నన్ను, పశ్య = చూడుము.

తా. సూర్యుణ్ణి అడ్డుకొందును. తీక్ష్ణములైన బాణములతో భూమిని బ్రద్దలు కొట్టుదును. పిచ్చిదానా! ఇచ్ఛానుసారము రూపము ధరించ గలిగినవాడను, నీ కోరికలన్నీ తీర్చగలవాడను అయిన నీ భర్త నైన నన్ను చూడుము. 4

మూ. ఏవముక్తవతస్తస్య సూర్యకల్పే శిఖిప్రభే,
క్రుద్ధస్య హరిపర్యన్తే రక్తే నేత్రే బభూవతుః. 5

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తవతః = పలికిన, క్రుద్ధస్య = కోపించిన, తస్య = ఆ రావణునియొక్క, సూర్యకల్పే = సూర్యునితో సమానములు, శిఖిప్రభే = అగ్ని వంటి కాంతి గలవి, హరిపర్యన్తే = శ్యామవర్ణము గల ప్రాంతములు గలవీ అయిన, నేత్రే = నేత్రములు, రక్తే = ఎఱ్ఱగా, బభూవతుః = అయినవి.

తా. కోపించి ఈ విధముగా మాటలాడుచున్న ఆ రావణుని, సూర్యుని వలె ఉన్నవి, అగ్నికాంతి వంటి కాంతి గలవి, నల్లని చివరి భాగములు గలవి అయిన నేత్రములు ఎఱ్ఱబడినవి.

5

మూ. సద్యః సౌమ్యం పరిత్యజ్య భిక్షురూపం చ సంమతమ్,
స్వం రూపం కాలరూపాభం భేజే వైశ్రవణానుజః. 6

ప్ర. అ. వైశ్రవణానుజః = రావణుడు, సద్యః = వెంటనే, సౌమ్యమ్ = సౌమ్యము, సంమతమ్ = పూజనీయము అయిన, భిక్షురూపమ్ = సంన్యాసిరూపమును, పరిత్యజ్య = విడచి, స్వమ్ = తన సంబంధమైన, కాలరూపాభమ్ = యముని రూపము వంటి, రూపమ్ = రూపమును, భేజే = పొందెను.

తా. ఆ రావణుడు సౌమ్యము, పూజనీయము అయిన సంన్యాసిరూపమును విడచి, యముని రూపము వంటి తన రూపమును గ్రహించెను. 6

మూ. సంరక్తనయనః శ్రీమాంస్తప్తకాఞ్చనభూషణః,
క్రోధేన మహతావిష్టో నీలజీమూతసంనిభః. 7
దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః.

ప్ర. అ. మహతా = గొప్పదైన, క్రోధేన = క్రోధముచేత, ఆవిష్టః = ఆవహింపబడిన అతడు, సంరక్తనయనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడు, శ్రీమాన్ = శోభ కలవాడు, తప్తకాఞ్చనభూషణః = పరిశుద్ధమైన బంగారు అలంకారములు కలవాడు, నీలజీమూతసన్నిభః = నల్లని మేఘముతో సమానుడు, దశాస్యః = పది తలలు కలవాడు, కార్ముకీ = ధనస్సు కలవాడు, బాణీ = బాణము కలవాడు, అయిన, క్షణదాచరః = రాక్షసుడుగా, బభూవ = ఆయెను.

తా. అధికమైన కోపముతో నిండిన అతడు పది తలలు గల రాక్షసుడుగా మారెను. శోభాయుక్తుడైన అతని నేత్రములు ఎఱ్ఱగా ఉండెను. అతడు బంగారు ఆభరణములు ధరించెను. నల్లని మేఘము వలె ఉండెను. ధనుర్బాణములు ధరించెను. 7

మూ. స పరివ్రాజకచ్ఛద్మ మహాకాయో విహాయ తత్, 8
ప్రతిపద్య స్వకం రూపం రావణో రాక్షసాధిపః.
సంరక్తనయనః క్రోధాజ్జీమూతనిచయప్రభః, 9
రక్తామ్బరధరస్తస్థౌ స్త్రీరత్నం ప్రేక్ష్య మైథిలీమ్.

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షసరాజైన, సః రావణః = ఆ రావణుడు, తత్ = ఆ, పరివ్రాజకచ్ఛద్మ = పరివ్రాజక కపటవేషమును, విహాయ = విడచి, స్వకమ్ = తనసంబంధమైన, రూపమ్ = రూపమును, ప్రతిపద్య = పొంది, క్రోధాత్ = కోపమువలన, సంరక్త నయనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, జీమూత నిచయప్రభః = మేఘసముదాయము వంటి కాంతి గలవాడై, రక్తామ్బరధరః = ఎఱ్ఱని వస్త్రములు ధరించినవాడై, స్త్రీరత్నమ్ = స్త్రీలలో శ్రేష్ఠురాలైన, మైథిలీమ్ = సీతను, ప్రేక్ష్య = చూచి, తస్థౌ = నిలచెను.

తా. రాక్షసరాజైన ఆ రావణుడు ఆ కపటపరివ్రాజకరూపమును విడచి, పెద్ద శరీరము ధరించి, కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో, మేఘసముదాయము వంటి శరీరకాంతితో, ఎఱ్ఱటి వస్త్రములు ధరించి, స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీతను చూచుచు నిలబడెను. 8, 9

మూ. స తామసితకేశాన్తాం భాస్కరస్య ప్రభామివ, 10
వసనాభరణోపేతాం మైథిలీం రావణోఽబ్రవీత్.

ప్ర. అ. సః = ఆ, రావణః = రావణుడు, అసితకేశాన్తామ్ = నల్లని కేశపాశము కలది, భాస్కరస్య = సూర్యునియొక్క, ప్రభామివ = కాంతి వలె ఉన్నది. వసనాభరణోపేతామ్ = వస్త్రములతోను ఆభరణములతోను కూడినది అయిన, మైథిలీమ్ = సీతను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మంచి వస్త్రములను ఆభరణములను ధరించి, నల్లని కేశపాశము గలిగి, సూర్యకాంతి వలె ప్రకాశించుచున్న ఆ సీతతో రావణుడు ఇట్లు పలికెను.

మూ. త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తారమిచ్ఛసి, 11
మామాశ్రయ వరారోహే తవాహం సదృశః పతిః.

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా! త్రిషు లోకేషు = మూడు లోకములలో, విఖ్యాతమ్ = ప్రసిద్ధుడైన, భర్తారమ్ = భర్తను, ఇచ్ఛసి యది = (నీవు) కోరినట్లయితే, మామ్ = నన్ను, ఆశ్రయ = ఆశ్రయించుము. అహమ్ = నేను, తవ = నీకు, సదృశః = తగిన, పతిః = భర్తను.

తా. అందమైన కటిప్రదేశము గలదానా ! నీకు మూడు లోకాలలో ప్రసిద్ధు

డైన భర్త కావాలని అనుకొన్నచో నన్ను ఆశ్రయించుము. నీకు భర్త అగుటకు తగినవాడను నేనే. 11

మూ. మాం భజస్వ చిరాయ త్వమహం శ్లాఘ్యః పతిస్తవ, 12
నైవ చాహం క్వచిద్భద్రే కరిష్యే తవ విప్రియమ్,
త్యజ్యతాం మానుషే భావో మయి భావః ప్రణీయతామ్.

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా ! చిరాయ = చిరకాలము, మామ్ = నన్ను, భజస్వ = పొందుము. అహమ్ = నేను, తవ = నీకు, శ్లాఘ్యః = శ్లాఘించదగిన, పతిః = భర్తను. అహమ్ = నేను, క్వచిత్ = ఎన్నడూ, తవ = నీకు, విప్రియమ్ = అపకారమును, న కరిష్యే చ = చెయ్యను. మానుషే = మానవుడైన రామునియందు, భావః = ప్రేమ, త్యజ్యతామ్ = విడవబడుగాక. మయి = నామీద, భావః = ప్రేమ, ప్రణీయతామ్ = చేయబడుగాక.

తా. నీవు చాల కాలము నా సహచరివిగా ఉండుము. నేను నీకు శ్లాఘింపతగిన భర్తను. ఓ : మంగళప్రదురాలా : నేను నీ కెన్నడూ అప్రియ మేదీ చేయను. మానవుడైన ఆ రామునినుండి నీ మనస్సు మరల్చుము. నాపై ఉంచుము. 12, 13

మూ. రాజ్యాచ్చ్యుతమసిద్ధార్థం రామం పరిమితాయుషమ్,
కైర్గుణైరనురక్తాసి మూఢే పణ్డితమానిని. 14

యః స్త్రియా వచనాద్రాజ్యం విహాయ ససుహృజ్జనమ్,
అస్మిన్ వ్యాళానుచరితే వనే చరతి దుర్మతిః. 15

ప్ర. అ. మూఢే = మూఢురాలా : పణ్డితమానిని = బుద్ధిమంతురాల నని అనుకొనుచున్నదానా ! దుర్మతిః = దుష్టబుద్ధి గల, యః = ఏ రాముడు, స్త్రియాః = స్త్రీయొక్క, వచనాత్ = వచనమువలన, ససుహృజ్జనమ్ = స్నేహితులతో కూడిన, రాజ్యమ్ = రాజ్యమును, విహాయ = విడచి, వ్యాళానుచరితే = క్రూరమృగములచే సంచరింపబడిన, అస్మిన్ = ఈ, వనే = వనమునందు, చరతి = సంచరించుచున్నాడో, అట్టి, రాజ్యాత్ = రాజ్యమునుండి, చ్యుతమ్ = భ్రష్టుడు, అసిద్ధార్థమ్ = సఫలము కాని ప్రయోజనము కలవాడు, పరిమితాయుషమ్ = పరిమితమైన ఆయు

ర్దాయము కలవాడు అయిన, రామమ్ = రాముణ్ణి గూర్చి, కైః = ఏ, గుణైః = గుణములచేత, అనురక్తా = అనురాగము కలదానవు, అసి = అయిఉన్నావు.

తా. తెలివిగలదాన నని అనుకొనే ఓ ! తెలివితక్కువదానా ! ఏ రాముడు బుద్ధివిహీనుడై స్త్రీ మాటలు విని రాజ్యమును, స్నేహితులను విడిచిపెట్టి క్రూర మృగములతో నిండిన ఈ అరణ్యములో తిరుగాడుచున్నాడో, అట్టి రాజ్యభ్రష్టుడూ, నిష్ప్రయోజనుడూ, అల్పాయుర్దాయవంతుడూ అయిన రాముణ్ణి ఏ గుణములు చూచి ప్రేమించుచున్నావు ? 14, 15

మూ. ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీమ్,
అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః, 16
జగ్రాహ రావణః సీతాం బుధః ఖే రోహిణీమివ.

ప్ర. అ. సుదుష్టాత్మా = మిక్కిలి దుష్టబుద్ధి గల, కామమోహితః = కామము చేత మోహితుడైన, రాక్షసః = రాక్షసుడైన, రావణః = రావణుడు, ప్రియార్హామ్ = ప్రియవచనములకు తగినదీ, ప్రియవాదినీమ్ = ప్రియముగా మాటలాడునదీ అయిన, మైథిలీమ్ = సీతను గూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అభిగమ్య = సమీపించి, ఖే = ఆకాశమునందు, బుధః = బుధుడు, రోహిణీమివ = రోహిణిని వలె, సీతామ్ = ఆ సీతను, జగ్రాహ = పట్టుకొనెను.

తా. కామముచే ఒళ్ళు తెలియని ఆ రావణుడు, ప్రియమైన మాటలకే తగినది, ప్రియముగా మాటలాడేదీ అయిన సీతతో ఈ విధముగా పలికి, ఆకాశమునందు బుధుడు రోహిణిని సమీపించి నట్లు సమీపించి, ఆమెను పట్టుకొనెను.

మూ. వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః, 17
ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా.

ప్ర. అ. సః = ఆతడు. పద్మాక్షీమ్ = పద్మముల వంటి నేత్రములు గల, సీతామ్ = సీతను, వామేన కరేణ = ఎడమచేతితో, మూర్ధజేషు = కేశములయందు, దక్షిణేన పాణినా = కుడిచేతితో, ఊర్వోః = తొడలయందు, ప్రతిజగ్రాహ = పట్టుకొనెను.

తా. ఆ రావణుడు పద్మముల వంటి నేత్రములు గల సీతను ఎడమ

చేతితో కేశపాశమునందు, కుడిచేతితోతొడలయందు పట్టుకొని లేవదీసికొని పోయెను. 17

మూ. తం దృష్ట్వా మృత్యుసంకాశం తీక్ష్ణదంష్ట్రం మహాభుజమ్,
ప్రాద్రవన్ గిరిసంకాశం భయార్తా వనదేవతాః.

ప్ర. అ. మృత్యుసంకాశమ్ = మృత్యువుతో సమానుడు, తీక్ష్ణదంష్ట్రమ్= తీక్ష్ణములైన కోరలు గలవాడు, మహాభుజమ్ = గొప్ప భుజములు కలవాడు, గిరిసంకాశమ్ = పర్వతముతో సమానుడు అయిన, తమ్ = వానిని, దృష్ట్వా= చూచి, వనదేవతాః = వనదేవతలు, భయార్తాః = భయముచేత పీడింపబడినవై, ప్రాద్రవన్ = పారిపోయిరి.

తా. తీక్ష్ణములైన కోరలతో, పెద్ద భుజములతో, పర్వత మంత ఆకార ముతో మృత్యువు వలె ఉన్న ఆ రావణుణ్ణి చూచి వనదేవతలు భయముచేత పీడింపబడి, పారిపోయిరి. 18

మూ. స చ మాయామయో దివ్యః ఖరయుక్తః ఖరస్వనః, 19
ప్రత్యదృశ్యత హేమాఙ్గో రావణస్య మహారథః.

ప్ర. అ. మాయామయః = మాయావికారము, దివ్యః = అద్భుతము, ఖర యుక్తః = గాడిదలతో కూర్పబడినది, ఖరస్వనః = పరుషమైన ధ్వని కలది, హేమాఙ్గః = బంగారు అవయవములు గలది అయిన, రావణస్య = రావణుని యొక్క, సః మహారథః = ఆ మహారథము, ప్రత్యదృశ్యత = చూడబడెను.

తా. మాయానిర్మితము, అద్భుతము, పరుషమైన ధ్వని గలది, బంగారు అవయవములు గలది అయిన, గాడిదలు కట్టిన రావణుని రథము అప్పుడు మరల కనబడెను. 19

మూ. తతస్తాం పరుషైర్వాక్యైర్భర్త్సయన్ స మహాస్వనః, 20
అఙ్కేనాదాయ వైదేహీం రథమారోపయత్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, మహాస్వనః = గొప్ప ధ్వని గల, సః = ఆ రావణుడు, తాం వైదేహీమ్ = ఆ సీతను, పరుషైః = పరుషములైన, వాక్యైః =

వాక్యములచేత, భర్త్సయన్ = భయపెట్టుచు, అఙ్కేన = ఒడిలో, ఆదాయ = గ్రహించి, రథమ్ = రథమును, ఆరోపయత్ = ఎక్కించెను.

తా. పెద్ద కంఠస్వరము గల ఆ రావణుడు పరుషములైన మాటలచేత ఆ సీతను భయపెట్టుచు, ఒడిలో కూర్చుండబెట్టుకొని రథము నెక్కించెను. 20

మూ. సా గృహీతా విచుక్రోశ రావణేన యశస్వినీ, 21
రామేతి సీతా దుఃఖార్తా రామం దూరగతం వనే.

ప్ర. అ. రావణేన=రావణునిచేత, గృహీతా=గ్రహింపబడిన, యశస్వినీ= కీర్తి గల, సా సీతా = ఆ సీత, దుఃఖార్తా = దుఃఖార్తురాలై, వనే = వనమునందు, దూరగతమ్ = దూరముగా వెళ్ళిన, రామమ్ = రాముణ్ణి గూర్చి, రామ ఇతి = రామా అని, విచుక్రోశ = అరచెను.

తా. రావణునిచేత పట్టుకొనబడిన కీర్తిమంతురాలైన ఆ సీత, దుఃఖపీడితురాలై, వనములో దూరముగా వెళ్ళిన రాముణ్ణి గూర్చి 'రామా !'అని అరచెను.

మూ. తామకామాం స కామార్తః పన్నగేన్ద్రవధూమివ, 22
వివేష్టమానామాదాయ ఉత్పపాతాథ రావణః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కామార్తః = కామపీడితుడైన, సః = ఆ, రావణః = రావణుడు, అకామామ్ = కామములేనిది, పన్నగేన్ద్రవధూమివ=ఆడ సర్పము వలె, వివేష్టమానామ్ = దొరలుచున్నదీ అయిన, తామ్ = ఆమెను, ఆదాయ = గ్రహించి, వేగేన = వేగముతో, ఉత్పపాత = ఎగిరెను.

తా. సీత విషయమై కామార్తుడైన ఆ రావణుడు, తనపై ఇచ్ఛ లేని ఆ సీత ఆడపాము వలె మెలికలు తిరిగిపోవుచుండగా ఆమెను పట్టుకొని ఆకాశములోనికి ఎగిరెను.

మూ. తతః సా రాక్షసేన్ద్రేణ హ్రియమాణా విహాయసా, 23
భృశం చుక్రోశ మత్తేవ భ్రాన్తచిత్తా యథాతురా.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రాక్షసేన్ద్రేణ = రావణునిచేత, విహాయసా = ఆకాశమార్గముచేత, హ్రియమాణా=హరించబడుచున్న, సా=ఆ సీత,

మత్తేవ = మదించినది వలె, భ్రాన్తచిత్తా = భ్రమచెందిన చిత్తము కలదై, ఆతురా యథా = రోగముతో బాధపడుచున్నది వలె, భృశమ్ = మిక్కిలి, చుక్రోశ = అరచెను.

తా. రావణునిచేత ఆకాశమార్గమునందు హరింపబడుచున్న ఆ సీత, మత్తెక్కినదాని వలె చిత్తభ్రమ చెందినదై, రోగపీడితురాలు వలె మిక్కిలి అరచెను. 23

మూ. హా లక్ష్మణ మహాబాహో గురుచిత్తప్రసాదక, 24
హ్రియమాణాం న జానీషే రక్షసా మామమర్షిణా.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! గురుచిత్తప్రసాదక = పెద్దల చిత్తమును ఆనందింపచేయువాడా! హా లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! అమర్షిణా = కోపము గల, రక్షసా = రాక్షసునిచేత, మామ్ = నన్ను, హ్రియమాణామ్ = హరించబడుచున్నదానినిగా, న జానీషే = ఎరుగవు.

తా. అయ్యో! లక్ష్మణా! గొప్ప బాహువులు కలవాడా! పెద్దల చిత్తమును ఆనందింపచేయువాడా! రాక్షసుడు కోపముచేత నన్ను అపహరించుకొనిపోవుచున్నట్లు నీకు తెలియదు కదా! 24

మూ. జీవితం సుఖమర్థాంశ్చ ధర్మహేతోః పరిత్యజన్, 25
హ్రియమాణామధర్మేణ మాం రాఘవ న పశ్యసి.

ప్ర. అ. జీవితమ్ = జీవితమును, సుఖమ్ = సుఖమును, అర్థాంశ్చ = ధనములను, ధర్మహేతోః = ధర్మము నిమిత్తమై, పరిత్యజన్ = విడచుచున్న, రాఘవ = రామా! అధర్మేణ = అధర్మాత్ముడైన రాక్షసునిచేత, హ్రియమాణామ్ = హరించబడుచున్న, మామ్ = నన్ను, న పశ్యసి = చూచుటలేదు.

తా. ధర్మముకొరకై జీవితమును, సుఖమును, సంపదలను విడచివేసిన రామా! అధర్మాత్ముడైన వీనిచే అపహరించబడుచున్న నన్ను నీవు చూచుటలేదు.

మూ. నను నామావినీతానాం వినేతాసి పరంతప, 26
కథమేవంవిధం పాపం న త్వం శాస్సి హి రావణమ్.

ప్ర. అ. పరంతప = శత్రుసంహారకుడా! అవినీతానామ్ = దుష్టులకు,

వినేతా = శిక్షకుడవు, అసి నను = అయి ఉన్నావు కదా ! ఏవంవిధమ్ = ఇట్టి, పాపమ్ = పాపాత్ముడైన, రావణమ్ = రావణుణ్ణి, కథమ్ = ఎట్లు, న హి శాస్సి = శిక్షించుటలేదు ?

తా. శత్రుసంహారకా ! నీవు దుష్టులను శిక్షించేవాడవు కదా ? అట్టి నీవు, ఇట్టి పాపాత్ముడైన రావణుణ్ణి ఎందువలన శిక్షించుటలేదు ? 26

మూ. న ను సద్యోఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలమ్, 27
కాలోఽప్యఙ్గీభవత్యత్ర సస్యానామివ పక్తయే.

ప్ర. అ. అవినీతస్య = దుష్టమైన, కర్మణః = కర్మయొక్క, ఫలమ్ = ఫలము, సద్యః = వెంటనే, న దృశ్యతే ను = చూడబడదు కదా? సస్యానామ్ = సస్యములయొక్క, పక్తయే ఇవ = పాకముకొరకు వలె, అత్ర = దీని విషయమునందు, కాలోఽపి = కాలము కూడ, అఙ్గీభవతి = అంగ మగును.

తా. దుష్టకర్మ ఫలితము వెంటనే కనబడదు. సస్యముల పాకము చెందుటకు (పండుటకు)ఎట్లో అట్లే పాపము ఫలమును ఇచ్చుటలోకూడ కాలము అంగ మగును. కొంత కాలము తరవాత నైనా పాపఫలము అనుభవింపక తప్పదు. 27

మూ. త్వం కర్మ కృతవానేతత్కాలోపహితచేతనః, 28
జీవితాన్తకరం ఘోరం రామాద్వ్యసనమాప్నుహి.

ప్ర. అ. త్వమ్ = నీవు, కాలోపహతచేతనః = కాలముచేత కొట్టబడిన బుద్ధి కలవాడవై, ఏతత్ = ఈ, కర్మ = కర్మను, కృతవాన్ = చేసినావు. రామాత్ = రామునివలన, జీవితాన్తకరమ్ = జీవితాంతమును కలిగించు, ఘోరమ్ = భయంకరమైన, వ్యసనమ్ = వ్యసనమును, ఆప్నుహి = పొందుము.

తా. రావణా! కాలముచేత విపరీతబుద్ధి కలవాడవై, నీవు ఈ పని చేసినావు. అందుచేత రామునివలన నీకు ప్రాణములను తీయు ఘోరమైన ఆపద సంభవించుగాక. 28

మూ. హన్తేదానీం సకామాస్తు కైకేయీ సహ బాన్ధవైః, 29
హ్రియే యద్ధర్మకామస్య ధర్మపత్నీ యశస్వినః.

ప్ర. అ. ధర్మకామస్య = ధర్మమునందు శ్రద్ధ కలవాడు, యశస్వినః = కీర్తి కలవాడు అయిన రామునియొక్క, ధర్మపత్మీ = ధర్మపత్నినైన నేను, యత్ = ఏ కారణమువలన, హ్రియే = హరించబడుచున్నానో, ఆ కారణమువలన, ఇదానీమ్ = ఇప్పుడు, కైకేయీ = కైకేయి, బాన్ధవైః సహ = బంధువులతో కూడ, సకామా = ఫలించిన కోరికగలది, అస్తు = అగుగాక. హన్త = అయ్యో!

తా. అయ్యో! ఈ నాటికి కైకేయి కోరిక, ఆమె బంధువుల కోరిక తీరినది. ఎందుచేతననగా ధర్మపరాయణుడు, కీర్తిశాలీ అయిన రాముని ధర్మపత్ని యైన నన్ను ఈ రాక్షసుడు హరించుచున్నాడు. 29

మూ. ఆమన్త్రయే జనస్థానే కర్ణికారాన్ సుపుష్పితాన్, 30
క్షిప్రం రామాయ శంసధ్వం సీతాం హరతి రావణః.

ప్ర. అ. జనస్థానే = జనస్థానమునందున్న, సుపుష్పితాన్ = బాగుగా పుష్పించిన, కర్ణికారాన్ = కర్ణికారవృక్షములను (కొండగోగుచెట్లను), ఆమన్త్రయే = పిలిచి కోరుచున్నాను. రావణః = రావణుడు, సీతామ్ = సీతను, హరతి = = హరించుచున్నాడు అని, క్షిప్రమ్ = శీఘ్రముగా, రామాయ = రామునకు, శంసధ్వమ్ = చెప్పుడు.

తా. "రావణుడు సీతను హరించుచున్నాడని శీఘ్రముగా రామునితో చెప్పండి'' అని జనస్థానమునందున్న బాగుగా పుష్పించిన కొండగోగుచెట్లను కోరుచున్నాను. 30

మూ. మాల్యవన్తం శిఖరిణం వన్దే ప్రస్రవణం గిరిమ్, 31
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః.

ప్ర. అ. మాల్యవన్తమ్ = మంచిపుష్పములు గలది, శిఖరిణమ్ = ఉన్నతమైన శిఖరములు గలది అయిన, ప్రస్రవణం గిరిమ్ = ప్రస్రవణపర్వతమును, వన్దే = నమస్కరించుచున్నాను. రావణః = రావణుడు, సీతామ్ = సీతను, హరతి = హరించుచున్నాడు అని, త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, రామాయ = రామునకు, శంస = చెప్పుము.

తా. పుష్పపంక్తులతో నిండి ఉన్నది, ఉన్నతమైన శిఖరములు కలది

అయిన ప్రస్రవణపర్వతానికి నమస్కరించుచున్నాను. రావణుడు సీతను హరించు చున్నా డని రామునితో శీఘ్రముగా చెప్పుము.

వి. ప్రాచ్యపాఠంలో "మాల్యవన్తమ్'' బదులు ''టఙ్కవన్తమ్'' అని ఉన్నది. "ఏటవాలుగా ఉండే చరియలు గలది''అని అర్థము. ఈ పాఠము బాగున్నది. మాల్యవంత మనేది ఒక పర్వతానికి పేరు అవడం చేత అది కుదరక ఏదో అర్థం చెప్పవలసి వచ్చింది. 31

మూ. హంససారససంఘుష్టాం వన్దే గోదావరీం నదీమ్, 32
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః.

ప్ర. అ. హంససారససంఘుష్టామ్ = హంసలచేతను, సారసపక్షుల చేతను ధ్వనిచేయించబడిన, గోదావరీం నదీమ్=గోదావరీనదిని, వన్దే=నమస్కరించుచున్నాను. రావణః = రావణుడు, సీతామ్ = సీతను, హరతి = హరించు చున్నాడు అని, త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, రామాయ = రామునకు, శంస = చెప్పుము.

తా. హంస-సారసపక్షుల ధ్వనులతో నిండిన గోదావరీనదికి నమస్కరించు చున్నాను. రావణుడు సీతను హరించుచున్నా డని శీఘ్రముగా రామునకు చెప్పుము. 32

మూ. దైవతాని చ యాన్యస్మిన్ వనే వివిధపాదపే, 33
నమస్కరోమ్యహం తేభ్యో భర్తుః శంసన్తు మాం హృతామ్.

ప్ర. అ. వివిధపాదపే=అనేకవిధములైన వృక్షములు గల, అస్మిన్ వనే = ఈ వనమునందు, యాని = ఏ, దైవతాని = దైవతములు, సన్తి = ఉన్నవో, తేభ్యః = వాటికి, అహమ్ = నేను, నమస్కరోమి = నమస్కరించుచున్నాను. మామ్=నన్ను, హృతామ్=హరించబడినదానినిగా, భర్తుః=నా భర్తకు, శంసన్తు = చెప్పెదరుగాక.

తా. అనేకవిధములైన వృక్షములతో నిండిన ఈ వనములో ఉన్న దేవత లందరికి నమస్కరించుచున్నాను. నన్ను రాక్షసుడు అపహరించినా డని మీరు రామునికి చెప్పుడు. 33

మూ. యాని కాని చిదప్యత్ర సత్త్వాని నివసన్త్యుత, 34
సర్వాణి శరణం యామి మృగపక్షిగణానపి.

ప్ర. అ. అత్ర = ఇక్కడ, యాని కాని చిత్ = ఏ కొన్ని, సత్త్వాని = ప్రాణులు, నివసన్తి = నివసించుచున్నవో, సర్వాణి = వాటినన్నింటినీ, మృగపక్షిగణానపి = మృగములయొక్క పక్షులయొక్క గణములను, శరణమ్ = శరణమునుగా, యామి = పొందుచున్నాను.

తా. ఇక్కడ నివసించి ఉన్న అన్ని ప్రాణులను, మృగముల గణములను, పక్షిగణములను కూడ నేను శరణువేడుచున్నాను. 34

మూ. హ్రియమాణాం ప్రియాం భర్తుః ప్రాణేభ్యోఽపి గరీయసీమ్,
వివశాపహృతా సీతా రావణేనేతి శంసత.

ప్ర. అ. ప్రాణేభ్యోఽపి = ప్రాణములకంటె కూడ, గరీయసీమ్ = గొప్పదానను, హ్రియమాణామ్ = హరించబడుచున్నదానను, ప్రియామ్ = ప్రియురాలను అయిన నన్ను గూర్చి, వివశా = వివశురాలైన, సీతా = సీత, రావణేన = రావణునిచేత, అపహృతా ఇతి = అపహరించబడినది అని, భర్తుః = నా భర్తకు, శంసత = చెప్పుడు.

తా. అపహరించబడుచున్న, ప్రాణములకంటె కూడ అధికముగా ప్రియురాలనైన, నన్ను గూర్చి నా భర్తతో- "ఏమీ చేయజాలని స్థితిలో ఉన్న సీతను రావణుడు అపహరించినాడు" అని చెప్పుడు. 35

మూ. విదిత్వా మాం మహాబాహురముత్రాపి మహాబలః, 36
ఆనేష్యతి పరాక్రమ్య వైవస్వతహృతామపి.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గలవాడు, మహాబాహుః = గొప్ప బాహువులు గలవాడు అయిన రాముడు, వైవస్వతహృతామపి = యమునిచేత హరింపబడినదాననైనను, మామ్ = నన్ను, అముత్రాపి = పరలోకములో ఉన్నను, విదిత్వా = తెలిసికొని, పరాక్రమ్య = పరాక్రమించి, ఆనేష్యతి = తీసికొని రాగలడు.

తా. గొప్ప బాహువులు గలవాడు, మహాబలశాలీ అయిన రాముడు, నన్ను యముడు అపహరించినను పరలోకములో నున్నట్లు తెలిసినచో పరాక్రమముచేత తీసికొని రాగలడు. 36

మూ. సా తదా కరుణా వాచో విలపన్తీ సుదుఃఖితా, 37
వనస్పతిగతం గృధ్రం దదర్శాయతలోచనా.

ప్ర. అ. తదా = అప్పుడు, కరుణాః = కరుణతో నిండిన, వాచః = వాక్కులను, విలపన్తీ = విలపించుచున్న, ఆయతలోచనా = దీర్ఘములైన నేత్రములు గల, సా = ఆ సీత, సుదుఃఖితా = చాలా దుఃఖించినదై, వనస్పతిగతమ్ = వృక్షముపై నున్న, గృధ్రమ్ = జటాయువును, దదర్శ = చూచెను.

తా. జాలిగొల్పునట్లు విలపించు చాలదుఃఖార్తయైన, విశాలనేత్రియైన ఆ సీతకు ఆ ప్రాంతమునందు చెట్టుమీద నున్న జటాయువు కనబడెను. 37

మూ. సా తముద్వీక్ష్య సుశ్రోణీ రావణస్య వశం గతా, 38
సమాక్రన్దద్భయపరా దుఃఖోపహతయా గిరా.

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, వశమ్ = వశమును, గతా = పొందిన, సుశ్రోణీ = అందమైన కటిప్రదేశము గల, భయపరా = భయమునకు అధీనురాలైన, సా = ఆ సీత, తమ్ = వానిని, ఉద్వీక్ష్య = చూచి, దుఃఖోపహతయా = దుఃఖముచేత కొట్టబడిన, గిరా = వాక్కుతో, సమాక్రన్దత్ = బిగ్గరగా అరచెను.

తా. రావణునకు వశురాలై, భయాక్రాంతురాలైన, చక్కని కటిప్రదేశము గల ఆ సీత జటాయువును చూచి దుఃఖముచేత తొట్రుపడుచున్న మాటలతో ఆతనిని గూర్చి బిగ్గరగా అరచెను. 38

మూ. జటాయో పశ్య మామద్య హ్రియమాణామనాథవత్, 39
అనేన రాక్షసేన్ద్రేణ కరుణం పాపకర్మణా.

ప్ర. అ. జటాయో = జటాయూ, అద్య = ఇప్పుడు, అనేన = ఈ, పాపకర్మణా = పాపాత్ముడైన, రాక్షసేన్ద్రేణ = రాక్షసరాజుచేత, అనాథవత్ = అనాథురాలి వలె, కరుణమ్ = జాలి కలుగునట్లుగా, హ్రియమాణామ్ = హరింపబడుచున్న, మామ్ = నన్ను, పశ్య = చూడుము.

తా. ఓ! జటాయూ! పాపాత్ముడైన ఈ రావణుడు ఇప్పుడు జాలిగొలుపు స్థితిలో ఉన్న నన్ను అనాథురాలిని వలె తీసికొనిపోవుచున్నాడు; చూడుము! 39

మూ. నైష వారయితుం శక్య స్తవ క్రూరో నిశాచరః, 40
సత్త్వవాన్ జితకాశీ చ సాయుధశ్చైవ దుర్మతిః.

ప్ర. అ. క్రూరః = క్రూరుడు, సత్త్వవాన్ = బలవంతుడు, జితకాశీ = జయముతో ప్రకాశించుచున్నవాడు, సాయుధశ్చైవ = ఆయుధములతో కూడినవాడు, దుర్మతిః = దుష్టబుద్ధి కలవాడు అయిన, ఏషః = ఈ, నిశాచరః = రాక్షసుడు, తవ = నీకు, వారయితుమ్ = నివారించుటకు, న శక్యః = శక్యమైనవాడు కాడు.

తా. ఈ రాక్షసుడు క్రూరుడు, బలవంతుడు, జయములను సంపాదించినవాడు, ఆయుధము చేతిలో ఉన్న దుష్టబుద్ధి; అట్టి వీనిని నీవు నివారింపజాలవు.

మూ. రామాయ తు యథాతత్త్వం జటాయో హరణం మమ, 41
లక్ష్మణాయ చ తత్సర్వమాఖ్యాతవ్యమశేషతః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనపఞ్చాశః సర్గః.

ప్ర. అ. జటాయో = జటాయూ! మమ = నాయొక్క, హరణమ్ = అపహరణమును గూర్చి, యథాతత్త్వమ్ = యథార్థముగా, తత్ సర్వమ్ = అది అంతా, అశేషతః = పూర్తిగా, రామాయ = రామునకు, లక్ష్మణాయ చ = లక్ష్మణునకూ, ఆఖ్యాతవ్యమ్ = చెప్పదగినది.

తా. జటాయూ! నా అపహరణమునకు సంబంధించిన విషయము లన్నీ పూర్తిగా, ఉన్నది ఉన్నట్లుగా రామునకు, లక్ష్మణునకూ చెప్పుము. 41

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
నలుబది తొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాశః సర్గః

[సీతను హరించవద్దని జటాయువు రావణునకు ఉపదేశించుట. అట్లు కానిచో యుద్ధానికి రమ్మని పిలుచుట.]

మూ. తం శబ్దమవసుప్తస్తు జటాయురథ శుశ్రువే,
నిరీక్ష్య రావణం క్షిప్రం వైదేహీం చ దదర్శ సః. 1

ప్ర. అ. అవసుప్తః = నిద్రించిన, జటాయుః = జటాయువు, తం శబ్దమ్ = ఆ శబ్దమును, శుశ్రువే = వినెను. అథ = అటు పిమ్మట, సః = అతడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, నిరీక్ష్య = పరిశీలించి, రావణమ్ = రావణుణ్ణి, వైదేహీం చ = సీతను, దదర్శ = చూచెను.

తా. సీత ఆర్తధ్వని నిద్రపోవుచున్న జటాయువునకు వినబడెను. అతడు వెంటనే పరిశీలించగా ఆతనికి సీత, రావణుడు కనబడిరి. 1

మూ. తతః పర్వతకూటాభస్తీక్ష్ణతుణ్డః ఖగోత్తమః,
వనస్పతిగతః శ్రీమాన్ వ్యాజహార శుభాం గిరమ్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పర్వతకూటాభః = పర్వతశిఖరమువంటివాడు, తీక్ష్ణతుణ్డః = తీక్ష్ణమైన ముక్కు కలవాడు, శ్రీమాన్ = శోభాయుక్తుడు అయిన, వనస్పతిగతః = చెట్టుమీద నున్న, ఖగోత్తమః = ఆ జటాయువు, శుభామ్ = మంగళకరమైన, గిరమ్ = మాటను, వ్యాజహార = పలికెను.

తా. పిమ్మట, పర్వతశిఖరము వంటి ఆకారము, తీక్ష్ణమైన ముక్కు కల శోభాయుక్తుడైన ఆ జటాయువు, చెట్టుమీదనే ఉండి మంగళకరమైన మాట పలికెను. 2

మూ. దశగ్రీవ స్థితో ధర్మే పురాణే సత్యసంశ్రయః,
జటాయుర్నామ నామ్నాహం గృధ్రరాజో మహాబలః. 3

ప్ర. అ. దశగ్రీవ = రావణా: అహమ్ = నేను, పురాణే ధర్మే = ప్రాచీనమైన ధర్మమునందు, స్థితః = ఉన్న, సత్యసంశ్రయః = సత్యమును ఆశ్రయించిన, మహాబలః = గొప్పబలము గల, గృధ్రరాజః = గృధ్రరాజును. నామ్నా = పేరుచేత, జటాయుర్నామ = జటాయు వని ప్రసిద్ధుడను.

తా. రావణా ! నేను సనాతనధర్మమును పాటించుచు, సత్యవ్రతమును అవలంబించిన మహాబలశాలినైన గృధ్రరాజును; నా పేరు జటాయువు. 3

మూ. రాజా సర్వస్య లోకస్య మహేన్ద్రవరుణోపమః,
లోకానాం చ హితే యుక్తో రామో దశరథాత్మజః. 4

ప్ర. అ. దశరథాత్మజః = దశథుని కుమారుడైన, రామః = రాముడు, సర్వస్య = సమస్తమైన, లోకస్య = లోకమునకు, రాజా = ప్రభువు, మహేన్ద్రవరుణోపమః = మహేంద్రునితోను వరుణునితోను సమానుడు, లోకానామ్ = లోకములయొక్క, హితే = హితమునందు, యుక్తః = ప్రయత్నము చేయువాడు.

తా. దశరథుని కుమారుడైన రాముడు సకలలోకములకు రాజు. మహేంద్రవరుణులవంటివాడు, లోకముల హితముకొరకై ప్రయత్నించువాడు. 4

మూ. తస్యైషా లోకనాథస్య ధర్మపత్నీ యశస్వినీ,
సీతా నామ వరారోహా యాం త్వం హర్తుమిహేచ్ఛసి. 5

ప్ర. అ. యామ్ = ఎవతెను, త్వమ్ = నీవు, ఇహ = ఇప్పుడు, హర్తుమ్ = హరించుటకై, ఇచ్ఛసి = కోరుచున్నావో, ఏషా = ఈమె, సీతా నామ = సీత అను పేరు గల, వరారోహా = సుందరమైన కటిప్రదేశము గల, యశస్వినీ = కీర్తిమంతురాలు. లోకనాథస్య = లోకములకు ప్రభువైన, తస్య = ఆ రాముని యొక్క, ధర్మపత్నీ = ధర్మపత్ని.

తా. నీ విప్పుడు అపహరించుచున్న స్త్రీ సీత. కీర్తిమంతురాలైన ఈమె, లోకములకు ప్రభువైన ఆ రాముని ధర్మపత్ని. 5

మూ. కథం రాజా స్థితో ధర్మే పరదారాన్ పరామృశేత్,
రక్షణీయా విశేషేణ రాజదారా మహాబల. 6

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, స్థితః = ఉన్న, రాజా = రాజు, పరదారాన్ = పరభార్యను, కథమ్ = ఎట్లు, పరామృశేత్ = స్పృశించును ? మహాబల = గొప్ప బలము గలవాడా ! రాజదారాః = రాజభార్య, విశేషేణ = విశేషముచేత, రక్షణీయాః = రక్షించదగినది.

తా. ధర్మమార్గమునందు ఉన్న రాజు పరభార్యలను స్పృశించునా ! ఓ ! మహాబలుడా ! రాజభార్యలను విశేషించి బాగుగా రక్షించవలెను. 6

మూ. నివర్తయ మతిం నీచాం పరదారాభిమర్శనాత్
న తత్సమాచరేద్ధీరో యత్పరోఽస్య విగర్హయేత్, 7
యథాత్మనస్తథాన్యేషాం దారా రక్ష్యా విమర్శనాత్.

ప్ర. అ. నీచామ్ = నీచమైన, మతిమ్ = బుద్ధిని, పరదారాభిమర్శనాత్ = పరభార్యను స్పృశించుటనుండి, నివర్తయ = మరల్చుము. పరః = ఇతరుడు, అస్య = వీనియొక్క, యత్ = ఏ పనిని, విగర్హయేత్ = నిందించునో, తత్ = దానిని, ధీరః = ధీరుడు, న సమాచరేత్ = చేయగూడదు. ఆత్మనః = తనయొక్క భార్య, యథా = ఎట్లో, తథా = అట్లే, అన్యేషామ్ = ఇతరులయొక్క, దారాః = భార్య, విమర్శనాత్ = పరపురుషస్పర్శనుండి, రక్ష్యాః = రక్షించదగినది.

తా. పరభార్యాస్పర్శనుండి నీ నీచబుద్ధిని మరల్చుము. బుద్ధిమంతుడు ఇతరులు నిందించే ఏ పనీ చేయకూడదు. తన భార్యను పరపురుషస్పర్శనుండి రక్షించుకొనుచున్నట్లే ఇతరుల భార్యలను కూడ రక్షించవలెను. 7

మూ. అర్థం వా యది వా కామం శిష్టాః శాస్త్రేష్వనాగతమ్. 8
వ్యవస్యన్త్యను రాజానం ధర్మం పౌలస్త్యనన్దన.

ప్ర. అ. పౌలస్త్యనన్దన = రావణా ! శిష్టాః = శిష్టులు, శాస్త్రేషు = శాస్త్రములయందు, అనాగతమ్ = తెలియబడని, అర్థం వా = అర్థమునైనా, యది వా = లేక, కామమ్ = కామమునైనా, ధర్మమ్ = ధర్మమునైనా, రాజానమ్ అను = రాజును అనుసరించి, వ్యవస్యన్తి = నిశ్చయించుదురు.

తా. రావణా అర్థమును గూర్చి కాని, కామమును గూర్చి కాని, ధర్మమును గూర్చి గాని సందేహము కలిగి, ఆ సందేహము శాస్త్రముల ద్వారా నిర్ణ

యించుటకు శక్యము కానప్పుడు, శిష్టులు ఆ విషయమునందు రాజునే అనుసరించుచుందురు. 8

మూ. రాజా ధర్మస్య కామస్య ద్రవ్యాణాం చోత్తమో నిధిః, 9
ధర్మః శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే.

ప్ర. అ. ధర్మస్య = ధర్మమునకు, కామస్య = కామమునకు, ద్రవ్యాణాం చ = ద్రవ్యములకు, రాజా = రాజు, ఉత్తమః = ఉత్తమమైన, నిధిః = నిధి. ధర్మః = ధర్మమైనా, శుభం వా = శుభమైనా, పాపం వా = పాపమైనా, రాజమూలమ్ = రాజమూలముగానే, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

తా. ధర్మానికి, కామానికీ, ద్రవ్యాలకీ కూడ రాజే ఉత్తమమైన నిధి. ధర్మమైనా, పుణ్యమైనా, పాపమైనా, వీటికి రాజే మూలము. 9

మూ. పాపస్వభావశ్చపలః కథం త్వం రక్షసాం వర, 10
ఐశ్వర్యమభిసంప్రాప్తో విమానమివ దుష్కృతిః.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, వర = నాయకుడా ! పాపస్వభావః = పాపస్వభావము కలవాడవు, చపలః = చపలుడవు అయిన, త్వమ్ = నీవు, దుష్కృతిః = పాపాత్ముడు, విమానమివ = (స్వర్గలోకమునకు వెళ్లే) విమానమును వలె, ఐశ్వర్యమ్ = ప్రభుత్వమును, కథమ్ = ఎట్లు, అభిసంప్రాప్తః = పొందినావు.

తా. రాక్షసుల నాయకుడా ! పాపస్వభావము కలవాడవు, చపలుడవు అయిన నీకు, పాపాత్మునకు స్వర్గారోహణము చేయుటకు ఉపయోగించే విమానము లభించి నట్లు ఐశ్వర్యము (రాజ్యాధికారము) ఎట్లు లభించినది. 10

మూ. కామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుమ్, 11
న హి దుష్టాత్మనామార్యమావసత్యాలయే చిరమ్.

ప్ర. అ. యః = ఏది, యస్య = ఎవనికి, స్వభావః = స్వభావమో అది, పరిమార్జితుమ్ = తుడిచివేయుటకు, కామమ్ = నిజముగా, న శక్యః = శక్యమైనది కాదు. దుష్టాత్మనామ్ = దుష్టబుద్ధులయొక్క, ఆలయే = గృహమునందు, చిరమ్ =

చిరకాలము, ఆర్యమ్ = మంచితనము (పుణ్యము), న వసతి హి = నివసించదు కదా.

తా. ఎవరిది ఎట్టి స్వభావమో దానిని మార్చుట చాల కష్టము. దుష్టాత్ముల గృహములలో పుణ్యము చాల కాలము ఉండదు కదా? పాపనివారకమైన పుణ్యము చేయజాలకపోవుట చేత వాళ్లు స్వాభావికమైన పాపప్రవృత్తినే చూపుచుందురు అని భావము. 11

మూ. విషయే వా పురే వా తే యదా రామో మహాబలః, 12
నాపరాధ్యతి ధర్మాత్మా కథం తస్యాపరాధ్యసి.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామః = రాముడు, యదా = ఎప్పుడు, తే = నీయొక్క, విషయే వా = దేశమునందు గాని, పురే వా = పట్టణమందు గాని, నాపరాధ్యతి = అపరాధము చేయుట లేదో, తస్య = ఆతని విషయమునందు, కథమ్ = ఎట్లు, అపరాధ్యసి = అపరాధము చేయుచున్నావు?

తా. మహాబలవంతుడు, ధర్మాత్ముడు అయిన రాముడు నీ దేశమునందు గాని, పురమునందు గాని ఏ అపరాధము చేయలేదు కదా; అట్టి రాముని విషయములో నీ వెందుకు అపరాధము చేయుచున్నావు? 12

మూ. యది శూర్పణఖాహేతోర్జనస్థానగతః ఖరః, 13
అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా,
అత్ర బ్రూహి యథాతత్త్వం కో రామస్య వ్యతిక్రమః 14
యస్య త్వం లోకనాథస్య భార్యాం హృత్వా గమిష్యసి.

ప్ర. అ. శూర్పణఖాహేతోః = శూర్పణఖకొరకై, జనస్థానగతః = జనస్థానములో ఉన్న, ఖరః = ఖరుడు, అతివృత్తః = మర్యాదను అతిక్రమించినవాడై, అక్లిష్టకర్మణా = శ్రమ లేకుండా పనులు చేయు, రామేణ = రామునిచేత, పూర్వమ్ = పూర్వము, హతః యది = చంపబడినట్లయితే, అత్ర = ఈ విషయమునందు, లోకనాథస్య = లోకముల ప్రభులైన, యస్య = ఎవనియొక్క, భార్యామ్ =

భార్యను, త్వమ్ = నీవు, హరిష్యసి = హరించగలవో (హరించుచున్నావో), అట్టి, రామస్య = రామునియొక్క, వ్యతిక్రమః=పొరబాటు, కః=ఏమి? యథాతత్త్వమ్ = యథార్థముగా, బ్రూహి = చెప్పుము.

తా. శ్రమపడకుండా పనులు నిర్వహించు రాముడు, శూర్పణఖను వెనక వేసికొన వచ్చిన జనస్థాననివాసి యైన ఖరుణ్ణి ఇంతకు ముందు చంపినాడంటే దీనిలో ఆ రాముని దోష మేమున్న దని నీవు ఆతని భార్యను హరించుచున్నావు? యథార్థముగా చెప్పుము. 13, 14

మూ. క్షిప్రం విసృజ వైదేహీం మా త్వా ఘోరేణ చక్షుషా, 15
దహేద్దహనభూతేన వృత్రమిన్ద్రాశనిర్యథా.

ప్ర. అ. క్షిప్రమ్ = శీఘ్రముగా, వైదేహీమ్ = సీతను, విసృజ = విడిచి పెట్టుము. త్వా=నిన్ను, ఇన్ద్రాశనిః = ఇంద్రుని వజ్రాయుధము, వృత్రం యథా = వృత్రాసురుణ్ణి వలె, దహనభూతేన = అగ్నిగా అయిన, ఘోరేణ = ఘోరమైన, చక్షుషా = నేత్రముతో, మా దహేత్ = కాల్చకుండుగాక.

తా. వెంటనే సీతను విడిచి పెట్టుము. అట్లు కాకపోయినచో, ఇంద్రుని వజ్రాయుధము వృత్రాసురుణ్ణి కాల్చివేసి నట్లు ఈమె అగ్నిగా మారిన తీక్ష్ణమైన నేత్రముతో (దృష్టితో)నిన్ను కాల్చివేయగలదు. 15

మూ. సర్పమాశీవిషం బద్ధ్వా వస్త్రాన్తే నావబుధ్యసే, 16
గ్రీవాయాం ప్రతిసక్తం చ కాలపాశం న పశ్యసి.

ప్ర. అ. ఆశీవిషమ్ = కోరలలో విషము గల, సర్పమ్ = సర్పమును, వస్త్రాన్తే = బట్టకొంగునందు, బద్ధ్వా = కట్టి, నావబుధ్యసే=తెలిసికొనలేకున్నావు. గ్రీవాయామ్ = కంఠమునందు, ప్రతిసక్తమ్ = తగల్చబడిన, కాలపాశమ్ = కాలపాశమును, న పశ్యసి = చూచుటలేదు.

తా. కోరలలో విషము నిండి ఉన్న సర్పాన్ని బట్ట చెంగున కట్టుకొని తెలుసుకొనజాలకున్నావు. కంఠానికి తగిలి ఉన్న యమపాశాన్ని చూచుకొనుట లేదు. 16

మూ. స భారః సౌమ్య భర్తవ్యో యో నరం నావసాదయేత్, 17
తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయమ్.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! యః = ఏది, నరమ్ = మనుష్యుని, నావసాదయేత్ = క్రుంగదీయదో, సః = ఆ, భారః = భారము, భర్తవ్యః = మోయదగినది. యత్ = ఏది, అనామయమ్ = రోగము లేకుండా, జీర్యతే = జీర్ణించునో, తత్ = అట్టి, అన్నమపి = అన్నము, భోక్తవ్యమ్ = తినదగినది.

తా. సౌమ్యుడా! ఏ బరువు మనిషిని క్రుంగదీయదో అట్టి భారమునే మోయవలెను. ఏది రోగము కలిగించకుండా జీర్ణించునో అట్టి అన్నమే తినవలెను. 17

మూ. యత్కృత్వా న భవేద్ధర్మో న కీర్తిర్న యశో భువి, 18
శరీరస్య భవేత్ఖేదః కస్తత్కర్మ సమాచరేత్.

ప్ర. అ. యత్ = ఏ పనిని, కృత్వా = చేసి(చేయగా), ధర్మః = ధర్మము, న భవేత్ = కలుగదో, భువి = భూమియందు, కీర్తిః = కీర్తి, న = కలుగదో, యశః = యశస్సు, న = కలగదో, శరీరస్య = శరీరమునకు, ఖేదః = దుఃఖము, భవేత్ = కలుగునో, తత్ = అట్టి, కర్మ = కర్మను, కః = ఎవడు, సమాచరేత్ = చేయును. (పుణ్యకర్మాదులు చేయుటవలన కలిగిన ప్రసిద్ధి కీర్తి. ఐశ్వర్యాదుల వలన కలిగిన ప్రసిద్ధి యశస్సు).

తా. ఏ పనులు చేయుటవలన ధర్మము కాని, భూలోకములో కీర్తి గాని, యశస్సు గాని కలగదో, దేనివలన శరీరమునకు ఖేదము కలుగునో అట్టి పని ఎవడు చేయును? 18

మూ. షష్టిర్వర్షసహస్రాణి మమ జాతస్య రావణ, 19
పితృపైతామహం రాజ్యం యథావదనుతిష్ఠతః.

ప్ర. అ. రావణ = రావణా! పితృపైతామహమ్ = తండ్రులకు, తాతలకు సంబంధించిన, రాజ్యమ్ = రాజ్యమును, యథావత్ = యథావిధిగా, అనుతిష్ఠతః = చేయుచున్న. జాతస్య = పుట్టిన, మమ = నాకు, షష్టిః = అరవై, వర్షసహస్రాణి = సంవత్సరములయొక్క సహస్రములు.

తా. రావణా ! నేను పుట్టి అరువదివేల సంవత్సరము లైనది. నేను నా తండ్రినుండి, తాతలనుండి సంక్రమించిన రాజ్యమును యథావిధిగా పాలించు చున్నాను. 19

మూ. వృద్ధో౾హం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ, 20
తథాప్యాదాయ వైదేహీం కుశలీ న గమిష్యసి.

ప్ర. అ. అహమ్ = నేను, వృద్ధః = ముసలివాడను. త్వమ్=నీవు, యువా = యువకుడవు, ధన్వీ = ధనుర్ధరుడవు, సశరః = బాణములతో కూడినవాడవు. కవచీ=కవచము కలవాడవు. రథీ=రథము కలవాడవు. తథాపి = అట్లయినను, వైదేహీమ్ = సీతను, ఆదాయ = గ్రహించి, కుశలీ = క్షేమవంతుడవై, న గమిష్యసి = వెళ్లవు.

తా. నేను ముసలివాడను. నీవు యువకుడవు. నీకు ధనుర్బాణములు, కవచము, రథము ఉన్నవి. అయినను సీతను తీసికొని నిన్ను క్షేమముగా వెళ్ళనీయను. 20

మూ. న శక్తస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః, 21
హేతుభిర్న్యాయసంయుక్తైర్ధ్రువాం వేదశ్రుతీమివ.

ప్ర. అ. మమ = నేను, పశ్యతః = చూచుచుండగా, త్వమ్ = నీవు, వైదేహీమ్ = సీతను, న్యాయసంయుక్తైః=న్యాయములతో కూడిన, హేతుభిః = హేతువులచేత, ధ్రువామ్ = స్థిరమైన, వేదశ్రుతీమివ = వేదమును వలె, బలాత్ = బలాత్కారముగా, హర్తుమ్ = హరించుటకు, న శక్తః = సమర్థుడవు కావు.

తా. న్యాయములతో కూడిన యుక్తులు చూపి స్థిరమైన ప్రామాణ్యము గల వేదమును (తార్కికులు మొదలైనవారు) ఎట్లు హరింపజాలరో అట్లే నేను చూచుచుండగా నీవు సీతను బలాత్కారముగా అపహరించజాలవు. లేదా వేదము పరమ ప్రమాణము. న్యాయసంమతము లైన హేతువులచేత కూడ దాని ప్రామాణ్యము స్థిరీకరింపబడినది. అట్టి వేదమును ఎట్లు నిరాకరించజాలరో అట్లే నీవు నేను చూచుచుండగా సీతను హరించజాలవు అని భావము. 21

మూ. యుద్ధ్యస్వ యది శూరోఽసి ముహూర్తం తిష్ఠ రావణ, 22
శయిష్యసే హతో భూమౌ యథాపూర్వం ఖరస్తథా.

ప్ర. అ. రావణ = రావణుడా ! శూరః అసి యది = శూరుడవు అయిన ట్లయితే, యుద్ధ్యస్వ = యుద్ధము చేయుము. ముహూర్తమ్ = ముహూర్తకాలమును, తిష్ఠ = నిలువుము. పూర్వమ్ = పూర్వము, ఖరః = ఖరుడు, యథా = ఎట్లో, తథా = అట్లే, హతః = చంపబడినవాడవై, భూమౌ = భూమియందు, శయిష్యసే = శయనించగలవు.

తా. రావణుడా ! నీవు శూరుడవైనచో ముహూర్తకాలముపాటు ఆగి నాతో యుద్ధము చేయుము. పూర్వము ఖరుడు హతుడైనట్లు హతుడవై, నేలమీద శయనించెదవు. 22

మూ. అసకృత్సంయుగే యేన నిహతా దైత్యదానవాః, 23
నచిరాచ్చీరవాసాస్త్వాం రామో యుధి వధిష్యతి.

ప్ర. అ. యేన = ఏ నీచేత, అసకృత్ = అనేకపర్యాయములు, సంయుగే = యుద్ధమునందు, దైత్యదానవాః = దైత్యులు దానవులు, నిహతాః = చంపబడినారో, త్వామ్ = అట్టి నిన్ను, నచిరాత్ = కొద్ది కాలములో, చీరవాసాః = నారచీరలను ధరించిన, రామః = రాముడు, యుధి = యుద్ధమునందు, వధిష్యతి = చంపగలడు.

తా. నీవు అనేకపర్యాయములు యుద్ధములో దైత్యులను సంహరించి ఉన్నావు. కాని, అట్టి నిన్నే, నారచీరలను ధరించి తాపసవృత్తిలో ఉన్న రాముడు కొద్ది కాలములోనే చంపగలడు. 23

మూ. కిం ను శక్యం మయా కర్తుం గతౌ దూరం నృపాత్మజౌ,
క్షిప్రం త్వం నశ్యసే నీచ తయోర్భీతో న సంశయః.

ప్ర. అ. మయా = నాచేత, కిం ను = ఏమి, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యమైనది? నృపాత్మజౌ = రాజకుమారులు, దూరమ్ = దూరముగా, గతౌ = వెళ్ళినారు. నీచ = నీచుడా! తయోః = వారికి, భీతః = భయపడిన, త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, నశ్యసే = నశించెదవు. సంశయః = సంశయము, న = లేదు.

తా. నేనేమి చేయగలను? ఆ రాజకుమారు లిద్దరూ దూరమునకు వెళ్ళిపోయినారు. వారిని వెంటనే తీసికొని రాజాలను. కాని, ఓ! నీచుడా! వారికి భయపడి పారిపోవుచున్న నీవు తప్పక నశించెదవు. సందేహము లేదు. 24

మూ. న హి మే జీవమానస్య నయిష్యసి శుభామిమామ్, 25
సీతాం కమలపత్రాక్షీం రామస్య మహిషీం ప్రియామ్.

ప్ర. అ. మే = నేను, జీవమానస్య=జీవించి ఉండగా, శుభామ్=మంగళప్రదురాలు, కమలపత్రాక్షీమ్=కమలపత్రముల వంటి నేత్రములు కలదీ, రామస్య = రామునియొక్క, ప్రియామ్ = ప్రియురాలూ, మహిషీమ్ = భార్యా అయిన, ఇమామ్ = ఈ, సీతామ్ = సీతను, న నయిష్యసి = తీసికొని వెళ్లవు.

తా. మంగళప్రదురాలు, కమలపత్రముల వంటి నేత్రములు కలది, రాముని ప్రియురాలైన పట్టమహిషి అయిన ఈ సీతను నేను జీవించి ఉండగా తీసికొని వెళ్లజాలవు. 25

మూ. అవశ్యం తు మయా కార్యం ప్రియం తస్య మహాత్మనః,
జీవితేనాపి రామస్య తథా దశరథస్య చ.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య=ఆ, రామస్య=రామునకు, తథా = మరియు, దశరథస్య చ = దశరథునకు, మయా = నాచేత, అవశ్యమ్= తప్పక, జీవితేనాపి = ప్రాణముచేత నైనా, ప్రియమ్ = ప్రియము, కార్యమ్ = చేయదగినది.

తా. మహాత్ముడైన ఆ రామునకూ, దశరథునకూ ప్రియమైన కార్యము నేను తప్పక నా ప్రాణాలు సమర్పించియైనా చేయవలెను. 26

మూ. తిష్ఠ తిష్ఠ దశగ్రీవ ముహూర్తం పశ్య రావణ. 27
యుద్ధాతిథ్యం ప్రదాస్యామి యథాప్రాణం నిశాచర,
వృన్తాదివ ఫలం త్వాం తు పాతయేయం రథోత్తమాత్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చాశః సర్గః.

ప్ర. అ. దశగ్రీవ = దశకంఠుడా! ముహూర్తమ్ = క్షణకాలముపాటు, తిష్ఠ తిష్ఠ = నిలువుము నిలువుము. రావణ = రావణా! పశ్య = చూడుము. నిశాచర = ఓ! రాక్షసుడా! యథాప్రాణమ్ = నా శక్తికి తగు నట్లుగా, యుద్ధాతిథ్యమ్ = యుద్ధమను ఆతిథ్యమును, ప్రదాస్యామి = ఇచ్చెదను. వృన్తాత్ = తొడిమినుండి, ఫలమివ = ఫలమును వలె, త్వామ్ = నిన్ను, రథోత్తమాత్ = శ్రేష్ఠమైన రథము నుండి, పాతయేయమ్ = క్రింద పడవేయుదును.

తా. దశకంఠుడా! ఆగుము; క్షణకాలము ఆగుము. రావణా! చూడుము. రాక్షసుడా! నీకు నా శక్తికొలది యుద్ధరూపమైన ఆతిథ్యము ఇచ్చెదను. నిన్ను నీ రథమునుంచి, తొడిమినుంచి పండు పడగొట్టి నట్లు పడగొట్టెదను. 27,28

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకపఞ్చాశః సర్గః

[రావణునితో జటాయువు ఘోరముగా యుద్ధము చేయుట. రావణుడు అతనిని వధించుట]

మూ. ఇత్యుక్తస్య యథాన్యాయం రావణస్య జటాయుషా,
క్రుద్ధస్యాగ్నినిభాః సర్వా రేజుర్వింశతిదృష్టయః. 1

ప్ర. అ. జటాయుషా = జటాయువుచేత, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, ఇతి = ఇట్లు, ఉక్తస్య = పలకబడిన, క్రుద్ధస్య = కోపగించిన, రావణస్య = రావణునియొక్క, సర్వాః = సమస్తమైన, వింశతిదృష్టయః = ఇరువది కళ్లు, అగ్నినిభాః = అగ్నితో సమానములై, రేజుః = ప్రకాశించినవి.

తా. జటాయువు పలికిన న్యాయసంమతములైన మాటలు వినగానే రావణునకు చాల కోపము వచ్చెను. ఆతని ఇరవై కళ్ళు కూడ నిప్పు వలె ఎఱ్ఱబారెను. 1

మూ. సంరక్తనయనః కోపాత్తప్తకాఞ్చనకుణ్డలః,
రాక్షసేన్ద్రోఽభిదుద్రావ పతగేన్ద్రమమర్షణః. 2

ప్ర. అ. తప్తకాఞ్చనకుణ్డలః=పరిశుద్ధమైన బంగారు కుండలములుగల, అమర్షణః = కోపస్వభావవంతుడైన, రాక్షసేన్ద్రః=రావణుడు, కోపాత్=కోపమువలన, సంరక్తనయనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, పతగేన్ద్రమ్ = ఆ పక్షిరాజైన జటాయువును గూర్చి, అభిదుద్రావ = పరుగెత్తెను.

తా. పరిశుద్ధమైన బంగారు కుండలములు ధరించిన, కోపస్వభావుడైన ఆ రావణుడు కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో ఆ జటాయువుమీదికి వేగముగా వెళ్లెను. 2

మూ. స సంప్రహారస్తుములస్తయోస్తస్మిన్ మహావనే,
బభూవ వాతోద్ధతయోర్మేఘయోర్గగనే యథా. 3

ప్ర. అ. తస్మిన్ = ఆ, మహావనే = మహారణ్యమునందు, తయోః = ఆ ఇద్దరిమధ్య, తుములః = వ్యాకులమైన, సః సంప్రహారః = ఆ యుద్ధము, గగనే = ఆకాశమునందు, వాతోద్ధతయోః = వాయువుచేత ఎగరగొట్టబడిన, మేఘయోర్యథా = రెండు మేఘముల మధ్యయందు వలె, బభూవ = ఆయెను.

తా. ఆ మహాటవిలో ఆ ఇద్దరి మధ్య జరిగిన తీవ్రమైన యుద్ధము, ఆకాశమునందు గాలికి ఎగురగొట్టబడిన రెండు మేఘములు ఢీకొనుట వలె ఉండెను.

మూ. తద్బభూవాద్భుతం యుద్ధం గృధ్రరాక్షసయోస్తదా,
సపక్షయోర్మాల్యవతోర్మహాపర్వతయోర్యథా. 4

ప్ర. అ. తదా = అప్పుడు, తయోః = ఆ, గృధ్రరాక్షసయోః = జటాయు రావణులయొక్క, తత్ = ఆ, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, యుద్ధమ్ = యుద్ధము, సపక్షయోః = రెక్కలతో కూడిన, మాల్యవతోః = మాల్యవంతము లను, మహాపర్వతయోః యథా = మహాపర్వతముల మధ్యయందు వలె, బభూవ = ఉండెను.

తా. ఆ జటాయురావణుల మధ్య జరుగుచున్న ఆశ్చర్యకరమైన ఆ యుద్ధము, రెక్కలున్న మాల్యవంతము లను రెండు మహాపర్వతముల మధ్య జరుగుచున్న యుద్ధము వలె ఉండెను.

వి. ఒక మాల్యవంతము మేరుసమీపాన ఉన్నది. ఒకటి దండకారణ్యంలో ఉన్నది. ఆ రెండింటికీ యుద్ధము జరుగుచున్నట్లున్న దని ఒక వ్యాఖ్యాత, దండకలో ఉన్న దానికీ, కిష్కింధాప్రాంతంలో ఉన్నదానికీ జరుగుచున్న యుద్ధము వలె ఉన్న దని మరొక వ్యాఖ్యాత వ్రాసినారు. 4

మూ. తతో నాళీకనారాచైస్తీక్ష్ణాగ్రైశ్చ వికర్ణిభిః,
అభ్యవర్షన్మహాఘోరైర్గృధ్రరాజం మహాబలః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాబలః = గొప్ప బలము గల రావణుడు, తీక్ష్ణాగ్రైః = తీక్ష్ణములైన అగ్రభాగములు గల, మహాఘోరైః = చాల భయంకర

ములైన, నాళీకనారాచైః = నాళీకబాణములచేతను, నారాచబాణములచేతను, వికర్ణిభిః = వికర్ణిబాణములచేతను (వంకర ములుకుల బాణములు), గృధ్రరాజమ్ = జటాయువును, అభ్యవర్షత్ = వర్షించెను.

తా. పిమ్మట మహాబలశాలియైన రావణుడు తీక్ష్ణములైన అగ్రభాగములు గల భయంకరములైన నాళీకబాణములను, నారాచబాణములను, వికర్ణిబాణములను జటాయువుపై వర్షించెను. 5

మూ. స తాని శరజాలాని గృధ్రః పత్త్రిరథేశ్వరః,
జటాయుః ప్రతిజగ్రాహ రావణాస్త్రాణి సంయుగే. 6

ప్ర. అ. పత్త్రరథేశ్వరః = పక్షిరాజైన, సః = ఆ, గృధ్రః = గ్రద్దయైన, జటాయుః = జటాయువు, సంయుగే = యుద్ధమునందు, తాని = ఆ, శరజాలాని = బాణముల సముదాయములను, రావణాస్త్రాణి = రావణుని అస్త్రములను, ప్రతి జగ్రాహ = స్వీకరించెను.

తా. పక్షిరాజైన ఆ జటాయువు ఆ బాణసముదాయములను, రావణుని అస్త్రములను ధైర్యముగా ఎదుర్కొనెను. 6

మూ. తస్య తీక్ష్ణనఖాభ్యాం తు చరణాభ్యాం మహాబలః,
చకార బహుధా గాత్రే వ్రణాన్ పతగసత్తమః. 7

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, పతగసత్తమః = పక్షులలో శ్రేష్ఠమైన జటాయువు, తీక్ష్ణనఖాభ్యామ్ = తీక్ష్ణములైన గోళ్లు గల, చరణాభ్యామ్ = పాదములచేత, తస్య = వానియొక్క, గాత్రేషు = అవయవములయందు, బహుధా = అనేకవిధములుగ, వ్రణాన్ = వ్రణములను, చకార = చేసెను.

తా. గొప్ప బలము గల ఆ జటాయువు వాడియైన గోళ్లు ఉన్న పాదాలతో ఆతని శరీరముమీద అనేకవిధముల గాయములు కలుగునట్లు చీరెను. 7

మూ. అథ క్రోధాద్దశగ్రీవో జగ్రాహ దశ మార్గణాన్,
మృత్యుదణ్డనిభాన్ ఘోరాన్ శత్రుమర్దనకాఙ్క్షయా. 8

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దశగ్రీవః = రావణుడు, క్రోధాత్ = కోపము

వలన, శత్రుమర్దనకాఙ్క్షయా = శత్రువును చంపుటయందు కోరికచేత, మృత్యుదణ్డనిభాన్ = మృత్యుదండముతో సమానములైన, ఘోరాన్ = భయంకరములైన, దశ మార్గణాన్ = పది బాణములను, జగ్రాహ = గ్రహించెను.

తా. పిమ్మట రావణుడు కోపించి, శత్రువును చంపవలె నని నిశ్చయించుకొని, మృత్యుదండము వలె భయంకరములైన పది బాణములు తీసెను. 8

మూ. స తైర్బాణైర్మహావీర్యః పూర్ణముక్తైరజిహ్మగైః,
బిభేద నిశితైస్తీక్ష్ణైర్గృధ్రం ఘోరైః శిలీముఖైః. 9

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, సః = ఆ రావణుడు, పూర్ణముక్తైః = పూర్తిగా లాగి విడువబడిన, అజిహ్మగైః = తిన్నగా వెళ్లు, నిశితైః = వాడియైన, తీక్ష్ణైః = బాధను కలిగించు, ఘోరైః = భయంకరములైన, శిలీముఖైః = ఉక్కు కొనలు గల, తైః = ఆ, బాణైః = బాణములచేత, గృధ్రమ్ = జటాయువును, బిభేద = భేదించెను.

తా. గొప్ప పరాక్రమము గల ఆ రావణుడు, వాడిగా ఉన్నవి, బాధ కలిగించేవి, భయంకరములు, ఉక్కు కొనలు గలవి, తిన్నగా ఎగురునవి అయిన, ధనస్సును పూర్తిగా లాగి విడువబడిన ఆ బాణములతో జటాయువు శరీరము బ్రద్దలగు నట్లు కొట్టెను. 9

మూ. స రాక్షసరథే పశ్యన్ జానకీం బాష్పలోచనామ్,
అచిన్తయిత్వా తాన్ బాణాన్ రాక్షసం సమభిద్రవత్. 10

ప్ర. అ. సః = జటాయువు, రాక్షసరథే = రావణుని రథమునందు, బాష్పలోచనామ్ = కన్నీరు నేత్రములందు గల, జానకీమ్ = సీతను, పశ్యన్ = చూచుచున్నవాడై, తాన్ = ఆ, బాణాన్ = బాణములను, అచిన్తయిత్వా = లెక్కచేయక, రాక్షసమ్ = రాక్షసుణ్ణి గూర్చి, సమభిద్రవత్ = వేగముగా వెళ్లెను.

తా. కన్నీళ్లు కార్చుచు రావణుని రథమునందు కూర్చున్న సీతను చూచుచు, ఆ జటాయువు ఆ బాణాలను లెక్కచేయక వేగముగ రావణునిమీదికి వెళ్లెను. 10

మూ. తతో౽స్య సశరం చాపం ముక్తామణివిభూషణమ్,
చరణాభ్యాం మహాతేజా బభఞ్జ పతగేశ్వరః. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, పతగేశ్వరః = జటాయువు, అస్య = రావణునియొక్క, ముక్తామణివిభూషణమ్ = ముత్యములు మణులు అలంకారముగా గల, సశరమ్ = శరముతో కూడిన, చాపమ్ = ధనస్సును, చరణాభ్యామ్ = పాదములచేత, బభఞ్జ = విరచెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల ఆ జటాయువు, ముత్యములచేత, మణులచేత అలంకరించబడిన ఆ రావణుని ధనస్సును, బాణమును, పాదములచేత విరిచివేసెను. 11

మూ. తతో౽న్యద్ధనురాదాయ రావణః క్రోధమూర్ఛితః,
వవర్ష శరవర్షాణి శతశో౽థ సహస్రశః. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రావణః = రావణుడు, క్రోధమూర్ఛితః = క్రోధముతో వ్యాప్తుడై, అన్యత్ = మరియొక, ధనుః = ధనస్సును, ఆదాయ = గ్రహించి, శతశః = వందలకొలది, అథ = మరియు, సహస్రశః = వేలకొలది, శరవర్షాణి = బాణముల వర్షములను, వవర్ష = వర్షించెను.

తా. అప్పుడు రావణుడు క్రోధావిష్టుడై మరియొక ధనస్సు గ్రహించి వందలకొలది, వేలకొలది బాణములను వర్షించెను. 12

మూ. శరైరావారిత స్తస్య సంయుగే పతగేశ్వరః,
కులాయముపసంప్రాప్తః పక్షీవ ప్రబభౌ తదా. 13

ప్ర. అ. తదా = అప్పుడు, సంయుగే = యుద్ధమునందు, తస్య = ఆతనియొక్క, శరైః = శరములచేత, ఆవారితః = కప్పబడిన, పతగేశ్వరః = జటాయువు, కులాయమ్ = గూడును, ఉపసంప్రాప్తః = పొందిన, పక్షీవ = పక్షివలె, ప్రబభౌ = ప్రకాశించెను.

ప్ర. అ. అప్పుడు యుద్ధమునందు ఆ రావణుని బాణములచే కప్పబడి జటాయువు గూడులో ఉన్న పక్షి వలె ప్రకాశించెను. 13

మూ. స తాని శరవర్షాణి పక్షాభ్యాం చ విధూయ చ,
చరణాభ్యాం మహాతేజా బభఞ్జాస్య మహద్ధనుః. 14

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = ఆ జటాయువు, తాని = ఆ, శరవర్షాణి = బాణవర్షములను, పక్షాభ్యామ్ = రెక్కలచేత, విధూయ చ = ఎగరగొట్టి, అస్య = ఈతనియొక్క, మహత్ = గొప్పదైన, ధనుః = ధనస్సును, చరణాభ్యామ్ = పాదములచేత, బభఞ్జ = విరచెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ జటాయువు, ఆ బాణవర్షములను రెక్కల చేత ఎగురగొట్టి ఆతని గొప్ప ధనస్సును పాదాలచేత విరచెను. 14

మూ. తచ్చాగ్నిసదృశం దీప్తం రావణస్య శరావరమ్,
పక్షాభ్యాం స మహావీర్యో వ్యాధునోత్పతగేశ్వరః. 15

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, సః = ఆ, పతగేశ్వరః = జటాయువు, రావణస్య = రావణునియొక్క, అగ్నిసదృశమ్ = అగ్నితో సమానమైన, దీప్తమ్ = ప్రకాశించుచున్న, తత్ = ఆ, శరావరమ్ = కవచమును, పక్షాభ్యామ్ = రెక్కలచేత, వ్యాధునోత్ = పడగొట్టెను.

తా. గొప్ప పరాక్రమము గల ఆ జటాయువు, రావణుని, అగ్ని వలె ప్రకాశించుచున్న కవచమును రెక్కల చేత ఊడగొట్టి క్రింద పడవేసెను. 15

మూ. కాఞ్చనోరశ్ఛదాన్ దివ్యాన్ పిశాచవదనాన్ ఖరాన్,
తాంశ్చాస్య జవసంపన్నాన్ జఘాన సమరే బలీ. 16

ప్ర. అ. బలీ = బలవంతుడైన ఆ జటాయువు, కాఞ్చనోరశ్ఛదాన్ = బంగారు కవచములు కలవి, దివ్యాన్ = అద్భుతమైనవి, పిశాచవదనాన్ = పిశాచముల వంటి ముఖములు కలవి, జవసంపన్నాన్ = వేగముతో కూడినవీ అయిన, తాన్ = ఆ, ఖరాన్ చ = గాడిదలను కూడ, సమరే = యుద్ధమునందు, జఘాన = చంపెను.

తా. బలశాలియైన ఆ జటాయువు, బంగారు కవచములు ధరించినవి. ఆశ్చర్యకరములు, పిశాచముల ముఖముల వంటి ముఖములు కలవి, మంచి వేగము గలవి అయిన గాడిదలను యుద్ధములో చంపివేసెను. 16

మూ. వరం త్రివేణుసంపన్నం కామగం పావకార్చిషమ్,
మణిహేమవిచిత్రాఙ్గం బభఞ్జ చ మహారథమ్. 17

ప్ర. అ. వరమ్ = శ్రేష్ఠమైనది, త్రివేణుసంపన్నమ్ = నొగతో కూడినది, కామగమ్ = స్వేచ్ఛగా వెళ్ళేది, పావకార్చిషమ్ = అగ్నివంటి తేజస్సు కలది, మణిహేమవిచిత్రాఙ్గమ్ = మణులచేతను, బంగారముచేతను విచిత్రమైన చక్రములు కలది అయిన, మహారథమ్ = గొప్ప రథమును, బభఞ్జ = విరచెను.

తా. శ్రేష్ఠమైనది, అందమైన నొగ కలది, మణులచేత, బంగారముచేత విచిత్రమైన చక్రములు కలది, రథికుని ఇష్టము ప్రకారము పోవునది అయిన మహారథమును విరుగగొట్టెను. 17

మూ. పూర్ణచన్ద్రప్రతీకాశం ఛత్రం చ వ్యజనైః సహ,
పాతయామాస వేగేన గ్రాహిభీ రాక్షసైః సహ. 18

ప్ర. అ. పూర్ణచన్ద్రప్రతీకాశమ్ = పూర్ణచంద్రునితో సమానమైన, ఛత్రం చ = ఛత్రమును కూడ, వ్యజనైః సహ = వింజామరలతో కూడ, గ్రాహిభిః = ఆ ఛత్రాదులను పట్టుకొని ఉన్న, రాక్షసైః సహ = రాక్షసులతో కూడ, వేగేన = వేగముతో, పాతయామాస = పడదోసెను.

తా. పూర్ణచంద్రుని వంటి శ్వేతచ్ఛత్రమును, వింజామరలను, వాటిని పట్టుకొని ఉన్న రాక్షసులను కూడ వేగముతో క్రింద పడవేసెను. 18

మూ. సారథేశ్చాస్య వేగేన తుణ్డేనైవ మహచ్ఛిరః,
పునర్వ్యపాహరచ్ఛ్రీమాన్ పక్షిరాజో మహాబలః. 19

ప్ర. అ. పునః = ఇంకా, మహాబలః = మహాబలవంతుడైన, శ్రీమాన్ = శోభాయుక్తుడైన, పక్షిరాజః = జటాయువు, అస్య = ఈ రావణునియొక్క, సారథేః = సారథియొక్క, మహత్ = గొప్పదైన, శిరః = శిరస్సును, వేగేన = వేగముతో, తుణ్డేనైవ = ముట్టిచేత, వ్యపాహరత్ = అపహరించెను.

తా. గొప్ప బలము కలవాడు, శోభాసంపన్నుడు అయిన జటాయువు గొప్ప వేగముతో, ఆ రావణుని సారథి శిరస్సును ముట్టితో ఖండించెను. 19

మూ. స భగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః,
అఙ్కే నాదాయ వైదేహీం పపాత భువి రావణః. 20

ప్ర. అ. భగ్నధన్వా = భగ్నమైన ధనస్సు కలవాడు, విరథః = రథము లేనివాడు, హతాశ్వః = చంపబడిన అశ్వములు కలవాడు, హతసారథిః = చంపబడిన సారథి కలవాడు అయిన, సః రావణః = ఆ రావణుడు, వైదేహీమ్ = సీతను, అఙ్కేన = ఒడిలో, ఆదాయ = గ్రహించి, భువి = నేలమీద, పపాత = పడెను.

తా. ఆ విధముగ జటాయువు ధనస్సును, రథమును విరిచివేసి, అశ్వాలను సారథిని చంపివేయగా రావణుడు సీతను ఒడిలో ఉంచుకొని నేలమీద పడెను. 20

మూ. దృష్ట్వా నిపతితం భూమౌ రావణం భగ్నవాహనమ్,
సాధుసాధ్వితి భూతాని గృధ్రరాజమపూజయన్. 21

ప్ర. అ. భగ్నవాహనమ్ = భగ్నమైన వాహనము కలవాడై, భూమౌ = నేలమీద, నిపతితమ్ = పడిన, రావణమ్ = రావణుని, దృష్ట్వా = చూచి, సాధు సాధు ఇతి = "బాగు బాగు" అని, భూతాని = ప్రాణులు, గృధ్రరాజమ్ = జటాయువును, అపూజయన్ = పూజించినవి.

తా. వాహనము భగ్నమైపోగా నేలమీద పడిపోయిన రావణుణ్ణి చూచి అక్కడ నున్న వారందరు "ఆహా! ఆహా! మంచి పని చేసితివి" అని అనుచు జటాయువును పూజించిరి. 21

మూ. పరిశ్రాన్తం తు తం దృష్ట్వా జరయా పక్షియూథపమ్,
ఉత్పపాత పునర్హృష్టో మైథిలీం గృహ్య రావణః. 22

ప్ర. అ. పక్షియూథపమ్ = పక్షిరాజైన, తమ్ = ఆ జటాయువును, జరయా = ముసలితనముచేత, పరిశ్రాన్తమ్ = అలసిపోయినవానినిగా, దృష్ట్వా = చూచి, రావణః = రావణుడు, హృష్టః = సంతోషించినవాడై, మైథిలీమ్ = సీతను, గృహ్య = గ్రహించి, పునః = మరల, ఉత్పపాత = ఆకాశములోనికి ఎగిరెను.

తా. ఆ జటాయువు ముసలితనముచేత అలసిపోయి నట్లు గమనించి రావణుడు సంతోషించుచు, మరల ఆకాశములోనికి ఎగిరెను. 22

మూ. తం ప్రహృష్టం నిధాయాఙ్కే గచ్ఛన్తం జనకాత్మజామ్,
గృధ్రరాజః సముత్పత్య సమభిద్రుత్య రావణమ్, 23
సమావార్య మహాతేజా జటాయురిదమబ్రవీత్.

ప్ర. అ. గృధ్రరాజః = గృధ్రముల రాజు, మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడు అయిన, జటాయుః = జటాయువు, సముత్పత్య = ఎగిరి, ప్రహృష్టమ్ = సంతోషించుచున్నవాడు, జనకాత్మజామ్ = సీతను, అఙ్కే = ఒడిలో, నిధాయ = ఉంచుకొని, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్నవాడు అయిన, తం రావణమ్ = ఆ రావణుణ్ణి, సమభిద్రుత్య = ఎదుటకు పరుగెత్తి వెళ్ళి, సమావార్య = అడ్డుకొని, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రావణుడు సంతోషించుచు సీతను ఒడిలో ఉంచుకొని వెళ్ళిపోవు చుండగా, గొప్ప తేజస్సు గల గృధ్రరాజైన జటాయువు, ఎగిరి, ఆతనికి ఎదురుగా వెళ్ళి, అడ్డుకొని ఇట్లు పలికెను. 23

మూ. వజ్రసంస్పర్శబాణస్య భార్యాం రామస్య రావణ, 24
అల్పబుద్ధే హరస్యేనాం వధాయ ఖలు రక్షసామ్.

ప్ర. అ. అల్పబుద్ధే = అల్పమైన బుద్ధి గల, రావణ = రావణా! వజ్రసంస్పర్శబాణస్య = వజ్రాయుధము వంటి స్పర్శ గల బాణములు గల, రామస్య = రాముని యొక్క, భార్యామ్ = భార్యయైన, ఏనామ్ = ఈ సీతను, రక్షసామ్ = రాక్షసులయొక్క, వధాయ = వధకొరకే, హరసి = హరించుచున్నావు.

తా. అల్పబుద్ధివైన రావణా! ఏ రాముని బాణముల ప్రహారము (దెబ్బ) వజ్రాయుధము ప్రహారము వంటిదో అట్టి రాముని భార్యయైన ఈ సీతను హరించుచున్నావు; ఇది రాక్షసుల వినాశమునకే దారితీయును. 24

మూ. సమిత్రబన్ధుః సామాత్యః సబలః సపరిచ్ఛదః, 25
విషపానం పిబస్యేతత్పిపాసిత ఇవోదకమ్.

ప్ర. అ. సమిత్రబన్ధుః = మిత్రులతోను బంధువులతోను కూడిన, సామాత్యః = మంత్రులతో కూడిన, సబలః = సైన్యముతో కూడిన, సపరిచ్ఛదః = పరివారముతో కూడిన నీవు, పిపాసితః = దప్పికొన్నవాడు, ఉదకమివ = ఉదకమును

వలె, ఏతత్ = ఈ సీతాపహరణ మనే, విషపానమ్ = విషమిశ్రమైన పానీయ మును, పిబసి = త్రాగుచున్నావు.

తా. నీ మిత్రులతో, బంధువులతో, అమాత్యులతో, సైన్యముతో, పరివార ముతో సహా నీవు సీతాపహరణ మనే ఈ విషము కలిసిన పానీయమును, దప్పి కొన్నవాడు ఉదకమును త్రాగినట్లు త్రాగుచున్నావు. 25

మూ. అనుబన్ధమజానన్తః కర్మణామవిచక్షణాః, 26
శీఘ్రమేవ వినశ్యన్తి యథా త్వం వినశిష్యసి.

ప్ర. అ. కర్మణామ్ = కర్మలయొక్క, అనుబన్ధమ్ = ఫలితమును, అజానన్తః = ఎరుగనివారై, అవిచక్షణాః = బుద్ధిలేనివాళ్లు, యథా = ఎట్లు, శీఘ్రమేవ = శీఘ్రముగానే, వినశ్యన్తి = నశింతురో, అట్లే, త్వమ్ = నీవు, వినశిష్యసి = నశించగలవు.

తా. బుద్ధివిహీనులు తాము చేయు కర్మలకు ఎట్టి ఫలితము కలుగునో తెలుసుకొనక ఆ కర్మలు చేసి ఎట్లు నశింతురో అట్లే నీవు కూడ నశించగలవు.

మూ. బద్ధస్త్వం కాలపాశేన క్వ గతస్తస్య మోక్ష్యసే, 27
వధాయ బడిశం గృహ్య సామిషం జలజో యథా.

ప్ర. అ. త్వమ్ = నీవు, కాలపాశేన = యమపాశముచేత, వధాయ = వధ కొరకు, బద్ధః = కట్టబడినావు. సామిషమ్ = మాంసముతో కూడిన, బడిశమ్ = గేలమును, గృహ్య = మ్రింగి, జలజః యథా = చేప వలె, తస్య = ఆ కాలపాశ మునకు (నుండి), క్వ గతః = ఎక్కడికి వెళ్ళినవాడవై, మోక్ష్యసే = విడిపించు కొనగలవు?

తా. చివర మాంసపుముక్క కట్టిన గేలమును చేప మ్రింగినట్లు నీవు చచ్చుటకే యమపాశమును తగల్చుకొన్నావు ; నీ వెక్కడికి వెళ్ళినా దానిని తప్పించుకొనలేవు. 27

మూ. న హి జాతు దురాధర్షౌ కాకుత్స్థౌ తవ రావణ, 28
ధర్షణం చాశ్రమస్యాస్య క్షమిష్యేతే తు రాఘవౌ.

ప్ర. అ. రావణ = రావణుడా ! దురాధర్షౌ = ఎదిరింప శక్యముకానివారు, కాకుత్స్థౌ=కకుత్స్థవంశమునందు పుట్టినవారు అయిన, రాఘవౌ=రామలక్ష్మణులు, తవ = నీయొక్క, అస్య ఆశ్రమస్య = ఈ ఆశ్రమముయొక్క, ధర్షణమ్ = అవమానమును, జాతు = ఎన్నడును, న క్షమిష్యేతే = సహించరు.

తా. రావణా ! ఎదిరింప శక్యముకాని, కాకుత్స్థవంశసంజాతులైన రామలక్ష్మణులు నీవు ఆశ్రమమునకు చేసిన అవమానమును ఎన్నటికీ సహించరు. 28

మూ. యథా త్వయా కృతం కర్మ భీరుణా లోకగర్హితమ్, 29
తస్కరాచరితో మార్గో నైవ వీరనిషేవితః.

ప్ర. అ. భీరుణా = పిరికివాడవైన, త్వయా = నీచేత, యథా = ఏ విధముగా, లోకగర్హితమ్ = లోకముచేత నిందితమైన, కర్మ = పని, కృతమ్ = చేయబడినదో, ఆ విధము, తస్కరాచరితః=దొంగలచేత అనుసరింపబడిన, మార్గః = మార్గము. వీరనిషేవితః = వీరులచేత సేవింపబడినది, నైవ = కాదు.

తా. పిరికివాడవైన నీవు లోకములో అందరిచేత నిందింపబడే పని చేసినావు. నీవు అవలంబించిన మార్గము దొంగలు అనుసరించునది. వీరులు అనుసరించేది కాదు. 29

మూ. యుధ్యస్వ యది శూరోఽసి ముహూర్తం తిష్ఠ రావణ,
శయిష్యసే హతో భూమౌ యథా భ్రాతా ఖరస్తథా.

(ప్రతిపదార్థతాత్పర్యాలకు 50 వ సర్గలోని 22 వ శ్లోకం చూడుడు).

మూ. పరేతకాలే పురుషో యత్కర్మ ప్రతిపద్యతే, 31
వినాశాయాత్మనోఽధర్మ్యం ప్రతిపన్నోఽసి కర్మ తత్.

ప్ర. అ. పురుషః = పురుషుడు, పరేతకాలే=మరణకాలమునందు, యత్ = ఏ, కర్మ = కర్మను, ప్రతిపద్యతే = పొందుతాడో, అధర్మ్యమ్ = ధర్మసంమతము కాని, తత్ కర్మ = ఆ కర్మను, ఆత్మనః = నీయొక్క, వినాశాయ = వినాశముకొరకు, ప్రతిపన్నః = పొందినవాడవు, అసి = అయి ఉన్నావు.

తా. చావు మూడినవాడే ఇట్టి ధర్మవిరుద్ధమైన పని చేయును. అందుచేత నీవు నీ నాశముకొరకే ఈ పాపకర్మ చేయుచున్నావు. 31

మూ. పాపానుబన్ధో వై యస్య కర్మణః కర్మ కో ను తత్, 32
కుర్వీత లోకాధిపతిః స్వయంభూర్భగవానపి.

ప్ర. అ. యస్య = ఏ, కర్మణః = కర్మయొక్క, పాపానుబన్ధః = పాపమైన ఫల ముండునో, తత్ = అట్టి, కర్మ = కర్మను, లోకాధిపతిః = లోకములకు అధిపతియైన, భగవాన్ = భగవంతుడైన, స్వయంభూరపి = సాక్షాత్తు బ్రహ్మయే యైనను, కః = ఎవ్వడు, కుర్వీత = చేయును.

తా. ఏ పని చేసినచో చివరికి చెడ్డ ఫలమే కలుగునో అట్టి కర్మను, సాక్షాత్తు సకలలోకముల అధిపతియైన భగవంతుడు బ్రహ్మదేవుని అంతటివాడైనా ఎవ్వడైనా చేయునా ? 32

మూ. ఏవముక్త్వా శుభం వాక్యం జటాయుస్తస్య రక్షసః, 33
నిపపాత భృశం పృష్ఠే దశగ్రీవస్య వీర్యవాన్.

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, జటాయుః = జటాయువు, ఏవమ్ = ఇట్లు, శుభమ్ = మంగళకరమైన, వాక్యమ్ = వాక్యమును, ఉక్త్వా = పలికి, రక్షసః = రాక్షసుడైన, తస్య రావణస్య = ఆ రావణునియొక్క, పృష్ఠే = వీపుమీద, భృశమ్ = మిక్కిలి (ఆఘాతము కలుగునట్లు), నిపపాత = వ్రాలెను.

తా. పరాక్రమవంతుడైన జటాయువు ఆ రావణునితో ఇట్లు మంగళకరమైన మాటలు చెప్పి, ఆతడు వినకపోవుటచే, మహావేగముగా ఆతని వీపుమీద వ్రాలెను. 33

మూ. తం గృహీత్వా నఖైస్తీక్ష్ణైర్విదదార సమన్తతః, 34
అధిరూఢో గజారోహో యథా స్యాద్దుష్టవారణమ్.

ప్ర. అ. తమ్ = ఆ రావణుని, గృహీత్వా = పట్టుకొని, అధిరూఢః = ఏనుగుపైకి ఎక్కిన, గజారోహః = మావటీడు, దుష్టవారణమ్ = దుష్టమైన గజమును, యథా = ఎట్లు, స్యాత్ = అగునో(చేయునో) అట్లు, తీక్ష్ణైః = వాడియైన, నఖైః = గోళ్ళచేత, సమన్తతః = అంతటా, విదదార = చీల్చెను.

తా. ఆ రావణుని గట్టిగా పట్టుకొని, మావటీడు దుష్టమైన ఏనుగును ఎక్కి దానిని అంకుశముతో పొడిచినట్లు వాడియైన గోళ్లతో చీల్చెను. 34

మూ. విదదార నఖైరస్య తుణ్డం పృష్ఠే సమర్పయన్, 35
కేశాంశ్చోత్పాటయామాస నఖపక్షముఖాయుధః.

ప్ర. అ. అస్య=ఈతనియొక్క, పృష్ఠే=వీపునందు, తుణ్డమ్=ముక్కును, సమర్పయన్ = ఉంచుచు, నఖైః = గోళ్లతో, విదదార = చీల్చెను. నఖపక్షముఖాయుధః = గోళ్లు, రెక్కలు, ముక్కు ఆయుధములుగా కలవాడై, కేశాంశ్చ = కేశములను కూడ, ఉత్పాటయామాస = పెరికివేసెను.

తా. ముక్కుతో ఆతని వీపుమీద పొడుచుచు, గోళ్లతో చీరెను. గోళ్లు, రెక్కలు, ముక్కు ఆయుధాలుగా ఉపయోగించుచు ఆతని జుట్టు పీకివేసెను. 35

మూ. స తథా గృధ్రరాజేన క్లిశ్యమానో ముహుర్ముహుః, 36
అమర్షస్ఫురితోష్ఠః సన్ ప్రాకమ్పత చ రావణః.

ప్ర. అ. గృధ్రరాజేన=జటాయువుచేత, ముహుర్ముహుః=మాటిమాటికి, తథా = ఆ విధముగా, క్లిశ్యమానః = బాధింపబడుచున్నవాడై, సః రావణః = ఆ రావణుడు, అమర్షస్ఫురితోష్ఠః సన్ = కోపముతో కదలుచున్న పెదవులు కలవాడై, ప్రాకమ్పత = వణకెను.

తా. జటాయువు ఆ విధముగా మాటిమాటికి పీడింపగా, రావణుడు కోపముచేత పెదవులు అదరగా వణకెను. 36

మూ. పరిగృహ్య చ వైదేహీం వామేనాఙ్కేన రావణః, 37
తలేనాభిజఘానాశు జటాయుం క్రోధమూర్ఛితః.

ప్ర. అ. రావణః = రావణుడు, క్రోధమూర్ఛితః=క్రోధముచేత వ్యాప్తుడై, వామేన అఙ్కేన=ఎడమ చంకచేత, వైదేహీమ్=సీతను, పరిగృహ్య=గ్రహించి, ఆశు = శీఘ్రముగా, జటాయుమ్ = జటాయువును, తలేన = అరచేతితో, అభిజఘాన = కొట్టెను.

తా. రావణుడు, సీతను ఎడమచంకయందు ఉంచుకొని, కోపముతో నిండినవాడై, వెంటనే అరచేతితో ఆ జటాయువును కొట్టెను. 37

మూ. జటాయు స్తమభిక్రమ్య తుణ్డేనాస్య ఖగాధిపః, 38
వామబాహూన్ దశ తదా వ్యపాహరదరిందమః.

ప్ర. అ. తదా = అప్పుడు, ఖగాధిపః = పక్షిరాజైన, అరిందమః = శత్రు సంహారకుడైన, జటాయుః = జటాయువు, తమ్ = ఆ రావణుని, అభిక్రమ్య = ఆక్రమించి, తుణ్డేన = ముక్కుతో, అస్య = ఇతనియొక్క, దశ = పది, వామబాహూన్ = ఎడమ చేతులను, వ్యపాహరత్ = హరించెను.

తా. పక్షిరాజు, శత్రుసంహారకుడు అయిన జటాయువు, అప్పుడు, ఆ రావణునిపై ఆక్రమణము చేసి ఆతని పది ఎడమ భుజములను ముక్కుతో ఛేదించి వేసెను. 38

మూ. సంఛిన్నబాహోః సద్యైవ బాహవః సహసాభవన్, 39
విషజ్వాలావలీయుక్తా వల్మీకాదివ పన్నగాః.

ప్ర. అ. సంఛిన్నబాహోః = ఛేదించబడిన బాహువులు గల అతనియొక్క, బాహవః = బాహువులు, సద్యైవ = వెంటనే, వల్మీకాత్ = పుట్టనుండి, విషజ్వాలావలీయుక్తాః = విషజ్వాలల పంక్తులతో కూడిన, పన్నగాః ఇవ = సర్పములు వలె, సహసా = శీఘ్రముగా, అభవన్ = పుట్టినవి.

తా. ఈ విధముగ బాహువులు తెగి పడిపోయిన ఆ రావణుని శరీరము నుండి వెంటనే, పుట్టనుండి విషజ్వాలలు కక్కుచున్న సర్పములు పైకి వచ్చినట్లు శీఘ్రముగా బాహువులు మొలచి పైకి వచ్చినవి. 39

మూ. తతః క్రోధాద్దశగ్రీవః స తాముత్సృజ్య రావణః, 40
ముష్టిభ్యాం చరణాభ్యాం చ గృధ్రరాజమపోథయత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దశగ్రీవః = పది కంఠములు గల, రావణః = రావణుడు, తామ్ = సీతను, ఉత్సృజ్య = విడచి, ముష్టిభ్యామ్ = పిడికిళ్లతోను, చరణాభ్యాం చ = పాదములతోను, గృధ్రరాజమ్ = జటాయువును, క్రోధాత్ = కోపమువలన, అపోథయత్ = కుమ్మెను.

తా. పిమ్మట దశకంఠుడైన రావణుడు సీతను విడచి, కోపావిష్టుడై పిడికిళ్లతోను పాదాలతోను జటాయువును కుమ్మెను. 40

మూ. తతో ముహూర్తం సంగ్రామో బభూవాతులవీర్యయోః, 41
రాక్షసానాం చ ముఖ్యస్య పక్షిణాం ప్రవరస్య చ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అతులవీర్యయోః = సాటిలేని పరాక్రమము గల, రాక్షసానాం ముఖ్యస్య = రాక్షసరాజునకు, పక్షిణాం ప్రవరస్య = పక్షిశ్రేష్ఠునకు, ముహూర్తమ్ = ముహూర్తకాలముపాటు, సంగ్రామః = యుద్ధము, బభూవ = ఆయెను.

తా. పిదప, సాటి లేని పరాక్రమము గల ఆ రాక్షసరాజ-పక్షిరాజులమధ్య కొంత సేపు యుద్ధము జరిగెను. 41

మూ. తస్య వ్యాయచ్ఛమానస్య రామస్యార్థే స రావణః, 42
పక్షౌ పార్శ్వౌ చ పాదౌ చ ఖడ్గముద్ధృత్య సోఽచ్ఛినత్.

ప్ర. అ. సః = ఆ, రావణః = రావణుడు, ఖడ్గమ్ = ఖడ్గమును, ఉద్యమ్య = ఎత్తి, రామస్య = రామునియొక్క, అర్థే = ప్రయోజనము నుద్దేశించి, వ్యాయచ్ఛమానస్య = ఉద్యమించుచున్న, తస్య = ఆ జటాయువుయొక్క, పక్షౌ = రెక్కలను, పార్శ్వౌ చ = పార్శ్వములను, పాదౌ చ = పాదములను, అచ్ఛినత్ = ఛేదించెను.

తా. రావణుడు ఖడ్గము ఎత్తి, రాముని నిమిత్తమై పోరాడుచున్న ఆ జటాయువు రెక్కలను, పార్శ్వములను, పాదములను నరికివేసెను. 42

మూ. స చ్ఛిన్నపక్షః సహసా రక్షసా రౌద్రకర్మణా, 43
నిపపాత హతో గృధ్రః ధరణ్యామల్పజీవితః.

ప్ర. అ. రౌద్రకర్మణా = భయంకరమైన కర్మ గల, రక్షసా = రాక్షసునిచేత, ఛిన్నపక్షః = ఛేదించబడిన రెక్కలు గలవాడై, సః = ఆ, గృధ్రః = జటాయువు, హతః = కొట్టబడినవాడై, అల్పజీవితః = అల్పమైన జీవితము కలవాడై, ధరణ్యామ్ = నేలమీద, నిపపాత = పడెను.

తా. భయంకరమైన పనులు చేయు ఆ రావణుడు రెక్కలను ఛేదించివేయగా, జటాయువు, ఆ విధముగా కొట్టబడినవాడై, కొన ఊపిరితో నేలపై ఒరిగెను. 43

మూ. తం దృష్ట్వా పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషమ్,
అభ్యధావత వైదేహీ స్వబన్ధుమివ దుఃఖితా. 44

ప్ర. అ. వైదేహీ = సీత, భూమౌ = నేలమీద, పతితమ్ = పడిన, క్షతజార్ద్రమ్ = రక్తముచేత తడిసిన, తం జటాయుషమ్ = ఆ జటాయువును, దృష్ట్వా = చూచి, దుఃఖితా = దుఃఖించినదై, స్వబన్ధుమివ = తన బంధువును గూర్చి వలె, అభ్యధావత = అతనివద్దకు పరుగెత్తి వెళ్ళెను.

తా. నేలపై బడి, రక్తముచే తడిసిన ఆ జటాయువును చూడగానే సీత దుఃఖార్తురాలై, తన బంధువువద్దకు వెళ్ళినట్లు ఆతని వద్దకు శీఘ్రముగా పరుగెత్తెను. 44

మూ. తం నీలజీమూతనికాశకాయం
సుపాణ్డురోరస్కముదారవీర్యమ్,
దదర్శ లఙ్కాధిపతిః పృథివ్యాం
జటాయుషం శాన్తమివాగ్నిదావమ్. 45

ప్ర. అ. లఙ్కాధిపతిః = రావణుడు, నీలజీమూతనికాశకాయమ్ = నల్లని మేఘముతో సమానమైన శరీరము కలవాడు, సుపాణ్డురోరస్కమ్ = బాగుగా తెల్లనైన వక్షఃస్థలము కలవాడు, ఉదారవీర్యమ్ = గొప్ప పరాక్రమము గలవాడు, శాన్తమ్ = శాంతించిన, అగ్నిదావమివ = దావాగ్నివలె ఉన్నవాడు అయిన, తం జటాయుషమ్ = ఆ జటాయువును, పృథివ్యామ్ = నేలమీద, దదర్శ = చూచెను.

తా. రావణుడు నేలపై పడిఉన్న జటాయువును చూచెను. మహాపరాక్రమవంతుడైన ఆ జటాయువు మేఘముతో సమానమైన శరీరముతో తెల్లని వక్షస్థలముతో శాంతించిన దావాగ్ని వలె ఉండెను. 45

మూ. తతస్తు తం పత్త్రిరథం మహీతలే
నిపాతితం రావణవేగమర్దితమ్,
పునశ్చ సంగృహ్య శశిప్రభాననా
రురోద సీతా జనకాత్మజా తదా. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శశిప్రభాననా = చంద్రునివంటి కాంతి గల ముఖము గల, జనకాత్మజా = జనకుని పుత్రియైన, సీతా = సీత, తదా = అప్పుడు, రావణవేగమర్దితమ్ = రావణుని వేగముచేత పీడింపబడినవాడు, మహీతలే = నేలమీద, నిపాతితమ్ = పడగొట్టబడినవాడు అయిన, తం పత్త్రిరథమ్ = ఆ జటాయువును, పునః = మరల, పరిగృహ్య = పట్టుకొని, రురోద = ఏడ్చెను.

తా. పిమ్మట, చంద్రునివంటి ముఖము గల, జనకపుత్రియైన సీత, అప్పుడు, రావణుని వేగముచేత మర్దితుడై నేలమీద పడి యున్న ఆ జటాయువును మరల పట్టుకొని ఏడ్చెను. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్య కాండలో ఏబదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

[రావణుడు సీతను అపహరించుట].

మూ. సా తు తారాధిపముఖీ రావణేన నిరీక్ష్య తమ్,
గృధ్రరాజం వినిహతం విలలాప సుదుఃఖితా. 1

ప్ర. అ. తారాధిపముఖీ = చంద్రునివంటి ముఖము గల, సా తు = ఆ సీత, రావణేన = రావణునిచేత, వినిహతమ్ = చంపబడిన, తం గృధ్రరాజమ్ = ఆ జటాయువును, నిరీక్ష్య = చూచి, సుదుఃఖితా = చాల దుఃఖించినదై, విలలాప = విలపించెను.

తా. చంద్రునివంటి ముఖము గల సీత రావణునిచేత చంపబడిన ఆ జటాయువును చూచి, చాల దుఃఖించుచు విలపించెను. 1

మూ. నిమిత్తం లక్షణజ్ఞానం శకునస్వరదర్శనమ్,
అవశ్యం సుఖదుఃఖేషు నరాణాం ప్రతిదృశ్యతే. 2

ప్ర. అ. లక్షణజ్ఞానమ్ = ఆ యా లక్షణముల (కన్ను అదరుట మొదలైనవాటి) జ్ఞానము, శకునస్వరదర్శనమ్ = పక్షుల స్వరముల జ్ఞానము, నరాణామ్ = మనుష్యులయొక్క, సుఖదుఃఖేషు = సుఖదుఃఖములందు, అవశ్యమ్ = తప్పక, నిమిత్తమ్ = సూచకముగా, ప్రతిదృశ్యతే = చూడబడుచున్నది.

తా. లక్షణముల జ్ఞానము, కన్ను అదరుట, (అద్దములో తల కనబడకపోవుట మొదలైన లక్షణాల జ్ఞానము), పక్షుల స్వరములు వినబడుట మొదలైనవి మానవులకు రాబోవు సుఖదుఃఖములను తప్పక సూచించుచుండును. 2

మూ. నూనం రామ న జానాసి మహద్వ్యసనమాత్మనః,
ధావన్తి నూనం కాకుత్స్థం మదర్థం మృగపక్షిణః. 3

ప్ర. అ. రామ = రామా ! ఆత్మనః = నీయొక్క, మహత్ = గొప్పదైన, వ్యసనమ్ = వ్యసనమునుగూర్చి, న జానాసి = ఎరుగవు. నూనమ్ = నిశ్చయము. మదర్థమ్ = నా నిమిత్తమై, మృగపక్షిణః = మృగములు, పక్షులు, కాకుత్థ్సమ్ = రాముణ్ణి గూర్చి, ధావన్తి = పరుగెత్తుచున్నవి. నూనమ్ = నిశ్చయము.

తా. రామా ! నీకు కలిగిన ఈ గొప్ప ఆపదను గూర్చి నీకు తెలియదు కదా! (ఆ యా శకునములనుపట్టి యైనా తెలుసుకొనజాలవా అని భావము), ఈ మృగములు, పక్షులు పరుగెత్తుచున్నవి; రామునకు నా విషయము చెప్పుటకే పరుగెత్తుచున్నవి. నిశ్చయము. 3

మూ. అయం హి పాపచారేణ మాం త్రాతుమభిసంగతః,
శేతే వినిహతో భూమౌ మమ భాగ్యాద్విహంగమః. 4

ప్ర. అ. మామ్ = నన్ను, త్రాతుమ్ = రక్షించుటకు, అభిసంగతః = వచ్చిన, అయమ్ = ఈ, విహంగమః = జటాయువు, మమ = నాయొక్క, భాగ్యాత్ = దురదృష్టమువలన, పాపచారేణ = పాపాత్ముడైన రావణునిచేత, వినిహతః = చంపబడినవాడై, భూమౌ = భూమిమీద, శేతే = శయనించిఉన్నాడు.

తా. నన్ను రక్షించుటకై వచ్చిన ఈ జటాయువు, నా దుర్భాగ్యవశము చేత ఈ పాపాత్మునిచే చంపబడి నేలపై పడి యున్నాడు. 4

మూ. త్రాహి మామద్య కాకుత్థ్స లక్ష్మణేతి వరాఙ్గనా,
సుసంత్రస్తా సమాక్రన్దచ్ఛృణ్వతాం తు యథాన్తికే. 5

ప్ర. అ. వరాఙ్గనా = ఉత్తమస్త్రీ యైన సీత, సుసంత్రస్తా = చాల భయ పడినదై, కాకుత్థ్స = రామా ! లక్ష్మణ = లక్ష్మణా ! అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, త్రాహి = రక్షించుము, ఇతి = అని, అన్తికే = సమీపమునందు, శృణ్వతాం యథా = వినుచున్నారా అన్నట్లు, సమాక్రన్దత్ = అరచెను.

ప్ర. అ. ఉత్తమస్త్రీ యైన ఆ సీత చాల భయపడినదై, ''రామా ! లక్ష్మణా! ఇప్పుడు నన్ను రక్షించండి'' అని వారిద్దరు దగ్గర ఉన్నారా అన్నట్లు అరచెను.

మూ. తాం క్లిష్టమాల్యాభరణాం విలపన్తీమనాథవత్,
అభ్యధావత వైదేహీం రావణో రాక్షసాధిపః. 6

ప్ర. అ. క్లిష్టమాల్యాభరణామ్ = నలిగిపోయిన మాలలు ఆభరణములు కల, అనాథవత్ = అనాథురాలు వలె, విలపన్తీమ్ = విలపించుచున్న, తాం వైదేహీమ్ = ఆ సీతను గూర్చి, రాక్షసాధిపః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, అభ్యధావత = తొందరగా వెళ్లెను.

తా. పుష్పమాలలు, అలంకారములు నలిగిపోయి, అనాథురాలు వలె ఏడ్చుచున్న ఆ సీత దగ్గరకు రాక్షసరాజైన రావణుడు శీఘ్రముగా వెళ్లెను. 6

మూ. తాం లతామివ వేష్టన్తీమాలిఙ్గన్తీం మహాద్రుమాన్,
ముఞ్చ ముఞ్చేతి బహుశః ప్రవదన్రాక్షసాధిపః. 7

క్రోశన్తీం రామ రామేతి రామేణ రహితాం వనే,
జీవితాన్తాయ కేశేషు జగ్రాహాన్తకసన్నిభః. 8

ప్ర. అ. అన్తకసన్నిభః = యమునితో సమానుడైన, రాక్షసాధిపః = రావణుడు, లతామివ = లతవలె, మహాద్రుమాన్ = పెద్దవృక్షములను, వేష్టన్తీమ్ = చుట్టుకొనుచున్నది, ఆలిఙ్గన్తీమ్ = వాటిని కౌగలించుకొనుచున్నది, వనే = వనమునందు, రామేణ = రామునితో, రహితామ్ = శూన్యయైనదీ, రామ రామేతి = రామా! రామా ! అని, క్రోశన్తీమ్ = ఏడ్చుచున్నది అయిన, తామ్ = ఆ సీతను, ముఞ్చ ముఞ్చ ఇతి = (చెట్లను) విడువుము, విడువుము అని, బహుశః = అనేకపర్యాయములు, ప్రవదన్ = పలుకుచు, జీవితాన్తాయ = తన ప్రాణముల అంతముకొరకే, కేశేషు = కేశములయందు, జగ్రాహ = పట్టుకొనెను.

తా. ఆ వనములో రామునకు దూరమైన ఆ సీత రామా ! రామా ! అని విలపించుచు, అక్కడ నున్న మహావృక్షములను కౌగలించుకొని లత వలె వాటికి చుట్టబెట్టుకొనుచుండగా యముని వంటి ఆ రావణుడు "చెట్లు విడువుము, విడువుము''అని మాటిమాటికి అనుచు, చివరికి మరణము చెందుటకే ఆమెను జుట్టు పట్టుకొనెను. 7, 8

మూ. ప్రధర్షితాయాం సీతాయాం బభూవ సచరాచరమ్,
జగత్సర్వమమర్యాదం తమసాన్ధేన సంవృతమ్, 9
న వాతి మారుతస్తత్ర నిష్ప్రభోఽభూద్దివాకరః.

ప్ర. అ. సీతాయామ్ = సీత, ప్రధర్షితాయామ్ = అవమానించబడిన దగుచుండగా, సచరాచరమ్ = జంగమములతోను స్థావరములతోను కూడిన, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, అమర్యాదమ్ = కట్టుబాట్లు లేనిదై, అన్ధేన తమసా = గ్రుడ్డి చీకటిచేత, సంవృతమ్ = కప్పబడినది, బభూవ = ఆయెను, తత్ర = అక్కడ, మారుతః = వాయువు, న వాతి = వీచలేదు. దివాకరః = సూర్యుడు, నిష్ప్రభః = కాంతిహీనుడు, అభూత్ = ఆయెను.

తా. ఆ విధముగా సీత అవమానింపబడగా స్థావరజంగమాత్మకమైన జగత్తు అంతా కట్టుబాట్లు లేనిదై కటిక చీకటిచేత కప్పబడెను. అప్పుడు గాలి సరిగా వీచలేదు. సూర్యుని కాంతి తగ్గెను. 9

మూ. దృష్ట్వా సీతాం పరామృష్టాం దీనాం దివ్యేన చక్షుషా, 10
కృతం కార్యమితి శ్రీమాన్ వ్యాజహార పితామహః.

ప్ర. అ. శ్రీమాన్ = శోభ గల, పితామహః = బ్రహ్మదేవుడు, దీనామ్ = దీనురాలైన, సీతామ్ = సీతను, పరామృష్టామ్ = స్పృశించబడిన దానినిగా, దివ్యేన = దివ్యమైన, చక్షుషా = నేత్రముచేత, దృష్ట్వా = చూచి, కార్యమ్ = కార్యము, కృతమ్ = చేయబడినది, ఇతి = అని, వ్యాజహార = పలికెను.

తా. దీనురాలైన ఆ సీతను రావణుడు స్పృశించినట్లు దివ్యదృష్టితో చూచి, శోభాయుక్తుడైన బ్రహ్మదేవుడు-''తలచిన పని పూర్తి అయినట్లే''అని అనెను. 10

మూ. ప్రహృష్టా వ్యథితాశ్చాసన్ సర్వే తే పరమర్షయః, 11
దృష్ట్వా సీతాం పరామృష్టాం దణ్డకారణ్యవాసినః.
రావణస్య వినాశం చ ప్రాప్తం బుద్ధ్వా యదృచ్ఛయా.

ప్ర. అ. దణ్డకారణ్యవాసినః = దండకారణ్యమునందు నివసించు, సర్వే = సమస్తమైన, తే = ఆ, పరమర్షయః = మహర్షులు, సీతామ్ = సీతను, పరామృష్టామ్ = స్పృశించబడినదానినిగా, దృష్ట్వా = చూచి, యదృచ్ఛయా = దైవవశముచేత, రావణస్య = రావణునియొక్క, వినాశం చ = వినాశమును కూడ, ప్రాప్తమ్ = వచ్చినదానినిగా, బుద్ధ్వా = తెలుసుకొని, ప్రహృష్టాః = సంతోషించిన వారు, వ్యథితాశ్చ = వ్యథచెందినవారుకూడ, ఆసన్ = అయిరి.

తా. దండకారణ్యములో నివసించే మహర్షు లందరు సీతను రావణుడు పట్టి తీసికొనిపోవుట చూచి, దైవవశముచేత ఇంతకాలానికి రావణుని వినాశము రానున్న దని కూడ తెలిసికొని సంతోషమును, దుఃఖమును కూడ పొందిరి. 11,12

మూ. స తు తాం రామ రామేతి రుదన్తీం లక్ష్మణేతి చ,
జగామాదాయ చాకాశం రావణో రాక్షసేశ్వరః. 13

ప్ర. అ. రాక్షసేశ్వరః = రాక్షసుల ప్రభువైన, సః రావణః = ఆ రావణుడు, రామ రామేతి = రామా! రామా! అనీ, లక్ష్మణేతి చ = లక్ష్మణా అనీ, రుదన్తీమ్ = ఏడ్చుచున్న, తామ్ = ఆ సీతను, ఆదాయ = గ్రహించి, ఆకాశమ్ = ఆకాశమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. రాక్షసరాజైన రావణుడు, "రామా! రామా!" అని, "లక్ష్మణా!" అని ఏడ్చుచున్న ఆ సీతను గ్రహించి ఆకాశమార్గమునందు వెళ్ళిపోయెను. 13

మూ. తప్తాభరణజుష్టాఙ్గీ పీతకౌశేయవాసినీ,
రరాజ రాజపుత్రీ తు విద్యుత్సౌదామినీ యథా. 14

ప్ర. అ. తప్తాభరణజుష్టాఙ్గీ = పరిశుద్ధమైన బంగారు ఆభరణములతో కూడిన అవయవములు కలది, పీతకౌశేయవాసినీ = పచ్చని పట్టువస్త్రము ధరించినదీ అయిన, రాజపుత్రీ = ఆ రాజకుమారి యైన సీత, విద్యుత్ = మెరయుచున్న, సౌదామినీ యథా = మెరుపు వలె, రరాజ = ప్రకాశించెను.

తా. అన్ని అవయవములందు శుద్ధమైన బంగారు ఆభరణములు ధరించి, పచ్చని పట్టుచీర కట్టుకొని ఉన్న ఆ సీత మెరుస్తూన్న మెరుపు వలె ప్రకాశించెను. 14

మూ. ఉద్ధూతేన చ వస్త్రేణ తస్యాః పీతేన రావణః,
అధికం పరిబభ్రాజ గిరిర్దీప్త ఇవాగ్నినా. 15

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, ఉద్ధూతేన = ఎగురగొట్టబడిన, పీతేన = పచ్చని, వస్త్రేణ = వస్త్రముచేత, రావణః = రావణుడు, అగ్నినా = అగ్నిచేత, దీప్తః = ప్రకాశింపచేయబడిన, గిరిరివ = పర్వతము వలె, అధికమ్ = అధికముగా, పరిబభ్రాజ = ప్రకాశించెను.

తా. సీత శరీరముమీద ఉన్న పచ్చని వస్త్రము గాలికి ఎగురుచుండగా, ఆ రావణుడు అగ్నిచేత ప్రకాశింపచేయబడిన పర్వతము వలె అధికముగా ప్రకాశించెను. 15

మూ. తస్యాః పరమకల్యాణ్యాస్తామ్రాణి సురభీణి చ,
పద్మపత్రాణి వైదేహ్యా అభ్యకీర్యన్త రావణమ్. 16
(చ్యుతాని పద్మపత్రాణి రావణం సమావాకిరన్)

ప్ర. అ. పరమకల్యాణ్యాః = చాల మంగళప్రదురాలైన, తస్యాః = ఆ, వైదేహ్యాః = సీతయొక్క, తామ్రాణి = ఎఱ్ఱనైన, సురభీణి = పరిమళించుచున్న, పద్మపత్రాణి = పద్మముల రేకులు, చ్యుతాని = జారినవై, రావణమ్ = రావణుని, సమవాకిరన్ = చిమ్మినవి.

తా. అధికముగ మంగళప్రదురాలైన ఆ సీత కొప్పులోనుండి రాలిన పరిమళించుచున్న ఎఱ్ఱని పద్మపత్రములు ఆ రావణునిమీద చల్లినట్లు పడినవి. 16

మూ. తస్యాః కౌశేయముద్ధూతమాకాశే కనకప్రభమ్,
బభౌ చాదిత్యరాగేణ తామ్రమభ్రమివాతపే. 17

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, ఆకాశే = ఆకాశమునందు, ఉద్ధూతమ్ = ఎగురగొట్టబడిన, కనకప్రభమ్ = బంగారు కాంతి గల, కౌశేయమ్ = పట్టు చీర, ఆతపే = ఎండయందు, ఆదిత్యరాగేణ = సూర్యుని ఎరుపుచేత, తామ్రమ్ = ఎఱ్ఱనైన, అభ్రమివ = మేఘము వలె, బభౌ = ప్రకాశించెను.

తా. సీత ధరించిన, ఆకాశముపై గాలికి ఎగురుచున్న, బంగారు వన్నె గల పట్టుచీర, ఎండలో సూర్యుని కాంతి ప్రసరించిన మేఘము వలె ఉండెను.

మూ. తస్యాస్తత్సునసం వక్త్రమాకాశే రావణాఙ్కగమ్,
న రరాజ వినా రామం వినాళమివ పఙ్కజమ్. 18

ప్ర. అ. ఆకాశే = ఆకాశమునందు, రావణాఙ్కగమ్ = రావణుని అంకమునందున్న, సునసమ్ = అందమైన నాసిక గల, తస్యాః వక్త్రమ్ = ఆ సీత ముఖము, రామం వినా = రాముడు లేకుండుటచే, వినాళమ్ = కాడలేని, పఙ్కజమ్ ఇవ = పద్మము వలె, న రరాజ = ప్రకాశించలేదు.

తా. ఆకాశమార్గమునందు రావణుని అంకముమీద నున్న సుందరమైన నాసిక గల ఆమె ముఖము, రాముడు లేకపోవుటచేత, కాడ లేని పద్మము వలె కాంతివిహీనమై ఉండెను. 18

మూ. బభూవ జలదం నీలం భిత్త్వా చన్ద్ర ఇవోదితః,
సులలాటం సుకేశాన్తం పద్మగర్భాభమవ్రణమ్. 19

శుక్లైః సువిమలైర్దన్తైః ప్రభావద్భిరలంకృతమ్,
తస్యాస్తద్విమలం వక్త్రమాకాశే రావణాఙ్కగమ్. 20

రుదితం వ్యపమృష్టాస్రం చన్ద్రవత్ప్రియదర్శనమ్,
సునాసం చారుతామ్రోష్ఠమాకాశే హాటకప్రభమ్. 21

ప్ర. అ. సులలాటమ్ = అందమైన లలాటము కలది, సుకేశాన్తమ్ = అందమైన కేశాంతములు కలది, పద్మగర్భాభమ్ = పద్మము గర్భమువంటి కాంతి గలది, అవ్రణమ్ = వ్రణములు లేనిది, శుక్లైః = తెల్లనివి, సువిమలైః = మిక్కిలి నిర్మలములైనవి, ప్రభావద్భిః = కాంతి గలవి అయిన, దన్తైః = దంతములచేత, అలంకృతమ్ = అలంకరించబడినది, రుదితమ్ = రోదనము చేసినది, వ్యపమృష్టాస్రమ్ = తుడవబడిన కన్నీళ్లు కలది, చన్ద్రవత్ = చంద్రుడు వలె, ప్రియదర్శనమ్ = ఆనందకరమైన దర్శనము కలది, సునాసమ్ = అందమైన ముక్కు గలది, చారుతామ్రోష్ఠమ్ = అందమైన ఎఱ్ఱని పెదవులు కలది, ఆకాశే = ఆకాశమునందు, హాటకప్రభమ్ = బంగారము వంటి కాంతి గలది, ఆకాశే = ఆకాశమునందు, రావణాఙ్కగమ్ = రావణుని ఒడిలో ఉన్నది అయిన, తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, విమలమ్ = నిర్మలమైన, వక్త్రమ్ = ముఖము, నీలమ్ = నల్లనైన, జలదమ్ = మేఘమును, భిత్త్వా = ఛేదించుకొని, ఉదితః = ఉదయించిన, చన్ద్రః ఇవ = చంద్రుడు వలె, బభూవ = ఉండెను.

తా. ఆసమయమున రావణుని అంకమునందున్న నిర్మలమైన సీత ముఖము నల్లని మేఘమును ఛేదించుకొని పైకి వచ్చిన చంద్రబింబము వలె ఉండెను. అందమైన లలాటము, చక్కని ముంగురులు గల ఆ ముఖము మొటిమలు లేనిదై, పద్మము మధ్య భాగము వలె ప్రకాశించుచుండెను. తెల్లగా, నిర్మలములుగా ఉన్న, కాంతిమంతములైన దంతములతో ఒప్పుచుండెను. ఏడుచుటచే కారుచున్న కన్నీళ్లు

తుడవబడి యుండెను. చంద్రబింబము వలె చూచుటకు ఆనందజనకమై చక్కని ముక్కు, అందమైన ఎఱ్ఱని పెదవులు గల ఆ ముఖము ఆకాశమునందు బంగారము వలె ప్రకాశించుచుండెను. 19, 20, 21

మూ. రాక్షసేన సమాధూతం తస్యాస్తద్వదనం శుభమ్,
శుశుభే న వినా రామం దివా చన్ద్ర ఇవోదితః. 22

ప్ర. అ. రాక్షసేన = రాక్షసునిచేత, సమాధూతమ్ = కదల్చబడిన, తస్యాః = సీతయొక్క, శుభమ్ = మంగళకరమైన, తత్ = ఆ, ముఖమ్ = ముఖము, రామం వినా = రాముడు లేక, దివా = పగలు, ఉదితః = ఉదయించిన, చన్ద్రః ఇవ = చంద్రుడు వలె, న శుశుభే = ప్రకాశించలేదు.

తా. రాక్షసునిచేత భయకంపితమైపోవునట్లు చేయబడిన ఆ సీత ముఖము రాముడు దగ్గర లేకపోవుటచే, పగటి చంద్రుడు వలె కాంతివిహీనమై ఉండెను.

మూ. సా హేమవర్ణా నీలాఙ్గం మైథిలీ రాక్షసాధిపమ్,
శుశుభే కాఞ్చనీ కాఞ్చీ నీలం మణిమివాశ్రితా. 23

ప్ర. అ. నీలాఙ్గమ్ = నల్లని శరీరము గల, రాక్షసాధిపమ్ = రావణుణ్ణి, ఆశ్రితా = ఆశ్రయించి ఉన్న, హేమవర్ణా = బంగారు రంగు గల, సా మైథిలీ = ఆ సీత, నీలమ్ = నల్లని, మణిమ్ = మణిని (ఆశ్రయించిన), కాఞ్చనీ = బంగారు వికారమైన, కాఞ్చీ ఇవ = వడ్డాణము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. నల్లని శరీరము గల రావణుని సమీపమునందున్న బంగారు రంగు గల సీత, ఇంద్రనీలమాణిక్యము దగ్గర ఉన్న బంగారు వడ్డాణము వలె ప్రకాశించెను. 23

మూ. సా పద్మగౌరీ హేమాభా రావణం జనకాత్మజా,
విద్యుద్ఘనమివావిశ్య శుశుభే తప్తభూషణా. 24

ప్ర. అ. పద్మగౌరీ = పద్మము వలె పచ్చగా నున్నది, హేమాభా = బంగారము వంటి కాంతి గలది, తప్తభూషణా = పరిశుద్ధమైన (బంగారు)అలంకా

రములు గలది అయిన, సా జనకాత్మజా = ఆ సీత, రావణమ్ = రావణుని, ఆవిశ్య = సమీపించి, ఘనమ్ = మేఘమును, ఆవిశ్య = ప్రవేశించి (సమీపించి), విద్యు దివ = మెరుపు వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. పద్మము వలె పచ్చగా బంగారము వంటి కాంతితో ప్రకాశించుచు, పరిశుద్ధమైన బంగారు అలంకారములు ధరించి ఆ సీత, రావణుని సమీపము నందు, మేఘములో ప్రవేశించి ఉన్న మెరుపు వలె ప్రకాశించుచుండెను. 24

మూ. తస్యా భూషణఘోషేణ వైదేహ్యా రాక్షసాధిపః,
బభౌ సచపలో నీలః సఘోష ఇవ తోయదః. 25

ప్ర. అ. రాక్షసాధిపః = రావణుడు, తస్యాః వైదేహ్యాః = ఆ సీతయొక్క, భూషణఘోషేణ = అలంకారముల ధ్వనిచేత, సచపలః = మెరుపుతో కూడిన, సఘోషః = ధ్వనితో కూడిన, నీలః = నల్లని, తోయదః ఇవ = మేఘము వలె, బభౌ = ప్రకాశించెను.

తా. సీత అలంకారములు ధ్వనిచేయుటచేత ఆమెతో కూడిన ఆ రావణుడు మెరపుతో కూడిన, ధ్వని చేయుచున్న నల్లని మేఘము వలె ఉండెను. 25

మూ. ఉత్తమాఙ్గాచ్చ్యుతా తస్యాః పుష్పవృష్టిః సమన్తతః,
సీతాయా హ్రియమాణాయాః పపాత ధరణీతలే. 26

ప్ర. అ. హ్రియమాణాయాః = హరింపబడుచున్న, తస్యాః సీతాయాః = ఆ సీతయొక్క, ఉత్తమాఙ్గాత్ = శిరస్సునుండి, చ్యుతా = జారిన, పుష్పవృష్టిః = పుష్పముల వర్షము, సమన్తతః = నలువైపులా, ధరణీతలే = భూమిమీద, పపాత = పడెను.

తా. హరింపబడుచున్న సీత కేశపాశమునుండి జారిన పుష్పముల వర్షము అంతటా నేలమీద పడెను. 26

మూ. సా తు రావణవేగేన పుష్పవృష్టిః సమన్తతః,
సమాధూతా దశగ్రీవం పునరేవాభ్యవర్తత. 27

ప్ర. అ. సమన్తతః = నలుమూలల పడిన, సా పుష్పవృష్టిః = ఆ పుష్ప

వర్షము, రావణవేగేన=రావణుని వేగముచేత, సమాధూతా=ఎగురగొట్టబడినదై, పునః= మరల, దశగ్రీవమేవ = రావణుని గూర్చియే, అభ్యవర్తత=వచ్చెను.

తా. నలుమూలలా రాలిన ఆ పుష్పములు, రావణుని వేగముచేత ఎగిరి మరల ఆ రావణునివైపే వెళ్లెను. 27

మూ. అభ్యవర్తత పుష్పాణాం ధారా వైశ్రవణానుజమ్,
నక్షత్రమాలా విమలా మేరుం నగమివోన్నతమ్. 28

ప్ర. అ. పుష్పాణామ్ = పుష్పములయొక్క, ధారా = పంక్తి, విమలా = స్వచ్ఛమైన, నక్షత్రమాలా = నక్షత్రపంక్తి, ఉన్నతమ్=ఎత్తైన, మేరుం నగమివ = మేరుపర్వతమును వలె, వైశ్రవణానుజమ్ = రావణుని, అభ్యవర్తత = వెళ్ళి చేరెను.

తా. నిర్మలమైన నక్షత్రపంక్తి ఉన్నతమైన మేరుపర్వతము వైపు వెళ్ళినట్లు, పుష్పముల పంక్తి రావణుని వైపు వెళ్లెను. 28

మూ. చరణాన్నూపురం భ్రష్టం వైదేహ్యా రత్నభూషితమ్,
విద్యున్మణ్డలసంకాశం పపాత మధురస్వనమ్. 29

ప్ర. అ. వైదేహ్యాః=సీతయొక్క, చరణాత్=పాదమునుండి, భ్రష్టమ్= జారిన, రత్నభూషితమ్ = రత్నములచేత అలంకరించబడిన, నూపురమ్=నూపురము, విద్యున్మణ్డలసంకాశమ్= మెరుపుమండలముతో సమానమైనదై, మధురస్వనమ్= మధురమైన ధ్వని గలదై, పపాత = పడెను.

తా. సీత పాదమునుండి జారిపోయిన, రత్నములచేత అలంకరింపబడిన నూపురము, మెరపు చక్రమువలె, మధురముగా ధ్వనిచేయుచు పడెను. 29

మూ. తరుప్రవాళరక్తా సా నీలాఙ్గం రాక్షసేశ్వరమ్,
ప్రాశోభయత వైదేహీ గజం కక్ష్యేవ కాఞ్చనీ. 30

ప్ర. అ. తరుప్రవాళరక్తా = వృక్షముల చిగురు వలె ఎఱ్ఱనైన, సా వైదేహీ = ఆ సీత, నీలాఙ్గమ్=నల్లని శరీరము గల, రాక్షసేశ్వరమ్=రావణుణ్ణి,

కాఞ్చనీ = బంగారువికారమైన, కక్ష్యా = నడుముత్రాడు, గజమివ = ఏనుగును వలె, ప్రాశోభయత = ప్రకాశింపచేసెను.

తా. చెట్ల చిగురు వలె ఎఱ్ఱగా ఉన్న ఆ సీత, నల్లని శరీరము గల రావణుణ్ణి, బంగారు నడుముత్రాడు ఏనుగును ప్రకాశింపచేసి నట్లు ప్రకాశింప చేసెను. 30

మూ. తాం మహోల్కామివాకాశే దీప్యమానాం స్వతేజసా,
జహారాకాశమావిశ్య సీతాం వైశ్రవణానుజః. 31

ప్ర. అ. వైశ్రవణానుజః=రావణుడు, మహోల్కామివ = గొప్ప అగ్నిపిండము వలె, స్వతేజసా = తన తేజస్సుతో, ఆకాశే = ఆకాశమునందు, దీప్యమానామ్=ప్రకాశించుచున్న, తాం సీతామ్=ఆ సీతను, ఆకాశమ్=ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, జహార = అపహరించెను.

తా. సీత తన తేజస్సుతో ఆకాశములో పెద్ద అగ్నిపిండము వలె ప్రకాశించుచుండెను. అట్టి సీతను రావణుడు ఆకాశమార్గమునందు అపహరించెను. 31

మూ. తస్యాస్తాన్యగ్నివర్ణాని భూషణాని మహీతలే,
సఘోషాణ్యవకీర్యన్త క్షీణాస్తారా ఇవామ్బరాత్. 32

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, అగ్నివర్ణాని = అగ్నియొక్క వర్ణము వంటి వర్ణము గల, తాని భూషణాని = ఆ అలంకారములు, సఘోషాణి= ధ్వనితో కూడినవై, అమ్బరాత్ = ఆకాశమునుండి, క్షీణాః = పడిపోయిన, తారాః ఇవ = నక్షత్రములువలె, మహీతలే = నేలమీద, అవకీర్యన్త= చిమ్మబడినవి.

తా. అగ్ని వంటి రంగు గల ఆ సీత అలంకారములు, ఆకాశమునుండి, జారిపోయిన నక్షత్రముల వలె నేలపై నలుమూలలా విసిరివేసినట్లు పడిపోయినవి. 32

మూ. తస్యాః స్తనాన్తరాద్భ్రష్టో హారస్తారాధిపద్యుతిః,
వైదేహ్యా నిపతన్భాతి గఙ్గేవ గగనాచ్చ్యుతా. 33

ప్ర. అ. తస్యాః వైదేహ్యాః=ఆ సీతయొక్క, స్తనాన్తరాత్=వక్షస్థలము

నుండి, భ్రష్టః = జారిపోయిన, తారాధిపద్యుతిః = చంద్రుని వంటి కాంతి గల, హారః = హారము, నిపతన్ = క్రింద పడుచు, గగనాత్ = ఆకాశమునుండి, చ్యుతా = జారిన, గఙ్గేవ = గంగ వలె, భాతి = ప్రకాశించెను.

తా. ఆమె వక్షఃస్థలమునుండి జారి క్రిందికి పడిపోవుచున్న, చంద్రుని వంటి కాంతిగల ముత్యాల హారము ఆకాశమునుండి క్రిందికి పడుచున్న గంగ వలె ప్రకాశించెను. 33

మూ. ఉత్పాతవాతాభిహతా నానాద్విజగణాయుతాః,
మా భైరితి విధూతాగ్రా వ్యాజహ్రురివ పాదపాః. 34

ప్ర. అ. ఉత్పాతవాతాభిహతాః = రావణుడు పైకి ఎగురుటవలన కలిగిన గాలిచే కొట్టబడిన, నానాద్విజగణాయుతాః = అనేకములైన పక్షి సముదాయములతో కూడిన, పాదపాః = వృక్షములు, విధూతాగ్రాః = కదల్చబడిన అగ్ర భాగములు గలవై, మాభైః ఇతి = భయపడకుము అని, వ్యాజహ్రుః ఇవ = పలికినట్లున్నవి.

తా. రావణుడు పైకి ఎగురుటచే కలిగిన గాలికి కదలిన, అనేకపక్షులతో కూడిన వృక్షములు, చివరి కొమ్మలు ఊగుటచే, ''భయపడకుము'' అని సీతను ఓదార్చుచున్నవా అన్నట్లున్నవి. 34

మూ. నలిన్యో ధ్వస్తకమలా స్త్రస్తమీనజలేచరాః,
సఖీమివ గతోచ్ఛ్వాసామన్వశోచన్త మైథిలీమ్. 35

ప్ర. అ. ధ్వస్తకమలాః = నశించిన పద్మములు కలవి, త్రస్తమీనజలేచరాః = భయపడిన మీనములు ఇతరజలచరములు కలవి అయిన, నలిన్యః = పద్మసరస్సులు, గతోచ్ఛ్వాసామ్ = పోయిన శ్వాసలు గల, సఖీమివ = సఖురాలిని వలె, మైథిలీమ్ = సీతను గూర్చి, అన్వశోచన్త = దుఃఖించినవి.

తా. అప్పుడు పద్మసరస్సులలోని పద్మాలు ఎండిపోయినవి. మీనములు, ఇతర జలచరములు భయపడుచుండెను. అట్టి పద్మసరస్సులు మూర్ఛ చెందిన సఖురాలిని గూర్చి దుఃఖించి నట్లు సీతను గూర్చి దుఃఖించినవి. 35

మూ. సమన్తాదభిసంపత్య సింహవ్యాఘ్రమృగద్విజాః,
అన్వధావం స్తదా రోషాత్సీతాం ఛాయానుగామినః. 36

ప్ర. అ. తదా = అప్పుడు, సింహవ్యాఘ్రమృగద్విజాః = సింహములు, వ్యాఘ్రములు, లేళ్లు, పక్షులు, సమన్తాత్ = నలుమూలలా, అభిసంపత్య = గుంపులుగా చేరి, రోషాత్ = కోపమువలన, ఛాయానుగామినః = నీడను అనుసరించుచున్నవై, సీతామ్ = సీతను, అన్వధావన్ = అనుసరించి పరుగెత్తినవి.

తా. అప్పుడు సింహములు, వ్యాఘ్రములు, లేళ్లు, పక్షులు, గుంపులుగా చేరి, రావణునిమీద కోపముతో, నీడను అనుసరించి, సీత వెనుక పరుగెత్తి వెళ్లినవి. 36

మూ. జలప్రపాతాస్రముఖాః శృఙ్గైరుచ్ఛ్రితబాహుభిః,
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశన్తీవ పర్వతాః.

ప్ర. అ. సీతాయామ్ = సీత, హ్రియమాణాయామ్ = హరించబడుచున్నదగుచుండగా, పర్వతాః = పర్వతములు, జలప్రపాతాస్రముఖాః = జలపాతములనే కన్నీళ్లు ముఖములందు కలవై, శృఙ్గైః = శిఖరములనే, ఉచ్ఛ్రితబాహుభిః = ఎత్తబడిన బాహువులతో కూడినవై, విక్రోశన్తీవ = ఏడ్చుచున్నట్లుండెను.

తా. హరించబడుచున్న సీతను చూచి, పర్వతములు జలపాతము లనే కన్నీళ్లు కార్చుచు, శిఖరములనే బాహువులు పైకి ఎత్తి ఏడ్చుచున్నట్లు ఉండెను.

మూ. హ్రియమాణాం తు వైదేహీం దృష్ట్వా దీనో దివాకరః,
ప్రతిధ్వస్తప్రభః శ్రీమానాసీత్పాణ్డరమణ్డలః. 38

ప్ర. అ. హ్రియమాణామ్ = హరించబడుచున్న, వైదేహీమ్ = సీతను, దృష్ట్వా = చూచి, శ్రీమాన్ = శోభగల, దివాకరః = సూర్యుడు, దీనః = దీనుడై, ప్రతిధ్వస్తప్రభః = నశించిన కాంతి కలవాడై, పాణ్డరమణ్డలః = తెల్లని మండలము కలవాడుగా, ఆసీత్ = ఆయెను.

తా. కాంతి గల సూర్యుడు కూడ హరింపబడుచున్న సీతను చూచి దీనుడై, కాంతివిహీను డగుటచే అతని మండలము తెల్లగా కనబడుచుండెను. 38

మూ. నాస్తి ధర్మః కుతః సత్యం నార్జవం నానృశంసతా,
యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః. 39
ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్.

ప్ర. అ. యత్ర = ఎప్పుడు, రామస్య = రాముని యొక్క, భార్యామ్ = భార్యయైన, వైదేహీమ్ = సీతను, రావణః = రావణుడు, హరతి = హరించుచున్నాడో, అట్టి సమయమునందు, ధర్మః = ధర్మము, నాస్తి = లేదు. సత్యమ్ = సత్యము, కుతః = ఎట్లు ? ఆర్జవమ్ = ఋజుత్వము, న = లేదు. అనృశంసతా = అక్రూరత్వము కూడ, న = లేదు, ఇతి = అని, సర్వాణి = సమస్తమైన, భూతాని = ప్రాణులు, గణశః = గుంపులుగా చేరి, పర్యదేవయన్ = విచారించినవి.

తా. "రాముని భార్యయైన సీతనే రావణుడు అపహరించుకొనిపోవుచున్నాడనగా ఇంక ధర్మ మనేది లేదు. సత్యానికి స్థాన మేది ? ఋజుత్వానికి కాని, మంచితనానికి కాని చోటులేదు" అని అనుకొనుచు సమస్తభూతములు గుంపులు గుంపులుగా చేరి విచారించిరి. 39

మూ. విత్రస్తకా దీనముఖా రురుదుర్మృగపోతకాః, 40
ఉద్వీక్ష్యోద్వీక్ష్య నయనై రాస్రపాతావిలేక్షణాః.

ప్ర. అ. మృగపోతకాః = లేడి పిల్లలు, విత్రస్తకాః = భయపడినవై, దీనముఖాః = దీనములైన ముఖములుకలవై, అస్రపాతావిలేక్షణాః = కన్నీళ్లు కారుటచే వ్యాకులమైన చూపులు కలవై, నయనైః = నేత్రములతో, ఉద్వీక్ష్యోద్వీక్ష్య = పైకి చూచి చూచి, రురుదుః = ఏడ్చినవి.

తా. అక్కడ నున్న లేడి పిల్లలు భయపడిపోయెను. వాటి ముఖములు దీనములుగా ఉండెను. కన్నీళ్లు కార్చుటచే వాటి చూపులు వ్యాకులము లయ్యెను. అవి మాటిమాటికి కళ్లు పైకి ప్రసరింపచేసి చూచుచుండెను. 40

మూ. సుప్రవేపితగాత్రాశ్చ బభూవుర్వనదేవతాః, 41
విక్రోశన్తీం దృఢం సీతాం దృష్ట్వా దుఃఖం తథా గతామ్.

ప్ర. అ. తథా = ఆవిధముగా, దుఃఖమ్ = దుఃఖమును, గతామ్ = పొందిన, దృఢమ్ = అధికముగా, విక్రోశన్తీమ్ = అరచుచున్న, సీతామ్ = సీతను, దృష్ట్వా =

చూచి, వనదేవతాః = వనదేవతలు, సుప్రవేపితగాత్రాశ్చ = బాగా వణకుచున్న దేహములు కలవి, బభూవుః = అయినవి.

తా. ఆ విధముగా దుఃఖాక్రాంతురాలై బిగ్గరగా ఏడ్చుచున్న ఆ సీతను చూచి వనదేవతలు వణకిపోయినవి. 41

మూ. తాం తు లక్ష్మణ రామేతి క్రోశన్తీం మధురస్వరమ్, 42
అవేక్షమాణాం బహుశో వైదేహీం ధరణీతలమ్,
స తామాకులకేశాన్తాం విప్రమృష్టవిశేషకామ్, 43
జహారాత్మవినాశాయ దశగ్రీవో మనస్వినీమ్.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! రామ = రామా ! ఇతి = అని, మధురస్వరమ్ = మధురమైన స్వరము కలుగునట్లుగా, క్రోశన్తీమ్ = ఏడ్చుచున్నది, బహుశః = అనేకపర్యాయములు, ధరణీతలమ్ = భూమిని, అవేక్షమాణామ్ = చూచుచున్నది, ఆకులకేశాన్తామ్ = వ్యాకులమైన కేశాంతములు గలది, విప్రమృష్టవిశేషకామ్ = చెరిగిపోయిన తిలకము కలది, మనస్వినీమ్ = ఉత్తమమైన మనస్సు కలదీ అయిన, తాం వైదేహీమ్ = ఆ సీతను, సః దశగ్రీవః = ఆ రావణుడు, ఆత్మవినాశాయ = తన వినాశముకొరకే, జహార = హరించెను.

తా. అప్పుడు ఆ సీత ''రామా ! లక్ష్మణా !''అని మధురమైన స్వరముతో విలపించుచుండెను. రామలక్ష్మణు లెక్కడనైనా వచ్చుచున్నారేమో అని మాటిమాటికి నేలవైపు చూచుచుండెను. ఆమె జుట్టుముడి విడిపోయెను. తిలకము చెరిగిపోయెను. అట్టి ఉత్తమ మనస్సు గల సీతను ఆ రావణుడు తన వినాశము కొరకే అపహరించుకొనిపోయెను. 44, 45

మూ. తతస్తు సా చారుదతీ శుచిస్మితా
వినాకృతా బన్ధుజనేన మైథిలీ,
అపశ్యతీ రాఘవలక్ష్మణావుభౌ
వివర్ణవక్త్రా భయభారపీడితా. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, చారుదతీ = అందమైన దంతములు కలది, శుచిస్మితా = తెల్లని చిరునవ్వు గలది, బన్ధుజనేన వినా = బంధుజనులు లేకుండా, కృతా = చేయబడినది అయిన, మైథిలీ = సీత, రాఘవలక్ష్మణౌ = రామలక్ష్మణులను, ఉభౌ = ఇద్దరినీ, అపశ్యతీ = చూడనిదై, వివర్ణవక్త్రా = చెడిన రంగు గల ముఖము గలదై, భయభారపీడితా = భయభారముచేత పీడింపబడెను.

తా. అందమైన పలువరుస, తెల్లని చిరునవ్వు గల ఆ సీత బంధువులకు దూరముచేయబడి, రామలక్ష్మణులను ఇద్దరినీ కూడ చూడక వెలవెలబారిన ముఖముతో భయభారముచేత పీడింపబడెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఏబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిపఞ్చాశః సర్గః

## [సీత రావణుని నిందించుట]

మూ. ఖముత్పతన్తం తం దృష్ట్వా మైథిలీ జనకాత్మజా,
దుఃఖితా పరమోద్విగ్నా భయే మహతి వర్తినీ. 1

ప్ర. అ. జనకాత్మజా = జనకుని కుమార్తెయైన, మైథిలీ = సీత, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పతన్తమ్ = ఎగురుచున్న, తమ్ = రావణుని, దృష్ట్వా = చూచి, పరమోద్విగ్నా = చాల దిగులు చెందినదై, మహతి = గొప్ప, భయే = భయమునందు, వర్తినీ = ఉంటూన్నదై, దుఃఖితా = దుఃఖితురాలు అయ్యెను.

తా. జనకుని కుమార్తెయైన సీత, ఆకాశములో ఎగురుచున్న ఆ రావణుని చూచి, చాల దిగులు చెంది, అత్యధికముగా భయపడుచు దుఃఖితురాలయ్యెను. 1

మూ. రోషరోదనతామ్రాక్షీ భీమాక్షం రాక్షసాధిపమ్,
రుదన్తీ కరుణం సీతా హ్రియమాణేద మబ్రవీత్. 2

ప్ర. అ. హ్రియమాణా = హరించబడుచున్న, సీతా = సీత, కరుణమ్ = దీనముగా, రుదన్తీ = ఏడ్చుచున్నదై, రోషరోదనతామ్రాక్షీ = రోషముచేతను, ఏడ్చుటచేతను ఎఱ్ఱనైన నేత్రములు కలదై, భీమాక్షమ్ = భయంకరములైన నేత్రములు గల, రాక్షసాధిపమ్ = రావణుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రావణునిచేత హరించబడుచున్న సీత రోషముచేతను, ఏడ్చుటచేతను ఎఱ్ఱనైన నేత్రములు గలదై, భయంకరములైన నేత్రములు గల రావణునితో ఇట్లు పలికెను.

మూ. న వ్యపత్రపసే నీచ కర్మణానేన రావణ,
జ్ఞాత్వా విరహితాం యన్మాం చోరయిత్వా పలాయసే. 3

ప్ర. అ. నీచ = నీచుడవైన, రావణ = రావణా : విరహితామ్ = ఒంటరిగా ఉన్న, మామ్ = నన్ను, చోరయిత్వా = అపహరించి, పలాయసే ఇతి యత్ = పారిపోవుచున్నావుకదా; అనేన = ఈ, కర్మణా = పనిచేత, న వ్యపత్రపసే = సిగ్గుపడుటలేదా ?

తా. ఓ ! నీచుడవైన రావణా! రామలక్ష్మణులు లేక ఒంటరిగా ఉన్న నన్ను ఈ విధముగా అపహరించుకొని పారిపోవుచున్నావే; ఈ పనికి నీకు సిగ్గు కలుగుట లేదా ! 3

మూ. త్వయైవ నూనం దుష్టాత్మన్ భీరుణా హర్తుమిచ్ఛతా,
మమాపవాహితో భర్తా మృగరూపేణ మాయయా. 4

ప్ర. అ. దుష్టాత్మన్ = దుష్టబుద్ధి కలవాడా : హర్తుమ్ = హరించుటకు, ఇచ్ఛతా = కోరుచున్న, భీరుణా = పిరికిపందవైన, త్వయైవ = నీచేతనే, మమ = నాయొక్క, భర్తా = భర్త, మాయయా = మాయచేత, మృగరూపేణ = మృగ రూపముచేత, అపవాహితః = దూరముగా తీసికొనిపోబడినాడు.

తా. దుష్టబుద్ధి కలవాడా ! నన్ను హరించవలె నను ఉద్దేశ్యముతో పిరికి పందవైన నీవే మాయచేత మృగరూపము కల్పించి, నా భర్త దూరముగా వెళ్లి పోవు నట్లు చేసినావు. 4

మూ. యో హి మాముద్యతస్త్రాతుం సోఽప్యయం వినిపాతితః,
గృధ్రరాజః పురాణోఽసౌ శ్వశురస్య సఖా మమ. 5

ప్ర. అ. యః = ఏ, గృధ్రరాజః = జటాయువు, అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, త్రాతుమ్ = రక్షించుటకు, ఉద్యతః = ఉద్యమించినాడో, మమ శ్వశురస్య = నా మామగారియొక్క, పురాణః = ప్రాచీనుడైన, సఖా = స్నేహితుడైన, సః అయమ్ = అట్టి, అసౌ అపి = ఇతడు కూడ, వినిపాతితః = పడగొట్టబడినాడు.

తా. నా మామగారి ప్రాచీనమిత్రుడైన ఆ జటాయువు నన్ను రక్షించుటకు రాగా అతనిని కూడ పడగొట్టినావు. 5

మూ. పరమం ఖలు తే వీర్యం దృశ్యతే రాక్షసాధమ,
విశ్రావ్య నామధేయం హి యుద్ధే నాస్మి జితా త్వయా. 6

ప్ర. అ. రాక్షసాధమః = రాక్షసాధముడా ! తే వీర్యమ్ = నీ పరాక్రమము, పరమమ్ = చాల గొప్పదిగా, దృశ్యతే ఖలు = చూడబడుచున్నదికదా ! నామ దేయమ్ = పేరును, విశ్రావ్య = వినిపించి, త్వయా = నీచేత, యుద్ధే = యుద్ధము నందు, జితా = జయింపబడినదానను, నాస్మి హి = కాను కదా !

తా. రాక్షసాధమా ! నీ పరాక్రమము చాల గొప్పది వలె కనబడుచున్నది. నీవు నీ పేరును గొప్పగా చెప్పుకొని నన్ను రామునితో యుద్ధము చేసి జయించ జాలక అపహరించుకొనిపోవుచున్నావు ! 6

మూ. ఈదృశం గర్హితం కర్మ కథం కృత్వా న లజ్జసే,
స్త్రియాశ్చ హరణం నీచ రహితే చ పరస్య చ. 7

ప్ర. అ. నీచ = నీచుడా ! రహితే = శూన్యప్రదేశమునందు, పరస్య చ = పరునియొక్క, స్త్రియాః = స్త్రీయొక్క, హరణమ్ = హరణ మనే, ఈదృశమ్ = ఇట్టి, గర్హితమ్ = నింద్యమైన, కర్మ = పనిని, కృత్వా = చేసి, కథమ్ = ఎట్లు, న లజ్జసే = సిగ్గుపడుట లేదు ?

తా. నీచుడా ! శూన్యప్రదేశములో ఉన్న పరస్త్రీని అపహరించుట అనే ఇట్టి నింద్యమైన పని చేయుటకు నీకు సిగ్గు కలుగుటలేదా ? 7

మూ. కథయిష్యన్తి లోకేషు పురుషాః కర్మ కుత్సితమ్,
సునృశంసమధర్మిష్ఠం తవ శౌణ్డీర్యమానినః. 8

ప్ర. అ. శౌణ్డీర్యమానినః = శూరుడ ననే అభిమానము గల, తవ = నీయొక్క, సునృశంసమ్ = చాల క్రూరము, అధర్మిష్ఠమ్ = ధర్మవిరుద్ధము, కుత్సితమ్ = నింద్యము అయిన, కర్మ = ఈ పనిని, లోకేషు = లోకములలో, పురుషాః = పురుషులు, కథయిష్యన్తి = చెప్పుకొనగలరు.

తా. గొప్ప శూరుడ ననే గర్వము గల నీవు చేసిన ఈ క్రూరము, ధర్మ విరుద్ధము, నీచము అయిన ఈ కర్మను గూర్చి లోకములలో జనులు నిందా పూర్వకముగా చెప్పుకొందురు. 8

మూ. ధిక్తే శౌర్యం చ సత్త్వం చ యత్త్వం కథితవాంస్తదా,
కులాక్రోశకరం లోకే ధిక్తే చారిత్రమీదృశమ్. 9

ప్ర. అ. యత్ = దేనిని గూర్చి, త్వమ్ = నీవు, తదా = అప్పుడు, కథితవాన్ = చెప్పినావో, తే = నీయొక్క, శౌర్యమ్=అట్టి శౌర్యమును గూర్చి, సత్త్వం చ = బలమును గూర్చి, ధిక్ = నింద అగుగాక. లోకే=లోకమునందు, కులాక్రోశకరమ్=కులమునకు నిందను కలిగించు, తే=నీయొక్క, ఈదృశమ్= ఇట్టి, చారిత్రమ్ = చరిత్రను గూర్చి, ధిక్ = నింద అగుగాక.

తా. అప్పుడు నీవు నీ శౌర్యబలములను గూర్చి గొప్పగా చెప్పినావు. అట్టి నీ శౌర్యబలములను గూర్చి నింద అగుగాక. ఛీః ఇట్టి నీ చరిత్రము నీ కులమునకే కళంకము తెచ్చుచున్నది. 9

మూ. కిం కర్తుం శక్యమేవం హి యజ్జవేనైవ ధావసి,
ముహూర్తమపి తిష్ఠస్వ న జీవన్ ప్రతియాస్యసి. 10

ప్ర. అ. కిమ్ = ఏమి, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యము? యత్ = ఎందువలన అనగా, ఏవమ్ = ఈ విధముగా, జవేనైవ = వేగముతోనే, ధావసి = పారిపోవుచున్నావు. ముహూర్తమపి = ముహూర్తకాలమైనా, తిష్ఠస్వ= ఆగుము, జీవన్ = జీవించుచున్నవాడవై, న ప్రతియాస్యసి = తిరిగి వెళ్లవు.

తా. నీ వీ విధముగా మహావేగముతో పారిపోవుచుండగా ఏమి చేయ గలను? ముహూర్తకాలము పాటు ఆగుము. ప్రాణాలతో తిరిగి వెళ్లవు. 10

మూ. న హి చక్షుష్పథం ప్రాప్య తయోః పార్థివపుత్రయోః,
ససైన్యోఽపి సమర్థస్త్వం ముహూర్తమపి జీవితుమ్. 11

ప్ర. అ. తయోః = ఆ, పార్థివపుత్రయోః = రాజకుమారులయొక్క, చక్షుష్పథమ్=నేత్రమార్గమును, ప్రాప్య=పొంది, త్వమ్=నీవు, ససైన్యోఽపి=

తా. నా మామగారి ప్రాచీనమిత్రుడైన ఆ జటాయువు నన్ను రక్షించుటకు రాగా ఆతనిని కూడ పడగొట్టినావు. 5

మూ. పరమం ఖలు తే వీర్యం దృశ్యతే రాక్షసాధమ,
విశ్రావ్య నామధేయం హి యుద్ధే నాస్మి జితా త్వయా. 6

ప్ర. అ. రాక్షసాధమ! = రాక్షసాధముడా ! తే వీర్యమ్ = నీ పరాక్రమము, పరమమ్ = చాల గొప్పదిగా, దృశ్యతే ఖలు = చూడబడుచున్నదికదా ! నామ ధేయమ్ = పేరును, విశ్రావ్య = వినిపించి, త్వయా = నీచేత, యుద్ధే = యుద్ధము నందు, జితా = జయింపబడినదానను, నాస్మి హి = కాను కదా !

తా. రాక్షసాధమా ! నీ పరాక్రమము చాల గొప్పది వలె కనబడుచున్నది. నీవు నీ పేరును గొప్పగా చెప్పుకొని నన్ను రామునితో యుద్ధము చేసి జయించ జాలక అపహరించుకొనిపోవుచున్నావు ! 6

మూ. ఈదృశం గర్హితం కర్మ కథం కృత్వా న లజ్జసే,
స్త్రియాశ్చ హరణం నీచ రహితే చ పరస్య చ. 7

ప్ర. అ. నీచ = నీచుడా ! రహితే = శూన్యప్రదేశమునందు, పరస్య చ = పరునియొక్క, స్త్రియాః = స్త్రీయొక్క, హరణమ్ = హరణ మనే, ఈదృశమ్ = ఇట్టి, గర్హితమ్ = నింద్యమైన, కర్మ = పనిని, కృత్వా = చేసి, కథమ్ = ఎట్లు, న లజ్జసే = సిగ్గుపడుట లేదు ?

తా. నీచుడా ! శూన్యప్రదేశములో ఉన్న పరస్త్రీని అపహరించుట అనే ఇట్టి నింద్యమైన పని చేయుటకు నీకు సిగ్గు కలుగుటలేదా ? 7

మూ. కథయిష్యన్తి లోకేషు పురుషాః కర్మ కుత్సితమ్,
సునృశంసమధర్మిష్ఠం తవ శౌణ్డీర్యమానినః. 8

ప్ర. అ. శౌణ్డీర్యమానినః = శూరుడ ననే అభిమానము గల, తవ = నీయొక్క, సునృశంసమ్ = చాల క్రూరము, అధర్మిష్ఠమ్ = ధర్మవిరుద్ధము, కుత్సితమ్ = నింద్యము అయిన, కర్మ = ఈ పనిని, లోకేషు = లోకములలో, పురుషాః = పురుషులు, కథయిష్యన్తి = చెప్పుకొనగలరు.

తా. గొప్ప శూరుడ ననే గర్వము గల నీవు చేసిన ఈ క్రూరము, ధర్మ విరుద్ధము, నీచము అయిన ఈ కర్మను గూర్చి లోకములలో జనులు నిందా పూర్వకముగా చెప్పుకొందురు. 8

మూ. ధిక్తే శౌర్యం చ సత్త్వం చ యత్త్వం కథితవాంస్తదా,
కులాక్రోశకరం లోకే ధిక్తే చారిత్రమీదృశమ్. 9

ప్ర. అ. యత్ = దేనిని గూర్చి, త్వమ్ = నీవు, తదా = అప్పుడు, కథితవాన్ = చెప్పినావో, తే = నీయొక్క, శౌర్యమ్ = అట్టి శౌర్యమును గూర్చి, సత్త్వం చ = బలమును గూర్చి, ధిక్ = నింద అగుగాక. లోకే = లోకమునందు, కులాక్రోశకరమ్ = కులమునకు నిందను కలిగించు, తే = నీయొక్క, ఈదృశమ్ = ఇట్టి, చారిత్రమ్ = చరిత్రను గూర్చి, ధిక్ = నింద అగుగాక.

తా. అప్పుడు నీవు నీ శౌర్యబలములను గూర్చి గొప్పగా చెప్పినావు. అట్టి నీ శౌర్యబలములను గూర్చి నింద అగుగాక. ఛీ ! ఇట్టి నీ చరిత్రము నీ కులమునకే కళంకము తెచ్చుచున్నది. 9

మూ. కిం కర్తుం శక్యమేవం హి యజ్జవేనైవ ధావసి,
ముహూర్తమపి తిష్ఠస్వ న జీవన్ ప్రతియాస్యసి. 10

ప్ర. అ. కిమ్ = ఏమి, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యము ? యత్ = ఎందువలన అనగా, ఏవమ్ = ఈ విధముగా, జవేనైవ = వేగముతోనే, ధావసి = పారిపోవుచున్నావు. ముహూర్తమపి = ముహూర్తకాలమైనా, తిష్ఠస్వ = ఆగుము, జీవన్ = జీవించుచున్నవాడవై, న ప్రతియాస్యసి = తిరిగి వెళ్లవు.

తా. నీ వీ విధముగా మహావేగముతో పారిపోవుచుండగా ఏమి చేయ గలను ? ముహూర్తకాలము పాటు ఆగుము. ప్రాణాలతో తిరిగి వెళ్లవు. 10

మూ. న హి చక్షుష్పథం ప్రాప్య తయోః పార్థివపుత్రయోః,
ససైన్యోఽపి సమర్థస్త్వం ముహూర్తమపి జీవితుమ్. 11

ప్ర. అ. తయోః = ఆ, పార్థివపుత్రయోః = రాజకుమారులయొక్క, చక్షుష్పథమ్ = నేత్రమార్గమును, ప్రాప్య = పొంది, త్వమ్ = నీవు, ససైన్యోఽపి =

సైన్యసహితుడవైనను, ముహూర్తమపి = ముహూర్తకాలమైనను, జీవితుమ్ = జీవించుటకు, న సమర్థః హి = సమర్థుడవు కాదు కదా ?

తా. ఆ రామలక్ష్మణుల కంట బడినచో, నీవు, సైన్యముతో వచ్చినా కూడ, ఒక్క ముహూర్తము కూడ జీవించజాలవు. 11

మూ. న త్వం తయోః శరస్పర్శం సోఢుం శక్తః కథంచన,
వనే ప్రజ్వలితస్యేవ స్పర్శమగ్నేర్విహంగమః. 12

ప్ర. అ. వనే = వనమునందు, ప్రజ్వలితస్య = మండుచున్న, అగ్నేః = అగ్నియొక్క, స్పర్శమ్ = స్పర్శను, విహంగమః ఇవ = పక్షి వలె, త్వమ్ = నీవు, తయోః = ఆ ఇద్దరియొక్క, శరస్పర్శమ్ = బాణముల స్పర్శను, సోఢుమ్ = సహించుటకు, కథంచన = ఏ విధముగాను కూడ, న శక్తః = సమర్థుడవు కాదు.

తా. అరణ్యములో మండుచున్న అగ్ని స్పర్శను పక్షి ఏ విధముగ సహింపజాలదో అట్లే నీవు ఆ రామలక్ష్మణుల బాణముల స్పర్శను ఏ విధముగానూ కూడ సహించజాలవు. 12

మూ. సాధు కుర్వాత్మనః పథ్యం సాధు మాం ముఞ్చ రావణ,
మత్ప్రధర్షణరుష్టో హి భ్రాత్రా సహ పతిర్మమ. 13
విధాస్యతి వినాశాయ త్వం మాం యది న ముఞ్చసి.

ప్ర. అ. రావణ = రావణుడా ! సాధు = బాగుగా, ఆత్మనః = నీకు, పథ్యమ్ = హితమైన పనిని, కురు = చేయుము. మామ్ = నన్ను, సాధు = బాగుగా, ముఞ్చ = విడచి వేయుము. త్వమ్ = నీవు, మామ్ = నన్ను, న ముఞ్చసి యది = విడవకపోయినట్లయితే, మత్ప్రధర్షణరుష్టః = నా అవమానముచేత కోపించిన, మమ పతిః = నా భర్త, భ్రాత్రా సహ = సోదరునితో కూడినవాడై, వినాశాయ = నీ వినాశమునకు, విధాస్యతి = ఉపాయముచేయగలడు.

తా. రావణుడా ! మంచితనముతో నన్ను విడిచిపెట్టుము. అది నీకు హితకరమైనది. నీవు నన్ను విడవకపోయినచో, నన్ను అవమానించుటచేత కోపించిన నా భర్త, సోదరునితో కలిసి, నిన్ను నశింపచేయుటకై ఉపాయములను అవలంబించగలడు. 13

మూ. యేన త్వం వ్యవసాయేన బలాన్మాం హర్తుమిచ్ఛసి, 14
వ్యవసాయః స తే నీచ భవిష్యతి నిరర్థకః.

ప్ర. అ. నీచ = నీచుడా ! త్వమ్ = నీవు, యేన = ఏ, వ్యవసాయేన = ఉద్యమముచేత, మామ్ = నన్ను, బలాత్ = బలాత్కారముగా, హర్తుమ్ = హరించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, తే = నీయొక్క, సః = ఆ, వ్యవసాయః = ప్రయత్నము, నిరర్థకః = వ్యర్థము. భవిష్యతి = కాగలదు.

తా. నీచుడా ! నీవు ఏ ప్రయత్నము చేసి నన్ను బలాత్కారముగా హరించుటకు కోరుచున్నావో, నీవు చేసే ఆ ప్రయత్న మంతా వ్యర్థము కాగలదు.

మూ. న హ్యహం తమపశ్యన్తీ భర్తారం విబుధోపమమ్, 15
ఉత్సహే శత్రువశగా ప్రాణాన్ ధారయితుం చిరమ్.

ప్ర. అ. అహమ్ = నేను, విబుధోపమమ్ = దేవతలతో సమానుడైన, భర్తారమ్ = భర్తయైన, తమ్ = ఆ రాముణ్ణి, అపశ్యన్తీ = చూడనిదాననై, శత్రువశగా = శత్రువుల వశమునం దున్నదాననై, చిరమ్ = చిరకాలము, ప్రాణాన్ = ప్రాణములను, ధారయితుమ్ = ధరించుటకు, న ఉత్సహే హి = ఉత్సాహవంతురాలను గాను కదా.

తా. దేవతలతో సమానుడైన నా భర్తయైన రాముణ్ణి చూడకుండగా, శత్రువుల చేత చిక్కి నేను చిరకాలము ప్రాణములు ధరించజాలను కదా ! 15

మూ. న నూనం చాత్మనః పథ్యం శ్రేయో వా సమవేక్షసే, 16
మృత్యుకాలే యథా మర్త్యో విపరీతాని సేవతే.

ప్ర అ. మర్త్యః = మానవుడు, మృత్యుకాలే = మృత్యుసమయ మునందు, యథా = ఎట్లు, విపరీతాని = విపరీతకార్యములను, సేవతే = సేవించునో ఆ విధముగా, ఆత్మనః = నీయొక్క, పథ్యమ్ = హితమును గాని, శ్రేయో వా = శ్రేయస్సును గాని, న సమవేక్షసే = చూచుటలేదు.

తా. మరణకాలము ఆసన్న మైనప్పుడు మానవుడు విపరీతముగా ప్రవర్తించును. అందుచేతనే నీవు నీ హిత మేదో, శ్రేయస్సు ఏదో తెలుసుకొనలేకున్నావు. 16

మూ. ముమూర్షూణాం హి సర్వేషాం యత్పథ్యం తన్న రోచతే,
పశ్యామ్యద్య హి కణ్ఠే త్వాం కాలపాశావపాశితమ్. 17

ప్ర. అ. ముమూర్షూణామ్ = చచ్చుటకు సిద్ధముగా ఉన్న, సర్వేషామ్ = అందరికీ, యత్ = ఏది, పథ్యమ్ = పథ్యమో, తత్ = అది, న రోచతే = ఇష్టము కాదు. అద్య = ఇప్పుడు, త్వామ్ = నిన్ను, కణ్ఠే = కంఠమునందు, కాలపాశావపాశితమ్ = యమపాశముచేత కట్టబడినవానినిగా, పశ్యామి హి = చూచుచున్నాను కదా ?

తా. చచ్చుటకు సిద్ధముగా ఉన్నవాళ్ల కెవ్వరికీ పథ్యమైనది ఇష్టముగా ఉండదు. నీ కంఠమునకు యమపాశము బిగించబడిఉన్న దని నేను ఊహించుచున్నాను. 17

మూ. యథా చాస్మిన్ భయస్థానే న బిభేషి దశానన, 18
వ్యక్తం హిరణ్మయాన్ హి త్వం సంపశ్యసి మహీరుహాన్.

ప్ర. అ. దశానన = రావణుడా! త్వమ్ = నీవు, అస్మిన్ = ఈ, భయస్థానే = భయమునకు హేతువైన విషయమునందు; యథా = ఎట్లు, న బిభేషి = భయపడుటలేదో, హిరణ్మయాన్ = బంగారువికారమైన, మహీరుహాన్ = వృక్షములను, సంపశ్యసి = చూచుచున్నావు; వ్యక్తమ్ = స్పష్టము.

తా. రావణా! భయపడవలసిన ఇట్టి స్థితిలో నీవు భయపడకపోవుటను బట్టి చూడగా, నీవు, బంగారు వృక్షములను చూచుచున్నా వనుట స్పష్టము. 18

మూ. నదీం వైతరణీం ఘోరాం రుధిరౌఘనివాహినీమ్, 19
అసిపత్రవనం చైవ భీమం పశ్యసి రావణ.

ప్ర. అ. రావణ = రావణుడా! రుధిరౌఘనివాహినీమ్ = రక్తప్రవాహముతో ప్రవహించు, ఘోరామ్ = భయంకరమైన, వైతరణీం నదీమ్ = వైతరణీ నదిని, భీమమ్ = భయంకరమైన, అసిపత్రవనం చైవ = అసిపత్రవనమును, పశ్యసి = చూచుచున్నావు.

తా. రావణుడా! నీవు మరణించి, నరకములో రక్తప్రవాహముతో ప్రవ

హించు భయంకరమైన వైతరణీనదిని, భయంకరమైన అంతటా కత్తులు పరచిన అసిపత్రవనమును చూడగలవు. 19

మూ. తప్తకాఞ్చనపుష్పాం చ వైడూర్యప్రవరచ్ఛదామ్, 20
ద్రక్ష్యసే శాల్మలిం తీక్ష్ణామాయసైః కణ్టకైశ్చితామ్.

ప్ర. అ. తప్తకాఞ్చనపుష్పామ్ = శుద్ధమైన బంగారము వంటి పుష్పములు కలది, వైడూర్యప్రవరచ్ఛదామ్ = శ్రేష్ఠమైన వైడూర్యమణుల వంటి ఆకులు కలది, ఆయసైః = ఇనుము వికారమైన, కణ్టకైః = ముళ్ళతో, చితామ్ = వ్యాప్తమైనదీ, తీక్ష్ణామ్ = తీక్ష్ణమూ అయిన, శాల్మలిమ్ = శాల్మలీవృక్షమును, ద్రక్ష్యసే = చూడగలవు.

తా. ఆ నరకములో బంగారు రంగు పుష్పములు, వైడూర్యమణుల వంటి ఆకులు ఉన్న, శాల్మలీవృక్షమును (బూరుగుచెట్టు) చూడగలవు. దాని నిండా ఇనుప ముళ్లు గుచ్చి ఉండుటచే అది చాల తీక్ష్ణముగా ఉండును. 20

మూ. న హి త్వమీదృశం కృత్వా తస్యాలీకం మహాత్మనః, 21
ధరితుం శక్ష్యసి చిరం విషం పీత్వేవ నిర్ఘృణః.

ప్ర. అ. నిర్ఘృణః = జాలి లేని, త్వమ్ = నీవు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ రామునకు. ఈదృశమ్ = ఇట్టి, అలీకమ్ = అపకారమును, కృత్వా = చేసి, విషమ్ = విషమును, పీత్వేవ = త్రాగి వలె, చిరమ్ = చిరకాలము, ధరితుమ్ = జీవించుటకు, న శక్ష్యసి = సమర్థుడవు కాజాలవు.

తా. క్రూరుడవైన నీవు, మహాత్ముడైన ఆ రామునకు ఇట్టి అపకారము చేసిన పిమ్మట, విషము త్రాగినవాడు వలె చాల కాలము జీవించజాలవు. 21

మూ. బద్ధస్త్వం కాలపాశేన దుర్నివారేణ రావణ, 22
క్వ గతో లప్స్యసే శర్మ భర్తుర్మమ మహాత్మనః.

ప్ర. అ. రావణ = రావణుడా ! త్వమ్ = నీవు, దుర్నివారేణ = నివారింపశక్యము కాని, కాలపాశేన = కాలపాశముచేత, బద్ధః = కట్టబడినావు. మమ = నాయొక్క, భర్తుః = భర్తయైన, మహాత్మనః = మహాత్ముడైన రామునినుండి, క్వ

= ఎక్కడికి, గతః = వెళ్ళినవాడవై, శర్మ = సుఖమును, లప్స్యసే = పొంద గలవు?

తా. రావణుడా : నీవు నివారింప శక్యము కాని కాలపాశముచేత కట్టబడి ఉన్నావు. నీవు ఎక్కడికి పోయినను, మహాత్ముడైన నా భర్తనుండి తప్పించు కొని సుఖముగా ఉండజాలవు. 22

మూ. నిమేషాన్తరమాత్రేణ వినా భ్రాత్రా మహావనే, 23
రాక్షసా నిహతా యేన సహస్రాణి చతుర్దశ,
స కథం రాఘవో వీరః సర్వాస్త్రకుశలో బలీ. 24
న త్వాం హన్యాచ్ఛరై స్తీక్ష్ణైరిష్టభార్యాపహారిణమ్.

ప్ర. అ. యేన = ఏ రామునిచేత, మహావనే = మహారణ్యమునందు, భ్రాత్రా వినా = సోదరుడు లేకుండా, నిమేషాన్తరమాత్రేణ = రెప్పపాటు సమయములో, చతుర్దశ సహస్రాణి = పదునాలుగు వేలు, రాక్షసాః = రాక్షసులు, నిహతాః = చంపబడినారో, వీరః = వీరుడు, సర్వాస్త్రకుశలీ = సర్వాస్త్రముల యందు నేర్పు గలవాడు, బలీ = బలవంతుడు అయిన, సః = అట్టి, రాఘవః = రాముడు, ఇష్టభార్యాపహారిణమ్ = ఇష్టురాలైన భార్యను అపహరించిన, త్వామ్ = నిన్ను, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, శరైః = బాణములచేత, కథమ్ = ఎట్లు, న హన్యాత్ = చంపకుండును ?

తా. ఏ రాముడు, మహారణ్యములో, సోదరుని సహాయము కూడ లేకుండగా రెప్పపాటు కాలములో, పదునాలుగు వేలమంది రాక్షసులను చంపి నాడో, అట్టి మహావీరుడు, బలశాలి, సర్వాస్త్రములందు నేర్పుకలవాడూ అయిన రాముడు తన ప్రియురాలైన భార్యను అపహరించిన నిన్ను, తీక్ష్ణములైన బాణా లతో చంపకుండా ఉండునా ? 23, 24

మూ. ఏతచ్చాన్యచ్చ పరుషం వైదేహీ రావణాఙ్కగా. 25
భయశోకసమావిష్టా కరుణం విలలాప హ.

ప్ర. అ. రావణాఙ్కగా = రావణుని అంకమును పొందిన, వైదేహీ = సీత, భయశోకసమావిష్టా = భయముతోను శోకముతోను కూడినదై, ఏతత్ చ = దీనినీ,

అన్యచ్చ = ఇతరమునూ, పరుషమ్=పరుషవాక్యమును (పలుకుచు), కరుణమ్= దీనముగా, విలలాప హ = విలపించెను.

తా. రావణుని ఒడిలో ఉన్న సీత ఈ పరుషవాక్యములను, పరుషములైన మరి కొన్ని మాటలను పలుకుచు, భయముచేతను, శోకముచేతను ఆవేశింపబడినదై, దీనముగా ఏడ్చెను. 25

మూ. తథా భృశార్తాం బహు చైవ భాషిణీం
విలాపపూర్వం కరుణం చ భామినీమ్,
జహార పాపః కరుణం వివేష్టతీం
నృపాత్మజామాగతగాత్రవేపథుమ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
త్రిపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తథా=ఆ విధముగా, భృశార్తామ్=మిక్కిలి దుఃఖించుచున్నది, విలాపపూర్వమ్ = విలాపపూర్వకముగాను, కరుణం చ = దీనముగాను, బహు చైవ= అధికముగా, భాషిణీమ్ = మాటలాడుచున్నది, కరుణమ్ = జాలికొలుపునట్లుగా, వివేష్టతీమ్ = మెలికలు తిరుగుచున్నది, నృపాత్మజామ్ = రాజకుమారి, ఆగతగాత్రవేపథుమ్ = పొందబడిన శరీరకంపము గలది అయిన, భామినీమ్ = సీతను, పాపః = పాపాత్ముడైన రావణుడు, జహార = హరించెను.

తా. రాజకుమారియైన సీత ఆ విధముగా చాల దుఃఖితురాలై దీనముగా విలపించుచు ఏమేమో అధికముగా మాటలాడుచుండెను. జాలి గొలుపు నట్లు మెలికలు తిరిగిపోవుచుండెను. ఆమె శరీరము వణకిపోవుచుండెను. అట్టి సీతను ఆ పాపాత్ముడు హరించెను. 26

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఏబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపఞ్చాశః సర్గః

*[సీత తన ఆభరణములను మూటకట్టి ఐదుగురు వానరుల మధ్యా జారవిడచుట, రావణుడు సీతను తన అంతఃపురములో ఉంచుట, ఎనమండుగురు గూఢచారులను జనస్థానమునకు పంపుట.]*

మూ. హ్రియమాణా తు వైదేహీ కంచిన్నాథమపశ్యతీ,
దదర్శ గిరిశృఙ్గస్థాన్ పఞ్చ వానరపుఙ్గవాన్. 1

ప్ర. అ. హ్రియమాణా = హరించబడుచున్న, వైదేహీ = సీత, నాథమ్ = రక్షకుణ్ణి, కంచిత్ = ఎవనినీ, అపశ్యతీ = చూడనిదై, గిరిశృఙ్గస్థాన్ = పర్వత శిఖరముమీద ఉన్న, పఞ్చ = ఐదుగురు, వానరపుఙ్గవాన్ = వానరశ్రేష్ఠులను, దదర్శ = చూచెను.

తా. ఈ విధముగా అపహరింపబడుచున్న సీతకు రక్షకు లెవ్వరూ కన బడలేదు. ఇంతలో ఆమెకు పర్వతశిఖరముమీద ఉన్న ఐదుగురు వానరశ్రేష్ఠులు కనబడిరి. 1

మూ. తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభమ్,
ఉత్తరీయం వరారోహా శుభాన్యాభరణాని చ, 2
ముమోచ యది రామాయ శంసేయురితి భామినీ.

ప్ర. అ. విశాలాక్షీ = విశాలములైన నేత్రములు గల, వరారోహా = సుందరమైన కటిప్రదేశము గల, భామినీ = సీత, కనకప్రభమ్ = బంగారు కాంతి గల, కౌశేయమ్ = పట్టుదైన, ఉత్తరీయమ్ = ఉత్తరీయమును, శుభాని = మంగళకరములైన, ఆభరణాని చ = ఆభరణములను, రామాయ = రామునకు, శంసేయుః యది = చెప్పిన చెప్పవచ్చును, ఇతి = అని ఆలోచించి, తేషామ్ = వారియొక్క, మధ్యే = మధ్యయందు, ముమోచ = విడచెను.

తా. విశాలములైన నేత్రములు శ్రేష్ఠమైన కటిప్రదేశము గల ఆ సీత, "ఈ వానరులు రామునకు చెప్పిన చెప్పవచ్చును" అని ఆలోచించి, బంగారు కాంతి గల, ఉత్తరీయముగా ఉన్న పట్టువస్త్రమును, మంగళకరములైన ఆభరణములను వారి మధ్య విడచెను.

మూ. వస్త్రముత్సృజ్య తన్మధ్యే నిక్షిప్తం సహభూషణమ్, 3
సంభ్రమాత్తు దశగ్రీవస్తత్కర్మ న స బుద్ధవాన్.

ప్ర. అ. సహభూషణమ్ = భూషణములతో కూడిన, వస్త్రమ్=వస్త్రము, ఉత్సృజ్య=పీకితీసి, తన్మధ్యే=ఆ వానరుల మధ్యయందు, నిక్షిప్తమ్=ఉంచబడినది. సః దశగ్రీవః=ఆ రావణుడు, సంభ్రమాత్=తొందరవలన, తత్ = ఆ, కర్మ=పనిని, న బుద్ధవాన్ = తెలిసికొనలేదు.

తా. అలంకారములతో కూడ ఆ వస్త్రమును తీసి ఆమె ఆ వానరుల మధ్య విడచెను. రావణుడు తొందరలో ఉండుటచే ఆమె చేసిన పనిని గుర్తించలేదు. 3

మూ. పిఙ్గాక్షాస్తాం విశాలాక్షీం నేత్రైరనిమిషైరివ, 4
విక్రోశన్తీం తథా సీతాం దదృశుర్వానరర్షభాః.

ప్ర. అ. పిఙ్గాక్షాః = పచ్చని నేత్రములు గల, వానరర్షభాః = వానరశ్రేష్ఠులు, విశాలాక్షీమ్ = విశాలములైన నేత్రములు కల, తథా = ఆవిధముగా, విక్రోశన్తీమ్ = ఏడ్చుచున్న, తాం సీతామ్ = ఆ సీతను, అనిమిషైరివ = రెప్పపాటు లేనివి వలె ఉన్న, నేత్రైః = నేత్రములతో, దదృశుః = చూచిరి.

తా. పచ్చని నేత్రములు గల ఆ వానరశ్రేష్ఠులు, ఆ విధముగా ఏడ్చుచున్న విశాలాక్షియైన ఆ సీతను రెప్పపాటు లేని కండ్లతో చూచిరి. 4

మూ. స చ పమ్పామతిక్రమ్య లఙ్కామభిముఖః పురీమ్, 5
జగామ రుదతీం గృహ్య వైదేహీం రాక్షసేశ్వరః.

ప్ర. అ. సః రాక్షసేశ్వరః = ఆ రావణుడు, పమ్పామ్ = పంపానదిని, అతిక్రమ్య = దాటి, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును గూర్చి, అభిముఖః = అభిముఖుడై, రుదతీమ్ = ఏడ్చుచున్న, వైదేహీమ్=సీతను, గృహ్య=గ్రహించి, జగామ = వెళ్లెను.

తా. ఆ రావణుడు ఏడ్చుచున్న ఆ సీతను తీసికొని, పంపానదిని దాటి లంకాపురాభిముఖుడై వెళ్లెను. 5

మూ. తాం జహార సుసంహృష్టో రావణో మృత్యుమాత్మనః, 6
ఉత్సఙ్గేనేవ భుజగీం తీక్ష్ణదంష్ట్రాం మహావిషామ్.

ప్ర. అ. రావణః = రావణుడు, సుసంహృష్టః = చాలా సంతోషించిన వాడై, ఆత్మనః = తనకు, మృత్యుమ్ = మృత్యుదేవతయైన, తామ్ = ఆ సీతను, తీక్ష్ణదంష్ట్రామ్ = తీక్ష్ణములైన కోరలుగలది, మహావిషామ్ = గొప్ప విషము గలది అయిన, భుజగీమ్ = ఆడసర్పమును, ఉత్సఙ్గేనేవ = ఒడిచేత వలె, జహార = అపహరించెను.

తా. రావణుడు తనకు మృత్యుదేవతయైన ఆ సీతను, తీక్ష్ణములైన కోరలు, గొప్ప విషమూ గల ఆడసర్పమును ఒడిలో ఉంచుకొని తీసికొనివెళ్ళి నట్లు, సంతోషించుచు తీసికొని వెళ్ళెను. 6.

మూ. వనాని సరితః శైలాన్ సరాంసి చ విహాయసా, 7
స క్షిప్రం సమతీయాయ శరశ్చాపాదివ చ్యుతః.

ప్ర. అ. సః = అతడు, చాపాత్ = ధనస్సునుండి, చ్యుతః = జారిన, శరః ఇవ = బాణము వలె, క్షిప్రమ్ = శీఘ్రముగా, వనాని = వనములను, సరితః = నదులను, శైలాన్ = పర్వతములను, సరాంసి చ = సరస్సులను, విహాయసా = ఆకాశముచేత, సమతీయాయ = దాటెను.

తా. ధనస్సునుండి వెడలిన బాణము వలె ఆతడు అతివేగముగా వనములను, నదులను, పర్వతములను, సరస్సులను ఆకాశమార్గమున దాటివెళ్లెను. 7

మూ. తిమినక్రనికేతం తు వరుణాలయమక్షయమ్, 8
సరితాం శరణం గత్వా సమతీయాయ సాగరమ్.

ప్ర. అ. తిమినక్రనికేతమ్ = తిములకు, మొసళ్లకు స్థానమైన, అక్షయమ్ = అనంతమైన, సరితాం శరణమ్ = నదులకు శరణమైన, వరుణాలయమ్ = సముద్రమును, గత్వా = చేరి, సాగరమ్ = ఆ సముద్రమును, సమతీయాయ = దాటెను.

తా. తిమింగిలాలకు, మొసళ్లకు నివాసస్థానము, అనంతము, నదు లన్నీ ప్రవేశించే స్థానమూ అయిన సముద్రమును సమీపించి దానిని దాటెను. 8

మూ. సంభ్రమాత్పరివృత్తోర్మి రుద్ధమీనమహోరగః, 9
వైదేహ్యాం హ్రియమాణాయాం బభూవ వరుణాలయః.

ప్ర. అ. వైదేహ్యామ్ = సీత, హ్రియమాణాయామ్ = హరింపబడుచున్న దగుచుండగా, వరుణాలయః = సముద్రము, సంభ్రమాత్ = తొట్రుపాటువలన, పరివృత్తోర్మిః = దొర్లుచున్న తరంగములు కలదిగాను, రుద్ధమీనమహోరగః = నిశ్చలములైన మీనములు, మహాసర్పములు కలదిగాను, బభూవ = ఆయెను.

తా. వైదేహిని రావణుడు హరించుట చూచి సముద్రము కూడ కంగారు పడెను. దాని తరంగములు అస్తవ్యస్తములుగా దొర్లెను. మీనములు, మహా సర్పములు కదలకుండా పడియుండెను. 9

మూ. అన్తరిక్షగతా వాచః ససృజుశ్చారణాస్తదా, 10
ఏతదన్తో దశగ్రీవ ఇతి సిద్ధాస్తదాబ్రువన్.

ప్ర. అ. తదా = అప్పుడు, అన్తరిక్షగతాః = ఆకాశమునందున్న, చారణాః = చరణులు, దశగ్రీవః = రావణుడు, ఏతదన్తః = ఇదే అంతము గలవాడు, ఇతి = అని, వాచః = వాక్కులను, ససృజుః = పలికిరి. తదా = అప్పుడు, సిద్ధాః = సిద్ధులుకూడ, అబ్రువన్ = అట్లే పలికిరి.

తా. అప్పుడు చారణులు, సిద్ధులు ఆకాశమునందు చేరి "దీనితో రావణుడు అంతము నొందును'' అని పలికిరి. 10

మూ. స తు సీతాం వివేష్టన్తీమఙ్కేనాదాయ రావణః, 11
ప్రవివేశ పురీం లఙ్కాం రూపిణీం మృత్యుమాత్మనః.

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, ఆత్మనః = తనయొక్క, రూపిణీమ్ = రూపము గల, మృత్యుమ్ = మృత్యువైన, వివేష్టన్తీమ్ = మెలికలు తిరుగుచున్న, సీతామ్ = సీతను, అఙ్కేన = అంకముచేత, ఆదాయ = గ్రహించి, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఆ రావణుడు, శరీరము దాల్చిన తన మృత్యువైన, మెలికలు తిరిగి పోవుచున్న ఆ సీతను చంక బెట్టుకొని లంకాపురములో ప్రవేశించెను. 11

మూ. సోఽభిగమ్య పురీం లఙ్కాం సువిభక్తమహాపథామ్, 12
సంరూఢకక్ష్యాబహుళం స్వమన్తఃపురమావిశత్.

ప్ర. అ. సః = ఆతడు, సువిభక్తమహాపథామ్ = చక్కగా వేరుగా ఏర్పరుపబడిన విశాలమార్గములు గల, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును, అభిగమ్య = చేరి, సంరూఢకక్ష్యాబహులమ్ = జనముతో నిండిన అనేకములైన వాకిళ్లు గల, స్వమ్ అన్తఃపురమ్ = తన అంతఃపురమును, ఆవిశత్ = ప్రవేశించెను.

తా. రావణుడు విశాలముగా ఏర్పరచిన మార్గములు గల లంకానగరమును ప్రవేశించి, జనులతో నిండిన వాకిళ్లు గల అంతఃపురములో ప్రవేశించెను.

మూ. తత్ర తామసితాపాఙ్గాం శోకమోహపరాయణామ్, 13
నిదధే రావణః సీతాం మయో మాయామివాసురీమ్.

ప్ర. అ. రావణః = రావణుడు, అసితాపాఙ్గామ్ = నల్లని నేత్రాంతములు కలది, శోకమోహపరాయణామ్ = శోకమువలన కలిగిన మోహమునకు వశురాలు అయిన, తాం సీతామ్ = ఆ సీతను, మయః = మయుడు, ఆసురీమ్ = అసురుల సంబంధమైన, మాయామివ = మాయను వలె, తత్ర = అక్కడ, నిదధే = ఉంచెను.

తా. మయుడు అసురుల మాయను ఒక్క చోట ఉంచినట్లు రావణుడు నల్లని నేత్రాంతములు కల, శోకమువలన కలిగిన మూర్ఛలో ఉన్న, సీతను ఆ అంతఃపురములో ఉంచెను. 13

మూ. అబ్రవీచ్చ దశగ్రీవః పిశాచీర్ఘోరదర్శనాః, 14
యథా నేమాం పుమాన్ స్త్రీ వా సీతాం పశ్యత్యసంమతః.

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము గల, పిశాచీః = పిశాచస్త్రీలను గూర్చి, అబ్రవీచ్చ = పలికెను. అసంమతః = అనుజ్ఞ ఇవ్వబడని, పుమాన్ = పురుషుడు గాని, స్త్రీ వా = స్త్రీ గాని, ఇమామ్ = ఈ, సీతామ్ = సీతను, యథా = ఎట్లు, న పశ్యతి = చూడడో, అట్లు ఉండుడు.

తా. ''నా అనుజ్ఞ లేకుండగా ఎవ్వడైనా పురుషుడు గాని, స్త్రీ గాని ఈ సీతను చూడకుండా రక్షించండి''అని రావణుడు చూచుటకు భయము కలిగించు పిశాచస్త్రీలను ఆదేశించెను. 14

మూ. ముక్తామణిసువర్ణాని వస్త్రాణ్యాభరణాని చ, 15
యద్యదిచ్ఛేత్తదేవాస్యా దేయం మచ్ఛన్దతో యథా.

ప్ర. అ. ముక్తామణిసువర్ణాని = ముత్యములు, మణులు, సువర్ణము, వస్త్రాణి = వస్త్రములు, ఆభరణాని చ = ఆభరణములు, యత్ యత్ = దేనిని దేనిని, ఇచ్ఛేత్ = కోరునో, తదేవ = అది, అస్యాః = ఈమెకు, మచ్ఛన్దతో యథా = నా కోరిక ప్రకారము ఇచ్చి నట్లే, దేయమ్ = ఇవ్వదగినది.

తా. ముత్యము, మణులు, బంగారము, వస్త్రములు, ఆభరణములు ఏవేవి ఈమె అడుగునో వాటి నన్నింటినీ నేను అడిగినపుడు ఇచ్చినట్లు వెంటనే ఇవ్వ వలెను. 15

మూ. యా చ వక్ష్యతి వైదేహిం వచనం కించిదప్రియమ్, 16
అజ్ఞానాద్యది వా జ్ఞానాన్న తస్యా జీవితం ప్రియమ్.

ప్ర. అ. యా చ = ఎవ్వతె, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన గాని, జ్ఞానాత్ = జ్ఞానమువలనగాని, వైదేహీమ్ = సీతను గూర్చి, కించిత్ = ఏదైన, అప్రియమ్ = అప్రియమైన, వచనమ్ = వచనమును, వక్ష్యతి = పలుకగలదో, తస్యాః = ఆమెకు, జీవితమ్ = జీవితము, అప్రియమ్ = ప్రియము కాదు.

తా. ఏ స్త్రీ యైనా, తెలిసి గాని తెలియక గాని సీతతో అప్రియమైన మాట మాటలాడినచో, ఆ స్త్రీకి తన జీవితమునందు ఇష్టము లేదనియే అర్థము.

మూ. తథోక్త్వా రాక్షసీస్తాస్తు రాక్షసేన్ద్రః ప్రతాపవాన్, 17
నిష్క్రమ్యాన్తః పురాత్తస్మాత్కింకృత్యమితి చిన్తయన్,
దదర్శాష్టౌ మహావీర్యాన్ రాక్షసాన్ పిశితాశనాన్. 18

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, రాక్షసేన్ద్రః = రావణుడు, తాః = ఆ, రాక్షసీః = రాక్షసస్త్రీలను గూర్చి, తథా = అట్లు, ఉక్త్వా = పలికి,

తస్మాత్ = ఆ, అన్తఃపురాత్ = అంతఃపురమునుండి, నిష్క్రమ్య = బైటకు వెడలి, కిమ్ = ఏమి, కృత్యమ్ = చేయవలసిన పని అని, చిన్తయన్ = ఆలోచించుచు, మహావీర్యాన్ = గొప్ప పరాక్రమము గల, పిశితాశనాన్ = నరమాంసమును భక్షించు, అష్టౌ = ఎనమండుగురు, రాక్షసాన్ = రాక్షసులను, దదర్శ = చూచెను.

తా. ప్రతాపవంతుడైన రావణుడు ఆ స్త్రీలను ఆ విధముగా ఆదేశించి, అంతఃపురమునుండి బైటకు వచ్చి, ఇప్పుడు ఇంక చేయవలసినది ఏమి అని ఆలోచించి, గొప్ప పరాక్రమము గల నరమాంసభక్షకులైన ఎనమండుగురు రాక్షసులతో ఇట్లు పలికెను. 17, 18

మూ. స తాన్ దృష్ట్వా మహావీర్యో వరదానేన మోహితః,
ఉవాచైతానిదం వాక్యం ప్రశస్య బలవీర్యతః. 19

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, వరదానేన = వరదానముచేత, మోహితః = మోహము చెందిన (గర్వితుడైన), సః = రావణుడు, బలవీర్యతః = బలముచేతను, పరాక్రమము చేతను, ప్రశస్య = ప్రశంసించి, ఏతాన్ = వీళ్లను గూర్చి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. గొప్ప పరాక్రమము గల రావణుడు బ్రహ్మనుండి వరములను పొంది ఉండుటచే తన నెవ్వరూ ఏమీ చేయజాలరు గదా అను భ్రాంతితో కూడినవాడై, ఆ రాక్షసులను చూచి, వాళ్ల బలమును, పరాక్రమమును కొనియాడుచు ఇట్లు పలికెను. 19

మూ. నానాప్రహరణాః క్షిప్రమితో గచ్ఛత సత్వరాః,
జనస్థానం హతస్థానం భూతపూర్వం ఖరాలయమ్. 20

ప్ర. అ. నానాప్రహరణాః = అనేకవిధములైన ఆయుధములు కలవారై, సత్వరాః = తొందరతో కూడినవారై, ఇతః = ఇక్కడినుండి, క్షిప్రమ్ = శీఘ్రముగా, హతస్థానమ్ = చంపబడినవారికి స్థానమైన, ఖరాలయమ్ = ఖరుని నివాసముగా, భూతపూర్వమ్ = పూర్వమునందున్న, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, గచ్ఛత = వెళ్లండి.

తా. మీరు తొందరగా అనేక విధములైన ఆయుధములు ధరించి, పూర్వము ఖరునకు నివాసస్థానమై ఇప్పుడు శూన్యముగా ఉన్న జనస్థానమునకు వెంటనే వెళ్ళుడు. 20

మూ. తత్రోష్యతాం జనస్థానే శూన్యే నిహతరాక్షసే,
పౌరుషం బలమాశ్రిత్య త్రాసముత్సృజ్య దూరతః. 21

ప్ర. అ. పౌరుషమ్ = పౌరుషమును, బలమ్ = బలమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, త్రాసమ్ = భయమును, దూరతః = దూరముగా, ఉత్సృజ్య = విడచి, నిహతరాక్షసే = చంపబడిన రాక్షసులు గల, శూన్యే = శూన్యమైన, తత్ర = ఆ, జనస్థానే = జనస్థానమునందు, ఉష్యతామ్ = నివాసముచేయబడుగాక.

తా. మీరు పౌరుషమును, బలమును చూపుచు, భయమును దూరముగా విడచి, రాక్షసు లందరూ రామునిచేత చంపబడుటచేత శూన్యముగా ఉన్న ఆ జనస్థానములో నివసించవలెను. 21

మూ. బలం హి సుమహద్మన్యే జనస్థానే నివేశితమ్,
సదూషణఖరం యుద్ధే హతం రామేణ సాయకైః. 22

ప్ర. అ. మే = నాయొక్క, సుమహత్ = చాల పెద్దదైన, యత్ = ఏ, బలమ్ = సేన, జనస్థానే = జనస్థానమునందు, నివేశితమ్ = ఉంచబడినదో, సదూషణఖరమ్ = దూషణునితోను ఖరునితోను కూడిన ఆ సైన్యము, రామేణ = రామునిచేత, సాయకైః = బాణములచేత, హతమ్ = చంపబడినది.

తా. నేను జనస్థానములో ఉంచిన మహాసైన్యమును, ఖరదూషణులతో సహా రాముడు యుద్ధములో బాణములచేత సంహరించినాడు. 22

మూ. తతః క్రోధో మమాపూర్వో ధైర్యస్యోపరి వర్ధతే,
వైరం చ సుమహజ్జాతం రామం ప్రతి సుదారుణమ్. 23

ప్ర. అ. తతః = అందువలన, మమ = నాకు, అపూర్వః = పూర్వమునందు లేని, క్రోధః = క్రోధము, ధైర్యస్య = ధైర్యముయొక్క, ఉపరి = పైన, వర్ధతే = వృద్ధిపొందుచున్నది. రామం ప్రతి = రాముణ్ణి గూర్చి, సుమహత్ =

చాల గొప్పదైన, సుదారుణమ్ = చాల భయంకరమైన, వైరం చ = వైరము కూడ, జాతమ్ = ఏర్పడినది.

తా. ఆ కారణముచేత నాకు చిత్తస్థైర్యముచేత ఆపుకొనుటకు శక్యము కాని, పూర్వమెన్నడూ గలుగని కోపము పెరుగుచున్నది. రామునితో అతిభయంకరమైన గొప్ప వైరము ఏర్పడినది. 23

మూ. నిర్యాతయితుమిచ్ఛామి తచ్చ వైరమహం రిపోః,
న హి లప్స్యామ్యహం నిద్రామహత్వా సంయుగే రిపుమ్.

ప్ర. అ. అహమ్ = నేను, రిపోః = శత్రువుయొక్క, తత్ = ఆ, వైరమ్ = వైరమును, నిర్యాతయితుమ్ = తీర్చుకొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. సంయుగే = యుద్ధమునందు, రిపుమ్ = శత్రువును, అహత్వా = చంపకుండగా, అహమ్ = నేను, నిద్రామ్ = నిద్రను, న లప్స్యామి హి = పొందను కదా.

తా. శత్రువుపై కలిగిన ఆ పగ తీర్చుకొనవలె నని కోరుచున్నాను. యుద్ధములో ఆ శత్రువును చంపనంతవరకు నాకు నిద్ర పట్టదు. 24

మూ. తం త్విదానీమహం హత్వా ఖరదూషణఘాతినమ్,
రామం శర్మోపలప్స్యామి ధనం లబ్ధ్వేవ నిర్ధనః. 25

ప్ర. అ. అహమ్ = నేను, ఇదానీమ్ = ఇప్పుడు, ఖరదూషణఘాతినమ్ = ఖరదూషణులను చంపిన, తమ్ = ఆ, రామమ్ = రాముణ్ణి, హత్వా = చంపి, నిర్ధనః = నిర్ధనుడు, ధనమ్ = ధనమును, లబ్ధ్వా ఇవ = పొంది వలె, శర్మ = సుఖమును, ఉపలప్స్యామి = పొందగలను.

తా. ఖరదూషణులను చంపిన ఆ రాముణ్ణి చంపిన పిదపనే నేను ఇప్పుడు, ధనము లేనివాడు ధనము పొంది సంతోషించినట్లు సంతోషించగలను. 25

మూ. జనస్థానే వసద్భిస్తు భవద్భి రామమాశ్రితా,
ప్రవృత్తిరుపనేతవ్యా కిం కరోతీతి తత్త్వతః. 26

ప్ర. అ. జనస్థానే = జనస్థానమునందు, వసద్భిః = నివసించుచున్న, భవద్భిః = మీచేత, కిం = ఏమి, కరోతి ఇతి = చేయుచున్నాడో, రామమ్ = రాముణ్ణి ఆశ్రితా = ఆశ్రయించిన, ప్రవృత్తిః = వృత్తాంతము, తత్త్వతః = యథార్థముగా, ఉపనేతవ్యా = తీసికొనిరాదగినది.

తా. మీరు జనస్థానములో నివసించుచు, అక్కడ రాముడు ఏమి చేయు చున్నాడో చూచుచు, ఆతనికి సంబంధించిన వృత్తాంతమును యథార్థముగా నాకు తెలుపవలెను. 26

మూ. అప్రమాదాచ్చ గన్తవ్యం సర్వైరపి నిశాచరైః,
కర్తవ్యశ్చ సదా యత్నో రాఘవస్య వధం ప్రతి. 27

ప్ర. అ. నిశాచరైః = రాక్షసులైన, సర్వైరపి = మీ అందరిచేత, అప్రమాదాత్ = ఏమరిపాటు లేకుండా, గన్తవ్యమ్ = వెళ్లదగినది. రాఘవస్య = రాముని యొక్క, వధం ప్రతి = వధను గూర్చి, సదా = ఎల్లప్పుడూ, యత్నః = ప్రయత్నము, కర్తవ్యశ్చ = చేయదగినది.

తా. మీరందరు చాల జాగరూకతతో అక్కడికి వెళ్ళి రాముని చంపుటకై అన్ని వేళలా నిరంతరప్రయత్నము చేయవలెను. 27

మూ. యుష్మాకం చ బలజ్ఞోఽహం బహుశో రణమూర్ధని,
అతశ్చాస్మిన్ జనస్థానే మయా యూయం నియోజితాః. 28

ప్ర. అ. అహమ్ = నేను, రణమూర్ధని = రణాగ్రమునందు, బహుశః = అనేకపర్యాయములు, యుష్మాకమ్ = మీయొక్క, బలజ్ఞః = బలమును ఎరిగిన వాడను. అతశ్చ = ఆ కారణమువలననే, యూయమ్ = మీరు, అస్మిన్ = ఈ, జనస్థానే = జనస్థానమునందు, మయా = నాచేత, నియోజితాః = నియమించ బడినారు.

తా. నేను అనేకపర్యాయములు రణరంగములో మీరు చూపిన పరాక్రమమును చూచి ఉన్నాను. అందుచేతనే మిమ్ములను జనస్థానానికి పంపుచున్నాను.

మూ. తతః ప్రియం వాక్యముపేత్య రాక్షసా
మహార్థమష్టావభివాద్య రావణమ్,
విహాయ లఙ్కాం సహితాః ప్రతస్థిరే
యతో జనస్థానమలక్ష్యదర్శనాః. 29

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అష్టౌ = ఎనమండుగురు, రాక్షసాః = రాక్షసులు, ప్రియమ్ = ప్రియము, మహార్థమ్ = గొప్ప అర్థము గలదీ అయిన, వాక్యమ్ = వాక్యమును, ఉపేత్య = పొంది, రావణమ్ = రావణుని, అభివాద్య = నమస్కరించి, లఙ్కామ్ = లంకను, విహాయ = విడచి, సహితాః = కలిసినవారై, అలక్ష్యదర్శనాః = కనబడని దర్శనము గలవారై, జనస్థానమ్ = జనస్థానము, యతః = ఎటువైపున ఉన్నదో అటువైపు, ప్రతస్థిరే = ప్రయాణమైరి.

తా. పిమ్మట ఆ ఎనమండుగురు రాక్షసులు, ప్రియము, మంచి అర్థము కలదీ అయిన రావణుని మాట విని, రావణునకు నమస్కరించి, లంకను విడచి, అందరూ కలిసి, మాయచే ఇతరు లెవ్వరికీ కనబడనివారై, జనస్థానము వైపు వెళ్ళిరి. 29

మూ. తతస్తు సీతాముపలభ్య రావణః
సుసంప్రహృష్టః పరిగృహ్య మైథిలీమ్,
ప్రసజ్య రామేణ చ వైరముత్తమం
బభూవ మోహాన్ముదితః సరాక్షసః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుఃపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాక్షసః = రాక్షసుడైన, సః రావణః = ఆ రావణుడు, సీతామ్ = సీతను, ఉపలభ్య = పొంది, మైథిలీమ్ = సీతను, పరిగృహ్య = గ్రహించి, సుసంప్రహృష్టః = చాలా సంతోషించినవాడై, రామేణ = రామునితో, ఉత్తమమ్ = అధికమైన, వైరమ్ = వైరమును, ప్రసజ్య = ఏర్పరచుకొని, మోహాత్ = అజ్ఞానమువలన, ముదితః = సంతోషించినవాడు, బభూవ = ఆయెను.

తా. రావణుడు ఈ విధముగ సీతను పొంది, ఆమెను పొందితిని కదా అని చాల సంతోషించుచు, రామునితో గొప్ప వైరము పెట్టుకొని కూడ అజ్ఞానము చేత ఆనందించుచుండెను. 30

''బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ఏబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్పఞ్చాశః సర్గః

[రావణుడు సీతకు తన అంతఃపురమునంతా చూపి "నాకు భార్యవగుము" అని కోరుట].

మూ. సందిశ్య రాక్షసాన్ ఘోరాన్ రావణోఽష్టౌ మహాబలాన్,
ఆత్మానం బుద్ధివైక్లబ్యాత్ కృతకృత్యమమన్యత. 1

ప్ర. అ. రావణః = రావణుడు, మహాబలాన్ = గొప్ప బలము గల, అష్టౌ = ఎనమండుగురు, రాక్షసాన్ = రాక్షసులను, సందిశ్య = ఆదేశించి, బుద్ధివైక్లబ్యాత్ = బుద్ధిహీనత్వమువలన, ఆత్మానమ్ = తనను, కృతకృత్యమ్ = చేయవలసిన పను లన్నీ పూర్తిచేసుకొన్నవానినిగా, అమన్యత = తలచెను.

తా. రావణుడు గొప్ప బలము గల, భయంకరులైన ఎనమండుగురు రాక్షసులను ఇట్లు ఆదేశించి, బుద్ధివిహీను డగుటచే "కృతకృత్యుడను అయినాను" అని భావించెను. 1

మూ. స చిన్తయానో వైదేహీం కామబాణైః ప్రపీడితః,
ప్రవివేశ గృహం రమ్యం సీతాం ద్రష్టుమభిత్వరన్. 2

ప్ర. అ. సః = అతడు, వైదేహీమ్ = సీతను గూర్చి, చిన్తయానః = ఆలోచించుచు, కామబాణైః = మన్మథబాణములచేత, ప్రపీడితః = పీడింపబడినవాడై, సీతామ్ = సీతను, ద్రష్టుమ్ = చూచుటకు, అభిత్వరన్ = తొందరపడుచు, రమ్యమ్ = సుందరమైన, గృహమ్ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఆ రావణుడు సీతను గూర్చి ఆలోచించుచు, మన్మథబాణములచేత పీడింపబడినవాడై, ఆమెను చూచుటకు తొందరపడుచు, సుందరమైన అంతఃపురములో ప్రవేశించెను. 2

మూ. స ప్రవిశ్య తు తద్వేశ్మ రావణో రాక్షసాధిపః,
అపశ్యద్రాక్షసీమధ్యే సీతాం శోకపరాయణామ్. 3

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షసరాజైన, సః రావణః = ఆ రావణుడు, తత్ = ఆ, వేశ్మ = గృహమును, ప్రవిశ్య = ప్రవేశించి, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల మధ్యయందు, శోకపరాయణామ్ = దుఃఖమునకు అధీనురాలైన, సీతామ్ = సీతను, అపశ్యత్ = చూచెను.

తా. రాక్షసరాజైన ఆ రావణుడు గృహములో ప్రవేశించి, శోకముతో నిండి యున్న సీతను రాక్షసస్త్రీల మధ్య చూచెను. 3

మూ. అశ్రుపూర్ణముఖీం దీనాం శోకభారాభిపీడితామ్,
వాయువేగైరివాక్రాన్తాం మజ్జన్తీం నావమర్ణవే. 4

మృగయూథపరిభ్రష్టాం మృగీం శ్వభిరివావృతామ్,
అధోముఖముఖీం సీతామభ్యేత్య చ నిశాచరః. 5

తాం తు శోకపరాం దీనామవశాం రాక్షసాధిపః,
స బలాద్దర్శయామాస గృహం దేవగృహోపమమ్. 6

ప్ర. అ. అశ్రుపూర్ణముఖీమ్ = కన్నీళ్లతో నిండిన ముఖము గలది, దీనామ్ = దీనురాలు, శోకభారాభిపీడితామ్ = దుఃఖభారముచేత పీడింపబడినది, వాయువేగైః = వాయువుయొక్క వేగములచేత, సమాక్రాన్తామ్ = ఆక్రమింపబడినదై, అర్ణవే = సముద్రమునందు, మజ్జన్తీమ్ = మునిగిపోవుచున్న, నావమివ = ఓడ వలె ఉన్నది, మృగయూథపరిభ్రష్టామ్ = లేళ్ల గుంపునుండి తప్పిపోయినదై, శ్వభిః = కుక్కలచేత, ఆవృతామ్ = చుట్టబడిన, మృగీమివ = ఆడలేడి వలె ఉన్నది, అధోముఖముఖీమ్ = క్రిందికి వంచబడిన ముఖము గలది అయిన, సీతామ్ = సీతను, నిశాచరః = ఆ రాక్షసుడు, అభ్యేత్య = సమీపించి, శోకపరామ్ = శోకమునకు అధీనురాలు, దీనామ్ = దీనురాలు, అవశామ్ = తన వశములో లేనిదీ అయిన, తామ్ = ఆమెను (కు), సః రాక్షసాధిపః = ఆ రావణుడు, బలాత్ = బలాత్కారమువలన, దేవగృహోపమమ్ = దేవతాగృహముతో సమానమైన, గృహమ్ = గృహమును, దర్శయామాస = చూపించెను.

తా. దుఃఖభారముచేత క్రుంగిపోతూన్న దీనురాలైన ఆ సీత ముఖము కన్నీళ్లతో నిండి యుండెను. వాయువేగమునకు ఇటు అటు కొట్టుకొని సముద్రములో మునిగిపోతూన్న ఓడ వలె ఉండెను. లేళ్ల గుంపునుండి విడిపోగా, కుక్కలు చుట్టుముట్టిన ఆడలేడి వలె ఉండెను. తల క్రిందికి వంచి కూర్చుండెను. ఈ విధముగా దీనురాలై, దుఃఖముతో నిండి తన వశము తప్పి ఉన్న ఆ సీతను సమీపించి రాక్షసుడైన ఆ రావణుడు ఆమెను బలాత్కారముగా తీసికొనివెళ్ళి, దేవతల గృహముతో సమానమైన తన గృహమును ఆమెకు చూపించెను. 4, 5, 6

మూ. హర్మ్యప్రాసాదసంబాధం స్త్రీసహస్రనిషేవితమ్,
నానాపక్షిగణైర్జుష్టం నానారత్నసమన్వితమ్, 7

దాన్తకైస్తాపనీయైశ్చ స్ఫాటికై రాజతైరపి,
వజ్రవైడూర్యచిత్రైశ్చ స్తమ్భైర్దృష్టిమనోహరైః, 8
దివ్యదున్దుభినిర్హ్రాదం తప్తకాఞ్చనతోరణమ్.

ప్ర. అ. హర్మ్యప్రాసాదసంబాధమ్ = మేడలతోను ప్రాసాదములతోను ఇరుకుగా ఉన్నది, స్త్రీసహస్రనిషేవితమ్ = స్త్రీల సహస్రములచేత సేవింపబడినది, నానాపక్షిగణైః = అనేకవిధములైన పక్షుల సముదాయములచేత, జుష్టమ్ = పొందబడినది, నానారత్నసమన్వితమ్ = అనేకవిధములైన రత్నములతో కూడినది, దాన్తకైః = దంతసంబంధమైనవి, తాపనీయైః చ = సువర్ణమయములు, స్ఫాటికైః = స్ఫటికమాణిక్య వికారములు, రాజతైరపి = రజతవికారములు, వజ్రవైడూర్యచిత్రైః = వజ్రములచేతను, వైడూర్యములచేతను చిత్రవర్ణములైన, దృష్టిమనోహరైః = చూచుటకు మనోహరములుగా ఉన్న, స్తమ్భైః = స్తంభములతో కూడినది, దివ్యదున్దుభినిర్హ్రాదమ్ = శ్రేష్ఠములైన దుందుభుల ధ్వని గలది, తప్తకాఞ్చనతోరణమ్ = శుద్ధమైన బంగారముతో నిర్మించిన ముఖద్వారములు కలది అయిన (గృహమును చూపించెను).

తా. ఆతని గృహము (అంతఃపురము) మేడలతోను, ప్రాసాదములతోను కిక్కిరిసి ఉండెను. అక్కడ వేలకొలది స్త్రీలు నివసించుచుండిరి. అనేక విధములైన పక్షులు అక్కడ ఉండెను. అది అనేకవిధములైన రత్నములతో నిండి యుండెను. చూచుటకు అందముగా ఉన్న ఆ గృహ స్తంభములు బంగారము

తోను, వెండితోను నిర్మింపబడెను. వాటిపై దంతముతో నగిషీలు చెక్కి స్ఫటిక ములు, వజ్రములు, వైడూర్యములు మాటుటచే అవి చిత్రవిచిత్రములుగా ఉండెను. బంగారు ముఖద్వారములు గల ఆ గృహము దివ్యములైన దుందుభుల ధ్వనులతో మార్మ్రోగుచుండెను. 7, 8

మూ. సోపానం కాఞ్చనం చిత్రమారురోహ తయా సహ, 9
దాన్తకా రాజతాశ్చైవ గవాక్షాః ప్రియదర్శనాః,
హేమజాలావృతాశ్చాసన్ తత్ర ప్రాసాదపఙ్క్తయః. 10

ప్ర. అ. కాఞ్చనమ్ = బంగారువికారమైన, చిత్రమ్ = ఆశ్చర్యకరమైన, సోపానమ్ = మెట్లమార్గమును, తయా సహ = ఆమెతో కూడ, ఆరురోహ = ఎక్కెను. తత్ర = అక్కడ, దాన్తకాః = దంతవికారములు, రాజతాశ్చ=రజత వికారములు, ప్రియదర్శనాః=ఆనందమును కలిగించు దర్శనము కలవి అయిన, గవాక్షాః = కిటికీలు, హేమజాలావృతాః=బంగారు వలచేత కప్పబడిన, ప్రాసాద పఙ్క్తయః = ప్రాసాదముల పంక్తులు, ఆసన్ = ఉండెను.

తా. ఆతడు ఆమెతో కూడ కలిసి, బంగారు వికారమైన ఆశ్చర్యజనకమైన సోపానమార్గమును ఎక్కెను. అక్కడ దంతముతోను, వెండితోను నిర్మించిన కిటికీలు చూచుటకు ముచ్చట గొలిపేవిగా ఉండెను. బంగారు వల కప్పి అలంకరింపబడిన ప్రాసాదముల పంక్తులు కనబడుచుండెను. 9, 10

మూ. సుధామణివిచిత్రాణి భూమిభాగాని సర్వశః,
దశగ్రీవః స్వభవనే ప్రాదర్శయత మైథిలీమ్. 11

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, స్వభవనే = తన గృహమునందు, సర్వశః = అన్నివైపులందు, సుధామణివిచిత్రాణి = సున్నముచేతను, మణుల చేతను విచిత్రములుగా ఉన్న, భూమిభాగాని = అంతస్తులను, మైథిలీమ్=సీతను, (కు), ప్రాదర్శయత = చూపెను.

తా. రావణుడు సీతకు తన అంతఃపురభవనములో ఉన్న అన్ని అంతస్తులను చూపించెను. ఆ అంతస్తు లన్నీ సున్నము వేసి మణులు అలంకరించుటచే ఆశ్చర్యకరములుగా ఉండెను. 11

మూ. దీర్ఘికాః పుష్కరిణ్యశ్చ నానావృక్షసమన్వితాః,
రావణో దర్శయామాస సీతాం శోకపరాయణామ్. 12

ప్ర. అ. రావణః = రావణుడు, దీర్ఘికాః = దిగుడుబావులను, నానావృక్ష సమన్వితాః = అనేకవిధములైన వృక్షములతో కూడిన, పుష్కరిణ్యశ్చ = పరస్సులను, శోకపరాయణామ్ = శోకమునకు అధీనురాలైన, సీతామ్ = సీతను (కు), దర్శయామాస = చూపించెను.

తా. రావణుడు దుఃఖాక్రాంతురాలైన సీతకు దిగుడుబావులను, చుట్టూ చెట్లు ఉన్న చెరువులను చూపించెను. 12

మూ. దర్శయిత్వా తు వైదేహ్యాః కృత్స్నం తద్భవనోత్తమమ్,
ఉవాచ వాక్యం పాపాత్మా సీతాం లోభితుమిచ్ఛయా. 13

ప్ర. అ. పాపాత్మా = పాపాత్ముడైన రావణుడు, కృత్స్నమ్ = సమస్తమైన, తత్ = ఆ, భవనోత్తమమ్ = శ్రేష్ఠమైన గృహమును, వైదేహ్యాః = సీతకు, దర్శయిత్వా = చూపించి, సీతామ్ = సీతను, ఇచ్ఛయా = కోరికచేత, లోభితుమ్ = లోభపెట్టుటకు, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పాపాత్ముడైన ఆ రావణుడు శ్రేష్ఠమైన ఆ భవనము నంతా సీతకు చూపి, ఆమెకు కోరిక పుట్టించవలె నను అభిప్రాయముతో ఇట్లు పలికెను. 13

మూ. దశ రాక్షసకోట్యశ్చ ద్వావింశతిరథాపరాః,
తేషాం ప్రభురహం సీతే సర్వేషాం భీమకర్మణామ్, 14
వర్జయిత్వా జరావృద్ధాన్ బాలాంశ్చ రజనీచరాన్.

ప్ర. అ. సీతే = సీతా, జరావృద్ధాన్ = ముసలితనముచేత వృద్ధులు, బాలాంశ్చ = బాలులు అయిన, రజనీచరాన్ = రాక్షసులను, వర్జయిత్వా = విడిచి, దశ = పది, రాక్షసకోట్యశ్చ = రాక్షసుల కోటులు, అథ = మరియు, అపరాః = ఇంకను, ద్వావింశతిః = ఇరువదిరెండు కోట్లు ఉన్నవి. భీమకర్మణామ్ = భయంకరమైన కర్మగల, తేషామ్ = వారికి, సర్వేషామ్ = అందరికి, అహమ్ = నేను, ప్రభుః = ప్రభువును.

తా. సీతా! ముసలివాళ్లు, బాలులు అయిన రాక్షసులు కాక మొత్తము ముప్పదిరెండు కోట్లమంది రాక్షసు లున్నారు. భయంకరములైన పనులు చేయు వారి కందరికీ నేను ప్రభువును. 14

మూ. సహస్రమేకమేకస్య మమ కార్యపురఃసరమ్, 15
యదిదం రాజతన్త్రం మే త్వయి సర్వం ప్రతిష్ఠితమ్,
జీవితం చ విశాలాక్షి త్వం మే ప్రాణైర్గరీయసీ. 16

ప్ర. అ. ఏకస్య = ఒక్క, మమ = నాకు, ఏకమ్ = ఒక, సహస్రమ్ = సహస్రము, కార్యపురఃసరమ్ = కార్యములందు ముందునకు వచ్చునది. యత్ = ఏ, ఇదమ్ = ఈ, రాజ్యతన్త్రమ్ = రాజ్యవ్యవహారమున్నదో, సర్వమ్ = అది అంతా, జీవితం చ = జీవితమూ, త్వయి = నీయందు, ప్రతిష్ఠితమ్ = నిలచి ఉన్నది. విశాలాక్షి = విశాలములైన నేత్రములు గలదానా ! త్వమ్ = నీవు, మే = నాయొక్క, ప్రాణైః = ప్రాణములచేత, గరీయసీ = గొప్పదానవు.

తా. నాకు ఏ చిన్న పని పడినను వెయ్యిమంది ముందుకు వచ్చుచుందురు. ఓ ! విశాలనేత్రములు గల సీతా ! సమస్తమైన ఈ రాజ్యసంవిధానము, నా జీవితమూ కూడ నీమీద ఆధారపడి యున్నవి. నీవు నా ప్రాణములకంటె కూడ గొప్పదానవు. 15, 16

మూ. బహ్వీనాముత్తమస్త్రీణాం మమ యోఽసౌ పరిగ్రహః,
తాసాం త్వమీశ్వరా సీతే మమ భార్యా భవ ప్రియే. 17

ప్ర. అ. సీతే = సీతా ! బహ్వీనామ్ = అనేకులైన, ఉత్తమస్త్రీణామ్ = ఉత్తమస్త్రీలయొక్క, యః = ఏ, అసౌ = ఈ, పరిగ్రహః = సంపాదనము కలదో, తాసామ్ = వాళ్లకు, త్వమ్ = నీవు, ఈశ్వరీ = ప్రభువుగా, భవ = అగుము. ప్రియే = ప్రియురాలా ! మమ = నాయొక్క, భార్యా = భార్యవు, భవ = అగుము.

తా. సీతా ! నేను సంపాదించుకొని వచ్చిన బహుసంఖ్యలో ఉన్న ఉత్తమ స్త్రీలకు నీవు ప్రభువుగా ఉండుము. ప్రియురాలా ! నా భార్యవు అగుము. 17

మూ. సాధు కిం తేఽన్యయా బుద్ధ్యా రోచయస్వ వచో మమ,
కామాభితప్తస్య మమ ప్రసాదం కర్తుమర్హసి. 18

ప్ర. అ. తే = నీకు, అన్యయా = మరి యొక, బుద్ధ్యా = ఆలోచనచేత, కిమ్ = ఏమి ప్రయోజనము ? సాధు = మంచిదైన, మమ వచః = నా వచనమును, రోచయస్వ = ఇష్టమైనదానినిగా చేసికొనుము. కామాభితప్తస్య = కామముచేత తపింపచేయబడిన, మమ = నాయొక్క, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నీవు మరొక ఆలోచన ఎందుకు చేసెదవు ? నేను చెప్పిన మంచి మాటను అంగీకరించుము. కామముచేత తప్తుడనైన నన్ను అనుగ్రహించుము.18

మూ. పరిక్షిప్తా సముద్రేణ లఙ్కేయం శతయోజనా,
నేయం ధర్షయితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః. 19

ప్ర. అ. శతయోజనా = నూరు యోజనముల ప్రమాణము గల, ఇయమ్ = ఈ, లఙ్కా = లంక, సముద్రేణ = సముద్రముచేత, పరిక్షిప్తా = చుట్టబడినది. సేన్ద్రైః = ఇంద్రునితో కూడిన, సురాసురైరపి = సురులచేత అసురులచేత కూడ, ఇయమ్ = ఈ లంక, ధర్షయితుమ్ = ఎదిరించుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. నూరు యోజనముల ప్రమాణము గల ఈ లంక చుట్టూ సముద్ర మున్నది. అందుచేత సురాసురులు దేవేంద్రునితో కలసి దండెత్తివచ్చినా దీనిని జయించజాలరు. 19

మూ. న దేవేషు న యక్షేషు న గన్ధర్వేషు పక్షిషు,
అహం పశ్యామి లోకేషు యో మే వీర్యసమో భవేత్.20

ప్ర. అ. లోకేషు = లోకములలో, యః = ఎవడు, మే = నాకు వీర్యసమః = పరాక్రమముచేత సమానుడు, భవేత్ = అగునో, అట్టివానిని, అహమ్ = నేను, దేవేషు = దేవతలలో, న పశ్యామి = చూడను. యక్షేషు = యక్షులలో, న = చూడను. గన్ధర్వేషు = గంధర్వులలో, న = చూడను. పక్షిషు = పక్షులలో, న = చూడను.

తా. మూడు లోకములలోను, దేవతలలో గాని, యక్షులలో గాని, గంధ

ర్వులలో గాని, పక్షులలో గాని పరాక్రమముచేత నాతో సమానుడు ఎవ్వడూ లేడు. 20

మూ. రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా,
కిం కరిష్యసి రామేణ మానుషేణాల్పతేజసా. 21

ప్ర. అ. రాజ్యభ్రష్టేన = రాజ్యమునుండి భ్రష్టుడు, దీనేన = దీనుడు, తాపసేన = మునివృత్తిలో ఉన్నవాడు, గతాయుషా = గడచిన ఆయుర్దాయము గలవాడు, మానుషేణ = మానవుడు, అల్పతేజసా = అల్పమైన తేజస్సు కలవాడు అయిన, రామేణ = రామునితో, కిం కరిష్యసి = ఏమి చేయగలవు ?

తా. రాముడు రాజ్యభ్రష్టుడు, దీనుడు. మునివృత్తిలో ఉన్నవాడు. మానవ మాత్రుడు. అల్పమైన తేజస్సు కలవాడు. అతని ఆయుస్సు తీరిపోయినది. అట్టి రామునితో ఏమి చేసెదవు ? 21

మూ. భజస్వ సీతే మామేవ భర్తాహం సదృశస్తవ,
యౌవనం హ్యధ్రువం భీరు రమస్వేహ మయా సహ.

ప్ర. అ సీతే = సీతా ! మామేవ = నన్నే, భజస్వ = పొందుము. అహమ్ = నేను, తవ = నీకు, సదృశః = తగిన, భర్తా = భర్తను. భీరు = భయస్వభావము కలదానా ! యౌవనమ్ = యౌవనము, అధ్రువం హి = అస్థిరము కదా. ఇహ = ఇక్కడ, మయా సహ = నాతో కూడ, రమస్వ = క్రీడించుము.

తా. ఓ! సీతా ! నన్ను చేరుము. నేనే నీకు తగిన భర్తను. ఓ! భయ స్వభావము కలదానా ! యౌవనము స్థిరముగా ఉండేది కాదు కదా? ఇక్కడ నాతో కూడ రమించుము. 22

మూ. దర్శనే మా కృథా బుద్ధిం రాఘవస్య వరాననే,
కాస్య శక్తిరిహాగన్తుమపి సీతే మనోరథైః. 23

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠమైన ముఖము కలదానా ! రాఘవస్య = రాముని యొక్క, దర్శనే = దర్శనమునందు, బుద్ధిమ్ = బుద్ధిని, మా కృథాః = చేయకుము.

సీతే = సీతా! అస్య = ఈతనికి, మనోరథైరపి = మనోరథములచేత కూడ, ఇహ = ఇక్కడికి, ఆగన్తుమ్ = వచ్చుటకు, శక్తిః = శక్తి, కా = ఏమిటి?

తా. సుందరమైన ముఖము గలదానా! రాముడు నీకు కనబడగలడని కూడ ఆశ పడకుము. ఓ! సీతా! ఆతడు ఇక్కడికి ఊహచేత కూడ రాజాలడు.

మూ. న శక్యో వాయురాకాశే పాశైర్బన్ధుం మహాజవః,
దీప్యమానస్య వాప్యగ్నేర్గ్రహీతుం విమలాం శిఖామ్. 24

ప్ర. అ. మహాజవః = గొప్ప వేగము గల, వాయుః = వాయువు, ఆకాశే = ఆకాశమునందు, పాశైః = పాశములచేత, బన్ధుమ్ = బంధించుటకు, న శక్యః = శక్యమైనది కాదు. దీప్యమానస్య = ప్రజ్వలించుచున్న, అగ్నేః = అగ్ని యొక్క, విమలామ్ = నిర్మలమైన, శిఖామ్ = జ్వాలను, గ్రహీతుమ్ = గ్రహించుటకు (శక్యము కాదు).

తా. మహావేగము గల వాయువును ఆకాశమునందు బంధించుట శక్యము కాదు. అగ్ని ప్రజ్వలించుచుండగా దాని నిర్మలమైన జ్వాలను పట్టుకొనుట కూడ శక్యము కాదు.

మూ. త్రయాణామపి లోకానాం న తం పశ్యామి శోభనే,
విక్రమేణ నయేద్యస్త్వాం మద్బాహుపరిపాలితామ్. 25

ప్ర. అ. శోభనే = మంగళప్రదురాలా! త్రయాణామ్ = మూడు, లోకానామపి = లోకములలోకూడ, యః = ఎవడు, మద్బాహుపరిపాలితామ్ = నా బాహువులచేత పాలింపబడిన, త్వామ్ = నిన్ను, విక్రమేణ = పరాక్రమముచేత, నయేత్ = తీసికొని వెళ్లునో, తమ్ = అట్టివానిని, న పశ్యామి = చూడను.

తా. మంగళకరురాలా! నా రక్షణలో ఉన్న నిన్ను తీసికొని వెళ్ళగలిగినవా డెవ్వడూ, ఈ మూడు లోకములలో కూడ లేడు. 25

మూ. లఙ్కాయాం సుమహద్రాజ్యమిదం త్వమనుపాలయ,
త్వత్ప్రేష్యా మద్విధాశ్చైవ దేవాశ్చాపి చరాచరాః. 26

ప్ర. అ. త్వమ్ = నీవు, లఙ్కాయామ్ = లంకయందు, సుమహత్ =

చాల పెద్దదైన, ఇదమ్ = ఈ, రాజ్యమ్ = రాజ్యమును. అనుపాలయ = అంగీకరించుము. మద్విధాః = నావంటివారు, దేవాశ్చాపి = దేవతలు, చరాచరాః = స్థావరజంగమములు, త్వత్ప్రేష్యాః = నీకు కింకరులు అగుదురు.

తా. నీవు లంకలో చాల గొప్పదైన రాజ్యమును స్వీకరించినట్లయితే, నావంటివాళ్లు, దేవతలు, స్థావరములు, జంగమములు కూడ నీకు కింకరు లగుదురు. 26

మూ. అభిషేకోదకక్లిన్నా తుష్టా చ రమయస్వ మామ్,
దుష్కృతం యత్ పురా కర్మ వనవాసేన తద్గతమ్, 27
యశ్చ తే సుకృతో ధర్మస్తస్యేహ ఫలమాప్నుహి.

ప్ర. అ. అభిషేకోదకక్లిన్నా = రాజ్యాభిషేకజలముచేత తడిసినదానవై, తుష్టా చ = సంతోషించినదానవై, మామ్ = నన్ను, రమయస్వ = రమింపచేయుము. పురా = పూర్వమునందలి, యత్ = ఏ, దుష్కృతమ్ = చెడ్డదైన, కర్మ = కర్మ ఉండెనో, తత్ = అది, వనవాసేన = వనవాసముచేత, గతమ్ = పోయినది. తే = నీయొక్క, యః = ఏ, సుకృతః = బాగుగా చేయబడిన, ధర్మః = ధర్మము గలదో, తస్య = దానియొక్క, ఫలమ్ = ఫలమును, ఇహ = ఇక్కడ, అప్నుహి = పొందుము.

తా. రాజ్యాభిషేకము చేయించుకొన్న ఉదకముచేత తడిసినదానవై, ఆనందించుచు నన్ను ఆనందింపచేయుము. నీవు పూర్వము చేసిన పాపమంతా వనవాసదుఃఖమును అనుభవించుటచేత తొలగిపోయినది. ఇంక చేసిన పుణ్యమునకు ఫలితమును అనుభవించుము. 27

మూ. ఇహ మాల్యాని సర్వాణి దివ్యగన్ధాని మైథిలి, 28
భూషణాని చ ముఖ్యాని సేవస్వ చ మయా సహ.

ప్ర. అ. మైథిలి = సీతా ! ఇహ = ఇక్కడ, దివ్యగన్ధాని = దివ్యమైన సువాసన గల, సర్వాణి = సమస్తమైన, మాల్యాని = మాలలను, ముఖ్యాని = ముఖ్యములైన, భూషణాని చ = అలంకారములను, మయా సహ = నాతో కూడ, సేవస్వ = సేవించుము.

తా. సీతా ! నీవు ఇక్కడ నాతో కలిసి, దివ్యమైన సువాసన గల అన్ని పుష్పమాలలను, శ్రేష్ఠములైన అలంకారములను ధరించి ఆనందించుము. 28

మూ. పుష్పకం నామ సుశ్రోణి భ్రాతుర్వైశ్రవణస్య మే, 29
విమానం సూర్యసంకాశం తరసా నిర్జితం మయా.

ప్ర. అ. సుశ్రోణి = అందమైన కటిప్రదేశము గలదానా! మే = నా యొక్క, భ్రాతుః = సోదరుడైన, వైశ్రవణస్య = కుబేరునియొక్క, పుష్పకం నామ = పుష్పక మనే పేరు గల, సూర్యసంకాశమ్ = సూర్యునితో సమానమైన, విమానమ్ = విమానము, తరసా = బలముచేత, మయా = నాచేత, నిర్జితమ్ = జయింపబడినది.

తా. అందమైన కటిప్రదేశము గల ఓ ! సీతా ! నా సోదరుడైన కుబేరునికి చెందిన సూర్యుని వంటి కాంతి గల పుష్పక మనే విమానమును నేను పరాక్రమముచేత జయించితిని. 29

మూ. విశాలం రమణీయం చ తద్విమానమనుత్తమమ్, 30
తత్ర సీతే మయా సార్ధం విహరస్వ యథాసుఖమ్.

ప్ర. అ. సీతే = సీతా ! అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, తత్ = ఆ, విమానమ్ = విమానము, విశాలమ్ = విశాలమైనది. రమణీయం చ = అందమైనది. తత్ర = దానియందు, మయా సార్ధమ్ = నాతో కూడ, యథాసుఖమ్ = సుఖముగా, విహరస్వ = విహరించుము.

తా. సీతా ! చాల శ్రేష్ఠమైన ఆ విమానము విశాలమైనది; సుందర మైనది. నీవు నాతో కలిసి సుఖముగా దానియందు విహరించుము. 30

మూ. వదనం పద్మసంకాశమమలం చారుదర్శనమ్,
శోకార్తం తు వరారోహే న భ్రాజతి వరాననే. 31

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము కలదానా ! వరాననే = సుందరమైన ముఖము కలదానా! పద్మసంకాశమ్ = పద్మముతో సమానము, అమలమ్ = నిర్మలము, చారుదర్శనమ్ = అందమైన దర్శనము గలది అయిన,

వదనమ్ = నీ ముఖము, శోకార్తమ్ = దుఃఖముచేత పీడితమై, న భ్రాజతి = ప్రకాశించుటలేదు.

తా. శ్రేష్ఠమైన కటిప్రదేశము, అందమైన ముఖము గల ఓ! సీతా! పద్మముతో సమానము, నిర్మలము, చూడ ముచ్చట గొల్పునది అయిన నీ ముఖము దుఃఖముచేత పీడింపబడుటచే ప్రకాశహీనముగా ఉన్నది. 39

మూ. ఏవం వదతి తస్మిన్ సా వస్త్రాన్తేన వరాఙ్గనా,
పిధాయేన్దునిభం సీతా ముఖమశ్రూణ్యవర్తయత్. 32

ప్ర. అ. తస్మిన్ = అతడు, ఏవమ్ = ఇట్లు, వదతి = పలుకుచుండగా, వరాఙ్గనా = ఉత్తమ స్త్రీ అయిన, సా సీతా = ఆ సీత, ఇన్దునిభమ్ = చంద్రునితో సమానమైన, ముఖమ్ = ముఖమును, వస్త్రాన్తేన = వస్త్రాంతముచేత, పిధాయ = కప్పి, అశ్రూణి = కన్నీళ్లను, అవర్తయత్ = ప్రవర్తింపచేసెను.

తా. ఆ రావణుని మాటలు విని, స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఆ సీత, చంద్రుని వంటి ముఖము చీరకొంగుతో కప్పుకొని కన్నీళ్లు కార్చెను. 32

మూ. ధ్యాయన్తీం తామివాస్వస్థాం దీనాం చిన్తాహతప్రభామ్,
ఉవాచ వచనం పాపో రావణో రాక్షసేశ్వరః.

ప్ర. అ. పాపః = పాపాత్ముడైన, రాక్షసేశ్వరః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, ధ్యాయన్తీమివ = ధ్యానముచేయుచున్నది వలె ఉన్నదీ, అస్వస్థామ్ = అస్వస్థురాలు, దీనామ్ = దీనురాలు, చిన్తాహతప్రభామ్ = విచారముచేత కొట్టబడిన కాంతి గలది అయిన, తామ్ = ఆ సీతను గూర్చి, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. దీనురాలైన ఆ సీత వికలమైన మనస్సుతో ఏదో ధ్యానము చేయుచున్నదా అన్నట్లు ఉండెను చింతతో కాంతివిహీనురాలైన అట్టి సీతతో పాపాత్ముడైన ఆ రాక్షసరాజు రావణుడు ఇట్లు పలికెను. 33

మూ. అలం వ్రీడేన వైదేహి ధర్మలోపకృతేన చ, 34
ఆర్షోఽయం దైవనిష్యన్దో యస్త్వామభిగమిష్యతి.

ప్ర. అ. వైదేహి = సీతా ! ధర్మలోపకృతేన = ధర్మలోపముచేత ఏర్పడిన, వ్రీడేన = సిగ్గుచేత, అలమ్ = చాలును. యః = ఏది, త్వామ్ = నిన్ను, అభిగమిష్యతి = పొందనున్నదో, అయమ్ = ఈ, దైవనిష్యన్దః = దైవసంబంధము, ఆర్షః = ఋషిప్రోక్తమైనది.

తా. సీతా ! ధర్మలోపము కలుగ నున్న దని సిగ్గుపడవద్దు. నీకు దైవ వశముచేత లభింప నున్న ఈ సంబంధము ధర్మశాస్త్రములలో ఋషులచేత అంగీకరింపబడినదే.

వి. ఈ శ్లోకమునకు అర్థము సరిగా లేదు. వ్యాఖ్యాతలు ఏవేవో వ్యాఖ్యానించినారు. కొన్ని పరిస్థితులలో స్త్రీ పునర్వివాహము చేసికొనవచ్చు నని ధర్మశాస్త్రములలో ఋషులు చెప్పినారు గాన ఇది శాస్త్రసమ్మతమే అని భావ మన్నట్లు కొందరు వ్యాఖ్యాతలు వ్రాసినారు. 'నిష్యన్ద' శబ్దానికి "సంబంధము" అనే అర్థం ఎక్కడ ఉన్నదో తెలియదు. ఇట్లే ఇతరవ్యాఖ్యాతల వ్యాఖ్యానములు కూడా ఏవో వ్రాయాలని వ్రాసినట్లు ఉన్నవి. ప్రాచ్యపాఠము బాగున్నది—

''అలం వ్రీడేన వైదేహి ధర్మతాపకృతేన చ,
హర్షోఽయం దేవి విస్పష్టో యస్త్వాముపగమిష్యతి.''

పూర్వార్ధమునకు వెనుక చెప్పిన అర్థమే. దేవి = ఓ ! దేవీ ! యః = ఏ సంతోషము, త్వామ్ = నిన్ను, ఉపగమిష్యతి = పొందగలదో, అయం హర్షః = ఈ సంతోషము, విస్పష్టః = స్పష్టమైనదే. నీకు ఆనందము ఎంతో కలుగ నున్నదనే విషయము సుస్పష్టము. ఇంక ధర్మలోపభయంచేత సిగ్గు పడడం మంచిది కాదు అని భావము. 34

మూ. ఏతౌ పాదౌ మయా స్నిగ్ధౌ శిరోభిః పరిపీడితౌ, 35
ప్రసాదం కురు మే క్షిప్రం వశ్యో దాసోఽహమస్మి తే.

ప్ర. అ. ఏతౌ = ఈ, స్నిగ్ధౌ = సుందరములైన, పాదౌ = పాదములు, మయా = నాచేత, శిరోభిః = శిరస్సులచేత, పరిపీడితౌ = పీడింపబడినవి. క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురు = చేయుము. అహమ్ =

నేను, తే = నీకు, వశ్యః = వశుడైన, దాసః = దాసుడను, అస్మి = అయి ఉన్నాను.

తా. సుందరమైన నీ పాదములను స్పృశించి నమస్కరించుచున్నాను. నా మీద శీఘ్రముగా అనుగ్రహము చూపుము. నేను నీకు వశుడనైన దాసుడను. 35

మూ. ఇమాః శూన్యా మయా వాచః శుష్యమాణేన భాషితాః,
న చాపి రావణః కాంచిన్మూర్ధ్నా స్త్రీం ప్రణమేత హి.

ప్ర. అ. శుష్యమాణేన = కామపీడితుడనైన, మయా = నాచేత, ఇమాః = ఈ, శూన్యాః = శూన్యమైన, వాచః = వాక్కులు, భాషితాః = పలకబడినవి. రావణః = రావణుడు, కాంచిత్ స్త్రియమ్ = ఏ స్త్రీని కూడ, మూర్ధ్నా = శిరస్సుతో, న ప్రణమేత హి = నమస్కరించడుకదా.

తా. కామపీడితుడనైన నేను ఈ శూన్యములైన (నావంటివాడు చెప్ప కూడని) మాటలు చెప్పుచున్నాను. రావణుడు ఏ స్త్రీకి నమస్కరించడు కదా.

వి. శూన్యాః = అనేదాని అర్థం సరిగా కుదరడం లేదు.

"నేమాః శూన్యాః కృథా వాచః శుష్యమాణేన భాషితాః"

అనే ప్రాచ్యపాఠం బాగున్నది. ''శుష్యమాణేన = ఎండిపోవుచున్న (కామ పీడితుడనైన) నాచేత, భాషితాః = పలకబడిన, ఇమాః వాచః = ఈ వాక్కులను, శూన్యాః = శూన్యమైనవాటినిగా, న కృథాః = చేయకుము"- అని అర్థము. ఈ పాఠంలో కూడా 'న'కు బదులు 'మా' ఉంటే బాగుండును. 36

మూ. ఏవముక్త్వా దశగ్రీవో మైథిలీం జనకాత్మజామ్, 37
కృతాన్తవశమాపన్నో మమేయమితి మన్యతే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, జనకాత్మజామ్ = జనకుని కుమార్తె యైన, మైథిలీమ్ = సీతను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, కృతాన్తవశమ్

= యముని వశమును, ఆపన్నః = పొందినవాడై, ఇయమ్ = ఈమె, మమ = నాది, ఇతి = అని, మన్యతే = తలచుచుండెను.

తా. రావణుడు సీతతో ఇట్లు పలికి, యమునకు వశుడై పోవుటచే ''ఈమె ఇంక నాకు చెందినదే'' అని సంతోషించుచుండెను. 37

"బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఏబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్పఞ్చాశః సర్గః

[సీత రామునిపై తన కున్న నిశ్చల ప్రేమభక్తులను ప్రకటించి రావణుని నిందించుట. రాక్షసస్త్రీలు ఆమెను అశోకవాటికకు తీసికొని పోయి భయపెట్టుట].

మూ. సా తథోక్తా తు వైదేహీ నిర్భయా శోకకర్శితా,
తృణమన్తరతః కృత్వా రావణం ప్రత్యభాషత. 1

ప్ర. అ. తథా = అట్లు, ఉక్తా = పలకబడిన, శోకకర్శితా = శోకముచేత కృశింపచేయబడిన, సా వైదేహీ = ఆ సీత, నిర్భయా = భయము లేనిదై, తృణమ్ = గడ్డిపరకను, అన్తరతః = మధ్యయందు, కృత్వా = ఉంచి, రావణమ్ = రావణునిగూర్చి, ప్రత్యభాషత = సమాధానము చెప్పెను.

తా. శోకముతో కృశించి ఉన్న ఆ సీత ఆ రావణుని మాటలు విని, ఏ మాత్రమూ భయము లేనిదై, మధ్యలో గడ్డిపరక ఉంచి రావణునకు ఇట్లు సమాధానము చెప్పెను. 1

మూ. రాజా దశరథో నామ ధర్మసేతురివాచలః,
సత్యసన్ధః పరిజ్ఞాతో యస్య పుత్రః స రాఘవః. 2

ప్ర. అ. దశరథో నామ = దశరథు డనే పేరు గల, రాజా = రాజు, అచలః = స్థిరమైన, ధర్మసేతురివ = ధర్మమును నిలుపు సేతువు వంటివాడుగాను, సత్యసన్ధః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడుగాను, పరిజ్ఞాతః = ప్రసిద్ధుడు. సః రాఘవః = ఆ రాముడు, యస్య = ఎవనియొక్క, పుత్రః = పుత్రుడో.

తా. దశరథు డనే రాజు ధర్మమును నిలుపు స్థిరమైన సేతువు వంటివాడు అనీ, సత్యసంధు డనీ ప్రసిద్ధుడు. శ్రీరాముడు ఆతని పుత్రుడే. 2

మూ. రామో నామ స ధర్మాత్మా త్రిషు లోకేషు విశ్రుతః,
దీర్ఘబాహుర్విశాలాక్షో దైవతం హి పతిర్మమ. 3

ప్ర. అ. త్రిషు = మూడు, లోకేషు = లోకములయందు, విశ్రుతః = ప్రసిద్ధుడు, దీర్ఘబాహుః = దీర్ఘములైన బాహువులు కలవాడు, విశాలాక్షః = విశాలములైన నేత్రములు కలవాడు, రామో నామ = రాము డను పేరు గలవాడు అయిన, సః = ఆ, ధర్మాత్మా = ధర్మాత్ముడు, మమ = నాయొక్క, పతిః = భర్త, దైవతమ్ = నాకు దైవతము.

తా. మూడు లోకాలలోను ప్రసిద్ధుడు, దీర్ఘములైన బాహువులు విశాలములైన నేత్రములు కలవాడు అయిన, రాము డను పేరు గల ఆ ధర్మాత్ముడు నా భర్త. అతడే నా దైవము. 3

మూ ఇక్ష్వాకూణాం కులే జాతః సింహస్కన్ధో మహాద్యుతిః,
లక్ష్మణేన సహ భ్రాత్రా యస్తే ప్రాణాన్ హరిష్యతి. 4

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజుల, కులే = కులమునందు, జాతః = పుట్టినవాడు, సింహస్కన్ధః = సింహమువంటి మూపు కలవాడు, మహాద్యుతిః = గొప్ప కాంతి గలవాడు, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడిన, యః = ఏ రాముడు, తే = నీయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, హరిష్యతి = హరించగలడో.

తా. ఇక్ష్వాకువంశమునందు పుట్టినవాడు, సింహము వంటి మూపు గలవాడు, గొప్ప కాంతి గలవాడు అయిన ఆ రాముడు సోదరుడైన లక్ష్మణునితో కలిసి నీ ప్రాణములను తీసివేయగలడు. 4

మూ. ప్రత్యక్షం యద్యహం తస్య త్వయా స్యాం ధర్షితా బలాత్,
శయితా త్వం హతః సంఖ్యే జనస్థానే యథా ఖరః. 5

ప్ర. అ. అహమ్ = నేను, త్వయా = నీచేత, తస్య = ఆతనికి, ప్రత్యక్షమ్ = ఎదుట, బలాత్ = బలాత్కారముగా, ధర్షితా = అవమానితురాలను, స్యాం యది = అయి ఉన్నట్లయితే, త్వమ్ = నీవు, జనస్థానే = జనస్థానమునందు, ఖరః

యథా = ఖరుడు వలె, హతః = చంపబడినవాడవై, శయితా = శయనించెడి వాడవు.

తా. నీవు నన్ను ఆ రాముని సమక్షంలో అవమానించి ఉన్నట్లయితే, జన స్థానంలో ఖరుడు వలె, హతుడవై నేలమీద పడి యుండెడివాడవు. 5

మూ. య ఏతే రాక్షసాః ప్రోక్తా ఘోరరూపా మహాబలాః,
రాఘవే నిర్విషాః సర్వే సుపర్ణే పన్నగా యథా. 6

ప్ర. అ. ఘోరరూపాః = ఘోరమైన రూపము గలవారు, మహాబలాః = గొప్ప బలము గలవారు అయిన, యే = ఏ. ఏతే = ఈ, రాక్షసాః = రాక్షసులు, ప్రోక్తాః = చెప్పబడినారో, సర్వే = వాళ్ళందరూ, సుపర్ణే = గరుత్మంతుని విష యమునందు, పన్నగాః యథా = సర్పముల వలె, రాఘవే = రాముని విషయము నందు, నిర్విషాః = విషము లేనివారు.

తా. భయంకరమైన రూపములు గల మహాబలవంతులైన రాక్షసులను గూర్చి నీవేమో వర్ణించి చెప్పినావు. కాని ఈ రాక్షసు లందరూ, గరుత్మంతుని ముందు సర్పములు విషశూన్యము లైనట్లు, రాముని ముందు నిర్వీర్యులు. 6

మూ. తస్య జ్యావిప్రముక్తాస్తే శరాః కాఞ్చనభూషణాః,
శరీరం విధమిష్యన్తి గఙ్గాకూలమివోర్మయః. 7

ప్ర. అ. తస్య = ఆ రామునియొక్క, జ్యావిప్రముక్తాః = నారినుండి విడువ బడిన, కాఞ్చనభూషణాః = బంగారు అలంకారములు గల, శరాః = బాణములు, ఊర్మయః = తరంగములు, గఙ్గాకూలమివ = గంగాతీరమును వలె, తే శరీరమ్ = నీ శరీరమును, విధమిష్యన్తి = హింసించగలవు.

తా. బంగారముచేత అలంకరింపబడిన బాణములు ఆ రాముని ధనస్సు నుండి బయలుదేరి వచ్చి, గంగాతరంగములు గంగాతీరమును కూలద్రోసినట్లు, నీ శరీరమును హింసించగలవు. 7

మూ. అసురైర్వా సురైర్వా త్వం యద్యవధ్యోఽసి రావణ,
ఉత్పాద్య సుమహద్వైరం జీవంస్తస్య న మోక్ష్యసే. 8

ప్ర. అ. రావణ = రావణుడా ! త్వమ్ = నీవు, అసురైర్వా = అసురుల చేతగాని, సురైర్వా = దేవతలచేత గాని, అవధ్యః = చంప శక్యము కానివాడవు, అసి యది = అయినను, సుమహత్ = చాలా గొప్పదైన, వైరమ్ = వైరమును, ఉత్పాద్య = పుట్టించి, జీవన్ = జీవించుచున్నవాడవై, తస్య = ఆతనికి, న మోక్ష్యసే = విడువబడవు.

తా. రావణుడా ! నిన్ను అసురులు గాని, సురులు గాని చంపలేక పోవచ్చును. కాని రామునితో ఇంత గొప్ప వైరము పెట్టుకొని నీవు ప్రాణాలతో బైటపడవు. 8

మూ. న తే జీవితశేషస్య రాఘవోఽన్తకరో బలీ,
పశోర్యూపగతస్యేవ జీవితం తవ దుర్లభమ్. 9

ప్ర. అ. బలీ = బలవంతుడైన, సః రాఘవః = ఆ రాముడు, తే = నీ యొక్క, జీవితశేషస్య = మిగిలిన జీవితముయొక్క, అన్తకరః = అంతమును చేయువాడు. యూపగతస్య = యూపస్తంభమును పొందిన, పశోరివ = పశువునకు వలె, తవ = నీకు, జీవితమ్ = జీవితము, దుర్లభమ్ = దుర్లభము.

తా. మహాబలవంతుడైన ఆ రాముడు నీ మిగిలిన ఆయుర్దాయమును అంతము చేయగలడు. యూపస్తంభానికి కట్టిన పశువునకు వలె నీకు జీవితము ఇంక దక్కదు. 9

మూ. యది పశ్యేత్స రామస్త్వాం రోషదీప్తేన చక్షుషా,
రక్షస్త్వమద్య నిర్దగ్ధో గచ్ఛేః సద్యః పరాభవమ్. 10

ప్ర. అ. రక్షః = రాక్షసుడా ! సః రామః = ఆ రాముడు, రోషదీప్తేన = రోషముచేత మండుచున్న, చక్షుషా = నేత్రముతో, త్వామ్ = నిన్ను, పశ్యేద్యది = చూచినట్లయితే, అద్య = ఇప్పుడు, సద్యః = వెంటనే, త్వమ్ = నీవు, నిర్దగ్ధః = కాల్చబడినవాడవై, పరాభవమ్ = పరాభవమును, గచ్ఛేః = పొందెదవు.

తా. ఓ ! రాక్షసుడా ! ఆ రాముడు నిన్ను కోపముచేత ప్రజ్వలించుచున్న చూపుతో చూచినట్లయితే, నీవు ఇప్పుడే వెంటనే, కాల్చబడినవాడవై పరాభవమును పొందెదవు. 10

మూ. యశ్చన్ద్రం నభసో భూమౌ పాతయేన్నాశయేత వా,
సాగరం శోషయేద్వాపి స సీతాం మోచయేదిహ. 11

ప్ర. అ. యః = ఏ రాముడు, చన్ద్రమ్ = చంద్రుణ్ణి, నభసః = ఆకాశము నుండి, భూమౌ = నేలమీద, పాతయేత్ = పడవేయగలడో, వా = లేక, నాశయేత్ = నశింపచేయగలడో, సాగరమ్ = సముద్రమును, శోషయేద్వాపి = ఎండింప చేయగలడో, సః = ఆ రాముడు, ఇహ = ఇప్పుడు, సీతామ్ = సీతను, మోచయేత్ = విడిపించును.

తా. ఏ రాముడు చంద్రుణ్ణి ఆకాశమునుండి క్రిందికి పడగొట్టగలడో, లేదా నశింపచేయగలడో, సముద్రమును కూడ ఎండింపచేయగలడో ఆ రాముడే ఇప్పుడు సీతను విడిపించగలడు. 11

మూ. గతాయుస్త్వం గతశ్రీకో గతసత్త్వో గతేన్ద్రియః,
లఙ్కా వైధవ్యసంయుక్తా త్వత్కృతేన భవిష్యతి. 12

ప్ర. అ. త్వమ్ = నీవు, గతాయుః = గడచిన ఆయుర్దాయము కలవాడవు. గతశ్రీకః = పోయిన ఐశ్వర్యము గలవాడవు. గతసత్త్వః = పోయిన బలము గలవాడవు. గతేన్ద్రియః = నశించిన ఇంద్రియములు గలవాడవు. త్వత్కృతేన = నీవు చేసిన పనిచేత, లఙ్కా = లంక, వైధవ్యసంయుక్తా = వైధవ్యముతో కూడినది, భవిష్యతి = కాగలదు.

తా. నీ ఆయుస్సు మూడినది. నీ ఐశ్వర్యము అంతమొందినది. నీ బలము నశించినది. నీ ఇంద్రియములు పాడయినవి. నీవు చేసిన పనికి లంక వైధవ్యమును పొందనున్నది. 12

మూ. న తే పాపమిదం కర్మ శుభోదర్కం భవిష్యతి,
యాహం నీతా వినాభావం పతిపార్శ్వాత్త్వయా వనే.

ప్ర. అ. తే = నీయొక్క, ఇదమ్ = ఈ, కర్మ = పని, శుభోదర్కమ్ = శుభమైన భవిష్యత్ఫలము గలది, న భవిష్యతి = కాదు. యా = ఏ, అహమ్ = నేను, త్వయా = నీచేత, వనే = వనమునందు, పతిపార్శ్వాత్ = భర్తదగ్గరనుండి, వినాభావమ్ = వియోగమును, నీతా = పొందించబడితినో.

తా. నీవు వనములో భర్త దగ్గర నున్న నాకు భర్తతో వియోగము కల్పించినావు. నీవు చేసిన ఈ పాపకర్మ నీకు భవిష్యత్తునందు శుభఫలమును ఇవ్వదు. 13

మూ. స హి దైవతసంయుక్తో మమ భర్తా మహాద్యుతిః,
నిర్భయో వీర్యమాశ్రిత్య శూన్యే వసతి దణ్డకే. 14

ప్ర. అ. మహాద్యుతిః = గొప్ప కాంతి గలవాడైన, మమ = నాయొక్క, భర్తా = భర్తయైన, సః = ఆ రాముడు, వీర్యమ్ = వీర్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, నిర్భయః = భయములేనివాడై, దైవతసంయుక్తః = దైవముతో మాత్రమే కూడినవాడై, శూన్యే = శూన్యమైన, దణ్డకే = దండకారణ్యమునందు, వసతి = నివసించుచున్నాడు.

తా. మహాతేజఃశాలియైన నా భర్త తన పరాక్రమముపైననే ఆధారపడి, నిర్భయుడై, దైవము తప్ప మరెవ్వరి సహాయము లేనివాడై, స్వజనులు ఎవ్వరూ లేని దండకారణ్యములో నివసించుచున్నాడు. 14

మూ. స తే దర్పం బలం వీర్యముత్సేకం చ తథావిధమ్,
అపనేష్యతి గాత్రేభ్యః శరవర్షేణ సంయుగే. 15

ప్ర. అ. సః = అతడు, సంయుగే = యుద్ధమునందు, శరవర్షేణ = బాణవర్షముచేత, తే = నీయొక్క, గాత్రేభ్యః = అవయవములనుండి, దర్పమ్ = గర్వమును, బలమ్ = బలమును, వీర్యమ్ = పరాక్రమమును, తథావిధమ్ = అట్టి, ఉత్సేకం చ = ఎవ్వరినీ లెక్కచేయకుండుటను, అపనేష్యతి = తొలగించగలడు.

తా. నా భర్త యుద్ధములో బాణవర్షము వర్షించి నీ అవయవములలో (శరీరములో) ఉన్న గర్వమును, బలమును, పరాక్రమమును, ఎవ్వరినీ లెక్కచేయని అహంభావమును కడిగివేయగలడు. 15

మూ. యదా వినాశో భూతానాం దృశ్యతే కాలచోదితః,
తదా కార్యే ప్రమాద్యన్తి నరాః కాలవశం గతాః. 16

ప్ర. అ. భూతానామ్ = ప్రాణులకు, యదా = ఎప్పుడు, కాలచోదితః = కాలముచేత చేయబడిన, వినాశః = వినాశము, దృశ్యతే = చూడబడుచున్నదో, తదా = అప్పుడు, నరాః = నరులు, కాలవశమ్ = కాలమునకు వశమును, గతాః = పొందినవారై, కార్యే = కార్యమునందు, ప్రమాద్యన్తి = ప్రమాదము చెందుదురు.

తా. ప్రాణులకు (నరులకు) కాలమువలన కలగవలసిన వినాశము దాపురించినప్పుడు, ఆ నరులు కాలమునకు లొంగిపోయి తాము చేయవలసిన కార్యములందు పొరబాట్లు చేయుచుందురు. 16

మూ. మాం ప్రధృష్య స తే కాలః ప్రాప్తోఽయం రాక్షసాధమ,
ఆత్మనో రాక్షసానాం చ వధాయాన్తఃపురస్య చ. 17

ప్ర. అ. రాక్షసాధమ = ఓ ! రాక్షసాధముడా ! మామ్ = నన్ను, ప్రధృష్య = అవమానించి, ఆత్మనః = నీయొక్క, రాక్షసానాం చ = రాక్షసులయొక్క, అన్తఃపురస్య చ = అంతఃపురముయొక్క, వధాయ = వధకొరకు, సః కాలః = ఆ కాలము, తే = నీకు, ప్రాప్తః = వచ్చినది.

తా. రాక్షసాధముడా ! నన్నీవిధముగా అవమానించుటచేత, నువ్వు, రాక్షసులు, నీ అంతఃపురమూ నశించే అట్టి కాలము నీకు ప్రాప్తించినది. 17

మూ. న శక్యా యజ్ఞమధ్యస్థా వేదీ స్రుగ్భాణ్డమణ్డితా,
ద్విజాతిమన్త్రపూతా చ చణ్డాలేనావమర్దితుమ్. 18

ప్ర. అ. యజ్ఞమధ్యస్థా = యజ్ఞమధ్యమునందు ఉన్నది, స్రుగ్భాణ్డమణ్డితా = స్రుక్కుచేతను, ఇతరపాత్రలచేతను అలంకరింపబడినది, ద్విజాతిమన్త్రపూతా చ = బ్రాహ్మణుల మంత్రముచేత పవిత్రము చేయబడినదీ అయిన, వేదీ = వేదిక, చణ్డాలేన = చండాలునిచేత, అవమర్దితుమ్ = త్రొక్కుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. చుట్టూ స్రుక్కులు, ఇతరపాత్రలు పరిచి ఉన్నది, బ్రాహ్మణుల మంత్రములచేత పవిత్రముచేయబడినది అయిన, యజ్ఞశాలామధ్యమునం దున్న వేదికను చండాలుడు త్రొక్కజాలడు. 18

మూ. తథాహం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా,
త్వయా స్ప్రష్టుం న శక్యాస్మి రాక్షసాధమ పాపినా. 19

ప్ర. అ. రాక్షసాధమ = రాక్షసాధముడా ! తథా = అట్లే. ధర్మనిత్యస్య = ధర్మమునందు స్థిరుడైన రామునియొక్క, ధర్మపత్నీ = ధర్మపత్నిని, పతివ్రతా = పతివ్రతను అయిన, అహమ్ = నేను, పాపినా = పాపాత్ముడవైన, త్వయా = నీచేత, స్ప్రష్టుమ్ = స్పృశించుటకు, శక్యా = శక్యమైనదానను, నాస్మి = కాను.

తా. రాక్షసాధముడా ! ధర్మమునందు స్థిరమైన రాముని ధర్మపత్నిని, పతివ్రతను అయిన నన్ను, ఆ విధముగనే, పాపాత్ముడవైన నీవు స్పృశింపజాలవు. 19

మూ. క్రీడన్తీ రాజహంసేన పద్మషణ్డేషు నిత్యదా,
హంసీ సా తృణషణ్డస్థం కథం పశ్యేత మద్గుకమ్. 20

ప్ర. అ. పద్మషణ్డేషు = పద్మసమూహములందు, నిత్యదా = ఎల్లప్పుడు, రాజహంసేన = రాజహంసతో, క్రీడన్తీ = క్రీడించుచున్న, సా హంసీ = ఆ ఆడహంస, తృణషణ్డస్థమ్ = తృణసముదాయములో ఉన్న, మద్గుకమ్ = నీటికాకిని, కథమ్ = ఎట్లు, పశ్యేత = చూచును ?

తా. పద్మాల వనములో నిత్యమూ రాజహంసతో క్రీడించే ఆడహంస నీటిగడ్డిలో తిరిగే నీటికాకిని చూచుటకు కూడ ఇష్టపడునా ? 20

మూ. ఇదం శరీరం నిఃసంజ్ఞం బన్ధ వా ఘాతయస్వ వా,
నేదం శరీరం రక్ష్యం మే జీవితం వాపి రాక్షస, 21
న తు శక్ష్యామ్యుపక్రోశం పృథివ్యాం ధాతుమాత్మనః.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడా ! నిస్సంజ్ఞమ్ = సంజ్ఞ లేని, ఇదమ్ = ఈ, శరీరమ్ = శరీరమును, బన్ధ వా = బంధించుము. వా = లేదా, ఘాతయస్వ = నశింపచేయుము మే = నాకు, ఇదమ్ = ఈ, శరీరమ్ = శరీరము గాని, జీవితం వా = జీవితము గాని, రక్ష్యమ్ = రక్షింపదగినది. న = కాదు తు = కాని, పృథివ్యామ్ = భూలోకమునందు, ఆత్మనః = నాకు, ఉపక్రోశమ్ = నిందను, ధాతుమ్ = కలిగించుకొనుటకు, న శక్ష్యామి = సమర్థురాలను కాను

తా. రాక్షసుడా ! జడమైన ఈ శరీరమును నీ కిష్టమైనచో బంధించుము, లేదా చంపించివేయుము. ఈ శరీరమును కాని, ప్రాణాలను కాని రక్షించుకొనవలె నని నాకు కోరిక లేదు. ఈ భూలోకములో నాకు అపకీర్తి కలిగే పని మాత్రము చేయను. 21

మూ. ఏవముక్త్వా తు వైదేహీ క్రోధాత్సుపరుషం వచః, 22
రావణం మైథిలీ తత్ర పునర్నోవాచ కించన.

ప్ర. అ. వైదేహీ = విదేహరాజకుమారియైన, మైథిలీ = సీత, క్రోధాత్ = కోపమువలన, రావణమ్ = రావణునిగూర్చి, ఏవమ్ = ఇట్లు, సుపరుషమ్ = చాలా పరుషమైన, వచః = వచనమును, ఉక్త్వా = పలికి, తత్ర = అప్పుడు, పునః = మరల, కించన = ఏమీ, నోవాచ = పలకలేదు.

తా. జనకరాజపుత్రియైన సీత రావణునితో ఈ విధముగా కోపముతో నిండిన, చాల పరుషములైన మాటలు పలికి, మరల ఏమీ మాటలాడక ఊరకుండెను. 22

మూ. సీతాయా వచనం శ్రుత్వా పరుషం రోమహర్షణమ్, 23
ప్రత్యువాచ తతః సీతాం భయసందర్శనం వచః.

ప్ర. అ. సీతాయాః = సీతయొక్క, పరుషమ్ = పరుషమూ, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించేదీ అయిన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, (రావణుడు), తతః = అటుపిమ్మట, సీతామ్ = సీతను గూర్చి, భయసందర్శనమ్ = భయమును చూపే, వచః = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. సీత పలికిన పరుషములూ, రోమాంచమును కలిగించేవీ అయిన ఆ మాటలు విని రావణుడు ఆమెను భయపెట్టుచు ఇట్లు పలికెను. 23

మూ. శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని, 24
కాలేనానేన నాభ్యేషి యది మాం చారుహాసిని,
తతస్త్వాం ప్రాతరాశార్థం సూదాశ్ఛేత్స్యన్తి లేశశః. 25

ప్ర. అ. మైథిలి = మిథిలానగరరాజకుమారియైన, భామిని = ఓ ! సీతా !

మద్వాక్యమ్ = నామాటను, శృణు = వినుము. ద్వాదశ=పంద్రెండు, మాసాన్= మాసములను, (మాసములు) (అవధి). చారుహాసిని = అందమైన చిరునవ్వు గల దానా! అనేన = ఈ, కాలేన = కాలముచేత, మామ్ = నన్ను, నాభ్యేషి యది = చేరకపోయినట్లయితే, తతః = అటుపిమ్మట, సూదాః = వంటవాళ్లు, త్వామ్ = నిన్ను, ప్రాతరాశార్థే = ప్రాతఃకాల భోజనము నిమిత్తము, లేశశః = ముక్కలు ముక్కలుగా, ఛేత్స్యన్తి = ఛేదించగలరు.

తా. ఓ! సీతా! నేను చెప్పుచున్నది వినుము. నీకు పన్నెండుమాసాలు అవధి ఇచ్చుచున్నాను. అందమైన చిరునవ్వు గలదానా! ఈ సమయము లోగా నీవు నన్ను చేరకపోయినచో వంటవాళ్లు ప్రాతఃకాలమునందు తినే అల్పాహారము నిమిత్తము నిన్ను ముక్కముక్కలుగా ఛేదించివేయగలరు.

వి. ఈ ఒకటిన్నరశ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. 24-25

మూ. ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణః శత్రురావణః,
రాక్షసీశ్చ తతః క్రుద్ధ ఇదం వచనమబ్రవీత్. 26

ప్ర. అ. శత్రురావణః = శత్రువులను ఏడ్పించిన, రావణః = రావణుడు, ఇతి = ఇట్లు, పరుషమ్ = పరుషమైన, వాక్యమ్ = వాక్యమును, ఉక్త్వా = పలికి, తతః = అటుపిమ్మట, క్రుద్ధః = కోపించినవాడై, రాక్షసీః = రాక్షసస్త్రీలను గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. శత్రువులను ఏడ్పించే ఆ రావణుడు సీతతో ఈ విధముగా పరుషముగా పలికి, చాల కోపించినవాడై రాక్షసస్త్రీలతో ఇట్లు పలికెను. 26

మూ. శీఘ్రమేవ హి రాక్షస్యో వికృతా ఘోరదర్శనాః,
దర్పమస్యా వినేష్యధ్వం మాంసశోణితభోజనాః. 27

ప్ర. అ. వికృతాః = వికృతరూపము గలవాళ్లు, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము కలవాళ్లు, మాంసశోణితభోజనాః = మాంసము రక్తము భోజనముగా కలవాళ్ళు అయిన, రాక్షస్యః = రాక్షసస్త్రీలలారా! శీఘ్రమేవ = శీఘ్రముగా, అస్యాః = ఈమెయొక్క, దర్పమ్ = గర్వమును, వినేష్యధ్వమ్ = తొలగించండి.

తా. వికృతములైన ఆకారములతో చూచుటకు భయంకరంగా ఉండే,

మాంసరక్తములను భుజించే రాక్షసస్త్రీలలారా! ఈమె గర్వమును శీఘ్రముగా పోగొట్టండి. 27

మూ. వచనాదేవ తాస్తస్య సుఘోరా రాక్షసీగణాః,
కృతప్రాఞ్జలయో భూత్వా మైథిలీం పర్యవారయన్. 28

ప్ర. అ. సుఘోరాః=చాల భయంకరములైన, తాః=ఆ, రాక్షసీగణాః= రాక్షసస్త్రీ గణములు, తస్య= అతనియొక్క, వచనాదేవ = మాటవలననే, కృతప్రాఞ్జలయః = చేయబడిన నమస్కారము కలవి, భూత్వా= అయి, మైథిలీమ్ = సీతను, పర్యవారయన్ = చుట్టి నిలచినవి.

తా. భయంకరలైన ఆ రాక్షసస్త్రీలు రావణుని మాట వినిన వెంటనే ఆతనికి సవినయముగా నమస్కరించి సీతను చుట్టి నిలచిరి. 28

మూ. స తాః ప్రోవాచ రాజా తు రావణో ఘోరదర్శనః,
ప్రచాల్య చరణోత్కర్షైర్దారయన్నివ మేదినీమ్. 29

ప్ర. అ. ఘోరదర్శనః = భయంకరమైన దర్శనము గల, రాజా= రాజైన, సః రావణః= ఆ రావణుడు, చరణోత్కర్షైః= పాదములచే లాగుటచేత, మేదినీమ్= భూమిని, ప్రచాల్య= కదల్చి, దారయన్నివ = చీల్చుచున్నవాడువలె, తాః= ఆ రాక్షసస్త్రీలను గూర్చి, ప్రోవాచ = పలికెను.

తా. చూచుటకు భయంకరుడైన రాక్షసరాజైన ఆ రావణుడు పాదాఘాతములచేత భూమిని కదల్చి చీల్చివేయుచున్నాడా అన్నట్లు కనబడుచు ఆ రాక్షసస్త్రీలతో ఇట్లు పలికెను. 29

మూ. అశోకవనికామధ్యే మైథిలీ నీయతామియమ్,
తత్రేయం రక్ష్యతాం గూఢం యుష్మాభిః పరివారితా. 30

ప్ర. అ. ఇయం మైథిలీ= ఈ సీత, అశోకవనికామధ్యే = అశోకవనమధ్యమునందు, నీయతామ్= తీసికొనివెళ్ళబడుగాక. తత్ర= అక్కడ, ఇయమ్ = ఈమె, యుష్మాభిః= మీచేత, పరివారితా= చుట్టుకొనబడినదై, గూఢమ్= రహస్యముగా, రక్ష్యతామ్= రక్షింపబడుగాక.

తా. మీరు ఈ సీతను అశోకవనమధ్యమునకు తీసికొని వెళ్ళి, అక్కడ ఈమె చుట్టూ ఉంటూ, ఈమెను రహస్యముగా దాచి ఉంచి రక్షించండి. 30

మూ. తత్రైనాం తర్జనైర్ఘోరైః పునః సాన్త్వైశ్చ మైథిలీమ్,
ఆనయధ్వం వశం సర్వా వన్యాం గజవధూమివ. 31

ప్ర. అ. తత్ర = అక్కడ, సర్వాః = మీరందరూ, ఏనాం మైథిలీమ్ = ఈ సీతను, ఘోరైః = భయంకరములైన, తర్జనైః = భయపెట్టుటచేతను, పునః = మరల, సాన్త్వైశ్చ = ప్రతిమాలుకొనుటచేతను, వన్యామ్ = వనసంబంధమైన, గజవధూమివ = ఆడ ఏనుగను వలె, వశమ్ = వశమును, ఆనయధ్వమ్ = తీసికొనిరండి.

తా. అక్కడ మీరందరూ ఈ సీతను, వనములోని ఆడ ఏనుగును వలె, తీవ్రములైన భయపెట్టే మాటలచేతను, మంచి మాటలచేతను లొంగదీయండి.

మూ. ఇతి ప్రతిసమాదిష్టా రాక్షస్యో రావణేన తాః,
అశోకవనికాం జగ్ముర్మైథిలీం పరిగృహ్య తు. 32

సర్వకాలఫలైర్వృక్షైర్నానాపుష్పఫలైర్వృతామ్,
సర్వకాలమదైశ్చాపి ద్విజైః సముపసేవితామ్. 33

ప్ర. అ. రావణేన = రావణునిచేత, ఇతి = ఇట్లు, ప్రతిసమాదిష్టాః = ఆజ్ఞాపింపబడిన, తాః = ఆ, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, మైథిలీమ్ = సీతను, ప్రతిగృహ్య = తీసికొని, సర్వకాలఫలైః = సర్వకాలములందు ఫలములు గల, నానాపుష్పఫలైః = అనేకవిధములైన పుష్పములు ఫలములు గల, వృక్షైః = వృక్షములతో, వృతామ్ = కూడినది, సర్వకాలమదైః = అన్ని కాలములందు మదము గల, ద్విజైః = పక్షులచేత, సముపసేవితామ్ = సేవించబడిన, అశోకవనికామ్ = అశోకవనమును గూర్చి, జగ్ముః = వెళ్లిరి.

తా. ఆ రాక్షసస్త్రీలు రావణుని ఆజ్ఞను అనుసరించి, సీతను తీసికొని అశోకవనమునకు వెళ్ళిరి. ఆ అశోకవనము అన్ని కాలములలోనూ ఫలములు ఇచ్చే వృక్షములతోను, అనేకవిధములైన పువ్వులతో, పండ్లతో నిండిన వృక్షములతోను

అందముగా ఉండెను. ఆ వనమునందు అన్ని కాలములందును మదించి ఉండు పక్షులు నివసించుచుండెను. 32-33

మూ. సా తు శోకపరీతాఙ్గీ మైథిలీ జనకాత్మజా,
రాక్షసీవశమాపన్నా వ్యాఘ్రీణాం హరిణీ యథా. 34

ప్ర. అ. శోకపరీతాఙ్గీ=శోకముతో వ్యాప్తమైన శరీరము గల, జనకాత్మజా =జనకుని కుమార్తె యైన, సా మైథిలీ=ఆ సీత, హరిణీ=ఆడ లేడి, వ్యాఘ్రీణాం యథా = ఆడ పెద్దపులులకు వలె, రాక్షసీవశమ్ = రాక్షసస్త్రీల వశమును, ఆపన్నా = పొందినది.

తా. శోకముతో నిండిన శరీరము గల, జనకనందిని యైన ఆ సీత ఆడ లేడి ఆడ పెద్దపులుల వశమైపోయి నట్లు రాక్షసస్త్రీల వశమై పోయెను. 34

మూ. శోకేన మహతా గ్రస్తా మైథిలీ జనకాత్మజా,
న శర్మ లభతే భీరుః పాశబద్ధా మృగీ యథా. 35

ప్ర. అ. మహతా = గొప్పదైన, శోకేన = శోకముచేత, గ్రస్తా = ఆవహింపబడిన, భీరుః = భయస్వభావముగల, జనకాత్మజా=జనకుని కుమార్తెయైన, మైథిలీ = సీత, పాశబద్ధా = పాశములచేత కట్టబడిన, మృగీ యథా = ఆడ లేడి వలె, శర్మ = సుఖమును, న లభతే = పొందలేదు.

తా. జనకుని కుమార్తె యైన, భయస్వభావము గల ఆ సీత గొప్ప శోకముచేత ఆవహింపబడినదై పాశములచే కట్టబడిన ఆడ లేడి వలె ఏ మాత్రము సుఖము పొందకుండెను. 35

మూ. న విన్దతే తత్ర తు శర్మ మైథిలీ
విరూపనేత్రాభిరతీవ తర్జితా,
పతిం స్మరన్తీ దయితం చ దేవరం
విచేతనాభూద్భయశోకపీడితా. ,36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. విరూపనేత్రాభిః = వికృతమైన నేత్రములు గల రాక్షసస్త్రీలచేత, అతీవ = మిక్కిలి, తర్జితా = భయపెట్టబడినదై, మైథిలీ = సీత, తత్ర = అక్కడ, శర్మ = సుఖమును, న విన్దతే = పొందలేదు. దయితమ్ = ప్రియుడైన, పతిమ్ = భర్తను, దేవరం చ = మరదినీ, స్మరన్తీ = స్మరించుచున్నదై, భయశోకపీడితా = భయముచేతను, శోకముచేతను పీడింపబడినదై, విచేతనా = చైతన్యము లేనిది, అభూత్ = ఆయెను.

తా. వికృతములైన నేత్రములు గల ఆ రాక్షసస్త్రీలు ఎక్కువగా భయపెట్టుటచే జనకుని కూతురైన ఆ సీత సుఖము లేనిదై ఉండెను. ప్రియుడైన భర్తను, మరిదిని స్మరించుచు భయశోకములచేత పీడింపబడినదై స్పృహ కోల్పోయి పడి యుండెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఏబదిఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తపఞ్చాశః సర్గః

[మాయామృగమును చంపి తిరిగివచ్చుచున్న రాముడు మార్గములో కొన్ని అపశకునములు చూచి చింతించుట. తనవద్దకు వచ్చిన లక్ష్మణుని నిందించుచు సీత విషయమున భయము చెందుట].

మూ. రాక్షసం మృగరూపేణ చరన్తం కామరూపిణమ్,
నిహత్య రామో మారీచం తూర్ణం పథి న్యవర్తత. 1

ప్ర. అ. రామః = రాముడు, మృగరూపేణ = మృగరూపముతో, చరన్తమ్ = సంచరించుచున్న, కామరూపిణమ్ = స్వేచ్ఛారూపము గల, రాక్షసమ్ = రాక్షసుడైన, మారీచమ్ = మారీచుణ్ణి, నిహత్య = చంపి, తూర్ణమ్ = శీఘ్రముగా, పథి = మార్గమునందు, న్యవర్తత = మరలెను.

తా. మృగరూపముతో సంచరించుచున్న, ఇష్టానుసారము రూపము ధరించ గలిగిన రాక్షసుడైన ఆ మారీచుణ్ణి చంపి రాముడు శీఘ్రముగా వెనుకకు మరలి వచ్చుచుండెను. 1

మూ. తస్య సంత్వరమాణస్య ద్రష్టుకామస్య మైథిలీమ్,
క్రూరస్వనోఽథ గోమాయుర్వినినాదాస్య పృష్ఠతః. 2

ప్ర. అ. మైథిలీమ్ = సీతను, ద్రష్టుకామస్య = చూచుటకు కోరుచున్న, తస్య = ఆ రాముడు, సంత్వరమాణస్య = తొందరపడుచుండగా, అథ = అటు పిమ్మట, క్రూరస్వనః = క్రూరమైన ధ్వని గల, గోమాయుః = నక్క, అస్య = ఈ రామునియొక్క, పృష్ఠతః = వెనుక, వినినాద = అరచెను.

తా. రాముడు సీతను చూడవలెనని తొందరగా వచ్చుచుండగా ఆతని వెనుక క్రూరమైన ధ్వని గల నక్క అరచెను. 2

మూ. స తస్య స్వరమాజ్ఞాయ దారుణం రోమహర్షణమ్,
చిన్తయామాస గోమాయోః స్వరేణ పరిశఙ్కితః. 3

ప్ర. అ. సః = రాముడు, తస్య గోమాయోః = ఆ నక్కయొక్క, దారుణమ్ = భయంకరము, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించేది అయిన, స్వరమ్ = స్వరమును, ఆజ్ఞాయ = విని, స్వరేణ = దాని స్వరముచేత, పరిశఙ్కితః = శంకించుచున్నవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. భయంకరము, రోమాంచము కలిగించేదీ అయిన ఆ నక్క కూత విని, రాముడు ఆ కూతకు శంకించుచు ఇట్లు ఆలోచించెను. 3

మూ. అశుభం బత మన్యేఽహం గోమాయుర్వాశ్యతే యథా,
స్వస్తి స్యాదపి వైదేహ్యా రాక్షసైర్భక్షణం వినా 4

ప్ర. అ. బత = అయ్యో! గోమాయుః = నక్క, యథా = ఎట్లు, వాశ్యతే = ధ్వనిచేయుచున్నదో, (దానిచేత), అహమ్ = నేను, అశుభమ్ = అశుభమును, మన్యే = ఊహించుచున్నాను. రాక్షసైః = రాక్షసులచేత, భక్షణం వినా = భక్షణము లేకుండగా, వైదేహ్యాః = సీతకు, స్వస్తి = క్షేమము, స్యాదపి = అగునా?

తా. అయ్యో! ఈ నక్క కూయుట చూడగా అశుభము ఏదో జరుగనున్నదని అనిపించుచున్నది. సీతను రాక్షసు లెవ్వరూ భక్షించివేయకుండగా ఆమె క్షేమముగా ఉండునా! 4

మూ. మారీచేన తు విజ్ఞాయ స్వరమాలమ్బ్య మామకమ్,
విక్రుష్టం మృగరూపేణ లక్ష్మణః శృణుయాద్యది. 5

స సౌమిత్రిః స్వరం శ్రుత్వా తాం చ హిత్వా చ మైథిలీమ్,
తయేహ ప్రహితః క్షిప్రం మత్సకాశమిహేష్యతి. 6

ప్ర. అ. మృగరూపేణ = మృగరూపము గల, మారీచేన = మారీచునిచేత, విజ్ఞాయ = తెలిసికొని, మామకమ్ = నా సంబంధమైన, స్వరమ్ = స్వరమును, ఆలమ్బ్య = అవలంబించి, విక్రుష్టమ్ = అరపును, లక్ష్మణః = లక్ష్మణుడు, శృణుయాద్యది = విన్నట్లయితే, సః సౌమిత్రిః = ఆ లక్ష్మణుడు, స్వరమ్ =

స్వరమును, శ్రుత్వా = విని, తాం మైథిలీమ్ = ఆ సీతను, హిత్వా చ = విడచి, తయా = ఆమెచేత, ఇహ = ఇచటికి, ప్రహితః = పంపబడినవాడై, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఇహ = ఇప్పుడు, మత్సకాశమ్ = నా సమీపమును గూర్చి, ఏష్యతి = రాగలడు.

తా. మృగరూపమును ధరించి ఉన్న ఆ మారీచుడు కావలె నని నా స్వరముతో చేసిన అరపును లక్ష్మణుడు విని యుండవచ్చును. లక్ష్మణుడు ఆ స్వరమును విని, సీతచేత పంపబడినవాడై, ఆమెను విడచి, శీఘ్రముగా నా దగ్గరకు వచ్చును. 5. 6

మూ. రాక్షసైః సహితైర్నూనం సీతాయా ఈప్సితో వధః,
కాఞ్చనశ్చ మృగో భూత్వా వ్యపనీయాశ్రమాత్తు మామ్,
దూరం నీత్వా తు మారీచో రాక్షసోఽభూచ్ఛరాహతః,
హా లక్ష్మణ హతోఽస్మీతి యద్వాక్యం వ్యాజహార హ. 8

ప్ర. అ. యత్ = ఏ కారణమువలన, మారీచః = మారీచుడు, కాఞ్చనః మృగః = బంగారు లేడిగా, భూత్వా = అయి, మామ్ = నన్ను, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, వ్యపనీయ = తొలగించి, దూరమ్ = దూరముగా, నీత్వా = తీసికొనివెళ్లి, శరాహతః = బాణముచేత కొట్టబడినవాడై, రాక్షసః = రాక్షసుడుగా, అభూత్ = ఆయెనో, హా లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! హతః అస్మి = చంపబడితిని, ఇతి = అని, వాక్యమ్ = వాక్యమును, వ్యాజహార = పలికెనో, (అందువలన), సహితైః = కలిసిన, రాక్షసైః = రాక్షసులచేత, సీతాయాః = సీతయొక్క, వధః = వధ, ఈప్సితః = చేయ తలపెట్టబడినది, నూనమ్ = నిశ్చయము.

తా. రాక్షసు లందరూ కలిసి సీతను చంపవలె నని ఉపాయము పన్నినారు. సందేహము లేదు. అందుచేతనే మారీచుడు బంగారు లేడి రూపము ధరించి, నన్ను ఆశ్రమమునుండి దూరముగా తీసికొనిపోయి, బాణముచేత చంపబడినప్పుడు "అయ్యో! లక్ష్మణా! చచ్చితిని" అని పలికినాడు 7, 8

మూ. అపి స్వస్తి భవేత్తాభ్యాం రహితాభ్యాం మహావనే,
జనస్థాననిమిత్తం హి కృతవైరోఽస్మి రాక్షసైః, 9
నిమిత్తాని చ ఘోరాణి దృశ్యన్తేఽద్య బహూని చ

ప్ర. అ. మహావనే = మహావనమునందు, రహితాభ్యామ్ = (నాతో) శూన్యులైన, తాభ్యామ్ = వారిద్దరికీ, స్వస్తి = క్షేమము, అపి భవేత్ = అగునా ? జనస్థాననిమిత్తమ్ = జనస్థానము నిమిత్తము, రాక్షసైః = రాక్షసులతో, కృతవైరః = చేయబడిన వైరము కలవాడను, అస్మి హి = అయి ఉన్నాను కదా ! అద్య = ఇప్పుడు, ఘోరాణి = భయంకరములైన, బహూని = అనేకములైన, నిమిత్తాని చ = శకునములు కూడ, దృశ్యన్తే = చూడబడుచున్నవి.

తా. మహావనములో, నేను దగ్గర లేని సమయమునందు ఆ సీతాలక్ష్మణులు క్షేమముగా ఉందురా ? జనస్థానము మూలమున నాకు రాక్షసులతో వైరమేర్పడినది కదా ! ఇప్పుడు భయంకరములైన అనేక అపశకునములు కూడా కనబడుచున్నవి. 9

మూ. ఇత్యేవం చిన్తయన్రామః శ్రుత్వా గోమాయునిస్స్వనమ్,
ఆత్మనశ్చాపనయనాన్మృగరూపేణ రక్షసా,
ఆజగామ జనస్థానం రాఘవః పరిశఙ్కితః. 11

ప్ర. అ. రాఘవః = రఘువంశమునందు పుట్టిన, రామః = రాముడు, గోమాయునిస్స్వనమ్ = నక్క కూతను, శ్రుత్వా = విని, ఇత్యేవమ్ = ఇట్లు, చిన్తయన్ = చింతించుచు, మృగరూపేణ = మృగరూపము గల, రక్షసా = రాక్షసునిచేత, ఆత్మనః = తనయొక్క, అపనయనాత్ = దూరముగా తొలగించుటవలన, పరిశఙ్కితః = శంకించుచున్నవాడై, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. రఘువంశసంజాతుడైన ఆ రాముడు నక్క కూత విని ఈ విధముగా ఆలోచించుచు, ఆ రాక్షసుడు మృగరూపము ధరించి తనను దూరముగా తీసికొనిపోయినందుకు శంకాకులమైన మనస్సుతో జనస్థానము వైపు వెళ్లెను. 10,11

మూ. తం దీనమనసో దీనమాసేదుర్మృగపక్షిణః,
సవ్యం కృత్వా మహాత్మానం ఘోరాంశ్చ ససృజుః స్వనాన్.

ప్ర. అ. దీనమనసః = దీనమైన మనస్సు గల, మృగపక్షిణః = మృగములు, పక్షులు, దీనమ్ = దీనుడైన, మహాత్మానమ్ = మహాత్ముడైన, తమ్ = ఆ

రాముణ్ణి, సవ్యమ్ కృత్వా = ఎడమ ప్రక్కగా తిరుగుచు, ఆసేదుః = సమీపించినవి. ఘోరాన్ = ఘోరములైన, స్వరాన్ = స్వరములను, ససృజుశ్చ = విడిచినవి.

తా. మృగములూ, పక్షులూ, దీనమైన మనస్సుతో కూడినవై, దీనుడైన ఆ మహాత్మునకు ఎడమ వైపుగా తిరుగుచు సమీపించి ఘోరముగా ధ్వని చేసినవి. 12

మూ. తాని దృష్ట్వా నిమిత్తాని మహాఘోరాణి రాఘవః,
న్యవర్తతాథ త్వరితో జవేనాశ్రమమాత్మనః. 13

ప్ర. అ. రాఘవః = రాముడు, మహాఘోరాణి = చాలా భయంకరములైన, తాని నిమిత్తాని = ఆ శకునములను, దృష్ట్వా = చూచి, అథ = అటుపిమ్మట, త్వరితః = తొందరపడుచున్నవాడై, జవేన = వేగముతో, ఆత్మనః = తనయొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, న్యవర్తత = మరలెను.

తా. రాముడు చాల భయంకరము లైన ఆ శకునములను చూచి, తొందరపడుచు, వేగముగా తన ఆశ్రమము వైపు మరలి వచ్చెను. 13

మూ. సీతాం స తు వరారోహాం లక్ష్మణం చ మహాబలమ్,
ఆజగామ జనస్థానం చిన్తయన్నేవ రాఘవః. 14

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, వరారోహామ్ = శ్రేష్ఠమైన కటి ప్రదేశము గల, సీతామ్ = సీతను గూర్చి, మహాబలమ్ = గొప్ప బలము గల, లక్ష్మణం చ = లక్ష్మణుని గూర్చి, చిన్తయన్నేవ = ఆలోచించుచునే, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. ఆ రాముడు సుందరమైన కటిప్రదేశము గల సీతను గూర్చి, మహాబలవంతుడైన లక్ష్మణుని గూర్చి ఆలోచించుచు జనస్థానము వైపు వచ్చెను. 14

మూ. తతో లక్ష్మణమాయాన్తం దదర్శ విగతప్రభమ్,
తతోఽవిదూరే రామేణ సమియాయ స లక్ష్మణః, 15
విషణ్ణః సువిషణ్ణేన దుఃఖితో దుఃఖభాగినా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఆయాన్తమ్ = వచ్చుచున్న, విగతప్రభమ్ = పోయిన కాంతి గల, లక్ష్మణమ్ = లక్ష్మణుని, దదర్శ = చూచెను. తతః = అటు పిమ్మట, విషణ్ణః = దిగులుచెందినవాడు, దుఃఖితః = దుఃఖితుడు అయిన, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, సువిషణ్ణేన = మిక్కిలి దిగులు చెందిన, దుఃఖభాగినా = దుఃఖమును పొందిన, రామేణ = రామునితో, అవిదూరే = కొద్ది దూరమునందు, సమియాయ = కలిసెను.

తా. పిమ్మట దిగులు చెంది, దుఃఖాక్రాంతుడై ఉన్న ఆ లక్ష్మణుడు, చాల దుఃఖితుడై, దిగులు చెంది యున్న రాముణ్ణి కొద్ది దూరమునందే కలిసికొనెను.

15

మూ. సంజగర్హేఽథ తం భ్రాతా జ్యేష్ఠో లక్ష్మణమాగతమ్, 16
విహాయ సీతాం విజనే వనే రాక్షససేవితే.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, జ్యేష్ఠః భ్రాతా = అన్నగారైన రాముడు, రాక్షససేవితే = రాక్షసులచేత సేవింపబడిన, విజనే = విజనమైన, వనే = వనమునందు, సీతామ్ = సీతను, విహాయ = విడచి, ఆగతమ్ = వచ్చిన, తం లక్ష్మణమ్ = ఆ లక్ష్మణుణ్ణి, సంజగర్హే = నిందించెను.

తా. అప్పుడు జ్యేష్ఠసోదరుడైన రాముడు రాక్షసులకు నివాసమైన ఆ విజనమైన వనమునందు సీతను ఒంటరిగా విడిచి వచ్చిన ఆ లక్ష్మణుని నిందించెను.

16

మూ. గృహీత్వా చ కరం సవ్యం లక్ష్మణం రఘునన్దనః, 17
ఉవాచ మధురోదర్కమిదం పరుషమార్తవత్.

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, ఆర్తవత్ = దుఃఖపీడితుడై, సవ్యం కరమ్ = కుడి చేతిని, గృహీత్వా = గ్రహించి, మధురోదర్కమ్ = మధురమైన భావిఫలము గల, పరుషమ్ = పరుష మైన, ఇదమ్ = ఈ వాక్యమును, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు చాల దుఃఖించుచు, లక్ష్మణుని కుడి చెయ్యి తన చేతితో పట్టుకొని, భవిష్యత్తులో మంచి ఫలము గల పరుషమైన వాక్యమును ఇట్లు పలికెను.

17

మూ. అహో లక్ష్మణ గర్హ్యం తే కృతం యస్త్వం విహాయ తామ్,
సీతామిహాగతః సౌమ్య కచ్చిత్స్వస్తి భవేదిహ.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! లక్ష్మణ = లక్ష్మణా ! యః త్వమ్ = ఏ నీవు, తామ్ = ఆ, సీతామ్ = సీతను, విహాయ = విడచి, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావో, తే=అట్టి నీకు, (నీచేత), గర్హ్యమ్ = నిందింపదగిన పని, కృతమ్ = చేయబడినది. ఇహ = ఇప్పుడు, స్వస్తి = క్షేమము, భవేత్ కచ్చిత్ = అగునా? అహో = అయ్యో !

తా. సౌమ్యుడవైన లక్ష్మణా ! నీవు సీతను విడచి ఇక్కడికి వచ్చినావు; అయ్యో ! నీ వెంత చెడ్డ పని చేసితివి! ఇప్పుడు అంతా క్షేమముగా ఉండునా? 18

మూ. న మేఽస్తి సంశయో వీర సర్వథా జనకాత్మజా, 19
వినష్టా భక్షితా వాపి రాక్షసైర్వనచారిభిః,
అశుభాన్యేవ భూయిష్ఠం యథా ప్రాదుర్భవన్తి మే. 20

ప్ర. అ. వీర = ఓ ! వీరుడా ! మే = నాకు, భూయిష్ఠమ్ = అధికముగా, అశుభాన్యేవ = అశుభములే, యథా = ఎట్లు, ప్రాదుర్భవన్తి = కనబడుచున్నవో, దానిని పట్టి, జనకాత్మజా = సీత, సర్వథా = అన్ని విధములా, వినష్టా = నశించినది గాని, వనచారిభిః = వనములో సంచరించు, రాక్షసైః = రాక్షసులచేత, భక్షితా వాపి = భక్షింపబడినది గాని, అయి ఉండును. మే=నాకు, సంశయః= సంశయము, నాస్తి = లేదు.

తా. ఓ ! లక్ష్మణా! నాకు అన్నీ అశుభమైన శకునములే కనబడుచున్నవి. వీటిని బట్టి, అన్ని విధాలా, సీత నశించియేనా ఉండును, లేదా వనములో సంచరించే రాక్షసులచేత భక్షింపబడి ఉండును. నా కేమీ సందేహము లేదు. 19, 20

మూ. అపి లక్ష్మణ సీతాయాః సామగ్ర్యం ప్రాప్నుయావహే,
జీవన్త్యాః పురుషవ్యాఘ్ర సుతాయా జనకస్య వై. 21

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడవైన, లక్ష్మణ = లక్ష్మణా ! జీవన్త్యాః = జీవించి యున్న, జనకస్య సుతాయాః = జనకపుత్రియైన, సీతాయాః

= సీతయొక్క, సామగ్ర్యమ్ = పరిపూర్ణత్వమును, అపి ప్రాప్నుయావహే = పొందుదుమా !

తా. పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా ! జనకరాజపుత్రియైన సీతను, ప్రాణాలతో, ఎట్టి అపాయమూ లేని పరిపూర్ణశరీరముతో చూడగలుగుతామా ! 21

మూ. యథా వై మృగసంఘాశ్చ గోమాయుశ్చైవ భైరవమ్,
వాశ్యన్తే శకునాశ్చాపి ప్రదీప్తా మభితో దిశమ్, 22
అపి స్వస్తి భవేత్తస్యా రాజపుత్ర్యా మహాబల.

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గలవాడా ! మృగసంఘాశ్చ = మృగముల గుంపులు, గోమాయుశ్చ = నక్క, శకునాశ్చాపి = పక్షులు, ప్రదీప్తామ్ = మండుచున్న, దిశమ్ అభితః = దిక్కు వైపు, యథా = ఎట్లు, భైరవమ్ = భయంకరముగా, వాశ్యన్తే = అరచుచున్నవో, (దీనిని బట్టి), రాజపుత్ర్యాః = రాజపుత్రియైన, తస్యాః = ఆ సీతకు, స్వస్తి = క్షేమము, అపి భవేత్ = అగునా?

తా. మంటలు మండుచున్న దిక్కు వైపు తిరిగి మృగాల గుంపులు, నక్క, పక్షులు భయంకరముగా అరచుచున్నవి. దీనిని బట్టి రాజకుమారియైన సీత క్షేమముగా ఉండునా అని సందేహము కలుగుచున్నది. 22

మూ. ఇదం హి రక్షో మృగసంనికాశం
ప్రలోభ్య మాం దూరమనుప్రయాన్తమ్,
హతం కథంచిన్మహతా శ్రమేణ
స రాక్షసోఽభూన్మ్రియమాణ ఏవ. 23

ప్ర. అ. మృగసంనికాశమ్ = మృగముతో సమానమైన, ఇదం రక్షః = ఈ రాక్షసుడు, అనుప్రయాన్తమ్ = అనుసరించి వెళ్లుచున్న, మామ్ = నన్ను, దూరమ్ = దూరముగా, ప్రలోభ్య = లోభపెట్టి తీసికొనిపోయి, మహతా = గొప్ప, శ్రమేణ = శ్రమచేత, కథంచిత్ = ఎటులనో, హతమ్ = చంపబడినాడు. సః = ఆ మృగము, మ్రియమాణ ఏవ = చచ్చుచుండగానే, రాక్షసః = రాక్షసుడుగా, అభూత్ = అయెను.

తా. మృగరూపములో ఉన్న ఆ రాక్షసుడు అనుసరించి వెళ్ళిన నన్ను

లోభపెట్టి చాల దూరము తీసికొనిపోయినాడు. ఆ మృగమును చాల శ్రమచేత ఎటులనో చంపితిని. అది చావగానే రాక్షసుడుగా మారిపోయినది. 23

మూ. మనశ్చ మే దీనమిహాప్రహృష్టం
చక్షుశ్చ సవ్యం కురుతే వికారమ్,
అసంశయం లక్ష్మణ నాస్తి సీతా
హృతా మృతా వా పథి వర్తతే వా. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. ఇహ = ఈ సమయమునందు, దీనమ్=దీనమైన, మే మనశ్చ= నా మనస్సు కూడ, అప్రహృష్టమ్ = సంతోషము లేకుండా ఉన్నది. సవ్యం చక్షుశ్చ = ఎడమ కన్ను కూడ, వికారమ్ = వికారమును, కురుతే = చేయుచున్నది. లక్ష్మణ = లక్ష్మణా ! అసంశయమ్ = నిస్సంశయముగా, సీతా=సీత, నాస్తి = (ఆశ్రమములో) లేదు. హృతా=హరింపబడి ఉండవలెను, మృతా వా= లేదా మరణించి ఉండవలెను. పథి = మార్గమధ్యమునందు, వర్తతే వా = ఉండవలెను.

తా. నా మనస్సు ఇప్పుడు, దైన్యముతో నిండినదై సంతోషవిహీనముగా ఉన్నది. నా ఎడమ కన్ను కూడ అదరుచున్నది. లక్ష్మణా ! సీత ఆశ్రమములో ఉండదు. సందేహము లేదు. హరింపబడి ఉండవలె; లేదా మరణించి ఉండవలె; లేదా హరింపబడుచు మార్గమధ్యములో ఉండవలె. 24

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో ఏబదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టపఞ్చాశః సర్గః

[అనేకవిధాల ఆలోచనలతో రాముడు లక్ష్మణునితో ఆశ్రమము చేరుట. అక్కడ సీతను కానక దుఃఖాక్రాంతు డగుట.]

మూ. స దృష్ట్వా లక్ష్మణం దీనం శూన్యే దశరథాత్మజః,
పర్యపృచ్ఛత ధర్మాత్మా వైదేహీమాగతం వినా. 1

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః దశరథాత్మజః = ఆ రాముడు, శూన్యే = జనశూన్యమైన ఆ అరణ్యమునందు, వైదేహీం వినా = సీత లేకుండగా, ఆగతమ్ = వచ్చిన, దీనమ్ = దీనుడైన, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, దృష్ట్వా = చూచి, పర్యపృచ్ఛత = అడిగెను.

తా. ధర్మాత్ముడైన ఆ రాముడు ఆ శూన్యారణ్యములో, సీత లేకుండా వచ్చిన దీనుడైన లక్ష్మణుణ్ణి చూచి, ఇట్లు అడిగెను. 1

మూ. ప్రస్థితం దణ్డకారణ్యం యా మామనుజగామ హ,
క్వ సా లక్ష్మణ వైదేహీ యాం హిత్వా త్వమిహాగతః. 2

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును గూర్చి. ప్రస్థితమ్ = ప్రయాణమైన, మామ్ = నన్ను, యా = ఏ సీత, అనుజగామ హ = అనుసరించి వచ్చెనో, యామ్ = ఏ సీతను, హిత్వా = విడచి, త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావో, సా వైదేహీ = ఆ సీత, క్వ = ఎక్కడ ?

తా. ఏ సీత దండకారణ్యానికి బయలుదేరిన నా వెనుకనే వచ్చినదో, ఏ సీతను నీవు విడిచి వచ్చినావో ఆ సీత ఎక్కడ ఉన్నది ? 2

మూ. రాజ్యభ్రష్టస్య దీనస్య దణ్డకాన్ పరిధావతః,
క్వ సా దుఃఖసహాయా మే వైదేహీ తనుమధ్యమా. 3

ప్ర. అ. రాజ్యభ్రష్టస్య = రాజ్యభ్రష్టుడనై, దణ్డకాన్ = దండకారణ్యమును గూర్చి, పరిధావతః = పరుగెత్తుచున్న, దీనస్య = దీనుడ నైన, మే = నాకు, దుఃఖసహాయా = దుఃఖసమయమునందు సహాయురాలుగా నిలచిన, తనుమధ్యమా = సన్నని నడుము గల, సా వైదేహీ = ఆ సీత, క్వ = ఎక్కడ ?

తా. రాజ్యభ్రష్టుడనై నేను దీనుడనై దండకారణ్యానికి శీఘ్రముగా పోవుచున్న సమయమునందు నాకు దుఃఖసమయమునందు సహాయురాలుగా నిలచిన ఆ సన్నని నడుము గల సీత ఎక్కడ ? 3

మూ. యాం వినా నోత్సహే వీర ముహూర్తమపి జీవితుమ్,
క్వ సా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. 4

ప్ర. అ. వీర = వీరుడా ! యాం వినా = ఎవ్వతె లేకుండగా, ముహూర్తమపి = ముహూర్తకాలము కూడ, జీవితుమ్ = జీవించుటకు, నోత్సహే = ఇచ్ఛయించనో, సా = అట్టి, సురసుతోపమా = దేవతా కుమారితో సమానురాలైన, మే = నాయొక్క, ప్రాణసహాయా = ప్రాణములకు సహాయభూతురాలైన, సీతా = సీత, క్వ = ఎక్కడ ?

తా. ఓ ! వీరుడవైన లక్ష్మణా ! ఎవ్వతె లేనిచో నేను ముహూర్తకాలము కూడ జీవించలేనో అట్టి దేవతాస్త్రీతో సమానురాలు, నా ప్రాణాలకు సహాయభూతురాలు అయిన సీత ఎక్కడ ? 4

మూ. పతిత్వమమరాణాం వా పృథివ్యాశ్చాపి లక్ష్మణ,
తాం వినా తపనీయాభాం నేచ్ఛేయం జనకాత్మజామ్. 5

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! తపనీయాభామ్ = బంగారు వర్ణము గల, తామ్ = ఆ, జనకాత్మజాం వినా = సీత లేకుండా, అమరాణామ్ = దేవతలయొక్క, పతిత్వమ్ = ఆధిపత్యమును గాని, పృథివ్యాశ్చ = భూమియొక్క అధిపత్యమును గాని, నేచ్ఛేయమ్ = కోరను.

తా. లక్ష్మణా : బంగారు రంగు గల ఆ సీత లేకుండా నాకు దేవతాధిపత్యము కాని, భూలోకరాజ్యము గాని ఇష్టము కాదు. 5

మూ. కచ్చిజ్జీవతి వైదేహీ ప్రాణైః ప్రియతరా మమ,
కచ్చిత్ప్రవ్రాజనం సౌమ్య న మే మిథ్యా భవిష్యతి. 6

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మమ = నాకు, ప్రాణైః = ప్రాణములతో, ప్రియతరా = ఎక్కువ ఇష్టురాలైన, వైదేహీ = సీత, జీవతి కచ్చిత్ = జీవించి ఉన్నది కదా ! మే = నాయొక్క, ప్రవ్రాజనమ్ = అడవికి పంపుట, మిథ్యా = అసత్యము (వ్యర్థము), న భవిష్యతి కచ్చిత్ = కాదు కదా !

తా. ఓ ! సౌమ్యుడా ! నాకు ప్రాణములకంటె కూడ ప్రియురాలైన సీత జీవించి ఉండునుకదా ! నేను చేసిన ఈ అరణ్యనివాసము వ్యర్థముకాదు కదా!

మూ. సీతానిమిత్తం సౌమిత్రే మృతే మయి గతే త్వయి,
కచ్చిత్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి. 7

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! సీతానిమిత్తమ్ = సీతకొరకై, మయి = నేను, మృతే = మరణించినవాడ నగుచుండగా, త్వయి = నీవు, గతే = వెళ్ళిన వాడవగుచుండగా, సా కైకేయీ = ఆ కైకేయి, సకామా = తీరిన కోరిక గలదై, సుఖితా = సుఖించినది, భవిష్యతి కచ్చిత్ = అగునా !

తా. లక్ష్మణా ! సీత కోసమై నేను మరణించగా, నీవు తిరిగి అయోధ్య చేరగా, కైకేయి కోరిక తీరి ఆనందించునా ఏమి ? 7

మూ. సపుత్రరాజ్యాం సిద్ధార్థాం మృతపుత్రా తపస్వినీ,
ఉపస్థాస్యతి కౌసల్యా కచ్చిత్సౌమ్య న కేకయీమ్. 8

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మృతపుత్రా = మరణించిన పుత్రుడు గల, తపస్వినీ = దీనురాలైన, కౌసల్యా = కౌసల్య, సపుత్రరాజ్యామ్ = పుత్రునితోను రాజ్యముతోను కూడిన, సిద్ధార్థామ్ = సిద్ధించిన ప్రయోజనము గల, కేకయీమ్ = కైకేయిని, న ఉపస్థాస్యతి కచ్చిత్ = సేవించదు కదా !

తా. లక్ష్మణా ! పుత్రుడు మరణించగా దీనురాలైన కౌసల్య, పుత్రవంతురాలై రాజ్యమును సంపాదించి కోరిక సిద్ధించిన కైకేయిని సేవించవలసి ఉండునా!

మూ. యది జీవతి వైదేహీ గమిష్యామ్యాశ్రమం పునః,
సువృత్తా యది వా వృత్తా ప్రాణాంస్త్యక్ష్యామి లక్ష్మణ. 9

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! వైదేహీ = సీత, జీవతి యది = జీవించి ఉన్నట్లయితే, పునః = మరల, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. యది వా = లేక, సువృత్తా = మంచి చరిత్రగల ఆమె, వృత్తా = మరణించినచో, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యామి = విడచెదను.

తా. లక్ష్మణా ! సీత జీవించి ఉన్నట్లయితే తిరిగి ఆశ్రమానికి వెళ్లెదను. ఉత్తమమైన చరిత్ర గల ఆమె మరణించినచో ప్రాణములు విడచెదను. 9

మూ. యది మామాశ్రమగతం వైదేహీ నాభిభాషతే,
పునః ప్రహసితా సీతా వినశిష్యామి లక్ష్మణ. 10

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! ఆశ్రమగతమ్ = ఆశ్రమమునకు వెళ్ళిన, మామ్ = నన్ను, వైదేహీ = జనకుని కుమార్తె యైన, సీతా = సీత, ప్రహసితా = నవ్వుచున్నదై, పునః = మరల, నాభిభాషతే యది = పలకరించకపోయినట్లయితే, వినశిష్యామి = నశించెదను.

తా. లక్ష్మణా ! నేను ఆశ్రమునకు వెళ్ళు సరికి, జనకరాజనందనయైన సీత నవ్వుచూ నన్ను పలకరించకపోయినట్లయితే నేను మరణించెదను. 10

మూ. బ్రూహి లక్ష్మణ వైదేహీ యది జీవతి వా న వా,
త్వయి ప్రమత్తే రక్షోభిర్భక్షితా వా తపస్వినీ. 11

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! వైదేహీ = సీత, జీవతి వా = జీవించి ఉన్నదా; న వా = లేదా? త్వయి = నీవు, ప్రమత్తే = ఏమరుపాటు చెంది ఉండగా, తపస్వినీ = దీనురాలైన ఆమె, రక్షోభిః = రాక్షసులచేత, భక్షితా వా = భక్షింపబడినదా? బ్రూహి = చెప్పుము.

తా. లక్ష్మణా ! సీత జీవించి ఉన్నదా లేదా? నీవు ఏమరి ఉండగా దీనురాలైన ఆమెను రాక్షసులు భక్షించివేసినారా ? చెప్పుము. 11

మూ. సుకుమారీ చ బాలా చ నిత్యం చాదుఃఖదర్శినీ,
మద్వియోగేన వైదేహీ వ్యక్తం శోచతి దుర్మనాః. 12

ప్ర. అ. సుకుమారీ చ = సుకుమారురాలు, బాలా చ = చిన్న వయస్సులో ఉన్నది, నిత్యమ్ = నిత్యము, అదుఃఖదర్శినీ = దుఃఖమును చూడనిదీ అయిన, వైదేహీ = సీత, దుర్మనాః = దుఃఖించిన మనస్సు కలదై, మద్వియోగేన = నా వియోగముచేత, శోచతి = దుఃఖించుచున్నది. వ్యక్తమ్ = స్పష్టము.

తా. సుకుమారురాలు, చిన్నవయస్సులో ఉన్నది, ఎన్నడూ (వియోగ) దుఃఖమును చూడనిదీ అయిన సీత నా వియోగము మనస్సును పీడించగా దుఃఖించు చుండును; సత్యము. 12

మూ. సర్వదా రక్షసా తేన జిహ్మేన సుదురాత్మనా,
వదతా లక్ష్మణేత్యుచ్చైస్తవాపి జనితం భయమ్. 13

ప్ర. అ. జిహ్మేన = వక్రస్వభావము గలవాడు, సుదురాత్మనా = చాల దుష్టబుద్ధి గలవాడు అయిన, లక్ష్మణ ఇతి = లక్ష్మణా అని, ఉచ్చైః = గట్టిగా, వదతా = పలికిన, తేన రక్షసా = ఆ రాక్షసునిచేత, సర్వథా = అన్ని విధములా, తవాపి = నీకు కూడా, భయమ్ = భయము, జనితమ్ = పుట్టించబడినది.

తా. వక్రస్వభావము గల దుర్బుద్ధియైన ఆ రాక్షసుడు "లక్ష్మణా": అని గట్టిగా అరచినపుడు, బహుశా నీకు కూడ భయము కలిగి యుండును. 13

మూ. శ్రుతస్తు శఙ్కే వైదేహ్యా స స్వరః సదృశో మమ,
త్రస్తయా ప్రేషితస్త్వం చ ద్రష్టుం మాం శీఘ్రమాగతః.

ప్ర. అ. వైదేహ్యా = సీతచేత, మమ = నా స్వరమునకు, సదృశః = సమానమైన, సః = ఆ, స్వరః = స్వరము, శ్రుతః = వినబడినది అని, శఙ్కే = ఊహించుచున్నాను. త్రస్తయా = భయపడిన ఆమెచేత, ప్రేషితః = పంపబడినవాడవై, త్వం చ = నీవు, మామ్ = నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆగతః = వచ్చినావు.

తా. నా కంఠస్వరము వంటి స్వరమును విని భయపడిన సీత పంపగా నీవు నన్ను చూచుటకై శీఘ్రముగా వచ్చి ఉంటా వని ఊహించుచున్నాను. 14

మూ. సర్వథా తు కృతం కష్టం సీతాముత్సృజతా వనే,
ప్రతికర్తుం నృశంసానాం రక్షసాం దత్తమన్తరమ్. 15

ప్ర. అ. సీతామ్ = సీతను, వనే = వనమునందు, ఉత్సృజతా = విడచిన నీచేత, సర్వథా = అన్ని విధములా, కష్టమ్ = దుఃఖకర మైన పని, కృతమ్ = చేయబడినది. ప్రతికర్తుమ్ = ప్రతీకారము చేయుటకు, నృశంసానామ్ = క్రూరులైన, రక్షసామ్ = రాక్షసులకు, అన్తరమ్ = అవకాశము, దత్తమ్ = ఇవ్వబడినది.

తా. నీవు సీతను వనములో ఒంటరిగా విడచి వచ్చుటచే చాల దుఃఖమును కలిగించు పని చేసినావు. క్రూరులైన రాక్షసులకు మన విషయమున ప్రతిక్రియ చేయుటకు అవకాశము ఇచ్చిన ట్లయినది. 15

మూ. దుఃఖితాః ఖరఘాతేన రాక్షసాః పిశితాశనాః,
తైః సీతా నిహతా ఘోరైర్భవిష్యతి న సంశయః. 16

ప్ర. అ. పిశితాశనాః = నరమాంసభక్షకులైన, రాక్షసాః = రాక్షసులు, ఖరఘాతేన = ఖరుని సంహారముచేత, దుఃఖితాః = దుఃఖించి యున్నారు. ఘోరైః = భయంకరులైన, తైః = వాళ్లచేత, సీతా = సీత, నిహతా = చంపబడినది, భవిష్యతి = కాగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. నరమాంసమును భక్షించే రాక్షసు లందరూ నేను ఖరుణ్ణి చంపుటచేత దుఃఖితులై ఉన్నారు. క్రూరులైన వాళ్లు సీతను చంపి ఉందురు. సందేహము లేదు. 16

మూ. అహోఽస్మిన్వ్యసనే మగ్నః సర్వథా శత్రుసూదన,
కిం న్విదానీం కరిష్యామి శఙ్కే ప్రాప్తవ్యమీదృశమ్. 17

ప్ర. అ. శత్రుసూదన = శత్రుసంహారకుడా ! సర్వథా = అన్నివిధాల, అస్మిన్ = ఈ, వ్యసనే = దుఃఖమునందు, మగ్నః = మునిగినాను. ఇదానీమ్ = ఇప్పుడు, కిం ను కరిష్యామి = ఏమి చేయుదును ? ఈదృశమ్ = ఇట్టి, దుఃఖము, ప్రాప్తవ్యమ్ = పొందదగి ఉన్నది అని, శఙ్కే = ఊహించుచున్నాను. అహో = అయ్యో !

తా. శత్రుసంహారకుడవైన ఓః లక్ష్మణా ! అయ్యో ! నేను అన్ని విధాలా ఈ వ్యసనములో మునిగి పోయినాను. ఇప్పుడు ఏమి చేయుదును ? నాకు ఇట్టి కష్టము రావలసి ఉన్నది కాబోలు. 17

మూ. ఇతి సీతాం వరారోహాం చిన్తయన్నేవ రాఘవః,
ఆజగామ జనస్థానం త్వరయా సహ లక్ష్మణః. 18

ప్ర. అ. రాఘవః = రాముడు, ఇతి = ఇట్లు, వరారోహామ్ = శ్రేష్ఠమైన కటిప్రదేశము గల, సీతామ్ = సీతను గూర్చి, చిన్తయన్నేవ = ఆలోచించుచు, సహ లక్ష్మణః = లక్ష్మణసమేతుడై, త్వరయా = తొందరతో, జనస్థానమ్ = జనస్థానమును గూర్చి, ఆజగామ = వచ్చెను.

తా. రాముడు, అందమైన కటిప్రదేశము గల సీతను గూర్చి ఈ విధముగా ఆలోచించుచునే, లక్ష్మణసమేతుడై, తొందరగా జనస్థానము చేరెను. 18

మూ. విగర్హమాణోఽనుజమార్తరూపం
క్షుధా శ్రమాచ్చైవ పిపాసయా చ,
వినిశ్శ్వసన్ శుష్కముఖో వివర్ణః
ప్రతిశ్రయం ప్రాప్య సమీక్ష్య శూన్యమ్. 19

స్వమాశ్రమం సంప్రవిగాహ్య వీరో
విహారదేశాననుసృత్య కాంశ్చిత్,
ఏతత్తదిత్యేవ నివాసభూమౌ
ప్రహృష్టరోమా వ్యథితో బభూవ. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. వీరః = వీరుడైన రాముడు, ఆర్తరూపమ్ = మిక్కిలి దుఃఖితుడైన, అనుజమ్ = తమ్ముణ్ణి, విగర్హమాణః = నిందించుచు, క్షుధా = ఆకలిచేతను, శ్రమాచ్చైవ = అలసటవలనను, పిపాసయా చ = దప్పికచేతను, వినిఃశ్వసన్ = నిట్టూర్చుచు, శుష్కముఖః = ఎండిన ముఖము గలవాడై, వివర్ణః = మారిపోయిన శరీరచ్ఛాయ గలవాడై, ప్రతిశ్రయమ్ = ఆశ్రమప్రాంతమును, ప్రాప్య = పొంది, శూన్యమ్ = శూన్యమైనదానినిగా, సమీక్ష్య = చూచి, స్వమ్ = తన సంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, సంప్రవిగాహ్య = ప్రవేశించి, కాంశ్చిత్ = కొన్ని,

విహారదేశాన్ = విహారప్రదేశములను, అనుసృత్య = అనుసరించి, నివాసభూమౌ = నివాసస్థానమునందు, (చూచి), ఏతత్ = ఇది, తదేవ = అదే, ఇతి = అని నిశ్చయించుకొని, ప్రహృష్టరోమా = గగుర్పొడిచిన రోమములు కలవాడై, వ్యథితః = వ్యథచెందినవాడుగా, బభూవ = ఆయెను.

తా. ఆ రాముడు మిక్కిలి దుఃఖించుచున్న తమ్ముణ్ణి నిందించుచు ఆశ్రమము వైపు వెళ్ళెను. ఆకలిచేత, అలసటచేత, దాహముచేత ఆతని ముఖము ఎండిపోయెను. శరీరము రంగు వాడిపోయెను. ఆతడు నిట్టూర్చుచు, ఆశ్రమ సమీపప్రాంత మంతా శూన్యముగా ఉన్నట్లు చూచి తన ఆశ్రమములో ప్రవేశించెను. అక్కడినుండి తాము విహరించుచుండు కొన్ని ప్రదేశములకు వెళ్లెను. అచటినుండి మరల నివాసస్థానమునకు వచ్చెను. సీత ఎక్కడా కనబడకపోవుటచే, "నేను అనుకొనినట్లే జరిగినది" అని అనుకొనుచు, శరీరము గగుర్పాటు చెంద, చాల దుఃఖించెను. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో ఏబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనషష్టితమః సర్గః

### [రామలక్ష్మణుల సంభాషణము]

మూ. అథాశ్రమాదుపావృత్తమన్తరా రఘునన్దనః,
పరిపప్రచ్ఛ సౌమిత్రిం రామో దుఃఖార్దితం పునః. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రఘునన్దనః = రఘువంశమునకు ఆనంద వర్ధనుడైన, రామః = రాముడు, దుఃఖార్దితమ్ = దుఃఖముచేత పీడింపబడినవాడు, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, ఉపావృత్తమ్ = తిరిగి వచ్చినవాడు అయిన, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి, అన్తరా = మార్గమధ్యమునందు, పునః = మరల, పరిపప్రచ్ఛ = అడిగెను.

తా. రఘువంశమునకు ఆనందవర్ధనుడైన రాముడు, ఆశ్రమమునుండి వచ్చిన, దుఃఖార్తుడైన లక్ష్మణుణ్ణి, మార్గమధ్యములో, మరల ఇట్లు ప్రశ్నించెను.

మూ. తమువాచ కిమర్థం త్వమాగతోఽపాస్య మైథిలీమ్,
యదా సా తవ విశ్వాసాద్వనే విరహితా మయా. 2

ప్ర. అ. తమ్ = అతనిని గూర్చి, ఉవాచ = పలికెను. తవ = నీయొక్క, విశ్వాసాత్ = విశ్వాసమువలన, మయా = నాచేత, సా = ఆమె, వనే = వనమునందు, యదా = ఎప్పుడు, విరహితా = విడువబడినదో, మైథిలీమ్ = సీతను, కిమర్థమ్ = ఎందువలన, అపాస్య = విడచి, త్వమ్ = నీవు, ఆగతః = వచ్చినావు ?

తా. నేను నీమీద ఉన్న విశ్వాసముచేత సీతను అడవిలో విడచి వచ్చినాను కదా, అలాంటప్పుడు నీ వామెను విడచి ఎందుకు వచ్చినావు ? 2

మూ. దృష్ట్వైవాభ్యాగతం త్వాం మే మైథిలీం త్యజ్య లక్ష్మణ,
శఙ్కమానం మహత్పాపం యత్సత్యం వ్యథితం మనః.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా : మైథిలీమ్ = సీతను, త్యజ్య = విడచి, అభ్యాగతమ్ = వచ్చిన, త్వామ్ = నిన్ను, దృష్ట్వైవ = చూడగానే, మనః = నా మనస్సు, మహత్ = గొప్ప, పాపమ్ = పాపమును, శఙ్కమానమ్ = శంకించు చున్నదై, వ్యథితమ్ ఇతి యత్ = వ్యథ చెందిన దను విషయ మేది గలదో, అది, సత్యమ్ = సత్యము.

తా. లక్ష్మణా : సీతను విడచి వచ్చుచున్న నిన్ను చూడగానే నా మనస్సు గొప్ప పాపమును శంకించుచు నిజముగానే వ్యథ చెందినది. 3

మూ. స్ఫురతే నయనం సవ్యం బాహుశ్చ హృదయం చ మే,
దృష్ట్వా లక్ష్మణ దూరే త్వాం సీతావిరహితం పథి. 4

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా : సీతావిరహితమ్ = సీతతో శూన్యుడవైన, త్వామ్ = నిన్ను, దూరే = దూరమునందు, పథి = మార్గమునందు, దృష్ట్వా = చూచి, మే = నాయొక్క, సవ్యమ్ = ఎడమదైన, నయనమ్ = నేత్రము, బాహుశ్చ = బాహువు, స్ఫురతే = అదురుచున్నది. మే = నాయొక్క, హృదయం చ = హృదయము కూడ, అదరుచున్నది.

తా. లక్ష్మణా : సీత లేకుండా వచ్చుచున్న నిన్ను మార్గమునందు దూరముగా చూడగానే నా ఎడమ కన్ను, ఎడమ బుజము అదిరినవి. హృదయము కంపించినది. 4

మూ. ఏవముక్తస్తు సౌమిత్రిర్లక్ష్మణః శుభలక్షణః,
భూయో దుఃఖసమావిష్టో దుఃఖితం రామమబ్రవీత్. 5

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సౌమిత్రిః = సుమిత్ర కుమారుడైన, శుభలక్షణః = శుభమైన లక్షణములు గల, లక్ష్మణః = లక్ష్మణుడు, భూయః = మరల, దుఃఖసమావిష్టః = దుఃఖముచేత ఆవరింపబడినవాడై, దుఃఖితమ్ = దుఃఖించుచున్న, రామమ్ = రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. సుమిత్ర కుమారుడు, శుభలక్షణములు కలవాడు అయిన లక్ష్మణుడు రాముని మాటలు విని, ఇంకను అధికముగా దుఃఖించుచు, దుఃఖాక్రాంతుడైన రామునితో ఇట్లు పలికెను 5

మూ. న స్వయం కామకారేణ తాం త్యక్త్వాహమిహాగతః,
ప్రచోదిత స్తయైవోగ్రైస్త్వత్సకాశమిహాగతః. 6

ప్ర. అ. అహమ్ = నేను, తామ్ = ఆమెను, స్వయమ్ = స్వయముగా, త్యక్త్వా = విడచి, కామకారేణ = స్వేచ్ఛాచరణముచేత, ఇహ = ఇక్కడికి, న ఆగతః = రాలేదు. తయైవ = ఆమెచేతనే, ఉగ్రైః = తీవ్రములైన మాటలచేత, ప్రచోదితః = ప్రేరేపించబడినవాడనై, ఇహ = ఇక్కడికి, త్వత్సకాశమ్ = నీ సమీపమును గూర్చి, ఆగతః = వచ్చినాను.

తా. నేను నా అంతట నేనుగా ఆమెను విడచి, నా యిష్టము ప్రకారము ప్రవర్తించుచు ఇక్కడికి రాలేదు. తీవ్రములైన మాటలు పలికి ఆమె నన్ను ప్రేరేపించుటచే నేను ఇక్కడికి, నీ దగ్గరకు వచ్చినాను. 6

మూ. ఆర్యేణేవ పరాక్రుష్టం హా సీతే లక్ష్మణేతి చ,
పరిత్రాహీతి యద్వాక్యం మైథిల్యాస్తచ్ఛ్రుతిం గతమ్. 7

ప్ర. అ. హా సీతే = అయ్యో సీతా! హా లక్ష్మణ = అయ్యో లక్ష్మణా, ఇతి చ = అని, పరిత్రాహి ఇతి = రక్షించుము అని, యత్ = ఏ, వాక్యము, ఆర్యేణేవ = పూజ్యుడవైన నీచేత వలె, పరాక్రుష్టమ్ = అరవబడినదో, తత్ = అది, మైథిల్యాః = సీతయొక్క, శ్రుతిమ్ = చెవిని, గతమ్ = పొందినది.

తా. "అయ్యో! సీతా!" "అయ్యో! లక్ష్మణా!" అనీ, "రక్షించుము"అనీ వాక్యము నీవే పలికినట్లుగా సీత చెవికి వినబడినది. 7

మూ. సా తమార్తస్వరం శ్రుత్వా తవ స్నేహేన మైథిలీ,
గచ్ఛ గచ్ఛేతి మామాహ రుదన్తీ భయవిహ్వలా. 8

ప్ర. అ. సా మైథిలీ = ఆ సీత, తమ్ = ఆ, ఆర్తస్వరమ్ = దుఃఖితస్వరమును, శ్రుత్వా = విని, రుదన్తీ = ఏడ్చుచు, తవ స్నేహేన = నీమీద నున్న ప్రేమచేత, భయవిహ్వలా = భయముచేత వ్యాకులురాలై, గచ్ఛ గచ్ఛ ఇతి = వెళ్లుము వెళ్లుము అని, మామ్ = నన్ను గూర్చి, ఆహ = పలికెను.

తా. సీత ఆ దీనస్వరమును వినగానే నీపై ఉన్న ప్రేమచేత భయభ్రాంతురాలై, ఏడ్చుచు, ''వెళ్లుము వెళ్లుము''అని నాతో పలికెను. 8

మూ. ప్రచోద్యమానేన మయా గచ్ఛేతి బహుశ స్తయా,
ప్రత్యుక్తా మైథిలీ వాక్యమిదం త్వత్ప్రత్యయాన్వితమ్. 9

ప్ర. అ. గచ్ఛ ఇతి = వెళ్లుము అని, తయా = ఆమెచేత, బహుశః = అనేకపర్యాయములు, ప్రచోద్యమానేన = ప్రేరేపింపబడుచున్న, మయా = నాచేత, మైథిలీ = సీత, త్వత్ప్రత్యయాన్వితమ్ = నీమీద(నాకున్న) నమ్మకముతో కూడిన, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యుక్తా = పలకబడినది.

తా. ''వెళ్లుము వెళ్లుము''అని ఆమె అనేకపర్యాయములు ప్రేరేపించగా నేను నీ విషయమునందు నాకున్న విశ్వాసమును ప్రకటించుచు ఇట్లు పలికితిని. 9

మూ. న తత్పశ్యామ్యహం రక్షో యదస్య భయమావహేత్,
నిర్వృతా భవ నాస్త్యేతత్కేనాప్యేతదుదాహృతమ్. 10

ప్ర. అ. అస్య = ఈ రామునకు, యత్ = ఏ రాక్షసుడు, భయమ్ = భయమును, ఆవహేత్ = కలిగించునో, తత్ = అట్టి, రక్షః = రాక్షసుణ్ణి, అహమ్ = నేను, న పశ్యామి = చూడను. నిర్వృతా = సుఖము గలదానవు, భవ = అగుము. ఏతత్ = ఇది, నాస్తి = లేదు. కేనాపి = ఎవనిచేతనో, ఏవమ్ = ఇట్లు, ఉదాహృతమ్ = పలకబడినది.

తా. రామునకు భయము కలిగించ గల రాక్షసుడు ఉంటా డని నేను తలవను. నీవు నిర్భయముగా ఉండుము. ఇదంతా అసత్యము. ఎవ్వడో ఈ విధముగా అరచినాడు. 10

మూ. విగర్హితం చ నీచం చ కథమార్యోఽభిధాస్యతి,
త్రాహీతి వచనం సీతే యస్త్రాయేత్త్రిదశానపి. 11

ప్ర. అ. సీతే = సీతా ! యః = ఏ అన్నగారు, త్రిదశానపి = దేవతలను కూడ, త్రాయేత్ = రక్షించునో, ఆర్యః = అట్టి మా అన్నగారు, విగర్హితమ్ = నింద్యము, నీచం చ = నీచమూ అయిన, త్రాహి ఇతి = రక్షించుము అని, వచనమ్ = వచనమును, కథమ్ = ఎట్లు, అభిధాస్యతి = పలుకును ?

తా. సీతా ! దేవతలను కూడా రక్షింప సమర్థుడైన మా అన్నగారు,

నింద్యము, నీచము అయిన "రక్షించుము రక్షించుము" అను మాట ఎన్నడైనా పలుకునా ? 11

మూ. కింనిమిత్తం తు కేనాపి భ్రాతురాలమ్బ్య మే స్వరమ్,
రాక్షసేనేరితం వాక్యం త్రాహి త్రాహీతి శోభనే. 12

ప్ర. అ. శోభనే = శుభప్రదురాలా ! కిం నిమిత్తం తు = ఏ కారణము చేతనో, కేనాపి రాక్షసేన = ఎవ్వడో రాక్షసునిచేత, మే భ్రాతుః = నా సోదరుని యొక్క, స్వరమ్ = స్వరమును, ఆలమ్బ్య = గ్రహించి, త్రాహి త్రాహి ఇతి = రక్షించుము రక్షించుము అని, వాక్యమ్ = వాక్యము, ఈరితమ్ = పలకబడినది.

తా. మంగళప్రదురాలా ! ఎవ్వడో రాక్షసుడు, ఎందుచేతనో నా సోదరుని కంఠస్వరముతో "రక్షించుము రక్షించుము" అను వాక్యము పలికినాడు. 12

మూ. విస్వరం వ్యాహృతం వాక్యం లక్ష్మణ త్రాహి మామితి,
న భవత్యా వ్యథా కార్యా కునారీజనసేవితా. 13

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! మామ్ = నన్ను, త్రాహి = రక్షించుము, ఇతి = అని, విస్వరమ్ = విపరీతస్వరము గల, వాక్యమ్=వాక్యము, వ్యాహృతమ్ = పలకబడినది. భవత్యా = నీచేత. కునారీజనసేవితా = సామాన్యస్త్రీజనముచేత సేవింపబడిన, వ్యథా = వ్యథ, న కార్యా = చేయదగినది కాదు.

తా. "లక్ష్మణా ! నన్ను రక్షించుము" అని విపరీతస్వరముతో ఎవ్వరో అరచినారు. నీవు సాధారణస్త్రీ వలె వ్యథ చెందకూడదు. 13

మూ. అలం వైక్లబ్యమాలమ్బ్య స్వస్థా భవ నిరుత్సుకా,
న సోఽస్తి త్రిషు లోకేషు పుమాన్వై రాఘవం రణే,

జాతో వా జాయమానో వా సంయుగే యః పరాజయేత్,
న జయ్యో రాఘవో యుద్ధే దేవైః శక్రపురోగమైః. 15

ప్ర. అ. వైక్లబ్యమ్ = వ్యాకులత్వమును, ఆలమ్బ్య = అవలంబించి, అలమ్ = చాలును, నిరుత్సుకా = తొందర లేనిదానవై, స్వస్థా భవ = స్వస్థురాలవు అగుము. యః = ఎవడు, సంయుగే రణే = తీవ్రమైన యుద్ధము

నందు, రాఘవమ్ = రాముణ్ణి, పరాజయేత్ = ఓడించునో, సః = అట్టి, పుమాన్ = పురుషుడు, త్రిషు లోకేషు = మూడు లోకములందూ కూడ, జాతో వా = పుట్టి ఉన్నవాడు కాని, జాయమానో వా = పుట్ట నున్నవాడు గాని, నాస్తి = లేడు. రాఘవః = రాముడు, శక్రపురోగమైః = దేవేంద్రుడు మొదలైన, దేవైః = దేవతలచేత, యుద్ధే = యుద్ధమునందు, న జయ్యః = జయింప శక్యము కాని వాడు.

తా. మనస్సు కలత చెందనీయకుము. ఏమైనదా అని చింతించకుము. స్వస్థురాలవై ఉండుము. యుద్ధములో రాముణ్ణి ఓడించగలిగినవాడు ఇంతవరకు పుట్టి ఉండలేదు. ఇటుపైన పుట్టడు. దేవేంద్రుడు మొదలైన దేవతలు కూడ రాముణ్ణి యుద్ధములో జయించజాలరు. 14, 15

మూ. ఏవముక్తా తు వైదేహీ పరిమోహితచేతనా,
ఉవాచాశ్రూణి ముఞ్చన్తీ దారుణం మామిదం వచః. 16

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, వైదేహీ = సీత, పరిమోహితచేతనా = మోహింపచేయబడిన బుద్ధి గలదై, అశ్రూణి = కన్నీళ్ళను, ముఞ్చన్తీ = విడచుచున్నదై, మామ్ = నన్ను గూర్చి, ఇదం వచః = ఈ వచనమును, ఉవాచ = పలికెను.

తా. నా మాటలు వినిన పిమ్మట గూడ సీత మోహము చెందిన మనస్సుతో కన్నీళ్ళు కార్చుచు అతిక్రూరమైన మాటలు ఇట్లు పలికెను. 16

మూ. భావో మయి తవాత్యర్థం పాప ఏవ నివేశితః,
వినష్టే భ్రాతరి ప్రాప్తుం న చ త్వం మామవాప్స్యసి. 17

ప్ర. అ. భ్రాతరి = సోదరుడు, వినష్టే = నశించినవాడగుచుండగా, ప్రాప్తుమ్ = పొందుటకు, మయి = నాయందు, అత్యర్థమ్ = మిక్కిలి, పాపః ఏవ = పాపమైన, తవ = నీయొక్క, భావః = భావము, నివేశితః = ఉంచబడినది. త్వమ్ = నీవు, మామ్ = నన్ను, న చ అవాప్స్యసి = పొందవు.

తా. నీ సోదరుడు మరణించిన తరువాత నన్ను పొందవలెనని నా విషయమునందు చాల పాపమైన భావముతో ఉన్నావు. కాని నీవు నన్నెన్నటికీ పొందజాలవు.

మూ. సంకేతాద్భరతేన త్వం రామం సమనుగచ్ఛసి,
క్రోశన్తం హి యథాత్యర్థం నైవమభ్యవపద్యసే. 18

ప్ర. అ. అత్యర్థమ్ = మిక్కిలి, క్రోశన్తమ్ = అరచుచున్న ఆ రాముణ్ణి, యథా = ఎట్లు, ఏవమ్ = ఈ విధముగా, నాభ్యవపద్యసే = పొందుటలేదో, దానిని పట్టి, త్వమ్ = నీవు, భరతేన = భరతునితో, సంకేతాత్ = సంకేతమువలన, రామమ్ = రాముణ్ణి, నాభ్యవపద్యసే = చేరుట లేదు.

తా. రాముడు అంతగా అరచుచున్నా కూడ నీవు ఆతనివద్దకు వెళ్ళుటలేదనగా నీవు భరతునితో ఏవో ఏర్పాట్లు చేసికొనుటచేతనే అట్లు చేయుచున్నావు.

మూ. రిపుః ప్రచ్ఛన్నచారీ త్వం మదర్థమనుగచ్ఛసి,
రాఘవస్యాన్తరప్రేప్సుస్తథైనం నాభిపద్యసే. 19

ప్ర. అ. ప్రచ్ఛన్నచారీ = రహస్యముగా సంచరించుచున్న, రిపుః = శత్రువైన, త్వమ్ = నీవు, రాఘవస్య = రామునియొక్క, అన్తరప్రేప్సుః = అవకాశమును (ఛిద్రమును) అన్వేషించుచున్నవాడవై, మదర్థమ్ = నాకొరకే, అనుగచ్ఛసి = అనుసరించి వచ్చుచున్నావు. తథా = అట్లు(ఆ కారణముచేతనే), ఏనమ్ = ఈ రాముణ్ణి, నాభిపద్యసే = పొందుటలేదు.

తా. ఎప్పుడు అవకాశము దొరకునా అని చూచుచు, నా నిమిత్తమై అనుసరించి వచ్చుచున్నావు. నీవు రాముని ప్రచ్ఛన్నశత్రువు. అందుచేతనే ఆతనివద్దకు వెళ్ళుటలేదు. 19

మూ. ఏవముక్తో హి వైదేహ్యా సంరబ్ధో రక్తలోచనః,
క్రోధాత్ప్రస్ఫురమాణోష్ఠ ఆశ్రమాదభినిర్గతః. 20

ప్ర. అ. వైదేహ్యా = సీతచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడినవాడనై, సంరబ్ధః = తొందరపడుచు, క్రోధాత్ = కోపమువలన, రక్తలోచనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడనై, స్ఫురమాణోష్ఠః = కదలుచున్న పెదవులు కలవాడనై, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, అభినిర్గతః = బయలుదేరితిని.

తా. నేను సీత మాటలు విని, కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో, కదలుచున్న పెదవులతో తొందరగా ఆశ్రమమునుండి బయలుదేరివచ్చితిని. 20

మూ. ఏవం బ్రువాణం సౌమిత్రిం రామః సంతాపమోహితః,
అబ్రవీద్దుష్కృతం సౌమ్య తాం వినా యత్త్వమాగతః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, సంతాపమోహితః = దుఃఖముచేత మోహితుడైన, రామః = రాముడు, అబ్రవీత్ = పలికెను. సౌమ్య = సౌమ్యుడా : యత్ = ఏ కారణము వలన, త్వమ్ = నీవు, తాం వినా = సీత లేకుండగా, ఆగతః = వచ్చినావో, ఆ కారణమువలన, దుష్కృతమ్ = చెడ్డ పని, కృతమ్ = చేయబడినది.

తా. దుఃఖముతో నిండి యున్న రాముడు లక్ష్మణుని మాటలు విని ఇట్లు పలికెను. "లక్ష్మణా ! నీవు సీతను విడచి వచ్చితివి; నీవు చేసిన పని మంచిది కాదు.'' 21

మూ. జానన్నపి సమర్థం మాం రక్షసాం వినివారణే,
అనేన క్రోధవాక్యేన మైథిల్యా నిస్సృతో భవాన్. 22

ప్ర. అ. మామ్ = నన్ను, రక్షసామ్ = రాక్షసులయొక్క. వినివారణే = నివారించుటయందు, సమర్థమ్ = సమర్థుణ్ణిగా, జానన్నపి = ఎరిగినవాడ వైనను, భవాన్ = నీవు, మైథిల్యాః = సీతయొక్క, అనేన = ఈ, క్రోధవాక్యేన = కోపముతో కూడిన వాక్యముచేత, నిస్సృతః = వచ్చివేసినావు :

తా. రాక్షసులను నివారించుటలో నేను సమర్థుడ ననే విషయము తెలిసి ఉండి కూడ నీవు సీత కోపముతో ఏమేమో అన్నది కదా అని వచ్చివేసినావు. 22

మూ. న హి తే పరితుష్యామి త్యక్త్వా యద్యాసి మైథిలీమ్,
క్రుద్ధాయాః పరుషం శ్రుత్వా తాం విహాయ త్వమాగతః.

ప్ర. అ. మైథిలీమ్ = సీతను, త్యక్త్వా = విడచి, యద్యాసి = వచ్చుచున్నావే, తే = నీకు, న పరితుష్యామి = సంతోషించను. త్వమ్ = నీవు క్రుద్ధాయాః = కోపించిన ఆమెయొక్క, పరుషమ్ = పరుషవాక్యమును, శ్రుత్వా = విని, తామ్ = ఆమెను, విహాయ = విడచి, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావు.

తా. నీవు సీతను విడచి వచ్చేసినావు ! ఈ విషయము నాకేమాత్రము

సంతోషజనకముగా లేదు. ఆమె కోపములో ఏమో పరుషముగా మాటలాడినదని ఆమెను విడచివచ్చినావా ! 23

మూ. సర్వథా త్వవినీతం తే సీతయా యత్ప్రచోదితః,
క్రోధస్య వశమాపన్నో నాకరోః శాసనం మమ. 24

ప్ర. అ. సీతయా = సీతచేత, ప్రచోదితః = ప్రేరేపింపబడినవాడవై, క్రోధస్య = కోపముయొక్క, వశమ్ = వశమును, ఆగతః = పొందినవాడవై, మమ = నాయొక్క, శాసనమ్ = శాసనమును, నాకరోః ఇతి యత్ = చేయలేదనునది ఏది కలదో, ఇది, సర్వథా = అన్ని విధములా, తే = నీయొక్క, అవినీతమ్ = పొరబాటు.

తా. సీత ప్రేరేపింపగా, నీవు కోపమునకు వశుడవైపోయి నా ఆజ్ఞప్రకారము చేయలేదు. నీవు అన్ని విధములా పెద్ద తప్పు చేసినావు. 24

మూ. అసౌ హి రాక్షసః శేతే శరేణాభిహతో మయా,
మృగరూపేణ యేనాహమాశ్రమాదపవాహితః. 25

ప్ర. అ. మృగరూపేణ=మృగరూపము గల, యేన=ఎవనిచేత, అహమ్ = నేను, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, అపవాహితః = తొలగించబడితినో, అసౌ రాక్షసః = ఈ రాక్షసుడు, మయా = నాచేత, శరేణ = బాణముచేత, అభిహతః = కొట్టబడినవాడై, శేతే = శయనించి ఉన్నాడు.

తా. మృగరూపము ధరించి నన్ను ఆశ్రమమునుండి దూరముగా తీసికొనిపోయిన ఈ రాక్షసుణ్ణి నేను బాణముచేత కొట్టివేయగా వీడిక్కడ పడి ఉన్నాడు.

మూ. వికృష్య చాపం పరిధాయ సాయకం
సలీలబాణేన చ తాడితో మయా,
మార్గీం తనుం త్యజ్య సవిక్లబస్వరో
బభూవ కేయూరధరః స రాక్షసః. 26

ప్ర. అ. మయా = నాచేత, చాపమ్ = ధనస్సును, వికృష్య = లాగి, సాయకమ్ = బాణమును, పరిధాయ = ప్రయోగించి, సలీలబాణేన = విలాసముతో

కూడిన బాణముచేత, తాడితః = కొట్టబడిన, సః = ఆ మృగము, మార్గీమ్ = మృగసంబంధమైన, తనుమ్ = శరీరమును, త్యజ్య = విడచి, సవిక్లబస్వరః = దీనస్వరము కలవాడైన, కేయూరధరః = బాహుపురులు ధరించిన, రాక్షసః = రాక్షసుడుగా, బభూవ = ఆయెను.

తా. నేను ధనస్సును లాగి, బాణమును సంధించి అనాయాసముగా బాణముతో కొట్టగా ఆ మృగము, మృగశరీరము విడచి, దీనముగా అరచుచు, బాహుపురులు మొదలైన అలంకారములు ధరించిన రాక్షసుడుగా మారినది. 26

వి. ఈ శ్లోకంలోని 'సలీలబాణేన' ఇత్యాదులు అంతగా ప్రకరణోచితములుగా లేవు. ఇది ప్రాచ్యపాఠంలో లేదు.

మూ. శరాహతేనైవ తదార్తయా గిరా
స్వరం సమాలమ్బ్య సుదూరసుశ్రవమ్,
ఉదాహృతం తద్వచనం సుదారుణం
త్వమాగతో యేన విహాయ మైథిలీమ్. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, శరాహతేనైవ = శరముచేత కొట్టబడిన ఆ రాక్షసునిచేత, ఆర్తయా = దీనమైన, గిరా = వాక్కుతో, సుదూరసుశ్రవమ్ = చాలదూరమువరకు బాగుగా వినశక్యమైన, స్వరమ్ = స్వరమును, సమాలమ్బ్య = అవలంబించి, సుదారుణమ్ = చాల దారుణమైన, తత్ = ఆ, వచనమ్ = వచనము, ఉదాహృతమ్ = పలకబడినది. యేన = దేనిచేత, త్వమ్ = నీవు, మైథిలీమ్ = సీతను, విహాయ = విడచి, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావో.

తా. నేను బాణముచేత కొట్టగా, అప్పుడాతడు దుఃఖభరితమైన వాక్కుతో చాల దూరమువరకు వినబడే స్వరమును అవలంబించి, దారుణమైన ఆ వచనము పలికినాడు. అది వినియే నీవు సీతను విడిచి వచ్చినావు. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
ఏబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ షష్టితమః సర్గః

[రాముడు సీతను గూర్చి వృక్షములను, జంతువులను అడుగుచు, విలపించుచు సీతను అన్వేషించుట].

మూ. భృశమావ్రజమానస్య తస్యాధో వామలోచనమ్,
ప్రాస్ఫురచ్చాస్ఖలద్రామో వేపథుశ్చాస్య జాయతే. 1

ప్ర. అ. ఆవ్రజమానస్య=నడచుచున్న, తస్య=ఆ రామునియొక్క, వామలోచనమ్ = ఎడమకన్ను, అధః = క్రింది భాగమునందు, భృశమ్ = మిక్కిలి, ప్రాస్ఫురత్ = అదరెను. రామః = రాముడు, ప్రాస్ఖలచ్చ = త్రొట్రుపడెను. అస్య = ఈతనికి, వేపథుశ్చ = కంపము కూడ, జాయతే = కలిగెను.

తా. నడచి వెళ్ళుచున్న రాముని ఎడమ కన్ను క్రింది భాగమునందు అదరెను. ఆతని పాదములు తడబడెను. ఆతనికి వణకు పుట్టెను. 1

మూ. ఉపాలక్ష్య నిమిత్తాని సోఽశుభాని ముహుర్ముహుః,
అపి క్షేమం ను సీతాయా ఇతి వై వ్యాజహార చ 2

ప్ర. అ. సః = ఆ రాముడు, అశుభాని = అశుభములైన, నిమిత్తాని = నిమిత్తములను, ఉపాలక్ష్య = చూచి, సీతాయాః = సీతకు, క్షేమమ్ అపి ను = క్షేమము అయి ఉండునా అని, ముహుర్ముహుః = మాటిమాటికి, వ్యాజహార చ = = పలికెను.

తా. రాముడు ఆ అశుభశకునములు చూచి, "సీత క్షేమముగానే ఉండి ఉండునా" అని మాటిమాటికి పలుకుచు వాపోయెను. 2

మూ. త్వరమాణో జగామాథ సీతాదర్శనలాలసః,
శూన్యమావసథం దృష్ట్వా బభూవోద్విగ్నమానసః. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, త్వరమాణః = తొందరపడుచున్నవాడై, సీతాదర్శనలాలసః = సీతను చూచుటయందు ఆసక్తి కలవాడై, జగామ = వెళ్లెను. శూన్యమ్ = శూన్యమైన, అవసథమ్ = గృహమును, దృష్ట్వా = చూచి, ఉద్విగ్నమానసః = దుఃఖించిన మనస్సు కలవాడు, బభూవ = ఆయెను.

తా. సీతను చూడవలెనను ఆసక్తితో తొందరపడుచు వెళ్ళిన రాముడు పర్ణశాల శూన్యముగా ఉండుట చూడగానే ఆతని మనస్సు దిగులు చెందెను. 3

మూ. ఉద్భ్రమన్నివ వేగేన విక్షిపన్రఘునన్దనః,
తత్ర తత్రోటజస్థానమభివీక్ష్య సమన్తతః. 4

దదర్శ పర్ణశాలాం చ రహితాం సీతయా తదా,
శ్రియా విరహితాం ధ్వస్తాం హేమన్తే పద్మినీమివ. 5

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, వేగేన = వేగముచేత, ఉద్భ్రమన్నివ = తిరిగిపోవుచున్నవాడు వలె, విక్షిపన్ = హస్తపాదాదులు విసరుచు, తత్ర తత్ర = అక్కడక్కడ, ఉటజస్థానమ్ = పర్ణశాలాస్థానమును, సమన్తతః = నలు వైపులా, అభివీక్ష్య = చూచి, తదా = అప్పుడు, సీతయా = సీతతో, రహితామ్ = శూన్యమైనదీ, హేమన్తే = హేమంత ఋతువునందు, ధ్వస్తామ్ = నశించిన, పద్మినీమివ = పద్మలతవలె, శ్రియా = శోభతో, విరహితామ్ = శూన్యమూ అయిన, పర్ణశాలామ్ = పర్ణశాలను, దదర్శ = చూచెను.

తా. రాముడు వేగముగా తిరిగిపోవుచున్నాడా అన్నట్లు హస్తపాదాదులు విసరివేయుచు, పర్ణశాల ఉన్న ప్రదేశమును అంతా వెదకెను. అతనికి సీత లేని పర్ణశాల కనబడెను. అది హేమంతర్తువులో పద్మము లన్నీ నశించగా శోభా విహీన మైన పద్మలత వలె కాంతివిహీనమై ఉండెను. 4, 5

మూ. రుదన్తమివ వృక్షైశ్చ మ్లానపుష్పమృగద్విజమ్,
శ్రియా విహీనం విధ్వస్తం సంత్యక్తవనదేవతమ్ 6

విప్రకీర్ణాజినకుశం విప్రవిద్ధబుసీకటమ్,
దృష్ట్వా శూన్యం నిజస్థానం విలలాప పునః పునః. 7

ప్ర. అ. వృక్షైః = వృక్షములచేత, రుదన్తమివ = ఏడ్చుచున్నట్లున్నది, మ్లానపుష్పమృగద్విజమ్ = వాడిపోయిన పుష్పములు, మృగములు, పక్షులు కలది, శ్రియా = శోభతో, విహీనమ్ = శూన్యమైనదీ, విధ్వస్తమ్ = చేడిపోయినది, సంత్యక్తవనదేవతమ్ = విడువబడిన వనదేవతలు కలది, విప్రకీర్ణాజినకుశమ్ = చెల్లాచెదరుచేయబడిన కృష్ణాజినములు దర్భలు కలది, విప్రవిద్ధబ్రుసీకటమ్ = చిమ్మివేయబడిన దర్భాసనములు చాపలు కలది, శూన్యమ్ = శూన్యమూ అయిన, నిజస్థానమ్ = తన నివాసస్థానమును, దృష్ట్వా = చూచి, పునః పునః = మాటి మాటికి, విలలాప = విలపించెను.

తా. రాముని ఆశ్రమములో ఉన్న వృక్షములు ఏడ్చుచున్నట్లు కనబడు చుండెను. పుష్పములు వాడిపోయెను. మృగములు, పక్షులు దీనములై ఉండెను. ఆ ప్రాంతమంతా శోభావిహీనమై పాడుపడి ఉండెను. వనదేవతలు ఆ ప్రదేశమును విడచి వెళ్ళిపోయిరి. కృష్ణాజినములు, దర్భలు, దర్భాసనములు, చాపలు చెల్లా చెదరుగా పడి ఉండెను. ఈ విధముగా శూన్యముగా ఉన్న ఆ ప్రదేశమును చూచి రాముడు మాటిమాటికి విలపించెను. 6,7

మూ. హృతా మృతా వా నష్టా వా భక్షితా వా భవిష్యతి,
నిలీనాప్యథవా భీరురథవా వనమాశ్రితా. 8

ప్ర. అ. భీరుః = భయస్వభావము గల సీత, హృతా = హరించబడినదో, మృతా వా = మరణించినదో, నష్టా వా = తప్పిపోయినదో, భక్షితా వా = భక్షించ బడినదో, భవిష్యతి = కాగలదు (అయి ఉండును). అథవా = లేక, నిలీనా = దాగినదో, అథవా = లేక, వనమ్ = వనమును, ఆశ్రితా = ఆశ్రయించినదో.

తా. భయస్వభావము గల సీతను ఎవరో హరించి ఉందురు. లేదా ఆమె మరణించి ఉండును. లేదా తప్పిపోయి ఉండును. లేదా ఎవరో ఆమెను భక్షించి ఉందురు. లేదా ఎక్కడనైనా దాగియుండును. లేదా వనములోనికి వెళ్ళియుండును.

మూ. గతా విచేతుం పుష్పాణి ఫలాన్యపి చ వా పునః,
అథవా పద్మినీం యాతా జలార్థం వా నదీం గతా. 9

ప్ర. అ. అపివా = లేదా, పుష్పాణి = పుష్పములను, ఫలాని చ = ఫలములను, విచేతుమ్ = కోయుటకు, గతా = వెళ్ళినదా? అథవా = లేక, పద్మి

నీమ్ = పద్మసరస్సును గూర్చి, యాతా = వెళ్ళినదా? జలార్థమ్ = నీటికొరకై, నదీమ్ = నదిని గూర్చి, గతా = వెళ్ళినదా?

తా. లేదా ఆమె పుష్పములు, ఫలములు కోయుటకై వెళ్ళి యుండును, లేదా పద్మసరస్సుకు వెళ్ళి యుండును. లేదా నీటికొరకై నదికి వెళ్ళి ఉండును. 9

మూ. యత్నాన్మృగయమాణస్తు నాససాద వనే ప్రియామ్,
శోకరక్తేక్షణః శోకాదున్మత్త ఇవ లక్ష్యతే. 10

ప్ర. అ. యత్నాత్ = ప్రయత్నమువలన, మృగయమాణః తు = వెదకుచున్నవాడైనను, వనే = వనమునందు, ప్రియామ్ = ప్రియురాలిని, నాససాద = పొందలేదు. శోకరక్తేక్షణః = శోకముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, శోకాత్ = శోకమువలన, ఉన్మత్త ఇవ = పిచ్చివాడు వలె, లక్ష్యతే = కనబడుచున్నాడు (చుండెను).

తా. రాముడు ప్రయత్నపూర్వకముగా ఎంత వెదకినను వనములో ప్రియురాలు కనబడక దుఃఖముచేత కళ్ళు ఎఱ్ఱబడగా, అప్పుడు శోకముతో పిచ్చివాడు వలె కనబడుచుండెను. 10

మూ. వృక్షాద్వృక్షం ప్రధావన్ స గిరేరద్రిం నదాన్నదీమ్,
బభూవ విలపన్రామః శోకార్ణవపరిప్లుతః. 11

ప్ర. అ. రామః = రాముడు, వృక్షాత్ = ఒక వృక్షమునుండి, వృక్షమ్ = మరొక వృక్షమును గూర్చి, గిరేః = ఒక పర్వతమునుండి, అద్రిమ్ = మరొక పర్వతమును గూర్చి. నదాత్ = కాలవనుండి, నదీమ్ = నదినిగూర్చి, ప్రధావన్ = పరుగెత్తుచు, విలపన్ = విలపించుచు, శోకార్ణవపరిప్లుతః = శోకసముద్రములో తేలుచున్నవాడు, బభూవ = ఆయెను

తా. రాముడు ఒక చెట్టుదగ్గరనుంచి మరొక చెట్టుదగ్గరకు ఒక పర్వతమునుండి మరొక పర్వతమువద్దకు, ఒక కాలువనుండి మరొక కాలువ దగ్గరికి పరుగెత్తుచు, విలపించుచు, శోకసముద్రములో తేలుచుండెను. 11

మూ. అపి కాచిత్త్వయా దృష్టా సా కదమ్బప్రియా ప్రియా,
కదమ్బ యది జానీషే శంస సీతాం శుభాననామ్. 12

ప్ర. అ. కదమ్బ = కదంబవృక్షమా! కదమ్బప్రియా = కదంబపుష్పములు ప్రియములుగా గల, ప్రియా = నా ప్రియురాలైన, సా = ఆ, కాచిత్ = ఒకానొక స్త్రీ, త్వయా = నీచేత, అపి దృష్టా = చూడబడినదా! జానీషే యది = నీవు ఎరిగి ఉన్నట్లయితే, శుభాననామ్ = మంగళకరమైన ముఖము గల, సీతామ్ = సీతను గూర్చి, శంస = చెప్పుము.

తా. కదంబవృక్షమా! నీ వెవరినైన ఒక స్త్రీని చూచినావా! ఆమె కదంబ పుష్పములమీద చాల ప్రేమ గలది; నా ప్రియురాలు. నీకు తెలిసినట్లయితే శుభమైన ముఖము గల సీతను గూర్చి చెప్పుము. 12

మూ. స్నిగ్ధపల్లవసంకాశా పీతకౌశేయవాసినీ,
శంసస్వ యది వా దృష్టా బిల్వ బిల్వోపమ స్తనీ. 13

ప్ర. అ. బిల్వ = బిల్వవృక్షమా! స్నిగ్ధపల్లవసంకాశా = నిగనిగలాడుచున్న చిగురుతో సమానమైనది, పీతకౌశేయవాసినీ = పసుపుపచ్చని పట్టుచీర ధరించినది, బిల్వోపమ స్తనీ = బిల్వఫలముల వంటి స్తనములుకలది అయిన నా ప్రియురాలు, యది వా దృష్టా = చూడబడినదా, శంసస్వ = చెప్పుము.

తా. ఓ! బిల్వవృక్షమా! బిల్వఫలముల వంటి స్తనములు గల నా ప్రియురాలిని చూచినచో చెప్పుము. ఆమె శరీరకాంతి చిగురు వలె మెరయుచుండును. ఆమె పసుపుపచ్చ రంగు పట్టు చీర కట్టుకొని ఉన్నది. 13

మూ. అథవార్జున శంస త్వం ప్రియాం తామర్జునప్రియామ్,
జనకస్య సుతా భీరుర్యది జీవతి వా న వా. 14

ప్ర. అ. అథవా = లేదా, అర్జున = ఓ! అర్జున (మద్ది) వృక్షమా! త్వమ్ = నీవు, అర్జునప్రియామ్ = అర్జునవృక్షములు ప్రియములుగా గల, తాం ప్రియామ్ = ఆ ప్రియురాలిని గూర్చి, శంస = చెప్పుము. భీరుః = భయస్వభావము గల, జనకస్య సుతా = జనకుని కుమార్తె, యది జీవతి వా = జీవించి ఉన్నదా, న వా = లేదా (చెప్పుము).

తా. అర్జునవృక్షమా! నా ప్రియురాలెక్కడ ఉన్నదో నీవైనా చెప్పుము.

ఆమెకు అర్జునవృక్షము లన్న చాల ప్రేమ. భయస్వభావము గల ఆ జనకరాజ పుత్రి జీవించి ఉన్నదో లేదో చెప్పుము.

మూ. కకుభః కకుభోరూం తాం వ్యక్తం జానాతి మైథిలీమ్,
యథా పల్లవపుష్పాఢ్యో భాతి హ్యేష వనస్పతిః. 15

ప్ర. అ. ఏషః = ఈ, వనస్పతిః=వృక్షము, పల్లవపుష్పాఢ్యః=చిగుళ్ళతోను పుష్పములతోను నిండినదై, యథా = ఎట్లు, భాతి = ప్రకాశించుచున్నదో (దీనినిపట్టి), కకుభః = కకుభవృక్షము, కకుభోరూమ్ = కకుభవృక్షము వంటి తొడలు గల, తామ్ = ఆ, మైథిలీమ్ = సీతను, వ్యక్తమ్ = నిశ్చయముగా, జానాతి = ఎరిగి ఉన్నది.

తా. ఈ కకుభవృక్షము పూవులతోను, చిగుళ్ళతోను నిండి ప్రకాశించుచున్నది. దీనికి కకుభవృక్షము మానువంటి తొడలు గల సీతను గూర్చి తప్పక తెలిసి ఉండును. 15

మూ. భ్రమరైరుపగీతశ్చ యథా ద్రుమవరో హ్యయమ్,
ఏష వ్యక్తం విజానాతి తిలకస్తిలకప్రియామ్. 16

ప్ర. అ. ద్రుమవరః = వృక్షములలో శ్రేష్ఠమైన, అయమ్ = ఈ, తిలకః =తిలకవృక్షము, యథా=ఎట్లు, భ్రమరైః = తుమ్మెదలచేత, ఉపగీతః = సమీపమునందే ఉండి గానమును వినిపింప చేయబడుచున్నదో (దానిని పట్టి), ఏషః = ఈ వృక్షము, తిలకప్రియామ్=తిలకము ప్రియముగా గల సీతను, వ్యక్తమ్ = నిశ్చయముగా, విజానాతి = ఎరుగును.

తా. వృక్షములలో శ్రేష్ఠమైన ఈ తిలకవృక్షమువద్దకు చేరి తుమ్మెదలు పాడుచున్నవి. దీనిని పట్టి ఈ వృక్షమునకు తిలకముపై ఎక్కువ ప్రేమ గల సీత తప్పక తెలిసి ఉండును. 16

మూ. అశోక శోకాపనుద శోకోపహతచేతసమ్, 17
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసందర్శనేన మామ్.

ప్ర. అ. శోకాపనుద=శోకమును తొలగించు, అశోక=అశోకవృక్షమా! ప్రియాసందర్శనేన= నా ప్రియురాలిని చూపుటచేత, శోకోపహతచేతసమ్ =

శోకముచేత పీడింపబడిన చిత్తము గల, మామ్ = నన్ను, క్షిప్రమ్ = శీఘ్రముగా, త్వన్నామానమ్ = నీ పేరు గలవానినిగా, కురు = చేయుము.

తా. శోకమును తొలగించు అశోకవృక్షమా! శోకముచేత పీడింపబడిన మనస్సు గల నాకు నా ప్రియురాలిని చూపించి, శీఘ్రముగా, నీ పేరుగలవానినిగా, అనగా అశోకుణ్ణిగా (శోకము లేనివానినిగా) చేయుము. 17

మూ. యది తాల త్వయా దృష్టా పక్వతాలఫలస్తనీ,
కథయస్వ వరారోహాం కారుణ్యం యది తే మయి. 18

ప్ర. అ. తాల=తాలవృక్షమా! పక్వతాలఫలస్తనీ=పక్వమైన తాటిపండ్లవంటి స్తనములు గల సీత, త్వయా = నీచేత, దృష్టా యది = చూడబడినట్లయితే, తే = నీకు, మయి = నాయందు, కారుణ్యం యది = జాలి ఉన్నట్లయితే, వరారోహామ్ = సుందరమైన కటిప్రదేశము గల ఆమెను గూర్చి, కథయస్వ = చెప్పుము.

తా. ఓ! తాలవృక్షమా! పక్వమైన తాలఫలముల వంటి స్తనములు గల సీతను నీవు చూచినావా? నీకు నాపై దయ ఉన్నచో, అందమైన కటిప్రదేశము గల ఆమె జాడ తెలుపుము. 18

మూ. యది దృష్టా త్వయా సీతా జమ్బు జమ్బూఫలోపమామ్,
ప్రియాం యది విజానీషే నిఃశఙ్కం కథయస్వ మే. 19

ప్ర. అ. జమ్బు = జంబూవృక్షమా! (నేరేడుచెట్టు), త్వయా=నీచేత, సీతా = సీత, యది దృష్టా = చూడబడినదా? జమ్బూఫలోపమామ్ = నేరేడు పండ్ల వలె (నున్నగా) ఉన్న శరీరముగల, ప్రియామ్ = ప్రియురాలిని, జానీషే యది = నీవు ఎరిగి ఉన్నట్లయితే, మే = నాకు, నిఃశఙ్కమ్=నిఃసందేహముగా, కథయస్వ = చెప్పుము.

తా. ఓ! జంబూవృక్షమా! నీవు సీతను చూచినావా? నేరేడిపండు వలె నున్నగా మెరయుచున్న శరీరము గల సీతను గూర్చి నీకు తెలిసినచో నిఃసంశయముగా నాకు చెప్పుము. 19

మూ. అహో త్వం కర్ణికారాద్య సుపుష్పైః శోభసే భృశమ్,
కర్ణికారప్రియా సాధ్వీ శంస దృష్టా ప్రియా యది. 20

ప్ర. అ. కర్ణికార ! కర్ణికారవృక్షమా ! త్వమ్ = నీవు, అద్య = ఇప్పుడు, సుపుష్పైః = అందమైన పుష్పములతో, భృశమ్ = మిక్కిలి, శోభసే = శోభించుచున్నావు. అహో = ఏమి సౌందర్యము ! కర్ణికారప్రియా = కర్ణికారపుష్పము ప్రియముగా గల, సాధ్వీ = పతివ్రతయైన, ప్రియా = నా ప్రియురాలు, దృష్టా యది = చూడబడినట్లయితే, శంస = చెప్పుము.

తా. ఓ ! కర్ణికారవృక్షమా ! నీవు ఇప్పుడు మంచి పుష్పములతో ఎంత ప్రకాశించుచున్నావు ! కర్ణికారపుష్పములపై మక్కువ గల పతివ్రత యైన నా ప్రియురాలిని నీవు చూచినావా ? చెప్పుము. 20

మూ. చూతనీపమహాసాలాన్ పనసాన్ కురవాన్ ధవాన్,
దాడిమానసనాన్ గత్వా దృష్ట్వా రామో మహాయశాః. 21
మల్లికా మాధవీశ్చైవ చమ్పకాన్ కేతకీ స్తథా,
పృచ్ఛన్రామో వనే భ్రాన్తః ఉన్మత్త ఇవ లక్ష్యతే. 22

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రామః = మనోహరుడైన, రామః = రాముడు, వనే = ఆ వనమునందు, చూతనీపమహాసాలాన్ = చూతవృక్షములను, నీపవృక్షములను, పెద్దమద్దిచెట్లను, పనసాన్ = పనసవృక్షములను, ధవాన్ = చంద్రచెట్లను, దాడిమాన్ = దానెమ్మచెట్లను, అసనాన్ = వేగిసచెట్లను, మల్లికాః = మల్లికాలతలను, మాధవీశ్చైవ = మాధవీలతలను, చమ్పకాన్ = సంపంగి చెట్లను, తథా = మరియు, కేతకీః = మొగలిచెట్లను, దృష్ట్వా = చూచి, గత్వా = వాటివద్దకు వెళ్ళి, పృచ్ఛన్ = అడుగుచు. భ్రాన్తః = తిరుగుచున్నవాడై, ఉన్మత్తః ఇవ = పిచ్చివాడు వలె, లక్ష్యతే = కనబడుచుండెను.

తా. గొప్ప కీర్తి గలవాడు, అందరికి మనోహరుడు అయిన రాముడు, ఆ వనములో ఇటు అటు తిరుగుచు, మామిడిచెట్లను, నీపవృక్షములను, పెద్ద సాలవృక్షములను, పనసచెట్లను, గోరింటచెట్లను, చంద్రచెట్లను, దానిమ్మచెట్లను, వేగిసచెట్లను, మల్లికాలతలను మాధవీలతలను, సంపెంగచెట్లను, మొగలిపొదలను చూచి, వాటి దగ్గరకు వెళ్ళి ప్రశ్నించుచు, పిచ్చివాడు వలె కనబడెను. 22

మూ. అథవా మృగశాబాక్షీం మృగ జానాసి మైథిలీమ్,
మృగవిప్రేక్షణీ కాన్తా మృగీభిః సహితా భవేత్. 23

ప్ర. అ. అథవా = లేదా, మృగ = మృగమా ! మృగశాబాక్షీమ్ = మృగ శిశువు నేత్రముల వంటి నేత్రములు గల, మైథిలీమ్ = సీతను, జానాసి = ఎరుగుదువా ? మృగవిప్రేక్షణీ = మృగముల వంటి నేత్రములు గల, కాన్తా = ఆ సీత, మృగీభిః = ఆడలేళ్ళతో, సహితా = కూడినది, భవేత్ = అయిఉండును.

తా. లేదా ఈ మృగమును అడిగెదను, ఓ ! మృగమా ! లేడిపిల్ల కళ్ళ వంటి కళ్లు గల, సీతను ఎరుగుదువా ? మృగము నేత్రముల వంటి నేత్రములు గల సీత మృగాలలో కలిసిపోయి యుండును. 24

మూ. గజ సా గజనాసోరూర్యది దృష్టా త్వయా భవేత్,
తాం మన్యే విదితాం తుభ్యమాఖ్యాహి వరవారణ. 25

ప్ర. అ. గజ = ఓ ! గజమా ! గజనాసోరూః = ఏనుగుతొండము వంటి తొడలు గల, సా = ఆ సీత, త్వయా = నీచేత, దృష్టా = చూడబడినది, యది భవేత్ = కావచ్చును. తామ్ = ఆమెను, తుభ్యమ్ = నీకు, విదితామ్ = తెలియబడినదానినిగా, మన్యే = తలచెదను. వరవారణ = ఓ ! శ్రేష్ఠమైన గజమా ! ఆఖ్యాహి = చెప్పుము.

తా. ఓ ! గజమా ! ఏనుగు తొండము వంటి తొడలు గల ఆ సీతను నీవు చూచి ఉండవచ్చును. ఓ ! శ్రేష్ఠమైన గజమా ! నీకు ఆమె తెలియు నని తలచెదను. అందుచేత చెప్పుము. 25

మూ. శార్దూల యది సా దృష్టా ప్రియా చన్ద్రనిభాననా,
మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయమ్. 26

ప్ర. అ. శార్దూల = ఓ ! శార్దూలమా (పెద్దపులి), చన్ద్రనిభాననా = చంద్రునితో సమానమైన ముఖము గల, ప్రియా = ప్రియురాలైన, సా మైథిలీ = ఆ సీత, దృష్టా యది = చూడబడినట్లయితే, విస్రబ్ధమ్ = నమ్మకముగా, మమ = నాకు, కథయస్వ = చెప్పుము. తే = నీకు, భయమ్ = భయము, న = లేదు.

తా. ఓ ! వ్యాఘ్రమా ! చంద్రునితో సమానమైన ముఖము గలది, నా

ప్రియురాలూ అయిన ఆ సీతను చూచినచో నిఃసందేహముగా చెప్పుము. నీకేమీ భయము లేదు. 25

మూ. కిం ధావసి ప్రియే దూరే దృష్టాసి కమలేక్షణే,
వృక్షైరాచ్ఛాద్య చాత్మానం కిం మాం న ప్రతిభాషసే.

ప్ర. అ. కమలేక్షణే = పద్మముల వంటి నేత్రములు గల, ప్రియే = ప్రియురాలా ! దూరే = దూరమునందు, కిమ్ = ఎందువలన, ధావసి = పరుగెత్తు చున్నావు ? దృష్టా = చూడబడినదానవు, అసి = అయినావు, ఆత్మానమ్ = తనను, వృక్షైః = వృక్షములచేత, ఆచ్ఛాద్య = కప్పికొని, మామ్ = నన్ను గూర్చి, కిమ్ = ఎందువలన, న ప్రతిభాషసే = పలుకుటలేదు ?

తా. పద్మముల వంటి నేత్రములు గల ఓ ప్రియురాలా ! దూరముగా పారిపోవుచున్నా వేమి ? నాకు కనబడితివిలే! చెట్ల చాటున దాగి యుండి నాకు బదులుచెప్పుట లేదేమి ? 26

మూ. తిష్ఠ తిష్ఠ వరారోహే న తేఽస్తి కరుణా మయి,
నాత్యర్థం హాస్యశీలాసి కిమర్థం మాముపేక్షసే. 27

ప్ర. అ. వరారోహే = సుందరమైన కటిప్రదేశము గలదానా ! తిష్ఠ తిష్ఠ = ఆగుము ఆగుము. తే = నీకు, మయి = నాయందు, కరుణా = కరుణ, నాస్తి = లేదా ? అత్యర్థమ్ = మిక్కిలి, హాస్యశీలా = హాస్యస్వభావము గల దానవు, నాసి = కావు. మామ్ = నన్ను, కిమర్థమ్ = ఎందుకు, ఉపేక్షసే = ఉపేక్షించుచున్నావు ?

తా. సుందరమైన కటిప్రదేశము గల ఓ ! సీతా ! ఆగుము, ఆగుము. నామీద జాలి లేదా ? నీకెప్పుడూ ఇంత పరిహాసము చేసే స్వభావము లేదుకదా! ఇప్పుడు నన్ను ఎందుకు ఉపేక్షించుచున్నావు ? 27

మూ. పీతకౌశేయకేనాసి సూచితా వరవర్ణిని,
ధావన్త్యపి మయా దృష్టా తిష్ఠ యద్యస్తి సౌహృదమ్. 28

ప్ర. అ. వరవర్ణిని = శ్రేష్ఠమైన శరీరవర్ణము గలదానా ! పీతకౌశేయ

కేన=పచ్చని పట్టుచీరచేత, సూచితా = సూచింపబడినదానవు, అసి = అయితివి.
ధావన్త్యపి = పరుగెత్తుచున్నదానవైనను, మయా=నాచేత, దృష్టా=చూడబడితివి,
సౌహృదమ్ = స్నేహము, అస్తి యది = ఉన్నట్లయితే, తిష్ఠ = నిలబడుము.

తా. శ్రేష్ఠమైన శరీరచ్ఛాయ గల ఓ ! సీతా ! నీ పచ్చని పట్టుచీరను బట్టి గుర్తించినానులే. నీవు పరుగెత్తుచున్నను చూచినాను. నా మీద నీకేమైన ప్రేమ ఉన్నచో ఆగుము.
28

మూ. నైవ సా నూనమథవా హింసితా చారుహాసినీ,
కృచ్ఛ్రప్రాప్తం న మాం నూనం యథోపేక్షితుమర్హతి.

ప్ర. అ. అథవా = లేదా, సా = ఆమె, నైవ = కాదు. చారుహాసినీ = అందమైన నవ్వు గల ఆ సీత, హింసితా = హింసించబడినది. నూనమ్ = నిశ్చయము. యథా = ఎట్లు, (ఎందువలన అనగా) కృచ్ఛ్రప్రాప్తమ్ = కష్టమును పొందిన, మామ్ = నన్ను, ఉపేక్షితుమ్ = ఉపేక్షించుటకు, నార్హతి = తగదు. నూనమ్ = నిశ్చయము.

తా. లేదా, ఆ కనబడినది సీత అయి ఉండదు. సుందరమైన చిరునవ్వు గల ఆమెను ఎవ్వరో చంపివేసి ఉందురు. ఎందుచేత ననగా ఇట్లు కష్టములో నన్ను ఆమె ఉపేక్షించదు. నిజము.
29

మూ. వ్యక్తం సా భక్షితా బాలా రాక్షసైః పిశితాశనైః,
విభజ్యాఙ్గాని సర్వాణి మయా విరహితా ప్రియా. 30

ప్ర. అ. మయా = నాతో, విరహితా=శూన్యురాలైన, ప్రియా=నాప్రియురాలైన, సా బాలా = చిన్న వయస్సులో ఉన్న ఆ సీత, వ్యక్తమ్ = స్పష్టముగా (నిజముగా), సర్వాణి = సమస్తమైన, అఙ్గాని = అవయవములను, విభజ్య = విభజించి (ఖండించి), పిశితాశనైః = పచ్చిమాంసమును తిను, రాక్షసైః = రాక్షసులచేత, భక్షితా = భక్షింపబడినది.

తా. చిన్న వయస్సులో ఉన్న నా ప్రియురాలిని, నేను దగ్గర లేకుండుటచే, పచ్చి మాంసము తినే రాక్షసులు, ఆమె అవయవము లన్నింటినీ ఖండించి తినివేసి ఉందురు, సందేహము లేదు.
30

మూ. నూనం తచ్ఛుభదన్తోష్ఠం సునాసం చారుకుణ్డలమ్,
పూర్ణచన్ద్రనిభం గ్రస్తం ముఖం నిష్ప్రభతాం గతమ్. 31

ప్ర. అ. నూనమ్ = నిశ్చయముగా, శుభదన్తోష్ఠమ్ = సుందరములైన దంతములు, పెదవులు గలది, సునాసమ్ = అందమైన ముక్కు గలది, చారుకుణ్డలమ్ = అందమైన కుండలములు గలది, పూర్ణచన్ద్రనిభమ్ = పూర్ణచంద్రునితో సమానమూ అయిన, తత్ = ఆ, ముఖమ్ = ముఖము, గ్రస్తమ్ = మింగివేయబడినదై, నిష్ప్రభతామ్ = కాంతి లేనిదగుటను, గతమ్ = పొందినది.

తా. అందమైన దంతములు, పెదవులు, ముక్కు, కుండలములూ గలది, పూర్ణచంద్రునితో సమానమూ అయిన ఆ ముఖము రాక్షసులు మింగివేయునపుడు కాంతివిహీనమై పోయి ఉండును. నిజము. 31

మూ. సా హి చమ్పకవర్ణాభా గ్రీవా గ్రైవేయశోభితా,
కోమలా విలపన్త్యాస్తు కాన్తాయా భక్షితా శుభా. 32

ప్ర. అ. విలపన్త్యాః = విలపించుచున్న, కాన్తాయాః = నా ప్రియురాలి యొక్క, చమ్పకవర్ణాభా = చంపకపుష్పముయొక్క వర్ణమువంటి కాంతి గలది, గ్రైవేయశోభితా = కంఠాలంకారముచేత ప్రకాశింప చేయబడినది, కోమలా = కోమలమూ, శుభా = సుందరమూ అయిన, సా గ్రీవా = ఆ కంఠము, భక్షితా = భక్షింపబడినది.

తా. నా ప్రియురాలు విలపించుచుండగా, బంగారు రంగు గలదై, కంఠాభరణములచేత అలంకరింపబడి, అందముగా ఉన్న కోమలమైన ఆమె కంఠమును రాక్షసులు భక్షించి ఉందురు. 32

మూ. నూనం విక్షిప్యమాణౌ తౌ బాహూ పల్లవకోమలౌ,
భక్షితౌ వేపమానాగ్రౌ సహస్తాభరణాఙ్గదౌ. 33

ప్ర. అ. విక్షిప్యమాణౌ = తొందరగా కదల్చబడుచున్నవీ, పల్లవకోమలౌ = చిగురు వలె కోమలములూ, వేపమానాగ్రౌ = వణకుచున్న అగ్రభాగములు కలవి, సహస్తాభరణాఙ్గదౌ = కంకణములతోను బాహుపురులతోను కూడినవీ అయిన, తౌ బాహూ = ఆ బాహువులు, నూనమ్ = నిశ్చయముగా, భక్షితౌ = భక్షింపబడినవి.

తా. చిగురు వలె కోమలముగా ఉన్న ఆమె బాహువులు కంకణములచేత, బాహుపురులచేత అలంకరింపబడి ఉన్నవి. వ్రేళ్ళు వణకిపోవుచున్న, ఆ బాహువులను ఆమె ఇటు నటు వేగముగా కదల్చుచుండగా వాటిని రాక్షసులు భక్షించి ఉందురు. నిజము. 33

మూ. మయా విరహితా బాలా రక్షసాం భక్షణాయ వై,
సార్థేనేవ పరిత్యక్తా భక్షితా బహుబాన్ధవా. 34

ప్ర. అ. బాలా = బాలయైన సీత, రక్షసామ్ = రాక్షసులయొక్క, భక్షణాయ వై = భక్షణముకొరకే, మయా = నాచేత, విరహితా = శూన్యురాలైనది. బహుబాన్ధవా = చాలమంది బంధువులు గల ఆ సీత, సార్థేన = వర్తకుల గుంపు చేత, పరిత్యక్తా ఇవ = విడువబడినది వలె, భక్షితా = భక్షించబడినది.

తా. రాక్షసులు భక్షించుటకే నేను సీతను వదలివెళ్ళినట్లు అయినది. ఎందరో బంధువు లున్న సీత కూడ వర్తకుల గుంపు విడచి వెళ్ళిపోయిన స్త్రీ వలె రాక్షసులచేత భక్షింపబడినది. 34

మూ హా లక్ష్మణ మహాబాహో పశ్యసి త్వం ప్రియాం క్వచిత్,
హా ప్రియే క్వ గతా భద్రే హా సీతేతి పునః పునః. 35

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, హా! లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! త్వమ్ = నీవు, క్వచిత్ = ఎక్కడనైనా, ప్రియామ్ = ప్రియురాలిని, పశ్యసి = చూచుచున్నావా? భద్రే = మంగళప్రదురాలైన, హా ప్రియే = అయ్యో ప్రియురాలా! క్వ = ఎక్కడికి, గతా = వెళ్ళినావు? హా సీతే = అయ్యో! సీతా! ఇతి = అని, పునః పునః = మాటిమాటికి (విలపించెను).

తా. "అయ్యో! మహాబాహువైన లక్ష్మణా! నీకు నా ప్రియురాలు ఎక్కడనైనా కనబడుచున్నదా? అయ్యో! మంగళప్రదురాలవైన ప్రియురాలా! ఎక్కడికి వెళ్ళినావు? అయ్యో! సీతా!" అని మాటి మాటికి అనుచు విలపించెను. 35

మూ. ఇత్యేవం విలపన్రామః పరిధావన్వనాద్వనమ్,
క్వచిదుద్భ్రమతే వేగాత్క్వచిద్విభ్రమతే బలాత్, 36
క్వచిన్మత్త ఇవాభాతి కాన్తాన్వేషణతత్పరః.

ప్ర. అ. రామః = రాముడు, ఇత్యేవమ్ = ఈ విధముగా, విలపన్ = విలపించుచు, వనాత్ = ఒక వనమునుండి, వనమ్ = మరొక వనమును గూర్చి, పరిధావన్ = పరుగెత్తుచు, క్వచిత్ = ఒకచోట, వేగాత్ = దుఃఖవేగమువలన, ఉద్భ్రమతే = తిరిగిపోవుచున్నాడు (తిరిగిపోవుచుండెను). క్వచిత్ = ఒకచోట, బలాత్ = దుఃఖప్రభావమువలన, విభ్రమతే = భ్రాంతి చెందుచున్నాడు (చెందుచుండెను). క్వచిత్ = మరొకచోట, కాన్తాన్వేషణతత్పరః = భార్యయొక్క, వెదకుటయందు ఆసక్తి కలవాడై, మత్తః ఇవ = మదించినవాడు వలె, ఆభాతి = ప్రకాశించుచుండెను.

తా. రాముడీ విధముగా విలపించుచు ఒక వనమునుండి మరొక వనమునకు తిరుగుచు, ఒక చోట దుఃఖవేగమువలన తిరిగిపోవుచున్నట్లు అయిపోయెను. మరొక చోట దుఃఖబలమువలన భ్రాంతి చెందుచుండెను. మరొక చోట భార్యను వెదకుటలో లగ్నమైన మనస్సుతో ఉన్మత్తుడు వలె అగుచుండెను. 36

మూ. స వనాని నదీః శైలాన్ గిరిప్రస్రవణాని చ, 37
కాననాని చ వేగేన భ్రమత్యపరిసంస్థితః.

ప్ర. అ. సః = ఆ రాముడు, వనాని = వనములను, నదీః = నదులను, శైలాన్ = పర్వతములను, గిరిప్రస్రవణాని చ = పర్వతముల జలపాతములను, కాననాని చ = అడవులను, అపరిసంస్థితః = ఒక్కచోట నిలబడనివాడై, వేగేన = వేగముతో, భ్రమతి = తిరుగుచుండెను.

తా. ఆ రాముడు ఒక్క చోట నిలకడ లేక, చాల వేగముగా, వనములకు, నదులవద్దకు, పర్వతములవద్దకు, పర్వతములపై ఉన్న సెలయేళ్ళవద్దకు, దట్టమైన అడవులకు వెళ్ళి ఇటు అటు తిరుగుచుండెను. 37

మూ. తథా స గత్వా విపులం మహద్వనం
పరీత్య సర్వం త్వథ మైథిలీం ప్రతి,
అనిష్ఠితాశః స చకార మార్గణే
పునః ప్రియాయాః పరమం పరిశ్రమమ్. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షష్టితమః సర్గః.

ఇతః = ఇక్కడినుండి, కం వా దేశమ్ = ఏ ప్రదేశమును గూర్చి, గతా = వెళ్ళినదో ! సౌమిత్రే = లక్ష్మణా ! కేన=ఎవనిచేత, ఆహృతా వా=హరింపబడినదో ! ప్రియా = ప్రియురాలు, కేన వా = ఎవనిచేత, భక్షితా = భక్షింపబడినదో !

తా. లక్ష్మణా ! సీత ఎక్కడ ఉన్నదో ! ఇక్కడినుండి ఏ ప్రదేశమునకు వెళ్ళినదో ! ఓ! సౌమిత్రీ ! ఆమెను ఎవరు హరించినారో ! నా ప్రియురాలిని ఎవరు భక్షించినారో ! 3

మూ. వృక్షేణావార్య యది మాం సీతే హసితుమిచ్ఛసి,
అలం తే హసితేనాద్య మాం భజస్వ సుదుఃఖితమ్. 4

ప్ర. అ. సీతే = సీతా ! వృక్షేణ=వృక్షముచేత, ఆవార్య = దాగి, మామ్ = నన్ను. హసితుమ్ = పరిహసించుటకు, ఇచ్ఛసి యది = ఇచ్ఛయించుచున్నట్లయితే, తే = నీయొక్క, హసితేన = పరిహాసముచేత, అలమ్ = చాలును. అద్య = ఇప్పుడు, సుదుఃఖితమ్ = చాల దుఃఖించుచున్న, మామ్=నన్ను, భజస్వ = పొందుము.

తా. సీతా ! నాతో పరియాచక మాడుటకై చెట్ల వెనుక దాగి యున్నావా? ఇంక ఈ పరిహాసము చాలును. చాల దుఃఖాక్రాంతుడనైన నన్ను పొందుము. 4

మూ. యైః సహ క్రీడసే సీతే విశ్వస్తైర్మృగపోతకైః,
ఏతే హీనాస్త్వయా సౌమ్యే ధ్యాయన్త్యాస్రావిలేక్షణాః. 5

ప్ర. అ. సౌమ్యే = సౌమ్యురాలవైన, సీతే = సీతా! విశ్వస్తైః = నీయందు నమ్మిక గల, యైః = ఏ, మృగపోతకైః సహ = లేడిపిల్లలతో, క్రీడసే = ఆడుకొనుచున్నావో, ఏతే = ఇవి, త్వయా=నీతో, హీనాః = శూన్యములైనవై, ఆస్రావిలేక్షణాః = కన్నీళ్ళచేత వ్యాకులమైన నేత్రములు కలవై, ధ్యాయన్తి = ఏమో ఆలోచించుచున్నవి.

తా. సౌమ్యురాల వైన ఓ ! సీతా ! నమ్మిక గల ఏ లేడిపిల్లలతో నీవు ఆడుకొనుచుండేదానవో ఆ లేడిపిల్లలు, నీవు కనబడకపోవుటచే, కన్నీళ్ళతో నిండిన కళ్ళతో విచారగ్రస్తములై నిలచి ఉన్నవి. 5

మూ. సీతయా రహితోఽహం వై న హి జీవామి లక్ష్మణ,
వృతం శోకేన మహతా సీతాహరణజేన మామ్. 6
పరలోకే మహారాజో నూనం ద్రక్ష్యతి మే పితా.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! సీతయా = సీతతో, రహితః = శూన్యుడనైన, అహమ్ = నేను, న హి జీవామి = జీవించను. సీతాహరణజేన = సీతను హరించుటవల్ల కలిగిన, మహతా = గొప్ప, శోకేన = శోకముతో, వృతమ్ = కూడిన, మామ్ = నన్ను, మహారాజః = మహారాజైన, మే పితా = నా తండ్రి, నూనమ్ = తప్పక, పరలోకే = పరలోకమునందు, ద్రక్ష్యతి = చూడగలడు.

తా. లక్ష్మణా ! నేను సీత లేకుండగా జీవించను కదా. సీతను హరించుట వలన కలిగిన గొప్ప శోకముతో బాధపడుచున్న నన్ను నా తండ్రియైన దశరథ మహారాజు తప్పక పరలోకములో చూడగలడు. 6

మూ. కథం ప్రతిజ్ఞాం సంశ్రుత్య మయా త్వమభియోజితః, 7
అపూరయిత్వా తం కాలం మత్సకాశమిహాగతః.
కామవృత్తమనార్యం మాం మృషావాదినమేవ చ, 8
ధిక్త్వామితి పరే లోకే వ్యక్తం వక్ష్యతి మే పితా.

ప్ర. అ. మామ్ = నన్ను గూర్చి, మయా = నాచేత, అభియోజితః = ఆజ్ఞాపింపబడిన, త్వమ్ = నీవు, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, సంశ్రుత్య = (ప్రతిజ్ఞ) చేసి, తం కాలమ్ = ఆ కాలమును, అపూరయిత్వా = నింపక, మత్సకాశమ్ = నా సమీపమును గూర్చి, కథమ్ = ఎట్లు, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావు? కామవృత్తమ్ = స్వేచ్ఛాప్రవృత్తిగలవాడవు, అనార్యమ్ = చెడ్డవాడవు, మృషావాదినమేవ చ = అసత్యముగా మాటలాడువాడవు అయిన, త్వామ్ = నిన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక, ఇతి = అని, పరే లోకే = పరలోకమునందు, మే పితా = నా తండ్రి, వ్యక్తమ్ = సత్యముగా, వక్ష్యతి = పలకగలడు.

తా. "నేను ఆజ్ఞాపించగా అట్లే చేసెద నని ప్రతిజ్ఞ చేసి, ఆ కాలమును పూర్తిచేయకుండగా ఇక్కడికి నాదగ్గరకు ఎట్లు వచ్చినావు? ఛీ! నీవు స్వేచ్ఛగా ప్రవర్తించేవాడవు. గౌరవమునకు అనర్హుడవు. అసత్యము పలుకువాడవు'' అని పరలోకములో నా తండ్రి నన్ను నిందించును. 7, 8

మూ. వివశం శోకసంతప్తం దీనం భగ్నమనోరథమ్, 9
మామిహోత్సృజ్య కరుణం కీర్తిర్నరమివానృజుమ్,
క్వ గచ్ఛసి వరారోహే మా మోత్సృజ సుమధ్యమే, 10
త్వయా విరహితశ్చాహం మోక్ష్యే జీవితమాత్మనః.

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా ! వివశమ్ = నా వశములో లేనివాడను, శోకసంతప్తమ్ = శోకముచేత పీడింపబడినవాడను, దీనమ్ = దీనుడను, భగ్నమనోరథమ్ = భగ్నమైన మనోరథము కలవాడను అయిన, మామ్ = నన్ను, కీర్తిః = కీర్తి, అనృజుమ్ = ఋజుస్వభావము లేని, నరమివ = మనుష్యుణ్ణి వలె, ఇహ = ఇక్కడ, కరుణమ్ = దీనునిగా, ఉత్సృజ్య = విడచి, క్వ గచ్ఛసి = ఎక్కడికి వెళ్ళుచున్నావు? సుమధ్యమే = మంచి నడుము గలదానా! మా = నన్ను, మా ఉత్సృజ = విడువకుము. త్వయా = నీతో, విరహితః = శూన్యుడనైన, అహమ్ = నేను, ఆత్మనః = నాయొక్క, జీవితమ్ = జీవితమును, మోక్ష్యే = విడువగలను.

తా. అందమైన కటిప్రదేశము, సుందరమైన నడుము గల సీతా ! శోకముచేత పీడింపబడి, వశము తప్పి, దీనుడనై, మనోరథము లన్నీ భగ్నమైపోయిన నన్ను, ఇక్కడ, కుటిలస్వభావము గలవానిని కీర్తి విడచి నట్లు, దీనునిగా విడచివేసి ఎక్కడకు వెళ్ళుచున్నావు ! నన్ను విడువకుము. నీవు నన్ను విడచి నచో నా జీవితమునే విడచెదను. 9, 10

మూ. ఇతీవ విలపన్ రామః సీతాదర్శనలాలసః, 11
న దదర్శ సుదుఃఖార్తో రాఘవో జనకాత్మజామ్.

ప్ర. అ. సీతాదర్శనలాలసః = సీతయొక్క దర్శనమునందు ఆసక్తి కలవాడు, సుదుఃఖార్తః = అధికముగా దుఃఖముచేత పీడితుడు, రాఘవః = రఘువంశమునకు చెందినవాడు అయిన, రామః = రాముడు, ఇతీవ = ఇట్లు, విలపన్ = విలపించుచు, జనకాత్మజామ్ = సీతను, న దదర్శ = చూడలేదు.

తా. సీతను చూడవలె నను తీవ్రాభిలాష గల, రఘువంశసంజాతుడైన ఆ రాముడు దుఃఖముతో చాల బాధపడుచు, ఈ విధముగా విలపించుచుండెను. అతనికి సీత కనబడలేదు. 11

మూ. అనాసాదయమానం తం సీతాం దశరథాత్మజమ్, 12
పఙ్కమాసాద్య విపులం సీదన్తమివ కుఞ్జరమ్,
లక్ష్మణో రామమత్యర్థమువాచ హితకామ్యయా. 13

ప్ర. అ. సీతామ్ = సీతను, అనాసాదయమానమ్ = పొందనివాడు, దశరథాత్మజమ్ = దశరథుని కుమారుడు, విపులమ్ = అధికమైన, పఙ్కమ్ = బురదను, ఆసాద్య = పొంది, సీదన్తమ్ = నశించుచున్న, కుఞ్జరమ్ ఇవ = ఏనుగు వలె ఉన్న, తం రామమ్ = ఆ రాముని గూర్చి, లక్ష్మణః = లక్ష్మణుడు, అత్యర్థమ్ = మిక్కిలి, హితకామ్యయా = హితమునందు కోరికచేత, ఉవాచ = పలికెను.

తా. దశరథకుమారుడైన ఆ రాముడు సీత కనబడకపోవుటచే, అతివిశాలమైన బురదలో మునిగిపోవుచున్న ఏనుగ వలె బాధపడుచుండగా, లక్ష్మణుడు, అతని హితమును కోరుచు ఇట్లు పలికెను. 12, 13

మూ. మా విషాదం మహాబాహో కురు యత్నం మయా సహ,
ఇదం చ హి వనం శూర బహుకన్దరశోభితమ్. 14

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా; విషాదమ్ = దుఃఖమును, మా = పొందకుము. మయా సహ = నాతో కలిసినవాడవై, యత్నమ్ = ప్రయత్నమును, కురు = చేయుము. శూర = ఓ! శూరుడా ! ఇదమ్ = ఈ, వనమ్ = వనము, బహుకన్దరశోభితం హి = అనేకములైన గుహలచేత ప్రకాశింపచేయబడినది కదా !

తా. ఓ! మహాబాహూ ! విషాదము చెందకుము. నాతో కలిసి ప్రయత్నము చేయుము. ఓ! శూరుడా ! ఈ వనములో ఎన్నో గుహలు ఉన్నవి కదా!

మూ. ప్రియకాననసంచారా వనోన్మత్తా చ మైథిలీ,
సా వనం వా ప్రవిష్టా స్యాన్నళినీం వా సుపుష్పితామ్. 15

ప్ర. అ. ప్రియకాననసంచారా = ఇష్టమైన అరణ్యసంచారము గలది, వనోన్మత్తా చ = జలమునందు అత్యాసక్తి గలది అయిన, సా మైథిలీ = ఆ సీత, వనం వా = వనమును గాని, సుపుష్పితామ్ = బాగుగా పుష్పించిన, నళినీం వా = పద్మసరస్సును గాని, ప్రవిష్టా = ప్రవేశించినది, స్యాత్ = అయిఉండును.

తా. సీతకు అరణ్యములో సంచరించుట అనగా చాల ఇష్టము. జలము నందు కూడ ఆమెకు అధికమైన ఆసక్తి. అందుచేత ఆమె వనమునకు వెళ్ళి యుండును; లేదా పుష్పాలతో నిండిన పద్మసరస్సునకు వెళ్ళి యుండును. 15

మూ. సరితం వాపి సంప్రాప్తా మీనవఞ్జులసేవితామ్,
స్నాతుకామా నిలీనా స్యాద్ధాసకామా వనే క్వచిత్. 16

ప్ర. అ. స్నాతుకామా = స్నానము చేయుటకు ఇచ్ఛ గలదై, మీనవఞ్జులసేవితామ్ = మీనములచేత, నీటిప్రబ్బలిచెట్లచేత సేవింపబడిన, సరితం వాపి = నదినైనా, సంప్రాప్తా = పొందియుండును. హాసకామా = పరిహాసమునందు కోరికగలదై, క్వచిత్ = ఎక్కడనైనా, నిలీనా వా = దాగినదైనా, స్యాత్ = అయి ఉండవచ్చును.

తా. ఆమె స్నానముచేయుటకై, మీనములతోను, నీటి ప్రబ్బలిపొదలతోను నిండిన నదికైనా వెళ్ళి ఉండవచ్చును, లేదా పరిహాసము చేయుటకై ఎక్కడనైనా దాగియైనా ఉండవచ్చును. 16

మూ. విత్రాసయితుకామా వా లీనా స్యాత్కాననే క్వచిత్,
జిజ్ఞాసమానా వైదేహీ త్వాం మాం చ పురుషర్షభ, 17
తస్యాహ్యన్వేషణే శ్రీమన్ క్షిప్రమేవ యతావహై.

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! వైదేహీ = సీత, త్వాం చ = నిన్ను, మాం చ = నన్ను, విత్రాసయితుకామా వా = భయపెట్టు కోరిక గలదై, జిజ్ఞాసమానా = తెలుసుకొనదలచుచున్నదై, కాననే = అడవియందు, క్వచిత్ = ఎక్కడనో, లీనా = అణగినది, స్యాత్ = అయి ఉండును. శ్రీమన్ = ఓః శ్రీమంతుడా ! తస్యాః = ఆమెయొక్క, అన్వేషణే = వెదకుటయందు, క్షిప్రమేవ = శీఘ్రముగా, యతావహై = ప్రయత్నించెదము.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన రామా! మన మేమి చేసెదమో చూచుటకై, మనలను భయపెట్టుటకై, సీత, అడవిలో ఎక్కడనైన దాగియుండును. ఓః శ్రీమంతుడా! మనము వెంటనే ఆమెను వెదకుటకు ప్రయత్నము చేసెదము. 17

మూ. వనం సర్వం విచినువో యత్ర సా జనకాత్మజా, 18
మన్యసే యది కాకుత్స్థ మా స్మ శోకే మనః కృథాః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! మన్యసే యది=నీవు తలచినచో, సా=ఆ, జనకాత్మజా = సీత, యత్ర = ఎచట నున్నదో, సర్వమ్ = సమస్తమైన, వనమ్ = వనమును, విచినుమః = వెదకెదము. శోకే = శోకమునందు, మనః = మనస్సును, మా స్మ కృథాః=చేయకుము.

తా. రామా! నీవు సరే అన్నచో ఈ వనమునంతా వెదకి సీత ఎక్కడ ఉన్నదో చూచెదము. నీ మనస్సును దుఃఖవశము చేయకుము. 18

మూ. ఏవముక్తస్తు సౌహార్దాల్లక్ష్మణేన సమాహితః, 19
సహ సౌమిత్రిణా రామో విచేతుముపచక్రమే.

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, సౌహార్దాత్ = ప్రేమవలన, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడినవాడై, రామః = రాముడు, సమాహితః = సమాధానము పొందినవాడై, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడ, విచేతుమ్ = అన్వేషించుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. లక్ష్మణుడు స్నేహపూర్వకముగా పలికిన ఈ మాటలు విని రాముడు కొంత సమాధానము చెంది, ఆతనితో కలిసి సీతను వెదకుటకు ప్రారంభించెను.

మూ. తౌ వనాని గిరీంశ్చైవ సరితశ్చ సరాంసి చ, 20
నిఖిలేన విచిన్వానౌ సీతాం దశరథాత్మజౌ.

ప్ర. అ. తౌ దశరథాత్మజౌ = ఆ దశరథకుమారులు, వనాని = వనములను, గిరీన్ చైవ = పర్వతములను, సరితశ్చ = నదులను, సరాంసి చ = సరస్సులను, నిఖిలేన = పూర్తిగా, సీతామ్ = సీతను, విచిన్వానౌ = వెదకుచు, (ఆమెను పొందలేదు).

తా. దశరథకుమారులైన ఆ రామలక్ష్మణులు సీతకోసమై వనములు, పర్వతములు, నదులు, సరస్సులు, అన్ని చోట్లా వెదకిరి. 20

మూ. తస్య శైలస్య సానూని గుహాశ్చ శిఖరాణి చ, 21
నిఖిలేన విచిన్వానౌ నైవ తామభిజగ్మతుః.

ప్ర. అ. తస్య శైలస్య = ఆ పర్వతముయొక్క, సానూని=చరియలను,

గుహాశ్చ = గుహలను, శిఖరాణి చ = శిఖరములను, నిఖిలేన = పూర్తిగా, విచిన్వానౌ = వెదకుచున్నవారై, తామ్ = ఆమెను, నైవ అభిజగ్మతుః = పొందలేదు.

తా. ఆ పర్వతము చరియలు, గుహలు, శిఖరములు అంతటా వెదకినా కూడ రామలక్ష్మణులకు సీత కనబడలేదు. 21

మూ. విచిత్య సర్వతః శైలం రామో లక్ష్మణమబ్రవీత్, 22
నేహ పశ్యామి సౌమిత్రే వైదేహీం పర్వతే శుభామ్.

ప్ర. అ రామః = రాముడు, సర్వతః = అంతటా, శైలమ్ = పర్వతమును, విచిత్య = వెదకి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. సౌమిత్రే = లక్ష్మణా ! ఇహ = ఈ, పర్వతే = పర్వతమునందు, శుభామ్ = మంగళప్రదురాలైన, వైదేహీమ్ = సీతను, న పశ్యామి = చూడను.

తా. రాముడు ఆ పర్వతముమీద అంతటా వెదకి లక్ష్మణునితో ఇట్లు పలికెను. "లక్ష్మణా ! ఈ పర్వతముమీద ఎక్కడా మంగళప్రదురాలైన సీత కనబడుటలేదు."
22

మూ. తతో దుఃఖాభిసంతప్తో లక్ష్మణో వాక్యమబ్రవీత్, 23
విచరన్ దణ్డకారణ్యం భ్రాతరం దీప్తతేజసమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దుఃఖాభిసంతప్తః = దుఃఖముచేత పీడితుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును, విచరన్ = సంచరించుచు, (వెదకుచు), దీప్తతేజసమ్ = ప్రజ్వలించుచున్న తేజస్సు గల, భ్రాతరమ్ = సోదరుడైన రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిదప దుఃఖాక్రాంతుడైన లక్ష్మణుడు దండకారణ్యములో వెదకుచు, తేజస్సుతో ప్రజ్వలించుచున్న సోదరుడైన రామునితో ఇట్లు పలికెను. 23

మూ. ప్రాప్స్యసి త్వం మహాప్రాజ్ఞ మైథిలీం జనకాత్మజామ్,
యథా విష్ణుర్మహాబాహుర్బలిం బద్ధ్వా మహీమిమామ్.

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధి గలవాడా ! త్వమ్ = నీవు, జనకాత్మజామ్ = జనకుని కుమార్తె యైన, మైథిలీమ్ = సీతను, మహాబాహుః = గొప్ప బాహువులు గల, విష్ణుః = విష్ణువు, బలిమ్ = బలిచక్రవర్తిని, బద్ధ్వా = బంధించి, ఇమామ్ = ఈ, మహీం యథా = భూమిని వలె, ప్రాప్స్యసి = పొందగలవు.

తా. మహాబుద్ధిశాలివైన రామా ! మహాబాహువైన విష్ణుమూర్తి బలిచక్రవర్తిని బంధించి ఈ భూమిని పొంది నట్లు నీవు జనకరాజకుమారి యైన సీతను పొందగలవు. 24

మూ. ఏవముక్తస్తు సౌహార్దాల్లక్ష్మణేన స రాఘవః, 25
ఉవాచ దీనయా వాచా దుఃఖాభిహతచేతనః

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, సౌహార్దాత్ = స్నేహమువలన, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః రాఘవః = ఆ రాముడు, దుఃఖాభిహతచేతనః = దుఃఖముచేత కొట్టబడిన మనస్సు కలవాడై, దీనయా = దీనమైన, వాచా = వాక్కుతో, ఉవాచ = పలికెను.

తా. లక్ష్మణుడు స్నేహపూర్వకముగా పలికిన మాటలు విని, ఆ రాముడు దుఃఖముతో నిండిన మనస్సుతో, దీనముగా ఇట్లు పలికెను. 25

మూ. వనం సర్వం సువిచితం పద్మిన్యః ఫుల్లపఙ్కజాః, 26
గిరిశ్చాయం మహాప్రాజ్ఞ బహుకన్దరనిర్ఝరః,
న హి పశ్యామి వైదేహీం ప్రాణేభ్యోఽపి గరీయసీమ్. 27

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధి గలవాడా ! సర్వమ్ = సమస్తమైన, వనమ్ = వనము, సువిచితమ్ = బాగుగా వెదకబడినది ఫుల్లపఙ్కజాః = వికసించిన పద్మములు గల, పద్మిన్యః = పద్మసరస్సులు, వెదకబడినవి. బహుకన్దరనిర్ఝరః = అనేకమైన గుహలు, సెలయేళ్ళు గల, అయమ్ = ఈ, గిరిశ్చ = పర్వతము కూడ (వెదకబడినది). ప్రాణేభ్యోఽపి = ప్రాణములకంటె కూడ, గరీయసీమ్ = గొప్పదైన, వైదేహీమ్ = సీతను, న హి పశ్యామి = చూడను గదా.

తా. బుద్ధిశాలివైన లక్ష్మణా: వన మంతా వెదకినాము. వికసించిన పద్మము లున్న పద్మసరస్సులు, అనేకములైన గుహలు, సెలయేళ్ళు ఉన్న ఈ పర్వతము కూడ వెదకినాము. కాని నా ప్రాణములకంటె కూడ గొప్పదైన సీత కనబడుటలేదు. 27

మూ. ఏవం స విలపన్రామః సీతాహరణకర్శితః,
దీనః శోకసమావిష్టో ముహూర్తం విహ్వలోఽభవత్. 28

ప్ర. అ. సీతాహరణకర్శితః = సీతయొక్క హరణముచేత కృశింపచేయబడిన, సః రామః = ఆ రాముడు, ఏవమ్ = ఇట్లు, విలపన్ = విలపించుచు, దీనః = దీనుడై, శోకసమావిష్టః = శోకముచేత వ్యాప్తుడై, ముహూర్తమ్ = ముహూర్తకాలముపాటు, విహ్వలః = వ్యాకులుడు, అభవత్ = ఆయెను.

తా. సీతాహరణముచేత కృశించిపోయిన ఆ రాముడు ఈ విధముగా విలపించుచు, దీనుడై, దుఃఖాక్రాంతుడై ముహూర్తకాలముపాటు వ్యాకులత చెందెను.

మూ. సంతప్తో హ్యవసన్నాఙ్గో గతబుద్ధిర్విచేతనః,
నిషసాదాతురో దీనో నిఃశ్వస్యాశీతమాయతమ్. 29

ప్ర. అ. సంతప్తః = తపింపచేయబడినవాడై, అవసన్నాఙ్గః = కృశించిన దేహముకలవాడై, గతబుద్ధిః = పోయిన బుద్ధిబలము గలవాడై, విచేతనః = తొలగిన చైతన్యము కలవాడై, ఆతురః = పీడితుడై, దీనః = దీనుడై, అశీతమ్ = వేడిగాను, ఆయతమ్ = దీర్ఘముగాను, నిఃశ్వస్య = నిట్టూర్చి, నిషసాద = కూర్చుండెను.

తా. అప్పుడు రాముడు సంతాపము చెంది యుండెను. శరీరము కృశించెను. బుద్ధి సరిగా పనిచేయకుండెను. స్పృహ కూడ తప్పుచుండెను. ఈ విధముగ రాముడు దుఃఖపీడితుడై, దీనుడై, వేడిగా, దీర్ఘముగా నిట్టూర్చి కూర్చుండిపోయెను.

మూ. బహుళం స తు నిఃశ్వస్య రామో రాజీవలోచనః,
హా ప్రియేతి విచుక్రోశ బహుశో బాష్పగద్గదః. 30

ప్ర. అ. రాజీవలోచనః = కమలలోచనుడైన, సః రామః = ఆ రాముడు, బహుశమ్ = అధికముగా, నిఃశ్వస్య = నిట్టూర్చి, బాష్పగద్గదః = కన్నీటిచేత డగ్గుత్తిక కలవాడై, హా ప్రియేతి = అయ్యో ! ప్రియురాలా ! అని, బహుశః = అనేక పర్యాయములు, విచుక్రోశ = అరచెను.

తా. పద్మములవంటి నేత్రములు గల రాముడు మాటిమాటికి నిట్టూర్చుచు, బాష్పముచేత డగ్గుత్తిక చెందిన కంఠముతో "అయ్యో ! ప్రియురాలా !" అని అనేక పర్యాయములు అరచెను.

మూ. తం తతః సాన్త్వయామాస లక్ష్మణః ప్రియబాన్ధవః,
బహుప్రకారం ధర్మజ్ఞః ప్రశ్రితం ప్రశ్రితాఞ్జలిః. 31

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రియబాన్ధవః = ప్రియమైన బంధువులు గలవాడు, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడు అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రశ్రితాఞ్జలిః = కట్టబడిన దోసిలి గలవాడై, ప్రశ్రితమ్ = వినయముతో కూడునట్లుగా, బహుప్రకారమ్ = అనేకవిధముల, తమ్ = ఆ రాముణ్ణి, సాన్త్వయామాస = ఓదార్చెను.

తా. అప్పుడు, బంధువులమీద ప్రేమ గలవాడు, ధర్మములను ఎరిగినవాడు అయిన లక్ష్మణుడు, అంజలి ఘటించి, వినయపూర్వకముగా, అనేకవిధముల, ఆ రాముణ్ణి ఓదార్చెను. 31

మూ. అనాదృత్య తు తద్వాక్యం లక్ష్మణోష్ఠపుటాచ్చ్యుతమ్,
అపశ్యంస్తాం ప్రియాం సీతాం ప్రాక్రోశత్స పునః పునః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. సః తు = ఆ రాముడైతే, లక్ష్మణోష్ఠపుటాత్ = లక్ష్మణుని పెదవులనుండి, చ్యుతమ్ = వచ్చిన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, అనాదృత్య = ఆదరించక, ప్రియామ్ = ప్రియురాలైన, తాం సీతామ్ = ఆ సీతను, అపశ్యన్ = చూడనివాడై, పునః పునః = మాటిమాటికి, ప్రాక్రోశత్ = విలపించెను.

తా. కాని రాముడు లక్ష్మణుడు పలికిన మాటలు లెక్కచేయక, ప్రియురాలైన ఆ సీత కనబడకపోవుటచే మాటిమాటికి విలపించెను. 32

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
అరవదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విషష్టితమః సర్గః

[రాముడు సీతకొరకై విలపించుట]

మూ. సీతామపశ్యన్ ధర్మాత్మా శోకోపహతచేతనః,
విలలాప మహాబాహూ రామః కమలలోచనః. 1

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, కమలలోచనః = కమలముల వంటి నేత్రములు కలవాడు అయిన, రామః = రాముడు, సీతామ్ = సీతను, అపశ్యన్ = చూడనివాడై, శోకోపహత చేతనః = శోకముచేత కొట్టబడిన బుద్ధి కలవాడై, విలలాప = విలపించెను.

తా. ధర్మాత్ముడు, మహాబాహువు, పద్మనేత్రుడు అయిన రాముడు సీత కనబడకపోవుటచేత దుఃఖముచే కొట్టబడిన బుద్ధికలవాడై విలపించెను. 1

మూ. పశ్యన్నివ చ తాం సీతామపశ్యన్మదనార్దితః,
ఉవాచ రాఘవో వాక్యం విలాపాశ్రయదుర్వచమ్. 2

ప్ర. అ. మదనార్దితః = మన్మథునిచేత పీడితుడైన, రాఘవః = రాముడు, తామ్ = ఆ, సీతామ్ = సీతను, అపశ్యన్ = చూడకపోయినను, పశ్యన్నివ = చూచుచున్నవాడు వలె, విలాపాశ్రయదుర్వచమ్ = విలాపమును ఆశ్రయించుటచేత పలుకుటకు కష్టముగా ఉన్న, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మన్మథునిచేత పీడితుడైన రాముడు సీత కనబడకపోయినను కన బడుతున్నదని భావించుచు విలపించుటచే పైకి స్పష్టముగా రాని మాటలు ఇట్లు పలికెను. 2

మూ. త్వమశోకస్య శాఖాభిః పుష్పప్రియతయా ప్రియే,
ఆవృణోషి శరీరం తే మమ శోకవివర్ధినీ. 3

ప్ర. అ. ప్రియే = ప్రియురాలా ! త్వమ్ = నీవు, పుష్పప్రియతయా = పుష్పములు ప్రియములుగా కలదాన వగుటచేత, మమ = నాయొక్క, శోకవివర్ధినీ = శోకమును వృద్ధి పొందించుచు, అశోకస్య = అశోకవృక్షముయొక్క, శాఖాభిః = కొమ్మలచేత, తే = నీయొక్క, శరీరమ్ = శరీరమును, ఆవృణోషి = కప్పుకొనుచున్నావు.

తా. ప్రియురాలా ! నీవు పుష్పములపై అధికప్రీతి కలదాన వగుటచేత నీ శరీరమును అశోకవృక్షము కొమ్మలచేత కప్పుకొనుచున్నావు. దానివలన నా శోకము వృద్ధి పొందుచున్నది. 3

మూ. కదళీస్కన్ధసదృశౌ కదళ్యా సంవృతావుభౌ,
ఊరూ పశ్యామి తౌ దేవి నాసి శక్తా విగూహితుమ్. 4

ప్ర. అ. దేవి = దేవీ ! కదలీస్కన్ధసదృశౌ = అరటిస్తంభములతో సమానములు, కదళ్యా = అరటిచెట్టుచేత, సంవృతౌ = కప్పబడినవి అయిన, తే ఊరూ = నీ తొడలను, పశ్యామి = చూచుచున్నాను. విగూహితుమ్ = కప్పుటకు, శక్తా = సమర్థురాలవు, నాసి = కావు.

తా. ఓ! సీతా ! అరటిస్తంభాలతో సమానములైన నీ రెండు తొడలను అరటిచెట్లు కప్పివేయునట్లు చేసినావు కాని నాకు అవి కనబడిపోయినవి. వాటిని దాచలేకపోయినావు. 4

మూ. కర్ణికారవనం భద్రే హసన్తీ దేవి సేవసే,
అలం తే పరిహాసేన మమ బాధావహేన వై. 5

ప్ర. అ దేవి = ఓ ! దేవీ ! భద్రే = మంగళప్రదురాలా ! హసన్తీ = నవ్వుచు, కర్ణికారవనమ్ = కర్ణికారవృక్షవనమును, సేవసే = సేవించుచున్నావు. మమ = నాకు, బాధావహేన = బాధకలిగించు, తే పరిహాసేన = నీ పరిహాసముచేత, అలమ్ = చాలును.

తా. మంగళప్రదురాలవైన ఓ ! దేవీ ! నీవు నవ్వుచు కర్ణికారవృక్షముల గుంపులోనికి వెళ్లుచున్నావు. నాకు బాధ కలిగించే ఈ పరిహాస మింక చాలును.

మూ. పరిహాసేన కిం సీతే పరిశ్రాన్తస్య మే ప్రియే,
అయం స పరిహాసోఽపి సాధు దేవి న రోచతే. 6

ప్ర. అ. ప్రియే = ప్రియురాలా ! సీతే = సీతా ! పరిశ్రాన్తస్య = అలసి ఉన్న, మే = నాకు, పరిహాసేన = పరిహాసముచేత, కిమ్ = ఏమి ప్రయోజనము. దేవి = ఓ ! దేవీ ! అయమ్ = ఈ. సః = అట్టి, పరిహాసోఽపి = పరిహాసము కూడ, సాధు = బాగుగా, న రోచతే = నాకు ఇష్ట మగుట లేదు.

తా. ప్రియురాలవైన ఓ ! సీతా ! నేను అలసిపోయి ఉన్నప్పుడు పరిహాసము చేసి ఏమి ప్రయోజనము ? ఓ ! దేవీ ! పరిహాసమే యైనా నీవు చేయుచున్న ఈ పని నాకు ఇష్టము కాదు. 6

మూ. విశేషేణాశ్రమస్థానే హాసోఽయం న ప్రశస్యతే,
అవగచ్ఛామి తే శీలం పరిహాసప్రియం ప్రియే, 7
ఆగచ్ఛ త్వం విశాలాక్షి శూన్యోఽయముటజస్తవ.

ప్ర. అ. విశేషేణ = విశేషముచేత, ఆశ్రమస్థానే = ఆశ్రమస్థానమునందు, అయమ్ = ఈ, హాసః = పరిహాసము, న ప్రశస్యతే = ప్రశస్తముకాదు. ప్రియే = ప్రియురాలా ! తే = నీయొక్క, పరిహాసప్రియమ్ = పరిహాసము ప్రియముగా గల, శీలమ్ = స్వభావమును, అవగచ్ఛామి = ఎరుగుదును. విశాలాక్షి = విశాలములైన నేత్రములు కలదానా ! త్వమ్ = నీవు, ఆగచ్ఛ = రమ్ము. తవ = నీయొక్క, అయమ్ ఉటజః = ఈ పర్ణశాల, శూన్యః = శూన్యముగా ఉన్నది.

తా. ప్రియురాలా ! నీకు పరిహాసము చేయుట చాల ఇష్ట మని నాకు తెలియును. కాని ఇట్టి పరిహాసము, విశేషించి ఆశ్రమములో ప్రశస్తము కాదు. అందుచే ఓ ! విశాలాక్షీ ! నీవు రమ్ము. నీ పర్ణశాల శూన్యముగా ఉన్నది. 7

మూ. సువ్యక్తం రాక్షసైః సీతా భక్షితా వా హృతాపి వా, 8
న హి సా విలపన్తం మాముపసంప్రైతి లక్ష్మణ.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! సీతా = సీత, సువ్యక్తమ్ = నిశ్చితముగా, రాక్షసైః = రాక్షసులచేత, భక్షితా వా = భక్షింపబడినది గాని, హృతాపి వా =

హరింపబడినది గాని అయి ఉండును. సా = ఆమె, విలపన్తమ్ = విలపించుచున్న, మామ్ = నన్ను, న ఉపసంప్రైతి హి = చేరుటలేదు కదా!

తా. లక్ష్మణా! నిశ్చితముగా సీతను రాక్షసులు భక్షించి ఉందురు. లేదా హరించి ఉందురు. అట్లు కానిచో నే నిట్లు విలపించుచుండగా ఆమె రాకుండా ఉండునా? 8

మూ. ఏతాని మృగయూథాని సాశ్రునేత్రాణి లక్ష్మణ, 9
శంసన్తీవ హి వైదేహీం భక్షితాం రజనీచరైః.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! సాశ్రునేత్రాణి = కన్నీళ్ళతో కూడిన నేత్రములు గల, ఏతాని = ఈ, మృగయూథాని = లేళ్ల గుంపులు, వైదేహీమ్ = సీతను, రజనీచరైః = రాక్షసులచేత, భక్షితామ్ = భక్షింపబడినదానినిగా, శంసన్తీవ = చెప్పుచున్నట్లున్నవి.

ప్ర. అ. లక్ష్మణా! కన్నీళ్ళు కార్చుచున్న ఈ లేళ్ల గుంపులు, సీతను రాక్షసులు భక్షించినా రని చెప్పుచున్నవా అన్నట్లు ఉన్నవి. 9

మూ. హా మమార్యే క్వ యాతాసి హా సాధ్వి వరవర్ణిని, 10
హా సకామా త్వయా దేవీ కైకేయీ సా భవిష్యతి.

ప్ర. అ. హా = అయ్యో! మమ = నాయొక్క, ఆర్యే = పూజ్యురాలా! క్వ = ఎక్కడికి, యాతా అసి = వెళ్ళినావు? హా సాధ్వి = అయ్యో పతివ్రతా! వరవర్ణిని = శ్రేష్ఠమైన వర్ణము గలదానా! హా = అయ్యో! త్వయా = నీచేత, దేవీ = దేవియైన, సా = ఆ, కైకేయీ = కైకేయి, అద్య = ఇప్పుడు, సకామా = తీరిన కోరిక గలది, భవిష్యతి = కాగలదు.

తా. అయ్యో! ఆర్యురాలా! ఎక్కడికి పోయినావు? అయ్యో! పతివ్రతా! శ్రేష్ఠమైన దేహచ్ఛాయ గలదానా! అయ్యో! ఇప్పుడు నీ కీ ఆపద సంభవించుటచే ఆ కైకేయీదేవి కోరిక తీరినది. 10

మూ. సీతయా సహ నిర్యాతో వినా సీతాముపాగతః, 11
కథం నామ ప్రవేక్ష్యామి శూన్యమన్తఃపురం పునః.

ప్ర. అ. సీతయా సహ = సీతతో కూడ, నిర్యాతః = బయలుదేరివెళ్ళిన నేను, వినా సీతామ్ = సీత లేకుండగా, ఉపాగతః = వచ్చినవాడనై (తిరిగి అయోధ్య చేరినవాడనై), శూన్యమ్ = శూన్యమైన, అన్తఃపురమ్ = అంతఃపురమును, పునః = మరల, కథం నామ = ఎట్లు, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను ?

తా. సీతతో కలిసి బయలుదేరి వెళ్ళిన నేను ఆమె లేకుండా అయోధ్య చేరి శూన్యమైన అంతఃపురములో మరల ఎట్లు కాలు పెట్టగలను ? 11

మూ. నిర్వీర్య ఇతి లోకో మాం నిర్దయశ్చేతి వక్ష్యతి, 12
కాతరత్వం ప్రకాశం హి సీతాపనయనేన మే.

ప్ర. అ. లోకః = లోకము, మామ్ = నన్ను గూర్చి, నిర్వీర్యః ఇతి = పరాక్రమవిహీనుడు అని, నిర్దయశ్చేతి = దయ లేనివాడు అని, వక్ష్యతి = పలకగలదు. సీతాపనయనేన = సీతాపహారముచేత, మే = నాయొక్క, కాతరత్వమ్ = పిరికివాడ నగుట, ప్రకాశం హి = స్పష్టము కదా ?

తా. నేను పరాక్రమము లేనివాడ ననీ, దయ లేనివాడ ననీ లోకులు చెప్పుకొందురు. సీతను కోల్పోవుటచేత నేను పిరికివాడ ననే విషయము స్పష్టమే కదా ! 12

మూ. నివృత్తవనవాసశ్చ జనకం మిథిలాధిపమ్, 13
కుశలం పరిపృచ్ఛన్తం కథం శక్ష్యే నిరీక్షితుమ్.

ప్ర. అ. నివృత్తవనవాసశ్చ = పూర్తియైన వనవాసము గలవాడనై, కుశలమ్ = క్షేమమును, పరిపృచ్ఛన్తమ్ = ప్రశ్నించుచున్న, మిథిలాధిపమ్ = మిథిలా ప్రభువైన, జనకమ్ = జనకమహారాజును, నిరీక్షితుమ్ = చూచుటకు, కథమ్ = ఎట్లు, శక్ష్యే = సమర్థుడ నగుదును ?

తా. నేను వనవాసము పూర్తి చేసికొని వెళ్ళిన పిమ్మట మిథిలాధిపతి యైన జనకమహారాజు వచ్చి "క్షేమమా ?" అని ప్రశ్నించునపుడు ఆతని ముఖము ఎట్లు చూడగలను ? 13

మూ. విదేహరాజో నూనం మాం దృష్ట్వా విరహితం తయా, 14
సుతాస్నేహేన సంతప్తో మోహస్య వశమేష్యతి.

ప్ర. అ. విదేహరాజః = జనకమహారాజు, తయా = ఆ సీతతో, విరహితమ్ = శూన్యుడనైన, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, సుతాస్నేహేన = కుమార్తె యందలి ప్రేమచేత, సంతప్తః = పీడింపబడినవాడై, మోహస్య = మోహము యొక్క, వశమ్ = వశమును, ఏష్యతి = పొందగలడు. నూనమ్ = నిశ్చయము.

తా. సీత నా ప్రక్క లేకుండుట చూచి, జనకమహారాజు పుత్రికయందలి ప్రేమచేత దుఃఖితుడై తప్పక మూర్ఛ చెందును. 14

మూ. అథవా న గమిష్యామి పురీం భరతపాలితామ్, 15
స్వర్గోఽపి సీతయా హీనః శూన్య ఏవ మతో మమ.

ప్ర. అ. అథవా = లేదా, భరతపాలితామ్ = భరతునిచేత పాలింపబడిన, పురీమ్ = అయోధ్యానగరమును గూర్చి, న గమిష్యామి = వెళ్ళను. సీతయా = సీతతో, హీనః = శూన్యమైన, స్వర్గోఽపి = స్వర్గము కూడ, మమ = నాకు, శూన్యః ఏవ = శూన్యమైనదిగానే, మతః = తలపబడినది.

తా. లేదా నేను భరతుడు పాలించుచున్న అయోధ్యానగరమునకు వెళ్లనే వెళ్ళను. సీత లేని స్వర్గము కూడ నాకు శూన్యప్రదేశమువంటిదే. 15

మూ. మామిహోత్సృజ్య హి వనే గచ్ఛాయోధ్యాం పురీం శుభామ్,
న త్వహం తాం వినా సీతాం జీవేయం హి కథంచన.

ప్ర. అ. మామ్ = నన్ను, ఇహ = ఈ, వనే = వనమునందు, ఉత్సృజ్య = విడచి, శుభామ్ = మంగళకరమైన, అయోధ్యాం పురీమ్ = అయోధ్యానగరమును గూర్చి, గచ్ఛ = వెళ్లుము. అహం తు = నేనైతే, తాం సీతాం వినా = ఆ సీత లేకుండగా, కథంచన = ఏ విధముగాను కూడ, న జీవేయం హి = జీవించను కదా ?

తా. లక్ష్మణా ! నన్ను ఈ వనములోనే విడిచిపెట్టి నీవు మంగళకరమైన అయోధ్యానగరమునకు వెళ్ళిపొమ్ము. సీత లేకుండా నేను ఏవిధముగానూ కూడ జీవించజాలను. 16

మూ. గాఢమాశ్లిష్య భరతో వాచ్యో మద్వచనాత్త్వయా, 17
అనుజ్ఞాతోఽసి రామేణ పాలయేతి వసున్ధరామ్.

ప్ర. అ. భరతః = భరతుడు, గాఢమ్ = గాఢముగా, ఆశ్లిష్య = కౌగలించుకొని, మద్వచనాత్ = నా మాటవలన, త్వయా = నీచేత, వాచ్యః = చెప్పదగినవాడు. వసున్ధరామ్ = భూమిని, పాలయేతి = పాలించుము అని, రామేణ = రామునిచేత, అనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడినవాడవు, అసి = అయితివి.

తా. భరతుణ్ణి గాఢముగా కౌగలించుకొని "రాజ్యము ఏలుము అని రాముడు నీకు అనుమతి ఇచ్చినాడు" అని నా మాటగా ఆతనికి చెప్పుము. 17

మూ. అమ్బా చ మమ కైకేయీ సుమిత్రా చ త్వయా విభో,
కౌసల్యా చ యథాన్యాయమభివాద్యా మమాజ్ఞయా,
రక్షణీయా ప్రయత్నేన భవతా సోక్తకారిణా. 19

ప్ర. అ. విభో = సమర్థుడవైన లక్ష్మణా ! మమ = నాయొక్క, అమ్బా = తల్లియైన, కైకేయీ = కైకేయి, సుమిత్రా చ = సుమిత్ర, కౌసల్యా చ = కౌసల్య, త్వయా = నీచేత, మమ = నాయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, అభివాద్యాః = అభివాదనము చేయదగినవారు. ఉక్తకారిణా = చెప్పిన పని చేయు, భవతా = నీచేత, సా = ఆ కౌసల్య, ప్రయత్నేన = ప్రయత్నముచేత, రక్షణీయా = రక్షింపదగినది.

తా. సమర్థుడవైన లక్ష్మణా! నీవు, నా ఆజ్ఞప్రకారము తల్లియైన కైకేయికి, సుమిత్రకు, కౌసల్యకు న్యాయానుసారము అభివాదనము చేయవలెను. నీవు కౌసల్య చెప్పిన పనులు చేయుచు ఆమెను ప్రయత్నపూర్వకముగా రక్షించవలెను. 18, 19

మూ. సీతాయాశ్చ వినాశోఽయం మమ చామిత్రకర్శన,
విస్తరేణ జనన్యా మే వినివేద్యస్త్వయా భవేత్. 20

ప్ర. అ. అమిత్రకర్శన = శత్రువులను నశింపచేయువాడా ! సీతాయాశ్చ = సీతయొక్క, మమ చ = నాయొక్క, అయమ్ = ఈ, వినాశః = వినాశము, త్వయా = నీచేత, మే = నాయొక్క, జనన్యాః = తల్లికి, విస్తరేణ = విస్తారపూర్వకముగా, వినివేద్యః = తెలుపదగినది, భవేత్ = అగును.

తా. శత్రుసంహారకుడవైన లక్ష్మణా ! నేను, సీత ఏ విధముగా వినాశము పొందినామో ఈ విషయ మంతా నా తల్లికి సవిస్తరముగా తెలుపవలెను. 20

మూ. ఇతి విలపతి రాఘవే సుదీనే
వనముపగమ్య తయా వినా సుకేశ్యా,
భయవికలముఖస్తు లక్ష్మణోఽపి
వ్యథితమనా భృశమాతురో బభూవ. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. సుదీనే = చాల దీనుడైన, రాఘవే = రాముడు, వనమ్ = వనమును, ఉపగమ్య = పొంది, సుకేశ్యా = అందమైన కేశములు గల, తయా వినా = ఆ సీత లేకుండ, ఇతి = ఇట్లు, విలపతి = విలపించుచుండగా, లక్ష్మణోఽపి = లక్ష్మణుడు కూడ, భయవికలముఖః = భయముచేత వికలమైన ముఖము గలవాడై, వ్యథితమనాః = వ్యథచెందిన మనస్సు కలవాడై, భృశమ్ = మిక్కిలి, ఆతురః = పీడితుడు, బభూవ = ఆయెను.

తా. చాల దైన్యము పొందిన రాముడు అరణ్యములో సీత కనబడుకుండుటచే, ఈ విధముగా విలపించుచుండగా, లక్ష్మణునకు కూడ భయము చేత ముఖము వాడిపోయెను; మనస్సు వ్యథ చెందెను. ఈ విధముగ ఆతడు కూడ చాల దుఃఖార్తుడయ్యెను. 21

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో అరవదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిషష్టితమః సర్గః

## [రాముడు విలపించుట]

మూ. స రాజపుత్రః ప్రియయా విహీనః
శోకేన మోహేన చ పీడ్యమానః,
విషాదయన్ భ్రాతరమార్తరూపో
భూయో విషాదం ప్రవివేశ తీవ్రమ్. 1

ప్ర. అ. ప్రియయా = ప్రియురాలితో, విహీనః = శూన్యుడైన, సః రాజపుత్రః = ఆ రాజకుమారుడైన రాముడు, శోకేన = శోకము చేతను, మోహేన చ = మోహముచేతను, పీడ్యమానః = పీడించబడుచున్నవాడై, ఆర్తరూపః = చాల ఆర్తుడై, భ్రాతరమ్ = సోదరుడైన లక్ష్మణుని, విషాదయన్ = దుఃఖము కలవానిని చేయుచు, భూయః = మరల, తీవ్రమ్ = తీవ్రమైన, విషాదమ్ = దుఃఖమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ప్రియురాలు లేని ఆ రాముడు శోకముచేత, మోహము చేత పీడింపబడుచున్నవాడై, చాలా దుఃఖించుచు, సోదరుడైన లక్ష్మణునకు కూడ దుఃఖము కలిగించుచు, మరల తీవ్రమైన దుఃఖమును పొందెను. 1

మూ. స లక్ష్మణం శోకవశాభిపన్నం
శోకే నిమగ్నో విపులే తు రామః,
ఉవాచ వాక్యం వ్యసనానురూప
ముష్ణం వినిశ్శ్వస్య రుదన్ సశోకమ్. 2

ప్ర. అ. విపులే = అధికమైన, శోకే = శోకమునందు, నిమగ్నః = మునిగిన, సః రామః = ఆ రాముడు, సశోకమ్ = శోకముతో కూడినట్లుగా, రుదన్ = ఏడ్చుచు, శోకవశాభిపన్నమ్ = శోకమునకు వశత్వమును పొందిన, లక్ష్మణమ్ = లక్ష్మణుని

గూర్చి, ఉష్ణమ్ = వేడిగా, వినిఃశ్వస్య = నిట్టూర్చి, వ్యసనానురూపమ్ = దుఃఖమునకు తగిన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అధికమైన శోకములో మునిగిపోయిన ఆ రాముడు దుఃఖముతో ఏడ్చుచు, వేడి నిట్టూర్పులు విడచుచు, దుఃఖమునకు వశుడైన లక్ష్మణునితో, దుఃఖమును ప్రకటించు విధమున ఇట్లు పలికెను. 2

మూ. న మద్విధో దుష్కృతకర్మకారీ
మన్యే ద్వితీయోఽస్తి వసున్ధరాయామ్,
శోకేన శోకో హి పరమ్పరాయా
మా మేతి భిన్దన్ హృదయం మనశ్చ. 3

ప్ర. అ. వసున్ధరాయామ్ = భూమియందు, మద్విధః = నావంటి, దుష్కృతకర్మకారీ = పాపకర్మలు చేసినవాడు, ద్వితీయః = రెండవవాడు, నాస్తి = లేడు అని, మన్యే = తలచెదను. శోకేన = ఒక శోకముతో, శోకః = మరియొక శోకము, పరమ్పరాయాః = పరంపరవలన, హృదయమ్ = హృదయమును, మనశ్చ = మనస్సును, భిన్దన్ = భేదించుచు, మామ్ = నన్ను, ఏతి హి = పొందుచున్నది కదా.

తా. ఈ భూమిలో పాపకర్మలు ఆచరించినవాడు నావంటివాడు మరియొక డెవడూ లేడని తలచెదను. ఎందుచేత ననగా ఒక శోకము తరువాత మరియొక శోకము, అవిచ్ఛిన్నముగా, నా హృదయమును మనస్సును ఛేదించుచు వచ్చుచున్నది. 3

మూ. పూర్వం మయా నూనమభీప్సితాని
పాపాని కర్మాణ్యసకృత్కృతాని,
తత్రాయమద్యాపతితో విపాకో
దుఃఖేన దుఃఖం యదహం విశామి. 4

ప్ర. అ. మయా = నాచేత, పూర్వమ్ = పూర్వము, నూనమ్ = నిశ్చయముగా, అభీప్సితాని = ఇష్టమైన, పాపాని కర్మాణి = పాపకర్మలు, అసకృత్ = మాటిమాటికి, కృతాని = చేయబడినవి. తత్ర = ఆ విషయమునందు, అద్య =

ఇప్పుడు, విపాకః = పరిపాకము, ఆపతితః = వచ్చినది. యత్ = ఏ కారణము వలన, అహమ్ = నేను, దుఃఖేన = ఒక దుఃఖముచేత, దుఃఖమ్ = మరియొక దుఃఖమును, విశామి = ప్రవేశించుచున్నానో.

తా. పూర్వజన్మలో నేను అనేకపర్యాయములు, ఇష్టమువచ్చినట్లు పాప కర్మలు చేసి ఉన్నాను, సందేహము లేదు. దాని ఫలితమే ఇప్పుడు వచ్చి పడి నది. అందుచేతనే నేను కష్టముమీద కష్టము అనుభవించుచున్నాను. 4

మూ. రాజ్యప్రణాశః స్వజనైర్వియోగః
పితుర్వినాశో జననీవియోగః,
సర్వాణి మే లక్ష్మణ శోకవేగ
మాపూరయన్తి ప్రవిచిన్తితాని. 5

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! రాజ్యప్రణాశః = రాజ్యనాశము, స్వజనైః = బంధుజనులతో, వియోగః = వియోగము, పితుః = తండ్రియొక్క, వినాశః = మరణము, జననీవియోగః = తల్లియొక్క వియోగము, సర్వాణి = ఇవి అన్నీ, ప్రవిచిన్తితాని = ఆలోచించబడినవై, మే = నాయొక్క, శోకవేగమ్ = శోకము యొక్క వేగమును, ఆపూరయన్తి = నింపుచున్నవి.

తా. లక్ష్మణా ! రాజ్యము పోయినది. బంధుజనులు దూరమైనారు, తండ్రి మరణించినాడు. తల్లికి దూరమైనాను. వీటిని అన్నింటినీ గూర్చి ఆలోచించు చుండగా ఇది నా దుఃఖావేగమును పెంచుచున్నది. 5

మూ. సర్వం తు దుఃఖం మమ లక్ష్మణేదం
శాన్తం శరీరే వనమేత్య శూన్యమ్,
సీతావియోగాత్పునరప్యుదీర్ణం
కాష్ఠైరివాగ్నిః సహసా ప్రదీప్తః. 6

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, దుఃఖమ్ = దుఃఖము, శూన్యమ్ = జనశూన్యమైన, వనమ్ = వనమును, ఏత్య = పొంది, శరీరే = శరీరమునందు, శాన్తమ్ = శాంతించినది. సీతావియోగాత్ = సీతావియోగమువలన, కాష్ఠైః = కట్టెలచేత, సహసా = వెంటనే, ప్రదీప్తః = ప్రజ్వ

లించుచున్న, అగ్నిః = ఇవ = అగ్ని వలె, పునరపి = మరల, ఉదీర్ణమ్ = అధిక మైనది.

తా. లక్ష్మణా ! జనశూన్యమైన అరణ్యములో ప్రవేశించిన పిమ్మట ఆ దుఃఖము అంతా నా శరీరములో శాంతించినది. కాని ఇప్పుడు సీతావియోగము కలుగుటచే ఆ దుఃఖ మంతా మరల, కట్టెలు వేయుటచే వెంటనే అగ్ని ప్రజ్వలించి నట్లు, మరల విజృంభించినది. 6

మూ. సా నూనమార్యా మమ రాక్షసేన
బలాద్ధృతా ఖం సముపేత్య భీరుః,
అపస్వరం సస్వరవిప్రలాపా
భయేన విక్రన్దితవత్యభీక్ష్ణమ్. 7

ప్ర. అ. మమ = నాయొక్క, భీరుః = భయస్వభావముగల, సా ఆర్యా = ఆ పూజ్యురాలైన సీత, రాక్షసేన = రాక్షసునిచేత, బలాత్ = బలాత్కారముగా, హృతా = హరించబడినదై, ఖమ్ = ఆకాశమును, సముపేత్య = పొంది, సస్వర విప్రలాపా = స్వరముతో కూడిన ఏడ్పు గలదై, భయేన = భయముచేత, అభీక్ష్ణమ్ = మిక్కిలి, అపస్వరమ్ = వికృతస్వరము కలుగునట్లుగా, అక్రన్దితవతీ = అరచి నది. నూనమ్ = నిశ్చయము.

తా. నా ప్రియురాలు, భయస్వభావముకలది, పూజ్యురాలూ అయిన ఆ సీతను రాక్షసుడు బలాత్కారముగా హరించగా, ఆమె ఆకాశమును పొంది, సస్వరముగా విలపించుచు, భయముతో, వికృతస్వరముతో మిక్కిలి ఏడ్చి ఉండును. నిశ్చయము. 7

మూ. తౌ లోహితస్య ప్రియదర్శనస్య
సదోచితావుత్తమచన్దనస్య,
వృత్తౌ స్తనౌ శోణితపఙ్కదిగ్ధౌ
నూనం ప్రియాయా మమ నాభిభాతః. 8

ప్ర. అ. లోహితస్య = ఎఱ్ఱనిది, ప్రియదర్శనస్య = చూచుటకు ప్రియ ముగా ఉండునది అయిన, ఉత్తమచన్దనస్య = ఉత్తమమైన మంచిగంధమునకు,

సదా = ఎల్లప్పుడు, ఉచితౌ = అలవాటుపడినవీ, వృత్తౌ = వర్తులాకారముగా ఉన్నవీ అయిన, మమ ప్రియాయాః = నా ప్రియురాలియొక్క, తౌ స్తనౌ = ఆ స్తనములు, నూనమ్ = నిశ్చయముగా, శోణితపఙ్కదిగ్ధౌ = రక్తపంకముచేత పూయబడినవై, నాభిభాతః = ప్రకాశించుటలేదు.

తా. వర్తులములైన నా ప్రియురాలి ఆ స్తనములు ఎల్లప్పుడు, చూచుటకు అందముగా ఉండు ఎట్టివి, ఉత్తమమైన మంచిగంధము పూసికొనుటకు అలవాటు పడినవి. అట్టి స్తనములు రక్తపు బురదచేత పూయబడి, ప్రకాశహీనములై ఉండియుండును. సత్యము! 8

మూ. తచ్ఛ్లక్ష్ణ సువ్యక్తమృదుప్రలాపం
తస్యా ముఖం కుఞ్చితకేశభారమ్,
రక్షోవశం నూనముపాగతాయా
న భ్రాజతే రాహుముఖే యథేన్దుః. 9

ప్ర. అ. రక్షోవశమ్ = రాక్షసుల వశమును, ఉపాగతాయాః = పొందిన, తస్యాః = ఆమెయొక్క, శ్లక్ష్ణసువ్యక్త మృదుప్రలాపమ్ = మధురములు, బాగ స్పష్టములు, మృదువులు అయిన మాటలు గలది, కుఞ్చితకేశభారమ్ = ముడవబడిన కేశపాశము గలది అయిన, తత్ ముఖమ్ = ఆ ముఖము, రాహుముఖే = రాహువు ముఖమునందు, ఇన్దుః యథా = చంద్రుడు వలె, న భ్రాజతే = ప్రకాశించుటలేదు. నూనమ్ = నిశ్చయము.

తా. సీత రాక్షసుల వశమైపోయి ఉండును. అందుచేత మధురములు, సుస్పష్టములు, మృదువులు అయిన మాటలు పలికేదీ, ముడిచిన కేశపాశము గలదీ అయిన ఆమె ముఖము రాహువు నోట్లో చిక్కిన చంద్రబింబము వలె కాంతి విహీనమై యుండును. 9

మూ. తాం హారపాశస్య సదోచితాయా
గ్రీవాం ప్రియాయా మమ సువ్రతాయాః,
రక్షాంసి నూనం పరిపీతవన్తి
విభిద్య శూన్యే రుధిరాశనాని. 10

ప్ర. అ. సదా=ఎల్లప్పుడూ, హారపాశస్య=హారమునకు, ఉచితాయాః= అలవాటుపడినది, సువ్రతాయాః=మంచి నియమము కలదీ అయిన, మమ ప్రియాయాః=నా ప్రియురాలియొక్క, తాం గ్రీవామ్=ఆ కంఠమును, రుధి రాశనాని=రక్తమును భుజించు, రక్షాంసి=రాక్షసులు, శూన్యే=శూన్యప్రదేశము నందు, విభిద్య=విరగగొట్టి, నూనమ్=తప్పక, పరిపీతవన్తి=త్రాగి యుండును.

తా. ఉత్తమమైన నియమములను పాటించు నా ప్రియురాలు ఎల్లప్పుడూ హారములు ధరించుటకు అలవాటు పడినది. అట్టి ఆమె కంఠమును, రక్తము త్రాగే రాక్షసులు నులిమివేసి రక్తము త్రాగియుందురు. 10

మూ. మయా విహీనా విజనే వనే యా
రక్షోభిరాహృత్య వికృష్యమాణా,
నూనం నినాదం కురరీవ దీనా
సా ముక్తవత్యాయతకాన్తనేత్రా. 11

ప్ర. అ. యా=ఏ సీత, విజనే వనే=జనులు లేని వనమునందు, మయా=నాతో, విహీనా=శూన్యురాలై ఉన్నదో, సా=ఆ, ఆయతకాన్తనేత్రా =దీర్ఘమైన సుందరమైన నేత్రములు గల సీత, రక్షోభిః=రాక్షసులచేత, ఆహృత్య=హరించి, వికృష్యమాణా=లాగబడుచున్నదై, దీనా=దీనురాలై, కుర రీవ=గోరింక వలె, నూనమ్=నిశ్చయముగ, నినాదమ్=ధ్వనిని, ముక్తవతీ =విడచినది.

తా. విశాలములైన సుందరమైన నేత్రములు గల ఆ సీతను నేను దగ్గర లేనిసమయమునందు రాక్షసులు ఆ విజనమైన వనమునుండి అపహరించి లాగి నప్పుడు ఆమె దీనురాలై, గోరింక వలె అరచిఉండును. నిశ్చయము. 11

మూ. అస్మిన్మయా సార్ధముదారశీలా
శిలాతలే పూర్వముపోపవిష్టా,
కాన్తస్మితా లక్ష్మణ జాతహాసా
త్వామాహ సీతా బహువాక్యజాతమ్. 12

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! ఉదారశీలా=ఉత్తమమైన శీలము గలది,

కాన్తస్మితా = మనోహరమైన చిరునవ్వు గలదీ అయిన, సీతా = సీత, అస్మిన్ = ఈ, శిలాతలే = శిలాఫలకముమీద, మయాసార్ధమ్ = నాతో కూడ, పూర్వమ్ = పూర్వము, ఉపోపవిష్టా = నా దగ్గరగా కూర్చున్నదై, జాతహాసా = పుట్టిన నవ్వు గలదై, త్వామ్ = నిన్ను గూర్చి, బహువాక్యజాతమ్ = అనేక వాక్యముల సముదాయమును, ఆహ = పలికినది.

తా. లక్ష్మణా ! ఉత్తమశీలము సుందరమైన చిరునవ్వు గల సీత, పూర్వము, ఈ శిలాఫలకముపై నాతో కూడ, నా సమీపమున కూర్చుండి, నవ్వుచు, నీతో ఎన్నో మాటలు మాటలాడుచుండేది. 12

మూ. గోదావరీయం సరితాం వరిష్ఠా
ప్రియా ప్రియాయా మమ నిత్యకాలమ్,
అప్యత్ర గచ్ఛేదితి చిన్తయామి
నైకాకినీ యాతి హి సా కదా చిత్. 13

ప్ర. అ. సరితామ్ = నదులలో, వరిష్ఠా = గొప్పదైన, ఇయం గోదావరీ = ఈ గోదావరి. మమ ప్రియాయాః = నా ప్రియురాలికి, నిత్యకాలమ్ = ఎల్లప్పుడూ, ప్రియా = ఇష్టమైనది. అత్ర = ఈ నదికి, గచ్ఛేదపి = వెళ్ళి ఉండవచ్చును, ఇతి = అని, చిన్తయామి = ఊహించుచున్నాను. సా = ఆమె, ఏకాకినీ = ఒంటరిదై, కదాచిత్ = ఎన్నడూ, న యాతి హి = వెళ్లదు కదా :

తా. నదులలో శ్రేష్ఠమైన ఈ గోదావరీనది నా ప్రియురాలికి, సర్వదా, చాల ఇష్టమైనది. ఆమె ఆ నదికి వెళ్ళి యుండునా అని ఆలోచించుచున్నాను. కాని ఆమె ఒంటరిగా ఎన్నడూ వెళ్లదు కదా : 13

మూ. పద్మాననా పద్మవిశాలనేత్రా
పద్మాని వానేతుమభిప్రయాతా,
తదస్య యుక్తం న హి సా కదాచి
న్మయా వినా గచ్ఛతి పఙ్కజాని. 14

ప్ర. అ. పద్మాననా = పద్మమువంటి ముఖము గలది, పద్మవిశాలనేత్రా = పద్మముల వలె విశాలములైన నేత్రములు గలది అయిన సీత, పద్మాని =

పద్మములను, ఆనేతుమ్ = తీసికొనివచ్చుటకు, అభిప్రయాతా వా = వెళ్ళి యుండునా ? తదపి = అది కూడ, అయుక్తమ్ = యుక్తము కాదు. సా = ఆమె, కదాచిత్ = ఎప్పుడూ, మయా వినా = నేను లేకుండా, పఙ్కజాని = పద్మములను గూర్చి, న గచ్ఛతి హి = వెళ్ళదు కదా !

తా. పద్మము వంటి ముఖము, పద్మము వంటి విశాలనేత్రములు గల సీత పద్మాలు తీసికొనివచ్చుటకు వెళ్ళి యుండునా ! అది కూడ యుక్తము కాదు. ఎందుచేతనగా ఆమె ఎన్నడూ నేను దగ్గర లేకుండా పద్మాలకోసము వెళ్లదు.

మూ. కామం త్విదం పుష్పితవృక్షషణ్డం
నానావిధైః పక్షిగణైరుపేతమ్,
వనం ప్రయాతా ను తదప్యయుక్త
మేకాకినీ సాతిబిభేతి భీరుః. 15

ప్ర. అ. కామమ్ = మిక్కిలి, పుష్పితవృక్షషణ్డమ్ = పుష్పించిన వృక్ష సముదాయము గలది. నానావిధైః = అనేకవిధములైన, పక్షిగణైః = పక్షిసముదాయములతో, ఉపేతమ్ = కూడినదీ అయిన, ఇదమ్ = ఈ, వనమ్ = వనమును గూర్చి, ప్రయాతా ను = వెళ్ళినదా ? తదపి = అది కూడ, అయుక్తమ్ = యుక్తము కాదు. భీరుః = భయస్వభావము గల, సా = ఆమె, ఏకాకినీ = ఒంటరిదై, అతిబిభేతి = చాలభయపడును.

తా. అనేక విధములైన పక్షుల సముదాయములతో కూడిన ఈ వనములోని వృక్షముల గుంపులు చక్కగా పూసి ఉన్నవి. ఈ వనములోనికి వెళ్ళి యుండునా ? అదీ యుక్తము కాదు ఎందుచేత ననగా, అసలే భయస్వభావము గల ఆమె ఒంటరిగా చాల భయపడును. 15

మూ. ఆదిత్య భో లోకకృతాకృతజ్ఞ
లోకస్య సత్యానృతకర్మసాక్షిన్,
మమ ప్రియా సా క్వ గతా హృతా వా
శంసస్వ మే శోకవశస్య నిత్యమ్. 16

ప్ర. అ. లోకకృతాకృతజ్ఞ = లోకముయొక్క చేయబడిన కర్మను చేయ

బడని కర్మను ఎరిగినవాడా ! లోకస్య = లోకముయొక్క, సత్యానృతకర్మ సాక్షిన్ = సత్యకర్మకు, అసత్యకర్మకు సాక్షియైనవాడా ! ఆదిత్య = సూర్యుడా ! మమ = నాయొక్క, ప్రియా = ప్రియురాలైన, సా = ఆ సీత, క్వ = ఎక్కడికి, గతా = వెళ్ళినది ? హృతా వా = హరింపబడినదా ? నిత్యమ్ = ఎల్లప్పుడు, శోకవశస్య = శోకమునకు వశుడనైన, మే = నాకు, శంసస్వ = చెప్పుము.

తా. ఓ ! సూర్యుడా ! లోకములో ఎవరేమి చేసినారో, ఎవరేమి చేయలేదో నీకు తెలియును. లోకుల సత్యమునకు, అసత్యమునకు నీవు సాక్షివి. అందుచే నా ప్రియురాలు ఎక్కడికైనా వెళ్ళినదా, లేదా ఎవరైనా ఆమెను హరించినారా అను విషయమును నిత్యమూ శోకమునకు వశుడ నైన నాకు చెప్పుము. 16

మూ. లోకేషు సర్వేషు చ నాస్తి కించి
ద్యత్తే న నిత్యం విదితం భవేత్తత్,
శంసస్వ వాయో కులశాలినీం తాం
హృతా మృతా వా పథి వర్తతే వా. 17

ప్ర. అ. వాయో = ఓ ! వాయుదేవుడా ! సర్వేషు = సమస్తమైన, లోకేషు = లోకములయందు, యత్ = ఏది, నిత్యమ్ = ఎల్లప్పుడూ, తే = నీకు, విదితమ్ = తెలియబడినది, న భవేత్ = కాదో, తత్ = అది, కించిత్ = ఏదీ, నాస్తి = లేదు. కులశాలినీమ్ = కులముచేత ప్రకాశించుచున్న, తామ్ = ఆ సీతను గూర్చి, శంసస్వ = చెప్పుము. హృతా = హరింపబడినదా ? మృతా వా = మరణించినదా ? పథి = మార్గమునందు, వర్తతే వా = ఉన్నదా ?

తా. ఓ ! వాయుదేవా ! అన్ని లోకములలోను, నీకు తెలియనిది ఏదీ లేదు. అందుచేత సత్కులమందు జనించిన సీతను గూర్చి చెప్పుము. ఆమె నెవరైనా హరించినారా ? లేక మరణించినదా ? దారిలో ఉన్నదా ? 17

మూ. ఇతీవ తం శోకవిధేయదేహం
రామం విసంజ్ఞం విలపన్తమేవమ్,
ఉవాచ సౌమిత్రిరదీనసత్త్వో
న్యాయే స్థితః కాలయుతం చ వాక్యమ్. 18

ప్ర. అ. ఇతీవ = ఈ విధముగా, శోకవిధేయదేహమ్ = శోకమునకు లొంగిపోయిన దేహము గలవాడు, విసంజ్ఞమ్ = సంజ్ఞ లేనివాడు, ఏవమ్ = ఇట్లు, విలపన్తమ్ = విలపించుచున్నవాడు అయిన, తం రామమ్ = ఆ రాముణ్ణి గూర్చి, అదీనసత్త్వః = దీనము కాని బుద్ధి గలవాడు, న్యాయే = న్యాయమునందు, స్థితః = ఉన్నవాడు అయిన, సౌమిత్రిః = లక్ష్మణుడు, కాలయుతమ్ = కాలముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఈ విధముగ శరీరము శోకమునకు లొంగిపోగా, సంజ్ఞ కోల్పోయి, ఇట్లు విలపించుచున్న రామునితో, బుద్ధియందు దైన్యము లేనివాడు, న్యాయ మార్గము ననుసరించువాడు అయిన లక్ష్మణుడు కాలమునకు తగిన వాక్యము పలికెను. 18

మూ. శోకం విముఞ్చార్య ధృతిం భజస్వ
సోత్సాహతా చాస్తు విమార్గణేఽస్యాః,
ఉత్సాహవన్తో హి నరా న లోకే
సీదన్తి కర్మస్వతిదుష్కరేషు. 19

ప్ర. అ. ఆర్య = పూజ్యుడా ! శోకమ్ = దుఃఖమును, విముఞ్చ = విడువుము. ధృతిమ్ = ధైర్యమును, భజస్వ = పొందుము. అస్యాః = సీతయొక్క, విమార్గణే = వెదకుటయందు, సోత్సాహతా = ఉత్సాహముతో కూడియుండుట, అస్తు = అగుగాక, లోకే = లోకమునందు, ఉత్సాహవన్తః = ఉత్సాహము గల, నరాః = మనుష్యులు, అతిదుష్కరేషు = చేయుటకు చాల కష్టమైన, కర్మసు = పనులయందు, న సీదన్తి హి = క్రుంగిపోరు కదా ?

తా. పూజ్యుడవైన రామా! దుఃఖమును విడచి ధైర్యము అవలంబింపుము. సీతను వెదకుటకై ఉత్సాహము చూపుము. లోకములో ఉత్సాహవంతులైన మనుష్యులు చాల కష్టమైన పనులు చేయవలసివచ్చినా కూడ దిగులుచెందరు. 19

మూ. ఇతీవ సౌమిత్రిముదగ్రపౌరుషం
బ్రువన్తమార్తో రఘువంశవర్ధనః,
న చిన్తయామాస ధృతిం విముక్తవా
న్పునశ్చ దుఃఖం మహదభ్యుపాగమత్. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. ఆర్తః = దుఃఖితుడైన, రఘువంశవర్ధనః = రాముడు, ఇతీవ = ఇట్లు, బ్రువన్తమ్ = పలుకుచున్న, ఉదగ్రపౌరుషమ్ = అధికమైన పౌరుషము గల, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, న చిన్తయామాస = ఆలోచించలేదు. ధృతిమ్ = ధైర్యమును, విముక్తవాన్ = విడచినాడు. పునశ్చ = మరల, మహత్ = గొప్ప, దుఃఖమ్ = దుఃఖమును, అభ్యాగమత్ = పొందెను.

తా. దుఃఖార్తుడైన రాముడు ఈ విధముగా పలుకుచున్న గొప్ప పౌరుషము గల లక్ష్మణుని మాటలు లెక్కచేయలేదు. ధైర్యమును కోల్పోయి మరల గొప్ప దుఃఖమును పొందెను.

వి. ఈ సర్గ ప్రాచ్యపాఠములో లేదు. దీనిలో కవితాసౌందర్యము మృగ్యము. పదగుంఫనలో అందము లేదు. వాల్మీకి ముద్ర లేదు. గోదావరికిగాని పద్మాలు తీసికొనివచ్చుటకు గాని సీత వెళ్ళియుండదని దీనిలో చెప్పిన రాముడు రాబోవు సర్గలో లక్ష్మణుని గోదావరి దగ్గర ఉన్నదేమో చూడుమని అక్కడికి పంపుచున్నాడు. వెనుకటి (60-62) సర్గలలో రాముడు ఉన్మత్తుడువలె చెట్లను చేమలను, మృగాలను, పక్షులను సీతను గూర్చి అడిగినట్లు, సీత కనబడినట్లు భావించి ఏవేవో ఉన్మత్తప్రలాపములు చేసినట్లు వర్ణించిన శ్లోకాలు కూడ ప్రాచ్య పాఠములో లేవు. అవి లేకుండుటయే సమంజసము. వాటివలన రాముని ధీరోదాత్తత్వానికి లోపము కలుగుచున్నది. వెదకి వెదకి నిరాశ చెందిన పిమ్మట కొన్నాళ్ళకి ఇలాంటి ఉన్మాదము కలగవచ్చునేమో కాని ఆ అల్పకాలములో కలుగదు.

20

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో అరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుఃషష్టితమః సర్గః

[రామలక్ష్మణులు మరల సీతకై అన్వేషించుట. మృగములు చేసిన సంకేతములను బట్టి దక్షిణదిక్కు వైపు వెళ్ళుట. రాముడు పర్వతముమీద కోపము చూపుట. అక్కడ పడియున్న సీత తలలోని పువ్వులను, అలంకారముల ముక్కలను, యుద్ధచిహ్నములను చూచి రాముడు దేవాదులతో కూడిన మూడు లోకములమీద కోపమును చూపుట]

మూ. స దీనో దీనయా వాచా లక్ష్మణం వాక్యమబ్రవీత్
శీఘ్రం లక్ష్మణ జానీహి గత్వా గోదావరీం నదీమ్,
అపి గోదావరీం సీతా పద్మాన్యానయితుం గతా.

ప్ర. అ. సః=ఆ రాముడు, దీనః = దీనుడై, దీనయా = దీనమైన, వాచా = వాక్కుతో, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. లక్ష్మణ=లక్ష్మణా ! శీఘ్రమ్ = శీఘ్రముగా, గోదావరీం నదీమ్ = గోదావరీనదిని గూర్చి, గత్వా=వెళ్ళి, సీతా=సీత, పద్మాని=పద్మములను, ఆనయితుమ్ = తీసికొనివచ్చుటకు, గోదావరీమ్ = గోదావరిని గూర్చి, అపి గతా = వెళ్ళినదా అని, జానీహి = తెలిసికొనుము.

తా. దీనుడైన రాముడు దీనమైన కంఠస్వరముతో లక్ష్మణునితో ఇట్లు పలికెను. "లక్ష్మణా ! శీఘ్రముగా గోదావరీనదికి వెళ్ళి సీత పద్మములను తీసికొనివచ్చుటకై గోదావరికి వెళ్ళినదేమో చూచి రమ్ము" 1

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః పరవీరహా, 2
నదీం గోదావరీం రమ్యాం జగామ లఘువిక్రమః.

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన,

పరవీరహా = శత్రువీరులను సంహరించు, లక్ష్మణః = లక్ష్మణుడు, లఘువిక్రమః = శీఘ్రమైన నడక గలవాడై, రమ్యామ్ = సుందరమైన, గోదావరీం నదీమ్ = గోదావరీనదిని గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు రాముని మాటలు విని, శీఘ్రముగా నడచి సుందరమైన గోదావరీనదికి వెళ్లెను. 2

మూ. తాం లక్ష్మణస్తీర్థవతీం విచిత్వా రామమబ్రవీత్, 3
నైనాం పశ్యామి తీర్థేషు క్రోశతో న శృణోతి మే.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, తీర్థవతీమ్ = రేవులు గల, తామ్ = ఆ గోదావరిని, విచిత్వా = వెదకి, రామమ్ = రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఏనామ్ = ఈమెను, తీర్థేషు = రేవులలో, న పశ్యామి = చూడను. మే = నేను, క్రోశతః = బిగ్గరగా అరచినను, న శృణోతి = (ఆమె) వినుట లేదు.

తా. లక్ష్మణుడు రేవులు గల ఆ గోదావరీనదిని వెదకి వచ్చి రామునితో ఇట్లు పలికెను. "రేవులలో ఎక్కడా నాకు సీత కనబడలేదు. నేను బిగ్గరగా పిలచినా జవాబు లేదు". 3

మూ. కం ను వా దేశమాపన్నా వైదేహీ క్లేశనాశినీ, 4
న హ్యహం వేద తం దేశం యత్ర సా జనకాత్మజా.

ప్ర. అ క్లేశనాశినీ = క్లేశములను నశింపచేయు, వైదేహీ = సీత, కం వా = ఏ, దేశమ్ = ప్రదేశమును, ఆపన్నా ను = పొందినదో! సా = ఆ, జనకాత్మజా = సీత, యత్ర = ఎక్కడ ఉన్నదో, తం దేశమ్ = ఆ ప్రదేశమును, అహమ్ = నేను, న వేద హి = ఎరుగను.

తా. క్లేశములను తొలగించు సీత ఏ ప్రదేశమునకు వెళ్ళినదో! ఆ సీత ఉన్న చోటు నాకు తెలియుటలేదు. 4

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా దీనః సంతాపమోహితః 5
రామః సమభిచక్రామ స్వయం గోదావరీం నదీమ్,
స తాముపస్థితో రామః క్వ సీతేత్యేవమబ్రవీత్. 6

ప్ర. అ. రామః = రాముడు, లక్ష్యణస్య = లక్ష్మణునియొక్క, వచః =

వచనమును, శ్రుత్వా = విని, దీనః = దీనుడై, సంతాపమోహితః = తాపము చేత మోహితుడై, స్వయమ్ = స్వయముగా, గోదావరీం నదీమ్ = గోదావరీనదిని గూర్చి, సమభిచక్రామ = వెళ్ళెను. సః రామః = ఆ రాముడు, తామ్ = ఆ నదిని, ఉపస్థితః = సమీపించినవాడై, సీతే = సీతా ! క్వ = ఎక్కడ ఉన్నావు, ఇత్యేవమ్ = అని, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు లక్ష్మణుని మాటలు విని, దీనుడై, సంతాపముచేత మోహము చెంది స్వయముగా గోదావరీనది వైపు వెళ్లెను. ఆ నది దగ్గరకు వెళ్ళి రాముడు "సీతా ఎక్కడ ఉన్నావు?'' అని కేక వేసెను. 5,6

మూ. భూతాని రాక్షసేన్ద్రేణ వధార్హేణ హృతామితి,
న తాం శశంసూ రామాయ తథా గోదావరీ నదీ. 7

ప్ర. అ. వధార్హేణ = వధకు తగిన, రాక్షసేన్ద్రేణ = రావణునిచేత, హృతామ్ = అపహరింపబడిన, తామ్ = ఆమెను గూర్చి, ఇతి = ఈ విధముగా (అపహరించబడినట్లుగా), భూతాని = అక్కడ నున్న భూతములు, తథా = మరియు, గోదావరీ నదీ = గోదావరీనదియు, రామాయ = రామునకు, న శశంసుః = చెప్పలేదు.

తా. చంపదగిన ఆ రావణుడు, సీతను అపహరించినాడు అని అక్కడ ఉన్న భూతములు గాని, గోదావరీనది గాని రామునకు చెప్పలేదు. 7

మూ. తతః ప్రబోధితా భూతైః శంస చాస్మై ప్రియామితి,
న తు సాభ్యవదత్సీతాం పృష్టా రామేణ శోచతా. 8

ప్ర. అ. తతః = పిమ్మట, శోచతా = దుఃఖించుచున్న, రామేణ = రాముని చేత, పృష్టా = అడగబడిన, సా = ఆ గోదావరినది, ప్రియామ్ = ప్రియురాలిని గూర్చి, అస్మై = ఈతనికి, శంస = చెప్పుము, ఇతి = అని, భూతైః = భూతములచేత, ప్రబోధితా = ప్రేరేపింపబడిన దైనను, సీతామ్ = సీతను గూర్చి, నాభ్యవదత్ = చెప్పలేదు.

తా. దుఃఖించుచున్న రాముడు అడిగినను, "రామునకు అతని ప్రియురాలిని గూర్చి చెప్పుము" అని భూతములు ప్రేరేపించినను ఆ గోదావరీనది సీతను

గూర్చి రామునకు చెప్పలేదు. 8

మూ. రావణస్య తు తద్రూపం కర్మాణి చ దురాత్మనః,
ధ్యాత్వా భయాత్తు వైదేహీం సా నదీ న శశంస తామ్.

ప్ర. అ. సా నదీ = ఆ నది, దురాత్మనః = దురాత్ముడైన, రావణస్య = రావణునియొక్క, తత్ = ఆ, రూపమ్ = రూపమును, కర్మాణి చ = పనులను, ధ్యాత్వా = స్మరించి, భయాత్ = భయమువలన, తాం వైదేహీమ్ = ఆ సీతను గూర్చి, న శశంస = చెప్పలేదు. 9

తా. దురాత్ముడైన ఆ రావణుని ఆ రూపము, పనులు గుర్తుకు రాగానే భయపడినదై ఆ గోదావరీనది సీతను గూర్చి చెప్పలేదు.

మూ. నిరాశస్తు తయా నద్యా సీతాయా దర్శనే కృతః,
ఉవాచ రామః సౌమిత్రిం సీతాదర్శనకర్శితః. 10

ప్ర. అ. సీతాదర్శనకర్శితః = సీత కనబడకపోవుటచేత కృశించిన, రామః = రాముడు, తయా నద్యా = ఆ నదిచేత, సీతాయాః = సీతయొక్క, దర్శనే = దర్శనమువిషయమున, నిరాశః = ఆశలేనివాడుగా, కృతః = చేయబడిన వాడై, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. సీత కనబడకపోవుటచేత కృశించి ఉన్న రాముడు సీత కనబడే విషయమున ఆ నది కూడ నిరాశ కలిగించగా, లక్ష్మణునితో ఇట్లనెను. 10

మూ. ఏషా గోదావరీ సౌమ్య కించిన్న ప్రతి భాషతే
కిం ను లక్ష్మణ వక్ష్యామి సమేత్య జనకం వచః, 11
మాతరం చైవ వైదేహ్యా వినా తామహమప్రియమ్.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! ఏషా గోదావరీ = ఈ గోదావరీనది, కించిత్ = ఏమీ, న ప్రతిభాషతే = బదులు చెప్పుటలేదు. లక్ష్మణ = లక్ష్మణా ! జానకీం వినా = జానకి లేకుండగా, అహమ్ = నేను, జనకమ్ = జనకుని, సమేత్య = కలసి, మాతరం చైవ = తల్లిని కూడ కలిసి, అప్రియమ్ = అప్రియమైన, కిం ను = ఏమి, వచనమ్ = మాటను, వక్ష్యామి = చెప్పుదును ?

తా. సౌమ్యుడా! ఈ గోదావరీనది ప్రత్యుత్తర మేమీ ఇచ్చుటలేదు. లక్ష్మణా! సీత లేకుండా వెళ్ళిన నేను జనకమహారాజును, తల్లిని కలిసి వారితో అప్రియమైన వార్త ఎట్లు చెప్పుదును?

వి. "లక్ష్మణస్య వచః శ్రుత్వా'' (5వ శ్లోకం) మొదలు "ఏషా గోదావరీ" (11వ శ్లోకం) వరకు ఉన్న శ్లోకాలు ప్రాచ్యపాఠంలో లేవు. 11

మూ. యా మే రాజ్యవిహీనస్య వనే వన్యేన జీవతః, 12
సర్వం వ్యపనయేచ్ఛోకం వైదేహీ క్వ ను సా గతా.

ప్ర. అ. రాజ్యవిహీనస్య = రాజ్యము లేనివాడను, వనే = వనమునందు, వన్యేన = వనమునందు లభించే దానితో, జీవతః = జీవించుచున్నవాడను అయిన, మే = నాయొక్క, సర్వమ్ = సమస్తమైన, శోకమ్ = శోకమును, యా వైదేహీ = ఏ సీత, వ్యపనయేత్ = తొలగించునో, సా = ఆమె, క్వ = ఎక్కడికి, గతా ను = వెళ్ళినదో కదా.

తా. రాజ్యము కోల్పోయి, వనములో లభించే దానితో వనములో జీవితము గడపుచున్న నా శోకము నంతను తొలగించే సీత ఎక్కడికి పోయినదో!

మూ. జ్ఞాతిపక్షవిహీనస్య రాజపుత్రీమపశ్యతః, 13
మన్యే దీర్ఘా భవిష్యన్తి రాత్రయో మమ జాగ్రతః.

ప్ర. అ. జ్ఞాతిపక్షవిహీనస్య = బంధువర్గముతో శూన్యుడను, రాజపుత్రీమ్ = రాజకుమారియైన సీతను, అపశ్యతః = చూడనివాడను అయిన, జాగ్రతః = మేల్కొనియున్న, మమ = నాకు, రాత్రయః = రాత్రులు, దీర్ఘాః = దీర్ఘములుగా, భవిష్యన్తి = కాగలవు అని, మన్యే = తలచెదను.

తా. బంధువు లెవ్వరూ దగ్గర లేని నాకు సీత కూడ కనబడకపోయినచో రాత్రులందు నిద్ర పట్టక ఆ రాత్రులు చాల దీర్ఘములుగా కనబడు నని అనుకొను చున్నాను.

13

మూ. మన్దాకినీం జనస్థానమిమం ప్రస్రవణం గిరిమ్, 14
సర్వాణ్యనుగమిష్యామి యది సీతా హి దృశ్యతే.

("మన్దాకినీమ్"కిబదులు "గోదావరీమ్'' అను ప్రాచ్యపాఠము యుక్తము. జనస్థానములో మందాకిని ఉండదు కదా).

ప్ర. అ. గోదావరీమ్ = గోదావరిని, జనస్థానమ్ = జనస్థానమును, ఇమమ్ = ఈ, ప్రస్రవణం గిరిమ్ = ప్రస్రవణపర్వతమును, సర్వాణి = అన్నింటినీ, అనుగమిష్యామి = వెదకెదను. సీతా = సీత, యది హి దృశ్యతే = కనబడునేమో !

తా. గోదావరీనదిని, జనస్థానమును, ఈ ప్రస్రవణపర్వతమును అన్నింటిని వెదకెదను. సీత కనబడునేమో ! 14

మూ. ఏతే మృగా మహావీర్య మామీక్షన్తే ముహుర్ముహుః, 15
వక్తుకామా ఇవ హి మే ఇఙ్గితాన్యుపలక్షయే.

ప్ర. అ. మహావీర్య = గొప్ప పరాక్రమము గల లక్ష్మణా ! ఏతే = ఈ, మృగాః = మృగములు, ముహుర్ముహుః = మాటిమాటికి, మామ్ = నన్ను, ఈక్షన్తే = చూచుచున్నవి. ఇఙ్గితాని = వాటి ముఖాద్యాకారములను, ఉపలక్షయే = చూచుచున్నాను ; మే = నాకు, వక్తుకామా ఇవ = ఏమో చెప్పుటకు కోరిక గలవివలె ఉన్నవి.

తా. పరాక్రమశాలివైన లక్ష్మణా ! ఈ మృగములు మాటిమాటికి నాకేసి చూచుచున్నవి. వీటి ముఖాదివికారములు చూడగా నాతో ఏమో చెప్పవలె నను కొనుచున్నట్లు ఉన్నవి. 15

మూ. తాం స్తు దృష్ట్వా నరవ్యాఘ్రో రాఘవః ప్రత్యువాచ హ,
క్వ సీతేతి నిరీక్షన్వై బాష్పసంరుద్ధయా దృశా.

ప్ర. అ. నరవ్యాఘ్రః = నరులలో శ్రేష్ఠుడైన, రాఘవః = రాముడు, తాన్ = ఆ మృగములను, దృష్ట్వా = చూచి, బాష్పసంరుద్ధయా = బాష్పముచేత అడ్డుకొనబడిన, దృశా = దృష్టితో, నిరీక్షన్ = అంతటా పరిశీలించుచు, సీతా = సీత, క్వ = ఎక్కడ, ఇతి = అని, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన రాముడు ఆ మృగములను చూచి, కన్నీటిచేత

కప్పబడిన దృష్టితో నలుమూలలా పరికించుచు, "సీత ఎక్కడ ఉన్నది" అని ప్రశ్నించెను. 16

మూ. ఏవముక్తా నరేన్ద్రేణ తే మృగాః సహసోత్థితాః 17
దక్షిణాభిముఖాః సర్వే దర్శయన్తో నభ స్తలమ్,
మైథిలీ హ్రియమాణా సా దిశం యామన్వపద్యత, 18
తేన మార్గేణ ధావన్తో నిరీక్షన్తే నరాధిపమ్.

ప్ర. అ. నరేన్ద్రేణ = రాజైన రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, మృగాః = మృగములు, సహసా = శీఘ్రముగా, ఉత్థితాః = లేచినవై, సర్వే = అన్నియు, దక్షిణాభిముఖాః = దక్షిణదిక్కునకు అభిముఖ మైనవై, నభ స్తలమ్ = ఆకాశమును, దర్శయ న్తః = చూపుచున్నదై, హ్రియమాణా = హరించబడుచున్న, మైథిలీ = సీత, యామ్ = ఏ, దిశమ్ = దిక్కును, అన్వపద్యత = పొందెనో, తేన మార్గేణ = ఆ మార్గముచేత, ధావ న్తః = పరుగెత్తుచున్నవై, నరాధిపమ్ = రాముణ్ణి, నిరీక్ష న్తే = చూచుచున్నవి.

తా. రాముని ప్రశ్న విని ఆ మృగము లన్నీ వెంటనే లేచి, దక్షిణాభిముఖములై, ఆకాశమును చూపుచు, హరింపబడిన సీత ఏ దిక్కునకు వెళ్ళినదో ఆ మార్గమునందు పరుగెత్తుచు, రాముని వైపు చూచుచుండెను. 17,18

మూ. యేన మార్గం చ భూమిం చ నిరీక్షన్తే స్మ తే మృగాః,
పునర్నదన్తో గచ్ఛన్తి లక్ష్మణేనోపలక్షితాః.

ప్ర. అ. తే మృగాః = ఆ మృగములు, యేన = ఏ కారణముచేత, మార్గం చ = ఆకాశమార్గమును. భూమిం చ = భూమినీ, నిరీక్ష న్తే స్మ = చూచుచుండెనో, పునశ్చ = మరల, నద న్తః = అరచుచు, గచ్ఛ న్తి = వెళ్ళుచున్నవో, (అ కారణము చేత), లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఉపలక్షితాః = గు ర్తించబడినవి.

తా. ఆ మృగములు ఆకాశమార్గమును, భూమినీ చూచుచు మరల అరచుచు అటు వైపు వెళ్ళుచుండుటచే లక్ష్మణుడు వాటి అభిప్రాయమును గ్రహించెను.

మూ. తేషాం వచనసర్వస్వం లక్షయామాస చేఙ్గితమ్, 20
ఉవాచ లక్ష్మణో జ్యేష్ఠం ధీమాన్ భ్రాతరమార్తవత్.

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, తేషామ్ = ఆ మృగములయొక్క, వచనసర్వస్వమ్ = మాటల సారమైన, ఇఙ్గితమ్ = చేష్టను, లక్షయామాస = గుర్తించెను. అర్తవత్ = ఆర్తుడై, జ్యేష్ఠం భ్రాతరమ్ = అన్న గారిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. ఆ మృగముల చేష్టలే వాటి మాటల సారము. దానిని గుర్తించిన బుద్ధి శాలి యైన లక్ష్మణుడు, దీనుడై, అన్నగారితో ఇట్లు పలికెను. 20

మూ. క్వ గతేతి త్వయా పృష్టా యథేమే సహసోత్థితాః 21
దర్శయన్తి క్షితిం చైవ దక్షిణాం చ దిశం మృగాః,
సాధు గచ్ఛావహే దేవ దిశమేతాం హి నైరృతిమ్ 22
యది స్యాదాగమః కశ్చిదార్యా వా సాథ లక్ష్యతే.

ప్ర. అ. దేవ = ఓ ! ప్రభూ, ఇమే = ఈ, మృగాః = మృగములు, క్వ = ఎక్కడికి, గతా = వెళ్ళినవి, ఇతి = అని, త్వయా = నీచేత, పృష్టాః = అడగ బడినవై, సహసా = వెంటనే, ఉత్థితాః = లేచినవై, క్షితిం చైవ = భూమిని, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును, యథా = ఎట్లు, దర్శయన్తి = చూపుచున్నవో, (దానిని పట్టి), ఏతామ్ = ఈ, నైరృతిం దిశమ్ = నైరృతిదిక్కును గూర్చి, సాధు = బాగుగా, గచ్ఛావహే = వెళ్ళుదము. కశ్చిత్ = ఏదైన, ఆగమః = వార్త, యది స్యాత్ = ఉండవచ్చును. అథ = లేదా, సా = ఆ, ఆర్యా వా = అర్యురాలైనా, లక్ష్యతే = చూడబడును.

తా. ప్రభూ ! "సీత ఎక్కడికి వెళ్ళినది ?" అని నీవు అడిగినప్పుడు ఈ మృగములు వెంటనే లేచి, నేలను, దక్షిణ దిక్కును చూపుచున్నవి. అందుచేత మనము ఈ నైరృతిదిక్కు వైపు వెళ్లుదము. మన కేమైన జాడ తెలియవచ్చు. లేదా పూజ్యురాలైన సీతయే కనబడవచ్చును. 21,22

మూ. బాఢమిత్యేవ కాకుత్థ్సః ప్రస్థితో దక్షిణాం దిశమ్, 23
లక్ష్మణానుగతః శ్రీమాన్వీక్షమాణో వసున్ధరామ్.

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తుడైన, కాకుత్థ్సః = రాముడు, బాఢమిత్యేవ = తప్పక అట్లే అని, లక్ష్మణానుగతః = లక్ష్మణునిచేత అనుసరించబడినవాడై,

వసున్ధరామ్=భూమిని, వీక్షమాణః=చూచుచు, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును గూర్చి, ప్రస్థితః=ప్రయాణమైనాడు.

తా. శ్రీమంతుడైన రాముడు, తప్పక అట్లే చేసెదము అని పలికి, లక్ష్మణుడు వెంట రాగా, నేలను పరిశీలనగా చూచుచు, దక్షిణదిక్కువైపు ప్రయాణ మాయెను. 23

మూ. ఏవం సంభాషమాణౌ తావన్యోన్యం భ్రాతరావుభౌ, 24
వసున్ధరాయాం పతితపుష్పమార్గమపశ్యతామ్.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, అన్యోన్యమ్=పరస్పరము, సంభాషమాణౌ=మాటలాడుకొనుచున్న, ఉభౌ=ఇద్దరు, భ్రాతరౌ=సోదరులు, వసున్ధరాయామ్=నేలపై, పతితపుష్పమార్గమ్=రాలిన పువ్వులు గల మార్గమును, అపశ్యతామ్=చూచిరి.

తా. ఆ సోదరు లిద్దరూ పరస్పరము ఇట్లు మాటలాడుకొనుచు వెళ్ళుచుండగా వారికి నేలమీద రాలిన పువ్వులతో నిండిన మార్గము కనబడెను. 24

మూ. తాం పుష్పవృష్టిం పతితాం దృష్ట్వా రామో మహీతలే,
ఉవాచ లక్ష్మణం వీరో దుఃఖితో దుఃఖితం వచః.

ప్ర. అ. వీరః=వీరుడైన, రామః=రాముడు, మహీతలే=నేలమీద, పతితామ్=పడిన, తాం పుష్పవృష్టిమ్=ఆ పుష్పవర్షమును, దృష్ట్వా=చూచి, దుఃఖితః=దుఃఖించుచున్నవాడై, దుఃఖితమ్=దుఃఖించుచున్న, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. వీరుడైన రాముడు నేలమీద రాలి యున్న ఆ పుష్పముల వర్షమును చూచి, దుఃఖించుచు, దుఃఖితుడై ఉన్న లక్ష్మణునితో ఇట్లు పలికెను. 25

మూ. అభిజానామి పుష్పాణి తానీమానీహ లక్ష్మణ, 26
పినద్ధానీహ వైదేహ్యా మయా దత్తాని కాననే.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! ఇహ=ఇప్పుడు, తాని=ఆ, ఇమాని=ఈ, పుష్పాణి=పుష్పములను, అభిజానామి=గుర్తించుచున్నాను. ఇహ=ఈ,

కాననే = అడవియందు, మయా = నాచేత, దత్తాని = ఇవ్వబడిన ఈ పుష్పములు, వైదేహ్యా = సీతచేత, పినద్ధాని = కట్టబడినవి.

తా. లక్ష్మణా! ఈ పుష్పములు అవే. నేను వీటిని గుర్తుపట్టగలను. నేను అడవిలో సీత కివ్వగా ఆమె కట్టుకొన్నది. 26

మూ. మన్యే సూర్యశ్చ వాయుశ్చ మేదినీ చ యశస్వినీ, 27
అభిరక్షన్తి పుష్పాణి ప్రకుర్వన్తో మమ ప్రియమ్.

ప్ర. అ. సూర్యశ్చ = సూర్యుడు, వాయుశ్చ = వాయువు, యశస్వినీ = కీర్తి గల, మేదినీ చ = భూమి, మమ = నాకు, ప్రియమ్ = ప్రియమును, ప్రకుర్వన్తః = చేయుచున్నవై, పుష్పాణి = పుష్పములను, అభిరక్షన్తి = రక్షించుచున్నవి అని, మన్యే = తలచుచున్నాను.

తా. సూర్యుడు, వాయువు, కీర్తి గల భూమి నాకు ప్రియము చేయుటకై ఈ పుష్పములను కాపాడుచున్నా యని తలచెదను. 27

మూ. ఏవముక్త్వా మహాబాహుం లక్ష్మణం పురుషర్షభః, 28
ఉవాచ రామో ధర్మాత్మా గిరిం ప్రస్రవణాకులమ్.

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడు, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, రామః = రాముడు, మహాబాహుమ్ = గొప్ప బాహువులు గల, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, ప్రస్రవణాకులమ్ = జలప్రవాహములతో వ్యాకులముగా నున్న, గిరిమ్ = పర్వతమును గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పురుషులలో శ్రేష్ఠుడు, ధర్మాత్ముడూ అయిన రాముడు, మహాబాహువైన లక్ష్మణునితో ఇట్లు పలికి, సెలయేళ్ళతో నిండిన ఆ పర్వతముతో ఇట్లనెను.

మూ. కచ్చిత్ క్షితిభృతాం నాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ, 29
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా.

ప్ర. అ. క్షితిభృతాం నాథ = ఓ! పర్వతప్రభువా! రమ్యే = సుందరమైన, వనోద్దేశే = వనప్రాంతమునందు, మయా = నాతో, విరహితా = శూన్యురాలైన, సర్వాఙ్గసున్దరీ = అన్ని అవయవములయందు సుందరియైన, రామా =

స్త్రీ, త్వయా = నీచేత, కచ్చిత్ దృష్టా = చూడబడినదా ?

తా. పర్వతరాజా ! రమ్యమైన ఈ వనప్రాంతమునందు, నాతో విరహము పొందినదీ, సుందరములైన అన్ని అవయవములు కలదీ అయిన స్త్రీని ఎవరి నైన చూచినావా ?

29

మూ. క్రుద్ధోఽబ్రవీద్గిరిం తత్ర సింహః క్షుద్రమృగం యథా,
తాం హేమవర్ణాం హేమాభాం సీతాం దర్శయ పర్వత,
యావత్సానూని సర్వాణి న తే విధ్వంసయామ్యహమ్.

ప్ర. అ. తత్ర = అప్పుడు, సింహః = సింహము, క్షుద్రమృగం యథా = నీచమైన మృగమును గూర్చి వలె, గిరిమ్ = పర్వతమును, క్రుద్ధః = క్రుద్ధుడై, అబ్రవీత్ = పలికెను. పర్వత = పర్వతమా ! అహమ్ = నేను, తే = నీయొక్క, సర్వాణి = సమస్తమైన, సానూని = చరియలను, యావత్ = ఎంతలో, న విధ్వంసయామి = నశింపచేయనో, అంతలో, హేమవర్ణామ్ = బంగారు వర్ణము గలది, హేమాభామ్ = బంగారు కాంతి గలది అయిన, సీతామ్ = సీతను, దర్శయ = చూపుము.

తా. అప్పుడు రాముడు సింహము క్షుద్రమృగముమీద కోపించి నట్లు ఆ పర్వతము మీద కోపించి ఇట్లనెను :- ఓ ! పర్వతమా ! నేను నీ చరియల నన్నింటినీ ధ్వంసము చేయుటకు ముందే బంగారు వర్ణము, బంగారము వంటి కాంతి గల నా సీతను చూపించుము.

30, 31

మూ. ఏవముక్తస్తు రామేణ పర్వతో మైథిలీం ప్రతి,
శంసన్నివ తతః సీతాం నాదర్శయత రాఘవే. 32

ప్ర. అ. రామేణ = రామునిచేత, మైథిలీం ప్రతి = సీతను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, పర్వతః = పర్వతము, తతః = అటుపిమ్మట, సీతామ్ = సీతను గూర్చి, శంసన్నివ = (ప్రతిధ్వనిచే) చెప్పుచున్నాడా అన్నట్లుం డెను. రాఘవే = రామునియందు, (రామునకు), నాదర్శయత = తనను చూప లేదు.

తా. రాముడు సీతను గూర్చి ఈ విధముగా అడగగా, ఆ పర్వతము ప్రతి ధ్వనిచే సీతను గూర్చి చెప్పుచున్నదా అన్నట్లు కనబడెను గాని రామునకు తాను

మాత్రము (మనుష్యరూపమున) కనబడలేదు. లేదా సీతను చూపలేదు. 32

మూ. తతో దాశరథీ రామ ఉవాచ చ శిలోచ్చయమ్,
మమ బాణాగ్నినిర్దగ్ధో భస్మీభూతో భవిష్యసి. 33
అసేవ్యః సతతం చైవ నిస్తృణద్రుమపల్లవః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దాశరథిః = దశరథకుమారుడైన, రామః = రాముడు, శిలోచ్చయమ్ = పర్వతమును గూర్చి. ఉవాచ చ = పలికెను. మమ = నాయొక్క, బాణాగ్నినిర్దగ్ధః = బాణాగ్నిచేత కాల్చబడినదానవై, భస్మీభూతః = భస్మముగా మారిపోయినదానవై, సతతమ్ = ఎల్లప్పుడు, అసేవ్యః = సేవించుటకు తగనిదానవై, నిస్తృణద్రుమపల్లవః = తృణములు, వృక్షములు, చిగుళ్ళులేనిదానవై, భవిష్యసి = కాగలవు.

తా. పిమ్మట దశరథకుమారుడైన రాముడు ఆ పర్వతముతో ఇట్లు పలికెను. నిన్ను నా బాణాగ్నిచేత కాల్చివేసి భస్మముచేసెదను. తృణములు గాని, వృక్షములు గాని, చిగుళ్ళు గాని లేక ఎవ్వరూ దరిచేరుటకు అనర్హము కాగలవు.

మూ. ఇమాం వా సరితం చాద్య శోషయిష్యామి లక్ష్మణ, 34
యది నాఖ్యాతి మే సీతామార్యాం చన్ద్రనిభాననామ్.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! ఆర్యామ్ = పూజ్యురాలు, చన్ద్రనిభాననామ్ = చంద్రునితో సమానమైన ముఖము గలదీ అయిన, సీతామ్ = సీతను, మే = నాకు, నాఖ్యాతి = చెప్పకపోయినచో, అద్య = ఇప్పుడు, ఇమామ్ = ఈ, సరితం వా = నదినైనా, శోషయిష్యామి = ఎండింపచేసెదను.

తా. లక్ష్మణా! చంద్రుని వంటి ముఖము గల ఆర్యురాలైన సీత విషయము ఇప్పుడు ఈ నది చెప్పకపోయినచో దీనిని ఎండింపచేసెదను. 34

మూ. ఏవం స రుషితో రామో దిధక్షన్నివ చక్షుషా, 35
దదర్శ భూమౌ నిష్క్రాన్తం రాక్షసస్య పదం మహత్,
త్రస్తాయా రామకాఙ్క్షిణ్యాః ప్రధావన్త్యా ఇతస్తతః, 36
రాక్షసేనానువృత్తాయా మైథిల్యాశ్చ పదాన్యథ.

ప్ర. అ. ఏవమ్ = ఎట్లు, రుషితః = కోపించినవాడై, చక్షుషా = నేత్రము చేత, దిధక్షన్నివ = కాల్చదలుచుచున్నవాడు వలె ఉన్న, రామః = రాముడు, భూమౌ = నేలమీద, నిష్క్రాన్తమ్ = ఏర్పడిన, రాక్షసస్య = రాక్షసునియొక్క, మహత్ = పెద్దదైన, పదమ్ = పాదచిహ్నమును, అథ = పిమ్మట, త్రస్తాయాః = భయపడినది, రామకాఙ్క్షిణ్యాః = రాముణ్ణి కోరుచున్నదీ, ఇత స్తతః = ఇటు అటూ, ప్రధావన్త్యాః = పరుగెత్తుచున్నదీ, రాక్షసేన = రాక్షసునిచేత, అనువృత్తాయాః = వెంబడించబడినదీ అయిన, మైథిల్యాః = సీతయొక్క, పదాని చ = పాదచిహ్నములను, దదర్శ = చూచెను.

తా. ఈ విధముగా క్రుద్ధుడై, నేత్రములతో కాల్చివేయనున్నాడా అన్నట్లున్న ఆ రామునకు నేలమీద, రాక్షసుని ఒక పెద్ద అడుగు, రాక్షసుడు వెంబడించగా, భయపడి, రామునికొరకై ఎదురుచూచుచు, ఇటు అటు పరుగెత్తిన సీత అడుగులు కనబడెను.
35, 36

మూ. స సమీక్ష్య పరిక్రాన్తం సీతాయా రాక్షసస్య చ, 37
భగ్నం ధనుశ్చ తూణీ చ వికీర్ణం బహుధా రథమ్,
సంభ్రాన్తహృదయో రామః శశంస భ్రాతరం ప్రియమ్. 38

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, సీతాయాః = సీతయొక్క, రాక్షసస్య చ = రాక్షసునియొక్క, పరిక్రాన్తమ్ = నడచిన ఆనవాలును, భగ్నమ్ = విరిగిన, ధనుశ్చ = ధనస్సును, తూణీ చ = అంబులపొదులను, బహుధా = అనేకవిధములుగా, వికీర్ణమ్ = చిమ్మబడి ఉన్న, రథమ్ = రథమును, సమీక్ష్య = చూచి, సంభ్రాన్త హృదయః = భయముచెందిన హృదయము కలవాడై, ప్రియమ్ = ప్రియుడైన, భ్రాతరమ్ = సోదరుని గూర్చి, శశంస = ఇట్లు చెప్పెను.

తా. సీత, రాక్షసుడు నడచిన అడుగు జాడలను, విరిగిన ధనస్సును, అంబులపొదులను, ముక్కముక్కలై పడి ఉన్న రథమును చూడగానే రాముని హృదయము కంపించిపోయెను. అప్పు డాతడు తన ప్రియసోదరునితో ఇట్లనెను.
37,38

మూ. పశ్య లక్ష్మణ వైదేహ్యాః శీర్ణాః కనకబిన్దవః,
భూషణానాం హి సౌమిత్రే మాల్యాని వివిధాని చ. 39

ప్ర. అ. సౌమిత్రే = సుమిత్రాకుమారుడవైన, లక్ష్మణ = లక్ష్మణా! పశ్య = చూడుము. వైదేహ్యాః=సీతయొక్క, భూషణానామ్=అలంకారములయొక్క, కనకబిన్దవః = బంగారుముక్కలు, శీర్ణాః = జారిపడినవి. వివిధాని=అనేకవిధములైన, మాల్యాని = మాలలుకూడ (జారిపడినవి).

తా. సుమిత్రానందనుడవైన లక్ష్మణా! సీత అలంకారములనుండి చిన్న చిన్న బంగారపు ముక్కలు, అనేకవిధములైన పుష్పమాలలు రాలి పడినవి; చూడుము. 39

మూ. తప్తబన్దునికాశైశ్చ చిత్రైః క్షతజబిన్దుభిః,
ఆవృతం పశ్య సౌమిత్రే సర్వతో ధరణీధరమ్. 40

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! తప్తబిన్దునికాశైః = బంగారము చుక్కలతో సమానములైన, చిత్రైః=చిత్రములైన, క్షతజబిన్దుభిః=రక్తబిందువులచేత, సర్వతః = అంతటా, ఆవృతమ్ = కప్పబడిన, ధరణీధరమ్ = పర్వతమును, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! ఈ పర్వతముమీద అంతటా బంగారు చుక్కల వంటి, చిత్రములైన (చిన్నా పెద్దవిగా ఉన్న) రక్తబిందువులు పడి ఉన్నవి; చూడుము.

మూ. మన్యే లక్ష్మణ వైదేహీ రాక్షసైః కామరూపిభిః,
భిత్త్వా భిత్త్వా విభక్తా వా భక్షితా వా భవిష్యతి. 41

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! వైదేహీ = సీత, కామరూపిభిః = కామరూపము గల, రాక్షసైః=రాక్షసుల చేత, భిత్త్వా భిత్త్వా=ఛేదించిఛేదించి, విభక్తా వా = విడగొట్టబడినది గాని, భక్షితా వా = భక్షింపబడినది గాని, భవిష్యతి = కాగలదు (అయి ఉండును)అని, మన్యే = తలచుచున్నాను.

తా. లక్ష్మణా! ఇష్టము ప్రకారము రూపము ధరించ గల రాక్షసులు సీతను కోసి కోసి విడగొట్టియుందురు; లేదా భక్షించియుందురు అని తలచెదను.

మూ. తస్యా నిమిత్తం వైదేహ్యా ద్వయోర్వివదమానయోః,
బభూవ యుద్ధం సౌమిత్రే ఘోరం రాక్షసయోరిహ. 42

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! తస్యాః = ఆ, వైదేహ్యాః నిమిత్తమ్ = సీత నిమిత్తమై, వివదమానయోః = కలహము చేయుచున్న, ద్వయోః = ఇద్దరు, రాక్షసయోః = రాక్షసులకు, ఇహ = ఇక్కడ, ఘోరమ్ = ఘోరమైన, యుద్ధమ్ = యుద్ధము, బభూవ = ఆయెను.

తా. లక్ష్మణా ! ఆ సీతకొరకై కలహించిన ఇద్దరు రాక్షసులకు ఇక్కడ ఘోరమైన యుద్ధము జరిగి ఉండును. 42

మూ. ముక్తామణిమయం చేదం తపనీయవిభూషితమ్,
ధరణ్యాం పతితం సౌమ్య కస్య భగ్నం మహద్ధనుః. 43

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! కస్య = ఎవనిదో, ఇదమ్ = ఈ, ముక్తామణిమయమ్ = ముత్యముల రత్నముల వికారమైనది, తపనీయవిభూషితమ్ = బంగారముచేత అలంకరించబడినదీ, అయిన, మహత్ ధనుః = గొప్ప ధనస్సు, భగ్నమ్ = విరగగొట్టబడినదై, ధరణ్యామ్ = నేలమీద, పతితమ్ = పడినది.

తా. సౌమ్యుడా ! పొదిగిన ముత్యములతోను రత్నములతోను నిండినది, బంగారముచేత అలంకరింపబడినది అయిన ఈ పెద్ద ధనస్సు, ఎవరిదో, భగ్నమై నేలమీద పడి యున్నది. 43

మూ. తరుణాదిత్యసంకాశం వైడూర్యగుళికాచితమ్,
విశీర్ణం పతితం భూమౌ కవచం కస్య కాఞ్చనమ్. 44

ప్ర. అ. తరుణాదిత్యసంకాశమ్ = బాలసూర్యునితో సమానము, వైడూర్యగుళికాచితమ్ = వైడూర్యమణులచేత పొదగబడినది, కాఞ్చనమ్ = బంగారు వికారము, కస్య = ఎవనిదో, విశీర్ణమ్ = విరిగిపోయిన, కవచమ్ = కవచము, భూమౌ = నేలపై, పతితమ్ = పడినది.

తా బాలసూర్యునితో సమానమై, వైడూర్యమణులు పొదిగిన, ఈ బంగారు కవచ మెవ్వరిదో భగ్నమై నేలమీద పడి ఉన్నది. 44

మూ. ఛత్రం శతశలాకం చ దివ్యమాల్యోపశోభితమ్,
భగ్నదణ్డమిదం కస్య భూమౌ సమ్యఙ్నిపాతితమ్. 45

ప్ర. అ. శతశలాకం చ=నూరు ఊచలు గలది, దివ్యమాల్యోపశోభితమ్ = దివ్యములైన పుష్పమాలలచేత శోభింపచేయబడినది, భగ్నదణ్డమ్= విరుగగొట్టబడిన దండము గలది అయిన, ఇదం ఛత్రమ్= ఈ ఛత్రము, కస్య= ఎవనిదో, సమ్యక్= బాగుగా, భూమౌ = నేలమీద, నిపాతితమ్ = పడవేయబడినది.

తా. దివ్యములైన పుష్పమాలలచేత అలంకృతమైన ఈ నూరు ఊచల ఛత్రము, ఎవ్వరిదో, దండము పూర్తిగా విరిగిపోగా నేలమీద పడి ఉన్నది. 45

మూ. కాఞ్చనోరశ్ఛదాశ్చేమే పిశాచవదనాః ఖరాః,
భీమరూపా మహాకాయాః కస్య వా నిహతా రణే. 46

ప్ర. అ. కాఞ్చనోరశ్ఛదాః= బంగారు కవచములు గలవి, పిశాచవదనాః = పిశాచముల వంటి ముఖములు గలవి, భీమరూపాః=భయంకరములైన రూపములు గలవి, మహాకాయాః= పెద్ద శరీరములు గలవి, రణే= యుద్ధమునందు, నిహతాః= చంపబడినవి అయిన, ఇమే= ఈ, ఖరాః = గాడిదలు, కస్య వా = ఎవరివో.

తా. బంగారు కవచములు, పిశాచముఖముల వంటి ముఖములు, భయంకరమైన రూపము, పెద్ద శరీరము గల ఈ గాడిదలు యుద్ధములో చంపబడినవి. ఇవి ఎవరివో : 46

మూ. దీప్తపావకసంకాశో ద్యుతిమాన్ సమరధ్వజః,
అపవిద్ధశ్చ భగ్నశ్చ కస్య సాంగ్రామికో రథః. 47

ప్ర. అ. దీప్తపావకసంకాశః=మండుచున్న అగ్నితో సమానము, ద్యుతిమాన్= కాంతి గలది, సమరధ్వజః= యుద్ధధ్వజము గలది, అయిన, కస్య వా = ఎవనిదో, సాంగ్రామికః= యుద్ధసంబంధమైన, రథః= రథము, భగ్నః= విరగగొట్టబడినది, అపవిద్ధశ్చ= పడగొట్టబడినది.

తా. ప్రజ్వలించుచున్న అగ్నివలె ప్రకాశించుచున్నది, యుద్ధములో నాయకుని సూచించు ధ్వజముతో కూడినది, యుద్ధములో ఉపయోగింపబడేదీ అయిన ఈ రథ మెవరిదో విరుగగొట్టి దూరముగా పడవేయబడినది. 47

మూ. రథాక్షమాత్రా విశిఖా స్తపనీయవిభూషణాః,
కస్యేమేఽభిహతా బాణాః ప్రకీర్ణా ఘోరకర్మణః. 48

ప్ర. అ. రథాక్షమాత్రాః = రథముయొక్క ఇరుసు ప్రమాణము వంటి ప్రమాణము గలవి, విశిఖాః=శ్రేష్ఠమైన అగ్రభాగము గలవి, తపనీయవిభూషణాః = బంగారు అలంకారము గలవీ; అభిహతాః=కొట్టబడినవి అయిన, ఇమే బాణాః = ఈ బాణములు, ఘోరకర్మణః = ఘోరమైన కర్మ గల, కస్య = ఎవనివో, ప్రకీర్ణాః = చిమ్మబడి యున్నవి.

తా. భయంకరమైన పని చేయువానివి ఎవనివో ఈ బాణములు కొట్టబడినవై చెల్లాచెదరుగ పడి ఉన్నవి. ఇవి రథము ఇరుసుప్రమాణములో ఉన్నవి. వీటి అగ్రములు చాల తీక్ష్ణములుగా ఉన్నవి. వీటిపై బంగారు నగిషీ చెక్కబడినది.

వి. "రథాక్షమాత్రాః"అనునపుడు రథము ఇరుసు ఎంత పొడవు ఉండునో అంత పొడవున్న వనే అర్థము గ్రహించి "నాలుగువందల అంగుళముల పొడవున్నవి"అని వ్యాఖ్యాతలు అర్థము వ్రాసినారు. బాణము దాదాపు 33 అడుగుల పొడవు ఉండుట అసంభావ్యము కదా. చిన్న అంగుళ మేమో అనుకొన్నను, అది చాల ఎక్కువపొడవే అగును. అందుచేత వాటి లావు రథము ఇరుసంత ఉన్నదని చెప్పిన బాగుండును. 48

మూ. శరావరౌ శరైః పూర్ణౌ విధ్వస్తౌ పశ్య లక్ష్మణ,
ప్రతోదాభీశుహస్తో వై కస్యాయం సారథిర్హతః. 49

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! శరైః = బాణములతో, పూర్ణౌ = నిండిన, విధ్వస్తౌ = నశింపచేయబడిన, శరావరౌ = అంబులపొదులను, పశ్య = చూడుము. ప్రతోదాభీశుహస్తః = కొరడా, కళ్లెములు హస్తములందు గల, హతః = చంపబడిన, అయం సారథిః = ఈ సారథి, కస్య = ఎవరివాడో ?

తా. లక్ష్మణా ! బాణములతో నిండిన ఈ రెండు అంబులపొదులు ధ్వంసముచేయబడి ఉన్నవి; చూడుము. ఈతడు ఎవరి సారథియో చచ్చి పడి ఉన్నాడు. ఈతని చేతులలో కొరడా, కళ్లెములు ఉన్నవి. 49

మూ. కస్యేమౌ పురుషవ్యాఘ్ర శయాతే నిహతౌ యుధి,
చామరగ్రాహిణౌ సౌమ్య సోష్ణీషమణికుణ్డలౌ. 50

ప్ర. అ. పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుడా! సౌమ్య = సౌమ్యుడా! సోష్ణీష మణికుణ్డలౌ=తలపాగలతోను మణికుండలములతోను కూడిన, ఇమౌ= ఈ, చామర గ్రాహిణౌ = చామరములను పట్టువారు, కస్య = ఎవరివారో, యుధి = యుద్ధము నందు, నిహతౌ = చంపబడినవారై, శయాతే=శయినించిఉన్నారు.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ! సౌమ్యుడా! తలపాగాలు, కుండల ములు ధరించిన ఈ చామరగ్రాహులు ఎవరివారో; యుద్ధములో చంపబడి పడి ఉన్నారు.

వి. పై శ్లోకాలలో ఉన్న "కస్య'' అనేదానిని ప్రశ్నార్థకంగా గ్రహించి ''ఎవరిది?''అను అర్థము తీసికొనుటకంటె 'కస్య' అనేదానిని ''కస్యాపి"అనే అర్థంలో(ఎవరిదో) గ్రహించి వ్యాఖ్యానించుట యుక్త మని తోచి అట్లు చేసినాము. "ఇది ఎవరిది?'' అని లక్ష్మణుని ప్రశ్నించినచో ఆతనికి మాత్రము ఏమి తెలియును? 50

మూ. పదవీ పురుషస్యైషా వ్యక్తం కస్యాపి రక్షసః,
వైరం శతగుణం పశ్య మమేదం జీవితాన్తకమ్. 51

ప్ర. అ. ఏషా=ఇది, వ్యక్తమ్ = స్పష్టముగా, కస్యాపి = ఎవ్వడో, పురు షస్య = పురుషుడైన, రక్షసః = రాక్షసునియొక్క, పదవీ = మార్గము. మమ = నాయొక్క, జీవితాన్తకమ్=జీవితమునకు నాశకమైన, శతగుణమ్=వందరెట్లైన, ఇదం వైరమ్ = ఈ వైరమును, పశ్య = చూడుము.

తా. ఇది ఎవ్వడో పురుషుడైన రాక్షసుని మార్గ మనేది స్పష్టము. నా జీవితానికే ముప్పు తెచ్చిన ఈ వైరము ఏ విధముగా నూరు రెట్లు పెరిగిపోయినదో చూడుము! 51

వి. 43వ శ్లోకంనుంచి 51వ శ్లోకం వరకు ఉన్న 9 శ్లోకాలు ప్రాచ్య పాఠంలో లేవు. ఈ రథాదులు కనబడిన పిమ్మట ప్రక్కనే పడిఉన్న జటాయువు కూడ వెంటనే కనబడాలికదా! 51వ శ్లోకంలో రాముడు ''నాకు ప్రాణాంతకర మైన వైరము ఏర్పడినదే''అని వాపోవుట అనుచితము.

మూ. సుఘోరహృదయైః సౌమ్య రాక్షసైః కామరూపిభిః,
హృతా మృతా వా సీతా సా భక్షితా వా తపస్వినీ, 52
న ధర్మస్త్రాయతే సీతాం హ్రియమాణాం మహావనే.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! తపస్వినీ = దీనురాలైన, సా సీతా = ఆ సీత, సుఘోరహృదయైః = చాల ఘోరమైన హృదయము గల, కామరూపిభిః = స్వేచ్ఛానుసారము రూపము గల, రాక్షసైః=రాక్షసులచేత, హృతా వా=హరించబడినది గాని, భక్షితా వా = భక్షింపబడినది గాని అయి ఉండును. మృతా వా= లేదా మరణించి ఉండును. మహావనే = మహావనమునందు, హ్రియమాణామ్ = హరింపబడుచున్న, సీతామ్ = సీతను, ధర్మః = ధర్మము, న త్రాయతే=రక్షించుటలేదు.

తా. సౌమ్యుడవైన లక్ష్మణా ! దీనురాలైన సీతను ఘోరమైన మనస్సు గల, స్వేచ్ఛానుసారము రూపము ధరించగలిగిన రాక్షసులు హరింపగా ఆమె మరణించి యుండ వచ్చును; లేదా ఆమెను వాళ్ళు భక్షించి ఉండవచ్చును. మహారణ్యములో అపహరింపబడుచుండగా ఆ సీతను ధర్మము కాపాడలేకపోయినది !

మూ. భక్షితాయాం హి వైదేహ్యాం హృతాయామపి లక్ష్మణ, 53
కే హి లోకే ప్రియం కర్తుం శక్తాః సౌమ్య మహేశ్వరాః.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా, లక్ష్మణ=లక్ష్మణా! వైదేహ్యామ్ = సీత, భక్షితాయామ్ = భక్షింపబడినా, హృతాయామపి = హరించబడినా, మమ=నాకు, లోకే= ఈ లోకమునందు, కే ఈశ్వరాః=ఏ దేవతలు, ప్రియమ్=ప్రియమును, కర్తుమ్ = చేయుటకు, శక్తాః = సమర్థులు?

తా. సౌమ్యుడవైన లక్ష్మణా! సీత భక్షింపబడినా, హరింపబడినా, ఇంక ఈ లోకములో నాకు ఏ దేవతలు ప్రియము చేయగలరు ? ఇది తీరని నష్టము కదా ?

53.

మూ. కర్తారమపి లోకానాం శూరం కరుణవేదినమ్, 54
అజ్ఞానాదవమన్యేరన్ సర్వభూతాని లక్ష్మణ.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! లోకానామ్ = లోకములకు, కర్తారమపి=

కర్తయైనను, శూరమ్ = శూరుడైనను, కరుణవేదినమ్ = దయ చూపువానిని, సర్వభూతాని = అన్ని భూతములు, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, అవమన్యేరన్ = అవమానించును.

తా. లక్ష్మణా ! దయాపరుడైనవానిని చూచి, ఆత డెంత శూరుడైనా, లోకములను సృజింప సమర్థుడైనా, అన్ని భూతములు అజ్ఞానమువలన అవమానించును. 54

మూ. మృదుం లోకహితే యుక్తం దాన్తం కరుణవేదినమ్, 55
నిర్వీర్య ఇతి మన్యన్తే నూనం మాం త్రిదశేశ్వరాః.

ప్ర. అ. మృదుమ్ = మెత్తనివాడను, లోకహితే = లోకహితమునందు, యుక్తమ్ = ప్రయత్నము చేయువాడను, దాన్తమ్ = ఇంద్రియనిగ్రహము కలవాడను, కరుణవేదినమ్ = కరుణ చూపువాడను అయిన, మామ్ = నన్ను, త్రిదశేశ్వరాః = దేవతల ప్రభువులు, నిర్వీర్యః ఇతి = పరాక్రమహీనుడు అని, మన్యన్తే = తలచుచున్నారు, నూనమ్ = నిశ్చయము.

తా. ఇంద్రియనిగ్రహవంతుడనై, దయాపరుడనై నేను లోకమునకు హితము చేకూర్చవలె నని ప్రయత్నించుచు, మెత్తగా ఉండుటచేత దేవత లందరూ "ఇతడు పరాక్రమశూన్యుడు" అని అనుకొనుచున్నారు :

మూ. మాం ప్రాప్య హి గుణో దోషః సంవృత్తః పశ్య లక్ష్మణ
అద్యైవ సర్వభూతానాం రక్షసామభవాయ చ,
సంహృత్యైవ శశిజ్యోత్స్నాం మహాన్ సూర్య ఇవోదితః
సంహృత్యైవ గుణాన్ సర్వాన్ మమ తేజః ప్రకాశతే.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! మామ్ = నన్ను, ప్రాప్య = పొంది, గుణః = గుణము, దోషః = దోషముగా, సంవృత్తః = అయినది, పశ్య = చూడుము. శశిజ్యోత్స్నామ్ = చంద్రుని వెన్నెలను, సంహృత్యైవ = అణచివేసి, ఉదితః = ఉదయించిన, మహాన్ = గొప్ప, సూర్యః ఇవ = సూర్యుడు వలె, మమ తేజః = నా తేజస్సు, సర్వాన్ = సమస్తమైన, గుణాన్ = గుణములను, సంహృత్యైవ = అణగద్రొక్కి, అద్యైవ = ఇప్పుడే, సర్వభూతానామ్ = సకలభూతములయొక్క,

రక్షసాం చ = రాక్షసులయొక్క, అభవాయ = వినాశముకొరకు, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తా. లక్ష్మణా ! చూచితివా ; నాలో ఉన్న గుణము కూడ ఎట్లు దోషముగా మారినదో ! గొప్ప ప్రకాశము గల సూర్యుడు చంద్రుని వెన్నెలను అణచివేసి ఉదయించి నట్లు ఇప్పుడే నా తేజస్సు మృదుత్వము మొదలైన గుణాలను అన్నింటినీ అణగ ద్రొక్కి విజృంభించి సకలభూతములను, రాక్షసులను నశింపచేయ గలదు.

56, 57

మూ. నైవ యక్షా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః, 58
కింనరా వా మనుష్యా వా సుఖం ప్రాప్స్యన్తి లక్ష్మణ.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! యక్షాః = యక్షులు, సుఖమ్ = సుఖమును, నైవ ప్రాప్స్యన్తి = పొందరు, యక్షాః = యక్షులు, న = పొందరు, పిశాచాః = పిశాచములు, న = పొందవు, రాక్షసాః = రాక్షసులు, న = పొందరు. కింనరా వా = కింనరులు గాని, మనుష్యా వా = మనుష్యులు గాని, పొందరు.

తా. లక్ష్మణా ! ఇప్పుడు యక్షులను గాని, గంధర్వులను గాని, పిశాచములను గాని, రాక్షసులను గాని, కింనరులను గాని, మానవులను గాని సుఖముగా ఉండనివ్వను.

58

మూ. మమాస్త్రబాణసంపూర్ణమాకాశం పశ్య లక్ష్మణ, 59
నిఃసంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్యచారిణామ్.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! మమ = నాయొక్క, అస్త్రబాణసంపూర్ణమ్ = అస్త్రములతోను బాణములతోను నిండిన, ఆకాశమ్ = ఆకాశమును, అద్య = ఇప్పుడు, త్రైలోక్యచారిణామ్ = మూడు లోకములందు సంచరించు దేవతాదులకు, నిఃసంపాతమ్ = ఎగిరే చోటులేనిదానినిగా, కరిష్యామి = చేసెదను. పశ్య = చూడుము.

తా. లక్ష్మణా ! ఆకాశమును నా అస్త్రములతోను, బాణములతోను నింపి వేసి మూడు లోకములలో సంచరించే దేవతాదులకు ఎగురుటకు అవకాశము లేకుండా చేసెదను. చూడుము.

59

మూ. సంనిరుద్ధగ్రహగణమావారితనిశాకరమ్, 60
విప్రణష్టానలమరుద్భాస్కరద్యుతిసంవృతమ్,
వినిర్మథితశైలాగ్రం శుష్యమాణజలాశయమ్, 61
ధ్వస్తద్రుమలతాగుల్మం విప్రణాశితసాగరమ్,
త్రైలోక్యం తు కరిష్యామి సంయుక్తం కాలకర్మణా. 62

ప్ర. అ. త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయమును, సంనిరుద్ధగ్రహగణమ్ = అడ్డుకొనబడిన గ్రహముల సముదాయము గలదానినిగాను, ఆవారితనిశాకరమ్ = నివారింపబడిన చంద్రుడు కలదానిని గాను, విప్రణష్టానలమరుద్భాస్కరద్యుతి = నశించిన అగ్ని, వాయువు, సూర్యప్రకాశము కలదానినిగాను, సంవృతమ్ = చీకటిచేత కప్పబడినదానినిగాను, వినిర్మథితశైలాగ్రమ్ = మథింపబడిన పర్వతశిఖరములు కలదానినిగాను, శుష్యమాణజలాశయమ్ = ఎండిపోయిన జలస్థానములు కలదానినిగాను, ధ్వస్తద్రుమలతాగుల్మమ్ = నశింపచేయబడిన వృక్షములు, లతలు, పొదలు కలదానినిగాను, విప్రణాశితసాగరమ్ = నశింపచేయబడిన సముద్రము గలదానినిగాను, కాలకర్మణా = ప్రలయకాలముయొక్క కర్మతో, సంయుక్తమ్ = కూడినదానినిగాను, కరిష్యామి = చేయగలను.

తా. గ్రహగతులు నిలిచిపోవునట్లు చేసెదను. చంద్రుడు ఉదయించకుండ చేసెదను. అగ్నిని, వాయువును, సూర్యతేజస్సును నశింపచేసి అంధకారము క్రమ్ముకొనునట్లు చేసెదను. పర్వతశిఖరములను పడగొట్టెదను. సరస్సులు, నదులు మొదలైన జలాశయములు ఎండిపోవునట్లు చేసెదను. వృక్షములను, లతలను, పొదలను నశింపచేసెదను. సముద్రమును ఇంకింపచేసెదను. ఈ విధముగ ముల్లోకములలో ప్రళయము సృష్టించెదను. 60, 61, 62

మూ. న తాం కుశలినీం సీతాం ప్రదాస్యన్తి మమేశ్వరాః,
అస్మిన్ ముహూర్తే సౌమిత్రే మమ ద్రక్ష్యన్తి విక్రమమ్.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! ఈశ్వరాః = దేవతలు, తాం సీతామ్ = ఆ సీతను, కుశలినీమ్ = క్షేమముగా ఉన్నదానినిగా, మమ = నాకు, నప్రదాస్యన్తి =

ఇవ్వకపోయినచో, అస్మిన్ = ఈ, ముహూర్తే = ముహూర్తమునందు, మమ = నాయొక్క, విక్రమమ్ = పరాక్రమమును, ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. లక్ష్మణా ! దేవతలు సీతను క్షేమముగా నాకు అప్పగించనిచో ఈ క్షణమునందే నా పరాక్రమ మెట్టిదో చూపించెదను. 63

మూ. నాకాశముత్పతిష్యన్తి సర్వభూతాని లక్ష్మణ,
మమ చాపగుణోన్ముక్తైర్బాణజాలైర్నిరన్తరమ్. 64

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! సర్వభూతాని = అన్ని భూతములు, మమ = నాయొక్క, చాపగుణోన్ముక్తైః = ధనస్సు నారిచేత విడవబడిన, బాణజాలైః = బాణముల సముదాయములచేత, నిరన్తనమ్ = అవకాశము లేకుండా ఉన్న, ఆకాశమ్ = ఆకాశమును గూర్చి, న ఉత్పతిష్యన్తి = ఎగరవు.

తా. లక్ష్మణా ! నా ధనస్సునుండి వెలువడిన బాణములచేత దట్టముగా కప్పివేయబడిన ఆకాశములోనికి ఇంక ఏ ప్రాణులు కూడ ఎగురజాలవు. 64

మూ. అర్దితం మమ నారాచైర్ధ్వస్తభ్రాన్తమృగద్విజమ్,
సమాకులమమర్యాదం జగత్పశ్యాద్య లక్ష్మణ. 65

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! అద్య = ఇప్పుడు, మమ = నాయొక్క, నారాచైః = నారాచబాణములచేత, అర్దితమ్ = పీడించబడినది, ధ్వస్తభ్రాన్తమృగద్విజమ్ = నశించిన భయపడిన మృగములు పక్షులు కలది, సమాకులమ్ = వ్యాకులమైనది, అమర్యాదమ్ = కట్టుబాట్లు లేనిది అయిన, జగత్ = జగత్తును, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా ! ఇప్పుడు ఈ జగత్తును అంతా నా నారాచబాణములచేత పీడించెదను. మృగములను పక్షులను భయపడునట్లు చేసి నశింపచేసెదను. ఈ జగత్తును వ్యాకుల మయేటట్లు చేసి కట్టుబాట్లు అన్నీ తారుమారు చేసెదను. చూడుము. 65

మూ. ఆకర్ణపూర్ణైరిషుభిర్జీవలోకం దురావరైః,
కరిష్యే మైథిలీ హేతోరపిశాచమరాక్షసమ్. 66

ప్ర. అ. మైథిలీహేతోః = సీతనిమిత్తమై, జీవలోకమ్ = ఈ జగత్తును, ఆకర్ణపూర్ణైః = కర్ణాంతమువరకు లాగబడిన, దురావరైః = నివారింప శక్యము కాని, ఇషుభిః = బాణములచేత, అపిశాచమ్ = పిశాచములు లేనిదానినిగాను, అరాక్షసమ్ = రాక్షసులు లేని దానినిగాను, కరిష్యే = చేసెదను.

తా. సీత కారణముగ చెవి వరకు నారి లాగి విడవబడిన, నివారింప శక్యము కాని బాణములు ప్రయోగించి, ఈ జగత్తులో పిశాచాలు కాని, రాక్షసులు కాని లేకుండు నట్లు చేసెదను. 66

మూ. మమ రోషప్రయుక్తానాం సాయకానాం బలం సురాః,
ద్రక్ష్యన్త్యద్య విముక్తానామతిదూరాతిగామినామ్. 67

ప్ర. అ. విముక్తానామ్ = విడువబడినవి, మమ = నాయొక్క, రోషప్రయుక్తానామ్ = రోషముచేత ప్రేరింపబడినవి, అతిదూరాతిగామినామ్ = చాల దూరము ప్రయాణించునవి అయిన, సాయకానామ్ = బాణములయొక్క, బలమ్ = బలమును, సురాః = దేవతలు, అద్య = ఇప్పుడు, ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. నా రోషము ప్రేరేపింపగా నేను ప్రయోగించిన, చాల దూరము ప్రయాణించ గల నా బాణముల బల మెట్టిదో ఇప్పుడు దేవతలు తెలిసికొన గలరు. 67

మూ. నైవ దేవా న దైతేయా న పిశాచా న రాక్షసాః,
భవిష్యన్తి మమ క్రోధాత్త్రైలోక్యే విప్రణాశితే. 68

ప్ర. అ. మమ = నాయొక్క, క్రోధాత్ = క్రోధమువలన, త్రైలోక్యే = మూడు లోకముల సముదాయము, విప్రణాశితే = నశింపచేయబడినదగుచుండగా, దేవాః = దేవతలు, నైవ భవిష్యన్తి = ఉండరు. దైతేయాః = దైత్యులు, న = ఉండరు. పిశాచాః = పిశాచములు, న = ఉండరు. రాక్షసాః = రాక్షసులు, న = ఉండరు.

తా. నా క్రోధముచేత మూడు లోకములు నశించిన పిమ్మట దేవతలు గాని, దైత్యులు గాని, పిశాచములు గాని, రాక్షసులు గాని ఉండరు. 68

మూ. దేవదానవయక్షాణాం లోకా యే రక్షసామపి
బహుధా న భవిష్యన్తి బాణౌఘైః శకలీకృతాః. 69

ప్ర. అ. దేవదానవయక్షాణామ్ = దేవతలయొక్క, దానవులయొక్క, యక్షులయొక్క, రక్షసామపి = రాక్షసులయొక్క, యే = ఏ, లోకాః = లోకములున్నవో, అవి, బాణౌఘైః = బాణముల సముదాయములచేత, బహుధా = అనేకవిధములుగ, శకలీకృతాః = ముక్కలు చేయబడినవై, న భవిష్యన్తి = ఉండవు.

తా. నా బాణసముదాయములచేత ముక్కలు చేయబడినవై దేవలోకము, దానవలోకము, యక్షులలోకము, రాక్షసులలోకము కూడ నశించిపోగలవు. 69

మూ. నిర్మర్యాదానిమాన్ లోకాన్ కరిష్యామ్యద్య సాయకైః,
హృతాం మృతాం వా సౌమిత్రే న దాస్యన్తి మమేశ్వరాః.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! హృతామ్ = హరించబడినదైనా, మృతాం వా = మరణించినదైనా, నా ప్రియురాలిని, ఈశ్వరాః = దేవతలు, మమ = నాకు, న దాస్యన్తి = ఇవ్వకపోయినచో, అద్య = ఇప్పుడు, సాయకైః = బాణములచేత, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను, నిర్మర్యాదాన్ = కట్టుబాట్లు లేనివాటినిగా, కరిష్యామి = చేసెదను.

తా. లక్ష్మణా! సీత మరణించినా, హరింపబడినా ఆమెను దేవతలు నాకివ్వనిచో ఇప్పుడు బాణములచేత ఈ లోకముల వ్యవస్థలను ఛిన్నాభిన్నము చేసెదను. 70

మూ. తథారూపాం హి వైదేహీం న దాస్యన్తి యది ప్రియామ్,
నాశయామి జగత్సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 71

ప్ర. అ. తథారూపామ్ = అట్టి, ప్రియామ్ = ప్రియురాలైన, వైదేహీమ్ = సీతను, న దాస్యన్తి యది = ఇవ్వకపోయినట్లయితే, సర్వమ్ = సమస్తమైన, సచరాచరమ్ = జంగమస్థావరములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడులోకముల రూపమైన, జగత్ = జగత్తును, నాశయామి = నశింపచేసెదను.

తా. నా ప్రియురాలైన సీత హరింపబడినా, మరణించినా, ఆమెను నాకు అప్పగించకున్నచో స్థావరజంగమాత్మకమైన, మూడు లోకముల రూపములో ఉన్న జగత్తు నంతనూ నశింపచేసెదను. 71

మూ. ఇత్యుక్త్వా రోషతామ్రాక్షో రామో నిష్పీడ్య కార్ముకమ్,
శరమాదాయ సందీప్తం ఘోరమాశీవిషోపమమ్. 72
సంధాయ ధనుషి శ్రీమాన్ రామః పరపురంజయః,
యుగాన్తాగ్నిరివ క్రుద్ధ ఇదం వచనమబ్రవీత్. 73

ప్ర. అ. రామః = లోకాభిరాముడు, శ్రీమాన్ = శోభ కలవాడు, పరపురంజయః = శత్రుపురములను జయించువాడు అయిన, రామః = రాముడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, రోషతామ్రాక్షః = రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, కార్ముకమ్ = ధనస్సును, నిష్పీడ్య=దృఢముగా పట్టి, ఆశీవిషోపమమ్ = సర్పము వంటి, ఘోరమ్ = భయంకరమైన, సందీప్తమ్ = మండుచున్న, శరమ్ = బాణమును, ఆదాయ = గ్రహించి, ధనుషి = ధనస్సుమీద, సంధాయ = సంధించి, యుగాన్తాగ్నిరివ = ప్రలయకాలాగ్ని వలె, క్రుద్ధః = కోపించినవాడై, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. లోకాభిరాముడు, శ్రీమంతుడు, శత్రుపురములను జయించువాడు అయిన రాముడు ఇట్లు పలికి, రోషముచేత ఎరుపెక్కిన నేత్రములు కలవాడై, ధనస్సును ధృఢముగా పట్టుకొని, సర్పము వంటి భయంకరమైన, ప్రజ్వలించుచున్న బాణమును గ్రహించి, దానిని ధనస్సుమీద సంధించి, ప్రలయకాలాగ్ని వలె మండిపడుచు ఇట్లు పలికెను. 72, 73

మూ. యథా జరా యథా మృత్యుర్యథా కాలో యథా విధిః,
నిత్యం న ప్రతిహన్యన్తే సర్వభూతేషు లక్ష్మణ, 74
తథాహం క్రోధసంయుక్తో న నివార్యోఽస్మి సర్వథా.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! సర్వభూతేషు = సకలభూతములయందు, జరా = ముసలితనము, యథా = ఎట్లు, మృత్యుః = మృత్యువు, యథా = ఎట్లు, కాలః = కాలము, యథా = ఎట్లు, విధిః = దైవము, యథా = ఎట్లు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, న ప్రతిహన్యన్తే = అడ్డుకొనబడవో, తథా = అట్లే, క్రోధసంయుక్తః = క్రోధముతో కూడిన, అహమ్=నేను సర్వథా=అన్ని విధములా, న నివార్యః = నివారింప శక్యము కానివాడనుగా, అస్మి = అయి ఉన్నాను.

తా. లక్ష్మణా ! ముసలితనమును, మృత్యువును, కాలమును, దైవమును

భూతములలో ఎవ్వరూ కూడ ఏ విధముగా అతిక్రమింపజాలరో కోపము వచ్చిన నన్ను కూడ ఎవ్వరూ, ఏ విధముగానూ కూడ అడ్డుకొనజాలరు. 74

మూ. పురేవ మే చారుదతీమనిన్దితాం
దిశన్తి సీతాం యది నాద్య మైథిలీమ్,
సదేవగన్ధర్వమనుష్యపన్నగం
జగత్సశైలం పరివర్తయామ్యహమ్. 75

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుఃషష్టితమః సర్గః.

ప్ర. అ. చారుదతీమ్ = అందమైన దంతములు గలది, అనిన్దితామ్ = నిందించబడనిది, మైథిలీమ్ = మిథిలారాజకుమారి అయిన, సీతామ్ = సీతను, పురేవ = పూర్వమునందు వలె, అద్య = ఇప్పుడు, మే = నాకు, న దిశన్తి యది = (దేవతలు)ఇవ్వకపోయినట్లయితే, అహమ్ = నేను, సదేవగన్ధర్వమనుష్యపన్నగమ్ = దేవతలతోను, గంధర్వులతోను, మనుష్యులతోను, పన్నగులతోనుకూడిన, సశైలమ్ = పర్వతములతో కూడిన, జగత్ = జగత్తును, పరివర్తయామి = త్రిప్పెదను.

తా. అందమైన దంతములు కలది, దోషములు లేనిది, జనకరాజకుమారి అయిన సీతను నా కిప్పుడు పూర్వ మున్న రూపములో అప్పగించకపోయినచో దేవతలతోను, గంధర్వులతోను, మనుష్యులతోను, పన్నగులతోను కూడిన, పర్వత సహితమైన ఈ జగత్తు నంతా తలక్రిందుచేసెదను. 75

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
అరువదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చషష్టితమః సర్గః

[లక్ష్మణుడు రామునకు బోధించి కోపమును చల్లార్చుట].

మూ. తప్యమానం తదా రామం సీతాహరణకర్శితమ్,
లోకానామభవే యుక్తం సాంవర్తకమివానలమ్. 1

వీక్షమాణం ధనుః సజ్యం నిఃశ్వసన్తం పునః పునః,
దగ్ధుకామం జగత్సర్వం యుగాన్తే చ యథా హరమ్. 2

అదృష్టపూర్వం సంక్రుద్ధం దృష్ట్వా రామం స లక్ష్మణః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం ముఖేన పరిశుష్యతా. 3

ప్ర. అ. తథా = అట్లు, తప్యమానమ్ = తపింపచేయబడుచున్నవాడు, రామమ్ = లోకాభిరాముడు, సీతాహరణకర్శితమ్ = సీతయొక్క హరణముచేత కృశింపచేయబడినవాడు, సాంవర్తకమ్ = ప్రళయకాలసంబంధమైన, అనలమివ = అగ్ని వలె, లోకానామ్ = లోకములయొక్క, అభవే = లేకపోవుటయందు (వినాశనమునందు), యుక్తమ్ = ఉద్యుక్తుడు, సజ్యమ్ = నారితో కూడిన, ధనుః = ధనస్సును, వీక్షమాణమ్ = చూచుచున్నవాడు, పునః పునః = మాటిమాటికి, నిఃశ్వసన్తమ్ = నిట్టూర్చుచున్నవాడు, యుగాన్తే = యుగాంతమునందు, హరం యథా = ఈశ్వరుడు వలె, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తును, దగ్ధుకామమ్ = కాల్చుటకు కోరిక గలవాడు, అదృష్టపూర్వమ్ = పూర్వ మెన్నడూ ఆ విధముగా చూడబడని వాడు, సంక్రుద్ధమ్ = కోపించినవాడు అయిన, రామమ్ = రాముణ్ణి దృష్ట్వా = చూచి, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, అబ్రవీత్ = పలికెను.

తా. లోకాభిరాముడైన ఆ రాముడు ఆ విధముగ సీతాహరణముచేత

కృశించి దుఃఖముతో తపించిపోవుచుండెను. ప్రళయకాలాగ్ని వలె లోకములను కాల్చివేయవలె నను భావముతో నారి బిగించిన ధనస్సు వైపు చూచుచు మాటి మాటికి నిట్టూర్చుచుండెను. యుగాంతమునందు జగత్తు నంతనూ కాల్చివేయుటకై ఉద్యమించిన రుద్రుడు వలె ఉండెను. లక్ష్మణుడు పూర్వ మెన్నడూ రాముణ్ణి ఆ విధముగా చూచి ఉండలేదు. అట్టి కోపావిష్టుడైన రాముణ్ణి చూడగానే భయముచేత లక్ష్మణుని ముఖము ఎండిపోయెను. అట్టి స్థితిలో ఆతడు అంజలి ఘటించి రాము నితో ఇట్లు పలికెను. 1-3

మూ. పురా భూత్వా మృదుర్దాన్తః సర్వభూతహితే రతః,
న క్రోధవశమాపన్నః ప్రకృతిం హాతుమర్హసి. 4

ప్ర. అ. పురా = పూర్వము, మృదుః = మృదుస్వభావము కలవాడవుగాను, దాన్తః = ఇంద్రియనిగ్రహవంతుడవు గాను, సర్వభూతహితే = సమస్తభూతముల హితమునందు, రతః = ఆసక్తుడవుగాను, భూత్వా = ఉండి, క్రోధవశమ్ = క్రోధ వశమును, అపన్నః = పొందినవాడవై, ప్రకృతిమ్ = నీ స్వభావమును, హాతుమ్ = విడచుటకు, నార్హసి = తగవు.

తా. నీవు ఇంతవరకు మృదుస్వభావముతో, ఇంద్రియనిగ్రహవంతుడవై సకల ప్రాణుల హితమునందు ఆసక్తి కలవాడవై ఉన్నావు. అట్టి నీవు క్రోధము నకు వశుడవై నీ స్వభావమును విడచుట తగదు. 4

మూ. చన్ద్రే లక్ష్మీః ప్రభా సూర్యే గతిర్వాయౌ భువి క్షమా,
ఏతత్తు నియతం సర్వం త్వయి చానుత్తమం యశః. 5

ప్ర. అ. చన్ద్రే = చంద్రునియందు, లక్ష్మీః = శోభ, సూర్యే = సూర్యుని యందు, ప్రభా = కాంతి, వాయౌ = వాయువునందు, గతిః = గమనము, భువి = భూమియందు, క్షమా = ఓర్పు, ఏతత్ సర్వమ్ = ఇది అంతా, నియతమ్ = నిశ్చిత మైనది. త్వయి = నీయందు, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, యశః చ = కీర్తి కూడ, నిశ్చిత మైనది.

తా. చంద్రునిలో శోభ, సూర్యునిలో కాంతి, వాయువునందు సదాగమ నము, భూమియందు ఓర్పు ఏ విధముగా నిశ్చితముగా ఉండునో అట్లే నీయందు ఉత్తమమైన కీర్తి కూడ స్థిరముగా ఉన్నది. 5

మూ. ఏకస్య నాపరాధేన లోకాన్ హన్తుమిహార్హసి,
న తు జానామి కస్యాయం భగ్నః సాంగ్రామికో రథః 6
కేన వా కస్య వా హేతోః సాయుధః సపరిచ్ఛదః

ప్ర. అ. ఏకస్య = ఒక్కనియొక్క, అపరాధేన = అపరాధముచేత, ఇహ = ఇప్పుడు, లోకాన్ = లోకములను, హన్తుమ్ = చంపుటకు, నార్హసి = తగవు. సాయుధః = ఆయుధములతో కూడిన, సపరిచ్ఛదః = పరివారముతో కూడిన, అయమ్ = ఈ, సాంగ్రామికః = యుద్ధమునకు సంబంధించిన, రథః = రథము, కస్య = ఎవనిదో, కేన = ఎవనిచేత, కస్య వా హేతోః = ఏ కారణము వలన, భగ్నః = విరగగొట్ట బడినదో, న జానామి = ఎరుగను.

తా. ఎవడో ఒకడు అపరాధము చేసినందుకు నీవు ఈ లోకము లన్నింటిని సంహరించుట యుక్తము కాదు. ఈ యుద్ధరథము ఎవ్వరిదో, దీనిని, ఆయుధాలను, పరివారమును ఎవరు ఏ కారణముచేత ధ్వంసము చేసినారో తెలియుట లేదు. 6

మూ. ఖురనేమిక్షతశ్చాయం సిక్తో రుధిరబిన్దుభిః, 7
దేశో నిర్వృత్తసంగ్రామః సుఘోరః పార్థివాత్మజ.

ప్ర. అ. పార్థివాత్మజ = రాజకుమారా ! ఖురనేమిక్షతః = గుఱ్ఱముల డెక్కలచేతను రథచక్రాంతములచేతను నలగగొట్టిబడినది, రుధిరబిన్దుభిః=రక్త బిందువులచేత, సిక్తః = తడపబడినది, సుఘోరః=చాల భయంకరము అయిన, అయం దేశః = ఈ ప్రదేశము, నిర్వృత్తసంగ్రామః = జరిగిన యుద్ధము గలది.

తా. రామా ! భయంకరముగా ఉన్న ఈ ప్రదేశము గుఱ్ఱము డెక్కల చేతా, రథచక్రముల అంచులచేత నలిగినది. రక్తబిందువులచేత తడిసి ఉన్నది. ఇక్కడ యుద్ధము జరిగి ఉండును. 7

మూ. ఏకస్య తు విమర్దోఽయం న ద్వయోర్వదతాం వర, 8
న హి వృత్తం హి పశ్యామి బలస్య మహతః పదమ్.

ప్ర. అ. వదతామ్ = మాటలాడువారిలో, వర = శ్రేష్ఠుడా ! అయమ్ =

ఇది, ఏకస్య = ఒక్కనియొక్క, విమర్దః = యుద్ధమే. ద్వయోః=ఇద్దరియొక్క, యుద్ధము, న = కాదు. మహతః=గొప్పదైన, బలస్య=సేనయొక్క, వృత్తమ్= ఏర్పడిన, పదమ్ = చిహ్నమును, న హి పశ్యామి = చూడనుకదా.

తా. మాటలలో నేర్పరి వైన ఓ రామా! ఇది ఒక్కడే చేసిన యుద్ధము. ఇద్దరు చేసినది కాదు, ఇక్కడ పెద్దసైన్యము వచ్చిన గుర్తు లేవీ కనబడుటలేదు కదా.

మూ. నైకస్య తు కృతే లోకాన్ వినాశయితుమర్హసి, 9
యుక్తదణ్డా హి మృదవః ప్రశాన్తా వసుధాధిపాః.

ప్ర. అ. ఏకస్య కృతే = ఒక్కని నిమిత్తమై, లోకాన్ = లోకములను, వినాశయితుమ్ = నశింపచేయుటకు, నార్హసి = తగవు. హి = ఎందుచేతననగా, వసుధాధిపాః=రాజులు, యుక్తదణ్డాః=తగు దండము విధించువారు, మృదవః= దయ గలవారు, ప్రశాన్తాః = శాంతచిత్తము గలవారు.

తా. నీవు ఒక్కనికొరకై అన్ని లోకాలను నశింపచేయుట యుక్తము కాదు. ఎందుచేత ననగా ప్రభువులు తగు దండమునే విధించుచు, దయ గలవారై, ప్రశాంతచిత్తులై ఉందురు కదా. 9

మూ. సదా త్వం సర్వభూతానాం శరణ్యః పరమా గతిః 10
కో ను దారప్రణాశం తే సాధు మన్యేత రాఘవ.

ప్ర. అ. త్వమ్ = నీవు, సర్వభూతానామ్ = సకలప్రాణులకు, సదా = ఎల్లప్పుడు, శరణ్యః = రక్షకుడవైన, పరమా గతిః = ఉత్తమమైన గతివి కదా. రాఘవ = రామా! తే = నీయొక్క, దారప్రణాశమ్ = భార్యయొక్క నాశమును, కో ను = ఎవడు, సాధు = మంచిదానినిగా, మన్యేత = తలచును?

తా. రామా! నీవు, ఎల్లప్పుడు సకలప్రాణులకు రక్షకుడవు. నీవే వాళ్లకు ఉత్తమమైన గతివి. నీ భార్య నశించుట మంచిదే అని ఎవడు అనుకొనును? 10

మూ. సరితః సాగరాః శైలా దేవగన్ధర్వదానవాః, 11
నాలం తే విప్రియం కర్తుం దీక్షితస్యేవ సాధవః.

ప్ర. అ. సరితః = నదులు, సాగరాః = సముద్రములు, శైలాః = పర్వతములు, దేవగన్ధర్వదానవాః = దేవతలు, గంధర్వులు, దానవులు, తే = నీకు, సాధవః = సత్పురుషులు, దీక్షితస్యేవ = యజ్ఞదీక్ష గ్రహించినవానికి వలె, విప్రియమ్ = అపకారమును, కర్తుమ్ = చేయుటకు, నాలమ్ = సమర్థులు కారు.

తా. యజ్ఞదీక్ష గ్రహించినవానికి సత్పురుషులు ఎట్లు అపకారము తలపెట్టరో అట్లే నీకు నదులు గాని, సముద్రములు గాని, శైలములు గాని, దేవతలు గాని, గంధర్వులు గాని, దానవులు గాని అపకారము చేయజాలరు.

మూ. యేన రాజన్ హృతా సీతా తమన్వేషితుమర్హసి, 12
మద్ద్వితీయో ధనుష్పాణిః సహాయైః పరమర్షిభిః.

ప్ర. అ. రాజన్ = రాజా, ధనుష్పాణిః = ధనస్సుహస్తమునందు కలవాడవై, మద్ద్వితీయః = నేను సహాయుడను కలవాడవై, సహాయైః = సహాయులైన, పరమర్షిభిః = మహర్షులతో కూడినవాడవై, సీతా = సీత, యేన = ఎవనిచేత, హృతా = హరించబడినదో, తమ్ = వానిని, అన్వేషితుమ్ = వెదకుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. రాజా ! నీవు ధనస్సు ధరించి, నా సాహాయ్యముతోను, మహర్షుల సాహాయ్యముతోను, ఎవడు సీతను హరించినాడో వానికొరకు వెదకుము. 12

మూ. సముద్రం చ విచేష్యామః పర్వతాంశ్చ వనాని చ, 13
గుహాశ్చ వివిధా ఘోరా నదీః పద్మవనాని చ.

ప్ర. అ. సముద్రం చ = సముద్రమును, పర్వతాంశ్చ = పర్వతములను, వనాని చ = వనములను, వివిధాః = అనేకవిధములైన, ఘోరాః = భయంకరములైన, గుహాశ్చ = గుహలను, నదీః = నదులను, పద్మవనాని చ = పద్మవనములను, విచేష్యామః = వెదకెదము.

తా. సముద్రములోను, పర్వతములలోను, వనములలోను, భయంకరములైన అనేకవిధములైన గుహలలోను, నదులలోను, పద్మవనములలోను వెదకెదము. 13

మూ. దేవగన్ధర్వలోకాంశ్చ విచేష్యామః సమాహితాః, 14
యావన్నాధిగమిష్యామ స్తవ భార్యాపహారిణమ్.

ప్ర. అ. సమాహితాః = సావధానచిత్తులమై, తవ = నీయొక్క, భార్యాపహారిణమ్ = భార్యను అపహరించినవానిని, యావత్ = ఎంతవరకు, నాధిగమిష్యామః = పొందమో అంతవరకు, దేవగన్ధర్వలోకాంశ్చ = దేవలోకములను, గంధర్వలోకములను, విచేష్యామః = వెదకెదము.

తా. నీ భార్యను అపహరించినవాడు ఎంతవరకు దొరకడో అంతవరకు (దొరికేటంతవరకు) దేవలోకములోను గంధర్వలోకములోను, సావధానమైన చిత్తముతో వెదకెదము. 14

మూ. న చేత్సామ్నా ప్రదాస్యన్తి పత్నీం తే త్రిదశేశ్వరాః, 15
కోసలేన్ద్ర తతః పశ్చాత్ప్రాప్తకాలం కరిష్యసి.

ప్ర. అ. కోసలేన్ద్ర = కోసలదేశరాజా ! త్రిదశేశ్వరాః = దేవతలు, తే = నీయొక్క, పత్నీమ్ = భార్యను, సామ్నా = సామోపాయముచేత, న ప్రదాస్యన్తి చేత్ = ఇవ్వకపోయినట్లయితే, తతః పశ్చాత్ = అటు పిమ్మట, ప్రాప్తకాలమ్ = ఆ సమయమునకు యుక్తమైనదానిని, కరిష్యసి = చేయగలవు.

తా. కోసలాధీశుడవైన రామా ! దేవతలు, సామోపాయముచేత నీ భార్యను తిరిగి ఇవ్వనిచో అటు పిమ్మట ఏమి చేయవలెనో అది చేయవచ్చును.

మూ. శీలేన సామ్నా వినయేన సీతాం
నయేన న ప్రాప్స్యసి చేన్నరేన్ద్ర,
తతః సముత్సాదయ హేమపుఙ్ఖై
ర్మహేన్ద్రవజ్రప్రతిమైః శరౌఘైః. 16

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. నరేన్ద్ర = రాజా, శీలేన = సదాచారముచేత, సామ్నా = సామోపాయముచేత, వినయేన = వినయముచేత, నయేన = నీతిమార్గముచేత, సీతామ్ =

సీతను, న ప్రాప్స్యసి యది = పొందకపోయినట్లయితే, తతః = అటుపిమ్మట, హేమపుజ్ఞైః = బంగారు పొన్నులు గల, మహేన్ద్రవజ్రప్రతిమైః = మహేంద్రుని వజ్రాయుధముతో సమానములైన, శరౌఘైః = బాణసముదాయములచేత, సముత్సాదయ = నశింపచేయుము.

తా. రామా! నీ సదాచారముచేత, సామోపాయముచేత, వినయముచేత, నీతిమార్గముచేత నీకు సీత లభించకపోయినచో అటు పిమ్మట, బంగారుపొన్నులు గల, ఇంద్రుని వజ్రాయుధముతో సమానములైన బాణముల సముదాయములు ప్రయోగించి సంహరించుము. 16

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో అరువదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్షష్టితమః సర్గః

[లక్ష్మణుడు రాముని బోధించుట]

మూ. తం తథా శోకసంతప్తం విలపన్తమనాథవత్
మోహేన మహతావిష్టం పరిద్యూనమచేతనమ్. 1

తతః సౌమిత్రిరాశ్వాస్య ముహూర్తాదివ లక్ష్మణః
రామం సంబోధయామాస చరణౌ చాభిపీడయన్. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సౌమిత్రిః = సుమిత్ర కుమారుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, తథా = అట్లు, శోకసంతప్తమ్ = శోకముచేత తపింప చేయబడినవాడు, అనాథవత్ = అనాథుడు వలె, విలపన్తమ్ = విలపించుచున్న వాడు, మహతా = గొప్పదైన, మోహేన = మోహముచేత, ఆవిష్టమ్ = వ్యాపింప బడినవాడు, పరిద్యూనమ్ = క్షీణించినవాడు, అచేతనమ్ = అస్వస్థమైన చిత్తము గలవాడు అయిన, తం రామమ్ = ఆ రాముణ్ణి, ముహూర్తాదివ = ముహూర్త కాలము, ఆశ్వాస్య = ఓదార్చి, చరణౌ చ, = పాదములను, పీడయన్ = స్పృశిం చుచు, సంబోధయామాస = బోధించెను.

తా. రాముడు శోకముచేత తాపము చెంది అనాథుడు వలె విలపించు చుండెను. అధికమైన మోహము చెంది, క్షీణించి మనఃస్థైర్యము లేక ఉండెను. సుమిత్రాకుమారుడైన లక్ష్మణుడు అట్టి రాముని క్షణకాలముపాటు ఓదార్చి, పాదములు స్పృశించి నమస్కరించుచు, ఇట్లు బోధించెను. 1, 2

మూ. మహతా తపసా రామ మహతా చాపి కర్మణా,
రాజ్ఞా దశరథేనాసి లబ్ధోఽమృతమివామరైః. 3

ప్ర. అ. రామ = రామా ! రాజ్ఞా = రాజైన, దశరథేన = దశరథునిచేత, మహతా = గొప్ప, తపసా = తపస్సుచేతను, మహతా = గొప్ప, కర్మణాచాపి =

కర్మచేతను, అమరైః=దేవతలచేత, అమృతమివ=అమృతము వలె, లబ్ధః అసి=పొందబడినావు.

తా. రామా ! దశరథమహారాజు గొప్ప తపస్సు చేసి, గొప్ప కర్మ చేసి, దేవతలు అమృతమును పొంది నట్లు నిన్ను పొందినాడు. 3

మూ. తవ చైవ గుణైర్బద్ధస్త్వద్వియోగాన్మహీపతిః,
రాజా దేవత్వమాపన్నో భరతస్య యథాశ్రుతమ్. 4

ప్ర. అ. భరతస్య=భరతునినుండి, యథా=ఎట్లు, శ్రుతమ్=వినబడినదో, మహీపతిః=భూమికి ప్రభువైన, రాజా=దశరథమహారాజు, తవ=నీయొక్క, గుణైః=గుణములచేత, బద్ధః=కట్టబడినవాడై, త్వద్వియోగాత్=నీ వియోగమువలన, దేవత్వమ్=దేవత్వమును, ఆపన్నః=పొందినాడు.

తా. నీ గుణములచేత ఆకర్షింపబడి నీయందు అధికప్రేమ గల ఆ దశరథమహారాజు, భరతుడు మనకు తెలిపి నట్లు, నీ వియోగమువలన స్వర్గస్థుడైనాడు. 4

మూ. యది దుఃఖమిదం ప్రాప్తం కాకుత్స్థ న సహిష్యసే,
ప్రాకృతశ్చాల్పసత్త్వశ్చ ఇతరః కః సహిష్యతి. 5

ప్ర. అ. కాకుత్స్థ=రామా ! ప్రాప్తమ్=ప్రాప్తించిన, ఇదం దుఃఖమ్=ఈ దుఃఖమును, న సహిష్యసే యది=నీవు సహించకపోయినచో, ప్రాకృతః=సాధారణుడు, అల్పసత్త్వశ్చ=అల్పమైన ధైర్యము కలవాడు అయిన, ఇతరః=ఇతరుడు, కః=ఎవడు, సహిష్యతి=సహించగలడు?

తా. రామా ! ఈ విధముగా సంప్రాప్తించిన కష్టమును నీవే సహించకపోయినచో, అల్పశక్తి గల సామాన్యుడైన ఇతరు డెవ్వడు సహించగలడు? 5

మూ. దుఃఖితో హి భవాన్ లోకాంస్తేజసా యది ధక్ష్యతే,
ఆర్తాః ప్రజా నరవ్యాఘ్ర క్వ ను యాస్యన్తి నిర్వృతిమ్. 6

ప్ర. అ. నరవ్యాఘ్ర=నరులలో శ్రేష్ఠుడవైన ఓః రామా! దుఃఖితః=దుఃఖితుడవైన, భవాన్=నీవు, తేజసా=తేజస్సుచేత, లోకాన్=లోకములను,

ధక్ష్యతే యది = కాల్చబోయినట్లయితే, ఆర్తాః = పీడితులైన, ప్రజాః = ప్రజలు, క్వ = ఎక్కడ, నిర్వృతిమ్ = సుఖమును, యాస్యన్తి = పొందగలరు.

తా. రామా ! దుఃఖములో ఉన్న నీవు నీ తేజస్సుచేత లోకాలను దహించినట్లయితే పీడితులైన ప్రజలు ఎక్కడ సుఖము పొందగలరు ? 6

మూ. లోకస్వభావ ఏవైష యయాతిర్నహుషాత్మజః,
గతః శక్రేణ సాలోక్యమనయస్తం సమస్పృశత్. 7

ప్ర. అ. ఏషః = ఇది, లోకస్వభావః ఏవ = లోకముయొక్క స్వభావమే. నహుషాత్మజః = నహుషుని కుమారుడైన, యయాతిః = యయాతి, శక్రేణ = దేవేంద్రునితో, సాలోక్యమ్ = ఒకే లోకములో ఉండుటను, గతః = పొందెను. అనయః = దుఃఖము, తమ్ = ఆతనిని, సమస్పృశత్ = స్పృశించెను.

తా. నహుషుని కుమారుడైన యయాతి దేవేంద్రునితో సాలోక్యమును పొందెను. అయినను ఆతనికి దుఃఖము తప్పలేదు. లోకస్వభావము ఇంతే.

వి. స్వర్గములోకమునకు వెళ్ళిన యయాతి దేవేంద్రునితో తాను చేసిన యజ్ఞాదిపుణ్య కార్యములను గూర్చి గొప్పగా చెప్పుకొనగా అపుడు దేవేంద్రుడు "ఆత్మస్తుతి చేసికొన్న పాపాత్ముడవు; స్వర్గములో ఉండ దగవు" అని చెప్పి ఆతనిని స్వర్గమునుండి పడద్రోసినా డను కథ ఇక్కడ నిర్దేశింపబడినది. 7

మూ. మహర్షిర్యో వసిష్ఠస్తు యః ప్రితుర్నః పురోహితః,
అహ్నా పుత్రశతం జజ్ఞే తథైవాస్య పునర్హతమ్, 8

ప్ర. అ. మహర్షిః = మహర్షియైన, యః = ఏ, వసిష్ఠః = వసిష్ఠుడు కలడో, యః = ఏ మహర్షి, నః పితుః = మన తండ్రియొక్క, పురోహితః = పురోహితుడో, అస్య = ఈతనికి, అహ్నా = ఒక్క దివసమునందు, పుత్రశతమ్ = పుత్రుల శతము, జజ్ఞే = పుట్టెను. పునః = మరల, తథైవ = అట్లే, హతమ్ = చంపబడెను.

తా. మన తండ్రిగారి పురోహితుడైన వసిష్ఠమహర్షికి ఒకే దినమునందు నూరుగురు పుత్రులు జనించిరి. వారందరు ఒకే దివసమున విశ్వామిత్రహతులై మరణించిరి.

8

మూ. యా చేయం జగతాం మాతా దేవీ లోకనమస్కృతా,
అస్యాశ్చ చలనం భూమేర్దృశ్యతే సత్యసంశ్రవ. 9

ప్ర. అ. సత్యసంశ్రవ = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడా ! జగతామ్ = జగత్తులకు, మాతా = తల్లి, లోకనమస్కృతా = లోకములచేత నమస్కరింపబడినది, యా+ఇయమ్ = ఏ ఈ, దేవీ = దేవిగలరో, అస్యాః = ఈ, భూమేః = భూదేవికి కూడ, చలనమ్ = చలనము, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. సత్యమైన ప్రతిజ్ఞ గల రామా ! జగత్తులకు తల్లి, లోకములచేత నమస్కరింపబడేది అయిన భూదేవికి కూడ అప్పుడప్పుడు చలనము కనబడుచున్నది. 9

మూ. యౌ ధర్మౌ జగతాం నేత్రౌ యత్ర సర్వం ప్రతిష్ఠితమ్,
ఆదిత్యచన్ద్రౌ గ్రహణమభ్యుపేతౌ మహాబలౌ. 10

ప్ర. అ. యౌ = ఏ సూర్యచంద్రులు, ధర్మౌ = ధర్మస్వరూపులో, జగతామ్ = జగత్తులకు, నేత్రౌ = నేత్రములో, యత్ర = ఎవరియందు, సర్వమ్ = అంతా, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠింపబడి యున్నదో, మహాబలౌ = మహాబలవంతులైన, ఆదిత్యచన్ద్రౌ = సూర్యచంద్రులు కూడ, గ్రహణమ్ = గ్రహణమును, అభ్యుపేతౌ = పొందిరి.

తా. ధర్మస్వరూపులు, లోకములకు నేత్రములైనవారు, జగత్తు కంతకి ఆధారభూతులూ, మహాబలశాలులూ అయిన సూర్యచంద్రులు కూడ అప్పుడప్పుడు గ్రహణము పొందుచున్నారు. 10

మూ. సుమహాన్త్యపి భూతాని దేవాశ్చ పురుషర్షభ,
న దైవస్య ప్రముఞ్చన్తి సర్వభూతాని దేహినః. 11

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! సుమహాన్తి = చాల గొప్పవైన, భూతాని = భూతములైనను, దేవాశ్చ = దేవతలు, సర్వభూతాని = సమస్తప్రాణులు, దేహినః = దేహధారులు, దైవస్య = దైవముయొక్క శక్తిని, న ప్రముఞ్చన్తి = విడువరు.

తా. పురుషశ్రేష్ఠుడా ! చాల గొప్ప భూతములైనను (పృథివ్యాదిభూతము

లైనను), దేవతలైనను, ఏ ప్రాణులూ, ఏ దేహధారులూ కూడ దైవశక్తినుండి విడిపించుకొనజాలరు.

వి. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. 'భూతాని' అనేది రెండుసార్లు, "దేహినః"అనే శబ్దము ప్రయోగించుటచేత అన్వయం సరిగా లేదు. "సర్వభూతాది దేహినః'' అనే పాఠం కూడ సంతృప్తికరంగా లేదు. 11

మూ. శక్రాదిష్వపి దేవేషు వర్తమానౌ నయానయౌ,
శ్రూయేతే నరశార్దూల న త్వం శోచితుమర్హసి. 12

ప్ర. అ. నరశార్దూల=నరశ్రేష్ఠుడా ! శక్రాదిషు=దేవేంద్రుడు మొదలైన, దేవేషు = దేవతలలో కూడ, నయానయౌ = మంచి నీతి చెడ్డ నీతి అనునవి, వర్తమానౌ = ఉన్నవిగా, శ్రూయేతే = వినబడుచున్నవి. త్వమ్ = నీవు, శోచితుమ్ = దుఃఖించుటకు, నార్హసి = తగవు.

తా. ఓ! నరశ్రేష్ఠుడా ! ఇంద్రుడు మొదలైన దేవతలలో కూడ నీతి, దుర్నీతి ఉన్నట్లు వినుచున్నాము కదా. అందుచేత నీవు దుఃఖించవలదు. 12

మూ. నష్టాయామపి వైదేహ్యాం హృతాయామపి చానఘ,
శోచితుం నార్హసే వీర యథాన్యః ప్రాకృతస్తథా. 13

ప్ర. అ. అనఘ = దోషములులేనివాడా ! వీర = వీరుడా ! వైదేహ్యమ్ = సీత, నష్టాయామపి=నశించినను, హృతాయామపి=హరించబడినను, ప్రాకృతః = సామాన్యుడైన, అన్యః యథా = ఇతరమానవుడు వలె, శోచితుమ్ = దుఃఖించుటకు, నార్హసి = తగవు.

తా. ఏ దోషములు లేని వీరుడా ! సీత నశించినా, ఆమెను ఎవరైన అపహరించినా కూడ నీవు సామాన్యుడైన ఇతరమానవుడు వలె దుఃఖించకూడదు.

మూ. త్వద్విధా న హి శోచన్తి సతతం సత్యదర్శినః,
సుమహత్స్వపి కృచ్ఛ్రేషు రామానిర్వణ్ణదర్శనాః. 14

ప్ర. అ. రామ = రామా ! సతతమ్ = ఎల్లప్పుడు, సత్యదర్శినః = సత్యమును చూచేవారు, అనిర్విణ్ణదర్శినః = నిర్వేదము చెందని జ్ఞానము కలవారు

అయిన, త్వద్విధాః=నీవంటివారు, సుమహత్సు=చాల గొప్పవైన, కృచ్ఛ్రేష్వపి = కష్టములందు కూడ, న శోచన్తి హి = దుఃఖించరు కదా.

తా. రామా ! ఎల్లప్పుడు సత్యమునే చూచేవారు, పొరబాటులేని ఆలోచనలు కలవారు అయిన నీవంటివారు ఎన్ని పెద్ద కష్టములు వచ్చినను దుఃఖించరు కదా. 14

మూ. తత్త్వతో హి నరశ్రేష్ఠ బుద్ధ్వా సమనుచిన్తయ,
బుద్ధ్యా యుక్తా మహాప్రాజ్ఞా విజానన్తి శుభాశుభే. 15

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! తత్త్వతః = యథార్థముగా (యథార్థస్థితిని గూర్చి), బుద్ధ్యా = బుద్ధితో, సమనుచిన్తయ = ఆలోచించుము. మహాప్రాజ్ఞాః = గొప్ప బుద్ధి కలవారు, బుద్ధ్యా=బుద్ధితో, యుక్తాః=కూడినవారై, శుభాశుభే = మంచిచెడ్డలను, విజానన్తి = తెలుసుకొందురు.

తా. నరులలో శ్రేష్ఠుడవైన ఓ ! రామా ! యథార్థస్థితిని గూర్చి నీ బుద్ధితో ఆలోచించుము. ఓ ! మహాబుద్ధిశాలీ ! బుద్ధితో ఆలోచించువారు మంచిచెడ్డలను తెలుసుకొనగలుగుదురు. 15

మూ. అదృష్టగుణదోషాణామధ్రువాణాం తు కర్మణామ్,
నాన్తరేణ క్రియాం తేషాం ఫలమిష్టం ప్రవర్తతే. 16

ప్ర. అ. అదృష్టగుణదోషాణామ్ = చూడబడని గుణదోషములు గలవి. అధ్రువాణామ్ = అస్థిరములు అయిన, తేషామ్=ఆ, కర్మణామ్=కర్మలయొక్క, ఇష్టమ్ = ఇష్టమైన, ఫలమ్ = ఫలము, క్రియామ్ అన్తరేణ=ప్రయత్నము లేకుండగా, న ప్రవర్తతే = ప్రవర్తించదు.

తా. కర్మల గుణదోషములు మనము చూడజాలము. అనగా అవి సుఖమును ఇచ్చునో దుఃఖమును ఇచ్చునో తెలుసుకొనజాలము. అవి అస్థిరములు. ఎందుచేత ననగా ఏ కర్మయైనా అది పూర్తి అయిపోగానే నశించును కదా. అట్టి కర్మలను పూర్వజన్మలో ఆచరించి ఉండకపోయినచో వాటి ఫలము ఇప్పుడు లభించదు. అనగా ఇపుడు లభించుచున్న ఫలమును బట్టి పూర్వకర్మను ఊహించుకొనవలసి ఉండును. కర్మఫలానుభవము తప్పదు గాన విచారించి ప్రయోజనము

లేదు. ఇది గోవిందరాజులు చెప్పిన భావము. ఆయన "అధ్రువాణామ్''కు బదులు ''అధృతానామ్" అను పాఠము గ్రహించి "అనిశ్చితములు'' అని అర్థము చెప్పినారు.

చూడబడని గుణదోషములు గల, అస్థిరములైన (''అధ్రువాణామ్''అని వారి పాఠము)కర్మల నిష్పత్తి మానవుడు చేసిన కాని జరుగదు. వాటివలన ఇష్ట ఫలము, (''ప్రవర్తతే''కు బదులు ''చ వర్తతే"అను పాఠముండుటచేత, చ = అనిష్టఫలముకూడ) కలుగును"అని తిలకవ్యాఖ్యానము. భావము రెండు వ్యాఖ్యల లోను సమానమే.

కాని ''అదృష్టగుణదోషాణామ్'' ఇత్యాదిపూర్వార్ధమును 15వ శ్లోకములోని ''బుద్ధ్యా యుక్తాః" ఇత్యాది ఉత్తరార్ధముతో కలిపి అన్వయించిన బాగుండును. అప్పుడు- ''మహాప్రాజ్ఞాః=గొప్ప బుద్ధి గలవారు, బుద్ధ్యాయుక్తాః=బుద్ధితో కూడిన వారై, అనగా వివేకవంతులై, అదృష్టగుణదోషాణామ్ = చూడబడనిగుణదోషములు గల, అధ్రువాణామ్ = అస్థిరములైన, కర్మణామ్ = కర్మలయొక్క, శుభాశుభే = మంచి చెడులను, విజానన్తి = తెలుసుకొనుచున్నారు"అని అర్థము. "క్రియ లేకుండా, అనగా పురుషప్రయత్నము లేకుండా కర్మల ఇష్టఫలము లభించదు'' అని 16వ శ్లోకం ఉత్తరార్థానికి అర్థము. అందుచేత నీవు ప్రయత్నము చేసి సీతను సంపాదించుటకై ప్రయత్నించుము అని దీని భావము.

ప్రాచ్యపాఠము మరొక విధముగా ఉన్నది.

''అదృష్టగుణదోషాణాం కర్మస్వభిరతాత్మనామ్,
నాన్తరేణ క్రియాం వీర ఫలమిష్టం ప్రవర్తతే."

'ఓ! వీరుడా ! గుణదోషములు తెలియనివారు, కర్మలయందు ఆసక్తి కల వారు అయిన జనులకు, ప్రయత్నము చేయకుండా ఇష్టఫలము లభించదు"అని దాని భావము.

16

మూ. త్వమేవ హి పురా రామ మామేవం బహుశోఽన్వశాః,
అనుశిష్యాద్ధి కో ను త్వామపి సాక్షాద్బృహస్పతిః. 17

ప్ర. అ. రామ = రామా ! పురా = పూర్వము, త్వమేవ = నీవే, మామ్ = నన్ను, ఏవమ్ = ఇట్లు, బహుశః = అనేకపర్యాయములు, అన్వశాః హి = శిక్షిం

చితివి (బోధించితివి)కదా? సాక్షాత్ = సాక్షాత్తు, బృహస్పతిరపి = బృహస్పతియే యైనను, కో ను = ఎవడు, త్వామ్ = నిన్ను, అనుశిష్యాత్ హి = బోధించును ?

తా. రామా ! పూర్వము నీవే అనేకపర్యాయములు నాకు బోధించితివి కదా? సాక్షాత్తు బృహస్పతి యైనను ఎవడు నీకు బోధించగలడు ? 17

మూ. బుద్ధిశ్చ తే మహాప్రాజ్ఞ దేవైరపి దురన్వయా,
శోకేనాభిప్రసుప్తం తే జ్ఞానం సంబోధయామ్యహమ్. 18

ప్ర. అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి కలవాడా ! తే బుద్ధిః=నీ బుద్ధి, దేవైరపి = దేవతలచేత కూడ, దురన్వయా = గ్రహింప శక్యము కానిది. శోకేన = శోకముచేత, అభిప్రసుప్తమ్=నిద్రించిన, తే జ్ఞానమ్ = నీ జ్ఞానమును, అహమ్= నేను, సంబోధయామి = మేల్కొలుపుచున్నాను.

తా. గొప్ప బుద్ధి గలవాడా ! నీ బుద్ధిని దేవతలు కూడ తెలిసికొనజాలరు. నేను కేవలము శోకముచేత అణగి ఉన్న నీ జ్ఞానమును మేల్కొలుపుచున్నాను.

మూ. దివ్యం చ మానుషం చ త్వమాత్మనశ్చ పరాక్రమమ్,
ఇక్ష్వాకువృషభావేక్ష్య యతస్వ ద్విషతాం వధే. 19

ప్ర. అ. ఇక్ష్వాకువృషభ=ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడా ! త్వమ్=నీవు, దివ్యమ్ = దివ్యము, మానుషం చ = మనుష్యులకు సంబంధించినది అయిన, ఆత్మనః = నీయొక్క, పరాక్రమమ్ = పరాక్రమమును, అవేక్ష్య = చూచి, ద్విషతామ్ = శత్రువులయొక్క, వధే = వధయందు. యతస్వ = ప్రయత్నించుము.

తా. రామా ! నీకు దేవతలలో ఉండే (దివ్యమైన) పరాక్రమము. మానవులలో ఉండే పరాక్రమమూ కూడ ఉన్నది. అట్టి పరాక్రమమును గుర్తు ఉంచుకొని శత్రువులను సంహరించుటకు ప్రయత్నించుము.

వి. ''దివ్యంచ మానుషం చాస్త్రమాత్మనశ్చ పరాక్రమమ్''అను ప్రాచ్య పాఠము బాగున్నది. ''నీవద్ద దేవతలకుమాత్రమే తెలిసిన అస్త్రాలు, మానవులకు తెలిసే అస్త్రాలు కూడ ఉన్నవి. అట్టి రెండు విధాలైన అస్త్రాలను, నీ సహజపరాక్రమమును చూచుకొని శత్రుసంహారముకొరకు ప్రయత్నిము చేయుము''అని భావము. 19

మూ. కిం తేన సర్వనాశేన కృతేన పురుషర్షభ,
తమేవ త్వం రిపుం పాపం విజ్ఞాయోద్ధర్తుమర్హసి. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
షట్షష్టితమః సర్గః.

ప్ర. అ. పురుషర్షభ = ఓ! పురుషశ్రేష్ఠుడా! కృతేన = చేయబడిన, తేన = ఆ, సర్వనాశేన = సర్వనాశముచేత, కిమ్ = ఏమి ప్రయోజనము? త్వమ్ = నీవు, పాపమ్ = పాపాత్ముడైన, తం రిపుమ్ ఏవ = ఆ శత్రువునే, విజ్ఞాయ = తెలిసికొని, ఉద్ధర్తుమ్ = పెకలించివేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. రామా! సర్వనాశము చేయుటవలన ఏమి ప్రయోజనము? పాపాత్ముడైన ఆ శత్రువు ఎవడో తెలిసికొని వానినే నశింపచేయుము. 20

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో అరువదిఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తషష్టితమః సర్గః

*[రామలక్ష్మణులు జటాయువును చూచుట; రాముడు జటాయువును కౌగలించుకొని విలపించుట].*

మూ. పూర్వజోఽప్యుక్తమాత్రస్తు లక్ష్మణేన సుభాషితమ్,
సారగ్రాహీ మహాసారం ప్రతిజగ్రాహ రాఘవః. 1

ప్ర. అ. సారగ్రాహీ = సారమును గ్రహించు, రాఘవః = రాముడు, పూర్వజోఽపి = అన్నగారే అయినా, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఉక్తమాత్రః తు = చెప్పబడగానే, మహాసారమ్ = గొప్ప సారము గల, సుభాషితమ్ = మంచి మాటను, ప్రతిజగ్రాహ = అంగీకరించెను.

తా. రాముడు మాటలలోని సారమును గ్రహించే స్వభావము గలవాడు. అందుచే ఆతడు తాను పెద్దవాడే యైనా, లక్ష్మణుడు చెప్పిన, మంచి సారము గల ఉత్తమమైన వాక్యమును అంగీకరించెను. 1

మూ. సంనిగృహ్య మహాబాహుః ప్రవృత్తం కోపమాత్మనః,
అవష్టభ్య ధనుశ్చిత్రం రామో లక్ష్మణమబ్రవీత్. 2

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, రామః = రాముడు, ప్రవృత్తమ్ = ప్రవర్తించిన, ఆత్మనః = తనయొక్క, కోపమ్ = కోపమును, సంనిగృహ్య = నిగ్రహించుకొని, చిత్రమ్ = చిత్రమైన, ధనుః = ధనస్సును, అవష్టభ్య = ఆనుకొని, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. గొప్ప బాహువులు గల రాముడు తనకు కలిగిన కోపమును నిగ్రహించుకొని, చిత్రవర్ణములు గల ధనస్సును ఆనుకొని నిలచి, లక్ష్మణునితో ఇట్లు పలికెను. 2

మూ. కిం కరిష్యావహే వత్స క్వ వా గచ్ఛావ లక్ష్మణ,
కేనోపాయేన గచ్ఛేయం సీతామితి విచిన్తయ. 3

ప్ర. అ. వత్స = నాయనా, లక్ష్మణ = లక్ష్మణా ! కిమ్ = ఏమి, కరిష్యావహే = చేసెదము ? క్వ వా = ఎచటికి, గచ్ఛావ = వెళ్లెదము? సీతామ్ = సీతను, కేన = ఏ, ఉపాయేన = ఉపాయముచేత, గచ్ఛేయమ్ = పొందుదును, ఇతి = అను విషమును, విచిన్తయ = ఆలోచించుము.

తా. నాయనా ! లక్ష్మణా ! ఇప్పుడు మన మేమి చేసెదము ? ఎక్కడికి వెళ్లెదము ? సీత ఏ ఉపాయముచేత దొరకునో ఆలోచించుము. 3

మూ. తం తథా పరితాపార్తం లక్ష్మణో రామమబ్రవీత్
ఇమమేవ జనస్థానం త్వమన్వేషితుమర్హసి 4
రాక్షసైర్బహుభిః కీర్ణం నానాద్రుమ లతాయుతమ్.

ప్ర. అ. తథా = అట్లు, పరితాపార్తమ్ = మనస్తాపముచేత పీడితుడైన, తం రామమ్ = ఆ రాముణ్ణి గూర్చి, లక్ష్మణః = లక్ష్మణుడు, అబ్రవీత్ = పలికెను, త్వమ్ = నీవు, బహుభిః = అనేకులైన, రాక్షసైః = రాక్షసులచేత, కీర్ణమ్ = వ్యాప్తమైనది, నానాద్రుమలతాయుతమ్ = అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను కూడినది అయిన, ఇమమ్ = ఈ, జనస్థానమేవ = జనస్థానమునే, అన్వేషితుమ్ = వెదకుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. ఆ విధముగా మనస్తాపముతో బాధపడుచున్న రామునితో లక్ష్మణుడిట్లు పలికెను. “ఈ జనస్థానములో అనేకులు రాక్షసులు నివసించుచున్నారు. ఇది అనేకములైన వృక్షములతోను, లతలతోను వ్యాప్తమైనది. ఇక్కడనే వెదకుము”. 4

మూ. సన్తీహ గిరిదుర్గాణి నిర్దరాః కన్దరాణి చ 5
గుహాశ్చ వివిధా ఘోరా నానామృగగణాకులాః
ఆవాసాః కిన్నరాణాం చ గన్ధర్వభవనాని చ. 6

ప్ర. అ. ఇహ = ఇక్కడ, గిరిదుర్గాణి = పర్వతదుర్గములు, నిర్దరాః = లోయలు, కన్దరాణి చ = రంధ్రములు, వివిధాః = అనేకవిధములైన, ఘోరాః =

భయంకరమైన, నానామృగగణాకులాః = అనేకవిధములైన మృగముల సము దాయములచేత వ్యాకులములైన, గుహాశ్చ = గుహలు, కిన్నరాణామ్ = కింనరుల యొక్క, ఆవాసాః = నివాసములు, గన్ధర్వభవనాని చ = గంధర్వుల గృహములు, సన్తి = ఉన్నవి.

తా. ఈ జనస్థానమునందు పర్వతదుర్గములు, లోయలు, రంధ్రములు, భయంకరములు, అనేకవిధములైన మృగముల గణములచేత వ్యాకులములు అయిన అనేకవిధములైన గుహలు, కింనరుల నివాసములు, గంధర్వుల భవనములు ఉన్నవి. 5, 6

మూ. తాని యుక్తో మయా సార్ధం త్వమన్వేషితుమర్హసి,
త్వద్విధా బుద్ధిసంపన్నా మహాత్మానో నరర్షభ, 7
ఆపత్సు న ప్రకమ్పన్తే వాయువేగైరివాచలాః.

ప్ర. అ. త్వమ్ = నీవు, యుక్తః = ఉద్యుక్తుడవై, (ఏమరుపాటులేనివాడవై), మయా సార్ధమ్ = నాతో కూడ, తాని = వాటిని, అన్వేషితుమ్ = వెదకుటకు, అర్హసి = తగిఉన్నావు. నరర్షభ = ఓ! నరశ్రేష్ఠుడా! బుద్ధిసంపన్నాః = బుద్ధిసంపన్నులైన, త్వద్విధాః = నీవంటి, మహాత్మానః = మహాత్ములు, వాయువేగైః = వాయువేగములచేత, అచలాః ఇవ = పర్వతములు వలె, న ప్రకమ్పన్తే = కంపించరు.

తా. నీవు నాతో కలిసి. ప్రయత్నపూర్వకముగా ఆ స్థానములను అన్వేషించుము. ఓ! నరశ్రేష్ఠుడా! బుద్ధిసంపన్నులైన నీవంటి మహాత్ములు, వాయువేగమునకు పర్వతములు ఎట్లు చలించవో అట్లే ఆపదలలో చలించరు. 7

మూ. ఇత్యుక్తస్తద్వనం సర్వం విచచార సలక్ష్మణః, 8
క్రుద్ధో రామః శరం ఘోరం సంధాయ ధనుషి క్షురమ్.

ప్ర. అ. క్రుద్ధః = కోపించిన, రామః = రాముడు, ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడినవాడై, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, ధనుషి = ధనస్సు మీద, ఘోరమ్ = భయంకరమైన, క్షురం శరమ్ = అర్ధచంద్రబాణమును,

సంధాయ = సంధించి, సర్వమ్ = సమస్తమైన, తత్ వనమ్ = ఆ వనమును, విచచార = సంచరించెను.

తా. క్రుద్ధుడైన రాముడు ఆ మాటలు విని, లక్ష్మణసమేతుడై, ధనస్సుపై భయంకరమైన అర్ధచంద్రబాణము సంధించి ఆ వనమునంతా వెదకెను. 8

మూ. తతః పర్వతకూటాభం మహాభాగం ద్విజోత్తమమ్, 9
దదర్శ పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పర్వతకూటాభమ్ = పర్వతశిఖరముతో సమానుడు, మహాభాగమ్ = మహాభాగ్యవంతుడు, ద్విజోత్తమమ్ = పక్షులలో ఉత్తముడు, భూమౌ = భూమియందు, పతితమ్ = పడి యున్నవాడు, క్షతజార్ద్రమ్ = రక్తముచేత తడిసిన వాడు అయిన, జటాయుషమ్ = జటాయువును, దదర్శ = చూచెను.

తా. పిమ్మట రాముడు మహాభాగ్యవంతుడు, పక్షులలో ఉత్తముడూ అయిన జటాయువును చూచెను. పర్వతశిఖరము వలె ఉన్న ఆతడు రక్తముతో తడిసి నేలపై పడి యుండెను. 9

మూ. తం దృష్ట్వా గిరిశృఙ్గాభం రామో లక్ష్మణమబ్రవీత్, 10
అనేన సీతా వైదేహీ భక్షితా నాత్ర సంశయః.

ప్ర. అ. గిరిశృఙ్గాభమ్ = పర్వతశిఖరము వంటి కాంతి గల, తమ్ = ఆ జటాయువును, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. అనేన = ఈతనిచేత. వైదేహీ = విదేహరాజు కుమార్తె యైన, సీతా = సీత, భక్షితా = భక్షించబడినది. అత్ర = ఈ విషయము నందు, సంశయః = సంశయము, న = లేదు.

తా. పర్వతశిఖరము వలె ఉన్న ఆతనిని చూచి రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను. “ఈతడు సీతను భక్షించివేసినాడు. ఈ విషయములో సందేహము లేదు.” 10

మూ. గృధ్రరూపమిదం రక్షో వ్యక్తం భవతి కాననే, 11
భక్షయిత్వా విశాలాక్షీమాస్తే సీతాం యథాసుఖమ్,
ఏనం వధిష్యే దీప్తాగ్రైర్ఘోరైర్బాణైరజిహ్మగైః. 12

ప్ర. అ. ఇదమ్ = ఈ, రక్షః = రాక్షసుడు, గృధ్రరూపమ్ = గ్రద్ధ రూపము కలవాడై, కాననే = అడవిలో, భవతి = ఉన్నాడు. వ్యక్తమ్=సత్యము. విశాలాక్షీమ్ = విశాలములైన నేత్రములు గల, సీతామ్ = సీతను, భక్షయిత్వా= భక్షించి, యథాసుఖమ్ = సుఖముగా, ఆస్తే = కూర్చున్నాడు, దీప్తాగ్రైః=ప్రజ్వలించుచున్న అగ్రభాగములు గల, ఘోరైః=భయంకరములైన, అజిహ్మాగ్రైః= వక్రముగాకాకుండా వెళ్లే, బాణైః = బాణములచేత, ఏనమ్ = వీనిని, వధిష్యే= చంపగలను.

తా. "వీడు గ్రద్ధరూపముతో అరణ్యములో నివసించుచున్న రాక్షసుడు. సత్యము. విశాలమైన నేత్రములు గల సీతను భక్షించి సుఖముగా కూర్చున్నాడు. ప్రకాశించుచున్న అగ్రభాగములు గల, భయంకరములైన, వంకర లేకుండా ప్రయాణం చేసే బాణాలతో వీనిని చంపెదను". 11, 12

మూ. ఇత్యుక్త్వాభ్యపతద్గృధ్రం సంధాయ ధనుషి క్షురమ్,
క్రుద్ధో రామః సముద్రాన్తాం కమ్పయన్నివ మేదినీమ్. 13

ప్ర. అ. రామః = రాముడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, క్రుద్ధః = కోపించినవాడై, ధనుషి=ధనస్సుపై, క్షురమ్=అర్ధచంద్రబాణమును, సంధాయ= సంధించి, సముద్రాన్తామ్ = సముద్రము కొనలుగా గల, మేదినీమ్ = భూమిని, కమ్పయన్నివ=కంపింపచేయుచున్నవాడు వలె, గృధ్రమ్=ఆ గ్రద్ధను గూర్చి, అభ్యపతత్ = తొందరగా వెళ్లెను.

తా. రాముడు ఈ విధముగా పలికి, కోపించినవాడై, ధనస్సుపై అర్ధ చంద్రాకారబాణమును సంధించి, సముద్రమువరకు వ్యాపించి ఉన్న భూమిని కంపింపచేయుచున్నాడా అన్నట్లు ఆ గ్రద్ధమీదికి శీఘ్రముగా వెళ్ళెను. 13

మూ. తం దీనం దీనయా వాచా సఫేనం రుధిరం వమన్,
అభ్యభాషత పక్షీ తు రామం దశరథాత్మజమ్. 14

ప్ర. అ. పక్షీ తు = ఆ జటాయువు, సఫేనమ్ = నురుగుతో కూడిన, రుధిరమ్ = రక్తమును, వమన్ = కక్కుచు, దీనమ్ = దీనుడైన, తం = ఆ, దశరథాత్మజమ్ = దశరథకుమారుడైన, రామమ్ = రాముణ్ణి గూర్చి, దీనయా= దీనమైన, వాచా = వాక్కుతో, అభ్యభాషత = పలికెను.

తా. జటాయువు రక్తము, నురుగు కక్కుచు, దీనుడైన ఆ దశరథ కుమారుడైన రామునితో, దీనమైన మాటలతో ఇట్లు పలికెను. 14

మూ. యామోషధిమివాయుష్మన్నన్వేషసి మహావనే,
సా దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతమ్. 15

ప్ర. అ. ఆయుష్మన్=ఆయుష్మంతుడవైన రామా! యామ్=ఏ దేవిని, మహావనే= మహావనమునందు, ఓషధిమివ= ఓషధిని వలె, అన్వేషసి=వెదకుచున్నావో, సా దేవీ= ఆ దేవి, మమ= నాయొక్క, ప్రాణాః చ = ప్రాణములు, ఉభయమ్= ఈ ఉభయము కూడ, రావణేన=రావణునిచేత, హృతమ్=హరింపబడినది.

తా. ఆయుష్మంతుడవైన రామా! ఏ దేవిని ఈ మహావనములో, ఓషధిని వెదకినట్లు వెదకుచున్నావో ఆ దేవిని, నా ప్రాణాలను, రెండింటినీ కూడ రావణుడు హరించినాడు. 15

మూ. త్వయా విరహితా దేవీ లక్ష్మణేన చ రాఘవ,
హ్రియమాణా మయా దృష్టా రావణేన బలీయసా. 16

ప్ర. అ. రాఘవ= రామా! త్వయా= నీతోను, లక్ష్మణేన చ= లక్ష్మణునితోను, విరహితా= శూన్యురాలైన, దేవీ=సీత, బలీయసా= బలవంతుడైన, రావణేన= రావణునిచేత, హ్రియమాణా= హరించబడుచున్నదిగా, మయా= నాచేత, దృష్టా= చూడబడినది.

తా. రామా! నీవు, లక్ష్మణుడు దగ్గర లేని సమయములో సీతను బలశాలియైన రావణుడు అపహరించుచుండగా నేను చూచితిని. 16

మూ. సీతామభ్యవపన్నోఽహం రావణశ్చ రణే మయా,
విధ్వంసితరథశ్చాత్ర పాతితో ధరణీతలే. 17

ప్ర. అ. అహమ్= నేను, సీతామ్= సీతను, అభ్యవపన్నః= సమీపించితిని. మయా= నాచేత, రావణశ్చ= రావణుడు కూడ, విధ్వంసితరథః=నశింపచేయబడిన రథము కలవాడై, అత్ర=ఇక్కడ, ధరణీతలే=నేలమీద. పాతితః= పడవేయబడినాడు.

తా. నేను వెంటనే సీతను రక్షించుటకు వెళ్ళి రావణుని రథము నశింపచేసి ఆతనిని రథమునుండి నేలమీదకు పడద్రోసితిని. 17

మూ. ఏతదస్య ధనుర్భగ్న మేతదస్య శరావరమ్,
అయమస్య రథో రామ భగ్నః సాంగ్రామికో మయా. 18

ప్ర. అ. రామ = రామా ! ఏతత్ = ఇది, అస్య = ఈ రావణునియొక్క, భగ్నమ్ = విరగగొట్టబడిన, ధనుః = ధనస్సు. ఏతత్ = ఇది. అస్య = ఇతని యొక్క, శరావరమ్ = కవచము, అయమ్ = ఇది. మయా = నాచేత, భగ్నః = విరగగొట్టబడిన, అస్య = ఇతనియొక్క, సాంగ్రామికః = యుద్ధమునకు సంబంధించిన, రథః = రథము.

తా. రామా ! ఇది నేను విరుగ గొట్టిన ఆతని ధనస్సు. ఇది కవచము. ఇదే నేను విరగగొట్టిన ఆతని యుద్ధరథము. 18

మూ. అయం తు సారథిస్తస్య మత్పక్షనిహతో యుధి,
పరిశ్రాన్తస్య మే పక్షౌ ఛిత్త్వా ఖడ్గేన రావణః, 19

సీతామాదాయ వైదేహీముత్పపాత విహాయసమ్,
రక్షసా నిహతం పూర్వం న మాం హన్తుం త్వమర్హసి. 20

ప్ర. అ. అయం తు = ఇతడు, యుధి = యుద్ధమునందు, మత్పక్షనిహతః = నా రెక్కలచేత చంపబడిన, తస్య సారథిః = ఆతని సారథి. రావణః = రావణుడు, పరిశ్రాన్తస్య = అలసిఉన్న, మే = నాయొక్క, పక్షౌ = రెక్కలను, ఖడ్గేన = ఖడ్గముచేత, ఛిత్త్వా = ఛేదించి, వైదేహీమ్ = విదేహరాజకుమారియైన, సీతామ్ = సీతను, ఆదాయ = గ్రహించి, విహాయసమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పపాత = ఎగిరెను. రక్షసా = రాక్షసునిచేత, పూర్వమ్ = పూర్వమే, నిహతమ్ = చంపబడిన, మామ్ = నన్ను, త్వమ్ = నీవు, హన్తుమ్ = చంపుటకు, నార్హసి = తగవు.

తా. ఇతడు, యుద్ధములో నేను రెక్కలతో చంపి పడవేసిన రావణ సారథి. రావణుడు, అలసి ఉన్న నా రెక్కలు ఖడ్గముచేత ఛేదించి, సీతను గ్రహించి ఆకాశమార్గములోనికి ఎగిరిపోయినాడు. ముందే రాక్షసునిచే చంపబడిన నన్ను నీవు మరల చంపకుము. 19, 20

మూ. రామ స్తస్య తు విజ్ఞాయ బాష్పపూర్ణముఖ స్తదా,
ద్విగుణీకృతతాపా ర్తః సీతాసక్తాం ప్రియాం కథామ్. 21

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, తస్య = ఆతనియొక్క (ఆతనినుండి), సీతాసక్తామ్ = సీతకు సంబంధించిన, ప్రియామ్ = ఇష్టమైన, కథామ్ = కథను, విజ్ఞాయ = తెలిసికొని, బాష్పపూర్ణముఖః = కన్నీటితో నిండిన ముఖముకలవాడై, ద్విగుణీకృతతాపా ర్తః = రెట్టింపు చేయబడిన తాపముచేత పీడితు డయ్యెను.

తా. రాముడు జటాయువునుండి సీతకు సంబంధించిన ప్రియమైన వార్త విని, కన్నీళ్ళతో నిండిన ముఖము కలవాడై రెట్టింపు చేయబడిన తాపముచేత పీడితుడు అయ్యెను. 21

మూ. గృధ్రరాజం పరిష్వజ్య పరిత్యజ్య మహద్ధనుః,
నిపపాతావశో భూమౌ రురోద సహలక్ష్మణః. 22

ప్ర. అ. మహత్ = గొప్పదైన, ధనుః = ధనస్సును, పరిత్యజ్య = విడచి, గృధ్రరాజమ్ = జటాయువును, పరిష్వజ్య = కౌగలించుకొని, అవశః = వశము తప్పినవాడై, భూమౌ = నేలమీద, నిపపాత = పడెను. సహలక్ష్మణః = లక్ష్మణ సమేతుడై, రురోద = ఏడ్చెను.

తా. రాముడు చేతిలో ఉన్న మహాధనస్సును క్రింద పడవేసి, ఆ జటాయువును కౌగలించుకొని, దుఃఖవివశుడై నేలపై పడెను. ఆ రామలక్ష్మణు లిద్దరు ఏడ్చిరి. 22

మూ. ఏకమేకాయనే దుర్గే నిఃశ్వస న్తం కథంచన,
సమీక్ష్య దుఃఖితతరో రామః సౌమిత్రిమ బ్రవీత్. 23

ప్ర. అ. దుర్గే = నడచుటకు అశక్యమైన, ఏకాయనే = ఏకమార్గమునందు (కాలిబాటయందు), ఏకమ్ = ఒంటరిగా, కథంచన = అతికష్టముగా, నిఃశ్వసన్తమ్ = నిట్టూర్చుచున్న ఆ జటాయువును, సమీక్ష్య = చూచి, రామః = రాముడు, దుఃఖితతరః = ఎక్కువ దుఃఖించినవాడై, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. నడచుటకు కష్టమైన కాలిబాటలో ఒంటరిగా పడి ఉండి అతికష్టముగా ఊపిరి పీల్చుకొనుచున్న ఆ జటాయువును చూచి రాముడు ఇంకా అధికమైన దుఃఖముతో, లక్ష్మణునితో ఇట్లు పలికెను.

వి. "ఏకాయనే కృచ్ఛ్రే"అను పాఠము యుక్తము. "కృచ్ఛ్రే=కష్టమైన, ఏకాయనే= శ్వాసపైకిమాత్రమే ప్రసరించే స్థితియందు"అని అర్థము. ఎగ ఊపిరితో అతికష్టముగా శ్వాస పీల్చుకొనుచున్నాడు అని భావము. ఒక్కరే నడచే కాలిబాటలో పడిఉన్నాడు అనే అర్థం అంతగా ప్రకృతోపయుక్తము కాదు. ఆకాశంలో ఎగిరి యుద్ధం చేస్తూ పడినవాడు ఎక్కడనైనా పడవచ్చు కదా. 23

మూ. రాజ్యం భ్రష్టం వనే వాసః సీతా నష్టా పితా మృతః,
ఈదృశీయం మమాలక్ష్మీర్నిర్దహేదపి పావకమ్. 24

ప్ర. అ. రాజ్యమ్= రాజ్యము, భ్రష్టమ్= భ్రష్టమైనది. వనే= వనము నందు, వాసః= నివాసము. సీతా= సీత, నష్టా = కనబడకుండ పోయినది. పితా= తండ్రి, మృతః= మరణించినాడు. 'ద్విజో హతః'అను పాఠమున "ఈ జటాయువు చంపబడినాడు"అని అర్థము. మమ= నాయొక్క, ఈదృశీ= ఇట్టి, అలక్ష్మీః=దౌర్భాగ్యము, పావకమపి=అగ్నిని కూడ, నిర్దహేత్=కాల్చివేయును.

తా. రాజ్యము పోయినది. వనములో నివాసము చేయవలసి వచ్చినది. సీత కనబడకుండా పోయినది. తండ్రి మరణించినాడు. (ఈ జటాయువు చంప బడినాడు). ఈ నా దౌర్భాగ్యము అగ్నిని కూడ కాల్చివేయును. 24

మూ. సంపూర్ణమపి చేదద్య ప్రవిశేయం మహోదధిమ్,
సోఽపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యేత్సరితాంపతిః. 25

ప్ర. అ. అద్య= ఇప్పుడు, సంపూర్ణమ్ = జలముతో నిండియున్న, మహోదధిమ్ అపి=మహాసముద్రమునుకూడ, ప్రవిశేయం చేత్=నేను ప్రవేశించి నట్లయితే, సః= ఆ, సరితాం పతిః అపి = మహాసముద్రము కూడ, మమ= నాయొక్క, అలక్ష్మ్యా= దౌర్భాగ్యముచేత, విశుష్యేత్= ఎండిపోవును.

తా. నేను ఇప్పుడు, పూర్తిగా జలముతో నిండి ఉన్న మహాసముద్రములో

ప్రవేశించినచో, దౌర్భాగ్యవంతుడనైన నా స్పర్శ తగలగానే ఆ మహాసముద్రము కూడ ఎండిపోవును.
25

మూ. నాస్త్యభాగ్యతరో లోకే మత్తోఽస్మిన్ సచరాచరే,
యేనేయం మహతీ ప్రాప్తా మయా వ్యసనవాగురా. 26

ప్ర. అ. యేన మయా = ఏ నాచేత, ఇయమ్ = ఈ, మహతీ = గొప్పదైన, వ్యసనవాగురా = దుఃఖము లనే వల, ప్రాప్తా = పొందబడినదో, మత్తః = అట్టి నాకంటె, అభాగ్యతరః = ఎక్కువ దౌర్భాగ్యవంతుడు, సచరాచరే = జంగమ స్థావరములతో కూడిన, అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు, నాస్తి = లేదు.

తా. నేను ఇంత పెద్ద వ్యసనాల వలలో చిక్కుకొని ఉన్నాను. ఈ జంగమస్థావరాత్మకప్రపంచములో నాకంటె ఎక్కువ దౌర్భాగ్యవంతుడు మరొకడెవడూ లేడు.
26

మూ. అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః,
శేతే వినిహతో భూమౌ మమ భాగ్యవిపర్యయాత్. 27

ప్ర. అ. మే = నాయొక్క, పితృవయస్యః = తండ్రియొక్క స్నేహితుడు, జరాన్వితః = ముసలితనముతో కూడినవాడు అయిన, అయమ్ = ఈ, గృధ్రరాజః = జటాయువు, మమ = నాయొక్క, భాగ్యవిపర్యయాత్ = అదృష్టముయొక్క వైపరీత్యమువలన, వినిహతః = చంపబడినవాడై, భూమౌ = నేలమీద, శేతే = శయనించిఉన్నాడు.

తా. నా దౌర్భాగ్యమువలననే నా తండ్రిగారి మిత్రుడైన, వృద్ధుడైన ఈ జటాయువు కూడ చంపబడి నేలపై పడి ఉన్నాడు.
27

మూ. ఇత్యేవముక్త్వా బహుశో రాఘవః సహలక్ష్మణః,
జటాయుషం చ పస్పర్శ పితృస్నేహం విదర్శయన్. 28

ప్ర. అ. రాఘవః = రాముడు, ఇత్యేవమ్ = ఇట్లు, బహుశః = అనేకవిధములుగా, ఉక్త్వా = పలికి, సహలక్ష్మణః = లక్ష్మణసహితుడై, పితృస్నేహమ్ = తండ్రియందుండే ప్రేమ వంటి ప్రేమను, విదర్శయన్ = చూపుచు, జటాయుషమ్ = జటాయువును, పస్పర్శ = స్పృశించెను.

తా. రాముడు ఇట్లు అనేకవిధముల విలపించెను. పిదప రామలక్ష్మణులు తండ్రిపై ఎంత ప్రేమ ఉండునో అంత ప్రేమను చూపుచు జటాయువు శరీరమును తడవిరి. 28

మూ. నికృత్తపక్షం రుధిరావసిక్తం
స గృధ్రరాజం పరిరభ్య రామః,
క్వ మైథిలీ ప్రాణసమా మమేతి
విముచ్య వాచం నిపపాత భూమౌ. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, నికృత్తపక్షమ్ = ఛేదించబడిన రెక్కలు గలవాడు, రుధిరావసిక్తమ్ = రక్తముచేత తడపబడినవాడు అయిన, గృధ్రరాజమ్ = జటాయువును, పరిరభ్య = కౌగలించుకొని, మమ = నాయొక్క, ప్రాణసమా = ప్రాణములతో సమానురాలైన, మైథిలీ = సీత, క్వ = ఎక్కడ, ఇతి = అని, వాచమ్ = వాక్కును, విముచ్య = ఉచ్చరించి, భూమౌ = నేలమీద, నిపపాత = పడెను.

తా. ఆ రాముడు రెక్కలు తెగగొట్టబడుటచే రక్తముతో పూయబడియున్న ఆ జటాయువును కౌగలించుకొని, "నా ప్రాణసమురాలైన సీత ఎక్కడ ఉన్నది"? అని మాత్రము పలికి నేలమీద పడిపోయెను. 29

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
అరవదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టషష్టితమః సర్గః

[జటాయువు ప్రాణములు విడచుట. శ్రీరాముడు అతనికి దాహ సంస్కారము చేయుట].

మూ. రామః ప్రేక్ష్య తు తం గృధ్రం భువి రౌద్రేణ పాతితమ్,
సౌమిత్రిం మిత్రసంపన్నమిదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. రౌద్రేణ = భయంకరుడైన రావణునిచేత, భువి = నేలమీద, పాతితమ్ = పడగొట్టబడిన, తం గృధ్రమ్ = ఆ జటాయువును, ప్రేక్ష్య = చూచి, రామః = రాముడు, మిత్రసంపన్నమ్ = మంచి మిత్రులతో కూడిన, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. క్రూరుడైన రావణుడు నేలమీద పడగొట్టిన ఆ జటాయువును చూచి రాముడు మంచి మిత్రసంపద గల సౌమిత్రితో ఇట్లు పలికెను. 1

మూ. మమాయం నూనమర్థేషు యతమానో విహఙ్గమః,
రాక్షసేన హతః సంఖ్యే ప్రాణాంస్త్యక్ష్యతి దుస్త్యజాన్. 2

ప్ర. అ. మమ = నాయొక్క, అర్థేషు = ప్రయోజనములయందు, యతమానః = ప్రయత్నించుచున్న, అయం విహఙ్గమః = ఈ పక్షి, సంఖ్యే = యుద్ధమునందు, రాక్షసేన = రాక్షసునిచేత, హతః = చంపబడినవాడై, దుస్త్యజాన్ = విడువ శక్యముకాని, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యతి = విడువగలడు. నూనమ్ = నిశ్చయము.

తా. ఈ జటాయువు నాకు సాహాయ్యము చేయుటకొరకై ప్రయత్నము చేయుచు యుద్ధములో రాక్షసునిచేత చంపబడినాడు(కొట్టబడినాడు). ఈ విధముగ ఎవ్వరూ విడచుటకు ఇచ్ఛయించని ప్రాణాలను విడువనున్నాడు. సత్యము. 2

మూ. అతిఖిన్నః శరీరేఽస్మిన్ ప్రాణో లక్ష్మణ విద్యతే,
తథా హి స్వరహీనోఽయం విక్లబః సముదీక్ష్యతే. 3

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! అస్య = ఈతనియొక్క, అస్మిన్ శరీరే = ఈ శరీరమునందు, ప్రాణః = ప్రాణము, అతిఖిన్నః = చాల దుర్బలముగా, విద్యతే = ఉన్నది. తథా హి = అది యుక్తమే కదా. అయమ్ = ఈతడు, స్వరహీనః = స్వరము లేనివాడుగాను, విక్లబః = వ్యాకులుడు గాను, సముదీక్ష్యతే = చూడబడుచున్నాడు.

తా. లక్ష్మణా ! ఈతని శరీరములో ప్రాణము చాల దుర్బలముగా ఉన్నట్లు కనబడుచున్నది. అందుచేతనే ఇతడు కంఠస్వరము తగ్గిపోయి వ్యాకులుడుగా కనబడుచున్నాడు. 3

మూ. జటాయో యది శక్నోషి వాక్యం వ్యాహరితుం పునః,
సీతామాఖ్యాహి భద్రం తే వధమాఖ్యాహి చాత్మనః. 4

ప్ర. అ. జటాయో = జటాయూ ! పునః = మరల, వ్యాహరితుమ్ = మాటలాడుటకు, శక్నోషి యది = సమర్థుడ వైనట్లయితే, తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. సీతామ్ = సీతను గూర్చి, అఖ్యాహి = చెప్పుము. ఆత్మనః = నీయొక్క, వధమ్ = వధను గూర్చి, ఆఖ్యాహి = చెప్పుము.

తా. ఓ! జటాయూ ! మరొక సారి మాటలాడకలిగితే సీత విషయము, నీ వధ విషయము చెప్పుము. నీకు మంగళ మగుగాక. 4

మూ. కింనిమిత్తోఽహరత్సీతాం రావణ స్తస్య కిం మయా,
అపరాద్ధం తు యం దృష్ట్వా రావణేన హృతా ప్రియా. 5

ప్ర. అ. రావణః = రావణుడు, కింనిమిత్తః = ఏమికారణముగలవాడై, సీతామ్ = సీతను, అహరత్ = హరించెను ? మయా = నాచేత, తస్య = వానికి, కిమ్ = ఏమి, అపరాద్ధమ్ = అపరాధము చేయబడినది ? యమ్ = దేనిని, దృష్ట్వా = చూచి, ప్రియా = ప్రియురాలు, హృతా = హరించబడినదో.

తా. రావణుడు ఏ కారణమును పురస్కరించుకొని సీతను హరించినాడు?

ఆతనికి నేను ఏ అపకారము చేసినానని ఆతడు నా ప్రియురాలిని అపహరించి నాడు ?

5

మూ. కథం తచ్చన్ద్రసంకాశం ముఖమాసీన్మనోహరమ్,
సీతయా కాని చోక్తాని తస్మిన్ కాలే ద్విజోత్తమ. 6

ప్ర. అ. ద్విజోత్తమ = ఓ! పక్షిశ్రేష్ఠుడా ! చన్ద్రసంకాశమ్=చంద్రునితో సమానమైన, మనోహరమ్=మనోహరమైన, తత్ ముఖమ్ = ఆ ముఖము, కథమ్ = ఎట్లు, ఆసీత్ = ఉండెను? తస్మిన్ కాలే = ఆ సమయమునందు, సీతయా = సీతచేత, కాని = ఏ వాక్యములు, ఉక్తాని = పలకబడినవి?

తా. పక్షులలో శ్రేష్ఠుడ వైన ఓ! జటాయూ ! చంద్రునితో సమానమైన, మనోహర మైన ఆ సీత ముఖము ఆ సమయమునందు ఎట్లు అయిపోయినది ? ఆమె ఏమన్నది ?

6

మూ. కథంవీర్యః కథంరూపః కింకర్మా స చ రాక్షసః,
క్వ చాస్య భవనం తాత బ్రూహి మే పరిపృచ్ఛతః. 7

ప్ర. అ. సః రాక్షసః = ఆ రాక్షసుడు, కథంవీర్యః = ఎట్టి పరాక్రమము కలవాడు ? కథంరూపః = ఎట్టి రూపము గలవాడు ? కింకర్మా = ఏమి పని కల వాడు? అస్య = వీనియొక్క, భవనం చ = ఇల్లు, క్వ చ = ఎక్కడ ఉన్నది? తాత = తండ్రీ ! పరిపృచ్ఛతః = ప్రశ్నించుచున్న, మే = నాకు, బ్రూహి = చెప్పుము.

తా. ఆ రాక్షసుని పరాక్రమము ఎట్టిది ? ఆతని రూపము ఎట్టిది ? అతడు ఎట్టి పనులు చేయును? ఆతని నివాస మెక్కడ ? తండ్రీ! ప్రశ్నించుచున్న నాకు సమాధానము చెప్పుము.

7

మూ. తముద్వీక్ష్యాథ దీనాత్మా విలపన్తమనన్తరమ్,
వాచాతిసన్నయా రామం జటాయురిదమబ్రవీత్. 8

ప్ర. అ. అనన్తరమ్=అటు పిమ్మట, దీనాత్మా=దీనమైన మనస్సు గల, జటాయుః = జటాయువు, విలపన్తమ్ = విలపించుచున్న, రామమ్ = రాముణ్ణి,

ఉద్వీక్ష్య = పైకి కళ్ళు ఎత్తి చూచి, అథ = అటు పిమ్మట, అతిసన్నయా = చాలా క్షీణించిన, వాచా = వాక్కుతో, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట, దీనమైన మనస్సు గల జటాయువు విలపించుచున్న రాముని వైపు కళ్ళు పైకెత్తి చూచి, చాల క్షీణించిన స్వరముతో ఇట్లు పలికెను. 8

మూ. హృతా సా రాక్షసేన్ద్రేణ రావణేన విహాయసా,
మాయామాస్థాయ విపులాం వాతదుర్దినసంకులామ్. 9

ప్ర. అ. సా = ఆ సీత, రాక్షసేన్ద్రేణ = రాక్షసరాజైన, రావణేన = రావణునిచేత, వాతదుర్దినసంకులామ్ = వాయువుతోను మేఘాచ్ఛాదనముతోను వ్యాకులమైన, విపులామ్ = అధికమైన, మాయామ్ = మాయను, ఆస్థాయ = అవలంబించి, విహాయసా = ఆకాశముచే, హృతా = హరింపబడినది.

తా. రాక్షసరాజైన రావణుడు మాయచేత అధికమైన గాలిని, మేఘాచ్ఛాదనమును సృష్టించి, ఆకాశమార్గమున ఆ సీతను అపహరించినాడు. 9

మూ. పరిశ్రాన్తస్య మే తాత పక్షౌ ఛిత్త్వా స రాక్షసః,
సీతామాదాయ వైదేహీం ప్రయాతో దక్షిణాం దిశమ్. 10

ప్ర. అ. తాత = తండ్రీ ! సః రాక్షసః = ఆ రాక్షసుడు, పరిశ్రాన్తస్య = అలసిపోయి ఉన్న, మే = నాయొక్క, పక్షౌ = రెక్కలను, ఛిత్త్వా = ఛేదించి, వైదేహీమ్ = విదేహరాజకుమారియైన, సీతామ్ = సీతను, ఆదాయ = గ్రహించి, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, ప్రయాతః = వెళ్ళినాడు.

తా. తండ్రీ ! ఆ రాక్షసుడు నేను అలసిపోయి ఉన్నప్పుడు నా రెక్కలు ఛేదించి విదేహరాజపుత్రియైన సీతను తీసికొని దక్షిణపు దిక్కు వైపు వెళ్ళినాడు.

మూ. ఉపరుధ్యన్తి మే ప్రాణా దృష్టిర్భ్రమతి రాఘవ,
పశ్యామి వృక్షాన్ సౌవర్ణానుశీరకృతమూర్ధజాన్. 11

ప్ర. అ. రాఘవ = రామా ! మే = నాయొక్క, ప్రాణాః = ప్రాణములు, ఉపరుధ్యన్తి = అడ్డగింప బడుచున్నవి. దృష్టిః = దృష్టి, భ్రమతి = తిరిగిపోవు

చున్నది. ఉశీరకృతమూర్ధజాన్ = వట్టివేళ్లచేత చేయబడిన కేశములు గల సౌవర్ణాన్ = సువర్ణవికారమైన, వృక్షాన్ = వృక్షములను, పశ్యామి = చూచ చున్నాను.

తా. రామా! నా ప్రాణములు అడ్డగింపబడుచున్నది. చూపు తిరిగిపోవు చున్నది. వట్టివేళ్ళ వంటి కేశములు గల బంగారు చెట్లను చూచుచున్నాను. (మృత్యువు ఆసన్నమైనవారికి బంగారపు చెట్లు కనబడు నని ప్రతీతి). 11

మూ. యేన యాతి ముహూర్తేన సీతామాదాయ రావణః,
విప్రణష్టం ధనం క్షిప్రం తత్స్వామీ ప్రతిపద్యతే, 12
విన్దో నామ ముహూర్తోఽయం స చ కాకుత్స్థ నాబుధత్.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! రావణః = రావణుడు, యేన ముహూర్తేన = ఏ ముహూర్తముచేత(నందు), సీతామ్ = సీతను, ఆదాయ = తీసికొని, యాతి = వెళ్ళుచున్నాడో (వెళ్ళినాడో), అయమ్ = ఇది, విన్దః నామ = విందము అను, ముహూర్తః = ముహూర్తము. ప్రణష్టమ్ = పోయిన, ధనమ్ = ధనమును, తత్స్వామీ = దాని స్వామి, క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రతిపద్యతే = పొందును. సః చ = ఆ రావణుడు, నాబుధత్ = తెలిసికొనలేదు.

తా. రామా! రావణుడు సీతను ఏ ముహూర్తమునందు అపహరించినాడో! ఆ ముహూర్తమునకు విందముహూర్త మని పేరు. ఆ ముహూర్తమునందు పోయిన ధనము అచిరకాలములోనే ఆ యజమానికి తిరిగి లభించును. ఈ విషయము ఆ రాక్షసునికి తెలియదు. 12

మూ. త్వత్ప్రియాం జానకీం హృత్వా రావణో రాక్షసేశ్వరః, 13
ఝషవద్బడిశం గృహ్య క్షిప్రమేవ వినశ్యతి.

ప్ర. అ. రాక్షసేశ్వరః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, త్వత్ప్రియామ్ = నీ ప్రియురాలైన, జానకీమ్ = జానకిని, హృత్వా = హరించి, బడిశమ్ = గాలమును, గృహ్య = గ్రహించి, ఝషవత్ = చేపవలె, క్షిప్రమేవ = శీఘ్రముగా, వినశ్యతి = నశించును.

తా. నీ ప్రియురాలైన జానకిని హరించిన రాక్షసరాజైన రావణుడు గాలము మ్రింగిన చేప వలె శీఘ్రముగా నశించగలడు. 13

మూ. న చ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాం ప్రతి, 14
వైదేహ్యా రంస్యసే క్షిప్రం హత్వా తం రాక్షసం రణే.

ప్ర. అ. త్వయా = నీచేత, జనకస్య సుతాం ప్రతి = జనకుని కుమార్తెను గూర్చి, వ్యథా = దుఃఖము, న కార్యా = చేయదగినది కాదు. రణే = యుద్ధమునందు, తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, క్షిప్రమ్ = శీఘ్రముగా, హత్వా = చంపి, వైదేహ్యా = సీతతో, రంస్యసే = క్రీడించగలవు.

తా. నీవు సీతను గూర్చి దుఃఖించకుము. నీవు శీఘ్రముగా యుద్ధములో ఆ రాక్షసుణ్ణి చంపి సీతతో క్రీడించగలవు. 14

మూ. అసంమూఢస్య గృధ్రస్య రామం ప్రత్యనుభాషతః, 15
ఆస్యాత్సుస్రావ రుధిరం మ్రియమాణస్య సామిషమ్.

ప్ర. అ. రామం ప్రతి = రాముణ్ణి గూర్చి, అనుభాషతః = మాటలాడుచున్న, అసంమూఢస్య = తెలివితప్పని, మ్రియమాణస్య = మరణించుచున్న, గృధ్రస్య = జటాయువుయొక్క, ఆస్యాత్ = ముఖమునుండి, సామిషమ్ = మాంసముతో కూడిన, రుధిరమ్ = రక్తము, సుస్రావ = స్రవించెను.

తా. ఇంకా తెలివి తప్పని జటాయువు రామునితో ఈ విధముగా మాటలాడుచుండగా అతనికి మరణము ఆసన్నమగుటచే అతని ముఖమునుండి మాంసముతో కూడిన రక్తము స్రవించెను. 15

మూ. పుత్రో విశ్రవసః సాక్షాద్భ్రాతా వైశ్రవణస్య చ, 16
ఇత్యుక్త్వా దుర్లభాన్ ప్రాణాన్ ముమోచ పతగేశ్వరః.

ప్ర. అ. (ఆ రాక్షసుడు), విశ్రవసః = విశ్రవసునియొక్క, పుత్రః = పుత్రుడు. వైశ్రవణస్య = కుబేరునియొక్క, సాక్షాత్ = సాక్షాత్తు, భ్రాతా = సోదరుడు. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, పతగేశ్వరః = జటాయువు, దుర్లభాన్ = మరల లభించని, ప్రాణాన్ = ప్రాణములను, ముమోచ = విడచెను.

తా. "ఆ రాక్షసుడు విశ్రవసుని కుమారుడు, సాక్షాత్తు కుబేరుని సోదరుడు"అని చెప్పి జటాయువు దుర్లభములైన ప్రాణాలను విడచెను. 16

మూ. బ్రూహి బ్రూహీతి రామస్య బ్రువాణస్య కృతాఞ్జలేః, 17
త్యక్త్వా శరీరం గృధ్రస్య జగ్ముః ప్రాణా విహాయసమ్.

ప్ర. అ. కృతాఞ్జలేః = చేయబడిన దోసిలి గల, రామస్య = రాముడు, బ్రూహి బ్రూహి ఇతి = చెప్పుము చెప్పుము అని, బ్రువాణస్య = అనుచుండగానే, గృధ్రస్య = జటాయువుయొక్క, ప్రాణాః = ప్రాణములు, శరీరమ్ = శరీరమును, త్యక్త్వా = విడచి, విహాయసమ్ = ఆకాశమును గూర్చి, జగ్ముః = వెళ్ళినవి.

తా. రాముడు దోసిలి పట్టి, "ఇంకా చెప్పుము చెప్పుము"అని అనుచుండ గానే జటాయువు ప్రాణాలు శరీరమును విడచి ఆకాశముమీదికి ఎగిరిపోయినవి.

మూ. స నిక్షిప్య శిరో భూమౌ ప్రసార్య చరణౌ తదా, 18
విక్షిప్య చ శరీరం స్వం పపాత ధరణీతలే.

ప్ర. అ. సః = ఆ జటాయువు, తదా = అప్పుడు, శిరః = శిరస్సును, భూమౌ = భూమిమీద, నిక్షిప్య = ఉంచి, చరణౌ = పాదములను, ప్రసార్య = చాపి, స్వమ్ = తన సంబంధమైన, శరీరమ్ = శరీరమును, ధరణీతలే = నేలమీద, విక్షిప్య = జారవిడచి, పపాత = పడిపోయెను.

తా. అప్పుడా జటాయువు శిరస్సును నేలపై పడవేసి, పాదములు చాపి, శరీరమును నేలమీద జారవిడచి, ఒరిగిపోయెను. 18

మూ. తం గృధ్రం ప్రేక్ష్య తామ్రాక్షం గతాసుమచలోపమమ్,
రామః సుబహుభిర్దుఃఖైర్దీనః సౌమిత్రిమబ్రవీత్.

ప్ర. అ. సుబహుభిః = అనేకమైన, దుఃఖైః = దుఃఖములచేత, దీనః = దీనుడైన, రామః = రాముడు. తామ్రాక్షమ్ = ఎఱ్ఱని నేత్రములు గల, గతాసుమ్ = పోయిన ప్రాణములు గల, అచలోపమమ్ = పర్వతముతో సమానమైన, తం గృధ్రమ్ = ఆ జటాయువును, ప్రేక్ష్య = చూచి, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అనేకదుఃఖములు ఒక్కసారిగా వచ్చి పడుటచేత దీనుడైన రాముడు ఎఱ్ఱని కన్ను గల, పర్వతము వంటి దేహము గల, మరణించిన ఆ జటాయువును చూచి లక్ష్మణునితో ఇట్లనెను. 19

మూ. బహూని రక్షసాం వాసే వర్షాణి వసతా సుఖమ్, 20
అనేన దణ్డకారణ్యే విశీర్ణమిహ పక్షిణా.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, వాసే=నివాసమైన, ఇహ=ఈ, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, సుఖమ్=సుఖముగా, బహూని వర్షాణి = చాల సంవత్సరములను, వసతా = నివసించుచున్న, అనేన = ఈ, పక్షిణా = పక్షిచేత, విశీర్ణమ్=మరణముపొందుట (జరిగినది).

తా. రాక్షసులకు నివాసమైన ఈ దండకారణ్యములో సుఖముగా నివసించు చున్న ఈ జటాయువు నా నిమిత్తమై మరణించినాడు. 20

మూ. అనేకవార్షికో యస్తు చిరకాలసముత్థితః, 21
సోఽయమద్య హతః శేతే కాలో హి దురతిక్రమః.

ప్ర. అ. అనేకవార్షికః = అనేకసంవత్సరముల వయస్సు గల, యః=ఏ జటాయువు, చిరకాలసముత్థితః = చిరకాలము కార్యోద్యుక్తుడుగా ఉన్నాడో, సః అయమ్ = అట్టి ఈ జటాయువు, అద్య = ఇప్పుడు, హతః = చంపబడినవాడై, శేతే = శయనించినాడు. కాలః = కాలము, దురతిక్రమః హి = అతిక్రమింప శక్యము కానిది కదా ?

తా. అతి దీర్ఘాయుర్దాయము గల ఏ జటాయువు చాల కాలము కార్య వ్యగ్రుడై ఉండేవాడో అట్టి ఇతడు చంపబడి పడి ఉన్నాడు. కాలమును ఎవ్వరూ దాటజాలరు కదా ? 21

మూ. పశ్య లక్ష్మణ గృధ్రోయముపకారీ హతశ్చ మే, 22
సీతామభ్యవపన్నో వై రావణేన బలీయసా.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! సీతామ్ = సీతను, అభ్యవపన్నః = రక్షించుటకై వెళ్ళిన, మే ఉపకారీ = నాకు ఉపకారము చేసిన, అయం గృధ్రః = ఈ జటాయువు, బలీయసా = అధికబలవంతుడైన, రావణేన = రావణునిచేత, హతః = చంపబడినాడు. పశ్య = చూడుము.

తా. లక్ష్మణా ! నాకు ఉపకారము చేయవలె నను కోరికతో సీతను

రక్షించుటకై వెళ్ళిన ఈ జటాయువు అధికబలశాలియైన రావణునిచేత చంపబడినాడు.

22

మూ. గృధ్రరాజ్యం పరిత్యజ్య పితృపైతామహం మహత్, 23
మమ హేతోరయం ప్రాణాన్ ముమోచ పతగేశ్వరః.

ప్ర. అ. అయం పతగేశ్వరః = ఈ పక్షిరాజు, పితృపైతామహమ్ = తండ్రితాతలకు చెందిన, మహత్ = గొప్పదైన, గృధ్రరాజ్యమ్ = గృధ్రముల రాజ్యమును, పరిత్యజ్య = విడచి, మమ హేతోః = నా మూలమున, ప్రాణాన్ = ప్రాణములను, ముమోచ = విడచెను.

తా. ఈ పక్షిరాజు, తండ్రితాతలనాటినుండి వచ్చుచున్న గొప్ప గృధ్ర రాజ్యమును విడచిపెట్టి నా నిమిత్తమై ప్రాణాలను విడచినాడు. 23

మూ. సర్వత్ర ఖలు దృశ్యన్తే సాధవో ధర్మచారిణః, 24
శూరాః శరణ్యాః సౌమిత్రే తిర్యగ్యోనిగతేష్వపి.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! శూరాః = శూరులు, శరణ్యాః = శరణు జొచ్చినవారిని రక్షించేవారు, ధర్మచారిణః = ధర్మమును ఆచరించేవారు అయిన, సాధవః = సత్పురుషులు, సర్వత్ర = అంతటా, తిర్యగ్యోనిగతేష్వపి = తిర్యగ్జంతువులలో కూడ, దృశ్యన్తే ఖలు = చూడబడుచున్నారు కదా.

తా. లక్ష్మణా! శూరులు, శరణాగతరక్షకులు, ధర్మమును ఆచరించువారు అయిన సత్పురుషులు అంతటా ఉందురు కదా! తిర్యగ్జంతువులలో కూడ కనబడుచున్నారు కదా!

24

మూ. సీతాహరణజం దుఃఖం న మే సౌమ్య తథాగతమ్, 25
యథా వినాశే గృధ్రస్య మత్కృతే చ పరంతప.

ప్ర. అ. పరంతప = శత్రువినాశకుడా! సౌమ్య = సౌమ్యుడా, గృధ్రస్య = ఈ జటాయువుయొక్క, వినాశే = వినాశమునందు, మత్కృతే చ = (అందులోను) నా నిమిత్తమై, యథా = ఎట్లో, సీతాహరణజమ్ = సీతను హరించుటవలన కలిగిన, దుఃఖమ్ = దుఃఖము, తథావిధమ్ = ఆవిధమైనది. న = కాదు, ("తథాగతమ్"కు బదులు, "తథావిధమ్" అను ప్రాచ్యపాఠము గ్రహింపబడినది).

తా. శత్రుసంహారకుడవైన లక్ష్మణా ! ఈ జటాయువు మరణించుట వలన, అందులోను నానిమిత్తమై మరణించుటవలన, నా కెంత దుఃఖము కలుగు చున్నదో అంత దుఃఖము సీతాహరణమువలన కూడ కలగలేదు. 25

మూ. రాజా దశరథః శ్రీమాన్ యథా మమ మహాయశాః, 26
పూజనీయశ్చ మాన్యశ్చ తథాయం పతగేశ్వరః.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గలవాడు, శ్రీమాన్ = శ్రీమంతుడు, రాజా = రాజైన, దశరథః = దశరథుడు, మమ = నాకు, యథా = ఎట్లు, పూజనీయశ్చ = పూజింపదగినవాడో, మాన్యశ్చ = గౌరవింపదగినవాడో, అయమ్ = ఈ, పతగేశ్వరః = పక్షిరాజు, తథా = అట్లే.

తా. శ్రీమంతుడు, గొప్ప కీర్తి గలవాడు అయిన దశరథమహారాజు నాకు ఎట్లు పూజ్యుడో, గౌరవింపదగినవాడో ఈ పక్షిరాజు కూడ అట్లే పూజ్యుడు, మాన్యుడు. 26

మూ. సౌమిత్రే హర కాష్ఠాని నిర్మథిష్యామి పావకమ్, 27
గృధ్రరాజం దిధక్షామి మత్కృతే నిధనం గతమ్.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! కాష్ఠాని = కట్టెలను, హర = తీసికొని రమ్ము. పావకమ్ = అగ్నిని, నిర్మథిష్యామి = మథించెదను. మత్కృతే = నా నిమిత్తమై, నిధనమ్ = మరణమును, గతమ్ = పొందిన, గృధ్రరాజమ్ = జటాయువును, దిధక్షామి = కాల్చదలచుచున్నాను.

తా. లక్ష్మణా ! కట్టెలు తీసికొనిరమ్ము. అగ్నిని మథించి, నా నిమిత్తమై ప్రాణాలు విడచిన జటాయువునకు దహనసంస్కారము చేయవలె నని కోరు చున్నాను. 27

మూ. నాథం పతగలోకస్య చితామారోప్య రాఘవ, 28
ఇమం ధక్ష్యామి సౌమిత్రే హతం రౌద్రేణ రక్షసా.

ప్ర. అ. రాఘవ = రఘువంశమునందు పుట్టిన, సౌమిత్రే = లక్ష్మణా ! రౌద్రేణ = భయంకరుడైన, రక్షసా = రాక్షసునిచేత, హతమ్ = చంపబడిన,

ఇమమ్ = ఈ, పతగలోకస్య నాథమ్ = పక్షిసముదాయమునకు ప్రభువైన జటాయువును, చితామ్ = చితిని, ఆరోప్య = ఎక్కించి, ధక్ష్యామి = కాల్చెదను.

తా. రఘువంశమునందు జన్మించిన ఓ లక్ష్మణా! క్రూరుడైన రాక్షసుని చేత చంపబడిన, పక్షిరాజైన ఈ జటాయువును చితిపై ఎక్కించి, దహన సంస్కారము చేసెదను. 28

మూ. యా గతిర్యజ్ఞశీలానామాహితాగ్నేశ్చ యా గతిః, 29
అపరావర్తినాం యా చ యా చ భూమిప్రదాయినామ్,
మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాననుత్తమాన్, 30
గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ.

ప్ర. అ. మహాసత్త్వ = గొప్ప బలము గల, గృధ్రరాజ = ఓ! జటాయూ! మయా = నాచేత, సమనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడిన, త్వమ్ = నీవు, యజ్ఞశీలానామ్ = యజ్ఞములు చేయు స్వభావము కలవారికి, యా = ఏ, గతిః = గతియో, ఆహితాగ్నేశ్చ = అగ్న్యాధానము చేసినవానికి, యా గతిః = ఏ గతియో, అపరావర్తినామ్ = తిరిగి ఇంటికి రాని సంన్యాసులకు, లేదా యుద్ధమునుండి వెనుదిరగని యోధులకు, యా చ = ఏ గతియో, భూమిప్రదాయినామ్ = భూమిని ఇచ్చినవారికి, యా చ = ఏ గతియో, ఆ గతిని, గచ్ఛ = పొందుము. మయా = నాచేత, సంస్కృతః చ = సంస్కరింపబడిన నీవు, అనుత్తమాన్ = చాల ఉత్తమములైన, లోకాన్ = లోకములనుగూర్చి, వ్రజ = వెళ్ళుము.

తా. గొప్ప బలము గల ఓ! గృధ్రరాజా! సర్వదా యజ్ఞములు (జపయజ్ఞాదులు) చేయువారికి ఏ గతి లభించునో, ఆహితాగ్నులకు ఏ గతి లభించునో, సంన్యాసులకు (లేదా యుద్ధములో వెన్ను చూపనివారికి) ఏ గతి లభించునో, భూదానము చేసేవారికి ఏ గతి లభించునో ఆ గతిని నీవు పొందెదవుగాక. నేను అనుజ్ఞ ఇచ్చుచున్నాను. నాచేత సంస్కరింపబడిన నీవు అత్యుత్తమములైన లోకములకు వెళ్లుము. (ఈ రెండు శ్లోకములు ప్రాచ్యప్రతిలో లేవు). 29, 30

మూ. ఏవముక్త్వా చితాం దీప్తామారోప్య పతగేశ్వరమ్, 31
దదాహ రామో ధర్మాత్మా స్వబంధుమివ దుఃఖితః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామః = రాముడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, పతగేశ్వరమ్ = పక్షిరాజైన జటాయువును, చితామ్ = చితను, ఆరోప్య = ఎక్కించి, దుఃఖితః = దుఃఖించుచున్నవాడై, స్వబన్ధుమివ = తన బంధువును వలె, దదాహ = కాల్చెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఇట్లు పలుకుచు, జటాయువును చితిపై ఎక్కించి, చాల దుఃఖించుచు తన బంధువునకు వలె దహనసంస్కారము చేసెను.

మూ. రామోఽథ సహసౌమిత్రిర్వనం గత్వా స వీర్యవాన్, 32
స్థూలాన్ హత్వా మహారోహీననుతస్తార తం ద్విజమ్.

ప్ర. అ. అథ = పిమ్మట, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, రామః = రాముడు, సహసౌమిత్రిః = లక్ష్మణసమేతుడై, వనమ్ = వనమును గూర్చి, గత్వా = వెళ్ళి, స్థూలాన్ = పెద్దవైన, మహారోహీన్ = పెద్ద రోహిమృగములను, హత్వా = చంపి, తం ద్విజమ్ = ఆ పక్షిని గూర్చి, అనుతస్తార = దర్భలు పరచెను.

తా. పరాక్రమవంతుడైన రాముడు లక్ష్మణసమేతుడై అడవిలోనికి వెళ్ళి, లావుగా నున్న పెద్ద రోహిమృగలను చంపి, జటాయువునకు పిండప్రదానము చేయుటకై, దర్భలు పరచెను. 32

మూ. రోహిమాంసాని చోత్కృత్య పేశీకృత్య మహాయశాః, 33
శకునాయ దదౌ రామో రమ్యే హరితశాద్వలే.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రామః = రాముడు, రోహిమాంసాని = రోహిమృగమాంసములను, ఉత్కృత్య = పెకలించి, పేశీకృత్య = ముద్దగా చేసి, రమ్యే = సుందరమైన, హరితశాద్వలే = ఆకుపచ్చని పచ్చికబీడునందు, శకునాయ = పక్షికొరకు, దదౌ = ఇచ్చెను.

తా. మహాయశఃశాలియైన రాముడు రోహిమాంసములు తీసి ముద్దచేసి, రమ్యమైన ఆకుపచ్చని పచ్చిక బీడునందు జటాయువుకొరకు పిండముల నిచ్చెను.

మూ. యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయన్తి ద్విజాతయః, 34
తత్స్వర్గగమనం తస్య పిత్ర్యం రామో జజాప హ.

ప్ర. అ. తత్ = ప్రసిద్ధమైన, యత్ = దేనిని, ద్విజాతయః = బ్రాహ్మణులు, ప్రేతస్య = మరణించిన, మర్త్యస్య = మానవునకు, స్వర్గగమనమ్ = స్వర్గమును పొందించే దానినిగా, కథయన్తి = చెప్పుదురో, తత్ = ఆ, పిత్ర్యమ్ = పితృదేవతాకమైన మంత్రమును, తస్య = ఆ జటాయువునకు, జజాప = జపించెను.

తా. ఏ మంత్రము మరణించిన మానవుని స్వర్గమునకు పంపు నని బ్రాహ్మణులు చెప్పుదురో అట్టి పితృదేవతలకు సంబంధించిన మంత్రమును రాముడు ఆ జటాయువుకొరకై జపించెను. 34

మూ. తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ, 35
ఉదకం చక్రతుస్తస్మై గృధ్రరాజాయ తావుభౌ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఉభౌ = ఇద్దరైన, తౌ = ఆ, నరవరాత్మజౌ = రాజకుమారులు, గోదావరీం నదీమ్ = గోదావరీనదిని గూర్చి, గత్వా = వెళ్ళి, తస్మై = ఆ, గృధ్రరాజాయ = జటాయువునకు, ఉదకమ్ = ఉదకమును, చక్రతుః = చేసిరి.

తా. పిమ్మట ఆ రాజకుమారు లిద్దరూ గోదావరీనదికి వెళ్ళి ఆ జటాయువునకు ఉదకతర్పణములు చేసిరి. 35

మూ. శాస్త్రదృష్టేన విధినా జలే గృధ్రాయ రాఘవౌ, 36
స్నాత్వా తౌ గృధ్రరాజాయ ఉదకం చక్రతుస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, రాఘవౌ = రామలక్ష్మణులు, శాస్త్రదృష్టేన = శాస్త్రమునందు చూడబడిన, విధినా = విధిచేత, గృధ్రాయ = ఆ జటాయువు నిమిత్తము, జలే = నీటియందు, స్నాత్వా = స్నానముచేసి, గృధ్రరాజాయ = జటాయువునకు, ఉదకమ్ = ఉదకమును, చక్రతుః = చేసిరి (ఇచ్చిరి).

తా. ఆ రామలక్ష్మణులు అప్పుడు ఆ జటాయువును ఉద్దేశించి శాస్త్రోక్త ప్రకారమున నదిలో స్నానము చేసి ఆతనికి జలతర్పణములు చేసిరి. 36

మూ. స గృధ్రరాజః కృతవాన్యశస్కరం
సుదుష్కరం కర్మ రణే నిపాతితః,
మహర్షికల్పేన చ సంస్కృత స్తదా
జగామ పుణ్యాం గతిమాత్మనః శుభామ్. 37

ప్ర. అ. రణే = యుద్ధమునందు, సుదుష్కరమ్ = చేయుటకు చాల కష్ట మైన, యశస్కరమ్ = కీర్తిని కలిగించు, కర్మ = కర్మను, కృతవాన్ = చేసిన వాడు, నిపాతితః = పడగొట్టబడినవాడు అయిన, సః గృధ్రరాజః = ఆ జటా యువు, తదా = అప్పుడు, మహర్షికల్పేన = మహర్షితో సమానుడైన రామునిచేత, సంస్కృతః = సంస్కరింపబడినవాడై, పుణ్యామ్ = పుణ్యము, శుభామ్ = మంగళ ప్రదము అయిన, ఆత్మనః = తనయొక్క, గతిమ్ = గతిని, జగామ = పొందెను.

తా. చేయుటకు చాల కష్టమైన, కీర్తికరమైన పని చేసి యుద్ధములో ప్రాణ ములు విడచిన ఆ జటాయువు మహర్షి వంటి ఆ రాముడు సంస్కరించుటచే పుణ్యము, మంగళప్రదము అయిన, తనకు తగిన ఉత్తమగతిని పొందెను. 37

మూ. కృతోదకౌ తావపి పక్షిసత్తమే
స్థిరాం చ బుద్ధిం ప్రణిధాయ జగ్మతుః,
ప్రవేశ్య సీతాధిగమే తతో మనో
వనం సురేన్ద్రావివ విష్ణువాసవౌ. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
అష్టషష్టితమః సర్గః.

ప్ర. అ. తౌ అపి = ఆ రామలక్ష్మణులు, కృతోదకౌ = చేయబడిన తర్ప ణములు గలవారై, పక్షిసత్తమే = పక్షిశ్రేష్ఠునియందు, స్థిరామ్ = స్థిరమైన, బుద్ధిమ్ = బుద్ధిని, ప్రణిధాయ = ఉంచి, తతః = అటుపిమ్మట, సీతాధిగమే = సీతను పొందుటయందు, మనః = మనస్సును, ప్రవేశ్య = ప్రవేశపెట్టి, సురేన్ద్రౌ = దేవతా ప్రభువులైన, విష్ణువాసవావివ = విష్ణువు దేవేంద్రుడూ వలె, వనమ్ = వనమును గూర్చి, జగ్మతుః = వెళ్ళిరి.

తా. ఆ రామలక్ష్మణులు జటాయువుకు జలతర్పణములు చేసి, అతని మాటపై దృఢమైన నమ్మకముతో సీతను వెదకవలె నని నిశ్చయించుకొని దేవతల ప్రభువు పైన విష్ణువు, ఇంద్రుడువలె అడవిలోనికి వెళ్ళిరి. 38

''బాలానందిని''అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఆరణ్యకాండలో అరువదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనసప్తతితమః సర్గః

[*లక్ష్మణుడు అయోముఖిని శిక్షించుట, కబంధుని బాహువులలో చిక్కుకున్న రామలక్ష్మణులు చింతించుట*].

మూ. కృత్వైవముదకం తస్మై ప్రస్థితౌ రామలక్ష్మణౌ,
అవీక్షన్తౌ వనే సీతాం పశ్చిమాం జగ్మతుర్దిశమ్. 1

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, తస్మై = ఆ జటాయువునకు, ఉదకం కృత్వా = తర్పణములు ఇచ్చి, ప్రస్థితౌ = ప్రయాణమైనవారై, పశ్చిమామ్ = పశ్చిమమైన, దిశమ్ = దిక్కును గూర్చి, వనే=వనమునందు, సీతామ్ = సీతను, అవేక్షమాణౌ = వెదకుచున్నవారై, జగ్మతుః=వెళ్ళిరి.

తా. రామలక్ష్మణులు ఈ విధముగా జటాయువునకు ఉదకక్రియలు చేసి, సీతను వెదకుచు, పశ్చిమముదిక్కు వైపునకు వెళ్ళిరి. 1

మూ. తౌ దిశం దక్షిణాం గత్వా శరచాపాసిధారిణౌ,
అవిప్రహతమైక్ష్వాకూ పన్థానం ప్రతిపేదతుః. 2

ప్ర. అ. శరచాపాసిధారిణౌ = బాణములను, ధనస్సులను, ఖడ్గములను ధరించిన, తౌ = ఆ, ఐక్ష్వాకౌ = రామలక్ష్మణులు, తామ్ = ఆ, దక్షిణామ్=దక్షిణపు, దిశమ్ = దిక్కును గూర్చి, గత్వా = వెళ్ళి, అవిప్రహతమ్ = నలగగొట్టబడని(జను లెవ్వరూ సంచరించని), పన్థానమ్ = మార్గమును, ప్రతిపేదతుః = పొందిరి.

తా. ఆ రామలక్ష్మణులు బాణములను, ధనస్సులను, ఖడ్గములను ధరించి, దక్షిణదిక్కు వైపు వెళ్ళి, అక్కడ ఎవ్వరూ సంచరించని మార్గమును పొందిరి .2

మూ. గుల్మైర్వృక్షైశ్చ బహుభిర్లతాభిశ్చ ప్రవేష్టితమ్,
ఆవృతం సర్వతో దుర్గం గహనం ఘోరదర్శనమ్. 3

ప్ర. అ. బహుభిః = అనేకమైన, గుల్మైః = పొదలచేతను, వృక్షైశ్చ = వృక్షములచేతను, లతాభిశ్చ = లతలచేతను, ప్రవేష్టితమ్ = చుట్టబడినది, సర్వతః = అన్ని వైపులా, అవృతమ్ = కప్పబడినది, దుర్గమ్ = నడవ శక్యము కానిది, గహనమ్ = ప్రవేశింప శక్యము కానిది, ఘోరదర్శనమ్ = భయంకరమైన దర్శనము కలది అయిన (మార్గమును చేరిరి).

తా. ఆ మార్గమునందు అడుగడుగునా అనేకమైన పొదలు, వృక్షములు, లతలు ఉండెను. అన్ని మూలలా కప్పబడి యుండుట చేత ప్రవేశించుటకు గాని, నడచుటకు గాని కష్టమై చూచుటకు భయంకరముగా ఉండెను. 3

మూ. వ్యతిక్రమ్య తు వేగేన వ్యాళసింహనిషేవితమ్,
సుభీమం తన్మహారణ్యం వ్యతియాతౌ మహాబలౌ. 4

ప్ర. అ. మహాబలౌ = గొప్ప బలము గల ఆ రామలక్ష్మణులు, వ్యాళసింహనిషేవితమ్ = దుష్టగజములచేతను, సింహములచేతను సేవించబడిన, సుభీమమ్ = చాల భయంకరమైన, తత్ = ఆ, మహారణ్యమ్ = మహారణ్యమును, వేగేన = వేగముతో, వ్యతిక్రమ్య = దాటి, వ్యతియాతౌ = వెళ్ళిరి.

తా. మహాబలశాలులైన ఆ రామలక్ష్మణులు దుష్టగజములకు, సింహములకు నివాసస్థానమైన, భయంకరముగా ఉన్న ఆమహావనమును వేగముగా దాటి వెళ్ళిరి.

4

మూ. తతః పరం జనస్థానాత్త్రిక్రోశం గమ్య రాఘవౌ,
క్రౌఞ్చారణ్యం వివిశతుర్గహనం తౌ మహౌజసౌ. 5

ప్ర. అ. తతః పరమ్ = అటు పిమ్మట, మహౌజసౌ = గొప్ప తేజస్సు గల, తౌ = ఆ, రాఘవౌ = రామలక్ష్మణులు, జనస్థానాత్ = జనస్థానమునుండి, త్రిక్రోశమ్ = మూడు క్రోశముల దూరము, గమ్య = వెళ్ళి, గహనమ్ = ప్రవేశించ శక్యము కాని, క్రౌఞ్చారణ్యమ్ = క్రౌంచారణ్యమును, వివిశతుః = ప్రవేశించిరి.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల ఆ రామలక్ష్మణులు జనస్థానమునుండి మూడు కోసుల దూరము వెళ్ళి, ప్రవేశింప శక్యము కాని క్రౌంచారణ్యములో ప్రవేశించిరి.

5

మూ. నానామేఘఘనప్రఖ్యం ప్రహృష్టమివ సర్వతః,
నానాపక్షిగణైర్యుక్తం నానావ్యాళమృగైర్యుతమ్,

దిదృక్షమాణౌ వైదేహీం తద్వనం తౌ విచిక్యతుః,
తత్ర తత్రావతిష్ఠన్తౌ సీతాహరణకర్శితౌ. 6,7

ప్ర. అ. సీతాహరణకర్శితౌ = సీతాహరణము చేత కృశింపచేయబడిన, తౌ = ఆ రామలక్ష్మణులు, వైదేహీమ్ = సీతను, దిదృక్షమాణౌ = చూడ దలచుచున్నవారై, తత్ర తత్ర = అక్కడక్కడ, అవతిష్ఠన్తౌ = నిలచుచున్న వారై, నానామేఘఘనప్రఖ్యమ్ = అనేక మేఘముల గుంపుతో సమానము, సర్వతః = అంతటా, ప్రహృష్టమివ = సంతోషించుచున్నది వలె ఉన్నది, నానాపక్షిగణైః = అనేకవిధములైన పక్షుల సముదాయములతో, యుక్తమ్ = కూడినది. నానావ్యాళమృగైః = అనేకవిధములైన సర్పములతోను, మృగములతోను, యుతమ్ = కూడినది అయిన, తత్ = ఆ, వనమ్ = వనమును, విచిక్యతుః = వెదకిరి.

తా. సీత అపహరించబడుటచే కృశించిన ఆ రామలక్ష్మణులు, సీతను చూడవలెనను కోరికతో, మధ్య మధ్య ఆగుచు, ఆ వనమునంతా గాలించి వెదకిరి. ఆ వనము మేఘాల గుంపు వలె ఉండెను. పుష్పవృక్షాదులతో నిండి ఉండుటచే సంతోషించుచున్నట్లు ఉండెను. దానిలో అనేకవిధములైన పక్షిగణములు, అనేక విధములైన సర్పములు, మృగములు నివసించుచుండెను. 6,7

మూ. తతః పూర్వేణ తౌ గత్వా త్రిక్రోశం భ్రాతరౌ తదా,
క్రౌఞ్చారణ్యమతిక్రమ్య మతఙ్గాశ్రమమన్తరా. 8

దృష్ట్వా తు తద్వనం ఘోరం బహుభీమమృగద్విజమ్,
నానాసత్త్వసమాకీర్ణం సర్వం గహనపాదపమ్. 9

దదృశాతే గిరౌ తత్ర దరీం దశరథాత్మజౌ,
పాతాళసమగమ్భీరాం తమసా నిత్యసంవృతామ్. 10

ప్ర. అ. తదా = అప్పుడు, భ్రాతరౌ = సోదరులైన, తౌ దశరథాత్మజౌ =

ఆ రామలక్ష్మణులు, తతః = అక్కడినుండి, పూర్వేణ = తూర్పుగా, త్రిక్రోశమ్ = మూడు క్రోశముల దూరము, గత్వా = వెళ్ళి, క్రౌఞ్చారణ్యమ్ = క్రౌంచారణ్యమును, అతిక్రమ్య = దాటి, మతఙ్గాశ్రమమ్ అన్తరా = మతంగాశ్రమమునకు మధ్య, ఘోరమ్ = భయంకరము, బహుభీమమృగద్విజమ్ = అనేకములైన భయంకరములైన మృగములు, పక్షులు గలది, నానాసత్త్వసమాకీర్ణమ్ = అనేకవిధములైన మృగములతో వ్యాప్తము, గహనపాదపమ్ = ప్రవేశింప శక్యము కాని వృక్షములు కలది అయిన, సర్వమ్ = సమస్తమైన, తత్ = ఆ, వనమ్ = వనమును, దృష్ట్వా = చూచి, తత్ర = అక్కడ, గిరౌ = పర్వతమునందు, పాతాళసమగమ్భీరామ్ = పాతాళమువలె లోతైనది, తమసా = చీకటితో, నిత్యసంవృతామ్ = నిత్యము కప్పబడినదీ అయిన, దరీమ్ = గుహను, దదృశాతే = చూచిరి.

తా. అప్పుడు సోదరులైన ఆ రామలక్ష్మణులు అక్కడినుండి తూర్పుగా మూడు కోసుల దూరము వెళ్ళి. క్రౌంచారణ్యము దాటి, దానికి మతంగాశ్రమానికీ మధ్య భయంకరమైన ఒక మహారణ్యమును చూచిరి. అది అనేక క్రూరజంతువులకు, పక్షులకు నివాసమై యుండెను. అంతటా క్రూరమృగములు సంచరించుచుండెను. చెట్లు చాల దగ్గరదగ్గరగా ఉండుటచే ప్రవేశించుటకు శక్యము కాకుండా ఉండెను. ఆ వనములోని ఒక పర్వతమునందు వారికి పాతాళము వలె లోతైన ఒక గుహ కనబడెను. అది నిత్యము చీకటితో నిండి ఉండెను. 8,9,10

మూ. ఆసాద్య తౌ నరవ్యాఘ్రౌ దర్యాస్తస్యావిదూరతః,
దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననామ్. 11

ప్ర. అ. తౌ = ఆ, నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠులు, ఆసాద్య = సమీపించి, తస్యాః = ఆ, దర్యాః = గుహయొక్క, విదూరతః = సమీపమునందు, మహారూపామ్ = పెద్ద ఆకారము గల, వికృతాననామ్ = వికృతమైన ముఖము గల, రాక్షసీమ్ = రాక్షసస్త్రీని, దదృశాతే = చూచిరి.

తా. నరులలో శ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు ఆ గుహను సమీపించి, దాని దగ్గర పెద్ద ఆకారము, వికృతమైన ముఖము గల ఒక రాక్షసస్త్రీని చూచిరి.

మూ. భయదామల్పసత్త్వానాం బీభత్సాం రౌద్రదర్శనామ్,
లమ్బోదరీం తీక్ష్ణదంష్ట్రాం కరాళీం పరుషత్వచమ్, 12

భక్షయ న్తీం మృగాన్ భీమాన్ వికటాం ముక్తమూర్ధజామ్
ప్రైక్షేతాం తౌ తతస్తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ. 13

ప్ర. అ. తతః = పిమ్మట, భ్రాతరౌ = సోదరులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, అల్పసత్త్వానామ్ = అల్పబలము గలవారికి, భయదామ్ = భయమును కలిగించేదీ, బీభత్సామ్ = అసహ్యముగా ఉన్నది, రౌద్రదర్శనామ్ = భయంకరమైన దర్శనము కలది, లమ్బోదరీమ్ = వ్రేలాడుచున్న ఉదరము కలది, తీక్ష్ణదంష్ట్రీమ్ = తీక్ష్ణములైన కోరలు గలది, కరాళీమ్ = ఎత్తుపల్లములు గలది, పరుషత్వచమ్ = పరుషమైన చర్మం గలది, భీమాన్ = భయంకరములైన, మృగాన్ = మృగములను, భక్షయన్తీమ్ = భక్షించుచున్నది, వికటామ్ = వికృతాకారము గలది, ముక్తమూర్ధజామ్ = విడువబడిన కేశములు కలదీ అయిన ఆ రాక్షసిని, తత్ర = అక్కడ, ప్రైక్షేతామ్ = చూచిరి.

తా. ఆ రాక్షసి దుర్బలులకు భయమును కలిగించేదిగా ఉండెను. అస్యహ్యమును కలిగించే రూపముతో చూచుటకు క్రూరముగా ఉండెను. వ్రేలాడుచున్న పొట్ట, తీక్ష్ణములైన కోరలు, ఎత్తు పల్లములతో కూడిన అవయవాలు, పరుషమైన చర్మ, విరబోసిన జుట్టు, వీటితో ఆమె ఆకారము చాల వికృతముగా ఉండెను. అట్టి ఆ రాక్షసి, అక్కడ, సోదరులైన రామలక్ష్మణులకు కనబడెను.

మూ. సా సమాసాద్య తౌ వీరౌ వ్రజన్తం భ్రాతురగ్రతః,
ఏహి రంస్యావహేత్యుక్త్వా సమాలమ్బత లక్ష్మణమ్. 14

ప్ర. అ. సా = ఆ రాక్షసి, వీరౌ = వీరులైన, తౌ = రామలక్ష్మణులను, సమాసాద్య = సమీపించి, ఏహి = రమ్ము; రంస్యావహే = రమించెదము, ఇతి = అని, ఉక్త్వా = పలికి భ్రాతుః = అన్నగారియొక్క, అగ్రతః = ఎదుట, వ్రజన్తమ్ = వెళ్ళుచున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, సమాలమ్బత = పట్టుకొనెను.

తా. ఆ రాక్షసి వీరులైన ఆ రామలక్ష్మణులను సమీపించి, అన్నగారి ముందు నడచుచున్న లక్ష్మణునితో-''రమ్ము; రమించెదము'' అని పలుకుచు అతనిని పట్టుకొనెను. 14

మూ. ఉవాచ చైనం వచనం సౌమిత్రిముపగూహ్య సా,
అహం త్వయోముఖీ నామ లబ్ధా తే త్వమసి ప్రియః,

నాథ పర్వతకూటేషు నదీనాం పులినేషు చ,
ఆయుఃశేషమిమం వీర త్వం మయా సహ రంస్యసే. 16

ప్ర. అ. సా = ఆమె, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి, ఉపగూహ్య=కౌగలించుకొని, ఏనమ్ = ఇతనిని గూర్చి, వచనమ్ = వచనమును, ఉవాచ చ = పలికెను. అహం తు = నేను, అయోముఖీ నామ = అయోముఖి అను పేరు గలదానను. తే = నీకు, లబ్ధా = పొందబడితిని; త్వమ్ = నీవు, ప్రియః = ప్రియుడవు, అసి = అయి ఉన్నావు. వీర = ఓ! వీరుడా! నాథ = నాథా! ఇమమ్ = ఈ, ఆయుఃశేషమ్ = ఆయుర్దాయశేషమును, త్వమ్ = నీవు, మయా సహ = నాతో కూడ, పర్వతకూటేషు = పర్వతశిఖరముల పైనా, నదీనామ్ = నదుల యొక్క, పులినేషు చ = ఇసుకతిన్నెలయందు, రంస్యసే = క్రీడించగలవు.

తా. ఆమె లక్ష్మణుణ్ణి కౌగలించుకొని, ఆతనితో ఇట్లు పలికెను. "నా పేరు అయోముఖి, నేను నీకు లభించినాను. నీవు నా ప్రియుడవు, వీరుడా! నాథా! ఇంక నీ మిగిలిన ఆయుర్దాయకాల మంతా నాతో కలిసి పర్వతశిఖరములమీదా నదుల ఇసుక తిన్నెల మీదా క్రీడించుము." 15, 16

మూ. ఏవముక్తస్తు కుపితః ఖడ్గముద్ధృత్య లక్ష్మణః,
కర్ణనాసాస్తనం తస్యా నిచకర్తారిసూదనః. 17

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, అరిసూదనః = శత్రువులను నశింపచేయువాడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, కుపితః = కోపించినవాడై, ఖడ్గమ్ = ఖడ్గమును, ఉద్ధృత్య = ఎత్తి, తస్యాః = ఆమెయొక్క, కర్ణనాసాస్తనమ్ = చెవులను, ముక్కును, స్తనములను, చకర్త = ఛేదించెను.

తా. శత్రుసంహారకుడైన లక్ష్మణుడు ఆమె మాటలు విని, కోపముతో ఖడ్గమును తీసి ఆమె ముక్కు, చెవులు, స్తనములు ఖండించెను. 17

మూ. కర్ణనాసే నికృత్తే తు విస్వరం సా వినద్య చ,
యథాగతం ప్రదుద్రావ రాక్షసీ భీమదర్శనా. 18

ప్ర. అ. భీమదర్శనా = భయంకరమైన దర్శనము గల, సా రాక్షసీ = ఆ రాక్షసస్త్రీ, కర్ణనాసే = చెవులు ముక్కు, నికృత్తే = ఛేదించబడగా, విస్వరమ్ =

విపరీతస్వరము కలుగునట్లుగా, వినద్య = అరచి, యథాగతమ్=వచ్చిన విధము గానే, ప్రదుద్రావ = పరుగెత్తెను.

తా. చూచుటకు భయంకరముగా ఉండు ఆ రాక్షసి ముక్కు, చెవులు, ఛేదింపబడగా, వికృతస్వరముతో ఏడ్చుచు వచ్చిన మార్గముననే పారిపోయెను.

వి. ఈ అయోముఖీవృత్తాంతము ప్రాచ్యపాఠములో లేదు. 18

మూ. తస్యాం గతాయాం గహనం వ్రజన్తౌ వనమోజసా,
ఆసేదతురమిత్రఘ్నౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 19

ప్ర. అ. తస్యామ్=ఆమె, గతాయామ్=వెళ్ళిన దగుచుండగా, వ్రజన్తౌ= నడచుచున్న, భ్రాతరౌ = సోదరులైన, అమిత్రఘ్నౌ = శత్రుసంహారకులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఓజసా = తేజస్సుతో, గహనమ్ = ప్రవేశింప శక్యము కాని, వనమ్ = వనమును, ఆసేదతుః = సమీపించిరి.

తా. ఆ రాక్షసి వెళ్ళిపోయినతరువాత, శత్రుసంహారకులైన సోదరులైన రామలక్ష్మణులు, తేజస్సుతో, ప్రవేశింప శక్యము కాని ఆ వనములోనికి ప్రవేశించిరి. 19

మూ. లక్ష్మణస్తు మహాతేజాః సత్త్వవాన్ శీలవాన్ శుచిః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం భ్రాతరం దీప్తతేజసమ్. 20

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు, సత్త్వవాన్ = బలవంతుడు, శీలవాన్ = మంచి శీలముకలవాడు, శుచిః = పవిత్రుడు అయిన, లక్ష్మణస్తు = లక్ష్మణుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, దీప్తతేజసమ్=ప్రకాశించుచున్న తేజస్సు గల, భ్రాతరమ్=సోదరుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజఃశాలి, బలవంతుడు, ఉత్తమశీలము కలవాడు, పవిత్రుడు అయిన లక్ష్మణుడు అంజలి ఘటించి, తేజస్సుతో ప్రజ్వలించుచున్న అన్నగారితో ఇట్లు పలికెను. 20

మూ. స్పన్దతే చ దృఢం బాహురుద్విగ్నమివ మే మనః,
ప్రాయశశ్చాప్యనిష్టాని నిమిత్తాన్యుపలక్షయే. 21

ప్ర. అ. మే = నాయొక్క, బాహుః = బాహువు, దృఢమ్ = అధికముగా, స్పన్దతే = అదురుచున్నది. మనః = మనస్సు, ఉద్విగ్నమివ = దిగులు చెంది నట్లు ఉన్నది. ప్రాయశః = ఎక్కువగా, అనిష్టాని = అనిష్టమును కలిగించు, నిమిత్తాని = శకునములను, ఉపలక్షయే = చూచుచున్నాను.

తా. నా బాహువు ఎక్కువగా అదరుచున్నది. మనస్సు దిగులు చెందు చున్నట్లున్నది. ఎక్కువగా అనిష్టసూచకములైన అపశకునములు కనబడు చున్నవి. 21

మూ. తస్మాత్సజ్జీభవార్య త్వం కురుష్వ వచనం హితమ్,
మమేవ హి నిమిత్తాని సద్యః శంసన్తి సంభ్రమమ్. 22

ప్ర. అ. ఆర్య = పూజ్యుడా ! తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, సజ్జీభవ = సన్నద్ధుడవు కమ్ము. హితమ్ = హితమైన, వచనమ్ = నా మాటను, కురుష్వ = చేయుము. నిమిత్తాని = దుఃశకునములు, సద్యః = వెంటనే రానున్న, సంభ్రమమ్ = భయమును గూర్చి, మమ = నాకు, శంసన్తీవ హి = చెప్పుచున్నట్లున్నవి.

తా. పూజ్యుడవైన రామా ! అందుచే రాబోవు ఆపదను ఎదుర్కొనుటకు సిద్ధముగా ఉండుము. నేను చెప్పిన హితవాక్యమును వినుము. మన కేదో ఆపద వెంటనే రానున్నట్లు ఈ దుఃశకునములు నాకు చెప్పుచున్నట్లున్నవి. 22

మూ. ఏష వఞ్చులకో నామ పక్షీ పరమదారుణః,
ఆవయోర్విజయం యుద్ధే శంసన్నివ వినర్దతి. 23

ప్ర. అ. పరమదారుణః = మిక్కిలి భయంకరమైన, వఞ్జులకో నామ = వంచులక మను పేరు గల, ఏషః పక్షీ = ఈ పక్షి. యుద్ధే = యుద్ధమునందు, ఆవయోః = మన ఇద్దరికి, విజయమ్ = జయమును, శంసన్నివ = చెప్పుచున్నదా అన్నట్లు, వినర్దతి = ధ్వని చేయుచున్నది.

తా. చాల భయంకరమైన వంచులక మనే ఈ పక్షి కూతను పట్టి యుద్ధములో మనకు జయము రానున్నట్లు తోచుచున్నది. 23

మూ. తయోరన్వేషతోరేవం సర్వం తద్వనమోజసా,
సంజజ్ఞే విపులః శబ్దో ప్రభఞ్జన్నివ తద్వనమ్. 24

ప్ర. అ. తయోః = ఆ రామలక్ష్మణులు, ఏవమ్ = ఇట్లు, ఓజసా = పరాక్రమముతో, సర్వమ్ = సమస్తమైన, తత్ వనమ్ = ఆ వనమును, అన్వేషతోః = వెదకుచుండగా, తత్ వనమ్ = ఆ వనమును, ప్రభఞ్జన్నివ = విరచుచున్నది వలె, విపులః = అధికమైన, శబ్దః = శబ్దము, సంజజ్ఞే = కలిగెను.

తా. ఆ రామలక్ష్మణులు ఈ విధముగా తమ తేజస్సుతో ఆ వనము నంతా వెదకుచుండగా, ఆ వనమును విరచివేయుచున్నట్లు ఒక మహాశబ్దము వెలువడెను.

మూ. సంవేష్టితమివాత్యర్థం గగనం మాతరిశ్వనా,
వనస్య తస్య శబ్దోఽభూద్దివమాపూరయన్నివ. 25

ప్ర. అ. గగనమ్ = ఆకాశము, అత్యర్థమ్ = మిక్కిలి, మాతరిశ్వనా = వాయువుచేత, సంవేష్టితమివ = చుట్టబడినట్లుండెను. తస్య = ఆ, వనస్య = వనము యొక్క, శబ్దః = శబ్దము, దివమ్ = ఆకాశమును, ఆపూరయన్నివ = నింపుచున్నది వలె, అభూత్ = ఆయెను.

తా. ఆకాశము నంతా గాలి చుట్టబెట్టినట్లు అయ్యెను. ఆ వనము ధ్వని ఆకాశమును నింపుచున్నట్లుండెను. 25

మూ. తం శబ్దం కాఙ్క్షమాణస్తు రామః కక్షే సహానుజః,
దదర్శ సుమహాకాయం రాక్షసం విపులోదరమ్. 26

ప్ర. అ. తం శబ్దమ్ = ఆ శబ్దమును, కాఙ్క్షమాణః = కోరుచున్నవాడై, సహానుజః = తమ్మునితో కూడిన, రామః = రాముడు, కక్షే = పొదయందు, సుమహాకాయమ్ = చాల పెద్ద శరీరము కల, విపులోదరమ్ = విశాలమైన ఉదరము గల, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, దదర్శ = చూచెను.

తా. ఆ శబ్దము ఎట్లు వచ్చినదో తెలియ గోరిన, లక్ష్మణసమేతుడైన రాముడు ఇటు అటు చూచి, ఒక పొదలో పెద్ద శరీరము విశాలమైన ఉదరము గల ఒక రాక్షసుణ్ణి చూచెను. 26

మూ. ఆసేదతుస్తతస్తత్ర తావుభౌ ప్రముఖే స్థితమ్,
వివృద్ధమశిరోగ్రీవం కబన్ధముదరే ముఖమ్. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తౌ ఉభౌ = వారిద్దరూ, తత్ర = అక్కడ, ప్రముఖే = తమఎదుట, స్థితమ్ = ఉన్నవాడు, వివృద్ధమ్ = చాలా పెరిగినవాడు, అశిరోగ్రీవమ్ = శిరస్సు కంఠము లేనివాడు, ఉదరే ముఖమ్ = ఉదరమునందు ముఖము గలవాడు అయిన, కబన్ధమ్ = కబంధుణ్ణి, ఆసేదతుః = సమీపించిరి.

తా. అంతలో ఆ రామలక్ష్మణులు అక్కడ తమ ఎదుటనే ఉన్న కబంధుణ్ణి సమీపించిరి. ఆతని చాల పెద్దగా పెరిగిన దేహమునందు శిరస్సు కాని, కంఠము కాని లేకుండెను. ఆతని ముఖము పొట్టలో ఉండెను. 27

మూ. రోమభిర్నిచితైస్తీక్ష్ణైర్మహాగిరిమివోచ్ఛ్రితమ్,
నీలమేఘనిభం రౌద్రం మేఘస్తనితనిస్వనమ్. 28

ప్ర. అ. నిచితైః = దట్టముగా ఉన్న, తీక్ష్ణైః = తీక్ష్ణములైన, రోమభిః = రోమములతో, ఉచ్ఛ్రితమ్ = ఉన్నతమైన, మహాగిరిమివ = మహాపర్వతము వలె ఉన్నవాడు, నీలమేఘనిభమ్ = నీలమేఘముతో సమానుడు, రౌద్రమ్ = భయంకరుడు, మేఘస్తనితనిస్వనమ్ = ఉరుమువంటి ధ్వని కలవాడు అయిన (కబంధుని సమీపించిరి).

తా. ఆ రాక్షసుడు మొనలు దేరిన దట్టమైన రోమాలతో ఎత్తైన పర్వతము వలె ఉండెను. నల్లటి మేఘము వలె భయంకరుడైన ఆ రాక్షసుని ధ్వని ఉరుము వలె ఉండెను. 28

మూ. అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా,
మహాపక్ష్మేణ పిఙ్గేన విపులేనాయతేన చ. 29

ఏకేనోరసి ఘోరేణ నయనే నాశుదర్శినా,
మహాదంష్ట్రోపపన్నం తం లేలిహానం మహాముఖమ్. 30

ప్ర. అ అగ్నిజ్వాలానికాశేన = అగ్నిజ్వాలతో సమానము, లలాటస్థేన = లలాటమునందున్నది, దీప్యతా = ప్రకాశించుచున్నది, మహాపక్ష్మేణ = పెద్ద రెప్పలు గలది, పిఙ్గేన = పచ్చగా ఉన్నది, విపులేన = విశాలమైనది, ఆయతేన చ = పొడవైనది

ఆశుదర్శినా=శీఘ్రముగా చూచునది, ఘోరేణ=భయంకరమైనది అయిన, ఉరసి =వక్షస్థలమునందున్న, ఏకేన=ఒక, నయనేన=నేత్రముతో కూడినవాడు, మహాదంష్ట్రోపపన్నమ్ = పెద్దకోరలతో కూడినవాడు, లేలిహానమ్ = (నాలుకతో పెదవులు) నాకుచున్నవాడు, మహాముఖమ్ = పెద్ద ముఖముగలవాడు అయిన, తమ్ = ఆ రాక్షసుని (సమీపించిరి).

తా. ఆ రాక్షసుని శిరస్సు పొట్టలో ఉండుటచే ఆతని వక్షఃస్థలము మీద నున్న లలాటమునందు అతివిశాలము, దీర్ఘము అయిన నేత్రముండెను. అది అగ్ని జ్వాల వలె మండుచుండెను. పచ్చని గ్రుడ్డు గల ఆ నేత్రముమీద పెద్ద రెప్పలుండెను. భయంకరమైన ఆ నేత్రముతో అతడు ఎంత దూరమైనా శీఘ్రముగా చూడగలిగి ఉండెను. పెద్ద నోరు, దీర్ఘములైన కోరలు గల అతడు మాటి మాటికి నాలుకతో పెదవులు నాకుచుండెను. 29,30

మూ. భక్షయన్తం మహాఘోరానృక్షసింహమృగద్విపాన్,
ఘోరౌ భుజౌ వికుర్వాణముభౌ యోజనమాయతౌ. 31

ప్ర. అ. మహాఘోరాన్=చాల భయంకరములైన, ఋక్షసింహమృగద్విపాన్ = ఎలుగుబంట్లను, సింహములను, మృగములను, ఏనుగులను, భక్షయన్తమ్ = భక్షించుచున్నవాడు, యోజనమ్ = యోజనదూరము, ఆయతౌ = పొడవైన, ఘోరౌ = భయంకరములైన, ఉభౌ=రెండు, భుజౌ = భుజములను, వికుర్వాణమ్ = కదుపుచున్నవాడు (అయిన రాక్షసుని సమీపించిరి).

తా. అతడు అతిభయంకరములైన ఎలుగుబంట్లను, సింహములను, మృగములను, ఏనుగులను భక్షించుచుండెను. ఆమడ పొడవైన భయంకరములైన రెండు భుజాలను కదుపుచుండెను. 31

మూ. కరాభ్యాం వివిధాన్ గృహ్య ఋక్షాన్ పక్షిగణాన్ మృగాన్,
ఆకర్షన్తం వికర్షన్తమనేకాన్ మృగయూథపాన్. 32
స్థితమావృత్య పన్థానం తయోర్భ్రాత్రోః ప్రపన్నయోః.

ప్ర. అ. ఋక్షాన్ = ఎలుగుబంట్లను, వివిధాన్ = అనేకవిధములైన, పక్షిగణాన్ = పక్షిసముదాయములను, మృగాన్=మృగములను, అనేకాన్=అనేకము

లైన, మృగయూథపాన్ = మృగముల గుంపులలో శ్రేష్ఠమైనవాటిని, కరాభ్యామ్ = హస్తములతో, గృహ్య = పట్టుకొని, ఆకర్షన్తమ్ = తన వైపు లాగుచున్నవాడు, వికర్షన్తమ్ = ఈడ్చుచున్నవాడు, ప్రపన్నయోః = సమీపించిన, తయోః = ఆ, భ్రాత్రోః = సోదరులయొక్క (తమయొక్క), పన్థానమ్ = మార్గమును, ఆవృత్య = ఆవరించి, స్థితమ్ = ఉన్నవాడుఅయిన (ఆ రాక్షసుని సమీపించిరి).

తా. ఆ రాక్షసుడు అనేకవిధములైన పక్షిసమూహములను, మృగములను, ఎలుగుబంట్లను, అనేకమృగశ్రేష్ఠములను తన చేతులతో పట్టి ఈడ్చుచు తన వైపు లాగుచుండెను. దగ్గరకు వచ్చిన ఆ రామలక్ష్మణుల మార్గమును ఆవరించి ఉండెను.

32

మూ. అథ తౌ సమభిక్రమ్య క్రోశమాత్రే దదర్శతుః, 33
మహాన్తం దారుణం భీమం కబన్ధం భుజసంవృతమ్,
కబన్ధమివ సంస్థానాదతిఘోరప్రదర్శనమ్. 34

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తౌ = ఆ రామలక్ష్మణులు, సమభిక్రమ్య = నడచి వెళ్ళి, క్రోశమాత్రే = కోసు దూరమునందు, మహాన్తమ్ = చాల పెద్ద ఆకారము గలవాడు, దారుణమ్ = క్రూరుడు, భీమమ్ = భయంకరుడు, భుజసంవృతమ్ = భుజములచేత కప్పబడినవాడు, సంస్థానాత్ = శరీరాకారము వలన, కబన్ధమివ = మొండెము వలె ఉన్నవాడు, ఘోరప్రదర్శనమ్ = భయంకరమైన దర్శనము కలవాడు అయిన, కబన్ధమ్ = కబంధుణ్ణి, దదర్శతుః = చూచిరి.

తా. ఆ రామలక్ష్మణులు ముందుకు నడచి వెళ్ళి కోసుదూరములో చాల పెద్ద శరీరము గలవాడు, భయంకరుడు, క్రూరుడు అయిన కబందుని చూచిరి. అతడు భుజములచేత కప్పబడియుండెను. ఆతని శరీరము మొండెము వలె ఉండెను. అతడు చూచుటకు చాల భయంకరుడుగా ఉండెను.

వి. వెనుక "రాముడు తన ఎదుటనే ఒక పొదలో కబంధుని చూచెను" అని చెప్పబడినది. ఇక్కడ రామలక్ష్మణులు ముందుకు నడచి వెళ్ళిన పిమ్మట కబంధుణ్ణి చూచినట్లుగా చెప్పబడుచున్నది. ప్రాచ్యపాఠములో ఇట్లు కాక-రామలక్ష్మణులు కబంధుణ్ణి చూచిరి అని చెప్పి రెండు క్రోసుల దూరమునుంచే అతడు వారిద్దరినీ లాగుచుండెను అని చెప్పబడినది.

34

మూ. స మహాబాహురత్యర్థం ప్రసార్య విపులౌ భుజౌ,
జగ్రాహ సహితావేవ రాఘవౌ పీడయన్ బలాత్. 35

ప్ర. అ. మహాబాహుః = పెద్ద బాహువులు గల, సః = ఆ కబంధుడు, విపులౌ = పెద్దవైన, భుజౌ = భుజములను, అత్యర్థమ్ = మిక్కిలి, ప్రసార్య = చాపి, సహితావేవ = కలిసి యుండగానే, రాఘవౌ = రామలక్ష్మణులను, బలాత్ = బలమువలన, పీడయన్ = పీడించుచు, జగ్రాహ = పట్టుకొనెను.

తా. పెద్ద చేతులు గల ఆ రాక్షసుడు అతిదీర్ఘములైన తన చేతులు చాలదూరము చాపి, రామలక్ష్మణుల నిద్దరినీ బలముచేత పీడించుచు కలిపియే పట్టుకొనెను.

మూ. ఖడ్గినౌ దృఢధన్వానౌ తిగ్మతేజోవపుర్ధరౌ,
భ్రాతరౌ వివశం ప్రాప్తౌ కృష్యమాణౌ మహాబలౌ. 36

ప్ర. అ. ఖడ్గినౌ = ఖడ్గములు కలవారు, దృఢధన్వానౌ = దృఢమైన ధనస్సులు కలవారు, తిగ్మతేజోవపుర్ధరౌ = తీవ్రమైన తేజస్సు గల శరీరములను ధరించినవాడు, మహాబలౌ = గొప్ప బలము గలవారు అయిన, భ్రాతరౌ = ఆ సోదరు లిద్దరూ, కృష్యమాణౌ = లాగబడుచున్నవారై, వివశమ్ = తమ వశము లేక, ప్రాప్తౌ = అతనిని సమీపించిరి.

తా. ఖడ్గములను, దృఢములైన ధనస్సులను ధరించి తీవ్రమైన తేజస్సుతో ప్రకాశించుచున్న బలశాలులైన ఆ రామలక్ష్మణులు ఆ రాక్షసునిచే లాగబడినవారై, ఆతనికి లొంగిపోయి, ఆతని దగ్గర చేరిరి. 36

మూ. తత్ర ధైర్యేణ శూరస్తు రాఘవో నైవ వివ్యథే,
బాల్యాదనాశ్రయత్వాచ్చ లక్ష్మణస్త్వతివివ్యథే. 37
ఉవాచ స విషణ్ణః సన్ రాఘవం రాఘవానుజః.

ప్ర. అ. తత్ర = అప్పుడు, శూరః = శూరుడైన, రాఘవః = రాముడు, ధైర్యేణ = ధైర్యముచేత, నైవ వివ్యథే = వ్యథ చెందలేదు. లక్ష్మణస్తు = లక్ష్మణుడైతే, బాల్యాత్ = బాల్యమువలనను, అనాశ్రయత్వాచ్చ = ఆశ్రయము లేకపోవుట వలనను, అతివివ్యథే = చాల వ్యథ చెందెను. సః = ఆ, రాఘవానుజః = లక్ష్మణుడు,

విషణ్ణః సన్ = విషాదము చెందినవాడై, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. అప్పుడు శూరుడైన రాముడు ధైర్యవంతు డగుటచే వ్యథ చెంద లేదు. కాని లక్ష్మణుడు బాలు డగుటచేతను, రాముడు కూడ కష్టములో చిక్కు కొనుటచే మరొక ఆశ్రయ మేమీ లేకపోవుటచేతను చాల వ్యథ చెందెను. లక్ష్మణు డా విధముగ వ్యథ చెందినవాడై రామునితో ఇట్లు పలికెను.

వి. "అనాశ్రయత్వాచ్చ" అనేదాని అర్థం సంతృప్తికరంగా లేదు. 37

మూ. పశ్య మాం వీర వివశం రాక్షసస్య వశం గతమ్, 38
మయైకేన వినిర్యుక్తః పరిముఞ్చస్వ రాఘవ.

ప్ర. అ. వీర = వీరుడా! వివశమ్ = వశము తప్పినవాడనై, రాక్షసస్య = రాక్షసునియొక్క, వశమ్ = వశమును, గతమ్ = పొందిన, మామ్ = నన్ను, పశ్య = చూడుము. రాఘవ = రామా! ఏకేన = ఒక్క, మయా = నాచేత, వినిర్యుక్తః = దూరమైన వాడవై, పరిముఞ్చస్వ = విడిపించుకొనుము.

తా. వీరుడా! నేను వివశుడనై రాక్షసునికి వశమై పోయినాను చూడుము. రామా! నన్ను ఒక్కనినీ వీనికి సమర్పించి నీవు విడిపించుకొనుము. 38

మూ. మాం హి భూతబలిం దత్వా పలాయస్వ యథాసుఖమ్,
అధిగన్తాసి వైదేహీమచిరేణేతి మే మతిః.

ప్ర. అ. మామ్ = నన్ను, భూతబలిమ్ = భూతమునకు బలిగా, దత్వా = ఇచ్చి, యథాసుఖమ్ = సుఖముగా, పలాయస్వ = పారిపొమ్ము. వైదేహీమ్ = సీతను, అచిరేణ = కొద్దికాలములో, అధిగన్తాసి = పొందగలవు, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = అభిప్రాయము.

తా. నన్ను ఈ భూతానికి బలిగా ఇచ్చి నీవు సుఖముగా పారిపొమ్ము. కొంచెము కాలములోనే నీవు సీతను పొందగల వని నా అభిప్రాయము. 39

మూ. ప్రతిలభ్య చ కాకుత్స్థ పితృపైతామహీం మహీమ్, 40
తత్ర మాం రామ రాజ్యస్థః స్మర్తుమర్హసి సర్వదా.

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు జనించిన, రామ = రామా ! పితృపైతామహీమ్ = తండ్రితాతలకు చెందిన, మహీమ్ = భూమిని, ప్రతిలభ్య చ = పొంది, తత్ర = అక్కడ, రాజ్యస్థః = రాజ్యమునం దున్నవాడవై, సర్వదా = ఎల్లప్పుడు, మామ్ = నన్ను, స్మర్తుమ్ = స్మరించుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. కకుత్స్థవంశమునందు జనించిన రామా ! తండ్రితాతలకు చెందిన భూమిని తిరిగి పొంది, రాజ్యమును పాలించుచు, నీవు అక్కడ నన్ను ఎల్లప్పుడు స్మరించుము.

మూ. లక్ష్మణేనైవముక్తస్తు రామః సౌమిత్రిమబ్రవీత్, 41
మా స్మ త్రాసం కృథా వీర న హి త్వాదృగ్విషీదతి.

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు ఉక్తః = పలకబడిన, రామః = రాముడు, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను, వీర = వీరుడా ! త్రాసమ్ = భయమును, మా స్మ కృథాః = చేయకుము. త్వాదృక్ = నీవంటివాడు, న విషీదతి హి = విషాదము చెందడు కదా !

తా. లక్ష్మణుని మాటలు విని రాముడు ఆతనితో ఇట్లనెను. "వీరుడా ! భయపడకుము. నీవంటివాడు విషాదము చెందడు కదా ?

వి. లక్ష్మణుడు ఈ విధముగ భయపడుట ఆతని స్వభావానికే విరుద్ధము. అందులోను రామునకు పారిపొమ్మని సలహా ఇచ్చుట ఎంత ఉచితమో ఊహించ వచ్చును. ఈ ఐదు శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. 41

మూ. ఏతస్మిన్నన్తరే క్రూరో భ్రాతరౌ రామలక్ష్మణౌ, 42
పప్రచ్ఛ ఘననిర్ఘోషః కబన్ధో దానవోత్తమః.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యలో, క్రూరః = క్రూరుడైన, దానవోత్తమః = దానవులలో ఉత్తముడైన, కబన్ధః = కబంధుడు, ఘననిర్ఘోషః = మేఘము వంటి ధ్వని కలవాడై, భ్రాతరౌ = సోదరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, పప్రచ్ఛ = అడిగెను.

తా. ఇంతలో క్రూరుడు, దానవులలో ఉత్తముడూ అయిన కబంధుడు మేఘధ్వని వంటి ధ్వనితో సోదరులైన ఆ రామలక్ష్మణులను ప్రశ్నించెను. 42

మూ. కౌ యువాం వృషభస్కన్ధౌ మహాఖడ్గధనుర్ధరౌ, 43
ఘోరం దేశమిమం ప్రాప్తౌ మమ భక్షావుపస్థితౌ.

ప్ర. అ. వృషభస్కన్ధౌ = ఎద్దు మూపు వంటి మూపు కలవారు. మహాఖడ్గధనుర్ధరౌ = గొప్పవైన ఖడ్గములను ధనస్సులను ధరించినవారు, ఘోరమ్ = భయంకరమైన, ఇమం దేశమ్ = ఈ దేశమును, ప్రాప్తౌ = వచ్చినవారు అయిన, యువామ్ = మీరిద్దరు, కౌ = ఎవరు ? మమ = నాయొక్క, భక్షౌ = ఆహారముగా, ఉపస్థితౌ = వచ్చినారు.

తా. ఎద్దు మూపు వంటి భుజములు కల మీరు ఎవరు? పెద్ద ఖడ్గములను ధనస్సులను ధరించి, భయంకరమైన ఈ ప్రదేశానికి వచ్చినారు ! నాకు ఆహారముగా వచ్చినారు. 43

మూ. వదతం కార్యమిహ వాం కిమర్థం చాగతౌ యువామ్, 44
ఇమం దేశమనుప్రాప్తౌ క్షుధార్తస్యేహ తిష్ఠతః.

ప్ర. అ. ఇహ = ఇక్కడ, వామ్ = మీకు, కార్యమ్ = పని యేమో, వదతమ్ = చెప్పండి. యువామ్ = మీరిద్దరూ, కిమర్థమ్ = ఎందుకు, ఆగతౌ = వచ్చినారు? క్షుధార్తస్య = ఆకలిచేత పీడితుడనై, ఇహ = ఇక్కడ, తిష్ఠతః = ఉన్న నాయొక్క, ఇమమ్ = ఈ, దేశమ్ = ప్రదేశమును గూర్చి, అనుప్రాప్తౌ = వచ్చినారు.

తా. ఇక్కడ మీకు ఏమి పనో చెప్పండి. మీరిద్దరూ ఎందుకు వచ్చినారు? నేను ఆకలితో బాధపడుచు ఉన్న ఈ నా ప్రదేశానికి వచ్చినారు ! 44

మూ. సబాణచాపఖడ్గౌ చ తీక్ష్ణశృఙ్గావివర్షభౌ, 45
మమాస్యమనుసంప్రాప్తౌ దుర్లభం జీవితం పునః.

ప్ర. అ. సబాణచాపఖడ్గౌ = బాణములతోను, ధనస్సులతోను, ఖడ్గములతోను కూడినవారై, తీక్ష్ణశృఙ్గౌ = తీక్ష్ణములైన కొమ్ములు గల, ఋషభౌ ఇవ = ఎద్దులు వలె ఉన్న మీరు, మమ = నాయొక్క, ఆస్యమ్ = ముఖమును, అనుసంప్రాప్తౌ = చేరినారు. పునః = మరల, జీవితమ్ = జీవితము, దుర్లభమ్ = దుర్లభమైనది.

తా. బాణములు, ధనస్సులు, ఖడ్గములు ధరించి తీక్ష్ణములైన కొమ్ములు గల వృషభముల వలె ఉన్న మీరిద్దరూ నా నోటివద్దకు వచ్చినారు. ఇంక మీకు జీవితము దుర్లభము. 45

మూ. తస్య తద్వచనం శ్రుత్వా కబన్ధస్య దురాత్మనః, 46
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా.

ప్ర. అ. దురాత్మనః = దురాత్ముడైన, తస్య కబన్ధస్య = ఆ కబంధుని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, రామః = రాముడు, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. దురాత్ముడైన ఆ కబంధుని మాటలు వినగానే రాముని ముఖము వాడిపోయెను. అతడు లక్ష్మణునితో ఇట్లనెను. 46

మూ. కృచ్ఛ్రాత్ కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమ,
వ్యసనం జీవితాన్తాయ ప్రాప్తమప్రాప్య తాం ప్రియామ్.

ప్ర. అ. సత్యవిక్రమ = సత్యమైన పరాక్రమము గలవాడా! కృచ్ఛ్రాత్ = ఒక కష్టమునుండి, కృచ్ఛ్రతరమ్ = ఎక్కువ కష్టమును, ప్రాప్య = పొంది, ప్రియామ్ = ప్రియురాలైన, తామ్ = ఆ సీతను, అప్రాప్య = పొందక, జీవితాన్తాయ = జీవితముయొక్క అంతము కొరకు, దారుణమ్ = భయంకరమైన, వ్యసనమ్ = వ్యసనము, ప్రాప్తమ్ = పొందబడినది.

తా. సత్యమైన పరాక్రమము గల లక్ష్మణా! ఒక కష్టము వెనుక మరొక అధికమైన కష్టము వచ్చుచున్నది. నా ప్రియురాలైన సీత లభించలేదు. కాని ప్రాణములను తీసే ఈ దారుణమైన ఆపద వచ్చిపడినది. 47

మూ. కాలస్య సుమహద్వీర్యం సర్వభూతేషు లక్ష్మణ, 48
త్వాం చ మాం చ నరవ్యాఘ్ర వ్యసనైః పశ్య మోహితౌ.

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడా! లక్ష్మణ = లక్ష్మణా! సర్వభూతేషు = సకలభూతముల విషయమునందూ కూడ, కాలస్య = కాలము యొక్క,

వీర్యమ్=శక్తి, సుమహత్=చాల గొప్పది. వ్యసనైః=దుఃఖములచేత, మోహితౌ =బాధింపబడుచున్న, త్వాం చ=నిన్ను, మాం చ = నన్ను, పశ్య=చూడుము.

తా: నరులలో శ్రేష్ఠుడవైన లక్ష్మణా! అన్ని ప్రాణుల విషయమునందూ కూడ కాలము శక్తి చాల గొప్పది. నీవు, నేను కష్టాలచేత ఎట్లు బాధపడుచున్నామో చూడుము.

48

మూ. నాతిభారోఽస్తి కాలస్య సర్వభూతేషు లక్ష్మణ, 49
శూరాశ్చ బలవన్తశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే,
కాలాభిపన్నాః సీదన్తి యథా వాలుకసేతవః. 50

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! కాలస్య= కాలమునకు, సర్వభూతేషు= అన్ని భూతములయందు, అతిభారః=ఎక్కువ భారము, నాస్తి=లేదు. శూరాశ్చ = శూరులు, బలవన్తశ్చ = బలవంతులు, రణాజిరే= రణరంగమునందు, కృతాస్త్రాశ్చ= చేయబడిన అస్త్రములు గలవారు, కాలాభిపన్నాః= కాలముచేత ఆక్రమింపబడినవారై, వాలుకసేతవః యథా=ఇసుకతో కట్టిన అడ్డకట్టలు వలె, సీదన్తి = నశింతురు.

తా. లక్ష్మణా! కాలానికి ఏ భూతముల విషయమందూ కూడ భారమనేది లేదు. శూరులు, బలవంతులు, యుద్ధరంగములో అస్త్రనైపుణ్యము చూపినవారు కూడ కాలము ఆక్రమించగానే ఇసుకతో కట్టిన అడ్డకట్టల వలె కూలిపోవుదురు.

50

మూ. ఇతి బ్రువాణో దృఢసత్యవిక్రమో
మహాయశా దాశరథిః ప్రతాపవాన్,
అవేక్ష్య సౌమిత్రిముదగ్రపౌరుషం
స్థిరాం తదా స్వాం మతిమాత్మనాఽకరోత్. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకోనసప్తతితమః సర్గః.

ప్ర. అ. దృఢసత్యవిక్రమః= దృఢమూ సత్యమూ అయిన పరాక్రమము గలవాడు, మహాయశాః= గొప్ప కీర్తి కలవాడు, ప్రతాపవాన్= ప్రతాపవంతుడు

అయిన, దాశరథిః = రాముడు, ఇతి = ఇట్లు, బ్రువాణః = పలుకుచు, ఉదగ్ర పౌరుషమ్ = గొప్ప పౌరుషము గల, సౌమిత్రిమ్ = లక్ష్మణుని, అవేక్ష్య = చూచి, తదా = అప్పుడు, స్వామ్ = తనసంబంధమైన, స్థిరామ్ = స్థిరమైన, మతిమ్ = బుద్ధిని, ఆత్మనా = స్వయముగా, అకరోత్ = చేసెను.

తా. దృఢమూ, సత్యమూ అయిన పరాక్రమము కలవాడు, మహాయశః శాలి, ప్రతాపవంతుడు అయిన రాముడు, ఇట్లు పలుకుచు, తీవ్రమైన పౌరుషము గల లక్ష్మణుని చూచి, అప్పుడు తానే ఒక స్థిరమైన నిర్ణయము చేసికొనెను. 51

'బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో అరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ సప్తతితమః సర్గః

[రామలక్ష్మణులు పరస్పరము సంప్రదించుకొని కబంధుని భుజములు నరుకుట. కబంధుడు వారిద్దరిని ఆదరించుట].

మూ. తౌ తు తత్ర స్థితౌ దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ,
బాహుపాశపరిక్షిప్తౌ కబన్ధో వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. బాహుపాశపరిక్షిప్తౌ = బాహువుల పాశముచేత చుట్టబడిన, తత్ర స్థితౌ = అక్కడ ఉన్న, భ్రాతరౌ = సోదరులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా = చూచి, కబన్ధః = కబంధుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. తన బాహుపాశముచేత బంధింపబడి అక్కడ ఉన్న సోదరులైన ఆ రామలక్ష్మణులను చూచి కబంధు డిట్లనెను. 1

మూ. తిష్ఠతః కిం ను మాం దృష్ట్వా క్షుధార్తం క్షత్రియర్షభౌ,
ఆహారార్థం తు సందిష్టౌ దైవేన గతచేతసౌ. 2

ప్ర. అ. క్షత్రియర్షభౌ = క్షత్రియశ్రేష్ఠులారా ! క్షుధార్తమ్ = ఆకలిచేత, పీడింపబడిన, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, కిం ను = ఏ కారణమువలన, తిష్ఠతః = నిలచి ఉన్నారు. గతచేతసౌ = పోయిన ప్రాణములు గల మీరు, దైవేన = దైవముచేత, ఆహారార్థమ్ = ఆహారముకొరకు, సందిష్టౌ = పంపబడినారు.

తా. ఓ! క్షత్రియశ్రేష్ఠులారా ! ఆకలితో బాధ పడుచున్న నన్ను చూచుచు కూడ అక్కడ నిలబడి యున్నారేమి ? ఇంక మీరు మరణించినట్లే, ఎందుచేత ననగా దైవము మిమ్ములను నాకు ఆహారముగా పంపినది. 2

మూ. తచ్ఛ్రుత్వా లక్ష్మణో వాక్యం ప్రాప్తకాలం హితం తదా,
ఉవాచార్తిం సమాపన్నో విక్రమే కృతలక్షణః. 3

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, తత్ = అది, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, ఆర్తిమ్ = దుఃఖమును, సమాపన్నః = పొందినవాడై, విక్రమే = ప్రయత్నమునందు, కృతలక్షణః = చేయబడిన ప్రయత్నము కలవాడై, ప్రాప్తకాలమ్ = కాలమునకుతగిన, హితమ్ = హితమైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అప్పుడు లక్ష్మణు డాతని మాటలు విని, దుఃఖపీడితుడై, పరాక్రమము చూపుటకై ప్రయత్నించుచు, కాలానుగుణము, హితము అయిన మాట పలికెను. 3

మూ. త్వాం చ మాం చ పురా తూర్ణమాదత్తే రాక్షసాధమః,
తస్మాదసిభ్యామస్యాశు బాహూ ఛిన్దావహై గురూ. 4

ప్ర. అ. రాక్షసాధమః = ఈ రాక్షసాధముడు. తూర్ణమ్ = శీఘ్రముగా, త్వాం చ = నిన్నూ, మాం చ = నన్నూ, పురా ఆదత్తే = గ్రహించగలడు. తస్మాత్ = ఆ కారణమువలన, అస్య = ఇతనియొక్క, గురూ = పెద్దవైన, బాహూ = బాహువులను, అసిభ్యామ్ = ఖడ్గములచేత, ఛిన్దావహై = ఛేదించెదము.

తా. ఈ రాక్షసాధముడు నిన్నూ నన్నూ కూడ శీఘ్రముగా గ్రహించగలడు. అందువలన పెద్దవైన వీని బాహువులను వెంటనే ఛేదించెదము. 4

మూ. భీషణోఽయం మహాకాయో రాక్షసో భుజవిక్రమః,
లోకం హ్యతిజితం కృత్వా హ్యావాం హన్తుమిహేచ్ఛతి. 5

ప్ర. అ. భీషణః = భయంకరుడు, మహాకాయః = గొప్ప శరీరము కలవాడు, భుజవిక్రమః = భుజములలో పరాక్రమము గలవాడు అయిన అయం రాక్షసః = ఈ రాక్షసుడు, లోకమ్ = లోకమును, అతిజితమ్ = పూర్తిగా జయించబడినదానినిగా, కృత్వా = చేసి, ఇహ = ఇప్పుడు, ఆవామ్ = మనల నిద్దరినీ, హన్తుమ్ = చంపుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు.

తా. పెద్ద శరీరము గల భయంకరుడైన ఈ రాక్షసుని బల మంతా వీని భుజములలో ఉన్నది. ఇతడు లోకములోని అందని జయించి మనను కూడ ఇప్పుడు చంప ప్రయత్నించుచున్నాడు. 5

మూ. నిశ్చేష్టానాం వధో రాజన్ కుత్సితో జగతీపతేః,
క్రతుమధ్యోపనీతానాం పశూనామివ రాఘవ. 6

ప్ర. అ. రాజన్ = రాజా ! రాఘవ = రామా ! నిశ్చేష్టానామ్ = చేష్ట లేని వారియొక్క, వధః = వధ, క్రతుమధ్యోపనీతానాన్ = యజ్ఞమధ్యమునందు తీసి కొని రాబడిన, పశూనామివ = పశువుల వధ వలె, జగతీపతేః = రాజునకు, కుత్సితః = నిందితమైనది.

తా. రాజువైన రామా ! యజ్ఞము నిమిత్తము తీసికొని రాబడిన పశువులను చంపుట ఎట్లో అట్లే కదలలేనివారిని చంపుట రాజులకు నింద్యము. 6

మూ. ఏతత్సంజల్పితం శ్రుత్వా తయోః క్రుద్ధస్తు రాక్షసః,
విదార్యాస్యం తదా రౌద్రస్తౌ భక్షయితుమారభత్. 7

ప్ర. అ. క్రూరః = క్రూరుడు, రౌద్రః = భయంకరుడూ అయిన, రాక్షసస్తు = రాక్షసుడైతే, తదా = అప్పుడు, తయోః = ఆ ఇద్దరియొక్క, సంజల్పితమ్ = సంభాషణను, శ్రుత్వా = విని, ఆస్యమ్ = ముఖమును, విదార్య = చీల్చి (తెరచి), తౌ = వారిని, భక్షయితుమ్ = భక్షించుటకు, ఆరభత్ = ప్రారంభించెను.

తా. క్రూరుడు, భయంకరుడూ అయిన ఆ రాక్షసుడు ఆ ఇద్దరి సంభాషణ విని, కోపించినవాడై, నోరు తెరచి వారిని భక్షించుటకు ప్రయత్నించెను. 7

మూ. తతస్తౌ దేశకాలజ్ఞౌ ఖడ్గాభ్యామేవ రాఘవౌ,
అచ్ఛిన్దతాం సుసంవిగ్నౌ బాహూ తస్యాంసదేశతః. 8

ప్ర. అ. ("సుసంవిగ్నౌ" అను పాఠముకంటె ''సుసంహృష్టౌ'' అను పాఠము బాగున్నది)

**తతః** = అటుపిమ్మట, సుసంహృష్టౌ = చాల సంతోషించిన, దేశకాలజ్ఞౌ = దేశకాలములను ఎరిగిన, తౌ = ఆ, రాఘవౌ = రామలక్ష్మణులు, ఖడ్గాభ్యామేవ = ఖడ్గములతో, తస్య = ఆతనియొక్క, బాహూ = బాహువులను, అంసదేశతః = బుజముల దగ్గర, అచ్ఛిన్దతామ్ = నరికిరి.

తా. పిమ్మట, దేశకాలములను ఎరిగిన ఆ రామలక్ష్మణులు చాల సంతోషించుచు ఖడ్గములతో ఆతని బాహువులను బుజముల దగ్గరకు నరికివేసిరి. 8

మూ. దక్షిణో దక్షిణం బాహుమసక్తమసినా తతః,
చిచ్ఛేద రామో వేగేన సవ్యం వీరస్తు లక్ష్మణః. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దక్షిణః= నేర్పు గల, రామః=రాముడు, అసక్తమ్=అడ్డులేకుండగా, వేగేన=వేగముతో, దక్షిణం బాహుమ్ = కుడిచేతిని, అసినా = ఖడ్గముతో, చిచ్ఛేద = ఛేదించెను. వీరః= వీరుడైన, లక్ష్మణస్తు = లక్ష్మణుడైతే, సవ్యమ్= ఎడమ చేతిని, ఛేదించెను.

తా. అప్పుడు నేర్పు గల రాముడు వేగముగా, అడ్డు లేకుండగా, రాక్షసుని చెయ్యి ఛేదించెను. వీరుడైన లక్ష్మణుడు ఎడమ చెయ్యి ఖండించెను. 9

మూ. స పపాత మహాబాహుశ్ఛిన్నబాహుర్మహాస్వనః,
ఖం చ గాం చ దిశశ్చైవ నాదయన్ జలదో యథా. 10

ప్ర. అ. మహాబాహుః= దీర్ఘమైన బాహువులు గల, సః=ఆతడు, ఛిన్నబాహుః= ఛేదింపబడిన బాహువులు కలవాడై, మహాస్వనః= గొప్ప ధ్వని కలవాడై, జలదః యథా=మేఘము వలె, ఖం చ=ఆకాశమును, గాం చ=భూమిని, దిశశ్చైవ=దిక్కులను, నాదయన్ = ధ్వనింపచేయుచు, పపాత = పడెను.

తా. దీర్ఘమైన బాహువులు గల ఆ కబంధుడు బాహువులు ఛేదింపబడగానే పెద్ద ధ్వనితో మేఘము వలె ఆకాశమును, పృథివిని, దిక్కులను ధ్వనింపచేయుచు పడిపోయెను. 10

మూ. స నికృత్తౌ భుజౌ దృష్ట్వా శోణితౌఘపరిప్లుతః,
దీనః పప్రచ్ఛ తౌ వీరౌ కౌ యువామితి దానవః. 11

ప్ర. అ. సః= ఆ, దానవః= దానవుడు, నికృత్తౌ = ఖండించబడిన, భుజౌ = భుజములను, దృష్ట్వా= చూచి, శోణితౌఘపరిప్లుతః= రక్తప్రవాహముచేత తడపబడినవాడై, దీనః= దీనుడై, యువామ్= మీ రిద్దరూ, కౌ = ఎవరు? ఇతి = అని, తౌ వీరౌ = ఆ వీరులను, పప్రచ్ఛ= అడిగెను.

తా. ఆ దానవుడు ఛేదించబడిన తన భుజములు చూచుకొని, రక్త ప్రవాహముచేత తడపబడినవాడై, దీనుడై "మీరు ఎవరు?" అని ఆ వీరులను అడిగెను. 11

మూ. ఇతి తస్య బ్రువాణస్య లక్ష్మణః శుభలక్ష్మణః,
శశంస రాఘవం తస్య కబన్ధస్య మహాత్మనః. 12

ప్ర. అ. తస్య = అతడు, ఇతి = ఇట్లు, బ్రువాణస్య = పలుకుచుండగా, శుభలక్షణః = శుభమైన లక్షణములు గల, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, మహాత్మనః = మహాత్ముడైన, కబన్ధస్య = కబంధునకు, రాఘవమ్ = రాముని గూర్చి, శశంస = చెప్పెను.

తా. ఆ దానవుడు ఇట్లు పలుకుచుండగా శుభమైన లక్షణములు గల లక్ష్మణుడు మహాత్ముడైన కబంధునకు రాముని గూర్చి ఇట్లు చెప్పెను. 12

మూ. అయమిక్ష్వాకుదాయదో రామో నామ జనైః శ్రుతః,
అస్యైవావరజం విద్ధి భ్రాతరం మాం చ లక్ష్మణమ్. 13

ప్ర. అ. అయమ్ = ఇతడు, రామో నామ = రాముడనే పేరు గలవాడుగా, జనైః = జనులచేత, శ్రుతః = వినబడిన, ఇక్ష్వాకుదాయాదః = ఇక్ష్వాకువంశములో పుట్టినవాడు. మామ్ = నన్ను, అస్య = ఇతనియొక్క, అవరజం భ్రాతరమ్ = తమ్ముడైన, లక్ష్మణమ్ = లక్ష్మణునిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. ఇతడు ఇక్ష్వాకువంశములో పుట్టినవాడు. రాము డను పేరుతో జనులలో ప్రసిద్ధుడు. నేను ఇతని తమ్ముడను. నా పేరు లక్ష్మణుడు. 13

మూ. అస్య దేవప్రభావస్య వసతో విజనే వనే,
రక్షసాపహృతా పత్నీ యామిచ్ఛన్తావిహాగతౌ. 14

ప్ర. అ. విజనే = జనశూన్యమైన, వనే = వనమునందు, వసతః = నివసించుచున్న, దేవప్రభావస్య = దేవతలతో సమానమైన ప్రభావము గల, అస్య = ఈతనియొక్క, పత్నీ = భార్య, రక్షసా = రాక్షసునిచేత, అపహృతా = అపహరించబడినది. యామ్ = ఎవతెను, ఇచ్ఛన్తౌ = పొందగోరుచున్నవారమై, ఇహ = ఇక్కడికి, ఆగతౌ = వచ్చినాము.

తా. దేవతలతో సమానమైన ప్రభావము గల ఇతడు నిర్జనమైన అరణ్య

ములో నివసించుచుండగా, ఇతని భార్యను రాక్షసుడు అపహరించినాడు. ఆమెను వెదకుచు ఇక్కడికి వచ్చినాము. 14

మూ. త్వం తు కో వా కిమర్థం వా కబన్ధసదృశో వనే,
ఆస్యేనోరసి దీప్తేన భగ్నజఙ్ఘో వివేష్టసే. 15

ప్ర. అ. త్వం తు = నీవు, కః వా = ఎవ్వడవు ? కబన్ధసదృశః = మొండెముతో సమానుడవై, ఉరసి = వక్షస్థలమునందు, దీప్తేన = ప్రకాశించుచున్న, ఆస్యేన = ముఖముతో, భగ్నజఙ్ఘః = విరిగిపోయిన కాళ్ళు కలవాడవై, వనే = వనమునందు, కిమర్థం వా = ఎందుకు, వివేష్టసే = దొరలుచున్నావు ?

తా. నీవు ఎవ్వరవు ? మొండెము వలె ఉండి, ముఖము వక్షస్థలమునందు ప్రకాశించుచుండగా, కాళ్ళు విరిగి, ఎందుచేత ఈ అరణ్యములో దొరలుచున్నావు?

మూ. ఏవముక్తః కబన్ధస్తు లక్ష్మణేనోత్తరం వచః,
ఉవాచ పరమప్రీత స్తదిన్ద్రవచనం స్మరన్. 16

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, కబన్ధస్తు = కబంధుడైతే, తత్ = ఆ, ఇన్ద్రవచనమ్ = ఇంద్రుని వచనమును, స్మరన్ = స్మరించుచు, పరమప్రీతః = చాలా సంతోషించినవాడై, ఉత్తరమ్ = ప్రత్యుత్తరరూపమైన, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. కబంధుడు లక్ష్మణుని మాటలు విని, పూర్వము ఇంద్రుడు చెప్పిన మాటలు స్మరించి, చాల సంతోషించుచు ఇట్లు పలికెను. 16

మూ. స్వాగతం వాం నరవ్యాఘ్రౌ దిష్ట్యా పశ్యామి చాప్యహమ్,
దిష్ట్యా చేమౌ నికృత్తౌ మే యువాభ్యాం బాహుబన్ధనౌ, 17

ప్ర. అ. నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠులారా ! వామ్ = మీకు, స్వాగతమ్ = స్వాగత మగుగాక. అహమ్ = నేను, దిష్ట్యా = అదృష్టవశముచేత, పశ్యామి = చూచుచున్నాను. దిష్ట్యా = అదృష్టవశముచేత, యువాభ్యామ్ = మీచేత, మే = నాయొక్క, ఇమౌ = ఈ, బాహుబన్ధనౌ = బాహుబంధనములు, నికృత్తౌ = ఛేదించబడినవి.

తా. ఓ! పురుషశ్రేష్ఠులారా! మీకు సుఖాగమనము అగుగాక. అదృష్ట వశముచేత మిమ్ములను చూచుచున్నాను. ఈ నా బాహుబంధనములను మీరు నా అదృష్టవశముచేత ఛేదించినారు. 17

మూ. విరూపం యచ్చ మే రూపం ప్రాప్తం హ్యావినయాద్యథా,
తన్మే శృణు నరవ్యాఘ్ర తత్త్వతః శంసతస్తవ. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
సప్తతితమః సర్గః.

ప్ర. అ. నరవ్యాఘ్ర=నరశ్రేష్ఠుడా! మే=నాయొక్క, విరూపమ్=వికృత మైన, యత్=ఏ, రూపమ్=రూపము గలదో, అది, యథా=ఎట్లు, అవినయాత్ =అవినయమువలన, ప్రాప్తమ్=లభించినదో, తవ=నీకు, తత్త్వతః=యథార్థ ముగా, శంసతః= చెప్పుచున్న, మే= నానుండి, శృణు= వినుము.

తా. ఓ! నరశ్రేష్ఠుడా! ఈ వికృతమైన రూపము నాకే అవినయము చేయుటచే వచ్చినదో యథార్థముగా చెప్పెదను; వినుము.

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్య
కాండలో డెబ్బదవ సర్గ సమాప్తము

## అథ ఏకసప్తతితమః సర్గః

[కబంధుడు తన వృత్తాంతము చెప్పి "నా శరీరమును దహించి వేసిన పిమ్మట మీకు సీతాన్వేషణమునందు ఉపాయము చెప్పెదను" అని రామునితో పలుకుట]

మూ. పురా రామ మహాబాహో మహాబలపరాక్రమ,
రూపమాసీన్మమాచిన్త్యం త్రిషు లోకేషు విశ్రుతమ్, 1
యథా సోమస్య శక్రస్య సూర్యస్య చ యథా వపుః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! మహాబలపరాక్రమ = గొప్ప బలము పరాక్రమము కలవాడా: రామ = రామా! పురా = పూర్వము, సోమస్య = చంద్రుని రూపము, శక్రస్య = దేవేంద్రునిరూపము, యథా = ఎట్లో, సూర్యస్య చ = సూర్యునియొక్క, వపుః = శరీరము, యథా = ఎట్లో, అట్లే, మమ = నాయొక్క, రూపమ్ = రూపము, అచిన్త్యమ్ = ఊహింప శక్యము కానిదిగాను, త్రిషు లోకేషు = మూడు లోకములయందు, విశ్రుతమ్ = ప్రసిద్ధముగాను, ఆసీత్ = ఉండెను.

తా. గొప్ప బాహువులు, అత్యధికమైన బలపరాక్రమములు గల రామా! పూర్వము నా రూపము మూడు లోకములలో ప్రసిద్ధమై, ఊహింప శక్యము కాని విధమున అద్భుతముగా ఉండెను. నా రూపము చంద్రసూర్యుల రూపము వలె, దేవేంద్రుని రూపము వలె ఆశ్చర్యకరముగా ఉండెను. 1

మూ. సోఽహం రూపమిదం కృత్వా లోకవిత్రాసనం మహత్,
ఋషీన్వనగతాన్రామ త్రాసయామి తతస్తతః.

ప్ర. అ. రామ = రామా: సః అహమ్ = అట్టి నేను, లోకవిత్రాసనమ్ = లోకములకు భయము కలిగించు, మహత్ = పెద్దదైన, ఇదం రూపమ్ = ఈ

రూపమును, కృత్వా = చేసికొని, తత స్తతః = అక్కడక్కడ, వనగతాన్ = వనములో ఉన్న, ఋషీన్ = ఋషులను, త్రాసయామి = భయపెట్టుచుండెడివాడను.

తా. రామా! అట్టి అద్భుతమైన రూపము గల నేను లోకములకు భయము కలిగించే ఈ రూపము దాల్చి అక్కడక్కడ వనాలలో నివసించే మునులను భయపెట్టుచుండేవాడను. 2

మూ. తతః స్థూలశిరా నామ మహర్షిః కోపితో మయా, 3
సంచిన్వన్వివిధం వన్యం రూపేణానేన ధర్షితః.

ప్ర. అ. తతః = అంత, వివిధమ్ = అనేకవిధములైన, వన్యమ్ = వనమునందు లభించే వస్తుసముదాయమును, సంచిన్వన్ = ప్రోగుచేయుచున్న, స్థూలశిరాః నామ = స్థూలశిరస్కుడను పేరు గల, మహర్షిః = మహర్షి, అనేన = ఈ, రూపేణ = రూపముతో, ధర్షితః = బెదిరించబడినవాడై, మయా = నాచేత, కోపితః = కోపింపచేయబడినాడు.

తా. ఒకనాడు నేను, అనేకవిధములైన వనములో లభించే వస్తువులను సేకరించుచున్న స్థూలశిరస్కుడనే మహర్షిని ఈ రూపముతో బెదిరించి అతనికి కోపము కలిగించితిని. 3

మూ. తేనాహముక్తః ప్రేక్ష్యైవం ఘోరశాపాభిధాయినా, 4
ఏతదేవ నృశంసం తే రూపమస్తు విగర్హితమ్.

ప్ర. అ ప్రేక్ష్య = నన్ను చూచి, ఘోరశాపాభిధాయినా = ఘోరమైన శాపమును పలికిన, తేన = ఆ మహర్షిచేత, అహమ్ = నేను, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడితిని. తే = నీకు, నృశంసమ్ = క్రూరము, విగర్హితమ్ = నింద్యమూ అయిన, ఏతత్ = ఈ, రూపమేవ = రూపమే అస్తు = ఉండుగాక.

తా. ఆ మహర్షి నన్ను చూచి ఘోరమైన శాప మిచ్చుచు ఇట్లు పలికెను. "నీకు ఇటువైన క్రూరము, నింద్యము అయిన ఈ రూపమే ఉండుగాక".

మూ. స మయా యాచితః క్రుద్ధః శాపస్యాన్తో భవేదితి, 5
అభిశాపకృతస్యేతి తేనేదం భాషితం వచః.

ప్ర. అ. క్రుద్ధః = కోపించిన, సః = ఆమహర్షి, అభిశాపకృతస్య = అపచారముచేత చేయబడిన, శాపస్య = ఈ శాపమునకు, అన్తః = అంతము, భవేత్ = అగుగాక, ఇతి = అని, మయా = నాచేత, ప్రార్థితః = ప్రార్థింపబడెను; తేన = ఆ మహర్షిచేత, ఇదమ్ = ఈ, వచః = వచనము, భాషితమ్ = పలకబడినది.

తా. "నా అపచారమువలన కలిగిన ఈ శాపమునకు అంతము చూపుము" అని నేను క్రుద్ధుడైన ఆ మహర్షిని ప్రార్థింపగా, ఆతడిట్లనెను. 5

మూ. యదా ఛిత్త్వా భుజౌ రామస్త్వాం దహేద్విజనే వనే, 6
తదా త్వం ప్రాప్స్యసే రూపం స్వమేవ విపులం శుభమ్.

ప్ర. అ. రామః = రాముడు, భుజౌ = భుజములను, ఛిత్త్వా = ఛేదించి, త్వామ్ = నిన్ను, యదా = ఎప్పుడు, విజనే = జనశూన్యమైన, వనే = వనమునందు, దహేత్ = కాల్చునో, తదా = అప్పుడు, స్వమేవ = నీ సంబంధమైన, విపులమ్ = విశాలమైన, శుభమ్ = మంగళకరమైన, రూపమ్ = రూపమును, ప్రాప్స్యసే = పొందగలవు.

తా. "జనశూన్యమైన వనములో రాముడు ఎప్పుడు నీ భుజములను ఛేదించి, దహించునో, అప్పుడు నీవు మంగళకరమైన, విశాలమైన నీ రూపమును తిరిగి పొందగలవు". 6

మూ. శ్రియా విరాజితం పుత్రం దనోస్త్వం విద్ధి లక్ష్మణ, 7
ఇన్ద్రకోపాదిదం రూపం ప్రాప్తమేవం రణాజిరే.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! దనోః = దనువుయొక్క, శ్రియా = శోభతో, విరాజితమ్ = ప్రకాశింపచేయబడిన, పుత్రమ్ = పుత్రుణ్ణిగా, త్వమ్ = నీవు, విద్ధి = తెలుసుకొనుము. ఇన్ద్ర కోపాత్ = ఇంద్రుని కోపమువలన, రణాజిరే = యుద్ధరంగమునందు, ఏవమ్ = ఇట్లు, ఇదం రూపమ్ = ఈ రూపము, ప్రాప్తమ్ = పొందబడినది.

తా. లక్ష్మణా ! నేను దనువు కుమారుడను, లక్ష్మితో ప్రకాశించేవాడను. నా కిట్టి రూపము యుద్ధరంగములో ఇంద్రుని కోపమువలన వచ్చినది. 7

మూ. అహం హి తపసోగ్రేణ పితామహమతోషయమ్, 8
దీర్ఘమాయుః స మే ప్రాదా త్తతో మాం వి భ్రమో౽స్పృశత్.

ప్ర. అ. అహమ్ = నేను, ఉగ్రేణ = ఉగ్రమైన, తపసా = తపస్సుచేత, పితామహమ్ = బ్రహ్మదేవుని, అతోషయమ్ = సంతోష పెట్టితిని. సః = ఆ బ్రహ్మ దేవుడు, మే = నాకు, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుః = ఆయుర్దాయమును, ప్రాదాత్ = ఇచ్చెను. తతః = పిమ్మట, మామ్ = నన్ను, విభ్రమః = భ్రాంతి, అస్పృశత్ = స్పృశించెను.

తా. నేను ఉగ్రమైన తపస్సు చేసి బ్రహ్మదేవుని సంతోషపెట్టగా ఆ బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయుర్దాయమును ప్రసాదించెను. దానితో నాకు గర్వము కలిగెను. 8

మూ. దీర్ఘమాయుర్మయా ప్రాప్తం కిం మే శక్రః కరిష్యతి, 9
ఇత్యేవం బుద్ధిమాస్థాయ రణే శక్రమధర్షయమ్.

ప్ర. అ. మయా = నాచేత, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుః = ఆయుర్దాయము, ప్రాప్తమ్ = పొందబడినది. శక్రః = దేవేంద్రుడు, మే = నాకు, కిం కరిష్యతి = ఏమి చేయగలడు! ఇత్యేవమ్ = ఇట్లు, బుద్ధిమ్ = బుద్ధిని, ఆస్థాయ = అవలంబించి, రణే = యుద్ధమునందు, శక్రమ్ = దేవేంద్రుని, అధర్షయమ్ = ఎదిరించితిని.

తా. "నాకు దీర్ఘాయుర్దాయము లభించినది కదా; దేవేంద్రుడు నన్నేమి చేయగలడు"? ఈ విధమైన ఆలోచనతో యుద్ధమునందు ఇంద్రుని ఎదిరించితిని. 9

మూ. తస్య బాహుప్రయుక్తేన వజ్రేణ శతపర్వణా. 10
సక్థినీ చైవ మూర్ధా చ శరీరే సంప్రవేశితమ్.

ప్ర. అ. తస్య = ఇంద్రునియొక్క, బాహుప్రయుక్తేన = బాహువుచేత ప్రయోగింపబడిన, శతపర్వణా = నూరు అంచులు గల, వజ్రేణ = వజ్రాయుధము చేత, సక్థినీ చైవ = తొడలు, మూర్ధా చ = శిరస్సు, శరీరే = శరీరమునందు, సంప్రవేశితమ్ = ప్రవేశపెట్టబడినది.

తా. ఇంద్రుడు బాహువుతో నూరు అంచులు గల వజ్రాయుధమును ప్రయోగించగా నా తొడలు, తల కూడ శరీరములోనికి చొచ్చుకునిపోయినవి. 10

మూ. స మయా యాచ్యమానః సన్నానయద్యమసాదనమ్. 11
పితామహవచః సత్యం తదస్త్వితి మమాబ్రవీత్,

ప్ర. అ. సః = దేవేంద్రుడు, మయా = నాచేత, యాచ్యమానః సన్ = యాచింపబడుచు, యమసాదనమ్ = యమలోకమును, నానయత్ = పంపలేదు. తత్ = ఆ, పితామహవచః = బ్రహ్మదేవుని వచనము, సత్యమ్ = సత్యము, అస్తు ఇతి = అగు గాక అని, మమ = నాకు, అబ్రవీత్ = పలికెను.

తా. నాప్రార్థనను అంగీకరించి ఇంద్రుడు నన్ను యమలోకమునకు పంపలేదు. బ్రహ్మదేవుని మాట సత్య మగుగాక అని నాతో పలికి వదలిపెట్టెను.

మూ. అనాహారః కథం శక్తో భగ్నసక్థిశిరోముఖః, 12
వజ్రేణాభిహతః కాలం సుదీర్ఘమపి జీవితుమ్.

ప్ర. అ. వజ్రేణ = వజ్రముచేత, అభిహతః = కొట్టబడిన నేను, భగ్నసక్థిశిరోముఖః = విరిగిపోయిన తొడలు, శిరస్సు, ముఖము కలవాడనై, అనాహారః = ఆహారము లేనివాడనై, సుదీర్ఘం కాలమ్ = చాల కాలము, జీవితుమపి = జీవించుటకు కూడా, కథమ్ = ఎట్లు, శక్తః = సమర్థుడ నగుదును?

తా. "వజ్రముచేత కొట్టబడి, తొడలు, శిరస్సు, ముఖము విరిగిపోయిన నేను ఆహారము లేకుండా చాలా కాలము ఎట్లు జీవించగలను"? 12

మూ. ఏవముక్తస్తు మే శక్రో బాహూ యోజనమాయతౌ, 13
ప్రాదాదాస్యం చ మే కుక్షౌ తీక్ష్ణదంష్ట్రమకల్పయత్.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, శక్రః = దేవేంద్రుడు, మే = నాకు, యోజనమ్ = యోజనము దూరము, ఆయతౌ = పొడవైన, బాహూ = బాహువులను, ప్రాదాత్ = ఇచ్చెను. మే = నాయొక్క, కుక్షౌ = కుక్షియందు, తీక్ష్ణదంష్ట్రమ్ = తీక్ష్ణమైన కోరలు గల, ఆస్యం చ = ముఖమును కూడా, అకల్పయత్ = ఏర్పరచెను.

తా. ఈ విధముగా నేను అడుగగా దేవేంద్రుడు నాకు యోజనము పొడ

వైన బాహువులు ఇచ్చి, నా పొట్టలో తీక్ష్ణమైన దంతము లున్న నోరు కూడా అమర్చెను.

13

మూ. సోఽహం భుజాభ్యాం దీర్ఘాభ్యాం సంకృష్యాస్మిన్వనేచరాన్,
సింహద్విపమృగవ్యాఘ్రాన్ భక్షయామి సమన్తతః.

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, అస్మిన్ = ఈ, వనే = వనమునందు, దీర్ఘాభ్యామ్=పొడవైన, భుజాభ్యామ్=భుజములతో, అస్మిన్=ఈ, వనే = వనమునందు, సమన్తతః = అంతా, చరాన్ = సంచరించుచున్న, సింహద్విపమృగవ్యాఘ్రాన్ = సింహములను, ఏనుగులను, మృగములను, పెద్దపులులను, సంకృష్య = లాగి, భక్షయామి = భక్షించుచున్నాను.

తా. అట్టి నేను ఈ వనములో అంతటా సంచరించుచున్న సింహములను, గజములను, లేళ్లను, పెద్దపులులను దీర్ఘములైన నా భుజములతో లాగి భక్షించుచున్నాను.

14

మూ. స తు మామబ్రవీదిన్ద్రో యదా రామః సలక్ష్మణః, 15
ఛేత్స్యతే సమరే బాహూ తదా స్వర్గం గమిష్యసి.

ప్ర. అ. సః = ఆ, ఇన్ద్రః తు = ఇంద్రుడైతే, మామ్ = నన్ను గూర్చి, అబ్రవీత్ = పలికెను. యదా=ఎప్పుడు, సలక్ష్మణః=లక్ష్మణసహితుడైన, రామః = రాముడు, సమరే = యుద్ధమునందు, బాహూ = బాహువులను, ఛేత్స్యతే = ఛేదించగలడో, తదా = అప్పుడు, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గమిష్యసి = వెళ్ళగలవు.

తా. "లక్ష్మణసమేతుడైన రాముడు ఎప్పుడు యుద్ధములో నీ బాహువులను ఛేదించునో అప్పుడు నీవు మళ్ళీ స్వర్గానికి వెళ్లెదవు"అని ఇంద్రుడు నాతో చెప్పెను.

15

మూ. అనేన వపుషా రామ వనేఽస్మిన్రాజసత్తమ, 16
యద్యత్పశ్యామి సర్వస్య గ్రహణం సాధు రోచయే.

ప్ర. అ. రాజసత్తమ = రాజశ్రేష్ఠుడవైన, రామ = రామా ! అస్మిన్ వనే = ఈ వనమునందు, అనేన వపుషా = ఈ దేహముతో, యద్యత్ = దేనిని దేనిని,

పశ్యామి = చూతునో, సర్వస్య = ఆ సకలపదార్థ జాతముయొక్క, గ్రహణమ్= గ్రహణమును, సాధు = బాగుగా, రోచయే = ఇష్టపడుచున్నాను.

తా. రాజశ్రేష్ఠుడవైన రామా ! అది మొదలు నేనీ శరీరముతో ఈ వనములో ఉండి, కనిపించిన ప్రతిదానినీ గ్రహించవలె ననే కోరికతో ప్రవర్తించుచున్నాను. 16

మూ. అవశ్యం గ్రహణం రామో మన్యేఽహం సముపైష్యతి, 17
ఇమాం బుద్ధిం పురస్కృత్య దేహన్యాసకృతశ్రమః.

ప్ర. అ. రామః = రాముడు, అవశ్యమ్ = తప్పక, గ్రహణమ్ = గ్రహణమును, సముపైష్యతి = పొందగలడు, అని, అహమ్ = నేను, మన్యే = తలచుచున్నాను. ఇమామ్ = ఈ, బుద్ధిమ్ = బుద్ధిని, పురస్కృత్య=పురస్కరించుకొని, దేహన్యాసకృతశ్రమః = దేహమును విడచుటయందు చేయబడిన శ్రమ కలవాడనై (ఉన్నాను).

తా. "రాముడు ఎప్పటికైనా తప్పక నా పట్టులోనికి రాగలడు"అను ఆలోచనతో, ఈ దేహమును విడచుటకై ప్రయత్నము చేయుచు (ప్రతివస్తువును పట్టుకొనుచు) ఉన్నాను. 17

మూ. స త్వం రామోఽసి భద్రం తే నాహమన్యేన రాఘవ, 18
శక్యో హన్తుం యథాతత్త్వమేవముక్తం మహర్షిణా.

ప్ర. అ. రాఘవ = రామా ! త్వమ్=నీవు, సః రామః=ఆ రాముడవుగా, అసి = అయి ఉన్నావు. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. మహర్షిణా= మహర్షిచేత, తత్త్వమ్ = యథార్థము, ఏవమ్ = ఇట్లు, యథా=ఎట్లుచెప్పబడినదో, దానిని పట్టి, అహమ్ = నేను, అన్యేన=ఇతరునిచేత, హన్తుమ్=చంపుటకు, శక్యః = శ్యమైనవాడను, న = కాను.

తా. రామా ! నీవు ఆ రాముడవే. నీకు మంగళ మగుగాక. మహర్షి చెప్పిన విధమున నీవు తప్ప నన్నెవ్వరూ చంపజాలరు. 18

మూ. అహం హి మతిసాచివ్యం కరిష్యామి నరర్షభ, 19
మిత్రం చైవోపదేక్ష్యామి యువాభ్యాం సంస్కృతోఽగ్నినా.

ప్ర. అ. నరర్షభ = నరశ్రేష్ఠుడా ! అహమ్ = నేను, అగ్నినా = అగ్ని చేత, సంస్కృతః = సంస్కరించబడినవాడనై, యువాభ్యామ్ = మీకు, మతిసాచివ్యమ్ = బుద్ధియందు సాహాయ్యమును, కరిష్యామి = చేసెదను. మిత్రం చైవ = మిత్రుని కూడ, ఉపదేక్ష్యామి = ఉపదేశించెను.

తా. మానవులలో శ్రేష్ఠుడవైన రామా ! మీరు నాకు దహనసంస్కారము చేసిన పిమ్మట నేను మీకు ఆలోచనలో సాహాయ్యము చేసెదను. మీకు స్నేహితుని చూపగలను.

19

మూ. ఏవముక్తస్తు ధర్మాత్మా దనునా తేన రాఘవః, 20
ఇదం జగాద వచనం లక్ష్మణస్యోపశృణ్వతః.

ప్ర. అ. తేన = ఆ, దనునా = దనువుచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రాఘవః = రాముడు. లక్ష్మణస్య = లక్ష్మణుడు, ఉపశృణ్వతః = వినుచుండగా, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, జగాద = పలికెను.

తా. ఆ దనువు పలికిన మాటలు విని ధర్మాత్ముడైన రాముడు, లక్ష్మణుడు వినుచుండగా ఇట్లు పలికెను.

వి. వెనుక ఏడవ శ్లోకంలో ''శ్రియా విరాజితం పుత్రం దనోస్త్వం విద్ధి లక్ష్మణ"అని చెప్పబడినది. దానికి "శోభతో ప్రకాశించుచున్న నేను దనువు కుమారుడను"అని అర్థము. కొందరు వ్యాఖ్యాతలు "శ్రియా విరాజితం"అనేదానిని 6 వ శ్లోకంలోని "రూపమ్" అనేదానికి విశేషణంగా గ్రహించి "శోభాయుక్తమైన రూపమును పొందగలవు"అని అర్థము చెప్పినారు. "నేను దనువు కుమారుడను"అనియే ఇక్కడ (7వ శ్లోకంలో)అర్థము. దానిని పట్టి ఈ శ్లోకంలో 'దనోః' అనుదానికి "దనువంశములో పుట్టినవానియొక్క"అని అర్థం చెప్పినారు. కాని ఇది క్లిష్టార్థము. అందుచేత ప్రాచ్యపాఠము బాగున్న దని తోచుచున్నది. పైన చూపిన ఏడవ శ్లోకం పూర్వార్ధం, ఆ పాఠంలో "శ్రియో మాం మధ్యమం పుత్రం దనుం నామ్నా చ దానవమ్"అని ఉన్నది. "నేను శ్రీ అనువాని మధ్యమపుత్రుడనైన దనువనే పేరు గల దానవుడను"అని దాని అర్థము. ఏడవ శ్లోకంలో "శ్రియా విరాజితమ్''కు బదులు ''శ్రియో విరాజితమ్"అను పాఠమును గ్రహించి కొందరు

వ్యాఖ్యాతలు ''దనోః = దనువంశీయుడైన, శ్రియః = శ్రీ అనువానియొక్క'' ఇత్యాదివిధముగా వాఖ్యానం చేసినారు. ప్రాచ్యపాఠం గ్రహించిన పక్షాన ఇక్కడ "దనునా''అనేదాని అర్థం సరిగా కుదురును. 20

మూ. రావణేన హృతా భార్యా మమ సీతా యశస్వినీ, 21
నిష్క్రాన్తస్య జనస్థానాత్సహభ్రాత్రా యథాసుఖమ్.

ప్ర. అ. జనస్థానాత్ = జనస్థానమునుండి, సహ భ్రాత్రా = సోదరునితో కూడ, నిష్క్రాన్తస్య = బైటకువెళ్ళిన, మమ = నాయొక్క, భార్యా = భార్యయైన, యశస్వినీ = కీర్తిగల, సీతా = సీత, రావణేన = రావణునిచేత, యథాసుఖమ్ = సుఖముగా, హృతా = హరించబడినది.

తా. నేను నా తమ్ముడూ జనస్థానమునుండి బైటకు వెళ్ళిన సమయమునందు, రావణుడు కీర్తిమంతురాలైన నా భార్య సీతను అనాయాసముగా అపహరించినాడు. 21

మూ. నామమాత్రం తు జానామి న రూపం తస్య రక్షసః, 22
నివాసం వా ప్రభావం వా వయం తస్య న విద్మహే.

ప్ర. అ. తస్య = ఆరాక్షసునియొక్క, నామమాత్రమ్ = పేరును మాత్రమే, జానామి = ఎరుగుదును. రూపమ్ = రూపమును, న = ఎరుగను. తస్య = వానియొక్క, నివాసం వా = నివాసమును గాని, ప్రభావం వా = ప్రభావమును గాని, వయమ్ = మేము, న విద్మహే = ఎరుగము.

తా. నాకు ఆతని పేరు మాత్రమే తెలిసినది కాని ఆతని రూపము తెలియదు. ఆతని నివాసమును గూర్చి గాని, ప్రభావమును గూర్చి గాని తెలియ లేదు. 22

మూ. శోకార్తానామనాథానామేవం విపరిధావతామ్, 23
కారుణ్యం సదృశం కర్తుముపకారే చ వర్తతామ్.

ప్ర. అ. శోకార్తానామ్ = శోకముచేత పీడింపబడినవారము, అనాథానామ్ = రక్షకులు లేనివారము, ఏవమ్ = ఇట్లు, విపరిధావతామ్ = ఇటు అటు తిరుగాడుచున్నవారము, ఉపకారే = ఉపకారమునందు, వర్తతాం చ = ఉన్నవారము

అయిన, మా విషయమున, కారుణ్యమ్ = కారుణ్యము, కర్తుమ్ = చేయుటకు, సదృశమ్ = యుక్తము.

తా. మేము శోకార్తులమై, దారి చూపువారు లేక తిరుగాడుచున్నాము. మేము నీకు ఉపకారము కూడ చేయుచున్నాము గాన నీవు మా విషయమై కారుణ్యము చూపుట యుక్తము. 23

మూ. కాష్ఠాన్యాదాయ శుష్కాణి కాలే భగ్నాని కుఞ్జరైః, 24
ధక్ష్యామస్త్వాం వయం వీర శ్వభ్రే మహతి కల్పితే.

ప్ర. అ వీర = వీరుడా ! కాలే = కాలమునందు, కుఞ్జరైః = ఏనుగులచేత, భగ్నాని = విరుగగొట్టబడిన, శుష్కాణి = ఎండిన, కాష్ఠాని = కట్టెలను, ఆదాయ = గ్రహించి, కల్పితే = ఏర్పరుపబడిన, మహతి = పెద్దదైన, శ్వభ్రే = గోతియందు, త్వామ్ = నిన్ను, ధక్ష్యామః = కాల్చగలము.

తా. వీరుడా ! ఆ యా సమయాలలో ఏనుగులు విరచిన ఎండిన కట్టెలు తీసికొనివచ్చి, పెద్ద గొయ్యి ఏర్పరచి నిన్ను దహించెదము. 24

మూ. స త్వం సీతాం సమాచక్ష్వ యేన వా యత్ర వా హృతా.
కురు కల్యాణమత్యర్థం యది జానాసి తత్త్వతః.

ప్ర. అ. సః త్వమ్ = అట్టి నీవు, తత్త్వతః = యథార్థముగా, జానాసి యది = ఎరిగి ఉన్నట్లయితే, సీతామ్ = సీతను గూర్చి, యేన వా = ఎవనిచేత, యత్ర వా = ఎక్కడికి, హృతా = హరించబడినదో, సమాచక్ష్వ = చెప్పుము. అత్యర్థమ్ = మిక్కిలి, కల్యాణమ్ = కల్యాణమును, కురు = చేయుము.

తా. నీకు సీతను గూర్చి నిజముగా తెలిసినచో ఆమెను ఎవరు హరించినారో, ఎక్కడికి హరించుకొనిపోయినారో చెప్పి మంగళకరమైన కార్యమును చేయుము (పుణ్యము కట్టుకొనుము). 25

మూ. ఏవముక్తస్తు రామేణ వాక్యం దనురనుత్తమమ్, 26
ప్రోవాచ కుశలో వక్తుం వక్తారమపి రాఘవమ్.

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన,

వక్తుమ్ = మాటలాడుటకు, కుశలః = నేర్పరియైన, దనుః=దనువు, వక్తారమ్= వక్తయైన, రాఘవమ్ = రాముని గూర్చి, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, వాక్యమ్ = = వాక్యమును, ప్రోవాచ = పలికెను.

తా. రాముని మాటలు విని, మాటలలో నేర్పరియైన ఆ దనువు, మాటలలో నేర్పరియైన రామునితో ఉత్తమమైన మాట పలికెను. 26

మూ. దివ్యమస్తి న మే జ్ఞానం నాభిజానామి మైథిలీమ్. 27
యస్తాం జ్ఞాస్యతి తం వక్ష్యే దగ్ధః స్వం రూపమాస్థితః.

ప్ర. అ. మే = నాకు, దివ్యమ్ = దివ్యమైన, జ్ఞానమ్ = జ్ఞానము, నాస్తి= లేదు. మైథిలీమ్=సీతను, నాభిజానామి=గుర్తించను, దగ్ధః=కాల్చబడినవాడనై, స్వం రూమ్ = నా రూపమును, ఆస్థితః = గ్రహించినవాడనై, తామ్ = ఆమెను గూర్చి, యః = ఎవడు, జ్ఞాస్యతి = తెలుసుకొనగలడో, తమ్ = వానిని గూర్చి, వక్ష్యే = చెప్పగలను.

తా. నాకు దివ్యదృష్టి లేదు. అందుచే సీత ఎక్కడున్నదో గుర్తించజాలను. మీరు నన్ను దహించిన పిమ్మట నా సహజరూపమును తిరిగి పొంది సీతజాడ తెలుసుకొనగలిగినవానిని గూర్చి చెప్పెదను. 27

మూ. అదగ్ధస్య తు విజ్ఞాతుం శక్తిరస్తి న మే ప్రభో, 28
రాక్షసం తం మహావీర్యం సీతా యేన హృతా తవ.

ప్ర. అ. ప్రభో = ప్రభూ ! యేన = ఎవనిచేత, తవ = నీయొక్క, సీతా = సీత, హృతా = హరించబడినదో, తమ్ = ఆ, మహావీర్యమ్ = గొప్ప పరాక్రమము గల, రాక్షసమ్=రాక్షసుని గూర్చి, విజ్ఞాతుమ్=తెలిసికొనుటకు, అదగ్ధస్య = కాల్చబడని, మే = నాకు, శక్తిః = శక్తి నాస్తి= లేదు.

తా. నేను దహింపబడనంతవరకు, నీ భార్యయైన సీతను హరించిన మహాపరాక్రమవంతుడైన రాక్షసుని గూర్చి తెలిసికొను శక్తి నాకు లేదు. 28

మూ. విజ్ఞానం హి మమ భ్రష్టం శాపదోషేణ రాఘవ, 29
స్వకృతేన మయా ప్రాప్తం రూపం లోకవిగర్హితమ్.

ప్ర. అ. రాఘవ = రామా ! శాపదోషేణ = శాపదోషముచేత, మమ =

నాయొక్క, విజ్ఞానమ్ = దివ్యజ్ఞానము, భ్రష్టం హి = నశించినది కదా! మయా = నాచేత, స్వకృతేన = నేను చేసిన పనిచేతనే, లోకవిగర్హితమ్ = లోకమునందు నింద్యమైన, రూపమ్ = రూపము, ప్రాప్తమ్ = పొందబడినది.

తా. రామా ! శాపదోషముచేత నా దివ్యజ్ఞానము భ్రష్టమైపోయినది. నే చేసిన పనికి ఫలితముగా లోకులచేత నిందింపబడే ఈ రూపము సంప్రాప్తించినది.

మూ. కిం తు యావన్న యాత్యస్తం సవితా శ్రాన్తవాహనః. 31
తావన్మామవటే క్షిప్త్వా దహ రామ యథావిధి.

ప్ర. అ. రామ = రామా ! కిం తు = కాని, సవితా = సూర్యుడు, శ్రాన్త వాహనః = అలసిన గుఱ్ఱములు గలవాడై, అస్తమ్ = అస్త్రాద్రిని గూర్చి, యావత్ న యాతి = ఎంతలో వెళ్లడో, తావత్ = అంతలోగా, మామ్ = నన్ను, అవటే = గోతిలో, క్షిప్త్వా = పడవేసి, యథావిధి = యథాశాస్త్రముగా, దహ = కాల్చుము.

తా. కాని, రామా : సూర్యుడు గుఱ్ఱములు అలసిపోగా అస్త్రాద్రికి చేరక మునుపే నీవు నన్ను గోతిలో పడవేసి కాల్చవలెను. 30

మూ. దగ్ధస్త్వయాహమవటే న్యాయేన రఘునన్దన. 31
వక్ష్యామి తమహం వీర యస్తం జ్ఞాస్యతి రాక్షసమ్.

ప్ర. అ. వీర = వీరుడవైన, రఘునన్దన = రామా ! అహమ్ = నేను, త్వయా = నీచేత, న్యాయేన = శాస్త్రానుసారముగా, అవటే = గోతిలో, దగ్ధః = కాల్చబడినవాడనై, యః = ఎవడు, తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి గూర్చి, జ్ఞాస్యతి = తెలిసికొనగలడో, తమ్ = ఆతనిని గూర్చి, వక్ష్యామి = చెప్పగలను.

తా. వీరుడవైన రామా : నీవు నన్ను గోతిలో వేసి యథాశాస్త్రముగా కాల్చిన పిమ్మట ఆ రాక్షసుణ్ణి గూర్చి తెలుసుకొనగలిగిన వానిని గూర్చి నీకు చెప్పెదను. 31

మూ. తేన సఖ్యం చ కర్తవ్యం న్యాయ్యవృత్తేన రాఘవ, 32
కల్పయిష్యతి తే ప్రీతః సాహాయ్యం లఘువిక్రమః.

ప్ర. అ. రాఘవ = రామా ! న్యాయ్యవృత్తేన = న్యాయసంమతమైన

ప్రవృత్తిగల, తేన=వానితో, సఖ్యం చ = స్నేహము కూడ, కర్తవ్యమ్=చేయ దగినది. లఘువిక్రమః = శీఘ్రమైన పరాక్రమము గల అతడు, ప్రీతః=సంతోషించినవాడై, తే = నీకు, సాహాయ్యమ్ = సాహాయ్యమును, కల్పయిష్యతి=చేయగలడు.

తా. రామా! న్యాయసంమతమైన నడవడిక గల ఆతనితో నీవు స్నేహము చేసికొనవలెను. శీఘ్రమైన పరాక్రమము గల అతడు సంతోషించి నీకు సాహాయ్యము చేయగలడు. 32

మూ. న హి తస్యాస్త్యవిజ్ఞాతం త్రిషు లోకేషు రాఘవ, 33
సర్వాన్ పరిసృతో లోకాన్ పురాసౌ కారణాన్తరే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ఏకసప్తతితమః సర్గః.

ప్ర. అ. రాఘవ = రామా ! త్రిషు లోకేషు = మూడు లోకములందూ, తస్య = వానికి, అవిజ్ఞాతమ్ = తెలియనిది, నాస్తి హి = లేదు. అసౌ = ఇతడు, పురా = పూర్వము, కారణాన్తరే = మరియొక కారణమునందు, సర్వాన్ = సమస్తమైన, లోకాన్ = లోకములను, పరిసృతః = సంచరించినాడు.

తా. రామా! ఈ మూడు లోకములలో ఆతనికి తెలియనిది లేదు. ఎందుచేత ననగా, ఒకానొక కారణముచేత అతడు అన్ని లోకములూ తిరిగినాడు. 33

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
డెబ్బదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విసప్తతితమః సర్గః

[రామలక్ష్మణులు కబంధుని దహించుట. అతడు దివ్యరూపము ధరించి సుగ్రీవునితో స్నేహము చేయుమని రామునకు చెప్పుట.]

మూ. ఏవముక్తౌ తు తౌ వీరౌ కబన్ధేన నరేశ్వరౌ,
గిరిప్రదరమాసాద్య పావకం విససర్జతుః. 1

ప్ర. అ. కబన్ధేన = కబంధునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తౌ = పలకబడిన, నరేశ్వరౌ = రాజులైన, తౌ వీరౌ = ఆ వీరులు, గిరిప్రదరమ్ = పర్వతముయొక్క లోయను, ఆసాద్య = పొందించి, పావకమ్ = అగ్నిని, విససర్జతుః = విడచిరి.

తా. కబంధుని మాటలు విని మనుష్యుల ప్రభువులు, వీరులు అయిన ఆ రామలక్ష్మణులు వానిని పర్వతము లోయలోనికి పడవేసి నిప్పు ముట్టించిరి. 1

మూ. లక్ష్మణస్తు మహోల్కాభిర్జ్వలితాభిః సమన్తతః,
చితామాదీపయామాస సా ప్రజజ్వాల సర్వతః. 2

ప్ర. అ. లక్ష్మణస్తు = లక్ష్మణుడైతే, జ్వలితాభిః = మండుచున్న, మహోల్కాభిః = పెద్ద కొరవులతో, సమన్తతః = నలు వైపులా, చితామ్ = చితను, ఆదీపయామాస = మండింపచేసెను. సా = ఆ చిత, సర్వతః = అంతటా, ప్రజజ్వాల = మండెను.

తా. లక్ష్మణుడు మండుచున్న కొరవులతో చితను నలుమూలలా మండింపచేయగా అది అంతటా మండెను. 2

మూ. తచ్ఛరీరం కబన్ధస్య ఘృతపిణ్డోపమం మహత్,
మేదసా పచ్యమానస్య మన్దం దహతి పావకః. 3

ప్ర. అ. మేదసా = కొవ్వుచేత, పచ్యమానస్య = ఉడుకుచున్న, కబన్ధస్య =

= కబంధునియొక్క, మహత్ = చాల పెద్దదైన, ఘృతపిణ్డోపమమ్=నేతి ముద్ద వలె ఉన్న, తత్ = ఆ, శరీరమ్ = శరీరమును, పావకః = అగ్ని, మన్దమ్ = మందముగా, దహతి = కాల్చెను.

తా. చాల పెద్దదైన ఆ కబంధుని దేహము నేతిముద్ద వలె ఉండెను. అది కొవ్వుతో ఉడుకుచుండుటచే అగ్ని దానిని చాల మెల్లగా కాల్చెను. 3

మూ. స విధూయ చితామాశు విధూమోఽగ్నిరివోత్థితః,
అరజే వాససీ బిభ్రన్మాలాం దివ్యాం మహాబలః. 4

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, సః = ఆతడు, అరజే = పరాగము లేని, వాససీ = వస్త్రములను, దివ్యామ్ = దివ్యమైన, మాలామ్ = మాలను, బిభ్రత్ = ధరించుచు, చితామ్ = చితను, విధూయ = త్రోసివేసి, ఆశు=వెంటనే, విధూమః = ధూమము లేని, అగ్నిరివ = అగ్ని వలె, ఉత్థితః = లేచెను.

తా. మహాబలవంతుడైన ఆ కబంధుడు, శుభ్రమైన వస్త్రములను, దివ్యమైన పుష్పములను ధరించి, ఆ చితను త్రోసివేసి ధూమము లేని అగ్ని వలె, పైకి లేచెను. 4

మూ. తతశ్చితాయా వేగేన భాస్వరో విమలామ్బరః,
ఉత్పపాతాశు సంహృష్టః సర్వప్రత్యఙ్గభూషణః. 5

ప్ర. అ. తతః = అటు పిమ్మట, భాస్వరః = ప్రకాశించుచున్న ఆ కబంధుడు, విమలామ్బరః = నిర్మలములైన వస్త్రములు కలవాడై, సంహృష్టః=సంతోషించినవాడై సర్వప్రత్యఙ్గభూషణః = సమస్త అవయవములయందు అలంకారములు కలవాడై, ఆశు = శీఘ్రముగా, వేగేన = వేగముతో, చితాయాః = చిత నుండి, ఉత్పపాత = పైకి లేచెను.

తా. పిదప ఆతడు ప్రకాశించుచున్న రూపముతో, నిర్మలములైన వస్త్రములు. ప్రతి అవయవమునందు భూషణములు ధరించి, సంతోషించుచు, వెంటనే ఆ చితనుండి వేగముగా పైకి లేచెను. 5

మూ. విమానే భాస్వరే తిష్ఠన్ హంసయుక్తే యశస్కరే,
ప్రభయా చ మహాతేజా దిశో దశ విరాజయన్. 6

సోఽన్తరిక్షగతో రామం కబన్ధో వాక్యమబ్రవీత్,
శృణు రాఘవ తత్త్వేన యథా సీతామవాప్స్యసి. 7

ప్ర. అ. సః కబన్ధః = ఆ కబంధుడు, అన్తరిక్షగతః = ఆకాశమును పొందినవాడై. హంసయుక్తే = హంసలచేత కట్టబడిన, యశస్కరే = కీర్తిని కలిగించు, భాస్వరే = ప్రకాశించుచున్న, విమానే = విమానమునందు, తిష్ఠన్ = ఉన్నవాడై, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడై, ప్రభయా = కాంతిచేత, దశ దిశః = పది దిక్కులను, విరాజయన్ = ప్రకాశింపచేయుచు, రామమ్ = రాముని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రాఘవ = రామా ! సీతామ్ = సీతను, యథా = ఎట్లు, అవాప్స్యసి = పొందగలవో, తత్త్వేన = యథార్థముగా, శృణు = వినుము.

తా. ఆ కబంధుడు ఆకాశమును పొంది, అక్కడ హంసలు కట్టిన, కీర్తిని కలిగించే ప్రకాశించుచున్న విమానమును ఎక్కి, మహాతేజస్సు కలవాడై, తన కాంతిచేత పది దిక్కులను ప్రకాశింపచేయుచు రామునితో ఇట్లు పలికెను. "రామా! నీకు సీత ఎట్లు లభించగలదో చెప్పెదను; వినుము." 6, 7

మూ. రామ షడ్యుక్తయో లోకే యాభిః సర్వం విమృశ్యతే,
పరిమృష్టో దశాన్తేన దశాభాగేన సేవ్యతే. 8

ప్ర. అ. రామ = రామా ! యాభిః = వేటిచేత, సర్వమ్ = సమస్తము, విమృశ్యతే = విమర్శించబడునో, అట్టి, షట్ = ఆరు, యుక్తయః = ఉపాయములు, లోకే = లోకములో ఉన్నవి. దశాన్తేన = దశావిపాకముచేత. పరిమృష్టః = స్పృశించబడినవాడు, దశాభాగేన = దశావిపాకము కలవానిచేత, సేవ్యతే = సేవింపబడును.

తా. రామా ! లోకములో కార్యములను సాధించుటకు సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అను ఆరు ఉపాయములున్నవి. దుర్దశ పరిపాకమునకు వచ్చినవాడు అదే విధముగ దుర్దశాపరిపాకముచే బాధపడువానిచేత సేవింపబడును.

వి. ప్రస్తుతము నీ దశ చెడ్డదిగా ఉన్నది. అందుచేతనే కష్టాలలో ఉన్నావు.

నీవలెనే చెడుదశతో బాధపడుచున్నవానితో నీకు స్నేహము యుక్తము అని భావము.

సంధి = శత్రురాజుతో సంధి చేసికొనుట. విగ్రహము = విరోధము కొనసాగించుట. యానము=యుద్ధానికి వెళ్లుట. ఆసనము=సమయానికి వేచి ఉండుట. ద్వైధీభావము = శత్రుపక్షములో భేదాలు సృష్టించుట. సమాశ్రయణము = మరొకనిని సహాయునిగా ఆశ్రయించుట. ఇవి ఆరు ఉపాయాలు. 8

మూ. దశాభాగగతో హీనస్త్వం హి రామ సలక్ష్మణః,
యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణమ్.

ప్ర. అ. రామ = రామా! సలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, త్వమ్ = నీవు, దశాభాగగతః = దుర్దశాఫలమును పొందినవాడవై, హీనః = చెడ్డ అవస్థలో ఉన్నావు. యత్కృతే = దేని మూలమున, త్వయా = నీచేత, దారప్రధర్షణమ్= భార్యావమానరూపమైన, వ్యసనమ్ = దుఃఖము, ప్రాప్తమ్ = పొందబడినదో.

తా. రామా! నీవు, లక్ష్మణుడు కూడ దుర్దశాఫలమును అనుభవించవలసి ఉండుటచేత ఇట్టి హీనపరిస్థితిలో ఉన్నారు. దీని మూలముననే నీకు భార్యావియోగరూపమైన దుఃఖము సంప్రాప్తించినది. 9

మూ. తదవశ్యం త్వయా కార్యః స సుహృత్సుహృదాం వర,
అకృత్వా హి న తే సిద్ధిమహం పశ్యామి చిన్తయన్. 10

ప్ర. అ. సుహృదామ్=మంచి హృదయము కలవారిలో, వర=శ్రేష్ఠుడా! తత్=ఆ కారణమువలన, సః=అట్టివాడు, త్వయా=నీచేత, అవశ్యమ్=తప్పక, సుహృత్ = మిత్రుడు, కార్యః=చేసుకొనదగినవాడు. అకృత్వా= స్నేహితుని చేసికొనకుండగా, తే = నీకు, సిద్ధిమ్ = సిద్ధిని, అహమ్=నేను, చిన్తయన్=ఆలోచించుచు, న పశ్యామి = చూడను.

తా. మంచి హృదయము కలవారిలో శ్రేష్ఠుడవైన రామా! ఆ కారణముచే, నీవు తప్పక మిత్రుణ్ణి సంపాదించవలెను. మిత్రుణ్ణి సంపాదించకుండా నీకు కార్యసిద్ధి కలుగ దనియే, ఆలోచించగా నాకు తోచుచున్నది. 10

మూ. శ్రూయతాం రామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః,
భ్రాతా నిరస్తః క్రుద్ధేన వాలినా శక్రసూనునా. 11

ప్ర. అ. రామ=రామా! వక్ష్యామి = చెప్పెదను. శ్రూయతామ్=వినబడు గాక. శక్రసూనునా = ఇంద్రుని పుత్రుడు, భ్రాతా = సోదరుడు, క్రుద్ధేన = కోపించినవాడు అయిన, వాలినా = వాలిచేత, నిరస్తః = (రాజ్యమునుండి) వెడల గొట్టబడిన, సుగ్రీవో నామ = సుగ్రీవు డనే, వానరః = వానరుడు, (ఉన్నాడు).

తా. రామా! చెప్పుచున్నాను; వినుము. సుగ్రీవు డనే వానరుడు ఉన్నాడు. ఆతనిని ఇంద్రుని కుమారుడైన వాలి అనే సోదరుడు కోపించి, రాజ్యమునుండి వెడలగొట్టినాడు. 11

మూ. ఋశ్యమూకే గిరివరే పమ్పాపర్యన్తశోభితే,
నివసత్యాత్మవాన్వీరశ్చతుర్భిః సహ వానరైః. 12

ప్ర. అ. ఆత్మవాన్=బుద్ధి మంతుడు, వీరః=వీరుడు అయిన సుగ్రీవుడు, పమ్పాపర్యన్తశోభితే=పంపానదీప్రాంతమునందు ప్రకాశించుచున్న, ఋశ్యమూకే= ఋశ్యమూక మనే, గిరివరే=పర్వతశ్రేష్ఠమునందు, చతుర్భిః=నలుగురు, వానరైః సహ = వానరులతో కూడ, నివసతి = నివసించుచున్నాడు.

తా. బుద్ధిమంతుడు, వీరుడు అయిన ఆ సుగ్రీవుడు, పంపానదీప్రాంతము నందు ప్రకాశించుచున్న ఋశ్యమూక మనే పర్వతశ్రేష్ఠమునందు, నలుగురు వానరులతో కూడా నివసించుచున్నాడు. 12

మూ. వానరేన్ద్రో మహావీర్యస్తేజోవానమితప్రభః,
సత్యసన్ధో వినీతశ్చ ధృతిమాన్మతిమాన్మహాన్. 13

ప్ర. అ. వానరేన్ద్రః = వానరులలో శ్రేష్ఠుడైన ఆ సుగ్రీవుడు, మహావీర్యః = గొప్ప పరాక్రమము కలవాడు. తేజోవాన్ = తేజస్సు కలవాడు. అమితప్రభః =అమితమైన కాంతి గలవాడు. సత్యసన్ధః=సత్యమైన ప్రతిజ్ఞ గలవాడు. వినీతః = వినయవంతుడు, ధృతిమాన్ = ధైర్యవంతుడు, మతిమాన్ = బుద్ధిమంతుడు, మహాన్ = గొప్పవాడు

తా. వానరనాయకుడైన ఆ సుగ్రీవుడు గొప్ప పరాక్రమము, తేజస్సు,

సాటిలేని కాంతి గలవాడు, సత్యసంధుడు, వినయవంతుడు, ధైర్యవంతుడు, బుద్ధిశాలి, గొప్పవాడు. 13

మూ. దక్షః ప్రగల్భో ద్యుతిమాన్ మహాబలపరాక్రమః,
భ్రాత్రా వివాసితో రామ రాజ్యహేతోర్మహాబలః. 14

ప్ర. అ. రామ = రామా ! దక్షః = సమర్థుడు, ప్రగల్భః = ప్రగల్భుడు, ద్యుతిమాన్ = కాంతి గలవాడు, మహాబలపరాక్రమః = గొప్ప బలపరాక్రమములు కలవాడుఅయిన, మహాబలః = గొప్ప బలము గల ఆ సుగ్రీవుడు, రాజ్యహేతోః = రాజ్యము మూలమున, భ్రాత్రా = సోదరుని చేత, వివాసితః = దూరముగా పంపి వేయబడినాడు.

తా. రామా ! గొప్ప బలముగల ఆ సుగ్రీవుడు సమర్థుడు. ప్రగల్భుడు, కాంతి గలవాడు, గొప్ప బలపరాక్రమములు గలవాడు. ఆతనిని రాజ్యము మూలమున సోదరుడైన వాలి బైటకు పంపివేసినాడు. 14

మూ. స తే సహాయో మిత్రం చ సీతాయాః పరిమార్గణే,
భవిష్యతి హితే రామ మా చ శోకే మనః కృథాః. 15

ప్ర. అ. రామ = రామా ! సః = అతడు, తే = నీకు, మిత్రమ్ = మిత్రుడుగాను, సీతాయాః = సీతయొక్క, పరిమార్గణే = అన్వేషణమునందు, సహాయః = సహాయుడుగాను, హితే = నీకు హితమునం దున్నవాడుగాను, భవిష్యతి = కాగలడు. శోకే = శోకమునందు, మనః = మనస్సును, మా కృథాః = చేయకుము.

తా. రామా ! ఆతడు నీకు మిత్రుడై సీతను వెదకుటలో సాహాయ్యము చేయగలడు. నీకు హితము చేకూర్చగలడు. నీ మనస్సునకు శోకము కలుగనీయకుము. 15

మూ. భవితవ్యం హి యచ్చాపి న తచ్ఛక్యమిహాన్యథా,
కర్తుమిక్ష్వాకుశార్దూల కాలో హి దురతిక్రమః. 16

ప్ర. అ. ఇక్ష్వాకుశార్దూల = ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడవైన రామా ! యచ్చాపి = ఏది, భవితవ్యమ్ = కాదగి యున్నదో, తత్ = అది, అన్యథా = మరొక

విధంగా, కర్తుమ్ = చేయుటకు, న శక్యమ్ = శక్యము కాదు. కాలః = కాలము, దురతిక్రమః హి = అతిక్రమింపశక్యము కానిది కదా!

తా. ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడవైన రామా! ఏది కాదగి యున్నదో అది మరొక విధముగా చేయుటకు శక్యము కాదు. కాలమును ఎవ్వరూ అతిక్రమింప జాలరు కదా? 16

మూ. గచ్ఛ శీఘ్రమితో రామ సుగ్రీవం తం మహాబలమ్,
వయస్యం తం కురు క్షిప్రమితో గత్వాద్య రాఘవ, 17
అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ.

ప్ర. అ. రామ=రామా! ఇతః = ఇక్కడినుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, మహాబలమ్ = మహాబలశాలియైన, తం సుగ్రీవమ్ = ఆ సుగ్రీవుణ్ణి గూర్చి, గచ్ఛ = వెళ్ళుము. రాఘవ=రామా! అద్య = ఇప్పుడే, ఇతః=ఇక్కడినుండి, క్షిప్రమ్ = శీఘ్రముగా, గత్వా=వెళ్ళి, అద్రోహాయ=ద్రోహము లేకుండుటకై, విభావసౌ = అగ్ని, దీప్యమానే= ప్రజ్వలించుచుండగా, తమ్ = ఆతనిని, వయస్యమ్ = మిత్రునిగా, కురు = చేసికొనుము.

తా. రామా! నీవు ఇక్కడినుండి బయలుదేరి శీఘ్రముగా బలశాలియైన ఆ సుగ్రీవుని వద్దకు వెళ్ళుము. రామా! నీవు ఇప్పుడే శీఘ్రముగా వెళ్ళి, అగ్ని మండుచుండగా(అగ్నిసాక్షిగా) ఆతనితో మైత్రి ఏర్పరచుకొనుము. అట్లు చేసినచో మిత్రద్రోహ మనునది ఉండదు. 17

మూ. న చ తే నావమన్తవ్యః సుగ్రీవో వానరాధిపః, 18
కృతజ్ఞః కామరూపీ చ సహాయార్థీ చ వీర్యవాన్.

('వానరాధిపః'కు బదులు "వానరోఽపి సన్"అను ప్రాచ్యపాఠము బాగున్నది).

ప్ర. అ. వానరోఽపి సన్ = వానరుడే యైనను, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, తే = నీకు, నావమన్తవ్యః = అవమానింపదగినవాడు కాదు. అతడు, కృతజ్ఞః = కృతజ్ఞుడు, కామరూపీ చ = స్వేచ్ఛారూపము గలవాడు. సహాయార్థీ చ = సహాయుని అపేక్ష గలవాడు. వీర్యవాన్ = పరాక్రమవంతుడు.

తా. ఇతడు వానరుడే కదా అని నీవు సుగ్రీవుని అవమానించరాదు. అతడు కృతజ్ఞుడు. స్వేచ్ఛానుసారము రూపము ధరించగలవాడు. సాహాయ్యము చేసేవారి అవసర మున్నవాడు, పరాక్రమవంతుడు. 18

మూ. శక్తౌ హ్యద్య యువాం కర్తుం కార్యం తస్య చికీర్షితమ్, 19
కృతార్థో వాఽకృతార్థో వా కృత్యం తవ కరిష్యతి.

ప్ర. అ. యువామ్ = మీరిద్దరు, అద్య = ఇప్పుడు, తస్య = ఆ సుగ్రీవుని యొక్క, చికీర్షితమ్ = చేయదలచిన, కార్యమ్ = కార్యమును, కర్తుమ్ = చేయుటకు, శక్తౌ హి = సమర్థులే కదా. కృతార్థో వా = కృతార్థుడైనా, అకృతార్థో వా = కృతార్థుడు కాకపోయినా, తవ = నీయొక్క, కృత్యమ్ = కార్యమును, కరిష్యతి = చేయగలడు.

తా. మీరిద్దరూ ఇపుడు అతడు చేయగోరుచున్న కార్యమును సాధించుటకు సమర్థులే. తన కార్యము సఫలమైనా కాకపోయినా కూడ అతడు నీ పని చేయగలడు. 19

మూ. స ఋక్షరజసః పుత్రః పమ్పామటతి శఙ్కితః, 20
భాస్కరస్యౌరసః పుత్రో వాలినా కృతకిల్బిషః.

ప్ర. అ. ఋక్షరజసః = ఋక్షరజస్సు అను వానరునియొక్క, పుత్రః = పుత్రుడు, భాస్కరస్య = సూర్యునియొక్క, ఔరసః పుత్రః = ఔరసపుత్రుడు అయిన, సః = ఆ సుగ్రీవుడు, వాలినా = వాలిచేత, కృతకిల్బిషః = చేయబడిన పాపము కలవాడై, శఙ్కితః = భయపడుచున్నవాడై, పమ్పామ్ = పంపానదిని, అటతి = తిరుగుచున్నాడు.

తా. ఆ సుగ్రీవుడు ఋక్షరజస్సు అను వానరుని భార్యకు సూర్యునివలన పుట్టినాడు. అందుచే ఋక్షరజస్సుకు క్షేత్రజపుత్రుడు. సూర్యునకు ఔరసపుత్రుడు. వాలి ఆతని విషయమున పాపముగా ప్రవర్తించుటచే ఆతనికి భయపడుచు పంపానదీప్రాంతమున తిరుగుచున్నాడు. 20

మూ. సంనిధాయాయుధం క్షిప్రమృశ్యశృఙ్గాలయం కపిమ్, 21
కురు రాఘవ సత్యేన వయస్యం వనచారిణమ్.

ప్ర. అ. రాఘవ = రామా : ఆయుధమ్ = ఆయుధమును, సంనిధాయ = దగ్గర ఉంచుకొని, వనచారిణమ్ = వనములలో సంచరించుచున్న, ఋష్యశృఙ్గాలయమ్ = ఋష్యశృంగపర్వతము నివాసముగా గల, కపిమ్ = వానరుడైన సుగ్రీవుని, సత్యేన = సత్యముచేత, క్షిప్రమ్ = శీఘ్రముగా, వయస్యమ్ = మిత్రునిగా, కురు = చేసికొనుము.

తా. రామా: ఆ సుగ్రీవుడు అడవులలో తిరుగుచు ఋష్యశృంగపర్వతము మీద ఉన్నాడు. నీవు ఆయుధధారివై అక్కడికి వెళ్ళి, సత్యముపై శపథము చేసి, వెంటనే, ఆతనితో మైత్రి చేసికొనుము. 21

మూ. స హి స్థానాని సర్వాణి కార్త్స్న్యేన కపికుఞ్జరః, 22
నరమాంసాశినాం లోకే నైపుణ్యాదధిగచ్ఛతి.

ప్ర. అ. కపికుఞ్జరః = వానరులలో శ్రేష్ఠుడైన, సః = ఆ సుగ్రీవుడు, లోకే = ఈ లోకమునందు, నరమాంసాశినామ్ = నరమాంసమును తినే రాక్షసుల యొక్క, సర్వాణి = సమస్తమైన, స్థానాని = స్థానములను, కార్త్స్న్యేన = పూర్తిగా, నైపుణ్యాత్ = నేర్పువలన, అధిగచ్ఛతి హి = తెలిసికొని ఉన్నాడు కదా.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ సుగ్రీవునకు లోకములో ఉన్న నరమాంసభక్షకులైన రాక్షసుల స్థానము లన్నీ పూర్తిగా తెలియును. ఆతని నేర్పు అట్టిది. 22

మూ. న తస్యావిదితం లోకే కించిదస్తి హి రాఘవ, 23
యావత్సూర్యః ప్రతపతి సహస్రాంశురరిందమ.

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడవైన, రాఘవ = రామా ! సహస్రాంశుః = వెయ్యి కిరణములు గల, సూర్యః = సూర్యుడు, యావత్ = ఎంతవరకు, ప్రతపతి = తపించుచున్నాడో, అంతవరకూ ఉన్న, లోకే = లోకమునందు, తస్య = ఆతనికి, అవిదితమ్ = తెలియనిది, కించిత్ = ఏదీ కూడ, నాస్తి హి = లేదు కదా.

తా. శత్రుసంహారకుడవైన రామా ! ఈ లోకములో సహస్రకిరణుడైన సూర్యుడు ఎంతవరకు తన ప్రకాశమును వ్యాపింపచేయుచున్నాడో అంతవరకు ఆ సూర్యపుత్రునకు తెలియనిది ఏదీ లేదు. 23

మూ. స నదీర్విపులాన్ శైలాన్ గిరిదుర్గాణి కన్దరాన్, 24
అన్వీక్ష్య వానరైః సార్ధం పత్నీం తేఽధిగమిష్యతి.

ప్ర. అ. సః = అతడు, వానరైః సార్ధమ్ = వానరులతో కూడ, నదీః = నదులను, విపులాన్ = విశాలములైన, శైలాన్ = పర్వతములను, గిరిదుర్గాణి = పర్వతదుర్గములను, కన్దరాన్ = గుహలను, అన్వీక్ష్య = వెదకి, తే = నీయొక్క, పత్నీమ్ = భార్యను, అధిగమిష్యతి = పొందగలడు.

తా. అతడు వానరులతో కలిసి వెళ్ళి నదులను విశాలములైన పర్వతములను పర్వతదుర్గములను గుహలను వెదకి నీభార్య జాడ తెలిసికొనగలడు. 24

మూ. వానరాంశ్చ మహాకాయాన్ ప్రేషయిష్యతి రాఘవ, 25
దిశో విచేతుం తాం సీతాం త్వద్వియోగేన శోచతీమ్,
స జ్ఞాస్యతి వరారోహాం నిర్మలాం రావణాలయే. 26

ప్ర. అ. రాఘవ = రామా! త్వద్వియోగేన = నీ వియోగముచేత, శోచతీమ్ = దుఃఖించుచున్న, తాం సీతామ్ = ఆ సీతను, విచేతుమ్ = వెదకుటకు, మహాకాయాన్ = పెద్ద శరీరములు గల, వానరాంశ్చ = వానరులను కూడ, దిశః = దిక్కులను గూర్చి, ప్రేషయిష్యతి = పంపగలడు. సః = అతడు, రావణాలయే = రావణుని గృహమునందున్న, నిర్మలామ్ = పవిత్రురాలైన, వరారోహామ్ = అందమైన కటిప్రదేశము గల సీతను గూర్చి, జ్ఞాస్యతి = తెలుసుకొనగలడు.

తా. నీ వియోగముతో దుఃఖించుచున్న సీతను అన్వేషించుటకై అతడు పెద్ద శరీరములు గల వానరులను అన్ని దిక్కులకు పంపగలడు కూడ. ఈ విధముగ అతడు రావణుని ఇంటిలో ఉన్న సీతను గూర్చి తెలిసికొనగలడు. 25, 26

మూ. స మేరుశృఙ్గాగ్రగతామనిన్దితాం
ప్రవిశ్య పాతాలతమేఽపి వా శ్రితామ్,
ప్లవఙ్గమానాం ప్రవరస్తవ ప్రియాం
నిహత్య రక్షాంసి పునః ప్రదాస్యతి. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
ద్విసప్తతితమః సర్గః.

ప్ర. అ. ప్లవఙ్గమానామ్ = వానరులలో, ప్రవరః = శ్రేష్ఠుడైన, సః = అతడు, అనిన్దితామ్ = నిందింపబడని, తవ ప్రియామ్ = నీ ప్రియురాలిని, మేరుశృఙ్గాగ్రగతామ్ = మేరుపర్వతశిఖరాగ్రమునందు ఉన్నా, పాతాలతలే = పాతాలతలమునందు, శ్రితాం వాపి = ఆశ్రయించిఉన్నా, ప్రవిశ్య = అచటికి ప్రవేశించి, రక్షాంసి = రాక్షసులను, నిహత్య = చంపి, పునః = మరల, ప్రదాస్యతి = ఇవ్వగలడు.

తా. ఎట్టి దోషములూ లేని నీ ప్రియురాలు మేరుపర్వతశిఖరాగ్రమునందున్నా, పాతాళలోకములో ఉన్నా, ఆ వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు అక్కడికి వెళ్ళి, రాక్షసులను సంహరించి, మరల తీసికొనివచ్చి ఇవ్వగలడు. 27

''బాలానందిని'' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అరణ్యకాండలో డెబ్బదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిసప్తతితమః సర్గః

[కబంధుడు ఋష్యమూకపర్వతపంపాసరోమార్గములు వర్ణించి చెప్పి, మతంగముని వనమార్గము కూడ తెలిపి రాముని అనుమతితో స్వస్థానమునకు వెళ్ళిపోవుట.]

మూ. దర్శయిత్వా తు రామాయ సీతాయాః పరిమార్గణే,
వాక్యమన్వర్థమర్థజ్ఞః కబన్ధః పునరబ్రవీత్. 1

ప్ర. అ. అర్థజ్ఞః=కార్యమును ఎరిగిన, కబన్ధః=కబంధుడు, సీతాయాః=సీతయొక్క. పరిమార్గణే=అన్వేషణము విషయమున, దర్శయిత్వా=ఉపాయమును చూపి, అన్వర్థమ్=సరియైన అర్థము గల, వాక్యమ్ = వాక్యమును, పునః=మరల, అబ్రవీత్=పలికెను.

తా. ప్రయోజనమును బాగుగా తెలుసుకొనగలిగిన కబంధుడు సీతాన్వేషణము నిమిత్తమై రామునకు ఉపాయమును చెప్పి, ఉత్తమమైన అర్థము గల వాక్యమును మరల పలికెను. 1

మూ. ఏష రామ శివః పన్థా యత్రైతే పుష్పితా ద్రుమాః,
ప్రతీచీం దిశమాశ్రిత్య ప్రకాశన్తే మనోరమాః. 2

జమ్బూప్రియాళపనసప్లక్షన్యగ్రోధసిన్దుకాః,
అశ్వత్థాః కర్ణికారాశ్చ చూతాశ్చాన్యే చ పాదపాః. 3

ధన్వనా నాగవృక్షాశ్చ తిలకా నక్తమాలకాః,
నీలాశోకాః కదమ్బాశ్చ కరవీరాశ్చ పుష్పితాః, 4
అగ్నిముఖ్యా అశోకాశ్చ సురక్తాః పారిభద్రకాః.

ప్ర. అ. రామ=రామా! యత్ర=ఎక్కడ, ప్రతీచీమ్=పశ్చిమమైన,

దిశమ్ = దిక్కును, ఆశ్రిత్య = ఆశ్రయించి, మనోరమాః = మనోహరమైన, పుష్పితాః = పుష్పించిన, ద్రుమాః = చెట్లు, జమ్బూప్రియాళపనసప్లక్షన్యగ్రోధ సిన్దుకాః = నేరేడు, మోరటి, పనస, జువ్వి, మఱ్ఱి, తుమ్మికటుచెట్లు, అశ్వత్థాః = రావిచెట్లు, కర్ణికారాశ్చ = కొండగోగుచెట్లు, చూతాశ్చ = మామిడిచెట్లు, అన్యే చ = ఇతరములైన, పాదపాః = వృక్షములు, ధన్వనాః = చంద్రచెట్లు, నాగ వృక్షాశ్చ = పొన్నచెట్లు, తిలకాః = బొగ్గుచెట్లు, నక్తమాలకాః = కానుగుచెట్లు, నీలాశోకాః = నల్లని అశోకవృక్షములు, కదమ్బాశ్చ = కదంబవృక్షములు, పుష్పితాః = పుష్పించిన, కరవీరాశ్చ = గన్నేరుచెట్లు, అగ్నిముఖ్యాః = భల్లాతక వృక్షములు, అశోకాశ్చ = అశోకవృక్షములు, సురక్తాః = రక్తచందనవృక్షములు, పారిభద్రకాః = వేపచెట్లు, ప్రకాశన్తే = ప్రకాశించుచున్నవో, ఏషః = ఇది, శివః = మంగళకరమైన, పన్థాః = మార్గము.

తా. రామా ! పశ్చిమదిక్కు వైపున ఎక్కడ పుష్పించిన వృక్షములు ఉన్నవో, నేరేడు, మోరటి, పనస, జువ్వి, మఱ్ఱిచెట్లు, తుమ్మికచెట్లు, రావిచెట్లు, కొండగోగు చెట్లు, మామిడిచెట్లు, చంద్రచెట్లు, పొన్నచెట్లు, బొగ్గుచెట్లు, కానుగు చెట్లు, నల్లని అశోకవృక్షములు, కదంబవృక్షములు, పుష్పించిన గన్నేరుచెట్లు, భల్లాతకవృక్షములు, అశోకవృక్షములు, రక్తచందనవృక్షములు, వేపచెట్లు, ప్రకాశించుచున్నవో అది మంగళకరమైన మార్గము. 2-4

మూ. తానారుహ్యాథవా భూమౌ పాతయిత్వా చ తాన్ బలాత్, 5
ఫలాన్యమృతకల్పాని భక్షయన్తౌ గమిష్యథః.

ప్ర. అ. తాన్ = ఆ వృక్షములను, ఆరుహ్య = ఎక్కి, అథవా = లేదా, బలాత్ = బలమువలన, తాన్ = వాటిని, పాతయిత్వా = పడగొట్టి, అమృత కల్పాని = అమృతముతో సమానములైన, ఫలాని = ఫలములను, భక్షయిత్వా = భక్షించి, గమిష్యథః = వెళ్ళగలరు.

తా. ఆ వృక్షములను ఎక్కిగాని, బలముచేత క్రిందికి పడగొట్టి గాని వాటి అమృతము వంటి ఫలములను భక్షించుచు వెళ్ళుడు. 5

మూ. తదతిక్రమ్య కాకుత్స్థ వనం పుష్పితపాదపమ్, 6
నన్దనప్రతిమం చాన్యత్కురవో హ్యుత్తరా ఇవ.

ప్ర. అ. కాకుత్థ్స = రామా ! పుష్పితపాదపమ్ = పుష్పించిన వృక్షములు గల, తత్ = ఆ, వనమ్ = వనమును, అతిక్రమ్య = దాటి, నన్దనప్రతిమమ్ = నందనవనముతో సమానము, ఉత్తరాః కురవః ఇవ = ఉత్తరకురుదేశము వలె ఉన్నదీ అయిన, అన్యత్ = మరియొక వనము (ఉన్నది).

తా. రామా ! పుష్పించిన వృక్షములు గల ఆ వనమును దాటిన పిమ్మట, నందనవనముతో సమానము, ఉత్తరకురుదేశతుల్యమూ అయిన మరొక వనము ఉన్నది. 6

మూ. సర్వకాలఫలా యత్ర పాదపా మధురస్రవాః, 7
సర్వే చ ఋతవస్తత్ర వనే చైత్రరథే యథా.

ప్ర. అ. యత్ర = ఎక్కడ, సర్వకాలఫలాః = అన్ని కాలములయందు ఫలములు గల, పాదపాః = వృక్షములు, మధురస్రవాః = మధురమైన రసము గలవో, తత్ర వనే = ఆ వనమునందు, సర్వే = సమస్తమైన, ఋతవః = ఋతువులు, చైత్రరథే యథా = చైత్రరథమునందు వలె, ఉండును.

తా. ఆ వనమునందు వృక్షములు అన్ని కాలములయందు ఫలముల నిచ్చును. మధురమైన రసము గలవి. చైత్రరథమునందు వలె ఆ వనమునందు అన్ని ఋతువులు ఒకే సమయమునం దుండును. 7

మూ. ఫలభారానతాస్తత్ర మహావిటపధారిణః, 8
శోభన్తే సర్వతస్తత్ర మేఘపర్వతసన్నిభాః.

ప్ర. అ. తత్ర = అక్కడ, ఫలభారానతాః = ఫలముల భారముచేత వంగిన, మేఘపర్వతసన్నిభాః = మేఘములతోను, పర్వతములతోను సమానములైన, మహావిటపధారిణః = పెద్ద కొమ్మలను ధరించిన వృక్షములు, శోభన్తే = శోభించుచున్నవి.

తా. ఆ వనమునందు పెద్ద కొమ్మలు గల వృక్షములు, పండ్లభారముచేత వంగినవై, మేఘముల వలె, పర్వతముల వలె ప్రకాశించుచుండును. 8

మూ. తానారుహ్యాథవా భూమౌ పాతయిత్వా యథాసుఖమ్, 9
ఫలాన్యమృతకల్పాని లక్ష్మణస్తే ప్రదాస్యతి.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, తాన్ = ఆ వృక్షములను, ఆరుహ్య = ఎక్కి, అథవా = లేదా, యథాసుఖమ్ = సుఖముగా, పాతయిత్వా = క్రిందికి రాల్చి, అమృతకల్పాని = అమృతముతో సమానములైన, ఫలాని = ఫలములను, తే = నీకు, ప్రదాస్యతి = ఇవ్వగలడు.

తా. లక్ష్మణుడు ఆ చెట్లను ఎక్కి గాని లేదా క్రిందికి పడగొట్టి గాని అమృతము వంటి ఫలములను నీకు ఇవ్వగలడు. 9

మూ. చఙ్క్రమాణౌ వరాన్ దేశాన్ శైలాచ్ఛైలం వనాద్వనమ్,
తతః పుష్కరిణీం వీరౌ పమ్పాం నామ గమిష్యథః. 10

ప్ర. అ. వీరౌ = వీరులారా! శైలాత్ = పర్వతమునుండి, శైలమ్ = పర్వతమును, వనాత్ = వనమునుండి, వనమ్ = వనమును, చఙ్క్రమాణౌ = నడచుచు, తతః = అటుపిమ్మట, పమ్పాం నామ = పంప అనే, పుష్కరిణీమ్ = పద్మసరస్సును, గమిష్యథః = పొందగలరు.

తా. వీరులారా! పర్వతమునుండి పర్వతమునకు, వనమునుండి వనమునకు వెళ్ళుచు, అక్కడినుండి పంప అనే పద్మసరస్సును గూర్చి వెళ్లుడు. 10

మూ. అశర్కరామవిభ్రంశాం సమతీర్థామశైవలామ్, 11
రామ సంజాతవాలాకాం కమలోత్పలశాలినీమ్.

ప్ర. అ. రామ = రామా! అశర్కరామ్ = గులకరాళ్ళులేనిదీ, అవిభ్రంశామ్ = జారుడు లేనిదీ, సమతీర్థామ్ = సమానమైన రేవులు గలది, అశైవలామ్ = నాచు లేనిదీ, సంజాతవాలాకామ్ = పుట్టిన ఇసుక తిన్నెలు గలది, కమలోత్పలశాలినీమ్ = పద్మములతోను నల్లకలవలతోను ప్రకాశించుచున్నది అయిన పంపానదిని గూర్చి వెళ్ళుడు.

తా. ఆ పంపాసరస్సులో గులకరాళ్ళు గాని, జారుడు ప్రదేశము గాని, నాచు గాని ఉండదు. రేవులు సమముగా ఉండును. అక్కడక్కడ ఇసుకతిన్నెలు ఏర్పడి ఉండును. పద్మములతోను, నల్లకలవలతోను ప్రకాశించుచుండును. 11

మూ. తత్ర హంసాః ప్లవాః క్రౌఞ్చాః కురరాశ్చైవ రాఘవ, 12
వల్గుస్వనా నికూజన్తి పమ్పాసలిలగోచరాః.

ప్ర. అ. రాఘవ = రామా ! తత్ర = అక్కడ, పమ్పాసలిలగోచరాః = పంపాసరస్సు నీటిలో నివసించు, హంసాః = హంసలు, ప్లవాః = నీరుకోళ్ళు, క్రౌఞ్చాః = క్రౌంచపక్షులు, కురరాశ్చైవ = కురరపక్షులు, వల్గుస్వనాః = మధురములైన ధ్వనులు కలవై, వికూజన్తి = కూయుచుండును.

తా. రామా ! అక్కడ హంసలు, నీరుకోళ్ళు, క్రౌంచపక్షులు, కురరపక్షులు పంపాజలములో ఉన్నవై మధురమైన ధ్వనులతో కూయుచుండును. 12

మూ. నోద్విజన్తే నరాన్ దృష్ట్వా వధస్యాకోవిదాః శుభాః, 13
ఘృతపిణ్డోపమాన్ స్థూలాంస్తాన్ ద్విజాన్ భక్షయిష్యథః.

ప్ర. అ. వధస్య = వధకు, అకోవిదాః=ఎగిరినవి కాని, శుభాః = శుభములైన ఆ పక్షులు, నరాన్ = మనుష్యులను, దృష్ట్వా = చూచి, నోద్విజన్తే = భయపడవు. ఘృతపిణ్డోపమాన్ = నేతిముద్దలతో సమానములైన, స్థూలాన్=స్థూలములైన, తాన్ = ఆ, ద్విజాన్ = పక్షులను, భక్షయిష్యథః = భక్షించగలరు.

తా. చంపుట అనేది తెలియని ఉత్తమములైన ఆ పక్షులు మనుష్యులను చూచి బెదరవు. నేతిముద్దల వలె ఉన్న పెద్ద ప్రమాణములో ఉన్న ఆ పక్షులను మీరు భక్షించవచ్చును. 13

మూ. రోహితాన్వక్రతుణ్డాంశ్చ నడమీనాంశ్చ రాఘవ, 14
పమ్పాయామిషుభిర్మత్స్యాం స్తత్ర రామ వరాన్ హతాన్.
నిస్త్వక్పక్షానయ స్తప్తానకృశానేకకణ్టకాన్, 15
తవ భక్త్యా సమాయుక్తో లక్ష్మణః సంప్రదాస్యతి.

ప్ర. అ. రాఘవ = రఘువంశసంజాతుడవైన, రామ = రామా ! తత్ర= అక్కడ, పమ్పాయామ్ = పంపాసరస్సునందు, ఇషుభిః=బాణములచేత, హతాన్ = చంపబడినవి, వరాన్ = శ్రేష్ఠములైనవి, నిస్త్వక్పక్షాన్ = చర్మ రెక్కలు లేనివి, అయస్తప్తాన్ = ఇనుముమీద కాల్చబడినవి, అకృశానేకకణ్టకాన్ = చిక్కినవి గాని అనేకమైన ముళ్ళుకలవి గాని కానివి అయిన, మత్స్యాన్=మత్స్యములను, రోహితాన్ = గండుమీనులను, వక్రతుణ్డాంశ్చ = చౌరమీనులను, నడమీనాంశ్చ = రొయ్యమీనులను, లక్ష్మణః = లక్ష్మణుడు, భక్త్యా = భక్తితో, సమాయుక్తః = కూడినవాడై, తవ = నీకు, సంప్రదాస్యతి=ఇవ్వగలడు.

తా. రఘువంశమునందు పుట్టిన రామా! ఆ పంపాసరస్సులో శ్రేష్ఠములైనవి, బలిసినవి, చాల ముళ్ళు లేనివి అయిన మత్స్యములను, గండుమీనులను, చొరమీనులను, రొయ్యమీనులను, లక్ష్మణుడు బాణములచేత చంపి, వాటి చర్మలను రెక్కలను తీసివేసి, ఇనుముమీద కాల్చి భక్తిపురఃసరముగా నీకు సమర్పించగలడు. 14,15

మూ. భృశం తే ఖాదతో మత్స్యాన్ పమ్పాయాః పుష్పసంచయే,
పద్మగన్ధి శివం వారి సుఖశీతమనామయమ్,
ఉద్ధృత్య సతతాక్లిష్టం రౌప్యస్ఫాటికసన్నిభమ్, 17
అసౌ పుష్కరపర్ణేన లక్ష్మణః పాయయిష్యతి.

ప్ర. అ. భృశమ్ = మిక్కిలి, మత్స్యాన్ = మత్స్యములను, ఖాదతః = తినుచున్న, తే = నీకు, పుష్పసంచయే = పుష్పముల సముదాయమునం దున్నది, పద్మగన్ధి = పద్మాల సువాసన గలది, శివమ్ = మంగళప్రదము, సుఖశీతమ్ = సుఖకరముగాను, చల్లగాను ఉన్నది, అనామయమ్ = రోగము లేనిది, సతతాక్లిష్టమ్ = ఎల్లప్పుడూ నిర్మలముగా ఉండేది, రౌప్యస్ఫాటికసంనిభమ్ = వెండితోను స్ఫటికముతోను సమానము, అయిన, వారి = ఉదకమును, అసౌ = ఈ, లక్ష్మణః = లక్ష్మణుడు, పుష్కరపర్ణేన = తామరాకుచేత, పాయయిష్యతి = త్రాగించగలడు.

తా. నీవు మత్స్యములను అధికముగా తినుచుండగా, లక్ష్మణుడు పంపాసరస్సులోని పుష్పసముదాయములో ఉన్నది, పద్మముల సువాసన గలది, మంగళప్రదము. సుఖకరము, చల్లనిది, ఆరోగ్యకరము, ఎల్లప్పుడు వెండి వలె, స్ఫటికము వలె నిర్మలముగా ఉండేది, అయిన ఉదకమును తామరాకుడొప్పలో తీసికొనివచ్చి నీకు త్రాగించగలడు. 16, 17

మూ. స్థూలాన్ గిరిగుహాశయ్యాన్ వరాహాన్ వనచారిణః, 18
అపాం లోభాదుపావృత్తాన్ వృషభానివ నర్దతః,
రూపాన్వితాంశ్చ పమ్పాయాం ద్రక్ష్యసి త్వం నరోత్తమ.

ప. అ. నరోత్తమ = నరులలో ఉత్తముడవైన రామా! స్థూలాన్ =

లావైనవి, గిరిగుహాశయ్యాన్ = పర్వతగుహలు శయ్యలుగా గలవి, వనచారిణః = వనమునందు సంచరించేవి, అపామ్ = నీటియొక్క, లోభాత్ = ఆశవలన, ఉపావృత్తాన్ = వచ్చినవి, వృషభానివ = ఎద్దుల వలె, నర్దతః = ధ్వనిచేయుచున్నవి, రూపాన్వితాన్ = మంచి ఆకారముతో కూడినవి అయిన, వరాహాన్ = వరాహములను, పమ్పాయామ్ = పంపాసరస్సునందు, త్వమ్ = నీవు, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. నరులలో శ్రేష్ఠుడవైన రామా! నీకు పంపాసరస్సు దగ్గర నీరు త్రాగుటకై వచ్చిన, మంచి ఆకారము గల అడవిపందులు కనబడును. చాల లావుగా ఉన్న ఆ అడవిపందులు అరణ్యములో సంచరించుచు గుహలలో శయనించుచుండును. అవి ఆబోతుల వలె రంకెలు వేయుచుండును. 18, 19

మూ. సాయాహ్నే విచరన్రామ విటపీన్మాల్యధారిణః,
శీతోదకం చ పమ్పాయా దృష్ట్వా శోకం విహాస్యసి. 20

ప్ర. అ. రామ = రామా ! సాయాహ్నే = సాయంకాలమునందు, విచరన్ = సంచరించుచు, మాల్యధారిణః = పుష్పమాలలను ధరించు, విటపీన్ = వృక్షములను, పమ్పాయాః = పంపాసరస్సుయొక్క, శీతోదకం చ = చల్లని ఉదకమును, దృష్ట్వా = చూచి, శోకమ్ = శోకమును, విహాస్యసి = విడువగలవు.

తా. రామా ! సాయంకాలమునందు నీవు ఇటు నటు సంచరించుచు పుష్పమాలలు ధరించిన వృక్షాలను, పంపాసరోజలమును చూచి నీ శోకమును విడిచిపెట్టెదవు. 20

మూ. సుమనోభిశ్చితాంస్తత్ర తిలకాన్నక్తమాలకాన్,
ఉత్పలాని చ ఫుల్లాని పఙ్కజాని చ రాఘవ. 21

ప్ర. అ. రాఘవ = రామా ! తత్ర = అక్కడ, సుమనోభిః = పుష్పములతో, చితాన్ = వ్యాప్తములైన, తిలకాన్ = బొట్టుగుచెట్లను, నక్తమాలకాన్ = కానుగుచెట్లను, ఫుల్లాని = వికసించిన, ఉత్పలాని చ = నల్లకలవలను, పఙ్కజాని చ = పద్మములను (చూడగలవు).

తా. రామా! నీకు అక్కడ పుష్పములతో నిండిన బొట్టుగు చెట్లు, కానుగు చెట్లు, వికసించిన కలవలు, పద్మములు కనబడగలవు. 21

మూ. న తాని కశ్చిన్మాల్యాని తత్రారోపయితా నరః,
న చ వై మ్లానతాం యాన్తి న చ శీర్యన్తి రాఘవ. 22

ప్ర. అ. రాఘవ = రామా! తత్ర = అక్కడ, తాని మాల్యాని = ఆ మాలికలను, ఆరోపయితా = ధరించే, నరః = మనుష్యుడు, కశ్చిత్ = ఎవ్వడూ, న = లేడు. మ్లానతామ్ = వాడిపోవుటను, న యాన్తి = పొందవు. న చ శీర్యన్తి = రాలిపోవు.

తా. రామా! అక్కడ ఉన్న ఆ పుష్పమాలలు ధరించేవా రెవరూ లేరు. అవి వాడవు; రాలిపోవు. 22

మూ. మతఙ్గశిష్యాస్తత్రాసన్నృషయః సుసమాహితాః,
తేషాం భారాభితప్తానాం వన్యమాహరతాం గురోః. 23

యే ప్రపేతుర్మహీం తూర్ణం శరీరాత్స్వేదబిన్దవః,
తాని జాతాని మాల్యాని మునీనాం తపసా తదా. 24
స్వేదబిన్దుసముత్థాని న వినశ్యన్తి రాఘవ.

ప్ర. అ. తత్ర = అక్కడ, సుసమాహితాః = చాల ఏకాగ్రమైన చిత్తము గల, మతఙ్గశిష్యాః = మతంగమహర్షి శిష్యులైన, ఋషయః = ఋషులు, ఆసన్ = ఉండిరి. గురోః = గురువునకు, వన్యమ్ = వనమునందలి వస్తుసముదాయమును, ఆహరతామ్ = తీసికొనివచ్చుచున్న, భారాభితప్తానామ్ = భారముచేత బాధితులైన, తేషామ్ = ఆ మునులయొక్క, శరీరాత్ = శరీరమునుండి, యే = ఏ, స్వేదబిన్దవః = చెమటచుక్కలు, తూర్ణమ్ = శీఘ్రముగా, మహీమ్ = భూమిని (మీద), పేతుః = పడినవో, తాని = అవి, తదా = అప్పుడు, మునీనామ్ = మునులయొక్క, తపసా = తపస్సుచేత, మాల్యాని = మాలలుగా, జాతాని = అయినవి. రాఘవ = రామా! స్వేదబిన్దుసముత్థాని = చెమటచుక్కలనుండి పుట్టిన, ఆ మాలలు, న వినశ్యన్తి = నశించవు.

తా. అక్కడ మంచి మనోనిగ్రహము గల మతంగముని శిష్యులైన

ఋషులు నివసించేవారు. గురువుకొరకై, వనములో లభించే సమిధలు మొదలైన వాటిని తెచ్చునప్పుడు వాటి బరువుచేత క్లేశము చెందిన వాళ్ళ శరీరములనుండి నేలమీద పడిన చెమట చుక్కలు, ఆ మునుల తపఃప్రభావముచేత పుష్పమాలలుగా మారినవి. రామా ! చెమట చుక్కలనుండి పుట్టిన ఆ పుష్పమాలలు నశించకుండా ఉన్నవి. 23, 24

మూ. తేషాం గతానామద్యాపి దృశ్యతే పరిచారిణీ,
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ చిరజీవినీ. 25

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! తేషామ్ = ఆ మునులు, గతానామ్ = వెళ్ళిపోయినవారగుచుండగా, పరిచారిణీ = వాళ్ళకు ఉపచారములు చేసిన, ("సహచారిణీ"అని ప్రాచ్యపాఠము; దానికి "వారితో కలిసి తపస్సు చేసిన" అని అర్థము), చిరజీవినీ = దీర్ఘకాలము జీవించిన, శబరీనామ = శబరి అను పేరు గల, శ్రమణీ = = సన్న్యాసిని, అద్యాపి = ఇప్పటికి కూడా, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. రామా ! ఆ మును లందరు స్వర్గస్థులైనా వారికి ఉపచారములు చేసిన (లేదా వారితో కలిసి తపస్సు చేసిన) చిరాయుర్దాయవంతురాలైన శబరి అనే సన్న్యాసిని నేటికీ అక్కడ ఉన్నది. 25

మూ. త్వాం తు ధర్మే స్థితా నిత్యం సర్వభూతనమస్కృతమ్,
దృష్ట్వా దేవోపమం రామ స్వర్గలోకం గమిష్యతి.

ప్ర. అ. రామ = రామా ! నిత్యమ్ = ఎల్లప్పుడు, ధర్మే = ధర్మమునందు, స్థితా = ఉన్న ఆమె, సర్వభూతనమస్కృతమ్ = సకలజనులచేత (ప్రాణులచేత) నమస్కరింపబడిన, దేవోపమమ్ = దేవతాతుల్యుడవైన, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, స్వర్గలోకమ్ = స్వర్గలోకమును గూర్చి, గమిష్యతి = వెళ్లగలదు.

తా. రామా ! నిత్యము ధర్మమార్గమునందున్న ఆ శబరి, సకలభూతముల చేత నమస్కరింపబడేవాడవు, దేవతాతుల్యుడవూ అయిన నీ దర్శనము చేసికొని స్వర్గమునకు వెళ్ళగలదు. 26

మూ. తత స్త్వద్రామ పమ్పాయా స్తీరమాసాద్య పశ్చిమమ్, 27
ఆశ్రమస్థానమతులం గుహ్యం కాకుత్స్థ పశ్యసి.

ప్ర. అ. కాకుత్థ్స=కకుత్థ్సవంశమునందు జనించిన, రామ = రామా! తతః=అటుపిమ్మట, పమ్పాయాః=పంపయొక్క, తత్=ఆ, పశ్చిమం తీరమ్=పశ్చిమ తీరమును, ఆసాద్య = పొంది, అతులమ్=సాటి లేని, గుహ్యమ్=రహస్యమైన, ఆశ్రమస్థానమ్ = ఆశ్రమమును, పశ్యసి = చూచెదవు.

తా. కాకుత్థ్సవంశమునందు జనించిన రామా! పిమ్మట ఆ పంపాసదస్సు పశ్చిమతీరము చేరగా, అక్కడ నీకు సాటి లేనిది, రహస్యమూ అయిన ఆశ్రమము కనబడును. 27

మూ. న తత్రాత్రాక్రమితుం నాగాః శక్నువన్తి తమాశ్రమమ్, 28
వివిధాస్తత్ర వై నాగా వనే తస్మింశ్చ పర్వతే,
ఋషే స్తస్య మతఙ్గస్య విధానా త్తచ్చ కాననమ్. 29

ప్ర. అ. తత్ర = అక్కడ, నాగాః = ఏనుగులు, తమ్ = ఆ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆక్రమితుమ్ = ఆక్రమించుటకు, న శక్నువన్తి=సమర్థములు కావు. తస్మిన్ = ఆ, పర్వతే = పర్వతమునందు, వనే = వనమునందు, వివిధాః =అనేకవిధములైన, నాగాః=ఏనుగు లున్నవి. తత్=ఆ, కాననమ్=అరణ్యము, తస్య = ఆ, మతఙ్గస్య ఋషేః = మతంగమహర్షియొక్క, విధానాత్ = నియమమువలన (ఏర్పడినది).

తా. అ పర్వతమునందు, వనమునందు కూడ అనేకవిధములైన ఏనుగులు ఉన్నవి. కాని ఆ ఏనుగులు ఆ అశ్రమమును ఆక్రమింపజాలవు. ఆ అరణ్యమునందు మతంగమహర్షి ఏర్పరచిన నియమములు పాటింపబడుచున్నవి 28,29

మూ. తస్మిన్నన్దనసంకాశే దేవారణ్యోపమే వనే,
నానావిహగసంకీర్ణే రంస్యసే రామ నిర్వృతః. 30

ప్ర. అ. రామ = రామా! నన్దనసంకాశే= నందనవనముతో సమానమైన, దేవారణ్యోపమే = దేవతల అరణ్యములతో సమానమైన, నానావిహగసంకీర్ణే = అనేకవిధములైన పక్షులతో వ్యాప్తమైన, తస్మిన్ వనే=ఆ వనమునందు, నిర్వృతః = సుఖము పొందినవాడవై, రంస్యసే = క్రీడించగలవు.

తా. రామా! నందనవనముతోను, చైత్రరథాదివనములతోను సమాన

మైనది, అనేకవిధములైన పక్షులతో వ్యాప్తమూ అయిన ఆ వనమునందు నీవు సుఖముగా విహరించవచ్చును. 30

మూ. ఋష్యమూకశ్చ పమ్పాయాః పురస్తాత్పుష్పితద్రుమః,
సుదుఃఖారోహణో నామ శిశునాగాభిరక్షితః, 31
ఉదారో బ్రహ్మణా చైవ పూర్వకాలే వినిర్మితః.

ప్ర. అ. పమ్పాయాః = పంపయొక్క, పురస్తాత్ = ముందుగా, పుష్పితద్రుమః = పుష్పించిన వృక్షములు గలది, సుదుఃఖారోహణః = ఎక్కుటకు చాల కష్టమైనది, శిశునాగాభిరక్షితః = చిన్న ఏనుగులచేత రక్షింపబడినది, ఉదారః = శ్రేష్ఠమైనది, బ్రహ్మణా = బ్రహ్మచేత, పూర్వకాలే = పూర్వకాలమునందు, వినిర్మితః = నిర్మించబడినది అయిన, ఋష్యమూకపర్వతము ఉన్నది.

తా. ఋష్యమూకపర్వతము పంపకు ముందుగానే ఉన్నది. దానిని ఎక్కుట చాల కష్ట మని ప్రసిద్ధి. పూర్వకాలమునందు బ్రహ్మచే నిర్మింపబడిన ఈ పర్వతమును చిన్న ఏనుగులు రక్షించుచుండును. పుష్పించిన వృక్షములతో చాల సుందరముగా ఉండును. 31

మూ. శయానః పురుషో రామ తస్య శైలస్య మూర్ధని, 32
యత్స్వప్నే లభతే విత్తం తత్ప్రబుద్ధోఽధిగచ్ఛతి.

ప్ర. అ. రామ = రామా! తస్య = ఆ, శైలస్య = పర్వతముయొక్క, మూర్ధని = శిరస్సుపై, శయానః = శయనించిన, పురుషః = పురుషుడు, స్వప్నే = స్వప్నమునందు, యత్ = ఏ, విత్తమ్ = ధనమును, లభతే = పొందునో, తత్ = దానిని, ప్రబుద్ధః = మేల్కొన్నవాడై, అధిగచ్ఛతి = పొందును.

తా. రామా! ఆ పర్వతముమీద నిద్రించిన పురుషునకు స్వప్నములో ఏ ధనము లభించునో, ఆ ధనమును అతడు మేల్కొనగానే పొందును. 32

మూ. న త్వేనం విషమాచారః పాపకర్మాధిరోహతి, 33
యస్తు తం విషమాచారః పాపకర్మాధిరోహతి,
తత్రైవ ప్రహరన్త్యేనం సుప్తమాదాయ రాక్షసాః. 34

ప్ర. అ. విషమాచారః = విషమమైన ఆచారము గల, పాపకర్మా = పాప కర్మ చేయువాడు, ఏనమ్ = దానిని, న అధిరోహతి = ఎక్కజాలడు. విషమా చారః = విషమమైన ఆచారము గల, పాపకర్మా=పాపకర్మ గలవాడు, యః= ఎవడు, తమ్ = దానిని, అధిరోహతి = ఎక్కునో, సుప్తమ్ = నిద్రించుచున్న, తమ్ = ఆతనిని, ఆదాయ = గ్రహించి, రాక్షసాః = రాక్షసులు, తత్రైవ = అక్కడనే, ప్రహరన్తి = కొట్టెదరు.

తా. చెడ్డ ఆచారము గల పాపకర్మ గలవా డెవ్వడూ ఈ పర్వతమును ఎక్కడు. చెడ్డ ఆచారము గల పాపాత్ము డెవడైన ఎక్కినచో, ఆతడు నిద్రించు చున్నప్పుడు రాక్షసులు వానిని పట్టుకొని చంపుదురు. 33, 34

మూ. తత్రాపి శిశునాగానామాక్రన్దః శ్రూయతే మహాన్,
క్రీడతాం రామ పమ్పాయాం మతఙ్గారణ్యవాసినామ్. 35

ప్ర. అ. రామ = రామా ! తత్రాపి = ఆ ఋష్యమూకపర్వతమునందు కూడా, పమ్పాయామ్ = పంపాసరస్సునందు, క్రీడతామ్ = ఆడుకొనుచున్న, మతఙ్గారణ్యవాసినామ్ = మతంగారణ్యమునందు నివసించుచున్న, శిశునాగా నామ్ = చిన్న ఏనుగులయొక్క, మహాన్ = గొప్ప, ఆక్రన్దః = అరుపు, శ్రూయతే = వినబడుచుండును.

తా. రామా ! మతంగాశ్రమములో నివసించు చిన్న ఏనుగులు పంపలో ఆడుకొనుచుండునపుడు, వాటి మహాధ్వని ఆ ఋష్యమూకపర్వతముమీదకి కూడ వినబడుచుండును.

35

మూ. సిక్తా రుధిరధారాభిః సంహృత్య పరమద్విపాః,
ప్రచరన్తి పృథక్కీర్ణా మేఘవర్ణాస్తరస్వినః. 36

ప్ర. అ. మేఘవర్ణాః = మేఘములవంటి వర్ణములుగల, తరస్వినః = బలము గల, పరమద్విపాః = శ్రేష్ఠములైన ఏనుగులు, సంహృత్య = కొట్టుకొని, రుధిరధారాభిః = రక్తధారలచేత, సిక్తాః = తడపబడినవై, పృథక్ = వేరుగా, కీర్ణాః = వ్యాప్తమైనవై, ప్రచరన్తి = సంచరించుచుండును.

తా. మేఘము వంటి వర్ణము గల, బలము గల ఏనుగులు పోట్లాడుకొని,

రక్తధారలచేత తడపబడినవై, వేరు వేరు గుంపులుగా చెదిరిపోయి, తిరుగుచుండును. 36

మూ. తే తత్ర పీత్వా పానీయం విమలం శీతమవ్యయమ్,
నిర్వృతాః సంవిగాహన్తే వనాని వనగోచరాః. 37

ప్ర. అ. వనగోచరాః = వనములో సంచరించు, తే = ఆ ఏనుగులు, విమలమ్ = నిర్మలము, శీతమ్ = చల్లనిది, అవ్యయమ్ = ఆరోగ్యకరము అయిన, పానీయమ్ = ఉదకమును, పీత్వా = త్రాగి, నిర్వృతాః = తృప్తి చెందినవై, వనాని = వనములను, విగాహన్తే = ప్రవేశించుచుండును.

తా. వనములో సంచరించే ఆ ఏనుగులు ఆ పంపాసరస్సులో నిర్మలము, ఆరోగ్యకరము అయిన చల్లని నీరు త్రాగి, సంతృప్తి చెంది, వనములలోనికి పోవుచుండును. 37

మూ. ఋక్షాంశ్చ ద్వీపినశ్చైవ నీలకోమలకప్రభాన్,
రురూనపేతాపజయాన్ దృష్ట్వా శోకం జయిష్యసి. 38

ప్ర. అ. ఋక్షాంశ్చ = ఎలుగుబంట్లను, ద్వీపినశ్చైవ = పెద్దపులులను, నీలకోమలకప్రభాన్ = నీలమాణిక్యముల వలె కోమలమైన కాంతి గలవి, అపేతాపజయాన్ = పరాజయము లేనివి అయిన, రురూన్ = రురుమృగములను, దృష్ట్వా = చూచి, శోకమ్ = శోకమును, జయిష్యసి = జయించగలవు.

తా. ఎలుగుబంట్లను, పెద్దపులులను, ఇంద్రనీలము వంటి కోమలమైన కాంతి గల, పరాజయమును (భయమును) ఎరుగని నల్ల చారల దుప్పులను చూచుచు శోకమును మరచిపోయెదవు. 38

మూ. రామ తస్య తు శైలస్య మహతీ శోభతే గుహా,
శిలాపిధానా కాకుత్స్థ దుఃఖం చాస్యాః ప్రవేశనమ్. 39

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు పుట్టిన, రామ = రామా ! తస్య శైలస్య = ఆ పర్వతముయొక్క, శిలాపిధానా = శిల ఆచ్ఛాదనముగా గల, మహతీ = గొప్పదైన, గుహా = గుహ, శోభతే = ప్రకాశించుచున్నది. అస్యాః = దీనియొక్క, ప్రవేశనమ్ = ప్రవేశించుట, దుఃఖమ్ = కష్టమైనది.

తా. కకుత్థ్సవంశమునందు జనించిన రామా ! ఆ పర్వతమునందు పెద్ద గుహ శోభించుచున్నది. దానికి పెద్ద శిల ఆచ్ఛాదనముగా ఉన్నది. దానిలో ప్రవేశించుట చాల కష్టము. 39

మూ. తస్యా గుహాయాః ప్రాగ్ద్వారే మహాన్ శీతోదకో హ్రదః,
ఫలమూలాన్వితో రమ్యో నానామృగసమావృతః. 40

ప్ర. అ. తస్యాః = ఆ, గుహాయాః = గుహయొక్క, ప్రాగ్ద్వారే = తూర్పు ద్వారమునందు, శీతోదకః = చల్లని ఉదకము గలది, ఫలమూలాన్వితః = ఫలముల తోను మూలములతోను కూడినది, రమ్యః = సుందరమైనది, నానామృగ సమావృతః = అనేకవిధములైన మృగములచేత చుట్టబడినది అయిన, మహాన్ = పెద్ద, హ్రదః = చెరువు ఉన్నది.

తా. ఆ గుహ తూర్పు ద్వారమునందు చల్లని ఉదకము గలది, ఫలముల తోను మూలములతోను నిండినది, చుట్టూ అనేకమృగములు నివసించేదీ అయిన రమ్యమైన గొప్ప చెరువు ఉన్నది. 40

మూ. తస్యాం వసతి సుగ్రీవశ్చతుర్భిః సహ వానరైః,
కదాచిచ్ఛిఖరే తస్య పర్వతస్యావతిష్ఠతే. 41

ప్ర. అ. సుగ్రీవః = సుగ్రీవుడు, చతుర్భిః = నలుగురు, వానరైః సహ = వానరులతో కూడ, తస్యామ్ = ఆ గుహలో, వసతి = నివసించుచున్నాడు. కదాచిత్ = అప్పుడప్పుడు, తస్య పర్వతస్య = ఆ పర్వతముయొక్క, శిఖరే = శిఖరముపై, అవతిష్ఠతే = ఉండును.

తా. సుగ్రీవుడు నలుగురు వానరులతో కలిసి ఆ గుహలో నివసించు చున్నాడు. అప్పుడప్పుడు ఆ పర్వతము శిఖరముమీద ఉండును. 41

మూ. కబన్ధస్త్వనుశాస్యైవం తావుభౌ రామలక్ష్మణౌ,
స్రగ్వీ భాస్కరవర్ణాభః ఖే వ్యరోచత వీర్యవాన్. 42

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడు, స్రగ్వీ = మాలలు గలవాడు అయిన, కబన్ధస్తు = కబంధుడు, తౌ = ఆ, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, ఉభౌ = ఇద్దరినీ, ఏవమ్ = ఇట్లు, అనుశాస్య = బోధించి, ఖే = ఆకాశమునందు,

భాస్కరవర్ణాభః = సూర్యునివర్ణము వంటి కాంతి గలవాడై, వ్యరోచత=ప్రకాశించెను.

తా. పుష్పమాలలు ధరించి ఉన్న పరాక్రమవంతుడైన కబంధుడు ఆ రామలక్ష్మణు లిద్దరికీ ఈ విధముగా చెప్పి ఆకాశమునందు సూర్యుని వంటి కాంతితో ప్రకాశించుచుండెను. 42

మూ. తం తు ఖస్థం మహాభాగం కబన్ధం రామలక్ష్మణౌ,
ప్రస్థితౌ త్వం వ్రజస్వేతి వాక్యమూచతురన్తికే. 43

ప్ర. అ. ప్రస్థితౌ = ప్రయాణమైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, అన్తికే = సమీపమునందు, ఖస్థమ్ = ఆకాశమునందున్న, మహాభాగమ్= గొప్ప భాగ్యము గల, తం కబన్ధమ్ = ఆ కబంధుని గూర్చి, త్వమ్ = నీవు, వ్రజస్వ = వెళ్లుము, ఇతి = అని, వాక్యమ్ = వాక్యమును, ఊచతుః=పలికిరి.

తా. రామలక్ష్మణులు బయలుదేరి, దగ్గరనే ఆకాశములో ఉన్న మహాభాగ్యవంతుడైన ఆ కబంధునితో "ఇక నీవు వెళ్లుము''అని పలికిరి. 43

మూ. గమ్యతాం కార్యసిద్ధ్యర్థమితి తావబ్రవీత్స చ,
సువ్రతౌ తావనుజ్ఞాప్య కబన్ధః ప్రస్థితస్తదా. 44

ప్ర. అ. తదా = అప్పుడు, ప్రస్థితః = ప్రయాణమైన, సః కబన్ధశ్చ = ఆ కబంధుడు కూడ, సువ్రతౌ = మంచి నియమములు గల, తౌ = వారిని, అనుజ్ఞాప్య = అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, కార్యసిద్ధ్యర్థమ్ = కార్యసిద్ధికొరకు, గమ్యతామ్ = వెళ్లెదరుగాక అని, తౌ = వారిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు ఉత్తమమైన నియమములు గల ఆ రామలక్ష్మణుల అనుజ్ఞ తీసికొని బయలుదేరిన కబంధుడు ''కార్యసిద్ధికై వెళ్లుడు''అని ఆ రామలక్ష్మణులతో పలికెను. 44

మూ. స తత్కబన్ధః ప్రతిపద్య రూపం
వృతః శ్రియా భాస్కరతుల్యదేహః,
నిదర్శయన్ రామమవేక్ష్య ఖస్థః
సఖ్యం కురుష్వేతి తదాభ్యువాచ. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
త్రిసప్తతితమః సర్గః.

ప్ర. అ. సః కబన్ధః = ఆ కబంధుడు, తత్ = ఆ, రూపమ్ = రూపమును, ప్రతిపద్య = పొంది, శ్రియా = శోభతో, వృతః = కూడినవాడై, భాస్కరతుల్య దేహః = సూర్యునితో సమానమైన దేహము కలవాడై, ఖస్థః = ఆకాశమునందున్నవాడై, రామమ్ = రాముణ్ణి, అవేక్ష్య = చూచి, నిదర్శయన్ = ఋష్యమూకమువైపు చూపుచు, సఖ్యమ్ = స్నేహమును, కురుష్వ = చేయుము, ఇతి = అని, తదా = అప్పుడు, ఉవాచ = పలికెను.

తా. ఆ కబంధుడు తన రూపమును పొంది, శోభాన్వితుడై సూర్యుని వంటి దేహముతో ఆకాశములో నిలచి, రాముణ్ణి చూచి, అప్పుడు ఆతనికి ఋష్యమూకము వైపు చూపుచు, ''సుగ్రీవునితో స్నేహము చేయుము''అని పలికెను.

''బాలానందిని''అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో
డెబ్బదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃసప్తతితమః సర్గః

[రామలక్ష్మణులు పంపాతీరమునందున్న మతంగవనములో శబరి ఆశ్రమమునకు వెళ్ళి ఆమె చేసిన సత్కారమును అందుకొని ఆమెతో కలిసి మతంగవనమును పర్యావేక్షించుట, శబరి తన శరీరమును అగ్నిలో ఆహుతిగా సమర్పించి స్వర్గము చేరుట.]

మూ. తౌ కబన్ధేన తం మార్గం పమ్పాయా దర్శితం వనే,
ఆతస్థతుర్దిశం గృహ్య ప్రతీచీం నృవరాత్మజౌ. 1

ప్ర. అ. తౌ = ఆ, నృవరాత్మజౌ = దశరథకుమారులు, వనే = వనమునందు, ప్రతీచీం దిశమ్ = పశ్చిమదిక్కును, గృహ్య = గ్రహించి, కబన్ధేన = కబంధునిచేత, దర్శితమ్ = చూపబడిన, తమ్ = ఆ, పమ్పాయాః = పంపాసరస్సుయొక్క, మార్గమ్ = మార్గమును, ఆతస్థతుః = పొందిరి.

తా. ఆ రామలక్ష్మణులు, వనమునందు, పశ్చిమాభిముఖులై బయలుదేరి కబంధుడు చెప్పిన పంపాసరోవరమార్గమును చేరిరి. 1

మూ. తౌ శైలేష్వాచితానేతాన్ క్షౌద్రకల్పఫలాన్ ద్రుమాన్,
వీక్షన్తౌ జగ్మతుర్ద్రష్టుం సుగ్రీవం రామలక్ష్మణౌ. 2

ప్ర. అ. తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, శైలేషు = పర్వతములయందు, ఆచితాన్ = నాటబడిన (మొలచిన), క్షౌద్రకల్పఫలాన్ = తేనె వంటి పండ్లు గల, ద్రుమాన్ = వృక్షములను, వీక్షన్తౌ = చూచుచున్నవారై, సుగ్రీవమ్ = సుగ్రీవుని, ద్రష్టుమ్ = చూచుటకు, జగ్మతుః = వెళ్ళిరి.

తా. ఆ రామలక్ష్మణులు పర్వతాలమీద మొలచిన, తేనెవంటి ఫలములు గల వృక్షములను చూచుచు సుగ్రీవుని చూచుటకై వెళ్ళిరి. 2

మూ. కృత్వా చ శైలపృష్ఠే తు తౌ వాసం రామలక్ష్మణౌ,
పమ్పాయాః పశ్చిమం తీరం రాఘవావుపతస్థతుః. 3

ప్ర. అ. రాఘవౌ = రఘువంశ సంజాతులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, శైలపృష్ఠే = పర్వతము పైభాగమునందు, వాసమ్ = నివాసమును, కృత్వా = చేసి, పమ్పాయాః = పంపాసరస్సుయొక్క, పశ్చిమం తీరమ్ = పశ్చిమతీరమును, ఉపతస్థతుః = సమీపించిరి.

తా. రఘువంశమునందు పుట్టిన ఆ రామలక్ష్మణులు మార్గమధ్యములో పర్వతము పైభాగమునందు ఆగుచు, పంప పశ్చిమతీరమును చేరిరి. 3

మూ. తౌ పుష్కరిణ్యాః పమ్పాయాస్తీరమాసాద్య పశ్చిమమ్,
అపశ్యతాం తతస్తత్ర శబర్యా రమ్య మాశ్రమమ్. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తౌ = ఆ రామలక్ష్మణులు, పమ్పాయాః = పంప అను, పుష్కరిణ్యాః = పద్మసరస్సుయొక్క, పశ్చిమమ్ = పడమటిదైన, తీరమ్ = తీరమును, ఆసాద్య = పొంది, తత్ర = అక్కడ, శబర్యాః = శబరి యొక్క, రమ్యమ్ = రమ్యమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును, అపశ్యతామ్ = చూచిరి.

తా. పిమ్మట ఆ రామలక్ష్మణులు పంపాసరస్సు పశ్చిమతీరము చేరి అక్కడ, శబరి నివసించు రమ్యమైన ఆశ్రమమును చూచిరి. 4

మూ. తౌ తమాశ్రమమాసాద్య ద్రుమైర్బహుభిరావృతమ్,
సురమ్యమభివీక్షన్తౌ శబరీమభ్యుపేయతుః. 5

ప్ర. అ. తౌ = ఆ రామలక్ష్మణులు, తమ్ = ఆ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆసాద్య = సమీపించి, బహుభిః = అనేకమైన, ద్రుమైః = వృక్షములచేత, ఆవృతమ్ = కప్పబడిన, సురమ్యమ్ = చాల రమ్యమైన ఆ ఆశ్రమమును, అభివీక్షన్తౌ = చూచుచున్నవారై, శబరీమ్ = శబరిని, అభ్యుపేయతుః = పొందిరి.

తా. ఆ రామలక్ష్మణులు ఆ ఆశ్రమమును సమీపించి, అనేకమైన వృక్షములచేత కప్పబడిన, చాల అందమైన ఆ ఆశ్రమమును చూచుచు శబరిని సమీపించిరి.
5

మూ. తౌ చ దృష్ట్వా తదా సిద్ధా సముత్థాయ కృతాఞ్జలిః,
రామస్య పాదౌ జగ్రాహ లక్ష్మణస్య చ ధీమతః. 6

ప్ర. అ. తదా = అప్పుడు, సిద్ధా = సిద్ధురాలైన ఆ శబరి, తౌ = ఆ రామ లక్ష్మణులను, దృష్ట్వా = చూచి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలికలదై, సముత్థాయ = లేచి, రామస్య = రాముని యొక్క, ధీమతః = బుద్ధిమంతుడైన, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్క, పాదౌ = పాదములను, జగ్రాహ = గ్రహించెను.

తా. అప్పుడు సిద్ధురాలైన ఆ శబరి రామలక్ష్మణులను చూచి అంజలి ఘటించి, లేచి రాముని పాదములను, ధీమంతుడైన లక్ష్మణుని పాదములను స్పృశించి నమస్కరించెను. ౬

మూ. పాద్యమాచమనీయం చ సర్వం ప్రాదాద్యథావిధి,
తామువాచ తతో రామః శ్రమణీం సంశితవ్రతామ్. 7

ప్ర. అ. పాద్యమ్ = పాద్యమును, ఆచమనీయం చ = ఆచమనీయమును, సర్వమ్ = అంతనూ, యథావిధి = యథాశాస్త్రముగా, ప్రాదాత్ = ఇచ్చెను. తతః = అటుపిమ్మట, సంశితవ్రతామ్ = మిక్కిలి తీవ్రమైన నియమములు గల, తామ్ = ఆ, శ్రమణీమ్ = సంన్యాసినియైన శబరిని గూర్చి, రామః = రాముడు, ఉవాచ = పలికెను.

తా. ఆమె వారిద్దరికీ, యథాశాస్త్రముగా పాద్యము, ఆచమనము చేయుటకు ఉదకము మొదలైనవి అన్నీ సమర్పించెను. పిమ్మట రాముడు తీవ్రమైన నియమములను పాటించుచు తపస్సు చేయుచున్న ఆ సంన్యాసినితో ఇట్లు పలికెను. 7

మూ. కచ్చిత్తే నిర్జితా విఘ్నాః కచ్చిత్తే వర్ధతే తపః,
కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే. 8

ప్ర. అ. తపోధనే = తపస్సే ధనముగా గల ఓ! శబరీ! తే = నీయొక్క, విఘ్నాః = తపోవిఘ్నములు, నిర్జితాః కచ్చిత్ = జయింపబడినవా? తే = నీయొక్క, తపః = తపస్సు, వర్ధతే కచ్చిత్ = వృద్ధి చెందుచున్నది కదా? తే = నీయొక్క,

క్రోధః = కోపము, ఆహారశ్చ = ఆహారము, నియతః కచ్చిత్ = నిగ్రహింపబడినదా ?

తా. ఓ ! తాపసురాలా ! నీ తపస్సునకు విఘ్నము లేవీ కలుగుట లేదు కదా ? నీ తపస్సు వృద్ధి పొందుచున్నది కదా ? నీవు క్రోధమును నిగ్రహించుకొన్నావు కదా ? ఆహారము విషయమునందు కూడ నిగ్రహము అలవరచుకొన్నావు కదా ! 8

మూ. కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనసః సుఖమ్,
కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణి. 9

ప్ర. అ. చారుభాషిణి = అందముగా మాటలాడుదునా ! తే = నీకు, నియమాః = నియమములు, ప్రాప్తాః కచ్చిత్ = పొందబడినవికదా ? తే = నీయొక్క, మనసః = మనస్సునకు, సుఖం కచ్చిత్ = సుఖమే కదా ? తే = నీయొక్క, గురుశుశ్రూషా = గురుశుశ్రూష, సఫలా కచ్చిత్ = సఫలమైనదా ?

తా. చక్కగా మాటలాడు ఓ! శబరీ ! నీవు చాంద్రాయణాది నియమములన్నీ పూర్తి చేసికొంటివా? నీ మనస్సుకు సుఖము లభించినదా? నీవు చేసిన గురుసేవ సఫల మైనదా? 9

మూ. రామేణ తాపసీ పృష్టా సా సిద్ధా సిద్ధసంమతా,
శశంస శబరీ వృద్ధా రామాయ ప్రత్యవస్థితా. 10

ప్ర. అ. రామేణ = రామునిచేత, పృష్టా = అడగబడిన, సిద్ధా = సిద్ధురాలు, సిద్ధసంమతా = సిద్ధులకు ఇష్టురాలు, తాపసీ = తపఃసంపన్నురాలు, వృద్ధా = వృద్ధురాలు అయిన, సా శబరీ = ఆ శబరి, ప్రత్యవస్థితా = ఎదురుగా నిలచినదై, రామాయ = రామునకు, శశంస = చెప్పెను.

తా. తపఃసంపన్నురాలు, తపఃసిద్ధి సంపాదించినది, తపఃసిద్ధిసంపన్నుల గౌరవమును పొందినది, వృద్ధురాలూ అయిన ఆ శబరి రాముని మాటలు విని, ఆతనికి ఎదురుగా నిలచి ఇట్లు పలికెను. 10

మూ. అద్య ప్రాప్తా తపఃసిద్ధిస్తవ సందర్శనాన్మయా,
అద్య మే సఫలం తప్తం గురవశ్చ సుపూజితాః. 11

ప్ర. అ. అద్య = ఇప్పుడు, తవ=నీయొక్క, సందర్శనాత్ = దర్శనము వలన, మయా = నాచేత, తపఃసిద్ధిః = తపఃసిద్ధి, ప్రాప్తా = పొందబడినది. అద్య = ఇపుడు, మే = నాయొక్క, తప్తమ్ = తపస్సు, సఫలమ్ = సఫలమైనది. గురవశ్చ = గురువులు కూడ, సుపూజితాః = బాగుగా పూజించబడినారు.

తా. ఈనాడు నీ దర్శనము లభించుటచేత నాకు తపఃసిద్ధి లభించినది. నేను చేసిన తపస్సు, నేను చేసిన గురుశుశ్రూషా కూడ సఫలము లైనవి. 11

మూ. అద్య మే సఫలం జన్మ స్వర్గశ్చైవ భవిష్యతి,
త్వయి దేవవరే రామ పూజితే పురుషర్షభ. 12

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! దేవవరే = దేవతాశ్రేష్ఠుడవైన, త్వయి = నీవు, పూజితే=పూజింబబడినవాడ వగుచుండగా, అద్య = నేడు, మే= నాయొక్క, జన్మ = జన్మము, సఫలమ్ = సఫలమైనది. స్వర్గశ్చైవ = స్వర్గము కూడ, భవిష్యతి = లభించగలదు.

తా. పురుషశ్రేష్ఠుడవైన రామా! ఈనాడు దేవతాశ్రేష్ఠుడవైన నిన్ను పూజించిన పిదప నా జన్మ సఫలము కానున్నది. నాకు స్వర్గము లభించగలదు.

మూ. చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునన్దన,
గమిష్యామ్యక్షయాన్ లోకాం స్త్వత్ప్రసాదాదరిందమ. 13

ప్ర. అ. రఘునన్దన=రామా! తవ=నీయొక్క, సౌమ్యేన=సౌమ్యమైన, చక్షుషా=నేత్రముచేత, పూతా=పవిత్రింపచేయబడినదానను, అస్మి=అయితిని. అరిందమ = శత్రుసంహారకుడా! త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, అక్షయాన్ = అక్షయములైన, లోకాన్ = లోకములను గూర్చి, గమిష్యామి = వెళ్ళగలను.

తా. రామా! సౌమ్యమైన నీ దృష్టి నాపై ప్రసరించుటచేత పవిత్రురాలను అయినాను. శత్రుసంహారకా! నీ అనుగ్రహమువలన నేను అక్షయములైన ఉత్తమ లోకములకు వెళ్ళగలను. 13

వి. పై మూడు శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు.

మూ. చిత్రకూటం త్వయి ప్రాప్తే విమానైరతులప్రభైః,
ఇతస్తే దివమారూఢా యానహం పర్యచారిషమ్. 14

ప్ర. అ. అహమ్ = నేను, యాన్ = ఎవరిని, పర్యచారిషమ్ = సేవించితినో, తే = ఆ మహర్షులు, త్వయి = నీవు, చిత్రకూటమ్ = చిత్రకూటపర్వతమును, ప్రాప్తే = పొందినవాడవగుచుండగా, అతులప్రభైః = సాటి లేని కాంతి గల, విమానైః = విమానముల చేత, ఇతః = ఇక్కడినుండి, దివమ్ = స్వర్గమును, ఆరూఢాః = ఎక్కినారు.

తా. నేను పరిచర్యలు చేసిన ముని లందరూ, నీవు చిత్రకూటపర్వతము చేరినప్పుడే, ఈ ప్రదేశమును విడచి, సాటి లేని కాంతి గల విమానములు ఎక్కి స్వర్గమునకు వెళ్ళిపోయినారు. 14

మూ. తైశ్చాహముక్తా ధర్మజ్ఞైర్మహాభాగైర్మహర్షిభిః,
ఆగమిష్యతి తే రామః సుపుణ్యమిమమాశ్రమమ్, 15
స తే ప్రతిగ్రహీతవ్యః సౌమిత్రిసహితోఽతిథిః,
తం చ దృష్ట్వా వరాన్ లోకా నక్షయాంస్త్వం గమిష్యసి.

ప్ర. అ. ధర్మజ్ఞైః = ధర్మమును ఎరిగిన, మహాభాగైః = పూజ్యులైన, తైః మహర్షిభిః = ఆ మహర్షులచేత, అహమ్ = నేను, ఉక్తా = చెప్పబడితిని. రామః = రాముడు, తే = నీయొక్క, సుపుణ్యమ్ = చాల పుణ్యమైన, ఇమమ్ ఆశ్రమమ్ = ఈ ఆశ్రమమును గూర్చి, అగమిష్యతి = రాగలడు. సౌమిత్రిసహితః = లక్ష్మణునితో కూడిన, సః = అతడు, తే = నీకు, అతిథిః = అతిథిగా ప్రతిగ్రహీతవ్యః = గ్రహింపదగినవాడు. తమ్ = ఆ రాముణ్ణి, దృష్ట్వా = చూచి, త్వమ్ = నీవు, వరాన్ = శ్రేష్ఠములైన, అక్షయాన్ = నాశములేని, లోకాన్ = లోకములను గూర్చి, గమిష్యసి = వెళ్ళగలవు.

తా. ధర్మవేత్తలు, చాల పూజనీయులు అయిన ఆ మహర్షులు నాతో ఇట్లు చెప్పిరి. "పవిత్రమైన నీ ఆశ్రమమునకు రాముడు రాగలడు. లక్ష్మణసమేతుడైన ఆ రామునకు నీవు తగు విధముగ అతిథిసత్కారము చేయవలెను. ఆతని దర్శనము చేసిన పిమ్మట నీవు అక్షయములైన ఉత్తమలోకములకు వెళ్ళగలవు. 15,16

మూ. మయా తు వివిధం వన్యం సంచితం పురుషర్షభ,
తవార్థే పురుషవ్యాఘ్ర పమ్పాయాస్తీరసంభవమ్. 17

('పురుషర్షభ' అనుదానికి బదులు "రఘునన్దన" అను ప్రాచ్యపాఠము బాగున్నది.)

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడవైన, రఘునన్దన = రామా! మయా = నాచేత, తవ అర్థే = నీ నిమిత్తమై, పమ్పాయాః = పంపయొక్క, తీర సంభవమ్ = తీరమునందు పుట్టిన, వివిధమ్ = అనేకవిధములైన, వన్యమ్ = వనమునందు లభించు పదార్థజాతము, సంచితమ్ = ప్రోగుచేయబడినది.

తా. పురుషశ్రేష్ఠుడవైన రామా! నేను నీకొరకై పంపాతీరమునందు పుట్టిన, అనేకవిధములైన వనమునందు లభించే పదార్థసముదాయము ప్రోగుచేసి ఉన్నాను. 17

మూ. ఏవముక్తస్స ధర్మాత్మా శబర్యా శబరీమిదమ్,
రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్యమబహిష్కృతామ్. 18

ప్ర. అ. శబర్యా = శబరిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః రాఘవః = ఆ రాముడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, విజ్ఞానే = జ్ఞానమునందు, అబహిష్కృతామ్ = బహిష్కరింపబడని (దూరముగా ఉండని), తాం శబరీమ్ = ఆ శబరిని గూర్చి, ప్రాహ = పలికెను.

తా. ధర్మాత్ముడైన రాముడు శబరి మాటలు విని, నిత్యము జ్ఞానమార్గమునందు ఉండు ఆ శబరితో ఇట్లు పలికెను. 18

మూ. దనోః సకాశాత్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః,
శ్రుతం ప్రత్యక్షమిచ్ఛామి సంద్రష్టుం యది మన్యసే. 19

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, దనోః సకాశాత్ = దనువు సమీపమునుండి, శ్రుతమ్ = వినబడిన, తే = నీయొక్క, ప్రభావమ్ = ప్రభావమును, మన్యసే యది = నీవు అంగీకరించినట్లయితే, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షముగా, సంద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. మహాత్ముడైన దనువునుండి నీ ప్రభావమును గూర్చి విని ఉన్నాను. నీవు అంగీకరించినట్లయితే దానిని ప్రత్యక్షముగా చూడదలచుచున్నాను. 19

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా రామవక్త్రాద్వినిఃసృతమ్,
శబరీ దర్శయామాస తావుభౌ తద్వనం మహత్. 20

ప్ర. అ. శబరీ = శబరి, రామవక్త్రాత్ = రాముని ముఖమునుండి, వినిః సృతమ్ = బయల్వెడలిన, ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = = విని, తౌ ఉభౌ = వారిద్దరిని(కి), మహత్ = గొప్పదైన, తత్ = ఆ, వనమ్ = వనమును, దర్శయామాస = చూపెను.

తా. శబరి రాముని నోటినుండి ఈ మాట వెలువడగానే వారిద్దరికీ, గొప్పదైన ఆ వనమును చూపించెను. 20

మూ. పశ్య మేఘఘనప్రఖ్యం మృగపక్షిసమాకులమ్,
మతఙ్గవనమిత్యేవ విశ్రుతం రఘునన్దన. 21

ప్ర. అ. రఘునన్దన = రామా! మేఘఘనప్రఖ్యమ్ = దట్టమైన మేఘముతో సమానము, మృగపక్షిసమాకులమ్ = మృగములతోను పక్షులతోను వ్యాకులము, మతఙ్గవనమిత్యేవ = మతంగవన మని, విశ్రుతమ్ = ప్రసిద్ధము అయిన వనమును, పశ్య = చూడుము.

తా. రామా! మతంగవన మను ప్రసిద్ధి గల ఈ వనమును చూడుము. ఇది దట్టమైన మేఘము వలె ఉన్నది. మృగములతోను, పక్షులతోను వ్యాప్తమై యున్నది. 21

మూ. ఇహ తే భావితాత్మానో గురవో మే మహాద్యుతే,
జుహువాఞ్చక్రిరే తీర్థం మన్త్రవన్మన్త్రపూజితమ్. 22

ప్ర. అ. మహాద్యుతే = గొప్ప కాంతి గలవాడా! భావితాత్మానః = పవిత్రముగా చేసికొనబడిన మనస్సులు గల, తే = ఆ, మే గురవః = నా గురువులు, ఇహ = ఇక్కడ, మన్త్రవత్ = మంత్రములు గలది, మన్త్రపూజితమ్ = మంత్రములచేత పూజింపబడినది అయిన, తీర్థమ్ = గంగాదితీర్థమును, జుహువాంఞ్చక్రిరే

= ఆహ్వానించిరి. లేదా-తీర్థమ్ = యజ్ఞమును, జుహవాఞ్చక్రిరే = హోమము చేసిరి (లేదా చేసిరి).

తా. గొప్ప కాంతి గల రామా! పవిత్రమైన మనస్సులు గల నా గురువులు, ఇక్కడ, మంత్రములతో కూడి, మంత్రములచేత పూజింపబడిన గంగాది తీర్థములను ఆహ్వానించిరి. లేదా యజ్ఞము చేసిరి.

వి "జుహవాఞ్చక్రురనలం మన్త్రవన్మన్త్రకోవిదాః"అను ప్రాచ్యపాఠమునకు అర్థము అక్లిష్టముగా ఉన్నది. "మన్త్రకోవిదాః = మంత్రములందు ప్రావీణ్యము గల నా గురువులు, మన్త్రవత్ = మంత్రపూర్వకముగా, అనలమ్ = అగ్నిని, జుహవాఞ్చక్రుః = హోమము చేసిరి"అని అర్థము. 22

మూ. ఇయం ప్రత్యక్స్థలీ వేదిర్యత్ర తే మే సుసత్కృతాః,
పుష్పోపహారం కుర్వన్తి శ్రమాదుద్వేపిభిః కరైః. 23

ప్ర. అ. మే = నాయొక్క (చేత), సుసత్కృతాః = బాగుగా సేవించబడిన, తే = ఆ మునీశ్వరులు, యత్ర = ఎక్కడ, శ్రమాత్ = శ్రమవలన, ఉద్వేపిభిః = వణకుచున్న, కరైః = హస్తములతో. పుష్పోపహారమ్ = పుష్పసమర్పణమును, కుర్వన్తి = చేయుచుండిరో, అట్టి, ప్రత్యక్స్థలీ వేదిః = పశ్చిమమునందు ఎత్తైన వేది, ఇయమ్ = ఇదే.

తా. నేను శుశ్రూష చేసిన ఆ మునీశ్వరులు పశ్చిమాన ఎత్తుగా ఉన్న ఈ వేదిమీదనే దౌర్బల్యముచేత వణకుచున్న చేతులతో పువ్వులను సమర్పించుచుండేవారు. 23

మూ. తేషాం తపఃప్రభావేణ పశ్యాద్యాపి రఘూద్వహ,
ద్యోతయన్తి దిశః సర్వాః శ్రియా వేద్యోఽతులప్రభాః. 24

ప్ర. అ. రఘూద్వహ = రామా! తేషామ్ = వారియొక్క, తపఃప్రభావేణ = తపస్సుయొక్క ప్రభావముచేత, అతులప్రభాః = సాటి లేని కాంతి గల, వేద్యః = వేదులు, శ్రియా = శోభచేత, అద్యాపి = ఇప్పుడు కూడ. సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ద్యోతయన్తి = ప్రకాశింపచేయుచున్నవి. పశ్య = చూడుము.

తా. రామా ! చూడుము ! ఆ మునీశ్వరుల తపఃప్రభావముచేత, సాటి లేని కాంతి గల వేదులు తమ శోభతో, అన్ని దిక్కులను ఎట్లు ప్రకాశింపచేయు చున్నవో చూడుము. 24

మూ. అశక్నువద్భిస్తైర్గన్తుముపవాసశ్రమాలసైః,
చిన్తితేఽభ్యాగతాన్ పశ్య సహితాన్ సప్త సాగరాన్. 25

ప్ర. అ. ఉపవాసశ్రమాలసైః = ఉపవాసములవలన కలిగిన శ్రమచేత మందులూ, గన్తుమ్ = వెళ్ళుటకు(నడచుటకు), అశక్నువద్భిః = అసమర్థులూ అయిన, తైః = ఆమునీశ్వరులచేత, చిన్తితే = ఆలోచించగానే, అభ్యాగతాన్ = వచ్చిన, సహితాన్ = కలిసిఉన్న, సప్త సాగరాన్ = ఏడు సాగరములను, పశ్య = చూడుము.

తా. ఉపవాసములచేత కలిగిన దౌర్బల్యముచేత అలసులై నడచుటకు కూడ శక్తి లేని ఆ మునీశ్వరులు స్మరించగానే ఏడు సముద్రములు కలిసి వచ్చినవి. వాటిని చూడుము. 25

మూ. కృతాభిషేకైస్తైర్న్యస్తా వల్కలాః పాదపేష్విహ,
అద్యాపి నావశుష్యన్తి ప్రదేశే రఘునన్దన. 26

ప్ర. అ. రఘునన్దన = రామా ! ఇహ = ఇక్కడ, కృతాభిషేకైః = చేయబడిన స్నానముగల, తైః = ఆ మునీంద్రులచేత, ప్రదేశే = ఈ ప్రదేశమునందు, పాదపేషు = వృక్షములమీద, న్యస్తాః = ఉంచబడిన, వల్కలాః = నారచీరలు, అద్యాపి = ఇప్పటికి కూడ, నావశుష్యన్తి = ఎండుటలేదు.

తా. రామా! ఇక్కడ స్నానములు చేసిన ఆ ఋషీశ్వరులు ఈ ప్రదేశమునందు చెట్లపై ఆర వేసిన నారచీరలు ఇప్పటికి కూడ ఎండలేదు. 26

మూ. దేవకార్యాణి కుర్వద్భిర్యానీమాని కృతాని వై,
పుష్పైః కువలయైః సార్ధం మ్లానత్వం నోపయాన్తి వై. 27

ప్ర. అ. దేవకార్యాణి = దేవకార్యములను, కుర్వద్భిః = చేయుచున్న ఆ మునీశ్వరులచేత, కువలయైఃసార్ధమ్ = నల్లకలువలతో కూడ, పుష్పైః = పుష్పము

లతో, యాని = ఏ మాలికలు, కృతాని = చేయబడినవో, ఇమాని = ఇవి, మ్లాన త్వమ్ = వాడిపోవుటను, నోపయాన్తి వై = పొందుటలేదు.

తా. దేవతాపూజాదికార్యములు చేయు ఆ మునీశ్వరులు నల్లకలువలతోను, పుష్పములతోను ఏ మాలికలు నిర్మించినారో అవి ఇంకను వాడలేదు. 27

మూ. కృత్స్నం వనమిదం దృష్టం శ్రోతవ్యం చ శ్రుతం త్వయా,
తదిచ్ఛామ్యభ్యనుజ్ఞాతా త్యక్తుమేతత్కళేబరమ్. 28

ప్ర. అ. త్వయా = నీచేత, కృత్స్నమ్ = సమస్తమైన, ఇదం వనమ్ = ఈ వనము, దృష్టమ్ = చూడబడినది. శ్రోతవ్యమ్ = వినదగినది, శ్రుతం చ = వినబడినది కూడ, తత్ = ఆ కారణమువలన, అభ్యనుజ్ఞాతా = (నీచేత) అనుమతింపబడినదానవై, ఏతత్ = ఈ, కళేబరమ్ = శరీరమును, త్యక్తుమ్ = విడచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. ఈ వనము నంతా చూచినావు. వినవలసిన విషయములు వినినావు. అందుచేత ఇక నేను నీ అనుజ్ఞ పొంది ఈ కళేబరమును విడువ వలె నని కోరు చున్నాను. 28

మూ. తేషామిచ్ఛామ్యహం గన్తుం సమీపం భావితాత్మనామ్,
మునీనామాశ్రమో యేషామహం చ పరిచారిణీ. 29

ప్ర. అ. ఆశ్రమః = ఈ ఆశ్రమము, యేషాం మునీనామ్ = ఏ మునీశ్వరులదో, అహం చ = నేను, పరిచారిణీ = ఎవరి పరిచారికనో, భావితాత్మనామ్ = పవిత్రముచేయబడిన మనస్సు గల, తేషామ్ = ఆ మునీశ్వరులయొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించుచున్నాను.

తా. ఈ ఆశ్రమములో నివసించిన ఏ మునీశ్వరులకు నేను శుశ్రూష చేసే దాననో, పవిత్రమైన మనస్సు గల ఆ మునీశ్వరుల సమీపమునకు వెళ్ళవలె నని కోరుచున్నాను. 29

మూ. ధర్మిష్ఠం తు వచః శ్రుత్వా రాఘవః సహలక్ష్మణః,
ప్రహర్షమతులం లేభే ఆశ్చర్యమితి తత్త్వతః. 30

ప్ర. అ. సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రాఘవః = రాముడు, ధర్మిష్ఠమ్ = ధర్మయుక్తమైన, వచః = వచనమును, శ్రుత్వా = విని, తత్త్వతః = యథార్థముగా, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యకరమైనది, ఇతి = అని పలుకుచు, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను.

తా. ధర్మయుక్తమైన ఆమె మాటలు విని రామలక్ష్మణులు, "నిజముగా ఈ ఆశ్రమము ఆశ్చర్యజనకముగా ఉన్నది"అని పలుకుచు సంతోషించిరి. 30

మూ. తామువాచ తతో రామః శ్రమణీం సంశితవ్రతామ్,
అర్చితోఽహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథాసుఖమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, సంశితవ్రతామ్ = తీవ్రమైన వ్రతము గల, శ్రమణీమ్ = ఆ సంన్యాసిని యైన శబరిని గూర్చి, ఉవాచ = పలికెను. అహమ్ = నేను, త్వయా = నీచేత, భక్త్యా = భక్తితో, అర్చితః = పూజింపబడినాను. కామమ్ = యథేచ్ఛగా, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్లుము."

తా. కఠినమైన వ్రతములు గల ఆ శబరితో రాముడు ఇట్లు పలికెను. "నీవు నన్ను భక్తిపూర్వకముగా పూజించితివి. సుఖముగా, నీ ఇచ్ఛానుసారము వెళ్ళుము.

వి. ఈ శ్లోకంలోని ఉత్తరార్ధానికి బదులు ప్రాచ్యపాఠంలో-"అనుజానామి గచ్ఛేతి ప్రహృష్టవదనోఽబ్రవీత్"అని ఉన్నది. 31

మూ. ఇత్యుక్తా జటిలా వృద్ధా చీరకృష్ణాజినామ్బరా,
తస్మిన్ ముహూర్తే శబరీ దేహం జీర్ణం జిహాసతీ, 32

అనుజ్ఞాతా తు రామేణ హుత్వాత్మానం హుతాశనే,
జ్వలత్పావకసంకాశా స్వర్గమేవ జగామ సా. 33

ప్ర. అ. ఇతి = ఇట్లు, ఉక్తా = పలకబడిన, జటిలా = జటాధారిణి, వృద్ధా = వృద్ధురాలు, చీరకృష్ణాజినామ్బరా = నారచీరను కృష్ణాజినమును వస్త్రముగా ధరించిన, శబరీ = శబరి, జీర్ణమ్ = జీర్ణమైన, దేహమ్ = దేహమును, తస్మిన్

ముహూర్తే = ఆ ముహూర్తమునందు, జిహాసతీ = విడవదలచుచున్నదై, రామేణ = రామునిచేత, అనుజ్ఞాతా = అనుమతింపబడినదై, ఆత్మానమ్ = తనను, హుతాశనే = అగ్నియందు, హుత్వా = హోమముచేసి, జ్వలత్పావకసంకాశా = ప్రజ్వలించుచున్న అగ్నితో సమానురాలై, స్వర్గమేవ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. జటలను, నారలను, కృష్ణాజినమును ధరించిన, వృద్ధురాలైన ఆ శబరి రాముని మాటలు విని, ఆ ముహూర్తమునందే దేహమును విడువవలె నని నిశ్చయించుకొని, రాముని అనుజ్ఞ పొంది, తన శరీరమును అగ్నిలో హోమము చేసి, ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన శరీరముతో స్వర్గమునకు వెళ్ళెను. 32,33

మూ. దివ్యాభరణసంయుక్తా దివ్యమాల్యానులేపనా,
దివ్యామ్బరధరా తత్ర బభూవ ప్రియదర్శనా, 34
విరాజయన్తీ తం దేశం విద్యుత్సౌదామినీ యథా.

ప్ర. అ. దివ్యాభరణసంయుక్తా = దివ్యములైన అలంకారములతో కూడినదై. దివ్యమాల్యానులేపనా = దివ్యమైన పుష్పమాలికలు, చందనము మొదలైన అనులేపనము కలదై, దివ్యామ్బరధరా = దివ్యములైన వస్త్రములను ధరించినదై, విద్యుత్ = మెరయుచున్న, సౌదామనీ యథా = మెరుపువలె, తం దేశమ్ = ఆ దేశమును, విరాజయన్తీ = ప్రకాశింపచేయుచున్నదై, తత్ర = అక్కడ, ప్రియదర్శనా = ప్రియమైన దర్శనము కలదిగా, బభూవ = ఆయెను.

తా. పిదప ఆమె దివ్యములైన అలంకారములు, దివ్యములైన పుష్పమాలలు, అనులేపనము, దివ్యములైన వస్త్రములు ధరించి, మెరయుచున్న మెరుపు వలె ఆ ప్రదేశము నంతా ప్రకాశింపచేయుచు, చూచుటకు ఆనందమును కలిగించునదిగా ఆయెను. 34

మూ. యత్ర తే సుకృతాత్మానో విహరన్తి మహర్షయః, 35
తత్పుణ్యం శబరీ స్థానం జగామాత్మసమాధినా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
చతుఃసప్తతితమః సర్గః.

ప్ర. అ. శబరీ = శబరి, ఆత్మసమాధినా = తనయొక్క తపస్సుచేత, సుకృతాత్మానః = పుణ్యస్వరూపులైన, తే మహర్షయః = ఆ మహర్షులు, యత్ర = ఎక్కడ, విహరన్తి = విహరించుచున్నారో, తత్ = ఆ, పుణ్యమ్ = పుణ్యమైన, స్థానమ్ = స్థానమును, జగామ = పొందెను.

తా. శబరి తన తపోబలముచేత, పుణ్యాత్ములైన ఆ మహర్షులు ఏ స్థానమునందు విహరించుచున్నారో ఆ పుణ్యస్థానమును పొందెను. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో డెబ్బదినాల్గవసర్గ సమాప్తము.

## అథ పఞ్చసప్తతితమః సర్గః

[రామలక్ష్మణులు మాటలాడుకొనుచు పంపాతీరము చేరుట].

మూ. దివం తు తస్యాం యాతాయాం శబర్యాం స్వేన తేజసా,
లక్ష్మణేన సహ భ్రాత్రా చిన్తయామాస రాఘవః. 1

ప్ర. అ. తస్యామ్=ఆ, శబర్యామ్=శబరి, స్వేన తేజసా=తన తేజస్సు చేత, దివమ్=స్వర్గమును గూర్చి, యాతాయామ్=వెళ్ళిన దగుచుండగా, రాఘవః =రాముడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, చిన్తయామాస=ఆలోచించెను.

తా. ఆ శబరి తన తపోబలముచేత స్వర్గమునకు వెళ్ళిన పిమ్మట రాముడు సోదరుడైన లక్ష్మణునితో ఆలోచించెను. 1

మూ. స చిన్తయిత్వా ధర్మాత్మా ప్రభావం తం మహాత్మనామ్,
హితకారిణమేకాగ్రం లక్ష్మణం రాఘవోఽబ్రవీత్. 2

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః రాఘవః=ఆ రాముడు, మహాత్మనామ్=మహాత్ములైన ఆ మునీశ్వరులయొక్క, ప్రభావమ్=ప్రభావ మును, చిన్తయిత్వా=ఆలోచించి, హితకారిణమ్ = హితమును చేయువాడు, ఏకాగ్రమ్=ఏకాగ్రచిత్తము కలవాడు అయిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మాత్ముడైన ఆ రాముడు మహాత్ములైన ఆ మునీశ్వరుల ప్రభావ మును గూర్చి ఆలోచించి, హితమును చేయువాడు, ఏకాగ్రచిత్తము కలవాడు అయిన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 2

మూ. దృష్టోఽయమాశ్రమః సౌమ్య బహ్వాశ్చర్యః కృతాత్మనామ్
విశ్వస్తమృగశార్దూలో నానావిహగసేవితః. 3

ప్ర అ. సౌమ్య = సౌమ్యుడా ! కృతాత్మనామ్ = నిగ్రహించుకొనబడిన మనస్సు గల మునీశ్వరులయొక్క, బహ్వాశ్చర్యః = చాల ఆశ్చర్యకరము, విశ్వస్త మృగశార్దూలః = విశ్వాసము గల మృగములు, పెద్దపులులు కలది, నానావిహగ సేవితః = అనేకవిధములైన పక్షులచేత సేవించబడినది అయిన, అయమ్ ఆశ్రమః = ఈ ఆశ్రమము, దృష్టః = చూడబడినది.

తా. లక్ష్మణా! చాల ఆశ్చర్యకరము, నమ్మిక గల (భయములేని) లేళ్ళు పెద్దపులులూ కలది, అనేకవిధములైన పక్షులచేత సేవింపబడినది అయిన,పవిత్ర ములైన హృదయములు గల మహర్షుల ఆశ్రమమును చూచినాము. 3

మూ. సప్తానాం చ సముద్రాణామేషు తీర్థేషు లక్ష్మణ,
ఉపస్పృష్టం చ విధివత్పితరశ్చాపి తర్పితాః. 4

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా !, సప్తానామ్ = ఏడు. సముద్రాణామ్ = సముద్రములయొక్క, ఏషు తీర్థేషు = ఈ తీర్థములయందు, ఉపస్పృష్టమ్ = స్నానము చేయబడినది. పితరశ్చాపి = పితృదేవతలు కూడ, విధివత్ = యథా శాస్త్రముగ, తర్పితాః = తృప్తిపొందింపబడినారు.

తా. లక్ష్మణా ! ఈ ఏడు సముద్రముల తీర్థములలో స్నానము చేసినాము. యథాశాస్త్రముగా పితృతర్పణములు కూడ చేసినాము. 4

మూ. ప్రణష్టమశుభం తత్తత్కల్యాణం సముపస్థితమ్,
తేన తత్త్వేన హృష్టం మే మనో లక్ష్మణ సంప్రతి. 5
హృదయే హి నరవ్యాఘ్ర శుభమావిర్భవిష్యతి.

ప్ర. అ. అశుభమ్ = అశుభము, ప్రణష్టమ్ = నశించినది. తత్తత్ = ఆ యా, కల్యాణమ్ = కల్యాణము, సముపస్థితమ్ = ప్రాప్తించినది. లక్ష్మణ = లక్ష్మణా ! తేన = ఆ, తత్త్వేన = తత్త్వముచేత, సంప్రతి = ఇప్పుడు, మనః = మనస్సు, హృష్టమ్ = సంతోషించినది. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడా ! హృదయే = హృదయమునందు, శుభమ్ = శుభము, ఆవిర్భవిష్యతి హి = ఆవిర్భవించును కదా.

తా. లక్ష్మణా ! అశుభము నశించినది. ఆ యా కల్యాణములు ప్రాప్తించి

నవి. ఈ యథార్థవిషయముచేత నా మనస్సుకు సంతోషము కలిగినది. శుభము రానున్నప్పుడు హృదయమునకు తెలియుచుండును కదా ? 6

మూ. తదాగచ్ఛ గమిష్యామి పమ్పాం తాం ప్రియదర్శనామ్,
ఋష్యమూకో గిరిర్యత్ర నాతిదూరే ప్రకాశతే,
యస్మిన్వసతి ధర్మాత్మా సుగ్రీవోంఽశుమతః సుతః. 7
నిత్యం వాలిభయాత్త్రస్తశ్చతుర్భిః సహ వానరైః.

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, అంశుమతః సుతః=సూర్యుని కుమారుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, నిత్యమ్=నిత్యము, వాలిభయాత్ = వాలినుండి భయమువలన, చతుర్భిః=నలుగురు, వానరైః సహ =వానరులతో కూడ, యస్మిన్ = దేనియందు, వసతి = వసించుచున్నాడో అట్టి, ఋష్యమూకః = ఋష్యమూకపర్వతము, యత్ర = ఎక్కడ, నాతిదూరే=సమీపమునందు, ప్రకాశతే = ప్రకాశించుచున్నదో, తామ్ = అట్టి, ప్రియదర్శనామ్= ప్రియమైన దర్శనము గల, పమ్పామ్ = పంపాసరస్సును గూర్చి, గమిష్యామి = వెళ్ళెదను. ఆగచ్ఛ = రమ్ము.

తా. అందువలన, సూర్యకుమారుడు, ధర్మాత్ముడూ అయిన సుగ్రీవుడు నిత్యమూ వాలికి భయపడుచు, నలుగురు వానరులతో కలిసి నివసించుచున్న ఋష్యమూకపర్వతము ఏ పంపాసరస్సుకు దగ్గరగా ప్రకాశించుచున్నదో, అట్టి, చూచుటకు ఆనందము కలిగించు పంపాసరస్సుకు వెళ్ళుదము ; రమ్ము. 6,7

మూ. అభిత్వరే చ తం ద్రష్టుం సుగ్రీవం వానరర్షభమ్, 8
తదధీనం హి మే సౌమ్య సీతాయాః పరిమార్గణమ్.

ప్ర. అ. సౌమ్య= సౌమ్యుడా ! వానరర్షభమ్ = వానరశ్రేష్ఠుడైన, తం సుగ్రీవమ్ = ఆ సుగ్రీవుణ్ణి, ద్రష్టుమ్ = చూచుటకు, అభిత్వరే చ = తొందరపడుచున్నాను. సీతాయాః = సీతయొక్క, పరిమార్గణమ్ = అన్వేషణము, తదధీనమ్ = ఆతనిపై అధీనమైనది కదా ?

తా. సౌమ్యుడా ! వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుని చూడవలెనని నాకు తొంద

రగా ఉన్నది ; ఎందుచేత అనగా సీతాన్వేషణము ఆతనిపైననే ఆధారపడి యున్నది. 8

మూ. ఏవం బ్రువాణం తం ధీరం రామం సౌమిత్రిరబ్రవీత్, 9
గచ్ఛావ స్త్వరితం తత్ర మమాపి త్వరతే మనః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, ధీరమ్ = ధీరుడైన, తం రామమ్ = ఆ రాముణ్ణి గూర్చి, సౌమిత్రిః = లక్ష్మణుడు, అబ్రవీత్ = పలికెను. మమ = నాయొక్క, మనః అపి = మనస్సు కూడ, త్వరతే = తొందరపడు చున్నది. త్వరితమ్ = తొందరగా, తత్ర = అక్కడికి, గచ్ఛావః = వెళ్ళుదము.

తా. ఇట్లు పలుకు చున్న ధీరుడైన రామునితో లక్ష్మణుడు ఇట్లనెను. "నా మనస్సు కూడ తొందరపడుచున్నది. శీఘ్రముగా అక్కడికి వెళ్లెదము".

మూ. ఆశ్రమాత్తు తత స్తస్మాన్నిష్క్రమ్య స విశాం పతిః. 10
ఆజగామ తతః పమ్పాం లక్ష్మణేన సహ ప్రభుః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, విశాం పతిః = మానవులకు అధిపతి యైన, సః = ఆ, ప్రభుః = సర్వలోకప్రభువైన రాముడు, తస్మాత్ = ఆ, ఆశ్రమాత్ = ఆశ్రమమునుండి, నిష్క్రమ్య = బయలుదేరి, తతః = అక్కడినుండి, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడ, పమ్పామ్ = పంపాసరస్సును, ఆజగామ = పొందెను.

తా. పిమ్మట మానవుల అధిపతి, ప్రభువు అయిన రాముడు, ఆ ఆశ్రమము నుండి బయల్వెడలి, లక్ష్మణునితో కలిసి అక్కడినుండి పంపను చేరెను. 10

మూ. స దదర్శ తతః పుణ్యాముదారజనసేవితామ్, 11
నానాద్రుమలతాకీర్ణాం పమ్పాం పానీయవాహినీమ్,
పద్మైః సౌగన్ధికై స్తామ్రాం శుక్లాం కుముదమణ్డలైః,
నీలాం కువలయోద్ఘాటైర్బహువర్ణాం కుథామివ.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ రాముడు, పుణ్యామ్ = పవిత్రము, ఉదారజనసేవితామ్ = ఉత్తమపురుషులచేత సేవింపబడినది, నానాద్రుమ

లతాకీర్ణామ్ = అనేకవిధములైన వృక్షములచేత, లతలచేత వ్యాప్తము, పానీయ వాహినీమ్ = జలముతో నిండినది, సౌగన్ధికైః = మంచి సువాసన గల, పద్మైః = ఎఱ్ఱవి పద్మములచేత, తామ్రామ్ = ఎఱ్ఱగా ఉన్నది. కుముదమణ్డలైః=తెల్ల కలువల సముదాయములచేత, శుక్లామ్=తెల్లనిది, కువలయోద్ఘాటైః = నల్ల కలువల సముదాయములచేత, నీలామ్ = నల్లగా ఉన్నది, బహువర్ణామ్ = అనేకమైన వర్ణములు గల, కుథామివ = కంబళము వలె ఉన్న, పమ్పామ్ = పంపను, దదర్శ = చూచెను.

తా. పిమ్మట రాముడు పవిత్రమైన ఆ పంపను చూచెను. దానిని ఉత్తములైన నరులు సేవించుచుండిరి. దాని తీరములు అనేకవిధములైన వృక్షముల చేత, లతలచేత వ్యాప్తములై ఉండెను. అది త్రాగుటకు తగిన మంచి నీటితో నిండి ఉండెను. ఆ సరస్సులో మంచి సువాసన గల ఎఱ్ఱని పద్మములు, తెల్లని కలువలు, నల్లని కలవలు ఉండుటచేత అది వివిధవర్ణములతో విచిత్రముగా ఉన్న కంబళి వలె ఉండెను. 11,12

మూ. స తామాసాద్య వై రామో దూరాదుదకవాహినీమ్, 13
మతఙ్గసరసం నామ హ్రదం సమవగాహత.

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, ఉదకవాహినీమ్=ఉదకమును వహించుచున్న, తామ్ = ఆ పంపను, దూరాత్ = దూరమునుండి, ఆసాద్య = పొంది, (చూచి), మతఙ్గసరసం నామ = మతంగసరస మను పేరు గల, హ్రదమ్=చెరువును, సమవగాహత = ప్రవేశించెను.

తా. రాముడు ఉదకముతో నిండిన ఆ పంపాసరస్సును దూరమునుండియే చూచి, దాని సమీపమునం దున్న మతంగసరస మను పేరు గల చెరువులో దిగి స్నానము చేసెను. 13

మూ. అరవిన్దోత్పలవతీం పద్మసౌగన్ధికాయుతామ్, 14
పుష్పితామ్రవణోపేతాం బర్హిణోద్ఘుష్టనాదితామ్,
తిలకైర్బీజపూరైశ్చ ధవైః శుక్లద్రుమైస్తథా, 15
పుష్పితైః కరవీరైశ్చ పున్నాగైశ్చ సుపుష్పితైః,
మాలతీకున్దగుల్మైశ్చ భాణ్డీరైర్నిచులైస్తథా. 16

అశోకైః సప్తపర్ణైశ్చ కేతకై రతిముక్తకైః,
అన్యైశ్చ వివిధై ర్వృక్షైః ప్రమదామివ భూషితామ్, 17
సమీక్షమాణౌ పుష్పాఢ్యం సర్వతో విపులద్రుమమ్,
కోయష్టికైశ్చార్జునకైః శతపత్రైశ్చ కీరకైః, 18
ఏతైశ్చాన్యైశ్చ విహగైర్నాదితం తు వనం మహత్,
తతో జగ్మతురవ్యగ్రౌ రాఘవౌ సుసమాహితౌ, 19
తద్వనం చైవ సరసః పశ్యన్తౌ శకునైర్యుతమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రాఘవౌ = రామలక్ష్మణులు, అరవిన్దోత్పలవతీమ్ = ఎఱ్ఱని పద్మములు, కలవలు కలది, పద్మసౌగన్ధికాయుతామ్ = తెల్ల పద్మములతోను ఎఱ్ఱని కలవలతోను కూడినది, పుష్పితామ్రవణోపేతామ్ = పుష్పించిన మామిడితోటలతో కూడినది, బర్హిణోద్ఘుష్టనాదితామ్ = నెమళ్ళ అరపులచేత ధ్వనింపచేయబడినది, తిలకైః = బొట్టుగచెట్లతోను, బీజపూరైశ్చ = దానిమ్మచెట్లతోను, ధవైః = చంద్రచెట్లతోను, తథా = మరియు, శుక్లద్రుమైః = ఏరుమద్దిచెట్లతోను, పుష్పితైః = పుష్పించిన, కరవీరైశ్చ = గన్నేరుచెట్లతోను, సుపుష్పితైః = బాగా పూసిన, పున్నాగైశ్చ = సురపొన్నచెట్లతోను, మాలతీకున్దగుల్మైశ్చ = జాజిపొదలతోను, మల్లిపొదలతోను, భాణ్డీరైః = మఱ్ఱిచెట్లతోను, తథా = మరియు, నిచులైః = తినాసపుచెట్లతోను, అశోకైః = అశోకవృక్షములతోను, సప్తపర్ణైః = ఏడాకుల అరటిచెట్లతోను, కేతకైః = మొగలిచెట్లతోను, అతిముక్తకైః = గురివిందచెట్లతోను, అన్యైః = ఇతరములైన, వివిధైః = అనేకవిధములైన, వృక్షైశ్చ = వృక్షములతోను, కూడినది, భూషితామ్ = అలంకరింపబడిన, ప్రమదామివ = స్త్రీవలె ఉన్న పంపాసరస్సును, సర్వతః = నలుమూలలా, సమీక్షమాణౌ = చూచుచు, పుష్పాఢ్యమ్ = పుష్పములతో నిండినది, విపులద్రుమమ్ = పెద్ద వృక్షములు కలది, కోయష్టికైశ్చ = కోయష్టికపక్షులచేతను, అర్జునకైః = నెమళ్ళచేతను, శతపత్రైః = బెగ్గురుపక్షులచేతను, కీరకైః = చిలుకలచేతను, ఏతైః = ఈ పక్షులచేతను, అన్యైః = ఇతరములైన, విహగైశ్చ = పక్షులచేతను, నాదితమ్ = ధ్వనింపచేయబడినదీ, మహత్ = గొప్పదీ అయిన, శకునైః = పక్షులతో, యుతమ్ = కూడిన, వనమ్ = వనమును, పశ్యన్తౌ = చూచుచున్నవారై, అవ్యగ్రౌ =

తొందరపాటు లేనివారై, సుసమాహితౌ = బాగుగా సావధానచిత్తులై, సరసః = సరస్సుయొక్క, తత్ = ఆ, వనమ్ = వనమును గూర్చి, జగ్మతుః = వెళ్ళిరి.

తా. ఆ రామలక్ష్మణులు సావధానచిత్తులై, తొందర లేనివారై ఆ వనము లోనికి వెళ్ళిరి. మార్గమధ్యమునందు పంపాసరస్సును, దాని ప్రక్క నున్న వనమును చూచిరి. ఆ పంపాసరస్సునందు ఎఱ్ఱనిపద్మములు, కలవలు, తెల్లని పద్మములు, ఎఱ్ఱని కలవలు ఉండెను. దాని చుట్టూ పుష్పించిన మామిడిచెట్లు, బొట్టుగచెట్లు, దానమ్మచెట్లు, చంద్రచెట్లు, వీరుమద్దిచెట్లు, పుష్పించిన గన్నేరుచెట్లు పొన్నచెట్లు, జాజితీగలు, మల్లెపొదలు, మఱ్ఱిచెట్లు, తినాసపుచెట్లు, అశోకవృక్షములు, ఏడాకుల అరటిచెట్లు, మొగలిచెట్లు, గురివెందచెట్లు ఇంకా ఎన్నో ఇతరములైన చెట్లు ఉండుటచే ఆ సరస్సు అలంకరించుకొన్న స్త్రీ వలె ఉండెను. నెమళ్ళ కేకాధ్వనులతో ఆ ప్రాంతము ప్రతిధ్వనించుచుండెను. కోయష్టిక పక్షులు, బెగ్గురుపక్షులు, చిలకలు మొదలైన పక్షుల ధ్వనులు వినబడుచుండెను. ఆ సరస్సు ప్రక్కనే ఉన్న వనమును కూడ చూచుచు దానిలోనికి ప్రవేశించిరి.

మూ. స దదర్శ తతః పమ్పాం శీతవారినిధిం శుభామ్, 20
తిలకాశోకపున్నాగవకుళోద్దాలకాశినీమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ రాముడు, శీతవారినిధిమ్ = చల్లని నీటికి నిధి, శుభామ్ = మంగళప్రదము, తిలకాశోకపున్నాగ వకుళోద్దాల శాలినీమ్ = తిలక, అశోక, పుంనాగ, వకుళ, ఉద్దాల వృక్షములతో ప్రకాశించునదీ అయిన, పమ్పామ్ = పంపను, దదర్శ = చూచెను.

తా. పిమ్మట ఆ రాముడు చల్లని నీటితో నిండి ఉన్నది, మంగళప్రదము, తిలక - అశోక - పుంనాగ - వకుళ - ఉద్దాలవృక్షములతో ప్రకాశించుచున్నది అయిన పంపాసరస్సును చూచెను. 20

మూ. స రామో వివిధాన్ వృక్షాన్ సరాంసి వివిధాని చ, 21
పశ్యన్ కామాభిసంతప్తో జగామ పరమం హ్రదమ్.

ప్ర. అ. సః = ఆ, రామః = రాముడు, వివిధాన్ = అనేకవిధములైన, వృక్షాన్ = వృక్షములను, వివిధాని = అనేకవిధములైన, సరాంసి = సరస్సులను,

పశ్యన్ = చూచుచు, కామాభిసంతప్తః = మన్మథునిచేత పీడించబడినవాడై, పరమమ్ = శ్రేష్ఠమైన. హ్రదమ్ = చెరువును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ఆ రాముడు అనేకవిధములైన వృక్షాలను, అనేకసరస్సులను చూచుచు, మన్మథునిచే పీడింపబడుచున్నవాడై శ్రేష్ఠమైన ఆ పంపాసరస్సును సమీపించెను. 21

మూ. పుష్పితోపవనోపేతాం సాలచమ్పకశోభితామ్, 22
షట్పదౌఘసమావిష్టాం శ్రీమతీమతులప్రభామ్,
స్ఫటికోపమతోయాఢ్యాం శ్లక్ష్ణవాలుకసంతతామ్, 23

స తాం దృష్ట్వా పునః పమ్పాం పద్మసౌగన్ధికైర్యుతామ్
ఇత్యువాచ తదా వాక్యం లక్ష్మణం సత్యవిక్రమః. 24

ప్ర. అ. సత్యవిక్రమః=సత్యమైన పరాక్రమము గల, సః=ఆ రాముడు, పుష్పితోపవనోపేతామ్ = పుష్పించిన సమీపమునందలి వనములచే చుట్టబడినది, సాలచమ్పకశోభితామ్ = సాలవృక్షములచేతను, సంపెంగచెట్లచేతను ప్రకాశింపచేయబడినది, షట్పదౌఘసమావిష్టామ్=తుమ్మెదల సముదాయముచేత వ్యాప్తము, శ్రీమతీమ్ = శోభాయుక్తము, అతులప్రభామ్ = సాటిలేని కాంతి గలది, స్ఫటికోపమతోయాఢ్యామ్=స్ఫటికమువంటి నీటితో నిండినది, శ్లక్ష్ణవాలుకసంతతామ్= మృదువైన ఇసుకతో నిండినదీ, పద్మసౌగన్ధికైః = పద్మములతోను, ఎఱ్ఱని కలువలతోను, యుతామ్=కూడినది అయిన, తామ్=ఆ పంపను, పునః=మరల, దృష్ట్వా= చూచి, తదా=అప్పుడు, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇతి=ఇట్లు, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ పంపాసరస్సు చుట్టూ పుష్పించిన వనములు ఉండెను. సాల వృక్షములు, చంపక వృక్షములు దాని ప్రకాశమును ఇనుమడింపచేయుచుండెను. అక్కడ తుమ్మెదలు గుంపులు గుంపులుగా ఎగురుచుండెను. శోభాయుక్తమై, సాటిలేని కాంతితో ప్రకాశించుచున్న ఆ పంపా సరస్సులోని జలము స్ఫటికము వలె నిర్మలముగా ఉండెను. దానిలోని ఇసుక చాల మృదువుగా ఉండెను. పద్మములతోను, ఎఱ్ఱని కలవలతోను నిండి యున్న ఆ పంపానదిని మరల చూచుచు, సత్యమైన పరాక్రమము గల రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను.

మూ. అస్యాస్తీరే తు పూర్వోక్తః పర్వతో ధాతుమణ్డితః,
ఋష్యమూక ఇతి ఖ్యాతః పుణ్యః పుష్పితపాదపః. 25

ప్ర. అ. పూర్వోక్తః = పూర్వము చెప్పబడిన, ధాతుమణ్డితః = ధాతువుల చేత అలంకరించబడిన, పుణ్యః = పుణ్యమైన, పుష్పితపాదపః = పుష్పించిన వృక్షములు గల, ఋష్యమూకః ఇతి = ఋష్యమూకము అని, ఖ్యాతః = ప్రసిద్ధమైన, పర్వతః = పర్వతము, అస్యాః = దీనియొక్క, తీరే = తీరమునందు ఉన్నది.

తా. ధాతువులచేత అలంకరింపబడినది, పుణ్యము, పుష్పించిన వృక్షములు కలది అయిన, ఋష్యమూక మనే ప్రసిద్ధి గల, వెనుక చెప్పిన పర్వతము దీని తీరమునందే ఉన్నది. 25

మూ. హరే ఋక్షరజోనామ్నః పుత్ర స్తస్య మహాత్మనః,
అధ్యాస్తే తం మహావీర్యః సుగ్రీవ ఇతి విశ్రుతః. 26

ప్ర. అ. ఋక్షరజోనామ్నః = ఋక్షరజస్సు అను పేరు గల, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ, హరేః = వానరునియొక్క, పుత్రః = పుత్రుడు, మహావీర్యః = గొప్ప పరాక్రమము గలవాడు, సుగ్రీవః ఇతి = సుగ్రీవుడు అని, విశ్రుతః = ప్రసిద్ధుడూ అయిన వానరుడు, తమ్ = ఆపర్వతమును, అధ్యాస్తే = అధిష్ఠించిఉన్నాడు.

తా. ఋక్షరజస్సు అను పేరు గల మహాత్ముడైన వానరుని కుమారుడు, సుగ్రీవు డని ప్రసిద్ధుడు, మహాపరాక్రమశాలి అయిన వానరుడు ఆ పర్వతము మీద ఉన్నాడు. 26

మూ. సుగ్రీవమభిగచ్ఛ త్వం వానరేన్ద్రం నరర్షభ,
ఇత్యువాచ పునర్వాక్యం లక్ష్మణం సత్యవిక్రమమ్. 27

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడవైన లక్ష్మణా ! త్వమ్ = నీవు, వానరేన్ద్రమ్ = వానరుల ప్రభువైన, సుగ్రీవమ్ = సుగ్రీవుని గూర్చి, అభిగచ్ఛ = వెళ్లుము. పునః = మరల, సత్యవిక్రమమ్ = సత్యమైన పరాక్రమముగల, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇతి = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. లక్ష్మణా ! నీవు వానరనాయకుడైన సుగ్రీవునివద్దకు వెళ్ళుము అని రాముడు సత్యమైన పరాక్రమము గల లక్ష్మణునితో చెప్పి మరల పలికెను. 27

మూ. రాజ్యభ్రష్టేన దీనేన తస్యామాసక్తచేతసా,
కథం మయా వినా శక్యం సీతాం లక్ష్మణ జీవితుమ్. 28

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! రాజ్యభ్రష్టేన = రాజ్యమునుండి భ్రష్టుడను, దీనేన = దీనుడను, తస్యామ్ = ఆమెయందు, ఆసక్తచేతసా = లగ్నమైన చిత్తము గలవాడను అయిన, మయా = నాచేత, సీతాం వినా = సీత లేకుండా, జీవితుమ్ = జీవించుటకు, కథమ్ = ఎట్లు, శక్యమ్ = శక్యమైనది ?

తా. లక్ష్మణా ! నేను రాజ్యమును పోగొట్టుకొంటిని. దీనుడను. నా మనస్సు సీతపై లగ్నమై ఉన్నది. అట్టి నేను సీత లేకుండా ఎట్లు జీవించ గలను ?

మూ. ఇత్యేవముక్త్వా మదనాభిపీడితః
స లక్ష్మణం వాక్యమనన్యచేతసమ్,
వివేశ పమ్పాం తటినీం మనోరమాం
రఘూత్తమః శోకవిషాదయన్త్రితః. 29

ప్ర. అ. మదనాభిపీడితః = మన్మథునిచేత పీడింపబడిన, సః రఘూత్తమః = ఆ రాముడు, అనన్యచేతసమ్ = మరొక ఆలోచన లేని, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇత్యేవమ్ = ఇట్లు, వాక్యమ్ = వాక్యమును, ఉక్త్వా = పలికి, శోకవిషాదయన్త్రితః = శోకముచేతను, దిగులుచేతను పీడితుడై, మనోరమామ్ = సున్దరమైన, పమ్పాం తటినీమ్ = పంపాసరస్సును, వివేశ = ప్రవేశించెను.

తా. మన్మథునిచేత పీడింపబడిన ఆ రాముడు, వేరు ఆలోచన లేపీ లేని లక్ష్మణునితో ఇట్లు పలికి, శోకవిషాదములతో బాధపడుచు మనోహరమైన ఆ పంపాసరస్సును ప్రవేశించెను. (సరస్సును సమీపించెను). 29

మూ. తతో మహద్వర్త్మ సుదూరసంక్రమం
క్రమేణ గత్వా ప్రవిలోకయన్వనమ్,
దదర్శ పమ్పాం శుభదర్శకాననా
మనేకనానావిధ పక్షిజాలకామ్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే అరణ్యకాణ్డే
పఞ్చసప్తతితమః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుదూరసంక్రమమ్ = చాల దూరమైన నడక గల, మహత్ = దీర్ఘమైన, వర్త్మ = మార్గమును, క్రమేణ = క్రమముగా, గత్వా = వెళ్ళి, వనమ్ = వనమును, ప్రవిలోకయన్ = చూచుచు, శుభాదర్శకానననామ్ = శుభముగా కనబడు అడవులు గల, అనేకనానావిధపక్షిజాలకామ్ = అనేకములైన, బహువిధములైన పక్షిసముదాయములు గల, పమ్పామ్ = పంపా సరస్సును, దదర్శ = చూచెను.

తా. పిమ్మట రాముడు చాల దూరము నడవవలసి ఉన్న దీర్ఘమైన మార్గమును క్రమముగా నడచి, వనమును చూచుచు, మంగళకరమైన దర్శనము గల (చూచుటకు మంగళకరమైన) అడవులు గలది, అనేకవిధములైన, అనేకమైన పక్షుల సముదాయములు కలది అయిన పంపను చేరెను. 30

'బాలానందిని''అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అరణ్యకాండలో డెబ్బదియైదవ సర్గ సమాప్తము. అరణ్యకాండము సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే,

దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్తాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః శ్రీః

శ్రీరామాయ నమః

శ్రీ మద్వాల్మీకి మహర్షి ప్రణీత

శ్రీమద్రామాయణము

# కిష్కిన్ధాకాండము

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన

బాలానందినీ వ్యాఖ్యతో కూడినది


ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

1993

# ముందుమాట

రామాయణం లేని ఊరూ, 'రామా' అని పలకని నోరూ ఆంధ్రదేశంలో లేవు. మన ఆంధ్రదేశ మనేమిటి, మనదేశంలోనే లేవనటం అతిశయోక్తి కాదు. రామాయణానికీ భారతీయ జన జీవితానికీ మధ్య అనుబంధం అటువంటిది. వివిధ భారతీయభాషలలో వందలసంఖ్యలో రామాయణాలు వెలువడ్డాయి. రామాయణం నుంచి ఒక సూక్తో, రామకథాసంబంధమైన ఒక సామెతో వినపడని ప్రసంగాలూ, సంభాషణలూ అరుదు. పండితుడైనా సందర్భోచితంగా రామకథా ప్రస్తావన చేయకుండా రోజు గడపలేడు.

రామాయణాన్ని మహాకావ్య మనే అన్నారు. ఉత్తమ కావ్య లక్షణాలన్నీ అందులో ఉన్నాయి. కావ్య మనుకొన్నప్పటికీ రామాయణంలో ఎంత ఆధ్యాత్మిక సంపద ఉన్నదో అంత లౌకికజ్ఞానం ఉంది. ఎంత తవ్వినా తరగని గని రామాయణం. ఆదర్శ దాంపత్యానికి సీతారాములు అంటాము. తండ్రి ఆజ్ఞను పాలించడంలో రాముడినే ఆదర్శంగా చెపుతుంటాము. తిరుగులేకపోవట వనే భావం ప్రకటించడానికి రామబాణం అంటాము. ప్రజలు సుఖశాంతులతో గడిపే పరిపాలన ఉన్నప్పుడు రామరాజ్యం అంటాము.

ఎన్ని భాషలలో రామాయణం ఎన్ని విధాలుగా ప్రచురణ పొందినప్పటికీ వాల్మీకి రామాయణం వాల్మీకి రామాయణమే. రామాయణంలో ఆ మహర్షి రచించిన ప్రతిశ్లోకమూ ఒక మహాకావ్యమే. కనుకనే వాల్మీకి రచించిన శ్లోకాలను, వాటికి అర్థతాత్పర్యాలనూ విశేషవ్యాఖ్యతో ప్రచురించాలని 'ఆర్ష విజ్ఞాన ట్రస్టు' సంకల్పించింది. ప్రయత్నం మొదలై పదకొండు సంవత్సరాలైనా తొలిసంపుటం 'బాలకాండము' 1987లో వెలువడింది.

ట్రస్టు వ్యవస్థాపకులైన మాన్యులు న్యాయమూర్తి శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారి సంకల్పబలం, కంచిపీఠం పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి ఆశీర్వాద మహిమవల్లా, ఎందరో వదాన్యుల ఔదార్యం వల్లా ఆర్ష విజ్ఞాన ట్రస్టు ఇప్పటికి రామాయణ ప్రచురణ కార్యక్రమంలో పదింట ఆరువంతుల భాగాన్ని నిర్వహించగలిగింది. బాలకాండము, అయోధ్యాకాండము (రెండు సంపుటాలు), సుందరకాండ ఇదివరకే వెలువడ్డాయి. ఇప్పుడు ఆరణ్య, కిష్కింధాకాండములు వెలువడుతున్నాయి. అచిరభవిష్యత్తులో దైవానుగ్రహం వల్ల యుద్ధకాండము రెండు

సంపుటాలుగానూ, ఉత్తరకాండము రెండు సంపుటాలుగానూ ప్రచురించగలమని ట్రస్టు విశ్వసిస్తున్నది.

ఇంతవరకు వెలువడిన సంపుటల పద్ధతిలోనే ఇప్పుడు అరణ్య, కిష్కింధా కాండములుకూడా వెలువడ్డాయి. ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారి బాలానందినీ వ్యాఖ్య అటు పండితుల ప్రశంసలనూ, ఇటు పామరుల అభిమానాన్నీ చూరగొన్నది. విశేషంగా అధ్యయనం చేసి, శ్రమకోర్చి శ్రీ రామచంద్రుడుగారు అందిస్తున్న ఈ రచన ఆంధ్ర పాఠకలోకానికి వరప్రసాద మనిపిస్తున్నది.

నీలంరాజు వెంకట శేషయ్యగారూ, ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారూ, శ్రీదేవులపల్లి రామానుజరావుగారూ ఈ సంస్థకు చేదోడు వాదోడుగా ఉండి దీని అభివృద్ధికి దోహదం చేశారు. వారు చూపిన మార్గంలోనే ఈ సంస్థ పురోగమిస్తున్నది.

అరణ్యకాండములోనూ, కిష్కింధాకాండములోనూ అద్భుతమైన కావ్యాంశాలు మాత్రమేగాక నిత్యజీవితానికి ఉపయోగపడే అనేకానేక సూక్తులూ, ప్రవర్తనలను తీర్చి దిద్దుకొనడానికి దోహదం చేసే ఘట్టాలూ ఉన్నాయి. ఉదాహరణకు లక్ష్మణుడు వదినెగారి ఆభరణాలను గుర్తుపట్టడానికి వచ్చినప్పుడు కాలి కడియాలను మాత్రమే గుర్తుపడతా నంటాడు-

'నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే,
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్.'

"బాహువులకు పెట్టుకునే కేయూరాలు నాకు తెలియదు. చెవులకు పెట్టుకునే కుండలాలు ఎలా ఉంటాయో కూడ నాకు తెలియదు. కాని నిత్యం ఆ తల్లిపాదాలకు మొక్కుతుంటాను గనుక మంజీరాలను మాత్రం గుర్తుపడతాను" అంటాడు లక్ష్మణుడు. వదినెగారిపట్ల లక్ష్మణునికి ఉన్న మాతృభావనను ఇంతకంటె సమర్థవంతంగా వ్యక్తం చేయడానికి మార్గం ఉన్నదా? లేదు. ఇలా ఎన్ని ఉదాహరణలైనా చెప్పవచ్చు, స్థలాభావం ప్రతిబంధకం కాకపోతే.

ఇంతకు మునుపు వెలువడిన సంపుటాలను అభిమానించినట్లే ఇప్పుడు వెలువడుతున్న అరణ్య, కిష్కింధాకాండములను కూడా ఆంధ్రపాఠకజనులు సమాదరించుదురుగాక.

భద్రమస్తు

పొత్తూరి వెంకటేశ్వరరావు

# కిష్కింధాకాండ విషయసూచిక

శ్రీః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

బాలానన్దినీసహిత మగు

# శ్రీమద్రామాయణము - కిష్కిన్ధాకాండము

## అథ ప్రథమః సర్గః

[పంపను చూడగానే రాముడు వ్యాకులత్వము చెందుట. రాముడు పంపాసరఃశోభను లక్ష్మణునకు వర్ణించి చెప్పుట. లక్ష్మణుడు సీతావిరహముతో బాధపడుచున్న రాముని ఓదార్చుట. ఋష్యమూకపర్వతమునకు వచ్చుచున్న రామలక్ష్మణులను చూచి సుగ్రీవుడు, ఆతని అనుచరులు భయపడుట]

మూ. స తాం పుష్కరిణీం గత్వా పద్మోత్పలఝషాకులామ్,
రామః సౌమిత్రిసహితో విలలాపాకులేన్ద్రియః. 1

ప్ర. అ. సౌమిత్రిసహితః=లక్ష్మణునితో కూడిన, సః= ఆ, రామః= రాముడు, పద్మోత్పలఝషాకులామ్= పద్మములతోను, కలువలతోను మత్స్యములతోను వ్యాకులమైన, పుష్కరిణీమ్=పద్మసరస్సును, గత్వా= పొంది, ఆకులేన్ద్రియః =వ్యాకులములైన ఇంద్రియములు కలవాడై, విలలాప= విలపించెను.

తా. లక్ష్మణసమేతుడైన ఆ రాముడు పద్మములతోను, కలవలతోను, మత్స్యములతోను వ్యాకులమైన ఆ పంపాసరస్సును చేరి, ఇంద్రియములు వ్యాకులములు కాగా విలపించెను. 1

మూ. తత్ర దృష్ట్వైవ తాం హర్షాదిన్ద్రియాణి చకమ్పిరే,
స కామవశ మాపన్నః సౌమిత్రిమిదమబ్రవీత్.

ప్ర. అ. తత్ర= అక్కడ, తామ్= ఆ పంపాసరస్సును, దృష్ట్వైవ =చూడగానే, హర్షాత్= ఆనందమువలన, ఇన్ద్రియాణి= ఇంద్రియములు, చకమ్పిరే =కంపించినవి. సః= ఆ రాముడు, కామవశమ్= కామముయొక్క వశమును, ఆపన్నః= పొందినవాడై, సౌమిత్రిమ్= లక్ష్మణుని గూర్చి, ఇదమ్= ఈ వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. ఆ పంపాసరస్సును చూడగానే ఆనందముచేత రాముని ఇంద్రియములు చలించెను. మన్మథునికి వశుడై ఆ రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను. 2

మూ. సౌమిత్రే శోభతే పమ్పా వైదూర్యవిమలోదకా,
ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధైర్ద్రుమైః. 3

ప్ర.అ. సౌమిత్రే= లక్ష్మణా! వైదూర్యవిమలోదకా= వైదూర్యమణి వలె నిర్మలమైన ఉదకము గలది, ఫుల్లపద్మోత్పలవతీ= వికసించిన పద్మములు కలవలు కలది, వివిధైః= అనేకవిధములైన, ద్రుమైః= వృక్షములచేత, శోభితా= శోభింప చేయబడినది అయిన, పమ్పా=పంపాసరస్సు, శోభతే= ప్రకాశించుచున్నది.

తా. లక్ష్మణా! ఈ పంపాసరస్సు చాల అందముగా ఉన్నది. దీనిలోని జలము వైదూర్యమణి వలె నిర్మలముగా ఉన్నది. ఇది పద్మాలతోను, కలవలతోను నిండి ఉన్నది. దీనిని అనేకవృక్షములు శోభింపచేయుచున్నవి. 3

మూ. సౌమిత్రే! పశ్య పమ్పాయాః కాననం శుభదర్శనమ్,
యత్ర రాజన్తి శైలా వా ద్రుమాః సశిఖరా ఇవ. 4

ప్ర.అ.సౌమిత్రే!= లక్ష్మణా! పమ్పాయాః=పంపయొక్క, శుభదర్శనమ్= మంగళకరమైన దర్శనము గల, కాననమ్= అడవిని, పశ్య=చూడుము. యత్ర=ఎక్కడ, ద్రుమాః=వృక్షములు, సశిఖరాః=శిఖరములతో కూడిన, శైలాః ఇవ=పర్వతములు వలె, రాజన్తి=ప్రకాశించుచున్నవో.

తా. లక్ష్మణా! చూచేవారికి మంగళకరమైన పంపాతీరవనమును చూడుము. దానిలోని చెట్లు శిఖరాలతో కూడిన పర్వతముల వలె ఉన్నది. 4

మూ. మాం తు శోకాభిసంతప్తమాధయః పీడయన్తి వై,
భరతస్య చ దుఃఖేన వైదేహ్యా హరణేన చ. 5

ప్ర.అ. భరతస్య=భరతునియొక్క, దుఃఖేన=దుఃఖముచేతను, వైదేహ్యాః=సీత యొక్క, హరణేన=హరణముచేతను, శోకాభిసంతప్తమ్=దుఃఖముచేత తపింపచేయు బడిన, మాం తు=నన్నైతే, ఆధయః=మనోవ్యథలు, పీడయన్తి=పీడించుచున్నవి.

తా. భరతుని దుఃఖముచేత, సీతాపహరణముచేత దుఃఖముతో బాధపడుచున్న నన్ను మనోవ్యథలు పీడించుచున్నవి. 5

మూ. శోకార్తస్యాపి మే పమ్పా శోభతే చిత్రకాననా,
వ్యవకీర్ణా బహువిధైః పుష్పైః శీతోదకా శివా. 6

ప్ర.అ. చిత్రకాననా=చిత్రమైన అడవులు కలది, బహువిధైః= అనేకవిధములైన, పుష్పైః=పుష్పములచేత, వ్యవకీర్ణా=చిమ్మబడినది, శీతోదకా=చల్లని నీరు గలది శివా=మంగళప్రదమైన, పమ్పా=పంపాసరస్సు, శోకార్తస్యాపి=శోకము

చేత పీడింపబడినవాడనైనా, మే=నాకు,శోభతే=శోభించుచున్నది. (అందముగా కనబడుచున్నది.)

తా. ఈ పంప చుట్టూ అనేకవిధములైన అడవు లున్నవి. దీనిమీద అనేకవిధములైన పుష్పములు రాలి ఉన్నవి. నీరు చల్లగా ఉన్నది. ఈ విధముగా మంగళప్రదముగా ఉన్న ఈ పంపాసరస్సు నేను శోకార్తుడ నైనా అందముగా కనబడుచున్నది. 6

మూ. నలినైరపి సంఛన్నా హ్యత్యర్థశుభదర్శనా,
సర్వవ్యాలానుచరితా మృగద్విజసమాకులా. 7

ప్ర. అ. నలినైః=పద్మములచేత, సంఛన్నా=కప్పబడినది, అత్యర్థశుభద ర్శనా=మిక్కిలి మంగళకరమైన దర్శనము కలది, సర్వవ్యాలానుచరితా=సర్పములచేత ఏనుగులచేత సంచరించబడినది, మృగద్విజసమాకులా=లేళ్లతోను, పక్షులతోను వ్యాకు లమైనది.

తా. ఈ పంపాసరస్సు పద్మములతో కప్పబడినదై చూచుటకు మంగళ ప్రదముగా ఉన్నది. లేళ్ళతోను, పక్షులతోను వ్యాప్తమైన దీని ప్రాంతమునందు సర్పములు, ఏనుగులు సంచరించుచున్నవి. 7

మూ. అధికం ప్రవిభాత్యేతన్నీలపీతం తు శాద్వలమ్,
ద్రుమాణాం వివిధైః పుష్పైః పరిస్తోమై రివార్పితమ్. 8

ప్ర. అ. ద్రుమాణామ్=వృక్షములయొక్క, వివిధైః=అనేకవిధములైన, పుష్పైః=పుష్పములతో, పరిస్తోమైరివ=కంబళులతో వలె, అర్పితమ్=కప్పబడిన, ఏతత్=ఈ, నీలపీతమ్=నీలము గాను పచ్చగాను ఉన్న, శాద్వలమ్=పచ్చికబీడు, అధికమ్=అధికముగా, ప్రవిభాతి=ప్రకాశించుచున్నది.

తా. చెట్లనుండి అనేకవిధములైన పుష్పములు రాలి కంబళ్లు పర చినట్లుండుటచే, నల్లగాను, పచ్చగాను ఉన్న ఈ పచ్చికబీడు అధికముగా ప్రకాశించుచున్నది. 8

మూ. పుష్పభారసమృద్ధాని శిఖరాణి సమన్తతః,
లతాభిః పుష్పితాగ్రాభి రుపగూఢాని సర్వతః. 9

ప్ర. అ. సమన్తతః=అంతటా, పుష్పభారసమృద్ధాని=పుష్పముల భారముతో నిండిన, శిఖరాణి=వృక్షశిఖరములు, పుష్పితాగ్రాభిః= పుష్పించిన అగ్రభాగములు గల, లతాభిః=లతలచేత, సర్వతః=అంతటా, ఉపగూఢాని=కౌగలించుకొనబడినవి.

తా. పువ్వుల భారముతో నిండిన చెట్ల అగ్రభాగములను, అగ్రభాగములలో బాగా పుష్పించిన లతలు కౌగలించుకొని ఉన్నవి (పెనవేసుకొని ఉన్నవి.)

మూ. సుఖానిలోఽయం సౌమిత్రే కాలః ప్రచురమన్మథః,
గన్ధవాన్ సురభి ర్మాసో జాతపుష్పఫలద్రుమః. 10

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! సుఖానిలః=సుఖకరమైన వాయువుగల, అయం కాలః=ఈ కాలము, ప్రచురమన్మథః=అధికమైన మన్మథుడు కలది, జాతపుష్పఫలద్రుమః=పుట్టిన పుష్పఫలములు గల వృక్షములు గల, మాసః=ఈ మాసము, సురభిః=పరిమళించుచున్నది. గన్ధవాన్= గర్వము గలది.

తా. లక్ష్మణా! ఈ కాలమునందు గాలి సుఖకరముగా ఉండును. మన్మథుని ప్రభావము అధికముగా ఉండును. ఈ మాసమునందు చెట్లు పువ్వులతోను, ఫలములతోను నిండి యుండుటచే ఈ మాసము పరిమళించుచు, గర్వముతో ఉన్నదా అన్నట్లుండును. 10

మూ. పశ్య రూపాణి సౌమిత్రే వనానాం పుష్పశాలినామ్,
సృజతాం పుష్పవర్షాణి వర్షం తోయముచామివ. 11

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! పుష్పవర్షాణి=పుష్పవర్షములను, సృజతామ్=విడచుచున్న, పుష్పశాలినామ్=పుష్పములతో ప్రకాశించుచున్న, వనానామ్= వనముల యొక్క, వర్షమ్=వర్షమును వర్షించుచున్న, తోయముచామివ=మేఘములయొక్క వలె, రూపాణి= రూపములను, పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! పుష్పములతో ప్రకాశించుచున్న ఈ వనముల రూపములు ఉదకము వర్షించుచున్న మేఘముల రూపముల వలె ఉన్నవి ; చూడుము.

మూ. ప్రస్తరేషు చ రమ్యేషు వివిధాః కాననద్రుమాః,
వాయువేగప్రచలితాః పుష్పైరవకిరన్తి గామ్. 12

ప్ర. అ. రమ్యేషు=సుందరములైన, ప్రస్తరేషు=చరియలయందు, వివిధాః= అనేక విధములైన, కాననద్రుమాః=అరణ్యావృక్షములు, వాయువేగప్రచలితాః=వాయు వేగముచేత కదల్చబడినవై, పుష్పైః= పుష్పములచేత, గామ్=భూమిని, అవకిరన్తి=చల్లుచున్నవి.

తా. రమ్యములైన చరియలమీద నున్న అరణ్యావృక్షములు వాయువేగముచేత కదలి, నేలమీద పుష్పములు చల్లుచున్నవి. 12

మూ. పతితైః పతమానైశ్చ పాదపస్థైశ్చ మారుతః,
కుసుమైః పశ్య సౌమిత్రే క్రీడతీవ సమన్తతః. 13

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! పతితైః=రాలినవి, పతమానైశ్చ= రాలుచున్నవి, పాదపస్థైశ్చ=వృక్షముల మీద ఉన్నవీ అయిన, కుసుమైః= పుష్పములతో, మారుతః=వాయువు, సమన్తతః=అంతటా, క్రీడతీవ=ఆడుకొనుచున్నట్లున్నది.

పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! వాయుదేవుడు నలుమూలలా, రాలిన పువ్వులతోను, రాలుతున్న పువ్వులతోను, చెట్ల మీద ఉన్న పువ్వులతోను ఆడుకొనుచున్నాడా అన్నట్లున్నాడు. 13

మూ. విక్షిపన్ వివిధాః శాఖా నగానాం కుసుమోత్కటాః,
మారుతశ్చలితస్థానైః షట్పదైరనుగీయతే. 14

ప్ర. అ. నగానామ్=వృక్షములయొక్క, కుసుమోత్కటాః=వృక్షములతో నిండిన, వివిధాః=అనేకవిధములైన, శాఖాః=కొమ్మలను, విక్షిపన్=ఎక్కువగా కదల్చుచున్న, మారుతః=వాయువు, చలితస్థానైః=చలించిన స్థానములు గల, షట్పదైః=తుమ్మెదలచేత, అనుగీయతే=అనుసరించి గానము చేయబడుచున్నది.

తా. పుష్పములతో నిండిన అనేకవిధములైన వృక్షములను వాయువు అధికముగా కదల్చివేయుటచే తుమ్మెదలు తమ స్థానములనుండి కదలి, ఆ గాలి వైపు ఎగురుచు గానము చేయుచున్నవి. 14

మూ. మత్తకోకిలసంనాదైర్నర్తయన్నివ పాదపాన్,
శైలకన్దరనిష్క్రాన్తః ప్రగీత ఇవ చానిలః. 15

ప్ర. అ. శైలకన్దరనిష్క్రాన్తః=పర్వతగుహలనుండి బయల్వెడలిన, అనిలః= వాయువు, మత్తకోకిలసంనాదైః=మదించిన కోకిలల ధ్వనులచేత, పాదపాన్=వృక్షములను, నర్తయన్నివ=నాట్యము చేయించుచున్నది వలె, ప్రగీత ఇవ చ=గానము చేయ ప్రారంభించినది వలె ఉన్నది.

తా. పర్వతముల గుహలనుండి బయల్వెడలిన వాయువు మదించిన కోకిలల ధ్వనులచేత, వృక్షాలను నాట్యము చేయించుచు తాను పాట పాడుటకు ఉపక్రమించుచున్నట్లు ఉన్నది. 15

మూ. తేన విక్షిపతాత్యర్థం పవనేన సమన్తతః,
అమీ సంసక్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః. 16

ప్ర. అ. సమంతతః=అంతటా, అత్యర్థమ్=మిక్కిలి, విక్షిపతా= కదల్చుచున్న, తేన పవనేన=ఆ వాయువుచేత, సంసక్తశాఖాగ్రాః= కలపబడిన శాఖాగ్రములు గల, అమీ=ఈ, పాదపాః=వృక్షములు, గ్రథితా ఇవ=ఒకదానితో ఒకటి కలిపి కట్టబడినట్లున్నవి.

తా. అంతటా ప్రసరించుచు వాయువు వృక్షముల కొమ్మలను ఎక్కువగా కదల్చి కలుపుటచేత, ఈ వృక్షము లన్నీ ఒకదానితో ఒకటి చేర్చి కట్టబడిన ట్లున్నవి. 16

మూ. స ఏవ సుఖసంస్పర్శో వాతి చన్దనశీతలః,
గన్ధమభ్యవహన్ పుణ్యం శ్రమాపనయనోఽనిలః. 17

ప్ర. అ. సః ఏవ అనిలః=ఆ వాయువే, సుఖసంస్పర్శః=సుఖకరమైన స్పర్శగలదై, చన్దనశీతలః=చందనము వలె చల్లనిదై, పుణ్యమ్= ఉత్తమమైన, గన్ధమ్=గంధమును, అభ్యవహన్=వహించుచు, శ్రమాపనయనః=శ్రమను పోగొట్టుచు, వాతి= వీచుచున్నది.

తా. మంచి సువాసనను నలుమూలలా వ్యాపింపచేయుచున్న వాయువు, చందనమువలె చల్లగా ఉన్నది. శరీరమునకు సుఖకరమైన స్పర్శను ఇచ్చుచు శ్రమను తొలగించుచున్నది. 17

మూ. అమీ పవనవిక్షిప్తా వినదన్తీవ పాదపాః,
షట్పదైరనుకూజద్భిర్వనేషు మధుగన్ధిషు. 18

ప్ర. అ. మధుగన్ధిషు=తేనెయొక్క సువాసన గల, వనేషు=వనములయందు, పవనవిక్షిప్తాః=గాలిచేత అధికముగా కదల్పబడిన, అమీ=ఈ, పాదపాః=వృక్షములు, అనుకూజద్భిః=అనుసరించి కూయుచున్న, షట్పదైః=తుమ్మెదలచేత, వినదన్తీవ=ఆనందించుచున్నట్లు ఉన్నవి.

తా. మకరందము సువాసనతో నిండిన ఈ వనములలోని వృక్షములను వాయువు గట్టిగా కదుపివేయుచున్నది. అట్టి వృక్షములు ప్రక్కనే ఎగురుచు గానము చేయుచున్న తుమ్మెదల గానానికి సంతోషించుచున్నవా అన్నట్లున్నవి.

మూ. గిరిప్రస్థేషు రమ్యేషు పుష్పవద్భిర్మనోరమైః,
సంసక్తశిఖరాః శైలా విరాజన్తి మహాద్రుమైః. 19

ప్ర. అ. రమ్యేషు=రమ్యములైన, గిరిప్రస్థేషు=పర్వతముల చరియలయందు, పుష్పవద్భిః=పుష్పములు గల, మనోరమైః=మనోహరములైన, మహాద్రుమైః=పెద్ద వృక్షములతో, సంసక్తశిఖరాః=కూడిన శిఖరములు గల, శైలాః=పర్వతములు, విరాజన్తి=ప్రకాశించుచున్నవి.

తా. సుందరములైన పర్వతముల చరియలమీద ఉన్న, పుష్పించిన, మనోహరములైన మహావృక్షములు పర్వతశిఖరములను తాకుచున్నవి. అట్టి శిఖరములతో పర్వతములు ప్రకాశించుచున్నవి. 19

మూ. పుష్పసంఛన్నశిఖరా మారుతోత్క్షేపచఞ్చలాః,
అమీ మధుకరోత్తంసాః ప్రగీతా ఇవ పాదపాః. 20

ప్ర. అ. పుష్పసంఛన్నశిఖరాః=పుష్పములచేత కప్పబడిన శిఖరములు గలవి, మారుతోత్క్షేపచఞ్చలాః=గాలి కదల్చుటచేత చంచలములు, మధుకరోత్తంసాః=

తుమ్మెదలు శిరోభూషణములుగా గల, అమీ=ఈ, పాదపాః=వృక్షములు, ప్రగీతాః ఇవ=సంగీతనాట్యములను ప్రారంభించుచున్నట్లున్నవి.

తా. వృక్షములు గాలికి కదలుచున్నవి. వాటి పైభాగములు పుష్పములతో నిండి ఉన్నవి. వాటిపై ఉన్న తుమ్మెదలు పాడుచున్నవి. అందుచే ఈ వృక్షములు సంగీతనాట్యములు ప్రారంభించుచున్నట్లున్నవి. 20

మూ. సుపుష్పితాంస్తు పశ్యైతాన్ కర్ణికారాన్ సమన్తతః,
హాటకప్రతిసంఛన్నాన్నరాన్ పీతామ్బరానివ. 21

ప్ర. అ. సమన్తతః=అంతటా, సుపుష్పితాన్=బాగా పుష్పించిన, హాటకప్రతిసంఛన్నాన్=బంగారముచేత కప్పబడిన, పీతామ్బరాన్= పచ్చని వస్త్రములు గల, నరానివ=మనుష్యుల వలె ఉన్న, ఏతాన్=ఈ, కర్ణికారాన్=కర్ణికారవృక్షములను, పశ్య=చూడుము.

తా. అంతటా పుష్పించిన ఈ కర్ణికారవృక్షములు, బంగారు ఆభరణములు అనేకములు ధరించి, పీతాంబరములు కట్టుకొన్న మనుష్యుల వలె ఉన్నవి. చూడుము. 21

మూ. అయం వసన్తః సౌమిత్రే నానావిహగనాదితః,
సీతయా విప్రహీణస్య శోకసందీపనో మమ. 22

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! నానావిహగనాదితః=అనేకవిధములైన పక్షులచేత ధ్వనింపచేయబడిన, అయం వసన్తః=ఈ వసంతము, సీతయా=సీతతో, విప్రహీణస్య=విహీనుడనైన, మమ=నాకు, శోకసందీపనః= శోకమును వృద్ధిచేయునదిగా ఉన్నది.

తా. లక్ష్మణా! అనేకవిధములైన పక్షుల ధ్వనులతో నిండిన ఈ వసంతము సీతావిరహముతో బాధపడుచున్న నా దుఃఖమును అధికము చేయుచున్నది. 22

మూ. మాం హి శోకసమాక్రాన్తం సంతాపయతి మన్మథః,
హృష్టం ప్రవదమానశ్చ సమాహ్వయతి కోకిలః. 23

ప్ర. అ. శోకసమాక్రాన్తమ్=దుఃఖముచేత ఆక్రమించబడిన, మామ్= నన్ను, మన్మథః=మన్మథుడు, సంతాపయతి=బాధపెట్టుచున్నాడు. హృష్టమ్=ఆనందపూర్వకముగా, ప్రవదమానః=పలుకుచున్న, కోకిలః=కోకిల, సమాహ్వయతి= పిలచుచున్నది.

తా. దుఃఖాక్రాంతుడనైన నన్ను మన్మథుడు బాధపెట్టుచున్నాడు. ఆనందముతో కూయుచున్న ఈ కోకిల నన్ను పిలచుచున్నట్లున్నది. 23

మూ. ఏష దాత్యూహకో హృష్టో రమ్యే మాం వననిర్ఝరే,
ప్రణదన్మన్మథావిష్టం శోచయిష్యతి లక్ష్మణ. 24

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! రమ్యే=రమ్యమైన, వననిర్ఝరే= వనమునందలి సెలయేరులో, హృష్టః=సంతోషించిన, ప్రణదన్= కూయుచున్న, ఏషః=ఈ, దాత్యూహకః=దాత్యూహకము, మన్మథావిష్టమ్=మన్మథునిచేత ఆవేశింపబడిన, మామ్=నన్ను, శోచయిష్యతి= దుఃఖింపచేయగలదు.

తా. లక్ష్మణా! రమ్యమైన ఈ అరణ్యములోని కొండకాలువలో సంతోషముతో కూయుచున్న ఈ దాత్యూహపక్షి మన్మథునిచేత పీడితుడనైన నాకు ఇంకా దుఃఖము కలిగించుచున్నది. 24

మూ. శ్రుత్వైతస్య పురా శబ్దమాశ్రమస్థా మమ ప్రియా,
మా మాహూయ ప్రముదితా పరమం ప్రత్యనన్దత. 25

ప్ర. అ. పురా=పూర్వము, ఆశ్రమస్థా=ఆశ్రమములో ఉన్న, మమ ప్రియా=నా ప్రియురాలు, ఏతస్య=దీనియొక్క, శబ్దమ్= కూతను, శ్రుత్వా=విని, ప్రముదితా=సంతోషించుచున్నదై, మామ్=నన్ను, ఆహూయ=పిలచి, పరమమ్=మిక్కిలి, ప్రత్యనన్దత=ఆనందించెను.

తా. పూర్వము నా ప్రియురాలైన సీత దీని కూత విని సంతోషించుచు, నన్ను పిలచి, దీని కూత ఎంత బాగున్నదో వింటివా అని పలుకుచు ఆనందించెడిది.

మూ. ఏవం విచిత్రాః పతగా నానారావవిరావిణః,
వృక్షగుల్మలతాః పశ్య సంపతన్తి సమన్తతః. 26

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, విచిత్రాః=విచిత్రములైన, నానారావవిరావిణః= అనేకవిధములైన ధ్వనులతో కూయుచున్న, పతగాః=పక్షులు, సమన్తతః= నలు వైపులా, వృక్షగుల్మలతాః=వృక్షములను, పొదలను, లతలను గూర్చి, సంపతన్తి=ఎగురుచున్నవి; పశ్య=చూడుము.

తా. ఈ విధముగా అనేకవిధములైన స్వరములతో కూయుచు ఈ విచిత్రములైన పక్షులు అన్ని వైపులా చెట్లమీద పొదలమీద, లతలమీద ఎగురుచున్నవి; చూడుము. 26

మూ. విమిశ్రా విహగాః పుమ్భిరాత్మవ్యూహాభినన్దితాః,
భృఙ్గరాజప్రముదితాః సౌమిత్రే మధురస్వరాః. 27

ప్ర. అ. విహగాః=ఆడపక్షులు, పుమ్భిః=మగపక్షులతో, విమిశ్రాః= కలసినవై, ఆత్మవ్యూహాభినన్దితాః=తమ గుంపులచేత అభినందింపబడుచున్నవై, భృఙ్గరాజప్రముదితాః=శ్రేష్ఠమైన తుమ్మెదలతో సంతోషించుచున్నవై, మధురస్వరాః=మధురస్వరములు గలవై, (కూయుచున్నవి.)

తా. ఆడపక్షులు తమకు తగిన మగపక్షులతో కలిసి ఉన్నవి. తగిన మగపక్షులతో కూడినందుకు వాటిని వాటి సజాతీయములైన పక్షులు అభినందిం

చుచున్నవి. అట్టి పక్షులు తుమ్మెదలతో పాటు సంతోషముతో, మధురస్వరములతో కూయుచున్నవి. 27

మూ. అస్యాః కూలే ప్రముదితాః సంఘశః శకునాస్త్విహ,
దాత్యూహరతివిక్రన్దైః పుంస్కోకిలరుతైరపి, 28
స్వనన్తి పాదపాశ్చేమే మమానఙ్గప్రదీపకాః.

ప్ర.అ. ఇహ=ఇక్కడ, అస్యాః=ఈ పంపాసరస్సుయొక్క, తీరే= తీరమునందు, సంఘశః=గుంపులుగా ఉన్న, శకునాః=పక్షులు, ప్రముదితాః=ఆనందించుచున్నవి. ఇమే=ఈ, పాదపాశ్చ= వృక్షములు కూడ, దాత్యూహరతివిక్రన్దైః=దాత్యూహపక్షుల రతి ధ్వనులచేతను, పుంస్కోకిలరుతైరపి=మగ కోకిలల ధ్వనులచేతను, మమ=నాయొక్క, అనఙ్గప్రదీపకాః=మన్మథుని ఉద్దీపింపచేయుచున్నవై, స్వనన్తి=ధ్వనిచేయుచున్నవి.

తా. ఈ పంపానది తీరమునందు పక్షులు గుంపులు గుంపులుగా ఎగురుచు ఆనందించుచున్నవి. దాత్యూహపక్షుల రతికూజితములతోను, పుంస్కోకిలల కూతలతోను ప్రతిధ్వనించుచున్న ఈ వృక్షములు నాకు మన్మథోద్రేకమును కలిగించుచున్నవి. 28

మూ. అశోకస్తబకాఙ్గారః షట్పదస్వననిస్వనః, 29
మాం హి పల్లవతామ్రార్చిర్వసన్తాగ్నిః ప్రధక్ష్యతి.

ప్ర. అ. అశోకస్తబకాఙ్గారః=అశోకపుష్పముల గుత్తు లనే కణ కణలాడుచున్న నిప్పులు గలది, షట్పదస్వననిస్వనః=తుమ్మెదల ధ్వని అనే మంటల ధ్వని కలది, పల్లవతామ్రార్చిః=పల్లవములనే ఎఱ్ఱని మంటలు గలది, అయిన, వసన్తాగ్నిః= వసంత మనే అగ్ని, మామ్=నన్ను, ప్రధక్ష్యతి హి= కాల్చివేయును గదా.

తా. అశోకపుష్పముల గుత్తు లనే కణకణలాడుచున్న నిప్పులు, తుమ్మెదల ఝుంకారమనే ధ్వని, చిగుళ్లనే ఎఱ్ఱని మంటలు ఉన్న ఈ వసంత మనే అగ్ని నన్ను కాల్చి వేయగలదు. (వేయుచున్నది) 29

మూ. న హి తాం సూక్ష్మపక్ష్మాక్షీం సుకేశీం మృదుభాషిణీమ్, 30
అపశ్యతో మే సౌమిత్రే జీవితేఽస్తి ప్రయోజనమ్.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! సూక్ష్మపక్ష్మాక్షీమ్=సన్న రెప్పలు గల నేత్రములు గలది, సుకేశీమ్=అందమైన కేశములు గలది, మృదుభాషిణీమ్=మృదువుగా మాటలాడేదీ, అయిన, తామ్=ఆ సీతను, అపశ్యతః=చూడని, మే=నాకు, జీవితే=జీవితమునందు, ప్రయోజనమ్=ప్రయోజనము, నాస్తి హి=లేదు కదా!

తా. సూక్ష్మ మైన రెప్పలు గల నేత్రములు, అందమైన కేశములు గల, మృదువుగా మాటలాడే ఆ సీతను చూడకపోయినచో నా కి జీవితముతో ప్రయోజనము లేదు. 30

మూ. అయం హి దయితస్తస్యాః కాలో రుచిరకాననః, 31
కోకిలాకులసీమాన్తో దయితాయా మమానఘ.

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! మమ=నాయొక్క, దయితాయాః =ప్రియురాలైన, తస్యాః=ఆ సీతకు, రుచిరకాననః=అందమైన అడవులు గలది, కోకిలాకులసీమాన్తః=కోకిలలచేత వ్యాకులమైన సీమాంతములు (పరిహద్దులు) కలది అయిన, అయమ్=ఈ, కాలః=కాలము, దయితః=ఇష్టమైనది కదా.

తా. లక్ష్మణా! అందమైన అడవులతో, కోకిలల ధ్వనులతో నిండిన సీమాంతములతో అంధముగా నున్న ఈ కాలము నా ప్రియురాలైన సీతకు చాల ఇష్టమైనది కదా! 31

మూ. మన్మథాయాససంభూతో వసన్తగుణవర్ధితః, 32
అయం మాం ధక్ష్యతి క్షిప్రం శోకాగ్నిర్నచిరాదివ.

ప్ర. అ. మన్మథాయాససంభూతః=మన్మథబాధవలన పుట్టిన, అయమ్=ఈ, శోకాగ్నిః=దుఃఖాగ్ని, వసన్తగుణవర్ధితః=వసంతర్తువు గుణములచేత వృద్ధిపొందించబడినదై, మామ్=నన్ను, క్షిప్రమ్= శీఘ్రముగా, నచిరాదివ=అచిరకాలములో, ధక్ష్యతి=కాల్చివేయగలదు.

తా. మన్మథబాధవలన పుట్టిన ఈ శోకాగ్ని వసంతర్తువుగుణములచేత వృద్ధి పొందింపబడినదై శీఘ్రముగా నన్ను అచిరకాలములో కాల్చివేయగలదు.

మూ. అపశ్యతస్తాం వనితాం పశ్యతో రుచిరద్రుమాన్, 33
మమాయమాత్మప్రభవో భూయస్త్వముపయాస్యతి.

ప్ర. అ. తాం వనితామ్=ఆ స్త్రీని, అపశ్యతః=చూడనివాడను, రుచిరద్రుమాన్=సుందరములైన వృక్షములను, పశ్యతః= చూచుచున్నవాడను అయిన, మమ=నాయొక్క, అయమ్=ఈ, ఆత్మప్రభవః=మన్మథుడు, భూయస్త్వమ్=అధికత్వమును, ఉపయాస్యతి=పొందగలడు.

తా. నాకు సీత కనబడుటలేదు. అట్టి నాకు ఈ సుందరములైన వృక్షములను చూచుచుండుటచేత మన్మథుడు అధికముగా బాధ కలిగించుచున్నాడు.

మూ. అదృశ్యమానా వైదేహీ శోకం వర్ధయతీహ మే, 34
దృశ్యమానో వసన్తశ్చ స్వేదసంసర్గదూషకః.

ప్ర. అ. ఇహ=ఇక్కడ, అదృశ్యమానా=చూడబడని,వైదేహీ=సీత, మే=నాయొక్క, శోకమ్=శోకమును, వర్ధయతి= వృద్ధి పొందించుచున్నది. స్వేదసంసర్గదూషకః= చెమటయొక్క సంబంధమును తొలగించు, దృశ్యమానః=చూడబడుచున్న, వసన్తశ్చ=వసంతము కూడ, వృద్ధిపొందించుచున్నది.

తా. నాకు ఇప్పుడు సీత కనబడకుండుట చేతను, మలయమారుతము వీచుచుండుటచే చెమటను పోగొట్టు వసంతము కనబడుటచేతను శోకము వృద్ధి పొందుచున్నది. 34

మూ. మామద్య మృగశాబాక్షీచిన్తాశోకబలాత్కృతమ్, 35
సంతాపయతి సౌమిత్రే క్రూరశ్చైత్రవనానిలః.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! మృగశాబాక్షీచిన్తాశోకబలాత్కృతమ్=సీతను గూర్చిన చింతచేత, శోకముచేత బలాత్కరింపబడిన, మామ్=నన్ను, క్రూరః=క్రూరమైన, చైత్రవనానిలః=చైత్రమాసమునకు సంబంధించిన వనవాయువు, అద్య=ఇప్పుడు, సంతాపయతి=తపింపచేయుచున్నది.

తా. లక్ష్మణా! సీతను గూర్చిన చింత, శోకము నన్ను బలాత్కారముగా బాధపెట్టుచుండగా, ఇపుడు ఈ చైత్రమాసమునకు సంబంధించిన వనవాయువు కూడ పీడించుచున్నది. 35

మూ. అమీ మయూరాః శోభన్తే ప్రనృత్యన్త స్తతస్తతః, 36
స్వైః పక్షైః పవనోద్ధూతైర్గవాక్షైః స్ఫాటికైరివ.

ప్ర. అ. తతస్తతః=అక్కడక్కడ, ప్రనృత్యన్తః=నృత్యముచేయుచున్న, అమీ=ఈ, మయూరాః=నెమళ్ళు, పవనోద్ధూతైః=గాలికి కదల్చబడిన, స్ఫాటికైః=స్ఫటికవికారమైన, గవాక్షైరివ=కిటికీల వలె ఉన్న, స్వైః=తమ, పక్షైః=రెక్కలతో, శోభన్తే= ప్రకాశించుచున్నవి.

తా. అక్కడక్కడ నృత్యము చేయుచున్న ఈ నెమళ్ళు, స్ఫటికమాణిక్యవికారములైన కిటికీల వలె ఉన్న పింఛములతో ప్రకాశించుచున్నవి. 36

మూ. శిఖినీభిః పరివృతాస్త ఏతే మదమూర్ఛితాః, 37
మన్మథాభిపరీతస్య మమ మన్మథవర్ధనాః.

ప్ర. అ. శిఖినీభిః=ఆడనెమళ్లతో, పరివృతాః=కూడిన, మదమూర్ఛితాః=మదముతో వ్యాప్తమైన, తే ఏతే=అట్టి ఈ నెమళ్లు, మన్మథాభిపరీతస్య= మన్మథునితో కూడిన, మమ=నాయొక్క, మన్మథవర్ధనాః=మన్మథుని వృద్ధిపొందించుచున్నవి.

తా. ఆడ నెమళ్లతో కూడినవై బాగా మత్తెక్కి ఉన్న ఈ నెమళ్లు మన్మథునిచే పీడింపబడిన నాకు ఎక్కువ బాధ కలిగించుచున్నవి. 37

మూ. పశ్య లక్ష్మణ నృత్యన్తం మయూరముపనృత్యతి, 38
శిఖినీ మన్మథార్తైషా భర్తారం గిరిసానుని.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! గిరిసానుని=పర్వతము చరియయందు, మన్మథార్తా=మన్మథునిచేత పీడింపబడిన, ఏషా=ఈ, శిఖినీ= ఆడు నెమలి,

నృత్యన్తమ్=నాట్యము చేయుచున్న, భర్తారమ్= భర్తయైన,మయూరమ్=నెమలిని, ఉపనృత్యతి=సమీపించి నృత్యము చేయుచున్నది. పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! ఆ పర్వతము చరియమీద ఈ ఆడునెమలి, నృత్యము చేయుచున్న తన భర్తయైన మగనెమలిని అనుసరించి నృత్యము చేయుచున్నది. చూడుము. 38

మూ. తామేవ మనసా రామాం మయూరోఽప్యనుధావతి, 39
వితత్య రుచిరౌ పక్షౌ రుతైరుపహసన్నివ.

ప్ర. అ. మయూరోఽపి=నెమలి కూడ, రుచిరౌ=అందమైన, పక్షౌ=రెక్కలను, వితత్య=విస్తరింపచేసి, రుతైః= ధ్వనులచేత, ఉపహసన్నివ=పరిహసించుచున్నది వలె, మనసా=మనస్సుచేత (ప్రేమతో), తామ్=ఆ,రామామ్ ఏవ=స్త్రీనే, అనుధావతి= అనుసరించి పరుగెత్తుచున్నది.

తా. ఈ మగనెమలి కూడ తన అందమైన రెక్కలు విస్తరింపచేయుచు, ధ్వనులచేత నవ్వుచున్నదా అన్నట్లు అనురాగముతో ఆ ఆడనెమలినే అనుసరించుచున్నది. 39

మూ. మయూరస్య వనే నూనం రక్షసా న హృతా ప్రియా, 40
తస్మాన్నృత్యతి రమ్యేషు వనేషు సహ కాన్తయా.

ప్ర. అ. మయూరస్య=నెమలియొక్క, ప్రియా=ప్రియురాలు, వనే= వనమునందు, రక్షసా=రాక్షసునిచేత, న హృతా=హరించబడలేదు. నూనమ్=నిశ్చయము. తస్మాత్=అందువలననే, కాన్తయా సహ=ప్రియురాలితో కూడ, రమ్యేషు=రమ్యములైన, వనేషు= వనములయందు, నృత్యతి=నృత్యము చేయుచున్నది.

తా. ఈ మయూరము ప్రియురాలిని వనములో రాక్షసుడు అపహరించలేదు; నిజము. అందుచేతనే ఇది ప్రియురాలితో రమ్యములైన వనాలలో నృత్యము చేయుచున్నది. 40

మూ. మమ త్వయం వినా వాసః పుష్పమాసే సుదుఃసహః, 41
పశ్య లక్ష్మణ సంరాగస్తిర్యగ్యోనిగతేష్వపి.
అధునా శిఖినీ కామాద్భర్తారమభివర్తతే. 42

ప్ర. అ. పుష్పమాసే=ఈ చైత్రమాసమునందు, వినా=సీత లేకుండా, అయమ్=ఈ, వాసః=నివాసము, మమ తు=నాకైతే, సుదుస్సహః=చాల సహింప శక్యము కానిది. లక్ష్మణ=లక్ష్మణా! పశ్య=చూడుము. తిర్యగ్యోనిగతేష్వపి=తిర్యగ్జంతువులలో కూడ, సంరాగః= అనురాగ మున్నది. అధునా=ఇప్పుడు, శిఖినీ=ఆడ నెమలి, కామాత్=కామమువలన, భర్తారమ్=భర్తను, అభివర్తతే= చేరుచున్నది.

తా. ఈ పుష్పాలతో నిండిన చైత్రమాసములో సీత లేకుండా నివసించుట నాకు చాల భరింపశక్యము కానిదిగా ఉన్నది. లక్ష్మణా! చూడుము; తిర్యగ్జంతువులలో కూడా ఏ విధముగా అనురాగ మున్నదో! ఇప్పుడు ఈ ఆడ నెమలి, కామమువలన, తన భర్తను సమీపించుచున్నది. 41, 42

మూ. మామప్యేవం విశాలాక్షీ జానకీ జాతసంభ్రమా,
మదనేనాభివర్తేత యది నాపహృతా భవేత్. 43

ప్ర. అ. విశాలాక్షీ=విశాలములైన నేత్రములు గల, జానకీ=జానకి, అపహృతా=అపహరించబడినది, న భవేత్ యది= కాకపోయినచో, మదనేన=మన్మథునిచేత, జాతసంభ్రమా=పుట్టిన తొందర కలదై, ఏవమ్=ఇట్లే, మామపి=నన్నుకూడా, అభివర్తేత=సమీపించును.

తా. విశాలాక్షి యైన ఆ సీతను రాక్షసుడు అపహరించుకొనిపోకున్నచో ఆమె కూడ మన్మథోద్రేకముతో నన్ను సమీపించి ఉండేది. 43

మూ. పశ్య లక్ష్మణ పుష్పాణి నిష్ఫలాని భవన్తి మే,
పుష్పభారసమృద్ధానాం వనానాం శిశిరాత్యయే. 44

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! పశ్య=చూడుము. శిశిరాత్యయే= వసంతఋతువునందు, పుష్పభారసమృద్ధానామ్=పుష్పముల భారముతో సమృద్ధములైన, వనానామ్=వనములయొక్క, పుష్పాణి= పుష్పములు, మే=నా విషయమునందు, నిష్ఫలాని= వ్యర్థములు, భవన్తి=అగుచున్నవి.

తా. లక్ష్మణా! చూడుము; వసంతఋతువులో పుష్పముల భారముతో సమృద్ధములైన వనములలోని పుష్పములు నా విషయమున ఎట్లు వ్యర్థమగుచున్నవో!

మూ. రుచిరాణ్యపి పుష్పాణి పాదపానామతిశ్రియా,
నిష్ఫలాని మహీం యాన్తి సమం మధుకరోత్కరైః. 45

ప్ర. అ. పాదపానామ్=వృక్షములయొక్క, పుష్పాణి=పుష్పములు, అతిశ్రియా=అధికమైన శోభచేత, రుచిరాణ్యపి=సుందరమైనను, నిష్ఫలాని =వ్యర్థములై, మధుకరోత్కరైః సమమ్=తుమ్మెదల సముదాయములతోకూడ, మహీమ్=భూమిని, యాన్తి=పొందుచున్నవి.

తా. అత్యధికమైన శోభతో అందముగా ఉన్నా ఈ పుష్పములు వ్యర్థముగా, తుమ్మెదలతో కూడ చెట్లనుండి నేలపై రాలిపోవుచున్నవి. 45

మూ. నదన్తి కామం శకునా ముదితాః స్ఘశః కలమ్,
ఆహ్వాయన్త ఇవాన్యోన్యం కామోన్మాదకరా మమ. 46

ప్ర.అ. ముదితాః=సంతోషించిన, శకునాః=పక్షులు, మమ=నాకు, కామోన్మా

దకరాః=కామోన్మాదమును కలిగించుచున్నవై, అన్యోన్యమ్= పరస్పరము, ఆహ్వాయన్తః ఇవ=పిలచుచున్నవివలె, సఙ్ఘశః= గుంపులు గుంపులుగా, కలమ్=మధురముగా, కామమ్=స్వేచ్ఛగా, నదన్తి=కూయుచున్నవి.

తా. పక్షులు సంతోషముతో గుంపులుగా ఏర్పడి, పరస్పరము పిలుచుకొనుచున్నవా అన్నట్లు స్వేచ్ఛగా, మధురముగా కూయుచు నాకు కామోన్మాదమును కలిగించుచున్నవి. 46

మూ. వసన్తో యది తత్రాపి యత్ర మే వసతి ప్రియా,
నూనం పరవశా సీతా సాపి శోచత్యహం యథా. 47

ప్ర. అ. మే ప్రియా=నా ప్రియురాలైన, సీతా=సీత, యత్ర=ఎక్కడ, వసతి=నివసించుచున్నదో, తత్రాపి=అక్కడ కూడ, వసన్తః యది=వసంతర్తువు ఉన్నట్లయితే, సాపి=ఆమె కూడ, పరవశా= పరవశురాలై, అహం యథా=నేను వలె, శోచతి=దుఃఖించుచున్నది. నూనమ్=నిశ్చయము.

తా. నా ప్రియురాలైన సీత నివసించుచున్న ప్రదేశమునందు కూడ వసంతఋుతువు ఉన్నచో ఆమె కూడ పరవశురాలై నావలెనే దుఃఖించుచుండును.

మూ. నూనం న తు వసన్తస్తం దేశం స్పృశతి యత్ర సా,
కథం హ్యసితపద్మాక్షీ వర్తయేత్సా మయా వినా. 48

ప్ర.అ. సా=ఆమె, యత్ర=ఎక్కడ ఉన్నదో, తం దేశమ్=ఆ దేశమును, వసన్తః=వసంతము, న స్పృశతి=స్పృశించదు. నూనమ్=నిజము. అసితపద్మాక్షీ=నల్లని పద్మములవంటి నేత్రములు గల, సా=ఆమె, మయా వినా=నేను లేకుండగా, కథమ్=ఎట్లు, వర్తయేత్=గడుపును?

తా. సీత ఉన్న చోట ఈ వసంతఋుతువు ఉండదు. నిజము. నల్లని పద్మముల వంటి నేత్రములు గల ఆమె నేను లేకుండగా ఎట్లు గడపగలదు?48

మూ. అథవా వర్తతే తత్ర వసన్తో యత్ర మే ప్రియా,
కిం కరిష్యతి సుశ్రోణీ సా తు నిర్భర్త్సితా పరైః. 49

ప్ర. అ. అథవా=లేదా, మే=నాయొక్క, ప్రియా=ప్రియురాలు, యత్ర=ఎక్కడ, వర్తతే=ఉంటూన్నదో, తత్ర=అక్కడ, వసన్తః=వసంతము, వర్తతే=ఉన్ననూ, పరైః=పరులచేత, నిర్భర్త్సితా=భయపెట్టబడిన, సా=ఆ, సుశ్రోణీ=అందమైన కటిప్రదేశముగల సీత, కిం కరిష్యతి=ఏమి చేయగలదు?

తా. లేదా, నా ప్రియురాలున్న చోట కూడ వసంతఋుతువు ఉండవచ్చును. అయినను పరులచేత భయపెట్టబడుచున్న ఆ అందమైన కటి

ప్రదేశము గల సీత ఏమి చేయగలదు? 49

మూ. శ్యామా పద్మపలాశాక్షీ మృదుభాషా చ మే ప్రియా,
నూనం వసన్తమాసాద్య పరిత్యక్ష్యతి జీవితమ్. 50

ప్ర. అ. శ్యామా=యౌవనమధ్యమునం దున్నది, పద్మపలాశాక్షీ= పద్మప త్రముల వంటి నేత్రములు గలది, మృదుభాషా చ=మృదువైన మాటలు గల, మే ప్రియా=నా ప్రియురాలు, వసన్తమ్=వసంతమును, ఆసాద్య=పొంది, నూనమ్=తప్పక, జీవితమ్=జీవితమును, త్యక్ష్యతి=విడువగలదు.

తా. యౌవనమధ్యస్థురాలు, పద్మపత్రములవంటి నేత్రములు గలది, మృదువుగా మాటలాడేదీ అయిన నా ప్రియురాలు వసంతము రాగానే జీవితమును విడువగలదు; తప్పదు. 50

మూ. దృఢం హి హృదయే బుద్ధిర్మమ సంపరివర్తతే,
నాలం వర్తయితుం సీతా సాధ్వీ మద్విరహం గతా. 51

ప్ర.అ. హృదయే=హృదయమునందు, మమ=నాయొక్క, బుద్ధిః= బుద్ధి, దృఢమ్= అధికముగా, సంపరివర్తతే=తిరుగుచున్నది. మద్విరహమ్=నా విరహమును, గతా=పొందిన, సాధ్వీ= పతివ్రతయైన, సీతా=సీత, వర్తయితుమ్=జీవించుటకు, నాలమ్= సమర్థురాలు కాదు.

తా. నా విరహముతో బాధపడుచున్న పతివ్రతయైన సీత జీవింపజాలదని నా మనస్సులో నిశ్చితమైన ఆలోచన కలుగుచున్నది. 51

మూ. మయి భావో హి వైదేహ్యాస్తత్త్వతో వినివేశితః,
మమాపి భావః సీతాయాం సర్వథా వినివేశితః. 52

ప్ర. అ. వైదేహ్యాః=సీతయొక్క, భావః=భావము, మయి=నాయందు, తత్త్వతః=యథార్థముగా, వినివేశితః=ఉంచబడినది. మమ= నాయొక్క, భావః అపి=భావము కూడా, సర్వథా=అన్ని విధములా, సీతాయామ్=సీతయందు, వినివేశితః=ఉంచబడినది.

తా. సీత తన మనస్సును పూర్తిగా నా మీద నిలిపి ఉన్నది. నా మనస్సు కూడ అన్ని విధాలా సీతపైననే నిలపబడి ఉన్నది. 52

మూ. ఏష పుష్పవహో వాయుః సుఖస్పర్శో హిమావహః,
తాం విచిన్తయతః కాన్తాం పావకప్రతిమో మమ. 53

ప్ర. అ. పుష్పవహః=పుష్పములను మోసికొని వచ్చుచున్నది, సుఖ స్పర్శః= సుఖకరమైన స్పర్శ కలది, హిమావహః=మంచును వ్యాపింపచేయునది అయిన, ఏషః=ఈ, వాయుః=వాయువు, తాం కాన్తామ్=ఆ ప్రియురాలిని,

విచిన్వతః=వెదకుచున్న, మమ=నాకు, పావకప్రతిమః=అగ్నితో సమానముగా ఉన్నది.

తా. పుష్పములను మోసికొని వచ్చుచు, మంచును వ్యాపింపచేయుచు, సుఖమైన స్పర్శ నిచ్చుచున్న ఈ వాయువు నా ప్రియురాలిని వెదకుచున్న నాకు అగ్నివలె ఉన్నది. 53

మూ. సదా సుఖమహం మన్యే యం పురా సహ సీతయా,
మారుతః స వినా సీతాం శోకసంజననో మమ. 54

ప్ర. అ. పురా=పూర్వము, సీతయా సహ=సీతతో కలిసి ఉన్న, అహమ్=నేను, యమ్=ఏ వాయువును, సదా=ఎల్లప్పుడు, సుఖమ్=సుఖకరమైనదానినిగా, మన్యే=తలచెడివాడనో, సః మారుతః=ఆ వాయువే,సీతాం వినా=సీత లేకపోవుటచే, మమ= నాకు, శోకసంజననః=శోకమును కలిగించుచున్నది.

తా. ఇంతకు పూర్వము సీతతో కలిసి ఉన్నప్పుడు ఏ వాయువు ఎల్లప్పుడు సుఖకరముగానే ఉండు నని నేను భావించేవాడనో ఆ వాయువే ఇప్పుడు సీతావియుక్తుడనైన నాకు దుఃఖమును కలిగించుచున్నది. 54

మూ. తాం వినాథ విహఙ్గోఽసౌ పక్షీ ప్రణదితస్తదా,
వాయసః పాదపగతః ప్రహృష్టమభికూజతి. 55

ప్ర. అ. తదా=అప్పుడు, విహఙ్గః=ఆకాశమును చేరినదై, ప్రణదితః= అరచిన, పక్షీ=పక్షియైన, అసౌ వాయసః=ఈ కాకి, అథ= పిమ్మట (ఇప్పుడు), తాం వినా= ఆమె లేకుండగా (లేనప్పుడు), పాదపగతః= వృక్షమును చేరినదై, ప్రహృష్టమ్=ఆనందముగా, అభికూజతి= కూయుచున్నది.

తా. అప్పుడు సీతావియోగమును సూచించుచు ఆకాశముపైకి ఎగిరి అరచిన కాకియే ఇప్పుడు సీతావియోగము కలిగిన తరువాత, వృక్షముపై కూర్చుండి సంతోషముతో అరచుచు, మరల సీత లభించ నున్న దని సూచించుచున్నది. 55

మూ. ఏష వై తత్ర వైదేహ్యా విహగః ప్రతిహారకః,
పక్షీ మాం తు విశాలాక్ష్యాః సమీపముపనేష్యతి. 56

ప్ర. అ. తత్ర=అప్పుడు, విహగః=ఆకాశమున ఎగురుచు, వైదేహ్యాః=సీతకు, ప్రతిహారకః=అపహారకమైన (అపహరింపచేసిన), ఏషః పక్షీ= ఈ పక్షి, మామ్=నన్ను, విశాలాక్ష్యాః=విశాలములైన నేత్రములు గల సీతయొక్క, సమీపమ్=సమీపమును, ఉపనేష్యతి= చేర్చగలదు.

తా. ఆనాడు ఆకాశముమీద ఎగురుచు అరచి సీతాహరణమును

సూచించుట ద్వారా ఆమె అపహరణమునకు నిమిత్తమైన ఈ కాకియే నన్ను సీత దగ్గరకు తీసికొని వెళ్లగలదు. (సీత లభించునని సూచించుచు కూయుచున్న దని భావము.) 56

మూ. పశ్య లక్ష్మణ సంనాదం వనే మదవివర్ధనమ్,
పుష్పితాగ్రేషు వృక్షేషు ద్విజానామవకూజతామ్. 57

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! వనే=వనమునందు, పుష్పితాగ్రేషు= పుష్పించిన అగ్రభాగములు గల, వృక్షేషు=వృక్షములమీద, అవకూజతామ్=కూయుచున్న, ద్విజానామ్=పక్షులయొక్క, మదవివర్ధనమ్=మదమును వృద్ధి పొందించునట్లు ఎట్లు కూయుచున్నవో చూడుము.

తా. లక్ష్మణా! పక్షులు వనములో అగ్రభాగములు పుష్పించిన చెట్లపై కూర్చుండి మదమును వృద్ధి పొందించునట్లు ఎట్లు కూయుచున్నవో చూడుము.

మూ. విక్షిప్తాం పవనేనైతామసౌ తిలకమఞ్జరీమ్,
షట్పదః సహసాభ్యేతి మదోద్ధూతామివ ప్రియామ్. 58

ప్ర. అ. అసౌ=ఈ, షట్పదః=తుమ్మెద, పవనేన=వాయువుచేత, విక్షిప్తామ్=కదల్చబడిన, తిలకమఞ్జరీమ్=తిలకపుష్పముల గుత్తుని, మదోద్ధూతామ్=మదముచేత ఊపివేయబడిన, ప్రియామివ=ప్రియురాలిని వలె, సహసా=శీఘ్రముగా, అభ్యేతి=చేరుచున్నది.

తా. ఈ తుమ్మెద గాలికి కదలుచున్న తిలకపుష్పాల గుత్తిని, మదముచేత ఊగుచున్న ప్రియురాలిని చేరి నట్లు చేరుచున్నది. 58

మూ. కామినామయమత్యన్తమశోకః శోకవర్ధనః,
స్తబకైః పవనోత్క్షిప్తైస్తర్జయన్నివ మాం స్థితః. 59

ప్ర. అ. కామినామ్=కాముకులకు, అత్యన్తమ్=మిక్కిలి, శోకవర్ధనః=శోకమును వృద్ధిపొందించు, అయమ్ అశోకః=ఈ అశోకవృక్షము, పవనోత్క్షిప్తైః=గాలిచేత కదల్చబడిన, స్తబకైః=గుత్తులచేత, మామ్=నన్ను, తర్జయన్నివ=భయపెట్టుచున్నది వలె, స్థితః= ఉన్నది.

తా. కాముకుల శోకమును మిక్కిలి వృద్ధిపొందింపచేయు ఈ అశోకవృక్షము గాలికి ఎగురుచున్న పూలగుత్తులతో నన్ను జళిపించుచున్నట్లున్నది. 59

మూ. అమీ లక్ష్మణ దృశ్యన్తే చూతాః కుసుమశాలినః,
విభ్రమోత్సిక్తమనసః సాఙ్గరాగా నరా ఇవ. 60

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! కుసుమశాలినః=పుష్పములతో ప్రకాశించుచున్న, అమీ= ఈ, చూతాః=చూతవృక్షములు, విభ్రమోత్సిక్తమనసః=విలాసముచేత గర్వించిన

మనస్సు గల, సాఙ్గరాగాః=అంగరాగముతో కూడిన, నరా ఇవ=మానవుల వలె, దృశ్యన్తే=కనబడుచున్నవి.

తా. లక్ష్మణా! పుష్పములతో ప్రకాశించుచున్న ఈ చూతవృక్షములు విలాసలచేత గర్వించిన మనస్సులు గల, శరీరములకు అంగరాగము పూసికొన్న మనుష్యుల వలె ఉన్నవి. 60

మూ. సౌమిత్రే పశ్య పమ్పాయాశ్చిత్రాసు వనరాజిషు,
కింనరా నరశార్దూల విచరన్తి తతస్తతః. 61

ప్ర. అ. నరశార్దూల=నరులలో శ్రేష్ఠుడా! సౌమిత్రే=లక్ష్మణా! పమ్పాయాః=పంపాసరస్సుయొక్క, చిత్రాసు=చిత్రములైన, వనరాజిషు=వనపంక్తులలో, కింనరాః= కింనరులు, తతస్తతః=అక్కడక్కడ, విచరన్తి=సంచరించుచున్నారు. పశ్య=చూడుము.

తా. పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! పంపాతీరమునం దున్న చిత్రములైన వనపంక్తులలో కింనరులు అక్కడక్కడ సంచరించుచున్నారు. చూడుము. 61

మూ. ఇమాని శుభగన్ధీని పశ్య లక్ష్మణ సర్వశః,
నలినాని ప్రకాశన్తే జలే తరుణసూర్యవత్. 62

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! శుభగన్ధీని=మంచి వాసన గల, ఇమాని=ఈ, నలినాని=పద్మములు, జలే=జలమునందు, సర్వశః=అంతటా, తరుణసూర్యవత్=లేత సూర్యుల వలె, ప్రకాశన్తే=ప్రకాశించుచున్నవి; పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! చూడుము; మంచి వాసన గల ఈ పద్మములు నీటిలో అంతటా లేత సూర్యుల వలె ప్రకాశించుచున్నవి. 62

మూ. ఏషా ప్రసన్నసలిలా పద్మనీలోత్పలాయుతా,
హంసకారణ్డవాకీర్ణా పమ్పా సౌగన్ధికాయుతా. 63

ప్ర. అ. ప్రసన్నసలిలా=నిర్మలమైన ఉదకము గలది, పద్మనీలోత్పలాయుతా=పద్మములతోను, నల్లకలవలతోను కూడినది, హంసకారణ్డవాకీర్ణా=హంసలతోను, కారండవపక్షులతోను వ్యాప్తమూ, సౌగన్ధికాయుతా=ఎఱ్ఱని పద్మములతో కూడినదీ అయిన, ఏషా=ఈ, పమ్పా=పంపానది (ప్రకాశించుచున్నది).

తా. నిర్మలమైన ఉదకము గల ఈ పంపాసరస్సు పద్మములతోను, నల్లకలవలతోను, హంసలతోను, కారండవపక్షులతోను, ఎఱ్ఱతామరపూవులతోను ప్రకాశించుచున్నది. 63

మూ. ఏషా తరుణసూర్యాభైః షట్పదాహతకేసరైః,
పఙ్కజైః శోభతే పమ్పా సమన్తాదభిసంవృతా. 64

ప్ర. అ. తరుణసూర్యాభైః=లేత సూర్యుని వంటి కాంతి గల, షట్పదాహత కేసరైః=తుమ్మెదలచేత కొట్టబడిన కింజల్కములు గల, పఙ్కజైః=పద్మములచేత, సమన్తాత్=అంతటా, అభిసంవృతా=కప్పబడిన, ఏషా పమ్పా=ఈ పంపాసరస్సు, శోభతే = ప్రకాశించుచున్నది.

తా. ఈ పంపాసరస్సులో అంతటా లేత సూర్యుని వంటి కాంతి గల పద్మములు కప్పి ఉన్నవి. వాటి కింజల్కములు తుమ్మెదల రాపిడికి కదలుచున్నవి. అట్టి పద్మాలతో ఈ సరస్సు చాల అందముగా ఉన్నది. 64

మూ. చక్రవాకయుతా నిత్యం చిత్రప్రస్థవనాన్తరా,
మాతఙ్గమృగయూథైశ్చ శోభతే సలిలార్థిభిః. 65

ప్ర. అ. నిత్యమ్=ఎల్లప్పుడు, చక్రవాకయుతా=చక్రవాకపక్షులతో కూడినది, చిత్రప్రస్థవనాన్తరా=చిత్రములైన ప్రదేశములు గల వనమధ్యములు గలది అయిన ఈ పంప, సలిలార్థిభిః=ఉదకమును కోరుచున్న, మాతఙ్గమృగయూథైశ్చ =ఏనుగులతోను, లేళ్ల గుంపులతోను, శోభతే= ప్రకాశించుచున్నది.

తా. ఈ పంపానదీతీరమునందలి వనములలో చిత్రములైన ప్రదేశములు ఉన్నవి. దీనిలో సర్వదా చక్రవాకములు నివసించుచున్నవి. ఉదకమును త్రాగుటకై దీనివద్దకు వచ్చు ఏనుగుల గుంపులు, లేళ్ల గుంపులు దీని శోభను ఇనుమడింపచేయుచున్నవి. 65

మూ. పవనాహతవేగాభిరూర్మిభిర్విమలేఽమ్భసి,
పఙ్కజాని విరాజన్తే తాడ్యమానాని లక్ష్మణ. 66

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! విమలే=నిర్మలమైన, అమ్భసి= ఉదకమునందు, పవనాహతవేగాభిః=వాయువుచేత కొట్టబడిన వేగము గల, ఊర్మిభిః=తరంగముల చేత, తాడ్యమానాని=కొట్టబడుచున్న, పఙ్కజాని=పద్మములు, విరాజన్తే=ప్రకాశించుచున్నవి.

తా. లక్ష్మణా! నిర్మలమైన ఉదకములోని ఈ పద్మములు గాలికి తగ్గిన వేగము గల తరంగములచేత కొట్టబడినవై చూచుటకు అందముగా ఉన్నవి.

మూ. పద్మపత్రవిశాలాక్షీం సతతం ప్రియపఙ్కజామ్,
అపశ్యతో మే వైదేహీం జీవితం నాభిరోచతే. 67

ప్ర. అ. పద్మపత్రవిశాలాక్షీమ్=పద్మముల రేకులవలె విశాలములైన నేత్రములు కలది, సతతమ్=ఎప్పుడూ, ప్రియపఙ్కజామ్=ప్రియమైన పద్మములు గలది అయిన, వైదేహీమ్=సీతను, అపశ్యతః=చూడని, మే=నాకు, జీవితమ్= జీవితము, నాభిరోచతే=ఇష్టమగుటలేదు.

తా. ఎల్లప్పుడూ పద్మములంటే ఇష్టపడే పద్మపత్రవిశాలాక్షియైన సీత కనబడని జీవితము నా కేమాత్రము రుచించుట లేదు. 67

మూ. అహో కామస్య వామత్వం యో గతామపి దుర్లభామ్,
స్మారయిష్యతి కల్యాణీం కల్యాణతరవాదినీమ్. 68

ప్ర. అ. కామస్య=మన్మథునియొక్క, వామత్వమ్=వక్రత్వము, అహో= ఎంత ఆశ్చర్యజనకము! యః=ఏ మన్మథుడు, గతామ్=దూరముగా వెళ్లిపోయినదై, దుర్లభామ్ అపి=పొందుటకు కష్ట మైనదైనను, కల్యాణతరవాదినీమ్=మిక్కిలి మంగళముగా మాటలాడు, కల్యాణీమ్= మంగళప్రదురాలైన సీతను, స్మారయిష్యతి=స్మరింపచేయగలడో (చేయుచున్నాడో).

తా. చాల మంగళకరములైన మాటలు పలికే, మంగళస్వభావము గల ఆ సీత దూరముగా వెళ్లిపోయినది. ఆమె ఇపుడు లభించుట కష్టము. అయినను ఆమెయే నాకు స్మృతికి వచ్చునట్లు చేయుచున్న మన్మథుడు ఎంత వక్రస్వభావుడు! 68

మూ. శక్యో ధారయితుం కామో భవేదభ్యాగతో మయా,
యది భూయో వసన్తో మాం న హన్యాత్పుష్పితద్రుమః. 69

ప్ర. అ. పుష్పితద్రుమః=పుష్పించిన వృక్షములు గల, వసన్తః=వసంతము, భూయః=అధికముగా, న హన్యాద్యది= పీడించకున్నట్లయితే, అభ్యాగతః=వచ్చిన, కామః=మన్మథుడు, మయా=నాచేత, ధారయితుమ్=సహించుటకు, శక్యః=శక్యమైనవాడు.

తా. పుష్పించిన వృక్షములు గల వసంతము నన్ను అధికముగా పీడించకపోయినచో ఈ మన్మథుణ్ణి సహించుటకు శక్యమై ఉండేది. 69

మూ. యాని స్మ రమణీయాని తయా సహ భవన్తి మే,
తాన్యేవారమణీయాని జాయన్తే మే తయా వినా. 70

ప్ర. అ. తయా సహ=సీతతో కూడ, యాని=ఏవి, మే=నాకు, రమణీయాని=సుందరములుగా, భవన్తి స్మ=అయేవో, తాని=అవే, తయా వినా=ఆమె లేకపోవుటచేత, మే=నాకు, అరమణీయాని= అసుందరములు, జాయన్తే=అగుచున్నవి.

తా. సీత దగ్గర ఉన్నప్పుడు ఏ వస్తువులు నాకు చాల అందముగా ఉండేవో, ఆ వస్తువులే ఆమె లేకపోవుటచేత అసుందరములుగా కనబడుచున్నవి.

మూ. పద్మకోశపలాశాని ద్రష్టుం దృష్టిర్హి మన్యతే,
సీతాయా నేత్రకోశాభ్యాం సదృశానీతి లక్ష్మణ. 71

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! సీతాయాః=సీతయొక్క, నేత్రకోశాభ్యామ్=మొగ్గల వంటి నేత్రములతో, సదృశానీతి=సమానమైన వనే కారణమువలన, దృష్టిః=నా దృష్టి, పద్మకోశపలాశాని=పద్మముల మొగ్గల రేకులను, ద్రష్టుమ్=చూచుటకు, మన్యతే=తలచుచున్నది. (కోరుచున్నది.)

తా. లక్ష్మణా! పద్మాల మొగ్గల రేకులు చూడవలె నని నా దృష్టి కోరుచున్నది. ఎందుచేత ననగా అవి సీత నేత్రకోశముల వలె ఉన్నవి. 71

మూ. పద్మకేసరసంసృష్టో వృక్షాన్తరవినిస్సృతః,
నిఃశ్వాస ఇవ సీతాయా వాతి వాయుర్మనోహరః. 72

ప్ర. అ. పద్మకేసరసంసృష్టః=పద్మముల కింజల్కములతో కలిసినది, వృక్షాన్తరవినిఃసృతః=వృక్షమధ్యమునుండి బయలుదేరినది, మనోహరః= మనోహరము, సీతాయాః= సీతయొక్క, నిఃశ్వాసః ఇవ=నిఃశ్వాసము (ఊపిరిపీల్చుట) వలె ఉన్నది అయిన, వాయుః=వాయువు, వాతి= వీచుచున్నది.

తా. వృక్షముల మధ్యనుండి బయలుదేరి పద్మముల కింజల్కములను స్పృశించుచు వచ్చుచున్న ఈ వాయువు మనోహరమై, సీత నిఃశ్వాసము వలె ఉన్నది. 72

మూ. సౌమిత్రే పశ్య పమ్పాయా దక్షిణే గిరిసానుషు,
పుష్పితాం కర్ణికారస్య యష్టిం పరమశోభనామ్. 73

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! పమ్పాయాః=పంపకు, దక్షిణే= దక్షిణమునందు, గిరిసానుషు=పర్వతము చరియలయందు, కర్ణికారస్య=కర్ణికారవృక్షముయొక్క, పుష్పితామ్=పుష్పించిన, పరమశోభనామ్=మిక్కిలి అందముగా ఉన్న, యష్టిమ్=కర్రను (కొమ్మను), పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! పంపకు దక్షిణమున, పర్వతము చరియమీద ఉన్న ఆ కర్ణికారవృక్షము కొమ్మ పుష్పించి ఎంత అందముగా ఉన్నదో చూడుము. 73

మూ. అధికం శైలరాజోఽయం ధాతుభిస్తు విభూషితః,
విచిత్రం సృజతే రేణుం వాయువేగవిఘట్టితమ్. 74

ప్ర. అ. ధాతుభిః=గైరికాదిధాతువులచేత, విభూషితః=అలంకరించబడిన, అయమ్=ఈ, శైలరాజః= పర్వతరాజు, వాయువేగవిఘట్టితమ్= వాయువుయొక్క వేగముచేత (రాయబడిన) ఎగరగొట్టబడిన, విచిత్రమ్= విచిత్రమైన, రేణుమ్=రేణువును, అధికమ్=అధికముగా, సృజతే= సృష్టించుచున్నది.

తా. గైరికాదిధాతువులచేత అలంకరింపబడిన ఈ పర్వతరాజమునుండి వాయువేగముచే ఎగిరి విచిత్రమైన పరాగము అధికముగా బయలుదేరుచున్నది.

మూ. గిరిప్రస్థాస్తు సౌమిత్రే సర్వతః సంప్రపుష్పితైః,
నిష్పత్రైః సర్వతో రమ్యైః ప్రదీప్తా ఇవ కింశుకైః. 75

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! గిరిప్రస్థాః=పర్వతముయొక్క చరియలు, సర్వతః=అంతటా, సంప్రపుష్పితైః=పుష్పించినవి, నిష్పత్రైః= ఆకులు లేనివి అయిన, రమ్యైః=సుందరములైన, కింశుకైః=కింశుకవృక్షములచేత, సర్వతః=అంతటా, ప్రదీప్తాః ఇవ=మండుచున్నట్లు ఉన్నవి.

తా. లక్ష్మణా! పర్వతము చరియలమీద ఉన్న ఈ కింశుకవృక్షములు (మోదుగచెట్లు) ఆకులు లేకుండా మొదటినుండి చివరిదాకా ఎఱ్ఱని పువ్వులతో నిండి ఉండుటచేత, ఈ చరియలు అగ్నిజ్వాలలతో నిండినట్లు ఉన్నవి. 75

మూ. పమ్పాతీరరుహాశ్చేమే సంసిక్తా మధుగన్ధినః,
మాలతీమల్లికాపద్మకరవీరాశ్చ పుష్పితాః. 76

ప్ర. అ. పమ్పాతీరరుహాః =పంపాతీరమునందు మొలచినవి, సంసిక్తాః= తడపబడినవి, మధుగన్ధినః=మకరందముయొక్క సువాసనలు కలవి అయిన, ఇమే=ఈ, మాలతీమల్లికాపద్మకరవీరాశ్చ=మాలతీలతలు, మల్లికాలతలు, పద్మలతలు, కరవీరవృక్షములు కూడ, పుష్పితాః=పుష్పించినవి.

తా. పంపాతీరమునందు మొలచిన, నీటిచే తడపబడుచు, మకరందము సువాసనలతో నిండిన ఈ మాలతీలతలు, మల్లిపొదలు, పద్మలతలు, కరవీరవృక్షములు కూడ బాగుగా పుష్పించినవి. 76

మూ. కేతక్యః సిన్దువారాశ్చ వాసన్త్యశ్చ సుపుష్పితాః,
మాధవ్యో గన్ధపూర్ణాశ్చ కున్దగుల్మాశ్చ సర్వశః. 77

ప్ర. అ. కేతక్యః=మొగలిడొంకలు, సిన్దువారాశ్చ=సిందువారములు, వాసన్త్యశ్చ=వాసంతీలతలు, గన్ధపూర్ణాః =సువాసనతో నిండిన, మాధవ్యః=మాధవీలతలు, కున్దగుల్మాశ్చ=మొల్లపొదలు, సర్వశః=అన్నివైపులా, సుపుష్పితాః=బాగా పుష్పించినవి.

తా. మొగలి డొంకలు, సిందువారములు, వాసంతీలతలు, సువాసనగల మాధవీలతలు, మొల్లపొదలు అంతటా బాగుగా పుష్పించినవి. 77

మూ. చిరిబిల్వా మధూకాశ్చ వఞ్జులా వకులాస్తథా,
చమ్పకాస్తిలకాశ్చైవ నాగవృక్షాశ్చ పుష్పితాః. 78
నీపాశ్చ వరణాశ్చైవ ఖర్జూరాశ్చ సుపుష్పితాః.

ప్ర. అ. చిరిబిల్వాః=చిరిబిల్వవృక్షములు, మధూకాశ్చ=మధూకవృక్షములు, వఞ్జులాః=వంజులవృక్షములు, తథా=మరియు, వకులాః= వకులవృక్షములు, చమ్పకాః= సంపెంగచెట్లు, తిలకాశ్చైవ= తిలకవృక్షములు, నాగవృక్షాశ్చ= నాగవృక్షములు, పుష్పితాః=పుష్పించినవి. నీపాశ్చ=నీపవృక్షములు, వరణాశ్చైవ=వరణవృక్షములు,

ఖర్జూరాశ్చ=ఖర్జూరవృక్షములు, సుపుష్పితాః=బాగుగా పుష్పించినవి.

తా. చిరిబిల్వ - మధూక - వంజుళ - వకుల - చంపక - తిలక - నాగవృక్షములు పుష్పించినవి. నీప - వరణ - ఖర్జూరవృక్షములు కూడ బాగుగా పుష్పించినవి. 78

మూ. పద్మకాశ్చైవ శోభన్తే నీలాశోకాశ్చ పుష్పితాః, 79
లోధ్రాశ్చ గిరిపృష్ఠేషు సింహకేసరపిఞ్జరాః.

ప్ర. అ. గిరిపృష్ఠేషు=పర్వతముల పైభాగములందు, పుష్పితాః=పుష్పించిన, పద్మకాశ్చైవ=పద్మకవృక్షములు, నీలాశోకాశ్చ=నీలాశోకవృక్షములు, సింహకేసరపిఞ్జరాః=సింహముల జూలు వలె పింజరవర్ణము గల, లోధ్రాశ్చ= లోధ్రవృక్షములు, శోభన్తే=ప్రకాశించుచున్నవి.

తా. పర్వతము పైభాగములమీద పద్మకవృక్షములు, నీలాశోకవృక్షములు, సింహము జూలు రంగు వంటి రంగు గల లోధ్రవృక్షములు పుష్పించి ఎంతో అందముగా ఉన్నవి. 79

మూ. అఙ్కోలాశ్చ కురణ్టాశ్చ చూర్ణకాః పారిభద్రకాః, 80
చూతాః పాటలయశ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః.
ముచుకున్దార్జునాశ్చైవ దృశ్యన్తే గిరిసానుషు, 81
కేతకోద్దాలకాశ్చైవ శిరీషాః శింశపా ధవాః.

ప్ర. అ. అఙ్కోలాశ్చ=అంకోలవృక్షములు, కురణ్టాశ్చ=కురంటవృక్షములు, చూర్ణకాః=చూర్ణకవృక్షములు, పారిభద్రకాః=పారిభద్రకవృక్షములు, చూతాః=చూతవృక్షములు, పాటలయః=పాటలవృక్షములు, కోవిదారాశ్చ=కోవిదారవృక్షములు, ముచుకున్దార్జునాశ్చైవ= ముచుకుందవృక్షములు, అర్జునవృక్షములు, కేతకోద్దాలకాశ్చైవ= కేతకవృక్షములు, ఉద్దాలకవృక్షములు, శిరీషాః=శిరీషవృక్షములు, శింశపాః=శింశపావృక్షములు, ధవాః=ధవవృక్షములు, పుష్పితాః= పుష్పించినవై, గిరిసానుషు=పర్వతము చరియలయందు, దృశ్యన్తే= చూడబడుచున్నవి.

తా. ఈ పర్వతము చరియలమీద బాగుగా పుష్పించిన అంకోల - కురంట - చూర్ణక - పారిభద్రకవృక్షములు, చూత - పాటల - కోవిదారవృక్షములు, ముచుకుంద - అర్జునవృక్షములు, కేతక - ఉద్దాలక - శింశపా - శిరీష ధవవృక్షములు కనబడుచున్నవి. 80, 81

మూ. శాల్మల్యః కింశుకాశ్చైవ రక్తాః కురబకాస్తథా, 82
తినిశా నక్తమాలాశ్చ చన్దనాః స్యన్దనాస్తథా,
హిన్తాలా స్తిలకాశ్చైవ నాగవృక్షాశ్చ పుష్పితాః. 83

ప్ర. అ. శాల్మల్యః=బూరుగుచెట్లు, కింశుకాశ్చైవ=కింశుకవృక్షములు,

తథా=మరియు, రక్తాః=ఎఱ్ఱని, కురబకాః=గోరింటచెట్లు, తినిశాః=తినిశవృక్షములు, నక్తమాలాశ్చ=నక్తమాలవృక్షములు, చన్దనాః=మంచిగంధపు చెట్లు, తథా=మరియు, స్యన్దనాః= స్యందనవృక్షములు, హిన్తాలాః=హింతాలవృక్షములు, తిలకాశ్చైవ= తిలక వృక్షములు, నాగవృక్షాశ్చ=నాగవృక్షములు, పుష్పితాః= పుష్పించినవి.

తా. శాల్మలీ - కింశుక - రక్తకురబక - తినిశ - నక్తమాలా - చందన - స్యందన - హింతాల - తిలక - నాగవృక్షములు కూడ పూసినవి.

మూ. పుష్పితాన్ పుష్పితాగ్రాభిర్లతాభిః పరివేష్టితాన్,
ద్రుమాన్ పశ్యేహ సౌమిత్రే పమ్పాయా రుచిరాన్ బహూన్. 84

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! పుష్పితాన్=పుష్పించినవి, పుష్పితాగ్రాభిః= పుష్పించిన అగ్రభాగములు గల, లతాభిః=లతలచేత, పరివేష్టితాన్= చుట్టుకొనబడినవి, రుచిరాన్=సుందరములు అయిన, పమ్పాయాః= పంపయొక్క, బహూన్=అనేకమైన, ద్రుమాన్=వృక్షములను, ఇహ=ఇక్కడ, పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! ఇక్కడ పంపాతీరమునందు పుష్పించిన సుందరములైన అనేకవృక్షములను పుష్పించిన లతలు అల్లుకొని యున్నవి; చూడుము. 84

మూ. వాతవిక్షిప్తవిటపాన్ యథాసన్నాన్ద్రుమానిమాన్,
లతాః సమనువర్తన్తే మత్తా ఇవ వరస్త్రియః. 85

ప్ర. అ. వాతవిక్షిప్తవిటపాన్=గాలిచే కదల్చబడిన కొమ్మలు గల, యథాసన్నాన్=అనుకూల మగునట్లు దగ్గరగా ఉన్న, ఇమాన్ ద్రుమాన్= ఈ వృక్షములను, లతాః=లతలు, మత్తాః=మదించిన, వరస్త్రియః యథా=శ్రేష్ఠమైన స్త్రీలు వలె, సమనువర్తన్తే=దగ్గరగా చేరుచున్నవి.

తా. గాలికి కదలిన కొమ్మలతో ఈ చెట్లు అనుకూలమైన విధమున దగ్గర అగుచుండగా ఈ లతలు ఉత్తమస్త్రీల వలె వాటిని చేరుచున్నవి. 85

మూ. పాదపాత్పాదపం గచ్ఛన్ శైలాచ్ఛైలం వనాద్వనమ్,
వాతి నైకరసాస్వాదసంమోదిత ఇవానిలః. 86

ప్ర. అ. అనిలః=వాయువు, నైకరసాస్వాదసంమోదిత ఇవ= అనేకరసము లను ఆస్వాదించుటచేత ఆనందించుచున్నది వలె, పాదపాత్=ఒక చెట్టునుండి, పాదపమ్=మరొక చెట్టును గూర్చి, శైలాత్=ఒక పర్వతమునుండి, శైలమ్=మరొక పర్వతమును గూర్చి, వనాత్=ఒక వనమునుండి, వనమ్=మరొక వనమును గూర్చి, గచ్ఛన్=వెళ్లుచు, వాతి= వీచుచున్నది.

తా. వాయువు, అనేక విధములైన రసములను ఆస్వాదించుటచే సంతోషించుచున్నదా అన్నట్లు ఒక చెట్టునుండి మరొక చెట్టువైపు, ఒక పర్వతమునుండి మరొక పర్వతమువైపు, ఒక వనమునుండి మరొక వనములోనికి

వీచుచున్నది. 86

మూ. కే చిత్పర్యాప్తకుసుమాః పాదపా మధుగన్ధినః,
కేచిన్ముకులసంవీతాః శ్యామవర్ణా ఇవాబభుః. 87

ప్ర. అ. మధుగన్ధినః=తేనెయొక్క సువాసన గల, కేచిత్=కొన్ని, పాదపాః= వృక్షములు, పర్యాప్త,కుసుమాః=చాలినన్ని (అధికమైన) పుష్పములు గలవి. ముకులసంవీతాః=మొగ్గలతో కూడిన, కేచిత్=కొన్ని, శ్యామవర్ణా ఇవ=నల్లని వర్ణము కలవి వలె, ఆబభుః=ప్రకాశించినవి (ప్రకాశించుచున్నవి).

తా. పువ్వులతో నిండిన కొన్ని వృక్షములు మకరందగంధమును వ్యాపింపచేయుచున్నవి. మొగ్గలతో నిండి యుండుటచే కొన్ని వృక్షములు నల్లగా ఉన్నట్లు కనబడుచున్నవి. 87

మూ. ఇదం మృష్టమిదం స్వాదు ప్రఫుల్లమిద మిత్యపి,
రాగయుక్తో మధుకరః కుసుమేష్వేవ లీయతే. 88

ప్ర. అ. రాగయుక్తః=అనురాగముతో కూడిన, మధుకరః=తుమ్మెద, ఇదమ్= ఇది, మృష్టమ్=పరిశుద్ధమైనది; ఇదమ్=ఇది, స్వాదు=మధురమైనది; ఇదమ్=ఇది, ప్రఫుల్లమ్=వికసించినది. ఇత్యపి=అని అనుకొనుచు, కుసుమేష్వేవ=పుష్పములలో, లీయతే=అణగుచున్నది.

తా. తుమ్మెద "ఇది పరిశుద్ధముగా ఉన్నది; ఇది మధురము; ఇది వికసించినది" అని అనుకొనుచు అత్యధికమైన ఆసక్తితో పుష్పాలలో ప్రవేశించుచున్నది. 88

మూ. నిలీయ పునరుత్పత్య సహసాన్యత్ర గచ్ఛతి,
మధులుబ్ధో మధుకరః పమ్పాతీరద్రుమేష్వసౌ. 89

ప్ర. అ. పమ్పాతీరద్రుమేషు=పంపాతీరమునందలి వృక్షములయందు, మధులుబ్ధః=తేనెయందు ఆసక్తిగల, అసౌ=ఈ, మధుకరః= తుమ్మెద, నిలీయ=ఒక పువ్వులో అణగి, పునః=మరల, ఉత్పత్య= ఎగిరి, సహసా=వెంటనే, అన్యత్ర=మరి యొక వైపు, గచ్ఛతి= వెళ్లుచున్నది.

తా. పంపాతీరమునందున్న వృక్షములలో, తేనెయందు అత్యాసక్తి గల ఈ తుమ్మెద ఒక పుష్పములో ప్రవేశించి అణగి యుండి, హటాత్తుగా లేచి మరియొక వైపునకు వెళ్లుచున్నది. 89

మూ. ఇయం కుసుమసంఘాతైరుపస్తీర్ణా సుఖాకృతా,
స్వయం నిపతితైర్భూమిః శయనప్రస్తరైరివ. 90

ప్ర. అ.స్వయమ్=స్వయముగా, నిపతితైః=రాలిన, కుసుమసంఘాతైః=

పుష్పముల సముదాయములచేత, శయనప్రస్తరైరివ=శయనాస్తరణములచేత వలె, ఉపస్తీర్ణా=పరవబడిన, ఇయమ్=ఈ, భూమిః=భూమి, సుఖాకృతా=సుఖకరముగా ఉన్నది.

తా. వాటంత అవే ప్రోగులు ప్రోగులుగా రాలిన పువ్వులు పరచి ఉండుటచేత ఈ భూమి పక్క పరచినట్లు సుఖకరముగా ఉన్నది. 90

మూ. వివిధా వివిధైః పుష్పైస్తైరేవ నగసానుషు,
విస్తీర్ణాః పీతరక్తాభాః సౌమిత్రే ప్రస్తరాః కృతాః. 91

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! నగసానుషు=పర్వతము చరియలయందు, వివిధైః=అనేకవిధములైన,తైః పుష్పైరేవ=ఆ పుష్పములచేతనే, విస్తీర్ణాః=పరవబడిన, వివిధాః=అనేకవిధములైన, ప్రస్తరాః= శిలాఫలకములు, పీతరక్తాభాః= పచ్చని, ఎఱ్ఱని కాంతి గలవిగా, కృతాః= చేయుబడినవి.

తా. లక్ష్మణా! పర్వతముల చరియలమీద ఉన్న ఈ శిలాఫలకములు అనేక విధములైన పుష్పములచే కప్పబడి పచ్చని, ఎఱ్ఱని రంగులతో ప్రకాశించునట్లు చేయుబడినవి. 91

మూ. హిమాన్తే పశ్య సౌమిత్రే వృక్షాణాం పుష్పసంభవమ్,
పుష్పమాసే హి తరవః సంఘర్షాదివ పుష్పితాః. 92

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! హిమాన్తే=శిశిరర్తువు అంతమునందు, పుష్పమాసే=చైత్రమాసమునందు, వృక్షాణామ్=వృక్షములయొక్క, పుష్పసంభవమ్= పుష్పముల ఉత్పత్తిని, పశ్య=చూడుము. తరవః= ఈ వృక్షములు, సంఘర్షాదివ= సంఘర్షమువలన వలె, పుష్పితాః= పుష్పించినవి.

తా. లక్ష్మణా! హేమంతర్తువు గడచిన పిమ్మట చైత్రమాసములో వృక్షములు ఎట్లు పుష్పించినవో చూడుము. ఈ వృక్షములు ఒకదానితో ఒకటి పోటీపడుచున్నట్లు పుష్పించినవి. 92

మూ. ఆహ్వాయన్త ఇవాన్యోన్యం నగాః షట్పదనాదితాః,
కుసుమోత్తంసవిటపాః శోభన్తే బహు లక్ష్మణ. 93

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! కోసుమోత్తంసవిటపాః=పుష్పములు శిరోభూషణములుగా గల కొమ్మలు గలవి, షట్పదనాదితాః=తుమ్మెదలచేత ధ్వనింపచేయుబడినవి అయిన, నగాః=వృక్షములు, అన్యోన్యమ్= పరస్పరము, ఆహ్వాయన్తః ఇవ=పిలచుకొనుచున్నవి వలె, బహు= అధికముగా, శోభన్తే=ప్రకాశించుచున్నవి.

తా. లక్ష్మణా! పుష్పములతో నిండిన కొమ్మలుగల వృక్షములు, తుమ్మెదల ధ్వనులచేత పరస్పరము మాటలాడుకొనుచున్నట్లు ఉన్నవి. 93

మూ. ఏష కారణ్డవః పక్షీ విగాహ్య సలిలం శుభమ్,
రమతే కాన్తయా సార్ధం కామముద్దీపయన్నివ. 94

ప్ర. అ. ఏషః=ఈ, కారణ్డవః పక్షీ=కారండవపక్షి, శుభమ్= ఉత్తమమైన, సలిలమ్=నీటిని, విగాహ్య=ప్రవేశించి, కామమ్= కామమును, ఉద్దీపయన్నివ=ఉద్దీపింప చేయుచున్నదా అన్నట్లు, కాన్తయా సార్ధమ్=ప్రియురాలితో కూడ, రమతే=క్రీడించుచున్నది.

తా. ఈ కారండవపక్షి శుభ్రమైన నీటిలో మునిగి, చూచేవారికి కామమును ఉద్దీపింపచేయుచున్నదా అన్నట్లు ప్రియురాలితో క్రీడించుచున్నది.

మూ. మన్దాకిన్యాస్తు యదిదం రూపమేవం మనోరమమ్,
స్థానే జగతి విఖ్యాతా గుణాస్తస్యా మనోరమాః. 95

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, మనోరమమ్=మనోహరమైన, యత్=ఏ, ఇదమ్=ఈ, రూపమ్=పంపారూపము గలదో, అది, మన్దాకిన్యాః= మందాకినిది; తస్యాః=ఆ పంప యొక్క, మనోరమాః=మనోహరములైన, గుణాః=గుణములు, జగతి=జగత్తునందు, విఖ్యాతాః= ప్రసిద్ధమైనవి. స్థానే=యుక్తము.

తా. ఈ విధముగా మనోహరమైన రూపము మందాకినికి ఉన్నది. అందుచేతనే ఈ పంపకు సంబంధించిన మనోహరములైన గుణములు జగత్తులో ప్రసిద్ధి చెందినవి. 95

మూ. యది దృశ్యేత సా సాధ్వీ యది చేహ వసేమహి,
స్పృహయేయం న శక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ. 96

ప్ర. అ. రఘూత్తమ=లక్ష్మణా! సాధ్వీ=మంచి స్వభావము గల, సా=ఆ సీత, దృశ్యేత యది=చూడబడినట్లయితే, ఇహ=ఇక్కడనే, వసేమహి యది=మనము నివసించినట్లయితే, శక్రాయ=దేవేంద్రత్వమునకు, న స్పృహయేయమ్=అభిలషించను, అయోధ్యాయై=అయోధ్యకొరకు, న=అభిలషించను.

తా. లక్ష్మణా! ఉత్తమురాలైన ఆ సీత కనబడినట్లయితే, మన మందరము ఇక్కడనే నివసించగలుగుతే నాకు దేవేంద్రపదవి కూడ అక్కరలేదు. అయోధ్యకు తిరిగి వెళ్లవలె నని కూడ కోరను. 96

మూ. నహ్యేవం రమణీయేషు శాద్వలేషు తయా సహ,
రమతో మే భవేచ్చిన్తా న స్పృహాన్యేషు వా భవేత్. 97

ప్ర. అ. హి=ఎందువలన అనగా, ఏవమ్=ఈ విధముగా, రమణీయేషు=. సుందరములైన, శాద్వలేషు=పచ్చిక బీడులందు, తయా సహ=ఆ సీతతో కూడ,

రమతః=క్రీడించుచున్న, మే=నాకు, చిన్తా=విచారము, న భవేత్=కలుగదు. అన్యేషు=ఇతరవస్తువులయందు, స్పృహా వా= ఆసక్తి కూడ, న భవేత్=కలుగదు.

తా. ఎందువలన అనగా, ఇంత అందమైన ఈ పచ్చికబీళ్లమీద ఆమెతో విహరించ కలిగినచో నాకు మరొక చింత ఏమీ ఉండదు. ఇతర వస్తువుల మీద ఆసక్తి కూడ ఉండదు. 97

మూ. అమీ హి వివిధైః పుష్పైస్తరవో వివిధచ్ఛదాః,
కాననేఽస్మిన్వినా కాన్తాం చిన్తాముత్పాదయన్తి మే. 98

ప్ర. అ. వివిధచ్ఛదాః=అనేకవిధములైన ఆకులు గల, అమీ=ఈ, తరవః=వృక్షములు, వివిధైః=అనేకవిధములైన, పుష్పైః= పుష్పములతో, అస్మిన్=ఈ, కాననే=అడవియందు, కాన్తాం వినా= ప్రియురాలు లేకుండుటచే, మే=నాకు, చిన్తామ్=దుఃఖమును, ఉత్పాదయన్తి=పుట్టించుచున్నవి.

తా. ఈ అరణ్యములో, అనేకవిధములైన పత్రములతోను, పుష్పములతోను నిండిన వృక్షములు, సీత దగ్గర లేని నాకు దుఃఖమును కలిగించుచున్నవి.

మూ. పశ్య శీతజలాం చేమాం సౌమిత్రే పుష్కరాయుతామ్,
చక్రవాకానుచరితాం కారణ్డవనిషేవితామ్. 99

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! శీతజలామ్=చల్లని ఉదకము గలది, పుష్కరాయుతామ్=పద్మములతో కూడినది, చక్రవాకానుచరితామ్= చక్రవాకపక్షులచేత సంచరింపబడినది, కారణ్డవనిషేవితామ్= కారండవపక్షులచేత సేవింపబడినది అయిన, ఇమామ్=ఈ పంపను, పశ్య= చూడుము.

తా. లక్ష్మణా! చల్లని జలము గల ఈ పంపానది పద్మములతో నిండినదై, చక్రవాకపక్షులు, కారండవపక్షులు సంచరించుచుండగా ఎంత అందముగా ఉన్నదో చూడుము. 99

మూ. ప్లవైః క్రౌఞ్చైశ్చ సంపూర్ణాం మహామృగనిషేవితామ్,
అధికం శోభతే పమ్పా వికూజద్భిర్విహఙ్గమైః. 100

ప్ర. అ. ప్లవైః=ప్లవపక్షులతోను, క్రౌఞ్చైశ్చ=క్రౌంచపక్షులతోను, సంపూర్ణామ్=నిండినది, మహామృగనిషేవితామ్=మహామృగములచేత సేవింపబడినది అయిన పంపను (చూడుము). వికూజద్భిః=ధ్వనిచేయుచున్న, విహఙ్గమైః=పక్షులతో, పమ్పా=పంపాసరస్సు, అధికమ్= అధికముగా, శోభతే=శోభించుచున్నది.

తా. ఈ పంపాసరస్సు ప్లవములు, క్రౌంచములు అను పక్షులతో నిండి ఉన్నది. మహామృగములు జలము నిమిత్తము దీనిని సేవించుచున్నవి. ఇది పక్షుల ధ్వనులచేత చాల మనోహరముగా ఉన్నది. 100

మూ. దీపయన్తీవ మే కామం వివిధా ముదితా ద్విజాః,
శ్యామాం చన్ద్రముఖీం స్మృత్వా ప్రియాం పద్మనిభేక్షణామ్. 101

ప్ర. అ.ముదితాః=ఆనందముతో ఉన్న, వివిధాః=అనేకవిధములైన, ద్విజాః=పక్షులు, శ్యామామ్=యౌవనమధ్యమునం దున్నది, చన్ద్రముఖీమ్=చంద్రుని వంటి ముఖము కలది, పద్మనిభేక్షణామ్= పద్మములతో సమానమైన నేత్రములు గలది అయిన, ప్రియామ్= ప్రియురాలిని, స్మృత్వా=స్మరించి (స్మరింపజేసి), మే=నాయొక్క, కామమ్=కామమును, దీపయన్తీవ=ప్రజ్వాలింపచేయుచున్నట్లు ఉన్నవి.

తా. ఇక్కడ ఆనందముగా ఉన్న ఈ అనేకవిధములైన పక్షులు, యౌవనమధ్యమునందున్న, చంద్రుని వంటి ముఖము, పద్మము వంటి నేత్రములు గల నా ప్రియురాలిని స్మరింపచేసి నా కామమును ఉద్దీపింపచేయుచున్నట్లున్నవి.

మూ. పశ్య సానుషు చిత్రేషు మృగీభిః సహితాన్ మృగాన్,
మాం పునర్మృగశాబాక్ష్యా వైదేహ్యా విరహీకృతమ్. 102
వ్యథయన్తీవ మే చిత్తం సంచరన్త స్తతస్తతః.

ప్ర. అ. చిత్రేషు=చిత్రములైన, సానుషు=చరియలయందు, మృగీభిః= ఆడ లేళ్లతో, సహితాన్=కూడిన, మృగాన్=లేళ్లను, పశ్య= చూడుము. తతస్తతః=ఇటు అటు, సంచరన్తః=సంచరించుచున్నవై, మృగశాబాక్ష్యా=లేడిపిల్ల కళ్లవంటి కళ్లు గల , వైదేహ్యా=సీతతో, విరహీకృతమ్=లేనివాడుగా (దూరము) చేయబడిన, మామ్=నన్ను, పునః=మరల, వ్యథయన్తీవ= బాధించుచున్నట్లున్నవి. మే=నాయొక్క, చిత్తమ్=చిత్తమును, (పీడించుచున్నట్లున్నవి).

తా. చిత్రములైన చరియల మీద ఆడ లేళ్లతో కలసి ఉన్న ఈ లేళ్లను చూడుము. ఇటు అటు సంచరించుచున్న ఈ లేళ్లు లేడిపిల్ల కళ్లవంటి కళ్లు గల సీతకు దూరమైన నా మనస్సుకు ఇంకా బాధ కలిగించుచున్నవి. 102

మూ. అస్మిన్ సానుని రమ్యే హి మత్తద్విజగణాకులే, 103
పశ్యేయం యది తాం కాన్తాం తతః స్వస్తి భవేన్మమ.

ప్ర. అ. రమ్యే=రమ్యము, మత్తద్విజగణాకులే=మదించిన పక్షుల గుంపులతో వ్యాకులముగా ఉన్నదీ అయిన, అస్మిన్=ఈ , సానుని= చరియయందు, తామ్=ఆ, కాన్తామ్=ప్రియురాలిని, పశ్యేయం యది =నేను చూడగలిగినట్లయితే, మమ=నాకు, స్వస్తి=క్షేమము, భవేత్=అగును.

తా. మదించిన పక్షుల గుంపులతో వ్యాకులమై రమ్యముగా ఉన్న ఈ పర్వతము చరియ మీద నాకు సీత కనబడినచో నాకు క్షేమ మగును.103

మూ. జీవేయం ఖలు సౌమిత్రే మయా సహ సుమధ్యమా, 104
సేవేత యది వైదేహీ పమ్పాయాః పవనం శుభమ్.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! సుమధ్యమా=మంచి నడుము గల, వైదేహీ=సీత, మయా సహ=నాతో కూడ, పమ్పాయాః= పంపాసరస్సుయొక్క, శుభమ్=మంగళకరమైన, పవనమ్=వాయువును, సేవేత యది =సేవించినట్లయితే, జీవేయం ఖలు=జీవించగలను కదా!

తా. లక్ష్మణా! అందమైన నడుము గల సీత నాతో కలిసి శుభమైన ఈ పంపాసరఃపవనమును సేవించినచో నేను జీవించగలుగుదును. 104

మూ. పద్మసౌగన్ధికవహం శివం శోకవినాశనమ్, 105
ధన్యా లక్ష్మణ సేవన్తే పమ్పాయా వనమారుతమ్.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! పద్మసౌగన్ధికవహమ్=పద్మములయొక్క, ఎఱ్ఱపద్మములయొక్క సువాసనను మోసికొని వచ్చుచున్నది, శివమ్= మంగళప్రదము, శోకవినాశనమ్=శోకమును నశింపచేయునది అయిన, పమ్పాయాః=పంప యొక్క, వనమారుతమ్=వనముయొక్క వాయువును, ధన్యాః=అదృష్టవంతులు, సేవన్తే=సేవింతురు.

తా. లక్ష్మణా! పంపావనమునుండి వీచుచున్న ఈ వాయువు మంగళకరమై, పద్మముల సువాసనను, ఎఱ్ఱపద్మముల సువాసనను మోసికొని వచ్చుచు శోకమును తొలగించుచున్నది. దీనిని సేవించువారు అదృష్టవంతులు.

మూ. శ్యామా పద్మపలాశాక్షీ ప్రియా విరహితా మయా, 106
కథం ధారయతి ప్రాణాన్వివశా జనకాత్మజా.

ప్ర. అ. శ్యామా=యౌవనమధ్యమునం దున్నది, పద్మపలాశాక్షీ= పద్మపత్రముల వంటి నేత్రములు కలది, ప్రియా=నా ప్రియురాలు అయిన, జనకాత్మజా=సీత, మయా=నాతో, విరహితా=శూన్యురాలై, వివశా=వివశురాలై, (తన వశములో తానే లేనిదై) ప్రాణాన్= ప్రాణములను, కథమ్=ఎట్లు, ధారయతి=ధరించునో!

తా. యౌవనమధ్యమునం దున్నది, పద్మపత్రముల వంటి నేత్రములు కలది, నా ప్రియురాలు, వివశురాలు అయిన సీత నేను దగ్గర లేని సమయమునందు ప్రాణములను ఎట్లు ధరించునో! 106

మూ. కిం ను వక్ష్యామి ధర్మజ్ఞం రాజానం సత్యవాదినమ్, 107
జనకం పృష్టసీతం తం కుశలం జనసంసది.

ప్ర. అ. జనసంసది=జనుల సమూహమునందు, పృష్టసీతమ్=అడగబడిన సీత గల , ధర్మజ్ఞమ్=ధర్మవేత్తయైన, సత్యవాదినమ్=సత్యమునే పలుకు,

రాజానమ్=రాజైన, జనకమ్=జనకుని గూర్చి, కిం ను= ఏమి, కుశలమ్=కుశలమును, వక్ష్యామి=చెప్పగలను?

తా. ధర్మవేత్త, సత్యమునే పలుకువాడు అయిన జనకమహారాజు జనుల సమక్షమునందు సీతను గూర్చి ప్రశ్నించగా ఆతనికి కుశలవార్తను ఏమని చెప్పగలను? 107

మూ. యా మామనుగతా మన్దం పిత్రా ప్రస్థాపితం వనమ్, 108
సీతా ధర్మం సమాస్థాయ క్వ ను సా వర్తతే ప్రియా.

ప్ర. అ. పిత్రా=తండ్రిచేత, వనమ్=వనమును గూర్చి, ప్రస్థాపితమ్=పంపబడిన, మన్దమ్=భాగ్యహీనుడనైన, మామ్=నన్ను, యా= ఎవతె, ధర్మమ్=ధర్మమును, ఆస్థాయ=అవలంబించి, అనుగతా= అనుసరించి వచ్చినదో, సా=అట్టి, ప్రియా=ప్రియురాలైన, సీతా=సీత, క్వ=ఎక్కడ, వర్తతే ను=ఉన్నదో.

తా. తండ్రిచే వనమునకు పంపివేయబడిన భాగ్యవిహీనుడనైన నన్ను, ప్రియురాలైన ఏ సీత, ధర్మమును పాటించుచు అనుసరించి వచ్చినదో అట్టి సీత ఎక్కడ ఉన్నదో! 108

మూ. తయా విహీనః కృపణః కథం లక్ష్మణ ధారయే, 109
యా మా మనుగతా రాజ్యాద్భ్రష్టం విహతచేతసమ్.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! రాజ్యాత్=రాజ్యమునుండి, భ్రష్టమ్=భ్రష్టుడను, విహతచేతసమ్=కొట్టబడిన మనస్సు కలవాడను అయిన, మామ్=నన్ను, యా=ఎవతె, అనుగతా=అనుసరించి వచ్చినదో, తయా=అట్టి సీతతో, విహీనః=హీనుడనై, కృపణః=దీనుడనై, కథమ్=ఎట్లు, ధారయే=జీవింతును?

తా. లక్ష్మణా! రాజ్యభ్రష్టుడనై, బుద్ధివిహీనుడనైన నన్ను అనుసరించి అరణ్యమునకు వచ్చిన సీత లేకుండా దీనుడనైన నేను ఎట్లు జీవించగలను?

మూ. తచ్చార్వఞ్చితపద్మాక్షం సుగన్ధి శుభమవ్రణమ్, 110
అపశ్యతో ముఖం తస్యాః సీదతీవ మతిర్మమ.

ప్ర. అ. తస్యాః=ఆమెయొక్క, చారు=సుందరము, అఞ్చితపద్మాక్షమ్=సుందరమైన పద్మముల వంటి నేత్రములు గలది, సుగన్ధి=మంచి సువాసన గలది, శుభమ్=మంగళప్రదము, అవ్రణమ్=గాయములు లేనిది అయిన, తత్=ఆ, ముఖమ్=ముఖమును, అపశ్యతః=చూడని, మమ=నాయొక్క, మతిః=బుద్ధి, సీదతీవ=క్రుంగి పోవుచున్నట్లున్నది.

తా. ఆమె ముఖము చాల సుందరమైనది. అందమైన పద్మముల వంటి నేత్రములు గలది. మంచి సువాసన గలది. మంగళప్రదమైనది. స్నిగ్ధమైనది.

అట్టి ముఖమును చూడజాలని నా మనస్సు క్రుంగిపోవుచున్నది. 110

మూ. స్మితహాస్యాన్తరయుతం గుణవన్మధురం హితమ్, 111
వైదేహ్యా వాక్యమతులం కదా శ్రోష్యామి లక్ష్మణ.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! సీతాయాః=సీతయొక్క, స్మితహాస్యాన్తరయుతమ్=చిరునవ్వుతోను, పరిహాసముతోను మధ్యయందు కూడినది, గుణవత్=గుణములు గలది, మధురమ్=మధురము, హితమ్=హితము, అతులమ్=సాటి లేనిది అయిన, వాక్యమ్= వాక్యమును, కదా=ఎప్పుడు, శ్రోష్యామి=వినగలనో!

తా. లక్ష్మణా! సీత చిరునవ్వు నవ్వుచు, మధ్య మధ్య వినోదము కొరకై పరిహాసము చేయుచు మంచి గుణములు గల హితమైన సాటి లేని మాటలు మధురముగా మాటలాడుచుండెడిది. అట్టి ఆ మాటలు ఎప్పుడు విందునో కదా! 111

మూ. ప్రాప్య దుఃఖం వనే శ్యామా మాం మన్మథవికర్శితమ్, 112
నష్టదుఃఖేవ హృష్టేవ సాధ్వీ సాధ్వభ్యభాషత.

ప్ర. అ. శ్యామా=యౌవనమధ్యస్థురాలైన, సాధ్వీ= ఉత్తమగుణసంపన్నురాలైన ఆ సీత, వనే=వనమునందు, దుఃఖమ్= దుఃఖమును, ప్రాప్య=పొంది, నష్టదుఃఖేవ=పోయిన దుఃఖము కలది వలె, హృష్టేవ=ఆనందించినది వలె, మన్మథవికర్శితమ్= మన్మథునిచేత పీడింపబడిన, మామ్=నన్ను గూర్చి, సాధు=బాగుగా, అభాషత=పలికెడిది.

తా. యౌవనమధ్యస్థురాలైన ఆ సాధ్వి అడవిలో కష్టము లనుభవించుచున్నా ఏ కష్టములూ లేనిది వలె, ఆనందించుచున్నది వలె ప్రవర్తించుచు, మన్మథపీడితుడనైన నాతో మంచి మాటలు మాటలాడుచుండెడిది. 112

మూ. కిం ను వక్ష్యామ్యయోధ్యాయాం కౌసల్యాం వా నృపాత్మజ, 113
క్వ సా స్నుషేతి పృచ్ఛన్తీం కథం చాపి మనస్వినీమ్.

ప్ర. అ. నృపాత్మజ=రాజకుమారా! అయోధ్యాయామ్=అయోధ్యలో, సా=ఆ, స్నుషా=కోడలు, క్వ=ఎక్కడ? కథమ్= ఎట్లున్నది? ఇతి=అని, పృచ్ఛన్తీమ్=అడుగుచున్న, మనస్వినీమ్=ఉత్తమమైన మనస్సు గల, కౌసల్యామ్=కౌసల్యను గూర్చి, కిం ను=ఏమి, వక్ష్యామి=చెప్పెదను?

తా. లక్ష్మణా! నేను అయోధ్యకు వెళ్లిన పిమ్మట "నా కోడలు ఎక్కడ? ఎట్లు ఉన్నది?" అని నా తల్లి యైన ఉత్తమమనస్సు గల కౌసల్య ప్రశ్నించగా ఏమని చెప్పుదును? 113

మూ. గచ్ఛ లక్ష్మణ పశ్య త్వం భరతం భ్రాతృవత్సలమ్, 114
న హ్యాహం జీవితు శక్త స్త్వామృతే జనకాత్మజామ్.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! త్వమ్=నీవు, గచ్ఛ=వెళ్లుము. భ్రాతృవత్సలమ్=సోదరులపై ప్రేమ గల, భరతమ్=భరతుని, పశ్య=చూడుము. అహమ్=నేను, తాం జనకాత్మజామ్ ఋతే= ఆ సీత లేకుండా, జీవితుమ్=జీవించుటకు, న శక్తః హి=సమర్థుడను కాను కదా.

తా. లక్ష్మణా! నీవు సోదరులపై ప్రేమ గల ఆ భరతుని వద్దకు వెళ్లుము. ఆ సీత లేకుండా నేను జీవించజాలను. 114

మూ. ఇతి రామం మహాత్మానం విలపన్త మనాథవత్, 115
ఉవాచ లక్ష్మణో భ్రాతా వచనం యుక్తమవ్యయమ్.

ప్ర. అ. ఇతి=ఇట్లు, అనాథవత్=అనాథుడు వలె, విలపన్తమ్= విలపించుచున్న, మహాత్మానమ్=మహాత్ముడైన, రామమ్=రాముణ్ణి గూర్చి, భ్రాతా=సోదరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, యుక్తమ్= యుక్తము, అవ్యయమ్=వికారములు లేనిది అయిన, వచనమ్= వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ముడైన రాముడు ఈ విధముగ రక్షకు లెవ్వరూ లేనివాడు వలె విలపించుచుండగా, సోదరుడైన లక్ష్మణుడు, యుక్తము, దోషరహితము అయిన వాక్యము పలికెను. 115

మూ. సంస్తమ్భ రామ భద్రం తే మా శుచః పురుషోత్తమ, 116
నేదృశానాం మతిర్మన్దా భవత్యకలుషాత్మనామ్.

ప్ర. అ. పురుషోత్తమ=పురుషులలో శ్రేష్ఠుడవైన, రామ=రామా! సంస్తమ్భ=నిలద్రొక్కుకొనుము, తే=నీకు, భద్రమ్=క్షేమ మగు గాక. మా శుచః=దుఃఖించకుము. ఈదృశానామ్=ఇట్టి, అకలుషాత్మనామ్=కలుషము కాని హృదయము కలవారికి, మన్దా= మందమైన, మతిః=బుద్ధి, న భవతి=కాదు.

తా. పురుషులలో ఉత్తముడ వైన రామా! ధైర్యము తెచ్చికొనుము. నీకు మంగళ మగు గాక. నీవంటి నిర్మలమైన బుద్ధి కలవారి బుద్ధి మందము కాకూడదు. 116

మూ. స్మృత్వా వియోగజం దుఃఖం త్యజ స్నేహం ప్రియే జనే, 117
అతిస్నేహపరిష్వఙ్గాద్వర్తిరార్ద్రాఽపి దహ్యతే.

ప్ర. అ. వియోగజమ్=వియోగమువలన కలిగిన, దుఃఖమ్=దుఃఖమును, స్మృత్వా=స్మరించి, ప్రియే=ప్రియమైన, జనే= జనుని విషయమునందు, స్నేహమ్=స్నేహమును, త్యజ= విడిచిపెట్టుము. అతిస్నేహపరిష్వఙ్గాత్=మిక్కిలి

స్నేహముతో (తైలముతో) సంబంధమువలన, ఆర్ద్రా=నీటికి తడిసిన, వర్తిరపి=వత్తి కూడ, దహ్యతే= కాల్చివేయబడును.

తా. ప్రియులైన వ్యక్తుల వియోగమువలన దుఃఖము కలుగు నను విషయమును గుర్తు ఉంచుకొని, ప్రియజనమునం దున్న గాఢస్నేహమును విడిచి పెట్టుము. ఎక్కువ తైలముతో సంబంధము కలిగినచో నీటికి తడిసిన వత్తి కూడ మండిపోవును. 117

మూ. యది గచ్ఛతి పాతాలం తతోఽభ్యధికమేవ వా, 118
సర్వథా రావణస్తావన్న భవిష్యతి రాఘవ.

ప్ర. అ. రాఘవ=రామా! రావణః=రావణుడు, పాతాలమ్= పాతాలలోకమునుగాని, తతః=దానికంటె, అభ్యధికమేవ వా = అధికమైన లోకమును గాని, గచ్ఛతి యది=వెళ్లినను, సర్వథా= అన్నివిధములా, న భవిష్యతి తావత్=జీవించడు.

తా. రామా! రావణుడు పాతాలములో దాగినా, ఇంకా అంతకంటె లోతైన లోకములో దాగినా, జీవించుట సర్వథా అసంభవము. 118

మూ. ప్రవృత్తిర్లభ్యతాం తావత్తస్య పాపస్య రక్షసః, 119
తతో హాస్యతి వా సీతాం నిధనం వా గమిష్యతి.

ప్ర. అ. పాపస్య=పాపాత్ముడైన, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, ప్రవృత్తిః=వార్త, లభ్యతాం తావత్=పొందబడుగాక. తతః=అటు పిమ్మట, సీతాం వా =సీతనైనా, హాస్యతి=విడువగలడు, నిధనం వా=మరణమునైనా, గమిష్యతి=పొందగలడు.

తా. ముందుగా ఆ పాపాత్ముడైన రాక్షసుని జాడ తెలుసుకొందాము. పిమ్మట ఆతడు సీతనైనా విడువ వలె, లేదా మరణమునైనా పొందవలె. 119

మూ. యది యాతి దితేర్గర్భం రావణః సహ సీతయా, 120
తత్రాప్యేవం హనిష్యామి న చేద్దాస్యతి మైథిలీమ్.

ప్ర. అ. రావణః=రావణుడు, సీతయా సహ=సీతతో కూడ, దితేః= దితియొక్క, గర్భమ్=గర్భమును, యాతి యది=పొందినను, మైథిలీమ్=సీతను, న దాస్యతి చేత్=ఇవ్వకపోయినచో, తత్రాపి= అక్కడ కూడ, ఏనమ్=వీనిని, హనిష్యామి=చంపెదను.

తా. రావణుడు సీతతో కలిసి దితిగర్భములో ప్రవేశించి దాగినా కూడ, ఆతడు సీతను ఇవ్వకపోయినచో, అక్కడ కూడ ఆతనిని చంపెదను. 120

మూ. స్వాస్థ్యం భద్రం భజస్వార్య త్యజ్యతాం కృపణా మతిః, 121
అర్థో హి నష్టకార్యార్థైరయత్నేనాధిగమ్యతే.

ప్ర. అ. ఆర్య=పూజ్యుడా! భద్రమ్=క్షేమకరమైన, స్వాస్థ్యమ్= స్వస్థతను, భజస్వ=పొందుము. కృపణా=దీనమైన, మతిః= బుద్ధి, త్యజ్యతామ్=విడవబడుగాక. నష్టకార్యార్థైః=నష్టమైన కార్యప్రయోజనము గలవారిచేత, అర్థః=ఆ విషయము, అయత్నేన= ప్రయత్నము లేకుండగా, నాధిగమ్యతే హి=పొందబడదు కదా.

తా. పూజ్యుడా! క్షేమకరమైన మనఃస్వాస్థ్యమును (ధైర్యమును) అవలంబించుము. దీనమైన బుద్ధిని విడిచిపెట్టుము. కార్యరూపమైన ప్రయోజనమును పోగొట్టుకొన్నవారు ప్రయత్నము చేయకుండా మరల దానిని పొంద జాలరు గదా. 121

మూ. ఉత్సాహో బలవా నార్య నాస్త్యుత్సాహాత్పరం బలమ్, 122
సోత్సాహస్య హి లోకేషు న కించిదపి దుర్లభమ్.

ప్ర. అ. ఆర్య=పూజ్యుడా! ఉత్సాహః=ఉత్సాహము, బలవాన్= బలము గలది. ఉత్సాహాత్=ఉత్సాహముకంటె, పరమ్=శ్రేష్ఠమైన, బలమ్=బలము, నాస్తి=లేదు. సోత్సాహస్య=ఉత్సాహముతో కూడినవానికి, లోకేషు=లోకములలో, కించిదపి=ఏదీ, దుర్లభమ్= దుర్లభమైనది, నాస్తి=లేదు.

తా. పూజ్యుడా! ఉత్సాహము చాల బలము గలది. ఉత్సాహమును మించిన బలము వేరొకటి లేదు. ఉత్సాహవంతునకు ఈ లోకములలో లభించనిది ఏదీ లేదు. 122

మూ. ఉత్సాహవన్తః పురుషా నావసీదన్తి కర్మసు, 123
ఉత్సాహమాత్రమాశ్రిత్య ప్రతిలప్స్యామ జానకీమ్.

ప్ర. అ. ఉత్సాహవన్తః=ఉత్సాహము గల, పురుషాః=పురుషులు, కర్మసు=పనులయందు, నావసీదన్తి=క్షీణించరు. ఉత్సాహమాత్రమ్=ఉత్సాహమునే, ఆశ్రిత్య=ఆశ్రయించి, జానకీమ్=సీతను, ప్రతిలప్స్యామ=పొందెదము.

తా. ఉత్సాహవంతులకు ఏ పనులలోను ఓటమి ఉండదు. అందుచేత ఉత్సాహమును పెంచుకొని సీతను మరల పొందుటకు ప్రయత్నించెదము.123

మూ. త్యజ్యతాం కామవృత్తత్వం శోకం సంన్యస్య పృష్ఠతః, 124
మహాత్మానం కృతాత్మానమాత్మానం నావబుధ్యసే.

ప్ర. అ. శోకమ్=దుఃఖమును, పృష్ఠతః సంన్యస్య=వెనుకకు ఉంచి, కామవృత్తత్వమ్=కామపరాధీనత్వము, త్యజ్యతామ్= విడువబడుగాక. మహాత్మానమ్=మహాత్ముడవు, కృతాత్మానమ్= నిగ్రహించుకొనబడిన మనస్సు కలవాడవు

అయిన, ఆత్మానమ్=నిన్ను గూర్చి, నావబుధ్యసే=తెలుసుకొనకున్నావు.

తా. శోకమును వెనుకకు నెట్టివేయుము. కామపరాధీనత్వమును విడిచి పెట్టుము. మనోనిగ్రహవంతుడ వైన నీవు ఎంతటి మహాత్ముడవో గుర్తింప జాలకున్నావు. 124

మూ. ఏవం సంబోధితస్తేన శోకోపహతచేతనః, 125
త్యజ్య శోకం చ మోహం చ రామో ధైర్యముపాగమత్.

ప్ర. అ. శోకోపహతచేతనః=శోకముచేత పీడించబడిన బుద్ధి గల, రామః= రాముడు, తేన=ఆతనిచేత, ఏవమ్=ఇట్లు, సంబోధితః= బోధింపబడినవాడై, శోకం చ =శోకమును, మోహం చ=మోహమును, త్యజ్య=విడచి, ధైర్యమ్=ధైర్యమును, ఉపాగమత్=పొందెను.

తా. శోకముచేత బుద్ధివ్యాకులత చెందిన రాముడు లక్ష్మణుని బోధను విని, శోకమును, మోహమును విడచి, ధైర్యమును పొందెను. 125

మూ. సోఽభ్యతిక్రామదవ్యగ్ర స్తామచిన్త్యపరాక్రమః, 126
రామః పమ్పాం సురుచిరాం రమ్యాం పారిప్లవద్రుమామ్.

ప్ర. అ. అచిన్త్యపరాక్రమః=ఊహింప శక్యము కాని పరాక్రమము గల, సః రామః=ఆ రాముడు, అవ్యగ్రః=దిగులు లేనివాడై, సురుచిరామ్= చాల అందమైనది, రమ్యామ్=చిత్తమునకు ఆహ్లాదము కలిగించునది, పారిప్లవద్రుమామ్=గాలికి కదలుచున్న వృక్షములు కలది అయిన, పమ్పామ్=పంపాసరస్సును, అభ్యతిక్రామత్=అతిక్రమించెను.

తా. ఊహింప శక్యము కాని పరాక్రమము గల రాముడు దిగులు విడచి, సుందరము, ఆనందజనకము, చుట్టూ కదలుచున్న వృక్షములు కలది అయిన ఆ పంపను దాటి వెళ్లెను. 126

మూ. నిరీక్షమాణః సహసా మహాత్మా
సర్వం వనం నిర్ఝరకన్దరం చ,
ఉద్విగ్నచేతాః సహ లక్ష్మణేన
విచార్య దుఃఖోపహతః ప్రతస్థే. 127

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన రాముడు, సర్వమ్=సమస్తమైన, వనమ్=వనమును, నిర్ఝరకన్దరం చ=సెలయేళ్లను గుహలను, నిరీక్షమాణః=చూచుచు, ఉద్విగ్నచేతాః=దిగులు చెందిన మనస్సు కలవాడై, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, విచార్య=ఆలోచించి, దుఃఖోపహతః=దుఖముచేత కొట్టబడినవాడై, సహసా=వెంటనే, ప్రతస్థే=ప్రయాణమాయెను.

తా. మహాత్ముడైన రాముడు ఆ వనము నంతను, సెలయేళ్లను, పర్వతగుహలను చూచుచు (వెదకుచు), మనస్సు దిగులు చెందగా లక్ష్మణునితో ఆలోచించి, దుఃఖపీడితుడై శీఘ్రముగా బయలుదేరెను. 127

మూ. తం మత్తమాతఙ్గవిలాసగామీ
గచ్ఛన్తమవ్యగ్రమనా మహాత్మా,
స లక్ష్మణో రాఘవమిష్టచేష్టో
రరక్ష ధర్మేణ బలేన చైవ. 128

ప్ర. అ. మత్తమాతఙ్గవిలాసగామీ=మదించిన ఏనుగువలె విలాసగా నడచు వాడు, మహాత్మా=మహాత్ముడు, ఇష్టచేష్టః=ఇష్టమైన చేష్టలు కలవాడు అయిన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, గచ్ఛన్తమ్=వెళ్లుచున్న, తం రాఘవమ్= ఆ రాముణ్ణి, అవ్యగ్రమనాః=ఏమరిపాటు లేని మనస్సు కలవాడై, ధర్మేణ=ధర్మముచేతా, బలేన చైవ=బలముచేతా, రరక్ష= రక్షించెను.

తా. మదించిన ఏనుగ నడక వంటి అందమైన నడక గలవాడు, మహాత్ముడు, ఇష్టముగా ప్రవర్తించువాడు అయిన ఆ లక్ష్మణుడు వెళ్లుచున్న ఆ రాముణ్ణి, ధర్మముచేతా, బలముచేతా కూడ ఏమరిపాటు లేనివాడై రక్షించెను.

మూ. తావృష్యమూకస్య సమీపచారీ
చరన్దదర్శాద్భుతదర్శనీయౌ,
శాఖామృగాణామధిపస్తరస్వీ
వితత్రసే నైవ చిచేష్ట కించిత్. 129

ప్ర. అ. ఋష్యమూకస్య=ఋష్యమూకపర్వతముయొక్క, సమీప చారీ= సమీపమునందు సంచరించు, తరస్వీ=బలవంతుడైన, శాఖామృగాణామ్ అధిపః=వానరప్రభువైన సుగ్రీవుడు, చరన్=అక్కడ సంచరించుచు, అద్భుత దర్శనీయౌ=ఆశ్చర్యపూర్వకముగా చూడదగిన, తౌ=ఆ రామలక్ష్మణులను, దదర్శ=చూచెను. వితత్రసే=భయపడెను. కించిత్=కొంచెము కూడ, నైవ చిచేష్ట=చేష్ట చేయలేదు.

తా. ఋష్యమూకపర్వతసమీపమునందు సంచరించే బలశాలియైన ఆ వానరరాజు (సుగ్రీవుడు), చూచువారికి ఆశ్చర్యము కలిగించు ఆ రామలక్ష్మణులను చూచి, వాలి పంపగా వచ్చుచున్నా రనే భ్రాంతిచే భయపడి, నిశ్చేష్టుడయ్యెను.

మూ. స తౌ మహాత్మా గజమన్దగామీ
శాఖామృగస్తత్ర చరంశ్చరన్తౌ,
దృష్ట్వా విషాదం పరమం జగామ
చిన్తాపరీతో భయభారభగ్నః. 130

ప్ర. అ. తత్ర=అక్కడ, చరన్=సంచరించుచున్న, గజమన్దగామీ= గజము వలె మందముగా నడచుచున్న, మహాత్మా=మహాత్ముడైన, సః= ఆ, శాఖామృగః=వానరుడు, చరన్తౌ=సంచరించుచున్న, తౌ=ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, చిన్తాపరీతః=చింతతో కూడినవాడై, భయభారభగ్నః=భయము యొక్క భారముచేత క్రుంగిపోయినవాడై, పరమమ్=గొప్ప, విషాదమ్=దుఃఖమును, జగామ=పొందెను.

తా. గజమువలె మందముగా నడచు మహాత్ముడైన ఆ సుగ్రీవుడు ఆ ప్రాంతమునందు సంచరించుచు, అక్కడికే వచ్చుచున్న ఆ రామలక్ష్మణులను చూచి, ఏవేవో ఆలోచనలు చేయుచు భయభారముచేత క్రుంగిపోవుచు చాల దుఃఖించెను. 130

మూ. తమాశ్రమం పుణ్యసుఖం శరణ్యం
సదైవ శాఖామృగసేవితాన్తమ్,
త్రస్తాశ్చ దృష్ట్వా హరయో విజగ్ము
ర్మహౌజసౌ రాఘవలక్ష్మణౌ తౌ. 131

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కింధాకాండే
ప్రథమః సర్గః.

ప్ర. అ. మహౌజసౌ=గొప్ప తేజస్సు గల, తౌ=ఆ, రాఘవలక్ష్మణౌ= రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, త్రస్తాః=భయపడినవారై, హరయః=వానరులు, పుణ్యసుఖమ్=పవిత్రము, సుఖకరము, శరణ్యమ్=రక్షకము, సదైవ=ఎల్లప్పుడు, శాఖామృగసేవితాన్తమ్=వానరులచేత సేవింపబడిన మధ్యప్రదేశము కలది అయిన, తమ్=ఆ, ఆశ్రమమ్=ఆశ్రమమును గూర్చి, విజగ్ముః= వెళ్ళిరి.

తా. గొప్ప తేజస్సు గల ఆ రామలక్ష్మణులను చూడగానే ఆ వానరులు భయపడి, పవిత్రము, సుఖకరము, రక్షణము ఇచ్చేది, వానరులతో నిండిన మధ్యభాగము గలది అయిన ఆ అరణ్యములోనికి వెళ్లిపోయిరి.

అరణ్యకాండ చివరిసర్గలో ఉన్న ఇరవై శ్లోకాలు, ఈ సర్గలోని 130 శ్లోకాలు, మొత్తం 150 శ్లోకాలలో పంపాసరోవర్ణనము, రాముని సీతావిరహార్తిప్రదర్శనము, లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చడము మొదలైనవి ఉన్నాయి. కాని ప్రాచ్యప్రతిలో పంపాసరోవర్ణనము అరణ్యకాండలోని చివరి రెండు సర్గలలోనే మొత్తం 61 శ్లోకాలలో చేయబడినది. ఇంత సుదీర్ఘంగా లేదు. లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చినట్లు చెప్పే పదిశ్లోకాలు (ఈ సర్గలోని 114-123శ్లోకాలు) ఆ ప్రతిలో లేవు. 116వ శ్లోకంలో స్నేహశబ్దాని కున్న అర్థద్వయాన్ని దృష్టిలో ఉంచుకొని "ప్రియులైన వ్యక్తుల విషయంలో స్నేహం వదలివెయ్యాలి" అని రామునికి లక్ష్మణుడు చేసిన ఉపదేశం అంతగా బాగా లేదు. ఆ మాటలన్నీ అవాల్మీకీయాలుగానే

కనబడతాయి. ప్రాచ్యప్రతిలో కూడ రాముడు తన విరహార్తిని లక్ష్మణునితో చెప్పుకున్నట్లు ఐదారు శ్లోకాలు ఉన్నాయి కాని దాక్షిణాత్యపాఠంలో ఉన్నంతగా లేవు. 131

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ప్రథమసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

*[రామలక్ష్మణులను చూచి సుగ్రీవాదులు శంకించుట. హనుమంతుడు వాళ్ల శంకను తొలగించుట. రామలక్ష్మణులను గూర్చి తెలుసుకొనుటకొరకై సుగ్రీవుడు హనుమంతుని పంపుట]*

మూ. తౌ తు దృష్ట్వా మహాత్మానౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
వరాయుధధరౌ వీరౌ సుగ్రీవః శఙ్కితోఽభవత్. 1

ప్ర.అ. వరాయుధధరౌ=శ్రేష్ఠములైన ఆయుధములను ధరించిన, వీరౌ=వీరులైన, మహాత్మానౌ=మహాత్ములైన, భ్రాతరౌ=సోదరులైన, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, సుగ్రీవః= సుగ్రీవుడు, శఙ్కితః=భయపడినవాడు, అభూత్=ఆయెను.

తా. శ్రేష్ఠములైన ఆయుధములు ధరించిన వీరులు, మహాత్ములూ అయిన సోదరులైన ఆ రామలక్ష్మణులను చూచి సుగ్రీవుడు భయపడెను. 1

మూ. ఉద్విగ్నహృదయః సర్వా దిశః సమవలోకయన్,
న వ్యతిష్ఠత కస్మింశ్చిద్దేశే వానరపుఙ్గవః. 2

ప్ర.అ. వానరపుఙ్గవః=ఆ వానరశ్రేష్ఠుడు, ఉద్విగ్నహృదయః=దిగులు చెందిన హృదయము కలవాడై, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను, సమవలోకయన్=చూచుచు, కస్మింశ్చిత్ దేశే=ఏ ప్రదేశమునందూ కూడ, న వ్యతిష్ఠత=నిలవలేదు.

తా. ఆ సుగ్రీవుడు దిగులు చెందిన మనస్సుతో అన్ని దిక్కుల వైపు చూచుచు ఒక చోట నిలచి ఉండజాలక పోయెను. 2

మూ. నైవ చక్రే మనః స్థాతుం వీక్షమాణో మహాబలౌ,
కపేః పరమభీతస్య చిత్తం వ్యవససాద హ. 3

ప్ర.అ. మహాబలౌ=గొప్ప బలము గల ఆ రామలక్ష్మణులను, వీక్షమాణః=చూచుచున్నవాడై, స్థాతుమ్=నిలచుటకు, మనః=మనస్సును, నైవ చక్రే=చేయలేదు. పరమభీతస్య=మిక్కిలి భయపడిన, కపేః= సుగ్రీవునియొక్క, చిత్తమ్=మనస్సు, వ్యవససాద హ=దుర్బల మయ్యెను.

తా. అతడు మహాబలశాలులైన ఆ రామలక్ష్మణులను చూచిన పిమ్మట ఒక చోట నిలువజాలకపోయెను. మిక్కిలి భయము చెందిన ఆ సుగ్రీవుని

మనస్సు ధైర్యమును కోల్పోయెను. 3

మూ. చిన్తయిత్వా స ధర్మాత్మా విమృశ్య గురులాఘవమ్,
సుగ్రీవః పరమోద్విగ్నః సర్వైస్తైర్వానరైః సహ. 4

ప్ర.అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, చిన్త యిత్వా=ఆలోచించి, గురులాఘవమ్=తన బలముయొక్క ఆధిక్యమును అల్పత్వమును, విమృశ్య=విమర్శించి, తైః=ఆ, సర్వైః=సమస్తమైన, వానరైః సహ=వానరులతో కూడ, పరమోద్విగ్నః=మిక్కిలి భయము చెందెను.

తా. ధర్మాత్ముడైన ఆ సుగ్రీవుడు బాగుగా ఆలోచించి, తన బలము అధికమా అల్పమా అని విమర్శించుకొనుచు చాల భయపడెను. ఆ వానరు లందరూ కూడ భయపడిరి. 4

మూ. తతః స సచివేభ్యస్తు సుగ్రీవః ప్లవగాధిపః,
శశంస పరమోద్విగ్నః పశ్యంస్తౌ రామలక్ష్మణౌ. 5

ప్ర.అ. తతః=అటు పిమ్మట, ప్లవగాధిపః=వానరరాజైన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులను, పశ్యన్= చూచుచు, పరమోద్విగ్నః=చాల భయపడినవాడై, సచివేభ్యః=మంత్రులకు, శశంస=చెప్పెను.

తా. పిమ్మట వానరరాజైన ఆ సుగ్రీవుడు ఆ రామలక్ష్మణులను చూచి చాల భయపడుచు మంత్రులతో ఇట్లు చెప్పెను. 5

మూ. ఏతౌ వనమిదం దుర్గం వాలిప్రణిహితౌ ధ్రువమ్,
ఛద్మనా చీరవసనౌ ప్రచరన్తావిహాగతౌ. 6

ప్ర.అ. చీరవసనౌ=నారచీరలు ధరించినవారై, ఛద్మనా=కపటముచేత, దుర్గమ్=ప్రవేశింపశక్యముకాని, ఇదం వనమ్=ఈ వనమును, ప్రచరన్తౌ=సంచ రించుచున్న, ఏతౌ=ఈ ఇద్దరూ, వాలిప్రణిహితౌ= వాలిచేత పంపబడినవారై, ఇహ=ఇక్కడికి, ఆగతౌ=వచ్చినారు. ధ్రువమ్=నిశ్చయము.

తా. నారచీరలు ధరించి ప్రవేశింప శక్యము కాని ఈ వనములో కపటవేషముతో సంచరించుచున్న వీరిద్దరూ వాలి పంపగా ఇక్కడికి వచ్చినారు. సందేహము లేదు. 6

మూ. తతః సుగ్రీవసచివా దృష్ట్వా పరమధన్వినౌ,
జగ్ముర్గిరితటాత్తస్మాదన్యచ్ఛిఖరముత్తమమ్. 7

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సుగ్రీవసచివాః=సుగ్రీవుని మంత్రులు, పరమ ధన్వినౌ=గొప్ప ధనస్సులు ధరించిన రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, తస్మాత్=ఆ, గిరితటాత్=పర్వతము చరియనుండి, ఉత్తమమ్=ఉత్తమమైన, అన్యత్=మరియొక,

శిఖరమ్= శిఖరమును గూర్చి, జగ్ముః=వెళ్లిరి.

తా. శ్రేష్ఠములైన ధనస్సులు ధరించి ఉన్న ఆ రామలక్ష్మణులను చూచి, సుగ్రీవుని మంత్రులు ఆ పర్వతము చరియను విడచి మరొక ఉత్తమమైన శిఖరము మీదకు వెళ్లిరి. 7

మూ. తే క్షిప్రముపగమ్యాథ యూథపా యూథపర్షభమ్,
హరయో వానరశ్రేష్ఠం పరివార్యోపతస్థిరే. 8

ప్ర.అ. అథ=అటుపిమ్మట, యూథపాః=వానరుల గుంపులకు నాయకులైన, తే హరయః=ఆ వానరులు, క్షిప్రమ్=శీఘ్రముగా, అభిగమ్య= చేరి, యూథపర్షభమ్=వానరయూథనాయకులలో శ్రేష్ఠుడైన, వానరశ్రేష్ఠమ్=సుగ్రీవుని, పరివార్య=చుట్టి, ఉపతస్థిరే=కూర్చుండిరి.

తా. పిమ్మట వానరయూథనాయకులైన ఆ వానరులు, వానర యూథనాయకుల ప్రభువైన ఆ వానరోత్తముడైన సుగ్రీవుని సమీపించి, ఆతని చుట్టూ కూర్చుండిరి. 8

మూ. ఏవమేకాయనగతాః ప్లవమానా గిరేర్గిరిమ్,
ప్రకమ్పయన్తో వేగేన గిరీణాం శిఖరాణి చ. 9

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, గిరేః=పర్వతమునుండి, గిరిమ్=మరొక పర్వతమును గూర్చి, ప్లవమానాః=ఎగురుచున్నవారై, వేగేన= వేగముచేత, గిరీణామ్=పర్వతముల యొక్క, శిఖరాణి చ = శిఖరములను, ప్రకమ్పయన్తః=కదల్చుచు, ఏకాయనగతాః=ఒక మార్గమును చేరినారు.

తా. ఈ విధముగా ఒక పర్వతమునుండి మరొక పర్వతము మీదికి దుముకుచు, వేగముచేత పర్వతశిఖరములను కంపింపచేయుచు ఒకే పద్ధతిని అనుసరించిరి. 9

మూ. తతః శాఖామృగాః సర్వే ప్లవమానా మహాబలాః,
బభఞ్జశ్చ నగాంస్తత్ర పుష్పితాన్ దుర్గమాశ్రితాన్. 10

ప్ర.అ. తతః=అటుపిమ్మట, ప్లవమానాః=ఎగురుచున్న, మహాబలాః=గొప్ప బలము గల, సర్వే=సమస్తమైన, శాఖామృగాః=వానరులు, తత్ర=అక్కడ, దుర్గమ్=అరణ్యమును, ఆశ్రితాన్=ఆశ్రయించి ఉన్న, పుష్పితాన్=పుష్పించిన, నగాన్=వృక్షములను, బభఞ్జుః= విరచిరి.

తా. అక్కడ ఆ వానరులు ఇటు అటు దుముకుచు ఆ అరణ్యములో ఉన్న పుష్పించిన వృక్షములను విరచిరి. 10

మూ. ఆప్లవన్తో హరివరాః సర్వతస్తం మహాగిరిమ్,
మృగమార్జారశార్దూలాంస్త్రాసయన్తో యయుస్తదా. 11

ప్ర.అ. హరివరాః=ఆ వానరశ్రేష్ఠులు, తమ్=ఆ, మహాగిరిమ్ =మహాపర్వతమును, సర్వతః=అంతటా, ఆప్లవన్తః=దుముకుచు, తదా=అప్పుడు, మృగమార్జారశార్దూలాన్=మృగములను, పిల్లులను, పెద్దపులులను, త్రాసయన్తః=భయపెట్టుచు, యయుః =వెళ్లిరి.

తా. అప్పుడా వానరశ్రేష్ఠులు ఆ మహాపర్వతముమీద నలుమూలలా దుముకుచు, లేళ్లను, అడవిపిల్లులను, పెద్దపులులను భయపెట్టుచు వెళ్లిరి. 11

మూ. తతః సుగ్రీవసచివాః పర్వతేన్ద్రే సమాహితాః,
సంగమ్య కపిముఖ్యేన సర్వే ప్రాఞ్జలయః స్థితాః. 12

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, సుగ్రీవసచివాః =సుగ్రీవుని మంత్రులు, పర్వతేన్ద్రే=పర్వతశ్రేష్ఠమునందు, సమాహితాః =చేరినవారై, కపిముఖ్యేన=వానరశ్రేష్ఠునితో, సంగమ్య=కలిసి, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్లు కలవారై, స్థితాః=ఉండిరి.

తా. పిమ్మట సుగ్రీవుని మంత్రు లందరూ ఆ పర్వతశ్రేష్ఠమునందు గుమిగూడి, సుగ్రీవుని చేరి, అంజలులు ఘటించి నిలచిరి. 12

మూ. తతస్తు భయసంత్రస్తం వాలికిల్బిషశఙ్కితమ్,
ఉవాచ హనుమాన్ వాక్యం సుగ్రీవం వాక్యకోవిదః. 13

ప్ర.అ. తతః=అటుపిమ్మట, వాక్యకోవిదః=వాక్యములలో పండితుడైన, హనుమాన్=హనుమంతుడు, భయసంత్రస్తమ్=భయమునకు కారణభూతులైన రామలక్ష్మణులనుండి భయపడిన, వాలికిల్బిషశఙ్కితమ్ =వాలియొక్క పాపాలోచనవలన శంకించుచున్న, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట మాటలలో నేర్పరియైన హనుమంతుడు, వాలి పాపాలోచనలను గూర్చి శంకించుచు భయహేతువువలన భయపడిన ఆ సుగ్రీవునితో ఇట్లు పలికెను. 13

మూ. సంభ్రమస్త్యజ్యతామేష సర్వైర్వాలికృతో మహాన్,
మలయోఽయం గిరివరో భయం నేహాస్తి వాలినః. 14

ప్ర.అ. సర్వైః=మీ అందరిచేత, వాలికృతః=వాలివలన కలిగిన, ఏషః= ఈ, మహాన్=గొప్ప, సంభ్రమః=భయము, త్యజ్యతామ్= విడువబడుగాక. అయమ్=ఇది, గిరివరః=పర్వతములలో శ్రేష్ఠమైన, మలయః=మలయము. ఇహ=ఇక్కడ,

వాలినః=వాలినుండి, భయమ్=భయము, నాస్తి=లేదు.

తా. మీరందరూ వాలివలన ఆపద వచ్చునని భయపడకుడు. ఇది మలయపర్వతము కదా! ఇక్కడ వాలివలన భయమేమీ లేదు. 14

మూ. యస్మాదుద్విగ్నచేతాస్త్వం విద్రుతో హరిపుఙ్గవ,
తం క్రూరదర్శనం క్రూరం నేహ పశ్యామి వాలినమ్. 15

ప్ర.అ. హరిపుఙ్గవ=ఓ! వానరశ్రేష్ఠుడా! త్వమ్=నీవు, యస్మాత్= ఎవనివలన, ఉద్విగ్నచేతాః=భయపడిన మనస్సు కలవాడవై, విద్రుతః= పారిపోయినావో, తమ్=అట్టి, క్రూరదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, క్రూరమ్=క్రూరుడైన, వాలినమ్=వాలిని, ఇహ=ఇక్కడ, న పశ్యామి=చూడను.

తా. వానరశ్రేష్ఠుడవైన సుగ్రీవా! నీవు ఏ వాలికి భయపడి ఈ విధముగా పారిపోవుచున్నావో, చూచుటకు భయంకరుడుగా ఉండే క్రూరుడైన ఆ వాలి ఇక్కడ కనబడుటలేదు కదా! 15

మూ. యస్మాత్తవ భయం సౌమ్య పూర్వజాత్పాపకర్మణః,
స నేహ వాలీ దుష్టాత్మా న తే పశ్యామ్యహం భయమ్. 16

ప్ర.అ. సౌమ్య=ఓ! సౌమ్యుడా! తవ=నీకు, పాపకర్మణః=పాపమైన కర్మ గల, యస్మాత్=ఏ, పూర్వజాత్=అన్ననుండి, భయమ్= భయమో, సః=ఆ, దుష్టాత్మా=దుష్టబుద్ధి గల, వాలీ=వాలి, ఇహ=ఇక్కడ, న=లేదు. అహమ్=నేను, తే=నీకు, భయమ్=భయకారణమును, న పశ్యామి=చూడను.

తా. ఓ! సౌమ్యుడా! పాపకృత్యములు చేయు ఏ అన్నగారినుండి నీవు భయపడుచున్నావో అట్టి దుష్టబుద్ధియైన వాలి ఇక్కడ లేదు కదా. నీవు భయపడుటకు హేతు వేదీ నాకు కనబడుటలేదు. 16

మూ. అహో శాఖామృగత్వం తే వ్యక్తమేవ ప్లవఙ్గమ,
లఘుచిత్తతయాత్మానం న స్థాపయసి యో మతౌ. 17

ప్ర.అ. అహో=ఏమి ఆశ్చర్యము! ప్లవఙ్గమ=ఓ! సుగ్రీవా! యః= ఏ నీవు, లఘుచిత్తతయా=తేలికయైన (చపల)చిత్తము కలవాడ వగుటచేత, ఆత్మానమ్=తనను, మతౌ=బుద్ధియందు, న స్థాపయసి= నిలుపుట లేదో అట్టి, తే=నీయొక్క, శాఖామృగత్వమ్=వానరత్వము, వ్యక్తమేవ=స్పష్టమైనది.

తా. సుగ్రీవా! నీవు ధైర్యమును విడచుటచే నీ బుద్ధిని స్థిరముగా ఉంచుకొనజాలక నీ వానరత్వమును స్పష్టముగా చాటుకొనుచున్నావు. ఏమి ఆశ్చర్యము! 17

మూ. బుద్ధివిజ్ఞానసంపన్న ఇజ్గితైః సర్వమాచర,
న హ్యబుద్ధిం గతో రాజా సర్వభూతాని శాస్తి హి. 18

ప్ర.అ. బుద్ధివిజ్ఞానసంపన్నః=నిశ్చితబుద్ధితోను, పరుల ఆశయమును గ్రహించే విజ్ఞానముతోను కూడినవాడవై, ఇజ్గితైః=మనస్సులోని భావమును వ్యక్తముచేసే చేష్టాదులచేత, సర్వమ్=అంతను, ఆచర=ఆచరించుము. అబుద్ధిమ్=ఆలోచన లేకపోవుటను, గతః=పొందిన, రాజా =రాజు, సర్వభూతాని=సకలభూతములను, న శాస్తి హి= పాలింపజాలడు కదా!

తా. నీవు దృఢమైన నిశ్చయముతో, మనోభావమును తెలిపే చేష్టాదుల ద్వారా ఇతరుల అభిప్రాయమును గ్రహించుచు అన్ని కార్యములు చేయుము. స్థిరమైన ఆలోచన లేని రాజు ప్రజలను పాలింపజాలడు కదా? 18

మూ. సుగ్రీవస్తు శుభం వాక్యం శ్రుత్వా సర్వం హనూమతః,
తతః శుభతరం వాక్యం హనూమన్త మువాచ హ. 19

ప్ర.అ. సుగ్రీవస్తు=సుగ్రీవుడైతే, హనూమతః=హనుమంతునియొక్క, శుభమ్=మంగళకరమైన, సర్వం వాక్యమ్=వాక్యము నంతనూ, శ్రుత్వా=విని, తతః= అటుపిమ్మట, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, శుభతరమ్=మిక్కిలి శుభకరమైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. సుగ్రీవుడు క్షేమకరములైన హనుమంతుని మాట లన్నీ విని అంతకంటె అధికముగా క్షేమకరములైన మాటలు అతనితో ఇట్లు పలికెను.19

మూ. దీర్ఘబాహూ విశాలాక్షౌ శరచాపాసిధారిణౌ,
కస్య న స్యాద్భయం దృష్ట్వా హ్యేతౌ సురసుతోపమౌ. 20

ప్ర.అ. దీర్ఘబాహూ=దీర్ఘములైన బాహువులు కలవాళ్లు, విశాలాక్షౌ= విశాలములైన నేత్రములు కలవాళ్లు, శరచాపాసిధారిణౌ=బాణములను, ధనస్సులను, ఖడ్గములను ధరించినవాళ్లు, సురసుతోపమౌ= దేవతాపుత్రులతో సమానులు అయిన, ఏతౌ=వీళ్లను, దృష్ట్వా=చూచి, కస్య=ఎవనికి, భయమ్=భయము, న స్యాత్ =కలుగదు?

తా. పొడవైన బాహువులు, విశాలములైన నేత్రములు గల, దేవతాపురుషులతో సమానులైన వీరిద్దరూ ధనుర్బాణఖడ్గములు ధరించి వచ్చుచున్నారు. వీరిని చూచి ఎవరికి భయము కలుగకుండా ఉండును? 20

మూ. వాలిప్రణిహితావేవ శఙ్కేఽహం పురుషోత్తమౌ,
రాజానో బహుమిత్రాశ్చ విశ్వాసో నాత్ర హి క్షమః. 21

ప్ర.అ. పురుషోత్తమౌ=పురుషులలో ఉత్తములైన వీరిద్దరినీ, వాలిప్రణిహితౌ

ఏవ=వాలిచేత పంపబడిన వారినిగానే, అహమ్=నేను, శఙ్కే= శంకించుచున్నాను. రాజానః=రాజులు, బహుమిత్రాః=అనేకులైన మిత్రులు కలవారు. అత్ర=ఈ రాజుల విషయమున, విశ్వాసః= విశ్వాసము, న క్షమః= తగినది కాదు.

తా. పురుషులలో శ్రేష్ఠులైన వీరిద్దరినీ వాలియే పంపి ఉంటా డని నా సందేహము. ఎందుచేత ననగా రాజులకు చాలమంది మిత్రు లుందురు. అందుచేత రాజుల విషయమున విశ్వాసము పనికి రాదు. 21

మూ. అరయశ్చ మనుష్యేణ విజ్ఞేయాశ్ఛద్మచారిణః,
విశ్వస్తానామవిశ్వస్తాశ్ఛిద్రేషు ప్రహరన్త్యపి. 22

ప్ర.అ. మనుష్యేణ=మనుష్యునిచేత, ఛద్మచారిణః=కపటముగా సంచరించు, అరయః=శత్రువులు, విజ్ఞేయాః=తెలుసుకొనదగినవారు. అవిశ్వస్తాః=విశ్వాసములేని శత్రువులు, విశ్వస్తానామ్= విశ్వసించిఉన్నవారికి(ని), ఛిద్రేషు=అవకాశములందు, ప్రహరన్త్యపి= కొట్టెదరు కూడ.

తా. కపటముగా సంచరించుచుండే శత్రువులను మనుష్యుడు ఒక కంట కనిపెట్టుకొని ఉండవలెను. అట్లు కానిచో విశ్వాసము లేని ఆ శత్రువులు, మన కేమి భయ మని విశ్వాసముతో ఉన్నవారిని అవకాశము వచ్చినప్పుడు దెబ్బ తీయుదురు. 22

మూ. కృత్యేషు వాలీ మేధావీ రాజానో బహుదర్శినః,
భవన్తి పరహన్తారస్తే జ్ఞేయాః ప్రాకృతైర్నరైః. 23

ప్ర.అ. వాలీ=వాలి, కృత్యేషు=చేయదగిన పనులయందు, మేధావీ= చాల తెలివైనవాడు. బహుదర్శినః=అనేక విషయములను చూడగలిగిన, రాజానః =రాజులు, పరహన్తారః=శత్రువులను నశింపచేసేవారుగా, భవన్తి=ఉందురు. ప్రాకృతైః=సామాన్యులైన, నరైః=నరులచేత, తే=వారు, జ్ఞేయాః=తెలియదగినవారు.

తా. వాలి, ఏ పనులు ఎట్లు చేయవలెనో బాగా తెలిసిన మేధావి. అనేకవిషయములను సేకరించగలిగిన రాజులు శత్రువులను నశింపచేయగలరు. సామాన్యజనులు వారి విషయమున జాగరూకతతో ఉండవలెను. 23

మూ. తౌ త్వయా ప్రాకృతేనేవ గత్వా జ్ఞేయౌ ప్లవఙ్గమ,
ఇఙ్గితానాం ప్రకారైశ్చ రూపవ్యాభాషణేన చ. 24

ప్ర.అ. ప్లవఙ్గమ=ఓ! వానరా! త్వయా=నీచేత, ప్రాకృతేనేవ= సామాన్యమానవుడు వలె, గత్వా=వెళ్లి, తౌ=వారిద్దరూ, ఇఙ్గితానామ్ =ముఖవర్ణచేష్టాదులయొక్క, ప్రకారైశ్చ=పద్ధతులచేతను, రూపవ్యాభాషణేన=రూపముచేతను, మాటలచేతను, జ్ఞేయౌ= తెలియదగినవారు.

తా. హనుమంతుడా! నీవు సామాన్యమానవుడు వలె వెళ్లి, వారి ముఖవర్ణము, చేష్టలు మొదలైనవాటి పద్ధతులను పట్టి, రూపమును పట్టి, మాటలను పట్టి, వారెవరో తెలుసుకొనుము. 24

మూ. లక్షయస్వ తయోర్భావం ప్రహృష్టమనసౌ యది,
విశ్వాసయన్ ప్రశంసాభిరిఙ్గితైశ్చ పునః పునః. 25
మమైవాభిముఖం స్థిత్వా పృచ్ఛ త్వం హరిపుఙ్గవ,
ప్రయోజనం ప్రవేశస్య వనస్యాస్య ధనుర్ధరౌ. 26

ప్ర.అ. హరిపుఙ్గవ=ఓ! వానరశ్రేష్ఠుడా! తయోః=వారియొక్క, భావమ్=భావమును, లక్షయస్వ=గుర్తించుము. ప్రహృష్టమనసౌ యది =సంతోషించిన మనస్సు కలవారైనచో, ప్రశంసాభిః=పొగడ్తలచేతను, ఇఙ్గితైశ్చ=చేష్టాదులచేతను, పునః పునః=మాటి మాటికి, విశ్వాసయన్=విశ్వసింపచేయుచు, మమ=నాకు, అభిముఖమేవ= అభిముఖముగానే, స్థిత్వా=ఉండి, ధనుర్ధరౌ=ధనుర్ధరులైన వీరిని, అస్య వనస్య=ఈ వనముయొక్క, ప్రవేశస్య=ప్రవేశముయొక్క, ప్రయోజనమ్=ప్రయోజనమును, త్వమ్=నీవు, పృచ్ఛ =అడుగుము.

తా. వానరులలో శ్రేష్ఠుడవైన ఓ! హనుమంతుడా! వీరి భావము ఏమో గుర్తించుము. వీరి మనస్సులు ప్రసన్నములుగానే ఉన్నచో, పొగడ్తలచేతను, అనుకూలచేష్టలచేతను వారి మనస్సులో అధికముగా విశ్వాసము పుట్టించుము. నీవు నా వైపే తిరిగి నిలబడి, "మీరు ఈ వనములో ఎందుకు ప్రవేశించినారు?" అని ఈ ధనుర్ధరులైన వీరులను ప్రశ్నించుము. 25, 26

మూ. శుద్ధాత్మానౌ యది హ్యేతౌ జానీహి త్వం ప్లవఙ్గమ,
వ్యాభాషితైర్వా విజ్ఞేయా స్యాద్దుష్టాదుష్టతా తయోః. 27

ప్ర.అ. ప్లవఙ్గమ=వానరుడా! ఏతౌ=వీరిద్దరూ, శుద్ధాత్మానౌ యది =శుద్ధమైన మనస్సు కలవారేనా అని, త్వమ్=నీవు, జానీహి =తెలుసుకొనుము. తయోః=వారియొక్క, దుష్టాదుష్టతా= దుష్టత్వము కాని అదుష్టత్వము కాని, వ్యాభాషితైః వా=మాటలచేతనైనా, విజ్ఞేయా=తెలియదగినది.

తా. హనుమంతుడా! వీరి మనస్సు మన విషయములో పరిశుద్ధముగానే ఉన్నదా అను విషయము తెలిసికొనుము. వీళ్లు మంచివాళ్లా చెడ్డవాళ్లా అను విషయమును మాటలను పట్టికూడ తెలిసికొనుము. 27

మూ. ఇత్యేవం కపిరాజేన సందిష్టో మారుతాత్మజః,
చకార గమనే బుద్ధిం యత్ర తౌ రామలక్ష్మణౌ. 28

ప్ర.అ. కపిరాజేన=వానరరాజు చేత, ఇత్యేవమ్=ఇట్లు, సందిష్టః= ఆజ్ఞాపింపబడిన, మారుతాత్మజః=హనుమంతుడు, తౌ=ఆ, రామలక్ష్మణౌ =రామలక్ష్మణులు,

యత్ర=ఎక్కడ ఉన్నారో అక్కడికి, గమనే= వెళ్లుటయందు, బుద్ధిమ్=బుద్ధిని, చకార=చేసెను.

తా. సుగ్రీవుడు ఈ విధముగా ఆజ్ఞాపించగా, హనుమంతుడు రామలక్ష్మణు లున్న ప్రదేశమునకు వెళ్లుటకు నిశ్చయించుకొనెను. 28

మూ. తథేతి సంపూజ్య వచస్తు తస్య
కపిః సుభీతస్య దురాసదస్య,
మహానుభావో హనుమాన్యయౌ తదా
స యత్ర రామోఽతిబలీ సలక్ష్మణః. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్వితీయః సర్గః.

ప్ర.అ. మహానుభావః=గొప్ప సామర్థ్యము గల, కపిః=వానరుడైన, హనుమాన్=హనుమంతుడు, దురాసదస్య=సమీపించుటకు శక్యము కానివాడు, సుభీతస్య= చాల భయపడినవాడు అయిన, తస్య=ఆ సుగ్రీవుని యొక్క, వచః=వచనమును, తథేతి=అట్లే చేసెదను అని, సంపూజ్య= మన్నించి, అతిబలీ=గొప్ప బలము గలవాడు, సలక్ష్మణః=లక్ష్మణసమేతుడూ అయిన, సః రామః=ఆ రాముడు, యత్ర=ఎక్కడ ఉండెనో అక్కడికి, తదా=అప్పుడు, యయౌ=వెళ్లెను.

తా. గొప్పసామర్థ్యము గల హనుమంతుడు, సమీపించుటకు శక్యము కానివాడు, చాల భయపడివాడు అయిన ఆ సుగ్రీవుని మాటను మన్నించి, అట్లే చేసెదను అని పలికి, మహాబలశాలియైన రాముడు, లక్ష్మణుడు ఉన్న ప్రదేశమునకు వెళ్లెను. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ద్వితీయసర్గ సమాప్తము.

# అథ తృతీయః సర్గః

["మీరు ఈ అరణ్యమునకు ఎందుకు వచ్చినారు?" అని హనుమంతుడు రామలక్ష్మణులను ప్రశ్నించుట. తనను గూర్చి, సుగ్రీవుని గూర్చి వారికి చెప్పుట. లక్ష్మణుడు రాముని పక్షాన బదులు చెప్పుట. హనుమంతుడు సంతోషించుట.]

మూ. వచో విజ్ఞాయ హనుమాన్ సుగ్రీవస్య మహాత్మనః,
పర్వతాదృష్యమూకాత్తు పుప్లువే యత్ర రాఘవౌ. 1

ప్ర.అ. హనుమాన్=హనుమంతుడు, మహాత్మనః=మహాత్ముడైన, సుగ్రీవస్య =సుగ్రీవునియొక్క, వచః=వచనమును, విజ్ఞాయ=తెలిసికొని, ఋష్యమూకాత్ పర్వతాత్ =ఋష్యమూకపర్వతమునుండి, రాఘవౌ= రామలక్ష్మణులు, యత్ర=ఎక్కడ ఉండిరో అక్కడికి, పుప్లువే=ఎగిరెను.

తా. హనుమంతుడు మహాత్ముడైన సుగ్రీవుని మాటలు విని, ఋష్యమూకపర్వతమునుండి రామలక్ష్మణు లున్న చోటికి ఎగిరి వెళ్లెను. 1

మూ. కపిరూపం పరిత్యజ్య హనుమాన్మారుతాత్మజః,
భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః. 2

ప్ర.అ. తతః=పిమ్మట, మారుతాత్మజః=వాయుపుత్రుడు, కపిః= వానరుడు అయిన, హనుమాన్=హనుమంతుడు, కపిరూపమ్= వానరరూపమును, పరిత్యజ్య=విడచి, శఠబుద్ధితయా=విశ్వాసము లేని బుద్ధి కలవా డగుటచేత, భిక్షురూపమ్=సంన్యాసిరూపమును, భేజే= పొందెను.

తా. అప్పుడు, వాయుకుమారుడు, వానరుడు అయిన హనుమంతుడు, క్రొత్తవారైన ఆ రామలక్ష్మణుల విషయమున పూర్తి విశ్వాసము లేకపోవుటచేత, కపటబుద్ధితో, తన వానరరూపమును విడచి, సంన్యాసిరూపమును ధరించెను.

మూ. తతశ్చ హనుమాన్వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా,
వినీతవదుపాగమ్య రాఘవౌ ప్రణిపత్య చ, 3
ఆబభాషే చ తౌ వీరౌ యథావత్ ప్రశశంస చ.

ప్ర.అ. తతః=అటుపిమ్మట, హనుమాన్= హనుమంతుడు, వినీతవత్= వినయవంతుడై, రాఘవౌ= రామలక్ష్మణులను, ఉపాగమ్య=సమీపించి, ప్రణిపత్య చ=నమస్కరించి, శ్లక్ష్ణయా=మృదువు, సుమనోజ్ఞయా=మిక్కిలి మనోహరము అయిన, వాచా=వాక్కుతో, ఆబభాషే చ =పలకరించెను. యథావత్= తగు రీతిగా,

ప్రశశంస చ=ప్రశంసించెను కూడ.

తా. పిమ్మట హనుమంతుడు సవినయముగా రామలక్ష్మణులను సమీపించి, నమస్కరించి, మృదువైన, చాల మనోహరమైన వాక్కుతో ఆ వీరులను పలకరించెను. తగు రీతిలో వారిని ప్రశంసించెను. 3

మూ. సంపూజ్య విధివద్వీరౌ హనుమాన్వానరోత్తమః, 4
ఉవాచ కామతో వాక్యం మృదు సత్యపరాక్రమౌ.

ప్ర.అ. వానరోత్తమః=వానరశ్రేష్ఠుడైన, హనుమాన్=హనుమంతుడు, సత్య పరాక్రమౌ=సత్యమైన పరాక్రమము గల, వీరౌ=ఆ వీరులను, విధివత్=యథావిధిగా, సంపూజ్య=పూజించి, కామతః= సుగ్రీవుని ఇచ్ఛ ప్రకారము, మృదు=మృదువైన, వాక్యమ్= వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు సత్యమైన పరాక్రమము గల వీరులైన ఆ రామలక్ష్మణులను యథావిధిగా పూజించి, సుగ్రీవుడు చెప్పిన విధముగ మృదువైన వాక్యమును పలికెను. 4

మూ. రాజర్షిదేవప్రతిమౌ తాపసౌ సంశితవ్రతౌ, 5
దేశం కథమిమం ప్రాప్తౌ భవన్తౌ వరవర్ణినౌ,
త్రాసయన్తౌ మృగగణానన్యాంశ్చ వనచారిణః. 6

ప్ర.అ. రాజర్షిదేవప్రతిమౌ=రాజర్షులతోను, దేవతలతోను సమానులు, సంశిత వ్రతౌ=తీవ్రమైన వ్రతము గలవారు, తాపసౌ=మునులూ, వరవర్ణినౌ=శ్రేష్ఠమైన వర్ణము కలవారు అయిన, భవన్తౌ=మీరిద్దరూ, మృగాన్=మృగములను, అన్యాన్=ఇతరము లైన, వనచారిణశ్చ= వనములో సంచరించే ప్రాణులను, త్రాసయన్తౌ=భయపెట్టుచు, ఇమం దేశమ్ =ఈ దేశమును గూర్చి, కథమ్=ఎట్లు, ప్రాప్తౌ=వచ్చినారు.

తా. మీరు రాజర్షుల వలె, దేవతల వలె ఉన్నారు. తీవ్రమైన నియమములను పాటించు మునుల వేషములో ఉన్నారు. మీ శరీరచ్ఛాయ చాల శ్రేష్ఠముగా ఉన్నది. మిమ్ములను చూచి ఈ అరణ్యములో ఉన్న మృగాలు, ఇతర ప్రాణులు భయపడుచున్నవి. మీరు ఈ ప్రదేశమునకు ఎందుకు వచ్చినారు?5,6

మూ. పమ్పాతీరరుహాన్వృక్షాన్వీక్షమాణౌ సమన్తతః,
ఇమాం నదీం శుభజలాం శోభయన్తౌ తరస్వినౌ. 7
ధైర్యవన్తౌ సువర్ణాభౌ కౌ యువాం చీరవాససౌ,
నిఃశ్వసన్తౌ వరభుజౌ పీడయన్తావిమాః ప్రజాః. 8

ప్ర.అ. పమ్పాతీరమహావృక్షాన్=పంపాతీరమునందలి మహావృక్షములను, సమ న్తతః=నలువైపులా, వీక్షమాణౌ=చూచుచున్నవారు, శుభజలామ్ =శుభమైన జలము

గల, ఇమామ్=ఈ, నదీమ్=నదివంటి పంపాసరస్సును, శోభయన్తౌ=ప్రకాశిం పచేయుచున్నవారు, తరస్వినౌ= బలవంతులు, ధైర్యవన్తౌ=ధైర్యము కలవారు, సువర్ణాభౌ=మంచి రంగు, కాంతి గలవారు, చీరవాససౌ=నారచీరలు వస్త్రములుగా కలవారు, నిఃశ్వసన్తౌ =నిట్టూర్చుచున్నవారు, వరభుజౌ=శ్రేష్ఠములైన భుజములు గలవారు, ఇమాః=ఈ, ప్రజాః=ప్రజలను, పీడయన్తౌ=పీడించుచున్నవారు అయిన, యువామ్=మీరిద్దరు, కౌ=ఎవరు?

తా. బలశాలులైన మీరిద్దరూ పంపాతీరమునం దున్న వృక్షములను నలువైపులా చూచుచు మీ సన్నిధిచేత ఈ మంగళప్రదమైన జలము గల పంపాసరస్సును ప్రకాశింపచేయించుచున్నారు. ధైర్యవంతులు, మంచి శరీరచ్ఛాయ, కాంతీ గలవారు, నారచీరలు ధరించి ఉన్నవారు, శ్రేష్ఠములైన భుజములు గలవారు అయిన మిమ్ములను చూచి ఇక్కడ నున్న ప్రజలందరూ భయపడుచున్నారు. మీరెవ్వరు? 7,8

మూ. సింహవిప్రేక్షితౌ వీరౌ మహాబలపరాక్రమౌ,
శక్రచాపనిభే చాపే గృహీత్వా శత్రునాశనౌ, 9
శ్రీమన్తౌ రూపసంపన్నౌ వృషభశ్రేష్ఠవిక్రమౌ,
హస్తిహస్తోపమభుజౌ ద్యుతిమన్తౌ నరర్షభౌ. 10

ప్ర.అ. సింహవిప్రేక్షితౌ=సింహము చూపుల వంటి చూపులు కలవారు, వీరౌ= వీరులు, మహాబలపరాక్రమౌ=గొప్ప బలపరాక్రమములు గలవారు, శక్ర చాపనిభే=ఇంద్రధనుస్సుతో సమానమైన, చాపే=ధనస్సులను, గృహీత్వా=గ్రహించి ఉన్నవారు, శత్రునాశనౌ=శత్రువులను నశింపచేయువారు, శ్రీమన్తౌ=శోభ గల వారు, రూపసంపన్నౌ= సౌందర్యముతో కూడినవారు, వృషభశ్రేష్ఠవిక్రమౌ=శ్రేష్ఠమైన వృషభము వంటి పరాక్రమము గలవారు, హస్తిహస్తోపమభుజౌ=ఏనుగు తొండము వంటి భుజములు గలవారు, ద్యుతిమన్తౌ=కాంతి గలవారు, నరర్షభౌ= నరశ్రేష్ఠులు అయిన మీరు ఎవరు?

తా. వీరులు, గొప్ప బలపరాక్రమములు గలవారు అయిన మీ చూపులు సింహము చూపుల వలె ఉన్నవి. మీరు ధరించిన ధనస్సులు ఇంద్రధనస్సు వలె ఉన్నవి. మీరు శత్రుసంహారము చేయగలవారు. మంచి శోభ, సౌందర్యము గలవారు. శ్రేష్ఠమైన వృషభము వంటి పరాక్రమము గలవారు. మీ బాహువులు ఏనుగు తొండము వలె ఉన్నవి. మంచి కాంతి గల మానవశ్రేష్ఠులైన మీరు ఎవరు? 9, 10

మూ. ప్రభయా పర్వతేన్ద్రోఽసౌ యువయోరవభాసితః,
రాజ్యార్హావమరప్రఖ్యౌ కథం దేశమిహాగతౌ. 11

ప్ర.అ. అసౌ=ఈ, పర్వతేన్ద్రః=పర్వతరాజు, యువయోః= మీ ఇద్దరి

యొక్క, ప్రభయా=కాంతిచేత, అవభాసితః= ప్రకాశింపచేయబడినది. రాజ్యార్హౌ= రాజ్యమునకు తగినవారు, అమరప్రఖ్యౌ= దేవతలతో సమానులు అయిన మీరు, ఇహ=ఇప్పుడు, దేశమ్= ఈ దేశమును గూర్చి, కథమ్=ఎట్లు, ఆగతౌ=వచ్చినారు?

తా. మీ ఇద్దరి కాంతిచేత ఈ పర్వతము ప్రకాశవంతమైనది. రాజ్యానికి తగిన వారు, దేవతాతుల్యులూ అయిన మీరు ఇప్పుడు ఈ ప్రదేశమునకు ఎందుకు వచ్చినారు? 11

మూ. పద్మపత్రేక్షణౌ వీరౌ జటామణ్డలధారిణౌ,
అన్యోన్యసదృశౌ వీరౌ దేవలోకాదివాగతౌ. 12
యదృచ్ఛయేవ సంప్రాప్తౌ చన్ద్రసూర్యౌ వసున్ధరామ్,
విశాలవక్షసౌ వీరౌ మానుషౌ దేవరూపిణౌ. 13
సింహస్కన్ధౌ మహోత్సాహౌ సమదావివ గోవృషౌ.

ప్ర.అ. పద్మపత్రేక్షణౌ=పద్మపత్రముల వంటి నేత్రములు కలవారు, వీరౌ= వీరులు, జటామణ్డలధారిణౌ=జటామండలమును ధరించినవారు, అన్యోన్యస దృశౌ=పరస్పరము సమానులు, దేవలోకాత్= దేవలోకమునుండి, ఆగతౌ=వచ్చిన, వీరౌ=వీరుల వలె ఉన్నవారు, యదృచ్ఛయా=దైవవశముచేత, వసుంధరామ్=భూమి నిగూర్చి, సంప్రాప్తౌ =వచ్చిన, చన్ద్రసూర్యావివ=చంద్రసూర్యుల వలె ఉన్నవారు, విశాలవక్షసౌ=విశాలమైన వక్షఃస్థలములు కలవారు, వీరౌ=వీరులు, దేవరూపిణౌ=దేవ తలవంటి రూపములు గల, మానుషౌ=మనుష్యులు, సింహస్కన్ధౌ=సింహము వంటి మూపు గలవారు, మహోత్సాహౌ= గొప్ప ఉత్సాహము గలవారు, సమదౌ=మదముతో కూడిన, గోవృషౌ ఇవ= ఆబోతుల వలె ఉన్నవారు అయిన మీరు ఎవరు?

తా. మీ నేత్రములు పద్మముల రేకుల వలె ఉన్నవి. వీరులైన మీరు జటామండలమును ధరించి యున్నారు. ఒకరిని ఒకరు పోలి ఉన్నారు. దేవలోకమునుండి వచ్చిన వీరులవలె, తలవని తలంపుగా భూలోకానికి దిగి వచ్చిన చంద్రసూర్యులవలె ఉన్నారు. విశాలమైన వక్షఃస్థలములు గల వీరులైన మీరు దేవతలరూపము వంటి రూపము గల మనుష్యులు. సింహము మూపు వంటి మూపులతో, మంచి ఉత్సాహముతో ఉన్న మీరు మదించిన ఆబోతుల వలె ఉన్నారు. 12, 13

మూ. ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, 14
సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః.

ప్ర.అ. ఆయతాశ్చ=దీర్ఘమైనవి, సువృత్తాశ్చ=బాగుగా వర్తులాకారముగా ఉన్నవి. పరిఘోపమాః=పరిఘలతో సమానములు, సర్వభూషణభూషార్హాః= అన్నినగలకు తగినవి అయిన, బాహవః =బాహువులు, కిమర్థమ్=ఎందువలన,

న విభూషితాః= అలంకరింపబడలేదు.

తా. మీ బాహువులు దీర్ఘములై, బలిసి గుండ్రముగా ఉండి పరిఘుల వలె (కోట తలుపులకు వేసే పెద్ద ఇనుప గడియల వలె) ఉన్నవి. అన్ని విధముల అలంకారములచే అలంకరింపదగిన ఈ భుజములను అలంకరించుకొనలేదేమి?

మూ. ఉభౌ యోగ్యావహం మన్యే రక్షితుం పృథివీమిమామ్, 15
ససాగరవనాం కృత్స్నాం విన్ధ్యమేరువిభూషితామ్.

ప్ర.అ. ఉభౌ=మీ ఇద్దరినీ, అహమ్=నేను, ఇమామ్=ఈ, ససాగరవనామ్=సముద్రములతోను వనములతోను కూడినది, విన్ధ్యమేరువిభూషితామ్=వింధ్యపర్వతముచేతను, మేరుపర్వతముచేతను అలంకరించబడినది అయిన, కృత్స్నామ్=సమస్తమైన, పృథివీమ్= భూమిని, రక్షితుమ్=రక్షించుటకు, యోగ్యౌ=తగినవారినిగా, మన్యే=తలచుచున్నాను.

తా. సముద్రములతోను, వనములతోను కూడిన, వింధ్యమేరుపర్వతసహితమైన ఈ భూమి నంతనూ పరిపాలించుటకు మీరు తగినవా రని నా అభిప్రాయము. 15

మూ. ఇమే చ ధనుషీ చిత్రే శ్లక్ష్ణే చిత్రానులేపనే, 16
ప్రకాశేతే యథేన్ద్రస్య వజ్రే హేమవిభూషితే.

ప్ర.అ. చిత్రే=ఆశ్చర్యకరములు, శ్లక్ష్ణే=నున్నగా నున్నవి, చిత్రానులేపనే=చిత్రమైన పూత గలవి అయిన, ఇమే ధనుషీ చ= ఈ రెండు ధనస్సులు కూడ, ఇన్ద్రస్య=ఇంద్రునియొక్క, హేమవిభూషితే=బంగారముచేత అలంకరించబడిన, వజ్రే యథా=రెండు వజ్రాయుధముల వలె, ప్రకాశేతే=ప్రకాశించుచున్నవి.

తా. విచిత్రమైన పూత పూసి నున్నగా ఆశ్చర్యకరముగా ఉన్న ఈ ధనస్సులు ఇంద్రుని బంగారముతో అలంకరించిన వజ్రాయుధముల వలె ఉన్నవి.

మూ. సంపూర్ణాశ్చ శితైర్బాణై స్తూణాశ్చ శుభదర్శనాః, 17
జీవితాన్తకరైర్ఘోరైర్జ్వలద్భిరివ పన్నగైః.

ప్ర.అ. శుభదర్శనాః=శుభకరమైన దర్శనము గల, తూణాశ్చ =అంబులపొదులు కూడ, జీవితాన్తకరైః=జీవితమునకు అంతమును చేయునవి, ఘోరైః=భయంకరములు, జ్వలద్భిః=ప్రజ్వలించుచున్నవి, పన్నగైరివ =సర్పముల వలె ఉన్నవి అయిన, బాణైః=బాణములతో, సంపూర్ణాశ్చ =నిండి ఉన్నవి.

తా. చూచుటకు అందముగా ఉన్న అంబులపొదులు కూడ ప్రాణములు తీసే భయంకరమైన బాణాలతో నిండి ఉన్నవి. ప్రజ్వలించుచున్న ఈ బాణములు సర్పముల వలె ఉన్నవి. 17

మూ. మహాప్రమాణౌ విపులౌ తప్తహాటకభూషణౌ, 18
ఖడ్గావేతౌ విరాజేతే నిర్ముక్తభుజగావివ.

ప్ర.అ. మహాప్రమాణౌ=పెద్ద ప్రమాణము గలవి, విపులౌ =లావుగా ఉన్నవి, తప్తహాటకభూషితౌ=కరిగించి శుద్ధి చేసిన బంగారముచేత అలంకరించబడినవి అయిన, ఏతౌ=ఈ, ఖడ్గౌ= ఖడ్గములు, నిర్ముక్తభుజగావివ=కూసము విడచిన పాముల వలె, విరాజేతే=ప్రకాశించుచున్నవి.

తా. శుద్ధమైన బంగారముతో అలంకరించబడినవై, చాల పెద్దవిగాను, లావు (దళసరి)గాను ఉన్న ఈ ఖడ్గములు కూసము విడచిన సర్పములవలె ఉన్నవి. 18

మూ. ఏవం మాం పరిభాషన్తం కస్మాద్వై నాభిభాషతః. 19
సుగ్రీవో నామ ధర్మాత్మా కశ్చిద్వానరపుఙ్గవః,
వీరో వినికృతో భ్రాత్రా జగద్భ్రమతి దుఃఖితః. 20

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, పరిభాషన్తమ్=మాటలాడుచున్న, మామ్= నన్ను గూర్చి, కస్మాత్=ఎందువలన, నాభిభాషతః=మాటలాడరు? సుగ్రీవో నామ=సుగ్రీవు డనే పేరు గల, వీరః=వీరుడు, ధర్మాత్మా =ధర్మాత్ముడు అయిన, కశ్చిత్=ఒకానొక, వానరపుఙ్గవః= వానరశ్రేష్ఠుడు, భ్రాత్రా=సోదరునిచేత, వినికృతః= అవమానింపబడినవాడై, దుఃఖితః=దుఃఖితుడై, జగత్=జగత్తును, భ్రమతి =తిరుగుచున్నాడు.

తా. నే నింతగా మాటలాడుచుండగా మీరు బదులు చెప్ప రేమి? ధర్మాత్ముడు, వీరుడు అయిన సుగ్రీవు డనే ఒక వానరశ్రేష్ఠు డున్నాడు. ఆతనిని అన్నగారు అవమానము చేసి వెడలగొట్టగా అతడు దేశములో తిరుగాడుచున్నాడు.

మూ. ప్రాప్తోఽహం ప్రేషితస్తేన సుగ్రీవేణ మహాత్మనా,
రాజ్ఞా వానరముఖ్యానాం హనుమాన్నామ వానరః. 21

ప్ర.అ. మహాత్మనా=గొప్ప బుద్ధిగలవాడు, వానరముఖ్యానామ్= వానరనాయకులయొక్క, రాజ్ఞా=రాజు అయిన, తేన సుగ్రీవేణ=ఆ సుగ్రీవునిచేత, ప్రేషితః=పంపబడినవాడనై, ప్రాప్తః=వచ్చిన, అహమ్=నేను, హనుమాన్నామ=హనుమంతు డనే పేరు గల, వానరః=వానరుడను.

తా. నేను వానరుడను. నా పేరు హనుమంతుడు. వానరనాయకుల రాజు, మహాత్ముడూ అయిన సుగ్రీవుడు పంపగా వచ్చినాను. 21

మూ. యువాభ్యాం స హి ధర్మాత్మా సుగ్రీవః సఖ్యమిచ్ఛతి,
తస్య మాం సచివం విత్తం వానరం పవనాత్మజమ్. 22

భిక్షురూపప్రతిచ్ఛన్నం సుగ్రీవప్రీతికారణాత్,
ఋష్యమూకాదిహ ప్రాప్తం కామగం కామరూపిణమ్. 23

ప్ర.అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, యువాభ్యామ్=మీతో, సఖ్యమ్=స్నేహమును, ఇచ్ఛతి= కోరుచున్నాడు. మామ్=నన్ను, సుగ్రీవప్రీతికారణాత్= సుగ్రీవునకు ప్రీతి కలిగించుట అనే కారణమువలన, భిక్షురూపప్రతిచ్ఛన్నమ్ =సంన్యాసిరూపముచేత కప్పబడినవాడను, తస్య=ఆతనియొక్క, సచివమ్=మంత్రినీ, ఋష్యమూకాత్=ఋష్యమూకపర్వతమునుండి, ఇహ=ఇక్కడికి, ప్రాప్తమ్=వచ్చినవాడను, కామగమ్= ఇచ్ఛానుసారము వెళ్లేవాడను, కామరూపిణమ్=ఇచ్ఛానుసారము రూపము ధరించగలవాడను అయిన, పవనాత్మజమ్=వాయుపుత్రుడైన, వానరమ్ =వానరునిగా, విత్తమ్=తెలిసికొనండి.

తా. ధర్మాత్ముడైన ఆ సుగ్రీవుడు మీతో స్నేహమును కోరుచున్నాడు. నేను ఆతని మంత్రిని. వాయుపుత్రుడను. వానరుడను. సుగ్రీవునకు ప్రీతి కలిగించుటకై సంన్యాసిరూపములో కప్పబడి ఋష్యమూకమునుండి ఇక్కడికి వచ్చినాను. ఇచ్ఛానుసారము రూపము ధరించి ఇష్టము వచ్చిన చోటకు వెళ్లుటకు సమర్థుడను. 22,23

మూ. ఏవముక్త్వా తు హనుమాంస్తౌ వీరౌ రామలక్ష్మణౌ,
వాక్యజ్ఞో వాక్యకుశలః పునర్నోవాచ కిం చన. 24

ప్ర.అ. వాక్యజ్ఞః=మాటలు తెలిసినవాడు, వాక్యకుశలః=మాటలలో నేర్పరి అయిన, హనుమాన్=హనుమంతుడు, వీరౌ=వీరులైన, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులను గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పునః=మరల, కించన=ఏమీ, నోవాచ= పలకలేదు.

తా. మాటలు తెలిసినవాడు, మాటలాడుటలో నేర్పరి అయిన ఆ హనుమంతుడు వీరులైన ఆ రామలక్ష్మణులతో ఇట్లు పలికి, ఇంక ఏమీ అనకుండగా ఉండిపోయెను. 24

మూ. ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య రామో లక్ష్మణమబ్రవీత్,
ప్రహృష్టవదనః శ్రీమాన్ భ్రాతరం పార్శ్వతః స్థితమ్. 25

ప్ర.అ. శ్రీమాన్ =శోభతో కూడిన, రామః=రాముడు, తస్య=ఆతనియొక్క, ఏతత్=ఈ, వచః=వచనమును, శ్రుత్వా=విని, ప్రహృష్టవదనః=వికసించిన ముఖముగలవాడై, పార్శ్వతః=ప్రక్కనే, స్థితమ్=ఉన్న, భ్రాతరమ్=సోదరుడైన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. శ్రీమంతుడైన రాముడు హనుమంతుని మాటలు విని, ఆనందముచే వికసించిన ముఖముతో, ప్రక్కనే ఉన్న సోదరుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను.

మూ. సచివోఽయం కపీన్ద్రస్య సుగ్రీవస్య మహాత్మనః,
తమేవ కాఙ్క్షమాణస్య మమాన్తికమిహాగతః. 26

ప్ర.అ. కపీన్ద్రస్య=వానరశ్రేష్ఠుడైన, మహాత్మనః=మహాత్ముడైన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, సచివః=మంత్రియైన, అయమ్= ఇతడు, తమేవ=ఆతనినే, కాఙ్క్షమాణస్య=కోరుచున్న, మమ= నాయొక్క, సమీపమ్=సమీపమును గూర్చి, ఇహ=ఇక్కడికి, ఆగతః=వచ్చినాడు.

తా. వానరుల ప్రభువు, మహాత్ముడు అయిన సుగ్రీవుని మంత్రియైన ఇతడు, ఆతనినే వెదకుచు వచ్చిన నా దగ్గరకే వచ్చినాడు. 26

మూ. తమభ్యభాష సౌమిత్రే సుగ్రీవసచివం కపిమ్,
వాక్యజ్ఞం మధురైర్వాక్యైః స్నేహయుక్తమరిందమమ్. 27

ప్ర.అ. సౌమిత్రే=లక్ష్మణా! వాక్యజ్ఞమ్=మాటలు ఎరిగినవాడు, స్నేహయుక్తమ్=స్నేహముతో కూడినవాడు, అరిందమమ్=శత్రువులను నశింప చేయువాడు, సుగ్రీవసచివమ్=సుగ్రీవుని మంత్రీ అయిన, తం కపిమ్ =ఆ వానరుని గూర్చి, మధురైః=మధురములైన, వాక్యైః= వాక్యములతో, అభిభాషస్వ=మాటలాడుము.

తా. లక్ష్మణా! సుగ్రీవుని మంత్రియైన ఈ వానరుడు మాటలు తెలిసినవాడు. స్నేహము కలవాడు. శత్రువులను నశింపచేయువాడు. అట్టి ఈతనితో మధురమైన మాటలతో మాటలాడుము. 27

మూ. నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః,
నాసామవేదవిదుషః శక్యమేవం విభాషితుమ్. 28

ప్ర.అ. అనృగ్వేదవిదుషః=ఋగ్వేదములో పండితుడు కానివానికి, ఏవమ్= ఇట్లు, భాషితుమ్=మాటలాడుటకు, న శక్యమ్=శక్యము కాదు. అయజుర్వేదధారిణః=యజుర్వేదమును ధరించనివానికి, న=శక్యము కాదు. అసామవేదవిదుషః=సామవేదములో పాండిత్యము లేనివానికి, న= శక్యముకాదు.

తా. ఋగ్వేదమును చదవనివాడు, యజుర్వేదమును చదవనివాడు, సామవేదమును చదవనివాడు ఈ విధముగా మాటలాడజాలడు. 28

మూ. నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్,
బహు వ్యాహరతానేన న కించిదపశబ్దితమ్. 29

ప్ర.అ. నూనమ్=నిశ్చయముగా, అనేన=ఇతనిచేత, కృత్స్నమ్= సమస్తమైన, వ్యాకరణమ్=వ్యాకరణము, బహుధా=అనేకవిధముల, శ్రుతమ్=వినబడినది. బహు=అధికముగా, వ్యాహరతా= మాటలాడుచున్న, అనేన=వీనిచేత, కించిత్ =ఏమీ, న అపశబ్దితమ్ =అపశబ్దము చేయబడలేదు.

తా. నిశ్చయముగా ఇతడు వ్యాకరణమును అంతా అనేకపర్యాయములు విని (చదివి) ఉన్నాడు. అందుచేతనే ఇన్ని మాటలు మాటలాడినా ఒక్క అపశబ్దము కూడ ఉచ్చరించలేదు. 29

మూ. న ముఖే నేత్రయోశ్చాపి లలాటే చ భ్రువోస్తథా,
అన్యేష్వపి చ సర్వేషు దోషః సంవిదితః క్వచిత్. 30

ప్ర.అ. ముఖే=ముఖమునందు, నేత్రయోశ్చాపి=నేత్రములయందు, లలాటే=లలాటమునందు, తథా=మరియు, భ్రువోః= కనుబొమ్మలయందు, అన్యేష్వపి చ =ఇతర అవయవములయందు, సర్వేషు=అన్నింటియందు, క్వచిత్=దేనియందూ, దోషః=దోషము, న సంవిదితః=చూడబడలేదు.

తా. ముఖమునందు గాని, నేత్రములయందు గాని, లలాటమునందు గాని, కనుబొమ్మలయందు గాని, మరి ఏ అవయవమునందు గాని ఏ మాత్రము దోషము కనబడలేదు. 30

మూ. అవిస్తరమసందిగ్ధమవిలమ్బితమవ్యథమ్,
ఉరఃస్థం కణ్ఠగం వాక్యం వర్తతే మధ్యమస్వరమ్. 31

ప్ర.అ. వాక్యమ్=(ఇతని)వాక్యము, అవిస్తరమ్=విస్తృతము కానిదిగాను, అసందిగ్ధమ్=సందిగ్ధము కానిదిగాను, అవిలమ్బితమ్=ఆలస్యము లేనిదిగాను, అవ్యథమ్=వ్యథ లేనిదిగాను, ఉరఃస్థమ్=వక్షఃస్థలమునం దున్నదై, కణ్ఠగమ్=కంఠమును చేరి, మధ్యమస్వరమ్=మధ్యమమైన స్వరము గలదిగా ఉన్నది.

తా. ఈతని మాటలలో అవసరము లేని విస్తారము లేదు. సందేహమునకు తావు లేకుండా ఉన్నది. ఉచ్చారణలో ఆలస్యము లేదు. వినువారికి వ్యథ కలిగించుట లేదు. నాభినుండి పైకి వచ్చుచున్నప్పుడు ఇది ముందు (మాటలాడేవానికి మాత్రమే గోచరించే) మధ్యమా వాగ్రూపమున వక్షఃస్థలమును తాకుచు పైకి వచ్చి వినే వాళ్లకు వినబడే వైఖరీరూపమున కంఠమును చేరినది. బిగ్గరగా గాని, మందముగా గాని లేక మధ్యమస్వరములో ఉన్నది. 31

మూ. సంస్కారక్రమసంపన్నామద్భుతామవిలమ్బితామ్,
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్. 32

ప్ర.అ. సంస్కారక్రమసంపన్నామ్=సంస్కారక్రమములతో కూడినది, అద్భుతామ్ =ఆశ్చర్యకరము, అవిలమ్బితామ్=విలంబము లేనిది, కల్యాణీమ్=మంగళప్రదము, హృదయహారిణీమ్ =హృదయమును హరించునదీ అయిన, వాచమ్=వాక్కును, ఉచ్చారయతి=ఉచ్చరించుచున్నాడు.

తా. ఈత డుచ్చరించిన మంగళప్రదమైన వాక్కు, వ్యాకరణసంస్కారసంపన్నమై, క్రమము తప్పక ఆశ్చర్యకరముగా ఉన్నది. ఉచ్చారణలో తొందరలేదు.

మనోహరముగా ఉన్నది. 32

మూ. అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యఞ్జనస్థయా,
కస్య నారాధ్యతే చిత్తముద్యతాసే రరేరపి. 33

ప్ర.అ. త్రిస్థానవ్యఞ్జనస్థయా=వక్షము, కంఠము, శిరస్సు అను అక్షరవ్యంజకములైన (అక్షరోచ్చారణ కుపయుక్తములైన) స్థానములందు ఉన్న, చిత్రయా=చిత్రమైన, అనయా=ఈ, వాచా=వాక్కుచేత, ఉద్యతాసేః=ఎత్తబడిన ఖడ్గము గల, అరేరపి=శత్రువైనా, కస్య=ఎవనియొక్క, చిత్తమ్=చిత్తము, నారాధ్యతే=ఆరాధింపబడదు?

తా. వర్ణములను ఉచ్చరించే వక్షస్థలము, కంఠము, శిరస్సు అను మూడు స్థానములందు చక్కగా నిలచిన అందమైన ఇట్టి మాటలకు ఎవని మనస్సు సంతోషము పొందదు? కత్తి ఎత్తిన శత్రువు మనస్సు కూడ మారిపోవును. 33

మూ. ఏవంవిధో యస్య దూతో న భవేత్పార్థివస్య తు,
సిధ్యన్తి హి కథం తస్య కార్యాణాం గతయోఽనఘ. 34

ప్ర.అ. అనఘ=దోషములు లేనివాడా! యస్య=ఏ, పార్థివస్య=రాజుయొక్క, దూతః=దూత, ఏవంవిధః=ఇట్టివాడుగా, న భవేత్=ఉండడో, తస్య=అట్టి రాజుయొక్క, గతయః=రీతులు, కథమ్=ఎట్లు, సిధ్యన్తి=సిద్ధించును?

తా. దోషములు లేనివాడా! ఇట్టి దూత లేని రాజు తలపెట్టిన పనులు ఎట్లు సిద్ధించును? 34

మూ. ఏవం గుణగణైర్యుక్తా యస్య స్యుః కార్యసాధకాః,
తస్య సిధ్యన్తి సర్వేఽర్థా దూతవాక్యప్రచోదితాః. 35

ప్ర.అ. యస్య=ఏ రాజునకు, ఏవంగుణగణైః=ఇట్టి గుణగణములతో, యుక్తాః=కూడిన, కార్యసాధకాః=కార్యమును సాధించు దూతలు, స్యుః=ఉందురో, తస్య=అట్టి రాజుయొక్క, సర్వే= సమస్తమైన, అర్థాః=కార్యములు, దూతవాక్యప్రచోదితాః= దూతలయొక్క వాక్యములచేత ప్రేరేపింపబడినవై, సిధ్యన్తి=సిద్ధించును.

తా. ఇట్టి గుణగణములు గల కార్యసాధకులైన దూతలు ఏ రాజువద్ద నుందురో ఆతని కార్యములు ఆ దూతలచే నిర్వర్తింపబడి సిద్ధించును.

వి. హనుమంతుడు పలికిన వాక్యము 18 శ్లోకాలలో ఉన్నది. రాముడు అతని గుణగణాలను ప్రశంసిస్తూ పలికిన మాటలు కూడా దీర్ఘముగా పది శ్లోకాలలో ఉన్నవి. ఈ ప్రశంసావాక్యములను పట్టి (సీతకు ఆచార్యుడు అయి రామునితో కలుపబోయే) హనుమంతునిలో ఉన్న ఆచార్యలక్షణా లన్నీ స్పష్టం అవుతున్నాయి అని వ్యాఖ్యాతలు తదనుగుణంగా వ్యాఖ్యానించినారు. ఈ మాటలలో హనుమంతున కున్న సకలవేదవ్యాకరణపాండిత్యం ఎట్లు స్పష్టం

అవుతున్నదో తెలియదు. "ఏవంగుణగణైర్యుక్తాః" ఇత్యాదివాక్యనిర్మాణంలో వాల్మీకిముద్ర లేదు. ఈ శ్లోకాలు అన్నీ ప్రాచ్యప్రతిలో లేవు. ఈ క్రింది ఒకటిన్నర శ్లోకాలు మాత్రమే ఉన్నాయి : -

"తతః సంచిన్త్య మనసా రామో లక్ష్మణ మబ్రవీత్,
సచివోఽయం కపీన్ద్రస్య సుగ్రీవస్య మహాత్మనః.
తమాభాషస్వ సౌమిత్రే మత్సమీపముపాగతమ్,
వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః సత్యజ్ఞం సత్యవాదినమ్". 35

మూ. ఏవముక్తస్తు సౌమిత్రిః సుగ్రీవసచివం కపిమ్,
అభ్యభాషత వాక్యజ్ఞో వాక్యజ్ఞం పవనాత్మజమ్. 36

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, వాక్యజ్ఞః= వాక్యములను ఎరిగిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, వాక్యజ్ఞమ్= వాక్యములను ఎరిగినవాడు, పవనాత్మజమ్=వాయుపుత్రుడు, సుగ్రీవసచివమ్=సుగ్రీవుని మంత్రీ అయిన, కపిమ్=హనుమంతుని గూర్చి, అభ్యభాషత=పలికెను.

తా. మాటలలో నేర్పరి యైన లక్ష్మణుడు రాముని మాటలు విని, సుగ్రీవుని మంత్రీ, మాటలలో నేర్పరీ, వాయుపుత్రుడూ అయిన హనుమంతునితో ఇట్లు పలికెను. 36

మూ. విదితా నౌ గుణా విద్వన్సుగ్రీవస్య మహాత్మనః,
తమేవ చావాం మార్గావః సుగ్రీవం ప్లవగేశ్వరమ్. 37

ప్ర.అ. విద్వన్=విద్వాంసుడా! మహాత్మనః=మహాత్ముడైన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, గుణాః=గుణములు, నౌ= మాకు, విదితాః=తెలియబడినవి. ఆవామ్=మేము, ప్లవగేశ్వరమ్=వానరుల ప్రభువైన, తమేవ=ఆ సుగ్రీవునే, మార్గావః= వెదకుచున్నాము.

తా. ఓ! బుద్ధిమంతుడా! మహాత్ముడైన సుగ్రీవుని గుణాలను గూర్చి మాకు తెలియును. వానరరాజైన ఆ సుగ్రీవుణ్ణే మేము వెదకుచు వచ్చినాము.

మూ. యథా బ్రవీషి హనుమన్ సుగ్రీవవచనాదిహ,
తత్తథా హి కరిష్యావో వచనాత్తవ సత్తమ. 38

ప్ర.అ. సత్తమ=సత్పురుషులలో శ్రేష్ఠుడవైన, హనుమన్= హనుమంతుడా! ఇహ=ఇప్పుడు, సుగ్రీవవచనాత్=సుగ్రీవుని వచనమువలన, యథా=ఎట్లు, బ్రవీషి=పలుకుచున్నావో, తత్= దానిని, తవ=నీయొక్క, వచనాత్=వచనమువలన, తథా=అట్లే, కరిష్యావః=చేసెదము.

తా. సత్పురుషులలో శ్రేష్ఠుడైన ఓ! హనుమంతుడా! సుగ్రీవుని మాటల ప్రకారము నీవు ఇప్పుడు చెప్పిన విధముగానే మేము చేసెదము. 38

మూ. తత్తస్య వాక్యం నిపుణం నిశమ్య
ప్రహృష్టరూపః పవనాత్మజః కపిః,
మనః సమాధాయ జయోపపత్తౌ
సఖ్యం తదా కర్తుమియేష తాభ్యామ్. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
తృతీయః సర్గః.

ప్ర.అ. పవనాత్మజః=వాయుపుత్రుడైన, కపిః=హనుమంతుడు, తస్య=ఆత నియొక్క, నిపుణమ్=నేర్పుతో కూడిన, తత్ వాక్యమ్= ఆ వాక్యమును, నిశమ్య=విని, ప్రహృష్టరూపః=చాలా సంతోషించినవాడై, జయోపపత్తౌ=జయప్రాప్తి యందు, మనః= మనస్సును, సమాధాయ=ఉంచి, తదా=అప్పుడు, తాభ్యామ్= వారితో, సఖ్యమ్=సుగ్రీవునకు స్నేహమును, కర్తుమ్=చేయుటకు, ఇయేష=ఇచ్ఛయించెను.

తా. హనుమంతుడు నేర్పుగా పలికిన ఆ లక్ష్మణుని వాక్యమును విని చాల సంతోషించి, జయమును సంపాదించవచ్చు నని మనస్సులో అనుకొని, వారిద్దరితో సుగ్రీవునకు స్నేహము చేయవచ్చు నని నిశ్చయించుకొనెను.

వి. పై నాలుగు శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
మూడవసర్గ సమాప్తము.

# అథ చతుర్థః సర్గః

[లక్ష్మణుడు హనుమంతునకు రాముని వనవాసకారణమును, సీతాహరణ వృత్తాంతమును చెప్పి, సీతను అన్వేషించుటలో సుగ్రీవుని సాహాయ్యము కావలె నని కోరగా హనుమంతుడు వారిద్దరికి నమ్మిక కలగచేసి తనతో వారిని తీసికొని వెళ్లుట]

మూ. తతః ప్రహృష్టో హనుమాన్ కృత్యవానితి తద్వచః,
శ్రుత్వా మధురభావం చ సుగ్రీవం మనసా గతః. 1

ప్ర.అ. తతః=అటుపిమ్మట, కృత్యవాన్=మంచి కృత్యములు గల, హనుమాన్=హనుమంతుడు, ఇతి=ఇట్లు, తద్వచః=ఆ లక్ష్మణుని వచనమును, శ్రుత్వా=విని, మధురభావం చ= మధురభావమును కూడ, (తెలిసికొని), ప్రహృష్టః=సంతోషించినవాడై, మనసా=మనస్సుచేత, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి గూర్చి, గతః= వెళ్ళినాడు.

తా. పిమ్మట కృత్యములలో నేర్పు గల హనుమంతుడు లక్ష్మణుని మాటలు విని, వారి సద్భావమును కూడ తెలిసికొని, సంతోషించి, మనసా సుగ్రీవుని సన్నిధి చేరెను. (సుగ్రీవుని కార్యము సిద్ధించిన దని అనుకొనెను.) 1

మూ. భావ్యో రాజ్యాగమస్తస్య సుగ్రీవస్య మహాత్మనః,
యదయం కృత్యవాన్ ప్రాప్తః కృత్యం చైతదుపాగతమ్. 2

ప్ర.అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య సుగ్రీవస్య=ఆ సుగ్రీవునకు, రాజ్యాగమః=రాజ్యప్రాప్తి, భావ్యః=సంభావ్యము. యత్= ఎందువలన, కృత్యవాన్=ప్రయోజనము గల, అయమ్=ఇతడు, ప్రాప్తః=వచ్చినాడో. ఏతత్=ఈ, కృత్యం చ=కార్యము కూడా, ఉపాగతమ్=వచ్చినది.

తా. ఒక ప్రయోజనమును కోరి ఈ మహాపురుషుడు వచ్చినాడు. ఈ కృత్యము సుగ్రీవుడు చేయగలిగినదిగా కూడా ఉన్నది. అందుచేత మహాత్ముడైన సుగ్రీవునకు రాజ్యము లభించే అవకాశ మున్నది. 2

మూ. తతః పరమసంహృష్టో హనుమాన్ ప్లవగోత్తమః,
ప్రత్యువాచ తతో వాక్యం రామం వాక్యవిశారదమ్. 3

ప్ర.అ. తతః=అటు పిమ్మట, పరమసంహృష్టః=చాలా సంతోషించిన, ప్లవగోత్తమః=వానరశ్రేష్ఠుడైన, హనుమాన్=హనుమంతుడు, తతః=అటుపిమ్మట, వాక్యవిశారదమ్=మాటలలో నేర్పరి యైన, రామమ్=రాముని గూర్చి, వాక్యమ్=వాక్య

మును, ప్రత్యువాచ= తిరిగి పలికెను.

తా. పిమ్మట చాలా సంతోషించిన వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు మాటలలో నేర్పరియైన రామునితో ఇట్లు పలికెను. 3

మూ. కిమర్థం చ వనం ఘోరం పమ్పాకాననమణ్డితమ్,
ఆగతః సానుజో దుర్గం నానావ్యాలమృగాయుతమ్. 4

ప్ర.అ. సానుజః=తమ్మునితో కూడిన నీవు, పమ్పాకాననమణ్డితమ్= పంపాసమీపమునం దున్న వనములచేత అలంకరింపబడినది, దుర్గమ్= ప్రవేశింప శక్యముకానిది, నానావ్యాలమృగాయుతమ్=అనేకవిధములైన సర్పములతోను, మృగములతోను కూడినది అయిన, ఘోరమ్=భయంకరమైన, వనమ్=అరణ్యమును గూర్చి, కిమర్థమ్=ఎందుకు, ఆగతః= వచ్చినావు.

తా. పంపాపరిసరములలో ఉన్న వనములచేత అలంకరింపబడిన ఈ అరణ్యము భయంకరమైనది. ప్రవేశింప శక్యముకానిది. ఇది అనేకవిధములైన సర్పములతోను, మృగములతోను నిండి ఉన్నది. అట్టి ఈ అరణ్యములోనికి నీవు, నీ తమ్ముడు ఎందుకు వచ్చినారు? 4

మూ. తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణో రామచోదితః,
ఆచచక్షే మహాత్మానం రామం దశరథాత్మజమ్. 5

ప్ర.అ. లక్ష్మణః=లక్ష్మణుడు, తస్య=అతనియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, రామచోదితః= రామునిచేత ప్రేరితుడై, మహాత్మానమ్=మహాత్ముడు, దశరథాత్మజమ్= దశరథుని కుమారుడు అయిన, రామమ్=రాముణ్ణి గూర్చి, ఆచచక్షే=చెప్పెను.

తా. లక్ష్మణుడు ఆ హనుమంతుని మాటలు విని, రాముడు ప్రేరేపింపగా మహాత్ముడు, దశరథకుమారుడు అయిన రాముణ్ణి గూర్చి ఆతనితో ఇట్లు చెప్పెను.

మూ. రాజా దశరథో నామ ద్యుతిమాన్ ధర్మవత్సలః,
చాతుర్వర్ణ్యం స్వధర్మేణ నిత్యమేవానుపాలయన్. 6

ప్ర.అ. ద్యుతిమాన్=కాంతిగలవాడు, ధర్మవత్సలః=ధర్మమునందు ఆసక్తి గలవాడు, చాతుర్వర్ణ్యమ్=నాలుగు వర్ణములను, నిత్యమేవ= నిత్యమూ, స్వధర్మేణ=స్వధర్మముచేత, అభిపాలయన్=పాలించువాడు అయిన, దశరథో నామ=దశరథుడనే పేరు గల, రాజా=రాజు ఉండెను.

తా. కాంతి గలవాడు, ధర్మమునందు ఆసక్తి గలవాడు, నాలుగు వర్ణములను స్వధర్మానుసారము నిత్యమూ పరిపాలించేవాడు అయిన దశరథుడనే రాజు ఉండెను. 6

మూ. న ద్వేష్టా విద్యతే తస్య స తు ద్వేష్టి న కంచన,
స తు సర్వేషు భూతేషు పితామహ ఇహాపరః. 7
అగ్నిష్టోమాదిభిర్యజ్ఞైరిష్టవానాప్తదక్షిణైః.

ప్ర.అ. తస్య=ఆతనికి, ద్వేష్టా=ద్వేషించేవాడు, న విద్యతే=లేడు. సః=అతడు, కంచన=ఎవనినీ, న ద్వేష్టి=ద్వేషించడు. సః=అతడు, సర్వేషు=సమస్తమైన, భూతేషు=ప్రాణుల విషయమునందు, అపరః=మరియొక, పితామహః ఇవ=బ్రహ్మ దేవుడు వంటివాడు. ఆప్తదక్షిణైః=ఇవ్వబడిన దక్షిణలు గల, అగ్నిష్టోమాదిభిః=అగ్నిష్టోమము మొదలైన, యజ్ఞైః=యజ్ఞములతో, ఇష్టవాన్= యాగములు చేసినవాడు.

తా. ఆ దశరథుణ్ణి ద్వేషించేవా డెవ్వడూ లేడు. అతడు కూడ ఎవరినీ ద్వేషించడు (చలేదు). అందరు ప్రాణుల విషయములోను అతడు రెండవ బ్రహ్మదేవుడు వలె ప్రవర్తించుచుండెడివాడు. అతడు భూరిదక్షిణ లిచ్చి అగ్నిష్టోమాదియాగములు చేసినాడు.

వి. ఆరవ శ్లోకంలోని ఉత్తరార్ధము, ఈ సార్ధశ్లోకము ప్రాచ్యప్రతిలో లేవు.

మూ. తస్యాయం పూర్వజః పుత్రో రామో నామ జనైః శ్రుతః, 8
శరణ్యః సర్వభూతానాం పితుర్నిర్దేశపారగః.

ప్ర.అ. అయమ్=ఇతడు, తస్య=ఆ దశరథునియొక్క, పూర్వజః= ముందు పుట్టిన, (పెద్దవాడైన), పుత్రః=పుత్రుడు. రామో నామ= రాము డనే పేరు గలవాడుగా, జనైః=జనులచేత, శ్రుతః= వినబడినవాడు. సర్వభూతానామ్=సకల ప్రాణులకు, శరణ్యః= రక్షకుడు. పితుః=తండ్రియొక్క, నిర్దేశపారగః=ఆజ్ఞయొక్క అంతమును పొందినవాడు.

తా. రాముడనే పేరుతో జనులలో ప్రసిద్ధుడైన ఇతడు ఆ దశరథుని పెద్ద కుమారుడు. సకలప్రాణులకు అభయ మిచ్చువాడు. తండ్రి ఆజ్ఞను పూర్తిగా పాలించువాడు. 8

మూ. జ్యేష్ఠో దశరథస్యాయం పుత్రాణాం గుణవత్తరః, 9
రాజలక్షణసంయుక్తః సంయుక్తో రాజ్యసమ్పదా,
రాజ్యాద్భ్రష్టో మయా వస్తుం వనే సార్ధమిహాగతః. 10

ప్ర.అ. దశరథస్య=దశరథునియొక్క, పుత్రాణామ్=పుత్రులలో, జ్యేష్ఠః=పెద్ద వాడు, గుణవత్తరః=అధికమైన సద్గుణములు కలవాడు, రాజలక్షణసంయుక్తః=రాజల క్షణములతో కూడినవాడు, రాజ్యసమ్పదా= రాజ్యలక్ష్మితో, సంయుక్తః=కూడినవాడు అయిన, అయమ్=ఇతడు, రాజ్యాత్=రాజ్యమునుండి, భ్రష్టః=భ్రష్టుడై, వనే=వనము నందు, వస్తుమ్=నివసించుటకు, మయా సార్ధమ్=నాతో కూడ, ఇహ= ఇక్కడికి,

ఆగతః=వచ్చినాడు.

తా. దశరథపుత్రులలో జ్యేష్ఠుడైన ఇతడు అందరికంటెను అధికగుణవంతుడు. రాజలక్షణసంపన్నుడు. రాజ్యసంపదతో కూడినవాడు. కాని ఇతడు రాజ్యభ్రష్టుడగుటచే అరణ్యములో నివసించుటకై నాతో కూడ ఇక్కడికి వచ్చినాడు. 9, 10

మూ. భార్యయా చ మహాభాగ సీతయానుగతో వశీ,
దినక్షయే మహాతేజాః ప్రభయేవ దివాకరః. 11

ప్ర.అ. మహాభాగ=మహాభాగ్యవంతుడా! వశీ=ఇంద్రియనిగ్రహవంతుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడు అయిన ఇతడు, దినక్షయే= సాయంకాలమునందు, దివాకరః=సూర్యుడు, ప్రభయేవ=కాంతిచేత వలె, భార్యయా=భార్యయైన, సీతయా=సీతచేత, అనుగతః= అనుసరించబడినాడు.

తా. ఓ! మహాభాగ్యవంతుడా! ఇంద్రియనిగ్రహవంతుడు, మహాతేజఃశాలీ అయిన ఈతని భార్యయైన సీత సాయంకాలసమయమున సూర్యుణ్ణి కాంతి వెంబడించినట్లు వెంబడించి వచ్చినది. 11

మూ. అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్యముపాగతః,
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః. 12

ప్ర.అ. అహమ్=నేను, కృతజ్ఞస్య=కృతజ్ఞుడు, బహుజ్ఞస్య= అనేక విషయములు తెలిసినవాడు అయిన, అస్య=ఈతనియొక్క, గుణైః=గుణములచేత, దాస్యమ్=దాసత్వమును, ఉపాగతః= పొందిన, అవరః భ్రాతా=చిన్న సోదరుడను. నామతః=పేరువలన, లక్ష్మణో నామ=లక్ష్మణు డను ప్రసిద్ధి కలవాడను.

తా. నేను ఈతని తమ్ముడను. కృతజ్ఞుడు, అనేక విషయములు తెలిసినవాడు అయిన ఈతని గుణములచేత ఆవర్జింపబడినవాడనై దాసుడ నైతిని. నా పేరు లక్ష్మణుడు. 12

మూ. సుఖార్హస్య మహార్హస్య సర్వభూతహితాత్మనః,
ఐశ్వర్యేణ విహీనస్య వనవాసే రతస్య చ, 13
రక్షసాపహృతా భార్యా రహితే కామరూపిణా,
తచ్చ న జ్ఞాయతే రక్షః పత్నీ యేనాస్య వా హృతా. 14

ప్ర.అ. సుఖార్హస్య=సుఖమునకు తగినవాడు, మహార్హస్య=చాల పూజ్యుడు, సర్వభూతహితాత్మనః=సకలప్రాణులకు హితమైన బుద్ధి కలవాడు, ఐశ్వర్యేణ=ఐశ్వర్యముతో, విహీనస్య=విహీనుడై, వనవాసే=వనవాసమునందు, రతస్య=ఆసక్తుడూ అయిన ఈ రామునియొక్క, భార్యా=భార్య, రహితే=జనశూన్యమైన ప్రదేశమునందు, కామరూపిణా=స్వేచ్ఛానుసారము రూపము గల, రక్షసా=రాక్షసునిచేత,

అపహృతా=అపహరించబడినది. యేన వా=ఎవనిచేత, అస్య= ఈతనియొక్క, పత్నీ=భార్య, హృతా=హరింపబడినదో, తత్=ఆ, రక్షః=రాక్షసుడు, న జ్ఞాయతే=తెలియబడుటలేదు.

తా. సుఖమునకు తగినవాడు, చాల పూజ్యుడు, సకలప్రాణులకు హితమును కోరువాడు అయిన ఈ రాముడు ఐశ్వర్యమును కోల్పోయి అరణ్యములో నివసించుచుండగా, స్వేచ్ఛానుసారము రూపములను ధరించగలిగిన రాక్షసుడు ఈతని భార్యను అపహరించెను. అట్లు అపహరించిన రాక్షసు డెవ్వడో తెలియలేదు. 13, 14

మూ. దనుర్నామ శ్రియః పుత్రః శాపాద్రాక్షసతాం గతః,
ఆఖ్యాతస్తేన సుగ్రీవః సమర్థో వానరాధిపః. 15

ప్ర.అ. శ్రియః=శ్రీఅనువానియొక్క, పుత్రః=పుత్రుడు, శాపాత్= శాపము వలన, రాక్షసతామ్=రాక్షసత్వమును, గతః=పొందినవాడు అయిన, దనుః నామ=దనువు అనే వా డున్నాడు. తేన=ఆతనిచేత, వానరాధిపః=వానరాధిపుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, సమర్థః= సమర్థుడుగా, ఆఖ్యాతః=చెప్పబడినాడు.

తా. శ్రీపుత్రుడైన దనువు అనువాడు శాపవశముచేత రాక్షసత్వము పొందినాడు. వానరరాజైన సుగ్రీవుడు మంచి సామర్థ్యము కలవా డని ఆతడు చెప్పినాడు. 15

మూ. స జ్ఞాస్యతి మహావీర్యస్తవ భార్యాపహారిణమ్,
ఏవముక్త్వా దనుః స్వర్గం భ్రాజమానో దివం గతః. 16

ప్ర.అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, సః=అతడు, తవ= నీయొక్క, భార్యాపహారిణమ్=భార్యను అపహరించిన వానిని, జ్ఞాస్యతి=తెలుసుకొనగలడు. దనుః=దనువు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా= పలికి, భ్రాజమానః=ప్రకాశించుచు, స్వర్గమ్=స్వర్గమును గూర్చి, దివం గతః=ఆకాశమును పొందినాడు.

తా. "గొప్ప పరాక్రమము గల ఆ సుగ్రీవుడు నీ భార్యను అపహరించినవానిని గూర్చి తెలిసికొనగలడు" అని అతడు రామునితో చెప్పి, ప్రకాశించుచున్న శరీరముతో, స్వర్గమునకు పోవుటకై ఆకాశములోనికి ఎగిరినాడు. 16

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం యాథాతథ్యేన పృచ్ఛతః,
అహం చైవ చ రామశ్చ సుగ్రీవం శరణం గతౌ. 17

ప్ర.అ. పృచ్ఛతః=అడుగుచున్న, తే=నీకు, ఏతత్=ఇది, సర్వమ్=అంతా, యాథాతథ్యేన=యథార్థముగా, ఆఖ్యాతమ్= చెప్పబడినది. అహం చైవ=నేను, రామశ్చ=రాముడూ, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, శరణమ్=రక్షకునిగా, గతౌ= పొందినాము.

తా. నీ ప్రశ్నలకు సమాధానముగా ఈ విషయ మంతా ఉన్నదున్నట్లు చెప్పినాను. నేను, రాముడు కూడా సుగ్రీవుణ్ణి శరణు పొందినాము. 17

మూ. ఏష దత్త్వా చ విత్తాని ప్రాప్య చానుత్తమం యశః,
లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి. 18

ప్ర.అ. ఏషః=ఈ రాముడు, విత్తాని=ధనములను, దత్త్వా చ= ఇచ్చి, అనుత్తమమ్=చాల గొప్పదైన, యశః=కీర్తిని, ప్రాప్య చ=పొంది, పురా=పూర్వము, లోకనాథః=లోకమునకు నాథుడై, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, నాథమ్=రక్షకునిగా, ఇచ్ఛతి= కోరుచున్నాడు.

తా. పూర్వము ఏ రాముడు లోకాలకు ధనములు పంచిపెట్టి, గొప్ప కీర్తి గడించి లోకులకు సంరక్షకుడుగా ఉండెనో ఆతడు సుగ్రీవుని సాహాయ్యమును కోరుచున్నాడు. 18

మూ. పితా యస్య పురా హ్యాసీచ్ఛరణ్యో ధర్మవత్సలః,
తస్య పుత్రః శరణ్యస్య సుగ్రీవః శరణం గతః. 19

ప్ర.అ. పురా=పూర్వము, యస్య=ఏ రామునియొక్క, ధర్మవత్సలః= ధర్మమునందు ప్రేమగల, పితా=తండ్రి, శరణ్యః=శరణాగతరక్షకుడుగా, ఆసీత్=ఉండెనో, శరణ్యస్య=శరణాగత రక్షకుడైన, తస్య=అట్టి దశరథునియొక్క, పుత్రః=పుత్రుడు, సుగ్రీవమ్= సుగ్రీవుని, శరణం గతః=శరణు పొందినాడు.

తా. ఏ రాముని తండ్రియైన, ధర్మమునందు ఆసక్తి గల దశరథుడు శరణాగతరక్షకుడుగా ఉండేవాడో అట్టి దశరథుని కుమారుడైన రాముడు సుగ్రీవుని శరణు జొచ్చినాడు. 19

మూ. సర్వలోకస్య ధర్మాత్మా శరణ్యః శరణం పురా,
గురుర్మే రాఘవః సోఽయం సుగ్రీవం శరణం గతః. 20

ప్ర.అ. ధర్మాత్మా=ధర్మాత్ముడు, శరణ్యః=శరణాగతరక్షకుడు, పురా= పూర్వము, సర్వలోకస్య=సమస్తలోకముయొక్క, శరణమ్=రక్షకుడు, మే= నాయొక్క, గురుః=అన్న అయిన, సః అయమ్=అట్టి ఈ, రాఘవః=రాముడు, సుగ్రీవమ్= సుగ్రీవుణ్ణి, శరణం గతః=శరణు పొందినాడు.

తా. ధర్మాత్ముడు, శరణాగతరక్షకుడు, పూర్వము సకలలోకమును రక్షించినవాడు, నా అన్నగారు అయిన అట్టి, ఈ రాముడు సుగ్రీవుని శరణు పొందినాడు. 20

మూ. యస్య ప్రసాదే సతతం ప్రసీదేయురిమాః ప్రజాః,
స రామో వానరేన్ద్రస్య ప్రసాదమభికాంక్షతే. 21

ప్ర.అ. యస్య=ఏ రామునియొక్క, ప్రసాదే=అనుగ్రహమునందు, ఇమాః=ఈ, ప్రజాః=ప్రజలు, సతతమ్=ఎల్లప్పుడూ, ప్రసీదేయుః=సుఖముగా ఉందురో, సః రామః=అట్టి రాముడు, వానరేన్ద్రస్య=వానరరాజుయొక్క, ప్రసాదమ్=అనుగ్రహ మును, అభికాంక్షతే=కోరుచున్నాడు.

తా. ఏ రాముని అనుగ్రహము సంపాదించుకొని ఈ ప్రజలందరూ సుఖముగా ఉందురో అట్టి రాముడు సుగ్రీవుని అనుగ్రహమును కోరుచున్నాడు.

మూ. యేన సర్వగుణోపేతాః పృథివ్యాం సర్వపార్థివాః,
మానితాః సతతం రాజ్ఞా సదా దశరథేన వై. 22
తస్యాయం పూర్వజః పుత్రస్త్రిషు లోకేషు విశ్రుతః,
సుగ్రీవం వానరేన్ద్రం తు రామః శరణమాగతః. 23.

ప్ర.అ. రాజ్ఞా=రాజైన, యేన దశరథేన=ఏ దశరథునిచేత, పృథి వ్యామ్=భూమియం దున్న, సర్వగుణోపేతాః=సమస్తగుణములతో కూడిన, సర్వ పార్థివాః=సమస్తరాజులు, సదా=ఎల్లప్పుడు, సతతమ్=నిరంతరమూ, మానితాః=గౌర వించబడినారో, తస్య= అట్టి దశరథునియొక్క, పూర్వజః=మొదటపుట్టిన, పుత్రః= పుత్రుడు, త్రిషు లోకేషు=మూడు లోకములయందు, విశ్రుతః= ప్రసిద్ధుడు అయిన, అయం రామః=ఈ రాముడు, వానరేన్ద్రమ్= వానరరాజైన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, శరణం గతః=శరణు జొచ్చినాడు.

తా. ఏ దశరథమహారాజు భూమియం దున్న, సకలగుణములతో కూడిన రాజుల నందరిని తన సామంతులనుగా ఎల్లప్పుడూ అనుగ్రహదృష్టితో సత్కరించుచుండేవాడో అట్టి దశరథుని జ్యేష్ఠపుత్రుడు, మూడు లోకాలలో ప్రసిద్ధుడు అయిన రాముడు వానరరాజైన సుగ్రీవుని శరణు జొచ్చినాడు. 23

మూ. శోకాభిభూతే రామే తు శోకార్తే శరణం గతే,
కర్తుమర్హతి సుగ్రీవః ప్రసాదం హరియూథప. 24

ప్ర.అ. హరియూథప=ఓ! వానరనాయకా! శోకాభిభూతే=శోకముచేత తిర స్కరింపబడినవాడు, శోకార్తే=శోకముచేత పీడింపబడినవాడు, శరణం గతే=శరణు చేరినవాడు అయిన, రామే=రామునియందు, సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రసాదమ్=అను గ్రహమును, కర్తుమ్= చేయుటకు, అర్హతి=తగియున్నాడు.

తా. ఓ! వానరయూథనాయకా! శోకమునకు లొంగిపోయి, శోకముచేత పీడింపబడుచు, శరణుజొచ్చిన ఈ రామునిపై సుగ్రీవుడు అనుగ్రహము చూపవలెను.

వి. 17వ శ్లోకం ఉత్తరార్థము, 19-23 శ్లోకాలు ప్రాచ్యపాఠంలో లేవు. లక్ష్మణుడు ఇంత దీనముగా ప్రార్థించినా డనుట అనుచితముగా ఉన్నది. 24

మూ. ఏవం బ్రువాణం సౌమిత్రిం కరుణం సాశ్రుపాతనమ్,
హనుమాన్ప్రత్యువాచేదం వాక్యం వాక్యవిశారదః. 25

ప్ర.అ. కరుణమ్=దీనముగాను, సాశ్రుపాతనమ్=కన్నీళ్లపతనముతో కూడు నట్లుగాను, ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, సౌమిత్రిమ్=లక్ష్మణుని గూర్చి, వాక్యవిశారదః=మాటలలో నేర్పరియైన, హనుమాన్=హనుమంతుడు, ఇదమ్=ఈ, వాక్యమ్= వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. మాటలలో నేర్పరియైన హనుమంతుడు, అట్లు దీనముగా కన్నీళ్లు కార్చుచు లక్ష్మణుడు పలికిన మాటలు విని ఇట్లు పలికెను. 25

మూ. ఈదృశా బుద్ధిసంపన్నా జితక్రోధా జితేన్ద్రియాః,
ద్రష్టవ్యా వానరేన్ద్రేణ దిష్ట్యా దర్శనమాగతాః. 26

ప్ర.అ. బుద్ధిసంపన్నాః=సద్బుద్ధితో కూడినవారు, జితక్రోధాః= జయించబడిన క్రోధము గలవారు, జితేన్ద్రియాః=జయించబడిన ఇంద్రియములు కలవారు, దిష్ట్యా=దైవవశము చేత, దర్శనమ్= దర్శనమును, ఆగతాః=పొందినవారు అయిన, ఈదృశాః=ఇట్టి, వీరు, వానరేన్ద్రేణ=వానరరాజుచేత, ద్రష్టవ్యాః=చూడదగినవారు.

తా. బుద్ధిమంతులు, క్రోధమును జయించినవారు, ఇంద్రియములను జయించినవారు అయిన మీవంటివారి దర్శనము అదృష్టవశముచేతనే లభించును. అట్టి మిమ్ములను సుగ్రీవుడు తప్పక చూడవలెను. 26

మూ. స హి రాజ్యాచ్చ విభ్రష్టః కృతవైరశ్చ వాలినా,
హృతదారో వనే త్రస్తో భ్రాత్రా వినికృతో భృశమ్. 27

ప్ర.అ. వాలినా=వాలితో, కృతవైరః=చేయబడిన వైరము గలవాడు, భ్రాత్రా=సోదరుడైన ఆ వాలిచేత, హృతదారః=హరింపబడిన భార్య గలవాడు, భృశమ్=మిక్కిలి, వినికృతః=అవమానించబడినవాడు, రాజ్యాత్=రాజ్యమునుండి, విభ్రష్టః=భ్రష్టుడు అయిన, సః= అతడు, త్రస్తః=భయపడినవాడై, వనే=వనమునందు నివసించుచున్నాడు.

తా. సుగ్రీవుడు వాలితో వైరము పెట్టుకొనినాడు. వాలి సుగ్రీవుని భార్యను అపహరించి చాల అవమానించి రాజ్యభ్రష్టుని చేసినాడు. అతడు అరణ్యములో భయపడుచు కాలము గడపుచున్నాడు. 27

మూ. కరిష్యతి స సాహాయ్యం యువయోర్భాస్కరాత్మజః,
సుగ్రీవః సహ చాస్మాభిః సీతాయాః పరిమార్గణే. 28

ప్ర.అ. భాస్కరాత్మజః=సూర్యుని కుమారుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, అస్మాభిః సహ=మాతో కూడ, సీతాయాః=సీతయొక్క, పరిమార్గణే=వెదకుటయందు,

యువయోః=మీకు, సాహాయ్యమ్= సాహాయ్యమును, కరిష్యతి=చేయగలడు.

తా. సూర్యపుత్రుడైన సుగ్రీవుడు మాతో కలిసి, సీతాన్వేషణమునందు మీకు సాహాయ్యము చేయగలడు. 28

మూ. ఇత్యేవముక్త్వా హనుమాన్ శ్లక్ష్ణం మధురయా గిరా,
బభాషే సాధు గచ్ఛామః సుగ్రీవమితి రాఘవమ్. 29

ప్ర.అ. హనుమాన్=హనుమంతుడు, మధురయా=మధురమైన, గిరా= వాక్కుతో, ఇత్యేవమ్=ఇట్లు, శ్లక్ష్ణమ్=మృదువుగా, ఉక్త్వా=పలికి, సాధు=మంచిది; సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, గచ్ఛామః=వెళ్లుదము, ఇతి=అని, రాఘవమ్=రాముని గూర్చి, బభాషే=పలికెను.

తా. హనుమంతుడు ఈ విధముగా మధురములైన మాటలు మృదువుగా పలికి, "మంచిది, సుగ్రీవుని దగ్గరకు వెళ్లెదము" అని రామునితో అనెను. 29

మూ. ఏవం బ్రువన్తం ధర్మాత్మా హనుమన్తం స లక్ష్మణః,
ప్రతిపూజ్య యథాన్యాయమిదం ప్రోవాచ రాఘవమ్. 30

ప్ర.అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, ఏవమ్=ఇట్లు, బ్రువన్తమ్=పలుకుచున్న,హనుమన్తమ్= హనుమంతుని, యథాన్యాయమ్=న్యాయాను సారము, ప్రతిపూజ్య= పూజించి, రాఘవమ్=రాముని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ప్రోవాచ=పలికెను.

తా. ధర్మాత్ముడైన ఆ లక్ష్మణుడు ఇట్లు పలుకుచున్న ఆ హనుమంతుణ్ణి తగు విధముగా గౌరవించి రామునితో ఇట్లు పలికెను. 30

మూ. కపిః కథయతే హృష్టో యథాయం మారుతాత్మజః,
కృత్యవాన్ సోఽపి సంప్రాప్తః కృతకృత్యోఽసి రాఘవ. 31

ప్ర.అ. రాఘవ=రామా! మారుతాత్మజః=వాయుపుత్రుడైన, అయం కపిః=ఈ వానరుడు, హృష్టః=సంతోషించినవాడై, యథా=ఎట్లు, కథయతే=చెప్పుచున్నాడో, సోఽపి=అతడు కూడ, కృత్యవాన్=కృత్యము కలవాడై, సంప్రాప్తః=వచ్చినాడు. కృతకృత్యః=చేయబడిన పని గలవాడవు. అసి=అగుచున్నావు (అయినావు).

తా. రామా! ఈ హనుమంతుడు సంతోషముతో మాటలాడుచున్న విధము చూడగా ఇతడు మనతో పని ఉండి వచ్చినట్లు కనబడుచున్నది. ఇక నీ(మన) కార్యము పూర్తి యైనట్లే. 31

మూ. ప్రసన్నముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే,
నానృతం వక్ష్యతే వీరో హనుమాన్ మారుతాత్మజః . 32

ప్ర.అ. వ్యక్తమ్=స్పష్టముగా, ప్రసన్నముఖవర్ణశ్చ=ప్రసన్నమైన ముఖవర్ణము

కలవాడై, హృష్టశ్చ=సంతోషించుచు, భాషతే= మాటలాడుచున్నాడు. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్= హనుమంతుడు, అనృతమ్=అసత్యముగా, న వక్ష్యతే=పలకడు.

తా. ఇతడు ప్రసన్నమైన ముఖవర్ణముతో, సంతోషపూర్వకముగా మాటలాడుచున్నా డనునది స్పష్టముగా కనబడుచున్నది. వాయుపుత్రుడైన హనుమంతుడు అసత్యము పలకడు. 32

మూ. తతః స తు మహాప్రాజ్ఞో హనుమాన్ మారుతాత్మజః,
జగామాదాయ తౌ వీరౌ హరిరాజాయ రాఘవౌ. 33

ప్ర.అ. తతః=అటుపిమ్మట, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గల, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, వీరౌ=వీరులైన, తౌ రాఘవౌ=ఆ రామలక్ష్మణుల నిద్దరినీ, హరిరాజాయ=వానరరాజు వద్దకు, ఆదాయ=గ్రహించి, జగామ= వెళ్ళెను.

తా. పిమ్మట మహాబుద్ధిశాలి యైన, వాయుపుత్రుడైన, ఆ హనుమంతుడు వీరులైన ఆ రామలక్ష్మణులను సుగ్రీవునివద్దకు తీసికొని వెళ్ళెను. 33

మూ. భిక్షురూపం పరిత్యజ్య వానరం రూపమాస్థితః,
పృష్ఠమారోప్య తౌ వీరౌ జగామ కపికుఞ్జరః. 34

ప్ర.అ. కపికుఞ్జరః=ఆ వానరశ్రేష్ఠుడు, భిక్షురూపమ్=సంన్యాసి రూపమును, పరిత్యజ్య=విడచి, వానరమ్=వానరసంబంధమైన, రూపమ్=రూపమును, ఆస్థితః=గ్రహించినవాడై, తౌ=ఆ, వీరౌ=వీరులను, పృష్ఠమ్=వీపును, ఆరోప్య=ఎక్కించుకొని, జగామ=వెళ్ళెను.

తా. వానరులలో శ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు సంన్యాసిరూపము విడచి, వానరరూపము గ్రహించి, వీరులైన ఆ రామలక్ష్మణులను వీపుపై ఎక్కించుకొని వెళ్ళెను. 34

మూ. స తు విపులయశాః కపిప్రవీరః
పవనసుతః కృతకృత్యవత్ప్రహృష్టః,
గిరివరమురువిక్రమః ప్రయాతః
స శుభమతిః సహ రామలక్ష్మణాభ్యామ్. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కింధాకాణ్డే
చతుర్థః సర్గః.

ప్ర.అ. విపులయశాః=గొప్ప కీర్తి గలవాడు, కపిప్రవీరః=వానరవీరుడు అయిన, సః పవనసుతః=ఆ హనుమంతుడు, కృతకృత్యవత్= సాధించబడిన కార్యము గలవాడు వలె, ప్రహృష్టః=సంతోషించెను. శుభమతిః=శుభమైన బుద్ధి గల, ఉరువిక్రమః=గొప్ప

పరాక్రమము గల, సః=ఆ హనుమంతుడు, రామలక్ష్మణాభ్యాం సహ= రామలక్ష్మణులతో కూడ, గిరివరమ్=పర్వతశ్రేష్ఠమును, ప్రయాతః= పొందినాడు.

తా. అధికమైన కీర్తీ, గొప్ప పరాక్రమమూ, మంగళప్రదమైన బుద్ధీ గల వానరవీరుడైన హనుమంతుడు తన కార్యము సఫల మగుటచే సంతోషించుచు రామలక్ష్మణులతో కలిసి ఆ పర్వతము మీదికి వెళ్లెను. 35

*"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండములో నాల్గవసర్గ సమాప్తము.*

# అథ పఞ్చమః సర్గః

*[రామసుగ్రీవుల మైత్రి. వాలిని సంహరించెద నని రాముడు సుగ్రీవునకు మాట ఇచ్చుట.]*

మూ. ఋష్యమూకాత్తు హనుమాన్ గత్వా తం మలయం గిరిమ్,
ఆచచక్షే తదా వీరౌ కపిరాజాయ రాఘవౌ. 1

ప్ర.అ. హనుమాన్=హనుమంతుడు, ఋష్యమూకాత్=ఋష్యమూక పర్వతమునుండి, తమ్=ఆ, మలయం గిరిమ్=మలయపర్వతమును గూర్చి, గత్వా=వెళ్ళి, కపిరాజాయ=సుగ్రీవునకు, తదా= అప్పుడు, వీరౌ=వీరులైన, రాఘవౌ=రామలక్ష్మణులను గూర్చి, ఆచచక్షే=చెప్పెను.

తా. అప్పుడు హనుమంతుడు ఋష్యమూకపర్వతమునుండి మలయపర్వతమునకు వెళ్లి, సుగ్రీవునకు రామలక్ష్మణులను గూర్చి చెప్పెను. 1

మూ. అయం రామో మహాప్రాజ్ఞ సంప్రాప్తో దృఢవిక్రమ,
లక్ష్మణేన సహ భ్రాత్రా రామోఽయం సత్యవిక్రమః. 2

ప్ర.అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి గలవాడా! దృఢవిక్రమ=దృఢమైన పరాక్రమము గలవాడా! అయం రామః=ఈ రాముడు, భ్రాత్రా= సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, సంప్రాప్తః= వచ్చినాడు. అయం రామః=ఈ రాముడు, సత్యవిక్రమః=సత్యమైన పరాక్రమము గలవాడు.

తా. గొప్ప బుద్ధి, దృఢమైన పరాక్రమము గల ఓ! సుగ్రీవా! సోదరుడైన లక్ష్మణునితో కలిసి ఇదిగో రాముడు వచ్చినాడు. ఈ రాముడు సత్యమైన పరాక్రమము గలవాడు. 2

మూ. ఇక్ష్వాకూణాం కులే జాతో రామో దశరథాత్మజః,
ధర్మే నిగదితశ్చైవ పితుర్నిర్దేశకారకః. 3

ప్ర.అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకురాజుల, కులే=కులమునందు, జాతః=పుట్టినవాడు, దశరథాత్మజః=దశరథుని కుమారుడు అయిన, రామః=రాముడు, ధర్మే=ధర్మమునందు, నిగదితశ్చైవ= ప్రసిద్ధుడు. పితుః=తండ్రియొక్క, నిర్దేశకారకః=ఆజ్ఞను చేసినవాడు.

తా. రాముడు ఇక్ష్వాకువంశములో పుట్టినాడు. దశరథుని కుమారుడు. ధర్మాత్ముడుగా ప్రసిద్ధి పొందినవాడు. తండ్రి ఆజ్ఞను పాటించినవాడు. 3

మూ. రాజసూయాశ్వమేధైశ్చ వహ్నిర్యేనాభితర్పితః,
దక్షిణాశ్చ తథోత్సృష్టా గావః శతసహస్రశః. 4
తపసా సత్యవాక్యేన వసుధా యేన పాలితా,
స్త్రీహేతోస్తస్య పుత్రోఽయం రామోఽరణ్యం సమాగతః. 5

ప్ర.అ. యేన=ఎవనిచేత, రాజసూయాశ్వమేధైశ్చ=రాజసూయయాగముల చేతను అశ్వమేధయాగములచేతను, వహ్నిః=అగ్ని, అభితర్పితః= తృప్తి పొందించబడినాడో, తథా=మరియు, శతసహస్రశః= వందలకొలది వేలకొలది, గావః=గోవులు, దక్షిణాః=దక్షిణలుగా, ఉత్సృష్టాః=ఇవ్వబడినవో, యేన=ఎవనిచేత, తపసా= తపస్సుచేతను, సత్యవాక్యేన=సత్యవాక్యము చేతను, వసుధా=భూమి, పాలితా=పాలించబడినదో, తస్య=అట్టి దశరథునియొక్క, పుత్రః=పుత్రుడైన, అయం రామః=ఈ రాముడు, స్త్రీహేతోః=స్త్రీమూలమున, అరణ్యమ్=అరణ్యమును, సమాగతః=పొందినవాడు.

తా. ఏ దశరథుడు రాజసూయాశ్వమేధయాగములు చేసి అగ్నికి తృప్తి కలిగించెనో, వందల కొలది, వేలకొలది ఆవులను దక్షిణగా ఇచ్చెనో, తపస్సుచేతను, సత్యవాక్యముచేతను భూమిని పాలించెనో, అట్టి దశరథుని పుత్రుడైన ఈ రాముడు స్త్రీమూలమున అరణ్యమునకు వచ్చినాడు. 4, 5

మూ. తస్యాస్య వసతోఽరణ్యే నియతస్య మహాత్మనః,
రావణేన హృతా భార్యా స త్వాం శరణమాగతః. 6

ప్ర.అ. అరణ్యే=అరణ్యమునందు, వసతః=నివసించుచున్న, నియతస్య=నియమవంతుడైన, తస్య=అట్టి, అస్య=ఈ, మహాత్మనః=మహాత్మునియొక్క, భార్యా =భార్య, రావణేన=రావణునిచేత, హృతా = హరింపబడినది. సః=అట్టి, రాముడు, త్వామ్= నిన్ను, శరణమ్ ఆగతః=శరణుపొందినాడు.

తా. అట్టి ఈ మహాత్ముడైన రాముడు, నియమపాలనము చేయుచు అరణ్యములో నివసించుచుండగా, ఈతని భార్యను రావణుడు హరించినాడు. ఆ రాముడు నిన్ను శరణు పొందినాడు. 6

మూ. భవతా సఖ్యకామౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
ప్రగృహ్య చార్చయస్వైతౌ పూజనీయతమావుభౌ. 7

ప్ర.అ. భ్రాతరౌ=సోదరులైన, తౌ=ఆ, రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు, భవతా=నీతో, సఖ్యకామౌ=స్నేహమును కోరుచున్నవారు. పూజనీయతమౌ=మిక్కిలి పూజించదగిన, ఏతౌ= ఈ, ఉభౌ=ఇద్దరిని, ప్రగృహ్య=స్వీకరించి, అర్చయస్వ= పూజించుము.

తా. సోదరులైన ఈ రామలక్ష్మణులు నీతో స్నేహమును కోరుచున్నారు. చాల పూజార్హులైన వీరిద్దరిని స్వీకరించి పూజించుము. 7

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం సుగ్రీవో వానరాధిపః,
దర్శనీయతమో భూత్వా ప్రీత్యోవాచ చ రాఘవమ్. 8

ప్ర.అ. వానరాధిపః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, హనుమతః=హనుమంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, ప్రీత్యా=ఆనందముచే, దర్శనీయతమః= చూచుటకు చాల యోగ్యుడుగా, భూత్వా=అయి, రాఘవమ్=రాముని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. వానరరాజైన సుగ్రీవుడు హనుమంతుని మాటలు విని, ఆనందముచే చూచుటకు చాల అనుకూలుడుగా (ప్రసన్నుడుగా) అయి రామునితో ఇట్లు పలికెను. 8

మూ. భవాన్ధర్మవినీతశ్చ సుతపాః సర్వవత్సలః,
ఆఖ్యాతా వాయుపుత్రేణ తత్త్వతో మే భవద్గుణాః. 9

ప్ర.అ. భవాన్=నీవు, ధర్మవినీతశ్చ=ధర్మమునందు బాగుగా వినీతుడవు (శిక్షణ పొందినవాడవు). సుతపాః=మంచి తపస్సు కలవాడవు. సర్వవత్సలః=అందరియందూ ప్రేమ కలవాడవు. భవద్గుణాః=నీ గుణములు, వాయుపుత్రేణ=హనుమంతునిచేత, తత్త్వతః= యథార్థముగా, మే=నాకు, ఆఖ్యాతాః=చెప్పబడినవి.

తా. నీవు ధర్మము లన్నీ చక్కగా నేర్చినవాడవు. గొప్ప తపస్సు గలవాడవు. అందరియందు ప్రేమ గలవాడవు. నీ గుణములను గూర్చి వాయుపుత్రుడు నాకు పూర్తిగా చెప్పినాడు. 9

మూ. తన్మమైవైష సత్కారో లాభశ్చైవోత్తమః ప్రభో,
యత్త్వమిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ. 10

ప్ర.అ. ప్రభో=ఓ! ప్రభూ! తత్=ఆ కారణమువలన, త్వమ్=నీవు, వానరేణ=వానరుడనైన, మయా సహ=నాతో కూడ, సౌహార్దమ్=స్నేహమును, ఇచ్ఛసి ఇతి యత్=కోరుచున్నా వన్న మాట ఏది కలదో, ఏషః=ఇది, మమైవ=నాకే, సత్కారః= గౌరవము. ఉత్తమః=ఉత్తమమైన, లాభశ్చ=లాభము కూడ.

తా. ఓ! ప్రభూ! అందుచే నీవు వానరుడ నైన నాతో స్నేహమును కోరుచున్నా వనగా ఇది నాకే గొప్ప సత్కారము, ఉత్తమమైన లాభము! 10

మూ. రోచతే యది మే సఖ్యం బాహురేష ప్రసారితః,
గృహ్యతాం పాణినా పాణిర్మర్యాదా బధ్యతాం ధ్రువా. 11

ప్ర.అ. మే=నా యొక్క, సఖ్యమ్=స్నేహము, రోచతే యది= ఇష్టమైనచో, ఏషః=ఇదిగో, బాహుః=బాహువు, ప్రసారితః=చాపబడినది. పాణినా=హస్తము చేత, పాణిః=హస్తము, గృహ్యతామ్ =గ్రహింపబడుగాక. ధ్రువా=స్థిరమైన,

మర్యాదా=కట్టుబాటు, బధ్యతామ్=కట్టబడుగాక.

తా. నాతో స్నేహము ఇష్టమైనచో ఇదిగో నా బాహువు చాపుచున్నాను. దృఢమైన కట్టుబాటు ప్రకారము నీ చేతితో నా చేతిని పట్టుకొనుము. 11

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవస్య సుభాషితమ్,
సంప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా. 12
హృష్టః సౌహృదమాలంబ్య పర్యష్వజత పీడితమ్.

ప్ర.అ. సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, సుభాషితమ్=బాగుగా పలకబడిన, ఏతత్=ఈ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, సంప్రహృష్టమనాః=సంతోషించిన మనస్సు కలవాడై, (రాముడు), పాణినా=హస్తముతో, హస్తమ్=హస్తమును, పీడయామాస= పట్టుకొనెను. సౌహృదమ్=స్నేహమును, ఆలమ్బ్య=అవలంబించి, హృష్టః=సంతోషించినవాడై, పీడితమ్=గాఢముగా, పర్యష్వజత= కౌగలించుకొనెను.

తా. సుగ్రీవుడు చక్కగా పలికిన ఈ మాటలు విని, రాముడు మనస్సులో సంతోషించుచు, ఆతని హస్తమును తన హస్తముతో పట్టుకొనెను. ఆ విధముగ స్నేహమును అవలంబించి, సంతోషముతో ఆతనిని గాఢముగా కౌగలించుకొనెను.

మూ. తతో హనూమాన్ సంత్యజ్య భిక్షురూపమరిందమః, 13
కాష్ఠయోః స్వేన రూపేణ జనయామాస పావకమ్.
దీప్యమానం తతో వహ్నిం పుష్పైరభ్యర్చ్య సత్కృతమ్, 14
తయోర్మధ్యే తు సుప్రీతో నిదధౌ సుసమాహితః.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, అరిందమః=శత్రుసంహారకుడైన, హనుమాన్=హనుమంతుడు, భిక్షురూపమ్=సంన్యాసిరూపమును, సంత్యజ్య=విడచి, స్వేన=తనదైన, రూపేణ=రూపముతో కూడినవాడై, కాష్ఠయోః=రెండు కట్టెలయందు, పావకమ్=అగ్నిని, జనయామాస=పుట్టించెను. తతః=అటు పిమ్మట, దీప్యమానమ్ =ప్రజ్వలించుచున్న, సత్కృతమ్=అలంకరించబడిన, వహ్నిమ్= ఆ అగ్నిని, పుష్పైః=పుష్పములచేత, అభ్యర్చ్య=పూజించి, సుసమాహితః=బాగ సావధానచిత్తుడై, సుప్రీతః=చాల ఆనందించుచున్నవాడై, తయోః=ఆ రామ సుగ్రీవులయొక్క, మధ్యే=మధ్యయందు, నిదధౌ=ఉంచెను.

తా. పిమ్మట శత్రుసంహారకుడైన ఆ హనుమంతుడు సంన్యాసిరూపము విడచి, తన రూపము ధరించి, రెండు కట్టెలనుండి అగ్నిని పుట్టించి, మండుచున్న ఆ అగ్నిని పుష్పములతో పూజించి, అలంకరించి, చాల సంతోషించుచున్నవాడై, అధికమైన శ్రద్ధతో ఆ రామసుగ్రీవుల మధ్య ఉంచెను. 13, 14

మూ. తతోఽగ్నిం దీప్యమానం తౌ చక్రతుశ్చ ప్రదక్షిణమ్, 15
సుగ్రీవో రాఘవశ్చైవ వయస్యత్వముపాగతౌ.

ప్ర.అ. తతః=అటుపిమ్మట, తౌ=వారిద్దరూ, దీప్యమానమ్= ప్రజ్వరిల్లుచున్న, అగ్నిమ్=అగ్నిని, ప్రదక్షిణం చక్రతుః= ప్రదక్షిణము చేసిరి. సుగ్రీవః=సుగ్రీవుడు, రాఘవశ్చైవ=రాముడు, వయస్యత్వమ్=మిత్రత్వమును, ఉపాగతౌ=పొందినారు.

తా. పిమ్మట ఆ రామసుగ్రీవు లిద్దరూ మండుచున్న ఆ అగ్నికి ప్రదక్షిణము చేసిరి. ఈ విధముగా సుగ్రీవుడు, రాముడూ మిత్రులైరి. 15

మూ. తతః సుప్రీతమనసౌ తావుభౌ హరిరాఘవౌ, 16
అన్యోన్యమభివీక్షన్తౌ న తృప్తిమభిజగ్మతుః.

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సుప్రీతమనసౌ=చాల సంతోషించిన మనస్సులు గల, తౌ=ఆ, హరిరాఘవౌ=సుగ్రీవరాములు, ఉభౌ=ఇద్దరూ, అన్యోన్యమ్=పరస్పరము, అభివీక్షన్తౌ= చూచుచున్నవారై, తృప్తిమ్=తృప్తిని, న అభిజగ్మతుః=పొందలేదు.

తా. పిమ్మట ఆ రామసుగ్రీవు లిద్దరూ చాల సంతోషించిన మనస్సులతో పరస్పరము చూచుచు తృప్తిని పొందలేదు. 16

మూ. త్వం వయస్యోఽసి హృద్యో మే ఏకం దుఃఖం సుఖం చ నౌ, 17
సుగ్రీవో రాఘవం వాక్య మిత్యువాచ ప్రహృష్టవత్.

ప్ర.అ. త్వమ్=నీవు, మే=నాకు, హృద్యః=మనోహరుడైన, వయస్యః =మిత్రుడవు, అసి=అయినావు. నౌ=మనయొక్క, సుఖమ్=సుఖమూ, దుఃఖం చ=దుఃఖమూ, ఏకమ్=సమానములే. ఇతి= అని, సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రహృష్టవత్=సంతోషించినవాడై, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. సుగ్రీవుడు సంతోషించుచు "నీవు నాకు ప్రేమపాత్రుడవైన మిత్రుడవు అయినావు. ఇటుపై మన సుఖదుఃఖములు ఇరువురికీ సమానములు" అని పలికెను.

మూ. తతః సుపర్ణబహులాం భంక్త్వా శాఖాం సుపుష్పితామ్, 18
సాలస్యాస్తీర్య సుగ్రీవో నిషసాద సరాఘవః.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, సుగ్రీవః=సుగ్రీవుడు, సాలస్య= సాలవృక్షము యొక్క, సుపర్ణబహులామ్=మంచి ఆకులు అధికముగా గల, సుపుష్పితామ్=బాగా పుష్పించిన, శాఖామ్=కొమ్మను, భంక్త్వా=విరచి, ఆస్తీర్య=పరచి, సరాఘవః=రామునితో కూడినవాడై, నిషసాద=కూర్చుండెను.

తా. పిమ్మట సుగ్రీవుడు సాలవృక్షమునుండి బాగా ఆకులతోను, పువ్వులతోను నిండిన ఒక కొమ్మ విరిచి, దానిని నేలపై పరచి, దానిపై రామునితో కలిసి కూర్చుండెను. 18

మూ. లక్ష్మణాయాథ సంహృష్టో హనుమాన్మారుతాత్మజః, 19
శాఖాం చన్దనవృక్షస్య దదౌ పరమపుష్పితామ్.

ప్ర.అ. అథ=అటుపిమ్మట, సంహృష్టః=సంతోషించిన, మారుతాత్మజః =వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, చన్దనవృక్షస్య=చందనవృక్షము యొక్క, పరమపుష్పితామ్=బాగా పుష్పించిన, శాఖామ్=శాఖను, లక్ష్మణాయ=లక్ష్మణునికొరకు, దదౌ=ఇచ్చెను.

తా. పిమ్మట వాయుకుమారుడైన హనుమంతుడు సంతోషించి బాగుగా పుష్పించిన చందనవృక్షశాఖను లక్ష్మణున కిచ్చెను. 19

మూ. తతః ప్రహృష్టః సుగ్రీవః శ్లక్ష్ణం మధురయా గిరా, 20
ప్రత్యువాచ తదా రామం హర్షవ్యాకులలోచనః.

ప్ర.అ. తతః=అటుపిమ్మట, ప్రహృష్టః=సంతోషించిన, సుగ్రీవః =సుగ్రీవుడు, హర్షవ్యాకులలోచనః=సంతోషముతో వ్యాకులమైన నేత్రములు కలవాడై, తదా=అప్పుడు, రామమ్=రాముని గూర్చి, మధురయా=మధురమైన, గిరా=వాక్కుతో, శ్లక్ష్ణమ్= మృదువుగా, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. పిమ్మట, సుగ్రీవుడు చాలా సంతోషించి, సంతోషముచేత వ్యాకులములైన నేత్రములతో, మధురమైన మాటలతో, మృదువుగా రామునితో ఇట్లు పలికెను. 20

మూ. అహం వినికృతో రామ చరామీహ భయార్దితః, 21
హృతభార్యో వనే త్రస్తో దుర్గమేతదుపాశ్రితః.

ప్ర.అ. రామ=రామా! అహమ్=నేను, వినికృతః= అవమానింపబడినవాడనై, హృతభార్యః=హరింపబడిన భార్య కలవాడనై, భయార్దితః=భయముచేత పీడింపబడినవాడై, ఇహ=ఈ, వనే= వనమునందు, చరామి=సంచరించుచున్నాను. త్రస్తః= భయపడినవాడనై, దుర్గమ్=ప్రవేశింప శక్యము కాని, ఏతత్= ఈ వనమును, ఉపాశ్రితః=ఆశ్రయించితిని.

తా. రామా! నన్ను నా అన్నయైన వాలి అవమానించినాడు. నా భార్యను అపహరించినాడు. నేను భయముచేత పీడితుడనై ఈ వనములో తిరుగుచున్నాను. భయముతో, ఇతరు లెవ్వరూ ప్రవేశింప శక్యము కాని అరణ్యమును ఆశ్రయించినాను.

మూ. సోఽహం త్రస్తో వనేఽభీతో వసామ్యుద్భ్రాన్తచేతనః, 22
వాలినా నికృతో భ్రాత్రా కృతవైరశ్చ రాఘవ.

ప్ర.అ. రాఘవ=రామా! భ్రాత్రా=సోదరుడైన, వాలినా=వాలిచేత, నికృతః=అవమానించబడిన, కృతవైరశ్చ=చేయబడిన వైరము గల, సః అహమ్=అట్టి, నేను, త్రస్తః=భయపడినవాడనై, ఉద్భ్రాన్తచేతనః=తిరిగిపోవుచున్న బుద్ధి కలవాడనై, వనే=ఈ వనమునందు, అభీతః=వాలి భయము లేనివాడనై, వసామి= నివసించుచున్నాను.

తా. రామా! నన్ను నా సోదరుడైన వాలి అవమానించి నాతో వైరము పెట్టుకున్నాడు. నేను ఆతనినుండి భయపడినవాడనై, దుఃఖాక్రాంతమైన మనస్సుతో ఈ వనములో భయము లేకుండా నివసించుచున్నాను. 22

మూ. వాలినో మే మహాభాగ భయార్తస్యాభయం కురు, 23
కర్తుమర్హసి కాకుత్స్థ భయం మే న భవేద్యథా.

ప్ర.అ. మహాభాగ=మహాభాగ్యవంతుడా, వాలినః=వాలివలన, భయార్తస్య=భయముచేత పీడింపబడిన, మే=నాకు, అభయమ్=అభయమును, కురు=చేయుము. కాకుత్స్థ=రామా! మే=నాకు, యథా=ఎట్లు, భయమ్=భయము, న భవేత్= కలుగదో,. అట్లు, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. మహాభాగ్యవంతుడవైన* రామా! వాలినుండి కలిగిన భయముచేత పీడితుడనైన నాకు అభయము నిమ్ము. నాకు భయము కలగకుండువట్లు చేయుము. 23

మూ. ఏవముక్తస్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః, 24
ప్రత్యభాషత కాకుత్స్థః సుగ్రీవం ప్రహసన్నివ.

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, తేజస్వీ=తేజశ్శాలి, ధర్మజ్ఞః=ధర్మము నెరిగినవాడు, ధర్మవత్సలః=ధర్మమునందు ఆసక్తి గలవాడు అయిన, కాకుత్స్థః=రాముడు, ప్రహసన్నివ=నవ్వుచు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి గూర్చి, ప్రత్యభాషత=తిరిగి పలికెను.

తా. తేజఃశాలి, ధర్మములు తెలిసినవాడు, ధర్మమునందు ఆసక్తి గలవాడు అయిన రాముడు ఆ మాటలు విని, నవ్వుచు సుగ్రీవునితో ఇట్లు పలికెను. 24

మూ. ఉపకారఫలం మిత్రం విదితం మే మహాకపే, 25
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్.

ప్ర.అ. మహాకపే=గొప్ప వానరుడవైన సుగ్రీవా! మిత్రమ్=మిత్రుడు, ఉపకారఫలమ్=ఉపకారమే ఫలముగా కలవాడుగా, మే=నాకు, విదితమ్ =తెలియును. తవ=నీయొక్క, భార్యాపహారిణమ్=భార్యను అపహరించిన, తం వాలినమ్=ఆ వాలిని, వధిష్యామి=చంపగలను.

తా. సుగ్రీవుడా! మిత్రునకు ప్రయోజనము ఉపకారమే అను విషయము నాకు తెలియును. నీ భార్యను అపహరించిన ఆ వాలిని చంపగలను. 25

మూ. అమోఘాః సూర్యసంకాశాః మమేమే నిశితాః శరాః, 26
తస్మిన్ వాలిని దుర్వృత్తే నిపతిష్యన్తి వేగితాః.

కఙ్కపత్రప్రతిచ్ఛన్నా మహేన్ద్రాశనిసన్నిభాః, 27
తీక్ష్ణాగ్రా ఋజుపర్వాణః సరోషా భుజగా ఇవ.

ప్ర.అ. అమోఘాః=వ్యర్థము కానివి, సూర్యసంకాశాః=సూర్యునితో సమానమైనవి, నిశితాః=వాడియైనవి, కఙ్కపత్రప్రతిచ్ఛన్నాః= గ్రద్దల రెక్కలచేత కట్టబడినవి, మహేన్ద్రాశనిసన్నిభాః=మహేంద్రుని వజ్రముతో సమానమైనవి, తీక్ష్ణాగ్రాః=తీక్ష్ణములైన అగ్రభాగములు గలవి, ఋజుపర్వాణః= ఋజువైన కణుపులు గలవి, సరోషాః=కోపముతో కూడిన, భుజగాః ఇవ=సర్పములవలె ఉన్న, ఇమే=ఈ, మమ శరాః= నా బాణములు, వేగితాః=వేగముతో కూడినవై, దుర్వృత్తే=చెడ్డ నడవడి గల, తస్మిన్ వాలిని= ఆ వాలిపై, నిపతిష్యన్తి=పడగలవు.

తా. సూర్యుని వంటి ప్రకాశము గల వాడియైన నా బాణములు అమోఘములు. వీటికి గ్రద్దల రెక్కలు కట్టబడినవి. వాడియైన చివరి భాగములు, వంకరలేని కణుపులు గల ఈ బాణములు మహేంద్రుని వజ్రముతో సమానమైనవి. ఇవి కోపించిన సర్పముల వలె, మహావేగముతో చెడ్డ నడవడిక గల ఆ వాలిపై పడగలవు. 26, 27

మూ. తమద్య వాలినం పశ్య తీక్ష్ణై రాశీవిషోపమైః, 28
శరైర్వినిహతం భూమౌ ప్రకీర్ణమివ పర్వతమ్.

ప్ర.అ. అద్య=ఇప్పుడు, ఆశీవిషోపమైః=పాములతో సమానమైన, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, వినిహతమ్= చంపబడిన, భూమౌ=భూమిమీద, ప్రకీర్ణమ్=పడగొట్టబడిన, పర్వతమివ=పర్వతము వలె ఉన్న, వాలినమ్=వాలిని, పశ్య= చూడుము.

తా. ఇపుడే వాలిని సర్పములవంటి బాణముల చేత చంపి పర్వతమును పడగొట్టినట్లు పడగొట్టెదను. నీవు చూడగలవు. 28

మూ. స తు తద్వచనం శ్రుత్వా రాఘవస్యాత్మనో హితమ్, 29
సుగ్రీవః పరమప్రీతః పరమం వాక్యమబ్రవీత్.

ప్ర.అ. సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, ఆత్మనః=తనకు, హితమ్= హితమైన, రాఘవస్య=రామునియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, పరమప్రీతః=చాల సంతోషించినవాడై, పరమమ్=శ్రేష్ఠమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. రాముడు పలికిన, తనకు హితమైన ఆ మాట విని, సుగ్రీవుడు చాలా సంతోషించి మంచి మాట పలికెను. 29

మూ. తవ ప్రసాదేన నృసింహ వీర
ప్రియాం చ రాజ్యం చ సమాప్నుయామహమ్,

తథా కురు త్వం నరదేవ వైరిణం
యథా న హింస్యాత్స పునర్మమాగ్రజమ్. 31

ప్ర.అ. నృసింహ=నరులలో శ్రేష్ఠుడా! వీర=వీరుడా! తవ= నీయొక్క, ప్రసాదేన=అనుగ్రహముచేత, అహమ్=నేను, ప్రియాం చ =ప్రియురాలిని, రాజ్యం చ=రాజ్యమునూ, సమాప్నుయామ్=పొందుదును గాక. నరదేవ=నరుల ప్రభువా! సః=అతడు, పునః=మరల, యథా=ఎట్లు, న హింస్యాత్ =నన్ను హింసించకుండా ఉండునో, తథా=అట్లు, త్వమ్=నీవు, వైరిణమ్=శత్రువైన, మమ అగ్రజమ్=నా అన్నను, కురు=చేయుము.

తా. నరులలో శ్రేష్ఠుడవైన ఓ! వీరుడా! నీ అనుగ్రహము చేత నేను నా భార్యను, రాజ్యమును పొందెదను గాక! ఓ! మహారాజా! నాకు శత్రువైన నా అన్న నన్ను మరల ఎన్నడూ బాధించకుండా ఉండునట్లు చేయుము. 31

మూ. సీతా కపీన్ద్రక్షణదాచరాణాం
రాజీవహేమజ్వలనోపమాని,
సుగ్రీవరామప్రణయప్రసఙ్గే
వామాని నేత్రాణి సమం స్ఫురన్తి. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చమః సర్గః.

ప్ర.అ. సుగ్రీవరామప్రణయప్రసఙ్గే=సుగ్రీవునకు రామునకు స్నేహము జరిగిన ప్రసంగమునందు, సీతాకపీన్ద్రక్షణదాచరాణామ్=సీతయొక్క, వాలియొక్క, రావణునియొక్క, రాజీవహేమజ్వలనోపమాని=పద్మముతోను, బంగారముతోను, అగ్నితోను సమానములైన, నేత్రాణి=నేత్రములు, సమమ్= ఒక్కమారుగా, స్ఫురన్తి=అదిరినవి.

తా. రామునకు సుగ్రీవునకు మైత్రి జరిగినప్పుడు పద్మము వంటి సీత ఎడమ కన్ను, బంగారము వలె పచ్చగా ఉన్న వాలి ఎడమకన్ను, అగ్ని వలె ఎఱ్ఱగా ఉన్న రావణుని ఎడమ కన్ను ఒక్కమారుగా అదిరినవి.

వి. 17వ శ్లోకం ఉత్తరార్ధంనుండి (త్వం వయస్యోఽసి) 32వ శ్లోకం వరకు ఉన్న 15 శ్లోకాలు ప్రాచ్యపాఠంలో లేవు. రాముడు తన బాణాల ప్రభావం గూర్చి తానే చెప్పకోకుండా ఉండడమే బాగున్నది. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఐదవసర్గ సమాప్తము.

# అథ షష్ఠః సర్గః

*[సుగ్రీవుడు సీత జారవిడచిన అలంకారములను రామునకు చూపుట. రాముడు శోకరోషములతో పలికిన మాటలు.]*

మూ. పునరేవాబ్రవీత్ ప్రీతో రాఘవం రఘునన్దనమ్,
అయమాఖ్యాతి తే రామ సేవకో మన్త్రిసత్తమః. 1
హనుమాన్ యన్నిమిత్తం త్వం నిర్జనం వనమాగతః,
లక్ష్మణేన సహ భ్రాత్రా వసతశ్చ వనే తవ. 2
రక్షసాపహృతా భార్యా మైథిలీ జనకాత్మజా,
త్వయా వియుక్తా రుదతీ లక్ష్మణేన చ ధీమతా. 3

ప్ర.అ. ప్రీతః=సంతోషించిన ఆ సుగ్రీవుడు, రఘునన్దనమ్= రఘువంశీయులకు ఆనందమును కలిగించు, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, పునరేవ=మరల, అబ్రవీత్=పలికెను. రామ=రామా! త్వమ్=నీవు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ= లక్ష్మణునితో కూడ, యన్నిమిత్తమ్=ఎందువలన, నిర్జనమ్= నిర్జనమైన, వనమ్=వనమును గూర్చి, ఆగతః=వచ్చినావో, తే= నీయొక్క, సేవకః=సేవకుడు, మన్త్రిసత్తమః=మంత్రులలో శ్రేష్ఠుడూ అయిన, అయమ్=ఈ, హనుమాన్=హనుమంతుడు, ఆఖ్యాతి=చెప్పుచున్నాడు. వనే=వనమునందు, వసతః= నివసించుచున్న, తవ=నీయొక్క, భార్యా =భార్య, త్వయా=నీతోను, ధీమతా=బుద్ధిమంతుడైన, లక్ష్మణేన చ=లక్ష్మణునితోను, వియుక్తా=వియుక్తురాలు, రుదతీ=ఏడ్చుచున్నది, జనకాత్మజా=జనకుని కుమార్తె అయిన, మైథిలీ=సీత, రక్షసా= రాక్షసునిచేత, అపహృతా=అపహరించబడినది.

తా. సుగ్రీవుడు సంతోషించుచు, రఘువంశీయులకు ఆనందమును కలిగించు ఆ రామునితో మరల ఇట్లు పలికెను. "రామా! నీవు, నీ సోదరుడైన లక్ష్మణునితో కలిసి ఈ నిర్జనవనములోనికి ఎందుకు వచ్చినావో, నీ సేవకుడు, మంత్రులలో శ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు నాకు చెప్పినాడు. వనములో నివసించుచున్న నీ భార్యయైన, విలపించుచున్న జనకరాజకుమారి సీతను, నీవు, ధీమంతుడైన లక్ష్మణుడు లేని సమయమునందు రాక్షసుడు అపహరించినాడను విషయము కూడ చెప్పినాడు". 1-3

మూ. అన్తరం ప్రేప్సునా తేన హత్వా గృధ్రం జటాయుషమ్,
భార్యావియోగజం దుఃఖం ప్రాపితస్తేన రక్షసా. 4

ప్ర.అ. అన్తరమ్=అవకాశమును, ప్రేప్సునా=పొంద చూచుచున్న, తేన=ప్రసిద్ధుడైన, తేన రక్షసా=ఆ రాక్షసునిచేత, జటాయుషమ్=జయాయు వనే, గృధ్రమ్=గృధ్రమును, హత్వా=చంపి, భార్యావియోగజమ్=భార్యావియోగమువలన కలిగిన, దుఃఖమ్= దుఃఖమును, ప్రాపితః=పొందింపబడితివి.

తా. "ఆ రాక్షసుడు అవకాశమునకై చూచుచు ఉండి, జటాయువును చంపి, నీకు భార్యావియోగదుఃఖమును కలిగించినా డని చెప్పినాడు". 4

మూ. భార్యావియోగజం దుఃఖం న చిరాత్త్వం విమోక్ష్యసే,
అహం తామానయిష్యామి నష్టాం వేదశ్రుతీమివ. 5

ప్ర.అ. త్వమ్=నీవు, నచిరాత్=కొద్దికాలములో, భార్యావియోగజమ్=భార్యా వియోగమువలన కలిగిన, దుఃఖమ్=దుఃఖమును, విమోక్ష్యసే= విడవగలవు. అహమ్=నేను, నష్టామ్=నష్టమైన, వేదశ్రుతీమివ=వేదమును వలె, తామ్=ఆమెను, ఆనయిష్యామి=తీసికొని రాగలను.

తా. భార్యావియోగమువలన కలిగిన నీ దుఃఖము అచిరకాలములో తొలగిపోవును. నష్టమైన వేదమును వలె ఆమెను నేను తీసుకొని వచ్చెదను.

మూ. రసాతలే వా వర్తన్తీం వర్తన్తీం వా నభస్తలే,
అహమానీయ దాస్యామి తవ భార్యామరిందమ. 6

ప్ర.అ. అరిందమ=శత్రుసంహారకుడా! రసాతలే=పాతాళమునందు, వర్తన్తీం వా=ఉంటున్నా, నభస్తలే=ఆకాశమునందు, వర్తన్తీం వా=ఉంటున్నా, తవ భార్యామ్=నీ భార్యను, ఆనీయ=తీసికొని వచ్చి, దాస్యామి=ఇవ్వగలను.

తా. ఓ! శత్రుసంహారకుడా! నీ భార్య పాతాళములో ఉన్నా, ఆకాశమునందున్నా, నే నామెను తీసికొని వచ్చి నీ కిచ్చెదను. 6

మూ. ఇదం తథ్యం మమ వచస్త్వమవేహి చ రాఘవ,
న శక్యా సా జరయితుం సేన్ద్రైరపి సురాసురైః, 7
తవ భార్యా మహాబాహో భక్ష్యం విషకృతం యథా.

ప్ర.అ. రాఘవ=రామా! మమ=నాయొక్క, ఇదం వచః=ఈ వచనమును, తథ్యమ్=యథార్థమైనదానినిగా, త్వమ్=నీవు, అవేహి=తెలిసికొనుము. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! తవ భార్యా=నీ భార్యయైన, సా=ఆమె, విషకృతమ్=విషముతో చేయబడిన, భక్ష్యం యథా=భక్ష్యమువలె, సేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సురాసురైరపి=సురాసురులచేత కూడ, జరయితుమ్= జీర్ణింపచేసికొనుటకు, న శక్యా=శక్యమైనది కాదు.

తా. గొప్ప బాహువులు గల రామా! నేను చెప్పే ఈ మాట సత్యము. ఇంద్రునితో కూడిన సురులు గాని, అసురులు గాని నీ భార్యను, విషము కలిపి

వండిన భక్ష్యములను వలె జీర్ణించుకొనజాలరు. 7

మూ. త్యజ శోకం మహాబాహో తాం కాన్తా మానయామి తే, 8
అనుమానాత్తు జానామి మైథిలీ సా న సంశయః.
హ్రియమాణా మయా దృష్టా రక్షసా రౌద్రకర్మణా, 9
క్రోశన్తీ రామ రామేతి లక్ష్మణేతి చ విస్వరమ్.
స్ఫురన్తీ రావణస్యాఙ్కే పన్నగేన్ద్రవధూర్యథా. 10

ప్ర.అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! శోకమ్=శోకమును, త్యజ=విడువుము. తే=నీయొక్క, కాన్తామ్=భార్యయైన, తామ్=ఆ సీతను, ఆనయామి=తీసికొని వచ్చెదను. రౌద్రకర్మణా= భయంకరమైన కర్మ గల, రక్షసా=రాక్షసునిచేత, హ్రియమాణా= హరించబడుచున్నది, రామ రామేతి=రామా! రామా! అని, లక్ష్మణేతి చ= లక్ష్మణా అని, విస్వరమ్=వికృతస్వరము కలుగునట్లుగా, విలపన్తీ= విలపించుచున్నదీ, పన్నగేన్ద్రవధూర్యథా=ఆడసర్పము వలె, రావణస్య=రావణునియొక్క, అఙ్కే=అంకమునందు, స్ఫురన్తీ= కదలుచున్నదీ, మయా=నాచేత, దృష్టా=చూడబడినదీ అయిన, సా=ఆ స్త్రీ, మైథిలీ=సీతయే. అనుమానాత్=ఊహవలన, జానామి=తెలుసుకొనుచున్నాను. సంశయః=సంశయము,న=లేదు.

తా. గొప్ప బాహువులు గల ఓ! రామా! దుఃఖమును విడిచిపెట్టుము. నేను నీ భార్యను తీసికొని వచ్చెదను. భయంకరములైన పనులు చేయు ఆ రాక్షసుడు అపహరించుకొనిపోవుచుండగా, ఆ రావణుని ఒడిలో ఆడ సర్పము వలె, దొర్లుచూ, రామా! రామా! అని, లక్ష్మణా! అనీ, వికృతస్వరముతో ఏడ్చుచు ఆనాడు నాకు కనబడిన స్త్రీ సీతయే. సందేహము లేదు. ఊహచే తెలుసుకొనుచున్నాను. 8, 9, 10

మూ. ఆత్మనా పఞ్చమం మాం హి దృష్ట్వా శైలతలే స్థితమ్,
ఉత్తరీయం తయా త్యక్తం శుభాన్యాభరణాని చ. 11

ప్ర.అ. శైలతలే=పర్వతము పైభాగమునందు, స్థితమ్=ఉన్న, ఆత్మనా పఞ్చమమ్=నాచేత ఐదవవాడనైన, మామ్=నన్ను, దృష్ట్వా=చూచి, తయా=ఆమెచేత, ఉత్తరీయమ్=ఉత్తరీయము, త్యక్తమ్=జారవిడవబడినది. శుభాని=మంగళప్రదములైన, ఆభరణాని చ=అలంకారములు కూడ విడవబడినవి.

తా. నేను ఇంకా నలుగురితో కలిసి పర్వతముపై ఉండగా చూచి ఆమె తన ఉత్తరీయమును, శ్రేష్ఠములైన అలంకారములను జారవిడచినది. 11

మూ. తాన్యస్మాభిర్గృహీతాని నిహితాని చ రాఘవ,
ఆనయిష్యామ్యహం తాని ప్రత్యభిజ్ఞాతుమర్హసి. 12

ప్ర.అ. రాఘవ=రామా! తాని=అవి, అస్మాభిః=మాచేత, గృహీతాని=గ్రహించబడినవి. నిహితాని చ=(జాగర్తగా) ఉంచబడినవి. అహమ్=నేను, తాని=వాటిని, ఆనయిష్యామి=తీసికొనివచ్చెదను. ప్రత్యభిజ్ఞాతుమ్=గుర్తించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. రామా! వీటి నన్నింటినీ తీసి మేము జాగర్త చేసినాము. నేను వాటిని తీసికొనివచ్చెదను. నీవు గుర్తింపుము. 12

మూ. తమబ్రవీత్తతో రామః సుగ్రీవం ప్రియవాదినమ్,
ఆనయస్వ సఖే శీఘ్రం కిమర్థం ప్రవిలమ్బసే. 13

ప్ర.అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, ప్రియవాదినమ్= ప్రియమును పలుకు, తం సుగ్రీవమ్=ఆ సుగ్రీవుని గూర్చి, అబ్రవీత్= పలికెను. సఖే=మిత్రుడా! శీఘ్రమ్=శీఘ్రముగా, ఆనయస్వ= తీసికొనిరమ్ము. కిమర్థమ్=ఎందుకు, ప్రవిలమ్బసే=ఆలస్యము చేయుచున్నావు?

తా. అప్పుడు రాముడు ప్రియవాక్యములు పలుకు ఆ సుగ్రీవునితో ఇట్లనెను - "మిత్రుడా! శీఘ్రముగా తీసికొనిరమ్ము. ఆలస్య మెందుకు?" 13

మూ. ఏవముక్తస్తు సుగ్రీవః శైలస్య గహనాం గుహామ్,
ప్రవివేశ తతః శీఘ్రం రాఘవప్రియకామ్యయా. 14

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, తతః=అటుపిమ్మట, రాఘవప్రియకామ్యయా=రామునకు ప్రియము చేయవలెనను కోరికచేత, శైలస్య=పర్వతముయొక్క, గహనామ్= ప్రవేశింప శక్యము కాని, గుహామ్=గుహను, శీఘ్రమ్=శీఘ్రముగా, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట సుగ్రీవుడు రాముని మాటలు విని, రామునకు ప్రియమును చేకూర్చవలె ననే కోరికతో, ప్రవేశించుటకు కష్టమైన పర్వతగుహలోనికి శీఘ్రముగా ప్రవేశించెను. 14

మూ. ఉత్తరీయం గృహీత్వా తు స తాన్యాభరణాని చ,
ఇదం పశ్యేతి రామాయ దర్శయామాస వానరః. 15

ప్ర.అ. సః వానరః=ఆ సుగ్రీవుడు, ఉత్తరీయమ్=ఉత్తరీయమును, తాని=ఆ, ఆభరణాని చ=ఆభరణములను, గృహీత్వా=గ్రహించి, ఇదమ్=ఇదిగో, పశ్య=చూడుము. ఇతి=అని, రాఘవాయ= రామునకు, దర్శయామాస=చూపెను.

తా. సుగ్రీవుడు ఆ ఉత్తరీయమును, అలంకారాలను తీసికొని వచ్చి "ఇవిగో చూడుము" అని రామునకు చూపెను. 15

మూ. తతో గృహీత్వా వాసస్తు శుభాన్యాభరణాని చ,
అభవద్బాష్పసంరుద్ధో నీహారేణేవ చన్ద్రమాః. 16

ప్ర.అ. తతః=అటుపిమ్మట, వాసః=వస్త్రమును, శుభాని=శ్రేష్ఠములైన, ఆభరణాని చ=అలంకారములను, గృహీత్వా=గ్రహించి, నీహారేణ=మంచుచేత, చన్ద్రమాః ఇవ=చంద్రుడు వలె, బాష్పసంరుద్ధః=కన్నీటిచేత నిరోధింపబడినవాడై, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు ఆ ఉత్తరీయమును, శ్రేష్ఠములైన, అలంకారములను గ్రహించి చంద్రుడు పొగమంచుచేత కప్పబడి నట్లు బాష్పముచేత ఆవరించబడెను.

మూ. సీతాస్నేహప్రవృత్తేన స తు బాష్పేణ దూషితః,
హా ప్రియేతి రుదన్ ధైర్యముత్సృజ్య న్యపతత్ క్షితౌ. 17

ప్ర.అ. సః తు=ఆ రాముడైతే, సీతాస్నేహప్రవృత్తేన=సీతయందున్న స్నేహముచేత బయల్వెడలిన, బాష్పేణ=కన్నీటిచేత, దూషితః=దూషితుడై, ధైర్యమ్=ధైర్యమును, ఉత్సృజ్య=విడచి, హా ప్రియేతి=అయ్యో! ప్రియురాలా! అని, రుదన్=ఏడ్చుచు, క్షితౌ=నేలమీద, న్యపతత్= పడెను.

తా. సీతమీద ఉన్న ప్రేమచేత బయల్వెడలిన కన్నీరు కప్పగా, ఆ రాముడు ధైర్యము విడచి, హా!ప్రియా! అని ఏడ్చుచు, మూర్ఛచెంది నేలపై పడెను.

మూ. హృది కృత్వా స బహుశస్తమలంకారముత్తమమ్,
నిశశ్వాస భృశం సర్పో బిలస్థ ఇవ రోషితః. 18

ప్ర.అ. సః=ఆ రాముడు, ఉత్తమమ్=ఉత్తమమైన, తమ్ అలంకారమ్= ఆ అలంకారమును, బహుశః=అనేకపర్యాయములు, హృది= వక్షఃస్థలమునందు, కృత్వా= ఉంచుకొని, రోషితః=కోపించిన, బిలస్థః=బిలములో ఉన్న, సర్పః ఇవ=సర్పము వలె, భృశమ్= మిక్కిలి, నిశశ్వాస=నిట్టూర్చెను.

తా. రాముడు, ఉత్తమములైన ఆ అలంకారములను మాటిమాటికి వక్షఃస్థలమునం దుంచుకొనుచు, కలుగులో ఉన్న కోపించిన సర్పమువలె నిట్టూర్చెను (బుసలు కొట్టెను.) 18

మూ. అవిచ్ఛిన్నాశ్రువేగస్తు సౌమిత్రిం ప్రేక్ష్య పార్శ్వతః,
పరిదేవయితుం దీనం రామః సముపచక్రమే. 19

ప్ర.అ. రామః=రాముడు, అవిచ్ఛిన్నాశ్రువేగః=ఎడతెరిపి లేని కన్నీళ్ల వేగము గలవాడై, పార్శ్వతః=ప్రక్కనే ఉన్న, సౌమిత్రిమ్=లక్ష్మణుని, ప్రేక్ష్య=చూచి, దీనమ్=దీనముగా, పరిదేవయితుమ్=విలపించుటకు, సముపచక్రమే=ప్రారంభించెను.

తా. కన్నీళ్లు అవిచ్ఛిన్నముగా కారుచుండగా, రాముడు అక్కనే ఉన్న

లక్ష్మణుని చూచి, దైన్యముతో విలపించ ప్రారంభించెను. 19

మూ. పశ్య లక్ష్మణ వైదేహ్యా సంత్యక్తం హ్రియమాణయా,
ఉత్తరీయమిదం భూమౌ శరీరాద్భూషణాని చ. 20

ప్ర.అ. లక్ష్మణ=లక్ష్మణా! హ్రియమాణయా=హరించబడుచున్న, వైదేహ్యా=సీతచేత, శరీరాత్=శరీరమునుండి తీసి, భూమౌ= భూమియందు, సంత్యక్తమ్=విడువబడిన, ఇదమ్ ఉత్తరీయమ్=ఈ ఉత్తరీయమును, భూషణాని చ=అలంకారములను, పశ్య=చూడుము.

తా. లక్ష్మణా! రాక్షసుడు అపహరించుకొనిపోవుచున్నప్పుడు సీత తన శరీరమునుండి తీసి నేలపై జారవిడచిన ఈ ఉత్తరీయమూ, అలంకారాలూ చూడుము. 20

మూ. శాద్వలిన్యాం ధ్రువం భూమౌ సీతయా హ్రియమాణయా,
ఉత్సృష్టం భూషణమిదం తథారూపం హి దృశ్యతే. 21

ప్ర.అ. హ్రియమాణయా=హరించబడుచున్న, సీతయా=సీతచేత, ఇదమ్=ఈ, భూషణమ్=భూషణము, శాద్వలిన్యామ్=పచ్చగడ్డితో కూడిన, భూమౌ=నేలమీద, ఉత్సృష్టమ్=విడవబడినది. ధ్రువమ్= నిశ్చయము. తథారూపమ్=పూర్వమున్న రూపము కలదిగానే, దృశ్యతే హి= చూడబడుచున్నది గదా!

తా. హరింపబడుచున్నప్పుడు సీత ఈ అలంకారములను పచ్చికతో నిండిన నేలమీద జారవిడిచినది. నిశ్చయము. అందుచేతనే ఇవి విరిగిపోకుండా పూర్వము వలెనే ఉన్నవి. 21

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణో వాక్యమబ్రవీత్.
నాహం జానామి కేయూరే నాహం జానామి కుణ్డలే, 22
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివన్దనాత్.

ప్ర.అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, లక్ష్మణః=లక్ష్మణుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను. అహమ్=నేను, కేయూరే=బాహుపురులను, న జానామి= ఎరుగను. కుణ్డలే=కుండలములను, న=ఎరుగను. నిత్యమ్= నిత్యమూ, పాదాభివన్దనాత్=పాదములకు వందనము చేయుటవలన, నూపురే తు=నూపురములనైతే, అభిజానామి=గుర్తించగలను.

తా. రాముని మాటలు విని లక్ష్మణు డిట్లు పలికెను - నాకు బాహుపురులు గాని, కుండలములు గాని తెలియవు. కాని నిత్యమూ సీతకు పాదాభివందనము చేయుచుండుటచే ఆమె నూపురములను గుర్తించగలను.

వి. ఈ లక్ష్మణవాక్యము ప్రాచ్యపాఠములో లేదు. దీనిపై గోవిందరాజుల వ్యాఖ్యానము కూడ లేదు. సుందరకాండలో హనుమంతుడు సీత ధరించి ఉన్న

కర్ణాలంకారాలు, బాహువుల అలంకారాలు కూడ చూచినట్లు ఉన్నది. దానిని పట్టి సీత జారవిడచిన వాటిలో అవి లేవని చెప్పాలి. ఇంక లక్ష్మణుడు మామూలు మాటలలో ఈ విధంగా చెప్పినా డని సమర్థించుకోవాలి. రాముడు "లక్ష్మణా! ఈ అలంకారాలు చూచావా?" అని ప్రశ్నించడంలో తన దుఃఖాన్ని సూచించడమే కాని గుర్తు పట్టగలవా అని భావం రాదు. నిజంగా ఆ అభిప్రాయంతోనే అడిగినా లక్ష్మణుడు ఊకొట్టి దుఃఖాన్ని ప్రకటించాలే గాని తన యథార్థవాదిత్వాన్ని సూచిస్తూ "ఇవి గుర్తుపడతాను. ఇవి గుర్తుపట్టలేను" అని చెప్పవలసిన పని లేదు.

మూ. తతస్తు రాఘవో వాక్యం సుగ్రీవమిద మబ్రవీత్. 23
బ్రూహి సుగ్రీవ కం దేశం హ్రియన్తీ లక్షితా త్వయా,
రక్షసా రౌద్రరూపేణ మమ ప్రాణైః ప్రియా ప్రియా. 24

ప్ర.అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. సుగ్రీవ=సుగ్రీవా! మమ=నాయొక్క, ప్రాణైః=ప్రాణములతో, ప్రియా=ప్రియురాలైన, ప్రియా=ప్రియురాలు,రౌద్రరూపేణ=భయంకరమైన రూపము గల, రక్షసా=రాక్షసునిచేత, కం దేశమ్=ఏ దేశమును గూర్చి, హ్రియన్తీ=హరింపబడుచున్నదై, త్వయా=నీ చేత, లక్షితా= చూడబడినదో, బ్రూహి=చెప్పుము.

తా. పిమ్మట రాముడు సుగ్రీవునితో ఇట్లు పలికెను. "సుగ్రీవుడా! నాకు ప్రాణముల వలె ఇష్టురాలైన నా ప్రియురాలిని భయంకరమైన రూపము గల రాక్షసుడు ఏ దేశమునకు తీసికొని పోవుచుండగా నీవు చూచినావో చెప్పుము.24

మూ. క్వ వా వసతి తద్రక్షో మహద్వ్యసనదం మమ,
యన్నిమిత్తమహం సర్వాన్నాశయిష్యామి రాక్షసాన్. 25

ప్ర.అ. అహమ్=నేను, యన్నిమిత్తమ్=ఏ రాక్షసుని నిమిత్తమున, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను, నాశయిష్యామి= నశింపచేసెదనో, తత్=ఆ, మమ=నాకు, వ్యసనదమ్=దుఃఖమును కలిగించిన, మహత్ రక్షః=గొప్పరాక్షసుడు, క్వ వా=ఎక్కడ, వసతి=నివసించుచున్నాడు?

తా. నాకు దుఃఖమును కలిగించిన ఆ గొప్ప రాక్షసుడు ఎక్కడ నివసించుచున్నాడు? వాని మూలమున నేను రాక్షసుల నందరినీ నశింపచేయగలను.

మూ. హరతా మైథిలీం యేన మాం చ రోషయతా ధ్రువమ్,
ఆత్మనో జీవితాన్తాయ మృత్యుద్వారమపావృతమ్. 26

ప్ర.అ. మైథిలీమ్=సీతను, హరతా=హరించినవాడు, మామ్=నన్ను, రోషయతా చ=కోపింపచేసినవాడూ అయిన, యేన=ఎవనిచేత, ధ్రువమ్=నిశ్చయముగా, ఆత్మనః=తనయొక్క, జీవితాన్తాయ= జీవితముయొక్క అంతముకొరకు, మృత్యు

ద్వారమ్=మృత్యువుయొక్క ద్వారము, అపావృతమ్=తెరవబడినదో.

తా. ఆ రాక్షసుడు సీతను అపహరించి నాకు కోపము కలిగించుట ద్వారా తన ప్రాణములు విడుచుటకై మృత్యుద్వారమును తెరచినాడు. 26

మూ. మమ దయితతమా హృతా వనా
ద్రజనిచరేణ విమథ్య యేన సా,
కథయ మమ రిపుం తమద్య వై
ప్లవగపతే యమసంనిధిం నయామి. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షష్ఠః సర్గః.

ప్ర.అ. ప్లవగపతే=వానరరాజా! యేన=ఏ, రజనిచరేణ=రాక్షసునిచేత, మమ=నాయొక్క, దయితతమా=చాల ప్రియురాలైన, సా=ఆ సీత, విమథ్య=బలాత్కరించి, వనాత్=వనమునుండి, హృతా= హరించబడినదో, మమ=నాయొక్క, రిపుమ్=శత్రువైన, తమ్= ఆతనిని గూర్చి, కథయ=చెప్పుము. అద్య=ఇప్పుడే, యమసంనిధిమ్=యముని సమీపమును గూర్చి, నయామి=పంపెదను.

తా. సుగ్రీవా! నా ప్రియురాలైన సీతను బలాత్కారముగా వనమునుంచి తీసికొనిపోయిన ఆ రాక్షసు డెవడో చెప్పుము. నా శత్రువైన వానిని నేను ఇప్పుడే యమలోకమునకు పంపెదను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండములో
ఆరవసర్గ సమాప్తము.

## అథ సప్తమః సర్గః

[సుగ్రీవుడు రాముణ్ణి ఓదార్చుట. రాముడు నీ కార్యమును సాధించెద నని సుగ్రీవునితో చెప్పుట]

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో రామేణార్తేన వానరః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం సబాష్పం బాష్పగద్గదః. 1

ప్ర.అ. ఆర్తేన=దుఃఖితుడైన, రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, వానరః=వానరుడైన, సుగ్రీవః= సుగ్రీవుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, బాష్పగద్గదః= కన్నీటితో గద్గదస్వరము కలవాడై, సబాష్పమ్=కన్నీటితో కూడిన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు దుఃఖితుడైన రాముని మాటలు విని, అంజలి ఘటించి, కన్నీళ్లు కార్చుచు, కన్నీళ్ళచేత డగ్గుత్తిక చెందిన కంఠస్వరముతో ఇట్లు పలికెను.

మూ. న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః,
సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులేయస్య వా కులమ్. 2

ప్ర.అ. దౌష్కులేయస్య=దుష్టకులమునకు సంబంధించిన, తస్య=ఆ, పాపరక్షసః=పాపాత్ముడైన రాక్షసునియొక్క, నిలయమ్=నివాసమును గాని, సామర్థ్యమ్=సామర్థ్యమును గాని, విక్రమం వాపి= పరాక్రమమును గాని, కులం వా=కులమును గాని, సర్వథా=అన్ని విధములా, (ఏమాత్రమూ), న జానే=ఎరుగను.

తా. దుష్టకులమునందు పుట్టిన పాపాత్ముడైన ఆ రాక్షసుని నివాసము గాని, సామర్థ్యము కాని, పరాక్రమము గాని, కులము గాని నాకు తెలియదు. 2

మూ. సత్యం తు ప్రతిజానామి త్యజ శోకమరిందమ,
కరిష్యామి తథా యత్నం యథా ప్రాప్స్యసి మైథిలీమ్. 3

ప్ర.అ. అరిందమ=శత్రువినాశకుడా! సత్యమ్=సత్యముగా, ప్రతిజానామి =ప్రతిజ్ఞ చేయుచున్నాను. శోకమ్=శోకమును, త్యజ= విడువుము. మైథిలీమ్=సీతను, యథా=ఎట్లు, ప్రాప్స్యసి= పొందగలవో, తథా=అట్లు, యత్నమ్=ప్రయత్నమును, కరిష్యామి=చేసెదను.

తా. శత్రుసంహారకుడ వైన రామా! దుఃఖమును విడిచిపెట్టుము. నీకు సీత లభించునట్లు చేసెదను. నిజముగా ప్రతిజ్ఞ చేయుచున్నాను. 3

మూ. రావణం సగణం హత్వా పరితోష్యాత్మపౌరుషమ్,
తథాస్మి కర్తా నచిరా ద్యథా ప్రీతో భవిష్యసి. 4

ప్ర.అ. సగణమ్=పరివారముతో కూడిన, రావణమ్=రావణుని, హత్వా=చంపి, ఆత్మపౌరుషమ్=తన పౌరుషమును, పరితోష్య= సంతోషింపచేసి, యథా=ఎట్లు, ప్రీతః=సంతోషించినవాడవు, భవిష్యసి =కాగలవో, తథా=అట్లు, నచిరాత్=అచిర కాలమునందు, కర్తాస్మి=చేయగలను.

తా. నీవు పరివారముతో కూడిన రావణుని చంపి, నీ పౌరుషమును సార్థకము చేసికొని సంతోషించునట్లు శీఘ్రముగా చేయగలను. 4

మూ. అలం వైక్లబ్యమాలమ్బ్య ధైర్యమాత్మగతం స్మర,
త్వద్విధానాం న సదృశమీదృశం బుద్ధిలాఘవమ్. 5

ప్ర.అ. వైక్లబ్యమ్=దైన్యమును, ఆలమ్బ్య=అవలంబించి, అలమ్ =చాలును. ఆత్మగతమ్=నీలో ఉన్న, ధైర్యమ్=ధైర్యమును, స్మర=స్మరించుము. త్వద్విధానామ్=నీవంటివారికి, ఈదృశమ్= ఇట్టి, బుద్ధిలాఘవమ్=బుద్ధియొక్క లఘుత్వము, న సదృశమ్= తగినది కాదు.

తా. దైన్యమును అవలంబించకుము. నీలో సహజముగా ఉన్న ధైర్యమును జ్ఞప్తికి తెచ్చుకొనుము. నీవంటి వారికి ఇలాంటి తేలికయైన బుద్ధి తగదు. 5

మూ. మయాపి వ్యసనం ప్రాప్తం భార్యావిరహజం మహత్,
నాహమేవం హి శోచామి ధైర్యం న చ పరిత్యజే. 6

ప్ర.అ. మయాపి=నాచేతకూడ, భార్యావిరహజమ్=భార్యావిరహమువలన కలిగిన, మహత్=గొప్ప, వ్యసనమ్=దుఃఖము, ప్రాప్తమ్= పొందబడినది. అహమ్=నేను, ఏవమ్=ఇట్లు, న శోచామి= దుఃఖించుట లేదు. ధైర్యం చ =ధైర్యమును, న పరిత్యజే= విడచుటలేదు.

తా. భార్యావిరహమువలన నాకు కూడ గొప్ప ఆపద సంభవించినది. కాని నేను ఈ విధముగా దుఃఖించుట లేదు. ధైర్యమును విడచుట లేదు. 6

మూ. నాహం తామనుశోచామి ప్రాకృతో వానరోఽపి సన్,
మహాత్మా చ వినీతశ్చ కిం పునర్ధృతిమాన్ భవాన్. 7

ప్ర.అ. అహమ్=నేను, ప్రాకృతః=సామాన్యుడనైన, వానరోఽపి సన్=వానరుడనైనా, తామ్=ఆ భార్యను గూర్చి, న అనుశోచామి =దుఃఖించుటలేదు. మహాత్మా చ=మహాత్ముడవు, వినీతశ్చ= శాస్త్రాధ్యయనము కలవాడవు, ధృతిమాన్=ధైర్యవంతుడవు అయిన, భవాన్=నీవు, కిం పునః=చెప్పనేల?

తా. నేను సాధారణ వానరుడనే అయినా నా భార్యను గూర్చి

దుఃఖించుటకు లేదనగా, మహాత్ముడవు, విద్యావంతుడవు, ధైర్యవంతుడవు అయిన నీవు దుఃఖించకూడదు అను విషయము చెప్పవలెనా! 7

మూ. బాష్పమాపతితం ధైర్యాన్నిగ్రహీతుం త్వమర్హసి,
మర్యాదాం సత్త్వయుక్తానాం ధృతిం నోత్స్రష్టుమర్హసి. 8

ప్ర.అ. త్వమ్=నీవు, ఆపతితమ్=వచ్చిన, బాష్పమ్=కన్నీటిని, ధైర్యాత్=ధైర్యమువలన, నిగ్రహీతుమ్=నిగ్రహించుకొనుటకు, అర్హసి=తగియున్నావు. సత్త్వయుక్తానామ్=మనోబలము కలవారియొక్క, మర్యాదామ్=కట్టుబాటును, ధృతిమ్=ధైర్యమును, ఉత్స్రష్టుమ్=విడచుటకు, నార్హసి=తగవు.

తా. నీవు పైకి వచ్చుచున్న కన్నీటిని ధైర్యముతో ఆపుకొనుము. మనోబలము గలవారి కుండవలసిన కట్టుబాటును, ధైర్యమును నీవు విడవకూడదు.

మూ. వ్యసనే వార్థకృచ్ఛ్రే వా భయే వా జీవితాన్తగే,
విమృశంశ్చ స్వయా బుద్ధ్యా ధృతిమాన్నావసీదతి. 9

ప్ర.అ. వ్యసనే వా=ఆపదయందుగాని, అర్థకృచ్ఛ్రే వా=ధననాశము కలిగినప్పుడు గాని, జీవితాన్తగే=జీవితమునకు అంతమును కలిగించు, భయే వా=భయమునందుగాని, ధృతిమాన్=ధైర్యవంతుడు, స్వయా బుద్ధ్యా =తన బుద్ధితో, విమృశన్=విమర్శించుచు, నావసీదతి= కృంగిపోడు.

తా. ఆపత్సమయమునందు కాని, ధననాశము కలిగినప్పుడుగాని, ప్రాణాపాయకరమైన భయము వచ్చినపుడు గాని, ధైర్యవంతుడు తన బుద్ధితో బాగుగా ఆలోచించుకొనును; క్రుంగిపోడు. 9

మూ. బాలిశస్తు నరో నిత్యం వైక్లబ్యం యోఽనువర్తతే,
స మజ్జత్యవశః శోకే భారాక్రాన్తేవ నౌర్జలే. 10

ప్ర.అ. యః నరః=ఏ మనుష్యుడు, బాలిశః=మూఢుడై, నిత్యమ్= ఎల్లప్పుడూ, వైక్లబ్యమ్=దైన్యమును, అనువర్తతే =అనుసరించునో, సః=అతడు, అవశః=తన వశములో తాను లేక, భారాక్రాన్తా= బరువుచేత ఆక్రమించబడిన, నౌః=ఓడ,జలే ఇవ=జలమునందు వలె, శోకే=శోకమునందు, మజ్జతి=మునిగిపోవును.

తా. ఎవడు మూఢుడై నిత్యమూ దైన్యముతో ఉండునో అతడు తన వశములో తాను ఉండజాలక, ఎక్కువ బరువు వేసిన ఓడ నీటిలో మునిగిపోయినట్లు శోకములో మునిగి పోవును. 10

మూ. ఏషోఽఞ్జలిర్మయా బద్ధః ప్రణయాత్త్వాం ప్రసాదయే,
పౌరుషం శ్రయ శోకస్య నాన్తరం దాతుమర్హసి. 11

ప్ర.అ. మయా=నాచేత, ఏషః అఞ్జలిః=ఈ దోసిలి, బద్ధః=కట్టబడినది.

ప్రణయాత్=ప్రేమవలన, త్వామ్=నిన్ను, ప్రసాదయే= అనుగ్రహింపచేసికొనుచు న్నాను. పౌరుషమ్=పౌరుషమును, శ్రయ= ఆశ్రయించుము. శోకస్య=శోకమునకు, అన్తరమ్=అవకాశమును, దాతుమ్=ఇచ్చుటకు, నార్హసి=తగవు.

తా. ఇదిగో నేను స్నేహపూర్వకముగా అంజలి ఘటించి బ్రతిమాలుచున్నాను. పౌరుషమును అవలంబించుము. శోకమునకు అవకాశము ఇవ్వకుము. 11

మూ. యే శోకమనువర్తన్తే న తేషాం విద్యతే సుఖమ్,
తేజశ్చ క్షీయతే తేషాం న త్వం శోచితుమర్హసి. 12

ప్ర.అ. యే=ఎవరు, శోకమ్=శోకమును, అనువర్తన్తే= అనుసరింతురో, తేషామ్=వారికి, సుఖమ్=సుఖము, న విద్యతే=లేదు. తేషామ్=వారియొక్క, తేజశ్చ=తేజస్సు కూడ, క్షీయతే =క్షీణించును. త్వమ్=నీవు, శోచితుమ్=దుఃఖిం చుటకు, నార్హసి=తగవు.

తా. శోకముతోనే క్రుంగిపోవువారికి సుఖము ఉండదు. వారి తేజస్సు క్షీణించిపోవును. నీవు దుఃఖించుట తగదు. 12

మూ. శోకేనాభిప్రపన్నస్య జీవితే చాపి సంశయః,
స శోకం త్యజ రాజేన్ద్ర ధైర్యమాశ్రయ కేవలమ్. 13

ప్ర.అ. శోకేన=శోకముచేత, అభిపన్నస్య=వ్యాప్తమైనవానికి, జీవితే చాపి =జీవితమునందు కూడ, సంశయః=సంశయము. రాజేన్ద్ర= రాజులలో శ్రేష్ఠుడా! సః=అట్టి నీవు, శోకమ్=శోకమును, త్యజ=విడువుము. కేవలమ్=కేవలము, ధైర్యమ్=ధైర్యమునే, ఆశ్రయ=అవలంబించుము.

తా. శోకాక్రాంతుడైనవానికి జీవితము విషయములో కూడ సంశయ మేర్పడును. మహారాజా! నీవు శోకమును విడచి ధైర్యమును మాత్రమే అవలంబించుము. 13

మూ. హితం వయస్యభావేన బ్రూమి నోపదిశామి తే,
వయస్యతాం పూజయన్మే న త్వం శోచితుమర్హసి. 14

ప్ర.అ. వయస్యభావేన=స్నేహధర్మముచేత, హితమ్=హితమును, బ్రూమి =చెప్పుచున్నాను. తే=నీకు, నోపదిశామి=ఉపదేశించుటలేదు. మే=నాయొక్క, వయస్యతామ్=మిత్రత్వమును, పూజయన్= పూజించుచు, త్వమ్=నీవు, శోచి తుమ్=దుఃఖించుటకు, నార్హసి =తగవు.

తా. నీ విషయమునం దున్న స్నేహభావము చేత హితము చెప్పుచున్నాను. కాని నీకు ఉపదేశించుటలేదు. నీవు నా మైత్రిపై ఉన్న గౌరవభావముచేతనైనా దుఃఖించకుము. 14

మూ. మధురం సాన్త్వితస్తేన సుగ్రీవేణ స రాఘవః,
ముఖమశ్రుపరిక్లిన్నం వస్త్రాన్తేన ప్రమార్జయత్. 15

ప్ర.అ. తేన సుగ్రీవేణ=ఆ సుగ్రీవునిచేత, మధురమ్=మధురముగా, సాన్త్వితః=ఓదార్చబడిన, సః రాఘవః=ఆ రాముడు, అశ్రుపరిక్లిన్నమ్=కన్నీళ్ళచేత తడియైన, ముఖమ్=ముఖమును, వస్త్రాన్తేన=వస్త్రాంతముచేత, ప్రమార్జయత్=తుడిచెను.

తా. ఈ విధముగ సుగ్రీవుడు మధురముగా ఓదార్చగా రాముడు కన్నీళ్లతో తడిసిన ముఖమును వస్త్రాంతముచేత తుడుచుకొనెను. 15

మూ. ప్రకృతిస్థస్తు కాకుత్స్థః సుగ్రీవవచనాత్ ప్రభుః,
సంపరిష్వజ్య సుగ్రీవమిదం వచనమబ్రవీత్. 16

ప్ర.అ. ప్రభుః=ప్రభువైన, కాకుత్స్థః=రాముడు, సుగ్రీవవచనాత్ =సుగ్రీవుని వచనమువలన, ప్రకృతిస్థః=ప్రకృతియందు ఉన్నవాడై, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ప్రభువైన రాముడు సుగ్రీవుని మాటలకు సహజస్థితిని పొందినవాడై, ఆతనిని కౌగలించుకొని ఇట్లు పలికెను. 16

మూ. కర్తవ్యం యద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ,
అనురూపం చ యుక్తం చ కృతం సుగ్రీవ తత్త్వయా. 17

ప్ర.అ. సుగ్రీవ=సుగ్రీవుడా! స్నిగ్ధేన=స్నేహము కలవాడు, హితేన చ=హితము కోరువాడు అయిన, వయస్యేన=స్నేహితునిచేత, యత్=ఏది, కృతమ్=చేయబడినదో, అనురూపమ్= సమయమునకు అనుకూలమైన, యుక్తమ్=తగిన, తత్=అది, త్వయా=నీచేత, కృతమ్=చేయబడినది.

తా. సుగ్రీవా! హితమును కోరే ప్రేమ గల స్నేహితుడు ఎట్లు చేయవలెనో ఆ విధముగా నీవు సమయోచితము, యుక్తమూ అయిన పని చేసినావు. 17

మూ. ఏష చ ప్రకృతిస్థోఽహమనునీతస్త్వయా సఖే,
దుర్లభో హీదృశో బన్ధురస్మిన్ కాలే విశేషతః. 18

ప్ర.అ. సఖే=మిత్రుడా, త్వయా=నీచేత, అనునీతః= బ్రతిమాలుకొనబడిన, ఏషః అహమ్=ఈ నేను, ప్రకృతిస్థః= ప్రకృతియం దున్నవాడ నైతిని. ఈదృశః =ఇట్టి, బన్ధుః=బంధువు, దుర్లభః హి=దుర్లభుడు కదా. అస్మిన్=ఈ, కాలే= కాలమునందు, విశేషతః=విశేషించి, దుర్లభుడు.

తా. మిత్రుడా! నీవు బ్రతిమాలుకొనుటచేత ఇదిగో నేను మామూలు మనిషిని అయినాను. ఇట్టి బంధువు లభించదు కదా! విశేషించి ఇట్టి

సమయములో లభించదు. 18

మూ. కిం తు యత్న స్త్వయా కార్యో మైథిల్యాః పరిమార్గణే,
రాక్షసస్య చ రౌద్రస్య రావణస్య దురాత్మనః. 19

ప్ర.అ. కిం తు=కాని, త్వయా=నీచేత, మైథిల్యాః=సీతయొక్క, దురాత్మనః=దుష్టబుద్ధి గల, రాక్షసస్య=రాక్షసుడైన, రౌద్రస్య=భయంకరుడైన, రావణస్య=రావణునియొక్క, పరిమార్గణే=అన్వేషణమునందు, యత్నః=ప్రయత్నము, కార్యః= చేయదగినది.

తా. కాని నీవు సీతను, భయంకరుడు, దుర్బుద్ధి, రాక్షసుడూ అయిన రావణునీ వెదకుటకు ప్రయత్నము చేయవలెను. 19

మూ. మయా చ యదనుష్ఠేయం విస్రబ్ధేన తదుచ్యతామ్.
వర్షాస్వివ చ సుక్షేత్రే సర్వం సంపద్యతే తవ. 20

ప్ర.అ. మయా=నాచేత, యత్=ఏది, అనుష్ఠేయమ్=చేయదగినదో, తత్=అది, విస్రబ్ధేన=నమ్మకము గల నీచేత, ఉచ్యతామ్= చెప్పబడుగాక. తవ=నీయొక్క, సర్వమ్=కార్యమంతా, వర్షాసు=వర్షాకాలమునందు, సుక్షేత్రే ఇవ=మంచి క్షేత్రమునందు వలె, సంపద్యతే=సంపన్నమగును.

తా. నేను చేయవలసిన పని ఏదో నీవు నమ్మకముతో చెప్పుము. వర్షాకాలమునందు మంచి పొలమునందు వేసిన పంట ఫలించినట్లు నీ కార్యమంతా సఫలము కాగలదు. 20

మూ. మయా చ యదిదం వాక్యమభిమానాత్సమీరితమ్,
తత్త్వయా హరిశార్దూల తత్త్వమిత్యుపధార్యతామ్. 21

ప్ర.అ. హరిశార్దూల=వానరశ్రేష్ఠుడా! మయా=నాచేత, అభిమానాత్=నా పరాక్రమమునం దున్న నమ్మకము చేత, యత్=ఏ, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యము, సమీరితమ్=పలకబడినదో, తత్=అది, త్వయా=నీచేత, తత్త్వమ్ ఇతి=యథార్థము అని, ఉపధార్యతామ్=నిశ్చయింపబడుగాక.

తా. ఓ! వానరశ్రేష్ఠా! నేను ఆత్మవిశ్వాసముతో పలికిన ఈ మాటలో సందేహమునకు తావు లేదని తెలిసికొనుము. 21

మూ. అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన,
ఏతత్తే ప్రతిజానామి సత్యేనైవ శపామ్యహమ్. 22

ప్ర.అ. మే=నాకు, అనృతమ్=అసత్యము, న ఉక్తపూర్వమ్= పూర్వము చెప్పబడలేదు. కదాచన=ఎన్నడూ, న వక్ష్యే చ= పలకను కూడ. ఏతత్=దీనిని, తే=నీకు, ప్రతిజానామి= ప్రతిజ్ఞ చేయుచున్నాను. అహమ్=నేను, సత్యేనైవ=సత్యముచేతనే,

శపామి=ఒట్టుపెట్టుచున్నాను.

తా. నేను పూర్వ మెన్నడూ అసత్యము పలకలేదు. ఇటుపైన కూడ ఎన్నడూ పలకను. నీకు ప్రతిజ్ఞ చేయుచున్నాను. సత్యముపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 22

మూ. తతః ప్రహృష్టః సుగ్రీవో వానరైః సచివైః సహ,
రాఘవస్య వచః శ్రుత్వా ప్రతిజ్ఞాతం విశేషతః. 23

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సచివైః=మంత్రులైన, వానరైః సహ= వానరులతో కూడ, సుగ్రీవః=సుగ్రీవుడు, రాఘవస్య= రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, విశేషతః= విశేషించి, ప్రతిజ్ఞాతమ్=ప్రతిజ్ఞను విని, ప్రహృష్టః= సంతోషించినాడు.

తా. మంత్రిసహితు డైన సుగ్రీవుడు అప్పుడు రాముని మాటలు విని, విశేషించి ఆతడు ప్రతిజ్ఞ చేయుట చూచి చాల సంతోషించెను. 23

మూ. ఏవమేకాన్తసంపృక్తౌ తతస్తౌ నరవానరౌ,
ఉభావన్యోన్యసదృశం సుఖదుఃఖమభాషతామ్. 24

ప్ర.అ. తతః=అటుపిమ్మట, ఏవమ్=ఇట్లు, ఏకాన్తసంపృక్తౌ= రహస్యప్రదేశమునందు కలిసిన, తౌ=ఆ, నరవానరౌ=నరవానరులు, ఉభౌ=ఇద్దరూ, అన్యోన్యసదృశమ్=పరస్పరము తగునట్లుగా, సుఖదుఃఖమ్=తమ సుఖదుఃఖములను గూర్చి, అభాషతామ్= మాటలాడిరి.

తా. ఆ నరవానరు లిద్దరూ ఏకాంతప్రదేశములో కూర్చుండి పరస్పరము తగిన విధమున తమ తమ సుఖదుఃఖములను గూర్చి ముచ్చటించుకొనిరి. 24

మూ. మహానుభావస్య వచో నిశమ్య
హరిర్నృపాణామధిపస్య తస్య,
కృతం స మేనే హరివీరముఖ్య
స్తదా చ కార్యం హృదయేన విద్వాన్. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తమః సర్గః.

ప్ర.అ. విద్వాన్=పండితుడైన, సః=ఆ,హరివీరముఖ్యః= వానరవీరులలో శ్రేష్ఠుడైన, హరిః=సుగ్రీవుడు, మహానుభావస్య= గొప్ప సామర్థ్యము గల, తస్య=ఆ, నృపాణామ్=రాజులయొక్క, అధిపస్య=ప్రభువైన రామునియొక్క, వచః=వచనమును, నిశమ్య=విని, తదా=అప్పుడు, కార్యమ్=తన కార్యమును, కృతమ్=చేయబడినదానినిగా, హృదయేన=మనస్సుచేత, మేనే= తలచెను.

తా. బుద్ధిశాలి, వానరవీరుల నాయకుడు అయిన సుగ్రీవుడు, గొప్ప సామర్థ్యము గల రాజాధిరాజైన ఆ రాముని మాటలు విని, తన పని నెరవేరినట్లే అని మనస్సులో అనుకొనెను. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఏడవసర్గ సమాప్తము.

## అథ అష్టమః సర్గః

[సుగ్రీవుడు తన దుఃఖమునకు కారణమును రామునకు చెప్పుట. రాముడు ఆతనిని ఓదార్చి "మీ సోదరు లిరువురికీ వైరము ఎందుకు వచ్చినది?" అని ప్రశ్నించుట]

మూ. పరితుష్టస్తు సుగ్రీవస్తేన వాక్యేన వానరః,
లక్ష్మణస్యాగ్రజం శూరమిదం వచనమబ్రవీత్. 1

ప్ర.అ. వానరః=వానరుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, తేన వాక్యేన=ఆ వాక్యము చేత, పరితుష్టః=సంతోషించినవాడై, శూరమ్=శూరుడైన, లక్ష్మణస్య అగ్రజమ్=లక్ష్మణుని అన్నగారైన రాముణ్ణి గూర్చి, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ మాటలు విన్న సుగ్రీవుడు చాల సంతోషించి, లక్ష్మణుని అన్నగారు, శూరుడూ అయిన రామునితో ఇట్లు పలికెను. 1

మూ. సర్వథాహమనుగ్రాహ్యో దేవతానాం న సంశయః,
ఉపపన్నో గుణోపేతః సఖా యస్య భవాన్మమ. 2

ప్ర.అ. ఉపపన్నః=సర్వసంపదలతో కూడినవాడవు, గుణోపేతః= సద్గుణసంపన్నుడవు అయిన, భవాన్=నీవు, యస్య మమ=ఏ నాకు, సఖా=స్నేహితుడవు అయినావో, అహమ్=అట్టి నేను, సర్వథా= అన్ని విధములా, దేవతానామ్=దేవతలకు, అనుగ్రాహ్యః=అనుగ్రహింప దగినవాడను. సంశయః=సంశయము, న=లేదు.

తా. సకలసంపదలతో, సద్గుణములతో నిండిన నీవు నాకు స్నేహితుడవు అయినావు అనగా దేవతలు నాయందు పరిపూర్ణముగా అనుగ్రహము చూపినారని చెప్పుటలో సందేహము లేదు. 2

మూ. శక్యం ఖలు భవేద్రామ సహాయేన త్వయానఘ,
సురరాజ్యమపి ప్రాప్తుం స్వరాజ్యం కిముత ప్రభో. 3

ప్ర.అ. అనఘ=దోషములు లేనివాడా! ప్రభో=ఓ! ప్రభూ! రామ=రామా! త్వయా=నీవు, సహాయేన=సహాయుడవుగా ఉండగా, సురరాజ్యమపి=దేవతా రాజ్యము కూడ, ప్రాప్తుమ్=పొందుటకు, శక్యమ్=శక్యమైనది. స్వరాజ్యమ్=నా రాజ్యము, కిముత=చెప్పవలెనా?

తా. ఎట్టి దోషాలూ లేని రామా! ఓ! ప్రభూ! నీవు సాహాయ్యము

చేసినచో నేను స్వర్గలోకరాజ్యము కూడ పొందగలను; నా రాజ్యము మాట చెప్పవలెనా? 3

మూ. సోఽహం సభాజ్యో బన్ధూనాం సుహృదాం చైవ రాఘవ,
యస్యాగ్నిసాక్షికం మిత్రం లబ్ధం రాఘవ వంశజమ్. 4

ప్ర.అ. రాఘవ=రామా! యస్య=ఏ నాకు, రాఘవవంశజమ్= రఘువంశమునందు పుట్టిన, మిత్రమ్=మిత్రుడు, అగ్నిసాక్షికమ్= అగ్నిసాక్షికముగా, లబ్ధమ్=పొందబడెనో, సః అహమ్=అట్టి నేను, బన్ధూనామ్=బంధువులకు, సుహృదాం చైవ=మిత్రులకూ, సభాజ్యః=గౌరవించదగినవాడను.

తా. రామా! రఘు వంశములో పుట్టిన నీతో అగ్నిసాక్షికముగా స్నేహము చేసికొన్న నన్ను బంధువులు, మిత్రులు కూడ గౌరవించగలరు. 4

మూ. అహమప్యనురూపస్తే వయస్యో జ్ఞాస్యసే శనైః,
న తు వక్తుం సమర్థోఽహం స్వయమాత్మగుణానిమాన్. 5

ప్ర.అ. అహమపి=నేను కూడ, తే=నీకు, అనురూపః=తగిన, వయస్యః=మిత్రుడను. శనైః=మెల్లిగా, జ్ఞాస్యసే= తెలిసికొనగలవు. అహమ్=నేను, ఇమాన్=ఈ, ఆత్మగుణాన్=నా గుణములను, స్వయమ్=స్వయముగా, వక్తుమ్=చెప్పుటకు, సమర్థః= సమర్థుడను, న=కాను.

తా. నేను కూడ నీకు తగిన స్నేహితుడనే. ఈ విషయమును నీవే మెల్లమెల్లగా తెలిసికొనగలవు. నా గుణములను గూర్చి నేనే చెప్పజాలను. 5

మూ. మహాత్మనాం తు భూయిష్ఠం త్వద్విధానాం కృతాత్మనామ్,
నిశ్చలా భవతి ప్రీతిర్ధైర్యమాత్మవతాం వర. 6

ప్ర.అ. ఆత్మవతామ్= బుద్ధిమంతులలో, వర =శ్రేష్ఠుడా ! కృతాత్మనామ్ =పరిశుద్ధము చేయబడిన బుద్ధి గల, త్వద్విధానామ్= నీవంటి , మహాత్మనామ్ =మహాత్ములయొక్క, ప్రీతిః =ప్రేమ,భూయిష్ఠమ్=తరచుగా, నిశ్చలా =నిశ్చలమైనది, భవతి = అగును. ధైర్యమ్ =ధైర్యము కూడ నిశ్చలముగా నుండును.

తా. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవైన రామా! మనస్సును అదుపులో ఉంచుకొన్న నీ వంటి మహాత్ముల ప్రేమ, ధైర్యము కూడ, సాధారణముగా, స్థిరములై ఉండును. 6

మూ. రజతం వా సువర్ణం వా శుభాన్యాభరణాని చ,
అవిభక్తాని సాధూనామవగచ్ఛన్తి సాధవః. 7

ప్ర.అ. సాధూనామ్ =సత్పురుషులకు, రజతం వా=వెండీ, సువర్ణం వా=బంగారమూ, శుభాని =శ్రేష్ఠములైన, ఆభరణాని చ = ఆభరణములు,

అవిభక్తాని =విభజింపబడనివి అని, సాధవః = సత్పురుషులు, అవగచ్ఛన్తి =తెలుసుకొనుచున్నారు.

తా. సత్పురుషులు వెండి, బంగారము, ఉత్తమములైన ఆభరణములు మొదలైనవాటిని "ఇది నీది, ఇది నాది" అని పంచుకొనక సమముగా అనుభవింతురు అని సత్పురుషులు చెప్పుదురు.

మూ. ఆఢ్యో వాపి దరిద్రో వా దుఃఖితః సుఖితోఽపి వా,
నిర్దోషశ్చ సదోషశ్చ వయస్యః పరమా గతిః. 8

ప్ర.అ. ఆఢ్యో వాపి =ధనికుడైనా, దరిద్రో వా =దరిద్రుడైనా, దుఃఖితః =దుఃఖితుడైనా, సుఖితోఽపి వా=సుఖితుడైనా, నిర్దోషశ్చ =దోషములు లేనివాడైనా, సదోషశ్చ =దోషములతో కూడినవాడైనా, వయస్యః =స్నేహితుడే, పరమా=గొప్ప, గతిః = గతి.

తా. ధనికుడైనా దరిద్రుడైనా, దుఃఖాలలో ఉన్నా సుఖాలలో ఉన్నా, దోషము లున్నవాడైనా దోషములు లేనివాడైనా స్నేహితుడే ఉత్తమమైన గతి. 8

మూ. ధనత్యాగః సుఖత్యాగో దేశత్యాగోఽపి వానఘ,
వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథావిధమ్. 9

ప్ర.అ. అనఘ=దోషములు లేని రామా! స్నేహమ్ =స్నేహమును, తథావిధమ్ =అట్టిదానినిగా, దృష్ట్వా =చూచి, వయస్యార్థే = స్నేహితుని నిమి త్తము, ధనత్యాగః =ధనముయొక్క త్యాగమైనా, సుఖత్యాగః =సుఖముయొక్క త్యాగమైనా, దేశత్యాగో ఽపి వా= దేశత్యాగమైనా, ప్రవర్తన్తే =ప్రవర్తించుచున్నవి.

తా. దోషరహితుడవైన రామా! స్నేహ మనగా ఇట్టిది అని తెలిసినవాళ్లు ధనమును గాని, సుఖమును గాని, దేశమును గాని స్నేహితుని నిమిత్తమై విడచుటకు కూడ వెనుదీయరు. 9

మూ. తత్తథేత్యబ్రవీద్రామః సుగ్రీవం ప్రియదర్శనమ్,
లక్ష్మణస్యాగ్రతో లక్ష్మ్యా వాసవస్యేవ ధీమతః. 10

ప్ర.అ. రామః =రాముడు, వాసవస్యేవ = దేవేంద్రుడు వలె, ధీమతః =బుద్ధిమంతుడు, లక్ష్మ్యా =శోభతో కూడినవాడు అయిన, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, అగ్రతః =ఎదుట, ప్రియదర్శనమ్ =ప్రియమైన దర్శనము గల, సుగ్రీవమ్ = సుగ్రీవుణ్ణి గూర్చి, తత్ =అది, తథా =అట్లే, ఇతి=అని, అబ్రవీత్ =పలికెను.

తా. దేవేంద్రుడు వలె ధీమంతుడు, లక్ష్మీసంపన్నుడూ అయిన లక్ష్మణుని సమక్షమునందు, రాముడు, చూచువారికి ఆనందము కలిగించే ఆ సుగ్రీవునితో "నీవు చెప్పిన దంతా యథార్థము" అని పలికెను. 10

మూ. తతో రామం స్థితం దృష్ట్వా లక్ష్మణం చ మహాబలమ్,
సుగ్రీవః సర్వతశ్చక్షుర్వనే లోలమపాతయత్. 11

ప్ర.అ. తతః =అటుపిమ్మట, సుగ్రీవః =సుగ్రీవుడు, స్థితమ్= అక్కడ నిలచిన, రామమ్ =రాముణ్ణీ, మహాబలమ్ =గొప్ప బలము గల, లక్ష్మణం చ =లక్ష్మణుణ్ణీ, దృష్ట్వా =చూచి, లోలమ్ = చంచలమైన, చక్షుః =నేత్రమును, వనే=వనమునందు, సర్వతః =అన్ని వైపులా, అపాతయత్ =ప్రసరింపచేసెను.

తా. సుగ్రీవుడు నిలిచి ఉన్న రాముణ్ణీ, మహాబలశాలి యైన లక్ష్మణుణ్ణీ చూచి, ఆ వనమునందు అన్ని వైపులా తన దృష్టిని ప్రసరింప జేసెను. 11

మూ. స దదర్శ తతః సాలమవిదూరే హరీశ్వరః,
సుపుష్పమీషత్పత్రాఢ్యం భ్రమరైరుపశోభితమ్. 12

ప్ర.అ. తతః =అటుపిమ్మట, సః హరీశ్వరః =ఆ సుగ్రీవుడు, అవిదూరే =సమీపమునందు, సుపుష్పమ్ =మంచి పుష్పములు గలదీ, ఈషత్పత్రాఢ్యమ్= కొంచెము ఆకులతో కూడినదీ, భ్రమరైః = తుమ్మెదలచేత, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడినదీ అయిన, సాలమ్ =మద్దిచెట్టును, దదర్శ=చూచెను.

తా. అప్పుడు సుగ్రీవునకు చాలా పుష్పములతో నిండి , తక్కువ ఆకులు గల, తుమ్మెదలతో వ్యాప్తమైన ఒక మద్దిచెట్టు కనబడెను. 12

మూ. తస్యైకాం పర్ణబహులాం శాఖాం భంక్త్వా సుశోభితామ్,
రామస్యాస్తీర్య సుగ్రీవో నిషసాద సరాఘవః. 13

ప్ర.అ. సుగ్రీవః= సుగ్రీవుడు, తస్య = ఆ చెట్టుయొక్క, పర్ణబహులామ్=ఎక్కువ ఆకులు గలది, సుశోభితామ్ =చాలా అందముగా ఉన్నదీ అయిన, ఏకాం శాఖామ్ =ఒక కొమ్మను,భంక్త్వా =విరిచి, రామస్య =రామునకు, ఆస్తీర్య =నేలమీద పరచి, సరాఘవః =రామునితో కూడినవాడై, నిషసాద =కూర్చుండెను.

తా. సుగ్రీవుడు చాలా ఆకులు గల అందమైన కొమ్మనొకదానిని విరిచి రాముని కోసమై నేలపై పరచి, రామునితో కూడా దానిపై కూర్చుండెను.13

మూ. తావాసీనౌ తతో దృష్ట్వా హనూమానపి లక్ష్మణమ్,
శాలశాఖాం సముత్పాట్య వినీతముపవేశయత్. 14

ప్ర.అ. తతః =అటు పిమ్మట, హనూమానపి =హనుమంతుడు కూడ, ఆసీనౌ=కూర్చున్న, తౌ =వారిద్దరినీ, దృష్ట్వా =చూచి, శాలశాఖామ్ =మద్ది చెట్టు కొమ్మను, సముత్పాట్య =విరచి, వినీతమ్ = వినయవంతుడైన, లక్ష్మణమ్ =లక్ష్మణుని, ఉపవేశయత్ = కూర్చుండ బెట్టెను.

తా. పిమ్మట హనుమంతుడు, రామసుగ్రీవులు కూర్చుండుట చూచి, ఒక

సాలవృక్షశాఖను విరిచి , వినయవంతుడైన లక్ష్మణుని దానిమీద కూర్చుండబెట్టెను.
ఇంచుమించు 13, 14 శ్లోకాల భావమే ఉన్న రెండు శ్లోకాలు (18,19,20) పంచమసర్గలో ఉన్నవి. ఇక్కడ ఈ శ్లోకాలు ఉండడంచేత ఆ శ్లోకాలు ప్రక్షిప్తాలనుకోవచ్చును. ప్రాచ్యప్రతిలో ఆ శ్లోకాలు లేవు. 14

మూ. సుఖోపవిష్టం రామం తు ప్రసన్నముదధిం యథా,
సాలపుష్పావసంకీర్ణే తస్మిన్ గిరివరోత్తమే. 15
తతః ప్రహృష్టః సుగ్రీవః శ్లక్ష్ణయా శుభయా గిరా,
ఉవాచ ప్రణయాద్రామం హర్షవ్యాకులితాక్షరమ్. 16

ప్ర.అ. తతః =అటుపిమ్మట, సుగ్రీవః =సుగ్రీవుడు, సాలపుష్పావసంకీర్ణే=సాలపుష్పములచేత కప్పబడిన, తస్మిన్ =ఆ, గిరివరోత్తమే =ఉత్తమమైన పర్వతముమీద, సుఖోపవిష్టమ్ =సుఖముగా కూర్చున్నవాడు, ప్రసన్నమ్ = ప్రశాంతముగా ఉన్న, ఉదధిం యథా=సముద్రము వలె ఉన్నవాడు, రామమ్ =మనస్సుకు ఆనందము కలిగించేవాడు అయిన, రామమ్ =రాముణ్ణి గూర్చి, శ్లక్ష్ణయా = మృదువైన, శుభయా = శుభకరమైన, గిరా=వాక్కుతో, హర్షవ్యాకులితాక్షరమ్ =సంతోషముచేత వ్యాకులములైన అక్షరములు కలుగునట్లుగా, ప్రణయాత్ =స్నేహమువలన, ఉవాచ =పలికెను.

తా. సాలపుష్పములు అంతటా రాలి పడి ఉన్న ఆ శ్రేష్ఠమైన పర్వతము మీద సుఖముగా కూర్చున్న, సకలమనోభిరాముడైన రాముడు ప్రశాంతమైన సముద్రము వలె ఉండెను. సుగ్రీవుడు చాలా సంతోషించి, ఆ రామునితో, ఆనందముచేత అక్షరములు తొట్రుపడగా, మృదువులు, మంగలకరములు అయిన మాటలు ఇట్లు పలికెను. 15, 16

మూ. అహం వినికృతో భ్రాత్రా చరామ్యేష భయార్దితః,
ఋష్యమూకం గిరివరం హృతభార్యః సుదుఃఖితః. 17

ప్ర.అ. భ్రాత్రా =సోదరునిచేత, వినికృతః =అవమానింపబడిన, ఏషః అహమ్ =ఈ నేను, భయార్దితః=భయముచేత పీడింపబడినవాడనై, హృతభార్యః =హరింపబడిన భార్య కలవాడనై, సుదుఃఖితః=చాల దుఃఖించుచు, గిరివరమ్ = పర్వతశ్రేష్ఠమైన, ఋశ్యమూకమ్=ఋశ్యమూకమును, చరామి=చరించుచున్నాను.

తా. నన్ను నా సోదరుడు అవమానించి నా భార్యను అపహరించినాడు. నేను చాల దుఃఖించుచు, భయపీడితుడనై పర్వతశ్రేష్ఠమైన ఈ ఋష్యమూకము మీద సంచరించుచున్నాను. 17

మూ. సోఽహం త్రస్తో భయే మగ్నో వనే సంభ్రాన్తచేతనః,
వాలినా నికృతో భ్రాత్రా కృతవైరశ్చ రాఘవ. 18

ప్ర.అ. రాఘవ =రామా! భ్రాతా=సోదరుడైన, వాలినా =వాలిచేత, నికృతః =అవమానించబడినవాడను, కృతవైరశ్చ=చేయబడిన (ఏర్పడిన) వైరము కలవాడను అయిన, సః అహమ్=అట్టి నేను, త్రస్తః =భయపడినాను. సంభ్రాన్తచేతనః=భ్రాంతి చెందిన చిత్తము కలవాడనై, వనే =ఈ వనమునందు, భయే =భయమునందు, మగ్నః =మునిగి ఉన్నాను.

తా. రామా! నా సోదరుడైన వాలి నన్ను అవమానించినాడు. నాకు అతనితో వైర మేర్పడినది. నేను భయము చెంది, ఏమి చేయవలెనో తోచక, ఈ వనములో తిరుగుచు భయములలో మునిగి ఉన్నాను. 18

మూ. వాలినో మే భయార్తస్య సర్వలోకాభయంకర,
మమాపి త్వమనాథస్య ప్రసాదం కర్తుమర్హసి. 19

ప్ర.అ. సర్వలోకాభయంకర =సకలలోకములకు అభయము నిచ్చేవాడా! మే =నాయొక్క (నా సోదరుడైన), వాలినః=వాలినుండి, భయార్తస్య = భయముచేత పీడించబడిన, అనాథస్య =రక్షకుడు లేని, మమాపి = నాకు కూడా, త్వమ్=నీవు, ప్రసాదమ్ =అనుగ్రహమును, కర్తుమ్ =చేయుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. సర్వలోకములకు అభయము నిచ్చే రామా! నేను నా సోదరుడైన వాలినుండి భయము చెంది ఉన్నాను. అనాథుడను. అట్టి నా విషయమున అనుగ్రహము చేయుము. 19

మూ. ఏవముక్తస్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః,
ప్రత్యువాచ స కాకుత్స్థః సుగ్రీవం ప్రహసన్నివ. 20

ప్ర.అ. ఏవమ్ =ఇట్లు, ఉక్తః = పలకబడిన, తేజస్వీ = తేజఃశాలి, ధర్మజ్ఞః =ధర్మములు తెలిసినవాడు, ధర్మవత్సలః = ధర్మమునందు ప్రీతి గలవాడు అయిన, సః కాకుత్స్థః =ఆ రాముడు, ప్రహసన్నివ =నవ్వుచు, సుగ్రీవమ్ =సుగ్రీవుని గూర్చి, ప్రత్యువాచ =తిరిగి పలికెను.

తా. తేజఃశాలి, ధర్మములు తెలిసినవాడు, ధర్మతత్పరుడు అయిన రాముడు సుగ్రీవుని మాటలు విని అతనితో ఇట్లనెను. 20

మూ. ఉపకారఫలం మిత్రమపకారోఽరిలక్షణమ్,
అద్యైవ తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్ . 21

ప్ర.అ. మిత్రమ్ =మిత్రుడు, ఉపకారఫలమ్ =ఉపకారమే ఫలము కలవాడు, అపకారః = అపకారము, అరిలక్షణమ్ = శత్రువుల లక్షణము. తవ = నీయొక్క, భార్యాపహారిణమ్ =భార్యను అపహరించిన, తమ్ =ఆ వాలిని, అద్యైవ =ఇప్పుడే, వధిష్యామి =చంపగలను.

తా. స్నేహము చేసికొనినందుకు ఫలము ఉపకారము చేయుట. అపకారము చేయుట శత్రువుల లక్షణము. నీ భార్యను అపహరించిన ఆ వాలిని ఇప్పుడే చంపివేసెదను.. 21

మూ. ఇమే హి మే మహాభాగ పత్త్రిణస్తిగ్మతేజసః,
కార్తికేయవనోద్భూతాః శరా హేమవిభూషితాః. 22
కఙ్కపత్రపరిచ్ఛన్నా మహేన్ద్రాశనిసన్నిభాః,
సుపర్వాణః సుతీక్ష్ణాగ్రాః సరోషా భుజగా ఇవ. 23

ప్ర.అ. మహాభాగ = గొప్పభాగ్యము గలవాడా! మే = నాయొక్క, పత్రిణః = రెక్కలు గల, ఇమే =ఈ, శరాః =బాణములు, తిగ్మతేజసః = తీక్ష్ణమైన తేజస్సు గలవి. కార్తికేయవనోద్భూతాః = కుమారస్వామి పుట్టిన వనమునందు పుట్టినవి. హేమవిభూషితాః = బంగారముచేత అలంకరింపబడినవి. కఙ్కపత్రపరిచ్ఛన్నాః = గ్రద్దల రెక్కలచేత కట్టబడినవి. మహేన్ద్రాశనిసన్నిభాః = మహేంద్రుని వజ్రాయుధముతో సమానమైనవి. సుపర్వాణః = మంచి కణుపులు గలవి. సుతీక్ష్ణాగ్రాః =బాగా తీక్ష్ణమైన అగ్రములు గలవి. సరోషాః =కోపముతో,

తా. మహాభాగ్యవంతుడవైన ఓ! సుగ్రీవా! గ్రద్దల రెక్కలు కట్టిన ఈ నా బాణముల తేజస్సు తీవ్రమైనది. బంగారముచేత అలంకరింపబడిన ఈ బాణములు కుమారస్వామి జనించిన వనములోని కాండములతో నిర్మించినవి. మంచి కణుపులు, చాల తీక్ష్ణములైన అగ్రభాగములు గల ఈ బాణములు దేవేంద్రుని వజ్రాయుధమువంటివి. కోపించిన సర్పములవలె చాల భయంకరమైనవి. 22,23

మూ. వాలిసంజ్ఞమమిత్రం తే భ్రాతరం కృతకిల్బిషమ్,
శరైర్వినిహతం పశ్య వికీర్ణమివ పర్వతమ్. 24

ప్ర.అ. తే =నీయొక్క, భ్రాతరమ్ =సోదరుడు, కృతకిల్బిషమ్ = చేయబడిన పాపము గలవాడు అయిన, వాలిసంజ్ఞమ్=వాలి అనే పేరుగల, అమిత్రమ్=శత్రువును, శరైః =బాణములచేత, వినిహతమ్ =చంపబడి యుండగా, వికీర్ణమ్ =పడగొట్టబడిన, పర్వతమ్ ఇవ =పర్వతమును వలె, పశ్య =చూడుము.

తా. నీ సోదరుడూ, పాపమును ఆచరించినవాడు అయిన వాలి అనే నీ శత్రువును, పర్వతమును పడగొట్టి నట్లు బాణములచేత పడగొట్టెదను; చూడుము.

మూ. రాఘవస్య వచః శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః,
ప్రహర్షమతులం లేభే సాధు సాధ్వితి చాబ్రవీత్. 25

ప్ర.అ. వాహినీపతిః =వానరసేనకు అధిపతియైన, సుగ్రీవః =సుగ్రీవుడు, రాఘవస్య =రామునియొక్క, వచః =వచనమును, శ్రుత్వా = విని, అతులమ్ =సాటి లేని, ప్రహర్షమ్ =ఆనందమును, లేభే =పొందెను. సాధు సాధు ఇతి

=బాగు బాగు అని, అబ్రవీత్ చ= పలికెను కూడా.

తా. వానరప్రభువైన సుగ్రీవుడు రాముని మాటలు విని , చాల సంతోషించుచు, "బాగు బాగు" అని పలికెను. 25

మూ. రామ శోకాభిభూతోఽహం శోకార్తానాం భవాన్ గతిః,
వయస్య ఇతి కృత్వా హి త్వయ్యహం పరిదేవయే. 26

ప్ర.అ. రామ=రామా! అహమ్ =నేను, శోకాభిభూతః = శోకముచేత తిరస్కరించబడినవాడను. శోకార్తానామ్ =శోకముచేత పీడింపబడినవారికి, భవాన్ =నీవు, గతిః =గతివి. వయస్యః ఇతి కృత్వా = స్నేహితుడవు కదా అని, అహమ్ =నేను, త్వయి =నీయందు, పరిదేవయే =దుఃఖించుచున్నాను.

తా. రామా! నేను శోకాక్రాంతుడనై ఉన్నాను. శోకముతో బాధపడువారికి రక్షకుడవు నీవే. నీవు స్నేహితుడవు కదా అని నా కష్టములను నీ ముందు చెప్పుకొనుచున్నాను. 26

మూ. త్వం హి పాణిప్రదానేన వయస్యో మేఽ గ్నిసాక్షికమ్,
కృతః ప్రాణైర్బహుమతః సత్యేన చ శపామ్యహమ్. 27

ప్ర.అ. త్వమ్ =నీవు, పాణిప్రదానేన =హస్తమును ఇచ్చుటచేత, అగ్నిసాక్షికమ్ =అగ్నిసాక్షికముగా, కృతః =చేయబడిన , ప్రాణైః =ప్రాణములతో, బహుమతః =ఇష్టుడవైన, మే వయస్యః హి =నా స్నేహితుడవు కదా. అహమ్ =నేను, సత్యేన =సత్యముచేత, శపామి= ఒట్టుపెట్టుచున్నాను.

తా. నీవు నాతో చేతులు కలిపి అగ్నిసాక్షికముగా స్నేహము చేసికొన్నవాడవు. ప్రాణాలతో సమానముగ ప్రీతిపాత్రుడవు. సత్యముమీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను.

మూ. వయస్య ఇతి కృత్వా చ విస్రబ్ధః ప్రవదామ్యహమ్,
దుఃఖమన్తర్గతం తన్మే మనో హరతి నిత్యశః . 28

ప్ర.అ. వయస్యః ఇతి కృత్వా చ = స్నేహితుడవు కదా అని కూడ, అహమ్ =నేను, విస్రబ్ధః =విశ్వాసము కలవాడనై, ప్రవదామి = చెప్పుచున్నాను. మే=నాయొక్క, అన్తర్గతమ్ =లోపల నున్న, దుఃఖమ్ =దుఃఖము, నిత్యశః =ఎల్లప్పుడూ, మనః = మనస్సును, హరతి =హరించుచున్నది.

తా. నీవు నాకు స్నేహితుడ వగుటచేత నేను ఎరమరికలు లేకుండా చెప్పుచున్నాను. నాలో ఉన్న దుఃఖము, నిత్యము నా మనస్సును దహించి వేయుచున్నది. 28

మూ. ఏతావదుక్త్వా వచనం బాష్పదూషితలోచనః,
బాష్పదూషితయా వాచా నోచ్చైః శక్నోతి భాషితుమ్. 29

ప్ర.అ. ఏతావత్ =ఇంతమాత్రము, వచనమ్ =వచనమును, ఉక్త్వా =పలికి, బాష్పదూషితలోచనః =కన్నీటిచేత దూషితమైన నేత్రములు కలవాడై, బాష్పదూషితయా =కన్నీటిచేత దూషితమైన, వాచా = వాక్కుతో, ఉచ్చైః= గట్టిగా, భాషితుమ్ =మాటలాడుటకు, న శక్నోతి = సమర్థుడు కాలేదు.

తా. నేత్రములనుండి కన్నీరు కారగా, ఇంతమాత్రమే చెప్పి,కన్నీళ్లచేత మాట తొట్రు పడుటచే ఇంక పైకి ఏమీ చెప్పలేకపోయెను. 29

మూ. బాష్పవేగం తు సహసా నదీవేగమివాగతమ్,
ధారయామాస ధైర్యేణ సుగ్రీవో రామసంనిధౌ. 30

ప్ర.అ. సుగ్రీవః =సుగ్రీవుడు, రామసంనిధౌ =రాముని సంనిధియందు, నదీవేగమివ =నదీవేగము వలె, సహసా =హటాత్తుగా, ఆగతమ్ =వచ్చిన, బాష్పవేగమ్ =కన్నీటి వేగమును, ధైర్యేణ = ధైర్యముచేత, ధారయామాస =నిలుపుకొనెను.

తా. సుగ్రీవుడు రాముని ఎదుట నదీవేగము వలె హటాత్తుగా వచ్చిన కన్నీటి వేగమును ధైర్యముతో నిలుపుకొనెను. 30

మూ. స నిగృహ్య తు తం బాష్పం ప్రమృజ్య నయనే శుభే,
వినిఃశ్వస్య చ తేజస్వీ రాఘవం పునరూచివాన్. 31

ప్ర.అ. తేజస్వీ =తేజఃశాలి యైన, సః =ఆ సుగ్రీవుడు, తం బాష్పమ్ =ఆ కన్నీటిని, నిగృహ్య =నిగ్రహించుకొని, శుభే = శుభకరము లైన, నయనే =నేత్రములను, ప్రమృజ్య =తుడుచుకొని, వినిఃశ్వస్య =నిట్టూర్చి, రాఘవమ్ =రాముని గూర్చి, పునః = మరల, ఊచివాన్ = పలికినాడు.

తా. తేజఃశాలియైన ఆ సుగ్రీవుడు కన్నీరు నిలుపుకొని, మంగళకరములైన నేత్రములు తుడుచుకొని, నిట్టూర్చుచు మరల రామునితో ఇట్లు పలికెను. 31

మూ. పురాహం వాలినా రామ రాజ్యాత్స్వాదవరోపితః,
పరుషాణి చ సంశ్రావ్య నిర్ధూతోఽస్మి బలీయసా. 32

ప్ర.అ. రామ=రామా! పురా =పూర్వము, అహమ్ =నేను, బలీయసా =బలవంతుడైన, వాలినా =వాలిచేత, స్వాత్ =నా సంబంధమైన, రాజ్యాత్ =రాజ్యమునుండి, అవరోపితః =దింపబడితిని. పరుషాణి =పరుషములైన మాటలను, సంశ్రావ్య =వినిపించి, నిర్ధూతః =అవమానింపబడినవాడను, అస్మి =అయి ఉన్నాను.

తా. రామా! పూర్వము, బలశాలియైన వాలి నన్ను రాజ్యభ్రష్టుణ్ణి చేసి, పరుషవాక్యములు పలికి, అవమానించి దూరముగా పంపివేసినాడు. 32

మూ. హృతా భార్యా చ మే తేన ప్రాణేభ్యోఽపి గరీయసీ,
సుహృదశ్చ మదీయా యే సంయతా బన్ధనేషు తే. 33

ప్ర.అ. తేన =వానిచేత, ప్రాణేభ్యోఽపి =ప్రాణములకంటె కూడ, గరీయసీ =గొప్పదైన, మే భార్యా =నా భార్య, హృతా = హరించబడినది. మదీయాః =నా సంబంధమైన, యే =ఏ, సుహృదః = స్నేహితు లున్నారో, తే =వారు, బన్ధనేషు = బంధనములయందు, సంయతాః =కట్టబడినారు.

తా. అతడు, నా ప్రాణములకంటె కూడ ఎక్కువ ప్రియురాలైన నా భార్యను అపహరించి నా స్నేహితుల నందరినీ కారాగారములో బంధించినాడు.

మూ. యత్నవాంశ్చ స దుష్టాత్మా మద్వినాశాయ రాఘవ,
బహుశస్తత్ప్రయుక్తాశ్చ వానరా నిహతా మయా. 34

ప్ర.అ. రాఘవ =రామా! దుష్టాత్మా =దుష్టబుద్ధి గల, సః = అతడు, మద్వినాశాయ = నా వినాశముకొరకు, యత్నవాంశ్చ= ప్రయత్నము గలవాడు. బహుశః =అనేకపర్యాయములు, తత్ప్రయుక్తాః= ఆతనిచేత ప్రయోగింపబడిన, వానరాః =వానరులు, మయా =నాచేత, నిహతాః =చంపబడినారు.

తా. రామా! ఆ దుర్బుద్ధి నన్ను చంపుటకై ప్రయత్నము చేయుచునే ఉన్నాడు. అతడు అనేకపర్యాయములు నామీదికి పంపిన వానరులను నేను చంపివేసితిని. 34

మూ. శఙ్కయా త్వేతయా చైవ దృష్ట్వా త్వామపి రాఘవ,
నోపసర్పామ్యహం భీతో భయే సర్వే హి బిభ్యతి. 35

ప్ర.అ. రాఘవ =రామా! అహం చ =నేను, ఏతయా =ఈ, శఙ్కయా =శంకచేతనే, త్వామ్ అపి =నిన్ను కూడ, ఇహ = ఇక్కడ, దృష్ట్వా =చూచి, భీతః =భయపడినవాడనై, నోపసర్పామి= సమీపించలేదు. భయే =భయహేతువు ఉన్నప్పుడు, సర్వే =అందరూ, బిభ్యతి హి =భయపడుదురు కదా!

తా. రామా! నిన్ను చూచి నప్పుడు కూడ వాలి పంపినా డనే శంకచేత నేను భయపడి నీదగ్గరకు రాలేదు. భయమునకు కారణ మున్నప్పుడు అందరూ భయపడుదురు కదా! 35

మూ. కేవలం తు సహాయా మే హనుమత్ప్రముఖాస్త్విమే,
అతోఽహం ధారయామ్యద్య ప్రాణాన్ కృచ్ఛ్రగతోఽపి సన్. 36

ప్ర.అ. కేవలమ్= కేవలము, ఇమే =ఈ, హనుమత్ప్రముఖాః = హనుమంతుడు మొదలైనవారు, మే =నాకు, సహాయాః= సహాయులు. అతః =ఈ కారణమువలననే, అహమ్ =నేను, కృచ్ఛ్రగతోఽపి సన్ =కష్టములలో ఉన్నవాడనైనా, అద్య =ఇప్పుడు, ప్రాణాన్ =ప్రాణములను, ధారయామి =ధరించి ఉన్నాను.

తా. నాకు ఈ హనుమంతుడు మొదలైన వాళ్ళు మాత్రమే సహాయులుగా

ఉన్నారు. వీరు ఉండుటచేతనే నేను ఇన్ని కష్టాలలో కూడ ప్రాణాలతో ఉన్నాను.

మూ. ఏతే హి కపయః స్నిగ్ధా మాం రక్షన్తి సమన్తతః ,
సహ గచ్ఛన్తి గన్తవ్యే నిత్యం తిష్ఠన్తి చ స్థితే. 37

ప్ర.అ. స్నిగ్ధాః=స్నేహము గల, ఏతే= ఈ, కపయః = వానరులు, మామ్ =నన్ను, సమన్తతః =అంతటా, రక్షన్తి =రక్షించుచున్నారు. గన్తవ్యే =వెళ్లవలసి ఉన్నపుడు, సహ =కూడా, గచ్ఛన్తి = వెళ్ళుచున్నారు. స్థితౌ =నిలచినప్పుడు, తిష్ఠన్తి చ = నిలచుచున్నారు.

తా. నాపై స్నేహము గల ఈ వానరులు నేను ఎక్కడికి వెళ్లినా వెళ్ళుచు, ఎక్కడ ఉన్నా నా ప్రక్కనే ఉంటూ, నన్ను అన్ని వైపులా రక్షించుచున్నారు. 37

మూ. సంక్షేపస్త్వేష మే రామ కిముక్త్వా విస్తరం హి తే,
స మే జ్యేష్ఠో రిపుర్భ్రాతా వాలీ విశ్రుతపౌరుషః. 38

ప్ర.అ. రామ=రామా! ఏషః =ఇది, మే =నాయొక్క, సంక్షేపః =సంక్షేపము. తే=నీకు, విస్తరమ్ = విస్తరముగా, ఉక్త్వా = చెప్పి, కిమ్ =ఏమి ప్రయోజనము. మే =నాయొక్క, జ్యేష్ఠః భ్రాతా =అన్నగారు, విశ్రుత పౌరుషః =ప్రసిద్ధమైన పౌరుషము గలవాడు అయిన, సః వాలీ =ఆ వాలి, రిపుః =నా శత్రువు.

తా. రామా! ఇది నాకు సంబంధించిన సంక్షిప్తమైన వృత్తాంతము. ఇంకా విస్తరించి నీకు చెప్పుట అనావశ్యకము. ప్రసిద్ధమైన పౌరుషము గల ఆ వాలి నా అన్నగారు; అతడే నా శత్రువు. 38

మూ. తద్వినాశేఽపి మే దుఃఖం ప్రణష్టం స్యాదనన్తరమ్,
సుఖం మే జీవితం చైవ తద్వినాశనిబన్ధనమ్. 39

ప్ర.అ. తద్వినాశేఽపి = అతని వినాశమునందు కూడ, అనన్తరమ్ =వెంటనే, మే =నాయొక్క, దుఃఖమ్ =దుఃఖము, ప్రణష్టమ్ = నశించినది, స్యాత్ =అగును. మే =నాయొక్క, సుఖమ్ = సుఖమూ, జీవితం చైవ =జీవితమూ కూడ, తద్వినాశనిబన్ధనమ్ = ఆతని వినాశమునకు సంబంధించినది.

తా. అతడు నా సోదరుడే అయినా అతడు నశించినచో వెంటనే నా దుఃఖము తొలగిపోవును. నా సుఖము, జీవితము కూడ అతని వినాశముపై ఆధారపడియున్నవి. 39

మూ. ఏష మే రామ శోకాన్తః శోకార్తేన నివేదితః,
దుఃఖితః సుఖితో వాపి సఖ్యు ర్నిత్యం సఖా గతిః. 40

ప్ర.అ. రామ =రామా! శోకార్తేన =శోకముచేత పీడింపబడిన నాచేత,

మే =నాయొక్క, ఏషః=ఈ, శోకాన్తః =శోకము తొలగే ఉపాయము, నివేదితః =తెలుపబడినది. సఖ్యుః =స్నేహితునకు, దుఃఖితః = దుఃఖితుడైనా, సుఖితో వాపి =సుఖితుడైనా, సఖా =స్నేహితుడే, గతిః =గతి.

తా. రామా! శోకపీడితుడనైన నేను నా శోకము తొలగే ఉపాయము చెప్పినాను. సుఖములో ఉన్నా, దుఃఖాలలో ఉన్నా మిత్రుడే మిత్రునకు గతి. 40

మూ. శ్రుత్వైతచ్చ వచో రామః సుగ్రీవమిద మబ్రవీత్,
కిం నిమిత్తమభూద్వైరం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. 41

ప్ర.అ. రామః =రాముడు, ఏతత్ =ఈ, వచః= వచనమును, శ్రుత్వా =విని, సుగ్రీవమ్ =సుగ్రీవుని గూర్చి, ఇదమ్ =ఈ వాక్యమును, అబ్రవీత్ =పలికెను. కిం నిమిత్తమ్ =ఎందువలన, వైరమ్ =వైరము, అభూత్ =ఆయెను? తత్త్వతః = యథార్థముగా, శ్రోతుమ్ =వినుటకు, ఇచ్ఛామి =కోరుచున్నాను.

తా. రాముడు ఈ మాటలు విని, సుగ్రీవునితో ఇట్లు పలికెను - "మీ ఇద్దరికీ వైరము ఎట్లు కలిగెనో యథార్థముగా విన గోరుచున్నాను". 41

మూ. సుఖం హి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర,
ఆనన్తర్యాద్విధాస్యామి సంప్రధార్య బలాబలమ్. 42

ప్ర.అ. వానర =సుగ్రీవా! తవ =నీయొక్క, వైరస్య = వైరముయొక్క, కారణమ్ =కారణమును, శ్రుత్వా =విని, బలాబలమ్ =బలాబలములను, సంప్రధార్య =నిర్ణయించుకొని, ఆనన్తర్యాత్ =వెంటనే, సుఖమ్ =సుఖముగా, విధాస్యామి = చేయగలను.

తా. సుగ్రీవుడా! మీ వైరమునకు కారణ మేదో తెలుసుకొని, బలాబలములను చూచుకొని వెంటనే చేయవలసిన పని అనాయాసముగా చేసెదను. 42

మూ. బలవాన్హి మమామర్షః శ్రుత్వా త్వామవమానితమ్,
వర్ధతే హృదయోత్కమ్పీ ప్రావృడ్వేగ ఇవామ్భసః. 43

ప్ర.అ. త్వామ్=నిన్ను, అవమానితమ్ =అవమానింపబడినవానినిగా, శ్రుత్వా =విని, మమ = నాయొక్క, హృదయోత్కమ్పీ = హృదయమును కంపింపచేసే, బలవాన్ =బలముగల, అమర్షః = కోపము, అమ్భసః =జలముయొక్క, ప్రావృడ్వేగ ఇవ = వర్షకాలమునందలి వేగము వలె, వర్ధతే =వృద్ధి పొందుచున్నది.

తా. నీకు జరిగిన అవమానమును విని నాకు, హృదయమును కలత పెట్టే బలవత్తరమైన కోపము, వర్షాకాలమునందు జలవేగము వలె వృద్ధి పొందుచున్నది.

మూ. హృష్టః కథయ విస్రబ్ధో యావదారోప్యతే ధనుః,
సృష్టశ్చ హి మయా బాణో నిరస్తశ్చ రిపుస్తవ. 44

ప్ర.అ. మయా =నాచేత, ధనుః =ధనస్సు, యావత్ =ఎంతలో, ఆరోప్యతే =ఎక్కుపెట్టబడునో, బాణః =బాణము, సృష్టశ్చ = విడవబడినదో, తవ =నీయొక్క, రిపుః =శత్రువు, నిరస్తశ్చ =చంపబడునో, అంతలో, హృష్టః =సంతోషించినవాడవై, విస్రబ్ధః = నమ్మకము కలవాడవై, కథయ =చెప్పుము.

తా.నేను ధనస్సును ఎక్కుపెట్టి, బాణము ప్రయోగించి, నీ శత్రువును వధించే లోగా నీవు సంతోషముతో, విశ్వాసముతో చెప్పుము. 44

మూ. ఏవముక్తస్తు సుగ్రీవః కాకుత్స్థేన మహాత్మనా,
ప్రహర్షమతులం లేభే చతుర్భిః సహ వానరైః . 45

ప్ర.అ. మహాత్మనా =మహాత్ముడైన, కాకుత్స్థేన =రామునిచేత, ఏవమ్ =ఇట్లు, ఉక్తః = పలకబడిన, సుగ్రీవః =సుగ్రీవుడు, చతుర్భిః =నలుగురు, వానరైః సహ=వానరులతో కూడ, అతులమ్ =సాటి లేని, ప్రహర్షమ్ =సంతోషమును, లేభే =పొందెను.

తా. మహాత్ముడైన రాముని మాటలు విని, సుగ్రీవుడు, నలుగురు వానరులు కూడ చాల సంతోషించిరి. 45

మూ. తతః ప్రహృష్టవదనః సుగ్రీవో లక్ష్మణాగ్రజే,
వైరస్య కారణం తత్త్వమాఖ్యాతు ముపచక్రమే. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర.అ. తతః =అటుపిమ్మట, ప్రహృష్టవదనః =వికసించిన ముఖము గల, సుగ్రీవః =సుగ్రీవుడు, వైరస్య =వైరమునకు, కారణమ్ =కారణమైన, తత్త్వమ్ =యథార్థమును, లక్ష్మణాగ్రజే = రామునియందు, ఆఖ్యాతుమ్ =చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. పిమ్మట సుగ్రీవుడు సంతోషముచే వికసించిన ముఖముతో, వైరమునకు కారణ మేదో యథార్థముగా రామునకు చెప్పుటకు ఉపక్రమించెను. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
అష్టమసర్గ సమాప్తము.

# అథ నవమః సర్గః

[వాలితో తనకు వైరము కలుగుటకు కారణమును సుగ్రీవుడు రామునకు తెలుపుట.]

మూ. వాలీ నామ మమ భ్రాతా జ్యేష్ఠః శత్రునిషూదనః,
పితుర్బహుమతో నిత్యం మమ చాపి తథా పురా. 1

ప్ర.అ. శత్రునిషూదనః =శత్రుసంహారకుడైన, వాలీ నామ =వాలి అనే పేరు గల, మమ =నాయొక్క, జ్యేష్ఠః భ్రాతా =పెద్ద సోదరుడు, నిత్యమ్ =ఎల్లప్పుడూ, పితుః= మా తండ్రికి, బహుమతః = ఇష్టమైనవాడు. పురా =పూర్వము, మమ చాపి= నాకు కూడా, తథా =అట్లే ఇష్టుడు.

తా. శత్రుసంహారకుడైన వాలి అనే పేరు గల నా అన్నగారు మా తండ్రికి చాలా బహుమానపాత్రుడు. పూర్వము నాకు కూడా బహుమానపాత్రుడుగా ఉండేవాడు. 1

మూ. పితర్యుపరతే తస్మిన్ జ్యేష్ఠోఽయమితి మన్త్రిభిః ,
కపీనామీశ్వరో రాజ్యే కృతః పరమసంమతః. 2

ప్ర.అ. తస్మిన్ =ఆ, పితరి =తండ్రి, ఉపరతే =మరణించినవాడగుచుండగా, అయమ్ =ఇతడు, జ్యేష్ఠః ఇతి =పెద్దవాడు అని, రాజ్యే =రాజ్యమునందు, పరమసంమతః =మిక్కిలి పూజింపబడిన, కపీనామ్ ఈశ్వరః = వానరుల రాజుగా, మన్త్రిభిః =మంత్రులచేత, కృతః= చేయబడినాడు.

తా. మా తండ్రి మరణించిన పిమ్మట, మంత్రు లందరూ ఇతడు జ్యేష్ఠకుమారుడు కదా అని ఆలోచించి, అతనిని చాల గౌరవింపబడిన వానర రాజునుగా రాజ్యమునందు నియమించిరి. 2

మూ. రాజ్యం ప్రశాసతస్తస్య పితృపైతామహం మహత్,
అహం సర్వేషు కాలేషు ప్రణతః ప్రేష్యవత్ స్థితః. 3

ప్ర.అ. అహమ్ =నేను, మహత్ =గొప్పదైన, పితృపైతామహమ్= తండ్రులకు తాతలకూ సంబంధించిన, రాజ్యమ్ =రాజ్యమును, ప్రశాసతః =శాసించుచున్న, తస్య =అతనికి , సర్వేషు కాలేషు =అన్ని కాలములయందు, ప్రేష్యవత్ =సేవకుడు వలె, ప్రణతః =వంగినవాడనై, స్థితః =ఉంటిని.

తా. తండ్రితాతలనుండి సంక్రమించిన ఆ మహారాజ్యమును అతడు

శాసించుచుండగా, నేను అన్ని కాలములందూ కూడా, సేవకుడు వలె వంగి ఉంటిని. 3

మూ. మాయావీ నామ తేజస్వీ పూర్వజో దున్దుభేః సుతః,
తేన తస్య మహద్వైరం వాలినః స్త్రీకృతం పురా. 4

ప్ర.అ. దున్దుభేః=దుందుభియొక్క, పూర్వజః =అన్న, సుతః = (మయుని) కుమారుడు అయిన, మాయావీ నామ =మాయావి అనే పేరు గల, తేజస్వీ =తేజశ్శాలియైన రాక్షసుడు ఉండెను. పురా =పూర్వము, తస్య వాలినః =ఆ వాలికి, తేన =వానితో, స్త్రీకృతమ్ = స్త్రీవలన చేయబడిన, మహత్ =గొప్ప, వైరమ్=వైరము ఉండేది.

తా. దుందుభికి అన్నగారు, మయుని పెద్ద కుమారుడు అయిన మాయావి అనే తేజఃశాలియైన రాక్షసుడు ఉండేవాడు. పూర్వము అతనితో వాలికి స్త్రీమూలమున వైరము ఏర్పడినది.

ఈ అర్థం అక్షరానుగుణం కాకపోయినా ఉత్తరకాండలో "మయునికి మాయావి, దుందుభి అనే కుమారులు" అని చెప్పుటచే ఈ విధంగా వ్యాఖ్యాతలు వ్రాసినారు. 4

మూ. స తు సుప్తే జనే రాత్రౌ కిష్కిన్ధాద్వారమాగతః,
నర్దతి స్మ సుసంరబ్ధో వాలినం చాహ్వయద్రణే. 5

ప్ర.అ. రాత్రౌ=రాత్రియందు, జనే=జనము, సుప్తే= నిద్రించుచుండగా, సః=ఆ మాయావి, కిష్కిన్ధాద్వారమ్= కిష్కింధానగరద్వారమును, ఆగతః=పొందిన వాడై, సుసంరబ్ధః=చాలా తొందరగలవాడై, నర్దతి స్మ=గర్జించెను. వాలినమ్=వాలిని, రణే=యుద్ధమునందు, ఆహ్వయత్=పిలచెను.

తా. ఆ మాయావి ఒకనాడు రాత్రి జను లందరూ నిద్రించుచుండగా కిష్కింధాద్వారమువద్దకు వచ్చి, చాల కోపముతో బిగ్గరగా అరచుచు వాలిని యుద్ధానికి పిలచెను. 5

మూ. ప్రసుప్తస్తు మమ భ్రాతా నర్దతో భైరవస్వనమ్,
శ్రుత్వా న మమృషే వాలీ నిష్పపాత జవాత్తదా. 6

ప్ర.అ. తదా=అప్పుడు, ప్రసుప్తః=నిద్రపోయిన, మమ భ్రాతా=నా సోదరుడైన, వాలీ=వాలి, నర్దతః=గర్జించుచున్న వానియొక్క, భైరవస్వనమ్=భయంకరమైన ధ్వనిని, శ్రుత్వా=విని, న మమృషే=సహించలేదు. జవాత్=వేగమువలన, నిష్పపాత=బైటకు వచ్చెను.

తా. అప్పుడు నిద్రపోవుచున్న నా సోదరుడైన వాలి గర్జించుచున్న ఆతని భయంకరధ్వనిని విని సహించక వేగముగా బైటకు వచ్చెను. 6

మూ. స తు వై నిఃసృతః క్రోధాత్తం హన్తుమసురోత్తమమ్,
వార్యమాణస్తతః స్త్రీభిర్మయా చ ప్రణతాత్మనా. 7

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సః=ఆ వాలి, స్త్రీభిః=స్త్రీలచేతను, ప్రణతాత్మనా=వంగిన శరీరముగల,(నమస్కరించుచున్న), మయా చ= నా చేతను, నివార్యమాణః=నివారించబడుచున్నవాడైనను, తమ్=ఆ, అసురోత్తమమ్=శ్రేష్ఠుడైన అసురుణ్ణి, హన్తుమ్=చంపుటకు, క్రోధాత్=కోపమువలన, నిఃసృతః=బయలుదేరినాడు.

తా. అప్పుడు స్త్రీలు, నమస్కరించుచు నేను, నివారించినను వినక వాలి ఆ అసురుని చంపుటకు కోపముతో బైటకు వెళ్లెను. 7

మూ. స తు నిర్ధూయ తాః సర్వా నిర్జగామ మహాబలః,
తతోఽహమపి సౌహార్దాన్నిఃసృతో వాలినా సహ. 8

ప్ర.అ. మహాబలః=గొప్ప బలము గల, స తు=ఆ వాలియైతే, తాః సర్వాః=ఆ అందరు స్త్రీలను, నిర్ధూయ=తిరస్కరించి, నిర్జగామ=బయలుదేరెను. తతః=అనంతరము, అహమపి= నేను కూడ, సౌహార్దాత్=ప్రేమవలన, వాలినా సహ=వాలితో కూడ, నిఃసృతః=బయల్వెడలితిని.

తా. మహాబలశాలియైన ఆ వాలి ఆ స్త్రీల నందరినీ త్రోసిపుచ్చి బయలుదేరెను. అప్పుడు నేను కూడ స్నేహమువలన ఆ వాలితోకూడ బయలువెడలితిని. 8

మూ. స తు మే భ్రాతరం దృష్ట్వా మాం చ దూరాదవస్థితమ్,
అసురో జాతసంత్రాసః ప్రదుద్రావ తదా భృశమ్. 9

ప్ర.అ. సః= ఆ, అసురః తు = అసురుడైతే, మే భ్రాతరమ్ =నా సోదరుని, దూరాత్ =దూరముగా, అవస్థితమ్ =ఉన్న, మాం చ =నన్ను, దృష్ట్వా =చూచి, తదా =అప్పుడు, భృశమ్ = మిక్కిలి, జాతసంత్రాసః =పుట్టిన భయము కలవాడై, ప్రదుద్రావ = పరుగెత్తెను.

తా. అప్పుడా అసురుడు నా సోదరుణ్ణీ, దూరముగా ఉన్న నన్నూ చూచి చాల భయపడి పారిపోయెను. 9

మూ. తస్మిన్ ద్రవతి సంత్రస్తే హ్యావాం ద్రుతతరం గతౌ,
ప్రకాశోఽపి కృతో మార్గశ్చన్ద్రేణోద్గచ్ఛతా తదా. 10

ప్ర.అ. సంత్రస్తే =భయపడిన, తస్మిన్ =అతడు, ద్రవతి = పారిపోవుచుండగా, ఆవామ్ = మేమిద్దరము, ద్రుతతరమ్ = అతిశీఘ్రముగా, గతౌ =వెళ్లితిమి. తదా =అప్పుడు, ఉద్గచ్ఛతా = బయలుదేరుచున్న, చన్ద్రేణ =చంద్రునిచేత, మార్గః

=మార్గము, ప్రకాశో ఽపి =ప్రకాశము కలదిగా కూడ, కృతః= చేయబడినది.

తా. అతడు భయపడి పారిపోవుచుండగా మే మిద్దరము కూడ శీఘ్రముగా వానిని వెంబడించితిమి. అప్పుడు ఉదయించుచున్న చంద్రుడు మార్గము స్పష్టముగా కనబడునట్లు చేసెను. 10

మూ. స తృణై రావృతం దుర్గం ధరణ్యా వివరం మహత్,
ప్రవివేశాసురో వేగాదావామాసాద్య విష్ఠితౌ. 11

ప్ర.అ. సః అసురః= ఆ అసురుడు, ధరణ్యాః =భూమియొక్క, దుర్గమ్ =ప్రవేశింప శక్యము కానిది, తృణైః =తృణములచేత, ఆవృతమ్ =కప్పబడినది, మహత్ = గొప్పదీ అయిన, వివరమ్ = రంధ్రమును, ప్రవివేశ = ప్రవేశించెను. ఆవామ్ = మే మిద్దరము, ఆసాద్య = పొంది, విష్ఠితౌ =నిలచితిమి.

తా. ఆ అసురుడు తృణములచే కప్పబడిన, ప్రవేశింప శక్యము కాని గొప్పదైన భూవివరములోనికి వేగముగా ప్రవేశించెను. మే మిద్దరము ఆ బిలమువద్దకు చేరి నిలిచిపోయితిమి. 11

మూ. తం ప్రవిష్టం రిపుం దృష్ట్వా బిలం రోషవశం గతః,
మామువాచ తతో వాలీ వచనం క్షుభితేన్ద్రియః. 12

ప్ర.అ. తతః =అటుపిమ్మట, బిలమ్= బిలమును, ప్రవిష్టమ్ = ప్రవేశించిన, తం రిపుమ్ =ఆ శత్రువును, దృష్ట్వా =చూచి, వాలీ =వాలి, రోషవశమ్ =కోపవశమును, గతః =పొందినవాడై, క్షుభితేన్ద్రియః= క్షోభ చెందిన ఇంద్రియములు కలవాడై, మామ్ =నన్ను గూర్చి, ఉవాచ =పలికెను.

తా. అప్పుడా శత్రువు బిలములో ప్రవేశించుట చూచి, వాలి మిక్కిలి కోపించి క్షోభ చెందిన ఇంద్రియములతో నాతో ఇట్లు పలికెను. 12

మూ. ఇహ తిష్ఠాద్య సుగ్రీవ బిలద్వారి సమాహితః,
యావదత్ర ప్రవిశ్యాహం నిహన్మి సమరే రిపుమ్. 13

ప్ర.అ. సుగ్రీవ =సుగ్రీవుడా! అహమ్ =నేను, అత్ర =దీనియందు, ప్రవిశ్య =ప్రవేశించి, సమరే =యుద్ధమునందు, రిపుమ్=శత్రువును, యావత్ నిహన్మి =ఎంతలో చంపుదునో అంతవరకు, సమాహితః =సావధానచిత్తుడవై, అద్య =ఇప్పుడు, బిలద్వారి = బిలద్వారమునందు, తిష్ఠ =నిలువుము.

తా. సుగ్రీవుడా! నే నీ బిలములో ప్రవేశించి యుద్ధమునందు శత్రువును సంహరించి తిరిగి వచ్చేవరకు నీవు సావధానచిత్తుడవై ఈ బిలద్వారమువద్దనే ఉండుము. 13

మూ. మయా త్వేతద్వచః శ్రుత్వా యాచితః స పరంతపః,
శాపయిత్వా చ మాం పద్భ్యాం ప్రవివేశ బిలం తతః. 14

ప్ర.అ. ఏతత్ =ఈ , వచః =వచనమును, శ్రుత్వా =విని, మయా =నాచేత, యాచితః =ప్రార్థించబడిన, పరంతపః = శత్రువును పీడించు , సః =ఆ వాలి, మామ్ =నన్ను, పద్భ్యామ్ =పాదములచేత, శాపయిత్వా =ఒట్టు పెట్టించి, తతః = పిమ్మట,బిలమ్ =బిలమును, ప్రవివేశ =ప్రవేశించెను.

తా. ఆ మాటలు విని నేను కూడ వచ్చెద నని నేను ప్రార్థించగా శత్రుసంహారకుడైన ఆ వాలి అంగీకరించక తన పాదాలమీద ఒట్టు పెట్టి , బిలములోనికి ప్రవేశించెను. 14

మూ. తస్య ప్రవిష్టస్య బిలం సాగ్రః సంవత్సరో గతః,
స్థితస్య చ బిలద్వారి స కాలో వ్యత్యవర్తత. 15

ప్ర.అ. బిలమ్ =బిలమును, ప్రవిష్టస్య =ప్రవేశించిన, తస్య = అతనికి, సాగ్రః =అగ్రముతో కూడిన (కొంచెము అధికమైన), సంవత్సరః =సంవత్సరము, గతః = గడచినది. బిలద్వారి = బిలద్వారమునందు, స్థితస్య =నిలచియున్న నాకు, సః కాలః =ఆ కాలము, వ్యత్యవర్తత =గడచిపోయినది.

తా. అతడు బిలములో ప్రవేశించిన పిదప కొంచెము అధికముగా ఒక సంవత్సరము గడచిపోయినది. ఆ కాలమంతా నేను బిలము ద్వారమువద్దనే నిలచి ఉంటిని. 15

మూ. అహం తు నష్టం తం జ్ఞాత్వా స్నేహాదాగతసంభ్రమః,
భ్రాతరం న ప్రపశ్యామి పాపశఙ్కి చ మే మనః. 16

ప్ర.అ. అహం తు =నేనైతే, తమ్ =అతనిని, నష్టమ్ = మరణించిన వానినిగా, జ్ఞాత్వా =తెలుసుకొని (తలచి), స్నేహాత్ = స్నేహమువలన , ఆగత సంభ్రమః = కలిగిన భయము కలవాడనై, భ్రాతరమ్ = సోదరుని, న ప్రపశ్యామి =చూడలేదు. మే = నాయొక్క, మనః = మనస్సు, పాపశఙ్కి చ = పాపమును శంకించునది కూడ ఆయెను.

తా. వాలి మరణించినా డని ఊహించుచు, స్నేహమువలన నేను భయపడుచుంటిని. వాలి కనబడకపోవుటచేత నా మనస్సు పాపమును శంకించ ప్రారంభించెను. 16

మూ. అథ దీర్ఘస్య కాలస్య బిలాత్తస్మాద్వినిఃసృతమ్,
సఫేనం రుధిరం దృష్ట్వా తతోఽహం భృశదుఃఖితః. 17

ప్ర.అ. అథ =అటుపిమ్మట, దీర్ఘస్య కాలస్య=దీర్ఘమైన కాలమునకు, తస్మాత్

=ఆ, బిలాత్ = బిలమునుండ, వినిఃసృతమ్ = బయల్వెడలిన, సఫేనమ్ =నురుగుతో కూడిన, రుధిరమ్ = రక్తమును, దృష్ట్వా =చూచి, తతః =అటుపిమ్మట, అహమ్ = నేను, భృశదుఃఖితః =మిక్కిలి దుఃఖించితిని.

తా. అంతలో చాల కాలానికి , ఆ బిలమునుండి నురుగుతో కూడిన రక్తము బయలుదేరి రాగా చూచి నేను చాలా దుఃఖించితిని. 17

మూ. నర్దతామసురాణాం చ ధ్వనిర్మే శ్రోత్రమాగతః,
న రతస్య చ సంగ్రామే క్రోశతోఽపి స్వనో గురోః. 18

ప్ర.అ. నర్దతామ్ =అరచుచున్న, అసురాణామ్ =రాక్షసులయొక్క, ధ్వనిః= ధ్వని, మే =నాయొక్క, శ్రోత్రమ్ =చెవిని, ఆగతః=పొందినది. సంగ్రామే =యుద్ధమునందు, రతస్య =ఆసక్తుడైనవాడు గాని, క్రోశతో వాపి =అరచుచున్నవాడు గాని అయిన, గురోః= అన్నగారియొక్క, స్వనః=ధ్వని, న=వినబడలేదు.

తా. గట్టిగా అరచుచున్న అసురుల ధ్వని కూడ నా చెవిని పడినది. నా అన్నగారు యుద్ధము చేయుచున్నట్లు గాని, అరచుచున్నట్లు గాని ధ్వని వినబడలేదు. 18

మూ. అహం త్వవగతో బుద్ధ్యా చిహ్నైస్తైర్భ్రాతరం హతమ్,
పిధాయ చ బిలద్వారం శిలయా గిరిమాత్రయా, 19
శోకార్తశ్చోదకం కృత్వా కిష్కిన్ధామాగతః సఖే,
గూహమానస్య మే తత్త్వం యత్నతో మన్త్రిభిః శ్రుతమ్. 20

ప్ర.అ. సఖే =మిత్రుడా! అహం తు =నేనైతే, తైః =ఆ, చిహ్నైః =చిహ్నములచేత, భ్రాతరమ్ =సోదరుణ్ణి, హతమ్= చంపబడినవానినిగా, బుద్ధ్యా =బుద్ధిచేత, అవగతః = తెలుసుకొన్నవాడనై, గిరిమాత్రయా =పర్వతము ప్రమాణము గల, శిలయా =శిలచేత, బిలద్వారమ్ =బిలముయొక్క ద్వారమును, పిధాయ చ =మూసివేసి, శోకార్తః =శోకముచేత పీడింపబడినవాడనై, ఉదకం కృత్వా=ఉదకక్రియలు చేసి, కిష్కిన్ధామ్ =కిష్కింధను గూర్చి, ఆగతః =వచ్చినాను. మే =నేను, గూహమానస్య = దాచుచున్నా, మన్త్రిభిః =మంత్రులచేత, తత్త్వమ్ =యథార్థము, యత్నతః =ప్రయత్నమువలన, శ్రుతమ్ =వినబడినది.

తా. మిత్రుడా! నేను ఆ గుర్తులను పట్టి నా సోదరుడు చంపబడినాడని ఊహించుకొని, దుఃఖార్తుడనై, పర్వత మంత శిలతో ఆ బిలద్వారమును మూసివేసి, అతనికి తర్పణములు కూడ చేసి కిష్కింధ చేరితిని. నేను రహస్యముగా ఎంత దాచినా, మంత్రులు ప్రయత్నించి ఆ యథార్థమును తెలిసికొనిరి. 19, 20

మూ. తతోఽహం తైః సమాగమ్య సమేతైరభిషేచితః,
రాజ్యం ప్రశాసతస్తస్య న్యాయతో మమ రాఘవ. 21
ఆజగామ రిపుం హత్వా దానవం స తు వానరః.

ప్ర.అ. తతః =అటుపిమ్మట, సమేతైః =కలిసిన , తైః =ఆ మంత్రుల చేత, సమాగమ్య =వచ్చి, అహమ్ =నేను, అభిషేచితః =అభిషేకింపబడితిని. రాఘువ =రామా! తస్య మమ=అట్టి నేను, రాజ్యమ్ =రాజ్యమును, న్యాయతః=న్యాయానుసారముగా, ప్రశాసతః = పాలించుచుండగా, సః వానరః =ఆ వానరుడు, రిపుమ్ =శత్రువైన , దానవమ్ =దానవుణ్ణి, హత్వా =చంపి, ఆజగామ =వచ్చెను.

తా. అప్పుడా మంత్రులు కలిసి, నావద్దకు వచ్చి, నన్ను రాజ్యాభిషిక్తుని చేసిరి. రామా! నేను న్యాయసంమతముగా రాజ్యమును పాలించుచుండగా, వాలి, శత్రువైన దానవుని చంపి వచ్చెను. 21

మూ. అభిషిక్తం తు మాం దృష్ట్వా కోపాత్సంరక్తలోచనః, 22
మదీయాన్ మన్త్రిణో బద్ధ్వా పరుషం వాక్యమబ్రవీత్.

ప్ర.అ. అభిషిక్తమ్ =అభిషిక్తుడనైన, మామ్ =నన్ను, దృష్ట్వా =చూచి, కోపాత్=కోపమువలన, సంరక్తలోచనః =ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, మదీయాన్=నా సంబంధమైన, మన్త్రిణః = మంత్రులను, బద్ధ్వా =బంధించి, పరుషమ్ =పరుషమైన, వాక్యమ్ =వాక్యమును, అబ్రవీత్ =పలికెను.

తా. నేను రాజ్యాభిషిక్తుడనై ఉండుట చూచి, కోపముతో ఎఱ్ఱబడిన నేత్రములతో నన్ను దూషించి, నా మంత్రులను బంధించెను. 22

మూ. నిగ్రహే చ సమర్థస్య తం పాపం ప్రతి రాఘువ, 23
న ప్రావర్తత మే బుద్ధిర్భ్రాతృగౌరవయన్త్రితా.

ప్ర.అ రాఘువ =రామా! నిగ్రహే =వానిని నిగ్రహించుటయందు, సమర్థస్య =సమర్థుడనైనా, మే =నాయొక్క , బుద్ధిః = బుద్ధి, భ్రాతృగౌరవయన్త్రితా =సోదరునిమీద గౌరవముచేత నియమించబడినదై, తం పాపం ప్రతి =ఆ పాపాత్ముని గూర్చి, న ప్రావర్తత = ప్రవర్తించలేదు.

తా. రామా! నేను అతనిని నిగ్రహించుటకు సమర్థుడనే అయినా, నా బుద్ధిని అన్నమీద ఉన్న గౌరవము అడ్డుకొనుటచేత ఆ పాపాత్ముని విషయమున క్రూరముగా ప్రవర్తించలేదు. 23

మూ. హత్వా శత్రుం స మే భ్రాతా ప్రవివేశ పురం తదా. 24
మానయం స్తం మహాత్మానం యథావచ్చాభివాదయమ్.
ఉక్తాశ్చ నాశిషస్తేన ప్రహృష్టేనాన్తరాత్మనా. 25

ప్ర.అ. మే భ్రాతా =నా సోదరుడైన, సః =ఆ వాలి, శత్రుమ్ = శత్రువును, హత్వా =చంపి, తదా =అప్పుడు, పురమ్ = పట్టణమును, ప్రవివేశ =ప్రవేశించెను. మహాత్మానమ్ = మహాత్ముడైన, తమ్ =అతనిని, మానయన్ =గౌరవించుచు, యథావత్ =యథావిధిగా, అభివాదయమ్ =నమస్కరించితిని.

తేన= వానిచేత, ప్రహృష్టేన =సంతోషించిన, అన్తరాత్మనా =అంతరాత్మతో, ఆశిషః =ఆశీర్వచనములు, నోక్తాః =పలకబడలేదు.

తా. నా సోదరుడైన వాలి శత్రువును చంపి పట్టణములో ప్రవేశించగా నేను ఆ మహాత్ముని గౌరవించుచు యథావిధిగా అభివాదనము చేసితిని. కాని అతడు మనఃసంతోషపూర్వకముగా నన్ను ఆశీర్వదించలేదు. 24, 25

మూ. నత్వా పాదావహం తస్య ముకుటేనాస్పృశం ప్రభో,
అపి వాలీ మమ క్రోధాన్న ప్రసాదం చకార సః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
నవమః సర్గః.

ప్ర-అ. ప్రభో =ఓ! ప్రభూ! అహమ్ =నేను, నత్వా =నమస్కరించి, తస్య పాదౌ =అతని పాదాలను, ముకుటేన =కిరీటముతో, అస్పృశమ్ =స్పృశించినాను. అపి =అట్లయినా, సః వాలీ =ఆ వాలి , క్రోధాత్ =క్రోధమువలన, మమ =నా యొక్క, ప్రసాదమ్ = అనుగ్రహమును, న చకార =చేయలేదు.

తా. రామా! నే నాతనికి నమస్కరించి ఆతని పాదాలను కిరీటముతో స్పృశించినా కూడ ఆ వాలి కోపావిష్టుడై నన్ను అనుగ్రహించలేదు. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో తొమ్మిదవసర్గ సమాప్తము.

# అథ దశమః సర్గః

*["వాలిని అనుగ్రహింపచేసికొనుటకై నేనెంత ప్రయత్నించినా కూడ అతడు అంగీకరించక రాజ్యమునుండి బహిష్కరించెను." అని సుగ్రీవుడు చెప్పుట]*

మూ. తతః క్రోధసమావిష్టం సంరబ్ధం తముపాగతమ్,
అహం ప్రసాదయాఞ్చక్రే భ్రాతరం హితకామ్యయా. 1

ప్ర.అ. తతః =అటు పిమ్మట, అహమ్ =నేను, క్రోధసమావిష్టమ్ =కోపముచేత ఆవహించబడినవాడు, సంరబ్ధమ్ =తొందరపాటుతో కూడినవాడు అయిన, ఉపాగతమ్ =వచ్చిన, తం భ్రాతరమ్ =ఆ సోదరుని, హితకామ్యయా =హితమునందు కోరికచేత, ప్రసాదయాఞ్చక్రే =బ్రతిమాలుకొంటిని.

తా. అప్పుడు వచ్చి కోపావిష్టుడై తొందరగా ప్రవర్తించుచున్న , నా సోదరుణ్ణి నేను, మా ఇరువురి హితమును కోరి బ్రతిమాలుకొంటిని. 1

మూ. దిష్ట్యాఽసి కుశలీ ప్రాప్తో నిహతశ్చ త్వయా రిపుః,
అనాథస్య హి మే నాథస్త్వమేకోఽనాథనన్దన. 2

ప్ర.అ. అనాథనన్దన =అనాథులకు ఆనందము కలిగించేవాడా! దిష్ట్యా = అదృష్టవశముచేత, త్వయా =నీచేత, రిపుః =శత్రువు, నిహతః =చంపబడినాడు. కుశలీ =క్షేమవంతుడవై, ప్రాప్తః అసి = వచ్చినావు. అనాథస్య =అనాథుడనైన, మే =నాకు, త్వమ్ = నీవు, ఏకః =ఒక్కడవే, నాథః= రక్షకుడవు.

తా. రక్షకులు లేనివారికి ఆనందము కలిగించువాడా! అదృష్టవశముచే నీవు శత్రువును సంహరించి కుశలముగా తిరిగి వచ్చినావు. అనాథుడనైన నాకు నీ వొక్కడవే రక్షకుడవు. 2

మూ. ఇదం బహుశలాకం తే పూర్ణచన్ద్రమివోదితమ్,
ఛత్రం సవాలవ్యజనం ప్రతీచ్ఛస్వ మయా ధృతమ్. 3

ప్ర.అ. తే = నీకు, మయా =నాచేత, ధృతమ్ =పట్టబడినది, బహుశలాకమ్ =చాల ఊచలు కలది, ఉదితమ్ =ఉదయించిన, పూర్ణచన్ద్రమివ =పూర్ణచంద్రుడు వలె ఉన్నది, సవాలవ్యజనమ్ = చమరీమృగముల వాలముల రూపములైన వింజామరలతో కూడినది అయిన, ఇదమ్ =ఈ, ఛత్రమ్ =ఛత్రమును, ప్రతీచ్ఛస్వ =స్వీకరించుము.

తా. ఉదయించుచున్న చంద్రుడు వలె ఉన్నది, అనేకములైన ఊచలు ఉన్నది, అయిన ఈ ఛత్రమును , వింజామరలను పట్టుచున్నాను; అంగీకరించుము.

మూ. ఆర్త శ్చాథ బిలద్వారి స్థితః సంవత్సరం నృప,
దృష్ట్వా చ శోణితం ద్వారి బిలాచ్చాపి సముత్థితమ్. 4
శోకసంవిగ్నహృదయో భృశం వ్యాకులితేన్ద్రియః,
అపిధాయ బిలద్వారం శైలశృఙ్గేణ తత్తదా, 5
తస్మాద్దేశాదపాక్రమ్య కిష్కిన్ధాం ప్రావిశం పునః.

ప్ర.అ. నృప= రాజా! ఆర్తః= దుఃఖితుడనైన నేను, సంవత్సరమ్ = సంవత్సరకాలము, బిలద్వారి =బిలద్వారమునందు, స్థితః =ఉంటిని. అథ =అటు పిమ్మట, బిలాత్ =బిలమునుండి, సముత్థితమ్= బయలుదేరిన, శోణితమ్ = రక్తమును, ద్వారి =ద్వారమునందు, దృష్ట్వా చ=చూచి, శోకసంవిగ్న హృదయః =శోకముచేత దిగులు చెందిన హృదయము కలవాడనై, భృశమ్ =మిక్కిలి, వ్యాకులితేన్ద్రియః =వ్యాకులములుగా చేయబడిన ఇంద్రియములు కలవాడనై, తదా =అప్పుడు, తత్ =ఆ, బిలద్వారమ్ =బిలద్వారమును, శైలశృఙ్గేణ = పర్వతశిఖరము చేత, అపిధాయ =కప్పివేసి, తస్మాత్ =ఆ, దేశాత్ =ప్రదేశమునుండి, అపక్రమ్య =తొలగి, పునః =మరల, కిష్కిన్ధామ్ =కిష్కింధను, ప్రావిశమ్ =ప్రవేశించితిని.

తా. నేను దుఃఖముతో బాధపడుచు సంవత్సరము పాటు బిలము ద్వారము దగ్గర ఉంటిని. ఇంతలో బిలమునుండి రక్తము ద్వారము వైపు ప్రవహించి వచ్చుట చూచి, శోకముచేత హృదయము దిగులుచెందగా, ఇంద్రియము లన్నీ చాల వ్యాకులత చెందగా, ఆ బిలద్వారమును పర్వతశిఖరముచేత కప్పివేసి ఆ ప్రదేశము విడచి తిరిగి కిష్కింధ చేరితిని. 4, 5.

మూ. విషాదాత్త్విహ మాం దృష్ట్వా పౌరైర్మన్త్రిభిరేవ చ, 6
అభిషిక్తో న కామేన తన్మే క్షన్తుం త్వమర్హసి.

ప్ర.అ. విషాదాత్ =దుఃఖమువలన, ఇహ =ఇక్కడకు వచ్చిన, మామ్ =నన్ను, దృష్ట్వా =చూచి, పౌరైః =పౌరులచేతను, మన్త్రిభిరేవ చ =మంత్రులచేతను, అభిషిక్తః =అభిషేకింపబడితిని. కామేన = నా కోరికచేత, న =కాదు. త్వమ్ =నీవు, మే =నాయొక్క, తత్ =దానిని, క్షన్తుమ్ =క్షమించుటకు , అర్హసి =తగి ఉన్నావు.

తా. దుఃఖముతో ఇక్కడికి వచ్చిన నన్ను చూచి పౌరులు, మంత్రులు నాకు అభిషేకము చేసినారు. నా కోరికచేత కాదు. నీవు నాకు జరిగిన అభిషేకమును క్షమించుము. 6

త్వమేవ రాజా మానార్హః సదా చాహం యథా పురా, 7
రాజభావే నియోగోఽయం మమ త్వద్విరహాత్కృతః,
సామాత్యపౌరనగరం స్థితం నిహతకణ్టకమ్. 8

ప్ర.అ మానార్హః =గౌరవమునకు తగిన, రాజా =రాజు, త్వమేవ =నీవే. అహం చ =నేను, పురా యథా =పూర్వమునందు వలెనే. మమ=నాయొక్క, అయమ్ =ఈ , రాజభావే =రాజత్వమునందు, నియోగః =నియోగము, త్వద్విరహాత్ =నీవు లేకపోవుటవలన , కృతః =చేయబడినది. సామాత్యపౌరనగరమ్ =అమాత్యులతోను, పౌరులతోను, నగరములతోను కూడిన రాజ్యము, నిహతకణ్టకమ్ = చంపబడిన శత్రువులు కలదై, స్థితమ్ =ఉన్నది.

తా. గౌరవమునకు తగిన రాజు నీవే. నేను పూర్వమువలెనే ఉండగలను. నీవు లేకపోవుటవలన న న్నీ రాజ్యమునందు నియమించిరి. అమాత్యులతోను, పౌరులతోను, నగరములతోను కూడిన ఈ రాజ్యమును శత్రుబాధ లేవీ లేకుండా చేసి ఉంచినాను. 7, 8

మూ. న్యాసభూతమిదం రాజ్యం తవ నిర్యాతయామ్యహమ్,
మా చ రోషం కృథాః సౌమ్య మమ శత్రునిషూదన. 9

ప్ర.అ. న్యాసభూతమ్ =న్యాసమైన (కొంతకాలము పాటు దాచుటకై ఇతరులవద్ద ఉంచిన సొత్తుకు న్యాస మని పేరు), ఇదం రాజ్యమ్ =ఈ రాజ్యమును, అహమ్ =నేను, తవ =నీకు, నిర్యాతయామి =తిరిగి అప్పచెప్పుచున్నాను. శత్రునిషూదన =శత్రువులను సంహరించే, సౌమ్య =సౌమ్యుడా! మమ =నా విషయమున, రోషమ్ =కోపమును, మా కృథాః =చేయకుము.

తా. న్యాసముగా సంరక్షించిన ఈ రాజ్యమును నీకు మరల అప్ప చెప్పుచున్నాను. శత్రుసంహారకుడవైన ఓ! సౌమ్యుడా! నాపై కోపించకుము. 9

మూ. యాచే త్వాం శిరసా రాజన్ మయా బద్ధో ఽయమఞ్జలిః,
బలాదస్మిన్ సమాగమ్య మన్త్రిభిః పురవాసిభిః, 10
రాజభావే నియుక్తో ఽహం శూన్యదేశజిగీషయా.

ప్ర.అ. రాజన్ =రాజా! శిరసా =శిరస్సుతో, త్వామ్ =నిన్ను, యాచే =యాచించుచున్నాను. మయా=నాచేత, అయమ్ =ఈ, అఞ్జలిః =దోసిలి, బద్ధః =కట్టబడినది. మన్త్రిభిః = మంత్రులచేతను, పురవాసిభిః =పౌరులచేతను, సమాగమ్య =కలిసి, అహమ్ =నేను, శూన్యదేశజిగీషయా =రాజులేని దేశమును వశములో ఉంచుకొనవలె నను కోరికచేత, అస్మిన్ =ఈ, రాజభావే = రాజ్యమునందు , బలాత్ =బలాత్కారమువలన, నియుక్తః = నియమించబడితిని.

తా. అంజలి ఘటించి, శిరస్సు వంచి, నిన్ను ప్రార్థించుచున్నాను. రాజు లేని రాజ్యమును వశములో ఉంచుకొనవలె ననే కోరికతో మంత్రులు, పౌరులు కలిసి నన్ను ఈ రాజ్యమునందు బలాత్కరించి నియమించినారు. 10

మూ. స్నిగ్ధమేవం బ్రువాణం మాం స వినిర్భర్త్స్య వానరః, 11
ధిక్త్వామితి చ మాముక్త్వా బహు తత్తదువాచ హ.

ప్ర.అ. సః వానరః =ఆ వాలి, ఏవమ్ =ఇట్లు, స్నిగ్ధమ్ = స్నేహపూర్వకముగా, బ్రువాణమ్ =పలుకుచున్న, మామ్ =నన్ను, వినిర్భర్త్స్య =భయపెట్టి, త్వామ్ =నిన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక, ఇతి చ =అని కూడ, ఉక్త్వా =పలికి, తత్తత్ =ఆ యా దూషణవాక్యమును, బహు =అధికముగా, ఉవాచ హ =పలికెను.

తా. ఈ విధముగా స్నేహపూర్వకముగా మాటలాడుచున్న నన్ను ఆ వాలి భయపెట్టి, 'ఛీ! ఛీ' అని అనుచు అనేకనిందావాక్యములు పలికెను. 11

మూ. ప్రకృతీశ్చ సమానీయ మన్త్రిణ శ్చైవ సంమతాన్, 12
మామాహ సుహృదాం మధ్యే వాక్యం పరమగర్హితమ్.

ప్ర.అ. ప్రకృతీశ్చైవ =ప్రజలను, సంమతాన్ =పూజ్యులైన, మన్త్రిణ శ్చైవ = మంత్రులను, సమానీయ =పిలిపించి, సుహృదామ్=స్నేహితులయొక్క, మధ్యే =మధ్యయందు, మామ్ =నన్నుగూర్చి, పరమగర్హితమ్ =చాల నింద్యమైన, వాక్యమ్ = వాక్యమును, ఆహ =పలికెను.

తా. అప్పుడతడు గౌరవార్హులైన మంత్రులను, ప్రకృతులను (ప్రజలను) పిలిపించి, స్నేహితుల మధ్య నన్ను గూర్చి ఇలా నింద్యమైన మాట పలికెను.

మూ. విదితం వో మయా రాత్రౌ మాయావీ స మహాసురః, 13
మాం సమాహ్వాయత క్రుద్ధో యుద్ధాకాఙ్క్షీ తదా పురా.

ప్ర.అ. పురా=పూర్వము, మహాసురః =మహాసురుడైన, మాయావీ = మాయావి, క్రుద్ధః =కోపించినవాడై, యుద్ధాకాఙ్క్షీ = యుద్ధమును కోరుచున్నవాడై, తదా రాత్రౌ = ఆ నాటి రాత్రి, మామ్ =నన్ను, సమాహ్వాయత =పిలచెను. వః =మీకు, విదితమ్ = తెలియును కదా.

తా. పూర్వము ఒకనాటి రాత్రి, మహాసురుడైన మాయావి, కోపముతో యుద్ధమును కోరుచు నన్ను పిలచెను అను విషయము మీకు తెలియును కదా! 13

మూ. తస్య తద్భాషితం శ్రుత్వా నిఃసృతోఽహం నృపాలయాత్, 14
అనుయాతశ్చ మాం తూర్ణమయం భ్రాతా సుదారుణః.

ప్ర.అ. తస్య =అతనియొక్క, తత్ =ఆ, భాషితమ్ =మాటను, శ్రుత్వా =విని, అహమ్ =నేను, నృపాలయాత్ = రాజగృహమునుండి, నిఃసృతః =బయలుదేరితిని. సుదారుణః =చాల క్రూరుడైన, అయమ్ =ఈ, భ్రాతా =సోదరుడు,తూర్ణమ్ = శీఘ్రముగా, మామ్ =నన్ను, అనుయాతః =అనుసరించి

బయులుదేరినాడు.

తా. వాని మాటలు విని నేను రాజప్రాసాదమునుండి బయులుదేరి వెళ్ళితిని. అపుడు చాల క్రూరుడైన ఈ నా సోదరుడు నా వెనుకనే శీఘ్రముగా వచ్చినాడు. 14

మూ. స తు దృష్ట్వైవ మాం రాత్రౌ సద్వితీయం మహాబలః, 15
ప్రాద్రవద్భయసంత్రస్తో వీక్ష్యావాం సముపాగతౌ,
అభిద్రుతస్తు వేగేన వివేశ స మహాబిలమ్. 16

ప్ర.అ. మహాబలః= గొప్ప బలము గల, సః = ఆ రాక్షసుడు, రాత్రౌ = రాత్రియందు, సద్వితీయమ్ = సహాయునితో కూడిన, మామ్= నన్ను, దృష్ట్వా ఏవ= చూడగానే, ప్రాద్రవత్ =పారిపోయెను. సముపాగతౌ= వచ్చిన, ఆవామ్= మమ్ముల నిద్దరినీ, వీక్ష్య= చూచి, భయసంత్రస్తః= భయ హేతువుచేత భయపడినవాడై, వేగేన= వేగముతో, అభిద్రుతః= పారిపోయిన, సః= అతడు, మహాబిలమ్= గొప్ప బిలమును, వివేశ= ప్రవేశించెను.

తా. గొప్ప బలము గల ఆ అసురుడు రాత్రి మరొకనితో కూడ కలపి వచ్చిన నన్ను చూడగానే పారిపోయెను. మమ్ములను ఇద్దరినీ చూచి భయాక్రాంతుడై పారిపోయి ఆ అసురుడు ఒక మహాబిలములో ప్రవేశించెను.

మూ. తం ప్రవిష్టం విదిత్వా తు సుఘోరం సుమహద్బిలమ్,
అయముక్తోఽథ మే భ్రాతా మయా తు క్రూరదర్శనః.

ప్ర.అ. సుఘోరమ్ = చాల భయంకరుడైన, తమ్= ఆ అసురుణ్ణి, సుమహత్= చాల పెద్దదైన, బిలమ్= బిలమును, ప్రవిష్టమ్= ప్రవేశించినవానినిగా, విదిత్వా= తెలుసుకొని, అథ= పిమ్మట, క్రూరదర్శనః= క్రూరమైన దర్శనము గల, అయమ్= ఈ, మమ భ్రాతా = నా సోదరుడు, మయా= నాచేత, ఉక్తః= పలకబడినాడు.

తా. చాలా భయంకరుడైన ఆ అసురుడు ఆ మహాబిలములో ప్రవేశించి నట్లు చూచి, నేను క్రూరస్వభావుడైన ఈ నా సోదరునితో ఇట్లు పలికితిని.

మూ. అహత్వా నాస్తి మే శక్తిః ప్రతిగన్తుమితః పురీమ్,
బిలద్వారి ప్రతీక్ష త్వం యావదేనం నిహన్మ్యహమ్. 18

ప్ర.అ. అహత్వా= చంపకుండా, ఇతః= ఇక్కడినుండి, పురీమ్= పట్టణమును గూర్చి, ప్రతిగన్తుమ్= తిరిగి వెళ్లుటకు, మే= నాకు, శక్తిః= శక్తి, నాస్తి= లేదు. అహమ్= నేను, ఏనమ్ = వీనిని, యావత్= ఎంతలో, హన్మి= చంపుదునో, అంతవరకు, త్వమ్ = నీవు, బిలద్వారి= బిలముయొక్క ద్వారమునందు, ప్రతీక్ష= నిరీక్షించుము.

**తా.** "ఈ అసురుణ్ణి చంపకుండా నేను తిరిగి నగరమునకు వెళ్లజాలను. నేను వీనిని చంపి వచ్చువరకు నీవు ఈ బిలద్వారమువద్ద ఉండుము." 18

మూ. స్థితో౽యమితి మత్వాహం ప్రవిష్టస్తు దురాసదమ్,
తం మే మార్గయతస్తత్ర గతః సంవత్సరస్తదా. 19

ప్ర.అ. అయమ్= ఇతడు, స్థితః ఇతి=ఉన్నాడు అని, మత్వా=తలచి, అహమ్= నేను, దురాసదమ్=ప్రవేశింప శక్యము కాని ఆ బిలమును, ప్రవిష్టః= ప్రవేశించితిని. తదా=అప్పుడు, తత్ర =అక్కడ, తమ్ =వానిని, మార్గయతః =వెదకుచున్న, మే=నాకు, సంవత్సరః= సంవత్సరము, గతః = గడచినది.

**తా.** ఇతడు ద్వారమువద్ద ఉన్నాడు కదా అని అనుకొని నేను ప్రవేశింప శక్యము కాని ఆ బిలములోనికి ప్రవేశించితిని. అక్కడ నేను ఆతనికై వెదకుచుండగా సంవత్సరము గడచిపోయెను. 19

మూ. స తు దృష్టో మయా శత్రురనిర్వేదాద్భయావహః,
నిహతశ్చ మయా సద్యః స సర్వైః సహ బన్ధుభిః. 20

ప్ర.అ. భయావహః =భయంకరుడైన, సః=ఆ, శత్రుః= శత్రువు, మయా=నాచేత, అనిర్వేదాత్= నిర్వేదము (దిగులుబాటు) లేకుండా, దృష్టః= చూడబడినాడు. సః= అతడు, సర్వైః= సమస్తమైన, బన్ధుభిః సహ=బంధువులతో కూడ, సద్యః = వెంటనే, మయా=నాచేత, నిహతః= చంపబడెను.

**తా.** నేను దిగులుచెందకుండగా వెదకి భయంకరుడైన ఆ శత్రువును పట్టుకొని వెంటనే వానిని, వాని బంధువులను కూడ చంపివేసితిని. 20

మూ. తస్యాస్యాత్తు ప్రవృత్తేన రుధిరౌఘేణ తద్బిలమ్,
పూర్ణమాసీద్దురాక్రామం స్వనతస్తస్య భూతలే. 21

ప్ర.అ. భూతలే= నేలమీద, స్వనతః =ధ్వని చేయుచున్న, తస్య= వాని యొక్క, ఆస్యాత్=ముఖమునుండి, ప్రవృత్తేన= బయలుదేరిన, రుధిరౌఘేణ= రక్తప్రవాహముచేత, తత్ బిలమ్= ఆ బిలము, పూర్ణమ్ = నిండినదై, దురాక్రామమ్= ఆక్రమించుటకు (నడచుటకు) శక్యము కానిది, ఆసీత్= ఆయెను.

**తా.** అతడు నేలపై పడి అరచుచుండగా, ఆతని ముఖమునుండి బయలుదేరిన రక్తముతో నిండిపోయి ఆ బిలము నడచుటకు కూడ శక్యము కాకుండ అయ్యెను. 21

మూ. సూదయిత్వా తు తం శత్రుం విక్రాన్తం తమహం సుఖమ్,
నిష్క్రామం నేహ పశ్యామి బిలస్య పిహితం ముఖమ్. 22

ప్ర.అ. అహమ్=నేను, విక్రాన్తమ్=పరాక్రమవంతుడైన, తమ్= ప్రసిద్ధుడైన,

తం శత్రుమ్ =ఆ శత్రువును, సుఖమ్= అనాయాసముగా, సూదయిత్వా=చంపి, ఇహ= ఇక్కడ, నిష్క్రామమ్ = బైటకు వచ్చేదారిని, నైవ పశ్యామి= చూడజాలకపోతిని. బిలస్య= బిలముయొక్క, ముఖమ్=ముఖము, పిహితమ్=మూసివేయబడినది.

తా. నేను పరాక్రమవంతుడైన ఆ శత్రువును అనాయాసముగా చంపివేసి వచ్చేసరికి అక్కడ బైటకు దారి కనబడలేదు. ఎందుచేత ననగా బిలద్వారము కప్పబడి ఉండెను. 22

మూ. విక్రోశమానస్య తు మే సుగ్రీవేతి పునః పునః,
యతః ప్రతివచో నాస్తి తతోఽహం భృశదుఃఖితః. 23

ప్ర.అ. సుగ్రీవేతి= సుగ్రీవా! అని, పునః పునః =మాటిమాటికి, విక్రోశమానస్య= అరచుచున్న, మే=నాకు, యతః =ఎందువలన, ప్రతివచః= ప్రతివచనము, నాస్తి=లేదో, తతః= అందువలన, అహమ్= నేను, భృశదుఃఖితః= చాలా దుఃఖించితిని.

తా. "సుగ్రీవా! సుగ్రీవా!" అని మాటిమాటికి ఎంత అరచినా నాకు ప్రతివచనము రాకపోవుటకు నేను చాలా దుఃఖించితిని. 23

మూ. పాదప్రహారైస్తు మయా బహుభిః పరిపాతితమ్,
తతోఽహం తేన నిష్క్రమ్య పథా పునరుపాగతః. 24

ప్ర.అ. మయా=నాచేత, బహుభిః= అనేకమైన, పాదప్రహారైః= తన్నులచేత, పరిపాతితమ్= పడగొట్టబడినది. తతః= అటుపిమ్మట, అహమ్= నేను, తేన పథా= ఆ మార్గముచేత, నిష్క్రమ్య= బయల్వెడలి, పునః= మరల, ఉపాగతః =వచ్చితిని.

తా. ద్వారమునకు పెట్టిన ఆ మూతను నేను చాలా తన్నులు తన్ని పడగొట్టి ఆ మార్గము ద్వారా బైటకు వచ్చితిని. 24

మూ. తత్రానేనాస్మి సంరుద్ధో రాజ్యం మృగయతాత్మనః,
సుగ్రీవేణ నృశంసేన విస్మృత్య భ్రాతృసౌహృదమ్. 25

ప్ర.అ. ఆత్మనః= తనకు, రాజ్యమ్= రాజ్యమును, మృగయతా= అన్వేషించుచున్న, నృశంసేన =క్రూరుడైన, అనేన= ఈ సుగ్రీవునిచేత, భ్రాతృసౌహృదమ్= సోదరస్నేహమును, విస్మృత్య= విస్మరించి, అహమ్=నేను, తత్ర= అక్కడ, సంరుద్ధః అస్మి= బంధింపబడితిని.

తా. క్రూరుడైన ఈ సుగ్రీవుడు, సోదరప్రేమను మరచి, రాజ్యము పొందవలెననే కోరికతో నన్ను అక్కడ బైటకు రాకుండే టట్లు చేసినాడు. 25

మూ. ఏవముక్త్వా తు మాం తత్ర వస్త్రేణైకేన వానరః,
తదా నిర్వాసయామాస వాలీ విగతసాధ్వసః. 26

ప్ర.అ. వానరః= వానరుడైన, వాలీ=వాలి, తత్ర = ఆ సభయందు, మామ్= నన్ను గూర్చి, ఏవమ్= ఇట్లు, ఉక్త్వా= పలికి, విగతసాధ్వసః= పోయిన భయము కలవాడై, తదా= అప్పుడు, ఏకేన= ఒక్క, వస్త్రేణ= వస్త్రముతో, నిర్వాసయామాస= వెడలగొొట్టెను.

తా. అప్పు డా సభలో వాలి నన్నుగూర్చి ఈ విధముగా పలికి, ఏ మాత్రము సంకోచము లేనివాడై, నన్ను కట్టుబట్టతో దేశమునుండి వెడలగొొట్టెను.

మూ. తేనాహమపవిద్ధశ్చ హృతదారశ్చ రాఘవ,
తద్భయాచ్చ మహీం సర్వాం క్రాన్తవాన్ సవనార్ణవామ్. 27

ప్ర.అ. రాఘవ= రామా! తేన =వానిచేత, అపవిద్ధః =బైటకు త్రోసివేయబడినవాడనై, హృతదారశ్చ =హరించబడిన భార్య గలవాడనై, అహమ్ =నేను, తద్భయాత్ =అతనినుండి భయమువలన, సవనార్ణవామ్ =అరణ్యములతోను సముద్రముతోను కూడిన, సర్వామ్ =సమస్తమైన, మహీమ్ =భూమిని , క్రాన్తవాన్ = దాటినాను.

తా. రామా! ఆ విధముగా అతడు నన్ను బైటకు వెళ్ళగొట్టి నా భార్యను అపహరించగా నేను అతనికి భయపడి అరణ్యములతోను, సముద్రముతోను సహా ఈ భూమినంతా తిరిగితిని. 27

మూ. ఋష్యమూకం గిరివరం భార్యాహరణదుఃఖితః,
ప్రవిష్టోఽస్మి దురాధర్షం వాలినః కారణాన్తరే. 28

ప్ర.అ. భార్యాహరణదుఃఖితః = భార్యయొక్క హరణముచేత దుఃఖితుడ నైన నేను, కారణాన్తరే =కారణాంతరమునందు (చేత), వాలినః =వాలికి, దురాధర్షమ్ =ఆక్రమింప శక్యము కాని, గిరవరమ్ =పర్వతశ్రేష్ఠమైన, ఋష్యమూకమ్ = ఋష్యమూకమును, ప్రవిష్టః అస్మి =ప్రవేశించితిని.

తా. నా భార్యను (వాలి) హరించుటచేత దుఃఖితుడనైన నేను పర్వత శ్రేష్ఠమైన ఋష్యమూకమును ఆశ్రయించినాను. కారణాంతరముచేత ఈ పర్వతమును వాలి ఆక్రమింపజాలడు. 28

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం వైరానుకథనం మహత్,
అనాగసా మయా ప్రాప్తం వ్యసనం పశ్య రాఘవ. 29

ప్ర.అ. రాఘవ =రామా! ఏతత్=ఈ , మహత్ = గొప్పదైన, వైరానుకథనమ్ =వైరవృత్తాంతము, సర్వమ్ =అంతా, తే = నీకు, ఆఖ్యాతమ్

=చెప్పబడినది. అనాగసా =అపరాధము లేని, మయా =నాచేత, ప్రాప్తమ్ =పొందబడిన, వ్యసనమ్ = వ్యసనమును, పశ్య =చూడుము.

తా. రామా! మా వైరమునకు కారణము నంతా నీకు చెప్పినాను. ఏ అపరాధమూ లేకపోయినా నాకెట్టి ఆపద సంభవించినదో చూడుము. 29

మూ. వాలినశ్చ భయార్తస్య సర్వలోకభయాపహ,
కర్తుమర్హసి మే వీర ప్రసాదం తస్య నిగ్రహాత్. 30

ప్ర.అ. సర్వలోకభయాపహ =సమస్తలోకముల భయమును తొలగించువాడా! వీర =వీరుడా! వాలినః =వాలినుండి, భయార్తస్య = భయముచేత పీడింపబడిన, మే =నాయొక్క, ప్రసాదమ్ = అనుగ్రహమును, తస్య =వానియొక్క, నిగ్రహాత్ =నిగ్రహమువలన, కర్తుమ్ =చేయుటకు, అర్హసి =తగియున్నావు.

తా. సకలజనుల భయమును తొలగించు రామా! వాలివలన కలిగిన భయముతో నేను బాధపడుచున్నాను. వానిని నిగ్రహించి నన్ను అనుగ్రహింపుము.

మూ. ఏవముక్తః స తేజస్వీ ధర్మజ్ఞో ధర్మసంహితమ్,
వచనం వక్తుమారేభే సుగ్రీవం ప్రహసన్నివ. 31

ప్ర.అ. ఏవమ్ =ఇట్లు, ఉక్తః =పలకబడిన, ధర్మజ్ఞః=ధర్మవేత్త యైన, తేజస్వీ =తేజఃశాలియైన, సః =ఆ రాముడు, ప్రహసన్నివ =నవ్వుచు , సుగ్రీవమ్ =సుగ్రీవుని గూర్చి, ధర్మసంహితమ్ = ధర్మసంమతమైన, వచనమ్ =వచనమును, వక్తుమ్ =చెప్పుటకు, ఆరేభే =ప్రారంభించెను.

తా. తేజఃశాలి, ధర్మములను ఎరిగినవాడు అయిన రాముడు ఆ మాటలు విని, సుగ్రీవునితో ధర్మసంమతమైన ఈ వచనము పలికెను. 31

మూ. అమోఘాః సూర్యసంకాశా నిశితా మే శరా ఇమే,
తస్మిన్వాలిని దుర్వృత్తే పతిష్యన్తి రుషాన్వితాః . 32

ప్ర.అ. అమోఘాః=వ్యర్థము కానివి, సూర్యసంకాశాః=సూర్యునితో సమానములు, రుషా=(నా) కోపముతో, అన్వితాః=కూడినవి, నిశితాః=తీక్ష్ణములూ అయిన, ఇమే=ఈ, మే శరాః =నా బాణములు, దుర్వృత్తే =చెడ్డ నడవడిక గల, తస్మిన్ వాలిని =ఆ వాలియందు, పతిష్యన్తి =పడగలవు.

తా. సూర్యునితో సమానములు, వాడియైనవి, అమోఘములు అయిన నా బాణములను, నేను కోపముతో , దురాత్ముడైన ఆ వాలిపై ప్రయోగించెదను.

మూ. యావత్తం న హి పశ్యేయం తవ భార్యాపహారిణమ్,
తావత్స జీవేత్ పాపాత్మా వాలీ చారిత్రదూషకః. 33

ప్ర.అ. తవ =నీయొక్క, భార్యాపహారిణమ్ = భార్యను అపహరించిన, తమ్ =వానిని, యావత్ =ఎంతవరకు, న పశ్యేయమ్ =చూడనో, తావత్ =అంత వరకే, పాపాత్మా =పాపాత్ముడు, చారిత్రదూషకః = చరిత్రను దూషించినవాడు (పాడుచేసినవాడు)అయిన, సః వాలీ =ఆ వాలి, జీవేత్ = జీవించును.

తా. నీ భార్యను అపహరించి మర్యాదను ఉల్లంఘించిన ఆ పాపాత్ముడైన వాలి నా కంట బడనంతవరకు మాత్రమే జీవించును. 33

మూ. ఆత్మానుమానాత్పశ్యామి మగ్నస్త్వం శోకసాగరే,
త్వామహం తారయిష్యామి బాఢం ప్రాప్స్యసి పుష్కలమ్. 34

ప్ర.అ. త్వమ్ =నీవు, శోకసాగరే =శోకసముద్రమునందు, మగ్నః= మునిగి ఉన్నావు అని, ఆత్మానుమానాత్ =నన్ను పట్టి ఊహించుటవలన, పశ్యామి =చూచుచున్నాను. త్వామ్ =నిన్ను, అహమ్ =నేను, తారయిష్యామి =దాటించగలను. పుష్కలమ్ =పరిపూర్ణమైన రాజ్యమును, బాఢమ్ =తప్పక, ప్రాప్స్యసి =పొందగలవు.

తా. నా స్థితిని పట్టి ఊహించుకొని నీ వెట్లు శోకసాగరములో మునిగి ఉన్నావో తెలుసుకొనగలుగుచున్నాను. నిన్ను ఆ శోకసాగరమును దాటించెదను. సంపూర్ణ రాజ్యము నీకు తప్పక లభించగలదు. 34

మూ. తస్య తద్వచనం శ్రుత్వా హర్షపౌరుషవర్ధనమ్,
సుగ్రీవః పరమప్రీతః సుమహద్వాక్యమబ్రవీత్. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కింధాకాణ్డే
దశమః సర్గః.

ప్ర.అ. తస్య =ఆ రామునియొక్క, హర్షపౌరుషవర్ధనమ్ = సంతోషమును, పౌరుషమును వృద్ధి పొందించే, తత్ వచనమ్ =ఆ వచనమును, శ్రుత్వా =విని, సుగ్రీవః= సుగ్రీవుడు, పరమప్రీతః =చాలా సంతోషించినవాడై, సుమహత్ =చాల గొప్పదైన, వాక్యమ్ =వాక్యమును, అబ్రవీత్ =పలికెను.

తా. సుగ్రీవుడు సంతోషమును, పౌరుషమును వృద్ధి పొందించే ఆ రాముని మాటలు విని, చాలా సంతోషించి, గొప్ప వాక్యమును పలికెను. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
పదవసర్గ సమాప్తము.

# అథ ఏకాదశః సర్గః

[వాలి దుందుభిని చంపి ఆతని శవమును మతంగమహర్షి ఆశ్రమములోనికి విసరివేయుట. మతంగమహర్షి వాలిని శపించుట. రాముడు దుందుభి అస్థిపంజరమును దూరముగా విసరుట. సాలవృక్షములను భేదింపు మని సుగ్రీవుడు రాముణ్ణి కోరుట.]

మూ. రామస్య వచనం శ్రుత్వా హర్షపౌరుషవర్ధనమ్,
సుగ్రీవః పూజయాఞ్చక్రే రాఘవం ప్రశశంస చ. 1

ప్ర.అ. సుగ్రీవః=సుగ్రీవుడు, రామస్య=రామునియొక్క, హర్షపౌరుషవర్ధనమ్=సంతోషమును, పౌరుషమును వృద్ధి పొందించు, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, రాఘవమ్=రాముణ్ణి, పూజయాఞ్చక్రే=పూజించెను. ప్రశశంస చ=ప్రశంసించెను కూడ.

తా. సంతోషమును, పౌరుషమును వృద్ధి పొందించునట్లుగా, రాముడు పలికిన మాటలు విని సుగ్రీవుడు రాముణ్ణి గౌరవించి ప్రశంసించెను. 1

మూ. అసంశయం ప్రజ్వలితైస్తీక్ష్ణైర్మర్మాతిగైః శరైః
త్వం దహేః కుపితో లోకాన్యుగాన్త ఇవ భాస్కరః. 2

ప్ర.అ. ప్రజ్వలితైః=ప్రకాశించుచున్నవి, తీక్ష్ణైః=తీక్ష్ణములు, మర్మాతిగైః=మర్మస్థానములను అతిక్రమించేవి అయిన, శరైః=బాణములచేత, కుపితః=కోపించిన, త్వమ్=నీవు, యుగాన్తే=ప్రలయకాలమునందు, భాస్కరః ఇవ=సూర్యుడు వలె, లోకాన్= లోకములను, దహేః=కాల్చివేయుదువు. అసంశయమ్= సంశయము లేదు.

తా. నీవు కోపించినచో మర్మస్థానములను భేదించేవి, మండుచున్నవి, తీక్ష్ణములు అయిన శరములతో, ప్రళయకాలసూర్యుడు వలె లోకములను కాల్చివేయగలవు. సందేహము లేదు. 2

మూ. వాలినః పౌరుషం యత్తద్యచ్చ వీర్యం ధృతిశ్చ యా,
తన్మమైకమనాః శ్రుత్వా విధత్స్వ యదనన్తరమ్. 3

ప్ర.అ. వాలినః= వాలియొక్క, యత్=ఏ, పౌరుషమ్=పౌరుషము కలదో, తత్=దానిని, యత్ వీర్యమ్=ఏ పరాక్రమము గలదో, తత్= దానిని, యా=ఏ, ధృతిశ్చ=ధైర్యము గలదో దానిని, మమ=నానుండి, ఏకమనాః= ఏకాగ్రచిత్తము

కలవాడవై, శ్రుత్వా=విని, యత్=ఏది, అనన్తరమ్ =తరువాత చేయవలసినదో దానిని, విధత్స్వ=చేయుము.

తా. వాలికి ఎంత పౌరుషమున్నదో, ఎంత పరాక్రమ మున్నదో, ఎంత ధైర్యమున్నదో సావధానచిత్తముతో విని తరువాత ఏమి చేసిన బాగుండునో అది చేయుము. 3

మూ. సముద్రాత్పశ్చిమాత్పూర్వం దక్షిణాదపి చోత్తరమ్,
క్రామత్యనుదితే సూర్యే వాలీ వ్యపగతక్లమః. 4

ప్ర.అ. వాలీ=వాలి, వ్యపగతక్లమః=తొలగిన శ్రమ గలవాడై (శ్రమ లేని వాడై,) సూర్యే=సూర్యుడు, అనుదితే=ఉదయించకుండగనే, పశ్చిమాత్ =పశ్చిమమునకు సంబంధించిన, సముద్రాత్=సముద్రమునుండి, పూర్వమ్=పూర్వసముద్రమును గూర్చి, దక్షిణాత్= దక్షిణసముద్రమునుండి, ఉత్తరమ్=ఉత్తరసముద్రమును గూర్చి, క్రామతి=వెళ్ళును.

తా. వాలి బ్రాహ్మముహూర్తమునందు లేచి, సూర్యుడు ఉదయించుటకు పూర్వమే, పశ్చిమసముద్రమునుండి తూర్పుసముద్రమునకు, దక్షిణసముద్రమునుండి ఉత్తరసముద్రమునకు, అనాయాసముగా వెళ్ళి సంధ్యోపాసన చేయుచుండును.

వి. ఉత్తరకాండలో - 'వాలి నాలుగు సముద్రములకు వెళ్లి సంధ్యోపాసన చేయును' అని చెప్పబడుటచే వ్యాఖ్యాతలు ఈ శ్లోకానికి పైవిధంగా అధ్యాహారాదులతో అర్థం చెప్పినారు. 4

మూ. అగ్రాణ్యారుహ్య శైలానాం శిఖరాణి మహాన్త్యపి,
ఊర్ధ్వముత్పాత్య తరసా ప్రతిగృహ్ణాతి వీర్యవాన్. 5

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమశాలియైన ఆ వాలి, శైలానామ్=పర్వతములయొక్క, అగ్రాణి=అగ్రములను, ఆరుహ్య=ఎక్కి, మహాన్తి=పెద్దవైన, శిఖరాణి=శిఖరములను, తరసా=బలముచేత, ఊర్ధ్వమ్=పైకి, ఉత్పాత్య=ఎగరవేసి, ప్రతిగృహ్ణాతి=పట్టుకొనుచుండును.

తా. పరాక్రమవంతుడైన ఆ వాలి పర్వతములపైకి ఎక్కి, పెద్ద పెద్ద పర్వతశిఖరములను, బలముచేత, బంతుల వలె ఎగరవేసి, వాటిని పట్టుకొనుచుండును. 5

మూ. బహవః సారవన్తశ్చ వనేషు వివిధా ద్రుమాః,
వాలినా తరసా భగ్నా బలం ప్రథయతాత్మనః. 6

ప్ర. అ. ఆత్మనః=తనయొక్క, బలమ్=బలమును, ప్రథయతా=ప్రకటించుచున్న, వాలినా=వాలిచేత, వనేషు=అడవులలో, సారవన్తః=సారము గల, వివిధాః=అనేకవిధములైన, బహవః ద్రుమాః=అనేక వృక్షములు, తరసా=బలముచేత,

భగ్నాః=విరగగొట్టబడినవి.

తా. వాలి తన బలమును ప్రకటించుటకొరకు, అడవిలోని సారము గల, అనేకవిధములైన ఎన్నో వృక్షములను, బలముచేత విరగగొట్టుచుండును. 6

మూ. మహిషో దున్దుభిర్నామ కైలాసశిఖరప్రభః,
బలం నాగసహస్రస్య ధారయామాస వీర్యవాన్. 7

ప్ర.అ. కైలాసశిఖరప్రభః=కైలాసశిఖరము వంటి కాంతి (ప్రమాణము) గల, వీర్యవాన్=గొప్ప బలము గల, మహిషః=మహిషరూపుడైన, దున్దుభిః నామ=దుందుభి అనేవాడు, నాగసహస్రస్య=వేయి ఏనుగులయొక్క, బలమ్=బలమును, ధారయామాస =ధరించెను.

తా. కైలాసశిఖరమువంటి ప్రమాణము గల, మహాబలవంతుడైన, మహిషరూపముగల దుందుభి అనేవాడు వేయి ఏనుగుల బలముతో ఉండెను.

మూ. వీర్యోత్సేకేన దుష్టాత్మా వరదానేన మోహితః,
జగామ స మహాకాయః సముద్రం సరితాం పతిమ్. 8

ప్ర.అ. వీర్యోత్సేకేన=పరాక్రమగర్వముచేత, వరదానేన=వరదానముచేత, మోహితః=మోహింపబడినవాడు, దుష్టాత్మా=దుష్టమైన బుద్ధి గలవాడు, మహాకాయః=గొప్ప శరీరము గలవాడు అయిన, సః= ఆ దుందుభి, సరితాం పతిమ్=నదుల ప్రభువైన, సముద్రమ్= సముద్రుని గూర్చి, జగామ=వెళ్లెను.

తా. దుష్టబుద్ధి గల మహాశరీరవంతుడైన ఆ దుందుభి బలగర్వముచేతను, వరములు పొంది ఉండుటచేతను మోహితుడై నదులకు పతియైన సముద్రుని వద్దకు వెళ్లెను. 8

మూ. ఊర్మిమన్తమతిక్రమ్య సాగరం రత్నసంచయమ్,
మమ యుద్ధం ప్రయచ్ఛేతి తమువాచ మహార్ణవమ్. 9

ప్ర.అ. ఊర్మిమన్తమ్=తరంగములు గల, రత్నసంచయమ్= రత్నసముదాయము గల, సాగరమ్=సముద్రమును, అతిక్రమ్య= అతిక్రమించి, మమ=నాకు, యుద్ధమ్=యుద్ధమును, ప్రయచ్ఛ=ఇమ్ము, ఇతి=అని, తమ్=ఆ, మహార్ణవమ్= మహాసముద్రుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. తరంగములతోను, రత్నసముదాయములతోను కూడిన ఆ సముద్రుని అతిక్రమించి (లెక్క చేయక) "నాతో యుద్ధానికి రమ్ము" అని ఆ సముద్రుని పిలచెను. 9

మూ. తతః సముద్రో ధర్మాత్మా సముత్థాయ మహాబలః,
అబ్రవీద్వచనం రాజన్నసురం కాలచోదితమ్. 10

ప్ర.అ. రాజన్=రాజా! తతః=అటు పిమ్మట, ధర్మాత్మా= ధర్మాత్ముడు, మహాబలః=గొప్ప బలము గలవాడు అయిన, సముద్రః =సముద్రుడు, సముత్థాయ=లేచి, కాలచోదితమ్= కాలముచేత ప్రేరేపించబడిన, అసురమ్=ఆ అసురుని గూర్చి, వచనమ్= వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రామా! ధర్మాత్ముడు, గొప్ప బలము గలవాడు అయిన సముద్రుడు లేచి కాలముచేత ప్రేరేపింపబడి ఆ విధముగా వచ్చిన ఆ అసురునితో ఇట్లు పలికెను. 10

మూ. సమర్థో నాస్మి తే దాతుం యుద్ధం యుద్ధవిశారద,
శ్రూయతాం త్వభిధాస్యామి యస్తే యుద్ధం ప్రయచ్ఛతి. 11

ప్ర.అ. యుద్ధవిశారద=యుద్ధమునందు సమర్థుడా! తే=నీకు, యుద్ధమ్ =యుద్ధమును, దాతుమ్=ఇచ్చుటకు, సమర్థః=సమర్థుడను, నాస్మి=కాను. యః=ఎవడు, తే=నీకు, యుద్ధమ్= యుద్ధమును, ప్రయచ్ఛతి=ఇచ్చునో, అభిధాస్యామి=చెప్పెదను. శ్రూయతామ్=వినబడుగాక.

తా. యుద్ధములో సమర్థుడైనవాడా! నేను నీతో యుద్ధము చేయజాలను. నీతో ఎవడు యుద్ధము చేయగల సమర్థుడో ఆతనిని గూర్చి చెప్పెదను వినుము.

మూ. శైలరాజో మహారణ్యే తపస్విశరణం పరమ్,
శఙ్కరశ్వశురో నామ్నా హిమవానితి విశ్రుతః. 12
మహాప్రస్రవణోపేతో బహుకన్దరనిర్ఝరః,
స సమర్థస్తవ ప్రీతిమతులాం కర్తుమర్హతి. 13

ప్ర. అ. పరమ్=గొప్ప, తపస్విశరణమ్=మునులకు రక్షకుడు, శఙ్కరశ్వశురః=శివుని మామగారు, హిమవానితి=హిమవంతుడని, నామ్నా=పేరుచేత, విశ్రుతః=ప్రసిద్ధుడు, మహాప్రస్రవణోపేతః =పెద్ద సెలయేళ్లతో కూడినవాడు, బహుకన్దరనిర్ఝరః=అనేకములైన గుహలు జలప్రవాహములు కలవాడు అయిన, శైలరాజః=పర్వతరాజు, మహారణ్యే=మహారణ్యములో, ఉన్నాడు. సః=అతడు, సమర్థః= సమర్థుడు. తవ=నీకు, అతులామ్=సాటిలేని, ప్రీతిమ్= సంతోషమును, కరిష్యతి=చేయగలడు.

తా. మహారణ్యములో హిమవంతు డనే పేరు గల పర్వతరాజు ఉన్నాడు. శివుని మామగారైన ఆతడు మునులకు ఆశ్రయము ఇచ్చువాడు. ఆ పర్వతరాజుపై ఎన్నియో సెలయేళ్లు ప్రవహించుచుండును. అనేకమైన గుహలు, జలప్రవాహములు ఉన్న ఆ శైలరాజు చాల సమర్థుడు. నీకు యుద్ధానందమును ఇవ్వగలవాడు అతడే. 12, 13

మూ. తం భీత ఇతి విజ్ఞాయ సముద్రమసురోత్తమః,
హిమవద్వనమాగమ్య శరశ్చాపాదివ చ్యుతః, 14
తతస్తస్య గిరేః శ్వేతా గజేన్ద్రప్రతిమాః శిలాః,
చిక్షేప బహుధా భూమౌ దున్దుభిర్విననాద చ. 15

ప్ర. అ. అసురోత్తమః=అసురులలో ఉత్తముడైన, దున్దుభిః=దుందుభి, తమ్=ఆ, సముద్రమ్=సముద్రుని, భీతః ఇతి=భయపడినవాడు అని, విజ్ఞాయ=తలచి, చాపాత్=ధనస్సునుండి, చ్యుతః=జారిన, శర ఇవ=బాణము వలె, హిమవద్వనమ్=హిమవత్పర్వతవనమును, ఆగమ్య=పొంది, తతః=అటుపిమ్మట, తస్య గిరేః=ఆ పర్వతముయొక్క, శ్వేతాః=తెల్లని, గజేన్ద్రప్రతిమాః=ఏనుగతో సమానమైన, శిలాః=శిలలను, బహుధా=అనేక విధములుగా, భూమౌ=భూమియందు, చిక్షేప=చిమ్మివేసెను. వినినాద చ= ధ్వని చేసెను కూడ.

తా. అసురులలో శ్రేష్ఠుడైన ఆ దుందుభి సముద్రుడు తనకు భయపడినాడని తలచి, ధనస్సునుండి బయలుదేరిన బాణము వలె మహావేగముతో హిమవత్పర్వతవనమును చేరి, ఏనుగుల వంటి ప్రమాణము గల తెల్లని ఆ హిమవత్పర్వతశిలలను పడగొట్టి నేలపై నలుమూలలా చిమ్మివేసెను. 14, 15

మూ. తతః శ్వేతామ్బుదాకారః సౌమ్యః ప్రీతికరాకృతిః,
హిమవానబ్రవీద్వాక్యం స్వ ఏవ శిఖరే స్థితః. 16

ప్ర.అ. తతః=అటుపిమ్మట, శ్వేతామ్బుదాకారః=తెల్లని మేఘము వంటి ఆకారము గలవాడు, సౌమ్యః=సౌమ్యుడు, ప్రీతికరాకృతిః =ఆనందమును కలిగించు ఆకారము గలవాడు అయిన, హిమవాన్= హిమవంతుడు, స్వే=తనసంబంధమైన, శిఖరే ఏవ=శిఖరముమీదనే, స్థితః=నిలచినవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట, తెల్లని మేఘమువంటి ఆనందకరమైన ఆకారము గల సౌమ్యుడైన హిమవంతుడు తన శిఖరముమీదనే నిలచి ఇట్లు పలికెను. 16

మూ. క్లేష్టు మర్హసి మాం న త్వం దున్దుభే ధర్మవత్సల,
రణకర్మస్వకుశలస్తపస్విశరణం హ్యహమ్. 17

ప్ర.అ. ధర్మవత్సల=ధర్మమునందు ప్రేమ గల, దున్దుభే=దుందుభీ! త్వమ్=నీవు, మామ్=నన్ను, క్లేష్టుమ్=బాధించుటకు, నార్హసి=తగవు. తపస్విశరణమ్=మునులకు ఆశ్రయభూతుడనైన, అహమ్=నేను, రణకర్మసు=యుద్ధకర్మలయందు, అకుశలః హి =నేర్పు లేనివాడను కదా!

తా. ధర్మమునందు ఆసక్తిగల ఓ! దుందుభీ! న న్నీవిధముగా క్లేశపెట్టకుము. నేను మునులకు నివాసస్థానమైనవాడను. యుద్ధము చేయుటలో

నాకు నేర్పు లేదు. 17

మూ. తస్య తద్వచనం శ్రుత్వా గిరిరాజస్య ధీమతః,
ఉవాచ దున్దుభిర్వాక్యం క్రోధాత్సంరక్తలోచనః. 18

ప్ర. అ.దున్దుభిః=దుందుభి, ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య గిరిరాజస్య =ఆ పర్వతరాజుయొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, క్రోధాత్=కోపమువలన, సంరక్తలోచనః= ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, వాక్యమ్=వాక్యమును, ఉవాచ= పలికెను.

తా. బుద్ధిమంతుడైన ఆ పర్వతరాజు పలికిన మాటలు విని దుందుభి కోపమువలన ఎఱ్ఱబారిన నేత్రములతో, ఇట్లు పలికెను. 18

మూ. యది యుద్ధేఽసమర్థస్త్వం మద్భయాద్వా నిరుద్యమః,
తమాచక్ష్వ ప్రదద్యాన్మే యో హి యుద్ధం యుయుత్సతః. 19

ప్ర.అ. త్వమ్=నీవు, యుద్ధే=యుద్ధమునందు, అసమర్థః యది= అసమర్థుడవైతే, వా=లేక, మద్భయాత్=నావలన భయమువలన, నిరుద్యమః=ప్రయత్నము లేనివాడవైతే, యః=ఎవడు, యుయుత్సతః =యుద్ధము చేయగోరుచున్న, మే=నాకు, యుద్ధమ్ =యుద్ధమును, ప్రదద్యాత్=ఇచ్చునో, తమ్=వానిని, ఆచక్ష్వ =చెప్పుము.

తా. నీకు యుద్ధము చేసే సామర్థ్యము లేనిచో, లేదా నన్ను చూచి భయపడి నీవు యుద్ధప్రయత్నము చేయకున్నచో, యుద్ధము చేయవలె ననే వాంఛ గల నాతో యుద్ధము చేయగలవానిని ఎవరినైనా చూపుము. 19

మూ. హిమవానబ్రవీద్వాక్యం శ్రుత్వా వాక్యవిశారదః,
అనుక్తపూర్వం ధర్మాత్మా క్రోధాత్తమసురోత్తమమ్. 20

ప్ర.అ. వాక్యవిశారదః=మాటలలో నేర్పు గలవాడు, ధర్మాత్మా= ధర్మాత్ముడు అయిన, హిమవాన్=హిమవంతుడు, శ్రుత్వా=విని, తమ్=ఆ, అసురోత్తమమ్=అసురశ్రేష్ఠుని గూర్చి, క్రోధాత్= కోపమువలన, అనుక్తపూర్వమ్=పూర్వము పలకబడని, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మాటలలో నేర్పరి, ధర్మాత్ముడు అయిన హిమవంతుడు ఆ అసురోత్తముని మాటలు విని కోపించి, పూర్వ మెన్నడూ పలకని మాట అతనితో ఇట్లు పలికెను. 20

మూ. వాలీ నామ మహాప్రాజ్ఞ శక్రపుత్రః ప్రతాపవాన్,
అధ్యాస్తే వానరః శ్రీమాన్ కిష్కిన్ధామతులప్రభామ్. 21

ప్ర.అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి గలవాడా! శక్రపుత్రః=ఇంద్రుని పుత్రుడు, ప్రతాపవాన్=ప్రతాపము గలవాడు, శ్రీమాన్=శ్రీమంతుడు అయిన, వాలీ

నామ=వాలి అను పేరు గల, వానరః=వానరుడు, అతులప్రభామ్=గొప్ప కాంతి గల, కిష్కిన్ధామ్=కిష్కింధను, అధ్యాస్తే=అధిష్ఠించి ఉన్నాడు.

తా. ఓ! మహాబుద్ధిశాలీ! దేవేంద్రుని పుత్రుడు, ప్రతాపవంతుడు, శోభాసంపన్నుడు అయిన వాలి అనే ఒక వానరుడు సాటిలేని అందము గల కిష్కింధానగరములో నివసించుచున్నాడు. 21

మూ. స సమర్థో మహాప్రాజ్ఞ స్తవ యుద్ధవిశారదః,
ద్వన్ద్వయుద్ధం మహద్దాతుం నముచేరివ వాసవః. 22

ప్ర. అ. మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గలవాడు, యుద్ధవిశారదః=యుద్ధములో నేర్పు గలవాడు అయిన, సః=అతడు, వాసవః=దేవేంద్రుడు, నముచేరివ=నముచికి వలె, తవ=నీకు, మహత్=గొప్ప, ద్వన్ద్వయుద్ధమ్=ద్వంద్వయుద్ధమును, దాతుమ్=ఇచ్చుటకు, సమర్థః=సమర్థుడు.

తా. అతడు గొప్ప బుద్ధి గలవాడు. యుద్ధములో నేర్పుగలవాడు. దేవేంద్రుడు నముచికి వలె అతడు నీకు గొప్ప ద్వంద్వయుద్ధమును యివ్వగల సమర్థుడు. 22

మూ. తం శీఘ్రమభిగచ్ఛ త్వం యది యుద్ధమిహేచ్ఛసి,
స హి దుర్మర్షణో నిత్యం శూరః సమరకర్మణి. 23

ప్ర.అ. ఇహ=ఇప్పుడు, యుద్ధమ్=యుద్ధమును, ఇచ్ఛసి యది=కోరుచున్నట్లయితే, త్వమ్=నీవు, శీఘ్రమ్=శీఘ్రముగా, తమ్=ఆతనిని గూర్చి, అభిగచ్ఛ=వెళ్ళుము. శూరః=శూరుడైన, సః=అతడు, నిత్యమ్=ఎల్లప్పుడు, సమరకర్మణి=యుద్ధకర్మయందు, దుర్మర్షణః హి= సహింప శక్యము కానివాడు కదా!

తా. నీకు ఇప్పుడు యుద్ధము చేయవలె ననే కోరిక ఉన్నచో వెంటనే ఆతనిమీదికి వెళ్ళుము. శూరుడైన ఆ వాలిని యుద్ధములో ఎవ్వరూ ఎదుర్కొనజాలరు. 23

మూ. శ్రుత్వా హిమవతో వాక్యం కోపావిష్టః స దున్దుభిః,
జగామ తాం పురీం తస్య కిష్కిన్ధాం వాలినస్తదా. 24

ప్ర.అ. తదా=అప్పుడు, సః దున్దుభిః=ఆ దుందుభి, హిమవతః= హిమవంతుని యొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, కోపావిష్టః= కోపముతో నిండినవాడై, తస్య వాలినః=ఆ వాలియొక్క, పురీమ్=పట్టణమైన, కిష్కిన్ధామ్=కిష్కింధను గూర్చి, జగామ=వెళ్లెను.

తా. దుందుభి హిమవంతుని మాటలు విని, అప్పుడు గొప్ప కోపావేశముతో వాలి నగరమైన కిష్కింధకు వెళ్లెను. 24

మూ. ధారయన్మాహిషం వేషం తీక్ష్ణశృఙ్గో భయావహః,
ప్రావృషీవ మహామేఘస్తోయపూర్ణో నభస్తలే. 25
తతస్తు ద్వారమాగమ్య కిష్కిన్ధాయా మహాబలః,
ననర్ద కమ్పయన్ భూమిం దున్దుభిర్దున్దుభిర్యథా. 26

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, దున్దుభిః=దుందుభి, మాహిషమ్=మహిషమునకు సంబంధించిన, వేషమ్=వేషమును, ధారయన్=ధరించుచు, తీక్ష్ణ శృఙ్గః=తీక్ష్ణములైన కొమ్ములు కలవాడై, భయావహః=భయమును కలిగించుచు, ప్రావృషి=వర్షకాలమునందు, నభస్తలే=ఆకాశమునందు, తోయపూర్ణః=నీటితో నిండిన, మహామేఘ ఇవ=పెద్ద మేఘము వలె ఉన్నవాడై, కిష్కిన్ధాయాః=కిష్కింధయొక్క, ద్వారమ్=ద్వారమును, ఆగమ్య=పొంది, భూమిమ్=భూమిని, కమ్పయన్=కంపింప చేయుచు, దున్దుభిర్యథా= దుందుభి వలె, ననర్ద=ధ్వనిచేసెను.

తా. మహాబలశాలి యైన ఆ దుందుభి మహిషరూపము ధరించి, తీక్ష్ణములైన కొమ్ములతో భయము కలిగించుచు, వర్షకాలమునందు ఆకాశమునందు వ్యాపించిన ఉదకముతో నిండి ఉన్న నల్లని మేఘమువలె ఉండెను. అతడు కిష్కింధాద్వారము చేరి, భూమిని కంపింపచేయుచు దుందుభి వలె ధ్వని చేసెను. 25,26

మూ. సమీపస్థాన్ ద్రుమాన్ భఞ్జన్ వసుధాం దారయన్ ఖురైః,
విషాణేనోల్లిఖన్ దర్పాత్తద్ద్వారం ద్విరదో యథా. 27

ప్ర.అ. సమీపస్థాన్=సమీపమునందున్న, ద్రుమాన్=వృక్షములను, భఞ్జన్=విరచుచు, వసుధామ్=భూమిని, ఖురైః=డెక్కలచేత, దారయన్=చీల్చుచు, దర్పాత్=గర్వమువలన, విషాణేన=కొమ్ముతో, తద్ద్వారమ్=ఆ కిష్కింధాద్వారమును, ద్విరదో యథా=ఏనుగ వలె, ఉల్లిఖన్=రాయుచు, (ధ్వనిచేసెను).

తా. ఆ దుందుభి సమీపమునందున్న వృక్షములను విరచివేయుచు, డెక్కలతో భూమిని చీల్చుచు, ఏనుగు వలె, దర్పమువలన, కొమ్ముతో కిష్కింధాద్వారమును పొడుచుచు ధ్వని చేసెను. 27

మూ. అన్తఃపురగతో వాలీ శ్రుత్వా శబ్దమమర్షణః,
నిపపాత సహ స్త్రీభిస్తారాభిరివ చన్ద్రమాః. 28

ప్ర.అ. అన్తఃపురగతః=అంతఃపురమునందున్న, వాలీ=వాలి, శబ్దమ్= శబ్దమును, శ్రుత్వా=విని, అమర్షణః=సహించనివాడై, తారాభిః= నక్షత్రములతో కూడిన, చన్ద్రమాః ఇవ=చంద్రుడు వలె, స్త్రీభిః=స్త్రీలతో, నిష్పపాత=బైటకు వచ్చెను.

తా. అంతఃపురములో ఉన్న వాలి ఆ శబ్దమును విని, కోపించినవాడై నక్షత్రములతో కూడిన చంద్రుడు వలె స్త్రీలతో కూడినవాడై బైటకు వచ్చెను.

మూ. మితం వ్యక్తాక్షరపదం తమువాచ స దున్దుభిమ్,
హరీణామీశ్వరో వాలీ సర్వేషాం వనచారిణామ్ . 29

ప్ర.అ. వనచారిణామ్=వనమునందు సంచరించుచున్న, సర్వేషామ్=సమస్తమైన, హరీణామ్=వానరులకు, ఈశ్వరః=ప్రభువైన, సః వాలీ=ఆ వాలి, దున్దుభిమ్=దుందుభిని గూర్చి, వ్యక్తాక్షరపదమ్=స్పష్టములైన అక్షరములు పదములు గల, మితమ్=మితమైన వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వనములో సంచరించు సమస్తవానరులకు ప్రభువైన ఆ వాలి, మితముగా, స్పష్టములైన అక్షరములు పదములు గల వాక్కును ఆ దుందుభితో పలికెను. 29

మూ. కిమర్థం నగరద్వారమిదం రుద్ధ్వా వినర్దసే,
దున్దుభే విదితో మేఽసి రక్ష ప్రాణాన్ మహాబల. 30

ప్ర.అ. దున్దుభే=ఓ! దుందుభీ! ఇదమ్=ఈ, నగరద్వారమ్= పట్టణముద్వారమును, రుద్ధ్వా=అడ్డుకొని, కిమర్థమ్=ఎందుకు, వినర్దసే=ధ్వనిచేయుచున్నావు? మే=నాకు, విదితః=తెలిసినవాడవు, అసి=అయి ఉన్నావు. మహాబల=గొప్ప బలము కలవాడా! ప్రాణాన్=నీ ప్రాణములను, రక్ష=రక్షించుకొనుము.

తా. ఓ! దుందుభీ! నగరద్వారమునకు అడ్డుగా నిలచి ఎందుకు అరచుచున్నావు? నీ విషయము నాకు తెలియును. ఓ! మహాబలుడా! నీ ప్రాణాలు రక్షించుకొనుము. 30

మూ. తస్య తద్వచనం శ్రుత్వా వానరేన్ద్రస్య ధీమతః,
ఉవాచ దున్దుభిర్వాక్యం క్రోధాత్సంరక్తలోచనః. 31

ప్ర.అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య=ఆ, వానరేన్ద్రస్య= వానరరాజు యొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, దున్దుభిః=దుందుభి, క్రోధాత్=కోపమువలన, సంరక్తలోచనః=ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. బుద్ధిమంతుడైన ఆ వాలి మాటలు విని దుందుభి క్రోధముచేత ఎఱ్ఱబడిన నేత్రములతో ఇట్లు పలికెను. 31

మూ. న త్వం స్త్రీసంనిధౌ వీర వచనం వక్తుమర్హసి,
మమ యుద్ధం ప్రయచ్ఛాద్య తతో జ్ఞాస్యామి తే బలమ్. 32

ప్ర. అ. వీర=వీరుడా! త్వమ్=నీవు, స్త్రీసంనిధౌ=స్త్రీల సంనిధియందు, వచనమ్=వచనమును, వక్తుమ్=పలుకుటకు, నార్హసి=తగవు. అద్య=ఇప్పుడు, మమ=నాకు, యుద్ధమ్=యుద్ధమును, ప్రయచ్ఛ=ఇమ్ము. తతః=అటుపిమ్మట,

తే=నీయొక్క, బలమ్=బలమును, జ్ఞాస్యామి=తెలిసికొనగలను.

తా. ఓ! వీరుడా! స్త్రీల సమక్షములో ఇలాంటి గర్వోక్తులు పలకకుము. ఇప్పుడు నాతో యుద్ధము చేయుము. నీ బల మెంతటిదో తెలిసికొనెదను.

మూ. అథవా ధారయిష్యామి క్రోధమద్య నిశామిమామ్,
గృహ్యతాముదయః స్వైరం కామభోగేషు వానర. 33

ప్ర.అ. వానర=ఓ! వానరుడా! అథవా=లేదా, అద్య=ఇప్పుడు, ఇమామ్=ఈ, నిశామ్=రాత్రిని, క్రోధమ్=కోపమును, ధారయిష్యామి= నిగ్రహించుకొందును. ఉదయః=సూర్యోదయపర్యంతకాలము, స్వైరమ్=స్వేచ్ఛగా, కామభోగేషు=కామము యొక్క భోగములందు, గృహ్యతామ్=గ్రహింపబడుగాక.

తా. ఓ! వానరుడా! లేదా ఈ రాత్రి నేను నా కోపమును నిగ్రహించుకొనెదను. నీవు సూర్యోదయము వరకు స్వేచ్ఛగా కామభోగములను అనుభవించుము. 33

మూ. దీయతాం సంప్రదానం చ పరిష్వజ్య చ వానరాన్,
సర్వశాఖామృగేన్ద్రస్త్వం సంసాధయ సుహృజ్జనమ్. 34

ప్ర.అ. వానరాన్=వానరులను, పరిష్వజ్య=కౌగిలించుకొని, సంప్రదానమ్=ప్రీతిదానము, దీయతామ్=ఇవ్వబడుగాక. సర్వశాఖామృగేన్ద్రః=సమస్తమైన వానరులకు రాజువైన, త్వమ్=నీవు, సుహృజ్జనమ్=మిత్రజనమును, సంసాధయ=వీడ్కొనుము.

తా. వానరులను కౌగలించుకొని వారికి చివరిసారిగా ఇవ్వదలచిన కానుకలు ఇమ్ము. నీవు సమస్తమైన వానరులకు ప్రభువు కావున నీ స్నేహితు లందరికీ వీడ్కోలు చెప్పుము. 34

మూ. సుదృష్టాం కురు కిష్కిన్ధాం కురుష్వాత్మసమం పురే,
క్రీడస్వ చ సమం స్త్రీభిరహం తే దర్పనాశనః. 35

ప్ర. అ. కిష్కిన్ధామ్=కిష్కింధను, సుదృష్టామ్=బాగా చూడబడినదానినిగా, కురు= చేయుము. పురే=పట్టణమునందు, ఆత్మసమమ్=నీతో సమానమైనవానిని, కురుష్వ=రాజుగా చేయుము. స్త్రీభిః సమమ్=స్త్రీలతో కూడ, క్రీడస్వ చ=క్రీడించుము. అహమ్=నేను, తే=నీయొక్క, దర్పనాశనః= దర్పమును నశింపచేయువాడను.

తా. కిష్కింధను చివరిసారిగా, బాగా చూచుకొనుము. నీవంటివానిని పురములో రాజుగా నియమించుము. స్త్రీలతో క్రీడించుము. నేను నీ దర్పమును నశింపచేయగలవాడను. 35

మూ. యో హి మత్తం ప్రమత్తం వా భగ్నం వా రహితం కృశమ్,
హన్యాత్స భ్రూణహా లోకే త్వద్విధం మదమోహితమ్. 36

ప్ర. అ. యః=ఎవడు, మత్తమ్=మద్యముచే మదించిన వానిని గాని, ప్రమత్తం వా=ఏమరిన వానిని గాని, భగ్నం వా=ఓడిపోయినవానిని గాని, రహితమ్= ఆయుధాదులు లేనివానిని గాని, కృశమ్=దుర్బలుని గాని, మదమోహితమ్= మదముచేత మోహితుడైనవానిని గాని, హన్యాత్=చంపునో, సః=అతడు, లోకే=లోకమునందు, భ్రూణహా హి=భ్రూణహత్య చేసినవాడు కదా.

తా. మద్యము త్రాగిన మత్తులో ఉన్నవానిని గాని, ఏమరుపాటు చెందినవానిని గాని, ఓడిపోయిన వానినిగాని, ఆయుధాదులు లేని వానిని గాని, దుర్బలుని గాని, నీవలె కామమోహితుడై ఉన్నవానిని గాని చంపేవానికి భ్రూణహత్యాపాపము కలుగును కదా. 36

మూ. స ప్రహస్యాబ్రవీన్మన్దం క్రోధాత్తమసురేశ్వరమ్,
విసృజ్య తాః స్త్రియః సర్వాస్తారాప్రభృతికాస్తదా. 37

ప్ర.అ. తదా = అప్పుడు, సః =ఆ వాలి, ప్రహస్య =నవ్వి, తారాప్రభృతికాః =తార మొదలైన, తాః =ఆ, సర్వాః =సమస్తమైన, స్త్రియః =స్త్రీలను, విసృజ్య =విడచి, మన్దమ్ =మూర్ఖుడైన, తమ్ =ఆ, అసురేశ్వరమ్ =అసురశ్రేష్ఠుని గూర్చి, క్రోధాత్ = కోపమువలన, అబ్రవీత్ =పలికెను.

తా. అప్పుడు వాలి నవ్వి, తారమొదలైన ఆ స్త్రీల నందరినీ పంపివేసి, కోపించినవాడై, మూర్ఖుడైన ఆ అసురశ్రేష్ఠునితో ఇట్లు పలికెను. 37

మూ. మత్తోఽయమితి మా మంస్థా యద్యభీతోఽసి సంయుగే,
మదోఽయం సంప్రహారేఽస్మిన్ వీరపానం సమర్థ్యతామ్. 38

ప్ర.అ. అయమ్ =ఇతడు, మత్తః =మద్యముచే మత్తుడై ఉన్నాడు, ఇతి =అని, మా మంస్థాః=తలవకుము. సంయుగే =యుద్ధమునందు, అభీతః =భయము చెందనివాడవు, అసి యది =అయినవాడ వైతే, అయమ్ =ఈ, మదః =మదము, అస్మిన్ సంప్రహారే =ఈ యుద్ధమునందు, వీరపానమ్ = వీరపానముగా (యుద్ధమునకు వెళ్ళే ముందు వీరులు చేసే మద్యపానమునకు వీరపాన మని పేరు), సమర్థ్యతామ్ = భావింపబడుగాక.

తా. నేను మద్యమదముతో ఉన్నా నని అనుకొనకుము. నీకు భయము లేకపోయినచో యుద్ధానికి రమ్ము. ఈ యుద్ధములో ఈ మదము (మద్యపానము) వీరపాన మని తెలిసికొనుము. 38

మూ. తమేవముక్త్వా సంక్రుద్ధో మాలాముత్క్షిప్య కాఞ్చనీమ్,
పిత్రా దత్తాం మహేన్ద్రేణ యుద్ధాయ వ్యవతిష్ఠత. 39

ప్ర.అ. తమ్ =అతనిని గూర్చి, ఏవమ్ =ఇట్లు, ఉక్త్వా =పలికి, సంక్రుద్ధః =చాల కోపించినవాడై, పిత్రా =తండ్రియైన, మహేన్ద్రేణ =మహేంద్రునిచేత, దత్తామ్ =ఇవ్వబడిన, కాఞ్చనీమ్ = బంగారువికారమైన, మాలామ్ =మాలను, ఉత్‌క్షిప్య = ఎత్తి (మెడలో వేసికొని), యుద్ధాయ =యుద్ధముకొరకు, వ్యవతిష్ఠత = నిలచెను.

తా.చాలా కోపించిన వాలి ఆతనితో ఇట్లు పలికి తండ్రియైన దేవేంద్రుడిచ్చిన బంగారు మాలను మెడలో ధరించి, యుద్ధమునకై నిలచెను. 39

మూ. విషాణయోర్గృహీత్వా తం దున్దుభిం గిరిసన్నిభమ్,
ఆవిధ్యత తదా వాలీ వినదన్ కపికుఞ్జరః. 40

ప్ర.అ. తదా =అప్పుడు, కపికుఞ్జరః =వానరశ్రేష్ఠుడైన, వాలీ=వాలి, గిరిసంనిభమ్=పర్వతముతో సమానుడైన, తమ్=ఆ, దున్దుభిమ్= దుందుభిని, విషాణయోః=కొమ్ములయందు, గృహీత్వా =గ్రహించి, వినదన్ =ధ్వని చేయుచు, ఆవిధ్యత =విసిరికొట్టెను.

తా. అప్పుడు వానరశ్రేష్ఠుడైన వాలి పర్వతము వలె ఉన్న ఆ దుందుభిని కొమ్ములు పట్టి, అరచుచు, నేలపై వేసి కొట్టెను. 40

మూ. వాలీ వ్యాపాదయాంచక్రే ననర్ద చ మహాస్వనమ్,
శ్రోత్రాభ్యామథ రక్తం తు తస్య సుస్రావ పాత్యతః. 41

ప్ర.అ. వాలీ=వాలి, వ్యాపాదయాంచక్రే =కింద పడవేసెను. మహాస్వనమ్ =గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననర్ద చ=అరచెను. అథ = పిమ్మట, పాత్యతః =పడవేయబడుచున్న, తస్య =ఆ దుందుభియొక్క, శ్రోత్రాభ్యామ్ =చెవులనుండి, రక్తమ్ =రక్తము, సుస్రావ = స్రవించెను.

తా. వాలి ఆ దుందుభిని క్రింద పడవేసి గొప్ప ధ్వని చేయుచు అరచెను. క్రింద పడవేయబడిన ఆ దుందుభి చెవులనుండి రక్తము స్రవించెను. 41

మూ. తయోస్తు క్రోధసంరమ్భాత్పరస్పరజయైషిణోః,
యుద్ధం సమభవద్ఘోరం దున్దుభేర్వాలినస్తథా. 42

ప్ర.అ.క్రోధసంరమ్భాత్ =కోపావేశమువలన, పరస్పరజయైషిణోః = పరస్పరము జయమును కోరుచున్న, తయోః =వారిద్దరికీ, దున్దుభేః = దుందుభికి, తథా =మరియు, వాలినః =వాలికీ, ఘోరమ్ = ఘోరమైన, యుద్ధమ్ =యుద్ధము, సమభవత్ =ఆయెను.

తా.కోపావేశముతో పరస్పరము జయించవలె నని కోరుకొనుచున్న ఆ వాలిదుందుభులకు ఘోరమైన యుద్ధము జరిగెను. 42

మూ. అయుధ్యత తదా వాలీ శక్రతుల్యపరాక్రమః,
ముష్టిభిర్జానుభిః పద్భిః శిలాభిః పాదపైస్తథా. 43

ప్ర.అ. తదా=అప్పుడు, శక్రతుల్యపరాక్రమః =దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల, వాలీ=వాలి, ముష్టిభిః =పిడికిళ్లచేతను, జానుభిః =మోకాళ్ళ చేతను, పద్భిః =పాదములచేతను, శిలాభిః = శిలలచేతను, తథా =మరియు, పాదపైః =వృక్షములచేతను, అయుధ్యత =యుద్ధము చేసెను.

తా. దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల వాలి అప్పుడు పిడికిళ్లతో గ్రుద్ది, మోకాళ్లతో పొడిచి, పాదాలతో తన్ని, శిలలతోను వృక్షాలతోను కొట్టి యుద్ధము చేసెను. 43

మూ. పరస్పరం ఘ్నతో స్తత్ర వానరాసురయోస్తదా,
ఆసీద్ధీనోఽసురో యుద్ధే శక్రసూనుర్వ్యవర్ధత. 44

ప్ర.అ. తదా=అప్పుడు, తత్ర =అక్కడ, వానరాసురయోః = వాలి దుందుభులు, పరస్పరమ్ =పరస్పరము, ఘ్నతోః =కొట్టుకొనుచుండగా, యుద్ధే=ఆ యుద్ధమునందు, అసురః =అసురుడు, హీనః = తగ్గిపోయినవాడుగా, ఆసీత్ =ఆయెను. శక్రసూనుః =వాలి, వ్యవర్ధత =వృద్ధి పొందెను.

తా. అప్పు డక్కడ పరస్పరము కొట్టుకొనుచున్న వాలిదుందుభులలో దుందుభి బలము తగ్గిపోయెను. వాలి బలము పెరిగెను. 44

మూ. తం తు దున్దుభిముద్యమ్య ధరణ్యా మభ్యపాతయత్,
యుద్ధే ప్రాణహరే తస్మిన్నిష్పిష్టో దున్దుభిస్తదా. 45

ప్ర.అ. తమ్ =ఆ, దున్దుభిమ్ =దుందుభిని, ఉద్యమ్య =ఎత్తి, ధరణ్యామ్ =నేలమీద, అభ్యపాతయత్=పడవేసెను. తదా = అప్పుడు, ప్రాణహరే =ప్రాణములను హరించు, తస్మిన్ =ఆ, యుద్ధే =యుద్ధమునందు, దుందుభిః =దుందుభి, నిష్పిష్టః = నలగగొట్టబడెను.

తా. ఆ దుందుభిని ఎత్తి నేలమీద పడవేయగా, ప్రాణములను హరించే ఆ యుద్ధములో దుందుభి నేలమీద నలగగొట్టబడెను. 45

మూ. స్రోతోభ్యో బహు రక్తం తు తస్య సుస్రావ పాత్యతః,
పపాత చ మహాకాయః క్షితౌ పఞ్చత్వమాగతః. 46

ప్ర.అ. పాత్యతః =పడవేయబడుచున్న, తస్య =వానియొక్క, స్రోతోభ్యః =శరీరరంధ్రములనుండి, బహు =అధికమైన, రక్తమ్ = రక్తము, సుస్రావ =స్రవించెను. మహాకాయః =పెద్ద శరీరము గల ఆ అసురుడు, పఞ్చత్వమ్ =మరణమును, ఆగతః =పొందినవాడై, క్షితౌ =నేలమీద, పపాత =పడెను.

తా. నేలమీద పడవేయబడిన ఆ దుందుభి శరీరరంధ్రములనుండి అత్యధికముగా రక్తము స్రవించెను. పెద్ద శరీరము గల ఆతడు మరణించి నేలమీద పడిపోయెను. 46

మూ. తం తోలయిత్వా బాహుభ్యాం గతసత్త్వమచేతనమ్,
చిక్షేప బలవాన్వాలీ వేగేనైకేన యోజనమ్. 47

ప్ర.అ. బలవాన్=బలవంతుడైన, వాలీ =వాలి, గతసత్త్వమ్ = పోయిన బలము గల, అచేతనమ్ =చైతన్యము లేని, తమ్ =వానిని, బాహుభ్యామ్ =బాహువులచేత, తోలయిత్వా =ఎత్తి, ఏకేన = ఒక్క, వేగేన =వేగముచేత, యోజనమ్ =యోజనదూరము, చిక్షేప =విసిరివేసెను.

తా. బలశాలియైన వాలి బలము తగ్గిపోయి మరణించిన ఆ దుందుభిని చేతులతో ఎత్తి ఒకే ఊపులో యోజనము దూరము విసిరివేసెను. 47

మూ. తస్య వేగప్రవిద్ధస్య వక్త్రాత్ క్షతజబిన్దవః,
ప్రపేతుర్మారుతోత్క్షిప్తా మతఙ్గస్యాశ్రమం ప్రతి. 48

ప్ర.అ. వేగప్రవిద్ధస్య =వేగముచేత విసిరివేయబడిన, తస్య =ఆ దుందుభి యొక్క, వక్త్రాత్ =ముఖమునుండి, క్షతజబిన్దవః = రక్తబిందువులు, మారుతోత్క్షిప్తాః =వాయువుచేత ఎగురగొట్టబడినవై, మతఙ్గస్య =మతంగుని యొక్క, ఆశ్రమం ప్రతి=ఆశ్రమమును గూర్చి, ప్రపేతుః =పడినవి.

తా. ఆ దుందుభి వేగముగా విసిరివేయబడినప్పుడు వాని నోటినుండి కారిన రక్తబిందువులు గాలికి ఎగిరి మతంగాశ్రమము చుట్టూ పడినవి. 48

మూ. తాన్ దృష్ట్వా పతితాంస్తత్ర మునిః శోణితవిప్రుషః,
క్రుద్ధస్తస్య మహాభాగ చిన్తయామాస కో న్వయమ్. 49

ప్ర.అ. మహాభాగ =మహాభాగ్యవంతుడవైన రామా! మునిః =ముని , తత్ర =అక్కడ, పతితాన్ =పడిన, శోణితవిప్రుషః =రక్తబిందువులను, దృష్ట్వా =చూచి, తస్య =వానికి , క్రుద్ధః= కోపించినవాడై, అయమ్ =ఇతడు,కో ను =ఎవడు అని, చిన్తయామాస =ఆలోచించెను.

తా. మహాభాగ్యవంతుడ వైన రామా! మతంగముని ఆశ్రమములో పడిన రక్తబిందువులను చూచి, అట్లు చల్లినవానిపై కోపించి, ఈ పని చేసినవాడు ఎవడా అని ఆలోచించెను. 49

మూ. యేనాహం సహసా స్పృష్టః శోణితేన దురాత్మనా,
కోఽయం దురాత్మా దుర్బుద్ధిరకృతాత్మా చ బాలిశః. 50

ప్ర.అ. దురాత్మనా =దురాత్ముడైన, యేన =ఎవనిచేత, అహమ్ = నేను,

సహసా =హటాత్తుగా, శోణితేన =రక్తముచేత, స్పృష్టః =స్పృశింపబడితినో, దురాత్మా =దురాత్ముడు, దుర్బుద్ధిః= చెడ్డ బుద్ధి గలవాడు, అకృతాత్మా చ వినయవిహీనుడు అయిన , అయమ్ = ఈ, బాలిశః =మూర్ఖుడు, కః =ఎవడు?

తా. ఈ రక్తము నాపై పడుటకు కారణమైన దురాత్ముడు, దుర్బుద్ధి, వినయవిహీనుడు అయిన ఆ మూర్ఖు డెవడో! 50

మూ. ఇత్యుక్త్వా స వినిష్క్రమ్య దదృశే మునిసత్తమః,
మహిషం పర్వతాకారం గతాసుం పతితం భువి. 51

ప్ర.అ. సః =ఆ, మునిసత్తమః =మునిశ్రేష్ఠుడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా =పలికి, వినిష్క్రమ్య = బైటకు వచ్చి, గతాసుమ్ = పోయిన ప్రాణములు గలది, భువి =నేలమీద, పతితమ్ = పడినది, పర్వతాకారమ్ =పర్వతమువంటి ఆకారము గలది అయిన, మహిషమ్ =మహిషమును, దదృశే =చూచెను.

తా. ఆ మునిశ్రేష్ఠుడు ఇట్లు అనుకొనుచు బైటకు వెళ్ళి చూడగా ఆతనికి చచ్చి నేలమీద పడి ఉన్న, పర్వతమువంటి ఆకారము గల దున్నపోతు కనబడెను.

మూ. స తు విజ్ఞాయ తపసా వానరేణ కృతం హి తత్,
ఉత్ససర్జ మహాశాపం క్షేప్తారం వానరం ప్రతి. 52

ప్ర.అ. సః =అతడు, తత్ =దానిని, వానరేణ =వానరునిచేత, కృతమ్ =చేయబడినదానినిగా, తపసా =తపస్సుచేత, విజ్ఞాయ =తెలిసికొని, క్షేప్తారమ్ =ఆ మహిషమును విసిరివేసిన, వానరం ప్రతి =వానరుని గూర్చి, మహాశాపమ్ =గొప్ప శాపమును, ఉత్ససర్జ =విడచెను.

తా. ఆ పని చేసినవాడు వాలి అని ఆ ముని తపోబలముచే తెలుసుకొని, ఆ మహిషమును తన ఆశ్రమము వైపు పడవేసిన ఆ వాలికి గొప్ప శాపము ఇచ్చెను. 52

మూ. ఇహ తేనాప్రవేష్టవ్యం ప్రవిష్టస్య వధో భవేత్,
వనం మత్సంశ్రయం యేన దూషితం రుధిరస్రవైః. 53

ప్ర.అ. మత్సంశ్రయమ్=నాకు నివాసమైన, వనమ్ =వనము, యేన =ఎవనిచేత, రుధిరస్రవైః=రక్తస్రావములచేత, దూషితమ్=దూషింపబడినదో, తేన =వానిచేత, ఇహ =ఇక్కడ, న ప్రవేష్టవ్యమ్= ప్రవేశింపదగినది కాదు. ప్రవిష్టస్య =ప్రవేశించిన వానియొక్క, వధః= మృత్యువు, భవేత్ =అగును.

తా. నా నివాసస్థానమైన ఈ వనమును రక్తముచేత పాడుచేసినవాడు ఈ వనములో ప్రవేశించగూడదు. అట్లు ప్రవేశించినచో ఆతడు మరణించగలడు. 53

మూ. క్షిపతా పాదపాశ్చేమే సంభగ్నాశ్చాసురీం తనుమ్,
సమన్తాదాశ్రమం పూర్ణం యోజనం మామకం యది, 54
ఆక్రమిష్యతి దుర్బుద్ధిర్వ్యక్తం స న భవిష్యతి.

ప్ర.అ. ఆసురీమ్ =రాక్షసుని సంబంధమైన, తనుమ్ =శరీరమును, క్షిపతా =విసిరివేసిన వానిచేత, ఇమే =ఈ, పాదపాశ్చ = వృక్షములు కూడ, సంభగ్నాః =విరగగొట్టబడినవి. సమన్తాత్=చుట్టూ, పూర్ణమ్= పూర్ణమైన, యోజనమ్=యోజన మైన, మామకమ్ =నా సంబంధమైన, ఆశ్రమమ్ =ఆశ్రమమును, ఆక్రమిష్యతి = ఆక్రమించినట్లయితే, దుర్బుద్ధిః = దుర్బుద్ధి గల, సః =అతడు, న భవిష్యతి =ఉండడు (జీవించడు).

తా. ఈ అసురుని శరీరమును ఎవడు విసిరివేసినాడో అతడు ఈ వృక్షములను కూడ విరగగొట్టినాడు. పూర్తి యోజనము ప్రమాణము గల నా ఆశ్రమము చుట్టు ప్రక్కలకు వచ్చినచో దుర్బుద్ధి యైన అతడు జీవించడు. 54

మూ. యే చాస్య సచివాః కేచిత్ సంశ్రితా మామకం వనమ్, 55
న చ తైరిహ వస్తవ్యం శ్రుత్వా యాన్తు యథాసుఖమ్.

ప్ర.అ. మామకమ్ =నా సంబంధమైన, వనమ్ =వనమును, సంశ్రితాః =ఆశ్రయించిన, యే కేచిత్ =ఎవరైతే, అస్య సచివాః =ఇతని మంత్రులు గలరో, తైః చ =వారిచేత కూడ, ఇహ =ఇక్కడ, న వస్తవ్యమ్ =నివసింపరాదు. శ్రుత్వా =నా మాటను విని, యథాసుఖమ్ =సుఖము కలుగునట్లుగా, యాన్తు =వెళ్లెదరు గాక.

తా. నా వనమును ఆశ్రయించి ఉన్న ఆతని మంత్రులు మొదలైన వారు కూడ ఇటుమీద ఇక్కడ నివసించకూడదు. వారందరు నా మాటలు విని వెళ్లిపోయెదరు గాక. 55

మూ. తేఽపి వా యది తిష్ఠన్తి శపిష్యే తానపి ధ్రువమ్. 56
వనేఽస్మిన్ మామకే నిత్యం పుత్రవత్ పరిరక్షితే,
పత్రాఙ్కురవినాశాయ ఫలమూలాభవాయ చ. 57

ప్ర.అ. నిత్యమ్ =ఎల్లప్పుడు, పుత్రవత్ =పుత్రుడు వలె, పరిరక్షితే =రక్షించబడిన, మామకే =నా సంబంధమైన, అస్మిన్ వనే =ఈ వనమునందు, తేఽపి =ఆతని అనుచరులు కూడ, పత్రాఙ్కురవినాశాయ =ఆకులయొక్క, అంకురముల యొక్క వినాశముకొరకు, ఫలమూలాభవాయ చ = ఫలములయొక్క, మూలములయొక్క లేకుండా పోవుట కొరకు, తిష్ఠన్తి యది=ఉన్నట్లయితే, తానపి =వాళ్లను కూడా, ధ్రువమ్ = నిశ్చయముగా, శపిష్యే =శపించెదను.

తా. నేను నిత్యము ఈ వనమును పుత్రుని రక్షించుకొన్నట్లు రక్షించుకొను చున్నాను. అట్టి ఈ వనములో నివసించి ఆకులను, అంకురములను, ఫలములను,

మూలములను పాడుచేయుచున్న ఆ వానరులు దీనిని విడిచి వెళ్లకపోయినచో వాళ్ళను కూడ తప్పక శపించెదను. 56,57

మూ. దివసశ్చాత్ర మర్యాదా యం ద్రష్టా శ్వోఽస్మి వానరమ్,
బహువర్షసహస్రాణి స వై శైలో భవిష్యతి. 58

ప్ర.అ. అత్ర =ఈ విషయమునందు, దివసః =ఒక దివసము, మర్యాదా = గడువు. శ్వః =రేపు, యమ్ = ఏ, వానరమ్ =వానరుని, ద్రష్టాస్మి =చూడగలనో, సః =వాడు, బహువర్షసహస్రాణి =అనేక సహస్ర సంవత్సరములను, శైలః = పర్వతముగా, భవిష్యతి =కాగలడు.

తా. ఒక్క దినము మాత్రమే గడువు ఇచ్చుచున్నాను. రేపు నా కంటబడిన వానరుడు ఎన్నో వేల సంవత్సరముల పాటు శిలయై పడి యుండును. 58

మూ. తతస్తే వానరాః శ్రుత్వా గిరం మునిసమీరితామ్,
నిశ్చక్రముర్వనాత్తస్మాత్తాన్ దృష్ట్వా వాలి రబ్రవీత్. 59

ప్ర.అ. తతః =అటుపిమ్మట, తే =ఆ, వానరాః =వానరులు, మునిసమీరితామ్ =మునిచేత పలకబడిన, గిరమ్ =వాక్కును, శ్రుత్వా =విని, తస్మాత్ వనాత్ =ఆ వనమునుండి, నిశ్చక్రముః =బయలుదేరి వెళ్లిపోయిరి. తాన్ =వారిని , దృష్ట్వా =చూచి, వాలిః =వాలి, అబ్రవీత్ =పలికెను.

తా. ముని పలికిన మాటలు విని వానరులు ఆ వనమును విడిచి వెళ్ళిపోయిరి. వాళ్ళను చూచి వాలి ఇట్లు పలికెను. 59

మూ. కిం భవన్తః సమస్తాశ్చ మతఙ్గవనవాసినః,
మత్సమీపమనుప్రాప్తా అపి స్వస్తి వనౌకసామ్. 60

ప్ర.అ. మతఙ్గవనవాసినః =మతంగవనమునందు నివసించుచున్న, భవన్తః =మీరు, సమస్తాః =అందరూ, కిమ్ =ఎందువలన, మత్సమీపమ్ = నా సమీపమును గూర్చి, అనుప్రాప్తాః = వచ్చినారు? వనౌకసామ్ =వనము నివాసముగా గల వానరులకు, అపి స్వస్తి = క్షేమమే కదా!

తా. మతంగవనములో నివసించే మీరందరూ నా దగ్గరకు ఎందుకు వచ్చినారు? వానరులు అందరూ క్షేమమే కదా! 60

మూ. తతస్తే కారణం సర్వం తథా శాపం చ వాలినః,
శశంసుర్వానరాః సర్వే వాలినే హేమమాలినే. 61

ప్ర.అ. తతః =అటుపిమ్మట, సర్వే =సమస్తమైన, తే వానరాః =ఆ వానరులు, సర్వమ్ =సమస్తమైన, కారణమ్ =కారణమును, తథా =మరియు, వాలినః =వాలియొక్క, శాపం చ =శాపమును, హేమమాలినే = బంగారు మాల

గల, వాలినే =వాలికి, శశంసుః =చెప్పిరి.

తా. పిమ్మట ఆ వానరు లందరూ, బంగారు మాల ధరించిన ఆ వాలికి, తాము వచ్చుటకు కారణమును, అతనికి తగిలిన శాపమును గూర్చి చెప్పిరి. 61

మూ. ఏతచ్ఛ్రుత్వా తదా వాలీ వచనం వానరేరితమ్,
స మహర్షిం సమాసాద్య యాచతే స్మ కృతాఞ్జలిః. 62

ప్ర.అ. తదా = అప్పుడు, సః వాలీ =ఆ వాలి, వానరేరితమ్ =వానరులచేత పలకబడిన, ఏతత్ =ఈ , వచనమ్ = వచనమును, శ్రుత్వా =విని, కృతాఞ్జలిః =చేయబడిన దోసిలి కలవాడై, మహర్షిమ్ =మహర్షిని, సమాసాద్య =సమీపించి, యాచతే స్మ= యాచించెను.

తా. అప్పు డా వాలి వానరుల మాటలు విని, సవినయముగా ఆ మహర్షి దగ్గరకు వెళ్ళి ప్రార్థించెను. 62

మూ. మహర్షిస్తమనాదృత్య ప్రవివేశాశ్రమం ప్రతి,
శాపధారణభీతస్తు వాలీ విహ్వలతాం గతః. 63

ప్ర.అ. మహర్షిః =మహర్షి, తమ్ =అతనిని, అనాదృత్య = అనాదరము చేసి, ఆశ్రమం ప్రతి =ఆశ్రమమును గూర్చి, ప్రవివేశ = ప్రవేశించెను. వాలీ = వాలి, శాపధారణభీతః =శాపమును ధరించుటచే భయపడినవాడై, విహ్వలతామ్ వ్యాకులత్వమును, గతః= పొందెను.

తా. మతంగమహర్షి వాలి మాటలు ఆదరించక ఆశ్రమములోనికి వెళ్లి పోయెను. వాలి శాపము తగులుటచేత భయపడుచు వ్యాకులచిత్తముతో ఉండెను.

మూ. తతః శాపభయాద్భీతో ఋష్యమూకం మహాగిరిమ్,
ప్రవేష్టుం నేచ్ఛతి హరిర్ద్రష్టుం వాపి నరేశ్వర. 64

ప్ర.అ. నరేశ్వర =నరుల ప్రభువైన రామా! తతః =అప్పటినుండి, హరిః =ఆ వానరుడు, శాపభయాత్ =శాపమువలన కలుగు ఆపదవలన, భీతః =భయపడినవాడై, మహాగిరిమ్ = మహాపర్వతమైన, ఋష్యమూకమ్ =ఋష్యమూకమును, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, ద్రష్టుం వాపి =చూచుటకు గాని, నేచ్ఛతి = ఇచ్ఛయించదు.

తా. మహారాజా! రామా! నాటినుండి వాలి శాపమునకు భయపడి ఋష్యమూకమహాపర్వతముమీదికి ప్రవేశించుటకు, చివరకు దానివైపు చూచుటకు కూడ ఇష్టపడడు. 64

మూ. తస్యాప్రవేశం జ్ఞాత్వాహమిదం రామ మహావనమ్,
విచరామి సహామాత్యో విషాదేన వివర్జితః. 65

ప్ర.అ. రామ =రామా! అహమ్ =నేను, తస్య =అతనియొక్క, ప్రవేశమ్

=ప్రవేశించకుండుటను, జ్ఞాత్వా =తెలిసికొని, విషాదేన =దుఃఖముచేత, వివర్జితః =విడువబడినవాడనై, సహామాత్యః =మంత్రులతో కూడినవాడనై, ఇదమ్ =ఈ, మహావనమ్ = మహావనమును, విచరామి = సంచరించుచున్నాను.

తా. రామా! వాలి ఈ మహావనములో ప్రవేశింపజాల డని తెలిసికొని నేను ఏమీ భయములేక మంత్రులతో కూడ ఇక్కడ సంచరించుచున్నాను. 65

మూ. ఏషో ఽస్థినిచయస్తస్య దున్దుభేః సంప్రకాశతే,
వీర్యోత్సేకాన్నిరస్తస్య గిరికూటనిభో మహాన్. 66

ప్ర.అ. వీర్యోత్సేకాత్ = పరాక్రమగర్వమువలన, నిరస్తస్య = విసిరివేయబడిన, తస్య దున్దుభేః = ఆ దుందుభియొక్క, గిరికూటనిభః = పర్వతశిఖరముతో సమానమైన, మహాన్ = గొప్పదైన, ఏషః = ఈ, అస్థినిచయః = ఎముకల సముదాయము, సంప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తా. బలగర్వముతో వాలి దూరముగా విసరివేసిన ఆ దుందుభి అస్థిపంజరము ఇదిగో; పర్వతశిఖరము వలె ప్రకాశించుచున్నది. 66

మూ. ఇమే చ విపులాః సాలాః సప్త శాఖావలమ్బినః,
యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితుమోజసా. 67

ప్ర.అ. శాఖావలమ్బినః =కొమ్మలతో కూడిన, ఇమే= ఈ, సప్త= ఏడు, విపులాః=పెద్దవైన, సాలాః= సాలవృక్షములు, ఉన్నవి. యత్ర= వేటిలో, ఏకమ్ = ఒక దానిని, వాలీ =వాలి, ఓజసా =బలముచేత, నిష్పత్రయితుమ్=ఆకులు లేకుండా చేయుటకు, ఘటతే =సమర్థు డగుచుండునో (లేదా ప్రయత్నించుచుండునో).

తా. ఇవిగో ఇక్కడ కొమ్మలతో నిండిన ఏడు సాలవృక్షము లున్నవి. వాలి బలముచేత వీటిలో ఒకదానిని ఊపి ఆకు లన్నీ రాలిపోవు నట్లు చేయుచుండును.

వి. "నిష్పత్రాకురుతే" అనే పదానికి బాణమును ఒక లక్ష్యముపై ఆవలివైపునకు దూసికొని పోవు నట్లు ప్రయోగించి బాణానికి కట్టిన రెక్కలు ఊడిపోవు నట్లు చేయుచున్నాడు అని అర్థము. ఆ అర్థమును మనస్సులో ఉంచుకొని కొందరు వ్యాఖ్యాతలు వాలి ఒక చెట్టు ప్రమానుమీద చేతితోనే (ధనస్సు అవసరము లేకుండానే) బాణమును ఈ ప్రక్కనుండి ఆ మూలకు పోవునట్లు గ్రుచ్చగలడు అని అర్థము చెప్పినారు. అది క్లిష్టకల్పన. వానరులు బాణాలు ఉపయోగించినట్లు ఎక్కడా లేదు. 67

మూ. ఏతదస్యాసమం వీర్యం మయా రామ ప్రకాశితమ్,
కథం తం వాలినం హన్తుం సమరే శక్ష్యసే నృప. 68

ప్ర.అ. రామ=రామా! అస్య =ఈతనియొక్క, అసమమ్ =సాటి లేని,

ఏతత్ =ఈ, వీర్యమ్ =పరాక్రమము, ప్రకాశితమ్ = స్పష్టముగా చెప్పబడినది. నృప =రాజా! సమరే = యుద్ధమునందు, తం వాలినమ్ =ఆ వాలిని, హన్తుమ్ =చంపుటకు, కథమ్ =ఎట్లు, శక్ష్యసే =సమర్థుడ వగుదువు?

తా. రామా! వాలి కున్న సాటి లేని బలమును గూర్చి స్పష్టముగా చెప్పినాను. రాజా! అట్టి వాలిని యుద్ధములో నీవు చంపగలవా? 68

మూ. తథా బ్రువాణం సుగ్రీవం ప్రహసన్ లక్ష్మణోఽబ్రవీత్,
కస్మిన్ కర్మణి నిర్వృత్తే శ్రద్దధ్యా వాలినో వధమ్. 69

ప్ర-అ. లక్ష్మణః =లక్ష్మణుడు, తథా =అట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, సుగ్రీవమ్ =సుగ్రీవుని గూర్చి, ప్రహసన్= నవ్వుచు, అబ్రవీత్ =పలికెను. కస్మిన్ =ఏ, కర్మణి =పని, నిర్వృత్తే = జరిగిన దగుచుండగా, వాలినః= వాలియొక్క, వధమ్= వధను, శ్రద్దధ్యాః = నమ్మెదవు?

తా. సుగ్రీవుని మాటలు విని, లక్ష్మణుడు నవ్వుచు - రాముడు వాలిని చంపగల డను విషయమును అత డేమి చేసిన నమ్మెదవు? అని పలికెను. 69

మూ. తమువాచాథ సుగ్రీవః సప్త సాలానిమాన్ పురా,
ఏవమేకైకశో వాలీ వివ్యాధాథ స చాసకృత్. 70

ప్ర-అ. అథ =అటుపిమ్మట, సుగ్రీవః =సుగ్రీవుడు, తమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ =పలికెను. పురా=పూర్వము, సః వాలీ =ఆ వాలి, ఇమాన్=ఈ, సప్తసాలాన్=ఏడు సాలవృక్షములను, ఏవమ్=ఈ విధముగా, ఏకైకశః =ఒక్కొక్క దానిని చొప్పున, అథ = మరియు, అసకృత్ =అనేక పర్యాయములు, వివ్యాధ= పీడించెను.

తా. అప్పుడు సుగ్రీవుడు లక్ష్మణునితో ఇట్లు పలికెను. పూర్వము వాలి ఈ ఏడు సాలవృక్షములను ఒక్కొక్కదానిని పట్టుకొని అనేకపర్యాయములు, నేను చెప్పినట్లు పీడించేవాడు. 70

మూ. రామో నిర్దారయేదేషాం బాణేనైకేన చ ద్రుమమ్,
వాలినం నిహతం మన్యే దృష్ట్వా రామస్య విక్రమమ్. 71

ప్ర-అ. రామః =రాముడు, ఏషామ్ =వీటిలో, ద్రుమమ్ =ఒక చెట్టును, ఏకేన =ఒక్క, బాణేన =బాణముచేత, నిర్దారయేత్ =చీల్చినట్లయితే, రామస్య =రామునియొక్క, విక్రమమ్ = పరాక్రమమును, దృష్ట్వా =చూచి, వాలినమ్ =వానిని, నిహతమ్ =చంపబడినవానినిగా, మన్యే = తలచెదను.

తా. రాముడు ఒక్క బాణముతో ఈ చెట్లలో ఒకదానిని చీల్చగలిగిన ట్లయితే అప్పుడు రాముని పరాక్రమమును చూచి, వాలిని ఇతడు చంపగల డని నమ్మెదను. 71

మూ. హతస్య మహిషస్యాస్థి పాదేనైకేన లక్ష్మణ,
ఉద్యమ్య ప్రక్షిపేచ్చాపి తరసా ద్వే ధనుఃశతే. 72

ప్ర.అ. లక్ష్మణ =లక్ష్మణా! హతస్య =చంపబడిన, మహిషస్య = ఈ మహిషముయొక్క, అస్థి =ఎముకను (అస్థిపంజరమును), ఏకేన = ఒక, పాదేన =పాదము చేత, ఉద్యమ్య =ఎత్తి, తరసా = బలముచేత, ద్వే ధనుః శతే=రెండువందల ధనస్సుల దూరమును, ప్రక్షిపేచ్చాపి =విసిరివేసినను, (వాలిని చంపబడినవానినిగా ఎంచెదను).

తా. చచ్చిన ఈ మహిషాకారములో ఉన్న దుందుభి అస్థిపంజరమును రాముడు ఒక్క కాలితో ఎత్తి బలముచేత రెండు వందల ధనస్సుల (నాలుగు వందల గజముల) దూరము విసిరివేయగలిగినా కూడ ఇతడు వాలిని చంపగల డని నమ్మెదను. 72

మూ. ఏవముక్త్వా తు సుగ్రీవో రామం రక్తాన్తలోచనమ్,
ధ్యాత్వా ముహూర్తం కాకుత్స్థం పునరేవ వచోఽబ్రవీత్. 73

ప్ర.అ. సుగ్రీవః =సుగ్రీవుడు, రక్తాన్తలోచనమ్ =ఎఱ్ఱని కొనలు గల నేత్రములు గల, రామమ్=రాముని గూర్చి, ఏవమ్ =ఇట్లు, ఉక్త్వా =పలికి, ముహూర్తమ్ =ముహూర్తకాలము పాటు, ధ్యాత్వా =ఆలోచించి, కాకుత్స్థమ్ =రాముని గూర్చి, పునరేవ =మరల, వచః =వచనమును, అబ్రవీత్ =పలికెను.

తా. సుగ్రీవుడు కొనలయందు ఎఱ్ఱగా నున్న నేత్రములు గల రామునితో ఇట్లు పలికి, క్షణకాలము ఆలోచించి, మరల ఇట్లు పలికెను. 73

మూ. శూరశ్చ శూరమానీ చ ప్రఖ్యాతబలపౌరుషః,
బలవాన్వానరో వాలీ సంయుగేష్వపరాజితః. 74

ప్ర.అ. శూరశ్చ =శూరుడు, శూరమానీ చ =శూరుడ నని అనుకొనే వాడు, ప్రఖ్యాతబలపౌరుషః= ప్రసిద్ధమైన బలము, పౌరుషము గలవాడు, బలవాన్ =బలవంతుడు అయిన, వానరః వాలీ =వానరుడైన వాలి, సంయుగేషు = యుద్ధములయందు, అపరాజితః= ఓడించబడనివాడు.

తా. వానరుడైన వాలి శూరుడు. శూరుడ ననే అభిమానము కలవాడు. అతని బలపౌరుషములు అంతటా ప్రసిద్ధములు. బలవంతుడైన అతడు ఎన్నడూ యుద్ధములలో ఓటమి ఎరుగడు. 74

మూ. దృశ్యన్తే చాస్య కర్మాణి దుష్కరాణి సురైరపి,
యాని సంచిన్త్య భీతోఽహమృశ్యమూకముపాశ్రితః. 75

ప్ర.అ. సురైరపి =దేవతలచేత కూడ, దుష్కరాణి =చేయ శక్యము

కాని, అస్య =ఇతనియొక్క, కర్మాణి =కర్మలు, దృశ్యన్తే = చూడబడుచున్నవి. యాని =వేటిని గూర్చి, సంచిన్త్య =ఆలోచించి, భీతః =భయపడినవాడనై, అహమ్ =నేను, ఋష్యమూకమ్ = ఋష్యమూకపర్వతమును, ఉపాశ్రితః =ఆశ్రయించి ఉన్నానో.

తా. ఇతడు దేవతలు కూడా చేయజాలని పనులు చేసి ఉన్నాడు. ఆ పనులను గూర్చి ఆలోచించి, భయపడి నేను ఈ ఋష్యశృంగపర్వతమును ఆశ్రయించి ఉన్నాను. 75

మూ. తమజయ్యమధృష్యం చ వానరేన్ద్రమమర్షణమ్,
విచిన్తయన్న ముఞ్చామి ఋష్యమూకమముం త్వహమ్. 76

ప్ర.అ. తమ్ =ఆ, వానరేన్ద్రమ్ =వానరప్రభువైన వాలిని, అజయ్యమ్ =జయింప శక్యముకాని వానిని గాను, అధృష్యమ్ = ఎదుర్కొన శక్యము కానివానిని గాను, అమర్షణమ్ =కోపము గలవానిని గాను, విచిన్తయన్ =ఆలోచించుచు, అముమ్ =ఈ, ఋష్యమూకమ్ =ఋష్యమూకపర్వతమును, న ముఞ్చామి =విడచుటలేదు.

తా. వానరరాజైన ఆ వాలిని ఎదిరించుటకు గాని, జయించుటకు గాని శక్యము కాదు. అతడు కోపస్వభావము గలవాడు. ఈ విషయము తెలిసియే నేను ఈ ఋష్యమూకపర్వతమును విడచుట లేదు. 76

మూ. ఉద్విగ్నః శఙ్కితశ్చాహం విచరామి మహావనే,
అనురక్తైః సహామాత్యై ర్హనుమత్ప్రముఖైర్వరైః. 77

ప్ర.అ. అహమ్ =నేను, ఉద్విగ్నః =భయపడినవాడనై, శఙ్కితః = శంకించుచున్నవాడనై, అనురక్తైః =స్నేహముగల, వరైః= శ్రేష్ఠులైన, హనుమత్ప్రముఖైః =హనుమంతుడు మొదలైన, అమాత్యైః సహ = మంత్రులతో కూడ, మహావనే =మహావనమునందు, విచరామి = సంచరించుచున్నాను.

తా. నేను భయపడి ఏమి ఆపద వచ్చునో అని శంకించుచు, నాయందు ప్రేమ గల హనుమంతుడు మొదలైన ఉత్తములైన మంత్రులతో కలిసి ఈ మహావనములో తిరుగుచున్నాను. 77

మూ. ఉపలబ్ధం చ మే శ్లాఘ్యం సన్మిత్రం మిత్రవత్సల,
త్వామహం పురుషవ్యాఘ్ర హిమవన్త మివాశ్రితః. 78

ప్ర.అ. శ్లాఘ్యమ్=శ్లాఘింపదగిన, సన్మిత్రమ్=ఉత్తమమిత్రుడు, మే =నాకు, ఉపలబ్ధమ్ =పొందబడినాడు. మిత్రవత్సల = మిత్రులయందు ప్రేమ గలవాడా! పురుషవ్యాఘ్ర =పురుషశ్రేష్ఠుడా! అహమ్ =నేను, హిమవన్తమివ =హిమవంతుని వంటి, త్వామ్ =నిన్ను, ఆశ్రితః =ఆశ్రయించినాను.

తా. ఈనాడు నాకు శ్లాఘనీయుడైన ఉత్తమమిత్రుడు లభించినాడు. మిత్రులపై ప్రేమగల ఓ! పురుషశ్రేష్ఠుడా! హిమవత్పర్వతమువంటివాడ వైన నిన్ను ఆశ్రయించుచున్నాను. 78

మూ. కిం తు తస్య బలజ్ఞోఽహం దుర్భ్రాతుర్బలశాలినః,
అప్రత్యక్షం తు మే వీర్యం సమరే తవ రాఘవ. 79

ప్ర.అ. కిం తు = కాని, అహమ్ =నేను, బలశాలినః =బలముతో ప్రకాశించుచున్న, దుర్భ్రాతుః =చెడ్డ సోదరుడైన, తస్య = ఆ వాలియొక్క, బలజ్ఞః =బలమును ఎరిగినవాడను. రాఘవ = రామా! సమరే =యుద్ధమునందు, తవ =నీయొక్క, వీర్యం తు = పరాక్రమమైతే, మే =నాకు, అప్రత్యక్షమ్ =ప్రత్యక్షము కాదు.

తా. రామా! బలశాలియైన ఆ నా దుష్టసోదరుని బల మెంతటిదో నాకు తెలియును. కాని యుద్ధములో నీ పరాక్రమమును నే నెన్నడూ చూచి ఉండలేదు. 79

మూ. న ఖల్వహం త్వాం తులయే నావమన్యే న భీషయే,
కర్మభిస్తస్య భీమైశ్చ కాతర్యం జనితం మమ. 80

ప్ర.అ. అహమ్= నేను, త్వామ్=నిన్ను, న ఖలు తులయే = పరీక్షించుటలేదు. నావమన్యే=అవమానించుటలేదు. న భీషయే=భయపెట్టుటలేదు. తస్య =వానియొక్క, భీమైః =భయంకరమైన, కర్మభిః =కర్మలచేత, మమ =నాకు, కాతర్యమ్ = భయము, జనితమ్ =పుట్టించబడినది.

తా. నిన్ను పరీక్షింపవలె నని గాని, అవమానించవలె నని గాని, భయపెట్టవలె నని గాని నా అభిప్రాయము కాదు. భయంకరములైన అతడు చేసిన పనులు చూచి నా మనస్సులో భయము కలుగుటచే ఇట్లు పలుకుచున్నాను. 80

మూ. కామం రాఘవ తే వాణీ ప్రమాణం ధైర్యమాకృతిః,
సూచయన్తి పరం తేజో భస్మచ్ఛన్నమివానలమ్. 81

ప్ర.అ. రాఘవ =రామా! తే =నీయొక్క, వాణీ =వాక్కు, ప్రమాణమ్ =శరీరప్రమాణము, ధైర్యమ్=ధైర్యము, ఆకృతిః =ఆకారము, భస్మచ్ఛన్నమ్ = భస్మముచేత కప్పబడిన, అనలమ్ ఇవ = అగ్నివలె ఉన్న, పరమ్ =అధికమైన, తేజః=తేజస్సును, సూచయన్తి=సూచించుచున్నవి. కామమ్ =నిశ్చయము.

తా. రామా! నీ మాట, శరీరప్రమాణము, ధైర్యము, ఆకారము ఇవన్నీ నివురు గప్పిన నిప్పు వలె ఉన్న నీ అసాధారణమైన తేజస్సును సూచించుచున్నా యను మాట నిజమే. 81

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సుగ్రీవస్య మహాత్మనః,
స్మితపూర్వమథో రామః ప్రత్యువాచ హరిం ప్రతి. 82

ప్ర.అ. రామః =రాముడు, మహాత్మనః =మహాత్ముడైన, తస్య సుగ్రీవస్య =ఆ సుగ్రీవునియొక్క, తత్ వచనమ్ =ఆ వచనమును, శ్రుత్వా =విని, అథః =అటు పిమ్మట, హరిం ప్రతి =ఆ సుగ్రీవుని గూర్చి, స్మితపూర్వమ్ =చిరునవ్వు పూర్వమునందు కలుగునట్లుగా, ప్రత్యువాచ =తిరిగి పలికెను.

తా. రాముడు మహాత్ముడైన సుగ్రీవుని వచనము విని, చిరునవ్వు నవ్వుచు, అతనితో ఇట్లు పలికెను. 82

మూ. యది న ప్రత్యయోఽస్మాసు విక్రమే తవ వానర,
ప్రత్యయం సమరే శ్లాఘ్య మహముత్పాదయామి తే. 83

ప్ర.అ. వానర =సుగ్రీవా! విక్రమే =పరాక్రమము విషయమున, అస్మాసు =మాయందు, తవ =నీకు, ప్రత్యయః =నమ్మకము, న యది = లేకపోయినచో, అహమ్ =నేను, సమరే =యుద్ధము విషయమున, శ్లాఘ్యమ్ =శ్లాఘించదగిన, ప్రత్యయమ్ = నమ్మకమును, తే =నీకు, ఉత్పాదయామి =పుట్టించెదను.

తా. సుగ్రీవా! మా పరాక్రమము విషయమున నీకు నమ్మకము లేనిచో యుద్ధము చేయుటలో నాకున్న సామర్థ్యమును గూర్చి నమ్మకము కలిగించెదను.

మూ. ఏవముక్త్వా తు సుగ్రీవం సాన్త్వయన్ లక్ష్మణాగ్రజః,
రాఘవో దున్దుభేః కాయం పాదాఙ్గుష్ఠేన లీలయా. 84
తోలయిత్వా మహాబాహుశ్చిక్షేప దశయోజనమ్,
అసురస్య తనుం శుష్కాం పాదాఙ్గుష్ఠేన వీర్యవాన్. 85

ప్ర.అ. లక్ష్మణాగ్రజః =లక్ష్మణుని అన్నగారు, మహాబాహుః =గొప్ప బాహువులు గలవాడు, వీర్యవాన్ =పరాక్రమవంతుడు అయిన, రాఘవః =రాముడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా =పలికి, సుగ్రీవమ్ = సుగ్రీవుని, సాన్త్వయన్ =ఓదార్చుచు, దున్దుభేః =దుందుభియొక్క, కాయమ్ =శరీరమును, లీలయా =విలాసతో, పాదాఙ్గుష్ఠేన =పాదము బొటనవ్రేలితో, తోలయిత్వా =ఎత్తి, అసురస్య = ఆ రాక్షసునియొక్క, శుష్కామ్=ఎండిన, తనుమ్ =శరీరమును, పాదాఙ్గుష్ఠేన =[illegible]దము బొటనవ్రేలితో, దశయోజనమ్ =పది యోజనముల దూరము, చిక్షేప =[illegible]రెను.

తా. లక్ష్మణుని అన్నగారు, మహాబాహువు, పరాక్రమశాలీ అయిన రాముడు సుగ్రీవునితో ఇట్లు పలికి కాలి బొటనవ్రేలితో దుందుభి శరీరమును అనాయాసముగా ఎత్తి, రాక్షసుని ఎండిపోయిన ఆ శరీరమును పది యోజనముల దూరము విసరివేసెను. 84, 85

మూ. క్షిప్తం దృష్ట్వా తతః కాయం సుగ్రీవః పునరబ్రవీత్,
లక్ష్మణస్యాగ్రతో రామం తపన్త మివ భాస్కరమ్. 86
హరీణామగ్రతో వీర మిదం వచనమర్థవత్.

ప్ర.అ. సుగ్రీవః= సుగ్రీవుడు, క్షిప్తమ్=విసరివేయబడిన, కాయమ్=శరీరమును, దృష్ట్వా =చూచి, తతః = అటు పిమ్మట, తపన్తమ్ = తపింపచేయుచున్న, భాస్కరమ్ ఇవ = సూర్యుడు వలె ఉన్న, వీరమ్ =వీరుడైన, రామమ్ =రాముని గూర్చి, హరీణామ్ =వానరులయొక్క, అగ్రతః =ఎదుట, అర్థవత్ = అర్థయుక్తమైన, ఇదమ్ =ఈ, వచనమ్ =వచనమును, అబ్రవీత్ =పలికెను.

తా. ఆ విధముగ విసిరివేయబడిన శరీరమును చూచి సుగ్రీవుడు, సూర్యుడు వలె ప్రకాశించుచున్న వీరుడైన ఆ రామునితో లక్ష్మణవానరుల సమక్షమున అర్థయుక్తమైన వాక్యము నిట్లు పలికెను. 86

మూ. ఆర్ద్రః సమాంసః ప్రత్యగ్రః క్షిప్తః కాయః పురా సఖే, 87
పరిశ్రాన్తేన మత్తేన భ్రాత్రా మే వాలినా తదా.

ప్ర.అ. సఖే= మిత్రుడా! తదా =అప్పుడు, పరిశ్రాన్తేన = అలసిన, మత్తేన =మదములో కూడిన, మే భ్రాత్రా =నా సోదరుడైన, వాలినా =వాలిచేత, పురా =పూర్వము, ఆర్ద్రః =తడిగా ఉన్నది, సమాంసః =మాంసముతో కూడినది, ప్రత్యగ్రః =నూతనము అయిన, కాయః =శరీరము, క్షిప్తః =విసిరి వేయబడినది.

తా. మిత్రుడా! పూర్వము ఆనాడు నా సోదరుడైన వాలి బాగా అలసిపోయి, మత్తుడై ఉన్న సమయములో , మాంసముతో నిండి పచ్చిగా, క్రొత్తగా ఉన్న శరీరమును విసిరివేసినాడు. 87

మూ. లఘుః సంప్రతి నిర్మాంసస్తృణభూతశ్చ రాఘవ, 88
క్షిప్త ఏవం ప్రహర్షేణ భవతా రఘునన్దన.

ప్ర.అ. రఘునన్దన =రఘువంశీయులకు ఆనందము కలిగించువాడా! రాఘవ =రామా! సంప్రతి =ఇప్పుడు, లఘుః =తేలికయైనది, నిర్మాంసః =మాంసము లేనిది, తృణభూతశ్చ =గడ్డి వలె ఉన్నది అయిన, శరీరము, ప్రహర్షేణ =అధికమైన ఉత్సాహము గల, భవతా =నీచేత, ఏవమ్ =ఇట్లు, క్షిప్తః =విసిరివేయబడినది.

తా. రామా! నీ విప్పుడు విసిరివేసిన ఈ శరీరము మాంసము లేక తృణము వలె తేలిక యైపోయినది. నీ వీ సమయములో మంచి ఉత్సాహముతో కూడ ఉన్నావు. 88

మూ. నాత్ర శక్యం బలం జ్ఞాతుం తవ వా తస్య వాధికమ్, 89
ఆర్ద్రం శుష్కమితి హ్యేతత్సుమహద్రాఘవాన్తరమ్.

ప్ర.అ. అత్ర =ఈ విషయమునందు, తవ =నీయొక్క, బలమ్ = బలము, అధికం వా=అధికమా, తస్య వా =అతని బల మధికమా అని,జ్ఞాతుమ్ =తెలిసికొనుటకు, న శక్యమ్ =శక్యము కాదు. రాఘవ =రామా! ఆర్ద్రమ్ =పచ్చిగా ఉన్నది, శుష్కమితి = ఎండిపోయినది అని, ఏతత్ =ఇది, సుమహత్ =చాల గొప్పదైన, అన్తరం హి= =భేదము కదా.

తా. రామా! పచ్చిగా ఉండుట, ఎండిపోవుట అనే దానిలో చాల భేద మున్నది గాన దీనిని పట్టి ఆతని బలము అధికమా! నీ బలము అధికమా అని తెలిసికొనుటకు శక్యము కాదు. 89

మూ. స ఏవ సంశయస్తాత తవ తస్య చ యద్బలమ్, 90
సాలమేకం వినిర్భిద్య భవేద్వ్యక్తిర్బలాబలే.

ప్ర.అ. తాత =తండ్రీ! తవ =నీయొక్క, తస్య చ =వానియొక్క , యత్ =ఏ, బలమ్ =బలమున్నదో దాని విషయమున, స ఏవ = అదే, సంశయః =సంశయ మున్నది. ఏకమ్ =ఒక, సాలమ్ = సాలవృక్షమును, వినిర్భిద్య =భేదించి, బలాబలే= బలాబలములయందు, వ్యక్తిః =స్పష్టత్వము, భవేత్ =అగును.

తా. రామా! మీ ఇద్దరి బలాబలములను గూర్చి వెనుకటి సందేహమే నాకు కలుగుచున్నది. ఒక్క సాలవృక్షమును భేదించినచో మీ బలాబలములు స్పష్ట మగును. 90

మూ. కృత్వైతత్కార్ముకం సజ్యం హస్తిహస్త మివాపరమ్, 91
ఆకర్ణపూర్ణమాయమ్య విసృజస్వ మహాశరమ్.

ప్ర.అ. అపరమ్ =మరియొక్క, హస్తిహస్తమివ =ఏనుగు తొండము వలె ఉన్న, ఏతత్ =ఈ, కార్ముకమ్ =ధనస్సును, సజ్యమ్= నారితో కూడినదానినిగా, కృత్వా =చేసి, ఆకర్ణపూర్ణమ్ =కర్ణము పర్యంతము పూర్ణమైన దానినిగా, ఆయమ్య =లాగి, మహాశరమ్ = గొప్ప బాణమును, విసృజస్వ =విడువుము.

తా. మరొక ఏనుగు తొండము వలె ఉన్న ఈ ధనస్సుకు నారి కట్టి, చెవివరకు లాగి మహాశరమును ప్రయోగించుము. 91

మూ. ఇమం హి సాలం ప్రహిత స్త్వయా శరో
న సంశయోఽత్రాస్తి విదారయిష్యతి,
అలం విమర్శేన మమ ప్రియం ధ్రువం
కురుష్వ రాజన్ ప్రతిశాపితో మయా. 92

ప్ర.అ. రాజన్ =రాజా! త్వయా =నీచేత, ప్రహితః = ప్రయోగింపబడిన, శరః =బాణము, ఇమం సాలమ్ =ఈ మద్దిచెట్టును, విదారయిష్యతి =చీల్చివేయగలదు. అత్ర =ఈ విషయమున, సంశయః =సంశయము, నాస్తి =లేదు. విమర్శేన

=ఆలోచించుటచేత, అలమ్ =చాలును. ధ్రువమ్ =నిశ్చయముగా, మమ = నాకు, ప్రియమ్ =ప్రియమును, కురుష్వ=చేయుము. మయా =నాచేత, ప్రతిశాపితః =ఒట్టు పెట్టబడినావు.

తా. రాజా! నీవు ప్రయోగించిన బాణము తప్పక ఈ సాలవృక్షమును చీల్చివేయగలదు; సంశయము లేదు; ఆలోచించకుము. నాకు ప్రియమైన కార్యమును తప్పక చేయుము. నామీద ఒట్టు పెట్టి ప్రార్థించుచున్నాను. 92

మూ. యథా హి తేజస్సు పరః సదా రవి
ర్యథా హి శైలో హిమవాన్మహాద్రిషు,
యథా చతుష్పాత్సు చ కేసరీ వర
స్తథా నరాణామపి విక్రమే వరః. 93

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర.అ. తేజస్సు =తేజస్సులలో, రవిః= సూర్యుడు, యథా = ఎట్లు, వరః =శ్రేష్ఠుడో, మహాద్రిషు =మహాపర్వతములలో, హిమవాన్ శైలః = హిమవత్పర్వతము, యథా=ఎట్లు శ్రేష్ఠమో, చతుష్పాత్సు = నాలుగు పాదములు కల జంతువులలో, కేసరీ =సింహము, యథా = ఎట్లు, వరః =శ్రేష్ఠమో, తథా=అట్లు, నరాణామ్ = మనుష్యులలో, విక్రమే =పరాక్రమమునందు, వరః =శ్రేష్ఠుడవు, అపి =అయి ఉన్నావు.

తా. తేజస్సులలో సూర్యుడు ఎట్లు శ్రేష్ఠుడో, మహాపర్వతములలో హిమవత్పర్వతము ఎట్లు శ్రేష్ఠమో, నాలుగు పాదములు గల జంతువులలో సింహము ఎట్లు శ్రేష్ఠమో , నీవు కూడ, పరాక్రమముచేత, మనుష్యులలో శ్రేష్ఠుడవు. 93

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఏకాదశసర్గ సమాప్తము.

# అథ ద్వాదశః సర్గః

[రాముడు ఏడు సాలవృక్షములను భేదించుట, సుగ్రీవుడు కిష్కింధకు వెళ్ళి వాలిని యుద్ధానికి పిలచుట; యుద్ధములో ఓడిపోయి సుగ్రీవుడు మతంగవనమునకు పారిపోవుట, రాముడు అతనిని ఓదార్చి, అతని మెడలో గుర్తు కోసమై గజపుష్పమాలను కట్టించి, మరల అతనిని యుద్ధముకొరకు పంపుట.]

మూ. ఏతచ్చ వచనం శ్రుత్వా సుగ్రీవస్య సుభాషితమ్,
ప్రత్యయార్థం మహాతేజా రామో జగ్రాహ కార్ముకమ్. 1

ప్ర.అ. మహాతేజాః=గొప్పతేజస్సుగల, రామః = రాముడు, సుగ్రీవస్య =సుగ్రీవునియొక్క, సుభాషితమ్ =బాగుగా పలకబడిన, ఏతత్ =ఈ, వచనమ్ =వచనమును, శ్రుత్వా =విని, ప్రత్యయార్థమ్=అతనికి విశ్వాసము కొరకై, కార్ముకమ్ = ధనస్సును, జగ్రాహ =గ్రహించెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు, సుగ్రీవుడు చక్కగా పలికిన మాటలను విని, అతనికి నమ్మకము కలిగించుటకై ధనస్సును గ్రహించెను. 1

మూ. స గృహీత్వా ధనుర్ఘోరం శరమేకం చ మానదః,
సాలముద్దిశ్య చిక్షేప పూరయన్ జ్యారవైర్దిశః. 2

ప్ర.అ. మానదః =గౌరవమును ఇచ్చు, సః =ఆ రాముడు, ఘోరమ్ =భయంకరమైన, ధనుః =ధనస్సును, గృహీత్వా =గ్రహించి, జ్యారవైః =నారియొక్క ధ్వనులచేత, దిశః =దిక్కులను, పూరయన్ =నింపుచు, సాలమ్ =సాలవృక్షమును, ఉద్దిశ్య =ఉద్దేశించి, ఏకమ్ =ఒక, శరమ్ =ధనస్సును, చిక్షేప =ప్రయోగించెను.

తా. గౌరవమును సంరక్షించు ఆ రాముడు భయంకరమైన ధనస్సును గ్రహించి, నారి ధ్వనులతో దిక్కులను నింపుచు, ఒక బాణమును సాలవృక్షముపై ప్రయోగించెను. 2

మూ. స విసృష్టో బలవతా బాణః స్వర్ణపరిష్కృతః,
భిత్త్వా సాలాన్ గిరిప్రస్థం సప్త భూమిం వివేశ హ. 3

ప్ర.అ. బలవతా =బలము గల రాముని చేత, విసృష్టః =విడవబడిన, స్వర్ణపరిష్కృతః =బంగారముచేత పరిష్కరింపబడిన, సః బాణః =ఆ బాణము, సప్త =ఏడు, సాలాన్ =సాలవృక్షములను, గిరిప్రస్థమ్ =పర్వతముయొక్క చరియను, భిత్త్వా =భేదించి, భూమిమ్ = భూమిని, వివేశ హ =ప్రవేశించెను.

తా. మహాబలశాలి యైన రాముడు ప్రయోగించిన ఆ బాణము ఏడు సాలవృక్షములను, పర్వతపు చరియను భేదించి, భూమిలో ప్రవేశించెను. 3

మూ. సాయకస్తు ముహూర్తేన సాలాన్ భిత్త్వా మహాజవః,
నిష్పత్య చ పునస్తూణం తమేవ ప్రవివేశ హ. 4

ప్ర.అ. మహాజవః =గొప్ప వేగము గల, సాయకస్తు =బాణమైతే, ముహూర్తేన =ముహూర్తకాలములో, సాలాన్ =సాలవృక్షములను, భిత్త్వా =భేదించి, నిష్పత్య = బైటకువచ్చి, తమ్ = ఆ , తూణమేవ =అంబులపొదినే, పునః =మరల, ప్రవివేశ హ = ప్రవేశించెను.

తా. మహావేగము గల ఆ బాణము క్షణకాలములో ఆ సాలవృక్షములను భేదించి, పైకి వచ్చి, మరల ఆ అంబులపొదిలోనికే ప్రవేశించెను. 4

మూ. తాన్ దృష్ట్వా సప్త నిర్భిన్నాన్ సాలాన్వానరపుఙ్గవః,
రామస్య శరవేగేన విస్మయం పరమం గతః. 5

ప్ర.అ. వానరపుఙ్గవః= వానరశ్రేష్ఠుడు, నిర్భిన్నాన్=భేదింపబడిన, తాన్ =ఆ, సప్త=ఏడు, సాలాన్=సాలవృక్షములను, దృష్ట్వా= చూచి, రామస్య=రాముని యొక్క, శరవేగేన=బాణవేగముచేత, పరమమ్ =గొప్ప, విస్మయమ్=ఆశ్చర్యమును, గతః=పొందెను.

తా. సుగ్రీవుడు ఆ విధముగ భేదింపబడిన ఆ ఏడు సాలవృక్షములను చూచి రాముని శరవేగమునకు చాల ఆశ్చర్యపడెను. 5

మూ. స మూర్ధ్నా న్యపతద్భూమౌ ప్రలమ్బీకృతభూషణః,
సుగ్రీవః పరమప్రీతో రాఘవాయ కృతాఞ్జలిః. 6

ప్ర.అ. పరమప్రీతః=చాలా సంతోషించిన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, రాఘవాయ=రామునకు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలికలవాడై, ప్రలమ్బీకృత భూషణః=వ్రేలాడు నట్లు చేయబడిన అలంకారములు గలవాడై, మూర్ధ్నా=శిరస్సుతో, భూమౌ=భూమియందు, న్యపతత్= పడెను.

తా. చాలా సంతోషించిన ఆ సుగ్రీవుడు రామునకు అంజలి ఘటించి, హారాద్యలంకారములు వ్రేలాడు నట్లు శిరస్సు నేలకు తగులునట్లుగా వంగి నమస్కరించెను. 6

మూ. ఇదం చోవాచ ధర్మజ్ఞం కర్మణా తేన హర్షితః,
రామం సర్వాస్త్రవిదుషాం శ్రేష్ఠం శూరమవస్థితమ్. 7

ప్ర.అ. తేన=ఆ, కర్మణా=కర్మచేత, హర్షితః= సంతోషింపచేయబడిన ఆ సుగ్రీవుడు, ధర్మజ్ఞమ్=ధర్మము లెరిగినవాడు, సర్వాస్త్రవిదుషామ్=సకలాస్త్రములను

ఎరిగినవారిలో, శ్రేష్ఠమ్ =శ్రేష్ఠుడు, శూరమ్=శూరుడు, అవస్థితమ్=అక్కడ నిలిచి ఉన్నవాడూ అయిన, రామమ్=రాముని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ చ=పలికెను కూడ.

తా. రాముడు చేసిన ఆ పనికి సంతోషించిన సుగ్రీవుడు, ధర్మములు తెలిసినవాడు, అస్త్రవేత్త లందరిలో శ్రేష్ఠుడు, శూరుడూ అయిన, అక్కడ నిలచి యున్న రామునితో ఇట్లు పలికెను. 7

మూ. సేన్ద్రానపి సురాన్ సర్వాంస్త్వం బాణైః పురుషర్షభ,
సమర్థః సమరే హన్తుం కిం పున ర్వాలినం ప్రభో. 8

ప్ర.అ. పురుషర్షభ=పురుషులలో శ్రేష్ఠుడా! ప్రభో=ఓ! ప్రభూ! త్వమ్= నీవు, సమరే=యుద్ధమునందు, సేన్ద్రాన్=ఇంద్రునితో కూడిన, సర్వాన్ =సమస్తమైన, సురాన్ అపి=దేవతలను కూడ, హన్తుమ్ =చంపుటకు, సమర్థః=సమర్థుడవు. వాలినమ్=వాలిని, కిం పునః=చెప్పనేల?

తా. పురుషులలో శ్రేష్ఠుడ వైన రామా! నీవు బాణములచే, ఇంద్రునితో సహా, దేవతల నందరిని యుద్ధములో సంహరించుటకు సమర్థుడవు. వాలిమాట చెప్పవలెనా? 8

మూ. యేన సప్త మహాసాలా గిరిర్భూమిశ్చ దారితాః,
బాణేనైకేన కాకుత్స్థ స్థాతా తే కో రణాగ్రతః. 9

ప్ర.అ. కాకుత్స్థ=రామా! యేన=ఏ నీచేత, ఏకేన=ఒక్క, బాణేన =బాణముచేత, సప్త=ఏడు, మహాసాలాః=గొప్ప సాలవృక్షములు, గిరిః=పర్వతము, భూమిశ్చ=భూమీ కూడ, దారితాః =చీల్చివేయబడినవో, తే=అట్టి నీకు, రణాగ్రతః= రణాగ్రమునందు, కః=ఎవడు, స్థాతా=నిలవగలవాడు?

తా. రామా! నీవు ఒక్క బాణముచేత ఏడు మహాసాలవృక్షములను, పర్వతమును, భూమిని కూడ చీల్చివేసినావు. అట్టి నీముందు రణములో ఎవడు నిలబడగలడు? 9

మూ. అద్య మే విగతః శోకః ప్రీతిరద్య పరా మమ,
సుహృదం త్వాం సమాసాద్య మహేన్ద్రవరుణోపమమ్. 10

ప్ర.అ. అద్య=ఇప్పుడు, మహేన్ద్రవరుణోపమమ్=మహేంద్రునితోను వరుణుని తోను సమానుడవైన, త్వామ్=నిన్ను, సుహృదమ్= మిత్రునిగా, సమాసాద్య=పొంది, మే=నాయొక్క, శోకః= శోకము, విగతః=పోయినది. అద్య=ఇపుడు, మమ=నాకు, పరా =అత్యధికమైన, ప్రీతిః=సంతోషము కలిగినది.

తా. దేవేంద్రునితోను, వరుణునితోను సమానుడవైన నీవు ఈనాడు మిత్రుడుగా లభించుటచే నా శోకము పోయినది. అధికమైన ఆనందము

కలిగినది. 10

మూ. తమద్యైవ ప్రియార్థం మే వైరిణం భ్రాతృరూపిణమ్,
వాలినం జహి కాకుత్థ్స మయా బద్ధోఽయమఞ్జలిః. 11

ప్ర.అ. కాకుత్థ్స=రామా! మే=నాయొక్క, భ్రాతృరూపిణమ్= సోదరుని రూపము గల, వైరిణమ్=శత్రువైన, తం వాలినమ్=ఆ వాలిని, అద్యైవ=ఇప్పుడే, ప్రియార్థమ్=నాకు ప్రియము చేకూర్చుటకు, జహి=చంపుము. మయా=నాచేత, అయమ్=ఈ, అఞ్జలిః=దోసిలి, బద్ధః=కట్టబడినది.

తా. రామా! నేను దోసిలి కట్టి ప్రార్థించుచున్నాను. నా సోదరరూపములో ఉన్న శత్రువైన వాలిని, నాకు ప్రియము చేకూర్చుటకై ఇప్పుడే చంపివేయుము.

మూ. తతో రామః పరిష్వజ్య సుగ్రీవం ప్రియదర్శనమ్,
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో లక్ష్మణానుగతం వచః. 12

ప్ర.అ. తతః=అటుపిమ్మట, మహాప్రాజ్ఞః=. .. బుద్ధిగల, రామః= రాముడు, ప్రియదర్శనమ్=ప్రియమైన దర్శనము గలవాడు, లక్ష్మణానుగతమ్=లక్ష్మణునితో సమానుడు అయిన, సుగ్రీవమ్ =సుగ్రీవుని, పరిష్వజ్య=కౌగలించుకొని, వచః=వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. పిమ్మట గొప్ప బుద్ధిగల రాముడు చూచువారికి ఆనందమును కలిగించువాడు, స్నేహముచేత లక్ష్మణునితో సమానుడు అయిన ఆ సుగ్రీవుని కౌగలించుకొని ఈ విధముగ ప్రత్యుత్తర మిచ్చెను. 12

మూ. అస్మాద్గచ్ఛామ కిష్కిన్ధాం క్షిప్రం గచ్ఛ త్వమగ్రతః,
గత్వా చాహ్వాయ సుగ్రీవ వాలినం భ్రాతృగన్ధినమ్. 13

ప్ర.అ. సుగ్రీవ=సుగ్రీవుడా! క్షిప్రమ్=శీఘ్రముగా, కిష్కిన్ధామ్= కిష్కింధను గూర్చి, గచ్ఛామ=వెళ్లెదము. త్వమ్=నీవు, క్షిప్రమ్= శీఘ్రముగా, అగ్రతః=ముందు, గచ్ఛ=నడువుము. గత్వా= వెళ్లి, భ్రాతృగన్ధినమ్=సోదరుడనే గంధము (పేరు మాత్రము) గల, వాలినమ్ =వాలిని, ఆహ్వాయ=యుద్ధమునకు పిలువుము.

తా. సుగ్రీవా! ఇక్కడినుండి శీఘ్రముగా కిష్కింధకు వెళ్లెదము. నీవు ముందు నడువుము. నీవు వెళ్లి పేరుకు మాత్రము సోదరుడైన వాలిని యుద్ధానికై పిలువుము. 13

మూ. సర్వే తే త్వరితం గత్వా కిష్కిన్ధాం వాలినః పురీమ్,
వృక్షైరాత్మాన మావృత్య హ్యతిష్ఠన్ గహనే వనే. 14

ప్ర.అ. తే సర్వే=వారందరూ, వాలినః=వాలియొక్క, పురీమ్= పట్టణమైన, కిష్కిన్ధామ్=కిష్కింధను గూర్చి, త్వరితమ్=శీఘ్రముగా, గత్వా=వెళ్లి,

గహనే=దట్టమైన, వనే=వనమునందు, వృక్షైః= వృక్షములచేత, ఆత్మానమ్=తమను, ఆవృత్య=కప్పికొని, అతిష్ఠన్= ఉండిరి.

తా. వారందరు వాలి నగరమైన కిష్కింధకు శీఘ్రముగా వెళ్లి, దట్టమైన అడవిలో చెట్ల వెనుక దాగి ఉండిరి. 14

మూ. సుగ్రీవో వ్యనదద్ఘోరం వాలినో హ్వానకారణాత్,
గాఢం పరిహితో వేగాన్నాదైర్భిన్దన్నివామ్బరమ్. 15

ప్ర.అ. సుగ్రీవః=సుగ్రీవుడు, గాఢమ్=గట్టిగా, పరిహితః= వస్త్రమును బిగించినవాడై, వేగాత్=వేగమువలన, నాదైః= ధ్వనులచేత, అమ్బరమ్= ఆకాశమును, భిన్దన్నివ = బ్రద్దలుకొట్టుచున్నవాడువలె, వాలినః =వాలియొక్క, హ్వానకారణాత్ =పిలచుట అను కారణమువలన, ఘోరమ్=ఘోరముగా, వ్యనదత్=ధ్వనిచేసెను.

తా. సుగ్రీవుడు వస్త్రము గట్టిగా బిగించి, వేగముగా ధ్వనిచేత ఆకాశమును బ్రద్దలు కొట్టుచున్నాడా అన్నట్లు వాలిని యుద్ధమునకు పిలుచుచు ఘోరముగా ధ్వని చేసెను. 15

మూ. తం శ్రుత్వా నినదం భ్రాతుః క్రుద్ధో వాలీ మహాబలః,
నిష్పపాత సుసంరబ్ధో భాస్కరోఽస్తతటాదివ. 16

ప్ర.అ. మహాబలః=గొప్ప బలము గల, వాలీ=వాలి, భ్రాతుః= సోదరుని యొక్క, తం నినదమ్=ఆ ధ్వనిని, శ్రుత్వా=విని, క్రుద్ధః= కోపించినవాడై, సుసంరబ్ధః=చాల తొందరతో కూడినవాడై, అస్తతటాత్= అస్తాద్రితటము నుండి, భాస్కరః యథా=సూర్యుడువలె, నిష్పపాత= బైటకు వచ్చెను.

తా. మహాబలశాలియైన వాలి, సోదరుడైన సుగ్రీవుడు చేయుచున్న ఆ ధ్వనిని విని, చాల కోపించి, అస్తాద్రితటమునుండి సూర్యుడు వలె, చాల తొందరగా బైటకు వచ్చెను.

వి. సూర్యుడు అస్తాద్రినుండి బైటకు వచ్చినట్లు అనే ఉపమానము బాగా లేదు. అస్తాద్రి చేరిన సూర్యుడు క్రిందికే పోవును గాని పైకి ఎట్లు వచ్చును? వాలి మరణించనున్నాడు గాన అట్టి ఉపమానము చెప్పబడిన దని కొందరి సమర్థనము కూడ యుక్తము కాదు. అభిప్రాయం ఏదైనా ఉపమానం కుదురుట లేదు కదా? మొదట బైటకు వచ్చినపుడు వాలి మరణించలేదు కూడ. అందుచేత తోయదాదివ భాస్కరః "(మేఘమునుండి సూర్యుడు వలె) అను ప్రాచ్యపాఠములోని ఉపమానము బాగున్నది. 16

మూ. తతః సుతుములం యుద్ధం వాలిసుగ్రీవయోరభూత్,
గగనే గ్రహయోర్ఘోరం బుధాఙ్గారకయోరివ. 17

ప్ర.అ. తతః=అటుపిమ్మట, వాలిసుగ్రీవయోః=వాలిసుగ్రీవులకు, గగనే

=ఆకాశమునందు, బుధాఙ్గారకయోః=బుధుడు అంగారకుడు అను, గ్రహయో రివ=గ్రహములకు వలె, సుతుములమ్=చాల తీవ్రమైన, యుద్ధమ్=యుద్ధము, అభూత్=ఆయెను.

తా. పిమ్మట, ఆకాశమునందు బుధాంగారకగ్రహముల మధ్య జరిగి నట్లు వాలిసుగ్రీవుల మధ్య చాల తీవ్రమైన యుద్ధము జరిగెను. 17

మూ. తలైరశనికల్పైశ్చ వజ్రకల్పైశ్చ ముష్టిభిః,
జఘ్నతుః సమరేఽన్యోన్యం భ్రాతరౌ క్రోధమూర్ఛితౌ. 18

ప్ర.అ. క్రోధమూర్ఛితౌ=క్రోధముతో నిండిన, భ్రాతరౌ=ఆ సోదరులు, అశనికల్పైః=పిడుగులతో సమానములైన, తలైః=అరచేతి దెబ్బలతోను, వజ్ర కల్పైః=వజ్రముతో సమానమైన, ముష్టిభిః= గ్రుద్దులతోను, సమరే=యుద్ధమునందు, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నతుః=కొట్టుకొనిరి.

తా. క్రోధముతో నిండిన ఆ సోదరు లిద్దరూ పిడుగుల వంటి అరచేతి చరుపుల తోను, వజ్రాయుధము దెబ్బ వంటి గ్రుద్దులతోను ఒకరినొకరు కొట్టిరి.

మూ. తతో రామో ధనుష్పాణిస్తావుభౌ సముదైక్షత,
అన్యోన్యసదృశౌ వీరావుభౌ దేవావివాశ్వినౌ. 19

ప్ర.అ తతః=అటు పిమ్మట, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు గల, రామః=రాముడు, దేవౌ=దేవతలైన, అశ్వినౌ ఇవ=అశ్వినుల వలె, అన్యోన్యస దృశౌ=పరస్పరము సమానులుగా ఉన్న, తౌ= ఆ, ఉభౌ=ఇద్దరు, వీరౌ=వీరులను, సముదైక్షత=చూచెను.

తా. పిమ్మట ధనస్సు చేతిలో ధరించిన రాముడు ఆ అన్నదమ్ము లిద్దరూ, అశ్వినీదేవతల వలె పరస్పరము పోలిక గలిగి ఉన్నట్లు చూచెను. 19

మూ. యన్నావగచ్ఛత్సుగ్రీవం వాలినం వాపి రాఘవః,
తతో న కృతవాన్ బుద్ధిం మోక్తుమన్తకరం శరమ్. 20

ప్ర.అ. రాఘవః=రాముడు, సుగ్రీవమ్ =సుగ్రీవుని, వాలినం వాపి= వాలినీ, యత్ =ఏ కారణమువలన, నావగచ్ఛత్ =తెలిసికొన లేదో, తతః =అందువలన, అన్తకరమ్= మరణమును కలిగించే, శరమ్ = బాణమును, మోక్తుమ్=విడచుటకు, బుద్ధిమ్ =బుద్ధిని, న కృతవాన్ =చేయలేదు.

తా. వారిలో సుగ్రీవు డెవరో వాలి యెవరో గుర్తించలేక పోవుటచేత రాముడు, ప్రాణాంతకరమైన బాణమును ప్రయోగించుటకు ఇష్టపడలేదు. 20

మూ. ఏతస్మిన్నన్తరే భగ్నః సుగ్రీవస్తేన వాలినా,
అపశ్యన్ రాఘవం నాథమృష్యమూకం ప్రదుద్రువే. 21

ప్ర.అ. ఏతస్మిన్ అంతరే = ఈ మధ్యలో, తేన వాలినా =ఆ వాలిచేత, భగ్నః =ఓడింపబడినవాడై, సుగ్రీవః =సుగ్రీవుడు, నాథమ్ = రక్షకుడైన, రాఘవమ్ =రాముని, అపశ్యన్=చూడనివాడై, ఋష్యమూకమ్ =ఋష్యమూకపర్వతమును గూర్చి, ప్రదుద్రువే = పారిపోయెను.

తా. ఇంతలో సుగ్రీవుడు ఆ వాలి చేతిలో ఓడిపోయి, తనను రక్షించుటకు వచ్చిన రాముడు కనబడకపోవుటచే ఋష్యమూకపర్వతమునకు పారిపోయెను. 21

మూ. క్లాన్తో రుధిరసిక్తాఙ్గః ప్రహారైర్జర్జరీకృతః,
వాలినాభిద్రుతః క్రోధాత్ ప్రవివేశ మహావనమ్. 22

ప్ర.అ. వాలినా=వాలిచేత, క్రోధాత్=కోపమువలన, అభిద్రుతః=ఎదిరింపబడినవాడై, క్లాన్తః=అలసిపోయినవాడు, రుధిరసిక్తాఙ్గః=రక్తముచేత తడపబడిన శరీరము కలవాడు, ప్రహారైః= దెబ్బలచేత, జర్జరీకృతః=శిథిలముగా చేయబడినవాడు అయిన ఆ సుగ్రీవుడు, మహావనమ్=మహావనమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. వాలి కోపముతో ఎదుర్కొని యుద్ధము చేయగా సుగ్రీవుడు అలసిపోయెను. శరీర మంతా రక్తముతో తడిసిపోయెను. దెబ్బలకు ఆతని శరీరము శిథిలమై పోయెను. ఇట్టి స్థితిలో ఆ సుగ్రీవుడు మహావనములోనికి ప్రవేశించెను. 22

మూ. తం ప్రవిష్టం వనం దృష్ట్వా వాలీ శాపభయాత్తతః,
ముక్తో హ్యసి త్వ మిత్యుక్త్వా స నివృత్తో మహాబలః. 23

ప్ర.అ. వనమ్=వనమును, ప్రవిష్టమ్=ప్రవేశించిన,తమ్=ఆ సుగ్రీవుని, దృష్ట్వా=చూచి, మహాబలః=గొప్ప బలము గల, సః వాలీ=ఆ వాలి, త్వమ్=నీవు, ముక్తః అసి హి=విడవబడితివి కదా, ఇతి=అని, ఉక్త్వా=పలికి, శాపభయాత్= శాపభయమువలన, తతః=అక్కడినుండి, నివృత్తః=మరలిపోయినాడు.

తా. మహాబలశాలి యైన వాలి అరణ్యములో ప్రవేశించిన ఆ సుగ్రీవుని చూచి, "ఇప్పుడు విడువబడితివిలే"అని పలుకుచు, శాపభయమువలన, అక్కడినుండియే తిరిగి వెళ్లిపోయెను. 23

మూ. రాఘవోఽపి సహ భ్రాత్రా సహ చైవ హనూమతా,
తదేవ వనమాగచ్ఛత్సుగ్రీవో యత్ర వానరః. 24

ప్ర అ. రాఘవోఽపి=రాముడు కూడ, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, హనూమతా చ సహ=హనుమంతునితో కూడ, వానరః= వానరుడైన, సుగ్రీవః= సుగ్రీవుడు, యత్ర=ఎక్కడ ఉండెనో, తత్=ఆ, వనమేవ=వనమునే గూర్చి, ఆగచ్ఛత్=వచ్చెను.

తా. రాముడు కూడ సోదరునితోను, హనుమంతునితోను కలిసి, వానరుడైన సుగ్రీవుడు ఉన్న వనమునకే వచ్చెను. 24

మూ. తం సమీక్ష్యాగతం రామం సుగ్రీవః సహలక్ష్మణమ్,
హ్రీమాన్ దీనమువాచేదం వసుధామవలోకయన్ . 25

ప్ర.అ.సుగ్రీవః=సుగ్రీవుడు, అగతమ్=వచ్చిన, సహలక్ష్మణమ్= లక్ష్మణునితో కూడిన, తం రామమ్=ఆ రాముని, దృష్ట్వా=చూచి, హ్రీమాన్=సిగ్గు గలవాడై, వసుధామ్=భూమిని, అవలోకయన్= చూచుచు, దీనమ్=దీనముగా, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ= పలికెను.

తా. సుగ్రీవుడు, లక్ష్మణసహితుడై వచ్చిన రాముని చూచి, సిగ్గుపడుచు, నేలవైపు చూచుచు, దీనముగా ఇట్లు పలికెను. 25

మూ. ఆహ్వాయస్వేతి మాముక్త్వా దర్శయిత్వా చ విక్రమమ్,
వైరిణా ఘాతయిత్వా చ కిమిదానీం త్వయా కృతమ్. 26

ప్ర.అ. ఆహ్వాయస్వ=యుద్ధానికి పిలువుము, ఇతి=అని, మామ్= నన్ను గూర్చి, ఉక్త్వా=పలికి, విక్రమమ్=పరాక్రమమును, దర్శయిత్వా=చూపి, వైరిణా=శత్రువుచేత, ఘాతయిత్వా= కొట్టించి, త్వయా=నీచేత, ఇదానీమ్=ఇప్పుడు, కిం కృతమ్= ఏమి చేయబడినది!

తా. శత్రువును యుద్ధానికి పిలువుము అని చెప్పి, పరాక్రమము చూపి నమ్మకము కలిగించి, నన్ను శత్రువుచేత కొట్టించినావు! నీ విట్లు ఎందుకు చేసినావు? 26

మూ. తామేవ వేలాం వక్తవ్యం త్వయా రాఘవ తత్త్వతః,
వాలినం న నిహన్మీతి తతో నాహమితో వ్రజే. 27

ప్ర.అ. రాఘవ=రామా! తాం వేలామేవ=ఆ సమయమునందే, త్వయా= నీచేత, వాలినమ్=వాలిని, న నిహన్మి=చంపను, ఇతి=అని, తత్త్వతః=యథార్థముగా, వక్తవ్యమ్=చెప్పదగినది. తతః= అటుపిమ్మట, అహమ్=నేను, ఇతః=ఇక్కడినుండి, న వ్రజే= వెళ్లి ఉండెడివాడను కాను.

తా. రామా! "నేను వాలిని చంపను" అని నీవు అప్పుడే నాతో యథార్థముగా చెప్పి ఉన్నచో నేను ఇక్కడినుండి వెళ్ళేవాడను గాను కదా?

మూ. తస్య చైవం బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
కరుణం దీనయా వాచా రాఘవః పున రబ్రవీత్ . 28

ప్ర.అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య సుగ్రీవస్య=ఆ సుగ్రీవుడు, దీనయా= దీనమైన, వాచా=వాక్కుతో, కరుణమ్=జాలిగా, ఏవమ్= ఇట్లు, బ్రువాణస్య=పలు

కుచుండగా, రాఘవః=రాముడు, పునః= మరల, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ముడైన ఆ సుగ్రీవుడు దీనమైన వాక్యముతో, జాలి కలుగునట్లు ఇట్లు పలుకగా విని రాముడు ఇట్లు అనెను. 28

మూ. సుగ్రీవ శ్రూయతాం తాత క్రోధశ్చ వ్యపనీయతామ్,
కారణం యేన బాణోఽయం స మయా న విసర్జితః. 29

ప్ర.అ. తాత=తండ్రీ! సుగ్రీవ=సుగ్రీవుడా! యేన=ఏ కారణముచేత, సః అయమ్=అట్టి ఈ, బాణః=బాణము, మయా=నాచేత, న విసర్జితః=విడువబడలేదో, కారణమ్=కారణము, శ్రూయతామ్= వినబడుగాక. క్రోధః=కోపము, వ్యపనీయతాం చ=తొలగింపబడుగాక.

తా. నాయనా! సుగ్రీవా! నేను ఏ కారణముచేత ఈ బాణమును ప్రయోగించలేదో వినుము. కోపమును విడిచిపెట్టుము. 29

మూ. అలంకారేణ వేషేణ ప్రమాణేన గతేన చ,
త్వం చ వాలీ చ సుగ్రీవ సదృశౌ స్థః పరస్పరమ్. 30

ప్ర.అ. సుగ్రీవ=సుగ్రీవుడా! అలంకారేణ=అలంకారముచేతను, వేషేణ=వేషముచేతను, ప్రమాణేన=ప్రమాణముచేతను, గతేన చ= నడకచేతను, త్వం చ=నీవు, వాలీ చ=వాలీ, పరస్పరమ్= పరస్పరము, సదృశౌ=సమానులుగా, స్థః=ఉన్నారు.

తా. సుగ్రీవుడా! అలంకారములోను, వేషములోను, ప్రమాణము (లావు పొడవుల) లోను నీవూ వాలీ కూడ ఒకే విధముగా ఉన్నారు. 30

మూ. స్వరేణ వర్చసా చైవ ప్రేక్షితేన చ వానర,
విక్రమేణ చ వాక్యైశ్చ వ్యక్తిం వాం నోపలక్షయే. 31

ప్ర.అ. వానర=సుగ్రీవుడా! స్వరేణ=కంఠస్వరముచేత, వర్చసా చైవ= తేజస్సుచేత, ప్రేక్షితేన=చూపుచేత, విక్రమేణ చ=పరాక్రమము చేత, వాక్యైశ్చ=వాక్యములచేత, వామ్=మీయొక్క, వ్యక్తిమ్= భేదమును, నోపలక్షయే=చూడను.

తా. సుగ్రీవుడా! కంఠస్వరములో గాని, తేజస్సులో గాని, చూపులో గాని, పరాక్రమములో గాని, మాటలలో గాని మీ ఇద్దరికీ భేద మేమీ నాకు కనబడలేదు.

మూ. తతోఽహం రూపసాదృశ్యాన్మోహితో వానరోత్తమ,
నోత్సృజామి మహావేగం శరం శత్రునిబర్హణమ్. 32

ప్ర.అ. వానరోత్తమ=వానరశ్రేష్ఠుడా! తతః=ఆ కారణమువలన, రూపసాదృశ్యాత్=రూపముయొక్క సామ్యమువలన, మోహితః= మోహింపబడిన, అహమ్=నేను, మహావేగమ్=గొప్పవేగము గలది, శత్రునిబర్హణమ్=శత్రువులను చంపేదీ అయిన,

శరమ్=బాణమును, నోత్సృజామి=విడవలేదు.

తా. వానరశ్రేష్ఠుడా! మీ రూపములు ఒకే విధముగా ఉండుటవలన భ్రాంతి చెందిన నేను, మహావేగము గల, శత్రుసంహారక మైన బాణమును విడువలేదు. 32

మూ. జీవితాన్తకరం ఘోరం సాదృశ్యాత్తు విశఙ్కితః,
మూలఘాతో న నౌ స్యాద్ధి ద్వయోరితి కృతో మయా. 33

ప్ర.అ. సాదృశ్యాత్=సాదృశ్యమువలన, విశఙ్కితః=శంకితుడనై, జీవితాన్తకరమ్=జీవితమునకు అంతమును చేయు, ఘోరమ్= భయంకరమైన బాణమును (విడువలేదు). నౌ=మనకు, ద్వయోః= ఇద్దరికీ, మూలఘాతః=మూలఘాతము, స్యాద్ధి=అగును కదా. అందుచేత, మయా=నాచేత, న కృతః= చేయబడలేదు.

తా. మీ పోలికవలన శంకించినవాడనై ప్రాణాంతకమైన భయంకరమైన బాణమును విడువలేదు. మన కిద్దరకీ సమూలముగా వినాశము కలుగు నని నేను అట్లు చేయలేదు. 33

మూ. త్వయి వీర విపన్నే హి అజ్ఞానాల్లాఘవాన్మయా,
మౌఢ్యం చ మమ బాల్యం చ ఖ్యాపితం స్యాత్కపీశ్వర. 34

ప్ర.అ. వీర=వీరుడా! కపీశ్వర=వానరప్రభువైన సుగ్రీవుడా! అజ్ఞానాత్=నా అజ్ఞానమువల్ల, లాఘవాత్=నా తేలికబుద్ధివల్ల, త్వయి= నీవు, విపన్నే=ఆపద చెందినవాడ వగుచుండగా, మయా=నాచేత, మమ =నాయొక్క, మౌఢ్యం చ=మూఢత్వము, బాల్యం చ= అజ్ఞానము, ఖ్యాపితమ్=ప్రసిద్ధము చేయబడినది, స్యాత్=అగును.

తా. వీరుడవైన సుగ్రీవుడా! నా అజ్ఞానమువల్లా, తేలిక బుద్ధివల్లా నీవు ఆపద చెందినచో నేను నా మూఢత్వమును, అజ్ఞానమును చాటుకొన్నవాడ నగుదును. 34

మూ. దత్తాభయవధో నామ పాతకం మహదుచ్యతే.
అహం చ లక్ష్మణశ్చైవ సీతా చ వరవర్ణినీ, 35
త్వదధీనా వయం సర్వే వనేఽస్మిన్ శరణం భవాన్.

ప్ర.అ. దత్తాభయవధో నామ=ఇవ్వబడిన అభయము గలవాని వధ అనగా, మహత్=గొప్ప, పాతకమ్=పాపముగా, ఉచ్యతే= చెప్పబడుచున్నది. అహం చ=నేను, లక్ష్మణశ్చైవ=లక్ష్మణుడు, వరవర్ణినీ=ఉత్తమమైన శరీరచ్ఛాయ గల, సీతా చ=సీత, వయం సర్వే=మే మందరమూ, త్వదధీనాః=నీ అధీనులము. అస్మిన్=ఈ, వనే=వనమునందు, భవాన్=నీవు, శరణమ్=రక్షకుడవు.

తా. అభయ మిచ్చినవారిని చంపుట మహాపాతకము. నేను, లక్ష్మణుడు, ఉత్తమమైన శరీరకాంతి గల సీత, మేమందరమూ నీ అధీనులము. ఈ అరణ్యములో నీవే మాకు రక్షకుడవు. 35

మూ. తస్మాద్యుధ్యస్వ భూయస్త్వం మా మా శఙ్కీశ్చ వానర. 36
ఏతన్ముహూర్తే తు మయా పశ్య వాలినమాహవే,
నిరస్తమిషుణైకేన చేష్టమానం మహీతలే. 37

ప్ర.అ. వానర=సుగ్రీవుడా! తస్మాత్=ఆ కారణమువలన, త్వమ్=నీవు, భూయః=మరల, యుధ్యస్వ=యుద్ధముచేయుము. మా= నన్ను, మా శఙ్కీశ్చ=శంకించకుము. ఏతన్ముహూర్తే= ఈ ముహూర్తమునందే, మయా=నా చేత, ఆహవే=యుద్ధమునందు, ఏకేన=ఒక, బాణేన=బాణముచేత, నిరస్తమ్=ఎగురగొట్టబడినవాడు, మహీతలే=నేలమీద, చేష్టమానమ్= దొర్లుచున్నవాడు అయిన, వాలినమ్=వాలిని, పశ్య=చూడుము.

తా. సుగ్రీవుడా! ఆ కారణమువలన నీవు మరల యుద్ధము చేయుము. నా విషయమునందు శంకించకుము. నేనిప్పుడే యుద్ధములో ఒక్క బాణముచేత వాలిని పడగొట్టెదను. ఆతడు నేలమీద దొర్లుచుండగా నీవు చూడగలవు.

మూ. అభిజ్ఞానం కురుష్వ త్వమాత్మనో వానరేశ్వర,
యేన త్వామభిజానీయాం ద్వన్ద్వయుద్ధముపాగతమ్. 38

ప్ర.అ. వానరేశ్వర=ఓ! వానరరాజా! ద్వన్ద్వయుద్ధమ్= ద్వంద్వయుద్ధమును, ఉపాగతమ్=పొందిన, త్వామ్=నిన్ను, యేన=దేనిచేత, అభిజానీయామ్=గుర్తింతునో అట్టి, అభిజ్ఞానమ్=ఆనవాలును, ఆత్మనః=నీకు, కురుష్వ= చేయుము.

తా. సుగ్రీవుడా! నీవు ద్వంద్వయుద్ధము చేయుచున్నప్పుడు నేను నిన్ను గుర్తించుటకు వీలుగా ఏదైన ఒక ఆనవాలును ధరించుము. 38

మూ. గజపుష్పీమిమాం ఫుల్లాముత్పాట్య శుభలక్షణామ్,
కురు లక్ష్మణ కణ్ఠేఽస్య సుగ్రీవస్య మహాత్మనః. 39

ప్ర.అ. లక్ష్మణ=లక్ష్మణా! ఇమామ్=ఈ, ఫుల్లామ్=వికసించిన, శుభలక్షణామ్=అందమైన లక్షణము గల, గజపుష్పీమ్= గజపుష్పలతను, ఉత్పాట్య=పెకిలించి, మహాత్మనః=మహాత్ముడైన, అస్య సుగ్రీవస్య=ఈ సుగ్రీవునియొక్క, కణ్ఠే=కంఠమునందు, కురు=చేయుము.

తా. లక్ష్మణా! అందమైన ఆకారము గల ఈ వికసించిన గజపుష్పలతను పెకిలించి, మహాత్ముడైన ఈ సుగ్రీవుని కంఠమునందు కట్టుము. 39

మూ. తతో గిరితటే జాతాముత్పాట్య కుసుమాయుతామ్,
లక్ష్మణో గజపుష్పీం తాం తస్య కణ్ఠే వ్యసర్జయత్. 40

ప్ర.అ. తతః=అటుపిమ్మట, లక్ష్మణః=లక్ష్మణుడు, గిరితటే= పర్వత తటమునందు, జాతామ్=పుట్టిన, కుసుమాయుతామ్= పుష్పములలో నిండిన, తాం గజపుష్పీమ్=ఆ గజపుష్పలతను, ఉత్పాట్య= పీకి, తస్య=ఆతనియొక్క, కణ్ఠే=కంఠమునందు, వ్యసర్జయత్=విడచెను.

తా. పిమ్మట లక్ష్మణుడు ఆ పర్వతము చరియమీద మొలచిన, పుష్పములతో నిండిన గజపుష్పీలతను పెరికి, సుగ్రీవుని కంఠమునందు కట్టెను.

మూ. స తయా శుశుభే శ్రీమాన్లతయా కణ్ఠసక్తయా,
మాలయేవ బలాకానాం ససంధ్య ఇవ తోయదః. 41

ప్ర.అ. శ్రీమాన్=శోభ గల, సః=ఆ సుగ్రీవుడు, కణ్ఠసక్తయా= కంఠము నందు లగ్నమైన, తయా మాలయా=ఆ మాలచేత, ససన్ధ్యః= సంధ్యతో కూడిన, తోయదః=మేఘము, బలాకానామ్=కొంగలయొక్క, మాలయేవ=పంక్తిచేత వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. ఆ మాలను కంఠమునందు వేయగా శ్రీమంతుడైన సుగ్రీవుడు సంధ్యాకాలమునందు ఎట్లుగా ఉన్న మేఘము కొంగల పంక్తిచేత ప్రకాశించి నట్లు ప్రకాశించెను. 41

మూ. విభ్రాజమానో వపుషా రామవాక్యసమాహితః,
జగామ సహ రామేణ కిష్కిన్ధాం పునరాప సః. 42

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్వాదశః సర్గః.

ప్ర.అ. వపుషా=శరీరముతో, విభ్రాజమానః=ప్రకాశించుచున్న, సః= ఆ సుగ్రీవుడు, రామవాక్యసమాహితః=రాముని వాక్యముచేత సమాధానపరచబడి నవాడై, రామేణ సహ=రామునితో కూడ, జగామ= వెళ్లెను. పునః=మరల, కిష్కిన్ధామ్=కిష్కింధను, ఆప= పొందెను.

తా. సుగ్రీవుడు మాలచే తన శరీరము శోభిల్లగా, రాముని వాక్యముచే సమాధానపడి, రామునితో తిరిగి కిష్కింధకు పోయెను. 42

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యయందు కిష్కింధాకాండలో పండ్రెండవసర్గ సమాప్తము.

## అథ త్రయోదశః సర్గః

[మార్గములో అనేకవృక్షములను, సరస్సులను, సప్తజనాశ్రమమును చూచుచు శ్రీరామాదులు కిష్కింధ చేరుట]

మూ. ఋష్యమూకాత్స ధర్మాత్మా కిష్కిన్ధాం లక్ష్మణాగ్రజః,
జగామ సహసుగ్రీవో వాలివిక్రమపాలితామ్. 1

ప్ర.అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః=ఆ, లక్ష్మణాగ్రజః= రాముడు, సహసుగ్రీవః=సుగ్రీవునితో కూడినవాడై, ఋష్యమూకాత్= ఋష్యమూకపర్వతము నుండి, వాలివిక్రమపాలితామ్=వాలియొక్క పరాక్రమముచేత పాలింపబడిన, కిష్కిన్ధామ్=కిష్కింధను గూర్చి, జగామ= వెళ్లెను.

తా. ధర్మాత్ముడైన రాముడు సుగ్రీవసమేతుడై ఋష్యమూక పర్వతమునుండి బయలుదేరి, వాలి పరాక్రమముచే పాలింపబడిన కిష్కింధకు వెళ్లెను. 1

మూ. సముద్యమ్య మహచ్చాపం రామః కాఞ్చనభూషితమ్,
శరాంశ్చాదిత్యసంకాశాన్ గృహీత్వా రణసాధకాన్. 2

ప్ర.అ. రామః=రాముడు, కాఞ్చనభూషితమ్=బంగారముచేత అలంకరించబడిన, మహత్=పెద్దదైన, చాపమ్=ధనస్సును, ఆదిత్యసంకాశాన్=సూర్యునితో సమానమైన, రణసాధకాన్=రణములో జయమును సాధించు, సాయకాన్=బాణములను, గృహీత్వా=గ్రహించి, వెళ్లెను.

తా.రాముడు బంగారముచేత అలంకరించిన గొప్ప ధనస్సును, సూర్యునితో సమానములైనవి, యుద్ధములో జయమును సాధించేవీ అయిన బాణాలను ధరించి వెళ్లెను. 2

మూ. అగ్రతస్తు యయౌ తస్య రాఘవస్య మహాత్మనః,
సుగ్రీవః సంహతగ్రీవో లక్ష్మణశ్చ మహాబలః. 3

ప్ర.అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య రాఘవస్య=ఆ రామునియొక్క, అగ్రతః=ఎదట, సంహతగ్రీవః=దృఢమైన కంఠము గల, సుగ్రీవః= సుగ్రీవుడు, మహాబలః=గొప్ప బలము గల, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, యయౌ=వెళ్లెను.

తా. మహాత్ముడైన ఆ రాముని ఎదుట దృఢమైన కంఠము గల సుగ్రీవుడు, మహాబలశాలియైన లక్ష్మణుడు వెళ్లిరి. 3

మూ. పృష్ఠతో హనుమాన్ వీరో నలో నీలశ్చ వీర్యవాన్,
తారశ్చైవ మహాతేజా హరియూథపయూథపః. 4

ప్ర.అ. పృష్ఠతః=వెనక, వీరః=వీరుడైన, హనుమాన్= హనుమంతుడు, నలః=నలుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, నీలశ్చ=నీలుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, హరియూథపయూథపః=వానరసేనానాయకుల గణమునకు నాయకుడైన, తారశ్చైవ =తారుడు(వెళ్లిరి).

తా. రాముని వెనుక వీరుడైన హనుమంతుడు, నలుడు, పరాక్రమవంతుడైన నీలుడు, గొప్ప తేజస్సు కలవాడు, వానరసేనానాయకుల గణమునకు అధిపతియైన తారుడు వెళ్లిరి. 4

మూ. తే వీక్షమాణా వృక్షాంశ్చ పుష్పభారావలమ్బినః,
ప్రసన్నామ్బువహాశ్చైవ సరితః సాగరంగమాః. 5

ప్ర.అ. తే=వారు, పుష్పభారావలమ్బినః=పుష్పముల భారముచేత వ్రేలాడుచున్న, వృక్షాంశ్చ=వృక్షములను, ప్రసన్నామ్బువహాః= ప్రసన్నమైన ఉదకమును ప్రవహించే, సాగరంగమాః=సముద్రములోనికి వెళ్లు, సరితః=నదులను (చూచుచు వెళ్లిరి).

తా. వారందరూ పుష్పముల భారముతో వంగిన వృక్షములను, నిర్మలమైన ఉదకము ప్రవహించేవి, సముద్రములోనికి వెళ్లేవి అయిన నదులను చూచుచు వెళ్లిరి. 5

మూ. కన్దరాణి చ శైలాంశ్చ నిర్దరాణి గుహాస్తథా,
శిఖరాణి చ ముఖ్యాని దరీశ్చ ప్రియదర్శనాః. 6

ప్ర.అ. కన్దరాణి=చిన్న గుహలను, శైలాంశ్చ=పర్వతములను, నిర్దరాణి=నెరియలను, తథా=మరియు, గుహాః=పెద్దగుహలను, ముఖ్యాని=ముఖ్యములైన, శిఖరాణి=శిఖరములను, ప్రియదర్శనాః=ప్రియమైన దర్శనము గల, దరీశ్చ=లోయలను (చూచుచు వెళ్లిరి).

తా. వారు చిన్న గుహలను, పెద్ద గుహలను, పర్వతములను, నెరియలను, ఎత్తైన శిఖరములను, చూచుటకు అందమైన లోయలను చూచుచు వెళ్లిరి. 6

మూ. వైదూర్యవిమలైస్తోయైః పద్మైశ్చాకోశకుడ్మలైః,
శోభితాన్సజలాన్మార్గే తటాకాంశ్చావలోకయన్. 7

ప్ర.అ.మార్గే=మార్గమునందు, వైదూర్యవిమలైః=వైదూర్యమణులవలె నిర్మలములైన, తోయైః=ఉదకములతోను, అకోశకుడ్మలైః=పెద్ద మొగ్గలు గాని చిన్న మొగ్గలు గాని లేని, (లేదా-ఆకోశకుడ్మలైః= అగ్రభాగమువరకు మొగ్గలు గల)

పద్మైశ్చ=పద్మములచేతను, శోభితాన్=ప్రకాశింపచేయబడిన, సజలాన్=జలముతో నిండిన, తటాకాన్=చెరువులను, అవలోకయన్=చూచిరి.

తా. మార్గమధ్యమునందు వారికి వైదూర్యమణుల వలె నిర్మలముగా ఉన్న ఉదకములతోను, చిన్న మొగ్గలు గాని పెద్ద మొగ్గలు గాని లేక వికసించిన పద్మములతోను ప్రకాశించుచున్న జలపూర్ణములైన సరస్సులు కనబడెను. 7

మూ. కారణ్డైః సారసైర్హంసైర్వఞ్జులైర్జలకుక్కుటైః,
చక్రవాకై స్తథా చాన్యైః శకునైః ప్రతినాదితాన్. 8

ప్ర.అ. కారణ్డైః=కారండపక్షులచేతను, సారసైః=సారసపక్షులచేతను , హంసైః=హంసలచేతను, వఞ్జులైః=వంజులపక్షులచేతను, జలకుక్కుటైః=నీటికోళ్ల చేతను, చక్రవాకైః=చక్రవాకపక్షులచేతను, తథా=మరియు, అన్యైః=ఇతరములైన, శకునైః=పక్షులచేతను, ప్రతినాదితాన్=ప్రతిధ్వనింపచేయబడిన, సరస్సులను చూచిరి.

తా. ఆ సరస్సులు కారండవములు, సారసములు, హంసలు, వంజులములు, నీటికోళ్లు, చక్రవాకములు మొదలైన పక్షులధ్వనులతో మారుమ్రోగుచుండెను. 8

మూ. మృదుశష్పాఙ్కురాహారాన్నిర్భయాన్వనచారిణః,
చరతః సర్వతోఽపశ్యన్ స్థలీషు హరిణాన్ స్థితాన్. 9

ప్ర.అ. మృదుశష్పాఙ్కురాహారాన్=మృదువైన లేత గడ్డియొక్క అంకురములు ఆహారముగా గలవి, నిర్భయాన్=భయము లేనివి, వనచారిణః= వనమునందు సంచరించుచున్నవి, స్థలీషు=వనప్రదేశములందు, సర్వతః= అన్ని చోట్ల, చరతః=మేయుచున్నవి, స్థితాన్= నిలచినవి అయిన, హరిణాన్=లేళ్లను, అపశ్యన్=చూచిరి.

తా. అక్కడ మెట్ట ప్రదేశములలో లేళ్లు నలుమూలలా నిర్భయముగా సంచరించుచు మెత్తని లేతపచ్చికను మేయుచుండెను. అట్టిలేళ్లను చూచిరి. 9

మూ. తటాకవైరిణశ్చాపి శుక్లదన్తవిభూషితాన్,
ఘోరానేకచరాన్వన్యాన్ ద్విరదాన్ కూలఘాతినః. 10

ప్ర.అ.తటాకవైరిణః=చెరువులకు శత్రువులు, శుక్లదన్తవిభూషితాన్= తెల్లని దంతములచేత అలంకరించబడినవి, ఘోరాన్=భయంకరమైనవి, ఏకచరాన్=ఒంటరిగా తిరుగుచున్నవి, కూలఘాతినః=తీరములను పొడచుచున్నవి అయిన, ద్విరదాన్=ఏనుగులను (చూచిరి).

తా. తెల్లని దంతములతో ప్రకాశించుచున్న భయంకరములైన ఏనుగులు ఒంటరిగా తిరుగుచు సరస్సుల తీరములను దంతాలతో పొడుచుచుండెను. ఆ విధముగ సరస్సులకు శత్రువుల వలె ఉన్న ఏనుగులను చూచిరి. 10

మూ. మత్తాన్ గిరితటోద్ఘుష్టాన్ పర్వతానివ జఙ్గమాన్,
వానరాన్ ద్విరదప్రఖ్యాన్ మహీరేణుసముక్షితాన్. 11

ప్ర.అ. మత్తాన్=మదించినవి, గిరితటోద్ఘుష్టాన్=పర్వతముల తటములందు ధ్వనిచేయుచున్నవి, జఙ్గమాన్=నడచుచున్న, పర్వతానివ=పర్వతములవలె ఉన్నవి, ద్విరదప్రఖ్యాన్=ఏనుగులతో సమానములు, మహీరేణుసముక్షితాన్= నేలమీద నున్న పరాగముచేత పూయబడినవి అయిన, వానరాన్= వానరములను, చూచిరి.

తా. మదించిన వానరములు పర్వతముల చరియలమీద ధ్వని చేయుచుండెను. నడచే పర్వతముల వలె, ఏనుగుల వలె ఉన్న ఆ వానరముల శరీరములు భూపరాగముచేత కప్పబడి యుండెను. అట్టి వానరములను కూడ చూచిరి. 11

మూ. వనే వనచరాంశ్చాన్యాన్ ఖేచరాంశ్చ విహఙ్గమాన్,
పశ్యన్తస్త్వరితా జగ్ముః సుగ్రీవవశవర్తినః. 12

ప్ర.అ.సుగ్రీవవశవర్తినః=సుగ్రీవుని వశములో ఉన్న ఆ వానరులు, వనే= వనమునందు, అన్యాన్=ఇతరములైన, వనచరాంశ్చ=వనమునందు సంచరించే మృగములను, ఖేచరాన్=ఆకాశముమీద సంచరించే, విహఙ్గమాంశ్చ=పక్షులను, పశ్యన్తః=చూచుచున్నవారై, త్వరితాః= తొందరపడుచున్నవారై, జగ్ముః=వెళ్లిరి.

తా. సుగ్రీవానుచరులైన ఆ వానరులు ఆ వనములో ఇంకా ఇతరవన్యమృగములను, ఆకాశమునందు సంచరించే పక్షులను చూచుచు తొందరగా వెళ్లిరి. 12

మూ. తేషాం తు గచ్ఛతాం తత్ర త్వరితం రఘునన్దనః,
ద్రుమషణ్డవనం దృష్ట్వా రామః సుగ్రీవమబ్రవీత్. 13

ప్ర.అ. తేషామ్=వారు, త్వరితమ్=శీఘ్రముగా, గచ్ఛతామ్= వెళ్లుచుండగా, రఘునన్దనః=రఘువంశీయులకు ఆనందము కలిగించు, రామః =రాముడు, తత్ర=అక్కడ, ద్రుమషణ్డవనమ్=వృక్షముల గుంపులతో కూడిన వనమును, దృష్ట్వా=చూచి, సుగ్రీవమ్= సుగ్రీవుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. వారందరు శీఘ్రముగా వెళ్లుచుండగా, రఘునందనుడైన రాముడు అక్కడ చెట్ల గుంపులతో నిండిన ఒక వనమును చూచి సుగ్రీవునితో ఇట్లు పలికెను. 13

మూ. ఏష మేఘ ఇవాకాశే వృక్షషణ్డః ప్రకాశతే,
మేఘసంఘాతవిపులః పర్యన్తకదలీవృతః. 14

ప్ర.అ. మేఘసంఘాతవిపులః=మేఘముల సముదాయము వలె విశాలము,

పర్యన్తకదలీవృతః=ప్రాంతములందు అరటిచెట్లతో కూడినది అయిన, ఏషః వృక్షషణ్డః=ఈ వృక్షముల సముదాయము, ఆకాశే=ఆకాశమునందు, మేఘః ఇవ=మేఘము వలె, ప్రకాశతే=ప్రకాశించుచున్నది.

తా. మేఘముల గుంపు వలె దట్టమై, ప్రాంతములందు అరటిచెట్లతో నిండిన ఈ వృక్షసముదాయము ఆకాశమునందు మేఘము ప్రకాశించు నట్లు ప్రకాశించుచున్నది. 14

మూ. కిమేతద్ జ్ఞాతుమిచ్ఛామి సఖే కౌతూహలం మమ,
కౌతూహలాపనయనం కర్తుమిచ్ఛామ్యహం త్వయా. 15

ప్ర.అ. సఖే=మిత్రుడా! ఏతత్ =ఇది, కిమ్=ఏమిటి? జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. మమ= నాకు, కౌతూహలమ్=వేడుక ఉన్నది. త్వయా=నీచేత, కౌతూహలాపనయనమ్=నా వేడుకయొక్క తొలగించుటను, కర్తుమ్= చేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. మిత్రుడా! ఇదేమో తెలిసికొనవలె నని నాకు వేడుకగా ఉన్నది. నీవు నాకు కలిగిన ఈ కుతూహలమును శాంతింపచేయుము. 15

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
గచ్ఛన్నేవాచచక్షేఽథ సుగ్రీవస్తన్మహద్వనమ్. 16

ప్ర.అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య రాఘవస్య=ఆ రామునియొక్క, తత్ వచనమ్=ఆవచనమును, శ్రుత్వా =విని, సుగ్రీవః = సుగ్రీవుడు, అథ =అటు పిమ్మట, గచ్ఛన్నేవ = వెళ్లుచునే, తత్ = ఆ, మహత్=గొప్ప, వనమ్=వనమును గూర్చి, ఆచచక్షే=చెప్పెను.

తా. మహాత్ముడైన రాముని మాటలు విని సుగ్రీవుడు నడచి వెళ్లుచునే, ఆ మహావనమును గూర్చి ఇట్లు చెప్పెను. 16

మూ. ఏతద్రాఘవ విస్తీర్ణమాశ్రమం శ్రమనాశనమ్,
ఉద్యానవనసంపన్నం స్వాదుమూలఫలోదకమ్. 17

ప్ర.అ. రాఘవ=రామా! ఉద్యానవనసంపన్నమ్=ఉద్యానవనములతో నిండినది, స్వాదుమూలఫలోదకమ్=మధురమైన దుంపలు, ఉదకము గలది, విస్తీర్ణమ్=విశాలము అయిన, ఏతత్=ఇది, శ్రమనాశనమ్= శ్రమను తొలగించు, ఆశ్రమమ్=ఆశ్రమము.

తా. రామా! ఉద్యానవనములతో ప్రకాశించుచు, మధురమైన మూలములతోను, ఉదకముతోను సమృద్ధమైన ఈ విశాలమైన ఆశ్రమము శ్రమను తొలగించును. 17

మూ. అత్ర సప్తజనా నామ మునయః శంసితవ్రతాః,
సప్తైవాసన్నధఃశీర్షా నియతం జలశాయినః. 18

ప్ర.అ. అత్ర=ఇక్కడ, శంసితవ్రతాః=తీవ్రమైన నియమములు కలవారు, నియతమ్=నిశ్చితముగా, అధఃశీర్షాః=క్రిందికి శిరస్సులు కలవారై, జలశాయినః=నీటిలో శయనించువారు అయిన, సప్తజనాః నామ= సప్తజనులనే పేరు గల, సప్తైవ=ఏడుగురు, మునయః=మునులు, ఆసన్=ఉండిరి.

తా. తీవ్రములైన నియమములను పాటించుచు, నిత్యము తలక్రిందుగా నీటిలో శయనించే సప్తజను లనే పేరు గల ఏడుగురు మునులు ఇక్కడ ఉండెడివారు. 18

మూ. సప్తరాత్రే కృతాహారా వాయునాచలవాసినః,
దివం వర్షశతైర్యాతాః సప్తభిః సకలేవరాః. 19

ప్ర.అ. సప్తరాత్రే=ఏడుదినములలో, వాయునా=వాయువుచేత, కృతాహారాః =చేయబడిన ఆహారము కలవారు, అచలవాసినః=నిశ్చలముగా ఉండేవారు అయిన ఆ మునులు, సప్తభిః=ఏడు, వర్షశతైః= సంవత్సరముల శతములచేత, సకలేవరాః=శరీరముతో కూడినవారై, దివమ్=స్వర్గమును గూర్చి, యాతాః=వెళ్లిరి.

తా. కదలకుండగా నివసించే ఆ మునులు ఏడు దినముల కొకసారి వాయుభక్షణము చేసేవారు. అట్టి ఆ మునులు ఏడు వందల సంవత్సరములు ఈ విధముగా తపస్సు చేసి సశరీరస్వర్గము పొందినారు. 19

మూ. తేషామేతత్ప్రభావేణ ద్రుమప్రాకారసంవృతమ్,
ఆశ్రమం సుదురాధర్షమపి సేన్ద్రైః సురాసురైః. 20

ప్ర.అ. ద్రుమప్రాకారసంవృతమ్=వృక్షములనే ప్రాకారముచేత చుట్టబడిన, ఏతత్ =ఈ, ఆశ్రమమ్=ఆశ్రమము, తేషామ్=వారియొక్క, ప్రభావేణ=ప్రభావ ముచేత, సేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సురాసురైరపి=సురుల చేతను, అసురుల చేతను కూడ, సుదురాధర్షమ్= ఎదిరింప శక్యముకానిది.

తా. వృక్షము లనే ప్రాకారము చుట్టి ఉన్న ఈ వనమును, ఆ మునుల ప్రభావముచేత, ఇంద్రాదిదేవతలు, అసురులు కూడ ఎదిరింప జాలరు. 20

మూ. పక్షిణో వర్జయన్త్యేతత్తథాన్యే వనచారిణః,
విశన్తి మోహాద్యేఽప్యత్ర న నివర్తన్తి తే పునః. 21

ప్ర.అ. పక్షిణః=పక్షులు, తథా=మరియు, అన్యే=ఇతరములైన, వనచా రిణః=వనములో సంచరించే జంతువులు, ఏతత్=ఈ ఆశ్రమమును, వర్జ యన్తి=విడచుచున్నవి. యే=ఏవి, మోహాత్= అజ్ఞానమువలన, అత్ర=దీనియందు,

విశన్తి=ప్రవేశించునో, తే= అవి, పునః=మరల, న నివర్తన్తి=తిరిగి వెళ్లవు.

తా. పక్షులు, ఇతరవన్యజంతువులూ కూడ ఈ ఆశ్రమములో ప్రవేశించవు. అజ్ఞానముచేత ఏవైన ప్రవేశించినచో తిరిగి వెళ్లవు. 21

మూ. విభూషణరవాశ్చాత్ర శ్రూయన్తే సకలాక్షరాః,
తూర్యగీతస్వనశ్చాపి గన్ధో దివ్యశ్చ రాఘవ. 22

ప్ర.అ. రాఘవ=రామా! అత్ర=ఇక్కడ, సకలాక్షరాః=మధురమైన అక్షరములు గల, విభూషణరవాశ్చ= అలంకారముల ధ్వనులు, తూర్యగీతస్వనాశ్చాపి= తూర్యములయొక్క, గీతములయొక్క ధ్వనులు, శ్రూయన్తే=వినబడుచున్నవి. దివ్యః=దివ్యమైన, గన్ధశ్చ =సువాసన కూడ, వచ్చుచున్నది.

తా. రామా! ఇక్కడనుండి అలంకారముల ధ్వనులు, మధురములైన మాటలు, వాద్యసంగీతనాదములు వినవచ్చుచుండును. దివ్యమైన సువాసన వచ్చుచుండును. 22

మూ. త్రేతాగ్నయోఽపి దీప్యన్తే ధూమో హ్యేష ప్రదృశ్యతే,
వేష్టయన్నివ వృక్షాగ్రాన్ కపోతాఙ్గారుణో ఘనః. 23

ప్ర.అ. త్రేతాగ్నయోఽపి=త్రేతాగ్నులు కూడ, దీప్యన్తే=మండుచున్నవి. వృక్షాగ్రాన్=వృక్షముల అగ్రములను, వేష్టయన్నివ=చుట్టుచున్నది వలె ఉన్నది, కపోతాఙ్గారుణః=పావురము దేహము వలె అరుణవర్ణముగా ఉన్నది, ఘనః=దట్టమైనది అయిన, ఏషః=ఈ, ధూమః= ధూమము, ప్రదృశ్యతే హి=చూడబడుచున్నది కదా?

తా. ఇక్కడ దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము అనే అగ్నిత్రయము ప్రజ్వరించుచున్నది. పావురము దేహము వలె ధూసరవర్ణమైన, దట్టమైన పొగ వృక్షాగ్రములను చుట్టుకొనుచున్నట్లు పైకి ఎగయుచున్నది కదా? 23

మూ. ఏతే వృక్షాః ప్రకాశన్తే ధూమసంసక్తమస్తకాః,
మేఘజాలప్రతిచ్ఛన్నా వైదూర్యగిరయో యథా. 24

ప్ర.అ. ధూమసంసక్తమస్తకాః=ధూమముతో కలిసిన అగ్రభాగములు గల, ఏతే వృక్షాః=ఈ వృక్షములు, మేఘజాలప్రతిచ్ఛన్నాః=మేఘముల సముదాయముచేత కప్పబడిన, వైదూర్యగిరయో యథా=వైదూర్యమణిపర్వతముల వలె, ప్రకాశన్తే=ప్రకాశించుచున్నవి.

తా. పై భాగములమీద పొగ కప్పటచే ఈ వృక్షములు, మేఘాలు ఆవరించిన వైదూర్యపర్వతముల వలె ప్రకాశించుచున్నవి. 24

మూ. కురు ప్రణామం ధర్మాత్మంస్తేషాముద్దిశ్య రాఘవ,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రయతః సంహతాఞ్జలిః. 25

ప్ర.అ. ధర్మాత్మన్=ధర్మాత్ముడా! రాఘవ=రామా! తేషామ్ ఉద్దిశ్య= వారికి ఉద్దేశించి, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్షణునితో కూడ, ప్రయతః=సావధానచిత్తుడవై, సంహతాఞ్జలిః=దగ్గరగా చేర్చబడిన దోసిలి కలవాడవై, ప్రణామమ్=నమస్కారమును, కురు= చేయుము.

తా.ధర్మాత్ముడవైన రామా! నీవు, నీ తమ్ముడైన లక్ష్మణుడూ కూడ, సావధానచిత్తముతో దోసిలి కట్టి ఆ మునుల నుద్దేశించి నమస్కారము చేయుండి. 25

మూ. ప్రణమన్తి చ యే తేషామృషీణాం భావితాత్మనామ్,
న తేషామశుభం కిం చిచ్ఛరీరే రామ విద్యతే. 26

ప్ర. అ. రామ=రామా! భావితాత్మనామ్=పవిత్రమైన మనస్సు గల, తేషామ్ ఋషీణామ్=ఆ ఋషీశ్వరులకు, యే=ఎవరు, ప్రణమన్తి= నమస్కరింతురో, తేషామ్=వారికి, శరీరే=శరీరమునందు, కించిత్= ఏమీ, అశుభమ్=అశుభము, న విద్యతే=ఉండదు.

తా. రామా! పవిత్రములైన మనస్సులు గల ఆ ఋషులకు నమస్కరించేవారి శరీరములలో అశుభములైన రోగాదు లేవీ ఉండవు. 26

మూ. తతో రామః సహ భ్రాత్రా లక్ష్మణేన కృతాఞ్జలిః,
సముద్దిశ్య మహాత్మానస్తానృషీనభ్యవాదయత్. 27

ప్ర.అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, మహాత్మానః=మహాత్ములైన, తాన్=ఆ, ఋషీన్ సముద్దిశ్య=ఋషులను ఉద్దేశించి, అభ్యవాదయత్=నమస్కరించెను.

తా. పిదప రామలక్ష్మణులు చేతులు జోడించి, ఆ ఋషుల నుద్దేశించి నమస్కారము చేసిరి. 27

మూ. అభివాద్య చ ధర్మాత్మా రామో భ్రాతా చ లక్ష్మణః,
సుగ్రీవో వానరాశ్చైవ జగ్ముః సంహృష్టమానసాః. 28

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, భ్రాతా= సోదరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, సుగ్రీవః=సుగ్రీవుడు, వానరాశ్చైవ =వానరులు, అభివాద్య=నమస్కరించి, సంహృష్టమానసాః= సంతోషించిన మనస్సులు కలవారై, జగ్ముః=వెళ్లిరి.

తా. ధర్మాత్ముడైన రాముడు, సోధరుడైన లక్ష్మణుడు, సుగ్రీవుడు, వానరులు కూడ ఆ మునులకు నమస్కరించి, సంతోషించిన మనస్సులతో వెళ్లిరి.

వి. మహాపురుషులకు నమస్కరించుట విజయప్రద మని సూచించుటకై ఈ కథ ఇక్కడ చెప్పబడినది. 28

మూ. తే గత్వా దూరమధ్వానం తస్మాత్సప్తజనాశ్రమాత్,
దదృశుస్తాం దురాధర్షాం కిష్కిన్ధాం వాలిపాలితామ్. 29

ప్ర.అ. తే=వారు, తస్మాత్=ఆ, సప్తజనాశ్రమాత్= సప్తజనాశ్రమమునుండి, దూరమ్=దూరమైన, అధ్వానమ్= మార్గమును, గత్వా=వెళ్లి, వాలిపాలితామ్=వాలి చేత పాలింపబడిన, దురాధర్షామ్=ఎదిరింప శక్యముకాని, తాం కిష్కిన్ధామ్=ఆ కిష్కింధను, దదృశుః=చూచిరి.

తా. వారందరూ, ఆ సప్తజనాశ్రమమునుండి సుదూరమైన మార్గము నందు ప్రయాణము చేసి, వెళ్లి, వాలిచేత పాలింపబడుచు ఎదిరింప శక్యము కాని కిష్కింధను చూచిరి. 29

మూ. తతస్తు రామానుజరామవానరాః
ప్రగృహ్య శస్త్రాణ్యుదితోగ్రతేజసః,
పురీం సురేశాత్మజవీర్యపాలితాం
వధాయ శత్రోః పునరాగతా స్త్విహ. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర.అ. తతః=అటుపిమ్మట, ఉదితోగ్రతేజసః=ఆవిర్భవించిన ఉగ్రమైన తేజస్సు గల, రామానుజరామవానరాః=లక్ష్మణరామసుగ్రీవులు, శస్త్రాణి= ఆయుధములను, ప్రగృహ్య=గ్రహించి, శత్రోః=శత్రువుయొక్క, వధాయ =వధకొరకు, సురేశాత్మజవీర్యపాలితామ్=ఇంద్రుని పుత్రుడైన వాలిచేత పాలింపబడిన, పురీమ్=పట్టణమును గూర్చి, పునః=మరల, ఇహ= ఇప్పుడు, ఆగతాః=వచ్చిరి.

తా. పిమ్మట ఆ మునులకు నమస్కరించుటచే వారిలో ఉగ్రమైన తేజస్సు ఆవిర్భవించెను. అట్టి రామలక్ష్మణసుగ్రీవాదులు ఆయుధములు ధరించి, శత్రువును సంహరించుటకై, వాలి పరాక్రమముచే పాలింపబడిన ఆ కిష్కింధకు మరల వచ్చిరి. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పదమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్దశః సర్గః

*[వాలిని చంపెద నని రాముడు సుగ్రీవునకు మరల మాట ఇచ్చుట. సుగ్రీవుడు ఘోరముగా గర్జించుట]*

మూ. సర్వే తే త్వరితం గత్వా కిష్కిన్ధాం వాలినః పురీమ్,
వృక్షైరాత్మానమావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే. 1

ప్ర.అ;తా. చూ. 12 వ సర్గ 14 వ శ్లోకం.

మూ. విసార్య సర్వతో దృష్టిం కాననే కాననప్రియః,
సుగ్రీవో విపులగ్రీవః క్రోధమాహారయద్భృశమ్. 2

ప్ర.అ. కాననప్రియః=అడవి ప్రియముగా గల, విపులగ్రీవః=విశాలమైన కంఠముగల, సుగ్రీవః=సుగ్రీవుడు, కాననే=అడవియందు, సర్వతః= నలువైపులా, దృష్టిమ్=దృష్టిని, విసార్య=ప్రసరింపచేసి, భృశమ్=మిక్కిలి, క్రోధమ్=క్రోధమును, ఆహారయత్= తెప్పించుకొనెను.

తా. అడవియందు ప్రీతి కలవాడు, విశాలమైన కంఠము గలవాడు అయిన సుగ్రీవుడు ఆ అరణ్యముపై అంతటా దృష్టి ప్రసరింపచేసి చాల క్రోధమును తెప్పించుకొనెను. 2

మూ. తతస్తు నినదం ఘోరం కృత్వా యుద్ధాయ చాహ్వయత్,
పరివారైః పరివృతో నాదైర్భిన్దన్నివామ్బరమ్, 3
గర్జన్నివ మహామేఘో వాయువేగపురస్కృతః.

ప్ర.అ. పరివారైః=పరివారములతో, పరివృతః=కూడిన ఆ సుగ్రీవుడు, తతః =అటు పిమ్మట, నాదైః=శబ్దములచేత, అమ్బరమ్= ఆకాశమును, భిన్దన్నివ=భేదించుచున్నవాడు వలె, వాయువేగపురఃసరః= వాయువేగముచేత ముందుకు నడచుచున్న, గర్జన్=గర్జించుచున్న, మహామేఘ ఇవ=పెద్ద మేఘము వలె, ఘోరమ్=ఘోరమైన, నినదమ్ =ధ్వనిని, కృత్వా=చేసి, యుద్ధాయ=యుద్ధము కొరకు, ఆహ్వయత్=పిలచెను.

తా. పరివారముతో కూడిన ఆ సుగ్రీవుడు శబ్దముచేత ఆకాశమును భేదించుచున్నట్లు వాయువేగముచేత ముందుకు పోవుచున్న, గర్జించుచున్న పెద్ద మేఘము వలె, ఘోరమైన ధ్వని చేయుచు వాలిని యుద్ధానికి పిలచెను. 3

మూ. అథ బాలార్కసదృశో దృప్తసింహగతిస్తదా, 4
దృష్ట్వా రామం క్రియాదక్షం సుగ్రీవో వాక్యమబ్రవీత్.

ప్ర.అ. అథ=అటుపిమ్మట, బాలార్కసదృశః=లేత సూర్యునితో సమానుడు, దృప్తసింహగతిః=గర్వించిన సింహముయొక్క నడక వంటి నడక గలవాడు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, క్రియాదక్షమ్= పనులలో సమర్థుడైన, రామమ్=రాముని, దృష్ట్వా=చూచి, తదా= అప్పుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట బాలసూర్యునితో సమానుడు, గర్వించిన సింహము వలె నడచువాడు అయిన సుగ్రీవుడు అప్పుడు, పనులలో సమర్థుడైన రాముని చూచి ఇట్లు పలికెను. 4

మూ. హరివాగురయా వ్యాప్తాం తప్తకాఞ్చనతోరణామ్,
ప్రాప్తాః స్మ ధ్వజయన్త్రాఢ్యాం కిష్కిన్ధాం వాలినః పురీమ్. 5

ప్ర.అ. హరివాగురయా=వానరులనే వలచేత, వ్యాప్తామ్=వ్యాపింపబడిన, తప్తకాఞ్చనతోరణామ్ =శుద్ధమైన బంగారు తోరణము గల, ధ్వజయన్త్రాఢ్యామ్ =ధ్వజములతోను యంత్రములతోను కూడిన, వాలినః=వాలియొక్క, పురీమ్ =పట్టణమైన, కిష్కిన్ధామ్=కిష్కింధను, ప్రాప్తాః స్మ= చేరినాము.

తా. వాలి నగరమైన కిష్కింధ చేరినాము. దీనిని వానరులు వలవలె అంతటా వ్యాపించి కాపాడుచున్నారు. దీని ముఖద్వారము పరిశుద్ధమైన బంగారముతో నిర్మించబడినది. ధ్వజములతోను, యంత్రములతోను నిండియున్నది.

మూ. ప్రతిజ్ఞా యా కృతా వీర త్వయా వాలివధే పురా,
సఫలాం కురు తాం క్షిప్రం లతాం కాల ఇవాగతః. 6

ప్ర.అ. వీర=వీరుడా! త్వయా=నీచేత, వాలివధే=వాలివధవిషయమున, పురా=పూర్వము, యా=ఏ, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, కృతా=చేయుబడినదో, తామ్=దానిని, ఆగతః=వచ్చిన, కాలః=కాలము, లతామ్ ఇవ=లతను వలె, క్షిప్రమ్= శీఘ్రముగా, సఫలామ్=సఫలమైనదానినిగా, కురు=చేయుము.

తా. వీరుడవైన రామా! వాలిని చంపెద నని నీవు వెనుక చేసిన ప్రతిజ్ఞను, తగిన కాలము లతను సఫలము చేసినట్లు సఫలము చేయుము.6

మూ. ఏవముక్తస్తు ధర్మాత్మా సుగ్రీవేణ స రాఘవః,
తమేవోవాచ వచనం సుగ్రీవం శత్రుసూదనః. 7

ప్ర.అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః= పలకబడిన, ధర్మాత్మా=ధర్మాత్ముడు, శత్రుసూదనః= శత్రుసంహారకుడూ అయిన, సః రాఘవః=ఆ

రాముడు, తమ్=ఆ, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, వచనమ్=వచనమును, ఉవాచ= పలికెను.

తా. ధర్మాత్ముడు, శత్రుసంహారకుడు అయిన ఆ రాముడు సుగ్రీవుని మాటలు విని, ఆతనితో ఇట్లనెను. 7

మూ. కృతాభిజ్ఞానచిహ్నస్త్వమనయా గజసాహ్వయా,
లక్ష్మణేన సముత్పాట్య యైషా కణ్ఠే కృతా తవ. 8

ప్ర.అ. యా=ఏ, ఏషా= ఇది, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, సముత్పాట్య= ఊడ బెరికి, తవ=నీయొక్క, కణ్ఠే=కంఠమునందు, కృతా= చేయబడినదో, అనయా=ఈ, గజసాహ్వయా=గజపుష్పలతచేత, త్వమ్ =నీవు, కృతాభిజ్ఞానచిహ్నః=చేయబడిన ఆనవాలు కలవాడవు.

తా. లక్ష్మణుడు నేలనుండి ఊడబెరికి నీ కంఠమునందు కట్టిన ఈ గజపుష్పలత నీకు ఆనవాలుగా ఉన్నది గదా? 8

మూ. శోభసేఽప్యధికం వీర లతయా కణ్ఠసక్తయా,
విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా. 9

ప్ర.అ. వీర=వీరుడా! కణ్ఠసక్తయా=కంఠమునందు తగల్చబడిన, లతయా =లతచేత, ఆకాశే=ఆకాశమునందు, నక్షత్రమాలయా= నక్షత్రమాలచేత, విపరీతః=చుట్టువారుకొనబడిన, సూర్యః ఇవ= సూర్యుడు వలె, అధికమ్=అధికముగా, శోభసే=ప్రకాశించుచున్నావు.

తా. ఓ! వీరుడా! నీ కంఠమునం దున్న ఈ పుష్పలతతో నీవు, ఆకాశములో నక్షత్ర పంక్తిచేత చుట్టబడిన సూర్యుడు వలె ప్రకాశించుచున్నావు.

వి. సూర్యుని చుట్టూ నక్షత్రమాల ఉండుట (కనబడుట) అసంభావ్యము. అందుచే అట్లు కనబడినచో ఎట్లుండునో అట్లున్నావు అని అభూతోపమ అని చెప్పవలెను. కొందరు వ్యాఖ్యాతలు విపరీతము అనగా రాత్రి అనీ, సూర్యః అనగా పూర్ణచంద్రుడనీ అర్థాలు చెప్పి దానికి ఉపష్టంభకంగా "పరీతం తు దివా ప్రోక్తం విపరీతం తు శర్వరీ, రాకామధ్యగతశ్చన్ద్రః సూర్య ఇత్యభిధీయతే" అను వచనమును ఉదాహరించినారు. పై వాక్యం ప్రస్తుతశ్లోకం దృష్టిలో ఉంచుకొని కల్పించిన వాక్యం అనడంలో సందేహం లేదు. ఇవి క్రమంగా ఇతరగ్రంథాలలోకి కూడా ఎక్కిపోతూ ఉంటాయి. ఇలాంటి చమత్కారాలు మన వ్యాఖ్యాతలు చేస్తూ ఉంటారు. అవన్నీ అప్రామాణికాలు. 9

మూ. అద్య వాలిసముత్థం తే భయం వైరం చ వానర,
ఏకేనాహం ప్రమోక్ష్యామి బాణమోక్షేణ సంయుగే. 10

ప్ర.అ. వానర=సుగ్రీవా! అద్య=నేడు, అహమ్=నేను, సంయుగే =యుద్ధ

మునందు, ఏకేన=ఒక్క, బాణమోక్షేణ= బాణప్రయోగముచేత, తే=నీయొక్క, వాలిసముత్థమ్=వాలివలన కలిగిన, భయమ్=భయమును, వైరం చ=వైరమును, ప్రమోక్ష్యామి =తొలగింపచేసెదను.

తా. సుగ్రీవుడా! నేడు నేను యుద్ధములో ఒక్క బాణమును ప్రయోగించి, నీకు వాలివలన కలిగిన భయమును, వైరమును కూడ తొలగించెదను. 10

మూ. మమ దర్శయ సుగ్రీవ వైరిణం భ్రాతృరూపిణమ్,
వాలీ వినిహతో యావద్వనే పాంసుషు చేష్టతే. 11

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా! భ్రాతృరూపిణమ్=సోదరుని రూపములో ఉన్న, వైరిణమ్=శత్రువును, మమ=నాకు, దర్శయ=చూపుము. వాలీ =వాలి, వినిహతః=చంపబడినవాడై, వనే=వనమునందు, పాంసుషు =పరాగములలో, యావత్ చేష్టతే=దొర్లగలడు.

తా. సుగ్రీవుడా! సోదరరూపములో ఉన్న నీ శత్రువును నాకు చూపుము. నాచే చంపబడి ఆ వాలి, వనములో, పరాగములో దొర్లగలడు. 11

మూ. యది దృష్టిపథం ప్రాప్తో జీవన్స వినివర్తతే,
తతో దోషేణ మా గచ్ఛేత్సద్యో గర్హేచ్చ మాం భవాన్. 12

ప్ర.అ. దృష్టిపథమ్=నా దృష్టిమార్గమును, ప్రాప్తః=పొందిన, సః= అతడు, జీవన్=జీవించుచు, వినివర్తతే యది=వెళ్లినట్లయితే, తతః=అటుపిమ్మట, భవాన్=నీవు, సద్యః=వెంటనే, మా=నన్ను, దోషేణ=దోషముతో కూడినవానినిగా, గచ్ఛేత్=తెలుసుకొందువుగాక. మామ్ =నన్ను, గర్హేచ్చ=నిందించెదవుగాక.

తా. నా కంట బడిన తరవాత కూడ వాలి ప్రాణాలతో వెనుకకు తిరిగి వెళ్లగలిగిన ట్లయితే నీవు వెంటనే నేను దోషము చేసితినని గ్రహించవచ్చును. నన్ను నిందించవచ్చును.

మూ. ప్రత్యక్షం సప్త తే సాలా మయా బాణేన దారితాః,
తతో వేత్సి బలేనాద్య వాలినం విహతం రణే. 13

ప్ర. అ. తే==నీయొక్క, ప్రత్యక్షమ్=ఎదురుగానే, మయా= నాచేత, బాణేన=బాణముచేత, సప్త=ఏడు, సాలాః= సాలవృక్షములు, దారితాః=చీల్చబడినవి. తతః=అందువలన, అద్య=నేడు, రణే=యుద్ధమునందు, వాలినమ్=వాలిని, బలేన= నా బలముచేత, నిహతమ్=చంపబడినవానినిగా, వేత్సి= తెలుసుకొనుచున్నావు (తెలిసికొనుము).

తా. నీ ఎదుటనే నేను ఒక్క బాణముతో ఏడు సాలవృక్షములను చీల్చివేసితిని కదా? అందుచేత నేడు వాలి రణములో నా బలముచేత చావనున్నా డని తెలిసికొనుము. 13

మూ. అనృతం నోక్తపూర్వం మే వీర కృచ్ఛ్రేఽపి తిష్ఠతా,
ధర్మలోభపరీతేన న చ వక్ష్యే కథంచన. 14

ప్ర.అ. వీర=ఓ! వీరుడా! కృచ్ఛ్రే=ఆపదయందు, తిష్ఠతాపి= ఉన్న వాడనైనను, ధర్మలోభపరీతేన=ధర్మమునందు ఆసక్తితో కూడిన, మే= నాచేత, అనృతమ్=అసత్యము,న ఉక్తపూర్వమ్=పూర్వ మెన్నడూ పలకబడలేదు. కథంచన=ఏ విధముగానూ కూడ, న వక్ష్యే చ= పలకను కూడ.

తా. ఓ! వీరుడా! ధర్మమునందు అత్యాసక్తి గల నేను ఎన్ని కష్టములలో ఉన్నను పూర్వ మెన్నడూ అసత్యము పలకలేదు. ఎట్టి పరిస్థితులలోను ఇటుపై కూడ పలకను. 14

మూ. సఫలాం చ కరిష్యామి ప్రతిజ్ఞాం జహి సంభ్రమమ్,
ప్రసూతం కలమక్షేత్రం వర్షేణేవ శతక్రతుః. 15

ప్ర.అ. శతక్రతుః=దేవేంద్రుడు, వర్షేణ=వర్షముచేత, ప్రసూతమ్= అంకురించిన, కలమక్షేత్రమ్ ఇవ=వరిచేనును వలె, ప్రతిజ్ఞామ్= ప్రతిజ్ఞను, సఫలామ్=సఫలమైనదానినిగా, కరిష్యామి=చేయగలను. సంభ్రమమ్=తొందరను, జహి=చంపుము (విడువుము).

తా. దేవేంద్రుడు అంకురించిన వరిపొలమును వర్షము చేత సఫలము చేసినట్లు ప్రతిజ్ఞను సఫలము చేసెదను. భయమును విడువుము. 15

మూ. తదాహ్వాననిమిత్తం చ వాలినో హేమమాలినః,
సుగ్రీవ కురు తం శబ్దం నిష్పతేద్యేన వానరః. 16

ప్ర.అ. సుగ్రీవ=సుగ్రీవుడా! తత్=ఆకారణమువలన, హేమమాలినః= బంగారు మాల గల, వాలినః=వాలియొక్క, ఆహ్వాననిమిత్తం చ= ఆహ్వానముకొరకు, తమ్=అట్టి, శబ్దమ్=శబ్దమును, కురు= చేయుము, యేన=దేనిచేత, వానరః=వాలి, నిష్పతేత్= బైటకువచ్చునో.

తా. సుగ్రీవుడా! ఆ కారణము చేత బంగారు మాలను ధరించు వాలిని యుద్ధమునకు ఆహ్వానించుచు, ఎట్టి శబ్దము చేయుటచే అతడు వెంటనే బైటకు వచ్చునో అట్టి శబ్దము చేయుము. 16

మూ. జితకాశీ బలశ్లాఘీ త్వయా చాధర్షితః పురాత్,
నిష్పతిష్యత్యసంగేన వాలీ స ప్రియసంయుగః. 17

ప్ర.అ. జితకాశీ=జయముచేత ప్రకాశించువాడు, బలశ్లాఘీ=తన బలమును శ్లాఘించుకొనువాడు, త్వయా=నీచేత, అధర్షితః= ఎదిరింపబడనివాడు, ప్రియసంయుగః=ఇష్టమైన యుద్ధముగలవాడు అయిన, సః వాలీ=ఆ వాలి,

అసంగేన=అడ్డులేకుండా, పురాత్= పురమునుండి, నిష్పతిష్యతి=బైటకు రాగలడు.

తా. యుద్ధమునందు చాల ప్రీతి గల ఆ వాలి ఎల్లప్పుడు జయము పొందుచు ప్రకాశించుచున్నాడు. తన బలమును శ్లాఘించుకొనుచుండును. అతడు నీచేత ఎన్నడూ ఓడింపబడలేదు. అందుచే అతడు ఏ అడ్డము లేక నగరమునుండి బైటకు రాగలడు. 17

మూ. రిపూణాం ధర్షితం శ్రుత్వా మర్షయన్తి న సంయుగే,
జానన్తస్తు స్వకం వీర్యం స్త్రీసమక్షం విశేషతః. 18

ప్ర. అ. స్వకమ్=తమ సంబంధమైన, వీర్యమ్=పరాక్రమమును, జానన్తః=ఎరిగినవారు, సంయుగే=యుద్ధమునందు, రిపూణామ్= శత్రువులయొక్క, ధర్షితమ్=ఎదిరించుటను, శ్రుత్వా=విని, న మర్షయన్తి=సహించరు. స్త్రీ సమక్షమ్=స్త్రీల ఎదుట, విశేషతః= విశేషించి సహించరు.

తా. తమకున్న బలమును గూర్చి తెలిసినవాళ్లు యుద్ధమునకు రమ్మని శత్రువుల పిలుపు విని సహించజాలరు. స్త్రీల సమక్షమున అసలే సహించజాలరు.

మూ. స తు రామవచః శ్రుత్వా సుగ్రీవో హేమపిఙ్గలః,
ననర్ద క్రూరనాదేన వినిర్భిన్దన్నివామ్బరమ్. 19

ప్ర.అ. హేమపిఙ్గలః=బంగారమువలె పచ్చని వర్ణము గల, సః సుగ్రీవః= ఆ సుగ్రీవుడు, రామవచః=రాముని వచనమును, శ్రుత్వా=విని, అమ్బరమ్=ఆకాశమును, వినిర్భిన్దన్నివ=బ్రద్దలు కొట్టుచున్నవాడు వలె, క్రూరనాదేన=క్రూరమైన ధ్వనితో, ననర్ద=ధ్వని చేసెను.

తా. బంగారమువలె పచ్చని వర్ణము గల ఆ సుగ్రీవుడు రాముని మాటలు విని, ఆకాశమును బ్రద్దలు కొట్టుచున్నాడా అన్నట్లు క్రూరమైన శబ్దముతో ధ్వని చేసెను. 19

మూ. తత్ర శబ్దేన విత్రస్తా గావో యాన్తి హతప్రభాః,
రాజదోషపరామృష్టాః కులస్త్రియ ఇవాకులాః. 20

ప్ర.అ. తత్ర=అక్కడ, గావః=గోవులు, శబ్దేన=సుగ్రీవుని ధ్వనిచేత, విత్రస్తాః=భయపడినవై, హతప్రభాః=కొట్టబడిన కాంతి గలవై, రాజదోషపరామృష్టాః=రాజు యొక్క సరిగా పాలనచేయకపోవుట అనే దోషముచేత పరులచే స్పృశింపబడిన, కులస్త్రియః యథా=కులస్త్రీలవలె, ఆకులాః=వ్యాకులమైనవై, యాన్తి=పారిపోవుచున్నవి. (పారిపోయినవి).

తా. సుగ్రీవుడు చేసిన ధ్వని విని భయబడిన గోవులు కాంతివిహీనములై రాజు తన ధర్మమైన ప్రజాపరిపాలనమును సరిగా నిర్వర్తించకపోవుటచే పరులచేత

ఆక్రమింపబడిన కులస్త్రీల వలె వ్యాకులములై పరుగెత్తినవి. 20

మూ. ద్రవన్తి చ మృగాః శీఘ్రం భగ్నా ఇవ రణే హయాః,
పతన్తి చ ఖగా భూమౌ క్షీణపుణ్యా ఇవ గ్రహాః. 21

ప్ర.అ. రణే=యుద్ధమునందు, భగ్నాః=ఓడిపోయిన, హయాః ఇవ=గుఱ్ఱముల వలె, మృగాః= మృగములు, శీఘ్రమ్=శీఘ్రముగా, ద్రవన్తి చ=పారిపోవుచున్నవి. ఖగాః=పక్షులు, క్షీణపుణ్యాః= క్షీణమైన పుణ్యము గల, గ్రహాః ఇవ=నక్షత్రముల వలె, భూమౌ=భూమియందు, పతన్తి చ=పడిపోయినవి.

తా.మృగములు యుద్ధములో ఓడిపోయిన అశ్వముల వలె పారిపోయినవి. పక్షులు పుణ్యము క్షీణించగా పడిపోవుచున్న నక్షత్రముల వలె నేలపై రాలిపోయినవి. 21

మూ. తతః సజీమూతకృతప్రణాదో
నాదం హ్యాముఞ్చత్త్వరయా ప్రతీతః,
సూర్యాత్మజః శౌర్యవివృద్ధతేజాః
సరిత్పతిర్వానిలచఞ్చలోర్మిః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుర్దశః సర్గః.

ప.అ. తతః=అటు పిమ్మట, జీమూతకృతప్రణాదః=మేఘమువలె చేయబడిన ధ్వని గల, ప్రతీతః=ధ్వనిచేయుటలో ప్రసిద్ధుడైన, సూర్యాత్మజః =సుగ్రీవుడు, శౌర్యవివృద్ధతేజాః=శౌర్యముచేత వృద్ధిచెందిన తేజస్సు గలవాడై, అనిలచఞ్చలోర్మిః=వాయువుచేత చంచలములైన తరంగములు గల, సరిత్పతిర్వా=సముద్రము వలె, త్వరయా=తొందరతో, నాదమ్= ధ్వనిని, అముఞ్చత్=విడచెను.

తా. పిమ్మట మేఘము వలె ధ్వని చేయగలవాడు, ధ్వనిచేయుటలో ప్రసిద్ధుడు అయిన సూర్యకుమారుడైన సుగ్రీవుడు శౌర్యముచేత వృద్ధి చెందిన తేజస్సుతో గాలికి కదలుచున్న తరంగములు గల సముద్రుడు వలె శీఘ్రముగా గొప్ప ధ్వని చేసెను. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పదునాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చదశః సర్గః

[సుగ్రీవుని అరపులు విని వాలి యుద్ధానికై బయలుదేరి వచ్చుచుండగా తార ఆతనిని నివారించుట]

మూ. అథ తస్య వినాదం తం సుగ్రీవస్య మహాత్మనః,
శుశ్రావాన్తఃపురగతో వాలీ భ్రాతురమర్షణః. 1

ప్ర.అ. అథ=అటుపిమ్మట, మహాత్మనః=మహాత్ముడైన, భ్రాతుః= సోదరుడైన, తస్య సుగ్రీవస్య=ఆ సుగ్రీవునియొక్క, తం వినాదమ్= ఆ ధ్వనిని, అన్తఃపురగతః=అంతఃపురములో ఉన్న, అమర్షణః= కోపస్వభావము గల, వాలీ=వాలి, శుశ్రావ=వినెను.

తా. పిమ్మట, అంతఃపురములో నున్న, కోపస్వభావముగల వాలి తన సోదరుడు, మహాత్ముడు అయిన ఆ సుగ్రీవుడు చేయుచున్న ధ్వనిని వినెను. 1

మూ. శ్రుత్వా తు తస్య నినదం సర్వభూతప్రకమ్పనమ్,
మదశ్చైకపదే నష్టః క్రోధశ్చాపాదితో మహాన్. 2

ప్ర.అ. తస్య=ఆతనియొక్క, సర్వభూతప్రకమ్పనమ్=సకలప్రాణులను వణికించే, నినదమ్=ధ్వనిని, శ్రుత్వా=విని, ఏకపదే=ఒక్క మారుగా, మదః చ=మదము, నష్టః=నశించినది. మహాన్= గొప్ప, క్రోధః=క్రోధము, ఆపాదితశ్చ=తెచ్చుకొనబడినది.

తా. సకలప్రాణులకు వణకు పుట్టించే ఆ సుగ్రీవుని ధ్వని వినగానే వాలి మత్తు అంతా తొలగిపోయెను. చాల కోపము కూడ వచ్చెను. 2

మూ. తతో రోషపరీతాఙ్గో వాలీ స కనకప్రభః,
ఉపరక్త ఇవాదిత్యః సద్యో నిష్ప్రభతాం గతః. 3

ప్ర.అ. తతః=అటుపిమ్మట, రోషపరీతాఙ్గః=కోపముతో నిండిన శరీరము గల, కనకప్రభః =బంగారు కాంతి గల, సః వాలీ=ఆ వాలి, ఉపరక్తః=గ్రహణము పట్టిన, ఆదిత్యః ఇవ=సూర్యుడు వలె, సద్యః=వెంటనే, నిష్ప్రభతామ్= కాంతి లేకపోవుటను, గతః=పొందినాడు.

తా. అప్పుడు బంగారు రంగు గల ఆ వాలి, రోషముతో శరీరము అంతా నిండగా గ్రహణము పట్టిన సూర్యుడు వలె వెంటనే కాంతివిహీనుడయ్యెను. 3

మూ. వాలీ దంష్ట్రాకరాళస్తు క్రోధాద్దీప్తాగ్నిసన్నిభః,
భాత్యుత్పతితపద్మాభః సమృణాల ఇవ హ్రదః. 4

ప్ర.అ. దంష్ట్రాకరాళః=కోరలచేత ఎత్తు పల్లములతో ఉన్నవాడు, క్రోధాత్=కోపమువలన, దీప్తాగ్నిసన్నిభః=ప్రజ్వలించుచున్న అగ్నివలె ఉన్నవాడు అయిన, వాలీ=వాలి, ఉత్పతితపద్మాభః=పైకి వ్యాపించిన ఎఱ్ఱని పద్మముల కాంతి గల, సమృణాలః=తామరతూడులతో కూడిన, హ్రదః ఇవ=చెరువు వలె, భాతి=ప్రకాశించుచున్నాడు.

తా. కోరలతో ఎత్తు పల్లములు కలిగి, కోపమువలన ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న వాలి, పద్మముల కాంతి పైకి ప్రసరించి తామరతూడులతో నిండిన చెరువు వలె ఉండెను. 4

మూ. శబ్దం దుర్మర్షణం శ్రుత్వా నిష్పపాత తతో హరిః,
వేగేన చ పదన్యాసైర్దారయన్నివ మేదినీమ్. 5

ప్ర.అ. తతః=అటు పిమ్మట, హరిః=వాలి, దుర్మర్షణమ్=సహింప శక్యము కాని, శబ్దమ్=శబ్దమును, శ్రుత్వా=విని, వేగేన=వేగముతో, పదన్యాసైః=పాద న్యాసములచేత, మేదినీమ్=భూమిని, దారయన్నివ=చీల్చివేయుచున్నవాడు వలె, నిష్పపాత=శీఘ్రముగా బైటకు వచ్చెను.

తా. సహింప శక్యము కాని ఆ శబ్దమును వినగానే వాలి పాదన్యాసములచేత భూమిని చీల్చివేయుచున్నాడా అన్నట్లు వేగముగా బైటకు వచ్చెను. 5

మూ. తం తు తారా పరిష్వజ్య స్నేహాద్దర్శితసౌహృదా,
ఉవాచ త్రస్తసంభ్రాన్తా హితోదర్కమిదం వచః. 6

ప్ర.అ. తారా=తార, తమ్=ఆతనిని, స్నేహాత్=స్నేహమువలన, పరిష్వజ్య=కౌగలించుకొని, దర్శితసౌహృదా=చూపబడిన ప్రేమ గలదై, త్రస్తసంభ్రాన్తా=భయపడినదై, కంగారుపడుచున్నదై, హితోదర్కమ్=హితము, భవిష్యత్తులో మంచి ఫలమును ఇచ్చేది అయిన, ఇదం వచః=ఈ వచనమును, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు భయపడి కంగారుపడుచున్న తార ఆతనిని స్నేహపూర్వకముగా కౌగలించుకొని, ప్రేమను చూపుచు హితము, భవిష్యత్తులో మంచి ఫలమును ఇచ్చేదీ అయిన వాక్యమును పలికెను. 6

మూ. సాధు క్రోధమిదం వీర నదీవేగమివాగతమ్,
శయనాదుత్థితః కాల్యం త్యజ భుక్తామివ స్రజమ్. 7

ప్ర.అ. వీర=వీరుడా! నదీవేగమివ=నదీవేగము వలె, ఆగతమ్=వచ్చిన, ఇదమ్=ఈ, క్రోధమ్=క్రోధమును, కాల్యమ్=ప్రాతఃకాలమున, శయనాత్=శయన

మునుండి, ఉత్థితః=లేచినవాడు, భుక్తామ్= అనుభవించబడిన, స్రజమివ=మాలికను వలె, సాధు=బాగుగా, త్యజ=విడిచిపెట్టుము.

తా. ఓ వీరుడా! నదీవేగము వలె వచ్చిన ఈ కోపమును, ప్రాతఃకాలమునందు శయనమునుండి లేచినవాడు అనుభవించబడిన పుష్పమాలను విడచి నట్లు విడువుము. 7

మూ. కాల్యమేతేన సంగ్రామం కరిష్యసి చ వానర,
వీర తే శత్రుబాహుల్యం ఫల్గుతా వా న విద్యతే. 8

ప్ర. అ. వానర=ఓ వాలీ! ఏతేన=వీనితో, కాల్యమ్=ప్రాతఃకాలమునందు, సంగ్రామమ్=యుద్ధమును, కరిష్యసి=చేయగలవు. వీర=వీరుడా! తే= నీకు, శత్రుబాహుల్యమ్=శత్రువుల బాహుల్యము కాని, ఫల్గుతా వా=నీచత్వము గాని, న విద్యతే=లేదు.

తా. ఓ వీరుడా! నీవు ఈతనితో రేపు ప్రాతఃకాలము యుద్ధము చేయవచ్చును. నీకు శత్రువులు చాలామంది లేరు కదా? నీవు దుర్బలుడవు కూడ కావు కదా? (ఈ శ్లోకాన్ని పట్టి సుగ్రీవాదులు వాలితో యుద్ధానికి రాత్రి వచ్చినట్లు తెలియుచున్నది. అది అసంగతము. ప్రాచ్యప్రతిలో ఈ శ్లోకం లేదు) 8

మూ. సహసా తవ నిష్క్రామో మమ తావన్న రోచతే,
శ్రూయతామభిధాస్యామి యన్నిమిత్తం నివార్యసే. 9

ప్ర.అ. సహసా=వెంటనే, తవ=నీయొక్క, నిష్క్రామః=బైటకు వెళ్లుట, మమ=నాకు, న రోచతే తావత్=ఇష్టము కాదు. యన్నిమిత్తమ్=ఎందువలన, నివార్యసే=నివారింపబడుచున్నావో, అభిధాస్యామి=చెప్పెదను; శ్రూయతామ్=వినబడుగాక.

తా. వెంటనే నీ విట్లు బయలుదేరి యుద్ధానికి వెళ్లుట నాకు ఇష్టము కాదు. నిన్ను నేను ఎందుచేత నివారించుచున్నానో చెప్పెదను; వినుము. 9

మూ. పూర్వమాపతితః క్రోధాత్స త్వామాహ్వయతే యుధి,
నిష్పత్య చ నిరస్తస్తే హన్యమానో దిశో గతః. 10

ప్ర.అ. సః= అతడు, పూర్వమ్=పూర్వము, క్రోధాత్=కోపమువలన, ఆపతితః= వచ్చినవాడై, త్వామ్=నిన్ను, యుధి=యుద్ధమునందు, ఆహ్వయతే=పిలచినాడు తే=నీకు(నీచేత), నిష్పత్య=బైటకువెళ్లి, నిరస్తః=ఓడింపబడినవాడై, హన్యమానః= కొట్టబడుచున్నవాడై, దిశః= దిక్కులను గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. ఇంతకు పూర్వమే ఆ సుగ్రీవుడు కోపముతో వచ్చి నిన్ను యుద్ధానికై పిలిచినాడు. నీవు బైటకు వెళ్లి ఆతని కొట్టి ఓడించగా, దిక్కులు పట్టి పారిపోయినాడు. 10

మూ. త్వయా తస్య నిరస్తస్య పీడితస్య విశేషతః,
ఇహైత్య పునరాహ్వానం శఙ్కాం జనయతీవ మే. 11

ప్ర.అ. త్వయా=నీచేత, నిరస్తస్య=ఓడింపబడినవాడు, విశేషతః=విశేషించి, పీడితస్య=పీడించబడినవాడు అయిన, తస్య=ఆతనియొక్క, ఇహ=ఇక్కడికి, పునః=మరల, ఏత్య=వచ్చి, ఆహ్వానమ్=యుద్ధానికై పిలచుట, మే= నాకు, శఙ్కామ్=శంకను, జనయతీవ=కలిగించుచున్నట్లున్నది.

తా. నీవు ఓడించి విశేషముగా పీడించిన తరవాత కూడ ఆతడు మరల ఇక్కడికి వచ్చి నిన్ను యుద్ధానికై పిలచుట నా మనస్సులో శంకను కలిగించుచున్నది. 11

మూ. దర్పశ్చ వ్యవసాయశ్చ యాదృశస్తస్య నర్దతః,
నినాదస్య చ సంరమ్భో నైతదల్పం హి కారణమ్. 12

ప్ర.అ. నర్దతః=ధ్వని చేయుచున్న, తస్య=ఆతనియొక్క, దర్పశ్చ=దర్పము, వ్యవసాయశ్చ=ఉద్యమమూ, నినాదస్య=ధ్వనియొక్క, సంరమ్భః=తొందర, ఏతత్=ఇది, అల్పమ్=అల్పమైన, కారణమ్=కారణము, న హి= కాదు కదా?

తా. గట్టిగా గర్జించుచున్న ఆ సుగ్రీవుని దర్పము, నిశ్చితమైన ప్రయత్నము, ఆతని ధ్వనిలోని తీవ్రత్వము - వీటికి అన్నింటికి ఏదో గొప్ప కారణము ఉండవలెను.

మూ. నాసహాయమహం మన్యే సుగ్రీవం తమిహాగతమ్,
అవష్టబ్ధసహాయశ్చ యమాశ్రిత్యైష గర్జతి. 13

ప్ర.అ. ఇహ=ఇక్కడికి, ఆగతమ్=వచ్చిన, తం సుగ్రీవమ్=ఆ సుగ్రీవుని, అసహాయమ్=సహాయుడు లేనివానినిగా, న మన్యే=తలవను. అవష్టబ్ధసహాయశ్చ=ప్రబలుడైన సహాయుడు కలవాడై, యమ్=ఎవనిని, ఆశ్రిత్య=ఆశ్రయించి, ఏషః=ఈతడు, గర్జతి=గర్జించుచున్నాడో.

తా. ఈ సుగ్రీవుడు ఎవరో సాహాయ్యము చేసేవారు లేకుండగా ఇక్కడికి వచ్చినా డని నేను అనుకొనను. ఆతని కెవ్వరో ప్రబలుడైన సహాయుడు ఉన్నాడు. ఆతని ఆశ్రయ ముండుటచేతనే ఇతడు ఈ విధముగా గర్జించుచున్నాడు. 13

మూ. ప్రకృత్యా నిపుణశ్చైవ బుద్ధిమాంశ్చైవ వానరః,
నాపరీక్షితవీర్యేణ సుగ్రీవః సఖ్యమేష్యతి. 14

ప్ర.అ. ప్రకృత్యా=స్వభావముచేత, నిపుణశ్చైవ=నేర్పు గలవాడు, బుద్ధిమాంశ్చైవ=బుద్ధిమంతుడూ అయిన, వానరః=వానరుడైన, సుగ్రీవః = సుగ్రీవుడు, అపరీక్షితవీర్యేణ=పరీక్షించబడని పరాక్రమము గలవానితో, సఖ్యమ్= స్నేహమును, న ఏష్యతి=పొందడు.

తా. సుగ్రీవుడు సహజముగానే మంచి నేర్పరి. బుద్ధి గలవాడు. ఆతడు ఎదుటివాని పరాక్రమమును పరీక్షించకుండా ఆతనితో సఖ్యము చేసికొనడు.14

మూ. పూర్వమేవ మయా వీర శ్రుతం కథయతో వచః,
అఙ్గదస్య కుమారస్య వక్ష్యామ్యద్య హితం వచః.

ప్ర.అ. వీర=వీరుడా!. పూర్వమేవ=పూర్వమే, కథయతః=(నాకు)చెప్పిన, కుమారస్య=కుమారుడైన, అఙ్గదస్య=అంగదునియొక్క, వచః=వచనము, మయా=నాచేత, శ్రుతమ్=వినబడినది. హితమ్=హితమైన, వచః=ఆ వచనమును, అద్య=ఇప్పుడు, వక్ష్యామి=చెప్పెదను.

తా. వీరుడా! కుమారుడైన అంగదుడు పూర్వమే నాకు చెప్పి ఉన్నాడు. హితమైన ఆ వచనమును ఇప్పుడు చెప్పుచున్నాను. 15

మూ. అఙ్గదస్తు కుమారోఽయం వనాన్తముపనిర్గతః,
ప్రవృత్తిస్తేన కథితా చారై రాసీన్నివేదితా. 16

ప్ర.అ. కుమారః=కుమారుడైన, అయమ్ అఙ్గదః=ఈ అంగదుడు, వనాన్తమ్=వనప్రాంతదేశమును గూర్చి, ఉపనిర్గతః=వెళ్లినాడు. తేన=వానిచేత, ప్రవృత్తిః=వార్త, కథితా=చెప్పబడినది. చారైః=గూఢచారులచేత, నివేదితా= తెలుపబడినది, ఆసీత్=ఆయెను.

తా. కుమారుడైన అంగదుడు అరణ్యము సరిహద్దులకు వెళ్లివచ్చినాడు. ఆత డొక వార్త చెప్పినాడు. ఆతని కీ వార్తను గూఢచారులు చెప్పినారట. 16

మూ. అయోధ్యాధిపతేః పుత్రౌ శూరౌ సమరదుర్జయౌ,
ఇక్ష్వాకూణాం కులే జాతౌ ప్రస్థితౌ రామలక్ష్మణౌ, 17
సుగ్రీవప్రియకామార్థం ప్రాప్తౌ తత్ర దురాసదౌ.

ప్ర.అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశరాజులయొక్క, కులే=కులమునందు, జాతౌ=పుట్టినవారు, అయోధ్యాధిపతేః=అయోధ్యాప్రభువుయొక్క, పుత్రౌ= పుత్రులు, శూరౌ=శూరులు, సమరదుర్జయౌ=యుద్ధములో జయింప శక్యము కానివారు అయిన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ప్రస్థితౌ=(దేశములో) సంచరించుచున్నారు. దురాసదౌ=ఎదిరింప శక్యము కాని వారిద్దరూ, సుగ్రీవప్రియకామార్థమ్= సుగ్రీవుని ప్రియమైన కోరిక తీర్చుటకు, తత్ర=అచటికి, ప్రాప్తౌ=వచ్చినారు.

తా. ఇక్ష్వాకువంశములో పుట్టినవారు, అయోధ్యాధిపతియైన దశరథుని కుమారులు, శూరులు , యుద్ధములో ఎవ్వరిచేత జయింప శక్యము కానివారు అయిన రామలక్ష్మణులు దేశములో సంచరించుచున్నారట. ఎదిరింప శక్యము కాని వారిద్దరూ సుగ్రీవునకు ఇష్టమైన కోరికను తీర్చుటకై అక్కడికి వచ్చినారట.

మూ. స తే భ్రాతుర్హి విఖ్యాతః సహాయో రణకర్మణి, 18
రామః పరబలామర్దీ యుగాన్తాగ్నిరివోత్థితః.

ప్ర.అ. రణకర్మణి=యుద్ధము చేయుటయందు, విఖ్యాతః=ప్రసిద్ధుడు, ఉత్థితః=పైకి లేచిన, యుగాన్తాగ్నిరివ=యుగాంతమునందు అగ్ని వలె, పరబలామర్దీ= శత్రుబలమును మర్దించువాడు అయిన, సః రామః=ఆ రాముడు, తే=నీయొక్క, భ్రాతుః=సోదరునకు, సహాయః హి=సహాయుడు కదా.

తా. రాముడు యుద్ధము చేయుటలో ప్రసిద్ధి చెందినవాడు. విజృంభించిన ప్రలయకాలాగ్ని వలె శత్రుసైన్యమును నశింప చేయువాడు. అట్టి రాముడు నీ సోదరునకు సహాయు డైనాడట. 18

మూ. నివాసవృక్షః సాధూనామాపన్నానాం పరా గతిః, 19
ఆర్తానాం సంశ్రయశ్చైవ యశసశ్చైకభాజనమ్.

ప్ర.అ. సాధూనామ్=సత్పురుషులకు, నివాసవృక్షః=నివాసవృక్షమైనవాడు, ఆపన్నానామ్=ఆపదలు వచ్చినవారికి, పరా=ఉత్తమమైన, గతిః=గతి. ఆర్తానామ్=దుఃఖితులకు, సంశ్రయశ్చైవ=ఆశ్రయ మైనవాడు. యశసః= కీర్తికి, ఏకభాజనమ్=ఒకే ఒక స్థానము.

తా. రాముడు సాధుజనులకు నివాసవృక్షమువంటివాడు. ఆపదలలో ఉన్నవారికి ఉత్తమమైన గతి (రక్షకుడు). దుఃఖితులకు ఆశ్రయమిచ్చువాడు. కీర్తికి ఒకే ఒక స్థానము. 19

మూ. జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః, 20
ధాతూనామివ శైలేన్ద్రో గుణానామాకరో మహాన్.

ప్ర.అ. జ్ఞానవిజ్ఞానసంపన్నః=లౌకికజ్ఞానముతోను శాస్త్రజ్ఞానముతోను కూడినవాడు. పితుః=తండ్రియొక్క, నిదేశే=ఆజ్ఞయందు, స్థితః=ఉన్నవాడు. శైలేన్ద్రః=హిమవత్పర్వతము, ధాతూనామివ=ధాతువులకు వలె, గుణానామ్=గుణములకు, మహాన్=గొప్ప, ఆకరః=గనియైనవాడు.

తా. రాముడు లౌకికజ్ఞానము, శాస్త్రజ్ఞానము కలవాడు. పిత్రాజ్ఞను పాలించువాడు. హిమవత్పర్వతము ధాతువులకు వలె సద్గుణములకు గొప్ప గని వంటివాడు. 20

మూ. తత్ క్షమో న విరోధస్తే సహ తేన మహాత్మనా, 21
దుర్జయేనాప్రమేయేణ రామేణ రణకర్మసు.

ప్ర.అ.తత్=ఆ కారణమువలన, మహాత్మనా=మహాత్ముడు, రణకర్మసు=యుద్ధములందు, దుర్జయేన=జయింప శక్యము కానివాడు, అప్రమేయేణ= ఇంతటివాడని చెప్పుటకు శక్యము కానివాడు అయిన, తేన రామేణ=ఆ రామునితో,

తే=నీకు, విరోధః=విరోధము, న క్షమః= తగినది కాదు.

తా. మహాత్ముడైన రాముడు యుద్ధములో జయింప శక్యము కానివాడు. ఊహింప శక్యము కాని బలపరాక్రమాదులు కలవాడు. అట్టి రామునితో నీకు విరోధము తగదు. 21

మూ. శూర వక్ష్యామి తే కించిన్న చేచ్ఛామ్యభ్యసూయితుమ్, 22
శ్రూయతాం క్రియతాం చైవ తవ వక్ష్యామి యద్ధితమ్.

ప్ర.అ. శూర=శూరుడా! తే=నీకు, కించిత్=కొంచెము, వక్ష్యామి=చెప్పెదను. అభ్యసూయితుమ్=(నీవు)కోపించుటకు, న ఇచ్ఛామి=ఇచ్ఛయించను. తవ=నీకు, హితమ్=హితమైనదానిని, యత్ వక్ష్యామి=దేనిని చెప్ప నున్నానో అది, శ్రూయతామ్=వినబడుగాక. క్రియతాం చ=చేయబడుగాక.

తా. శూరుడా! నీ కొక విషయమును చెప్పెదను. నీవు కోపగించకూడదు. నేను నీకు చెప్పే హితమును విని ఆ విధముగా చేయుము. 22

మూ. యౌవరాజ్యేన సుగ్రీవం తూర్ణం త్వమభిషేచయ, 23
విగ్రహం మా కృథా వీర భ్రాత్రా రాజన్యవీయసా.

ప్ర.అ. వీర=వీరుడా! రాజన్=రాజా! త్వమ్=నీవు, తూర్ణమ్= శీఘ్రముగా, సుగ్రీవమ్=సుగ్రీవుని, యౌవరాజ్యేన=యౌవరాజ్యముతో, అభిషేచయ=అభిషిక్తుని చేయుము. యవీయసా=చిన్నవాడైన, భ్రాత్రా= సోదరునితో, విగ్రహమ్=విరోధమును, మా కృథాః=చేయకుము.

తా. వీరుడ వైన రాజా! నీవు వెంటనే సుగ్రీవుని యౌవరాజ్యాభిషిక్తుని చేయుము. తమ్మునితో విరోధము పెట్టుకొనకుము. 23

మూ. అహం హి తే క్షమం మన్యే తేన రామేణ సౌహృదమ్, 24
సుగ్రీవేణ చ సంప్రీతిం వైరముత్సృజ్య దూరతః.

ప్ర.అ. వైరమ్=వైరమును, దూరతః=దూరముగా, ఉత్సృజ్య=విడచి, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సంప్రీతిమ్=ప్రేమను, తేన రామేణ=ఆ రామునితో, సౌహృదమ్=స్నేహమును, తే=నీకు, క్షమమ్=తగినదానినిగా, అహమ్= నేను, మన్యే=తలచుచున్నాను.

తా. నీవు వైరమును దూరముగా విడచి సుగ్రీవునిపై ప్రేమ చూపవలెననీ, ఆ రామునితో స్నేహము చేసికొనవలె ననీ నేను కోరుచున్నాను. 24

మూ. లాలనీయో హి తే భ్రాతా యవీయానేష వానరః, 25
తత్ర వా సన్నిహస్థో వా సర్వథా బన్ధురేవ తే.

ప్ర.అ. యవీయాన్ భ్రాతా=చిన్న సోదరుడైన, ఏషః వానరః=ఈ సుగ్రీవుడు, తే= నీకు, లాలనీయః హి=లాలనచేయదగినవాడు కదా? తత్ర=అక్కడ, సన్ వా=ఉన్నవాడైనా, ఇహస్థో వా=ఇక్కడ ఉన్నవాడైనా, సర్వథా=అన్ని విధములా, తే=నీకు, బన్ధురేవ=బంధువే.

తా. నీ తమ్ముడైన ఈ సుగ్రీవుడు నీవు లాలన చేయవలసినవాడు. అతడు అక్కడ ఉన్నా, ఇక్కడ ఉన్నా అన్ని విధాలా నీ బంధువే కదా! 25

మూ. న హి తేన సమం బన్ధుం భువి పశ్యామి కఞ్చన, 26
దానమానాదిసత్కారైః కురుష్వ ప్రత్యనన్తరమ్,
వైరమేతత్సముత్సృజ్య తవ పార్శ్వే స తిష్ఠతు. 27

ప్ర.అ. తేన=అతనితో, సమమ్=సమానుడైన, బన్ధుమ్=బంధువును, కంచన =ఎవనినీ, భువి=ఈ భూలోకములో, న పశ్యామి హి=చూడను. ఏతత్= ఈ, వైరమ్=వైరమును, సముత్సృజ్య=విడచి, దానమానాదిసత్కారైః= దానము, గౌరవము మొదలైన సత్కారములచేత, ప్రత్యనన్తరమ్=(సమీపమునందున్నవానినిగా) నీ తరువాతవానినిగా, కురుష్వ=చేయుము. సః=అతడు, తవ = నీయొక్క, పార్శ్వే=పార్శ్వమునందు, తిష్ఠతు=ఉండుగాక.

తా. నీకు సుగ్రీవుని వంటి బంధు వెవ్వడూ ఈ భూలోకములో లేడు. ఈ వైరమును విడచి, ఆతనికి తగు దానము, గౌరవము మొదలైన సత్కారములను చేయుచు నీ తరవాతవానినిగా చేయుము. అతనిని ఎల్లప్పుడు నీ ప్రక్కనే ఉంచుకొనుము. 26,27

మూ. సుగ్రీవో విపులగ్రీవో మహాబన్ధుర్మతస్తవ,
భ్రాతృసౌహృదమాలమ్బ నాన్యా గతిరిహాస్తి తే. 28

ప్ర.అ. విపులగ్రీవః=విశాలమైన కంఠము గల, సుగ్రీవః=సుగ్రీవుడు, తవ= నీకు, మహాబన్ధుః=గొప్ప బంధువుగా, మతః=అంగీకరింపబడినాడు. భ్రాతృసౌహృదమ్=సోదరస్నేహమును, ఆలమ్బ=అవలంబించుము. తే= నీకు, ఇహ=ఇక్కడ, అన్యా గతిః=మరొక మార్గము, నాస్తి=లేదు.

తా. విశాలమైన కంఠము గల సుగ్రీవుని మించిన బంధువు మరొకడు నీకు లేడు. అతని విషయమున సోదరస్నేహము చూపుము. నీకు ఇప్పుడు మరొక మార్గము లేదు. 28

మూ. యది తే మత్ప్రియం కార్యం యది చావైషి మాం హితామ్,
యాచ్యమానః ప్రియత్వేవ సాధు వాక్యం కురుష్వ మే. 29

ప్ర.అ. తే=నీకు, మత్ప్రియమ్=నాకు ప్రియము, కార్యం యది=చేయదగినది అయితే, మామ్=నన్ను, హితామ్=హితురాలినిగా, అవేషి యది =నీవు భావించిన

ట్లయితే, ప్రియత్వేన=ప్రియుడవగుటచేత, యాచ్యమానః= ప్రార్థింపబడుచున్న నీవు, మే=నాయొక్క, వాక్యమ్=వాక్యమును, సాధు= బాగుగా, కురుష్వ=చేయుము.

తా. నీవు నాకు ప్రియమును చేయవలె నని కోరినచో, నేను నీ హితమును కోరేదానను అని భావించినచో, నా మాట ప్రకారము బాగుగా ఆచరించుము. నీవు ప్రియుడ వగుటచే ప్రార్థించుచున్నాను. 29

మూ. ప్రసీద పథ్యం శృణు జల్పితం హి మే
న రోషమేవానువిధాతుమర్హసి,
క్షమో హి తే కోశలరాజసూనువా
న విగ్రహః శక్రసమానతేజసా. 30

ప్ర.అ. ప్రసీద=అనుగ్రహించుము. మే=నాయొక్క, పథ్యమ్= పథ్యమైన, జల్పితమ్=మాటను, శృణు=వినుము. రోషమేవ=కోపమునే, అనువిధాతుమ్=చేయుటకు, న అర్హసి=తగవు. శక్రసమానతేజసా= దేవేంద్రునితో సమానమైన తేజస్సు గల, కోశలరాజసూనునా=రామునితో, తే= నీకు, విగ్రహః=విరోధము, న క్షమః హి=తగినది కాదు కదా!

తా. నన్ను అనుగ్రహించి నేను చెప్పిన హితవాక్యమును వినుము. కోపమును మాత్రమే అనుసరించకుము. దేవేంద్రునితో సమానమైన తేజస్సు గల రామునితో నీకు విరోధము తగదు. 30

మూ. తదా హి తారా హితమేవ వాక్యం
తం వాలినం పథ్యమిదం బభాషే,
న రోచతే తద్వచనం హి తస్య
కాలాభిపన్నస్య వినాశకాలే. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చదశః సర్గః.

ప్ర.అ. తదా=అప్పుడు, తారా=తార, తం వాలినమ్=ఆ వాలిని గూర్చి, హితమ్=లాభకరము, పథ్యమ్=శ్రేయస్కరము అయిన, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, బభాషే=పలికెను. కాలాభిపన్నస్య=కాలముచేత ఆక్రమించబడిన, తస్య=ఆతనికి, వినాశకాలే=వినాశకాలమునందు, తత్ వచనమ్=ఆ వచనము, న రోచతే=ఇష్టము కాలేదు.

తా. అప్పుడు తార పలికిన మాటలు లాభకరములు, మంచిని చేయునవి అయినను వినాశకాలము దాపురించుటచే వాలికి ఆ మాటలు ఇష్టము కాలేదు.31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పదునైదవ సర్గ సమాప్తము.

# అథ షోడశః సర్గః

*[తార మాటలు లెక్కచేయక వాలి బైటకు వచ్చి సుగ్రీవునితో ఘోరయుద్ధము చేయుట; రాముని బాణము వక్షస్థలమును భేదించగా నేలపై కూలుట]*

మూ. తామేవం బ్రువతీం తారాం తారాధిపనిభాననామ్,
వాలీ నిర్భర్త్సయామాస వచనం చేదమబ్రవీత్. 1

ప్ర.అ. ఏవమ్=ఇట్లు, బ్రువతీమ్=పలుకుచున్న, తారాధిపనిభాననామ్=చంద్రునితో సమానమైన ముఖము గల, తాం తారామ్=ఆ తారను, వాలీ=వాలి, నిర్భర్త్సయామాస=భయపెట్టెను (కసరికొనెను). ఇదమ్=ఈ, వచనం చ=వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. ఈ విధముగా పలుకుచున్న చంద్రునితో సమానమైన ముఖము గల తారను కసరికొనుచు వాలి ఇట్లు పలికెను. 1

మూ. గర్జతోఽస్య సుసంరబ్ధం భ్రాతుః శత్రోర్విశేషతః,
మర్షయిష్యామి కేనాపి కారణేన వరాననే. 2

ప్ర.అ. వరాననే=మంచి ముఖము గలదానా! భ్రాతుః=సోదరుడు, విశేషతః= విశేషించి, శత్రోః=శత్రువు అయిన, అస్య=ఇతడు, సుసంరబ్ధమ్=చాల తొందరగా, గర్జతః=గర్జించుచుండగా, కేనాపి కారణేన=ఏ కారణముచేతనైనా, మర్షయిష్యామి=సహించెదనా?

తా. సుందరమైన ముఖము గలదానా! నా సోదరుడు, విశేషించి నా శత్రువూ అయిన ఇతడు తొందర చేయుచు గర్జించుచుండగా, నేను ఏకారణముచేతనైనా సహించగలనా? 2

మూ. అధర్షితానాం శూరాణాం సమరేష్వనివర్తినామ్,
ధర్షణామర్షణం భీరు మరణాదతిరిచ్యతే. 3

ప్ర.అ. భీరు=భయస్వభావము గలదానా! సమరేషు=యుద్ధములలో, అనివర్తినామ్=వెనుకకు తిరగనివారు, అధర్షితానామ్=ఎదిరింపబడనివారు అయిన, శూరాణామ్=శూరులకు, ధర్షణామర్షణమ్=ఎదిరించుటను సహించుట, మరణాత్=మరణము కంటె, అతిరిచ్యతే=అధిక మగుచున్నది.

తా. భయస్వభావము గలదానా! యుద్ధములో వెన్ను చూపనివారు, ఎవరిచేతా ఎదిరింపబడనివారు అయిన శూరులకు, శత్రువు అవమానకరముగా పిలుచుచుండగా ఓర్పు వహించుట మరణము కంటె కూడ గొప్పది. 3

మూ. సోఢుం న చ సమర్థోఽహం యుద్ధకామస్య సంయుగే,
సుగ్రీవస్య చ సంరమ్భం హీనగ్రీవస్య గర్జతః. 4

ప్ర.అ. అహమ్=నేను, సంయుగే=యుద్ధరంగమునందు, యుద్ధకామస్య=యుద్ధమును కోరుచున్న, హీనగ్రీవస్య=చెడ్డ కంఠము గల, గర్జతః= గర్జించుచున్న, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, సంరమ్భమ్=హడావిడిని, సోఢుమ్=సహించుటకు, న సమర్థః = సమర్థుడను కాను.

తా. చెడ్డ కంఠము గల సుగ్రీవుడు, యుద్ధరంగములో యుద్ధమును కోరుచు, గర్జించుచు చేయుచున్న హడావిడిని నేను సహించజాలను. 4

మూ. న చ కార్యో విషాదస్తే రాఘవం ప్రతి మత్కృతే,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ కథం పాపం కరిష్యతి. 5

ప్ర.అ. మత్కృతే=నా విషయమున, రాఘవం ప్రతి=రాముని గూర్చి, తే=నీకు, విషాదః=దుఃఖము, న కార్యః=చేయదగినది కాదు. ధర్మజ్ఞశ్చ= ధర్మములు తెలిసినవాడు, కృతజ్ఞశ్చ=కృతజ్ఞుడు అయిన ఆతడు, పాపమ్= పాపమును, కథమ్=ఎట్లు, కరిష్యతి=చేయును.

తా. రాముని గూర్చి నీవు నా విషయమునందు దిగులు చెందకుము. ధర్మములు తెలిసినవాడు, కృతజ్ఞుడు అయిన రాముడు పాపము ఎట్లు చేయును?

మూ. నివర్తస్వ సహ స్త్రీభిః కథం భూయోఽనుగచ్ఛసి,
సౌహార్దం దర్శితం తావన్మయి భక్తిస్త్వయా కృతా. 6

ప్ర.అ. స్త్రీభిః సహ=ఇతరస్త్రీలతో కూడ, నివర్తస్వ=వెనుకకు వెళ్లుము. భూయః=మరల, కథమ్= ఎందుకు, అనుగచ్ఛసి=నన్ను అనుసరించి వచ్చుచున్నావు? త్వయా=నీచేత, సౌహార్దమ్=స్నేహము, దర్శితం తావత్ = చూపబడినది. మయి=నాయందు, భక్తిః= భక్తి, కృతా=చేయబడినది.

తా. ఇతరస్త్రీలతో కలిసి వెనుకకు వెళ్లుము. ఇంకా నా వెనుకనే వచ్చుచున్నావెందుకు? నాపై నీ కున్న స్నేహమును, భక్తిని చూపినావు; చాలును. 6

మూ. ప్రతియోత్స్యామ్యహం గత్వా సుగ్రీవం జహి సంభ్రమమ్,
దర్పం చాస్య వినేష్యామి న చ ప్రాణైర్విమోక్ష్యతే. 7

ప్ర.అ. అహమ్ =నేను, గత్వా =వెళ్ళి, సుగ్రీవమ్ = సుగ్రీవుని, ప్రతియోత్స్యామి =ఎదిరించి యుద్ధము చేసెదను. సంభ్రమమ్ =భయమును, జహి =చంపుము (విడువుము). అస్య = ఇతనియొక్క, దర్పమ్ =దర్పమును, వినేష్యామి=తొలగించెదను. ప్రాణైః =ప్రాణములచేత, న విమోక్ష్యతే

=విడిపింపబడడు.

తా. నేను వెళ్లి సుగ్రీవునితో యుద్ధము చేసెదను. భయపడకుము. వాని గర్వమును మాత్రమే అణచివేసెదను కాని ప్రాణములు తీయను. 7

మూ. అహం హ్యాజిస్థితస్యాస్య కరిష్యామి యదీప్సితమ్,
వృక్షైర్ముష్టిప్రహారైశ్చ పీడితః ప్రతియాస్యతి. 8

ప్ర.అ. అహమ్=నేను, ఆజిస్థితస్య=యుద్ధములో ఉన్న, అస్య =ఇతనికి, యత్ =ఏది, ఈప్సితమ్ =ఇష్టమో దానిని , కరిష్యామి =చేసెదను. వృక్షైః =వృక్షములచేతను, ముష్టిప్రహారైశ్చ =పిడికిళ్ళ దెబ్బలచేతను, పీడితః =పీడింపబడినవాడై, ప్రతియాస్యతి =తిరిగి వెళ్లగలడు.

తా. నేను యుద్ధరంగమునకు వచ్చిన ఆ సుగ్రీవుడు కోరుకొన్న యుద్ధమును ఇచ్చెదను. వృక్షములచేతను, గ్రుద్దులచేతను పీడింపబడినవాడై తిరిగి వెళ్లగలడు. 8

మూ. న మే గర్వితమాయస్తం సహిష్యతి దురాత్మవాన్ , 9
కృతం తారే సహాయత్వం దర్శితం సౌహృదం మయి.

ప్ర.అ. దురాత్మవాన్ = దుష్టబుద్ధి గల ఆ సుగ్రీవుడు, మే =నాయొక్క, గర్వితమ్ =దర్పమును, ఆయస్తమ్ =ప్రయత్నమును, న సహిష్యతి =సహించడు. తారే =తారా! సహాయత్వమ్ =బుద్ధిసాహాయ్యము, కృతమ్ =చేయబడినది. మయి =నాయందు, సౌహృదమ్ =స్నేహము, దర్శితమ్ =చూపబడినది.

తా. దుర్బుద్ధియైన ఆ సుగ్రీవుడు నా దర్పమును, నా ప్రయత్నమును (యుద్ధపద్ధతిని) సహింపజాలడు. నీవు నాకు బుద్ధిసాహాయ్యము చేసితివి. నా మీద నీకున్న ప్రేమను చూపితివి. ఇక చాలును. 9

మూ. శాపితాపి మమ ప్రాణైర్నివర్తస్వ జనేన చ,
అలం జిత్వా నివర్తిష్యే తమహం భ్రాతరం రణే. 10

ప్ర.అ. మమ =నాయొక్క, ప్రాణైః = ప్రాణములచేత, శాపితా అపి =ఒట్టు పెట్టబడుచున్నావు. జనేన =ఇతరస్త్రీజనముతో, నివర్తస్వ = మరలుము. అహమ్ =నేను, రణే =యుద్ధమునందు, తం భ్రాతరమ్ =ఆ సోదరుని, జిత్వా =జయించి, అలమ్ =శీఘ్రముగా, నివర్తిష్యే = మరలిరాగలను.

తా. నా ప్రాణాలమీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. నీవు ఇతర స్త్రీలతో కలిసి లోనికి వెళ్లుము. యుద్ధములో నేను నా సోదరుని జయించి శీఘ్రముగా తిరిగి వచ్చెదను. 10

మూ. తం తు తారా పరిష్వజ్య వాలినం ప్రియవాదినీ,
చకార రుదతీ మన్దం దక్షిణా సా ప్రదక్షిణమ్. 11

ప్ర.అ. ప్రియవాదినీ =ప్రియముగా మాటలాడునది, దక్షిణా= నేర్పు గలదీ అయిన, సా తారా = ఆ తార, తం వాలినమ్ = ఆ వాలిని, పరిష్వజ్య =కౌగలించుకొని, మన్దమ్ =మందముగా, రుదతీ = ఏడ్చుచున్నదై, ప్రదక్షిణమ్ =ప్రదక్షిణమును, చకార =చేసెను.

తా. ప్రియముగా మాటలాడేది, నేర్పు కలది అయిన అ తార ఆ వాలిని కౌగలించుకొని మందముగా ఏడ్చుచు ఆతనికి ప్రదక్షిణమును చేసెను.11

మూ. తతః స్వస్త్యయనం కృత్వా మన్త్రవిద్విజయైషిణీ,
అన్తఃపురం సహ స్త్రీభిః ప్రవిష్టా శోకమోహితా. 12

ప్ర.అ.తతః =అటుపిమ్మట, మన్త్రవిత్ =స్వస్త్యయనమంత్రములను ఎరిగిన ఆమె, విజయైషిణీ = విజయమును కోరుచు, స్వస్త్యయనమ్ = స్వస్త్యయనమును, కృత్వా =చేసి, శోకమోహితా =శోకముచేత మోహితురాలై, స్త్రీభిః సహ= స్త్రీలతో కూడ, అన్తఃపురమ్ = అంతఃపురమును, ప్రవిష్టా =ప్రవేశించినది.

తా. స్వస్త్యయనాది మంత్రములు తెలిసిన ఆ తార భర్తవిజయమును కోరుచు ఆతనికి స్వస్త్యయనము చేసి, దుఃఖాక్రాంతురాలై, ఇతరస్త్రీలతో కూడ అంతఃపురములోనికి వెళ్లెను. 12

మూ. ప్రవిష్టాయాం తు తారాయాం సహ స్త్రీభిః స్వమాలయమ్,
నగర్యా నిర్యయౌ క్రుద్ధో మహాసర్ప ఇవ శ్వసన్. 13

ప్ర.అ. తారాయామ్ =తార, స్త్రీభిః సహ=స్త్రీలతో కూడ, స్వమ్ = తన సంబంధమైన, ఆలయమ్ =గృహమును, ప్రవిష్టాయామ్ = ప్రవేశించిన దగుచుండగా, కుద్ధః =కోపించిన ఆ వాలి, మహాసర్ప ఇవ =గొప్ప సర్పము వలె, శ్వసన్ =నిట్టూర్చుచు, నగర్యాః = నగరమునుండి, నిర్యయౌ = బయలువెడలెను.

తా. తార, స్త్రీలు అంతఃపురములోనికి వెళ్లిన పిమ్మట కోపించిన ఆ వాలి మహాసర్పము వలె బుసలు కొట్టుచు నగరమునుండి బైటకు వచ్చెను. 13

మూ. స నిఃశ్వస్య మహారోషో వాలీ పరమవేగవాన్,
సర్వతశ్చారయన్ దృష్టిం శత్రుదర్శనకాఙ్క్షయా. 14

ప్ర.అ. మహారోషః =గొప్ప కోపము గల, సః వాలీ =ఆ వాలి, పరమవేగవాన్=గొప్ప వేగము గలవాడై, నిఃశ్వస్య =నిట్టూర్చి, శత్రుదర్శనకాఙ్క్షయా =శత్రువును చూడవలె నను కోరికతో, సర్వతః= నలు వైపులా, దృష్టిమ్ =దృష్టిని, చారయన్ =ప్రసరింప చేయుచు (నిలచెను).

తా. మహావేగము గల ఆ వాలి మహారోషముతో బుసలు కొట్టుచు శత్రువును చూచుటకై దృష్టిని నలుమూలలా ప్రసరింపచేయుచు నిలచెను. 14

మూ. స దదర్శ తతః శ్రీమాన్ సుగ్రీవం హేమపిఙ్గలమ్,
సుసంవీతమవష్టబ్ధం దీప్యమానమివానలమ్. 15

ప్ర.అ. తతః =పిమ్మట, శ్రీమాన్ =శోభ గల, సః=ఆ వాలి, హేమపిఙ్గలమ్ =బంగారము వలె పచ్చగా ఉన్నవాడు, సుసంవీతమ్ = బాగా వస్త్రముచేత కట్టబడినవాడు, అవష్టబ్ధమ్ =బింకముగా ఉన్నవాడు, దీప్యమానమ్ = ప్రజ్వలించుచున్న, అనలమ్ ఇవ=అగ్నివలె ఉన్నవాడు అయిన, సుగ్రీవమ్= సుగ్రీవుని, దదర్శ =చూచెను.

తా. పిమ్మట శోభాసంపన్నుడైన ఆ వాలి బంగారము వలె పచ్చగా ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న సుగ్రీవుని చూచెను. అతడు వస్త్రము గట్టిగా బిగించి బింకముతో నిలబడి ఉండెను. 15

మూ. తం స దృష్ట్వా మహాబాహుః సుగ్రీవం పర్యవస్థితమ్,
గాఢం పరిదధే వాసో వాలీ పరమకోపనః. 16

ప్ర.అ. పరమకోపనః = చాల కోపించువాడు, మహాబాహుః =గొప్ప బాహువులు గలవాడు అయిన, సః వాలీ =ఆ వాలి, పర్యవస్థితమ్ = సమీపమునందున్న, తం సుగ్రీవమ్ =ఆ సుగ్రీవుని, దృష్ట్వా =చూచి, వాసః= వస్త్రమును, గాఢమ్ =బిగువుగా, పరిదధే =కట్టెను.

తా. గొప్ప బాహువులు గలవాడు, చాల కోపము కలవాడు అయిన ఆ వాలి, దగ్గరనే ఉన్న ఆ సుగ్రీవుని చూచి వస్త్రమును గట్టిగా బిగించి కట్టుకొనెను. 16

మూ. స వాలీ గాఢసంవీతో ముష్టిముద్యమ్య వీర్యవాన్,
సుగ్రీవమేవాభిముఖో యయౌ యోద్ధుం కృతక్షణః. 17

ప్ర.అ. గాఢసంవీతః =గట్టిగా వస్త్రము కట్టినవాడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు అయిన, సః వాలీ =ఆ వాలి, ముష్టిమ్ =పిడికిలిని, ఉద్యమ్య =ఎత్తి, యోద్ధుమ్ =యుద్ధము చేయుటకు, కృతక్షణః =చేయబడిన సమయము గలవాడై, సుగ్రీవమ్ =సుగ్రీవుని గూర్చి, అభిముఖః =అభిముఖుడై, యయౌ =వెళ్లెను.

తా. పరాక్రమవంతుడైన ఆ వాలి వస్త్రము గట్టిగా బిగించి, పిడికిలి ఎత్తి, యుద్ధముచేయుటకై అవకాశము కల్పించుకొని సుగ్రీవుని వైపు వెళ్లెను. 17

మూ. శ్లిష్టం ముష్టిం సముద్యమ్య సంరబ్ధతరమాగతః,
సుగ్రీవోఽపి సముద్దిశ్య వాలినం హేమమాలినమ్. 18

ప్ర.అ. సుగ్రీవః అపి=సుగ్రీవుడు కూడ, శ్లిష్టమ్ =బిగించబడిన, ముష్టిమ్ =పిడికిలిని, సముద్యమ్య =ఎత్తి, హేమమాలినమ్ = బంగారు మాల గల, వాలినమ్ =వాలిని, సముద్దిశ్య =ఉద్దేశించి, సంరబ్ధతరమ్ =మిక్కిలి తొందరగా, ఆగతః =వచ్చినాడు.

తా. సుగ్రీవుడు కూడ గట్టిగా బిగించిన పిడికిలి ఎత్తి, బంగారు మాల ధరించిన వాలి వైపు తొందరగా వెళ్లెను. 18

మూ. తం వాలీ క్రోధతామ్రాక్షం సుగ్రీవం రణకోవిదమ్,
ఆపతన్తం మహావేగమిదం వచనమబ్రవీత్. 19

ప్ర.అ. వాలీ =వాలి, క్రోధతామ్రాక్షమ్ =కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడు, రణకోవిదమ్ =యుద్ధము తెలిసినవాడు, మహావేగమ్ =గొప్ప వేగము గలవాడు అయిన, ఆపతన్తమ్ = వచ్చిపడుచున్న, తం సుగ్రీవమ్ =ఆ సుగ్రీవుని గూర్చి, ఇదం వచనమ్ =ఈ వచనమును, అబ్రవీత్ =పలికెను.

తా.కోపము చేత నేత్రములు ఎఱ్ఱబడి మహావేగముతో మీదికి వచ్చుచున్న, యుద్ధములో సమర్థుడైన ఆ సుగ్రీవునితో వాలి ఇట్లు పలికెను. 19

మూ. ఏష ముష్టిర్మహాన్బద్ధో గాఢః సునియతాఙ్గులిః,
మయా వేగవిముక్తస్తే ప్రాణానాదాయ యాస్యతి. 20

ప్ర.అ. సునియతాఙ్గులిః= బాగా బిగించబడిన వ్రేళ్ళు గల, గాఢః =బిగువుగా ఉన్న, ఏషః =ఈ, బద్ధః= కట్టబడిన, మహాన్ =గొప్పదైన, ముష్టిః= ముష్టి, మయా =నాచేత, వేగవిముక్తః =వేగముగా విడవబడినదై, తే =నీయొక్క, ప్రాణాన్ =ప్రాణములను, ఆదాయ =గ్రహించి, యాస్యతి =వెళ్లగలదు.

తా.వ్రేళ్ళు బాగా బిగించి, ఈ పెద్ద పిడికిలిని గట్టిగా కట్టినాను. దీనిని నేను నీమీద ప్రయోగించెదను. ఇది నీ ప్రాణములను తీసివేయగలదు. 20

మూ. ఏవముక్తస్తు సుగ్రీవః క్రుద్ధో వాలిన మబ్రవీత్,
తవ చైష హరన్ ప్రాణాన్ ముష్టిః పతతు మూర్ధని. 21

ప్ర.అ. ఏవమ్ =ఇట్లు, ఉక్తః= పలకబడిన, సుగ్రీవః =సుగ్రీవుడు, క్రుద్ధః =కోపించినవాడై, వాలినమ్ =వాలిని గూర్చి, అబ్రవీత్ =పలికెను. ఏషః =ఈ, ముష్టిః =పిడికిలి, తవ = నీయొక్క, ప్రాణాన్ =ప్రాణములను, హరన్ =హరించుచు, మూర్ధని = శిరస్సుమీద, పతతు =పడుగాక.

తా. వాలి మాటలు విని సుగ్రీవు డాతనితో ఇట్లు పలికెను. నా

పిడికిలి నీ తలపై పడి నీ ప్రాణములను హరించగలదు. 21

మూ. తాడితస్తేన సంక్రుద్ధః సమభిక్రమ్య వేగతః,
అభవచ్ఛోణితోద్గారీ సాపీడ ఇవ పర్వతః. 22

ప్ర.అ. వేగతః =వేగముతో, సమభిక్రమ్య=సమీపించి, తేన =ఆ వాలి చేత, తాడితః =కొట్టబడిన, సంకుద్ధః =కోపించిన సుగ్రీవుడు, శోణితోద్గారీ =రక్తమును స్రవించుచు, సాపీడః =సెలయేరుతో కూడిన, పర్వతః ఇవ = పర్వతము వలె, అభవత్ =ఆయెను.

తా. వాలి సమీపించి కొట్టగా ఆ సుగ్రీవుడు కోపించి, రక్తమును స్రవించుచు సెలయేరు ప్రవహించుచున్న పర్వతము వలె ఉండెను. 22

మూ. సుగ్రీవేణ తు నిఃశఙ్కం సాలముత్పాట్య తేజసా,
గాత్రేష్వభిహతో వాలీ వజ్రేణేవ మహాగిరిః. 23

ప్ర.అ. సుగ్రీవేణ తు =సుగ్రీవునిచేతనైతే, తేజసా =తేజస్సుచేత, నిఃశఙ్కమ్ =సందేహము లేకుండగా, సాలమ్ =సాలవృక్షమును, ఉత్పాట్య =పెరికి, వాలీ =వాలి, వజ్రేణ =వజ్రముచేత, మహాగిరిః ఇవ= గొప్ప పర్వతము వలె, గాత్రేషు =అవయవములయందు, అభిహతః =కొట్టబడెను.

తా. సుగ్రీవుడు బలముచేత ఒక సాలవృక్షమును పెరికి, దానితో వజ్రముతో మహాపర్వతమును కొట్టినట్లు వాలిని, ఏ మాత్రము సంశయించక ఆతని అవయవములమీద కొట్టెను. 23

మూ. స తు వాలీ ప్రచలితః సాలతాడనవిహ్వలః,
గురుభారభరాక్రాన్తా నౌః ససార్థేవ సాగరే. 24

ప్ర.అ. సాలతాడనవిహ్వలః = సాలవృక్షముతో కొట్టుటచేత వ్యాకులుడైన, సః =ఆ, వాలీ తు =వాలియైతే, సాగరే =సముద్రమునందు, గురుభారభరాక్రాన్తా =అధికమైన వస్తువుల భారముచేత ఆక్రమింపబడిన, ససార్థా =వర్తకుల గుంపుతో కూడిన, నౌః ఇవ =ఓడ వలె, ప్రచలితః =కదలిపోయెను.

తా. సాలవృక్షముతో కొట్టుటచే వ్యాకులత్వము చెందిన ఆ వాలి, అధికమైన వస్తువుల భారముచేత, వర్తకులతో నిండి ఉన్న ఓడ సముద్రములో ఇటు అటు కదిలిపోయి నట్లు కదిలిపోయెను. 24

మూ. తౌ భీమబలవిక్రాన్తౌ సుపర్ణసమవేగితౌ,
ప్రయుద్ధౌ ఘోరవపుషౌ చన్ద్రసూర్యావివామ్బరే.
పరస్పరమమిత్రఘ్నౌ ఛిద్రాన్వేషణతత్పరౌ. 25

ప్ర.అ. భీమబలవిక్రాన్తౌ =భయంకరమైన బలము పరాక్రమము కలవారు,

సుపర్ణసమవేగితౌ =గరుత్మంతునితో సమానమైన వేగముకలవారు, ఘోరవపుషౌ =భయంకరమైన శరీరములు కలవారు, పరస్పరమ్ =పరస్పరము, ఛిద్రాన్వేషణతత్పరౌ =ఛిద్రములను అన్వేషించుటకు ఆసక్తి గలవారు, అమిత్రఘ్నౌ =శత్రువులను సంహరించేవారు అయిన, తౌ =ఆ వాలిసుగ్రీవులు, అమ్బరే =ఆకాశమందు, చన్ద్రసూర్యావివ = చంద్రసూర్యులు వలె, ప్రయుద్ధౌ =తీవ్రమైన యుద్ధము కలవారైరి.

తా. భయంకరమైన బలపరాక్రమములు, గరుత్మంతుని వంటి వేగము, భయంకరములైన శరీరములు గల ఆ శత్రుసంహారకులైన వాలిసుగ్రీవులు, ఒకరి లోపమును ఒకరు వెదుకుచు, ఆకాశమునందు చంద్రసూర్యులు వలె తీవ్రముగా యుద్ధము చేసిరి. 25

మూ. తతోఽవర్ధత వాలీ తు బలవీర్యసమన్వితః,
సూర్యపుత్రో మహావీర్యః సుగ్రీవః పరిహీయత. 26

ప్ర.అ.తతః =అటు పిమ్మట, బలవీర్యసమన్వితః =బలవీర్యములతో కూడినవాడై, వాలీ = వాలి, అవర్ధత =వృద్ధి పొందెను. మహావీర్యః =గొప్ప పరాక్రమము గల, సూర్యపుత్రః =సూర్యపుత్రుడైన, సుగ్రీవః =సుగ్రీవుడు, పరిహీయత =తగ్గిపోయెను.

తా.అప్పుడు వాలి బలపరాక్రమములు వృద్ధి చెందగా, మహాపరాక్రమశాలి, సూర్యపుత్రుడు అయిన సుగ్రీవుని బలపరాక్రమములు తగ్గిపోయెను. 26

మూ. వాలినా భగ్నదర్పస్తు సుగ్రీవో మన్దవిక్రమః, 27
వాలినం ప్రతి సామర్షో దర్శయామాస లాఘవమ్.

ప్ర.అ. వాలినా =వాలిచేత, భగ్నదర్పః= భగ్నమైన దర్పము గల, సుగ్రీవః = సుగ్రీవుడు, మన్దవిక్రమః =మందమైన పరాక్రమము గలవాడై, సామర్షః =కోపముతో కూడినవాడై, వాలినం ప్రతి =వాలిని గూర్చి, లాఘవమ్ =శీఘ్రుత్వమును, దర్శయామాస =చూపెను.

తా. వాలి దర్పమును భగ్నము చేయగా పరాక్రమము మంద మైపోయిన సుగ్రీవుడు వాలిపై కోపముతో మరల యుద్ధములో శీఘ్రుత్వమును (నేర్పును) చూపెను. 27

మూ. వృక్షైః సశాఖైః శిఖరైర్వజ్రకోటినిభైర్నఖైః, 28
ముష్టిభిర్జానుభిః పద్భిర్బాహుభిశ్చ పునః పునః,
తయోర్యుద్ధ మభూద్ఘోరం వృత్రవాసవయోరివ. 29

ప్ర.అ. తయోః= వారిద్దరికీ, సశాఖైః =కొమ్మలతో కూడిన, వృక్షైః = వృక్షములతోను, శిఖరైః =శిఖరములతోను, వజ్రకోటినిభైః=వజ్రాయుధాగ్రములతో

సమానములైన, నఖైః=గోళ్లతోను, ముష్టిభిః=పిడికిళ్లతోను, జానుభిః=మోకాళ్ళతోను, పద్భిః = పాదములతోను, బాహుభిః =బాహువులతోను, వృత్రవాసవయోరివ =వృత్రాసురునకు దేవేంద్రునకు వలె, పునః పునః= మాటిమాటికి , ఘోరమ్= ఘోరమైన, యుద్ధమ్ =యుద్ధము, అభూత్ =ఆయెను.

తా. వారిద్దరూ మాటిమాటికి కొమ్మ లున్న చెట్లతోను, శిఖరముల తోను, వజ్రాయుధము అగ్రభాగముతో సమానములైన గోళ్ళతోను, పిడికిళ్లతోను, మోకాళ్లతోను, పాదాలతోను, బాహువులతోను కొట్టుకొనుచు, వృత్రాసురుడు, దేవేంద్రుడూ వలె, ఘోరముగా యుద్ధము చేసిరి. 28, 29

మూ. తౌ శోణితాక్తౌ యుధ్యేతాం, వానరౌ వనచారిణౌ,
మేఘావివ మహాశబ్దైస్తర్జమానౌ పరస్పరమ్. 30

ప్ర.అ. వనచారిణౌ =వనమునందు సంచరించే, తౌ వానరౌ =ఆ వానరు లిద్దరూ, శోణితాక్తౌ =రక్తముచేత తడపబడినవారై, పరస్పరమ్ = పరస్పరము, తర్జమానౌ =భయపెట్టుచున్నవారై, మహాశబ్దైః = గొప్ప శబ్దములతో కూడిన, మేఘావివ =మేఘముల వలె, యుధ్యేతామ్ =యుద్ధము చేసిరి.

తా. వనములో సంచరించే ఆ వానరు లిద్దరూ, రక్తముచేత తడిసి, ఒకరి నొకరు జడిపించుచు, పెద్ద ఉరుములు గల మేఘముల వలె, యుద్ధము చేసిరి. 30

మూ. హీయమానమథాపశ్యత్సుగ్రీవం వానరేశ్వరమ్,
ప్రేక్షమాణం దిశశ్చైవ రాఘవః స ముహుర్ముహుః. 31

ప్ర.అ. అథ =అటు పిమ్మట, సః రాఘవః =ఆ రాముడు, ముహుర్ముహుః =మాటిమాటికి, దిశః =దిక్కులను, ప్రేక్షమాణమ్ =చూచుచున్న, వానరేశ్వరమ్ = వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుని, హీయమానమ్ = ఓడిపోవుచున్నవానినిగా, అపశ్యత్ =చూచెను.

తా. అప్పుడు వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు దిక్కుల వైపు చూచుచుండెను. అందుచే అతడు ఓడిపోవుచున్నట్లుగా రాముడు గ్రహించెను. 31

మూ. తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరమ్,
స శరం వీక్షతే వీరో వాలినో వధకాఙ్క్షయా. 32

ప్ర.అ.తతః =అటుపిమ్మట, మహాతేజాః= గొప్ప తేజస్సు కలవాడు, వీరః =వీరుడు అయిన, సః రామః = ఆ రాముడు, హరీశ్వరమ్ = సుగ్రీవుని, ఆర్తమ్ =పీడింపబడినవానినిగా, దృష్ట్వా =చూచి, వాలినః =వాలియొక్క, వధకాఙ్క్షయా =వధయందు కోరికచేత, శరమ్ =బాణమును, వీక్షతే =చూచుచున్నాడు (చూచెను).

తా. అప్పుడు మహాతేజఃశాలి, వీరుడు అయిన రాముడు, సుగ్రీవుడు కష్టములో ఉన్నట్లు తెలిసికొని, వాలిని చంపుటకు ఉపయోగించే బాణముకొరకై చూచెను. 32

మూ. తతో ధనుషి సంధాయ శరమాశీవిషోపమమ్,
పూరయామాస తచ్చాపం కాలచక్రమివాన్తకః. 33

ప్ర-అ-తతః=అటు పిమ్మట, ఆశీవిషోపమమ్=సర్పముతో సమానమైన, శరమ్=బాణమును, ధనుషి=ధనస్సునందు, సంధాయ=సంధించి, అన్తకః=యముడు, కాల చక్రమివ=కాలచక్ర మనే ఆయుధమును వలె, తత్ చాపమ్=ఆ ధనస్సును, పూరయామాస=లాగెను.

తా. పిమ్మట రాముడు సర్పము వంటి శరమును ధనస్సుమీద సంధించి ఆ ధనస్సును, యముడు కాలచక్ర మనే ఆయుధమును లాగి నట్లు పూర్తిగా లాగెను. 33

మూ. తస్య జ్యాతలఘోషేణ త్రస్తాః పత్త్రిరథేశ్వరాః,
ప్రదుద్రువుర్మృగాశ్చైవ యుగాన్త ఇవ మోహితాః. 34

ప్ర-అ-తస్య=ఆ ధనస్సుయొక్క, జ్యాతలఘోషేణ=నారియొక్క ధ్వని చేత, త్రస్తాః= భయపడిన, పత్త్రరథేశ్వరాః=పక్షిశ్రేష్ఠములు, మృగాశ్చైవ=మృగములు, యుగాన్తే= ప్రలయకాలమునందు, మోహితాః ఇవ=భయపెట్టబడిన ప్రాణులు వలె, ప్రదుద్రువుః=పారిపోయినవి.

తా. ఆ ధనస్సు నారివలన కలిగిన శబ్దమును విని భయపడి శ్రేష్ఠములైన పక్షులు, మృగములు కూడ, ప్రలయకాలమునందు భయపడిన ప్రాణుల వలె పారిపోయినవి. 34

మూ. ముక్తస్తు వజ్రనిర్ఘోషః ప్రదీప్తాశనిసన్నిభః,
రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః. 35

ప్ర-అ. రాఘవేణ=రామునిచేత, ముక్తః=విడవబడిన, వజ్రనిర్ఘోషః=వజ్రము వంటి ధ్వని గల, ప్రదీప్తాశనిసన్నిభః=మండుచున్న పిడుగుతో సమానమైన, మహాబాణః=గొప్ప బాణము, వాలివక్షసి=వాలియొక్క వక్షఃస్థలమునందు, పాతితః=పడవేయబడినది.

తా. వజ్రము వంటి ధ్వని గలది, ప్రజ్వలించుచున్న పిడుగు వలె ఉన్నదీ అయిన గొప్ప బాణము, రామునిచే విడవబడినదై వాలి వక్షస్థలము మీద పడినది. 35

మూ. తతస్తేన మహాతేజా వీర్యయుక్తః కపీశ్వరః,
వేగేనాభిహతో వాలీ నిపపాత మహీతలే. 36

ప్ర.అ. తతః =అటుపిమ్మట, మహాతేజాః =గొప్ప తేజస్సు కలవాడు, వీర్యయుక్తః =పరాక్రమముతో కూడినవాడు, కపీశ్వరః =వానరరాజు అయిన, వాలీ =వాలి, తేన =ఆ బాణముచేత, వేగేన = వేగముచేత, అభిహతః =కొట్టబడినవాడై, మహీతలే =నేలమీద, నిపపాత =పడెను.

తా. గొప్ప తేజస్సు పరాక్రమము గల, వానరరాజైన ఆ వాలి ఆ బాణముచేత గొప్ప వేగముతో కొట్టబడినవాడై నేలమీద పడిపోయెను. 36

మూ. ఇన్ద్రధ్వజ ఇవోద్ధూతః పౌర్ణమాస్యాం మహీతలే,
ఆశ్వయుక్సమయే మాపి గతసత్త్వో విచేతనః, 37
బాష్పసంరుద్ధకణ్ఠస్తు వాలీ చార్తస్వరః శనైః.

ప్ర.అ. ఆశ్వయుక్సమయే =ఆశ్వయుజసమయరూపమైన, మాసి = మాసమునందు, పౌర్ణమాస్యామ్ =పౌర్ణమాసియందు, మహీతలే = నేలమీద, ఉద్ధూతః =పడవేయబడిన, ఇన్ద్రధ్వజ ఇవ = ఇంద్రధ్వజము వలె, వాలీ =వాలి, గతసత్త్వః =పోయిన బలము గలవాడై, విచేతనః =చైతన్యము లేనివాడై, శనైః =మెల్లగా, బాష్పసంరుద్ధకణ్ఠః =కన్నీటిచేత అడ్డుకొనబడిన కంఠము గలవాడై, ఆర్తస్వరః =దీనమైన స్వరము గలవాడై (పడిపోయెను).

తా. ఆశ్వయుజమాసమున పూర్ణిమనాడు నేలమీద పడవేయబడిన ఇంద్రధ్వజము వలె వాలి నేలమీద పడిపోయెను. అతని బలము తగ్గిపోయెను. స్పృహ తప్పెను. కంఠము కన్నీటిచేత అడ్డుకొనబడుటచే దీనమైన శబ్దము మెల్లగా వచ్చుచుండెను. 37

మూ. నరోత్తమః కాలయుగాన్తకోపమం
శరోత్తమం కాఞ్చనరూప్యభాసితమ్,
ససర్జ దీప్తం తమమిత్రమర్దనం
సధూమమగ్నిం ముఖతో యథా హరః. 38

ప్ర.అ. నరోత్తమః =నరులలో ఉత్తముడైన రాముడు, కాలయుగాన్తకోపమమ్ =ప్రలయకాలమునందలి యమునితో సమానము, కాఞ్చనరూప్యభాసితమ్ =బంగారముచేతను వెండిచేతను ప్రకాశింపచేయబడిన, దీప్తమ్ = మండుచున్న, అమిత్రమర్దనమ్ =శత్రువులను సంహరించు, తం శరోత్తమమ్ =ఆ ఉత్తమమైన బాణమును, హరః= రుద్రుడు, ముఖతః = ముఖమునుండి, సధూమమ్ =ధూమముతో కూడిన, అగ్నిమ్ ఇవ= అగ్నిని వలె, ససర్జ =విడచెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన రాముడు, ప్రజ్వలించుచున్న, శత్రుసంహారకమైన ఆ బాణమును, రుద్రుడు ప్రలయకాలమునందు ఫాలనేత్రమునుండి, ధూమముతో కూడిన అగ్నిని విడచినట్లు విడచెను. ఆ బాణము బంగారముచేతను, వెండిచేతను

అలంకరింపబడి ఉండెను. ప్రలయకాలమునందలి యముడు వలె భయంకరముగా ఉండెను. 38

మూ. అథోక్షితః శోణితతోయవిస్రవైః
ప్రపుష్పితాశోక ఇవాచలోద్గతః,
విచేతనో వాసవసూనురాహవే
ప్రభ్రంశితేన్ద్రధ్వజవత్ క్షితిం గతః. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షోడశః సర్గః.

ప్ర.అ. అథ =అటుపిమ్మట, వాసవసూనుః =ఇంద్రుని కుమారుడైన వాలి, ఆహవే =యుద్ధమునందు, శోణితతోయవిస్రవైః =రక్తముయొక్క, చెమటయొక్క, స్రావములచేత, ఉక్షితః =తడపబడినవాడై, అచలోద్గతః =పర్వతమునుండి మొలచిన, ప్రపుష్పితాశోక ఇవ =పుష్పించిన అశోకవృక్షము వలె, విచేతనః =చైతన్యము లేనివాడై, ప్రభంశితేన్ద్రధ్వజవత్ =పడగొట్టబడిన ఇంద్రధ్వజము వలె, క్షితిమ్ =భూమిని, గతః =పొందినాడు.

తా. రక్తముతోను చెమటతోను తడిసిన ఆ వాలి పర్వతము మీద మొలచిన పుష్పించిన అశోకవృక్షము వలె ఉండెను. అట్టి వాలి చైతన్యము కోల్పోయి, క్రిందికి పడద్రోయబడిన ఇంద్రధ్వజము వలె, యుద్ధరంగములో నేలపై పడిపోయెను. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పదహారవ సర్గ సమాప్తము.

# అథ సప్తదశః సర్గః

[వక్షఃస్థలము చీల్చబడినను ఇంద్రుడిచ్చిన బంగారు మాల ప్రభావముచేత ప్రాణములు పోకుండా పడి యున్న వాలి రాముని నిందించుట.]

మూ. తతః శరేణాభిహతో రామేణ రణకర్కశః,
పపాత సహసా వాలీ నికృత్త ఇవ పాదపః. 1

ప్ర.అ. తతః= అటుపిమ్మట, రణకర్కశః = యుద్ధములో కఠినుడైన, వాలీ = వాలి, రామేణ = రామునిచేత, శరేణ =బాణముచేత, అభిహతః =కొట్టబడినవాడై, నికృత్తః =నరికివేయబడిన, పాదపః ఇవ =చెట్టు వలె, సహసా =వెంటనే, పపాత =పడెను.

తా. అప్పుడు రాముడు బాణముతో కొట్టగా, యుద్ధములో కఠినుడైన వాలి, నరికివేసిన చెట్టువలె నేలమీద పడిపోయెను. 1

మూ. స భూమౌ న్యస్తసర్వాఙ్గస్తప్తకాఞ్చనభూషణః,
అపతద్దేవరాజస్య ముక్తరశ్మిరివ ధ్వజః. 2

ప్ర.అ. తప్తకాఞ్చనభూషణః=పరిశుద్ధమైన బంగారు భూషణములు గల, సః= ఆ వాలి, ముక్తరశ్మిః=విడవబడిన త్రాళ్లు గల, దేవరాజస్య= దేవేంద్రుని యొక్క, ధ్వజః ఇవ=ధ్వజము వలె, భూమౌ= నేలమీద, న్యస్తసర్వాఙ్గః=ఉంచబడిన సకలావయవములు కలవాడై, పపాత=పడెను.

తా. పరిశుద్ధమైన బంగారు అలంకారములు ధరించిన ఆ వాలి కట్టిన త్రాళ్లు విప్పివేయగా నేలమీద పడిపోయిన ఇంద్రధ్వజము వలె, సమస్తఅవయవములు నేలపై అనునట్లు పడిపోయెను. 2

మూ. తస్మిన్నిపతితే భూమౌ హర్యృక్షాణాం గణేశ్వరే,
నష్టచన్ద్రమివ వ్యోమ న వ్యరాజత మేదినీ. 3

ప్ర.అ. హర్యృక్షాణామ్=వానరులయొక్క, గణేశ్వరే=గణమునకు ప్రభువైన, తస్మిన్=ఆ వాలి, భూమౌ=నేలమీద, నిపతితే= పడినవాడగుచుండగా, మేదినీ=భూమి, నష్టచన్ద్రమ్=తొలగిన చంద్రుడు గల, వ్యోమ ఇవ=ఆకాశము వలె, న వ్యరాజత=ప్రకాశించలేదు.

తా. వానరుల గణములకు ప్రభువైన ఆ వాలి పడిపోవుటతో భూమి, చంద్రుడు తొలగిన ఆకాశము వలె ప్రకాశవిహీన మయ్యెను. 3

మూ. భూమౌ నిపతితస్యాపి తస్య దేహం మహాత్మనః,
న శ్రీర్జహాతి న ప్రాణా న తేజో న పరాక్రమః. 4

ప్ర.అ. భూమౌ=నేలమీద, నిపతితస్యాపి=పడిపోయినవాడైనను, మహాత్మనః =మహాత్ముడైన, తస్య=ఆతనియొక్క, దేహమ్=దేహమును, శ్రీః = శోభ, న జహాతి=విడవలేదు. ప్రాణాః=ప్రాణములు, న= విడవలేదు. తేజః=తేజస్సు, న=విడవలేదు. పరాక్రమః= పరాక్రమము, న=విడవలేదు.

తా. మహాత్ముడైన ఆ వాలి నేలమీద పడిపోయినా శోభ కాని, ప్రాణములు కాని, తేజస్సు కాని, పరాక్రమము కాని ఆతనిని విడువలేదు. 4

మూ. శక్రదత్తా వరా మాలా కాఞ్చనీ రత్నభూషితా,
దధార హరిముఖ్యస్య ప్రాణాంస్తేజః శ్రియం చ సా. 5

ప్ర.అ. శక్రదత్తా=దేవేంద్రునిచేత ఇవ్వబడిన, కాఞ్చనీ=బంగారము వికారమైన, రత్నభూషితా=రత్నములచేత అలంకరించబడిన, వరా =శ్రేష్ఠమైన, సా మాలా=ఆ మాల, హరిముఖ్యస్య= వానరరాజుయొక్క, ప్రాణాన్=ప్రాణములను, తేజః=తేజస్సును, శ్రియం చ=శోభను, దధార=ధరించెను (నిలబెట్టెను).

తా. దేవేంద్రు డిచ్చిన రత్నములచేత అలంకరింపబడిన ఆ శ్రేష్ఠమైన బంగారు మాల వాలి ప్రాణములను, తేజస్సును, శోభను నిలబెట్టెను. 5

మూ. స తయా మాలయా వీరో హైమయా హరియూథపః,
సంధ్యానుగతపర్యన్తః పయోధర ఇవాభవత్. 6

ప్ర.అ. వీరః=వీరుడైన, సః హరియూథపః=ఆ వానరగణముల ప్రభువైన వాలి, హైమయా=బంగారము వికారమైన, తయా మాలయా=ఆ మాలతో, సంధ్యానుగతపర్యన్తః=సంధ్యారాగముచేత పొందబడిన ప్రాంతభాగములు గల, పయోధరః ఇవ=మేఘము వలె, అభవత్=ఉండెను.

తా. బంగారుమాలతో కూడిన వీరుడైన ఆ వాలి, ప్రాంతభాగములందు సంధ్యారాగము అలముకొన్న మేఘము వలె ఉండెను. 6

మూ. తస్య మాలా చ దేహశ్చ మర్మఘాతీ చ యః శరః,
త్రిధేవ రచితా లక్ష్మీః పతితస్యాపి శోభతే. 7

ప్ర.అ. పతితస్యాపి=పడిపోయినవాడైనను, తస్య=ఆతనియొక్క, మాలా చ =మాల, దేహః చ=దేహము, మర్మఘాతీ=మర్మస్థానమును కొట్టే, యః శరః=ఏ బాణ మున్నదో అది, త్రిధా=మూడు విధాలుగా, రచితా=రచింపబడిన, లక్ష్మీః ఇవ=శోభ వలె, శోభతే= ప్రకాశించుచుండెను.

తా. ఆ వాలి నేలపై కూలిపోయినను, ఆతని శోభ, ఆ బంగారు మాల, దేహము, మర్మస్థానమును భేదించిన బాణము అను మూడు రూపములలో రచింపబడి నట్లు ప్రకాశించుచుండెను. 7

మూ. తదస్త్రం తస్య వీరస్య స్వర్గమార్గప్రభావనమ్,
రామబాణాసనక్షిప్తమావహత్పరమాం గతిమ్. 8

ప్ర.అ. స్వర్గమార్గప్రభావనమ్=స్వర్గమార్గమును కలిగించు, రామబాణాసనక్షిప్తమ్=రాముని ధనస్సుచేత ప్రయోగింపబడిన, తత్= ఆ, అస్త్రమ్ = అస్త్రము, తస్య వీరస్య=ఆ వీరునకు, పరమాం గతిమ్= ఉత్తమగతిని, ఆవహత్=సంపాదించెను.

తా. రాముని ధనస్సుచే ప్రయోగించబడిన, స్వర్గమార్గమును ఇచ్చే ఆ అస్త్రము ఆ వీరుడైన వాలికి సద్గతిని సంపాదించెను. 8

మూ. తం తథా పతితం సంఖ్యే గతార్చిషమివానలమ్,
యయాతిమివ పుణ్యాన్తే దేవలోకాదిహ చ్యుతమ్, 9
ఆదిత్యమివ కాలేన యుగాన్తే భువి పాతితమ్,
మహేన్ద్రమివ దుర్ధర్షముపేన్ద్రమివ దుఃసహమ్, 10
మహేన్ద్రపుత్రం పతితం వాలినం హేమమాలినమ్,
వ్యూఢోరస్కం మహాబాహుం దీప్తాస్యం హరిలోచనమ్, 11
లక్ష్మణానుచరో రామో దదర్శోపససర్ప చ.

ప్ర.అ. సంఖ్యే=యుద్ధమునందు, తథా=అట్లు, పతితమ్= పడినవాడు, గతార్చిషమ్=పోయిన జ్వాలలు గల, అనలమ్ ఇవ= అగ్ని వలె ఉన్నవాడు, పుణ్యాన్తే=పుణ్యము యొక్క అంతమునందు, దేవలోకాత్=దేవలోకమునుండి, ఇహ=భూలోకములోనికి, చ్యుతమ్= జారిపడిన, యయాతిమివ=యయాతి వలె ఉన్నవాడు, మహేన్ద్రమివ= మహేంద్రుడు వలె, దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము కానివాడు, ఉపేన్ద్రమివ= ఉపేంద్రుడు వలె, దుఃసహమ్=సహింప శక్యము కానివాడు, మహేన్ద్రపుత్రమ్=మహేంద్రుని పుత్రుడు, హేమమాలినమ్=బంగారు మాల గలవాడు, వ్యూఢోరస్కమ్=విశాలమైన వక్షఃస్థలము కలవాడు, మహాబాహుమ్=గొప్ప బాహువులు గలవాడు, దీప్తాస్యమ్= ప్రకాశించుచున్న ముఖము గలవాడు, హరిలోచనమ్=పచ్చని కళ్లు గలవాడు అయిన, తం వాలినమ్=ఆ వాలిని, లక్ష్మణానుచరః= లక్ష్మణుడు అనుచరుడుగా గల, రామః=రాముడు, పతితమ్= పడిపోయినవానినిగా, దదర్శ=చూచెను, ఉపససర్ప చ=సమీపించెను కూడ.

తా. ఆ విధముగా యుద్ధములో పడిపోయి, బంగారు మాల ధరించిన, మహేంద్రపుత్రుడైన వాలి, జ్వాలలు శాంతించిన అగ్ని వలె, ప్రళయకాలమునందు కాలునిచే క్రింద పడవేయబడిన సూర్యుడు వలె ఉండెను. విశాలమైన వక్షఃస్థలము,

దీర్ఘములైన బాహువులు, ప్రకాశించుచున్న ముఖము, పచ్చని నేత్రములు గల ఆ వాలి మహేంద్రుడు వలె ఎదిరింప శక్యముకానివాడు, ఉపేంద్రుడు వలె సహింప శక్యము కానివాడు. అట్టి వాలి పడిపోయి నట్లు చూచి రాముడు లక్ష్మణసహితుడై ఆతని దగ్గరకు వెళ్లెను. 9-11

మూ. బహుమాన్య చ తం వీరం వీక్షమాణం శనైరివ, 12
ఉపయాతౌ మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర.అ. శనైరివ=మెల్లగా, వీక్షమాణమ్=చూచుచున్న, తం వీరమ్= ఆ వీరుని, బహుమాన్య=గౌరవించి, మహావీర్యౌ=గొప్ప పరాక్రమము గల, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ఉపయాతౌ =సమీపించిరి.

తా. మహాపరాక్రమశాలులు, సోదరులూ అయిన రామలక్ష్మణులు, మెల్లిగా చూచుచున్న వీరుడైన ఆ వాలివద్దకు గౌరవపురస్సరముగా వెళ్లిరి. 12

మూ. తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం చ మహాబలమ్,
అబ్రవీత్పరుషం వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్, 13
స భూమావల్పతేజోసుర్నిహతో నష్టచేతనః,
అర్థసంహితయా వాచా గర్వితం రణగర్వితమ్. 14

ప్ర.అ. నిహతః=కొట్టబడినవాడు, అల్పతేజోసుః=అల్పమైన తేజస్సు, ప్రాణములు కలవాడు, నష్టచేతనః=నశించిన చైతన్యము గలవాడు, భూమౌ =భూమియందు పడినవాడు అయిన, సః వాలీ=ఆ వాలి, రణగర్వితమ్ =యుద్ధమునందు గర్వించిన, తం రాఘవమ్=ఆ రాముని, మహాబలమ్=గొప్ప బలము గల, లక్ష్మణం చ=లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, అర్థసంహితయా=అర్థముతో కూడిన, వాచా=వాక్కుతో, పరుషమ్=పరుషము, ప్రశ్రితమ్=వినయముతో కూడినది, ధర్మసంహితమ్=ధర్మముతో కూడినది అయిన, వాక్యమ్=వాక్యమును, గర్వితమ్=గర్వయుక్తముగా, అబ్రవీత్ =పలికెను.

తా. బాణము దెబ్బ తిని కొంచెము మిగిలిన ప్రాణములతోను తేజస్సుతోను నేలమీద పడిపోయి, స్పృహ కోల్పోయిన ఆ వాలి, రణములో గర్వితుడైన రాముని, మహాబలశాలియైన లక్ష్మణుని చూచి అర్థముతో కూడిన మాటలతో, పరుషము, వినయసంపన్నము, ధర్మసంమతము అయిన వాక్యమును సగర్వముగా పలికెను. 13, 14

మూ. పరాఙ్ముఖవధం కృత్వా కోఽత్ర ప్రాప్తస్త్వయా గుణః,
యదహం యుద్ధసంరబ్ధస్త్వత్కృతే నిధనం గతః. 15

ప్ర.అ. యుద్ధసంరబ్ధః=యుద్ధము తొందరలో ఉన్న, అహమ్=నేను, త్వత్కృతే=నీ మూలమున, యత్ నిధనం గతః=మరణమును పొందితినే, పరాఙ్ముఖ

ఖవధమ్=మరొక దిక్కునకు ముఖమున్నవాని వధను, కృత్వా= చేసి, అత్ర=ఇక్కడ, (దీనియందు) కః=ఏ, గుణః=గుణము, త్వయా=నీచేత, ప్రాప్తః=పొందబడినది?

తా. మరొకరితో యుద్ధము చేసే తొందరలో ఉన్న నేను నీ మూలమున మరణించుచున్నాను గదా! నీవైపు తిరిగి లేనివానిని చంపి నీవు ఏ గుణమును సాధించినావు? 15

మూ. కులీనః సత్త్వసంపన్నస్తేజస్వీ చరితవ్రతః, 16
రామః కరుణవేదీ చ ప్రజానాం చ హితే రతః,
సానుక్రోశో మహోత్సాహః సమయజ్ఞో దృఢవ్రతః, 17
ఇతి తే సర్వభూతాని కథయన్తి యశో భువి.

ప్ర.అ. రామః=రాముడు, కులీనః=సత్కులమునందు పుట్టినవాడు, సత్త్వ సంపన్నః=బలముతో కూడినవాడు, తేజస్వీ=మంచి తేజస్సు కలవాడు, చరిత వ్రతః=ఆచరింపబడిన వ్రతములు కలవాడు, కరుణవేదీ చ =కరుణను తెలియువాడు, ప్రజానామ్=ప్రజలయొక్క, హితే= హితమునందు, రతః=ఆసక్తి కలవాడు, సాను క్రోశః=జాలి గలవాడు, మహోత్సాహః=గొప్ప ఉత్సాహము గలవాడు, సమయజ్ఞః= సమయమును గుర్తించువాడు, దృఢవ్రతః=దృఢమైన నియమము కలవాడు, ఇతి =ఇట్లు, తే=నీయొక్క, యశః=కీర్తిని, సర్వభూతాని= సమస్తభూతములు, భువి=భూలోకములో, కథయన్తి=చెప్పుచున్నవి.

తా. "రాముడు సత్కులమునందు పుట్టినవాడు. బలశాలి. తేజస్సు కలవాడు. నియమములను ఆచరించువాడు. కరుణ కలవాడు. ప్రజల హితమునందే ఆసక్తి కలవాడు. జాలి కలవాడు. మంచి ఉత్సాహము కలవాడు. సమయాసమయములు తెలిసినవాడు. నియమముల విషయమున స్థైర్యము గలవాడు" అని సకలభూతములు భూలోకములో నీ కీర్తిని చెప్పుకొనుచుందురు కదా! 16, 17

మూ. దమః శమః క్షమా ధర్మో ధృతిః సత్త్వం పరాక్రమః, 18
పార్థివానాం గుణా రాజన్ దణ్డశ్చాప్యపకారిషు.

ప్ర.అ. రాజన్=రాజా! దమః=ఇంద్రియములను అదుపులో ఉంచుకొనుట, శమః=మనస్సును వశములో ఉంచుకొనుట, క్షమా=ఓర్పు, ధర్మః= ధర్మము, ధృతిః=ధైర్యము, సత్త్వమ్=బలము, పరాక్రమః= పరాక్రమము, అపకారిషు=అప కారము చేసినవారియందు, దణ్డశ్చ= దండము, పార్థివానామ్=రాజులయొక్క, గుణాః=గుణములు.

తా. రాజా! ఇంద్రియములను మనస్సును అదుపులో ఉంచుకొనుట, ఓరిమి, ధర్మము, ధైర్యము, బలము, పరాక్రమము, అపకారము చేసిన వారిని దండించుట - ఇవి రాజుల గుణములు. 18

మూ. తాన్ గుణాన్ సంప్రధార్యాహమగ్ర్యం చాభిజనం తవ, 19
తారయా ప్రతిషిద్ధోఽపి సుగ్రీవేణ సమాగతః.

ప్ర.అ. అహమ్=నేను, తాన్=ఆ, గుణాన్=గుణములను, తవ= నీయొక్క, అగ్ర్యమ్=శ్రేష్ఠమైన, అభిజనమ్=వంశమును, సంప్రధార్య =నిర్ణయించుకొని, తారయా=తారచేత, ప్రతిషిద్ధః అపి= నివారింపబడినను, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమాగతః=కలిసితిని.

తా. నీయందు ఆ గుణములు ఉన్న వని అనుకొని, నీ శ్రేష్ఠమైన వంశమును కూడ చూచి, నేను తార నివారించుచున్నను వచ్చి సుగ్రీవునితో యుద్ధమునకు తలబడితిని. 19

మూ. న మామన్యేన సంరబ్ధం ప్రమత్తం వేద్ధు మర్హసి, 20
ఇతి మే బుద్ధిరుత్పన్నా బభూవాదర్శనే తవ.

ప్ర.అ. తవ=నీయొక్క, అదర్శనే=దర్శనము కలగకపోగా, అన్యేన= మరొకనితో, సంరబ్ధమ్=యుద్ధములో ఉన్న, ప్రమత్తమ్=ఏమరిపాటు చెంది ఉన్న, మామ్=నన్ను, వేద్ధుమ్=కొట్టుటకు, నార్హసి=తగవు, ఇతి= అని, మే=నాకు, బుద్ధిః=బుద్ధి, ఉత్పన్నా బభూవ=పుట్టినది.

తా. నీవు కనబడకపోవుటతో "మరొకరితో యుద్ధము చేయుచు ఏమరిపాటు చెంది ఉన్న నన్ను కొట్టవు" అని నేను అనుకొన్నాను. 20

మూ. న త్వాం వినిహతాత్మానం ధర్మధ్వజమధార్మికమ్, 21
జానే పాపసమాచారం తృణైః కూపమివావృతమ్.

ప్ర.అ. త్వామ్=నిన్ను, వినిహతాత్మానమ్=పూర్తిగా నశింపచేయబడిన బుద్ధి కలవానివిగాను, ధర్మధ్వజమ్=ధర్మము ధ్వజముగా గల, అధార్మికమ్= అధార్మికునిగాను, పాపసమాచారమ్=పాపప్రవర్తన కలవానినిగాను, తృణైః= తృణములచేత, ఆవృతమ్=కప్పబడిన, కూపమ్ ఇవ=కూపమువంటివానిని గాను, న జానే=ఎరుగను.

తా. నీ బుద్ధి చాల చెడ్డ దనీ, నీవు ధర్మ మనే ధ్వజమును ధరించిన అధార్మికుడ వనీ, పాపప్రవృత్తి కలవాడవనీ, గడ్డి కప్పిన నుయ్యి వంటివాడ వనీ నాకు తెలియదు. 21

మూ. సతాం వేషధరం పాపం ప్రచ్ఛన్నమివ పావకమ్, 22
నాహం త్వామభిజానామి ధర్మచ్ఛద్మాభిసంవృతమ్.

ప్ర.అ. సతామ్=సత్పురుషులయొక్క, వేషధరమ్=వేషమును ధరించినవాడవు, పాపమ్=పాపాత్ముడవు, ప్రచ్ఛన్నమ్=కప్పబడిన, పావకమ్ ఇవ= అగ్నివంటివాడవు, ధర్మచ్ఛద్మాభిసంవృతమ్=ధర్మ మనే కప్పచేత కప్పబడినవాడవూ అయిన,

త్వామ్=నిన్ను, అహమ్=నేను, న అభిజానామి=గుర్తించలేదు.

తా. నీవు సత్పురుషుల వేషము ధరించిన పాపాత్ముడ వనీ, కప్పబడి ఉన్న నిప్పువంటివాడ వనీ, ధర్మ మనే ముసుగులో ఉన్నవాడ వనీ నేను గ్రహించ జాలకపోయినాను. 22

మూ. విషయే వా పురే వా తే యదా పాపం కరోమ్యహమ్, 23
న చ త్వామవజానే౽హం కస్మాత్త్వం హంస్యకిల్బిషమ్,
ఫలమూలాశనం నిత్యం వానరం వనగోచరమ్, 24
మామిహాప్రతియుధ్యన్తమన్యేన చ సమాగతమ్.

ప్ర.అ. అహమ్=నేను, యదా=ఎప్పుడు(ఎందువలన), తే=నీయొక్క, విషయే వా=దేశమునందు గాని, పురే వా=పట్టణమునందు గాని, పాపమ్= పాపమును, న కరోమి=చేయలేదో, త్వామ్=నిన్ను, న చ అవజానే= అవమానించలేదో, (ఆ కారణమువలన) అకిల్బిషమ్=పాపము లేనివాడను, నిత్యమ్=నిత్యము, ఫల మూలాశనమ్ =ఫలమూలములను తినేవాడను, వనగోచరమ్= వనములో నివసించు, వానరమ్=వానరుడను, ఇహ=ఇప్పుడు, అప్రతియుధ్యన్తమ్=ఎదిరించి యుద్ధము చేయనివాడను, అన్యేన=మరొకనితో, సమాగతమ్= యుద్ధములో కలిసినవాడనూ అయిన, మామ్=నన్ను, కస్మాత్=ఏ కారణమువలన, హంసి=చంపుచున్నావు?

తా. నేను నీ దేశములో కాని, నీ పురములో గాని ఏ పాపకార్యము చేయలేదు. నిన్ను అవమానించలేదు. నిత్యము ఫలమూలములను భుజించుచు వనములో నివసించే వానరుడను. పాపము లేనివాడను. నీతో యుద్ధము చేయుటలేదు. మరొకనితో యుద్ధము చేయుచున్నాను. అట్టి నన్ను ఎందుకు చంపుచున్నావు? 23,24

మూ. త్వం నరాధిపతేః పుత్రః ప్రతీతః ప్రియదర్శనః, 25
లిఙ్గమప్యస్తి తే రాజన్ దృశ్యతే ధర్మసంహితమ్.

ప్ర.అ. త్వమ్=నీవు, ప్రియదర్శనః=ప్రియమైన దర్శనము గల, నరాధిపతేః పుత్రః=రాజకుమారుడవుగా, ప్రతీతః=ప్రసిద్ధుడవు. రాజన్=రాజా! తే=నీయొక్క, ధర్మసంహితమ్=ధర్మసంమతమైన, లిఙ్గమపి=చిహ్నము కూడ, అస్తి=ఉన్నది; దృశ్యతే=కనబడుచున్నది.

తా. రాజా! నీవు చూచుటకు ఆనందమును కలిగించు రాజకుమారుడవుగా ప్రసిద్ధుడవు. నీయందు ధర్మసంమతములైన జటావల్కలాదిచిహ్నములు కూడ స్పష్టముగా చూడబడుచున్నవి. 25

మూ. కః క్షత్రియకులే జాతః శ్రుతవాన్నష్టసంశయః, 26
ధర్మలిఙ్గప్రతిచ్ఛన్నః క్రూరం కర్మ సమాచరేత్.

ప్ర.అ. క్షత్రియకులే=క్షత్రియకులమునందు, జాతః=పుట్టినవాడు, శ్రుతవాన్= శాస్త్రజ్ఞానము కలవాడు, నష్టసంశయః=నశించిన సంశయములు కలవాడు, ధర్మలిఙ్గప్రతిచ్ఛన్నః=ధర్మచిహ్నములచేత కప్పబడినవాడు అయిన, కః=ఎవడు, క్రూరమ్=క్రూరమైన, కర్మ=కర్మను, సమాచరేత్=చేయును?

తా. క్షత్రియవంశములో జనించి, శాస్త్రాభ్యాసము చేసి, సంశయములన్నీ తొలగించుకొని, ధర్మచిహ్నములను ధరించిన ఎవడైనా ఇట్టి క్రూరమైన పని చేయునా! 26

మూ. త్వం రాఘవకులే జాతో ధర్మవానితి విశ్రుతః, 27
అభవ్యో భవ్యరూపేణ కిమర్థం పరిధావసే.

ప్ర.అ.రాఘవకులే=రఘువంశీయుల కులమునందు, జాతః=పుట్టినవాడవు, ధర్మవానితి=ధర్మవంతుడు అని, విశ్రుతః=ప్రసిద్ధిచెందినవాడవు అయిన, త్వమ్=నీవు, అభవ్యః=చెడ్డవాడవై యుండి, భవ్యరూపేణ= మంచివాని రూపముతో, కిమర్థమ్ = ఎందుకు, పరిధావసే= పరుగెత్తుచున్నావు?

తా. రఘువంశములో పుట్టి, ధర్మాత్ముడుగా ప్రసిద్ధి చెందిన నీవు వాస్తవమున దుష్టుడవై ఉండి కూడ మంచివాడ నని చెప్పకొనుచు ఎందుకు తిరుగుచున్నావు? 27

మూ. సామ దానం క్షమా ధర్మః సత్యం ధృతిపరాక్రమౌ, 28
పార్థివానాం గుణా రాజన్ దణ్డశ్చాప్యపకారిషు.

ప్ర.అ. రాజన్ =రాజా! సామ =సామము(ఇతరులను అనునయించుట), దానమ్ =దానము, క్షమా =ఓర్పు, ధర్మః =ధర్మము, సత్యమ్= సత్యము, ధృతిపరాక్రమౌ=ధైర్యపరాక్రమములు, అపకారిషు = అపకారము చేసినవారియందు, దణ్డః =దండము, పార్థివానామ్ = రాజులయొక్క, గుణాః=గుణములు.

తా. రాజా! సామము, దానము, ఓర్పు, ధర్మము, సత్యము, ధైర్యము, పరాక్రమము, అపకారము చేసినవారిని దండించుట - ఇవి రాజగుణములు. 28

మూ. వయం వనచరా రామ మృగా మూలఫలాశినః, 29
ఏషా ప్రకృతిరస్మాకం పురుషస్త్వం నరేశ్వరః.

ప్ర.అ. రామ=రామా! వయమ్=మేము, మూలఫలాశినః = మూలములను ఫలముల భుజించు, వనచరాః =వనములో సంచరించు, మృగాః = మృగములము. ఏషా =ఇది, అస్మాకమ్=మాయొక్క, ప్రకృతిః =స్వభావము. త్వమ్ =నీవు, నరేశ్వరః =నరులకు ప్రభువైన, పురుషః =పురుషుడవు.

తా. రామా! మేము, పండ్లు దుంపలు తిని వనములో నివసించే మృగములము. ఇది మా స్వభావము. నీవో, నరులకు అధిపతివైన పురుషుడవు.

మూ. భూమిర్హిరణ్యం రూపం చ విగ్రహే కారణాని చ, 30
తత్ర కస్తే వనే లోభో మదీయేషు ఫలేషు వా.

ప్ర.అ. విగ్రహే =(ఎవనినైన) నిగ్రహించుటయందు, భూమిః =భూమి, హిరణ్యమ్ = బంగారము, రూపం చ =వెండి, కారణాని = కారణములు. తత్ర = అట్టి స్థితిలో, తే =నీకు, వనే = వనమునందు కాని, మదీయేషు =నాకు సంబంధించిన, ఫలేషు వా = ఫలములయందు కాని, లోభః =ఆశ, కః =ఏమి?

తా. ఎవరినైనా నిగ్రహించుటకు భూమి, బంగారము, వెండి కారణములు. అట్టి స్థితిలో, నీకు నా భూమియైన వనము మీద కాని, నేను తినే ఫలములమీద గాని ఆశ ఏమిటి? 30

మూ. నయశ్చ వినయశ్చోభౌ నిగ్రహానుగ్రహావపి, 31
రాజవృత్తిరసంకీర్ణా న నృపాః కామవృత్తయః.

ప్ర.అ. నయశ్చ =నీతి, వినయశ్చ =వినయము, నిగ్రహానుగ్రహౌ =నిగ్రహము అనుగ్రహము అను, ఉభావపి =రెండూ, అసంకీర్ణా =సాంకర్యములేని, రాజవృత్తిః =రాజధర్మము. నృపాః = రాజులు, కామవృత్తయః =స్వేచ్ఛాప్రవృత్తి గలవారు, న =కారు. 32

తా. నీతిని అవలంబించుట, వినయము కలిగి ఉండుట, నిగ్రహించ తగినవారిని నిగ్రహించుట, అనుగ్రహించతగినవారిని అనుగ్రహించుట - ఇది రాజు పాటించవలసిన ధర్మము. వీటిలో సాంకర్యమునకు, ఒకదానిలో మరొకటి కలిసిపోవుటకు అవకాశము లేదు. అందుచే రాజులు స్వేచ్ఛగా ప్రవర్తించరు.

మూ. త్వం తు కామప్రధానశ్చ కోపనశ్చానవస్థితః, 32
రాజవృత్తేషు సంకీర్ణః శరాసనపరాయణః.

ప్ర.అ. త్వం తు =నీవైతే, కామప్రధానశ్చ =కామమే ప్రధానముగా కలవాడవు. కోపనశ్చ =కోపస్వభావుడవు. అనవస్థితః =స్థిరత్వము లేనివాడవు. రాజవృత్తేషు =రాజధర్మములందు, సంకీర్ణః = సంకీర్ణుడవు (సాంకర్యమును చేయువాడవు). శరాసనపరాయణః = ధనస్సునందే ఆసక్తి కలవాడవు.

తా. కాని నీకు కామమే (నీ కోరిక తీరుటయే) ప్రధానము. నీవు కోపస్వభావుడవు. చంచలమైన మనస్సు కలవాడవు. రాజధర్మముల విషయమున విశ్చితబుద్ధి లేనివాడవు. ధనస్సు చేతిలో ఉన్నది కదా అని ఇతరులను చంపుచుందువు. 32

మూ. న తేఽస్త్యపచితిర్ధర్మే నార్థే బుద్ధిరవస్థితా, 33
ఇన్ద్రియైః కామవృత్తః సన్ కృష్యసే మనుజేశ్వర.

ప్ర.అ. మనుజేశ్వర =మనుష్యుల ప్రభువైన రామా! తే =నీకు, ధర్మే =ధర్మమునందు, అపచితిః =పూజ (శ్రద్ధ), న = లేదు. బుద్ధిః =నీ బుద్ధి, అర్థే =అర్థమువందు, న అవస్థితా =స్థిరముగా నిలచి లేదు. కామవృత్తః =స్వేచ్ఛాప్రవృత్తికలవాడవై, ఇన్ద్రియైః=ఇంద్రియములచేత, కృష్యసే =లాగబడుచున్నావు.

తా. రాజువైన రామా! నీకు ధర్మమునందు శ్రద్ధ లేదు. నీ బుద్ధికి అర్థము విషయమునందు స్థైర్యము లేదు. స్వేచ్ఛగా కామమునకే ప్రాధాన్య మిచ్చే నిన్ను ఇంద్రియములు ఇటు అటు లాగివేయుచున్నవి. 33

మూ. హత్వా బాణేన కాకుత్స్థ మామిహానపరాధినమ్, 34
కిం వక్ష్యసి సతాం మధ్యే కర్మ కృత్వా జుగుప్సితమ్.

ప్ర.అ. కాకుత్స్థ =రామా! అనపరాధినమ్ =అపరాధము లేని, మామ్ =నన్ను, ఇహ =ఇక్కడ, బాణేన= బాణముచేత, హత్వా =చంపి, జుగుప్సితమ్ =నిందితమైన, కర్మ= పనిని, కృత్వా =చేసి, సతామ్ =సత్పురుషులయొక్క, మధ్యే=మధ్యయందు, కిమ్ =ఏమి, వక్ష్యసి =చెప్పగలవు?

తా. రామా! ఏ అపరాధమూ లేని నన్ను బాణముతో చంపి, ఇట్టి నింద్యమైన పని చేసిన నీవు సత్పురుషులమధ్య ఏమని సమర్థించుకొనగలవు?

మూ. రాజహా బ్రహ్మహా గోఘ్నశ్చోరః ప్రాణివధే రతః, 35
నాస్తికః పరివేత్తా చ సర్వే నిరయగామినః.

ప్ర.అ. రాజహా =రాజును చంపినవాడు, బ్రహ్మహా =బ్రాహ్మణుని చంపినవాడు, గోఘ్నః=గోవును చంపినవాడు, ప్రాణివధే=ప్రాణుల వధయందు, రతః =ఆసక్తి గలవాడు, నాస్తికః =నాస్తికుడు, పరివేత్తా చ=పరివేత్త (అన్న కంటె ముందు వివాహము చేసికొన్నవాడు పరివేత్త), సర్వే =వీళ్లందరూ, నిరయగామినః=నరకమునకు వెళ్లువారు.

తా. రాజును చంపినవాడు, బ్రాహ్మణుని చంపినవాడు, గోవును చంపినవాడు, దొంగ, ప్రాణులను చంపుటయందు ఆసక్తి గలవాడు, వేదము ప్రమాణము కాదనే (లేదా పరలోకము, దేవుడూ లేడనే) నాస్తికుడు, పరివేత్త - వీరందరూ నరకమునకు పోవుదురు. 35

మూ. సూచకశ్చ కదర్యశ్చ మిత్రఘ్నో గురుతల్పగః, 36
లోకం పాపాత్మనామేతే గచ్ఛన్తే నాత్ర సంశయః.

ప్ర.అ. సూచకః చ =చాడీలు చెప్పువాడు, కదర్యః చ =లోభి, మిత్రఘ్నః =మిత్రుని చంపినవాడు, గురుతల్పగః = గురుభార్యాగమనము చేసినవాడు, ఏతే =వీళ్లు, పాపాత్మనామ్ = పాపాత్ములయొక్క, లోకమ్ =లోకమును,

గచ్ఛన్తే=వెళ్లుదురు. అత్ర=ఈ విషయమున, సంశయః=సంశయము, న =లేదు.

తా. చాడీలు చెప్పువాడు, లోభి, మిత్రుని చంపినవాడు, గురుభార్యాగమనము చేసినవాడు-వీరందరూ పాపాత్ముల లోకమునకు వెళ్ళుదురు. ఈ విషయమున సందేహము లేదు. 36

మూ. అధార్యం చర్మ మే సద్భి రోమాణ్యస్థి చ వర్జితమ్,
అభక్ష్యాణి చ మాంసాని త్వద్విధైర్ధర్మచారిభిః. 37

ప్ర.అ. మే =నాయొక్క, చర్మ=చర్మ, అధార్యమ్ = ధరింపతగనిది. రోమాణి =రోమములు, సద్భిః =సత్పురుషులచేత, (వర్జితములు). అస్థి చ=ఎముకకూడ, వర్జితమ్ =వర్జితము (పరిహరింపబడినది.). త్వద్విధైః=నీవంటి, ధర్మచారిభిః=ధర్మమును ఆచరించువారిచేత, మాంసాని =మాంసములు, అభక్ష్యాణి చ = భక్షింపతగనివి.

తా. నా చర్మము ధరించుటకు యోగ్యము కాదు. నా రోమములు, ఎముకలు కూడ సత్పురుషులచేత నిషిద్ధములు. నీవంటి ధర్మాత్ములు నా మాంసమును తినరు. 37

మూ. పఞ్చ పఞ్చనఖా భక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ, 38
శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పఞ్చమః.

ప్ర.అ. రాఘవ =రామా! బ్రహ్మక్షత్రేణ =బ్రాహ్మణులచేతను క్షత్రియులచేతను, శల్యకః =ముండ్లపంది, శ్వావిధః =కుక్కలను చంపు ఒక విధమైన వరాహము, గోధా =ఉడుము, శశః =చెవులపిల్లి, పఞ్చమః =ఐదవ, కూర్మశ్చ =తాబేలు అను, పఞ్చ =ఐదు, పఞ్చనఖాః=ఐదు గోళ్లు గల జంతువులు, భక్ష్యాః =భక్షింపదగినవి.

తా. రామా! ఐదు వేళ్ల జంతువులలో శల్యకము, శ్వావిధము, ఉడుము, చెవులపిల్లి, తాబేలు అను ఈ ఐదింటిని మాత్రమే బ్రాహ్మణులు, క్షత్రియులు తినవచ్చును. 38

మూ. చర్మ చాస్థి చ మే రామ న స్పృశన్తి మనీషిణః, 39
అభక్ష్యాణి చ మాంసాని సోఽహం పఞ్చనఖో హతః.

ప్ర.అ. రామ =రామా! మనీషిణః =బుద్ధిమంతులు, మే =నాయొక్క, చర్మ చ =చర్మను, అస్థీని చ=ఎముకలను, న స్పృశన్తి =స్పృశించరు. మాంసాని చ=నా మాంసములు కూడా, అభక్ష్యాణి =భక్షింపతగనివి. పఞ్చనఖః = ఐదు గోళ్లు గల, సః అహమ్ =అట్టి నేను, హతః= చంపబడితిని.

తా. రామా! ఐదు గోళ్ల జంతువు నైన నన్ను చంపినావు. బుద్ధిమంతులు

నా చర్మమును కాని, ఎముకలను గాని స్పృశించరు. నా మాంసము తినదగినది కాదు. 39

మూ. తారయా వాక్యముక్తోఽహం సత్యం సర్వజ్ఞయా హితమ్, 40
తదతిక్రమ్య మోహేన కాలస్య వశమాగతః.

ప్ర.అ. సర్వజ్ఞయా =అన్నీ తెలిసిన, తారయా =తారచేత, అహమ్ =నేను, సత్యమ్ =సత్యము, హితమ్ =హితమూ అయిన, వాక్యమ్ =వాక్యమును, ఉక్తః =చెప్పబడితిని. మోహేన = అజ్ఞానముచేత, తత్ =ఆ వాక్యమును, అతిక్రమ్య=అతిక్రమించి, కాలస్య = యమునకు, వశమ్ =వశమును, ఆగతః = పొందితిని.

తా. అన్ని విషయములూ తెలిసిన తార సత్యమూ, హితమూ అయిన మాటలు చెప్పినది. కాని నేను అజ్ఞానముచేత ఆమె మాటలు కాదని యమునికి వశుడ నైతిని. 40

మూ. త్వయా నాథేన కాకుత్స్థ న సనాథా వసుంధరా,
ప్రమదా శీలసంపన్నా పత్యేవ చ విధర్మణా. 41

ప్ర.అ. కాకుత్స్థ=రామా! వసుంధరా=భూమి, నాథేన=ప్రభువైన, త్వయా=నీచేత, శీలసంపన్నా=మంచి శీలముతో కూడిన, ప్రమదా=స్త్రీ, విధ ర్మణా=చెడ్డ ప్రవర్తన గల, పత్యా ఇవ=భర్తచేత వలె, సనాథా=మంచి నాథుడు గలది, న=కాదు.

తా. రామా! చెడ్డ ప్రవర్తన గల భర్త ఉన్నను, శీలసంపన్నురాలైన స్త్రీ ఏ విధముగ మంచి నాథుడు లేనిదే అగుచున్నదో, అట్లే నీవు ఈ భూమికి నాథుడ వన్న మాటే కాని దీనికి మంచి నాథుడు లేడు. 41

మూ. శఠో నైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రితమానసః,
కథం దశరథేన త్వం జాతః పాపో మహాత్మనా. 42

ప్ర.అ. శఠః=గూఢముగా అప్రియము చేయువాడవు, నైకృతికః=పరు లకు అపకారము చేయువాడవు, క్షుద్రః=నీచుడవు, మిథ్యాప్రశ్రితమానసః= అసత్యమైన వినయము గల మనస్సు గలవాడవు, పాపః=పాపాత్ముడవు అయిన, త్వమ్=నీవు, మహాత్మనా=మహాత్ముడైన, దశరథేన=దశరథుని చేత, కథమ్=ఎట్లు, జాతః=పుట్టినావు? 42

తా. రహస్యముగా అప్రియము చేయువాడవు, పరాపకారము చేయువాడవు, నీచుడవు, మనస్సులో అసత్యమైన వినయము గలవాడవు, పాపాత్ముడవు అయిన నీవు మహాత్ముడైన దశరథునకు కుమారుడవుగా ఎట్లు పుట్టినావు?

మూ. ఛిన్నచారిత్రకక్ష్యేణ సతాం ధర్మాతివర్తినా,
త్యక్తధర్మాఙ్కుశేనాహం నిహతో రామహస్తినా. 43

ప్ర. అ. ఛిన్నచారిత్రకక్ష్యేణ=తెగగొట్టబడిన చరిత్ర అనే నడుము త్రాడు గలవాడు, సతామ్=సత్పురుషులయొక్క, ధర్మాతివర్తినా=ధర్మమును అతిక్రమించిన వాడు, త్యక్తధర్మాఙ్కుశేన=విడవబడిన ధర్మ మనే అంకుశము గలవాడు అయిన, రామహస్తినా=రాము డనే ఏనుగు చేత, అహమ్=నేను, నిహతః=చంపబడితిని.

తా. రాముడనే ఏనుగు సచ్చరిత్ర మనే నడుము త్రాడు తెగగొట్టి, సత్పురుషుల ధర్మమును అతిక్రమించి, ధర్మమనే అంకుశమును దూరము చేసి, నన్ను చంపివేసినది. 43

మూ. అశుభం చాప్రయుక్తం చ సతాం చైవ విగర్హితమ్,
వక్ష్యసే చేదృశం కృత్వా సద్భిః సహ సమాగతః. 44

ప్ర. అ. అశుభమ్=అశుభము, అయుక్తమ్=అయుక్తము, సతామ్= సత్పురుషులకు, విగర్హితమ్=నింద్యము అయిన, ఈదృశమ్=ఇట్టి పనిని, కృత్వా= చేసి, సద్భిః సహ=సత్పురుషులతో, సమాగతః=కూడినవాడవై,(కిమ్=ఏమి?) వక్ష్యసే=చెప్పెదవు?

తా. సత్పురుషులు నిందించే అశుభము, అయుక్తము అయిన ఇట్టి పనిచేసి నీవు, పెద్దల సమక్షమునందు ఏ మని చెప్పెదవు? 44

మూ. ఉదాసీనేషు యోఽస్మాసు విక్రమోఽయం ప్రకాశితః,
అపకారిషు తే రామ నైవం పశ్యామి విక్రమమ్. 45

ప్ర. అ. రామ=రామా! ఉదాసీనేషు=ఉదాసీనులమైన, అస్మాసు=మా యందు, యః=ఏ, అయమ్=ఈ, విక్రమః=పరాక్రమము, ప్రకాశితః=చూపబడినదో, ఏవమ్=ఇట్లు, విక్రమమ్=పరాక్రమమును, అపకారిషు=అపకారము చేసినవారియందు, న పశ్యామి=చూడను.

తా. రామా! నీతో శత్రుత్వము కాని, మిత్రత్వము కాని లేని మా విషయమునందు నీవు చూపిన పరాక్రమమును నీ శత్రువుల విషయమునందు నీవు చూపుట లేదు. 45

మూ. దృశ్యమానస్తు యుధ్యేథా మయా యుధి నృపాత్మజ,
అద్య వైవస్వతం దేవం పశ్యేస్త్వం నిహతో మయా. 46

ప్ర. అ. నృపాత్మజ=రాజకుమారుడా! యుధి=యుద్ధమునందు, దృశ్యమానః=చూడబడుచున్నవాడవై, మయా=నాతో, యుధ్యేథాః=యుద్ధము చేసి ఉన్నట్లయితే, మయా=నాచేత, నిహతః=చంపబడినవాడవై, అద్య=ఇప్పుడే, త్వమ్=నీవు, వైవస్వతం దేవమ్=యముని, పశ్యేః=చూచి ఉండేవాడవు.

తా. రామా! యుద్ధరంగములో ప్రత్యక్షముగా నాతో యుద్ధము చేసి ఉన్నచో నీవు నాచేత చంపబడినవాడనై, ఇప్పుడే యమధర్మరాజును చూచెడివాడవు.

మూ. త్వయాఽదృశ్యేన తు రణే నిహతోఽహం దురాసదః,
ప్రసుప్తః పన్నగేనేవ నరః పానవశం గతః. 47

ప్ర. అ. దురాసదః=ఎదిరింప శక్యముకాని, అహమ్=నేను, రణే= యుద్ధమునందు, అదృశ్యేన=కనబడని, త్వయా=నీచేత, పానవశం గతః= పానమునకు వశుడై, ప్రసుప్తః=నిద్రపోవుచున్న, నరః=నరుడు, పన్నగేనేవ= సర్పముచేత వలె, నిహతః=చంపబడితిని.

తా. నీవు నన్ను యుద్ధములో ఎదిరింప జాలక, కనబడనివాడవై, మద్యము త్రాగి నిద్రపోవుచున్న మనుష్యుని సర్పము చంపి నట్లు చంపినావు. 47

మూ. సుగ్రీవప్రియకామేన యదహం విహతస్త్వయా,
మామేవ యది పూర్వం త్వమేతదర్థమచోదయః, 48
రాక్షసం చ దురాత్మానం తవ భార్యాపహారిణమ్,
కణ్ఠే బద్ధ్వా ప్రదద్యాం తేఽనిహతం రావణం రణే. 49

ప్ర. అ. సుగ్రీవప్రియకామేన=సుగ్రీవునకు ప్రియము చేయుటయందు కోరిక గల, త్వయా=నీచేత, అహమ్=నేను, యత్=దేని నిమిత్తము, నిహతః= చంపబడితినో, త్వమ్=నీవు, ఏతదర్థమ్=ఆ పనినిమిత్తమై, పూర్వమ్= ముందుగానే, మామేవ=నన్నే, అచోదయః యది=ప్రార్థించి ఉన్నట్లయితే, తవ భార్యాపహారిణమ్=నీ భార్యను అపహరించిన, దురాత్మానమ్=దురాత్ముడైన, రాక్షసం చ=రాక్షసుడైన, రావణమ్=రావణుని, రణే=యుద్ధమునందు, అనిహతమ్=చంపబడకుండా, కణ్ఠే=కంఠమునందు, బద్ధ్వా=బంధించి, తే=నీకు, ప్రదద్యామ్=ఇచ్చి ఉండెడివాడను.

తా. సుగ్రీవునకు ప్రియము చేయ దలచిన నీవు ఏ కార్యము కొరకై నన్ను చంపినావో ఆ కార్యము నిమిత్తము నన్నే ముందుగా ప్రేరేపించి ఉన్నచో నేను, నీ భార్యను అపహరించిన, దురాత్ముడైన రావణుని యుద్ధములో చంపకుండా, మెడకు తాడు కట్టి తీసికొని వచ్చి నీకు అప్పగించెడివాడను. 48,49

మూ. న్యస్తాం సాగరతోయే వా పాతాలే వాపి మైథిలీమ్,
ఆనయేయం తవాదేశాచ్ఛ్వేతామశ్వతరీమివ. 50

ప్ర.అ. సాగరతోయే వా=సముద్రజలమునందైనను, పాతాలేఽపి వా=పాతాలములో నైనను, న్యస్తామ్=ఉంచబడిన, మైథిలీమ్=సీతను, తవ=నీయొక్క, ఆదేశాత్= ఆజ్ఞవలన, శ్వేతామ్=తెల్లని, అశ్వతరీమివ=గుఱ్ఱమునువలె, ఆనయేయమ్=తీసికొనివచ్చి ఉండెడివాడను.

తా. సీతను సముద్రజలమధ్యమునందు దాచినా, పాతాలములో దాచినా,

నీ ఆజ్ఞచే నేను ఆమెను, మధుకైటభులచే పాతాలములో నిరోధింపబడిన, ఆడగుఱ్ఱము రూపములో ఉన్న శ్రుతిని హయగ్రీవుడు తీసికొని వచ్చినట్లు తీసికొనివచ్చి, నీకు ఇచ్చి ఉండెడివాడను. 50

మూ. యుక్తం యత్ప్రాప్నుయాద్రాజ్యం సుగ్రీవః స్వర్గతే మయి,
అయుక్తం యదధర్మేణ త్వయాహం నిహతో రణే. 51

ప్ర. అ. మయి=నేను, స్వర్గతే=స్వర్గస్థుడను కాగా, సుగ్రీవః=సుగ్రీవుడు, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్నుయాత్ ఇతి యత్=పొందును అనునది ఏది కలదో అది, యుక్తమ్=యుక్తమే. అహమ్=నేను, రణే=యుద్ధమునందు, త్వయా= నీచేత, అధర్మేణ=అధర్మముచేత, నిహతః ఇతి యత్=చంపబడితిని అనునది ఏది కలదో అది, అయుక్తమ్=అయుక్తము.

తా. నేను స్వర్గస్థుడ నైన పిమ్మట సుగ్రీవుడు రాజ్యమును పొందుట యుక్తమే; కాని నీవు నన్ను యుద్ధములో అధర్మముగా చంపుటమాత్రము యుక్తము కాదు. 51

మూ. కామమేవంవిధో లోకః కాలేన వినియుజ్యతే,
క్షమం చేద్భవతా ప్రాప్తముత్తరం సాధు చిన్త్యతామ్. 52

ప్ర. అ. లోకః=లోకము, ఏవంవిధః కామమ్=ఇట్టిదే. కాలేన=కాలముచేత, వినియుజ్యతే=నియమింపబడుచుండును. క్షమం చేత్=శక్య మైనచో, భవతా= నీచేత, ప్రాప్తమ్=తగిన, ఉత్తరమ్=ప్రత్యుత్తరము, సాధు=బాగుగా, చిన్త్యతామ్=ఆలోచింపబడుగాక.

తా. లోకముతీరు ఇట్టిదే అను మాట నిజమే. లోకమును కాలము జన్మమరణాదులందు ఈ విధముగనే నియమించుచుండును. కాని నీవు చేసిన పని యుక్తమే అని చెప్పుటకు తగిన ప్రత్యుత్తరము చెప్ప కలిగినచో బాగా ఆలోచించుము. 52

మూ. ఇత్యేవముక్త్వా పరిశుష్కవక్త్రః
శరాభిఘాతాద్వ్యథితో మహాత్మా,
సమీక్ష్య రామం రవిసంనికాశం
తూష్ణీం బభూవామరరాజసూనుః. 53

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తదశః సర్గః.

ప్ర. అ. శరాభిఘాతాత్=బాణముయొక్క దెబ్బవలన, వ్యథితః=వ్యథ చెందిన వాడు, మహాత్మా=మహాత్ముడు అయిన, అమరరాజసూనుః=ఇంద్రుని కుమారుడైన వాలి, పరిశుష్కవక్త్రః=ఎండిపోయిన ముఖము గలవాడై, రవిసంనికాశమ్=సూర్యునితో

సమానుడైన, రామమ్=రాముని, సమీక్ష్య=చూచి, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తూష్ణీం బభూవ=మౌనముగా ఉండెను.

తా. బాణప్రహారము చేత వ్యథ చెందిన మహాత్ముడైన వాలి, సూర్యునితో సమానుడైన రాముని చూచి, ఇట్లు పలికి, ముఖము శుష్కించగా మౌనము వహించెను. 53

*బాలానందిని అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పదిహేడవ సర్గ సమాప్తము.*

# అథ అష్టాదశః సర్గః

[రాముడు వాలి మాటలకు సమాధానము చెప్పుచు తాను వాలి కిచ్చిన దండము యుక్తమే అని సమర్థించుటు. వాలి తన అపరాధమును మన్నింపు మని కోరుచు అంగదుని రక్షించుచుండు మని రాముని ప్రార్థించుటు. రాముడు వాలిని ఓదార్చుట]

మూ. ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం ధర్మార్థసహితం హితమ్,
పరుషం వాలినా రామో నిహతేన విచేతసా. 1

ప్ర. అ. రామః=రాముడు, నిహతేన=కొట్టబడిన, విచేతసా=చిత్తములేని (స్పృహ తప్పిన), వాలినా=వాలిచేత, ధర్మార్థసహితమ్=ధర్మార్థములతో కూడిన, హితమ్=హితమైన, ప్రశ్రితమ్=వినయముతో కూడిన, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, ఇతి=ఇట్లు, ఉక్తః=పలకబడెను.

తా. బాణము దెబ్బ తిని, స్పృహ తప్పిన వాలి రామునితో, వినయపూర్వకముగా, ధర్మార్థములతో కూడిన, హితమైన, పరుషమైన వాక్యమును పైవిధముగ పలికెను. 1

మూ. తం నిష్ప్రభమివాదిత్యం ముక్తతోయమివామ్బుదమ్,
ఉక్తవాక్యం హరిశ్రేష్ఠముపశాన్తమివానలమ్, 2
ధర్మార్థగుణసంపన్నం హరీశ్వరమనుత్తమమ్,
అధిక్షిప్తస్తదా రామః పశ్చాద్వాలిన మబ్రవీత్. 3

ప్ర. అ. తదా=అప్పుడు, అధిక్షిప్తః=నిందించబడిన, రామః=రాముడు, నిష్ప్రభమ్=కాంతి లేని, ఆదిత్యమ్ ఇవ=సూర్యుడు వలె ఉన్నవాడు, ముక్త తోయమ్=విడవబడిన ఉదకము గల, అమ్బుదమివ=మేఘము వలె ఉన్నవాడు, ఉపశాన్తమ్=శాంతించిన, అనలమ్ ఇవ=అగ్ని వలె ఉన్నవాడు, హరిశ్రేష్ఠమ్= వానరులలో శ్రేష్ఠుడు, హరీశ్వరమ్=వానరప్రభువు, అనుత్తమమ్=శ్రేష్ఠుడు, ధర్మార్థగుణసంపన్నమ్= ధర్మార్థములతోను గుణములతోను కూడునట్లుగా, ఉక్తవాక్యమ్=పలకబడిన వాక్యము కలవాడు అయిన, వాలినమ్=వాలిని గూర్చి, పశ్చాత్=పిమ్మట, అబ్రవీత్=పలికెను.

తా. వానరశ్రేష్ఠుడు, వానరప్రభువు, అత్యుత్తముడు అయిన వాలి అప్పుడు కాంతి తొలగిన సూర్యుడు వలె, ఉన్న నీరు అంతా వర్షించివేసిన మేఘము వలె, శాంతించిన అగ్ని వలె ఉండెను. అట్టి వాలిచే నిందింపబడిన రాముడు ఆతని మాటలు విన్న పిదప ఇట్లనెను. 2,3

మూ. ధర్మమర్థం చ కామం చ సమయం చాపి లౌకికమ్,
అవిజ్ఞాయ కథం బాల్యాన్మామిహాద్య విగర్హసే. 4

ప్ర. అ. ధర్మమ్=ధర్మమును, అర్థం చ=అర్థమును, కామం చ=కామమును, లౌకికమ్=లౌకికమైన, సమయం చ =మర్యాదను, అవిజ్ఞాయ= తెలుసుకొనకుండగా, ఇహ=ఇక్కడ, అద్య=ఇప్పుడు, బాల్యాత్= అజ్ఞానమువలన, మామ్=నన్ను, కథమ్=ఎట్లు, విగర్హసే= నిందించుచున్నావు?

తా. నీవు ధర్మమును, అర్థమును, కామమును, లోకమర్యాదను తెలిసికొనకుండా, ఇక్కడ నన్ను ఇప్పుడు, అజ్ఞానమువలన ఎందుకు నిందించుచున్నావు?

మూ. అపృష్ట్వా బుద్ధిసంపన్నాన్ వృద్ధానాచార్యసంమతాన్,
సౌమ్యం వానరచాపల్యాత్త్వం మాం వక్తుమిహేచ్ఛసి. 5

ప్ర. అ. బుద్ధిసంపన్నాన్=బుద్ధితో సంపన్నులు, ఆచార్యసంమతాన్=ఆచార్యులకు అంగీకరింపదగినవారు అయిన, వృద్ధాన్=పెద్దలను, అపృష్ట్వా=అడగక, త్వమ్=నీవు, సౌమ్యమ్=సౌమ్యుడనైన, మామ్=నన్ను గూర్చి, వానరచాపల్యాత్=వానరుని చాపల్యమువలన, ఇహ=ఇప్పుడు, వక్తుమ్= పలుకుటకు, ఇచ్ఛసి=ఇచ్ఛయించుచున్నావు.

తా. బుద్ధిసంపన్నులు, ఆచారము తెలిసిన ఆచార్యులకు మాన్యులు అయిన పెద్దవారిని అడగకుండగా, నీవు, వానరసహజమైన చాపల్యముచేత, సౌమ్యుడనైన నన్ను నిందింప యత్నించుచున్నావు. 5

మూ. ఇక్ష్వాకూణామియం భూమిః సశైలవనకాననా,
మృగపక్షిమనుష్యాణాం నిగ్రహానుగ్రహేష్వపి. 6

ప్ర. అ. సశైలవనకాననా=పర్వతములతోను, వనములతోను, మహారణ్యములతోను కూడిన, ఇయమ్=ఈ, భూమిః=భూమి, మృగపక్షిమనుష్యాణామ్=మృగములయొక్క, పక్షులయొక్క, మనుష్యులయొక్క, నిగ్రహానుగ్రహేష్వపి=నిగ్రహానుగ్రహముల విషయములలో కూడ, ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశీయులకు సంబంధించినది.

తా. పర్వతములతోను, చిన్న వనములతోను, మహారణ్యములతోను సహా ఈ భూమి అంతా ఇక్ష్వాకువంశీయులకు చెందినది. మృగములను, పక్షులను, మనుష్యులను నిగ్రహించుట, అనుగ్రహించుట అను విషయమునందు కూడ వారికే అధికారము. 6

మూ. తాం పాలయతి ధర్మాత్మా భరతః సత్యవానృజుః,
ధర్మకామార్థతత్త్వజ్ఞో నిగ్రహానుగ్రహే రతః. 7

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడు, సత్యవాన్=సత్యము కలవాడు, ఋజుః=ఋజుస్వభావము కలవాడు, ధర్మకామార్థతత్త్వజ్ఞః=ధర్మ-కామ-అర్థముల తత్త్వమును ఎరిగినవాడు, నిగ్రహానుగ్రహే=నిగ్రహించుటయందు, అనుగ్రహించుటయందు, రతః=

ఆసక్తి కలవాడు అయిన, భరతః=భరతుడు, తామ్=ఆ భూమిని, పాలయతి= పాలించుచున్నాడు.

తా. ఈ భూమిని ఇప్పుడు ధర్మాత్ముడైన భరతుడు పాలించుచున్నాడు. ఆతడు సత్యమునే పలుకువాడు. వక్రత్వము లేనివాడు. ధర్మ-అర్థ-కామముల తత్త్వము తెలిసినవాడు. దుష్టులను నిగ్రహించుటయందు, శిష్టులను అనుగ్రహించుటయందు శ్రద్ధ కలవాడు. 7

మూ. నయశ్చ వినయశ్చోభౌ యస్మిన్సత్యం చ సుస్థితమ్,
విక్రమశ్చ యథా దృష్టః స రాజా దేశకాలవిత్. 8

ప్ర. అ. యస్మిన్=ఎవనియందు, నయశ్చ=నీతి, వినయశ్చ=వినయము అను, ఉభౌ=రెండు గుణములు ఉన్నవో, సత్యం చ=సత్యము కూడ, సుస్థితమ్= బాగా స్థిరముగా ఉన్నదో, విక్రమశ్చ=పరాక్రమము కూడ, యథా= ఎట్లుండవలెనో అట్లు, దృష్టః=చూడబడినదో, సః=అట్టి భరతుడు, దేశకాలవిత్= దేశకాలములను ఎరిగిన, రాజా=రాజు.

తా. ఆ భరతునియందు నీతి, వినయము, సత్యము స్థిరముగా ఉన్నవి. ఆతడు తగిన పరాక్రమము గలవాడు. దేశకాలములు తెలిసిన రాజు. 8

మూ. తస్య ధర్మకృతాదేశా వయమన్యే చ పార్థివాః,
చరామో వసుధాం కృత్స్నాం ధర్మసంతానమిచ్ఛవః. 9

ప్ర. అ. తస్య=అతనియొక్క (చేత), ధర్మకృతాదేశాః=ధర్మముకొరకు చేయబడిన ఆజ్ఞ కల, వయమ్=మేము, అన్యే=ఇతరులైన, పార్థివాశ్చ=రాజులు, ధర్మసంతానమ్=ధర్మముయొక్క అవిచ్ఛేదమును, ఇచ్ఛవః=కోరుచున్నవారమై, కృత్స్నమ్=సమస్తమైన, వసుధామ్=భూమిని, చరామః=సంచరించుచున్నాము.

తా. ధర్మసంరక్షణము నిమిత్తము అతడు ఇచ్చిన ఆజ్ఞ ప్రకారము, మేము, మరి కొందరు రాజులు, ధర్మము అవిచ్ఛిన్నముగా ఉండునట్లు చూచుటకై ఈ భూమిమీద అంతటా సంచరించుచున్నాము. 9

మూ. తస్మిన్ నృపతిశార్దూలే భరతే ధర్మవత్సలే,
పాలయత్యఖిలాం పృథ్వీం కశ్చరేద్ధర్మవిప్రియమ్. 10

ప్ర. అ. నృపతిశార్దూలే=రాజులలో శ్రేష్ఠుడైన, ధర్మవత్సలే=ధర్మమునందు ఆసక్తి గల, తస్మిన్=ఆ, భరతే=భరతుడు, అఖిలామ్=సమస్తమైన, పృథ్వీమ్= భూమిని, పాలయతి=పాలించుచుండగా, కః=ఎవడు, ధర్మవిప్రియమ్= ధర్మమునకు విరోధమును, చరేత్=చేయును?

తా. రాజులలో శ్రేష్ఠుడైన ధర్మనిరతుడైన ఆ భరతుడు ఈ పృథివిని పాలించుచుండగా ఎవడు ధర్మవిరుద్ధముగా ప్రవర్తించగలడు? 10

మూ. తే వయం మార్గవిభ్రష్టం స్వధర్మే పరమే స్థితాః,
భరతాజ్ఞాం పురస్కృత్య చిన్తయామో యథావిధి. 11

ప్ర. అ. పరమే=శ్రేష్ఠమైన, స్వధర్మే=స్వధర్మమునందు, స్థితాః=ఉన్న, తే వయమ్=అట్టి మేము, భరతాజ్ఞామ్=భరతుని ఆజ్ఞను, పురస్కృత్య= పురస్కరించుకొని, యథావిధి=యథావిధిగా, మార్గవిభ్రష్టమ్=ధర్మమార్గమునుండి భ్రష్టుడైనవానిని గూర్చి, యథావిధి=యథాశాస్త్రముగా, చిన్తయామః=చింతించుచుందుము.

తా. శ్రేష్ఠమైన మా ధర్మమును పాలించుచున్న మేము భరతుని ఆజ్ఞను పురస్కరించుకొని, ఎవరైనా ధర్మమార్గమును అతిక్రమించుచున్నారా అని శాస్త్రానుసారముగా పరిశీలించి చూచుచుందుము. 11

మూ. త్వం తు సంక్లిష్టధర్మశ్చ కర్మణా చ విగర్హితః,
కామతన్త్రప్రధానశ్చ న స్థితో రాజవర్త్మని. 12

ప్ర.అ. త్వం తు=నీవైతే, సంక్లిష్టధర్మశ్చ=చెడగొట్టబడిన ధర్మము గలవాడవు. కర్మణా=కర్మచేత, విగర్హితః=నింద్యుడవు. కామతన్త్రప్రధానశ్చ= కామతంత్రమే ప్రధానముగా కలవాడవు. రాజవర్త్మని=రాజమార్గమునందు, న స్థితః=లేవు.

తా. నీవు రాజధర్మమును అనుసరించక ధర్మమును చెడగొట్టినావు; నింద్యమైన కర్మ చేసినావు. కామభోగములకే ప్రాధాన్య మిచ్చినావు. 12

మూ. జ్యేష్ఠో భ్రాతా పితా చాపి యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
త్రయస్తే పితరో జ్ఞేయా ధర్మే చ పథి వర్తినః. 13

ప్ర. అ. ధర్మే=ధర్మమైన, పథి=మార్గమునందు, వర్తినః=ఉన్నవానికి, జ్యేష్ఠః భ్రాతా=అన్నగారు, పితా చాపి=కన్న తండ్రి, యశ్చ=ఎవడు, విద్యామ్= విద్యను, ప్రయచ్ఛతి=ఇచ్చునో, అతడు, తే త్రయః=వారు ముగ్గురూ, పితరః= తండ్రులుగా, జ్ఞేయాః=తెలియదగినవారు.

తా. అన్నగారు, కన్నతండ్రి, విద్య నిచ్చిన గురువు వీరు ముగ్గురూ తండ్రులవి ధర్మమార్గమునం దున్నవారు తెలుసుకొనవలెను. 13

మూ. యవీయానాత్మనః పుత్రః శిష్యశ్చాపి గుణోదితః,
పుత్రవత్తే త్రయశ్చిన్త్యా ధర్మశ్చైవాత్రకారణమ్. 14

ప్ర. అ. యవీయాన్=తమ్ముడు, పుత్రః=పుత్రుడు, గుణోదితః=గుణములతో కూడిన, శిష్యశ్చ=శిష్యుడు, తే త్రయః=ఆ ముగ్గురూ, ఆత్మనః= తనయొక్క, పుత్రవత్=పుత్రుల వలె, చిన్త్యాః=భావింపదగినవారు. అత్ర=ఈ విషయమునందు, ధర్మః=ధర్మము, కారణమ్=కారణము.

తా. తమ్ముడు , కుమారుడు, సద్గుణవంతుడైన శిష్యుడు - వీరు

ముగ్గురూ తన పుత్రులే అని భావించవలెను. ఇందుకు ధర్మమే కారణము.

మూ. సూక్ష్మః పరమదుర్జ్ఞేయః సతాం ధర్మః ప్లవఙ్గమ,
హృదిస్థః సర్వభూతానామాత్మా వేద శుభాశుభమ్. 15

ప్ర. అ. ప్లవఙ్గమ = ఓ వానరుడా! సతామ్= సత్పురుషులయొక్క, ధర్మః =ధర్మము, సూక్ష్మః =సూక్ష్మమైనది. పరమదుర్జ్ఞేయః = తెలిసికొనుటకు చాల కష్టమైనది. సర్వభూతానామ్ =సకలప్రాణుల, హృదిస్థః=హృదయమునందున్న, ఆత్మా =ఆత్మ, శుభాశుభమ్ =శుభాశుభములను, వేద=ఎరుగును.

తా. ఓ! వానరా! సత్పురుషు లాచరించు ధర్మము చాల సూక్ష్మమైనది. తెలిసికొనుటకు చాల కష్టమైనది. సకలభూతముల హృదయములలో ఉన్న ఆత్మయే మంచిచెడ్డలను తెలిసికొనగల్గును. 15

మూ. చపలశ్చపలైః సార్ధం వానరైరకృతాత్మభిః,
జాత్యన్ధ ఇవ జాత్యన్ధైర్మన్త్రయన్ ప్రేక్షసే ను కిమ్. 16

ప్ర. అ.చపలః =చపలస్వభావము గల నీవు, అకృతాత్మభిః = నిగ్రహించుకొనబడని బుద్ధి గల, చపలైః=చపలులైన, వానరైః సార్ధమ్= వానరులతో కూడ, జాత్యన్ధః =పుట్టంధుడు, జాత్యన్ధైః ఇవ=పుట్టంధులతో వలె, మన్త్రయన్ =ఆలోచించుచు, ప్రేక్షసే ను కిమ్ = చూడగలవా?

తా. పుట్టుకతో గ్రుడ్డివాడు, పుట్టుకతో గ్రుడ్డివారైన ఇతరులతో ఆలోచించి నట్లు చపలుడవైన నీవు చపలస్వభావులు , బుద్ధిని సరియైన మార్గములో ఉంచుకొననివారు అయిన వానరులతో ఆలోచించి ధర్మాధర్మములను తెలిసికొనగలవా? 16

మూ. అహం తు వ్యక్తతామస్య వచనస్య బ్రవీమి తే,
న హి మాం కేవలం రోషాత్త్వం విగర్హితుమర్హసి. 17

ప్ర.అ.అహమ్ =నేను, అస్య =ఈ, వచనస్య =వాక్యముయొక్క, వ్యక్తతామ్=స్పష్టత్వమును, తే =నీకు, బ్రవీమి=చెప్పుచున్నాను. త్వమ్ =నీవు, కేవలమ్ =కేవలము, రోషాత్ =కోపమువలన, మామ్ =నన్ను, విగర్హితుమ్=నిందించుటకు, నార్హసి హి =తగవు కదా.

తా. నేను నా మాటల భావమును నీకు స్పష్టీకరించెదను. నీవు కేవలము కోపముతో నన్ను ఇట్లు దూషించతగదు. 17

మూ. తదేతత్కారణం పశ్య యదర్థం త్వం మయా హతః,
భ్రాతుర్వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనమ్. 18

ప్ర. అ. త్వమ్ =నీవు, యదర్థమ్ =ఎందు నిమిత్తమై, మయా = నా

చేత, హతః =చంపబడితివో, తత్ ఏతత్ =అట్టి ఈ, కారణమ్ =కారణమును, పశ్య =చూడుము. సనాతనమ్ =నిత్యమైన, ధర్మమ్ =ధర్మమును, త్యక్త్వా =విడచి, భ్రాతుః =సోదరునియొక్క, భార్యాయామ్ = భార్యయందు, వర్తసి = ప్రవర్తించుచున్నావు.

తా. నేను నిన్ను ఎందుకు చంపినానో కారణము వినుము. నీవు శాశ్వతమైన ధర్మమును విడచి సోదరుని భార్యను స్వీకరించినావు. 18

మూ. అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మకృత్. 19

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, అస్య=ఈ, సుగ్రీవస్య= సుగ్రీవుడు, ధరమాణస్య=జీవించి ఉండగానే, పాపకర్మకృత్=పాపకర్మ చేయుచున్న నీవు, కామాత్=కామమువలన, స్నుషాయామ్=కోడలైన, రుమాయామ్=రుమయందు, వర్తసే=ప్రవర్తించుచున్నావు.

తా. పాపకర్మ చేయు నీవు, మహాత్ముడైన ఈ సుగ్రీవుడు జీవించి ఉండగానే కోడలి వంటిదైన రుమను కామమువలన పొందినావు. 19

మూ. తద్వ్యతీతస్య తే ధర్మాత్కామవృత్తస్య వానర,
భ్రాతృభార్యాభిమర్శేఽస్మిన్ దణ్డోఽయం ప్రతిపాదితః. 20

ప్ర. అ. వానర=వానరుడా! తత్=ఆ కారణమువలన, ధర్మాత్= ధర్మమునుండి, వ్యతీతస్య=వ్యతిక్రమించిన, కామవృత్తస్య=స్వేచ్ఛగా ప్రవర్తించుచున్న, తే=నీకు, అస్మిన్=ఈ, భ్రాతృభార్యాభిమర్శే=సోదరుని భార్యను స్పృశించుటయందు, అయమ్=ఈ, దణ్డః=దండము, ప్రతిపాదితః= నిర్ణయించబడినది.

తా. ఓ! వానరా! అందువలన, స్వేచ్ఛగా ప్రవర్తించుచు ధర్మమును వ్యతిక్రమించిన నీవు చేసిన ఈ సోదరుని భార్యను స్పృశించుట అనే పాపమునకు ఈ దండము ఇవ్వబడినది. 20

మూ. న హి లోకవిరుద్ధస్య లోకవృత్తాదపేయుషః,
దణ్డాదన్యత్ర పశ్యామి నిగ్రహం హరియూథప. 21

ప్ర. అ. హరియూథప=వానరరాజా! లోకవిరుద్ధస్య=లోకమునకు విరుద్ధుడై, లోకవృత్తాత్=లోకముయొక్క ఆచారమునుండి, అపేయుషః=దూరమైనవానికి, దణ్డాత్=దండముకంటె, అన్యత్ర=మరియొక, నిగ్రహమ్=నిగ్రహమును, న పశ్యామి హి=చూడను కదా.

తా. ఓ వానరరాజా! లోకమునకు విరుద్ధముగా ప్రవర్తించుచు, లోకాచారమునకు దూరమైనవానికి దండము తప్ప మరొక ప్రాయశ్చిత్త మేదీ నాకు కనబడదు. 21

మూ. న చ తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్గతః,
ఔరసీం భగినీం వాపి భార్యాం వాప్యనుజస్య యః, 22
ప్రచరేత నరః కామాత్తస్య దణ్డో విధీయతే.

ప్ర. అ. కులోద్గతః=ఉత్తమకులమునందు పుట్టిన, క్షత్రియః= క్షత్రియుడనైన, అహమ్=నేను, తే=నీయొక్క, పాపమ్=పాపమును, న మర్షయే=సహించను. యః నరః=ఏ నరుడు, ఔరసీమ్= కుమార్తెను గాని, భగినీం వాపి =సోదరిని గాని, అనుజస్య=తమ్మునియొక్క, భార్యాం వాపి=భార్యను గాని, కామాత్=కామమువలన, ప్రచరేత=పొందునో, తస్య=వానికి, దణ్డః=దండము, విధీయతే=విధింపబడుచున్నది.

తా. ఉత్తమవంశమునందు పుట్టిన క్షత్రియుడనైన నేను నీవు చేసిన పాపకర్మను సహించజాలను. ఏ మానవుడు కామమోహితుడై, కుమార్తెను గాని, సోదరిని గాని, తమ్ముని భార్యను గాని పొందునో ఆతనికి దండము విధింపబడినది. 22

మూ. భరతస్తు మహీపాలో వయం త్వాదేశవర్తినః, 23
త్వం చ ధర్మాదతికాన్తః కథం శక్యముపేక్షితుమ్.

ప్ర. అ. భరతః తు=భరతుడు, మహీపాలః=రాజు. వయం తు=మేమైతే, ఆదేశవర్తినః=ఆతని ఆజ్ఞయం దున్నవారము. త్వం చ=నీవు, ధర్మాత్=ధర్మము నుండి, అతిక్రాన్తః=అతిక్రమించినావు. ఉపేక్షితుమ్=ఉపేక్షించుటకు, కథమ్=ఎట్లు, శక్యమ్=శక్యమగును?

తా. ఇప్పుడు భరతుడు రాజుగా ఉన్నాడు. మేము ఆతని ఆజ్ఞను పాలించుచున్నాము. నీవు ధర్మమార్గమును తప్పినావు. ఎట్లు ఉపేక్షించగలము?

మూ. గురుధర్మవ్యతిక్రాన్తం ప్రాజ్ఞో ధర్మేణ పాలయన్ , 24
భరతః కామయుక్తానాం నిగ్రహే పర్యవస్థితః.

ప్ర. అ. ప్రాజ్ఞః=బుద్ధిమంతుడు,గురుధర్మవ్యతిక్రాన్తమ్=గొప్పదైన ధర్మమును వ్యతిక్రమించినవానిని, (నిఘ్నన=నశింపచేసేవాడు), ధర్మేణ= ధర్మముచేత, పాలయన్=పాలించుచున్నవాడు అయిన, భరతః=భరతుడు, కామయుక్తానామ్=కామముతో కూడినవారియొక్క, నిగ్రహే=నిగ్రహమునందు, పర్యవస్థితః=నిలచిఉన్నాడు.

తా. ధర్మానుసారము రాజ్యపాలనము చేయు బుద్ధిమంతుడైన భరతుడు ఉత్తమమైన ధర్మమును అతిక్రమించువారిని నశింపచేయును. స్వేచ్ఛగా ప్రవర్తించువారిని నిగ్రహించుటకై స్థిరనిశ్చయముతో ఉన్నాడు. 24

మూ. వయం తు భరతాదేశం విధిం కృత్వా హరీశ్వర,
త్వద్విధాన్భిన్నమర్యాదాన్నిగ్రహీతుం వ్యవస్థితాః. 25

ప్ర. అ.హరీశ్వర=ఓ వానరరాజా! వయం తు=మేమైతే, భరతాదేశమ్= భరతుని ఆజ్ఞను, విధిమ్=శాస్త్రమునుగా, కృత్వా=చేసి, భిన్నమర్యాదాన్= చెడగొట్ట బడిన కట్టుబాట్లు గల, త్వద్విధాన్=నీవంటివాళ్లను, నిగ్రహీతుమ్=నిగ్రహించుటకు, వ్యవస్థితాః=ఉన్నాము.

తా.ఓ వానరరాజా! మేము భరతుని ఆదేశమును శాస్త్రము వలె పాటించుచు, కట్టుబాట్లను అతిక్రమించిన నీవంటివాళ్లను నిగ్రహించుటకై నిలచి ఉన్నాము. 25

మూ. సుగ్రీవేణ చ మే సఖ్యం లక్ష్మణేన యథా తథా, 26
దారరాజ్యనిమిత్తం చ నిఃశ్రేయసకరః స మే.

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునితో, మే=నాయొక్క, సఖ్యమ్=సఖ్యము, లక్ష్మణేన=లక్ష్మణునితో, యథా=ఎట్లో, తథా=అట్లే. దారరాజ్యనిమిత్తమ్= భార్యను, రాజ్యమును నిమిత్తముగా చేసి ఏర్పడినది. సః=అతడు, మే=నాకు, నిః శ్రేయసకరః=క్షేమమును చేయువాడు.

తా. నాకు సుగ్రీవునితో ఏర్పడిన స్నేహము లక్ష్మణునితో స్నేహము వంటిది. భార్య, రాజ్యము నిమిత్తముగా చేసికొని ఏర్పడినది. ఆతడు నాకు సాహాయ్యము చేయనున్నాడు. 26

మూ. ప్రతిజ్ఞా చ మయా దత్తా తదా వానరసంనిధౌ, 27
ప్రతిజ్ఞా చ కథం శక్యా మద్విధేనావవేక్షితుమ్.

ప్ర.అ. తదా =అప్పుడు, మయా =నాచేత, వానరసంనిధౌ = వానరుల సమీపమునందు, ప్రతిజ్ఞా చ =ప్రతిజ్ఞ కూడ, దత్తా = ఇవ్వబడినది. మద్విధేన =నావంటివానిచేత, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, అనవేక్షితుమ్ =చూడకుండుటకు, కథమ్=ఎట్లు, శక్యా = శక్యమైనది?

తా. నేను ఆనాడు వానరుల సమక్షమునందు ప్రతిజ్ఞ కూడ చేసి ఉన్నాను. నావంటివాడు చేసిన ప్రతిజ్ఞను పాలించకుండా ఎట్లుండగలడు? 27

మూ. తదేభిః కారణైః సర్వైర్మహద్భిర్ధర్మసంహితైః, 28
శాసనం తవ యద్యుక్తం తద్భవాననుమన్యతామ్.

ప్ర. అ. తత్ =ఆ కారణమువలన, ధర్మసంహితైః=ధర్మసంమతములైన, సర్వైః =సమస్తమైన, మహద్భిః =గొప్పవైన, ఏభిః కారణైః = ఈ కారణములచేత, తవ =నీయొక్క, యత్ =ఏ, శాసనమ్= దండనము, యుక్తమ్ =యుక్తమైనదో, తత్ =దానిని, భవాన్ =నీవు, అనుమన్యతామ్ =అంగీకరించెదవుగాక.

తా. ధర్మసంమతములైన ఈ గొప్ప కారణము లన్నింటిచేత, నీకు తగిన దండనమే ఇవ్వబడినది. దీనిని నీవు అంగీకరించవలెను. 28

మూ. సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్యస్తవ నిగ్రహః, 29
వయస్యస్యోపకర్తవ్యం ధర్మమేవానుపశ్యతా.

ప్ర. అ. తవ =నీయొక్క, నిగ్రహః=నిగ్రహము, సర్వథా = అన్నివిధములా, ధర్మః ఇత్యేవ =ధర్మమే అని, ద్రష్టవ్యః = చూడదగినది. ధర్మమ్ =ధర్మమును, అనుపశ్యతా = చూచుచున్నవానిచేత, వయస్యస్య =స్నేహితునకు, ఉపకర్తవ్యమ్ ఏవ = ఉపకారము చేయవలసినదే.

తా. నిన్ను నిగ్రహించుట అన్ని విధములా ధర్మమే అని గ్రహింపుము. ధర్మమును పాటించువాడు స్నేహితునకు ఉపకారము చేసియే తీరవలెను. 29

మూ. శక్యం త్వయాపి తత్కార్యం ధర్మమేవానువర్తతా, 30
శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ,
గృహీతౌ ధర్మకుశలైస్తథా తచ్చరితం మయా. 31

ప్ర. అ. ధర్మమేవ =ధర్మమునే, అనుపశ్యతా =చూచుచున్న, త్వయాపి =నీచేత కూడ, తత్ =ఆ, కార్యమ్ =కార్యము, శక్యమ్ =శక్యమైనది. మనునా =మనువుచేత, చారిత్రవత్సలౌ =మంచి నడవడికయందు ఆసక్తి గల, శ్లోకౌ =శ్లోకములు, గీతౌ = చెప్పబడిన వని, శ్రూయతే =వినబడుచున్నది. ధర్మకుశలైః = ధర్మమునందు నేర్పు గలవారిచేత, గృహీతౌ =గ్రహింపబడినవి. మయా =నాచేత, తత్ =అది, తథా =ఆ విధముగా, చరితమ్ = ఆచరించబడినది.

తా. ధర్మమును అనుసరించి నీవు కూడ నీకు లభించిన దండము ధర్మసంమతమే అని గ్రహించుము. సచ్చరిత్రను ప్రశంసించు రెండు శ్లోకములను మనువు చెప్పి నట్లు వినుచున్నాము. ధర్మమునందు నేర్పుగల వారు వాటిని స్వీకరించిరి. నేను కూడ వాటిలో చెప్పిన ప్రకారమే చేసినాను. 30, 31

మూ. రాజభిర్ధృతదణ్డాశ్చ కృత్వా పాపాని మానవాః,
నిర్మలాః స్వర్గమాయాన్తి సన్తః సుకృతినో యథా. 32

ప్ర. అ. (ఆ రెండు శ్లోకములు చెప్పుచున్నాడు). మానవాః =మానవులు, పాపాని =పాపములను, కృత్వా =చేసి, రాజభిః =రాజులచేత, ధృతదణ్డాః= ధరించబడిన (విధించబడిన) దండము గలవారై, నిర్మలాః = పాపవిహీనులై, సుకృతినః =పుణ్యాత్ములైన, సన్తః యథా= సత్పురుషులు వలె, స్వర్గమ్ =స్వర్గమును, ఆయాన్తి=పొందుదురు.

తా. పాపాలు చేసిన మానవులు రాజులచేత దండింపబడి, పాపములన్నీ తొలగిపోవుటచే, పుణ్యాత్ములైన సత్పురుషుల వలె స్వర్గమునకు వెళ్ళెదరు. 32

మూ. శాసనాద్వాపి మోక్షాద్వా స్తేనః పాపాత్ప్రముచ్యతే,
రాజా త్వశాసన్ పాపస్య తదవాప్నోతి కిల్బిషమ్. 33

ప్ర. అ. స్తేనః =దొంగ, శాసనాద్వాపి =దండించుటవల్లనైనా, మోక్షాద్వా =విడిచివేయుటవల్లనైనా, పాపాత్ =పాపమునుండి, ప్రముచ్యతే =విడువబడును. అశాసన్ =శాసించని, రాజా తు =రాజైతే, పాపస్య =పాపాత్మునియొక్క, తత్ =ఆ, కిల్బిషమ్ = పాపమును, ఆప్నోతి =పొందును.

తా. దండమును అనుభవించుటవలన గాని, పట్టి విడవబడుటవలన గాని, దొంగ చేసిన పాపమునుండి విముక్తు డగును. కాని సరిగా దండించని రాజుకు ఆ పాపాత్ముని పాపము సంక్రమించును. 33

మూ. ఆర్యేణ మమ మాన్ధాత్రా వ్యసనం ఘోరమీప్సితమ్,
శ్రమణేన కృతే పాపే యథా పాపం కృతం త్వయా. 34

ప్ర. అ. మమ =నాయొక్క, ఆర్యేణ =పూజ్యుడైన, మాన్ధాత్రా = మాంధాతచేత, త్వయా =నీచేత, యథా =ఎట్లు, పాపమ్ = పాపము, కృతమ్ = చేయబడినదో, అట్లే, శ్రమణేన =ఒక బౌద్ధసన్యాసిచేత, పాపే =పాపము, కృతే =చేయబడిన దగుచుండగా, ఈప్సితమ్ =ఇష్టమైన, ఘోరమ్ =తీవ్రమైన, వ్యసనమ్ = దండనము ఇవ్వబడినది.

తా. ఒక బౌద్ధసంన్యాసి నీవు చేసిన పాపమువంటి పాపమునే చేయగా, నా పూర్వపురుషుడు, పూజ్యుడు అయిన మాంధాత తాను ఎట్టి దండనము ఇవ్వవలె నని అనుకొనెనో అట్టి భయంకరమైన దండము ఆతనికి విధించెను.

వి. ప్రాచీనవ్యాఖ్యాతలు పై విధముగా వ్యాఖ్యానించినారు. కాని రాముని కాలానికి, అంతకు పూర్వం మాంధాత కాలానికి, బౌద్ధులు లేరు. అందుచేత శ్రమణశబ్దాన్ని నామధేయవాచకంగా తీసికొంటే బాగుంటుంది. 'మాంధాత దండము విధించెను' అనే అర్థము ఈ పదాలకు సరిగా కుదరదు. అది క్లిష్టాన్వయము. వెనుకటి శ్లోకంలో "రాజు దుష్టుని శిక్షించక పోయినచో వాని పాపము రాజుకు సంక్రమించును" అని చెప్పబడినది. అందుచేత, "శ్రమణుని పాపము మాంధాతకు సంక్రమించినది" అని ఇక్కడ అర్థం చెప్పిన బాగుండును. ప్రాచ్యపాఠంలో అర్థం స్పష్టంగా ఉన్నది.

"పూర్వేణ మమ మాన్ధాత్రా సంప్రాప్తం వ్యసనం మహత్,
శ్రమణేన కృతే పాపే యథాపాపం కృతం త్వయా." 34

మూ. అన్యైరపి కృతం పాపం ప్రమత్తైర్వసుధాధిపైః,
ప్రాయశ్చిత్తం చ కుర్వన్తి తేన తచ్ఛామ్యతే రజః. 35

ప్ర. అ. అన్యైరపి =ఇతరులచేత కూడ, కృతమ్ = చేయబడిన,

పాపమ్=పాపము, ప్రమత్తైః =ప్రమాదమును పొందిన, వసుధాధిపైః =రాజులచేత, (పొందబడినది). ప్రాయశ్చిత్తమ్ = ప్రాయశ్చిత్తమును, కుర్వన్తి =చేయుచుందురు. తేన =దానిచేత, తత్ =ఆ, రజః =పాపము, శామ్యతే =శాంతించును.

తా. ఏమరుపాటు చెందిన మరి కొందరు రాజులు కూడ ఇతరులు చేసిన పాపమును పొందిరి. వాళ్ళు ప్రాయశ్చిత్తము చేసికొని ఆ పాపమును తొలగించుకొనుచుందురు. 35

మూ. తదలం పరితాపేన ధర్మతః పరికల్పితః,
వధో వానరశార్దూల న వయం స్వవశే స్థితాః. 36

ప్ర. అ. వానరశార్దూల =వానరశ్రేష్ఠుడా! తత్ =ఆ కారణమువలన, పరితాపేన =దుఃఖముచేత, అలమ్ =చాలును. వధః =నీ వధ, ధర్మతః =ధర్మమువలననే, పరికల్పితః =కల్పింపబడినది. వయమ్ =మేము, స్వవశే =మా అధీనములో (మా ఇష్టములో), న స్థితాః =లేము.

తా. అందుచేత, ఓ వానరశ్రేష్ఠుడా ! నీవు మనస్సులో బాధ పడవలసిన పని లేదు. నిన్ను చంపుట ధర్మసంమతమే. మేము స్వతంత్రులము కాము; శాస్త్రమును అనుసరించువారము. 36

మూ. శృణు చాప్యపరం భూయః కారణం హరిపుఙ్గవ,
తచ్ఛ్రుత్వా హి మహద్వీర న మన్యుం కర్తుమర్హసి. 37

ప్ర. అ. వీర =వీరుడా! హరిపుఙ్గవ =వానరశ్రేష్ఠుడా! భూయః = మరల, అపరమ్ =మరియొక, కారణమ్ = కారణమును, శృణు=వినుము. తత్ =ఆ, మహత్ =గొప్పదైన కారణమును, శ్రుత్వా =విని, మన్యుమ్ =కోపమును, కర్తుమ్ =చేయుటకు, నార్హసి =తగవు.

తా. వీరుడవైన వానరశ్రేష్ఠుడా ! మరి యొక కారణము కూడ చెప్పెదను వినుము. ప్రధానమైన ఆ కారణమును విన్న పిమ్మట నీకు కోపము ఉండదు. 37

మూ. న మే తత్ర మనస్తాపో న మన్యుర్హరిపుఙ్గవ,
వాగురాభిశ్చ పాశైశ్చ కూటైశ్చ వివిధైర్నరాః, 38
ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ గృహ్ణన్తి సుబహూన్ మృగాన్.

ప్ర. అ. హరిపుఙ్గవ =వానరశ్రేష్ఠుడా ! తత్ర =నీ వధ విషయమున(లేదా నీవు చేసిన నింద విషయమున)మే =నాకు, మనస్తాపః =మనస్సుకు బాధగాని, మన్యుః =శోకము గాని, న =లేదు. నరాః = మానవులు, వాగురాభిశ్చ =వలలచేతను, పాశైశ్చ =పాశములచేతను, వివిధైః =అనేకవిధములైన, కూటైశ్చ =కపటములచేతను, ప్రతిచ్ఛన్నాశ్చ =కప్పబడినవారై, దృశ్యాశ్చ =కనబడుచున్నవారై,

సుబహూన్ =అనేకమైన, మృగాన్ =మృగములను, గృహ్ణన్తి = గ్రహించుచుందురు.

తా. వానరశ్రేష్ఠుడా! నిన్ను ఈ విధముగా చంపినందుకు నీవు నన్ను నిందించినందుకు నాకు మనస్తాపము గాని, శోకము కాని లేదు. ఎందుచేత ననగా మానవులు దాగి ఉండి గాని, కనబడుచూ గాని అనేకమృగములను వలలతోను, పాశములతోను, ఇంకా అనేకకపటోపాయములతోను బంధించుచుందురు. 38

మూ. ప్రధావితాన్వా విత్రస్తాన్ విస్రబ్ధానతివిష్ఠితాన్, 39
ప్రమత్తానప్రమత్తాన్వా వరా మాంసాశినో భృశమ్,
విధ్యన్తి విముఖాంశ్చాపి న చ దోషోఽత్ర విద్యతే. 40

ప్ర. అ. మాంసాశినః=మాంసమును భుజించు, నరాః=నరులు, ప్రధావితాన్ వా=పారిపోవుచున్నవైనా, విత్రస్తాన్=భయపడినవైనా, విస్రబ్ధాన్=నమ్మకముతో ఉన్నవైనా, అతివిష్ఠితాన్=నిలచి ఉన్నవైనా, ప్రమత్తాన్=ఏమరిపాటుతో ఉన్నా, అప్రమత్తాన్వా=ఏమరిపాటు లేనివైనా, విముఖాంశ్చ=పరాఙ్ముఖముగా ఉన్నా, మృగములను, విధ్యన్తి= కొట్టుచుందురు. అత్ర=దీనియందు, దోషః=దోషము, న విద్యతే=లేదు.

తా. మృగములు పరుగెత్తుచున్నా, భయపడినా, భయములేక కదలకుండా నిలచి ఉన్నా, ఏమరిపాటుతో ఉన్నా, ఏమరుపాటు లేకపోయినా, మరొక వైపు తిరిగి ఉన్నా, వాటిని చంపుచుందురు. అట్లు చేయుటలో దోషము లేదు.

మూ. యాన్తి రాజర్షయశ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః,
తస్మాత్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానరః, 41
అయుధ్యన్ ప్రతియుధ్యన్ వా యస్మాచ్ఛాఖామృగో హ్యసి.

ప్ర. అ. అత్ర=ఈ లోకమునందు, ధర్మకోవిదాః=ధర్మమును ఎరిగిన, రాజర్షయః=రాజర్షులు, మృగయామ్=వేటను గూర్చి, యాన్తి చ=వెళ్లుచుందురు కూడ. వానర=ఓ వానరుడా! త్వమ్=నీవు, అయుధ్యన్=యుద్ధము చేయకపోయినా, ప్రతియుధ్యన్ వా =ఎదిరించి యుద్ధము చేసినా, యస్మాత్=ఏ కారణమువలన, శాఖామృగః=వానరుడవు, అసి=అయి ఉన్నావో, తస్మాత్=ఆ కారణమువలన, మయా=నాచేత, యుద్ధే=యుద్ధమునందు, బాణేన=బాణముచేత, నిహతః=చంపబడితివి.

తా. ధర్మవేత్తలైన రాజర్షులు వేటాడుచుందురు కూడ. ఓ వానరుడా! నీవు నాతో యుద్ధము చేసినా, చేయకపోయినా వానరుడవే కదా! అందుచేతనే నిన్ను యుద్ధములో బాణముతో కొట్టినాను. 41

మూ. దుర్లభస్య చ ధర్మస్య జీవితస్య శుభస్య చ, 42
రాజానో వానరశ్రేష్ఠ ప్రదాతారో న సంశయః.

ప్ర.అ. వానరశ్రేష్ఠ=ఓ వానరశ్రేష్ఠుడా ! రాజానః=రాజులు, దుర్లభస్య=దుర్లభమైన, ధర్మస్య=ధర్మమునకు, శుభస్య= శుభకరమైన, జీవితస్య చ=జీవితమునకు, ప్రదాతారః=దాతలు. సంశయః=సంశయము, న=లేదు.

తా. ఓ! వానరశ్రేష్ఠా! సంపాదింప శక్యము కాని ధర్మమును, పవిత్రమైన జీవితమును రాజులే ఇచ్చెదరు. సందేహము లేదు. 42

మూ. తాన్న హింస్యాన్న చాక్రోశేన్నాక్షిపేన్నాప్రియం వదేత్, 43
దేవా మానుషరూపేణ చరన్త్యేతే మహీతలే.

ప్ర.అ. తాన్=ఆ రాజులను, న హింస్యాత్=హింసించకూడదు. న చాక్రోశేత్=నిందించగూడదు. న ఆక్షిపేత్=చులకనగా మాటలాడకూడదు. అప్రియమ్=అప్రియమును, న వదేత్= పలకకూడదు. ఏతే=వీరు, దేవాః=దేవతలు. మానుషరూపేణ= మనుష్యరూపముతో, మహీతలే=భూమియందు, చరన్తి= సంచరించుచున్నారు.

తా. రాజు లనగా మనుష్యరూపముతో భూలోకమునందు సంచరించే దేవతలు. అందుచేత వారిని హింసించకూడదు; నిందించకూడదు. తేలికగా మాటలాడకూడదు; అప్రియము పలకకూడదు. 43

మూ. త్వం తు ధర్మమవిజ్ఞాయ కేవలం రోషమాస్థితః, 44
విదూషయసి మాం ధర్మే పితృపైతామహే స్థితమ్.

ప్ర. అ. త్వం తు=నీవైతే, ధర్మమ్=ధర్మమును, అవిజ్ఞాయ= తెలిసికొనక, కేవలమ్=కేవలము, రోషమ్=రోషమును, ఆస్థితః= అవలంబించినవాడవై, పితృపైతామహే=నా తండ్రికి తాతలకు సంబంధించిన, ధర్మే=ధర్మమునందు, స్థితమ్=ఉన్న, మామ్=నన్ను, విదూషయసి=దూషించుచున్నావు.

తా. నీవైతే ధర్మ మేమో తెలియక, కేవలము రోషముతో నిండినవాడవై, నా తండ్రితాతలనుండి వచ్చుచున్న ధర్మమార్గమును అనుసరించిన నన్ను దూషించుచున్నావు! 44

మూ. ఏవముక్తస్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశమ్, 45
న దోషం రాఘవే దధ్యౌ ధర్మే ఽధిగతనిశ్చయః.

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః= పలకబడిన, వాలీ=వాలి, భృశమ్=మిక్కిలి, ప్రవ్యథితః=వ్యథ చెందినవాడై, ధర్మే=ధర్మమునందు, అధిగతనిశ్చయః=పొందబడిన నిశ్చయము గలవాడై, రాఘవే=రామునియందు, దోషమ్=దోషమును, న దధ్యౌ=చూడలేదు.

తా. రాముని మాటలు వినిన పిదప వాలి మనస్సులో చాలా చింతించెను. ధర్మమును గూర్చి నిశ్చిత మగు అభిప్రాయము కలుగుటచే రామునియందు దోష

మేమీ లేదని గ్రహించెను. 45

మూ. ప్రత్యువాచ తతో రామం ప్రాఞ్జలిర్వానరేశ్వరః, 46
యత్త్వమాత్థ నరశ్రేష్ఠ తత్తథైవ న సంశయః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరేశ్వరః=ఆ వానరరాజు, ప్రాఞ్జలిః=ఎత్త బడిన దోసిలి కలవాడై, రామమ్=రాముని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా! త్వమ్=నీవు, యత్=ఏది, ఆత్థ=పలికితివో, తత్=అది, తథైవ=అట్లే. సంశయః=సంశయము, న=లేదు.

తా. పిమ్మట వానరరాజైన వాలి అంజలి ఘటించి రామునితో ఇట్లు పలికెను; "నరులలో శ్రేష్ఠుడవైన రామా! నీవు చెప్పిన దంతా సత్యము; సంశయము లేదు". 46

మూ. ప్రతివక్తుం ప్రకృష్టే హి నాపకృష్టస్తు శక్నుయాత్, 47
యదయుక్తం మయా పూర్వం ప్రమాదాద్వాక్యమప్రియమ్,
తత్రాపి ఖలు మాం దోషం కర్తుం నార్హసి రాఘవ. 48

ప్ర. అ. రాఘవ=రామా! ప్రకృష్టే=ఉత్తముని విషయమునందు, అప కృష్టః=తక్కువవాడు, ప్రతివక్తుమ్=ప్రత్యుత్తర మిచ్చుటకు, న శక్నుయాత్=సమర్థుడు కాజాలడు; మయా=నాచేత, పూర్వమ్=పూర్వము, ప్రమాదాత్=పొరబాటువలన, యత్=ఏ, అయుక్తమ్=అయుక్తమైన, అప్రియమ్=ప్రియము కాని, వాక్యమ్=వాక్యము, ఉక్తమ్=పలకబడినదో, తత్రాపి= దానివిషయమునందు కూడ, మామ్=నన్ను గూర్చి, దోషమ్= దోషమును, కర్తుమ్=చేయుటకు, నార్హసి=తగవు.

తా. రామా! ఉత్తమునకు నీచుడు సమాధానము చెప్పజాలడు కదా! నేను పొరబాటుచే ఇంతకు ముందు అయుక్తముగాను, అప్రియము గాను పలికిన మాటలకు నా విషయమున దోషమును చూడకుము. 47, 48

మూ. త్వం హి దృష్టార్థతత్త్వజ్ఞః ప్రజానాం చ హితే రతః,
కార్యకారణసిద్ధౌ చ ప్రసన్నా బుద్ధి రవ్యయా. 49

ప్ర.అ. త్వమ్=నీవు, దృష్టార్థతత్త్వజ్ఞః=చూడబడిన విషయములు గలవాడవు, వాటి తత్త్వము తెలిసినవాడవు. ప్రజానామ్= ప్రజలయొక్క, హితే=హితము నందు, రతశ్చ=ఆసక్తి గలవాడవు. అవ్యయా=దోషములు లేని, బుద్ధిః=బుద్ధి, కార్యకారణసిద్ధౌ= కార్యకారణముల సిద్ధియందు, ప్రసన్నా=నిర్మలమైనది.

తా. నీవు అన్ని విషయములు పరిశీలించి వాటి తత్త్వమును తెలిసికొన్న వాడవు. ప్రజల హితమునందే ఆసక్తి కలవాడవు. ఎట్టి దోషములు లేని నీ బుద్ధి ఏ కారణమువలన ఏ కార్యము కలుగుచున్నది అను విషయమును స్పష్టముగా నిర్ణయించ సమర్థమైనది. 49

మూ. మామప్యవగతం ధర్మాద్ వ్యతిక్రాన్తపురస్కృతమ్,
ధర్మసంహితయా వాచా ధర్మజ్ఞ పరిపాలయ. 50

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసిన ఓ రామా! ధర్మాత్= ధర్మమునుండి, అవగతమ్=దూరమైనవాడను, వ్యతిక్రాన్తపురస్కృతమ్ =ధర్మమును అతిక్రమించిన వారిలో అగ్రేసరుడను అయిన, మామపి= నన్ను, ధర్మసంహితయా=ధర్మముతో కూడిన, వాచా=వాక్కుతో, పరిపాలయ=పాలించుము.

తా. ధర్మములు తెలిసిన రామా! నేను ధర్మమునుండి దూరమైనాను. ధర్మమును అతిక్రమించినవారిలో అగ్రేసరుడను. అట్టి నన్ను ధర్మముతో కూడిన మాటలతో పాలించుము. 50

మూ. బాష్పసంరుద్ధకణ్ఠస్తు వాలీ సార్తరవః శనైః,
ఉవాచ రామం సంప్రేక్ష్య పఙ్కలగ్న ఇవ ద్విపః. 51

ప్ర. అ. పఙ్కలగ్నః=పంకమునందు దిగబడిన, ద్విపః ఇవ= ఏనుగు వలె ఉన్న, వాలీ=వాలి, బాష్పసంరుద్ధకణ్ఠః=బాష్పముచేత అడ్డుకొనబడిన కంఠము కలవాడై, సార్తరవః=దీనధ్వనితో కూడినవాడై, రామమ్=రాముని, సంప్రేక్ష్య=చూచి, శనైః=మెల్లగా, ఉవాచ=పలికెను.

తా. బురదలో దిగబడిపోయిన ఏనుగు వలె ఉన్న వాలి కన్నీటితో డగ్గుత్తిక చెందిన కంఠము గలవాడై, రాముని చూచి, దీనస్వరముతో మందముగా ఇట్లు పలికెను. 51

మూ. న చాత్మానమహం శోచే న తారాం నాపి బాన్ధవాన్,
యథా పుత్రం గుణజ్యేష్ఠమఙ్గదం కనకాఙ్గదమ్. 52

ప్ర. అ. గుణజ్యేష్ఠమ్=గుణములచేత పెద్దవాడు, కనకాఙ్గదమ్= బంగారు అంగదములు కలవాడు అయిన, పుత్రమ్=పుత్రుడైన, అఙ్గదమ్=అంగదుని గూర్చి, యథా=ఎట్లు దుఃఖించుచున్నానో, అట్లు, అహమ్=నేను, ఆత్మానమ్=నన్నుగూర్చి, న శోచే=దుఖించుటలేదు. తారామ్=తారను గూర్చి, న=దుఃఖించుటలేదు. బాన్ధవానపి= బంధువులను గూర్చి కూడ, న=దుఃఖించుట లేదు.

తా. "సద్గుణములచేత పెద్దవాడు, అందమైన బాహువులు ధరించువాడు అయిన నా కుమారుడు అంగదుని గూర్చి విచారించి నంతగా నన్ను గూర్చి గాని, తారను గూర్చి గాని, ఇతర బంధువులను గూర్చి గాని నేను విచారించుట లేదు." 52

మూ. స మమాదర్శనాద్దీనో బాల్యాత్ప్రభృతి లాలితః,
తటాక ఇవ పీతామ్బురుపశోషం గమిష్యతి. 53

ప్ర. అ. బాల్యాత్ ప్రభృతి=బాల్యము మొదలు, లాలితః=లాలన చేయబడిన,

సః=ఆ అంగదుడు, మమ=నాయొక్క, అదర్శనాత్= కనబడకపోవుటవలన, దీనః=దీనుడై, పీతాంబుః=త్రాగబడిన ఉదకము గల, తటాకః ఇవ=చెరువు వలె, ఉపశోషమ్=శోషణమును, గమిష్యతి=పొందగలడు.

తా. "బాల్యమునుండి లాలన చేయబడిన అంగదుడు నేను కనబడకపోవుటచే దీనుడై, పూర్తిగా నీళ్లు త్రాగివేసిన చెరువు వలె ఎండిపోవును." 53

మూ. బాలశ్చాకృతబుద్ధిశ్చ ఏకపుత్రశ్చ మే ప్రియః,
తారేయో రామ భవతా రక్షణీయో మహాబలః. 54

ప్ర. అ. రామ=రామా! బాలశ్చ=బాలుడు, అకృతబుద్ధిశ్చ=చేయబడని బుద్ధి గలవాడు (లోకజ్ఞానము లేనివాడు), మే=నా యొక్క, ప్రియః=ఇష్టుడైన, ఏకపుత్రశ్చ=ఒకే పుత్రుడు, మహాబలః=గొప్ప బలము గలవాడు, తారేయః=తార కుమారుడు అయిన అంగదుడు, భవతా=నీచేత, రక్షణీయః=రక్షింపదగినవాడు.

తా. "రామా! అంగదుడు వయస్సుచేత చిన్నవాడు. లోకానుభవము లేనివాడు. తారపుత్రుడైన ఇతడు నా ఏకైక కుమారుడు. ఈతనిని నీవు రక్షించవలెను." 54

మూ. సుగ్రీవే చాఙ్గదే చైవ విధత్స్వ మతిముత్తమామ్,
త్వం హి గోప్తా చ శాస్తా చ కార్యాకార్యవిధౌ స్థితః. 55

ప్ర. అ. సుగ్రీవే చ=సుగ్రీవుని విషయమునందు, అఙ్గదే చైవ= అంగదుని విషయమునందు, ఉత్తమామ్=ఉత్తమమైన, మతిమ్= బుద్ధిని, విధత్స్వ=చేయుము. కార్యాకార్యవిధౌ=కార్యాకార్యముల విధియందు, స్థితః=ఉన్న, త్వమ్=నీవు, గోప్తా చ=రక్షకుడవు. శాస్తా చ=శిక్షకుడవు.

తా. "నీవు కార్యాకార్యముల విషయమున నిశ్చితమైన అభిప్రాయము ఉన్నవాడవు, రక్షకుడవు, దుష్టులను శాసించువాడవు. అట్టి నీవు సుగ్రీవుని విషయమునందు, అంగదుని విషయమునందు ఉత్తమమైన బుద్ధిని చూపుము. (వాళ్ళను) బాగుగా చూచుకొనుము." 55

మూ. యా తే నరపతే వృత్తిర్భరతే లక్ష్మణే చ యా,
సుగ్రీవే చాఙ్గదే రాజంస్తాం చిన్తయితుమర్హసి. 56

ప్ర. అ. నరపతే=నరులకు ప్రభువైనవాడా! రాజన్=రాజా! భరతే=భరతుని యందు, తే=నీకు, యా=ఏ, వృత్తిః=ప్రవృత్తి ఉన్నదో, లక్ష్మణే చ=లక్ష్మణుని విషయమునందు కూడ, యా=ఏది ఉన్నదో, తామ్ =అట్టి ప్రవృత్తిని, సుగ్రీవే చ=సుగ్రీవునియందు, అఙ్గదే= అంగదునియందు, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగియున్నావు.

తా. "మానవుల ప్రభువైన ఓ రాజా! భరతుని విషయమున, లక్ష్మణుని విషయమున నీవు ఏ విధముగా ప్రవర్తింతువో అట్టి ప్రవర్తనను సుగ్రీవాంగదుల విషయమునందు కూడ చూపుము." 56

మూ. మద్దోషకృతదోషాం తాం యథా తారాం తపస్వినీమ్,
సుగ్రీవో నావమన్యేత తథావస్థాతుమర్హసి. 57

ప్ర. అ. మద్దోషకృతదోషామ్=నా దోషముచేత చేయబడిన దోషము గల, తపస్వినీమ్=దీనురాలైన, తాం తారామ్=ఆ తారను, సుగ్రీవః= సుగ్రీవుడు, యథా=ఎట్లు, నావమన్యేత=అవమానించడో, తథా=అట్లు, అవస్థాతుమ్=ఉండుటకు (ఉంచుటకు), అర్హసి=తగిఉన్నావు.

తా. "దీనురాలైన తార స్వయముగా ఏ అపరాధము చేయకపోయినను నా అపరాధముచేత ఆమె కూడ అపరాధముచేసినదే అని భావించి సుగ్రీవుడు ఆమెను అవమానించకుండునట్లు చూడుము." 57

మూ. త్వయా హ్యనుగృహీతేన శక్యం రాజ్యముపాసితుమ్, 58
త్వద్వశే వర్తమానేన తవ చిత్తానువర్తినా,
శక్యం దివం చార్జయితుం వసుధాం చాపి శాసితుమ్. 59

ప్ర. అ. త్వయా=నీచేత, అనుగృహీతేన=అనుగ్రహింపబడినవాడై, త్వద్వశే=నీ వశమునందు, వర్తమానేన=ఉంటున్నవాడై, తవ చిత్తానువర్తినా=నీ చిత్తమును అనుసరించువానిచేత, రాజ్యమ్= రాజ్యమును, ఉపాసితుమ్=నడపుటకు, శక్యమ్=శక్యమైనది. దివమ్=స్వర్గమును, ఆర్జయితుం చ=సంపాదించుటకు, వసుధామ్=భూమిని, శాసితుం చాపి=శాసించుటకు, శక్యమ్= శక్యమైనది.

తా. నీ అనుగ్రహమును పొంది, నీ వశములో ఉండి, నీ చిత్తమును అనుసరించి ఉండేవాడు రాజ్యమును పాలింపగలడు. స్వర్గమును కూడ సంపాదించగలడు. భూమిని శాసించగలడు. 58,59

మూ. త్వత్తోఽహం వధమాకాఙ్క్షన్ వార్యమాణోఽపి తారయా,
సుగ్రీవేణ సహ భ్రాత్రా ద్వన్ద్వయుద్ధముపాగతః, 60
ఇత్యుక్త్వా వానరో రామం విరరామ హరీశ్వరః.

ప్ర.అ. అహమ్=నేను, తారయా=తారచేత, వార్యమాణోఽపి= నివారింపబడుచున్నను, త్వత్తః=నీనుండి, వధమ్= వధను, ఆకాఙ్క్షన్ =కోరుచు, భ్రాత్రా=సోదరుడైన, సుగ్రీవేణ సహ=సుగ్రీవునితో కూడ, ద్వన్ద్వయుద్ధమ్=ద్వంద్వ యుద్ధమును, ఉపాగతః=పొందినాను. హరీశ్వరః=వానరరాజైన, వానరః=వాలి, రామమ్=రామునిగూర్చి, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, విరరామ=విరమించెను.

తా. "తార నివారించుచున్నా నీ చేతిలో మరణించుటకా అన్నట్లు నేను

నా సోదరుడైన సుగ్రీవునితో ద్వంద్వయుద్ధమునకై తలబడితిని." వానరరాజైన వాలి రామునితో ఇట్లు పలికి విరమించెను. 60

మూ. స తమాశ్వాసయద్రామో వాలినం వ్యక్తదర్శనమ్, 61
సాధుసంమతయా వాచా ధర్మతత్త్వార్థయుక్తయా.

ప్ర.అ. సః రామః=ఆ రాముడు, వ్యక్తదర్శనమ్=స్పష్టమైన దృష్టి (ఆలోచన ) గల, తం వాలినమ్=ఆ వాలిని, సాధుసంమతయా= సత్పురుషులకు సంమతమైన, ధర్మతత్త్వార్థయుక్తయా=ధర్మముతోను, యథార్థముతోను కూడిన, వాచా=వాక్కుతో, ఆశ్వాసయత్=ఓదార్చెను.

తా. అప్పుడా రాముడు స్పష్టమైన ఆలోచన గల ఆ వాలికి సత్పురుషులకు సంమతములు, ధర్మముతోను, యథార్థముతోను కూడినవి అయిన మాటలు చెప్పెను. 61

మూ. న సంతాపస్త్వయా కార్య ఏతదర్థం ప్లవఙ్గమ, 62
న వయం భవతా చిన్త్యా నాప్యాత్మా హరిసత్తమ.
వయం భవద్విశేషేణ ధర్మతః కృతనిశ్చయాః. 63

ప్ర. అ. ప్లవఙ్గమ=ఓ వాలీ! ఏతదర్థమ్=దీని నిమిత్తము, త్వయా=నీచేత, సంతాపః=దుఃఖము, న కార్యః=చేయదగినది కాదు. హరిసత్తమ=వానరశ్రేష్ఠుడా! భవతా=నీచేత, వయమ్= మేము, న చిన్త్యాః=చింతింప తగిన వారము కాదు. ఆత్మాపి=తాను కూడ, న= చింతింపదగినవాడు కాదు. వయమ్=మేము, భవద్విశేషేణ=నీయొక్క విశేషముచేత, ధర్మతః=ధర్మమువలన, కృతనిశ్చయాః=చేయబడిన నిశ్చయము గలవారము.

తా. ఓ! వానరశ్రేష్ఠుడైన వాలీ! తారాంగదుల విషయమున నీవు దుఃఖించకుము. మేము నిన్ను అనవసరముగా చంపినామని గాని, నీవు మహాపాపములు చేసినావని గాని భావించకుము. నీ విషయమునందు ఏర్పడిన విశేషముచేత (అనుగ్రహబుద్ధిచేత) ధర్మానుసారముగా చేయవలెనని మేము నిశ్చయము చేసికొన్నాము. 62,63

మూ. దణ్డ్యే యః పాతయేద్దణ్డం దణ్డ్యో యశ్చాపి దణ్డ్యతే,
కార్యకారణసిద్ధార్థావుభౌ తౌ నావసీదతః. 64

ప్ర. అ. యః=ఎవడు, దణ్డ్యే=దండింపదగినవానియందు, దణ్డమ్=దండమును, పాతయేత్=ప్రయోగించునో, యశ్చాపి= ఏ, దణ్డ్యః=దండింపదగినవాడు, దణ్డ్యతే=దండింపబడునో, కార్యకారణసిద్ధార్థౌ=కార్యకారణములయందు చరితార్థులైన, తౌ= ఆ, ఉభౌ=ఇద్దరూ, నావసీదతః=నశించరు.

తా. శిక్షింపదగినవానిని శిక్షించినవాడు, శిక్షింప దగి ఉండి శిక్ష

అనుభవించినవాడు వీరిద్దరూ కార్యకారణములు (అనగా దండింప దగి ఉండుట అనే కారణము, దండించుట అనే కార్యము) జరుగుటచే చరితార్థులై వినాశము పొందరు. 64

మూ. తద్భవాన్ దణ్డసంయోగాదస్మాద్విగతకల్మషః,
గతః స్వాం ప్రకృతిం ధర్మ్యాం దణ్డదిష్టేన వర్త్మనా. 65

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, భవాన్=నీవు, అస్మాత్= ఈ, దణ్డసంయోగాత్=దండనముయొక్క సంబంధమువలన, విగతకల్మషః =పోయిన పాపములు గలవాడవై, దణ్డదిష్టేన=దండముచేత ఇవ్వబడిన, వర్త్మనా=మార్గముచేత, ధర్మ్యామ్=ధర్మసంమత మైన, స్వామ్=నీ సంబంధమైన, ప్రకృతిమ్=స్వభావమును, గతః= పొందినావు.

తా. అందుచే నీ కిపుడు ఈ దండము లభించుటచే నీ పాపము లన్నీ తొలగినవి. దణ్డనశాస్త్రములో చెప్పిన విధముగ నీవు ధర్మసంమతమైన సహజస్థితికి వచ్చినావు. 65

మూ. త్యజ శోకం చ మోహం చ భయం చ హృదయే స్థితమ్,
త్వయా విధానం హర్యగ్ర్య న శక్యమతివర్తితుమ్. 66

ప్ర.అ. హర్యగ్ర్య=వానరప్రముఖుడా! హృదయే= హృదయమునందు, స్థితమ్=ఉన్న, శోకం చ=శోకమును, మోహం చ=మోహమును, భయం చ=భయమును, త్యజ=విడువుము. త్వయా=నీచేత, విధానమ్=దైవనిర్ణయము, అతివర్తితుమ్= దాటుటకు, న శక్యమ్=శక్యముకాదు.

తా. వానరులలో ప్రముఖుడవైన వాలీ! నీ హృదయములో ఉన్న శోకమును, మోహమును, భయమును విడిచిపెట్టుము. దైవవిధానమును నీవు తప్పించుకొనజాలవు. 66

మూ. యథా త్వయ్యఙ్గదో నిత్యం వర్తతే వానరేశ్వర,
తథా వర్తేత సుగ్రీవే మయి చాపి న సంశయః. 67

ప్ర. అ. వానరేశ్వర=వానరరాజా! అఙ్గదః=అంగదుడు, త్వయి=నీయందు, యథా=ఎట్లు, వర్తతే=ప్రవర్తించుచున్నాడో, సుగ్రీవే=సుగ్రీవునియందు, మయి చాపి=నాయందు, తథా= అట్లు, వర్తేత=ప్రవర్తించును. సంశయః=సంశయము, న= లేదు.

తా. ఓ వానరరాజా! అంగదుడు నీ విషయమున ఎట్లు ప్రవర్తించుచున్నాడో, సుగ్రీవుని విషయమునందు, నా విషయమునందు కూడ అట్లే ప్రవర్తించగలడు. సందేహము లేదు. 67

మూ. స తస్య వాక్యం మధురం మహాత్మనః
సమాహితం ధర్మపథానువర్తినః,
నిశమ్య రామస్య రణావమర్దినో
వచః సుయుక్తం నిజగాద వానరః. 68

ప్ర.అ. సః వానరః=ఆ వాలి, మహాత్మనః=మహాత్ముడు, ధర్మపథానువర్తినః=ధర్మమార్గమును అనుసరించుచున్నవాడు, రణావమర్దినః=యుద్ధములో శత్రువులను నశింపచేయువాడు అయిన, తస్య రామస్య =ఆ రామునియొక్క, మధురమ్=మధురము, సమాహితమ్=సమాధానరూపముగా ఉన్నది అయిన, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, సుయుక్తమ్=చాల యుక్తమైన, వచః=వచనమును, నిజగాద=పలికెను.

తా. మహాత్ముడు, ధర్మమార్గమును అనుసరించువాడు, యుద్ధములో శత్రుసంహారకుడు అయిన ఆ రాముడు పలికిన మధురము, యుక్తియుక్తమూ అయిన వాక్యము విని వాలి యుక్తముగా ఇట్లు పలికెను. 68

మూ. శరాభితప్తేన విచేతసా మయా
ప్రభాషితస్త్వం యదజానతా విభో,
ఇదం మహేన్ద్రోపమ భీమ విక్రమ
ప్రసాదితస్త్వం క్షమ మే నరేశ్వర. 69

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
అష్టాదశః సర్గః.

ప్ర. అ. విభో=ఓ ప్రభూ! మహేన్ద్రోపమ=మహేంద్రునితో సమానుడా! భీమవిక్రమ=భయంకరమైన పరాక్రమముగలవాడా! నరేశ్వర= నరుల ప్రభువైన రామా! శరాభితప్తేన=బాణముచేత పీడింపబడిన, విచేతసా=మనస్సులేని (ఆలోచన చేయజాలని) అజానతా= ఎరుగని, మయా=నా చేత, త్వమ్=నీవు, యత్=ఏది, ప్రభాషితః= పలకబడితివో, మే=నాయొక్క, ఇదమ్=దీనిని, క్షమస్వ=క్షమించుము. త్వమ్=నీవు, ప్రసాదితః=అనుగ్రహింపచేసికొనబడుచున్నావు.

తా. మహేంద్రునితో సమానుడవు, భయంకరమైన పరాక్రమము గలవాడవు, మహారాజువూ అయిన ఓ ప్రభూ! బాణముచేత పీడింపబడినవాడనై, ఆలోచించు శక్తి తగ్గిన నేను తెలియక ఏమేమో అన్నాను. నిన్ను బ్రతిమాలుకొను చున్నాను. దీనిని క్షమింపుము. 69

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పద్దెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనవింశః సర్గః

[వానరులు పారిపోవుచుండగా తార వారితో మాటలాడి అంగదునితో కూడ వాలివద్దకు వచ్చి ఆతని స్థితిని చూచి దుఃఖించుట]

మూ. స వానరమహారాజః శయానః శరపీడితః,
ప్రత్యుక్తో హేతుమద్వాక్యైర్నోత్తరం ప్రత్యపద్యత. 1

ప్ర. అ. శరపీడితః=బాణముచేత పీడింపబడినవాడై, శయానః=శయనించి యున్న, సః=ఆ, వానరమహారాజః=వానరుల రాజైన వాలి, హేతుమద్వాక్యైః=హేతువులు గల వాక్యములచేత, ప్రత్యుక్తః=సమాధానము చెప్పబడినవాడై, ఉత్తరమ్=ప్రత్యుత్తరమును, న ప్రత్యపద్యత=పొందలేదు.

తా. బాణముచేత పీడింపబడి నేలపై శయనించి ఉన్న ఆ వాలి, రాముడు చెప్పిన హేతుబద్ధమైన సమాధానమునకు మరొక సమాధాన మేమీ కనుగొనలేకపోయెను. 1

మూ. అశ్మభిః పరిభిన్నాఙ్గః పాదపైరాహతో భృశమ్,
రామబాణేన చాక్రాన్తో జీవితాన్తే ముమోహ సః. 2

ప్ర. అ. అశ్మభిః=రాళ్లచేత, పరిభిన్నాఙ్గః=భేదింపబడిన అవయవములు గలవాడు, పాదపైః=వృక్షములచేత, భృశమ్=మిక్కిలి, ఆహతః= కొట్టబడినవాడు, రామబాణేన చ=రాముని బాణముచేతకూడ, ఆక్రాన్తః= ఆక్రమించబడినవాడు అయిన, సః=ఆతడు, జీవితాన్తే=జీవితాంతమునందు, ముమోహ=మోహము చెందెను.

తా. వాలి అవయవము లన్నీ రాళ్ల దెబ్బలకు నలిగిపోయెను. వృక్షముల దెబ్బలు కూడ ఎక్కువగా తగిలెను. చివరకు రాముని బాణము ఆతనిని పడగొట్టెను. ఈ విధముగ ప్రాణములు విడచు సమయమునందు ఆతడు స్పృహ తప్పి పడి యుండెను. 2

మూ. తం భార్యా బాణమోక్షేణ రామదత్తేన సంయుగే,
హతం ప్లవగశార్దూలం తారా శుశ్రావ వాలినమ్. 3

ప్ర. అ. ప్లవగశార్దూలమ్=వానరులలో శ్రేష్ఠుడైన, తం వాలినమ్=ఆ వాలిని, సంయుగే=యుద్ధమునందు, రామదత్తేన=రామునిచేత ఇవ్వబడిన, బాణమోక్షేణ=బాణముయొక్క విడచుటచేత, హతమ్=చంపబడినవానినిగా, భార్యా=ఆతని భార్యయైన, తారా=తార, శుశ్రావ=వినెను.

తా. యుద్ధములో రాముడు ప్రయోగించిన బాణముచేత వానరశ్రేష్ఠుడైన ఆ వాలి చంపబడినా డని అతని భార్యయైన తార వినెను. 3

మూ. సా సపుత్రాప్రియం శ్రుత్వా వధం భర్తుః సుదారుణమ్,
నిష్పపాత భృశం తస్మాదుద్విగ్నా గిరికన్దరాత్. 4

ప్ర. అ. సపుత్రా=పుత్రునితో కూడిన, సా=ఆమె, భర్తుః=భర్తయొక్క, సుదారుణమ్=చాల దారుణమైన, అప్రియమ్=అప్రియమైన, వధమ్=వధను, శ్రుత్వా=విని, భృశమ్=మిక్కిలి, ఉద్విగ్నా=దుఃఖించినదై, తస్మాత్= ఆ, గిరికన్దరాత్=పర్వతగుహ నుండి, నిష్పపాత=తొందరగా బైటకు వచ్చెను.

తా. పుత్రసహితురాలైన ఆమె చాల దారుణము, అప్రియము అయిన భర్తృమరణవార్త విని, చాల దుఃఖించుచు, ఆ కిష్కింధనుండి బైటకు వచ్చెను. 4

మూ. యే త్వఙ్గదపరీవారా వానరా హి మహాబలాః,
తే సకార్ముకమాలోక్య రామం త్రస్తాః ప్రదుద్రువుః. 5

ప్ర.అ. అఙ్గదపరీవారాః=అంగదునికి పరివారముగా ఉన్న, యే=ఏ, మహాబలాః=గొప్ప బలము గల, వానరాః=వానరులు గలరో, తే=వారు, సకార్ముకమ్=ధనస్సుతో కూడిన, రామమ్=రాముని, ఆలోక్య=చూచి, త్రస్తాః= భయపడినవారై, ప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. అంగదుని పరివారముగా ఉన్న మహాబలశాలులైన వానరు లందరూ, ధనస్సు చేత ధరించిన రాముని చూచి, భయపడి పారిపోయిరి. 5

మూ. సా దదర్శ తతస్త్రస్తాన్ హరీనాపతతో ద్రుతమ్,
యూథాదివ పరిభ్రష్టాన్ మృగాన్ నిహతయూథపాన్. 6

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సా=ఆమె, త్రస్తాన్= భయపడుచున్నవారు, ద్రుతమ్=శీఘ్రముగా, ఆపతతః=పారిపోవుచు ఎదురుగా వచ్చుచున్నవారు, నిహతయూథపాన్=చంపబడిన గుంపుయొక్క నాయకుడు గలవి, యూథాత్=గుంపునుండి, పరిభ్రష్టాన్=తప్పిపోయినవీ అయిన, మృగానివ= మృగముల వలె ఉన్నవారు అయిన, హరీన్=వానరులను, దదర్శ=చూచెను.

తా. గుంపు నాయకుడు చంపబడగా, గుంపునుండి విడిపోయిన మృగముల వలె, భయపడి, శీఘ్రముగా పారిపోయి వచ్చుచున్న ఆ వానరులను తార చూచెను.

మూ. తానువాచ సమాసాద్య దుఃఖితాన్ దుఃఖితా సతీ,
రామవిత్రాసితాన్ సర్వాననుబద్ధానివేషుభిః. 7

ప్ర.అ. దుఃఖితాన్=దుఃఖితులు, ఇషుభిః=బాణములచేత, అనుబద్ధానివ=వెన్నంటబడినవారు వలె, రామవిత్రాసితాన్=రామునిచేత భయపెట్టబడినవారు

అయిన, తాన్=ఆ వానరులను, సమాసాద్య=పొంది, దుఃఖితా సతీ=దుఃఖించు చున్నదై, ఉవాచ=పలికెను.

తా. దుఃఖితులైన ఆ వానరు లందరూ రామబాణములు తరుముకొని వచ్చు చున్నవా అన్నట్లు రామునికి భయపడి పారిపోవుచుండగా, దుఃఖితురాలైన తార వారిని సమీపించి ఇట్లు పలికెను. 7

మూ. వానరా రాజసింహస్య యస్య యూయం పురఃసరాః,
తం విహాయ సువిత్రస్తాః కస్మాద్ద్రవథ దుర్గతాః. 8

ప్ర. అ. వానరాః= ఓ వానరులారా! యూయమ్=మీరు, యస్య=ఏ, రాజసింహస్య=రాజశ్రేష్ఠునియొక్క, పురఃసరాః=ముందు నడిచేవారుగా ఉండే వారో, తమ్=ఆతనిని, విహాయ=విడచి, సువిత్రస్తాః=చాల భయపడినవారై, దుర్గతాః=దుఃఖము చెందినవారై, కస్మాత్=ఎందువలన, ద్రవథ= పారిపోవుచు న్నారు?

తా. ఓ వానరులారా! మీరు రాజశ్రేష్ఠుడైన ఏ వాలికి పురఃసరులుగా (ముందు నడిచేవారుగా) ఉండేవారో ఆ వాలిని విడచి, భయపడి, దుఃఖాక్రాంతులై ఎందుకు పారిపోవుచున్నారు? 8

మూ. రాజ్యహేతోః స చేద్భ్రాతా భ్రాత్రా క్రూరేణ పాతితః,
రామేణ ప్రసృతైర్దూరాన్మార్గణైర్దూరపాతిభిః. 9

ప్ర. అ. క్రూరేణ=క్రూరుడైన, భ్రాత్రా=సోదరునిచేత, భ్రాతా= సోద రుడైన, సః=ఆ వాలి, రాజ్యహేతోః=రాజ్యముకొరకై, రామేణ= రామునిచేత, దూరాత్=దూరమునుండి, ప్రసృతైః=ప్రసరించిన, దూరపాతిభిః= దూరమునందు పడు, మార్గణైః=బాణములచేత, పాతితః చేత్= పడగొట్టబడినట్లయితే - మీరెందుకు పారిపోవుచున్నారు?

తా. క్రూరుడైన సోదరుడు, సుగ్రీవుడు, రాజ్యముకొరకై సోదరుడైన వాలిని, రామునిచేత, దూరమునుండి ప్రసరించేవి దూరమునం దున్న లక్ష్య మును కొట్టగలిగినవి అయిన బాణములచే పడగొట్టించినచో మీరు ఎందుకు పారిపోవుచున్నారు?

వి. ఎనిమిది, తొమ్మిది శ్లోకాలకు ఒకటే అన్వయము. "రాముని ద్వారా సుగ్రీవుడు వాలిని చంపించినచో మీరెందుకు పారిపోవుచున్నారు" అనే ప్రశ్న అసంగతముగా ఉన్నది. మీరు ఆ సుగ్రీవునే సేవించవచ్చునుకదా అని భావమని కొందరి వ్యాఖ్యానము ఇంకను అసంగతము. అందుచేత "చేత్" అనేదానికి ప్రశ్నార్థమును అంగీకరించి "వాలి చంపబడినాడా?" అను అర్థము చెప్పిన బాగుండును. తనకు వార్తగా తెలిసినను ఆ విషయమును అందరినీ అడుగుట ఆ సమయంలో సహజము. ప్రాచ్య పాఠంలో "కచ్చిద్భర్తా చ రౌద్రేణ రాజ్యలుబ్ధేన

ఘాతితః" అని ఉన్నది. "కచ్చిత్" అనేదానికి ప్రశ్న మాత్రమే ఇక్కడ అర్థము. లేదా ఇక్కడ కూడ "కచ్చిద్భర్తా న" అని ఉంటే బాగుండును. వాల్మీకినాటికి "కచ్చిత్" అనేది కేవలప్రశ్నార్థకంగా కూడ ఉండి ఉండవచ్చును. 9

మూ. కపిపత్న్యా వచః శ్రుత్వా కపయః కామరూపిణః,
ప్రాప్తకాలమవిశ్లిష్టమూచుర్వచన మఙ్గనామ్. 10

ప్ర. అ. కామరూపిణః=స్వేచ్ఛానుసారము రూపము గల, కపయః=వానరులు, కపిపత్న్యా =వాలిభార్యయైన తారయొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, ప్రాప్తకాలమ్=కాలమునకు తగిన, అవిశ్లిష్టమ్=స్పష్టమైన, వచనమ్=వచనమును, అఙ్గనామ్=తారను గూర్చి, ఊచుః=పలికిరి.

తా. ఇష్టానుసారము రూపములు ధరించ గలిగిన వానరులు తార మాటలు విని, ఆమెతో, కాలమునకు అనుగుణముగా, స్పష్టముగా ఇట్లు పలికిరి. 10

మూ. జీవపుత్రే నివర్తస్వ పుత్రం రక్షస్వ చాఙ్గదమ్,
అన్తకో రామరూపేణ హత్వా నయతి వాలినమ్. 11

ప్ర. అ. జీవపుత్రే=జీవించి ఉన్న పుత్రుడు కలదానా! నివర్తస్వ=వెనుకకు మరలుము. పుత్రమ్=పుత్రుడైన, అఙ్గదమ్=అంగదుని, రక్షస్వ= రక్షించుకొనుము. అన్తకః=యముడు, రామరూపేణ=రాము డనే రూపముతో, వాలినమ్=వాలిని, హత్వా=చంపి, నయతి= తీసికొనిపోవుచున్నాడు.

తా. జీవించి యున్న పుత్రుడు గల ఓ తారా! వెనుకకు మరలుము. పుత్రుడైన అంగదుని రక్షించుకొనుము. రాముని రూపములో వచ్చి యముడు వాలిని చంపి తీసికొనిపోవుచున్నాడు. 11

మూ. క్షిప్తాన్ వృక్షాన్ సమావిధ్య విపులాశ్చ తథా శిలాః,
వాలీ వజ్రసమైర్బాణైర్వజ్రేణేవ నిపాతితః. 12

ప్ర. అ. క్షిప్తాన్=మీదకు (వాలిచేత) విసరబడిన, వృక్షాన్=వృక్షములను, తథా=మరియు, విపులాః=విశాలములైన, శిలాః=శిలలను, వజ్రసమైః= వజ్రముతో సమానములైన, బాణైః=బాణములచేత, సమావిధ్య=కొట్టివేసి, వాలీ=వాలి, వజ్రేణేవ=వజ్రముచేత వలె, నిపాతితః=పడగొట్టబడినాడు.

తా. రాముడు తనమీద వాలి విసరిన వృక్షములను, విశాలములైన శిలలను వజ్రముతో సమానములైన బాణాలతో కొట్టివేసి, ఆతనిని వజ్రముచేత పడగొట్టినట్లు పడగొట్టెను.

వి. వాలి వృక్షాదులు ప్రయోగించి రామునితో యుద్ధము చేయకపోయినను వానరు లా విధముగా ఊహించుకొని చెప్పిన మాట లివి. ఒక్కొక్కరి నోటిలో విషయాలు ఏ విధముగా మారిపోవునో చెప్పుటకు ఇది మంచి ఉదాహరణము.

మూ. అభిభూతమిదం సర్వం విద్రుతం వానరం బలమ్,
అస్మిన్ ప్లవగశార్దూలే హతే శక్రసమప్రభే. 13

ప్ర. అ. శక్రసమప్రభే=దేవేంద్రునితో సమానమైన కాంతి గల, అస్మిన్=ఈ, ప్లవగశార్దూలే=వానరశ్రేష్ఠుడు, హతే=చంపబడినవా డగుచుండగా, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, వానరం బలమ్=వానరుల సంబంధమైన సేన, అభిభూతమ్=తిరస్కరించబడినదై, విద్రుతమ్=పారిపోయినది.

తా. దేవేంద్రుని వంటి కాంతి గల ఆ వాలిని రాముడు చంపగానే ఈ వానరసైన్య మంతా భయపడి పారిపోయినది. 13

మూ. రక్ష్యతాం నగరీ శూరైరఙ్గదశ్చాభిషిచ్యతామ్,
పదస్థం వాలినః పుత్రం భజిష్యన్తి ప్లవఙ్గమాః. 14

ప్ర. అ. నగరీ=నగరము, శూరైః=శూరులచేత, రక్ష్యతామ్= రక్షింపబడుగాక. అఙ్గదశ్చ=అంగదుడు, అభిషిచ్యతామ్=అభిషేకింపబడుగాక. పదస్థమ్=రాజ్యమునందున్న, వాలినః పుత్రమ్=వాలి కుమారుడైన అంగదుని, ప్లవఙ్గమాః=వానరులు, భజిష్యన్తి=సేవించగలరు.

తా. ఈ నగరమును శూరులచే రక్షింపచేయుము. అంగదునకు రాజ్యాభిషేకము చేయుము. వాలి కుమారుడైన అంగదుడు రాజైన పిమ్మట సర్వవానరులు ఆతనిని సేవించగలరు. 14

మూ. అథవాఽ రుచితం స్థానమిహ తే రుచిరాననే,
ఆవిశన్తి హి దుర్గాణి క్షిప్రమద్యైవ వానరాః. 15

ప్ర. అ. రుచిరాననే=సుందరమైన ముఖము గల ఓ తారా! అథవా=లేదా, ఇహ=ఇక్కడ, తే=నీయొక్క, స్థానమ్=ఉండుట, అరుచితమ్= ఇష్టమైనది కాదు. వానరాః=సుగ్రీవాది వానరులు, అద్యైవ=ఇప్పుడే, క్షిప్రమ్=శీఘ్రముగా, దుర్గాణి=దుర్గములను, ఆవిశన్తి హి= ప్రవేశించెదరు కదా!

తా. ఓ తారా! లేదా, నీ విక్కడ ఉండుట మంచిది కాదు. ఎందుచేత ననగా సుగ్రీవాదివానరులు వెంటనే ఇప్పుడు మన దుర్గములను ఆక్రమించుకొందురు. 15

మూ. అభార్యాః సహభార్యాశ్చ సన్త్యత్ర వనచారిణః,
లుబ్ధేభ్యో విప్రలబ్ధేభ్యస్తేభ్యో నః సుమహద్భయమ్. 16

ప్ర. అ. అభార్యాః=భార్యలు లేనివారు, సహభార్యాశ్చ=భార్యలతో కూడినవారు, అయిన, వనచారిణః=వానరులు, అత్ర=ఇక్కడ, సన్తి= ఉన్నారు. లుబ్ధేభ్యః= లోభము గలవారు, విప్రలబ్ధేభ్యః=మనచే మోసగింపబడినవారు అయిన, తేభ్యః= వారినుండి, నః=మనకు, సుమహత్=చాల గొప్ప, భయమ్=భయ మున్నది.

తా. ఇక్కడ ఉన్న వానరులలో కొందరు భార్యలు దగ్గర లేనివాళ్లు; కొందరు భార్యలు దగ్గర ఉన్నవాళ్లు. వీళ్లందరికీ, మనవలన అపకారము జరిగినది. అందుచే వీళ్లు సమయానికై వేచి ఉన్నారు. సుగ్రీవుని పక్షమునకు చెందిన వీళ్ల నుండి మనకు భయ మేర్పడినది. 16

మూ. అల్పాన్తరగతానాం తు శ్రుత్వా వచనమఙ్గనా,
ఆత్మనః ప్రతిరూపం సా బభాషే చారుహాసినీ. 17

ప్ర. అ. అల్పాన్తరగతానామ్=కొంచెము దూరములో ఉన్న ఆ వానరుల యొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, చారుహాసినీ=అందమైన నవ్వు గల, సా అఙ్గనా=ఆ తార, ఆత్మనః=తనకు, ప్రతిరూపమ్=తగిన విధముగా, బభాషే=పలికెను.

తా. కొంచెము దూరములో ఉన్న ఆ వానరుల మాటలు విని, అందమైన చిరునవ్వు గల ఆ తార, తన స్వభావమునకు తగునట్లుగ ఇట్లు పలికెను. 17

మూ. పుత్రేణ మమ కిం కార్యం రాజ్యేనాపి కిమాత్మనా,
కపిసింహే మహాభాగే తస్మిన్ భర్తరి నశ్యతి. 18

ప్ర. అ. కపిసింహే=వానరులలో శ్రేష్ఠుడు, మహాభాగే=మహాభాగ్యవంతుడు అయిన, తస్మిన్=ఆ, భర్తరి=నా భర్త, నశ్యతి సతి=మరణించుచుండగా, మమ=నాకు, పుత్రేణ=పుత్రునిచేత, కిం కార్యమ్=ఏమి పని? రాజ్యేనాపి= రాజ్యముచేత, ఆత్మనా=తనచేత, కిమ్=ఏమిప్రయోజనము?

తా. వానరశ్రేష్ఠుడు, మహానుభావుడు అయిన నా భర్త మరణించిన పిమ్మట నాకు పుత్రునితో ఏమి ప్రయోజనము? రాజ్యముతో ఏమి ప్రయోజనము? నా ప్రాణాలతో ఏమి ప్రయోజనము? 18

మూ. పాదమూలం గమిష్యామి తస్యైవాహం మహాత్మనః,
యోఽసౌ రామప్రయుక్తేన శరేణ వినిపాతితః. 19

ప్ర. అ. యః=ఏ, అసౌ=ఇతడు, రామప్రయుక్తేన=రామునిచేత ప్రయోగింపబడిన, శరేణ=బాణముచేత, వినిపాతితః=పడగొట్టబడినాడో, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ వాలియొక్క, పాదమూలమ్ ఏవ= పాదములను గూర్చియే, గమిష్యామి=వెళ్లగలను.

తా. రాముడు ప్రయోగించిన బాణముచేత పడగొట్టబడిన ఆ మహాత్ముని పాదమూలము చెంతకే నేను వెళ్లెదను. 19

మూ. ఏవముక్త్వా ప్రదుద్రావ రుదతీ శోకమూర్ఛితా,
శిరశ్చోరశ్చ బాహుభ్యాం దుఃఖేన సమభిఘ్నతీ. 20

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రుదతీ=ఏడ్చుచున్నదై, శోక మూర్ఛితా=శోకముచేత వ్యాప్తురాలై, దుఃఖేన=దుఃఖముచేత, శిరశ్చ=శిరస్సును, ఉరశ్చ=వక్షఃస్థలమును, బాహుభ్యామ్=బాహువులతో, సమభిఘ్నతీ=కొట్టుకొనుచున్నదై, ప్రదుద్రావ=పరుగెత్తెను.

తా. శోకముతో నిండిన ఆమె ఇట్లు పలికి, ఏడ్చుచు దుఃఖముతో తలను, వక్షఃస్థలమును చేతులతో బాదుకొనుచు పరుగెత్తెను. 20

మూ. సా వ్రజన్తీ దదర్శాథ పతిం నిపతితం భువి,
హన్తారం దానవేన్ద్రాణాం సమరేష్వనివర్తినమ్. 21

ప్ర. అ. సా=ఆమె, వ్రజన్తీ=వెళ్లుచున్నదై, అథ=అటుపిమ్మట, దానవేన్ద్రాణామ్=దానవేంద్రులకును, హన్తారమ్=చంపినవాడు, సమరేషు= యుద్ధములందు, అనివర్తినమ్=వెనుకకు మరలని వాడు, భువి=భూమియందు, నిపతితమ్=పడినవాడు అయిన, పతిమ్=భర్తను, దదర్శ=చూచెను.

తా. పిమ్మట ఆమె వెళ్లి మాయావి మొదలైన దానవులను సంహరించినవాడు, యుద్ధములలో వెన్ను చూపనివాడు అయిన, నేలపై పడి యున్న భర్తను చూచెను.

మూ. క్షేప్తారం పర్వతేన్ద్రాణాం వజ్రాణామివ వాసవమ్,
మహావాతసమావిష్టం మహామేఘౌఘనిఃస్వనమ్. 22

ప్ర. అ. వజ్రాణామ్=వజ్రములకు, వాసవమ్ ఇవ=దేవేంద్రుడు వలె, పర్వతేన్ద్రాణామ్=పర్వతశ్రేష్ఠములకు, క్షేప్తారమ్=విసిరివేయువాడు, మహావాతసమావిష్టమ్=మహావాయువుతో సమానమైన ఆవేశము(వేగము)గలవాడు, మహామేఘౌఘనిఃస్వనమ్=మహామేఘసముదాయము వంటి ధ్వని గలవాడు అయిన భర్తను చూచెను.

తా. దేవేంద్రుడు వజ్రాయుధములను విసిరినట్లు వాలి అనేకపర్వతములను విసిరివేసేవాడు. మహావాయువు వంటి వేగము గలవాడు. గొప్ప మేఘము వలె ధ్వని చేసెడివాడు. 22

మూ. శక్రతుల్యపరాక్రాన్తం వృష్ట్వేవోపరతం ఘనమ్,
నర్దన్తం నర్దతాం భీమం శూరం శూరేణ పాతితమ్, 23
శార్దూలేనామిషస్యార్థే మృగరాజమివాహతమ్.

ప్ర. అ. శక్రతుల్యపరాక్రాన్తమ్=దేవేంద్రునితో సమానమైన పరాక్రమముకలవాడు, వృష్ట్వా=వర్షించి, ఉపరతమ్=విరమించిన, ఘనమ్ ఇవ=మేఘము వలె ఉన్నవాడు, నర్దన్తమ్=గర్జించువాడు, నర్దతామ్=గర్జించువారికి, భీమమ్=భయంకరుడు, శూరమ్=శూరుడు, శూరేణ=శూరుడైన రాముని చేత, పాతితమ్=పడగొట్టబడినవాడు, ఆమిషస్యార్థే=మాంసముకొరకై, శార్దూలేన=పెద్దపులిచేత, ఆహతమ్=చంపబడిన,

మృగరాజమివ= శ్రేష్ఠమైన మృగము వలె ఉన్నవాడు అయిన, భర్తను చూచెను.

తా. ఆ వాలి దేవేంద్రునితో సమానమైన పరాక్రమము కలవాడు. అతడు వర్షించి విరమించిన మేఘము వలె ఉండెను. గర్జించు స్వభావము గల అతడు గర్జించువారికి భయంకరుడుగా ఉండెడివాడు. శూరుడు. శూరుడైన రామునిచే పడగొట్టబడిన అతడు మాంసము నిమిత్తము పెద్దపులిచేత చంపబడిన శ్రేష్ఠమైన మృగము వలె ఉండెను. 23

మూ. అర్చితం సర్వలోకస్య సపతాకం సవేదికమ్, 24
నాగహేతోః సుపర్ణేన చైత్యమున్మథితం యథా.

ప్ర. అ. సర్వలోకస్య=సకలజనులకు, అర్చితమ్=పూజింపబడినది, సపతాకమ్=పతాకలతో అలంకరింపబడినది, సవేదికమ్=అరుగులతో కూడినది, సుపర్ణేన=గరుత్మంతునిచేత, నాగహేతోః=సర్పముకొరకై, ఉన్మథితమ్= భగ్నము చేయబడిన, చైత్యం యథా=చైత్యగృహమువలె ఉన్నవాడు అయిన భర్తను చూచెను.

తా. సకలజనులచేత పూజింపబడినది, పతాకలచేత అలంకరింపబడినది, అరుగులు ఉన్నది అయిన చైత్యమును, లోపల దాగియున్న సర్పముకొరకై గరుత్మంతుడు భగ్నముచేసినచో అది ఎట్లుండునో వాలి అట్లుండెను.

వి. ఇక్కడ చైత్య మనగా ఏదైన పాముపుట్ట చుట్టూ నిర్మించి చక్కగా చిన్నజండాలతోను, చుట్టూ అరుగులతోను అలంకరించిన కట్టడమై ఉండును. 24

మూ. అవష్టభ్యావతిష్ఠన్తం దదర్శ ధనురూర్జితమ్, 25
రామం రామానుజం చైవ భర్తుశ్చైవ తథానుజమ్.

ప్ర. అ. ఊర్జితమ్=చాల దృఢమైన, ధనుః=ధనస్సును, అవష్టభ్య= ఆనుకొని, అవతిష్ఠన్తమ్=నిలచి ఉన్న, రామమ్=రాముని, రామానుజం చైవ=లక్ష్మణుని, తథా=మరియు,భర్తుః=భర్తయొక్క, అనుజం చైవ=తమ్మునీ, దదర్శ=చూచెను.

తా. అక్కడ ఆమె దృఢమైన ధనస్సుపై ఆనుకొని నిలచి ఉన్న రాముని, లక్ష్మణుని, తన భర్త తమ్ముడైన సుగ్రీవునీ చూచెను. 25

మూ. తానతీత్య సమాసాద్య భర్తారం నిహతం రణే, 26
సమీక్ష్య వ్యథితా భూమౌ సంభ్రాన్తా నిపపాత హ.

ప్ర. అ. తాన్=వారిని, అతీత్య=దాటి, రణే=యుద్ధమునందు, నిహతమ్=చంపబడిన, భర్తారమ్=భర్తను, సమాసాద్య=సమీపించి, సమీక్ష్య=చూచి, వ్యథితా=వ్యథ చెందినదై, సంభ్రాన్తా=స్పృహ తప్పినదై, భూమౌ=నేలమీద, నిపపాత హ=పడిపోయెను.

తా. ఆమె వారి నందరినీ దాటి వెళ్లి, యుద్ధములో చంపబడిన భర్త

సమీపము చేరి, ఆతనిని చూడగానే దుఃఖాక్రాంతురాలై స్పృహ తప్పి నేలమీద పడిపోయెను. 26

మూ. సుప్తేవ పునరుత్థాయ ఆర్యపుత్రేతి వాదినీ, 27
రురోద సా పతిం దృష్ట్వా సంవీతం మృత్యుదామభిః.

ప్ర. అ. సా=ఆమె, సుప్తేవ=నిద్రపోయినది వలె, పునః=మరల, ఉత్థాయ=లేచి, ఆర్యపుత్ర ఇతి=ఆర్యపుత్రా అని, వాదినీ=పలుకుచున్నదై, మృత్యు దామభిః=మృత్యుపాశములచేత, సంవీతమ్=కట్టబడిన, పతిమ్ = భర్తను, దృష్ట్వా =చూచి, రురోద= ఏడ్చెను. 27

తా. ఆమె నిద్రనుండి లేచి నట్లు లేచి, మృత్యుపాశములచేత బంధింపబడిన భర్తను చూచి, "ఆర్యపుత్రా!!" అని అనుచు ఏడ్చెను. 27

మూ. తామవేక్ష్య తు సుగ్రీవః క్రోశన్తీం కురరీమివ,
విషాదమగమత్కష్టం దృష్ట్వా చాఙ్గదమాగతమ్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, కురరీమివ=గోరెంక వలె, క్రోశన్తీమ్= అరచుచున్న, తామ్=ఆమెను, అవేక్ష్య=చూచి, ఆగతమ్=వచ్చిన, అఙ్గదం చ=అంగదుని కూడ, దృష్ట్వా=చూచి, కష్టమ్=కష్టమైన, విషాదమ్=దుఃఖమును, అగమత్=పొందెను.

తా. గోరెంకపిట్ట వలె అరచుచున్న ఆ తారను, అక్కడికి వచ్చిన అంగదునీ చూచి సుగ్రీవుడు చాల దుఃఖించెను. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో పందొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ వింశః సర్గః

[తార విలపించుట]

మూ. రామచాపవిసృష్టేన శరేణాన్తకరేణ తమ్,
దృష్ట్వా వినిహతం భూమౌ తారా తారాధిపాననా, 1
సా సమాసాద్య భర్తారం పర్యష్వజత భామినీ.

ప్ర. అ. తారాధిపనిభాననా=చంద్రునితో సమానమైన ముఖము గలది, భామినీ = కోపము గలది (స్త్రీ) అయిన, సా తారా = ఆ తార, రామచాపవిసృష్టేన =రాముని ధనస్సుచేత, విడువబడిన, అన్తకరేణ =అంతమును చేయు, శరేణ = బాణముచేత, నిహతమ్ =కొట్టబడిన, తమ్ =ఆ, భర్తారమ్ = భర్తను, భూమౌ =నేలమీద, దృష్ట్వా = చూచి, సమాసాద్య =సమీపించి, పర్యష్వజత =కౌగలించుకొనెను.

తా. చంద్రుని వంటి ముఖము గల ఆ తార రాముడు విడచిన, ప్రాణాంతకమైన బాణముచేత కొట్టబడి నేలపై పడి యున్న భర్తను చూచి, దగ్గరకు వెళ్లి కౌగలించుకొనెను. 1

మూ. ఇషుణాభిహతం దృష్ట్వా వాలినం కుఞ్జరోపమమ్, 2
వానరం పర్వతేన్ద్రాభం శోకసంతప్తమానసా,
తారా తరుమివోన్మూలం పర్యదేవయదాతురా. 3

ప్ర.అ. ఇషుణా = బాణముచేత, అభిహతమ్ = కొట్టబడినవాడు, కుఞ్జరోపమమ్ = ఏనుగతో సమానుడూ, పర్వతేన్ద్రాభమ్ = హిమవంతుని వంటి కాంతి గలవాడు, ఉన్మూలమ్ = పైకి లాగివేసిన మొదలు గల, తరుమ్ ఇవ = చెట్టు వలె ఉన్నవాడు అయిన, వానరమ్ = వానరుడైన, వాలినమ్ = వాలిని, దృష్ట్వా = చూచి, తారా = తార, ఆతురా = దుఃఖితురాలై, శోకసంతప్తమానసా = శోకముచేత పీడింపబడిన మనస్సు కలదై ,పర్యదేవయత్ = విలపించెను.

తా. పర్వతముతో సమానుడు, ఏనుగవంటివాడు అయిన ఆ వాలి బాణముచేత కొట్టబడి మూలముతో సహా పెరికివేసిన వృక్షము వలె పడి ఉండెను. అట్టి వాలిని చూచి తార శోకముచేత పీడింపబడిన మనస్సుతో, దుఃఖార్తురాలై విలపించెను. 2, 3

మూ. రణే దారుణ విక్రాన్త ప్రవీర ప్లవతాం వర,
కిం దీనామపురోభాగామద్య త్వం నాభిభాషసే. 4

ప్ర.అ. రణే = యుద్ధమునందు, దారుణ = భయంకరుడా! విక్రాన్త = విక్రమించువాడా! ప్రవీర = గొప్ప వీరుడా! ప్లవతాం వర = వానరులలో శ్రేష్ఠుడా! దీనామ్ = దీనురాలను, అపురోభాగామ్ = దోషములను ఎత్తి చూపని దానినీ (ని న్నెన్నడూ దూషించనిదాననూ) అయిన నన్ను, త్వమ్ = నీవు, అద్య = నేడు, కిమ్ = ఎందువలన, నాభిభాషసే = మాటలాడకున్నావు.

తా. యుద్ధములో భయంకరుడా! పరాక్రమమును ప్రదర్శించువాడా! గొప్ప వీరుడా! వానరులలో శ్రేష్ఠుడా! నిన్ను ఎన్నడూ దూషించని దీనురాలనైన నన్ను ఇప్పుడు పలకరించవేమి? 4

మూ. ఉత్తిష్ఠ హరిశార్దూల భజస్వ శయనోత్తమమ్,
నైవంవిధాః శేరతే హి భూమౌ నృపతిసత్తమాః. 5

ప్ర. అ. హరిశార్దూల =వానరశ్రేష్ఠుడా! ఉత్తిష్ఠ = లెమ్ము. శయనోత్తమమ్ = శ్రేష్ఠమైన శయనమును, భజస్వ = పొందుము. ఏవంవిధాః = ఇట్టి, నృపతిసత్తమాః = రాజశ్రేష్ఠులు, భూమౌ = నేలమీద, న శేరతే హి = శయనించరు కదా!

తా. ఓ వానరశ్రేష్ఠుడా! లెమ్ము. శ్రేష్ఠమైన శయనముపై శయనించుము. నీవంటి గొప్ప రాజులు నేలమీద శయనించరు కదా! 5

మూ. అతీవ ఖలు తే కాన్తా వసుధా వసుధాధిప,
గతాసురపి తాం గాత్రైర్మాం విహాయ నిషేవసే. 6

ప్ర. అ. వసుధాధిప = ఓ రాజా! తే = నీకు, వసుధా = భూమి, అతీవ = మిక్కిలి, కాన్తా ఖలు = ప్రియురాలు కదా! గతాసురపి = పోయిన ప్రాణములు కలవాడవైనను, మామ్ = నన్ను, విహాయ = విడచి, గాత్రైః = అవయవములతో, తామ్ = ఆమెను, నిషేవసే = సేవించుచున్నావు.

తా. భూమికి అధిపతివైన వాడా! నీకు భూమి చాల ప్రియురాలు కదా! అందుచేతనే, నన్ను విడచి, మరణానంతరము కూడ ఆమెను సర్వావయవములతో కౌగలించుకొని యున్నావు. 6

మూ. వ్యక్తమద్య త్వయా వీర ధర్మతః సంప్రవర్తతా,
కిష్కిన్ధేవ పురీ రమ్యా స్వర్గమార్గే వినిర్మితా. 7

ప్ర. అ. వీర = వీరుడా! ధర్మతః = ధర్మానుసారముగా, సంప్రవర్తతా = ప్రవర్తించుచున్న, త్వయా = నీచేత, అద్య = ఇప్పుడు, కిష్కిన్ధేవ =

కిష్కింధ వలె, రమ్యా = సుందరమైన, పురీ = పట్టణము, స్వర్గమార్గే = స్వర్గమార్గమునందు, వినిర్మితా = నిర్మింపబడినది. స్పష్టమ్ = యథార్థము.

తా. ఓ వీరుడా! ధర్మప్రవర్తన గల నీవు ఇప్పుడు స్వర్గమార్గమునందు కిష్కింధాపురము వలె అందమైన మరి యొక పురమును నిర్మించినావు. నిజము. అందుచేతనే కిష్కింధను విడచి నీవు అక్కడికి వెళ్ళిపోవుచున్నావు. 7

మూ. యాన్యస్మాభిస్త్వయా సార్ధం వనేషు మధుగన్ధిషు,
విహృతాని త్వయా కాలే తేషాముపరమః కృతః . 8

ప్ర. అ. త్వయా = నీచేత, అస్మాభిః సార్ధమ్ = మాతో కూడ, మధుగన్ధిషు = మద్యగంధములతో కూడిన, వనేషు = వనములయందు, యాని = ఏ, విహృతాని = విహారములు, కాలే =కాలమునందు, (చేయబడినవో), తేషామ్ = వాటియొక్క, ఉపరమః = సమాప్తి , త్వయా = నీచేత, కృతః = చేయబడినది.

తా. నీవు ఆ యా కాలములలో మాతో, కలిసి, మద్యగంధముతో నిండిన వనములలో విహరించుచుండెడివాడవు. ఇప్పుడు వాటినన్నింటిని నిలిపివేసినావు.

మూ. నిరానన్దా నిరాశాఽహం నిమగ్నా శోకసాగరే,
త్వయి పఞ్చత్వమాపన్నే మహాయూథపయూథపే. 9

ప్ర. అ. మహాయూథపయూథపే = గొప్ప వానరగణాధిపతుల గణములకు ప్రభువైన, త్వయి = నీవు, పఞ్చత్వమ్ =మరణమును, ఆపన్నే = పొందినవాడ వగుచుండగా, అహమ్ = నేను, నిరానన్దా = ఆనందము లేనిదాననై, నిరాశా = ఆశ లేనిదాననై, శోకసాగరే = శోకసముద్రమునందు, నిమగ్నా = మునిగి ఉన్నాను.

తా. వానరసేనానాయకుల నాయకుడవైన నీవు మరణము చెందిన పిదప నే నిపుడు ఏ ఆనందమూ లేక, నిరాశురాలనై, శోకసాగరములో మునిగి యున్నాను. 9

మూ. హృదయం సుస్థితం మహ్యం దృష్ట్వా నిపతితం భువి,
యన్న శోకాభిసంతప్తం స్ఫుటతేఽద్య సహస్రధా. 10

ప్ర. అ. మహ్యమ్ = నాకొరకు, హృదయమ్ = నా హృదయము, సుస్థితమ్ = బాగా నిలచి ఉన్నది. యత్ = ఎందువలన అనగా, భువి = నేలపై, నిపతితమ్ = పడిన నిన్ను, దృష్ట్వా = చూచి, శోకాభిసంతప్తమ్ = శోకముచేత పీడింపబడినదై, అద్య = ఇప్పుడు, సహస్రధా = వెయ్యి ముక్కలుగా, న స్ఫుటతే = బ్రద్ద లగుటలేదో.

తా. నా హృదయము చాలా గట్టిది. ఎందుచేత ననగా నేలమీద

పడియున్న నిన్ను చూచిన తరువాత కూడ ఇది శోకపీడితమై వెయ్యి ముక్కలుగా బ్రద్దలవలేదు.

మూ. సుగ్రీవస్య త్వయా భార్యా హృతా స చ వివాసితః,
యత్తత్తస్య త్వయా వ్యుష్టిః ప్రాప్తేయం ప్లవగాధిప. 11

ప్ర. అ. ప్లవగాధిప = వానరరాజా! త్వయా = నీచేత, యత్ = ఏ కారణమువలన, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, భార్యా = భార్య, హృతా = హరింపబడినదో, సః చ = అతడు, వివాసితః = (నగరమునుండి) వెడలగొట్టబడినాడో, తత్ = ఆ కారణమువలన, త్వయా = నీ చేత, తస్య = దానియొక్క, ఇయమ్ = ఈ, వ్యుష్టిః = ఫలము, ప్రాప్తా = పొందబడినది.

తా. వానరరాజా! నీవు సుగ్రీవుని భార్యను హరించి ఆతనిని రాజ్యమునుండి వెడలగొట్టినావు. దానికి ఫలితముగా నీకీ ఆపద సంప్రాప్తించినది. 11

మూ. నిఃశ్రేయసపరా మోహాత్త్వయా చాహం విగర్హితా,
యైషాఽబ్రవం హితం వాక్యం వానరేన్ద్ర హితైషిణీ. 12

ప్ర. అ. వానరేన్ద్ర = వానరరాజా! నిఃశ్రేయసపరా = నీ శ్రేయస్సునందు ఆసక్తి కలదాననై, హితైషిణీ = నీ హితమును కోరుచున్నదాననై, యా = ఏ, ఏషా= ఈ నేను, హితమ్ = హితమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవమ్ = పలికితినో, అహమ్ = అట్టినేను, త్వయా = నీచేత, మోహాత్ = అజ్ఞానమువలన, విగర్హితా = నిందింపబడితిని.

తా. నేను నీ క్షేమమునందు ఆసక్తితో నీ హితమును కోరి చెప్పిన హితమైన మాటలను వినక నీవు అజ్ఞానముచేత నన్ను నిందించితివి. 12

మూ. రూపయౌవనదృప్తానాం దక్షిణానాం చ మానద,
నూన మప్సరసామార్య చిత్తాని ప్రమథిష్యసి. 13

ప్ర.అ. మానద =మానమును (గౌరవమును) సంరక్షించువాడా! రూపయౌవనదృప్తానామ్ = రూపముచేతను, యౌవనముచేతను గర్వించిన, దక్షిణానామ్ = నేర్పరులైన, అప్సరసామ్ = అప్సరఃస్త్రీలయొక్క, చిత్తాని =చిత్తములను, ప్రమథిష్యసి = పీడించగలవు. నూనమ్ = నిజము.

తా. తనవారి గౌరవమును సంరక్షించువాడా! రూపముచేత, యౌవనము చేత గర్వించిన, మంచి నేర్పు గల అప్సరస్త్రీల మనస్సులను నీవు దోచుకొనగలవు. నిజము. 13

మూ. కాలో నిఃసంశయో నూనం జీవితాన్తకరస్తవ,
బలాద్యేనావపన్నోఽపి సుగ్రీవస్యావశో వశమ్. 14

ప్ర. అ. నిఃసంశయః = సంశయములేని, కాలః =కాలమే, తవ = నీయొక్క, జీవితాన్తకరః = జీవితమునకు అంతమును చేసినది. నూనమ్ = నిశ్చయము. యేన = ఏ కాలముచేత, అవశః= ఎవరికినీ వశుడు కాని నీవు, బలాత్ =బలాత్కారముగా, సుగ్రీవస్య = సుగ్రీవునకు, వశమ్ = వశమును, అవపన్నః =పొందితివో.

తా. ఎవరి విషయమునందూ కూడ సందేహించని కాలమే జీవితమును అంతము చేసినది; నిశ్చయము. ఎవరికీ వశుడవు కాని నిన్ను ఆ కాలమే బలాత్కారముగా, సుగ్రీవునకు వశ మగునట్లు చేసినది. 14

మూ. అస్థానే వాలినం హత్వా యుధ్యమానం పరేణ చ,
న సంతప్యతి కాకుత్థ్సః కృత్వా కర్మ సుగర్హితమ్. 15

ప్ర. అ. కాకుత్థ్సః =రాముడు, పరేణ = ఇతరునితో, యుధ్యమానమ్ = యుద్ధము చేయుచున్న, వాలినమ్ = వాలిని, అస్థానే = అయుక్తమైన పద్ధతిలో, హత్వా = చంపి, సుగర్హితమ్ =చాల నింద్యమైన, కర్మ = పనిని, కృత్వా = చేసి, న సంతప్యతి =విచారించుట లేదు.

తా. రాముడు ఇతరునితో యుద్ధము చేయుచున్న వాలిని అన్యాయముగా చంపి, నింద్యమైన పని చేసినందుకు విచారించుటలేదు. (ఈ శ్లోకము కొన్ని ప్రతులలో లేదు. లేకపోవుటయే యుక్తము. నిన్ను చంపి అనుట యుక్తము గాని "వాలిని చంపి" అనుట అయుక్తము కదా!) 15

మూ. వైధవ్యం శోకసంతాపం కృపణాకృపణా సతీ,
అదుఃఖోపచితా పూర్వం వర్తయిష్యామ్యనాథవత్. 16

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, అకృపణా సతీ =దైన్యము లేనిదాననై ఉండి, అదుఃఖోపచితా = దుఃఖముతో కూడుకొననిదాననైన నేను, అనాథవత్ = =అనాథురాలువలె (అనాథురాలనై), కృపణా =దీనురాలనై, వైధవ్యమ్ =వైధవ్యమును, శోకసంతాపమ్ = దుఃఖసంతాపమును, వర్తయిష్యామి = అనుభవించెదను.

తా. పూర్వమెన్నడూ దైన్యమును కాని, దుఃఖములను కాని ఎరుగని నేను ఇపుడు అనాథురాలనై వైధవ్యమును, దుఃఖమును అనుభవించవలసివచ్చినది. 16

మూ. లాలితశ్చాఙ్గదో వీరః సుకుమారః సుఖోచితః,
వత్స్యతే కామవస్థాం మే పితృవ్యే క్రోధమూర్ఛితే. 17

ప్ర. అ. పితృవ్యే =పినతండ్రి, క్రోధమూర్ఛితే = కోపముతో నిండినవాడగుచుండగా, లాలితః =లాలింపబడినవాడు, సుకుమారః = సుకుమారుడు, సుఖోచితః =సుఖమునకు అలవాటు పడినవాడు, వీరః =ధీరుడు అయిన, మే

అఙ్గదః = నా అంగదుడు, కామ్= ఏ, అవస్థామ్ =అవస్థను, వత్స్యతే = నివసించగలడో (అనుభవించగలడో!)

తా. ముద్దుగా పెరిగినవాడు, వీరుడు, సుకుమారుడు, సుఖములకు అలవాటు పడినవాడు అయిన నా కుమారుడైన అంగదుడు, పినతండ్రియైన సుగ్రీవుడు కోపావిష్టుడై ఉండగా ఆతని దగ్గర ఎట్లు మెసలగలడో కదా! 17

మూ. కురుష్వ పితరం పుత్ర సుదృష్టం ధర్మవత్సలమ్,
దుర్లభం దర్శనం తస్య తవ వత్స భవిష్యతి. 18

ప్ర. అ. పుత్ర =కుమారా! ధర్మవత్సలమ్ = ధర్మమునందు ప్రేమ గల, పితరమ్ =తండ్రిని, సుదృష్టమ్ =బాగా చూడబడినవానినిగా, కురుష్వ = చేయుము. వత్స = నాయనా! తస్య =ఆతనియొక్క, దర్శనమ్ = దర్శనము, దుర్లభమ్ =దుర్లభము, భవిష్యతి = కాగలదు.

తా. నాయనా! కుమారా! ధర్మాత్ముడైన నీ తండ్రిని బాగా చూడుము. ఇటుపైన నీకు ఈయన దర్శనము లభించదు. 18

మూ. సమాశ్వాసయ పుత్రం త్వం సందేశం సందిశస్వ మే,
మూర్ధ్ని చైనం సమాఘ్రాయ ప్రవాసం ప్రస్థితో హ్యసి. 19

ప్ర. అ. త్వమ్ =నీవు, పుత్రమ్ = పుత్రుని, సమాశ్వాసయ = ఊరడించుము. ఏనమ్ = ఈతనిని, మూర్ధ్ని = శిరస్సుమీద, సమాఘ్రాయ= వాసన చూచి, మే =నాకు, సందేశమ్ = సందేశమును, సందిశస్వ = ఇమ్ము. ప్రవాసమ్ =ప్రవాసమును గూర్చి, ప్రస్థితః =ప్రయాణమైనవాడవు, అసి హి=అయి ఉన్నావు కదా!

తా. (నాథా!) నీవు కుమారుని ఓదార్చుము. ఇతనిని శిరస్సుపై వాసన చూచి ముద్దు పెట్టుకొని నాకు చెప్పవలసిన విషయములు చెప్పుము. దీర్ఘప్రవాసము కొరకు ప్రయాణ మైతివి కదా! 19

మూ. రామేణ హి మహత్కర్మ కృతం త్వామభినిఘ్నతా,
ఆనృణ్యం చ గతం తస్య సుగ్రీవస్య ప్రతిశ్రవే. 20

ప్ర. అ. త్వామ్ = నిన్ను, అభినిఘ్నతా = కొట్టిన, రామేణ = రాముని చేత, మహత్ = గొప్పదైన, కర్మ = పని, కృతం హి = చేయబడినది కదా! సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, ప్రతిశ్రవే = ప్రతిజ్ఞావిషయమునందు, తస్య = ఆరామునకు ( నిచేత), ఆనృణ్యమ్ = ఋణము లేకపోవుట కూడ, గతం తు=పొందబడినది.

తా. నిన్ను చంపుట ద్వారా రాముడు గొప్ప కార్యమును సాధించి, సుగ్రీవునకు తాను చేసిన ప్రతిజ్ఞను నిలుపుకొనినాడు. ఆ విధముగ తన

ఋణమును తీర్చుకొన్నాడు. 20

మూ. సకామో భవ సుగ్రీవ రుమాం త్వం ప్రతిపత్స్యసే,
భుఙ్క్ష్వ రాజ్యమనుద్విగ్నః శస్తో భ్రాతా రిపుస్తవ. 21

ప్ర. అ.సుగ్రీవ = సుగ్రీవా! సకామః = తీరిన కోరిక గలవాడవు, భవ = అగుము. త్వమ్ =నీవు, రుమామ్ = రుమను, ప్రతిపత్స్యసే = పొందగలవు. అనుద్విగ్నః = దిగులు లేనివాడవై, రాజ్యమ్ = రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము. తవ =నీయొక్క, రిపుః =శత్రువైన భ్రాతా = సోదరుడు, శస్తః =చంపబడినాడు.

తా. సుగ్రీవా! నీ కోరిక తీరినది. నీకు రుమ లభించగలదు. ఏ దిగులు లేకుండా రాజ్యము అనుభవించుము. నీ శత్రువైన సోదరుడు చంపబడినాడు. 21

మూ. కిం మామేవం ప్రలపతీం ప్రియాం త్వం నాభిభాషసే,
ఇమాః పశ్య వరా బహ్వ్యో భార్యాస్తే వానరేశ్వర. 22

ప్ర. అ. వానరేశ్వర = వానరరాజా! ఏవమ్ = ఇట్లు, ప్రలపతీమ్ = ప్రలాపములు చేయుచున్న, ప్రియామ్ = ప్రియురాలనైన, మామ్ = నన్ను, త్వమ్ = నీవు, కిమ్ = ఎందువలన, నాభిభాషసే = పలకరించుట లేదు? తే = నీయొక్క, బహ్వ్యః =అనేకలైన, వరాః =శ్రేష్ఠలైన, భార్యాః = భార్యలు, ఇమాః =ఇరుగో! పశ్య =చూడుము.

తా. ఓ వానరరాజా! నే నింతగా మాటలాడుచుండగా నన్ను పలకరించవేమి? ఇదిగో! ఉత్తమలైన నీ భార్య లందరూ వచ్చి ఉన్నారు; చూడుము. 22

మూ. తస్యా విలపితం శ్రుత్వా వానర్యః సర్వతశ్చ తాః,
పరిగృహ్యాఙ్గదం దీనా దుఃఖార్తాః పరిచుక్రుశుః. 23

ప్ర. అ. సర్వతః = నలుమూలలా ఉన్న, తాః = ఆ, వానర్యః = వానరస్త్రీలు, తస్యాః =ఆమెయొక్క, విలపితమ్=విలాపమును, శ్రుత్వా =విని, అఙ్గదమ్ =అంగదుని, పరిగృహ్య = పట్టుకొని, దీనాః= దీనలై, దుఃఖార్తాః =దుఃఖముచేత పీడింపబడినవారై, పరిచుక్రుశుః =ఏడ్చిరి.

తా. అక్కడ నలుప్రక్కలా ఉన్న వానరస్త్రీలు తార చేయు విలాపమును విని, దైన్యముతో అంగదుని పట్టుకొని, దుఃఖపీడితలై ఏడ్చిరి. 23

మూ. కిమఙ్గదం సాఙ్గదవీరబాహో
విహాయ యాతోఽసి చిరం ప్రవాసమ్,
న యుక్తమేవంగుణసంనికృష్టం
విహాయ పుత్రం ప్రియచారువేషమ్. 24

ప్ర. అ. సాఙ్గదవీరబాహో = బాహుపురులతోకూడిన బలముగల బాహువులు కలవాడా! అఙ్గదమ్ = అంగదుని, విహాయ = విడచి, చిరం ప్రవాసమ్ = చిరకాలప్రవాసమును, కిమ్ =ఎందువలన, ప్రయాతః అసి =పొందితివి? గుణసంనికృష్టమ్ = గుణములచేత సమీపింపబడిన (సద్గుణవంతుడైన), ప్రియ చారువేషమ్ = ప్రియమైన అందమైన వేషము గల, పుత్రమ్ = పుత్రుని, విహాయ = విడచి, ఏవమ్ = ఇట్లు వెళ్ళుట, న యుక్తమ్ = యుక్తము కాదు.

తా. బాహుపురులతో అలంకరించిన మంచి బలము గల బాహువులు గలవాడా! అంగదుని విడచి చిరకాలప్రవాసమునకు వెళ్లిపోవుచున్నా వేమి? సద్గుణములు కలవాడు, ప్రియము, అందమూ అయిన వేషమును ధరించువాడు అయిన పుత్రుని విడచి ఇట్లు వెళ్లిపోవుట యుక్తము కాదు. 24

మూ. కి మప్రియం తే ప్రియచారువేష
మయా కృతం నాథ సుతేన వా తే,
సహాఙ్గదాం మాం స విహాయ వీర
యత్ప్రస్థితో దీర్ఘ మితః ప్రవాసమ్. 25

ప్ర. అ. ప్రియచారువేష = ప్రియమైన అందమైన వేషము గలవాడా! వీర = వీరుడా! నాథ = నాథుడా! సః = అట్టి నీవు, సహాఙ్గదామ్ = అంగదునితో కూడిన, మామ్ =నన్ను, విహాయ =విడచి, ఇతః =ఇక్కడినుండి, దీర్ఘమ్ = దీర్ఘమైన, ప్రవాసమ్ = ప్రవాసమును, యత్ ప్రస్థితః = ప్రయాణ మైతివే, మయా= నా చేత గాని, తే =నీయొక్క, సుతేన వా =కుమారుని చేత గాని, కిమ్ =ఏమి, అప్రియమ్ =అప్రియము, కృతమ్ =చేయబడినది?

తా. అందమైన వేషమును ధరించుటయందు మక్కువ గల ఓ వీరుడా! ఓ నాథా! నన్ను, అంగదునీ కూడ విడచి ఇక్కడినుండి దీర్ఘప్రవాసమునకై వెళ్లి పోవుచున్నావు కదా; నేను కాని, నీ పుత్రుడు కాని నీ విషయమున ఏ అపరాధము చేసినాము? 25

మూ. యద్యప్రియం కించిదసంప్రధార్య
కృతం మయా స్యాత్తవ దీర్ఘబాహో,
క్షమస్వ మే తద్ధరివంశనాథ
వ్రజామి మూర్ధ్నా తవ వీర పాదౌ. 26

ప్ర. అ. దీర్ఘబాహో =దీర్ఘములైన బాహువులు గలవాడా! హరివంశనాథ = వానరవంశమునకు నాథుడా! వీర = వీరుడా! అసంప్రధార్య =నిశ్చయించక, మయా =నాచేత, తవ =నీకు, అప్రియమ్ =అప్రియమైన, కించిత్ = ఏదైన కార్యము, కృతం స్యాద్యది =చేయబడి ఉన్నట్లయితే, మే =నాయొక్క, తత్ =ఆ కార్యమును, క్షమస్వ =క్షమించుము. మూర్ధ్నా = శిరస్సుతో, తవ పాదౌ

=నీ పాదమును, వ్రజామి= పొందుచున్నాను.

తా. దీర్ఘములైన బాహువులు గలవాడా! వానరవంశమునకు నాథుడా! ఓ వీరుడా! నేను తెలియక నీ విషయమున ఏదైన అపరాధము చేసినచో దానిని క్షమించుము. శిరస్సుతో నీ పాదములను స్పృశించుచున్నాను. 26

మూ. తథా తు తారా కరుణం రుదన్తీ
భర్తుః సమీపే సహ వానరీభిః,
వ్యవస్యత ప్రాయమనిన్ద్యవర్ణా
ఉపోపవేష్టుం భువి యత్ర వాలీ. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
వింశః సర్గః,

ప్ర. అ. అనిన్ద్యవర్ణా = నిందింపతగని వర్ణముగల, తారా =తార, భర్తుః= భర్తయొక్క, సమీపే = సమీపమునందు, వానరీభిః సహ = వానరస్త్రీలతో కూడ, తథా =అట్లు, కరుణమ్ = దీనముగా, రుదన్తీ =ఏడ్చుచున్నదై, వాలీ = వాలి, యత్ర =ఎక్కడ ఉన్నాడో, భువి =ఆ స్థలమునందు, ప్రాయమ్ ఉపోపవేష్టుమ్ = ప్రాయోపవేశము చేయుటకు, వ్యవస్యత = నిశ్చయించెను.

తా. నిందింప దగని అందమైన శరీరచ్ఛాయగల ఆ తార వానరస్త్రీలతో కూడ భర్త సమీపమున ఆ విధముగా దీనముగా ఏడ్చుచు, వాలి ఎక్కడ పడి ఉండెనో ఆ ప్రదేశమునందే ప్రాయోపవేశము చేయుటకు నిర్ణయించుకొనెను. 27

*"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఇరువదవ సర్గ సమాప్తము.*

# అథ ఏకవింశః సర్గః

[హనుమంతుడు తారను ఓదార్చుట. తార భర్తతో సహగమనము చేయవలె నని నిశ్చయించుట]

మూ. తతో నిపతితాం తారాం చ్యుతాం తారామివామ్బరాత్,
శనైరాశ్వాసయామాస హనుమాన్ హరియూథపః. 1

ప్ర. అ. తతః =అటుపిమ్మట, అమ్బరాత్ = ఆకాశమునుండి, చ్యుతామ్ = జారిన, తారామివ =నక్షత్రము వలె ఉన్న, నిపతితామ్ =క్రింద పడి ఉన్న, తారామ్ =తారను, హరియూథపః =వానరసేనానాయకుడైన, హనుమాన్ = హనుమంతుడు, శనైః =మెల్లగా, ఆశ్వాసయామాస =ఓదార్చెను.

తా. ఆకాశమునుండి జారి పడిన నక్షత్రము వలె నేలపై పడి ఉన్న తారను వానరసేనానాయకుడైన హనుమంతుడు అప్పుడు, మెల్లగా ఓదార్చెను. 1

మూ. గుణదోషకృతం జన్తుః స్వకర్మ ఫలహేతుకమ్,
అవ్యగ్రస్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభాశుభమ్. 2

ప్ర. అ. జన్తుః= ప్రాణి, గుణదోషకృతమ్ =గుణములచేతను దోషముల చేతను (సద్బుద్ధి దుర్బుద్ధులతో) చేయబడిన, ఫలహేతుకమ్ =ఫలమునకు హేతువైన, సర్వమ్ = సమస్తమైన, తత్ = ఆ, శుభాశుభమ్ = శుభము అశుభము అయిన, కర్మ =కర్మను, ప్రేత్య =మరణించి, అవ్యగ్రః =ఆకులుడు కానివాడై, ఆప్నోతి = పొందును.

తా. ప్రతిప్రాణీ కూడ ఆ యా ఫలములను ఇచ్చే కర్మలను మంచి బుద్ధితోను, చెడు బుద్ధితోను ఆచరించుచుండును. ఆ కర్మల శుభఫలములను అశుభఫలములను కూడ మరణానంతరము తప్పక అనుభవించవలసి ఉండును. వ్యాకులత్వము చెంది ప్రయోజనము లేదు. (ఈ శ్లోకానికి అన్వయం సంతృప్తికరంగా లేదు.) 2

మూ. శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనానుకమ్పసే,
కశ్చ కస్యానుశోచ్యోఽస్తి దేహేఽస్మిన్ బుద్బుదోపమే. 3

ప్ర. అ. శోచ్యా = విచారించదగిన నీవు, శోచ్యమ్ = విచారించదగిన, కమ్ =ఎవనిని గూర్చి, శోచసి = విచారించుచున్నావు? దీనా =దీనురాలవైన నీవు, దీనమ్ =దీనుడైన ఎవనిని గూర్చి, అనుకమ్పసే =జాలి పడుచున్నావు? అస్మిన్ = ఈ, దేహే =దేహము, బుద్బుదోపమే = నీటి బుడగతో సమానమై

ఉండగా, కః =ఎవడు, కస్య =ఎవనికి, అనుశోచ్యః = విచారించ దగిన వాడుగా, అస్తి = ఉన్నాడు?

తా. భవిష్యత్తులో ఏమి జరుగ నున్నదో తెలియక నిన్ను గూర్చి నువ్వే విచారించవలసి ఉన్నపుడు, ఇతరు లెవ్వరో విచారింపదగినవా రని అనుకొని ఎవరిని గూర్చి విచారించెదవు? నీవే దీనురాలవై ఉండి మరి ఏ దీనుని గూర్చి జాలిపొందెదవు? ఈ దేహము నీటి బుడగతో సమానమైనది. అట్టి స్థితిలో ఎవరు ఎవరిని గూర్చి విచారించవలెను? (పై శ్లోకము ఈ శ్లోకము కూడ ప్రాచ్యప్రతిలో లేవు. వీటి పద్ధతి చూడగా ప్రక్షిప్తము లనియే తోచును.) 3

మూ. అఙ్గదస్తు కుమారోఽయం ద్రష్టవ్యో జీవపుత్రయా,
ఆయత్యాం చ విధేయాని సమర్థాన్యస్య చిన్తయ. 4

ప్ర. అ. జీవపుత్రయా = జీవించి ఉన్న పుత్రుడు గల నీచేత, కుమారః = కుమారుడైన, అయమ్ =ఈ, అఙ్గదః =అంగదుడు, ద్రష్టవ్యః = చూచుకొనదగినవాడు. ఆయత్యామ్ = భవిష్యత్తునందు, అస్య =ఇతనికి, విధేయాని =చేయదగిన, సమర్థాని = హితకార్యములను, చిన్తయ = ఆలోచించుము.

తా. జీవించి ఉన్న పుత్రుడు గల నీవు కుమారుడైన ఈ అంగదుని చూచుకొనవలెను. ఇతనికి మున్ముందు క్షేమకరములైన కార్యములను గూర్చి ఆలోచించవలెను. 4

మూ. జానాస్యనియతామేవ భూతానామాగతిం గతిమ్,
తస్మాచ్ఛుభం హి కర్తవ్యం పణ్డితేనేహ లౌకికమ్. 5

ప్ర. అ. భూతానామ్ = ప్రాణులయొక్క, ఆగతిమ్ =ఆగమనమును (పుట్టుటను), గతిమ్ =మరణమును, అనియతామ్ ఏవ = నియతము కాని దానినిగా, జానాసి =ఎరుగుదువు కదా. తస్మాత్ = ఆ కారణమువలన, పణ్డితేన = పండితునిచేత, ఇహ = ఇక్కడ, లౌకికమ్ =లోకమునకు సంబంధించిన, శుభమ్ =శుభము, కర్తవ్యం హి = చేయదగినది కదా?

తా. ప్రాణులు పుట్టుట, మరణించుట అనేవి అనిశ్చితము లనే విషయము నీకు తెలిసినదే కదా. అందుచేత బుద్ధిమంతుడు ఆ విషయమును గూర్చి విచారించక ఈ లోకములో ఏది శుభమో అట్టి పని చేయవలెను. 5

మూ. యస్మిన్ హరిసహస్రాణి శతాని నియుతాని చ,
వర్తయన్తి కృతాశాని సోఽయం దిష్టాన్తమాగతః. 6

ప్ర. అ. యస్మిన్ = ఏ వాలి విషయమునందు, కృతాశాని = చేయబడిన ఆశ గలవై, హరిసహస్రాణి =వానరులయొక్క వేలు, శతాని =శతములు, నియుతాని చ = నియుతములు, వర్తయన్తి = జీవించుచున్నవో, సః అయమ్

=అట్టి ఈ వాలి, దిష్టాన్తమ్ =ఆయుఃకాలాంతమును, ఆగతః=పొందినాడు.

తా. వందలకొలది, వేలకొలది, లక్షల కొలది వానరులు ఏ వాలిమీద ఆశలు పెట్టుకొని (ఏ వాలిని ఆశ్రయించి) జీవనము గడుపుచున్నారో ఆ వాలి మరణించినాడు. 6

మూ. యదయం న్యాయదృష్టార్థః సామదానక్షమాపరః,
గతో ధర్మజితాం భూమిం నైనం శోచితుమర్హసి. 7

ప్ర. అ. న్యాయదృష్టార్థః = న్యాయముచేత చూడబడిన కార్యములు గలవాడు, సామదానక్షమాపరః =సామమునందు, దానమునందు, ఓర్పునందు ఆసక్తి గలవాడు అయిన, అయమ్ = ఈ వాలి, యత్ = ఏ కారణము వలన, ధర్మజితామ్ = ధర్మముచేత జయించబడిన, భూమిమ్ = భూమిని గూర్చి, గతః =వెళ్ళినాడో, అందువలన, ఏనమ్=ఇతనిని గూర్చి, శోచితుమ్ = దుఃఖించుటకు, నార్హసి = తగవు.

తా. ఈ వాలి విషయములను న్యాయానుసారము నిర్ణయించెడివాడు. సామదానోపాయములను ప్రయోగించి ఓర్పు చూపించుచుండెడివాడు. అట్టి ఈ వాలి ధర్మముచేత జయించుకొన్న స్వర్గమునకు వెళ్ళినాడు గాన ఈతనిని గూర్చి విచారించవలసిన పని లేదు. 7

మూ. సర్వే చ హరిశార్దూలాః పుత్రశ్చాయం తవాఙ్గదః,
హర్యృక్షపతిరాజ్యం చ త్వత్సనాథమనిన్దితే. 8

ప్ర. అ. అనిన్దితే =నిందింపబడనిదానా! సర్వే = సమస్తమైన, హరిశార్దూలాః = వానరశ్రేష్ఠులు, తవ =నీయొక్క, పుత్రః = పుత్రుడైన, అయమ్ = ఈ, అఙ్గదశ్చ = అంగదుడు, హర్యృక్షపతిరాజ్యం చ = వానరభల్లూకాధిపతుల రాజ్యము, త్వత్సనాథమ్ = నీచేత నాథుడు కలది.

తా. ఎట్టి దోషములు లేనిదానా! సమస్తమైన వానరశ్రేష్ఠులకు, నీ కుమారుడైన అంగదునకు, ఈ వానర - భల్లూక రాజ్యమునకు, ఇప్పుడు నీవే రక్షకురాలవు. 8

మూ. తావిమౌ శోకసంతప్తౌ శనైః ప్రేరయ భామిని,
త్వయా పరిగృహీతోఽయమఙ్గదః శాస్తు మేదినీమ్. 9

ప్ర. అ. భామిని =ఓ తారా! శోకసంతప్తౌ = శోకముచే పీడింపబడిన, తౌ ఇమౌ = ఈ సుగ్రీవాంగదులను, శనైః =మెల్లగా, ప్రేరయ = ప్రేరేపించుము. త్వయా = నీచేత, పరిగృహీతః =గ్రహించబడినవాడై, అయమ్ = ఈ, అఙ్గదః =అంగదుడు, మేదినీమ్ = భూమిని, శాస్తు = శాసించుగాక.

తా. ఓ తారా! దుఃఖముతో బాధ పడుచున్న ఈ సుగ్రీవాంగదులను

మెల్లగా ఇప్పుడు చేయవలసిన కృత్యములు చేయుటకు ప్రేరేపించుము. నీ పర్యవేక్షణలో అంగదుడు రాజ్యమును పాలించుగాక. 9

మూ. సన్తతిశ్చ యథా దృష్టా కృత్యం యచ్చాపి సాంప్రతమ్,
రాజ్ఞస్తత్క్రియతాం సర్వమేష కాలస్య నిశ్చయః. 10

ప్ర. అ. సన్తతిః = సంతానము, యథా =ఎట్లు, దృష్టా = చూడబడినదో, సాంప్రతమ్ =ఇప్పుడు, రాజ్ఞః =రాజునకు, యత్ = ఏ, కృత్యం చాపి =చేయవలసిన పని ఉన్నదో, తత్ =అది, సర్వమ్ = సమస్తము, క్రియతామ్ =చేయబడుగాక. ఏషః =ఇది, కాలస్య = కాలముయొక్క, నిశ్చయః=నిశ్చయము.

తా. సంతానము తండ్రికి ఏ పనులు చేయవలె నని లోకములో చూడబడినదో (భావింపబడుచున్నదో), రాజైన వాలికి ఈ సమయమున ఏ ఔర్ధ్వదైహికక్రియలు చేయదగినవో వాటిని చేయవలెను. ఇది ఈ సమయమునకు తగిన నిర్ణయము. 10

మూ. సంస్కార్యో హరిరాజస్తు అఙ్గదశ్చాభిషిచ్యతామ్,
సింహాసనగతం పుత్రం పశ్యన్తీ శాన్తి మేష్యసి. 11

ప్ర. అ. హరిరాజః = వానరరాజు, సంస్కార్యః =సంస్కరింప దగినవాడు. అఙ్గదశ్చ =అంగదుడు కూడ, అభిషిచ్యతామ్ = అభిషేకము చేయబడుగాక. సింహాసనగతమ్ = సింహాసనమును పొందిన, పుత్రమ్ = పుత్రుని, పశ్యన్తీ = చూచుచున్నదానవై, శాన్తిమ్ = శాంతిని, ఏష్యసి = పొందగలవు.

తా. వాలికి సంస్కారము చేయవలెను. అంగదునకు రాజ్యాభిషేకము చేయవలెను. సింహాసనముమీద కూర్చున్న కుమారుని చూచుకొనుచు నీవు శాంతిని పొందగలవు. 11

మూ. సా తస్య వచనం శ్రుత్వా భర్తృవ్యసనపీడితా,
అబ్రవీదుత్తరం తారా హనూమన్తమవస్థితమ్. 12

ప్ర. అ. భర్తృవ్యసనపీడితా =భర్తయొక్క వ్యసనముచేత పీడించబడిన, సా తారా = ఆ తార, తస్య = ఆతనియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అవస్థితమ్ = నిలచి ఉన్న, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, ఉత్తరమ్ = ఉత్తరమును, అబ్రవీత్ = పలికెను.

తా. భర్తృమరణదుఃఖముతో బాధపడుచున్న ఆ తార హనుమంతుని మాటలు విని, నిలచి ఉన్న ఆతనితో ఇట్లు పలికెను. 12

మూ. అఙ్గదప్రతిరూపాణాం పుత్రాణామేకతః శతమ్,
హతస్యాప్యస్య వీరస్య గాత్రసంశ్లేషణం వరమ్. 13

ప్ర. అ. అఙ్గదప్రతిరూపాణామ్ =అంగదునితో సమానులైన, పుత్రాణామ్ = పుత్రులయొక్క, శతమ్ = శతము, ఏకతః = ఒకవైపున ఉండుగాక. హతస్యాపి = చంపబడినవాడైనను, అస్య = ఈ, వీరస్య =వీరునియొక్క, గాత్రసంశ్లేషణమ్ = శరీరముయొక్క ఆలింగనము, వరమ్ = శ్రేష్ఠము.

తా. అంగదుని వంటి వందమంది కుమారులను ఒక ప్రక్క, మరణించిన వాడైనను ఈ వీరుని శరీరమును కౌగలించుకొనుటను మరొక ప్రక్క ఉంచి చూచినచో రెండవదే శ్రేష్ఠ మైనది.

వి. ఈ శ్లోకం అన్వయం సరిగా లేదు. భావం కూడ ఉదాత్తంగా లేదు. ప్రాచ్యపాఠంలోని శ్లోకము ఈ విధముగా ఉన్నది:-

"కిం కార్యం పతిహీనాయాః పుత్రాణామయుతైరపి,
పితృవ్యస్తస్య సుగ్రీవః సర్వకార్యేష్వనన్తరః.".

"భర్త లేకపోయిన తరవాత పదివేలమంది పుత్రులు ఉన్నా మాత్రము ఏమి ప్రయోజనము? మరణించిన ఈ వీరుని శరీరమునీడయే మంచిది." అని దాని భావము. 13

మూ. న చాహం హరిరాజ్యస్య ప్రభవామ్యఙ్గదస్య వా,
పితృవ్యస్తస్య సుగ్రీవః సర్వకార్యేష్వనన్తరః. 14

ప్ర. అ. అహమ్ =నేను, హరిరాజ్యస్య =వానరరాజ్యమునకు గాని, అఙ్గదస్య వా = అంగదునకు గాని, న ప్రభవామి =సామర్థ్యము కలదానను కాను. తస్య = ఆతనియొక్క, పితృవ్యః = పినతండ్రియైన సుగ్రీవుడు, సర్వకార్యేషు = అన్ని కార్యములందు, అనన్తరః = దగ్గరివాడు.

తా. వానరరాజ్యమును వదుపుటకు కాని, అంగదుని విషయములో కాని నాకు సామర్థ్యము లేదు. అన్ని కార్యములు చూచుకొనవలసినవాడు అంగదుని పినతండ్రి యైన సుగ్రీవుడే. 14

మూ. న హ్యేషా బుద్ధి రాస్థేయా హనూమన్నఙ్గదం ప్రతి,
పితా హి బన్ధుః పుత్రస్య న మాతా హరిసత్తమ. 15

ప్ర. అ. హనుమన్ = హనుమంతుడా! అఙ్గదం ప్రతి = అంగదుని గూర్చి, ఏషా = ఈ, బుద్ధిః = బుద్ధి, న ఆస్థేయా = అవలంబింపదగినది కాదు. హరిసత్తమ = వానరశ్రేష్ఠుడా! పుత్రస్య = పుత్రునకు, పితా = తండ్రియే, బన్ధుః = బంధువు; మాతా = తల్లి, న = కాదు.

తా. వానరశ్రేష్ఠుడవైన హనుమంతుడా! అంగదుని యోగక్షేమములను నేను చూడగల ననే అభిప్రాయము సరియైనది కాదు. పుత్రునకు హితము చేకూర్చగలిగిన బంధువు తండ్రియే కాని తల్లి కాదు. 15

మూ. న హి మమ హరిరాజసంశ్రయాత్
క్షమతరమస్తి పరత్ర చేహ వా,
అభిముఖహతవీరసేవితం
శయనమిదం మమ సేవితుం క్షమమ్. 16

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. మమ = నాకు, ఇహ వా = ఇహలోకములో కాని, పరత్ర వా =పరలోకములో కాని, హరిరాజసంశ్రయాత్ = వానరరాజైన వాలియొక్క ఆశ్రయణముకంటె, క్షమతరమ్ = ఎక్కువ యుక్తమైనది, న అస్తి హి = లేదు కదా. అభిముఖహతవీరసేవితమ్ = అభిముఖుడై ఉండగా చంపబడిన వీరుడైన వాలిచేత, సేవించబడిన, ఇదమ్ = ఈ, శయనమ్ = శయనమును, సేవితుమ్= సేవించుటకే, మమ = నాకు, క్షమమ్ = యుక్తమైనది.

తా. వాలిని సేవించుట తప్ప మరియొక్క కార్య మేదీ నాకు ఈ లోకములో కాని, పరలోకములో కాని లేదు. యుద్ధములో అభిముఖుడై ఉండగా చంపబడిన ఈ వాలి ఎక్కడ శయనించి ఉన్నాడో అక్కడనే నేను కూడ శయనించుట (ఆతనితో పాటు మరణించుట) నాకు యుక్తము. 16

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఇరువది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వావింశః సర్గః

*[వాలి సుగ్రీవాంగదులకు తన మనస్సులోని అభిప్రాయము తెలిపి ప్రాణములు విడచుట]*

మూ. వీక్షమాణస్తు మన్దాసుః సర్వతో మన్దముచ్ఛ్వసన్,
ఆదావేవ తు సుగ్రీవం దదర్శానుజమగ్రతః. 1

ప్ర. అ. మన్దాసుః = దుర్బలములైన ప్రాణములు కలవాడు, మన్దం = మందముగా, ఉచ్ఛ్వసన్ = శ్వాస పీల్చుచున్నవాడు అయిన వాలి, సర్వతః, నలువైపుల, వీక్షమాణః తు = చూచుచున్నవాడై, ఆదావేవ = ముందుగా, అగ్రతః = యెదుట, అనుజం =తమ్ముడైన, సుగ్రీవమ్ = సుగ్రీవుని, దదర్శ = చూచెను.

తా. దుర్బలములైన ప్రాణములతో మందముగా శ్వాస పీల్చుచున్న వాలి నలువైపుల చూచుచు ముందుగా తన యెదుట నున్న తమ్ముడైన సుగ్రీవుని చూచెను. 1

మూ. తం ప్రాప్తవిజయం వాలీ సుగ్రీవం ప్లవగేశ్వరః,
ఆభాష్య వ్యక్తయా వాచా సస్నేహమిదమబ్రవీత్. 2

ప్ర. అ. ప్లవగేశ్వరః = వానరరాజైన, వాలీ = వాలి, ప్రాప్తవిజయమ్ = పొందబడిన విజయము గల, తం సుగ్రీవమ్ = ఆ సుగ్రీవుని, ఆభాష్య = పలకరించి, వ్యక్తయా = స్పష్టమైన, వాచా = వాక్కుతో, సస్నేహమ్ = స్నేహపూర్వకముగా, ఇదమ్ =దీనిని, అబ్రవీత్ = పలికెను.

తా. వానరరాజైన వాలి, విజయమును పొందిన ఆ సుగ్రీవుని పలకరించి స్పష్టమైన మాటలతో స్నేహపూర్వకముగా ఇట్లు పలికెను. 2

మూ. సుగ్రీవ దోషేణ న మాం గన్తుమర్హసి కిల్బిషాత్,
కృష్యమాణం భవిష్యేణ బుద్ధిమోహేన మాం బలాత్. 3

ప్ర. అ. సుగ్రీవ = సుగ్రీవుడా! మామ్ = నన్ను, దోషేణ = దోషముతో, గన్తుమ్ = తెలుసుకొనుటకు, న అర్హసి =తగవు. కిల్బిషాత్ = పాపమువలన, భవిష్యేణ = కానున్న, బుద్ధిమోహేన =బుద్ధియొక్క మోహముచేత, బలాత్ = బలాత్కారముగా, మామ్ =నన్ను, కృష్యమాణమ్ = లాగబడుచున్నవానినిగా, (తెలుసుకొనుము).

తా. సుగ్రీవుడా! నేను చేసిన దోషమును లెక్క చేయకుము. రాబోవు

ఫలమును బట్టి ఏర్పడిన బుద్ధిమోహము నన్ను ఈ విధముగా బలాత్కారముగా లాగినది. 3

మూ. యుగపద్విహితం తాత! న మన్యే సుఖమావయోః,
పౌహార్దం భ్రాతృయుక్తం హి తదిదం జాతమన్యథా. 4

ప్ర. అ. తాత! =నాయనా! ఆవయోః = మనిద్దరకు, సుఖమ్ = సుఖమును, యుగపత్ = ఒకేకాలమందు, విహితమ్ = విధింపబడినదానినిగా, న మన్యే = తలవను. భ్రాతృయుక్తమ్ = సోదరులకు తగిన, తత్ =ఆ, ఇదమ్ =ఈ, పౌహార్దమ్ = స్నేహము, అన్యథా =మరియొక విధముగా, జాతమ్ = అయినది.

తా. నాయనా! మనము ఇద్దరము ఒకే కాలమునందు సుఖపడుటను భగవంతుడు వ్రాయలేదు. సోదరుల మధ్య ఉండవలసిన స్నేహము విరుద్ధముగా అయినది. 4

మూ. ప్రతిపద్య త్వమద్యైవ రాజ్యమేషాం వనౌకసామ్,
మామప్యద్యైవ గచ్ఛన్తం విద్ధి వైవస్వతక్షయమ్. 5

ప్ర. అ. త్వమ్ =నీవు, అద్యైవ =ఇప్పుడే, ఏషామ్ = ఈ, వనౌకసామ్ = వానరులయొక్క, రాజ్యమ్ = రాజ్యమును, ప్రతిపద్య = పొందుము. మామపి = నన్నుకూడ, అద్యైవ = ఇపుడే, వైవస్వతక్షయమ్ = యముని గృహమును గూర్చి, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్నవానినిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. నీవు ఇపుడే ఈ వానరరాజ్యమును స్వీకరించుము. నేను ఈ క్షణమునందే యమలోకమునకు వెళ్ళిపోవుచున్నాను. 5

మూ. జీవితం చ హి రాజ్యం చ శ్రియం చ విపులాం తథా,
ప్రజహామ్యేష వై తూర్ణమహం చాగర్హితం యశః. 6

ప్ర. అ. ఏషః అహమ్ = ఈ నేను, జీవితం చ = జీవితమును, రాజ్యం చ = రాజ్యమును, తథా =మరియు, విపులామ్ = అధికమైన, శ్రియం చ =లక్ష్మిని, అగర్హితమ్ =నింద్యము కాని, యశః చ =కీర్తిని, తూర్ణమ్ = శీఘ్రముగా, ప్రజహామి = విడిచిపెట్టుచున్నాను.

తా. నేను ఇపుడే నా జీవితమును, రాజ్యమును, అధికమైన ఐశ్వర్యమును "వాలి ఎవరిచేతా చంప శక్యమైనవాడు కాడు" అను ఉత్తమమైన కీర్తిని విడిచిపెట్టుచున్నాను. 6

మూ. అస్యాన్త్వహమవస్థాయాం వీర ! వక్ష్యామి యద్వచః,
యద్యప్యసుకరం రాజన్ కర్తుమేవ త్వమర్హసి. 7

ప్ర. అ. వీర! = వీరుడా! రాజన్ =రాజా! అస్యామ్ అవస్థాయామ్ =ఈ అవస్థలో, అహమ్ =నేను, యత్ =యే, వచః =వచనమును, వక్ష్యామి = చెప్పెదనో (దానిని), అసుకరం యద్యపి =సులభముగా చేయుటకు శక్యము కానిదైనను, కర్తుమేవ= చేయుటకే, త్వమ్ = నీవు, అర్హసి = తగియున్నావు.

తా. వీరుడ వైన ఓ రాజా! ఇట్టి అవస్థలో ఉన్న నేను ఒక్క మాట చెప్పెదను. అది చేయుటకు అంత సులభము కాక పోయినను నీవు తప్పక చేయవలెను. 7

మూ. సుఖార్హం సుఖసంవృద్ధం బాలమేనమబాలిశమ్,
బాష్పపూర్ణముఖం పశ్య భూమౌ పతితమఙ్గదమ్. 8

ప్ర. అ. సుఖార్హమ్ = సుఖమునకు తగినవాడు, సుఖసంవృద్ధమ్ = సుఖముతో పెరిగినవాడు, బాలమ్ = చిన్న వయస్సువాడు, అబాలిశమ్= బుద్ధిమంతుడు, బాష్పపూర్ణముఖమ్ = కన్నీటితో నిండిన ముఖము కలవాడు, భూమౌ =నేలమీద, పతితమ్ = పడి ఉన్నవాడు అయిన, అఙ్గదమ్ = అంగదుని, పశ్య = చూడుము.

తా. ఈ అంగదుడు సుఖమునకు తగినవాడు; సుఖములతో పెరిగినవాడు. చిన్న వయస్సువాడైనను బుద్ధిమంతుడు. అట్టి ఈ అంగదుడు కన్నీళ్ళతో నిండిన ముఖముతో భూమిపై ఎట్లు పడియున్నాడో చూడుము. 8

మూ. మమ ప్రాణైః ప్రియతరం పుత్రం పుత్రమివౌరసమ్,
మయా హీనమహీనార్థం సర్వతః పరిపాలయ. 9

ప్ర. అ. మమ = నాయొక్క, ప్రాణైః =ప్రాణములకంటె, ప్రియతరమ్ = ఎక్కువ ప్రియమైనవాడు, మయా =నాతో, హీనమ్ =హీనుడు అయిన, పుత్రమ్ = నా పుత్రుని, ఔరసం పుత్రమ్ ఇవ =నీ ఔరసపుత్రుని వలె, సర్వతః =అన్ని విధముల, అహీనార్థమ్=హీనముకాని ప్రయోజనము కలవానినిగా, పరిపాలయ = పాలించుము.

తా. నా పుత్రుడైన ఈ అంగదుడు నా ప్రాణములకంటె కూడ ఎక్కువ ఇష్టమైనవాడు. నేను లేని ఈతనిని ఎట్టి లోపములు రాకుండగ అన్ని విధముల పరిపాలించుము. 9

మూ. త్వమప్యస్య పితా దాతా పరిత్రాతా చ సర్వశః,
భయేష్వభయదశ్చైవ యథాஉహం ప్లవగేశ్వర. 10

ప్ర. అ. ప్లవగేశ్వర = ఓ వానరరాజా! అహమ్ =నేను, యథా =ఎట్లో (అట్లే), త్వమపి =నీవు కూడ, అస్య = ఇతనికి, పితా = తండ్రివి. దాతా=అన్నీ ఇచ్చువాడవు. సర్వశః =అన్ని వైపులనుండి, పరిత్రాతా చ = రక్షకుడవు. భయేషు = భయములయందు, అభయదశ్చైవ = అభయమును ఇచ్చువాడవు.

తా. ఓ సుగ్రీవా! నావలెనే నీవు కూడా ఈ అంగదునకు తండ్రివిగాను, అన్నీ యిచ్చే వాడవుగాను, అన్ని వైపులనుండి రక్షించేవాడవుగాను, భయములయందు అభయము నిచ్చేవాడవుగాను ఉండవలెను. 10

మూ. ఏష తారాత్మజః శ్రీమాంస్త్వయా తుల్యపరాక్రమః,
రక్షసాం చ వధే తేషామగ్రతస్తే భవిష్యతి. 11

ప్ర. అ. శ్రీమాన్ =శ్రీమంతుడు, త్వయా = నీతో, తుల్యపరాక్రమః = సమానమైన పరాక్రమము కలవాడైన, ఏషః= ఈ, తారాత్మజః = తారా పుత్రుడైన అంగదుడు, తేషామ్ = ఆ, రక్షసామ్ = రాక్షసులయొక్క, వధే = వధయందు, తే =నీకు, అగ్రతః=ఎదుట, భవిష్యతి = ఉండగలడు.

తా. మంచి కాంతి కలవాడు, నీతో సమానమైన పరాక్రమము కలవాడు అయిన ఈ అంగదుడు నీ ముందు నిలచి రాక్షసులను సంహరించుటకు నీకు తోడ్పడగలడు. 11

మూ. అనురూపాణి కర్మాణి విక్రమ్య బలవాన్ రణే,
కరిష్యత్యేష తారేయస్తేజస్వీ తరుణోఽఙ్గదః. 12

ప్ర. అ. బలవాన్ =బలవంతుడు, తారేయః =తార కుమారుడు, తేజస్వీ = గొప్ప తేజస్సు కలవాడు, తరుణః =యువకుడు అయిన, ఏషః అఙ్గదః = ఈ అంగదుడు, రణే = యుద్ధమునందు, విక్రమ్య = పరాక్రమించి, అనురూపాణి =తగిన, కర్మాణి = కర్మలను, కరిష్యతి =చేయగలడు.

తా. బలవంతుడు, తేజశ్శాలి, తారాపుత్రుడు, యువకుడు అయిన ఈ అంగదుడు యుద్ధములో పరాక్రమమును చూపి నా కుమారునికి తగిన పనులు చేయగలడు. 12

మూ. సుషేణదుహితా చేయమర్థసూక్ష్మవినిశ్చయే,
ఔత్పాతికే చ వివిధే సర్వతః పరినిష్ఠితా. 13

ప్ర. అ. సుషేణదుహితా = సుషేణుని కుమార్తెయైన, ఇయం చ=ఈ తార కూడ, అర్థసూక్ష్మవినిశ్చయే =సూక్ష్మములైన విషయములను నిశ్చయించుటయందు, వివిధే =అనేకవిధములైన, ఔత్పాతికే చ =ఉత్పాతములకు సంబంధించిన కార్యమునందు, సర్వతః = అన్ని విధముల, పరినిష్ఠితా = సమర్థురాలు.

తా. సుషేణుని కుమార్తెయైన ఈ తార కూడ అతిసూక్ష్మములైన విషయములను గూర్చి ఆలోచించి నిర్ణయించుటయందు, అకస్మాత్తుగా వచ్చే అనేక ఉపద్రవములలో చేయవలసిన పనులయందు మంచి సామర్థ్యము కలది.

మూ. యదేషా సాధ్వితి బ్రూయాత్ కార్యం తన్ముక్తసంశయమ్,
న హి తారామతం కిఞ్చిదన్యథా పరివర్తతే. 14

ప్ర. అ. ఏషా =ఈమె, యత్ =దేనిని, సాధు ఇతి =మంచిది అని, బ్రూయాత్ =చెప్పునో, తత్ =అది, ముక్తసంశయమ్ = విడువబడు సంశయము కలుగునట్లుగా, కార్యమ్ =చేయదగినది. తారామతమ్ = తారయొక్క మతము, కిఞ్చిత్ = ఏదియు, అన్యథా =మరియొక విధముగా, న పరివర్తతే హి =మారదు కదా!

తా. ఈ తార మంచిది అని చెప్పిన కార్యమును నిస్సంశయముగా చేయవచ్చును. తార అభిప్రాయము ఎన్నడు మరొక విధముగా మారదు. 14

మూ. రాఘవస్య చ తే కార్యం కర్తవ్యమవిశఙ్కయా,
స్యాదధర్మో హ్యకరణే త్వాం చ హింస్యాదమానితః. 15

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, కార్యం చ =కార్యము కూడ, తే=నీకు, అవిశంకయా = శంక లేకుండగా, కర్తవ్యమ్ = చేయదగినది. అకరణే = చేయకపోవుటయందు, అధర్మః =అధర్మము, స్యాత్ హి= కలుగును కదా! అమానితః =గౌరవింపబడనివాడై, త్వామ్ =నిన్ను, హింస్యాత్ చ=చంపును కూడ.

తా. నీవు రాముని కార్యమును ఏ మాత్రము శంకించకుండగా చేయవలెను. అట్లు చేయనిచో అధర్మము అగును. నీచే అవమానితుడై రాముడు నిన్ను కూడా చంపివేయును. 15

మూ. ఇమాం చ మాలామాధత్స్వ దివ్యాం సుగ్రీవ కాఞ్చనీమ్,
ఉదారా శ్రీః స్థితా హ్యస్యాం సమ్ప్రజహ్యాన్మృతే మయి. 16

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా! కాఞ్చనీమ్=బంగారము వికారమైన, ఇమాం మాలామ్ = ఈ మాలను, ఆధత్స్వ =ధరించుము. అస్యామ్ =దీనియందు, స్థితా =ఉన్న, ఉదారా =ప్రశస్తమైన, శ్రీః =జయలక్ష్మి, మయి = నేను, మృతే =మరణించినవాడ నగుచుండగా, సమ్ప్రజహ్యాత్ హి = విడిచివేయును గదా!

తా. ఓ సుగ్రీవా! ఇదిగో! ఈ దివ్యమైన బంగారు మాలను నీవు ధరించుము. నేను మరణించినట్లైతే (శవస్పర్శదోషముచే) జయలక్ష్మిని యిచ్చు ప్రశస్తమైన శక్తి ఈ మాలనుండి దూరమైపోవును. 16

మూ. ఇత్యేవముక్తః సుగ్రీవో వాలినా భ్రాతృసౌహృదాత్,
హర్షం త్యక్త్వా పునర్దీనో గ్రహగ్రస్త ఇవోడురాట్. 17

ప్ర. అ. వాలినా=వాలిచేత, భ్రాతృసౌహృదాత్ =సోదరప్రేమవలన, ఇత్యేవమ్

=ఇట్లు, ఉక్తః =పలుకబడిన, సుగ్రీవః =సుగ్రీవుడు, హర్షమ్ =సంతోషమును, త్యక్త్వా =విడచి, పునః = మరల, దీనః =దీనుడై, గ్రహగ్రస్తః = రాహువుచే మ్రింగబడిన, ఉడురాట్ ఇవ =చంద్రుడు వలె ఉండెను.

తా. వాలి సోదరస్నేహముతో పలికిన మాటలు విని సుగ్రీవుడు సంతోషవిహీనుడై, మరల దీనుడై, రాహువు మ్రింగిన చంద్రుడు వలె ఉండెను.

మూ. తద్వాలివచనాచ్ఛాన్తః కుర్వన్యుక్తమతన్ద్రితః,
జగ్రాహ సోఽభ్యనుజ్ఞాతో మాలాం తాం చైవ కాఞ్చనీమ్. 18

ప్ర. అ. సః =ఆ సుగ్రీవుడు, తద్వాలివచనాత్ =ఆ వాలియొక్క మాటలవలన, శాన్తః =శాంతుడై, అతన్ద్రితః =అలసత్వము లేనివాడై, యుక్తమ్ = యుక్తమైన కార్యమును, కుర్వన్ =చేయుచు, అభ్యనుజ్ఞాతః =వాలిచే అనుజ్ఞ ఇవ్వబడినవాడై, కాఞ్చనీమ్ =బంగారము వికారమైన, తాం మాలామ్ = ఆ మాలను, జగ్రాహ =గ్రహించెను.

తా. సుగ్రీవుడు వాలి మాటలు విని వైరమును విడిచి అలసత్వము లేకుండగ తగు కార్యములు చేయుచు వాలి అనుజ్ఞచేత ఆ బంగారు మాలను స్వీకరించెను. 18

మూ. తాం మాలాం కాఞ్చనీం దత్త్వా దృష్ట్వా చైవాత్మజం స్థితమ్,
సంసిద్ధః ప్రేత్యభావాయ స్నేహాదఙ్గదమబ్రవీత్. 19

ప్ర. అ. కాఞ్చనీమ్ =బంగారము వికారమైన, తాం మాలామ్ = ఆ మాలను, దత్త్వా = ఇచ్చి, స్థితమ్ =నిలచియున్న, ఆత్మజం చ =కుమారుని, దృష్ట్వా =చూచి, ప్రేత్యభావాయ =మరణమునకు, సంసిద్ధః =సిద్ధుడై ఉన్న ఆ వాలి, స్నేహాత్ =స్నేహమువలన, అఙ్గదమ్ =అంగదుని గూర్చి, అబ్రవీత్ =పలికెను.

తా. మరణోన్ముఖుడైన ఆ వాలి ఆ బంగారుమాలను సుగ్రీవునకు ఇచ్చి దగ్గర నిలిచియున్న కుమారుడైన అంగదుని చూచి ఆతనితో స్నేహపూర్వకముగా ఇట్లనెను. 19

మూ. దేశకాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. 20

ప్ర. అ. అద్య =ఇపుడు, ప్రియాప్రియే =ప్రియమును, అప్రియమును, క్షమమాణః =ఓర్చుకొనుచున్నవాడవై, దేశకాలౌ = దేశకాలములను, భజస్వ = సేవించుము. కాలే =కాలమునందు, సుఖదుఃఖసహః= సుఖదుఃఖములను సహించుచున్నవాడవై, సుగ్రీవవశగః =సుగ్రీవుని వశమును పొందినవాడవు, భవ =అగుము.

తా. నీవు ఇటుపై ప్రియము కలిగినను, అప్రియము కలిగినను ఓర్చుకొనుచు దేశమునకు కాలమునకు అనుగుణముగా ప్రవర్తించుము. ఆ యా సమయములలో కలుగు సుఖదుఃఖములను సహించుచు సుగ్రీవుని వశములో ఉండుము. 20

మూ. యథా హి త్వం మహాబాహో లాలితః సతతం మయా,
న తథా వర్తమానం త్వాం సుగ్రీవో బహుమన్యతే. 21

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! త్వమ్ =నీవు, సతతమ్ =ఎల్లపుడు, మయా =నాచేత, యథా=ఎట్లు, లాలితః = లాలింప బడినవాడవో, తథా =అట్లు, వర్తమానమ్ =ఉంటున్న, త్వామ్ = నిన్ను, సుగ్రీవః =సుగ్రీవుడు, న బహుమన్యతే = గౌరవించడు.

తా. గొప్ప బాహువులు గల ఓ అంగదుడా! నీవు ఎట్లు ప్రవర్తించినను నేను సర్వదా నిన్ను లాలించుచుంటిని. ఇపుడు నీవు ఆ విధముగా ప్రవర్తించినచో సుగ్రీవుడు ఇష్టపడడు. 21

మూ. వాస్యామిత్త్రైర్గతం గచ్ఛేర్మా శత్రుభిరరిన్దమ,
భర్తురర్థపరో దాన్తః సుగ్రీవవశగో భవ. 22

ప్ర. అ. అరిన్దమ = ఓ శత్రుసంహారకుడా! అస్య =ఈ సుగ్రీవునియొక్క, అమిత్రైః =మిత్రులు కాని వారితో, గతమ్ =గమనమును, మా గచ్ఛేః = పొందకుము. శత్రుభిః =శత్రువులతో, మా =పొందకుము. భర్తుః = ప్రభువుయొక్క, అర్థపరః = కార్యమునం దాసక్తి కలవాడవై, దాన్తః = ఇంద్రియనిగ్రహము కలవాడవై, సుగ్రీవ వశగః =సుగ్రీవునకు వశుడవై, భవ =ఉండుము.

తా. శత్రుసంహారకుడ వైన ఓ అంగదా ! సుగ్రీవునితో స్నేహములేని ఉదాసీనులతో గాని, ఆతని శత్రువులతో గాని కలిసి తిరగకుము. ప్రభువైన సుగ్రీవుని కార్యమును సాధించుటయందే ఆసక్తి కలవాడవై ఇంద్రియములను నిగ్రహించుకొని ఆతనికి వశుడవై ఉండుము. 22

మూ. న చాపి ప్రణయః కార్యః కర్తవ్యోఽప్రణయశ్చ తే,
ఉభయం హి మహాదోషం తస్మాదన్తరదృగ్భవ. 23

ప్ర. అ. అతిప్రణయః =ఎక్కువ ప్రేమ, తే =నీకు, న కార్యః = చేయదగినది కాదు. అప్రణయశ్చ = ద్వేషము కూడ, న కర్తవ్యః = చేయదగినది కాదు. ఉభయమ్ = ఈ ఉభయము, మహాదోషమ్ = గొప్ప దోషము గలది. తస్మాత్ = ఆ కారణమువలన, అన్తరదృక్ = మధ్యను చూచువాడవు, భవ = అగుము.

తా. నీవు ఎవరి విషయమునందు ఎక్కువ ప్రేమ చూపకూడదు. ఎక్కువ ద్వేషము కూడ చూపకూడదు. ఈ రెండూ చాల చెడ్డవే. అందుచే మధ్య

మార్గదృష్టి కలవాడవు అగుము. 23

మూ. ఇత్యుక్త్వాథ వివృత్తాక్షః శరసమ్పీడితో భృశమ్,
వివృతైర్దశనై ర్భీమై ర్బభూవోత్క్రాన్తజీవితః. 24

ప్ర. అ. భృశమ్ =మిక్కిలి, శరసమ్పీడితః =బాణముచేత పీడింపబడిన ఆ వాలి, ఇతి =ఇట్లు, ఉక్త్వా = పలికి, అథ = అటు పిమ్మట, వివృత్తాక్షః =తిరిగి పోయిన కండ్లు కలవాడై, వివృతైః =తెరవబడిన, భీమైః =భయంకరమైన, దశనైః =దంతములతో కూడినవాడై, ఉత్క్రాన్తజీవితః = ఎగిరిపోయిన జీవితము కలవాడు, బభూవ = ఆయెను.

తా. బాణము గ్రుచ్చుకొనుటచే చాల బాధపడుచున్న ఆ వాలి ఈ మాటలు చెప్పి కండ్లు తేరవేసి భయంకరమైన దంతములు పైకి కనబడునట్లు నోరు తెరచి మరణించెను. 24

మూ. తతో విచుక్రుశుస్తత్ర వానరా హతయూథపాః,
పరిదేవయమానాస్తే సర్వే ప్లవగసత్తమాః. 25

ప్ర. అ. తతః =అటుపిమ్మట, ప్లవగసత్తమాః =వానరులలో శ్రేష్ఠులైన, సర్వే =సమస్తమైన, తే వానరాః =ఆ వానరులు, హతయూథపాః = చంపబడిన నాయకుడు కలవారై, పరిదేవయమానాః =ఏడ్చుచు, తత్ర = అక్కడ, విచుక్రుశుః =అరచిరి.

తా. తమ గుంపులకు నాయకుడైన ఆ వాలి మరణించగానే వానరులలో శ్రేష్ఠులైన, అక్కడ ఉన్న వానరు లందరు విలపించుచు బిగ్గరగా ఏడ్చిరి. 25

మూ. కిష్కిన్ధా హ్యద్య శూన్యా చ స్వర్గతే వానరేశ్వరే,
ఉద్యానాని చ శూన్యాని పర్వతాః కాననాని చ, 26
హతే ప్లవగశార్దూలే నిష్ప్రభా వానరాః కృతాః.

ప్ర. అ. వానరేశ్వరే=వానరరాజు, స్వర్గతే=స్వర్గమును పొందినవా డగు చుండగా, అద్య=ఇపుడు, కిష్కిన్ధా=కిష్కింధ, శూన్యా హి= శూన్య మైనది కదా! ఉద్యానాని చ=ఉద్యానములు, శూన్యాని=శూన్యమైనవి. పర్వతాః=పర్వత ములు, కాననాని చ=అరణ్యములు, శూన్యములైనవి. ప్లవగశార్దూలే=వానరశ్రేష్ఠుడు, హతే=చంపబడినవా డగుచుండగా, వానరాః=వానరులు, నిష్ప్రభాః=కాంతి లేనివా రుగా, కృతాః= చేయుబడినారు.

తా. వానరరాజైన వాలి ఇపుడు మరణించుటతో కిష్కింధానగరము, ఉద్యానములు, పర్వతములు, అరణ్యములు కూడ శూన్యములై పోయినవి. ఈ వానరశ్రేష్ఠుడు మరణించుటచే వానరు లందరు కాంతివిహీనులైనారు. 26

మూ. యస్య వేగేన మహతా కాననాని వనాని చ,
పుష్పౌఘేణానుబధ్యన్తే కరిష్యతి తదద్య కః. 27

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, మహతా వేగేన=గొప్ప వేగముచేత, కాననాని=మహారణ్యములు, వనాని చ =చిన్న వనములు, పుష్పౌఘేణ=పుష్ప సముదాయముచేత, అనుబధ్యన్తే=అనుబద్ధము లగుచుండెడివో, తత్=దానిని, అద్య=ఇప్పుడు, కః=ఎవడు, కరిష్యతి=చేయగలడు.

తా. ఈ వాలి మహావేగముగా వెళ్లుచున్నపుడు పెద్ద అరణ్యములలోను, చిన్న వనములలోను ఉన్న పుష్పములు ఎగిరి ఆతనిని అనుసరించుచుండెడివి. ఇపుడు అట్లు ఎవడు చేయగలడు? 27

మూ. యేన దత్తం మహద్యుద్ధం గన్ధర్వస్య మహాత్మనః, 28
గోలభస్య మహాబాహోర్దశ వర్షాణి పంచ చ,
నైవ రాత్రౌ న దివసే తద్యుద్ధముపశామ్యతి. 29

ప్ర. అ. యేన=ఏ వాలిచేత, మహాత్మనః=మహాత్ముడు, మహాబాహోః= గొప్ప బాహువులు కలవాడు అయిన, గోలభస్య=గోలభుడనే పేరు గల, గన్ధర్వస్య=గంధ ర్వునకు, దశ=పది, పంచ చ=ఐదు, వర్షాణి=సంవత్సరములను, మహత్=గొప్ప, యుద్ధమ్=యుద్ధము, దత్తమ్=ఇవ్వబడినదో, తత్ యుద్ధమ్= ఆ యుద్ధము, రాత్రౌ=రాత్రియందు, నైవ ఉపశామ్యతి=శాంతించలేదు. దివసే=పగటియందు, న=శాంతించలేదు.

తా. వాలి మహాత్ముడు, గొప్ప బాహువులు గలవాడు అయిన గోలభుడు అను గంధర్వునితో పదునైదు సంవత్సరముల పాటు గొప్ప యుద్ధము చేసెను. రాత్రియందుగాని, పగటియందు గాని ఆ యుద్ధమునకు విరామము లేకుండెను.

మూ. తతస్తు షోడశే వర్షే గోలభో వినిపాతితః,
తం హత్వా దుర్వినీతం తు వాలీ దంష్ట్రాకరాలవాన్. 30
సర్వాఽభయఙ్కరోఽస్మాకం కథమేష నిపాతితః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, షోడశే=పదునాఱవ, వర్షే= సంవత్సరమునందు, గోలభః=గోలభుడు, వినిపాతితః= పడగొట్టబడినాడు. దంష్ట్రాకరాలవాన్=కోరలచేత ఎత్తుపల్లములు గల, వాలీ=వాలి, దుర్వినీతమ్=దుష్టబుద్ధియైన, తమ్=ఆ గోల భుని, హత్వా=చంపి, అస్మాకమ్=మాకు, సర్వాఽభయఙ్కరః= అందరినుండి అభయమును ఇచ్చినవాడు అయినాడు. ఏషః=అట్టి (ఈ) వాలి, కథమ్=ఎట్లు, నిపాతితః=పడగొట్టబడినాడు.

తా. పదహారవ సంవత్సరములో ఆ గోలభుడు చంపబడెను. కోరలచే ఎత్తుపల్లములు ఉన్న ఆ వాలి దుర్బుద్ధియైన ఆ గోలభుని చంపి మాకు

అందరినుండి అభయమును ఇచ్చినాడు. అట్టి వాలి ఎట్లు చంపబడినాడో కదా!

మూ. హతే తు వీరే ప్లవగాధిపే తదా
ప్లవఙ్గమాస్తత్ర న శర్మ లేభిరే,
వనేచరాః సింహయుతే మహావనే
యథా హి గావో నిహతే గవాం పతౌ. 31

ప్ర. అ. సింహయుతే=సింహముతో కూడిన, మహావనే=మహావనమునందు, గవామ్=గోవులయొక్క, పతౌ=పతియైన వృషభము, నిహతే= చంపబడినదగుచుండగా, వనేచరాః=వనములో సంచరించు, గావః= గోవులు, యథా=ఎట్లో అట్లే, తదా=అప్పుడు, వీరే= వీరుడైన, ప్లవగాధిపే=వానరరాజు, హతే=చంపబడినవా డగుచుండగా, తత్ర=అక్కడ, ప్లవఙ్గమాః=వానరులు, శర్మ= సుఖమును, న లేభిరే=పొందలేదు.

తా. సింహము నివసించు మహారణ్యములో వృషభము చంపివేయబడినపుడు ఆ వనములో సంచరించు గోవులు ఎట్లు సుఖముగా ఉండజాలవో అట్లే వీరుడైన వాలి చంపబడిన పిమ్మట అక్కడ ఉన్న వానరులు సుఖమును పొందలేకపోయిరి.

మూ. తతస్తు తారా వ్యసనార్ణవాప్లుతా
మృతస్య భర్తుర్వదనం సమీక్ష్య సా,
జగామ భూమిం పరిరభ్య వాలినం
మహాద్రుమం ఛిన్నమివాశ్రితా లతా. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్వావింశ స్సర్గః.

ప్ర. అ. తతః =అటుపిమ్మట, సా తారా=ఆ తార, వ్యసనార్ణవాప్లుతా= దుఃఖసముద్రములో మునిగినదై, మృతస్య=మరణించిన, భర్తుః= భర్తయొక్క, వదవమ్=ముఖమును, సమీక్ష్య=చూచి, ఛిన్నమ్= తెగగొట్టబడిన, మహాద్రుమమ్=మహావృక్షమును, ఆశ్రితా= ఆశ్రయించిన, లతా ఇవ=లత వలె, వాలినమ్=వాలిని, పరిరభ్య= కౌగలించుకొని, భూమిమ్=భూమిని, జగామ=పొందెను.

తా. అటు పిమ్మట ఆ తార దుఃఖసముద్రములో మునిగినదై మరణించిన భర్త ముఖమును చూచుచు, ఛేదింపబడిన మహావృక్షమును అల్లుకొని ఉన్న లత వలె ఆ వాలిని కౌగలించుకొని నేలపై పడెను. 32

"బాలానన్దిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఇరువదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయోవింశః సర్గః

## [తారావిలాపము]

మూ. తతః సముపజిఘ్రన్తీ కపిరాజస్య తన్ముఖమ్,
పతిం లోకశ్రుతా తారా మృతం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, లోకశ్రుతా=లోకమునందు ప్రసిద్ధురాలైన, తారా=తార, కపిరాజస్య=వాలియొక్క, తత్ ముఖమ్=ఆ ముఖమును, సముపజిఘ్రన్తీ=వాసనచూచుచున్నదై, మృతమ్= మరణించిన, పతిమ్=భర్తను గూర్చి, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. లోకములో ప్రసిద్ధురాలైన ఆ తార వానరరాజైన వాలి ముఖమును వాసనచూచుచు మరణించిన ఆ భర్తను గూర్చి యిట్లు పలికెను. 1

మూ. శేషే త్వం విషమే దుఃఖమకృత్వా వచనం మమ,
ఉపలోపచితే వీర! సుదుఃఖే వసుధాతలే. 2

ప్ర. అ. వీర!=ఓ వీరుడా! మమ=నాయొక్క, వచనమ్=వచనమును, అకృత్వా=చేయక, త్వమ్=నీవు, విషమే=సమముగా లేనిది, ఉపలోపచితే=రాళ్లతో వ్యాప్త మైనది, సుదుఃఖే=చాల దుఃఖకరము అయిన, వసుధాతలే= నేలమీద, దుఃఖమ్=దుఃఖము కలుగునట్లుగా, శేషే=శయనించియున్నావు.

తా. ఓ వీరుడా! నేను చెప్పిన మాట వినక నీవు ఎగుడు దిగుడుగా ఉన్న, రాళ్లతో నిండిన, చాల దుఃఖకరమైన నేలపై దుఃఖము కలుగు నట్లుగా పడి యున్నావు. 2

మూ. మత్తః ప్రియతరా నూనం వానరేన్ద్ర మహీ తవ,
శేషే హి తాం పరిష్వజ్య మాం చ న ప్రతిభాషసే. 3

ప్ర. అ. వానరేన్ద్ర=ఓ వానరరాజా! మహీ=భూమి, తవ=నీకు, మత్తః=నాకంటె, నూనమ్=నిశ్చయముగా, ప్రియతరా= ఎక్కువ ఇష్టమైనది. హి=ఎందుచేతననగా, తామ్=ఆ భూమిని, పరిష్వజ్య=కౌగలించుకొని, శేషే=శయనించియున్నావు. మామ్=నన్ను గూర్చి, న ప్రతిభాషసే చ=మాటలాడుటలేదు.

తా. ఓ వానరరాజా! నీకు భూమియే నాకంటె ఎక్కువ ఇష్టమైనది. ఎందుచేత ననగా నీవు ఆ భూమిని కౌగలించుకొని శయనించి యున్నావు. నాతో మారు మాటాడుటలేదు. 3

మూ. సుగ్రీవస్య వశం ప్రాప్తో విధిరేష భవత్యహో,
సుగ్రీవ ఏవ విక్రాన్తో వీర సాహసికప్రియ. 4

ప్ర. అ. వీర=ఓ వీరుడా! సాహసికప్రియ=సాహసకృత్యములు ప్రియములుగా కలవాడా! సుగ్రీవస్య=సుగ్రీవునకు, వశం ప్రాప్తః= వశమైనావు. సుగ్రీవ ఏవ=సుగ్రీవుడే, విక్రాన్తః= పరాక్రమవంతుడైనాడు. ఏషః=ఇది, విధిః=దైవవిధానము, భవతి= అగుచున్నది. అహో!=ఎంత ఆశ్చర్యము.

తా. సాహసకృత్యములు చేయుటయందు ఆసక్తి గల ఓ వీరుడా! నీవే సుగ్రీవునకు లొంగి పోయినావు. సుగ్రీవుడే అధికపరాక్రమవంతు డైనాడు. ఈ దైవవిధి ఎంత ఆశ్చర్యకరముగా నున్నది. 4

మూ. ఋక్షవానరముఖ్యాస్త్వాం బలినం పర్యుపాసతే,
తేషాం విలపితం కృచ్ఛ్రమఙ్గదస్య చ శోచతః, 5
మమ చేమా గిరః శ్రుత్వా కిం త్వం న ప్రతిబుధ్యసే.

ప్ర. అ. ఋక్షవానరముఖ్యాః=భల్లూకములలోను వానరులలోను ప్రధానమైన వారు, బలినమ్=బలవంతుడవైన, త్వామ్=నిన్ను, పర్యుపాసతే= సేవించుచున్నారు. తేషామ్=వారియొక్క, కృచ్ఛ్రమ్=కష్టమైన, విలపితమ్=విలాపమును, శోచతః=దుఃఖించుచున్న, అఙ్గదస్య చ=అంగదునియొక్క విలాపమును, మమ=నాయొక్క, ఇమాః= ఈ, గిరః=మాటలను, శ్రుత్వా=విని, త్వమ్=నీవు, కిమ్= ఎందువలన, న ప్రతిబుధ్యసే=మేలుకొనుటలేదు.

తా. భల్లూకనాయకులు, వానరనాయకులు బలవంతుడవైన నిన్ను సేవించుచున్నారు. దుఃఖముతో కూడిన వారి విలాపమును, దుఃఖించుచున్న అంగదుని విలాపమును నేను పలుకుచున్న ఈ మాటలను విని నీవు మేల్కొనుట లేదేమి? 5

మూ. ఇదం తద్వీరశయనం తత్ర శేషే హతో యుధి,
శాయితా నిహతా యత్ర త్వయైవ రిపవః పురా. 6

ప్ర. అ. త్వయైవ=నీచేతనే, పురా=పూర్వము, నిహతాః= చంపబడిన వారై, రిపవః=శత్రువులు, యత్ర=దేనిపై, శాయితాః = శయనింపచేయబడినారో, తత్=ఆ, వీరశయనమ్=వీరశయనము, ఇదమ్ =ఇదే; యుధి=యుద్ధమునందు, హతః=చంపబడినవాడవై, తత్ర=ఆ వీరశయనము నందు, శేషే=శయనించియున్నావు.

తా. నీవు పూర్వము శత్రువులను చంపి వారిని యే వీరశయనము మీద శయనించునట్లు చేసితివో ఆ వీరశయనముమీదనే నీవు ఇప్పుడు చంపబడి శయనించియున్నావు. 6

మూ. విశుద్ధసత్త్వాభిజన ప్రియయుద్ధ మమ ప్రియ,
మామనాథాం విహాయైకాం గతస్త్వమసి మానద. 7

ప్ర. అ. విశుద్ధసత్త్వాభిజన=పరిశుద్ధమైన బలము వంశము గలవాడా! ప్రియయుద్ధ=ఇష్టమైన యుద్ధము గలవాడా! మానద=గౌరవమును రక్షించువాడా!, మమ ప్రియ=నా ప్రియుడా! త్వమ్=నీవు, అనాథామ్=అనాథురాలనైన, మామ్=నన్ను, ఏకామ్=ఒంటరిగా, విహాయ=విడచి, గతః=వెళ్లిపోయినావు.

తా. పరిశుద్ధమైన బలము, బంధుజనము గలవాడా! ప్రియమైన యుద్ధము గలవాడా! గౌరవమును సంరక్షించు నా ప్రియుడా! అనాథరాలనైన నన్ను ఒంటరిగా విడచి నీవు వెళ్లిపోయినావు. 7

మూ. శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా,
శూరభార్యాం హతాం పశ్య సద్యో మాం విధవాం కృతామ్. 8

ప్ర. అ. విపశ్చితా=బుద్ధిమంతునిచేత, కన్యా=కన్య, శూరాయ= శూరునకు, న ప్రదాతవ్యా ఖలు=ఇవ్వదగినది కాదు కదా! సద్యః= వెంటనే,(హఠాత్తుగా) విధవాం కృతామ్=భర్త లేనిదానినిగా చేయబడిన, హతామ్=దుఃఖపీడితురాలనైన, శూరభార్యామ్=శూరుని భార్యనైన, మామ్=నన్ను, పశ్య=చూడుము.

తా. బుద్ధిమంతు డెవ్వడూ తన కుమార్తెను శూరునకు ఇవ్వకూడదు. శూరుని భార్యనైన నేను హఠాత్తుగా వైధవ్యమును పొంది ఎట్లు దౌర్భాగ్యవంతురాల నైతినో చూడుము. 8

మూ. అవభగ్నశ్చ మే మానో భగ్నా మే శాశ్వతీ గతిః, 9
అగాధే చ నిమగ్నాస్మి విపులే శోకసాగరే.

ప్ర. అ. మే= నాయొక్క, మానః =అహంకారము, (గౌరవము), అవభగ్నశ్చ =భగ్నమైనది. మే =నాయొక్క, శాశ్వతీ =శాశ్వతమైన, గతిః =గతి, భగ్నా =భగ్నమైనది. అగాధే =అగాధమైన, విపులే =విశాలమైన, శోకసాగరే =శోకసముద్రమునందు, నిమగ్నా =మునిగినదానను, అస్మి =అయి ఉన్నాను.

తా. నా మానము భగ్న మైపోయినది. నా శాశ్వత మైన గతి నిరుద్ధమైనది. నేను ఇపుడు చాల లోతైన విశాలమైన శోకసముద్రములో మునిగి ఉన్నాను. 9

మూ. అశ్మసారమయం నూనమిదం మే హృదయం దృఢమ్, 10
భర్తారం నిహతం దృష్ట్వా యన్నాద్య శతధా కృతమ్.

ప్ర. అ. నిహతమ్ =చంపబడిన, భర్తారమ్ =భర్తను, దృష్ట్వా = చూచి, యత్ =ఏది, అద్య =ఇప్పుడు, శతధా =నూరు ముక్కలుగా, న కృతమ్ = చేయబడలేదో అట్టి, మే =నాయొక్క, దృఢమ్ = దృఢమైన, ఇదం హృదయమ్ =

ఈ హృదయము, అశ్మసారమయమ్ = లోహవికారమైనది. నూనమ్ =నిశ్చయము.

తా. దృఢమైన ఈ నా హృదయము లోహముతో చేయబడినది నిజము. అందుచేతనే యిది మరణించి యున్న భర్తను చూచిన తరువాత కూడ నూరు ముక్కలుగా బ్రద్దలై పోలేదు. 10

మూ. సుహృచ్చైవ చ భర్తా చ ప్రకృత్యా చ మమ ప్రియః,
ప్రహారే చ పరాక్రాన్తః శూరః పఞ్చత్వమాగతః. 11

ప్ర. అ. మమ =నాకు, ప్రకృత్యా = స్వభావముచేత, ప్రియః = ప్రియుడవు, సుహృచ్చైవ = మంచి హృదయము కలవాడవు, భర్తా చ =భర్తవు, ప్రహారే = యుద్ధమునందు, పరాక్రాన్తః = పరాక్రమవంతుడవైన, శూరః =శూరుడవు అయిన నీవు, పఞ్చత్వమ్ = మరణమును, ఆగతః = పొందినావు.

తా. నీవు నా భర్తవు. మంచి హృదయము గలవాడవు. స్వభావముచేతనే ప్రియుడవు. యుద్ధములలో పరాక్రమమును చూపించు శూరుడవు. అట్టి నీవు మరణమును పొందినావు. 11

మూ. పతిహీనా తు యా నారీ కామం భవతు పుత్రిణీ,
ధనధాన్యసమృద్ధాఽపి విధవేత్యుచ్యతే బుధైః. 12

ప్ర. అ. యా నారీ =ఏ స్త్రీ, పతిహీనా = భర్త లేనిదో ఆమె , పుత్రిణీ = పుత్రవంతురాలు, భవతు కామమ్ = అయిఉండు గాక! ధనధాన్యసమృద్ధాఽపి = ధనధాన్యములతో సమృద్ధురా లైనా, బుధైః = పండితులచే, విధవేతి = విధవ యని, ఉచ్యతే =చెప్పబడును.

తా. భర్త లేని స్త్రీ ఎంత మంది పుత్రు లున్నను, ధనధాన్యసమృద్ధి కలది యైనను ఆమెను పండితులు విధవ యనియే అందురు. 12

మూ. స్వగాత్రప్రభవే వీర శేషే రుధిరమణ్డలే,
కృమిరాగపరిస్తోమే స్వకీయే శయనే యథా. 13

ప్ర. అ. వీర!= ఓ వీరుడా! స్వగాత్రప్రభవే = నీ గాత్రమునుండి పుట్టిన, రుధిరమణ్డలే = రక్తమండలము మీద, కృమిరాగపరిస్తోమే = ఇంద్రగోపకృమి యొక్క రంగు వంటి రంగు గల ఆస్తరణము గల, స్వకీయే = నీ సంబంధమైన, శయనే యథా = శయనముమీద వలె, శేషే =శయనించి యున్నావు.

తా. ఓ వీరుడా! నీ శరీరమునుండి స్రవించిన రక్తమండలముమీద, ఇంద్రగోపమను కృమి వలె ఎఱ్ఱ నైన ఆస్తరణము గల నీ శయనము మీద శయనించి నట్లు శయనించి యున్నావు. 13

మూ. రేణుశోణితసంవీతం గాత్రం తవ సమన్తతః,
పరిరబ్ధుం న శక్నోమి భుజాభ్యాం ప్లవగర్షభ! 14

ప్ర. అ. ప్లవగర్షభ =ఓ వానరశ్రేష్ఠుడా! సమన్తతః = నలు వైపుల, రేణుశోణితసంవీతమ్ = పరాగముచేత, రక్తము చేత కప్పబడిన, తవ గాత్రమ్ = నీ శరీరమును, భుజాభ్యామ్ = భుజములతో, పరిరబ్ధుమ్ = కౌగలించుకొనుటకు, న శక్నోమి = సమర్థురాలను కాను.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! నీ శరీర మంతా పరాగముతోను రక్తముతోను కప్పబడియున్నది. దీనిని నా భుజములతో కౌగలించుకొనలేక పోవుచున్నాను. 14

మూ. కృతకృత్యోఽద్య సుగ్రీవో వైరేఽస్మిన్నతిదారుణే,
యస్య రామవిముక్తేన హృతమేకేషుణా భయమ్. 15

ప్ర.అ. అతిదారుణే = చాల భయంకర మైన, అస్మిన్ వైరే = ఈ వైరమునందు, సుగ్రీవః =సుగ్రీవుడు, అద్య = ఇప్పుడు, కృతకృత్యః = కృతకృత్యుడైనాడు; యస్య = ఎవనియొక్క, భయమ్ = భయము, రామవిముక్తేన = రామునిచే విడవబడిన, ఏకేషుణా = ఒక బాణముచేత, హృతమ్ = హరింపబడినదో.

తా. అతి భయంకరమైన ఈ వైరములో సుగ్రీవు డిప్పుడు కృతకృత్యు డైనాడు. ఎందుచేత ననగా రాముడు విడచిన ఒక్క బాణము ఆతని భయమును తొలగించినది. 15

మూ. శరేణ హృది లగ్నేన గాత్రసంస్పర్శనే తవ,
వార్యామి త్వాం నిరీక్షన్తీ త్వయి పఞ్చత్వమాగతే. 16

ప్ర. అ. త్వయి = నీవు, పఞ్చత్వమ్ = మరణమును, ఆగతే = పొందిన వాడవగుచుండగా, త్వామ్ =నిన్ను, నిరీక్షన్తీ = చూచుచున్న నేను, తవ = నీయొక్క, హృది =హృదయమునందు, లగ్నేన = లగ్నమైన, శరేణ = బాణముచేత, గాత్రసంస్పర్శనే = శరీరమును స్పృశించుటయందు, వార్యామి = నివారింపబడు చున్నాను.

తా. మరణించిన నిన్ను చూచుచున్న నేను నీ హృదయమునందు బాణము గ్రుచ్చుకొని యుండుటచే నీ శరీరమును స్పృశించలే కున్నాను. 16

మూ. ఉద్బబర్హ శరం నీలస్తస్య గాత్రగతం తదా,
గిరిగహ్వరసంలీనం దీప్తమాశీవిషం యథా. 17

ప్ర. అ. తదా =అపుడు, నీలః = నీలుడు, తస్య =ఆతనియొక్క, గాత్రగతమ్= శరీరములో ఉన్న, శరమ్ =బాణమును, గిరిగహ్వరసంలీనమ్ =

పర్వతగుహయందు అణిగిన, దీప్తమ్= ప్రకాశించుచున్న, ఆశీవిషం యథా = సర్పమును వలె, ఉద్వబర్హ = పైకిలాగెను.

తా. అపుడు నీలుడు వాలి శరీరములో ఉన్న ఆ బాణమును పర్వత గుహలో అణిగియున్న ప్రకాశించుచున్న సర్పమును వలె పైకి లాగెను. 17

మూ. తస్య నిష్కృష్యమాణస్య బాణస్యాపి బభౌ ద్యుతిః,
అస్తమస్తకసంరుద్ధో రశ్మిర్దినకరాదివ. 18

ప్ర. అ. నిష్కృష్యమాణస్య =పైకి లాగబడుచున్న, తస్య =ఆ, బాణస్య = బాణముయొక్క, ద్యుతిః =కాంతి, దినకరాత్ =సూర్యుని నుండి లాగబడుచున్న, అస్తమస్తకసంరుద్ధః = అస్తాద్రి శిఖరమునందు నిరుద్ధమైన, రశ్మిః ఇవ =కిరణము వలె , బభౌ = ప్రకాశించెను.

తా. వాలి శరీరమునుండి లాగబడుచున్న ఆ బాణము అస్తాద్రిశిఖరమునందు నిరుద్ధమై సూర్యుని నుండి పైకి లాగబడుచున్న కిరణము వలె ప్రకాశించెను. 18

మూ. పేతుః క్షతజధారాస్తు వ్రణేభ్యస్తస్య సర్వశః,
తామ్రగైరికసమ్పృక్తా ధారా ఇవ ధరాధరాత్. 19

ప్ర.అ. తస్య = అతనియొక్క , వ్రణేభ్యః = గాయములనుండి, క్షతజ ధారాః =రక్తధారలు, ధరాధరాత్ = పర్వతమునుండి, తామ్రగైరికసమ్పృక్తాః =ఎఱ్ఱని గైరికధాతువులతో కలిసిన, ధారాః ఇవ = జలధారలు వలె, సర్వశః =అన్ని వైపుల, పేతుః =పడినవి.

తా. ఆ వాలి గాయములనుండి రక్తధారలు పర్వతమునుండి ఎఱ్ఱవి గైరిక ధాతువులతో కలసిన జలధారల వలె అన్ని వైపుల పడెను. 19

మూ. అవకీర్ణం విమార్జన్తీ భర్తారం రణరేణునా,
అస్రైర్నయనజైః శూరం సిషేచాస్త్రసమాహతమ్. 20

ప్ర. అ.రణరేణునా= యుద్ధపరాగముచేత, అవకీర్ణమ్ = వ్యాపింపబడిన, భర్తారమ్ = భర్తను, విమార్జన్తీ = తుడుచుచున్నదై, అస్త్రసమాహతమ్ =అస్త్రముచేత కొట్టబడిన , శూరమ్ = ఆ శూరుణ్ణి, నయనజైః =నేత్రముల నుండి పుట్టిన, అస్రైః = కన్నీళ్లతో, సిషేచ = తడిపెను.

తా. ఆ తార రణభూమిపరాగముచే కప్పబడిన ఆ భర్త శరీరమును తుడుచుచు బాణముచే చంపబడిన ఆ శూరుని కన్నీళ్లతో తడిపెను. 20

మూ. రుధిరోక్షితసర్వాఙ్గం దృష్ట్వా వినిహతం పతిమ్,
ఉవాచ తారా పిఙ్గాక్షం పుత్రమఙ్గదమఙ్గనా. 21

ప్ర. అ. అఙ్గనా = వాలియొక్క స్త్రీయైన, తారా = తార, వినిహతమ్ =

చంపబడిన, రుధిరోక్షితసర్వాఙ్గమ్ = రక్తముచేత తడపబడిన సమస్త దేహముగల, పతిమ్ = భర్తను, దృష్ట్వా = చూచి, పుత్రమ్ = పుత్రుడైన, పిఙ్గాక్షమ్ =పచ్చని నేత్రములు గల, అఙ్గదమ్ = అంగదుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. వాలి, భార్యయైన తార రక్తముతో తడిసిన దేహముతో మరణించి పడియున్న భర్తను చూచి కుమారుడైన అంగదునితో ఇట్లు పలికెను. 21

మూ. అవస్థాం పశ్చిమాం పశ్య పితుః పుత్ర సుదారుణామ్,
ప్రసక్తస్య వైరస్య గతోఽన్తః పాపకర్మణామ్. 22

ప్ర.అ. పుత్ర!= ఓ పుత్రుడా! పితుః =తండ్రియొక్క, సుదారుణామ్ = చాల దారుణమైన, పశ్చిమామ్ = చివరిదైన, అవస్థామ్ = అవస్థను, పశ్య =చూడుము. పాపకర్మణా = పాపకర్మ చేత, సంప్రసక్తస్య = ఏర్పడిన, వైరస్య = వైరముయొక్క, అన్తః = అంతము, గతః = పొందబడినది.

తా. ఓ కుమారుడా! చాల దారుణమైన నీ తండ్రి అంత్యావస్థను చూడుము. పూర్వజన్మకృతమైన పాపముచే ఏర్పడిన వైరము ఇపుడు అంత మైనది.

మూ. బాలసూర్యోజ్జ్వలతనుం ప్రయాతం యమసాదనమ్,
అభివాదయ రాజానం పితరం పుత్ర మానదమ్. 23

ప్ర. అ. పుత్ర! = ఓ పుత్రుడా! బాలసూర్యోజ్జ్వలతనుమ్ = బాలసూర్యుడి వలె ప్రకాశించుచున్న శరీరము కలవాడు, యమసాదనమ్ = యమలోకమును గూర్చి, ప్రయాతమ్ = వెళ్ళినవాడు, రాజానమ్ = రాజు, మానదమ్ =గౌరవమును రక్షించువాడు అయిన , పితరమ్ = తండ్రిని, అభివాదయ = నమస్కరించుము.

తా. ఓ పుత్రుడా! బాలసూర్యుని వలె ప్రకాశించుచున్న శరీరము కలవాడు, రాజు, గౌరవమును రక్షించువాడు అయిన మరణించిన నీ తండ్రికి నమస్కారము చేయుము. 23

మూ. ఏవముక్తః సముత్థాయ జగ్రాహ చరణౌ పితుః ,
భుజాభ్యాం పీనవృత్తాభ్యామఙ్గదోఽ హమితి బ్రువన్. 24

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, ఉక్తః=పలుకబడిన ఆ అంగదుడు, సముత్థాయ=లేచి, అహమ్=నేను, అఙ్గదః=అంగదుడను, ఇతి= అని, బ్రువన్=పలుకుచు, పీనవృత్తాభ్యామ్=బలిసి గుండ్రముగా ఉన్న, భుజాభ్యామ్=భుజములతో, పితుః=తండ్రియొక్క, చరణౌ=పాదములను, జగ్రాహ=గ్రహించెను.

తా. అంగదుడు ఆ మాటలు విని లేచి నేను అంగదుడను; నమస్కరించుచున్నాను అని పలుకుచు బలిసి గుండ్రముగా ఉన్న భుజములతో తండ్రి పాదములు పట్టుకొనెను. 24

మూ. అభివాదయమానం త్వా మఙ్గదం త్వం యథా పురా,
దీర్ఘాయుర్భవ పుత్రేతి కిమర్థం నాభిభాషసే. 25

ప్ర. అ. త్వామ్=నిన్ను, అభివాదయమానమ్=నమస్కరించుచున్న, అఙ్గదమ్=అంగదుని, త్వమ్=నీవు, పుత్ర!=కుమారుడా! దీర్ఘాయుః=దీర్ఘాయుర్దాయవంతుడవు, భవ=అగుము. ఇతి=అని, కిమర్థం= ఎందుకు, యథా పురా=పూర్వమునందువలె, నాభిభాషసే=పలుకుట లేదు. (తార ఇట్లు పలికెను.)

తా. నీకు నమస్కరించుచున్న అంగదుని 'పుత్రుడా! దీర్ఘాయుర్దాయవంతుడవు కమ్ము.' అని పూర్వమునందు వలె ఎందుచేత ఆశీర్వదించుట లేదు? 25

మూ. అహం పుత్రసహాయా త్వాముపాసే గతచేతనమ్,
సింహేన పాతితం సద్యో గౌః సవత్సేవ గోవృషమ్. 26

ప్ర. అ. సద్యః=అపుడే, సింహేన=సింహముచేత, పాతితమ్= పడగొట్టబడిన, గోవృషమ్=వృషభమును, సవత్సా=లేగదూడతో కూడిన, గౌః ఇవ=ఆవు వలె, పుత్రసహాయా=పుత్రుడుసహాయుడుగా గల, అహమ్= నేను, గతచేతనమ్=పోయిన చైతన్యము గల, త్వామ్=, నిన్ను (నీకు) ఉపాసే=దగ్గర కూర్చొని యున్నాను.

తా. అపుడే సింహముచే పడగొట్టబడిన ఆబోతు సమీపమున లేగదూడతో గూడిన ఆవు ఉన్నట్లు పుత్రునితో కూడ నేను మరణించియున్న నీ సమీపమున కూర్చొని యున్నాను. 26

మూ. ఇష్ట్వా సఙ్గ్రామయజ్ఞేన రామప్రహరణామ్భసా,
తస్మిన్నవభృథే స్నాతః కథం పత్న్యా మయా వినా. 27

ప్ర. అ. సఙ్గ్రామయజ్ఞేన ఇష్ట్వా=యుద్ధ మనే యజ్ఞము చేసి, పత్న్యా= భార్యనైన, మయా వినా=నేను లేకుండగా, రామప్రహరణామ్భసా=రాముని ఆయుధ మనే ఉదకముతో, తస్మిన్=ఆ, అవభృథే=అవభృథమునందు, కథమ్= ఎట్లు, స్నాతః=స్నానము చేసినావు?

తా. యుద్ధ మనే యజ్ఞము చేసి నీవు భార్య నైన నేను లేకుండగా రాముని ఆయుధ మనే ఉదకముతో అవభృథస్నానము (యజ్ఞము పూర్తియైన తరువాత చేసే స్నానము) ఎట్లు చేసినావు? 27

మూ. యా దత్తా దేవరాజేన తవ తుష్టేన సంయుగే,
శాతకౌమ్భీం ప్రియాం మాలాం తాం తే పశ్యామి నేహ కిమ్. 28

ప్ర. అ.సంయుగే=యుద్ధమునందు, తుష్టేన=సంతోషించిన, దేవరాజేన= దేవేంద్రునిచేత, యా=ఏది, తవ=నీకు, దత్తా=ఇవ్వబడినదో, తామ్=అట్టి, శాతకౌ

మ్మీమ్=బంగారము వికారమైన, తే ప్రియామ్=నీకు ఇష్టమైన, మాలామ్=మాలను, ఇహ=ఇక్కడ, కిమ్=ఎందువలన, న పశ్యామి= చూచుటలేదు?

తా. యుద్ధములో సంతోషించి దేవేంద్రుడు నీ కిచ్చిన నీకు చాలా ప్రియమైన ఆ బంగారు మాల ఇక్కడ కనబడుట లేదేమి? 28

మూ. రాజ్యశ్రీర్న జహాతి త్వాం గతాసుమపి మానద,
సూర్యస్యావర్తమానస్య శైలరాజమివ ప్రభా. 29

ప్ర. అ. మానద=గౌరవము ఇచ్చువాడా! శైలరాజమ్=మేరుపర్వతమును, ఆవర్తమానస్య=ప్రదక్షణము చేయుచున్న, సూర్యస్య=సూర్యనియొక్క, ప్రభా ఇవ=కాంతి వలె, రాజ్యశ్రీః=రాజ్యశోభ, గతాసుమ్ అపి= మరణించినవాడవైనను, త్వామ్=నిన్ను, న జహాతి=విడుచుటలేదు.

తా. గౌరవమును సంరక్షించువాడా! మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయు సూర్యుని ఆతని కాంతి విడువ నట్లు నీవు మరణించినను రాజ్యలక్ష్మి నిన్ను విడుచుటలేదు. 29

మూ. న మే వచః పథ్యమిదం త్వయా కృతం
న చాస్మి శక్తా హి నివారణే తవ,
హతా సపుత్రాఽస్మి హతేన సంయుగే
సహ త్వయా శ్రీర్విజహాతి మామపి. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రయోవింశః సర్గః.

ప్ర. అ. త్వయా=నీచేత, మే=నాయొక్క, పథ్యమ్=హితమైన, ఇదం వచః=ఈ వచనము, న కృతమ్=చేయబడలేదు. తవ= నీయొక్క, నివారణే=నివారణమునందు, శక్తా=సమర్థురాలను, న అస్మి చ హి=కాలేకపోతిని గదా!సంయుగే=యుద్ధమునందు, హతేన=చంపబడిన నీచేత, సపుత్రా=పుత్రునితో కూడిన నేను కూడ, హతాస్మి= చంపబడితిని, శ్రీః=లక్ష్మి, త్వయా సహ=నీతో కూడ, మామపి=నన్ను కూడ, విజహాతి=విడిచిపెట్టుచున్నది.

తా. నేను చెప్పిన హితమైన మాటలను నీవు వినలేదు. నేను అపుడు నిన్ను నివారింపజాలక పోయితిని. యుద్ధములో నీవు చంపబడుటచే పుత్రునితో సహ నేను కూడ చంపబడినదానైతిని. నీతోపాటు నన్ను కూడ లక్ష్మి విడిచిపెట్టివేయుచున్నది. 30

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఇరువది మూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్వింశః సర్గః

[శోకపీడితుడైన సుగ్రీవుడు ప్రాణములు విడుచుటకు రాముని అనుమతిని కోరుట. నన్ను కూడ చంపివేయ మని తార రాముని ప్రార్థించుట. రాముడు ఆమెకు బోధించుట.]

మూ. తామాశు వేగేన దురాసదేన
త్వభిప్లుతాం శోకమహార్ణవేన,
పశ్యంస్తదా వాల్యనుజస్తరస్వీ
భ్రాతుర్వధేనాప్రతిమేన తేపే. 1

ప్ర.అ.దురాసదేన = సహింప శక్యము గాని, శోకమహార్ణవేన=శోకమహా సముద్రముచే, వేగేన = వేగముతో, ఆశు= శీఘ్రముగా , అభిప్లుతామ్ = ముంచివేయబడిన, తామ్ =ఆమెను, పశ్యన్ = చూచుచు, తదా =అపుడు, తరస్వీ = బలవంతుడైన, వాల్యనుజః =వాలియొక్క తమ్ముడు, అప్రతిమేన = సాటి లేని , భ్రాతుః వధేన =సోదరుని వధచేత, తేపే =దుఃఖించెను.

తా. సహింప శక్యము గాని మహావేగము గల దుఃఖసముద్రములో మునిగిన ఆ తారను చూచి బలశాలియైన సుగ్రీవుడు సాటి లేని సోదరవధకు చాల దుఃఖించెను. 1

మూ. స బాష్పపూర్ణేన ముఖేన పశ్యన్
క్షణేన నిర్విణ్ణమనా మనస్వీ,
జగామ రామస్య శనైస్సమీపం
భృత్యైర్వృతః సంపరిదూయమానః. 2

ప్ర. అ. బాష్పపూర్ణేన = కన్నీటితో నిండిన, ముఖేన =ముఖముతో, క్షణేన = క్షణకాలము, పశ్యన్ = చూచుచున్నవాడై, నిర్విణ్ణమనాః = దుఃఖమును పొందిన మనస్సు గల, మనస్వీ = ఉత్తమ మైన మనస్సు గల, సః = ఆ సుగ్రీవుడు, సంపరిదూయమానః = దుఃఖించుచు, భృత్యైః = భృత్యులతో, వృతః = కూడిన వాడై, శనైః =మెల్లగా, రామస్య = రామునియొక్క, సమీపమ్ = సమీపమును, జగామ = వెళ్లెను.

తా. ఉత్తమమైన మనస్సు గల ఆ సుగ్రీవుడు కన్నీటితో నిండిన ముఖముతో క్షణకాలము చూచి, మనస్సు దిగులు చెందగా, దుఃఖించుచు భృత్యులతో కలిసి మెల్లగా రామునివద్దకు వెళ్లెను. 2

మూ. స తం సమాసాద్య గృహీతచాప
ముదాత్తమాశీవిషతుల్యబాణమ్,
యశస్వినం లక్షణలక్షితాఙ్గ
మవస్థితం రాఘవ మిత్యువాచ. 3

ప్ర. అ. సః = అతడు, గృహీతచాపమ్ = గ్రహింపబడిన ధనుస్సు గలవాడు, ఉదాత్తమ్ = ఉత్తముడు, ఆశీవిషతుల్యబాణమ్ = సర్పములతో సమానమైన బాణములు గలవాడు, యశస్వినమ్ = కీర్తి గలవాడు, లక్షణలక్షితాఙ్గమ్ = ఉత్తమలక్షణములతో కూడిన శరీరము కలవాడు, అవస్థితమ్ =అక్కడ నిలిచి ఉన్నవాడు అయిన, తం రాఘవమ్ =ఆ రాముణ్ణి , సమాసాద్య = సమీపించి, ఇతి =ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. చాల ఉదాత్తుడైన రాముడు ధనుస్సును, సర్పములతో సమానములైన బాణములను ధరించి నిలిచి యుండెను. యశశ్శాలి, ఉత్తమలక్షణములతో కూడిన శరీరముగలవాడు అయిన ఆ రాముని సమీపించి సుగ్రీవు డిట్లు పలికెను. 3

మూ. యథా ప్రతిజ్ఞాతమిదం నరేన్ద్ర
కృతం త్వయా దృష్టఫలం చ కర్మ,
మమాద్య భోగేషు నరేన్ద్రసూనో
మనో నివృత్తం హతజీవితేన. 4

ప్ర. అ. నరేన్ద్ర! = ఓ రాజా! త్వయా = నీచేత, యథా =ఎట్లు, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినదో అట్లు, ఇదమ్ = ఈ, దృష్టఫలమ్ = చూడబడిన ఫలము గల, కర్మ = పని, కృతమ్ =చేయబడినది. నరేన్ద్రసూనో = ఓ రాజకుమారా! హతజీవితేన = కొట్టబడిన జీవితముచేత, అద్య = ఇపుడు, మమ=నాయొక్క, మనః = మనస్సు, భోగేషు = భోగములయందు, నివృత్తమ్ = మరలినది.

తా. ఓ రాజా! నీవు ప్రతిజ్ఞ చేసిన విధముగా ఫలము ప్రత్యక్షముగా కనబడునట్లు చేయవలసిన పని చేసితివి. కాని నా జీవితము భగ్నమై పోవుటచే ఇపుడు నా మనస్సు భోగములనుండి మరలిపోయినది. 4

మూ. అస్యాం మహిష్యాం తు భృశం రుదత్యాం
పురేఽతి విక్రోశతి దుఃఖతప్తే,
హతే నృపే సంశయితేఽఙ్గదే చ
న రామ రాజ్యే రమతే మనో మే. 5

ప్ర. అ. రామ! =ఓ రామా! అస్యామ్ = ఈ, మహిష్యామ్ = పట్టపురాణి, భృశమ్ = మిక్కిలి, రుదత్యామ్ = ఏడ్చుచుండగా, దుఃఖతప్తే

=దుఃఖముచే పీడింపబడిన, పురే = పట్టణము, అతివిక్రోశతి = ఎక్కువగా ఏడ్చుచుండగా, నృపే = రాజు, హతే =చంపబడినవా డగుచుండగా, అఙ్గదే చ =అంగదుడు, సంశయితే = సంశయింపదగిన స్థితిలో ఉండగా, మే = నాయొక్క, మనః =మనస్సు, రాజ్యే = రాజ్యమునందు, న రమతే = ఆనందించుటలేదు.

తా. ఓ రామా! రాజైన వాలి మరణించినాడు. పట్టపురాణియైన ఈ తార ఎక్కువగా ఏడ్చుచున్నది. నగరమంతా దుఃఖముచేత పీడింపబడి అధికముగా ఏడ్చుచున్నది. అంగదుని స్థితి సంశయాస్పదముగా నున్నది. అందుచేత నా మనస్సునకు రాజ్యము మీద ఆసక్తి లేదు. 5

మూ. క్రోధాదమర్షాదతివిప్రధర్షా
ద్భ్రాతుర్వధో మేఽనుమతః పురస్తాత్,
హతే త్విదానీం హరియూథపేఽస్మిన్
సుతీక్ష్ణమిక్ష్వాకువర ప్రతప్స్యే. 6

ప్ర.అ. పురస్తాత్ = ముందుగా, క్రోధాత్ = కోపమువలన, అమర్షాత్ = సహించకపోవుటవలన, అతివిప్రధర్షాత్ = అధికమైన అవమానమువలన, భ్రాతుః = సోదరునియొక్క, వధః = వధ, మే = నాకు, అనుమతః = ఇష్టమైనది. ఇక్ష్వాకువర = ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడా! ఇదానీమ్ =ఇపుడు, అస్మిన్ = ఈ, హరియూథపే =వానరనాయకుడు, హతే = చంపబడినవా డగుచుండగా, సుతీక్ష్ణమ్= అత్యధికముగా , ప్రతప్స్యే = దుఃఖము పొందగలను.

తా. రామా! పూర్వము ఇతడు నన్ను ఎక్కువ అవమానించుటచే కలిగిన కోపమువలనను, అమర్షమువలనను ఈ నా సోదరుని చంపవలె నని కోరుకొంటిని. కాని ఇపుడు ఈ వానరనాయకుడు మరణించిన పిమ్మట చాల దుఃఖించుచున్నాను. 6

మూ. శ్రేయోఽద్య మన్యే మమ శైలముఖ్యే
తస్మిన్ హి వాసశ్చిరమృష్యమూకే,
యథా తథా వర్తయతః స్వవృత్త్యా
నేమం నిహత్య త్రిదివస్య లాభః. 7

ప్ర. అ. అద్య =ఇపుడు, స్వవృత్త్యా = నా వృత్తిచేత, యథా తథా = ఏదో విధముగా, వర్తయతః = జీవనము గడుపుచున్న, మమ = నాకు, తస్మిన్ = ఆ, శైలముఖ్యే = పర్వతశ్రేష్ఠమైన, ఋష్యమూకే = ఋష్యమూక పర్వతమునందు, చిరమ్ = చిరకాలము, వాసః =నివాసము, శ్రేయః = మంచిది అని, మన్యే =తలచుచున్నాను. ఇమమ్ = ఈతనిని, నిహత్య = చంపి, త్రిదివస్య = స్వర్గముయొక్క, లాభః =లాభముకూడ, న= మంచిది కాదు.

తా. ఏదో విధముగా జీవనము గడుపుచు పర్వతములలో శ్రేష్ఠమైన ఈ ఋష్యమూకపర్వతమునందు నివసించుటయే మంచిదని ఇపుడు నే ననుకొనుచున్నాను. ఈతనిని చంపి స్వర్గములో నివసించుట కూడ మంచిది కాదు. 7

మూ. న త్వా జిఘాంసామి చరేతి యన్మా
మయం మహాత్మా మతిమానువాచ,
తస్యైవ తద్రామ వచోఽనురూప
మిదం వచః కర్మ చ మే ఽనురూపమ్. 8

ప్ర. అ. రామ! =ఓ రామా! మహాత్మా =మహాత్ముడు, మతిమాన్ = బుద్ధిమంతుడు అయిన, అయమ్ = ఈ వాలి, త్వా =నిన్ను, న జిఘాంసామి = చంప నిచ్ఛయించను, చర = స్వేచ్ఛగా తిరుగుము, ఇతి = అని, యత్ =ఏ వాక్యమును, మామ్ = నన్ను గూర్చి, ఉవాచ = పలికెనో, తత్ వచః =ఆ వచనము, తస్యైవ =అతనికే, అనురూపమ్=తగినది. ఇదమ్=ఈ, వచః =వచనము, కర్మ చ = పని, మే= నాకు, అనురూపమ్ = తగినది.

తా. రామా! మహాత్ముడు, బుద్ధిమంతుడు అయిన ఆ వాలి "నిన్ను చంపవలె నని నాకు కోరిక లేదు; స్వేచ్ఛగా తిరుగుము" అని నాతో పలికి విడిచిపెట్టెడివాడు. అట్లు పలుకుట అతనికే తగి యుండెను. ఇట్లు మాటలాడుట ఈ విధముగా చేయుట నాకు తగి ఉన్నది. 8

మూ. భ్రాతా కథం నామ మహాగుణస్య
భ్రాతుర్వధం రామ విరోచయేత,
రాజ్యస్య దుఃఖస్య చ వీర సారం
విచిన్తయన్ కామపురస్కృతోఽపి. 9

ప్ర. అ. రామ! = ఓ రామా! వీర! =ఓ వీరుడా! కామపురస్కృతోఽపి =కామముచేత పురస్కృతుడైనను, (కోరికతో కూడినవాడైనను), భ్రాతా = సోదరుడు, రాజ్యస్య = రాజ్యముయొక్క, దుఃఖస్య చ = దుఃఖముయొక్క, సారమ్ = సారమును, విచిన్తయన్=ఆలోచించుచు, మహాగుణస్య=గొప్ప గుణములు గల, భ్రాతుః =సోదరునియొక్క, వధమ్ =వధను, కథమ్ నామ =ఎట్లు, విరోచయేత =ఇష్టపడును?

తా. మహావీరుడ వైన రామా! రాజ్యాదులందు ఎంత కోరిక ఉన్న వాడైనను, సోదరుడు రాజ్యమునకు , తరువాత కలుగు దుఃఖమునకు ఉన్న బలా బలములను తెలిసికొన్నచో గొప్ప గుణములు గల సోదరుని వధకు ఇష్టపడునా!

మూ. వధో హి మే మతో నాసీత్స్వమాహాత్మ్యావ్యతిక్రమాత్,
మమాసీద్బుద్ధిదౌరాత్మ్యాత్ ప్రాణహారీ వ్యతిక్రమః. 10

ప్ర. అ. స్వమాహాత్మ్యావ్యతిక్రమాత్ =తన మాహాత్మ్యమును అతిక్రమించ కపోవుటవలన, మే వధః =నా వధ, మతః = ఆతనికి ఇష్టమైనది, నాసీత్ = కాలేదు. మమ =నాయొక్క, బుద్ధిదౌరాత్మ్యాత్ = బుద్ధియొక్క చెడ్డతనమువలన, ప్రాణహారీ =ప్రాణములను హరించు, వ్యతిక్రమః = మర్యాదోల్లంఘనము, ఆసీత్ =అయినది.

తా. వాలి తన మాహాత్మ్యమునకు అనుగుణముగా నన్ను చంపుటకు ఇష్టపడలేదు. కాని నేను నా బుద్ధి వికటించుటవలన అతని ప్రాణములను తీసి మర్యాదను అతిక్రమించితిని. 10

మూ. ద్రుమశాఖావభగ్నోఽహం ముహూర్తం పరినిష్టనన్,
సాన్త్వయిత్వా త్వనేనోక్తో న పునః కర్తుమర్హసి. 11

ప్ర. అ. ద్రుమశాఖావభగ్నః =వృక్షశాఖచేత కొట్టబడిన, ముహూర్తమ్ = క్షణకాలము, పరినిష్టనన్ = అరుచుచున్న,అహమ్ =నేను, అనేన =ఇతనిచేత, సాన్త్వయిత్వా =ఓదార్చి, పునః=మరల, కర్తుమ్ =ఇట్లు చేయుటకు, న అర్హసి = తగవు అని, ఉక్తః =పలుకబడితిని.

తా. వాలి నన్ను చెట్టుకొమ్మతో కొట్టినపుడు నేను దీనముగా అరచుచుండగా అతడు నన్ను ఓదార్చి "మరల ఎన్నడు ఇట్లు చేయకుము" అని అనుచుండెడివాడు.

మూ. భ్రాతృత్వమార్యభావశ్చ ధర్మశ్చానేన రక్షితః,
మయా క్రోధశ్చ కామశ్చ కపిత్వం చ ప్రదర్శితమ్. 12

ప్ర. అ. అనేన = ఇతనిచేత, భ్రాతృత్వమ్ = సోదరత్వము, ఆర్యభావశ్చ =పూజ్యత్వము, ధర్మశ్చ =ధర్మము, రక్షితః =రక్షింపబడినది. మయా =నాచేత, క్రోధశ్చ =కోపము, కామశ్చ =కామము, కపిత్వం చ =వానరత్వము, ప్రదర్శితమ్ =చూపబడినది.

తా. వాలి సోదరత్వమును, పూజ్యత్వమును, ధర్మమును రక్షించినాడు; కాని నేను క్రోధమును, కామమును, వానరస్వభావమును చూపించినాను. 12

మూ. అచిన్తనీయం పరివర్జనీయ
మనీప్సనీయం స్వనవేక్షణీయమ్,
ప్రాప్తోఽస్మి పాప్మానమిమం వయస్య
భ్రాతుర్వధాత్త్వాష్ట్రవధాదివేన్ద్రః. 13

ప్ర. అ. వయస్య =ఓ మిత్రుడా! భ్రాతుః =సోదరునియొక్క, వధాత్

=వధవలన, త్వాష్ట్రవధాత్ =త్వష్ట కుమారుడైన విశ్వరూపుని వధవలన, ఇన్ద్రః ఇవ=ఇంద్రుడు వలె, అచిన్తనీయమ్ = ఊహింప శక్యముగానిది, పరివర్జనీయమ్= విడువ దగినది, అనీప్సనీయమ్ = కోర తగనిది, స్వనవేక్షణీయమ్=ఏమాత్రము చూడదగనిది యైన, ఇమమ్ = ఈ, పాప్మానమ్ =పాపమును, ప్రాప్తః అస్మి =పొందినాను.

తా. ఓ మిత్రుడా! ఈ సోదరుని చంపుటవలన విశ్వరూపుని చంపుటవలన ఇంద్రునకు వలె నాకు ఊహింపశక్యము గానిది, సత్పురుషులచే పరిహరింపదగినది, కోరతగనిది, ఏమాత్రము చూడదగనిది యైన ఈ పాపము వచ్చినది. 13

మూ. పాప్మానమిన్ద్రస్య మహీ జలం చ
వృక్షాశ్చ కామం జగృహుః స్త్రియశ్చ,
కో నామ పాప్మానమిమం సహేత
శాఖామృగస్య ప్రతిపత్తుమిచ్ఛేత్. 14

ప్ర. అ. ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, పాప్మానమ్ = పాపమును, మహీ=భూమియు, జలం చ =జలమును, వృక్షాశ్చ= వృక్షములు, స్త్రియశ్చ =స్త్రీలు, జగృహుః కామమ్=గ్రహించి యుండవచ్చును. శాఖామృగస్య =వానరుడనైన నాయొక్క, ఇమమ్=ఈ, పాప్మానమ్= పాపమును, కో నామ =ఎవడు, సహేత =సహించును. ప్రతిపత్తుమ్ = పొందుటకు, ఇచ్ఛేత్ = ఇచ్ఛయించును.

తా. ఇంద్రుడు విశ్వరూపుని చంపుటవలన కలిగిన బ్రహ్మహత్యాపాపమును భూమి ఊషరక్షేత్ర (చవటిభూమి) రూపములోను, జలము నురుగులోను, వృక్షములు జిగురులోను, స్త్రీలు ఆర్తవములోను గ్రహించి యుండవచ్చును కాని వానరుడ నైన నేను చేసిన ఈ పాపమును స్వీకరించుటకు ఎవరు అంగీకరింతురు? ఎవరు సహించగలరు? 14

మూ. నార్హామి సన్మానమిమం ప్రజానాం
న యౌవరాజ్యం కుత ఏవ రాజ్యమ్,
అధర్మయుక్తం కులనాశయుక్త
మేవంవిధం రాఘవ! కర్మ కృత్వా. 15

ప్ర. అ. రాఘవ! =రామా! అధర్మయుక్తమ్ =అధర్మముతో కూడినది, కులనాశయుక్తమ్ =కులముయొక్క నాశముతో కూడినది యైన, ఏవంవిధమ్ =ఇట్టి, కర్మ =కర్మను, కృత్వా =చేసి, ప్రజానామ్ = ప్రజలయొక్క, ఇమమ్ =ఈ, సన్మానమ్ = గౌరవమును, న అర్హామి = తగను. యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును, న =తగను. రాజ్యమ్ =రాజ్యమును, కుత ఏవ =ఎట్లు?

తా. రామా! అధర్మముతో కూడినది, కులనాశమునకు హేతువు అయిన ఇట్టి పనిని చేసిన నేను ప్రజలనుండి ఇట్టి ఆదరమునకు గాని, యౌవరాజ్యమునకు

గాని తగినవాడను గాను. రాజ్యము మాట చెప్ప పనియే లేదు. 15

మూ. పాపస్య కర్తాఽస్మి విగర్హితస్య
క్షుద్రస్య లోకాపకృతస్య లోకే,
శోకో మహాన్మామభివర్తతేఽయం
వృష్టేర్యథా నిమ్నమివామ్బువేగః. 16

ప్ర. అ. లోకే=లోకమునందు, విగర్హితస్య =నిందింపబడినది, క్షుద్రస్య = నీచము, లోకాపకృతస్య =లోకమునకు అపకారము చేయునది యైన, పాపస్య =పాపమునకు, కర్తా =కర్తను, అస్మి =అయినాను. వృష్టేః =వర్షముయొక్క, అమ్బువేగః ఇవ= జలవేగమువలె, మహాన్ =గొప్పదైన, అయం శోకః =ఈ శోకము, మామ్ =నన్ను, నిమ్నమ్ ఇవ =పల్లమును వలె, అభివర్తతే = ఆవరించుచున్నది.

తా. నేను లోకములో నిందిత మైనది, నీచము,లోకమునకు అపకారము చేయునది యైన మహాపాపమును చేసితిని. వర్షమువల్ల కలిగిన జలవేగము పల్లమునకు ప్రవహించినట్లు గొప్పదైన ఈ శోకము నన్ను ఆవరించుచున్నది. 16

మూ. సోదర్యఘాతాపరగాత్రవాలః
సన్తాపహస్తాక్షిశిరోవిషాణః,
ఏనోమయో మామభిహన్తి హస్తీ
దృప్తో నదీకూలమివ ప్రవృద్ధః. 17

ప్ర. అ. సోదర్యఘాతాపరగాత్రవాలః =సోదరుని చంపుట అను శరీరము యొక్క వెనుకభాగము, వాలము కలది, సన్తాపహస్తాక్షిశిరోవిషాణః = దుఃఖ మనే తొండము,నేత్రములు, శిరస్సు, దంతములు కలది, ఏనోమయః = పాపవికారమైనది, దృప్తః =గర్వించినది, ప్రవృద్ధః =పెరిగినది యైన, హస్తీ=ఏనుగ, మామ్ =నన్ను, నదీకూలమివ = నదీతీరమును వలె, అభిహన్తి=కొట్టుచున్నది.

తా. పాప మనే ఈ గర్వించిన ఏనుగ గొప్ప బలము కలదై నన్ను నదీతీరమును పొడిచి నట్లు పొడుచుచున్నది. సోదరుని చంపుట యనునదియే దీని శరీరము వెనుకటి భాగము, వాలము అయి ఉన్నవి. దుఃఖమే దీని తొండము. నేత్రములు, శిరస్సు, దంతములు. 17

మూ. అంహో బతేదం నృవరావిషహ్యా
నివర్తతే మే హృది సాధువృత్తమ్,
అగ్నౌ వివర్ణం పరితప్యమానం
కిట్టం యథా రాఘవ జాతరూపమ్. 18

ప్ర. అ. నృవర = మానవులలో శ్రేష్ఠుడా! రాఘవ =రామా! మే =నాయొక్క, హృది =హృదయమునందు, సాధువృత్తమ్ = మంచి నడవడిక,

ఇదమ్ =ఈ, అంహః =దోషమును, అవిషహ్యా =సహించక, అగ్నౌ =అగ్నియందు, పరితప్యమానమ్ = కాల్చబడుచున్న, వివర్ణమ్ = చెడ్డ వర్ణము గల, జాతరూపమ్= బంగారము, కిట్టం యథా =మలమును సహించక వలె, నివర్తతే= దూర మగుచున్నది. బత =ఎంత కష్టము.

తా. నరులలో శ్రేష్ఠుడ వైన రామా! పరిశుద్ధము గాని బంగారమును అగ్నిలో కాల్చినపుడు అది ఆ మలమును సహించక దానినుండి వేరు పడినట్లు నా హృదయములో మంచి నడవడిక ఈ పాపమును సహించక దానికి దూర మగుచున్నది. 18

మూ. మహాబలానాం హరియూథపానా
మిదం కులం రాఘవ మన్నిమిత్తమ్,
అస్యాఙ్గదస్యాపి చ శోకతాపా
దర్ధస్థితప్రాణమితీవ మన్యే. 19

ప్ర. అ. రాఘవ! =రామా! మన్నిమిత్తమ్ =నా నిమిత్తమై, అస్య =ఈ, అఙ్గదస్య =అంగదునియొక్క, శోకతాపాత్ చ = శోకతాపమువలనను, మహాబలానామ్ =గొప్ప బలము గల, హరియూథపానామ్ =వానరనాయకుల, ఇదం కులమ్ =ఈ కులము, అర్ధస్థితప్రాణమ్ =సగమే ఉన్న ప్రాణములు కలది, ఇతీవ =అని, మన్యే = తలచుచున్నాను.

తా. రామా! నా మూలముగను, ఈ అంగదుని దుఃఖమును చూచియు మహాబలవంతులైన ఈ వానరనాయకుల సముదాయము సగము ప్రాణముతో మాత్రమే వున్నదని అనుకొనుచున్నాను. 19

మూ. సుతః సులభ్యః సుజనః సువశ్యః
కుతస్తు పుత్రః సదృశోఽఙ్గదేన,
న చాపి విద్యేత స వీరదేశో
యస్మిన్భవేత్సోదరసన్నికర్షః. 20

ప్ర. అ. అఙ్గదేన =అంగదునితో, సదృశః =సమానుడు, సుజనః =ఉత్తమజనుడు, సువశ్యః సుతః =బాగుగా వశములో నుండు కుమారుడు అయిన, పుత్రః = పుత్రుడు, కుతః =ఎట్లు, సులభ్యః=సులభముగా లభించగలడు. వీర! =ఓ వీరుడా! యస్మిన్ =ఏ దేశమునందు, సోదరసన్నికర్షః =సోదరుని సంబంధము, భవేత్ =ఉండునో, సః దేశః చాపి =ఆ దేశము కూడ, న విద్యేత = ఉండదు.

తా. సుజనుడు, వశములో ఉండేవాడు అయిన అంగదుని వంటి కుమారుడు ఎట్లు లభించును? ఓ రామా! సోదరుడు లభించు దేశము కూడ ఎక్కడ కనపడదు. 20

మూ. అద్యాఙ్గదో వీరవరో న జీవే
జ్జీవేత మాతా పరిపాలనార్థమ్,
వినా తు పుత్రం పరితాపదీనా
సా నైవ జీవేదితి నిశ్చితం మే. 21

ప్ర. అ. అద్య = ఇపుడు, వీరవరః =వీరశ్రేష్ఠుడైన, అఙ్గదః =అంగదుడు, న జీవేత్ = జీవించడు. మాతా =తల్లి, పరిపాలనార్థమ్ = పుత్రుని పరిపాలించుటకు, జీవేత =జీవించవచ్చును. పుత్రం వినా తు = పుత్రుడు లేకుండగా, పరితాపదీనా = తాపముచేత దీనురాలై, సా =ఆమె, నైవ జీవేత్ =జీవించదు. ఇతి =అని, మే =నాయొక్క, నిశ్చితమ్ =నిశ్చయము.

తా. వీరశ్రేష్ఠుడైన అంగదుడు ఇటుపైన జీవించడు. తల్లియైన తార ఆతనిని రక్షించుటకై జీవించవచ్చును. కాని పుత్రుడు లేకపోయినచో దుఃఖముతో దీనురాలై ఆమె కూడ జీవించ దని నా నిశ్చయము. 21

మూ. సోఽహం ప్రవేక్ష్యామ్యతిదీప్తమగ్నిం
భ్రాత్రా చ పుత్రేణ చ సఖ్యమిచ్ఛన్,
ఇమే విచేష్యన్తి హరిప్రవీరాః
సీతాం నిదేశే పరివర్తమానాః. 22

ప్ర. అ. సః అహమ్ =అట్టి నేను, భ్రాత్రా చ =సోదరునితోను, పుత్రేణ చ =పుత్రునితోను, సఖ్యమ్= కలయికను, ఇచ్ఛన్ = కోరుచున్నవాడనై, అతిదీప్తమ్ =మిక్కిలి ప్రజ్వలించుచున్న, అగ్నిమ్ =అగ్నిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను. ఇమే =ఈ, హరిప్రవీరాః =వానరవీరులు, నిదేశే =నీ ఆజ్ఞయందు, పరివర్తమానాః =ప్రవర్తించుచు, సీతామ్ =సీతను, విచేష్యన్తి =వెదకగలరు.

తా. నేను నా సోదరునితోను ఆతని మిత్రునితోను కలియుటకై ప్రజ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించెదను. ఈ వానరవీరులు నీ ఆజ్ఞను పాలించి సీతను వెదకగలరు. 22

మూ. కృత్స్నం తు తే సేత్స్యతి కార్యమేత
న్మయ్యప్యతీతే మనుజేన్ద్రపుత్ర!
కులస్య హన్తారమజీవనార్హం
రామానుజానీహి కృతాగసం మామ్. 23

ప్ర. అ. మనుజేన్ద్రపుత్ర ! =రాజకుమారా! రామ! =ఓ రామా! మయి =నేను, అతీతేఽపి =మరణించినను, తే =నీయొక్క, కృత్స్నమ్ = సమస్త మైన, ఏతత్ కార్యమ్=ఈ కార్యము, సేత్స్యతి =సిద్ధించగలదు. కులస్య =కులమునకు, హన్తారమ్ = నాశకుడను, అజీవనార్హమ్ =జీవించుటకు తగని

వాడను, కృతాగసమ్ =చేయబడిన అపరాధము కలవాడను అయిన, మామ్ =నన్ను, అనుజానీహి =అనుజ్ఞ ఇమ్ము.

తా. రాజకుమారుడవైన రామా! నేను మరణించినను నీ కార్య మంతా సిద్ధించును. ఇంత అపరాధము చేసి కులమును నశింప జేసిన నేను జీవించుటకు తగను. నాకు మరణించుటకు అనుమతి ఇమ్ము. 23

మూ. ఇత్యేవమార్తస్య రఘుప్రవీరః
శ్రుత్వా వచో వాలిజఘన్యజస్య,
సఞ్జాతబాష్పః పరవీరహన్తా
రామో ముహూర్తం విమనా బభూవ. 24

ప్ర. అ. రఘుప్రవీరః =రఘువంశీయులలో ఉత్తమవీరుడు, పరవీరహన్తా =శత్రువీరులను చంపేవాడు ఐన, రామః =రాముడు, ఆర్తస్య = పీడితుడైన, వాలిజఘన్యజస్య =వాలి తమ్ముడైన సుగ్రీవునియొక్క, ఇత్యేవమ్ =ఇట్లు, వచః =వచనమును, శ్రుత్వా =విని, సఞ్జాతబాష్పః =పుట్టిన కన్నీరు కలవాడై, ముహూర్తమ్ =ముహూర్తకాలము, విమనాః =వికారము చెందిన మనస్సు కలవాడు, బభూవ =ఆయెను.

తా. రఘువంశీయులలో మహావీరుడు, శత్రువీరులను సంహరించువాడు అయిన రాముడు వాలి తమ్ముడైన సుగ్రీవుడు పలికిన ఈ మాటలు విని కన్నీళ్లతో కూడినవాడై, క్షణకాలము మనస్సులో విషాదము చెందెను. 24

మూ. తస్మిన్ క్షణేఽభీక్ష్ణ మవేక్షమాణః
క్షితిక్షమావాన్ భువనస్య గోప్తా,
రామో రుదన్తీం వ్యసనే నిమగ్నాం
సముత్సుకః సోఽథ దదర్శ తారామ్. 25

ప్ర. అ. క్షితిక్షమావాన్ = భూమివంటి ఓర్పు గలవాడు, భువనస్య =లోకమునకు, గోప్తా=రక్షకుడు అయిన, సః రామః = ఆ రాముడు, తస్మిన్ =ఆ, క్షణే =క్షణమునందు, సముత్సుకః = ఔత్సుక్యము కలవాడై, అభీక్ష్ణమ్ =మిక్కిలి, అవేక్షమాణః = చూచుచు, అథ =పిమ్మట, వ్యసనే =దుఃఖమునందు, నిమగ్నామ్ = మునిగి ఉన్న, రుదన్తీమ్ = ఏడ్చుచున్న, తారామ్ = తారను, దదర్శ= చూచెను.

తా. భూమి వంటి ఓర్పు గలవాడు, జగద్రక్షకుడు అయిన ఆ రాముడు, ఆ క్షణమునందు ఔత్సుక్యముతో మాటిమాటికి చూచుచు అపుడు దుఃఖములో మునిగి ఏడ్చుచున్న తారను చూచెను. 25

మూ. తాం చారునేత్రాం కపిసింహనాథాం
పతిం సమాశ్లిష్య తదా శయానామ్,
ఉత్థాపయామాసురదీనసత్త్వాం
మన్త్రిప్రధానాః కపిరాజపత్నీమ్. 26

ప్ర. అ. చారునేత్రామ్ =అందమైన నేత్రములు కలది, కపిసింహనాథామ్ = వానరశ్రేష్ఠుడైన వాలి నాథుడుగా గలది, తదా = అప్పుడు, పతిమ్ =భర్తను, సమాశ్లిష్య =కౌగలించుకొని, శయానామ్ = శయనించియున్నది, అదీనసత్త్వామ్= దీనము కాని బుద్ధి కలది యైన, కపిరాజపత్నీమ్ =వానరరాజు భార్యయైన, తామ్ =ఆమెను, మన్త్రిప్రధానాః =మంత్రిశ్రేష్ఠులు, ఉత్థాపయామాసుః =లేవదీసిరి.

తా. అందమైన నేత్రములు కలది, వానరశ్రేష్ఠుడైన వాలి నాథుడుగా గలది, స్వభావముచే ధైర్యవంతురాలు అయిన వాలి భార్యయైన ఆ తార భర్తను కౌగలించుకొని పడి ఉండగా ఆమెను మంత్రిశ్రేష్ఠులు లేవదీసిరి. 26

మూ. సా విస్ఫురన్తీ పరిరభ్యమాణా
భర్తుస్సమీపాదపనీయమానా,
దదర్శ రామం శరచాపపాణిం,
స్వతేజసా సూర్యమివ జ్వలన్తమ్. 27

ప్ర. అ. పరిరభ్యమాణా =భర్తను కౌగలించుకొని యున్నది, భర్తుః = భర్తయొక్క, సమీపాత్=సమీపమునుండి అపనీయమానా= తొలగించబడుచున్నది యైన, సా =ఆమె, విస్ఫురన్తీ = కొట్టుకొనుచున్నదై, శరచాపపాణిమ్ = బాణములు, ధనస్సు హస్తములందు కలవాడు, స్వతేజసా=తన తేజస్సుతో, సూర్యమివ =సూర్యుడువలె, జ్వలన్తమ్ =ప్రజ్వలించుచున్నవాడు అయిన, రామమ్ =రాముని, దదర్శ =చూచెను.

తా. భర్తను కౌగలించుకొని ఉన్న ఆ తార భర్త దగ్గరనుండి తొలగింప బడుచున్నపుడు కాళ్లు చేతులు కదుపుచు వ్యాకులముగా నుండెను. ఆమె అక్కడ ధనుర్బాణములను ధరించి తన తేజస్సుతో సూర్యుడు వలె ప్రకాశించుచున్న రాముని చూచెను. 27

మూ. సుసంవృతం పార్థివలక్షణైశ్చ
తం చారునేత్రం మృగశావనేత్రా,
అదృష్టపూర్వం పురుషప్రధాన
మయం స కాకుత్స్థ ఇతి ప్రజజ్ఞే. 28

ప్ర. అ. మృగశావనేత్రా =మృగశిశువుయొక్క నేత్రముల వంటి నేత్రములు గల ఆమె, పార్థివలక్షణైః =రాజలక్షణములలో, సుసంవృతమ్ =కూడిన వాడు,

చారునేత్రమ్ = అందమైన నేత్రములు కలవాడు, అదృష్టపూర్వమ్ =పూర్వ మెన్నడు చూడబడనివాడు, పురుషప్రధానమ్ =పురుషులలో శ్రేష్ఠుడు అయిన, తమ్ =ఆ రాముని, అయమ్ =ఇతడే, సః =ఆ, కాకుత్స్థః =రాముడు,ఇతి =అని, ప్రజజ్ఞే =గుర్తించెను.

తా. లేడిపిల్ల వంటి నేత్రములు గల ఆ తార రాజలక్షణములతో కూడిన వాడు, అందమైన నేత్రములు కలవాడు, పురుషులలో శ్రేష్ఠుడు, పూర్వ మెన్నడు చూడబడనివాడు అయిన, ఆ రాముని, "ఇతడే ఆ రాముడు" అని గుర్తించెను.

మూ. తస్యేన్ద్రకల్పస్య దురాసదస్య
మహానుభావస్య సమీపమార్యా,
ఆర్తాతితూర్ణం వ్యసనం ప్రపన్నా
జగామ తారా పరివిహ్వలన్తీ. 29

ప్ర. అ. ఆర్యా = పూజ్యురాలు, ఆర్తా =ఆర్తురాలు, వ్యసనమ్ = దుఃఖమును, ప్రపన్నా = పొందినది యైన, తారా =తార, పరివిహ్వలన్తీ = వ్యాకులత్వమును చెందుచున్నదై, ఇన్ద్రకల్పస్య = ఇంద్రునితో సమానుడు, దురాసదస్య =సమీపింప శక్యముగాని వాడు, మహానుభావస్య=గొప్ప సామర్థ్యము కలవాడు అయిన, తస్య =ఆ రామునియొక్క, సమీపమ్ =సమీపమును గూర్చి, అతితూర్ణమ్=చాల శీఘ్రముగా, జగామ =వెళ్లెను.

తా. దుఃఖముచెంది చాల బాధపడుచున్న పూజ్యురాలైన ఆ తార వ్యాకులమైన చిత్తముతో, ఇంద్రునితో సమానుడు, ఎదిరింప శక్యము గానివాడు, గొప్ప సామర్థ్యము గలవాడు అయిన ఆ రాముని వద్దకు శీఘ్రముగా వెళ్ళెను.

మూ. తం సా సమాసాద్య విశుద్ధసత్త్వం
శోకేన సంభ్రాన్తశరీరభావా,
మనస్వినీ వాక్యమువాచ తారా
రామం రణోత్కర్షణలబ్ధలక్ష్యమ్. 30

ప్ర. అ.శోకేన=శోకముచేత, సంభ్రాన్తశరీరభావా=మారిపోయిన శరీరస్వభావము గల, మనస్వినీ=ఆత్మాభిమానవంతురాలైన, సా తారా=ఆ తార, విశుద్ధసత్త్వమ్=పరిశుద్ధమైన బుద్ధి కలవాడు, రణోత్కర్షణలబ్ధలక్ష్యమ్=యుద్ధమునందు ఆధిక్యముచే పొందబడిన లక్ష్యము కలవాడు అయిన, తం రామమ్=ఆ రాముని, సమాసాద్య=సమీపించి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. దుఃఖముచేత మారిపోయిన శరీరస్వభావము గల మానవంతురాలైన ఆ తార పరిశుద్ధమైన బుద్ధి కలవాడు, యుద్ధములో లక్ష్యమును వేధించుటకు సమర్థుడు అయిన ఆ రాముని సమీపించి ఇట్లు పలికెను. 30

మూ. త్వమప్రమేయశ్చ దురాసదశ్చ
జితేన్ద్రియశ్చోత్తమధర్మకశ్చ,
అక్షీణకీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః. 31

ప్ర. అ.త్వమ్=నీవు, అప్రమేయశ్చ=ఊహింప శక్యము గానివాడవు, దురాసదశ్చ=ఎదురింప శక్యముగానివాడవు, జితేన్ద్రియశ్చ=జయించబడిన ఇంద్రియములు గలవాడవు, ఉత్తమధర్మకశ్చ=ఉత్తమమైన ధర్మములు కలవాడవు, అక్షీణకీర్తిశ్చ=క్షీణించని కీర్తి కలవాడవు, విచక్షణశ్చ=నేర్పు కలవాడవు, క్షితిక్షమావాన్=భూమివంటి ఓర్పు గలవాడవు, క్షతజోపమాక్షః= రక్తముతో సమానమైన ఎఱ్ఱని నేత్రములు కలవాడవు.

తా.నీవు ఊహింప శక్యము గాని స్వరూపము గలవాడవు. ఎదురింప శక్యము గానివాడవు. జితేంద్రియుడవు. ఉత్తమమైన ధర్మము, క్షీణించని కీర్తి, భూమివంటి ఓర్పు, రక్తమువలె ఎఱ్ఱనైన నేత్రములు గల నీవు గొప్ప సామర్థ్యము కలవాడవు.

వి. ఈ శ్లోకములో తార శ్రీరాముని సాక్షాత్తు మహావిష్ణువుగా వర్ణించినదని కొందరు వ్యాఖ్యాతలు అతివిపులముగా వ్రాసియున్నారు. 31

మూ. త్వమాప్తబాణాసనబాణపాణి
ర్మహాబలః సంహననోపపన్నః,
మనుష్యదేహాభ్యుదయం విహాయ
దివ్యేన దేహాభ్యుదయేన యుక్తః. 32

ప్ర. అ.ఆప్తబాణాసనబాణపాణిః=గ్రహించబడిన ధనస్సు బాణము హస్తమునందు గలవాడవు, మహాబలః=గొప్ప బలము కలవాడవు, సంహననోపపన్నః=అందమైన శరీరసంఘటనముతో గూడినవాడవు అయిన, త్వమ్=నీవు, మనుష్యదేహాభ్యుదయమ్=మనుష్యుల దేహముయొక్క గొప్పదనమును, విహాయ=విడచి, దివ్యేన=దివ్యమైన, దేహాభ్యుదయేన=దేహముయొక్క గొప్పదనముతో, యుక్తః=కూడినవాడవు.

తా.అందమైన శరీరసంఘటనముతో మహాబలశాలివై హస్తములందు ధనుర్బాణములు ధరించిన నీవు మనుష్యుల దేహమునందలి గొప్పదనము కంటె భిన్నమైన దివ్యదేహము వైశిష్ట్యముతో కూడి యున్నావు. 32

మూ. యేనైవ బాణేన హతః ప్రియో మే
తేనైవ బాణేన హి మాం జహీహి,

హతా గమిష్యామి సమీపమస్య
న మాం వినా వీర! రమేత వాలీ. 33

ప్ర. అ. వీర!=ఓ వీరుడా! యేనైవ=యే, బాణేన=బాణముచేత, మే ప్రియః=నా ప్రియుడు, హతః=చంపబడినాడో, తేన=ఆ, బాణేనైవ= బాణముచేతనే, మామ్=నన్ను, జహీహి=విడువుము(చంపుము). హతా= చంపబడినదాననై, అస్య= ఈతనియొక్క, సమీపమ్=సమీపము గూర్చి, గమిష్యామి=వెళ్లగలను. మాం వినా=నేను లేకుండగా, వాలీ=వాలి, న రమేత=సుఖముగా ఉండజాలడు.

తా.ఓ వీరుడా! ఏ బాణముతో నా భర్తను చంపినావో ఆ బాణముతోనే నన్ను గూడ చంపుము. నేను ఆతని దగ్గరకు వెళ్ళెదను. నేను లేకున్నచో ఆతడు సుఖముగా ఉండజాలడు. 33

మూ. స్వర్గేఽపి పద్మామలపత్రనేత్ర
సమేత్య సమ్ప్రేక్ష్య చ మామపశ్యన్,
న హ్యేష ఉచ్చావచతామ్రచూడా
విచిత్రవేషాప్సరసోఽభజిష్యత్. 34

ప్ర. అ. పద్మామలపత్రనేత్ర=పద్మములయొక్క నిర్మలములైన రేకుల వంటి నేత్రములు గలవాడా! ఏషః=ఈ వాలి, స్వర్గే=స్వర్గమునందు, సమేత్యాపి= చేరి కూడ, సమ్ప్రేక్ష్య=చూచి, మామ్=నన్ను, అపశ్యన్=చూడనివాడై, ఉచ్చావచతామ్రచూడా=అనేకవిధములైన ఎఱ్ఱని శిరోభూషణములు గల, విచిత్రవేషాప్సరసః=విచిత్రములైన వేషములు గల అప్సరస్త్రీలను, న అభజిష్యత్=పొందడు.

తా. ఓ పద్మపత్రనేత్రా! నా భర్త స్వర్గమునకు వెళ్లిన తరువాత కూడ, ఇటు అటు చూచి, నేను కనబడనిచో అక్కడ ఉన్న అనేక విధములైన ఎఱ్ఱని పుష్పాదులు శిరస్సుపై ధరించి విచిత్రములైన వేషములతో కూడిన అప్సరస్త్రీలను స్వీకరించడు. 34

మూ. స్వర్గేఽపి శోకం చ వివర్ణతాం చ
మయా వినా ప్రాప్స్యతి వీర వాలీ,
రమ్యే నగేన్ద్రస్య తటావకాశే
విదేహకన్యారహితో యథా త్వమ్. 35

ప్ర. అ. వీర!=ఓ వీరుడా! విదేహకన్యారహితః=సీతతో శూన్యుడవైన, త్వమ్=నీవు, నగేన్ద్రస్య=పర్వతముయొక్క, రమ్యే=సుందరమైన, తటావకాశే= చరియలయందు, యథా=ఎట్లో అట్లే, వాలీ=వాలి, స్వర్గేఽపి= స్వర్గమునందు, కూడ, మయా వినా=నేను లేక, శోకం చ=దుఃఖమును, వివర్ణతాం చ=వైవర్ణ్యమును, ప్రాప్స్యతి=పొందగలడు.

తా.ఓ వీరుడా! సీత లేకపోవుటచే నీవు అందమైన పర్వతప్రాంతమునందు కూడ ఎట్లు శోకమును, కృశత్వమును పొందుచున్నావో అట్లే వాలి నేను లేకపోవుటచే స్వర్గములో కూడ శోకమును రంగుమారిపోవుటను (కృశత్వమును) పొందును. 35

మూ. త్వం వేత్థ తావద్వనితావిహీనః
ప్రాప్నోతి దుఃఖం పురుషః కుమారః,
తత్త్వం ప్రజానన్ జహి మాం న వాలీ
దుఃఖం మమాదర్శనజం భజేత. 36

ప్ర. అ. కుమారః=యువకుడైన, పురుషః=పురుషుడు, వనితావిహీనః=స్త్రీ లేనివాడై, దుఃఖమ్=దుఃఖమును, ప్రాప్నోతి=పొందును అని, త్వమ్=నీవు, వేత్థ తావత్=ఎరుగుదువు. తత్=ఆ కారణమువలన, ప్రజానన్=ఈ విషయమును ఎరిగిన, త్వమ్=నీవు, మామ్=నన్ను, జహి=చంపుము. వాలీ=వాలి, మమ=నాయొక్క, అదర్శనజమ్=కనబడకపోవుటవలన కలిగిన, దుఃఖమ్=దుఃఖమును, న భజేత=పొందకుండుగాక!

తా.యువకుడైన పురుషుడు స్త్రీవిహీనుడైనచో ఎట్లు దుఃఖమును పొందునో నీకు తెలియును. అందుచే ఈ విషయమును తెలిసిన నీవు నన్ను చంపివేయుము. వాలికి నేను కనబడకపోవుటచే దుఃఖము కలుగకుండుగాక! 36

మూ. యచ్చాపి మన్యేత భవాన్మహాత్మా
స్త్రీఘాతదోషస్తు భవేన్న మహ్యమ్,
ఆత్మేయమస్యేతి హి మాం జహి త్వం
న స్త్రీవధః స్యాన్మనుజేన్ద్రపుత్ర. 37

ప్ర. అ. మనుజేన్ద్రపుత్ర!=ఓ రాజకుమారా! మహాత్మా=మహాత్ముడవైన, భవాన్=నీవు, మహ్యమ్=నాకు, స్త్రీఘాతదోషః=స్త్రీని చంపిన దోషము, న భవేత్=కలుగకుండుగాక! అని మన్యేత యచ్చ=తలచినను, ఇయమ్= ఈమె, అస్య=ఇతనియొక్క, ఆత్మా=ఆత్మయే, ఇతి=అని, మామ్= నన్ను, త్వమ్=నీవు, జహి=చంపుము. స్త్రీవధః=స్త్రీవధ, న స్యాత్=కాదు.

తా. ఓ రాజకుమారా! మహాత్ముడవైన నీవు ఈమెను చంపినచో స్త్రీహత్యాదోషము కలుగు నని అనుకొనచుండవచ్చును; కాని ఈమె కూడ వాలి శరీరమే యని భావించి నన్ను చంపుము. నీకు స్త్రీహత్యాదోషము ఉండదు. 37

మూ. శాస్త్రప్రయోగాద్వివిధాచ్చ వేదా
దనన్యరూపాః పురుషస్య దారాః,

దారప్రదానాన్న హి దానమన్య
త్ప్రదృశ్యతే జ్ఞానవతాం హి లోకే. 38

ప్ర. అ. శాస్త్రప్రయోగాత్=శాస్త్రముయొక్క ప్రయోగమువలన, వివిధాత్= అనేకవిధములైన, వేదాత్=వేదమువలన, దారాః=భార్య, పురుషస్య= పురుషునకు, అనన్యరూపాః=అన్యరూపము కలది కాదు. లోకే=లోకమునందు, దారప్రదానాత్=భార్యాదానముకంటె, అన్యత్=మరి యొక, దానమ్=దానము, జ్ఞానవతామ్=జ్ఞానవంతులకు, న ప్రదృశ్యతే హి=చూడబడుటలేదు కదా!

తా. శాస్త్రానుసారముగాను, అనేకవేదవాక్యముల ప్రకారము భార్య పురుషుని కంటె వేరుకాదు. లోకములో భార్యాదానమును మించిన దానము మరేదియు లేదని బుద్ధిమంతులు చెప్పుదురు. 38

మూ. త్వం చాపి మాం తస్య మమ ప్రియస్య
ప్రదాస్యసే ధర్మమవేక్ష్య వీర!
అనేన దానేన న లప్స్యసే త్వ
మధర్మయోగం మమ వీర ఘాతాత్. 39

ప్ర. అ. వీర=ఓ వీరుడా! త్వం చాపి=నీవు కూడ, ధర్మమ్=ధర్మమును, అవేక్ష్య=చూచి, మామ్=నన్ను, మమ ప్రియస్య=నా భర్తయైన, తస్య=ఆతనికి, ప్రదాస్యసే=ఇవ్వగలవు. వీర!=ఓ వీరుడా! త్వమ్=నీవు, అనేన=ఈ, దానేన=దానముచేత, మమ=నాయొక్క, ఘాతాత్=చంపుటవలన, అధర్మయోగమ్=అధర్మసంబంధమును, న లప్స్యసే=పొందవు.

తా. ఓ వీరుడా! నీవు ఈ ధర్మమును గ్రహించి, నన్ను నా ప్రియుడైన వాలికి ఇమ్ము. ఇట్లు ఇచ్చుటచే నన్ను చంపిన పాపము నీకు రాదు. 39

మూ. ఆర్తామనాథా మపనీయమానా
మేవం గతాం నార్హసి మామహన్తుమ్,
అహం హి మాతఙ్గవిలాసగామినా
ప్లవఙ్గమానామృషభేణ ధీమతా. 40

వినా వరార్హోత్తమ హేమమాలినా
చిరం న శక్ష్యామి నరేన్ద్ర జీవితుమ్,
ఇత్యేవముక్తస్తు విభుర్మహాత్మా
తారాం సమాశ్వాస్య హితం బభాషే. 41

ప్ర. అ. నరేన్ద్ర=ఓ రాజా! ఆర్తామ్=దుఃఖితురాలను, అనాథామ్= అనాథురాలను, అపనీయమానామ్=దూరముగా తీసికొని పోబడుచున్నదానను అయిన, ఏవంగతామ్=ఇట్టి స్థితిలో ఉన్నదానను అయిన, మామ్=నన్ను,

అహన్తుమ్=చంపకుండా ఉండుటకు, నార్హసి=తగవు. అహమ్=నేను, మాతఙ్గవిలాస గామినా=ఏనుగు వలె విలాసగా నడచువాడు, ధీమతా=బుద్ధిమంతుడు, వరార్హోత్తమ హేమమాలినా=అమూల్యమైన ఉత్తమమైన బంగారు మాల కలవాడు అయిన, ప్లవఙ్గమానాం ఋషభేణ వినా=వానరశ్రేష్ఠుడు లేకుండగా, చిరమ్=చిరకాలము, జీవితుమ్=జీవించుటకు, న శక్ష్యామి= సమర్థురాలను కాజాలను. ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, విభుః=ప్రభువు, మహాత్మా=మహాత్ముడు అయిన రాముడు, తారామ్=తారను, సమాశ్వాస్య=ఓదార్చి, హితమ్=హితమును, బభాషే=పలికెను.

తా. ఓ రాజా! ఆర్తురాలను, అనాథురాలను అయిన నన్ను దూరముగా తీసుకొని పోవుచున్నారు. ఇట్టి స్థితిలో ఉన్న నన్ను నీవు చంపక పోవుట తగదు. ఏనుగు వలె విలాసగా నడచువాడు, బద్ధిమంతుడు, అమూల్యమైన శ్రేష్ఠమైన బంగారు మాల కలవాడు, వానర శ్రేష్ఠుడు అయిన ఆ వాలి లేకుండగా నేను చిరకాలము జీవించజాలను. మహాత్ముడు, ప్రభువు అయిన రాముడు ఈ మాటలు విని తారను ఓదార్చి ఇట్లు హితమైన మాటలు పలికెను. 40,41

మూ. మా వీరభార్యే! విమతిం కురుష్వ
లోకో హి సర్వో విహితో విధాత్రా,
తం చైవ సర్వం సుఖదుఃఖయోగం
లోకోఽబ్రవీత్తేన కృతం విధాత్రా. 42

ప్ర. అ. వీరభార్యే!=వీరుని భార్యవైన ఓ తారా! విమతిమ్=విపరీతమైన బుద్ధిని, మా కురుష్వ=చేయకుము. సర్వః=సమస్తమైన, లోకః=లోకము, విధాత్రా=బ్రహ్మచేత, విహితః హి=నిర్మించబడినది కదా! సర్వమ్=సమస్తమైన, తమ్=ఆ, సుఖదుఃఖయోగం చైవ=సుఖదుఃఖసంబంధము కూడ, తేన విధాత్రా=ఆ బ్రహ్మచేత, కృతమ్=చేయబడిన దానినిగా, లోకః=లోకము, అబ్రవీత్= చెప్పెను.

తా. ఓ వీరభార్యా! ఇట్టి విపరీతపు ఆలోచనలు చేయకుము. ఈ లోకమునంతను బ్రహ్మ సృష్టించినాడు. సుఖదుఃఖముల నన్నింటిని కూడ బ్రహ్మయే విధించినాడని లోకులందఱు చెప్పుదురు. 42

మూ. త్రయోఽపి లోకా విహితం విధానం
నాతిక్రమన్తే వశగా హి తస్య,
ప్రీతిం పరాం ప్రాప్స్యసి తాం తథైవ
పుత్రశ్చ తే ప్రాప్స్యతి యౌవరాజ్యమ్.
ధాత్రా విధానం విహితం తథైవ
న శూరపత్న్యః పరిదేవయన్తి. 43

ప్ర. అ. త్రయః అపి=మూడు, లోకాః=లోకములు, తస్య=ఆ బ్రహ్మకు, వశగాః హి=వశమును పొందినవి కదా! విహితమ్=బ్రహ్మచే విధింపబడిన,

విధానమ్=విధానమును, నాతిక్రమన్తే=అతిక్రమించవు. పరామ్=శ్రేష్ఠమైన, తాం ప్రీతిమ్=ఆ ఆనందమును, తథైవ=అట్లే, పాప్స్యసి=పొందగలవు. తే=నీయొక్క, పుత్రశ్చ=పుత్రుడు కూడ, యౌవరాజ్యమ్= యౌవరాజ్యమును, ప్రాప్స్యతి=పొందగలడు. ధాత్రా=బ్రహ్మచేత, విధానమ్=విధానము, తథైవ=అట్లే, విహితమ్=చేయబడినది. శూరపత్న్యః= శూరుల భార్యలు, న పరిదేవయన్తి=విలపించరు.

తా. ఈ మూడు లోకములు కూడ బ్రహ్మవశమున ఉన్నవి. అవి ఆతడు విధించిన నియమమును అతిక్రమింపజాలవు. నీవు అధికమైన ఆనందమును పూర్వమువలెనే పొందగలవు. నీ కుమారుడు యౌవరాజ్యమును పొందగలడు. బ్రహ్మవిధించిన విధాన మిట్లే ఉన్నది. శూరుల భార్యలు విలపించరు. 43

మూ. ఆశ్వాసితా తేన మహాత్మనా తు
ప్రభావయుక్తేన పరంతపేన,
సా వీరపత్నీ ధ్వనతా ముఖేన
సువేషరూపా విరరామ తారా. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుర్వింశస్సర్గః.

ప్ర. అ. ప్రభావయుక్తేన=ప్రభావముతో కూడిన వాడు, పరంతపేన= శత్రుసంహారకుడు, మహాత్మనా=మహాత్ముడు అయిన, తేన=ఆ రామునిచేత, ఆశ్వాసితా=ఓదార్చబడినదై, వీరపత్నీ=వీరుని భార్య, ధ్వనతా= ధ్వనిచేయుచున్న, ముఖేన=ముఖముతో కూడినది, సువేషరూపా=మంచి వేషము, రూపము కలదియైన, సా తారా=ఆ తార, విరరామ=విరమించెను.

తా. వీరుని భార్య అందమైన రూపము, వేషము కలది యైన విలపించుచున్న ఆ తార మహాత్ముడు, ప్రభావశాలి, శత్రుసంహారకుడు అయిన ఆ రాముడు ఇట్లు ఓదార్చగా రోదనమును విడచెను.

వి.సుగ్రీవుడు తార విలపించినట్లు, తార తనను కూడ చంప మని రాముణ్ణి కోరినట్లు రాముడు ఆమెను ఓదార్చినట్లు వర్ణిస్తూ పెద్దవృత్తములతో వ్రాసిన ఈ నలుబదినాలుగు శ్లోకముల సర్గ ప్రాచ్యపాఠములో లేదు. ఈ శ్లోకాల అన్వయము చాల చోట్ల సరిగా కుదురుటలేదు. పదప్రయోగాదులు కూడ సరిగా లేవు. అందుచే ఇది పద్యాలు అల్లడం నేరుస్తున్న ఎవరో సామాన్యకవి రచించిన ప్రక్షిప్తసర్గ యనియే భావించుట యుక్తము.

తార రామునిపై కోపించి "నీ భార్య లభించినను కాలాంతరమునందు నీకు ఆమెతో వియోగము  కలుగుగాక"అని శపించినట్లు ప్రాచ్యపాఠములో వున్నది.

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఇరువది నాలుగవ సర్గ సమాప్తము.

# అథ షడ్వింశః సర్గః

*[రాముడు తారాసుగ్రీవాంగదులకు బోధించి వాలికి దాహసంస్కారము చేయ మని వారిని ఆదేశించుట, అంగదుడు వాలికి దాహసంస్కారాదులు చేయుట]*

మూ. స సుగ్రీవం చ తారాం చ సాఙ్గదాం సహలక్ష్మణః,
సమానశోకః కాకుత్స్థః సాన్త్వయన్నిదమబ్రవీత్. 1

ప్ర. అ. సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, సమానశోకః=సమానమైన శోకము గల, సః కాకుత్స్థః=ఆ రాముడు, సుగ్రీవం చ=సుగ్రీవుని, సాఙ్గదామ్=అంగదునితో కూడిన, తారాం చ=తారను, సాన్త్వయన్=ఓదార్చుచు, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవాదులతో సమానమైన శోకము గల లక్ష్మణసమేతుడైన రాముడు సుగ్రీవుని, తారను, అంగదుని ఓదార్చుచు ఇట్లు పలికెను. 1

మూ. న శోకపరితాపేన శ్రేయసా యుజ్యతే మృతః,
యదత్రానన్తరం కార్యం తత్సమాధాతుమర్హథ. 2

ప్ర. అ. శోకపరితాపేన=శోకమువలన కలిగిన పరితాపముచే, మృతః=మరణించినవాడు, శ్రేయసా=శ్రేయస్సుతో, న యుజ్యతే=కూడదు. అత్ర= ఇచట, యత్=యే, అనన్తరమ్=అనంతరమైన, కార్యమ్=కార్యమున్నదో, తత్=దానిని, సమాధాతుమ్=చేయుటకు, అర్హథ=తగియున్నారు.

తా. మీరు ఈ విధముగా శోకముతో ఏడ్చుటచే మరణించిన వాలికి శ్రేయస్సు లభించదు. ఇపుడు తర్వాత చేయవలసిన కార్య మేది యున్నదో దానిని చేయుడు. 2

మూ. లోకవృత్త మనుష్ఠేయం కృతం వో బాష్పమోక్షణమ్,
న కాలాదుత్తరం కిఞ్చిత్పరం కర్మ ఉపాసితుమ్. 3

ప్ర. అ. లోకవృత్తమ్=లోకవ్యవహారము, అనుష్ఠేయమ్=చేయదగినది. వః=మీయొక్క, బాష్పమోక్షణమ్=కన్నీరు విడుచుట, కృతమ్=చేయబడినది. కాలాత్=మరణకాలముకంటె, ఉత్తరమ్=తర్వాతదైన, పరమ్=అన్యమైన, కిఞ్చిత్ కర్మ=ఏ కర్మయు, ఉపాసితుమ్=చేయుటకు, న=లేదు.

తా. లోకవ్యవహారమును అనుష్ఠించవలెను. మీరింతవరకు ఏడ్చినారు. మరణానంతరము వెంటనే చేయవలసిన మరి యొక మరణదుఃఖమును తొలగించు

కర్మ యేదియు లేదు. 3

మూ. నియతిః కారణం లోకే నియతిః కర్మసాధనమ్,
నియతిః సర్వభూతానాం నియోగేష్విహ కారణమ్. 4

ప్ర. అ. లోకే=లోకమునందు, నియతిః=దైవము, (కాలము) కారణమ్=అన్నింటికిని కారణము. నియతిః=కాలము, కర్మసాధనమ్=కర్మకు సాధనము. ఇహ=ఈ లోకములో, సర్వభూతానామ్=సమస్తభూతములయొక్క, నియోగేషు=ప్రేరణలయందు, నియతిః=కాలమే, కారణమ్=కారణము.

తా. ఈ లోకములో అన్నింటికిని కారణము కాలమే. కాలమే కర్మలకు సాధనము. ఈ లోకములో సమస్తభూతములను ప్రేరేపించు కారణము కాలమే.

మూ. న కర్తా కస్యచిత్కశ్చిన్నియోగే నాపి చేశ్వరః,
స్వభావే వర్తతే లోకస్తస్య కాలః పరాయణమ్. 5

ప్ర. అ. కస్యచిత్=ఏ ఒక్కనియొక్క, నియోగే=ప్రేరణమునందు, కశ్చిత్=ఏ ఒక్కడు, కర్తా=కర్త, న=కాడు. ఈశ్వరః అపి చ=సమర్థుడు కూడ, న=కాడు. లోకః=లోకము, స్వభావే=స్వభావమునందు, వర్తతే= ఉండును. తస్య=ఆ స్వభావమునకు, కాలః=కాలము, పరాయణమ్= ప్రధానమైన ప్రవర్తకము.

తా. ఎవ్వనిని ఎవ్వరు ప్రవర్తింపచేయరు. అట్లు ప్రవర్తింపచేయుటకు సమర్థులు కూడ కారు. లోకము తమ స్వభావమును అనుసరించి ప్రవర్తించుచుండును. ఆ స్వభావమునకు, ఆ లోకమునకు కాలము ప్రధానమైన గతి. 5

మూ. న కాలః కాలమత్యేతి న కాలః పరిహీయతే,
స్వభావం చ సమాసాద్య న కిఞ్చిదతివర్తతే. 6

ప్ర. అ. కాలః=కాలము, కాలమ్=కాలమును, న అత్యేతి=దాటదు. కాలః=కాలము, న పరిహీయతే=అతిక్రమింపబడదు. కిఞ్చిత్=ఏదీ కూడ, స్వభావమ్=స్వభావమును, సమాసాద్య=పొంది, న అతివర్తతే=దానిని దాటదు.

తా. కాలము తనను కూడ అతిక్రమించదు. దానిని ఎవ్వరు మరల్పజాలరు. కాలమువలన లభించు స్వభావములను ఏ వస్తువు కూడ అతిక్రమింపజాలదు. 6

మూ. న కాలస్యాస్తి బన్ధుత్వం న హేతుర్న పరాక్రమః,
న మిత్రజ్ఞాతిసంబన్ధః కారణం నాత్మనో వశః. 7

ప్ర. అ. కాలస్య=కాలమునకు, బన్ధుత్వమ్=బంధుత్వము, నాస్తి=లేదు. హేతుః=కారణము, న=లేదు. పరాక్రమః=దానిని జయించు పరాక్రమము, న=లేదు. మిత్రజ్ఞాతిసంబన్ధః=మిత్రత్వము జ్ఞాతిత్వము అను సంబంధము, కారణమ్=కారణము, న=కాదు.

తా. కాలమునకు పక్షపాతము లేదు. దానిని వశమును చేసికొను సాధనము గాని, దానిని జయించు పరాక్రమము గాని లేదు. మిత్రత్వము, జ్ఞాతిత్వము మొదలైన సంబంధము కాలప్రవృత్తికి కారణము కాదు. ఇది యెవరికిని వశ మైనది కాదు. 7

మూ. కిం తు కాలపరీణామో ద్రష్టవ్యః సాధు పశ్యతా,
ధర్మశ్చార్థశ్చ కామశ్చ కాలక్రమసమాహితాః. 8

ప్ర. అ. కిం తు=కాని, సాధు=బాగుగా, పశ్యతా=చూచుచున్న వానిచేత, కాల పరీణామః=కాలముయొక్క పరిణామము, ద్రష్టవ్యః=చూడదగినది. ధర్మశ్చ=ధర్మము, అర్థశ్చ=అర్థము, కామశ్చ=కామము, కాలక్రమసమాహితాః=కాలముచేత క్రమముగా సమకూర్చబడినవి.

తా. సద్బుద్ధి కలవాడు కాలపరిణామమును బాగుగా పరిశీలించవలెను. కాలము ధర్మార్థకామములను ఒక క్రమము ప్రకారము సమకూర్చుచుండును. 8

మూ. ఇతః స్వాం ప్రకృతిం వాలీ గతః ప్రాప్తః క్రియాఫలమ్,
సామదానార్థసంయోగైః పవిత్రం ప్లవగేశ్వరః. 9

ప్ర. అ. ప్లవగేశ్వరః=వానరరాజైన, వాలీ=వాలి, ఇతః=ఇక్కడినుండి, స్వామ్=తన సంబంధమైన, ప్రకృతిమ్=స్వభావమును, గతః=పొందినాడు. సామ దానార్థసంయోగైః=సామదానఅర్థముల సంబంధములచేత, పవిత్రమ్= పవిత్రమైన, క్రియాఫలమ్=క్రియలకు ఫలమును, ప్రాప్తః=పొందినాడు.

తా. వానరరాజైన వాలి ఈ లోకము విడిచి సహజమైన తన స్వరూపమును పొందినాడు. సామ,దాన, అర్థముల సంబంధముచే ఏర్పడిన పవిత్రమైన పుణ్యాఫలమును పొందినాడు. 9

మూ. స్వధర్మస్య చ సంయోగాజ్జితస్తేన మహాత్మనా,
స్వర్గః పరిగృహీతశ్చ ప్రాణానపరిరక్షతా. 10

ప్ర. అ. ప్రాణాన్=ప్రాణములను, అపరిరక్షతా=రక్షించని, తేన మహాత్మనా= ఆ మహాత్మునిచేత, స్వధర్మస్య=స్వధర్మముయొక్క, సంయోగాత్=సంబంధమువలన, స్వర్గః=స్వర్గము, జితః=జయింపబడినది. పరిగృహీతశ్చ=స్వీకరింపబడినది.

తా. మహాత్ముడైన ఆ వాలి తన ప్రాణములను రక్షించుకొనక స్వధర్మమును చేయుటచే స్వర్గమును జయించి దానిని చేరినాడు. 10

మూ. ఏషా వై నియతిః శ్రేష్ఠా యాం గతో హరియూథపః,
తదలం పరితాపేన ప్రాప్తకాలముపాస్యతామ్. 11

ప్ర. అ. హరియూథపః=వానరరాజైన వాలి, యామ్=దేనిని, గతః=పొంది

నాడో, ఏషా=ఈ, నియతిః=గతి, శ్రేష్ఠా పై=శ్రేష్ఠమైనది. తత్=ఆ కారణమువలన, పరితాపేన=తాపముచేత,అలమ్=చాలును. ప్రాప్తకాలమ్= కాలమునకు తగిన పని, ఉపాస్యతామ్=చేయబడుగాక!

తా. వానరరాజైన వాలి శ్రేష్ఠమైన గతిని పొందినాడు. అందుచే దుఃఖించక కాలోచితమైన కార్యమును చేయుడు. 11

మూ. వచనాన్తే తు రామస్య లక్ష్మణః పరవీరహా,
అవదత్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం గతచేతసమ్. 12

ప్ర. అ. రామస్య=రామునియొక్క, వచనాన్తే=వచనముయొక్క అంతము నందు, పరవీరహా=శత్రువీరులను సంహరించు, లక్ష్మణః=లక్ష్మణుడు, గతచేతసమ్= పోయిన మనస్సు గల, (ఆలోచనలు చేయజాలని) సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, ప్రశ్రితమ్=వినయపూర్వకమైన, వాక్యమ్=వాక్యమును, అవదత్=పలికెను.

తా. రాముని వాక్యము పూర్తియైన పిమ్మట శత్రుసంహారకుడైన లక్ష్మణుడు ఏ ఆలోచనలు చేయజాలని స్థితిలో ఉన్న సుగ్రీవునితో వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 12

మూ. కురు త్వమస్య సుగ్రీవ! ప్రేతకార్యమనన్తరమ్,
తారాఙ్గదాభ్యాం సహితో వాలినో దహనం ప్రతి. 13

ప్ర. అ. సుగ్రీవ!=సుగ్రీవుడా! త్వమ్=నీవు, తారాఙ్గదాభ్యామ్=తారుడితోను అంగదునితోను, సహితః=కూడినవాడవై , అస్య=ఈ వాలియొక్క, అనన్త రమ్=తరువాత చేయ దగిన, ప్రేతకార్యమ్=ప్రేతకార్యమును, కురు =చేయుము. వాలినః=వాలియొక్క, దహనం ప్రతి=దహనమును గూర్చి (ప్రయత్నము చేయుము.)

తా. ఓ సుగ్రీవుడా! నీవు తారాంగదులతో కలిసి వాలికి చేయవలసిన, ప్రేతకార్యమును ఈతని దహనమును గూర్చిన ప్రయత్నమును చేయుము. 13

మూ. సమాజ్ఞాపయ కాష్ఠాని శుష్కాణి చ బహూని చ,
చన్దనాని చ దివ్యాని వాలిసంస్కారకారణాత్. 14

ప్ర. అ. శుష్కాని=పండిన, బహూని=అనేకమైన, కాష్ఠాని=కాష్ఠము లను, దివ్యాని=శ్రేష్ఠములైన, చన్దనాని చ=చందనకాష్ఠములను, వాలిసంస్కార కారణాత్=వాలియొక్క సంస్కారము చేయుట అనే కారణమువలన, సమాజ్ఞా పయ=ఆజ్ఞాపించుము.

తా. వాలికి సంస్కారము చేయుటకై ఎండిన అనేకములైన కాష్ఠములను, శ్రేష్ఠములైన మంచి గంధపు చెక్కలను తెచ్చుటకై ఆజ్ఞాపించుము. 14

మూ. సమాశ్వాసయ చైనం త్వమఙ్గదం దీనచేతసమ్,
మా భూర్బాలిశబుద్ధిస్త్వం త్వదధీనమిదం పురమ్. 15

ప్ర. అ. త్వమ్=నీవు, దీనచేతసమ్=దీనమైన మనస్సు గల, ఏనమ్=ఈ అఙ్గదమ్=అంగదుని,సమాశ్వాసయ=ఓదార్చుము. త్వమ్=నీవు, బాలిశబుద్ధిః=వికలమైన బుద్ధి కలవాడవు, మా భూః=కాకుము. ఇదం పురమ్= ఈ పట్టణము, త్వదధీనమ్=నీపై ఆధారపడి యున్నది.

తా. నీవు చిత్తములో ధైర్యమును చెదిరియున్న ఈ అంగదుని ఓదార్చుము. నీ మనస్సులోని దౌర్బల్యమును విడిచిపెట్టుము. ఈ నగరము నీపై ఆధారపడి యున్నది. 15

మూ. అఙ్గదస్త్వానయేన్మాల్యం వస్త్రాణి వివిధాని చ,
ఘృతం తైలమథో గన్ధాన్యచ్చాత్ర సమనన్తరమ్. 16

ప్ర. అ. అఙ్గదస్తు=అంగదుడు, మాల్యమ్=పుష్పమాలను, వివిధాని= అనేకవిధములైన, వస్త్రాణి చ=వస్త్రములను, ఘృతమ్=ఘృతమును, తైలమ్= తైలమును, అథో=ఇంకను, గన్ధాని=గంధములను, అత్ర =ఈ సమయమునందు, యత్=ఏది, సమనన్తరమ్=వెంటనే ఉపయోగించునదో దానిని, ఆనయేత్=తీసుకొనివచ్చుగాక!

తా. అంగదుడు పుష్పమాలలు, అనేకవిధములైన వస్త్రములు, నెయ్యి, తైలము, సుగంధద్రవ్యములు, ఇపుడు కావలసిన ఇతరద్రవ్యములు తీసుకొని వచ్చుగాక! 16

మూ. త్వం తార శిబికాం శీఘ్రమాదాయాగచ్ఛ సమ్భ్రమాత్,
త్వరా గుణవతీ యుక్తా హ్యస్మిన్కాలే విశేషతః. 17

ప్ర. అ. తార!= ఓ తారుడా! త్వమ్ =నీవు, సమ్భ్రమాత్ =తొందరగా వెళ్ళి, శీఘ్రమ్ =శీఘ్రముగా, శిబికామ్ =పల్లకిని, ఆదాయ =తీసుకొని, ఆగచ్ఛ =రమ్ము. త్వరా=తొందర, గుణవతీ =గుణము గలది. విశేషతః=విశేషించి, అస్మిన్కాలే = ఈ కాలమునందు, యుక్తా హి =యుక్తమైనది కదా!

తా. ఓ తారుడా! నీవు వేగముగా వెళ్ళి పల్లకిని శీఘ్రముగా తీసుకొని రమ్ము. పనుల విషయమున తొందర మంచిది. విశేషించి ఈ సమయమునందు యుక్తమైనది. 17

మూ. సజ్జీభవన్తు ప్లవగాః శిబికావాహనోచితాః,
సమర్థా బలినశ్చైవ నిర్హరిష్యన్తి వాలినమ్. 18

ప్ర. అ. శిబికావాహనోచితాః =పల్లకిని మోయుటకు తగినవారు, సమర్థాః = సమర్థులు, బలినశ్చైవ =బలవంతులు అయిన, ప్లవగాః=వానరులు, సజ్జీభవన్తు =సన్నద్ధులగుదురుగాక! వాలినమ్ =వాలిని, నిర్హరిష్యన్తి =తీసికొనివెళ్లగలరు.

తా. ఆ పల్లకిని మోయుటకు తగినవారు సమర్థులు బలవంతులు అయిన వానరులు సిద్ధముగా ఉండెదరు గాక! వారు వాలిని తీసుకొని వెళ్లవలెను. 18

మూ. ఏవముక్త్వా తు సుగ్రీవం సుమిత్రానన్దవర్ధనః,
తస్థౌ భ్రాతృసమీపస్థో లక్ష్మణః పరవీరహా. 19

ప్ర.అ. సుమిత్రానన్దవర్ధనః =సుమిత్రయొక్క ఆనందమును వృద్ధి పొందించువాడు, పరవీరహా = శత్రువీరులను సంహరించువాడు అయిన, లక్ష్మణః =లక్ష్మణుడు, సుగ్రీవమ్ = సుగ్రీవుని గూర్చి, ఏవమ్ =ఇట్లు, ఉక్త్వా =పలికి, భ్రాతృసమీపస్థః =సోదరుని సమీపమునం దున్నవాడై , తస్థౌ =నిలబడెను.

తా. సుమిత్ర ఆనందమును వృద్ధి పొందించువాడు, శత్రుసంహారకుడు, అయిన లక్ష్మణుడు సుగ్రీవునితో ఇట్లు పలికి సోదరుని సమీపమున నిలచెను.19

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా తారః సమ్భ్రాన్తమానసః,
ప్రవివేశ గుహాం శీఘ్రం శిబికాసక్తమానసః. 20

ప్ర.అ. తారః =తారుడు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా =విని, సమ్భ్రాన్తమానసః =తొందరపడుచున్న మనస్సు గలవాడై, శిబికాసక్తమానసః =పల్లకియందు ఆసక్తి గల మనస్సు కలవాడై, శీఘ్రమ్= శీఘ్రముగా, గుహామ్=గుహను, ప్రవివేశ =ప్రవేశించెను.

తా. లక్ష్మణుని మాటలు విని తొందరపడుచున్న మనస్సు గల తారుడు ఆ పల్లకిని తీసుకొని వచ్చుటకై శీఘ్రముగా కిష్కింధకు వెళ్ళెను. 20

మూ. ఆదాయ శిబికాం తారః స తు పర్యాపతత్పునః,
వానరైరుహ్యమానాం తాం శూరైరుద్వహనోచితైః. 21

ప్ర. అ. సః తారః =ఆ తారుడు, ఉద్వహనోచితైః =మోయుటకు తగిన, శూరైః =శూరులైన, వానరైః =వానరులచేత, ఉహ్యమానామ్ =మోయబడుచున్న, తామ్ =ఆ, శిబికామ్ = పల్లకిని, ఆదాయ =తీసుకొని, పునః = మరల, పర్యాపతత్ = శీఘ్రముగా వచ్చెను.

తా. తారుడు పల్లకిని మోయుటకు తగిన శూరులైన వానరులచేత దానిని పట్టించుకొని తీసుకొని వచ్చెను. 21

మూ. దివ్యాం భద్రాసనయుతాం శిబికాం స్యన్దనోపమామ్,
పక్షికర్మభిరాచిత్రాం ద్రుమకర్మవిభూషితామ్. 22
ఆచితాం చిత్రపత్తీభి స్సునివిష్టాం సమన్తతః,
విమానమివ సిద్ధానాం జాలవాతాయనాయుతామ్. 23
సునియుక్తాం విశాలాం చ సుకృతాం శిల్పిభిః కృతామ్,
దారుపర్వతకోపేతాం చారుకర్మపరిష్కృతామ్. 24

వరాభరణహారైశ్చ చిత్రమాల్యోపశోభితామ్,
గుహాగహనసఞ్ఛన్నాం రక్తచన్దనభూషితామ్. 25
పుష్పౌఘైః సమభిచ్ఛన్నాం పద్మమాలాభిరేవ చ,
తరుణాదిత్యవర్ణాభిర్భ్రాజమానాభిరావృతామ్. 26

ప్ర.అ. దివ్యామ్ =శ్రేష్ఠమైనది, భద్రాసనయుతామ్=రాజాసనముతో కూడినది, స్యన్దనోపమామ్ =రథముతో సమానమైనది, పక్షికర్మభిః = పక్షులయొక్క కర్మలచేత (కృత్రిమమైన పక్షులచేత), ఆచిత్రామ్ =చిత్రమైనది, ద్రుమకర్మవిభూషితామ్ =వృక్షములయొక్క ప్రతికృతులచేత అలంకరింపబడినది, చిత్రపత్తీభిః=చిత్రరూపములో నున్న కాలిబంటులచేత, ఆచితామ్ =కూర్చబడినది, సమన్తతః =నలువైపుల, సునివిష్టామ్ =బాగుగా కూర్చబడినది, సిద్ధానామ్ =సిద్ధులయొక్క, విమానమివ= విమానము వలె నున్నది, జాలవాతాయనాయుతామ్ =చిన్న రంధ్రములతోను, కిటికీలతోను కూడినది, సునియుక్తామ్ =బాగుగా కట్టబడినది, విశాలాం చ =విశాలమైనది, సుకృతామ్ =చక్కగా నిర్మింపబడినది, శిల్పిభిః =శిల్పులచేత, కృతామ్ = నిర్మించబడినది, దారుపర్వతకోపేతామ్ = కఱ్ఱతో చేయబడిన పర్వతములతో కూడినది, చారుకర్మపరిష్కృతామ్ = అందమైన పనులచే అలంకరించబడినది, వరాభరణహారైశ్చ =శ్రేష్ఠమైన ఆభరణములతోను, హారములతోను కూడినది, చిత్రమాల్యోపశోభితామ్ =చిత్రములైన మాలికలచే శోభింపచేయబడినది, గుహాగహనసఞ్ఛన్నామ్ =గుహలతోను, అడవులతోను, కప్పబడినది, రక్తచన్దనభూషితామ్ = ఎఱ్ఱని చందనముచే అలంకరించబడినది, పుష్పౌఘైః =పుష్ప సముదాయములచేత నిండిన, తరుణాదిత్యవర్ణాభిః = లేత సూర్యుని రంగు గల, భ్రాజమానాభిః =ప్రకాశించుచున్న, పద్మమాలాభిః =పద్మములయొక్క మాలలచేత, ఆవృతామ్ =కప్పబడిన, శిబికామ్ =పల్లకిని (తీసుకొనివచ్చెను.)

తా. రథమువలె నున్న శ్రేష్ఠమైన ఆ పల్లకిలో రాజునకు తగిన ఆసనము అమర్చి యుండెను. నలు మూలల చక్కగా నిర్మింపబడిన సిద్ధుల విమానము వలె నున్న ఆ పల్లకిపై కృత్రిమమైన పక్షులు, వృక్షములు, యుద్ధభటులు మొదలగు వాటి చిత్రములు చెక్కబడియుండెను. అక్కడక్కడ సన్నని రంధ్రములు, కిటికీలు ఏర్పరచిన విశాలమైన ఆ పల్లకీలో అక్కడక్కడ కఱ్ఱతో చేసిన కొండలు, గుహలు, చెట్లతోపులు నిర్మింపబడియుండెను. ఎఱ్ఱని చందనముచే అలంకరింపబడిన దానిపై శ్రేష్ఠమైన అలంకారములు, హారములు, చిత్రములైన మాలికలు, పుష్పములు, బాలసూర్యుని వంటి రంగు గల పద్మమాలలు కప్పబడి యుండెను. అట్టి పల్లకిని తారుడు పట్టించుకొని వచ్చెను. 22-25

మూ. ఈదృశీం శిబికాం దృష్ట్వా రామో లక్ష్మణమబ్రవీత్,
క్షిప్రం వినీయతాం వాలీ ప్రేతకార్యం విధీయతామ్. 26

ప్ర. అ. ఈదృశీమ్=ఇట్టి, శిబికామ్=పల్లకిని, దృష్ట్వా=చూచి, రామః=రాముడు, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను. వాలీ=వాలి, క్షిప్రమ్=శీఘ్రముగా, వినీయతామ్=తీసికొని వెళ్లబడుగాక! ప్రేతకార్యమ్=ప్రేతకార్యము, విధీయతామ్=చేయబడుగాక!

తా. ఇట్టి శిబికను చూచి రాముడు లక్ష్మణునితో "వాలిని శీఘ్రముగా తీసుకొనిపోయి ప్రేతకార్యము చేయుదురు గాక" యని పలికెను.

వి. శిబికను వర్ణించే ఐదు(22-26) శ్లోకములు, ఈ రామవాక్యము ప్రాచ్యప్రతిలో లేవు. 26

మూ. తతో వాలినముద్యమ్య సుగ్రీవః శిబికాం తదా,
ఆరోపయత విక్రోశన్నఙ్గదేన సహైవ తు. 27

ప్ర.అ. తతః=అటుపిమ్మట, అఙ్గదేన సహైవ తు=అంగదునితో కూడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, విక్రోశన్=ఏడ్చుచు, వాలినమ్=వాలిని, ఉద్యమ్య=ఎత్తి, తదా=అపుడు, శిబికామ్=శిబికను, ఆరోపయత= ఎక్కించెను.

తా. పిమ్మట సుగ్రీవాంగదులు విలపించుచు వాలిని ఎత్తి ఆ శిబికలోనికి ఎక్కించిరి. 27

మూ. ఆరోప్య శిబికాం చైవ వాలినం గతజీవితమ్,
అలఙ్కారైశ్చ వివిధైర్వస్త్రైశ్చ భూషితమ్. 28
ఆజ్ఞాపయత్తదా రాజా సుగ్రీవః ప్లవగేశ్వరః,
ఔర్ధ్వదైహిక మార్యస్య క్రియతామనురూపతః. 29

ప్ర.అ. తదా=అపుడు, ప్లవగేశ్వరః=వానరాధిపతియైన, రాజా=రాజైన, సుగ్రీవః= సుగ్రీవుడు, వివిధైః=అనేకవిధములైన, అలఙ్కారైశ్చ= అలంకారములచేత, మాల్యైః=మాలికలచేత, వస్త్రైశ్చ=వస్త్రములచేత , భూషితమ్=అలంకరించబడిన, గతజీవితమ్=మరణించిన, వాలినమ్=వాలిని, శిబికామ్=శిబికను, ఆరోప్య=అధిష్ఠింపచేసి, ఆజ్ఞాపయత్=ఇట్లు ఆజ్ఞాపించెను. ఆర్యస్య=పూజ్యుడైన అన్నగారియొక్క, ఔర్ధ్వదైహికమ్= ప్రేతకార్యము, అనురూపతః=తగు విధముగా, క్రియతామ్=చేయబడుగాక!

తా. మరణించిన ఆ వాలిని అలంకారములచేత, అనేకవిధములైన పుష్పమాలలచేత వస్త్రములచేత, అలంకరించి, శిబికపై ఎక్కించి, వానరరాజైన సుగ్రీవుడు తన అనుచరులను ఇట్లు ఆజ్ఞాపించెను. "పూజ్యుడైన అన్నగారికి తగు విధముగా ప్రేతకార్యము చేయవలెను."

మూ. విశ్రాణయన్తో రత్నాని వివిధాని బహూని చ,
అగ్రతః ప్లవగా యాన్తు శిబికా తదనన్తరమ్. 30

ప్ర. అ. ప్లవగాః=వానరులు, వివిధాని=అనేకవిధములైన, బహూని= అనేకమైన, రత్నాని=రత్నములను, విశ్రాణయన్తః=పంచుచున్నవారై, అగ్రతః= ముందు, యాన్తు=వెళ్లుదురుగాక! శిబికా=శిబిక, తదనన్తరమ్=వారి వెనుక, (వెళ్లుగాక!)

తా. "వానరులు అనేకవిధములైన అనేకరత్నములను పంచుచు ముందు నడువవలెను. వారి వెనక ఈ శిబిక వెళ్లవలెను". 30

మూ. రాజ్ఞామృద్ధివిశేషా హి దృశ్యన్తే భువి యాదృశాః,
తాదృశైరిహ కుర్వన్తు వానరా భర్తృసత్క్రియామ్. 31

ప్ర.అ. భువి=భూమియందు, రాజ్ఞామ్=రాజులయొక్క, యాదృశాః= ఎట్టి, ఋద్ధివిశేషాః=ఐశ్వర్యవిశేషములు, దృశ్యన్తే=చూడబడుచున్నవో, తాదృశైః=అట్టి వాటితో, వానరాః=వానరులు, భర్తృసత్క్రియామ్= ప్రభువుకు సత్కారమును, కుర్వన్తు=చేయుదురుగాక!

తా. "భూలోకములో రాజులకు ఎట్టి ఐశ్వర్యవిశేషములు ఉండునో అట్టి ఐశ్వర్యవిశేషములతో వానరు లందరు ప్రభువునకు సత్కారము చేయుదురుగాక." 31

మూ. తాదృశం వాలినః క్షిప్రం ప్రాకుర్వన్నౌర్ధ్వదైహికమ్,
అఙ్గదం పరిరభ్యాశు తారప్రభృతయస్తదా, 32
క్రోశన్తః ప్రయయుస్సర్వే వానరా హతబాన్ధవాః.

ప్ర. అ. వాలినః=వాలికి, తాదృశమ్=అట్టి, ఔర్ధ్వదైహికమ్= ప్రేతకార్యమును, క్షిప్రమ్=శీఘ్రముగా, ప్రాకుర్వన్=చేసిరి. తదా= అపుడు, హతబాన్ధవాః=చంపబడిన బంధువు గల, తారప్రభృతయః=తారుడు మొదలైన, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, అఙ్గదమ్=అంగదుని, పరిరభ్య=కౌగలించుకొని, క్రోశన్తః=ఏడ్చుచున్నవారై, ఆశు=శీఘ్రముగా, ప్రయయుః=వెళ్లిరి.

తా. అపుడు శీఘ్రముగా వాలికి తగు విధముగా ప్రేతకార్యము చేసిరి. బంధువైన వాలిని కోల్పోయిన తారుడు మొదలైన వానరు లందరు అంగదుని కౌగలించుకొని ఏడ్చుచు నడిచి వెళ్లిరి. 32

మూ. తతః ప్రనిహితాః సర్వా వానర్యోఽస్య వశానుగాః, 33
చుక్రుశు ర్వీర! వీరేతి భూయః క్రోశన్తి తాః ప్రియమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అస్య=ఈ వాలియొక్క, వశానుగాః= వశమును పొందిన, సర్వాః=సమస్తమైన, వానర్యః=వానరస్త్రీలు, ప్రనిహితాః=

సమీపించినవారై, వీర! వీర! ఇతి=ఓ, వీరుడా! వీరుడా! యని, చుక్రుశుః=ఏడ్చిరి. తాః=ఆ స్త్రీలు, ప్రియమ్=ప్రియుని గూర్చి, భూయః=మాటిమాటికి, క్రోశన్తి=ఏడ్చిరి.

తా. పిమ్మట ఆ వాలి వశములో నున్న వానరస్త్రీలందరు వాలి దగ్గరకు చేరి ఓ! వీరుడా! ఓ వీరుడా! యని మాటిమాటికి పలుకుచు, తమ ప్రియుని గూర్చి విలపించిరి . 33

మూ. తారాప్రభృతయః సర్వా వానర్యో హతబాన్ధవాః,
అనుజగ్ముశ్చ భర్తారం క్రోశన్త్యః కరుణస్వనాః. 34

ప్ర. అ. హతబాన్ధవాః=చంపబడిన బంధువు గల, తారాప్రభృతయః=తార మొదలైన, సర్వాః=సమస్తమైన, వానర్యః=వానరస్త్రీలు, కరుణస్వనాః= దీనమైన ధ్వని కలవారై, క్రోశన్త్యః=ఏడ్చుచు, భర్తారమ్=భర్తను, అనుజగ్ముశ్చ=అనుసరించి వెళ్లిరి.

తా. భర్తను కోల్పోయిన తార మొదలైన వానరస్త్రీ లందరు దీన స్వరములతో ఏడ్చుచు భర్తను అనుసరించి వెళ్లిరి. 34

మూ. తాసాం రుదితశబ్దేన వానరీణాం వనాన్తరే,
వనాని గిరయశ్చైవ విక్రోశన్తీవ సర్వతః. 35

ప్ర. అ. వనాన్తరే=వనమధ్యమునందు, తాసామ్=ఆ, వానరీణామ్= వానర స్త్రీలయొక్క, రుదితశబ్దేన=రోదనధ్వనిచేత, సర్వతః=నలువైపుల, వనాని=వనములు, గిరయశ్చైవ=పర్వతములు, విక్రోశన్తీవ= ఏడ్చుచున్నట్లుండెను.

తా. ఆ వనమధ్యములో వానరస్త్రీల రోదనధ్వని వ్యాపించుటచే నలువైపుల ఉన్న వనములు, పర్వతములు ఏడ్చుచున్నట్లు అనిపించెను. 35

మూ. పులినే గిరినద్యాస్తు వివిక్తే జలసంవృతే, 36
చితాం చక్రుః సుబహవో వానరా వనచారిణః.

ప్ర. అ. వనచారిణః=వనమునందు సంచరించే, సుబహవః=అనేకులైన, వానరాః=వానరులు, గిరినద్యాః=పర్వతమునుండి ప్రవహించు నదియొక్క, జల సంవృతే=జలముచే చుట్టబడిన, వివిక్తే=నిర్జనమైన, పులినే=ఇసుకతిన్నె మీద, చితామ్=చితను, చక్రుః=చేసిరి.

తా. వనములో సంచరించే ఆ వానరులు పర్వతమునుండి ప్రవహించు నదీతీరమున చుట్టూ జలమున్న నిర్జనమైన ఒక ఇసుకతిన్నెపై చితను ఏర్పరచిరి.

మూ. అవరోప్య తతః స్కన్ధాచ్ఛిబికాం వానరోత్తమాః,
తస్థురేకాన్తమాశ్రిత్య సర్వే శోకపరాయణాః. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, వానరోత్తమాః=వానరశ్రేష్ఠులు, స్కన్ధాత్=భుజమునుండి, శిబికామ్=శిబికను, అవరోప్య= దింపి, శోకపరాయణాః=శోకమునకు అధీనులై, ఏకాన్తమ్=ఏకాంతప్రదేశమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, తస్థుః=నిలబడిరి.

తా. పిమ్మట ఆ వానరశ్రేష్ఠులు శిబికను భుజములనుండి క్రిందికి దింపి దుఃఖాక్రాంతులై ఒక ప్రక్కగా నిలబడి యుండిరి. 37

మూ. తతస్తారా పతిం దృష్ట్వా శిబికాతలశాయినమ్, 38
ఆరోప్యాఙ్కే శిరస్తస్య విలలాప సుదుఃఖితా.

ప్ర. అ. తతః=పిమ్మట, తారా=తార, శిబికాతలశాయినమ్=శిబికపై శయనించి యున్న, పతిమ్=భర్తను, దృష్ట్వా=చూచి, సుదుఃఖితా=చాల దుఃఖించుచున్నదై, తస్య=అతనియొక్క, శిరః=శిరస్సును, అఙ్కే=ఒడిలో, ఆరోప్య=ఉంచుకొని, విలలాప=విలపించెను.

తా. అపుడు తార శిబికపై శయనించి యున్న భర్తను చూచి దుఃఖాక్రాంతురాలై ఆతని తల ఒడిలో ఉంచుకొని విలపించెను. 38

మూ. హా! వానరమహారాజ హా నాథ మమ వత్సల! 39
హా మహార్హ! మహాబాహో! హా మమ ప్రియ పశ్య మామ్.
జనం న పశ్యసీమం త్వం కస్మాచ్ఛోకాభిపీడితమ్. 40

ప్ర. అ. హా వానరమహారాజ!=అయ్యో! ఓ వానరమహారాజా! హా మమ నాథ=అయ్యో! నా నాథుడా!, హా మహార్హ!=ఓ శ్రేష్ఠుడా!, హా మహాబాహో!,=అయ్యో! ఓ మహాబాహూ! మమ=నాయొక్క, ప్రియ!=ప్రియుడా!, మామ్=నన్ను, పశ్య=చూడుము. త్వమ్=నీవు, శోకాభిపీడితమ్=శోకముచే పీడింపబడిన, ఇమం జనమ్=ఈ జనుని, కస్మాత్=ఎందువలన, న పశ్యసి=చూచుటలేదు.

తా. అయ్యో! ఓ వానరరాజా! అయ్యో! నా నాథుడా! ఓ వాత్సల్యవంతుడా! అయ్యో! మహాభోగములకు తగినవాడా! అయ్యో! ఓ మహాబాహూ! ఓ! నా ప్రియుడా! నన్ను చూడుము. శోకముచే పీడింపబడిన నన్ను నీవు చూడవేమి? 39-40

మూ. ప్రహృష్టమిహ తే వక్త్రం గతాసోరపి మానద!
అస్తార్కసమవర్ణం చ దృశ్యతే జీవతో యథా. 41

ప్ర. అ. మానద!=గౌరవము నిచ్చువాడా! గతాసోరపి=మరణించినవాడవైనను, తే=నీయొక్క, అస్తార్కసమవర్ణమ్=అస్తాద్రియందున్న సూర్యునితో సమానమైన వర్ణము గల, వక్త్రమ్=ముఖము, జీవతో యథా=జీవించియున్న వాని ముఖము వలె, ఇహ=ఇపుడు, ప్రహృష్టమ్=వికసించినదై, దృశ్యతే= చూడబడుచున్నది.

తా. ఓ గౌరవము నిచ్చువాడా! నీవు మరణించినను అస్తమించుచున్న సూర్యునితో సమానమైన వర్ణము గల నీ ముఖము జీవించియున్నప్పుడు వలె వికసించి యున్నది . 41

మూ. ఏష త్వాం రామరూపేణ కాలః కర్షతి వానర,
యేన స్మ విధవాః సర్వాః కృతా ఏకేషుణా రణే. 42

ప్ర. అ. వానర!=ఓ వానరుడా! ఏషః కాలః=ఈ యముడు, త్వామ్= నిన్ను, రామరూపేణ=రాముని రూపముతో, కర్షతి=లాగుచున్నాడు. యేన=ఏ రామునిచేత, రణే=యుద్ధమునందు, ఏకేషుణా=ఒక్క బాణముచేత, సర్వాః=మేమందరము, విధవాః=భర్త లేనివారముగా, కృతాః=చేయబడినామో!

తా. ఓ వానరరాజా! యముడు రాముని రూపములో వచ్చి నిన్ను లాగికొని పోవుచున్నాడు. అతడు యుద్ధములో ఒక్క బాణము ప్రయోగించి మమ్ముల నందరిని భర్త లేనివారినిగా చేసినాడు. 42

మూ. ఇమాస్తాస్తవ రాజేన్ద్ర! వానర్యోఽప్లవగాస్తవ,
పాదైర్వికృష్టమధ్వానమాగతాః కిం న బుధ్యసే. 43

ప్ర. అ. రాజేన్ద్ర!=ఓ రాజేంద్రుడా! తవ=నీయొక్క, తాః=ఆ, ఇమాః =ఈ, వానర్యః=వానరస్త్రీలు, అప్లవగాః=దుముకి నడవనివారై, పాదైః=పాదములతో, తవ=నీయొక్క, వికృష్టమ్=దూరమైన, అధ్వానమ్=మార్గమును, ఆగతాః=వచ్చినారు. కిమ్=ఎందువలన, న బుధ్యసే=నీవు గుర్తించుటలేదు.

తా. ఓ రాజేంద్రుడా! నీకు సంబంధించిన ఈ వానరస్త్రీ లందరు దుముకి ప్రయాణించకుండగా పాదములతో నడిచి నీ వెనుక ఇంత దూరము వచ్చినారు. నీవు ఎందువలన తెలిసికొనుటలేదు? 43

మూ. తవేష్టా నను చైవేమా భార్యాశ్చన్ద్రనిభాననాః,
ఇదానీం నేక్షసే కస్మాత్సుగ్రీవం ప్లవగేశ్వర! 44

ప్ర. అ. ప్లవగేశ్వర!=ఓ వానరరాజా! ఇమాః=ఈ, చన్ద్రనిభాననాః=చంద్రునితో సమానమైన ముఖములు గల, భార్యాః=భార్యలు, తవ=నీకు, ఇష్టాః నను=ఇష్టమైన వారు కదా. ఇదానీమ్=ఇపుడు, సుగ్రీవమ్=సుగ్రీవుని, కస్మాత్=ఎందువలన, నేక్షసే= చూచుటలేదు?

తా. ఓ వానరరాజా! చంద్రునితో సమానమైన ముఖములు గల ఈ భార్య లందరు నీకు ఇష్టమైనవారే కదా. వీరిని, సుగ్రీవుని ఇపుడు నీవు ఎందుకు చూచుటలేదు? 44

మూ. ఏతే హి సచివా రాజంస్తారప్రభృతయస్తవ,
పురవాసిజన శ్చాయం పరివార్య విషీదతి. 45

ప్ర. అ. రాజన్=ఓ రాజా! తారప్రభృతయః=తారుడు మొదలైన, ఏతే= ఈ, తవ సచివాః=నీ మంత్రులు, (దుఃఖించుచున్నారు). అయమ్=ఈ, పురవాసిజనః= పురములో నివసించు జనము, పరివార్య=చుట్టి నిలచి, విషీదతి= దుఃఖించుచున్నది.

తా. ఓ రాజా! తారుడు మొదలైన నీ మంత్రులు పురములో నివసించు జనులు నీ చుట్టూ నిలచి దుఃఖించుచున్నారు. 45

మూ. విసర్జయైనాన్ సచివాన్ యథాపురమరిన్దమ,
తతః క్రీడామహే సర్వా వనేషు మదనోత్కటాః. 46

ప్ర. అ. అరిన్దమ=ఓ శత్రుసంహారకుడా! ఏనాన్=ఈ, సచివాన్= మంత్రులను, యథాపురమ్=పూర్వమునందువలెనే, విసర్జయ=విడిచిపెట్టుము (పంపివేయుము). తతః=అటు పిమ్మట, మదనోత్కటాః=ఉత్కటమైన మన్మథుడు గల, సర్వాః=మేమందరము, వనేషు=వనములలో, క్రీడామహే=క్రీడించెదము.

తా. ఓ శత్రుసంహారకుడా! ఈ మంత్రులను పూర్వమునందు వలె వారి వారి స్థానములకు పంపివేయుము. పిమ్మట ఉత్కటమైన మన్మథుడు గల మేము నీతో వనములలో క్రీడించెదము. 46

మూ. ఏవం విలపతీం తారాం పతిశోకపరీవృతామ్,
ఉత్థాపయన్తి స్మ తదా వానర్యః శోకకర్శితాః. 47

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, విలపతీమ్=విలపించుచున్న, పతిశోకపరీవృతామ్ =భర్తృశోకముతో కూడిన, తారామ్=తారను, తదా=అపుడు, శోకకర్శితాః =శోకముచే కృశింపచేయబడిన, వానర్యః=వానరస్త్రీలు, ఉత్థాపయన్తి స్మ= లేవదీసిరి.

తా. భర్తృశోకముతో నిండిన తార ఈ విధముగా విలపించుచుండగా, అపుడు శోకముతో కృశించిన వానరస్త్రీలు ఆమెను లేవదీసిరి. 47

మూ. సుగ్రీవేణ తతః సార్ధం సోఽఙ్గదః పితరం రుదన్,
చితామారోపయామాస శోకేనాభిప్లుతేన్ద్రియః. 48

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః అఙ్గదః=ఆ అంగదుడు, సుగ్రీవేణ సార్ధమ్ =సుగ్రీవునితో కూడ, రుదన్=ఏడ్చుచు, శోకేన=శోకముచేత, అభిప్లుతేన్ద్రియః =నిండిన ఇంద్రియములు గలవాడై, పితరమ్=తండ్రిని, చితామ్=చితను, ఆరోపయామాస=ఎక్కించెను.

తా. పిమ్మట అంగదుడు సుగ్రీవునితో కలసి యేడ్చుచు, శోకముచే సరిగా

పనిచేయని ఇంద్రియములు కలవాడై తండ్రి శరీరమును చితపై ఎక్కించెను.

మూ. తతో௨గ్నిం విధివద్దత్త్వా సో௨పసవ్యం చకార హ,
పితరం దీర్ఘమధ్వానం ప్రస్థితం వ్యాకులేన్ద్రియః. 49

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః=అతడు, వ్యాకులేన్ద్రియః= వ్యాకులమైన ఇంద్రియములు గలవాడై, విధివత్=యథాశాస్త్రముగా, అగ్నిమ్= అగ్నిని, దత్త్వా=ఇచ్చి, దీర్ఘమ్=దీర్ఘమైన, అధ్వానమ్=మార్గమును గూర్చి, ప్రస్థితమ్=ప్రయాణమైన, పితరమ్=తండ్రిని, అపసవ్యం చకార=అప్రదక్షిణునిగా చుట్టూ తిరిగెను.

తా. వ్యాకులములైన ఇంద్రియములు గల అంగదుడు యథాశాస్త్రముగా చితకు నిప్పు ముట్టించి దీర్ఘప్రయాణమునకై వెళ్లుచున్న తండ్రికి చుట్టూ అప్రదక్షిణముగా తిరిగెను. 49

మూ. సంస్కృత్య వాలినం తం తు విధివత్ప్లవగర్షభాః,
ఆజగ్ము రుదకం కర్తుం నదీం శుభజలాం శివామ్. 50

ప్ర. అ. ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, తం వాలినమ్=ఆ వాలిని, విధివత్= యథాశాస్త్రముగా, సంస్కృత్య=సంస్కరించి, ఉదకం కర్తుమ్=ఉదకము చేయుటకు (జలతర్పణములు ఇచ్చుటకు), శుభజలామ్=పవిత్రమైన జలము గల, శివామ్ =మంగళకరమైన, నదీమ్=నదిని గూర్చి, ఆజగ్ముః=వచ్చిరి.

తా. వానరశ్రేష్ఠులు వాలికి దహనసంస్కారములు చేసి జలతర్పణము లిచ్చుటకై పవిత్రములైన ఉదకము గల మంగళప్రదమైన నది దగ్గరకు వెళ్లిరి. 50

మూ. తతస్తే సహితాస్తత్ర అఙ్గదం స్థాప్య చాగ్రతః,
సుగ్రీవతారాసహితాః సిషిచుర్వానరా జలమ్. 51

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుగ్రీవతారాసహితాః=సుగ్రీవునితోను, తారతోను కూడిన, తే వానరాః=ఆ వానరులు, తత్ర=అక్కడ, సహితాః= కూడినవారై, అఙ్గదమ్=అంగదుని, అగ్రతః=ఎదుట, స్థాప్య=ఉంచుకొని, జలమ్=జలమును సిషిచుః=తడిపిరి (ఇచ్చిరి).

తా. పిమ్మట సుగ్రీవునితోను, తారతోను గూడిన ఆ వానరు లందరు అంగదుని ముందు ఉంచుకొని, ఆ నదిదగ్గర చేరి జలతర్పణములు చేసిరి. 51

మూ. సుగ్రీవేణేవ దీనేన దీనో భూత్వా మహాబలః,
సమానశోకః కాకుత్స్థః ప్రేతకార్యాణ్యకారయత్. 52

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, కాకుత్స్థః=రాముడు, దీనేన= దీనుడైన, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమానశోకః=సమానమైన శోకము కలవాడై, దీనః=దీనుడుగా, భూత్వా=అయి, ప్రేతకార్యాణి= ప్రేతకార్యములను, అకారయత్=చేయించెను.

తా. మహాబలశాలియైన రాముడు దీనుడైన సుగ్రీవుని వలెనే శోకాక్రాంతుడై దీనుడై ఆతనిచేత ప్రేతకార్యమును చేయించెను. 52

మూ. తతస్తు తం వాలిన మగ్ర్యపౌరుషం
ప్రకాశమిక్ష్వాకువరేషుణా హతమ్,
ప్రదీప్య దీప్తాగ్నిసమౌజసం తదా
సలక్ష్మణం రామముపేయివాన్ హరిః. 53

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చవింశ స్సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అగ్ర్యపౌరుషమ్=శ్రేష్ఠమైన పౌరుషము గలవాడు, ప్రకాశమ్=ప్రసిద్ధుడు, ఇక్ష్వాకువరేషుణా=రాముని బాణముచేత, హతమ్=చంపబడినవాడు అయిన, అగ్నిసమౌజసమ్=ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన, తం వాలినమ్=ఆ వాలిని, ప్రదీప్య=దహనముచే సంస్కరించి, తదా=అప్పుడు, హరిః=వానరుడైన సుగ్రీవుడు, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, దీప్తాగ్నిసమౌజసమ్=ప్రజ్వలించుచున్న అగ్నితో సమమైన కాంతిగల, రామమ్= రాముని, ఉపేయివాన్=చేరినాడు.

తా. పిమ్మట శ్రేష్ఠమైన పరాక్రమము కలవాడు, ప్రసిద్ధుడు, రాముని బాణముచే చంపబడినవాడు అయిన ఆ వాలికి దహనసంస్కారము చేసి, సుగ్రీవుడు ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన తేజస్సు గల లక్ష్మణసహితుడైన రాముని వద్దకు వెళ్లెను. 53

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఇరువది ఐదవ సర్గ సమాప్తము

# అథ షడ్వింశః సర్గః

[సుగ్రీవుని రాజ్యాభిషేకనిమిత్తము కిష్కింధలోనికి రావలెనని హనుమంతుడు రాముని ప్రార్థించుట. నేను నగరములో ప్రవేశించను అని చెప్పి రాముడు సుగ్రీవుని రాజ్యాభిషేకమునకు అనుమతి ఇచ్చుట. సుగ్రీవాంగదుల అభిషేకము]

మూ. తతః శోకాభిసంతప్తం సుగ్రీవం క్లిన్నవాససమ్,
శాఖామృగమహామాత్రాః పరివార్యోపతస్థిరే. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శోకాభిసంతప్తమ్=శోకముచే తపింపచేయబడినవాడు, క్లిన్నవాససమ్=తడిసిన వస్త్రములు కలవాడు అయిన, సుగ్రీవమ్=సుగ్రీవుని, శాఖామృగమహామాత్రాః=మంత్రులైన వానరులు, పరివార్య= చుట్టుకొని, ఉపతస్థిరే=సేవించిరి.

తా. పిమ్మట మంత్రులైవ వానరు లందరు శోకముచే పీడింపబడిన, తడిసిన వస్త్రములు గల సుగ్రీవుని చుట్టు నిలిచి అతనిని సేవించిరి. 1

మూ. అభిగమ్య మహాబాహుం రామమక్లిష్టకారిణమ్,
స్థితాః ప్రాఞ్జలయః సర్వే పితామహమివర్షయః. 2

ప్ర. అ. సర్వే=ఆ వానరులందరు, పితామహమ్=బ్రహ్మదేవుని, ఋషయః ఇవ=ఋషులు వలె, మహాబాహుమ్=గొప్ప బాహువులు కలవాడు, అక్లిష్టకారిణమ్=క్లేశము లేకుండగా పనులు చేయువాడు అయిన, రామమ్=రాముని, అభిగమ్య=చేరి, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్లు గలవారై, స్థితాః=నిలబడిరి.

తా. ఆ వానరులందరు ఋషులు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి నట్లు మహాబాహువు, శ్రమ పడకుండ పనిచేయువాడు అయిన రాముని వద్దకు వెళ్లి నమస్కరించుచు నిలబడిరి. 2

మూ. తతః కాఞ్చనశైలాభ స్తరుణార్కనిభాననః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం హనూమాన్మారుతాత్మజః. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కాఞ్చనశైలాభః=మేరుపర్వతము వంటి కాంతి గలవాడు, తరుణార్కనిభాననః=లేత సూర్యునితో సమానమైన ముఖము గలవాడు, మారుతాత్మజః=వాయుకుమారుడు అయిన, హనూమాన్=హనుమంతుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. పిమ్మట మేరుపర్వతము వంటి కాంతి, బాలసూర్యునితో సమానమైన

ముఖము గల వాయుపుత్రుడైన హనుమంతుడు అంజలి ఘటించి ఇట్లు పలికెను.

మూ. భవత్ప్రసాదాత్కాకుత్స్థ పితృపైతామహం మహత్,
వానరాణాం సుదంష్ట్రాణాం సమ్పన్నబలశాలినామ్, 4
మహాత్మనాం సుదుష్ప్రాపం ప్రాప్తం రాజ్యమిదం ప్రభో.

ప్ర. అ. ప్రభో=ఓ ప్రభూ! కాకుత్స్థ=ఓ రామా! సుదంష్ట్రాణామ్=మంచి కోరలు గలవారు, సమ్పన్నబలశాలినామ్=అధికమైన బలముతో ప్రకాశించుచున్నవారు, మహాత్మనామ్=మహాత్ములు అయిన, వానరాణామ్=వానరులయొక్క, ఇదమ్=ఈ, పితృపైతామహమ్=తండ్రి తాతలకు సంబంధించిన, మహత్=గొప్పదైన, సుదుష్ప్రాపమ్=పొందుటకు చాల కష్టమైన, రాజ్యమ్=రాజ్యము, భవత్ప్రసాదాత్=నీ అనుగ్రహమువలన, ప్రాప్తమ్=పొందబడినది.

తా. ఓ! ప్రభూ! రామా! సుగ్రీవుడు, మంచి కోరలు కలవారు, అధికమైన బలముతో ప్రకాశించుచున్నవారు, బుద్ధిశాలురు అయిన వానరుల రాజ్యమును నీ యనుగ్రహమువలన పొందగలిగినాడు. తండ్రి తాతలకు సంబంధించిన ఈ గొప్ప రాజ్యము పొందుట చాలా కష్టమైన పని. 4

మూ. భవతా సమనుజ్ఞాతః ప్రవిశ్య నగరం శుభమ్, 5
సంవిధాస్యతి కార్యాణి సర్వాణి ససుహృద్గణః,
స్నాతోఽయం వివిధైర్గన్ధైరౌషధైశ్చ యథావిధి. 6

ప్ర. అ. అయమ్=ఈ సుగ్రీవుడు, ససుహృద్గణః=మిత్రగణముతో కూడినవాడై, భవతా=నీచేత, సమనుజ్ఞాతః=అనుజ్ఞ ఇవ్వబడినవాడై, శుభమ్= సుందరమైన, నగరమ్=నగరమును, ప్రవిశ్య=ప్రవేశించి, వివిధైః= అనేకవిధములైన, గన్ధైః=గంధములతోను, ఔషధైశ్చ=ఔషధములతోను, యథావిధి=యథాశాస్త్రముగ, స్నాతః=అభిషిక్తుడై, సర్వాణి=సమస్తమైన, కార్యాణి=కార్యములను, సంవిధాస్యతి=చేయగలడు.

తా. ఈ సుగ్రీవుడు మిత్రగణముతో గూడి నీ యనుజ్ఞచే సుందరమైన కిష్కింధానగరమును ప్రవేశించి, అక్కడ అనేకవిధములైన సుగంధద్రవ్యములతోను, ఔషధములతోను యథాశాస్త్రముగా రాజ్యాభిషిక్తుడై అన్ని కార్యములను చక్కపెట్టగలడు. 5, 6

మూ. అర్చయిష్యతి మాల్యైశ్చ రత్నైశ్చ త్వాం విశేషతః,
ఇమాం గిరిగుహాం రమ్యామభిగన్తుం త్వమర్హసి. 7
కురుష్వ స్వామిసంబన్ధం వానరాన్ సమ్ప్రహర్షయ.

ప్ర. అ. మాల్యైశ్చ=పుష్పమాలలతోను, రత్నైశ్చ=రత్నములతోను, విశేషతః=విశేషించి, త్వామ్=నిన్ను, అర్చయిష్యతి=పూజించగలడు. త్వమ్=నీవు, రమ్యామ్=సుందరమైన, ఇమామ్=ఈ, గిరిగుహామ్= పర్వతగుహారూపమైన కిష్కిం

ధానగరమును, అభిగన్తుమ్=పొందుటకు, అర్హసి= తగి యున్నావు. వానరాన్=వానరులను, స్వామి సంబన్ధమ్=ప్రభువుతో సంబంధమును, కురుష్వ=చేయుము. సమ్ప్రహర్షయ=సంతోషింపచేయుము.

తా. అతడు నీకు మాల్యములను రత్నములను (శ్రేష్ఠమైన వస్తువులను) సమర్పించి విశేషించి పూజించగలడు. నీవు సుందరమైన ఈ కిష్కింధానగరమునకు వచ్చి వానరులకు రాజును ఏర్పరచి వారికి ఆనందమును కలుగజేయుము. 7

మూ. ఏవముక్తో హనుమతా రాఘవః పరవీరహా, 8
ప్రత్యువాచ హనూమన్తం బుద్ధిమాన్ వాక్యకోవిదః.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః= పలుకబడిన, పరవీరహా=శత్రువీరులను సంహరించు వాడైన, వాక్యకోవిదః= మాటలలో పండితుడైన, బుద్ధిమాన్=బుద్ధిమంతుడైన, రాఘవః= రాముడు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. శత్రువీరసంహారకుడు, బుద్ధిమంతుడు, మాటలలో నేర్పరి అయిన రాముడు హనుమంతుని మాటలు విని ఆతనితో యిట్లనెను. 8

మూ. చతుర్దశ సమాః సౌమ్య! గ్రామం వా యది వా పురమ్, 9
న ప్రవేక్ష్యామి హనుమన్ పితుర్నిర్దేశపాలకః.

ప్ర. అ. సౌమ్య=ఓ సౌమ్యుడా! హనుమన్=ఓ హనుమంతుడా! పితుః= తండ్రియొక్క, నిర్దేశపాలకః=ఆజ్ఞను పాలించుచున్నవాడనై, చతుర్దశ= పదునాలుగు, సమాః=సంవత్సరములను, గ్రామం వా=గ్రామమును గాని, యది వా=లేక, పురమ్=పట్టణమును గాని, న ప్రవేక్ష్యామి=ప్రవేశించను.

తా. సౌమ్యుడవైన హనుమంతుడా! నేను నా తండ్రి ఆజ్ఞను పాలించుచు పదునాలుగు సంవత్సరములు గ్రామములోనికి గాని, పట్టణములోనికి గాని ప్రవేశించను. 9

మూ. సుసమృద్ధాం గుహాం దివ్యాం సుగ్రీవో వానరర్షభః, 10
ప్రవిష్టో విధివద్వీరః క్షిప్రం రాజ్యేఽభిషిచ్యతామ్.

ప్ర. అ. సుసమృద్ధామ్=చాల సమృద్ధమైన, దివ్యామ్=శ్రేష్ఠమైన, గుహామ్ = గుహను, (కిష్కింధను) ప్రవిష్టః = ప్రవేశించిన, వీరః= వీరుడైన, వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన , సుగ్రీవః = సుగ్రీవుడు, క్షిప్రమ్ = శీఘ్రముగా విధివత్ = యథాశాస్త్రముగా , రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్యతామ్ = అభిషేకింపబడుగాక!

తా. వానరశ్రేష్ఠుడు, వీరుడు అయిన సుగ్రీవుని సర్వసమృద్ధమైన

శ్రేష్ఠమైన కిష్కింధానగరమునకు తీసికొని వెళ్ళి వెంటనే యథాశాస్త్రముగా అతనికి రాజ్యాభిషేకము చేయుడు. 10

మూ. ఏవముక్త్వా హనూమన్తం రామః సుగ్రీవమబ్రవీత్, 11
వృత్తజ్ఞో వృత్తసమ్పన్నముదారబలవిక్రమమ్.

ప్ర. అ. వృత్తజ్ఞః = లౌకికప్రవృత్తిని ఎరిగిన, రామః = రాముడు, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, వృత్తసమ్పన్నమ్ = మంచినడవడికతో కూడినవాడు , ఉదారబలవిక్రమమ్ = గొప్ప బలము, పరాక్రమము కలవాడు అయిన, సుగ్రీవమ్ = సుగ్రీవుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. లోకవ్యవహారము బాగుగా తెలిసిన రాముడు హనుమంతునితో ఇట్లు చెప్పి సదాచారసంపన్నుడు, ఉత్తమమైన బలపరాక్రమములు గలవాడు అయిన సుగ్రీవునితో యిట్లు పలికెను. 11

మూ. ఇమమప్యఙ్గదం వీరం యౌవరాజ్యేఽభిషేచయ, 12
జ్యేష్ఠస్య హి సుతో జ్యేష్ఠః సదృశో విక్రమేణ చ,
అఙ్గదోఽయమదీనాత్మా యౌవరాజ్యస్య భాజనమ్. 13

ప్ర. అ. వీరమ్ = వీరుడైన, ఇమమ్ = ఈ, అఙ్గదమపి = అంగదుని కూడ, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేచయ = అభిషిక్తుని చేయుము. జ్యేష్ఠస్య =నీ యన్నగారైన వాలియొక్క, జ్యేష్ఠః సుతః =పెద్ద కుమారుడు, విక్రమేణ=పరాక్రమముచేత, సదృశః = సమానుడు, అదీనాత్మా = దీనము గావి మనస్సు గలవాడైన, అయమ్ అఙ్గదః = ఈ అంగదుడు, యౌవరాజ్యస్య = యౌవరాజ్యమునకు, భాజనమ్ = పాత్రమైనవాడు.

తా. వీరుడైన ఈ అంగదుని యౌవరాజ్యాభిషిక్తుని చేయుము. మీ అన్నగారి పెద్దకుమారుడు పరాక్రమముచేత అతనితో సమానుడు, ఉత్సాహవంతుడు అయిన ఈ అంగదుడు యౌవరాజ్యమునకు తగినవాడు. 12,13

మూ. పూర్వోఽయం వార్షికో మాసః శ్రావణః సలిలాగమః,
ప్రవృత్తాః సౌమ్య చత్వారో మాసా వార్షికసంజ్ఞితాః. 14

ప్ర. అ. సౌమ్య! = ఓ సౌమ్యుడా, వార్షికసంజ్ఞితాః = వర్షమునకు సంబంధించిన వని పేరు గల, చత్వారః మాసాః =నాలుగు మాసములు, ప్రవృత్తాః = ప్రారంభమైనవి. అయమ్ =ఇది, సలిలాగమః = అధికవర్షములు వచ్చు, వార్షికః = వర్షకాలసంబంధమైన , పూర్వః = మొదటిదైన, శ్రావణః మాసః = శ్రావణమాసము.

తా. ఓ సౌమ్యుడా ! వర్షకాల మని చెప్పబడు నాలుగు మాసముల

కాలము ప్రారంభ మైనది . ఆ వర్షకాలములో ఇది ఎక్కువ వర్షములు కురియు శ్రావణమాసము. 14

మూ. నాయముద్యోగసమయః ప్రవిశ త్వం పురీం శుభామ్,
అస్మిన్వత్స్యామ్యహం సౌమ్య పర్వతే సహ లక్ష్మణః. 15

ప్ర. అ. సౌమ్య! = ఓ సౌమ్యుడా! అయమ్ = ఇది, ఉద్యోగసమయః = ప్రయత్నమునకు సమయము, న = కాదు. త్వమ్ = నీవు, శుభామ్ = సుందరమైన, పురీమ్ = పట్టణమును, ప్రవిశ = ప్రవేశించుము. అహమ్ = నేను, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడనై, అస్మిన్ పర్వతే = ఈ పర్వతమునందు, వత్స్యామి = నివసించగలను.

తా. ఓ సౌమ్యుడా! సీతాన్వేషణప్రయత్నము చేయుటకు తగిన సమయము కాదు. నీవు సుందరమైన కిష్కింధానగరమునకు వెళ్లుము. నేను లక్ష్మణసహితుడనై ఈ పర్వతముమీద నివసించెదను. 15

మూ. ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్తమారుతా,
ప్రభూతసలిలా సౌమ్య! ప్రభూతకమలోత్పలా. 16

ప్ర. అ. సౌమ్య! = ఓ సౌమ్యుడా ! ఇయమ్ = ఈ, గిరిగుహా = పర్వతగుహ, రమ్యా = సుందరమైనది. విశాలా = విశాలమైనది. యుక్తమారుతా = తగిన వాయువు గలది, ప్రభూతసలిలా = అధికమైన ఉదకము గలది, ప్రభూతకమలోత్పలా = అధికమైన కమలములు కలువలు కలది.

తా. ఓ సౌమ్యుడా! రమ్యమైన ఈ పర్వతగుహ విశాలముగా ఉన్నది. గాలి చక్కగా వీచుచున్నది. ఇచట ఉదకము, పద్మములు, కలువలు సమృద్ధిగా లభించుచున్నవి. 16

మూ. కార్తికే సమనుప్రాప్తే త్వం రావణవధే యత,
ఏష నః సమయః సౌమ్య ప్రవిశ త్వం స్వమాలయమ్. 17
అభిషిఞ్చస్వ రాజ్యే చ సుహృదః సమ్ప్రహర్షయ.

ప్ర. అ. కార్తికే = కార్తికమాసము, సమనుప్రాప్తే = వచ్చిన దగుచుండగా, త్వమ్ = నీవు, రావణవధే = రావణుని వధ విషయమున, యత = ప్రయత్నించుము. సౌమ్య ! = ఓ సౌమ్యుడా ! ఏషః = ఇది, నః = మనయొక్క, సమయః = ఒడబాటు. త్వమ్ = నీవు, స్వమ్ = నీ సంబంధమైన, ఆలయమ్ = గృహమును, ప్రవిశ = ప్రవేశించుము. రాజ్యే =రాజ్యమునందు, అభిషిఞ్చస్వ=అభిషిక్తుడ వగుము. సుహృదః = మిత్రులను, సమ్ప్రహర్షయ = సంతోషపెట్టుము.

తా. ఓ సౌమ్యుడా! కార్తికమాసము వచ్చిన పిమ్మట నీవు రావణ

వధవిషయమున ప్రయత్నించుము. ఇదియే మన ఒడంబడిక. ఇప్పుడు నీవు నీ యింటికి వెళ్లుము. నీవు రాజ్యాభిషిక్తుడవై మిత్రులకు సంతోషము కలిగించుము.

మూ. ఇతి రామాభ్యనుజ్ఞాతః సుగ్రీవో వానరర్షభః, 18
ప్రవివేశ పురీం రమ్యాం కిష్కిన్ధాం వాలిపాలితామ్.

ప్ర. అ. ఇతి = ఇట్లు, రామాభ్యనుజ్ఞాతః = రామునిచేత అనుమతిం పబడిన, వానరర్షభః= వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవః = సుగ్రీవుడు, వాలిపాలితామ్ = వాలిచేత పరిపాలింపబడిన, రమ్యామ్ = సుందరమైన, కిష్కిన్ధాం పురీమ్ = కిష్కింధానగరమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు ఈ విధముగా రామునిచే అనుమతింపబడిన వాడై అంతవరకు వాలిచే పరిపాలింపబడిన సుందరమైన కిష్కింధానగరమును ప్రవేశించెను. 18

మూ. తం వానరసహస్రాణి ప్రవిష్టం వానరేశ్వరమ్, 19
అభివాద్య ప్రవిష్టాని సర్వతః పర్యవారయన్.

ప్ర. అ. వానరేశ్వరమ్ = వానరప్రభువైన, ప్రవిష్టమ్ = ప్రవేశించిన, తమ్ = ఆతనిని, అభివాద్య = నమస్కరించి, వానరసహస్రాణి = వానరులయొక్క సహస్రములు, ప్రవిష్టాని = ప్రవేశించినవై, సర్వతః = నలువైపుల , పర్యవారయన్ = చుట్టుకొని ఉండెను.

తా. వేలకొలది వానరులు నగరములో ప్రవేశించిన వానరరాజైన ఆ సుగ్రీవునకు నమస్కరించి ఆతని వెనుక నగరములో ప్రవేశించి నలువైపుల ఆతనిని చుట్టుకొని ఉండిరి. 19

మూ. తతః ప్రకృతయః సర్వా దృష్ట్వా హరిగణేశ్వరమ్, 20
ప్రణమ్య మూర్ధ్నా పతితా వసుధాయాం సమాహితాః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = ప్రకృతులు, హరిగణేశ్వరమ్ =వానరగణములకు ప్రభువైన సుగ్రీవుని, దృష్ట్వా = చూచి, మూర్ధ్నా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, సమాహితాః = సావధానచిత్తులై, వసుధాయామ్ = నేలమీద, పతితాః = పడిరి.

తా. పిమ్మట మంత్రులు మొదలగు ప్రకృతులు అందరు ఆ సుగ్రీవుని చూచి, శిరస్సు వంచి నమస్కరించుచు సావధానచిత్తులై నేలపై బడి నమస్కరించిరి.

మూ. సుగ్రీవః ప్రకృతీః సర్వాః సమ్భాష్యోత్థాప్య వీర్యవాన్, 21
భ్రాతురన్తఃపురం సౌమ్యం ప్రవివేశ మహాబలః.

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమము కలవాడు, మహాబలః=గొప్ప బలము

కలవాడు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, సర్వాః=సమస్తమైన, ప్రకృతీః= ప్రకృతులను, ఉత్థాప్య=లేవదీసి, సంభాష్య=పలకరించి, భ్రాతుః= సోదరునియొక్క, సౌమ్యమ్=సుందరమైన, అన్తఃపురమ్=అంతఃపురమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పరాక్రమవంతుడు, మహాబలశాలి అయిన సుగ్రీవుడు నేలపై బడి నమస్కరించుచున్న మంత్రులు మొదలగు వారిని లేవదీసి, వారితో మాటలాడి, అన్నగారి సుందరమైన అంతఃపురములో ప్రవేశించెను. 21

మూ. ప్రవిష్టం భీమవిక్రాన్తం సుగ్రీవం వానరర్షభమ్, 22
అభ్యషిఞ్చన్త సుహృదః సహస్రాక్షమివామరాః.

ప్ర. అ. ప్రవిష్టమ్=అంతఃపురములో ప్రవేశించిన, భీమవిక్రాన్తమ్=భయంకరమైన విక్రమముగల, వానరర్షభమ్=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవమ్=సుగ్రీవుని, సుహృదః =స్నేహితులు, అమరాః=దేవతలు, సహస్రాక్షమ్ ఇవ=దేవేంద్రునివలె, అభ్యషిఞ్చన్త =అభిషేకించిరి.

తా. భయంకరమైన పరాక్రమము గలవాడు, వానరశ్రేష్ఠుడు అయిన సుగ్రీవుడు లోపల ప్రవేశించిన పిమ్మట, దేవతలు ఇంద్రునకు వలె, ఆతని మిత్రులు అతనికి రాజ్యాభిషేకము చేసిరి. 22

మూ. తస్య పాణ్డురమాజహ్రుశ్ఛత్రం హేమపరిష్కృతమ్. 23
శుక్లే చ వాలవ్యజనే హేమదణ్డే యశస్కరే,
తథా రత్నాని సర్వాణి సర్వబీజౌషధాని చ. 24
సక్షీరాణాం చ వృక్షాణాం ప్రరోహాన్ కుసుమాని చ.
శుక్లాని చైవ వస్త్రాణి శ్వేతం చైవానులేపనమ్. 25
సుగన్ధీని చ మాల్యాని స్థలజాన్యమ్బుజాని చ,
చన్దనాని చ దివ్యాని గన్ధాంశ్చ వివిధాన్ బహూన్. 26
అక్షతం జాతరూపం చ ప్రియఙ్గుమధుసర్పిషీ,
దధి చర్మ చ వైయాఘ్రం పరార్థ్యే చాప్యుపానహౌ, 27
సమాలంబనమాదాయ గోరోచనం మనశ్శిలామ్,
ఆజగ్ముస్తత్ర ముదితా వరాః కన్యాశ్చ షోడశ. 28

ప్ర. అ. పాణ్డురమ్=తెల్లనిది, హేమపరిష్కృతమ్=బంగారముచేత అలంకరింపబడినది అయిన, ఛత్రమ్=ఛత్రమును, హేమదణ్డే=బంగారు దండముగల, యశస్కరే=కీర్తిని కలిగించు, శుక్లే=తెల్లని, వాలవ్యజనే చ= వింజామరలను, తస్య=ఆతనికి, ఆజహ్రుః=తీసికొనివచ్చిరి. తథా=మరియు, షోడశ=పదహారుగురు, ముదితాః=ఆనందముతో కూడిన, వరాః= శ్రేష్ఠలైన, కన్యాశ్చ=కన్యలు, సర్వాణి=సమస్తమైన, రత్నాని= రత్నములను, సర్వబీజౌషధాని చ=సమస్తమైన

బీజములను ఔషధములను, సక్షీరాణామ్=పాలతో కూడిన, వృక్షాణామ్=వృక్షముల యొక్క, ప్రరోహాన్= అంకురములను,కుసుమాని చ=పుష్పములను, శుక్లాని=తెల్లని, వస్త్రాణి చైవ=వస్త్రములను, శ్వేతమ్=తెల్లని, అనులేపనం చైవ=మైపూతను, సుగన్ధీని=మంచి గంధము గల, మాల్యాని=మాలికలను, స్థలజాని= నేలపై పుట్టిన, అమ్బుజాని చ=పద్మములను, దివ్యాని=శ్రేష్ఠములైన, చన్దనాని చ=చందనములను, వివిధాన్=అనేకవిధములైన, బహూన్= అనేకమైన, గన్ధాంశ్చ=సుగంధద్రవ్యములను, అక్షతమ్=అక్షతలను,జాతరూపం చ=బంగారమును, ప్రియఙ్గుమధుసర్పిషీ=ప్రియంగుధాన్యమును తేనెను నేతిని, దధి=పెరుగును, వైయాఘ్రమ్=వ్యాఘ్రమునకు సంబంధించిన, చర్మ చ= చర్మను, పరార్థ్యౌ=శ్రేష్ఠములైన, ఉపానహౌ=పాదుకలను, సమాలమ్భనమ్=ఒంటికినలుగు పెట్టుకొను చూర్ణమును, గోరోచనమ్=గోరోచనమును, మనశ్శిలామ్=మనశ్శిలను, ఆదాయ=తీసికొని, తత్ర= అక్కడ, ఆజగ్ముః=వచ్చిరి.

తా. ఆ సుగ్రీవునికొరకై బంగారముచే అలంకరింపబడిన శ్వేతఛత్రమును, బంగారు దండములు గల కీర్తిని కలిగించు తెల్లని వింజామరలను తీసికొని వచ్చిరి. సంతోషించుచున్న పదహారుగురు ఉత్తమకన్యకలు అన్ని రత్నములను, అన్ని ధాన్యములను, ఓషధులను, పాలచెట్ల అంకురములను, పుష్పములను, తెల్లని వస్త్రములను, తెల్లని మైపూతను, సువాసన గల పుష్పములను, మెట్ట తామరపూవులను, శ్రేష్ఠములైన చందనములను, అనేకవిధములైన చాల సుగంధద్రవ్యములను, అక్షతలను, బంగారమును, ప్రియంగుధాన్యమును, తేనెను, నేతిని, పెరుగును, వ్యాఘ్రచర్మను, శ్రేష్ఠములైన పాదుకలను, ఒంటికి నలుగు పెట్టు చూర్ణమును గోరోచనమును మణిశిలను తీసికొని వచ్చిరి. 23-28

మూ. తతస్తే వానరశ్రేష్ఠమభిషేక్తుం యథావిధి,
రత్నైర్వస్త్రైశ్చ భక్ష్యైశ్చ తోషయిత్వా ద్విజర్షభాన్. 29

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రత్నైః=రత్నములచేతను, వస్త్రైశ్చ=వస్త్రములచేతను, భక్ష్యైః=భక్ష్యములచేతను, ద్విజర్షభాన్= బ్రాహ్మణశ్రేష్ఠులను, తోషయిత్వా=సంతోషపెట్టి, తే=వారు, యథావిధి= యథాశాస్త్రముగా, వానరశ్రేష్ఠమ్=వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుని, అభిషేక్తుమ్= అభిషేకించుటకు, (ప్రారంభించిరి)

తా. పిమ్మట ఆ వానరులు బ్రాహ్మణశ్రేష్ఠులకు రత్నములు, వస్త్రములు, భక్ష్యములు ఇచ్చి వారిని సంతోషపెట్టి, సుగ్రీవునకు యథావిధిగా అభిషేకము చేయ ప్రారంభించిరి. 29

మూ. తతః కుశపరిస్తీర్ణం సమిద్ధం జాతవేదసమ్,
మన్త్రపూతేన హవిషా హుత్వా మన్త్రవిదో జనాః. 30

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మన్త్రవిదః=మంత్రవేత్తలైన, జనాః= జనులు, కుశపరిస్తీర్ణమ్=చుట్టూ దర్భలు పరిచిన, సమిద్ధమ్= ప్రజ్వలించుచున్న, జాతవేదసమ్=అగ్నిని, మన్త్రపూతేన=మంత్రముచే పవిత్రమైన, హవిషా=హవిస్సుతో, హుత్వా=హోమముచేసి పూజించిరి.

తా. పిమ్మట మంత్రవేత్తలైన జనులు చుట్టూ దర్భలు పరిచిన ప్రజ్వలించుచున్న అగ్నితో మంత్రములచే పవిత్రమైన హవిస్సును హోమము చేసిరి.

మూ. తతో దేవప్రతిష్ఠానే వరాస్తరణసంవృతే,
ప్రాసాదశిఖరే రమ్యే చిత్రమాల్యోపశోభితే. 31
ప్రాఙ్ముఖం విధివన్మన్త్రైః స్థాపయిత్వా వరాసనే,
నదీనదేభ్యః సంహృత్య తీర్థేభ్యశ్చ సమన్తతః. 32
ఆహృత్య చ సముద్రేభ్యః సర్వేభ్యో వానరర్షభాః.
అపః కనకకుమ్భేషు నిధాయ విమలం జలమ్. 33
శుభై ర్వృషభశృఙ్గైశ్చ కలశైశ్చైవ కాఞ్చనైః,
శాస్త్రదృష్టేన విధినా మహర్షివిహితేన చ. 34
గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః,
మైన్దశ్చ ద్వివిదశ్చైవ హనుమాన్ జామ్బవాంస్తథా. 35
అభ్యషిఞ్చన్త సుగ్రీవం ప్రసన్నేన సుగన్ధినా,
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హేమప్రతిష్ఠానే=బంగారు ఆధారభూమి కల, వరాస్తరణసంవృతే=శ్రేష్ఠమైన ఆస్తరణములచే కప్పబడిన, చిత్రమాల్యోపశోభితే= చిత్రములైన మాలికలచే ప్రకాశింపచేయబడిన, రమ్యే=సుందరమైన, ప్రాసాదశిఖరే=ప్రాసాదముయొక్క అగ్రభాగమునందు, వరాసనే=శ్రేష్ఠమైన ఆసనమునందు, మన్త్రైః=మంత్రములతో, విధివత్=యథాశాస్త్రముగా, ప్రాఙ్ముఖమ్=తూర్పు వైపు ముఖము కలవానినిగా, స్థాపయిత్వా=కూర్చుండబెట్టి, నదీనదేభ్యః= నదులనుండి, కొండకాలువలనుండి, సమన్తతః=అన్ని ప్రాంతములందు ఉన్న, తీర్థేభ్యశ్చ=తీర్థములనుండి, అపః=ఉదకమును, సంహృత్య= తీసికొనివచ్చి, సర్వేభ్యః=సమస్తమైన, సముద్రేభ్యః చ=సముద్రములనుండి కూడ, విమలమ్=నిర్మలమైన, జలమ్=జలమును, ఆహృత్య=తీసికొని వచ్చి, కనకకుమ్భేషు=బంగారు కుంభములలో, నిధాయ=ఉంచి, వానరర్షభాః= వానరశ్రేష్ఠులైన, గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, గవయః= గవయుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గన్ధమాదనుడు, మైన్దశ్చ= మైందుడు, ద్వివిదశ్చైవ=ద్వివిదుడు, హనూమాన్=హనుమంతుడు, తథా= మరియు, జామ్బవాన్=జాంబవంతుడు, ప్రసన్నేన=నిర్మలమైన, సుగంధినా= మంచి సువాసన గల, సలిలేన=ఉదకముతో, శాస్త్రదృష్టేన=శాస్త్రములలో చూడబడిన, మహర్షి

విహితేన చ=మహర్షులచేత చెప్పబడిన, విధినా=విధిచేత, శుభైః=మంగళకరములైన, వృషభశృఙ్గైశ్చ=వృషభముల కొమ్ములచేతను, కాఞ్చనైః= బంగారు వికారమైన, కలశై శ్చైవ=కలశలచేతను, వసవః=వసువులు, సహస్రాక్షమ్=వెయ్యి కన్నులు గల, వాసవం యథా=ఇంద్రుని వలె, అభ్యషిఞ్చన్త=అభిషేకము చేసిరి.

తా. పిమ్మట ఆ వానరశ్రేష్ఠులు పూర్వాభిముఖముగా ప్రవహించు నదుల నుండి, పశ్చిమాభిముఖముగా ప్రవహించు నదములనుండి, దేశములో అంతటా ఉన్న తీర్థములనుండి, సకలసముద్రములనుండి, జలమును తీసికొనివచ్చి దానిని బంగారు కుంభములలో ఉంచిరి. బంగారపు స్తంభములు కలది, చిత్రములైన పుష్పమాలలతో ప్రకాశింపచేయబడినది, శ్రేష్ఠములైన ఆస్తరణములచే కప్పబడినది అయిన, రమ్యమైన ప్రాసాదాగ్రమునందు ఆ సుగ్రీవుని శ్రేష్ఠమైన ఒక ఆసనముపై మంత్రోచ్చారణము చేయుచు తూర్పుగా ముఖము ఉండు నట్లు యథాశాస్త్రముగా కుర్చుండబెట్టిరి. పిమ్మట శాస్త్రములలో చెప్పిన, మహర్షులు విధించిన విధానమును అనుసరించుచు, గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గన్ధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు, హనుమంతుడు, జాంబవంతుడు నిర్మలము, సువాసనతో కూడినది అయిన ఆ ఉదకమును పవిత్రములైన వృషభముల కొమ్ములతోను, బంగారు కలశలతోను గ్రహించి వసువులు దేవేంద్రునికి అభిషేకము చేసినట్లు ఆతనికి అభిషేకము చేసిరి. 31-36

మూ. అభిషిక్తే తు సుగ్రీవే సర్వే వానరపుఙ్గవాః,
ప్రచుక్రుశుర్మహాత్మానో హృష్టాః శతసహస్రశః. 37

ప్ర. అ. సుగ్రీవే=సుగ్రీవుడు, అభిషిక్తే=అభిషేకించబడినవాడగుచుండగా, శతసహస్రశః=వందలకొలది వేలకొలది ఉన్న, సర్వే=సమస్తమైన, మహాత్మానః=గొప్ప బుద్ధిగల, వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, హృష్టాః= సంతోషించినవారై, ప్రచు క్రుశుః=అరిచిరి.

తా. వందలకొలది వేలకొలది ఉన్న మహాత్ములైన ఆ వానరశ్రేష్ఠ లందరు సుగ్రీవుడు రాజ్యాభిషిక్తు డైనందుకు సంతోషించుచు కోలాహలము చేసిరి. 37

మూ. రామస్య తు వచః కుర్వన్ సుగ్రీవో వానరేశ్వరః,
అఙ్గదం సమ్పరిష్వజ్య యౌవరాజ్యేఽభ్యషేచయత్. 38

ప్ర. అ. వానరేశ్వరః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామస్య= రాము నియొక్క, వచః=వచనమును, కుర్వన్=చేయుచు, అఙ్గదమ్= అంగదుని, సమ్పరి ష్వజ్య=కౌగలించుకొని, యౌవరాజ్యే=యౌవరాజ్యమునందు, అభ్యషేచయత్=అభిషి క్తుని చేయించెను.

తా. వానరరాజైన సుగ్రీవుడు అంగదుని ప్రేమపూర్వకముగా కౌగలించుకొని

రామాజ్ఞానుసారము ఆతనిని యౌవరాజ్యములో అభిషిక్తుని చేసెను. 38

మూ. అఙ్గదే చాభిషిక్తే తు సానుక్రోశాః ప్లవఙ్గమాః,
సాధు సాధ్వితి సుగ్రీవం మహాత్మానో హ్యపూజయన్. 39

ప్ర. అ. అఙ్గదే చ=అంగదుడు కూడ, అభిషిక్తే తు= అభిషేకింపబడినవాడగు చుండగా, సానుక్రోశాః=అంగదునిపై దయతో కూడిన, మహాత్మానః=మహాత్ములైన, ప్లవఙ్గమాః=వానరులు, సాధు సాధు ఇతి= బాగు బాగు అని, సుగ్రీవమ్=సుగ్రీవుని, అపూజయన్=పూజించిరి.

తా. అంగదునకు కూడ యౌవరాజ్యాభిషేకము జరుగుటచే ఆతని విషయమున జాలి గల మహాత్ములైన వానరులు "మంచి పని చేసితివి; మంచి పని చేసితివి;" అని సుగ్రీవుని కొనియాడిరి. 39

మూ. రామం చైవ మహాత్మానం లక్ష్మణం చ పునః పునః,
ప్రీతాశ్చ తుష్టువుః సర్వే తాదృశే తత్ర వర్తిని. 40

ప్ర. అ. తత్ర=అక్కడ, తాదృశే=అట్టి అభిషేకకార్యము, వర్తిని= జరుగుచుం డగా, సర్వే=అందరు, ప్రీతాశ్చ=సంతోషించినవారై, మహాత్మానమ్=మహాత్ముడైన, రామం చైవ=రాముని, లక్ష్మణం చ= లక్ష్మణుని, పునః పునః=మాటి మాటికి, తుష్టువుః=స్తుతించిరి.

తా.అక్కడ, ఆ రాజ్యాభిషేకకార్యము జరుగుచుండగా అందరు సంతోషించి మహాత్ములైన రామలక్ష్మణులను మాటి మాటికి స్తుతించిరి. 40

మూ. హృష్టపుష్టజనాకీర్ణా పతాకాధ్వజశోభితా,
బభూవ నగరీ రమ్యా కిష్కిన్ధా గిరిగహ్వరే. 41

ప్ర. అ. గిరిగహ్వరే=పర్వతగుహలో ఉన్న, పతాకాధ్వజశోభితా=పతాక లచేతను ధ్వజములచేతను అలంకరింపబడిన, రమ్యా=రమ్యమైన, కిష్కిన్ధా నగరీ= కిష్కింధానగరము, హృష్టపుష్టజనాకీర్ణా=సంతోషించిన పరిపుష్టులైన జనులతో వ్యాప్తము, బభూవ=అయెను.

తా. పతాకలతోను ధ్వజములతోను అలంకరింపబడి రెండు పర్వతముల మధ్య నున్న రమ్యమైన ఆ కిష్కింధానగరము సంతోషించుచు ఆరోగ్యవంతులై ఉన్న జనులతో నిండి యుండెను. 41

మూ. నివేద్య రామాయ తదా మహాత్మనే
మహాభిషేకం కపివాహినీపతిః,

రుమాం చ భార్యాముపలభ్య వీర్యవా
నవాప రాజ్యం త్రిదశాధిపో యథా. 42

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షడ్వింశః సర్గః.

ప్ర. అ. తదా=అపుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, కపివాహినీపతిః=వానరసేనానాయకుడైన సుగ్రీవుడు, మహాత్మనే=మహాత్ముడైన, రామాయ= రామునకు, మహాభిషేకమ్=ఆ గొప్ప రాజ్యాభిషేకమును, నివేద్య=తెలిపి, భార్యామ్=భార్యయైన, రూమాం చ=రుమను, ఉపలభ్య=పొంది, త్రిదశాధిపో యథా=ఇంద్రుడువలె, రాజ్యమ్=రాజ్యమును, అవాప=పొందెను.

తా. పరాక్రమశాలియైన ఆ సుగ్రీవుడు తనకు రాజ్యాభిషేకము జరిగినదని మహాత్ముడైన రామునకు తెలిపి, భార్యయైన రుమను మరల పొంది, దేవేంద్రుని వలె రాజ్యమును పొందెను. 42

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఇరువది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తవింశః సర్గః

*[ప్రస్రవణగిరిమీద నివసించుచున్న రామలక్ష్మణులు మాటలాడుకొనుట]*

మూ. అభిషిక్తే తు సుగ్రీవే ప్రవిష్టే వానరే గుహామ్,
ఆజగామ సహ భ్రాత్రా రామః ప్రస్రవణం గిరిమ్. 1

ప్ర. అ. అభిషిక్తే=రాజ్యాభిషిక్తుడైన, వానరే=వానరుడైన, సుగ్రీవే= సుగ్రీవుడు, గుహామ్=గుహను(కిష్కింధను) ప్రవిష్టే=ప్రవేశించిన వాడగుచుండగా, రామః=రాముడు, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, ప్రస్రవణం గిరిమ్=ప్రస్రవణపర్వతమును గూర్చి, ఆజగామ=వచ్చెను.

తా. రాజ్యాభిషిక్తుడైన సుగ్రీవుడు తన అనుమతి చెంది కిష్కింధానగరమునకు వెళ్లిన పిమ్మట రాముడు సోదరునితో కూడ ప్రస్రవణ పర్వతమును చేరెను.1.

మూ. శార్దూలమృగసంఘుష్టం సింహైర్భీమరవైర్వృతమ్,
నానాగుల్మలతాగూఢం బహుపాదపసఙ్కులమ్. 2
ఋక్షవానర గోపుచ్ఛైర్మార్జాలైశ్చ నిషేవితమ్,
మేఘరాశినిభం శైలం నిత్యం శుచికరం శివమ్. 3

ప్ర. అ. శార్దూలమృగసంఘుష్టమ్=పులులచేత, మృగములచేత, ధ్వనింపచేయబడినది, భీమరవైః=భయంకరమైన ధ్వనులు గల, సింహైః=సింహములతో, వృతమ్= కూడినది, నానాగుల్మలతాగూఢమ్=అనేకవిధములైన పొదలతోను, లతలతోను దట్టముగా నున్నది, బహుపాదపసఙ్కులమ్=అనేకవృక్షములతో నిండినది, ఋక్షవానరగోపుచ్ఛైః=ఎలుగుబంట్లచేతను, వానరములచేతను, కొండముచ్చులచేతను, మార్జాలైశ్చ=అడవిపిల్లులచేతను, నిషేవితమ్=సేవించబడినది, మేఘరాశినిభమ్=మేఘములయొక్క రాశులతో సమానమైనది, నిత్యమ్=ఎల్లప్పుడు, శుచికరమ్=పవిత్రత్వమును చేయునది, శివమ్=మంగళకరము అయిన, శైలమ్=శైలమును, (చేరెను)

తా. ప్రస్రవణపర్వతముపై పులుల ధ్వనులు మృగముల ధ్వనులు, వ్యాపించియుండెను. భయంకరముగా గర్జించుచున్న సింహములు దానిపై నివసించుచుండెను. అనేక విధములైన పొదలు, లతలు, అనేకవృక్షములు దట్టముగా ఉండెను. నిత్యము పవిత్రము మంగళకరము మేఘరాశి వలె ఉన్నది అయిన ఆ పర్వతముపై ఎలుగుబంట్లు, వానరములు, కొండముచ్చులు నివసించుచుండెను. 2, 3

మూ. తస్య శైలస్య శిఖరే మహతీమాయతాం గుహామ్,
ప్రత్య గృహ్ణత వాసార్థం రామః సౌమిత్రిణా సహ. 4

ప్ర. అ. రామః=రాముడు, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడ, తస్య శైలస్య=ఆ పర్వతముయొక్క, శిఖరే=శిఖరమునందు, మహతీమ్=గొప్పది, ఆయతామ్=దీర్ఘము అయిన, గుహామ్=గుహను, వాసార్థమ్= నివాసముకొరకు, ప్రత్యగృహ్ణాత=స్వీకరించెను.

తా. ఆ పర్వతముశిఖరమునందున్న ఒక విశాలమైన పెద్ద గుహను లక్ష్మణ సమేతుడైన రాముడు నివాసార్థమై స్వీకరించెను. 4

మూ. కృత్వా చ సమయం రామః సుగ్రీవేణ సహానఘః,
కాలయుక్తం మహద్వాక్యమువాచ రఘునన్దనః. 5
వినీతం భ్రాతరం భ్రాతా లక్ష్మణం లక్ష్మివర్ధనమ్.

ప్ర. అ. అనఘః=దోషములు లేనివాడు, రఘునన్దనః=రఘువంశీయులకు ఆనందము కలిగించువాడు, భ్రాతా=సోదరుడు అయిన, రామః=రాముడు, సుగ్రీవేణ సహ=సుగ్రీవునితో కూడ, సమయమ్=ఒడంబడికను, కృత్వా= చేసికొని, వినీతమ్=వినయవంతుడు, భ్రాతరమ్=సోదరుడు, లక్ష్మివర్ధనమ్=లక్ష్మిని వృద్ధిచేయువాడు అయిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, కాలయుక్తమ్=కాలములకు తగిన, మహత్=గొప్ప, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. దోషములు లేనివాడు, రఘువంశమునకు ఆనందము కలిగించువాడు అయిన రాముడు, సుగ్రీవునితో ఒడంబడిక చేసికొని, సోదరుడు, లక్ష్మిని వృద్ధి పొందించువాడు, వినయవంతుడు అయిన లక్ష్మణునితో ఆ సమయమునందు తగిన మంచి మాటలను ఇట్లు పలికెను. 5

మూ. ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్తమారుతా,
అస్యాం వత్స్యామ సౌమిత్రే వర్షరాత్రమరిన్దమ. 6

ప్ర. అ. అరిన్దమ=శత్రుసంహారకుడవైన, సౌమిత్రే=లక్ష్మణా! రమ్యా=సుందరమైన, ఇయమ్=ఈ, గిరిగుహా=పర్వతగుహ, విశాలా=విశాలమైనది. యుక్తమారుతా=తగినవాయువు గలది. వర్షరాత్రమ్=ఈ వర్షకాలమంతా, అస్యామ్=దీనియందు, వత్స్యామ=నివసించెదము.

తా. శత్రుసంహారకుడవైన ఓ లక్ష్మణా! ఈ పర్వతగుహ మంచి గాలి కలదై రమ్యముగాను విశాలముగాను ఉన్నది. ఈ వర్షకాలము దీనిలో నివసించెదము. 6

మూ. గిరిశృఙ్గమిదం రమ్యముత్తమం పార్థివాత్మజ, 7
శ్వేతాభిః కృష్ణతామ్రాభిః శిలాభిరుపశోభితమ్,
నానాధాతుసమాకీర్ణం నదీదర్దురసంయుతమ్. 8
వివిధైర్వృక్షషణ్డైశ్చ చారుచిత్రలతాయుతమ్,
నానావిహగసంఘుష్టం మయూరవరనాదితమ్. 9

మాలతీకున్దగుల్మైశ్చ సిందువారైః శిరీషకైః,
కదమ్బార్జునసర్జైశ్చ పుష్పితైరుపశోభితమ్. 10

ప్ర. అ. పార్థివాత్మజ=ఓ రాజకుమారా! శ్వేతాభిః=తెల్లనివి, కృష్ణతామ్రాభిః=నల్లనివి, ఎఱ్ఱనివి అయిన, శిలాభిః=శిలలచేత, ఉపశోభితమ్=ప్రకాశింపచేయబడినది, నానా ధాతుసమాకీర్ణమ్=అనేక విధములైన ధాతువులచేత వ్యాప్తమైనది, నదీదర్దురసంయుతమ్= నదులతోను, కప్పలతోను కూడినది, వివిధైః=అనేకవిధములైన, వృక్షషణ్డైశ్చ=వృక్షసముదాయములతో కూడినది, చారుచిత్రలతాయుతమ్=అందమైన చిత్రములైన, లతలతో కూడినది, నానావిహగసంఘుష్టమ్=అనేకవిధములైన పక్షులచేత ధ్వనింపచేయబడినది, మయూరవరనాదితమ్=శ్రేష్ఠములైన నెమళ్లచేత ధ్వనింపచేయబడినది, మాలతీకున్దగుల్మైశ్చ=మాలతీ తీగలయొక్క, మల్లెతీగలయొక్క పొదలచేత, సిందువారైః=సిందువారవృక్షములచేత, శిరీషకైః=శిరీషవృక్షములచేత, పుష్పితైః=పుష్పించిన, కదమ్బార్జున సర్జైశ్చ=కదంబ, - అర్జున - సర్జవృక్షములచేత, ఉపశోభితమ్=ప్రకాశింపచేయబడినది, ఉత్తమమ్= ఉత్తమము అయిన, ఇదమ్=ఈ, గిరిశృఙ్గమ్=పర్వతశిఖరము, రమ్యమ్=రమ్యమైనది.

తా. ఓ రాజకుమారా! ఉత్తమమైన ఈ పర్వతశిఖరము చాల రమ్యముగా ఉన్నది. అనేక విధములైన ధాతువులతో నిండిన ఈ పర్వతము తెలుపు నలుపు ఎరుపు రంగులలో ఉన్న శిలలతో ప్రకాశించుచున్నది. ఇక్కడ నదులు, కప్పలు, అనేక విధములైన వృక్షముల సముదాయములు, అందమైన చిత్రవర్ణములు గల లతలు అంతటా వ్యాపించి యున్నవి. ఇక్కడ నెమళ్ల ధ్వనులు అనేకవిధములైన ఇతర పక్షుల కూతలు వినబడుచున్నవి. పుష్పించిన మాలతీ లతల పొదలు, మల్లెతీగల పొదలు సిందువారములు, శిరీష - కదంబ - అర్జున - సర్జ వృక్షములు దీనికి ఎంతో శోభను కూర్చుచున్నవి. 7 - 10

మూ. ఇయం చ నళినీ రమ్యా ఫుల్లపఙ్కజమణ్డితా,
నాతిదూరే గుహాయా నౌ భవిష్యతి నృపాత్మజ. 11

ప్ర. అ. నృపాత్మజ!=ఓ రాజకుమారా! ఫుల్లపఙ్కజమణ్డితా= వికసించిన పద్మములచే అలంకరించబడిన, రమ్యా=రమ్యమైన, ఇయం నళినీ చ=ఈ పద్మసరస్సు కూడ, నౌ=మనయొక్క, గుహాయాః= గుహకు, నాతిదూరే=సమీపమునందు, భవిష్యతి=ఉండగలదు.

తా. ఓ లక్ష్మణా! వికసించిన పద్మములచే అలంకరింపబడి రమ్యముగానున్న ఈ పద్మసరస్సు మన గుహకు దగ్గరగా ఉండును. 11

మూ. ప్రాగుదక్ప్రవణే దేశే గుహా సాధు భవిష్యతి,
పశ్చాచ్చైవోన్నతా సౌమ్య! నివాతేయం భవిష్యతి. 12

ప్ర. అ. సౌమ్య!=ఓ సౌమ్యుడా! ప్రాగుదక్ప్రవణే=తూర్పు ఉత్తరముల

వైపు పల్లముగా నున్న, దేశే=ప్రదేశమునందు, గుహా= గుహ, సాధు=బాగుగ, భవిష్యతి=ఉండును. పశ్చాత్=వెనుక భాగమున, ఉన్నతా=ఎత్తైన, ఇయమ్=ఈ గుహ, నివాతా= అధికమైన గాలి లేనిదిగా, భవిష్యతి=ఉండును.

తా. ఓ సౌమ్యుడా! తూర్పువైపు ఉత్తరము వైపు పల్లముగా నున్న ప్రదేశములో ఉన్న ఈ గుహ మనకు అనుకూలముగా ఉండును. ఇది వెనుక భాగమున ఎత్తుగా ఉండుటచే ఎక్కువ గాలి లేకుండగా ఉండును. 12

మూ. గుహాద్వారే చ సౌమిత్రే శిలా సమతలా శివా,
కృష్ణా చైవాయతా చైవ భిన్నాఞ్జనచయోపమా. 13

ప్ర. అ. సౌమిత్రే=ఓ లక్ష్మణా! గుహాద్వారే= గుహద్వారమునందు, సమతలా=సమతలమైనది, శివా= మంగళకరమైనది, కృష్ణా=నల్లనిది, ఆయతా చైవ=పొడవుగా ఉన్నది, భిన్నాఞ్జనచయోపమా=కదిపిన కాటుక రాశితో సమానము అయిన, శిలా=శిల, ఉన్నది.

తా. ఓ లక్ష్మణా! గుహద్వారములో అందమైన, సమతలమైన, విశాలమైన శిల ఉన్నది. ఇది కాటుకరాశివలె నల్లగా ఉన్నది. 13

మూ. గిరిశృఙ్గమిదం తాత! పశ్య చోత్తరతః శుభమ్,
భిన్నాఞ్జనచయాకారమంభోధరమివోదితమ్. 14

ప్ర. అ. తాత!=తండ్రీ, ఉత్తరతః=ఉత్తరము వైపున, భిన్నాఞ్జనచయాకారమ్=కదపబడిన కాటుకరాశి వంటి ఆకారము కలది, ఉదితమ్=పైకి లేచిన, అంభోధరమివ=మేఘము వలె ఉన్నది అయిన, శుభమ్=మంగళకరమైన, ఇదమ్=ఈ,గిరిశృఙ్గమ్ పర్వతశిఖరమును, పశ్య=చూడుము.

తా. నాయనా! ఇక్కడి నుండి ఉత్తరమున అందమైన ఒక పర్వత శిఖర మున్నది; చూడుము. కదిపిన కాటుక రాశి వంటి ఆకారము గల ఈ శిఖరము పైకి లేచిన మేఘము వలె ఉన్నది. 14

మూ. దక్షిణస్యామపి దిశి స్థితం శ్వేతమివామ్బరమ్,
కైలాసశిఖరప్రఖ్యం నానాధాతువిరాజితమ్. 15

ప్ర. అ. దక్షిణస్యాం దిశి=దక్షిణదిక్కు యందు, స్థితమ్=ఉన్నది, శ్వేతమ్=తెల్లని, అమ్బరమివ=వస్త్రము వలె ఉన్నది, కైలాసశిఖర ప్రఖ్యమ్=కైలాసపర్వతశిఖరముతో సమానము, నానాధాతువిరాజితమ్= అనేకవిధములైన ధాతువులచేత ప్రకాశింపచేయబడినది, అయిన (ఆ శిఖరమును చూడుము)

తా. దక్షిణపు దిక్కున అనేక విధములైన ధాతువులతో ప్రకాశించుచున్న మరొక శిఖర మున్నది; చూడుము. తెల్లని వస్త్రము వలె ఉన్న ఈ శిఖరము కైలాసశిఖరము వలె ప్రకాశించుచున్నది. 15

మూ. ప్రాచీనవాహినీం చైవ నదీం భృశమకర్దమామ్,
గుహాయాః పరతః పశ్య త్రికూటే జాహ్నవీమివ. 16
చన్దనైస్తిలకైః సాలైస్తమాలైరతిముక్తకైః,
పద్మకైః సరలైశ్చైవ అశోకైశ్చైవ శోభితామ్. 17

ప్ర. అ. ప్రాచీనవాహినీమ్=తూర్పుగా ప్రవహించుచున్నది, భృశమ్= మిక్కిలి, అకర్దమామ్=బురద లేనిది, చన్దనైః=చన్దన వృక్షములచేత, తిలకైః=తిలకవృక్షములచేత, సాలైః=మద్దిచెట్లచేత, తమాలైః= తమాలవృక్షములచేత, అతిముక్తకైః=అతిముక్తకవృక్షములచేత, పద్మకైః=పద్మక వృక్షములచేత, సరళైశ్చైవ=సరళవృక్షములచేత, అశోకైశ్చైవ=అశోకవృక్షములచేత, శోభితామ్=ప్రకాశింపచేయబడినది, త్రికూటే=త్రికూటపర్వతమునందు, జాహ్నవీమివ=గంగానది వలె నున్న, నదీమ్=నదిని, గుహాయాః=గుహకు, పరతః= దూరముగా, పశ్య=చూడుము.

తా. గుహకు దూరముగా ఆ నది తూర్పు వైపు ప్రవహించుచున్నది. దీనిని చూడుము. దీనిలో బురద లేదు. ఇది త్రికూట పర్వతమునందు ప్రవహించుచున్న గంగ వలె నున్నది. దీని చుట్టూ ఉన్న చన్దన - తిలక - సాల - తమాల - అతిముక్తక - పద్మక - సరళ - అశోకవృక్షములు దీని శోభను అధికము చేయుచున్నవి. 16,17

మూ. వానీరైస్తిమిదైశ్చైవ వకులైః కేతకైరపి,
హిన్తాలైస్తినిశైర్నీపైర్వేతసైః కృతమాలకైః. 18
తీరజైః శోభితా భాతి నానారూపైస్తతస్తతః,
వసనాభరణోపేతా ప్రమదేవాఽభ్యలఙ్కృతా. 19

ప్ర. అ. తీరజైః=తీరములందు మొలచిన, నానారూపైః= అనేకరూపములుగల, తతస్తతః=ఆ యా ప్రదేశములలో ఉన్న, వానీరైః= వానీరములచేత, తిమిదైశ్చైవ=తిమిదములచేత, వకులైః=వకుల వృక్షములచేత, కేతకైరపి=మొగలి డొంకలచేత, హిన్తాలైః=హింతాల వృక్షములచేత, తినిశైః=తినిశ వృక్షములచేత, నీపవృక్షైః=నీప వృక్షములచేత, కృతమాలకైః=చేయబడిన పంక్తులుగల, వేతసైః= నీటిప్రబ్బలి తీగలచేత, శోభితా=శోభింపచేయబడినదై, వసనాభరణోపేతా= వస్త్రములతోను, అలంకారములతోను కూడిన, అభ్యలఙ్కృతా=అధికముగా అలంకరింపబడిన, ప్రమదేవ=స్త్రీ వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. ఈ నదీ తీరమున అనేకవిధములైన వృక్షములు అక్కడక్కడ పంక్తులు గట్టి ఉన్నవి. అట్టి వానీర - తిమిద - వకుల - కేతక - హింతాల - తినిశ - నీప - వేతసాదివృక్షములతో ఈ నది మంచి వస్త్రములను, అలంకారములను ధరించి చక్కగా అలంకరించుకొన్న యువతి వలె నున్నది.

మూ. శతశః పక్షిసఙ్ఘైశ్చ నానానాదవినాదితా,
ఏకైక మనురక్తైశ్చ చక్రవాకైరలఙ్కృతా. 20
పులినై రతిరమ్యైశ్చ హంససారససేవితా,
ప్రహసన్తీ భాత్యేషా నారీ సర్వవిభూషితా. 21

ప్ర. అ. శతశః=వందలకొలది, పక్షిసఙ్ఘైశ్చ= పక్షిసముదాయములచేత, నానానాదవినాదితా=అనేకవిధములైన కూతలచే ధ్వనింపచేయబడినది, ఏకైకమ్=పరస్పరము, అనురక్తైశ్చ=ప్రేమతో కూడిన, చక్రవాకైః=చక్రవాక పక్షులచేత, అలఙ్కృతా= అలంకరింపబడినది, అతిరమ్యైః=చాల సుందరములైన, పులినైః= ఇసుకతిన్నెలతో కూడినది, హంససారససేవితా=హంసలచేత సారసపక్షులచేత సేవింపబడినది యైన, ఏషా=ఈ నది, సర్వవిభూషితా=అంతటా అలంకరింపబడిన, ప్రహసన్తీ=నవ్వుచున్న, నారీవ=స్త్రీ వలె, భాతి =ప్రకాశించుచున్నది.

తా. ఈ నది సమీపమున వందలకొలది పక్షులు గుంపులుగా చేరి కూయుచున్నవి. పరస్పరము అనురాగముతో కూడిన చక్రవాకములు, హంసలు, సారసపక్షులు ఇక్కడ నివసించుచున్నవి. దీని తీరమునందు చాల సుందరములైన ఇసుకతిన్నెలు ఉన్నవి. ఈ విధముగా ఈ నది పూర్తిగా అలంకరించుకొని నవ్వుచున్న స్త్రీ వలె ఉన్నది. 20,21

మూ. క్వచిన్నీలోత్పలైశ్ఛన్నా భాతి రక్తోత్పలైః క్వచిత్,
క్వచిదాభాతి శుక్లైశ్చ దివ్యైః కుముదకుడ్మలైః. 22

ప్ర. అ. క్వచిత్=కొన్ని చోట్ల, నీలోత్పలైః=నల్ల కలువలచేతను, క్వచిత్=కొన్ని చోట్ల, రక్తోత్పలైః=ఎఱ్ఱకలువలచేతను, ఛన్నా= కప్పబడినదై, భాతి =ప్రకాశించుచున్నది. క్వచిత్=కొన్నిచోట్ల, శుక్లైశ్చ=తెల్లని, దివ్యైః=శ్రేష్ఠములైన, కుముదకుడ్మలైః= కలువల మొగ్గలచేత, ఆభాతి=ప్రకాశించుచున్నది.

తా. ఈ నది కొన్నిచోట్ల నల్లని కలువలతోను, కొన్ని చోట్ల ఎఱ్ఱని కలువలతోను, మరికొన్ని చోట్ల అందమైన తెల్ల కలువల మొగ్గలతోను ప్రకాశించుచున్నది. 22

మూ. పారిప్లవశతైర్జుష్టా బర్హిక్రౌఞ్చవినాదితా,
రమణీయా నదీ సౌమ్యా మునిసఙ్ఘనిషేవితా. 23

ప్ర. అ. పారిప్లవశతైః=వందలకొలది జలపక్షులచేత, జుష్టా= సేవించబడినది, బర్హిక్రౌఞ్చవినాదితా=నెమళ్లచేత, క్రౌంచపక్షులచేత ధ్వనింపచేయబడునది, మునిసఙ్ఘనిషేవితా=మునుల సముదాయముచే సేవింపబడునది, సౌమ్యా=సౌమ్యము అయిన, నదీ=నది, రమణీయా=సుందరమైనది.

తా. సౌమ్యమైన ఈ నది అనేక జలపక్షులతో కూడి అందముగా

ఉన్నది. ఇక్కడ నెమళ్ల ధ్వనులు, క్రౌంచపక్షుల రవములు ప్రతిధ్వనించుచున్నవి. ఎందరో మునులు ఈ నదిలో స్నానాదులు చేయుచున్నారు. 23

మూ. పశ్య చన్దనవృక్షాణాం పంక్తీః సురుచిరా ఇవ,
కకుభానాం చ దృశ్యన్తే మనసేవోదితాః సమమ్. 24

ప్ర. అ. చన్దనవృక్షాణామ్=చందన వృక్షములయొక్క, సురుచిరా ఇవ=చాలా అందముగా వున్న, పంక్తీః=పంక్తులను, పశ్య= చూడుము. సమమ్=ఒక్కమాటుగా, మనసా=మనస్సుచేత, ఉదితాః ఇవ=పుట్టినవా అన్నట్లున్న, కకుభానాం చ=కకుభవృక్షపంక్తులు కూడ, దృశ్యన్తే=చూడబడుచున్నవి.

తా. చాల అందముగా నున్న ఈ చందనవృక్షపంక్తులను చూడుము. కకుభవృక్షముల పంక్తులు కూడ మనస్సంకల్పముచే ఒకే సమయమునందు మొలచినవా అన్నట్లు ఉన్నవి. 24

మూ. అహో సురమణీయోఽయం దేశః శత్రునిషూదన,
దృఢం రంస్యావ సౌమిత్రే సాధ్వత్ర నివసావహే. 25

ప్ర. అ. శత్రునిషూదన!=శత్రుసంహారకుడవైన, సౌమిత్రే=లక్ష్మణా! అయమ్=ఈ, దేశః=ప్రదేశము, సురమణీయః=చాల అందమైనది. అహో=ఏమి ఆశ్చర్యము, అత్ర=ఇక్కడ, సాధు= బాగుగా, నివసావహే=నివసించెదము. దృఢమ్=నిశ్చయముగా, రంస్యావ=క్రీడించెదము (ఆనందించెదము).

తా. శత్రుసంహారకుడవైన ఓ లక్ష్మణా! ఈ ప్రదేశము ఎంత అందముగా నున్నది! ఇక్కడ మనము ఆనందముతో నివసించెదము. 25

మూ. ఇతశ్చ నాతిదూరే సా కిష్కిన్ధా చిత్రకాననా,
సుగ్రీవస్య పురీ రమ్యా భవిష్యతి నృపాత్మజ. 26

ప్ర. అ. నృపాత్మజ= ఓ రాజకుమారా! చిత్రకాననా= చిత్రములైన ఉద్యానములు కల, రమ్యా=సుందరమైన, సుగ్రీవస్య పురీ=సుగ్రీవుని పట్టణమైన, సా కిష్కిన్ధా=ఆ కిష్కింధ, ఇతః=ఇక్కడినుండి, నాతిదూరే=సమీపమునందు, భవిష్యతి=కాగలదు.

తా. ఓ లక్ష్మణా! చిత్రమైన ఉద్యానములతో రమ్యమైన సుగ్రీవనగరమైన ఆ కిష్కింధ ఇక్కడి నుండి దగ్గరలో ఉండును. 26

మూ. గీతవాదిత్రనిర్ఘోషః శ్రూయతే జయతాం వర,
నదతాం వానరాణాం చ మృదఙ్గాడమ్బరైః సహ. 27

ప్ర. అ. జయతాం వర!=జయించువారిలో శ్రేష్ఠుడా! గీతవాదిత్రనిర్ఘోషః=గానములయొక్క, వాద్యములయొక్క ధ్వని, నదతామ్=అరచుచున్న, వాన

రాణాం చ=వానరులయొక్క ధ్వని, మృదఙ్గాడమ్బరైః సహ=మృదంగములయొక్క ఆడంబరములతో కూడ, శ్రూయతే= వినబడుచున్నది.

తా. జయించువారిలో శ్రేష్ఠుడ వైన ఓ లక్ష్మణా! సంగీత వాద్యధ్వనులు, మృదంగధ్వనులు వానరులు చేయుధ్వనులు కిష్కింధనుండి వినబడుచున్నవి. 27

మూ. లబ్ధ్వా భార్యాం కపివరః ప్రాప్య రాజ్యం సుహృద్వృతః,
ధ్రువం నన్దతి సుగ్రీవః సమ్ప్రాప్య మహతీం శ్రియమ్. 28

ప్ర. అ. కపివరః=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, భార్యామ్=భార్యను, లబ్ధ్వా=పొంది, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్య=పొంది, మహతీమ్=గొప్పదైన, శ్రియమ్=ఐశ్వర్యమును, సమ్ప్రాప్య=పొంది, సహృద్వృతః=మిత్రులతోకూడినవాడై, నన్దతి=సంతోషించుచున్నాడు. ధ్రువమ్=నిశ్చయము.

తా. వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు భార్యను, రాజ్యమును, గొప్ప ఐశ్వర్యమును పొంది, స్నేహితులతో కలసి ఆనందించుచున్నాడు; నిశ్చయము.28

మూ. ఇత్యుక్త్వా న్యవసత్తత్ర రాఘవః సహలక్ష్మణః,
బహుదృశ్యదరీకుఞ్జే తస్మిన్ ప్రస్రవణే గిరౌ. 29

ప్ర. అ. రాఘవః =రాముడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా =పలికి, బహుదృశ్యదరీకుఞ్జే =అనేకమైన అందమైన గుహలు పొదలు గల, తస్మిన్ = ఆ, ప్రస్రవణే గిరౌ = ప్రస్రవణపర్వతమునందు, తత్ర = అక్కడ, సహలక్ష్మణః =లక్ష్మణసమేతుడై, న్యవసత్ =నివసించెను.

తా. రాముడు ఈ విధముగా పలికి అందమైన అనేకమైన గుహలు, పొదలు గల ఆ ప్రస్రవణపర్వతముపై ఆ ప్రదేశములో లక్ష్మణసహితుడై నివసించెను.

వి. ఈ సర్గలో ఐదవ శ్లోకము మొదలు 29వ శ్లోకము వరకు ఉన్న ఇరువది నాలుగు శ్లోకములు ప్రాచ్యప్రతిలో లేవు. రాముడు పర్వతమును వర్ణించుచు ఇంత దీర్ఘభాషణము చేయుట పర్వతశిఖరముపై మహానద్యాదులున్నట్లు వర్ణించుట అసహజముగానే ఉన్నవి. 29

మూ. సుసుఖే హి బహుద్రవ్యే తస్మిన్ హి ధరణీధరే,
వసతస్తస్య రామస్య రతిరల్పాపి నాఽభవత్. 30

ప్ర. అ. సుసుఖే = చాల సుఖకరము, బహుద్రవ్యే = అనేకమైన వస్తువులు కలది అయిన, తస్మిన్ = ఆ, ధరణీధరే = పర్వతమునందు, వసతః =నివసించుచున్నను, తస్య రామస్య = ఆ రామునకు , అల్పాఽపి = కొంచెము కూడ, రతిః = ఆనందము, నాభవత్ =కలుగలేదు.

తా. సుఖకరము, అనేకవస్తువులతో సమృద్ధము అయిన ఆ పర్వతముపై

నివసించుచున్నను రామునకు కొంచెము కూడ ఆనందము కలుగలేదు. 30

మూ. హృతాం హి భార్యాం స్మరతః ప్రాణేభ్యోఽపి గరీయసీమ్,
ఉదయాఽభ్యుదితం దృష్ట్వా శశాఙ్కం స విశేషతః. 31

ప్ర. అ. సవిశేషతః =విశేషించి, ఉదయాఽభ్యుదితమ్ = ఉదయపర్వతమునందు ఉదయించిన, శశాఙ్కమ్ =చంద్రుని, దృష్ట్వా = చూచి, హృతామ్ =హరింపబడిన, ప్రాణేభ్యోఽపి= ప్రాణములకంటె కూడ, గరీయసీమ్ = గొప్పదైన, భార్యామ్ =భార్యను, స్మరతః =స్మరించుచున్న, (ఆ రామునకు ఆనందము కలుగలేదు).

తా. విశేషించి ఉదయపర్వతముపై ఉన్న చంద్రుని చూడగానే ప్రాణములకంటె కూడ ఎక్కువ ప్రియురాలైన హరింపబడిన భార్యను స్మరించుటచే రామునకు ఆనందము కలుగలేదు. 31

మూ. ఆవివేశ న తం నిద్రా నిశాసు శయనం గతమ్,
తత్సముత్థేన శోకేన బాష్పోపహతచేతసమ్. 32

ప్ర. అ. తత్సముత్థేన = ఆ స్మరణముచే కలిగిన, శోకేన =దుఃఖముచేత, బాష్పోపహతచేతసమ్ =కన్నీటిచేత పీడింపబడిన చిత్తము గల, నిశాసు = రాత్రులందు, శయనమ్ =శయనమును, గతమ్ = పొందిన, తమ్ = ఆ రాముని, నిద్రా =నిద్ర, న ఆవివేశ =చేరలేదు.

తా. ఆ రాముడు రాత్రులందు శయనించి నపుడు భార్యాస్మరణముచే కలిగిన దుఃఖముచేత బాష్పములు ప్రవహించి మనస్సు కలుష మగుటచే నిద్ర రాలేదు. 32

మూ. తం శోచమానం కాకుత్స్థం నిత్యం శోకపరాయణమ్,
తుల్యదుఃఖోఽబ్రవీద్భ్రాతా లక్ష్మణోఽనునయన్వచః. 33

ప్ర. అ. శోచమానమ్ = దుఃఖించుచున్న, నిత్యమ్ = ఎల్లప్పుడు, శోకపరాయణమ్ = దుఃఖమునకు వశుడు అయిన, తమ్ =ఆ, కాకుత్స్థమ్ =రాముని, అనునయన్ = బ్రతిమాలుకొనుచు, తుల్యదుఃఖః = సమానమైన దుఃఖము కలవాడు, భ్రాతా =సోదరుడు అయిన, లక్ష్మణః =లక్ష్మణుడు, వచః =వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా శోకమునకు లొంగిపోయి దుఃఖించుచున్న ఆ రాముని ఓదార్చుచు, ఆతనితో సమానమైన దుఃఖము గల సోదరుడైన లక్ష్మణుడు ఇట్లు పలికెను. 33

మూ. అలం వీర! వ్యథాం గత్వా న త్వం శోచితుమర్హసి,
శోచతో హ్యావసీదన్తి సర్వార్థా విదితం హి తే. 34

ప్ర. అ. వీర! = ఓ వీరుడా! వ్యథామ్ =వ్యథను, గత్వా = పొంది, అలమ్ = చాలును. త్వమ్ =నీవు, శోచితుమ్ = దుఃఖించుటకు, న అర్హసి = తగవు. శోచతః = దుఃఖించువానియొక్క, సర్వార్థాః =అన్ని పనులు, అవసీదన్తి హి =చెడిపోవును కదా! తే = నీకు, విదితం హి = తెలియును కదా!

తా. ఓ వీరుడా! వ్యథ చెందకుము. నీవు దుఃఖించకూడదు. దుఃఖించు వాని పను లన్నీ చెడిపోవు నని నీకు తెలియును కదా! 34

మూ. భవాన్ క్రియాపరో లోకే భవాన్ దేవపరాయణః,
ఆస్తికో ధర్మశీలశ్చ వ్యవసాయీ చ రాఘవ. 35

ప్ర. అ. రాఘవ! = ఓ రామా! లోకే =లోకమునందు, భవాన్ =నీవు, క్రియాపరః = కార్యాచరణమునందు ఆసక్తి కలవాడవు. భవాన్ = నీవు, దేవపరాయణః =దేవతలయందు ఆసక్తి కలవాడవు. ఆస్తికః = ఆస్తికుడవు. ధర్మశీలశ్చ = ధర్మస్వభావము కలవాడవు. వ్యవసాయీ చ =ఉద్యమశీలుడవు.

తా. ఓ రామా! నీవు లోకములో చేయవలసిన కర్తవ్యములను చేయుచు వాటి ఫలము సిద్ధించుటకై దేవతలను కూడ పూజించుచుందువు. ఆస్తికుడవు. ధర్మస్వభావము కలవాడవు. ఎల్లపుడు ఉద్యమము చేయువాడవు. 35

మూ. న హ్యవ్యవసితః శత్రుం రాక్షసం తం విశేషతః,
సమర్థస్త్వం రణే హన్తుం విక్రమై ర్జిహ్మకారిణమ్. 36

ప్ర. అ. అవ్యవసితః = ఉద్యమము చేయని, త్వమ్ =నీవు, విక్రమైః = పరాక్రమములచేత, జిహ్మకారిణమ్ = కపటము చేసిన, శత్రుమ్ = శత్రువును, విశేషతః = విశేషించి, రాక్షసమ్ = రాక్షసుడైన, తమ్ =ఆ రావణుని, రణే = యుద్ధమునందు, హన్తుమ్ = చంపుటకు, సమర్థః న హి = సమర్థుడవు కాజాలవు కదా!

తా. నీవు ఉద్యమము చేయకపోయినచో కపటముగా ప్రవర్తించినవాడు, విశేషించి రాక్షసుడు అయిన ఆ శత్రువును యుద్ధమునందు పరాక్రమమును చూపి సంహరించుటకు సమర్థుడవు కాజాలవు. 36

మూ. సమున్మూలయ శోకం త్వం వ్యవసాయం స్థిరీకురు,
తతః సపరివారం తం రాక్షసం హన్తుమర్హసి. 37

ప్ర. అ. త్వమ్ = నీవు, శోకమ్ =దుఃఖమును, సమున్మూలయ = పెకలించివేయుము. వ్యవసాయమ్ = ఉద్యమమును, స్థిరీకురు = స్థిరముచేయుము.

తతః = అటు పిమ్మట, సపరివారమ్ =పరివారముతో కూడిన, తం రాక్షసమ్ = ఆ రాక్షసుని, హన్తుమ్ =చంపుటకు, అర్హాసి = తగి యున్నావు.

తా. నీవు పూర్తిగా దుఃఖమును విడిచిపెట్టి స్థిరమైన ప్రయత్నము చేయుము. అపుడు నీవు ఆ రాక్షసుని సపరివారముగా చంపగలిగెదవు. 37

మూ. పృథివీమపి కాకుత్‌స్థ ససాగరవనాచలామ్,
పరివర్తయితుం శక్తః కిం పునస్తం హి రావణమ్. 38

ప్ర.అ. కాకుత్‌స్థ = రామా! ససాగరవనాచలామ్ = సముద్రములతోను, అరణ్యములతోను, పర్వతములతోను కూడిన, పృథివీమపి = భూమిని కూడ, పరివర్తయితుమ్ = తలక్రిందులు చేయుటకు, శక్తః = సమర్థుడవు. తం రావణమ్ = ఆ రావణుని, కిం పునః = చెప్పనేల.

తా. ఓ రామా! నీవు సముద్రములతోను, అరణ్యములతోను, పర్వతములతోను కూడిన భూమిని కూడ తలక్రిందు చేయగలవు. రావణుని మాట చెప్పవలెనా! 38

మూ. శరత్కాలం ప్రతీక్షస్వ ప్రావృట్‌కాలోఽయమాగతః,
తతః సరాష్ట్రం సగణం రావణం తం వధిష్యసి. 39

ప్ర.అ. అయమ్=ఈ, ప్రావృట్‌కాలః = వర్షకాలము, ఆగతః = వచ్చినది. శరత్కాలమ్ = శరత్కాలమును, ప్రతీక్షస్వ = నిరీక్షించుము. తతః =అటు పిమ్మట, సరాష్ట్రమ్ = రాష్ట్రముతో కూడిన, సగణమ్ = గణముతో కూడిన, తం రావణమ్ = ఆ రావణుని, వధిష్యసి = చంపగలవు.

తా. ఇపుడు వర్షకాలము వచ్చినది. శరత్కాలము వచ్చువరకు వేచి ఉండుము. పిమ్మట రాష్ట్రపరివారములతో సహా ఆ రావణుని చంపగలవు. 39

మూ. అహం తు ఖలు తే వీర్యం ప్రసుప్తం ప్రతిబోధయే,
దీప్తైరాహుతిభిః కాలే భస్మచ్ఛన్నమివానలమ్. 40

ప్ర. అ. అహమ్=నేను, కాలే = హోమసమయమునందు, దీప్తైః = ప్రజ్వలించుచున్న, ఆహుతిభిః = ఆహుతులచేత, భస్మచ్ఛన్నమ్ = భస్మముచేత కప్పబడిన, అనలమ్ ఇవ = అగ్నినివలె, తే =నీయొక్క, ప్రసుప్తమ్ = నిద్రించిన, వీర్యమ్ = పరాక్రమమును, ప్రతిబోధయే ఖలు = లేపుచున్నాను కదా!

తా. బూడిద కప్పి ఉన్న అగ్నిని హోమసమయమునందు ప్రజ్వలించు ఆహుతులచేత ప్రజ్వలింపచేసి నట్లు నేను ఈ మాటలతో నీలో నిద్రించి ఉన్న పరాక్రమమును కేవలము మేల్కొలుపుచున్నాను. 40

మూ. లక్ష్మణస్య హి తద్వాక్యం ప్రతిపూజ్య హితం శుభమ్,
రాఘవః సుహృదం స్నిగ్ధమిదం వచనమబ్రవీత్. 41

ప్ర. అ. రాఘవః = రాముడు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, హితమ్ =హితము, శుభమ్ = శుభము అయిన, తత్ వాక్యమ్ =ఆ వాక్యమును, ప్రతిపూజ్య = ఆదరించి, సుహృదమ్ =మంచి హృదయము గలవాడు, స్నిగ్ధం = స్నేహము కలవాడు అయిన ఆ లక్ష్మణుని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. లక్ష్మణుడు పలికిన హితము, శుభకరము అయిన ఆ మాట విని రాముడు మంచి హృదయము కలవాడు, స్నేహవంతుడు అయిన అతనితో ఇట్లు పలికెను. 41

మూ. వాచ్యం యదనురక్తేన స్నిగ్ధేన చ హితేన చ,
సత్యవిక్రమయుక్తేన తదుక్తం లక్ష్మణ త్వయా. 42

ప్ర. అ. లక్ష్మణ! = ఓ లక్ష్మణా! అనురక్తేన = అనురాగము కలవాడు, స్నిగ్ధేన = స్నేహము కలవాడు, హితేన చ = హితమును కోరువాడు, సత్యవిక్రమయుక్తేన = సత్యమైన పరాక్రమముతో కూడిన వాడు అయిన పురుషునిచే, యత్ = ఏది, వాచ్యమ్ = చెప్పదగినదో, తత్ = అది, త్వయా = నీ చేత, ఉక్తమ్ = చెప్పబడినది.

తా. ఓ లక్ష్మణా! ప్రేమ, స్నేహము గల, హితమును కోరు, సత్యమైన పరాక్రమము కల పురుషుడు ఏ మాటను చెప్పవలెనో ఆ మాటను చెప్పినావు.

మూ. ఏష శోకః పరిత్యక్తః సర్వకార్యావసాదకః,
విక్రమేష్వప్రతిహతం తేజః ప్రోత్సాహయామ్యహమ్. 43

ప్ర. అ. సర్వకార్యావసాదకః = అన్ని పనులు చెడగొట్టు, ఏషః =ఈ, శోకః = శోకము, పరిత్యక్తః = విడువబడినది ; అహమ్ =నేను, విక్రమేషు = పరాక్రమములయందు, అప్రతిహతమ్ = అడ్డులేని, తేజః = తేజస్సును, ప్రోత్సాహయామి = ప్రోత్సహించుచున్నాను.

తా. నేను ఇదిగో అన్ని పనులు చెడగొట్టే ఈ శోకమును విడుచుచున్నాను. పరాక్రమములయందు అడ్డు లేని నా తేజస్సును వృద్ధిపొందించుకొనుచున్నాను.43

మూ. శరత్కాలం ప్రతీక్షిష్యే స్థితోఽస్మి వచనే తవ,
సుగ్రీవస్య నదీనాం చ ప్రసాదమనుపాలయన్. 44

ప్ర. అ. సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, నదీనాం చ= నదులయొక్క, ప్రసాదమ్ = ప్రసాదమును, అనుపాలయన్ = ఎదురుచూచుచు, శరత్కాలమ్

శరత్కాలమును, ప్రతీక్షిష్యే = నిరీక్షించెదను. తవ = నీయొక్క, వచనే = వచనమునందు, స్థితః అస్మి=ఉన్నాను.

తా. సుగ్రీవుని అనుగ్రహము కొరకు, వర్షకాలాంతమున నదులు నిర్మలములు అగుటకొరకు ఎదురుచూచుచు శరత్కాలమును నిరీక్షించెదను. నీ మాట ప్రకారము చేసెదను. 44

మూ. ఉపకారేణ వీరస్తు ప్రతికారేణ యుజ్యతే,
అకృతజ్ఞోఽ ప్రతికృతో హన్తి సత్త్వవతాం మనః. 45

ప్ర. అ. ఉపకారేణ = ఉపకారముతో కూడిన, వీరః = వీరుడు, ప్రతికారేణ = ప్రత్యుపకారముతో, యుజ్యతే = కూడును. అకృతజ్ఞః = కృతజ్ఞుడుకాని, అప్రతికృతః = ప్రత్యుపకారము చేయనివాడు, సత్త్వవతామ్ = సత్త్వగుణము కలవారియొక్క, మనః = మనస్సును, హన్తి = బాధించును.

తా. ఇతరులనుండి ఉపకారము పొందిన వీరుడు, తప్పక ప్రత్యుపకారము చేయును. కృతజ్ఞుడు కాక, ప్రత్యుపకారము చేయనివాడు సత్పురుషుల మనస్సుకు బాధ కల్గించును. 45

మూ. తదేవ యుక్తం ప్రణిధాయ లక్ష్మణః
కృతాఞ్జలిస్తత్ప్రతిపూజ్య భాషితమ్,
ఉవాచ రామం స్వభిరామదర్శనం
ప్రదర్శయన్ దర్శనమాత్మనః శుభమ్. 46

ప్ర. అ. లక్ష్మణః =లక్ష్మణుడు, తదేవ = దానినే, యుక్తమ్ = యుక్తమైనదానినిగా, ప్రణిధాయ=ఆలోచించి, కృతాఞ్జలిః =చేయబడిన దోసిలి కలవాడై, తత్ =ఆ, భాషితమ్ = భాషణమును, ప్రతిపూజ్య = మెచ్చుకొని, ఆత్మనః = తనయొక్క, శుభమ్ = శుభమైన, దర్శనమ్ = దృష్టిని, ప్రదర్శయన్ = చూపుచు, స్వభిరామదర్శనమ్= బాగా మనోహరమైన దర్శనము గల, రామమ్ = రామునిగూర్చి, ఉవాచ = పలికెను.

తా. లక్ష్మణుడు అట్లు చేయుటయే యుక్త మని ఆలోచించి రాముని మాటలను మెచ్చుకొనుచు అంజలి ఘటించి తన మంచి ఆలోచనలను ప్రదర్శించుచు చూచుటకు చాల మనోహరుడైన రామునితో ఇట్లనెను. 46

మూ. యథోక్తమేతత్తవ సర్వమీప్సితమ్
నరేన్ద్ర కర్తా నచిరాత్తు వానరః,
శరత్ప్రతీక్షః క్షమతామిమం భవాన్
జలప్రపాతం రిపునిగ్రహే ధృతః. 47

ప్ర. అ. నరేన్ద్ర ! = ఓ రాజా! యథా = ఎట్లు, ఉక్తమ్ =

చెప్పబడినదో, అట్లు, వానరః = సుగ్రీవుడు, నచిరాత్ = అచిరకాలములో, తవ =నీకు, ఈప్సితమ్ = ఇష్టమైన, ఏతత్ సర్వమ్ = ఈకార్యము నంతను, కర్తా = చేయగలడు. రిపునిగ్రహే = శత్రుసంహారమునందు, ధృతః = దృఢమైన నిశ్చయము గల, భవాన్ = నీవు, శరత్ప్రతీక్షః = శరత్కాలమును ఎదురుచూచుచున్నవాడవై, ఇమమ్ = ఈ, జలప్రపాతమ్ = వర్షకాలమును, క్షమతామ్ = సహించెదవు గాక.

తా. ఓ రాజా! నీవు చెప్పినట్లుగా సుగ్రీవుడు అచిరకాలములో నీ కిష్టమైన పని నంతను చేయగలడు. శత్రుసంహారమునకై దృఢముగా నిశ్చయించుకొనిన నీవు శరత్కాలమునకు నిరీక్షించుచు ఈ వర్షకాలము ఓపిక పట్టుము. 47

మూ. నియమ్య కోపం పరిపాల్యతాం శరత్
క్షమస్వ మాసాంశ్చతురో మయా సహ,
వసాచలేఽస్మిన్ మృగరాజసేవితే
సంవర్తయన్ శత్రువధే సమర్థః. 48

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తవింశః సర్గః.

ప్ర. అ. శత్రువధే = శత్రువును చంపుటయందు, సమర్థః = సమర్థుడవైన నీవు, క్షమస్వ = ఓపిక పట్టుము. కోపమ్ = కోపమును, నియమ్య = నియమించుకొని, శరత్ = శరత్కాలము, పరిపాల్యతామ్ = నిరీక్షించబడుగాక! చతురః =నాలుగు, మాసాన్ = మాసములను, సంవర్తయన్ = గడుపుచు, మృగరాజసేవితే = సింహములచేత సేవించబడిన, అస్మిన్ అచలే = ఈ పర్వతమునందు, మయా సహ = నాతో కూడ, వస =నివసించుము.

తా. శత్రువులను సంహరించుటయందు సమర్థుడ వైన నీవు కోపమును అణచుకొని ఓర్పుతో శరత్కాలముకొరకు వేచి యుండుము. నాతో కలిసి సింహములచే సేవించబడిన ఈ పర్వతమునందు నివసించుచు; నాలుగు మాసములు గడుపుము. 48

*"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో*
ఇరువదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టావింశః సర్గః

(రాముడు వర్షఋతువును వర్ణించుట)

మూ. స తదా వాలినం హత్వా సుగ్రీవమభిషిచ్య చ,
వసన్ మాల్యవతః పృష్ఠే రామో లక్ష్మణమబ్రవీత్. 1

ప్ర. అ. వాలినమ్= వాలిని, హత్వా = చంపి, సుగ్రీవమ్ = సుగ్రీవుని, అభిషిచ్య చ =అభిషేకించి, తదా = అపుడు, మాల్యవతః = మాల్యవత్పర్వతముయొక్క, పృష్ఠే = పైభాగమునందు, వసన్ = నివసించుచున్న, సః రామః =ఆ రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. వాలిని చంపి సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని చేసి మాల్యవత్పర్వతముపై నివసించుచున్న రాముడు లక్ష్మణునితో ఇట్లనెను. 1

మూ. అయం స కాలః సమ్ప్రాప్తః సమయోఽద్య జలాగమః,
సమ్పశ్య త్వం నభో మేఘైః సంవృతం గిరిసన్నిభైః. 2

ప్ర. అ. సః అయమ్ = అట్టి ఈ, కాలః = కాలము, సమ్ప్రాప్తః = వచ్చినది. అద్య = ఇపుడు, జలాగమః సమయః = జలము వచ్చే సమయము. గిరిసన్నిభైః = పర్వతములతో సమానమైన, మేఘైః =మేఘములచేత, సంవృతమ్ = కప్పబడిన, నభః = ఆకాశమును, త్వమ్ = నీవు, సమ్పశ్య = చూడుము.

తా. ఇప్పుడు మన మనుకొనుచున్న ఆ వర్షకాలము వచ్చినది. ఆకాశము పర్వతముల వంటి మేఘములచే ఎట్లు కప్పబడినదో చూడుము. 2

మూ. నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః,
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్. 3

ప్ర. అ. ద్యౌః = ఆకాశము, భాస్కరస్య = సూర్యునియొక్క, గభస్తిభిః =కిరణములచేత, సముద్రాణామ్ = సముద్రములయొక్క, రసమ్ = జలమును, పీత్వా = త్రాగి, నవమాసధృతమ్ = తొమ్మిది మాసములు ధరింపబడిన, రసాయనమ్ = షడ్రసములకు మూలమైన, గర్భమ్ = గర్భస్థమైన జలమును, ప్రసూతే = కనుచున్నది.

తా. ఆకాశము సూర్యుని కిరణముల ద్వారా సముద్రజలమును త్రాగి షడ్రసములకు మూలభూతమైన, తొమ్మిది మాసములు ధరింపబడిన గర్భమును (గర్భస్థజలమును) కనుచున్నది. (విడుచుచున్నది.) 3

మూ. శక్యమమ్బరమారుహ్య మేఘసోపానపఙ్క్తిభిః,
కుటజార్జునమాలాభిరలఙ్కర్తుం దివాకరః. 4

ప్ర. అ. మేఘసోపానపఙ్క్తిభిః =మేఘములచే ఏర్పడిన మెట్ల పంక్తులచే, అమ్బరమ్ = ఆకాశమును, ఆరుహ్య =ఎక్కి, దివాకరః =సూర్యుడు, (సూర్యుణ్ణి), కుటజార్జునమాలాభిః =కుటజపుష్పముల మాలలచేతను, అర్జునపుష్పముల మాలలచేతను, అలఙ్కర్తుమ్ = అలంకరించుటకు, శక్యమ్ = శక్యమైనది.

తా. మేఘములచే ఏర్పడిన మెట్ల పంక్తుల మీదుగ ఆకాశముపైకి ఎక్కి కుటజ - అర్జున పుష్పముల మాలలతో సూర్యుని అలంకరించుటకు శక్య మగును అన్నట్లున్నది. 4

మూ. సన్ధ్యారాగోత్థితైస్తామ్రైరన్తేష్వపి చ పాణ్డుభిః,
స్నిగ్ధైరభ్రపటచ్ఛేదైర్బద్ధవ్రణమివామ్బరమ్. 5

ప్ర. అ. సన్ధ్యారాగోత్థితైః =సంధ్యారాగముతో కూడిన, తామ్రైః =ఎఱ్ఱనైన, అన్తేష్వపి చ = చివరలయందు, పాణ్డుభిః = తెల్లగాఉన్న, స్నిగ్ధైః = నున్నని, అభ్రపటచ్ఛేదైః =మేఘము లనే వస్త్రఖండములచే, అమ్బరమ్ = ఆకాశము, బద్ధవ్రణమ్ ఇవ = కట్టబడిన వ్రణములు కలది వలె నున్నది.

తా. వస్త్రఖండముల వలె నున్నగా ఉన్న మేఘములు సంధ్యారాగము ప్రసరించుటచే ఎఱ్ఱగాను, చివరి భాగమునందు తెల్లగాను ఉన్నవి. అట్టి మేఘములతో ఆకాశము వ్రణములకు కట్లు కట్టినట్లున్నది. 5

మూ. మన్దమారుతనిశ్వాసం సన్ధ్యాచన్దనరఞ్జితమ్,
ఆపాణ్డుజలదం భాతి కామాతురమివామ్బరమ్. 6

ప్ర. అ. మన్దమారుతనిఃశ్వాసమ్ =మన్దమారుత మనే నిట్టూర్పు కలది, సన్ధ్యాచన్దనరఞ్జితమ్ = సన్ధ్య అనే చందనముచే పూయబడినది, ఆపాణ్డుజలదమ్ =తెల్లని మేఘము కలది అయిన, అమ్బరమ్ = ఆకాశము, కామాతురమివ =కామముచే బాధపడుచున్నది వలె, భాతి = ప్రకాశించుచున్నది.

తా. మందమారుతమే నిట్టూర్పుగా కలిగి, సంధ్యారాగ మనే చందనముచే పూయబడి తెల్లని మేఘములతో కూడిన ఆకాశము కామాతురమా అన్న ట్లున్నది.

మూ. ఏషా ఘర్మపరిక్లిష్టా నవవారిపరిప్లుతా,
సీతేవ శోకసంతప్తా మహీ బాష్పం విముఞ్చతి. 7

ప్ర. అ. ఘర్మపరిక్లిష్టా = గ్రీష్మఋతువుచే పీడింపబడినది, నవవారిపరిప్లుతా = క్రొత్త వర్షోదకముచే తడుపబడినది అయిన, ఏషా మహీ = ఈ భూమి, శోకసంతప్తా = శోకముచే తపింపచేయబడిన, సీతేవ =సీత వలె, బాష్పమ్ =

ఆవిరిని, (సీతపక్షంలో కన్నీటిని), విముఞ్చతి = విడుచుచున్నది.

తా. గ్రీష్మఋతువుచే మిక్కిలి ఎండిపోయిన, క్రొత్త వాననీటికి తడిసిన ఈ భూమి శోకముచే తపింపచేయబడిన సీత వలె, బాష్పమును విడచుచున్నది.

మూ. మేఘోదరవినిర్ముక్తాః కర్పూరదలశీతలాః,
శక్యమఞ్జలిభిః పాతుం వాతాః కేతకగన్ధినః. 8

ప్ర. అ. మేఘోదరవినిర్ముక్తాః =మేఘముల ఉదరముఁనుండి విడువబడినవి, కర్పూరదళశీతలాః = కర్పూరదళముల వలె చల్లగా ఉన్నవి, కేతకగన్ధినః = మొగిలి పూవు వాసనలు గలవి అయిన, వాతాః =వాయువులు, అఞ్జలిభిః = దోసిళ్ళతో, పాతుమ్ =త్రాగుటకు, శక్యమ్ =శక్యమైనది.

తా. మేఘమధ్యములనుండి బయలువెడలి, కర్పూరదళముల వలె చల్లగా ఉన్న మొగలిపూల సువాసనలతో కూడిన ఈ గాలులు దోసిళ్ళతో త్రాగవచ్చునా అన్నట్లున్నవి. 8

మూ. ఏష ఫుల్లార్జునః శైలః కేతకైరభివాసితః,
సుగ్రీవ ఇవ శాన్తారిర్ధారాభిరభిషిచ్యతే. 9

ప్ర. అ. ఫుల్లార్జునః = వికసించిన అర్జునవృక్షములు కలది, కేతకైః = మొగిలిపూవులచేత, అభివాసితః = సువాసనకలదిగా చేయబడినది అయిన, ఏషః శైలః= ఈ పర్వతము, శాన్తారిః =నశించిన శత్రువు గల, సుగ్రీవ ఇవ = సుగ్రీవుడు వలె, ధారాభిః = జలధారలచేత, అభిషిచ్యతే = తడుపబడుచున్నది.

తా. వికసించిన అర్జునవృక్షములతో నిండి, మొగిలి పూవుల సువాసనలతో కూడిన ఈ పర్వతము శత్రుమరణానంతరము సుగ్రీవుడు వలె జలధారలచేత అభిషేకించబడుచున్నది. 9

మూ. మేఘకృష్ణాజినధరా ధారాయజ్ఞోపవీతినః,
మారుతాపూరితగుహాః ప్రాధీతా ఇవ పర్వతాః. 10

ప్ర. అ. మేఘకృష్ణాజినధరాః =మేఘము లనే కృష్ణాజినములను ధరించినవి, ధారాయజ్ఞోపవీతినః =జలధార లనే యజ్ఞోపవీతములు కలవి, మారుతాపూరిత గుహాః = వాయువుచే నింపబడిన గుహలు కలవి అయిన, పర్వతాః = పర్వతములు, ప్రాధీతా ఇవ= వేదాధ్యయనమునకు ఉపక్రమించుచున్నట్లున్నవి.

తా. గాలిచే నింపబడిన గుహలు గల పర్వతములు మేఘము లనే కృష్ణాజినములను, జలధార లనే యజ్ఞోపవీతములను ధరించి, వేదాధ్యయనమునకు ఉపక్రమించుచున్నవా అన్నట్లున్నవి. 10

మూ. కశాభిరివ హైమీభిర్విద్యుద్భిరభితాడితమ్,
అన్తస్తనితనిర్ఘోషం సవేదనమివామ్బరమ్. 11

ప్ర. అ. హైమీభిః =బంగారమువికారమైన, కశాభిరివ = కొరడాల చేతను వలె, విద్యుద్భిః = మెరుపులచేత, అభితాడితమ్ = కొట్టబడినది, స్తనితనిర్ఘోషమ్ = ఉరుములతో ధ్వనించుచున్నది అయిన, అమ్బరమ్ = ఆకాశము, అన్తః = లోపల, సవేదనమివ = బాధతో కూడినది వలె నున్నది.

తా. బంగారు కొరడాల వలె ఉన్న మెరుపులచేత కొట్టబడుచు ఉరుముల ధ్వనులతో కూడిన ఆకాశము లోపల వేదనతో బాధపడుచున్నట్లు ఉన్నది. 11

మూ. నీలమేఘాశ్రితా విద్యుత్ స్ఫురన్తీ ప్రతిభాతి మే,
స్ఫురన్తీ రావణస్యాఙ్కే వైదేహీవ తపస్వినీ. 12

ప్ర. అ. నీలమేఘాశ్రితా = నీలమేఘమును ఆశ్రయించినదై, స్ఫురన్తీ = ప్రకాశించుచున్న, విద్యుత్ = మెరుపు, రావణస్య = రావణునియొక్క, అఙ్కే = అంకమునందు, స్ఫురన్తీ = కదులుచున్న, తపస్వినీ = దీనురాలైన, వైదేహీవ = సీత వలె, మే = నాకు, ప్రతిభాతి=తోచుచున్నది.

తా. నీలమేఘముపై మెరియుచున్న ఈ మెరుపు నాకు రావణుని ఒడిలో ఇటు అటు కొట్టుకొనుచున్న దీనురాలైన సీత వలె కనబడుచున్నది. 12

మూ. ఇమాస్తా మన్మథవతాం హితాః ప్రతిహతా దిశః,
అనులిప్తా ఇవ ఘనైర్నష్టగ్రహనిశాకరాః. 13

ప్ర. అ. మన్మథవతామ్ =మన్మథుడు కలవారికి, హితాః = హితమైనవి, ప్రతిహతాః =అస్పష్టముగా నున్నవి, నష్టగ్రహనిశాకరాః =నశించిన గ్రహములు చంద్రుడు కలవి అయిన, ఇమాః= ఈ, తాః దిశః = ఆ దిక్కులు, ఘనైః = మేఘములచేత, అనులిప్తా ఇవ = పూయబడినట్లున్నవి.

తా. కాముకులకు ఆనందకరములుగా ఉన్న ఈ దిక్కులు తూర్పు పడమర మొదలగు భేదములు తెలియకుండా ఉన్నవి. గ్రహచంద్రాదులు కనబడుటలేదు. ఇవి మేఘములచేత పూయబడినట్లున్నవి. 13

మూ. క్వచిద్బాష్పాభిసంరుద్ధాన్ వర్షాగమసముత్సుకాన్,
కుటజాన్పశ్య సౌమిత్రే పుష్పితాన్గిరిసానుషు. 14
మమ శోకాభిభూతస్య కామసన్దీపనాన్ స్థితాన్.

ప్ర. అ. సౌమిత్రే! = ఓ! లక్ష్మణా! క్వచిత్ = కొన్ని చోట్ల, బాష్పాభిసంరుద్ధాన్ = ఆవిరిచే కప్పబడినవి, వర్షాగమసముత్సుకాన్ = వర్షాకాలముచేత తృప్తి చెందింపబడినవి, గిరిసానుషు = పర్వతశిఖరములమీద, స్థితాన్ = ఉన్నవి,

పుష్పితాన్ = పుష్పించినవి, శోకాభిభూతస్య= దుఃఖముచేత తిరస్కరించబడిన, మమ =నాకు, కామసన్దీపనాన్ = కామమును వృద్ధిచేయుచున్నవి అయిన, కుటజాన్ = కుటజవృక్షములను, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! పర్వతముల చరియలమీద ఉన్న పుష్పించిన ఈ కుటజవృక్షములను చూడుము. ఇవి కొన్ని చోట్ల ఆవిరిచే కప్పబడి ఉన్నవి. వర్షకాలము వచ్చుటచేత తృప్తి చెంది ఉన్నవి. ఇవి దుఃఖాక్రాంతుడ నైన నాకు కామోద్దీపకములుగా ఉన్నవి. 14

మూ. రజః ప్రశాన్తం సహిమోఽ ద్య వాయు
ర్నిదాఘదోషప్రసరాః ప్రశాన్తాః,
స్థితా హి యాత్రా వసుధాధిపానాం
ప్రవాసినో యాన్తి నరాః స్వదేశాన్. 15

ప్ర. అ. అద్య = ఇపుడు, రజః = పరాగము, ప్రశాన్తమ్ = శాంతించినది. వాయుః = వాయువు , సహిమః =మంచుతో కూడినది. నిదాఘదోషప్రసరాః = గ్రీష్మఋతువునకు సంబంధించిన దోషములయొక్క ప్రసారములు, ప్రశాన్తాః = శాంతించినవి. వసుధాధిపానామ్ = రాజులయొక్క, యాత్రా = యాత్ర, స్థితా హి = నిలిచిపోయినది. ప్రవాసినః = ప్రవాసము గల, నరాః = నరులు, స్వదేశాన్ = తమ దేశములను, యాన్తి = వెళ్లుచున్నారు.

తా. ఇపుడు పరాగము శాంతించినది. వాయువు చల్లగా ఉన్నది. గ్రీష్మఋతువుకు సంబంధించిన తాపాదిదోషములు తగ్గినవి. రాజుల యుద్ధయాత్ర నిలిచిపోయినది. దేశాంతములకు వెళ్లినవారు స్వదేశమునకు తిరిగి వచ్చుచున్నారు.

మూ. సమ్ప్రస్థితా మానసవాసలుబ్ధాః ప్రియాన్వితాః సమ్ప్రతి చక్రవాకాః,
అభీక్ష్ణవర్షోదకవిక్షతేషు యానాని మార్గేషు న సమ్పతన్తి. 16

ప్ర. అ. సమ్ప్రతి = ఇపుడు, మానసవాసలుబ్ధాః = మానససరోవరమునందు నివసించుటకు ఆసక్తి గల హంసలు, సమ్ప్రస్థితాః =ప్రయాణమైనవి. చక్రవాకాః= చక్రవాకపక్షులు, ప్రియాన్వితాః =ప్రియురాండ్రతో కూడినవి.అభీక్ష్ణవర్షోదకవిక్షతేషు = వర్షోదకముచేత మిక్కిలి కొట్టబడిన, మార్గేషు = మార్గములయందు, యానాని = వాహనములు, న సమ్పతన్తి = నడచుటలేదు.

తా. ఇపుడు హంసలు మానససరస్సు చేరుటకు బయలుదేరినవి. చక్రవాకపక్షులు ప్రియురాళ్లతో కలిసి ఉన్నవి. మార్గములు వర్షోదకములచేత మిక్కిలి చెడిపోవుటచే వాహనములు తిరుగుటలేదు. 16

మూ. క్వచిత్ప్రకాశం క్వచిదప్రకాశం నభః ప్రకీర్ణామ్బుధరం విభాతి,
క్వచిత్క్వచిత్పర్వతసన్నిరుద్ధం రూపం యథా శాన్తమహార్ణవస్య. 17

ప్ర. అ. ప్రకీర్ణామ్బుధరమ్ = వ్యాపించిన మేఘములు కలది, క్వచిత్ = కొన్నిచోట్ల, ప్రకాశమ్ = ప్రకాశించుచున్నది, క్వచిత్= కొన్ని చోట్ల, అప్రకాశమ్= ప్రకాశించనిది అయిన, నభః = ఆకాశము, క్వచిత్క్వచిత్ = కొన్ని కొన్ని చోట్ల, పర్వతసన్నిరుద్ధమ్ = పర్వతములచేత అడ్డుకొనబడిన, శాన్తమహార్ణవస్య = శాంతమైన మహాసముద్రముయొక్క, రూపం యథా =రూపము వలె, విభాతి = ప్రకాశించుచున్నది.

తా. మేఘములు అక్కడక్కడ వ్యాపించి ఉన్న ఆకాశము కొన్ని చోట్ల ప్రకాశముగాను, కొన్ని చోట్ల ప్రకాశము లేనిది గాను ఉండుటచే అది అక్కడక్కడ పర్వతములు పైకి కనబడుచున్న తరంగములు లేని మహాసముద్రము వలె ప్రకాశించుచున్నది. 17

మూ. వ్యామిశ్రితం సర్జకదమ్బపుష్పై ర్నవం జలం పర్వతధాతుతామ్రమ్,
మయూరకేకాభిరనుప్రయాతం శైలాపగాః శీఘ్రతరం వహన్తి. 18

ప్ర. అ. శైలాపగాః =కొండకాలువలు, సర్జకదమ్బపుష్పైః = సర్జపుష్పముల తోను, కదంబపుష్పములతోను, వ్యామిశ్రితమ్ = కలిపినది, పర్వతధాతుతామ్రమ్ =పర్వతముల ధాతువులచేత ఎఱ్ఱగా ఉన్నది, మయూరకేకాభిః =నెమళ్లయొక్క కేకాధ్వనులచేత, అనుప్రయాతమ్ =అనుసరించబడినది అయిన, నవం జలమ్ =నూతనమైన జలమును, శీఘ్రతరమ్ =మిక్కిలి శీఘ్రముగా, వహన్తి =ప్రవహించుచున్నవి.

తా. కొండకాలువలు క్రొత్త నీటిని అతిశీఘ్రముగా ప్రవహించుచున్నవి. ఆ నీరు సర్జపుష్పములతోను కదంబపుష్పములతోను కలిసి ఉన్నది. పర్వతములపై ఉన్న ధాతువులచేత ఎఱ్ఱగా ఉన్నది. ప్రవహించుచున్న ఆ నీటిని నెమళ్ల కేకాధ్వనులు అనుసరించి వెళ్లుచున్నవి. 18

మూ. రసాకులం షట్పదసన్నికాశం ప్రభుజ్యతే జమ్బుఫలం ప్రకామమ్,
అనేకవర్ణం పవనావధూతం భూమౌ పతత్యామ్రఫలం విపక్వమ్. 19

ప్ర. అ. రసాకులమ్ = రసముతో నిండినది, షట్పదసన్నికాశమ్ = తుమ్మెదతో సమానము అయిన, జమ్బుఫలమ్ = నేరేడుపండు, ప్రకామమ్ = మిక్కిలి, ప్రభుజ్యతే = తినబడుచున్నది. అనేకవర్ణమ్ =అనేకవర్ణములు గల, విపక్వమ్ = ముగ్గిన, ఆమ్రఫలమ్ = మామిడిపండు, పవనావధూతమ్ = గాలిచే కదల్చబడినదై, భూమౌ = నేలమీద, పతతి =పడుచున్నది.

తా. తుమ్మెద వలె నల్లగా ఉన్నవి, రసముతో నిండినవి అయిన నేరేడు పండ్లు అధికముగా తినబడుచున్నవి. అనేకమైన రంగులు గల ముగ్గిన మామిడిపండ్లు గాలికి కదల్చబడి నేలమీద రాలుచున్నవి. 19

మూ. విద్యుత్పతాకాః సబలాకమాలాః శైలేన్ద్రకూటాకృతిసన్నికాశాః,
గర్జన్తి మేఘాః సముదీర్ణనాదా మత్తా గజేన్ద్రా ఇవ సంయుగస్థాః.

ప్ర. అ.విద్యుత్పతాకాః =మెరుపు లనే జండాలు కలవి, సబలాకమాలాః =కొంగ లనే పుష్పమాలలతో కూడినవి, శైలేన్ద్రకూటాకృతిసన్నికాశాః = పెద్ద పర్వతములయొక్క శిఖరముల ఆకారముతో సమానములు అయిన, మేఘాః = మేఘములు, సంయుగస్థాః = యుద్ధమునందున్న, మత్తాః = మదించిన, గజేన్ద్రా ఇవ = ఏనుగులు వలె, సముదీర్ణనాదాః =అధికమైన ధ్వని కలవై, గర్జన్తి= గర్జించుచున్నవి.

తా. మెరుపులనే పతాకలు, కొంగలనే మాలలు ధరించి పర్వతశిఖరముల వలె నున్న మేఘములు యుద్ధములో మదించిన ఏనుగుల వలె అధికమైన ధ్వనితో గర్జించుచున్నవి. 20

మూ. వర్షోదకాప్యాయితశాద్వలాని ప్రవృత్తనృత్తోత్సవబర్హిణాని,
వనాని నిర్వృష్టవలాహకాని పశ్యాపరాహ్ణేష్వధికం విభాన్తి. 21

ప్ర. అ. వర్షోదకాప్యాయితశాద్వలాని = వర్షోదకముచేత తృప్తి పొందింపబడిన పచ్చిక బీళ్లు కలవి, ప్రవృత్తనృత్తోత్సవబర్హిణాని = ప్రారంభమైన నృత్తోత్సవము గల నెమళ్లు గలవి, నిర్వృష్టబలాహకాని = వర్షించిన మేఘములు కలవి అయిన, వనాని = వనములు, అపరాహ్ణేషు = అపరాహ్ణములయందు, అధికమ్ = అధికముగా, విభాన్తి = ప్రకాశించుచున్నవి. పశ్య = చూడుము.

తా. ఈ వనములలో బాగుగా వర్షము కురియుటచేత ఇక్కడ నున్న పచ్చికబయళ్లు వర్షోదకముచేత తృప్తిచెంది యున్నవి. నెమళ్లు నృత్తోత్సవమును ప్రారంభించినవి. అట్టి ఈ వనములు అపరాహ్ణములయందు చూచుటకు చాల అందముగా నున్నవి. 21

మూ. సముద్వహన్తః సలిలాతిభారం బలాకినో వారిధరా నదన్తః,
మహత్సు శృఙ్గేషు మహీధరాణాం విశ్రమ్య విశ్రమ్య పునః ప్రయాన్తి.

ప్ర. అ. సలిలాతిభారమ్ = నీటియొక్క అధికమైన భారమును, సముద్వహన్తః = మోయుచున్నవి, బలాకినః = కొంగలు కలవి అయిన, వారిధరాః = మేఘములు, నదన్తః = ధ్వనిచేయుచున్నవై, మహీధరాణామ్ = పర్వతములయొక్క, మహత్సు = పెద్దవైన, శృఙ్గేషు =శిఖరములయందు, విశ్రమ్య విశ్రమ్య = విశ్రమించి, విశ్రమించి, పునః = మరల, ప్రయాన్తి = వెళ్లుచున్నవి.

తా. కొంగలతో కూడిన ఈ మేఘములు అధికమైన జలభారమును మోయుచు, ధ్వని చేయుచు పర్వతముల ఉన్నతశిఖరములపైన విశ్రమించి, విశ్రమించి, మరల వెళ్లుచున్నవి. 22

మూ. మేఘాభికామా పరిసమ్పతన్తీ సమ్మోదితా భాతి బలాకపఙ్క్తిః,
వాతావధూతా వరపౌణ్డరీకీ లమ్బేవ మాలా రుచిరామ్బరస్య. 23

ప్ర.అ. మేఘాభికామా = (గర్భధారణమునకై) మేఘమువిషయమున కామము కలదై, పరిసమ్పతన్తీ = అంతట ఎగురుచున్న, సమ్మోదితా = సంతోషముతో కూడిన, బలాకపఙ్క్తిః=కొంగల పంక్తి, అమ్బరస్య=ఆకాశముయొక్క, వాతావధూతా=వాయువుచేత కదల్చబడిన, వరపౌణ్డరీకీ=శ్రేష్ఠమైన తెల్లని పద్మముల వికారమైన, రుచిరా=అందమైన, లమ్బా=వ్రేలాడుచున్న, మాలా ఇవ= మాల వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. కోరికతో మేఘము వైపు సంతోషముగా ఎగురుచున్న కొంగల పంక్తి గాలికి కదులుచున్న పొడవైన తెల్లని పద్మములతో ఆకాశములో కట్టిన మాల వలె ప్రకాశించుచున్నది. 23

మూ. బాలేన్ద్రగోపాన్తరచిత్రితేన విభాతి భూమిర్నవశాద్వలేన,
గాత్రానుపృక్తేన శుకప్రభేణ నారీవ లాక్షోక్షితకమ్బలేన. 24

ప్ర. అ. బాలేన్ద్రగోపాన్తరచిత్రితేన=చిన్న ఇంద్రగోపకీటకములచే మధ్య యందు చిత్రింపబడిన, నవశాద్వలేన=క్రొత్త పచ్చికబీడుతో, భూమిః=భూమి, గాత్రానుపృక్తేన=శరీరమునకు లగ్నమైన, శుకప్రభేణ=చిలుక వంటి కాంతి గల, లాక్షోక్షితకమ్బలేన=లత్తుకచేత చల్లబడిన కంబలముతో, నారీవ=స్త్రీ వలె, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. చిన్న ఇంద్రగోపకీటకములచేత మధ్య మధ్య చిత్రవర్ణముగా నున్న క్రొత్త పచ్చికబీడులతో భూమి లత్తుక చుక్కలు చల్లిన చిలుకవర్ణము గల కంబళము శరీరముపై కప్పుకొన్న స్త్రీ వలె ప్రకాశించుచున్నది. 24

మూ. నిద్రా శనైః కేశవమభ్యుపైతి ద్రుతం నదీ సాగరమభ్యుపైతి,
హృష్టా బలాకా ఘనమభ్యుపైతి కాన్తా సకామా ప్రియమభ్యుపైతి.

ప్ర. అ. నిద్రా=నిద్ర, శనైః=మెల్లగా, కేశవమ్=కేశవుని, అభ్యుపైతి=చేరుచున్నది. నదీ=నది, ద్రుతమ్=శీఘ్రముగా, సాగరమ్=సముద్రమును, అభ్యుపైతి=చేరుచున్నది. హృష్టా= సంతోషించిన, బలాకా=ఆడకొంగ, ఘనమ్=మేఘమును, అభ్యుపైతి= చేరుచున్నది. సకామా=కామముతో గూడిన, కాన్తా=స్త్రీ, ప్రియమ్= ప్రియుని, అభ్యుపైతి=చేరుచున్నది.

తా. నిద్ర మెల్లగా శ్రీమహావిష్ణువును చేరుచున్నది. నది శీఘ్రముగా సాగరమును చేరుచున్నది. ఆనందించుచున్న ఆడకొంగ మేఘమువైపు ఎగురుచున్నది. కామముతో గూడిన స్త్రీ ప్రియుని దగ్గరకు చేరుచున్నది. 25

మూ. జాతా వనాన్తాః శిఖిసుప్రనృత్తా జాతాః కదమ్బాః సకదమ్బశాఖాః,
జాతా వృషా గోషు సమానకామా జాతా మహీ సస్యవనాభిరామా.

ప్ర. అ. వనాన్తాః=వనమధ్యములు, శిఖిసుప్రనృత్తాః=మంచి నెమళ్ల నృత్యము కలవి, జాతాః=అయినవి. కదమ్బాః=కదంబవృక్షములు, సకదమ్బశాఖాః= కదంబపుష్పములతో కూడిన శాఖలు గలవి, జాతాః=అయినవి. వృషాః=వృషభములు, గోషు=గోవులవిషయమున, సమానకామాః=సమానమైన కామము గలవి, జాతాః= అయినవి. మహీ=భూమి, సస్యవనాభిరామా=సస్యములతోను, వనములతోను మనోహరము, జాతా=అయినది.

తా. వనమధ్యములలో, నెమళ్లు చక్కగా నృత్యము చేయుచున్నవి. కదంబవృక్షముల శాఖలు పుష్పములతో నిండి యున్నవి. వృషభములు గోవులు సమానమైన కామముతో నున్నవి. భూమి సస్యములతోను, వనములతోను మనోహరముగా నున్నది. 26

మూ. వహన్తి వర్షన్తి నదన్తి భాన్తి ధ్యాయన్తి నృత్యన్తి సమాశ్వసన్తి,
నద్యో ఘనా మత్తగజా వనాన్తాః ప్రియావిహీనాః శిఖినః ప్లవఙ్గమాః.

ప్ర. అ. నద్యః=నదులు, ఘనాః=మేఘములు, మత్తగజాః=మదించిన ఏనుగులు, వనాన్తాః=వనమధ్యములు, ప్రియావిహీనాః=ప్రియురాండ్రు లేనివారు, శిఖినః=నెమళ్లు, ప్లవఙ్గమాః=వానరులు,(వరుసగా) వహన్తి= ప్రవహించుచున్నవి; వర్షన్తి=వర్షించుచున్నవి; నదన్తి=ధ్వనిచేయుచున్నవి; భాన్తి=ప్రకాశించుచున్నవి; ధ్యాయన్తి=ధ్యానించుచున్నారు; నృత్యన్తి= నాట్యముచేయుచున్నవి; సమాశ్వసన్తి=ఊరడిల్లుచున్నారు.

తా. నదులు ప్రవహించుచున్నవి. మేఘములు వర్షించుచున్నవి. మదించిన గజములు ఘీంకరించుచున్నవి. వనమధ్యములు ప్రకాశించుచున్నవి. ప్రియురాళ్లు దగ్గర లేనివారు ఏమేమో ధ్యానించుచున్నారు. నెమళ్లు నాట్యము చేయుచున్నవి. వానరులు ఊరడిల్లుచున్నారు (సుగ్రీవునకు రాజ్యము లభించుటచే సంతోషించుచున్నారు). 27

మూ. ప్రహర్షితాః కేతకిపుష్పగన్ధమాఘ్రాయ మత్తా వననిర్ఝరేషు,
ప్రపాతశబ్దాకులితా గజేన్ద్రాః సార్ధం మయూరైః సమదా నదన్తి.28

ప్ర. అ. కేతకిపుష్పగన్ధమ్=మొగలిపూవుల సువాసనను, ఆఘ్రాయ= వాసనచూచి, ప్రహర్షితాః=సంతోషించిన, గజేన్ద్రాః=ఏనుగులు, మత్తాః= మదించినవై, వననిర్ఝరేషు=వనములయందలి కొండకాలువలయందు, ప్రపాతశబ్దాకులితాః= జలప్రపాతముచేత కలిగిన శబ్దముచే ఆకులములుగా చేయబడుచు, సమదాః=మదముతో కూడినవై, మయూరైః సార్ధమ్=నెమళ్లతో కూడ, నదన్తి=ధ్వని చేయుచున్నవి.

తా. మొగలిపూవుల సువాసనను వాసన చూచి సంతోషించిన మత్తగజములు వనములలోని కొండకాలువలలో, జలము పడుటచే కలిగిన ధ్వనులచేత వ్యాకులములై మదముతో కూడి నెమళ్లతో పాటు ధ్వని చేయుచున్నవి.

మూ. ధారానిపాతై రభిహన్యమానాః కదమ్బశాఖాసు విలమ్బమానాః,
క్షణార్జితం పుష్పరసావగాఢం శనైర్మదం షట్చరణాస్త్యజన్తి. 29

ప్ర.అ. ధారానిపాతైః=జలధారలు పడుటచేత, అభిహన్యమానాః= కొట్టబడుచున్నవి, కదమ్బశాఖాసు=కదమ్బవృక్షశాఖలయందు, విలమ్బమానాః= వ్రేలాడుచున్నవి అయిన, షట్చరణాః=తుమ్మెదలు, క్షణార్జితమ్=క్షణకాలములో సంపాదింపబడిన, పుష్పరసావగాఢమ్=పుష్పరసముచేత అధికమైన, మదమ్= మదమును, శనైః=మెల్లగా, త్యజన్తి=విడుచుచున్నవి.

తా. పడుచున్న వర్షధారలచే కొట్టబడి కదంబవృక్షశాఖలయందు వ్రేలాడుచున్న తుమ్మెదలు క్షణకాలములో సంపాదింపబడిన పుష్పరసమును త్రాగుటచే అధికము అయిన మదమును మెల్లగా విడుచుచున్నవి. 29

మూ. అఙ్గారచూర్ణోత్కరసన్నికాశైః ఫలైః సుపర్యాప్తరసైః సమృద్ధైః,
జమ్బూద్రుమాణాం ప్రవిభాన్తి శాఖా నిపీయమానా ఇవ షట్పదౌఘైః.

ప్ర. అ. అఙ్గారచూర్ణోత్కరసన్నికాశైః=బొగ్గుపొడి ముద్దతో సమానమైన, సుపర్యాప్తరసైః=పరిపూర్ణమైన రసము గల, సమృద్ధైః=సమృద్ధములైన, ఫలైః=ఫలములతో, జమ్బూద్రుమాణామ్=నేరేడుచెట్లయొక్క, శాఖాః= శాఖలు, షట్పదౌఘైః=తుమ్మెదల సముదాయములచేత, నిపీయమానా ఇవ= త్రాగబడుచున్నవి వలె, ప్రవిభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. బొగ్గుపొడి ముద్దల వలె నున్న రసముతో నిండిన పండ్లతో నేరేడు చెట్ల కొమ్మలు తుమ్మెదల సముదాయములతో నిండిన ట్లున్నవి. 30

మూ. తడిత్పతాకాభిరలఙ్కృతానాముదీర్ణగమ్భీరమహారవాణామ్,
విభాన్తి రూపాణి వలాహకానాం రణోత్సుకానామివ వానరాణామ్ .

ప్ర. అ. తడిత్పతాకాభిః=మెరుపు లనే పతాకలచేత, అలఙ్కృతానామ్= అలంకరింపబడిన, ఉదీర్ణగమ్భీరమహారవాణామ్=అధికమైన గంభీరమైన మహాధ్వనులు గల, వలాహకానామ్=మేఘములయొక్క, రూపాణి=రూపములు, రణోత్సుకానామ్=యుద్ధమునందు ఆసక్తి గల, వానరాణామ్ ఇవ=వానరులయొక్క రూపములు వలె, విభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. మేఘములు మెరుపు లనే పతాకలచేత అలంకరింపబడి గంభీరమైన ధ్వని చేయుచున్నవి. అట్టి ఈ మేఘముల రూపములు రణమునందు ఉత్సాహము గల వానరుల రూపములు వలె ప్రకాశించుచున్నవి. 31

మూ. మార్గానుగః శైలవనానుసారీ సమ్ప్రస్థితో మేఘరవం నిశమ్య,
యుద్ధాభికామః ప్రతినాదశఙ్కీ మత్తో గజేన్ద్రః ప్రతిసన్నివృత్తః. 32

ప్ర. అ. మేఘరవమ్=మేఘధ్వనిని, నిశమ్య=విని, ప్రతినాదశఙ్కీ= శత్రుగజముయొక్క నాదము అని శంకించినదై, యుద్ధాభికామః=యుద్ధమునందు కోరికకలదై, సమ్ప్రస్థితః=బయలుదేరిన, మార్గానుగః= మార్గమును అనుసరించిన, శైలవనానుసారీ=శైలమును, వనమును అనుసరించి పోవుచున్న, మత్తః= మదించిన, గజేన్ద్రః=ఏనుగు, ప్రతిసన్నివృత్తః=తిరిగి వచ్చినది.

తా. మదించిన ఈ గజేంద్రము మేఘధ్వని విని శత్రుగజము చేయు ధ్వని అని శంకించి, దానితో యుద్ధము చేయుటకై బయలుదేరి పర్వతమును, వనమును అనుసరించి ఆ మార్గమున కొంతదూరము వెళ్లి తిరిగి వచ్చినది. 32

మూ. క్వచిత్ప్రగీతా ఇవ షట్పదౌఘైః క్వచిత్ప్రనృత్తా ఇవ నీలకణ్ఠైః,
క్వచిత్ప్రమత్తా ఇవవారణేంద్రై ర్విభాన్త్యనేకాశ్రయిణో వనాన్తాః. 33

ప్ర. అ. అనేకాశ్రయిణః=అనేక ప్రాణులకు ఆశ్రయములైన, వనాన్తాః= వనమధ్యప్రదేశములు, క్వచిత్=కొన్నిచోట్ల, షట్పదౌఘైః=తుమ్మెదల సము దాయములచేత, ప్రగీతాః ఇవ=పాటలు పాడుచున్నవి వలె, క్వచిత్=కొన్ని చోట్ల , నీలకణ్ఠైః=నెమళ్లచేత, ప్రనృత్తా ఇవ=నృత్యము చేయుచున్నవి వలె, క్వచిత్=కొన్ని చోట్ల, వారణేన్ద్రైః=గజేంద్రములచేత, ప్రమత్తాః ఇవ= మదించినవి వలె, విభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. ఈ వనమధ్యములలో కొన్ని చోట్ల తుమ్మెద లుండుటచే ఆ వనభాగములు గానము చేయుచున్నట్లున్నవి. కొన్ని చోట్ల నెమళ్లుండుటచే ఆ వనప్రదేశములు నాట్యము చేయుచున్నట్లున్నవి. కొన్ని చోట్ల గజేంద్రము లుండుటచేత ఆ ప్రదేశములు మదించినట్లున్నవి. అనేక ప్రాణుల కాశ్రయమైన ఈ వనప్రదేశములు ఇట్లు ప్రకాశించుచున్నవి. 33

మూ. కదమ్బసర్జార్జునకన్దలాఢ్యా వనాన్తభూమిర్మధువారిపూర్ణా,
మయూరమత్తాభిరుతప్రనృత్తైరాపానభూమిప్రతిమా విభాతి. 34

ప్ర. అ. కదమ్బసర్జార్జునకన్దలాఢ్యా=కదంబ, సర్జ, అర్జున, కందల పుష్పములతో నిండినది, మధువారిపూర్ణా=మకరందజలముతో పూర్ణము అయిన, వనాన్తభూమిః=వనమధ్యప్రదేశము, మయూరమత్తాభిరుతప్రనృత్తైః= నెమళ్లయొక్క మదించిన కూతలచేతను, నృత్యములచేతను, ఆపానభూమిప్రతిమా= ఆపానభూ మితో సమానమై, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. ఈ వనమధ్యప్రదేశమునందు కదంబ, సర్జ, అర్జున, కందలపుష్పములు రాశులుగా పడి ఉన్నవి. ఇవి మకరందముతో నిండి యున్నవి. అట్టి ఈ వనమధ్య

ప్రదేశము, నెమళ్లు మదించి ధ్వనిచేయుచు నాట్యమాడుటచే మధుపానస్థానము వలె నున్నది. 34

మూ. ముక్తాసమాభం సలిలం పతద్వై సునిర్మలం పత్రపుటేషు లగ్నమ్,
హృష్టా వివర్ణచ్ఛదనా విహఙ్గాః సురేన్ద్రదత్తం తృషితాః పిబన్తి. 35

ప్ర.అ. సురేన్ద్రదత్తమ్=దేవేంద్రునిచేత ఇవ్వబడినది, ముక్తాసమాభమ్=ముత్యములతో సమానమైన కాంతి గలది, పతత్=పడుచున్నది, సునిర్మలమ్=బాగా నిర్మలము, పత్రపుటేషు=దొన్నెల వంటి ఆకులలో, లగ్నమ్=లగ్నము అయిన, సలిలమ్=ఉదకమును, తృషితాః= దప్పికొన్న, వివర్ణచ్ఛదనాః=తడియుటచే రంగు మారిన రెక్కలు గల, విహఙ్గాః=పక్షులు, హృష్టాః=సంతోషించినవై, పిబన్తి=త్రాగుచున్నవి.

తా. దేవేంద్రుని ప్రేరణచే మేఘములు వర్షించుచున్న ముత్యములతో సమానమైన కాంతి గల పత్రపుటములలో లగ్నమైన నిర్మలమైన ఉదకమును తడియుటచే రంగు మారిన రెక్కలు గల, దప్పిగొన్న పక్షులు సంతోషించుచు త్రాగుచున్నవి. 35

మూ. షట్పాదతన్త్రీమధురాభిధానం ప్లవఙ్గమోదీరితకణ్ఠతాలమ్,
ఆవిష్కృతం మేఘమృదఙ్గనాదై ర్వనేషు సఙ్గీతమివ ప్రవృత్తమ్. 36

ప్ర. అ. వనేషు=వనములయందు, షట్పాదతన్త్రీమధురాభిధానమ్=తుమ్మెదలనే వీణయొక్క మధురధ్వని కలది, ప్లవఙ్గమోదీరితకణ్ఠతాళమ్=కప్పలచే చేయబడిన కంఠతాళధ్వని గలది, మేఘమృదఙ్గనాదైః=మేఘములనే మృదఙ్గముల ధ్వనులచేత, ఆవిష్కృతమ్=ఆవిష్కరింపబడినది అయిన, సఙ్గీతమ్=సంగీతము, ప్రవృత్తమ్ ఇవ=ప్రారంభ మైనట్లున్నది.

తా. వనములలో సంగీతము ప్రారంభ మైనట్లున్నది. దీనిలో తుమ్మెదల ధ్వనులే మధురములైన వీణాధ్వనులు. మండూకముల కంఠధ్వనులే కంఠతాళములు. మేఘధ్వనులే మృదఙ్గధ్వనులు. 36

మూ. క్వచిత్ప్రనృత్తైః క్వచిదున్నదద్భిః క్వచిచ్చ వృక్షాగ్రనిషణ్ణకాయైః,
వ్యాలమ్బబర్హాభరణైర్మయూరైర్వనేషు సఙ్గీతమివ ప్రవృత్తమ్. 37

ప్ర. అ. క్వచిత్= కొన్నిచోట్ల, ప్రనృత్తైః= నాట్యముచేయుచున్నవి, క్వచిత్=కొన్నిచోట్ల, ఉన్నదద్భిః=ధ్వని చేయుచున్నవి, క్వచిత్=కొన్నిచోట్ల, వృక్షాగ్రనిషణ్ణకాయైః= వృక్షాగ్రములయం దున్న శరీరములు గలవి, వ్యాలమ్బబర్హాభరణైః= వ్రేలాడుచున్న పింఛములనే ఆభరణములు కలవి అయిన, మయూరైః= నెమళ్ల చేత, వనేషు=వనములయందు, సఙ్గీతమ్=సంగీతము, ప్రవృత్తమ్ ఇవ =ప్రారంభ మైనట్లున్నది.

తా. వ్రేలాడుచున్న పింఛము లనే ఆభరణములు గల నెమళ్లు కొన్ని చోట్ల నాట్యము చేయుచున్నవి. కొన్ని చోట్ల బిగ్గరగా అరచుచున్నవి. కొన్ని చోట్ల వృక్షాగ్రములమీద కూర్చున్నవి. ఈ విధముగా వనములలో సంగీతము ప్రారంభమైనట్లున్నది. (నృత్త గీత వాద్యములకు సంగీతక మని పేరు.) 37

మూ. స్వనైర్ఘనానాం ప్లవగాః ప్రబుద్ధా విహాయ నిద్రాం చిరసన్నిరుద్ధామ్,
అనేకరూపాకృతివర్ణనాదాః నవామ్బుధారాభిహతా నదన్తి. 38

ప్ర.అ. ఘనానామ్= మేఘములయొక్క, స్వనైః= ధ్వనులచేత, ప్రబుద్ధాః=లేచిన, అనేకరూపాకృతివర్ణనాదాః= అనేకవిధములైన రూపములు, ఆకారములు, వర్ణములు, ధ్వనులు కల, ప్లవగాః=కప్పలు, చిరసన్నిరుద్ధామ్=చాల కాలము గ్రహింపబడిన, నిద్రామ్=నిద్రను, విహాయ=విడచి, నవామ్బుధారాభిహతాః= నూతన జలధారలచేత కొట్టబడినవై, నదన్తి=ధ్వనిచేయుచున్నవి.

తా. చాల కాలమునుండి నిద్రించుచున్న అనేక విధములైన రూపములు, ఆకారములు, వర్ణములు, ధ్వనులు గల కప్పలు మేఘధ్వనులకు లేచి నూతన వర్షజలధారలచేత కొట్టబడుచు ధ్వనిచేయుచున్నవి. 38

మూ. నద్యః సముద్వాహితచక్రవాకాస్తటాని శీర్ణాన్యపవాహయిత్వా,
దృప్తా నవప్రాభృతపూర్ణభోగా ద్రుతం స్వభర్తారముపోపయాన్తి. 39

ప్ర.అ. సముద్వాహితచక్రవాకాః=కొట్టుకొనిపోవు నట్లు చేయబడిన చక్రవాకపక్షులు గల, దృప్తాః=గర్వించిన, నద్యః=నదులు, శీర్ణాని=చీల్చివేయబడిన, తటాని=తటములను, అపవాహయిత్వా=తొలగించి, నవప్రాభృతపూర్ణభోగాః=నూతనములైన కానుకలతో నిండిన శరీరములు కలవై, (పూర్ణమైన భోగములు కలవై), స్వభర్తారమ్=తమ భర్తయైన సముద్రుని, ద్రుతమ్=శీఘ్రముగా, ఉపోపయాన్తి=సమీపించుచున్నవి.

తా. గర్వించిన నదులు తమ ప్రవాహముపై చక్రవాకపక్షులు కొట్టుకొని పోవు నట్లు చేయుచు జీర్ణములైన తటములను తొలగించుచు నూతనములైన కానుకలతో నిండిన శరీరములు గలవై తమ భర్తయైన సముద్రుని సమీపించుచున్నవి.

మూ. నీలేషు నీలా నవవారిపూర్ణా మేఘేషు మేఘాః ప్రతిభాన్తి సక్తాః,
దవాగ్నిదగ్ధేషు దవాగ్నిదగ్ధాః శైలేషు శైలా ఇవ బద్ధమూలాః. 40

ప్ర. అ. నీలేషు=నల్లని, మేఘేషు=మేఘములయందు, సక్తాః=తగుల్కొనియున్న, నవవారిపూర్ణాః=నూతనమైన ఉదకముతో నిండిన, నీలాః=నల్లని, మేఘాః=మేఘములు, దవాగ్నిదగ్ధేషు= దావాగ్నిచే కాల్చబడిన, శైలేషు=పర్వతములయందు, బద్ధమూలాః= కట్టబడిన మూలములు గల, దవాగ్నిదగ్ధాః=దావాగ్నిచే కాల్చబడిన, శైలాః ఇవ=పర్వతములు వలె, ప్రతిభాన్తి=కనబడుచున్నవి.

తా. క్రొత్త నీటితో నిండిన నల్లని మేఘములు, నల్లని మేఘముల మీద నిలిచి ఉన్నప్పుడు దావాగ్నిచే కాల్చబడిన పర్వతముల మీద నిలచిన దావాగ్నిచే కాల్చబడిన ఇతర పర్వతముల వలె కనబడుచున్నవి. 40

మూ. ప్రమత్తసంనాదితబర్హిణాని సశక్రగోపాకులశాద్వలాని,
చరన్తి నీపార్జునవాసితాని గజాః సురమ్యాణి వనాన్తరాణి. 41

ప్ర. అ. గజాః=ఏనుగులు, ప్రమత్తసంనాదితబర్హిణాని= మదించిన ధ్వనిచే యుచున్న నెమళ్లు కలవి, సశక్రగోపాకులశాద్వలాని= శక్రగోపము లనే పురుగులతో కూడిన వ్యాకులములైన పచ్చికబయళ్లు కలవి, నీపార్జునవాసితాని=నీపవృక్షములచేత, అర్జున వృక్షములచేత సుగంధము కలవిగా చేయబడినవి, సురమ్యాణి=చాల రమ్యములు అయిన, వనాన్తరాణి=వనమధ్యములను, చరన్తి=సంచరించుచున్నవి.

తా. రమ్యములైన వనమధ్యప్రదేశములు మదించి కేకాధ్వనులు చేయుచున్న నెమళ్లతో నిండి యున్నవి. అక్కడ నున్న పచ్చికబీళ్లు ఎఱ్ఱని శక్రగోపకీటములతో అందముగా ఉన్నవి. నీప, అర్జున పుష్పముల సువాసనలు వ్యాపించుచున్నవి. అట్టి వనమధ్యములలో గజములు సంచరించుచున్నవి. 41

మూ. నవామ్బుధారాహతకేసరాణి ద్రుతం పరిత్యజ్య సరోరుహాణి,
కదమ్బపుష్పాణి సకేసరాణి నవాని హృష్టా భ్రమరాః పిబన్తి. 42

ప్ర. అ. హృష్టాః=సంతోషించుచున్న, భ్రమరాః=తుమ్మెదలు, నవామ్బుధారాహతకేసరాణి=నూతనజలధారలచేత కొట్టబడిన కింజల్కములు గల, సరోరుహాణి=పద్మములను, ద్రుతమ్=శీఘ్రముగా, పరిత్యజ్య=విడచి, సకేసరాణి=కింజల్కములతో కూడిన, నవాని= క్రొత్తవైన, కదమ్బపుష్పాణి=కదంబపుష్పములను, పిబన్తి= త్రాగుచున్నవి.

తా. సంతోషించుచున్న తుమ్మెదలు నూతనజలధారలచే కింజల్కములు చెదిరిపోయిన పద్మాలను వెంటనే విడచి కింజల్కములతో కూడిన క్రొత్తకదంబ పుష్పముల మధువును త్రాగుచున్నవి. 42

మూ. మత్తా గజేన్ద్రా ముదితా గవేన్ద్రా వనేషు విక్రాన్తతరా మృగేన్ద్రాః,
రమ్యా నగేన్ద్రా నిభృతా నరేన్ద్రాః ప్రక్రీడితో వారిధరైః సురేన్ద్రః.

ప్ర. అ. గజేన్ద్రాః=గజేంద్రములు, మత్తాః=మదించినవి. వనేషు= వనములలో, గవేన్ద్రాః=ఆబోతులు, ముదితాః=సంతోషించినవి. మృగేన్ద్రాః= సింహములు, విక్రాన్తతరాః=అధికముగా పరాక్రమించుచున్నవి. నగేన్ద్రాః= పర్వతములు, రమ్యాః=సుందరమైనవి. నరేన్ద్రాః=రాజులు, నిభృతాః= అణగి ఉన్నారు. సురేన్ద్రాః=దేవేంద్రుడు, వారిధరైః=మేఘములతో, ప్రక్రీడితః=ఆడుకొనుచున్నాడు.

తా. వనములలో ఏనుగులు మదించి ఉన్నవి. ఆబోతులు సంతోషించుచు

న్నవి. సింహములు పరాక్రమించుచున్నవి. పర్వతములు సుందరముగా నున్నవి. రాజులు యుద్ధయాత్రలు చేయక నిలిచి ఉన్నారు. దేవేంద్రుడు మేఘములతో ఆడుకొనుచున్నాడు. 43

మూ. మేఘాః సముద్ధూతసముద్రనాదా
మహాజలౌఘైర్గగనావలమ్బాః,
నదీస్తటాకాని సరాంసి వాపీ
ర్మహీం చ కృత్స్నామపవాహయన్తి. 44

ప్ర. అ. మహాజలౌఘైః=గొప్ప జలప్రవాహములచేత, సముద్ధూతసముద్రనాదాః= తిరస్కరించబడిన సముద్రధ్వనులు గల, గగనావలమ్బాః=ఆకాశముపై వ్రేలాడుచున్న, మేఘాః=మేఘములు, నదీః=నదులను, తటాకాని=చెఱువులను, సరాంసి=సరస్సులను, వాపీః=దిగుడుబావులను, కృత్స్నామ్=సమస్తమైన, మహీం చ=భూమిని, అపవాహయన్తి=ప్రవహింపచేయుచున్నవి.

తా. అధికమైన జలముతో నిండి సముద్రధ్వనిని తిరస్కరించుచున్న, ఆకాశముపై ఎగురుచున్న మేఘములు నదులను, చెఱువులను, సరస్సులను, దిగుడుబావులను, భూమి నంతను కూడ నీటితో నింపి వేయుచున్నవి. 44

మూ. వర్షప్రవేగా విపులాః పతన్తి ప్రవాన్తి వాతాః సముదీర్ణవేగాః,
ప్రనష్టకూలాః ప్రవహన్తి శీఘ్రం నద్యో జలం విప్రతిపన్నమార్గాః. 45

ప్ర. అ. విపులాః=అధికమైన, వర్షప్రవేగాః=వర్షవేగములు, పతన్తి= పడుచున్నవి. సముదీర్ణవేగాః=అధికమైన వేగము గల, వాతాః=వాయువులు, ప్రవాన్తి=వీచుచు న్నవి. ప్రనష్టకూలాః=కూలిపోయిన ఒడ్లు గలవై, విప్రతిపన్నమార్గాః=విరుద్ధమైన మార్గములు గల, నద్యః=నదులు, శీఘ్రమ్= శీఘ్రముగా, జలమ్=జలమును, ప్రవహన్తి=ప్రవహించుచున్నవి.

తా. అధికమైన వర్షములు వేగముగా పడుచున్నవి. తీవ్రమైన వేగముతో వాయువులు వీచుచున్నవి. నదులు తీరములను పడగొట్టి వేరే మార్గములలో శీఘ్రముగా ప్రవహించుచున్నవి. 45

మూ. నరై ర్నరేన్ద్రా ఇవ పర్వతేన్ద్రాః సురేన్ద్రనీతైః పవనోపనీతైః,
ఘనామ్బుకుమ్భైరభిషిచ్యమానా రూపం శ్రియం స్వామివ దర్శయన్తి.

ప్ర. అ. పర్వతేన్ద్రాః=పర్వతశ్రేష్ఠములు, సురేన్ద్రనీతైః=దేవేంద్రునిచే పంపబ డిన, పవనోపనీతైః=వాయువుచే దగ్గరకు తీసుకొనిరాబడిన, ఘనామ్బుకుంభైః=మేఘము లనే జలకుంభములచేత, నరైః=నరులచేత, నరేన్ద్రా ఇవ=రాజులు వలె, అభి షిచ్యమానాః=అభిషేకించబడుచున్నవై, రూపమ్= రూపమును, స్వామ్=తమ సంబంధమైన, శ్రియమ్ ఇవ=లక్ష్మిని వలె, దర్శయన్తి=చూపించుచున్నవి.

తా. ఉన్నతములైన పర్వతములు దేవేంద్రుడు పంపిన వాయువు తీసుకొని వచ్చిన మేఘము లనే జలకుంభములచేత రాజులు నరులచేత అభిషేకించబడి నట్లు అభిషేకింపబడుచు ఆ రాజులు తమ శోభను చూపించి నట్లు తమ రూపమును చూపించుచున్నవి. 46

మూ. ఘనోపగూఢం గగనం న తారా న భాస్కరో దర్శనమభ్యుపైతి,
నవైర్జలౌఘైర్ధరణీ వితృప్తా తమో విలిప్తా న దిశః ప్రకాశాః. 47

ప్ర. అ. గగనమ్=ఆకాశము, ఘనోపగూఢమ్=మేఘములచే కప్పబడినది. భాస్కరః=సూర్యుడు, దర్శనమ్=దర్శనమును, న అభ్యుపైతి= పొందుటలేదు. తారాః=నక్షత్రములు, న= పొందుటలేదు. ధరణీ=భూమి, జలౌఘైః=జలసముదాయములచేత, వితృప్తా=తృప్తిచెందినది. తమోవిలిప్తాః= తమస్సుచేత పూయబడిన, దిశః=దిక్కులు, న ప్రకాశాః=ప్రకాశించుటలేదు.

తా. ఆకాశము మేఘములతో నిండి యున్నది. నక్షత్రములు కాని సూర్యుడు కాని కనబడుటలేదు. నూతనజలప్రవాహములచేత భూమి తృప్తి చెందినది. చీకటి అలముకొనుటచే దిక్కులు ప్రకాశించుటలేదు. 47

మూ. మహాన్తి కూటాని మహీధరాణాం ధారావిధౌతాన్యధికం విభాన్తి,
మహాప్రమాణైర్విపులైః ప్రపాతైర్ముక్తాకలాపైరివ లమ్బమానైః. 48

ప్ర. అ. మహీధరాణామ్=పర్వతములయొక్క, ధారావిధౌతాని=జలధారలచేత కడిగివేయబడిన, మహాన్తి=గొప్పవైన, కూటాని=శిఖరములు, లమ్బమానైః=వ్రేలాడుచున్న, ముక్తాకలాపైరివ=ముత్యముల సముదాయములవలె నున్న, మహాప్రమాణైః=గొప్ప ప్రమాణము గల, విపులైః=విశాలములైన, ప్రపాతైః= జలపాతములతో, అధికమ్=అధికముగా, విభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. వర్షజలధారలు కడిగివేయుటచే పెద్దవైన పర్వతశిఖరములు వ్రేలాడుచున్న ముత్యాలహారముల వంటి పెద్ద పెద్ద జలప్రపాతములతో అధికముగా ప్రకాశించుచున్నవి. 48

మూ. శైలోపలప్రస్ఖలమానవేగాః
శైలోత్తమానాం విపులాః ప్రపాతాః,
గుహాసు సంనాదితబర్హిణాసు
హారా వికీర్యన్త ఇవావభాన్తి. 49

ప్ర. అ. శైలోపలప్రస్ఖలమానవేగాః=పర్వతముల రాళ్లపై తొట్రుపడుచున్న వేగము గల, విపులాః=విశాలములైన, ప్రపాతాః=జలప్రపాతములు, శైలోత్తమానామ్=శ్రేష్ఠమైన పర్వతములయొక్క, సంనాదితబర్హిణాసు= ధ్వనింపచేయబడిన నెమళ్లు గల, గుహాసు=గుహలయందు, హారాః=హారములు, వికీర్యన్త ఇవ=చిమ్మ

బడుచున్నవా అన్నట్లు, అవభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. విశాలమైన జలప్రపాతముల వేగము పర్వతములమీద నున్న శిలలచే అడ్డుకొనబడి, ఆ జలము పర్వతముల గుహలలో ప్రవేశించుచుండుటచే ధ్వని చేయుచున్న నెమళ్లతో నిండిన ఆ గుహలలో ముత్యాలహారములు చిమ్మబడుచున్నవా అన్నట్లున్నది. 49

మూ. శీఘ్రప్రవేగా విపులాః ప్రపాతా నిర్ధౌతశృఙ్గోపతలా గిరీణామ్,
ముక్తాకలాపప్రతిమాః పతన్తో మహాగుహోత్సఙ్గతలైర్ధ్రియన్తే. 50

ప్ర. అ. శీఘ్రప్రవేగాః=శీఘ్రమైన వేగము కలవి, విపులాః=విశాలమైనవి, గిరీణామ్=పర్వతములయొక్క, నిర్ధౌతశృఙ్గోపతలాః=కడగబడిన శిఖరములు సమీప ప్రదేశములు కలవి, ముక్తాకలాపప్రతిమాః=ముత్యముల హారములతో సమానమైనవి అయిన, పతన్తః=పడుచున్న, ప్రపాతాః=జలపాతములు, మహాగుహోత్సఙ్గతలైః=విశాలములైన గుహాప్రదేశములచేత, ధ్రియన్తే= ధరింపబడుచున్నవి.

తా. పెద్దవైన జలప్రపాతములు ముత్యాలహారముల వలె ప్రకాశించుచు మహావేగముతో పడుచున్నవి. పర్వతశిఖరములను వాటి సమీపప్రాంతములను కడిగివేయుచున్న ఆ జలప్రపాతములను విశాలములైన గుహలు ధరించుచున్నవి.

మూ. సురతామర్దవిచ్ఛిన్నాః స్వర్గస్త్రీహారమౌక్తికాః,
పతన్తి చాతులా దిక్షు తోయధారాః సమన్తతః. 51

ప్ర. అ. సురతామర్దవిచ్ఛిన్నాః=సురతమర్దనముచే తెగిపోయిన, స్వర్గస్త్రీహారమౌక్తికాః=స్వర్గస్త్రీల హారములయందలి ముత్యములైన, అతులాః=సాటి లేని, తోయధారాః=జలధారలు, సమన్తతః=అంతట, దిక్షు=దిక్కులయందు, పతన్తి=పడుచున్నవి.

తా. సురతమర్దనమునందు తెగిపోయిన స్వర్గస్త్రీలు ధరించిన హారమునందలి ముత్యముల వలె నున్న సాటిలేని జలధారలు దిక్కులయందు నలువైపుల పడుచున్నవి. 51

మూ. విలీయమానైర్విహగైర్నిమీలద్భిశ్చ పఙ్కజైః,
వికసన్త్యా చ మాలత్యా గతోఽస్తం జ్ఞాయతే రవిః. 52

ప్ర. అ. విలీయమానైః=అణగుచున్న, విహగైః=పక్షులచేతను, నిమీలద్భిః=మూసికొనిపోవుచున్న, పఙ్కజైః చ=పద్మములచేతను, వికసన్త్యా=వికసించుచున్న, మాలత్యా చ=మాలతీలతచేతను, రవిః=సూర్యుడు, అస్తంగతః=అస్తమించినవాడుగా, జ్ఞాయతే=తెలియబడుచున్నాడు.

తా. పక్షులు తమ గూళ్ళు చేరుటచేతను, పద్మములు ముకుళీభ

వించుటచేతను, మాలతీలత వికసించుటచేతను సూర్యాస్తమయము అయినట్లు ఊహించబడుచున్నది. 52

మూ. వృత్తా యాత్రా నరేన్ద్రాణాం సేనా పథ్యేవ వర్తతే,
వైరాణి చైవ మార్గాశ్చ సలిలేన సమీకృతాః. 53

ప్ర. అ. నరేన్ద్రాణామ్=రాజులయొక్క, యాత్రా=యుద్ధయాత్ర, వృత్తా=నివర్తించినది. సేనా=సేన, పథ్యేవ=మార్గమునందే, వర్తతే= నిలిచిపోవుచున్నది. సలిలేన=ఉదకముచేత, వైరాణి చైవ=వైరములు, మార్గాశ్చ=మార్గములు, సమీకృతాః=సమము చేయబడినవి.

తా. రాజుల యుద్ధయాత్ర నిలిచిపోయినది. వారి సేన మార్గమధ్యములో ఆగిపోయినది. రాజుల మధ్య నున్న వైరమును, మార్గములను కూడ జలము సమము చేసివేసినది. 53

మూ. మాసి ప్రోష్ఠపదే బ్రహ్మ బ్రాహ్మణానాం వివక్షతామ్,
అయమధ్యాయసమయః సామగానాముపస్థితః. 54

ప్ర. అ. ప్రోష్ఠపదే మాసి=భాద్రపదమాసమునందు, బ్రహ్మ=వేదమును, వివక్షతామ్=పఠింప దలచుచున్న, సామగానామ్=సామగులైన, బ్రాహ్మణానామ్=బ్రాహ్మణులయొక్క, అయమ్=ఈ, అధ్యాయసమయః= చదివే సమయము, ఉపస్థితః=వచ్చినది.

తా. భాద్రపదమాసములో వేదాధ్యయనము చేయదలచుచున్న సామవేదశాఖీయులైన బ్రాహ్మణులు అధ్యయనము చేసే సమయము (భాద్రపదశుక్లతృతీయ) వచ్చినది. 54

మూ. నివృత్తకర్మాయతనో నూనం సఞ్చితసఞ్చయః,
ఆషాఢీమభ్యుపగతో భరతః కోశలాధిపః. 55

ప్ర. అ. నివృత్తకర్మాయతనః=పూర్తిచేయబడిన కర్మలు గల గృహము గలవాడు, సఞ్చితసఞ్చయః=సమకూర్చుకొనబడిన వస్తుసముదాయము గలవాడు, కోశలాధిపః=కోశలదేశ రాజు అయిన, భరతః=భరతుడు, ఆషాఢీమ్= ఆషాఢపూర్ణిమను, అభ్యుపగతః=పొంది ఉన్నాడు. నూనమ్=నిశ్చయము.

తా. కోసలాధిపతియైన భరతుడు గృహకర్మ లన్నింటిని పూర్తిచేసుకొని వస్తువులను సంపాదించుకొని ఇపుడు ఆషాఢపూర్ణిమకు సంబంధించిన వ్రతమును అవలంబించి ఉండును. 55

మూ. నూనమాపూర్యమాణాయాః సరయ్వా వర్ధతే రయః,
మాం సమీక్ష్య సమాయాన్తమయోధ్యాయా ఇవ స్వనః. 56

ప్ర. అ. ఆపూర్యమాణాయాః=జలప్రవాహములచే నింపబడుచున్న, సరయ్వాః =సరయూనదియొక్క, రయః=వేగము, సమాయాన్తమ్=వచ్చుచున్న, మామ్=నన్ను, సమీక్ష్య=చూచి, అయోధ్యాయాః=అయోధ్యయొక్క, స్వనః ఇవ=ధ్వని వలె, వర్ధతే=వృద్ధిపొందుచున్నది. నూనమ్=నిశ్చయము.

తా. జలముచేత నింపబడుచున్న సరయూనది వేగము తిరిగి వచ్చుచున్న నన్ను చూచి అయోధ్యానగరము ధ్వని వలె వృద్ధి పొందుచున్నది. నిశ్చయము.

మూ. ఇమాః స్ఫీతగుణా వర్షాః సుగ్రీవః సుఖమశ్నుతే ,
విజితారిః సదారశ్చ రాజ్యే మహతి చ స్థితః. 57

ప్ర. అ. విజితారిః=జయింపబడిన శత్రువు గలవాడు, సదారశ్చ=భార్యతో గూడినవాడు, మహతి=గొప్పదైన, రాజ్యే=రాజ్యమునందు, స్థితః చ= ఉన్నవాడు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, స్ఫీతగుణాః=అధికములైన గుణములు గల, ఇమాః వర్షాః=ఈ వర్షకాలమును, (నందు) సుఖమ్= సుఖమును, అశ్నుతే=పొందుచున్నాడు.

తా. శత్రువును జయించిన సుగ్రీవుడు అధికమైన గుణములు గల ఈ వర్షకాలములో భార్యలతో గూడి గొప్ప రాజ్యమును ఏలుచు సుఖము అనుభవించుచున్నాడు. 57

మూ. అహం తు హృతదారశ్చ రాజ్యాచ్చ మహతశ్చ్యుతః,
నదీకూలమివ క్లిన్నమవసీదామి లక్ష్మణ. 58

ప్ర. అ. లక్ష్మణ=ఓ లక్ష్మణా! హృతదారశ్చ=హరింపబడిన భార్య గలవాడను, మహతః=గొప్పదైన, రాజ్యాత్=రాజ్యమునుండి, చ్యుతశ్చ=భ్రష్టుడను అయిన, అహం తు=నేనైతే, క్లిన్నమ్=తడిసిన, నదీకూలమ్ ఇవ=నదీతీరము వలె, అవసీదామి=నశించుచున్నాను.

తా. లక్ష్మణా! నేను మాత్రము గొప్ప రాజ్యమునుండి భ్రష్టుడనై భార్యను ఎవరో అపహరింపగా, తడిసిపోయిన నది ఒడ్డువలె నశించుచున్నాను. 58

మూ. శోకశ్చ మమ విస్తీర్ణో వర్షాశ్చ భృశదుర్గమాః,
రావణశ్చ మహాన్ శత్రురపారం ప్రతిభాతి మే. 59

ప్ర. అ. మమ=నాయొక్క, శోకశ్చ=శోకము, విస్తీర్ణః=అధికమైనది. వర్షాశ్చ=వర్షకాలము, భృశదుర్గమాః=ప్రయాణము చేయుటకు ఏ మాత్రము వీలు కానిది. రావణశ్చ=రావణుడు, మహాన్=గొప్ప, శత్రుః=శత్రువు. మే=నాకు, అపారమ్=అంతములేనిదిగా, ప్రతిభాతి=తోచుచున్నది.

తా. నా దుఃఖము చాల అధికముగా నున్నది. వర్షకాలమా! ప్రయాణము చేయుటకు ఏ మాత్రము శక్యము కానిది. రావణుడా బలవంతుడైన శత్రువు.

ఈ మూడు దాటుటకు శక్యము కానివిగా నాకు కనబడుచున్నవి. 59

మూ. అయాత్రాం చైవ దృష్ట్వేమాం మార్గాంశ్చ భృశదుర్గమాన్,
ప్రణతే చైవ సుగ్రీవే న మయా కిఞ్చిదీరితమ్. 60

ప్ర. అ. సుగ్రీవే=సుగ్రీవుడు, ప్రణతే చైవ =నమస్కరించుచున్నను, ఇమామ్=ఈ, అయాత్రామ్=యాత్రకు వీలుకాకపోవుటను, భృశదుర్గమాన్= మిక్కిలి దుర్గమములైన, మార్గాంశ్చ=మార్గములను, దృష్ట్వా=చూచి, మయా=నాచేత, కిఞ్చిత్=ఏమియు, న ఈరితమ్=పలుకబడలేదు.

తా. సుగ్రీవుడు వచ్చి సీతాన్వేషణమునకు ఇప్పుడే వానరులను పంపెదము అని పలికినను నేను యాత్రకు అనుకూలము కాకపోవుటను, మార్గములు చాల దుర్గమములుగా ఉండుటను చూచి అప్పుడేమియు చెప్పలేదు. 60

మూ. అపి చాతిపరిక్లిష్టం చిరాద్దారైః సమాగతమ్,
ఆత్మకార్యగరీయస్త్వాద్వక్తుం నేచ్ఛామి వానరమ్. 61

ప్ర. అ. అపిచ=మరియు, అతిపరిక్లిష్టమ్=చాల కష్టపడినవాడు, చిరాత్=చిర కాలమునకు, దారైః=భార్యతో, సమాగతమ్=కూడినవాడు అయిన, వానరమ్=వానరుని గూర్చి, ఆత్మకార్యగరీయస్త్వాత్=తన కార్యము చాల గొప్ప దగుటచే, వక్తుమ్=ఏమీ చెప్పుటకు, నేచ్ఛామి=ఇచ్ఛయించను.

తా. మరొక విషయ మేమనగా ఎన్నో కష్టములు పడిన సుగ్రీవుడు చాల కాలమునకు భార్యను పొందగలిగినాడు. అందుచేతను మన కార్యము చాల గొప్పదగుటచేతను అపుడు నేను అతనితో ఏమీ అనలేదు. 61

మూ. స్వయమేవ హి విశ్రమ్య జ్ఞాత్వా కాలముపాగతమ్,
ఉపకారం చ సుగ్రీవో వేత్స్యతే నాత్ర సంశయః. 62

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, విశ్రమ్య=విశ్రమించి, కాలమ్= కాలమును, ఉపాగతమ్=వచ్చినదానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, ఉపకారం చ=ఉపకారమును గూడ, స్వయమేవ=స్వయముగానే, వేత్స్యతే హి= తెలుసుకొనగలదుకదా? అత్ర=ఈ విషయమున, సంశయః=సంశయము, న=లేదు.

తా. సుగ్రీవుడు కొంతకాలము విశ్రమించి తాను పొందిన ఉపకారమును స్మరించుచు, తగు సమయము వచ్చిన దని స్వయముగానే తెలుసుకొనగలడు. ఈ విషయములో సందేహము లేదు. 62

మూ. తస్మాత్కాలప్రతీక్షోఽహం స్థితోఽస్మి శుభలక్షణ,
సుగ్రీవస్య నదీనాం చ ప్రసాదమభికాంక్షయన్ . 63

ప్ర. అ. శుభలక్షణ =శుభములైన లక్షణములు గల ఓ లక్ష్మణా!

తస్మాత్= ఆ కారణమువలన, అహమ్=నేను, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, నదీనాం చ=నదులయొక్క, ప్రసాదమ్=ప్రసాదమును, అభికాంక్షయన్=కోరుచు, కాలప్రతీక్షః=కాలమునకు వేచియున్నవాడను, అస్మి=అయి ఉన్నాను.

తా. ఓ లక్ష్మణా! అందువలన నేను నదుల జలము నిర్మలము కావలెనని, సుగ్రీవుడు సాహాయ్యము చేయవలె నని కోరుకొనుచు సమయమునకై వేచి ఉన్నాను. 63

మూ. ఉపకారేణ వీరో హి ప్రతికారేణ యుజ్యతే,
అకృతజ్ఞోఽప్రతికృతో హన్తి సత్త్వవతాం మనః. 64

అథైవ ముక్తః ప్రణిధాయ లక్ష్మణః
కృతాఞ్జలిస్తత్ప్రతిపూజ్య భాషితమ్,
ఉవాచ రామం స్వభిరామదర్శనం
ప్రదర్శయన్ దర్శన మాత్మనః శుభమ్. 65

యదుక్తమేతత్తవ సర్వమీప్సితం
నరేన్ద్ర కర్తా న చిరాత్తు వానరః,
శరత్ప్రతీక్షః క్షమతామిమం భవాన్
జలప్రపాతం రిపునిగ్రహే ధృతః. 66

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కింధాకాణ్డే
అష్టావింశః సర్గః.

ప్రతిపదార్థతాత్పర్యములకు ఇరవైఏడవ సర్గలోని 45, 46, 47 శ్లోకములను చూడుడు.

ఈ సర్గలోని వర్షకాలవర్ణనము ముప్పదిఆరు దీర్ఘవృత్తశ్లోకములలో సుదీర్ఘముగా నడిచినది. ఇంత దీర్ఘవర్ణనము ప్రాచ్యపాఠములో లేదు. ఐదారు శ్లోకములలోనే వర్షావర్ణనము చేయబడినది. 64-66

*"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఇరువదిఎనిమిదవ సర్గ సమాప్తము.*

# అథ ఏకోనత్రింశః సర్గః

[హనుమంతుడు బోధించగా సుగ్రీవుడు నీలుని పిలిపించి వానర సైన్యములను సమకూర్చవలె నని ఆదేశించుట.]

మూ. సమీక్ష్య విమలం వ్యోమ గతవిద్యుద్బలాహకమ్,
సారసాకులసఙ్ఘుష్టం రమ్యజ్యోత్స్నానులేపనమ్, 1
సమృద్ధార్థం చ సుగ్రీవం మన్దధర్మార్థసఙ్గ్రహమ్,
అత్యర్థం చాసతాం మార్గమేకాన్తగతమానసమ్, 2
నివృత్తకార్యం సిద్ధార్థం ప్రమదాభిరతం సదా,
ప్రాప్తవన్తమభిప్రేతాన్ సర్వానేవ మనోరథాన్, 3
స్వాం చ పత్నీమభిప్రేతాం తారాం చాపి సమీప్సితామ్,
విహరన్తమహోరాత్రం కృతార్థం విగతజ్వరమ్, 4
క్రీడన్తమివ దేవేశం గన్ధర్వాప్సరసాం గణైః,
మన్త్రిషు న్యస్తకార్యం చ మన్త్రిణామనవేక్షకమ్, 5
ఉచ్ఛిన్నరాజ్యసన్దేహం కామవృత్తమివ స్థితమ్,
నిశ్చితార్థోఽర్థతత్త్వజ్ఞః కాలధర్మవిశేషవిత్, 6
ప్రసాద్య వాక్యైర్వివిధైర్హేతుమద్భిర్మనోరమైః,
వాక్యవిద్వాక్యతత్త్వజ్ఞం హరీశం మారుతాత్మజః, 7
హితం తథ్యం చ పథ్యం చ సామధర్మార్థనీతిమత్,
ప్రణయప్రీతిసంయుక్తం విశ్వాసకృతనిశ్చయమ్, 8
హరీశ్వరముపాగమ్య హనూమాన్ వాక్యమబ్రవీత్.

ప్ర. అ. విమలమ్=నిర్మలము, గతవిద్యుద్బలాహకమ్=పోయిన మెరుపులు మేఘములు కలది, సారసాకులసఙ్ఘుష్టమ్=సారసపక్షులచే వ్యాకులముగా ధ్వని చేయుచున్నది, రమ్యజ్యోత్స్నానులేపనమ్=రమ్యమైన వెన్నెల అనులేపనముగా కలది అయిన, వ్యోమ=ఆకాశమును, సమృద్ధార్థమ్=సిద్ధించిన కార్యముగలవాడు, మన్దధర్మార్థసఙ్గ్రహమ్=మందమైన ధర్మార్థముల సంపాదనము కలవాడు, అత్యర్థమ్=మిక్కిలి, అసతామ్=సత్పురుషులు కానివారియొక్క, మార్గమ్= కామప్రవృత్తిరూపమైన మార్గమును పొందినవాడు, ఏకాన్తగతమానసమ్= రహస్యప్రదేశమునం దాసక్తి కల మనస్సు కలవాడు, నివృత్తకార్యమ్=నివర్తించిన ఇతర కార్యములు కలవాడు, సిద్ధార్థమ్=సిద్ధమైన

ప్రయోజనము కలవాడు, సదా= ఎల్లపుడు, ప్రమదాభిరతమ్=స్త్రీలయందు దాసక్తుడు, అభిప్రేతాన్=ఇష్టమైన, సర్వానేవ =సమస్తమైన, మనోరథాన్=మనోరథములను, అభిప్రేతామ్=ఇష్టురాలైన, స్వాం పత్నీమ్=తన భార్యను, సమీప్సితామ్=కోరబడిన, తారాం చాపి= తారను, ప్రాప్తవన్తమ్=పొందినవాడు, అహోరాత్రమ్=రాత్రింబవళ్లు, విహరన్తమ్=విహరించుచున్నవాడు, కృతార్థమ్=కృతార్థుడు, విగతజ్వరమ్= పోయిన ఇతర బాధలు కలవాడు, గన్ధర్వాప్సరసామ్=గంధర్వులయొక్క, అప్సరసలయొక్క, గణైః=గణములతో, క్రీడన్తమ్=క్రీడించుచున్న, దేవేశమ్ ఇవ=దేవేంద్రుని వలె ఉన్నవాడు, మన్త్రిషు=మంత్రులయందు, న్యస్తకార్యం చ=ఉంచబడిన కార్యములు గలవాడు, మన్త్రిణామ్=మంత్రులకు, అనవేక్షకమ్=చూడనివాడు, ఉచ్ఛిన్నరాజ్యస న్దేహమ్=తొలగిన రాజ్యమును గూర్చిన సందేహము కలవాడు, కామవృత్తమ్ ఇవ=స్వేచ్ఛగా సంచరించువాడు వలె, స్థితమ్=ఉన్నవాడు, హరీశమ్=వానరుల రాజు అయిన, సుగ్రీవం చ=సుగ్రీవుని, సమీక్ష్య=చూచి, నిశ్చితార్థః=నిశ్చితమైన విషయములు కలవాడు, అర్థతత్త్వజ్ఞః= అర్థతత్త్వమును తెలిసినవాడు, కాలధ ర్మవిశేషవిత్=కాలముయొక్క, ధర్మముయొక్క విశేషములను ఎరిగినవాడు, వాక్యవిత్=వాక్యములలో నేర్పరి, మారుతాత్మజః= వాయుకుమారుడు అయిన, హనుమాన్=హనుమంతుడు, వాక్యతత్త్వజ్ఞమ్= వాక్యముయొక్క తత్త్వమును ఎరి గిన, హరీశ్వరమ్=ఆ సుగ్రీవుని, ఉపాగమ్య= సమీపించి, వివిధైః=అనేకవిధములైన, హేతుమద్భిః=హేతువులుకల, మనోరమైః=మనోహరములైన, వాక్యైః=వాక్యములచేత, ప్రసాద్య= అనుగ్రహింపచేసుకొని,, హితమ్=హితము, తథ్యమ్=సత్యము, పథ్యమ్ చ= లాభకరము, సామధర్మార్థనీతిమత్=సామము, ధర్మము, అర్థము, నీతి కలది, ప్రణయప్రీతిసంయుక్తమ్=ప్రేమతోను సంతోషముతోను కూడినది, విశ్వాసకృతనిశ్చ యమ్=విశ్వాసముచేత చేయబడిన నిశ్చయముకలది అయిన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఇంతలో వర్షకాలము గడచిపోవుటచేత మేఘములు మెఱుపులు తొలగిపోయి ఆకాశము నిర్మల మయ్యెను. సారసపక్షులతో వ్యాకులమై, వాటి ధ్వనులతో నిండిన ఆ ఆకాశము అందమైన వెన్నెలచే పూయబడెను. తన పని పూర్తి చేసికొనిన సుగ్రీవుడు ధర్మార్థముల సంపాదనమునందు, ఇతరకార్యములందు శ్రద్ధ చూపక అసత్పురుషు లనుసరించు కామభోగమునందే ఎక్కువ ఆసక్తి కలవాడై ఎల్లప్పుడు రహస్యప్రదేశమునే కోరుచు స్త్రీలతో విహరించుచుండెను. ఇష్టమైన సకల మనోరథములు తన భార్యయైన రుమ, ఇష్టురాలైన తార లభించుటచే కృతార్థుడ నని అనుకొనుచు ఇతరబాధ లేవియు లేక రాత్రింబవళ్లు విహరించుచుండెను. అతడు గంధర్వులతోను, అప్సరస్త్రీలతోను విహరించుచున్న దేవేంద్రుడు వలె ఉండెను. కార్యభారము నంతను మంత్రులపై ఉంచి వారికి కూడ దర్శన మిచ్చుటలేదు. రాజ్యమునకు సంబంధించిన అన్ని సందేహములు తొలగిపోవుటచే ఆ వానరరాజు స్వేచ్ఛాప్రవృత్తి కలవాడు వలె వ్యవహరించుచుండెను. విషయములను నిశ్చయించ

సమర్థుడు వాటి తత్త్వమును ఎరిగినవాడు, కాలవిశేషములను, ధర్మవిశేషములను గుర్తించగలిగినవాడు, మాటలలో నేర్పరి, వాయుకుమారుడు అయిన హనుమంతుడు ఇది చూచి వాక్యముల తత్త్వమును తెలుసుకొనగలిగిన ఆ సుగ్రీవుని వద్దకు వెళ్ళి, హితము, సత్యము, లాభకరము, సామ, ధర్మ, అర్థ, నీతులతో ఒప్పుచున్నది, ప్రేమను సంతోషమును తెలుపునది, విశ్వాసముచేత నిశ్చితము అయిన వాక్యమును పలికెను. 1 - 8

మూ. రాజ్యం ప్రాప్తం యశశ్చైవ కౌలీ శ్రీరభివర్ధితా, 9
మిత్రాణాం సఙ్గ్రహః శేషస్తద్భవాన్ కర్తుమర్హతి.

ప్ర. అ. రాజ్యమ్=రాజ్యము, యశశ్చైవ=కీర్తియు, ప్రాప్తమ్= పొందబడినది. కౌలీ=వంశమునకు సంబంధించిన, శ్రీః=లక్ష్మి, అభివర్ధితా= వృద్ధిపొందింపబడి నది. మిత్రాణామ్=మిత్రులయొక్క, సఙ్గ్రహః=సంగ్రహము, శేషః=మిగిలినది. తత్=దానిని, భవాన్=నీవు, కర్తుమ్=చేయుటకు, అర్హతి=తగియున్నావు.

తా. నీవు నీ రాజ్యమును, యశస్సును సంపాదించుకొన్నావు. నీ వంశమునకు సంబంధించిన లక్ష్మిని వృద్ధిపొందించినావు. ఇంక మిత్రుల కార్యములు సాధించి వారి స్నేహమును సంపాదించుట మిగిలి ఉన్నది. ఇపుడు నీవు ఆ పని చేయవలెను. 9

మూ. యో హి మిత్రేషు కాలజ్ఞః సతతం సాధు వర్తతే, 10
తస్య రాజ్యం చ కీర్తిశ్చ ప్రతాపశ్చాపి వర్ధతే.

ప్ర. అ. యో హి=ఎవడు, కాలజ్ఞః=కాలమును గుర్తించిన వాడై, సతతమ్=ఎల్ల పుడు, మిత్రేషు=మిత్రులవిషయమునందు, సాధు=బాగుగా, వర్తతే=ప్రవర్తించునో, తస్య=వానియొక్క, రాజ్యం చ=రాజ్యము, కీర్తిశ్చ=కీర్తి, ప్రతాపశ్చ=ప్రతాపము, వర్ధతే=వృద్ధిపొందును.

తా. తగు కాలమును గుర్తించుచు మిత్రుల విషయమున, ఎల్లప్పుడు బాగుగా ప్రవర్తించువాని రాజ్యము, కీర్తి, ప్రతాపము వృద్ధి పొందును. 10

మూ. యస్య కోశశ్చ దణ్డశ్చ మిత్రాణ్యాత్మా చ భూమిప, 11
సమాన్యేతాని సర్వాణి స రాజ్యం మహదశ్నుతే.

ప్ర. అ. భూమిప=రాజా! యస్య=ఎవనియొక్క, కోశశ్చ=కోశము, (ధనము), దణ్డశ్చ=దండము(సైన్యము), మిత్రాణి=మిత్రులు, ఆత్మా చ= తాను (తన ప్రభుశక్తి), ఏతాని=ఈ, సర్వాణి=అన్నీ, సమాని=సమములో, సః=అతడు, మహత్=గొప్పదైన, రాజ్యమ్=రాజ్యమును, అశ్నుతే= పొందును.

తా. ఓ రాజా! ఎవని కోశము, సైన్యము, మిత్రులు, ప్రభుత్వశక్తి - ఈ నాలుగు సమముగా ఉండునో ఆతడే గొప్ప రాజ్యము పొందగలుగును. 11

మూ. తద్భవాన్ వృత్తసమ్పన్నః స్థితః పథి నిరత్యయే, 12
మిత్రార్థమభినీతార్థం యథావత్కర్తుమర్హతి.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, వృత్తసమ్పన్నః=మంచి నడవడికతో కూడిన, భవాన్=నీవు, నిరత్యయే=అపాయము లేని, పథి=మార్గమునందు, స్థితః=ఉన్నవాడవై, అభినీతార్థమ్=ప్రతిజ్ఞచేయబడిన విషయము గల, మిత్రార్థమ్=మిత్రుని కార్యమును, యథావత్=యథావిధిగా, కర్తుమ్= చేయుటకు, అర్హతి=తగి యున్నావు.

తా. అందువలన మంచి నడవడిక గల నీవు అపాయరహితమైన మార్గమును అవలంబించి ప్రతిజ్ఞ చేసి యున్న మిత్రకార్యమును యథావిధిగా చేయవలెను.12

మూ. సన్త్యజ్య సర్వకార్యాణి మిత్రార్థే యో న వర్తతే, 13
సమ్భ్రమాద్ధి కృతోత్సాహః సోఽనర్థేనావరుధ్యతే.

ప్ర. అ. యః=ఎవడు, సర్వకార్యాణి=ఇతరములైన సమస్తకార్యములను, సన్త్యజ్య=విడచి, సమ్భ్రమాత్=తొందరవలన, కృతోత్సాహః=చేయబడిన ఉత్సాహము కలవాడై, మిత్రార్థే=మిత్రుని కార్యమునందు, న వర్తతే= ప్రవర్తించడో, సః=అతడు, అనర్థేన=అనర్థముచేత, అవరుధ్యతే= నిరోధింపబడును.

తా. ఇతరకార్యము లన్నిటిని విడచి ఉత్సాహము చూపుచు, ఎవడు తొందరగా మిత్రుని కార్యమును సాధించుటకు ప్రవర్తించడో ఆతడు అనర్థములను ఎదుర్కొనవలసివచ్చును. 13

మూ. యో హి కాలవ్యతీతేషు మిత్రకార్యేషు వర్తతే, 14
స కృత్వా మహతోఽప్యర్థాన్న మిత్రార్థేన యుజ్యతే.

ప్ర. అ. యః=ఎవడు, కాలవ్యతీతేషు=కాలమును అతిక్రమించిన, మిత్రకార్యేషు=మిత్రుని కార్యములందు, వర్తతే=ప్రవర్తించునో, సః= అతడు, మహతః=గొప్పవైన, అర్థాన్=కార్యములను, కృత్వాఽపి= చేసి కూడ, మిత్రార్థేన=మిత్రుని కార్యముతో, న యుజ్యతే=యుక్తుడు కాడు.

తా. కాలము మించిపోయిన పిమ్మట మిత్రుల కార్యమును చేయుటకు ప్రవర్తించువాడు ఎంత గొప్ప కార్యములను చేసినను మిత్రుని కార్యమును సాధించినవాడు కాజాలడు. 14

మూ. తదిదం మిత్రకార్యం నః కాలాతీతమరిన్దమ, 15
క్రియతాం రాఘవస్యైతద్వైదేహ్యాః పరిమార్గణమ్.
తదిదం వీర కార్యం తే కాలాతీతమరిన్దమ. 16

ప్ర. అ. అరిన్దమ=ఓ! శత్రుసంహారకుడా! నః=మనయొక్క, తత్=ఆ, ఇదమ్=ఈ మిత్రకార్యమ్=మిత్రకార్యము, కాలాతీతమ్=గడచిపోయిన కాలము

కలది. వైదేహ్యాః=సీతయొక్క, పరిమార్గణమ్=అన్వేషణరూపమైన, రాఘవస్య=రాముని యొక్క, ఏతత్=ఈ కార్యము, క్రియతామ్= చేయబడుగాక! అరిన్దమ=శత్రుసంహారకుడవైన, వీర!=వీరుడా!, తత్=ఆ, ఇదమ్=ఈ, కార్యమ్=కార్యము, తే=నీకు, కాలాతీతమ్= గడిచిపోయిన కాలము కలది.

తా. శత్రుసంహారకుడవైన ఓ వీరుడా! ఇప్పటికే కాలము మించిపోయిన మిత్రుని కార్యము నీవు చేయవలెను. సీతాన్వేషణ మనే రాముని కార్యము చేయుటలో ఇప్పటికే చాల ఆలస్య మైనది. 15,16

మూ. న చ కాలమతీతం తే నివేదయతి కాలవిత్,
త్వరమాణోఽపి స ప్రాజ్ఞస్తవ రాజన్వశానుగః. 17

ప్ర. అ. రాజన్=రాజా! ప్రాజ్ఞః=బుద్ధిమంతుడైన, కాలవిత్=కాలము నెరింగిన, సః=ఆ రాముడు, త్వరమాణోఽపి=తొందరపడుచున్నను, తవ=నీకు, వశానుగః=వశుడై ,అతీతమ్=గడచిన, కాలమ్= కాలమును గూర్చి, తే=నీకు, న నివేదయతి=తెలుపుటలేదు.

తా. ఓ రాజా! బుద్ధిమంతుడైన ఆ రాముడు కాలము గడచినట్లు తెలిసి తొందరపడుచున్నను, నిన్ను తొందరచేయుట యుక్తము కాదని భావించి వర్షకాలము గడచిన దని నీకు చెప్పుటలేదు. 17

మూ. కులస్య హేతుః స్ఫీతస్య దీర్ఘబన్ధుశ్చ రాఘవః,
అప్రమేయప్రభావశ్చ స్వయం చాప్రతిమో గుణైః. 18

ప్ర. అ. రాఘవః=రాముడు, స్ఫీతస్య=గొప్పదైన, కులస్య= కులమునకు, హేతుః=కారణమైనవాడు. దీర్ఘబన్ధుశ్చ=చాలకాలము బంధువుగా ఉండువాడు. స్వయమ్=తాను, అప్రమేయప్రభావశ్చ=ఇంత అని చెప్ప శక్యము గాని ప్రభావము కలవాడు. గుణైః=గుణములచేత, అప్రతిమః=సాటిలేనివాడు.

తా. రాముడు కులము అభివృద్ధి చెందుటకు హేతువైనవాడు. (రాముడు అనుగ్రహించిన కులము అభివృద్ధిచెందును). దీర్ఘకాలము మైత్రిని చూపువాడు. ఊహింప శక్యము గాని ప్రభావము గలవాడు. గుణములలో సాటి లేనివాడు.18

మూ. తస్య త్వం కురు వై కార్యం పూర్వం తేన కృతం తవ,
హరీశ్వర కపిశ్రేష్ఠానాజ్ఞాపయితుమర్హసి. 19

ప్ర. అ. హరీశ్వర!=ఓ! వానరరాజా! పూర్వమ్=పూర్వము, తేన= ఆతనిచేత, తవ=నీయొక్క కార్యము, కృతమ్=చేయబడినది. త్వమ్=నీవు, తస్య=ఆతని యొక్క, కార్యమ్=కార్యమును, కురు వై=చేయుము. కపిశ్రేష్ఠాన్=వానరశ్రేష్ఠులను, ఆజ్ఞాపయితుమ్=ఆజ్ఞాపించుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. ఓ వానరరాజా! రాముడు పూర్వము నీ కార్యము చేసి ఉన్నాడు.

ఇపుడు నీవు ఆతని కార్యము చేయవలెను. అందుచే వానరశ్రేష్ఠులను ఆజ్ఞాపించుము. 19

మూ. న హి తావద్భవేత్కాలో వ్యతీతశ్చోదనాదృతే,
చోదితస్య హి కార్యస్య భవేత్కాలవ్యతిక్రమః. 20

ప్ర. అ. చోదనాదృతే=చోదనము లేకుండగ, కాలః=కాలము, వ్యతీతః=గడచిపోయినది, న భవేత్ తావత్=కాదు. చోదితస్య=ప్రేరేపింపబడిన, కార్యస్య=కార్యముయొక్క, కాలవ్యతిక్రమః=కాలాతిక్రమము, భవేత్= అగును.

తా. రాముడు వచ్చి ప్రేరేపించనంతవరకు కాలము మించిపోయినట్లు కాదు. ఆతడు వచ్చి ప్రేరేపించినచో, కాలాతిక్రమము అయినట్లగును. 20

మూ. అకర్తురపి కార్యస్య భవాన్కర్తా హరీశ్వర!
కిం పునః ప్రతికర్తుస్తే రాజ్యేన చ వధేన చ. 21

ప్ర. అ. హరీశ్వర!=ఓ! వానరరాజా! కార్యస్య=కార్యమునకు, అకర్తురపి=చేయనివానికి కూడ, భవాన్=నీవు, కర్తా=చేయువాడవు. వధేన చ=శత్రువధచేతను, రాజ్యేన చ=రాజ్యముచేతను, తే=నీకు, ప్రతికర్తుః=ఉపకారము చేసినవానికి, కిం పునః=చెప్పనేల?

తా. ఓ వానరరాజా! ఏ ఉపకారము చేయని వానికి కూడ నీవు ఉపకారము చేయుదువు. శత్రువును సంహరించి రాజ్యము నిచ్చి నీకు ఉపకారము చేసిన వాని విషయమున చెప్పవలెనా! 21

మూ. శక్తిమానతివిక్రాన్తో వానరర్క్షగణేశ్వర!
కర్తుం దాశరథేః ప్రీతిమాజ్ఞాయాం కిం ను సజ్జసే. 22

ప్ర. అ. వానరర్క్షగణేశ్వర=వానరుల గణములకు, భల్లూకముల గణములకు ప్రభువైనవాడా! శక్తిమాన్=శక్తిమంతుడవు, అతివిక్రాన్తః=మిక్కిలి పరాక్రమవంతుడవు అయిన నీవు, దాశరథేః=రామునకు, ప్రీతిమ్=సంతోషమును, కర్తుమ్=చేయుటకొరకు, ఆజ్ఞాయామ్=ఆజ్ఞయందు, కిం ను సజ్జసే=ఎందుచేత ఆలసించుచున్నావు?

తా. సుగ్రీవా! నీవు శక్తిమంతుడవు; గొప్ప పరాక్రమము కలవాడవు; రామునికి సంతోషమును కల్గించుటకై వానరులను ఆజ్ఞాపించుటలో ఎందుకు ఆలసించుచున్నావు? 22

మూ. కామం ఖలు శరైః శక్తః సురాసురమహోరగాన్,
వశే దాశరథిః కర్తుం త్వత్ప్రతిజ్ఞామవేక్షతే. 23

ప్ర. అ. దాశరథిః=రాముడు, శరైః=బాణములచేత, సురాసురమహోర

గాన్= సురులను, అసురులను, మహాసర్పములను, వశే=వశమునందు, కర్తుమ్= చేసికొనుటకు, కామమ్=పూర్తిగా, శక్తః ఖలు=సమర్థుడే కదా! త్వత్ప్రతిజ్ఞామ్=నీ ప్రతిజ్ఞను, అపేక్షతే=చూచుచున్నాడు

తా. రాముడు బాణములచేత సురులను, అసురులను, మహాసర్పములను తన వశములో ఉంచుకొనుటకు సమర్థుడే అయినను నీవు ప్రతిజ్ఞచేసితివి కదా అని వేచి యున్నాడు. 23

మూ. ప్రాణత్యాగావిశఙ్కేన కృతం తేన మహత్ప్రియమ్,
తస్య మార్గామ వైదేహీం పృథివ్యామపి చామ్బరే. 24

ప్ర. అ. ప్రాణత్యాగావిశఙ్కేన=ప్రాణత్యాగమునందు కూడ శంక లేని, తేన= ఆతనిచేత, మహత్=గొప్ప, ప్రియమ్=ప్రియము, కృతమ్=చేయబడినది. తస్య=ఆతనియొక్క, వైదేహీమ్=సీతను, పృథివ్యామ్=భూమియందు, అమ్బరేఽపి చ=ఆకాశమునందు, మార్గామ=వెదకెదము.

తా. ఆ రాముడు తనకు ప్రాణాపాయము కలుగు నని కూడ భయపడక నీకు గొప్ప ప్రియమును చేసినాడు. ఆ రాముని భార్యయైన సీతను భూమియందు ఆకాశమునందు వెదకెదము. 24

మూ. దేవదానవగన్ధర్వా అసురాః సమరుద్గణాః,
న చ యక్షా భయం తస్య కుర్యుః కిమివ రాక్షసాః. 25

ప్ర.అ. దేవదానవగన్ధర్వాః =దేవదానవగంధర్వులు, సమరుద్గణాః =మరుద్గణములతో కూడిన, అసురాః =అసురులు, యక్షాః చ =యక్షులు, తస్య =ఆ రామునకు, భయమ్ =భయమును, న కుర్యుః =చేయరు. రాక్షసాః = రాక్షసులు, కిమివ = ఏమి చేయగలరు?

తా. ఆ రామునకు దేవతలు గాని, దానవులు గాని, గంధర్వులు గాని, అసురులు గాని, మరుద్గణములు గాని, యక్షులు గాని భయము కల్గింపజాలరు. రాక్షసులు ఏమి చేయగలరు? 25

మూ. తదేవం శక్తియుక్తస్య పూర్వం ప్రియకృతస్తవ,
రామస్యార్హసి పిఙ్గేశ కర్తుం సర్వాత్మనా ప్రియమ్. 26

ప్ర. అ. పిఙ్గేశ =ఓ వానరరాజా! తత్ =ఆ కారణమువలన, ఏవంశక్తియుక్తస్య =ఇట్టి శక్తితో కూడినవాడు, పూర్వమ్ = పూర్వము, తవ =నీకు, ప్రియకృతః =ప్రియమును చేసినవాడు అయిన, రామస్య =రామునకు, సర్వాత్మనా = అన్ని విధముల, ప్రియమ్ =ప్రియమును, కర్తుమ్ =చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. అందుచే ఓ వానరరాజా! ఇట్టి గొప్ప శక్తి కలవాడు, ముందుగా

నీకు ఉపకారము చేసినవాడు అయిన రామునకు నీవు అన్ని విధముల ప్రియము చేయవలెను. 26

మూ. నాధస్తాదవనౌ నాప్సు గతిర్నోపరి చామ్బరే,
కస్యచిత్సజ్జతేఽస్మాకం కపీశ్వర! తవాజ్ఞయా. 27

ప్ర. అ. కపీశ్వర! = ఓ వానరరాజా! తవ = నీయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, అస్మాకమ్ = మాలో, కస్యచిత్ = ఏ ఒక్కనియొక్క, గతిః =గమనము, అధస్తాత్ = పాతాళలోకమున, న సజ్జతే = మందము కాదు. అవనౌ =భూమియందు, అప్సు = ఉదకమునందు, న =మందము కాదు. ఉపరి =పైన, అమ్బరే చ =ఆకాశమునందు కూడ, న =మందము కాదు.

తా. ఓ వానరరాజా! నీవు ఆజ్ఞాపించినచో మాలో ఏ ఒక్కని గమనమునకు కూడ పాతాళములో కాని భూమిపై కాని, జలములో కాని, ఆకాశమునందు కాని అడ్డు లేదు. 27

మూ. తదాజ్ఞాపయ కః కిం తే కుతో వాపి వ్యవస్యతు,
హరయో హ్యప్రధృష్యాస్తే సన్తి కోట్యగ్రతోఽనఘ. 28

ప్ర. అ. అనఘ = ఓ దోషము లేనివాడా! తత్ =ఆ కారణమువలన, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము. కః =ఎవడు, కుతః= ఎటు వైపునుంచి, కిమ్ = ఏ కార్యమును, వ్యవస్యతు =సాధించుగాక! తే =నీకు, కోట్యగ్రతః =కోటికంటే అధికమైన, అప్రధృష్యాః = ఎదిరింప శక్యము గాని, హరయః =వానరులు, సన్తి హి =ఉన్నారు కదా!

తా. అందుచే ఓ దోషరహితుడా! నీ అధీనములో కోటికంటె అధికమైన వానరులు ఉన్నారు కదా! వారిలో ఎవ్వరు ఎక్కడినుండి ఏమి చేయవలెనో ఆజ్ఞాపించుము. 28

మూ. తస్య తద్వచనం శ్రుత్వా కాలే సాధు నిరూపితమ్,
సుగ్రీవః సత్త్వసమ్పన్నశ్చకార మతిముత్తమామ్. 29

ప్ర. అ. తస్య = ఆ హనుమంతునియొక్క, కాలే = తగిన కాలమునందు, సాధు = చక్కగా, నిరూపితమ్ =చెప్పబడిన, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, సత్త్వసమ్పన్నః = బలముతో కూడిన, సుగ్రీవః =సుగ్రీవుడు, ఉత్తమామ్ = ఉత్తమమైన, మతిమ్ =బుద్ధిని, చకార=చేసెను.

తా. హనుమంతుడు తగిన కాలమునందు చక్కగా పలికిన ఆ మాటలు విని బలశాలియైన ఆ సుగ్రీవుడు ఉత్తమమైన నిశ్చయము చేసెను. 29

మూ. సన్దిదేశాతిమతిమాన్నీలం నిత్యకృతోద్యమమ్,
దిక్షు సర్వాసు సర్వేషాం సైన్యానాముపసఙ్గ్రహే. 30

ప్ర. అ. అతిమతిమాన్ =గొప్ప బుద్ధి గల ఆ సుగ్రీవుడు, సర్వాసు =సమస్తమైన, దిక్షు =దిక్కులయందున్న, సర్వేషామ్ = సమస్తమైన, సైన్యానామ్=సైన్యములయొక్క, ఉపసఙ్గ్రహే = ఒకచోట చేర్చుటయందు (కొరకు), నిత్యకృతోద్యమమ్ = నిత్యము చేయబడిన ఉద్యమము గల, నీలమ్ = నీలుని, సన్దిదేశ = ఆజ్ఞాపించెను.

తా. బుద్ధిమంతుడైన ఆ సుగ్రీవుడు, ఎల్లప్పుడు ఉద్యమశీలు డైన నీలుని పిలిపించి అన్ని దిక్కులలోను ఉన్న సకలసైన్యములను, చేర్చుటకై ఆజ్ఞాపించెను.30

మూ. యథా సేనా సమగ్రా మే యూథపాలాశ్చ సర్వశః,
సమాగచ్ఛన్త్యసఙ్గేన సేనాగ్రాణి తథా కురు. 31

ప్ర. అ. మే =నాయొక్క, సమగ్రా =సమస్తమైన, సేనా = సేన, యూథపాలాశ్చ =సేనానాయకులు, సర్వశః =అన్ని వైపులనుండి, అసఙ్గేన =ఆలస్యము లేకుండగా, యథా =ఎట్లు, సేనాగ్రాణి = సేనలయొక్క అగ్రభాగములను, సమాగచ్ఛన్తి =పొందుదురో, తథా = అట్లు, కురు =చేయుము.

తా. నా సమస్తసేన, సేనానాయకులు కూడ ఆలస్యము లేకుండగా నలువైపులనుండి వచ్చి సేనాముఖమునందు నిలిచే టట్లు చేయుము. 31

మూ. యే త్వన్తపాలాః ప్లవగాః శీఘ్రగా వ్యవసాయినః,
సమానయన్తు తే శీఘ్రం త్వరితాః శాసనాన్మమ. 32
స్వయం చానన్తరం కార్యం భవానేవానుపశ్యతు.

ప్ర. అ. అన్తపాలాః =సరిహద్దులను రక్షించు, శీఘ్రగాః = శీఘ్రముగా వెళ్లే, వ్యవసాయినః =ఉద్యమశీలులైన, యే ప్లవగాః = ఏ వానరులు కలరో, తే=వారు, మమ =నాయొక్క, శాసనాత్ = శాసనమువలన, త్వరితాః =తొందరపడుచు, శీఘ్రమ్ =శీఘ్రముగా, సమానయన్తు =వచ్చెదరు గాక. అనన్తరం కార్యమ్ =తరువాత చేయవలసిన పనిని, భవాన్ ఏవ = నీవే, స్వయమ్ =స్వయముగా, అనుపశ్యతు =చూచెదవుగాక!

తా. శీఘ్రముగా వెళ్లువారు, ఉద్యమశీలులు అయిన పరిహద్దులను రక్షించు వానరు లందరు నా ఆజ్ఞ ప్రకారము తొందరపడుచు శీఘ్రముగా వచ్చెదరు గాక. మిగిలిన పనులు అన్నింటిని నీవే స్వయముగా చూచుకొనుము.

మూ. త్రిపఞ్చరాత్రాదూర్ధ్వం యః ప్రాప్నుయాదిహ వానరః,
తస్య ప్రాణాన్తికో దణ్డో నాత్ర కార్యా విచారణా. 33

ప్ర. అ. యః వానరః = ఏ వానరుడు, త్రిపఞ్చరాత్రాత్ = పదిహేను దినములకంటె, ఊర్ధ్వమ్ =పైన, ఇహ =ఇక్కడకు, ప్రాప్నుయాత్ =వచ్చునో, తస్య =వానికి, ప్రాణాన్తికః = ప్రాణములను పొగొట్టు, దణ్డః =దండనము పడగలదు. అత్ర =ఈ విషయమున, విచారణా =ఆలోచన, న కార్యా = చేయదగినది కాదు.

తా. పదిహేను దివసముల తరువాత వచ్చు వానరునకు ప్రాణదండనము విధించబడును. ఈ విషయములో సందేహము లేదు. 33

మూ. హరీంశ్చ వృద్ధానుపయాతు సాఙ్గదో
భవాన్మమాజ్ఞామధికృత్య నిశ్చితమ్,
ఇతి వ్యవస్థాం హరిపుఙ్గవేశ్వరో
విధాయ వేశ్మ ప్రవివేశ వీర్యవాన్. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. సాఙ్గదః =అంగదునితో కూడినవాడవై, భవాన్ =నీవు, మమ =నాయొక్క, ఆజ్ఞామ్ =ఆజ్ఞను, అధికృత్య = అనుసరించి, నిశ్చితమ్ = నిశ్చితముగా, వృద్ధాన్ = వృద్ధులైన, హరీన్ =వానరులను, ఉపయాతు =చేరెదవుగాక! వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, హరిపుఙ్గవేశ్వరః = వానరశ్రేష్ఠుల రాజైన సుగ్రీవుడు, ఇతి =ఇట్లు, వ్యవస్థామ్ =వ్యవస్థను, విధాయ=చేసి, వేశ్మ =గృహమును, ప్రవివేశ =ప్రవేశించెను.

తా. నీవు నా ఆజ్ఞప్రకారము అంగదసహితుడవై తప్పక పెద్దలైన వానరులను కలువవలెను. పరాక్రమవంతుడైన సుగ్రీవుడు ఈ విధముగా వ్యవస్థ చేసి గృహములో ప్రవేశించెను. 34

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఇరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ త్రింశః సర్గః

(శరదృతువర్ణనము. సుగ్రీవుని వద్దకు వెళ్లు మని లక్ష్మణుని రాముడు ఆజ్ఞాపించుట.)

మూ. గృహం ప్రవిష్టే సుగ్రీవే విముక్తే గగనే ఘనైః,
వర్షరాత్రే స్థితో రామః కామశోకాభిపీడితః, 1
పాణ్డురం గగనం దృష్ట్వా విమలం చన్ద్రమణ్డలమ్,
శారదీం రజనీం చైవ దృష్ట్వా జ్యోత్స్నానులేపనామ్, 2
కామవృత్తం చ సుగ్రీవం నష్టాం చ జనకాత్మజామ్
దృష్ట్వా కాలమతీతం చ ముమోహ పరమాతురః. 3

ప్ర. అ. సుగ్రీవే = సుగ్రీవుడు, గృహమ్ = గృహమును, ప్రవిష్టే =ప్రవేశించినవా డగుచుండగా, గగనే =ఆకాశము, ఘనైః = మేఘముల చేత, విముక్తే =విడువబడిన దగుచుండగా, వర్షరాత్రే =వర్షకాల రాత్రియందు, కామశోకాభిపీడితః =కామముచేతను, శోకముచేతను పీడితుడై, స్థితః = ఉన్న, రామః =రాముడు, పాణ్డురమ్ =తెల్లని, గగనమ్ = ఆకాశమును, విమలమ్ = నిర్మలమైన, చన్ద్రమణ్డలమ్ =చంద్రమండలమును, దృష్ట్వా = చూచి, జ్యోత్స్నానులేపనామ్ = వెన్నెల మైపూతగా గల, శారదీమ్ = శరత్కాల సంబంధమైన, రజనీం చైవ =రాత్రిని కూడ, దృష్ట్వా = చూచి, కామవృత్తమ్ =కామప్రవృత్తి గల, సుగ్రీవమ్= సుగ్రీవుని, నష్టామ్= నష్టురాలైన, జనకాత్మజాం చ = సీతను, అతీతమ్ =గడచిపోయిన, కాలమ్ =కాలమును, దృష్ట్వా =చూచి, పరమాతురః =మిక్కిలి బాధపడుచున్నవాడై, ముమోహ చ =మూర్ఛ చెందెను.

తా. ఈ విధముగా ఆజ్ఞాపించి సుగ్రీవుడు గృహములోనికి వెళ్లిపోయెను. ఆకాశము మేఘములచే విడువబడి తెల్లగా ప్రకాశించుచుండెను. చంద్రమండలము నిర్మలముగా కనబడుచుండెను. శరత్కాలరాత్రి వెన్నెలచే పూయబడి ఉండెను. కామశోకములచేత పీడితుడై, వర్షకాలమును గడిపిన రాముడు, సుగ్రీవుడు కామభోగములలో ఆసక్తుడై ఉండుటను గమనించి, జనకాత్మజ నష్ట యగుటను స్మరించుచు కాలము గడచిపోయి నట్లు గుర్తించి చాల దుఃఖితుడై మూర్ఛ చెందెను. 1-3

మూ. స తు సంజ్ఞాముపాగమ్య ముహూర్తా న్మతిమాన్ నృపః,
మనఃస్థామపి వైదేహీం చిన్తయామాస రాఘవః. 4

ప్ర. అ. మతిమాన్ = బుద్ధిమంతుడు, నృపః =రాజు అయిన, సః రాఘవః =ఆ రాముడు, ముహూర్తాత్ =క్షణకాలములో, సంజ్ఞామ్ =సంజ్ఞను, ఉపాగమ్య =పొంది, మనఃస్థామపి = మనస్సులో ఉన్న, వైదేహీమ్ =సీతను గూర్చి, చిన్తయామాస = చింతించెను.

తా. బుద్ధిమంతుడైన ఆ రాముడు క్షణకాలములో మరల స్పృహ చెంది మనస్సులో ఉన్న సీతను గూర్చి చింతించెను. 4

మూ. దృష్ట్వా చ విమలం వ్యోమ గతవిద్యుద్బలాహకమ్,
సారసారావసఙ్ఘుష్టం విలలాపార్తయా గిరా. 5

ప్ర. అ. గతవిద్యుద్బలాహకమ్ =పోయిన మెరుపులు, మేఘములు కలది, సారసారావసఙ్ఘుష్టమ్ =సారసపక్షుల ధ్వనులచేత ధ్వనింపచేయబడినది, విమలమ్ =నిర్మలము అయిన, వ్యోమ = ఆకాశమును, దృష్ట్వా చ =చూచి, ఆర్తయా =దీనమైన, గిరా =వాక్కుతో, విలలాప =విలపించెను.

తా. ఆకాశమునుండి మేఘములు, మెరుపులు తొలగి పోయెను. సారస పక్షుల ధ్వనులతో అది మారుమ్రోగుచుండెను. అట్టి నిర్మలమైన ఆకాశమును చూచి, రాముడు దీనమైన వాక్కుతో విలపించెను. 5

మూ. ఆసీనః పర్వతస్యాగ్రే హేమధాతువిభూషితే,
శారదం గగనం దృష్ట్వా జగామ మనసా ప్రియామ్. 6

ప్ర. అ. పర్వతస్య = పర్వతముయొక్క, హేమధాతువిభూషితే = బంగారముచేతను, ధాతువులచేతను అలంకరింపబడిన, అగ్రే =శిఖరమునందు, ఆసీనః = కూర్చున్న రాముడు, శారదమ్ = శరత్కాల సంబంధమైన, గగనమ్ =ఆకాశమును, దృష్ట్వా =చూచి, మనసా= మనస్సుచేత, ప్రియామ్ = ప్రియురాలిని, జగామ= పొందెను.

తా. బంగారముచేతను, ధాతువులచేతను అలంకృతమైన ఆ పర్వత శిఖరముపై కూర్చుండి రాముడు శరత్కాలమునందలి ఆకాశమును చూచి ప్రియురాలిని గూర్చి ఇట్లు తలచెను. 6

మూ. సారసారావసంనాదైః సారాసారావవాదినీ,
యాఽఽశ్రమే రమతే బాలా సాఽద్య మే రమతే కథమ్. 7

ప్ర. అ. సారసారావవాదినీ = సారసపక్షుల ధ్వని వంటి కంఠధ్వనిగల, యా బాలా =బాలయైన ఏ సీత, ఆశ్రమే= ఆశ్రమమునందు, మే= నాకు (నాతో) సారాసారావసంనాదైః =సారసపక్షుల కూతల ధ్వనులచేత, రమతే =క్రీడించుచుండెడిదో, సా =అట్టి సీత, అద్య =ఇపుడు, కథమ్ =ఎట్లు, రమతే = విహరించుచున్నదో.

తా. సారసపక్షుల ధ్వనుల వంటి కంఠధ్వని గల యువతి యైన యే సీత సారసపక్షుల ధ్వనులు వినుచు పూర్వము నాతో ఆశ్రమములో విహరించుచుండెడిదో అట్టి సీత ఇపుడు ఎట్లు విహరించుచున్నదో గదా! (కాలము గడుపుచున్నదో కదా!) 7

మూ. పుష్పితాంశ్చాసనాన్ దృష్ట్వా కాఞ్చనానివ నిర్మలాన్,
కథం సా రమతే బాలా పశ్యన్తీ మామపశ్యతీ. 8

ప్ర. అ. పుష్పితాన్ =పుష్పించిన, కాఞ్చనానివ =బంగారము వికారములైనవి వలె నున్న, నిర్మలాన్ =నిర్మలము లైన, అసనాన్ = అసన వృక్షములను, దృష్ట్వా =చూచి, పశ్యన్తీ =నా కొరకై చూచుచు, మామ్ =నన్ను, అపశ్యతీ =చూడని, సా బాలా = ఆ బాలయైన సీత, కథమ్ =ఎట్లు , రమతే = విహరించుచున్నదో!

తా. పుష్పించి బంగారము వికారములైనవి వలె ఉన్న నిర్మలములైన అసనవృక్షములను చూచి వెంటనే నాకొరకై ఇటు అటు పరికించి నన్ను చూడక ఆ సీత ఎట్లు కాలము గడుపుచున్నదో! 8

మూ. యా పురా కలహంసానాం కలేన కలభాషిణీ,
బుధ్యతే చారుసర్వాఙ్గీ సాఽద్య మే రమతే కథమ్. 9

ప్ర. అ. చారుసర్వాఙ్గీ=అందమైన సకల అవయవములు కలది, కలభాషిణీ= మధురముగా మాట్లాడునది అయిన, యా=ఏ సీత, పురా=పూర్వము, కలహంసానామ్=కలహంసలయొక్క, కలేన=మధురమైన ధ్వనిచేత, బుధ్యతే= మేల్కొనుచుండెడిదో, మే=నాయొక్క, సా=ఆమె, అద్య=ఇపుడు, కథమ్=ఎట్లు, రమతే=విహరించుచున్నదో.

తా. అందమైన సకలావయవములు కలది, మధురముగా మాటలాడునది అయిన ఏ సీత పూర్వము కలహంసల మధురధ్వనులు విని మేల్కొనుచుండెడిదో, నా ప్రియురాలైన ఆ సీత ఇపుడు ఎట్లు కాలము గడుపుచున్నదో? 9

మూ. నిస్వనం చక్రవాకానాం నిశమ్య సహచారిణామ్,
పుణ్డరీకవిశాలాక్షీ కథమేషా భవిష్యతి. 10

ప్ర. అ. పుణ్డరీకవిశాలాక్షీ=పద్మముల వలె విశాలములైన నేత్రములు గల, ఏషా=ఈ సీత, సహచారిణామ్=కలిసి తిరుగుచున్న, చక్రవాకానామ్= చక్రవాకపక్షులయొక్క, నిస్వనమ్=ధ్వనిని, నిశమ్య=విని, కథమ్=ఎట్లు, భవిష్యతి=కాగలదో?

తా. పద్మముల వంటి విశాలములైన నేత్రములు గల ఆ సీత కలిసి తిరుగుచున్న చక్రవాకపక్షుల ధ్వనులు విని ఏమైపోవునో గదా! 10

మూ. సరాంసి సరితో వాపీః కాననాని వనాని చ,
తాం వినా మృగశాబాక్షీం చరన్నాద్య సుఖం లభే. 11

ప్ర. అ. సరాంసి=సరస్సులను, సరితః=నదులను, వాపీః= దిగుడుబావులను, కాననాని=అరణ్యములను, వనాని చ=వనములను, చరన్=సంచరించుచున్న నేను, అద్య=ఇపుడు, తామ్=ఆ, మృగశాబాక్షీం వినా=లేడిపిల్ల కన్నుల వంటి కన్నులు గల సీత లేకపోవుటచే, సుఖమ్= సుఖమును, న లభే=పొందుటలేదు.

తా. నేను సరస్సులలోను, నదులలోను, దిగుడుబావులలోను, అరణ్యములలోను, వనములలోను సంచరించుచున్నను లేడికన్నుల వంటి కన్నులు గల ఆ సీత దగ్గర లేకపోవుటచే సుఖమును పొందజాలకున్నాను. 11

మూ. అపి తాం మద్వియోగాచ్చ సౌకుమార్యాచ్చ భామినీమ్,
సుదూరం పీడయేత్కామః శరద్గుణనిరన్తరః. 12

ప్ర.అ. శరద్గుణనిరన్తరః=శరత్కాలమునకు సంబంధించిన గుణములతో నిండి ఉన్న, కామః=మన్మథుడు, సౌకుమార్యాత్=సౌకుమార్యమువలనను, మద్వియోగాచ్చ=నా వియోగమువలనను, తామ్=ఆ, భామినీమ్=సీతను, సుదూరమ్=మిక్కిలి, పీడయేత్ అపి=పీడించునా?

తా. శరత్కాలగుణములతో నిండిన మన్మథుడు ఆ సీతను కూడ నా వియోగమువలనను, సౌకుమార్యమువలనను అధికముగా పీడించుచుండును. 12

మూ. ఏవమాది నరశ్రేష్ఠో విలలాప నృపాత్మజః,
విహఙ్గ ఇవ సారఙ్గః సలిలం త్రిదశేశ్వరాత్. 13

ప్ర. అ. నరశ్రేష్ఠః=నరులలో శ్రేష్ఠుడైన, నృపాత్మజః=ఆ రాజకుమారుడు, త్రిదశేశ్వరాత్=ఇంద్రునినుండి, సలిలమ్=వర్షోదకమును కోరుచున్న, సారఙ్గః=చాతక మనే, విహఙ్గ ఇవ=పక్షి వలె, ఏవమాది=ఈ విధముగా, విలలాప=విలపించెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన రాముడు దేవేంద్రుని నుండి, వర్షోదకమును కోరుచున్న చాతకపక్షి వలె ఈ విధముగా విలపించెను. 13

మూ. తతశ్చఞ్చూర్య రమ్యేషు ఫలార్థీ గిరిసానుషు,
దదర్శ పర్యుపావృత్తో లక్ష్మీవాన్ లక్ష్మణోఽగ్రజమ్. 14

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఫలార్థీ=ఫలములను కోరుచు, రమ్యేషు= రమ్యములైన, గిరిసానుషు=పర్వతముల చరియలయందు, చఞ్చూర్య=తిరిగి, పర్యుపావృత్తః=మరలి వచ్చిన, లక్ష్మీవాన్=శోభ గల, లక్ష్మణః= లక్ష్మణుడు, అగ్రజమ్=అన్నను, దదర్శ=చూచెను.

తా. ఫలములకొరకై పర్వతము చరియలయందు తిరిగి వచ్చిన శోభాసంపన్నుడైన లక్ష్మణుడు దుఃఖాక్రాంతుడైన అన్నగారిని చూచెను. 14

మూ. స చిన్తయా దుస్సహయా పరీతం
విసంజ్ఞమేకం విజనే మనస్వీ,
భ్రాతుర్విషాదాత్త్వరితోఽతిదీనః
సమీక్ష్య సౌమిత్రి రువాచ దీనమ్. 15

ప్ర.అ. మనస్వీ=ఉత్తమమైన మనస్సు కలవాడు అయిన, సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, విజనే=జనులు లేని ప్రదేశమునందు, ఏకమ్=ఒంటరిగా ఉన్నవాడు, దుస్సహయా =సహింప శక్యము గాని, చిన్తయా=చిన్తతో, పరీతమ్= కూడినవాడు, విసంజ్ఞమ్=సంజ్ఞ లేని వాడు అయిన రాముని, సమీక్ష్య=చూచి, భ్రాతుః=సోదరునియొక్క, విషాదాత్=దుఃఖమువలన, అతిదీనః=చాల దీనుడై, త్వరితః=తొందరపడుచు, దీనమ్=దీనముగా, ఉవాచ=పలికెను.

తా. ఉత్తమమైన మనస్సు గల ఆ లక్ష్మణుడు జనశూన్యమైన ప్రదేశములో ఒంటరిగా కూర్చుండి సహింప శక్యము గాని చింతతో కూడి సంజ్ఞ కోల్పోయి ఉన్న అన్నగారిని చూచి ఆతని దుఃఖమువలన చాల దీనుడై తొందరపడుచు దీనముగా ఇట్లు పలికెను. 15

మూ. కిమార్య కామస్య వశం గతేన
కిమాత్మపౌరుష్యపరాభవేన,
అయం హ్రియా సంహ్రియతే సమాధిః
కిమత్ర యోగేన నివర్తితేన. 16

ప్ర. అ. ఆర్య!=ఓ పూజ్యుడా! కామస్య=కామమునకు, వశంగతేన= వశమును పొందుటచేత, కిమ్=ఏమి ప్రయోజనము? ఆత్మపౌరుష్యపరాభవేన= తన పౌరుషమును అణగద్రొక్కుటచేత, కిమ్=ఏమి ప్రయోజనము. హ్రియా= లజ్జాహేతువైన ఈ దుఃఖముచేత, అయమ్=ఈ, సమాధిః= చిత్తైకాగ్రత్వము, సంహ్రియతే=తొలగింపబడుచున్నది. అత్ర=ఇపుడు, నివర్తితేన=తొలగించబడిన, యోగేన= యోగముచేత, కిమ్=ఏమి ప్రయోజనము.

తా. ఓ! పూజ్యుడా! ఈ విధముగా కామమునకు వశుడ వగుటచేత ఏమి ప్రయోజనము? తన పురుషకారమును అణచికొనుటచేత ఏమీ ప్రయోజనము ఉండదు. లజ్జాకరమైన ఇట్టి ప్రవృత్తిచేత చిత్తస్థైర్యము నశించును. ఇట్లు చిత్తస్థైర్యమును కోల్పోయిన పిమ్మట ఏ కార్యమూ సిద్ధించదు. 16

మూ. క్రియాభియోగం మనసః ప్రసాదం
సమాధియోగానుగతం చ కాలమ్,

సహాయసామర్థ్యమదీనసత్త్వః
స్వకర్మహేతుం చ కురుష్వ హేతుమ్. 17

ప్ర. అ. అదీనసత్త్వః=దీనము గాని బుద్ధి కలవాడవై, క్రియాభియోగమ్=కార్యమునందు ప్రవృత్తిని, మనసః=మనస్సుయొక్క, ప్రసాదమ్=ప్రసాదమును, సమాధియోగానుగతమ్=ధైర్యోపాయములతో కూడిన, కాలం చ=కాలమును, సహాయసామర్థ్యమ్=సహాయులయొక్క సామర్థ్యమును, హేతుమ్= కార్యసిద్ధికి హేతువైన, స్వకర్మ చ=నీ కర్మను, హేతుమ్=హేతువునుగా, కురుష్వ=చేయుము.

తా. నీవు మనస్సులోని దైన్యమును విడిచి కార్యమునందు శ్రద్ధను చూపుము. మనస్సును నిర్మలము చేసికొనుము. ధైర్యోపాయములచేత కాలమును వశము చేసికొనుము. సుగ్రీవాదుల సాహాయ్యసామర్థ్యమును సంపాదించుము. కార్యసిద్ధికి హేతువైన దేవతోపాసనాదికర్మలు చేయుము. 17

మూ. న జానకీ మానవవంశనాథ
త్వయా సనాథా సులభా పరేణ,
న చాగ్నిచూడాం జ్వలితాముపేత్య
న దహ్యతే వీర! వరార్హ కశ్చిత్. 18

ప్ర.అ. మానవవంశనాథ=మానవవంశమునకు ప్రభువైనవాడా! త్వయా=నీచేత, సనాథా=నాథుడు కలదైన, జానకీ=సీత, పరేణ=ఇతరునిచేత, సులభా=సులభమైనది, న=కాదు. వీర!=వీరుడా! వరార్హ= శ్రేష్ఠమైన పూజ కలవాడా! జ్వలితామ్=ప్రజ్వలించుచున్న, అగ్నిచూడామ్= అగ్నిజ్వాలను, ఉపేత్య=సమీపించి, కశ్చిత్=ఎవడూ, న దహ్యతే ఇతి న=దహింపబడడు అను మాట లేదు.

తా. మానవవంశమునకు ప్రభువైన ఓ రామా! నీవు నాథుడుగా ఉన్న సీతను ఇతరు లెవ్వరును పొందజాలరు. అధికమైన గౌరవమునకు తగిన ఓ వీరుడా! ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలను సమీపించినవాడెవ్వడూ కాల్చబడకుండా ఉండడు. 18

మూ. సలక్షణం లక్ష్మణమప్రధృష్యం
స్వభావజం వాక్యమువాచ రామః,
హితం చ పథ్యం చ నయప్రసక్తం
ససామ ధర్మార్థసమాహితం చ. 19

ప్ర. అ. రామః=రాముడు, సలక్షణమ్=ఉత్తమలక్షణములతో కూడినవాడు, అప్రధృష్యమ్=ఎదిరింప శక్యముగానివాడు అయిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, స్వభావజమ్=సహజముగా వచ్చినది, హితమ్=హితము, పథ్యం చ=పథ్యము, నయప్రసక్తమ్=నీతితో కూడినది, ససామ=సామముతో కూడినది, ధర్మార్థసమాహితం చ=ధర్మముతోనూ అర్థముతోను కూడినది అయిన, వాక్యమ్= వాక్యమును,

ఉవాచ=పలికెను.

తా.రాముడు ఎదిరింప శక్యముగానివాడు, ఉత్తమలక్షణములు కలవాడు అయిన లక్ష్మణునితో స్వభావసిద్ధము, హితము (భవిష్యత్తులో మంచిని చేయునది), పథ్యము (ఆ సమయమున మంచిని చేయునది), నీతిసహితము, సామముతో కూడినది, ధర్మార్థసంగతము అయిన వాక్యమును పలికెను. 19

మూ. నిస్సంశయం కార్యమవేక్షితవ్యం
క్రియావిశేషోఽప్యనువర్తితవ్యః,
ననుప్రవృద్ధస్య దురాసదస్య
కుమార కార్యస్య ఫలం చ చిన్త్యమ్. 20

ప్ర.అ. కుమార= ఓ! లక్ష్మణా, నిస్సంశయమ్=సంశయములు లేని, కార్యమ్=కార్యము, అవేక్షితవ్యమ్=చూడదగినది. క్రియావిశేషోఽపి= క్రియావిశేషము కూడ, అనువర్తితవ్యః=చేయదగినది. ప్రవృద్ధస్య=వృద్ధి పొందినది, దురాసదస్య=సంపాదించుటకు శక్యము గానిది అయిన, కార్యస్య= కార్యముయొక్క, ఫలం చ=ఫలము కూడ, చిన్త్యం నను=చింతింప తగినది కదా!

తా. ఓ లక్ష్మణా! తలబెట్టిన కార్యము నెరవేరుటలో ఎట్టి సంశయము లేకుండునట్లు చూచుకొనవలెను. క్రియావిశేషమును అవలంబించవలెను. సాధించుటకు కష్టమైన వృద్ధి పొందిన కార్యమువలన కలుగు ఫలమును కూడ ఆలోచించుకొనవలెను. 20

మూ. అథ పద్మపలాశాక్షీం మైథిలీమనుచిన్తయన్,
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా. 21

ప్ర. అ. అథ=అటు పిమ్మట, రామః=రాముడు, పద్మపలాశాక్షీమ్= పద్మపత్రముల వంటి నేత్రములు గల, మైథిలీమ్=సీతను, అనుచిన్తయన్= స్మరించుచు, పరిశుష్యతా=ఎండుచున్న, ముఖేన=ముఖముతో, లక్ష్మణమ్= లక్ష్మణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట రాముడు పద్మపత్రముల వంటి నేత్రములు గల సీతను గూర్చి చింతించుచు, శుష్కించుచున్న ముఖముతో లక్ష్మణునితో ఇట్లు పలికెను.21

మూ. తర్పయిత్వా సహస్రాక్షః సలిలేన వసుంధరామ్,
నిర్వర్తయిత్వా సస్యాని కృతకర్మా వ్యవస్థితః. 22

ప్ర.అ. సహస్రాక్షః=దేవేంద్రుడు, సలిలేన=ఉదకముచేత, వసుంధరామ్= భూమిని, తర్పయిత్వా=తృప్తి పొందించి, సస్యాని=సస్యములను, నిర్వర్తయిత్వా=పుట్టించి, కృతకర్మా=చేయబడిన కర్తవ్యము కలవాడై, వ్యవస్థితః=నిలచి ఉన్నాడు.

తా. దేవేంద్రుడు ఉదకముచేత భూమికి తృప్తి గలిగించి, సస్యములు మొలచునట్లు చేసి, తన కర్తవ్యమును పూర్తిచేసికొనినాడు. 22

మూ. దీర్ఘగమ్భీరనిర్ఘోషాః శైలద్రుమపురోగమాః,
విసృజ్య సలిలం మేఘాః పరిశ్రాన్తా నృపాత్మజ. 23

ప్ర.అ. నృపాత్మజ =లక్ష్మణా! దీర్ఘగమ్భీరనిర్ఘోషాః = దీర్ఘము, గంభీరము అయిన ధ్వని కల, శైలద్రుమపురోగమాః = శైలముల ముందు వృక్షముల ముందు ఎగురుచున్న, మేఘాః =మేఘములు , సలిలమ్ = ఉదకమును, విసృజ్య = విడచి, పరిశాన్తాః = శాంతించినవి.

తా. లక్ష్మణా! దీర్ఘముగాను గంభీరముగాను ధ్వని చేయుచు పర్వతముల ముందు, వృక్షముల ముందు ఎగురుచున్న మేఘములు ఉదకమును విడచి శాంతించినవి. 23

మూ. నీలోత్పలదలశ్యామాః శ్యామీకృత్వా దిశో దశ,
విమదా ఇవ మాతఙ్గాః శాన్తవేగాః పయోధరాః. 24

ప్ర. అ. నీలోత్పలదలశ్యామాః = నల్లకలువల దళముల వలె నీలవర్ణము గల, పయోధరాః =మేఘములు, దశ = పది, దిశః =దిక్కులను, శ్యామీకృత్వా = నల్లగా చేసి, విమదాః = మదము తొలగిన, మాతఙ్గాః ఇవ = ఏనుగులు వలె, శాన్తవేగాః = శాంతించిన వేగము గలవి.

తా. నీలోత్పలముల దళముల వలె నీలవర్ణము గల మేఘములు పది దిక్కులను నల్లగా నుండునట్లు చేసినవి. ఇపుడు మదము తగ్గిన గజముల వేగము వలె వాటి వేగము తగ్గినది. 24

మూ. జలగర్భా మహామేఘాః కుటజార్జునగన్ధినః,
చరిత్వా విరతాః సౌమ్య వృష్టివాతాః సముద్యతాః. 25

ప్ర. అ. సౌమ్య =సౌమ్యుడా! జలగర్భాః = జలము గర్భమునందు గల, మహామేఘాః = గొప్ప మేఘములు, కుటజార్జునగన్ధినః = కుటజ-అర్జున పుష్పముల సువాసన గల, సముద్యతాః = బయలుదేరిన, వృష్టివాతాః = వర్షముతో కూడిన వాయువులు, చరిత్వా = సంచరించి, విరతాః = విరమించినవి.

తా. సౌమ్యుడా! జలముతో నిండిన మేఘములు, కుటజ - అర్జున పుష్పముల సువాసనలతో వీచుచున్న వర్షపు గాలులు, సంచరించి ఇప్పుడు విరమించినవి. 25

మూ. ఘనానాం వారణానాం చ మయూరాణాం చ లక్ష్మణ,
నాదః ప్రస్రవణానాం చ ప్రశాన్తః సహసానఘ. 26

ప్ర. అ. అనఘ = పాపములు లేనివాడా! లక్ష్మణ = లక్ష్మణా! ఘనానామ్ = మేఘములయొక్క, వారణానాం చ = ఏనుగులయొక్క, మయూరాణాం చ =నెమళ్లయొక్క, ప్రస్రవణానాం చ = సెలయేరులయొక్క, నాదః =ధ్వని, సహసా = హటాత్తుగా, ప్రశాన్తః = శాంతించినది.

తా. దోషరహితుడవైన ఓ లక్ష్మణా! మేఘములు, ఏనుగులు, నెమళ్లు, సెలయేరులు - వీటి ధ్వని హటాత్తుగా ఆగిపోయినది. 26

మూ. అభివృష్టా మహామేఘైర్నిర్మలాశ్చిత్రసానవః,
అనులిప్తా ఇవాభాన్తి గిరయశ్చన్ద్రరశ్మిభిః. 27

ప్ర. అ. మహామేఘైః=గొప్ప మేఘములచేత, అభివృష్టాః=వర్షింపబడినవి, నిర్మలాః=నిర్మలములు, చిత్రసానవః=చిత్రములైన చరియలు గలవి అయిన, గిరయః=పర్వతములు, చన్ద్రరశ్మిభిః=చంద్రకిరణములచేత, అనులిప్తాః ఇవ=పూయబడినవి వలె, ఆభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా. పెద్ద మేఘములు కురిసిన వర్షములచేత తడిసి నిర్మలములైన, చిత్రమైన చరియలు గల పర్వతములు చంద్రకిరణములచేత పూయబడినవా అన్నట్లు ప్రకాశించుచున్నవి.

వి. 28 వ శ్లోకం మొదలు 60 వ శ్లోకం వరకు ఉన్న సుదీర్ఘశరద్వర్ణనము ప్రాచ్యప్రతిలో లేదు. చాలమంది ఉదాహరించే "చంచచ్చంద్ర" ఇత్యాది శ్లోకము కూడ లేదు. 27

మూ. శాఖాసు సప్తచ్ఛదపాదపానాం
ప్రభాసు తారార్కనిశాకరాణామ్,
లీలాసు చైవోత్తమవారణానాం
శ్రియం విభజ్యాద్య శరత్ప్రవృత్తా. 28

ప్ర. అ. అద్య=ఇప్పుడు, శరత్=శరత్కాలము, సప్తచ్ఛదపాదపానామ్= ఏడాకులఅరటిచెట్లయొక్క, శాఖాసు=కొమ్మలయందు, తారార్కనిశాకరాణామ్= నక్షత్ర - సూర్య-చంద్రులయొక్క, ప్రభాసు=కాంతులయందు, ఉత్తమవారణానామ్= ఉత్తమములైన ఏనుగులయొక్క, లీలాసు చ =విలాసలయందు, శ్రియమ్= శోభను, విభజ్య=విభజించి, ప్రవృత్తా=ప్రారంభమైనది.

తా. శరత్కాలము, ఇప్పుడు, ఏడాకుల అరటిచెట్ల శాఖలకు, నక్షత్ర - సూర్య-చంద్రుల కాంతులకు ఉత్తమములైన గజముల విలాసలకు శోభను పంచి ఇచ్చుచున్నది. 28

మూ. సంప్రత్యనేకాశ్రయచిత్రశోభా
లక్ష్మీః శరత్కాలగుణోపపన్నా,

సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు
పద్మాకరేష్వభ్యధికం విభాతి. 29

ప్ర. అ.సంప్రతి=ఇప్పుడు, అనేకాశ్రయచిత్రశోభా=అనేకములైన ఆశ్రయముల యందు చిత్రమైన శోభ గల, శరత్కాలగుణోపపన్నా=శరత్కాలముయొక్క గుణములతో కూడిన, లక్ష్మీః=శోభ, సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు=సూర్యుని హస్తాగ్రములచేత వికసింపచేయబడిన, పద్మాకరేషు=పద్మసరస్సులయందు, అధికమ్=అధికముగా, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. అనేకములైన ఆశ్రయములయందు విచిత్రమైన శోభ గల శరత్కాలగుణములచేత ఏర్పడిన లక్ష్మి ఇప్పుడు సూర్యుని కరాగ్రములచేత వికసింపచేయబడిన పద్మసరస్సులలో అధికముగా ప్రకాశించుచున్నది. 29

మూ. సప్తచ్ఛదానాం కుసుమోపగన్ధః
షట్పాదవృన్దైరనుగీయమానః,
మత్తద్విపానాం పవనానుసారీ
దర్పం వినేష్యన్నధికం విభాతి. 30

ప్ర. అ.షట్పాదవృన్దైః=తుమ్మెదల సముదాయములచేత, అనుగీయమానః= అనుసరించి గానము చేయబడుచున్నదీ, పవనానుసారీ=వాయువును అనుసరించుచున్నదీ అయిన, సప్తచ్ఛదానామ్=ఏడాకుల అరటిచెట్లయొక్క, కుసుమోపగన్ధః=పుష్పముల సువాసన, మత్తద్విపానామ్=మదించిన గజములయొక్క, దర్పమ్=దర్పమును, వినేష్యన్=తొలగించనున్నదై, అధికమ్=అధికముగా, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. ఏడాకుల అరటిచెట్ల పుష్పముల సుగంధమును తుమ్మెదల గుంపులు గానము చేయుచు అనుసరించుచున్నవి. వాయువును అనుసరించి వ్యాపించుచున్న ఆ సుగంధము మత్తగజముల దర్పమును (మదోదకగంధమును గూర్చిన గర్వమును) తొలగించుచు ప్రకాశించుచున్నది. 30

మూ. అభ్యాగతైశ్చారువిశాలపక్షైః
సరఃప్రియైః పద్మరజోవకీర్ణైః,
మహానదీనాం పులినోపయాతైః
క్రీడన్తి హంసాః సహ చక్రవాకైః. 31

ప్ర.అ. హంసాః=హంసలు, అభ్యాగతైః=వచ్చినవి, చారువిశాలపక్షైః= అందమైన విశాలమైన రెక్కలు గలవి, సరఃప్రియైః=సరస్సు ప్రియముగా గలవి, పద్మరజోవకీర్ణైః=పద్మముల పరాగముచేత చల్లబడినవి, మహానదీనామ్= మహానదులయొక్క, పులినోపయాతైః=ఇసుకతిన్నెలను పొందినవీ అయిన, చక్రవాకైః సహ=చక్రవాకపక్షులతో గూడ, క్రీడన్తి=ఆడుకొనుచున్నవి.

తా. విశాలములైన రెక్కలు గల చక్రవాకపక్షులు మహానదుల ఇసుక తిన్నెలమీదకు ఎచటినుండియో వచ్చినవి. సరస్సులయందు అధికప్రేమ గల ఆ చక్రవాకముల దేహములు పద్మముల పుప్పొడిచే కప్పబడి ఉన్నవి. అభ్యాగతములైన అట్టి చక్రవాకములతో హంసలు ఆడుకొనుచున్నవి. 31

మూ. మదప్రగల్భేషు చ వారణేషు
గవాం సమూహేషు చ దర్పితేషు,
ప్రసన్నతోయాసు చ నిమ్నగాసు
విభాతి లక్ష్మీర్బహుధా విభక్తా. 32

ప్ర. అ. మదప్రగల్భేషు=మదముచేత ప్రగల్భములైన, వారణేషు= ఏనుగుల యందు, దర్పితేషు=గర్వించిన, గవామ్=గోవులయొక్క, సమూహేషు=సమూహము లయందు, ప్రసన్నతోయాసు=నిర్మలమైన ఉదకము గల, నిమ్నగాసు చ=నదులయందు, బహుధా=అనేకవిధములుగా, విభక్తా= విభజించబడి ఉన్న, లక్ష్మీః=శరదృతుశోభ, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. శరదృతుశోభ మదముచేత ప్రగల్భములైన ఏనుగులయందు, గర్వించిన వృషభముల సముదాయములందు, నిర్మలమైన ఉదకము గల నదులయందు విభజించబడి ప్రకాశించుచున్నది. 32

మూ. నభః సమీక్ష్యాంబుధరైర్విముక్తం
విముక్తబర్హాభరణా వనేషు,
ప్రియాస్వరక్తా వినివృత్తశోభా
గతోత్సవా ధ్యానపరా మయూరాః. 33

ప్ర. అ. వనేషు=వనములయందు, మయూరాః=నెమళ్లు, అమ్బుధరైః = మేఘములచేత, విముక్తమ్=విడువబడిన, నభః=ఆకాశమును, సమీక్ష్య= చూచి, విముక్తబర్హాభరణాః=విడువబడిన, పింఛము లనే ఆభరణములు గలవై, ప్రియాసు = ప్రియురాండ్రయందు, అరక్తాః=అనురాగము లేనివై, వినివృత్తశోభాః= నివర్తించిన శోభ గలవై, గతోత్సవాః=గడచిన ఉత్సవము గలవై, ధ్యానపరాః= ధ్యానమునందు లగ్నములై ఉన్నవి.

తా. వనములలో ఉన్న నెమళ్లు మేఘములచేత విడువబడిన ఆకాశమును చూచి పింఛము లనే ఆభరణములను విడిచివేసినవి. వాటి శోభ తొలగినది. ఉత్సవము సమాప్తమైనది. ప్రియురాండ్రపై వాటికి ఆసక్తి తగ్గినది. ఈ స్థితిలో అవి ధ్యానించుచున్నవి వలె అయినవి. 33

మూ. మనోజ్ఞగన్ధైః ప్రియకైరనల్పైః
పుష్పాతిభారావనతాగ్రశాఖైః,

సువర్ణగౌరైర్నయనాభిరామై
రుద్యోతితానీవ వనాన్తరాణి. 34

ప్ర. అ. మనోజ్ఞగన్ధైః=మనోహరమైన సువాసన కలవి, పుష్పాతి భారావనతాగ్రశాఖైః= పుష్పముల అధికమైన భారముచేత వంగిన శాఖాగ్రములు కలవి, సువర్ణగౌరైః=బంగారము వలె పచ్చనివి, నయనాభిరామైః=నేత్రములకు మనోహరములు అయిన, అనల్పైః=అధికమైన, ప్రియకైః=ప్రియకపుష్పములచేత , వనాన్తరాణి= వనమధ్యములు, ఉద్యోతితానీవ=ప్రకాశింపచేయబడుచున్నట్లున్నవి.

తా. మనోహరమైన సుగంధము గల బంగారువర్ణము గల అనేక ప్రియకవృక్షములు వనమధ్యములను ప్రకాశింపచేయుచున్నట్లున్నవి. నేత్రములకు మనోహరములైన ఆ వృక్షముల శాఖాగ్రములు పుష్పముల భారాతిశయముచేత వంగినవి. 34

మూ. ప్రియాన్వితానాం నళినీప్రియాణాం
వనప్రియాణాం కుసుమోద్ధతానామ్,
మదోత్కటానాం మదలాలసానాం
గజోత్తమానాం గతయోఽద్య మన్దాః. 35

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ప్రియాన్వితానామ్=భార్యలతో కూడినవి, నళినీప్రియాణామ్ = పద్మలతలు ప్రియముగా కలవి, వనప్రియానామ్ = వనములు ప్రియముగా కలవి, కుసుమోద్ధతానామ్= పుష్పములచేత (పుష్పముల సువాసనను ఆఘ్రాణించుటచేత) మదించినవి, మదలాలసానామ్ = మదమునందు ఆసక్తి కలవి, మదోత్కటానామ్ =మదమును స్రవించుచున్న గండస్థలములు కలవి అయిన, గజోత్తమానామ్ = ఉత్తమములైన గజముల యొక్క, గతయః= నడకలు, మన్దాః =మందమైనవి.

తా. ఇపుడు తమ భార్యలతో కూడిన ఉత్తమములైన గజములు మందముగా నడచుచున్నవి. ఆ గజములకు వనములు, పద్మసరస్సులు చాల ప్రీతిపాత్రములు. పుష్పముల సువాసనను ఆఘ్రాణించుటచే మత్తెక్కిన ఆ గజములు గండస్థలములనుండి మదోదకమును స్రవించుచున్నవి. 35

మూ. వ్యభ్రం నభః శస్త్రవిధౌతవర్ణం
కృశప్రవాహాని నదీజలాని,
కహ్లారశీతాః పవనాః ప్రవాన్తి
తమోవిముక్తాశ్చ దిశః ప్రకాశాః. 36

ప్ర. అ. వ్యభ్రమ్ = తొలగిన మేఘములు గల, నభః = ఆకాశము, శస్త్రవిధౌతవర్ణమ్ = ఖడ్గము వలె స్వచ్ఛమైన వర్ణము కలది. నదీజలాని =

నదీజలములు, కృశప్రవాహాని = కృశించిన ప్రవాహములు కలవి, కహ్లారశీతాః= కలువలచేత శీతముగా నున్న, పవనాః = వాయువులు, ప్రవాన్తి = వీచుచున్నవి. తమోవిముక్తాః = చీకటిచే విడువబడిన, దిశః = దిక్కులు, ప్రకాశాః = స్పష్టముగా నున్నవి.

తా. మేఘములు తొలగిపోవుటచే ఆకాశము శుభమైన ఖడ్గము రంగులో నున్నది. నదీజలముల ప్రవాహములు కృశించినవి. కలువల సువాసనలతో నిండి చల్లగా నున్న వాయువులు వీచుచున్నవి. చీకటి తొలగి దిక్కులు ప్రకాశించుచున్నవి.

మూ. సూర్యాతపక్రామణనష్టపఙ్కా
భూమిశ్చిరోద్ఘాటితసాన్ద్రరేణుః,
అన్యోన్యవైరేణ సమాయుతానా
ముద్యోగకాలోఽద్య నరాధిపానామ్. 37

ప్ర.అ. సూర్యాతపక్రామణనష్టపఙ్కా = సూర్యుని ఎండయొక్క ఆక్రమణముచేత నశించిన బురద గల , భూమిః = భూమి, చిరోద్ఘాటితసాన్ద్రరేణుః = చాలకాలము తరువాత పైకి ఎగురగొట్టబడిన దట్టమైన పరాగము గలది. అన్యోన్యవైరేణ = పరస్పరవైరముచేత, సమాయుతానామ్ = కలిసిన, నరాధిపానామ్ = రాజులకు, అద్య =ఇప్పుడు, ఉద్యోగకాలః = ప్రయత్నము చేసే సమయము.

తా. సూర్యుని ఎండ ప్రసరించి పంకము ఎండిపోవుటచే చాలా కాలమునకు, భూమినుండి దట్టమైన పరాగము ఎగురుచున్నది. ఇది పరస్పరము వైరముతో ఎదిరించుచున్న రాజులు యుద్ధప్రయత్నము చేసే సమయము. 37

మూ. శరద్గుణాప్యాయితరూపశోభాః
ప్రహర్షితాః పాంశుసముక్షితాఙ్గాః,
మదోత్కటాః సమ్ప్రతి యుద్ధలుబ్ధా
వృషా గవాం మధ్యగతా నదన్తి. 38

ప్ర. అ. శరద్గుణాప్యాయితరూపశోభాః = శరత్కాలముయొక్క గుణములచేత వృద్ధి పొందింపబడిన శరీరశోభ గలవి, ప్రహర్షితాః = సంతోషించుచున్నవి, పాంశుసముక్షితాఙ్గాః = పరాగములచే కప్పబడిన శరీరములు గలవి, మదోత్కటాః =మదముచేత తీవ్రముగా నున్నవి, గవామ్ = గోవులయొక్క, మధ్యగతాః =మధ్యయందు ఉన్నవి అయిన, వృషాః = వృషభములు, సమ్ప్రతి = ఇపుడు, యుద్ధలుబ్ధాః =యుద్ధమునం దాసక్తి కలవై, నదన్తి = ధ్వని చేయుచున్నవి.

తా. వృషభములు ఇపుడు చాల ఉత్సాహముతో, మదముతో నిండినవై గోవుల మధ్య నిలిచి ఇతర వృషభములతో యుద్ధము చేయుటకు ఉద్యుక్తము లగుచున్నవి. వీటి శరీరకాంతి శరత్కాలమునకు సంబంధించిన గుణములచేత చాల అధికముగా నున్నది. వాటి శరీరములు పరాగముచే కప్పబడి యున్నవి.

మూ. సమన్మథా తీవ్రతరానురాగా
కులాన్వితా మన్దగతిః కరేణుః,
మదాన్వితం సమ్పరివార్య యాన్తం
వనేషు భర్తారమనుప్రయాతి. 39

ప్ర.అ. సమన్మథా = మన్మథునితో కూడినది, తీవ్రతరానురాగా = చాల తీవ్రమైన అనురాగము కలది, కులాన్వితా = సజాతీయమైన ఏనుగులతో కూడినది, మన్దగతిః = మందమైన గమనము కలది అయిన, కరేణుః =ఆడ ఏనుగు, వనేషు= వనములయందు, యాన్తమ్ = వెళ్లుచున్న, మదాన్వితమ్ = మదముతో కూడిన, భర్తారమ్ = భర్తను, సమ్పరివార్య =చుట్టి, అనుప్రయాతి =అనుసరించివెళ్లుచున్నది.

తా. తీవ్రమైన అనురాగముతో ఈ ఆడ ఏనుగు ఇతరమైన ఆడ ఏనుగులతో కలసి మందముగా నడచుచు అరణ్యములలో సంచరించుచున్న మదించిన తన భర్తయైన మగ ఏనుగును అనుసరించి వెళ్లుచున్నది. 39

మూ. త్యక్త్వా వరాణ్యాత్మవిభూషణాని
బర్హాణి తీరోపగతా నదీనామ్,
నిర్భర్త్స్యమానా ఇవ సారసౌఘైః
ప్రయాన్తి దీనా విమనా మయూరాః. 40

ప్ర. అ. ఆత్మవిభూషితాని = తమ అలంకారములైన, వరాణి = శ్రేష్ఠములైన, బర్హాణి = పింఛములను, త్యక్త్వా = విడిచి, నదీనామ్ = నదులయొక్క, తీరోపగతాః = తీరములను చేరి యున్న , మయూరాః = నెమళ్లు, సారసౌఘైః =సారసపక్షుల సముదాయములచేత, నిర్భర్త్స్యమానాః ఇవ = భయపెట్టబడుచున్నవి వలె, దీనాః = దీనములై, విమనాః = ఉత్సాహశూన్యములై, ప్రయాన్తి = వెళ్లుచున్నవి.

తా. వర్షకాలాంతమునందు నెమళ్ల ఉత్తమాలంకారములైన పింఛములు రాలిపోయినవి. అవి నదీతీరములను చేరి అక్కడ ఉన్న సారసపక్షుల సముదాయములచే ధిక్కరింపబడుచున్నవా అన్నట్లు దీనములై ఉత్సాహశూన్యములై సంచరించుచున్నవి. 40

మూ. విత్రాస్య కారణ్డవచక్రవాకాన్
మహోర్మివైర్భిన్నకటా గజేన్ద్రాః,
సరస్సు బుద్ధామ్బుజభూషణేషు
విక్షోభ్య విక్షోభ్య జలం పిబన్తి. 41

ప్ర. అ. భిన్నకటాః = స్రవించుచున్న గండస్థలములు గల, గజేన్ద్రాః =

ఏనుగులు, మహారవైః =గొప్ప ధ్వనులచేత, కారణ్డవచక్రవాకాన్ = కారండవములను చక్రవాకములను, విత్రాస్య = భయపెట్టి, బుద్ధామ్బుజభూషణేషు = వికసించిన పద్మములు భూషణముగా గల, సరస్సు = సరస్సులయందు, జలమ్ = జలమును, విక్షోభ్య విక్షోభ్య = ఎక్కువగా కదిలి పోవు నట్లు చేసి, పిబన్తి = త్రాగుచున్నవి.

తా. గండస్థలములనుండి మదోదకము కారుచున్న మహాగజములు, ఘీంకారధ్వనులచేత సరస్సులలో ఉన్న కారండవ చక్రవాకపక్షులను భయపెట్టుచు వికసించిన పద్మములచే అందముగా నున్న ఆ సరస్సులలోని జలమును ఎక్కువగా క్షోభింపచేయుచు త్రాగుచున్నవి. 41

మూ. వ్యపేతపఙ్కాసు సవాలుకాసు
ప్రసన్నతోయాసు సగోకులాసు,
ససారసారావవినాదితాసు
నదీషు హంసా నిపతన్తి హృష్టాః. 42

ప్ర. అ. వ్యపేతపఙ్కాసు = పోయిన బురద గలవి, సవాలుకాసు = ఇసుకతో కూడినవి, ప్రసన్నతోయాసు = ప్రసన్నమైన ఉదకము కలవి, సగోకులాసు = గోవుల సముదాయములతో కూడినవి, ససారసారావవినాదితాసు = సారసపక్షుల ధ్వనులతో కూడినవై వాటిచే మారుమ్రోగింపబడుచున్నవి అయిన, నదీషు =నదులలో, హంసాః = హంసలు, హృష్టాః = సంతోషించుచున్నవై, నిపతన్తి = వ్రాలుచున్నవి.

తా. నదులలోని బురద ఎండిపోయినది. ఇసుక కనబడుచున్నది. నీరు నిర్మలముగా ఉన్నది. ఆవుల గుంపులు వచ్చి చేరుచున్నవి. సారసపక్షుల ధ్వని వ్యాపించుచున్నది. అట్టి నదుల వద్దకు వచ్చి హంసలు సంతోషముతో వ్రాలుచున్నవి. 42

మూ. నదీఘనప్రస్రవణోదకానా
మతిప్రవృద్ధానిలబర్హిణానామ్,
ప్లవఙ్గమానాం చ గతోత్సవానాం
ధ్రువం రవాః సమ్ప్రతి సంప్రణష్టాః. 43

ప్ర. అ. సమ్ప్రతి = ఇప్పుడు, నదీఘనప్రస్రవణోదకానామ్ = నదులయొక్క, మేఘములయొక్క, కొండకాలువల ఉదకముల యొక్క, అతిప్రవృద్ధానిల బర్హిణానామ్ = మిక్కిలి వృద్ధి చెందిన వాయువు యొక్క, నెమళ్ళ యొక్క, గతోత్సవానామ్ = సమాప్తమైన ఉత్సవము గల, ప్లవఙ్గమానాం చ = కప్పలయొక్క, రవాః = ధ్వనులు, సంప్రణష్టాః = నశించినవి. ధ్రువమ్ = నిశ్చయము.

తా. ఇప్పుడు నదులు, మేఘములు, సెలయేళ్లు, తీవ్రమైన గాలులు, నెమళ్లు మంచి రోజులు గడచి పోయిన కప్పలు - వీటి అన్నిటి ధ్వనులు శాంతించినవి. 43

మూ. అనేకవర్ణాః సువినష్టకాయా
నవోదితేష్వమ్బుధరేషు నష్టాః,
క్షుధార్దితా ఘోరవిషా బిలేభ్య
శ్చిరోషితా విప్రసరన్తి సర్పాః. 44

ప్ర. అ. అమ్బుధరేషు = మేఘములు, నవోదితేషు = క్రొత్తగా ఆవిర్భవించగా, నష్టాః = బిలములలో అణగి ఉన్నవి, సువినష్టకాయాః = మిక్కిలి కృశించిన దేహములు కలవి, అనేకవర్ణాః = అనేక వర్ణములు కలవి, క్షుధార్దితాః = ఆకలిచే పీడింపబడినవి, ఘోరవిషాః = భయంకరమైన విషము కలవి, చిరోషితాః = చిరకాలము బిలములలో ఉండిపోయినవి అయిన, సర్పాః = సర్పములు, బిలేభ్యః = బిలములనుండి, విప్రసరన్తి = పైకి వచ్చుచున్నవి.

తా. సర్పములు వర్షకాలప్రారంభమునందు బిలములలో ప్రవేశించి, అక్కడనే ఉండిపోవుటచే వాటి శరీరములు బాగా కృశించినవి. ఆకలిచే పీడింపబడుచున్న అనేకవర్ణములు గల భయంకరమైన విషము గల ఆ సర్పములు బిలములనుండి బయటకు వచ్చుచున్నవి. 44

మూ. చఞ్చచ్చన్ద్రకరస్పర్శ హర్షోన్మీలితతారకా,
అహో రాగవతీ సన్ధ్యా జహాతి స్వయమమ్బరమ్. 45

ప్ర. అ. చఞ్చచ్చన్ద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా = ప్రకాశించుచున్న చంద్రుని కిరణముల స్పర్శవలన కలిగిన హర్షముచే ప్రకాశించుచున్న నక్షత్రములు గల, రాగవతీ = ఎరుపు గల, సన్ధ్యా= సంధ్య, స్వయమ్ = స్వయముగా, అమ్బరమ్ = ఆకాశమును, జహాతి = విడచుచున్నది. అహో! = ఏమి ఆశ్చర్యము!

తా. ప్రకాశించుచున్న చంద్రుని కిరణముల స్పర్శవలన కలిగిన హర్షముచేత ప్రకాశించుచున్న నక్షత్రములు గల రాగము గల సంధ్య తానే ఆకాశమును విడచుచున్నది. ఏమి ఆశ్చర్యము!

వి. ఈ శ్లోకములోని కొన్ని పదములకు రెండేసి అర్థములున్నవి. కర = కిరణము, హస్తము; తారకా = నక్షత్రము, కనుపాప; రాగ = ఎరుపు, ప్రేమ; అమ్బర = ఆకాశము, వస్త్రము. ఈ విధముగా రెండర్థముల పదములు ప్రయోగించుటచేత ఇక్కడ మరొక అర్థము స్ఫురించుచున్నది. చంద్రుడనే నాయకుని హస్తస్పర్శవలన కలిగిన ఆనందముచే నేత్రములు వికసింపగా, అనురాగవంతురాలైన సన్ధ్య అనే నాయిక స్వయముగానే వస్త్రమును విడుచుచున్నది.

వెనుక సూచించి నట్లు పెద్ద వృత్తాలలో నడచిన ఈ శరద్వర్ణనము, ఈ శ్లోకము ప్రాచ్యపాఠములో లేవు. వాస్తవమున శరత్కాలమును వర్ణించే సందర్భమున ఈ సంధ్యావర్ణనము అప్రస్తుతము, అసంగతము. అందుచేత

ఇలాంటి వర్ణనలన్నీ ప్రక్షిప్తము లని అనుకొనుట యుక్తము. 45

మూ. రాత్రిః శశాఙ్కోదితసౌమ్యవక్త్రా
తారాగణోన్మీలితచారునేత్రా,
జ్యోత్స్నాంశుకప్రావరణా విభాతి
నారీవ శుక్లాంశుకసంవృతాఙ్గీ. 46

ప్ర. అ. శశాఙ్కోదితసౌమ్యవక్త్రా = చంద్రు డనే ప్రకాశించుచున్న అందమైన ముఖము కలది, తారాగణోన్మీలితచారునేత్రా=నక్షత్రగణము లనే వికసించిన అందమైన నేత్రములు గలది, జ్యోత్స్నాంశుకప్రావరణా= వెన్నెల అనే వస్త్రాచ్ఛాదనము కలది అయిన, రాత్రిః = రాత్రి, శుక్లాంశుకసంవృతాఙ్గీ = తెల్లని వస్త్రముచే కట్టబడిన శరీరము గల, నారీవ = స్త్రీ వలె, విభాతి = ప్రకాశించుచున్నది.

తా. రాత్రి తెల్లని వస్త్రము ధరించిన స్త్రీ వలె ప్రకాశించుచున్నది. ఉదయించిన చంద్రుడే దీని అందమైన ముఖము. నక్షత్ర సముదాయములే వికసించిన అందమైన నేత్రములు. వెన్నెలయే వస్త్రాచ్ఛాదనము. 46

మూ. విపక్వశాలిప్రసవాని భుక్త్వా
ప్రహర్షితా సారసచారుపఙ్క్తిః,
నభః సమాక్రామతి శీఘ్రవేగా
వాతావధూతా గ్రథితేవ మాలా. 47

ప్ర. అ. విపక్వశాలిప్రసవాని = పండిన వరి గింజలను, భుక్త్వా = తిని, ప్రహర్షితా = సంతోషించుచున్న, సారసచారుపఙ్క్తిః = సారస పక్షులయొక్క అందమైన పంక్తి, శీఘ్రవేగా = శీఘ్రమైన వేగము కలదై, వాతావధూతా = వాయువుచేత కదల్చబడిన, గ్రథితా = గ్రుచ్చబడిన, మాలా ఇవ = పుష్పమాల వలె, నభః = ఆకాశమును, సమాక్రామతి = ఆక్రమించుచున్నది.

తా. పండిన వరిగింజలను తిని, ఆనందముతో వేగముగా ఎగురుచున్న సారసపక్షుల అందమైన పంక్తి గాలికి ఎగురుచున్న పుష్పమాల వలె ఆకాశమును ఆక్రమించుచున్నది. 47

మూ. సుప్తైకహంసం కుముదైరుపేతం
మహాహ్రదస్థం సలిలం విభాతి,
ఘనైర్విముక్తం నిశి పూర్ణచన్ద్రం
తారాగణాకీర్ణమివాన్తరిక్షమ్. 48

ప్ర. అ. సుప్తైకహంసమ్ = నిద్రించుచున్న ఒక హంస గలది, కుముదైః = తెల్ల కలువలతో, ఉపేతమ్ = కూడినది, మహాహ్రదస్థమ్ = గొప్ప

చెరువులో ఉన్నది అయిన, సలిలమ్ = ఉదకము, నిశి = రాత్రియందు, ఘనైః = మేఘములచేత, విముక్తమ్ = విడువబడిన, తారాగణాకీర్ణమ్ = నక్షత్ర సముదాయములతో వ్యాప్తమైన, పూర్ణచన్ద్రమ్ = పూర్ణుడైన చంద్రుడు గల, అన్తరిక్షమ్ ఇవ= ఆకాశమువలె, విభాతి = ప్రకాశించుచున్నది.

తా. విశాలమైన చెరువులో ఉన్న ఉదకము తెల్లని కలువలతో నిండియున్నది. దీనిలో ఒక హంస నిద్రించుచున్నది. అందుచే అది రాత్రి సమయమున మేఘము లన్నీ తొలగిపోయి పూర్ణచంద్రునితోను నక్షత్రగణములతోను ప్రకాశించుచున్న ఆకాశము వలె నున్నది. 48

మూ. ప్రకీర్ణహంసాకులమేఖలానాం
ప్రబుద్ధపద్మోత్పలమాలినీనామ్,
వాప్యుత్తమానామధికాద్య లక్ష్మీ
ర్వరాఙ్గనానామివ భూషితానామ్. 49

ప్ర. అ. ప్రకీర్ణహంసాకులమేఖలానామ్ = వ్యాపించియున్న హంసలే చంచలమైన వడ్డాణములు కలవి, ప్రబుద్ధపద్మోత్పలమాలినీనామ్ = వికసించిన పద్మములయొక్క, కలువలయొక్క పంక్తులు కలవి అయిన, వాప్యుత్తమానామ్ = శ్రేష్ఠమైన దిగుడుబావులయొక్క, లక్ష్మీః = శోభ, అద్య = ఇప్పుడు, భూషితానామ్ =అలంకరింపబడిన, వరాఙ్గనానామివ = శ్రేష్ఠమైన స్త్రీలయొక్క లక్ష్మి వలె, అధికా =అధికమైనది.

తా. ఇపుడు శ్రేష్ఠమైన దిగుడుబావులు వ్యాపించి యున్న హంస లనే వడ్డాణములతోను, వికసించిన పద్మముల కలువల పంక్తులతోను, అలంకరించుకొని ఉత్తమస్త్రీల వలె అధికశోభతో ప్రకాశించుచున్నవి. 49

మూ. వేణుస్వరవ్యఞ్జితతూర్యమిశ్రః
ప్రత్యూషకాలేఽనిలసమ్ప్రవృత్తః,
సమ్మూర్ఛితో గహ్వరగోవృషాణా
మన్యోన్యమాపూరయతీవ శబ్దః. 50

ప్ర. అ. వేణుస్వరవ్యఞ్జితతూర్యమిశ్రః = వేణుధ్వనులచే ఏర్పరుపబడిన, వాద్యములతో కలిసినది, అనిలసమ్ప్రవృత్తః = వాయువుచేత ప్రసరింపచేయబడి నది, సమ్మూర్ఛితః = వ్యాపించినది అయిన, శబ్దః = ధ్వని, ప్రత్యూషకాలే = ప్రాతఃకాలమునందు, గహ్వరగోవృషాణామ్=గుహలయందలి వృషభములయొక్క శబ్దము, అన్యోన్యమ్=పరస్పరము, ఆపూరయతీవ=పూరించుచున్నట్లున్నది.

తా. ప్రాతఃకాలమునందు వేణుధ్వనులచే ప్రకటింపబడిన వాద్యములతో కలసినది, వాయువుచేత వ్యాపింపచేయబడినది, అంతటా వ్యాపించినది అయిన

శబ్దము, గుహలలోని వృషభముల శబ్దము ఒకదాని నొకటి అధికము చేయుచున్నట్లున్నవి. 50

మూ. నవైర్నదీనాం కుసుమప్రహాసై
ర్వ్యాధూయమానైర్మృదుమారుతేన,
ధౌతామలక్షౌమపటప్రకాశైః
కూలాని కాశైరుపశోభితాని. 51

ప్ర. అ. నదీనామ్=నదులయొక్క, కూలాని=తీరములు, కుసుమప్రహాసైః=పుష్పము లనే నవ్వు కలవి, మృదుమారుతేన=మందమైన వాయువుచేత, వ్యాధూయమానైః=కదల్చబడుచున్నది, ధౌతమలక్షౌమపటప్రకాశైః=ఉతకబడిన నిర్మలమైన తెల్ల పట్టుబట్ట వంటి ప్రకాశము కలవి, అయిన, నవైః=నూతనములైన, కాశైః=రెల్లులచేత, ఉపశోభితాని=ప్రకాశింపచేయబడినవి.

తా. పుష్పము లనే నవ్వులు కలిగినవి, మందమైన వాయువుచేత కదల్చబడుచున్నవి, ఉతికిన తెల్లని పట్టుబట్టల వలె ప్రకాశించుచున్నవి అయిన క్రొత్త రెల్లులచే నదీతీరములు శోభింపచేయబడుచున్నవి. 51

మూ. వనప్రచణ్డా మధుపానశౌణ్డాః
ప్రియాన్వితాః షట్చరణాః ప్రహృష్టాః,
వనేషు మత్తాః పవనానుయాత్రాం
కుర్వన్తి పద్మాసనరేణుగౌరాః. 52

ప్ర. అ. వనప్రచణ్డాః=వనమునందు తీవ్రమైనవి, మధుపానశౌణ్డాః= మధువును త్రాగుటయందు సమర్థములైనవి, ప్రహృష్టాః=సంతోషించుచున్నవి, మత్తాః=మదించినవి, పద్మాసనరేణుగౌరాః=పద్మములయొక్క అసనపుష్పములయొక్క పుప్పొడులచే పచ్చగా ఉన్నవి అయిన, షట్చరణాః=తుమ్మెదలు, ప్రియాన్వితాః=ప్రియురాండ్రతో కూడినవై, వనేషు=వనములయందు, పవనానుయాత్రామ్=వాయువును అనుసరించి యాత్రను, కుర్వన్తి=చేయుచున్నవి.

తా. వనములలో నిరంకుశముగా ప్రవర్తించేవి, మధుపానమునందు శౌర్యము కలవి, పద్మముల పరాగములచేతను, అసనపుష్పముల పరాగముచేతను పచ్చగా నున్నవి అయిన మదించిన తుమ్మెదలు ప్రియురాండ్రతో కలపి సంతోషించుచు వనములలో గాలికి అనుకూలముగా ఎగురుచున్నవి. 52

మూ. జలం ప్రసన్నం కుసుమప్రహాసం
క్రౌఞ్చస్వనం శాలివనం విపక్వమ్,
మృదుశ్చ వాయుర్విమలశ్చ చన్ద్రః
శంసన్తి వర్షవ్యపనీతకాలమ్. 53

ప్ర. అ. కుసుమప్రహాసమ్=పుష్పము లనే నవ్వు కలది, క్రౌఞ్చస్వనమ్=క్రౌంచపక్షులయొక్క ధ్వని కలది, ప్రసన్నమ్=నిర్మలము అయిన, జలమ్=జలము, విపక్వమ్=పండిన, శాలివనమ్=వరిచేను, మృదుః=మృదువైన, వాయుః=వాయువు, విమలః=నిర్మలమైన, చన్ద్రశ్చ=చంద్రుడు, వర్షవ్యపనీతకాలమ్=వర్షములు గడచిపోయిన కాలమును, శంసన్తి= చెప్పుచున్నవి.

తా. నిర్మలము, పుష్పము లనే నవ్వు కలది, క్రౌఞ్చపక్షుల ధ్వనితో కూడినది అయిన జలము, పండిన వరిచేను, మందమైన వాయువు, నిర్మలమైన చంద్రబింబము, - ఇవన్నీ వర్షకాలము గడచి నట్లు చెప్పుచున్నవి. 53

మూ. మీనోపసన్దర్శితమేఖలానాం
నదీవధూనాం గతయో౽ద్య మన్దాః,
కాన్తోపభుక్తాలసగామినీనాం
ప్రభాతకాలేష్వివ కామినీనామ్. 54

ప్ర. అ. మీనోపసన్దర్శితమేఖలానామ్=మీనము లనే కనబడుచున్న వడ్డాణము కలిగిన, నదీవధూనామ్=నదులనే స్త్రీలయొక్క, గతయః=నడకలు, అద్య= ఇప్పుడు, ప్రభాతకాలేషు=ప్రాతఃకాలములయందు, కాన్తోపభుక్తాలసగామినీనామ్= ప్రియులచేత అనుభవింపబడిన మందముగా నడచుచున్న, కామినీనామ్ ఇవ= స్త్రీలయొక్క గమనములు వలె, మన్దాః=మందమైనవి.

తా. పైకి కనబడుచున్న మీనము లనే వడ్డాణములు గల నదు లనే స్త్రీల గమనములు ప్రాతఃకాలములందు, ప్రియులచే అనుభవింపబడిన మందముగా నడచుచున్న స్త్రీల గమనముల వలె ఇప్పుడు మందముగా నున్నవి. 54

మూ. సచక్రవాకాని సశైవలాని
కాశైర్దుకూలైరివ సంవృతాని,
సపత్రరేఖాని సరోచనాని
వధూముఖానీవ నదీముఖాని. 55

ప్ర. అ. సచక్రవాకాని=చక్రవాకములతో కూడినవి, సశైవలాని=నాచుతో కూడినవి, దుకూలైరివ=పట్టుబట్టల వంటి, కాశైః=రెల్లుగడ్డిచేత, సంవృతాని=కప్పబడినవి అయిన, నదీముఖాని=నదుల ముఖములు, సపత్రరేఖాని=పత్రరేఖలతో కూడినవి(స్త్రీల చెక్కిళ్లపై రంగులతో వేసిన ఆకుల వంటి బొమ్మలకు పత్రరేఖలు అని పేరు) సరోచనాని=గోరోచనములతో కూడిన, వధూముఖానీవ=స్త్రీల ముఖములు వలె ఉన్నవి.

తా. చక్రవాకపక్షులతోను, నాచులతోను కూడి పట్టుబట్టల వంటి రెల్లు గడ్డిచే కప్పబడిన నదీముఖములు, పత్రరేఖలు చిత్రించి గోరోచనము పూసుకొనిన

స్త్రీల ముఖముల వలె నున్నవి. 55

మూ. ప్రఫుల్లబాణాసనచిత్రితేషు
ప్రహృష్టషట్పాదనికూజితేషు,
గృహీతచాపోద్యతదణ్డచణ్డః
ప్రచణ్డచారోఽద్య వనేషు కామః. 56

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ప్రఫుల్లబాణాసనచిత్రితేషు=వికసించిన బాణ వృక్షములచేతను, అసనవృక్షములచేతను, చిత్రవర్ణము కలవిగా చేయబడిన, ప్రహృష్టషట్పాదనికూజితేషు=సంతోషించుచున్న తుమ్మెదలచేత ధ్వనింపచేయబడిన, వనేషు=వనములయందు, గృహీతచాపోద్యతదణ్డచణ్డః=గ్రహింపబడిన ధనస్సు కల వాడు, ప్రయోగింపబడిన దండముచేత తీవ్రముగా ఉన్నవాడు అయిన, కామః= మన్మథుడు, ప్రచణ్డచారః=తీవ్రమైన సంచారము కలవాడు.

తా. ఇపుడు వనములన్నీ వికసించిన బాణవృక్షములచేతను, అసనవృక్షముల చేతను చిత్రవర్ణములుగా నున్నవి. సంతోషించిన తుమ్మెదలు ధ్వని చేయుచున్నవి. అట్టి ఈ వనములలో మన్మథుడు ధనస్సు ధరించి దండించుటకు ఉద్యుక్తుడై తీవ్రరూపముతో సంచరించుచున్నాడు. 56

మూ. లోకం సువృష్ట్యా పరితోషయిత్వా
నదీస్తటాకాని చ పూరయిత్వా,
నిష్పన్నసస్యాం వసుధాం చ కృత్వా
త్యక్త్వా నభస్తోయధరాః ప్రణష్టాః. 57

ప్ర. అ. తోయధరాః=మేఘములు, సువృష్ట్యా=మంచి వర్షముచేత, లోకమ్=లోకమును, పరితోషయిత్వా=సంతోషపెట్టి, నదీః=నదులను, తటాకాని చ=చెఱువులను, పూరయిత్వా=నింపి, వసుధామ్=భూమిని, నిష్పన్నసస్యామ్=సమృద్ధమైన సస్యములు కలదానినిగా, కృత్వా=చేసి, నభః=ఆకాశమును, త్యక్త్వా=విడచి, ప్రణష్టాః=అదృశ్యమైనవి.

తా. మేఘములు మంచి వర్షములచేత లోకమునకు సంతోషమును కలిగించి నదులను చెఱువులను నింపి, భూమిని సస్యసమృద్ధము చేసి, ఆకాశమును విడిచి, కనబడకుండా వెళ్లిపోయినవి. 57

మూ. దర్శయన్తి శరన్నద్యః పులినాని శనైః శనైః,
నవసఙ్గమసవ్రీడా జఘనానీవ యోషితః. 58

ప్ర. అ. నవసఙ్గమసవ్రీడాః=నవసంగమమునందు సిగ్గుతో కూడిన, యోషితః= స్త్రీలు, జఘనానీవ=జఘనములను వలె, శరన్నద్యః=శరత్కాలనదులు, పులినాని=ఇసుకతిన్నెలను, శనైః శనైః=మెల్లమెల్లగా, దర్శయన్తి= చూపుచున్నవి.

తా. నవసంగమసమయమునందు సిగ్గుపడుచున్న స్త్రీలు జఘనములను వలె శరత్కాలనదులు ఇసుకతిన్నెలను మెల్లమెల్లగా చూపుచున్నవి. 58

మూ. ప్రసన్నసలిలాః సౌమ్య కురరాభివినాదితాః,
చక్రవాకగణాకీర్ణా విభాన్తి సలిలాశయాః. 59

ప్ర. అ. సౌమ్య! =ఓ సౌమ్యుడా! ప్రసన్నసలిలాః=నిర్మలములైన ఉదకములు కలవి, కురరాభివినాదితాః=క్రౌంచపక్షులచేత ధ్వనింపచేయబడినవి, చక్రవాకగణాకీర్ణాః= చక్రవాకపక్షుల సముదాయములచే వ్యాప్తములు అయిన, సలిలాశయాః= జలాశయములు, విభాన్తి=ప్రకాశించుచున్నవి.

తా.ఓ! సౌమ్యుడా! నిర్మలములైన జలములతో నిండిన చెరువులు మొదలైన జలాశయములు క్రౌంచపక్షుల ధ్వనులచేత ప్రతిధ్వనించుచు, చక్రవాక పక్షుల గుంపులతో నిండి అందముగా నున్నవి. 59

మూ. అన్యోన్యబద్ధవైరాణాం జిగీషూణాం నృపాత్మజ !
ఉద్యోగసమయః సౌమ్య! పార్థివానాముపస్థితః. 60

ప్ర. అ. నృపాత్మజ=రాజకుమారా! సౌమ్య!=సౌమ్యుడా! అన్యోన్యబద్ధవైరాణామ్ =పరస్పరము కట్టబడిన వైరము కలవారు, జిగీషూనామ్= జయించ కోరుచున్న వారు అయిన, పార్థివానామ్=రాజులయొక్క, ఉద్యోగసమయః= ప్రయత్నమునకు సమయము, ఉపస్థితః=వచ్చినది.

తా. ఓ లక్ష్మణా! పరస్పరము వైరము వహించి జయంచవలెనను కోరిక గల, రాజులు ఉద్యమించు సమయము వచ్చినది. 60

మూ. ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ!
న చ పశ్యామి సుగ్రీవముద్యోగం చ తథావిధమ్. 61

ప్ర. అ. నృపాత్మజ! =రాజకుమారా! ఇయమ్=ఇది, పార్థివానామ్= రాజులయొక్క, సా=ఆ, ప్రథమా యాత్రా=మొదటి యాత్ర. సుగ్రీవమ్=సుగ్రీవుని, తథావిధమ్= అట్టి, ఉద్యోగం చ=ప్రయత్నమును, న చ పశ్యామి=చూడను.

తా. ఓ! లక్ష్మణా! ఇది రాజులు యుద్ధయాత్ర ప్రారంభించు సమయము. కాని సుగ్రీవుడు గాని అట్టి ప్రయత్నము గాని కనబడుట లేదు.61

మూ. అసనాః సప్తపర్ణాశ్చ కోవిదారాశ్చ పుష్పితాః,
దృశ్యన్తే బన్ధుజీవాశ్చ శ్యామాశ్చ గిరిసానుషు. 62

ప్ర. అ. గిరిసానుషు=పర్వతముల చరియలయందు, పుష్పితాః=పుష్పించిన, అసనాః=అసనవృక్షములు, సప్తపర్ణాశ్చ=ఏడాకుల అరటిచెట్లు, కోవిదారాశ్చ=కోవిదారవృక్షములు, బన్ధుజీవాః= బన్ధుజీవ వృక్షములు, శ్యామాశ్చ= శ్యామాలతలు,

దృశ్యన్తే=కనబడుచున్నవి.

తా. పర్వతముల చరియల మీద ఉన్న అసన - సప్తపర్ణ - కోవిదార - బన్ధుజీవ వృక్షములు, శ్యామాలతలు, పుష్పించినవి. 62

మూ. హంససారసచక్రాహ్వైః కురరైశ్చ సమన్తతః,
పులినాన్యవకీర్ణాని నదీనాం పశ్య లక్ష్మణ. 63

ప్ర. అ. లక్ష్మణ =ఓ లక్ష్మణా! నదీనామ్ = నదులయొక్క, పులినాని = ఇసుకతిన్నెలు, హంససారసచక్రాహ్వైః = హంసలచేతను, సారసపక్షులచేతను, చక్రవాకపక్షులచేతను, కురరైశ్చ =క్రౌంచపక్షులచేతను, సమన్తతః =అంతట, అవకీర్ణాని = వ్యాప్తమైనవి. పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! నదుల ఇసుకతిన్నెలయందు అంతటను హంసలు, సారసపక్షులు, చక్రవాకములు, క్రౌంచపక్షులు వ్యాపించి యున్నవి; చూడుము. 63

వి. ఈ 62, 63 శ్లోకములు కొన్ని ప్రతులలో "అన్యోన్యబద్ధవైరాణామ్" ఇత్యాదిశ్లోకములకు ముందు ఉన్నవి. అట్లు ఉండుటయే యుక్తము.

మూ. చత్వారో వార్షికా మాసా గతా వర్షశతోపమాః,
మమ శోకాభితప్తస్య తథా సీతామపశ్యతః. 64

ప్ర. అ. సీతామ్ = సీతను, అపశ్యతః = చూడనివాడను, తథా = మరియు, శోకాభితప్తస్య =శోకముచేత తపింపచేయబడినవాడను అయిన, మమ = నాకు, వర్షశతోపమాః = నూరు సంవత్సరములతో సమానములైన, వార్షికాః= వర్షకాలసంబంధమైన, చత్వారః=నాలుగు, మాసాః = మాసములు, గతాః = గడచినవి.

తా. ఈ వర్షకాలమాసములు నాలుగు సీత కనబడక దుఃఖముచే పీడింపబడిన నాకు వంద సంవత్సరముల వలె గడచినవి. 64

మూ. చక్రవాకీవ భర్తారం పృష్ఠతోఽనుగతా వనమ్,
విషమం దణ్డకారణ్యముద్యానమివ చాఙ్గనా. 65

ప్ర. అ. అఙ్గనా =సీత, భర్తారమ్ = భర్తనైన నన్ను, విషమమ్ = భయంకరమైన, వనమ్ = వనమైన, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును గూర్చి, ఉద్యానమివ = ఉద్యానవనమును గూర్చి వలె, చక్రవాకీవ = ఆడ చక్రవాకపక్షివలె, పృష్ఠతః =వెనుకనే, అనుగతా = అనుసరించి వచ్చినది.

తా. ఆడ చక్రవాకపక్షి తన భర్తను అనుసరించి నట్లు సీత నా వెనుకనే భయంకరమైన ఆ దండకారణ్యములోనికి ఉద్యానవనములోనికి వలె ప్రవేశించినది.

మూ. ప్రియావిహీనే దుఃఖార్తే హృతరాజ్యే వివాసితే,
కృపాం న కురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ. 66

ప్ర. అ. లక్ష్మణ! =ఓ లక్ష్మణా! ప్రియావిహీనే = ప్రియురాలితో శూన్యుడను, దుఃఖార్తే = దుఃఖముచే పీడింపబడినవాడను, హృతరాజ్యే = హరింపబడిన రాజ్యము కలవాడను, వివాసితే = నగరమునుండి వెడలగొట్టబడిన వాడను అయిన, మయి =నాయందు, రాజా సుగ్రీవః = రాజైన సుగ్రీవుడు, కృపామ్ = కృపను, న కురుతే = చేయుటలేదు.

తా. లక్ష్మణా! రాజ్యము నపహరించి నగరమునుండి వెడలగొట్టబడిన నేను ప్రియావిహీనుడనై దుఃఖముతో బాధపడుచున్నాను. అయినను రాజైన సుగ్రీవుడు నాపై దయ చూపుటలేదు. 66

మూ. అనాథో హృతరాజ్యోఽయం రావణేన చ ధర్షితః,
దీనో దూరగృహః కామీ మాం చైవ శరణం గతః, 67
ఇత్యేతైః కారణైః సౌమ్య! సుగ్రీవస్య దురాత్మనః,
అహం వానరరాజస్య పరిభూతః పరంతప! 68

ప్ర. అ. సౌమ్య =ఓ సౌమ్యుడా! పరంతప! = శత్రువులను పీడించువాడా! అయమ్ = ఇతడు, అనాథః =నాథుడు లేనివాడు, హృతరాజ్యః = హరింపబడిన రాజ్యము కలవాడు; రావణేన = రావణునిచేత, ధర్షితః = అవమానించబడినవాడు; దీనః =దీనుడు, దూరగృహః =దూరమైన గృహము కలవాడు, కామీ = కాముకుడు, మాం చైవ =నన్ను, శరణం గతః = శరణు పొందినవాడు, ఇత్యేతైః = ఈ, కారణైః = కారణములచేత, దురాత్మనః = దుష్టబుద్ధి గల, వానరరాజస్య = వానరరాజైన, సుగ్రీవస్య = సుగ్రీవునకు, (సుగ్రీవునిచేత) అహమ్ = నేను, పరిభూతః = తిరస్కరించ బడినాను.

తా. శత్రుసంహారకుడవైన ఓ లక్ష్మణా! "ఇతడు అనాథుడు; రాజ్యమును కోల్పోయినవాడు; రావణునిచేత అవమానించబడినాడు; దీనుడు; ఇంటికి దూరమైనాడు; భార్యావియోగముతో బాధపడుచున్నాడు; నన్ను శరణు పొందినాడు" అని అనుకొనుచు దుర్బుద్ధియైన వానరరాజు సుగ్రీవుడు నన్ను అవమానించుచున్నాడు. 67-68

మూ. స కాలం పరిసఙ్ఖ్యాయ సీతాయాః పరిమార్గణే,
కృతార్థః సమయం కృత్వా దుర్మతిర్నావబుధ్యతే. 69

ప్ర.అ. దుర్మతిః =దుష్టబుద్ధియైన, సః = అతడు, కృతార్థః = కృతార్థుడై, సీతాయాః = సీతయొక్క, పరిమార్గణే = అన్వేషణమునందు, కాలమ్ = కాలమును, పరిసఙ్ఖ్యాయ = చెప్పి, సమయమ్ = ఒడంబడికను, కృత్వా =

చేసి, నావబుధ్యతే = గుర్తించుటలేదు.

తా. దుర్బుద్ధియైన ఆ సుగ్రీవుడు సీతను అన్వేషించుటకు కాలమును చెప్పి నాతో ఒడంబడిక చేసుకొని తన పని పూర్తియగుటచే ఇప్పుడు స్మరించుటలేదు.

మూ. స కిష్కింధాం ప్రవిశ్య త్వం బ్రూహి వానరపుఙ్గవమ్,
మూర్ఖం గ్రామ్యసుఖే సక్తం సుగ్రీవం వచనాన్మమ. 70

ప్ర. అ. సః త్వమ్ = నీవు, కిష్కిన్ధామ్ = కిష్కింధను, ప్రవిశ్య = ప్రవేశించి, వానరపుఙ్గవమ్ = వానరశ్రేష్ఠుడు, మూర్ఖమ్ = మూర్ఖుడు, గ్రామ్యసుఖే = స్త్రీసుఖమునందు, సక్తమ్ = ఆసక్తుడు అయిన, సుగ్రీవమ్ = సుగ్రీవునిగూర్చి, మమ = నాయొక్క, వచనాత్ =వచనమువలన, బ్రూహి = చెప్పుము.

తా. నీవు కిష్కింధానగరములో ప్రవేశించి వానరశ్రేష్ఠుడు, మూర్ఖత్వముతో స్త్రీసుఖమునందు ఆసక్తుడు అయిన సుగ్రీవునితో నా మాటగా చెప్పుము. 70

మూ. అర్థినాముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్,
ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాధమః. 71

ప్ర. అ. ఉపపన్నానామ్ = ఆశ్రయించినవారు, పూర్వమ్ = పూర్వము, ఉపకారిణాం చ = ఉపకారము చేసిన వారు అయిన, అర్థినామ్ = కార్యార్థులకు, సంశ్రుత్య = ప్రతిజ్ఞ చేసి, ఆశామ్ = వారి ఆశను, యః = ఎవడు, హన్తి = నశింపచేయునో (పూరించడో) , సః = అతడు, లోకే = లోకమునందు, పురుషాధమః = పురుషాధముడు.

తా. "తనకు పూర్వము ఉపకారము చేసి, కార్యార్థులై తన దగ్గరకు వచ్చిన వారికి మాట ఇచ్చి ఎవడు వారి ఆశను పూరించడో అతడు లోకములో పురుషాధముడు." 71

మూ. శుభం వా యది వా పాపం యో హి వాక్యముదీరితమ్,
సత్యేన పరిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః. 72

ప్ర. అ. యః హి =ఎవడు, శుభం వా = శుభమైనను, యది వా =లేక, పాపమ్ =పాపమైనను, ఉదీరితమ్ = పలకబడిన, వాక్యమ్ = వాక్యమును, సత్యేన = సత్యముచేత, పరిగృహ్ణాతి = స్వీకరించునో, సః వీరః =ఆ వీరుడు, పురుషోత్తమః = పురుషులలో శ్రేష్ఠుడు.

తా. "ఎవడు శుభమైనను అశుభమైనను తాను పలికిన మాటను నిలబెట్టుకొనునో ఆ వీరుడు పురుషోత్తముడు." 72

మూ. కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం న భవన్తి యే,
తాన్మృతానపి క్రవ్యాదాః కృతఘ్నాన్నోపభుఞ్జతే. 73

ప్ర. అ. కృతార్థాః = తమ పనులు నెరవేర్చుకొన్న, యే =ఎవరు, అకృతార్థానామ్ = పూర్తికాని పనులు గల, మిత్రాణామ్ = మిత్రులకు, న భవన్తి = అవరో (అక్కరకు రారో), మృతాన్=మరణించిన, కృతఘ్నాన్ = కృతఘ్నులైన, తాన్ = వాళ్లను, క్రవ్యాదాః అపి = మాంసము తిను జంతువులు కూడ, న ఉపభుఞ్జతే = తినవు.

తా. "తమ పనులు పూర్తి చేసుకొని, ఇంకా పనులు పూర్తి కాని మిత్రులకు ఎవరు అక్కరకు రారో అట్టి కృతఘ్నులను, మరణించిన పిమ్మట కుక్కలు మొదలైన జంతువులు కూడ తినవు." 73

మూ. నూనం కాఞ్చనపృష్ఠస్య వికృష్టస్య మయా రణే,
ద్రష్టుమిచ్ఛసి చాపస్య రూపం విద్యుద్గణోపమమ్. 74

ప్ర.అ. నూనమ్ = నిజముగా, కాఞ్చనపృష్ఠస్య = బంగారు పృష్ఠభాగము గలది, రణే = యుద్ధమునందు, మయా = నాచేత, వికృష్టస్య = లాగబడినది అయిన, చాపస్య = ధనస్సుయొక్క, విద్యుద్గణోపమమ్ = మెరపుల గుంపుతో సమానమైన, రూపమ్ = రూపమును, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. "యుద్ధములో బంగారు పైభాగము గల ధనస్సును నేను లాగుచుండగా మెరపుల సముదాయము వంటి దాని రూపమును చూడగోరుచున్నావు; నిజము!"

మూ. ఘోరం జ్యాతలనిర్ఘోషం క్రుద్ధస్య మమ సంయుగే,
నిర్ఘోషమివ వజ్రస్య పునః సంశ్రోతుమిచ్ఛసి. 75

ప్ర. అ. సంయుగే = యుద్ధమునందు, క్రుద్ధస్య = కోపించిన, మమ = నాయొక్క, వజ్రస్య = వజ్రముయొక్క, నిర్ఘోషమివ = ధ్వని వలె ఉన్న, ఘోరమ్ = భయంకరమైన, జ్యాతలనిర్ఘోషమ్ = నారియొక్క ధ్వనిని, పునః =మరల, సంశ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. "నేను యుద్ధములో కోపించి భయంకరమైన నారి చరచుచు టంకారధ్వని చేయగా వజ్రధ్వనివంటి ఆ భయంకరమైన ధ్వనిని మరల వినవలె నని కోరుచున్నావు." 75

మూ. కామమేవంగతేఽ ప్యస్య పరిజ్ఞాతే పరాక్రమే,
త్వత్సహాయస్య మే వీర న చిన్తా స్యాన్నృపాత్మజ. 76

ప్ర. అ. వీర =వీరుడా! నృపాత్మజ =రాజకుమారా! అస్య = ఈతని యొక్క, పరిజ్ఞాతే = తెలియబడిన, పరాక్రమే = పరాక్రమము, కామమ్ ఏవం గతేఽపి = ఇట్లయినను, త్వత్సహాయస్య = నీవు సహాయుడవుగా గల, మే =నాకు, చిన్తా = విచారము, న స్యాత్ = కలగదు.

తా. వీరుడవైన లక్ష్మణా! మనకు తెలిసిన ఈ సుగ్రీవుడు మనకు ఉపయోగించకుండగా ఇట్లు అయిపోయిన అయిపోవుగాక; నీవు సహాయుడవుగా ఉన్నంతవరకు నాకేమీ విచారము లేదు. 76

మూ. యదర్థమయమారమ్భః కృతః పరపురంజయ,
సమయం నాభిజానాతి కృతార్థః ప్లవగేశ్వరః. 77

ప్ర. అ. పరపురంజయ = శత్రుపురములను జయించువాడా! యదర్థమ్ = దేని నిమిత్తమై, అయమ్ = ఈ, ఆరమ్భః = ప్రయత్నము, కృతః = చేయబడినదో, సమయమ్ = దాని సమయమును, కృతార్థః = చేయబడిన తన కార్యము గల, ప్లవగేశ్వరః = సుగ్రీవుడు, నాభిజానాతి = గుర్తించుట లేదు.

తా. శత్రువుల పురములను జయించు ఓ! లక్ష్మణా! తన పని పూర్తిచేసికొనిన సుగ్రీవుడు ఈ ప్రయత్న మంతా దేని నిమిత్తమై చేయబడినదో దానికి తగిన సమయము వచ్చినను గుర్తించకున్నాడు. 77

మూ. వర్షాసమయకాలం తు ప్రతిజ్ఞాయ హరీశ్వరః,
వ్యతీతాంశ్చతురో మాసాన్ విహరన్నావబుధ్యతే. 78

ప్ర. అ. హరీశ్వరః = సుగ్రీవుడు, వర్షాసమయకాలమ్ = వర్షముల సమయ మను కాలమును, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, విహరన్ = విహరించుచు, వ్యతీతాన్ = గడచిపోయిన, చతురః = నాలుగు, మాసాన్ = మాసములను, నావబుధ్యతే = తెలిసికొనుటలేదు.

తా. వర్షకాలమును నిరీక్షించవలసిన కాలముగా ప్రతిజ్ఞ చేసిన సుగ్రీవుడు, సుఖముగా విహరించుచు, నాలుగు మాసములు గడచిపోయిన విషయమును గుర్తించుటలేదు. 78

మూ. సామాత్యపరిషత్ క్రీడన్ పానమేవోపసేవతే,
శోకదీనేషు నాస్మాసు సుగ్రీవః కురుతే దయామ్. 79

ప్ర. అ. సుగ్రీవః = సుగ్రీవుడు, సామాత్యపరిషత్ = అమాత్యపరిషత్తుతో కూడినవాడై, క్రీడన్ = క్రీడించుచు, పానమేవ = పానమునే, ఉపసేవతే= సేవించుచున్నాడు. శోకదీనేషు =శోకముచేత దీనులమైన, అస్మాసు = మనయందు, దయామ్ = దయను, న కురుతే =చేయుటలేదు.

తా. సుగ్రీవుడు అమాత్యపరిషత్తుతో కలిసి క్రీడించుచు మద్యపానము చేయుచున్నాడు. శోకముతో దీనులమైన మనపై దయ చూపుటలేదు. 79

మూ. ఉచ్యతాం గచ్ఛ సుగ్రీవస్త్వయా వీర మహాబల,
మమ రోషస్య యద్రూపం బ్రూయాశ్చైవమిదం వచః. 80

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గల , వీర =వీరుడా! గచ్ఛ = వెళ్లుము. త్వయా = నీచేత, సుగ్రీవః =సుగ్రీవుడు, మమ = నాయొక్క, రోషస్య = కోపముయొక్క, యత్ = ఏ, రూపమ్ =రూప ముండునో దానిని, ఉచ్యతామ్ = చెప్పబడుగాక. ఏనమ్ = వీనిని గూర్చి, ఇదమ్ = ఈ, వచః = వచనమును, బ్రూయాశ్చ = చెప్పుము.

తా. మహాబలుడవైన ఓ! వీరుడా! నీవు వెళ్లి నాకు కోపము వచ్చినచో ఎట్లుండునో సుగ్రీవునికి తెలిపి ఆతనికి ఈ మాట కూడ చెప్పుము. 80

మూ. న చ సంకుచితః పన్థా యేన వాలీ హతో గతః,
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథమన్వగాః. 81

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా! సమయే=ఒడంబడికయందు, తిష్ఠ= ఉండుము. హతః=చంపబడిన, వాలీ=వాలి, యేన=ఏమార్గముచేత, గతః=వెళ్లినాడో, పన్థాః=ఆ మార్గము, న చ సంకుచితః= మూసివేయబడలేదు. వాలిపథమ్=వాలిమార్గమును, మా అన్వగాః= అనుసరించకుము.

తా. "సుగ్రీవా! మాటమీద నిలబడుము. నేను చంపిన వాలి వెళ్లిన మార్గము మూసివేయలేదు. వాలి వెళ్లిన మార్గమున వెళ్లకుము." 81

మూ. ఏక ఏవ రణే వాలీ శరేణ నిహతో మయా,
త్వాం తు సత్యాదతిక్రాన్తం హనిష్యామి సబాన్ధవమ్. 82

ప్ర. అ. మయా=నాచేత, రణే=యుద్ధమునందు, శరేణ=బాణముచేత, ఏకః=ఒక్క, వాలీ ఏవ=వాలిమాత్రమే, హతః=చంపబడినాడు. సత్యాత్=సత్యమునుండి, అతిక్రాన్తమ్=అతిక్రమించిన, త్వాం తు=నిన్నైతే, సబాన్ధవమ్=బంధుసహితముగా, హనిష్యామి=చంపగలను.

తా. "నేను యుద్ధములో బాణముతో ఒక్క వాలిని మాత్రమే చంపినాను. మాట తప్పిన నిన్ను మాత్రము బంధుసహితముగా చంపెదను."

మూ. తదేవం విహితే కార్యే యద్ధితం పురుషర్షభ,
తత్తద్బ్రూహి నరశ్రేష్ఠ త్వర కాలవ్యతిక్రమః. 83

ప్ర. అ. పురుషర్షభ=వృషభము వంటి పురుషుడా! నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడా! తత్=ఆ కారణమువలన, కార్యే=కార్యము, ఏవమ్=ఇట్లు, విహితే=ఉండగా, యత్=ఏది, హితమ్=హితమో, తత్ తత్=దాని నంతనూ, బ్రూహి=చెప్పుము. త్వర=తొందరపడుము. కాలవ్యతిక్రమః= కాలాతిక్రమము, (కాకుండుగాక).

తా. పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! మనకార్యము ఇట్టి స్థితిలో ఉన్నది గాన ఇపుడు ఏది మనకు హితమో ఆ విధముగా ఆతనితో అన్నీ చెప్పుము. ఆలస్యము కాకూడదు; తొందరపడుము. 83

మూ. కురుష్వ సత్యం మమ వానరేశ్వర
ప్రతిశ్రుతం ధర్మమవేక్ష్య శాశ్వతమ్,
మా వాలినం ప్రేత్య గతో యమక్షయం
త్వమద్య పశ్యేర్మమ చోదితః శరైః. 84

ప్ర. అ. వానరేశ్వర=వానరరాజా! శాశ్వతమ్=శాశ్వతమైన, ధర్మమ్=ధర్మమును, అవేక్ష్య=చూచి, మమ=నాకు, ప్రతిశ్రుతమ్= ప్రతిజ్ఞచేయబడిన పనిని, సత్యమ్=సత్యమైనదానినిగా, కురుష్వ=చేయుము. అద్య=ఇప్పుడు, త్వమ్=నీవు, మమ=నాయొక్క, శరైః= బాణములచేత, చోదితః=పంపబడినవాడవై, ప్రేత్య=మరణించి, యమక్షయమ్=యముని గృహమును, గతః=పొందినవాడవై, వాలినమ్=వాలిని, మా పశ్యేః=చూడకుందువుగాక.

తా. "సుగ్రీవుడా! శాశ్వతమైన ధర్మమును దృష్టిలో ఉంచుకొని, నాకు చేసిన ప్రతిజ్ఞను సత్యము చేయుము. నీ విప్పుడు నా బాణములచే కొట్టబడి, మరణించి, యమలోకము చేరి అక్కడ వాలిని చూడకుము." 84

మూ. స పూర్వజం తీవ్రవివృద్ధకోపం
లాలప్యమానం ప్రసమీక్ష్య దీనమ్,
చకార తీవ్రం మతిముగ్రతేజా
హరీశ్వరే మానవవంశవర్ధనః. 85

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రింశః సర్గః.

ప్ర.అ. మానవవంశవర్ధనః=మనువుయొక్క వంశమును వృద్ధి పొందించిన, ఉగ్రతేజాః=ఉగ్రమైన తేజస్సు గల, సః=ఆ లక్ష్మణుడు, తీవ్రవివృద్ధకోపమ్= తీవ్రముగా వృద్ధిపొందిన కోపము గల, దీనమ్=దీనముగా, లాలప్యమానమ్= మాటలాడుచున్న, పూర్వజమ్=అన్నను, ప్రసమీక్ష్య=చూచి, హరీశ్వరే= సుగ్రీవుని విషయమునందు, తీవ్రమ్=తీవ్రమైన, మతిమ్=బుద్ధిని, చకార= చేసెను.

తా. మనువంశమును ఉద్ధరించువాడు, భయంకరమైన తేజస్సు కలవాడు అయిన ఆ లక్ష్మణుడు, తీవ్రముగా పెరిగి పోయిన కోపముతో దీనముగా మాటలాడుచున్న అన్నగారిని చూచి సుగ్రీవుని విషయమునందు తీవ్రమైన ఆలోచన చేసెను. 85

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ముప్పదవ సర్గ సమాప్తము.

# అథ ఏకత్రింశః సర్గః

(సుగ్రీవునిపై లక్ష్మణునకు కలిగిన కోపమును రాముడు శాంతింపచేయుట, లక్ష్మణుడు కిష్కింధాద్వారము సమీపించి అంగదుని సుగ్రీవుని వద్దకు పంపుట; వానరులు భయము చెందుట; ప్లక్షుడు, ప్రభావుడు సుగ్రీవునకు కర్తవ్యమును ఉపదేశించుట)

మూ. స కామినం దీనమదీనసత్త్వం
శోకాభిపన్నం సముదీర్ణకోపమ్,
నరేన్ద్రసూనుర్నరదేవపుత్రం
రామానుజః పూర్వజమిత్యువాచ. 1

ప్ర.అ. నరేన్ద్రసూనుః=రాజకుమారుడైన, సః=ఆ, రామానుజః= లక్ష్మణుడు, కామినమ్=కామముతో కూడినవాడు, దీనమ్=దీనుడు, అదీనసత్త్వమ్=దీనముకాని బలముగలవాడు, శోకాభిపన్నమ్=శోకముచేత పొందబడినవాడు, సముదీర్ణకోపమ్=అత్యధికమైన కోపము గలవాడు, నరదేవపుత్రమ్=దశరథకుమారుడు అయిన, అగ్రజమ్=అన్నగారిని గూర్చి, ఇతి=ఇట్లు, ఉవాచ=పలికెను.

తా. రాజకుమారుడైన లక్ష్మణుడు సీతావియోగముతో బాధపడుచున్నవాడు, దీనుడు, గొప్ప బలము గలవాడు, దుఃఖాక్రాంతుడు, అత్యధికమైన కోపము గలవాడు, దశరథపుత్రుడు అయిన అన్నగారితో ఇట్లు పలికెను. 1

మూ. న వానరః స్థాస్యతి సాధువృత్తే
న మన్యతే కర్మఫలానుషఙ్గాన్,
న భోక్ష్యతే వానరరాజలక్ష్మీం
తథా హి నాభిక్రమతేఽస్య బుద్ధిః. 2

ప్ర.అ. వానరః=వానరుడు, సాధువృత్తే=సత్పురుషుల వృత్తమునందు, న స్థాస్యతి=ఉండడు. కర్మఫలానుషఙ్గాన్=కర్మఫలముల సంబంధములను, న మన్యతే=తెలుసుకొనడు. వానరరాజ్యలక్ష్మీమ్=వానరుల రాజ్యలక్ష్మిని, న భోక్ష్యతే=అనుభవింపడు. తథా హి=యుక్తమేకదా! అస్య=వీనియొక్క, బుద్ధిః=బుద్ధి, నాభిక్రమతే=ముందుకు ప్రవర్తించుటలేదు.

తా. వానరుడైన ఈ సుగ్రీవుడు సత్పురుషులు అవలంబించు మార్గమున ప్రవర్తించడు. కర్మలవలన కలుగు ఫలములను గూర్చి తెలుసుకొనుట లేదు. వానరుల రాజ్యలక్ష్మిని ఇటుపై అనుభవించడు. అందుచేతనే వీనికి ముందు

చూపు మందగించినది. 2

మూ. మతిక్షయాద్గ్రామ్యసుఖేషు సక్త
స్తవ ప్రసాదాప్రతికారబుద్ధిః,
హతోఽ గ్రజం పశ్యతు వీర వాలినం
న రాజ్యమేవం విగుణస్య దేయమ్. 3

ప్ర.అ. వీర=ఓ వీరుడా! తవ=నీయొక్క, ప్రసాదాప్రతికారబుద్ధిః= అనుగ్రహమునకు ప్రత్యుపకారము చేయుని బుద్ధి కలవాడై, మతిక్షయాత్= బుద్ధియొక్క క్షయమువలన, గ్రామ్యసుఖేషు=స్త్రీసుఖములయందు, సక్తః= ఆసక్తుడైన ఇతడు, హతః=చంపబడినవాడై, అగ్రజమ్=అన్న యైన, వాలినమ్=వాలిని పశ్యతు=చూచుగాక! ఏవమ్=ఇట్లు, విగుణస్య= చెడ్డ గుణము కలవానికి, రాజ్యమ్ రాజ్యము, న దేయమ్=ఇవ్వదగినది కాదు.

తా. ఓ వీరుడా! నీవు చూపిన అనుగ్రహమునకు ప్రత్యుపకారము చేయవలయునను ఆలోచన లేక క్షీణించిన బుద్ధి కలవాడై స్త్రీసుఖములలో ఆసక్తుడైన ఈ సుగ్రీవుడు చంపబడి అన్నగారైన వాలిని చూచుగాక! ఇట్టి చెడ్డవానికి రాజ్యమును ఇవ్వకూడదు. 3

మూ. న ధారయే కోపముదీర్ణవేగం
నిహన్మి సుగ్రీవమసత్యమద్య,
హరిప్రవీరైః సహ వాలిపుత్రో
నరేన్ద్రపుత్ర్యా విచయం కరోతు. 4

ప్ర.అ. ఉదీర్ణవేగమ్=అధికమైన వేగము గల,కోపమ్=కోపమును, న ధారయే=నిగ్రహించను. అద్య=ఇప్పుడే, అసత్యమ్=అసత్యవాది అయిన, సుగ్రీవమ్=సుగ్రీవుని, నిహన్మి=చంపెదను. వాలిపుత్రః=అంగదుడు, హరిప్రవీరైః సహ=వానరవీరులతో కూడ, నరేన్ద్రపుత్ర్యాః=రాజకుమారియైన సీతయొక్క, విచయమ్=అన్వేషణమును, కరోతు=చేయుగాక!

తా. తీవ్రమైన వేగము గల నా కోపమును అణచుకొనజాలను. అసత్యవాదియైన సుగ్రీవుని ఇపుడే చంపివేసెదను. వాలి పుత్రుడైన అంగదుడు వానరవీరులతో కూడి సీతను అన్వేషించుగాక! 4

మూ. తమాత్తబాణాసనముత్పతన్తం
నివేదితార్థం రణచణ్డకోపమ్,
ఉవాచ రామః పరవీరహన్తా
స్వవేక్షితం సానునయం చ వాక్యమ్. 5

ప్ర.అ. పరవీరహన్తా=శత్రువీరులను సంహరించు, రామః=రాముడు,

నివేదితార్థమ్=తెలుపబడిన విషయము కలవాడు, రణచణ్డకోపమ్= యుద్ధమునందు తీవ్రమైన కోపము కలవాడు, ఆత్తబాణాసనమ్=గ్రహింపబడిన ధనస్సు కలవాడు అయిన, ఉత్పతన్తమ్=తొందరగా లేచుచున్న, తమ్=ఆ లక్ష్మణుని గూర్చి, స్వవేక్షితమ్=బాగా ఆలోచించబడినది, సానునయం చ=అనునయముతో కూడినది అయిన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ= పలికెను.

తా.శత్రువీరులను సంహరించు రాముడు, యుద్ధములో తీవ్రమైన కోపము గల ఆ లక్ష్మణుడు చెప్పదలచిన మాటలు చెప్పి, ధనస్సు ధరించి శీఘ్రముగా లేచుచుండగా, ఆతనితో అనునయపూర్వకముగా బాగా ఆలోచించిన వాక్యమును పలికెను. 5

మూ. న హి వై త్వద్విధో లోకే పాపమేవం సమాచరేత్,
కోపమార్యేణ యో హన్తి స వీరః పురుషోత్తమః. 6

ప్ర.అ. త్వద్విధః=నీవంటివాడు, లోకే=లోకమునందు, ఏవమ్=ఇట్లు పాపమ్=పాపమును, న సమాచరేత్=ఆచరించడు. యః=ఎవడు, ఆర్యేణ=పూజ్యమైన వివేకముచేత, కోపమ్=కోపమును, హన్తి= అణచుకొనునో, సః వీరః=ఆ వీరుడు, పురుషోత్తమః=పురుషశ్రేష్ఠుడు.

తా. లోకములో నీవంటివాడు ఇట్టి పాపమును చేయకూడదు. కోపమును వివేకముచేత అణచుకొన్న వీరుడే పురుషులలో శ్రేష్ఠుడు. 6

మూ. నేదమత్ర త్వయా గ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ!
తాం ప్రీతిమనువర్తస్వ పూర్వవృత్తం చ సఙ్గతమ్. 7

ప్ర.అ. లక్ష్మణ!= ఓ లక్ష్మణా! సాధువృత్తేన=మంచి నడవడిక గల, త్వయా= నీచేత, అత్ర=ఈ విషయమున, ఇదమ్=ఇది, న గ్రాహ్యమ్=గ్రహింపదగినది కాదు. తామ్=ఆ, ప్రీతిమ్=ప్రేమను, పూర్వవృత్తమ్=పూర్వమునందు జరిగిన, సఙ్గతం చ=సంబంధమును, అనువర్తస్వ=అనువర్తించుము.

తా. లక్ష్మణా! మంచి నడవడిక గల నీవు ఇపుడు ఆ పాపమును చేయకూడదు. సుగ్రీవునితో పూర్వము మనకు ఏర్పడిన సంబంధమును, స్నేహమును అనుసరించి ప్రవర్తించుము. 7

మూ. సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్,
వక్తుమర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయే. 8

ప్ర.అ. కాలపర్యయే=కాలము గడచిపోయిన దగుచుండగా, వ్యతీతమ్= తన మాట తప్పిన, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, రూక్షాణి= పరుషవాక్కులను, పరివర్జయన్=విడచుచు, సామోపహితయా= సామముతో కూడిన, వాచా=వాక్కుతో, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగియున్నావు.

తా. కాలము గడచిపోగా, ఆడిన మాట తప్పిన ఆ సుగ్రీవునితో పరుషమైన మాటలు పరిహరించి సామముతో కూడిన మాటను పలుకవలయును.

మూ. సోఽగ్రజేనానుశిష్టార్థో యథావత్పురుషర్షభః,
ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా! 9

ప్ర.అ. అగ్రజేన=అన్నగారిచేత, యథావత్=తగువిధముగా, అనుశిష్టార్థః =బోధింపబడిన విషయము గల, పురుషర్షభః= పురుషశ్రేష్ఠుడైన, పరవీరహా=శత్రువీరులను సంహరించు, వీరః= వీరుడైన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, పురీమ్=కిష్కింధను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఈ విధముగా అన్నగారిచే తగు విధముగా బోధింపబడి, పురుష శ్రేష్ఠుడు, శత్రువీరులను సంహరించువాడు, వీరుడు అయిన ఆ లక్ష్మణుడు కిష్కింధలో ప్రవేశించెను. 9

మూ. తతః శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితే రతః,
లక్ష్మణః ప్రతిసంరబ్ధో జగామ భవనం కపేః. 10
శక్రబాణాసనప్రఖ్యం ధనుః కాలాన్తకోపమః,
ప్రగృహ్య గిరిశృఙ్గాభం మన్దరః సానుమానివ. 11

ప్ర.అ. తతః=అటుపిమ్మట, శుభమతిః=శుభమైన బుద్ధి కలవాడు, ప్రాజ్ఞః=ఉత్తమబుద్ధిమంతుడు, భ్రాతుః=సోదరునియొక్క, ప్రియహితే= ప్రియమునందు, హితమునందు, రతః=ఆసక్తి కలవాడు, ప్రతిసంరబ్ధః=తొందరతో కూడినవాడు, కాలాన్తకోపమః= ప్రళయకాలమునందలి యమునితో సమానుడు అయిన, లక్ష్మణః= లక్ష్మణుడు, శక్రబాణాసనప్రఖ్యమ్=ఇంద్రధనస్సుతో సమానమైన, గిరిశృఙ్గాభమ్=పర్వతశిఖరము వంటి కాంతి గల, ధనుః=ధనుస్సును, ప్రగృహ్య=గ్రహించి, మన్దరః=మందర మనే, సానుమానివ= పర్వతము వలె, కపేః=సుగ్రీవునియొక్క, భవనమ్=గృహమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట శుభమైన బుద్ధి, సామర్థ్యము గలవాడు, అన్నగారి ప్రియమునందు హితమునందు ఆసక్తి కలవాడు అయిన తొందరపడుచున్న లక్ష్మణుడు సుగ్రీవుని గృహమునకు వెళ్లెను. ప్రళయకాలమునందలి యమునితో సమానుడైన అతడు ఇంద్రధనస్సు వలె, పర్వతశిఖరము వలె నున్న ధనుస్సును చేత ధరించి మందరపర్వతము వలె నుండెను. 10,11

మూ. యథోక్తకారీ వచనముత్తరం చైవ సోత్తరమ్,
బృహస్పతిసమో బుద్ధ్యా మత్వా రామానుజస్తదా. 12
కామక్రోధసముత్థేన భ్రాతుః క్రోధాగ్నినా వృతః,
ప్రభఞ్జన ఇవాప్రీతః ప్రయయౌ లక్ష్మణస్తతః. 13

ప్ర.అ. తతః=అటు పిమ్మట, యథోక్తకారీ= రాముడు చెప్పినట్లుగా చేయువాడు, రామానుజః=రాముని తమ్ముడు, భ్రాతుః=సోదరునియొక్క, కామ క్రోధసముత్థేన=కామముచేత, క్రోధముచేత పుట్టిన; క్రోధాగ్నినా=కోపాగ్నిచేత, వృతః= ఆవరింపబడినవాడు, అప్రీతః=సంతోషము లేనివాడు, బుద్ధ్యా= బుద్ధి చేత, బృహస్పతిసమః=బృహస్పతితో సమానుడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, సోత్తరమ్=ప్రత్యుత్తరముతో కూడిన, ఉత్తరం వచనమ్=ఉత్తరమైన వాక్యమును, మత్వా=ఆలోచించుకొని, తదా=అప్పుడు, ప్రభఞ్జన ఇవ=వాయువు వలె, ప్రయయౌ= వెళ్ళెను.

తా. రాముడు చెప్పిన విధముగా కార్యములు చేయు బృహస్పతి సమానమైన బుద్ధిగల లక్ష్మణుడు తన మాటలకు సుగ్రీవుడు చెప్పబోవు ఉత్తరమును, దానికి తాను చెప్పవలసిన ప్రత్యుత్తరమును బాగుగా ఆలోచించుకొనెను. సోదరుని కామమును క్రోధమును చూచుటచే ఆతని క్రోధాగ్ని ప్రజ్వరిల్లెను. అట్టి లక్ష్మణుడు వాయువు వలె శీఘ్రముగా వెళ్లెను. 12,13

మూ. సాలతాలాశ్వకర్ణాంశ్చ తరసా పాతయన్బలాత్,
పర్యస్యన్గిరికూటాని ద్రుమానన్యాంశ్చ వేగితః. 14
శిలాశ్చ శకలీకుర్వన్ పద్భ్యాం గజ ఇవాశుగః,
దూరామేకపదీం త్యక్త్వా యయౌ కార్యవశాద్ద్రుతమ్. 15

ప్ర.అ.ఆశుగః=శీఘ్రముగా వెళ్లు, గజ ఇవ=ఏనుగ వలె, వేగితః=వేగము కలవాడై, తరసా=బలముచేత, సాలతాలాశ్వకర్ణాంశ్చ =సాలవృక్షములను, తాలవృక్షములను, అశ్వకర్ణ వృక్షములను, పాతయన్=పడవేయుచు, అన్యాన్=ఇతరమైన, ద్రుమాంశ్చ= వృక్షములను, గిరికూటాని=పర్వతముల శిఖరములను, బలాత్= బలమువలన, పర్యస్యన్=క్రింద పడవేయుచు, పద్భ్యామ్= పాదములచేత, శిలాః=రాళ్లను, శకలీకుర్వన్=ముక్కలు చేయుచు, దూరామ్=దూరమైన, ఏకపదీమ్=కాలిబాటను, త్యక్త్వా=విడిచి, కార్యవశాత్=కార్యవశమువలన, ద్రుతమ్=శీఘ్రముగా, యయౌ= వెళ్లెను.

తా. ఆ లక్ష్మణుడు శీఘ్రముగా నడచుచున్న ఏనుగు వలె వేగవంతుడై సాల- తాల-అశ్వకర్ణవృక్షములను బలముచేత క్రింద పడగొట్టుచు, పర్వతశిఖరములను, ఇతరవృక్షములను కూడ ఇటు అటు విసిరివేయుచు పాదములచేత రాళ్లను నలుగకొట్టుచు పనితొందరవలన దూరముగా నున్న కాలిబాటమీద గాక దగ్గరగా నున్న మరొక మార్గమున శీఘ్రముగా వెళ్లెను.

మూ. తామపశ్యద్బలాకీర్ణాం హరిరాజమహాపురీమ్,
దుర్గామిక్ష్వాకుశార్దూలః కిష్కిన్ధాం గిరిసఙ్కటే. 16

ప్ర.అ. ఇక్ష్వాకుశార్దూలః=ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడైన ఆ లక్ష్మ

ణుడు, గిరిసఙ్కటే=పర్వతముల మధ్యయందు, బలాకీర్ణామ్= సేనలచేత వ్యాప్తము, దుర్గామ్=ప్రవేశింప శక్యముగానిది, హరిరాజమహాపురీమ్ =వానరరాజైన సుగ్రీవుని ప్రధానపురము అయిన, తామ్=ఆ, కిష్కిన్ధామ్ =కిష్కింధను, అపశ్యత్=చూచెను.

తా. లక్ష్మణుడు సుగ్రీవుని రాజధానియైన కిష్కింధను చూచెను. పర్వతముల మధ్య ఉన్న ప్రవేశింపశక్యము గాని ఆ నగరము సేనలతో నిండి యుండెను. 16

మూ. రోషాత్ప్రస్ఫురమాణోష్ఠః సుగ్రీవం ప్రతి లక్ష్మణః,
దదర్శ వానరాన్ భీమాన్ కిష్కిన్ధాయా బహిశ్చరాన్. 17

ప్ర.అ. సుగ్రీవమ్ ప్రతి=సుగ్రీవుని గూర్చి, రోషాత్=కోపమువలన, ప్రస్ఫురమాణోష్ఠః=కదలుచున్న పెదవులు గల, లక్ష్మణః=లక్ష్మణుడు, కిష్కిన్ధాయాః=కిష్కిన్ధయొక్క, బహిశ్చరాన్=వెలుపల సంచరించుచున్న, భీమాన్=భయంకరులైన, వానరాన్=వానరులను, దదర్శ=చూచెను.

తా. సుగ్రీవుని మీద కోపముతో పెదవులు వణకుచున్న ఆ లక్ష్మణుడు కిష్కింధ వెలుపల సంచరించుచున్న భయంకరులైన వానరులను చూచెను. 17

మూ. తం దృష్ట్వా వానరాః సర్వే లక్ష్మణం పురుషర్షభమ్,
శైలశృఙ్గాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్, 18
జగృహుః కుఞ్జరప్రఖ్యా వానరాః పర్వతాన్తరే.

ప్ర.అ. పర్వతాన్తరే=పర్వతముల మధ్యయం దున్న, కుఞ్జరప్రఖ్యాః=ఏనుగులతో సమానులైన, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, పురుషర్షభమ్=పురుషశ్రేష్ఠుడైన, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, శతశః= వందలకొలది, శైలశృఙ్గాణి=పర్వతశిఖరములను, ప్రవృద్ధాన్=బాగా పెరిగిన, మహీరుహాన్ చ=వృక్షములను, జగృహుః=గ్రహించిరి.

తా. పర్వతమధ్యమునం దున్న ఏనుగుల వంటి ఆ వానరులు అందరు పురుషశ్రేష్ఠుడైన ఆ లక్ష్మణుని చూచి వందలకొలది పర్వతముల శిఖరములను పెద్ద వృక్షములను గ్రహించిరి. 18

మూ. తాన్గృహీతప్రహరణాన్ సర్వాన్ దృష్ట్వా తు లక్ష్మణః, 19
బభూవ ద్విగుణం క్రుద్ధో బహ్విన్ధన ఇవానలః.

ప్ర.అ. లక్ష్మణః=లక్ష్మణుడు, గృహీతప్రహరణాన్=గ్రహింపబడిన ఆయుధములు గల, తాన్=వారిని, సర్వాన్=అందరిని, దృష్ట్వా= చూచి, బహ్విన్ధనః=అధికమైన కట్టెలు గల, అనలః ఇవ=అగ్ని వలె, ద్విగుణమ్=రెట్టింపు, క్రుద్ధః బభూవ=కోపించెను.

తా. ఆయుధములు ధరించిన ఆ వానరులందరిని చూచి లక్ష్మణుడు

అనేకములైన కట్టెలు చేర్చిన అగ్ని వలె రెట్టింపు కోపమును వహించెను. 19

మూ. తం తే భయపరీతాఙ్గాః క్షుబ్ధం దృష్ట్వా ప్లవఙ్గమాః, 20
కాలమృత్యుయుగాన్తాభం శతశో విద్రుతా దిశః.

ప్ర.అ. శతశః=వందలకొలది ఉన్న, తే=ఆ, ప్లవఙ్గమాః= వానరులు, క్షుబ్ధమ్=కోపముతో ఉన్న, కాలమృత్యుయుగాన్తాభమ్= ప్రళయకాలమృత్యువు వంటి ప్రళయకాలము వంటి కాంతి గల, తమ్=ఆ లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, భయపరీతాఙ్గాః=భయముతో కూడిన శరీరములు కలవారై, దిశః=దిక్కులను గూర్చి, విద్రుతాః = పారిపోయినారు.

తా. ఆ వానరులు ప్రళయకాలము వలె, ప్రళయకాలమృత్యుదేవత వలె, భయంకరుడుగా ఉన్న, కోపముతో కూడిన ఆ లక్ష్మణుని చూచి భయభ్రాంతులై వందలకొలది గుంపులు గుంపులుగా చేరి దిక్కులకు పారిపోయిరి. 20

మూ. తతః సుగ్రీవభవనం ప్రవిశ్య హరిపుఙ్గవాః, 21
క్రోధమాగమనం చైవ లక్ష్మణస్య న్యవేదయన్.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, సుగ్రీవభవనమ్=సుగ్రీవుని గృహమును, ప్రవిశ్య=ప్రవేశించి, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, ఆగమనమ్=రాకను, క్రోధం చైవ= కోపమును, న్యవేదయన్=తెలిపిరి.

తా. పిమ్మట వానరశ్రేష్ఠులు సుగ్రీవుని భవనమునకు వెళ్లి లక్ష్మణుడు వచ్చినట్లు, ఆతడు కోపముతో ఉన్నట్లు తెలిపిరి. 21

మూ. తారయా సహితః కామీ సక్తః కపివృషో రహః, 22
న తేషాం కపిసింహానాం శుశ్రావ వచనం తదా.

ప్ర.అ. తదా=అపుడు, కామీ=కాముకుడు, తారయా= తారతో, సహితః=కూడినవాడు, రహః =రహస్యమునందు, సక్తః= కామాసక్తుడు అయిన, కపివృషః =ఆ వానరశ్రేష్ఠుడు, తేషామ్=ఆ, కపిసింహానామ్=వానరశ్రేష్ఠుల, వచనమ్=వచనమును, న శుశ్రావ=వినలేదు.

తా. అపుడు తారతో కూడి రహస్యమునందు కామాసక్తుడైన, కాముకుడైన, ఆ సుగ్రీవునకు ఆ వానరశ్రేష్ఠులు చెప్పిన మాటలు వినబడలేదు.

మూ. తతః సచివసన్దిష్టా హరయో రోమహర్షణాః, 23
గిరికుఞ్జరమేఘాభా నగరాన్నిర్యయుస్తదా.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, రోమహర్షణాః=రోమాంచము కలిగించేవారు, గిరికుఞ్జరమేఘాభాః=పర్వతముల వంటి, ఏనుగుల వంటి, మేఘముల వంటి కాంతి గలవారు అయిన, హరయః=వానరులు, సచివసన్దిష్టాః=మంత్రులచేత ఆజ్ఞా

పించబడినవారై, తదా=అపుడు, నగరాత్=నగరమునుండి, నిర్యయుః=బయటకు వచ్చిరి.

తా. పిమ్మట మంత్రుల ఆజ్ఞను అనుసరించి పర్వతముల వలె ఏనుగుల వలె, మేఘములవలె ఉన్న వానరులు నగరమునుండి బయటకు వచ్చిరి. 23

మూ. నఖదంష్ట్రాయుధాః సర్వే వీరా వికృతదర్శనాః, 24
సర్వే శార్దూలదంష్ట్రాశ్చ సర్వే చ వికృతాననాః.

ప్ర.అ. వీరాః=వీరులైన, నఖదంష్ట్రాయుధాః=గోళ్లు, కోరలు ఆయుధము లుగా గల, సర్వే=వారందరు, వికృతదర్శనాః=వికారమైన దర్శనము గలవారు, సర్వే=అందరు, శార్దూలదంష్ట్రాశ్చ=పులుల వంటి కోరలు గలవారు, సర్వే చ=అందరు, వికృతాననాః=వికారమైన ముఖము గలవారు.

తా. వీరులైన ఆ వానరులందరికి గోళ్లు, కోరలే ఆయుధములు. వారందరు చూచుటకు వికారముగా ఉండిరి. వాళ్ల కోరలు పులికోరల వలె ఉండెను. వాళ్ల ముఖములు వికారముగా ఉండెను. 24

మూ. దశనాగబలాః కేచిత్ కేచిద్దశగుణోత్తరాః, 25
కేచిన్నాగసహస్రస్య బభూవుస్తుల్యవర్చసః.

ప్ర.అ. కేచిత్=కొందరు, దశనాగబలాః=పది ఏనుగుల బలము కలవారు, కేచిత్=కొందరు, దశగుణోత్తరాః=పది రెట్లకంటె ఎక్కువైన బలము కలవారు, కేచిత్=కొందరు, నాగసహస్రస్య=వేయి ఏనుగులయొక్క, తుల్యవర్చసః= సమానమైన తేజస్సు కలవారు, బభూవుః =ఉండిరి.

తా. వారిలో కొందరు పది ఏనుగుల బలము గలవారు. కొందరు వంద ఏనుగులను మించిన బలము గలవారు. కొందరు వేయి ఏనుగులతో సమానమైన బలము గలవారు. 25

మూ. తతస్తైః కపిభిర్వ్యాప్తాం ద్రుమహస్తైర్మహాబలైః, 26
అపశ్యల్లక్ష్మణః క్రుద్ధః కిష్కిన్ధాం తాం దురాసదామ్.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, క్రుద్ధః=కోపించిన, లక్ష్మణః= లక్ష్మణుడు ద్రుమహస్తైః=వృక్షములు హస్తమునందు గల, మహాబలైః= గొప్ప బలము గల, తైః కపిభిః=ఆ వానరులచేత, వ్యాప్తామ్= వ్యాప్తమైన, దురాసదామ్=ఎదిరింప శక్యము గాని, తాం కిష్కిన్ధామ్= ఆ కిష్కింధను, అపశ్యత్=చూచెను.

తా. కోపించిన లక్ష్మణుడు హస్తములలో వృక్షములను ధరించిన మహాబలవంతులైన వానరులచేత వ్యాప్తమై ఎదిరింప శక్యము గాని ఆ కిష్కింధను చూచెను. 26

మూ. తతస్తే హరయః సర్వే ప్రాకారపరిఖాన్తరాత్, 27
నిష్క్రమ్యోదగ్రసత్త్వాస్తు తస్థురావిష్కృతం తదా.

ప్ర.అ. తతః=అటు పిమ్మట, ఉదగ్రసత్త్వాః=తీవ్రమైన బలము గల, సర్వే=సమస్తమైన, తే హరయః=ఆ వానరులు, ప్రాకారపరిఖాన్తరాత్= ప్రాకారము యొక్క పరిఖయొక్క మధ్యనుండి, నిష్క్రమ్య=బయటకు వచ్చి, తదా= అపుడు, ఆవిష్కృతమ్ =పైకి కనబడునట్లుగా, తస్థుః=నిలిచిరి.

తా. అపుడు తీవ్రమైన పరాక్రమము గల ఆ వానరు లందరు ప్రాకారపరిఖల మధ్యభాగమునుండి బయటకు వచ్చి కనబడునట్లు నిలబడిరి.27

మూ. సుగ్రీవస్య ప్రమాదం చ పూర్వజస్యార్థమాత్మవాన్, 28
దృష్ట్వా క్రోధవశం వీరః పునరేవ జగామ సః.

ప్ర.అ. ఆత్మవాన్=బుద్ధిమంతుడైన, సః వీరః=ఆ వీరుడు, సుగ్రీవస్య= సుగ్రీవునియొక్క, ప్రమాదమ్=ఏమరుపాటును, పూర్వజస్య=అన్నగారియొక్క, అర్థమ్=కార్యమును, దృష్ట్వా=చూచి, పునరేవ=మరల, క్రోధవశమ్=క్రోధమునకు వశమును, జగామ=పొందెను.

తా. అన్నగారి కార్యమును, తన కర్తవ్యమును చేయుటలో సుగ్రీవుని ఏమరుపాటును గూర్చి ఆలోచించగానే బుద్ధిమంతుడైన, వీరుడైన లక్ష్మణునకు ఇంకను ఎక్కువగా కోపము వచ్చెను. 28

మూ. స దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసః కోపసంరక్తలోచనః, 29
బభూవ నరశార్దూలః సధూమ ఇవ పావకః.

ప్ర.అ. దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసః=దీర్ఘములు, ఉష్ణములు అయిన గొప్ప నిట్టూర్పులు గలవాడు, కోపసంరక్తలోచనః=కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడు అయిన, నరశార్దూలః=నరశ్రేష్ఠుడైన, సః=ఆ లక్ష్మణుడు, సధూమః=ధూమముతో కూడిన, పావకః ఇవ=అగ్ని వలె, బభూవ=ఆయెను.

తా. దీర్ఘముగాను, వేడిగాను నిట్టూర్చుచు, కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో పురుషశ్రేష్ఠుడైన ఆ లక్ష్మణుడు ధూమముతో కూడిన అగ్ని వలె ఉండెను. 29

మూ. బాణశల్యస్ఫురజ్జిహ్వః సాయకాసనభోగవాన్, 30
స్వతేజోవిషసఙ్ఘాతః పఞ్చాస్య ఇవ పన్నగః.

ప్ర.అ. బాణశల్యస్ఫురజ్జిహ్వః=కదలుచున్న జిహ్వల వంటి బాణముల శల్యములు కలవాడు, సాయకాసనభోగవాన్=పడగవంటి ధనస్సు గలవాడు, స్వతేజోవిషసఙ్ఘాతః= విషసముదాయము వంటి తన తేజస్సు గలవాడు అయిన అతడు, పఞ్చాస్యః=ఐదు ముఖములు గల, పన్నగః ఇవ=సర్పము వలె ఉండెను.

తా. ఆ లక్ష్మణుడు కదలుచున్న నాలుకల వంటి బాణశల్యములతో, పడగవంటి ధనస్సుతో, విషము వంటి తన తేజస్సుతో అయిదు ముఖముల సర్పము వలె నుండెను. 30

మూ. తం దీప్తమివ కాలాగ్నిం నాగేన్ద్రమివ కోపితమ్, 31
సమాసాద్యాఙ్గదస్త్రాసాద్విషాదమగమత్పరమ్.

ప్ర.అ. అఙ్గదః=అంగదుడు, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, కాలాగ్నిమ్ ఇవ=ప్రళయకాలాగ్ని వలె, కోపితమ్=కోపింపచేయబడిన, నాగేన్ద్రమివ= గజేంద్రము వలె ఉన్న, తమ్=ఆ లక్ష్మణుని, సమాసాద్య=చేరి, త్రాసాత్= భయమువలన, పరమ్=అధికమైన, విషాదమ్=దుఃఖమును, అగమత్= పొందెను.

తా. ప్రజ్వలించుచున్న ప్రళయకాలాగ్ని వలె, కోపము కలిగించిన గజేంద్రము వలె ఉన్న ఆ లక్ష్మణుని చూడగానే అంగదుడు భయముతో చాల దిగులు చెందెను. 31

మూ. సోఽఙ్గదం రోషతామ్రాక్షః సన్దిదేశ మహాయశాః, 32
సుగ్రీవః కథ్యతాం వత్స! మమాగమనమిత్యుత.

ప్ర.అ. రోషతామ్రాక్షః=రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల, మహాయశాః= గొప్ప కీర్తి గల, సః=ఆ లక్ష్మణుడు, అఙ్గదమ్=అఙ్గదుని, వత్స!= నాయనా! సుగ్రీవః=సుగ్రీవుడు, మమ=నాయొక్క, ఆగమనమ్=రాకను గూర్చి, కథ్యతామ్=చెప్పబడుగాక! ఇతి ఉత=అని, సన్దిదేశ= కబురుపంపెను.

తా. రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల మహాయశశ్శాలి యైన ఆ లక్ష్మణుడు "నాయనా! నీవు వెళ్లి సుగ్రీవునకు నేను వచ్చినా నని చెప్పుము" అని అంగదునితో కబురు పంపెను. 32

మూ. ఏష రామానుజః ప్రాప్తస్త్వత్సకాశమరిన్దమ, 33
భ్రాతుర్వ్యసనసన్తప్తో ద్వారి తిష్ఠతి లక్ష్మణః.
తస్య వాక్యం యది రుచిః క్రియతాం సాధు వానర, 34
ఇత్యుక్త్వా శీఘ్రమాగచ్ఛ వత్స వాక్యమరిన్దమ.

ప్ర.అ. అరిన్దమ=శత్రుసంహారకుడవైన, వత్స!=ఓ! అంగదుడా! అరిన్దమ=ఓ! శత్రుసంహారకుడా! భ్రాతుః=సోదరునియొక్క, వ్యసనసంతప్తః= వ్యసనముచేత దుఃఖితుడైన, రామానుజః=రాముని తమ్ముడైన, ఏషః లక్ష్మణః=ఈ లక్ష్మణుడు, త్వత్‌సకాశమ్=నీ సమీపమును, ప్రాప్తః= వచ్చినవాడై, ద్వారి=ద్వారమువందు, తిష్ఠతి=నిలిచి ఉన్నాడు. వానర!=ఓ వానరుడా! రుచిః యది=ఇష్ట మున్నట్లైతే, తస్య=ఆతనియొక్క, వాక్యమ్= వాక్యము, సాధు=బాగుగా, క్రియతామ్=చేయబడు గాక. ఇతి=అని, ఉక్త్వా=పలికి, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆగచ్ఛ=రమ్ము.

తా. "శత్రుసంహారకుడవైన ఓ అంగదా! నీవు సుగ్రీవునితో 'శత్రుసంహారకుడవైన ఓ వానరరాజా! సోదరునకు కలిగిన వ్యసనములను చూచి దుఃఖించుచున్న రాముని తమ్ముడైన లక్ష్మణుడు నీ దగ్గరకు వచ్చి ద్వారమునం దున్నాడు. నీకు ఇష్టమైనచో అతడు చెప్పినట్లు చేయుము' అని చెప్పి తొందరగా రమ్ము."

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా శోకావిష్టోఽ జ్గదోఽబ్రవీత్,
పితుః సమీపమాగమ్య సౌమిత్రిరయమాగతః. 35

ప్ర.అ. లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, వచః=వాక్యమును, శ్రుత్వా= విని, శోకావిష్టః=శోకముతో కూడినవాడై, అజ్గదః=అంగదుడు, పితుః= తండ్రియొక్క, సమీపమ్=సమీపమును, ఆగమ్య=పొంది, అయమ్=ఈ, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఆగతః=వచ్చినాడు అని, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణుని మాటలు విని అంగదుడు శోకాక్రాంతుడై పినతండ్రి దగ్గరకు వచ్చి ఈ లక్ష్మణుడు వచ్చి యున్నాడు అని చెప్పెను. 35

మూ. అథాజ్గదస్తస్య సుతీవ్రవాచా సమ్భ్రాన్తభావః పరదీనవక్త్రః,
నిర్గత్య పూర్వం నృపతేస్తరస్వీ తతో రుమాయాశ్చరణౌ వవన్దే. 36

ప్ర.అ. అథ= అటు పిమ్మట, తరస్వీ = బలవంతుడైన, అజ్గదః = అంగదుడు, తస్య = ఆ లక్ష్మణునియొక్క, సుతీవ్రవాచా = చాల తీవ్రమైన వాక్యము చేత, సమ్భ్రాన్తభావః = కంగారు చెందిన మనస్సు కలవాడై, పరదీనవక్త్రః = మిక్కిలి దీనమైన ముఖము కలవాడై, నిర్గత్య = వెళ్లి , పూర్వమ్ = ముందుగా, నృపతేః = రాజుయొక్క పాదములను, తతః = పిమ్మట, రుమాయాః = రుమయొక్క, చరణౌ= పాదములను, వవన్దే = నమస్కరించెను.

తా. పిమ్మట బలశాలియైన అంగదుడు చాల తీవ్రమైన ఆ లక్ష్మణుని మాటలు విని మనస్సులో భయపడుచు చాల దీనమైన ముఖము కలవాడై వెళ్లి ముందుగా సుగ్రీవుని పాదములకు, పిదప రుమ పాదములకు నమస్కరించెను.

మూ. సజ్గృహ్యా పాదౌ పితురుగ్రతేజా
జగ్రాహ మాతుః పునరేవ పాదౌ,
పాదౌ రుమాయాశ్చ నిపీడయిత్వా
నివేదయామాస తతస్తదర్థమ్. 37

ప్ర.అ. ఉగ్రతేజాః = ఉగ్రమైన తేజస్సు గల అంగదుడు, పితుః = తండ్రియొక్క, పాదౌ = పాదములను, సజ్గృహ్యా = పట్టుకొని, పునరేవ = పిదప, మాతుః = తల్లియొక్క, పాదౌ = పాదములను, జగ్రాహ = పట్టుకొనెను. రుమాయాః = రుమయొక్క, పాదౌ చ =పాదములను కూడ, నిపీడయిత్వా = పీడించి, తదర్థమ్ = ఆ విషయమును, తతః = అటు పిమ్మట, నివేదయామాస

= తెలిపెను.

తా. గొప్ప తేజస్సు గల అంగదుడు తండ్రికి, తల్లికి, రుమకు పాదాభివందనము చేసి పిదప లక్ష్మణుడు వచ్చి నట్లు చెప్పెను. 37

వి. లక్ష్మణుడు అంగదుని చేత కబురు పంపుట, ఆతడు సుగ్రీవునితో చెప్పుట వర్ణించు ఈ ఏడు శ్లోకములు (31-37) ప్రాచ్యప్రతిలో లేవు.

మూ. స నిద్రామదసంవీతో వానరో న విబుద్ధవాన్,
బభూవ మదమత్తశ్చ మదనేన చ మోహితః. 38

ప్ర.అ. నిద్రామదసంవీతః =నిద్రతోను, మదముతోను కూడిన, సః వానరః = ఆ వానరుడు, న విబుద్ధవాన్= తెలుసుకొనలేదు. మదమత్తశ్చ = మద్యమదముచే మత్తుడైన అతడు, మదనేన చ =మన్మథునిచేత కూడ, మోహితః = మోహింపబడినవాడు, బభూవ = ఆయెను.

తా. నిద్రామదములతో కూడిన ఆ సుగ్రీవుడు తెలుసుకొనలేదు. మద్యమదముచేత మత్తుడైన అతడు మన్మథుని చేత కూడ మోహితుడై ఉండెను.

మూ. తతః కిలకిలాం చక్రుర్లక్ష్మణం ప్రేక్ష్య వానరాః,
ప్రసాదయన్తస్తం క్రుద్ధం భయమోహితచేతసః. 39

ప్ర.అ. తతః=అటు పిమ్మట, క్రుద్ధమ్=కోపగించిన, లక్ష్మణమ్= లక్ష్మణుని, ప్రేక్ష్య=చూచి, వానరాః=వానరులు, భయమోహితచేతసః= భయముచేత మోహము పొందింపబడిన చిత్తము గలవారై, తమ్=ఆతనిని, ప్రసాదయన్తః=అనుగ్రహింపచేసుకొనుచున్నవారై, కిలకిలామ్=కిలకిలధ్వనిని, చక్రుః=చేసిరి.

తా. కోపించిన ఆ లక్ష్మణుని చూచి, భయముతో నిండిన మనస్సులు గల ఆ వానరులు ఆతనిని అనుగ్రహింపచేసికొనుచు కిలకిల ధ్వనులు చేసిరి. 39

మూ. తే మహౌఘనిభం దృష్ట్వా వజ్రాశనిసమస్వనమ్,
సింహనాదం సమం చక్రుర్లక్ష్మణస్య సమీపతః. 40

ప్ర.అ. తే=ఆ వానరులు, దృష్ట్వా=చూచి, మహౌఘనిభమ్= మహాప్రవాహముతో సమానము, వజ్రాశనిసమస్వనమ్=వజ్రముతోను, ఉరుములతోను సమానమైన ధ్వని కలది అయిన, సింహనాదమ్=సింహనాదమును, సమమ్= ఒక్కమారుగా, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, సమీపతః=సమీపమునందు, చక్రుః=చేసిరి.

తా. ఆ వానరులు లక్ష్మణుని చూచి ఒక్కమారుగా ఆతని దగ్గర సింహనాదము చేసిరి. అది మహాజలప్రవాహధ్వని వలె, వజ్రాయుధధ్వని వలె, పిడుగుల ధ్వనివలె ఉండెను. 40

మూ. తేన శబ్దేన మహతా ప్రత్యబుధ్యత వానరః,
మదవిహ్వలతామ్రాక్షో వ్యాకులస్రగ్విభూషణః. 41

ప్ర.అ. మహతా=గొప్పదైన, తేన శబ్దేన=ఆ ధ్వనిచేత, వానరః= సుగ్రీవుడు, మదవిహ్వలతామ్రాక్షః=మదముచేత వ్యాకులమైన ఎఱ్ఱని నేత్రములు కలవాడై, వ్యాకులస్రగ్విభూషణః=వ్యాకులములైన పుష్పమాలలు అలంకారములు కలవాడై, ప్రత్యబుధ్యత=తెలిసికొనెను.

తా. ఆ గొప్పశబ్దము వినగానే సుగ్రీవుడు తెలివిలోనికి వచ్చెను. ఆతని నేత్రములు మదముచేత వ్యాకులములై ఎఱ్ఱగా ఉండెను. మాలలు అలంకారములు చెదిరి యుండెను. 41

మూ. అథాఙ్గదవచః శ్రుత్వా తేనైవ చ సమాగతౌ,
మన్త్రిణౌ వానరేన్ద్రస్య సంమతోదారదర్శనౌ. 42
ప్లక్షశ్చైవ ప్రభావశ్చ మన్త్రిణావర్థధర్మయోః,
వక్తుముచ్చావచం ప్రాప్తం లక్ష్మణం తౌ శశంసతుః. 43

ప్ర.అ. అథ=అటు పిమ్మట, అఙ్గదవచః=అంగదుని వాక్యమును, శ్రుత్వా=విని, తేనైవ=ఆతనితో, సమాగతౌ=వచ్చిన, సంమతోదారదర్శనౌ=ఇష్టమైన, శ్రేష్ఠమైన దర్శనము గలవారు, అర్థధర్మయోః= అర్థధర్మములయందు, మన్త్రిణౌ=మంత్రులు అయిన, ప్లక్షశ్చైవ=ప్లక్షుడు, ప్రభావశ్చ=ప్రభావుడు, అనే, తౌ=ఆ, వానరేన్ద్రస్య=సుగ్రీవుని, మన్త్రిణౌ=మంత్రులు, లక్ష్మణమ్=లక్ష్మణుని, ప్రాప్తమ్=వచ్చినవానినిగా, వక్తుమ్=చెప్పుటకు, ఉచ్చావచమ్=అనేకవిధములుగా, శంసతుః=చెప్పిరి.

తా. పిమ్మట అంగదుని మాటలు విని ఆతనితో కలిసి వచ్చిన ప్లక్షుడు, ప్రభావుడు అనే సుగ్రీవుని మంత్రులు లక్ష్మణుడు వచ్చినట్లు ఆతనికి తెలుపుటకై అనేకవిధములుగా పలికిరి. చూచుటకు ఇష్టముగాను, మధురముగాను ఉండు వారిద్దరు అర్థధర్మముల విషయమున సుగ్రీవుని మంత్రులుగా ఉండిరి. 42,43

మూ. ప్రసాదయిత్వా సుగ్రీవం వచనైః సార్థనిశ్చితైః,
ఆసీనం పర్యుపాసీనౌ యథా శక్రం మరుత్పతిమ్. 44

ప్ర.అ. ఆసీనమ్=కూర్చునియున్న, సుగ్రీవమ్=సుగ్రీవుని, మరుత్పతిమ్=దేవతల ప్రభువైన, శక్రం యథా=దేవేంద్రుని వలె, పర్యుపాసీనౌ=సమీపించి కూర్చున్నవారై, సార్థనిశ్చితైః=అర్థముతో కూడినవి, నిశ్చితములు అయిన, వచనైః= మాటలతో, ప్రసాదయిత్వా=అనుగ్రహింపచేసుకొని, (పలికిరి)

తా. దేవతల ప్రభువైన ఇంద్రుని వలె కూర్చుని యున్న సుగ్రీవుని సమీపమున కూర్చుండి ఉత్తమమైన అర్థము కలవి, నిశ్చితములు అయిన మాటలతో, సుగ్రీవుని అనుగ్రహింపచేసుకొని ఆ వానరు లిద్దరు ఇట్లు పలికిరి.

మూ. సత్యసన్ధౌ మహాభాగౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ,
వయస్యభావం సమ్ప్రాప్తౌ రాజ్యార్హౌ రాజ్యదాయినౌ. 45

ప్ర.అ. సత్యసన్ధౌ =సత్యమైన ప్రతిజ్ఞ కలవారు, మహాభాగౌ = గొప్ప భాగ్యము కలవారు, రాజ్యార్హౌ = రాజ్యమునకు తగినవారు, రాజ్యదాయినౌ = రాజ్యమును ఇచ్చిన వారు అయిన , భ్రాతరౌ = సోదరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, వయస్యభావమ్ = మిత్రత్వమును, సమ్ప్రాప్తౌ =పొందినారు.

తా. సత్యసంధులు, మహాభాగ్యశాలులు, రాజ్యమునకు తగినవారు, నీకు రాజ్యమును ఇచ్చిన వారు అయిన రామలక్ష్మణులు నీకు మిత్రు లైనారు. 45

మూ. తయోరేకో ధనుష్పాణిర్ద్వారి తిష్ఠతి లక్ష్మణః,
యస్య భీతాః ప్రవేపన్తో నాదాన్ముఞ్చన్తి వానరాః. 46

ప్ర.అ. తయోః = వారిలో, ఏకః = ఒకడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, ధనుష్పాణిః = ధనుస్సు హస్తమునందు కలవాడై, ద్వారి =ద్వారమునందు, తిష్ఠతి = నిలిచి ఉన్నాడు; యస్య = ఎవనికి, భీతాః = భయపడినవారై, ప్రవేపన్తః = వణకుచున్నవారై, వానరాః = వానరులు, నాదాన్ = ధ్వనులను, ముఞ్చన్తి = విడుచుచున్నారో.

తా. వారిలో ఒకడైన లక్ష్మణుడు చేతిలో ధనుస్సు ధరించి ద్వారము వద్ద నిలబడి ఉన్నాడు. వానరులు అతనికి భయపడి వణకుచు అరచుచున్నారు.46

మూ. స ఏష రాఘవభ్రాతా లక్ష్మణో వాక్యసారథిః,
వ్యవసాయరథః ప్రాప్తస్తస్య రామస్య శాసనాత్. 47

ప్ర.అ. తస్య = ఆ, రామస్య = రామునియొక్క, శాసనాత్ = ఆజ్ఞ వలన, రాఘవభ్రాతా =రాముని సోదరుడైన, సః ఏషః లక్ష్మణః = ఆ ఈ లక్ష్మణుడు, వాక్యసారథిః = వాక్యము సారథిగా కలవాడై, వ్యవసాయరథః = కార్యనిశ్చయమే రథముగా కలవాడై, ప్రాప్తః = వచ్చినాడు.

తా. రాముని సోదరుడైన లక్ష్మణుడు రాముని ఆజ్ఞచే ఆతని వాక్యము లనే సారథి తీసుకొని రాగా కార్యనిర్ణయ మనే రథమును ఎక్కి వచ్చినాడు.47

మూ. అయం చ తనయో రాజంస్తారాయా దయితోఽఙ్గదః,
లక్ష్మణేన సకాశం తే ప్రేషితస్త్వరయాఽనఘ. 48

ప్ర.అ. అనఘ= దోషములు లేనివాడా! రాజన్ = రాజా! తారాయాః = తారయొక్క, దయితః = ప్రియుడైన, తనయః = కుమారుడైన, అయం అఙ్గదః = ఈ అంగదుడు, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, త్వరయా = తొందరతో, తే సకాశమ్ = నీ సమీపమును, ప్రేషితః = పంపబడినాడు.

తా. దోషరహితుడవైన రాజా! లక్ష్మణుడు తార పుత్రుడైన ఈ అంగదుని తొందరగా నీవద్దకు పంపినాడు. 48

మూ. సో౽యం రోషపరీతాక్షో ద్వారి తిష్ఠతి వీర్యవాన్,
వానరాన్ వానరపతే చక్షుషా నిర్దహన్నివ. 49

ప్ర.అ. వానరపతే = ఓ వానరరాజా! వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః అయమ్ = అట్టి ఈ లక్ష్మణుడు, రోషపరీతాక్షః =రోషముతో కూడిన నేత్రములు గలవాడై, చక్షుషా = నేత్రములతో, వానరాన్ = వానరులను, నిర్దహన్నివ = కాల్చుచున్నవాడు వలె, ద్వారి = ద్వారమునందు , తిష్ఠతి = నిలిచి ఉన్నాడు.

తా. ఓ! వానరరాజా! పరాక్రమవంతుడైన అట్టి ఈ లక్ష్మణుడు రోషముతో నిండిన నేత్రములు కలవాడై, వానరులను చూపులతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు చూచుచు, ద్వారము వద్ద నిలిచి ఉన్నాడు. 49

మూ. తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్రః సహబాన్ధవః,
గచ్ఛ శీఘ్రం మహారాజ రోషో హ్యద్య నివర్త్యతామ్. 50

ప్ర.అ. మహారాజ! = ఓ! మహారాజా! త్వమ్ =నీవు, సపుత్రః = పుత్రసహితుడవై, సహబాన్ధవః = బంధుసహితుడవై, శీఘ్రమ్ = శీఘ్రముగా , గచ్ఛ = వెళ్లుము. మూర్ధ్నా = శిరస్సుతో, తస్య = అతనికి, ప్రణమ్య = నమస్కరించి, అద్య = ఇపుడు, రోషః = కోపము, నివర్త్యతామ్ = మరలించబడుగాక!

తా. ఓ! మహారాజా! నీవు పుత్రులతోను, బంధువులతోను కలిసి శీఘ్రముగా వెళ్ళి ఆతనికి శిరస్సు వంచి నమస్కారము చేసి ఇప్పుడే ఆతని కోపమును శమింపచేయుము. 50

మూ. యదాహ రామో ధర్మాత్మా తత్కురుష్వ సమాహితః,
రాజంస్తిష్ఠ స్వసమయే భవ సత్యప్రతిశ్రవః. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాండే
ఏకత్రింశః సర్గః.

ప్ర.అ. రాజన్ = రాజా! ధర్మాత్మా = ధర్మాత్ముడైన , రామః రాముడు, యత్ = దేనిని, ఆహ= చెప్పుచున్నాడో, తత్ = దానిని, సమాహితః = ఏకాగ్రచిత్తుడవై, కురుష్వ = చేయుము. సత్యప్రతిశ్రవః= సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవై, స్వసమయే = నీవు చేసిన ఒడంబడికపై, భవ = ఉండుము.

తా. ఓ! రాజా! నీవు సావధానమైన చిత్తముతో నీవు చేసిన ప్రతిజ్ఞ

సత్యమగునట్లు చేయుచు, ధర్మాత్ముడైన రాముడు ఏది చెప్పనో అది చేయుము. నీవు చేసిన ఒడంబడిక ప్రకారము నడువుము. 51

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున కిష్కింధాకాండలో ముప్పది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వాత్రింశః సర్గః

(హనుమంతుడు చింతతో వ్యాకులుడైన సుగ్రీవునకు బోధించుట)

మూ. అఙ్గదస్య వచః శ్రుత్వా సుగ్రీవః సచివైః సహ,
లక్ష్మణం కుపితం శ్రుత్వా ముమోచాసనమాత్మవాన్. 1

ప్ర.అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, సుగ్రీవః = సుగ్రీవుడు, సచివైః సహ = మంత్రులతో కూడ, అఙ్గదస్య = అంగదునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, లక్ష్మణమ్ = లక్ష్మణుని, కుపితమ్ = కోపించిన వానినిగా, శ్రుత్వా = విని, ఆసనమ్ = ఆసనమును, ముమోచ = విడిచిపెట్టెను.

తా.మంత్రిసహితుడైన, బుద్ధిమంతుడైన సుగ్రీవుడు అంగదుని మాటలు విని, లక్ష్మణుడు కోపించి నట్లు తెలుసుకొని కూర్చున్న ఆసనమునుండి లేచెను.1

మూ. స చ తానబ్రవీద్వాక్యం నిశ్చిత్య గురులాఘవమ్,
మన్త్రిజ్ఞాన్ మన్త్రికుశలో మన్త్రేషు పరినిష్ఠితః. 2

ప్ర.అ. మన్త్రికుశలః = ఆలోచనలయందు నేర్పు గలవాడు, మన్త్రేషు = ఆలోచనలయందు, పరినిష్ఠితః = స్థిరుడూ అయిన, సః = ఆ సుగ్రీవుడు, గురులాఘవమ్ = కార్యమునకు సంబంధించిన గురుత్వమును, లఘుత్వమును, నిశ్చిత్య = నిశ్చయించి, మన్త్రిజ్ఞాన్ = ఆలోచనలను ఎరిగిన, తాన్ = వారిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆలోచనలలో నేర్పు గలవాడు, ఆలోచించిన విధముగ ప్రవర్తించువాడు అయిన సుగ్రీవుడు కార్యమునందలి బరువును తేలికతనమును (మంచిచెడ్డలను) నిశ్చయించి మంత్రమునందు నేర్పుగల ఆ వానరులతో ఇట్లనెను. 2

మూ. న మే దుర్వ్యాహృతం కిఞ్చిన్నాపి మే దురనుష్ఠితమ్,
లక్ష్మణో రాఘవభ్రాతా క్రుద్ధః కిమితి చిన్త్యతే. 3

ప్ర.అ. మే = నాకు (నాచేత), కించిత్ = ఏమీ, న దుర్వ్యాహృతమ్ = చెడ్డగా పలకబడలేదు. మే = నాకు, దురనుష్ఠితమ్ అపి = చెడ్డగా చేయబడినది కూడ, న =లేదు. రాఘవభ్రాతా = రాముని సోదరుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, కిమ్ = ఎందువలన, క్రుద్ధః = కోపించినాడు, ఇతి = అని, చిన్త్యతే = ఆలోచించబడుచున్నది.

తా. నేనేమీ చెడ్డ మాట అనలేదు; చెడ్డ పని ఏదీ చేయలేదు. రాముని

సోదరుడైన లక్ష్మణునకు కోపము ఎందుకు వచ్చినదా అని ఆలోచించుచున్నాను.

మూ. అసుహృద్భిర్మమామిత్రైర్నిత్యమన్తరదర్శిభిః,
మమ దోషానసంభూతాన్ శ్రావితో రాఘవానుజః. 4

ప్ర.అ. రాఘవానుజః = లక్ష్మణుడు, అసుహృద్భిః= మంచి హృదయము కలవారు కాని, నిత్యమ్=ఎల్లప్పుడు, అన్తరదర్శిభిః =అవకాశమునకై చూచుచుండు, మమ అమిత్రైః = నా శత్రువులచేత, మమ= నాయొక్క, అసంభూతాన్ = లేని, దోషాన్ = దోషములను, శ్రావితః = వినిపింపబడినాడు.

తా. నిత్యము అవకాశము కొరకు చూచే చెడ్డ బుద్ధి గల నా శత్రువు లెవరో లక్ష్మణునకు నామీద లేని దోషములను కల్పించి చెప్పి ఉందురు. 4

మూ. తత్ర తావద్యథాబుద్ధి సర్వైరేవ యథావిధి,
భావస్య నిశ్చయస్తావ ద్విజ్ఞేయో నిపుణం శనైః. 5

ప్ర.అ. అత్ర= ఈ సమయమునందు, సర్వైరేవ = మీ అందరిచేతను, యథాబుద్ధి = బుద్ధ్యనుసారముగా, యథావిధి = శాస్త్రానుసారముగా, భావస్య = విషయము యొక్క, నిశ్చయః = నిశ్చయము, నిపుణమ్ = నేర్పుగా, శనైః = మెల్లగా, విజ్ఞేయః తావత్ = ముందుగా తెలిసికొనదగినది.

తా. ఈ సమయమునందు మీరందరు యథాశాస్త్రముగా బుద్ధిని ఉపయోగించి, ఈ విషయమునందు ఏమి నిర్ణయము చేయవలెనో నేర్పుగా, మెల్లగా తెలిసికొనవలెను. 5

మూ. న ఖల్వస్తి మమ త్రాసో లక్ష్మణాన్నాపి రాఘవాత్,
మిత్రం త్వస్థానకుపితం జనయత్యేవ సంభ్రమమ్. 6

ప్ర.అ. మమ = నాకు, లక్ష్మణాత్ = లక్ష్మణునివలన, త్రాసః = భయము, నాస్తి ఖలు = లేదు. రాఘవాదపి = రామునివలన కూడ, న = లేదు. అస్థానకోపితమ్ = కారణము లేకుండా కోపించిన, మిత్రమ్ = మిత్రుడు, సంభ్రమమ్ = తొందరను, జనయత్యేవ = తప్పక కలిగించును కదా!

తా. లక్ష్మణునివలన నాకేమీ భయము లేదు. రామునివలన కూడ లేదు. కాని మిత్రుడు అకారణముగా కోపించినా డన్నచో ఎవరైనా కంగారు పడుదురు కదా! 6

మూ. సర్వథా సుకరం మిత్రం దుష్కరం ప్రతిపాలనమ్,
అనిత్యత్వాత్తు చిత్తానాం ప్రీతిరల్పేఽపి భిద్యతే. 7

ప్ర.అ. సర్వథా = అన్ని విధములా, మిత్రమ్ = మిత్రుడు, సుకరమ్ = సులభముగా చేసికొన శక్యమైనవాడు. ప్రతిపాలనమ్ = రక్షించుకొనుట,

దుష్కరమ్ = చేయుటకు కష్టమైనది. చిత్తానామ్ = చిత్తములు, అనిత్యత్వాత్తు = అనిత్యము లగుటవలన, అల్పేఽపి = చిన్న విషయమునందు కూడ, ప్రీతిః = ప్రేమ, భిద్యతే = భిన్నమై పోవును.

తా. అన్ని విధాల స్నేహితుని సంపాదించుట సులభమే కాని ఆ స్నేహమును రక్షించుకొనుట చాల కష్టము. ఎందుచేత ననగా - చిత్తములు మారి పోవుచుండును గాన చిన్న విషయమునకు కూడ స్నేహము చెడిపోవును.

మూ. అతో నిమిత్తం త్రస్తోఽహం రామేణ తు మహాత్మనా,
యన్మయోపకృతం శక్యం ప్రతికర్తుం న తన్మయా. 8

ప్ర.అ. అతః నిమిత్తమ్ = ఆ కారణమువలన, అహమ్ = నేను, మహాత్మనా = మహాత్ముడైన, రామేణ = రామునిచేత, త్రస్తః = భయపడుచున్నాను. మమ = నాకు, యత్ =ఏ, ఉపకృతమ్=ఉపకారము చేయబడినదో, తత్ = అది, మయా = నాచేత, ప్రతికర్తుమ్ = తీర్చుటకు, న శక్యమ్ = శక్యము కాదు.

తా. అందుచేతనే నేను మహాత్ముడైన రామునికి భయపడుచున్నాను. ఆతడు నాకు చేసిన ఉపకారమునకు నేను ప్రత్యుపకారము చేయజాలను. 8

మూ. సుగ్రీవేణైవముక్తే తు హనుమాన్ హరిపుఙ్గవః,
ఉవాచ స్వేన తర్కేణ మధ్యే వానరమన్త్రిణామ్. 9

ప్ర.అ. సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = చెప్పబడగా, హరిపుఙ్గవః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమంతుడు, వానరమన్త్రిణామ్ = సుగ్రీవుని మంత్రులయొక్క, మధ్యే = మధ్యయందు, స్వేన = తన సంబంధమైన, తర్కేణ = ఊహచేత, ఉవాచ= ఇట్లు పలికెను.

తా. సుగ్రీవుని మాటలు విని సుగ్రీవుని మంత్రుల మధ్యయందున్న వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, ఊహను అనుసరించి ఇట్లు పలికెను. 9

మూ. సర్వదా నైతదాశ్చర్యం యత్త్వం హరిగణేశ్వర,
న విస్మరసి సుస్నిగ్ధముపకారం కృతం శుభమ్. 10

ప్ర.అ. హరిగణేశ్వర = వానరరాజా! త్వమ్ = నీవు, సుస్నిగ్ధమ్ = స్నేహపూర్వకముగా, కృతమ్ = చేయబడిన, శుభమ్ = ఉపకారమును, న విస్మరసి ఇతి యత్ = విస్మరించుటలే దను విషయము ఏది కలదో, ఏతత్ = ఇది, సర్వథా = అన్ని విధముల, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యకరము, న = కాదు.

తా. వానరరాజా! నీకు రాముడు చేసిన ఉపకారమును, స్నేహ పూర్వకముగా నీవు మరచిపోలే దన్నచో దీనిలో ఆశ్చర్య మేమీ లేదు. 10

మూ. రాఘవేణ తు వీరేణ భయముత్సృజ్య దూరతః,
త్వత్ప్రియార్థం హతో వాలీ శక్రతుల్యపరాక్రమః. 11

ప్ర.అ. వీరేణ = వీరుడైన, రాఘవేణ = రామునిచేత, భయమ్ = భయమును, దూరతః = దూరముగా, ఉత్సృజ్య = విడచి, త్వత్ప్రియార్థమ్ = నీ ప్రియముకొరకు, శక్రతుల్యపరాక్రమః = దేవేంద్రునితో సమానమైన పరాక్రమముగల, వాలీ= వాలి, హతః = చంపబడినాడు.

తా. వీరుడైన రాముడు ఏమాత్రము భయము చెందక నీకు ప్రియము చేయుటకొరకు దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల వాలిని చంపినాడు.

మూ. సర్వథా ప్రణయాత్ క్రుద్ధో రాఘవో నాత్ర సంశయః,
భ్రాతరం సంప్రహితవాన్ లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. 12

ప్ర. అ. రాఘవః = రాముడు, సర్వథా = అన్ని విధములా, ప్రణయాత్ = నీమీద నున్న స్నేహమువలననే, క్రుద్ధః = కోపించినాడు. అత్ర = ఈ విషయమునందు, సంశయః = సంశయము, న = లేదు. భ్రాతరమ్ = సోదరుడైన, లక్ష్మివర్ధనమ్ = లక్ష్మిని వృద్ధి పొందించు, లక్ష్మణమ్ = లక్ష్మణుని, ప్రహితవాన్ = పంపినాడు.

తా. రాముడు నీ విషయమున స్నేహము కలిగి యుండియే కోపించి నాడు. సందేహము లేదు. అందుచేత తన సోదరుడైన, లక్ష్మిని వృద్ధినొందించే లక్ష్మణుని పంపి ఉన్నాడు. 12

మూ. త్వం ప్రమత్తో న జానీషే కాలం కాలవిదాం వర,
ఫుల్లసప్తచ్ఛదశ్యామా ప్రవృత్తా తు శరచ్ఛుభా. 13

ప్ర. అ. కాలవిదామ్ = యుక్తకాలమును ఎరిగినవారిలో, వర = శ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, ప్రమత్తః = ఏమరిపాటులో ఉన్నవాడవై, కాలమ్ = కాలమును, న జానాషే = తెలిసికొనుటలేదు. ఫుల్లసప్తచ్ఛదశ్యామా= వికసించిన ఏడాకుల అరటిచెట్లచేత శ్యామవర్ణము గల, శుభా = సుందరమైన, శరత్ = శరత్కాలము, ప్రవృత్తా = ప్రారంభ మైనది.

తా. యుక్తమైన కాలమును తెలిసికొన గలిగిన ఓ! సుగ్రీవా! నీవు ఏమరిపాటులో ఉండి కాలమును తెలిసికొనలేకుండా ఉన్నావు. వికసించిన ఏడాకుల అరటిచెట్లతో నల్లగా ఉన్న, సుందరమైన శరత్కాలము ప్రారంభ మైనది.

మూ. నిర్మలగ్రహనక్షత్రా ద్యౌః ప్రనష్టబలాహకా,
ప్రసన్నాశ్చ దిశః సర్వాః సరితశ్చ సరాంసి చ. 14

ప్ర. అ. ప్రనష్టబలాహకా = తొలగిన మేఘములు గల, ద్యౌః = ఆకాశము, నిర్మలగ్రహనక్షత్రా = నిర్మలములైన గ్రహములు, నక్షత్రములు కలది.

సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులు, సరితశ్చ = నదులు, సరాంసి చ= సరస్సులు, ప్రసన్నాః= ప్రసన్నమైనవి.

తా. మేఘములు తొలగిపోయిన ఆకాశమునందు గ్రహములు, నక్షత్రములు నిర్మలముగా ప్రకాశించుచున్నవి. అన్ని దిక్కులు, నదులు , సరస్సులు నిర్మలముగా ఉన్నవి. 14

మూ. ప్రాప్తముద్యోగకాలం తు నావైషి హరిపుఙ్గవ,
త్వం ప్రమత్త ఇతి వ్యక్తం లక్ష్మణోఽ యమిహాగతః. 15

ప్ర. అ. హరిపుఙ్గవ = వానరశ్రేష్ఠుడా! ప్రాప్తమ్ = వచ్చిన, ఉద్యోగకాలమ్ =ప్రయత్నము చేసే సమయమును, నావైషి = గుర్తించకున్నావు. త్వమ్ = నీవు, ప్రమత్తః ఇతి = ఏమరిపాటు చెంది ఉన్నావు అని, అయం లక్ష్మణః = ఈ లక్ష్మణుడు, ఇహ= ఇచ్చటికి, ఆగతః = వచ్చినాడు. వ్యక్తమ్ = ఈ విషయము స్పష్టము.

తా. వానరరాజా! మనము ప్రయత్నము చేయుటకు తగిన కాలము వచ్చినట్లు నీవు గుర్తించుట లేదు. నీవు ఏమరిపాటు చెంది ఉన్నా వనే కారణము చేతనే లక్ష్మణు డిక్కడికి వచ్చినా డనే విషయము స్పష్టము. 15

మూ. ఆర్తస్య హృతదారస్య పరుషం పురుషాన్తరాత్,
వచనం మర్షణీయం తే రాఘవస్య మహాత్మనః. 16

ప్ర. అ. ఆర్తస్య = దుఃఖితుడు, హృతదారస్య = హరింపబడిన భార్య కలవాడు, మహాత్మనః =మహాత్ముడు అయిన, రాఘవస్య = రామునియొక్క, పురుషాన్తరాత్ = మరొక పురుషుని ద్వారా పంపబడిన, పరుషమ్ = పరుషమైన, వచనమ్ = వచనము, తే = నీకు, మర్షణీయమ్ = సహింపదగినది.

తా. హరించబడిన భార్య కలవాడైన మహాత్ము డైన రాముడు కష్టములలో ఉన్నాడు. మరొక పురుషుని ద్వారా ఆతడు పంపిన పరుషవచనములను నీవు సహించవలెను. 16

మూ. కృతాపరాధస్య హి తే నాన్యత్పశ్యామ్యహం క్షమమ్,
అన్తరేణాఞ్జలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్. 17

ప్ర. అ. అఞ్జలిమ్=దోసిలిని, బద్ధ్వా=కట్టి, లక్ష్మణస్య= లక్ష్మణునియొక్క, ప్రసాదనాత్ అన్తరేణ=అనుగ్రహింపచేసికొనుట తప్ప, క్షమమ్=తగిన, అన్యత్=మరొక కార్యమును, కృతాపరాధస్య=చేయబడిన అపరాధము గల, తే=నీకు, అహమ్=నేను, న పశ్యామి=చూడను.

తా. అపరాధము చేసిన నీవు అంజలి ఘటించి లక్ష్మణుని అనుగ్రహింపచేసికొనుట తప్ప తగిన మరొక ఉపాయ మేదీ నాకు కనబడుట

లేదు. 17

మూ. నియుక్తైర్మన్త్రిభిర్వాచ్యో హ్యవశ్యం పార్థివో హితమ్,
అత ఏవ భయం త్యక్త్వా బ్రవీమ్యవధృతం వచః. 18

ప్ర. అ. నియుక్తైః=నియమితులైన, మన్త్రిభిః=మంత్రులచేత, పార్థివః=రాజు, అవశ్యమ్=తప్పక, హితమ్=హితమును, వాచ్యః=చెప్పదగినవాడు. అతః ఏవ=అందువలననే, భయమ్=భయమును, త్యక్త్వా= విడచి, అవధృతమ్=నిశ్చితమైన, వచః=వచనమును, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. నియమితులైన మంత్రులు తప్పక రాజుకు ఏది హితమో అదే చెప్పవలెను. అందుచేతనే నేను భయము విడచి, నిశ్చితమైన మాట చెప్పుచున్నాను.

మూ. అభిక్రుద్ధః సమర్థో హి చాపముద్యమ్య రాఘవః,
సదేవాసురగన్ధర్వం వశే స్థాపయితుం జగత్. 19

ప్ర. అ. అభిక్రుద్ధః=కోపించిన, రాఘవః=రాముడు, చాపమ్=ధనస్సును, ఉద్యమ్య=ఎత్తి, సదేవాసురగన్ధర్వమ్=దేవతలతోను, అసురులతోను, గంధర్వులతోను కూడిన, జగత్=జగత్తును, వశే=వశమునందు, స్థాపయితుమ్=ఉంచుటకు, సమర్థో హి=సమర్థుడు కదా!

తా. రాముడు కోపించినచో ధనస్సును ఎక్కుపెట్టి, దేవతలతోను, అసురులతోను, గంధర్వులతోను కూడిన జగత్తును వశములో ఉంచుకొనగలడు. 19

మూ. న స క్షమః కోపయితుం యః ప్రసాద్యః పునర్భవేత్,
పూర్వోపకారం స్మరతా కృతజ్ఞేన విశేషతః. 20

ప్ర. అ. పూర్వోపకారమ్=పూర్వోపకారమును, స్మరతా= స్మరించుచున్నవాడవు, విశేషతః=విశేషించి, కృతజ్ఞేన=కృతజ్ఞుడవుగా ఉండవలసినవాడవు అయిన నీ చేత, యః=ఏ రాముడు, పునః=మరల, ప్రసాద్యః=అనుగ్రహింపచేసికొనదగినవాడో, సః=అతడు, కోపయితుమ్= కోపింపచేయుటకు, న క్షమః=తగినవాడు కాడు.

తా. పూర్వము రాముడు చేసిన ఉపకారమును స్మరించుచు, విశేషించి కృతజ్ఞతాభావముతో ఉండవలసిన నీవు ఆతనిని మాటిమాటికి అనుగ్రహింపచేసుకొనవలెను. అట్టి రామునకు కోపము కలిగించుట మంచిది కాదు.

మూ. తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్రః ససుహృజ్జనః,
రాజంస్తిష్ఠ స్వసమయే భర్తుర్భార్యేవ తద్వశే. 21

ప్ర. అ. రాజన్=రాజా! సపుత్రః=పుత్రులతో కూడిన, ససుహృజ్జనః= స్నేహితులతో కూడిన, త్వమ్=నీవు, తస్య=ఆతనికి, మూర్ధ్నా= శిరస్సుతో,

ప్రణమ్య=నమస్కరించి, స్వసమయే=నీప్రతిజ్ఞయందు, భర్తుః= భర్తకు, భార్యేవ=భార్య వలె, తద్వశే=ఆతని వశమునందు, తిష్ఠ= ఉండుము.

తా. పుత్రులతోను, స్నేహితులతోను కూడిన నీవు ఆతనికి శిరస్సు వంచి, నమస్కరించి, నీ ప్రతిజ్ఞను పాలించుచు, భర్తకు భార్య వలె, ఆతనికి వశుడవై ఉండుము. 21

మూ. న రామరామానుజశాసనం త్వయా
కపీన్ద్ర యుక్తం మనసాఽప్యపోహితుమ్,
మనో హి తే జ్ఞాస్యతి మానుషం బలం
స రాఘవస్యాస్య సురేన్ద్రవర్చసః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్వాత్రింశః సర్గః.

ప్ర. అ. కపీన్ద్ర=వానరరాజా! రామరామానుజశాసనమ్=రామునియొక్క, లక్ష్మణునియొక్క శాసనము, త్వయా=నీచేత, మనసా పి=మనస్సుచేత కూడ, అపోహితుమ్=త్రోసిపుచ్చుటకు, న యుక్తమ్=యుక్తము కాదు. సరాఘవస్య=లక్ష్మణునితో కూడిన, సురేన్ద్రవర్చసః=దేవేంద్రుని వంటి పరాక్రమము గల, అస్య=ఈ రాము నియొక్క, మానుషమ్=మనుష్యసంబంధియైన, బలమ్= బలమును, తే మనః=నీ మనస్సు, జ్ఞాస్యతి హి=తెలిసికొనగలదు. (తెలిసికొని ఉన్నది కదా).(లేదా - సరాఘవ స్య=రామునితో కూడిన, అస్య=ఈ లక్ష్మణునియొక్క అని అర్థము.)

తా. ఓ! వానరరాజా! నీవు మనసా కూడ రామలక్ష్మణుల శాసనమును త్రోసిపుచ్చుట మంచిది కాదు. లక్ష్మణసమేతుడు, ఇంద్రునితో సమానమైన తేజస్సు కలవాడు అయిన ఈ రాముని మనుష్యబలము ఎంతటిదో నీ మనస్సుకే తెలియును. ఇంక దివ్యాస్త్రాదిబలము మాట చెప్పవలెనా. ("రామునితో కూడిన ఈ లక్ష్మణుని మానుషబలము ఎంతటిదో నీకు తెలియును" అని కొందరు వ్యాఖ్యాతలు). 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయస్త్రింశః సర్గః

(లక్ష్మణుడు కిష్కింధ శోభను చూచుచు సుగ్రీవుని గృహములో ప్రవేశించుట. అక్కడ కోపముతో ధనుష్టంకారము చేయుట. భయపడిన సుగ్రీవుడు ఆతని కోపమును శాంతింపచేయుటకై తారను పంపగా ఆమె లక్ష్మణుని అనునయించి అంతఃపురములోనికి తీసికొనివచ్చుట).

మూ. అథ ప్రతిసమాదిష్టో లక్ష్మణః పరవీరహా,
ప్రవివేశ గుహాం రమ్యాం కిష్కింధాం రామశాసనాత్. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ప్రతిసమాదిష్టః=లోనికి పిలువబడిన, పరవీరహా=శత్రువీరసంహారకుడైన, లక్ష్మణః= లక్ష్మణుడు, రామశాసనాత్=రాముని ఆజ్ఞవలన, రమ్యామ్=సుందరమైన, గుహామ్=గుహయైన, కిష్కింధామ్=కిష్కింధను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట అంగదాదులచేత లోనికి ఆహ్వానింపబడిన, శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు రాముని ఆజ్ఞ ప్రకారము, పర్వతముల మధ్యనున్న రమ్యమైన కిష్కింధానగరమును ప్రవేశించెను. 1

మూ. ద్వారస్థా హరయస్తత్ర మహాకాయా మహాబలాః,
బభూవుర్లక్ష్మణం దృష్ట్వా సర్వే ప్రాఞ్జలయః స్థితాః. 2

ప్ర. అ. తత్ర=అక్కడ, ద్వారస్థాః=ద్వారమునందున్న, మహాకాయాః= పెద్ద శరీరములు గల, మహాబలాః=గొప్ప బలము గల, హరయః=వానరులు, సర్వే=అందరూ, లక్ష్మణమ్=లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, ప్రాఞ్జలయః=పైకి ఎత్తబడిన దోసిళ్లు కలవారై, స్థితాః=నిలచినవారుగా, బభూవుః=అయిరి.

తా. అక్కడ ద్వారమునందున్న, పెద్ద శరీరములు, గొప్ప బలమూ గల వానరు లందరూ, లక్ష్మణుని చూచి చేతులు జోడించి నిలబడిరి. 2

మూ. నిఃశ్వసన్తం తు తం దృష్ట్వా క్రుద్ధం దశరథాత్మజమ్,
బభూవుర్హరయస్త్రస్తా న చైనం పర్యవారయన్. 3

ప్ర. అ. హరయః=వానరులు, నిఃశ్వసన్తమ్=నిట్టూర్చుచున్న, క్రుద్ధమ్=కోపించిన, తం దశరథాత్మజమ్=ఆ లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, త్రస్తాః=భయపడినవారు, బభూవుః=అయిరి. ఏనమ్=ఇతనిని, న పర్యవారయన్=చుట్టలేదు.

తా. కోపముతో నిట్టూర్చుచున్న ఆ లక్ష్మణుని చూచి వానరులు

భయపడిరి. ఆతని చుట్టూ చేరలేదు. 3

మూ. స తాం రత్నమయీం దివ్యాం శ్రీమాన్ పుష్పితకాననామ్,
రమ్యాం రత్నసమాకీర్ణాం దదర్శ మహతీం గుహామ్. 4

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, సః=ఆ లక్ష్మణుడు, రత్నమయీమ్=రత్నవికారమూ, దివ్యామ్=శ్రేష్ఠము, పుష్పితకాననామ్=పుష్పించిన అడవులు కలది, రమ్యామ్=సుందరము, రత్నసమాకీర్ణామ్=శ్రేష్ఠములైన వస్తువులతో నిండినది అయిన, తామ్=ఆ, మహతీమ్=గొప్పదైన, గుహామ్=గుహను, దదర్శ=చూచెను.

తా. రత్నములతో నిండి ఉన్న శ్రేష్ఠమైన ఆ కిష్కింధాపురములోని ఉద్యానము లన్నీ పుష్పించి ఉండెను. అట్టి శ్రేష్ఠములైన వస్తువులతో నిండిన ఆ రమ్యమైన పురమును శ్రీమంతుడైన లక్ష్మణుడు చూచెను. 4

మూ. హర్మ్యప్రాసాదసంబాధాం నానారత్నోపశోభితామ్,
సర్వకాలఫలైర్వృక్షైః పుష్పితైరుపశోభితామ్. 5

ప్ర. అ. హర్మ్యప్రాసాదసంబాధామ్=మేడలతోను, ధనికుల భవనములతోను ఇరుకుగా ఉన్నది, నానారత్నోపశోభితామ్=అనేకవిధములైన రత్నములచేత శోభింపచేయబడినది, సర్వకాలఫలైః=అన్ని కాలములందు ఫలములు గల, పుష్పితైః=పుష్పించిన, వృక్షైః=వృక్షములచేత, ఉపశోభితామ్=ప్రకాశింపచేయబడినది అయిన ఆ కిష్కింధను చూచెను.

తా. ఆ కిష్కింధ మేడలతోను, ధనికుల భవనములతోను ఇరుకుగా ఉండెను. అనేకవిధములైన రత్నములతోను, అన్ని కాలములందు ఫలముల నిచ్చు పుష్పించిన వృక్షములతోను ప్రకాశించుచుండెను. 5

మూ. దేవగన్ధర్వపుత్రైశ్చ వానరైః కామరూపిభిః,
దివ్యమాల్యామ్బరధరైః శోభితాం ప్రియదర్శనైః. 6

ప్ర. అ. దేవగన్ధర్వపుత్రైః=దేవతలయొక్క, గంధర్వులయొక్క పుత్రులు, కామరూపిభిః=స్వేచ్ఛారూపము గలవారు, దివ్యమాల్యామ్బరధరైః=దివ్యములైన మాలలను, వస్త్రములను ధరించినవారు, ప్రియదర్శనైః=ప్రియమైన దర్శనము గలవారు అయిన, వానరైః=వానరులచేత, ఉపశోభితామ్=ప్రకాశింపచేయబడిన (కిష్కింధను చూచెను.)

తా. దేవతల పుత్రులు, గంధర్వుల పుత్రులు, ఇచ్ఛానుసారము రూపములను ధరించ గలవారు, దివ్యములైన మాలలను వస్త్రములను ధరించినవారు, చూచుటకు ఆనందము కలిగించువారు అయిన వానరులు ఆ నగరమును శోభింపచేయుచుండిరి.

మూ. చన్దనాగురుపద్మానాం గన్ధైః సురభిగన్ధినామ్,
మైరేయాణాం మధూనాం చ సంమోదితమహాపథామ్. 7

ప్ర. అ. సురభిగన్ధినామ్=ఘ్రాణేంద్రియమునకు తృప్తిని కలిగించు సువాసన గల, చన్దనాగురుపద్మానామ్= చందనములయొక్క, అగురువుయొక్క, పద్మముల యొక్క, మైరేయాణామ్=మద్యములయొక్క, మధూనామ్=ద్రాక్షనుండి తీసిన మద్యములయొక్క, గన్ధైః=వాసనలచేత, సంమోదితమహాపథామ్=సువాసన కలవిగా చేయబడిన రాజమార్గములు గల (కిష్కింధను చూచెను).

తా. ఆ నగరములోని రాజమార్గములు ఘ్రాణేంద్రియమునకు తృప్తిని కలిగించు చందన - అగురు - పద్మముల సువాసనలతోను, మైరేయము, మధువు అను మద్యముల సువాసనలతోను నిండి ఉండెను. 7

మూ. విన్ధ్యమేరుగిరిప్రఖ్యైః ప్రాసాదైర్నైకభూమిభిః,
దదర్శ గిరినద్యశ్చ విమలాస్తత్ర రాఘవః. 8

ప్ర. అ. రాఘవః=లక్ష్మణుడు, తత్ర=అక్కడ, నైకభూమిభిః= అనేకములైన అంతస్తులు గల, విన్ధ్యమేరుగిరిప్రఖ్యైః=వింధ్యపర్వతముతోను, మేరుపర్వతముతోను సమానములైన, ప్రాసాదైః=ప్రాసాదములతో (కూడిన కిష్కింధను చూచెను). విమలాః=స్వచ్ఛమైన, గిరినద్యశ్చ=కొండకాలవలను, దదర్శ= చూచెను.

తా. లక్ష్మణుడు అక్కడ చాలా అంతస్తులు ఉన్న, వింధ్య-మేరు పర్వతముల వలె ఎత్తైన ప్రాసాదములను, నిర్మలములైన కొండకాలవలను చూచెను. 8

మూ. అఙ్గదస్య గృహం రమ్యం మైన్దస్య ద్వివిదస్య చ,
గవయస్య గవాక్షస్య గజస్య శరభస్య చ. 9
విద్యున్మాలేశ్చ సంపాతేః సూర్యాక్షస్య హనూమతః,
వీరబాహోః సుబాహోశ్చ నలస్య చ మహాత్మనః. 10
కుముదస్య సుషేణస్య తారజామ్బవతోస్తథా,
దధివక్త్రస్య నీలస్య సుపాటలసునేత్రయోః. 11
ఏతేషాం కపిముఖ్యానాం రాజమార్గే మహాత్మనామ్,
దదర్శ గృహముఖ్యాని మహాసారాణి లక్ష్మణః. 12

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, అఙ్గదస్య=అంగదునియొక్క, రమ్యమ్= సుందరమైన, గృహమ్=గృహమును, మైన్దస్య=మైందునియొక్క, ద్వివిదస్య చ=ద్వివిదునియొక్క, గవయస్య=గవయునియొక్క, గవాక్షస్య= గవాక్షునియొక్క, గజస్య=గజునియొక్క, శరభస్య చ=శరభునియొక్క, విద్యున్మాలేశ్చ=విద్యున్మాలియొక్క, సంపాతేః=సంపాతియొక్క, సూర్యాక్షస్య=సూర్యాక్షునియొక్క, హనూమతః=హనుమంతునియొక్క, వీరబాహోః= వీరబాహువుయొక్క, సుబాహోశ్చ=సుబాహువుయొక్క,

మహాత్మనః=మహాత్ముడైన,నలస్య చ=నలునియొక్క, కుముదస్య=కుముదునియొక్క, సుషేణస్య= సుషేణునియొక్క, తథా=మరియు, తారజామ్బవతోః=తారునియొక్క, జాంబవంతునియొక్క, దధివక్త్రస్య=దధివక్త్రునియొక్క, నీలస్య=నీలునియొక్క, సుపాటలసునేత్రయోః=సుపాటలసునేత్రులయొక్క, ఏతేషామ్=ఈ, మహాత్మనామ్=గొప్పవారైన, కపిముఖ్యానామ్=వానరనాయకులయొక్క, మహాసారాణి=గొప్ప సారము గల, గృహముఖ్యాని=శ్రేష్ఠములైన గృహములను, రాజమార్గే=రాజమార్గమునందు, దదర్శ=చూచెను.

తా. లక్ష్మణుడు రాజమార్గమునందు రమ్యమైన అంగదుని గృహమును, మహాత్ములు, వానరనాయకులు అయిన మైంద - ద్వివిద- గవయ-గవాక్ష-గజ-శరభ-విద్యున్మాలి-సంపాతి- సూర్యాక్ష-హనుమత్-వీరబాహు-సుబాహు-నల-కుముద-సుషేణ-తార-జాంబవత్-దధివక్త్ర-నీల-సుపాటల-సునేత్రుల గొప్ప సంపద గల శ్రేష్ఠములైన గృహములను చూచెను. 9-12

మూ. పాణ్డురాభ్రప్రకాశాని గన్ధమాల్యయుతాని చ,
ప్రభూతధనధాన్యాని స్త్రీరత్నైః శోభితాని చ. 13

ప్ర. అ. పాణ్డురాభ్రప్రకాశాని=తెల్లని మేఘముల ప్రకాశము గలవి, గన్ధమాల్యయుతాని చ=గంధములతోను మాలికలతోను కూడినవి, ప్రభూతధనధాన్యాని=అధికమైన ధనధాన్యములు కలవి, స్త్రీరత్నైః=శ్రేష్ఠమైన స్త్రీలచేత, శోభితాని చ=శోభింపచేయబడినవి అయిన (ప్రాసాదములను చూచెను).

తా. గంధములతోను, మాలికలతోను, అధికమైన ధనధాన్యములతోను, ఉత్తమస్త్రీలతోను కూడిన ఆ ప్రాసాదములు తెల్లని మేఘముల వలె ప్రకాశించుచుండెను. 13

మూ. పాణ్డురేణ తు శైలేన పరిక్షిప్తం దురాసదమ్,
వానరేన్ద్రగృహం రమ్యం మహేన్ద్రసదనోపమమ్. 14
శుక్లైః ప్రాసాదశిఖరైః కైలాసశిఖరోపమైః,
సర్వకామఫలైర్వృక్షైః పుష్పితైరుపశోభితమ్. 15
మహేన్ద్రదత్తైః శ్రీమద్భిర్నీలజీమూతసన్నిభైః,
దివ్యపుష్పఫలైర్వృక్షైః శీతచ్ఛాయైర్మనోరమైః. 16
హరిభిః సంవృతద్వారం బలిభిః శస్త్రపాణిభిః,
దివ్యమాల్యావృతం శుభ్రం తప్తకాఞ్చనతోరణమ్. 17
సుగ్రీవస్య గృహం రమ్యం ప్రవివేశ మహాబలః,
అవార్యమాణః సౌమిత్రిర్మహాభ్రమివ భాస్కరః. 18

ప్ర. అ. పాణ్డురేణ=తెల్లని, శైలేన=పర్వతముచేత, పరిక్షిప్తమ్= చుట్టబడి

నది, దురాసదమ్=పొంద శక్యము కానిది, మహేన్ద్రసదనోపమమ్= మహేంద్రుని గృహముతో సమానము, రమ్యమ్=రమ్యము అయిన, వానరేన్ద్రగృహమ్=వానరరాజు గృహమును (చూచెను). శుక్లైః=తెల్లని, కైలాసశిఖరోపమైః=కైలాసశిఖరములవంటి, ప్రాసాదశిఖరైః=ప్రాసాదముల శిఖరములచేతను, సర్వకామఫలైః=సమస్తమైన కామము లనే ఫలములను ఇచ్చునవి, పుష్పితైః=పుష్పించినవి అయిన, వృక్షైః=వృక్షములచేత, ఉపశోభితమ్= ప్రకాశింపచేయబడినది, మహేన్ద్రదత్తైః=మహేంద్రునిచేత ఇవ్వబడినవి, శ్రీమద్భిః= శోభతో కూడినవి, నీలజీమూతసంనిభైః=నల్లని మేఘములతో సమాన ములు, దివ్యపుష్పఫలైః=దివ్యమైన పుష్పములు ఫలములు గలవి, శీతచ్ఛాయైః=చల్లని నీడ గలవి, మనోరమైః=మనోహరములు అయిన, వృక్షైః=వృక్షములతో ప్రకా శించుచున్నది, బలిభిః=బలవంతులైన,శస్త్రపాణిభిః=ఆయుధములు హస్తములందు గల, హరిభిః=వానరులచేత, సంవృతద్వారమ్=కప్పబడిన ద్వారములు గలది, దివ్యమాల్యావృతమ్ =దివ్యములైన మాలికలచేత కప్పబడినది, శుభ్రమ్= తెల్లగా ఉన్నది, తప్తకాఞ్చనతోరణమ్=శుద్ధమైన బంగారు తోరణము గలది అయిన, రమ్యమ్=రమ్య మైన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, గృహమ్=గృహమును, మహాబలః=గొప్ప బలము గల, సౌమిత్రిః=లక్ష్మణుడు, భాస్కరః= సూర్యుడు, మహాభ్రమివ=గొప్ప మేఘమును వలె, అవార్యమాణః= నివారింపబడనివాడై, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. అక్కడ దేవేంద్రుని భవనము వలె రమ్యమైన, ఆక్రమింప శక్యము కాని వానరరాజు గృహమును చూచెను. ఆ గృహము చుట్టూ తెల్లని పర్వత ముండెను. కైలాసశిఖరముల వంటి తెల్లని బురుజులతో ప్రకాశించుచుండెను. సమస్తములైన కోరిక లనే ఫలముల నిచ్చు, పుష్పించిన వృక్షములతో శోభించుచుండెను. దాని సమీపమున శోభాయుక్తము లైనవి, నల్లని మేఘములతో సమానములు, దివ్యములైన పుష్పఫలములు గలవి, చల్లని నీడ నిచ్చునవి, మనోహరములు అయిన, దేవేంద్రు డిచ్చిన వృక్షము లుండెను. ఆయుధములు ధరించిన వానరులు దాని ద్వారముల వద్ద నిలచి యుండిరి. తెల్లని ఆ భవనమును శ్రేష్ఠములైన పుష్పమాలలు వ్రేలాడదీసి అలంకరించిరి. దాని ముఖద్వారము పరిశుద్ధమైన బంగారముతో నిర్మించబడెను. మహాబలశాలి యైన లక్ష్మణుడు అట్టి సుగ్రీవభవనములోనికి సూర్యుడు పెద్ద మేఘములోనికి ప్రవేశించి నట్లు ప్రవేశించెను. ఆ లక్ష్మణుని ఎవ్వరూ అడ్డుకొనలేదు. 14-18

మూ. స సప్త కక్ష్యా ధర్మాత్మా యానాసనసమావృతాః,
ప్రవిశ్య సుమహద్గుప్తం దదర్శాన్తఃపురం మహత్. 19
హైమరాజతపర్యఙ్కైర్బహుభిశ్చ వరాసనైః,
మహార్హాస్తరణోపేతైస్తత్ర తత్ర సమావృతమ్. 20

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః=ఆ లక్ష్మణుడు, యానాసనస మావృతాః=యానములతోను, ఆసనములతోను కూడిన, సప్త=ఏడు, కక్ష్యాః=వాకి ళ్లను, ప్రవిశ్య=ప్రవేశించి, సుమహత్=చాలా విశాలమైనది, గుప్తమ్=రక్షింపబడినది,

మహత్=గొప్పది, హైమరాజతపర్యజ్కైః= బంగారముతో వెండితో చేయబడిన శయనములతోను, మహార్హాస్తరణోపేతైః= గొప్ప మూల్యములు గల ఆస్తరణములతో కూడిన, బహుభిః=అనేకమైన, వరాసనైశ్చ=శ్రేష్ఠమైన ఆసనములతోను, తత్ర తత్ర=అక్కడక్కడ, సమావృతమ్=కప్పబడిన, అన్తఃపురమ్=అంతఃపురమును, దదర్శ=చూచెను.

తా. ధర్మాత్ముడైన ఆ లక్ష్మణుడు అనేకవాహనములతోను, ఆసనములతోను కూడిన ఏడు వాకిళ్లను దాటి వెళ్లి చాల విశాలమైన, బాగుగా రక్షించబడిన అంతఃపురమును చూచెను. ఆ అంతఃపురమునందు అక్కడక్కడ శ్రేష్ఠమైన ఆస్తరణములు పరిచిన ఎన్నో ఉత్తమములైన ఆసనములు, బంగారు పర్యంకములు, వెండి పర్యంకములు (సోఫాలు) అమర్చబడి యుండెను. 19,20

మూ. ప్రవిశన్నేవ సతతం శుశ్రావ మధురస్వనమ్,
తన్త్రీగీతసమాకీర్ణం సమతాళపదాక్షరమ్. 21

ప్ర. అ. ప్రవిశన్నేవ=ప్రవేశించుచునే, తన్త్రీగీతసమాకీర్ణమ్= తన్త్రీధ్వనులతో కూడినది, సమతాలపదాక్షరమ్=సమానమైన తాళము, పదములు, అక్షరములు గలది, సతతమ్=అవిచ్ఛిన్నము అయిన, మధురస్వనమ్=మధురమైన ధ్వనిని, శుశ్రావ=వినెను.

తా. అంతఃపురములో ప్రవేశించగానే లక్ష్మణునకు వీణాతంత్రులనాదముతో కలిసి సమమైన తాళములు, పదములు, అక్షరములు గల అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న మధురధ్వని వినబడెను. 21

మూ. బహ్వీశ్చ వివిధాకారా రూపయౌవనగర్వితాః,
స్త్రియః సుగ్రీవభవనే దదర్శ స మహాబలః. 22

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=అతడు, సుగ్రీవభవనే= సుగ్రీవుని గృహమునందు, వివిధాకారాః=అనేకవిధములైన ఆకారము గలవారు, రూపయౌవనగర్వితాః=రూపముచేత యౌవనముచేత గర్వించినవారు అయిన, బహ్వీః= చాలమంది, స్త్రియః=స్త్రీలను, దదర్శ=చూచెను.

తా.మహాబలశాలియైన ఆ లక్ష్మణుడు సుగ్రీవుని గృహములో అనేకవిధములైన ఆకారములు గల సౌందర్యయౌవనములచేత గర్వించిన స్త్రీలను చాలమందిని చూచెను. 22

మూ. దృష్ట్వాభిజనసమ్పన్నాస్తత్ర మాల్యకృతస్రజః,
వరమాల్యకృతవ్యగ్రా భూషణోత్తమభూషితాః. 23
నాతృప్తాన్నాతి చ వ్యగ్రాన్నానుదాత్తపరిచ్ఛదాన్,
సుగ్రీవానుచరాంశ్చాపి లక్షయామాస లక్ష్మణః. 24

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, తత్ర=అక్కడ, అభిజనసమ్పన్నాః= ఉత్తమవంశముతో కూడినవారు, మాల్యకృతస్రజః=పుష్పములతో కట్టబడిన మాలలు కలవారు, వరమాల్యకృతవ్యగ్రాః=శ్రేష్ఠమైన మాలికల నిర్మాణమునందు ఉద్యుక్తులైనవారు, భూషణోత్తమభూషితాః=ఉత్తమమైన భూషణములచే అలంకరింపబడిన వారు అయిన స్త్రీలను, దృష్ట్వా=చూచి, నాతృప్తాన్=తృప్తిలేనివారు కానివారు, నాతి చ వ్యగ్రాన్=ఎక్కువ వ్యగ్రులు కానివారు, నానుదాత్తపరిచ్ఛదాన్= శ్రేష్ఠవస్త్రములు లేనివారు కానివారు అయిన, సుగ్రీవానుచరాంశ్చాపి=సుగ్రీవుని అనుచరులను కూడ, లక్షయామాస=చూచెను.

తా. లక్ష్మణుడు అక్కడ ఉత్తమమైన అలంకారములు అలంకరించుకొని మాలలకు తగిన పుష్పములతో కట్టిన మాలలు ధరించి, ఉత్తమమైన పుష్పమాలలను నిర్మించుటలో వ్యగ్రలైన స్త్రీలను చూచి పిమ్మట సుగ్రీవుని అనుచరులను కూడ చూచెను. వారిలో తృప్తి లేనివారు కాని, ఎక్కువ కార్యభారముతో ఉన్నవారు కాని, ఉదాత్తమైన వేషము లేనివారు గాని లేకుండిరి. 23,24

మూ. కూజితం నూపురాణాం చ కాఞ్చీనాం నిస్వనం తథా,
స నిశమ్య తతః శ్రీమాన్ సౌమిత్రిర్లజ్జితోఽభవత్. 25

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శ్రీమాన్=శోభ గల, సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, నూపురాణామ్=నూపురములయొక్క, కూజితమ్=శబ్దమును, తథా=మరియు, కాఞ్చీనామ్=వడ్డాణములయొక్క, నిస్వనమ్=ధ్వనిని, నిశమ్య=విని, లజ్జితః= సిగ్గుపొందినవాడు, అభవత్=ఆయెను.

తా. శ్రీమంతుడైన ఆ లక్ష్మణుడు, నూపురముల శబ్దములను, వడ్డాణముల ధ్వనిని వినగానే ముందుకు వెళ్లుటకు కొంచెము సందేహించెను. 25

మూ. రోషవేగప్రకుపితః శ్రుత్వా చాభరణస్వనమ్,
చకార జ్యాస్వనం వీరో దిశః శబ్దేన పూరయన్. 26

ప్ర. అ. వీరః=వీరుడైన లక్ష్మణుడు, ఆభరణస్వనమ్=ఆభరణముల ధ్వనిని, శ్రుత్వా=విని, రోషవేగప్రకుపితః=రోషవేగముచేత ఆవేశింపబడి, దిశః= దిక్కులను, శబ్దేన=ధ్వనిచేత, పూరయన్=నింపుచు, జ్యాస్వనమ్= వారియొక్క ధ్వనిని, చకార=చేసెను.

తా. ఆభరణముల ధ్వని వినగానే లక్ష్మణుడు మిక్కిలి కోపావిష్టుడై దిక్కులు ప్రతిధ్వనించు నట్లు టంకారధ్వని చేసెను. 26

మూ. చారిత్రేణ మహాబాహురపకృష్టః స లక్ష్మణః,
తస్థావేకాన్తమాశ్రిత్య రామశోకసమన్వితః. 27

ప్ర. అ. రామశోకసమన్వితః=రాముని శోకముతో కూడిన, మహా

బాహుః=గొప్ప బాహువులు గల, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, చారిత్రేణ=సచ్చరిత్రచేత, అపకృష్టః=దూరముగా లాగబడినవాడై, ఏకాన్తమ్=ఏకాంతప్రదేశమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, తస్థౌ=నిలచెను.

తా. రామునకు కలిగిన శోకముతో తాను కూడ బాధపడుచున్న మహాబాహువైన ఆ లక్ష్మణుడు సచ్చరిత్ర కలవా డగుటచే దూరముగా వెళ్లి స్త్రీ సన్నిధి లేని ప్రదేశమునందు నిలచెను. 27

మూ. తేన చాపస్వనేనాథ సుగ్రీవః ప్లవగాధిపః,
విజ్ఞాయాగమనం త్రస్తః స చచాల వరాసనాత్. 28

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ప్లవగాధిపః=వానరరాజైన, సః సుగ్రీవః= ఆ సుగ్రీవుడు, తేన=ఆ, చాపస్వనేన=ధనస్సుయొక్క ధ్వనిచేత, ఆగమనమ్=లక్ష్మణుని రాకను, విజ్ఞాయ=తెలుసుకొని, త్రస్తః=భయపడినవాడై, వరాసనాత్=శ్రేష్ఠమైన ఆసనమునుండి, చచాల=చలించెను.

తా. అపుడు వానరరాజైన సుగ్రీవుడు ఆ ధనుష్టంకారముచేత లక్ష్మణుడు వచ్చి నట్లు తెలుసుకొని భయపడి రాజాసనమునుండి లేచెను. 28

మూ. అఙ్గదేన యథా మహ్యం పురస్తాత్ప్రతివేదితమ్,
సువ్యక్తమేష సమ్ప్రాప్తః సౌమిత్రిర్భ్రాతృవత్సలః. 29

ప్ర. అ. పురస్తాత్=ముందుగానే, అఙ్గదేన=అంగదునిచేత, మహ్యమ్=నాకు, యథా=ఎట్లు, ప్రతివేదితమ్=తెలుపబడినదో, అట్లు, భ్రాతృవత్సలః= సోదరుని యందు ప్రేమ గల, ఏషః=ఈ, సౌమిత్రిః=లక్ష్మణుడు, సమ్ప్రాప్తః= వచ్చినాడు; సువ్యక్తమ్=స్పష్టము.

తా. అంగదుడు ముందుగా నాతో చెప్పినట్లే సోదరునియందు ప్రేమ గల ఈ లక్ష్మణుడు వచ్చినాడు. సందేహము లేదు. 29

మూ. అఙ్గదేన సమాఖ్యాతో జ్యాస్వనేన చ వానరః,
బుబుధే లక్ష్మణం ప్రాప్తం ముఖం చాస్యోపశుష్యత. 30

ప్ర. అ. అఙ్గదేన=అంగదునిచేత, జ్యాస్వనేన చ=నారియొక్క ధ్వనిచేత, సమాఖ్యాతః=చెప్పబడిన, వానరః=సుగ్రీవుడు, లక్ష్మణమ్=లక్ష్మణుని, ప్రాప్తమ్=వచ్చినవానినిగా, బుబుధే=తెలుసుకొనెను. అస్య=ఇతనియొక్క, ముఖం చ=ముఖము, ఉపశుష్యత=ఎండిపోయెను.

తా. సుగ్రీవుడు, అంగదుడు చెప్పుటచేతను, ధనుష్టంకారధ్వనిచేతను లక్ష్మణుడు వచ్చినట్లుగా తెలిసికొనెను. ఆతని ముఖము వెలవెల పోయెను. 30

మూ. తతస్తారాం హరిశ్రేష్ఠః సుగ్రీవః ప్రియదర్శనామ్,
ఉవాచ హితమవ్యగ్రస్త్రాసపమ్భ్రాన్తమానసః. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, త్రాసపమ్భ్రాన్తమానసః=భయముచేత తొందరపడుచున్న మనస్సు గల, హరిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవః= సుగ్రీవుడు, ప్రియదర్శనామ్=ప్రియమైన దర్శనము గల, తారామ్=తారను గూర్చి, హితమ్=హితమైన వాక్యమును, అవ్యగ్రమ్=తొందరపాటు లేకుండగా, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట భయముతో కంగారుపడుచున్న మనస్సు గల వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు చూచువారికి ఆనందము కలిగించు తారతో హితమైన వాక్యమును తొందర లేకుండగా ఇట్లు పలికెను.

వి. సుగ్రీవభవనములో స్త్రీలను చూచిన లక్ష్మణుడు ధనుష్టకారము చేసి నట్లు, అది విని సుగ్రీవుడు భయపడి నట్లు వర్ణించు (25 - 30) ఆరు శ్లోకములు, సుగ్రీవుడు తారను పంపగా ఆమె లక్ష్మణుని కోపమును శాంతింప చేసి నట్లు వర్ణించు ఈ శ్లోకము మొదలు ముప్పదియైదు శ్లోకములు ప్రాచ్యప్రతిలో లేవు. 31

మూ. కిం ను రుట్కారణం సుభ్రు ప్రకృత్యా మృదుమానసః,
సరోష ఇవ సమ్ప్రాప్తో యేనాయం రాఘవానుజః. 32

ప్ర. అ. సుభ్రు=అందమైన కనుబొమలు కలదానా! ప్రకృత్యా=స్వభావము చేత, మృదుమానసః=మృదువైన మనస్సు గల, అయమ్=ఈ, రాఘవానుజః= లక్ష్మణుడు, యేన=ఏ కారణముచేత, సరోష ఇవ=కోపముతో కూడినవాడు వలె, సమ్ప్రాప్తః=వచ్చినాడో అట్టి, రుట్కారణమ్=రోషమునకు కారణము, కిం ను=ఏమై ఉండునో!

తా. ఓ! తారా! స్వభావముచే మృదువైన మనస్సు గల ఈ లక్ష్మణుడు కోపముతో వచ్చినట్లున్నది, దీనికి కారణ మేమై ఉండునో? 32

మూ. కిం పశ్యసి కుమారస్య రోషస్థానమనిన్దితే,
న ఖల్వకారణే కోపమాహరేన్నరపుఙ్గవః. 33

ప్ర. అ. అనిన్దితే=నిందింపబడనిదానా! కుమారస్య=లక్ష్మణునకు, రోషస్థానమ్=కోపమునకు కారణమును, కిమ్=దేనినిగా, పశ్యసి= చూచుచున్నావు; నరపుఙ్గవః=నరశ్రేష్ఠుడైన లక్ష్మణుడు, అకారణే=కారణము లేకుండగా, కోపమ్=కోపమును, న ఆహరేత్ ఖలు=చేయదుగదా!

తా. దోషరహితురాలవైన ఓ! తారా! యువకుడైన ఈ లక్ష్మణునకు కోపకారణ మేదై యుండు నని ఊహించుచున్నావు? నరశ్రేష్ఠుడైన ఇతడు కారణము లేకుండగా కోపించడు గదా! 33

మూ. యద్యస్య కృతమస్మాభిర్బుధ్యసే కిఞ్చిదప్రియమ్,
తద్బుద్ధ్యా సమ్ప్రధార్యాశు క్షిప్రమేవాభిధీయతామ్. 34

ప్ర. అ. అస్మాభిః=మనచేత, అస్య=ఇతనికి, కిఞ్చిత్=ఏదైన, అప్రియమ్=అప్రియము, కృతమ్=చేయబడినదానినిగా, బుధ్యసే యది= నీవు తలచిన యెడల, తత్=దానిని, ఆశు=శీఘ్రముగా, బుద్ధ్యా=బుద్ధితో, సమ్ప్రధార్య=నిశ్చయించి, క్షిప్రమేవ=శీఘ్రముగా, అభిధీయతామ్= చెప్పబడుగాక!

తా. మనము ఈతనికి ఏమైన అప్రియము చేసియున్నామా అను విషయమును నీ బుద్ధిచేత శీఘ్రముగా నిశ్చయించి వెంటనే చెప్పుము. 34

మూ. అథవా స్వయమేవైనం ద్రష్టుమర్హసి భామిని!
వచనైః సాన్త్వయుక్తైశ్చ ప్రసాదయితుమర్హసి. 35

ప్ర. అ. అథవా=లేదా, భామిని=ఓ! తారా! ఏనమ్=ఇతనిని, స్వయమేవ=స్వయముగా, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి=తగి ఉన్నావు. సాన్త్వయుక్తైః=బ్రతిమాలుకొనుటతో కూడిన, వచనైః=మాటలతో, ప్రసాదయితుమ్=అనుగ్రహింపచేసికొనుటకు, అర్హసి=తగియున్నావు.

తా. లేదా నీవే స్వయముగా వెళ్లి ఈతనిని చూచి మంచిమాటలతో అనుగ్రహింపచేసికొనుము. 35

మూ. త్వద్దర్శనే విశుద్ధాత్మా న స కోపం కరిష్యతి,
న హి స్త్రీషు మహాత్మానః క్వచిత్కుర్వన్తి దారుణమ్. 36

ప్ర. అ. విశుద్ధాత్మా=పరిశుద్ధమైన మనస్సు గల, సః=అతడు, త్వద్దర్శనే=నీ దర్శనము కలుగగా, కోపమ్=కోపమును, న కరిష్యతి= చేయుడు. మహాత్మానః=మహాత్ములు, క్వచిత్=ఎక్కడను, స్త్రీషు= స్త్రీలవిషయమునందు, దారుణమ్=దారుణమును, న కుర్వన్తి హి=చేయరుకదా!

తా. నిన్ను చూడగానే పరిశుద్ధమైన మనస్సు గల ఆతని కోపము శాంతించును. మహాత్ములు ఎక్కడా కూడ స్త్రీలవిషయమున దారుణకృత్యము చేయరు కదా! 36

మూ. త్వయా సాన్త్వైరుపక్రాన్తం ప్రసన్నేన్ద్రియమానసమ్,
తతః కమలపత్రాక్షం ద్రక్ష్యామ్యహమరిన్దమమ్. 37

ప్ర. అ. సాన్త్వైః= సాంత్వవచనములతో, త్వయా=నీచేత, ఉపక్రాన్తమ్=సమీపింపబడిన, ప్రసన్నేంద్రియమానసమ్=ప్రసన్నమైన ఇంద్రియములు మనస్సు గల, కమలపత్రాక్షమ్=పద్మపత్రముల వంటి నేత్రములు గల, అరిన్దమమ్=శత్రుసంహారకుడైన ఆ లక్ష్మణుని, అహమ్=నేను, తతః=అటుపిమ్మట, ద్రక్ష్యామి=చూడగలను.

తా. నీవు మంచి మాటలతో దగ్గరకు వెళ్లిన పిమ్మట కమలపత్రముల వంటి నేత్రములు గల శత్రుసంహారకుడైన ఆ లక్ష్మణుని ఇంద్రియములు, మనస్సు ప్రసన్నము లగును. పిమ్మట నేను అతనిని చూచెదను. 37

మూ. సా ప్రస్ఖలన్తీ మదవిహ్వలాక్షీ
ప్రలమ్బకాఞ్చీగుణ హేమసూత్రా,
సలక్షణా లక్ష్మణసన్నిధానం
జగామ తారా నమితాఙ్గయష్టిః. 38

ప్ర. అ. మదవిహ్వలాక్షీ=మదముచేత వ్యాకులమైన నేత్రములు గలది, ప్రలమ్బకాఞ్చీగుణ హేమసూత్రా=వ్రేలాడుచున్న వడ్డాణము, బంగారు త్రాడు గలది, సలక్షణా=ఉత్తమలక్షణములు కలది, నమితాఙ్గయష్టిః=వంగిన శరీరము గలది అయిన, సా తారా=ఆ తార, ప్రస్ఖలన్తీ=తొట్రుపడుచు, లక్ష్మణసన్నిధానమ్= లక్ష్మణుని సమీపమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. ఆ తార నేత్రములు మదముచేత వ్యాకులములై ఉండెను. ఆమె శరీరమునందు వడ్డాణము, బంగారు సూత్రములు వ్రేలాడుచుండెను. ఉత్తమలక్షణసంపన్నురాలైన ఆమె శరీరము కొంచెము ముందుకు వంగి యుండెను. అట్టి తార తొట్రుపడుచు (కొంచెము తూలుచు) లక్ష్మణుని దగ్గరకు వెళ్లెను. 38

మూ. స తాం సమీక్ష్యైవ హరీశపత్నీం
తస్థావుదాసీనతయా మహాత్మా,
అవాఙ్ముఖోఽభూన్మనుజేన్ద్రపుత్రః
స్త్రీసన్నికర్షాద్వినివృత్తకోపః. 39

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ, మనుజేన్ద్రపుత్రః= రాజకుమారుడు, హరీశపత్నీమ్=వానరరాజు భార్యయైన, తామ్=ఆమెను, సమీక్ష్యైవ=చూడగానే, ఉదాసీనతయా=ఉదాసీనత్వముతో, తస్థౌ= నిలబడెను. స్త్రీసన్నికర్షాత్=స్త్రీయొక్క సామీప్యమువలన, వినివృత్తకోపః= తొలగిన కోపము కలవాడై, అవాఙ్ముఖః=క్రిందికి ముఖము కలవాడు, అభూత్= ఆయెను.

తా. మహాత్ముడైన ఆ లక్ష్మణుడు తారను చూడగానే ఉదాసీనుడు అయ్యెను. స్త్రీ సమీపమునందు ఉండుటచేత కోపము తొలగి తల వంచుకొనెను.

మూ. సా పానయోగాచ్చ నివృత్తలజ్జా
దృష్టిప్రసాదాచ్చ నరేన్ద్రసూనోః,
ఉవాచ తారా ప్రణయప్రగల్భం
వాక్యం మహార్థం పరిసాన్త్వరూపమ్. 40

ప్ర. అ. పానయోగాచ్చ=మద్యపానసంబంధమువలనను, నరేన్ద్రసూనోః=ఆ రాజకుమారునియొక్క, దృష్టిప్రసాదాచ్చ=దృష్టిప్రసాదమువలనను, నివృత్తలజ్జా=నివర్తించిన లజ్జ గల, సా తారా=ఆ తార, మహార్థమ్= గొప్ప అర్థము గలది, పరిసాన్త్వరూపమ్=బ్రతిమాలుకొనుట అను రూపము గలది, ప్రణయప్రగల్భమ్=స్నేహముచేత ప్రగల్భముగా నున్నది అయిన, వాక్యమ్= వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మద్యము సేవించి యుండుటచేతను, లక్ష్మణుని దృష్టి ప్రసన్నముగా నుండుటచేతను ఆ తార సంకోచమును విడచి స్నేహముతో ప్రగల్భముగా నున్న గొప్ప అర్థము గల బ్రతిమాలుకొనున ట్లున్న వాక్యమును పలికెను. 40

మూ. కిం కోపమూలం మనుజేన్ద్రపుత్ర
కస్తే న సన్తిష్ఠతి వాఙ్నిదేశే,
కః శుష్కవృక్షం వనమాపతన్తం
దవాగ్నిమాసీదతి నిర్విశఙ్కః. 41

ప్ర. అ. మనుజేన్ద్రపుత్ర=ఓ! రాజకుమారా! కోపమూలమ్=కోపమునకు కారణము, కిమ్=ఏమి? తే=నీయొక్క, వాఙ్నిదేశే=ఆజ్ఞావాక్యమునందు, కః=ఎవడు, న సన్తిష్ఠతి=నిలువలేదు. శుష్కవృక్షమ్=ఎండిన వృక్షములు గల, వనమ్=వనమును గూర్చి, ఆపతన్తమ్=వచ్చుచున్న, దవాగ్నిమ్= దావాగ్నిని, కః=ఎవడు, నిర్విశఙ్కః=శంక లేనివాడై, ఆసీదతి= సమీపించుచున్నాడు.

తా. ఓ! రాజకుమారా! నీ కోపమునకు కారణము ఏమి? నీ ఆజ్ఞను పాటించనివాడు ఎవరు? ఎండిన వృక్షములతో నిండిన అడవి వైపు వచ్చుచున్న దావాగ్నిని నిర్భయముగా సమీపించుచున్నవాడు ఎవడు? 41

మూ. స తస్యా వచనం శ్రుత్వా సాన్త్వపూర్వమశఙ్కితః,
భూయః ప్రణయదృష్టార్థం లక్ష్మణో వాక్యమబ్రవీత్. 42

ప్ర. అ. సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, సాన్త్వపూర్వమ్=సాన్త్వనము పూర్వమునందు కలది, భూయః ప్రణయదృష్టార్థమ్=అధికమైన స్నేహముచేత చూపబడిన ప్రయోజనము కలది అయిన, తస్యాః వచనమ్=ఆమె మాటలను, శ్రుత్వా=విని, అశఙ్కితః=శంక లేనివాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ లక్ష్మణుడు తార బ్రతిమాలుకొనుచు అధికమైన స్నేహముతో ప్రయోజనమును చూపుచు పలికిన మాటలు విని శంకలేనివాడై ఇట్లు పలికెను.

మూ. కిమయం కామవృత్తస్తే లుప్తధర్మార్థసఙ్గ్రహః,
భర్తా భర్తృహితే యుక్తే న చైనమవబుద్ధ్యసే. 43

ప్ర. అ. భర్తృహితే=భర్తయొక్క హితమునందు, యుక్తే=ఆసక్తురాలా, తే=నీయొక్క, భర్తా=భర్తయైన, అయమ్=ఇతడు, కామవృత్తః= కామప్రవృత్తి కల

వాడై, లుప్తధర్మార్థసఙ్గ్రహః=లోపించిన ధర్మార్థముల సంపాదనము కలవాడై, కిమ్=ఎందువలన అట్లున్నాడు. ఏనమ్=ఇతనిని గూర్చి, న అవబుద్ధ్యసే=నీవు తెలుసుకొనుటలేదు.

తా. భర్త హితమును కోరు ఓ తారా! నీ భర్త ధర్మార్థముల సంపాదనమును చేయక కామప్రవృత్తితో మాత్రమే ఎందు కున్నాడు? నీవు ఈతని దోషమును గుర్తించుటలేదు. 43

మూ. న చిన్తయతి రాజ్యార్థం సోఽస్మాన్ శోకపరాయణాన్,
సామాత్యపరిషత్తారే కామమేవోపసేవతే. 44

ప్ర.అ. తారే!=ఓ తారా! సామాత్యపరిషత్=అమాత్యపరిషత్తుతో కూడిన, సః=ఆ సుగ్రీవుడు, రాజ్యార్థమ్=రాజ్యప్రయోజనమును, శోకపరాయణాన్= శోకమునకు అధీనులమైన, అస్మాన్=మమ్ములను గూర్చి, న చిన్తయతి= ఆలోచించుటలేదు. కామమేవ=కామమునే, ఉపసేవతే=సేవించుచున్నాడు.

తా. ఓ! తారా! అమాత్యపరిషత్తుతో కూడిన సుగ్రీవుడు భోగములను మాత్రమే సేవించుచు రాజ్యకార్యమును గూర్చి గాని, శోకాక్రాంతులమైన మమ్ములను గూర్చి గాని ఆలోచించుటలేదు. 44

మూ. స మాసాంశ్చతురః కృత్వా ప్రమాణం ప్లవగేశ్వరః,
వ్యతీతాంస్తాన్ మదోదగ్రో విహరన్నావబుధ్యతే. 45

ప్ర. అ. సః ప్లవగేశ్వరః= ఆ సుగ్రీవుడు, చతురః=నాలుగు, మాసాన్= మాసములను, ప్రమాణమ్=ప్రమాణములుగా, కృత్వా=చేసి, మదోదగ్రః= మదముతో తీవ్రమైనవాడై, విహరన్=విహరించుచు, తాన్=ఆ మాసములను, వ్యతీతాన్=గడచినవాటినిగా, నావబుధ్యతే=తెలిసికొనుటలేదు.

తా. సుగ్రీవుడు నాలుగు మాసములు అవధిగా ఇచ్చి ఇపుడు మదమత్తుడై విహరించుచు ఆ మాసములు గడచిన విషయమును గుర్తించుటలేదు. 45

మూ. న హి ధర్మార్థసిద్ధ్యర్థం పానమేవం ప్రశస్యతే,
పానాదర్థశ్చ కామశ్చ ధర్మశ్చ పరిహీయతే. 46

ప్ర. అ. ధర్మార్థసిద్ధ్యర్థమ్=ధర్మార్థముల సిద్ధికొరకు, ఏవమ్=ఇట్లు, పానమ్=మద్యపానము, న ప్రశస్యతే హి=ప్రశంసించ బడదుకదా! పానాత్= పానమువలన, అర్థశ్చ=అర్థము, కామశ్చ=కామము, ధర్మశ్చ=ధర్మము, పరిహీయతే=తగ్గిపోవును.

తా. ఈ విధముగా మద్యపానము చేయుట ధర్మార్థముల సిద్ధిని కోరువాడు చేయదగినది కాదు. పానమువలన ధర్మ-అర్థ-కామములు మూడు చెడిపోవును.

మూ. ధర్మలోపో మహాంస్తావత్కృతే హ్యప్రతికుర్వతః,
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్. 47

ప్ర. అ. కృతే=ఉపకారము చేయబడినదగుచుండగా, అప్రతికుర్వతః= ప్రత్యుపకారము చేయనివానికి, మహాన్=గొప్పదైన, ధర్మలోపః హి=ధర్మలోపము కలుగును కదా! గుణవతః=గుణవంతుడైన, మిత్రస్య=మిత్రునియొక్క, నాశే= నాశమునందు, మహాన్=గొప్ప, అర్థలోపశ్చ=అర్థలోపము కూడ కలుగును కదా!

తా. ఉపకారమును పొంది, ప్రత్యుపకారము చేయనివానికి గొప్ప ధర్మలోపము కలుగును. గుణవంతుడైన మిత్రుని పోగొట్టుకున్న వానికి గొప్ప అర్థలోపము కలుగును. 47

మూ. మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్,
తద్ద్వయం తు పరిత్యక్తం న తు ధర్మే వ్యవస్థితమ్. 48

ప్ర. అ. సత్యధర్మపరాయణమ్=సత్యమునందు, ధర్మమునందు ఆసక్తి గల, మిత్రమ్ =మిత్రుడు, అర్థగుణశ్రేష్ఠమ్=అర్థము విషయమున, గుణముల విషయమున శ్రేష్ఠుడు. తత్ ద్వయమ్=ఆ రెండు, పరిత్యక్తమ్=విడువబడిన, ధర్మే=ధర్మమునందు, వ్యవస్థితమ్=స్థితి, న తు=చేయబడలేదు.

తా. సత్యమునందు, ధర్మమునందు ఆసక్తి గల మిత్రుడు అర్థవిషయము లందు, గుణవిషయములందు శ్రేష్ఠుడు. కాని నీ భర్త ఆ రెండింటిని విడిచినాడు. ధర్మమునందు నిలిచి ఉండలేదు. 48

మూ. తదేవం ప్రస్తుతే కార్యే కార్యమస్మాభిరుత్తరమ్,
యత్కార్యం కార్యతత్త్వజ్ఞే త్వముదాహర్తుమర్హసి. 49

ప్ర. అ. కార్యతత్త్వజ్ఞే=కార్యతత్త్వము తెలిసినదానా! తత్=ఆ కారణము వలన, ప్రస్తుతే కార్యే=ప్రస్తుతమైన కార్యము, ఏవమ్=ఈ విధముగా ఉండగా, అస్మాభిః=మాచేత, యత్=ఏ, ఉత్తరం కార్యమ్=తరువాతి కార్యము, కార్యమ్ =చేయదగినదో, త్వమ్=నీవు, ఉదాహర్తుమ్=చెప్పుటకు, అర్హసి= తగియున్నావు.

తా. కార్యతత్త్వము తెలిసిన ఓ తారా! ప్రస్తుతమైన మా కార్యము ఈ విధముగా నున్న పరిస్థితిలో, మేము ముందు ఏమి చేయవలెనో నీవే చెప్పుము.

మూ. సా తస్య ధర్మార్థసమాధియుక్తం
నిశమ్య వాక్యం మధురస్వభావమ్,
తారా గతార్థే మనుజేన్ద్రకార్యే
విశ్వాసయుక్తం తమువాచ భూయః. 50

ప్ర. అ. సా తారా=ఆ తార, తస్య=లక్ష్మణునియొక్క, ధర్మార్థసమాధియు

క్తమ్ =ధర్మార్థనిశ్చయములతో కూడిన, మధురస్వభావమ్=మధురమైన స్వభావము గల, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, గతార్థే=గడచిన ప్రయోజనము గల, మనుజేన్ద్రకార్యే=రాముని కార్యము విషయమున, విశ్వాసయుక్తమ్= విశ్వాసముతో కూడిన, తమ్=ఆతనిని గూర్చి, భూయః=మరల, ఉవాచ= పలికెను.

తా. ధర్మార్థముల నిశ్చయముతో కూడిన, మధురమైన ఆ లక్ష్మణుని మాటలు విని తార కాలము మించిన రాముని కార్యము విషయమున దానిని ఎట్లైనను సాధించగలను అను విశ్వాసముతో కూడిన, లక్ష్మణునితో మరల ఇట్లు పలికెను. (లేదా రాముని కార్యము విషయమున విశ్వాసము కల్గునట్లుగా పలికెను.) 50

మూ. న కోపకాలః క్షితిపాలపుత్ర
న చాపి కోపః స్వజనే విధేయః,
త్వదర్థకామస్య జనస్య తస్య
ప్రమాదమప్యర్హసి వీర! సోఢుమ్. 51

ప్ర. అ. క్షితిపాలపుత్ర!=రాజకుమారా! కోపకాలః=కోపమునకు కాలము, న=కాదు. స్వజనే=స్వజనమునందు, కోపః=కోపము, న చాపి విధేయః= చేయదగినది కాదు. వీర!=వీరుడా! త్వదర్థకామస్య=నీ ప్రయోజనమునందు కోరిక గల, తస్య జనస్య=ఆ సుగ్రీవునియొక్క, ప్రమాదమపి=పొరపాటును కూడ, సోఢుమ్=సహించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. వీరుడవైన ఓ! రాజకుమారా! ఇది కోపమునకు కాలము కాదు. స్వజనము విషయమున కోపించకూడదు. నీ ప్రయోజనమును సాధించవలె నని కోరుచున్న ఆ సుగ్రీవుని పొరబాటును నీవు సహించవలెను. 51

మూ. కోపం కథం నామ గుణప్రకృష్టః
కుమార కుర్యాదపకృష్టసత్త్వే,
కస్త్వద్విధః కోపవశం హి గచ్ఛే
సత్త్వావరుద్ధస్తపసః ప్రసూతిః. 52

ప్ర. అ. కుమార!=ఓ! లక్ష్మణా! గుణప్రకృష్టః=గుణములచేత అధికమైనవాడు, అపకృష్టసత్త్వే=తక్కువ బలము కలవాని విషయమున, కోపమ్= కోపమును, కథం నామ=ఎట్లు, కుర్యాత్=చేయును. సత్త్వావరుద్ధః=ఉద్యమముతో కూడిన, తపసః=తపస్సునకు, ప్రసూతిః=ఉత్పత్తిస్థానము అయిన, త్వద్విధః= నీవంటి, కః=ఎవరు, కోపవశమ్=కోపమునకు వశమును, గచ్ఛేత్= పొందును?

తా. లక్ష్మణా! అధికమైన గుణములు గలవాడు, అల్పగుణములు కలవాని విషయమున కోపించునా? ఉద్యమశీలుడు, గొప్ప తపస్సు కలవాడు అయిన నీవంటివాడు కోపమునకు వశు డగునా! 52

మూ. జానామి కోపం హరివీరబన్ధో
ర్జానామి కార్యస్య చ కాలసఙ్గమ్,
జానామి కార్యం త్వయి యత్కృతం న
స్తచ్చాపి జానామి యదత్ర కార్యమ్. 53

ప్ర. అ. హరివీరబన్ధోః=సుగ్రీవుని మిత్రుడైన రామునియొక్క, కోపమ్=కోపమును గూర్చి, జానామి=ఎరుగుదును. కార్యస్య=కార్యముయొక్క, కాలసఙ్గమ్ =కాలవిలంబనమును, జానామి=ఎరుగుదును. త్వయి=నీవిషయమున, నః =మాకు (మాచేత), యత్ కృతమ్=ఏది చేయబడినదో, కార్యమ్=ఆ కార్యమును, జానామి=ఎరుగుదును. అత్ర=ఈ విషయమున, యత్=ఏది, కార్యమ్=చేయదగినదో, తచ్చాపి=దానినికూడ, జానామి=ఎరుగుదును.

తా. రాముని కోపము ఎట్లు అమోఘమైనదో నాకు తెలియును. కార్యము విషయమున ఆలస్యమైన దని నాకు తెలియును. నీ విషయమున మేము చేసిన అపచారము కూడ నాకు తెలియును. ఇపుడు ఏమి చేయవలయునో ఆ విషయము కూడ నాకు తెలియును. 53

మూ. తచ్చాపి జానామి యథాఽవిషహ్యం
బలం నరశ్రేష్ఠ! శరీరజస్య,
జానామి యస్మింశ్చ జనేఽవబద్ధం
కామేన సుగ్రీవమసక్తమద్య. 54

ప్ర. అ. నరశ్రేష్ఠ=నరులలో శ్రేష్ఠుడవైన లక్ష్మణా! శరీరజస్య=మన్మథునియొక్క, బలమ్=బలము, యథా=ఎట్లు, అవిషహ్యమ్ =సహింప శక్యము కానిదో, తచ్చాపి=దానిని కూడ, జానామి=ఎరుగుదును. యస్మిన్=ఏ, జనే=జనమునందు, సుగ్రీవమ్=సుగ్రీవుని, అసక్తమ్= నిర్విరామముగా, అద్య=ఇపుడు, కామేన=కామముచేత, అవబద్ధమ్= బద్ధుడై ఉన్నవానినిగా, జానామి=ఎరుగుదును.

తా. ఓ! లక్ష్మణా! మన్మథుని బలము ఎంత సహింప శక్యము గానిదో నాకు తెలియును. ఇపుడు సుగ్రీవుడు ఏ స్త్రీజనమునందు కామముతో నిరంతరము ఆసక్తుడై ఉన్నాడో వారు కూడ నాకు తెలియును. 54

మూ. వాకామతన్త్రే తవ బుద్ధిరస్తి
త్వం వై యథా మన్యువశం ప్రపన్నః,
న దేశకాలౌ హి న చార్థధర్మా
వవేక్షతే కామరతిర్మనుష్యః. 55

ప్ర. అ. త్వమ్=నీవు, యథా=ఎట్లు, మన్యువశమ్=కోపమునకు వశమును, ప్రపన్నః=పొందినావో, (దానిని బట్టి) తవ=నీయొక్క, బుద్ధిః= బుద్ధి,

కామతన్త్రే=మన్మథతంత్రమువందు, నాస్తి=లేదు. కామరతిః= కామమునందు ఆసక్తి గల, మనుష్యః=మనుష్యుడు, దేశకాలౌ= దేశకాలములను, న అవేక్షతే=చూడదు. అర్థధర్మౌ చ=అర్థధర్మములను కూడ, న =చూడదు.

తా. నీవు ఇట్లు కోపమునకు వశుడవగుట చూడగా నీకు కామతంత్రము వందు ఆసక్తి లేదని తెలియుచున్నది. కామమునందు ఆసక్తుడైన మనుష్యుడు దేశకాలములను కాని అర్థధర్మములను కాని చూడడు కదా! 55

మూ. తం కామవృత్తం మమ సన్నికృష్టం
కామాభియోగాచ్చ విముక్తలజ్జమ్,
క్షమస్వ తావత్పరవీరహన్త
స్త్వద్భ్రాతరం వానరవంశనాథమ్. 56

ప్ర. అ. పరవీరహన్తః=శత్రువీరులను సంహరించువాడా! కామవృత్తమ్= కామప్రవృత్తి కలవాడు, మమ=నాకు, సన్నికృష్టమ్=సమీపమునం దున్నవాడు, కామాభియోగాత్=కామావేశమువలన, విముక్తలజ్జమ్=విడువబడిన లజ్జ కలవాడు, త్వద్భ్రాతరమ్=నీ సోదరుడు, వానరవంశనాథమ్=వానరవంశమునకు ప్రభువు అయిన, తమ్=ఆ సుగ్రీవుని, క్షమస్వ=క్షమించుము.

తా. శత్రువీరులను సంహరించువాడా! కామప్రవృత్తి కలవాడై కామావేశ ముచేత సిగ్గు విడచి నా దగ్గరనే ఉన్న నీ సోదరుని వంటివాడైన ఆ సుగ్రీవుని క్షమించుము. 56

మూ. మహర్షయో ధర్మతపోఽభిరామాః
కామానుకామాః ప్రతిబద్ధమోహాః,
అయం ప్రకృత్యా చపలః కపిస్తు
కథం న సజ్జేత సుఖేషు రాజా. 57

ప్ర. అ. ధర్మతపోఽభిరామాః=ధర్మముచేత, తపస్సుచేత మనోహరులైన, మహర్షయః= మహర్షులు, కామానుకామాః=కామమును అనుసరించినవారు, ప్రతిబద్ధమోహాః= నిరంతరమైన మోహము కలవారు. కపిః=వానరుడు, ప్రకృత్యా=స్వభావ ముచేత, చపలః=చపలుడు అయిన, అయం రాజా=ఈ వానరరాజు, సుఖేషు= సుఖములయందు, కథమ్=ఎట్లు, న సజ్జేత=సక్తుడు కాకుండును?

తా. ధర్మముచేతను, తపస్సుచేతను పేరు పొందిన మహర్షులు కూడ కామవశులై నిరంతరము మోహముతో ఉందురు. వానరుడు, సహజముగా చపలస్వభావము గలవాడు అయిన సుగ్రీవుడు కామాసక్తుడు కాకుండ ఎట్లు ఉండగలడు? 57

మూ . ఇత్యేవముక్త్వా వచనం మహార్థం
సా వానరీ లక్ష్మణమప్రమేయమ్,
పునః సఖేలం మదవిహ్వలాక్షీ
భర్తుర్హితం వాక్యమిదం బభాషే. 58

ప్ర. అ. మదవిహ్వలాక్షీ=మదముచేత వ్యాకులమైన నేత్రములు గల, సా=ఆ, వానరీ=తార, అప్రమేయమ్=ఊహింప శక్యము గాని ప్రభావము గల, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇత్యేవమ్=ఇట్లు, మహార్థమ్=గొప్ప అర్థము గల, వచనమ్=వచనమును, ఉక్త్వా=పలికి, పునః=మరల, సఖేలమ్=విలాసముతో కూడుకున్నట్లుగా, భర్తుః=భర్తకు, హితమ్= హితమైన, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, బభాషే=పలికెను.

తా. మహాప్రభావశాలి యైన లక్ష్మణునితో ఆ తార ఈ విధముగా గొప్ప అర్థము గల వచనము పలికి మదముచేత వ్యాకులమైన నేత్రములు గలదై విలాసపూర్వకముగా తన భర్తకు హితమైన వాక్యమును మరల ఇట్లు పలికెను.

మూ. ఉద్యోగస్తు చిరాజ్ఞప్తః సుగ్రీవేణ నరోత్తమ,
కామస్యాపి విధేయేన తవార్థప్రతిసాధనే. 59

ప్ర. అ. నరోత్తమ!=నరులలో శ్రేష్ఠుడా! కామస్య=కామమునకు, విధేయేనాపి=విధేయుడైనను, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, తవ=నీయొక్క, అర్థప్రతి సాధనే=కార్యమును సాధించుటకై, ఉద్యోగః=ప్రయత్నము, చిరాజ్ఞప్తః=చిరకాలము క్రితమే ఆజ్ఞాపించబడినది.

తా. కామమునకు విధేయు డైనను సుగ్రీవుడు నీ కార్యమును సాధించుటకు తగు ప్రయత్నములు జరుగుటకు చాల కాలమునకు పూర్వమే ఆజ్ఞాపించి యున్నాడు. 59

మూ. ఆగతా హి మహావీర్యా హరయః కామరూపిణః,
కోటీశతసహస్రాణి నానానగనివాసినః. 60

ప్ర. అ. మహావీర్యాః=గొప్ప పరాక్రమముగల, కామరూపిణః= స్వేచ్ఛారూపములు గల, నానానగనివాసినః=అనేక పర్వతములపై నివసించు, కోటీశతసహస్రాణి=కోట్లకొలది వందలకొలది, వేలకొలది, హరయః=వానరులు, ఆగతాః హి=వచ్చినారు కదా?

తా. గొప్ప పరాక్రమము గలవారు, స్వేచ్ఛానుసారముగా రూపములను ధరించ గలవారు, అనేక పర్వతములమీద నివసించువారు అయిన వానరులు కోట్లకొలది, వందలకొలది, వేలకొలది వచ్చి ఉన్నారు కదా? 60

మూ. తదాగచ్ఛ మహాబాహో చారిత్రం రక్షితం త్వయా,
అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనమ్. 61

ప్ర.అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా! తత్=ఆ కారణము వలన, ఆగచ్ఛ=రమ్ము. త్వయా=నీచేత, చారిత్రమ్=మంచి చరిత్ర, రక్షితమ్=రక్షింపబడినది. సతామ్=సత్పురుషులకు, మిత్రభావేన=స్నేహభావముతో, దారావలోకనమ్=మిత్రుని భార్యలను చూచుట, అచ్ఛలమ్=కపటము కానిది (అధర్మము కానిది).

తా. మహాబాహువులు గలవాడా! అందువలన అంతఃపురమునకు రమ్ము; నీవు చరిత్రను రక్షించినావు. (నీవు మంచి నడవడిక కలవాడవు). సత్పురుషులు మైత్రీపురఃసరముగా మిత్రుల భార్యలను చూచుటలో దోషము లేదు. 61

మూ. తారయా చాప్యనుజ్ఞాతస్త్వరయా చాపి చోదితః,
ప్రవివేశ మహాబాహురభ్యన్తరమరిందమః. 62

ప్ర.అ. మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడు, అరిందమః= శత్రుసంహారకుడు అయిన లక్ష్మణుడు, తారయా చాపి=తారచేత కూడ, అనుజ్ఞాతః=అనుమతింపబడినవాడై, త్వరయా చాపి=తొందరచేత కూడ, చోదితః=ప్రేరేపించబడినవాడై, అభ్యన్తరమ్=అంతఃపురమును, ప్రవివేశ= ప్రవేశించెను.

తా. శత్రుసంహారకుడు, మహాబాహువు అయిన లక్ష్మణుడు తార అనుమతించుటచేతను, కార్యమునకు సంబంధించిన తొందర ప్రేరేపించుట చేతను అంతఃపురములోనికి ప్రవేశించెను. 62

మూ. తతః సుగ్రీవమాసీనం కాఞ్చనే పరమాసనే,
మహార్హాస్తరణోపేతే దదర్శాదిత్యసంనిభమ్. 63
దివ్యాభరణచిత్రాఙ్గం దివ్యరూపం యశస్వినమ్,
దివ్యమాల్యామ్బరధరం మహేన్ద్రమివ దుర్జయమ్. 64
దివ్యాభరణమాలాభిః ప్రమదాభిః సమావృతమ్,
సంరబ్ధతరరక్తాక్షో బభూవాన్తకసంనిభః. 65

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహార్హాస్తరణోపేతే=గొప్ప మూల్యము గల ఆస్తరణముతో కూడిన, కాఞ్చనే=బంగారము వికారమైన, పరమాసనే=శ్రేష్ఠమైన ఆసనమునందు,ఆసీనమ్=కూర్చున్నవాడు, ఆదిత్యసంనిభమ్=సూర్యునితో సమానుడు, దివ్యాభరణచిత్రాఙ్గమ్=దివ్యములైన అలంకారములతో చిత్రమైన శరీరము కలవాడు, దివ్యరూపమ్=శ్రేష్ఠమైన రూపము కలవాడు, యశస్వినమ్=కీర్తి గలవాడు, దివ్యమాల్యామ్బరధరమ్=శ్రేష్ఠములైన మాలికలను, వస్త్రములను ధరించినవాడు, మహేన్ద్రమివ=మహేంద్రుడువలె, దుర్జయమ్=జయింప శక్యము కానివాడు, దివ్యా

భరణమాలాభిః=శ్రేష్ఠములైన ఆభరణములు మాలికలు గల, ప్రమదాభిః=స్త్రీలచేత, సమావృతమ్=చుట్టబడి ఉన్నవాడు అయిన, సుగ్రీవమ్=సుగ్రీవుని, దదర్శ=చూచెను. సంరబ్ధతరరక్తాక్షః=ఎక్కువ చలించిన ఎఱ్ఱని నేత్రములు కలవాడై, అన్తకసంనిభః=యమునితో సమానుడు, బభూవ=అయెను.

తా. పిమ్మట ఆ లక్ష్మణుడు అమూల్యమైన ఆస్తరణము కప్పిన బంగారు ఉత్తమాసనమునందు కూర్చున్న, సూర్యుని వంటి కాంతి గల సుగ్రీవుని చూచెను. శ్రేష్ఠమైన రూపము గల అతని శరీరము శ్రేష్ఠములైన అలంకారములతో చిత్రముగా ఉండెను. శ్రేష్ఠములైన పుష్పమాలలను, వస్త్రములను ధరించిన, యశఃశాలియైన ఆ సుగ్రీవుడు మహేంద్రుడు వలె జయింప శక్యము కానివాడు. అతని చుట్టూ దివ్యములైన ఆభరణములు, పుష్పమాలలు ధరించిన స్త్రీలు నిలచి ఉండిరి. అతనిని చూడగానే కోపముచేత కదలుచున్న ఎఱ్ఱనైన నేత్రములతో లక్ష్మణుడు యముడు వలె కనబడెను. 63-65

మూ. రుమాం తు వీరః పరిరభ్య గాఢం
వరాసనస్థో వరహేమవర్ణః,
దదర్శ సౌమిత్రిమదీనసత్త్వం
విశాలనేత్రః స విశాలనేత్రమ్. 66

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. రుమామ్=రుమను, గాఢమ్=గాఢముగా, పరిరభ్య= కౌగలించుకొని, వరాసనస్థః=శ్రేష్ఠమైన ఆసనమునందున్న, వరహేమవర్ణః= శ్రేష్ఠమైన బంగారము వంటి వర్ణము గల, విశాలనేత్రః=విశాలములైన నేత్రములు గల, వీరః=వీరుడైన, సః=ఆ సుగ్రీవుడు, అదీనసత్త్వమ్=దీనము కాని బలము గలవాడు, విశాలనేత్రమ్=విశాలములైవ నేత్రములు గలవాడు అయిన, సౌమిత్రిమ్= లక్ష్మణుని, దదర్శ=చూచెను.

తా. రుమను గాఢముగా కౌగలించుకొని శ్రేష్ఠమైవ ఆసనముపై కూర్చొని యున్న శ్రేష్ఠమైన బంగారము వంటి వర్ణము గల విశాలనేత్రుడైన, వీరుడైన సుగ్రీవుడు, దైన్య మెరుగని బలము గలవాడు, విశాలనేత్రుడు అయిన లక్ష్మణుని చూచెను. 66

*"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ముప్పదిమూడవ సర్గ సమాప్తము.*

## అథ చతుస్త్రింశః సర్గః

(సుగ్రీవుడు లక్ష్మణుని వద్దకు వెళ్లుట. లక్ష్మణుడు ఆతనిని భయపెట్టుట)

మూ. తమప్రతిహతం క్రుద్ధం ప్రవిష్టం పురుషర్షభమ్,
సుగ్రీవో లక్ష్మణం దృష్ట్వా బభూవ వ్యథితేన్ద్రియః. 1

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, అప్రతిహతమ్=అడ్డుకొనబడకుండగా, ప్రవిష్టమ్=లోనికి ప్రవేశించిన, క్రుద్ధమ్=కోపించిన, పురుషర్షభమ్= పురుషశ్రేష్ఠుడైన, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, వ్యథితేన్ద్రియః=వ్యథ చెందిన ఇంద్రియములు కలవాడు, బభూవ=అయెను.

తా. ఎవ్వరిచేతను అడ్డగింపబడక లోనికి ప్రవేశించిన కోపావిష్టుడైన ఆ పురుషశ్రేష్ఠుడైన లక్ష్మణుని చూడగానే సుగ్రీవుని మనస్సు, ఇంద్రియములు చాల వ్యథ చెందెను. 1

మూ. క్రుద్ధం నిఃశ్వసమానం తం ప్రదీప్తమివ తేజసా,
భ్రాతుర్వ్యసనసంతప్తం దృష్ట్వా దశరథాత్మజమ్. 2
ఉత్పపాత హరిశ్రేష్ఠో హిత్వా సౌవర్ణమాసనమ్,
మహామ్మహేన్ద్రస్య యథా స్వలంకృత ఇవ ధ్వజః. 3

ప్ర. అ. క్రుద్ధమ్=కోపించినవాడు, నిఃశ్వసమానమ్=నిట్టూర్చుచున్నవాడు, తేజసా=తేజస్సుతో, ప్రదీప్తమివ=మండుచున్నట్లు ఉన్నవాడు, భ్రాతుః= సోదరుని యొక్క, వ్యసనసంతప్తమ్=దుఃఖముచేత తపింపచేయబడినవాడు అయిన, తమ్=ఆ, దశరథాత్మజమ్=లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, హరిశ్రేష్ఠః= సుగ్రీవుడు, సౌవర్ణమ్=బంగారము వికారమైన, ఆసనమ్=ఆసనమును, హిత్వా=విడచి, మహేన్ద్రస్య=మహేంద్రునియొక్క, స్వలంకృతః=బాగుగా అలంకరించబడిన, మహాన్=గొప్పదైన, ధ్వజః యథా ఇవ=ధ్వజము వలె, ఉత్పపాత=పైకి ఎగిరి దిగెను.

తా. కోపించిన ఆ లక్ష్మణుడు తేజస్సుతో ప్రజ్వలించుచు నిట్టూర్పులు విడుచుచుండెను. అన్నగారికి కలిగిన కష్టములకు బాధ చెంది ఉన్న ఆతనిని చూడగానే సుగ్రీవుడు బంగారు ఆసనమునుండి బాగా అలంకరింపబడిన పెద్ద ఇంద్రధ్వజము వలె లేచి ఎగిరి క్రిందికి దిగెను. 2,3

మూ. ఉత్పతన్తమనూత్పేతూ రుమాప్రభృతయః స్త్రియః,
సుగ్రీవం గగనే పూర్ణం చన్ద్రం తారాగణా ఇవ. 4

ప్ర. అ. రుమాప్రభృతయః=రుమ మొదలైన, స్త్రియః=స్త్రీలు, ఉత్పత

స్తమ్=ఎగిరి లేచుచున్న, సుగ్రీవమ్=సుగ్రీవుని, గగనే= ఆకాశమునందు, పూర్ణమ్=పూర్ణుడైన, చన్ద్రమ్=చంద్రుని, తారాగణా ఇవ=నక్షత్రగణములు వలె, అనూత్పేతుః=అనుసరించి లేచిరి.

తా. సుగ్రీవుడు తొందరగా లేచుట చూచి రుమ మొదలైన స్త్రీలు, ఆకాశములో పూర్ణచంద్రుని అనుసరించి నక్షత్రగణములువలె ఆతని అనుసరించి లేచిరి. 4

మూ. సంరక్తనయనః శ్రీమాన్ సంచచార కృతాఞ్జలిః,
బభూవావస్థితస్తత్ర కల్పవృక్షో మహానివ. 5

ప్ర. అ. సంరక్తనయనః=ఎఱ్ఱనైన నేత్రములు గల, శ్రీమాన్=శ్రీమంతుడైన సుగ్రీవుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, సంచచార=సంచరించెను (లక్ష్మణుని సమీపించెను). మహాన్=గొప్ప, కల్పవృక్షః ఇవ=కల్పవృక్షము వలె, తత్ర=అక్కడ, అవస్థితః=నిలిచినవాడు, బభూవ=ఆయెను.

తా. మదిరామదముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల శ్రీమంతుడైన సుగ్రీవుడు చేతులు జోడించి లక్ష్మణుని సమీపించి, గొప్ప కల్పవృక్షము వలె అక్కడ నిలచెను. 5

మూ. రుమాద్వితీయం సుగ్రీవం నారీమధ్యగతం స్థితమ్,
అబ్రవీల్లక్ష్మణః క్రుద్ధః సతారం శశినం యథా. 6

ప్ర. అ. సతారమ్=నక్షత్రములతో కూడిన, శశినం యథా=చంద్రుడు వలె, రుమాద్వితీయమ్=రుమతో కూడిన, నారీమధ్యగతమ్=స్త్రీల మధ్యయందున్న, స్థితమ్=నిలచి ఉన్న, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, క్రుద్ధః=కోపించిన, లక్ష్మణః=లక్ష్మణుడు, అబ్రవీత్=పలికెను.

తా. నక్షత్రములతో కూడిన చంద్రుడు వలె రుమతో కూడ స్త్రీల మధ్యయందున్న సుగ్రీవుని చూచి లక్ష్మణుడు కోపముతో ఇట్లు పలికెను. 6

మూ. సత్త్వాభిజనసంపన్నః సానుక్రోశో జితేన్ద్రియః,
కృతజ్ఞః సత్యవాదీ చ రాజా లోకే మహీయతే. 7

ప్ర. అ. సత్త్వాభిజనసంపన్నః=బలముతోను ఉత్తమబంధుజనముతోనూ కూడినవాడు, సానుక్రోశః=జాలికలవాడు, జితేన్ద్రియః=జయించబడిన ఇంద్రియములు కలవాడు, కృతజ్ఞః=కృతజ్ఞుడు, సత్యవాదీ చ=సత్యము పలుకువాడు అయిన, రాజా=రాజు,లోకే=లోకమునందు, మహీయతే=పూజింపబడును.

తా. బలము, ఉత్తమబంధుజనము ఉన్నవాడు, జాలి కలవాడు, ఇంద్రియములను జయించినవాడు, కృతజ్ఞుడు, సత్యమునే పలుకువాడు, అయిన

రాజు లోకములో గౌరవమును పొందును. 7

మూ. యస్తు రాజా స్థితోఽధర్మే మిత్రాణాముపకారిణామ్,
మిథ్యా ప్రతిజ్ఞాం కురుతే కో నృశంసతరస్తతః. 8

ప్ర. అ. యః=ఏ, రాజా=రాజు, అధర్మే=అధర్మమునందు, స్థితః=ఉన్నవాడై, ఉపకారిణామ్=ఉపకారము చేసిన వారికి, మిథ్యా=అసత్యమైన, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, కురుతే=చేయునో, తతః=వానికంటె, నృశంసతరః=ఎక్కువ క్రూరుడు, కః=ఎవడు?

తా. ఏ రాజు అధర్మాత్ముడై, ఉపకారము చేసిన మిత్రులకు, సహాయము చేసెద నని అసత్యమైన ప్రతిజ్ఞ చేయునో వానికంటె ఎక్కువ క్రూరుడెవ్వడును ఉండడు. 8

మూ. శతమశ్వానృతే హన్తి సహస్రం తు గవానృతే,
ఆత్మానం స్వజనం హన్తి పురుషః పురుషానృతే. 9

ప్ర. అ.పురుషః=పురుషుడు, అశ్వానృతే=అశ్వనిమిత్తము అసత్య మాడి నప్పుడు, శతమ్=నూరు అశ్వములను, హన్తి=చంపుచున్నాడు. గవానృతే=గోవు నిమిత్తము అసత్యము పలికి నప్పుడు, సహస్రమ్=వెయ్యి ఆవులను చంపు చున్నాడు. పురుషానృతే=పురుషుని విషయమునందు అసత్యము పలికిప్పుడు, ఆత్మానమ్=తనను, స్వజనమ్=స్వజనమును, హన్తి= చంపుచున్నాడు.

తా. అశ్వము విషయమున (అశ్వమును దానము చేసెదను అని మాట ఇచ్చి తప్పుట వంటి) అసత్యమును పలికినవానికి నూరు అశ్వములను చంపిన పాపము వచ్చును. గోవు విషయమునందు అసత్యము పలికినవానికి వేయి గోవులను చంపిన పాపము వచ్చును. పురుషునకు మాట ఇచ్చి తప్పినవానికి తన బంధువులను చంపి, తనను చంపుకొనిన పాపము వచ్చును. 9

మూ. పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతికరోతి యః,
కృతఘ్నః సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర. 10

ప్ర. అ. ప్లవగేశ్వర=సుగ్రీవుడా! పూర్వమ్=ముందు, కృతార్థః= నెరవేరిన తన పని గల, యః=ఎవడు, మిత్రాణామ్=మిత్రులకు, తత్= దానిని(కి), న ప్రతికరోతి=ప్రత్యుపకారము చేయడో, కృతఘ్నః=కృతఘ్నుడైన, సః=అతడు, సర్వభూతానామ్=సకలజనులకు, వధ్యః=వధ్యుడు.

తా. సుగ్రీవా! తన పని ముందు ముగించుకొని సాహాయ్యము చేసిన మిత్రులకు ప్రత్యుపకారము చేయని కృతఘ్నుని అందరూ చంపివేయుదురు.10

మూ. గీతోఽయం బ్రహ్మణా శ్లోకః సర్వలోకనమస్కృతః,
దృష్ట్వా కృతఘ్నం క్రుద్ధేన తన్నిబోధ ప్లవంగమ. 11

ప్ర. అ. ప్లవఙ్గమ=సుగ్రీవుడా! కృతఘ్నమ్=కృతఘ్నుని, దృష్ట్వా= చూచి, క్రుద్ధేన=కోపించిన, బ్రహ్మణా=బ్రహ్మచేత, సర్వలోకనమస్కృతః= సమస్తలోకము చేత నమస్కరించబడిన, అయమ్=ఈ, శ్లోకః=శ్లోకము, గీతః=చదవబడినది. తత్=దానిని, నిబోధ=తెలిసికొనుము.

తా. సుగ్రీవా! కృతఘ్నుని చూచి కోపించిన బ్రహ్మదేవుడు సకలలోకములచేత ఆదరింపబడిన ఒక శ్లోకమును చదివినాడు. దానిని వినుము.

మూ. గోఘ్నే చైవ సురాపే చ చౌరే భగ్నవ్రతే తథా,
నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. 12

ప్ర. అ. గోఘ్నే=గోవును చంపినవానియందు, సురాపే చ=సుర త్రాగినవానియందు, చౌరే=దొంగయందు, తథా=అట్లే, భగ్నవ్రతే=భగ్నమైన వ్రతము కలవానియందు, సద్భిః=సత్పురుషులచేత, నిష్కృతిః=ప్రాయశ్చిత్తము, విహితా=విధింపబడినది. కృతఘ్నే=కృతఘ్నునియందు, నిష్కృతిః= ప్రాయశ్చిత్తము, నాస్తి=లేదు.

తా. గోహత్య చేసినవానికి, సురాపానము చేసినవానికి, దొంగకు, వ్రతభంగము జరిగినవానికి సత్పురుషులు ప్రాయశ్చిత్తములు చెప్పి ఉన్నారు. కాని కృతఘ్నునికి ప్రాయశ్చితము లేదు. 12

మూ. అనార్యస్త్వం కృతఘ్నశ్చ మిథ్యావాదీ చ వానర,
పూర్వం కృతార్థో రామస్య న తత్ ప్రతికరోషి యత్. 13

ప్ర. అ. వానర=సుగ్రీవా! పూర్వమ్=ముందుగా, కృతార్థః=చేయబడిన కార్యము గల, త్వమ్=నీవు, యత్=ఏ కారణమువలన, రామస్య= రామునకు, న ప్రతికరోషి=ప్రత్యుపకారము చేయుటలేదో, తత్=ఆ కారణమువలన, అనార్యః=చెడ్డవాడవు. కృతఘ్నశ్చ=కృతఘ్నుడవు. మిథ్యావాదీ చ=అసత్యముగా మాటలాడుచున్నవాడవు.

తా. సుగ్రీవా! ముందుగా నీ పని పూర్తి చేసికొనిన నీవు ఇప్పుడు రామునకు ప్రత్యుపకారము చేయుటలేదు; నీవు చెడ్డవాడవు; కృతఘ్నుడవు; అసత్యవాదివి. 13

మూ. నను నామ కృతార్థేన త్వయా రామస్య వానర,
సీతాయా మార్గణే యత్నః కర్తవ్యః కృతమిచ్ఛతా. 14

ప్ర.అ. వానర=సుగ్రీవుడా! కృతార్థేన=కృతార్థుడవైన, రామస్య= రామునియొక్క, కృతమ్=కార్యమును, ఇచ్ఛతా=కోరుచున్న, త్వయా= నీచేత, సీతాయాః=సీతయొక్క, మార్గణే=అన్వేషణమునందు, యత్నః= ప్రయత్నము, నను నామ కర్తవ్యః=చేయదగినది కదా!

తా. సుగ్రీవా! నీ కార్యమును పూర్తి చేసికొనిన నీవు రాముని కార్యమును సాధించుటకొరకు సీతాన్వేషణమునకై ప్రయత్నము చేయవలసి ఉన్నది కదా!14

మూ. స త్వం గ్రామ్యేషు భోగేషు సక్తో మిథ్యాప్రతిశ్రవః,
స త్వాం రామో విజానీతే సర్పం మణ్డూకరావిణమ్. 15

ప్ర. అ. మిథ్యాప్రతిశ్రవః=అసత్యమైన ప్రతిజ్ఞ గల, సః త్వమ్=అట్టి నీవు, గ్రామ్యేషు భోగేషు=స్త్రీలతో విహరించుటయందు, సక్తః=ఆసక్తుడవుగా ఉన్నావు. రామః=రాముడు, త్వామ్=నిన్ను, మణ్డూకరావిణమ్=కప్ప కూత గల, సర్పమ్=సర్పమునుగా, న విజానీతే=ఎరుగడు.

తా. నీవు ప్రతిజ్ఞను నిలుపుకొనక స్త్రీలతో కలిసి భోగములు అనుభవించుచున్నావు. నీవు కప్ప కూతలు కూసే సర్ప మని రాముడు ఎరుగడు. 15

మూ. మహాభాగేన రామేణ పాపః కరుణవేదినా,
హరీణాం ప్రాపితో రాజ్యం త్వం దురాత్మా మహాత్మనా. 16

ప్ర. అ. మహాభాగేన=గొప్ప భాగ్యము కలవాడు, మహాత్మనా=మహాత్ముడు, కరుణవేదినా=దయ కలవాడు అయిన, రామేణ=రామునిచేత, పాపః=పాపివి, దురాత్మా=దుష్టబుద్ధివి అయిన, త్వమ్=నీవు, హరీణామ్= వానరులయొక్క, రాజ్యమ్=రాజ్యమును, ప్రాపితః=పొందింపబడినావు.

తా. మహాభాగ్యశాలి, మహాత్ముడు, కరుణాశీలుడు అయిన రాముడు, పాపాత్ముడవు, దుష్టబుద్ధివీ అయిన నిన్ను వానరులకు రాజునుగా చేసినాడు! 16

మూ. కృతం చేన్నాభిజానీషే రాఘవస్య మహాత్మనః,
సద్యస్త్వం నిశితైర్బాణైర్హతో ద్రక్ష్యసి వాలినమ్. 17

ప్ర. అ. త్వమ్=నీవు, మహాత్మనః=మహాత్ముడైన, రాఘవస్య= రాముని యొక్క, కృతమ్=చేయబడిన ఉపకారమును, నాభిజానీషే యది= గుర్తించకపోయినట్లయితే, సద్యః=వెంటనే, నిశితైః=వాడియైన, బాణైః= బాణములచేత, హతః=చంపబడినవాడవై, వాలినమ్=వాలిని, ద్రక్ష్యసే= చూడగలవు.

తా. మహాత్ముడైన రాముడు నీకు చేసిన ఉపకారమును గుర్తు ఉంచుకొని నీ కర్తవ్యమును చేయకపోయినచో ఇప్పుడే వాడియైన బాణములచేత చంపబడిన వాడవై వాలిని చూడగలవు. 17

మూ. న స సంకుచితః పన్థా యేన వాలీ హతో గతః,
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథమన్వగాః. 18

ప్రతిపదార్థతాత్పర్యములకు 30 వ సర్గ 81 వ శ్లోకము చూడుడు.

మూ. న నూనమిక్ష్వాకువరస్య కార్ముకా
చ్చ్యుతాంశ్చ తాన్ పశ్యసి వజ్రసంనిభాన్,
తతః సుఖం నామ విషేవసే సుఖీ
న రామకార్యం మనసాప్యవేక్షసే. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుస్త్రింశః సర్గః.

ప్ర. అ. నూనమ్=నిశ్చయముగా, ఇక్ష్వాకువరస్య=రామునియొక్క, కార్ముకాత్=బాణమునుండి, వజ్రసంనిభాన్=వజ్రముతో సమానములైన, తాన్= ఆ, శరాన్=బాణములను, న పశ్యసి=(నీవు)చూచుటలేదు. తతః= అందువలననే, సుఖీ=సుఖవంతుడవై, సుఖమ్=సుఖమును, నిషేవసే నామ=సేవించుచున్నావు. మనసాపి=మనస్సుచేత కూడ, రామకార్యమ్= రాముని కార్యమును, న అవేక్షసే=చూచుటలేదు.

తా. నీవు నిజముగా రాముని ధనస్సునుండి బయలుదేరిన, వజ్రాయుధమువంటి బాణములను చూడలేదు. అందుచేత నిశ్చింతుడవై సుఖమును అనుభవించుచున్నా మనుకొనుచున్నావు. రాముని కార్యమును గూర్చి మనస్సులో కూడ తలచుటలేదు. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ముప్పదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చత్రింశః సర్గః

(తార యుక్తియుక్తములైన మాటలు చెప్పి లక్ష్మణుని శాంతింపచేయుట)

మూ. తథా బ్రువాణం సౌమిత్రిం ప్రదీప్తమివ తేజసా,
అబ్రవీల్లక్ష్మణం తారా తారాధిపనిభాననా. 1

ప్ర. అ. తథా=అట్లు, బ్రువాణమ్=పలుకుచున్నవాడు, తేజసా= తేజస్సుతో, ప్రదీప్తమివ=మండుచున్నట్లు ఉన్నవాడు అయిన, సౌమిత్రిమ్= సుమిత్రాకుమారుడైన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, తారాధిపనిభాననా= చంద్రుని వంటి ముఖము గల, తారా=తార, అబ్రవీత్=పలికెను.

తా. తేజస్సుతో ప్రజ్వలించుచున్నాడా అన్నట్లున్న సుమిత్రాకుమారుడైన లక్ష్మణుని మాటలు విని చంద్రుని వంటి ముఖము గల తార ఇట్లు పలికెను.1

మూ. నైవం లక్ష్మణ వక్తవ్యో నాయం పరుషమర్హతి,
హరీణామీశ్వరః శ్రోతుం తవ వక్త్రాద్విశేషతః. 2

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణుడా! అయమ్=ఈ, హరీణామీశ్వరః=వానరరాజు, ఏవమ్=ఇట్లు, న వక్తవ్యః=పలకదగినవాడు కాదు. విశేషతః=విశేషించి, తవ=నీయొక్క, వక్త్రాత్=ముఖమునుండి, పరుషమ్=పరుషవాక్యమును, శ్రోతుమ్=వినుటకు, నార్హతి=తగడు.

తా. లక్ష్మణా! వానరరాజైన ఈ సుగ్రీవునితో నీవు ఇట్లు పలుకుట తగదు. ఇతడు విశేషించి నీ నోటినుండి ఇట్టి పరుషవాక్యములు వినుటకు తగినవాడు కాదు. 2

మూ. నైవాకృతజ్ఞః సుగ్రీవో న శఠో నాపి దారుణః,
నైవానృతకథో వీర న జిహ్మశ్చ కపీశ్వరః. 3

ప్ర. అ. వీర=ఓ! వీరుడా! కపీశ్వరః=వానరప్రభువైన, సుగ్రీవః= సుగ్రీవుడు, అకృతజ్ఞః=కృతజ్ఞుడు కానివాడు, న=కాదు. శఠః= రహస్యముగా అపకారము చేసేవాడు, న=కాదు. దారుణః అపి=క్రూరుడు కూడ, న=కాదు. అనృతకథః=అసత్యము మాటలాడువాడు, నైవ=కాదు. జిహ్మః చ=కుటిలస్వభావము కలవాడు కూడ, న=కాదు.

తా. ఓ! వీరుడా! వానరరాజైన ఈ సుగ్రీవుడు కృతజ్ఞత లేనివాడు కాని, శఠుడుగాని, క్రూరుడు గాని, అసత్యము పలుకువాడు గాని, కుటిలస్వభావము

కలవాడు గాని కాదు. 3

మూ. ఉపకారం కృతం వీరో నాప్యయం విస్మృతః కపిః,
రామేణ వీర సుగ్రీవో యదన్యైర్దుష్కరం రణే. 4

ప్ర. అ. వీర=వీరుడా! కపిః=వానరుడైన, అయం సుగ్రీవః=ఈ సుగ్రీవుడు, రణే=యుద్ధమునందు, యత్=ఏది, అన్యైః=ఇతరులచేత, దుష్కరమ్=చేయ శక్యము కానిదో అట్టి, రామేణ=రామునిచేత, కృతమ్= చేయబడిన, ఉపకారమ్=ఉపకారమును, న విస్మృతః అపి=మరువలేదు కూడా.

తా. యుద్ధములో ఇతరు లెవ్వరూ చేయజాలని ఉపకారము రాముడు చేసి ఉన్నాడు. ఆ ఉపకారమును సుగ్రీవుడు మరచిపోలేదు. 4

మూ. రామప్రసాదాత్కీర్తిం చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
ప్రాప్తవానిహ సుగ్రీవో రుమాం మాం చ పరంతప. 5

ప్ర. అ. పరంతప=శత్రువులను బాధించువాడా! సుగ్రీవః=సుగ్రీవుడు, ఇహ=ఇక్కడ, రామప్రసాదాత్=రాముని అనుగ్రహమువలన, కీర్తిం చ= కీర్తిని, శాశ్వతమ్=శాశ్వతమైన, కపిరాజ్యం చ=వానరరాజ్యమును, రుమామ్=రుమను, మాం చ=నన్ను, ప్రాప్తవాన్=పొందినాడు.

తా. శత్రుసంహారకుడవైన లక్ష్మణా! రాముని అనుగ్రహమువల్లనే సుగ్రీవుడు ఇప్పుడు కీర్తిని, శాశ్వతమైన వానరరాజ్యమును, రుమను, నన్ను పొందగలిగినాడు. 5

మూ. సుదుఃఖశయితః పూర్వం ప్రాప్యేదం సుఖముత్తమమ్,
ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో యథా మునిః. 6

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, సుదుఃఖశయితః=చాల దుఃఖముతో శయనించిన ఇతడు, ఉత్తమమ్=ఉత్తమమైన, ఇదమ్=ఈ, సుఖమ్=సుఖమును, ప్రాప్య=పొంది, విశ్వామిత్రః మునిః యథా=విశ్వామిత్రముని వలె, ప్రాప్తకాలమ్=వచ్చిన సమయమును (సమయోచితమైన కార్యమును) న జానీతే= తెలిసికొనుట లేదు.

తా. పూర్వము సుఖముగా నిద్ర కూడ ఎరుగని ఈ సుగ్రీవుడు ఉత్తమమైన ఈ సుఖము లభించగానే, విశ్వామిత్రముని వలె, సమయము వచ్చిన దని గుర్తించుట లేదు. 6

మూ. ఘృతాచ్యాం కిల సంసక్తో దశ వర్షాణి లక్ష్మణ,
అహోఽమన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః. 7

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! ధర్మాత్మా=ధర్మాత్ముడైన, మహామునిః= మహామునియైన, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, దశ=పది, వర్షాణి= సంవత్సరము

లను, ఘృతాచ్యామ్=ఘృతాచి అను అప్సరః స్త్రీ యందు, సంసక్తః= ఆసక్తుడై, అహః=ఒక్కరోజునుగా, అమన్యత కిల=తలచెనట.

తా. లక్ష్మణా! ధర్మాత్ముడు, మహామునీ అయిన విశ్వామిత్రుడు పది సంవత్సరములు ఘృతాచియందు ఆసక్తి కలవాడై యుండి ఆ కాలమును ఒక్క రోజుగా తలచెనట.

వి. బాలకాండలోని విశ్వామిత్రోపాఖ్యానములో మేనక అని ఉన్నది గాన ఇక్కడ ఘృతాచి అనగా మేనక అని గ్రహించవలె నని కొందరు వ్యాఖ్యాతలు, విశ్వామిత్రుడు ఘృతాచియందు కూడ సక్తుడైనట్లు దీనిని బట్టి గ్రహించవలె నని మరికొందరు వ్యాఖ్యాతలు వ్రాసినారు. 7

మూ. స హి ప్రాప్తం న జానీతే కాలం కాలవిదాం వరః,
విశ్వామిత్రో మహాతేజాః కిం పునర్యః పృథగ్ జనః. 8

ప్ర. అ. కాలవిదామ్=కాలమును ఎరిగినవారిలో, వరః=శ్రేష్ఠుడు, మహాతేజాః= గొప్ప తేజస్సు కలవాడు అయిన, సః=ఆ, విశ్వామిత్రః=విశ్వామిత్రుడు కూడ, ప్రాప్తకాలమ్=వచ్చిన సమయమును, న జానీతే=ఎరుగలేదు. యః=ఎవడు, పృథగ్ జనః=సామాన్యజనుడో అతడు, కిం పునః=చెప్పనేల?

తా. కాలవేత్తలలో శ్రేష్ఠుడు, గొప్ప తేజస్సు కలవాడు అయిన ఆ విశ్వామిత్రుడే కాలమును గుర్తించజాలకపోయినా డనగా సామాన్యుని విషయము చెప్పవలెనా? 8

మూ. దేహధర్మగతస్యాస్య పరిశ్రాన్తస్య లక్ష్మణ,
అవితృప్తస్య కామేషు రామః క్షన్తు మిహార్హతి. 9

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! దేహధర్మగతస్య=దేహధర్మమును అనుసరించుచున్నవాడు, పరిశ్రాన్తస్య=అలసి ఉన్నవాడు, కామేషు=కామముల యందు, అవితృప్తస్య=తృప్తి చెందనివాడు అయిన, అస్య=ఈతని విషయమున, రామః=రాముడు, ఇహ=ఇప్పుడు, క్షన్తుమ్=క్షమించుటకు, అర్హతి=తగిఉన్నాడు.

తా. లక్ష్మణా! దేహధర్మమును అనుసరించుచు, కామముల విషయమున తృప్తి చెందక, అలసి ఉన్న ఈతనిని ఇప్పుడు రాముడు క్షమించవలెను. 9

మూ. న చ రోషవశం తాత గన్తుమర్హసి లక్ష్మణ,
నిశ్చయార్థమవిజ్ఞాయ సహసా ప్రాకృతో యథా. 10

ప్ర. అ. తాత = తండ్రీ! లక్ష్మణ =లక్ష్మణా! నిశ్చయార్థమ్=యథార్థ మును, అవిజ్ఞాయ =తెలిసికొనకుండగా, ప్రాకృతో యథా =సామాన్యపురుషుడు వలె, సహసా = తొందరగా, రోషవశమ్ = రోషవశమును, గన్తుమ్ = పొందుటకు, న అర్హసి = తగవు.

తా. నాయనా! లక్ష్మణా! యథార్థమును తెలిపికొనకుండగా, సామాన్యమానవుడు వలె తొందరపడి రోషమునకు వశుడవు కాకుము. 10

మూ. సత్త్వయుక్తా హి పురుషాస్త్వద్విధాః పురుషర్షభ,
అవిమృశ్య న రోషస్య సహసా యాన్తి వశ్యతామ్. 11

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! సత్త్వయుక్తాః =ఉత్తమమైన బుద్ధి గల, త్వద్విధాః =నీవంటి, పురుషాః= పురుషులు, అవిమృశ్య = అలోచించకుండగా, సహసా =శీఘ్రముగా, రోషస్య = రోషమునకు, వశ్యతామ్ =వశులగుటను, న యాన్తి = పొందరు.

తా. పురుషశ్రేష్ఠుడా! బుద్ధిమంతులైన నీ వంటి పురుషులు విమర్శ లేకుండగా తొందరపడి కోపమునకు వశులు కారు కదా? 11

మూ. ప్రసాదయే త్వాం ధర్మజ్ఞ సుగ్రీవార్థం సమాహితా,
మహాన్ రోషసముత్పన్నః సంరమ్భస్త్యజ్యతామయమ్. 12

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములను ఎరిగినవాడా! సమాహితా = ఏకాగ్రచిత్తము గలదాననై, సుగ్రీవార్థమ్ =సుగ్రీవుని నిమిత్తము, త్వామ్= నిన్ను, ప్రసాదయే = బ్రతిమాలుచున్నాను. రోషసముత్పన్నః =రోషమువలన కలిగిన, మహాన్ =గొప్పదైన, అయమ్ =ఈ, సంరమ్భః =తొందర, త్యజ్యతామ్ =విడువబడుగాక.

తా. ధర్మములు తెలిసిన ఓ! లక్ష్మణా ! నేను సుగ్రీవునికొరకు ఏకాగ్రచిత్తురాలనై నిన్ను వేడుకొనుచున్నాను. రోషమువలన పుట్టిన ఈ గొప్ప ఆవేశమును విడువుము. 12

మూ. రుమాం మాం చాఙ్గదం రాజ్యం ధనధాన్యవసూని చ,
రామప్రియార్థం సుగ్రీవస్త్యజేదితి మతిర్మమ. 13

ప్ర. అ. సుగ్రీవః =సుగ్రీవుడు, రామప్రియార్థమ్ =రాముని ప్రియముకొరకు, రుమామ్ =రుమను, మాం చ = నన్ను, అఙ్గదమ్ =అంగదుని, రాజ్యమ్ = రాజ్యమును, ధనధాన్యవసూని చ = ధనమును, ధాన్యమును, రత్నములను, త్యజేత్ = విడచును, ఇతి =అని, మమ = నాయొక్క, మతిః =బుద్ధి.

తా. సుగ్రీవుడు రామునకు ప్రియము చేయుటకు రుమను, నన్ను, అంగదుని, రాజ్యమును, ధనధాన్యములను, రత్నములను కూడ త్యజించు నని నా అభిప్రాయము. 13

మూ. సమావేష్యతి సుగ్రీవః సీతయా సహ రాఘవమ్,
శశాఙ్కమివ రోహిణ్యా హత్వా తం రాక్షసాధమమ్. 14

ప్ర. అ. సుగ్రీవః =సుగ్రీవుడు, రాక్షసాధమమ్=రాక్షసులలో అధముడైన, తమ్ = ఆ రావణుని , హత్వా =చంపి, శశాఙ్కమ్ =చంద్రుని, రోహిణ్యా ఇవ =రోహిణితో వలె, రాఘవమ్ =రాముని, సీతయా సహ =సీతతో కూడా, సమానేష్యతి = చేర్చగలడు.

తా. సుగ్రీవుడు రాక్షసాధముడైన రావణుని చంపి చంద్రుని రోహిణితో చేర్చినట్లు రాముని సీతతో చేర్చగలడు. 14

మూ. శతకోటిసహస్రాణి లఙ్కాయాం కిల రక్షసామ్,
అయుతాని చ షట్త్రింశత్సహస్రాణి శతాని చ. 15

ప్ర. అ. లఙ్కాయామ్ = లంకయందు, రక్షసామ్ =రాక్షసులయొక్క, శతకోటిసహస్రాణి = నూరుకోట్ల సహస్రములు, షట్ త్రింశత్ =ముప్పది ఆరు, అయుతాని చ = అయుతములు (పదివేలు), సహస్రాణి = వేలు, శతాని చ =వందలు, (ఉన్నవట).

తా. లంకలో నూరుకోట్ల వేల రాక్షసులు, ముప్పది ఆరు అయుతముల, వేల, వందల సంఖ్యలో రాక్షసు లున్నారట. 15

మూ. అహత్వా తాంశ్చ దుర్ధర్షాన్ రాక్షసాన్ కామరూపిణః,
అశక్యం రావణం హన్తుం యేన సా మైథిలీ హృతా. 16

ప్ర. అ. దుర్ధర్షాన్ =ఎదిరింప శక్యము కాని, కామరూపిణః = స్వేచ్ఛారూపములు గల, తాన్=ఆ, రాక్షసాన్ = రాక్షసులను, అహత్వా =చంపకుండగా, యేన=ఎవనిచేత, సా =ఆ, మైథిలీ =సీత, హృతా =హరించబడినదో, రావణమ్= అట్టి రావణుని, హన్తుమ్= చంపుటకు, అశక్యమ్ = శక్యము కాదు.

తా. ఇచ్ఛానుసారము రూపములు ధరించగలిగిన, ఎదిరింప శక్యము కానివారైన ఆ రాక్షసులను చంపకుండగా సీతను హరించిన రావణుని చంపుట శక్యముకాదు. 16

మూ. తే న శక్యా రణే హన్తుమసహాయేన లక్ష్మణ,
రావణః క్రూరకర్మా చ సుగ్రీవేణ విశేషతః. 17

ప్ర. అ. లక్ష్మణ =లక్ష్మణా, తే = ఆ రాక్షసులు, క్రూరకర్మా =క్రూరమైన కర్మ గల, రావణః=రావణుడు, అసహాయేన = సహాయుడు లేని రామునిచేత, రణే = యుద్ధమునందు, హన్తుమ్ = చంపుటకు, న శక్యాః = శక్యమైనవారు కాదు. సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, విశేషతః =విశేషించి, (ప్రయోజన మున్నది.)

తా. లక్ష్మణా! ఇతరుల సాహాయ్యము లేకుండా రాముడు ఆ రాక్షసులను, క్రూరకర్మలు చేయు ఆ రావణుని చంపజాలడు. అందుచేత

సుగ్రీవుని సాహాయ్యము అవశ్యకము.

వి. దీనికి "ఎవరి సాహాయ్యమూ లేని సుగ్రీవుడు రాక్షసులను, రావణుని చంపజాలడు"అని కొందరు వ్యాఖ్యానించిరి. రామునికి సుగ్రీవుని సాహాయ్యము చాల అవసర మని చెప్పుట తార అభిప్రాయము గాన తిలకవ్యాఖ్యాను సారము పైన అర్థము చూపబడినది. ప్రాచ్యప్రతిలో పాఠము కూడ దానికి అనుగుణముగా ఉన్నది --

"న చ శక్యా రణే హన్తుమసహాయేన రాక్షసాః,
రామేణ క్రూరకర్మాణః సుగ్రీవసహితేన వై."

కాని 19 వ శ్లోకమును కూడ దృష్టిలో ఉంచుకొని అర్థము చెప్పినచో "సాహాయ్యము లేకుండ రాముడు ఆ రాక్షసులను చంపజాలడు. సుగ్రీవుడు అసలే చంపజాలడు. అందుచే సాహాయ్యము కొరకై సుగ్రీవుడు కోట్లకొలది వానరులను పిలిపించుచున్నాడు" అని భావము చెప్పినచో బాగుండు నవి తోచును. 17

మూ. ఏవమాఖ్యాతవాన్ వాలీ స హ్యభిజ్ఞో హరీశ్వరః,
ఆగమస్తు న మే వ్యక్తః శ్రవాత్తస్య బ్రవీమ్యహమ్. 18

ప్ర. అ. వాలీ = వాలి, ఏవమ్=ఇట్లు, ఆఖ్యాతవాన్ = చెప్పినాడు. సః = ఆ, హరీశ్వరః = వానరరాజు, అభిజ్ఞః హి =ఈ విషయములు తెలిసినవాడు కదా. ఆగమః = ఇంతమంది రాక్షసుల ప్రాప్తి, మే=నాకు, న వ్యక్తః = స్పష్టము కాదు. తస్య = వాలియొక్క, శ్రవాత్ =వినుటవలన, అహమ్ =నేను, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. రావణుని బలమును గూర్చి నాకు వాలి చెప్పి ఉన్నాడు. వానరరాజైన ఆతడు అన్ని విషయములు తెలిసినవాడు కదా? ఇంత రాక్షస బలము రావణునకు ఎట్లు లభించినదో నాకు తెలియదు. నేను వాలినుండి విన్నది మాత్రమే చెప్పుచున్నాను. 18

మూ. త్వత్సహాయనిమిత్తం హి ప్రేషితా హరిపుఙ్గవాః,
ఆనేతుం వానరాన్యుద్ధే సుబహూన్ హరిపుఙ్గవాన్. 19

ప్ర. అ. ("తత్సహాయ" అను ప్రాచ్యపాఠము బాగున్నది.). తత్ =ఆ కారణమువలన, యుద్ధే= యుద్ధమునందు, సహాయనిమిత్తమ్ = సహాయులుగా ఉండుటకొరకు, హరిపుఙ్గవాన్ = వానరులలో శ్రేష్ఠులైన, సుబహూన్ = చాలమంది, వానరాన్ = వానరులను, ఆనేతుమ్ = తీసికొనివచ్చుటకు, హరిపుఙ్గవాః = వానరులు, ప్రేషితాః=పంపబడినారు కదా.

తా. అందుచేత యుద్ధములో సాహాయ్యము చేయుటకై చాలమంది

వానరశ్రేష్ఠులను తీసికొని వచ్చుటకు వానరులు పంపబడినారు. 19

మూ. తాంశ్చ ప్రతీక్షమాణోఽయం విక్రాన్తః సుమహాబలాన్,
రాఘవస్యార్థసిద్ధ్యర్థం న నిర్యాతి హరీశ్వరః. 20

ప్ర. అ. విక్రాన్తః = పరాక్రమవంతుడైన, అయమ్= ఈ, హరీశ్వరః = సుగ్రీవుడు, మహాబలాన్ = గొప్ప బలము గల, తాన్ = ఆ వానరులను, రాఘవస్య = రామునియొక్క, అర్థసిద్ధ్యర్థమ్ = కార్యముయొక్క సిద్ధికొరకు, ప్రతీక్షమాణః=నిరీక్షించుచు, న నిర్యాతి = బయలుదేరి వచ్చుట లేదు.

తా. పరాక్రమవంతుడైన ఈ సుగ్రీవుడు రాముని కార్యము సిద్ధించుటకై మహాబలశాలులైన ఆ వానరుల రాకకోసమై నిరీక్షించుచున్నాడు. అందుచేతనే రామునివద్దకు రాలేదు. 20

మూ. కృతా సుసంస్థా సౌమిత్రే సుగ్రీవేణ పురా యథా,
అద్య తైర్వానరైః సర్వైరాగన్తవ్యం మహాబలైః. 21

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, పురా =ముందుగానే, సుసంస్థా = మంచి ఏర్పాటు, యథా = ఎట్లు, కృతా = చేయబడినదో, దాని ప్రకారము, మహాబలైః =గొప్పబలము గల, సర్వైః = సమస్తమైన, తైః వానరైః =ఆ వానరులచేత, అద్య =నేడు, ఆగన్తవ్యమ్ = రావలసి ఉన్నది.

తా. లక్ష్మణా! ఇంతకు పూర్వమే సుగ్రీవుడు బాగుగా చేసిన ఏర్పాటు ప్రకారము మహాబలవంతులైన ఆ వానరు లందరు ఈ రోజునే రావలసి ఉన్నది. 21

మూ. ఋక్షకోటిసహస్రాణి గోలాఙ్గూలశతాని చ,
అద్య త్వాముపయాస్యన్తి జహి కోపమరిందమ. 22
కోట్యోఽనేకాస్తు కాకుత్స్థ కపీనాం దీప్తతేజసామ్.

ప్ర. అ. అరిందమ=శత్రుసంహారకుడా! కాకుత్స్థ = లక్ష్మణా! అద్య =ఈ రోజునే, ఋక్షకోటిసహస్రాణి =భల్లూకముల వేయికోట్లు, గోలాఙ్గూలశతాని =కొండముచ్చుల వందలు లేదా వందకోట్లు, దీప్తతేజసామ్=ప్రకాశించుచున్న తేజస్సు గల, కపీనామ్=వానరులయొక్క, అనేకాః=అనేకమైన, కోట్యః=కోట్లు, త్వామ్=నిన్ను, ఉపయాస్యన్తి=చేరగలరు. కోపమ్ =కోపమును, జహి =చంపుము (విడువుము).

తా. శత్రుసంహారకుడవైన లక్ష్మణా! కోట్లకొలది భల్లూకములు, కొండముచ్చులు, గొప్పతేజస్సు గల వానరులు ఈ రోజునే నీవద్దకు రాగలరు. కోపమును విడువుము. 22

మూ. తవ హి ముఖమిదం నిరీక్ష్య కోపాత్
క్షతజసమే నయనే నిరీక్షమాణాః,
హరివరవనితా న యాన్తి శాన్తిం
ప్రథమభయస్య హి శఙ్కితాః స్మ సర్వాః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చత్రింశః సర్గః.

ప్ర. అ. హరివరవనితాః = సుగ్రీవుని స్త్రీలు, తవ =నీయొక్క, ఇదమ్ =ఈ , ముఖమ్ =ముఖమును, నిరీక్ష్య = చూచి, కోపాత్ = కోపమువలన, క్షతజసమే = రక్తముతో సమానములైన, నయనే = నేత్రములను, నిరీక్షమాణాః = చూచుచున్నవారై, శాన్తిమ్ = శాంతిని, న యాన్తి = పొందుట లేదు. సర్వాః = మేమందరమూ, ప్రథమభయస్య = మొదటిదైన వాలివధరూపమైన భయమునకు, శఙ్కితాః = శంకించుచున్నవారము, స్మ = అయి ఉన్నాము.

తా. సుగ్రీవుని అంతఃపురస్త్రీ లందరూ నీ ముఖమును, కోపముచేత రక్తము వలె ఎఱ్ఱగా ఉన్న నీ నేత్రములను చూచి మనస్సులో శాంతిని పొందజాలకున్నారు. మేమందరము ఇంతకు పూర్వము వాలికి జరిగిన దానివంటిదే సుగ్రీవునకు జరుగునేమో అని భయపడుచున్నాము. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ముప్పదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్‌త్రింశః సర్గః

[తన అల్పత్వమును, రాముని గొప్పతనమును ప్రతిపాదించుచు సుగ్రీవుడు లక్ష్మణుని క్షమింపు మని వేడుట; లక్ష్మణుడు ఆతనిని ప్రశంసించుచు తనతో రమ్మని ఆతనిని ఆదేశించుట]

మూ. ఇత్యుక్తస్తారయా వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్,
మృదుస్వభావః సౌమిత్రిః ప్రతిజగ్రాహ తద్వచః. 1

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, తారయా =తారచేత, ప్రశ్రితమ్ =వినయముతో కూడినది, ధర్మసంహితమ్ =ధర్మసంమతము అయిన, వాక్యమ్ =వాక్యమును, ఉక్తః =పలకబడిన, మృదుస్వభావః = మెత్తని స్వభావము గల, సౌమిత్రిః = లక్ష్మణుడు, తత్ =ఆ, వచః =వచనమును, ప్రతిజగ్రాహ = అంగీకరించెను.

తా. తార వినయపూర్వకముగా పలికిన ధర్మసంమతమైన ఆ మాటలను మెత్తని స్వభావము గల లక్ష్మణుడు అంగీకరించెను. 1

మూ. తస్మిన్ ప్రతిగృహీతే తు వాక్యే హరిగణేశ్వరః,
లక్ష్మణాత్సుమహత్త్రాసం వస్త్రం క్లిన్నమి వాత్యజత్. 2

ప్ర. అ. తస్మిన్ = ఆ, వాక్యే =వాక్యము, ప్రతిగృహీతే = గ్రహింపబడిన దగుచుండగా, హరిగణేశ్వరః = సుగ్రీవుడు, లక్ష్మణాత్ = లక్ష్మణునినుండి, సుమహత్ = చాల గొప్పదైన, త్రాసమ్ = భయమును, క్లిన్నమ్ = తడిసిన, వస్త్రమివ = వస్త్రమును వలె, అత్యజత్ = విడచెను.

తా. లక్ష్మణుడు తార మాటలను అంగీకరించిన పిమ్మట సుగ్రీవుడు లక్ష్మణునివలన కలిగిన గొప్ప భయమును తడిసిన వస్త్రమును వలె విడచెను.2

మూ. తతః కణ్ఠగతం మాల్యం చిత్రం బహుగుణం మహత్,
చిచ్ఛేద విమదశ్చాసీత్సుగ్రీవో వానరేశ్వరః. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వానరేశ్వరః = వానరరాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు, కణ్ఠగతమ్ =కంఠమునం దున్న, చిత్రమ్ = విచిత్రమైన, బహుగుణమ్ = చాలా పేటలు గల, మహత్ =గొప్పదైన, మాల్యమ్ = మాలల సముదాయమును, చిచ్ఛేద = త్రెంపివేసెను. విమదశ్చ = మదము లేనివాడు, ఆసీత్ =ఆయెను.

తా. పిమ్మట సుగ్రీవుడు తన కంఠమునం దున్న చాల పేటలతో విచిత్రమైన, పెద్ద మాలికల సముదాయమును త్రెంపివేసెను. ఆతని మదము తొలగిపోయెను. 3

మూ. స లక్ష్మణం భీమబలం సర్వవానరసత్తమః,
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం సుగ్రీవః సంప్రహర్షయన్. 4

ప్ర. అ. సర్వవానరసత్తమః = సమస్తవానరులలో ఉత్తముడైన, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, భీమబలమ్ = భయంకరమైన బలము గల, లక్ష్మణమ్ = లక్ష్మణుని, సంప్రహర్షయన్ = సంతోషపెట్టుచు, ప్రశ్రితమ్ = వినయ పూర్వకమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వానరు లందరిలో ఉత్తముడైన ఆ సుగ్రీవుడు భయంకరమైన బలము గల లక్ష్మణుని సంతోషపెట్టుచు వినయపూర్వకముగా ఇట్లు పలికెను.4

మూ. ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
రామప్రసాదాత్సౌమిత్రే పునశ్చాప్తమిదం మయా. 5

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! ప్రణష్టా = నశించిన, శ్రీశ్చ = లక్ష్మియు, కీర్తిశ్చ =కీర్తి, శాశ్వతమ్ = శాశ్వతమైన, కపిరాజ్యం చ =వానరరాజ్యము, ఇదమ్ =ఇదంతా, రామప్రసాదాత్ = రాముని అనుగ్రహమువలన, మయా = నాచేత, పునః = మరల, ఆప్తమ్ = పొందబడినది.

తా. లక్ష్మణా! నేను రాముని అనుగ్రహముచేత శాశ్వతమైన వానరరాజ్యమును, పోయిన ఐశ్వర్యమును, కీర్తిని మరల పొందితిని. 5

మూ. కః శక్తః తస్య దేవస్య ఖ్యాతస్య స్వేన కర్మణా,
తాదృశం ప్రతికుర్వీత అంశేనాపి నృపాత్మజ. 6

ప్ర. అ. నృపాత్మజ = రాజకుమారా! స్వేన = తన సంబంధమైన, కర్మణా = కర్మచేత, ఖ్యాతస్య = ప్రసిద్ధుడైన, దేవస్య = ప్రభువైన, తస్య = ఆ రామునకు, శక్తః =సమర్థుడైన, కః =ఎవడు, అంశేనాపి = కొంచెమైనను, తాదృశమ్ = అట్టి ఉపకారమును, ప్రతికుర్వీత = తిరిగి చేయగలడు?

తా. ఓ! రాజకుమారా! తన పనులచేత ప్రసిద్ధుడైన ప్రభువైన ఆ రామునకు అట్టి ఉపకారమునకు ప్రత్యుపకారముగా కొంచెమైనను ఎవడు చేయగలడు? 6

మూ. సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతి చ రావణమ్,
సహాయమాత్రేణ మయా రాఘవః స్వేన తేజసా. 7

ప్ర. అ. ధర్మాత్మా రాఘవః =ధర్మాత్ముడైన రాముడు, సహాయమాత్రేణ

= కేవలము సహాయుడుగా ఉన్న, మయా = నాతో, స్వేన తేజసా = తన తేజస్సుచేతనే, సీతామ్ = సీతను, ప్రాప్స్యతి =పొందగలడు. రావణమ్ =రావణుని, వధిష్యతి చ = చంపగలడు.

తా. ధర్మాత్ముడైన రాముడు నేను కేవలము సహాయుడుగా ఉండగా తన తేజస్సుచేతనే సీతను పొందగలడు. రావణుని చంపగలడు. 7

మూ. సహాయకృత్యం కిం తస్య యేన సప్త మహాద్రుమాః,
గిరిశ్చ వసుధా చైవ బాణేనైకేన దారితాః. 8

ప్ర. అ. యేన = ఏ రామునిచేత, సప్త = ఏడు, మహాద్రుమాః = మహావృక్షములు, గిరిశ్చ = పర్వతము, వసుధా చైవ = భూమి, ఏకేన = ఒక, బాణేన = బాణముచేత, దారితాః = చీల్చబడినవో, తస్య = ఆ రామునకు, సహాయకృత్యమ్ = సహాయునివలన పని , కిమ్ = ఏమి?

తా. ఒకే బాణముచేత ఏడు మహావృక్షములను, పర్వతమును, భూమిని చీల్చిన రామునకు ఇతరుల సహాయ మెందుకు? 8

మూ. ధనుర్విస్ఫారయాణస్య యస్య శబ్దేన లక్ష్మణ,
సశైలా కమ్పితా భూమిః సహాయైః కిం ను తస్య వై. 9

ప్ర. అ. లక్ష్మణ = ఓ! లక్ష్మణా! ధనుః = ధనస్సును, విస్ఫారయాణస్య = చరచుచున్న, యస్య = ఏ రామునియొక్క, శబ్దేన = శబ్దముచేత, సశైలా=పర్వతములతో కూడిన, భూమిః = భూమి, కమ్పితా = కంపింప చేయబడినదో, తస్య = ఆతనికి, సహాయైః = సహాయులచేత, కిం = ఏమి ప్రయోజనము?

తా. ఓ! లక్ష్మణా! ఏ రాముడు ధనుస్సును చరువగా ఆ శబ్దముచేత, పర్వతములతో కూడిన భూమి కూడ కంపించినదో, అట్టి రామునకు సహాయము చేయువారు ఎందుకు? 9

మూ. అనుయాత్రాం నరేన్ద్రస్య కరిష్యేఽహం నరర్షభ,
గచ్ఛతో రావణం హన్తుం వైరిణం సపురస్సరమ్. 10

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడవైన ఓ లక్ష్మణా! సపురస్సరమ్ =ముందు నడిచే వారితో కూడిన, వైరిణమ్ = శత్రువైన, రావణమ్ =రావణుని, హన్తుమ్ =చంపుటకొరకు, గచ్ఛతః = వెళ్ళుచున్న, నరేన్ద్రస్య = నరేంద్రుడైన రామునకు, అహమ్ = నేను, అనుయాత్రామ్ = అనుసరించి యాత్రను, కరిష్యే =చేయుగలను.

తా. లక్ష్మణా! సైన్యములతో కూడిన శత్రువైన రావణుని సంహరించుటకు, రాముడు వెళ్ళుచుండగా నేను కేవలము అతని వెనుక వెళ్లెదను. 10

మూ. యది కిఞ్చిదతిక్రాన్తం విశ్వాసాత్ప్రణయేన వా,
ప్రేష్యస్య క్షమితవ్యం మే న కశ్చి న్నాపరాధ్యతి. 11

ప్ర. అ. విశ్వాసాత్ = విశ్వాసమువలనగాని, ప్రణయేన వా = ప్రేమచేతగాని, కిఞ్చిత్ = ఏదైన, అతిక్రాన్తం యది = అతిక్రమింపబడినట్లైతే, ప్రేష్యస్య =భృత్యుడనైన, మే = నాయొక్క ఆ కార్యము, క్షమితవ్యమ్ = క్షమింప దగినది. కశ్చిత్ =ఎవడు, నాపరాధ్యతి ఇతి న = అపరాధము చేయడు అన్న మాట లేదు కదా!

తా. విశ్వాసమువలన గాని, స్నేహముచేత గాని నేను ఏదైన అపరాధము చేసినచో భృత్యుడనైన నన్ను క్షమించవలెను. అపరాధమును చేయనివాడు ఎవడూ ఉండడు కదా! 11

మూ. ఇతి తస్య బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
అభవల్లక్ష్మణః ప్రీతః ప్రేమ్ణా చేదమువాచ హ. 12

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య =ఆ, సుగ్రీవస్య = సుగ్రీవుడు, ఇతి = ఇట్లు, బ్రువాణస్య = పలుకుచుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రీతః అభవత్ = సంతోషించెను. ప్రేమ్ణా = ప్రేమతో, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. మహాత్ముడైన సుగ్రీవుడు ఇట్లు పలుకుచుండగా లక్ష్మణుడు సంతోషించి ప్రేమతో ఇట్లు పలికెను. 12

మూ. సర్వథా హి మమ భ్రాతా సనాథో వానరేశ్వర,
త్వయా నాథేన సుగ్రీవ ప్రశ్రితేన విశేషతః. 13

ప్ర. అ. వానరేశ్వర! =ఓ! వానరరాజా! సుగ్రీవ = సుగ్రీవుడా! నాథేన=రక్షకుడవు, విశేషతః=విశేషించి, ప్రశ్రితేన = వినయవంతుడవు అయిన, త్వయా = నీ చేత, మమ = నాయొక్క, భ్రాతా =సోదరుడు, సర్వథా = అన్ని విధముల, సనాథః హి = మంచి రక్షకుడు కలవాడు కదా!

తా. ఓ! వానరరాజా! రక్షకుడవు, విశేషించి వినయవంతుడవు అయిన నీవు ఉండుటచే నా సోదరుడు అన్ని విధముల మంచి రక్షకుడు కలవాడుగా ఉన్నాడు. 13

మూ. యస్తే ప్రభావః సుగ్రీవ యచ్చ తే శౌచమీదృశమ్,
అర్హస్త్వం కపిరాజ్యస్య శ్రియం భోక్తుమనుత్తమామ్. 14

ప్ర. అ. సుగ్రీవ!= ఓ! సుగ్రీవుడా! తే=నీయొక్క, యః =ఏ, ప్రభావః= ప్రభావ మున్నదో, ఈదృశమ్ = ఇట్టి, యత్=ఏ, శౌచం చ =పరిశుద్ధత్వము

ఉన్నదో, వీటిచేత, త్వమ్ =నీవు, కపిరాజ్యస్య = వానరరాజ్యమునకు, అనుత్తమామ్ = శ్రేష్ఠమైన, శ్రియమ్=ఐశ్వర్యమును, భోక్తుమ్ =అనుభవించుటకు, అర్హః =తగినవాడవు.

తా. ఓ! సుగ్రీవా ! నీకు ఇంతటి ప్రభావము, ఇట్టి పరిశుద్ధత్వము ఉన్నవి. అందుచేత నీవు ఈ వానరరాజ్యమునకు, ఉత్తమమైన ఐశ్వర్యమునకు తగినవాడవు. 14

మూ. సహాయేన తు సుగ్రీవ! త్వయా రామః ప్రతాపవాన్,
వధిష్యతి రణే శత్రూనచిరాన్నాత్ర సంశయః. 15

ప్ర. అ. సుగ్రీవ = ఓ! సుగ్రీవుడా! సహాయేన = సహాయుడవైన, త్వయా = నీతో కలిసి, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, రామః=రాముడు, శత్రూన్ =శత్రువులను, రణే = యుద్ధమునందు, అచిరాత్ =శీఘ్రముగా, వధిష్యతి = చంపగలడు. అత్ర =ఈ విషయమున, సంశయః=సంశయము, న= లేదు.

తా. సుగ్రీవా! ప్రతాపవంతుడైన రాముడు నీ సహాయముతో శత్రువులను యుద్ధరంగమునందు శీఘ్రముగా చంపగలడు. ఈ విషయమున సంశయము లేదు. 15

మూ. ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సఙ్గ్రామేష్వనివర్తినః,
ఉపపన్నం చ యుక్తం చ సుగ్రీవ తవ భాషితమ్. 16

ప్ర. అ. సుగ్రీవ! = ఓ! సుగ్రీవా! ధర్మజ్ఞస్య =ధర్మమును తెలిసినవాడవు, కృతజ్ఞస్య = కృతజ్ఞుడవు, సఙ్గ్రామేషు = యుద్ధములయందు, అనివర్తినః = వెనుకకు తిరుగనివాడవు అయిన, తవ= నీకు, భాషితమ్ = ఇట్లు పలుకుట, ఉపపన్నమ్ =తగి ఉన్నది. యుక్తం చ = యుక్తముగాను ఉన్నది.

తా. సుగ్రీవా! ధర్మమును తెలిసినవాడవు, కృతజ్ఞుడవు, యుద్ధములో వెనుకకు తిరుగని వాడవు అయిన నీవు ఇట్లు పలుకుట ఉపపన్నము గాను, యుక్తముగాను ఉన్నది. 16

మూ. దోషజ్ఞః సతి సామర్థ్యే కోఽన్యో భాషితుమర్హతి,
వర్జయిత్వా మమ జ్యేష్ఠం త్వాం చ వానరసత్తమ. 17

ప్ర. అ. వానరసత్తమ! = వానరశ్రేష్ఠుడా! మమ =నాయొక్క, జ్యేష్ఠమ్ = అన్నగారిని, త్వాం చ =నిన్ను, వర్జయిత్వా = విడిచి, అన్యః=ఇతరుడు, కః =ఎవడు, సామర్థ్యే సతి = సామర్థ్య ముండగా, దోషజ్ఞః =తన దోషమును తెలుసుకొన్నవాడై, భాషితుమ్ = ఇట్లు పలుకుటకు, అర్హతి = తగి యున్నాడు.

తా. ఓ! వానరరాజా! మా అన్నగారు, నీవు తప్పు మరెవ్వడైన సామర్థ్యము ఉండి కూడ తన తప్పిదమును గ్రహించి ఇట్లు మాట్లాడునా!

మూ. సదృశశ్చాపి రామేణ విక్రమేణ బలేవ చ,
సహాయో దైవతైర్దత్తశ్చిరాయ హరిపుఙ్గవ. 18

ప్ర. అ. హరిపుఙ్గవ =వానరశ్రేష్ఠుడా! దైవతైః = దేవతలచేత, చిరాయ = చిరకాలమునకు, దత్తః =ఇవ్వబడిన, సహాయః =సహాయుడవైన నీవు, విక్రమేణ = పరాక్రమముచేత, బలేన చ = బలముచేత, రామేణ = రామునితో, సదృశః = తగినవాడవు, అపి =అయి ఉన్నావు.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! దేవతలు నిన్ను చాల కాలమునకు సహాయునిగా ఇచ్చినారు. నీవు పరాక్రమముచేత, బలముచేత కూడ రామునకు తగినవాడవు.

మూ. కిం తు శీఘ్రమితో వీర నిష్క్రామ త్వం మయా సహ,
సాన్త్వయస్వ వయస్యం చ భార్యాహరణదుఃఖితమ్. 19

ప్ర. అ. కిం తు =కాని, వీర! = ఓ! వీరుడా! త్వమ్ =నీవు, మయా సహ = నాతోకూడ , ఇతః =ఇక్కడనుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, నిష్క్రామ = బయలుదేరుము. భార్యాహరణదుఃఖితమ్ = భార్యను హరించుటచేత దుఃఖించుచున్న, వయస్యమ్ = మిత్రుని, సాన్త్వయస్వ =ఓదార్చుము.

తా. ఓ! వీరుడా! నీ విక్కడినుండి బయలుదేరి నాతో వచ్చి భార్యాహరణముచేత దుఃఖితుడైన నీ మిత్రుని ఓదార్చుము. 19

మూ. యచ్చ శోకాభిభూతస్య శ్రుత్వా రామస్య భాషితమ్,
మయా త్వం పరుషాణ్యుక్తస్తత్ క్షమస్వ సఖే మమ. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షట్త్రింశః సర్గః.

ప్ర. అ. సఖే=మిత్రుడా! శోకాభిభూతస్య = దుఃఖాక్రాంతుడైన, రామస్య = రామునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, మయా = నాచేత, త్వమ్ =నీవు, పరుషాణి =పరుషవాక్యములను, ఉక్తః ఇతి యత్ =పలుకబడితివి అనునది ఏది కలదో, మమ = నాయొక్క, తత్ = దానిని, క్షమస్వ = క్షమించుము.

తా. ఓ! మిత్రుడా! శోకముతో బాధపడుచున్న రాముని మాటలు వినుటచే నేను నిన్ను పరుషవాక్యము లాడి దూషించితిని. అందుకు నన్ను క్షమించుము. 20

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండములో ముప్పది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తత్రింశః సర్గః

[వానరసైన్యమును పిలిపించుటకు మరల దూతలను పంపమని సుగ్రీవుడు హనుమంతుని ఆజ్ఞాపించుట; రాజాజ్ఞ విని వానరు లందరు కిష్కింధకు బయలుదేరుట, తిరిగి వచ్చిన దూతలు సుగ్రీవునకు కానుకలు సమర్పించి వానరులు వచ్చినారని తెలుపుట].

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా,
హనుమన్తం స్థితం పార్శ్వే వచనం చేదమబ్రవీత్. 1

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ =ఇట్లు, ఉక్తః = పలుకబడిన, సుగ్రీవః =సుగ్రీవుడు, పార్శ్వే =పార్శ్వమునందు, స్థితమ్ =ఉన్న , హనుమన్తమ్ =హనుమంతుని గూర్చి, ఇదం వచనమ్ =ఈ వచనమును, అబ్రవీత్ =పలికెను.

తా. మహాత్ముడైన లక్ష్మణుని మాటలు విని సుగ్రీవుడు తన పక్కనే ఉన్న హనుమంతునితో ఇట్లు పలికెను. 1

మూ. మహేన్ద్రహిమవద్విన్ధ్యకైలాసశిఖరేషు చ,
మన్దరే పాణ్డుశిఖరే పఞ్చశైలేషు యే స్థితాః. 2
తరుణాదిత్యవర్ణేషు భ్రాజమానేషు నిత్యశః,
పర్వతేషు సముద్రాన్తే పశ్చిమాయాం తు యే దిశి. 3
ఆదిత్యభవనే చైవ గిరౌ సన్ధ్యాభ్రసన్నిభే,
పద్మాచలవనం భీమాః సంశ్రితా హరిపుఙ్గవాః. 4
అఞ్జనామ్బుదసఙ్కాశాః కుఞ్జరేన్ద్రమహౌజసః,
అఞ్జనే పర్వతే చైవ యే వసన్తి ప్లవఙ్గమాః. 5
మహాశైలగుహావాసా వానరాః కనకప్రభాః,
మేరుపార్శ్వగతాశ్చైవ యే చ ధూమ్రగిరిం శ్రితాః. 6
తరుణాదిత్యవర్ణాశ్చ పర్వతే యే మహారుణే,
పిబన్తో మధుమైరేయం భీమవేగాః ప్లవఙ్గమాః. 7
వనేషు చ సురమ్యేషు సుగన్ధిషు మహత్సు చ,
తాపసాశ్రమరమ్యేషు వనాన్తేషు సమన్తతః. 8

తాంస్తాంస్త్వమానయ క్షిప్రం పృథివ్యాం సర్వవానరాన్,
సామదానాదిభిః కల్పైః వానరైర్వేగవత్తరైః. 9

ప్ర. అ. మహేన్ద్రహిమవద్వింధ్యకైలాసశిఖరేషు చ=మహేంద్ర - హిమవత్-వింధ్య-కైలాసపర్వతముల శిఖరములందు, పాణ్డుశిఖరే=తెల్లని శిఖరములు గల, మన్దరే=మందర పర్వతమునందు, పఞ్చశైలేషు=ఈ ఐదు పర్వతము లందు, యే=ఎవరు, స్థితాః=ఉన్నారో, సముద్రాన్తే=సముద్రప్రాంతమునందు, నిత్యశః=ఎల్లప్పుడు, భ్రాజమానేషు=ప్రకాశించుచున్న, తరుణాదిత్యవర్ణేషు=బాలసూ ర్యుని వంటి వర్ణము గల, పర్వతేషు =పర్వతములమీద, పశ్చిమాయామ్=పశ్చిమమైన, దిశి=దిక్కుయందు, యే=ఎవరున్నారో, సన్ధ్యాభ్రసన్నిభే=సంధ్యాకాలము మేఘముతో సమానమైన, ఆదిత్యభవనే=ఆదిత్యభవన మనే, గిరౌ చైవ=పర్వతమునందు, భీమాః=భయంకరులైన, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, పద్మాచలవనమ్=పద్మాచల వనమును, సంశ్రితాః=ఆశ్రయించినారో, అఞ్జనే పర్వతే=అంజనపర్వతమునందు, అఞ్జనామ్బుదసఙ్కాశాః=కాటుకతోను మేఘములతోను సమానమైన, కుఞ్జరేన్ద్ర మహౌజసః=గజేంద్రముల వంటి గొప్ప బలము గల, యే ప్లవఙ్గమాః=ఏ వానరులు, వసన్తి =నివసించుచున్నారో, మహాశైలగుహావాసాః=మహాశైల మను పర్వతముయొక్క గుహలు నివాసముగా గల, కనకప్రభాః=బంగారము వంటి కాంతి గల, వానరాః=వానరులున్నారో, మేరుపార్శ్వగతాశ్చైవ=మేరుపర్వతము యొక్క పార్శ్వమును పొందియున్న ఏ వానరులు గలరో, యే=ఏ వానరులు, ధూమ్రగిరిమ్=ధూమ్రపర్వతమును, శ్రితాః=ఆశ్రయించి ఉన్నారో, మహారుణే= మహారుణమనే, పర్వతే=పర్వతమునందు, మైరేయం మధు=మైరేయమనే మధు వును, పిబన్తః=త్రాగుచుండు, భీమవేగాః=భయంకరమైన వేగము గల, యే=ఏ, తరుణాదిత్యవర్ణాః= బాలసూర్యుని వంటి వర్ణము గల, ప్లవఙ్గమాః=వానరు లున్నారో, సురమ్యేషు=చాల అందమైన, సుగన్ధిషు=మంచి గంధముగల, మహత్సు=గొప్పవైన, వనేషు చ=వనములయందు, తాపసాశ్రమరమ్యేషు=మునుల ఆశ్రమములచేత సుందరములైన, సమన్తతః=చుట్టూ ఉన్న, వనాన్తేషు=వనాంతములందు ఏ వానరు లున్నారో, పృథివ్యామ్=భూమియందున్న, తాంస్తాన్=ఆ యా, సర్వవా నరాన్=సమస్తమైన వానరులను, సామదానాదిభిః=సామము దానము మొదలైన, కల్పైః=ఉపాయములచేత, వేగవత్తరైః=ఎక్కువ వేగము గల, వానరైః=వానరులచేత, క్షిప్రమ్=శీఘ్రముగా, త్వమ్=నీవు, ఆనయ= తీసుకొనిరమ్ము (రప్పించుము).

తా. మహేంద్ర-హిమవత్ - వింధ్య - కైలాసపర్వతముల శిఖరములయందు, తెల్లని శిఖరములు గల మందరపర్వతమునందు, ఈ ఐదు పర్వతములందు నివసించుచున్నవారిని, సముద్రప్రాంతమునందున్న, నిత్యము బాలసూర్యుని కాంతితో ప్రకాశించుచున్న పర్వతములయందు, పశ్చిమ దిక్కునందు సంధ్యామేఘముతో సమానమైన ఆదిత్యభవన మనే పర్వతమునందు ఉన్నవారిని, పద్మాచలములో నివసించు భయంకరమైన వానరశ్రేష్ఠులను, అంజనపర్వతమునందు నివసించు

గజేంద్రములతో సమానమైన బలము గల, కాటుక వలె, మేఘముల వలె, నల్లగా ఉండు వానరులను, మహాపర్వత శిఖరములలో నివసించు బంగారు కాంతి గల, వానరులను, మేరుపర్వతప్రాంతమునందున్న వానరులను, ధూమ్రగిరిని ఆశ్రయించి ఉన్నవారిని, మహారుణపర్వతమునందు నివసించుచు, మైరేయ మను మధువును సేవించుచుండు బాలసూర్యునివర్ణము వంటి వర్ణము గల భయంకరమైన వేగము గల వానరులను, మంచి సువాసన గల అందమైన మహావనమునందు మునుల ఆశ్రమములతో రమ్యములైన అన్నివైపులా ఉన్న వనాంతములందు నివసించువారిని, భూమిపై ఉన్న సర్వవానరులను, నీవు అధికమైన వేగము గల వానరులను పంపి సామదానాది ఉపాయములతో శీఘ్రముగా ఇక్కడికి రప్పింపుము. 2-9

మూ. ప్రేషితాః ప్రథమం యే చ మయాజ్ఞాతా మహాజవాః,
త్వరణార్థం తు భూయస్త్వం సమ్ప్రేషయ హరీశ్వరాన్. 10

ప్ర. అ. మయా=నాచేత, ఆజ్ఞాతాః=ఆజ్ఞాపింపబడిన, మహాజవాః=గొప్ప వేగము గల, యే=ఏ వానరులు, ప్రథమమ్=ముందుగా, ప్రేషితాః=పంపబడినారో, త్వరణార్థమ్ =వారిని తొందరపెట్టుటకై, త్వమ్=నీవు, భూయః=మరల, హరీశ్వరాన్= వానరశ్రేష్ఠులను, సంప్రేషయ=పంపుము.

తా. ఇంతకు పూర్వమే నా ఆజ్ఞ ప్రకారము పంపబడిన మహావేగవంతులైన వానరులను తొందరపెట్టుటకై నీవు మరల మరి కొందరు వానరులను పంపుము.

మూ. యే ప్రసక్తాశ్చ కామేషు దీర్ఘసూత్రాశ్చ వానరాః,
ఇహానయస్వ తాన్ శీఘ్రం సర్వానేవ కపీశ్వరాన్. 11

ప్ర. అ. యే=ఏ, వానరాః=వానరులు, కామేషు=కామములయందు, ప్రసక్తాశ్చ =ఆసక్తులై ఉన్నారో, దీర్ఘసూత్రాశ్చ=పనులలో ఆలస్యము చేయువారో వారిని, సర్వానేవ= సమస్తమైన, తాన్ కపీశ్వరాన్=ఆ వానరులను, శీఘ్రమ్=శీఘ్రముగా, ఇహ=ఇక్కడికి, ఆనయస్వ=తీసుకొనిరమ్ము.

తా. కామోపభోగములందు ఆసక్తులైనవారిని, పనులలో దీర్ఘాలోచన చేయువారిని, సమస్తమైన వానరశ్రేష్ఠులను వెంటనే ఇక్కడికి రప్పించుము.11

మూ. అహోభిర్దశభిర్యే చ నాగచ్ఛన్తి మమాజ్ఞయా,
హన్తవ్యాస్తే దురాత్మానో రాజశాసనదూషకాః. 12

ప్ర. అ. యే=ఏ వానరులు, మమ=నాయొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, దశభిః= పది, అహోభిః=దివసములచేత, నాగచ్ఛన్తి=రారో, రాజశాసనదూషకాః=రాజాజ్ఞను ధిక్కరించిన, తే=ఆ, దురాత్మానః=దురాత్ములు, హన్తవ్యాః=చంపదగినవారు.

తా. నా ఆజ్ఞ ప్రకారము పదిరోజుల లోపుగా రాని, రాజాజ్ఞను ధిక్కరించే దురాత్ములకు మరణదండము విధింపబడును. 12

మూ. శతాన్యథ సహస్రాణి కోట్యశ్చ మమ శాసనాత్,
ప్రయాన్తు కపిసింహానాం నిదేశే మమ యే స్థితాః. 13

ప్ర. అ. మమ=నాయొక్క, నిదేశే=ఆజ్ఞయందు, యే=ఎవరు, స్థితాః= ఉన్నారో అట్టి, కపిసింహానామ్=వానరశ్రేష్ఠులయొక్క, శతాని=శతములు, సహస్రాణి= సహస్రములు, కోట్యశ్చ=కోట్లు, మమ=నాయొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, ప్రయాన్తు =వచ్చెదరుగాక!

తా. నా అధికారములో ఉన్న వందలకొలది, వేలకొలది, కోట్లకొలది వానరశ్రేష్ఠులు నా ఆజ్ఞ ప్రకారము ఇక్కడికి రావలెను. 13

మూ. మేఘపర్వతసఙ్కాశాశ్ఛాదయన్త ఇవామ్బరమ్,
ఘోరరూపాః కపిశ్రేష్ఠా యాన్తు మచ్ఛాసనాదితః. 14

ప్ర. అ. మేఘపర్వతసఙ్కాశాః=మేఘములతోను, పర్వతములతోను సమానమైనవారు, ఘోరరూపాః= భయంకరమైన రూపము గలవారు అయిన, కపిశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, అమ్బరమ్=ఆకాశమును, ఛాదయన్త ఇవ=కప్పుచున్నవారు వలె, మచ్ఛాసనాత్=నా ఆజ్ఞవలన, ఇతః=ఇటువైపు, యాన్తు=వచ్చెదరుగాక!

తా. భయంకరమైన ఆకారములతో మేఘముల వలె, పర్వతముల వలె ఉన్న వానరులు ఆకాశమును కప్పివేయుచున్నారా అన్నట్లు నా ఆజ్ఞ ప్రకారము ఇక్కడికి వచ్చెదరు గాక! 14

మూ. తే గతిజ్ఞా గతిం గత్వా పృథివ్యాం సర్వవానరాః,
ఆనయన్తు హరీన్సర్వాంస్త్వరితాః శాసనాన్మమ. 15

ప్ర. అ. గతిజ్ఞాః=మార్గమును తెలిసిన, తే=ఆ, సర్వవానరాః=వానరు లందరు, త్వరితాః=తొందరపడుచున్నవారై, గతిం గత్వా=శీఘ్రగమనమున వెళ్లి, పృథివ్యామ్=భూమియందలి, సర్వాన్=సమస్తమైన, హరీన్=వానరులను, మమ=నాయొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, ఆనయన్తు=తీసికొనివచ్చెదరుగాక!

తా. మార్గమును తెలిసిన వానరులు వేగముగా వెళ్లి నా ఆజ్ఞ ప్రకారము భూమిపై ఉన్న సమస్తవానరులను తొందరగా తీసికొని వచ్చెదరుగాక! 15

మూ. తస్య వానరరాజస్య శ్రుత్వా వాయుసుతో వచః,
దిక్షు సర్వాసు విక్రాన్తాన్ ప్రేషయామాస వానరాన్. 16

ప్ర. అ. వాయుసుతః=హనుమంతుడు, తస్య వానరరాజస్య=ఆ సుగ్రీవునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, సర్వాసు=సమస్తమైన, దిక్షు=దిక్కులయందు, విక్రాన్తాన్=పరాక్రమవంతులైన, వానరాన్=వానరులను, ప్రేషయామాస=పంపెను.

తా. హనుమంతుడు సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారము పరాక్రమవంతులైన వానరులను అన్ని దిక్కులకు పంపెను. 16

మూ. తే పదం విష్ణువిక్రాన్తం పతత్త్రిజ్యోతిరధ్వగాః,
ప్రయాతాః ప్రహితా రాజ్ఞా హరయస్తు క్షణేన వై. 17

ప్ర. అ. రాజ్ఞా=రాజుచేత, ప్రహితాః=పంపబడిన, తే=ఆ, హరయః= వానరులు, పతత్త్రిజ్యోతిరధ్వగాః=పక్షులయొక్క, నక్షత్రములయొక్క మార్గమును పొందినవారై, క్షణేన=క్షణకాలములో, విష్ణువిక్రాన్తమ్=త్రివిక్రమునిచేత ఆక్రమించబడిన, పదమ్= స్థానమును, (ఆకాశమును) ప్రయాతాః=చేరిరి.

తా. పక్షిమార్గమునందు, నక్షత్రమార్గమునందు పంచరించ గలిగిన ఆ వానరులు సుగ్రీవునిచే పంపబడి క్షణకాలములో ఆకాశముపైకి ఎగిరిరి. 17

మూ. తే సముద్రేషు గిరిషు వనేషు చ సరస్సు చ,
వానరా వానరాన్ సర్వాన్ రామహేతోరచోదయన్. 18

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, సముద్రేషు=సముద్రములయందు, గిరిషు= పర్వతములయందు, వనేషు చ=వనములయందు, సరస్సు చ=సరస్సులయందు ఉన్న, సర్వాన్= సమస్తమైన, వానరాన్=వానరులను, రామహేతోః=రామునికొరకై, అచోదయన్=ప్రేరేపించిరి.

తా. ఆ వానరులు వెళ్లి సముద్రములలోను, పర్వతములమీద, వనములలోను, సరస్సులలోను నివసించు వానరులను, అందరిని రామకార్యార్థమై రావలె నని ప్రేరేపించిరి. 18

మూ. మృత్యుకాలోపమస్యాజ్ఞాం రాజరాజస్య వానరాః,
సుగ్రీవస్యాయయుః శ్రుత్వా సుగ్రీవభయశఙ్కితాః. 19

ప్ర. అ. వానరాః=వానరులు, మృత్యుకాలోపమస్య=మృత్యుదేవతతోను, యమునితోను సమానుడైన, రాజరాజస్య=వానరరాజులకు రాజైన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, శ్రుత్వా=విని, సుగ్రీవభయశఙ్కితాః=సుగ్రీవునివలన కలుగు భయముచే శంకించుచున్నవారై, ఆయయుః=వచ్చిరి.

తా. ఆ వానరులు మృత్యుదేవతతోను యమునితోనూ సమానుడైన, వానరరాజులకు రాజైన సుగ్రీవుని ఆజ్ఞ విని ఆతనికి భయపడుచు వచ్చిరి.19

మూ. తతస్తేఽఞ్జనసఙ్కాశా గిరేస్తస్మాన్మహాబలాః,
తిస్రః కోట్యః ప్లవఙ్గానాం నిర్యయుర్యత్ర రాఘవః. 20

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తస్మాత్ గిరేః=ఆ పర్వతమునుండి, ప్లవఙ్గమానామ్= వానరులయొక్క, మహాబలాః=గొప్ప బలము గల, అఞ్జనసఙ్కాశాః=కాటుకతో

సమానమైన, త్రిసః=మూడు, కోట్యః=కోటులు, రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడున్నాడో అక్కడికి, నిర్యయుః=బయలుదేరి వచ్చిరి.

తా. పిమ్మట ఆ పర్వతమునుండి కాటుక వలె నల్లని కాంతి గల గొప్ప బలము గల మూడు కోట్ల వానరులు రాము డున్న చోటికి వచ్చిరి. 20

మూ. అస్తం గచ్ఛతి యత్రార్కస్తస్మిన్ గిరివరే రతాః,
సన్తప్త హేమవర్ణాభాస్తస్మాత్కోట్యో దశ చ్యుతాః. 21

ప్ర. అ. యత్ర=ఏ పర్వతమునందు, అర్కః=సూర్యుడు, అస్తం గచ్ఛతి=అస్తమించునో, తస్మిన్=ఆ, గిరివరే=పర్వతశ్రేష్ఠమునందు, రతాః=ఆసక్తి గల, సంతప్త హేమవర్ణాభాః= పుటము పెట్టిన బంగారము వంటి కాంతి గల, దశ కోట్యః=పది కోట్లు వానరులు, తస్మాత్=ఆ పర్వతమునుండి, చ్యుతాః=బయలుదేరిరి.

తా. సూర్యుడు అస్తమించు పర్వతముపై నివసించు శుద్ధమైన బంగారపు ఛాయ గల పదికోట్ల వానరులు ఆ పర్వతమునుండి బయలుదేరిరి. 21

మూ. కైలాసశిఖరేభ్యశ్చ సింహకేసరవర్చసామ్,
తతః కోటిసహస్రాణి వానరాణాం సమాగమన్. 22

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సింహకేసరవర్చసామ్=సింహము జూలు వంటి రంగు గల, వానరాణామ్ =వానరులయొక్క, కోటి సహస్రాణి=వెయ్యి కోట్లు, కైలాసశిఖరేభ్యశ్చ= కైలాసపర్వతశిఖరములనుండి, సమాగమన్=వచ్చిరి.

తా. కైలాసశిఖరములనుండి సింహముల జూలు వంటి కాంతిగల వెయ్యి కోట్ల వానరులు వచ్చిరి. 22

మూ. ఫలమూలేన జీవన్తో హిమవన్తముపాశ్రితాః,
తేషాం కోటిసహస్రాణాం సహస్రం సమవర్తత. 23

ప్ర. అ. ఫలమూలేన=ఫలములతోను, దుంపలతోను, జీవన్తః=జీవించుచు, హిమవన్తమ్= హిమవత్పర్వతమును, ఉపాశ్రితాః=ఏ వానరులు ఆశ్రయించి నారో, తేషామ్=ఆ వానరులయొక్క, కోటిసహస్రాణామ్=వెయ్యి కోట్లయొక్క, సహస్రమ్=సహస్రము, సమవర్తత=వచ్చెను.

తా. ఫలమూలములతో జీవించుచు హిమవత్పర్వతముపై నివసించు వానరుల వెయ్యికోట్ల సహస్రములు వచ్చిరి. 23

మూ. అఙ్గారకసమానానాం భీమానాం భీమకర్మణామ్,
విన్ధ్యాద్వానరకోటీనాం సహస్రాణ్యాపతన్ ద్రుతమ్. 24

ప్ర. అ. విన్ధ్యాత్=వింధ్యపర్వతమునుండి, అఙ్గారకసమానానామ్=కుజునితో

సమానులు, భీమానామ్=భయంకరులు, భీమకర్మణామ్=భయంకరమైన పనులు కలవారు అయిన, వానరకోటీనామ్=వానరుల కోటుల, సహస్రాణి=సహస్రములు, ద్రుతమ్=శీఘ్రముగా, ఆపతన్=వచ్చినవి.

తా. వింధ్యపర్వతమునుండి వేలకొలది కోట్ల సంఖ్యలో అంగారకునితో సమానులు, భయంకరులు, భయంకరమైన పని చేయువారు అయిన వానరులు శీఘ్రముగా వచ్చిరి. 24

మూ. క్షీరోదవేలానిలయాస్తమాలవనవాసినః,
వారికేళాశనాశ్చైవ తేషాం సఙ్ఖ్యా న విద్యతే. 25

ప్ర. అ. క్షీరోదవేలానిలయాః=క్షీరసముద్రతీరమునందు నివసించువారు, తమాలవనవాసినః= తమాలవనమునందు నివసించువారు, నారికేళాశనాశ్చైవ=నారికేళములను భుజించువారు అయిన ఏ వానరులు కలరో, తేషామ్=వారియొక్క, సఙ్ఖ్యా=సంఖ్య, న విద్యతే=లేదు.

తా. క్షీరసముద్రతీరమునందు, తమాలవనములో నివసించుచు నారికేళఫలములను భక్షించు వానరులు ఎందరో వచ్చిరి. వారికి లెక్క లేదు. 25

మూ. వనేభ్యో గహ్వరేభ్యశ్చ సరిద్భ్యశ్చ మహాబలా,
ఆగచ్ఛద్వానరీ సేనా పిబన్తీవ దివాకరమ్. 26

ప్ర. అ. మహాబలా=గొప్ప బలము గల, వానరీ సేనా=వానరుల సంబంధమైన సేన, దివాకరమ్ =సూర్యుని, పిబన్తీవ=త్రాగుచున్నదా అన్నట్లు, వనేభ్యః= వనములనుండి, గహ్వరేభ్యశ్చ=గుహలనుండి, సరిద్భ్యశ్చ=నదులనుండి, ఆగచ్ఛత్=వచ్చెను.

తా. గొప్ప బలము గల వానరసేన సూర్యుని మింగివేయుచున్నదా అన్నట్లు వనములనుండి, గుహలనుండి, నదులనుండి బయలుదేరి వచ్చెను. 26

మూ. యే తు త్వరయితుం యాతా వానరాః సర్వవానరాన్,
తే వీర! హిమవచ్ఛైలే దదృశుస్తం మహాద్రుమమ్. 27

ప్ర. అ. యే=ఏ, వానరాః=వానరులు, సర్వవానరాన్=సమస్తవానరులను, త్వరయితుమ్=తొందరపెట్టుటకు, యాతాః=ముందుగా వెళ్లినారో, తే వీరాః=ఆ వీరులు, హిమవచ్ఛైలే=హిమవత్పర్వతమునందు, తమ్=ఆ, మహాద్రుమమ్=మహా వృక్షమును, దదృశుః=చూచిరి.

తా. సమస్తవానరులను తొందరగా పిలుచుటకు మొదట వెళ్లిన వానరు లందరు హిమవత్పర్వతముమీద ఆ మహావృక్షమును చూచిరి. 27

మూ. తస్మిన్గిరివరే పుణ్యే యజ్ఞో మాహేశ్వరః పురా,
సర్వదేవమనస్తోషో బభూవ సుమనోరమః. 28

ప్ర. అ. పుణ్యే=పవిత్రమైన, తస్మిన్=ఆ, గిరివరే=శ్రేష్ఠమైన పర్వతముమీద, పురా=పూర్వము, సర్వదేవమనస్తోషః=సమస్తదేవతల మనస్సుకు సంతోషమును కలిగించునది, సుమనోరమః=చాల మనోహరము అయిన, మాహేశ్వరః=మహేశ్వరుని ఉద్దేశించి చేయబడిన, యజ్ఞః=యజ్ఞము, బభూవ=జరిగెను.

తా. పవిత్రమైన ఆ హిమవత్పర్వతముమీద పూర్వము సకలదేవతల మనస్సులకు ఆనందమును కలిగించు మనోహరమైన, ఒక యజ్ఞము మహేశ్వరుని ఉద్దేశించి చేయబడెను. 28

మూ. అన్నవిష్యన్దజాతాని మూలాని చ ఫలాని చ,
అమృతస్వాదుకల్పాని దదృశుస్తత్ర వానరాః. 29

ప్ర. అ. తత్ర=అక్కడ, వానరాః=వానరులు, అన్ననిష్యన్దజాతాని=అన్నము చెదిరి పడుటవలన పుట్టిన, అమృతస్వాదుకల్పాని=అమృతము వలె మధురమైన, మూలాని చ=దుంపలను, ఫలాని చ=ఫలములను, దదృశుః=చూచిరి.

తా. అక్కడ ఆ వానరులు ఇటు అటు చెదిరి పడిన యజ్ఞాన్నమునుండి పుట్టిన అమృతము వలె మధురమైన మూలములను ఫలములను చూచిరి.29

మూ. తదన్నసమ్భవం దివ్యం ఫలమూలం మనోహరమ్,
యః కశ్చిత్సకృదశ్నాతి మాసం భవతి తర్పితః. 30

ప్ర. అ. తదన్నసమ్భవమ్=ఆ యజ్ఞాన్నమునుండి పుట్టిన, దివ్యమ్=శ్రేష్ఠము, మనోహరమ్=మనోహరము అయిన, ఫలమూలమ్=ఫలములను, మూలములను, యః కశ్చిత్=ఏ ఒక్కడు, సకృత్=ఒక పర్యాయము, అశ్నాతి=తినునో, మాసమ్=ఒక మాసమ్, తర్పితః= తృప్తి పొందింపబడినవాడు, భవతి=అగును.

తా. ఎవరైన ఆ యజ్ఞాన్నమునుండి పుట్టిన శ్రేష్ఠములు, మనోహరములు అయిన ఫలములను, మూలములను ఒక్క పర్యాయము తిన్నచో ఆతనికి ఒక్క మాసమువరకు ఆకలి ఉండదు. 30

మూ. తాని మూలాని దివ్యాని ఫలాని చ ఫలాశనాః,
ఔషధాని చ దివ్యాని జగృహుర్హరిపుఙ్గవాః. 31

ప్ర. అ. ఫలాశనాః=ఫలములను భుజించు, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, దివ్యాని= దివ్యములైన, తాని=ఆ, మూలాని=మూలములను, ఫలాని చ=ఫలములను, దివ్యాని= దివ్యములైన, ఔషధాని చ=ఔషధములను, జగృహుః=గ్రహించిరి.

తా. ఫలములను భుజించు ఆ వానరులు శ్రేష్ఠములైన ఆ మూలములను

ఫలములను, కొన్ని దివ్యౌషధులను తీసుకొనిరి. 31

మూ. తస్మాచ్చ యజ్ఞాయతనాత్ పుష్పాణి సురభీణి చ,
ఆనిన్యుర్వానరా గత్వా సుగ్రీవప్రియకారణాత్. 32

ప్ర. అ. వానరాః=వానరులు, గత్వా =వెళ్లి, తస్మాత్ = ఆ, యజ్ఞాయతనాత్ =యజ్ఞము చేసిన స్థానమునుండి, సురభీణి =పరిమళించుచున్న, పుష్పాణి చ = పుష్పములను కూడ, సుగ్రీవప్రియకారణాత్ =సుగ్రీవునికి ప్రియము చేయుట అను కారణమువలన, ఆనిన్యుః =తీసుకొనివచ్చిరి.

తా. అచటకు వెళ్లిన వానరులు సుగ్రీవునికి సంతోషమును కల్గించుటకై ఆ యజ్ఞస్థానమునుండి పరిమళించుచున్న పుష్పములను కూడ తీసికొని వచ్చిరి.

మూ. తే తు సర్వే హరివరాః పృథివ్యాం సర్వవానరాన్,
సంచోదయిత్వా త్వరితం యూథానాం జగ్మురగ్రతః. 33

ప్ర. అ. సర్వే =సమస్తమైన, తే హరివరాః = ఆ వానరశ్రేష్ఠులు, పృథివ్యామ్ = భూమిమీద నున్న, సర్వవానరాన్ = అందరు వానరులను, సంచోదయిత్వా = ప్రేరేపించి, యూథానామ్ = ఆ వానరయూథములయొక్క, అగ్రతః =ముందు, త్వరితమ్ = తొందరగా, జగ్ముః = వెళ్ళిరి.

తా. ఆ వానరు లందరు భూమిమీద నున్న వానరు లందరిని సుగ్రీవాజ్ఞ ప్రకారము ప్రేరేపించి వారి గుంపులు వచ్చుటకు ముందుగానే తొందరగా తిరిగి వచ్చిరి. 33

మూ. తే తు తేన ముహూర్తేన కపయః శీఘ్రచారిణః,
కిష్కిన్ధాం త్వరయా ప్రాప్తాః సుగ్రీవో యత్ర వానరః. 34

ప్ర. అ. శీఘ్రచారిణః = శీఘ్రముగా సంచరించు, తే కపయః = ఆ వానరులు, తేన ముహూర్తేన = ఆ ముహూర్తముచేత (నందు), వానరః = వానరుడైన, సుగ్రీవః = సుగ్రీవుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో (అచ్చటికి), కిష్కిన్ధామ్ = కిష్కింధను గూర్చి, త్వరయా = తొందరతో, ప్రాప్తాః =వచ్చినారు.

తా. శీఘ్రముగా సంచరించు ఆ వానరులు తొందరగా కిష్కింధను చేరి ఆ సమయమునందు సుగ్రీవుడు ఎక్కడ ఉండెనో అచటికి వెళ్లిరి. 34

మూ. తే గృహీత్వౌషధీః సర్వాః ఫలమూలం చ వానరాః,
తం ప్రతిగ్రాహయామాసుర్వచనం చేదమబ్రువన్. 35

ప్ర. అ. తే వానరాః =ఆ వానరులు, సర్వాః = సమస్తమైన, ఓషధీః = ఓషధులను, ఫలమూలం చ = ఫలములను, మూలములను, గృహీత్వా = గ్రహించి, తమ్ = ఆ సుగ్రీవుని, ప్రతిగ్రాహయామాసుః = గ్రహింపచేసిరి.

ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రువన్ చ = పలికిరి కూడ.

తా. ఆ వానరులు ఓషధు లన్నింటిని, ఫలమూలములను తీసికొని వచ్చి సుగ్రీవునకు సమర్పించి ఆతనితో ఇట్లనిరి. 35

మూ. సర్వే పరిసృతాః శైలాః సరితశ్చ వనాని చ,
పృథివ్యాం వానరాః సర్వే శాసనాదుపయాన్తి తే. 36

ప్ర. అ. సర్వే = సమస్తమైన, శైలాః = పర్వతములు, సరితశ్చ = నదులు, వనాని చ = వనములు, పరిసృతాః = మాచే పొందబడినవి. తే = నీయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, పృథివ్యామ్ = భూమిపై ఉన్న, సర్వే సమస్తమైన, వానరాః = వానరులు, ఉపయాన్తి = వచ్చుచున్నారు.

తా. మేము అన్ని పర్వతములకు, నదులకు, వనములకు వెళ్లినాము. భూమిమీద వానరు లందరు నీ ఆజ్ఞ ప్రకారము వచ్చుచున్నారు. 36

మూ. ఏవం శ్రుత్వా తతో హృష్టః సుగ్రీవః ప్లవగాధిపః,
ప్రతిజగ్రాహ చ ప్రీతస్తేషాం సర్వముపాయనమ్. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. తతః= అటుపిమ్మట, ప్లవగాధిపః =వానరరాజైన, సుగ్రీవః =సుగ్రీవుడు, ఏవమ్ = ఇట్లు, శ్రుత్వా = విని, హృష్టః = సంతోషించెను. తేషామ్ = వారియొక్క, సర్వమ్ = సమస్తమైన, ఉపాయనమ్ = కానుకను, ప్రీతః =సంతోషించినవాడై, ప్రతిజగ్రాహ చ = స్వీకరించెను కూడ.

తా. వానరరాజైన సుగ్రీవుడు ఆ మాటలు విని సంతోషించి వారు తెచ్చిన కానుకలను అన్నింటిని స్వీకరించెను. 37

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ముప్పది యేడవసర్గ సమాప్తము.

# అథ అష్టాత్రింశః సర్గః

(సుగ్రీవుడు లక్ష్మణునితో కలిసి రాముని వద్దకు వెళ్లి ఆతని పాదములకు నమస్కరించుట, రాముడు ఆతనితో మంచి మాటలు పలుకుట, సుగ్రీవుడు సైన్యమును సంపాదించుటకై తన ప్రయత్నమును చెప్పుట, రాముడు అది విని సంతోషించుట)

మూ. ప్రతిగృహ్య చ తత్సర్వముపాయనముపాహృతమ్,
వానరాన్ సాన్త్వయిత్వా చ సర్వానేవ వ్యసర్జయత్. 1

ప్ర. అ. ఉపాహృతమ్ = తీసుకొనిరాబడిన , తత్ =ఆ, సర్వమ్ = సమస్తమైన, ఉపాయనమ్ = కానుకను, ప్రతిగృహ్య = స్వీకరించి, సాన్త్వయిత్వా చ = మంచి మాటలు పలికి, సర్వాన్ ఏవ = సమస్తమైన, వానరాన్ = వానరులను, వ్యసర్జయత్ = పంపివేసెను.

తా. సుగ్రీవుడు వారు తీసుకొని వచ్చిన కానుకలను అన్నింటిని స్వీకరించి మంచి మాటలు పలికి పంపివేసెను. 1

మూ. విసర్జయిత్వా స హరీన్ సహస్రాన్ కృతకర్మణః,
మేనే కృతార్థమాత్మానం రాఘవం చ మహాబలమ్. 2

ప్ర. అ. సః=అతడు, కృతకర్మణః=చేయుబడిన పని గల, సహస్రాన్=వేలకొలది, హరీన్=వానరులను, విసర్జయిత్వా=పంపివేసి, ఆత్మానమ్=తనను, మహాబలమ్= గొప్ప బలము గల, రాఘవం చ= రాముని, కృతార్థమ్=కృతార్థునిగా, మేనే=తలచెను.

తా. సుగ్రీవుడు పని పూర్తి చేసికొని వచ్చిన వేలకొలది ఆ వానరులను పంపివేసి తాను మహాబలశాలి యైన రాముడు కూడా కృతార్థులైనట్లు భావించెను.

మూ. స లక్ష్మణో భీమబలం సర్వవానరసత్తమమ్,
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం సంప్రహర్షయన్. 3
కిష్కిన్ధాయా వినిష్క్రామ యది తే సౌమ్య రోచతే.

ప్ర. అ. సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, భీమబలమ్=భయంకరమైన బలము గలవాడు, సర్వవానరసత్తమమ్=సమస్తమైన వానరులలో శ్రేష్ఠుడు అయిన, సుగ్రీవమ్=సుగ్రీవుని, సంప్రహర్షయన్=సంతోషపెట్టుచు, ప్రశ్రితమ్=వినయపూర్వకమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. సౌమ్య!=ఓ సౌమ్యుడా! తే=నీకు, రోచతే యది=ఇష్టమైనట్లైతే, కిష్కిన్ధాయాః=కిష్కింధనుండి, వినిష్క్రామ=బయలుదేరుము.

తా. లక్ష్మణుడు భయంకరమైన బలము కలవాడు, వానరులందరిలోను శ్రేష్ఠుడు అయిన సుగ్రీవునకు సంతోషము కలిగించుచు వినయపూర్వకముగా "ఓ సౌమ్యుడా! నీకు ఇష్టమైనచో కిష్కింధనుండి బయలుదేరి రామునివద్దకు రమ్ము" అని పలికెను. 3

మూ. తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య సుభాషితమ్, 4
సుగ్రీవః పరమప్రీతో వాక్యమేతదువాచ హ,
ఏవం భవతు గచ్ఛామ స్థేయం త్వచ్ఛాసనే మయా. 5

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, సుభాషితమ్=బాగుగా పలుకబడిన, తస్య లక్ష్మణస్య=ఆ లక్ష్మణునియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, పరమప్రీతః=చాల సంతోషించినవాడై, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను. ఏవమ్= ఇట్లు, భవతు=అగుగాక. గచ్ఛామ=వెళ్లుదము. మయా=నాచేత, త్వచ్ఛాసనే=నీ ఆజ్ఞయందు, స్థేయమ్=ఉండదగినది.

తా. సుగ్రీవుడు ప్రేమపూర్వకముగా లక్ష్మణుడు పలికిన ఆ మాట విని చాల సంతోషించి "అట్లే అగుగాక! వెళ్లెదము. నేను నీ ఆజ్ఞను పాలించవలెను" అని పలికెను. 4,5

మూ. తమేవముక్త్వా సుగ్రీవో లక్ష్మణం శుభలక్షణమ్,
విసర్జయామాస తదా తారాద్యాశ్చైవ యోషితః. 6

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, శుభలక్షణమ్=శుభమైన లక్షణములు గల, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తదా=అపుడు, తారాద్యాః=తార మొదలైన, యోషితశ్చైవ=స్త్రీలను, విసర్జయామాస=పంపివేసెను.

తా. సుగ్రీవుడు శుభలక్షణములు గల లక్ష్మణునితో ఇట్లు పలికి తార మొదలైన స్త్రీలను అంతఃపురములోనికి పంపివేసెను. 6

మూ. ఏహీత్యుచ్చైర్హరివరాన్ సుగ్రీవః సముదాహరత్,
తస్య తద్వచనం శ్రుత్వా హరయః శీఘ్రమాయయుః, 7
బద్ధాఞ్జలిపుటాః సర్వే యే స్యుః స్త్రీదర్శనక్షమాః.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, ఏహి=రమ్ము, ఇతి=అని, ఉచ్చైః=బిగ్గరగా, హరివరాన్=వానరశ్రేష్ఠులను గూర్చి, సముదాహరత్=పలికెను. తస్య=ఆతనియొక్క, తత్=ఆ వచనమును, శ్రుత్వా=విని, యే=ఏ వానరములు, స్త్రీదర్శనక్షమాః= అంతఃపురస్త్రీలను చూచుటకు తగినవారుగా, స్యుః=ఉందురో, సర్వే=సమస్తమైన, హరయః= ఆ వానరులు, బద్ధాఞ్జలిపుటాః=కట్టబడిన దోసిళ్లు కలవారై, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆయయుః=వచ్చిరి.

తా. సుగ్రీవుడు "ఇటు రండి" అని వానరులను బిగ్గరగా పిలచెను. ఆతని

మాట విని అంతఃపురస్త్రీలను చూచుటకు తగిన వానరులు అంజలి ఘటించి శీఘ్రముగా వచ్చిరి. 7

మూ. తానువాచ తతః ప్రాప్తాన్ రాజార్కసదృశప్రభః, 8
ఉపస్థాపయత క్షిప్రం శిబికాం మమ వానరాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అర్కసదృశప్రభః=సూర్యునితో సమానమైన కాంతి గల, రాజా=రాజు, ప్రాప్తాన్=వచ్చిన, తాన్=వారిని గూర్చి, ఉవాచ=పలికెను. వానరాః=వానరులారా! మమ=నాయొక్క, శిబికామ్=పల్లకిని, క్షిప్రమ్= శీఘ్రముగా, ఉపస్థాపయత=తీసుకొని రండి.

తా. సూర్యునితో సమానమైన కాంతి గల సుగ్రీవుడు వచ్చిన ఆ వానరులను చూచి "నా పల్లకిని వెంటనే తీసుకొని రండి" అని పలికెను. 8

మూ. శ్రుత్వా తు వచనం తస్య హరయః శీఘ్రవిక్రమాః, 9
సముపస్థాపయామాసుః శిబికాం ప్రియదర్శనామ్.

ప్ర. అ. శీఘ్రవిక్రమాః=శీఘ్రమైన గమనము గల, హరయః=వానరులు, తస్య= ఆతనియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, ప్రియదర్శనామ్=అందమైన దర్శనము గల, శిబికామ్=పల్లకిని, సముపస్థాపయామాసుః=తెచ్చిరి.

తా. సుగ్రీవుని మాట ప్రకారము శీఘ్రముగా వెళ్లు ఆ వానరులు చూచుటకు అందమైన పల్లకిని తీసుకొని వచ్చిరి. 9

మూ. తాముపస్థాపితాం దృష్ట్వా శిబికాం వానరాధిపః, 10
లక్ష్మణారుహ్యతాం శీఘ్రమితి సౌమిత్రిమబ్రవీత్.

ప్ర. అ. వానరాధిపః=సుగ్రీవుడు, ఉపస్థాపితామ్=తీసుకొనిరాబడిన, తాం శిబికామ్= ఆ పల్లకిని, దృష్ట్వా=చూచి, లక్ష్మణ!=ఓ లక్ష్మణా! శీఘ్రమ్=శీఘ్రముగా, ఆరుహ్యతామ్=ఎక్కబడుగాక! ఇతి=అని, సౌమిత్రిమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్= పలికెను.

తా. సుగ్రీవుడు ఆ పల్లకిని చూచి "లక్ష్మణా! శీఘ్రముగా ఎక్కుము" అని లక్ష్మణునితో పలికెను. 10

మూ. ఇత్యుక్త్వా కాఞ్చనం యానం సుగ్రీవః సూర్యసన్నిభమ్, 11
బహుభిర్హరిభిర్యుక్తమారురోహ సలక్ష్మణః.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, సూర్యసన్నిభమ్= సూర్యునితో సమానము, బహుభిః=చాలమంది, హరిభిః=వానరులచేత, యుక్తమ్= మోయబడినది అయిన, కాఞ్చనమ్=బంగారము వికారమైన, యానమ్=ఆ వాహనమును, సలక్ష్మణః=లక్ష్మణసహితుడై, ఆరురోహ=ఎక్కెను.

తా. సుగ్రీవుడు లక్ష్మణునితో ఇట్లు పలికి చాలమంది వానరులు మోయుచున్న, సూర్యునితో సమానమైన ఆ బంగారు వాహనమును లక్ష్మణునితో కూడ ఎక్కెను. 11

మూ. పాణ్డురేణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని, 12
శుక్లైశ్చ వాలవ్యజనైర్ధూయమానైః సమన్తతః,
శఙ్ఖభేరీనినాదైశ్చ వన్దిభిశ్చాభినన్దితః, 13
నిర్యయౌ ప్రాప్య సుగ్రీవో రాజ్యశ్రియమనుత్తమామ్.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, అనుత్తమామ్=శ్రేష్ఠమైన, రాజ్యశ్రియమ్=రాజ్యలక్ష్మిని, ప్రాప్య=పొంది, వన్దిభిః=స్తోత్రపాఠకులచేత, అభినన్దితః=స్తుతింపబడుచున్నవాడై, మూర్ధని=శిరస్సుమీద, ధ్రియమాణేన=ధరింపబడుచున్న, పాణ్డురేణ=తెల్లని, ఆతపత్రేణ=ఛత్రముతోను, సమన్తతః=అంతటా, ధూయమానైః=వీచబడుచున్న, వాలవ్యజనైః=వింజామరలతోను, శఙ్ఖభేరీనినాదైశ్చ=శంఖములయొక్క, భేరీలయొక్క ధ్వనులతోను, నిర్యయౌ=బయలుదేరెను.

తా. శ్రేష్ఠమైన రాజ్యలక్ష్మిని పొందిన ఆ సుగ్రీవుడు వందిమాగధులు స్తుతించుచుండగా బయలుదేరెను. ఆతని శిరస్సుపై తెల్లని ఛత్రము పట్టిరి. తెల్లని వింజామరలు నలుమూలల వీచుచుండిరి. శంఖములు, భేరీలు మ్రోగుచుండెను.

మూ. స వానరశతైస్తీక్ష్ణైర్బహుభిః శస్త్రపాణిభిః, 14
పరికీర్ణో యయౌ తత్ర యత్ర రామో వ్యవస్థితః.

ప్ర. అ. సః=అతడు, శస్త్రపాణిభిః=ఆయుధములు హస్తములందు గల, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, బహుభిః=అనేకమైన, వానరశతైః=వానరులయొక్క శతములచేత, పరికీర్ణః= చుట్టువారుకొనబడినవాడై, రామః=రాముడు, యత్ర=ఎక్కడ, వ్యవస్థితః=ఉన్నాడో, తత్ర=అక్కడికి, యయౌ=వెళ్లెను.

తా. ఆయుధములు ధరించిన శూరులైన వానరులు వందలకొలది తన చుట్టూ వచ్చుచుండగా ఆ సుగ్రీవుడు రాముడు నివసించుచున్న ప్రదేశమునకు వెళ్లెను. 14

మూ. స తం దేశమనుప్రాప్య శ్రేష్ఠం రామనిషేవితమ్, 15
అవాతరన్మహాతేజాః శిబికాయాః సలక్ష్మణః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సలక్ష్మణః=లక్ష్మణునితో గూడిన, సః=ఆ సుగ్రీవుడు, రామనిషేవితమ్=రామునిచేత సేవింపబడిన, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన, తం దేశమ్= ఆ ప్రదేశమును, అనుప్రాప్య=చేరి, శిబికాయాః=పల్లకినుండి, అవాతరత్=దిగెను.

తా. రాముడు నివసించుచున్న శ్రేష్ఠమైన ఆ ప్రదేశమును చేరి గొప్ప

తేజస్సు గల ఆ సుగ్రీవుడు, లక్ష్మణుడు పల్లకినుండి దిగిరి. 15

మూ. ఆసాద్య చ తతో రామం కృతాఞ్జలిపుటోఽ భవత్, 16
కృతాఞ్జలౌ స్థితే తస్మిన్ వానరాశ్చాభవంస్తథా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామమ్=రాముని, ఆసాద్య=సమీపించి, కృతాఞ్జలిపుటః=చేయబడిన దోసిలి కలవాడు, అభవత్ =ఆయెను. తస్మిన్=అతడు, కృతాఞ్జలౌ=చేయబడిన దోసిలి కలవాడై, స్థితే=నిలిచి యుండగా, వానరాశ్చ=వాన రులు కూడ, తథా=అట్లు, అభవన్=అయిరి.

తా. పిమ్మట అతడు రాముని సమీపించి దోసిలి కట్టి నిలబడెను. అతడు ఆ విధముగా దోసిలి కట్టి నిలిచి యుండుట చూచి, వానరు లందరు కూడ అట్లే చేసిరి. 16

మూ. తటాకమివ తం దృష్ట్వా రామః కుడ్మలపఙ్కజమ్, 17
వానరాణాం మహత్సైన్యం సుగ్రీవే ప్రీతిమానభూత్.

ప్ర. అ. రామః=రాముడు, కుడ్మలపఙ్కజమ్=మొగ్గలుగా ఉన్న పద్మములు గల, తమ్=ఆ, తటాకమివ=చెరువు వలె ఉన్న, వానరాణామ్=వానరులయొక్క, మహత్= గొప్పదైన, సైన్యమ్=సైన్యమును, దృష్ట్వా=చూచి, సుగ్రీవే=సుగ్రీవుని యందు, ప్రీతిమాన్=ప్రేమ కలవాడు, అభూత్=ఆయెను.

తా. రాముడు పద్మముల మొగ్గలతో నిండిన చెఱువు వలె ఉన్న ఆ పెద్ద వానరసైన్యమును చూచి సుగ్రీవుని విషయమున స్నేహభావమును పొందెను.17

మూ. పాదయోః పతితం మూర్ధ్నా తముత్థాప్య హరీశ్వరమ్, 18
ప్రేమ్ణా చ బహుమానాచ్చ రాఘవః పరిషస్వజే.

ప్ర. అ. రాఘవః=రాముడు, మూర్ధ్నా=శిరస్సుతో, పాదయోః=పాదముల మీద, పతితమ్=పడిన, తమ్=ఆ, హరీశ్వరమ్=సుగ్రీవుని, ఉత్థాప్య=లేపి, ప్రేమ్ణా చ=ప్రేమతోను, బహుమానాచ్చ=గౌరవము వలనను, పరిషస్వజే=కౌగలించుకొనెను.

తా. రాముడు తన పాదములపై శిరస్సు ఉంచి నమస్కరించుచున్న ఆ సుగ్రీవుణ్ణి లేవదీసి ప్రేమతోను, గౌరవభావముతోను కౌగలించుకొనెను. 18

మూ. పరిష్వజ్య చ ధర్మాత్మా నిషీదేతి తతోఽ బ్రవీత్, 19
నిషణ్ణం తం తతో దృష్ట్వా క్షితౌ రామోఽ బ్రవీత్తతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, పరిష్వజ్య=కౌగలించుకొని, తతః=అటుపిమ్మట, నిషీద=కూర్చుండుము, ఇతి=అని, అబ్రవీత్=పలికెను. తతః=అటుపిమ్మట, క్షితౌ=నేలమీద, నిషణ్ణామ్=కూర్చున్న, తమ్=అతనిని, దృష్ట్వా=చూచి, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఆతనిని కౌగలించుకొని కూర్చుండుము అని పలికెను. ఆతడు కూర్చున్న పిమ్మట ఆతనితో ఇట్లనెను. 19

మూ. ధర్మమర్థం చ కామం చ కాలే యస్తు నిషేవతే, 20
విభజ్య సతతం వీర! స రాజా హరిసత్తమ.

ప్ర. అ. వీర=ఓ! వీరుడా!హరిసత్తమ=ఓ! వానరశ్రేష్ఠుడా! యః=ఎవడు, సత తమ్=ఎల్లప్పుడు, ధర్మమ్=ధర్మమును, అర్థం చ=అర్థమును, కామం చ=కామమును, కాలే=కాలమునందు, విభజ్య= విభజించుకొని, నిషేవతే=సేవించునో, సః=అతడే, రాజా=రాజు.

తా. వీరుడవైన ఓ సుగ్రీవా! ఎవడు ధర్మార్థకామములను ఆ యా కాలములందు విభజించుకొని సేవించునో ఆతడే రాజు. 20

మూ. హిత్వా ధర్మం తథార్థం చ కామం యస్తు నిషేవతే, 21
స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే.

ప్ర. అ. యః=ఎవడు, ధర్మమ్=ధర్మమును, తథా=మరియు, అర్థం చ= అర్థమును, హిత్వా=విడచి, కామమ్=కామమును, నిషేవతే=సేవించునో, సః= అతడు, వృక్షాగ్రే=వృక్షము చివర, సుప్తః ఇవ=నిద్రపోయినవాడు వలె, పతితః= క్రిందపడినవాడగుచునే, ప్రతిబుధ్యతే=మేల్కొనును(తెలిసికొనును.)

తా. ధర్మార్థములను విడచి కామమును మాత్రమే సేవించువాడు చెట్టు చివరి కొమ్మపై నిద్రించిన వాడు కింద పడిన తరువాతనే మేల్కొని నట్లు, ఆపదలలో చిక్కుకొనిన పిమ్మటనే తన తప్పిదమును గ్రహించును. 21

మూ. అమిత్రాణాం వధే యుక్తో మిత్రాణాం సంగ్రహే రతః, 22
త్రివర్గఫలభోక్తా చ రాజా ధర్మేణ యుజ్యతే.

ప్ర. అ. అమిత్రాణామ్=శత్రువులయొక్క, వధే=వధయందు, యుక్తః=ఆస క్తుడు, మిత్రాణామ్=మిత్రులయొక్క, సంగ్రహే=సంగ్రహమునందు, రతః=ఆసక్తుడు అయిన, రాజా=రాజు, ధర్మేణ=ధర్మముతో, యుజ్యతే=కూడినవా డగును. త్రివర్గ ఫలభోక్తా చ=ధర్మార్థకామము అనే మూడింటి ఫలమును అనుభవించువాడగును.

తా. అమిత్రులను వధించుచు, మిత్రులను సంపాదించుకొనుచుండు రాజు రాజధర్మమును పాలించినవాడగును. ఆతడే ధర్మార్థకామముల ఫలమును అనుభవించగలడు. 22

మూ. ఉద్యోగసమయస్త్వేష ప్రాప్తః శత్రునిషూదన, 23
సంచిన్త్యతాం హి పిఙ్గేశ హరిభిః సహ మన్త్రిభిః.

ప్ర. అ. శత్రునిషూదన=శత్రుసంహారకుడవైన, పిఙ్గేశ=వానరరాజా! ఏషః=ఈ,

ఉద్యోగసమయః=ప్రయత్నమునకు సమయము, ప్రాప్తః=వచ్చినది. మన్త్రిభిః=నీ మంత్రులైన, హరిభిః సహ=వానరులతో కూడ, సంచిన్త్యతామ్=ఆలోచింపబడుగాక.

తా. శత్రుసంహారకుడవైన సుగ్రీవా! మనము ప్రయత్నము చేయవలసిన సమయము వచ్చినది. అందుచేత నీ మంత్రులతో ఆలోచించుము. 23

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో రామం వచనమబ్రవీత్. 24
ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
త్వత్ప్రసాదాన్మహాబాహో పునః ప్రాప్తమిదం మయా. 25

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామమ్=రామునిగూర్చి, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! ప్రణష్టా=నశించిన, శ్రీశ్చ=లక్ష్మి, కీర్తిశ్చ=కీర్తి, శాశ్వతమ్=శాశ్వతమైన, ఇదమ్=ఈ, కపిరాజ్యం చ=వానరరాజ్యము, మయా=నాచేత, త్వత్ప్రసాదాత్=నీ అనుగ్రహమువలన, ప్రాప్తమ్=పొందబడినది.

తా. రాముని మాటలు విని సుగ్రీవుడు ఆతనితో ఇట్లు పలికెను. గొప్ప బాహువులు గల ఓ! రామా! పోయిన ఐశ్వర్యమును, కీర్తిని, ఈ శాశ్వతమైన వానరరాజ్యమును నేను నీ అనుగ్రహమువలన పొందితిని. 24,25

మూ. తవ దేవ ప్రసాదాచ్చ భ్రాతుశ్చ జయతాం వర,
కృతం న ప్రతికుర్యాద్యః పురుషాణాం హి దూషకః. 26

ప్ర. అ. దేవ=ఓ! ప్రభూ! జయతాం వర=జయించువారిలో శ్రేష్ఠుడా! తవ=నీయొక్క, భ్రాతుశ్చ=నీ సోదరునియొక్క, ప్రసాదేన=అనుగ్రహముచేత, కృతమ్=చేయబడిన ఉపకారమును, యః=ఎవడు, న ప్రతికుర్యాత్=ప్రత్యుపకారము చేయడో అతడు, పురుషాణామ్=పురుషులలో, దూషకః=ధర్మనాశకుడు.

తా. జయించువారిలో గొప్పవాడవైన ఓ! ప్రభూ! నీవు, నీ సోదరుడు అనుగ్రహించి చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేయకపోయినచో నేను ధర్మమునకు విఘాతము కలిగించిన పురుషుడను అగుదును. 26

మూ. ఏతే వానరముఖ్యాశ్చ శతశః శత్రుసూదన,
ప్రాప్తాశ్చాదాయ బలినః పృథివ్యాం సర్వవానరాన్. 27

ప్ర. అ. శత్రుసూదన=శత్రుసంహారకుడా! శతశః=వందలకొలది, ఏతే=ఈ, వానరముఖ్యాః=వానరశ్రేష్ఠులు, పృథివ్యామ్=భూమిమీద ఉన్న, బలినః=బలవంతులైన, సర్వవానరాన్=అందరు వానరులను, ఆదాయ=తీసికొని, ప్రాప్తాః=వచ్చినారు.

తా. శత్రుసంహారకుడవైన రామా! వందలకొలది ఈ వానరులు, భూమిమీద బలశాలులైన వానరు లందరినీ తీసికొని వచ్చినారు. 27

మూ. ఋక్షాశ్చ వానరాః శూరా గోలాఙ్గూలాశ్చ రాఘవ,
కాన్తారవనదుర్గాణామభిజ్ఞా ఘోరదర్శనాః. 28
దేవగన్ధర్వపుత్రాశ్చ వానరాః కామరూపిణః,
స్వైః స్వైః పరివృతాః సైన్యైర్వర్తన్తే పథి రాఘవ. 29

ప్ర. అ. రాఘవ=రఘువంశమునందు జన్మించిన, రాఘవ=రామా! కాన్తార వనదుర్గాణామ్=మహారణ్యములను, వనములను, అక్కడ నున్న దుర్గములను ఎరిగిన, ఘోరదర్శనాః=భయంకరమైన దర్శనము గల, ఋక్షాశ్చ=ఎలుగుబంట్లు, వానరాః= వానరులు, శూరాః=శూరులైన, గోలాఙ్గూలాశ్చ=కొండముచ్చులు, దేవగన్ధర్వపుత్రాః= దేవతలయొక్క గంధర్వులయొక్క పుత్రులైన, కామరూపిణః=స్వేచ్ఛారూపములు గల, వానరాశ్చ= వానరులు, స్వైః స్వైః=తమ తమ, సైన్యైః=సైన్యములతో, పరివృతాః=కూడినవారై, పథి=మార్గమునందు, వర్తన్తే=ఉన్నారు.

తా. రామా! మహారణ్యములతోను, వనములతోను, దుర్గములతోను పరిచయ మున్నవారు, చూచుటకు భయంకరులు అయిన భల్లూకములు, వానరులు, శూరులైన గోలాంగూలములు, దేవగంధర్వుల పుత్రులు స్వేచ్ఛారూపము గలవారు అయిన వానరులు తమ తమ సైన్యములతో వచ్చుచున్నారు; మార్గమధ్యమునందు ఉన్నారు. 28,29

మూ. శతైః శతసహస్రైశ్చ వర్తన్తే కోటిభిస్తథా,
అయుతైశ్చావృతా వీర శఙ్కుభిశ్చ పరంతప. 30
అర్బుదైరర్బుదశతైర్మధ్యైశ్చాన్త్యైశ్చ వానరాః,
సముద్రాశ్చ పరార్ధాశ్చ హరయో హరియూథపాః. 31
ఆగమిష్యన్తి తే రాజన్ మహేన్ద్రసమవిక్రమాః,
మేఘపర్వతసంకాశా మేరువిన్ధ్యకృతాలయాః. 32

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడవైన, రాజన్=రాజా! వీర=ఓ! వీరుడా!శతైః= (వానరుల)శతములతోను, శతసహస్రైశ్చ=లక్షలతోను, తథా=మరియు, కోటిభిః=కోట్లతోను, అయుతైశ్చ=అయుతములతోను, శఙ్కుభిశ్చ=శంకువుల తోను, అర్బుదైః=అర్బుదములతోను, అర్బుదశతైః=అర్బుదముల శతముల తోను, మధ్యైశ్చ=మధ్యలతోను, అన్త్యైశ్చ=అంత్యములతోను, ఆవృతాః=కూడిన, వానరాః=వానరులు, వర్తన్తే=మార్గములో ఉన్నారు. సముద్రాశ్చ=సముద్రములు, పరార్ధాశ్చ=పరార్ధములు, హరయః=వానరులు, మహేన్ద్రసమవిక్రమాః=మహేంద్రునితో సమానమైన పరాక్రమము గల, మేఘపర్వతసంకాశాః= మేఘములతోను పర్వతము లతోనూ సమానులైన, మేరువిన్ధ్యకృతాలయాః=మేరుపర్వతమునందు వింధ్యపర్వత మునందు చేయబడిన నివాసములు గల, హరియూథపాః=వానరసేనానాయకులు, తే=నీకు, ఆగమిష్యన్తి=రాగలరు.

తా. శత్రుసంహారకుడవు, వీరుడవు అయిన ఓ! రాజా! శతము, లక్ష, కోటి, అయుతము, శంకువు, అర్బుదము, నూరు అర్బుదములు, మధ్య, అంత్యము అను సంఖ్యలలో ఉన్న వానరులతో కూడిన వానరనాయకులు దారిలో ఉన్నారు. సముద్ర పరార్ధసంఖ్యలలో ఉన్న వానరులు, మహేంద్రునితో సమానమైన పరాక్రమము గలవారు, మేరువింధ్యపర్వతములమీద నివసించువారు అయిన వానరసేనానాయకులు నీవద్దకు రాగలరు.

వి. నూరు వేలు లక్ష. నూరులక్షలు కోటి. పదివేలు అయుతము. లక్షకోట్లు శంకువు. వెయ్యి శంకువులు అర్బుదము. పది అర్బుదములు మధ్యము. పది మధ్యములు అంత్యము. ఇరవై అంత్యములు సముద్రము. ముప్పై సముద్రములు పరార్ధము. అసంఖ్యాకులైన వానరులు వచ్చుచున్నారని భావము. (తిలకవ్యాఖ్య.)

గోవిందరాజవ్యాఖ్యానములో జ్యోతిఃశాస్త్రములో చెప్పిన ఈ సంఖ్యాలక్షణము ఉదాహరింపబడినది. ఈ సంఖ్యలు పది రెట్లు చొప్పున పెరుగును:-

"ఏకం దశ శతమస్మాత్సహస్రమయుతం తతః పరం లక్షమ్,
ప్రయుతం కోటిమథార్బుదవృన్దే ఖర్వం నిఖర్వం చ.
తస్మాన్మహాసరోజం శఙ్కుం సరితాం పతిం త్వన్త్యమ్,
మధ్యం పరార్ధమాహుర్యథోత్తరం దశగుణం తథా జ్ఞేయమ్." 30-32

మూ. తే త్వామభిగమిష్యన్తి రాక్షసం యే సబాన్ధవమ్,
నిహత్య రావణం యుద్ధే హ్యానయిష్యన్తి మైథిలీమ్. 33

ప్ర. అ. యే=ఏ వానరులు, యుద్ధే=యుద్ధమునందు, సబాన్ధవమ్=బంధువులతో గూడిన, రాక్షసమ్=రాక్షసుడైన, రావణమ్=రావణుని, నిహత్య=చంపి, మైథిలీమ్=సీతను, ఆనయిష్యన్తి=తీసికొనిరాగలరో, తే=అట్టి వానరులు, త్వామ్=నిన్ను, అభిగమిష్యన్తి= చేరగలరు.

తా. ఆ వానరు లందరు నీ వద్దకు రాగలరు. వారు రాక్షసుడైన రావణుని, వాని బంధువులను యుద్ధమునందు సంహరించి సీతను తీసికొని రాగలరు. 33

మూ. తతః సముద్యోగమవేక్ష్య వీర్యవాన్
హరిప్రవీరస్య నిదేశవర్తినః,
బభూవ హర్షాద్వసుధాధిపాత్మజః
ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
అష్టాత్రింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, వసుధాధిపాత్మజః= రాజకుమారుడైన రాముడు, నిదేశవర్తినః=తన ఆజ్ఞను పాలించుచున్న,

హరిప్రవీరస్య= సుగ్రీవునియొక్క, సముద్యోగమ్=ప్రయత్నమును, అవేక్ష్య=చూచి, హర్షాత్= సంతోషమువలన, ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః=వికసించిన నల్లకలువల వంటి నేత్రములు కలవాడు, బభూవ=ఆయెను.

తా. పరాక్రమవంతుడైన రాముడు, సుగ్రీవుడు తన ఆజ్ఞను పాలించి ప్రయత్నము చేయుచున్నందులకు సంతోషించెను. ఆతని నేత్రములు నల్ల కలువలు వికసించి నట్లు ఆనందముతో వికసించెను. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ముప్పది ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనచత్వారింశః సర్గః

(రాముడు సుగ్రీవునకు తన కృతజ్ఞతను తెలుపుట. వానరసేనానాయకులు తమ తమ సేనలతో వచ్చి చేరుట)

మూ. ఇతి బ్రువాణం సుగ్రీవం రామో ధర్మభృతాం వరః,
బాహుభ్యాం సంపరిష్వజ్య ప్రత్యువాచ కృతాఞ్జలిమ్. 1

ప్ర. అ. ధర్మభృతామ్=ధర్మమును పోషించేవారిలో, వరః=శ్రేష్ఠుడైన, రామః= రాముడు, ఇతి=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, కృతాఞ్జలిమ్=చేయబడిన దోసిలి గల, సుగ్రీవమ్=సుగ్రీవుని, బాహుభ్యామ్=బాహువులచేత, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడైన రాముడు ఇట్లు పలుకుచు చేతులు జోడించి నమస్కరించుచున్న సుగ్రీవుని బాహువులతో కౌగలించుకొని ఇట్లు పలికెను. 1

మూ. యదిన్ద్రో వర్షతే వర్షం న తచ్చిత్రం భవిష్యతి,
ఆదిత్యోఽ సౌ సహస్రాంశుః కుర్యాద్వితిమిరం నభః, 2
చన్ద్రమా రజనీం కుర్యాత్ప్రభయా సౌమ్య నిర్మలామ్,
త్వద్విధో వాఽ పి మిత్రాణాం ప్రీతిం కుర్యాత్పరంతప. 3

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా! సౌమ్య=సౌమ్యుడా! ఇన్ద్రః=ఇంద్రుడు, వర్షమ్=వర్షమును, యత్ వర్షతే=వర్షించుచున్నా డనునది ఏది కలదో, సహస్రాంశుః= వేయి కిరణములు గల, అసౌ=ఈ, ఆదిత్యః=సూర్యుడు, నభః=ఆకాశమును, వితిమిరమ్=చీకటి లేనిదానినిగా, కుర్యాత్=చేయుట ఏది కలదో, చన్ద్రమాః=చంద్రుడు, ప్రభయా=కాంతిచేత,రజనీమ్=రాత్రిని, నిర్మలామ్=నిర్మలమైన దానినిగా, కుర్యాత్= చేయుట అనునది ఏది కలదో, త్వద్విధః=నీవంటివాడు, మిత్రాణామ్=మిత్రులకు, ప్రీతిమ్= సంతోషమును, కుర్యాత్=చేయుట అనునది ఏది కలదో, తత్=అది, చిత్రమ్=ఆశ్చర్యకరము, న భవిష్యతి=కాదు.

తా. శత్రుసంహారకుడవైన ఓ!సౌమ్యుడా! ఇంద్రుడు వర్షించుచున్నాడనగా, వేయి కిరణములు గల ఈ సూర్యుడు ఆకాశమునుండి చీకటిని తొలగించుచున్నా డనగా, చంద్రుడు తన కాంతిచేత రాత్రిని నిర్మలము చేయుచున్నా డనగా నీవంటి వాడు మిత్రులకు ఆనందము కల్గించుచున్నా డనగా దీనిలో ఆశ్చర్యపడవలసినది లేదు. 2,3

మూ. ఏవం త్వయి న తచ్చిత్రం భవేద్యత్సౌమ్య శోభనమ్,
జానామ్యహం త్వాం సుగ్రీవ సతతం ప్రియవాదినమ్. 4

ప్ర. అ. సౌమ్య!=ఓ! సౌమ్యుడా! సుగ్రీవ!=సుగ్రీవుడా! ఏవమ్=ఇట్లు, త్వయి=నీయందు, శోభనమ్=శోభనమైన, తత్=ఆ కార్యము, చిత్రమ్=ఆశ్చర్యకరము, న భవేత్=కాదు. త్వామ్=నిన్ను, సతతమ్=ఎల్లప్పుడు, ప్రియవాదినమ్=ప్రియమునే మాట్లాడువానినిగా, అహమ్=నేను, జానామి=ఎరుగుదును.

తా. సౌమ్యుడైన ఓ సుగ్రీవా! నీవు ఈ విధముగా మంచి కార్యమును చేయుట ఆశ్చర్యకరము కాదు. ఎల్లపుడు ప్రియముగా మాటలాడు నిన్నుగూర్చి నాకు బాగుగా తెలియును. 4

మూ. త్వత్సనాథః సఖే సజ్ఖ్యే జేతాఽ స్మి సకలానరీన్,
త్వమేవ మే సుహృన్మిత్రం సాహాయ్యం కర్తుమర్హసి . 5

ప్ర. అ. సఖే=మిత్రుడా! త్వత్సనాథః=నీతో కూడినవాడనై, సజ్ఖ్యే=యుద్ధము నందు, సకలాన్=సమస్తమైన, అరీన్=శత్రువులను, జేతాఽ స్మి=జయించగలను. సుహృత్=మంచి హృదయము గల, మిత్రమ్=మిత్రుడవైన, త్వమేవ=నీవే, మే= నాకు, సాహాయ్యమ్=సాహాయ్యమును, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ! మిత్రుడా! నీతో కలిసి యుద్ధములో శత్రువు లందరిని, జయించగలను. మంచి హృదయము గల మిత్రుడవైన నీవే నాకు సహాయము చేయ దగినవాడవు. 5

మూ. జహారాత్మవినాశాయ మైథిలీం రాక్షసాధమః,
వఞ్చయిత్వా తు పౌలోమీమనుహ్లాదో యథా శచీమ్. 6

ప్ర. అ. రాక్షసాధమః=రాక్షసాధముడైన రావణుడు, వఞ్చయిత్వా=వంచించి, మైథిలీమ్= సీతను, అనుహ్లాదః=అనుహ్లాదుడు, పౌలోమీమ్=పులోముని కుమార్తె యైన, శచీం యథా=శచీదేవిని వలె, ఆత్మవినాశాయ=తన వినాశముకొరకే, జహార=హరించినాడు.

తా. రాక్షసాధముడైన రావణుడు, అనుహ్లాదుడు పులోముని కుమార్తెయైన శచీదేవిని అపహరించి నట్లు సీతను తన వినాశముకొరకే మోసగించి అపహరించినాడు. 6

మూ. న చిరాత్తం వధిష్యామి రావణం నిశితైః శరైః,
పౌలోమ్యాః పితరం దృప్తం శతక్రతురివారిహా. 7

ప్ర. అ. తం రావణమ్=ఆ రావణుని, నచిరాత్=కొంచెము కాలములో, అరిహా= శత్రుసంహారకుడైన, శతక్రతుః=దేవేంద్రుడు, పౌలోమ్యాః=శచీదేవియొక్క,

దృప్తమ్= గర్వించిన, పితరమ్ ఇవ=తండ్రిని వలె, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, వధిష్యామి=చంపగలను.

తా. శత్రుసంహారకుడైన దేవేంద్రుడు దృప్తుడైన శచీదేవి తండ్రిని వలె ఆ రావణుని వాడియైన బాణములతో కొద్ది కాలములో సంహరించెదను.

వి. పులోముడు శచీదేవి తండ్రి. ఆతని అనుమతిచే అనుహ్లాదుడు ఆమెను అపహరింపగా దేవేంద్రుడు వారినిద్దరిని సంహరించె నని పురాణగాథ. 7

మూ. ఏతస్మిన్నన్తరే చైవ రజః సమభివర్తత,
ఉష్ణతీవ్రాం సహస్రాంశోశ్ఛాదయద్గగనే ప్రభామ్. 8

ప్ర. అ. ఏతస్మిన్నన్తరే=ఈ లోపుగా, గగనే=ఆకాశమునందు, సహస్రాంశోః=సూర్యునియొక్క, ఉష్ణతీవ్రామ్=వేడిగా తీవ్రముగా నున్న, ప్రభామ్=కాంతిని, ఛాదయత్=కప్పుచు,రజః=పరాగము, సమభివర్తత=వ్యాపించెను.

తా. ఇంతలో సూర్యుని ఉష్ణము తీవ్రము అయిన కాంతిని కప్పివేయుచు పరాగము ఆకాశమునందు వ్యాపించెను. 8

మూ. దిశః పర్యాకులాశ్చాసన్ రజసా తేన దూషితాః,
చచాల చ మహీ సర్వా సశైలవనకాననా. 9

ప్ర. అ. తేన=ఆ, రజసా=పరాగముచేత, దూషితాః=దూషింపబడినవై, దిశః= దిక్కులు, పర్యాకులాశ్చ=వ్యాకులములు, ఆసన్=అయినవి. సశైలవనకాననా= పర్వతములతోను, వనములతోను, అరణ్యములతోనూ కూడిన, సర్వా=సమస్తమైన, మహీ చ= భూమి కూడ, చచాల=చలించెను.

తా. ఆ పరాగము వ్యాపించుటచేత దిక్కులు వ్యాకులములు అయ్యెను. పర్వతములతో, వనములతో, అరణ్యములతో కూడిన భూమి యంతయు చలించెను.

మూ. తతో నగేన్ద్రసఙ్కాశైస్తీక్ష్ణదం ష్ట్రైర్మ హాబలైః,
కృత్స్నా సఞ్ఛాదితా భూమిరసఙ్ఖ్యేయైః ప్లవఙ్గమైః. 10
నిమేషాన్తరమాత్రేణ తతస్తైర్హరియూథపైః,
కోటీశతపరీవారైర్వానరైః కామరూపిభిః. 11
నాదేయైః పార్వతేయైశ్చ సాముద్రైశ్చ మహాబలైః,
హరిభిర్మేఘనిర్హ్రాదైరన్యైశ్చ వనవాసిభిః. 12
తరుణాదిత్యవర్ణైశ్చ శశిగౌరైశ్చ వానరైః,
పద్మకేసరవర్ణైశ్చ శ్వేతైర్హేమకృతాలయైః. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నగేన్ద్రసఙ్కాశైః=పర్వతములతో సమాన

మైన, తీక్ష్ణదంష్ట్రైః=తీక్ష్ణమైన కోరలు గల, మహాబలైః=గొప్పబలము గల, అసఙ్ఖ్యేయైః=లెక్కింప శక్యము గాని, ప్లవఙ్గమైః=వానరులచేత, కృత్స్నా=సమస్తమైన, భూమిః=భూమి, నిమేషాన్తరమాత్రేణ=ఒక్క నిమేషకాలములో, సఞ్ఛాదితా=కప్పబడినది. తతః=అటుపిమ్మట, హరియూథపైః=వానరసేనానాయకులచేత, కోటీశతపరీవారైః=వందలకొలది కోట్ల పరివారము గల, కామరూపిభిః=స్వేచ్ఛారూపము గల, వానరైః=వానరులచేత, నాదేయైః=నదులకు సంబంధించినవారు, పార్వతేయైశ్చ=పర్వతములకు సంబంధించినవారు, సాముద్రైశ్చ=సముద్రమునకు సంబంధించినవారు, మహాబలైః=గొప్ప బలము గలవారు అయిన, హరిభిః=వానరులచేత, మేఘనిర్హ్రాదైః=మేఘముల వంటి ధ్వని గల, అన్యైః=ఇతరులైన, వనవాసిభిః=వానరులచేత, తరుణాదిత్యవర్ణైః=బాలసూర్యుని వంటి రంగు గలవారు, శశిగౌరైశ్చ=చంద్రుని వలె తెల్లగా ఉన్నవారు, పద్మకేసరవర్ణైశ్చ=పద్మకేసరముల వంటి రంగు గలవారు, శ్వేతైః=తెల్లగా ఉన్నవారు, హేమకృతాలయైః=మేరుపర్వతమునందు చేయబడిన నివాసము గలవారు అయిన, వానరైః=వానరులచేత, (ఆ భూమి కప్పబడెను.)

తా. ఇంతలో మరుక్షణమునందే పర్వతముల వలె ఉన్న తీక్ష్ణమైన కోరలు గల అసంఖ్యాకులైన వానరులు వచ్చి ఆ ప్రదేశము నంతను కప్పివేసిరి. మహాబలశాలులైన ఆ వానరసేనానాయకులతో వందలకొలది కోట్ల వానరులు వారి పరివారముతో వచ్చిరి. ఆ వానరులలో కొందరు నదులలోను, కొందరు పర్వతములపైనను, కొందరు సముద్రమునందు నివసించువారు, మేఘము వలె గర్జించు మహాబలవంతులైన కొందరు వానరులు వివిధవర్ణములలో ఉండిరి. కొందరు బాలసూర్యుని వంటి వర్ణముతోను, కొందరు తెల్లని కాంతితోను, కొందరు పద్మముల కింజల్కముల వంటి కాంతితోను, ప్రకాశించుచుండిరి. వారిలో కొందరు మేరుపర్వతముపై నివసించువారు. 10-13

మూ. కోటీసహస్రైర్దశభిః శ్రీమాన్పరివృతస్తదా,
వీరః శతబలిర్నామ వానరః ప్రత్యదృశ్యత. 14

ప్ర. అ. తదా=అపుడు, దశభిః=పది, కోటీసహస్రైః=కోట్ల సహస్రములతో, పరివృతః=కూడిన, శ్రీమాన్=శోభ గల, వీరః=వీరుడైన, శతబలిర్నామ=శతబలి యను పేరు గల, వానరః= వానరుడు, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. అపుడు లక్షకోట్ల వానరులతో కలిసి వచ్చిన శ్రీమంతుడు, వీరుడు అయిన శతబలి అనే వానరుడు కనబడెను. 14

మూ. తతః కాఞ్చనశైలాభస్తారాయా వీర్యవాన్పితా,
అనేకైర్బహుసాహస్రైః కోటిభిః ప్రత్యదృశ్యత. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కాఞ్చనశైలాభః=మేరుపర్వతము వంటి కాంతి గలవాడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, తారాయాః పితా=తారయొక్క

తండ్రి యైన సుషేణుడు, బహుసాహస్రైః=అనేకమైన వేల, కోటిభిః=కోట్లతో, అనేకైః=అనేకవానరులతో, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. పిమ్మట మేరుపర్వతమువంటి కాంతి గల పరాక్రమవంతుడైన తార తండ్రి సుషేణుడు చాల వేలకోట్ల వానరులతో కనబడెను. 15

మూ. తథాఽ పరేణ కోటీనాం సహస్రేణ సమన్వితః,
పితా రుమాయాః సంప్రాప్తః సుగ్రీవశ్వశురో విభుః. 16

ప్ర.అ. తథా=అట్లే, విభుః=సమర్థుడు, రుమాయాః పితా=రుమయొక్క తండ్రి అయిన, సుగ్రీవశ్వశురః=సుగ్రీవుని మామగారు, అపరేణ=మరియొక, కోటీనామ్= కోటులయొక్క, సహస్రేణ=సహస్రముతో, సమన్వితః=కూడినవాడై, సంప్రాప్తః= వచ్చినాడు.

తా. అట్లే సమర్థుడు, సుగ్రీవుని మామగారు అయిన రుమ తండ్రి వేయి కోట్ల సైన్యముతో కూడి వచ్చెను. 16

మూ. పద్మకేసరసఙ్కాశస్తరుణార్కనిభాననః,
బుద్ధిమాన్ వానరశ్రేష్ఠః సర్వవానరసత్తమః. 17
అనేకైర్బహుసాహస్రైర్వానరాణాం సమన్వితః,
పితా హనుమతః శ్రీమాన్ కేసరీ ప్రత్యదృశ్యత. 18

ప్ర. అ. పద్మకేసరసఙ్కాశః=పద్మముల కింజల్కములతో సమానమైన వాడు, తరుణార్కనిభాననః=బాలసూర్యునితో సమానమైన ముఖము గలవాడు, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు, వానరశ్రేష్ఠః= వానరులలో శ్రేష్ఠుడు, సర్వవానరస త్తమః=అందరి వానరములలో మంచివాడు, హనూమతః= హనుమంతునియొక్క, పితా=తండ్రి అయిన, శ్రీమాన్=శ్రీమంతుడైన, కేసరీ=కేసరి, వానరాణామ్=వాన రులయొక్క, అనేకైః=అనేకమైన, బహుసాహస్రైః=అనేకసహస్రములతో, సమ న్వితః=కూడినవాడై, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. పద్మముల కింజల్కముల వంటి శరీరకాంతి, బాలసూర్యునివంటి ముఖము కలిగినవాడు, బుద్ధిమంతుడు, వానరశ్రేష్ఠుడు, వానరులు అందరిలోను మంచి స్వభావము కలవాడు, శ్రీమంతుడు, హనుమంతుని తండ్రి యైన కేసరి అనే వానరనాయకుడు అనేక సహస్రసంఖ్యలో ఉన్న వానరులతో కలిసి వచ్చెను.

మూ. గోలాఙ్గూలమహారాజో గవాక్షో భీమవిక్రమః,
వృతః కోటిసహస్రేణ వానరాణామదృశ్యత. 19

ప్ర.అ. వానరాణామ్=వానరులయొక్క, కోటిసహస్రేణ=వెయ్యి కోట్లతో, వృతః= కూడిన, గోలాఙ్గూలమహారాజః=గోలాంగూలముల (కొండముచ్చుల) మహా

రాజు అయిన, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, గవాక్షః=గవాక్షుడు, అదృశ్యత=చూడబడెను.

తా. ఇంతలో వెయ్యి కోట్ల వానరులతో కలిసి వచ్చిన భయంకరమైన పరాక్రమము గల, గోలాంగూలముల మహారాజు అయిన గవాక్షుడు కనబడెను. 19

మూ. ఋక్షాణాం భీమవేగానాం ధూమ్రః శత్రునిబర్హణః,
వృతః కోటిసహస్రాభ్యాం ద్వాభ్యాం సమభివర్తత. 20

ప్ర. అ. శత్రునిబర్హణః=శత్రునాశకుడైన, ధూమ్రః=ధూమ్రుడు, భీమవేగానామ్= భయంకరమైన వేగము గల, ఋక్షాణామ్=భల్లూకములయొక్క, ద్వాభ్యామ్=రెండు, కోటిసహస్రాభ్యామ్=కోట్ల సహస్రములతో, సమభివర్తత=వచ్చెను.

తా. శత్రువినాశకుడైన ధూమ్రుడు భయంకరమైన వేగము గల రెండు వేల కోట్ల భల్లూకములతో కలసి వచ్చెను. 20

మూ. మహాచలనిభైర్ఘోరైః పనసో నామ యూథపః,
ఆజగామ మహావీర్యస్తిసృభిః కోటిభిర్వృతః. 21

ప్ర. అ. పనసో నామ=పనసు డనే పేరుగల, మహావీర్యః=గొప్పపరాక్రమముగల, యూథపః=సేనానాయకుడు, తిసృభిః కోటిభిః=మూడు కోట్ల, మహాచలనిభైః= మహాపర్వతములతో సమానులైన, ఘోరైః=భయంకరులైన వానరులతో, వృతః=కూడినవాడై, ఆజగామ=వచ్చెను.

తా. మహాపరాక్రమము గల పనసు డనే సేనానాయకుడు మహాపర్వతములతో సమానులైన భయంకరులైన మూడు కోట్ల వానరులతో కలిసి వచ్చెను. 21

మూ. నీలాఞ్జనచయాకారో నీలో నామాథ యూథపః,
అదృశ్యత మహాకాయః కోటిభిర్దశభిర్వృతః. 22

ప్ర. అ. అథ=అటు పిమ్మట, దశభిః కోటిభిః=పది కోట్ల వానరులతో, వృతః=కూడినవాడై, నీలాఞ్జనచయాకారః=నల్లటి కాటుకప్రోగు వంటి ఆకారము గల, మహాకాయః =గొప్ప శరీరము గల, నీలో నామ=నీలు డనే, యూథపః=సేనానాయకుడు, అదృశ్యత=కనబడెను.

తా. పిమ్మట పది కోట్ల వానరులతో కలిసి వచ్చిన నల్లటి కాటుక కుప్ప వంటి పెద్ద శరీరము గల నీలు డనే సేనానాయకుడు కనబడెను. 22

మూ. తతః కాఞ్చనశైలాభో గవయో నామ యూథపః,
ఆజగామ మహావీర్యః కోటిభిః పఞ్చభిర్వృతః. 23

ప్ర. అ. తతః=అటు పిమ్మట, కాఞ్చనశైలాభః=మేరుపర్వతము వంటి కాంతి గల, మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, గవయో నామ=గవయుడను పేరు

గల, యూథపః= సేనానాయకుడు, పఞ్చభిః కోటిభిః=ఐదు కోట్ల వానరులతో, వృతః=కూడినవాడై, ఆజగామ=వచ్చెను.

తా. పిమ్మట మేరుపర్వతమువంటి కాంతి గల మహాపరాక్రమవంతుడైన గవయు డను సేనానాయకుడు ఐదు కోట్ల మంది వానరులతో కలిపి వచ్చెను.

మూ. దరీముఖశ్చ బలవాన్ యూథపోఽభ్యాయయౌ తదా,
వృతః కోటిసహస్రేణ సుగ్రీవం సముపస్థితః. 24

ప్ర. అ. తదా=అప్పుడు, బలవాన్=బలవంతుడు అయిన, దరీముఖః=దరీ ముఖు డను, యూథపః=సేనానాయకుడు, కోటిసహస్రేణ=వెయ్యి కోట్ల వానరులతో, వృతః=కూడినవాడై, అభ్యాయయౌ=వచ్చెను. సుగ్రీవమ్=సుగ్రీవుని, సముపస్థితః=సమీపించెను.

తా. బలశాలియైన దరీముఖు డను సేనానాయకుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చి సుగ్రీవునివద్ద నిలబడెను. 24

మూ. మైన్దశ్చ ద్వివిదశ్చోభావశ్విపుత్రౌ మహాబలౌ,
కోటికోటిసహస్రేణ వానరాణామదృశ్యతామ్. 25

ప్ర. అ. మహాబలౌ=గొప్ప బలము గల, అశ్విపుత్రౌ=అశ్వినీదేవతల పుత్రులైన, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చ=ద్వివిదుడు, ఉభౌ=ఇద్దరు, వానరాణామ్= వానరుల యొక్క, కోటికోటిసహస్రేణ=సహస్రకోటి ద్వయముతో, అదృశ్యతామ్=చూడబడిరి.

తా. మహాబలవంతులు, అశ్వనీదేవతల పుత్రులు అయిన మైందద్వివిదులు ఇద్దరు ఒక్కొక్కరు వేయి కోట్ల వానరులతో కలిసి వచ్చి కనబడిరి. 25

మూ. గజశ్చ బలవాన్ వీరస్తిసృభిః కోటిభిర్వృతః,
ఆజగామ మహాతేజా సుగ్రీవస్య సమీపతః. 26

ప్ర. అ. బలవాన్=బలవంతుడు, వీరః=వీరుడు అయిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు అయిన, గజశ్చ=గజుడు, తిసృభిః కోటిభిః=మూడు కోట్ల వానరులతో, వృతః= కూడినవాడై, సుగ్రీవస్య=సుగ్రీవునకు, సమీపతః=సమీపమునకు, ఆజగామ=వచ్చెను.

తా. బలవంతుడు, వీరుడు, మహాతేజశ్శాలీ యైన గజుడు మూడు కోట్ల వానరులతో కలిసి సుగ్రీవునివద్దకు వచ్చెను. 26

మూ. ఋక్షరాజో మహాతేజా జామ్బవాన్నామ నామతః,
కోటిభిర్దశభిర్వ్యాప్తః సుగ్రీవస్య వశే స్థితః. 27

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు, నామతః=పేరువలన, జామ్బ వాన్ నామ=జాంబవంతు డను ప్రసిద్ధి కలవాడు అయిన, ఋక్షరాజః=భల్లూకముల

రాజు, దశభిః=పది, కోటిభిః=కోట్లతో, వ్యాప్తః=కూడినవాడై, సుగ్రీవస్య=సుగ్రీవుని యొక్క, వశే=వశమునందు, స్థితః=ఉండెను.

తా. మహాతేజశ్శాలియైన జాంబవంతు డనే భల్లూకరాజు పది కోట్ల భల్లూకములతో సుగ్రీవుని వద్దకు వచ్చెను. 27

మూ. రుమణో నామ తేజస్వీ విక్రాన్తైర్వానరైర్వృతః,
అగతో బలవాంస్తూర్ణం కోటీశతసమావృతః. 28

ప్ర. అ. విక్రాన్తైః=పరాక్రమవంతులైన, వానరైః=వానరులతో, వృతః=కూడిన, తేజస్వీ=తేజఃశాలి, బలవాన్=బలవంతుడు అయిన, రుమణో నామ=రుమణు డను వానరుడు, కోటీశతసమావృతః=వంద కోటుల వానరులతో కూడినవాడై, తూర్ణమ్=శీఘ్రముగా, సమాగతః=వచ్చినాడు.

తా. పరాక్రమవంతులైన వానరులతో కూడిన తేజఃశాలి, బలవంతుడు అయిన రుమణు డను వానరుడు వంద కోట్లమంది వానరులతో కూడినవాడై శీఘ్రముగా వచ్చెను. 28

మూ. తతః కోటిసహస్రాణాం సహస్రేణ శతేన చ,
పృష్ఠతోఽనుగతః ప్రాప్తో హరిభిర్గన్ధమాదనః. 29

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కోటిసహస్రాణామ్=వేయి కోటుల యొక్క, సహస్రేణ= సహస్రముచేతను, శతేన చ=శతముచేతను, వానరైః=వానరులచేత, పృష్ఠతః=వెనుకనే, అనుగతః=అనుసరించబడిన, గన్ధమాదనః=గంధమాదనుడు, ప్రాప్తః=వచ్చినాడు.

తా. పిమ్మట, పదివేల కోట్ల వానరులు, లక్షవేల కోట్ల వానరులు వెంటరాగా గంధమాదనుడు వచ్చెను. 29

మూ. తతః పద్మసహస్రేణ వృతః శఙ్కుశతేన చ,
యువరాజోఽఙ్గదః ప్రాప్తః పితుస్తుల్యపరాక్రమః. 30

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పితుః=తండ్రికి, తుల్యపరాక్రమః=తుల్యమైన పరాక్రమము గల, యువరాజః=యువరాజైన, అఙ్గదః=అంగదుడు, పద్మసహస్రేణ=వేయి పద్మముల వానరులతోను, శఙ్కుశతేన చ= నూరు శంకువులు వానరులతోను, వృతః=కూడినవాడై, ప్రాప్తః=వచ్చినాడు.

తా. పిమ్మట తండ్రి వంటి పరాక్రమము గల యువరాజైన అంగదుడు వేయి పద్మముల, నూరు శంకువుల వానరులతో కూడ వచ్చెను. 30

మూ. తతస్తారాద్యుతిస్తారో హరిర్భీమపరాక్రమః,
పఞ్చభిర్హరికోటీభిర్దూరతః పర్యదృశ్యత. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తారాద్యుతిః=నక్షత్రమువంటి కాంతి గల, భీమపరాక్రమః=భయంకరమైన పరాక్రమము గల, తారః=తారుడను, హరిః=వానరుడు, పఞ్చభిః=ఐదు, హరికోటీభిః=వానరుల కోటులతో, దూరతః=దూరమునుండి, పర్యదృశ్యత=చూడబడెను.

తా. పిమ్మట నక్షత్రము వంటి కాంతి, భయంకరమైన పరాక్రమము గల తారు డను వానరుడు ఐదు కోట్ల వానరులతో దూరమునుండి కనబడెను. 31

మూ. ఇన్ద్రజానుః కపిర్వీరో యూథపః ప్రత్యదృశ్యత,
ఏకాదశానాం కోటీనామీశ్వరస్తైశ్చ సంవృతః. 32

ప్ర. అ. ఏకాదశానాం కోటీనామ్=పదకొండు కోటులకు, ఈశ్వరః=ప్రభువు, వీరః= వీరుడు, యూథపః=సేనానాయకుడు అయిన, ఇన్ద్రజానుః=ఇంద్రజానువు అను, కపిః= వానరుడు, తైః=ఆ వానరులతో, సంవృతః=కూడినవాడై, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. పదకొండు కోట్ల వానరులకు ప్రభువు, వీరుడు అయిన ఇంద్రజానువు అను సేనానాయకుడు ఆ సైనికులతో కూడ వచ్చెను. 32

మూ. తతో రమ్భస్త్వనుప్రాప్తస్తరుణాదిత్యసంనిభః,
అయుతేన వృతశ్చైవ సహస్రేణ శతేన చ. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తరుణాదిత్యసంనిభః=లేత సూర్యునితో సమానుడైన, రమ్భః=రంభుడు, అయుతేన=అయుతముతోనూ, సహస్రేణ=సహస్రముతోను, శతేన చ= శతముతోను, వృతః=కూడినవాడై, అనుప్రాప్తః=వచ్చినాడు.

తా. పిమ్మట బాలసూర్యుని వంటి కాంతి గల రంభుడు వానరుల అయుతముతోను, సహస్రముతోను, శతముతోను, కూడినవాడై వచ్చెను. 33

మూ. తతో యూథపతిర్వీరో దుర్ముఖో నామ వానరః,
ప్రత్యదృశ్యత కోటీభ్యాం ద్వాభ్యాం పరివృతో బలీ. 34

ప్ర. అ. తతః=అటుపిమ్మట, యూథపతిః=సేనానాయకుడు, వీరః=వీరుడు, బలీ= బలవంతుడూ అయిన, దుర్ముఖో నామ=దుర్ముఖుడను పేరు గల, వానరః=వానరుడు, ద్వాభ్యామ్=రెండు, కోటీభ్యామ్=కోటులతో, పరివృతః=కూడినవాడై, ప్రత్యదృశ్యత= కనబడెను.

తా. పిమ్మట సేనానాయకుడు, వీరుడు, బలవంతుడు అయిన దుర్ముఖుడనే వానరుడు రెండు కోట్ల వానరులతో కలిసి వచ్చెను. 34

మూ. కైలాసశిఖరాకారైర్వానరైర్భీమవిక్రమైః,
వృతః కోటిసహస్రేణ హనుమాన్ ప్రత్యదృశ్యత. 35

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, కైలాసశిఖరాకారైః=కైలాసపర్వతశిఖరముల వంటి ఆకారములు గల, భీమవిక్రమైః=భయంకరమైన పరాక్రమము గల, కోటిసహస్రేణ=వెయ్యి కోట్ల, వానరైః=వానరులతో, వృతః=కూడినవాడై, ప్రత్యదృశ్యత=కనబడెను.

తా. హనుమంతుడు కైలాసశిఖరముల వంటి ఆకారములు గల, భయంకరమైన పరాక్రమము గల వెయ్యి కోట్ల వానరులతో కూడి వచ్చెను. 35

మూ. నలశ్చాపి మహావీర్యః సంవృతో ద్రుమవాసిభిః,
కోటీశతేన సంప్రాప్తః సహస్రేణ శతేన చ. 36

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, నలశ్చాపి=నలుడు కూడ, కోటీశతేన= నూరు కోట్లు, సహస్రేణ=వెయ్యి, శతేన చ=నూరు, ద్రుమవాసిభిః=వానరులతో, సంవృతః=కూడినవాడై, సంప్రాప్తః=వచ్చినాడు.

తా. గొప్ప పరాక్రమము గల నలుడు కూడ వంద కోట్ల ఒక వెయ్యి ఒక వంద వానరులతో కలిసి వచ్చెను. 36

మూ. తతో దరీముఖః శ్రీమాన్ కోటిభిర్దశభిర్వృతః,
సంప్రాప్తోఽభినదంస్తస్య సుగ్రీవస్య మహాత్మనః. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శ్రీమాన్=కాంతి గల, దరీముఖః=దరీముఖుడు, దశభిః=పది, కోటిభిః=కోట్లతో, వృతః=కూడినవాడై, అభినదన్=ధ్వనిచేయుచు, తస్య=ఆ, మహాత్మనః=మహాత్ముడైన, సుగ్రీవస్య=సుగ్రీవుని సమీపమును, సంప్రాప్తః=చేరినాడు.

తా. శ్రీమంతుడైన దరీముఖుడు పది కోట్ల వానరులతో కలిసి, ధ్వని చేయుచు మహాత్ముడైన ఆ సుగ్రీవుని వద్దకు వచ్చెను. 37

మూ. శరభః కుముదో వహ్నిర్వానరో రంహ ఏవ చ,
ఏతే చాన్యే చ బహవో వానరాః కామరూపిణః. 38
ఆవృత్య పృథివీం సర్వాం పర్వతాంశ్చ వనాని చ,
యూథపాః సమనుప్రాప్తా యేషాం సంఖ్యా న విద్యతే. 39
ఆగతాశ్చ విశిష్టాశ్చ పృథివ్యాం సర్వవానరాః.

ప్ర. అ. శరభః=శరభుడు, కుముదః=కుముదుడు, వానరః=వానరుడైన, వహ్నిః=వహ్ని, రంహః ఏవ చ=రంహుడు, ఏతే=వీరు, కామరూపిణః=స్వేచ్ఛారూపము గల, అన్యే చ=ఇతరులైన, బహవః=అనేకులైన, యేషామ్=ఎవరికి, సంఖ్యా=సంఖ్య, న విద్యతే, లేదో అట్టి, వానరాః=వానరులు, యూథపాః=సేనానాయకులు, సర్వామ్=సమస్తమైన, పృథివీమ్=భూమిని, పర్వతాంశ్చ=పర్వతములను, వనాని చ=వనములను, ఆవృత్య=కప్పివేసి, సమనుప్రాప్తాః=వచ్చినారు. ఆగతాః=వచ్చిన, సర్వవానరాః=

సమస్తవానరులు, పృథివ్యామ్=భూమిమీద, నివిష్టాశ్చ=చేరిరి (కూర్చుండిరి).

తా. శరభుడు, కుముదుడు, వహ్ని, రంభుడు, అసంఖ్యాకులైన కామరూపము గల ఇంకా ఎందరో వానరులు, వానరసేనానాయకులు, సకలభూమిని, పర్వతములను, వనములను కప్పివేయుచు వచ్చి నేలమీద వాలిరి. 38,39

మూ. ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవఙ్గమాః,
అభ్యవర్తన్త సుగ్రీవం సూర్యమభ్రగణా ఇవ. 40

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులు, ఆప్లవన్తః=దుముకుచు, ప్లవన్తశ్చ=ఎగురుచు, గర్జన్తశ్చ=గర్జించుచు, సూర్యమ్=సూర్యుని, అభ్రగణా ఇవ=మేఘసముదాయములు వలె, సుగ్రీవమ్=సుగ్రీవుని, అభ్యవర్తన్త=చుట్టూ చేరిరి.

తా. ఆ వానరులు దుముకుచు, ఎగురుచు, గర్జించుచు, మేఘములు సూర్యుని చుట్టూ చేరినట్లు, సుగ్రీవుని చుట్టూ చేరిరి. 40

మూ. కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రకృష్టా బాహుశాలినః,
శిరోభిర్వానరేన్ద్రాయ సుగ్రీవాయ న్యవేదయన్. 41

ప్ర. అ. ప్రకృష్టాః=శ్రేష్ఠులు, బాహుశాలినః=బాహువులతో ప్రకాశించుచున్న వారు అయిన, ఆ వానరులు, బహుశబ్దాన్=అనేకధ్వనులను, కుర్వాణాః=చేయుచు, శిరోభిః= వంచబడిన శిరస్సులతో, వానరేన్ద్రాయ=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవాయ=సుగ్రీవునకు, న్యవేదయన్=తమ రాకను తెలిపిరి.

తా. శ్రేష్ఠమైనవారు, బలము గల బాహువులు గలవారు అయిన ఆ వానరులు అనేక శబ్దములను చేయుచు వచ్చి చేరి, శిరస్సులు వంచి వానరరాజైన సుగ్రీవునకు తమ రాకను తెలిపిరి. 41

మూ. అపరే వానరశ్రేష్ఠాః సంగమ్య చ యథోచితమ్,
సుగ్రీవేణ సమాగమ్య స్థితాః ప్రాఞ్జలయస్తదా. 42

ప్ర. అ. అపరే=మరికొందరు, వానరశ్రేష్ఠాః=వానరనాయకులు, యథోచితమ్=తగు విధముగా, సంగమ్య=కలిసి, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమాగమ్య=కలిసి, తదా= అప్పుడు, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్లు కలవారై, స్థితాః=ఉండిరి.

తా. మరి కొందరు వానరనాయకులు యథోచితముగా కలిసి వచ్చి, సుగ్రీవునితో కలిసి చేతులు జోడించి నిలబడిరి. 42

మూ. సుగ్రీవస్త్వరితో రామే సర్వాంస్తాంస్త్వరితాంస్తదా,
నివేదయిత్వా ధర్మజ్ఞః స్థితః ప్రాఞ్జలిరబ్రవీత్. 43

ప్ర. అ. ధర్మజ్ఞః=ధర్మము నెరిగిన, సుగ్రీవః=సుగ్రీవుడు, త్వరితః= తొందరపడుచున్నవాడై, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, స్థితః=నిలచినవాడై, తదా=

అప్పుడు, త్వరితాన్=శీఘ్రముగా వచ్చిన, తాన్=ఆ, సర్వాన్=అందరిని, రామే=రామునియందు, నివేదయిత్వా=తెలిపి, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మములు తెలిసిన సుగ్రీవుడు తొందరపడుచు చేతులు జోడించి నిలచి శీఘ్రముగా వచ్చిన వారి నందరిని గూర్చి రామునకు తెలిపి వారితో ఇట్లు పలికెను. 43

మూ. యథాసుఖం పర్వతనిర్ఝరేషు
వనేషు సర్వేషు చ వానరేన్ద్రాః,
నివేశయిత్వా విధివద్బలాని
బలం బలజ్ఞః ప్రతిపత్తుమీష్టే. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. వానరేన్ద్రాః=వానరేంద్రులారా! పర్వతనిర్ఝరేషు=పర్వతములయందు సెలయేళ్లయందు, సర్వేషు=సమస్తమైన, వనేషు చ=వనములందు, యథాసుఖమ్=సుఖముగా, విధివత్= యథావిధిగా, బలాని=సేనలను, నివేశయిత్వా=నిలిపి, బలజ్ఞః=బలము నెరిగిన రాముడు, బలమ్=బలమును, ప్రతిపత్తుమ్=తెలిసికొనుటకు, ఈష్టే=సమర్థుడగును.

తా. ఓ! వానరనాయకులారా! మీ మీ సైన్యములను సుఖముగా, పద్ధతి ప్రకారము పర్వతములమీద, సెలయేళ్లవద్ద, అన్ని వనములలోను నిలిపినట్లయితే బలమును గూర్చి తెలిసిన రాముడు మీ బలమును తెలిసికొనగలడు. 44

*"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ముప్పదితొమ్మిదవ సర్గ సమాప్తము.*

# అథ చత్వారింశః సర్గః

[రాముని ఆజ్ఞచేత సుగ్రీవుడు వానరులను సీతాన్వేషణార్థము తూర్పు దిక్కుకు పంపుచు అక్కడ ఉన్న ప్రదేశములను వర్ణించి చెప్పుట.]

మూ. అథ రాజా సమృద్ధార్థః సుగ్రీవః ప్లవగేశ్వరః,
ఉవాచ వరశార్దూలం రామం పరబలార్దనమ్. 1

ప్ర. అ. ప్లవగేశ్వరః=వానరుల ప్రభువు, రాజా=రాజు అయిన, సుగ్రీవః= సుగ్రీవుడు, సమృద్ధార్థః=సిద్ధించిన కార్యము కలవాడై, అథ=అటుపిమ్మట, నరశా ర్దూలమ్=నరులలో శ్రేష్ఠుడు, పరబలార్దనమ్=శత్రుబలమును పీడించువాడు అయిన, రామమ్=రాముని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట కార్యము సిద్ధించిన వానరప్రభువైన సుగ్రీవుడు నరులలో శ్రేష్ఠుడు శత్రుసేనాసంహారకుడు అయిన రామునితో ఇట్లనెను. 1

మూ. ఆగతా వినివిష్టాశ్చ బలినః కామచారిణః,
వానరేన్ద్రా మహేన్ద్రాభా యే మద్విషయవాసినః. 2

ప్ర. అ. యే=ఎవరు, మద్విషయవాసినః=నాకు తెలిసిన దేశములలో నివసించువారో అట్టి, బలినః=బలవంతులు, కామచారిణః=స్వేచ్ఛగా సంచరిం చువారు, మహేన్ద్రాభాః= మహేంద్రుని వంటి కాంతి గలవారు అయిన, వానరేన్ద్రాః=వానరేంద్రులు, ఆగతాః=వచ్చినారు. వినివిష్టాశ్చ=తగు స్థానములలో నిలిచియున్నారు.

తా. బలవంతులు, స్వేచ్ఛగా సంచరించువారు, మహేంద్రుని వంటి కాంతి గలవారు, నాకు తెలిసిన దేశములలో నివసించువారు అయిన వానరశ్రేష్ఠులు వచ్చి నిలిచి ఉన్నారు. 2

మూ. త ఇమే బహువిక్రాన్తైర్బలిభిర్భీమవిక్రమైః,
ఆగతా వానరా ఘోరా దైత్యదానవసన్నిభాః. 3

ప్ర. అ. ఘోరాః=భయంకరులు, దైత్యదానవసన్నిభాః=దైత్యులతోను, దాన వులతోను సమానులు అయిన, తే=ఆ, ఇమే వానరాః=ఈ వానరులు, బహువిక్రాన్తైః=అధికమైన పరాక్రమము గల, బలిభిః=బలవంతులైన, భీమవి క్రమైః=భయంకరమైన పరాక్రమము గల వానరులతో, ఆగతాః=వచ్చినారు.

తా. దైత్యులతోను, దానవులతోను సమానులు, భయంకరులు అయిన ఆ వానరులు గొప్ప పరాక్రమము గల బలవంతులైన వానరులతో కలిసి వచ్చినారు.3

మూ. ఖ్యాతకర్మాపదానాశ్చ బలవన్తో జితక్లమాః,
పరాక్రమేషు విఖ్యాతా వ్యవసాయేషు చోత్తమాః. 4
పృథివ్యమ్బుచరా రామ నానానగనివాసినః,
కోట్యోఘాశ్చ ఇమే ప్రాప్తా వానరాస్తవ కిఙ్కరాః. 5

ప్ర. అ. రామ!=ఓ రామా! ఖ్యాతకర్మాపదానాశ్చ=ప్రసిద్ధమైన పనులు, పూర్వము చేసిన కార్యములు కలవారు, బలవన్తః=బలవంతులు, జితక్లమాః=జయించబడిన శ్రమ కలవారు, పరాక్రమేషు=పరాక్రమములయందు, విఖ్యాతాః=ప్రసిద్ధులు, వ్యవసాయేషు= ఉద్యమములయందు, ఉత్తమాః=ఉత్తములు, పృథివ్యమ్బుచరాః=భూమిపైన నీటియందు సంచరించువారు, నానానగనివాసినః=అనేక పర్వతములయందు నివసించువారు అయిన, ఇమే=ఈ, వానరాః=వానరులు, కోట్యోఘాః=అనేక కోటులసంఖ్యకలవారై, తవ=నీకు, కిఙ్కరాః= కింకరులుగా, ప్రాప్తాః=వచ్చినవారు.

తా. రామా! భూమిమీద, ఉదకముమీద సంచరించ గలవారు, అనేక పర్వతములలో నివసించువారు అయిన, వానరులు అనేక కోట్లకొలది నీకు కింకరులై వచ్చి యున్నారు. వీరి పనులు, పూర్వము వీరు చేసిన కార్యములు ప్రసిద్ధమైనవి. బలవంతులైన వీరు అలసట లేనివారు. పరాక్రమముచేత ప్రసిద్ధులు. ప్రయత్నము చేయుటలో ఉత్తములు. 4,5

మూ. నిదేశవర్తినః సర్వే సర్వే గురుహితే స్థితాః,
అభిప్రేతమనుష్ఠాతుం తవ శక్ష్యన్త్యరిన్దమ. 6

ప్ర. అ. అరిన్దమ=ఓ! శత్రుసంహారకుడా! సర్వే=వీరందరు, నిదేశవర్తినః= ఆజ్ఞయం దుండువారు, సర్వే=అందరు, గురుహితే=ప్రభువు హితమునందు, స్థితాః= ఉన్నవారు, తవ=నీకు, అభిప్రేతమ్=ఇష్టమైన కార్యమును, అనుష్ఠాతుమ్=చేయుటకు, శక్ష్యన్తి=సమర్థులు కాగలరు.

తా. శత్రుసంహారకుడవైన ఓ! రామా! ప్రభువు హితమునే కోరు ఈ వానరు లందరు ప్రభువు ఆజ్ఞ ప్రకారము నడుచువారు. వీరు నీకు ఇష్టమైన కార్యమును చేయగలరు. 6

మూ. త ఇమే బహుసాహస్రైరనేకైర్బహువిక్రమైః,
ఆగతా వానరా ఘోరా దైత్యదానవసన్నిభాః. 7

ప్రతిపదార్థతాత్పర్యములకు పైన మూడవ శ్లోకము చూడుడు.

మూ. యన్మన్యసే నరవ్యాఘ్ర ప్రాప్తకాలం తదుచ్యతామ్,
తత్సైన్యం త్వద్వశే యుక్తమాజ్ఞాపయితుమర్హసి. 8

ప్ర. అ. నరవ్యాఘ్ర=ఓ! నరశ్రేష్ఠుడా! యత్=దేనిని, ప్రాప్తకాలమ్=కాలమునకు తగిన దానినిగా, మన్యసే=తలచుచున్నావో, తత్=అది, ఉచ్యతామ్=చెప్పబడుగాక.

త్వద్వశే=నీ అధీనమునందు, యుక్తమ్=చేరిఉన్న, త్వత్ సైన్యమ్=నీ సైన్యమును, ఆజ్ఞాపయితుమ్=ఆజ్ఞాపించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. రామా! ఈ సమయమున ఏది తగిన కార్యమో అది చెప్పుము. నీ వశమును చేరిన నీ సైన్యమును ఆజ్ఞాపించుము. 8

మూ. కామమేవమిదం కార్యం విదితం మమ తత్త్వతః,
తథాఽపి తు యథాయుక్తమాజ్ఞాపయితుమర్హసి. 9

ప్ర. అ. ఇదమ్=ఈ, కార్యమ్=కార్యము, మమ=నాకు, తత్త్వతః=యథార్థముగా, ఏవమ్=ఇట్లు, విదితం కామమ్=తెలియబడినదే. తథాఽపి=అట్లైనను, యథాయుక్తమ్=తగువిధముగా, ఆజ్ఞాపయితుమ్=ఆజ్ఞాపించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఈ కార్యమును గూర్చిన అన్ని విషయములు నాకు తెలిసినవే. ఐనను నీవు తగు విధముగా ఆజ్ఞాపించుము. 9

మూ. తథా బ్రువాణం సుగ్రీవం రామో దశరథాత్మజః,
బాహుభ్యాం సంపరిష్వజ్య ఇదం వచనమబ్రవీత్. 10

ప్ర. అ. దశరథాత్మజః=దశరథుని కుమారుడైన, రామః=రాముడు, తథా=అట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, సుగ్రీవమ్=సుగ్రీవుని, బాహుభ్యామ్=బాహువులతో, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. దశరథకుమారుడైన రాముడు ఇట్లు పలుకుచున్న సుగ్రీవుని బాహువులతో కౌగలించుకొని ఇట్లు పలికెను. 10

మూ. జ్ఞాయతాం సౌమ్య వైదేహీ యది జీవతి వా న వా,
స చ దేశో మహాప్రాజ్ఞ యస్మిన్వసతి రావణః. 11

ప్ర.అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి గల, సౌమ్య=సౌమ్యుడా! వైదేహీ=సీత, యది జీవతి వా=జీవించి యున్నదా, న వా=లేదా; రావణః=రావణుడు, యస్మిన్=ఏ దేశమునందు, వసతి=నివసించుచున్నాడో, సః దేశః చ=ఆ దేశము, జ్ఞాయతామ్= తెలియబడుగాక.

తా. గొప్ప బుద్ధి గల ఓ! సుగ్రీవుడా! సీత జీవించి ఉన్నదా! లేదా? అను విషయమును రావణుడు నివసించు దేశమును తెలుసుకొనవలెను. 11

మూ. అభిగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ,
ప్రాప్తకాలం విధాస్యామి తస్మిన్కాలే సహ త్వయా. 12

ప్ర. అ. వైదేహీమ్=సీతను, రావణస్య=రావణునియొక్క, నిలయం

చ=స్థానమును, అభిగమ్య=తెలిసికొని, తస్మిన్కాలే=ఆ కాలమునందు, త్వయా సహ=నీతో కూడ, ప్రాప్తకాలమ్=కాలమునకు తగిన పనిని, విధాస్యామి=చేయగలను.

తా. సీతను గూర్చి, రావణుని నివాసస్థానమును గూర్చి తెలిసికొనిన పిమ్మట నీతో కలిసి నేను ఆ సమయమునకు తగునట్లుగా చేయగలను. 12

మూ. నాహమస్మిన్ ప్రభుః కార్యే వానరేన్ద్ర న లక్ష్మణః,
త్వమస్య హేతుః కార్యస్య ప్రభుశ్చ ప్లవగేశ్వర. 13

ప్ర. అ. ప్లవగేశ్వర!=వానరులకు రాజైన, వానరేన్ద్ర=ఓ! సుగ్రీవా! అహమ్=నేను, అస్మిన్=ఈ, కార్యే=కార్యమునందు, ప్రభుః=సమర్థుడను, న=కాను. లక్ష్మణః=లక్ష్మణుడు, న=సమర్థుడు కాడు. త్వమ్=నీవే, అస్య=ఈ, కార్యస్య=కార్యమునకు, హేతుః=కారణమైనవాడవు. ప్రభుశ్చ=సమర్థుడవు కూడ.

తా. వానరరాజువైన ఓ సుగ్రీవా! ఈ అన్వేషణకార్యము చేయుటకు నాకు కాని, లక్ష్మణునకు కాని సామర్థ్యము లేదు. నీవే ఇందుకు సమర్థుడవు. ఇది సఫల మగుటకు నీవే కారణమైనవాడవు. 13

మూ. త్వమేవాజ్ఞాపయ విభో మమ కార్యవినిశ్చయమ్,
త్వం హి జానాసి యత్కార్యం మమ వీర న సంశయః. 14

ప్ర. అ. విభో=ఓ! రాజా! మమ=నాయొక్క, కార్యవినిశ్చయమ్=కార్యము యొక్క నిశ్చయమును, త్వమేవ=నీవే, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపించుము. వీర!=ఓ! వీరుడా! మమ=నాయొక్క, యత్ కార్యమ్=ఏ కార్య మున్నదో దానిని, త్వమ్=నీవు, జానాసి హి=ఎరుగుదువు కదా! సంశయః=సంశయము, న=లేదు.

తా. వీరుడవైన ఓ! సుగ్రీవా! నా కార్యము విషయమున చేయవలసిన నిశ్చయమును నీవే ఆజ్ఞాపించుము. నా కార్యమును గూర్చి నీకు బాగుగా తెలియును. సందేహము లేదు. 14

మూ. సుహృద్వినీతో విక్రాన్తః ప్రాజ్ఞః కాలవిశేషవిత్,
భవానస్మద్ధితే యుక్తః సుహృదాప్తోఽ ర్థవిత్తమః. 15

ప్ర. అ. భవాన్=నీవు, సుహృత్=మంచి హృదయము కలవాడవు; వినీతః=వినయవంతుడవు; విక్రాన్తః=పరాక్రమవంతుడవు, ప్రాజ్ఞః=బుద్ధిమంతుడవు, కాలవిశేషవిత్=కాలవిశేషము తెలిసినవాడవు, అస్మద్ధితే=మా హితమునందు, యుక్తః=శ్రద్ధ గల, సుహృత్=స్నేహితుడవు, ఆప్తః=ఆప్తుడవు, అర్థవిత్తమః=విషయములు తెలిసిన వారిలో శ్రేష్ఠుడవు.

తా. నీవు మంచి హృదయము కలవాడవు. వినయము, పరాక్రమము బుద్ధిబలము, కలవాడవు. కాలవిశేషములను గుర్తించగలవాడవు. ఆప్తుడవు. విషయములు బాగుగా తెలిసినవాడవు. మా హితమునందు శ్రద్ధగల మిత్రుడవు.

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో వినతం నామ యూథపమ్,
అబ్రవీద్రామసాన్నిధ్యే లక్ష్మణస్య చ ధీమతః, 16
శైలాభం మేఘనిర్ఘోషమూర్జితం ప్లవగేశ్వరమ్.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, ఉక్తః=పలుకబడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామసాన్నిధ్యే=రాముని సన్నిధియందు, ధీమతః=బుద్ధిమంతుడైన, లక్ష్మణస్య చ=లక్ష్మణుని సన్నిధియందు, యూథపమ్=సేనానాయకుడు, శైలాభమ్= పర్వతము వంటి కాంతి గలవాడు, మేఘనిర్ఘోషమ్=మేఘము వంటి ధ్వని కలవాడు, ఊర్జితమ్=బలవంతుడు అయిన, వినతం నామ=వినతు డను పేరు గల, ప్లవగేశ్వరమ్= వానరనాయకుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు ఆ మాటలు విని పర్వతము వలె ఉన్నవాడు, మేఘము వంటి ధ్వని కలవాడు, బలవంతుడు, వానరుల ప్రభువు అయిన వినతు డనే సేనానాయకునితో రామలక్ష్మణుల సమక్షమున ఇట్లు పలికెను. 16

మూ. సోమసూర్యనిభైః సార్ధం వానరైర్వానరోత్తమ, 17
దేశకాలనయైర్యుక్తో విజ్ఞః కార్యవినిశ్చయే,
వృతః శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్, 18
అధిగచ్ఛ దిశం పూర్వాం సశైలవనకాననామ్.

ప్ర. అ. వానరోత్తమ=వానరశ్రేష్ఠుడా! దేశకాలనయైః=దేశముతోను, కాలముతోను, నీతితోను; యుక్తః=కూడినవాడవు, కార్యవినిశ్చయే=కార్యమును నిశ్చయించుటయందు, విజ్ఞః=తెలిసినవాడవు అయిన నీవు, సోమసూర్యనిభైః=చంద్రసూర్యులతో సమానులైన, వానరైః సార్ధమ్=వానరులతో కూడ, తరస్వినామ్=బలవంతులైన, వానరాణామ్=వానరులయొక్క, శతసహస్రేణ=లక్షతో, వృతః=కూడినవాడవై, సశైలవనకాననామ్=పర్వతములతోను, వనములతోను, అరణ్యములతోను కూడిన, పూర్వాం దిశమ్=తూర్పు దిక్కును గూర్చి, అధిగచ్ఛ=వెళ్లుము.

తా. ఓ! వానరోత్తమా! నీవు దేశమును, కాలమును, నీతిని గుర్తించి కార్యమును నిర్ణయించుటలో సమర్థుడవు. సూర్యచంద్రులతో సమానులైన, బలవంతులైన లక్షమంది వానరులతో కలిసి నీవు శైలములతోను, వనములతోను, అడవులతోను నిండిన తూర్పు దిక్కునకు వెళ్లుము. 17,18

మూ. తత్ర సీతాం చ వైదేహీం నిలయం రావణస్య చ, 19
మార్గధ్వం గిరిదుర్గేషు వనేషు చ నదీషు చ.

ప్ర.అ. తత్ర=అక్కడ, వైదేహీమ్=విదేహరాజకుమారి యైన, సీతాం చ=సీతను, రావణస్య =రావణునియొక్క, నిలయం చ=స్థానమును, గిరిదుర్గేషు=పర్వతదుర్గములయందు, వనేషు చ=వనములందు, నదీషు చ=నదులయందు,

మార్గధ్వమ్= వెదకుడు.

తా. అక్కడ గిరిదుర్గములయందు, వనములందు, నదులందు సీతను, రావణుని స్థానమును వెదకుడు. 19

మూ. నదీం భాగీరథీం రమ్యాం సరయూం కౌశికీం తథా, 20
కాలిన్దీం యమునాం రమ్యాం యామునం చ మహాగిరిమ్,
సరస్వతీం చ సిన్ధుం చ శోణం మణినిభోదకమ్. 21
మహీం కాలమహీం చాపి శైలకాననశోభితామ్,
బ్రహ్మమాలాన్విదేహాంశ్చ మాలవాన్ కాశికోసలాన్. 22
మాగధాంశ్చ మహాగ్రామాన్ పుణ్డ్రాంస్త్వఙ్గాంస్తథైవ చ,
భూమిం చ కోశకారాణాం భూమిం చ రజతాకరామ్. 23

ప్ర. అ. భాగీరథీం నదీమ్=గంగానదిని, రమ్యామ్=సుందరమైన, సర యూమ్= సరయూనదిని, తథా=మరియు, కౌశికీమ్=కౌశికి నదిని, కాలిన్దీమ్=కళింద పర్వతమునుండి పుట్టిన, రమ్యామ్=సుందరమైన, యమునామ్=యమునానదిని, యామునమ్= యామున మను, మహాగిరిం చ= మహాపర్వతమును, సరస్వతీం చ= సరస్వతిని, సిన్ధుం చ=సింధునదిని, మణినిభోదకమ్= మణులవంటి ఉదకము గల, శోణమ్=శోణనదమును, మహీమ్=మహీనదిని, శైలకాననశోభితామ్ =శైలములచేత, కాననములచేత ప్రకాశింపచేయబడిన, కాలమహీం చాపి=కాలమహీనదిని, బ్రహ్మ మాలాన్=బ్రహ్మమాలదేశమును, విదేహాంశ్చ= విదేహదేశమును, మాలవాన్=మాల వదేశమును, కాశికోసలాన్=కాశికోసలదేశములను, మాగధాన్=మగధదేశమునకు సంబంధించిన, మహాగ్రామాన్ చ=పెద్ద గ్రామములను, పుణ్డ్రాన్=పుండ్రదేశమును, తథైవ చ=మరియు, అఙ్గాన్=అంగదేశమును, కోశకారాణామ్=కోశకారులనే రాజు లయొక్క, భూమిమ్=భూమిని, రజతాకరామ్=వెండి గనులు గల, భూమిం చ=భూమిని, (మార్గధ్వమ్=వెదకుడు)

తా. రమ్యములైన గంగా - సరయూ - కౌశికీ - యమునా - సరస్వతీ - సింధు నదులను, మణులవంటి నిర్మలమైన ఉదకము గల శోణనదమును, యామునపర్వతమును, మహీనదిని, శైలములతోను అడవులతోను ప్రకాశించుచున్న కాలమహీనదిని, బ్రహ్మమాల - విదేహ - మాలవ - కాశి - కోసల - పుండ్ర అంగదేశములను, మగధదేశములోని మహాగ్రామములను, కోశకారులనే రాజుల రాజ్యమును, వెండి గనులు గల దేశమును సీతకొరకై వెదకుడు. 20-23

మూ. సర్వం చ తద్విచేతవ్యం మృగయద్భిస్తతస్తతః,
రామస్య దయితాం భార్యాం సీతాం దశరథస్నుషామ్. 24

ప్ర. అ. రామస్య=రామునియొక్క, దయితామ్=ప్రియురాలైన, భార్యామ్=

భార్యయైన, దశరథస్నుషామ్=దశరథుని కోడలైన, సీతామ్=సీతను, తతస్తతః=ఆ యా ప్రదేశములయందు, మృగయద్భిః=వెదకుచున్న మీ చేత, తత్ సర్వమ్=ఆ ప్రదేశమంతయు, విచేతవ్యమ్ =అన్వేషింపదగినది.

తా. రాముని భార్య, దశరథుని కోడలు అయిన సీతకొరకై మీరు ఆ ప్రదేశ మంతా వెదకవలెను. 24

మూ. సముద్రమవగాఢాంశ్చ పర్వతాన్పత్తనాని చ,
మన్దరస్య చ యే కోటిం సంశ్రితాః కేచిదాయతామ్. 25
కర్ణప్రావరణాశ్చైవ తథా చాప్యోష్ఠకర్ణకాః,
ఘోరలోహముఖాశ్చైవ జవనాశ్చైకపాదకాః. 26
అక్షయా బలవన్తశ్చ తథైవ పురుషాదకాః,
కిరాతాస్తీక్ష్ణచూడాశ్చ హేమాభాః ప్రియదర్శనాః. 27
ఆమమీనాశనాశ్చాపి కిరాతా ద్వీపవాసినః,
అన్తర్జలచరా ఘోరా నరవ్యాఘ్రా ఇతి స్మృతాః. 28
ఏతేషా మాశ్రయాః సర్వే విచేయాః కాననౌకసః,
గిరిభిర్యే చ గమ్యన్తే ప్లవనేన ప్లవేన చ. 29

ప్ర. అ. కాననౌకసః=ఓ! వానరులారా! సముద్రమ్=సముద్రమును, అవగాఢాన్= ప్రవేశించిన, పర్వతాన్=పర్వతములను, పత్తనాని చ=పట్టణములను, మన్దరస్య= మన్దరపర్వతముయొక్క, ఆయతామ్=దీర్ఘమైన, కోటిమ్=అగ్రభాగమును, సంశ్రితాః= ఆశ్రయించిన, కేచిత్=కొంతమంది, కర్ణప్రావరణాశ్చైవ=చెవులను కప్పుకొన్నవారు (చెవులులేనివారు) ఓష్ఠకర్ణకాః=పెదవులే కర్ణములుగా గలవారు, ఘోరలోహముఖాశ్చైవ=ఇనుము వంటి భయంకరమైన ముఖములు గలవారు, జవనాః=వేగము గలవారు, ఏకపాదకాః=ఒక్క పాదము గలవారు, అక్షయాః= నాశము లేనివారు, బలవన్తశ్చ=బలవంతులు, తథైవ=మరియు, పురుషాదకాః=మనుష్యులను తినేవారు అయిన, కిరాతాః=కిరాతులు, తీక్ష్ణచూడాః= తీక్ష్ణమైన శిరస్సులు గలవారు, ప్రియదర్శనాః=ప్రియమైన దర్శనముగల, హేమాభాః= బంగారు కాంతి గలవారు, ఆమమీనాశనాః=పచ్చి చేపలను తిను, ద్వీపవాసినః=ద్వీపములో నివసించు, కిరాతాః=కిరాతులు, నరవ్యాఘ్రాః ఇతి =నరవ్యాఘ్రములవి, స్మృతాః= చెప్పబడిన, అన్తర్జలచరాః=నీటిలో సంచరించు, ఘోరాః=భయంకరమైన మానవులు, ఏతేషామ్= వీరియొక్క, సర్వే=సమస్తమైన, ఆశ్రయాః=నివాసములు, విచేయాః=వెదకదగినవి. యే=ఏ నివాసస్థానములు, గిరిభిః=పర్వతములచేతను, ప్లవనేన = ఎగురుటచేతను, ప్లవేన చ=నావచేతను, గమ్యన్తే=చేరబడునో.

తా. ఓ! వానరులారా! సముద్రములో మునిగి యున్న పర్వతాలను, పట్టణములను, దీర్ఘమైన మందరపర్వతాగ్రభాగమును ఆశ్రయించి కొందరు

నివసించుచుందురు. వారిలో కొందరికి చెవులు ఉండవు. కొందరికి పెదవులే చెవులు. కొందరి ముఖములు ఇనుప ముఖముల వలె భయంకరముగా నుండును. వాళ్లు మహావేగము గలవారు. వారికి ఒక పాద ముండును. నాశము లేని (చంపుటకు శక్యము కాని) బలవంతులైన కొందరు మనుష్యులను తినివేయుదురు. కొందరు కిరాతుల శిరస్సులు తీక్ష్ణముగా పొడవుగా ఉండును. బంగారు చాయ గల కొందరు చూచుటకు అందముగా ఉందురు. ద్వీపములలో నివసించు కొందరు కిరాతులు పచ్చి చేపలను తిందురు. నరవ్యాఘ్రములు అను పేరు గల భయంకరులైన కొందరు నీటి మధ్యలో సంచరించుచుందురు. వీరి స్థానముల నన్నింటిని మీరు వెదకవలెను. ఆ స్థానములు చేరుటకు పర్వతముల మీదుగా వెళ్లవలెను. కొన్ని చోట్లకు తెప్పలచేతను, మరికొన్ని చోట్లకు ఎగురుచు వెళ్లవలెను.

మూ. యత్నవన్తో యవద్వీపం సప్తరాజ్యోపశోభితమ్,
సువర్ణరూప్యకద్వీపం సువర్ణాకరమణ్డితమ్, 30
యవద్వీపమతిక్రమ్య శిశిరో నామ పర్వతః,
దివం స్పృశతి శృఙ్గేణ దేవదానవసేవితః. 31
ఏతేషాం గిరిదుర్గేషు ప్రపాతేషు వనేషు చ,
మార్గధ్వం సహితాః సర్వే రామపత్నీం యశస్వినీమ్. 32

ప్ర.అ. సప్తరాజ్యోపశోభితమ్=ఏడు రాజ్యములతో ప్రకాశించుచున్న, యవద్వీపమ్= యవద్వీపమును, సువర్ణాకరమణ్డితమ్=బంగారు గనులచేత అలంకరింపబడిన, సువర్ణరూప్యకద్వీపమ్=సువర్ణద్వీపమును, రజతద్వీపమును, యత్నవన్తః=ప్రయత్నవంతులై (వెదకుడు). యవద్వీపమ్= యవద్వీపమును, అతిక్రమ్య=దాటి, శిశిరో నామ=శిశిరమను పేరుగల, దేవదానవసేవితః= దేవతలచేతను, దానవులచేతను సేవింపబడిన, పర్వతః=పర్వతము, శృఙ్గేణ=శిఖరముచేత, దివమ్= స్వర్గమును, స్పృశతి=స్పృశించుచున్నది. సర్వే=మీరందరు, సహితాః=కూడినవారై, ఏతేషామ్=ఈ ద్వీపములయొక్క, గిరిదుర్గేషు=పర్వతదుర్గములయందు, ప్రపాతేషు= జలపాతములయందు, వనేషు చ=వనములయందు, యశస్వినీమ్=కీర్తిమంతురాలైన, రామపత్నీమ్=రాముని భార్యను, మార్గధ్వమ్=వెదకుడు.

తా. మీరు ప్రయత్నవంతులై అందరు కలిసి ఏడు రాజ్యములతో ప్రకాశించుచున్న యవద్వీపమును, బంగారు గనులతో నిండిన సువర్ణద్వీపమును, రజతద్వీపమును వెదకుడు. యవద్వీపమును దాటి శిశిర మను పర్వత మున్నది. దేవతలకు, దానవులకు నివాసస్థానమైన ఆ పర్వత శిఖరములు స్వర్గమును స్పృశించుచుండును. ఈ ద్వీపములలోని పర్వతదుర్గములయందు, జలప్రపాతములయందు, వనములలోను కీర్తిమంతురాలైన సీతకొరకు వెదకుడు.

మూ. తతో రక్తజలం ప్రాప్య శోణాఖ్యం శీఘ్రవాహినమ్,
గత్వా పారం సముద్రస్య సిద్ధచారణసేవితమ్ . 33
తస్య తీర్థేషు రమ్యేషు విచిత్రేషు వనేషు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 34

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రక్తజలమ్=ఎఱ్ఱని జలము గల, శీఘ్రవాహి కమ్= శీఘ్రముగా ప్రవహించు, శోణాఖ్యమ్=శోణ మను నదమును, ప్రాప్య=పొంది, సముద్రస్య=సముద్రముయొక్క, సిద్ధచారణసేవితమ్=సిద్ధులచేత, చారణులచేత సేవించబడిన, పారమ్=అవతలి ఒడ్డును, గత్వా=పొంది, తస్య=దానియొక్క, రమ్యేషు=రమ్యములైన, తీర్థేషు=తీర్థములయందు, విచిత్రేషు=విచిత్రములైన, కాన నేషు చ=అడవులయందు, తతస్తతః=ఆ అన్ని ప్రాంతములందు, వైదేహ్యా=సీతతో, రావణః= రావణుడు, మార్గితవ్యః=వెదకదగినవాడు.

తా. అక్కడనుండి ఎఱ్ఱని నీరుగల, శీఘ్రముగా ప్రవహించే శోణనదిని చేరి, అక్కడినుండి సిద్ధులు, చారణులు నివసించు సముద్రము అవతలి ఒడ్డు చేరి దాని రమ్యములైన తీర్థములలోను, విచిత్రములైన అడవులలోను సీతను, రావణుని వెదకవలెను. 33, 34.

మూ. తతః సముద్రద్వీపాంశ్చ సుభీమాన్ ద్రష్టుమర్హథ,
ఊర్మిమన్తం మహారౌద్రం క్రోశన్తమనిలోద్ధతమ్. 35

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సుభీమాన్=చాల భయంకరములైన, సముద్ర ద్వీపాంశ్చ= సముద్రమునందలి ద్వీపములను, మహారౌద్రమ్=చాల భయంకరము, అనిలోద్ధతమ్=గాలిచేత కదల్చబడినది, క్రోశన్తమ్=ధ్వనిచేయుచున్నది అయిన, ఊర్మిమన్తమ్=తరంగములు గల సముద్రమును, ద్రష్టుమ్=చూచుటకు, అర్హథ=తగి ఉన్నారు.

తా. పిమ్మట భయంకరములైన సముద్రద్వీపములను, గాలిచే కదల్చబడి ధ్వని చేయుచు చాల భయంకరమైన, తరంగములతో నిండిన సముద్రమును వెదకుడు. 35

మూ. తత్రాసురా మహాకాయాశ్ఛాయాం గృహ్ణన్తి నిత్యశః,
బ్రహ్మణా సమనుజ్ఞాతా దీర్ఘకాలం బుభుక్షితాః. 36

ప్ర.అ. తత్ర=అక్కడ, దీర్ఘకాలమ్=చాలకాలము, బుభుక్షితాః=ఆకలితో కూడిన, మహాకాయాః=పెద్ద శరీరములు గల, అసురాః=అసురులు, బ్రహ్మణా=బ్రహ్మచేత, సమనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడినవారై, నిత్యమ్=ఎల్లప్పుడూ, ఛాయామ్=నీడను, గృహ్ణన్తి=గ్రహించుచుందురు.

తా. అక్కడ చాల కాలమునుండి ఆకలితో బాధపడుచున్న పెద్ద పెద్ద

దేహములు గల అసురులు, బ్రహ్మదేవుని అనుజ్ఞచేత, నిత్యము తమ సమీపమునకు వచ్చిన వారిని నీడను పట్టి లాగి తినుచుందురు. 36

మూ. తం కాలమేఘప్రతిమం మహోరగనిషేవితమ్,
అభిగమ్య మహానాదం తీర్థేనైవ మహోదధిమ్. 37
తతో రక్తజలం భీమం లోహితం నామ సాగరమ్,
గత్వా ప్రేక్ష్యథ తాం చైవ బృహతీం కూటశాల్మలీమ్. 38

ప్ర. అ. కాలమేఘప్రతిమమ్=నల్లని మేఘముతో సమానము, మహోరగనిషేవితమ్=గొప్ప ఉరగములచేత సేవింపబడినది, మహానాదమ్=గొప్ప ధ్వని గలది అయిన, తం మహోదధిమ్=ఆ మహాసముద్రమును, తీర్థేనైవ=తీరముచేతనే లేదా ఉపాయముచేత, అభిగమ్య=దాటి, తతః= అటుపిమ్మట, రక్తజలమ్=ఎఱ్ఱని జలము గల, భీమమ్=భయంకరమైన, లోహితం నామ= లోహితమనే, సాగరమ్=సముద్రమును, గత్వా=పొంది, బృహతీమ్=పెద్దదైన, తామ్=ఆ, కూటశాల్మలీమ్=కూటశాల్మలీవృక్షమును, ప్రేక్ష్యథ=చూడగలరు.

తా. మహాసర్పములకు నివాసస్థానమైన, మేఘము వంటి మహాధ్వని గల ఆ మహోదధిని తీరమార్గముననే (లేదా ఉపాయముచేత) దాటి దానితరువాత ఎఱ్ఱని జలము గల లోహిత మను పేరు గల భయంకరమైన సముద్రమును చేరి అక్కడ చాల పెద్దదైన ఆ కూటశాల్మలీవృక్షమును చూడగలరు. 37,38

మూ. గృహం చ వైనతేయస్య నానారత్నవిభూషితమ్,
తత్ర కైలాససంకాశం విహితం విశ్వకర్మణా. 39

ప్ర.అ. తత్ర=అక్కడ, నానారత్నవిభూషితమ్=అనేకరత్నములచేత అలంకరించబడిన, కైలాససంకాశమ్=కైలాసముతో సమానమైన, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, విహితమ్= నిర్మించబడిన, వైనతేయస్య=గరుత్మంతుని యొక్క, గృహమ్=గృహమును (చూడగలరు).

తా. అక్కడ కైలాసపర్వతము వలె ఉన్న గరుత్మంతుని గృహము మీకు కనబడును. రత్నములచేత అలంకరించబడిన ఆ గృహమును విశ్వకర్మ నిర్మించెను.

మూ. తత్ర శైలనిభా భీమా మన్దేహా నామ రాక్షసాః,
శైలశృఙ్గేషు లమ్బన్తే నానారూపా మహాబలాః. 40

ప్ర. అ. తత్ర=అక్కడ, శైలశృఙ్గేషు=పర్వతశిఖరములయందు, శైలనిభాః=పర్వతములతో సమానులు, భీమాః=భయంకరులు, నానారూపాః=అనేకవిధములైన రూపములు గలవారు, మహాబలాః=గొప్పబలము గలవారు, భయావహాః=భయమును కలిగించువారు అయిన మన్దేహాః నామ=మందేహులనే, రాక్షసాః=రాక్షసులు, లమ్బన్తే=వ్రేలాడుచుందురు.

తా. అక్కడ పర్వతములవంటి ఆకారములతో భయంకరముగా ఉండు, అనేకవిధములైన రూపములు గల, మహాబలశాలులైన మందేహు లనే రాక్షసులు, చూచువారికి భయము కలిగించుచు పర్వతశిఖరములమీద వ్రేలాడుచుందురు.40

మూ. తే పతన్తి జలే నిత్యం సూర్యస్యోదయనం ప్రతి,
అభితప్తాః స్మ సూర్యేణ లమ్బన్తే స్మ పునః పునః. 41
నిహతా బ్రహ్మతేజోభిరహన్యహని రాక్షసాః.

ప్ర. అ. తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, అహన్యహని=ప్రతిదినమునందు, సూర్యోదయనం ప్రతి=సూర్యోదయసమయమునందు, నిత్యమ్=నిత్యమూ, సూర్యేణ=సూర్యునిచేత, అభితప్తాః=తపింపచేయబడిన వారై, బ్రహ్మతేజోభిః=బ్రహ్మతేజస్సులచేత(ఉదయసమయమున సూర్యునకు అర్ఘ్యప్రదానము చేయు త్రైవర్ణికుల బ్రహ్మతేజస్సుచేత), నిహతాః=కొట్టబడినవారై, జలే= జలమునందు, పతన్తి=పడిపోవుచుందురు. పునః పునః=మాటిమాటికి, లమ్బన్తే స్మ= శిఖరములమీద వ్రేలాడుచుందురు.

తా. ఆ రాక్షసులు, ప్రతిదినము సూర్యోదయసమయమున సూర్యునిచేత తపింపచేయబడి, బ్రహ్మతేజస్సులచేత కొట్టబడినవారై, నిత్యమూ సముద్రజలములో పడిపోవుచుందురు. మరల లేచి పర్వతశిఖరములమీద వ్రేలాడుచుందురు. 41

మూ. తతః పాణ్డురమేఘాభం క్షీరోదం నామ సాగరమ్,
గత్వా ద్రక్ష్యథ దుర్ధర్షా ముక్తాహారమివోర్మిభిః. 42

ప్ర. అ. దుర్ధర్షాః=ఎదిరింప శక్యముకాని వానరులారా! తతః=అక్కడినుండి, గత్వా= వెళ్లి, పాణ్డురమేఘాభమ్=తెల్లని మేఘము వంటి కాంతి గల, ఊర్మిభిః=తరంగములతో, ముక్తాహారమివ=ముత్యాలహారము వలె నున్న, క్షీరోదం నామ=క్షీరోదము అను పేరు గల, సాగరమ్=సముద్రమును, ద్రక్ష్యథ=చూడగలరు.

తా. ఎదిరింప శక్యము కాని ఓ! వానరులారా! అక్కడినుండి వెళ్ళి మీరు తెల్లని మేఘమువంటి కాంతి గలది, తరంగములతో ముత్యాలహారము వలె ఉన్నదీ అయిన క్షీరసముద్రమును చూడగలరు. 42

మూ. తస్య మధ్యే మహాన్ శ్వేతో ఋషభో నామ పర్వతః, 43
దివ్యగన్ధైః కుసుమితైరాచితైశ్చ నగైర్వృతః,
సరశ్చ రాజతైః పద్మైర్జ్వలితైర్హేమకేసరైః, 44
నామ్నా సుదర్శనం నామ రాజహంసైః సమాకులమ్.

ప్ర.అ. తస్య=ఆ క్షీరసముద్రముయొక్క, మధ్యే=మధ్యయందు, దివ్యగన్ధైః=దివ్యమైన సువాసన గల, కుసుమితైః=పుష్పించిన, ఆచితైః=దగ్గర దగ్గరగా ఉన్న, నగైః= పర్వతములతో, వృతః=కూడిన, ఋషభో నామ=ఋషభ మను, శ్వేతః=తెల్లని, పర్వతః=పర్వతము, జ్వలితైః=ప్రకాశించుచున్న, హేమకేసరైః=బంగారు

కింజల్కములు గల, రాజతైః=రజతవికారమైన, పద్మైః=పద్మములతో కూడినది, రాజ హంసైః=రాజహంసలతో, సమాకులమ్=వ్యాకులమూ అయిన, నామ్నా=పేరుచేత, సుదర్శనం నామ=సుదర్శన మను ప్రసిద్ధి గల, సరశ్చ=సరస్సు (ఉన్నవి).

తా. ఆ క్షీరసముద్రమధ్యమునందు ఋషభ మనే తెల్లని పర్వతము న్నది. ఆ పర్వతము మీద దివ్యమైన సువాసన గల పుష్పించిన, వృక్షములు దట్టముగా ఉండును. దాని పైననే బంగారు కింజల్కములు గల ప్రకాశించుచున్న వెండి పద్మములతోను, రాజహంసలతోనూ అందముగా ఉన్న సుదర్శన మను ప్రసిద్ధనామము గల సరస్సు ఉన్నది. 43,44

మూ. విబుధాశ్చారణా యక్షాః కింనరాశ్చాప్సరోగణాః, 45
హృష్టాః సమధిగచ్ఛన్తి నలినీం తాం రిరంసవః.

ప్ర.అ. విబుధాః=దేవతలు, చారణాః=చారణలు, యక్షాః =యక్షులు, కిన్నరాశ్చ=కిన్నరులు, అప్సరోగణాః=అప్సరస్త్రీలసముదాయములు, హృష్టాః=సంతోషించినవారై, రిరంసవః= క్రీడింపగోరుచున్నవారై, తాం నలినీమ్=ఆ పద్మసరస్సును, సమధిగచ్ఛన్తి=పొందుచుందురు.

తా. దేవతలు, చారణులు, యక్షులు, కిన్నరులు, వానరులు సంతోషముతో క్రీడింపవలెనను కోరికతో ఆ సుదర్శనసరస్సువద్దకు వెళ్లుచుందురు. 45

మూ. క్షీరోదం సమతిక్రమ్య తదా ద్రక్ష్యథ వానరాః. 46
జలోదం సాగరం శీఘ్రం సర్వభూతభయావహమ్.

ప్ర. అ. వానరాః=వానరులారా! క్షీరోదమ్=క్షీరసముద్రమును, సమతిక్రమ్య=దాటి, సర్వభూతభయావహమ్=సమస్తభూతములకు భయమును కలిగించు, జలోదమ్=జలము ఉదకముగా గల, సాగరమ్=సముద్రమును, తదా=అప్పుడు, శీఘ్రమ్=శీఘ్రముగా, ద్రక్ష్యథ= చూడగలరు.

తా. వానరులారా! అప్పుడు క్షీరసముద్రమును దాటి వెళ్లి వెంటనే అందరికి భయమును కలిగించు జలసముద్రమును చూడగలరు. 46

మూ. తత్ర తత్కోపజం తేజః కృతం హయముఖం మహత్, 47
అస్యాహుస్తన్మహావేగమోదనం సచరాచరమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, తత్కోపజమ్=ఔర్వుని కోపమువలన కలిగిన, మహత్=గొప్పదైన, హయముఖమ్=అశ్వముఖము గల, తేజః=తేజస్సు, కృతమ్=చేయబడినది. సచరాచరమ్=చరాచరములతో కూడిన, మహావేగమ్=గొప్ప వేగము గల, తత్=ఆ జలమును, అస్య=దీనికి, ఓదనమ్=అన్నమునుగా, ఆహుః=చెప్పుదురు.

తా. ఆ సముద్రములో ఔర్వఋషి కోపము వలన పుట్టిన అశ్వముఖము

గల గొప్ప తేజస్సు ఉన్నది. స్థావరజంగమములతో కూడి మహావేగము గలిగిన ఆ సముద్రజలము ఆ తేజస్సుకు ఆహారము అని చెప్పుదురు. 47

మూ. తత్ర విక్రోశతాం నాదో భూతానాం సాగరౌకసామ్, 48
శ్రూయతే చాసమర్థానాం దృష్ట్వా తద్వడవాముఖమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, తత్=ఆ, వడవాముఖమ్=వడవాగ్ని ముఖమును, దృష్ట్వా=చూచి, అసమర్థానామ్=సమర్థములు గాని, విక్రోశతామ్=అరచుచున్న, సాగరౌకసామ్=సముద్రములో నివసించుచున్న, భూతానామ్=ప్రాణులయొక్క, నాదః=ధ్వని, శ్రూయతే=వినబడుచున్నది.

తా. అక్కడ వడవాగ్నిని చూచి ఏమీ చేయజాలక సముద్రములోని ప్రాణులు అరచుచుండు ధ్వని వినబడును. 48

మూ. స్వాదూదస్యోత్తరే తీరే యోజనాని త్రయోదశ, 49
జాతరూపశిలో నామ సుమహాన్ కనకప్రభః.

ప్ర. అ. స్వాదూదస్య=మధురమైన ఉదకము గల ఆ సముద్రముయొక్క, ఉత్తరే తీరే= ఉత్తరతీరమునందు, త్రయోదశ=పదమూడు, యోజనాని = యోజనములు, సుమహాన్=చాల పెద్దది, కనకప్రభః=బంగారు కాంతి కలది అయిన, జాతరూపశిలో నామ=జాతరూపశిలము అను పర్వతము ఉన్నది.

తా. మధురమైన ఉదకము గల ఆ సముద్రము ఉత్తరతీరమునందు పదమూడు యోజనములు వ్యాపించి బంగారు కాంతి గల జాతరూపశిలము అను మహాపర్వత మున్నది. 49

మూ. తత్ర చన్ద్రప్రతీకాశం పన్నగం ధరణీధరమ్, 50
పద్మపత్రవిశాలాక్షం తతో ద్రక్ష్యథ వానరాః,
ఆసీనం పర్వతస్యాగ్రే సర్వదేవనమస్కృతమ్, 51
సహస్రశిరసం దేవమనన్తం నీలవాససమ్.

ప్ర. అ. వానరాః=వానరులారా! తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడ, పర్వతస్య= పర్వతముయొక్క, అగ్రే=అగ్రమునందు, ఆసీనమ్=కూర్చున్నవాడు, చన్ద్రప్రతీకాశమ్= చంద్రునితో సమానుడు, పద్మపత్రవిశాలాక్షమ్=పద్మపత్రముల వలె విశాలములైన నేత్రములు గలవాడు, సర్వదేవనమస్కృతమ్=సమస్తదేవతలచేత నమస్కరింపబడినవాడు, సహస్రశిరసమ్=వేయి శిరస్సులు గలవాడు, నీలవాససమ్=నల్లని వస్త్రము గలవాడు, దేవమ్=ప్రభువు, ధరణీధరమ్=భూమిని మోయువాడు అయిన, అనన్తమ్=అనంతుడను, పన్నగమ్=సర్పమును, ద్రక్ష్యథ=చూడగలరు.

తా. వానరులారా! మీకు అక్కడ వేయి పడగలు గల, భూభారమును వహించు ఆదిశేషుడు ఆ పర్వతాగ్రముపై కూర్చుండి కనబడును. సమస్తదేవతలచే

నమస్కరింపబడిన ఆ ప్రభువు చంద్రుని కాంతి వంటి కాంతితో ప్రకాశించుచుండును. పద్మపత్రముల వలె విశాలములైన నేత్రములు గల ఆ దేవుడు నల్లటి వస్త్రము ధరించి యుండును. 50,51

మూ. త్రిశిరాః కాఞ్చనః కేతుస్తాలస్తస్య మహాత్మనః, 52
స్థాపితః పర్వతస్యాగ్రే విరాజతి సవేదికః.

ప్ర. అ. మహాత్మనః=గొప్పదైన, తస్య పర్వతస్య=ఆ పర్వతముయొక్క, అగ్రే= అగ్రమునందు, స్థాపితః=స్థాపించబడిన, కేతుః=కేతువైన, త్రిశిరాః=మూడు శిరస్సులు గల, కాఞ్చనః=బంగారు వికారమైన, సవేదికః=వేదికతో కూడిన, తాలః=తాలవృక్షము, విరాజతి=ప్రకాశించుచున్నది.

తా. మూడు తలలు గల చుట్టూ వేదిక కట్టిన ఒక బంగారు తాళవృక్షము ఆ మహాపర్వతము పైభాగమునందు కేతువుగా స్థాపించబడినది. 52

మూ. పూర్వస్యాం దిశి నిర్మాణం కృతం తత్త్రిదశేశ్వరైః, 53
తతః పరం హేమమయః శ్రీమానుదయపర్వతః,
తస్య కోటిర్దివం స్పృష్ట్వా శతయోజనమాయతా. 54
జాతరూపమయీ దివ్యా విరాజతి సవేదికా.

ప్ర. అ. తత్=ఆ, నిర్మాణమ్=నిర్మాణము, పూర్వస్యాం దిశి=తూర్పు దిక్కునందు, త్రిదశేశ్వరైః=దేవతలచేత, కృతమ్=చేయబడినది. తతః పరమ్=దానికవతల, హేమమయః= బంగారు వికారమైన, శ్రీమాన్=శోభాయుక్తమైన, ఉదయపర్వతః=ఉదయపర్వతము ఉన్నది. తస్య=దానియొక్క, జాతరూపమయీ=బంగారు వికారమైనది, దివ్యా=శ్రేష్ఠమైనది, సవేదికా=వేదికలతో కూడినది, శతయోజనమ్=నూరు యోజనములు, ఆయతా=దీర్ఘము అయిన, కోటిః=అగ్రభాగము, దివమ్=ఆకాశమును, స్పృష్ట్వా=స్పృశించి, విరాజతి= ప్రకాశించుచున్నది.

తా. ఈ తాళవృక్షనిర్మాణమును దేవతలు తూర్పు దిక్కున చేసి యున్నారు. దాని తరువాత బంగారు ఉదయపర్వతము శోభతో ప్రకాశించుచుండును. బంగారు వికారము, శ్రేష్ఠము, వేదికలతో కూడినది, నూరుయోజనములు పొడవుగలది అయిన దాని అగ్రభాగము ఆకాశమును స్పృశించుచు ప్రకాశించుచుండును. 53,54

మూ. సాలైస్తాలైస్తమాలైశ్చ కర్ణికారైశ్చ పుష్పితైః, 55
జాతరూపమయైర్దివ్యైః శోభతే సూర్యసంనిభైః.

ప్ర. అ. జాతరూపమయైః=బంగారు వికారమైన, దివ్యైః=దివ్యములైన, సూర్యసన్నిభైః=సూర్యునితో సమానమైన, పుష్పితైః=పుష్పించిన, సాలైః=సాల వృక్షములతోను, తాలైః=తాలవృక్షములతోను, తమాలైశ్చ=తమాలవృక్షములతోను, కర్ణికారైశ్చ=కర్ణికారవృక్షములతోను, శోభతే= ప్రకాశించుచున్నది.

తా. అది బంగారు వికారమైనది; దివ్యములు సూర్యునితో సమానములు అయిన పుష్పించిన సాల - తాల - తమాల - కర్ణికారవృక్షములతో ప్రకాశించుచుండును. 55

మూ. తత్ర యోజనవిస్తారముచ్ఛ్రితం దశయోజనమ్, 56
శృఙ్గం సౌమనసం నామ జాతరూపమయం ధ్రువమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, యోజనవిస్తారమ్=యోజనము వైశాల్యము గలది, దశయోజనమ్= పది యోజనములు, ఉచ్ఛ్రితమ్=ఉన్నతము, జాతరూపమయమ్=బంగారు వికారము, ధ్రువమ్= స్థిరము అయిన, సౌమనసం నామ=సౌమనసము అను పేరు గల, శృఙ్గమ్= శిఖరము, ఉన్నది.

తా. అక్కడ సౌమనస మను పేరు గల బంగారు శిఖరము ఉన్నది. స్థిరమైన ఆ శిఖరము ఒక యోజనము విస్తీర్ణము, పది యోజనములు ఎత్తు గలిగి యున్నది. 56

మూ. తత్ర పూర్వం పదం కృత్వా పురా విష్ణుస్త్రివిక్రమే, 57
ద్వితీయం శిఖరే మేరోశ్చకార పురుషోత్తమః.

ప్ర. అ. పురుషోత్తమః = పురుషోత్తముడైన, విష్ణుః = విష్ణువు, పురా=పూర్వము, త్రివిక్రమే=త్రివిక్రమప్రస్తావమునందు, పూర్వమ్=ముందుగా, తత్ర=ఆ శిఖరమునందు, పదమ్=పాదన్యాసమును, కృత్వా=చేసి, ద్వితీయమ్=రెండవ పాదన్యాసమును, మేరోః=మేరుపర్వతముయొక్క, శిఖరే=శిఖరమునందు, చకార=చేసెను.

తా. పూర్వము త్రివిక్రమరూపసందర్భమునందు పురుషోత్తముడైన విష్ణువు ముందుగా ఆ సౌమనసశిఖరముపై పాదమును ఉంచి, రెండవ పాదన్యాసమును మేరుపర్వతశిఖరము మీద చేసెను. 57

మూ. ఉత్తరేణ పరిక్రమ్య జమ్బూద్వీపం దివాకరః, 58
దృశ్యో భవతి భూయిష్ఠం శిఖరం తన్మహోచ్ఛ్రియమ్.

ప్ర. అ. దివాకరః=సూర్యుడు, జమ్బూద్వీపం ఉత్తరేణ=జంబూద్వీపమునకు ఉత్తరముగా, పరిక్రమ్య=సంచరించి, మహోచ్ఛ్రియమ్=గొప్ప ఔన్నత్యము గల, తత్=ఆ, శిఖరమ్=శిఖరమును (చేరి), భూయిష్ఠమ్=అధికముగా, దృశ్యః=చూడబడువాడు, భవతి=అగును.

తా. సూర్యుడు జంబూద్వీపమునకు ఉత్తరముగా సంచరించి అత్యున్నతమైన ఆ శిఖరమును చేరి పిమ్మట మేరువుకు దక్షిణముగా నున్న వారికి చాలవరకు కనబడును. 58

మూ. తత్ర వైఖానసా నామ వాలఖిల్యా మహర్షయః, 59
ప్రకాశమానా దృశ్యన్తే సూర్యవర్ణాస్తపస్వినః.

ప్ర. అ. తత్ర=అక్కడ, సూర్యవర్ణాః=సూర్యుని వంటి వర్ణము గలవారు, తపస్వినః= తపస్సు కలవారు, వైఖానసా నామ=వైఖానసు లనే పేరు గలవారు అయిన, వాలఖిల్యాః మహర్షయః= వాలఖిల్యమహర్షులు, ప్రకాశమానాః=ప్రకాశించుచున్నవారై, దృశ్యన్తే=చూడబడుచుందురు.

తా. అక్కడ సూర్యునితో సమానమైన వర్ణము గల, తపశ్శాలులైన వైఖానసు లను వాలఖిల్యమహర్షులు ప్రకాశించుచు కనబడుదురు. 59

మూ. అయం సుదర్శనో ద్వీపః పురో యస్య ప్రకాశతే, 60
యస్మింస్తేజశ్చ చక్షుశ్చ సర్వప్రాణభృతామపి.

ప్ర. అ. యస్య=ఏ తేజస్సుయొక్క, పురః=ఎదుట, సర్వప్రాణభృతామపి= సమస్తప్రాణులయొక్క, చక్షుశ్చ=నేత్రము, ప్రకాశతే=ప్రకాశించునో, తత్=అట్టి తేజః=తేజస్సు, యస్మిన్=దేనియందున్నదో, అయమ్=ఇది, సుదర్శనః ద్వీపః=సుద ర్శన మను ద్వీపము.

తా. సూర్యరూపమైన ఏ తేజస్సుకు ఎదుట సమస్తప్రాణుల నేత్రములు ప్రకాశించునో అట్టి తేజస్సు (సూర్యుడు)ఉండు సుదర్శనద్వీపము ఇదే. 60

మూ. శైలస్య తస్య పృష్ఠేషు కన్దరేషు వనేషు చ, 61
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః.

ప్ర. అ. తస్య శైలస్య=ఆ ఉదయపర్వతముయొక్క, పృష్ఠేషు=పైభాగముల యందు, కన్దరేషు=గుహలయందు, వనేషు చ=వనములయందు, తతస్తతః=అక్కడ క్కడ, రావణః=రావణుడు, వైదేహ్యా సహ=సీతతో కూడ, మార్గితవ్యః=వెదకదగినవాడు.

తా. ఆ ఉదయపర్వతపైభాగములందు గుహలలోను, అరణ్యములలోను అన్ని చోట్ల కూడ రావణునికొరకు సీతకొరకు వెదకవలెను. 61

మూ. కాఞ్చనస్య చ శైలస్య సూర్యస్య చ మహాత్మనః, 62
ఆవిష్టా తేజసా సన్ధ్యా పూర్వా రక్తా ప్రకాశతే.

ప్ర. అ. కాఞ్చనస్య=బంగారువికారమైన, శైలస్య=ఆ పర్వతముయొక్క, మహాత్మనః= మహాత్ముడైన, సూర్యస్య చ=సూర్యునియొక్క, తేజసా=తేజస్సుతో, ఆవిష్టా=కూడిన, పూర్వా సన్ధ్యా=ప్రాతఃకాలసంధ్య, రక్తా=ఎఱ్ఱనైనదై, ప్రకాశతే=ప్రకా శించుచుండును.

తా. ఆ బంగారు పర్వతము కాంతి మహాత్ముడైన ఆ సూర్యుని కాంతి కలియుటచేత ప్రాతఃకాలసంధ్య ఎఱ్ఱగా ప్రకాశించుచుండును. 62

మూ. పూర్వమేతత్కృతం ద్వారం పృథివ్యా భువనస్య చ, 63
సూర్యస్యోదయనం చైవ పూర్వా హ్యేషా దిగుచ్యతే.

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, ఏతత్=ఇది, (ఉదయపర్వతము), పృథివ్యాః=భూమికిని, భువనస్య=జగత్తునకు, ద్వారమ్=ద్వారముగాను, సూర్యస్య=సూర్యునియొక్క, ఉదయనం చ=ఉదయస్థానముగాను, కృతమ్=చేయబడినది. ఏషా=ఇది, పూర్వా దిక్= పూర్వదిక్కు అని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. బ్రహ్మ ఈ పర్వతమును పూర్వము (మొట్టమొదట)భూమికి జగత్తునకు ద్వారముగాను, సూర్యుని ఉదయస్థానముగాను సృష్టించెను. అందువలన ఈ దిక్కు 'పూర్వదిక్' అని చెప్పబడుచున్నది. 63

మూ. తస్య శైలస్య పృష్ఠేషు నిర్ఝరేషు గుహాసు చ, 64
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః.

ప్ర. అ.తస్య శైలస్య=ఆ పర్వతముయొక్క, పృష్ఠేషు=పైభాగములయందు, నిర్ఝరేషు= కొండకాలువలయందు, గుహాసు చ=గుహలయందు, వైదేహ్యా సహ=సీతతో కూడ, రావణః= రావణుడు, తతస్తతః=అక్కడ, అక్కడ, మార్గితవ్యః=వెదకతగినవాడు.

తా. మీరు ఆ పర్వతము పైభాగములయందు, కొండకాలువలయందు, గుహలయందు, అన్ని ప్రదేశములందు కూడ రావణుని సీతను వెదకుడు. 64

మూ. తతః పరమగమ్యా స్యాద్దిక్పూర్వా త్రిదశావృతా, 65
రహితా చన్ద్రసూర్యాభ్యామదృశ్యా తమసా వృతా.

ప్ర. అ.తతః పరమ్=ఆ ఉదయపర్వతమునకు అవతల, త్రిదశావృతా=దేవతలతో కూడినది, చన్ద్రసూర్యాభ్యామ్=చంద్రసూర్యులతో, రహితా=శూన్యము, తమసా=చీకటిచేత, ఆవృతా=కప్పబడినది అయిన, పూర్వా దిక్=తూర్పుదిక్కు, అగమ్యా స్యాత్=వెళ్లుటకు శక్యము గానిది. అదృశ్యా=చూచుటకు శక్యము గానిది.

తా. ఆ ఉదయపర్వతము తరువాత దేవతలు నివసించు ఆ తూర్పు దిక్కునకు ఎవ్వరు వెళ్లజాలరు. చన్ద్రసూర్యులు లేకపోవుటచే అంధకారముచే కప్పబడి ఉన్న ఆ ప్రాంతమును ఎవ్వరును చూడజాలరు. 65

మూ. శైలేషు తేషు సర్వేషు కన్దరేషు నదీషు చ, 66
యే చ నోక్తా మయోద్దేశా విచేయా తేషు జానకీ.

ప్ర. అ. తేషు=ఆ, శైలేషు=పర్వతములయందు, సర్వేషు=సమస్తమైన, కన్దరేషు= గుహలయందు, నదీషు చ=నదులయందు, మయా=నాచేత, యే=ఏ, ఉద్దేశాః= ప్రదేశములు, నోక్తాః=చెప్పబడలేదో, తేషు=వాటియందు, జానకీ=జానకి, విచేయా= వెదకదగినది.

తా. ఆ పర్వతములయందు, గుహలలోను, నదులలోను నేను చెప్పని ప్రదేశములు ఉన్నచో వాటిలోను సీతను వెదకవలెను. 66

మూ. ఏతావద్వానరైః శక్యం గన్తుం వానరపుఙ్గవాః, 67
అభాస్కరమమర్యాదం న జానీమస్తతః పరమ్.

ప్ర. అ. వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులారా! ఏతావత్=ఇంతవరకు, వానరైః=వానరులచేత, గన్తుమ్=వెళ్లుటకు, శక్యమ్=శక్యమైనది. అభాస్కరమ్=సూర్యుడు లేనిది, అమర్యాదం చ=పరిహద్దులు లేనిది అయిన, తతః పరమ్=దానికి అవతల నున్న ప్రదేశమును గూర్చి, న జానీమః=మేము ఎరుగము.

తా. ఓ వానరశ్రేష్ఠులారా! వానరులు అంతవరకే వెళ్లగలరు. అది దాటి సూర్యుడు లేని పరిహద్దులు లేని ఆ ప్రదేశమును గూర్చి నాకు తెలియదు. 67

మూ. అభిగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ, 68
మాసే పూర్ణే నివర్తధ్వముదయం ప్రాప్య పర్వతమ్.

ప్ర. అ. ఉదయం పర్వతమ్=ఉదయపర్వతమును, ప్రాప్య=పొంది, వైదేహీమ్=సీతను, రావణస్య=రావణునియొక్క, నిలయం చ=స్థానమును, అభిగమ్య=తెలుసుకొని, మాసే=మాసము, అపూర్ణే=నిండకుండగానే, నివర్తధ్వమ్=తిరిగి రండి.

తా. మీరు ఉదయపర్వతము వరకు వెళ్లి రావణుని నివాసమును, సీతను తెలుసుకొని మాసములోపుగా తిరిగి రావలెను. 68

మూ. ఊర్ధ్వం మాసాన్న వస్తవ్యం వసన్వధ్యో భవేన్మమ,
సిద్ధార్థాః సన్నివర్తధ్వమధిగమ్య చ మైథిలీమ్. 69

ప్ర. అ. మాసాత్ ఊర్ధ్వమ్=మాసముకంటే పైన, న వస్తవ్యమ్=నివసించకూడదు. వసన్= ఆ విధముగా నివసించువాడు, మమ=నాకు, వధ్యః=వధింపదగినవాడు. సిద్ధార్థాః=సిద్ధమైన కార్యము గలవారై, మైథిలీమ్=సీతను, అధిగమ్య=పొంది, సన్నివర్తధ్వమ్=తిరిగి రండి.

తా. మీరు మాసము మించి ఉండకూడదు. అట్లు ఉన్నవానికి నేను మరణదండమును ఇవ్వగలను. కార్యము పూర్తి చేసుకొని సీత జాడ తెలిసికొని తిరిగి రండి. 69

మూ. మహేన్ద్రకాన్తాం వనషణ్డమణ్డితాం
దిశం చరిత్వా నిపుణేన వానరాః,
అవాప్య సీతాం రఘువంశజప్రియాం
తతో నివృత్తాః సుఖినో భవిష్యథ. 70

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాండే
చత్వారింశః సర్గః.

ప్ర. అ. వానరాః=వానరులారా! మహేన్ద్రకాన్తామ్=మహేంద్రునకు ఇష్టమైనది, వనషణ్డమణ్డితామ్=వృక్షసముదాయములచేత అలంకరింపబడినది అయిన, దిశమ్=తూర్పు దిక్కును, నిపుణేన=నేర్పుతో, చరిత్వా=సంచరించి, రఘువంశజప్రియామ్=రాముని ప్రియురాలైన, సీతామ్=సీతను, అవాప్య=పొంది, తతః=అటు పిమ్మట, నివృత్తాః=తిరిగివచ్చినవారై, సుఖినః=సుఖవంతులు, భవిష్యథ=కాగలరు.

తా. ఓ! వానరులారా! వృక్షముల సముదాయములతో అందముగా నున్న మహేంద్రునికి ఇష్టమైన ఆ తూర్పు దిక్కునందు నేర్పుతో సంచరించి, రాముని భార్యయైన సీత జాడ తెలుసుకొని మరలి వచ్చి సుఖముగా ఉందురు. 70

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకచత్వారింశః సర్గః

[దక్షిణదిక్కునందున్న ప్రదేశములను వర్ణించి చెప్పి సుగ్రీవుడు వానర వీరులను ఆ దిక్కుకు పంపుట.]

మూ. తతః ప్రస్థాప్య సుగ్రీవస్తన్మహద్వానరం బలమ్,
దక్షిణాం ప్రేషయామాస వానరానభిలక్షితాన్. 1

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, మహత్=గొప్పదైన, తత్=ఆ, వానరం బలమ్= వానరసైన్యమును, ప్రస్థాప్య=పంపి, తతః=అటు పిమ్మట, అభిలక్షితాన్=బాగా పరీక్షింపబడిన, వానరాన్=వానరులను, దక్షిణామ్=దక్షిణదిక్కును గూర్చి, ప్రేషయామాస=పంపెను.

తా. సుగ్రీవుడు ఆ వానరసైన్యమును తూర్పుదిక్కుకు పంపిన తరువాత బాగుగా పరీక్షింపబడిన వానరులను దక్షిణదిక్కునకు పంపెను. 1

మూ. నీల మగ్నిసుతం చైవ హనూమన్తం చ వానరమ్,
పితామహసుతం చైవ జామ్బవన్తం మహౌజసమ్. 2
సుహోత్రం చ శరారిం చ శరగుల్మం తథైవ చ,
గజం గవాక్షం గవయం సుషేణం వృషభం తథా. 3
మైన్దం చ ద్వివిదం చైవ విజయం గన్ధమాదనమ్,
ఉల్కాముఖమనఙ్గం చ హుతాశనసుతావుభౌ. 4
అఙ్గదప్రముఖాన్వీరాన్ వీరః కపిగణేశ్వరః,
వేగవిక్రమసమ్పన్నాన్ సన్దిదేశ విశేషవిత్ . 5

ప్ర. అ.వీరః=వీరుడు, విశేషవిత్=విశేషమును తెలిసినవాడు అయిన, కపిగణేశ్వరః =సుగ్రీవుడు, అగ్నిసుతమ్=అగ్నికుమారుడైన, నీలమ్=నీలుని, వానరమ్ =వానరుడైన, హనూమన్తం చ= హనుమంతుని, పితామహసుతమ్=బ్రహ్మదేవుని కుమారుడైన, మహౌజసమ్=గొప్ప తేజస్సు గల, జామ్బవన్తం చైవ=జాంబవంతుని, సుహోత్రం చ =సుహోత్రుని, శరారిం చ=శరారిని, తథైవ చ=మరియు, శరగుల్మమ్= శరగుల్ముని, గజమ్=గజుని, గవాక్షమ్=గవాక్షుని, గవయమ్=గవయుని, సుషేణమ్= సుషేణుణ్ణి, తథా=మరియు, వృషభమ్=వృషభుణ్ణి, మైన్దం చ=మైందుని, ద్వివిదం చైవ=ద్వివిదుని, విజయమ్=విజయుని, గన్ధమాదనమ్=గన్ధమాదనుని, ఉల్కాముఖమ్= ఉల్కాముఖుడు, అనఙ్గం చ=అనంగుడు అను, హుతాశనసుతౌ=అగ్నికుమారులైన, ఉభౌ=ఇద్దరిని, అఙ్గదప్రముఖాన్=అంగదుడు

మొదలైన, వేగవిక్రమసమ్పన్నాన్=వేగముతోను పరాక్రమముతోను కూడిన, వీరాన్=వీరులను, సన్దిదేశ=పంపెను.

తా. విశేషమును గుర్తింప సమర్థుడైన వీరుడైన సుగ్రీవుడు అగ్నికుమారుడైన నీలుని, హనుమంతుని, బ్రహ్మదేవుని కుమారుడు, గొప్ప బలము గలవాడు అయిన జాంబవంతుని, సుహోత్ర - శరారి - శరగుల్మ - గజ - గవాక్ష - గవయ - సుషేణ - వృషభ - మైన్ద - ద్వివిద, విజయ, గందమాదనులను, అగ్నిపుత్రులైన ఉల్కాముఖ - అనంగులను, వేగముతోను, పరాక్రమముతోను కూడిన అంగదుడు మొదలైన వీరులను పంపెను. 2-5

మూ. తేషామగ్రేసరం చైవ మహాబలమథాఙ్గదమ్,
విధాయ హరివీరాణామాదిశద్దక్షిణాం దిశమ్. 6

అథ=అటు పిమ్మట, తేషామ్=ఆ, హరివీరాణామ్=వానర వీరులకు, మహాబలమ్= గొప్ప బలము గల, అఙ్గదమ్=అంగదుణ్ణి, అగ్రేసరమ్=నాయకునిగా, విధాయ=చేసి, దక్షిణాం దిశమ్=దక్షిణ దిక్కును గూర్చి, ఆదిశత్=పంపెను.

తా. ఆ వానరవీరులకు మహాబలశాలియైన అంగదుని నాయకునిగా చేసి వారిని దక్షిణదిక్కుకు పంపించెను. 6

మూ. యే కేచన సముద్దేశాస్తస్యాం దిశి సుదుర్గమాః
కపీశః కపిముఖ్యానాం స తేషాం సముదాహరత్. 7

ప్ర. అ. తస్యాం దిశి=ఆ దిక్కునందు, దుర్గమాః=ప్రవేశింప శక్యము గాని, యే కే చన= ఏ కొన్ని, సముద్దేశాః=పై దేశము లున్నవో వాటిని, సః కపీశః=ఆ సుగ్రీవుడు, తేషాం కపిముఖ్యానామ్=ఆ వానరశ్రేష్ఠులకు, సముదాహరత్=చెప్పెను.

తా. ఆ సుగ్రీవుడు ఆ దిక్కునందున్న ప్రవేశింప శక్యము గాని, ప్రదేశములను గూర్చి ఆ వానరనాయకులకు చెప్పెను. 7

మూ. సహస్రశిరసం విన్ధ్యం నానాద్రుమలతాయుతమ్,
నర్మదాం చ నదీం రమ్యాం మహోరగనిషేవితామ్. 8
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీమ్,
వరదాం చ మహాభాగాం మహోరగనిషేవితామ్. 9
మేఖలాముత్కలాంశ్చైవ దశార్ణనగరాణ్యపి,
ఆబ్రవన్తీమవన్తీం చ సర్వామేవానుపశ్యత. 10

ప్ర. అ. సహస్రశిరసమ్=వెయ్యి శిఖరములు గల, నానాద్రుమలతాయుతమ్= అనేకవిధములైన వృక్షములతోను లతలతోను కూడిన, విన్ధ్యమ్=వింధ్యపర్వతమును,

మహోరగనిషేవితామ్= మహాసర్పములచేత సేవింపబడిన, రమ్యామ్=రమ్యమైన, నర్మదాం నదీం చ=నర్మదానదిని, తతః=అటుపిమ్మట, రమ్యామ్=రమ్యమైన, గోదావరీమ్=గోదావరిని, మహానదీమ్=మహానదియైన, కృష్ణవేణీమ్=కృష్ణవేణిని, మహాభాగామ్=చాల సుందరమైన, మహోరగనిషేవితామ్=మహాసర్పములచేత సేవించబడిన, వరదాం చ=వరదానదిని, మేఖలాన్= మేఖలదేశమును, ఉత్కలాంశ్చైవ=ఉత్కల దేశమును, దశార్ణనగరాణ్యపి=దశార్ణనగరములను, ఆబ్రవన్తీమ్=ఆబ్రవంతీనగరమును, అవన్తీమ్=అవంతిని, సర్వమేవ=అంతను, అనుపశ్యత=వెదకండి.

తా. అనేకశిఖరములు, వృక్షములు, లతలు గల వింధ్యపర్వతమును, మహాసర్పములు నివసించు రమ్యమైన నర్మదానదిని, రమ్యమైన గోదావరీనదిని, కృష్ణవేణి అను మహానదిని (కృష్ణవేణిని, మహానదిని) మహాసర్పములు నివసించు సుందరమైన వరదానదిని, మేఖలదేశమును, ఉత్కలదేశమును, దశార్ణనగరములను, ఆబ్రవంతి - అవంతి నగరములను అన్నింటిని వెదకుడు. 8-10

మూ. విదర్భానృష్టికాంశ్చైవ రమ్యాన్మాహిషకానపి,
తథా మత్స్యకళిఙ్గాంశ్చ కౌశికాంశ్చ సమన్తతః. 11
అన్వీక్ష్య దణ్డకారణ్యం సపర్వతనదీగుహమ్,
నదీం గోదావరీం చైవ సర్వమేవానుపశ్యత, 12
తథైవాన్ధ్రాంశ్చ పుణ్డ్రాంశ్చ చోళాన్ పాణ్డ్యాంశ్చ కేరళాన్.

ప్ర. అ. విదర్భాన్=విదర్భదేశమును, ఋష్టికాంశ్చైవ=ఋష్టికదేశమును, రమ్యాన్= రమ్యమైన, మాహిషకానపి=మహిషదేశమును, తథా=మరియు, మత్స్య కళిఙ్గాంశ్చ= మత్స్యదేశమును కళింగదేశమును, సమన్తతః =ఆ సమీపమువందున్న, కౌశికాంశ్చ=కౌశికదేశమును, సపర్వతనదీగుహామ్=పర్వతములతోను, నదులతోను, గుహలతోను కూడిన, దణ్డకారణ్యమ్=దండకారణ్యమును, అన్వీక్ష్య=చూచి, గోదావరీం నదీం చైవ=గోదావరీనదిని, తథైవ=అట్లే, ఆన్ధ్రాంశ్చ=ఆంధ్రదేశమును, పుణ్డ్రాంశ్చ=పుండ్రదేశమును, చోళాన్=చోళదేశమును, పాణ్డ్యాంశ్చ=పాండ్యదేశ మును, కేరళాన్=కేరళదేశమును, సర్వమేవ=అంతను, అనుపశ్యత=అన్వేషించండి.

తా. విదర్భ - ఋష్టిక - మాహిషక - మత్స్య - కళింగ - కౌశిక - ఆంధ్ర - పుండ్ర - చోళ - పాండ్య - కేరళ దేశములను, పర్వతములతోను, నదులతోను, గుహలతోను నిండిన దండకారణ్యమును గోదావరీ నదిని వీటినన్నింటిని అన్వేషించుడు. 11,12

మూ. అయోముఖశ్చ గన్తవ్యః పర్వతో ధాతుమణ్డితః, 13
విచిత్రశిఖరః శ్రీమాంశ్చిత్రపుష్పితకాననః,
సుచన్దనవనోద్దేశో మార్గితవ్యో మహాగిరిః. 14

ప్ర. అ. ధాతుమణ్డితః = ధాతువులచేత అలంకరింపబడినది, విచిత్రశిఖరః

= విచిత్రములైన శిఖరములు కలది, శ్రీమాన్ = శోభాయుక్తమైనది, చిత్ర పుష్పిత కాననః =చిత్రములైన పుష్పించిన అరణ్యములు కలది అయిన, అయోముఖః పర్వతః = మలయపర్వతము, గన్తవ్యః = వెళ్లదగినది. సుచన్దనవనోద్దేశః =అందమైన చందన వన ప్రాంతములు గల, మహాగిరిః = ఆ మహాపర్వతము, మార్గితవ్యః = వెదకతగినది.

తా. ధాతువులచేత అలంకరింపబడినది, విచిత్రమైన శిఖరములు కలది, శోభతో కూడినది, పుష్పించి చిత్రవర్ణములుగా ఉన్న అరణ్యములు కలది అయిన మలయపర్వతమునకు వెళ్లి అందమైన చందనవనములు గల ఆ మహాపర్వతమునందు వెదకుడు. 13,14

మూ. తతస్తామాపగాం దివ్యాం ప్రసన్నసలిలాశయామ్,
తత్ర ద్రక్ష్యథ కావేరీం విహృతామప్సరోగణైః. 15

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దివ్యామ్ = శ్రేష్ఠము, ప్రసన్న సలిలాశయామ్ = నిర్మలమైన ఉదకమునకు స్థానము, అప్సరోగణైః = అప్సర స్త్రీల సముదాయములచేత, విహృతామ్ = విహరించబడినది అయిన, తామ్ = ఆ, కావేరీమ్ = కావేరి అను, ఆపగామ్ =నదిని, తత్ర = అక్కడ, ద్రక్ష్యథ = చూడగలరు.

తా. పిమ్మట మీకు అక్కడ నిర్మలమైన జలములతో నిండి అందముగా నున్న కావేరీనది కనబడును. దానిలో అప్సరసస్త్రీలు విహరించుచుందురు. 15

మూ. తస్యాసీనం నగస్యాగ్రే మలయస్య మహౌజసః,
ద్రక్ష్యథాదిత్యసఙ్కాశమగస్త్యమృషిసత్తమమ్. 16

ప్ర. అ. మహౌజసః = గొప్ప తేజస్సు గల , తస్య= ఆ, మలయస్య నగస్య = మలయపర్వతముయొక్క, అగ్రే = అగ్రమునందు, ఆసీనమ్ = కూర్చున్న, ఆదిత్యసఙ్కాశమ్ = సూర్యునితో సమానుడైన, ఋషిసత్తమమ్ = ఋషులలో శ్రేష్ఠుడైన, అగస్త్యమ్ = అగస్త్యుని, ద్రక్ష్యథ = చూడగలరు.

తా. సుందరమైన ఆ మలయపర్వతశిఖరమునందు కూర్చున్న మునిశ్రేష్ఠుడైన సూర్యుని వంటి కాంతి గల అగస్త్యుడు మీకు కనబడును. 16

మూ. తతస్తేనాభ్యనుజ్ఞాతాః ప్రసన్నేన మహాత్మనా,
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథ మహానదీమ్. 17

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రసన్నేన = ప్రసన్నుడై, మహాత్మనా = మహాత్ముడైన, తేన =ఆ అగస్త్యుని చేత, అనుజ్ఞాతాః =అనుజ్ఞ ఇవ్వబడినవారై, అథ = అటు పిమ్మట, గ్రాహజుష్టామ్ = మొసళ్ళతో కూడిన, తామ్రపర్ణీమ్ = తామ్రపర్ణి అను, మహానదీమ్ = మహానదిని, తరిష్యథ =దాటగలరు.

తా. పిమ్మట ప్రసన్నుడైన ఆ మహాత్ముని అనుజ్ఞ పొంది మొసళ్ళతో నిండిన తామ్రపర్ణీనదిని దాటి వెళ్లుడు. 17

మూ. సా చన్దనవనైశ్చిత్రైః ప్రచ్ఛన్నద్వీపవారిణీ,
కాన్తేవ యువతీ కాన్తం సముద్రమవగాహతే. 18

ప్ర. అ. చిత్రైః=చిత్రమైన, చన్దనవనైః=చందనవనములచేత, ప్రచ్ఛన్నద్వీపవారిణీ= కప్పబడిన ద్వీపములు ఉదకములు గల, సా=ఆ తామ్రపర్ణీనది, యువతీ=యువతియైన, కాన్తా=స్త్రీ, కాన్తమ్ ఇవ=భర్తను వలె, సముద్రమ్=సముద్రమును, అవగాహతే=చేరుచున్నది.

తా. చిత్రములైన చందనవనములు ఆవరించి యున్న ద్వీపములు, ఉదకములు గల ఆ తామ్రపర్ణీనది యువతి యైన స్త్రీ ప్రియుని చేరినట్లు సముద్రమును చేరుచున్నది. 18

మూ. తతో హేమమయం దివ్యం ముక్తామణివిభూషితమ్,
యుక్తం కవాటం పాణ్డ్యానాం గతా ద్రక్ష్యథ వానరాః. 19

ప్ర. అ. వానరాః=వానరులారా! తతః=అటుపిమ్మట, యుక్తమ్=కోటకు అమర్చబడిన, హేమమయమ్=బంగారువికారమైనది, దివ్యమ్=శ్రేష్ఠము, ముక్తామణివిభూషితమ్= ముత్యములచేత, మణులచేత అలంకరింపబడినది అయిన, పాణ్డ్యానామ్=పాండ్యదేశముయొక్క, కవాటమ్=కోట తలుపును, గతాః=అక్కడికి వెళ్లినవారై, ద్రక్ష్యథ=చూడగలరు.

తా. ఓ!వానరులారా! మీరు అక్కడకు వెళ్లి పాండ్యదేశము కోటకు అమర్చిన బంగారువికారమైన ముత్యములచేత మణులచేత అలంకరింపబడిన దివ్యమైన తలుపును చూడగలరు. 19

మూ. తతః సముద్రమాసాద్య సమ్ప్రధార్యార్థనిశ్చయమ్,
అగస్త్యేనాన్తరే తత్ర సాగరే వినివేశితః, 20
చిత్రసానునగః శ్రీమాన్మహేన్ద్రః పర్వతోత్తమః,
జాతరూపమయః శ్రీమానవగాఢో మహార్ణవమ్. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సముద్రమ్=సముద్రమును, ఆసాద్య=చేరి, అర్థనిశ్చయమ్=కార్యక్రమమును, సమ్ప్రధార్య=నిశ్చయించి, అగస్త్యేన=అగస్త్యుని చేత, తత్ర=అక్కడ, సాగరే=సముద్రమునందు, అన్తరే=మధ్యయందు, వినివేశితః= స్థాపించబడిన, చిత్రసానునగః=చిత్రమైన చరియలు వృక్షములు గల, శ్రీమాన్=సుందరమైన, మహేన్ద్రః=మహేంద్రమను, పర్వతోత్తమః=పర్వతశ్రేష్ఠము ఉన్నది. జాతరూపమయః= బంగారము వికారమైన, శ్రీమాన్=సుందరమైన ఆ పర్వతము, మహార్ణవమ్=మహాసముద్రమును, అవగాఢః=ప్రవేశించియున్నది.

తా. అటు పిమ్మట సముద్రమును సమీపించి చేయవలసిన కార్యమును నిర్ణయించుకొనుడు. అక్కడ అగస్త్యుడు సముద్రమధ్యములో నిలిపిన సుందరమైన మహేంద్రపర్వతము ఉన్నది. దాని చరియలు, వృక్షములు, నానావర్ణములతో ఉండును. బంగారము వికారమైన ఆ పర్వతము మహాసముద్రములోనికి చొచ్చుకొని ఉన్నది. 20,21

మూ. నానావిధైర్నగైః ఫుల్లైర్లతాభిశ్చోపశోభితమ్,
దేవర్షియక్షప్రవరై రప్సరోభిశ్చ సేవితమ్. 22
సిద్ధచారణసఙ్ఘైశ్చ ప్రకీర్ణం సుమనోరమమ్,
తముపైతి సహస్రాక్షః సదా పర్వసు పర్వసు. 23

ప్ర. అ. నానావిధైః=అనేకవిధములైన, ఫుల్లైః=వికసించిన, నగైః=వృక్షములచేత, లతాభిశ్చ=లతలచేత, ఉపశోభితమ్=అలంకరింపబడినది, దేవర్షియక్షప్రవరైః=దేవర్షులచేత, శ్రేష్ఠులైన యక్షులచేత, అప్సరోభిశ్చ=అప్సరస్త్రీలచేత, సేవితమ్=సేవించబడినది, సిద్ధచారణసఙ్ఘైశ్చ=సిద్ధులయొక్క చారణులయొక్క సంఘములచేత, ప్రకీర్ణమ్=వ్యాప్తమైనది, సుమనోరమమ్=చాల మనోహరము అయిన, తమ్=ఆ పర్వతమును, సహస్రాక్షః=దేవేంద్రుడు, పర్వసు పర్వసు= అన్ని పర్వములయందు, సదా=ఎల్లపుడు, ఉపైతి=పొందుచుండును.

తా. ఆ పర్వతము వికసించిన పుష్పములు గల, అనేక విధములైన వృక్షములతోను లతలతోను ప్రకాశించుచుండును. చాలా మనోహరమైన ఆ పర్వతముపై దేవతలు ఋషులు యక్షులు అప్సరస్త్రీలు సిద్ధులు చారణులు నివసించుచుందురు. దేవేంద్రుడు ప్రతిపర్వమునందు ఆ పర్వతమునకు వచ్చుచుండును. 22,23

మూ. ద్వీపస్తస్యాపరే పారే శతయోజనవిస్తృతః,
అగమ్యో మానుషైర్దీప్తస్తం మార్గధ్వం సమన్తతః. 24

ప్ర. అ. తస్య=దానియొక్క, అపరే పారే=అవతలి ఒడ్డున, శతయోజనవిస్తృతః=నూరు యోజనములు విస్తారము గల, మానుషైః=మనుష్యులచేత, అగమ్యః=పొంద శక్యము గాని, దీప్తః=ప్రకాశించుచున్న, ద్వీపః=ద్వీపము ఉన్నది. తమ్=దానిని, సమన్తతః= అంతటను, మార్గధ్వమ్=వెదకండి.

తా. దాని అవతలి ఒడ్డున నూరు యోజనముల వైశాల్యము గల ద్వీపమున్నది. ప్రకాశించుచున్న ఆ ద్వీపమునకు మానవులు వెళ్లజాలరు. ఆ ద్వీపమునం దంతటను మీరు వెదకుడు. 24

మూ. తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః,
స హి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః, 25
రాక్షసాధిపతేర్వాసః సహస్రాక్షసమద్యుతేః.

ప్ర. అ. తత్ర=అక్కడ, సీతా=సీత, విశేషతః=విశేషముగా, సర్వాత్మనా=అన్ని విధముల, మార్గితవ్యా=వెదకతగినది. సః=ఆ, దేశః=దేశము, వధ్యస్య= చంపదగినవాడు, దురాత్మనః=దురాత్ముడు, రాక్షసాధిపతేః=రాక్షసరాజు, సహస్రాక్షసమద్యుతేః=ఇంద్రునితో సమానమైన కాంతి గలవాడు అయిన, రావణస్య=రావణునియొక్క, వాసః=నివాసము.

తా. మీరు విశేషించి ఆ ద్వీపమునందు సీతను అన్ని విధముల అన్వేషించవలెను. రాక్షసరాజు దేవేంద్రునితో సమానమైన కాంతి గలవాడు, దురాత్ముడు చంపదగినవాడు అయిన రావణుడు ఆ దేశమునందే నివసించుచుండును. 25

మూ. దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్య తు రాక్షసీ, 26
అఙ్గారకేతి విఖ్యాతా ఛాయామాక్షిప్య భోజనీ.

ప్ర. అ. తస్య=ఆ, దక్షిణస్య సముద్రస్య=దక్షిణసముద్రముయొక్క, మధ్యే=మధ్యయందు, ఛాయామ్=నీడను, ఆక్షిప్య=లాగి, భోజనీ=భుజించు, అఙ్గారకేతి=అంగారక అని, విఖ్యాతా=ప్రసిద్ధురాలైన, రాక్షసీ=రాక్షసస్త్రీ ఉన్నది.

తా. ఆ దక్షిణసముద్రమధ్యమునందు అంగారక అను ఒక రాక్షసస్త్రీ నివసించుచుండును. ఆమె నీడను బట్టి లాగి ప్రాణులను భక్షించుచుండును.

మూ. ఏవం నిస్సంశయాన్ కృత్వా సంశయాన్నష్టసంశయాః, 27
మృగయధ్వం నరేన్ద్రస్య పత్నీమమితతేజసః.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, సంశయాన్=సంశయాస్పదములైన దేశములను, నిస్సంశయాన్=సంశయము లేనివాటినిగా, కృత్వా=చేసికొని, నష్టసంశయాః=నష్టమైన సంశయము గలవారై, అమితతేజసః=అమితమైన తేజస్సు గల, నరేన్ద్రస్య=నరులకు ప్రభువైన రామునియొక్క, పత్నీమ్=భార్యను, మృగయధ్వమ్=వెదకండి.

తా. ఆ యా దేశములను గూర్చి సంశయములను ఈ విధముగా తొలగించుకొని, మీరు అమితమైన తేజస్సు గల రాముని భార్యకొరకు వెదకండి.

మూ. తమతిక్రమ్య లక్ష్మీవాన్ సముద్రే శతయోజనే, 28
గిరిః పుష్పితకో నామ సిద్ధచారణసేవితః.

ప్ర. అ. తమ్=ఆ ద్వీపమును, అతిక్రమ్య=దాటి, శతయోజనే=నూరు యోజనముల ప్రమాణము గల, సముద్రే=సముద్రమునందు, లక్ష్మీవాన్=శోభకలది, సిద్ధచారణసేవితః= సిద్ధులచేత, చారణులచేత సేవించబడినది అయిన, పుష్పితకో నామ=పుష్పితక మను పేరు గల, గిరిః= పర్వతము ఉన్నది.

తా. ఆ ద్వీపమును దాటిన పిమ్మట నూరు యోజనముల సముద్రములో సిద్ధులకు చారణులకు నివాసమైన పుష్పితక మను అందమైన పర్వతమున్నది.28

మూ. చన్ద్రసూర్యాంశుసఙ్కాశః సాగరామ్బుసమాశ్రయః, 29
భ్రాజతే విపులైః శృఙ్గైరమ్బరం విలిఖన్నివ.

ప్ర. అ. చన్ద్రసూర్యాంశుసఙ్కాశః=చంద్రునియొక్క సూర్యునియొక్క కిరణములతో సమానము, సాగరామ్బుసమాశ్రయః=సముద్రోదకము ఆశ్రయము గలది అయిన ఆ పర్వతము, విపులైః= విశాలములైన, శృఙ్గైః=శిఖరములచేత, అమ్బరమ్=ఆకాశమును, విలిఖన్నివ= వ్రాయుచున్నదా అన్నట్లు, భ్రాజతే=ప్రకాశించుచున్నది.

తా. సముద్రజలములో ఉన్న చంద్రకిరణములతోను సూర్యకిరణములతోను సమానమైన ఆ పర్వతము విశాలమైన శిఖరములతో ఆకాశమును ఒరయుచున్నట్లుండును. 29

మూ. తస్యైకం కాఞ్చనం శృఙ్గం సేవతే యం దివాకరః, 30
శ్వేతం రాజతమేకం చ సేవతే యన్నిశాకరః,
న తం కృతఘ్నాః పశ్యన్తి న నృశంసా న నాస్తికాః. 31

ప్ర. అ. తస్య=దానియొక్క, ఏకమ్=ఒక, శృఙ్గమ్=శిఖరము, కాఞ్చనమ్=బంగారు వికారమైనది. యమ్=దేనిని, దివాకరః=సూర్యుడు, సేవతే=సేవించుచుండునో. ఏకమ్=ఒక, శ్వేతమ్=తెల్లని శిఖరము, రాజతమ్=వెండివికారమైనది, యత్=దేనిని, నిశాకరః=చంద్రుడు, సేవతే=సేవించుచున్నాడో. తమ్=ఆ పర్వతమును, కృతఘ్నాః= కృతఘ్నులు, న పశ్యన్తి=చూడరు; నృశంసాః=క్రూరులు, న=చూడరు. నాస్తికాః= నాస్తికులు, న=చూడరు.

తా. ఆ పర్వతముమీద ఒక శిఖరము బంగారము వికారమైనది. దానిని సూర్యుడు సేవించుచుండును. ఒక శిఖరము వెండిది. తెల్లగా నున్న ఆ శిఖరముపై చంద్రుడు నివసించును. కృతఘ్నులు కాని, క్రూరులు గాని, నాస్తికులు గాని ఆ పర్వతమును చూడజాలరు. 30,31

మూ. ప్రణమ్య శిరసా శైలం తం విమార్గథ వానరాః,
తమతిక్రమ్య దుర్ధర్షం సూర్యవాన్నామ పర్వతః, 32
అధ్వనా దుర్విగాహేన యోజనాని చతుర్దశ.

ప్ర. అ. వానరాః=వానరులారా! తం శైలమ్=ఆ పర్వతమును, శిరసా=శిరస్సుచేత, విమార్గథ=అన్వేషించండి. దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము గాని, తమ్=ఆ పర్వతమును, అతిక్రమ్య=దాటి, దుర్విగాహేన=ప్రవేశింపశక్యముగాని, అధ్వనా=మార్గముచేత, చతుర్దశ యోజనాని=పదునాలుగు యోజనములు దూరమునందు, సూర్యవాన్నామ=సూర్యవంత మను, పర్వతః=పర్వత మున్నది.

తా. ఓ! వానరులారా! శిరస్సు వంచి ఆ పుష్పితక పర్వతమునకు

నమస్కరించి దానిపై అన్వేషించుడు. ఎదిరింప శక్యము గాని ఆ పర్వతమును దాటి ప్రవేశింప శక్యము గాని పదునాలుగు యోజనముల దూరము వెళ్లిన పిమ్మట సూర్యవంత మను పర్వత మున్నది. 32

మూ. తతస్తమప్యతిక్రమ్య వైద్యుతో నామ పర్వతః, 33
సర్వకామఫలైర్వృక్షైః సర్వకాలమనోహరైః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తమపి=దానిని కూడ, అతిక్రమ్య=దాటి, సర్వకామఫలైః=సమస్తమైన కామము లను ఫలములు గల, సర్వకాలమనోహరైః=సర్వకాలములందు మనోహరములైన, వృక్షైః=వృక్షములతో కూడిన, వైద్యుతో నామ=వైద్యుత మను పేరు గల, పర్వతః=పర్వతమున్నది.

తా. ఆ సూర్యవత్పర్వతమును దాటిన తరువాత సర్వకామములను ఫలించు, అన్ని కాలములందు మనోహరములైన వృక్షములతో కూడిన వైద్యుత మనే పర్వతమున్నది. 33

మూ. తత్ర భుక్త్వా వరార్హాణి మూలాని చ ఫలాని చ, 34
మధూని పీత్వా ముఖ్యాని పరం గచ్ఛత వానరాః.

ప్ర. అ. వానరాః=ఓ! వానరులారా! తత్ర=అక్కడ, వరార్హాణి=శ్రేష్ఠములైన, మూలాని చ=మూలములను, ఫలాని చ=ఫలములను, భుక్త్వా=తిని, ముఖ్యాని=శ్రేష్ఠమైన, మధూని=మధువులను, పీత్వా=త్రాగి, పరమ్=ముందుకు, గచ్ఛత=వెళ్లండి.

తా. ఓ! వానరులారా! ఆ వైద్యుతపర్వతముపై లభించు శ్రేష్ఠములైన మూలములు, ఫలములు తిని ఉత్తమములైన మధువులను త్రాగి, ముందుకు వెళ్ళుడు. 34

మూ. తత్ర నేత్రమనఃకాన్తః కుఞ్జరో నామ పర్వతః, 35
అగస్త్యభవనం యత్ర నిర్మితం విశ్వకర్మణా.

ప్ర. అ. తత్ర=అక్కడ, నేత్రమనఃకాన్తః=నేత్రములకు మనస్సులకు రమ్యమైన, కుఞ్జరో నామ=కుంజర మనుపేరు గల, పర్వతః=పర్వతమున్నది. యత్ర=దేనిమీద, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, అగస్త్యభవనమ్=అగస్త్యుని గృహము, నిర్మితమ్=నిర్మించబడినదో.

తా. అక్కడ నేత్రములను మనస్సును ఆకర్షించు కుంజరమను పర్వత మున్నది. దానిమీదనే విశ్వకర్మ అగస్త్యుని గృహమును నిర్మించెను. 35

మూ. తత్ర యోజనవిస్తారముచ్ఛ్రితం దశయోజనమ్, 36
శరణం కాఞ్చనం దివ్యం నానారత్నవిభూషితమ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, యోజనవిస్తారమ్ = ఒక యోజనము వైశాల్యము కలది, దశయోజనమ్=పదియోజనములు, ఉచ్ఛ్రితమ్=ఎత్తైనది, దివ్యమ్= దివ్యము, నానారత్న విభూషితమ్ = అనేకవిధములైన రత్నములచేత అలంకరింపబడినది అయిన, కాఞ్చనమ్ = బంగారు వికారమైన, శరణమ్=గృహము ఉన్నది.

తా. దివ్యమైన ఆ అగస్త్యుని బంగారు గృహము అనేకవిధములైన రత్నములచేత అలంకరింపబడినదై యోజనము వైశాల్యముతో పది యోజనముల ఎత్తు ఉన్నది. 36

మూ. తత్ర భోగవతీ నామ సర్పాణామాలయః పురీ, 37
విశాలరథ్యా దుర్ధర్షా సర్వతః పరిరక్షితా,
రక్షితా పన్నగైర్ఘోరై స్తీక్ష్ణదంష్ట్రైర్మహావిషైః, 38
సర్పరాజో మహాఘోరో యస్యాం వసతి వాసుకిః.

ప్ర. అ. తత్ర = అక్కడ, విశాలరథ్యా = విశాలములైన వీథులు కలది, దుర్ధర్షా = ఎదిరింప శక్యము గానిది, సర్వతః = నలువైపుల, పరిరక్షితా = రక్షింపబడినది, ఘోరైః= భయంకరములైన, తీక్ష్ణదంష్ట్రైః= తీక్ష్ణములైన కోరలు గల, మహావిషైః = గొప్ప విషము గల, పన్నగైః =సర్పములచేత, రక్షితా = రక్షింపబడినది, సర్పాణామ్ = సర్పములకు , ఆలయః =నివాసమైన, భోగవతీ నామ = భోగవతి అను పేరు గల , పురీ = పట్టణమున్నది. యస్యామ్ = దేనియందు, సర్పరాజః = సర్పరాజైన, మహాఘోరః = చాల భయంకరుడైన, వాసుకిః = వాసుకి, వసతి =నివసించుచున్నాడో.

తా. అక్కడ సర్పములకు నివాసమైన భోగవతి అను నగరమున్నది. విశాలమైన వీథులతో నలు వైపుల రక్షింపబడుచున్న దానిని ఎవ్వరు ఎదిరింపజాలరు. తీక్ష్ణమైన కోరలు, గొప్ప విషము గల భయంకరములైన సర్పములు దానిని రక్షించుచుండును. ఆ నగరములో సర్పరాజు, చాల భయంకరుడు అయిన వాసుకి నివసించుచుండును. 37,38

మూ. నిర్యాయ మార్గితవ్యా చ సా చ భోగవతీ పురీ, 39
తత్ర చానన్తరోద్దేశే యే కేచన సమావృతాః.

ప్ర. అ. సా = ఆ, భోగవతీ పురీ = భోగవతీ నగరము, మార్గితవ్యా = వెదకతగినది. నిర్యాయ = దానిని దాటి వెళ్లి, తత్ర = అక్కడ, సమావృతాః = ఆవరించియున్న, యే కేచన = ఏ యే, అనన్తరోద్దేశాః = సమీపప్రదేశములు గలవో (అవి కూడ అన్వేషించదగినవి.)

తా. ఆ భోగవతీనగరములో అన్వేషించి దాని బయటకు వచ్చి ఆ నగరమును ఆవరించియున్న సమీపప్రదేశము లన్నింటిని వెదకవలెను. 39

మూ. తం చ దేశమతిక్రమ్య మహావృషభసంస్థితిః, 40
పర్వరత్నమయః శ్రీమాన్వృషభో నామ పర్వతః.

ప్ర. అ. తం దేశమ్ = ఆ దేశమును, అతిక్రమ్య = దాటి , ఋషభసంస్థితిః = వృషభము వంటి ఆకారము గలది, సర్వరత్నమయః = సమస్తరత్నములతో నిండినది, శ్రీమాన్ = శోభ గలది, అయిన, ఋషభో నామ = ఋషభ మను పేరుగల, మహాన్ = గొప్ప , పర్వతః = పర్వత మున్నది.

తా. ఆ దేశమును దాటిన పిమ్మట సకలరత్నములతో నిండి శోభించుచున్న, ఋషభ మను మహాపర్వత మున్నది. అది వృషభాకారములో ఉండును. 40

మూ. గోశీర్షకం పద్మకం చ హరిశ్యామం చ చన్దనమ్, 41
దివ్యముత్పద్యతే యత్ర తచ్చైవాగ్నిసమప్రభమ్.

ప్ర. అ. యత్ర = ఏ పర్వతముపైన, గోశీర్షకమ్ =గోశీర్షకము, పద్మకం చ = పద్మకము, హరిశ్యామం చ = హరిశ్యామము అను, చన్దనమ్ = చందనము, అగ్ని సమప్రభమ్ = అగ్నితో సమానమైన కాంతి గల, దివ్యమ్ = దివ్యమైన, తచ్చైవ = ఆ చన్దనము, ఉత్పద్యతే = పుట్టునో.

తా. ఆ పర్వతముమీద గోశీర్షకము, పద్మకము, హరిశ్యామము అను చందనము, అగ్నితో సమానమైన కాంతి గల శ్రేష్ఠమైన చందనము పుట్టును.41

మూ. న తు తచ్చన్దనం దృష్ట్వా స్ప్రష్టవ్యం తు కదాచన, 42
రోహితా నామ గన్ధర్వా ఘోరం రక్షన్తి తద్వనమ్.

ప్ర. అ. తత్ =ఆ, చన్దనమ్ =చందనమును, దృష్ట్వా = చూచి, కదాచన =ఎప్పుడూ, న స్ప్రష్టవ్యం తు =స్పృశింపదగినది కాదు. ఘోరమ్ = భయంకరమైన, తత్ వనమ్ =ఆ వనమును, రోహితా నామ = రోహితు లను పేరు గల, గన్ధర్వాః = గంధర్వులు, రక్షన్తి = రక్షించుచున్నారు.

తా. ఆ చందనమును చూచి దానిని ఎన్నడును స్పృశించరాదు. భయంకరమైన ఆ వనమును రోహితులు అను గంధర్వులు రక్షించుచున్నారు.

మూ. తత్ర గన్ధర్వపతయః పఞ్చ సూర్యసమప్రభాః, 43
శైలూషో గ్రామణీః శిక్షః శుకో బభ్రుస్తథైవ చ,
రవిసోమాగ్నివపుషాం నివాసః పుణ్యకర్మణామ్. 44

ప్ర. అ. తత్ర=అక్కడ, శైలూషః=శైలూషుడు, గ్రామణీః= గ్రామణి, శిక్షః= శిక్షుడు, శుకః =శుకుడు, తథైవ=మరియు, బభ్రుః=బభ్రువు అను,

సూర్యసమప్రభాః= సూర్యునితో సమానమైన కాంతి గల, పఞ్చ=ఐదుగురు, గన్ధర్వపతయః=గంధర్వరాజులు, ఉందురు. రవిసోమాగ్నివపుషామ్=సూర్యచంద్రాగ్నుల వంటి దేహములు గల, పుణ్యకర్మణామ్= పుణ్యకర్మ కలవారికి, నివాసః=నివాసము.

తా. ఆ ఋషభపర్వతముమీద సూర్యునితో సమానమైన కాంతి గల శైలూషుడు, గ్రామణి, శిక్షుడు, శుకుడు, బభ్రువు అను ఐదుగురు గంధర్వరాజులు నివసించుచుందురు. అది సూర్యచంద్రఅగ్నులతో సమానమైన దేహములు గల పుణ్యాత్ములకు నివాసస్థానము. 43,44

మూ. అన్తే పృథివ్యా దుర్ధర్షాస్తతః స్వర్గజితః స్థితాః,
తతః పరం న వః సేవ్యః పితృలోకః సుదారుణః. 45

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పృథివ్యాః=భూమియొక్క, అన్తే=అంతమునందు, దుర్ధర్షా=ఎదిరింప శక్యము గాని, స్వర్గజితః=స్వర్గమును జయించిన వారు, స్థితాః= ఉన్నారు. తతః పరమ్=దాని కవతల, సుదారుణః=చాల భయంకరమైన, పితృలోకః= పితృలోకము, వః=మీకు, సేవ్యః=సేవింపదగినది, న=కాదు.

తా. దాని తరువాత భూమి చివరిభాగమునందు స్వర్గమును సంపాదించిన పుణ్యాత్ము లుందురు. దాని తరువాత వచ్చు భయంకరమైన పితృలోకమునకు మీరు వెళ్లగూడదు. 45

మూ. రాజధానీ యమస్యైషా కష్టేన తమసా వృతా,
ఏతావదేవ యుష్మాభిర్వీరవానరపుఙ్గవాః, 46
శక్యం విచేతుం గన్తుం వా నాతో గతిమతాం గతిః.

ప్ర. అ. వీరవానరపుఙ్గవాః=వీరులైన వానరశ్రేష్ఠులారా! ఏషా=ఈ, యమస్య రాజధానీ =యముని పట్టణము, కష్టేన=కష్టమైన, తమసా=చీకటిచేత, ఆవృతా= కప్పబడియున్నది. యుష్మాభిః=మీచేత, ఏతావదేవ=ఇంతవరకు మాత్రమే, విచేతుమ్= వెదకుటకు గాని, గన్తుం వా=వెళ్లుటకు గాని, శక్యమ్=శక్యము. అతః=అటుపైన, గతిమతామ్=ప్రాణులకు, గతిః=గతి, న=లేదు.

తా. వీరులైన ఓ వానరశ్రేష్ఠులారా! ఆ యముని రాజధాని భయంకరమైన చీకటిచేత ఆవరింపబడియుండును. మీరు అంతవరకే వెళ్లుటకు గాని, వెదకుటకు గాని శక్య మగును. ప్రాణు లెవ్వరు అది దాటి వెళ్లజాలరు.

మూ. సర్వ మేతత్సమాలోక్య యచ్చాన్యదపి దృశ్యతే, 47
గతిం విదిత్వా వైదేహ్యాః సంనివర్తితుమర్హథ.

ప్ర. అ. ఏతత్=దీనిని, సర్వమ్=అంతను, అన్యత్=ఇతరమైన, యచ్చ=ఏది, దృశ్యతే=చూడబడునో, దానిని, సమాలోక్య=వెదకి, వైదేహ్యాః=సీతయొక్క, గతిమ్= గతిని, విదిత్వా=తెలిసికొని, సంనివర్తితుమ్=మరలి వచ్చుటకు, అర్హథ=తగి ఉన్నారు.

తా. ఈ అన్ని ప్రదేశములను ఇంకను అక్కడ కనబడిన ఇతర ప్రదేశములను వెదకి సీత జాడను తెలుసుకొని తిరిగి రండు. 47

మూ. యశ్చ మాసాన్నివృత్తోఽగ్రే దృష్టా సీతేతి వక్ష్యతి, 48
మత్తుల్యవిభవో భోగైః సుఖం స విహరిష్యతి.

ప్ర. అ. యః=ఎవడు, మాసాత్=మాసముకంటె, అగ్రే=ముందుగా, నివృత్తః= మరలి వచ్చినవాడై, సీతా=సీత, దృష్టా=చూడబడినది, ఇతి=అని, వక్ష్యతి=చెప్పగలడో, సః= అతడు, మత్తుల్యవిభవః=నాతో సమానమైన వైభవము కలవాడై, భోగైః=భోగములతో, సుఖమ్ =సుఖముగా, విహరిష్యతి=విహరించగలడు.

తా. మాసము లోపుగా వచ్చి సీత కనబడిన దని చెప్పువాడు నాతో సమానమైన వైభవము పొంది సుఖముగా భోగములు అనుభవించగలడు. 48

మూ. తతః ప్రియతరో నాస్తి మమ ప్రాణాద్విశేషతః, 49
కృతాపరాధో బహుశో మమ బన్ధుర్భవిష్యతి.

ప్ర. అ. తతః=వానికంటే, ప్రియతరః=ఎక్కువ ప్రియమైనవాడు, నాస్తి లేడు. మమ= నాయొక్క, ప్రాణాత్=ప్రాణములకంటె, విశేషతః=అధికముగా, (ప్రియుడు). బహుశః=అనేక పర్యాయములు, కృతాపరాధః=చేయబడిన అపరాధములు కలవాడు కూడ, మమ=నాకు, బన్ధుః =బంధువు, భవిష్యతి=కాగలడు.

తా. నాకు వానికంటె ఎక్కువ ఇష్టమైనవాడు ఉండడు. నా ప్రాణములకంటె కూడ ఎక్కువ ఇష్టు డగును. అనేకపర్యాయములు అపరాధములు చేసినవాడు కూడ నాకు బంధు వగును. 49

మూ. అమితబలపరాక్రమా భవన్తో
విపులగుణేషు కులేషు చ ప్రసూతాః,
మనుజపతిసుతాం యథా లభధ్వం
తదధిగుణం పురుషార్థమారభధ్వమ్. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. భవన్తః=మీరు, అమితబలపరాక్రమాః=అమితమైన బలము పరాక్రమము గలవారు. విపులగుణేషు=అధికమైన గుణములు గల, కులేషు=కులములందు, ప్రసూతాః= పుట్టినారు. మనుజపతిసుతామ్= మహారాజు కుమార్తెయైన సీతను, యథా=ఎట్లు, లభధ్వమ్=పొందెదరో, తదధిగుణమ్= దానికి తగిన, పురుషార్థమ్=పురుషప్రయత్నమును, ఆరభధ్వమ్=ప్రారంభించండి.

తా. మీరు ఉత్తమగుణములు గల కులములలో పుట్టినవారు. అమితమైన

బలపరాక్రమములు కలవారు. సీతాదేవి లభించు విధముగా తగిన పురుష ప్రయత్నమును ప్రారంభించుడు. 50

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

(సుగ్రీవుడు, సుషేణుడు మొదలగువారిని పశ్చిమదిక్కునకు పంపుట)

మూ. అథ ప్రస్థాప్య స హరీన్ సుగ్రీవో దక్షిణాం దిశమ్,
అబ్రవీన్మేఘసఙ్కాశం సుషేణం నామ వానరమ్. 1

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, హరీన్=వానరులను, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును గూర్చి , ప్రస్థాప్య=పంపి, అథ=అటుపిమ్మట, మేఘసఙ్కాశమ్=మేఘముతో సమానుడైన, సుషేణం నామ=సుషేణుడనే పేరు గల, వానరమ్=వానరుని గూర్చి, అబ్రవీత్= పలికెను.

తా. ఆ వానరులను దక్షిణదిక్కునకు పంపించిన పిమ్మట సుగ్రీవుడు మేఘముతో సమానుడైన సుషేణునితో పలికెను. 1

మూ. తారాయాః పితరం రాజా శ్వశురం భీమవిక్రమమ్,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యమభిగమ్య ప్రణమ్య చ. 2

ప్ర. అ. రాజా=సుగ్రీవుడు, తారాయాః=తారయొక్క, పితరమ్=తండ్రి, శ్వశురమ్ =మామగారు అయిన, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గల ఆ సుషేణుని, అభిగమ్య =సమీపించి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి గలవాడై, ప్రణమ్య చ=నమస్కరించి, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు తారకు తండ్రి, తనకు మామగారు అయిన భయంకరమైన పరాక్రమము గల సుషేణుని దగ్గరకు వెళ్లి చేతులు జోడించి నమస్కరించి పలికెను. 2

మూ. మహర్షిపుత్రం మారీచమర్చిష్మన్తం మహాకపిమ్,
వృతం కపివరైః శూరైర్మహేన్ద్రసదృశద్యుతిమ్. 3
బుద్ధివిక్రమసమ్పన్నం వైనతేయసమద్యుతిమ్,
మరీచిపుత్రాన్మారీచానర్చిర్మాల్యాన్ మహాబలాన్, 4
ఋషిపుత్రాంశ్చ తాన్సర్వాన్ ప్రతీచీమాదిశద్దిశమ్.

ప్ర. అ. మహర్షిపుత్రమ్=మహర్షిపుత్రుడు, మారీచమ్=మరీచమహర్షి కుమారుడు, మహాకపిమ్=గొప్పవానరుడు, శూరైః=శూరులైన, కపివరైః=వానరశ్రేష్ఠులతో, వృతమ్ =కూడినవాడు, మహేన్ద్రసదృశద్యుతిమ్=మహేంద్రునితో సమానమైన కాంతి గలవాడు, బుద్ధివిక్రమసంపన్నమ్=బుద్ధిపరాక్రమములతో కూడినవాడు,

వైనతేయసమద్యుతిమ్=గరుత్మంతునితో సమానమైన కాంతి గలవాడు అయిన, అర్చిష్మన్తమ్=అర్చిష్మంతుని, మరీచిపుత్రాన్=మరీచి మహర్షి పుత్రులు, అర్చిర్మాల్యాన్=అర్చిర్మాల్యులనే పేరు గలవారు, మహాబలాన్=గొప్ప బలము గలవారు, ఋషిపుత్రాంశ్చ=ఋషిపుత్రులు అయిన, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, మారీచాన్=మారీచులను, ప్రతీచీం దిశమ్=పశ్చిమదిక్కును గూర్చి, ఆదిశత్=పంపెను.

తా. మరీచిమహర్షి కుమారుడు, శూరులైన వానరశ్రేష్ఠులతో కూడినవాడు, మహేంద్రునితోను, గరుత్మంతునితోను సమానమైన కాంతి గలవాడు, బుద్ధి పరాక్రమములతో కూడినవాడు అయిన అర్చిష్మంతు డనే వానరుని మరీచి మహర్షి పుత్రులు, మహాబలశాలులు అయిన అర్చిమాల్యులను, ఆతని తమ్ములైన సమస్తవానరులను పశ్చిమదిక్కునకు పంపెను. 3-4

మూ. ద్వాభ్యాం శతసహస్రాభ్యాం కపీనాం కపిసత్తమాః, 5
సుషేణప్రముఖా యూయం వైదేహీం పరిమార్గథ.

ప్ర. అ. కపిసత్తమాః=ఓ! వానరశ్రేష్ఠులారా! యూయమ్=మీరు, సుషేణ ప్రముఖాః= సుషేణుడు నాయకుడుగా కలవారై, కపీనామ్=వానరుల యొక్క, ద్వాభ్యామ్=రెండు, శతసహస్రాభ్యామ్ =లక్షలతోగూడి, వైదేహీమ్=సీతను, పరిమార్గథ=వెదకుడు.

తా. ఓ! వానరశ్రేష్ఠులారా! మీరు రెండులక్షల వానరులతో కలసి వెళ్లి, సీతకొరకు వెదకుడు. సుషేణుడు మీకు నాయకుడుగా ఉండును. 5

మూ. సౌరాష్ట్రాన్ సహబాహ్లీకాంశ్చన్ద్రచిత్రాంస్తథైవ చ, 6
స్ఫీతాన్ జనపదాన్రమ్యాన్ విపులాని పురాణి చ,
పుంనాగగహనం కుక్షిం బకులోద్దాళకాకులమ్, 7
తథా కేతకఖణ్డాంశ్చ మార్గధ్వం హరిపుఙ్గవాః.

ప్ర. అ. హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులారా! సౌరాష్ట్రాన్=సౌరాష్ట్రదేశమును, తథైవ చ =మరియు, సహబాహ్లీకాన్=బాహ్లీకదేశముతో కూడిన, చన్ద్రచిత్రాన్ = చంద్రచిత్రదేశమును, స్ఫీతాన్=విశాలమైన, రమ్యాన్=సుందరమైన, జనపదాన్ =గ్రామములను, విపులాని=విశాలములైన, పురాణి చ=పట్టణములను, పుంనాగగహనమ్ =పుంనాగవనమును, బకులోద్దాలకాకులమ్=వకుళవృక్షములతోను, ఉద్దాలక వృక్షములతోను నిండిన, కుక్షిమ్=మధ్యప్రదేశమును, తథా=మరియు, కేతకఖణ్డాంశ్చ=కేతక వనములను, మార్గధ్వమ్=వెదకుడు.

తా. ఓ! వానరశ్రేష్ఠులారా! సౌరాష్ట్ర - బాహ్లీక - చంద్ర చిత్ర దేశములను, విశాలములు, సుందరములు అయిన గ్రామములను, విశాలములైన ?గరములను, పున్నాగవనమును, వకుళవృక్షములతోను, ఉద్దాలకవృక్షములతోను

నిండిన మధ్యదేశమును, కేతకవనములను వెదకుడు. 6,7

మూ. ప్రత్యక్స్రోతోవహాశ్చైవ నద్యః శీతజలాః శివాః, 8
తాపసానామరణ్యాని కాన్తారగిరయశ్చ యే,
తత్ర స్థలీర్మరుప్రాయా అత్యుచ్చశిశిరాః శిలాః. 9
గిరిజాలావృతాం దుర్గాం మార్గిత్వా పశ్చిమాం దిశమ్,
తతః పశ్చిమమాగమ్య సముద్రం ద్రష్టుమర్హథ. 10
తిమినక్రాకులజలం గత్వా ద్రక్ష్యథ వానరాః.

ప్ర. అ. వానరాః= ఓ! వానరులారా! ప్రత్యక్స్రోతోవహాః=పశ్చిమముగా ప్రవహించు, శీతజలాః =చల్లని జలము గల, శివాః=పుణ్యమైన, నద్యశ్చైవ=నదులు, తాపసానామ్= మహర్షులయొక్క, అరణ్యాని=అరణ్యములు, యే=ఏ, కాన్తారగిరయశ్చ=అరణ్యములలోని పర్వతములు ఉన్నవో, వాటిని, తత్ర=అక్కడ, మరుప్రాయాః =అధికముగా మరువులు గల, స్థలీః=భూములను, అత్యుచ్చశిశిరాః=చాలా ఎత్తైన చల్లని, శిలాః=శిలలను, గిరిజాలావృతామ్=పర్వతసముదాయములచేత ఆవరింపబడి యున్న, దుర్గామ్= ప్రవేశింప శక్యము కాని, పశ్చిమాం దిశమ్=పశ్చిమదిక్కును, మార్గిత్వా=వెదకి, తతః= అటుపిమ్మట, పశ్చిమం సముద్రమ్=పశ్చిమ సముద్రమును, ఆగమ్య=చేరి, ద్రష్టుమ్= చూచుటకు, అర్హథ=తగి యున్నారు. గత్వా=వెళ్లి, తిమినక్రాకులజలమ్=తిములతోను, మొసళ్లతోను వ్యాకులమైన జలము గల సముద్రమును, ద్రక్ష్యథ=చూడగలరు.

తా. వానరులారా! చల్లని మంగళకరమైన జలముతో పశ్చిమదిశగా ప్రవహించు నదులను, మునుల ఆశ్రమములను, అరణ్యములలోని పర్వతములను, అక్కడ ఉన్న మరుభూములను, చాల ఎత్తుగా చల్లగా ఉన్న శిలలను, పర్వతసముదాయముచే ఆవృతమై ఉన్న ప్రవేశించుటకు కష్టమైన పశ్చిమదిక్కును వెదకి తిములతోను, మొసళ్లతోను నిండియున్న పశ్చిమసముద్రమునకు వెళ్లుడు.

మూ. తతః కేతకఖణ్డేషు తమాలగహనేషు చ, 11
కపయో విహరిష్యన్తి నారికేళవనేషు చ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కపయః=వానరులు, కేతకఖణ్డేషు= మొగలిచెట్లగుంపులయందు, తమాలగహనేషు చ=తమాలవనములందు, నారికేళవనేషు చ=కొబ్బరి తోటలలోను, విహరిష్యన్తి=విహరించగలరు.

తా. పిమ్మట మీరు మొగలితోపులలోను, తమాలవనములలోను, కొబ్బరితోటలలోను విహరింపుడు. 11

మూ. తత్ర సీతాం చ మార్గధ్వం నిలయం రావణస్య చ, 12
వేలాతలనివిష్టేషు పర్వతేషు వనేషు చ,
మురచీపత్తనం చైవ రమ్యం చైవ జటాపురమ్. 13

అవన్తీమఙ్గలేపాం చ తథా చాలక్షితం వనమ్,
రాష్ట్రాని చ విశాలాని పత్తనాని తతస్తతః. 14

ప్ర. అ. తత్ర=అక్కడ, వేలాతలనివిష్టేషు=సముద్రతీరమునందున్న, పర్వతేషు= పర్వతములయందు, వనేషు చ=వనములయందు, సీతాం చ=సీతను, రావణస్య=రావణునియొక్క, నిలయం చ=స్థానమును, మార్గధ్వమ్=వెదకుడు. మురచీపత్తనం చైవ=మురచీపత్తనమును, రమ్యమ్=సుందరమైన, జటాపురం చైవ=జటాపురమును, అవన్తీమ్=అవంతిని, అఙ్గలేపాం చ=అంగలేపను, తథా=మరియు, అలక్షితమ్=అలక్షిత మను, వనమ్=వనమును, తతస్తతః=అక్కడక్కడ ఉన్న, రాష్ట్రాని చ=రాష్ట్రములను, విశాలాని=విశాలములైన, పత్తనాని=పట్టణములను వెదకుడు.

తా. అక్కడ సముద్రతీరమునందున్న పర్వతములయందు, వనములయందు, రమ్యమైన మురచీపత్తన - జటాపుర - అవంతీ - అంగలేపాపురములలోను, అలక్షితవనములోను, అక్కడ విశాలములైన రాష్ట్రములలోను, పట్టణములలోను సీతను, రావణుని స్థానమును వెదకుడు. 12-14

మూ. సిన్ధుసాగరయోశ్చైవ సఙ్గమే తత్ర పర్వతః,
మహాన్ సోమగిరిర్నామ శతశృఙ్గో మహాద్రుమః. 15

ప్ర. అ. సిన్ధుసాగరయోః=సింధునదీసముద్రములయొక్క, సఙ్గమే=సంగమమునందు, తత్ర=అక్కడ, సోమగిరిర్నామ=సోమగిరి అను పేరు గల, శతశృఙ్గః=వంద శిఖరములు గల, మహాద్రుమః=పెద్ద చెట్లు గల, మహాన్ పర్వతః=పెద్ద పర్వతము,(ఉన్నది).

తా. అక్కడ సింధుసాగరముల సంగమస్థానమునందు నూరు శిఖరములు గల మహావృక్షములతో నిండిన సోమగిరి అను ఒక పెద్ద పర్వత మున్నది.15

మూ. తత్ర ప్రస్థేషు రమ్యేషు సింహాః పక్షగమాః స్థితాః,
తిమిమత్స్యగజాంశ్చైవ నీడాన్యారోపయన్తి తే. 16

ప్ర. అ. తత్ర=అక్కడ, రమ్యేషు=సుందరములైన, ప్రస్థేషు=చరియలయందు, పక్షగమాః=రెక్కలతో ఎగురు, సింహాః=సింహములు, స్థితాః=ఉన్నవి. తే=అవి, తిమిమత్స్యగజాంశ్చైవ=తిములను, మత్స్యములను, గజములను, నీడాని=తమగూళ్లను, ఆరోపయన్తి=పొందించుచున్నవి.

తా. అక్కడ రమ్యములైన చరియలమీద రెక్కలతో ఎగురు సింహములుండును. అవి తిములను, మత్స్యములను, గజములను పట్టి తమ గూళ్లకు చేర్చుచుండును. 16

మూ. తాని నీడాని సింహానాం గిరిశృఙ్గగతాశ్చ యే,
దృప్తాస్తృప్తాశ్చ మాతఙ్గాస్తోయదస్వననిస్వనాః, 17
విచరన్తి విశాలేఽస్మింస్తోయపూర్ణే సమన్తతః

ప్ర. అ. గిరిశృఙ్గగతాః=పర్వతశిఖరములయందున్న, తోయదస్వననిస్వనాః=మేఖధ్వని వంటి ధ్వని గల, దృప్తాః=గర్వించినవి, తృప్తాశ్చ=తృప్తిచెందినవి అయిన, యే=ఏ, మాతఙ్గాః= ఏనుగులు కలవో అవి, సమన్తతః=నలువైపుల, తోయపూర్ణే=నీటితో నిండిన, అస్మిన్=ఈ, విశాలే=విశాలమైనప్రదేశమునందు, తాని=ఆ, సింహానామ్=సింహములయొక్క, నీడాని=నివాసస్థానములను,(స్థానముల సమీపమునందు) విచరన్తి=సంచరించుచుండును.

తా. నలువైపుల నీటితో నిండిన ఈ విశాలప్రదేశములో ఉన్న సింహముల నివాసస్థానముల దగ్గర పర్వతశిఖరములందు నివసించునవి, ఉరుముల వంటి ఘీంకారములు గలవి, తృప్తిచెంది గర్వించి ఉన్నవి అయిన ఏనుగులు సంచరించుచుండును. 17

మూ. తత్ర శృఙ్గం దివస్పర్శం కాఞ్చనం చిత్రపాదపమ్, 18
సర్వమాశు విచేతవ్యం కపిభిః కామరూపిభిః.

ప్ర. అ. తత్ర= అక్కడ, దివస్పర్శమ్ = ఆకాశమును స్పృశించునది, చిత్రపాదపమ్ =చిత్రమైన వృక్షములు గలది, కాఞ్చనమ్ = బంగారము వికారము అయిన, శృఙ్గమ్ = శిఖరము, సర్వమ్ =అంతయు, కామరూపిభిః = స్వేచ్ఛారూపము గల, కపిభిః = వానరులచేత, ఆశు =శీఘ్రముగా, విచేతవ్యమ్ =వెదకతగినది.

తా. కామరూపులైన వానరులు ఆకాశమును స్పృశించుచున్న చిత్రమైన వృక్షములు గల దాని బంగారు శిఖరమును అంతను శీఘ్రముగా వెదకవలెను.18

మూ. కోటిం తత్ర సముద్రే తు కాఞ్చనీం శతయోజనామ్, 19
దుర్దర్శాం పారియాత్రస్య గత్వా ద్రక్ష్యథ వానరాః.

ప్ర. అ. వానరాః= వానరులారా! తత్ర = అచటికి , గత్వా = వెళ్లి, సముద్రే తు =సముద్రమునందు , పారియాత్రస్య = పారియాత్ర పర్వతముయొక్క, శతయోజనామ్ = నూరుయోజనములు గల, కాఞ్చనీమ్ = బంగారు వికారమైన, దుర్దర్శామ్ = చూచుటకు శక్యము గాని, కోటిమ్ =అగ్రభాగమును, ద్రక్ష్యథ = చూడగలరు.

తా. వానరులారా! మీరు అచటికి వెళ్లి సముద్రములో ఉన్న పారియాత్ర పర్వతముయొక్క, నూరు యోజనముల బంగారు అగ్రభాగమును చూడగలరు. అది మిరిమిట్లు గొల్పుచు చూచుటకు కష్టముగా నుండును. 19

మూ. కోట్యస్తత్ర చతుర్వింశద్గన్ధర్వాణాం తపస్వినామ్, 20
వసన్త్యగ్నినికాశానాం ఘోరాణాం కామరూపిణామ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, తపస్వినామ్ = తపశ్శాలులు, అగ్నినికాశానామ్ = అగ్నితో సమానులు; ఘోరాణామ్ = భయంకరులు, కామరూపిణామ్ = స్వేచ్ఛారూపవంతులు అయిన, గన్ధర్వాణామ్ = గంధర్వులయొక్క, చతుర్వింశత్ = ఇరువదినాలుగు, కోట్యః =కోటులు, నివసన్తి = నివసించుచున్నారు.

తా. ఆ పారియాత్రపర్వతశిఖరమునందు, అగ్నితో సమానులు, భయంకరులు, స్వేచ్ఛారూపము గలవారు, తపశ్శాలులు అయిన ఇరువదినాలుగు కోట్ల గంధర్వులు నివసించుచున్నారు. 20

మూ. పావకార్చిఃప్రతీకాశాః సమవేతాః సమన్తతః, 21
నాత్యాసాదయితవ్యాస్తే వానరైర్భీమవిక్రమైః.

ప్ర. అ. సమన్తతః = నలువైపుల, సమవేతాః = కలసియున్న, పావకార్చిః ప్రతీకాశాః= అగ్నిజ్వాలలతో సమానులైన, తే = వారు, భీమవిక్రమైః = భయంకరమైన పరాక్రమము గల, వానరైః = వానరులచేత, నాత్యాసాదయితవ్యాః = సమీపింప దగినవారు కారు.

తా. నలు మూలల వ్యాపించి ఉన్న అగ్నిజ్వాలలతో సమానులైన వారి దగ్గరకు భయంకరమైన పరాక్రమము గలవారైనను మీరు ఎవ్వరూ వెళ్లకూడదు.21

మూ. నాదేయం చ ఫలం తస్మాద్దేశాత్కిఞ్చిత్ప్లవఙ్గమైః, 22
దురాసదా హి తే వీరాః సత్త్వవన్తో మహాబలాః,
ఫలమూలాని తే తత్ర రక్షన్తే భీమవిక్రమాః. 23

ప్ర. అ. తస్మాత్ దేశాత్=ఆ ప్రదేశమునుండి, ప్లవఙ్గమైః=వానరులచేత, ఫలమ్= ఫలము, కిఞ్చిత్=ఏదియు, నాదేయమ్=గ్రహింపదగినది కాదు. సత్త్వవన్తః=బుద్ధిబలము కలవారు, మహాబలాః=గొప్ప బలము కలవారు అయిన, తే వీరాః=ఆ వీరులు, దురాసదాః హి=ఎదిరింప శక్యము గానివారు కదా! భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, తే=వారు, తత్ర=అక్కడ, ఫలమూలాని=ఫలములను, మూలములను, రక్షన్తే=రక్షించుచున్నారు.

తా. వానరు లెవ్వరు ఆ ప్రదేశమునందు ఏ ఫలములను గ్రహించకూడదు. మహాబలవంతులైన ఆ వీరులు ఎదిరింప శక్యము గానివారు. భయంకరమైన పరాక్రమము గలవారు. అక్కడ ఉన్న ఫలములను రక్షించుచుందురు. 22,23

మూ. తత్ర యత్నశ్చ కర్తవ్యో మార్గితవ్యా చ జానకీ,
న హి తేభ్యో భయం కిఞ్చిత్కపిత్వమనువర్తతామ్. 24

ప్ర. అ. తత్ర=అక్కడ, యత్నశ్చ=ప్రయత్నము, కర్తవ్యః=చేయదగినది. జానకీ= జానకి, మార్గితవ్యా చ=వెదకతగినది. కపిత్వమ్=వానరత్వమును, అనువర్తతామ్= అనుసరించువారికి, తేభ్యః=వారివలన, భయమ్=భయము, కిఞ్చిత్=కొంచెము కూడ, న హి=లేదుకదా.

తా. అక్కడ మీరు ప్రయత్నపూర్వకముగా సీతను వెదకవలెను. వానరులుగా ప్రవర్తించువారికి అక్కడ గంధర్వులనుండి ఏ మాత్రము భయము లేదు. 24

మూ. తత్ర వైదూర్యవర్ణాభో వజ్రసంస్థానసంస్థితః,
నానాద్రుమలతాకీర్ణో వజ్రో నామ మహాగిరిః. 25
శ్రీమాన్ సముదితస్తత్ర యోజనానాం శతం సమమ్,
గుహాస్తత్ర విచేతవ్యాః ప్రయత్నేన ప్లవఙ్గమాః. 26

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా! తత్ర=అక్కడ, వైదూర్యవర్ణాభః=వైదూర్యమణుల వంటి వర్ణము కాంతి గల, వజ్రసంస్థానసంస్థితః=వజ్రముయొక్క ఆకారముతో ఉన్న, నానాద్రుమలతాకీర్ణః=అనేకవిధములైన వృక్షములతోను,లతలతోను వ్యాప్తమైన,శ్రీమాన్=శోభ గల, వజ్రో నామ=వజ్ర మను పేరుగల, మహాగిరిః=మహాపర్వతము,తత్ర=అక్కడ, యోజనానాం శతమ్=నూరుయోజనములు, సమమ్=సమానముగా, సముదితః=ఎత్తైనది. తత్ర=దానియందు, గుహాః=గుహలు, ప్రయత్నేన=ప్రయత్నముచేత, విచేతవ్యాః= అన్వేషింపదగినవి.

తా. ఓ! వానరులారా! అక్కడ వైదూర్యమణివంటి కాంతి గల వజ్రము ఆకారములో నున్న నూరు యోజనముల ఎత్తు గల, వజ్ర మను, శోభాయుక్తమైన మహాపర్వత మున్నది. అది అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను నిండి ఉండును. దాని గుహలను ప్రయత్నపూర్వకముగా అన్వేషించవలెను. 25,26

మూ. చతుర్భాగే సముద్రస్య చక్రవాన్నామ పర్వతః,
తత్ర చక్రం సహస్రారం నిర్మితం విశ్వకర్మణా. 27

ప్ర. అ. సముద్రస్య=సముద్రముయొక్క, చతుర్భాగే=నాలుగవ భాగమునందు, చక్రవాన్ నామ=చక్రవంత మను పేరు గల, పర్వతః=పర్వత మున్నది. తత్ర=దానిమీద, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, సహస్రారమ్=వేయి అంచులు గల, చక్రమ్=చక్రము, నిర్మితమ్=నిర్మించబడినది.

తా. సముద్రము నాల్గవ వంతు భాగములో చక్రవంత మను పర్వత మున్నది. దానిమీద విశ్వకర్మ వేయి అంచులు గల చక్రమును నిర్మించెను. 27

మూ. తత్ర పఞ్చజనం హత్వా హయగ్రీవం చ దానవమ్,
ఆజహార తతశ్చక్రం శఙ్ఖం చ పురుషోత్తమః. 28

ప్ర. అ. తత్ర=అక్కడ, పురుషోత్తమః=విష్ణువు, హయగ్రీవమ్=హయగ్రీవు

డను, దానవమ్=దానవుని, హత్వా=చంపి, తతః=వానినుండి, చక్రమ్=చక్రమును, పఞ్చజనమ్=పఞ్చజనుని చంపి, శఙ్ఖం చ=శంఖమును, ఆజహార=గ్రహించెను.

తా. అక్కడ శ్రీమహావిష్ణువు ఆ చక్రమును రక్షించుచున్న హయగ్రీవుడు అను దానవుని చంపి వానినుండి చక్రమును, పంచజనుని చంపి వానినుండి శంఖమును గ్రహించెను. 28

మూ. తత్ర సానుషు రమ్యేషు విశాలాసు గుహాసు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 29

ప్ర. అ. తత్ర=అక్కడ, రమ్యేషు=రమ్యములైన, సానుషు=చరియలయందు, విశాలాసు=విశాలములైన, గుహాసు చ=గుహలలోను, రావణః=రావణుడు, వైదేహ్యా సహా=సీతతో కూడ, తతస్తతః=అక్కడక్కడ, మార్గితవ్యః=వెదకతగినవాడు.

తా. అక్కడ అందమైన చరియలయందు, విశాలములైన గుహలయందు, అన్ని ప్రదేశములయందు, రావణుణ్ణి సీతను వెదకుడు. 29

మూ. యోజనాని చతుష్షష్టిర్వరాహో నామ పర్వతః,
సువర్ణశృఙ్గః సుమహానగాధే వరుణాలయే. 30

ప్ర. అ. అగాధే=చాల లోతైన, వరుణాలయే=సముద్రమునందు, చతుష్షష్టిః=అరువదినాలుగు, యోజనాని=యోజనములు, సువర్ణశృఙ్గః=బంగారు శిఖరములు గల, వరాహో నామ=వరాహ మను పేరు గల, పర్వతః=పర్వత మున్నది.

తా. చాల లోతైన సముద్రములో అరువదినాలుగు యోజనముల దూరము వ్యాపించి బంగారు శిఖరములు గల వరాహ మను పర్వత మున్నది. 30

మూ. తత్ర ప్రాగ్జ్యోతిషం నామ జాతరూపమయం పురమ్,
తస్మిన్వసతి దుష్టాత్మా నరకో నామ దానవః. 31

ప్ర. అ. తత్ర=అక్కడ, పాగ్జ్యోతిషం నామ=ప్రాగ్జ్యోతిష మను, జాతరూపమయమ్= బంగారువికారమైన, పురమ్=పట్టణమున్నది. తస్మిన్=దానియందు, దుష్టాత్మా= దుష్టాత్ముడైన, నరకో నామ=నరకు డను పేరు గల, దానవః=దానవుడు, వసతి= నివసించుచున్నాడు.

తా. అక్కడ ప్రాగ్జ్యోతిష మను బంగారు పట్టణ మున్నది. ఆ పట్టణములో నరకు డను దుష్టబుద్ధి గల దానవుడు నివసించుచున్నాడు. 31

మూ. తత్ర సానుషు రమ్యేషు విశాలాసు గుహాసు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 32

ప్ర. అ. చూ. 29వ శ్లోకం.

మూ. తమతిక్రమ్య శైలేన్ద్రం కాఞ్చనాన్తరనిర్దరమ్,
పర్వతః సర్వసౌవర్ణో ధారాప్రస్రవణాయుతః. 33

ప్ర. అ. తమ్=ఆ, కాఞ్చనాన్తరనిర్దరమ్=బంగారు లోపలి గుహలు గల, తం శైలేన్ద్రమ్= ఆ వరాహ పర్వతమును, అతిక్రమ్య=దాటి, ధారాప్రస్రవణా యుతః=జలధారలతోను, సెలయేళ్లతోను కూడిన, సర్వసౌవర్ణః=సర్వసౌవర్ణ మను, పర్వతః=పర్వత మున్నది.

తా. బంగారు గుహామధ్యప్రదేశములు గల ఆ వరాహపర్వతమును దాటిన పిమ్మట జలపాతములతోను, సెలయేళ్లతోను నిండిన సర్వసౌవర్ణ మను పర్వత మున్నది. 33

మూ. తం గజాశ్చ వరాహాశ్చ సింహా వ్యాఘ్రాశ్చ సర్వతః,
అభిగర్జన్తి సతతం తేన శబ్దేన దర్పితాః. 34

ప్ర. అ. సర్వతః=నలు వైపుల, గజాశ్చ=ఏనుగులు, వరాహాశ్చ=వరా హములు, సింహాః=సింహములు, వ్యాఘ్రాశ్చ=వ్యాఘ్రములు, తేన=ఆ, శబ్దేన= ప్రతిధ్వనిచేత,దర్పితాః=గర్వించినవై, తమ్=ఆ పర్వతమును, సతతమ్=ఎల్లప్పుడు, అభిగర్జన్తి=అభిముఖముగా గర్జించుచుండును.

తా. గజములు, వరాహములు, సింహములు, పెద్దపులులు, ఆ పర్వత మునకు అభిముఖముగా నలువైపులా నిలిచి ప్రతిధ్వనిచేత గర్వించినవై ఎల్లప్పుడు గర్జించుచుండును. 34

మూ. యస్మిన్హరిహయః శ్రీమాన్మహేన్ద్రః పాకశాసనః,
అభిషిక్తః సురై రాజా మేఘో నామ స పర్వతః. 35

ప్ర. అ. హరిహయః=ఆకుపచ్చని గుఱ్ఱములు గల, శ్రీమాన్=ఐశ్వ ర్యసంపన్నుడైన, పాకశాసనః=పాకాసురుని చంపిన, మహేన్ద్రః=మహేంద్రుడు, యస్మిన్=ఏ పర్వతము మీద, సురైః=దేవతలచేత, రాజా=రాజుగా, అభి షిక్తః=అభిషేకించబడినాడో, సః=అట్టి, మేఘో నామ=మేఘ మను పేరు గల, పర్వతః=పర్వతమున్నది.

తా. అక్కడ మేఘ మను పర్వతమున్నది. దానిపైననే ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు, శ్రీమంతుడు, పాకాసురుని సంహరించినవాడు, అయిన మహేంద్రునకు దేవతలు రాజ్యాభిషేకము చేసిరి. 35

మూ. తమతిక్రమ్య శైలేన్ద్రం మహేన్ద్రపరిపాలితమ్,
షష్టిం గిరిసహస్రాణి కాఞ్చనాని గమిష్యథ. 36
తరుణాదిత్యవర్ణాని భ్రాజమానాని సర్వతః,
జాతరూపమయైర్వృక్షైః శోభితాని సుపుష్పితైః. 37

ప్ర. అ. మహేన్ద్రపరిపాలితమ్=మహేంద్రునిచేత పాలింపబడిన, తమ్=ఆ, శైలేన్ద్రమ్= పర్వతమును, అతిక్రమ్య=దాటి, తరుణాదిత్యవర్ణాని=బాలసూర్యుని వంటి కాంతి గలవి, సర్వతః=నలువైపుల, భ్రాజమానాని=ప్రకాశించుచున్నవి, సుపుష్పితైః=బాగా పుష్పించిన, జాతరూపమయైః=బంగారు వికారమైన, వృక్షైః=వృక్షములచేత, శోభితాని=ప్రకాశింపచేయబడినవి, కాఞ్చనాని=బంగారువికారమైన, షష్టిమ్=అరువది, గిరిసహస్రాణి=పర్వతముల సహస్రములను గూర్చి, గమిష్యథ=వెళ్లగలరు.

తా. మీరు మహేంద్రుడు పాలించుచున్న ఆ మేఘపర్వతము దాటి అరువదివేల బంగారు పర్వతములకు వెళ్లుడు. అన్ని వైపుల ఆ పర్వతములు బాలసూర్యుని వంటి కాంతితో ప్రకాశించుచుండును. బాగుగా పుష్పించిన బంగారు వృక్షములతో శోభించుచుండును. 36,37

మూ. తేషాం మధ్యే స్థితో రాజా మేరురుత్తమపర్వతః,
ఆదిత్యేన ప్రసన్నేన శైలో దత్తవరః పురా. 38

ప్ర. అ. తేషామ్ = ఆ పర్వతముల యొక్క, మధ్యే = మధ్యయందు, రాజా = రాజైన, మేరుః =మేరువు అను, ఉత్తమపర్వతః = శ్రేష్ఠమైన పర్వతము, స్థితః = ఉన్నది. పురా = పూర్వమునందు, శైలః = ఆ పర్వతము, ప్రసన్నేన = ప్రసన్నుడైన, ఆదిత్యేన = సూర్యునిచేత, దత్తవరః =ఇవ్వబడిన వరములు గలది.

తా. ఆ పర్వతముల మధ్య పర్వతరాజైన మేరుపర్వత మను ఉత్తమమైన పర్వత మున్నది. పూర్వము సూర్యుడు ప్రసన్నుడై ఆ పర్వతమునకు వరమును ఇచ్చెను. 38

మూ. తేనైవముక్తః శైలేన్ద్రః సర్వ ఏవ త్వదాశ్రయాః,
మత్ప్రసాదాద్భవిష్యన్తి దివా రాత్రౌ చ కాఞ్చనాః. 39
త్వయి యే చాపి వత్స్యన్తి దేవగన్ధర్వదానవాః,
తే భవిష్యన్తి రక్తాశ్చ ప్రభయా కాఞ్చనప్రభాః. 40

ప్ర. అ. శైలేన్ద్రః = ఆ పర్వతరాజు, తేన = ఆ సూర్యునిచేత, ఏవమ్ =ఇట్లు, ఉక్తః =పలుకబడెను. త్వదాశ్రయాః =నీవు ఆశ్రయముగా గల, సర్వే ఏవ = అందరు, దివా = పగలు, రాత్రౌ చ=రాత్రియందు, మత్ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, కాఞ్చనాః = బంగారు వికారమైనవి, భవిష్యన్తి = కాగలవు. యే =ఏ, దేవగన్ధర్వదానవాః = దేవతలు, గంధర్వులు, దానవులు, త్వయి = నీపై, వత్స్యన్తి =నివసించగలరో, తే చాపి = వారు కూడ, ప్రభయా= కాంతిచేత, రక్తాశ్చ = ఎఱ్ఱనివారుగాను, కాఞ్చనప్రభాః =బంగారు కాంతి గలవారుగాను, భవిష్యన్తి = కాగలరు.

తా. సూర్యుడు మేరు పర్వతముతో ఇట్లు చెప్పెను. “నీమీద ఉన్న ప్రతి వస్తువు నా అనుగ్రహమువలన రాత్రింబవళ్లు బంగారు వర్ణము గలది

అగును. నీపై నివసించు దేవగంధర్వదానవుల వర్ణము ఎట్టిగాను, బంగారము వర్ణము వలెను ఉండును." 39,40

మూ. విశ్వే దేవాశ్చ వసవో మరుతశ్చ దివౌకసః,
ఆగత్య పశ్చిమాం సన్ధ్యాం మేరుముత్తమపర్వతమ్. 41
ఆదిత్యముపతిష్ఠన్తి తైశ్చ సూర్యోఽభిపూజితః,
అదృశ్యః సర్వభూతానామస్తం గచ్ఛతి పర్వతమ్. 42

ప్ర. అ. విశ్వేదేవాశ్చ = విశ్వేదేవతలు, వసవః =వసువులు, మరుతశ్చ = మరుత్తులు, దివౌకసః = ఇతరదేవతలు, పశ్చిమాం సన్ధ్యామ్ = పశ్చిమ సంధ్యాకాలమునందు, ఉత్తమపర్వతమ్ = ఉత్తమపర్వతమైన, మేరుమ్ = ఆ మేరువును, ఆగత్య = చేరి, ఆదిత్యమ్ = సూర్యుని, ఉపతిష్ఠన్తి = సేవింతురు. సూర్యః = సూర్యుడు, తైః = వారిచేత, అభిపూజితః = పూజింపబడినవాడై , సర్వభూతానామ్= సమస్తప్రాణులకు, అదృశ్యః= కనబడనివాడై, అస్తం పర్వతమ్ = అస్తాద్రినిగూర్చి, గచ్ఛతి =వెళ్లును.

తా. విశ్వేదేవతలు, అష్టవస్తువులు, సప్తమరుత్తులు, ఇతరదేవతలు, పశ్చిమసంధ్యాసమయమునందు ఉత్తమపర్వతమైన ఆ మేరువును చేరి సూర్యుని సేవింతురు. సూర్యుడు వారిచేత పూజింపబడి సకలప్రాణులకు కనబడకుండు నట్లు అస్తాద్రికి వెళ్లును. 41,42

మూ. యోజనానాం సహస్రాణి దశ తాని దివాకరః,
ముహూర్తార్ధేన తం శీఘ్రమభియాతి శిలోచ్చయమ్. 43

ప్ర. అ. దివాకరః = సూర్యుడు, ముహూర్తార్ధేన = అర్ధముహూర్త కాలములో, యోజనానామ్ = యోజనములయొక్క, తాని = ఆ, దశసహస్రాణి = పదివేలు, శిలోచ్చయమ్ =ఆ పర్వతమునుగూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, అభియాతి =వెళ్లును.

తా. సూర్యుడు ఆ మేరువునుండి పదివేలయోజనముల దూరములో ఉన్న ఆ అస్తాద్రిని అర్ధముహూర్తకాలములో శీఘ్రముగా చేరును. 43

మూ. శృఙ్గే తస్య మహద్దివ్యం భవనం సూర్యసన్నిభమ్,
ప్రాసాదగణసంబాధం విహితం విశ్వకర్మణా. 44

ప్ర. అ. తస్య = ఆ అస్తాద్రియొక్క, శృఙ్గే = శిఖరమునందు, ప్రాసాదగణసంబాధమ్ = మేడల సముదాయముల చేత ఇరుకుగా ఉన్న, సూర్యసన్నిభమ్ = సూర్యునితో సమానమైన, మహత్ = గొప్పదైన, దివ్యమ్ = శ్రేష్ఠమైన, భవనమ్ = భవనము, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, విహితమ్ = నిర్మింపబడినది.

తా. విశ్వకర్మ దాని శిఖరము మీద సూర్యుని వలె ప్రకాశించుచున్న దివ్యమైన మహాభవనమును నిర్మించెను. అది ప్రాసాదముల సముదాయములతో నిండి యుండును. 44

మూ. శోభితం తరుభిశ్చిత్రైర్నానాపక్షిసమాకులైః,
నికేతం పాశహస్తస్య వరుణస్య మహాత్మనః. 45

ప్ర. అ. చిత్రైః =చిత్రములైన, నానాపక్షిసమాకులైః = అనేక పక్షులతో వ్యాకులముగా నున్న, తరుభిః = వృక్షములచేత, శోభితమ్ = ప్రకాశింపచేయబడిన, మహాత్మనః = మహాత్ముడైన , పాశహస్తస్య = పాశము హస్తమునందు గల, వరుణస్య =వరుణునియొక్క, నికేతమ్ = నివాసము.

తా. అనేకవిధములైన పక్షులతో నిండిన విచిత్రములైన వృక్షములతో ప్రకాశించుచున్న ఆ దివ్యభవనము పాశము హస్తమునందు గల మహాత్ముడైన వరుణుని నివాసము. 45

మూ. అన్తరా మేరుమస్తం చ తాలో దశశిరా మహాన్,
జాతరూపమయః శ్రీమాన్భ్రాజతే చిత్రవేదికః. 46

ప్ర. అ. మేరుమ్ = మేరుపర్వతమునకు, అస్తం చ = అస్త్రాద్రికి , అన్తరా = మధ్య, దశశిరాః = పది తలలు కలది, జాతరూపమయః = బంగారు వికారము, శ్రీమాన్ = శోభాయుక్తము, చిత్రవేదికః = చిత్రమైన వేదికలు గలది, అయిన, మహాన్ = గొప్ప, తాలః = తాళవృక్షము, భ్రాజతే = ప్రకాశించుచున్నది.

తా. ఆ మేరుఅస్త్రాద్రుల మధ్య పది తలలు గల పెద్ద బంగారు తాటి చెట్టు ఉన్నది. దాని చుట్టూ ఉన్న వేదిక చిత్రముగా నుండును. 46

మూ. తేషు సర్వేషు దుర్గేషు సరస్సు చ సరిత్సు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తత స్తతః. 47

ప్ర. అ. సర్వేషు = సమస్తమైన, తేషు దుర్గేషు = ఆ దుర్గములయందు, సరస్సు చ = సరస్సులయందు, సరిత్సు చ = నదులయందు, తతస్తతః = ఆ యా ప్రదేశములందు, వైదేహ్యా సహ = సీతతో కూడ, రావణః = రావణుడు, మార్గితవ్యః = వెదకతగినవాడు.

తా. మీరు ఆ అన్ని దుర్గములలోను, సరస్సులలోను, నదులలోను, ఆ యా స్థలములలో రావణుని కోసము సీతకోసము వెదకుడు. 47

మూ. యత్ర తిష్ఠతి ధర్మజ్ఞస్తపసా స్వేన భావితః,
మేరుసావర్ణిరిత్యేవ ఖ్యాతో వై బ్రహ్మణా సమః. 48

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మమును తెలిసినవాడు, స్వేన = తనసంబంధమైన, తపసా = తపస్సుచేత, భావితః= పవిత్రము చేయబడినవాడు, బ్రహ్మణా = బ్రహ్మతో, సమః = సమానుడు, మేరుసావర్ణిః ఇత్యేవ = మేరుసావర్ణి అని, ఖ్యాతః = ప్రసిద్ధుడైన మహర్షి, యత్ర =ఎచట, తిష్ఠతి = ఉన్నాడో.

తా. ఆ ప్రాంతమునందు ధర్మమును తెలిసినవాడు, తపస్సుచేత పవిత్రమైనవాడు, బ్రహ్మదేవునితో సమానుడు అయిన, మేరుసావర్ణి నివసించుచున్నాడు.

మూ. ప్రష్టవ్యో మేరుసావర్ణిర్మహర్షిః సూర్యసన్నిభః,
ప్రణమ్య శిరసా భూమౌ ప్రవృత్తిం మైథిలీం ప్రతి. 49

ప్ర. అ. సూర్యసన్నిభః = సూర్యునితో సమానుడైన, మహర్షిః = మహర్షియైన, మేరుసావర్ణిః = మేరుసావర్ణి, శిరసా = శిరస్సుతో, భూమౌ = భూమిపై బడి, ప్రణమ్య = నమస్కరించి, మైథిలీం ప్రతి = సీతను గూర్చి , ప్రవృత్తిమ్ =వార్తను, ప్రష్టవ్యః = అడగదగినవాడు.

తా. మీరు సూర్యునితో సమానుడైన ఆ మేరుసావర్ణిమహర్షికి సాష్టాంగప్రణామము చేసి సీతను గూర్చిన వార్తను ప్రశ్నించుడు. 49

మూ. ఏతావజ్జీవలోకస్య భాస్కరో రజనీక్షయే,
కృత్వా వితిమిరం సర్వమస్తం గచ్ఛతి పర్వతమ్. 50

ప్ర. అ. భాస్కరః=సూర్యుడు, జీవలోకస్య=ప్రాణిలోకమునకు, ఏతావత్=ఇంతవరకు, సర్వమ్=సమస్తప్రదేశమును, రజనీక్షయే=పగటియందు, వితిమిరమ్=చీకటి లేనిదానినిగా, కృత్వా=చేసి, అస్తం పర్వతమ్=అస్తాద్రిని, గచ్ఛతి=చేరును.

తా. సూర్యుడు పగటిభాగమునందు ఇంతవరకు ఉన్న ప్రదేశమునందు ప్రాణులకు చీకటి లేకుండునట్లు చేసి అస్తాద్రిని చేరును. 50

మూ. ఏతావద్వానరైః శక్యం గన్తుం వానరపుఙ్గవాః,
అభాస్కరమమర్యాదం న జానీమస్తతః పరమ్. 51

ప్ర. అ. తా. చూ. 40వ సర్గలో 68వ శ్లోకము.

మూ. అవగమ్య తు వైదేహీం నిలయం రావణస్య చ,
అస్తం పర్వతమాసాద్య పూర్ణే మాసే నివర్తత. 52

ప్ర. అ. వైదేహీమ్=సీతను, రావణస్య=రావణునియొక్క, నిలయం చ=స్థానమును, అవగమ్య=తెలుసుకొని, అస్తం పర్వతమ్=అస్తాద్రిని, ఆసాద్య=సమీపించి, మాసే= మాసము, పూర్ణే=నిండిన దగుచుండగా, నివర్తత=తిరిగిరండి.

తా. సీతను, రావణుని నివాసమును గూర్చి తెలుసుకొని అస్తాద్రివరకు

వెళ్లి మాసము నిండగానే తిరిగి రండి. 52

మూ. ఊర్ధ్వం మాసాన్న వస్తవ్యం వసన్వధ్యో భవేన్మమ,
సహైవ శూరో యుష్మాభిః శ్వశురో మే గమిష్యతి. 53

ప్ర. అ. మాసాత్=మాసముకంటె, ఊర్ధ్వమ్=పైన, న వస్తవ్యమ్=నివసించ కూడదు. వసన్=నివసించువాడు, మమ=నాకు, వధ్యః=వధ్యుడు, భవేత్=అగును. యుష్మాభిః సహైవ=మీతో కూడ, మే=నాయొక్క, శూరః=శూరుడైన, శ్వశురః= మామగారు, గమిష్యతి=వెళ్లగలడు.

తా. మాసము దాటి ఉండకూడదు. అట్లున్నవానికి మరణదండము విధింపబడును. శూరుడైన మా మామగారు మీతో వచ్చును. 53

మూ. శ్రోతవ్యం సర్వమేతస్య భవద్భిర్దిష్టకారిభిః,
గురురేష మహాబాహుః శ్వశురో మే మహాబలః. 54

ప్ర. అ. దిష్టకారిభిః=ఆజ్ఞాపించబడినదానిని చేయు, భవద్భిః=మీచేత, ఏతస్య= ఇతనియొక్క, సర్వమ్=సమస్తము, శ్రోతవ్యమ్=వినదగినది. మహాబాహుః=గొప్ప బాహువులు గల, మహాబలః=గొప్ప బలము గల, ఏషః=ఇతడు, మే=నాకు, శ్వశురః=మామగారు, గురుః=పూజ్యుడు.

తా. మీరు ఇతడు చెప్పిన దంతా విని ఇతని ఆజ్ఞ ప్రకారము చేయువలయును. మహాబాహువు, మహాబలశాలి యైన ఈ సుషేణుడు నాకు మామ అగుటచే పూజ్యుడు. 54

మూ. భవన్తశ్చాపి విక్రాన్తాః ప్రమాణం సర్వ ఏవ హి,
ప్రమాణమేనం సంస్థాప్య పశ్యధ్వం పశ్చిమాం దిశమ్. 55

ప్ర. అ. విక్రాన్తాః=పరాక్రమవంతులైన, సర్వే=సమస్తమైన, భవన్తశ్చాపి=మీరు కూడ, ప్రమాణమ్ ఏవ హి=ప్రమాణమే కదా! ఏనమ్=ఇతనిని, ప్రమాణమ్= ప్రమాణముగా, సంస్థాప్య=ఉంచుకొని, పశ్చిమాం దిశమ్= పశ్చిమదిక్కును, పశ్యధ్వమ్=చూడండి.

తా. పరాక్రమవంతులైన మీరందరు కూడ కార్యవ్యవస్థలో సమర్థులే. అయినను ఈ సుషేణుని వ్యవస్థాపకునిగా ఉంచుకొని, పశ్చిమదిక్కు వెదకుడు.

మూ. దృష్టాయాం తు నరేన్ద్రస్య పత్న్యామమితతేజసః,
కృతకృత్యా భవిష్యామః కృతస్య ప్రతికర్మణా. 56

ప్ర. అ. అమితతేజసః=అమితమైన తేజస్సు గల, నరేన్ద్రస్య=రామునియొక్క, పత్న్యామ్=భార్య, దృష్టాయామ్=చూడబడినదగుచుండగా, కృతస్య=చేయబడినదానికి, ప్రతికర్మణా= తిరిగి చేయుటచేత, కృతకృత్యాః=కృతకృత్యులము, భవిష్యామః=కాగ

లము.

తా. అమితమైన తేజస్సు గల ఈ రాముని భార్యను చూడగలిగినచో ఆతడు చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేసి, కృతకృత్యులము కాగలము.

మూ. అతోఽన్యదపి యత్కార్యం కార్యస్యాస్య హితం భవేత్,
సమ్ప్రధార్య భవద్భిశ్చ దేశకాలార్థసంహితమ్. 57

ప్ర. అ. అస్య=ఈ, కార్యస్య=కార్యమునకు, అతః=దీనికంటె, అన్యదపి= అన్యమైన, యత్=ఏది, హితమ్=లాభకరము, భవేత్=అగునో, దేశకాలార్థసంహితమ్= దేశమునకు, కాలమునకు, ప్రయోజనమునకు, అనుకూలమైన అది, భవద్భిః=మీచేత, సమ్ప్రధార్య= నిశ్చయించి, కార్యమ్=చేయదగినది.

తా. నేను చెప్పినది కాక ఈ కార్యమునకు లాభకరమైన ఇతరమైన దేదైనా ఉన్నచో దేశకాలప్రయోజనముల కనుగుణముగా మీరే నిర్ణయించి ఆ కార్యమును చేయుడు. 57

మూ. తతః సుషేణప్రముఖాః ప్లవఙ్గమాః
సుగ్రీవవాక్యం నిపుణం నిశమ్య,
ఆమన్త్ర్య సర్వే ప్లవగాధిపం తే
జగ్ముర్దిశం తాం వరుణాభిగుప్తామ్. 58

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుషేణప్రముఖాః=సుషేణుడు మొదలైన, తే ప్లవఙ్గమాః= ఆ వానరులు, సుగ్రీవవాక్యమ్=సుగ్రీవుని మాటను, నిపుణమ్=నేర్పుగా, నిశమ్య=విని, సర్వే=వారందరు, ప్లవగాధిపమ్= సుగ్రీవుని, ఆమన్త్ర్య=అనుజ్ఞ గైకొని, వరుణాభిగుప్తామ్ = వరుణునిచేత రక్షించబడిన, తాం దిశమ్=ఆ దిక్కును గూర్చి, జగ్ముః=వెళ్లిరి.

తా. పిమ్మట సుషేణుడు మొదలైన ఆ వానరు లందరు సుగ్రీవుని మాటలు శ్రద్ధతో విని ఆతని అనుజ్ఞ గైకొని పశ్చిమ దిక్కునకు వెళ్లిరి. 58

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిచత్వారింశః సర్గః

[సుగ్రీవుడు సీతాన్వేషణముకొరకు శతబలుడు మొదలగు వానరులను ఉత్తరదిక్కునకు పంపుట].

మూ. తతః సన్దిశ్య సుగ్రీవః శ్వశురం పశ్చిమాం దిశమ్,
వీరం శతబలం నామ వానరం వానరేశ్వరః. 1

ప్ర. అ. వానరేశ్వరః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, శ్వశురమ్=మామగారిని, పశ్చిమాం దిశమ్=పశ్చిమదిక్కును గూర్చి, సన్దిశ్య=పంపి, తతః=అటుపిమ్మట, శతబలం నామ=శతబలుడను పేరు గల, వీరమ్=వీరుడైన, వానరమ్=వానరుని గూర్చి (పలికెను.).

తా. వానరరాజైన సుగ్రీవుడు మామగారైన సుషేణుని పశ్చిమదిక్కునకు పంపి వీరుడైన శతబలుడను వానరునితో పలికెను. 1

మూ. ఉవాచ రాజా సర్వజ్ఞః సర్వవానరసత్తమః,
వాక్యమాత్మహితం చైవ రామస్య చ హితం తదా. 2

ప్ర. అ. రాజా=రాజు, సర్వజ్ఞః=అన్నియు తెలిసినవాడు, సర్వవానరసత్తమః=సమస్తవానరులలో శ్రేష్ఠుడు అయిన సుగ్రీవుడు, తదా=అపుడు, ఆత్మహితం చైవ=తనకు హితము, రామస్య చ=రామునకు కూడ, హితమ్=హితము అయిన, వాక్యమ్= వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు సకలవానరులలో శ్రేష్ఠుడైన, అన్నియు తెలిసిన సుగ్రీవుడు తనకు, రామునకు కూడ హితకరమైన వాక్యమును పలికెను. 2

మూ. వృతః శతసహస్రేణ త్వద్విధానాం వనౌకసామ్,
వైవస్వతసుతైః సార్థం ప్రతిష్ఠస్వ స్వమన్త్రిభిః. 3

ప్ర. అ. త్వద్విధానామ్=నీవంటి, వనౌకసామ్=వానరులయొక్క, శతసహస్రేణ=నూరు సహస్రములతో, వృతః=కూడినవాడవై, స్వమన్త్రిభిః=నీ మంత్రులైన, వైవస్వతసుతైః సార్ధమ్= యముని కుమారులతో కూడ, ప్రతిష్ఠస్వ=బయలుదేరుము.

తా. నీ వంటి లక్షమంది వానరులతోను, . యముని పుత్రులైన నీ మంత్రులతోను, కలిసి బయలుదేరుము. 3

మూ. దిశాముదీచీం విక్రాన్త హిమశైలావతంసికామ్,
సర్వతః పరిమార్గధ్వం రామపత్నీం యశస్వినీమ్. 4

ప్ర. అ. విక్రాన్త!=ఓ! పరాక్రమవంతుడా! హిమశైలావతంసికామ్=హిమవత్పర్వతము శిరోభూషణముగా గల, ఉదీచీం దిశమ్=ఉత్తరపుదిక్కును, యశస్వినీమ్=కీర్తిమంతురాలైన, రామపత్నీమ్=సీతను, సర్వతః=అంతటను, పరిమార్గధ్వమ్=వెదకుడు.

తా. ఓ! పరాక్రమవంతుడా! మీరు హిమవత్పర్వతము శిరోభూషణముగా గల ఉత్తరపు దిక్కుకు వెళ్లి అక్కడ అంతటను కీర్తిమంతురాలైన సీతను వెదకుడు.

మూ. అస్మిన్కార్యే వినిర్వృత్తే కృతే దాశరథేః ప్రియే,
ఋణాన్ముక్తా భవిష్యామః కృతార్థార్థవిదాంవర. 5

ప్ర. అ. అర్థవిదాం వర=కార్యవేత్తలలో శ్రేష్ఠుడా! అస్మిన్=ఈ, కార్యే=కార్యము, వినిర్వృత్తే=జరిగిన దగుచుండగా, దాశరథేః=రామునకు, ప్రియే=ప్రియము, కృతే= చేయబడినదగుచుండగా, ఋణాత్=ఋణమునుండి, ముక్తాః=ముక్తులమై, కృతార్థాః= కృతార్థులము, భవిష్యామః=కాగలము.

తా. కార్యములు తెలిసిన వారిలో శ్రేష్ఠుడా! ఈ కార్యము సాధించి రామునకు ప్రియమును చేసినచో మేము ఋణవిముక్తులమై కృతార్థులము కాగలము.

మూ. కృతం హి ప్రియమస్మాకం రాఘవేణ మహాత్మనా,
తస్య చేత్ప్రతికారోఽస్తి సఫలం జీవితం భవేత్. 6

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, అస్మాకమ్=మాకు, ప్రియమ్=ప్రియము, కృతం హి=చేయబడినది కదా? తస్య=దానికి, ప్రతికారః= ప్రత్యుపకారము, అస్తి చేత్=ఉన్నట్లైతే, జీవితమ్=జీవితము, సఫలమ్=సఫలము, భవేత్=అగును.

తా. మహాత్ముడైన రాముడు మాకు ఉపకారము చేసి యున్నాడు. దానికి ప్రత్యుపకారము చేసినచో మా జీవితము సఫలమగును. 6

మూ. అర్థినః కార్యనిర్వృత్తిమకర్తురపి యశ్చరేత్,
తస్య స్యాత్సఫలం జన్మ కిం పునః పూర్వకారిణః. 7

ప్ర. అ. యః=ఎవడు, అకర్తురపి=ఉపకారము చేయనివాడైనను, అర్థినః=కార్యార్థియొక్క, కార్యనిర్వృత్తిమ్=కార్యసమాప్తిని, చరేత్=చేయునో, తస్య=వానియొక్క, జన్మ=జన్మ, సఫలం స్యాత్=సఫలమగును. పూర్వకారిణః=ముందు ఉపకారము చేసినవానికి చేసినచో, కిం పునః=చెప్పనేల.

తా. తనకు ఉపకారము చేయనివాడైనను ఎవరైన కార్యమును కోరి వచ్చినపుడు అతని కార్యమును పూర్తి చేసినవాని జన్మ సఫల మగును. ముందు ఉపకారము చేసినవాని కార్యమును చేసినపుడు చెప్పవలెనా? 7

మూ. ఏతాం బుద్ధిం సమాస్థాయ దృశ్యతే జానకీ యథా,
తథా భవద్భిః కర్తవ్యమస్మత్ప్రియహితైషిభిః. 8

ప్ర. అ. ఏతామ్= ఈ, బుద్ధిమ్ = బుద్ధిని, సమాస్థాయ = అవలంబించి, అస్మత్ప్రియహితైషిభిః = మాయొక్క హితమును ప్రియమును కోరుచున్న, భవద్భిః =మీచేత, జానకీ=జానకి, యథా = ఎట్లు, దృశ్యతే = చూడబడునో, తథా = అట్లు , కర్తవ్యమ్ = చేయదగినది.

తా. మా ప్రియమును, హితమును కోరు మీరు ఈ ఆలోచనతో సీతను వెదకుటకు ప్రయత్నము చేయుడు. 8

మూ. అయం హి సర్వభూతానాం మాన్యస్తు నరసత్తమః,
అస్మాసు చ గతః ప్రీతిం రామః పరపురంజయః. 9

ప్ర. అ. అయమ్=ఈ , నరసత్తమః = నరులలో శ్రేష్ఠుడు, పరపురంజయః = శత్రుపురములను జయించువాడు అయిన, రామః = రాముడు, సర్వభూతానామ్ = సకలభూతములకు, మాన్యః = పూజింపదగినవాడు. అస్మాసు = మాయందు, ప్రీతిమ్ = స్నేహమును, గతః = పొందినాడు.

తా. నరులలో శ్రేష్ఠుడు, శత్రుపురములను జయించువాడు అయిన ఈ రాముడు అందరికి పూజనీయుడు. మా విషయమున స్నేహభావముతో ఉన్నవాడు. 9

మూ. ఇమాని వనదుర్గాణి నద్యః శైలాన్తరాణి చ,
భవన్తః పరిమార్గన్తు బుద్ధివిక్రమసమ్పదా. 10

ప్ర. అ. భవన్తః=మీరు, బుద్ధివిక్రమసమ్పదా=బుద్ధిపరాక్రమములయొక్క సంపదతో, ఇమాని=ఈ, వనదుర్గాణి=వనదుర్గములను, నద్యః=నదులను, శైలాన్తరాణి చ= పర్వతమధ్యభాగములను, పరిమార్గన్తు=అన్వేషించెదరుగాక!

తా. బుద్ధిపరాక్రమముల సంపద గల మీరు ఈ వనదుర్గములలోను, నదులలోను, పర్వతమధ్యములలోను అన్వేషించుడు. 10

మూ. తత్ర మ్లేచ్ఛాన్ పులిన్దాంశ్చ శూరసేనాంస్తథైవ చ,
ప్రస్థలాన్ భరతాంశ్చైవ కురూంశ్చ సహ మద్రకైః. 11
కామ్బోజయవనాంశ్చైవ శకానాం పత్తనాని చ,
బాహ్లీకాన్ హృషికాంశ్చైవ పౌరవానథ టఙ్కణాన్. 12
చీనాన్ పరమచీనాంశ్చ నీహారాంశ్చ పునః పునః,
అన్వీక్ష్య వరదాంశ్చైవ హిమవన్తం విచిన్వథ. 13

ప్ర. అ. తత్ర=అక్కడ, మ్లేచ్ఛాన్=మ్లేచ్ఛదేశమును, పులిందాంశ్చ=పులిం

దదేశమును, తథైవ చ=మరియు, శూరసేనాన్=శూరసేనదేశమును, ప్రస్థ లాన్=ప్రస్థలదేశమును, భరతాంశ్చైవ=భరతదేశమును, మద్రకైః సహ=మద్రకదేశ ముతో, కురూంశ్చ=కురుదేశమును, కామ్బోజయవనాంశ్చైవ=కాంబోజ - యవన దేశములను, శకానామ్=శకదేశముయొక్క, పత్తనాని చ=పట్టణములను, బాహ్లీ కాన్=బాహ్లీకదేశమును, ఋషికాంశ్చైవ=ఋషికదేశమును, పౌరవాన్=పౌరవదేశ మును, అథ=మరియు, టఙ్కణాన్=టంకణదేశమును, చీనాన్=చీనదేశమును, పరమచీనాంశ్చ=పరమచీనదేశమును, నీహారాంశ్చ=నీహారదేశమును, వరదాంశ్చైవ=వర దదేశమును, పునఃపునః=మాటి మాటికి, అన్విక్ష్య=వెదకి, హిమవన్తమ్=హిమవత్ప ర్వతమును, విచిన్వథ=అన్వేషింపుడు.

తా. అక్కడ మ్లేచ్ఛ - పులింద - శూరసేన - ప్రస్థల - భరత - కురు - మద్రక - కాంబోజ - యవన - శక - బాహ్లీక - ఋషిక - పౌరవ - టంకణ - చీన - పరమచీన - నీహార - వరద దేశములలో బాగుగా వెదకి హిమవత్పర్వతమునందు కూడ సీతకై అన్వేషించుడు. 11 - 13

మూ. లోధ్రపద్మకఖణ్డేషు దేవదారువనేషు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 14

ప్ర. అ. లోధ్రపద్మకఖణ్డేషు=లోధ్రపద్మకవృక్షముల సముదాయములయందు, దేవదారువనేషు చ=దేవదారువనములయందు, రావణః=రావణుడు, తతస్తతః=అక్క డక్కడ, వైదేహ్యా సహ=సీతతో కూడ, మార్గితవ్యః=వెదకతగినవాడు.

తా. లోధ్ర - పద్మక వృక్షముల సముదాయములయందు, దేవదారువన మునందు అన్ని ప్రదేశములలోను రావణునికొరకు, సీతకొరకు వెదకుడు. 14

మూ. తతః సోమాశ్రమం గత్వా దేవగన్ధర్వసేవితమ్,
కాలం నామ మహాసానుం పర్వతం తం గమిష్యథ. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దేవగన్ధర్వసేవితమ్=దేవతలచేత గంధర్వులచేత సేవింపబడిన, సోమాశ్రమమ్=సోమాశ్రమమును గూర్చి, గత్వా=వెళ్లి, మహాసా నుమ్=విశాలమైన చరియలు గల, కాలం నామ=కాల మను పేరు గల, తం పర్వతమ్=ఆ పర్వతమును గూర్చి, గమిష్యథ=వెళ్లగలరు.

తా. పిమ్మట దేవతలు, గంధర్వులు నివసించు సోమాశ్రమమునకు వెళ్లి అక్కడినుండి విశాలమైన చరియలు గల కాలపర్వతమునకు వెళ్లుడు. 15

మూ. మహత్సు తస్య శైలేషు పర్వతేషు గుహాసు చ,
విచిన్వత మహాభాగాం రామపత్నీమనిన్దితామ్. 16

ప్ర. అ. తస్య=దానియొక్క, మహత్సు=పెద్దవైన, శైలేషు=శిలాసముదా యములయందు, పర్వతేషు=పర్వతభాగములయందు, గుహాసు చ=గుహలయందు,

మహాభాగామ్=గొప్ప భాగ్యము కలది, అనిన్దితామ్=దోషములు లేనిది అయిన, రామపత్నీమ్=సీతను, విచిన్వత= వెదకుడు.

తా. ఆ నీలపర్వతమునకు సంబంధించిన శిలాసముదాయములపైన, పెద్ద పర్వతభాగములపైన, గుహలలోను మహాభాగ్యవంతురాలు, దోషములు లేనిది అయిన సీతను వెదకుడు. 16

మూ. తమతిక్రమ్య శైలేన్ద్రం హేమగర్భం మహాగిరిమ్,
తతః సుదర్శనం నామ పర్వతం గన్తుమర్హథ. 17

ప్ర. అ. హేమగర్భమ్=బంగారు గర్భము గలది, శైలేన్ద్రమ్=పర్వతశ్రేష్ఠము అయిన, తమ్=ఆ, మహాగిరిమ్=మహాపర్వతమును, అతిక్రమ్య=దాటి, తతః=అటు పిమ్మట, సుదర్శనం నామ=సుదర్శన మను పేరు గల, పర్వతమ్=పర్వతమును గూర్చి, గన్తుమ్= వెళ్లుటకు, అర్హథ=తగియున్నారు.

తా. పర్వతశ్రేష్ఠమైన బంగారముతో నిండిన ఆ కాలపర్వతమును దాటి సుదర్శనపర్వతమునకు వెళ్లుడు. 17

మూ. తతో దేవసఖో నామ పర్వతః పతగాలయః,
నానాపక్షిసమాకీర్ణో వివిధద్రుమభూషితః. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పతగాలయః=పక్షులకు నివాసము, నానాపక్షిసమాకీర్ణః= అనేకవిధములైన పక్షులతో వ్యాప్తము, వివిధద్రుమభూషితః=అనేకవిధములైన వృక్షములచేత అలంకరింపబడినది అయిన, దేవసఖో నామ=దేవసఖము అను పేరు గల, పర్వతః=పర్వతము ఉన్నది.

తా. ఆ సుదర్శనము తరువాత పక్షులకు నివాసమైన దేవసఖ మను పర్వతమున్నది. అనేకవృక్షములచేత అలంకరింపబడిన ఆ పర్వతమునందు అనేక విధములైన పక్షులు ఉండును. 18

మూ. తస్య కాననషణ్డేషు నిర్దరేషు గుహాసు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 19

ప్ర. అ. తస్య=దానియొక్క, కాననషణ్డేషు=వనసముదాయములయందు, నిర్దరేషు= లోయలయందు, గుహాసు చ=గుహలయందు, రావణః=రావణుడు, వైదేహ్యా సహ= సీతతో కూడ, తతస్తతః=అక్కడక్కడ, మార్గితవ్యః=వెదకతగినవాడు.

తా. ఆ పర్వతముపైన వనములందు, లోయలలోను, గుహలలోను, అన్ని స్థలములయందు రావణునికొరకు సీతకొరకు వెదకుడు. 19

మూ. తమతిక్రమ్య చాకాశం పర్వతః శతయోజనమ్,
అపర్వతనదీవృక్షం సర్వసత్త్వవివర్జితమ్. 20

ప్ర. అ. తమ్=దేవసఖపర్వతమును, అతిక్రమ్య=దాటి, అపర్వతనదీవృక్షమ్=పర్వతములు గాని, నదులు గాని, వృక్షములు గాని లేని, సర్వసత్త్వవివర్జితమ్=సకలప్రాణులతో శూన్యమైన, సర్వతః=నలు వైపుల, శతయోజనమ్=నూరు యోజనములు గల, ఆకాశమ్=ఆకాశమున్నది.

తా. ఆ దేవసఖపర్వతము దాటిన తరువాత, అంతటా వంద యోజనముల వైశాల్యము గల శూన్యప్రదేశ ముండును. అక్కడ పర్వతములు గాని, నదులుగాని, వృక్షములు గాని, ఏ ప్రాణులు గాని ఉండవు. 20

మూ. తత్తు శీఘ్రమతిక్రమ్య కాన్తారం రోమహర్షణమ్,
కైలాసం పాణ్డురం ప్రాప్య హృష్టా యూయం భవిష్యథ. 21

ప్ర. అ. కాన్తారమ్=భయంకరము, రోమహర్షణమ్=రోమాంచజనకము అయిన, తత్= దానిని, శీఘ్రమ్=శీఘ్రముగా, అతిక్రమ్య=దాటి, పాణ్డురమ్=తెల్లని, కైలాసమ్= కైలాసమును, ప్రాప్య=పొంది, యూయమ్=మీరు, హృష్టాః=సంతోషించినవారు, భవిష్యథ=కాగలరు.

తా. భయంకరమై, రోమాంచమును కల్గించు ఆ శూన్యదేశమును దాటి వెళ్లి తెల్లని కైలాసపర్వతమును చూడగానే మీకు ఆనందము కలుగును. 21

మూ. తత్ర పాణ్డురమేఘాభం జామ్బూనదపరిష్కృతమ్,
కుబేరభవనం రమ్యం నిర్మితం విశ్వకర్మణా. 22

ప్ర. అ. తత్ర=అక్కడ, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నిర్మితమ్=నిర్మింపబడిన, పాణ్డురమేఘాభమ్=తెల్లని మేఘము వంటి కాంతి గల, జామ్బూనదపరిష్కృతమ్=బంగారముచేత అలంకరించబడిన, రమ్యమ్=రమ్యమైన, కుబేరభవనమ్=కుబేరుని భవనమున్నది.

తా. అక్కడ విశ్వకర్మ నిర్మించిన రమ్యమైన కుబేరుని భవనమున్నది. తెల్లని మేఘము వలె ఎత్తుగా ఉండు ఆ భవనము బంగారముచే అలంకరించబడినది.22

మూ. విశాలా నలినీ యత్ర ప్రభూతకమలోత్పలా,
హంసకారణ్డవాకీర్ణా అప్సరోగణసేవితా. 23

ప్ర. అ. యత్ర=ఎక్కడ, ప్రభూతకమలోత్పలా=అధికమైన కమలములు, కలువలు గలది, హంసకారణ్డవాకీర్ణా=హంసలచేత, కారండవపక్షులచేత వ్యాప్తమైనది, అప్సరోగణసేవితా=అప్సరస్త్రీల సముదాయముచేత సేవించబడినది అయిన, విశాలా=విశాలమైన, నలినీ=పద్మసరస్సు ఉన్నదో?

తా. అక్కడ అధికమైన పద్మములు, కలువలు గల ఒక విశాలమైన పద్మసరస్సు ఉన్నది. హంసలతోను, కారండవపక్షులతోను నిండిన ఆ సరస్సును

అప్సరస్త్రీలు సేవించుచుందురు. 23

మూ. తత్ర వైశ్రవణో రాజా సర్వలోకనమస్కృతః,
ధనదో రమతే శ్రీమాన్ గుహ్యకైః సహ యక్షరాట్. 24

ప్ర. అ. తత్ర=ఆ పర్వతమునందు, వైశ్రవణః=విశ్రవణుని కుమారుడు, రాజా=రాజు, సర్వలోకనమస్కృతః=సమస్తలోకములచేత నమస్కరింపబడినవాడు, యక్షరాట్=యక్షుల రాజు అయిన, శ్రీమాన్=శ్రీమంతుడైన, ధనదః=కుబేరుడు, గుహ్యకైః సహ=యక్షులతో కూడ, రమతే=క్రీడించుచుండును.

తా. ఆ భవనములో విశ్రవణుని కుమారుడు సర్వలోకములచే నమస్కరింపబడు వాడు, యక్షుల రాజు, శ్రీమంతుడు అయిన కుబేరుడు యక్షులతో సంతోషముగా నివసించుచుండును. 24

మూ. తస్య చన్ద్రనికాశేషు పర్వతేషు గుహాసు చ,
రావణః సహ వైదేహ్యా మార్గితవ్యస్తతస్తతః. 25

ప్ర. అ. తస్య=ఆ కైలాసపర్వతముయొక్క, చన్ద్రనికాశేషు=చంద్రునితో సమానములైన, పర్వతేషు=సమీపపర్వతములయందు, గుహాసు చ=గుహలయందు, తతస్తతః=అక్కడక్కడ, వైదేహ్యా సహ=సీతతో కూడ, రావణః=రావణుడు, మార్గితవ్యః=వెదక తగినవాడు.

తా. ఆ కైలాసముదగ్గర ఉన్న చంద్రుని వంటి కాంతి గల పర్వతముల మీద, గుహలలోను, అన్ని ప్రదేశములలోను కూడ సీతను రావణుని వెదకుడు.

మూ. క్రౌఞ్చం తు గిరిమాసాద్య బిలం తస్య సుదుర్గమమ్,
అప్రమత్తైః ప్రవేష్టవ్యం దుష్ప్రవేశం హి తత్స్మృతమ్. 26

ప్ర. అ. క్రౌఞ్చం గిరిమ్=క్రౌంచపర్వతమును, ఆసాద్య=పొంది, సుదుర్గమమ్=ప్రవేశించుటకు చాల కష్టమైన, తస్య బిలమ్=దాని రంధ్రము, అప్రమత్తైః=ఏమరుపాటు లేని మీచేత, ప్రవేష్టవ్యమ్=ప్రవేశింప దగినది. తత్=అది, దుష్ప్రవేశమ్=ప్రవేశింప శక్యము గానిదిగా, స్మృతమ్ హి=చెప్పబడినది కదా?

తా. మీరు క్రౌంచపర్వతమును చేరి ప్రవేశించుటకు చాల కష్టమైన దాని రంధ్రములోనికి చాల జాగరూకతతో ప్రవేశించవలెను. అది ప్రవేశింప శక్యము గానిది అని అందరు చెప్పుదురు. 26

మూ. వసన్తి హి మహాత్మానస్తత్ర సూర్యసమప్రభాః,
దేవైరభ్యర్థితాః సమ్యగ్దేవరూపా మహర్షయః. 27

ప్ర. అ. తత్ర=ఆ కైలాసపర్వతమునందు, సూర్యసమప్రభాః=సూర్యునితో సమానమైన కాంతి గలవారు, దేవైః=దేవతలచేత, అభ్యర్థితాః=ప్రార్థింపబడినవారు,

దేవరూపాః=దేవస్వరూపులు, మహాత్మానః=మహాత్ములు అయిన, మహర్షయః=మహర్షులు, సమ్యక్=బాగుగా, వసన్తి హి=నివసించుచున్నారు.

తా. సూర్యునితో సమానమైన కాంతి గలవారు, దేవతాస్వరూపులు, మహాత్ములు అయిన మహర్షులు, దేవతలు ప్రార్థింపగా ఆ కైలాసపర్వతముమీద నివసించుచున్నారు. 27

మూ. క్రౌఞ్చస్య తు గుహాశ్చాన్యాః సానూని శిఖరాణి చ,
దర్దరాశ్చ నితమ్బాశ్చ విచేతవ్యా స్తతస్తతః. 28
కౌఞ్చస్య శిఖరం చాపి నిరీక్ష్య చ తతస్తతః.

ప్ర. అ. క్రౌఞ్చస్య=క్రౌఞ్చపర్వతముయొక్క, శిఖరం చాపి=శిఖరమును కూడ, తతస్తతః= అక్కడక్కడ, నిరీక్ష్య=చూచి, క్రౌఞ్చస్య=క్రౌంచపర్వతము యొక్క, అన్యాః=ఇతరమైన, గుహాశ్చ=గుహలు, సానూని=చరియలు, శిఖరాణి చ=శిఖరములు, దర్దరాశ్చ= పర్వతరంధ్రములు, నితమ్బాశ్చ=పర్వతమధ్యప్రదేశములు, తతస్తతః=అంతటా, విచేతవ్యాః= వెదకతగినవి.

తా. క్రౌంచపర్వతమునకు సంబంధించిన పెద్ద శిఖరమును, ఇతరమైన గుహలను, చరియలను, శిఖరములను, రంధ్రములను, మధ్యప్రదేశమును పూర్తిగా అన్వేషించవలెను. 28

మూ. అవృక్షం కామశైలం చ మానసం విహగాలయమ్ 29
న గతిస్తత్ర భూతానాం దేవానాం న చ రక్షసామ్.

ప్ర. అ. అవృక్షమ్ = వృక్షములు లేని, విహగాలయమ్ = పక్షులకు స్థానమైన, మానసమ్ =మానసమను, కామశైలమ్ = కోరికలను తీర్చు పర్వతమును, (వెదకవలెను). తత్ర = అక్కడ, భూతానామ్ = ప్రాణులకు, గతిః= గమనము, న =లేదు. దేవానామ్ =దేవతలకు, రక్షసాం చ= రాక్షసులకు, న =లేదు.

తా. క్రౌంచపర్వతమునకు సంబంధించి మానస మను కోరికలను తీర్చు ఒక పర్వత మున్నది. దానిపై వృక్షము లుండవు. పక్షులు నివసించుచుండును. ప్రాణులు, దేవతలు, రాక్షసులు కూడ అక్కడికి వెళ్లజాలరు. 29

మూ. స చ సర్వైర్విచేతవ్యః ససానుప్రస్థభూధరః. 30
క్రౌఞ్చం గిరి మతిక్రమ్య మైనాకో నామ పర్వతః.

ప్ర. అ. ససానుప్రస్థభూధరః = చరియలు, ప్రాంతభూములు, పర్యంత పర్వతములు వీటితో కూడి, సః = ఆ క్రౌంచపర్వతము, సర్వైః = అందరిచే, విచేతవ్యః =వెదకదగినది. క్రౌఞ్చం గిరిమ్= క్రౌంచపర్వతమును, అతిక్రమ్య =దాటి, మైనాకో నామ =మైనాక మను పేరుగల, పర్వతః = పర్వతమున్నది.

తా. ఆ క్రౌంచ పర్వతమునకు సంబంధించిన చరియలను, ప్రాంతభూము లను, చిన్న పర్వతములను మీరందరు వెదకవలెను. క్రౌంచపర్వతమును దాటిన తరువాత మైనాకపర్వతము వచ్చును. 30

మూ. మయస్య భవనం తత్ర దానవస్య స్వయం కృతమ్. 31
మైనాకస్తు విచేతవ్యః ససానుప్రస్థకన్దరః,
స్త్రీణామశ్వముఖానాం తు నికేతస్తత్ర తత్ర తు. 32

ప్ర. అ. తత్ర = దానిమీద, దానవస్య = దానవుడైన, మయస్య =మయునియొక్క, స్వయం కృతమ్ = స్వయముగా నిర్మింపబడిన, భవనమ్ = భవనమున్నది. ససానుప్రస్థకన్దరః =చరియలతోను, సమీపభూములతోను, గుహలతోను కూడిన, మైనాకః =మైనాకపర్వతము, విచేతవ్యః =వెదకతగినది. తత్ర తత్ర = అక్కడక్కడ, అశ్వముఖీనాం స్త్రీణామ్ = కింపురుషస్త్రీలయొక్క, నికేతః = స్థానము ఉన్నది.

తా. ఆ మైనాకపర్వతముమీద మయుడనే దానవుడు స్వయముగా నిర్మించుకొనిన భవన మున్నది. అక్కడక్కడ కింపురుషస్త్రీల నివాసము లున్నవి. ఆ మైనాకము చరియలను, సమీపభూములను, గుహలను వెదకవలెను. 31,32

మూ. తం దేశం సమతిక్రమ్య ఆశ్రమం సిద్ధసేవితమ్,
సిద్ధా వైఖానసాస్తత్ర వాలఖిల్యాశ్చ తాపసాః. 33

ప్ర. అ. తం దేశమ్=ఆ ప్రదేశమును, సమతిక్రమ్య=దాటి, సిద్ధసేవితమ్=సిద్ధులచేత సేవించబడిన, ఆశ్రమమ్=ఆశ్రమ మున్నది. తత్ర=అక్కడ, సిద్ధాః=సిద్ధులు, వైఖానసాః=వైఖానసులు, తాపసాః=మునులైన, వాలఖిల్యాశ్చ=వాలఖిల్యులు ఉందురు.

తా. ఆ ప్రదేశమును దాటిన పిమ్మట సిద్ధులు నివసించు ఆశ్రమము వచ్చును. దానియందు సిద్ధులు, వైఖానసులు, వాలఖిల్యులు నివసించుచుందురు.

మూ. వన్దితవ్యాస్తతః సిద్ధాస్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యా చాపి సీతాయాః ప్రవృత్తిర్వినయాన్వితైః. 34

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తపసా=తపస్సుచేత, వీతకల్మషాః=నశించిన పాపములు గల, సిద్ధాః=సిద్ధులు, వన్దితవ్యాః=నమస్కరించదగినవారు. వినయాన్వితైః=వినయముతో కూడిన మీచేత, సీతాయాః=సీతయొక్క, ప్రవృత్తిః=వార్త, ప్రష్టవ్యా చాపి=అడగదగినది.

తా. మీరు తపస్సుచేత పాపము లన్నీ నశించిన సిద్ధులకు నమస్కరించి సీత వృత్తాంతమును గూర్చి వారిని సవినయముగా ప్రశ్నించుడు. 34

మూ. హేమపుష్కరసంఛన్నం తత్ర వైఖానసం సరః,
తరుణాదిత్యసఙ్కాశైర్హంసైర్విచరితం శుభైః. 35

ప్ర. అ. తత్ర=అక్కడ, హేమపుష్కరసఞ్ఛన్నమ్=బంగారు పద్మములచేత కప్పబడిన, తరుణాదిత్యసఙ్కాశైః=లేతసూర్యునితో సమానమైన, శుభైః=సుందరమైన, హంసైః =హంసలచేత, విచరితమ్=సంచరించబడిన, వైఖానసమ్=వైఖానసులకు సంబంధించిన, సరః= సరస్సు ఉన్నది.

తా. అక్కడ వైఖానసులకు సంబంధించిన సరస్సు ఉన్నది. బంగారు పద్మములతో నిండిన ఆ సరస్సులో లేత సూర్యునివంటి కాంతి గల సుందరములైన హంసలు సంచరించుచుండును. 35

మూ. ఔపవాహ్యః కుబేరస్య సార్వభౌమ ఇతి స్మృతః,
గజః పర్యేతి తం దేశం సదా సహ కరేణుభిః. 36

ప్ర. అ. సార్వభౌమః ఇతి=సార్వభౌమము అని, స్మృతః=చెప్పబడిన, కుబేరస్య= కుబేరునియొక్క, ఔపవాహ్యః=వాహనమైన, గజః=గజము, కరేణుభిః సహ=ఆడ ఏనుగులతో కూడ, సదా=ఎల్లప్పుడు, తం దేశమ్=ఆ ప్రదేశమును గూర్చి, పర్యేతి= వచ్చుచుండును.

తా. కుబేరుని వాహనమైన సార్వభౌమము అను పేరు గల గజము ఆడ ఏనుగులతో కలిసి నిత్యము ఆ ప్రదేశమునకు వచ్చుచుండును. 36

మూ. తత్సరః సమతిక్రమ్య నష్టచన్ద్రదివాకరమ్,
అనక్షత్రగణం వ్యోమ నిష్పయోదమనాదితమ్. 37

ప్ర. అ. తత్ సరః=ఆ సరస్సును, సమతిక్రమ్య=దాటి, నష్టచన్ద్రదివాకరమ్= కనబడని చంద్రసూర్యులు కలది, అనక్షత్రగణమ్=నక్షత్రగణము లేనిది, నిష్పయోదమ్=మేఘములు లేనిది, అనాదితమ్=ధ్వని చేయించబడనిది అయిన, వ్యోమ=ఆకాశ ముండును.

తా. ఆ సరస్సు దాటిన తర్వాత చంద్రసూర్యులు గాని, నక్షత్రగణములు గాని, మేఘములు గాని, లేని ఎట్టి ధ్వనులు వినబడని ఆకాశము మాత్రము ఉండును. 37

మూ. గభస్తిభిరివార్కస్య స తు దేశః ప్రకాశ్యతే,
విశ్రామ్యద్భిస్తపస్సిద్ధైర్దేవకల్పైః స్వయంప్రభైః. 38

ప్ర. అ. దేవకల్పైః=దేవతలతో సమానులు, స్వయంప్రభైః=స్వయముగా కాంతి గలవారు, విశ్రామ్యద్భిః=విశ్రమించుచున్నవారు అయిన, తపస్సిద్ధైః=తపస్సు వలన సిద్ధి పొందినవారిచేత, సః దేశః=ఆ ప్రదేశము, అర్కస్య=సూర్యునియొక్క, గభస్తిభిరివ=కిరణములచేత వలె, ప్రకాశ్యతే=ప్రకాశింపచేయబడుచుండును.

తా. దేవతలతో సమానులై సహజమైన కాంతి గల అక్కడ విశ్రమించుచున్న తపస్సిద్ధులచేత ఆ ప్రదేశము సూర్యకిరణములచేత వలె ప్రకాశింపచేయబడుచుండును.

మూ. తం తు దేశమతిక్రమ్య శైలోదా నామ నిమ్నగా,
ఉభయోస్తీరయోస్తస్యాః కీచకా నామ వేణవః. 39
తే నయన్తి పరం తీరం సిద్ధాన్ప్రత్యానయన్తి చ.

ప్ర. అ. తం దేశమ్=ఆ ప్రదేశమును, అతిక్రమ్య=దాటి, శైలోదా నామ=శైలోద అను పేరు గల, నిమ్నగా =నది ఉన్నది. తస్యాః=దానియొక్క, ఉభయోః=రెండు, తీరయోః =తీరములయందు, కీచకాః నామ=కీచకము లను, వేణవః=వెదుళ్ళు ఉండును. తే= అవి, సిద్ధాన్=సిద్ధులను, పరం తీరమ్=అవతలి ఒడ్డును, నయన్తి=తీసుకొనివెళ్లును. ప్రత్యానయన్తి చ=తిరిగి తీసుకొని వచ్చుచుండును.

తా. ఆ ప్రదేశమును దాటిన తరువాత శైలోద అను నది వచ్చును. దాని రెండు తీరములయందు కీచకములు అను వెదుళ్లు ఉండును. అవి సిద్ధులను నది ఆవలి ఒడ్డునకు తీసుకొని వెళ్లి వెనుకకు తీసుకొని వచ్చుచుండును. 39

మూ. ఉత్తరాః కురవస్తత్ర కృతపుణ్యప్రతిశ్రయాః, 40
తతః కాఞ్చనపద్మాభిః పద్మినీభిః కృతోదకాః,
నీలవైడూర్యపత్రాఢ్యా నద్యస్తత్ర సహస్రశః, 41
రక్తోత్పలవనైశ్చాత్ర మణ్డితాశ్చ హిరణ్మయైః.

ప్ర. అ. తత్ర=అక్కడ, కృతపుణ్యప్రతిశ్రయాః=పుణ్యాత్ములకు నివాసమైన, ఉత్తరాః కురవః=ఉత్తరకురుదేశ మున్నది. తతః=అటు పిమ్మట, తత్ర =అక్కడ, కాఞ్చనపద్మాభిః=బంగారు పద్మములు గల, పద్మినీభిః=పద్మలతలతో, కృతోదకాః=కలిసిన ఉదకములుగల, నీలవైడూర్యపత్రాఢ్యాః=నీలవైడూర్యముల వంటి పత్రములతో నిండిన, నద్యః=నదులు, సహస్రశః=వేలకొలది ఉన్నవి. అత్ర=ఇక్కడ, హిరణ్మయైః=బంగారు వికారమైన, రక్తోత్పలవనైః=ఎఱ్ఱని కలువల వనముల చేత, మణ్డితాః=అలంకరింపబడినవి.

తా. అక్కడ పుణ్యాత్ములకు నివాసమైన ఉత్తరకురుదేశ మున్నది. అక్కడ బంగారు పద్మములు గల పద్మలతలు వ్యాపించిన ఉదకములతో నీలవైడూర్యముల వంటి ఆకులతో నిండి బంగారు వికారమైన ఎఱ్ఱని కలువల చేత అలంకరింపబడిన వేలకొలది నదులు ఉండును. 40,41

మూ. తరుణాదిత్యసఙ్కాశా భాన్తి తత్ర జలాశయాః. 42
మహార్హమణిరత్నైశ్చ కాఞ్చనప్రభకేసరైః,
నీలోత్పలవనైశ్చిత్రైః స దేశః సర్వతో వృతః. 43

ప్ర. అ. సః దేశః=ఆ ప్రదేశము, సర్వతః = అంతటా, మహార్హమణిరత్నైశ్చ =గొప్ప విలువ గల మణులతోను, రత్నములతోను, కాఞ్చనప్రభకేసరైః = బంగారు కాంతి గల కింజల్కములు గల, చిత్రైః =చిత్రములైన, నీలోత్పలవనైః =నల్ల కలువల వనములచేతను, నిస్తులాభిః = సాటిలేని, ముక్తాభిః=ముత్యములచేతను, మహాధనైః =గొప్ప ధనము గల, మణిభిశ్చ =మణులచేతను, వృతః = ఆవరింపబడి యుండును.

తా. ఆ ప్రదేశమునందు అంతట చాల విలువైన మణులు, రత్నములు, బంగారువర్ణము కింజల్కములు గల చిత్రములైన నల్లకలువల వనములు, సాటి లేని ముత్యములు వ్యాపించి ఉండును. 42,43

మూ. ఉద్ధూతపులినాస్తత్ర జాతరూపైశ్చ నిమ్నగాః,
సర్వరత్నమయైశ్చిత్రైరవగాఢా నగోత్తమైః. 44
జాతరూపమయైశ్చాపి హుతాశనసమప్రభైః.

ప్ర. అ. తత్ర= అక్కడ, నిమ్నగాః = నదులు, జాతరూపైః =బంగారముతో, ఉద్ధూతపులినాః =కలిసిన ఇసుక తిన్నెలు గలవి. సర్వరత్నమయైః =అన్ని రత్నములతో నిండిన, చిత్రైః =చిత్రవర్ణములైన, జాతరూపమయైః=బంగారు వికారమైన, హుతాశనసమప్రభైః = అగ్నితో సమానమైన కాంతి గల, నగోత్తమైః = పర్వతశ్రేష్ఠములచేత, అవగాఢాః =ప్రవేశింపబడినవి.

తా. ఇక్కడ నదుల ఇసుక తిన్నెలు బంగారము కలిసి యుండును. అనేకరత్నములతో నిండి చిత్రవర్ణములై అగ్నితో సమానమైన కాంతి గల బంగారు పర్వతములు ఈ నదులలోనికి చొచ్చుకొని ఉండును. 44

మూ. నిత్యపుష్పఫలాస్తత్ర నగాః పత్రరథాకులాః. 45
దివ్యగన్ధరసస్పర్శాః సర్వకామాన్ స్రవన్తి చ,
నానాకారాణి వాసాంసి ఫలన్త్యన్యే నగోత్తమాః. 46

ప్ర. అ. తత్ర= అక్కడ, నగాః =వృక్షములు, నిత్యపుష్పఫలాః= నిత్యములైన పుష్పఫలములు గలవి. పత్రరథాకులాః =పక్షులచేత వ్యాకులమైనవి. దివ్యగన్ధరసస్పర్శాః = దివ్యమైన వాసన, రుచి, స్పర్శ కలవి. సర్వకామాన్ =అన్ని కోరికలను, స్రవన్తి చ = ఇచ్చును. అన్యే =మరికొన్ని , నగోత్తమాః =వృక్షశ్రేష్ఠములు, నానాకారాణి = అనేక ఆకారములు గల, వాసాంసి =వస్త్రములు, ఫలన్తి =ఇచ్చును.

తా. అక్కడ ఉన్న వృక్షములు నిత్యము పుష్పఫలములతో నిండి ఉండును. పక్షులు వాటిపై నివసించుచుండును. దివ్యములైన గంధరసస్పర్శలు గల ఆ వృక్షములు అన్ని కోరికలను ఇచ్చును. కొన్ని వృక్షములు అనేక ఆకారములు గల వస్త్రములను ఫలించును. 45,46

మూ. ముక్తా వైదూర్యచిత్రాణి భూషణాని తథైవ చ,
స్త్రీణాం యాన్యనురూపాణి పురుషాణాం తథైవ చ. 47
సర్వర్తుసుఖసేవ్యాని ఫలన్త్యన్యే నగోత్తమాః,
మహార్హమణిచిత్రాణి ఫలన్త్యన్యే నగోత్తమాః. 48

ప్ర. అ. అన్యే =ఇతరమైన, నగోత్తమాః =శ్రేష్ఠమైన వృక్షములు, యాని = ఏవి, స్త్రీణామ్=స్త్రీలకు, తథైవ చ = మరియు, పురుషాణామ్ = పురుషులకు, అనురూపాణి = తగినవో, అట్టి, ముక్తావైదూర్యచిత్రాణి =ముత్యములచేత వైదూర్యములచేత చిత్రములైన, తథైవ చ = మరియు, సర్వర్తుసుఖసేవ్యాని = సమస్త ఋతువులయందు సుఖముగా సేవింపదగిన, భూషణాని = అలంకారములను, ఫలన్తి = ఫలించును. అన్యే = ఇతరమైన, నగోత్తమాః = శ్రేష్ఠమైన వృక్షములు, మహార్హమణిచిత్రాణి = అధికమైన మూల్యము గల మాణిక్యములతో చిత్రములైన వస్తువులను, ఫలన్తి = ఫలించును.

తా. కొన్ని వృక్షములు ముత్యములతోను వైదూర్యమాణిక్యములతోను, విచిత్రములైన, స్త్రీలకు, పురుషులకు కూడ అనురూపమైన, అన్ని ఋతువులయందు సుఖముగా సేవింపదగిన అలంకారములను, కొన్ని వృక్షములు అమూల్యములైన మణులతో విచిత్రములైన వస్తువులను ఫలించుచుండును. 47,48

మూ. శయనాని ప్రసూయన్తే చిత్రాస్తరణవన్తి చ,
మనఃకాన్తాని మాల్యాని ఫలన్త్యత్రాపరే ద్రుమాః. 49

ప్ర. అ. అత్ర = ఇక్కడ, అపరే = ఇతరమైన , ద్రుమాః = వృక్షములు, చిత్రాస్తరణవన్తి = చిత్రమైన ఆస్తరణములు గల, శయనాని = శయనములను, ప్రసూయన్తే = సృష్టించును. మనఃకాన్తాని = మనస్సుకు సుందరమైన, మాల్యాని = పుష్పమాలలను, ఫలన్తి = ఫలించును.

తా. ఇక్కడ మరి కొన్ని వృక్షములు చిత్రములైన ఆస్తరణములు గల శయనములను మనస్సును ఆకర్షించు పుష్పమాలలను ఫలించును. 49

మూ. పానాని చ మహార్హాణి భక్ష్యాణి వివిధాని చ,
స్త్రియశ్చ గుణసమ్పన్నా రూపయౌవనలక్షితాః. 50

ప్ర. అ. మహార్హాణి = అధికమైన మూల్యము గల, పానాని = పానములను, వివిధాని = అనేక విధములైన, భక్ష్యాణి చ = భక్ష్యములను, గుణసమ్పన్నాః = గుణములతో కూడిన, రూపయౌవనలక్షితాః = రూపముతోను యౌవనముతోను కూడిన, స్త్రియశ్చ= స్త్రీలను (ఇచ్చును.)

తా. కొన్ని వృక్షములు, చాల విలువ గల పానములను, అనేకవిధములైన భక్ష్యములను, రూపయౌవనములతో ప్రకాశించు సద్గుణవతులైన స్త్రీలను ఇచ్చును.

మూ. గన్ధర్వాః కింనరాః సిద్ధా నాగా విద్యాధరాస్తథా,
రమన్తే సతతం తత్ర నారీభిర్భాస్వరప్రభాః. 51

ప్ర. అ. భాస్వరప్రభాః = ప్రకాశించుచున్న కాంతులు గల, గన్ధర్వాః = గంధర్వులు, కింనరాః = కిన్నరులు, సిద్ధాః = సిద్ధులు, నాగాః = నాగులు, తథా = మరియు, విద్యాధరాః = విద్యాధరులు, తత్ర = అక్కడ, సతతమ్ = ఎల్లప్పుడు, నారీభిః = స్త్రీలతో, రమన్తే = క్రీడించుచుందురు.

తా. కాంతితో ప్రకాశించుచున్న గంధర్వ - కింనర - సిద్ధ - నాగ - విద్యాధరులు అక్కడ స్త్రీలతో కూడి ఎల్లప్పుడు విహరించుచుందురు. 51

మూ. సర్వే సుకృతకర్మాణః సర్వే రతిపరాయణాః,
సర్వే కామార్థసహితా వసన్తి సహయోషితః. 52

ప్ర. అ. సర్వే = అందరు, సుకృతకర్మాణః-మంచి కర్మలు గలవారు; సర్వే = అందరు, రతిపరాయణాః = రతియం దాసక్తి కలవారు; సర్వే = అందరు, కామార్థసహితాః = కామార్థములతో కూడినవారై, సహయోషితః = స్త్రీలతో కూడినవారై, వసన్తి = నివసించుచున్నారు.

తా. అక్కడ ఉన్నవా రందరు పుణ్యాత్ములు. రతియందు ఆసక్తి కలవారు. కామార్థములందు ప్రీతికలవారై స్త్రీలతో కలిసి నివసించుచుందురు. 52

మూ. గీతవాదిత్రనిర్ఘోషః సోత్కృష్టహసితస్వనః,
శ్రూయతే సతతం తత్ర సర్వభూతమనోరమః. 53

ప్ర. అ. సోత్కృష్టహసితస్వనః = అధికమైన నవ్వుల ధ్వనితో కలిసిన, సర్వభూతమనోరమః = సకలభూతములకు మనోహరమైన, గీతవాదిత్రనిర్ఘోషః = గీతములయొక్క, వాద్యములయొక్క ధ్వని, తత్ర = అక్కడ, సతతమ్ = ఎల్లపుడు, శ్రూయతే = వినబడుచుండును.

తా. అక్కడ అధికమైన నవ్వుల ధ్వనులతో కలిపి సకలభూతములకు మనోహరమైన గీతవాద్యముల ధ్వని ఎల్లపుడు వినబడుచుండును. 53

మూ. తత్ర నాముదితః కశ్చిన్నాత్ర కశ్చిదసత్ప్రియః,
అహన్యహని వర్ధన్తే గుణాస్తత్ర మనోరమాః. 54

ప్ర. అ. తత్ర = అక్కడ, అముదితః = సంతోషించనివాడు, కశ్చిత్ = ఎవడును, న = ఉండడు. అసత్ప్రియః = చెడ్డవారికి ఇష్టమైనవాడు, కశ్చిత్ = ఎవ్వడూ, న = ఉండడు; తత్ర = అక్కడ, అహన్యహని = ప్రతిదినమునందు, మనోరమాః = మనోహరములైన, గుణాః = గుణములు, వర్ధన్తే = వృద్ధిపొందుచుండును.

తా. అక్కడ సంతోషించనివాడు కాని, చెడ్డవారికి ఇష్టుడు గాని ఎవ్వడూ ఉండడు. అక్కడ మనోహరమైన గుణములు రోజు రోజుకు వృద్ధి పొందుచుండును. 54

మూ. తమతిక్రమ్య శైలేన్ద్రముత్తరః పయసాం నిధిః,
తత్ర సోమగిరిర్నామ మధ్యే హేమమయో మహాన్. 55

ప్ర. అ. తమ్ = ఆ, శైలేన్ద్రమ్ = పర్వతమును, అతిక్రమ్య = దాటి, ఉత్తరః= ఉత్తరమైన, పయసాం నిధిః= సముద్రము ఉన్నది. తత్ర= అక్కడ, మధ్యే= మధ్యయందు, హేమమయః= బంగారువికారమైన, మహాన్= గొప్పదైన, సోమగిరిర్నామ= సోమగిరి యను పర్వతము ఉన్నది.

తా. ఆ పర్వతమును దాటిన పిమ్మట ఉత్తరసముద్రము వచ్చును. దాని మధ్యయందు సోమగిరి అను గొప్ప బంగారు పర్వత ముండును. 55

మూ. ఇన్ద్రలోకగతా యే చ బ్రహ్మలోకగతాశ్చ యే,
దేవాస్తం సమవేక్షన్తే గిరిరాజం దివం గతాః. 56

ప్ర. అ. యే = ఎవరు, ఇన్ద్రలోకగతాః = ఇంద్రలోకములో ఉన్నారో, యే = ఎవరు, బ్రహ్మలోకగతాశ్చ = బ్రహ్మలోకములో ఉన్నారో, దేవాః = అట్టి దేవతలు, దివమ్ = ఆకాశమును, గతాః = పొందినవారై, తమ్ = ఆ, గిరిరాజమ్ = పర్వతరాజును, సమవేక్షన్తే= చూచుచుందురు.

తా. ఇంద్రలోకములోను, బ్రహ్మలోకములోను ఉన్న దేవతలు ఆకాశములో నిలచి ఆ పర్వతరాజు సౌందర్యమును చూచుచుందురు. 56

మూ. స తు దేశో విసూర్యోఽపి తస్య భాసా ప్రకాశతే,
సూర్యలక్ష్మ్యాభివిజ్ఞేయస్తపతేవ వివస్వతా. 57

ప్ర. అ. సః దేశః = ఆ ప్రదేశము, విసూర్యో ఽపి = సూర్యుడు లేనిదైనను, సూర్యలక్ష్మ్యా = సూర్యునియొక్క శోభచేత, అభివిజ్ఞేయః = తెలియదగిన పదార్థములు గలదై, తపతా = ప్రకాశించుచున్న, వివస్వతా ఇవ = సూర్యునిచేత వలె, తస్య = ఆ పర్వతముయొక్క, భాసా=కాంతిచేత, ప్రకాశతే=ప్రకాశించుచున్నది.

తా. ఆ ప్రదేశములో సూర్యుడు లేకపోయినను సూర్యుడు ప్రకాశించుచున్నాడా అన్నట్లు అది సూర్యుని కాంతి వంటి కాంతితో కూడినదై ఆ పర్వతము కాంతిచేత ప్రకాశించుచున్నది. 57

మూ. భగవాంస్తత్ర విశ్వాత్మా శమ్భురేకాదశాత్మకః,
బ్రహ్మా వసతి దేవేశో బ్రహ్మర్షిపరివారితః. 58

ప్ర. అ. తత్ర = అక్కడ, విశ్వాత్మా = ప్రపంచస్వరూపుడు, ఏకాదశాత్మకః = ఏకాదశమూర్తులు గల, శమ్భుః = శివుడు, బ్రహ్మర్షిపరివారితః = బ్రహ్మర్షులతో కూడిన, దేవేశః = దేవతల ప్రభువైన, బ్రహ్మా = బ్రహ్మయు, వసతి = నివసించుచున్నాడు.

తా. అక్కడ ప్రపంచస్వరూపుడు పదకొండు మూర్తులు కలవాడు అయిన భగవంతుడైన శివుడు, బ్రహ్మర్షులతో కూడిన దేవతాప్రభువైన బ్రహ్మదేవుడును నివసించుచుందురు. 58

మూ. న కథంచన గన్తవ్యం కురూణాముత్తరేణ వః,
అన్యేషామపి భూతానాం నానుక్రామతి వై గతిః. 59

ప్ర. అ. కురూణాముత్తరేణ = కురుదేశమున కుత్తరముగా, కథంచన = ఏ విధముగాను, వః = మీకు, న గన్తవ్యమ్ = వెళ్ళదగినది కాదు. అన్యేషామ్ = ఇతరములైన, భూతానామ్ అపి = భూతములకు కూడ, గతిః = గమనము, నానుక్రామతి = ప్రసరించదు.

తా. మీరు కురుదేశమునకు ఉత్తరముగా ఎట్టి పరిస్థితిలోను వెళ్ళకూడదు. ఇతర ప్రాణులు కూడ అచటికి వెళ్లజాలరు. 59

మూ. స హి సోమగిరిర్నామ దేవానామపి దుర్గమః,
తమాలోక్య తతః క్షిప్రముపావర్తితుమర్హథ. 60

ప్ర. అ. సోమగిరిర్నామ = సోమగిరి అను పేరు గల, సః = ఆ పర్వతము, దేవానామపి = దేవతలకు కూడ, దుర్గమః = వెళ్లుటకు శక్యము గానిది. తమ్ = ఆ పర్వతమును, ఆలోక్య = చూచి, తతః = అక్కడి నుండి, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఉపావర్తితుమ్ = తిరిగి వచ్చుటకు, అర్హథ=తగి యున్నారు.

తా. ఈ సోమగిరికి దేవతలు కూడ వెళ్ళజాలరు. మీరు దానిని చూచి వెంటనే తిరిగి రండు. 60

మూ. ఏతావద్వానరైః శక్యం గన్తుం వానరపుఙ్గవాః,
అభాస్కరమమర్యాదం న జానీమస్తతః పరమ్. 61

ప్ర. అ., తా. చూ. 51వ శ్లోకము 42వ సర్గ.

మూ. సర్వమేతద్విచేతవ్యం యన్మయా పరికీర్తితమ్,
యదన్యదపి నోక్తం చ తత్రాపి క్రియతాం మతిః. 62

ప్ర. అ. మయా=నాచేత, యత్=ఏది, పరికీర్తితమ్=చెప్పబడినదో, ఏతత్=ఇది, సర్వమ్=సమస్తము, విచేతవ్యమ్=వెదకదగినది. అన్యదపి=ఇతరమైనది,

యత్=ఏది, నోక్తమ్=చెప్పబడలేదో, తత్రాపి చ=దాని విషయమునందు కూడ, మతిః=బుద్ధి, క్రియతామ్=చేయబడుగాక!

తా. నేను చెప్పిన ప్రదేశము లన్నీ వెదకుడు. నేను చెప్పనిది ఏదైన ఉన్నచో అక్కడ కూడ మీరు ఆలోచించి అన్వేషించుడు. 62

మూ. తతః కృతం దాశరథేర్మహత్ప్రియం
మహత్తరం చాపి తతో మమ ప్రియమ్,
కృతం భవిష్యత్యనిలానలోపమా
విదేహజాదర్శనజేన కర్మణా. 63

ప్ర. అ. అనిలానలోపమాః=వాయువుతోను అగ్నితోను సమానులైన వానరులారా! తతః= అటు పిమ్మట, విదేహజాదర్శనజేన=సీతయొక్క దర్శనమువలన కలిగిన, కర్మణా=కర్మచేత, దాశరథేః=రామునకు, మహత్=గొప్ప, ప్రియమ్=ప్రియము, కృతమ్=చేయబడినది, (కాగలదు). తతః అపి=అంత కంటె కూడ, మమ=నాకు, మహత్తరమ్=అధికమైన, ప్రియమ్=ప్రియము, కృతమ్=చేయబడినది, భవిష్యతి=కాగలదు.

తా. వాయువుతోను, అగ్నితోను సమానులైన ఓ! వానరులారా! మీరు సీతను అన్వేషించి ఆమెను చూచినచో రామునకు చాల ప్రియము చేసినట్లగును. నాకు అంతకంటె అధికముగా ప్రియము చేసినట్లగును. 63

మూ. తతః కృతార్థాః సహితాః సబాన్ధవాః
మయార్చితాః సర్వగుణైర్మనోరమైః,
చరిష్యథోర్వీం ప్రతి శాన్తశాత్రవాః
సహప్రియా భూతధరాః ప్లవఙ్గమాః. 64

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా! తతః=అటుపిమ్మట, కృతార్థాః=కృతార్థులై, సహితాః=కలిసినవారై, సబాన్ధవాః=బంధువులతో కూడినవారై, మయా=నాచేత, మనోరమైః=మనోహరములైన, సర్వగుణైః=అన్ని గుణములచేత, అర్చితాః=పూజింపబడినవారై, శాన్తశాత్రవాః=నశించిన శత్రువులు కలవారై, సహప్రియాః=ప్రియురాండ్రతో కూడినవారై, భూతధరాః=ఇతరప్రాణులను పోషించువారై, ఉర్వీమ్=భూమిని, ప్రతిచరిష్యథ=సంచరించగలరు.

తా. వానరులారా! మీరు అందరు కలిసి కార్యము సాధించి, నేను ఇచ్చిన

మనోహరములైన ఉత్తమపదార్థములను స్వీకరించి, భార్యాబంధుసమేతులై శత్రువులు లేనివారై, ఇతరప్రాణులను కూడ పోషించుచు, భూమిపై సంచరించగలరు. 64

*"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో*
నలుబది మూడవ సర్గ సమాప్తము.

## అథ చతుశ్చత్వారింశః సర్గః

*[రాముడు దక్షిణదిక్కుకు వెళ్లుచున్న హనుమంతునికి ముద్రికను ఇచ్చుట].*

మూ. విశేషేణ తు సుగ్రీవో హనూమత్యర్థముక్తవాన్,
స హి తస్మిన్ హరిశ్రేష్ఠే నిశ్చితార్థోఽర్థసాధనే. 1

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, విశేషేణ=విశేషముచేత, హనూమతి=హనుమంతుని విషయమున, అర్థమ్=ఈ విషయమును, ఉక్తవాన్=చెప్పినాడు. సః=సుగ్రీవుడు, అర్థసాధనే=కార్యసాధనవిషయమున, తస్మిన్ హరిశ్రేష్ఠే=ఆ వానరశ్రేష్ఠుడైన హనుమంతునియందు, నిశ్చితార్థః హి=నిశ్చితమైన అర్థము కలవాడు కదా?

తా. సుగ్రీవుడు విశేషించి హనుమంతునితో ఇట్లు చెప్పెను. ఎందుచేత ననగా కార్యమును సాధించు విషయమున సుగ్రీవునకు హనుమంతునియందు నమ్మిక ఉండెను. 1

మూ. అబ్రవీచ్చ హనూమన్తం విక్రాన్తమనిలాత్మజమ్,
సుగ్రీవః పరమప్రీతః ప్రభుః సర్వవనౌకసామ్. 2

ప్ర. అ. సర్వవనౌకసామ్=సకలవానరులకు, ప్రభుః=ప్రభువైన, సుగ్రీవః=సుగ్రీవుడు, పరమప్రీతః=చాల సంతోషించినవాడై, విక్రాన్తమ్=పరాక్రమవంతుడు, అనిలాత్మజమ్=వాయుపుత్రుడు అయిన, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీచ్చ= ఇట్లు పలికెను.

తా. సకలవానరుల ప్రభువైన సుగ్రీవుడు సంతోషించుచు పరాక్రమవంతుడు, వాయుపుత్రుడు అయిన హనుమంతునితో ఇట్లనెను. 2

మూ. న భూమౌ నాన్తరిక్షే వా నామ్బరే నామరాలయే,
నాప్సు వా గతిసఙ్గం తే పశ్యామి హరిపుఙ్గవ!. 3

ప్ర. అ. హరిపుఙ్గవ=ఓ! వానరశ్రేష్ఠుడా! భూమౌ=భూమియందు, తే=నీయొక్క, గతిసఙ్గమ్=గమనమునకు అడ్డును, న పశ్యామి=చూడను. అన్తరిక్షే వా = అంతరిక్షమునందు, న = చూడను. అమ్బరే=ఎత్తైన ఆకాశమునందు, న=చూడను. అమరాలయే=స్వర్గమునందు, న=చూడను. అప్సు వా= ఉదకమునందైనా, న=చూడను.

తా. వానరశ్రేష్ఠుడవైన హనుమంతుడా! భూమి యందుగాని, భూమికి

దగ్గరగా నున్న పక్షులు ఎగిరే అంతరిక్షమునందు గాని, సుదూరాకాశమునందు గాని, స్వర్గలోకములో గాని, నీటిలో కాని నీ గమనమునకు అడ్డు లేదు. 3

మూ. సాసురాః సహగన్ధర్వాః సనాగనరదేవతాః,
విదితాః సర్వలోకాస్తే ససాగరధరాధరాః. 4

ప్ర. అ. సాసురాః=అసురులతో గూడిన, సహగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, సనాగనరదేవతాః=నాగులతోను, నరులతోను,దేవతలతోను కూడిన, ససాగరధరాధరాః= సముద్రములతోను, పర్వతములతోను కూడిన, సర్వలోకాః=సమస్తలోకములు, తే=నీకు, విదితాః=తెలిసినవి.

తా. అసురులతోను, గంధర్వులతోను నాగ - నర - దేవతలతోను, సముద్రములతోను, పర్వతములతోను కూడిన సర్వలోకములు నీకు తెలియును. 4

మూ. గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవం చ మహాకపే,
పితుస్తే సదృశం వీర మారుతస్య మహౌజసః. 5

ప్ర. అ. వీర!=ఓ! వీరుడా, మహాకపే=హనుమంతుడా! తే=నీయొక్క, గతిః= గతి, వేగశ్చ=వేగము, తేజశ్చ=తేజస్సు, లాఘవం చ=శీఘ్రత్వము, పితుః= తండ్రియైన, మహౌజసః=గొప్ప తేజస్సు గల, మారుతస్య=వాయువునకు, సదృశమ్= సమానమైనది(వి).

తా. వీరుడవైన హనుమంతుడా! గమనములోను, వేగములోను, తేజస్సు లోను, శీఘ్రత్వములోను నీవు మహాతేజశ్శాలియైన నీ తండ్రియైన వాయువుతో సమానుడవు. 5

మూ. తేజసా వాపి తే భూతం న సమం భువి విద్యతే,
తద్యథా లభ్యతే సీతా తత్త్వమేవానుచిన్తయ. 6

ప్ర. అ. తేజసా వాపి=తేజస్సుచేత కూడ, తే=నీకు, సమమ్=సమానమైన, భూతమ్=ప్రాణి, భువి=భూలోకములో, న విద్యతే=లేదు. తత్=ఆ కారణమువలన, సీతా=సీత, యథా=ఎట్లు, లభ్యతే=పొందబడునో, తత్=దానిని, త్వమేవ=నీవే, అనుచిన్తయ=ఆలోచించుము.

తా. తేజస్సుచేత నీకు సమానమైన ప్రాణి ఏదీ ఈ భూలోకములో లేదు. అందువలన సీత లభించు ఉపాయమును నీవే ఆలోచించుము. 6

మూ. త్వయ్యేవ హనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః,
దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపణ్డిత. 7

ప్ర. అ. నయపణ్డిత=నీతియందు పండితుడవైన, హనుమన్=హనుమంతుడా! బలమ్= బలము, బుద్ధిః=బుద్ధి, పరాక్రమః=పరాక్రమము, దేశకాలానువృత్తిశ్చ= దేశ

కాలములను అనువర్తించుట, నయశ్చ=నీతి, త్వయ్యేవ=నీయందే, అస్తి=ఉన్నది.(వి)

తా. నీతియందు పండితుడవైన ఓ! హనుమంతుడా! బలము, బుద్ధి, పరాక్రమము, దేశకాలానుగుణముగా ప్రవర్తించుట, నీతి-ఇవన్నీ నీయందే ఉన్నవి.

మూ. తతః కార్యసమాసఙ్గమవగమ్య హనూమతి,
విదిత్వా హనుమన్తం చ చిన్తయామాస రాఘవః. 8

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, హనూమతి=హనుమంతునియందు, కార్యసమాసఙ్గమ్=కార్యముయొక్క సంబంధమును, అవగమ్య=తెలిసికొని, హనుమన్తం చ=హనుమంతుని గూర్చి, విదిత్వా=తెలిసికొని, చిన్తయామాస=ఆలోచించెను.

తా. రాముడు హనుమంతునిలో ఉన్న కార్యమును సాధించు శక్తిని తెలిసికొని, ఆతని విషయమును పూర్తిగా గ్రహించి ఈ విధముగా ఆలోచించెను.

మూ. సర్వథా నిశ్చితార్థోఽయం హనూమతి హరీశ్వరః,
నిశ్చితార్థతరశ్చాపి హనూమాన్కార్యసాధనే. 9

ప్ర. అ. అయమ్=ఈ, హరీశ్వరః=సుగ్రీవుడు, సర్వథా=అన్ని విధముల, హనూమతి = హనుమంతునియందు, నిశ్చితార్థః=నిశ్చితమైన కార్యము గలవాడు. కార్యసాధనే= కార్యమును సాధించుటయందు, హనుమాన్=హనుమంతుడు, నిశ్చితార్థతరశ్చాపి=ఎక్కువ కార్యనిశ్చయము కలవాడు.

తా. ఈ సుగ్రీవునకు హనుమంతునిపై కార్యమును సాధించు విషయమున అన్ని విధముల విశ్వాస మున్నది. కార్యమును సాధించుటలో హనుమంతుడు మిక్కిలి కార్యనిశ్చయము కలవాడు. 9

మూ. తదేవం ప్రస్థితస్యాస్య పరిజ్ఞాతస్య కర్మభిః,
భర్త్రా పరిగృహీతస్య ధ్రువః కార్యఫలోదయః. 10

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, ఏవమ్=ఇట్లు, ప్రస్థితస్య=ప్రయాణమైనవాడు, కర్మభిః=పనులచేత, పరిజ్ఞాతస్య=తెలియబడినవాడు, భర్త్రా=ప్రభువుచేత, పరిగృహీతస్య=స్వీకరింపబడినవాడు అయిన, అస్య=ఇతనియొక్క, కార్యఫలోదయః= కార్యముయొక్క ఫలముయొక్క లాభము, ధ్రువః=నిశ్చితము.

తా. ఇతడు పూర్వము చేసిన పనులచేత ప్రసిద్ధి పొందినాడు. ప్రభువు విశ్వాసమును చూరగొనినాడు. ఇపుడు బయలుదేరి వెళ్ళుచున్న ఇతడు కార్యమును సఫలము చేయుట నిశ్చితము. 10

మూ. తం సమీక్ష్య మహాతేజా వ్యవసాయోత్తరం హరిమ్,
కృతార్థ ఇవ సంవృత్తః ప్రహృష్టేన్ద్రియమానసః. 11

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల ఆ రాముడు, వ్యవసాయోత్తరమ్=ఉద్యమము చేత శ్రేష్ఠుడైన, తమ్=ఆ, హరిమ్=హనుమంతుని, సమీక్ష్య=చూచి, ప్రహృష్టేన్ద్రియమానసః=సంతోషించిన ఇంద్రియములు, మనస్సు కలవాడై, కృతార్థ ఇవ= కృతార్థుడు వలె, సంవృత్తః=ఆయెను.

తా. మహాతేజశ్శాలియైన ఆ రాముడు, ఉద్యమము చేయుటలో చాల సమర్థుడైన ఆ హనుమంతుని చూచి, ఇంద్రియములు మనస్సు ఆనందముతో నిండగా తన పని పూర్తి యైనట్లు భావించెను. 11

మూ. దదౌ తస్య తతః ప్రీతః స్వనామాఙ్కోపశోభితమ్,
అఙ్గులీయమభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః. 12

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరంతపః=శత్రుసంహారకుడైన ఆ రాముడు, ప్రీతః= సంతోషించినవాడై, స్వనామాఙ్కోపశోభితమ్=తన నామముయొక్క చిహ్నముచేత ప్రకాశింపచేయుబడిన, అఙ్గులీయమ్=ఉంగరమును, రాజపుత్ర్యాః=సీతకు, అభిజ్ఞానమ్=ఆనవాలుగా, తస్య= అతనికి, దదౌ=ఇచ్చెను.

తా. పిమ్మట ఆ రాముడు సంతోషించుచు, సీతకు ఆనవాలుకొరకై తన నామధేయము చెక్కిన - ఉంగరమును హనుమంతునకు ఇచ్చెను. 12

మూ. అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా,
మత్సకాశాదనుప్రాప్తమనుద్విగ్నానుపశ్యతి. 13

ప్ర. అ. హరిశ్రేష్ఠ=ఓ! వానరశ్రేష్ఠుడా! అనేన=ఈ, చిహ్నేన=చిహ్నముచేత, జనకాత్మజా=సీత, త్వామ్=నిన్ను, మత్సకాశాత్=నా సమీపమునుండి, అనుప్రాప్తమ్=వచ్చినవానివిగా, అనుద్విగ్నా=భయపడనిదై, అనుపశ్యతి=ఊహించును.

తా. హనుమంతుడా! ఈ చిహ్నమును చూచి సీత నీవు నా దగ్గరనుండియే వచ్చితి వని ఊహించి భయపడకుండా ఉండును. 13

మూ. వ్యవసాయశ్చ తే వీర సత్త్వయుక్తశ్చ విక్రమః,
సుగ్రీవస్య చ సన్దేశః సిద్ధిం కథయతీవ మే. 14

ప్ర. అ. వీర!=ఓ వీరుడా! తే=నీయొక్క, వ్యవసాయః=ఉత్సాహము, సత్త్వయుక్తః=బలముతో కూడిన, విక్రమశ్చ=పరాక్రమము, సుగ్రీవస్య= సుగ్రీవునియొక్క, సన్దేశశ్చ=సందేశము, మే=నాకు, సిద్ధిమ్=సిద్ధిని, కథయతీవ= చెప్పుచున్నట్లున్నవి.

తా. ఓ వీరుడా! నీ ఉత్సాహము, బలము, పరాక్రమము, సుగ్రీవుడు నీతో చెప్పిన మాటలు కార్యము సిద్ధించునని నాకు చెప్పుచున్నట్లున్నవి. 14

మూ. స తద్గృహ్య హరిశ్రేష్ఠః కృత్వా మూర్ధ్ని కృతాఞ్జలిః,
వన్దిత్వా చరణౌ చైవ ప్రస్థితః ప్లవగర్షభః. 15

ప్ర.అ. ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడైన, సః=ఆ, హరిశ్రేష్ఠః=హనుమంతుడు, తత్=దానిని, గృహ్యా=గ్రహించి, మూర్ధ్ని=శిరస్సునందు, కృత్వా=ఉంచుకొని, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, చరణౌ చైవ=పాదములను కూడ, వన్దిత్వా=నమస్కరించి, ప్రస్థితః=ప్రయాణమాయెను.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు ఆ ఉంగరమును గ్రహించి, శిరస్సుపై ఉంచుకొని, చేతులు జోడించి నమస్కరించి, పాదాభివందనము కూడ చేసి ప్రయాణమయ్యెను. 15

మూ. స తత్ప్రకర్షన్ హరిణాం మహద్బలం
బభూవ వీరః పవనాత్మజః కపిః,
గతామ్బుదే వ్యోమ్ని విశుద్ధమణ్డలః
శశీవ నక్షత్రగణోపశోభితః. 16

ప్ర. అ. హరిణామ్=వానరులయొక్క, మహత్=గొప్పదైన, తత్ బలమ్=ఆ సైన్యమును, ప్రకర్షన్=లాగికొనివెళ్ళుచున్న, వీరః=వీరుడైన, పవనాత్మజః=వాయుపుత్రుడైన, సః కపిః=ఆ హనుమంతుడు,గతామ్బుదే=పోయిన మేఘములు గల, వ్యోమ్ని= ఆకాశమునందు, నక్షత్రగణోపశోభితః=నక్షత్రముల గణములచేత శోభింపచేయబడిన, శశీవ=చంద్రుడు వలె, బభూవ=ఉండెను.

తా. విశాలమైన ఆ వానరసైన్యమును తీసుకొని వెళ్లుచున్న వీరుడైన ఆ వాయుకుమారుడు మేఘములు లేని ఆకాశమునందు నక్షత్రగణములతో ప్రకాశించుచున్న పరిశుద్ధమైన చంద్రమండలము వలె నుండెను. 16

మూ. అతిబల బలమాశ్రితస్తవాహం
హరివరవిక్రమ విక్రమైరనల్పైః,
పవనసుత యథాధిగమ్యతే సా
జనకసుతా హనుమంస్తథా కురుష్వ. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుశ్చత్వారింశః సర్గః

ప్ర. అ. అతిబల=అధికమైన బలము కలవాడా! హరివరవిక్రమ=శ్రేష్ఠమైన సింహము వంటి పరాక్రమము కలవాడా! పవనసుత!=వాయుపుత్రుడా! హనుమన్=హనుమంతుడా! అహమ్=నేను, తవ=నీయొక్క, బలమ్ = బలమును, ఆశ్రితః=ఆశ్రయించి ఉన్నాను. అనల్పైః=అధికములైన, విక్రమైః= పరాక్రమములచేత, సా=ఆ, జనకసుతా=సీత, యథా=ఎట్లు, అధిగమ్యతే= పొందబడునో, తథా=అట్లు, కురుష్వ=చేయుము.

తా. సింహము వంటి పరాక్రమము గల మహాబలశాలివైన ఓ! వాయుకు

మారా! నేను నీ బలముపై ఆధారపడి ఉన్నాను. అత్యధికమైన పరాక్రమమును చూపి ఆ సీత లభించు నట్లు చేయుము. 17

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదినాల్గవసర్గ సమాప్తము.

# అథ పఞ్చచత్వారింశః సర్గః

[ఆ యా దిక్కులకు వెళ్లుచున్న వానరులు సుగ్రీవుని సమక్షమున తమ ఉత్సాహమును ప్రదర్శించు మాటలు చెప్పుట]

మూ. సర్వాంశ్చాహూయ సుగ్రీవః ప్లవగాన్ ప్లవగర్షభః,
సమస్తాంశ్చాబ్రవీద్రాజా రామకార్యార్థసిద్ధయే. 1
ఏవమేతద్విచేతవ్యం భవద్భిర్వానరోత్తమైః.

ప్ర. అ. ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడు, రాజా=రాజు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, సర్వాన్=సమస్తమైన, ప్లవగాన్=వానరులను, ఆహూయ=పిలచి, రామకార్యార్థసిద్ధయే=రాముని కార్యముయొక్క ప్రయోజనము సిద్ధించుటకొరకు, సమస్తాన్=సమస్తమైన వారిని గూర్చి, అబ్రవీత్=పలికెను. వానరోత్తమైః=వానరశ్రేష్ఠులైన, భవద్భిః= మీచేత, ఏవమ్=ఇట్లు, ఏతత్=ఇది, విచేతవ్యమ్=వెదకదగినది.

తా. వానరశ్రేష్ఠుడు రాజు అయిన సుగ్రీవుడు, ఆ వానరులందరిని పిలచి, రాముని కార్యమును సాధించుటకై వారితో ఇట్లనెను. వానరశ్రేష్ఠులైన మీరు నేను చెప్పిన విధముగా అన్వేషణము చేయవలెను. 1

మూ. తదుగ్రశాసనం భర్తుర్విజ్ఞాయ హరిపుఙ్గవాః, 2
శలభా ఇవ సఞ్ఛాద్య మేదినీం సమ్ప్రతస్థిరే.

ప్ర. అ. హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, భర్తుః=ప్రభువుయొక్క, తత్=ఆ, ఉగ్రశాసనమ్=ఉగ్రమైన ఆజ్ఞను, విజ్ఞాయ=తెలిసికొని, మేదినీమ్=భూమిని, శలభా ఇవ=మిడతల వలె, సఞ్ఛాద్య=కప్పి, సమ్ప్రతస్థిరే=బయలుదేరిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు ప్రభువైన సుగ్రీవుని ఉగ్రమైన శాసనమును విని భూమిని మిడతల దండు వలె కప్పి వేయుచు ప్రయాణమైరి. 2

మూ. రామః ప్రస్రవణే తస్మిన్న్యవసత్సహలక్ష్మణః, 3
ప్రతీక్షమాణస్తం మాసం యః సీతాధిగమే కృతః.

ప్ర. అ. రామః=రాముడు, సహలక్ష్మణః=లక్ష్మణసహితుడై, యః=ఏది, సీతాధిగమే=సీతను చూచుటకు, కృతః=విధింపబడినదో, తం మాసమ్=ఆ మాసమును, ప్రతీక్షమాణః=నిరీక్షించుచు, తస్మిన్ ప్రస్రవణే=ఆ ప్రస్రవణ పర్వతముమీద, న్యవసత్=నివసించెను.

తా. రాముడు లక్ష్మణసహితుడై సీతను చూచుటకు సుగ్రీవుడు వానరులకు

విధించిన ఆ మాసము ఆ ప్రస్రవణపర్వతముమీద నివసించెను. 3

మూ. ఉత్తరాం తు దిశం రమ్యాం గిరిరాజసమావృతామ్, 4
ప్రతస్థే సహసా వీరో హరిః శతబలస్తదా.

ప్ర. అ. తదా=అపుడు, శతబలః=శతబలు డను, వీరః=వీరుడైన, హరిః= వానరుడు, గిరిరాజసమావృతామ్=పర్వతరాజైన హిమవంతునితో కూడిన, రమ్యామ్=సుందరమైన, ఉత్తరాం దిశమ్=ఉత్తరదిక్కును గూర్చి, సహసా=వెంటనే, ప్రతస్థే=ప్రయాణమాయెను.

తా. అపుడు శతబలుడు అను వీరుడైన వానరుడు, హిమవంతునితో కూడిన సుందరమైన ఉత్తరదిక్కునకు వెంటనే బయలుదేరి వెళ్లెను. 4

మూ. పూర్వాం దిశం ప్రతియయౌ వినతో హరియూథపః, 5
తారాఙ్గదాదిసహితః ప్లవగః పవనాత్మజః,
అగస్త్యచరితామాశాం దక్షిణాం హరియూథపః. 6

ప్ర. అ. హరియూథపః=వానరసేనానాయకుడైన, వినతః=వినతుడు, పూర్వాం దిశం ప్రతి= తూర్పు దిక్కును గూర్చి, యయౌ=వెళ్లెను. హరియూథపః=వానరసేనానాయకుడు, పవనాత్మజః=వాయుకుమారుడు అయిన, ప్లవగః=హనుమంతుడు, తారాఙ్గదాదిసహితః= తారుడు, అంగదుడు మొదలైన వారితో కూడినవాడై, అగస్త్యచరితామ్=అగస్త్యునిచేత సంచరించబడిన, దక్షిణామ్ ఆశామ్=దక్షిణదిక్కును గూర్చి వెళ్లెను.

తా. వానరనాయకుడైన వినతుడు తూర్పు దిక్కుకు వెళ్లెను. వానరనాయకుడైన హనుమంతుడు తారాంగదాదులతో కలిసి అగస్త్యుని సంచారస్థానమైన దక్షిణదిక్కునకు వెళ్లెను. 5,6

మూ. పశ్చిమాం చ దిశం ఘోరాం సుషేణః ప్లవగోత్తమః,
ప్రతస్థే హరిశార్దూలో దిశం వరుణపాలితామ్. 7

ప్ర. అ. ప్లవగేశ్వరః=వానరప్రభువైన, హరిశార్దూలః=వానరశ్రేష్ఠుడైన, సుషేణః= సుషేణుడు, వరుణపాలితామ్ దిశమ్=వరుణునిచేత పాలింపబడిన దిక్కైన, ఘోరామ్=భయంకరమైన, పశ్చిమాం దిశమ్=పశ్చిమదిక్కును గూర్చి, ప్రతస్థే=ప్రయాణ మాయెను.

తా. వానరశ్రేష్ఠుడు, వానరనాయకుడు అయిన సుషేణుడు వరుణునిచేత పాలింపబడిన భయంకరమైన పశ్చిమదిక్కునకు వెళ్లెను. 7

మూ. తతః సర్వా దిశో రాజా చోదయిత్వా యథాతథమ్,
కపిసేనాపతీన్వీరో ముమోద సుఖితః సుఖమ్. 8

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వీరః=వీరుడైన, రాజా=సుగ్రీవుడు, కపి సేనాపతీన్= వానరసేనానాయకులను, యథాతథమ్=తగు విధముగా, సర్వాః దిశః=అన్ని దిక్కులను గూర్చి, చోదయిత్వా=పంపి, సుఖితః=సుఖముగలవాడై, సుఖమ్=సుఖముగా, ముమోద= ఆనందించెను.

తా. వీరుడైన సుగ్రీవుడు వానరసేనానాయకులను తగు విధముగా పలు దిక్కులకు పంపి సుఖవంతుడై ఆనందించెను. 8

మూ. ఏవం సఞ్చోదితాః సర్వే రాజ్ఞా వానరయూథపాః,
స్వాం స్వాం దిశమభిప్రేత్య త్వరితాః సమ్ప్రతస్థిరే. 9

ప్ర. అ. రాజ్ఞా=రాజుచేత, ఏవమ్=ఇట్లు, సఞ్చోదితాః=పంపబడిన, సర్వే= సమస్తమైన, వానరయూథపాః=వానరనాయకులు, స్వాం స్వామ్=తమ తమ, దిశమ్= దిక్కును, అభిప్రేత్య=ఉద్దేశించి, త్వరితాః=తొందరపడుచున్నవారై, సమ్ప్రతస్థిరే= ప్రయాణమైరి.

తా. సుగ్రీవునిచే పంపబడిన ఆ వానరసేనానాయకు లందరు తొందరపడుచు తమ తమ దిక్కులకు ప్రయాణ మైరి. 9

మూ. నదన్తశ్చోన్నదన్తశ్చ గర్జన్తశ్చ ప్లవఙ్గమాః,
క్ష్వేడన్తో ధావమానాశ్చ వినదన్తో మహాబలాః. 10

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల, ప్లవఙ్గమాః=వానరులు, నదన్తః=ధ్వని చేయుచున్నవారై, ఉన్నదన్తశ్చ=అరచుచున్నవారై, గర్జన్తశ్చ=గర్జించు చున్నవారై, క్ష్వేడన్తః= సింహనాదము చేయుచున్నవారై, వినదన్తః=వికృతనాదములు చేయుచున్నవారై, ధావమానాశ్చ= పరుగెత్తుచున్నవారై, వెళ్లిరి.

తా. గొప్ప బలము గల ఆ వానరులు ధ్వని చేయుచు, అరచుచు, గర్జించుచు, సింహనాదము చేయుచు, వికృతముగా అరచుచు, పరుగెత్తుచు వెళ్లిరి.

మూ. ఏవం సఞ్చోదితాః సర్వే రాజ్ఞా వానరయూథపాః,
ఆనయిష్యామహే సీతాం హనిష్యామశ్చ రావణమ్. 11

ప్ర. అ. రాజ్ఞా=సుగ్రీవునిచేత, ఏవమ్=ఇట్లు, సఞ్చోదితాః=పంపబడిన, సర్వే=సమస్తమైన, వానరయూథపాః=వానరసేనానాయకులు, సీతామ్=సీతను, ఆనయిష్యామహే=తీసుకొని వచ్చెదము. రావణమ్=రావణుని, హనిష్యామశ్చ=చంపెదము.

తా. సుగ్రీవునిచే పంపబడిన ఆ వానరు లందరు "రావణుని చంపి సీతను తీసుకొనివచ్చెదము" అని పలికిరి. 11

మూ. అహమేకో వధిష్యామి ప్రాప్తం రావణమాహవే,
తతశ్చోన్మథ్య సహసా హరిష్యే జనకాత్మజామ్. 12

ప్ర. అ. అహమ్=నేను, ఏకః=ఒక్కడనే, ఆహవే=యుద్ధమునందు, ప్రాప్తమ్= వచ్చిన, రావణమ్=రావణుని, వధిష్యామి=చంపగలను. తతశ్చ=అటుపి మ్మట, ఉన్మథ్య= రాక్షసులను పీడించి, సహసా=శీఘ్రముగా, జనకాత్మజామ్= సీతను, ఆహరిష్యే=తీసుకొని వచ్చెదను.

తా. "యుద్ధమునకు వచ్చిన రావణుని నేను ఒక్కడినే చంపెదను. పిమ్మట రాక్షసులను జయించి సీతను శీఘ్రముగా తీసుకొని వచ్చెదను" అని ఒక డనెను. 12

మూ. వేపమానాం శ్రమేణాద్య భవద్భిః స్థీయతామితి,
ఏక ఏవాహరిష్యామి పాతాలాదపి జానకీమ్. 13

ప్ర. అ. శ్రమేణ=శ్రమచేత, వేపమానామ్=వణకుచున్న, జానకీమ్= సీతను, పాతాలాదపి=పాతాళమునుండైనా, ఏక ఏవ=నేనొక్కడనే, ఆహరిష్యామి=తీసుకొని వచ్చెదను. అద్య=ఇపుడు, భవద్భిః=మీరు, స్థీయతామ్=ఉందురుగాక, ఇతి=అని, (ఒకడు పలికెను).

తా. "శ్రమచేత వణకుచున్న సీతను పాతాళమునుంచియైన నే నొక్కడనే తీసుకొని వచ్చెదను. మీరందరు ఇక్కడనే ఉండుడు." అని మరొకడు పలికెను.

మూ. విధమిష్యామ్యహం వృక్షాన్ దారయిష్యామ్యహం గిరీన్,
ధరణీం దారయిష్యామి క్షోభయిష్యామి సాగరాన్. 14

ప్ర. అ. అహమ్=నేను, వృక్షాన్=వృక్షములను, విధమిష్యామి=దూర ముగా విసిరివేసెదను. గిరీన్=పర్వతములను, దారయిష్యామి=చీల్చెదను. ధరణీమ్=భూమిని, దారయిష్యామి=చీల్చెదను. సాగరాన్=సముద్రములను, క్షోభ యిష్యామి=క్షోభింపచేసెదను.

తా. "నేను వృక్షములను విసిరివేసెదను. పర్వతములను భూమిని చీల్చివేసెదను. సాగరములను క్షోభింపచేసెదను" అని మరొకడు పలికెను. 14

మూ. అహం యోజనసఙ్ఖ్యాయాః ప్లవేయం నాత్ర సంశయః,
శతయోజనసఙ్ఖ్యాయాః శతం సమధికం హ్యహమ్. 15

ప్ర. అ. అహమ్=నేను, యోజనసఙ్ఖ్యాయాః=యోజనసంఖ్యయొక్క, శతమ్= శతమును, ప్లవేయమ్=ఎగిరెదను. అహమ్=నేను, శతయోజనసఙ్ఖ్యాయాః=నూరు యోజనముల సంఖ్యకంటె, సమధికమ్=అధికముగా, ఎగిరెదను. అత్ర=దీనియందు, సంశయః= సంశయము, న=లేదు.

తా. "నేను నూరు యోజనముల దూరము ఎగురగలను" అని ఒకడు, "నేను నూరు యోజనములకంటె ఎక్కువ దూరము ఎగురగలను; సందేహము లేదు" అని మరొకడు పలికెను. 15

మూ. భూతలే సాగరే వాఽపి శైలేషు చ వనేషు చ,
పాతాళస్యాపి వా మధ్యే న మమాచ్ఛిద్యతే గతిః. 16

ప్ర. అ. భూతలే=భూతలమునందు గాని, సాగరే వాఽపి=సముద్రమునందుగాని, శైలేషు చ=పర్వతములయందుగాని, వనేషు చ=వనములందు గాని, పాతాళస్య= పాతాళముయొక్క, మధ్యే వాపి=మధ్యయందు గాని, మమ=నాయొక్క, గతిః= గమనము, న ఆచ్ఛిద్యతే=అడ్డుకొనబడదు.

తా. భూతలమునందు కాని, సముద్రమునందుగాని, పర్వతములందు గాని, వనములందు గాని, పాతాళమధ్యమునందు గాని, నా గమనమునకు అడ్డు లేదని మరొక వానరుడు చెప్పెను. 16

మూ. ఇత్యేకైకస్తదా తత్ర వానరా బలదర్పితాః,
ఊచుశ్చ వచనం తస్య హరిరాజస్య సంనిధౌ. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చచత్వారింశః సర్గః.

ప్ర. అ. తదా=అపుడు, బలదర్పితాః=బలముచేత గర్వించిన, వానరాః=వానరులు, తత్ర=అక్కడ, తస్య=ఆ, హరిరాజస్య=సుగ్రీవునియొక్క, సంనిధౌ=సన్నిధియందు, ఏకైకః=ఒక్కొక్కడు, ఇతి=ఇట్లు, వచనమ్=వచనమును, ఊచుః=పలికిరి.

తా. అపుడు బలముచేత గర్వించిన ఆ వానరులు ఒక్కరొక్కరుగా ఆ సుగ్రీవుని సమక్షమున ఈ విధముగా పలికిరి. 17

*"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదిఐదవ సర్గ సమాప్తము.*

# అథ షట్చత్వారింశః సర్గః

[సుగ్రీవుడు తాను భూమండలము నంతను తిరిగినట్లు రామునితో చెప్పుట]

మూ. గతేషు వానరేన్ద్రేషు రామః సుగ్రీవమబ్రవీత్,
కథం భవాన్విజానీతే సర్వం వై మణ్డలం భువః. 1

ప్ర. అ. వానరేన్ద్రేషు=వానరనాయకులు, గతేషు=వెళ్లినవారగుచుండగా, రామః= రాముడు, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, అబ్రవీత్=పలికెను. భవాన్=నీవు, భువః= భూమియొక్క, సర్వమ్=సమస్తమైన, మణ్డలమ్=మండలమును, కథమ్=ఎట్లు, విజానీతే=ఎరుగుదువు.

తా. ఆ వానరనాయకు లందరు వెళ్లిన పిమ్మట "నీకు ఈ భూమండలము అంతను గూర్చి ఎట్లు తెలియును" అని రాముడు సుగ్రీవుని ప్రశ్నించెను. 1

మూ. సుగ్రీవశ్చ తతో రామమువాచ ప్రణతాత్మవాన్,
శ్రూయతాం సర్వమాఖ్యాస్యే విస్తరేణ వచో మమ. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రణతాత్మవాన్=వంచబడిన దేహము కలవాడై, రామమ్=రాముని గూర్చి, ఉవాచ=పలికెను. సర్వమ్=సమస్తమును, విస్తరేణ=విస్తారముతో, ఆఖ్యాస్యే=చెప్పగలను. మమ=నాయొక్క, వచః=వచనము, శ్రూయతామ్=వినబడుగాక.

తా. అపుడు సుగ్రీవుడు సవినయముగా వంగి రామునితో ఇట్లనెను. అంతను సవిస్తరముగా చెప్పెదను. వినుము. 2

మూ. యదా తు దున్దుభిం నామ దానవం మహిషాకృతిమ్,
ప్రతికాలయతే వాలీ మలయం ప్రతి పర్వతమ్. 3
తదా వివేశ మహిషో మలయస్య గుహాం ప్రతి,
వివేశ వాలీ తత్రాపి మలయం తజ్జిఘాంసయా. 4

ప్ర. అ. వాలీ=వాలి, మహిషాకృతిమ్=మహిషరూపము గల, దున్దుభిం నామ= దుందుభి అను, దానవమ్=దానవుని, యదా=ఎపుడు, మలయం పర్వతం ప్రతి= మలయపర్వతమును గూర్చి, ప్రతికాలయతే=తరిమెనో, తదా=అపుడు, మహిషః=ఆ మహిషము, మలయస్య=మలయపర్వతముయొక్క, గుహాం ప్రతి=గుహను గూర్చి, వివేశ= ప్రవేశించెను. వాలీ=వాలి, తజ్జిఘాంసయా=వానిని చంపవలె నను ఇచ్ఛచేత, తత్రాపి=అక్కడ కూడ, మలయమ్=మలయపర్వతమును, వివేశ=ప్రవేశించెను.

తా. మహిషరూపములో వచ్చిన దుందుభి అను దానవుని వాలి మలయ పర్వతము వైపు తరుమగా, ఆ మహిషము మలయపర్వతగుహలో ప్రవేశించెను. వాలి అక్కడ కూడ వానిని చంపవలెనను కోరికతో ఆ గుహలో ప్రవేశించెను. 3,4

మూ. తతోऽహం తత్ర నిక్షిప్తో గుహాద్వారి వినీతవత్ ,
న చ నిష్క్రామతే వాలీ తదా సంవత్సరే గతే. 5

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వినీతవత్=వినయవంతుడనైన, అహమ్=నేను, తత్ర= అక్కడ, గుహాద్వారి=గుహాద్వారమునందు, నిక్షిప్తః= ఉంచబడితిని. తదా = అప్పుడు, సంవత్సరే = సంవత్సరము, గతే = గడిచినను, వాలీ = వాలి, న నిష్క్రామతే = బయటకు రాలేదు.

తా. పిమ్మట వినయవంతుడనైన నన్ను గుహాద్వారమునందు ఉంచెను. సంవత్సరము గడిచినను వాలి బయటకు రాలేదు. 5

మూ. తతః క్షతజవేగేన ఆపుపూరే తదా బిలమ్,
తదహం విస్మితో దృష్ట్వా భ్రాతుః శోకవిషార్దితః. 6

ప్ర. అ. తతః = అటుపిమ్మట, బిలమ్ = ఆ బిలము, క్షతజవేగేన = రక్తవేగముచేత, ఆపుపూరే = నింపబడెను. తదా = అపుడు, అహమ్ = నేను, తత్ =దానిని, దృష్ట్వా = చూచి, విస్మితః = ఆశ్చర్యము చెందినవాడనై, భ్రాతుః = సోదరునియొక్క, శోకవిషార్దితః = శోక మను విషముచేత పీడింపబడితిని.

తా. పిమ్మట ఆ గుహ రక్తప్రవాహముచేత నింపబడెను. నేను అది చూచి ఆశ్చర్యపడుచు సోదరునికొరకై కలిగిన శోకమను విషముచేత పీడింపబడితిని. 6

మూ. అథాऽహం గతబుద్ధిస్తు సువ్యక్తం నిహతో గురుః,
శిలా పర్వతసఙ్కాశా బిలద్వారి మయా కృతా. 7
అశక్నువన్ నిష్క్రమితుం మహిషో వినశిష్యతి.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, గురుః = అన్న, సువ్యక్తమ్ =నిశితముగా, నిహతః = చంపబడినాడు అని, అహమ్ =నేను, గతబుద్ధిః = పొందబడిన బుద్ధి కలవాడను అయితిని. మహిషః = ఆ మహిషము, నిష్క్రమితుమ్ = బయటకి వచ్చుటకు, అశక్నువన్ = సమర్థముకానిదై, వినశిష్యతి = నశించగలదు, (అని తలచి) మయా = నాచేత, పర్వతసఙ్కాశా = పర్వతముతో సమానమైన, శిలా = శిల, బిలద్వారి = బిలముయొక్క ద్వారమునందు, కృతా = చేయబడినది.

తా. పిమ్మట నేను "నిశితముగా అన్న చంపబడినాడు" అని తలచితిని. బయటికి రాజాలక మహిషము మరణించును అను అభిప్రాయముతో నేను పర్వతము వంటి ఒక శిలను గుహాద్వారమునందు ఉంచితిని. 7

మూ. తతోఽహమాగాం కిష్కిన్ధాం నిరాశస్తస్య జీవితే. 8
రాజ్యం చ సుమహత్ప్రాప్య తారాం చ రుమయా సహ,
మిత్రైశ్చ సహితస్తస్య వసామి విగతజ్వరః. 9

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ =నేను, తస్య = ఆతని యొక్క, జీవితే = జీవితమునందు, నిరాశః = ఆశ లేనివాడనై, కిష్కిన్ధామ్ = కిష్కింధను గూర్చి , ఆగామ్ = వచ్చితిని. సుమహత్ = చాల గొప్పదైన, రాజ్యం చ = రాజ్యమును, రుమయా సహ = రుమతో కూడ, తారాం చ = తారను, ప్రాప్య = పొంది, తస్య = వానియొక్క, మిత్రైః = మిత్రులతో, సహితః = కూడినవాడనై, విగతజ్వరః = పోయిన దుఃఖము కలవాడనై, వసామి = నివసించుచున్నాను.

తా. పిమ్మట నేను వాలి జీవితము విషయమున నిరాశుడనై కిష్కింధకు తిరిగి వచ్చి, విశాలమైన రాజ్యమును, తారను, రుమను పొంది ఆతని మిత్రులతో కలిసి ఏ బాధలు లేక సుఖముగా నివసించుచుంటిని. 8, 9

మూ. ఆజగామ తతో వాలీ హత్వా తం వానరర్షభః,
తతోఽహమదదాం రాజ్యం గౌరవాద్భయయన్త్రితః. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన, వాలీ = వాలి, తమ్ = వానిని, హత్వా= చంపి, ఆజగామ = వచ్చెను. తతః = అటుపిమ్మట, అహమ్ = నేను, భయయన్త్రితః = భయముచేత పీడింపబడినవాడనై, గౌరవాత్ =గౌరవమువలన, రాజ్యమ్ =రాజ్యమును, అదదామ్ = ఇచ్చితిని.

తా. ఇంతలో వానరశ్రేష్ఠుడైన వాలి ఆ మహిషమును చంపి తిరిగి వచ్చెను. అపుడు నేను భయపడుచు గౌరవపూర్వకముగా రాజ్యమును ఆతని కిచ్చితిని. 10

మూ. స మాం జిఘాంసుర్దుష్టాత్మా వాలీ ప్రవ్యథితేన్ద్రియః,
పరికాలయతే క్రోధాద్ధావన్తం సచివైః సహ. 11

ప్ర. అ. దుష్టాత్మా = దుష్టబుద్ధి గల, సః వాలీ = ఆ వాలి, ప్రవ్యథితేన్ద్రియః = వ్యథ చెందిన ఇంద్రియములు గలవాడై, సచివైః సహ= మంత్రులతో కూడ, ధావన్తమ్ = పరుగెత్తుచున్న, మామ్ = నన్ను, జిఘాంసుః = చంప దలచినవాడై, క్రోధాత్ = కోపమువలన, పరికాలయతే = తరిమెను.

తా. దుష్టబుద్ధి కల ఆ వాలి వ్యథ చెందిన ఇంద్రియములు గలవాడై, నన్ను చంపవలె నను కోరికతో కోపావిష్టుడై మంత్రులతో కలిసి పారిపోవుచున్న నన్ను తరుముకొని వచ్చెను. 11

మూ. తతోఽహం వాలినా తేన సోఽనుబద్ధః ప్రధావితః,
నదీశ్చ వివిధాః పశ్యన్ వనాని నగరాణి చ. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేన = ఆ, వాలినా = వాలిచేత, అనుబద్ధః = అనుసరించబడిన, సః అహమ్ = నేను, వివిధాః = వివిధములైన, నదీః = నదులను, వనాని = వనములను, నగరాణి చ = నగరములను, పశ్యన్ =చూచుచు, ప్రధావితః = పరుగెత్తినాను.

తా. వాలి తరుమగా నేను అనేక నదులను, వనములను, నగరములను చూచుచు పరుగెత్తితిని. 12

మూ. ఆదర్శతలసఙ్కాశా తతో వై పృథివీ మయా,
అలాతచక్రప్రతిమా దృష్టా గోష్పదవత్కృతా. 13

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మయా = నాచేత, పృథివీ = భూమి, ఆదర్శతలసఙ్కాశా =అద్దము పైభాగముతో సమానముగాను, అలాతచక్రప్రతిమా = అలాతచక్రముతో సమానము గాను, (చివర ఎఱ్ఱని నిప్పు గల కట్టెను గుండ్రముగా వేగముగా త్రిప్పినపుడు అది అగ్నిచక్రము వలె కనబడును. అదే అలాతచక్రము) దృష్టా = చూడబడినది. గోష్పదవత్ = గోష్పదము వలె, (ఎద్దు అడుగు గుర్తు వలె) కృతా = చేయుబడినది.

తా. నాకు అప్పుడు భూమి అద్దము పైభాగము వలె, అలాతచక్రము వలె కనబడినది. దానిని గోష్పదమును దాటినట్లు దాటితిని. 13

మూ. పూర్వాం దిశం తతో గత్వా పశ్యామి వివిధాన్ ద్రుమాన్,
పర్వతాన్ సదరీన్ రమ్యాన్ సరాంసి వివిధాని చ. 14

ప్ర. అ. తతః = అక్కడినుండి, పూర్వాం దిశమ్ = తూర్పుదిక్కును గూర్చి, గత్వా = వెళ్లి, వివిధాన్ = అనేకవిధములైన, ద్రుమాన్ = వృక్షములను, సదరీన్ = గుహలతో కూడిన, రమ్యాన్=రమ్యములైన, పర్వతాన్ = పర్వతములను, వివిధాని = అనేక విధములైన, సరాంసి చ = సరస్సులను, పశ్యామి = చూచితిని.

తా. పిమ్మట నేను తూర్పు దిక్కునకు వెళ్ళి అనేకవృక్షములను, గుహలతో కూడిన రమ్యములైన పర్వతములను, అనేకవిధములైన సరస్సులను చూచితిని. 14

మూ. ఉదయం తత్ర పశ్యామి పర్వతం ధాతుమణ్డితమ్,
క్షీరోదం సాగరం చైవ నిత్యమప్సరసాలయమ్. 15

ప్ర. అ. తత్ర = అక్కడ, ధాతుమణ్డితమ్ = ధాతువులచేత

అలంకరించబడిన, ఉదయం పర్వతమ్ = ఉదయపర్వతమును, నిత్యమ్ = ఎల్లప్పుడు, అప్సరసాలయమ్ = అప్సరసలకు నివాసమైన, క్షీరోదం సాగరం చైవ =క్షీరము ఉదకముగా గల సముద్రమును, పశ్యామి = చూచితిని.

తా. అక్కడ ధాతువులచే అలంకరింపబడిన ఉదయపర్వతమును, నిత్యము అప్సరసలు నివసించు క్షీరసాగరమును చూచితిని. 15

మూ. పరికాల్యమానస్తం తదా వాలినాఽభిద్రుతో హ్యాహమ్,
పునరావృత్య సహసా ప్రస్థితోఽహం తదా విభో. 16

ప్ర. అ. విభో=ఓ! ప్రభూ! వాలినా=వాలిచేత, పరికాల్యమానః=తరుమబడుచున్న, అహమ్=నేను, తదా=అపుడు, అభిద్రుతః=పరుగెత్తితిని. తదా=అపుడు, పునః=తిరిగి, ఆవృత్య=వెనుకకు వచ్చి, సహసా=వెంటనే, ప్రస్థితః=ప్రయాణ మైతిని.

తా. ప్రభువైన రామా! వాలి తరుముచుండగా నేను పరుగెత్తుచూ తిరిగి వెనుకకు వచ్చి మరల వెంటనే బయలుదేరితిని. 16

మూ. దిశస్తస్యాస్తతో భూయః ప్రస్థితో దక్షిణాం దిశమ్,
విన్ధ్యపాదపసఙ్కీర్ణాం చన్దనద్రుమశోభితామ్. 17

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తస్యాః=ఆ, దిశః=దిక్కునుండి, భూయః=మరల, విన్ధ్యపాదపసఙ్కీర్ణామ్=వింధ్యపర్వతమునందలి వృక్షములతో నిండిన, చన్దనద్రుమశోభితామ్= చందనవృక్షములచేత ప్రకాశింపచేయబడిన, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును గూర్చి, ప్రస్థితః=ప్రయాణ మైతిని.

తా. పిమ్మట ఆ దిక్కునుండి వింధ్యపర్వత-వృక్షములతో నిండిన చందనవృక్షములతో ప్రకాశించుచున్న దక్షిణదిక్కునకు ప్రయాణ మైతిని. 17

మూ. ద్రుమశైలాన్తరే పశ్యన్ భూయో దక్షిణతోఽపరామ్,
అపరాం చ దిశం ప్రాప్తో వాలినా సమభిద్రుతః. 18

ప్ర. అ. ద్రుమశైలాన్తరే=వృక్షములయొక్క పర్వతములయొక్క మధ్యయందు, దక్షిణతః= దక్షిణదిక్కునుండి, అపరామ్=మరియొక దిక్కును, పశ్యన్=చూచుచు, భూయః=మరల, వాలినా=వాలిచేత, సమభిద్రుతః=తరుమబడినవాడనై, అపరాం దిశమ్=పశ్చిమదిక్కును, ప్రాప్తః=పొందితిని.

తా. అక్కడ వృక్షముల మధ్యనుండి పర్వతముల మధ్యనుండి మరొక దిక్కు వైపునకు చూచుకొనుచు, వాలి తరుముచుండగా పశ్చిమదిక్కునకు వెళ్లితిని.

మూ. స పశ్యన్ వివిధాన్ దేశానస్తం చ గిరిసత్తమమ్,
ప్రాప్య చాస్తం గిరిశ్రేష్ఠముత్తరం సమ్ప్రధావితః. 19

ప్ర. అ. సః=అట్టి నేను, వివిధాన్=అనేకవిధములైన, దేశాన్=దేశములను, గిరిసత్తమమ్=పర్వతశ్రేష్ఠమైన, అస్తం చ=అస్తాద్రిని, పశ్యన్=చూచుచు, గిరిశ్రేష్ఠమ్=పర్వతశ్రేష్ఠమైన, అస్తమ్=అస్తాద్రిని, ప్రాప్య=పొంది, ఉత్తరమ్=ఉత్తరదిక్కును గూర్చి, సమ్ప్రధావితః=పరుగెత్తితిని.

తా. నేను అక్కడ అనేకప్రదేశములను పర్వతశ్రేష్ఠమైన అస్తాద్రిని చూచుచు, ఆ అస్తాద్రిని చేరి, అక్కడినుండి ఉత్తరము వైపు పరుగెత్తితిని. 19

మూ. హిమవన్తం చ మేరుం చ సముద్రం చ తథోత్తరమ్,
యదా న విన్దే శరణం వాలినా సమభిద్రుతః, 20
తదా మాం బుద్ధిసమ్పన్నో హనుమాన్ వాక్యమబ్రవీత్.

ప్ర. అ. హిమవన్తం చ=హిమవత్పర్వతమును, మేరుం చ=మేరు పర్వతమును, తథా=మరియు, ఉత్తరం సముద్రం చ=ఉత్తరసముద్రమును, (గూర్చి పరుగెత్తితిని). వాలినా=వాలిచేత, సమభిద్రుతః=తరుమబడిన నేను, యదా=ఎప్పుడు, శరణమ్=శరణమును, న విన్దే= పొందలేదో, తదా=అపుడు, బుద్ధిసమ్పన్నః=బుద్ధిమంతుడైన, హనుమాన్= హనుమంతుడు, మామ్=నన్ను గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. నేను హిమవత్పర్వతమునకు, మేరుపర్వతమునకు ఉత్తరసముద్రమువరకు వెళ్లితిని. ఈ విధముగా వాలి తరుముచుండగా రక్షణ మేమియు లభించని నన్ను చూచి బుద్ధిసంపన్నుడైన హనుమంతుడు ఇట్లు పలికెను. 20

మూ. ఇదానీం మే స్మృతం రాజన్ యథా వాలీ హరీశ్వరః. 21
మతఙ్గేన తదా శప్తో హ్యస్మిన్నాశ్రమమణ్డలే.
ప్రవిశేద్యది వా వాలీ మూర్ధాఽస్య శతధా భవేత్. 22
తత్ర వాసః సుఖోఽస్మాకం నిరుద్విగ్నో భవిష్యతి.

ప్ర. అ. రాజన్=రాజా, హరీశ్వరః=వానరరాజైన, వాలీ=వాలి, తదా=అపుడు, మతఙ్గేన=మతంగమునిచేత, యథా=ఎట్లు, శప్తః=శపించబడినాడో, (అది) మే=నాకు, ఇదానీమ్=ఇపుడు, స్మృతమ్=స్మరింపబడినది. వాలీ=వాలి, అస్మిన్=ఈ, ఆశ్రమమణ్డలే=ఆశ్రమమండలమునందు, ప్రవిశేద్యది=ప్రవేశించినట్లైతే, అస్య=వీనియొక్క, మూర్ధా=శిరస్సు, శతధా=నూరు ముక్కలుగా, భవేత్=అగును. తత్ర=అక్కడ, అస్మాకమ్=మనకు, వాసః=నివాసము, సుఖః=సుఖకరము గాను, నిరుద్విగ్నః=నిర్భయముగాను, భవిష్యతి=కాగలదు.

తా. రాజా! పూర్వము మతంగముని వానరరాజైన వాలిని శపించిన విషయము ఇపుడు నాకు స్మృతికి వచ్చినది. వాలి ఆ ఆశ్రమములో ప్రవేశించినచో, వాని శిరస్సు వంద ముక్కలు అగును. అక్కడ మనకు నివాసము సుఖకరముగాను,

నిర్భయము గాను ఉండును. 21,22

మూ. తత్ర పర్వతమాసాద్య ఋష్యమూకం నృపాత్మజ, 23
న వివేశ తదా వాలీ మతఙ్గస్య భయాత్తదా.

ప్ర. అ.నృపాత్మజ=రాజకుమారా! తత్ర=అక్కడ, ఋష్యమూకం పర్వతమ్= ఋష్యమూకపర్వతమును, తదా=అపుడు, ఆసాద్య=సమీపించి, వాలీ=వాలి, మతఙ్గస్య =మతంగునియొక్క, భయాత్=భయము వలన, తదా=అపుడు, న వివేశ=ప్రవేశించలేదు.

తా. ఓ! రామా! అపుడు వాలి ఋష్యమూకపర్వతమువరకు వచ్చి, అక్కడ మతంగుని శాపమునకు భయపడి ఆ పర్వతముమీదకు రాలేదు. 23

మూ. ఏవం మయా తదా రాజన్ ప్రత్యక్షముపలక్షితమ్,
పృథివీమణ్డలం సర్వం గుహామస్మ్యాగతస్తతః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. రాజన్=ఓ! రాజా! ఏవమ్=ఈ విధముగా, తదా=అపుడు, సర్వమ్= సమస్తమైన, పృథివీమణ్డలమ్=భూమండలము, ప్రత్యక్షమ్=ప్రత్యక్షముగా, మయా= నాచేత, ఉపలక్షితమ్=చూడబడినది. గుహామ్=గుహను గూర్చి, తతః=అటుపిమ్మట, ఆగతః అస్మి=వచ్చి ఉన్నాను.

తా. రామా! అపుడు నేను ఈ విధముగా భూమండల మంతను ప్రత్యక్షముగా చూచి ఈ పర్వతగుహ చేరినాను. 24

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
నలుబది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తచత్వారింశః సర్గః

[తూర్పు, ఉత్తరము, పడమర దిక్కులకు వెళ్లిన వానరులు నిరాశతో తిరిగివచ్చుట]

మూ. దర్శనార్థం తు వైదేహ్యాః సర్వతః కపికుఞ్జరాః,
వ్యాదిష్టాః కపిరాజేన యథోక్తం జగ్మురఞ్జసా. 1

ప్ర. అ. కపిరాజేన=సుగ్రీవునిచేత, వ్యాదిష్టాః=ఆజ్ఞాపించబడిన, కపికుఞ్జరాః=వానరశ్రేష్ఠులు, యథోక్తమ్=చెప్పిన విధముగా, వైదేహ్యాః=సీతయొక్క, దర్శనార్థమ్=దర్శనము కొరకు, అఞ్జసా=శీఘ్రముగా, సర్వతః=అన్ని వైపుల, జగ్ముః=వెళ్లిరి.

తా. సుగ్రీవునిచే ఆజ్ఞాపించబడిన ఆ వానరశ్రేష్ఠులు సీతను వెదకుటకై ఆతడు చెప్పిన విధముగా శీఘ్రముగా అన్ని వైపులకు వెళ్లిరి. 1

మూ. తే సరాంసి పరిత్యక్తానాకాశం నగరాణి చ,
నదీదుర్గాంస్తథా దేశాన్ విచిన్వన్తి సమన్తతః. 2

ప్ర. అ. తే=వారు, సరాంసి=సరస్సులను, పరిత్యక్తాన్=నదులను, డొంకలను, ఆకాశమ్=ఆకాశమును, నగరాణి చ=నగరములను, తథా=మరియు, నదీదుర్గాన్=నదులచేత ప్రవేశింప శక్యము గాకున్న, దేశాన్=దేశములను, సమన్తతః=అంతట, విచిన్వన్తి= అన్వేషించిరి.

తా. ఆ వానరులు సరస్సులు, నదులు, డొంకలు, వృక్షాదులు లేని ప్రదేశములు, నగరములు, నదులచేత దుర్గమముగా ఉన్న ప్రదేశములు - వీటి నన్నిటిని అంతటా వెదకిరి. 2

మూ. సుగ్రీవేణ సమాఖ్యాతాః సర్వే వానరయూథపాః,
తత్ర దేశాన్విచిన్వన్తి సశైలవనకాననాన్. 3

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, సమాఖ్యాతాః=బోధింపబడిన, సర్వే=సమస్తమైన, వానరయూథపాః=వానరసేనానాయకులు, తత్ర=అక్కడ, సశైలవనకాననాన్=పర్వతములతోను, వనములతోను, అరణ్యములతోను కూడిన, దేశాన్=దేశములను, విచిన్వన్తి=వెదకిరి.

తా. సుగ్రీవునిచేత ఆజ్ఞాపింపబడిన ఆ వానరనాయకు లందరు అక్కడ పర్వతములు, వనములు, అరణ్యములు - వీటితో కూడిన దేశములను అన్వేషించిరి.

మూ. విచిత్య దివసం సర్వే సీతాధిగమనే ధృతాః,
సమాయాన్తి స్మ మేదిన్యాం నిశాకాలేషు వానరాః. 4

ప్ర. అ. సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, సీతాధిగమనే=సీతను పొందుటయందు, ధృతాః=ఉద్యుక్తులై, దివసమ్=పగటి భాగమంతా, విచిత్య=వెదకి, నిశాకాలేషు=రాత్రిసమయములయందు, మేదిన్యామ్=భూమియందు, సమాయాన్తి స్మ= కలిసికొనుచుండిరి.

తా. సీతను పొందవలెనను దృఢసంకల్పముతో ఆ వానరు లందరు పగలంతా వెదకి, రాత్రి సమయములయందు భూమిపై వచ్చి కలుసుకొనుచుండిరి.

మూ. సర్వర్తుకాంశ్చ దేశేషు వానరాః సఫలద్రుమాన్,
ఆసాద్య రజనీం శయ్యాం చక్రుః సర్వేష్వహస్సు తే. 5

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, సర్వేషు=సమస్తమైన, అహస్సు= దినములయందు, సర్వర్తుకాన్=సమస్త ఋతువులకు సంబంధించిన, సఫలద్రుమాన్=ఫలములతో కూడిన వృక్షములను, దేశేషు=ఆ యా ప్రదేశములయందు, ఆసాద్య=పొంది, రజనీమ్= రాత్రిని (రాత్రియందు)శయ్యామ్=శయ్యను, చక్రుః=చేసిరి.

తా. ఆ వానరులు అన్ని దినములయందు రాత్రి యగుసరికి ఆ యా ప్రదేశములలో, అన్ని ఋతువులకు సంబంధించిన ఫలవృక్షములను చేరి శయనించుచుండిరి. 5

మూ. తదహః ప్రథమం కృత్వా మాసే ప్రస్రవణం గతాః,
కపిరాజేన సఙ్గమ్య నిరాశాః కపికుఞ్జరాః. 6

ప్ర. అ. తత్ అహః=ఆ దివసమును, ప్రథమమ్=మొదటిదానిగా, కృత్వా=చేసికొని, మాసే=ఒక మాసములో, కపికుఞ్జరాః=వానరశ్రేష్ఠులు, నిరాశాః=నిరాశులై, ప్రస్రవణమ్=ప్రస్రవణపర్వతమును గూర్చి, గతాః=వెళ్లినవారై, కపిరాజేన=సుగ్రీవునితో, సఙ్గమ్య=కలిసి (చెప్పిరి).

తా. బయలుదేరిన రోజు మొదలు ఒక మాసమునందు వానరశ్రేష్ఠులు సీత జాడ తెలియక నిరాశులై ప్రస్రవణపర్వతమునందు ఉన్న సుగ్రీవుని వద్దకు తిరిగి వచ్చిరి. 6

మూ. విచిత్య తు దిశం పూర్వాం యథోక్తాం సచివైః సహ,
అదృష్ట్వా వినతః సీతామాజగామ మహాబలః. 7

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, వినతః=వినతుడు, సచివైః సహ= సహాయులతో కూడ, యథోక్తామ్=చెప్పబడిన విధముగా ఉన్న,పూర్వాం దిశమ్=తూర్పు దిక్కును, విచిత్య=అన్వేషించి, సీతామ్=సీతను, అదృష్ట్వా=చూడక, ఆజగామ=

తిరిగి వచ్చెను.

తా. మహాబలశాలియైన వినతుడు సహాయులతో కూడి సుగ్రీవుడు చెప్పిన విధముగా ఉన్న తూర్పుదిక్కును అన్వేషించి సీతను కానక తిరిగి వచ్చెను. 7

మూ. దిశమప్యుత్తరాం సర్వాం వివిచ్య స మహాకపిః,
ఆగతః సహ సైన్యేన వీరః శతబలస్తదా. 8

ప్ర. అ. తదా=అపుడు, వీరః=వీరుడైన, మహాకపిః=వానరనాయకుడైన, శతబలః=శతబలుడు, సైన్యేన సహ=సైన్యముతో కూడ, సర్వామ్=సమస్తమైన, ఉత్తరాం దిశమ్= ఉత్తరదిక్కును, వివిచ్య=వెదకి, ఆగతః=వచ్చినాడు.

తా. వీరుడైన శతబలు డను మహావానరుడు సైన్యముతో వెళ్లి ఉత్తరదిక్కును అన్వేషించి తిరిగి వచ్చెను. 8

మూ. సుషేణః పశ్చిమామాశాం వివిచ్య సహ వానరైః,
సమేత్య మాసే పూర్ణే తు సుగ్రీవముపచక్రమే. 9

ప్ర. అ. సుషేణః=సుషేణుడు, వానరైః సహ=వానరులతో కూడ, పశ్చిమామ్ ఆశామ్= పశ్చిమదిక్కును, వివిచ్య=వెదకి, మాసే=మాసము, పూర్ణే తు=పూర్ణమైనది అగుచుండగా, సమేత్య=తిరిగి వచ్చి, సుగ్రీవమ్=సుగ్రీవుని, ఉపచక్రమే=సమీపించెను.

తా. సుషేణుడు వానరులతో కలిసి పశ్చిమదిక్కునకు వెళ్లి అక్కడ వెదకి ఒక మాసము నిండగానే తిరిగి వచ్చి సుగ్రీవుని కలిసెను. 9

మూ. తం ప్రస్రవణపృష్ఠస్థం సమాసాద్యాభివాద్య చ,
ఆసీనం సహ రామేణ సుగ్రీవమిదమబ్రువన్. 10

ప్ర. అ. రామేణ సహ=రామునితో కూడ, ఆసీనమ్=కూర్చున్న, ప్రస్రవణపృష్ఠస్థమ్= ప్రస్రవణపర్వతము పైభాగమునం దున్న, తం సుగ్రీవమ్=ఆ సుగ్రీవుని, ఆసాద్య=పొంది, అభివాద్య చ=నమస్కరించి, ఇదమ్=ఈ వాక్యమును అబ్రువన్=పలికిరి.

తా. ప్రస్రవణపర్వతముపైన రామునితో కలిసి కూర్చున్న ఆ సుగ్రీవుని వద్దకు వెళ్లి నమస్కరించి ఇట్లు పలికిరి. 10

మూ. విచితాః పర్వతాః సర్వే వనాని గహనాని చ,
నిమ్నగాః సాగరాన్తాశ్చ సర్వే జనపదాశ్చ యే. 11

ప్ర. అ. సర్వే=సమస్తమైన, పర్వతాః=పర్వతములు, విచితాః=వెదకబడినవి, గహనాని=దట్టమైన, వనాని చ=వనములు, నిమ్నగాః=నదులు, సాగరాన్తాశ్చ= సముద్రప్రాంతప్రదేశములు, యే=ఏ, జనపదాశ్చ= గ్రామములున్నవో, సర్వే=అవన్నీ (వెదకబడినవి).

తా. అన్ని పర్వతములు, దట్టమైన వనములు, నదులు, సముద్రప్రాంత భూములు, అన్ని గ్రామములు వెదకినాము. 11

మూ. గుహాశ్చ విచితాః సర్వా యాశ్చ తే పరికీర్తితాః,
విచితాశ్చ మహాగుల్మా లతావితతసన్తతాః. 12

ప్ర. అ. సర్వాః=సమస్తమైన, తే=నీచేత, పరికీర్తితాః=చెప్పబడిన, యాః=ఏ, గుహాః=గుహ లున్నవో అవి, విచితాః=వెదకబడినవి. లతావితతసన్తతాః=లతలు దట్టముగా అల్లుకొనిన, మహాగుల్మాః=పెద్ద పొదలు, విచితాః=వెదకబడినవి.

తా. నీవు చెప్పిన అన్ని గుహలను వెదకితిమి. లతలు దట్టముగా అల్లుకొనిన పెద్ద పొదలను వెదకితిమి. 12

మూ. గహనేషు చ దేశేషు దుర్గేషు విషమేషు చ,
సత్త్వాన్యతిప్రమాణాని విచితాని హతాని చ, 13
యే చైవ గహనా దేశా విచితాస్తే పునః పునః.

ప్ర. అ. గహనేషు=దట్టముగా ఉన్నవి, దుర్గేషు=ప్రవేశింపశక్యము గానివి, విషమేషు చ=ఎగుడు దిగుడుగా ఉన్నవి అయిన, దేశేషు=ప్రదేశములయందు, అతిప్రమాణాని=పెద్ద ప్రమాణము గల, సత్త్వాని=జంతువులు, విచితాని=వెదకబడినవి. హతాని చ=చంపబడినవి కూడ. గహనాః=ప్రవేశింప శక్యము గాని, యే=ఏ, దేశాః=దేశము లున్నవో, తే=అవి, పునః పునః=మాటిమాటికి, విచితాః=వెదకబడినవి.

తా. దట్టముగా ప్రవేశింపశక్యముగాక విషమముగా ఉన్న ప్రదేశములలో పెద్ద ప్రమాణము గల ప్రాణులను వెదకి చంపి వేసితిమి. ప్రవేశింప శక్యము గాని ప్రదేశములలో చాలా సార్లు అన్వేషించితిమి. 13

మూ. ఉదారసత్త్వాభిజనో హనూమాన్
స మైథిలీం జ్ఞాస్యతి వానరేన్ద్ర!
దిశం తు యామేవ గతా తు సీతా
తామాస్థితో వాయుసుతో హనూమాన్. 14

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. వానరేన్ద్ర=ఓ! వానరరాజా! ఉదారసత్త్వాభిజనః=ఉత్తమమైన బలము, కులము గల, సః=ఆ, హనూమాన్=హనుమంతుడు, మైథిలీమ్=సీతను, జ్ఞాస్యతి=తెలిసికొనగలడు. సీతా=సీత, యామ్ ఏవ=ఏ, దిశమ్=దిక్కును గూర్చి, గతా=వెళ్లినదో, తామ్=ఆ దిక్కునే, వాయుసుతః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, ఆస్థితః=అవలంబించినాడు.

తా. ఓ! వానరరాజా! అధికమైన బలము, ఉత్తమమైన వంశము గల, ఆ హనుమంతుడు సీతను గూర్చి తెలుసుకొనగలడు. వాయుకుమారుడైన హనుమంతుడు సీత వెళ్లిన దిక్కునకే వెళ్లి ఉన్నాడు కదా! 14

"బాలానన్దిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టచత్వారింశః సర్గః

*[దక్షిణదిక్కునకు వెళ్లిన వానరులు సీతాన్వేషణమును ప్రారంభించుట]*

మూ. సహ తారాఙ్గదాభ్యాం తు సహసా హనుమాన్ కపిః,
సుగ్రీవేణ యథోద్దిష్టం గన్తుం దేశం ప్రచక్రమే. 1

ప్ర. అ. కపిః=వానరుడైన, హనుమాన్=హనుమంతుడు, తారాఙ్గదాభ్యాం సహ= తారునితోను, అంగదునితోను కలిసి, సహసా=వెంటనే, సుగ్రీవేణ=సుగ్రీవుని చేత, యథోద్దిష్టమ్=ఆదేశింపబడిన విధముగా, దేశమ్=ఆ దేశమును గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, ప్రచక్రమే=ప్రారంభించెను.

తా. హనుమంతుడు తారునితోను, అంగదునితోను కలిసి, వెంటనే సుగ్రీవుడు చెప్పిన విధముగా దక్షిణదిక్కునకు బయలుదేరెను. 1

మూ. స తు దూరముపాగమ్య సర్వైస్తైః కపిసత్తమైః,
తతో విచిత్య విన్ధ్యస్య గుహాశ్చ గహనాని చ. 2
పర్వతాగ్రనదీదుర్గాన్ సరాంసి విపులద్రుమాన్,
వృక్షఖణ్డాంశ్చ వివిధాన్ పర్వతాన్ వనపాదపాన్. 3

ప్ర. అ. సః=అతడు, సర్వైః=సమస్తమైన, తైః=ఆ, కపిసత్తమైః= వానరశ్రేష్ఠులతో, దూరమ్=దూరము, ఉపాగమ్య=వెళ్లి, తతః=అటుపిమ్మట, విన్ధ్యస్య=వింధ్యపర్వతముయొక్క, గుహాశ్చ=గుహలను, గహనాని చ=అరణ్యములను, విచిత్య=వెదకి, పర్వతాగ్రనదీదుర్గాన్=పర్వతశిఖరములను, నదుల దుర్గమప్రదేశములను, సరాంసి=సరస్సులను, విపులద్రుమాన్=పెద్ద వృక్షములుగల, వృక్షఖణ్డాంశ్చ= వృక్షసముదాయములను, వివిధాన్=అనేక విధములైన, పర్వతాన్=పర్వతములను, వనపాదపాన్=వనములను, వృక్షములను,(వెదకెను)

తా. ఆ హనుమంతుడు చాల దూరము వెళ్లి ఆ వానరు లందరితో కలిసి వింధ్యపర్వతగుహలను, అరణ్యములను, దుర్గమప్రదేశములను, సరస్సులను, పెద్ద వృక్షములతో నిండిన వృక్షసముదాయములను, అనేక పర్వతములను, ఆడవులను, వృక్షములను వెదకెను. 2,3

మూ. అన్వేషమాణాస్తే సర్వే వానరాః సర్వతో దిశమ్,
న సీతాం దదృశుర్వీరా మైథిలీం జనకాత్మజామ్. 4

ప్ర. అ. వీరాః=వీరులైన, తే వానరాః=ఆ వానరులు, సర్వే= అందరు,

సర్వతోదిశమ్=అన్నిదిక్కులయందు, అన్వేషమాణాః=వెదకుచున్నవారై, మైథిలీమ్=మిథిలానగరరాజకుమారి, జనకాత్మజామ్=జనకుని కూతురు అయిన, సీతామ్=సీతను, న దదృశుః=చూడలేదు.

తా. ఆ వానరు లందరు అన్ని దిక్కులయందు వెదకినను వీరులైన వారికి జనకాత్మజయైన సీత కనబడలేదు. 4

మూ. తే భక్షయన్తో మూలాని ఫలాని వివిధాన్యపి,
అన్వేషమాణా దుర్ధర్షా న్యవసంస్తత్ర తత్ర హ. 5

ప్ర. అ. దుర్ధర్షాః=ఎదిరింప శక్యముగాని, తే=ఆ వానరులు, వివిధాని=అనేకవిధములైన, మూలాని=మూలములను, ఫలాన్యపి=ఫలములను, భక్షయన్తః=భక్షించుచు, అన్వేషమాణాః=వెదకుచు, తత్ర తత్ర=ఆ యా ప్రదేశములయందు, న్యవసన్= నివసించిరి.

తా. ఎదిరింప శక్యము గాని ఆ వానరులు అనేక విధములైన మూలములను, ఫలములను తినుచు సీతకొరకై అన్వేషించుచు, అక్కడక్కడ నివసించిరి. 5

మూ. స తు దేశో దురన్వేషో గుహాగహనవాన్మహాన్,
నిర్జలం నిర్జనం శూన్యం గహనం ఘోరదర్శనమ్. 6

ప్ర. అ. గుహాగహనవాన్=గుహలు అరణ్యములు గల, మహాన్=గొప్పదైన, సః దేశః= ఆ దేశము, దురన్వేషః=వెదకుటకు కష్టముగా ఉండెను. నిర్జలమ్=జలములేని, నిర్జనమ్= జనులులేని, శూన్యమ్=శూన్యమైన, గహనమ్=అరణ్యము, ఘోరదర్శనమ్=భయంకరమైన దర్శనము కలదై ఉండెను.

తా. గుహలతోను, అరణ్యములతోను నిండిన, ఆ విశాలమైన ప్రదేశమునందు అన్వేషించుటకు చాల కష్టముగా ఉండెను. జలము లేక, నిర్జనమై శూన్యముగా ఉన్న ఆ అరణ్యము చూచుటకు భయంకరముగా ఉండెను. 6

మూ. తాదృశాన్యప్యరణ్యాని విచిత్య భృశపీడితాః,
స దేశశ్చ దురన్వేష్యో గుహాగహనవాన్మహాన్. 7

ప్ర. అ. తాదృశాని=అట్టి, అరణ్యాన్యపి=అరణ్యములను కూడ, విచిత్య=వెదకి, భృశపీడితాః=మిక్కిలి పీడింపబడిరి. గుహాగహనవాన్=గుహలు అరణ్యములు గల, మహాన్= గొప్పదైన, సః దేశశ్చ=ఆ దేశము, దురన్వేష్యః=వెదకుటకు కష్టముగా ఉండెను.

తా. అట్టి అరణ్యములను కూడ వెదకి ఆ వానరులు చాల పీడితులైరి. గుహలతోను, అరణ్యములతోను నిండిన ఆ విశాలమైన ప్రదేశము వెదకుటకు కష్టముగా నుండెను. 7

మూ. త్యక్త్వా తు తం తతో దేశం సర్వే వై హరియూథపాః,
దేశమన్యం దురాధర్షం వివిశు శ్చాకుతోభయాః. 8

ప్ర. అ. సర్వే=సమస్తమైన, హరియూథపాః=వానరనాయకులు, తతః=అటు పిమ్మట, తం దేశమ్=ఆ ప్రదేశమును, త్యక్త్వా=విడచి, అకుతోభయాః=ఎటునుండి భయము లేనివారై, దురాధర్షమ్=ఎదిరింప శక్యము గాని, అన్యం దేశమ్=మరియొక ప్రదేశమును, వివిశుః=ప్రవేశించిరి.

తా. ఆ వానరు లందరు ఆ ప్రదేశమును విడిచి ఏ మాత్రము భయము లేనివారై, ప్రవేశించుటకు శక్యము కాని మరొక ప్రదేశమునకు వెళ్లిరి. 8

మూ. యత్ర వన్ధ్యఫలా వృక్షా విపుష్పాః పర్ణవర్జితాః,
నిస్తోయాః సరితో యత్ర మూలం యత్ర సుదుర్లభమ్. 9

ప్ర. అ. యత్ర=ఎక్కడ, వృక్షాః=వృక్షములు, వన్ధ్యఫలాః=పుట్టని ఫలములు కలవో, విపుష్పాః=పుష్పములు లేనివో, పర్ణవర్జితాః=ఆకులతో శూన్యమైనవో, యత్ర=ఎక్కడ, సరితః=నదులు, నిస్తోయాః=ఉదకము లేనివో, యత్ర=ఎక్కడ, మూలమ్=మూలము, సుదుర్లభమ్=చాల దుర్లభమైనదో.

తా. ఆ ప్రదేశములోని చెట్లకు, పుష్పములు గాని, ఫలములు గాని, ఆకులు గాని లేవు. నదులలో ఉదకము లేదు. అక్కడ మూలములు ఏ మాత్రము లభించవు. 9

మూ. న సన్తి మహిషా యత్ర న మృగా న చ హస్తినః,
శార్దూలాః పక్షిణో వాపి యే చాన్యే వనగోచరాః. 10

ప్ర. అ. యత్ర=ఏ ప్రదేశమునందు, మహిషాః=దున్నపోతులు, న సన్తి=లేవో, మృగాః=మృగములు, న=లేవో, హస్తినః=ఏనుగులు, శార్దూలాః= పెద్దపులులు, పక్షిణో వాపి=పక్షులు, వనగోచరాః=వనమునందు నివసించు, యే=ఏ, అన్యే చ=ఇతర మృగములున్నవో అవి, న=లేవో.

తా. ఆ ప్రదేశమునందు దున్నపోతులు గాని, లేళ్లు గాని, ఏనుగులు గాని, పెద్దపులులు గాని, పక్షులు గాని, వనములో సంచరించు ఇతరప్రాణులు గాని లేవు. 10

మూ. న యత్ర వృక్షా నౌషధ్యో న వల్ల్యో నాపి వీరుధః,
స్నిగ్ధపత్రాః స్థలే యత్ర పద్మిన్యః ఫుల్లపఙ్కజాః. 11
ప్రేక్షణీయాః సుగన్ధాశ్చ భ్రమరైశ్చ వివర్జితాః.

ప్ర. అ. యత్ర=ఎక్కడ, వృక్షాః=వృక్షములు, న=లేవో, ఓషధ్యః=ఓషధులు, న=లేవో, వల్ల్యః=లతలు, న=లేవో, వీరుధః=నేలపై పాకు తీగలు,

న=లేవో, యత్ర=ఎక్కడ, స్నిగ్ధపత్రాః=నున్నని ఆకులు గల, స్థలే=స్థలమునందు మొలుచు, పద్మిన్యః=పద్మలతలు, ఫుల్లపఙ్కజాః=వికసించిన పద్మములు గల, ప్రేక్షణీయాః=చూచుటకు అందమైన, సుగన్ధాశ్చ=మంచిసువాసనగల పద్మలతలు లేవో, భ్రమరైశ్చ=తుమ్మెదలచేత, వివర్జితాః=విడువబడినవో, (అట్టి దేశమునకు వెళ్లిరి.)

తా. అక్కడ వృక్షములు గాని, ఓషధులు గాని, చెట్లపై పాకు లతలు గాని, నేలమీద పాకు తీగెలు గాని, అందమైన ఆకులు గల మెట్టతామరలు గాని, చూచుటకు అందమైన సువాసన గల, వికసించిన, పద్మములు గల పద్మలతలు గాని లేవు. అక్కడ తుమ్మెదలు కూడ లేకుండెను. 11

మూ. కణ్డుర్నామ మహాభాగః సత్యవాదీ తపోధనః, 12
మహర్షిః పరమామర్షీ నియమైర్దుష్ప్రధర్షణః.

ప్ర. అ. సత్యవాదీ=సత్యమునే పలుకువాడు, మహాభాగః=గొప్ప భాగ్యము కలవాడు, తపోధనః=తపస్సే ధనముగా గలవాడు, పరమామర్షీ=ఎక్కువ కోపము గలవాడు, నియమైః=నియమములచేత, దుష్ప్రధర్షణః=ఎదిరింప శక్యముగానివాడు అయిన, కణ్డుర్నామ=కందు అను పేరు గల, మహర్షిః=మహర్షి ఉండెను.

తా. మహాభాగ్యవంతుడు, సత్యము పలుకువాడు, తపస్సు ధనముగా గలవాడు, ఎక్కువ కోపము గలవాడు, నియమములచేత ఎదిరింప శక్యము గానివాడు అయిన కందుమహర్షి ఉండెను. 12

మూ. తస్య తస్మిన్వనే పుత్రో బాలకో దశవార్షికః, 13
ప్రణష్టో జీవితాన్తాయ క్రుద్ధస్తేన మహామునిః.

ప్ర. అ. తస్మిన్ వనే =ఆ వనమునందు, తస్య = ఆమునియొక్క, దశవార్షికః = పది సంవత్సరములు గల, పుత్రః = పుత్రుడైన, బాలకః = పిల్లవాడు, జీవితాన్తాయ = జీవితము అంతమగుటకొరకు, ప్రణష్టః =నశించెను. తేన = దానిచేత, మహామునిః = ఆ మహాముని, క్రుద్ధః =కోపగించెను.

తా. ఆతని పుత్రుడైన పది సంవత్సరముల బాలుడు ఆ వనములో మరణించెను. అందుచేత ఆ మహాముని కోపించెను. 13

మూ. తేన ధర్మాత్మనా శప్తం కృత్స్నం తత్ర మహద్వనమ్. 14
అశరణ్యం దురాధర్షం మృగపక్షివివర్జితమ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, మహత్ = గొప్పదైన, కృత్స్నమ్ = సమస్తమైన, వనమ్ = వనము, అశరణ్యమ్ = దేనికి ఆశ్రయము కాకుండునది గాను, దురాధర్షమ్ = ఎదిరింప శక్యముగానిదిగాను, మృగపక్షివివర్జితమ్ = మృగములతోను, పక్షులతోను శూన్య మగునట్లుగాను, తేన = ఆ, ధర్మాత్మనా

= ధర్మాత్ముడైన మునిచేత, శప్తమ్ = శపించబడినది.

తా. ఆ మహారణ్యమును ధర్మాత్ముడైన ఆ ముని ఏ ప్రాణులకు ఆశ్రయము కాకుండునట్లు, ప్రవేశింప శక్యము కాకుండునట్లు, మృగములు పక్షులు లేకుండునట్లు శపించెను. 14

మూ. తస్య తే కాననాన్తాంస్తు గిరీణాం కన్దరాణి చ, 15
ప్రభవాని నదీనాం చ విచిన్వన్తి సమాహితాః.

ప్ర. అ. తే = ఆ వానరులు, సమాహితాః =సావధానచిత్తులై, తస్య = ఆ ప్రదేశముయొక్క, కాననాన్తాన్ = అడవుల చివరి భాగములను, గిరీణామ్ = పర్వతములయొక్క, కన్దరాణి చ = గుహలను, నదీనామ్ =నదులయొక్క, ప్రభవాణి చ = ఉత్పత్తి స్థానములను, విచిన్వన్తి = అన్వేషించిరి.

తా. ఆ వానరులు, అరణ్యప్రాంతములందు, పర్వతముల గుహలలోను, నదులు పుట్టిన స్థలములలోను, సావధానచిత్తముతో వెదకిరి. 15

మూ. తత్ర చాపి మహాత్మానో నాపశ్యన్ జనకాత్మజామ్, 16
హర్తారం రావణం వాపి సుగ్రీవప్రియకారిణః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములు అయిన ఆ వానరులు, సుగ్రీవప్రియకారిణః= సుగ్రీవునకు ప్రియమును చేయువారై, తత్ర చాపి=అక్కడ కూడ, జనకాత్మజామ్=సీతనుగాని, హర్తారమ్=ఆమెను హరించిన, రావణం వాపి=రావణునిగాని, నాపశ్యన్=చూడలేదు.

తా. సుగ్రీవునకు ప్రియమును జేయగోరుచున్న మహాత్ములైన ఆ వానరులకు అక్కడ సీత గాని, సీతను హరించిన రావణుడు గాని కనబడలేదు.

మూ. తే ప్రవిశ్య తు తం భీమం లతాగుల్మసమావృతమ్, 17
దదృశుర్భీమకర్మాణమసురం సురనిర్భయమ్.

ప్ర. అ. తే=వారు, లతాగుల్మసమావృతమ్=లతలచేత, పొదలచేత కప్పబడిన, భీమమ్= భయంకరమైన, తమ్=ఆ ప్రదేశమును, ప్రవిశ్య=ప్రవేశించి, భీమకర్మాణమ్=భయంకరమైన కర్మ గల, సురనిర్భయమ్=దేవతలనుండి కూడ భయములేని, అసురమ్=ఒక అసురుణ్ణి, దదృశుః=చూచిరి.

తా. లతలచేతను, పొదలచేతను కప్పబడిన భయంకరమైన ఆ ప్రదేశమును చేరిన ఆ వానరులకు భయంకరమైన కర్మలు చేయువాడు, దేవతలకు కూడ భయపడని వాడు అయిన ఒక అసురుడు కనబడెను. 17

మూ. తం దృష్ట్వా వానరా ఘోరం స్థితం శైలమివాసురమ్, 18
గాఢం పరిహితాః సర్వే దృష్ట్వా తం పర్వతోపమమ్.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, శైలమ్ ఇవ=పర్వతము వలె, స్థితమ్=ఉన్న, ఘోరమ్=భయంకరుడు అయిన, తమ్=ఆ, అసురమ్=అసురుని, దృష్ట్వా=చూచి, ఆశ్చర్యపడిరి. పర్వతోపమమ్=పర్వతముతో సమానుడు అయిన, తమ్=వానిని, దృష్ట్వా=చూచి, గాఢమ్=గట్టిగా, పరిహితాః=నడుము బిగించినవారైరి.

తా. ఆ వానరులందరు పర్వతము వలె ఉన్న భయంకరుడైన ఆ అసురుని చూచి వానితో యుద్ధము చేయుటకు పూర్తిగా సన్నద్ధులైరి. 18

మూ. సోఽపి తాన్వానరాన్ సర్వాన్ నష్టాః స్థేత్యబ్రవీద్బలీ. 19
అభ్యధావత సంక్రుద్ధో ముష్టిముద్యమ్య సజ్ఞతమ్.

ప్ర. అ. బలీ=బలవంతుడైన, సోఽపి=ఆ అసురుడు కూడ, నష్టాః=నశించినవారు, స్థ=అయినారు, ఇతి=అని, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, వానరాన్=వానరులను గూర్చి, అబ్రవీత్=పలికెను. సంక్రుద్ధః=కోపించినవాడై, సజ్ఞతమ్=బిగపట్టిన, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, అభ్యధావత=వారి కెదురుగా పరుగెత్తెను.

తా. బలవంతుడైన ఆ అసురుడు ఆ వానరులను చూచి "మీరు చచ్చినారు" అని పలుకుచు కోపముతో, బిగియుపట్టిన పిడికిలి ఎత్తి వారివైపు పరుగెత్తెను. 19

మూ. తమాపతన్తం సహసా వాలిపుత్రోఽఙ్గదస్తదా, 20
రావణోఽయమితి జ్ఞాత్వా తలేనాభిజఘాన హ.

ప్ర. అ. తదా=అపుడు, వాలిపుత్రః=వాలికుమారుడైన, అఙ్గదః=అంగదుడు, ఆపతన్తమ్=మీదికి వచ్చుచున్న, తమ్=వానిని, అయమ్=ఇతడే, రావణః=రావణుడు, ఇతి=అని, జ్ఞాత్వా=తలచి, సహసా=వెంటనే, తలేన=అరచేతితో, అభిజఘాన హ=కొట్టెను.

తా. అపుడు మీదికి వచ్చుచున్న వానిని చూచి ఇతడే రావణుడు అని అనుకొని వాలిపుత్రుడైన అంగదుడు వెంటనే వానిని అరచేతితో కొట్టెను. 20

మూ. స వాలిపుత్రాభిహతో వక్త్రాచ్ఛోణితముద్వమన్, 21
అసురో న్యపతద్భూమౌ పర్యస్త ఇవ పర్వతః.

ప్ర. అ. వాలిపుత్రాభిహతః=అంగదునిచేత కొట్టబడిన, సః అసురః=ఆ అసురుడు, వక్త్రాత్=ముఖమునుండి, శోణితమ్=రక్తమును, ఉద్వమన్=కక్కుచూ, పర్యస్తః= తలక్రిందులు చేయబడిన, పర్వతః ఇవ=పర్వతము వలె, భూమౌ=నేలపై, న్యపతత్=పడెను.

తా. అంగదునిచేత కొట్టబడిన ఆ అసురుడు ముఖము నుండి రక్తమును

గ్రక్కుకొనుచు తలక్రిందులైన పర్వతము వలె నేలపై పడెను. 21

మూ. తే తు తస్మిన్నిరుచ్ఛ్వాసే వానరా జితకాశినః, 22
విచిన్వన్ ప్రాయశస్తత్ర సర్వం తద్గిరిగహ్వరమ్.

ప్ర. అ. తస్మిన్=అతడు, నిరుచ్ఛ్వాసే=ప్రాణములు పోయినవాడగుచుండగా, జితకాశినః=జయముచేత ప్రకాశించుచున్న, తే=ఆ వానరులు, తత్ర=అక్కడ, ప్రాయశః=చాలవరకు, సర్వమ్=సమస్తమైన, తత్=ఆ, గిరిగహ్వరమ్=పర్వతగుహను, విచిన్వన్= వెదకిరి.

తా. ఆ అసురుడు మరణించిన పిదప విజయముతో ప్రకాశించుచున్న ఆ వానరులు ఆ పర్వతగుహను అంతను పూర్తిగా వెదకిరి. 22

మూ. విచితం తు తతః కృత్వా సర్వే తే కాననౌకసః, 23
అన్యదేవాపరం ఘోరం వివిశుర్గిరిగహ్వరమ్.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, కాననౌకసః=అరణ్యములలో నివసించు వానరులు, విచితమ్=వెదకబడినదానినిగా, కృత్వా=చేసి, తతః=అటు పిమ్మట, అన్యదేవ=మరియొక, ఘోరమ్=భయంకరమైన, అపరమ్=రెండవ, గిరిగహ్వరమ్=పర్వతగుహను, వివిశుః= ప్రవేశించిరి.

తా. ఆ గుహను పూర్తిగా వెదకిన పిమ్మట వానరు లందరు భయంకరమైన మరి యొక గుహలో ప్రవేశించిరి. 23

మూ. తే విచిత్య పునః ఖిన్నా వినిష్పత్య సమాగతాః. 24
ఏకాన్తే వృక్షమూలే తు నిషేదుర్దీనమానసాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
అష్టాచత్వారింశః సర్గః.

ప్ర. అ. తే=వారు, పునః=మరల, విచిత్య=వెదకి, ఖిన్నాః=అలసినవారై, వినిష్పత్య=బయటకు వచ్చి, సమాగతాః=కలసినవారై, దీనమానసాః=దీనమైన మనస్సులు గలవారై, ఏకాన్తే=ఒక ప్రదేశమునందు, వృక్షమూలే=వృక్షముయొక్క మూలమునందు, నిషేదుః=కూర్చుండిరి.

తా. వారు ఆ గుహలో వెదకి అలసిపోయి బయటకు వచ్చి అందరు కలిసికొని దీనమైన మనస్సులతో ఒక ప్రదేశమునందు చెట్టు మొదట కూర్చుండిరి.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనపఞ్చాశః సర్గః

*[అంగదుడు, గంధమాదనుడు ఓదార్చగా వానరులు మరల ఉత్సాహముతో సీతాన్వేషణము ప్రారంభించుట]*

మూ. అథాఙ్గదస్తదా సర్వాన్వానరానిదమబ్రవీత్,
పరిశ్రాన్తో మహాప్రాజ్ఞః సమాశ్వాస్య శనైర్వచః. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, పరిశ్రాన్తః=అలసిపోయిన, మహాప్రాజ్ఞః=చాల బుద్ధిమంతుడైన, అఙ్గదః=అంగదుడు, తదా=అపుడు, సర్వాన్=సమస్తమైన, వానరాన్= వానరులను, సమాశ్వాస్య=ఓదార్చి, శనైః=మెల్లగా, ఇదమ్=ఈ, వచః= వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట చాల అలసి ఉన్న మహాబుద్ధిమంతుడైన అంగదుడు, ఆ వానరులందరిని ఓదార్చుచు మెల్లగా ఇట్లు పలికెను. 1

మూ. వనాని గిరయో నద్యో దుర్గాణి గహనాని చ,
దర్యో గిరిగుహాశ్చైవ విచితాః సర్వమన్తతః. 2
తత్ర తత్ర సహాస్మాభిర్జానకీ న చ దృశ్యతే,
తథా రక్షోపహర్తా చ సీతాయాశ్చైవ దుష్కృతీ. 3

ప్ర. అ. అస్మాభిః=మనచేత, సహ=కలిసి, వనాని=వనములు, గిరయః= పర్వతములు, నద్యః=నదులు, దుర్గాణి=ప్రవేశింప శక్యముగాని, గహనాని చ=అడవులు, దర్యః=పొదలు, గిరిగుహాశ్చైవ=పర్వతగుహలు, అన్తతః=ప్రాంతములందున్న, సర్వమ్=సమస్తప్రదేశము, తత్ర తత్ర=అక్కడక్కడ, విచితాః=వెదకబడినవి. జానకీ= జానకి, న దృశ్యతే=చూడబడుటలేదు. తథా=అట్లే, సీతాయాః=సీతయొక్క, అపహర్తా=అపహారకుడైన, దుష్కృతీ=పాపాత్ముడైన, రక్షః చ=ఆ రాక్షసుడు కూడ, కనబడుటలేదు.

తా. మన మందరము కలిసి వనములు, పర్వతములు, నదులు, ప్రవేశింప శక్యము కాని అరణ్యములు, పొదలు, పర్వతగుహలు, ఆ యా ప్రాంత ప్రదేశములు, అన్నీ వెదికినాము. కాని సీత గాని, సీతను అపహరించిన దురాత్ముడైన ఆ రాక్షసుడు గాని కనబడలేదు. 2,3

మూ. కాలశ్చ నో మహాన్యాతః సుగ్రీవశ్చోగ్రశాసనః,
తస్మాద్భవన్తః సహితా విచిన్వన్తు సమన్తతః. 4

ప్ర. అ. నః=మనకు, మహాన్=గొప్ప, కాలః=కాలము, యాతః=గడచినది. సుగ్రీవశ్చ=సుగ్రీవుడు కూడ, ఉగ్రశాసనః=ఉగ్రమైన ఆజ్ఞ కలవాడు. తస్మాత్=ఆ కారణమువలన, భవన్తః=మీరు, సహితాః=కలిసినవారై, సమన్తతః=అంతటను, విచిన్వన్తు=వెదకెదరు గాక!

తా. మనము బయలుదేరి చాల కాల మైనది. సుగ్రీవుడా చండశాసనుడు. అందుచేత మీరందరు కలిసి అంతటా వెదకుడు. 4

మూ. విహాయ తన్ద్రీం శోకం చ నిద్రాం చైవ సముత్థితామ్,
విచినుధ్వం తథా సీతాం పశ్యామో జనకాత్మజామ్. 5

ప్ర. అ. సముత్థితామ్=పుట్టిన, తన్ద్రీమ్=అలసత్వమును, శోకం చ=శోకమును, నిద్రాం చైవ=నిద్రను, విహాయ=విడచి, జనకాత్మజామ్=జనకుని కుమార్తెయైన, సీతామ్=సీతను, (యథా=ఎట్లు) పశ్యామః=చూచెదమో, తథా=అట్లు, విచినుధ్వమ్=వెదకుడు.

తా. మీరందరు అలసత్వమును, శోకమును, నిద్రను విడచి, జనకుని కుమార్తె యైన సీత కనబడువరకు అన్వేషించుడు. 5

మూ. అనిర్వేదం చ దాక్ష్యం చ మనసశ్చాపరాజయమ్,
కార్యసిద్ధికరాణ్యాహుస్తస్మాదేతద్బ్రవీమ్యహమ్. 6

ప్ర. అ. అనిర్వేదమ్=దిగులు చెందకుండుటను, దాక్ష్యం చ=నేర్పును, మనసః=మనసుయొక్క, అపరాజయం చ=పరాజయము పొందకుండుటను, కార్యసిద్ధికరాణి=కార్యసిద్ధిని చేయువాటినిగా, ఆహుః=చెప్పుచున్నారు. తస్మాత్=ఆ కారణమువలన, అహమ్=నేను, ఏతత్=ఈ వాక్యమును, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. దిగులు చెందకుండుట, నేర్పు, మనస్సు ఉత్సాహముగా ఉండుట అనునవి కార్యసిద్ధిని కలిగించు నని చెప్పుదురు. అందువలననే నే నిట్లు చెప్పుచున్నాను. 6

మూ. అద్యాపీదం వనం దుర్గం విచిన్వన్తు వనౌకసః,
ఖేదం త్యక్త్వా పునః సర్వైర్వనమేవ విచీయతామ్. 7

ప్ర. అ. అద్యాపి=ఇపుడు కూడ, వనౌకసః=వానరులు, దుర్గమ్=ప్రవేశింప శక్యము గాని, ఇదం వనమ్=ఈ వనమును, విచిన్వన్తు=అన్వేషించెదరుగాక! సర్వైః=మీ అందరిచేత, ఖేదమ్=దుఃఖమును, త్యక్త్వా=విడచి, పునః=మరల, వనమేవ =ఈ వనమే, విచీయతామ్=అన్వేషింపబడుగాక!

తా. మీరందరు ఇపుడు కూడ ప్రవేశింప శక్యము కాని ఈ వనమునే వెదకుడు. దుఃఖమును విడచి మరల వెదకుట ప్రారంభించుడు. 7

మూ. అవశ్యం కుర్వతాం తస్య దృశ్యతే కర్మణః ఫలమ్.
పరం విర్వేదమాగమ్య వ హి నో మీలనం క్షమమ్. 8

ప్ర. అ. కుర్వతామ్=కార్యము చేయువారికి, తస్య కర్మణః=ఆ కర్మయొక్క, ఫలమ్= ఫలము, అవశ్యమ్=తప్పక, దృశ్యతే=చూడబడును. పరమ్=అట్లుగాక, నిర్వేదమ్= దిగులును, ఆగమ్య=పొంది, నః=మనకు, మీలనమ్=కండ్లు మూయుటకూడ, న క్షమమ్ హి=శక్యము కాదు గదా!

తా. కార్యమును చేయువానికి దాని ఫలము తప్పక లభించును. అట్లు గాక మనము దిగులుచెంది ఉన్నచో కండ్లు మూయుట కూడ కష్ట మగును. 8

మూ. సుగ్రీవః క్రోధనో రాజా తీక్ష్ణదణ్డశ్చ వానరాః,
భేతవ్యం తస్య సతతం రామస్య చ మహాత్మనః. 9

ప్ర. అ. వానరాః=వానరులారా! రాజా=రాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, క్రోధనః=కోపస్వభావము గలవాడు, తీక్ష్ణదణ్డశ్చ=తీక్ష్ణమైన దండనము గలవాడు. తస్య= ఆతనికి, మహాత్మనః= మహాత్ముడైన, రామస్య చ=రామునకు, సతతమ్=ఎల్లపుడు, భేతవ్యమ్=భయపడవలసి యున్నది.

తా. వానరులారా! మన రాజైన సుగ్రీవుడు కోపస్వభావము కలవాడు. తీక్ష్ణముగా దండించువాడు. మనము ఎల్లపుడు ఆతనికి మహాత్ముడైన రామునకు భయపడవలసి ఉన్నది. 9

మూ. హితార్థమేతదుక్తం వః క్రియతాం యది రోచతే,
ఉచ్యతాం హి క్షమం యత్తత్సర్వేషామేవ వానరాః. 10

ప్ర. అ. వానరాః=ఓ! వానరులారా! వః=మీయొక్క, హితార్థమ్= హితముకొరకు, ఏతత్=ఇది, ఉక్తమ్=చెప్పబడినది. రోచతే యది=ఇష్టమైనట్లైతే, క్రియతామ్=చేయుబడుగాక. యత్=ఏది, సర్వేషామేవ=మన అందరికి, క్షమమ్= తగినదో, తత్=అది, ఉచ్యతామ్=చెప్పబడుగాక!

తా. ఓ! వానరులారా! మీ హితమునే కోరి నే నిట్లు చెప్పుచున్నాను. మీకు ఇష్టమైనచో అట్లు చేయుడు. మన అందరికి తగినది ఏమైన ఉన్నచో చెప్పుడు. 10

మూ. అఙ్గదస్య వచః శ్రుత్వా వచనం గన్ధమాదనః,
ఉవాచావ్యక్తయా వాచా పిపాసాశ్రమఖిన్నయా. 11

ప్ర. అ. అఙ్గదస్య=అంగదునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, గన్ధమాదనః=గంధమాదనుడు, పిపాసాశ్రమఖిన్నయా=దప్పికచేతను, శ్రమచేతను అలసిన, అవ్యక్తయా=అస్పష్టమైన, వాచా=వాక్కుతో, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. గన్ధమాదనుడు అంగదుని మాటలు విని దప్పికచేత, అలసటచేత, మందమైన, అస్పష్టమైన మాటలు ఇట్లు పలికెను. 11

మూ. సదృశం ఖలు వో వాక్యమఙ్గదో యదువాచ హ,
హితం చైవానుకూలం చ క్రియాతామస్య భాషితమ్. 12

ప్ర. అ. అఙ్గదః=అంగదుడు, యత్ వాక్యమ్=ఏ వాక్యమును, ఉవాచ హ=పలికెనో అది, వః=మీకు, సదృశం ఖలు=తగినది కదా? హితం చైవ=హితము, అనుకూలం చ= అనుకూలము అయిన, అస్య=వానియొక్క, భాషితమ్=వచనము, క్రియతామ్=చేయబడుగాక!

తా. అంగదుడు మీతో చెప్పిన మాట తగినదిగా ఉన్నది. హితము, అనుకూలము అయిన ఇతడు చెప్పిన మాటను మీరు చేయవలెను. 12

మూ. పునర్మార్గామహే శైలాన్కన్దరాంశ్చ శిలాస్తథా,
కాననాని చ శూన్యాని గిరిప్రస్రవణాని చ. 13

ప్ర. అ. పునః=మరల, శైలాన్=పర్వతములను, కన్దరాంశ్చ=గుహలను, తథా=మరియు, శిలాః=శిలలను, శూన్యాని=శూన్యములైన, కాననాని చ=అడవులను, గిరిప్రస్రవణాని చ=పర్వతములను సెలయేళ్లను, మార్గామహే=వెదకుదుము.

తా. పర్వతములు, గుహలు, శిలలు, శూన్యములైన అడవులు, పర్వతములు, సెలయేళ్లు, వీటిని మరల వెదకుదము. 13

మూ. యథోద్దిష్టాని సర్వాణి సుగ్రీవేణ మహాత్మనా,
విచిన్వన్తు వనం సర్వే గిరిదుర్గాణి సఙ్గతాః. 14

ప్ర. అ. సర్వే=మీరందరు, సఙ్గతాః=కలిసినవారై, మహాత్మనా=మహాత్ముడైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, యథోద్దిష్టాని=చెప్పబడిన విధముగా నున్న, సర్వాణి=సమస్తమైన, గిరిదుర్గాణి=పర్వతదుర్గములను, విచిన్వన్తు=అన్వేషించెదరు గాక.

తా. మీరందరు కలిసి మహాత్ముడైన సుగ్రీవుడు చెప్పిన పర్వతదుర్గములను అన్నింటిని వెదకుడు. 14

మూ. తతః సముత్థాయ పునర్వానరాస్తే మహాబలాః,
విన్ధ్యకాననసఙ్కీర్ణాం విచేరుర్దక్షిణాం దిశమ్. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలాః=గొప్ప బలము గల, తే వానరాః=ఆ వానరులు, పునః=మరల, సముత్థాయ=లేచి, విన్ధ్యకాననసఙ్కీర్ణామ్=వింధ్యారణ్యము చేత వ్యాప్తమైన, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును, విచేరుః=సంచరించిరి.

తా. మరల మహాబలవంతులైన ఆ వానరు లందరు లేచి విన్ధ్యారణ్యముతో నిండిన దక్షిణదిక్కునందు సంచరించిరి. 15

మూ. తే శారదాభ్రప్రతిమం శ్రీమద్రజతపర్వతమ్,
శృఙ్గవన్తం దరీవన్తమధిరుహ్య చ వానరాః. 16
తత్ర లోధ్రవనం రమ్యం సప్తపర్ణవనాని చ,
విచిన్వన్తో హరివరాః సీతాదర్శనకాంక్షిణః. 17

ప్ర.అ. సీతాదర్శనకాంక్షిణః=సీతయొక్క దర్శనమును కోరుచున్న, హరివరాః= వానరశ్రేష్ఠులైన, తే వానరాః=ఆ వానరులు, శారదాభ్రప్రతిమమ్=శరత్కాలమేఘముతో సమానమైన, శ్రీమత్=శోభాయుక్త మైన, శృఙ్గవన్తమ్=శిఖరములు గల, దరీవన్తమ్= గుహలు గల, రజతపర్వతమ్=రజతపర్వతమును, అధిరుహ్య=ఎక్కి, తత్ర=దానిపై, రమ్యమ్=సుందరమైన, లోధ్రవనమ్=లోధ్రవృక్షముల వనమును, సప్తపర్ణవనాని చ= సప్తపర్ణవృక్షముల వనములను, విచిన్వన్తః=వెదకుచు ఉండిరి.

తా. వానరులలో శ్రేష్ఠులైన ఆ వానరులు సీతాదర్శనమును కోరుచు శరత్కాలమేఘము వలె నున్న శోభాయుక్తమైన శిఖరములతోను, గుహలతోను కూడిన రజతపర్వత మను పర్వతమును ఎక్కి దానిమీద నున్న రమ్యమైన లోధ్రవృక్షవనమును, సప్తపర్ణవృక్షవనములను వెదికిరి. 16, 17

మూ. తస్యాగ్రమధిరూఢాస్తే శ్రాన్తా విపులవిక్రమాః,
న పశ్యన్తి స్మ వైదేహీం రామస్య మహిషీం ప్రియామ్. 18

ప్ర. అ. తస్య=దానియొక్క, అగ్రమ్=అగ్రభాగమును, అధిరూఢాః=ఎక్కిన, విపులవిక్రమాః=అధికమైన పరాక్రమము గల, తే=వారు, శ్రాన్తాః=అలసినవారై, రామస్య=రామునియొక్క, ప్రియాం మహిషీమ్=ప్రియురాలైన భార్యయైన, వైదేహీమ్= సీతను, న పశ్యన్తి స్మ=చూడలేదు.

తా. అధికమైన పరాక్రమము గల ఆ వానరులు, ఆ పర్వతము పై భాగమును ఎక్కి రాముని భార్యయైన సీతను వెదకి అలసిపోయిరి. ఆమె మాత్రము కనబడలేదు. 18

మూ. తే తు దృష్టిగతం దృష్ట్వా తం శైలం బహుకన్దరమ్,
అవారోహన్త హరయో వీక్షమాణాః సమన్తతః. 19

ప్ర. అ. తే హరయః=ఆ వానరులు, దృష్టిగతమ్=దృష్టిని పొందిన, బహుకన్దరమ్= అనేకగుహలు గల, తం శైలమ్=ఆ పర్వతమును, దృష్ట్వా=చూచి, సమన్తతః=నలు వైపుల, వీక్షమాణాః=చూచుచు, అవారోహన్త=దిగిరి.

తా. ఆ వానరులు అనేకగుహలు గల ఎదురుగా ఉన్న ఆ పర్వతమును చూచి, అన్ని వైపులా పరీక్షించి క్రిందికి దిగిరి. 19

మూ. అవరుహ్య తతో భూమిం శ్రాన్తా విగతచేతసః,
స్థిత్వా ముహూర్తం తత్రాథ వృక్షమూలముపాశ్రితాః. 20

ప్ర. అ. తతః=ఆ పర్వతమునుండి, భూమిమ్=భూమిని గూర్చి, అవరుహ్య=దిగి, శ్రాన్తాః=అలసినవారై, విగతచేతసః=పోయిన చిత్తములు గలవారై, తత్ర=అక్కడ, ముహూర్తమ్=క్షణకాలము, స్థిత్వా=ఉండి, అథ=అటుపిమ్మట, వృక్షమూలమ్= వృక్షమూలమును, ఉపాశ్రితాః=ఆశ్రయించినారు.

తా. ఆ వానరులు ఆ పర్వతమునుండి నేలమీదికి దిగి అలసి, ఆలోచన చేయజాలని మనస్సులతో అక్కడ క్షణకాలము ఉండి, వృక్షముల మూలములను ఆశ్రయించిరి. 20

మూ. తే ముహూర్తం సమాశ్వస్తాః కిఞ్చిద్భగ్నపరిశ్రమాః,
పునరేవోద్యతాః కృత్స్నాం మార్గితుం దక్షిణాం దిశమ్. 21

ప్ర. అ. తే=వారు, ముహూర్తమ్=క్షణకాలము, సమాశ్వస్తాః= సేదతీర్చుకొన్నవారై, కిఞ్చిత్=కొంచెము, భగ్నపరిశ్రమాః=తొలగిన అలసట గలవారై, పునరేవ= మరల, కృత్స్నామ్=సమస్తమైన, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును, మార్గితుమ్= అన్వేషించుటకు, ఉద్యతాః=ఉద్యమించిరి.

తా. వారు కొంచెముసేపు సేదతీర్చుకొని, కొంచెము అలసట తగ్గిన పిమ్మట, మరల ఆ దక్షిణదిక్కు నంతను వెదకుటకు ఉద్యమించిరి. 21

మూ. హనుమత్ప్రముఖాస్తావత్ప్రస్థితాః ప్లవగర్షభాః,
విన్ధ్యమేవాదితః కృత్వా విచేరుశ్చ సమన్తతః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకోనపఞ్చాశః సర్గః

ప్ర. అ. హనుమత్ప్రముఖాః=హనుమంతుడు మొదలైన, ప్లవగర్షభాః=వానరులు, ప్రస్థితాః=అన్వేషణమునకు ప్రారంభించినవారై, ఆదితః=మొదటినుంచి, కృత్వా=చేసి, విన్ధ్యమేవ=వింధ్యపర్వతమునే, సమన్తతః=అన్ని వైపుల, విచేరుః=అన్వేషించిరి.

తా. హనుమంతుడు మొదలైన ఆ వానరశ్రేష్ఠులు అన్వేషణమును మరల ప్రారంభించి ఆ విన్ధ్యపర్వతమునందే దాని మొదటినుండి అన్ని వైపుల అన్వేషించిరి.

*"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో నలుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.*

# అథ పఞ్చాశః సర్గః

[ఆకలిదప్పులతో బాధపడుచున్న వానరులు ఒక గుహలో ప్రవేశించుట. అక్కడ వారు దివ్యములైన వృక్షములను, సరోవరమును, భవనములను, ఒక వృద్ధురాలగు తాపసిని చూచుట. హనుమంతుడు ఆమెను గూర్చి ప్రశ్నించుట]

మూ. సహ తారాఙ్గదాభ్యాం తు సఙ్గమ్య హనుమాన్ కపిః,
విచినోతి స్మ విన్ధ్యస్య గుహాశ్చ గహనాని చ. 1

ప్ర. అ. కపిః=వానరుడైన, హనుమాన్=హనుమంతుడు, తారాఙ్గదాభ్యాం సహ= తారునితోను, అంగదునితోను, సఙ్గమ్య=కలిసి, విన్ధ్యస్య=వింధ్యపర్వతము యొక్క, గుహాశ్చ=గుహలను, గహనాని చ=అరణ్యములను, విచినోతి స్మ=అన్వే షించెను.

తా. హనుమంతుడు తారాంగదులతో కలిసి వింధ్యపర్వతగుహలను, అరణ్యములను అన్వేషించెను. 1

మూ. సింహశార్దూలజుష్టాశ్చ గుహాశ్చ పరితస్తదా,
విషమేషు నగేన్ద్రస్య మహాప్రస్రవణేషు చ. 2

ప్ర. అ. తదా =అపుడు, పరితః = నలు వైపుల, సింహశార్దూలజుష్టాః = సింహములతోను, శార్దూలములతోను కూడిన, గుహాశ్చ = గుహలను, నగేన్ద్రస్య = పర్వతముయొక్క, విషమేషు = విషమప్రదేశములయందు, మహాప్రస్రవణేషు చ=గొప్ప జలపాతప్రదేశములయందు వెదకెను.

తా. సింహములతోను, పులులతోను నిండిన ఆ పర్వతము గుహలలోను, ఎగుడుదిగుడుగా ఉండు ప్రదేశములలోను, పెద్ద జలప్రపాతము లున్న ప్రదేశములలోను వెదకెను. 2

మూ. ఆసేదుస్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్,
తేషాం తత్రైవ వసతాం స కాలో వ్యత్యవర్తత. 3

ప్ర. అ. తస్య శైలస్య = ఆ పర్వతముయొక్క, దక్షిణపశ్చిమామ్ = నైఋతి దిక్కునందున్న, కోటిమ్ = అగ్రభాగమును, ఆసేదుః = పొందిరి. తేషామ్ = వారు, తత్రైవ =అక్కడనే, వసతామ్ = నివసించుచుండగా, సః కాలః = ఆ కాలము, వ్యత్యవర్తత = గడచిపోయెను.

తా. ఆ వానరులు ఆ పర్వతము నైఋతి మూలనున్న అగ్రభాగమును

చేరిరి. వారు అక్కడనే నివసించుచుండగా ఆ కాలము గడచిపోయెను. 3

మూ. స హి దేశో దురన్వేష్యో గుహాగహనవాన్మహాన్,
తత్ర వాయుసుతః సర్వం విచినోతి స్మ పర్వతమ్. 4

ప్ర. అ. గుహాగహనవాన్ = గుహలు అరణ్యములు గల, మహాన్ = గొప్ప దైన, సః దేశః =ఆ దేశము, దురన్వేష్యః = వెదకుటకు కష్టమైనది. వాయుసుతః = హనుమంతుడు, తత్ర = అక్కడ, సర్వమ్ = సమస్తమైన, పర్వతమ్ = పర్వతమును, విచినోతి స్మ = అన్వేషించెను.

తా. గుహలతోనూ, అరణ్యములతోను నిండిన, విశాలమైన ఆ ప్రదేశము వెదకుటకు చాల కష్టముగా ఉండెను. హనుమంతుడు అక్కడ ఆ ప్రదేశము నంతను వెదకెను. 4

మూ. పరస్పరేణ రహితా అన్యోన్యస్యావిదూరతః,
గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః. 5
మైన్దశ్చ ద్వివిదశ్చైవ హనుమాన్ జామ్బవానపి,
అఙ్గదో యువరాజశ్చ తారశ్చ వనగోచరః. 6
గిరిజాలావృతాన్ దేశాన్మార్గిత్వా దక్షిణాం దిశమ్,
విచిన్వన్తస్తతస్తత్ర దదృశుర్వివృతం బిలమ్, 7
దుర్గమృక్షబిలం నామ దానవేనాభిరక్షితమ్.

ప్ర. అ. గజః = గజుడు, గవాక్షః = గవాక్షుడు, గవయః = గవయుడు, శరభః = శరభుడు, గన్ధమాదనః = గంధమాదనుడు, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చైవ= ద్వివిదుడు, హనుమాన్ = హనుమంతుడు, జామ్బవానపి = జాంబవంతుడు, యువరాజః= యువరాజైన, అఙ్గదశ్చ = అంగదుడు, వనగోచరః = వానరుడైన, తారశ్చ = తారుడు, పరస్పరేణ = ఒకరితో ఒకరు, రహితాః=వేరుపడినవారై, అన్యోన్యస్య= పరస్పరమునకు, అవిదూరతః = సమీపమునందే ఉన్నవారై, గిరిజాలావృతాన్ = పర్వతసముదాయములచేత కప్పబడిన, దేశాన్ = దేశములను, మార్గిత్వా = వెదకి, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును, తతః = అటుపిమ్మట, విచిన్వన్తః = వెదకుచు, తత్ర = అక్కడ, దానవేన = దానవునిచేత, అభిరక్షితమ్ = రక్షింపబడిన, దుర్గమ్ = ప్రవేశింప శక్యముగాని, ఋక్షబిలం నామ = ఋక్షబిల మను పేరు గల, వివృతమ్ = తెరచి ఉన్న, బిలమ్ = బిలమును, దదృశుః =చూచిరి.

తా. గజ - గవాక్ష - గవయ - శరభ - గన్ధమాదన - మైన్ద - ద్వివిదులు, హనుమంతుడు, జాంబవంతుడు, యువరాజైన అంగదుడు, తారుడు, వీరందరు విడివిడిగా ఒకరి కొకరు దగ్గరగానే ఉంటూ, పర్వతములతో నిండిన ఆ ప్రదేశములను వెదకి పిమ్మట దక్షిణదిక్కును వెదకుచు అక్కడ దానవునిచే

రక్షింపబడుచున్న ప్రవేశింప శక్యము గాని తెరచి ఉన్న ఋక్షబిల మనే బిలమును చూచిరి. 5-7

మూ. క్షుత్పిపాసాపరీతాస్తు శ్రాన్తాస్తు సలిలార్థినః, 8
అవకీర్ణం లతావృక్షై ర్దదృశుస్తే మహాబిలమ్.

ప్ర. అ. క్షుత్పిపాసాపరీతాః = ఆకలిదప్పులతో కూడిన, శ్రాన్తాః = అలసిన, సలిలార్థినః = ఉదకమును కోరుచున్న, తే = వారు, లతావృక్షైః = లతలతోను, వృక్షములతోను, అవకీర్ణమ్ = వ్యాప్తమైన, మహాబిలమ్ = గొప్ప బిలమును, దదృశుః =చూచిరి.

తా. ఆకలిదప్పికలతో బాధపడుచు, అలసినవారై నీటికోసమై చూచుచున్న ఆ వానరులు లతావృక్షములతో నిండిన ఆ మహాబిలమును చూచిరి. 8

మూ. తత్ర క్రౌఞ్చాశ్చ హంసాశ్చ సారసాశ్చాపి నిష్క్రమన్, 9
జలార్ద్రాశ్చక్రవాకాశ్చ రక్తాఙ్గాః పద్మరేణుభిః.

ప్ర. అ. తత్ర = అక్కడ, క్రౌఞ్చాశ్చ = క్రౌంచపక్షులు, హంసాశ్చ = హంసలు, సారసాశ్చ = సారసపక్షులు, జలార్ద్రాః = నీటితో తడిసిన, పద్మరేణుభిః = పద్మపరాగములచేత, రక్తాఙ్గాః = రంగు పూయబడిన దేహములు గల, చక్రవాకాశ్చ = చక్రవాకపక్షులు, నిష్క్రమన్ = బయటకు వచ్చినవి.

తా. అక్కడ క్రౌంచపక్షులు, హంసలు, సారసములు, పద్మపరాగముల చేత పూయబడిన నీటికి తడిసిన చక్రవాకపక్షులు ఆ బిలమునుండి బయటికి వచ్చుచుండెను. 9

మూ. తతస్తద్బిలమాసాద్య సుగన్ధి దురతిక్రమమ్, 10
విస్మయవ్యగ్రమనసో బభూవుర్వానరర్షభాః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వానరర్షభాః = వానరశ్రేష్ఠులు, సుగన్ధి = సువాసనగలది, దురతిక్రమమ్ = దాట శక్యము గానిది అయిన, తత్ బిలమ్ =ఆ బిలమును, ఆసాద్య = సమీపించి, విస్మయవ్యగ్రమనసః =ఆశ్చర్యముచేత వ్యగ్రమైన మనస్సు గలవారుగా, బభూవుః = అయిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు సువాసనగల, దాట శక్యము గాని ఆ బిలమును సమీపించగానే వారి మనస్సులు ఆశ్చర్యముతో వ్యగ్రము లయ్యెను. 10

మూ. సఞ్జాతపరిశఙ్కాస్తే తద్బిలం ప్లవగోత్తమాః, 11
అభ్యపద్యన్త సంహృష్టాస్తేజోవన్తో మహాబలాః.

ప్ర. అ. తేజోవన్తః = తేజస్సు గలవారు, మహాబలాః = గొప్ప బలము గలవారు అయిన, తే = ఆ, ప్లవగోత్తమాః = వానరశ్రేష్ఠులు, సఞ్జాతపరిశఙ్కాః

= పుట్టిన శంక గలవారై, సంహృష్టాః = సంతోషించినవారై, తత్ బిలమ్ = ఆ బిలమును, అభ్యపద్యన్త = సమీపించిరి.

తా. తేజశ్శాలులు, మహాబలవంతులు అయిన ఆ వానరశ్రేష్ఠులకు ఆ బిలమును చూడగానే సందేహము గలిగెను. వారు సంతోషించుచు దానిని సమీపించిరి. 11

మూ. నానాసత్త్వసమాకీర్ణం దైత్యేన్ద్రనిలయోపమమ్, 12
దుర్దర్శమివ ఘోరం చ దుర్విగాహ్యం చ సర్వశః.

ప్ర. అ. నానాసత్త్వసమాకీర్ణమ్ = అనేక జంతువులతో నిండినది, దైత్యేన్ద్రనిలయోపమమ్ = బలిచక్రవర్తి స్థానముతో సమానము, దుర్దర్శమివ = చూచుటకు శక్యము కానిది, ఘోరమ్ = భయంకరము, సర్వశః = అన్ని వైపుల, దుర్విగాహ్యం చ = ప్రవేశింప శక్యము గానిది అయిన ఆ బిలమును సమీపించిరి.

తా. అనేక జంతువులతో నిండిన భయంకరమైన ఆ బిలము పాతాళము వలె ఉండెను. చూచుటకు కూడ శక్యము గాని ఆ బిలము ఎటువైపునుండి కూడ ప్రవేశించుటకు శక్యము గానిదై ఉండెను. 12

మూ. తతః పర్వతకూటాభో హనూమాన్మారుతాత్మజః, 13
అబ్రవీద్వానరాన్ సర్వాన్కాన్తారవనకోవిదః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పర్వతకూటాభః = పర్వతశిఖరము వంటి కాంతి గల, కాన్తారవనకోవిదః = మహారణ్యములను, వనములను గూర్చి తెలిసిన, మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనూమాన్ = హనుమంతుడు, సర్వాన్ = సమస్తమైన, వానరాన్ = వానరులను గూర్చి , అబ్రవీత్ =పలికెను.

తా. పిమ్మట అరణ్యములను గూర్చి వనములను గూర్చి బాగుగా తెలిసిన పర్వతశిఖరము వంటి దేహము గల వాయుపుత్రుడైన హనుమంతుడు ఆ వానరులందరితో ఇట్లు పలికెను. 13

మూ. గిరిజాలావృతాన్ దేశాన్మార్గిత్వా దక్షిణాం దిశమ్, 14
వయం సర్వే పరిశ్రాన్తా న చ పశ్యామ మైథిలీమ్.

ప్ర. అ. వయమ్ = మనము, సర్వే = అందరము, గిరిజాలావృతాన్ = పర్వతసముదాయములచేత కప్పబడిన, దేశాన్ = దేశములను, మార్గిత్వా = అన్వేషించి, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును అన్వేషించి, పరిశ్రాన్తాః = అలసితిమి. మైథిలీమ్ = సీతను, న చ పశ్యామ = చూడము.

తా. మనము అందరము పర్వతములతో నిండిన ప్రదేశములను దక్షిణదిక్కును వెదకి అలసిపోయినాము. కాని సీత కనబడలేదు. 14

మూ. అస్మాచ్చాపి బిలాద్ధంసాః క్రౌఞ్చాశ్చ సహ సారసైః, 15
జలార్ద్రాశ్చక్రవాకాశ్చ నిష్పతన్తి స్మ సర్వశః.
నూనం సలిలవానత్ర కూపో వా యది వా హ్రదః, 16
తథా చేమే బిలద్వారే స్నిగ్ధాస్తిష్ఠన్తి పాదపాః.

ప్ర. అ. అస్మాత్ = ఈ, బిలాత్ = బిలమునుండి , హంసాః = హంసలు, సారసైః సహ = సారసపక్షులతో కూడ, క్రౌఞ్చాశ్చ = క్రౌంచపక్షులు, జలార్ద్రాః = నీటితో తడిసిన, చక్రవాకాశ్చ =చక్రవాకపక్షులు, సర్వశః = అన్ని వైపులనుండి, నిష్పతన్తి స్మ = బయటికి వచ్చుచున్నవి. అత్ర = ఇక్కడ, సలిలవాన్ = నీరు గల, కూపో వా=నుయ్యి గాని, యది వా =లేక, హ్రదః = చెఱువు గాని ఉన్నది. నూనమ్ = నిశ్చయము. తథా =అట్లే, ఇమే = ఈ, బిలద్వారే = బిలద్వారమునందలి, పాదపాః = వృక్షములు, స్నిగ్ధాః = మెరియుచు, తిష్ఠన్తి = ఉన్నవి.

తా. ఈ బిలము అన్ని వైపులనుండి హంసలు, క్రౌంచపక్షులు, సారసపక్షులు, నీటితో తడసిన చక్రవాకములు, బయటకు వచ్చుచున్నవి. ఇక్కడ ఉదకముతో నిండిన కూపము గాని, నుయ్యి గాని, చెఱువు గాని తప్పక ఉండును. అందుచేతనే ఈ బిలద్వారమునందున్న వృక్షములు పచ్చగా ప్రకాశించుచున్నవి.15,16

మూ. ఇత్యుక్తాస్తద్బిలం సర్వే వివిశుస్తమిరావృతమ్, 17
అచన్ద్రసూర్యం హరయో దదృశూ రోమహర్షణమ్.

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, ఉక్తాః = పలుకబడిన, సర్వే= సమస్తమైన వానరులు, తిమిరావృతమ్ = చీకటిచే కప్పబడిన, తత్ బిలమ్ =ఆ బిలమును, వివిశుః = ప్రవేశించిరి. హరయః = వానరులు, అచన్ద్రసూర్యమ్ = చంద్రసూర్యులు లేని, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించు ఆ బిలమును, దదృశుః = చూచిరి.

తా. ఆ వానరు లందరు హనుమంతుని మాటలు విని చీకటిచే ఆవరింపబడిన ఆ బిలములో ప్రవేశించి చంద్రసూర్యులు లేని, రోమాంచమును కలిగించు ఆ బిలమును చూచిరి. 17

మూ. నిశామ్య తస్మాత్సింహాంశ్చ తాంస్తాంశ్చ మృగపక్షిణః, 18
ప్రవిష్టా హరిశార్దూలా బిలం తిమిరసంవృతమ్.

ప్ర. అ. హరిశార్దూలాః = వానరశ్రేష్ఠులు, తస్మాత్ = ఆ బిలమునుండి వచ్చుచున్న, సింహాంశ్చ = సింహములను, తాంస్తాన్ = ఆ యా, మృగపక్షిణః = మృగములను పక్షులను, నిశామ్య = చూచి, తిమిరసంవృతమ్ = చీకటిచే కప్పబడిన, బిలమ్ = బిలమును, ప్రవిష్టాః = ప్రవేశించిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు ఆ బిలమునుండి వచ్చుచున్న సింహములను, ఆయా మృగములను పక్షులను చూచి చీకటితో నిండిన ఆ బిలములో ప్రవేశించిరి.

మూ. న తేషాం సజ్జతే దృష్టిర్న తేజో న పరాక్రమః, 19
వాయోరివ గతిస్తేషాం దృష్టిస్తమసి వర్తతే.

ప్ర. అ. తేషామ్ = వారియొక్క, దృష్టిః =దృష్టి, న సజ్జతే = అడ్డుకొనబడుటలేదు. తేజః = తేజస్సు, న = అడ్డుకొనబడుటలేదు. పరాక్రమః = పరాక్రమము, న = అడ్డుకొనబడుటలేదు. తేషామ్ = వారి యొక్క, గతిః =గమనము, వాయోరివ =వాయువు గమనము వలె ఉండెను. దృష్టిః = దృష్టి, తమసి = అంధకారములో కూడ, వర్తతే = ప్రవర్తించుచుండెను.

తా. వారి దృష్టికి కాని, తేజస్సుకు గాని, పరాక్రమమునకు గాని, అడ్డు లేకుండెను. వారి గమనము వాయుగమనము వలె అంతటా ఉండెను. వారి దృష్టి అంధకారములో కూడ ప్రసరించు చుండెను. 19

మూ. తే ప్రవిష్టాస్తు వేగేన తద్బిలం కపికుఞ్జరాః, 20
ప్రకాశం చాభిరామం చ దదృశుర్దేశముత్తమమ్.

ప్ర. అ. తత్ బిలమ్ = ఆ బిలమును, వేగేన = వేగముతో, ప్రవిష్టాః = ప్రవేశించిన, తే కపికుఞ్జరాః = ఆ వానరశ్రేష్ఠులు, ప్రకాశం చ = ప్రకాశించుచున్నది, అభిరామం చ = మనోహరము అయిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, దేశమ్ = దేశమును, దదృశుః = చూచిరి.

తా. వేగముగా ఆ బిలములో ప్రవేశించిన ఆ వానరవీరులు అక్కడ ప్రకాశముతో కూడి మనోహరముగా ఉన్న ప్రదేశమును చూచిరి. 20

మూ. తతస్తస్మిన్బిలే భీమే నానాపాదపసఙ్కులే, 21
అన్యోన్యం సమ్పరిష్వజ్య జగ్ముర్యోజనమన్తరమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అన్యోన్యమ్ = పరస్పరము, సమ్పరిష్వజ్య = దగ్గరగా పట్టుకొని, భీమే =భయంకరము, నానాపాదపసఙ్కులే = అనేక విధములైన వృక్షములతో నిండినది అయిన, తస్మిన్ బిలే = ఆ బిలమునందు, యోజనమ్ = ఒక యోజనము, అన్తరమ్ = దూరమును, జగ్ముః = వెళ్ళిరి.

తా. పిమ్మట వారు ఒకరి నొకరు గట్టిగా పట్టుకొని అనేకవృక్షములతో నిండి భయంకరముగా నున్న ఆ బిలముతో ఒక యోజనము దూరము వెళ్ళిరి.21

మూ. తే నష్టసంజ్ఞాస్తృషితాః సమ్భ్రాన్తాః సలిలార్థినః, 22
పరిపేతుర్బిలే తస్మిన్కఞ్చిత్కాలమతన్ద్రితాః.

ప్ర. అ. నష్టసంజ్ఞాః = నష్టమైన సంజ్ఞ గలవారు, తృషితాః =

దప్పికొన్నవారు, సమ్భ్రాన్తాః = భ్రాంతి చెందినవారు, సలిలార్థినః = ఉదకమును కోరుచున్నవారు అయిన, తే = వారు, అతన్ద్రితాః = అలసత్వము లేనివారై, తస్మిన్ = ఆ, బిలే = బిలమునందు, కఞ్చిత్కాలమ్ = కొంచెము సమయము, పరిపేతుః = పడిరి.

తా. దప్పికతో జలమును కోరుచు, సంజ్ఞ కోల్పోయి భ్రాంతి చెందిన చిత్తములతో కూడిన ఆ వానరులు ఆ బిలములో కొంతసేపు అలసత్వము లేకుండగా దుమికిరి. 22

మూ. తే కృశా దీనవదనాః పరిశ్రాన్తాః ప్లవఙ్గమాః, 23
ఆలోకం దదృశుర్వీరా నిరాశా జీవితే యదా.

ప్ర. అ. కృశాః = కృశించినవారు, దీనవదనాః = దీనములైన ముఖములు కలవారు, పరిశ్రాన్తాః = అలిసిపోయినవారు అయిన , తే = ఆ, వీరాః = వీరులైన, ప్లవఙ్గమాః = వానరులు, యదా = ఎపుడు, జీవితే = జీవితమునందు, నిరాశాః = ఆశ లేనివారైనారో, అపుడు, ఆలోకమ్ = వెలుతురును, దదృశుః = చూచిరి.

తా. అలసి, కృశించి, దైన్యముతో కూడిన ముఖములతో ఆ వానరులు జీవితముపై నిరాశ చెందిన సమయమున వారి కొక వెలుతురు కనబడెను.23

మూ. తతస్తం దేశమాగమ్య సౌమ్యా వితిమిరం వనమ్, 24
దదృశుః కాఞ్చనాన్ వృక్షాన్ దీప్తవైశ్వానరప్రభాన్.
సాలాంస్తాలాంస్తమాలాంశ్చ పున్నాగాన్ వఞ్జులాన్ ధవాన్, 25
చమ్పకాన్ నాగవృక్షాంశ్చ కర్ణికారాంశ్చ పుష్పితాన్,
స్తబకైః కాఞ్చనైశ్చిత్రై రక్తైః కిసలయైస్తథా. 26
ఆపీడైశ్చ లతాభిశ్చ హేమాభరణభూషితాన్,
తరుణాదిత్యసఙ్కాశాన్ వైదూర్యమయవేదికాన్. 27
విభ్రాజమానాన్వపుషా పాదపాంశ్చ హిరణ్మయాన్,
నీలవైదూర్యవర్ణాశ్చ పద్మినీః పతగైర్వృతాః, 28
మహద్భిః కాఞ్చనైః పద్మైర్వృతా బాలార్కసన్నిభైః.

ప్ర. అ. సౌమ్యాః = సౌమ్యులైన ఆ వానరులు, తతః = అటుపిమ్మట, తం దేశమ్ = ఆ ప్రదేశమును, ఆగమ్య = పొంది, వితిమిరమ్ = చీకటి లేని, వనమ్ = వనమును, దీప్తవైశ్వానరప్రభాన్ = మండుచున్న అగ్ని వంటి కాంతి గల, కాఞ్చనాన్ = బంగారు వికారమైన, వృక్షాన్ = వృక్షములను, సాలాన్ = సాలవృక్షములను, తాలాన్ = తాలవృక్షములను, తమాలాంశ్చ = తమాల వృక్షములను, పున్నాగాన్=పున్నాగవృక్షములను, వఞ్జులాన్= వంజుల వృక్షములను, ధవాన్ = ధవవృక్షములను, చమ్పకాన్ = చంపక వృక్షములను,

నాగవృక్షాంశ్చ = నాగ వృక్షములను, పుష్పితాన్ = పుష్పించిన, కర్ణికారాంశ్చ = కర్ణికార వృక్షములను, కాఞ్చనైః = బంగారువికారమైన, చిత్రైః = చిత్రములైన, స్తబకైః = పూలగుత్తులతోను, తథా = మరియు, రక్తైః = ఎఱ్ఱనైన, కిసలయైః = చిగుళ్ళతోను, ఆపీడైః = ఉన్నతమైన పైభాగములతోను, లతాభిశ్చ = లతలతోను కూడినవి, హేమాభరణభూషితాన్ = బంగారు అలంకారములచేత అలంకరింపబడినవి, తరుణాదిత్యసఙ్కాశాన్ = బాలసూర్యునితో సమానమైనవి, వైదూర్యమయవేదికాన్ = వైదూర్యమాణిక్య వికారమైన తిన్నెలు కలవి అయిన, వపుషా = దేహముచేత, విభ్రాజమానాన్ = ప్రకాశించుచున్న, హిరణ్మయాన్ = బంగారు వికారమైన, పాదపాంశ్చ = వృక్షములను, నీలవైదూర్యవర్ణాః = నల్లని వైదూర్యమాణిక్యమువంటి వర్ణము గలవి, పతగైః = పక్షులతో, వృతాః = కూడినవి, బాలార్కసన్నిభైః = బాలసూర్యునితో సమానములైన, కాఞ్చనైః = బంగారు వికారమైన, మహద్భిః = పెద్దవైన, పద్మైః = పద్మములతో, వృతాః = కూడినవి అయిన, పద్మినీః = పద్మలతలను, దదృశుః = చూచిరి.

తా. సౌమ్యులైన ఆ వానరులు ఆ ప్రదేశమును చేరి, చీకటి లేని వనమును, మండుచున్న అగ్ని వంటి కాంతి గల బంగారు వృక్షములను, పుష్పించిన సాల - తాల -తమాల - పున్నాగ - వంజుల - ధవ - చంపక - నాగ - కర్ణికార వృక్షములను చూచిరి. అక్కడ నున్న బంగారు వృక్షములు చిత్రములైన బంగారు పువ్వుల గుర్తులతోను, ఎఱ్ఱని చిగుళ్ళతోను, ఉన్నతములైన భాగములతోను, చుట్టిన లతలతోను, ప్రకాశించుచుండెను. అవి బంగారు అలంకారములతో అలంకరింపబడి , బాలసూర్యుని వలె ప్రకాశించుచుండెను. వాటి అగ్రమూలమునందు వైదూర్యమణుల వేదికలు అమర్చబడి ఉండెను. వారు అక్కడ నల్లని వైదూర్యముల వంటి రంగు గల పద్మలతలను చూచిరి. వాటి చుట్టు పక్షులు ఎగురుచుండెను. అవి బాల సూర్యుని వంటి కాంతి గల బంగారు పెద్దపద్మములతో నిండియుండెను.24-28

మూ. జాతరూపమయైర్మత్స్యైర్మహద్భిశ్చాథ పఙ్కజైః, 29
నళినీస్తత్ర దదృశుః ప్రసన్నసలిలాయుతాః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, జాతరూపమయైః = బంగారు వికారమైన, మత్స్యైః = మత్స్యములతోను, మహద్భిః = పెద్దవైన, పఙ్కజైః = పద్మములతోను కూడిన, ప్రసన్నసలిలాయుతాః = నిర్మలమైన ఉదకముతో కూడిన, నళినీః = పద్మసరస్సులను, తత్ర = అక్కడ, దదృశుః = చూచిరి.

తా. పిమ్మట ఆ వానరులు అక్కడ నిర్మలమైన జలము గల పద్మ సరస్సులను చూచిరి. అవి బంగారు మత్స్యములతోను, పెద్ద పద్మములతోను ప్రకాశించుచుండెను. 29

మూ. కాఞ్చనాని విమానాని రాజతాని తథైవ చ, 30
తపనీయగవాక్షాణి ముక్తాజాలావృతాని చ,

హైమరాజతభౌమాని వైదూర్యమణిమన్తి చ, 31
దదృశుస్తత్ర హరయో గృహముఖ్యాని సర్వశః.

ప్ర. అ. హరయః= వానరులు, తత్ర = అక్కడ, కాఞ్చనాని = బంగారు వికారమైన, తథైవ = మరియు, రాజతాని = వెండి వికారమైన, విమానాని = విమానములను, తపనీయగవాక్షాణి = బంగారు కిటికీలు గలవి, ముక్తాజాలావృతాని చ = ముత్యముల చేత కప్పబడినవి, హైమరాజతభౌమాని = బంగారు అంతస్తులు, వెండి అంతస్తులు కలవి, వైదుర్యమణిమన్తి చ= వైదుర్యమణులు గలవి అయిన, గృహముఖ్యాని = శ్రేష్ఠమైన గృహములను, సర్వశః = అన్నివైపుల, దదృశుః = చూచిరి.

తా. వారి కక్కడ అన్ని వైపుల బంగారు గృహములు, వెండి గృహములు కనబడెను. శ్రేష్ఠములైన ఆ గృహములలో, బంగారు కిటికీలు ఉండెను. అవి ముత్యములలో నిర్మించిన వలల చేత కప్పబడెను. వైదూర్యమణులతో నిండిన ఆ గృహములలో కొన్ని అంతస్థులు బంగారముతోను, కొన్ని వెండితోను నిర్మించబడెను. 30,31

మూ. పుష్పితాన్ ఫలినో వృక్షాన్ ప్రవాళమణిసన్నిభాన్, 32
కాఞ్చనభ్రమరాంశ్చైవ మధూని చ సమన్తతః.

ప్ర. అ. పుష్పితాన్= పుష్పించిన, ఫలినః = ఫలములు గల, ప్రవాళమణిసన్నిభాన్ = పొగడములతో సమానమైన, వృక్షాన్ = వృక్షములను, కాఞ్చనభ్రమరాంశ్చైవ = బంగారు తుమ్మెదలను, మధూని చ = మధువులను, సమన్తతః = అన్నివైపుల (చూచిరి).

తా. వారికి ఆ ప్రాంతమునం దంతటను పుష్పఫలములతో నిండిన పగడముల వంటి కాంతి గల వృక్షములు, బంగారు తుమ్మెదలు, మధువులు కనబడెను. 32

మూ. మణికాఞ్చనచిత్రాణి శయనాన్యాసనాని చ, 33
వివిధాని విశాలాని దదృశుస్తే సమన్తతః,
హైమరాజతకాంస్యానాం భాజనానాం చ సఞ్చయాన్. 34

ప్ర. అ. తే = వారు, మణికాఞ్చనచిత్రాణి = మణులచేత, బంగారముచేత, చిత్రవర్ణములై ఉన్న, వివిధాని = అనేక విధములైన, విశాలాని = విశాలములైన, శయనాని = శయనములను, ఆసనాని చ = ఆసనములను, హైమరాజతకాంస్యానామ్ = బంగారము, వెండి, కంచు - వీటి వికారమైన, భాజనానామ్ = పాత్రలయొక్క, సఞ్చయాన్ చ = సముదాయములను, సమన్తతః= అంతట, దదృశుః = చూచిరి.

తా. వారికి అక్కడ మణులచేతను బంగారముచేతను విచిత్రములుగా

న్న విశాలములైన అనేకవిధములైన శయనములు, ఆసనములు; బంగారముతోను, వెండితోను, కంచుతోను చేసిన పాత్రల సముదాయములు కనబడెను. 33,34

మూ. అగురూణాం చ దివ్యానాం చన్దనానాం చ సఞ్చయాన్,
శుచీన్యభ్యవహార్యాణి మూలాని చ ఫలాని చ. 35

ప్ర. అ. దివ్యానామ్=దివ్యములైన, అగురూణామ్=అగురువులయొక్క, చన్దనానామ్= చన్దనములయొక్క, సఞ్చయాన్=ప్రోగులను, శుచీని=పరిశుద్ధమైన, అభ్యవహార్యాణి= తినదగిన, మూలాని చ=మూలములను, ఫలాని చ=ఫలములను, (చూచిరి)

తా. వారు అక్కడ శ్రేష్ఠములైన అగురువుల ప్రోగులను, చందనముల ప్రోగులను, పరిశుద్ధములైన తినదగిన మూలములను, ఫలములను చూచిరి. 35

మూ. మహార్హాణి చ పానాని మధూని రసవన్తి చ,
దివ్యానామమ్బరాణాం చ మహార్హాణాం చ సఞ్చయాన్, 36
కమ్బలానాం చ చిత్రాణామజినానాం చ సఞ్చయాన్.

ప్ర. అ. మహార్హాణి=గొప్ప విలువ గల, పానాని=పానములను, రసవన్తి=మంచి రుచి గల, మధూని=మధువులను, దివ్యానామ్=శ్రేష్ఠములైన, మహార్హాణామ్=గొప్ప మూల్యము గల, అమ్బరాణామ్=వస్త్రములయొక్క, సఞ్చయాన్ చ=సముదాయములను, చిత్రాణామ్=చిత్రములైన, కమ్బలానాం చ=కంబలములయొక్క, అజినానాం చ= చర్మములయొక్క, సఞ్చయాన్=సముదాయములను (చూచిరి).

తా. మంచి విలువ గల పానీయములను, రుచి గల మధువులను, శ్రేష్ఠములైన అమూల్యములైన వస్త్రముల సముదాయములను, విచిత్రములైన కంబళ్లను, చర్మములను చూచిరి. 36

మూ. తత్ర తత్ర చ విన్యస్తాన్ దీప్తాన్ వైశ్వానరప్రభాన్, 37
దదృశుర్వానరాః శుభ్రాన్ జాతరూపస్య సఞ్చయాన్.

ప్ర. అ. వానరాః=వానరులు, తత్ర తత్ర=అక్కడక్కడ, విన్యస్తాన్=ఉంచబడిన, దీప్తాన్=ప్రకాశించుచున్న, వైశ్వానరప్రభాన్=అగ్ని వంటి కాంతి గల, శుభ్రాన్=శుభ్రములైన, జాతరూపస్య=బంగారముయొక్క, సఞ్చయాన్=ప్రోగులను, దదృశుః=చూచిరి.

తా. అక్కడక్కడ అగ్ని వంటి కాంతి గల పరిశుద్ధమైన బంగారపు రాసులు ఉంచబడెను. వానరులు వాటిని కూడ చూచిరి. 37

మూ. తత్ర తత్ర విచిన్వన్తో బిలే తత్ర మహాప్రభాః, 38
దదృశుర్వానరాః శూరాః స్త్రియం కాంచి దదూరతః.

ప్ర. అ. మహాప్రభాః=గొప్ప కాంతి గల, శూరాః=శూరులైన, వానరాః=వానరులు, తత్ర బిలే=ఆ బిలమునందు, తత్ర తత్ర=అక్కడక్కడ, విచిన్వన్తః=వెదకుచు, అదూరతః= సమీపమునందు, కాఃచిత్=ఒకానొక, స్త్రియమ్=స్త్రీని, దదృశుః=చూచిరి.

తా. గొప్ప కాంతి గల శూరులైన ఆ వానరులు ఆ బిలమునందు అక్కడక్కడ వెదకుచుండగా సమీపమునందే వారికి ఒక స్త్రీ కనబడెను. 38

మూ. తాం చ తే దదృశుస్తత్ర చీరకృష్ణాజినామ్బరామ్, 39
తాపసీం నియతాహారాం జ్వలన్తీమివ తేజసా.

ప్ర. అ. తే=వారు, తత్ర=అక్కడ, చీరకృష్ణాజినామ్బరామ్=నార చీరలు, కృష్ణాజినము వస్త్రముగా గలది, నియతాహారామ్=నియతమైన ఆహారము కలది, తేజసా=తేజస్సుచేత, జ్వలన్తీమివ=మండుచున్నట్లు కనబడుచున్నది, తాపసీమ్=తపస్సు చేయునది అయిన, తామ్= ఆ స్త్రీని, దదృశుః=చూచిరి.

తా. నియతముగా ఆహారమును భుజించుచు, నారచీరలను, కృష్ణాజినమును ధరించిన ఆ తాపసి కాంతితో ప్రజ్జ్వలించు చున్నట్లుండెను. 39

మూ. విస్మితా హరయస్తత్ర వ్యవతిష్ఠన్త సర్వశః 40
పప్రచ్ఛ హనుమాంస్తత్ర కాసి త్వం కస్య వా బిలమ్.

ప్ర. అ. హరయః=వానరులు, విస్మితాః=ఆశ్చర్యమును చెందినవారై, తత్ర=అక్కడ, సర్వశః=అన్ని వైపుల, వ్యవతిష్ఠన్త=నిలచిరి. తత్ర=అపుడు, హనుమాన్= హనుమంతుడు, పప్రచ్ఛ=అడిగెను. త్వమ్=నీవు, కా అసి=ఎవ్వరవు? బిలమ్=ఈ బిలము, కస్య వా=ఎవనిది?

తా. ఆ వానరులు ఆశ్చర్యము చెంది అక్కడ నలువైపుల నిలచిరి. హనుమంతు డప్పుడు ఆమెను "నీవు ఎవ్వరవు? ఈ బిలము ఎవ్వరిది?" అని ప్రశ్నించెను. 40

మూ. తతో హనూమాన్గిరిసన్నికాశః
కృతాఞ్జలిస్తామభివాద్య వృద్ధామ్,
పప్రచ్ఛ కా త్వం భవనం బిలం చ,
రత్నాని చేమాని వదస్వ కస్య. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, గిరిసన్నికాశః=పర్వతముతో సమానుడైన, హనూమాన్= హనుమంతుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, తాం వృద్ధామ్=ఆ వృద్ధురాలిని, అభివాద్య=నమస్కరించి, పప్రచ్ఛ=అడిగెను. త్వమ్=నీవు,

కా=ఎవరవు. భవనమ్=ఈ భవనము, బిలం చ=ఈ బిలము, ఇమాని=ఈ రత్నాని చ=రత్నములు, కస్య=ఎవరివి, వదస్వ=చెప్పుము.

తా. పిమ్మట పర్వతమువంటి శరీరము గల హనుమంతుడు ఆ వృద్ధురాలికి చేతులు జోడించి నమస్కరించి, "నీవు ఎవరవు? ఈ భవనము, బిలము, రత్నములు ఎవరివి?" అని ఆమెను ప్రశ్నించెను. 41

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో యేబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకపఞ్చాశః సర్గః

[హనుమంతుడు ప్రశ్నించగా ఆ తాపసి తనను గూర్చి ఆ ప్రదేశమును గూర్చి చెప్పి వానరులను భోజనమునకు నిమంత్రించుట]

మూ. ఇత్యుక్త్వా హనుమాంస్తత్ర చీరకృష్ణాజినామ్బరామ్,
అబ్రవీత్తాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్. 1

ప్ర. అ. తత్ర=అక్కడ, హనుమాన్=హనుమంతుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, చీరకృష్ణాజినామ్బరామ్=నారచీరలు కృష్ణాజినము వస్త్రముగా గల, మహాభాగామ్= మహాభాగ్యవంతురాలైన, ధర్మచారిణీమ్=ధర్మమును ఆచరించుచున్న, తాం తాపసీమ్=ఆ తాపసిని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు ఈ విధముగా ప్రశ్నించి, నారచీరలను కృష్ణాజినమును ధరించి ఉన్న ధర్మమును ఆచరించు పూజ్యురాలైన ఆ తాపసితో మరల ఇట్లు అనెను. 1

మూ. ఇదం ప్రవిష్టాః సహసా బిలం తిమిరసంవృతమ్,
క్షుత్పిపాసాపరిశ్రాన్తాః పరిఖిన్నాశ్చ సర్వశః. 2

ప్ర. అ. క్షుత్పిపాసాపరిశ్రాన్తాః=ఆకలిచేతను దప్పికచేతను అలిసిన, సర్వశః=అన్ని విధముల, పరిఖిన్నాశ్చ=ఖిన్నులమైన మేము, తిమిరసంవృతమ్=చీకటి చేత కప్పబడిన, ఇదమ్=ఈ, బిలమ్=బిలమును, సహసా=శీఘ్రముగా, ప్రవిష్టాః=ప్రవేశించినాము.

తా. పూర్తిగా అలిసిపోయి ఆకలిదప్పికలతో బాధపడుచున్న మేము హఠాత్తుగా చీకటితో నిండిన ఈ బిలములో ప్రవేశించినాము. 2

మూ. మహద్ధరణ్యా వివరం ప్రవిష్టాః స్మ పిపాసితాః,
ఇమాంస్త్వేవంవిధాన్భావాన్వివిధానద్భుతోపమాన్, 3
దృష్ట్వా వయం ప్రవ్యథితాః సమ్భ్రాన్తా నష్టచేతసః.

ప్ర. అ. పిపాసితాః=దప్పికొన్నవారమై, ధరణ్యాః=భూమియొక్క, మహత్=గొప్పదైన, వివరమ్=ఈ బిలమును, ప్రవిష్టాః స్మ=ప్రవేశించినాము. ఏవంవిధాన్=ఈ విధములైన, వివిధాన్=అనేకవిధములైన, అద్భుతోపమాన్=అద్భుతములవలె ఉన్న, ఇమాన్=ఈ, భావాన్=పదార్థములను, దృష్ట్వా=చూచి, వయమ్=మేము, నష్టచేతసః=నష్టమైన చిత్తములు కలవారమై, సమ్భ్రాన్తాః=భ్రాంతి చెందినవారమై,

ప్రవ్యథితాః=వ్యథ చెందినాము.

తా. మేము దప్పికతో భూమిపై నున్న ఈ బిలములోనికి ప్రవేశించినాము. ఇక్కడ ఆశ్చర్యకరములైన అనేకవిధములైన ఇట్టి ఈ పదార్థములను చూడగానే మా మనస్సులు ఆశ్చర్యచకితములై భ్రాంతి చెంది మేము కంగారుపడుచున్నాము.

మూ. కస్యైతే కాఞ్చనా వృక్షాస్తరుణాదిత్యసన్నిభాః, 4
శుచీన్యభ్యవహార్యాణి మూలాని చ ఫలాని చ,
కాఞ్చనాని విమానాని రాజతాని గృహాణి చ. 5
తపనీయగవాక్షాణి మణిజాలావృతాని చ.

ప్ర. అ. ఏతే=ఈ, తరుణాదిత్యసన్నిభాః=బాలసూర్యునితో సమానమైన, కాఞ్చనాః= బంగారు వికారమైన, వృక్షాః=వృక్షములు, శుచీని=పరిశుద్ధమైన, అభ్యవహార్యాణి= తినతగిన, మూలాని చ=మూలములు, ఫలాని చ=ఫలములు, కాఞ్చనాని= బంగారువికారమైన, విమానాని=మేడలు, రాజతాని=వెండివికారమైన, తపనీయ గవాక్షాని= బంగారు కిటికీలు గల, మణిజాలావృతాని=మాణిక్యవికారమైన చిన్న రంధ్రములు గల కిటికీలతో కూడిన, గృహాణి చ=గృహములు, కస్య=ఎవనివి?

తా. బాలసూర్యునితో సమానమైన ఈ బంగారు వృక్షములు, భుజించుటకు తగిన పరిశుద్ధమైన ఈ ఫలమూలములు, బంగారు విమానములు, బంగారు పెద్ద కిటికీలతోను, మాణిక్యవికారమైన చిన్న కిటికీలతోను కూడిన ఈ వెండి యిళ్లు ఎవరివి? 4,5

మూ. పుష్పితాః ఫలవన్తశ్చ పుణ్యాః సురభిగన్ధయః, 6
ఏతే జామ్బూనదమయాః పాదపాః కస్య తేజసా.
కాఞ్చనాని చ పద్మాని జాతాని విమలే జలే, 7
కథం మత్స్యాశ్చ సౌవర్ణా దృశ్యన్తే సహ కచ్ఛపైః.
ఆత్మనస్త్వనుభావాద్వా కస్య వైతత్తపోబలమ్, 8
అజానతాం నః సర్వేషాం సర్వమాఖ్యాతుమర్హసి.

ప్ర. అ. పుష్పితాః=పుష్పించినవి, ఫలవన్తశ్చ=ఫలములు గలవి, పుణ్యాః= పుణ్యమైనవి, సురభిగన్ధయః=పరిమళముగలవి అయిన, ఇమే=ఈ, జామ్బూనద మయాః= బంగారు వికారమైన, పాదపాః=వృక్షములు, విమలే=నిర్మలమైన, జలే జలమునందు, కాఞ్చనాని=బంగారువికారమైన, పద్మాని చ=పద్మములు, కస్య=ఎవనియొక్క, తేజసా= తేజస్సుచేత, జాతాని=పుట్టినవి. కచ్ఛపైః సహ=తాబేళ్లతో కూడ, సౌవర్ణాః=బంగారు వికారమైన, మత్స్యాశ్చ=మత్స్యములు, కథమ్=ఎట్లు, దృశ్యన్తే=చూడబడుచున్నవి? ఆత్మనః=నీయొక్క, అనుభావాత్ వా=ప్రభావమువలన చూడబడుచున్నవా? ఏతత్=ఈ, తపోబలమ్=తపోబలము, కస్య వా=ఎవనిది? అజానతామ్=తెలియని, నః=మాకు, సర్వేషామ్=అందరికి, సర్వమ్=అంతా,

ఆఖ్యాతుమ్=చెప్పుటకు, అర్హసి=తగి యున్నావు.

తా. పుష్పఫలములతో కూడి, మంచి సువాసన గల, పవిత్రములైన ఈ బంగారు వృక్షములు, నిర్మలమైన జలములో ఉన్న ఈ బంగారు పద్మములు ఎవని తేజస్సుచేత పుట్టినవి? ఈ బంగారు మత్స్యములు, తాబేళ్లు ఎట్లు వచ్చినవి? ఇది అంతా నీ ప్రభావమువలననా? లేదా మరి ఎవ్వరిదైన తపోబలము వలననా? తెలియని మా అందరికి ఈ విషయము నంతను తెలుపుము. 6-8

మూ. ఏవముక్తా హనుమతా తాపసీ ధర్మచారిణీ, 9
ప్రత్యువాచ హనూమన్తం సర్వభూతహితే రతా.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలుకబడిన, సర్వభూతహితే=సమస్తప్రాణుల హితమునందు, రతా=ఆసక్తి గల, ధర్మచారిణీ=ధర్మమును ఆచరించు, తాపసీ=తాపసి, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. సకల ప్రాణుల హితమును కోరునది, ధర్మమును ఆచరించునది అయిన ఆ తాపసి హనుమంతుని మాటలు విని ఆతనితో ఇట్లు పలికెను. 9

మూ. మయో నామ మహాతేజా మాయావీ వానరర్షభ, 10
తేనేదం నిర్మితం సర్వం మాయయా కాఞ్చనం వనమ్.

ప్ర. అ. వానరర్షభ=ఓ! వానరశ్రేష్ఠుడా! మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మాయావీ= మాయావి అయిన, మయో నామ=మయుడను వాడు, ఉండెను. ఇదమ్=ఈ, సర్వమ్= సమస్తమైన, కాఞ్చనం వనమ్=బంగారు వనము, తేన=వానిచేత, మాయయా=మాయచేత, నిర్మితమ్=నిర్మించబడినది.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! మాయలు ఎరింగిన మహాతేజశ్శాలియైన మయుడను వాడు ఉండెను. ఆతడు మాయాబలముచేత ఈ బంగారు వనము నంతను నిర్మించెను. 10

మూ. పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవ హ, 11
యేనేదం కాఞ్చనం దివ్యం నిర్మితం భవనోత్తమమ్.

ప్ర. అ. యేన=ఎవనిచేత, కాఞ్చనమ్=బంగారు వికారమైన, దివ్యమ్=శ్రేష్ఠమైన, ఇదమ్=ఈ, భవనోత్తమమ్=ఉత్తమమైన భవనము, నిర్మితమ్=నిర్మించబడినదో అతడు, పురా=పూర్వము, దానవముఖ్యానామ్=దానవప్రభువులయొక్క, విశ్వకర్మా= విశ్వకర్మగా, బభూవ=ఉండెను.

తా. దివ్యమైన ఈ బంగారు భవనమును నిర్మించిన ఆ మయుడు పూర్వము దానవరాజుల శిల్పిగా ఉండెను. 11

మూ. స తు వర్షసహస్రాణి తపస్తప్త్వా మహద్వనే, 12
పితామహాద్వరం లేభే సర్వమౌశనసం ధనమ్.

ప్ర. అ. సః=అతడు, వనే=వనమునందు, వర్షసహస్రాణి=వేలకొలది సంవత్సరములు, మహత్=గొప్పదైన, తపః=తపస్సు, తప్త్వా=చేసి, పితామహాత్=బ్రహ్మదేవునినుండి, వరమ్=వరమును, ఔశనసమ్=శుక్రాచార్యునకు సంబంధించిన, సర్వమ్=సమస్తమైన, ధనమ్=ధనమును, లేభే=పొందెను.

తా. అతడు వనములో వేలకొలది సంవత్సరములు గొప్ప తపస్సు చేసి బ్రహ్మదేవునినుండి వరమును, శుక్రాచార్యుని సమస్తధనమును పొందెను. 12

మూ. విధాయ సర్వం బలవాన్ సర్వకామేశ్వరస్తదా, 13
ఉవాస సుఖితః కాలం కం చిదస్మిన్మహావనే.

ప్ర. అ. తదా=అపుడు, బలవాన్=బలవంతుడైన, సర్వకామేశ్వరః=సమస్తమైన కోరికలకు సమర్థుడైన అతడు, సుఖితః=సుఖవంతుడై, అస్మిన్=ఈ, మహావనే=మహావనమందు, కం చిత్ కాలమ్=కొంత కాలము, ఉవాస=నివసించెను.

తా. బలవంతుడు, అన్ని కోరికలను సంపాదింప సమర్థుడు అయిన ఆ మయుడు దీని నంతను నిర్మించి ఈ మహావనములో కొంత కాలము సుఖముగా ఉండెను. 13

మూ. తమప్సరసి హేమాయాం సక్తం దానవపుఙ్గవమ్, 14
విక్రమ్యైవాశనిం గృహ్య జఘానైష పురన్దరః.

ప్ర. అ. హేమాయామ్=హేమ అనే, అప్సరసి=అప్సరస్త్రీయందు, సక్తమ్=ఆసక్తుడైన, తమ్=ఆ, దానవపుఙ్గవమ్=దానవశ్రేష్ఠుడైన మయుణ్ణి, ఈశః=ప్రభువైన, పురన్దరః= దేవేంద్రుడు, అశనిమ్=వజ్రమును, గృహ్య=గ్రహించి, విక్రమ్యైవ=పరాక్రమించి, జఘాన=చంపెను.

తా. ఆ మయుడు హేమ అను అప్సరస్త్రీయందు ఆసక్తుడై ఉండుట చూచి త్రిలోకప్రభువైన దేవేంద్రుడు తన పరాక్రమము చూపుచు, వజ్రాయుధముతో ఆతనిని చంపెను. 14

మూ. ఇదం చ బ్రహ్మణా దత్తం హేమాయై వనముత్తమమ్, 15
శాశ్వతః కామభోగశ్చ గృహం చేదం హిరణ్మయమ్.

ప్ర. అ. ఇదమ్=ఈ, ఉత్తమమ్=ఉత్తమమైన, వనమ్=వనము, శాశ్వతః=శాశ్వతమైన, కామభోగశ్చ=కామముల భోగము, హిరణ్మయమ్=బంగారు వికారమైన, ఇదమ్=ఈ, గృహమ్=గృహము, బ్రహ్మణా=బ్రహ్మచేత, హేమాయై=హేమకొరకు, దత్తమ్=ఇవ్వబడినది.

తా. బ్రహ్మ ఈ ఉత్తమమైన వనమును, శాశ్వతములైన కామభోగములను, ఈ బంగారు గృహమును, హేమకు ఇచ్చెను. 15

మూ. దుహితా మేరుసావర్ణేరహం తస్యాః స్వయంప్రభా, 16
ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ.

ప్ర. అ. వానరోత్తమ=ఓ! వానరశ్రేష్ఠుడా! మేరుసావర్ణేః=మేరుసావర్ణియొక్క, దుహితా=కుమార్తెనైన, స్వయంప్రభా=స్వయంప్రభ యను పేరు గల, అహమ్=నేను, తస్యాః=ఆ, హేమాయాః=హేమయొక్క, ఇదమ్=ఈ, భవనమ్=భవనమును, రక్షామి=రక్షించుచున్నాను.

తా. ఓ! వానరోత్తమా! నేను మేరుసావర్ణి కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. హేమయొక్క ఈ భవనమును రక్షించుచు ఇక్కడ ఉన్నాను. 16

మూ. మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా, 17
తయా దత్తవరా చాస్మి రక్షామి భవనం మహత్.

ప్ర. అ. నృత్తగీతవిశారదా=నృత్తమునందు, గీతమునందు నేర్పు గల, హేమా=హేమ, మమ=నాయొక్క, ప్రియసఖీ=ప్రియసఖి. తయా=ఆమెచేత, దత్త వరా=ఇవ్వబడిన వరము కలదానను, అస్మి=అయితిని. మహత్=గొప్పదైన, భవనమ్=ఈ భవనమును, రక్షామి=రక్షించుచున్నాను.

తా. నా ప్రియసఖురాలైన హేమ నృత్తగీతములందు మంచి నేర్పు గలది. ఆమె వరమును ఇచ్చినది. నేను ఈ గొప్ప భవనమును రక్షించుచున్నాను. 17

మూ. కిం కార్యం కస్య వా హేతోః కాన్తారాణి ప్రపద్యథ, 18
కథం చేదం వనం దుర్గం యుష్మాభిరుపలక్షితమ్.

ప్ర. అ. కార్యమ్=కార్యము, కిమ్=ఏమి? కస్య వా=ఏ, హేతోః= హేతువునకు, కాన్తారాణి=అడవులను, ప్రపద్యథ=పొందుచున్నారు? దుర్గమ్=ప్రవేశింప శక్యము కాని, ఇదమ్ వనమ్=ఈ వనము, యుష్మాభిః=మీచేత, కథమ్=ఎట్లు, ఉపలక్షితమ్=చూడబడినది.

తా. మీరు ఏ పనిమీద వచ్చినారు? ఈ అడవులలో ఎందుకు సంచరించుచున్నారు? ప్రవేశింప శక్యము గాని ఈ వనమును ఎట్లు చూచినారు?

మూ. శుచీన్యభ్యవహార్యాణి మూలాని చ ఫలాని చ, 19
భుక్త్వా పీత్వా చ పానీయం సర్వం మే వక్తుమర్హసి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. శుచీని=పరిశుద్ధమైన, అభ్యవహార్యాణి=తినదగిన, మూలాని

చ=మూలములను, ఫలాని చ=ఫలములను, భుక్త్వా=తిని, పానీయమ్=జలమును, పీత్వా చ=త్రాగి, మే=నాకు, సర్వమ్=సమస్తమును, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. పరిశుద్ధములైన తినదగిన ఈ ఫలములను, మూలములను తిని ఉదకము త్రాగి ఆ విషయ మంతయు మాకు చెప్పుము. 19

"బాలానందిని"యను శ్రీ మద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో యేబది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విపఞ్చాశః సర్గః

[స్వయంప్రభ ప్రశ్నించగా వానరులు తమ వృత్తాంతము ఆమెకు తెలుపుట. ఆమె ప్రభావముచేత వారు గుహనుండి బయటకు వచ్చి సముద్రతీరము చేరుట.]

మూ. అథ తానబ్రవీత్సర్వాన్విశ్రాన్తాన్ హరియూథపాన్,
ఇదం వచనమేకాగ్రా తాపసీ ధర్మచారిణీ. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ధర్మచారిణీ=ధర్మమును ఆచరించునది, ఏకాగ్రా= ఏకాగ్రచిత్తము కలది అయిన, తాపసీ=ఆ తాపసి, విశ్రాన్తాన్=విశ్రమించిన, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, హరియూథపాన్=వానరనాయకులను గూర్చి, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఏకాగ్రచిత్తురాలై ధర్మమును ఆచరించుచున్న ఆ తాపసి విశ్రమించిన ఆ వానరనాయకులతో ఇట్లు పలికెను. 1

మూ. వానరా యది వః ఖేదః ప్రనష్టః ఫలభక్షణాత్,
యది చైతన్మయా శ్రావ్యం శ్రోతుమిచ్ఛామి తాం కథామ్. 2

ప్ర. అ. వానరాః=వానరులారా! ఫలభక్షణాత్=ఫలములను భక్షించుట వలన, వః= మీయొక్క, ఖేదః=అలసట, ప్రనష్టః యది=నశించినట్లైతే, ఏతత్=ఇది, మయా=నాచేత, శ్రావ్యం చ యది=వినదగినట్లైతే, తాం కథామ్=ఆ కథను, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. ఓ! వానరులారా! ఫలములను భక్షించుటవలన మీ అలసట తీరినచో నేను మీ వృత్తాంతమును తెలుసుకొనవచ్చు నన్నచో దానిని వినగోరుచున్నాను.2

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా హనూమాన్మారుతాత్మజః,
ఆర్జవేన యథాతత్త్వమాఖ్యాతుముపచక్రమే. 3

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనూమాన్=హనుమంతుడు, తస్యాః= ఆమెయొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, ఆర్జవేన=ఋజుత్వముతో, యథాతత్త్వమ్=యథార్థముగా, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు ఆమె మాటలు విని నిష్కపటముగా, ఉన్న దున్నట్లు చెప్పుటకు ప్రారంభించెను. 3

మూ. రాజా సర్వస్య లోకస్య మహేన్ద్రవరుణోపమః,
రామో దాశరథిః శ్రీమాన్ ప్రవిష్టో దణ్డకావనమ్. 4
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా సహ భార్యయా,
తస్య భార్యా జనస్థానాద్రావణేన హృతా బలాత్. 5

ప్ర. అ. సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకమునకు, రాజా=రాజు, మహేన్ద్రవరుణోపమః=మహేన్ద్రవరుణులతో సమానుడు, దాశరథిః=దశరథకుమారుడు అయిన, శ్రీమాన్=శ్రీమంతుడు అయిన, రామః=రాముడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితోను, భార్యయా=భార్యయైన, వైదేహ్యా సహ=సీతతోను, దణ్డకావనమ్=దండకారణ్యమును, ప్రవిష్టః=ప్రవేశించినాడు. తస్య=అతని యొక్క, భార్యా=భార్య, రావణేన=రావణునిచేత, జనస్థానాత్=జనస్థానమునుండి, బలాత్=బలాత్కారముగా, హృతా=హరింపబడినది.

తా. సమస్తలోకములకు ప్రభువు, మహేన్ద్రవరుణులతో సమానుడు, దశరథకుమారుడు, శ్రీమంతుడు అయిన రాముడు సోదరుడైన లక్ష్మణునితోను, భార్యయైన సీతతోను కలిసి, దండకావనములో ప్రవేశించినాడు. అతని భార్యను రావణుడు జనస్థానమునుండి బలాత్కారముగా అపహరించినాడు. 4,5

మూ. వీరస్తస్య సఖా రాజ్ఞః సుగ్రీవో నామ వానరః,
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్. 6

ప్ర. అ. వీరః=వీరుడు, వానరముఖ్యానామ్=వానరశ్రేష్ఠులయొక్క, రాజా=రాజు అయిన, సుగ్రీవో నామ=సుగ్రీవుడు అను పేరు గల, వానరః=వానరుడు, తస్య=ఆ, రాజ్ఞః=రాజైన రామునియొక్క, సఖా=స్నేహితుడు. యేన=ఎవనిచేత, వయమ్= మేము, ప్రస్థాపితాః=పంపబడితిమో.

తా. వీరుడు, వానరనాయకుల రాజు అయిన సుగ్రీవు డను వానరుడు ఆ రామునకు మిత్రుడు. ఆతడే మమ్ములను పంపినాడు. 6

మూ. అగస్త్యచరితామాశాం దక్షిణాం యమరక్షితామ్,
సహైభిర్వానరైర్ముఖ్యైరంగదప్రముఖైర్వయమ్. 7
రావణం సహితాః సర్వే రాక్షసం కామరూపిణమ్,
సీతయా సహ వైదేహ్యా మార్గధ్వమితి చోదితాః. 8

ప్ర. అ. సర్వే=మీరందరు, సహితాః=కూడినవారై, వైదేహ్యా=విదేహరాజపుత్రియైన, సీతయా సహ=సీతతో కూడ, కామరూపిణమ్=స్వేచ్ఛారూపము గల, రాక్షసమ్=రాక్షసుడైన, రావణమ్=రావణుని, మార్గధ్వమ్=వెదకుడు; ఇతి=అని, వయమ్=మేము, అఙ్గదప్రముఖైః=అంగదుడు మొదలైన, ఏభిః=ఈ, ముఖ్యైః=ముఖ్యులైన, వానరైః సహ=వానరులతో కూడ, అగస్త్యచరితామ్=అగ

స్త్యునిచేత సంచరించబడిన, యమరక్షితామ్= యమునిచేత రక్షించబడిన, దక్షిణామ్ ఆశామ్=దక్షిణదిక్కును గూర్చి, చోదితాః=పంపబడితిమి.

తా. అంగదుడు నాయకుడుగా గల ఈ వానరశ్రేష్ఠులతో మమ్ములను పిలిచి ఆ సుగ్రీవుడు "మీరందరు కలిసి స్వేచ్ఛానుసారము రూపములను ధరించు రాక్షసుడైన రావణుని, విదేహరాజు కుమారియైన సీతను, వెదకుడు." అని ఆజ్ఞాపించి, అగస్త్యుని సంచారస్థానమైన, యమునిచే రక్షించబడుచున్న ఈ దక్షిణదిక్కునకు పంపినాడు. 7, 8

మూ. విచిత్య తు వనం సర్వం సముద్రం దక్షిణాం దిశమ్,
వయం బుభుక్షితాః సర్వే వృక్షమూలముపాశ్రితాః. 9

ప్ర. అ. వయమ్=మేము, సర్వే=అందరము, సర్వమ్=సమస్తమైన, వనమ్= వనమును, సముద్రమ్=సముద్రమును, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కును, విచిత్య= అన్వేషించి, బుభుక్షితాః=ఆకలిగొన్నవారమై, వృక్షమూలమ్=వృక్షముయొక్క మూలమును, ఉపాశ్రితాః=ఆశ్రయించినాము.

తా. మే మందరము ఆ అరణ్యము నంతను, సముద్రమునంతను, దక్షిణదిక్కును వెదకి, ఆకలిగొన్నవారమై చెట్టు మొదట చేరితిమి. 9

మూ. వివర్ణవదనాః సర్వే సర్వే ధ్యానపరాయణాః,
నాధిగచ్ఛామహే పారం మగ్నాశ్చిన్తామహార్ణవే. 10

ప్ర. అ. సర్వే=మేమందరము, వివర్ణవదనాః=వివర్ణమైన ముఖములు గలవారమైతిమి. సర్వే=అందరము, ధ్యానపరాయణాః=ధ్యానమునందు లగ్నుల మైతిమి. చిన్తామహార్ణవే= చింత అను మహాసముద్రమునందు, మగ్నాః=మునిగినవారమై, పారమ్=అవతలి ఒడ్డును, నాధిగచ్ఛామహే=పొందజాలకపోతిమి.

తా. మే మందరము వాడిపోయిన ముఖములతో ఆలోచనలో పడి చింత యను మహాసముద్రములో మునిగి గట్టు చేరలేకపోతిమి. 10

మూ. చారయన్తస్తతశ్చక్షుర్దృష్టవన్తో మహద్బిలమ్,
లతాపాదపసమ్పన్నం తిమిరేణ సమావృతమ్. 11

ప్ర. అ. తతః=అటుపిమ్మట, చక్షుః=నేత్రమును, చారయన్తః=ప్రసరింపచేయుచు, లతాపాదపసమ్పన్నమ్=లతలతోను, వృక్షములతోను కూడిన, తిమిరేణ=చీకటిచేత, సమావృతమ్= కప్పబడిన, మహత్=గొప్పదైన, బిలమ్=బిలమును, దృష్టవన్తః=చూచినాము.

తా. అటుపిమ్మట దృష్టిని ప్రసరింపచేయుగా లతలతోను, వృక్షములతోను నిండిన చీకటిచేత కప్పబడిన ఈ మహాబిలము కనబడినది. 11

మూ. అస్మాద్ధంసా జలక్లిన్నాః పక్షైః సలిలరేణుభిః,
కురరాః సారసాశ్చైవ విష్పతన్తి పతత్త్రిణః. 12

ప్ర. అ. అస్మాత్=ఈ బిలమునుండి, సలిలరేణుభిః=ఉదకబిందువులతో కూడిన, పక్షైః= రెక్కలతో, జలక్లిన్నాః=జలములో తడసిన, హంసాః=హంసలు, కురరాః=కురరపక్షులు, సారసాశ్చైవ=సారసము లను, పతత్త్రిణః=పక్షులు, విష్పతన్తి=బయటకు వచ్చుచున్నవి.

తా. నీటిలో తడిసి జలబిందువులతో కూడిన రెక్కలతో హంసలు, కురరములు, సారసపక్షులు ఈ బిలమునుండి బయటకు వచ్చుచుండెను. 12

మూ. సాధ్వత్ర ప్రవిశామేతి మయా తూక్తాః ప్లవఙ్గమాః,
తేషామపి హి సర్వేషామనుమానముపాగతమ్. 13

ప్ర. అ. అత్ర=దీనిలో, సాధు=బాగుగా, ప్రవిశామ=ప్రవేశించెదము, ఇతి= అని, మయా=నాచేత, ప్లవఙ్గమాః=వానరులు, ఉక్తాః=పలుకబడినవారు. తేషామ్=ఆ సర్వేషామపి=అందరికి కూడ, అనుమానమ్=జలమున్న దను ఊహ, ఉపాగతమ్= వచ్చినది.

తా. "ఈ బిలములో ప్రవేశించెదము" అని నేను ఆ వానరులతో పలికితిని. అక్కడ జల ముండవచ్చును అని వారందరికి కూడ ఊహ కలిగెను. 13

మూ. అస్మిన్నిపతితాః సర్వేఽప్యథ కార్యత్వరాన్వితాః,
తతో గాఢం నిపతితా గృహ్య హస్తైః పరస్పరమ్. 14

ప్ర. అ. అథ=అటుపిమ్మట, కార్యత్వరాన్వితాః=కార్యముయొక్క తొందరతో కూడిన, సర్వేఽపి=అందరును, అస్మిన్=ఈ కార్యమునందు, నిపతితాః=ఉద్యుక్తులైరి. తతః=అటుపిమ్మట, పరస్పరమ్=పరస్పరము, హస్తైః=హస్తములచేత, గాఢమ్= గట్టిగా, గృహ్య=గ్రహించి, నిపతితాః=బిలములో పడిరి.

తా. కార్యము విషయమున తొందరతో కూడిన వానరు లందరు అట్లు చేయుటకు ఉద్యుక్తులైరి. పిమ్మట పరస్పరము చేతులు గట్టిగా పట్టుకొని గుహలో దుమికిరి. 14

మూ. ఇదం ప్రవిష్టాః సహసా బిలం తిమిరసంవృతమ్,
ఏతన్నః కార్యమేతేన కృత్యేన వయమాగతాః. 15
త్వాం చైవోపగతాః సర్వే పరిద్యూనా బుభుక్షితాః.

ప్ర. అ. తిమిరసంవృతమ్=చీకటిచేత కప్పబడిన, ఇదం బిలమ్=ఈ బిలమును, సహసా= శీఘ్రముగా, ప్రవిష్టాః=ప్రవేశించినాము. ఏతత్=ఇది, నః=మాయొక్క, కార్యమ్=కార్యము. ఏతేన=ఈ, కృత్యేన=కృత్యముచేత, వయమ్=మేము, ఆగతాః=

వచ్చినాము. బుభుక్షితాః=ఆకలితో ఉన్నవారమై, పరిద్యూనాః=క్షీణించిన, సర్వే=అంద రము, త్వామ్=నిన్ను, ఉపగతాశ్చైవ=చేరితిమి.

తా. చీకటిచేత ఆవరింపబడిన ఈ బిలములోనికి శీఘ్రముగా ప్రవేశించితిమి. ఇదే మా కార్యము. ఈ కార్యముమీదనే మేము వచ్చితిమి. ఆకలిగొని క్షీణించిన వారమై మేమందరము నిన్ను చేరితిమి. 15

మూ. ఆతిథ్యధర్మదత్తాని మూలాని చ ఫలాని చ, 16
అస్మాభిరుపయుక్తాని బుభుక్షాపరిపీడితైః.

ప్ర. అ. బుభుక్షాపరిపీడితైః=ఆకలిచేత పీడించబడిన, అస్మాభిః=మాచేత, ఆతిథ్యధర్మదత్తాని= ఆతిథ్యధర్మానుసారము ఇవ్వబడిన, మూలాని చ=మూలములు, ఫలాని చ=ఫలములు, ఉపయుక్తాని=ఉపయోగించబడినవి.

తా. నీవు ఆతిథ్యధర్మమును అనుసరించి ఇచ్చిన మూలములను, ఫలములను ఆకలితో బాధపడుచున్న మేము భుజించితిమి. 16

మూ. యత్త్వయా రక్షితాః సర్వే మ్రియమాణా బుభుక్షయా, 17
బ్రూహి ప్రత్యుపకారార్థం కిం తే కుర్వన్తు వానరాః.

ప్ర. అ. బుభుక్షయా=ఆకలిచేత, మ్రియమాణాః=మరణించుచున్న, సర్వే=అందరు, యత్=ఏ కారణమువలన, త్వయా=నీచేత, రక్షితాః=రక్షించబడినారో, అందువలన, వానరాః=వానరులు, తే=నీకు, ప్రత్యుపకారార్థమ్=ప్రత్యుపకారముకొరకు, కిం కుర్వన్తు=ఏమి చేయుదురు? బ్రూహి=చెప్పుము.

తా. నీవు ఆకలిచే మరణించుచున్న మమ్ములనందరిని రక్షించితివి. అందుచే నీకు ప్రత్యుపకారముగా ఏమి చేయవలెనో చెప్పుము. 17

మూ. ఏవముక్తా తు సర్వజ్ఞా వానరైస్తైః స్వయంప్రభా, 18
ప్రత్యువాచ తతః సర్వానిదం వానరయూథపాన్.

ప్ర. అ. తైః వానరైః=ఆ వానరులచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలుకబ డిన, సర్వజ్ఞా=అన్నియు తెలిసిన, స్వయంప్రభా=స్వయంప్రభ, తతః=అటుపిమ్మట, సర్వాన్=సమస్తమైన, వానరయూథపాన్=వానరనాయకులను, ఇదమ్=ఈ వాక్య మును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. వానరుల మాట విని సర్వజ్ఞురాలైన ఆ స్వయంప్రభ వారితో మరల ఇట్లనెను. 18

మూ. సర్వేషాం పరితుష్టాస్మి వానరాణాం తరస్వినామ్, 19
చరన్త్యా మమ ధర్మేణ న కార్యమిహ కేన చిత్.

ప్ర. అ. తరస్వినామ్=బలవంతులైన, సర్వేషామ్=సమస్తమైన, వానరాణామ్=

వానరులకు, పరితుష్టా=సంతోషించినదానను, అస్మి=అయితిని. ధర్మేణ=ధర్మము చేత, చరన్త్యాః=సంచరించుచున్న, మమ=నాకు, ఇహ=ఇక్కడ, కేనచిత్=దేనిచేతను, కార్యమ్=కార్యము, న=లేదు.

తా. బలవంతులైన మీ అందరి విషయమున సంతోషించుచున్నాను. ధర్మమును ఆచరించుచున్న నాకు కావలసిన దేదియు లేదు. 19

మూ. ఏవముక్తః శుభం వాక్యం తాపస్యా ధర్మసంహితమ్, 20
ఉవాచ హనుమాన్ వాక్యం తామనిన్దితచేష్టితామ్.

ప్ర. అ. తాపస్యా=ఆ తాపసిచేత, ఏవమ్=ఇట్లు, ధర్మసంహితమ్=ధర్మముతో కూడిన, శుభమ్=శుభమైన, వాక్యమ్=వాక్యమును, ఉక్తః=పలుకబడిన, హనుమాన్=హనుమంతుడు, అనిన్దితచేష్టితామ్=నిందింపబడని కార్యములు గల, తామ్=ఆమెను గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. ఆ తాపసి పలికిన ధర్మసమ్మతమైన మాటలు విని హనుమంతుడు ఉత్తమమైన కార్యములు చేయు ఆమెతో ఇట్లు పలికెను. 20

మూ. శరణం త్వాం ప్రపన్నాః స్మః సర్వే వై ధర్మచారిణీమ్, 21
యః కృతః సమయోఽస్మాసు సుగ్రీవేణ మహాత్మనా,
స తు కాలో వ్యతిక్రాన్తో బిలే చ పరివర్తతామ్. 22

ప్ర. అ. ధర్మచారిణీమ్=ధర్మమును ఆచరించుచున్న, త్వామ్=నిన్ను, సర్వే= మేమందరము, శరణం ప్రపన్నాః స్మః=శరణు పొందినాము. మహాత్మనా=మహాత్ముడైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, అస్మాసు=మాయందు, యః=ఏ, సమయః=కాలము, కృతః=చేయబడినదో, సః=ఆ, కాలః=కాలము, బిలే=బిలము నందు, పరివర్తతామ్=తిరుగుచున్న మాకు, వ్యతిక్రాన్తః=గడచిపోయినది.

తా. ధర్మమును ఆచరించు నిన్ను మేమందరము శరణు జొచ్చినాము. మహాత్ముడైన సుగ్రీవుడు ఇచ్చిన గడువు మేము ఈ బిలములో తిరుగుచుండగా గడచిపోయినది. 21, 22

మూ. సా త్వమస్మాద్బిలాదస్మానుత్తారయితుమర్హసి,
తస్మాత్సుగ్రీవవచనాదతిక్రాన్తాన్గతాయుషః. 23

ప్ర. అ. సా=అట్టి, త్వమ్=నీవు, తస్మాత్=ఆ, సుగ్రీవవచనాత్=సుగ్రీవుని వచనమునుండి, అతిక్రాన్తాన్=దూరమైన, గతాయుషః=గడచిన ఆయుర్దాయము గల, అస్మాన్=మమ్ములను, అస్మాత్=ఈ, బిలాత్=బిలమునుండి, ఉత్తారయితుమ్=దాటించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. సుగ్రీవుడు ఇచ్చిన గడువును దాటి ప్రాణములను విడువవలసిన మమ్ము నీవు ఈ బిలమునుండి దాటించవలెను. 23

మూ. త్రాతుమర్హసి నః సర్వాన్ సుగ్రీవభయశఙ్కితాన్,
మహచ్చ కార్యమస్మాభిః కర్తవ్యం ధర్మచారిణి. 24
తచ్చాపి న కృతం కార్యమస్మాభిరిహ వాసిభిః.

ప్ర. అ. ధర్మచారిణి=ఓ! ధర్మమును ఆచరించుదానా! సుగ్రీవ భయశఙ్కితాన్=సుగ్రీవునినుండి రాబోవు అపాయమునకు భయపడుచున్న, నః సర్వాన్=మమ్ములనందరిని, త్రాతుమ్= రక్షించుటకు, అర్హసి=తగిఉన్నావు. అస్మాభిః=మాచేత, మహత్=గొప్పదైన, కార్యం చ=కార్యము కూడ, కర్తవ్యమ్=చేయదగి ఉన్నది. ఇహ=ఇక్కడ, వాసిభిః= నివసించుచున్న, అస్మాభిః=మాచేత, తత్=ఆ, కార్యం చాపి=కార్యము కూడ, న కృతమ్=చేయబడలేదు.

తా. ధర్మాత్మురాలవై నీవు సుగ్రీవునివలన రాబోవు అపాయమునకు భయపడుచున్న మమ్ములను రక్షింపవలెను. మేము గొప్ప కార్య మొకటి చేయవలసి ఉన్నది. ఇక్కడనే ఉండిపోవుటచే మేము ఆ కార్యమును చేయజాలకపోతిమి.24

మూ. ఏవముక్తా హనుమతా తాపసీ వాక్యమబ్రవీత్. 25
జీవతా దుష్కరం మన్యే ప్రవిష్టేన నివర్తితుమ్.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా= పలుకబడిన, తాపసీ=తాపసి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. ప్రవిష్టేన=ప్రవేశించిన వానిచేత, జీవతా=జీవించియుండగా, నివర్తితుమ్= తిరిగి వెళ్లుటకు, దుష్కరమ్=చేయశక్యము గానిది అని, మన్యే=తలచెదను.

తా. హనుమంతుని మాటలు విని ఆ తాపసి ఇట్లు పలికెను. ఈ బిలములో ప్రవేశించినవాడు మరల ప్రాణములతో బయటకు వెళ్లజాలడు. 25

మూ. తపసః సుప్రభావేణ నియమోపార్జితేన చ, 26
సర్వానేవ బిలాదస్మాత్తారయిష్యామి వానరాన్.

ప్ర. అ నియమోపార్జితేన=నియమముచేత సంపాదించబడిన, తపసః= తపస్సుయొక్క, సుప్రభావేణ=మంచి ప్రభావముచేత, సర్వానేవ=సమస్తమైన, వానరాన్=వానరులను, అస్మాత్=ఈ, బిలాత్=బిలమునుండి, తారయిష్యామి= దాటించెదను.

తా. నియమములచే సంపాదించిన తపఃప్రభావముచేత వానరుల నందరిని ఈ బిలము నుండి దాటించెదను. 26

మూ. నిమీలయత చక్షూంషి సర్వే వానరపుఙ్గవాః, 27
న హి నిష్క్రమితుం శక్యమనిమీలితలోచనైః.

ప్ర.అ. సర్వే=సమస్తమైన, వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులైన మీరు, చక్షూంషి=నేత్రములను, నిమీలయత=మూసుకొనండి. అనిమీలితలోచనైః= మూసుకొనబడని నేత్రములు కలవారిచేత, నిష్క్రమితుమ్=బయటకు వెళ్లుటకు, న శక్యం హి=శక్యము గాదు కదా!

తా. ఓ! వానరశ్రేష్ఠులారా! మీరందరు కళ్లు మూసుకొనుడు. కళ్లు మూసుకొననిచో బయటకు వెళ్లుటకు శక్యము గాదు. 27

మూ. తతో నిమీలితాః సర్వే సుకుమారాఙ్గులైః కరైః, 28
సహసా పిదధుర్దృష్టిం హృష్టా గమనకాఙ్క్షయా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, గమనకాఙ్క్షయా=వెళ్లుటయందు కోరికచేత, హృష్టాః=సంతోషించిన, సర్వే=వానరు లందరు, నిమీలితాః=కళ్లు మూసుకొన్నవారై, సహసా=వెంటనే, సుకుమారాఙ్గులైః=సుకుమారములైన వ్రేళ్లు గల, కరైః=హస్తములతో, దృష్టిమ్=దృష్టిని, పిదధుః= కప్పుకొనిరి.

తా. పిమ్మట, వెళ్లవలె నను కోరికతో ఆ వానరు లందరు సంతోషించుచు, కండ్లు మూసుకొని సుకుమారమైన వేళ్లు గల చేతులతో వెంటనే కళ్లు కప్పుకొనిరి.

మూ. వానరాస్తు మహాత్మానో హస్తరుద్ధముఖాస్తదా, 29
నిమేషాన్తరమాత్రేణ బిలాదుత్తారితాస్తయా.

ప్ర. అ తదా=అపుడు, హస్తరుద్ధముఖాః=చేతులతో కప్పబడిన ముఖములు గల, మహాత్మానః=మహాత్ములైన, వానరాః=వానరులు, తయా= ఆమెచేత, నిమేషాన్తరమాత్రేణ=కనురెప్పపాటు కాలములో, బిలాత్= బిలమునుండి, ఉత్తారితాః= దాటింపబడిరి.

తా. అపుడు హస్తములతో ముఖములను కప్పుకొని ఉన్న మహాత్ములైన ఆ వానరులను ఆమె రెప్పపాటు కాలములో ఆ బిలమునుండి బయటకు తీసుకొని వచ్చెను. 29

మూ. ఉవాచ సర్వాంస్తాంస్తత్ర తాపసీ ధర్మచారిణీ, 30
నిఃసృతాన్విషమాత్తస్మాత్సమాశ్వాస్యేదమబ్రవీత్.

ప్ర. అ ధర్మచారిణీ=ధర్మమును ఆచరించు, తాపసీ=ఆ తాపసి, తత్ర= అక్కడ, తాన్ సర్వాన్=వారి నందరిని గూర్చి, ఉవాచ=పలికెను. విషమాత్= భయంకరమైన, తస్మాత్=ఆ బిలమునుండి, నిఃసృతాన్=బయటకు వచ్చిన వారిని, సమాశ్వాస్య=ఓదార్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మాత్ములైన ఆ తాపసి భయంకరమైన ఆ బిలమునుండి బయటకు వచ్చిన ఆ వానరులకు అందరికి ధైర్యము చెప్పుచు ఇట్లు పలికెను.30

మూ. ఏష విన్ధ్యో గిరిః శ్రీమాన్నానాద్రుమలతాయుతః, 31
ఏష ప్రస్రవణః శైలః సాగరోఽయం మహోదధిః,
స్వస్తి వోఽస్తు గమిష్యామి భవనం వానరర్షభాః, 32
ఇత్యుక్త్వా తద్బిలం శ్రీమత్ప్రవివేశ స్వయంప్రభా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ ఏషః=ఇది, శ్రీమాన్=శోభాయుక్తము, నానాద్రుమలతాయుతః= అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను కూడిన, విన్ధ్యః గిరిః=వింధ్య పర్వతము. ఏషః=ఇది, ప్రస్రవణః=ప్రస్రవణ మను, శైలః=పర్వతము. అయమ్= ఈ, సాగరః=సాగరము, మహోదధిః=దక్షిణమహాసముద్రము. వానరర్షభాః=వాన రశ్రేష్ఠులారా! వః=మీకు, స్వస్తి=క్షేమము, అస్తు=అగుగాక! భవనమ్=నా భవనమును గూర్చి, గమిష్యామి= వెళ్లగలను. ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, స్వయం ప్రభా=స్వయంప్రభ, శ్రీమత్=శోభాయుక్తమైన, తత్ బిలమ్=ఆ బిలమును, ప్రవివేశ= ప్రవేశించెను.

తా. "ఇది అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను నిండిన శోభాయుక్తమైన వింధ్యపర్వతము. ఇది ప్రస్రవణపర్వతము. ఇది మహాసముద్రము. ఓ! వానరశ్రేష్ఠులారా! మీకు క్షేమ మగుగాక! నేను నా స్థానమునకు వెళ్లెదను" అని పలికి స్వయంప్రభ శోభాయుక్తమైన ఆ బిలములో ప్రవేశించెను. 31,32

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఏబది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిపఞ్చాశః సర్గః

*[సుగ్రీవు డిచ్చిన గడువు పూర్తి యైనను తాము కార్యము సాధించలేకపోవుటచే సుగ్రీవునకు భయపడుచు అంగదుడు మొదలైన వానరులు ప్రాయోపవేశము చేసి ప్రాణములను విడచుటకు నిశ్చయించుకొనుట]*

మూ. తతస్తే దదృశుర్ఘోరం సాగరం వరుణాలయమ్,
అపారమభిగర్జన్తం ఘోరైరూర్మిభిరాకులమ్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తే=వారు, ఘోరమ్=భయంకరము, వరుణాలయమ్=వరుణుని స్థానము, అపారమ్=అవతలి ఒడ్డు లేనిది, అభిగర్జన్తమ్=గర్జించుచున్నది, ఘోరైః=భయంకరములైన, ఊర్మిభిః= తరంగములచేత, ఆకులమ్=వ్యాకులము అయిన, సాగరమ్=సముద్రమును, దదృశుః=చూచిరి.

తా. పిమ్మట ఆ వానరులు వరుణుని నివాసమైన భయంకరమైన సముద్రమును చూచిరి. అపారమైన ఆ సముద్రము భయంకరములైన తరంగములతో వ్యాకులమై గర్జించుచుండెను. 1

మూ. మయస్య మాయావిహితం గిరిదుర్గం విచిన్వతామ్,
తేషాం మాసో వ్యతిక్రాన్తో యో రాజ్ఞా సమయః కృతః. 2

ప్ర. అ. తేషామ్=ఆ వానరులు, మయస్య=మయునియొక్క, మాయావిహితమ్=మాయచేత నిర్మింపబడిన, గిరిదుర్గమ్=పర్వతదుర్గమును, విచిన్వతామ్=వెదకుచుండగా, యః=ఏది, రాజ్ఞా=రాజుచేత, సమయః=సమయముగా, కృతః=నిశ్చయింపబడినదో, మాసః=ఆ మాసము, వ్యతిక్రాన్తః=గడచినది.

తా. మయుడు మాయచే నిర్మించిన ఆ పర్వతదుర్గమును వెదకుచుండగానే ఆ వానరులకు సుగ్రీవుడు నిర్ణయించిన మాసము గడువు దాటిపోయెను. 2

మూ. విన్ధ్యస్య తు గిరేః పాదే సమ్ప్రపుష్పితపాదపే,
ఉపవిశ్య మహాత్మానశ్చిన్తామాపేదిరే తదా. 3

ప్ర. అ. తదా=అపుడు, మహాత్మానః=మహాత్ములైన వానరులు, సమ్ప్రపుష్పితపాదపే=పుష్పించిన వృక్షములు గల, విన్ధ్యస్య గిరేః=వింధ్యపర్వతముయొక్క, పాదే=క్రింది ప్రాంతమునందు, ఉపవిశ్య=కూర్చొని, చిన్తామ్=చింతను, ఆపేదిరే=పొందిరి.

తా. అపుడు మహాత్ములైన వానరులు, పుష్పించిన వృక్షములతో నిండిన

వింధ్యపర్వత ప్రాంతభూమియందు కూర్చుండి చింతను పొందిరి. 3

మూ. తతః పుష్పాతిభారాగ్రాన్ లతాశతసమావృతాన్,
ద్రుమాన్వాసన్తికాన్ దృష్ట్వా బభూవుర్భయశఙ్కితాః. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పుష్పాతిభారాగ్రాన్=పుష్పములచేత చాల బరువెక్కిన, లతాశతసమావృతాన్=వందలకొలది లతలచేత కప్పబడిన, వాసన్తికాన్= వసంతఋతువుకు సంబంధించిన, ద్రుమాన్=వృక్షములను, దృష్ట్వా=చూచి, భయశఙ్కితాః=భయముచేత శంకితులు, బభూవుః=అయిరి.

తా. పిమ్మట ఆ వానరులు, పుష్పభారములతో నిండిన అగ్రభాగములు గల అనేకలతలచేత కప్పబడిన వసంతఋతువునందు పుష్పించిన వృక్షములను చూచి భయముచే శంకితులైరి. 4

మూ. తే వసన్త మనుప్రాప్తం ప్రతివేద్య పరస్పరమ్,
నష్టసన్దేశకాలార్థా నిపేతుర్ధరణీతలే. 5

ప్ర. అ. తే=వారు, వసన్తమ్=వసంతఋతువును, అనుప్రాప్తమ్=వచ్చిన దానిగా, పరస్పరమ్=పరస్పరము, ప్రతివేద్య=తెలుపుకొని, నష్టసన్దేశకాలార్థాః=నశించిన సందేశకాల మను ప్రయోజనము కలవారై, ధరణీతలే= భూమిమీద, నిపేతుః=పడిరి.

తా. ఆ వానరులు వసంతఋతువు వచ్చిన దని, ఒకరితో ఒకరు చెప్పుకొనుచు, సందేశకాలము అను ప్రయోజనము నష్ట మగుటచే దుఃఖించుచు నేలపై బడిరి. 5

మూ. తతస్తాన్ కపివృద్ధాంశ్చ శిష్టాంశ్చైవ వనౌకసః,
వాచా మధురయా భాష్య యథావదనుమాన్య చ, 6
స తు సింహవృషస్కన్ధః పీనాయతభుజః కపిః,
యువరాజో మహాప్రాజ్ఞ అఙ్గదో వాక్యమబ్రవీత్. 7

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సింహవృషస్కన్ధః=సింహవృషభముల వంటి మూపు గల, పీనాయతభుజః=బలిసిన పొడవైన భుజములు గల, యువరాజః= యువరాజు, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గలవాడు అయిన, కపిః=వానరుడైన, అంగదః=అంగదుడు, తాన్=ఆ, కపివృద్ధాంశ్చ=వృద్ధులైన వానరులను, శిష్టాన్=ఇతరులైన, వనౌకసశ్చైవ=వానరులను, మధురయా=మధురమైన, వాచా=వాక్కుచేత, ఆభాష్య=పలకరించి, యథావత్=తగు విధముగా, అనుమాన్య చ=గౌరవించి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట సింహవృషభముల వంటి మూపు, బలిసిన పొడవైన భుజములు గల యువరాజు, మహాబుద్ధిమంతుడు అయిన అంగదుడు వృద్ధులైన వానరులను, ఇతరులైన వానరులను, మధురమైన మాటలతో పలుకరించుచు

తగు విధముగా సత్కరించి ఇట్లు పలికెను. 6,7

మూ. శాసనాత్కపిరాజస్య వయం సర్వే వినిర్గతాః,
మాసః పూర్ణో బిలస్థానాం హరయః కిం న బుధ్యత. 8

ప్ర.అ. హరయః=ఓ! వానరులారా! వయం సర్వే=మన మందరము, కపిరాజస్య=సుగ్రీవునియొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, వినిర్గతాః= బయలుదేరితిమి. బిలస్థానామ్=బిలములో ఉన్న మనకు, మాసః=మాసము, పూర్ణః=నిండినది. కిమ్=ఎందువలన, న బుధ్యత=తెలుసుకొనరు?

తా. ఓ! వానరులారా! మన మందరము సుగ్రీవుని ఆజ్ఞచేత బయలుదేరినాము. మనము బిలములో ఉండగానే మాసము గడచిపోయినది. మీకు తెలియుటలేదా! 8

మూ. వయమాశ్వయుజే మాసి కాలసఙ్ఖ్యావ్యవస్థితాః,
ప్రస్థితాః సోఽపి చాతీతః కిమతః కార్యముత్తరమ్. 9

ప్ర.అ. వయమ్=మనము, కాలసఙ్ఖ్యావ్యవస్థితాః=కాలసంఖ్యచేత నియమింపబడినవారమై, ఆశ్వయుజే మాసి=ఆశ్వయుజమాసమునందు, ప్రస్థితాః= బయలుదేరితిమి. సోఽపి=ఆ కాలము కూడ, అతీతః=గడచిపోయినది. అతః=ఆ కారణమువలన, ఉత్తరం కార్యమ్=తరువాత చేయదగిన కార్యము, కిమ్=ఏమి?

తా. మనము కాలసంఖ్యానియమమును అనుసరించి ఆశ్వయుజ మాసములో బయలుదేరితిమి. ఆ కాలము గడచిపోయినది. ఇటుపైన మనము ఏమి చేయవలెను? 9

మూ. భవన్తః ప్రత్యయం ప్రాప్తాః నీతిమార్గవిశారదాః,
హితేష్వభిరతా భర్తుర్నిసృష్టాః సర్వకర్మసు. 10

ప్ర.అ. భవన్తః=మీరు, ప్రత్యయమ్=విశ్వాసమును, ప్రాప్తాః= పొందినవారు. నీతిమార్గవిశారదాః=నీతిమార్గమునందు నేర్పు గలవారు. భర్తుః= ప్రభువుయొక్క, హితేషు=హితములయందు, అభిరతాః=ఆసక్తి కలవారు. సర్వకర్మసు=అన్ని పనులయందు, నిసృష్టాః=సఫలత్వమును పొందినవారు.

తా. మీరందరు ప్రభువు విశ్వాసమునకు పాత్రులు. నీతిమార్గమునందు సమర్థులు. ప్రభువు హితమునందు ఆసక్తి కలవారు. అన్ని కార్యములయందు ఫలమును సాధించినవారు. 10

మూ. కర్మస్వప్రతిమాః సర్వే దిక్షు విశ్రుతపౌరుషాః,
మాం పురస్కృత్య నిర్యాతాః పిఙ్గాక్షప్రతిచోదితాః. 11

ప్ర. అ. సర్వే=మీరందరు, కర్మసు=కర్మలయందు, అప్రతిమాః=సాటి

లేనివారు. దిక్షు=దిక్కులయందు, విశ్రుతపౌరుషాః=ప్రసిద్ధమైన పౌరుషము కలవారు, పిఙ్గాక్షప్రతిచోదితాః=సుగ్రీవునిచేత ప్రేరేపింపబడినవారై, మామ్=నన్ను, పురస్కృత్య=ఎదుట ఉంచుకొని, నిర్యాతాః=బయలుదేరినారు.

తా. మీరందరు పనులలో సాటిలేనివారు. మీ పౌరుషము అన్ని దిక్కులయందు ప్రసిద్ధమైనది. సుగ్రీవుడు ఆజ్ఞాపించగా నన్ను నాయకునిగా చేసుకొని బయలుదేరినారు. 11

మూ. ఇదానీమకృతార్థానాం మర్తవ్యం నాత్ర సంశయః,
హరిరాజస్య సన్దేశమకృత్వా కః సుఖీ భవేత్. 12

ప్ర. అ. ఇదానీమ్=ఇపుడు, అకృతార్థానామ్=చేయబడిన కార్యము గలవారము కాని మనకు, మర్తవ్యమ్=మరణింపవలసి యున్నది. అత్ర=ఈ విషయమున, సంశయః=సంశయము, న=లేదు. హరిరాజస్య= సుగ్రీవునియొక్క, సన్దేశమ్=ఆజ్ఞను, అకృత్వా=చేయకుండగా, కః= ఎవడు, సుఖీ=సుఖవంతుడై, భవేత్=ఉండును?

తా. ఇపుడు కార్యము పూర్తిచేయజాలని మన మందరము మరణించవలసి యుండును; సందేహము లేదు. సుగ్రీవుని ఆజ్ఞ నిర్వర్తించనివాడు, ఎవడు సుఖముగా ఉండగలడు? 12

మూ. అస్మిన్నతీతే కాలే తు సుగ్రీవేణ కృతే స్వయమ్,
ప్రాయోపవేశనం యుక్తం సర్వేషాం చ వనౌకసామ్. 13

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, కృతే=నిర్ణయించబడిన, అస్మిన్ కాలే=ఈ కాలము, అతీతే=గడచిపోయినదగుచుండగా, సర్వేషామ్= సమస్తమైన, వనౌకసామ్=వానరులకు, స్వయమ్=స్వయముగా, ప్రాయోపవేశనమ్=ప్రాయోపవేశము, యుక్తమ్=తగినది.

తా. సుగ్రీవుడు నిర్ణయించిన ఈ కాలము గడచిపోయినది గాన మన మందరము స్వయముగానే ప్రాయోపవేశము చేయుట మంచిది. 13

మూ. తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవః స్వామిభావే వ్యవస్థితః,
న క్షమిష్యతి నః సర్వానపరాధకృతో గతాన్. 14

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రకృత్యా=స్వభావముచేత, తీక్ష్ణః= తీక్ష్ణమైనవాడు, స్వామిభావే=రాజత్వమునందు, వ్యవస్థితః=ఉన్నవాడు. గతాన్=తిరిగి వెళ్లిన, అపరాధకృతః=అపరాధము చేసిన, నః=మనలను, సర్వాన్=అందరిని, న క్షమిష్యతి=క్షమించడు.

తా. సుగ్రీవుడు సహజముగా తీక్ష్ణస్వభావము గలవాడు. రాజుగా కూడ ఉన్నాడు. తిరిగి వెళ్లిన, అపరాధము చేసిన మనలను క్షమించడు. 14

మూ. అప్రవృత్తౌ చ సీతాయాః పాపమేవ కరిష్యతి,
తస్మాత్క్షమమిహాద్యైవ గన్తుం ప్రాయోపవేశనమ్. 15
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ ధనాని చ గృహాణి చ.

ప్ర. అ. సీతాయాః=సీతయొక్క, అప్రవృత్తౌ=వార్త తెలియని దగుచుండగా, పాపమేవ=పాపమునే, కరిష్యతి=చేయగలడు. తస్మాత్=అందువలన, పుత్రాంశ్చ=పుత్రులను, దారాంశ్చ=భార్యలను, ధనాని చ=ధనములను, గృహాణి చ=గృహములను, త్యక్త్వా=విడిచి, ఇహ=ఇక్కడ, అద్యైవ= ఇపుడే, ప్రాయోపవేశనమ్=ప్రాయోపవేశనమును, గన్తుమ్=పొందుటకు, క్షమమ్=తగినది.

తా. సీత వార్త తెలియకనే మనము పోయినచో అతడు మనలను చంపగలడు. అందువలన మనము పుత్రులను, భార్యలను, ధనములను, గృహములను విడచి ఇపుడే ఇక్కడ, ప్రాయోపవేశము చేయుట మంచిది. 15

మూ. ధ్రువం నో హింసతే రాజా సర్వాన్ప్రతిగతానితః, 16
వధేనాప్రతిరూపేణ శ్రేయాన్మృత్యురిహైవ నః.

ప్ర. అ. రాజా=రాజు, ఇతః=ఇక్కడినుండి, ప్రతిగతాన్=తిరిగి వెళ్లిన, నః=మనలను, సర్వాన్=అందరిని, అప్రతిరూపేణ=సాటి లేని, వధేన= వధచేత, ధ్రువమ్=నిశ్చయముగా, హింసతే=హింసించును. నః=మనకు, ఇహైవ=ఇక్కడనే, మృత్యుః=మృత్యువు, శ్రేయాన్=శ్రేయస్కరమైనది.

తా. మన మిక్కడి నుండి తిరిగి వెళ్లిన పిమ్మట సుగ్రీవుడు మనలను అందరిని తప్పక చిత్రవధ చేసి హింసించును. అందుచేత మనకు ఇక్కడనే మరణము శ్రేయస్కరము. 16

మూ. న చాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభిషేచితః, 17
నరేన్ద్రేణాభిషిక్తోఽస్మి రామేణాక్లిష్టకర్మణా.

ప్ర. అ. అహమ్=నేను, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, యౌవరాజ్యేన= యౌవరాజ్యముచే, న అభిషేచితః=అభిషేకింపబడలేదు. అక్లిష్టకర్మణా= శ్రమపడకుండగా పనులు చేయు, నరేన్ద్రేణ=మహారాజైన, రామేణ=రామునిచేత, అభిషిక్తః=అభిషేకింపబడినవాడను, అస్మి=అయి ఉన్నాను.

తా. నన్ను సుగ్రీవుడు యౌవరాజ్యములో అభిషిక్తుని చేయలేదు. శ్రమపడకుండగా పనులు చేయువాడు, మహారాజు అయిన రాముడు నాకు అభిషేకము చేసినాడు. 17

మూ. స పూర్వం బద్ధవైరో మాం రాజా దృష్ట్వా వ్యతిక్రమమ్. 18
ఘాతయిష్యతి దణ్డేన తీక్ష్ణేన కృతనిశ్చయః,

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, బద్ధవైరః=కట్టబడిన, వైరము గల, సః రాజా=ఆ సుగ్రీవుడు, వ్యతిక్రమమ్=పొరబాటును, దృష్ట్వా=చూచి, కృతనిశ్చయః=చేయబడిన నిశ్చయము గలవాడై, మామ్=నన్ను, తీక్ష్ణేన= తీక్ష్ణమైన, దణ్డేన=దండముచేత, ఘాతయిష్యతి=చంపించగలడు.

తా. పూర్వమునుండి నాపై వైరబుద్ధి గల ఆ సుగ్రీవుడు ఈ పొరబాటును చూచి దృఢముగా నిశ్చయము చేసుకొని తీక్ష్ణమైన దండము విధించి నన్ను చంపించగలడు. 18

మూ. కిం మే సుహృద్భిర్వ్యసనం పశ్యద్భిర్జీవితాన్తరే, 19
ఇహైవ ప్రాయమాసిష్యే పుణ్యే సాగరరోధసి.

ప్ర. అ. జీవితాన్తరే=జీవితమధ్యమునందు, మే వ్యసనమ్=నా వ్యసనమును, పశ్యద్భిః=చూచుచున్న, సుహృద్భిః=స్నేహితులచేత, కిమ్=ఏమి ప్రయోజనము. ఇహైవ=ఇక్కడనే, పుణ్యే=పవిత్రమైన, సాగరరోధసి= సముద్రతీరమునందు, ప్రాయమ్ ఆసిష్యే=ప్రాయోపవేశము చేసెదను.

తా. నాకు జీవితమధ్యమునందే వచ్చిన వ్యసనమును నా స్నేహితులు చూచుట ఎందుకు? ఇక్కడనే పవిత్రమైన ఈ సముద్రతీరమునందు ప్రాయోపవేశము చేసెదను. 19

మూ. ఏతచ్ఛ్రుత్వా కుమారేణ యువరాజేన భాషితమ్, 20
సర్వే తే వానరశ్రేష్ఠాః కరుణం వాక్యమబ్రువన్.

ప్ర. అ. యువరాజేన=యువరాజైన, కుమారేణ=అంగదునిచేత, భాషితమ్=పలుకబడిన, ఏతత్=ఈ వాక్యమును, శ్రుత్వా=విని, సర్వే= సమస్తమైన, తే=ఆ, వానరశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, కరుణమ్=దీనమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రువన్=పలికిరి.

తా. యువరాజైన అంగదుని మాటలు విని ఆ వానరశ్రేష్ఠు లందరు దీనముగా ఇట్లు పలికిరి. 20

మూ. తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవః ప్రియారక్తశ్చ రాఘవః, 21
సమీక్ష్యాకృతకార్యాంస్తు తస్మింశ్చ సమయే గతే,
అదృష్టాయాం చ వైదేహ్యాం దృష్ట్వా చైవ సమాగతాన్, 22
రాఘవప్రియకామాయ ఘాతయిష్యత్యసంశయమ్.

ప్ర. అ.సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రకృత్యా=స్వభావముచేత, తీక్ష్ణః= తీక్ష్ణమైనవాడు, రాఘవశ్చ=రాముడు, ప్రియారక్తః=ప్రియురాలియం దాసక్తి కలవాడు. వైదేహ్యామ్=సీత, అదృష్టాయామ్=చూడబడనిదగుచుండగా, తస్మిన్=ఆ, సమయే=కాలము, గతే=గడచిపోయిన దగుచుండగా, సమాగతాన్=వచ్చిన, అకృతకార్యాన్= చేయబడని కార్యము

గల మనలను, సమీక్ష్య= చూచి, దృష్ట్వా=ఆలోచించి, రాఘవప్రియకామాయ=రాము నకు ప్రియమును చేయు కోరికకొరకు(చేత) అసంశయమ్=నిస్సంశయముగా, ఘాతయిష్యతి= చంపించగలడు.

తా. సుగ్రీవుడు స్వభావముచేత, తీక్ష్ణమైనవాడు. రాముడు భార్యను పొందవలెనని కోరికతో ఉన్నవాడు. మనము సీతను చూడకుండగా కార్యమును పూర్తిచేయక గడువు దాటిన పిమ్మట తిరిగి వెళ్లగా చూచి ఆ సుగ్రీవుడు రామునకు ప్రియము చేయవలయు ననే కోరికతో మనలను తప్పక చంపించును.

మూ. న క్షమం చాపరాద్ధానాం గమనం స్వామిపార్శ్వతః, 23
ప్రధానభూతాశ్చ వయం సుగ్రీవస్య సమాగతాః.

ప్ర. అ. అపరాద్ధానామ్=అపరాధము చేసిన మనకు, స్వామిపార్శ్వతః= ప్రభువు దగ్గరకు, గమనమ్=వెళ్లుట, న క్షమమ్=తగినది కాదు. సుగ్రీవస్య=సుగ్రీవునకు, ప్రధానభూతాః=ప్రధానులమైన, వయమ్= మనము, సమాగతాః=వచ్చినాము.

తా. మనము అపరాధము చేసిన పిమ్మట ప్రభువు దగ్గరకు వెళ్లుట మంచిది కాదు. సుగ్రీవుడు ప్రధానులమైన మనలను అందరిని చేర్చి ఇక్కడికి పంపినాడు. 23

మూ. ఇహైవ సీతామన్విష్య ప్రవృత్తిముపలభ్య వా, 24
నో చేద్గచ్ఛామ తం వీరం గమిష్యామో యమక్షయమ్.

ప్ర. అ. ఇహైవ=ఇక్కడనే, సీతామ్=సీతను, అన్విష్య=వెదకి, ప్రవృ త్తిమ్=వృత్తాంతమును, ఉపలభ్య వా=పొంది, తం వీరమ్=వీరుడైన ఆ సుగ్రీవుని గూర్చి, నో గచ్ఛామ చేత్=వెళ్లకపోయినచో, యమక్షయమ్= యమలోకమును గూర్చి, గమిష్యామః=వెళ్లగలము.

తా. సీతను ఇక్కడనే వెదకి లేదా ఆమె వృత్తాంతమును తెలుసుకొని ఆ సుగ్రీవునివద్దకు వెళ్లకపోయినచో మనము యమలోకమునకు వెళ్లెదము. 24

మూ. ప్లవఙ్గమానాం తు భయార్దితానాం
శ్రుత్వా వచస్తార ఇదం బభాషే,
అలం విషాదేన బిలం ప్రవిశ్య
వసామ సర్వే యది రోచతే వః. 25

ప్ర. అ. తారః=తారుడు, భయార్దితానామ్=భయముచేత పీడింపబడిన, ప్లవఙ్గమానామ్=వానరులయొక్క, వచః=వాక్యమును, శ్రుత్వా=విని, ఇదమ్=ఈ మాటను, బభాషే=పలికెను. విషాదేన=దుఃఖముచేత, అలమ్=చాలును. వః=మీకు, రోచతే యది=ఇష్టమైనట్లైతే, సర్వే= మన మందరము, బిలమ్=బిలమును, ప్రవిశ్య=ప్రవేశించి, వసామ= నివసించెదము.

తా. భయపీడితులైన ఆ వానరుల మాటలు విని తారుడు ఇట్లు పలికెను. మీ రెవ్వరు దుఃఖించవద్దు. మీరు అంగీకరించినచో మన మందరము ఈ బిలములో ప్రవేశించి అక్కడ నివసించెదము. 25

మూ. ఇదం హి మాయావిహితం సుదుర్గమం
ప్రభూతపుష్పోదకభోజ్యపేయమ్,
ఇహాస్తి వో నైవ భయం పురన్దరా
న్న రాఘవాద్వానరరాజతోఽపి వా. 26

ప్ర. అ. మాయావిహితమ్=మాయచేత నిర్మించబడిన, ప్రభూతపుష్పోదక భోజ్యపేయమ్=అధికమైన పుష్పములు, ఉదకము, భోజ్యములు, పానీయములు గల, ఇదమ్=ఈ బిలము, సుదుర్గమం హి=ప్రవేశించుటకు చాల కష్టమైనది కదా! ఇహ=ఇక్కడ, వః=మనకు, పురన్దరాత్=దేవేంద్రునివలన, భయమ్= భయము, నైవ=లేదు. రాఘవాత్=రాముని వలన గాని, వానరరాజతోఽపి వా=సుగ్రీవుని వలన గాని, న=భయము లేదు.

తా. మాయచేత నిర్మించబడినది, అధికమైన పుష్పములు, ఉదకము, భోజ్యములు, పానీయములు కలది, అయిన ఈ బిలము ప్రవేశించుటకు చాల కష్ట మైనది. ఇక్కడ నున్నచో మనకు దేవేంద్రునివల్ల కూడ భయ ముండదు. రామునివలన గాని, సుగ్రీవుని వలన గాని ఏ మాత్రము భయము ఉండదు.26

మూ. శ్రుత్వాఙ్గదస్యాపి వచోఽనుకూల
మూచుశ్చ సర్వే హరయః ప్రతీతాః,
యథా న హన్యేమ తథా విధాన
మసక్తమద్యైవ విధీయతాం నః. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
త్రిపఞ్చాశః సర్గః.

ప్ర. అ. అఙ్గదస్య=అంగదునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా= విని, సర్వే=సమస్తమైన, హరయః=వానరులు, ప్రతీతాః=విశ్వాసము కలవారై, అనుకూలమ్=అనుకూలముగా, ఊచుః=పలికిరి. యథా=ఎట్లు, న హన్యేమ=చంప బడమో, తథా=అట్లు, నః=మనకు, అద్యైవ= ఇప్పుడే, విధానమ్=ఉపాయము, అసక్తమ్=ఆలస్యము లేకుండగా, విధీయతామ్=చేయబడుగాక!

తా. అంగదుని మాటలు విని ఆ వానరు లందరు విశ్వాసము గలవారై ఆతని కనుకూలముగా ఇట్లు పలికిరి. "మనము చంపబడకుందు నట్లు ఏదైన ఉపాయము ఇపుడే ఆలస్యము లేకుండగా చూడవలెను." 27

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఏబదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుఃపఞ్చాశః సర్గః

[హనుమంతుడు వానరులను భేదోపాయముచేత తన వైపు త్రిప్పుకొని తనతో రావలసినదిగా అంగదునికి బోధించుట]

మూ. తథా బ్రువతి తారే తు తారాధిపతివర్చసి,
అథ మేనే హృతం రాజ్యం హనూమానఙ్గదేన తత్. 1

ప్ర. అ. తారాధిపతివర్చసి=చంద్రుని వంటి కాంతి గల, తారే=తారుడు, తథా=అట్లు, బ్రువతి=పలుకుచుండగా, అథ=అటుపిమ్మట, హనూమాన్=హనుమంతుడు, అఙ్గదేన=అంగదునిచేత, తత్=ఆ, రాజ్యమ్=రాజ్యమును, హృతమ్=హరింపబడినదానినిగా, మేనే=తలచెను.

తా. చంద్రుని వంటి కాంతి గల తారుడు అట్లు పలుకుచుండగా హనుమంతుడు ఈ కపిరాజ్యమును అంగదుడు హరింపనున్నాడు అని తలచెను.1

మూ. బుద్ధ్యా హ్యష్టాఙ్గయా యుక్తం చతుర్బలసమన్వితమ్,
చతుర్దశగుణం మేనే హనూమాన్ వాలినః సుతమ్. 2

ప్ర.అ హనూమాన్=హనుమంతుడు, వాలినః=వాలియొక్క, సుతమ్=కుమారుని, అష్టాఙ్గయా=ఎనిమిది అంగములు గల, బుద్ధ్యా=బుద్ధితో, యుక్తమ్=కూడినవానినిగాను, చతుర్బలసమన్వితమ్=నాలుగు బలములతో కూడిన వానినిగాను, చతుర్దశగుణమ్=పదునాలుగు గుణములు గలవానినిగాను, మేనే= తలచెను.

తా. "ఈ అంగదునియందు ఎనిమిది అంగములు గల బుద్ధి, నాలుగు బలములు, పదునాలుగు గుణములు ఉన్నవి" అని హనుమంతుడు తలచెను. 2

వి|| బుద్ధియొక్క ఎనిమిది అంగములు : శుశ్రూష (ఇతరులనుండి విని విషయములను తెలుసుకొనవలెను అను కోరిక), వినుట, గ్రహించుట, ధారణము, ఊహ, అపోహ, విషయజ్ఞానము, యథార్థజ్ఞానము - ఇవి ఎనిమిది బుద్ధిగుణములు.

"శుశ్రూషాశ్రవణం చైవ గ్రహణం ధారణం తథా,
ఉహాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః.

ఊహ అనగా విషయములను ఆలోచించి గ్రహించుట. అపోహ అనగా ఆలోచించి అయుక్తమైనవాటిని విడచుట.

నాలుగు బలములు -- సామ - దాన - భేద - విగ్రహములు అను నాలుగు ఉపాయములవలన కలిగిన బలములు లేదా బాహుబల, మనోబల,

ఉపాయబల, బంధుబలములు.

చతుర్దశగుణములు -- దేశకాలములను గుర్తించుట, దృఢత్వము, క్లేశము లను సహించుట, అన్నియు తెలుసుకొనుట, నేర్పు, బలము, ఆలోచన రహస్యముగా ఉంచుట, వాదమునకు దిగకుండుట, శౌర్యము, ఇతరులు చూపు భక్తిని గుర్తించుట, కృతజ్ఞత్వము, శరణాగతవాత్సల్యము, తగుసమయములో కోపము చూపుట, చపలత్వము లేకుండుట ఇవి పదునాలుగు గుణములు.

"దేశకాలజ్ఞతా దార్ఢ్యం సర్వక్లేశసహిష్ణుతా,
సర్వవిజ్ఞానతా దాక్ష్యమూర్జః సంవృతమన్త్రితా,
అవిసంవాదితా శౌర్యం భక్తిజ్ఞత్వం కృతజ్ఞతా,
శరణాగతవాత్సల్యమమర్షిత్వ మచాపలమ్." 2

మూ. ఆపూర్యమాణం శశ్వచ్చ తేజోబలపరాక్రమైః,
శశినం శుక్లపక్షాదౌ వర్ధమానమివ శ్రియా. 3
బృహస్పతిసమం బుద్ధ్యా విక్రమే సదృశం పితుః,
శుశ్రూషమాణం తారస్య శుక్రస్యేవ పురన్దరమ్. 4
భర్తురర్థే పరిశ్రాన్తం సర్వశాస్త్రవిశారదః,
అభిసన్ధాతుమారేభే హనూమానఙ్గదం తతః. 5

ప్ర. అ. శశ్వత్=ఎల్లప్పుడు, తేజోబలపరాక్రమైః=తేజస్సుచేత, బలము చేత, పరాక్రమముచేత, ఆపూర్యమాణమ్=నింపబడుచున్నవాడు, శుక్లపక్షాదౌ= శుక్లపక్షప్రారంభమున, శశినమివ=చంద్రుడు వలె, శ్రియా=శోభతో, వర్ధమా నమ్=వృద్ధిపొందుచున్నవాడు, బుద్ధ్యా=బుద్ధిచేత, బృహస్పతిసమమ్= బృహస్పతితో సమానుడు, విక్రమే=పరాక్రమమునందు, పితుః= తండ్రికి, సదృశమ్=తగినవాడు, శుక్రస్య=శుక్రునకు, పురన్దరమ్ ఇవ= దేవేంద్రుడు వలె, తారస్య=తారునకు, శుశ్రూ షమాణమ్=వినదలుచుకొన్నవాడు, భర్తుః= ప్రభువుయొక్క, అర్థే=కార్యమునందు, పరిశ్రాన్తమ్=అలసినవాడు, అయిన, అఙ్గదమ్=అంగదుని, సర్వశాస్త్రవిశారదః=సమ స్తశాస్త్రములలో పండితుడైన, హనూమాన్=హనుమంతుడు, తతః=అటుపిమ్మట, అభిసన్ధాతుమ్= కార్యమునందు కూర్చుటకై, ఆరేభే=ప్రారంభించెను.

తా. అటుపిమ్మట సకలశాస్త్రములందు పండితుడైన హనుమంతుడు నిత్యము తేజస్సుచేత, బలముచేత, పరాక్రమముచేత నింపబడుచున్నవాడు, శుక్లపక్ష ప్రారంభ చంద్రుడు వలె శోభతో ప్రకాశించుచున్నవాడు, బుద్ధిచేత బృహస్పతితో సమానుడు, పరాక్రమమునందు తండ్రితో సమానుడు, రాక్షసగురువైన శుక్రుని మాటలు దేవేంద్రుడు వినదలచినట్లు తనకు హితము కాని మాటలు చెప్పుచున్న తారుని మాటలు వినదలచుచున్నవాడు, ప్రభువు కార్యమునకు అలసి ఉన్నవాడు అయిన అంగదుని తన కర్తవ్యము విషయమున అభిముఖునిగా చేయుటకు

ప్రారంభించెను. 3-5

మూ. స చతుర్ణాముపాయానాం తృతీయముపవర్ణయన్,
భేదయామాస తాన్ సర్వాన్ వానరాన్వాక్యసమ్పదా. 6

ప్ర. అ. సః=అతడు, చతుర్ణామ్=నాలుగు, ఉపాయానామ్= ఉపాయములలో, తృతీయమ్=మూడవదానిని, ఉపవర్ణయన్=వర్ణించుచు, తాన్=ఆ, వానరాన్=వానరులను, వాక్యసమ్పదా=వాక్యముల సంపదచేత, భేదయామాస=విడదీసెను.

తా. హనుమంతుడు, సామ - దాన - భేద - దండము లను నాలుగు ఉపాయములలో, మూడవదైన భేదోపాయమును అవలంబించి తన మాటల శక్తితో ఆ వానరు లందరిని విడదీసెను. 6

మూ. తేషు సర్వేషు భిన్నేషు తతోఽభీషయదఙ్గదమ్,
భీషణైర్వివిధైర్వాక్యైః కోపోపాయసమన్వితైః. 7

ప్ర. అ. తేషు=ఆ, సర్వేషు=అందరు, భిన్నేషు=భేదింపబడినవారగుచుండగా, తతః=అటుపిమ్మట, కోపోపాయసమన్వితైః=కోపరూపమైన ఉపాయముతో కూడిన, భీషణైః=భయంకరములైన, వివిధైః=అనేకవిధములైన, వాక్యైః= వాక్యములచేత, అఙ్గదమ్=అంగదుని, అభీషయత్=భయపెట్టెను.

తా. ఆ వానరు లందరు భేదింపబడిన తరువాత, కోపరూపమైన ఉపాయముతో (దండముతో) కూడిన, భయంకరములైన అనేకవిధములైన వాక్యములచేత, అంగదుని భయపెట్టెను. 7

మూ. త్వం సమర్థతరః పిత్రా యుద్ధే తారేయ వై ధ్రువమ్,
దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా. 8

ప్ర. అ. తారేయ=ఓ! అంగదుడా! త్వమ్=నీవు, యుద్ధే= యుద్ధమునందు, పిత్రా=తండ్రితో, సమర్థతరః=ఎక్కువ సమర్థుడవు, ధ్రువమ్=నిశ్చయము. పితా యథా=మీ తండ్రివలె, కపిరాజ్యమ్= వానరరాజ్యమును, దృఢమ్=దృఢముగా, ధారయితుమ్=ధరించుటకు, శక్తః= సమర్థుడవు.

తా. ఓ! అంగదుడా! నీవు యుద్ధములో తండ్రికంటె కూడ సమర్థుడవు. తండ్రి వలె ఈ వానరరాజ్యమును దృఢముగా ధరించుటకు సమర్థుడవు. సందేహము లేదు. 8

మూ. నిత్యమస్థిరచిత్తా హి కపయో హరిపుఙ్గవ !
నాజ్ఞాప్యం విసహిష్యన్తి పుత్రదారం వినా త్వయా. 9

ప్ర. అ. హరిపుఙ్గవ=ఓ! వానరశ్రేష్ఠుడా! కపయః=వానరులు, నిత్యమ్=నిత్యము, అస్థిరచిత్తాః హి=అస్థిరమైన చిత్తము కలవారు కదా ! పుత్రదారం

వినా= పుత్రులు భార్యలు లేకుండగా, త్వయా=నీచేత, ఆజ్ఞాప్యమ్=ఆజ్ఞాపనమును, న విసహిష్యన్తి=సహించరు.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! ఈ వానరులందరు ఎల్లపుడు చపలచిత్తులు. పుత్రులకు భార్యలకు దూరముగా ఉన్న వీరు నీ యాజ్ఞకు లొంగి ఉండరు. 9

మూ. త్వాం న తే హ్యనుయుఞ్జేయుః ప్రత్యక్షం ప్రవదామి తే,
యథాఽయం జామ్బవాన్నీలః సుహోత్రశ్చ మహాకపిః. 10
న హ్యహం తే ఇమే సర్వే సామదానాదిభిర్గుణైః,
దండేన న త్వయా శక్యాః సుగ్రీవాదపకర్షితమ్. 11

ప్ర. అ. ప్రత్యక్షమ్=ప్రత్యక్షముగా, తే=నీకు, యథా=ఎట్లు, ప్రవదామి=చెప్పుచున్నానో, అయమ్=ఈ, జామ్బవాన్=జాంబవంతుడు, నీలః=నీలుడు, మహాకపిః=గొప్ప వానరుడైన, సుహోత్రశ్చ=సుహోత్రుడు, ఏతే=వీరు, త్వామ్=నిన్ను, నానుయుఞ్జేయుః హి=అనుసరించరు కదా ! అహమ్=నేనుకూడ, నహి=అనుసరించను కదా. తే=ఆ, ఇమే=ఈ, సర్వే= అందరము, సామదానాదిభిః=సామము, దానము మొదలైన, గుణైః=గుణములచేత, దణ్డేన=దండముచేత, త్వయా= నీచేత, సుగ్రీవాత్=సుగ్రీవునినుండి, అపకర్షితుమ్=లాగుటకు, న శక్యాః= శక్యమైనవారము కాము.

తా. నేను నీకు ప్రత్యక్షముగా చెప్పుచున్నాను. ఈ జాంబవంతుడు, నీలుడు, గొప్ప వానరుడైన సుహోత్రుడు నీతో కలిసి ఉండరు. నేను కూడ నీ పక్షమున ఉండను. మమ్ముల నెవరిని నీవు సామదానాదిగుణములచేత దండముచేత సుగ్రీవునినుండి దూరము చేయ జాలవు. 10,11

మూ. విగృహ్యాసనమప్యాహుర్దుర్బలేన బలీయసా,
ఆత్మరక్షాకరాత్తస్మాన్న విగృహ్ణీత దుర్బలః. 12

ప్ర.అ బలీయసా=అధికబలవంతునిచేత, దుర్బలేన=దుర్బలునితో, విగృహ్య=విరోధమును పొంది, ఆసనమ్ అపి=ఉండుటను కూడ, ఆహుః= యుక్తము అని చెప్పుదురు. తస్మాత్=ఆ కారణమువలన, ఆత్మరక్షాకరః= ఆత్మరక్ష చేసుకొను, దుర్బలః=దుర్బలుడు, న విగృహ్ణీత=విరోధము పెట్టుకొనకూడదు.

తా. బలవంతుడు దుర్బలునితో విరోధము చేసి ఒకచోట ఉండవచ్చును. అందుచేత దుర్బలుడు తన రక్షణను కోరుకున్నచో బలవంతునితో విరోధము పెట్టుకొనకూడదు. 12

మూ. యాం చేమాం మన్యసే ధాత్రీమేతద్బిలమితి శ్రుతమ్,
ఏతల్లక్ష్మణబాణానామీషత్కార్యం విదారణమ్. 13

ప్ర. అ. యామ్=ఏ, ఇమామ్=ఈ, ధాత్రీమ్=భూమిని గూర్చి, మన్యసే=తల చుచున్నావో, ఏతత్=ఈ, బిలమ్=బిలము, ఇతి=అని, శ్రుతమ్=వినబడినదో, లక్ష్మణబాణానామ్=లక్ష్మణుని బాణములకు, ఏతత్= ఈ, విదారణమ్=చీల్చుట, ఈషత్కార్యమ్=అనాయాసముగా చేయదగినది.

తా. నీవు ఈ భూమి రక్షించగల దని తలచుచున్నావు. ఈ బిలము రక్షించు నని తారుడు చెప్పగా వినుచున్నావు. కాని దీనిని చీల్చుట లక్ష్మణుని బాణములకు చాల చిన్న పని. 13

మూ. స్వల్పం హి కృత మిన్ద్రేణ క్షిపతా హ్యశనిం పురా,
లక్ష్మణో విశితైర్బాణైర్భిన్ద్యాత్పత్రపుటం యథా. 14

ప్ర. అ. పురా=పూర్వమునందు, అశనిమ్=వజ్రాయుధమును, క్షిపతా= విసరిన, ఇన్ద్రేణ=ఇంద్రునిచేత, స్వల్పమ్=చాల చిన్న పని, కృతం హి = చేయబ డినది కదా! లక్ష్మణః=లక్ష్మణుడు, నిశితైః=వాడియైన, బాణైః = బాణములచేత, పత్రపుటమ్ యథా=ఆకు దొప్పను వలె, భిన్ద్యాత్=బ్రద్దలు కొట్టును.

తా. పూర్వము మయుణ్ణి చంపుటకై ఇంద్రుడు వజ్రాయుధమును విసిరినాడు అనునది చాల చిన్న పని. లక్ష్మణుడు వాడియైన బాణములచేత ఈ బిలమును ఆకుల దొప్పను బ్రద్దలు కొట్టినట్లు బ్రద్దలు కొట్టును. 14

మూ. లక్ష్మణస్య చ నారాచా బహవః సన్తి తద్విధాః,
వజ్రాశనిసమస్పర్శా గిరీణామపి దారకాః. 15

ప్ర. అ. వజ్రాశనిసమస్పర్శాః=వజ్రముతోను, పిడుగుతోను సమానమైన స్పర్శ గలవి, గిరీణామపి=పర్వతములకు కూడ, దారకాః=చీల్చునవి అయిన, తద్విధాః=అట్టి, బహవః=అనేకమైన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, నారాచాః=నారా చములు, సన్తి=ఉన్నవి.

తా. లక్ష్మణుని వద్ద, వజ్రాయుధముతోను, పిడుగుతోను సమానమైన, పర్వతములను కూడ చీల్చగలిగిన అట్టి నారాచ బాణములు అనేకము లున్నవి.15

మూ. అవస్థానే యదైవ త్వమాసిష్యసి పరంతప,
తదైవ హరయః సర్వే త్యక్ష్యన్తి కృతనిశ్చయాః. 16

ప్ర. అ. పరంతప =శత్రువులను పీడించువాడా ! త్వమ్=నీవు, యదైవ= ఎప్పుడు, అవస్థానే=ఈ బిలమునందు, ఆసిష్యసి=కూర్చుందువో, తదైవ= అపుడే, సర్వే=సమస్తమైన, హరయః=వానరులు, కృతనిశ్చయాః= చేయబడిన నిశ్చయము గలవారై, త్యక్ష్యన్తి=విడువగలరు.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! నీవు ఈ బిలములో ప్రవేశించగానే ఈ వానరులందరు నిశ్చయించుకొని నిన్ను విడిచి పెట్టెదరు. 16

మూ. స్మరన్తః పుత్రదారాణాం నిత్యోద్విగ్నా బుభుక్షితాః,
ఖేదితా దుఃఖశయ్యాభిస్త్వాం కరిష్యన్తి పృష్ఠతః. 17

ప్ర. అ. పుత్రదారాణామ్=పుత్రులకు, భార్యలకు, స్మరన్తః=స్మరించుచు, నిత్యోద్విగ్నాః=ఎల్లపుడు దిగులుచెందినవారై, బుభుక్షితాః=ఆకలిగొన్నవారై, దుఃఖశయ్యాభిః=దుఃఖముతో కూడిన శయ్యలచేత, ఖేదితాః=ఖేదము పొందింపబడినవారై, త్వామ్=నిన్ను, పృష్ఠతః కరిష్యన్తి=వెనుకకు చేయగలరు.

తా. వీరందరు భార్యాపుత్రులను స్మరించుచు, నిత్యము భయపడుచు, ఆకలిగొన్నవారై, శయనముల మీద నిద్ర పోక దుఃఖపడుచు నిన్ను నిర్లక్ష్యము చేసి విడిచివేయుదురు. 17

మూ. స త్వం హీనః సుహృద్భిశ్చ హితకామైశ్చ బన్ధుభిః,
తృణాదపి భృశోద్విగ్నః స్పందమానాద్భవిష్యసి. 18

ప్ర. అ. సుహృద్భిశ్చ=స్నేహితులతోను, హితకామైః=హితమును కోరు, బన్ధుభిశ్చ=బంధువులతోను, హీనః=శూన్యుడవై, సః త్వమ్=అట్టి నీవు, స్పన్దమానాత్=కదులుచున్న, తృణాదపి=తృణమునుండి కూడ, భృశోద్విగ్నః=చాల భయపడినవాడవు, భవిష్యసి=కాగలవు.

తా. స్నేహితుడు గాని, నీ హితమును గోరు బంధువులు గాని లేక నీవు గడ్డి పరక కదలినను మిక్కిలి భయపడుచుండెదవు. 18

మూ. అత్యుగ్రవేగా నిశితా ఘోరా లక్ష్మణసాయకాః,
అపావృత్తం జిఘాంసన్తో మహావేగా దురాసదాః. 19

ప్ర. అ. లక్ష్మణసాయకాః=లక్ష్మణుని బాణములు, అత్యుగ్రవేగాః=చాల ఉగ్రమైన వేగము గలవి. నిశితాః=వాడియైనవి. ఘోరాః=భయంకరమైనవి. అపావృత్తమ్=కర్తవ్యమునుండి విముఖుడవైన నిన్ను, జిఘాంసన్తః= చంపదలచిన, మహావేగాః=గొప్పవేగము గల ఆ బాణములు, దురాసదాః=ఎదిరింప శక్యము గానివి.

తా. అతితీవ్రమైన వేగము గల, వాడియైన లక్ష్మణుని బాణములు చాల భయంకరమైనవి. నీ కర్తవ్యము నుండి విముఖుడవైన నిన్ను చంపుటకై ప్రయోగింపబడిన ఆ బాణములు ఎదిరింప శక్యము గానివి. 19

మూ. అస్మాభిస్తు గతం సార్ధం వినీతవదుపస్థితమ్,
ఆనుపూర్వ్యాత్తు సుగ్రీవో రాజ్యే త్వాం స్థాపయిష్యతి. 20

ప్ర. అ. తు=కాని, అస్మాభిః సార్ధమ్=మాతో కూడ, గతమ్=తిరిగి వెళ్లిన, వినీతవత్=వినయవంతుడవై, ఉపస్థితమ్=సమీపించిన, త్వామ్= నిన్ను,

సుగ్రీవః=సుగ్రీవుడు, రాజ్యే=రాజ్యమునందు, ఆనుపూర్వ్యాత్= క్రమమువలన, స్థాపయిష్యతి=స్థాపించగలడు.

తా. కాని నీవు మాతో కలిసి తిరిగి వెళ్లి వినయముతో సమీపించినచో, సుగ్రీవుడు నిన్ను క్రమానుసారముగా రాజ్యమునందు స్థాపించగలడు. 20

మూ. ధర్మరాజః పితృవ్యస్తే ప్రీతికామో దృఢవ్రతః,
శుచిః సత్యప్రతిజ్ఞశ్చ స త్వాం జాతు న నాశయేత్. 21

ప్ర. అ. తే=నీయొక్క, పితృవ్యః=పినతండ్రి, ధర్మరాజః=ధర్మముతో ప్రకాశించువాడు. ప్రీతికామః=ప్రేమయందు కోరిక కలవాడు. దృఢవ్రతః= దృఢమైన వ్రతము కలవాడు. శుచిః=పరిశుద్ధుడు. సత్యప్రతిజ్ఞశ్చ=సత్యమైన ప్రతిజ్ఞ గలవాడు. సః=అతడు, త్వామ్=నిన్ను, జాతు=ఎన్నడును, న నాశయేత్=నశింపచేయడు.

తా. నీ పినతండ్రి యైన సుగ్రీవుడు ధర్మముతో ప్రకాశించువాడు. ప్రేమయందు కోరిక కలవాడు. దృఢమైన నియమము కలవాడు. పరిశుద్ధుడు. సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు. ఆతడు నిన్ను ఎన్నటికి నశింపచేయడు. 21

మూ. ప్రియకామశ్చ తే మాతుస్తదర్థం చాస్య జీవితమ్,
తస్యాపత్యం చ నాస్త్యన్యత్తస్మాదఙ్గద గమ్యతామ్. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుష్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తే=నీయొక్క, మాతుః=తల్లియొక్క, ప్రియకామశ్చ= ప్రియమును కోరువాడు. అస్య=వీనియొక్క, జీవితమ్=జీవితము, తదర్థం చ=ఆమెకొరకై ఉన్నది. తస్య=వానికి, అన్యత్=మరియొక్క, అపత్యం చ=సంతానము కూడ, నాస్తి=లేదు. అఙ్గద=ఓ ! అంగదుడా ! తస్మాత్=ఆ కారణమువలన, గమ్యతామ్=వెళ్లెదవుగాక !

తా. అతడు నీ తల్లికి ప్రియము చేయవలె నను కోరిక కలవాడు. అతని జీవితము ఆమె కొరకే. అతనికి మరొక సంతానము కూడ లేదు. అంగదుడా! అందువలన మనము తిరిగి వెళ్లెదము. 22

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఏబది నాలుగవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చపఞ్చాశః సర్గః

*[అంగదాది వానరులు ప్రాయోపవేశము చేయుట.]*

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్,
స్వామిసత్కారసంయుక్తమఙ్గదో వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. హనుమతః=హనుమంతునియొక్క, ప్రశ్రితమ్=వినయముతో కూడినది, ధర్మసంహితమ్=ధర్మముతో కూడినది, స్వామిసత్కారసంయుక్తమ్=ప్రభువు గౌరవముతో కూడినది అయిన, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, అఙ్గదః=అంగదుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మసమ్మతము, ప్రభుభక్తితో కూడినది, వినయసంపన్నము అయిన, హనుమంతుని వాక్యము విని అంగదు డిట్లు పలికెను. 1

మూ. స్థైర్యమాత్మమనశ్శౌచమానృశంస్యమథార్జవమ్,
విక్రమశ్చైవ ధైర్యం చ సుగ్రీవే నోపపద్యతే. 2

ప్ర. అ. స్థైర్యమ్=స్థిరత్వము, ఆత్మమనశ్శౌచమ్=ఆత్మమనస్సుల పరిశుద్ధత్వము, ఆనృశంస్యమ్=క్రూరత్వము లేకపోవుట, అథ=మరియు, ఆర్జవమ్=ఋజుత్వము, విక్రమశ్చైవ=పరాక్రమము, ధైర్యం చ=ధైర్యము, సుగ్రీవే=సుగ్రీవునియందు, నోపపద్యతే=ఉపపన్నము కాదు.

తా. సుగ్రీవునిలో స్థైర్యము, ఆత్మమనస్సుల పరిశుద్ధత్వము, సాధుత్వము, ఋజుత్వము, పరాక్రమము, ధైర్యము ఇవి యేవియు లేవు. 2

మూ. భ్రాతుర్జ్యేష్ఠస్య యో భార్యాం జీవతో మహిషీం ప్రియామ్,
ధర్మేణ మాతరం యస్తు స్వీకరోతి జుగుప్సితః, 3
కథం స ధర్మం జానీతే యేన భ్రాత్రా దురాత్మనా,
యుద్ధాయాభినియుక్తేన బిలస్య పిహితం ముఖమ్. 4

ప్ర. అ. జుగుప్సితః=నిందితుడైన, యః=ఏ సుగ్రీవుడు, జ్యేష్ఠస్య=పెద్దవాడైన, భ్రాతుః=సోదరుడు, జీవతః= జీవించియుండగా, ధర్మేణ=ధర్మముచేత, మాతరం=తన తల్లి, భార్యామ్=ఆతని భార్యయు, ప్రియామ్=ప్రియురాలూఅయిన, మహిషీమ్=పట్టపురాణిని, స్వీకరోతి= స్వీకరించినాడో, దురాత్మనా=దుష్టబుద్ధి గల, భ్రాత్రా=సోదరుడైన, యుద్ధాయ=యుద్ధముకొరకు, అభినియుక్తేన=నియమింపబడిన, యేన= ఎవనిచేత, బిలస్య=బిలముయొక్క, ముఖమ్=ముఖము, పిహితమ్=

కప్పబడినదో, సః=అతడు, ధర్మమ్=ధర్మమును, కథమ్=ఎట్లు, జానీతే=తెలుసుకొనును.

తా. నిందితుడైన ఏ సుగ్రీవుడు అన్న జీవించి యుండగానే ధర్మానుసారముగా తనకు తల్లి వంటిది, అన్నగారి ప్రియురాలూ, భార్యా అయిన, పట్టమహిషిని స్వీకరించినాడో, ఏ దురాత్ముడు దుందుభి బయటకు వచ్చినచో వానితో యుద్ధము చేయుటకు నియమించబడినను ఆ బిలము ముఖమును కప్పివేసినాడో, ఆతడు ధర్మమును తెలిసినవాడు ఎట్లగును ? 3,4

మూ. సత్యాత్పాణిగృహీతశ్చ కృతకర్మా మహాయశాః,
విస్మృతో రాఘవో యేన స కస్య సుకృతం స్మరేత్. 5

ప్ర. అ. సత్యాత్=సత్యమువలన, పాణిగృహీతశ్చ=హస్తముచే గ్రహింపబడినవాడు, కృతకర్మా=చేయబడిన పని గలవాడు, మహాయశాః=గొప్ప కీర్తి కలవాడు అయిన, రాఘవః=రాముడు, యేన=ఎవనిచేత, విస్మృతః= మరువబడినాడో, సః=అతడు, కస్య=ఎవనియొక్క, సుకృతమ్= ఉపకారమును, స్మరేత్=స్మరించును.

తా. ఏ సుగ్రీవుడు శపథపూర్వకముగా చేతులు కలిపి, ఉపకారము చేసిన మహాకీర్తిశాలి యైన రాముని కూడ మరచినాడో అట్టివాడు ఎవరి ఉపకారమును గుర్తు ఉంచుకొనును? 5

మూ. లక్ష్మణస్య భయేనేహ నాధర్మభయభీరుణా,
ఆదిష్టా మార్గితుం సీతాం ధర్మస్తస్మిన్ కథం భవేత్. 6

ప్ర. అ. ఇహ=ఇక్కడ, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, భయేన= భయముచేతనే, సీతామ్=సీతను, మార్గితుమ్=వెదకుటకు, ఆదిష్టాః= ఆజ్ఞాపించబడితిమి. అధర్మభయభీరుణా=అధర్మభయముచేత భయపడిన ఆతనిచేత, న=కాదు. తస్మిన్=అట్టివానియందు, ధర్మః=ధర్మము, కథమ్= ఎట్లు, భవేత్=ఉండును.

తా. అతడు లక్ష్మణునికి భయపడి సీతాన్వేషణమునకై మనలను పంపినాడు కాని అధర్మభయముచేత కాదు. అట్టివానిలో ధర్మ మెట్లుండును ?6

మూ. తస్మిన్ పాపే కృతఘ్నే తు స్మృతిహీనే చలాత్మని,
ఆర్యః కో విశ్వసేజ్జాతు తత్కులీనో విశేషతః. 7

ప్ర. అ. పాపే=పాపాత్ముడు, కృతఘ్నే=కృతఘ్నుడు, స్మృతిహీనే= ఉపకారస్మరణము లేనివాడు, చలాత్మని=చంచలబుద్ధి గలవాడు అయిన, తస్మిన్= ఆతనియందు, జాతు=ఎన్నడైన, ఆర్యః=పూజ్యుడైన, కః=ఎవడు, విశ్వసేత్=విశ్వసించును. విశేషతః=విశేషించి, తత్కులీనః=ఆతని కులమునకు చెందినవాడు ఎవడు విశ్వసించును ?

తా. ఆ సుగ్రీవుడు పాపాత్ముడు, కృతఘ్నుడు, ఉపకారమును స్మరించని వాడు, చంచలమైన మనస్సు కలవాడు. అట్టి వానిని పూజ్యు డెవ్వడైన ఎన్నడైన విశ్వసించునా ? విశేషించి ఆతని వంశములో పుట్టినవాడు విశ్వసించునా ? 7

మూ. రాజ్యే పుత్రః ప్రతిష్ఠాప్యః సగుణో విగుణోఽపి వా,
కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి. 8

ప్ర. అ. సగుణః=గుణములు కలవాడైనను, విగుణోఽపి వా= గుణములు లేనివాడైనను, పుత్రః=పుత్రుడు, రాజ్యే=రాజ్యమునందు, ప్రతిష్ఠాప్యః=స్థాపించదగినవాడు. సుగ్రీవః=సుగ్రీవుడు, శత్రుకులీనమ్= శత్రుకులమునకు సంబంధించిన, మామ్=నన్ను, కథమ్=ఎట్లు, జీవయిష్యతి=జీవింపచేయగలడు ?

తా. గుణవంతు డైనను, గుణవంతుడు కాకపోయినను పుత్రుడే రాజ్యమునందు స్థాపింపదగినవాడు. అందుచేత తన పుత్రుని కాదని సుగ్రీవుడు శత్రుకులమునకు చెందిన నన్ను చంపకుండ ఉండునా ? 8

మూ. భిన్నమన్త్రోఽపరాద్ధశ్చ భిన్నశక్తిః కథం హ్యహమ్,
కిష్కిన్ధాం ప్రాప్య జీవేయమనాథ ఇవ దుర్బలః. 9

ప్ర. అ. భిన్నమన్త్రః=భేదింపబడిన ఆలోచన కలవాడను, అపరాద్ధశ్చ= అపరాధము చేసినవాడను, భిన్నశక్తిః=భేదింపబడిన శక్తి కలవాడను అయిన, అహమ్=నేను, కిష్కిన్ధామ్=కిష్కింధను, ప్రాప్య=పొంది, దుర్బలః= దుర్బలుడైన, అనాథ ఇవ=అనాథుడు వలె, కథమ్=ఎట్లు, జీవేయమ్= జీవించెదను ?

తా. నా ఆలోచనలు భగ్న మైనవి. నావలన అపరాధము జరిగినది. నా శక్తి కూడ భగ్న మైనది. అట్టి నేను కిష్కింధ చేరి దుర్బలుడైన అనాథుడు వలె ఎట్లు జీవించగలను ? 9

మూ. ఉపాంశుదణ్డేన హి మాం బన్ధనేనోపపాదయేత్,
శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్. 10

ప్ర. అ. శఠః=శఠుడు, క్రూరః=క్రూరుడు, నృశంసః=ఘాతకుడు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, రాజ్యకారణాత్=రాజ్యముకొరకై, మామ్= నన్ను, ఉపాంశుదణ్డేన=రహస్యమైన దండనముచేతను, బన్ధనేన= బంధనముచేతను, ఉపపాదయేత్=కూర్చును.

తా. శఠుడు, క్రూరుడు, ఘాతకుడు అయిన సుగ్రీవుడు రాజ్యముకొరకై నన్ను రహస్యముగా దండించి బంధించును. 10

మూ. బన్ధనాచ్చావసాదాన్మే శ్రేయః ప్రాయోపవేశనమ్,
అనుజానన్తు మాం సర్వే గృహం గచ్ఛన్తు వానరాః. 11

ప్ర. అ. బన్ధనాత్=బంధనముకంటెను, అవసాదాత్=దుఃఖముకంటెను, మే=నాకు, ప్రాయోపవేశనమ్=ప్రాయోపవేశము, శ్రేయః=మంచిది. సర్వే=సమస్త మైన, వానరాః=వానరులు, మామ్=నన్ను, అనుజానన్తు=అనుమతించెదరుగాక ! గృహమ్=గృహమునుగూర్చి, గచ్ఛన్తు=వెళ్లెదరు గాక !

తా. బంధింపబడి దుఃఖమును అనుభవించుట కంటె నాకు ప్రాయోపవేశమే మంచిది. మీరందరు నాకు అనుమతి ఇవ్వండి. ఇంటికి తిరిగి వెళ్లండి. 11

మూ. అహం వః ప్రతిజానామి న గమిష్యామ్యహం పురీమ్,
ఇహైవ ప్రాయమాసిష్యే శ్రేయో మరణమేవ మే. 12

ప్ర. అ. అహమ్=నేను, వః=మీకు, ప్రతిజానామి=ప్రతిజ్ఞ చేయుచు న్నాను. అహమ్=నేను, పురీమ్=పట్టణమును గూర్చి, న గమిష్యామి=వెళ్లను. ఇహైవ=ఇక్కడనే, ప్రాయమ్ ఆసిష్యే= ప్రాయోపవేశము చేసెదను. మే=నాకు, మరణమేవ=మరణమే, శ్రేయః= మంచిది.

తా. నేను మీకు ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. నేను కిష్కింధకు రాను. ఇక్కడనే ప్రాయోపవేశము చేసెదను. నాకు మరణమే మంచిది. 12

మూ. అభివాదనపూర్వం తు రాఘవౌ బలశాలినౌ,
అభివాదనపూర్వం తు రాజా కుశలమేవ చ. 13
వాచ్యస్తాతో యవీయాన్మే సుగ్రీవో వానరేశ్వరః.

ప్ర. అ. బలశాలినౌ=బలముతో ప్రకాశించుచున్న, రాఘవౌ=రామలక్ష్మణులు, అభివాదనపూర్వమ్=నమస్కారపూర్వకముగా, (కుశలము అడుగదగినవారు). వానరే శ్వరః=వానరప్రభువు, మే=నాయొక్క, యవీయాన్ తాతః=పినతండ్రి, రాజా=రాజు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, అభివాదనపూర్వమ్= నమస్కారపూర్వకముగా, కుశ లమ్=క్షేమమును, వాచ్యః=చెప్పదగినవాడు.

తా. బలవంతులైన రామలక్ష్మణులకు, నా పినతండ్రి వానరరాజు అయిన సుగ్రీవునకు నమస్కారపూర్వకముగా నేను కుశలమడిగితి నని చెప్పవలెను. 13

మూ. ఆరోగ్యపూర్వం కుశలం వాచ్యా మాతా రుమా చ మే. 14
మాతరం చైవ మే తారామాశ్వాసయితుమర్హథ.

ప్ర. అ. మే=నాయొక్క, మాతా=తల్లియైన, రుమా చ=రుమకూడ, ఆరోగ్యపూర్వమ్=ఆరోగ్యపూర్వకముగా, కుశలమ్=కుశలమును, వాచ్యా= చెప్పదగి నది. మే=నాయొక్క, మాతరమ్=తల్లియైన, తారామ్=తారను, ఆశ్వాసయితుం చైవ=ఓదార్చుటకు, అర్హథ=తగి యున్నారు.

తా. నా తల్లియైన రుమకు ఆరోగ్యపూర్వకముగా కుశల మడిగితి నని

చెప్పవలెను. నా తల్లియైన తారను మీరు ఓదార్చవలెను. 14

మూ. ప్రకృత్యా ప్రియపుత్రా సా సానుక్రోశా తపస్వినీ, 15
వినష్టమిహ మాం శ్రుత్వా వ్యక్తం హాస్యతి జీవితమ్.

ప్ర. అ. ప్రకృత్యా=స్వభావముచేత, సానుక్రోశా=దయతో కూడినది, ప్రియపుత్రా=ప్రియమైన పుత్రుడు కలది, తపస్వినీ=దీనురాలు అయిన, సా= ఆ నా తల్లి, ఇహ=ఇక్కడ, మామ్=నన్ను, వినష్టమ్=మరణించిన వానినిగా, శ్రుత్వా=విని, వ్యక్తమ్=తప్పక, జీవితమ్=జీవితమును, హాస్యతి=విడువగలదు.

తా. నా తల్లి స్వభావముచేతనే జాలికలది. పుత్రప్రేమ గలది. దీనురాలైన ఆమె, నేను ఇక్కడ మరణించినట్లు విని తప్పక ప్రాణములు విడుచును. 15

మూ. ఏతావదుక్త్వా వచనం వృద్ధాంస్తానభివాద్య చ, 16
వివేశ చాఙ్గదో భూమౌ రుదన్దర్భేషు దుర్ముఖః.

ప్ర. అ. ఏతావత్=ఇంత, వచనమ్=వచనమును, ఉక్త్వా=పలికి, తాన్=ఆ, వృద్ధాన్=వృద్ధులను, అభివాద్య చ=నమస్కరించి, అఙ్గదః= అంగదుడు, రుదన్=ఏడ్చుచు, దుర్ముఖః=కాంతి విహీనమైన ముఖము కలవాడై, భూమౌ=నేలమీద, దర్భేషు=దర్భలపై, వివేశ=శయనించెను.

తా. అంగదుడు ఈ మాటలను పలికి వృద్ధులకు నమస్కరించి ఏడ్చుచు దుఃఖముచే కాంతివిహీనమైన ముఖముతో భూమిపై దర్భలు పరచుకొని శయనించెను. 16

మూ. తస్య సంవిశతస్తత్ర రుదన్తో వానరర్షభాః, 17
నయనేభ్యః ప్రముముచురుష్ణం వై వారి దుఃఖితాః.

ప్ర. అ. తస్య=అతడు, తత్ర=అక్కడ, సంవిశతః=శయనించుచుండగా, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, దుఃఖితాః=దుఃఖితులై, రుదన్తః= ఏడ్చుచున్నవారై, నయనేభ్యః=నేత్రములనుండి, ఉష్ణమ్=వేడియైన, వారి= ఉదకమును, ప్రముముచుః=విడచిరి.

తా. అంగదుడు అక్కడ శయనించుట చూచి వానరశ్రేష్ఠులు దుఃఖితులై ఏడ్చుచు నేత్రములనుండి వెచ్చని కన్నీళ్లు కార్చిరి. 17

మూ. సుగ్రీవం చైవ నిన్దన్తః ప్రశంసన్తశ్చ వాలినమ్, 18
పరివార్యాఙ్గదం సర్వే వ్యవస్యన్ ప్రాయమాసితుమ్.

ప్ర. అ. సర్వే=అందరు, సుగ్రీవమ్=సుగ్రీవుని, నిన్దన్తః= నిందించుచు, వాలినమ్=వాలిని, ప్రశంసన్తశ్చ=పొగడుచు, అఙ్గదమ్= అంగదుని, పరివార్య=చుట్టి, ప్రాయమ్ ఆసితుమ్=ప్రాయోపవేశము చేయుటకు, వ్యవస్యన్=నిశ్చయించిరి.

తా. ఆ వానరు లందరు అంగదుని చుట్టూ చేరి సుగ్రీవుని నిందించుచు వాలిని పొగడుచు ప్రాయోపవేశము చేయుటకు నిశ్చయించిరి. 18

మూ. తద్వాక్యం వాలిపుత్రస్య విజ్ఞాయ ప్లవగర్షభాః, 19
ఉపస్పృశ్యోదకం సర్వే ప్రాఙ్ముఖాః సముపావిశన్.
దక్షిణాగ్రేషు దర్భేషు ఉదక్తీరం సమాశ్రితాః, 20
ముమూర్షవో హరిశ్రేష్ఠా ఏతత్క్షమమితి స్మ హ.

ప్ర. అ. వాలిపుత్రస్య=అంగదునియొక్క, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, విజ్ఞాయ=తెలుసుకొని, ప్లవగర్షభాః=వానరులలో ఉత్తములైన, సర్వే= సమస్తమైన, హరిశ్రేష్ఠాః=వానరనాయకులు, ఏతత్=ఇదియే, క్షమమ్ ఇతి= తగినది అని, తలచి, ముమూర్షవః=మరణింప నిచ్ఛ గలవారై, ఉదకమ్= ఉదకమును, ఉపస్పృశ్య=ఆచమనముచేసి, ఉదక్తీరమ్=ఉత్తరతీరమును, సమాశ్రితాః=ఆశ్రయించిన వారై, ప్రాఙ్ముఖాః=తూర్పు దిక్కునకు అభిముఖులై, దక్షిణాగ్రేషు=దక్షిణమునకు అగ్రభాగములు గల, దర్భేషు= దర్భలమీద, సముపావిశన్=కూర్చుండిరి.

తా. వానరులలో ఉత్తములైన ఆ వానరనాయకు లందరు అంగదుని మాటలు విని ఇదే తగిన దని నిశ్చయించుకొని, మరణించ వలె నను కోరికతో సముద్రము ఉత్తరతీరమునందు దర్భలను దక్షిణాగ్రముగా పరచుకొని ఆచమనము చేసి తూర్పు దిక్కునకు అభిముఖులై కూర్చుండిరి. 19,20

మూ. రామస్య వనవాసం చ క్షయం దశరథస్య చ, 21
జనస్థానవధం చైవ వధం చైవ జటాయుషః,
హరణం చైవ వైదేహ్యా వాలినశ్చ వధం తథా, 22
రామకోపం చ వదతాం హరీణాం భయమాగతమ్.

ప్ర. అ. రామస్య=రామునియొక్క, వనవాసం చ=వనవాసమును, దశరథస్య=దశరథునియొక్క, క్షయం చ=మరణమును, జనస్థానవధం చైవ=జనస్థానమునందు వధను, జటాయుషః=జటాయువుయొక్క, వధం చైవ=వధను, వైదేహ్యాః=సీతయొక్క, హరణం చైవ=హరణమును, తథా=మరియు, వాలినః=వాలియొక్క, వధం చ=వధను, రామకోపం చ=రామునియొక్క కోపమును గూర్చి, వదతామ్=చెప్పుకొనుచున్న, హరీణామ్=వానరులకు, భయమ్=భయము, ఆగతమ్=వచ్చినది.

తా. రాముని వనవాసము, దశరథుని మరణము, జనస్థానములో రాముడు చేసిన రాక్షసవధము, జటాయుమరణము, సీతాపహరణము, వాలిసంహారము, రాముని కోపము - వీటిని గూర్చి మాటలాడుకొనుచు ఆ వానరులు చాల, భయముతో నుండిరి. 21,22

మూ. స సంవిశద్భిర్బహుభిర్మహీధరో మహాద్రికూటప్రతిమైః ప్లవఙ్గమైః,
బభూవ సన్నాదితనిర్ఝరాన్తరో భృశం నదద్భిర్జలదైరివామ్బరమ్. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సంవిశద్భిః=శయనించుచున్న, మహాద్రికూటప్రతిమైః=పెద్ద పర్వతశిఖరములతో సమానములైన, బహుభిః=అనేకులైన, ప్లవఙ్గమైః=వానరులచేత, భృశమ్=మిక్కిలి, సన్నాదితనిర్ఝరాన్తరః=ధ్వనింపచేయబడిన గుహల మధ్య భాగములు గల, సః=ఆ, మహీధరః=పర్వతము, నదద్భిః=ఉరుముచున్న, జలదైః=మేఘములతో కూడిన, అమ్బరమ్ ఇవ=ఆకాశము వలె, బభూవ= ఉండెను.

తా. పెద్ద పర్వతశిఖరముల వంటి అనేకులైన ఆ వానరులు శయనిం చుచుండగా వారి ధ్వనితో గుహలు నిండుటచే ఆ పర్వతము ఉరుముతున్న మేఘములతో కూడిన ఆకాశమువలె ఉండెను. 23

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఏబదిఐదవ సర్గ సమాప్తము.

# అథ షట్పఞ్చాశః సర్గః

[సంపాతిని చూచి వానరులు భయపడుట; జటాయువు మరణించినట్లు వానరులనుండి విని సంపాతి దుఃఖించుట. తనను క్రిందికి దింపు డని అతడు వానరులను ప్రార్థించుట.]

మూ. ఉపవిష్టాస్తు తే సర్వే యస్మిన్ ప్రాయం గిరిస్థలే,
హరయో గృధ్రరాజశ్చ తం దేశముపచక్రమే. 1
సంపాతిర్నామ నామ్నా తు చిరజీవీ విహఙ్గమః,
భ్రాతా జటాయుషః శ్రీమాన్విఖ్యాతబలపౌరుషః. 2

ప్ర. అ. తే=ఆ, సర్వే=సమస్తమైన, హరయః=వానరులు, యస్మిన్=ఏ, గిరిస్థలే=పర్వతప్రదేశమునందు, ప్రాయమ్ ఉపవిష్టాః= ప్రాయోపవేశము చేసినారో, తం దేశమ్= ఆ దేశమును గూర్చి, గృధ్రరాజః= గృధ్రములయొక్క రాజు, నామ్నా= పేరుచేత, సమ్పాతిర్నామ=సంపాతి అను ప్రసిద్ధి కలవాడు, జటాయుషః=జటాయువుయొక్క, భ్రాతా=సోదరుడు, శ్రీమాన్=శోభ కలవాడు, విఖ్యాతబలపౌరుషః=ప్రసిద్ధమైన బలము పౌరుషము కలవాడు అయిన, విహఙ్గమః=పక్షి, ఉపచక్రమే=సమీపించెను.

తా. జటాయువు సోదరుడు, చిరంజీవి, ప్రసిద్ధమైన బలపౌరుషములు గలవాడు, శ్రీమంతుడు అయిన సంపాతి అను గృధ్రరాజు ఆ వానరు లందరు ప్రాయోపవేశము చేయుచున్న ప్రదేశమునకు వచ్చెను. 1,2

మూ. కన్దరాదభినిష్క్రమ్య స విన్ధ్యస్య మహాగిరేః,
ఉపవిష్టాన్ హరీన్ దృష్ట్వా హృష్టాత్మా గిరమబ్రవీత్. 3

ప్ర. అ. సః=అతడు, మహాగిరేః=మహాపర్వతమైన, విన్ధ్యస్య= విన్ధ్యముయొక్క, కన్దరాత్=గుహనుండి, అభినిష్క్రమ్య=బయటకు వచ్చి, ఉపవిష్టాన్=కూర్చొనియున్న, హరీన్=వానరులను, దృష్ట్వా=చూచి, హృష్టాత్మా=సంతోషించుచున్న మనస్సు కలవాడై గిరమ్=వాక్కును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ సంపాతి విధ్యపర్వతగుహనుండి బయటకు వచ్చి అక్కడ ప్రాయోపవిష్టులైన వానరులను చూచి సంతోషించుచు ఇట్లు పలికెను. 3

మూ. విధిః కిల నరం లోకే విధానేనానువర్తతే,
యథాఽయం విహితో భక్ష్యశ్చిరాన్మహ్యాముపాగతః. 4

ప్ర. అ. లోకే=లోకమునందు, విధిః=దైవము, విధానేన=కర్మచేత,

నరమ్=ప్రాణిని, అనువర్తతే కిల=అనువర్తించుచుండును గదా ! యథా= ఎందుచేత ననగా, చిరాత్=చిరకాలమునకు, మహ్యమ్=నాకొరకై, విహితః= ఏర్పరచబడిన, అయమ్=ఈ, భక్ష్యః=ఆహారము, ఉపాగతః=వచ్చినది.

తా. "లోకములో దైవము ప్రతిప్రాణికి పూర్వకర్మానుసారముగా ఫలములు ఇచ్చుచుండును. ఎందుచేత ననగా ఇంత కాలమునకు ఈ ఆహారము నాకొరకై లభించినది." 4

మూ. పరమ్పరాణాం భక్షిష్యే వానరాణాం మృతం మృతమ్,
ఉవాచైతద్వచః పక్షీ తాన్నిరీక్ష్య ప్లవఙ్గమాన్. 5

ప్ర. అ. వానరాణామ్=వానరులయొక్క, పరమ్పరాణామ్=పంక్తులలో, మృతం మృతమ్=ఎవ డెవడు మరణించెనో వానిని, భక్షిష్యే=భక్షించెదను. తాన్= ఆ, ప్లవఙ్గమాన్=వానరులను, నిరీక్ష్య=చూచి, పక్షీ=పక్షి, ఏతత్= ఈ, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. "వానరుల ఈ పంక్తులలో ఎవ డెవడు మరణించునో వానిని భక్షించెదను". ఆ వానరులను చూచిన పక్షి పై విధముగా పలికెను. 5

మూ. తస్య తద్వచనం శ్రుత్వా భక్ష్యలుబ్ధస్య పక్షిణః,
అఙ్గదః పరమాయస్తో హనూమన్తమథాబ్రవీత్. 6

ప్ర. అ. భక్ష్యలుబ్ధస్య=ఆహారమునందు ఆసక్తి గల, తస్య పక్షిణః=ఆ పక్షియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, అథ= అటుపిమ్మట, అఙ్గదః=అంగదుడు, పరమాయస్తః=మిక్కిలి దుఃఖించుచు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆహారమునం దాసక్తి గల ఆ పక్షి మాటలు విని అంగదుడు చాల దుఃఖించుచు హనుమంతునితో ఇట్లు పలికెను. 6

మూ. పశ్య గృధ్రాపదేశేన సాక్షాద్వైవస్వతో యమః,
ఇమం దేశమనుప్రాప్తో వానరాణాం విపత్తయే. 7

ప్ర. అ. గృధ్రాపదేశేన= ఈ గృధ్ర మనే మిషచేత, వైవస్వతః=సూర్యుని కుమారుడైన, యమః=యముడు, సాక్షాత్=సాక్షాత్తు, వానరాణామ్= వానరుల యొక్క, విపత్తయే=ఆపదకొరకు, ఇమం దేశమ్=ఈ ప్రదేశమును గూర్చి, అనుప్రాప్తః=వచ్చినాడు, పశ్య=చూడుము.

తా. సాక్షాత్తు యముడు ఈ గృధ్రమనే వంకతో వానరులను చంపుటకై ఇక్కడకు వచ్చినాడు, చూడుము. 7

మూ. రామస్య న కృతం కార్యం న కృతం రాజశాసనమ్,
హరీణామియమజ్ఞాతా విపత్తిః సహసాగతా. 8

ప్ర. అ. రామస్య=రామునియొక్క, కార్యమ్=కార్యము, న కృతమ్=చేయబడలేదు. రాజశాసనమ్=రాజాజ్ఞ, న కృతమ్=చేయబడలేదు. హరీణామ్=వానరులకు, ఇయమ్=ఈ, అజ్ఞాతా=తెలియబడని, విపత్తిః=ఆపద, సహసా=హఠాత్తుగా, ఆగతా=వచ్చినది.

తా. మనము రాముని కార్యము సాధించలేకపోతిమి. రాజాజ్ఞను చేయలేకపోతిమి. మనకు ఈ ఆపద తెలియకుండగా హఠాత్తుగా వచ్చి పడినది.

మూ. వైదేహ్యాః ప్రియకామేన కృతం కర్మ జటాయుషా,
గృధ్రరాజేన యత్తత్ర శ్రుతం వస్తదశేషతః. 9

ప్ర. అ. వైదేహ్యాః=సీతకు, ప్రియకామేన=ప్రియమునందు కోరిక గల, గృధ్రరాజేన=గృధ్రరాజైన, జటాయుషా=జటాయువుచేత, తత్ర=అక్కడ, యత్ కర్మ=ఏ పని, కృతమ్=చేయబడినదో, తత్=అది, అశేషతః= పూర్తిగా, వః=మీకు, శ్రుతమ్=వినబడినది.

తా. సీతకు ప్రియమును చేయ గోరిన గృధ్రరాజైన జటాయువు అక్కడ ఏ పని చేసెనో అది మీకు పూర్తిగా తెలియును. 9

మూ. తథా సర్వాణి భూతాని తిర్యగ్యోనిగతాన్యపి,
ప్రియం కుర్వన్తి రామస్య త్యక్త్వా ప్రాణాన్ యథా వయమ్. 10

ప్ర. అ. తథా=మరియు, తిర్యగ్యోనిగతాన్యపి=తిర్యగ్యోనులకు చెందినవి అయినను, సర్వాణి=సమస్తమైన, భూతాని=భూతములు, ప్రాణాన్= ప్రాణములను, త్యక్త్వా=విడచి, వయం యథా=మనము వలెనే, రామస్య= రామునకు, ప్రియమ్=ప్రియమును, కుర్వన్తి=చేయుచున్నవి.

తా. సమస్తమైన తిర్యగ్జంతువులు కూడ ప్రాణములను కూడ విడచి మనవలెనే రామునకు ప్రియమును చేయుచున్నవి. 10

మూ. అన్యోఽన్యముపకుర్వన్తి స్నేహకారుణ్యయన్త్రితాః,
తతస్తస్యోపకారార్థం త్యజతాత్మానమాత్మనా. 11

ప్ర. అ. స్నేహకారుణ్యయన్త్రితాః=స్నేహముచేతను, కారుణ్యముచేతను, నియంత్రితములై, అన్యోన్యమ్=పరస్పరము, ఉపకుర్వన్తి=ఉపకారము చేసుకొనుచున్నవి. తతః=ఆ కారణమువలన, తస్య=ఆ రాముని యొక్క, ఉపకారార్థమ్=ఉపకారముకొరకై, ఆత్మానమ్=తనను, ఆత్మనా= స్వయముగా, త్యజత=విడవండి.

తా. తిర్యగ్జంతువులు స్నేహముతోను, కారుణ్యముతోను నిండినవై

పరస్పరము ఉపకారము చేసుకొనుచున్నవి. అందుచే ఆ రాముని ఉపకారముకొరకై మీ ప్రాణములను స్వయముగా త్యజించుడు. 11

మూ. ప్రియం కృతం హి రామస్య ధర్మజ్ఞేన జటాయుషా,
రాఘవార్థే పరిశ్రాన్తా వయం సంత్యక్తజీవితాః, 12
కాన్తారాణి ప్రపన్నాః స్మ న చ పశ్యామ మైథిలీమ్.

ప్ర. అ. ధర్మజ్ఞేన =ధర్మమును తెలిసిన, జటాయుషా=జటాయువుచేత, రామస్య=రామునకు, ప్రియమ్=ప్రియము, కృతం హి=చేయబడినది కదా! వయమ్=మనము, రాఘవార్థే=రామునికొరకై, పరిశ్రాన్తాః=అలసినవారమై, సంత్యక్తజీవితాః=విడువబడిన జీవితము కలవారమై, కాన్తారాణి=అరణ్యములను, ప్రపన్నాః=పొందినవారము, స్మ=అయితిమి. మైథిలీమ్=సీతను, న చ పశ్యామ=చూడజాలమైతిమి.

తా. ధర్మమును ఎరిగిన జటాయువు రామునకు ప్రియము చేసినాడు. మనము ప్రాణములకు కూడ తెగించి రామునికొరకు శ్రమపడి అరణ్యమును చేరితిమి; కాని సీత కనబడలేదు. 12

మూ. స సుఖీ గృధ్రరాజస్తు రావణేన హతో రణే, 13
ముక్తశ్చ సుగ్రీవభయాద్గతశ్చ పరమాం గతిమ్.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, రావణేన=రావణునిచేత, హతః=చంపబడిన, సః=ఆ, గృధ్రరాజస్తు=జటాయువు అయితే, సుఖీ= సుఖవంతుడు. సుగ్రీవభయాత్=సుగ్రీవ భయమునుండి, ముక్తశ్చ= విడువబడినవాడు, పరమామ్=ఉత్తమమైన, గతిమ్=గతిని, గతశ్చ= పొందినాడు.

తా. యుద్ధములో రావణునిచేత చంపబడిన ఆ జటాయువు చాల అదృష్టవంతుడు. అతనికి సుగ్రీవునివలన భయము లేదు. ఉత్తమగతిని కూడ పొందినాడు. 13

మూ. జటాయుషో వినాశేన రాజ్ఞో దశరథస్య చ, 14
హరణేన చ వైదేహ్యాః సంశయం హరయో గతాః.

ప్ర. అ. జటాయుషః=జటాయువుయొక్క, వినాశేన=మరణముచేతను, రాజ్ఞః=రాజైన, దశరథస్య చ=దశరథుని మరణముచేతను, వైదేహ్యాః= సీతయొక్క, హరణేన చ=హరణముచేతను, హరయః=వానరులు, సంశయం గతాః=సంశయమును పొందినారు.

తా. జటాయువు, దశరథమహారాజు మరణించుటచేతను, సీతాహరణము చేతను, ఇపుడు వానరులు సంశయస్థితిలో ఉన్నారు. 14

మూ. రామలక్ష్మణయోర్వాసశ్చారణ్యే సహ సీతయా, 15
రాఘవస్య చ బాణేన వాలినశ్చ తథా వధః,
రామకోపాదశేషాణాం రక్షసాం చ తథా వధః, 16
కైకేయ్యా వరదానేన ఇదం చ వికృతం కృతమ్.

ప్ర. అ. కైకేయ్యాః= కైకేయికి, వరదానేన=వరదానముచేత, సీతయా సహ= సీతతో కూడ, అరణ్యే=అరణ్యమునందు, రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, వాసః=నివాసము, తథా=మరియు, రాఘవస్య=రామునియొక్క, బాణేన=బాణముచేత, వాలినః=వాలియొక్క, వధశ్చ=వధయు, తథా= మరియు, రామకోపాత్=రాముని కోపమువలన, అశేషాణామ్=సమస్తమైన, రక్షసామ్=రాక్షసుల యొక్క, వధశ్చ=వధయు, ఇదమ్=ఈ, వికృతం చ= వికారము, కృతమ్=చేయబడినది.

తా. సీతతో కూడ రామలక్ష్మణులు అరణ్యములో నివసించుట, రాముని బాణముచేత వాలి వధ, రాముని కోపమువలన జనస్థానములోని సమస్తరాక్షసుల సంహారము, మనకు ఇపుడు వచ్చిపడిన ఈ మరణము, ఇవన్నీ కైకేయికి దశరథుడు వరమును ఇచ్చుట చేత కలిగినవి. 15,16

మూ. తదసుఖమనుకీర్తితం వచో
భువి పతితాంశ్చ నిరీక్ష్య వానరాన్,
భృశచకితమతిర్మహామతిః
కృపణముదాహృతవాన్ స గృధ్రరాజః. 17

ప్ర. అ. అనుకీర్తితమ్=పలుకబడిన, అసుఖమ్=సుఖకరము కాని, తత్= వచః=ఆ వచనమును (విని), భువి=నేలపై, పతితాన్=పడిన, వానరాన్=వానరులను, నిరీక్ష్య=చూచి, మహామతిః=గొప్ప బుద్ధి గల, సః=ఆ, గృధ్రరాజః=గృధ్రరాజైన సంపాతి, భృశచకితమతిః=మిక్కిలి భయపడిన బుద్ధి గలవాడై, కృపణమ్=దీనముగా, ఉదాహృతవాన్=పలికెను.

తా. నేలపై పడి ఉన్న ఆ వానరులను చూచి, వారు పలికిన విషాదకరములైన మాటలు విని, గొప్ప బుద్ధి గల ఆ సంపాతి చాల భయపడిన మనస్సుతో దీనముగా ఇట్లు పలికెను. 17

మూ. తత్తు శ్రుత్వా తథా వాక్యమఙ్గదస్య ముఖోద్గతమ్,
అబ్రవీద్వచనం గృధ్రస్తీక్ష్ణతుణ్డో మహాస్వనః. 18

ప్ర. అ. తీక్ష్ణతుణ్డః=తీక్ష్ణమైన ముట్టె గల, మహాస్వనః=గొప్ప ధ్వని గల, గృధ్రః=సంపాతి, తథా=అట్లు, అఙ్గదస్య=అంగదునియొక్క, ముఖోద్గతమ్=ముఖమునుండి బయలుదేరిన, తత్ వాక్యమ్=ఆ వాక్యము, శ్రుత్వా=విని, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. తీక్ష్ణమైన ముట్టీ గొప్ప ధ్వనీ గల ఆ సంపాతి, ఆ విధముగా అంగదుడు పలికిన మాటలు విని ఇట్లు పలికెను. 18

మూ. కోఽయం గిరా ఘోషయతి ప్రాణైః ప్రియతరస్య మే,
జటాయుషో వధం భ్రాతుః కమ్పయన్నివ మే మనః. 19

ప్ర. అ. మే=నాకు, పాణైః=ప్రాణములతో, (కంటె), ప్రియతరస్య= మిక్కిలి ఇష్టుడైన, భ్రాతుః=సోదరుడైన, జటాయుషః=జటాయువుయొక్క, వధమ్=వధను గూర్చి, మే=నాయొక్క, మనః=మనస్సును, కమ్పయన్నివ=కంపింపచేయుచున్న వాడు వలె, గిరా=వాక్కుతో, ఘోషయతి= ఘోషించుచున్నాడు; అయమ్=ఇతడు, కః=ఎవడు ?

తా. నా మనస్సు కంపించునట్లు, నా ప్రాణముల కంటె అధికముగా ఇష్టుడైన నా సోదరుడైన జటాయువు మరణమును గూర్చి చెప్పుచున్నవాడు, ఇత డెవడు ? 19

మూ. కథమాసీజ్జనస్థానే యుద్ధం రాక్షసగృధ్రయోః,
నామధేయమిదం భ్రాతుశ్చిరస్యాద్య మయా శ్రుతమ్. 20

ప్ర. అ. జనస్థానే=జనస్థానమునందు, రాక్షసగృధ్రయోః=రాక్షసునకు, జటాయువునకు, యుద్ధమ్=యుద్ధము, కథమ్=ఎట్లు, ఆసీత్=ఆయెను ? భ్రాతుః=సోదరునియొక్క, ఇదం నామధేయమ్=ఈ పేరు, మయా=నాచేత, అద్య=నేడు, చిరస్య=చిరకాలమునకు, శ్రుతమ్=వినబడినది.

తా. జనస్థానములో రాక్షసునకు, జటాయువునకు యుద్ధము ఎట్లు జరిగినది ? నా సోదరుని పేరు నేను చాల కాలమునకు ఈ రోజు వినుచున్నాను. 20

మూ. ఇచ్ఛేయం గిరిదుర్గాచ్చ భవద్భిరవతారితుమ్,
యవీయసో గుణజ్ఞస్య శ్లాఘనీయస్య విక్రమైః. 21
అతిదీర్ఘస్య కాలస్య పరితుష్టోఽస్మి కీర్తనాత్.

ప్ర.అ. గిరిదుర్గాత్=ఈ పర్వతదుర్గమునుండి, భవద్భిః=మీచేత, అవతారితుమ్=దింపుటకు, ఇచ్ఛేయమ్=కోరుదును. గుణజ్ఞస్య= గుణములను ఎరిగినవాడు, విక్రమైః=పరాక్రమములచేత, శ్లాఘనీయస్య= శ్లాఘింపదగినవాడు అయిన, యవీయసః=నా తమ్మునియొక్క, అతిదీర్ఘస్య=చాల దీర్ఘమైన, కాలస్య=కాలమునకు, కీర్తనాత్=కీర్తించుటవలన, పరితుష్టః అస్మి=సంతోషించినాను.

తా. మీరు నన్ను ఈ పర్వతదుర్గమునుండి క్రిందకు దింపవలె నని కోరుచున్నాను. చాల కాలము తరువాత, గుణములు తెలిసినవాడు, పరాక్రమములచేత శ్లాఘింపదగినవాడు అయిన నా తమ్ముని గూర్చి మీరు

మాట్లాడుటచేత సంతోషించుచున్నాను. 21

మూ. తదిచ్ఛేయమహం శ్రోతుం వినాశం వానరర్షభాః, 22
భ్రాతుర్జటాయుషస్తస్య జనస్థాననివాసినః.

ప్ర.అ. వానరర్షభాః=ఓ ! వానరశ్రేష్ఠులారా ! తత్=ఆకారణమువలన, అహమ్=నేను, జనస్థాననివాసినః=జనస్థానమునందు నివసించుచున్న, భ్రాతుః=సోదరుడైన, తస్య=ఆ, జటాయుషః=జటాయువుయొక్క, వినాశమ్=మరణమును గూర్చి, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛేయమ్= ఇచ్ఛయింతును.

తా. వానరశ్రేష్ఠులారా ! జనస్థానమునందు నివసించిన నా సోదరుడైన ఆ జటాయువు ఎట్లు మరణించినాడో వినుటకు కోరుచున్నాను. 22

మూ. తస్యైవ చ మమ భ్రాతుః సఖా దశరథః కథమ్, 23
యస్య రామః ప్రియః పుత్రో జ్యేష్ఠో గురుజనప్రియః.

ప్ర. అ. గురుజనప్రియః=గురుజనుల ఇష్టుడైన, రామః =రాముడు, యస్య=ఎవనియొక్క, ప్రియః=ప్రియుడైన, జ్యేష్ఠః పుత్రః=జ్యేష్ఠపుత్రుడో, అట్టి, మమ భ్రాతుః=నా సోదరుడైన, తస్యైవ=ఆ జటాయువుయొక్క, సఖా= స్నేహితుడైన, దశరథః=దశరథుడు, కథమ్=వీట్లు మరణించినాడు ?

తా. గురుజనులకు ఇష్టుడైన రాముడు, ఏ దశరథునకు ప్రియుడైన జ్యేష్ఠపుత్రుడో నా సోదరుని మిత్రుడైన ఆ దశరథుడు ఎట్లు మరణించినాడు?23

మూ. సూర్యాంశుదగ్ధపక్షత్వాన్న శక్నోమి విసర్పితుమ్, 24
ఇచ్ఛేయం పర్వతాదస్మాదవతర్తుం మరిన్దమాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. అరిన్దమాః=శత్రువులను పీడించు ఓ వానరులారా ! సూర్యాంశుదగ్ధపక్షత్వాత్=సూర్యకిరణములచేత కాల్చివేయబడిన రెక్కలు గలవాడనగుటవలన, విసర్పితుమ్=చలించుటకు, న శక్నోమి=సమర్థుడను కాను. అస్మాత్=ఈ, పర్వతాత్=పర్వతమునుండి, అవతర్తుమ్=దిగుటకు, ఇచ్ఛేయమ్=కోరుదును.

తా. ఓ ! శత్రుసంహారకులారా ! సూర్యకిరణములచే నా రెక్కలు కాలిపోవుటచేత, నేను కదలజాలను. ఈ పర్వతమునుండి క్రిందకు దింపవలె నని కోరుచున్నాను. 24

*"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఏబదిఆరవ సర్గ సమాప్తము.*

# అథ సప్తపఞ్చాశః సర్గః

*[అంగదుడు సంపాతిని పర్వతమునుండి క్రిందికి దింపి రాముని వనప్రవేశము మొదలు తమ ప్రాయోపవేశము వరకు జరిగిన వృత్తాంతమును తెలుపుట.]*

మూ. శోకాద్భ్రష్టస్వరమపి శ్రుత్వా వానరయూథపాః,
శ్రద్దధుర్నైవ తద్వాక్యం కర్మణా తస్య శఙ్కితాః. 1

ప్ర. అ. వానరయూథపాః=వానరసేనానాయకులు, శోకాత్=శోకమువలన, భ్రష్టస్వరమపి=భ్రష్టమైన స్వరము కలదైనను, తద్వాక్యమ్=ఆతని వాక్యమును, శ్రుత్వా=విని, తస్య=వానియొక్క, కర్మణా=కర్మచేత, శఙ్కితాః= శంకించినవారై, నైవ శ్రద్దధుః=నమ్మలేదు.

తా. వానరసేనానాయకులు, ఆతని కంఠధ్వని శోకము వలన కలుషమై యున్నను ఆతడు ఏమి చేయునో అని శంకించుచు నమ్మలేదు. 1

మూ. తే ప్రాయముపవిష్టాస్తు దృష్ట్వా గృధ్రం ప్లవఙ్గమాః,
చక్రుర్బుద్ధిం తదా రౌద్రాం సర్వాన్నో భక్షయిష్యతి. 2

ప్ర. అ. ప్రాయమ్ ఉపవిష్టాః=ప్రాయోపవేశము చేసిన, తే ప్లవఙ్గమాః=ఆ వానరులు, గృధ్రమ్=సంపాతిని, దృష్ట్వా=చూచి, తదా=అపుడు, నః= మనలను, సర్వాన్=అందరిని, భక్షయిష్యతి=భక్షించగలడు అని, రౌద్రామ్= భయంకరమైన, బుద్ధిమ్=బుద్ధిని, చక్రుః=చేసిరి.

తా. అపుడు ప్రాయోపవేశము చేయుచున్న వానరులు సంపాతిని చూచి, ఇతడు మనలను అందరిని భక్షించగలడు అని భయంకరమైన ఆలోచన చేసిరి.2

మూ. సర్వథా ప్రాయమాసీనాన్యది నో భక్షయిష్యతి,
కృతకృత్యా భవిష్యామః క్షిప్రం సిద్ధిమితో గతాః. 3

ప్ర. అ. ప్రాయమ్ ఆసీనాన్=ప్రాయోపవేశము చేయుచున్న, నః=మనలను, భక్షయిష్యతి యది=భక్షించినట్లైతే, ఇతః=ఇక్కడినుండి, క్షిప్రమ్= శీఘ్రముగా, సిద్ధిమ్=కార్యసిద్ధిని, గతాః=పొందినవారమై, సర్వథా=అన్ని విధముల, కృతకృత్యాః=కృతకృత్యులము, భవిష్యామః=కాగలము.

తా. ప్రాయోపవేశము చేయుచున్న మనలను ఇతడు భక్షించినచో మనము అన్ని విధముల కృతకృత్యుల మగుదుము. మన కోరిక శీఘ్రముగా తీరును.3

మూ. ఏతాం బుద్ధిం తతశ్చక్రుః సర్వే తే హరియూథపాః,
అవతార్య గిరేః శృఙ్గాద్గృధ్రమాహాఙ్గదస్తదా. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, తే హరియూథపాః=ఆ వానర సేనానాయకులు, ఏతామ్=ఈ, బుద్ధిమ్=ఆలోచనను, చక్రుః=చేసిరి. తదా=అపుడు, అఙ్గదః=అంగదుడు, గృధ్రమ్=సంపాతిని, గిరేః= పర్వతముయొక్క, శృఙ్గాత్=శిఖరమునుండి, అవతార్య=దింపి, ఆహ= పలికెను.

తా. ఆ వానరనాయకు లందరు ఈ విధముగా ఆలోచించుకొనిరి. అపుడు అంగదుడు సంపాతిని పర్వతశిఖరమునుండి దింపి ఇట్లు పలికెను. 4

మూ. బభూవర్క్షరజో నామ వానరేన్ద్రః ప్రతాపవాన్,
మమార్యః పార్థివః పక్షిన్ ధార్మికౌ తస్య చాత్మజౌ. 5
సుగ్రీవశ్చైవ వాలీ చ పుత్రౌ ఘనబలావుభౌ,
లోకావిశ్రుతకర్మాభూద్రాజా వాలీ పితా మమ. 6

ప్ర. అ. పక్షిన్=ఓ ! పక్షి ! ప్రతాపవాన్=ప్రతాపవంతుడు, వానరేన్ద్రః= వానరప్రభువు, మమ=నాకు, ఆర్యః=పితామహుడు అయిన, ఋక్షరజో నామ= ఋక్షరజుడు అను పేరు గల, పార్థివః=రాజు, బభూవ=ఉండెను. ఘన బలౌ=అధికమైన బలము గల, ఉభౌ=ఇద్దరైన, సుగ్రీవశ్చైవ= సుగ్రీవుడు, వాలీ చ=వాలియు, తస్య=అతనియొక్క, ధార్మికౌ= ధార్మికులైన, ఆత్మజౌ= ఔరసులైన, పుత్రౌ=పుత్రులు. మమ=నాయొక్క, పితా=తండ్రియైన, వాలీ=వాలి, లోకే=లోకమునందు, విశ్రుతకర్మా= ప్రసిద్ధమైన పనులు గల, రాజా=వానరరాజుగా, అభూత్=ఆయెను.

తా. ఓ ! పక్షి ! ప్రతాపవంతుడు, వానరప్రభువు అయిన ఋక్షరజుడను ఒక రాజు ఉండెను. ఆతడు నా పితామహుడు. ధార్మికులు, గొప్ప బలము గలవారు అయిన వాలిసుగ్రీవులు ఆతని ఔరస పుత్రులు. వానరరాజైన నా తండ్రి వాలి లోకములో పరాక్రమాదులచే ప్రసిద్ధి పొందినవాడు. 5,6

మూ. రాజా కృత్స్నస్య జగతః ఇక్ష్వాకూణాం మహారథః,
రామో దాశరథిః శ్రీమాన్ప్రవిష్టో దణ్డకావనమ్. 7
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా సహ భార్యయా
పితుర్నిదేశనిరతో ధర్మ్యం పన్థానమాశ్రితః. 8

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశీయులలో, మహారథః=మహారథుడు, కృత్స్నస్య=సమస్తమైన, జగతః=జగత్తునకు, రాజా=రాజు, శ్రీమాన్=శ్రీమంతుడు, దాశరథిః=దశరథకుమారుడు అయిన, రామః= రాముడు, పితుః=తండ్రియొక్క, నిదేశనిరతః=ఆజ్ఞయందు ఆసక్తి కలవాడై, ధర్మ్యమ్=ధర్మసమ్మతమైన, పన్థా

నమ్=మార్గమును, ఆశ్రితః= ఆశ్రయించినవాడై, భ్రాతా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితోను, భార్యయా=భార్యయైన, వైదేహ్యా సహ=సీతతోను, దణ్డకావనమ్= దండకావనమును, ప్రవిష్టః=ప్రవేశించినాడు.

తా. ఇక్ష్వాకువంశీయులలో మహారథుడు, సకలజగత్తునకు రాజు, శ్రీమంతుడు, దశరథకుమారుడు అయిన రాముడు ధర్మమార్గమును అవలంబించి తండ్రి ఆజ్ఞను పాలించుచు, సోదరుడైన లక్ష్మణునితోను భార్యయైన సీతతోను కలిసి దండకారణ్యములో ప్రవేశించినాడు. 7,8

మూ. తస్య భార్యా జనస్థానాద్రావణేన హృతా బలాత్,
రామస్య తు పితుర్మిత్రం జటాయుర్నామ గృధ్రరాట్, 9
దదర్శ సీతాం వైదేహీం హ్రియమాణాం విహాయసా.

ప్ర. అ. తస్య=అతనియొక్క, భార్యా=భార్య, జనస్థానాత్= జనస్థానము నుండి, రావణేన=రావణునిచేత, బలాత్=బలాత్కారముగా, హృతా=హరింపబడినది. రామస్య=రామునియొక్క, పితుః=తండ్రియొక్క, మిత్రమ్=మిత్రుడైన, జటాయుర్నామ=జటాయు వను పేరు గల, గృధ్రరాట్= గృధ్రరాజు, విహాయసా=ఆకాశముచేత, హ్రియమాణామ్=హరించబడుచున్న, వైదేహీమ్=విదేహరాజకుమారి యైన, సీతామ్=సీతను, దదర్శ=చూచెను.

తా. ఆ రాముని భార్యను రావణుడు జనస్థానమునుండి బలాత్కారముగా అపహరించెను. రాముని తండ్రి మిత్రుడైన జటాయు వను గృధ్రరాజు ఆకాశ మార్గమునందు అపహరింపబడుచున్న ఆ సీతను చూచెను. 9

మూ. రావణం విరథం కృత్వా స్థాపయిత్వా చ మైథిలీమ్, 10
పరిశ్రాన్తశ్చ వృద్ధశ్చ రావణేన హతో రణే.

ప్ర. అ. రావణమ్=రావణుని, విరథమ్=రథము లేనివానినిగా, కృత్వా=చేసి, మైథిలీం చ=సీతను, స్థాపయిత్వా=నిలిపి, పరిశ్రాన్తశ్చ= అలసిపోయిన, వృద్ధశ్చ=వృద్ధుడైన, జటాయువు, రణే=రణమునందు, రావణేన=రావణునిచేత, హతః=చంపబడినాడు.

తా. వృద్ధుడైన జటాయువు రావణుని రథము లేనివానినిగా చేసి సీతను నిలిపి అలిసిపోయెను. అపుడు ఆతనిని యుద్ధములో రావణుడు చంపివేసెను.10

మూ. ఏవం గృధ్రో హతస్తేన రావణేన బలీయసా, 11
సంస్కృతశ్చాపి రామేణ జగామ గతిముత్తమామ్.

ప్ర. అ. గృధ్రః=జటాయువు, ఏవమ్=ఈ విధముగా, బలీయసా= బలవంతుడైన, తేన రావణేన=ఆ రావణునిచేత, హతః=చంపబడినాడు. రామేణ=రామునిచేత, సంస్కృతశ్చాపి=సంస్కరింపబడినవాడై, ఉత్తమాం గతిమ్=ఉత్తమగతిని,

జగామ=పొందెను.

తా. బలశాలియైన ఆ రావణుడు జటాయువును ఈ విధముగా చంపెను. ఆ జటాయువు రామునిచేత సంస్కరింపబడి ఉత్తమగతిని పొందెను. 11

మూ. తతో మమ పితృవ్యేణ సుగ్రీవేణ మహాత్మనా, 12
చకార రాఘవః సఖ్యం సోఽవధీత్ పితరం మమ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, మమ=నాయొక్క, పితృవ్యేణ=పినతండ్రియైన, మహాత్మనా=మహాత్ముడైన, సుగ్రీవేణ= సుగ్రీవునితో, సఖ్యమ్=స్నేహమును, చకార=చేసెను. సః=అతడు, మమ=నాయొక్క, పితరమ్=తండ్రిని, అవధీత్=చంపెను.

తా. పిమ్మట రాముడు నా పినతండ్రియైన, బుద్ధిశాలియైన సుగ్రీవునితో స్నేహము చేసెను. రాముడు నా తండ్రిని చంపెను. 12

మూ. మమ పిత్రా విరుద్ధో హి సుగ్రీవః సచివైః సహ, 13
నిహత్య వాలినం రామస్తతస్తమభిషేచయత్.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, సచివైః సహ=తన మంత్రులతో కూడ, మమ=నాయొక్క, పిత్రా=తండ్రితో, విరుద్ధః=విరోధము పొందినాడు. రామః=రాముడు, వాలినమ్=వాలిని, నిహత్య=చంపి, తతః= అటుపిమ్మట, తమ్=వానిని, అభిషేచయత్=అభిషిక్తుని చేసెను.

తా. మంత్రులతో కూడిన సుగ్రీవుడు నా తండ్రితో విరోధము చేసెను. రాముడు వాలిని చంపి ఆ సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని చేసెను. 13

మూ. స రాజ్యే స్థాపితస్తేన సుగ్రీవో వానరేశ్వరః, 14
రాజా వానరముఖ్యానాం తేన ప్రస్థాపితా వయమ్.

ప్ర. అ. తేన=ఆ రామునిచేత, రాజ్యే=రాజ్యమునందు, స్థాపితః= స్థాపించబడిన, వానరేశ్వరః=వానరనాయకుడైన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, వానరముఖ్యానామ్=వానరశ్రేష్ఠులకు, రాజా=రాజు. తేన=అతనిచేత, వయమ్=మేము, ప్రస్థాపితాః=పంపబడితిమి.

తా. వానరనాయకుడైన ఆ సుగ్రీవుడు రామునిచే రాజ్యమునందు స్థాపింపబడి ఇపుడు వానరశ్రేష్ఠుల రాజుగా ఉన్నాడు. ఆతడు మమ్ములను పంపినాడు. 14

మూ. ఏవం రామప్రయుక్తాస్తు మార్గమాణాస్తతస్తతః, 15
వైదేహీం నాధిగచ్ఛామో రాత్రౌ సూర్యప్రభామివ.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, రామప్రయుక్తాః=రామునిచేత ప్రేరేపిం

పబడిన వారమై, తతస్తతః=అక్కడక్కడ, మార్గమాణాః=వెదకుచు, రాత్రౌ=రాత్రియందు, సూర్యప్రభామివ=సూర్యకాంతిని వలె, వైదేహీమ్=సీతను, నాధిగచ్ఛామః=పొందలేకపోతిమి.

తా. రామునిచేత పంపబడిన మేము అక్కడక్కడ వెదకినను రాత్రియందు సూర్యకాంతివలె సీత మాకు ఎక్కడా కనబడలేదు. 15

మూ. తే వయం దణ్డకారణ్యం విచిత్య సుసమాహితాః, 16
అజ్ఞానాత్తు ప్రవిష్టాః స్మ ధరణ్యా వివృతం బిలమ్.

ప్ర. అ. తే వయమ్=అట్టి మేము, సుసమాహితాః=బాగుగా సావధానచిత్తులమై, దండకారణ్యమ్=దండకారణ్యమును, విచిత్య=వెదకి, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, ధరణ్యాః=భూమియొక్క, వివృతమ్=తెరచి యున్న, బిలమ్=బిలమును, ప్రవిష్టాః స్మ= ప్రవేశించితిమి.

తా. మేము సావధానమైన మనస్సుతో దండకారణ్యమును వెదకి భూమిపై ఒక బిలము తెరచి ఉండగా తెలియక దానిలో ప్రవేశించితిమి. 16

మూ. మయస్య మాయావిహితం తద్బిలం చ విచిన్వతామ్, 17
వ్యతీతస్తత్ర నో మాసో యో రాజ్ఞా సమయః కృతః.

ప్ర. అ. మయస్య=మయునియొక్క, మాయావిహితమ్=మాయచేత నిర్మింపబడిన, తత్= ఆ, బిలమ్=బిలమును, విచిన్వతామ్=వెదకుచున్న, నః=మాకు, యః= ఏది, రాజ్ఞా=రాజుచేత, సమయః=సమయముగా, కృతః=నిర్ణయింపబడినదో, మాసః =ఆ మాసము, తత్ర=అక్కడ, వ్యతీతః=గడచిపోయినది.

తా. మేము మయుని మాయచే నిర్మింపబడిన ఆ బిలమును వెదకుచుండగా రాజు గడువుగా ఇచ్చిన మాసము అక్కడనే గడచిపోయినది. 17

మూ. తే వయం కపిరాజస్య సర్వే వచనకారిణః, 18
కృతాం సంస్థామతిక్రాన్తా భయాత్ప్రాయముపాసితాః.

ప్ర. అ. కపిరాజస్య=సుగ్రీవునియొక్క, వచనకారిణః=వచనమును చేయు, సర్వే= సమస్తమైన, తే వయమ్=అట్టి మేము, కృతామ్=చేయబడిన, సంస్థామ్=నియమమును, అతిక్రాన్తాః=అతిక్రమించినవారమై, భయాత్=భయమువలన, ప్రాయమ్ ఉపాసితాః= ప్రాయోపవేశము చేయుచున్నాము.

తా. సుగ్రీవుని ఆజ్ఞను పాలించు మేమందరము ఆతడు చేసిన నియమమును అతిక్రమించుటచే భయపడి ప్రాయోపవేశము చేయుచున్నాము.

మూ. క్రుద్ధే తస్మింస్తు కాకుత్స్థే సుగ్రీవే చ సలక్ష్మణే, 19
గతానామపి సర్వేషాం తత్ర నో నాస్తి జీవితమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తస్మిన్=ఆ, కాకుత్స్థే=రాముడు, సలక్ష్మణే=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవే చ=సుగ్రీవుడు, క్రుద్ధే=కోపగించినవా డగుచుండగా, తత్ర=అక్కడకు, గతానామపి= వెళ్లినవారమైనను, నః=మాకు, సర్వేషామ్=అందరికి, జీవితమ్=జీవితము, నాస్తి= లేదు.

తా. రామునకు, సుగ్రీవునకు, లక్ష్మణునకు కోపము కలిగించిన పిమ్మట మేమందరము అక్కడకు వెళ్లినను మాకు జీవితము ఉండదు.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
ఏబది ఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టపఞ్చాశః సర్గః

[సంపాతి తన రెక్కలు కాలిపోయిన వృత్తాంతమును చెప్పుట. రావణుని నివాసస్థానమును గూర్చి తెలుపుట. వానరుల సహాయముతో సముద్రతీరమునకు వెళ్ళి సోదరునకు తర్పణము లిచ్చుట.]

మూ. ఇత్యుక్తః కరుణం వాక్యం వానరైస్త్యక్తజీవితైః,
సబాష్పో వానరాన్గృధ్రః ప్రత్యువాచ మహాస్వనః. 1

ప్ర. అ. త్యక్తజీవితైః= విడువబడిన ప్రాణములు గల, వానరైః= వానరులచేత, ఇతి= ఇట్లు, కరుణమ్= జాలిగొలుపు, వాక్యమ్= వాక్యమును, ఉక్తః= పలుకబడిన, మహాస్వనః= గొప్ప ధ్వని గల, గృధ్రః= సంపాతి, సబాష్పః= కన్నీటితో కూడిన వాడై, వానరాన్= వానరులను గూర్చి, ప్రత్యువాచ= తిరిగి పలికెను.

తా. ప్రాణములు విడచుటకు సిద్ధమైన ఆ వానరులు పలికిన జాలిగొలుపు మాటలు విని సంపాతి కన్నీళ్లు కార్చుచు ఉచ్చైఃస్వరముతో వారితో ఇట్లనెను. 1

మూ. యవీయాన్ స మమ భ్రాతా జటాయుర్నామ వానరాః,
యమాఖ్యాత హతం యుద్ధే రావణేన బలీయసా. 2

ప్ర. అ. వానరాః= వానరులారా ! యమ్= ఎవనిని, బలీయసా= బలవంతుడైన, రావణేన= రావణునిచేత, యుద్ధే= యుద్ధమునందు, హతమ్= చంపబడినవానినిగా, ఆఖ్యాత= చెప్పుచున్నారో, జటాయుః నామ= జటాయు అను పేరు గల, సః= అతడు, మమ= నాయొక్క, యవీయాన్= చిన్నవాడైన, భ్రాతా= సోదరుడు.

తా. వానరులారా ! బలవంతుడైన రావణునిచేత యుద్ధములో చంపబడినట్లు మీరు చెప్పుచున్న ఆ జటాయువు నా తమ్ముడు. 2

మూ. వృద్ధభావాదపక్షత్వాచ్ఛృణ్వం స్తదపి మర్షయే,
న హి మే శక్తిరస్త్యద్య భ్రాతుర్వైరవిమోక్షణే. 3

ప్ర. అ. తత్= దానిని, శృణ్వన్ అపి= వినుచున్నవాడ నైనను, వృద్ధభావాత్= ముసలివాడ నగుటవలనను, అపక్షత్వాత్= రెక్కలు లేనివాడనగుటవలనను, మే= నాకు, అద్య= ఇపుడు, భ్రాతుః= సోదరునియొక్క, వైరవిమోక్షణే= వైరమును విడిపించుటయందు, (వైరమునకు ప్రతీకారము చేయుటయందు) శక్తిః= శక్తి, నాస్తి హి= లేదు కదా !

తా. నేను ఈ విషయము విన్నను వార్ధక్యముచేతను, నాకు రెక్కలు లేకపోవుటచేతను సహించి ఉన్నాను. నా సోదరుని వైరమునకు ప్రతీకారము చేయుటకు నాకు ఇపుడు శక్తి లేదు. 3

మూ. పురా వృత్రవధే వృత్తే స చాహం చ జయైషిణౌ,
ఆదిత్యముపయాతౌ స్వో జ్వలన్తం రశ్మిమాలినమ్. 4

ప్ర. అ. పురా= పూర్వము, వృత్రవధే= వృత్రాసురవధ, వృత్తే= జరిగినదగుచుండగా, స చ= అతడు, అహం చ= నేను, జయైషిణౌ= జయమును కోరుచున్నవారమై, జ్వలన్తమ్= ప్రజ్వలించుచున్న, రశ్మిమాలినమ్= కిరణముల పంక్తి గల, ఆదిత్యమ్= సూర్యుని గూర్చి, ఉపయాతౌ= వెళ్ళినవారము, స్వః= అగుచున్నాము(అయితిమి).

తా. పూర్వము వృత్రాసురవధ జరిగిన కాలములో ఆ జటాయువు, నేను జయమును కోరుచు (పోటీ పడుచు) కిరణముల పంక్తులతో ప్రజ్వలించుచున్న సూర్యమండలము వైపు ఎగిరితిమి. 4

మూ. ఆవృత్త్యాకాశమార్గేణ జవేన స్మ గతౌ భృశమ్,
మధ్యం ప్రాప్తే తు సూర్యే తు జటాయురవసీదతి. 5

ప్ర. అ. ఆకాశమార్గేణ= ఆకాశమార్గముచేత, ఆవృత్త్య= ఆవరించి, భృశమ్= మిక్కిలి, జవేన= వేగముతో, గతౌ స్మ= వెళ్లితిమి. సూర్యే= సూర్యుడు, మధ్యమ్= ఆకాశమధ్యమును, ప్రాప్తే తు= పొందగానే, జటాయుస్తు= జటాయువైతే, అవసీదతి= క్షీణించెను.

తా. మేమిద్దరము మహావేగముతో ఆకాశమార్గమును ఆవరించి వెళ్ళితిమి. సూర్యుడు ఆకాశమధ్యమును చేరగానే జటాయువు క్షీణించెను. 5

మూ. తమహం భ్రాతరం దృష్ట్వా సూర్యరశ్మిభిరర్దితమ్,
పక్షాభ్యాం ఛాదయామాస స్నేహాత్పరమవిహ్వలమ్. 6

ప్ర. అ. భ్రాతరమ్= సోదరుడైన, తమ్= అతనిని, సూర్యరశ్మిభిః= సూర్యకిరణములచేత, అర్దితమ్= పీడింపబడినవానినిగా, దృష్ట్వా= చూచి, పరమవిహ్వలమ్= చాల వ్యాకులుడైన అతనిని, అహమ్= నేను, స్నేహాత్= స్నేహమువలన, పక్షాభ్యామ్= రెక్కలతో, ఛాదయామాస= కప్పితిని.

తా. నా సోదరుడైన జటాయువు సూర్యకిరణములచేత పీడింపబడుట చూచి నేను చాల వ్యాకులుడైన అతనిని స్నేహమువలన రెక్కలతో కప్పితిని. 6

మూ. నిర్దగ్ధపత్రః పతితో విన్ధ్యేఽహం వానరర్షభాః,
అహమస్మిన్ వసన్ భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే. 7

ప్ర. అ. వానరర్షభాః= ఓ ! వానరశ్రేష్ఠులారా ! అహమ్= నేను,

నిర్దగ్ధపత్రః= కాల్చివేయబడిన రెక్కలు గలవాడనై, విన్ధ్యే= వింధ్యపర్వతమునందు, పతితః= పడితిని. అస్మిన్= దీనియందు, వసన్= నివసించుచున్న, అహమ్= నేను, భ్రాతుః= సోదరునియొక్క, ప్రవృత్తిమ్= వార్తను, నోపలక్షయే= తెలుసుకొనను.

తా. ఓ ! వానరశ్రేష్ఠులారా ! రెక్కలు కాలిపోవుటచే నేను ఈ వింధ్యపర్వతముపై పడిపోయితిని. ఇక్కడ నివసించుచున్న నాకు నా సోదరుని వృత్తాంతము తెలియలేదు. 7

మూ. జటాయుషస్త్వేవముక్తే భ్రాత్రా సమ్పాతినా తదా,
యువరాజో మహాప్రాజ్ఞః ప్రత్యువాచాఙ్గదస్తదా. 8

ప్ర. అ. తదా= అపుడు, జటాయుషః= జటాయువుయొక్క, భ్రాత్రా= సోదరుడైన, సంపాతినా= సంపాతిచేత, ఏవమ్= ఇట్లు, ఉక్తః= పలుకబడిన, మహాప్రాజ్ఞః= మహాబుద్ధిమంతుడు, యువరాజః= యువరాజు అయిన, అఙ్గదః= అంగదుడు, తదా= అపుడు, ప్రత్యువాచ= తిరిగి పలికెను.

తా. జటాయువు సోదరుడైన సంపాతి మాటలు విని, అపుడు యువరాజు, మహాబుద్ధిమంతుడు అయిన అంగదుడు మరల ఇట్లు పలికెను. 8

మూ. జటాయుషో యది భ్రాతా శ్రుతం తే గదితం మయా,
ఆఖ్యాహి యది జానాపి నిలయం తస్య రక్షసః. 9

ప్ర.అ. తే= నీయొక్క, గదితమ్= వచనమును, మయా= నాచేత, శ్రుతమ్= వినబడినది. జటాయుషః= జటాయువుయొక్క, భ్రాతా యది= సోదరుడ వైనచో, జానాపి యది= ఎరిగున్నచో, తస్య= ఆ, రక్షసః= రాక్షసునియొక్క, నిలయమ్= స్థానమును గూర్చి, ఆఖ్యాహి= చెప్పుము.

తా. నీ మాట లన్నింటిని వింటిని. నీవు జటాయువు సోదరుడి వైనచో ఆ రాక్షసుని స్థానమును గూర్చి నీకు తెలిసినచో చెప్పుము. 9

మూ. అదీర్ఘదర్శినం తం వై రావణం రాక్షసాధమమ్,
అన్తికే యది వా దూరే యది జానాపి శంస నః. 10

ప్ర. అ. అదీర్ఘదర్శినమ్= దీర్ఘదృష్టి లేని, రాక్షసాధమమ్= రాక్షసాధముడైన, తం రావణమ్= ఆ రావణుని గూర్చి, అన్తికే= సమీపమునందు గాని, దూరే యది వా= దూరమునందు గాని, జానాపి యది= ఎరిగి ఉన్నట్లైతే, నః= మాకు, శంస= చెప్పుము.

తా. దీర్ఘదృష్టి లేని ఆ రాక్షసాధముడైన రావణుడు ఇక్కడకు సమీపమునందు గాని, దూరమునందు కాని ఎక్కడ ఉన్నాడో నీకు తెలిసినచో చెప్పుము. 10

మూ. తతోఽబ్రవీన్మహాతేజా భ్రాతా జ్యేష్ఠో జటాయుషః,
ఆత్మానురూపం వచనం వానరాన్సమ్ప్రహర్షయన్. 11

ప్ర. అ. తతః= అటుపిమ్మట, జటాయుషః= జటాయువుయొక్క, జ్యేష్ఠః భ్రాతా= జ్యేష్ఠసోదరుడు, మహాతేజాః= గొప్ప తేజస్సు కలవాడు అయిన సంపాతి, వానరాన్= వానరులను, ఆత్మానురూపమ్= తనకు తగిన, వచనమ్= వచనమును, అబ్రవీత్= పలికెను.

తా. పిమ్మట మహాతేజశ్శాలి, జటాయువు జ్యేష్ఠసోదరుడు అయిన సంపాతి వానరులకు సంతోషము కలిగించుచు తనకు తగిన మాటను ఇట్లు పలికెను. 11

మూ. నిర్దగ్ధపక్షో గృధ్రోఽహం గతవీర్యః ప్లవఙ్గమాః,
వాఙ్మాత్రేణాపి రామస్య కరిష్యే సాహ్యముత్తమమ్. 12

ప్ర. అ. ప్లవఙ్గమాః= వానరులారా ! నిర్దగ్ధపక్షః= కాల్చివేయబడిన రెక్కలు గల, గతవీర్యః= పోయిన పరాక్రమముగల, గృధ్రః= గృధ్రమునైన, అహమ్= నేను, వాఙ్మాత్రేణాపి= మాట మాత్రము చేతనైనా, రామస్య= రామునకు, ఉత్తమమ్= ఉత్తమమైన, సాహ్యమ్= సహాయమును, కరిష్యే= చేయగలను.

తా. ఓ వానరులారా ! రెక్కలు కాలిపోయి, పరాక్రమము నశించిన గ్రద్దనైన నేను మాటమాత్రముచేతనైన రామునకు ఉత్తమమైన సహాయము చేసెదను.

మూ. జానామి వారుణాన్లోకాన్ విష్ణోస్త్రైవిక్రమానపి,
దేవాసురవిమర్దాంశ్చ హ్యమృతస్య విమన్థనమ్. 13

ప్ర. అ. వారుణాన్=వరుణునకు సంబంధించిన, లోకాన్=లోకములను, త్రైవిక్రమాన్=మూడుపాదన్యాసములకు సంబంధించిన, విష్ణోః=విష్ణువుయొక్క, లోకాన్=లోకములను, దేవాసురవిమర్దాంశ్చ=దేవాసురయుద్ధములను, అమృతస్య=అమృతముయొక్క, విమన్థనమ్=మథనమును, జానామి= ఎరుగుదును.

తా. జలము అధికముగా ఉండు వరుణలోకములను, విష్ణువు మూడు అడుగులచేత ఆక్రమించిన భూమ్యాదిలోకములను, దేవాసురయుద్ధములను, అమృతమథనమును నేను ఎరుగుదును. 13

మూ. రామస్య యదిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా,
జరయా చ హృతం తేజః ప్రాణాశ్చ శిథిలా మమ. 14

ప్ర. అ. రామస్య=రామునియొక్క, యత్=ఏ, ఇదం కార్యమ్=ఈ కార్య మున్నదో అది, మయా=నాచేత, ప్రథమమ్=ముందుగా, కర్తవ్యమ్= చేయదగినది. జరయా=ముసలితనముచేత, మమ=నాయొక్క, తేజః= తేజస్సు, హృతమ్=హరింపబడినది. ప్రాణాశ్చ=ప్రాణములు కూడ, శిథిలాః= శిథిలమైనవి.

తా. నేను ఈ రాముని కార్యమును ముందుగా చేయవలయును. ముసలితనము నా తేజస్సును హరించివేసినది. ప్రాణములు శిథిలము లైనవి.14

మూ. తరుణీ రూపసమ్పన్నా సర్వాభరణభూషితా,
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా. 15
క్రోశన్తీ రామ రామేతి లక్ష్మణేతి చ భామినీ,
భూషణాన్యపవిధ్యన్తీ గాత్రాణి చ విధున్వతీ. 16

ప్ర. అ. దురాత్మనా=దురాత్ముడైన, రావణేన=రావణునిచేత, హ్రియమాణా=హరించబడుచున్నది, తరుణీ=యౌవనవంతురాలు, రూపసమ్పన్నా=సౌందర్యముతో కూడినది, సర్వాభరణభూషితా=సమస్త అలంకారములచేత అలంకరింపబడినది, రామరామేతి=రామా ! రామా అని, లక్ష్మణేతి చ=లక్ష్మణా ! అని, క్రోశన్తీ=అరచుచున్నదీ, భూషణాని=అలంకారములను, అపవిధ్యన్తీ=విసిరి వేయుచున్నది, గాత్రాణి=అవయవములను, విధున్వతీ= కదల్చుచున్నది అయిన, భామినీ=స్త్రీ, మయా=నాచేత, దృష్టా= చూడబడినది.

తా. రూపసంపన్నురాలు, సమస్తమైన అలంకారములు అలంకరించుకొన్నది అయిన ఒక యువతిని, దుర్బుద్ధియైన రావణుడు హరించికొనిపోవుచుండగా నేను చూచితిని. ఆమె అలంకారములను క్రిందపడవేయుచు అవయవములు కొట్టుకొనుచు, రామా ! రామా ! లక్ష్మణా ! అని అరచుచుండెను. 15,16

మూ. సూర్యప్రభేవ శైలాగ్రే తస్యాః కౌశేయముత్తమమ్,
అసితే రాక్షసే భాతి యథా విద్యుదివామ్బరే. 17

ప్ర. అ. అసితే=నల్లనైన, రాక్షసే=రాక్షసునియందు, తస్యాః=ఆమెయొక్క, ఉత్తమమ్=ఉత్తమమైన, కౌశేయమ్=పట్టువస్త్రము, శైలాగ్రే=పర్వతాగ్రమునందు, సూర్యప్రభేవ =సూర్యకాంతి వలె, అమ్బరే=ఆకాశమునందు, యథా= ఎట్లు, విద్యుదివ=మెరుపు వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. నల్లనైన ఆ రాక్షసుని శరీరముమీద ఉత్తమమైన ఆమె పట్టువస్త్రము పర్వతాగ్రము మీద సూర్యకాంతి వలె, ఆకాశము మీద మెరుపు వలె ప్రకాశించుచుండెను. 17

మూ. తాం తు సీతామహం మన్యే రామస్య పరికీర్తనాత్,
శ్రూయతాం మే కథయతో నిలయం తస్య రక్షసః. 18

ప్ర. అ. రామస్య=రామునియొక్క, పరికీర్తనాత్=కీర్తనమువలన, తామ్=ఆమెను, సీతామ్=సీతనుగా, అహమ్=నేను, మన్యే= తలచుచున్నాను. తస్య=ఆ, రక్షసః=రాక్షసునియొక్క, నిలయమ్= నివాసమును గూర్చి, కథయతః=చెప్పుచున్న, మే=నాకు, శ్రూయతామ్= వినబడుగాక !

తా. ఆమె రాముని పేరు కీర్తించుచుండెను గాన ఆమె సీతయే అని తలచెదను. ఆ రాక్షసుని నివాసమును గూర్చి చెప్పెదను; వినుడు. 18

మూ. పుత్రో విశ్రవసః సాక్షాద్భ్రాతా వైశ్రవణస్య చ,
అధ్యాస్తే నగరీం లఙ్కాం రావణో నామ రాక్షసః. 19

ప్ర. అ. విశ్రవసః=విశ్రవసునియొక్క, పుత్రః=పుత్రుడు, సాక్షాత్= సాక్షాత్తు, వైశ్రవణస్య=వైశ్రవణునియొక్క, భ్రాతా=సోదరుడు అయిన, రావణో నామ=రావణుడను పేరు గల, రాక్షసః=రాక్షసుడు, లఙ్కాం నగరీమ్= లంకానగరమును, అధ్యాస్తే=అధిష్ఠించి ఉన్నాడు.

తా. విశ్రవసుని పుత్రుడు, సాక్షాత్తు కుబేరుని సోదరుడు అయిన రావణుడను రాక్షసుడు, లంకానగరములో నివసించుచున్నాడు. 19

మూ. ఇతో ద్వీపః సముద్రస్య సమ్పూర్ణే శతయోజనే,
తస్మిన్లఙ్కాపురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా. 20

ప్ర. అ. ఇతః=ఇక్కడినుండి, సమ్పూర్ణే=పూర్ణమైన, శతయోజనే= నూరు యోజనముల దూరమునందు, ద్వీపః=ద్వీప మున్నది. తస్మిన్=దానియందు, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నిర్మితా=నిర్మింపబడిన, రమ్యా=సుందరమైన, లఙ్కాపురీ=లంక అను పట్టణము ఉన్నది.

తా. ఇక్కడినుండి పూర్తి నూరు యోజనముల దూరమునందు సముద్రములో ఒక ద్వీపము ఉన్నది. ఆ ద్వీపమునందు విశ్వకర్మ నిర్మించిన రమ్యమైన లంక యను పట్టణ మున్నది. 20

మూ. జామ్బూనదమయైర్ద్వారైశ్చిత్రైః కాఞ్చనవేదికైః,
ప్రాసాదైర్హేమవర్ణైశ్చ మహద్భిః సుసమా కృతా, 21
ప్రాకారేణార్కవర్ణేన మహతా చ సమన్వితా.

ప్ర. అ. జామ్బూనదమయైః=బంగారు వికారమైన, చిత్రైః=చిత్రములైన, ద్వారైః=ద్వారములతోను, కాఞ్చనవేదికైః=బంగారు వేదికలు గల, హేమవర్ణైశ్చ=బంగారు వర్ణములు గల, మహద్భిః=గొప్పవైన, ప్రాసాదైః= మేడలచేతను, సుసమా=చాల అందమైనదిగా, కృతా=చేయబడినది. అర్కవర్ణేన=సూర్యుని వంటి వర్ణము గల, మహతా=గొప్పదైన, ప్రాకారేణ= ప్రాకారముతో, సమన్వితా=కూడినది.

తా. ఆ లంకాపట్టణమునందు చిత్రములైన బంగారు వికారములైన ద్వారములు, బంగారు వేదికలు గల, సువర్ణచ్ఛాయ గల, పెద్ద ప్రాసాదములు ఉన్నవి. దాని చుట్టూ సూర్యుని వంటి వర్ణము గల గొప్ప ప్రాకార మున్నది.21

మూ. తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ, 22
రావణాన్తఃపురే రుద్ధా రాక్షసీభిః సురక్షితా,
జనకస్యాత్మజాం రాజ్ఞస్తస్యాం ద్రక్ష్యథ మైథిలీమ్. 23

ప్ర. అ. దీనా=దీనురాలు, కౌశేయవాసినీ=పట్టు వస్త్రమును ధరించినది అయిన, వైదేహీ=సీత, తస్యామ్=ఆ లంకయందు, రావణాన్తఃపురే=రావణుని అంతఃపురమునందు, రుద్ధా=అడ్డుకొన బడినదై, రాక్షసీభిః= రాక్షసస్త్రీల చేత, సురక్షితా=బాగుగా రక్షింపబడినదై, వసతి=నివసించుచున్నది. తస్యామ్=ఆ లంకయందు, రాజ్ఞః=రాజైన, జనకస్య=జనకునియొక్క, ఆత్మజామ్=కుమార్తె యైన, మైథిలీమ్=సీతను, ద్రక్ష్యథ=చూడగలరు.

తా. ఆ లంకాపట్టణములో, రావణుని అంతఃపురమునందు నిరోధింపబడి, దీనురాలైన సీత పట్టువస్త్రమును ధరించి నివసించియున్నది. రాక్షసస్త్రీలు ఆమెను బాగుగా రక్షించుచున్నారు. మహారాజైన జనకుని కుమార్తె యైన సీతను మీరు అక్కడ చూడగలరు. 22,23

మూ. లఙ్కాయామథ గుప్తాయాం సాగరేణ సమన్తతః,
సమ్ప్రాప్య సాగరస్యాన్తం సమ్పూర్ణం శతయోజనమ్. 24
ఆసాద్య దక్షిణం తీరం తతో ద్రక్ష్యథ రావణమ్,
తత్రైవ త్వరితాః క్షిప్రం విక్రమధ్వం ప్లవఙ్గమాః. 25

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా ! సమ్పూర్ణమ్=పూర్ణమైన, శత యోజనమ్=నూరు యోజనముల, సాగరస్య=సాగరముయొక్క, అన్తమ్= అంతమును, సమ్ప్రాప్య=పొంది, అథ=పిమ్మట, దక్షిణం తీరమ్= దక్షిణతీరమును, ఆసాద్య=చేరి, తతః=అటు పిమ్మట, సమన్తతః=నలు వైపుల, సాగరేణ=సముద్రముచేత, గుప్తాయామ్=రక్షించబడిన, లఙ్కాయామ్= లంకయందు, రావణమ్=రావణుని, ద్రక్ష్యథ=చూడగలరు. త్వరితాః= తొందరపడుచున్నవారై, తత్రైవ=అక్కడనే, క్షిప్రమ్=శీఘ్రముగా, విక్రమధ్వమ్=పరాక్రమమును చూపుడు.

తా. ఓ ! వానరులారా ! పూర్తి శతయోజనముల దూరమున్న సాగరము అంతమును పొంది దక్షిణతీరము చేరి నాలుగు పక్కల సముద్రముచేత రక్షించబడుచున్న లంకలో మీరు రావణుని చూడవచ్చును. మీరు శీఘ్రముగా వెళ్లి అక్కడనే మీ పరాక్రమమును చూపుడు. 24,25

మూ. జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగమిష్యథ,
ఆద్యః పన్థాః కులిఙ్గానాం యే చాన్యే ధాన్యజీవినః. 26
ద్వితీయో బలిభోజానాం యే చ వృక్షఫలాశనాః,

భాసాస్తృతీయం గచ్ఛన్తి క్రౌఞ్చాశ్చ కురరైః సహ, 27
శ్యేనాశ్చతుర్థం గచ్ఛన్తి గృధ్రా గచ్ఛన్తి పఞ్చమమ్.

ప్ర. అ. జ్ఞానేన=జ్ఞానముచేత, పశ్యామి ఖలు=చూచుచున్నాను కదా! దృష్ట్వా=చూచి, ప్రత్యాగమిష్యథ=తిరిగి వచ్చెదరు. కులిఙ్గానామ్= కులింగపక్షులకు, అన్యే=ఇతరమైన, ధాన్యజీవినః=ధాన్యమును తిని జీవించు, యే=ఏపక్షులున్నవో వాటికి, ఆద్యః=మొదటి, పన్థాః=ఆకాశమార్గము. బలిభోజానామ్=కాకులకు, వృక్షఫలాశనాః=వృక్షముల ఫలములను భుజించు, యే=ఏ పక్షులు గలవో వాటికి, ద్వితీయః=రెండవ మార్గమును, భాసాః= భాసపక్షులు, కురరైస్సహ=కురరములతో కూడ, క్రౌఞ్చాశ్చ=క్రౌంచపక్షులు, తృతీయమ్=మూడవ మార్గమును, గచ్ఛన్తి=వెళ్లు చున్నవి. శ్యేనాః= డేగలు, చతుర్థమ్=నాల్గవ మార్గమును, గచ్ఛన్తి=పొందుచున్నవి. గృధ్రాః=గ్రద్దలు, పఞ్చమమ్=ఐదవ మార్గమును, గచ్ఛన్తి= పొందుచున్నవి.

తా. నేను దివ్యదృష్టితో చూచుచున్నాను. మీరు సీతను చూచి తిరిగి రాగలరు. కులింగపక్షులు, ధాన్యమును తిని జీవించు ఇతర పక్షులు, ఆకాశమునందు భూమికి దగ్గరగా వున్న మొదటి మార్గమునందు ఎగురగలవు. కాకులు, వృక్షముల ఫలములను తిను ఇతర పక్షులు రెండవ మార్గమునందు ఎగురగలవు. భాస పక్షులు, క్రౌంచ పక్షులు, గోరెంకలు, మూడవ మార్గమునందు ఎగురగలవు. డేగలు నాల్గవ మార్గమునందు, గ్రద్దలు ఐదవ మార్గమునందు ఎగురగలవు.

మూ. బలవీర్యోపపన్నానాం రూపయౌవనశాలినామ్, 28
షష్ఠస్తు పన్థా హంసానాం వైనతేయగతిః పరా,
వైనతేయాచ్చ నో జన్మ సర్వేషాం వానరర్షభాః. 29

ప్ర. అ. వానరర్షభాః=ఓ ! వానరశ్రేష్ఠులారా ! బలవీర్యోపపన్నానామ్= బలముతోను పరాక్రమముతోను కూడిన, రూపయౌవనశాలినామ్=రూపయౌవనము లతో ప్రకాశించుచున్న, హంసానామ్=హంసలకు, షష్ఠః=ఆరవదైన, పన్థాః= మార్గము. వైనతేయగతిః=వినతాపుత్రుడైన గరుత్మంతునియొక్క అరుణిని యొక్క గతి, పరా=దానికంటె ఉన్నతమైనది. సర్వేషామ్=సమస్తమైన, నః= మాయొక్క, జన్మ=జన్మ, వైనతేయాత్=అరుణుని వలన జరిగినది.

తా. ఓ ! వానరశ్రేష్ఠులారా ! గొప్ప బలము, పరాక్రమము, రూపము, యౌవనము గల హంసలు ఆరవ మార్గమునందు ఎగురగలవు. గరుత్మంతుని గతి, అరుణుని గతి దానికంటె ఉన్నత మైనది. మేమందరము వినతాపుత్రుడైన అరుణుని సంతతివారము. 28,29

మూ. గర్హితం తు కృతం కర్మ యేన స్మ పిశితాశినః,
ప్రతికార్యం చ మే తస్య వైరం భ్రాతృకృతం భవేత్. 30

ప్ర. అ. యేన=ఏ రావణునిచే, గర్హితమ్=నిందితమైన, కర్మ=పని, కృతమ్=చేయబడినదో, తస్య=ఆ, పిశితాశినః=పచ్చిమాంసమును తిను రావణునియొక్క, భ్రాతృకృతమ్=నా సోదరుని విషయమున చేయబడిన, వైరం చ= వైరము కూడ, ప్రతికార్యమ్=ప్రతిక్రియ చేయదగినది, భవేత్=అగును.

తా. క్రూరుడైన ఆ రావణుడు సీతాహరణ మను నింద్యమైన పని చేసినాడు. అతడు నా సోదరుని చంపినందుకు నేను ప్రతిక్రియ కూడ చేయవలసి యున్నది. 30

మూ. ఇహస్థోఽహం ప్రపశ్యామి రావణం జానకీం తథా,
అస్మాకమపి సౌపర్ణం దివ్యం చక్షుర్బలం తథా. 31

ప్ర. అ. ఇహస్థః=ఇక్కడ ఉన్నవాడ నగుచునే, అహమ్=నేను, రావణమ్= రావణుని, తథా=మరియు, జానకీమ్=సీతను, ప్రపశ్యామి= చూచుచున్నాను. అస్మాకమపి=మాకు కూడ, సౌపర్ణమ్=గరుత్మంతునకు సంబంధించిన, దివ్యమ్=దివ్యమైన, చక్షుః=నేత్రము, తథా=మరియు, బలమ్=బలము, ఉన్నవి.

తా. నేను ఇక్కడినుండియే రావణుని, జానకిని కూడ చూడ గలుగుచున్నాను. గరుత్మంతునకు ఎట్టి దివ్యమైన నేత్రము, బలము ఉన్నవో, అట్టివే మాకు కూడ ఉన్నవి. 31

మూ. తస్మాదాహారవీర్యేణ నిసర్గేణ చ వానరాః,
ఆయోజనశతాత్సాగ్రాద్వయం పశ్యామ నిత్యశః. 32

ప్ర. అ. వానరాః=వానరులారా ! తస్మాత్=ఆ కారణమువలన, వయమ్= మేము, ఆహారవీర్యేణ=ఆహారముయొక్క బలముచేతను, నిసర్గేణ చ=స్వభావము చేతను, సాగ్రాత్=అగ్రముతో కూడిన, ఆయోజనశతాత్=యోజనశతమువరకు, నిత్యశః=ఎల్లపుడు, పశ్యామ=చూచెదము.

తా. అందుచే, ఓ ! వానరులారా ! ఆహారబలముచేతను, జాతి స్వభావముచేతను మేము నిత్యము యోజనశతమును మించి చూచుచుందుము.

మూ. అస్మాకం విహితా వృత్తిర్నిసర్గేణ చ దూరతః,
విహితా పాదమూలే తు వృత్తిశ్చరణయోధినామ్. 33

ప్ర. అ. అస్మాకమ్=మాకు, వృత్తిః=జీవనోపాయము, నిసర్గేణ= స్వభావము చేత, దూరతః=దూరముగా, విహితా=విధించబడినది. చరణయోధినామ్= కోళ్లకు, పాదమూలే=వాటి పాదముల క్రింద, వృత్తిః=వృత్తి, విహితా= విధింపబడినది.

తా. స్వభావము చేతనే మాకు ఆహారము చాల దూరమునందు విధింపబడినది. కోళ్లకు వాటి పాదముల క్రిందనే ఆహారము ఏర్పరపబడినది.33

మూ. ఉపాయో దృశ్యతాం కశ్చిల్లఙ్ఘనే లవణామ్భసః,
అభిగమ్య తు వైదేహీం సమృద్ధార్థా గమిష్యథ. 34

ప్ర. అ. లవణామ్భసః=లవణసముద్రముయొక్క, లఙ్ఘనే=దాటుటయందు, కశ్చిత్=ఏదైన, ఉపాయః=ఉపాయము, దృశ్యతామ్=చూడబడుగాక ! వైదేహీమ్=సీతను, అభిగమ్య=పొంది, సమృద్ధార్థాః=సిద్ధించిన కార్యము గలవారై, గమిష్యథ=వెళ్లగలరు.

తా. ఈ లవణసముద్రమును దాటుటకు ఏదైన ఉపాయమును ఆలోచించుడు. సీతను చూచి కార్యసిద్ధిని పొంది తిరిగి వెళ్లగలరు. 34

మూ. సముద్రం నేతుమిచ్ఛామి భవద్భిర్వరుణాలయమ్,
ప్రదాస్యామ్యుదకం భ్రాతుః స్వర్గతస్య మహాత్మనః. 35

ప్ర. అ. భవద్భిః=మీచేత, వరుణాలయమ్=వరుణుని నివాసమైన, సముద్రమ్=సముద్రమును, నేతుమ్=పొందించుటకు, ఇచ్ఛామి= కోరుచున్నాను. స్వర్గతస్య=స్వర్గమునకు వెళ్లిన, మహాత్మనః=మహాత్ముడైన, భ్రాతుః=సోదరునకు, ఉదకమ్=ఉదకమును, ప్రదాస్యామి=ఇచ్చెదను.

తా. మీరు నన్ను సముద్రము దగ్గరకు తీసుకొని వెళ్ళవలె నని కోరుచున్నాను. స్వర్గస్థుడైన ఉత్తమబుద్ధి గల నా సోదరునకు తర్పణమును ఇచ్చెదను. 35

మూ. తతో నీత్వా తు తం దేశం తీరే నదనదీపతేః,
నిర్దగ్ధపక్షం సమ్పాతిం వానరాః సుమహౌజసః. 36
తం పునః ప్రాపయిత్వా చ తం దేశం పతగేశ్వరమ్,
బభూవుర్వానరా హృష్టాః ప్రవృత్తిముపలభ్య తే. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సుమహౌజసః=గొప్ప తేజస్సు గల, వానరాః=వానరులు, నిర్దగ్ధపక్షమ్= కాల్చబడిన రెక్కలు గల, సమ్పాతిమ్=సంపాతిని, తతః=అటు పిమ్మట, నదనదీపతేః=సముద్రముయొక్క, తీరే=తీరమునందు, తం దేశమ్=ఆ ప్రదేశమును గూర్చి, నీత్వా=తీసుకొని వెళ్లి, తమ్=ఆ, పతగేశ్వరమ్=పక్షిరాజును, పునః=మరల, తం దేశమ్=ఆ ప్రదేశమును, ప్రాపయిత్వా=పొందించి, (నిలిచిరి). తే వానరాః=ఆ వానరులు, ప్రవృత్తిమ్= వృత్తాంతమును, ఉపలభ్య=పొంది, హృష్టాః=సంతోషించినవారు, బభూవుః= అయిరి.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల ఆ వానరులు రెక్కలు కాలిపోయిన ఆ సంపాతిని సముద్రతీరము నందు సముద్రమునకు దగ్గరగా ఉన్న ప్రదేశమునకు

తీసుకొనివెళ్లి, మరల ఆతనిని వెనుకటి ప్రదేశమునకు చేర్చిరి. సీతావృత్తాంతము తెలియుటచే ఆ వానరు లందరు సంతోషించిరి. 36,37

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో ఏబది ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనషష్టితమః సర్గః

[సంపాతి తన పుత్రుడైన సుపార్శ్వుడు చెప్పగా వినిన సీతారావణులను ఆతడు చూచిన సంఘటనను చెప్పుట]

మూ. తతస్తదమృతాస్వాదం గృధ్రరాజేన భాషితమ్,
విశమ్య ముదితా హృష్టాస్తే వచః ప్లవగర్షభాః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అమృతాస్వాదమ్=అమృతము వంటి రుచి గల, గృధ్రరాజేన=సంపాతిచేత, భాషితమ్=పలుకబడిన, తత్ వచః=ఆ వచనమును, విశమ్య=విని, తే=ఆ, ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, ముదితాః=సంతోషించిరి. హృష్టాః=రోమాంచము కలవారైరి.

తా. అమృతము వలె మధురముగా ఉన్న సంపాతి పలికిన ఆ మాటలు విని ఆ వానరశ్రేష్ఠు లందరు చాల సంతోషించిరి. 1

మూ. జామ్బవాన్ వానరశ్రేష్ఠః సహ సర్వైః ప్లవఙ్గమైః,
భూతలాత్సహసోత్థాయ గృధ్రరాజానమబ్రవీత్. 2

ప్ర. అ. వానరశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన, జామ్బవాన్=జాంబవంతుడును, సర్వైః=సమస్తమైన, ప్లవఙ్గమైః సహ=వానరులతో కూడ, సహసా=వెంటనే, భూతలాత్=నేలపైనుండి, ఉత్థాయ=లేచి, గృధ్రరాజానమ్=సంపాతిని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆ వానరు లందరితో కూడిన వానరశ్రేష్ఠుడైన జాంబవంతుడు నేలపై నుండి వెంటనే లేచి సంపాతితో ఇట్లు పలికెను. 2

మూ. క్వ సీతా కేన వా దృష్టా కో వా హరతి మైథిలీమ్,
తదాఖ్యాతు భవాన్ సర్వం గతిర్భవ వనౌకసామ్. 3

ప్ర. అ. సీతా=సీత, క్వ=ఎక్కడ ఉన్నది ? కేన వా=ఎవనిచేత, దృష్టా=చూడబడినది ? మైథిలీమ్ =సీతను, కో వా=ఎవడు, హరతి=హరించుచున్నాడు ? భవాన్=నీవు, తత్ సర్వమ్=దానినంతను, ఆఖ్యాతు=చెప్పెదవుగాక, వనౌకసామ్=వానరులకు, గతిః=గతిగా, భవ=అగుము.

తా. సీత ఎక్కడ ఉన్నది ? ఆమెను ఎవరు చూచినారు ? ఆమెను హరించిన వాడెవరు ? నీవు దీని నంతను చెప్పుము. వానరులకు సాహాయ్యము చేయుము. 3

మూ. కో దాశరథిబాణానాం వజ్రవేగనిపాతినామ్,
స్వయం లక్ష్మణముక్తానాం న చిన్తయతి విక్రమమ్. 4

ప్ర. అ. వజ్రవేగనిపాతినామ్=వజ్రవేగముతో పడు, దాశరథిబాణానామ్= రాముని బాణములయొక్క, స్వయమ్=స్వయముగా, లక్ష్మణముక్తానామ్= లక్ష్మణునిచేత విడువబడిన బాణములయొక్క, విక్రమమ్=పరాక్రమమును, కః= ఎవడు, న చిన్తయతి=ఆలోచించుటలేదు.

తా. వజ్రము వంటి వేగముతో పడు రామబాణముల శక్తిని, లక్ష్మణుడు ప్రయోగించిన బాణముల శక్తిని గూర్చి ఆలోచించని ఆతడు ఎవడు ? 4

మూ. స హరీన్ ప్రతిసంయుక్తాన్ సీతాశ్రుతిసమాహితాన్,
పునరాశ్వాసయన్ప్రీతః ఇదం వచనమబ్రవీత్. 5

ప్ర. అ. సః=అతడు, ప్రీతః=సంతోషించినవాడై, ప్రతిసంయుక్తాన్= ప్రాయోపవేశమును విడచినవారు, సీతాశ్రుతిసమాహితాన్=సీతను గూర్చి వినుటయందు సావధానచిత్తులు అయిన, హరీన్=వానరులను, ఆశ్వాసయన్=ఓదార్చుచు, పునః=మరల, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ప్రాయోపవేశమును విడచి సీతావృత్తాంతమును వినవలెనని ఉత్కంఠతో ఉన్న ఆ వానరులను ఓదార్చుచు సంపాతి సంతోషించుచు ఇట్లు పలికెను. 5

మూ. శ్రూయతామిహ వైదేహ్యా యథా మే హరణం శ్రుతమ్,
యేన చాపి మమాఖ్యాతం యత్ర చాయతలోచనా. 6

ప్ర. అ. వైదేహ్యాః=సీతయొక్క, హరణమ్=హరణము, మే=నాకు, యథా=ఎట్లు, శ్రుతమ్=వినబడినదో, యేన చ=ఎవనిచేత, మమ= నాకు, ఆఖ్యాతమ్=చెప్పబడినదో, ఆయతలోచనా=విశాలమైన నేత్రములు గల ఆ సీత, యత్ర చ=ఎక్కడ ఉన్నదో, ఇహ=ఇపుడు, శ్రూయతామ్=వినబడుగాక !

తా. సీతాహరణమును గూర్చి నేను ఎట్లు విన్నానో, నాకు ఎవరు చెప్పినారో, విశాలములైన నేత్రములు గల ఆ సీత ఎక్కడ ఉన్నదో, చెప్పెదను వినుడు. 6

మూ. అహమస్మిన్ గిరౌ దుర్గే బహుయోజనమాయతే,
చిరాన్నిపతితో వృద్ధః క్షీణప్రాణపరాక్రమః. 7

ప్ర. అ. బహుయోజనమ్=అనేకయోజనములు, ఆయతే=పొడవైన, దుర్గే=ప్రవేశింప శక్యము కాని, అస్మిన్ గిరౌ=ఈ పర్వతముపై, చిరాత్= చిరకాలమునకు ముందు, నిపతితః=పడిన, అహమ్=నేను, వృద్ధః= వృద్ధుడనై, క్షీణప్రాణపరాక్రమః=క్షీణమైన ప్రాణములు, పరాక్రమము కలవాడను అయితిని.

తా. చాల కాలము క్రితము అనేకయోజనముల వైశాల్యము గల ప్రవేశింప శక్యము గాని ఈ పర్వతము మీద పడిపోయిన నేను వృద్ధుడ నైతిని. నా బలపరాక్రమములు క్షీణించినవి. 7

మూ. తం మామేవంగతం పుత్రః సుపార్శ్వో నామ నామతః,
ఆహారేణ యథాకాలం బిభర్తి పతతాం వరః. 8

ప్ర. అ. ఏవంగతమ్=ఈ విధముగా అయిన, తమ్=అట్టి, మామ్ = నన్ను, పతతామ్=పక్షులలో, వరః=శ్రేష్ఠుడు, నామతః=పేరుచేత, సుపార్శ్వో నామ=సుపార్శ్వు డను ప్రసిద్ధి గల, పుత్రః=పుత్రుడు, యథాకాలమ్=కాలానుసారముగా, ఆహారేణ=ఆహారముచేత, బిభర్తి= పోషించుచున్నాడు.

తా. ఇట్టి స్థితిలో నున్న నన్ను పక్షులలో శ్రేష్ఠుడైన, సుపార్శ్వు డను పేరు గల నా పుత్రుడు కాలానుసారముగా, ఆహారము తెచ్చి ఇచ్చుచు పోషించుచున్నాడు. 8

మూ. తీక్ష్ణకామాస్తు గన్ధర్వాస్తీక్ష్ణకోపా భుజఙ్గమాః,
మృగాణాం తు భయం తీక్ష్ణం తతస్తీక్ష్ణక్షుధా వయమ్. 9

ప్ర. అ. గన్ధర్వాః=గంధర్వులు, తీక్ష్ణకామాః=తీక్ష్ణమైన కామము గలవారు; భుజఙ్గమాః=సర్పములు, తీక్ష్ణకోపాః=తీక్ష్ణమైన కోపము గలవి; మృగాణామ్=మృగములకు, భయమ్=భయము, తీక్ష్ణమ్=తీక్ష్ణమైనది, తతః=అట్లే, వయమ్=మేము తీక్ష్ణక్షుధాః=తీక్ష్ణమైన ఆకలి గలవారము.

తా. గంధర్వులకు కామము అధికము. సర్పములకు కోపము అధికము. లేళ్లకు భయము అధికము. అట్లే మాకు ఆకలి అధికము. 9

మూ. స కదాచిత్ క్షుధార్తస్య మమాహారాభికాఙ్క్షిణః,
గతసూర్యేఽహని ప్రాప్తో మమ పుత్రో హ్యనామిషః. 10

ప్ర. అ. కదాచిత్=ఒకనాడు, మమ పుత్రః=నా కుమారుడైన, సః=ఆ సుపార్శ్వుడు, ఆహారాభికాఙ్క్షిణః=ఆహారమును కోరుచున్న, మమ=నేను, క్షుధార్తస్య=ఆకలిచేత పీడింపబడినవాడనై ఉండగా, అహని=పగలు, గతసూర్యే=గడచిన సూర్యుడు గల దగుచుండగా, అనామిషః=ఆహారము లేనివాడై, ప్రాప్తః=వచ్చినాడు.

తా. ఒకరోజున నేను ఆహారమును కోరుచు ఆకలితో బాధపడుచుండగా, నా కుమారుడు మాంస మేమియు లేకుండగా, సూర్యాస్తమయ సమయమునందు వచ్చినాడు. 10

మూ. స మయాహారసంరోధాత్పీడితః ప్రీతివర్ధనః,
అనుమాన్య యథాతత్త్వమిదం వచనమబ్రవీత్. 11

ప్ర. అ. ఆహారసంరోధాత్=ఆహారము లేకపోవుటవలన, మయా=నాచేత, పీడితః=నిందింపబడిన, సః=ఆ, ప్రీతివర్ధనః=ఆనందమును వృద్ధిపొందింపచేయు నా కుమారుడు, అనుమాన్య=నన్ను బ్రతిమిలాడి, యథాతత్త్వమ్=యథార్థముగా, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్= పలికెను.

తా. నాకు ఆనందమును వృద్ధిపొందించు నా కుమారుని నేను ఆహారము లభించకపోవుటచే నిందించి పీడించితిని. అపుడు ఆతడు నన్ను బ్రతిమిలాడు కొనుచు జరిగినది జరిగినట్లు ఇట్లు చెప్పెను. 11

మూ. అహం తాత యథాకాలమామిషార్థీ ఖమాప్లుతః,
మహేన్ద్రస్య గిరేర్ద్వారమావృత్య సుసమాశ్రితః. 12

ప్ర. అ. తాత=తండ్రీ, అహమ్=నేను, ఆమిషార్థీ=మాంసమును కోరుచున్న వాడనై, యథాకాలమ్=కాలానుసారముగా, మహేన్ద్రస్య గిరేః= మహేంద్రపర్వతము యొక్క, ద్వారమ్=ద్వారమును, ఆవృత్య=కప్పి, సుసమాశ్రితః=బాగుగా ఆశ్రయించి ఉంటిని.

తా. తండ్రీ! నేను ప్రతిదినమునందు వలె మాంసముకొరకై ఆకాశమునకు ఎగిరి, మహేంద్రపర్వతద్వారమును ఆవరించి స్థిరముగా నిలచితిని. 12

మూ. తత్ర సత్త్వసహస్రాణాం సాగరాన్తరచారిణామ్,
పన్థానమేకోఽ ధ్యవసం సంనిరోద్ధుమవాఙ్ముఖః. 13

ప్ర. అ. తత్ర=అక్కడ, సాగరాన్తరచారిణామ్=సాగరమధ్యమునందు సంచరించు, సత్త్వసహస్రాణామ్=వేలకొలది జంతువులయొక్క, పన్థానమ్= మార్గమును, సంనిరోద్ధుమ్=అడ్డుకొనుటకు, ఏకః=నేనొక్కడను, అవాఙ్ముఖః=క్రిందికి ముఖము గలవాడనై, అధ్యవసమ్=నిలచితిని.

తా. అక్కడ నేనొక్కడనే తల క్రిందికి వంచి సముద్రములో సంచరించు వేలకొలది జంతువుల మార్గమును అడ్డుకొనుటకై నిలచితిని. 13

మూ. తత్ర కశ్చిన్మయా దృష్టః సూర్యోదయసమప్రభామ్,
స్త్రియమాదాయ గచ్ఛన్వై భిన్నాఞ్జనచయోపమః. 14

ప్ర. అ. సూర్యోదయసమప్రభామ్=సూర్యోదయముతో సమానమైన కాంతిగల, స్త్రియమ్=స్త్రీని, ఆదాయ=గ్రహించి, గచ్ఛన్=వెళ్లుచున్న, భిన్నాఞ్జన చయోపమః=భిన్నమైన కాటుకరాశి వంటి, కశ్చిత్=ఒకానొకడు, మయా=నాచేత, తత్ర=అక్కడ, దృష్టః=చూడబడినాడు.

తా. అక్కడ కదల్చిన కాటుకరాశివలె ఉన్న ఒకడు సూర్యోదయముతో సమానమైన కాంతి గల ఒక స్త్రీని తీసుకొని పోవుచు నాకు కనబడినాడు.14

మూ. సోఽహమభ్యవహారార్థం తౌ దృష్ట్వా కృతనిశ్చయః,
తేన సామ్నా వినీతేన పన్థానమనుయాచితః. 15

ప్ర. అ.సః అహమ్=అట్టి నేను, తౌ=వారిద్దరిని, దృష్ట్వా=చూచి, అభ్యవ హారార్థమ్=ఆహారముకొరకు, కృతనిశ్చయః=చేయబడిన నిశ్చయము కలవాడను అయితిని. వినీతేన=వినయవంతుడైన, తేన=వానిచేత, సామ్నా= సామముతో, పన్థానమ్=మార్గమును, అనుయాచితః=యాచింపబడితిని.

తా. నేను వారిద్దరిని చూచి ఆహారముగా గ్రహింపవలెనని నిశ్చయము చేసుకొని ఉండగా ఆతడు వినయపూర్వకముగా బ్రతిమాలుచు మార్గమును ఇమ్మని నన్ను ప్రార్థించెను. 15

మూ. న హి సామోపపన్నానాం ప్రహర్తా విద్యతే భువి,
నీచేష్వపి జనః కశ్చిత్కిమఙ్గ బత మద్విధః. 16

ప్ర. అ. సామోపపన్నానామ్=సామముతో కూడిన వారికి, (ని), ప్రహర్తా= కొట్టెడు, జనః=జనుడు, నీచేష్వపి=నీచులలో కూడ, కశ్చిత్=ఎవ్వడు, భువి=భూమి యందు, న హి=ఉండడు కదా ! మద్విధః=నావంటివాడు, కిమఙ్గ=ఏమి చెప్పవలెను. బత !=ఆహా !

తా. బ్రతిమాలుకొనుచున్న వారిని చంపువా డెవ్వడు ఈ భూమియందు నీచులలో కూడ ఉండడు. ఇక నావంటి వాని మాట చెప్పవలెనా ? 16

మూ. స యాతస్తేజసా వ్యోమ సంక్షిపన్నివ వేగితః,
అథాఽహం ఖేచరైర్భూతైరభిగమ్య సభాజితః. 17

ప్ర. అ.సః=అతడు, వేగితః=వేగము గలవాడై, తేజసా=తేజస్సుచేత, వ్యోమ=ఆకాశమును, సంక్షిపన్నివ=చిన్నదిగా చేయుచున్న వాడు వలె, యాతః=వెళ్లి పోయినాడు. అథ=అటుపిమ్మట, అహమ్=నేను, ఖేచరైః= ఆకాశమునందు సంచరిం చుచున్న, భూతైః=ప్రాణులచేత, అభిగమ్య=సమీపించి, సభాజితః=గౌరవించబడితిని.

తా. అతడు తేజస్సుచేత ఆకాశమును చిన్నదిగా చేయుచున్నాడా అన్నట్లు వేగముగా వెళ్లిపోయెను. అపుడు అక్కడ నున్న ఆకాశములో సంచరించు భూతములు నా దగ్గరకు వచ్చి నన్ను ప్రశంసించినవి. 17

మూ. దిష్ట్యా జీవతి సీతేతి అబ్రువన్మాం మహర్షయః,
కథఞ్చిత్సకళత్రోఽసౌ గతస్తే స్వస్త్యసంశయమ్. 18

ప్ర. అ. సీతా=సీత, దిష్ట్యా=దైవవశముచేత, జీవతి=జీవించి యున్నది. అసౌ=ఇతడు, సకళత్రః=రక్షింపదగిన వ్యక్తితో కూడినవాడై, కథఞ్చిత్= ఎట్లో, గతః=వెళ్లినాడు. తే=నీకు, అసంశయమ్=నిస్సంశయముగా, స్వస్తి=క్షేమము,

ఇతి=అని, మహర్షయః=మహర్షులు, మామ్= నన్ను గూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. "దైవవశముచేత సీత జీవించి యున్నది. రక్షింపదగిన వ్యక్తితో కూడ ఈతడు ఎట్లో తప్పించుకొని వెళ్లినాడు. నిస్సంశయముగా నీకు క్షేమ మగును" అని ఆ మహర్షులు నాతో పలికిరి. 18

మూ. ఏవ ముక్తస్తతోఽహం తైః సిద్ధైః పరమశోభనైః,
స చ మే రావణో రాజా రక్షసాం ప్రతివేదితః. 19
హరన్ దాశరథేర్భార్యాం రామస్య జనకాత్మజామ్,
భ్రష్టాభరణకౌశేయాం శోకవేగపరాజితామ్. 20
రామలక్ష్మణయోర్నామ క్రోశన్తీం ముక్తమూర్ధజామ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అహమ్=నేను, పరమశోభనైః=మిక్కిలి ప్రకాశించుచున్న, సిద్ధైః=సిద్ధులచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః= పలుకబడితిని. దాశరథేః=దశరథకుమారుడైన, రామస్య=రామునియొక్క, భార్యామ్=భార్య, జనకాత్మజామ్=జనకుని కూతురు, భ్రష్టాభరణకౌశేయామ్=జారిపోయిన ఆభరణములు పట్టువస్త్రములు కలది, శోకవేగపరాజితామ్=శోకముయొక్క వేగముచేత ఓడింపబడినది, రామలక్ష్మణయోః= రామలక్ష్మణులయొక్క, నామ= పేరును, క్రోశన్తీమ్=గ్రహించి అరచుచున్నది, ముక్తమూర్ధజామ్=విడిపోయిన కేశములు గలదియైన ఆమెను, హరన్= హరించుచున్న, సః=అతడు, రక్షసామ్=రాక్షసులయొక్క, రాజా=రాజైన, రావణః=రావణుడుగా, ప్రతివేదితః=తెలుపబడినాడు.

తా. అధికముగా ప్రకాశించుచున్న ఆ సిద్ధులు కూడ నాతో అట్లే పలికిరి. దశరథకుమారుడైన రాముని భార్య, జనకుని కూతురు, జారిపోయిన ఆభరణములు పట్టువస్త్రములు కలదై, దుఃఖవేగముచేత బాధపడుచు విడిపోయిన కేశపాశముతో రామలక్ష్మణుల పేర్లను ఉచ్చరించుచు ఏడ్చుచున్న ఆ స్త్రీని హరించుచున్నవాడు రాక్షసరాజైన రావణుడు అని కూడ వారు నాకు చెప్పిరి.

మూ. ఏష కాలాత్యయస్తాత ఇతి వాక్యవిదాం వరః,
ఏతదర్థం సమగ్రం మే సుపార్శ్వః ప్రత్యవేదయత్. 21

ప్ర. అ. తాత !=తండ్రీ ! ఏషః=ఇదియే, కాలాత్యయః=కాలము గడచిపోవుట (ఆలస్యము), ఇతి=అని, వాక్యవిదామ్=వాక్యవేత్తలలో, వరః= శ్రేష్ఠుడైన, సుపార్శ్వః=సుపార్శ్వుడు, ఏతదర్థమ్=ఈ విషయమును, సమగ్రమ్=పూర్తిగా, మే=నాకు, ప్రత్యవేదయత్=తెలిపెను.

తా. "తండ్రీ ! ఆలస్యమునకు ఇదియే కారణము " అని వాక్యవేత్తలలో శ్రేష్ఠుడైన సుపార్శ్వుడు ఆ విషయము నంతను నాకు తెలిపెను. 21

మూ. తచ్ఛ్రుత్వాపి హి మే బుద్ధిర్నాసీత్కాచిత్పరాక్రమే,
అపక్షో హి కథం పక్షీ కర్మ కిఞ్చిత్సమారభేత్. 22

ప్ర. అ. తత్=దానిని, శ్రుత్వాఽపి=విని కూడ, మే=నాకు, పరాక్రమే=పరాక్రమము విషయమున, కాచిత్=ఏమియు, బుద్ధిః=బుద్ధి, నాసీత్=కలుగలేదు. అపక్షః=రెక్కలు లేని, పక్షీ=పక్షి, కిఞ్చిత్ కర్మ=ఏ కర్మ యైనను, కథమ్=ఎట్లు, సమారభేత్=ఆరంభించును ?

తా. ఆ విషయము విన్న పిమ్మట కూడ నాకు పరాక్రమము చూపవలెనను ఆలోచన కలుగలేదు. రెక్కలు లేని పక్షి ఏమి చేయగలదు ? 22

మూ. యత్తు శక్యం మయా కర్తుం వాగ్బుద్ధిగుణవర్తినా,
శ్రూయతాం తత్ర వక్ష్యామి భవతాం పౌరుషాశ్రయమ్. 23

ప్ర. అ. వాగ్బుద్ధిగుణవర్తినా=వాక్కునందు, బుద్ధిగుణమునందు ఉన్న, మయా=నాచేత, యత్=ఏది, కర్తుమ్=చేయుటకు, శక్యమ్= శక్యమైనదో, భవతామ్=మీయొక్క, పౌరుషాశ్రయమ్=పౌరుషము ఆశ్రయముగా గల విషయమును, తత్ర=ఆ కార్యమునందు, వక్ష్యామి=చెప్పెదను. శ్రూయతామ్=వినబడుగాక !

తా. నేను నా బుద్ధిబలముచేతను, మాటచేతను చేయదగిన ఉపకారము చేసెదను. అది మీ పౌరుషముపై ఆధారపడి ఉన్నది. దానిని చెప్పెదను వినుడు. 23

మూ. వాఙ్మతిభ్యాం హి సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః,
యద్ధి దాశరథేః కార్యం మమ తన్నాత్ర సంశయః. 24

ప్ర. అ. సర్వేషామ్=సమస్తమైన, వః=మీకు, వాఙ్మతిభ్యామ్= మాటచేతను, బుద్ధిచేతను, ప్రియమ్=ప్రియమును, కరిష్యామి=చేసెదను. యత్=ఏది, దాశరథేః=రామునియొక్క, కార్యమ్=కార్యమో, తత్= అది, మమ=నాదే. అత్ర=దీనియందు, సంశయః=సంశయము, న= లేదు.

తా. మీ అందరికి నేను నా మాటచేతను, నా బుద్ధిచేతను, ప్రియము చేసెదను. రాముని కార్యము నా కార్యమే; సందేహము లేదు. 24

మూ. తద్భవన్తో మతిశ్రేష్ఠా బలవన్తో మనస్వినః,
ప్రహితాః కపిరాజేన దేవైరపి దురాసదాః. 25

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, మతిశ్రేష్ఠాః=బుద్ధిచేత శ్రేష్ఠులు, మనస్వినః=మానవంతులు, బలవన్తః=బలవంతులు, దేవైరపి=దేవతలచేత కూడ, దురాసదాః=ఎదిరింప శక్యము గానివారు అయిన, భవన్తః=మీరు, కపిరాజేన=సుగ్రీవునిచేత, ప్రహితాః=పంపబడినారు.

తా. గొప్ప బుద్ధి గలవారు, బలవంతులు, ఉత్తమమైన మనస్సు గలవారు, దేవతలచేత కూడ ఎదిరింప శక్యము గానివారు అయిన మిమ్ములను సుగ్రీవుడు పంపినాడు. 25

మూ. రామలక్ష్మణబాణాశ్చ నిశితాః కఙ్కపత్రిణః,
త్రయాణామపి లోకానాం పర్యాప్తాస్త్రాణనిగ్రహే. 26

ప్ర. అ. కఙ్కపత్రిణః=గ్రద్దరెక్కలు గలవి, నిశితాః=వాడిగా ఉన్నవి అయిన, రామలక్ష్మణబాణాశ్చ=రామలక్ష్మణుల బాణములు, త్రయాణామ్=మూడు, లోకానామ్=లోకములయొక్క, త్రాణనిగ్రహే=రక్షణమునందు, నిగ్రహించుటయందు, పర్యాప్తాః=చాలునవి.

తా. వాడియై గ్రద్దరెక్కలు గట్టిన రామలక్ష్మణుల బాణములు మూడు లోకములను రక్షించుటకు, నిగ్రహించుటకు సమర్థమైనవి. 26

మూ. కామం ఖలు దశగ్రీవస్తేజోబలసమన్వితః,
భవతాం తు సమర్థానాం న కిఞ్చిదపి దుష్కరమ్. 27

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, తేజోబలసమన్వితః ఖలు కామమ్= తేజో బలములతో కూడినవాడే. తు=కాని, సమర్థానామ్=సమర్థులైన, భవతామ్=మీకు, దుష్కరమ్=చేయ శక్యముగానిది, కిఞ్చిదపి=ఏదియు, న=లేదు.

తా. రావణుడు తేజోబలములు గలవాడే కావచ్చును ; అయినను సమర్థులైన మీరు చేయజాలని పని లేదు. 27

మూ. తదలం కాలసఙ్గేన క్రియతాం బుద్ధినిశ్చయః,
న హి కర్మసు సజ్జన్తే బుద్ధిమన్తో భవద్విధాః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ.తత్=ఆ కారణమువలన, కాలసఙ్గేన=విలంబముచేత, అలమ్= చాలును. బుద్ధినిశ్చయః=బుద్ధియొక్క నిశ్చయము, క్రియతామ్=చేయబడుగాక! భవద్విధాః=మీవంటి, బుద్ధిమన్తః=బుద్ధిమంతులు, కర్మసు= పనులయందు, న సజ్జన్తే హి=ఆలస్యము చేయరు కదా !

తా. అందుచే ఇంక ఆలస్యము చేయవద్దు. మీ బుద్ధితో కార్యమును నిశ్చయింపుడు. మీవంటి బుద్ధిమంతులు పనులలో ఆలస్యము చేయరు కదా !28

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
యేబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ షష్టితమః సర్గః

[సంపాతి తన వృత్తాంతమును చెప్పుట]

మూ. తతః కృతోదకం స్నాతం తం గృధ్రం హరియూథపాః,
ఉపవిష్టా గిరౌ రమ్యే పరివార్య సమన్తతః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరియూథపాః=వానరసేనానాయకులు, కృతోదకమ్=చేయబడిన జలతర్పణములు గల, స్నాతమ్=స్నానముచేసిన, తం గృధ్రమ్=ఆ సంపాతిని, సమన్తతః=అన్ని వైపుల, పరివార్య=చుట్టి, రమ్యే=సుందరమైన, గిరౌ=పర్వతమునందు, ఉపవిష్టాః=కూర్చుండిరి.

తా. పిమ్మట ఆ వానరనాయకులందరు జటాయువునకు జలతర్పణములు చేసి, స్నానము చేసిన ఆ సంపాతి చుట్టూ రమ్యమైన ఆ పర్వతము మీద కూర్చుండిరి. 1

మూ. తమఙ్గదముపాసీనం తైః సర్వైర్హరిభి ర్వృతమ్,
జనితప్రత్యయో హర్షాత్సమ్పాతిః పునరబ్రవీత్. 2

ప్ర. అ. తైః=ఆ, సర్వైః=సమస్తమైన, హరిభిః=వానరులతో, వృతమ్=కూడిన, ఉపాసీనమ్=కూర్చొనియున్న, తమ్ అఙ్గదమ్= ఆ అంగదుని గూర్చి, జనితప్రత్యయః=పుట్టిన నమ్మకము గల, సమ్పాతిః=సంపాతి, హర్షాత్=సంతోషమువలన, పునః=తిరిగి, అబ్రవీత్=పలికెను.

తా. నమ్మకము ఏర్పడిన ఆ సంపాతి సంతోషించుచు, ఆ వానరులందరితో కూడి కూర్చొని ఉన్న అంగదునితో మరల ఇట్లు పలికెను. 2

మూ. కృత్వా నిశ్శబ్దమేకాగ్రాః శృణ్వన్తు హరయో మమ,
తథ్యం సఙ్కీర్తయిష్యామి యథా జానామి మైథిలీమ్. 3

ప్ర. అ. హరయః=వానరులారా ! మైథిలీమ్=సీతను గూర్చి, యథా= ఎట్లు, జానామి=ఎరుగుదునో, తథ్యమ్=యథార్థమును, సంకీర్తయిష్యామి= చెప్పెదను. నిశ్శబ్దమ్=నిశ్శబ్దమును, కృత్వా=చేసి, ఏకాగ్రాః= ఏకాగ్రచిత్తులై, మమ=నాకు, శృణ్వన్తు=వినెదరుగాక !

తా. వానరులారా ! సీతను గూర్చి నాకు ఎట్లు తెలియునో, యథార్థముగా చెప్పెదను. మీరు నిశ్శబ్దముగా ఉండి ఏకాగ్రచిత్తముతో వినుడు. 3

మూ. అస్య విన్ధ్యస్య శిఖరే పతితోఽస్మి పురానఘ,
సూర్యతాపపరీతాఙ్గో నిర్దగ్ధః సూర్యరశ్మిభిః. 4

ప్ర. అ. అనఘ =దోషములు లేనివాడా ! పురా=పూర్వము, సూర్యరశ్మిభిః=సూర్యకిరణములచేత, నిర్దగ్ధః=కాల్చబడినవాడనై, సూర్యతాపపరీతాఙ్గః=సూర్యుని వలన ఏర్పడిన తాపముతో నిండిన శరీరము కలవాడనై, అస్య=ఈ, విన్ధ్యస్య=వింధ్యపర్వతముయొక్క, శిఖరే=శిఖరమునందు, పతితః అస్మి=పడితిని.

తా. ఓ ! దోషములు లేనివాడా ! పూర్వము నేను సూర్యకిరణములచేత దహింపబడి, సూర్యుని వేడితో నిండిన శరీరము కలవాడనై ఈ వింధ్య శిఖరముమీద పడితిని. 4

మూ. లబ్ధసంజ్ఞస్తు షడ్రాత్రాద్వివశో విహ్వలన్నివ,
వీక్షమాణో దిశః సర్వా నాభిజానామి కిఞ్చన. 5

ప్ర. అ. షడ్రాత్రాత్=ఆరు రోజులపిమ్మట, లబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞ కలవాడనై, విహ్వలన్నివ=వ్యాకులుడనై, సర్వాః=సమస్తమైన, దిశః= దిక్కులను, వీక్షమాణః=చూచుచున్నవాడనై, కిఞ్చన=దేనిని, నాభిజానామి= గుర్తించలేదు.

తా. నాకు ఆరు దినముల పిమ్మట సంజ్ఞ వచ్చినది. నేను వివశుడనై వ్యాకులత్వము చెంది, ప్రతిదిక్కును చూచుచు, దేనినీ గుర్తింపజాలకపోతిని. 5

మూ. తతస్తు సాగరాన్ శైలాన్నదీః సర్వాః సరాంసి చ,
వనాని చ ప్రదేశాంశ్చ నిరీక్ష్య మతిరాగతా. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సాగరాన్=సముద్రములను, శైలాన్= పర్వతములను, సర్వాః నదీః=సమస్తమైన నదులను, సరాంసి చ=సరస్సులను, వనాని చ=వనములను, ప్రదేశాంశ్చ=ప్రదేశములను, నిరీక్ష్య=చూచి, మతిః=బుద్ధి, ఆగతా=వచ్చినది.

తా. సముద్రములు, పర్వతములు, నదులు, సరస్సులు, వనములు చుట్టుప్రక్కన ఉన్న ప్రదేశములు చూచిన పిమ్మట నాకు తెలివి వచ్చినది. 6

మూ. హృష్టపక్షిగణాకీర్ణః కన్దరోదరకూటవాన్,
దక్షిణస్యోదధేస్తీరే విన్ధ్యోఽయమితి నిశ్చితః. 7

ప్ర. అ. హృష్టపక్షిగణాకీర్ణః=సంతోషించిన పక్షిగణములతో కూడినది, కన్దరోదరకూటవాన్= గుహామధ్యములు, శిఖరములు కలది అయిన, అయమ్=ఇది, దక్షిణస్య=దక్షిణమైన, ఉదధేః=సముద్రముయొక్క, తీరే=తీరమునందున్న, విన్ధ్యః ఇతి=వింధ్యపర్వతము అని, నిశ్చితః=నిశ్చయించుకుంటిని.

తా. సంతోషించుచున్న పక్షిగణములతో వ్యాప్తమై గుహామధ్యములు,

శిఖరములు గల ఈ పర్వతము దక్షిణసముద్రతీరమందలి వింధ్య పర్వతము అని నిశ్చయించుకుంటిని. 7

మూ. ఆసీచ్చాత్రాశ్రమం పుణ్యం సురైరపి సుపూజితమ్,
ఋషిర్నిశాకరో నామ యస్మిన్నుగ్రతపాభవత్. 8

ప్ర. అ. అత్ర=ఇక్కడ, సురైరపి=దేవతలచేత కూడ, సుపూజితమ్= బాగా పూజింపబడిన, ఆశ్రమమ్=ఆశ్రమము, ఆసీత్=ఉండెను. యస్మిన్= దేనియందు, నిశాకరో నామ=నిశాకరు డను పేరు గల, ఉగ్రతపాః= ఉగ్రమైన తపస్సు గల, ఋషిః=ఋషి, అభవత్=ఉండెనో.

తా. ఆ పర్వతము మీద దేవతలచేత కూడ పూజింపబడిన, పుణ్యమైన ఆశ్రమము ఉండెను. ఆ ఆశ్రమములో ఉగ్రమైన తపస్సు గల, నిశాకరుడు అను ఋషి ఉండెను. 8

మూ. అష్టౌ వర్షసహస్రాణి తేనాస్మిన్నృషిణా వినా,
వసతో మమ ధర్మజ్ఞే స్వర్గతే తు నిశాకరే. 9

ప్ర. అ. ధర్మజ్ఞే=ధర్మములను ఎరిగిన, నిశాకరే=నిశాకరుడు, స్వర్గతే= స్వర్గస్థు డగుచుండగా, తేన=ఆ, ఋషిణా వినా=ఋషి లేకుండగా, అస్మిన్= ఈ పర్వతమునందు, వసతః=నివసించుచున్న, మమ=నాకు, అష్టౌ= ఎనిమిది, వర్షసహస్రాణి=సంవత్సరముల సహస్రములు గడచినవి.

తా. ధర్మములు తెలిసిన ఆ నిశాకరుడు స్వర్గస్థుడైన పిమ్మట నేను ఈ పర్వతముపై ఎనిమిది వేల సంవత్సరములనుండి నివసించుచున్నాను. 9

మూ. అవతీర్య చ విన్ధ్యాగ్రాత్కృచ్ఛ్రేణ విషమాచ్ఛనైః,
తీక్ష్ణదర్భాం వసుమతీం దుఃఖేన పునరాగతః. 10

ప్ర. అ. విషమాత్=విషమముగానున్న, విన్ధ్యాగ్రాత్=వింధ్యపర్వతశిఖరము నుండి, శనైః=మెల్లగా, కృచ్ఛ్రేణ=కష్టముతో, అవతీర్య=దిగి, తీక్ష్ణదర్భామ్=తీక్ష్ణ మైన దర్భలు గల, వసుమతీమ్=భూమిని, దుఃఖేన= దుఃఖముతో, పునః=మరల, ఆగతః=పొందితిని.

తా. విషమమైన ఆ వింధ్యపర్వతశిఖరమునుండి అతికష్టముగా మెల్లగా దిగి, తీక్ష్ణమైన దర్భలతో నిండి ఉన్న భూమిని మిక్కిలి శ్రమతో చేరితిని. 10

మూ. తమృషిం ద్రష్టుకామోఽస్మి దుఃఖేనాభ్యాగతో భృశమ్,
జటాయుషా మయా చైవ బహుశోఽధిగతో హి సః. 11

ప్ర. అ.భృశమ్=మిక్కిలి, దుఃఖేన=దుఃఖముచేత, అభ్యాగతః= పొందబడిన నేను, తమ్ ఋషిమ్=ఆ ఋషిని, ద్రష్టుకామః= చూడవలెనను కోరిక కలవా

డను, అస్మి=అయితిని. సః=అతడు, జటాయుషా=జటాయువుచేతను, మయా చైవ=నాచేతను, బహుశః= అనేకపర్యాయములు, అధిగతో హి=పొందబడెను గదా !

తా. మిక్కిలి దుఃఖముతో కూడిన నాకు ఆ ఋషిని చూడవలె నను కోరిక పుట్టెను. పూర్వము నేను, జటాయువు అనేక పర్యాయములు ఆయన దర్శనము చేసి యుంటిమి. 11

మూ. తస్యాశ్రమపదాభ్యాశే వవుర్వాతాః సుగన్ధినః,
వృక్షో నాపుష్పితః కశ్చిదఫలో వా న దృశ్యతే. 12

ప్ర. అ. తస్య=ఆ ఋషియొక్క, ఆశ్రమపదాభ్యాశే=ఆశ్రమసమీపమునందు, సుగన్ధినః=సువాసన గల, వాతాః=వాయువులు, వవుః=వీచినవి. అపుష్పితః=పుష్పించని, వృక్షః=వృక్షము, కశ్చిత్=ఏదియు, న దృశ్యతే=కనబడుటలేదు. అఫలో వా=ఫలము లేనిది గాని, న= కనబడుటలేదు.

తా. ఆ ఋషీశ్వరుని ఆశ్రమసమీపమునందు, సుగంధముతో కూడిన వాయువులు వీచుచుండెను. పుష్పములు లేని వృక్షముగాని, ఫలములు లేని వృక్షము గాని ఏదీ కనబడకుండెను. 12

మూ. ఉపేత్య చాశ్రమం పుణ్యం వృక్షమూలముపాశ్రితః,
ద్రష్టుకామః ప్రతీక్షే చ భగవన్తం నిశాకరమ్. 13

ప్ర. అ. పుణ్యమ్=పవిత్రమైన, ఆశ్రమమ్=ఆశ్రమమును, ఉపేత్య=చేరి, వృక్షమూలమ్=వృక్షముయొక్క మూలమును, ఉపాశ్రితః=ఆశ్రయించినవాడనై, భగవన్తమ్=భగవంతుడైన, నిశాకరమ్=నిశాకరుణ్ణి, ద్రష్టుకామః= చూడవలె నను కోరిక కలవాడనై, ప్రతీక్షే చ=నిరీక్షించుచున్నాను. (నిరీక్షించితిని.)

తా. ఆ పవిత్రమైన ఆశ్రమమును చేరి, పూజ్యుడైన నిశాకరుని చూడవలె నను కోరికతో, ఒక వృక్షమూలమునందు కూర్చొని నిరీక్షించితిని. 13

మూ. అథ పశ్యామి దూరస్థమృషిం జ్వలితతేజసమ్,
కృతాభిషేకం దుర్ధర్షముపావృత్తముదఙ్ముఖమ్. 14

ప్ర. అ. అథ=అటుపిమ్మట, కృతాభిషేకమ్=చేయబడిన స్నానము గలవాడు, ఉపావృత్తమ్=తిరిగి వచ్చినవాడు, దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము గానివాడు, ఉదఙ్ముఖమ్=ఉత్తరాభిముఖుడు, జ్వలితతేజసమ్=ప్రజ్వలించుచున్న తేజస్సు గలవాడు అయిన, దూరస్థమ్=దూరమునందున్న, ఋషిమ్=ఋషిని, పశ్యామి= చూచుచున్నాను. (చూచితిని)

తా. పిమ్మట ప్రజ్వలించుచున్న తేజస్సు గల ఎదిరింప శక్యముకాని ఆ ఋషీశ్వరుడు స్నానము చేసి ఉత్తరాభిముఖుడై వచ్చుచుండగా దూరమునందు

చూచితిని. 14

మూ. తమృక్షాః సృమరా వ్యాఘ్రాః సింహా నానాసరీసృపాః,
పరివార్యోపగచ్ఛన్తి ధాతారం ప్రాణినో యథా. 15

ప్ర. అ. ప్రాణినః=ప్రాణులు, ధాతారం యథా=బ్రహ్మదేవునివలె, తమ్=ఆతనిని, పరివార్య=చుట్టిన, ఋక్షాః=భల్లూకములు, సృమరాః= సృమరములు, వ్యాఘ్రాః=పెద్దపులులు, సింహాః=సింహములు, నానాసరీసృపాః=అనేకవిధములైన సర్పాదులు, ఉపగచ్ఛన్తి=అనుసరించి వచ్చుచుండెను.

తా. ఎలుగుబంట్లు, సృమరములు, పెద్దపులులు, సింహములు, అనేకవిధ ములైన సర్పాదులు, ఆతని చుట్టూ చేరి బ్రహ్మను ప్రాణులు అనుసరించి వచ్చి నట్లు అనుసరించి వచ్చుచుండెను. 15

మూ. తతః ప్రాప్తమృషిం జ్ఞాత్వా తాని సత్త్వాని వై యయుః,
ప్రవిష్టే రాజని యథా సర్వం సామాత్యకం బలమ్. 16

ప్ర. అ. రాజని=రాజు, ప్రవిష్టే=లోనికి ప్రవేశించినవా డగుచుం డగా, సర్వమ్=సమస్తమైన, సామాత్యకమ్=మంత్రులతో కూడిన, బలమ్=సేన, యథా=ఎట్లో, అట్లే, ఋషిమ్=ఆ ఋషిని, ప్రాప్తమ్=ఆశ్రమము చేరిన వానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, తతః=అటుపిమ్మట, తాని=ఆ, సత్త్వాని=జంతువులు, యయుః వై=తిరిగి వెళ్లిపోయినవి.

తా. రాజు లోనికి వెళ్లిన పిమ్మట ఆతని వెంట వచ్చిన అమాత్యాదులతో కూడిన సైన్యము మరలి వెళ్లిపోయినట్లు ఆ ఋషీశ్వరుడు ఆశ్రమములో ప్రవేశించుట చూచి ఆ జంతువులన్నీ వెనుకకు మరలి వెళ్లిపోయెను. 16

మూ. ఋషిస్తు దృష్ట్వా మాం తుష్టః ప్రవిష్టశ్చాశ్రమం పునః,
ముహూర్తమాత్రాన్నిర్గమ్య తతః కార్యమపృచ్ఛత. 17

ప్ర. అ. ఋషిస్తు=ఋషియైతే, మామ్=నన్ను, దృష్ట్వా=చూచి, తుష్టః=సంతోషించినవాడై, ఆశ్రమమ్=ఆశ్రమమును, ప్రవిష్టః= ప్రవేశించినవాడై, తతః=అటుపిమ్మట, ముహూర్తమాత్రాత్= ముహూర్తమాత్రములో, పునః=మరల, నిర్గమ్య=బయటకు వచ్చి, కార్యమ్= కార్యమును, అపృచ్ఛత=అడిగెను.

తా. ఆ ఋషీశ్వరుడు నన్ను చూచి సంతోషించి, ఆశ్రమములోనికి వెళ్లి ముహూర్తమాత్రములో తిరిగి వచ్చి, కార్యమును గూర్చి నన్ను ప్రశ్నించెను. 17

మూ. సౌమ్య వైకల్యతాం దృష్ట్వా రోమ్ణాం తే నావగమ్యతే,
అగ్నిదగ్ధావిమౌ పక్షౌ ప్రాణాశ్చాపి శరీరకే. 18

ప్ర. అ. సౌమ్య=ఓ ! సౌమ్యుడా, తే=నీయొక్క, రోమ్ణామ్= రోమ

ములయొక్క, వైకల్యతామ్=వికలత్వమును, దృష్ట్వా=చూచి, నావగమ్యతే=గుర్తింపబడుటలేదు. ఇమౌ=ఈ, పక్షౌ=రెక్కలు, అగ్నిదగ్ధౌ=అగ్నిచేత కాల్చబడినవి. ప్రాణాశ్చాపి=ప్రాణములు కూడ, శరీరకే=శరీరమునందు మాత్రమే ఉన్నవి.

తా. ఓ ! సౌమ్యుడా ! నీ శరీరముపై రోమములు వికారముగా ఉండుటచే నిన్ను గుర్తించుటకు శక్యము కాకున్నది. నీ రెండు రెక్కలు అగ్నికి కాలిపోయినవి. ప్రాణములు శరీరమునందు మాత్రమే ఉన్నవి. 18

మూ. గృధ్రౌ ద్వౌ దృష్టపూర్వౌ మే మాతరిశ్వసమౌ జవే,
గృధ్రాణాం చైవ రాజానౌ భ్రాతరౌ కామరూపిణౌ. 19

ప్ర. అ. గృధ్రాణామ్=గృధ్రములకు, రాజానౌ=రాజులు, జవే=వేగమునందు, మాతరిశ్వసమౌ=అగ్నితో సమానులు, కామరూపిణౌ= స్వేచ్ఛారూపము గలవారు, భ్రాతరౌ=సోదరులు, అయిన, ద్వౌ=ఇద్దరు, గృధ్రౌ=గృధ్రములు అయిన మీరు, మే=నాకు, దృష్టపూర్వౌ= పూర్వమునందు చూడబడినవారు.

తా. వేగములో వాయువుతో సమానులు, గృధ్రములకు రాజులు, ఇచ్ఛానుసారము రూపములు ధరింపదగినవారు, సోదరులు, అయిన మిమ్ములను ఇద్దరిని నేను పూర్వము చూచి యున్నాను. 19

మూ. జ్యేష్ఠో హి త్వం తు సమ్పాతే జటాయురనుజస్తవ,
మానుషం రూపమాస్థాయ గృహ్ణీతాం చరణౌ మమ. 20

ప్ర. అ. సమ్పాతే=ఓ ! సంపాతీ ! త్వమ్=నీవు, జ్యేష్ఠో హి=పెద్దవాడవు కదా. జటాయుః=జటాయువు, తవ=నీయొక్క, అనుజః=తమ్ముడు. మానుషమ్=మనుష్యసంబంధమైన, రూపమ్=రూపమును, ఆస్థాయ= గ్రహించి, మమ=నాయొక్క, చరణౌ=పాదములను, గృహ్ణీతామ్=గ్రహించిరి.

తా. ఓ ! సంపాతీ ! నీవు పెద్దవాడవు కదా ! జటాయువు నీ తమ్ముడు. మీ రిద్దరు మనుష్యరూపము ధరించి నా పాదములకు నమస్కరించితిరి. 20

మూ. కిం తే వ్యాధిసముత్థానం పక్షయోః పతనం కథమ్,
దణ్డోవాఽయం ధృతః కేన సర్వమాఖ్యాహి పృచ్ఛతః. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షష్టితమః సర్గః.

ప్ర. అ. తే=నీకు, వ్యాధిసముత్థానం కిమ్=వ్యాధియొక్క ఆవిర్భావమా? పక్షయోః=రెక్కలయొక్క, పతనమ్=పతనము, కథమ్=ఎట్లు జరిగినది ? కేన= ఎవనిచేత, అయమ్=ఈ, దణ్డః=దండనము, ధృతః వా=విధింపబడినది? పృచ్ఛతః=ప్రశ్నించుచున్న నాకు, సర్వమ్=సమస్తమును, ఆఖ్యాహి= చెప్పుము.

తా. నీ రెక్కలు ఎందువలన పోయినవి ? ఏదైన రోగము వచ్చినదా? లేదా ఎవరైన ఈ విధముగా దండించినారా ? అడుగుచున్న నాకు ఈ విషయము లన్నీ చెప్పుము. 21

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమున కిష్కింధాకాండలో అరువదవ సర్గ సమాప్తము.

# అథ ఏకషష్టితమః సర్గః

*[సంపాతి తన రెక్కలు కాలిపోవుటకు కారణమును నిశాకరునకు చెప్పుట]*

మూ. తతస్తద్దారుణం కర్మ దుష్కరం సహసా కృతమ్,
ఆచచక్షే మునేః సర్వం సూర్యానుగమనం తథా. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సహసా=అనాలోచితముగా, కృతమ్= చేయబడిన, దుష్కరమ్=చేయశక్యముకాని, దారుణమ్=దారుణమైన, తత్ కర్మ=ఆ పనిని, తథా=మరియు, సూర్యానుగమనమ్=సూర్యుని అనుసరించి వెళ్లుటను, సర్వమ్=అంతను, మునేః=మునికి, ఆచచక్షే=చెప్పితిని.

తా. పిమ్మట నేను సాహసపూర్వకముగా చేసిన దారుణమైన చేయ శక్యము గాని ఆ పనిని గూర్చి, సూర్యుని అనుసరించి వెళ్లుటను గూర్చి అన్ని విషయములను ఆ మునికి చెప్పితిని. 1

మూ. భగవన్ వ్రణయుక్తత్వాల్లజ్జయా చాకులేన్ద్రియః,
పరిశ్రాన్తో న శక్నోమి వచనం పరిభాషితమ్. 2

ప్ర. అ. భగవన్=పూజ్యుడా! వ్రణయుక్తత్వాత్=వ్రణములతో కూడిన వాడ నగుటవలనను, లజ్జయా చ=లజ్జచేతను, ఆకులేన్ద్రియః=వ్యాకులములైన ఇంద్రియములు గల, పరిశ్రాన్తః=అలసి ఉన్న నేను, వచనమ్=వచనమును, పరిభాషితుమ్=పలుకుటకు, న శక్నోమి=సమర్థుడను కాను.

తా. ఓ ! మహామునీ ! వ్రణములచేతను, లజ్జచేతను నా ఇంద్రియములు వ్యాకులమై పోయినవి. చాల అలసి యున్నాను. మాటలాడుటకు కూడ శక్తి లేదు. 2

మూ. అహం చైవ జటాయుశ్చ సఙ్ఘర్షాద్గర్వమోహితౌ,
ఆకాశం పతితౌ దూరాజ్జిజ్ఞాసన్తౌ పరాక్రమమ్. 3

ప్ర. అ. అహం చైవ=నేను, జటాయుశ్చ=జటాయువు, గర్వమోహితౌ= గర్వముచేత మోహింపబడినవారమై, పరాక్రమమ్=పరాక్రమమును, జిజ్ఞాసన్తౌ= తెలియగోరుచున్నవారమై, సఙ్ఘర్షాత్=పోటీవలన, దూరాత్=దూరముగా, ఆకాశమ్=ఆకాశమును గూర్చి, పతితౌ=ఎగిరితిమి.

తా. నేను, జటాయువు గర్వముచేత ఒళ్లు తెలియక, మా బలమును తెలుసుకొనవలె నని కోరుచు, పోటీపడుచు సుదూరమైన ఆకాశము మీదికి

ఎగిరితిమి. 3

మూ. కైలాసశిఖరే బద్ధ్వా మునీనామగ్రతః పణమ్,
రవిః స్యాదనుయాతవ్యో యావదస్తం మహాగిరిమ్. 4

ప్ర. అ. కైలాసశిఖరే=కైలాసశిఖరమునందు, మునీనామ్=మునులయొక్క, అగ్రతః=ఎదుట, మహాగిరిమ్=మహాపర్వతమైన, అస్తం యావత్= అస్తాద్రివరకు, రవిః=సూర్యుడు, అనుయాతవ్యః=అనుసరింపదగినవాడు, స్యాత్=అగును అని, పణమ్=పందెమును, బద్ధ్వా=కట్టి, ఆకాశముపై ఎగిరితిమి.

తా. "అస్తాద్రివరకు సూర్యుని అనుసరించి వెళ్లవలెను" అని మేమిద్దరము కైలాసశిఖరముమీద మునుల సమక్షమున పందెము వేసికొని ఆకాశము మీదికి ఎగిరితిమి. 4

మూ. అథావాం యుగపత్ప్రాప్తావపశ్యావ మహీతలే,
రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్. 5

ప్ర. అ. అథ=పిమ్మట, ఆవామ్=మే మిద్దరము, యుగపత్= ఒక్కమారుగా, ప్రాప్తౌ=ఆకాశమును పొందినవారమై, మహీతలే=భూమియందు, రథచక్రప్రమాణాని=రథచక్రము వంటి ప్రమాణము గల, నగరాణి=నగరములను, పృథక్ పృథక్=వేరు వేరుగా, అపశ్యావ=చూచితిమి.

తా. మే మిద్దరము ఒకే సమయమున ఆకాశమునకు ఎగిరి వేలపై చూడగా నగరము లన్నీ వేరు వేరుగా రథచక్రప్రమాణములో కనబడినవి. 5

మూ. క్వ చిద్వాదిత్రఘోషశ్చ క్వ చిద్భూషణనిస్వనః,
గాయన్తీః స్మాఙ్గనా బహ్వీః పశ్యావో రక్తవాససః. 6

ప్ర. అ. క్వచిత్=కొన్నిచోట్ల, వాదిత్రఘోషశ్చ=వాద్యముల ధ్వని క్వచిత్=కొన్ని చోట్ల, భూషణనిస్వనః=భూషణముల ధ్వని వినబడెను. గాయన్తీః=గానము చేయుచున్న, రక్తవాససః=ఎఱ్ఱని వస్త్రములు గల, బహ్వీః=చాలామంది, అఙ్గనాః=స్త్రీలను, పశ్యావః స్మ=చూచితిమి.

తా. కొన్ని చోట్ల వాద్యధ్వని, కొన్ని చోట్ల అలంకారముల ధ్వని వినబడెను. ఎఱ్ఱని వస్త్రములు ధరించి గానము చేయుచున్న చాలమంది స్త్రీలు కనబడిరి.6

మూ. తూర్ణముత్పత్య చాకాశమాదిత్యపదమాస్థితౌ,
ఆవామాలోకయావస్తద్వనం శాద్వలసంస్థితమ్. 7

ప్ర. అ. ఆకాశమ్=ఆకాశమును గూర్చి, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్పత్య=ఎగిరి, ఆదిత్యపదమ్=సూర్యస్థానమును, ఆస్థితౌ= పొందినవారమై, ఆవామ్=మేము, తత్ వనమ్=ఆ వనమును, శాద్వలసంస్థితమ్=బీడు వలె నున్న దానినిగా, ఆలోక

యావః=చూచితిమి.

తా. శీఘ్రముగా ఆకాశముపైకి ఎగిరి సూర్యుని సమీపమును చేరిన మాకు అరణ్యము పచ్చిక బీడు వలె కనబడెను. 7

మూ. ఉపలైరివ సఞ్ఛన్నా దృశ్యతే భూః శిలోచ్చయైః,
ఆపగాభిశ్చ సంవీతా సూత్రైరివ వసున్ధరా. 8

ప్ర. అ. భూః=భూమి, శిలోచ్చయైః=పర్వతములతో, ఉపలైః=రాళ్లచేత, సఞ్ఛన్నా ఇవ=కప్పబడినది వలె, దృశ్యతే=కనబడెను. ఆపగాభిః= నదులతో కూడిన, వసున్ధరా=భూమి, సూత్రైః=త్రాళ్లచేత, సంవీతా ఇవ= గ్రుచ్చబడినది వలె కనబడెను.

తా. పర్వతములతో కూడిన భూమి రాళ్లు కప్పినట్లుండెను. నదులతో కూడిన భూమి దారములు పరచి నట్లు కనబడెను. 8

మూ. హిమవాంశ్చైవ విన్ధ్యశ్చ మేరుశ్చ సుమహాగిరిః,
భూతలే సమ్ప్రకాశన్తే నాగా ఇవ జలాశయే. 9

ప్ర. అ. హిమవాంశ్చైవ=హిమవత్పర్వతము, విన్ధ్యశ్చ=వింధ్యపర్వతము, సుమహాగిరిః=మహాపర్వతమైన, మేరుశ్చ=మేరుపర్వతము, భూతలే= భూమిమీద, జలాశయే=సరస్సునందు, నాగా ఇవ=ఏనుగులు వలె, సమ్ప్రకాశన్తే=ప్రకాశించుచుండెను.

తా. మహాపర్వతములైన హిమవత్పర్వతము, వింధ్యపర్వతము, మేరుపర్వతము, భూమిమీద సరస్సులోని ఏనుగులు వలె ప్రకాశించుచుండెను. 9

మూ. తీవ్రః స్వేదశ్చ ఖేదశ్చ భయం చాపీత్తదావయోః,
సమావిశత మోహశ్చ తతో మూర్ఛా చ దారుణా. 10

ప్ర. అ. తదా=అపుడు, ఆవయోః=మా ఇద్దరికి, తీవ్రః=తీవ్రమైన, స్వేదశ్చ=చెమట, ఖేదశ్చ=దుఃఖము, భయం చ=భయము, ఆసీత్= ఆయెను. మోహః=మోహము, దారుణా=భయంకరమైన, మూర్ఛా చ= మూర్ఛయు, సమావిశత=కలిగెను.

తా. అపుడు మా ఇద్దరికి తీవ్రమైన చెమట, దుఃఖము, భయము కలిగెను. చిత్తమునకు భ్రాన్తి, దారుణమైన మూర్ఛ కూడ కలిగెను. 10

మూ. న చ దిగ్ జ్ఞాయతే యామ్యా న చాగ్నేయీ న వారుణీ,
యుగాన్తే నియతో లోకో హతో దగ్ధ ఇవాగ్నినా. 11

ప్ర. అ. యామ్యా దిక్=దక్షిణదిక్కు, న చ జ్ఞాయతే=తెలియబడలేదు. ఆగ్నేయీ=ఆగ్నేయదిక్కు, న=తెలియబడలేదు. వారుణీ=పశ్చిమదిక్కు, న=తెలియబడలేదు. లోకః=లోకము, యుగాన్తే=యుగాన్తమునందు, అగ్నినా=అగ్నిచేత,

దగ్ధః=కాల్చబడినదై, హత ఇవ=నశింపచేయబడినది వలె, నియతః=నిలిచి యుండెను.

తా. మాకు అప్పుడు దక్షిణదిక్కు గాని, ఆగ్నేయము గాని, పశ్చిమము గాని తెలియలేదు. లోకమంతా ప్రళయకాలమునందు అగ్నిచే కాల్చబడి నశింపచేయబడినట్లు కనిపించెను.
11

మూ. మనశ్చ మే హతం భూయశ్చక్షుః ప్రాప్య తు సంశ్రయమ్,
యత్నేన మహతా హ్యస్మిన్మనః సన్ధాయ చక్షుషీ. 12
యత్నేన మహతా భూయో భాస్కరః ప్రతిలోకితః,
తుల్యః పృథ్వీప్రమాణేన భాస్కరః ప్రతిభాతి నౌ. 13

ప్ర. అ. మే=నాయొక్క, మనః=మనస్సు, హతమ్=పీడింపబడినది, చక్షుః=నేత్రమును, సంశ్రయమ్=ఆశ్రయముగా, ప్రాప్య=పొంది, మహతా=గొప్పదైన, యత్నేన=ప్రయత్నముచేత, అస్మిన్=సూర్యునియందు, మనః=మనస్సును, చక్షుషీ=నేత్రములను, సన్ధాయ=నిలిపి, భూయః=మరల, మహతా=గొప్పదైన, యత్నేన=ప్రయత్నముచేత, భాస్కరః=సూర్యుడు, ప్రతిలోకితః=చూడబడినాడు. భాస్కరః=సూర్యుడు, పృథ్వీప్రమాణేన=భూమియొక్క ప్రమాణముతో, తుల్యః=సమానుడుగా, నౌ= మాకు, ప్రతిభాతి=కనబడినాడు.

తా. నా మనస్సు కూడ పనిచేయలేదు. నేత్రమునే ఆధారముగా తీసుకొని, గొప్ప ప్రయత్నముతో మనస్సును, నేత్రములను, సూర్యునిపై నిలిపితిమి. మరల ఎక్కువ ప్రయత్నము చేసి, సూర్యుని వైపు చూచితిమి. అపుడు మాకు సూర్యుడు భూమి ప్రమాణము వంటి ప్రమాణములో కనబడెను.
12,13

మూ. జటాయుర్మామనాపృచ్ఛ్య నిపపాత మహీం తతః,
తం దృష్ట్వా తూర్ణమాకాశాదాత్మానం ముక్తవానహమ్. 14

ప్ర. అ. జటాయుః=జటాయువు, మామ్=నన్ను, అనాపృచ్ఛ్య= అడగకుండగానే, మహీమ్=భూమిని గూర్చి, నిపపాత=పడెను. తతః= అటుపిమ్మట, అహమ్=నేను, తమ్=ఆతనిని, దృష్ట్వా=చూచి, తూర్ణమ్=శీఘ్రముగా, ఆత్మానమ్=నన్ను, ఆకాశాత్=ఆకాశమునుండి, ముక్తవాన్=క్రిందికి విడిచితిని.

తా. జటాయువు నాతో చెప్పకుండగానే భూమి వైపు పడిపోయెను. అపుడు నేను ఆతనిని చూచి వెంటనే ఆకాశమునుండి నా శరీరమును క్రిందకు దింపితిని.
14

మూ. పక్షాభ్యాం చ మయా గుప్తో జటాయుర్న ప్రదహ్యత,
ప్రమాదాత్తత్ర నిర్దగ్ధః పతన్వాయుపథాదహమ్. 15

ప్ర. అ. మయా=నాచేత, పక్షాభ్యామ్=రెక్కలచేత, గుప్తః= రక్షింపబడిన, జటాయుః=జటాయువు, న ప్రదహ్యత=కాల్చబడలేదు. తత్ర=అక్కడ, ప్రమా

దాత్=పొరబాటువలన, వాయుపథాత్= వాయుమార్గమునుండి, పతన్=దిగుచున్న, అహమ్=నేను, నిర్దగ్ధః= కాల్చబడితిని.

తా. నేను రెక్కలతో రక్షించుటచేత జటాయువు కాలిపోలేదు. నేను మాత్రము ఆకాశమార్గమునందు దిగుచున్నపుడు సావధానచిత్తుడను కాకపోవుటచేత నా రెక్కలు కాలిపోయినవి. 15

మూ. ఆశఙ్కే తం నిపతితం జనస్థానే జటాయుషమ్,
అహం తు పతితో విన్ధ్యే దగ్ధపక్షో జడీకృతః. 16

ప్ర. అ. తం జటాయుషమ్=ఆ జటాయువును, జనస్థానే =జనస్థానము నందు, నిపతితమ్=పడినవానినిగా, ఆశఙ్కే=శంకించుచున్నాను. అహం తు=నేనైతే, దగ్ధపక్షః=కాల్చబడిన రెక్కలు గలవాడనై, జడీకృతః=జడుడుగా చేయబడినవాడనై, విన్ధ్యే=వింధ్యపర్వతమునందు, పతితః=పడితిని.

తా. జటాయువు జనస్థానములో పడి ఉండె నని ఊహించుచున్నాను. నేను మాత్రము రెక్కలు కాలిపోయి స్పృహ తప్పి వింధ్యపర్వతముమీద పడితిని.

మూ. రాజ్యాచ్చ హీనో భ్రాత్రా చ పక్షాభ్యాం విక్రమేణ చ,
సర్వథా మర్తుమేవేచ్ఛన్ పతిష్యే శిఖరాద్గిరేః. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. రాజ్యాత్=రాజ్యమునుండి, భ్రాత్రా చ=సోదరునితోను, పక్షాభ్యామ్=రెక్కలతోను, విక్రమేణ చ=పరాక్రమముతోను, హీనః= హీనుడనైన నేను, సర్వథా=అన్ని విధముల, మర్తుమేవ=మరణించుటకే, ఇచ్ఛన్=కోరుచు, గిరేః=పర్వతముయొక్క, శిఖరాత్=శిఖరమునుండి, పతిష్యే=పడగలను.

తా. రాజ్యము, సోదరుడు, రెక్కలు, పరాక్రమము, ఇవన్నీ పోయిన నేను అన్ని విధముల మరణించవలె నని కోరుచున్నాను. అందువలన పర్వత శిఖరమునుండి పడెదను. 17

*"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున కిష్కింధాకాండలో అరువదిఒకటవ సర్గ సమాప్తము.*

# అథ ద్విషష్టితమః సర్గః

*[నిశాకరుడు సంపాతిని ఓదార్చి భవిష్యత్తులో రామునకు సాహాయ్యము చేయుటకు ప్రాణములు ధరించి యుండుము అని ఆదేశించుట]*

మూ. ఏవముక్త్వా మునిశ్రేష్ఠమరుదం భృశదుఃఖితః,
అథ ధ్యాత్వా ముహూర్తం చ భగవానిదమబ్రవీత్. 1

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, మునిశ్రేష్ఠమ్=ఆ మునిశ్రేష్ఠుని గూర్చి, ఉక్త్వా=పలికి, భృశదుఃఖితః=మిక్కిలి దుఃఖించిన వాడనై, అరుదమ్= ఏడ్చితిని. అథ=అటు పిమ్మట, భగవాన్=పూజ్యుడైన ఆ ముని, ముహూర్తమ్=ముహూర్తకాలము, ధ్యాత్వా=ఆలోచించి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. నేను ఆ మహామునితో ఇట్లు పలికి చాల దుఃఖించుచు ఏడ్చితిని. అపుడు పూజ్యుడైన ఆ ముని కొంచెము సేపు ఆలోచించి ఇట్లు పలికెను. 1

మూ. పక్షౌ చ తే ప్రపక్షౌ చ పునరన్యౌ భవిష్యతః,
చక్షుషీ చైవ ప్రాణాశ్చ విక్రమశ్చ బలం చ తే. 2

ప్ర. అ. తే=నీకు, పునః=మరల, అన్యౌ=ఇతరమైన, పక్షౌ చ= రెక్కలు, ప్రపక్షౌ చ=చిన్న రెక్కలు, భవిష్యతః=పుట్టగలవు. తే=నీకు, చక్షుషీ చ=నేత్రములు, ప్రాణాశ్చ=ప్రాణములు, విక్రమశ్చ= పరాక్రమము, బలం చ=బలము, కలుగగలవు.

తా. నీకు క్రొత్త రెక్కలు చిన్న రెక్కలు పుట్టగలవు. అట్లే దృష్టి, ప్రాణశక్తి, పరాక్రమము, బలము కూడ కలుగగలవు. 2

మూ. పురాణే సుమహత్కార్యం భవిష్యం హి మయా శ్రుతమ్,
దృష్టం మే తపసా చైవ శ్రుత్వా చ విదితం మమ. 3

ప్ర. అ. సుమహత్కార్యమ్=చాల గొప్పదైన కార్యము, భవిష్యమ్= కానున్నదిగా, పురాణే=పూర్వమునందు, మయా=నాచేత, శ్రుతమ్= వినబడినది. మే=నాయొక్క, తపసా చైవ=తపస్సుచేత, దృష్టమ్= చూడబడినది. శ్రుత్వా=విని, మమ=నాకు, విదితం చ=తెలియబడినది.

తా. ఒక మహాకార్యము జరుగనున్నది అని నేను పూర్వము వింటిని. నా తపస్సుచేత గూడ ఆ విషయమును తెలుసుకొంటిని. ముందుగా విని తరువాత తపోబలముచేత చూచితిని. 3

మూ. రాజా దశరథో నామ కశ్చిదిక్ష్వాకువర్ధనః,
తస్య పుత్రో మహాతేజా రామో నామ భవిష్యతి. 4

ప్ర. అ. దశరథో నామ=దశరథుడను పేరు గల, ఇక్ష్వాకువర్ధనః= ఇక్ష్వాకువంశమును వృద్ధిపొందించు, కశ్చిత్=ఒకానొక, రాజా=రాజు, ఉన్నాడు. తస్య=అతనికి, రామో నామ=రాము డను పేరు గల, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, పుత్రః=పుత్రుడు, భవిష్యతి= పుట్టగలడు.

తా. ఇక్ష్వాకువంశమునకు వృద్ధిని కల్గించు దశరథుడనే ఒక రాజు ఉన్నాడు. ఆతనికి మహాతేజశ్శాలియైన రాముడను పుత్రుడు కలుగును. 4

మూ. అరణ్యం చ సహ భ్రాత్రా లక్ష్మణేన గమిష్యతి,
తస్మిన్నర్థే నియుక్తః సన్ పిత్రా సత్యపరాక్రమః. 5

ప్ర. అ. సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గల ఆ రాముడు, పిత్రా= తండ్రిచేత, తస్మిన్=ఆ, అర్థే=కార్యమునందు, నియుక్తః సన్= నియమించబడినవాడై, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, అరణ్యమ్=అరణ్యమును గూర్చి, గమిష్యతి=వెళ్లగలడు.

తా. సత్యమైన పరాక్రమము గల ఆ రాముడు ఆ విధముగా చేయవలె నని తండ్రి ఆజ్ఞాపించుటచే సోదరుడైన లక్ష్మణునితో కలిసి అరణ్యమునకు వెళ్ల గలడు. 5

మూ. నైరృతో రావణో నామ తస్య భార్యాం హరిష్యతి,
రాక్షసేన్ద్రో జనస్థానే అవధ్యః సురదానవైః. 6

ప్ర.అ. జనస్థానే=జనస్థానమునందు, తస్య=ఆ రామునియొక్క, భార్యామ్=భార్యను, రాక్షసేన్ద్రః=రాక్షసరాజు, సురదానవైః=దేవతలచేతను దాన వులచేతను, అవధ్యః=చంప శక్యము కానివాడు అయిన, రావణో నామ= రావణు డను పేరు గల, నైరృతః=రాక్షసుడు, హరిష్యతి=హరించగలడు.

తా. రాక్షసరాజు, దేవతలచేతను దానవులచేతను గూడ వధింప శక్యము కానివాడు అయిన రావణుడు అను రాక్షసుడు జనస్థానములో ఆతని భార్యను హరింపగలడు. 6

మూ. సా చ కామైః ప్రలోభ్యన్తీ భక్ష్యైర్భోజ్యైశ్చ మైథిలీ,
న భోక్ష్యతి మహాభాగా దుఃఖమగ్నా యశస్వినీ. 7

ప్ర. అ. మహాభాగా=మహాభాగ్యవంతురాలు, దుఃఖమగ్నా=దుఃఖమునందు మగ్నయైనది, యశస్వినీ=కీర్తిగలదియైన, సా మైథిలీ=ఆ సీత, కామైః= కామములచేత, భక్ష్యైః=భక్ష్యములచేత, భోజ్యైశ్చ=భోజ్యములచేత, ప్రలోభ్యన్తీ=లోభ పెట్టబడుచున్నదై, న భోక్ష్యతి=భుజించదు.

తా. దుఃఖములో మునిగి యున్న మహాభాగ్యవంతురాలు, కీర్తిమంతురాలు అయిన ఆ సీత కామములను, భక్ష్యములను, భోజ్యములను, చూపి లోభపెట్టబడి నను భుజింపదు. 7

మూ. పరమాన్నం చ వైదేహ్యా జ్ఞాత్వా దాస్యతి వాసవః,
యదన్నమమృతప్రఖ్యం సురాణామపి దుర్లభమ్. 8

ప్ర. అ. వాసవః=దేవేంద్రుడు, జ్ఞాత్వా=తెలుసుకొని, సురాణామపి= దేవతలకు కూడ, దుర్లభమ్=దుర్లభమైన, అమృతప్రఖ్యమ్=అమృతముతో సమాన మైన, యత్ అన్నమ్=ఏ అన్న మున్నదో, పరమాన్నమ్=అట్టి పరమాన్నమును, వైదేహ్యాః=సీతకు, దాస్యతి=ఇవ్వగలడు.

తా. ఆ విషయమును తెలిసికొనిన దేవేంద్రుడు అమృతముతో సమానము, దేవతలకు కూడ దుర్లభము అయిన పరమాన్నమును సీతకు ఇవ్వగలడు. 8

మూ. తదన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞాయేన్ద్రాదిదం త్వితి,
అగ్ర ముద్ధృత్య రామాయ భూ-తలే నిర్వపిష్యతి. 9

ప్ర. అ. మైథిలీ=సీత, తత్ అన్నమ్=ఆ అన్నమును, ప్రాప్య=పొంది, ఇదమ్=ఇది, ఇన్ద్రాత్ ఇతి =ఇంద్రుని నుండి వచ్చినది అని, విజ్ఞాయ= తెలిసికొని, అగ్రమ్=మొదటి భాగమును, ఉద్ధృత్య=ఎత్తి తీసి, రామాయ= రామునికొరకై, భూతలే=భూమిమీద, నిర్వపిష్యతి=ఉంచగలదు.

తా. సీత ఆ అన్నము ఇంద్రునినుండి వచ్చిన దని తెలుసుకొని దాని పై భాగమును పైకి తీసి రాముని కొరకై నేలమీద ఉంచగలదు. 9

మూ. యది జీవతి మే భర్తా లక్ష్మణో వాఽపి దేవరః,
దేవత్వం గచ్ఛతోర్వాపి తయోరన్నమిదం త్వితి. 10

ప్ర. అ. మే భర్తా=నా భర్త, జీవతి యది=జీవించి యున్నట్లైతే, దేవరః= మరదియైన, లక్ష్మణో వాఽపి=లక్ష్మణుడు, జీవతి యది=జీవించి యున్న ట్లైతే, దేవత్వమ్=దేవత్వమును, గచ్ఛతోర్వాపి=పొందినవారైనను, తయోః=వారిద్దరికి, ఇదమ్=ఇది, అన్నమ్=అన్నము, ఇతి=అని ( ఇవ్వగలదు.)

తా. "నా భర్తయైన రాముడు, మరిది యైన లక్ష్మణుడు జీవించి యున్నను, స్వర్గస్థులైనను ఈ అన్నము వారిద్దరికి చెందుగాక" అని పలికి నేలపై ఉంచగలదు. 10

మూ. ఏష్యన్తి ప్రేషితాస్తత్ర రామదూతాః ప్లవఙ్గమాః,
ఆఖ్యేయా రామమహిషీ త్వయా తేభ్యో విహఙ్గమ. 11

ప్ర. అ. విహఙ్గమ=ఓ ! సంపాతీ ! రామదూతాః=రాముని

దూతలైన, ప్లవఙ్గమాః=వానరులు, ప్రేషితాః=పంపబడినవారై, తత్ర=అక్కడకు, ఏష్యన్తి=రాగలరు. త్వయా=నీచేత, తేభ్యః=వారికి, రామమహిషీ= రామునిభార్య, ఆఖ్యేయా=చెప్పదగినది.

తా. ఓ ! పక్షిరాజా ! రాముని దూతలైన వానరులు రాముడు పంపగా అక్కడికి రాగలరు. నీవు రాముని భార్యను గూర్చి వారికి చెప్పవలెను. 11

మూ. సర్వథా చ న గన్తవ్యమీదృశః క్వ గమిష్యసి,
దేశకాలౌ ప్రతీక్షస్వ పక్షౌ త్వం ప్రతిపత్స్యసే. 12

ప్ర. అ. సర్వథా=అన్ని విధముల, న గన్తవ్యమ్=వెళ్లదగినది కాదు, ఈదృశః=ఇట్టివాడవు, క్వ=ఎక్కడికి, గమిష్యసి=వెళ్లగలవు. దేశకాలౌ= దేశకాలములను, ప్రతీక్షస్వ=నిరీక్షించుము. త్వమ్=నీవు, పక్షౌ= రెక్కలను, ప్రతిపత్స్యసే=పొందగలవు.

తా. నీవు అన్ని విధముల ఎక్కడికీ వెళ్లకూడదు. ఇట్టి స్థితిలో ఎక్కడికి వెళ్లెదవు ? దేశమును కాలమును నిరీక్షించుము. నీకు మరల రెక్కలు రాగలవు.12

మూ. ఉత్సాహేయమహం కర్తుమద్యైవ త్వాం సపక్షకమ్,
ఇహస్థస్త్వం హి లోకానాం హితం కార్యం కరిష్యసి. 13

ప్ర. అ. అహమ్=నేను, త్వామ్=నిన్ను, అద్యైవ=ఇపుడే, సపక్షకమ్=రెక్కలతో కూడిన వానినిగా, కర్తుమ్=చేయుటకు, ఉత్సాహేయమ్= సమర్థుడనగుదును. త్వమ్=నీవు, ఇహస్థః=ఇక్కడ ఉన్నవాడవై, లోకానామ్=లోకములకు, హితమ్=హితమైన, కార్యమ్=కార్యమును, కరిష్యసి=చేయగలవు.

తా. నేను ఇప్పుడే నీకు రెక్కలు పుట్టించుటకు నా సామర్థ్యమును చూపగలను. కాని నీవు ఇక్కడనే ఉండి లోకములకు హితమైన కార్యమును చేయగలవు కదా ! 13

మూ. త్వయాఽపి ఖలు తత్కార్యం తయోశ్చ నృపపుత్రయోః,
బ్రాహ్మణానాం గురుణాం చ మునీనాం వాసవస్య చ. 14

ప్ర. అ. త్వయాఽపి=నీచేత కూడ, తయోః=ఆ, నృపపుత్రయోః= రాజకుమారులయొక్క, బ్రాహ్మణానామ్=బ్రాహ్మణులయొక్క, గురూణామ్= పూజ్యులైన, మునీనాం చ=మునులయొక్క, వాసవస్య చ=దేవేంద్రునియొక్క, తత్=ఆ హితము, కార్యం ఖలు=చేయదగి యున్నది కదా !

తా. నీవు కూడ ఆ రాజకుమారులకు, బ్రాహ్మణులకు, పూజ్యులైన గురువులకు, దేవేంద్రునకు హితమైన ఆ కార్యమును చేయవలెను కదా ! 14

మూ. ఇచ్ఛామ్యహమపి ద్రష్టుం భ్రాతరౌ రామలక్ష్మణౌ,
వేచ్ఛే చిరం ధారయితుం ప్రాణాంస్త్యక్ష్యే కలేవరమ్. 15

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. అహమపి=నేనుకూడ, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ= రామలక్ష్మణులను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. చిరమ్=చిరకాలము, ప్రాణాన్=ప్రాణములను, ధారయితుమ్=ధరించుటకు, నేచ్ఛే=యిచ్ఛయించను. కలేవరమ్=శరీరమును, త్యక్ష్యే=విడచెదను. దృష్టతత్త్వార్థదర్శనః=చూడబడిన యథార్థదర్శనము గల, మహర్షిః=మహర్షి, ఏవమ్=ఇట్లు, అబ్రవీత్= పలికెను.

తా. "సోదరులైన ఆ రామలక్ష్మణులను చూడవలె నని నాకు కూడ కోరిక ఉన్నది. కాని చిరకాలము ప్రాణములు ధరించుటకు నాకు ఇష్టము లేదు. అందుచే ఈ శరీరమును విడచి వేసెదను." యథార్థమును చూచిన ఆ మహర్షి ఈ విధముగా పలికెను. 15

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమున కిష్కింధాకాండములో
అరువదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిషష్టితమః సర్గః

*[సంపాతికి కొత్త రెక్కలు పుట్టుట, అతడు వానరులను ప్రోత్సహించి ఎగిరి వెళ్లిపోవుట; వానరులు అక్కడినుండి దక్షిణము వైపు ప్రయాణమగుట.]*

మూ. ఏతైరన్యైశ్చ బహుభిర్వాక్యైర్వాక్యవిశారదః,
మాం ప్రశప్యాభ్యనుజ్ఞాయ ప్రవిష్టః స స్వమాలయమ్. 1

ప్ర. అ. వాక్యవిశారదః=మాటలయందు నేర్పు గల, సః=ఆ ముని, ఏతైః= ఈ మాటలచేతను, అన్యైశ్చ=ఇతరమైన, బహుభిః=అనేకమైన, వాక్యైః= వాక్యముల చేతను, మామ్=నన్ను, ప్రశస్య=బోధించి, అభ్యనుజ్ఞాప్య= అనుజ్ఞను పొందింపచేసి, స్వమ్=తన సంబంధమైన, ఆలయమ్=నివాసమును, ప్రవిష్టః=ప్రవేశించినాడు.

తా. మాటలలో నేర్పరి యైన ఆ ముని ఈ మాటలు, ఇంకా ఎన్నో మాటలు చెప్పి, నాకు బోధించి, అనుజ్ఞ ఇచ్చి తన ఆశ్రమములో ప్రవేశించెను.1

మూ. కన్దరాత్తు విసర్పిత్వా పర్వతస్య శనైః శనైః,
అహం విన్ధ్యం సమారుహ్య భవతః ప్రతిపాలయే. 2

ప్ర. అ. అహమ్=నేను, పర్వతస్య=పర్వతముయొక్క, కన్దరాత్= గుహ నుండి, శనైః శనైః=మెల్లమెల్లగా, విసర్పిత్వా=నడిచి, విన్ధ్యమ్= వింధ్యపర్వతమును, సమారుహ్య=ఎక్కి, భవతః=మిమ్ములను, ప్రతిపాలయే=నిరీక్షించుచున్నాను.

తా. నేను ఆ పర్వతగుహనుండి మెల్లమెల్లగా పాకుతూ, వచ్చి, వింధ్య పర్వతమును ఎక్కి మీ రాకకై ఎదురుచూచుచున్నాను. 2

మూ. అద్య త్వేతస్య కాలస్య సాగ్రం వర్షశతం గతమ్,
దేశకాలప్రతీక్షోऽస్మి హృది కృత్వా మునేర్వచః. 3

ప్ర. అ. అద్య=ఇపుడు, ఏతస్య కాలస్య=ఈ కాలముయొక్క, సాగ్రమ్= కొంచెము అగ్రముతో కూడిన, వర్షశతమ్=సంవత్సరముల శతము, గతమ్= గడచినది. మునేః=మునియొక్క, వచః=వచనమును, హృది= హృదయమునందు, కృత్వా=చేసి, దేశకాలప్రతీక్షః=దేశమును కాలమును ఎదురు చూచుచున్నవాడనై, అస్మి=ఉన్నాను.

తా. ఇప్పటికి కొంచెము అధికముగా నూరు సంవత్సరముల కాలము గడచినది. నేను ఆ ముని మాటలను స్మరించుచు దేశకాలములకై వేచి యున్నాను.

వి.మనం అనుసరిస్తూన్న దాక్షిణాత్యపాఠం ప్రకారం సంపాతి మాటలలో కొంత పూర్వాపరవిరోధం కనబడుతున్నది. ప్రాచ్యపాఠం ప్రకారం ఆవిరోధాన్ని కొంతవరకు తగ్గించవచ్చును. అరవైయవసర్గలోని తొమ్మిదవ శ్లోకంలో నిశాకరముని స్వర్గస్థుడైన పిమ్మట సంపాతి ఎనిమిది వేల సంవత్సరాలపాటు అక్కడనే ఉండిపోయినట్లు చెప్పబడింది. 63వ సర్గ రెండవశ్లోకంలో వానరుల రాకకై సుమారు నూరు సంవత్సరాలు సంపాతి నిరీక్షించినట్లు చెప్పబడింది. అక్కడ చెప్పిన ఎనిమిది వేల సంవత్సరాలకీ దీనికీ సంబంధం కుదరడం లేదు. కాని ప్రాచ్యపాఠంలో "అష్టౌవర్ష సహస్రాణి"(60-9) ఇత్యాదిశ్లోకానికి బదులు-

"అష్టౌ వర్షసహస్రాణి తేనాస్మిన్నుషితం గిరౌ,
స్వర్గతస్య శతం త్వేకం ద్వేశతే వసతో మమ"

అని ఉన్నది. "ఆ ముని ఈ పర్వతంమీద మొత్తం 8000 సంవత్సరాలు నివసించాడు. ఆయన స్వర్గస్థుడైన పిమ్మట నేను ఇక్కడ మూడు వందల సంవత్సరాల నుండి నివసిస్తున్నాను" అని అర్థం. (స్వర్గతస్య=ఆతడు స్వర్గస్థుడుకాగా, వసతః=నివసించుచున్న, మమ=నాకు, ఏకం శతమ్=నూరు సంవత్సరములు, ద్వే శతే=రెండువందల సంవత్సరాలు గడచినది అని అర్థం) "ఆ ముని స్వర్గస్థుడై నూరు సంవత్సరాలైనది. నేను రెండు వందల సంవత్సరాలనుండి ఇక్కడ ఉంటున్నాను" అనీ అర్థం కూడా చెప్పవచ్చును. కాని ఆ అర్థం కుదరదు. వృత్రాసురసంహారానంతరం తాము పందెం వేసికొని ఆకాశమార్గంలో ఎగిరినట్లు చెప్పినాడు. అనగా చాలాకాలంక్రితమే అది జరిగినదని చెప్పాలి. పడిపోయిన వెంటనే కొద్దిరోజులలో సంపాతి ఆ మునిని కలుసుకున్నాడు. అందుచేత ఆయన సంనిధిలో కొన్నివేల సంవత్సరాలు ఉన్నట్లు, ఆయన స్వర్గస్థుడైన పిమ్మట మూడువందల సంవత్సరాలపాటు ఆయన చెప్పిన ప్రకారం వానరులకోసం నిరీక్షిస్తున్నట్లూ చెప్పాలి. 63వసర్గలోని మూడవశ్లోకానికి బదులు ప్రాచ్యపాఠంలో ఉన్న-

"అద్య త్వేతస్య కాలస్య సాగ్రం వర్షశతత్రయమ్
దేశకాలప్రతీక్షోఽస్మి హృది కృత్వా మునేర్వచః"
అనే శ్లోకం ఈ భావానికి అనుగుణంగా ఉన్నది. 3

మూ. మహాప్రస్థానమాసాద్య స్వర్గతే తు నిశాకరే,
మాం నిర్దహతి సన్తాపో వితర్కైర్బహుభిర్వృతమ్. 4

ప్ర. అ. నిశాకరే=నిశాకరుడు, మహాప్రస్థానమ్=మహాప్రస్థానమును, ఆసాద్య=పొంది, స్వర్గతే=స్వర్గమునకు వెళ్లినవా డగుచుండగా, బహుభిః= అనేకమైన, వితర్కైః=ఊహలతో, వృతమ్=కూడిన, మామ్=నన్ను, సన్తాపః=సంతాపము, నిర్దహతి=కాల్చివేయుచున్నది.

తా. నిశాకరముని మహాప్రస్థానము చేసి స్వర్గమునకు వెళ్లిపోయినాడు. అప్పటి నుండి అనేకమైన ఊహలతో నిండిన నన్ను మనస్తాపము కాల్చివేయుచున్నది.

మూ. ఉదితాం మరణే బుద్ధిం మునివాక్యైర్నివర్తయే,
బుద్ధిర్యా తేన మే దత్తా ప్రాణానాం రక్షణే మమ. 5
సా మేఽపనయతే దుఃఖం దీప్తేవాగ్నిశిఖా తమః.

ప్ర. అ. మరణే=మరణమునందు, ఉదితామ్=పుట్టిన, బుద్ధిమ్= బుద్ధిని, మునివాక్యైః=మునియొక్క వాక్యములచేత, నివర్తయే= నివర్తింపచేయుచున్నాను. మమ=నాయొక్క, ప్రాణానామ్=ప్రాణములయొక్క, రక్షణే=రక్షణము విషయమునందు, తేన=ఆ మునిచేత, మే=నాకు, యా=ఏ, బుద్ధిః=బుద్ధి, దత్తా=ఇవ్వబడినదో, సా=అది, దీప్తా=ప్రజ్వలించుచున్న, అగ్నిశిఖా=అగ్నిజ్వాల, తమః ఇవ=చీకటిని వలె, మే దుఃఖమ్=నా దుఃఖమును, అపనయతే=తొలగించుచున్నది.

తా. మరణించవలె నని నాకు కలిగిన ఆలోచనను ముని వాక్యముల చేత అణచుకొనుచున్నాను. నీ ప్రాణములను రక్షించుకొనుము అని ముని నాకు ఇచ్చిన ఉపదేశము ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాల చీకటిని పోగొట్టినట్లు నా దుఃఖమును పోగొట్టుచున్నది. 4,5

మూ. బుద్ధ్యతా చ మయా వీర్యం రావణస్య దురాత్మనః, 6
పుత్రః సన్తర్జితో వాగ్భిర్న త్రాతా మైథిలీ కథమ్.

ప్ర. అ. దురాత్మనః=దురాత్ముడైన, రావణస్య=రావణునియొక్క, వీర్యం= పరాక్రమమును, బుద్ధ్యతా=ఎరిగిన, మయా=నాచేత, మైథిలీ=సీత, కథమ్=ఎట్లు, న త్రాతా=రక్షింపబడలేదు, అని, వాగ్భిః=మాటలతో, పుత్రః=పుత్రుడు, సంతర్జితః=నిందింపబడినాడు.

తా. దురాత్ముడైన ఆ రావణుని పరాక్రమమును గూర్చి నాకు తెలియును. నీవు సీతను ఎందుకు రక్షించలేదు అని నేను నా పుత్రుణ్ణి నిందించితిని. 6

మూ. తస్యా విలపితం శ్రుత్వా తౌ చ సీతావియోజితౌ, 7
న మే దశరథస్నేహాత్పుత్రేణోత్పాదితం ప్రియమ్.

ప్ర. అ. తస్యాః=ఆమెయొక్క, విలపితమ్=విలాపమును, శ్రుత్వా=విని, తౌ=రామలక్ష్మణులను, సీతావియోజితౌ=సీతనుండి వియోగమును పొందింపబడిన వారినిగా విని, మే=నాయొక్క, దశరథస్నేహాత్=దశరథునియందు స్నేహమువలనను, పుత్రేణ=నా పుత్రునిచేత, ప్రియమ్=ప్రియము, న ఉత్పాదితమ్= చేయుబడలేదు.

తా. సీత విలాపమును విని రామలక్ష్మణులకు ఆమె దూరము చేయబడిన దని తెలిసికొని, దశరథునిపై నా కున్న నా స్నేహమును గూర్చి తెలిసికూడ నా పుత్రుడు నాకు ప్రియము చేయలేదు. 7

మూ. తస్య త్వేవం బ్రువాణస్య సంహతైర్వానరైః సహ, 8
ఉత్పేతతుస్తదా పక్షౌ సమక్షం వనచారిణామ్.

ప్ర. అ. తదా=అపుడు, సంహతైః=గుమిగూడిన, వానరైః సహ=వానరులతో కూడ, తస్య=అతడు, ఏవమ్=ఇట్లు, బ్రువాణస్య= పలుకుచుండగా, వన చారిణామ్=వానరులయొక్క, సమక్షమ్=ఎదుటనే, పక్షౌ=రెక్కలు, ఉత్పేతతుః=పైకి ఎగిరినవి (మొలచినవి.)

తా. అక్కడ గుమిగూడిన వానరులతో సంపాతి ఇట్లు పలుకుచుండగానే ఆ వానరుల సమక్షమునందు అతని రెక్కలు మొలచెను. 8

మూ. స దృష్ట్వా స్వాం తనుం పక్షైరుద్గతైరరుణచ్ఛదైః, 9
ప్రహర్షమతులం లేభే వానరాంశ్చేదమబ్రవీత్.

ప్ర. అ. సః=అతడు, అరుణచ్ఛదైః=ఎఱ్ఱని ఈకలు గల, ఉద్గతైః= మొలిచిన, పక్షైః=రెక్కలతో కూడిన, స్వామ్=తన సంబంధమైన, తనుమ్= శరీరమును, దృష్ట్వా=చూచి, అతులమ్=సాటి లేని, ప్రహర్షమ్= సంతోషమును, లేభే=పొందెను. వానరాన్=వానరులను గూర్చి, ఇదమ్= ఈ వాక్యమును, అబ్రవీత్ చ =పలికెను.

తా. అతడు ఎఱ్ఱని ఈకలతో, రెక్కలు మొలచిన తన శరీరమును చూచుకొని చాల సంతోషించెను. వానరులతో ఇట్లు పలికెను. 9

మూ. నిశాకరస్య రాజర్షేః ప్రసాదాదమితౌజసః, 10
ఆదిత్యరశ్మినిర్దగ్ధౌ పక్షౌ పునరుపస్థితౌ.

ప్ర. అ.అమితౌజసః=గొప్ప తేజస్సు గల, రాజర్షేః=రాజర్షియైన, నిశాకరస్య=నిశాకరునియొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, ఆదిత్యరశ్మినిర్దగ్ధౌ=సూర్యుని కిరణములచే కాల్చివేయబడిన, పక్షౌ=రెక్కలు, పునః= మరల, ఉపస్థితౌ=వచ్చినవి.

తా. గొప్ప తేజస్సు గల రాజర్షియైన నిశాకరముని అనుగ్రహమువలన సూర్యకిరణముల చేత కాలిపోయిన నా రెక్కలు మరల పుట్టినవి. 10

మూ. యౌవనే వర్తమానస్య మమాసీద్యః పరాక్రమః, 11
తమేవాద్యావగచ్ఛామి బలం పౌరుషమేవ చ.

ప్ర. అ. యౌవనే=యౌవనమునందు, వర్తమానస్య=ఉన్న, మమ=నాకు, యః=ఏ, పరాక్రమః=పరాక్రమము, ఆసీత్=ఉండెనో, తమేవ= దానినే, అద్య=ఇపుడు, అవగచ్ఛామి=అనుభవించుచున్నాను. బలమ్= బలమును, పౌరుషమేవ చ=పౌరుషమును అనుభవించుచున్నాను.

తా. నేను యౌవనములో ఉన్నప్పుడు ఎట్టి పరాక్రమము, బలము పౌరుషము ఉండెనో వాటినే ఇపుడు నాయందు అనుభవించుచున్నాను. 11

మూ. సర్వథా క్రియతాం యత్నః సీతామధిగమిష్యథ, 12
పక్షలాభో మమాయం వః సిద్ధిప్రత్యయకారకః.

ప్ర. అ. సర్వథా=అన్ని విధముల, యత్నః=ప్రయత్నము, క్రియతామ్= చేయబడుగాక! సీతామ్=సీతను, అధిగమిష్యథ=పొందగలరు. మమ=నాయొక్క, అయమ్=ఈ, పక్షలాభః=రెక్కలయొక్క లాభము, వః= మీయొక్క, సిద్ధిప్రత్యయకారకః=కార్యసిద్ధియందు నమ్మకమును కల్గించునది.

తా. అన్ని విధముల ప్రయత్నము చేయుడు. సీత లభించగలదు. నాకు రెక్కలు మొలచుటను బట్టి మీ కార్యము కూడ సిద్ధించు నని నమ్మవచ్చును.12

మూ. ఇత్యుక్త్వా తాన్ హరీన్ సర్వాన్ సమ్పాతిః పతగోత్తమః, 13
ఉత్పపాత గిరేః శృఙ్గాజ్జిజ్ఞాసుః ఖగమో గతిమ్.

ప్ర. అ. పతగోత్తమః=పక్షులలో శ్రేష్ఠుడైన, సమ్పాతిః=సంపాతి, సర్వాన్=సమస్తమైన, తాన్=ఆ, హరీన్=వానరులను గూర్చి, ఇతి= ఇట్లు, ఉక్త్వా=పలికి, ఖగమః=ఆకాశమునందు సంచరించు పక్షియొక్క, గతిమ్=గమనమును, జిజ్ఞాసుః=తెలియగోరుచున్నవాడై, గిరేః= పర్వతముయొక్క, శృఙ్గాత్=శిఖరమునుండి, ఉత్పపాత=ఎగిరెను.

తా. పక్షులలో శ్రేష్ఠుడైన ఆ సంపాతి ఆ వానరు లందరితో ఇట్లు చెప్పి, తనకు ఆకాశమునందు ఎగిరే శక్తి ఉన్నదో లేదో యని పరీక్షించుకొనుటకై ఆ పర్వతశిఖరమునుండి పైకి ఎగిరెను. 13

మూ. తస్య తద్వచనం శ్రుత్వా ప్రతిసంహృష్టమానసాః, 14
బభూవుర్హరిశార్దూలా విక్రమాభ్యుదయోన్ముఖాః.

ప్ర. అ. హరిశార్దూలాః=వానరశ్రేష్ఠులు, తస్య=ఆ సంపాతియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, ప్రతిసంహృష్టమానసాః= సంతోషించిన మనస్సు గలవారై, విక్రమాభ్యుదయోన్ముఖాః=పరాక్రమముయొక్క అభివృద్ధికి ఉన్ముఖులుగా, బభూవుః=అయిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు సంపాతి మాటలు విని, సంతోషించుచున్న మనస్సులతో పరాక్రమాభివృద్ధికి అభిముఖులు అయిరి. 14

మూ. అథ పవనసమానవిక్రమాః
ప్లవగవరాః ప్రతిలబ్ధపౌరుషాః, 15
అభిజిదభిముఖా దిశం యయు
ర్జనకసుతాపరిమార్గణోన్ముఖాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాండే
త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, పవనసమానవిక్రమాః=వాయువుతో సమానమైన పరాక్రమము గల, ప్రతిలబ్ధపౌరుషాః=తిరిగి పొందబడిన పౌరుషము గల, ప్లవగవరాః=వానరశ్రేష్ఠులు, అభిజిదభిముఖాః=అభిజిన్ముహూర్తమునకు అభిముఖులై, జనకసుతాపరిమార్గణోన్ముఖాః=సీతయొక్క అన్వేషణమునందు అభిముఖులై, దిశమ్=దక్షిణదిక్కును గూర్చి, యయుః=వెళ్లిరి.

తా. పిమ్మట వాయువుతో సమానమైన పరాక్రమము గల ఆ వానర శ్రేష్ఠులు మరల పౌరుషమును పొంది, అభిజిన్ముహూర్తమునకు నిరీక్షించి సీతను అన్వేషించుటకై దక్షిణదిక్కునకు వెళ్లిరి. 15

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున కిష్కింధాకాండలో అరువదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃషష్టితమః సర్గః

[సముద్రవైశాల్యమును చూచి దిగులు చెందిన వానరులకు ధైర్యము చెప్పుచు అంగదుడు సముద్రమును దాటుటకై ఎవరికి ఎంత శక్తి యున్నదో ప్రశ్నించుట.]

మూ. ఆఖ్యాతా గృధ్రరాజేన సముత్ప్లుత్య ప్లవఙ్గమాః,
సఙ్గతాః ప్రీతిసంయుక్తా వినేదుః సింహవిక్రమాః. 1

ప్ర. అ. గృధ్రరాజేన=సంపాతిచేత, ఆఖ్యాతాః=ఇట్లు చెప్పబడిన, సింహ విక్రమాః=సింహమువంటి పరాక్రమముగల, ప్లవఙ్గమాః=వానరులు, సంగతాః=కలిసినవారై, ప్రీతిసంయుక్తాః=ఆనందముతో కూడినవారై, సముత్ప్లుత్య=ఎగిరి, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. సంపాతి మాటలు విని సింహము వంటి పరాక్రమము గల ఆ వానరు లందరు కలిసి, ఆనందముతో ఎగిరిరి. 1

మూ. సంపాతేర్వచనం శ్రుత్వా హరయో రావణక్షయమ్,
హృష్టాః సాగరమాజగ్ముః సీతాదర్శనకాఙ్క్షిణః. 2

ప్ర. అ. హరయః=వానరులు, సంపాతేః=సంపాతియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, హృష్టాః=సంతోషించినవారై, సీతాదర్శనకాఙ్క్షిణః= సీత దర్శనమును కోరుచున్న వారై, రావణక్షయమ్=రావణుని నివాసమును గూర్చి, సాగరమ్=సముద్రమును, ఆజగ్ముః=పొందిరి.

తా. వానరులు సంపాతి మాటలు విని సంతోషించి, సీతను చూడవలెనను కోరికతో రావణుని నివాసమును గూర్చి వెళ్లుటకై సముద్రమును చేరిరి.2

మూ. అభిగమ్య తు తం దేశం దదృశుర్భీమవిక్రమాః,
కృత్స్నం లోకస్య మహతః ప్రతిబిమ్బమివ స్థితమ్. 3

ప్ర. అ. భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల ఆ వానరులు, తమ్=ఆ, దేశమ్=ప్రదేశమును, అభిగమ్య=చేరి, మహతః=గొప్పదైన, లోకస్య=లోకము యొక్క, కృత్స్నమ్=సమస్తమైన, ప్రతిబిమ్బమివ= ప్రతిబింబము వలె, స్థితమ్=ఉన్న ఆ సముద్రమును, దదృశుః=చూచిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల ఆ వానరులు ఆ ప్రదేశమును చేరి అక్కడ గొప్పదైన లోకముయొక్క పూర్తి ప్రతిబింబమా అన్నట్లున్న సముద్రమును చూచిరి. 3

మూ. దక్షిణస్య సముద్రస్య సమాసాద్యోత్తరాం దిశమ్,
సంనివేశం తతశ్చక్రుర్హరివీరా మహాబలాః. 4

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల, హరివీరాః=వానరవీరులు, దక్షిణస్య సముద్రస్య=దక్షిణసముద్రముయొక్క, ఉత్తరాం దిశమ్= ఉత్తరదిక్కును, సమాసాద్య=చేరి, తతః=అటుపిమ్మట, సంనివేశమ్= విడిదిని (ఒక పద్ధతిలో స్థితిని), చక్రుః=చేసిరి.

తా. మహాబలవంతులైన ఆ వానరవీరులు దక్షిణసముద్రము ఉత్తర తీరమును చేరి అక్కడ ఒక పద్ధతి ప్రకారము నిలిచిరి. 4

మూ. సత్త్వైర్మహద్భిర్వికృతైః క్రీడద్భిర్వివిధైర్జలే,
వ్యత్యస్తైః సుమహాకాయైరూర్మిభిశ్చ సమాకులమ్. 5
ప్రసుప్తమివ చాన్యత్ర క్రీడన్తమివ చాన్యతః,
క్వచిత్పర్వతమాత్రైశ్చ జలరాశిభిరావృతమ్. 6
సంకులం దానవేన్ద్రైశ్చ పాతాలతలవాసిభిః.
రోమహర్షకరం దృష్ట్వా విషేదుః కపికుఞ్జరాః. 7

ప్ర. అ. జలే=జలమునందు, క్రీడద్భిః=క్రీడించుచున్న, మహద్భిః= పెద్దవైన, వికృతైః=వికారముగా ఉన్న, వివిధైః=అనేకవిధములైన, సత్త్వైః= జంతువులతోను, వ్యత్యస్తైః=తలక్రిందులగుచున్న, సుమహాకాయైః=చాల పెద్ద శరీరము గల, ఊర్మిభిశ్చ=తరంగములతోను, సమాకులమ్=వ్యాకులమైనది, అన్యత్ర=మరొక చోట, ప్రసుప్తమివ=నిద్రించుచున్నది వలె ఉన్నది, అన్యతః= మరియొక వైపున, క్రీడన్తమివ=ఆడుకొనుచున్నది వలె ఉన్నది, క్వచిత్= కొన్నిచోట్ల, పర్వతమాత్రైః=పర్వతప్రమాణముగల, జలరాశిభిః=తరంగములచేత, ఆవృతమ్=కప్పబడినది, పాతాలతలవాసిభిః=పాతాలమునందు నివసించుచున్న, దానవేన్ద్రైశ్చ=దానవేంద్రులతో, సంకులమ్=వ్యాకులమైనదీ, రోమహర్షకరమ్=రోమాంచమును కలిగించునది అయిన సముద్రమును, దృష్ట్వా= చూచి, కపికుఞ్జరాః=వానరశ్రేష్ఠులు, విషేదుః=విషాదము చెందిరి.

తా. ఆ సముద్రములో పెద్ద శరీరములతో వికృతముగా ఉన్న అనేకవిధములైన జంతువులు క్రీడించుచుండెను. పెద్ద ఆకారములు గల తరంగములు ఎత్తుగా పైకి లేచి క్రిందికి పడుచుండెను. కొన్ని చోట్ల ఆ సముద్రము నిద్రించుచున్నట్లు, మరి కొన్ని చోట్ల ఆడుకొనుచున్నట్లు ఉండెను. కొన్ని చోట్ల పర్వతముల వంటి తరంగములచేత కప్పబడి ఉండెను. పాతాలములో నివసించు దానవేంద్రులతో అది వ్యాకులముగా ఉండెను. రోమాంచమును పుట్టించు అట్టి సముద్రమును చూచి ఆ వానరశ్రేష్ఠులు దిగులు చెందిరి. 5-7

మూ. ఆకాశమివ దుష్పారం సాగరం ప్రేక్ష్య వానరాః,
విషేదుః సహితాః సర్వే కథం కార్యమితి బ్రువన్. 8

ప్ర. అ. సహితాః=కలిసి ఉన్న, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, ఆకాశమివ=ఆకాశము వలె, దుష్పారమ్=దాటశక్యము కాని, సాగరమ్=సముద్రమును, ప్రేక్ష్య=చూచి, విషేదుః=విషాదము చెందిరి. కథమ్=ఎట్లు, కార్యమ్=చేయదగినది, ఇతి=అని, బ్రువన్=పలికిరి.

తా. అక్కడ కలిసి నిలిచిన ఆ వానరు లందరు ఆకాశము వలె దాటుటకు శక్యము కాని సముద్రమును చూచి దిగులుచెందిరి. "ఇప్పుడు ఏమి చేయవలెను?" అని అనుకొనిరి. 8

మూ. విషణ్ణాం వాహినీం దృష్ట్వా సాగరస్య నిరీక్షణాత్,
ఆశ్వాసయామాస హరీన్ భయార్తాన్ హరిసత్తమః. 9

ప్ర. అ.హరిసత్తమః=వానరశ్రేష్ఠుడైన అంగదుడు, సాగరస్య=సముద్రము యొక్క, నిరీక్షణాత్=చూచుటవలన, విషణ్ణామ్=దిగులుచెందిన, వాహినీమ్= సేనను, దృష్ట్వా=చూచి, భయార్తాన్=భయముచేతపీడితులైన, హరీన్= వానరులను, ఆశ్వాసయామాస=ఓదార్చెను.

తా. సముద్రమును చూచుటచేత దిగులు చెందిన ఆ సేనను చూచి వానరనాయకుడైన అంగదుడు భయపీడితులైన ఆ వానరులతో ఇట్లు పలికెను.9

మూ. తాన్విషాదేన మహతా విషణ్ణాన్వానరర్షభాన్,
ఉవాచ మతిమాన్ కాలే వాలిసూనుర్మహాబలః. 10

ప్ర. అ.మతిమాన్=బుద్ధిమంతుడైన, మహాబలః=గొప్ప బలము గల, వాలిసూనుః=వాలికుమారుడైన అంగదుడు, మహతా=గొప్పదైన, విషాదేన= దుఃఖముచేత, విషణ్ణాన్=దిగులుచెందిన, తాన్ వానరర్షభాన్=ఆ వానరశ్రేష్ఠులను గూర్చి, కాలే=ఆ కాలమునందు (తగునట్లుగా), ఉవాచ=పలికెను.

తా. బుద్ధిమంతుడు, మహాబలశాలీ అయిన ఆ అంగదుడు గొప్ప దుఃఖముతో దిగులు చెంది ఉన్న ఆ వానరశ్రేష్ఠులతో ఆ సమయమునకు తగు విధముగ ఇట్లు పలికెను. 10

మూ. న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తరః,
విషాదో హన్తి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః. 11

ప్ర. అ. విషాదే=విషాదమునందు (దిగులు చెందుటయందు), మనః=మనస్సు, న కార్యమ్=చేయదగినదికాదు. విషాదః=విషాదము, దోషవత్తరః= చాల దోషము కలది. క్రుద్ధః=కోపించిన, ఉరగః=సర్పము, బాలమ్ ఇవ= బాలుణ్ణి వలె,

పురుషమ్=పురుషుణ్ణి, విషాదః=విషాదము, హన్తి= చంపివేయును.

తా. మనస్సులో విషాదము రానీయకూడదు. విషాదము చాల చెడ్డది. కోపించిన సర్పము బాలుణ్ణి చంపి నట్లు విషాదము పురుషుని చంపివేయును.11

మూ. యో విషాదం ప్రసహతే విక్రమే సముపస్థితే,
తేజసా తస్య హీనస్య పురుషార్థో న సిధ్యతి. 12

ప్ర. అ. విక్రమే=పరాక్రమసమయము, సముపస్థితే=వచ్చినదగుచుండగా, యః=ఎవడు, విషాదమ్=విషాదమును, ప్రసహతే=సహించునో ( ఆశ్రయించునో), తేజసా=తేజస్సుతో, హీనస్య=శూన్యుడైన, తస్య= ఆతనియొక్క, పురుషార్థః=పురుష ప్రయోజనము, న సిధ్యతి=సిద్ధించదు.

తా. పరాక్రమము చూపవలసిన సమయములో విషాదమునకు అవకాశమును ఇచ్చు తేజోవిహీనుని కార్యములు ఏవీ సిద్ధించవు. 12

మూ. తస్యాం రాత్రౌ వ్యతీతాయామఙ్గదో వానరైః సహ,
హరివృద్ధైః సమాగమ్య పునర్మన్త్రమమన్త్రయత్. 13

ప్ర. అ. తస్యామ్=ఆ, రాత్రౌ=రాత్రి, వ్యతీతాయామ్= గడచినదగుచుండగా, అఙ్గదః=అంగదుడు, హరివృద్ధైః=వానరులలో వృద్ధులైన, వానరైః సహ=వానరులతో కూడ, సమాగమ్య=కలిసి, పునః= మరల, మన్త్రమ్=మంత్రమును (ఆలోచనను) అమన్త్రయత్=మంత్రించెను (చేసెను).

తా. ఆ రాత్రి గడచిన పిమ్మట మరునాడు అంగదుడు వానరులలో వృద్ధులైన వానరులతో కలిసి మరల ఆలోచన చేసెను. 13

మూ. సా వానరాణాం ధ్వజినీ పరివార్యాఙ్గదం బభౌ,
వాసవం పరివార్యేవ మరుతాం వాహినీ స్థితమ్. 14

ప్ర. అ. వానరాణామ్=వానరులయొక్క, సా=ఆ, ధ్వజినీ=సేన, అఙ్గదమ్=అంగదుని, పరివార్య=చుట్టి, నిలచి, స్థితమ్=నిలచిన, వాసవమ్=ఇంద్రుని, పరివార్య=చుట్టి, మరుతామ్=దేవతలయొక్క, వాహినీవ=సేన వలె, బభౌ=ప్రకాశించెను.

తా. అంగదుని చుట్టూ నిలచిన ఆ వానరసేన నిలచి ఉన్న దేవేంద్రుని చుట్టూ ఉన్న దేవసేన వలె ప్రకాశించెను. 14

మూ. కోఽన్యస్తాం వానరీం సేనాం శక్తః స్తమ్భయితుం భవేత్,
అన్యత్ర వాలితనయాదన్యత్ర చ హనూమతః. 15

ప్ర. అ. వాలితనయాత్=వాలికుమారుడైన అంగదునికంటె, అన్యత్ర=వేరుగా, హనూమతః=హనుమంతునికంటె, అన్యత్ర=వేరుగా, అన్యః=ఇతరుడు, కః=ఎవడు,

తామ్=ఆ, వానరీమ్=వానరులసంబంధమైన, సేనామ్=సేనను, స్తమ్భయితుమ్=నిలుపుటకు, శక్తః=సమర్థుడు, భవేత్=అగును ?

తా. అంగదుడు తప్ప, హనుమంతుడు తప్ప, మరి ఎవడు ఆ వానరసేనను వశములో ఉంచుకొన గలడు ? 15

మూ. తతస్తాన్ హరివృద్ధాంశ్చ తచ్చ సైన్యమరిందమః,
అనుమాన్యాఙ్గదః శ్రీమాన్ వాక్యమర్థవదబ్రవీత్. 16

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అరిందమః=శత్రుసంహారకుడు, శ్రీమాన్=శ్రీమంతుడు అయిన, అఙ్గదః=అంగదుడు, తాన్=ఆ, హరివృద్ధాన్= వానరవృద్ధులను, తత్=ఆ, సైన్యం చ=సైన్యమును, అనుమాన్య= గౌరవించి, అర్థవత్=అర్థయుక్తమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. శత్రుసంహారకుడు, శ్రీమంతుడు అయిన ఆ అంగదుడు వృద్ధులైన వానరులతోను, ఆ వానరసైన్యముతోను గౌరవపూర్వకముగా, అర్థయుక్తమైన మాటలు ఇట్లు పలికెను. 16

మూ. క ఇదానీం మహాతేజా లఙ్ఘయిష్యతి సాగరమ్,
కః కరిష్యతి సుగ్రీవం సత్యసన్ధ మరిందమమ్. 17

ప్ర. అ. ఇదానీమ్=ఇప్పుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, కః=ఎవడు, సాగరమ్=సముద్రమును, లఙ్ఘయిష్యతి=లంఘించగలడు? కః= ఎవడు, అరిందమమ్=శత్రుసంహారకుడైన, సుగ్రీవమ్=సుగ్రీవుని, సత్యసన్ధమ్=సత్యప్రతిజ్ఞ కలవానినిగా, కరిష్యతి=చేయగలడు?

తా. ఇప్పుడు గొప్ప తేజస్సు గల ఎవడు ఈ సముద్రమును దాటి, శత్రుసంహారకుడైన సుగ్రీవుని ప్రతిజ్ఞను నిలబెట్టగలడు ? 17

మూ. కో వీరో యోజనశతం లఙ్ఘయేత ప్లవఙ్గమః,
ఇమాంశ్చ యూథపాన్ సర్వాన్ మోచయేత మహాభయాత్. 18

ప్ర. అ. వీరః=వీరుడైన, కః=ఏ, ప్లవఙ్గమః=వానరుడు, యోజనశతమ్=నూరు యోజనములు, లఙ్ఘయేత=దాటును? ఇమాన్=ఈ, యూథపాన్=సేనానాయకులను, సర్వాన్=అందరినీ, మహాభయాత్= మహాభయమునుండి, మోచయేత=విడిపించును?

తా. వీరుడైన ఏ వానరుడు నూరు యోజనముల దూరము లంఘించి, ఈ సేనానాయకు లందరి మహాభయమును తొలగించగలడు ? 18

మూ. కస్య ప్రసాదాద్దారాంశ్చ పుత్రాంశ్చైవ గృహాణి చ,
ఇతో నివృత్తాః పశ్యేమ సిద్ధార్థాః సుఖినో వయమ్. 19

ప్ర. అ. వయమ్=మనము, కస్య=ఎవనియొక్క, ప్రసాదాత్= అనుగ్రహమువ

లన, సిద్ధార్థాః=సిద్ధించిన కార్యము కలవారమై, సుఖినః= సుఖవంతులమై, ఇతః=ఇక్కడి నుండి, నివృత్తాః=మరలినవారమై, దారాంశ్చ= భార్యలను, పుత్రాంశ్చైవ=పుత్రులను, గృహాణి చ=గృహములను, పశ్యేమ= చూచెదము ?

తా. మనము ఎవని అనుగ్రహముచేత కార్యమును సాధించి సుఖముగా ఇక్కడినుండి తిరిగి వెళ్లి మన భార్యలను, పుత్రులను, గృహములను చూడగలము?

మూ. కస్య ప్రసాదాద్రామం చ లక్ష్మణం చ మహాబలమ్,
అభిగచ్ఛేమ సంహృష్టాః సుగ్రీవం చ వనౌకసమ్. 20

ప్ర. అ. కస్య=ఎవనియొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, సంహృష్టాః=సంతోషించుచున్నవారమై, రామం చ=రాముణ్ణి, మహాబలమ్= గొప్ప బలము గల, లక్ష్మణం చ=లక్ష్మణుణ్ణి, వనౌకసమ్=వానరుడైన, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి, అభిగచ్ఛేమ=చేరగలము ?

తా. ఎవని అనుగ్రహముచేత మనము సంతోషించుచు, రాముణ్ణి, మహాబలశాలియైన లక్ష్మణుణ్ణి, వానరరాజైన సుగ్రీవుణ్ణి చేరగలము ? 20

మూ. యది కశ్చిత్సమర్థో వః సాగరప్లవనే హరిః,
స దదాత్విహ నః శీఘ్రం పుణ్యామభయదక్షిణామ్. 21

ప్ర. అ. వః=మీలో, కశ్చిత్=ఎవ్వడైనా, హరిః=వానరుడు, సాగరప్లవనే=సాగరమును దాటుటయందు, సమర్థః యది=సమర్థు డైనచో, సః=అతడు, ఇహ=ఇక్కడ, నః=మాకు, శీఘ్రమ్=శీఘ్రముగా, పుణ్యామ్=పుణ్యమైన, అభయదక్షిణామ్=అభయ దక్షిణను, దదాతు= ఇచ్చుగాక.

తా. మీలో ఏ వానరునకైన ఈ సముద్రమును దాటుటకు సామర్థ్యమున్నచో ఆతడు శీఘ్రముగా మాకు ఇప్పుడు పుణ్యమైన అభయ మను దక్షిణను ఇచ్చుగాక. 21

మూ. అఙ్గదస్య వచః శ్రుత్వా న కశ్చిత్ కిం చిదబ్రవీత్,
స్తిమితేవాభవత్సర్వా సా తత్ర హరివాహినీ. 22

ప్ర. అ. అఙ్గదస్య=అంగదునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా= విని, కశ్చిత్=ఎవ్వడును, కించిత్=ఏమీ, న అబ్రవీత్=పలుకలేదు. తత్ర=అక్కడ, సర్వా=సమస్తమైన, సా=ఆ, హరివాహినీ=వానరసేన, స్తిమితేవ=నిశ్చలమైనది వలె, అభవత్=ఆయెను.

తా. అంగదుని మాటలు విని ఏ ఒక్క వానరుడు కూడ ఏమీ మాటలాడలేదు. అప్పుడు ఆ వానరసేన అంతా నిశ్చలమైపోయి నట్లు ఉండెను.

మూ. పునరేవాఙ్గదః ప్రాహ తాన్ హరీన్ హరిసత్తమః,
సర్వే బలవతాం శ్రేష్ఠా భవన్తో దృఢవిక్రమాః, 23
వ్యపదేశకులే జాతాః పూజితాశ్చాప్యభీక్ష్ణశః.

ప్ర. అ. హరిసత్తమః=వానరశ్రేష్ఠుడైన, అఙ్గదః=అంగదుడు, తాన్ హరీన్=ఆ వానరులను గూర్చి, పునరేవ=మరల, ప్రాహ=పలికెను. భవన్తః=మీరు, సర్వే=అందరూ, బలవతామ్=బలము కలవారిలో, శ్రేష్ఠాః=శ్రేష్ఠమైనవారు. దృఢవిక్రమాః=దృఢమైన పరాక్రమము కలవారు. వ్యపదేశకులే=కలంకములేని కులమునందు, జాతాః=పుట్టినవారు. అభీక్ష్ణశః=మిక్కిలి, పూజితాశ్చ=పూజింపబడినారు కూడ.

తా. వానరనాయకుడైన అంగదుడు వారితో మరల ఇట్లు పలికెను. "మీరందరూ బలవంతులలో శ్రేష్ఠులు, దృఢమైన పరాక్రమము గలవారు. కలంకములేని కులములో పుట్టినవారు. ఎన్నో సత్కారములు అందుకొన్నవారు." 23

మూ. న హి వో గమనే సంగః కదాచిత్కస్యచిద్భవేత్, 24
బ్రువధ్వం యస్య యా శక్తిః ప్లవనే ప్లవగర్షభాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
చతుఃషష్టితమః సర్గః.

ప్ర. అ. వః=మీలో, కస్యచిత్=ఎవ్వనికీ, కదాచిత్=ఎన్నడూ, గమనే=గమనమునందు, సంగః=అడ్డు, న భవేత్ హి =ఉండదు కదా! ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులారా! ప్లవనే=ఎగురుటయందు, యస్య=ఎవనికి, యా=ఏ, శక్తిః=శక్తి ఉన్నదో, బ్రువధ్వమ్=చెప్పుడు.

తా. ఓ ! వానరశ్రేష్ఠులారా ! మీలో ఏ ఒక్కరికి, ఎక్కడికి వెళ్లవలెనన్నమా ఎన్నడూ అడ్డు లేదు. అందుచేత, ఎగురుటకు ఎవరికి ఎంత శక్తి ఉన్నదో చెప్పుడు. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో
అరువదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చషష్టితమః సర్గః

[వానరులు వరుసగా తమకు ఎగురుటకు ఉన్న శక్తిని గూర్చి చెప్పుట. జాంబవదంగదులు మాటలాడుకొనుట. జాంబవంతుడు హనుమంతుని ప్రేరేపించుటకై ఆతని దగ్గరకు వెళ్లుట.]

మూ. అథాఙ్గదవచః శ్రుత్వా తే సర్వే వానరర్షభాః,
స్వం స్వం గతౌ సముత్సాహమూచుస్తత్ర యథాక్రమమ్. 1
గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః,
మైన్దశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జామ్బవాంస్తథా. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, అఙ్గదవచః=అంగదుని వచనమును, శ్రుత్వా=విని, గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, గవయః= గవయుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, మైన్దశ్చ= మైందుడు, ద్వివిదశ్చైవ=ద్వివిదుడు, సుషేణః=సుషేణుడు, తథా= మరియు, జామ్బవాన్=జాంబవంతుడు, సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, యథాక్రమమ్=క్రమముగా, తత్ర=అక్కడ, గతౌ=గమనమునందు, స్వం స్వమ్=తన తన, సముత్సాహమ్=శక్తిని గూర్చి, ఊచుః=చెప్పిరి.

తా. పిమ్మట గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు, సుషేణుడు, జాంబవంతుడు, ఆ వానరశ్రేష్ఠ లందరు ఎగురుటకు తమ తమ శక్తిని గూర్చి క్రమముగా అక్కడ చెప్పిరి. 1,2

మూ. ఆబభాషే గజస్తత్ర ప్లవేయం దశయోజనమ్,
గవాక్షో యోజనాన్యాహ గమిష్యామీతి వింశతిమ్. 3

ప్ర. అ. తత్ర=అక్కడ, గజః=గజుడు, దశయోజనమ్=పది యోజనములు, ప్లవేయమ్=ఎగురుదును అని, ఆబభాషే=పలికెను. గవాక్షః= గవాక్షుడు, వింశతిమ్=ఇరువది, యోజనాని=యోజనములను, గమిష్యామి= వెళ్లగలను, ఇతి=అని, ఆహ=పలికెను.

తా. అపుడు "నేను పది యోజనముల దూరము ఎగురగలను" అని గజుడు చెప్పెను. "నేను ఇరువది యోజనములు వెళ్లగలను" అని గవాక్షుడు చెప్పెను. 3

మూ. శరభో వానరస్తత్ర వానరాంస్తానువాచ హ,
త్రింశతం తు గమిష్యామి యోజనానాం ప్లవఙ్గమాః. 4

ఋషభో వానరస్తత్ర వానరాంస్తానువాచ హ,
చత్వారింశద్గమిష్యామి యోజనానాం న సంశయః. 5
వానరాంస్తు మహాతేజా అబ్రవీద్గన్ధమాదనః,
యోజనానాం గమిష్యామి పఞ్చాశత్తు న సంశయః. 6
మైన్దస్తు వానరస్తత్ర వానరాంస్తానువాచ హ,
యోజనానాం పరం షష్టిమహం ప్లవితుముత్సహే. 7
తతస్తత్ర మహాతేజా ద్వివిదః ప్రత్యభాషత,
గమిష్యామి న సన్దేహః సప్తతిం యోజనాన్యహమ్. 8
సుషేణస్తు మహాతేజాః సత్త్వవాన్ కపిసత్తమః,
అశీతిం ప్రతిజానే ఽహం యోజనానాం పరాక్రమే. 9

ప్ర. అ. తత్ర=అక్కడ, శరభః=శరభు డను, వానరః=వానరుడు, తాన్ వానరాన్=ఆ వానరులను గూర్చి, ఉవాచ హ=పలికెను. ప్లవఙ్గమాః= వానరులారా! యోజనానామ్=యోజనముల యొక్క, త్రింశతమ్=ముప్పదిని, గమిష్యామి=వెళ్లగలను. తత్ర=అక్కడ, ఋషభః=ఋషభుడను, వానరః=వానరుడు, తాన్ వానరాన్=ఆ వానరులను గూర్చి, ఉవాచ హ= పలికెను. యోజనానామ్=యోజనములయొక్క, చత్వారింశత్=నలుబది, గమిష్యామి=వెళ్లగలను. సంశయః=సంశయము, న=లేదు. మహాతేజాః= గొప్ప తేజస్సు గల, గన్ధమాదనః=గంధమాదనుడు, వానరాన్=వానరులను గూర్చి, అబ్రవీత్=పలికెను. యోజనానామ్=యోజనములయొక్క, పఞ్చాశత్= ఏబదిని, గమిష్యామి=వెళ్లగలను. సంశయః=సంశయము, న=లేదు. తత్ర=అక్కడ, మైన్దః=మైందు డను, వానరస్తు=వానరుడైతే, తాన్ వానరాన్=ఆ వానరులను గూర్చి, ఉవాచ హ=పలికెను. అహమ్=నేను, యోజనానామ్=యోజనములయొక్క, షష్టిం పరమ్=అరువది మాత్రమే, ప్లవితుమ్= ఎగురుటకు, ఉత్సహే=సమర్థుడ నగుచున్నాను. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, ద్వివిదః=ద్వివిదుడు, తత్ర=అక్కడ, ప్రత్యభాషత=పలికెను. అహమ్=నేను, సప్తతిమ్=డెబ్బది, యోజనాని=యోజనములను, గమిష్యామి=వెళ్లగలను. సన్దేహః= సందేహము, న=లేదు. మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు, సత్త్వవాన్= బలవంతుడు అయిన, సుషేణః=సుషేణుడు అను, కపిసత్తమః=వానరశ్రేష్ఠుడు పలికెను, అహమ్=నేను, పరాక్రమే=దాటుటయందు, యోజనానామ్=యోజనములయొక్క, అశీతిమ్=ఎనుబదిని, ప్రతిజానే= ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. ఓ ! వానరులారా ! నేను ముప్పదియోజనములు వెళ్లగలను అని శరభుడు, నలుబది యోజనములు వెళ్లగల నని ఋషభుడు, నేను నిస్సంశయముగా యేబది యోజనములు వెళ్లగలను అని మహాతేజశ్శాలియైన గంధమాదనుడు, నేను అరువది యోజనములు ఎగురగలను అని మైందుడు, నేను నిస్సంశయముగా డెబ్బది యోజనములు ఎగురగల నని మహాతేజశ్శాలియైన ద్వివిదుడు, నేను

ఎనుబది యోజనములు దాటగల నని ప్రతిజ్ఞ చేయుచున్నాను అని గొప్పతేజస్సు, బలము గల వానరశ్రేష్ఠుడైన సుషేణుడు చెప్పిరి. 4 - 9

మూ. తేషాం కథయతాం తత్ర సర్వాంస్తాననుమాన్య చ,
తతో వృద్ధతమస్తేషాం జామ్బవాన్ ప్రత్యభాషత. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేషామ్=వారిలో, వృద్ధతమః=చాల వృద్ధుడైన, జామ్బవాన్=జాంబవంతుడు, తేషామ్=వారు, తత్ర=అక్కడ, కథయతామ్=అట్లు చెప్పచుండగా, తాన్ సర్వాన్=వారి నందరిని, అనుమాన్య చ=సత్కరించి, ప్రత్యభాషత=పలికెను.

తా. అక్కడ వానరు లందరు అట్లు పలుకుచుండగా, వారి అందరిలోకి పెద్దవాడైన జాంబవంతుడు, వాళ్లతో ఆదరపూర్వకముగా ఇట్లు పలికెను. 10

మూ. పూర్వమస్మాకమప్యాసీత్కశ్చిద్గతిపరాక్రమః,
తే వయం వయసః పార మనుప్రాప్తాః స్మ సామ్ప్రతమ్. 11

ప్ర. అ. పూర్వమ్=పూర్వమునందు, అస్మాకమపి=మాకు కూడ, కశ్చిత్, =ఒకనొక, గతిపరాక్రమః=గమనమునందు పరాక్రమము, ఆసీత్=ఉండెను. తే వయమ్=అట్టి మేము, సామ్ప్రతమ్=ఇపుడు, వయసః=వయస్సుయొక్క, పారమ్=అంతమును, అనుప్రాప్తాః స్మ=పొందితిమి.

తా. పూర్వము మాకు కూడ ఎగురుటకు ఏదో కొంత పరాక్రమము ఉండెడిది. కాని ఇపుడు మేము చివరి వయస్సులో ఉన్నాము. 11

మూ. కింతు నైవం గతే శక్యమిదం కార్యముపేక్షితుమ్,
యదర్థం కపిరాజశ్చ రామశ్చ కృతనిశ్చయౌ. 12

ప్ర. అ. కిం తు=కాని, ఏవంగతే=ఇట్లుండగా, యదర్థమ్=దేనికొరకై, కపిరాజశ్చ=సుగ్రీవుడు, రామశ్చ=రాముడు, కృతనిశ్చయౌ=చేయబడిన నిశ్చయము గలవారో, ఇదమ్=ఈ, కార్యమ్=కార్యము, ఉపేక్షితుమ్= ఉపేక్షించుటకు, న శక్యమ్=శక్యము గాదు.

తా. కాని ఇట్టి పరిస్థితులలో ఏ కార్యమును సుగ్రీవుడు, రాముడు తప్పక చేయవలయు నని నిశ్చయించుకొని ఉన్నారో, దానిని మనము ఉపేక్షించుట తగదు. 12

మూ. సామ్ప్రతం కాలమస్మాకం యా గతిస్తాం నిబోధత,
నవతిం యోజనానాం తు గమిష్యామి న సంశయః. 13

ప్ర. అ. సామ్ప్రతమ్=ఇపుడు, కాలమ్=ఈ కాలమును, (ఈ సమయము నందు), అస్మాకమ్=మాకు, యా=ఏ, గతిః=గమనము ఉన్నదో, తామ్= దానిని,

నిబోధత=తెలుసుకొనండి. యోజనానామ్=యోజనములయొక్క, నవతిమ్=తొంబదిని, గమిష్యామి=వెళ్లగలను. సంశయః=సంశయము, న=లేదు.

తా. ఇపుడు మాకు ఎంత గమనశక్తి ఉన్నదో వినండి. నేను నిస్సంశయముగా తొంబది యోజనముల దూరము వెళ్లగలను. 13

మూ. తాం శ్చ సర్వాన్ హరిశ్రేష్ఠాన్ జామ్బవానిదమబ్రవీత్,
న ఖల్వేతావదేవాసీద్గమనే మే పరాక్రమః. 14

ప్ర. అ. సర్వాన్=సమస్తమైన, తాన్=ఆ, హరిశ్రేష్ఠాన్=వానరుల నాయకులను గూర్చి, జామ్బవాన్=జాంబవంతుడు, ఇదం చ=ఈ మాటను కూడ, అబ్రవీత్=పలికెను. మే=నాకు, గమనే=గమనమునందు, పరాక్రమః= పరాక్రమము, ఏతావదేవ=ఇంత మాత్రమే, న ఆసీత్ ఖలు=ఉండలేదు.

తా. జాంబవంతుడు ఆ వానరశ్రేష్ఠు లందరితో ఇంకా ఇట్లు పలికెను. పూర్వము నాకు గమన విషయమునందున్న శక్తి ఇంత మాత్రమే కాదు.14

మూ. మయా వైరోచనే యజ్ఞే ప్రభవిష్ణుః సనాతనః,
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణస్త్రివిక్రమః. 15

ప్ర. అ. మయా=నాచేత, పూర్వమ్=పూర్వము, వైరోచనే= బలిచక్రవర్తికి సంబంధించిన, యజ్ఞే=యజ్ఞమునందు, క్రమమాణః= ఆక్రమించుచున్నవాడు, ప్రభవిష్ణుః=సమర్థుడు, సనాతనః=నిత్యుడు అయిన, త్రివిక్రమః=త్రివిక్రముడు, ప్రదక్షిణీకృతః=ప్రదక్షిణము చేయబడినాడు.

తా. పూర్వము బలిచక్రవర్తి చేసిన యజ్ఞమునందు మూడులోకములను ఆక్రమించుచున్న సర్వసమర్థుడు, నిత్యుడు అయిన, త్రివిక్రమునకు నేను ప్రదక్షిణము చేసియుంటిని. 15

మూ. స ఇదానీమహం వృద్ధః ప్లవనే మన్దవిక్రమః,
యౌవనే చ తదాసీన్మే బలమప్రతిమం పరమ్. 16

ప్ర. అ. ఇదానీమ్=ఇప్పుడు, వృద్ధః=వృద్ధుడనైన, సః అహమ్=అట్టి నేను, ప్లవనే=ఎగురుటయందు, మన్దవిక్రమః=మందమైన పరాక్రమము కలవాడను. తదా=అపుడు, యౌవనే=యౌవనమునందు, మే బలమ్= నా బలము, అప్రతిమమ్=సాటిలేనిదై, పరమ్=అధికమైనదిగా, ఆసీత్=ఉండెను.

తా. అట్టి నేను ఇపుడు వృద్ధుడ నగుటచే ఎగురుటకు నా శక్తి తగ్గిపోయినది. పూర్వము నేను యౌవనములో ఉన్నపుడు నాకు సాటిలేని గొప్ప బలము ఉండెడిది. 16

మూ. సమ్ప్రత్యేతావదేవాద్య శక్యం మే గమనే స్వతః,
నైతావతా చ సంసిద్ధిః కార్యస్యాస్య భవిష్యతి. 17

ప్ర. అ. సమ్ప్రతి=ఈ వయస్సులో, అద్య=ఇపుడు, మే=నాకు, స్వతః=స్వయముగా, గమనే=వెళ్లుటకు, ఏతావదేవ=ఇంతమాత్రమే, శక్యమ్=శక్యమైనది. ఏతావతా=ఇంతమాత్రముచేత, అస్య=ఈ, కార్యస్య=కార్యముయొక్క, సంసిద్ధిః=సిద్ధి, న భవిష్యతి=కలుగదు.

తా. ఇపుడు నా కీ వయస్సులో స్వయముగా వెళ్లే శక్తి ఇంత మాత్రమే ఉన్నది. కాని దీనిచేత ఈ కార్యము సిద్ధించదు. 17

మూ. అథోత్తరముదారార్థమబ్రవీదఙ్గదస్తదా,
అనుమాన్య తదా ప్రాజ్ఞో జామ్బవన్తం మహాకపిమ్. 18

ప్ర. అ. అథ=అటుపిమ్మట, తదా=అపుడు, ప్రాజ్ఞః= బుద్ధిమంతుడైన, అఙ్గదః=అంగదుడు, మహాకపిమ్=గొప్ప వానరుడైన, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, అనుమాన్య=గౌరవించి, ఉదారార్థమ్= ఉత్తమమైన అర్థము గల, ఉత్తరమ్=ప్రత్యుత్తరమును, తదా=అపుడు, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట బుద్ధిమంతుడైన అంగదుడు వానరులలో శ్రేష్ఠుడైన ఆ జాంబవంతునితో ఉదారమైన అర్థము గల ఈ వాక్యమును ఆదరపూర్వకముగా పలికెను. 18

మూ. అహమేతద్గమిష్యామి యోజనానాం శతం మహత్,
నివర్తనే తు మే శక్తిః స్యాన్న వేతి న నిశ్చితమ్. 19

ప్ర. అ. అహమ్=నేను, మహత్=గొప్పదైన, ఏతత్=ఈ, యోజనానామ్=యోజనములయొక్క, శతమ్=శతమును, గమిష్యామి= వెళ్లగలను. నివర్తనే=తిరిగి వచ్చుటయందు, మే=నాకు, శక్తిః=శక్తి, స్యాత్=ఉండునా ? న వా=ఉండదా, ఇతి=అని, నిశ్చితమ్= నిశ్చయము, న=లేదు.

తా. నేను ఈ సుదీర్ఘమైన నూరు యోజనముల దూరము వెళ్లగలను. కాని తిరిగి వచ్చుటకు నాకు శక్తి ఉన్నదో లేదో నిశ్చితముగా చెప్పజాలను.19

మూ. తమువాచ హరిశ్రేష్ఠం జామ్బవాన్ వాక్యకోవిదః,
జ్ఞాయతే గమనే శక్తిస్తవ హర్యృక్షసత్తమ. 20

ప్ర. అ. వాక్యకోవిదః=మాటలలో నేర్పరియైన, జామ్బవాన్=జాంబవంతుడు, తమ్=ఆ, హరిశ్రేష్ఠమ్=అంగదుని గూర్చి, ఉవాచ=పలికెను. హర్యృక్షసత్తమ=వానరులలోను భల్లూకములలోను శ్రేష్ఠుడా! గమనే= గమనమునందు, తవ=నీయొక్క, శక్తిః=శక్తి, జ్ఞాయతే= తెలియబడుచున్నది.

తా. మాటలలో నేర్పరియైన జాంబవంతుడు అంగదునితో ఇట్లు పలికెను. "వానరులకు, భల్లూకములకు నాయకుడవైన ఓ ! అంగదా ! నీకు ఎగురుటకు ఎంత శక్తి ఉన్నదో నాకు తెలియును." 20

మూ. కామం శతసహస్రం వా న హ్యేష విధిరుచ్యతే,
యోజనానాం భవాన్ శక్తో గన్తుం ప్రతినివర్తితుమ్. 21

ప్ర. అ. భవాన్=నీవు, యోజనానామ్=యోజనములయొక్క, శతసహస్రం వా=నూరు సహస్రములైనా, గన్తుమ్=వెళ్లుటకు, ప్రతినివర్తితుమ్= తిరిగి వచ్చుటకు, శక్తః కామమ్=సమర్థుడవే. ఏషః=ఈ, విధిః= విధానము, న ఉచ్యతే హి=చెప్పబడదు కదా !

తా. "నీవు లక్ష యోజనముల దూరము కూడా వెళ్లి తిరిగి వచ్చుటకు సమర్థుడవే. అయినను చేయవలసిన విధానము ఇది కాదు." 21

మూ. న హి ప్రేషయితా తాత స్వామీ ప్రేష్యః కథం చన,
భవతాయం జనః సర్వః ప్రేష్యః ప్లవగసత్తమ. 22

ప్ర. అ. తాత=ఓ ! తండ్రీ ! ప్రేషయితా=ఇతరులను పంపించువాడైన, స్వామీ=ప్రభువు, కథం చన =ఏ విధముగాను కూడ, ప్రేష్యః= పంపదగినవాడు, న హి=కాదు కదా ! ప్లవగసత్తమ =ఓ ! వానరశ్రేష్ఠుడా ! సర్వః=సమస్తమైన, అయం జనః=ఈ జనము, భవతా=నీచేత, ప్రేష్యః= పంపదగినది.

తా. తండ్రీ ! ఇతరులను ఆజ్ఞాపించి పంపవలసిన ప్రభువును ఎన్నటికిని పంపకూడదు కదా! ఓ ! వానరశ్రేష్ఠుడా ! వీరందరు నీవు పంపదగినవారు. 22

మూ. భవాన్ కళత్రమస్మాకం స్వామిభావే వ్యవస్థితః,
స్వామీ కళత్రం సైన్యస్య గతిరేషా పరంతప. 23

ప్ర. అ. పరంతప=శత్రువులను పీడించువాడా ! స్వామిభావే= ప్రభుత్వము నందు, వ్యవస్థితః=ఉన్న, భవాన్=నీవు, అస్మాకమ్=మాకు, కళత్రమ్=రక్షింపదగిన వాడవు. స్వామీ=ప్రభువు, సైన్యస్య= సైన్యమునకు, కళత్రమ్=రక్షింపదగినవాడు. ఏషా=ఇది, గతిః=పద్ధతి.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! మాకు అధిపతిగా ఉన్న నిన్ను మేము రక్షించుకొనవలెను. సైన్యము తన స్వామిని రక్షించుకొనవలెను. ఇదియే విధింపబడిన మార్గము. 23

మూ. అపి వై తస్య కార్యస్య భవాన్మూలమరిన్దమ,
తస్మాత్కళత్రవత్తాత ప్రతిపాల్యః సదా భవాన్. 24

ప్ర. అ. తాత=తండ్రీ ! అరిన్దమ=శత్రుసంహారకుడా ! తస్య=ఆ,

కార్యస్య=కార్యమునకు, భవాన్=నీవు, మూలమ్ అపి వై=మూలముగా కూడ అయి ఉన్నావు. తస్మాత్=ఆ కారణము వలన, భవాన్=నీవు, కళత్రవత్= రక్షించుకొనదగిన వస్తువు వలె, సదా=ఎల్లపుడు, ప్రతిపాల్యః=రక్షింపదగినవాడవు.

తా. శత్రుసంహారకుడా ! ఓ ! తండ్రీ ! ఈ కార్యమునకు అంతకు నీవు మూలమైన వాడవు. అందుచేత నిన్ను రక్షింపదగిన వస్తువును వలె మేము ఎల్లపుడు రక్షించుకొనుచుండవలెను. 24

మూ. మూలమర్థస్య సంరక్ష్యమేష కార్యవిదాం నయః,
మూలే హి సతి సిధ్యన్తి గుణాః సర్వే ఫలోదయాః. 25

ప్ర. అ. అర్థస్య=కార్యముయొక్క, మూలమ్=మూలము, సంరక్ష్యమ్= రక్షించుకొనదగినది. ఏషః=ఇది, కార్యవిదామ్=కార్యవేత్తలయొక్క, నయః= నీతి. మూలే=మూలము, సతి=ఉండగా, ఫలోదయాః=ఫలమును ఇచ్చు, సర్వే=సమస్తమైన, గుణాః=గుణములు, సిధ్యన్తి హి=సిద్ధించును కదా !

తా. కార్యము యొక్క మూలమును సంరక్షించుకొనవలెను. కార్యమును ఎట్లు సాధించవలెనో తెలిసినవాడు చెప్పు నీతి ఇదే. మూలము స్థిరముగా ఉన్నపుడు మంచి ఫలముల నిచ్చు అన్ని గుణములు వాటి అంతట అవే సిద్ధించును. 25

మూ. తద్భవానస్య కార్యస్య సాధనం సత్యవిక్రమ,
బుద్ధివిక్రమసమ్పన్నో హేతురత్ర పరంతప. 26

ప్ర. అ. సత్యవిక్రమ=సత్యమైన పరాక్రమము గలవాడా ! తత్=ఆ కారణమువలన, భవాన్=నీవు, అస్య కార్యస్య=ఈ కార్యమునకు, సాధనమ్= సాధనమైనవాడవు. పరంతప=శత్రువులను సంహరించువాడా ! అత్ర=ఈ విషయమునందు, బుద్ధివిక్రమసమ్పన్నః=బుద్ధితోను పరాక్రమముతోను కూడిన నీవు, హేతుః=కారణమైనవాడవు.

తా. సత్యమైన పరాక్రమము కలవాడవైన ఓ ! అంగదుడా ! ఈ కార్యమునకు నీవే సాధనము. ఓ ! శత్రుసంహారకుడా ! బుద్ధిపరాక్రమములు గల నీవే ఈ కార్యమును సాధించుటకు కారణమైనవాడవు. 26

మూ. గురుశ్చ గురుపుత్రశ్చ త్వం హి నః కపిసత్తమ !
భవన్తమాశ్రిత్య వయం సమర్థా హ్యర్థసాధనే. 27

ప్ర. అ. కపిసత్తమ =ఓ ! వానరశ్రేష్ఠుడా ! నః=మాయొక్క, గురుపుత్రః= పూజ్యుడైన వాలి కుమారుడ వైన, త్వమ్=నీవు, గురుశ్చ=పూజ్యుడవు. వయమ్=మేము, భవన్తమ్=నిన్ను, ఆశ్రిత్య=ఆశ్రయించి, అర్థసాధనే= కార్యమును సాధించుటయందు, సమర్థాః హి=సమర్థులము కదా !

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! నీవు మాకు రాజగుటచే పూజ్యుడైన వాలి కుమారుడవు. యువరాజు వగుటచే నీవు కూడ పూజ్యుడవు. మేము నీ సాహాయ్యముచేతనే కార్యమును సాధించుటకు సమర్థుల మగుచున్నాము. 27

మూ. ఉక్తవాక్యం మహాప్రాజ్ఞం జామ్బవన్తం మహాకపిః,
ప్రత్యువాచోత్తరం వాక్యం వాలిసూనురథాఙ్గదః. 28

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాకపిః=గొప్ప వానరుడు, వాలిసూనుః= వాలి కుమారుడు అయిన, అఙ్గదః=అంగదుడు, ఉక్తవాక్యమ్=పలుకబడిన వాక్యము గల, మహాప్రాజ్ఞమ్=చాల బుద్ధిమంతుడైన, జామ్బవన్తమ్= జాంబవంతుని గూర్చి, ఉత్తరం వాక్యమ్=ప్రత్యుత్తరరూపమైన వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. మహాబుద్ధిమంతుడైన ఆ జాంబవంతుడు పలికిన మాటలు విని వానర నాయకుడు, వాలి కుమారుడు అయిన అంగదుడు మరల ఇట్లు పలికెను.

మూ. యది నాహం గమిష్యామి నాన్యో వానరపుఙ్గవః,
పునః ఖల్విదమస్మాభిః కార్యం ప్రాయోపవేశనమ్. 29

ప్ర. అ. అహమ్=నేను, న గమిష్యామి యది=వెళ్లకపోయినచో, అన్యః= మరియొక, వానరపుఙ్గవః=వానరశ్రేష్ఠుడు, న=వెళ్లకపోయినచో, అస్మాభిః= మన చేత, పునః=మరల, ఇదమ్=ఈ, ప్రాయోపవేశనమ్=ప్రాయోపవేశనము, కార్యం ఖలు=చేయదగినది కదా !

తా. మరొక వానరశ్రేష్ఠుడు వెళ్లక, నేను వెళ్లక పోయినచో మరల మనము ప్రాయోపవేశనమే చేయవలసి యుండును కదా ! 29

మూ. న హ్యకృత్వా హరిపతేః సన్దేశం తస్య ధీమతః,
తత్రాపి గత్వా ప్రాణానాం పశ్యామి పరిరక్షణమ్. 30

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య హరిపతేః=ఆ సుగ్రీవునియొక్క, సన్దేశమ్=ఆజ్ఞను, అకృత్వా=చేయకుండగా, తత్ర=అక్కడికి, గత్వాపి=వెళ్లికూడ, ప్రాణానామ్=ప్రాణములయొక్క, పరిరక్షణమ్= రక్షణము, న పశ్యామి=చూడను.

తా. బుద్ధిశాలియైన సుగ్రీవుని ఆజ్ఞను నిర్వర్తించకుండగా తిరిగి అక్కడికి వెళ్లినను మనము ప్రాణములను రక్షించుకొనగల మని నేను భావించను. 30

మూ. స హి ప్రసాదే చాత్యర్థం కోపే చ హరిరీశ్వరః,
అతీత్య తస్య సన్దేశం వినాశో గమనే భవేత్. 31

ప్ర. అ. సః=ఆ, హరిః=సుగ్రీవుడు, ప్రసాదే చ=అనుగ్రహమునందు, కోపే చ=కోపమునందు, అత్యర్థమ్=మిక్కిలి, ఈశ్వరః=సమర్థుడు. తస్య=ఆతని యొక్క, సన్దేశమ్=ఆజ్ఞను, అతీత్య=దాటి, గమనే= వెళ్లుటలో, వినాశః=వినాశము,

భవేత్=అగును.

తా. ఆ సుగ్రీవుడు మిక్కిలి అనుగ్రహము చూపుటకు, కోపము చూపుటకు కూడ సమర్థుడు. ఆతని ఆజ్ఞను నెరవేర్చకుండగా తిరిగి వెళ్లినచో మనకు వినాశము కలుగును. 31

మూ. తత్తథా హ్యస్య కార్యస్య న భవత్యన్యథా గతిః,
తద్భవానేవ దృష్టార్థః సంచిన్తయితు మర్హతి. 32

ప్ర. అ. తత్=అది, తథాహి=అట్లే జరుగును కదా ! అస్య=ఈ, కార్యస్య=కార్యమునకు, గతిః=గతి, అన్యథా=మరియొక విధముగా, న భవతి=కాదు. తత్=ఆ కారణమువలన, దృష్టార్థః=చూడబడిన విషయములు గల, భవానేవ=నీవే, సంచిన్తయితుమ్=ఆలోచించుటకు, అర్హతి=తగి ఉన్నావు.

తా. ఇది అట్లే జరుగును. ఈ కార్యమునకు మరొక మార్గము లేదు. అందుచే అన్ని విషయములు తెలిసిన నీవే ఆలోచించవలెను. 32

మూ. సోఽఙ్గదేవ తదా వీరః ప్రత్యుక్తః ప్లవగర్షభః,
జామ్బవానుత్తమం వాక్యం ప్రోవాచేదం తతోఽఙ్గదమ్. 33

ప్ర. అ. అఙ్గదేన=అంగదునిచేత, తదా=అపుడు, ప్రత్యుక్తః= పలుకబడిన, వీరః=వీరుడైన, ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడైన, సః జామ్బవాన్=ఆ జాంబవంతుడు, తతః=అటుపిమ్మట, అఙ్గదమ్= అంగదుని గూర్చి, ఉత్తమమ్=ఉత్తమమైన, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, ప్రోవాచ=పలికెను.

తా. వీరుడు వానరశ్రేష్ఠుడు అయిన జాంబవంతుడు, అంగదుని మాటలు విని, ఆతనితో ఉత్తమమైన వాక్యమును ఇట్లు పలికెను. 33

మూ. తస్య తే వీర కార్యస్య న కిఞ్చిత్పరిహాస్యతే,
ఏష సఞ్చోదయామ్యేనం యః కార్యం సాధయిష్యతి. 34

ప్ర.అ వీర=ఓ ! వీరుడా ! తే=నీయొక్క, తస్య కార్యస్య=ఆ కార్యముయొక్క, కిఞ్చిత్=ఏమీ కూడ, న పరిహాస్యతే=లోపించదు. ఏషః= ఈ నేను, కార్యమ్=కార్యమును, యః=ఎవడు, సాధయిష్యతి= సాధించగలడో, ఏనమ్=వీనిని, సఞ్చోదయామి=ప్రేరేపించెదను.

తా. ఓ ! వీరుడా ! ఈ కార్యమునకు (ఎట్టి) లోపము కలుగదు. ఈ కార్యమును సాధించగలవానిని నేను ప్రేరేపించెదను. 34

మూ. తతః ప్రతీతం ప్లవతాం వరిష్ఠ
మేకాన్తమాశ్రిత్య సుఖోపవిష్టమ్,

సంచోదయామాస హరిప్రవీరో
హరిప్రవీరం హనుమన్తమేవ. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరిప్రవీరః=వానరులలో మహావీరుడైన జాంబవంతుడు, ప్రతీతమ్=ప్రసిద్ధుడు, ప్లవతామ్=వానరులలో, వరిష్ఠమ్= శ్రేష్ఠుడు, ఏకాన్తమ్=నిర్జనప్రదేశమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, సుఖోపవిష్టమ్=సుఖముగా కూర్చున్నవాడు, హరిప్రవీరమ్=వానరవీరుడు అయిన, హనుమన్తమేవ=హనుమంతునే, సంచోదయామాస=ప్రేరేపించెను.

తా. పిమ్మట వానరులలో మహావీరుడైన జాంబవంతుడు ప్రసిద్ధుడు, వానరశ్రేష్ఠుడు, వానరులలో మహావీరుడు అయిన ఏకాంత ప్రదేశములో సుఖముగా కూర్చొని ఉన్న హనుమంతుని ప్రేరేపించెను. 35

*"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో అరువదియైదవ సర్గ సమాప్తము.*

## అథ షట్షష్టితమః సర్గః

[జాంబవంతుడు హనుమంతునకు ఆతని జన్మవృత్తాంతమును తెలిపి సముద్రమును లంఘించుటకై ప్రోత్సహించుట.]

మూ. అనేకశతసాహస్రీం విషణ్ణాం హరివాహినీమ్,
జామ్బవాన్ సముదీక్ష్యైవం హనూమన్తమథాబ్రవీత్. 1

ప్ర. అ. జామ్బవాన్=జాంబవంతుడు, విషణ్ణామ్=దిగులుచెందిన, అనేకశతసాహస్రీమ్=అనేకలక్షల సంఖ్య గల, హరివాహినీమ్=వానరసేనను, సముదీక్ష్య=చూచి, అథ=అటుపిమ్మట, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ఏవమ్=ఇట్లు, అబ్రవీత్=పలికెను.

తా. లక్షల సంఖ్యలో ఉన్న వానరసైన్యము దిగులు చెంది యుండుట చూచి జాంబవంతుడు హనుమంతునితో ఇట్లు పలికెను. 1

మూ. వీర వానరలోకస్య సర్వశాస్త్రవిదాం వర !
తూష్ణీమేకాన్తమాశ్రిత్య హనూమన్ కిం న జల్పసి. 2

ప్ర. అ. వానరలోకస్య=వానరసముదాయముయొక్క, వీర !=వీరుడా! సర్వశాస్త్రవిదామ్=సమస్తమైన శాస్త్రములు తెలిసినవారిలో, వర=శ్రేష్ఠుడా ! హనూమన్=హనుమంతుడా ! తూష్ణీమ్=మౌనముగా, ఏకాన్తమ్= ఏకాన్తమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, కిమ్=ఎందువలన, న జల్పసి= మాటలాడుటలేదు.

తా. వానరులలో వీరుడవు, సమస్తశాస్త్రములు తెలిసినవారిలో శ్రేష్ఠుడవు అయిన ఓ ! హనుమంతుడా ! ఏకాంతప్రదేశములో మౌనముగా కూర్చుండి ఏమీ మాటలాడ వేమి ? 2

మూ. హనూమన్ హరిరాజస్య సుగ్రీవస్య సమో హ్యసి,
రామలక్ష్మణయోశ్చాపి తేజసా చ బలేన చ. 3

ప్ర. అ. హనూమన్=హనుమంతుడా! తేజసా చ=తేజస్సుచేతను, బలేన చ=బలముచేతను, హరిరాజస్య=వానరరాజైన, సుగ్రీవస్య=సుగ్రీవునకు, రామలక్ష్మణయోశ్చాపి=రామలక్ష్మణులకు, సమః=సమానుడవు, అసి హి= అయి ఉన్నావు కదా !

తా. ఓ ! హనుమంతుడా ! నీవు తేజస్సుచేత, బలముచేత, వానరరాజైన సుగ్రీవునితోను, రామలక్ష్మణులతోను సమానుడవు కదా ! 3

మూ. అరిష్టనేమినః పుత్రో వైనతేయో మహాబలః,
గరుత్మానితి విఖ్యాత ఉత్తమః సర్వపక్షిణామ్. 4

ప్ర. అ. అరిష్టనేమినః=కాశ్యపునియొక్క, పుత్రః=పుత్రుడు, సర్వపక్షిణామ్=సమస్తపక్షులలో, ఉత్తమః=ఉత్తముడు, వైనతేయః= వినతాకుమారుడు, మహాబలః=గొప్ప బలము గలవాడు, గరుత్మానితి= గరుత్మంతుడు అని, విఖ్యాతః=ప్రసిద్ధుడు అయిన పక్షిరాజు ఉన్నాడు.

తా. వినతాకాశ్యపుల పుత్రుడు, మహాబలశాలి, సర్వపక్షులలో ఉత్తముడు అయిన గరుత్మంతుడు ప్రసిద్ధుడు. 4

మూ. బహుశో హి మయా దృష్టః సాగరే స మహాబలః,
భుజఙ్గానుద్ధరన్ పక్షీ మహావేగో మహాయశాః. 5

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, మహావేగః=గొప్ప వేగము గల, మహాయశాః=గొప్ప కీర్తి గల, సః=ఆ, పక్షీ=పక్షి, సాగరే= సాగరమునందు, భుజఙ్గాన్=సర్పములను, ఉద్ధరన్=పైకిలాగుచు, మయా=నాచేత, బహుశః=అనేక పర్యాయములు, దృష్టః హి= చూడబడినాడు కదా !

తా. గొప్ప బలము, వేగము, యశస్సు గల ఆ గరుత్మంతుడు సముద్రములో నున్న సర్పములను పైకి లాగుచుండగా నేను అనేకపర్యాయములు చూచితిని. 5

మూ. పక్షయోర్యద్బలం తస్య తావద్భుజబలం తవ,
విక్రమశ్చాపి తేజశ్చ న తే తేనాపహీయతే. 6

ప్ర. అ. తస్య=అతనియొక్క, పక్షయోః=రెక్కలయొక్క, యత్=ఏ, బలమ్=బలమున్నదో, తవ=నీయొక్క, భుజబలమ్=భుజముల బలము, తావత్=అంతే ఉన్నది. తే=నీయొక్క, విక్రమశ్చాపి=పరాక్రమము, తేజశ్చ=తేజస్సు, తేన=వానిచే(తో), న అపహీయతే=తీసిపోదు.

తా. ఆతని రెక్కలకు ఎంత బలము ఉన్నదో నీ భుజములకు అంత బలము ఉన్నది. పరాక్రమముచేతను, తేజస్సుచేతను నీవు ఆతనికి ఏ మాత్రము తీసిపోవు. 6

మూ. బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్త్వం చ హరిపుఙ్గవ!
విశిష్టం సర్వభూతేషు కిమాత్మానం న సజ్జసే. 7

ప్ర. అ. హరిపుఙ్గవ=ఓ ! వానరశ్రేష్ఠుడా ! బలమ్=బలము, బుద్ధిశ్చ బుద్ధి, తేజశ్చ=తేజస్సు, సత్త్వమ్=ధైర్యము, సర్వభూతేషు=అన్ని ప్రాణులయందు, విశిష్టమ్=అధికమైనది. ఆత్మానమ్=నిన్ను, కిమ్= ఎందువలన, న సజ్జసే=సన్నద్ధుని

చేయకున్నావు.

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! నీ బలము, బుద్ధి, తేజస్సు, ధైర్యము ఇతరప్రాణులలో ఉన్నవాటికంటె అధికమైనవి. నీవు ఈ కార్యమునకై ఎందుకు సిద్ధము అగుట లేదు. 7

మూ. అప్సరాప్సరసాం శ్రేష్ఠా విఖ్యాతా పుఞ్జికస్థలా,
అఞ్జనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః. 8

ప్ర. అ. పుఞ్జికస్థలా=పుంజికస్థల యను, అప్సరసామ్=అప్సరస్త్రీలలో, శ్రేష్ఠా=శ్రేష్ఠురాలు, విఖ్యాతా=ప్రసిద్ధురాలు, అఞ్జనేతి=అంజన అని, పరిఖ్యాతా=తెలియబడినది అయిన, అప్సరా=అప్సరస్త్రీ, హరేః= వానరుడైన, కేసరిణః=కేసరియొక్క, పత్నీ=భార్య.

తా. అప్సరస్త్రీలలో శ్రేష్ఠురాలు, ప్రసిద్ధురాలు, అంజన అను నామాంతరము గలది అయిన పుంజికస్థల అను అప్సరస్త్రీ వానరుడైన కేసరియొక్క భార్య. 8

మూ. విఖ్యాతా త్రిషు లోకేషు రూపేణాప్రతిమా భువి,
అభిశాపాదభూత్తాత వానరీ కామరూపిణీ. 9

ప్ర. అ. తాత=ఓ ! తండ్రీ ! రూపేణ=రూపముచేత, అప్రతిమా=సాటి లేనిదిగా, త్రిషు=మూడు, లోకేషు=లోకములయందు, విఖ్యాతా= ప్రసిద్ధురాలైన ఆమె, అభిశాపాత్=శాపమువలన, భువి=భూలోకమునందు, కామరూపిణీ=స్వేచ్ఛారూపము గల, వానరీ=వానరస్త్రీగా, అభూత్=ఆయెను.

తా. నాయనా ! సౌందర్యమునందు పాటిలేనిదిగా మూడు లోకములలోను ప్రసిద్ధురాలైన ఆమె శాపవశము చేత, స్వేచ్ఛానుసారముగా రూపము ధరించగల వానరస్త్రీగా భూలోకమునందు పుట్టినది. 9

మూ. దుహితా వానరేన్ద్రస్య కుఞ్జరస్య మహాత్మనః,
మానుషం విగ్రహం కృత్వా రూపయౌవనశాలినీ. 10
విచిత్రమాల్యాభరణా కదాచిత్క్షౌమధారిణీ,
అచరత్పర్వతస్యాగ్రే ప్రావృడమ్బుదసన్నిభే. 11

ప్ర. అ. వానరేన్ద్రస్య=వానరప్రభువైన, మహాత్మనః=మహాత్ముడైన, కుఞ్జరస్య=కుంజరునియొక్క, దుహితా=కుమార్తెయైన, రూపయౌవనశాలినీ=రూప యౌవనములతో ప్రకాశించుచున్న ఆమె, కదాచిత్= ఒకప్పుడు, మానుషమ్=మనుష్య సంబంధమైన, విగ్రహమ్=శరీరమును, కృత్వా=చేసి, విచిత్రమాల్యాభరణా=విచిత్రమైన మాల్యములు అలంకారములు కలదై, క్షౌమధారిణీ=పట్టువస్త్రమును ధరించినట్టిదై, ప్రావృడమ్బుదసన్నిభే= వర్షకాలమేఘముతో సమానమైన, పర్వతస్య అగ్రే=పర్వతము

యొక్క శిఖరమునందు, అచరత్=సంచరించెను.

తా. వానరప్రభువైన, మహాత్ముడైన కుంజరుని కుమార్తెగా పుట్టిన ఆ పుంజికస్థల రూపముతోను, యౌవనముతోను ప్రకాశించుచున్న మనుష్యశరీరము దాల్చి, విచిత్రములైన పుష్పమాలలు, అలంకారములు ధరించి, తెల్లని పట్టు వస్త్రమును కట్టుకొని ఒకనాడు వర్షకాలమేఘమువలె ఉన్న పర్వతశిఖరమునందు సంచరించెను. 10,11

మూ. తస్యా వస్త్రం విశాలాక్ష్యాః పీతరక్తదశం శుభమ్,
స్థితాయాః పర్వతస్యాగ్రే మారుతోఽపాహరచ్ఛనైః. 12

ప్ర. అ. పర్వతస్య=పర్వతముయొక్క, అగ్రే=అగ్రమునందు, స్థితాయాః=ఉన్న, విశాలాక్ష్యాః=విశాలములయిన నేత్రములు గల, తస్యాః= ఆమెయొక్క, పీతరక్తదశమ్=పచ్చని, ఎఱ్ఱని అగ్రభాగములు గల, శుభమ్= సుందరమైన, వస్త్రమ్=వస్త్రమును, మారుతః=వాయువు, శనైః= మెల్లగా, అపాహరత్=తొలగించెను.

తా. విశాలము లగు నేత్రములు గల ఆమె పర్వతశిఖరముమీద ఉండగా, పచ్చని ఎఱ్ఱని అంచులు గల ఆమె వస్త్రమును వాయుదేవుడు మెల్లగా తొలగించెను.

మూ. స దదర్శ తతస్తస్యా వృత్తావూరూ సుసంహతౌ,
స్తనౌ చ పీనౌ సహితౌ సుజాతం చారు చాననమ్. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః=ఆ వాయుదేవుడు, తస్యాః= ఆమెయొక్క, వృత్తౌ=గుండ్రముగా ఉన్న, సుసంహతౌ=బాగా దగ్గరగా ఉన్న, ఊరూ=తొడలను, పీనౌ=బలిసిన, సహితౌ=కలిసి ఉన్న, స్తనౌ చ= స్తనములను, సుజాతమ్=చక్కని ఆకారము గల, చారు=అందమైన, ఆననం చ=ముఖమును, దదర్శ=చూచెను.

తా. అపుడు ఆ వాయుదేవుడు ఆమెయొక్క గుండ్రని కలిసి ఉన్న తొడలను, బలిసి దగ్గరగా ఉన్న స్తనములను, చాల అందమైన ముఖమును చూచెను. 13

మూ. తాం విశాలాయతశ్రోణీం తనుమధ్యాం యశస్వినీమ్,
దృష్ట్వైవ శుభసర్వాఙ్గీం పవనః కామమోహితః. 14

ప్ర. అ. విశాలాయతశ్రోణీమ్=విశాలమైన, దీర్ఘమైన కటిస్థలము గలది, తనుమధ్యామ్=సన్నని నడుము గలది, యశస్వినీమ్=కీర్తి గలది, శుభసర్వాఙ్గీమ్=సుందరమైన సమస్త అవయవములు గలది అయిన, తామ్= ఆమెను, దృష్ట్వైవ=చూడగానే, పవనః=వాయువు, కామమోహితః= కామముచేత మోహితు డయ్యెను.

తా. విశాలమైన కటిప్రదేశము, సన్నని నడుము, అందమైన సకల అవయవములు గల, కీర్తిమంతురాలైన ఆమెను చూడగానే వాయుదేవుడు కామముచేత మోహితు డయ్యెను. 14

మూ. స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః,
మన్మథావిష్టసర్వాఙ్గో గతాత్మా తామనిన్దితామ్. 15

ప్ర. అ. అనిన్దితామ్=నిందింపబడని, తామ్=ఆమెను గూర్చి, గతాత్మా=వెళ్లిన మనస్సుగల, సః మారుతః=ఆ వాయుదేవుడు, మన్మథావిష్టసర్వాఙ్గః=మన్మథునిచేత ఆవేశింపబడిన సమస్త శరీరము గలవాడై, దీర్ఘాభ్యామ్=పొడవైన, భుజాభ్యామ్=భుజములతో, తామ్=ఆమెను, పర్యష్వజత=కౌగలించుకొనెను.

తా. దోషములు లేని ఆమెయందు మనస్సు ప్రవర్తించుటచేత మన్మథుడావేశించిన సకలశరీరము గల వాయుదేవుడు పొడవైన భుజములతో ఆమెను కౌగలించుకొనెను. 15

మూ. సా తు తత్రైవ సమ్భ్రాన్తా సువ్రతా వాక్యమబ్రవీత్,
ఏకపత్నీవ్రతమిదం కో నాశయితుమిచ్ఛతి. 16

ప్ర. అ. తత్రైవ=అక్కడ, సమ్భ్రాన్తా=భయపడిన, సువ్రతా=మంచి నియమములు గల, సా తు=ఆమె యైతే, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. ఇదమ్=ఈ, ఏకపత్నీవ్రతమ్=ఒకే భర్త కలిగిఉండుట అను వ్రతమును, కః=ఎవడు, నాశయితుమ్=నశింపచేయుటకు, ఇచ్ఛతి= కోరుచున్నాడు.

తా. ఉత్తమమైన నియమములు గల ఆమె అప్పుడు భయపడుచు ఇట్లు పలికెను. "నా ఏకపత్నీవ్రతమును నశింప చేయుచున్నవాడు ఎవడు ?" 16

మూ. అఞ్జనాయా వచః శ్రుత్వా మారుతః ప్రత్యభాషత,
న త్వాం హింసామి సుశ్రోణి మా భూత్తే మనసో భయమ్. 17

ప్ర. అ. అఞ్జనాయాః=అంజనయొక్క, వచః=మాటను, శ్రుత్వా=విని, మారుతః=వాయువు, ప్రత్యభాషత=తిరిగి పలికెను. సుశ్రోణి=మంచి కటి స్థలము గలదానా, త్వామ్=నిన్ను, న హింసామి=హింసించను. తే=నీయొక్క, మనసః=మనస్సునకు, భయమ్=భయము, మా భూత్= లేకపోవుగాక!

తా. అంజన మాటలు విని, వాయుదేవుడు ఇట్లు పలికెను. "అందమైన శ్రోణులు గల ఓ ! అంజనా ! నిన్ను నేను హింసించను. భయపడకుము." 17

మూ. మనసాఽస్మి గతో యత్త్వాం పరిష్వజ్య యశస్విని,
వీర్యవాన్ బుద్ధిసమ్పన్నస్తవ పుత్రో భవిష్యతి. 18

ప్ర. అ. యశస్విని=కీర్తిగలదానా ! యత్=ఏ కారణమువలన, త్వామ్= నిన్ను, పరిష్వజ్య=కౌగలించుకొని, మనసా=మనస్సుచేత మాత్రమే, గతః అస్మి=పొందినానో, (అందువలన భయపడకుము). తవ=నీకు, వీర్యవాన్=పరాక్రమవంతుడు, బుద్ధిసమ్పన్నః=బుద్ధితో కూడినవాడు అయిన, పుత్రః= పుత్రుడు, భవిష్యతి=పుట్టగలడు.

తా. ఓ! కీర్తిమంతురాలా! నిన్ను నేను కౌగలించుకొని మనస్సుచేతనే నిన్ను అనుభవించితిని. అందుచేత నీకు వ్రతభంగము లేదు. నీకు పరాక్రమవంతుడు, బుద్ధిమంతుడు అయిన పుత్రుడు కలుగును. 18

మూ. మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః,
లఙ్ఘనే ప్లవనే చైవ భవిష్యతి మయా సమః. 19

ప్ర. అ. మహాసత్త్వః=గొప్ప ధైర్యము కల, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహాబలపరాక్రమః=గొప్ప బలము పరాక్రమము గల అతడు, లఙ్ఘనే= దుముకుటయందు, ప్లవనే చైవ=ఎగురుటయందు, మయా=నాతో, సమః= సమానుడు, భవిష్యతి=కాగలడు.

తా. గొప్ప ధైర్యము, తేజస్సు, బలము, పరాక్రమము గల నీ కుమారుడు ఎగురుటయందు, దుముకుటయందు నాతో సమానుడై ఉండును. 19

మూ. ఏవముక్తా తతస్తుష్టా జననీ తే మహాకపే,
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభమ్. 20

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గల, మహాకపే=ఓ ! మహావానరుడా ! ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలుకబడిన, తే జననీ=నీ తల్లి, తుష్టా= సంతోషించినదై, తతః=అటుపిమ్మట, ప్లవగర్షభమ్=వానరశ్రేష్ఠుడవైన, త్వామ్=నిన్ను, గుహాయామ్=గుహయందు, ప్రజజ్ఞే=కనెను.

తా. గొప్ప బాహువులు గల ఓ ! వానరశ్రేష్ఠుడా ! నీ తల్లి ఆ మాటలు విని సంతోషించి ఒక గుహలో వానరశ్రేష్ఠుడ వైన నిన్ను కనెను. 20

మూ. అభ్యుత్థితం తతః సూర్యం బాలో దృష్ట్వా మహావనే,
ఫలం చేతి జిఘృక్షుస్త్వముత్ప్లుత్యాభ్యుదితో దివమ్. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బాలః=బాలుడవైన, త్వమ్=నీవు, మహావనే=మహావనమునందు, అభ్యుత్థితమ్=లేచిన, సూర్యమ్=సూర్యుణ్ణి, దృష్ట్వా=చూచి, ఫలం చేతి=ఫలము అని, జిఘృక్షుః=గ్రహింప దలచినవాడవై, ఉత్ప్లుత్య=ఎగిరి, దివమ్=ఆకాశమును గూర్చి, అభ్యుద్గతః= వెళ్లితివి.

తా. బాలుడవైన నీవు ఆ మహావనములో ఉదయించుచున్న సూర్యుని చూచి, ఫల మని తలచి, దానిని పట్టుకొనవలె నను కోరికతో ఆకాశము వైపు ఎగిరితివి. 21

మూ. శతాని త్రీణి గత్వాథ యోజనానాం మహాకపే,
తేజసా తస్య నిర్ధూతో న విషాదం గతస్తతః. 22

ప్ర. అ.మహాకపే !=ఓ మహావానరుడా ! అథ=అటుపిమ్మట, యోజ

నానామ్= యోజనములయొక్క, త్రీణి=మూడు, శతాని=శతములను, గత్వా=వెళ్లి, తస్య=ఆ సూర్యునియొక్క, తేజసా=తేజస్సుచేత, నిర్ధూతః= ఆక్రమించబడిన వాడవై నను, తతః=దానివలన, విషాదమ్=దుఃఖమును (భయము), న గతః=పొందలేదు.

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! నీవు మూడు వందల యోజనముల దూరము ఎగిరి, సూర్యుని తేజస్సు ఆక్రమించుచున్నను దానివలన భయపడలేదు. 22

మూ. త్వామప్యుపగతం తూర్ణ మన్తరిక్షం మహాకపే,
క్షిప్తమిన్ద్రేణ తే వజ్రం కోపావిష్టేన ధీమతా. 23

ప్ర. అ. మహాకపే=ఓ! వానరశ్రేష్ఠుడా! తూర్ణమ్=శీఘ్రముగా, అన్తరిక్షమ్=ఆకాశమును, ఉపగతమ్=పొందిన, త్వామ్ అపి=నిన్ను (చూచి), కోపావిష్టేన=కోపముతో కూడిన, ధీమతా=బుద్ధిమంతుడైన, ఇన్ద్రేణ= ఇంద్రునిచేత, వజ్రమ్=వజ్రము, తే=నీకు, క్షిప్తమ్=విసరబడినది.

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! వేగముగా ఆకాశము మీదికి వచ్చిన నిన్ను చూచి బుద్ధిమంతుడైన ఇంద్రుడు కోపావిష్టుడై నీపై వజ్రమును ప్రయోగించెను.

మూ. తదా శైలాగ్రశిఖరే వామో హనురభజ్యత,
తతో హి నామధేయం తే హనుమానితి కీర్తితమ్. 24

ప్ర. అ. తదా=అప్పుడు, శైలాగ్రశిఖరే=శైలాగ్రమునందలి శిఖరమునందు, వామః=ఎడమదైన, హనుః=గడ్డము, అభజ్యత=విరిగెను. తతః=ఆ కారణమువ లననే, తే=నీయొక్క, నామధేయమ్=పేరు, హనుమానితి= హనుమంతుడు అని, కీర్తితమ్=చెప్పబడినది.

తా. అప్పుడు నీవు పర్వతశిఖరముమీద పడుటచే నీ ఎడమ గడ్డము విరిగిపోయెను. అందువలననే నీకు "హనుమంతుడు" అను పేరు వచ్చినది. 24

మూ. తతస్త్వాం నిహతం దృష్ట్వా వాయుర్గన్ధవహః స్వయమ్,
త్రైలోక్యే భృశసంక్రుద్ధో న వవౌ వై ప్రభఞ్జనః. 25

ప్ర. అ. తతః=అటుపిమ్మట, గన్ధవహః=గంధమును మోయువాడు, ప్రభఞ్జనః=వృక్షాదులను విరచు శక్తి కలవాడు అయిన, వాయుః=వాయువు, త్వామ్=నిన్ను, నిహతమ్=కొట్టబడినవానినిగా, దృష్ట్వా=చూచి, స్వయమ్=తాను, భృశసంక్రుద్ధః=చాల కోపించినవాడై, త్రైలోక్యమ్= మూడు లోకములను, న వవౌ వై=వీచలేదు.

తా. గంధమును మోయువాడు, వృక్షాదులను విరచివేయు శక్తి కలవాడు అయిన వాయుదేవుడు నిన్ను ఆ విధముగా దేవేంద్రుడు కొట్టుట చూచి, చాల కోపించినవాడై మూడు లోకములలోను వీచలేదు. 25

మూ. సంభ్రాన్తాశ్చ సురాః సర్వే త్రైలోక్యే క్షోభితే సతి,
ప్రసాదయన్తి సంక్రుద్ధం మారుతం భువనేశ్వరాః. 26

ప్ర. అ. త్రైలోక్యే=మూడులోకములు, క్షోభితే సతి=క్షోభ పెట్టబడిన వగుచుండగా, భువనేశ్వరాః=లోకములకు ప్రభువులైన, సర్వే=సమస్తమైన, సురాః=దేవతలు, సంభ్రాన్తాః=భయపడినవారై, సంక్రుద్ధమ్=కోపించిన, మారుతమ్=వాయువును, ప్రసాదయన్తి=అనుగ్రహింపచేసికొనిరి.

తా. మూడు లోకములు క్షోభ చెందుట చూచి లోకపాలులైన దేవత లందరూ, కోపించిన ఆ వాయుదేవుణ్ణి ప్రార్థించిరి. 26

మూ. ప్రసాదితే చ పవనే బ్రహ్మా తుభ్యం వరం దదౌ,
అశస్త్రవధ్యతాం తాత సమరే సత్యవిక్రమ. 27

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, సత్యవిక్రమ=సత్యమైన పరాక్రమము గల వాడా ! తాత=నాయనా ! పవనే=వాయువు, ప్రసాదితే= అనుగ్రహింపచేసికొనబడి నవా డగుచుండగా, బ్రహ్మా=బ్రహ్మ, తుభ్యమ్=నీకు, అశస్త్రవధ్యతామ్=శస్త్రములచేత చంప శక్యముకాకుండుటను, వరమ్= వరమునుగా, దదౌ=ఇచ్చెను.

తా. యుద్ధమునందు సత్యమైన పరాక్రమము గల నాయనా ! వాయుదేవుడు ఆ విధముగా బ్రతిమాలికొనబడు సమయమునందు బ్రహ్మదేవుడు నీకు శస్త్రములచేత చావులేకపోవుట అను వరమును ఇచ్చెను. 27

మూ. వజ్రస్య చ నిపాతేన విరుజం త్వాం సమీక్ష్య చ,
సహస్రనేత్రః ప్రీతాత్మా దదౌ తే వరముత్తమమ్, 28
స్వచ్ఛన్దతశ్చ మరణం తవ స్యాదితి వై ప్రభో.

ప్ర. అ. ప్రభో=ఓ ! సర్వసమర్థుడా ! సహస్రనేత్రః=దేవేంద్రుడు, వజ్రస్య= వజ్రముయొక్క, నిపాతేన=పడుటచేత, త్వామ్=నిన్ను, విరుజమ్=పీడ లేనివానినిగా, సమీక్ష్య చ=చూచి, ప్రీతాత్మా=సంతోషించిన మనస్సు గలవాడై, తవ=నీకు, స్వచ్ఛన్దతః=స్వేచ్ఛగా, మరణమ్=మరణము, స్యాత్= అగుగాక, ఇతి=అని, ఉత్తమమ్=ఉత్తమమైన, వరమ్=వరమును, దదౌ=ఇచ్చెను.

తా. ఓ ! సర్వసమర్థుడవైన హనుమంతుడా ! వజ్రాయుధము ప్రయోగించినను నీకు ఎట్టి పీడా కలుగకుండుటను చూచి, దేవేంద్రుడు సంతోషించుచు, నీవు కోరినప్పుడు మాత్రమే నీకు మరణము వచ్చునని ఒక గొప్పవరమును నీ కిచ్చెను. 28

మూ. స త్వం కేసరిణః పుత్రః క్షేత్రజో భీమవిక్రమః, 29
మారుతస్యౌరసః పుత్రస్తేజసా చాపి తత్సమః.
త్వం హి వాయుసుతో వత్స ప్లవనే చాపి తత్సమః. 30

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, సః త్వమ్= అట్టి నీవు, కేసరిణః=కేసరియొక్క, క్షేత్రజః=క్షేత్రజుడవైన (ఆతని భార్యకు ఇతరుని వలన పుట్టిన) , పుత్రః=పుత్రుడవు. మారుతస్య=వాయుదేవునియొక్క, ఔరసః పుత్రః=ఔరస(సాక్షాత్) పుత్రుడవు. తేజసా=తేజస్సుచేత, తత్సమశ్చ=ఆతనితో సమానుడవు. వత్స=నాయనా ! వాయుసుతః= వాయుపుత్రుడవైన, త్వమ్=నీవు, ప్లవనే=ఎగురుటయందు, తత్సమః హి= ఆతనితో సమానుడవు కదా ?

తా. భయంకరమైన పరాక్రమము గల అట్టి నీవు కేసరికి క్షేత్రజపుత్రుడవు. వాయువునకు ఔరసపుత్రుడవు. తేజస్సుచేత ఆతనితో సమానుడవు. వాయువా! వాయుపుత్రుడవైన నీవు ఎగురుటలో కూడ ఆతనితో తుల్యుడవు. 29,30

మూ. వయమద్య గతప్రాణా భవానస్మాసు సాంప్రతమ్,
దాక్ష్యవిక్రమసంపన్నః కపిరాజ ఇవాపరః. 31

ప్ర. అ. అద్య=ఇప్పుడు, వయమ్=మేము, గతప్రాణాః=పోయిన ప్రాణములు గలవారము. భవాన్=నీవు, సాంప్రతమ్=ఇప్పుడు, అస్మాసు= మాలో, దాక్ష్యవిక్రమ సంపన్నః=సామర్థ్యముతోను, పరాక్రమముతోను కూడినవాడవు; అపరః=మరియొక, కపిరాజః, ఇవ=సుగ్రీవుడు వంటివాడవు.

తా. ఇప్పుడు మా ప్రాణములు పోవుచున్నవి. ఇప్పుడు మాలో సామర్థ్యము, పరాక్రమము గల వాడవు నీవే. రెండవ సుగ్రీవునివంటివాడవు. 31

మూ. త్రివిక్రమే మయా తాత సశైలవనకాననా,
త్రిఃసప్తకృత్వః పృథివీ పరిక్రాన్తా ప్రదక్షిణమ్. 32

ప్ర. అ. తాత=నాయనా ! త్రివిక్రమే=త్రివిక్రమావతార సమయమునందు, సశైలవనకాననా=పర్వతములతోను, వనములతోను, మహారణ్యములతోను కూడిన, పృథివీ=భూమి, మయా=నాచేత, త్రిఃసప్తకృత్వః=ఇరువది ఒక్క పర్యాయములు, ప్రదక్షిణమ్=ప్రదక్షిణముగా, పరిక్రాన్తా=చుట్టూతిరగబడినది.

తా. నాయనా ! మహావిష్ణువు త్రివిక్రమరూపము ధరించినప్పుడు నేను ఈ పర్వతారణ్యాదులతో కూడిన భూమికి ఇరవది ఒక్క పర్యాయములు ప్రదక్షిణము చేసితిని. 32

మూ. తదా చౌషధయోఽస్మాభిః సంచితా దేవశాసనాత్,
నిర్మథ్యమమృతం యాభిస్తదానీం నో మహద్బలమ్. 33

ప్ర. అ. తదా=అప్పుడు, దేవశాసనాత్=దేవతల యొక్క ఆజ్ఞవలన, యాభిః=వేటిచేత, అమృతమ్=అమృతము, నిర్మథ్యమ్=మథింప దగినదో, ఓషధయః=అట్టి ఓషధులు, అస్మాభిః=మాచేత, సంచితాః= ప్రోగుచేయబడినవి. తదానీమ్=అప్పుడు, నః=మాయొక్క, బలమ్= బలము, మహత్=చాల గొప్పది.

తా. అప్పుడు దేవతల ఆజ్ఞచేత మేము, సముద్రములో వేసి అమృతమును మథించుటకు ఉపయోగించు ఓషధులను సంపాదించుకొని వచ్చితిమి. ఆ కాలములో మాకు చాల బలము ఉండెడిది. 33

మూ. స ఇదానీమహం వృద్ధః పరిహీనపరాక్రమః,
సాంప్రతం కాలమస్మాకం భవాన్సర్వగుణాన్వితః. 34

ప్ర. అ. ఇదానీమ్=ఇప్పుడు, వృద్ధః=వృద్ధుడనై, సః అహమ్=అట్టి నేను, పరిహీనపరాక్రమః=తగ్గిపోయిన పరాక్రమము కలవాడను. సాంప్రతం కాలమ్= ఈ కాలమునందు, భవాన్=నీవు, అస్మాకమ్=మాలో, సర్వగుణాన్వితః= సమస్తగుణములతో కూడినవాడవు.

తా. ఇప్పుడు నేను వృద్ధుడ నైపోవుటచే నా బలపరాక్రమములు క్షీణించినవి. ఈ సమయమునందు మాలో సమస్తగుణములు ఉన్నవాడవు నీవే. 34

మూ. తద్విజృమ్భస్వ విక్రాన్త ప్లవతాముత్తమో హ్యసి,
త్వద్వీర్యం ద్రష్టుకామా హి సర్వా వానరవాహినీ. 35

ప్ర. అ. విక్రాన్త=పరాక్రమవంతుడా ! తత్=ఆ కారణమువలన, విజృమ్భస్వ=విజృంభించుము. ప్లవతామ్=వానరులలో, ఉత్తమః= ఉత్తముడవు, అసి హి=అయి ఉన్నావు కదా ! సర్వా=సమస్తమైన, వానరవాహినీ=వానరసేన, త్వద్వీర్యమ్=నీ పరాక్రమమును, ద్రష్టుకామా హి=చూడవలెనను కోరికగలది.

తా. ఓ ! పరాక్రమవంతుడా ! అందుచేత విజృంభించుము. నీవు వానరులలో శ్రేష్ఠుడవు కదా ? ఈ వానరసేన అంతా నీ పరాక్రమమును చూడవలె నని కోరుచున్నది. 35

మూ. ఉత్తిష్ఠ హరిశార్దూల లఙ్ఘయస్వ మహార్ణవమ్,
పరా హి సర్వభూతానాం హనుమన్యా గతిస్తవ. 36

ప్ర. అ. హరిశార్దూల=వానరశ్రేష్ఠుడా ! హనుమన్=హనుమంతుడా! ఉత్తిష్ఠ=లెమ్ము. మహార్ణవమ్=మహాసముద్రమును, లఙ్ఘయస్వ= దాటుము. తవ=నీయొక్క, యా=ఏ, గతిః=గమన మున్నదో అది, సర్వభూతానామ్=సకల భూతములలో, పరా హి=శ్రేష్ఠ మైనది కదా !

తా. వానరశ్రేష్ఠుడవైన ఓ ! హనుమంతుడా ! లెమ్ము. మహాసముద్రమును దాటుము. నీ గమనశక్తి జగత్తులోని అన్ని ప్రాణుల గమనశక్తికంటె చాల గొప్పది కదా ! 36

మూ. విషణ్ణా హరయః సర్వే హనుమన్ కిముపేక్షసే,
విక్రమస్వ మహావేగ విష్ణుస్త్రీన్ విక్రమానివ. 37

ప్ర. అ. హనుమన్=హనుమంతుడా ! సర్వే=సమస్తమైన, హరయః= వానరులు, విషణ్ణాః=దిగులు చెంది ఉన్నారు. కిమ్=ఎందువలన, ఉపేక్షసే= ఉపేక్షించుచున్నావు ? మహావేగ=గొప్ప వేగము గలవాడా ! విష్ణుః=విష్ణువు, త్రీన్=మూడు, విక్రమానివ=పాదన్యాసములను వలె, విక్రమస్వ= ఆక్రమించుము.

తా. హనుమంతుడా ! వానరు లందరూ దిగులు చెంది ఉన్నారు. నీవు ఉపేక్షించుచున్నా వేమి ? మహావేగము గలవాడా ! విష్ణువు మూడు పాదన్యాసములచేత లోకములను ఆక్రమించి నట్లు నీవు నీ శక్తిని చూపుము.37

మూ. తతః కపీనామృషభేణ చోదితః
ప్రతీతవేగః పవనాత్మజః కపిః,
ప్రహర్షయంస్తాం హరివీరవాహినీం
చకార రూపం మహదాత్మనస్తదా. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
షట్షష్టితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కపీనామ్ ఋషభేణ=వానరులలో శ్రేష్ఠుడైన జాంబవంతునిచేత, చోదితః=ప్రేరేపింపబడిన, ప్రతీతవేగః=ప్రసిద్ధమైన వేగము గల, పవనాత్మజః=వాయుపుత్రుడైన, కపిః=హనుమంతుడు, తామ్=ఆ, హరివీరవాహినీమ్=వానరవీరుల సేనను, ప్రహర్షయన్=సంతోషింపచేయుచు, తదా=అప్పుడు, ఆత్మనః=తనయొక్క, రూపమ్=రూపమును, మహత్= పెద్దదానినిగా, చకార=చేసెను.

తా. ప్రసిద్ధమైన వేగము గల వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు, వానర శ్రేష్ఠుడైన జాంబవంతు డీ విధముగా ప్రేరేపించగా, ఆ వానరవీరసైన్యమునకు సంతోషము కలుగునట్లు తన శరీరమును చాల పెద్దదిగా చేసెను. 38

*"బాలనందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో*
అరువదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తషష్టితమః సర్గః

[సముద్రమును దాటుటకు హనుమంతుడు ఉత్సాహమును చూపుట. జాంబవంతుడు ఆతనిని ప్రశంసించుట. వేగముగా ఎగురుటకై హనుమంతుడు మహేంద్రపర్వతమును ఎక్కుట.]

మూ. తం దృష్ట్వా జృమ్భమాణం తే క్రమితుం శతయోజనమ్,
వేగేనాపూర్యమాణం చ సహసా వానరోత్తమమ్. 1
సహసా శోకముత్సృజ్య ప్రహర్షేణ సమన్వితాః,
వినేదుస్తుష్టువుశ్చాపి హనూమన్తం మహాబలమ్. 2

ప్ర.అ. శతయోజనమ్=నూరు యోజనముల దూరమును, క్రమితుమ్=ఆక్రమించుటకు, జృమ్భమాణమ్=విజృంభించుచున్నవాడు, సహసా= శీఘ్రముగా, వేగేన=వేగముచేత, ఆపూర్యమాణం చ=నింపబడుచున్నవాడు, వానరోత్తమమ్=వానరులలో శ్రేష్ఠుడు అయిన, మహాబలమ్=గొప్పబలము గల, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని, దృష్ట్వా=చూచి, తే=ఆ వానరులు, సహసా=వెంటనే, శోకమ్=శోకమును, ఉత్సృజ్య=విడచి, ప్రహర్షేణ= గొప్ప ఆనందముతో, సమన్వితాః=కూడినవారై, వినేదుః=ధ్వని చేసిరి. తుష్టువుశ్చాపి=ఆతనిని స్తుతించిరి కూడ.

తా. వానరోత్తముడు, మహాబలశాలీ అయిన ఆ హనుమంతుడు నూరు యోజనముల దూరము దాటుటకు విజృంభించుచు వేగమును పూర్తిగా చూపుటకు ఉద్యుక్తుడవగా ఆతనిని చూచి వానరులు వెంటనే తమ శోకమును విడచి, చాల సంతోషించుచు బిగ్గరగా అరచిరి; ఆతనిని స్తుతించిరి కూడ. 1,2

మూ. ప్రహృష్టా విస్మితాశ్చాపి తే వీక్షన్తే సమన్తతః,
త్రివిక్రమకృతోత్సాహం నారాయణ మివ ప్రజాః. 3

ప్ర. అ. సమన్తతః=అన్ని పక్కలా ఉన్న, తే=ఆ వానరులు, ప్రహృష్టాః=సంతోషించినవారై, విస్మితాశ్చాపి=ఆశ్చర్యపడుచున్నవారై, ప్రజాః=ప్రజలు, త్రివిక్రమకృతోత్సాహమ్=మూడు పాదన్యాసములు చేయుటయందు చూపబడిన ఉత్సాహముగల, నారాయణమివ=శ్రీమహావిష్ణువును వలె, వీక్షన్తే=చూచుచుండిరి.

తా. ఆ వానరులు ఆతని చుట్టూ నిలచి, సంతోషించుచు, మూడు అడుగులు వేయుటలో ఉత్సాహము చూపుచున్న శ్రీమహావిష్ణువును ప్రజలు చూచి నట్లు ఆశ్చర్యముతో చూచిరి. 3

మూ. సంస్తూయమానో హనుమాన్ వ్యవర్ధత మహాబలః,
సమావిధ్య చ లాఙ్గూలం హర్షాద్బలముపేయివాన్. 4

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, హనుమాన్=హనుమంతుడు, సంస్తూయమానః=స్తుతింపబడుచున్నవాడై, హర్షాత్=సంతోషమువలన, బలమ్=బలమును, ఉపేయివాన్=పొందినవాడై, లాఙ్గూలమ్=తోకను, సమావిధ్య=గట్టిగా విదిపి, వ్యవర్ధత=వృద్ధిపొందెను.

తా. మహాబలశాలియైన హనుమంతుడు వానరులచే స్తుతింపబడుచు, సంతోషమువలన బలమును పొంది, తోకను గట్టిగా విదిపి పెరిగెను. 4

మూ. తస్య సంస్తూయమానస్య వృద్ధైర్వానరపుఙ్గవైః,
తేజసాఽఽపూర్యమాణస్య రూపమాసీదనుత్తమమ్. 5

ప్ర. అ. వృద్ధైః=వృద్ధులైన, వానరపుఙ్గవైః=వానరశ్రేష్ఠులచేత, సంస్తూయమానస్య=స్తుతింపబడుచున్న, తేజసా=తేజస్సుచేత, ఆపూర్యమాణస్య=నింపబడుచున్న, తస్య=ఆతనియొక్క, రూపమ్=రూపము, అనుత్తమమ్=చాల శ్రేష్ఠముగా, ఆసీత్=ఉండెను.

తా. పెద్దవారైన వానరశ్రేష్ఠు లందరూ స్తుతించుచుండగా, తేజస్సుతో నిండుచున్న ఆతని ఆకారము చాల ఉత్తమముగా ఉండెను. 5

మూ. యథా విజృమ్భతే సింహో వివృతే గిరిగహ్వరే,
మారుతస్యౌరసః పుత్రస్తథా సంప్రతి జృమ్భతే. 6

ప్ర. అ. వివృతే=తెరవబడిన (లేదా విశాలమైన,)గిరిగహ్వరే= పర్వత గుహయందు, సింహః=సింహము, యథా=ఎట్లు, విజృమ్భతే= విజృంభించునో, మారుతస్య=వాయువుయొక్క, ఔరసః పుత్రః=ఔరసపుత్రుడైన హనుమంతుడు, సంప్రతి=ఇప్పుడు, తథా=అట్లు, జృమ్భతే= విజృంభించుచున్నాడు.

తా. తెరవబడిన విశాలమైన పర్వతగుహలో సింహము ఎట్లు విజృంభించునో, వాయుపుత్రుడైన హనుమంతుడు ఇప్పుడు అట్లు విజృంభించుచున్నాడు. 6

మూ. అశోభత ముఖం తస్య జృమ్భమాణస్య ధీమతః,
అమ్బరీషమివాదీప్తం విధూమ ఇవ పావకః. 7

ప్ర. అ. జృమ్భమాణస్య=ఆవలించుచున్న, ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య=ఆతనియొక్క, ముఖమ్=ముఖము, ఆదీప్తమ్=మండుచున్న, అమ్బరీషమివ=పెనము వలె, విధూమః=ధూమము లేని, పావకః ఇవ= అగ్నివలె, అశోభత=ప్రకాశించెను.

తా. ధీమంతుడైన ఆ హనుమంతుడు ఆవులించి నప్పుడు, ఆతని

ముఖము ఎట్టిగా కాలిన పెనము వలె, ధూమము లేని అగ్నివలె ప్రకాశించెను.7

మూ. హరీణాముత్థితో మధ్యాత్సంప్రహృష్టతనూరుహః,
అభివాద్య హరీన్ వృద్ధాన్ హనుమానిదమబ్రవీత్. 8

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, మధ్యాత్=మధ్యమునుండి, ఉత్థితః= లేచిన, సంప్రహృష్టతనూరుహః =వికసించిన(లేచిన) రోమములు గల, హనుమాన్= హనుమంతుడు, వృద్ధాన్=వృద్ధులైన, హరీన్=వానరులను, అభివాద్య= నమస్కరించి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు వానరులమధ్య నుండి లేచెను. ఆతని శరీరము గగుర్పొడిచెను. పెద్దలైన వానరులందరికి నమస్కరించి ఆత డిట్లు పలికెను. 8

మూ. అరుజత్పర్వతాగ్రాణి హుతాశనసఖోఽ నిలః,
బలవానప్రమేయశ్చ వాయురాకాశగోచరః. 9

ప్ర. అ. హుతాశనసఖః=అగ్నికి స్నేహితుడు, బలవాన్=బలవంతుడు, అప్రమేయః చ=ఇంతటి వాడని చెప్ప శక్యము కానివాడు, ఆకాశగోచరః= ఆకాశమునందు సంచరించువాడు, అనిలః=వేగము గలవాడు అయిన, వాయుః= వాయువు, పర్వతాగ్రాణి=పర్వతాగ్రములను, అరుజత్=పీడించెను.

తా. అగ్నికి స్నేహితుడు, వేగముగా సంచరించువాడు, ఊహింప శక్యము కాని బలము కలవాడు, ఆకాశమునందు సంచరించువాడు అయిన వాయుదేవుడు పర్వతశిఖరములను కూడ ఎగురగొట్టగలడు. 9

మూ. తస్యాహం శీఘ్రవేగస్య శీఘ్రగస్య మహాత్మనః,
మారుతస్యౌరసః పుత్రః ప్లవనేనాస్మి తత్సమః. 10

ప్ర. అ. శీఘ్రవేగస్య=శీఘ్రమైన వేగము గల, శీఘ్రగస్య=శీఘ్రముగా నడచు, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ, మారుతస్య=వాయుదేవునియొక్క, ఔరసః పుత్రః=ఔరసపుత్రుడనైన, అహమ్=నేను, ప్లవనేన=ఎగురుటచేత, తత్సమః=ఆతనితో సమానుడను, అస్మి=అయి ఉన్నాను.

తా. శీఘ్రముగా నడచేవాడు, మహావేగవంతుడు, మహాత్ముడు అయిన ఆ వాయుదేవుని ఔరసపుత్రుడనైన నేను ఎగురుటలో ఆతనితో సమానుడను.10

మూ. ఉత్సహేయం హి విస్తీర్ణమాలిఖన్తమివామ్బరమ్,
మేరుం గిరిమసఙ్గేన పరిగన్తుం సహస్రశః. 11

ప్ర. అ. విస్తీర్ణమ్=విశాలమైన, అమ్బరమ్=ఆకాశమును, ఆలిఖన్తమివ= ఒరయుచున్నట్లున్న, మేరుం గిరిమ్=మేరుపర్వతమును, అసంగేన= ఆయాసము లేకుండగా, సహస్రశః=వేలకొలది పర్యాయములు, పరిగన్తుమ్= ప్రదక్షిణము చేయుటకు,

ఉత్సహేయం హి=సమర్థుడను అగుదును కదా!

తా. ఆకాశమును ఒరయుచున్నదా అన్నట్లున్న అతివిశాలమైన మేరు పర్వతము చుట్టూ వేలకొలది పర్యాయములు ప్రదక్షిణము చేయగలను. 11

మూ. బాహువేగప్రణున్నేన సాగరేణాహముత్సహే,
సమాప్లావయితుం లోకం సపర్వతనదీహ్రదమ్. 12

ప్ర. అ. అహమ్=నేను, బాహువేగప్రణున్నేన=బాహువుల వేగముచేత ప్రేరేపింపబడిన, సాగరేణ=సముద్రముచేత, సపర్వతనదీహ్రదమ్=పర్వతములతోను, నదులతోను, హ్రదములతోను కూడిన, లోకమ్=లోకమును, ప్లావయితుమ్=ముంచుటకు, ఉత్సహే=సమర్థుడను అగుదును.

తా. సముద్రమును నా బాహువుల వేగముచేత కదిపివేసి పర్వతములతోను, నదులతోను, చెరువులతోను కూడిన ఈ లోకమునంతను ముంచెత్తగలను. 12

మూ. మమోరుజఙ్ఘావేగేన భవిష్యతి సముత్థితః,
సముత్థితమహాగ్రాహః సముద్రో వరుణాలయః. 13

ప్ర. అ. వరుణాలయః=వరుణుని నివాసమైన, సముద్రః=సముద్రము, మమ=నాయొక్క, ఊరుజఙ్ఘావేగేన=తొడలయొక్క పిక్కలయొక్క వేగముచేత, సముత్థితః=లేచినదై, సముత్థితమహాగ్రాహః=పైకి లేచిన పెద్ద మొసళ్ళు కలది, భవిష్యతి=కాగలదు.

తా. వరుణుని నివాసస్థాన మైన సముద్రము నా తొడల, పిక్కల వేగముచేత పైకి లేచిపోగా దానిలోని జలజంతువులు బైటకు లేచిపోవును. 13

మూ. పన్నగాశనమాకాశే పతన్తం పక్షిసేవితమ్,
వైనతేయమహం శక్తః పరిగన్తుం సహస్రశః. 14

ప్ర. అ. పన్నగాశనమ్=సర్పములు ఆహారముగా కలవాడు, పక్షిసేవితమ్=పక్షులచేత సేవింపబడినవాడు, ఆకాశే=ఆకాశమునందు, పతన్తమ్= ఎగురుచున్నవాడు అయిన, వైనతేయమ్=గరుత్మంతుని, సహస్రశః=వేలకొలది పర్యాయములు, పరిగన్తుమ్=ప్రదక్షిణము చేయుటకు, అహమ్=నేను, శక్తః=సమర్థుడను.

తా. పక్షిరాజు, సర్పములను భుజించువాడు అయిన గరుత్మంతుడు ఆకాశముమీద ఎగురుచున్నప్పుడు నే నాతనికి అనేకవేల పర్యాయములు ప్రదక్షిణము చేయ సమర్థుడను. 14

మూ. ఉదయాత్ప్రస్థితం వాపి జ్వలన్తం రశ్మిమాలినమ్,
అనస్తమితమాదిత్యమహం గన్తుం సముత్సహే. 15

తతో భూమిమసంస్పృష్ట్వా పునరాగన్తుముత్సహే,
ప్రవేగేనైవ మహతా భీమేన ప్లవగర్షభాః. 16

ప్ర. అ. ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులారా ! ఉదయాత్=ఉదయపర్వతమునుండి, ప్రస్థితమ్=ప్రయాణమైన, జ్వలన్తమ్=ప్రజ్వలించుచున్న, రశ్మిమాలినమ్=కిరణముల పంక్తి గల, ఆదిత్యమ్=సూర్యుణ్ణి, అనస్తమితమ్= అస్తమించకుండగా, గన్తుమ్=చేరుటకు, అహమ్=నేను, ఉత్సహే= సమర్థుడ నగుచున్నాను. తతః=అటుపిమ్మట, భూమిమ్=భూమిని, అస్పృష్ట్వా=స్పృశించకుండా, భీమేన=భయంకరమైన, మహతా=గొప్పదైన, ప్రవేగేనైవ=వేగముతో, పునః=తిరిగి, ఆగన్తుమ్=సూర్యునకభిముఖముగా వెళ్లుటకు, ఉత్సహే=సమర్థుడ నగుచున్నాను.

తా. కిరణముల పంక్తులతో ప్రజ్వలించుచున్న సూర్యుడు ఉదయపర్వతమునుండి ప్రయాణమై అస్త్రాద్రి చేరుటకు పూర్వము నేనాతని సమీపించి తిరిగి వచ్చి భూమిమీద దిగకుండా మరల ఆతనికి ఎదురుగా వెళ్లగలను.15, 16

మూ. ఉత్సహేయమతిక్రాన్తుం సర్వానాకాశగోచరాన్,
సాగరాన్ శోషయిష్యామి దారయిష్యామి మేదినీమ్. 17

ప్ర. అ. ఆకాశగోచరాన్=ఆకాశమునందు సంచరించు, సర్వాన్=అందరిని, అతిక్రాన్తుమ్=దాటుటకు, ఉత్సహేయమ్=సమర్థుడను అగుదును. సాగరాన్=సముద్రములను, శోషయిష్యామి=ఎండింపచేసెదను. మేదినీమ్= భూమిని, దారయిష్యామి=చీల్చెదను.

తా. ఆకాశమునందు సంచరించు అందరినీ అతిక్రమించగలను. సాగరములను ఎండింపచేయగలను. భూమిని చీల్చివేయగలను. 17

మూ. పర్వతాంశ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవఙ్గమాః,
హరిష్యామ్యూరువేగేన ప్లవమానో మహార్ణవమ్. 18

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా ! ప్లవమానః=ఎగురుచున్నవాడనై, పర్వతాన్=పర్వతములను, చూర్ణయిష్యామి=చూర్ణము చేసెదను. ప్లవమానః=ఎగురుచున్నవాడనై, ఊరువేగేన=తొడల వేగముచేత, మహార్ణవమ్=మహాసముద్రమును, హరిష్యామి=హరించెదను.

తా. వానరులారా ! నేను ఎగురుచు పర్వతములను చూర్ణము చేయగలను. తొడల వేగముచేత మహాసముద్రమును హరించగలను. 18

మూ. లతానాం వివిధం పుష్పం పాదపానాం చ సర్వశః,
అనుయాస్యతి మామద్య ప్లవమానం విహాయసా. 19

ప్ర. అ. అద్య=ఇప్పుడు, విహాయసా=ఆకాశముచేత, ప్లవమానమ్=ఎగురుచున్న, మామ్=నన్ను, లతానామ్=లతలయొక్క, పాదపానాం చ= వృక్షము

లయొక్క, వివిధమ్=అనేకవిధములైన, పుష్పమ్=పుష్పము, సర్వశః=అన్ని వైపులా, అనుయాస్యతి=అనుసరించగలదు.

తా. నే నిప్పుడు ఎగురుచుండగా అనేకవిధములైన లతావృక్షపుష్పములు నా వెనకనే రాగలవు. 19

మూ. భవిష్యతి హి మే పన్థాః స్వాతేః పన్థా ఇవామ్బరే,
చరన్తం ఘోరమాకాశముత్పతిష్యన్తమేవ చ, 20
ద్రక్ష్యన్తి నిపతన్తం చ సర్వభూతాని వానరాః.

ప్ర. అ. వానరాః=వానరులారా ! అమ్బరే=ఆకాశమునందు, మే=నాయొక్క, పన్థాః=మార్గము, స్వాతేః=స్వాతియొక్క, పన్థాః ఇవ= మార్గము వలె, భవిష్యతి=కాగలదు. ఘోరమ్=భయంకరమైన, ఆకాశమ్= ఆకాశమును, ఉత్పతిష్యన్తమేవ చ=ఎగురనున్న, చరన్తమ్=సంచరించుచున్న, నిపతన్తమ్=క్రిందికి దిగుచున్న నన్ను, సర్వభూతాని=సమస్తభూతములు, ద్రక్ష్యన్తి=చూడగలవు.

తా. వానరులారా ! ఆకాశమునందు పుష్పములతో నిండిన నా మార్గము, అనేకనక్షత్రములు గల స్వాతీనక్షత్రమార్గము వలె ఉండును. ఆకాశములోనికి ఎగురుటకై ఇటు అటు తిరుగుచున్నప్పుడు, ఎగిరి మరల కొంచెము క్రిందికి దిగినప్పుడు నన్ను అన్ని భూతములు చూడగలవు. 20

మూ. మహామేరుప్రతీకాశం మాం ద్రక్ష్యధ్వం ప్లవఙ్గమాః, 21
దివమావృత్య గచ్ఛన్తం గ్రసమానమివామ్బరమ్.

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా ! మహామేరుప్రతీకాశమ్= మహామేరుపర్వతముతో సమానుడను, దివమ్=ఆకాశమును, ఆవృత్య=కప్పి, గచ్ఛన్తమ్=వెళ్లుచున్నవాడను, అమ్బరమ్=ఆకాశమును, గ్రసమానమ్ ఇవ=మ్రింగుచున్నట్లు ఉన్న, మామ్=నన్ను, ద్రక్ష్యధ్వమ్=చూడగలరు.

తా. వానరులారా ! మహామేరువుతో సమానమైన దేహముతో ఆకాశమును ఆవరించి, ఆకాశమును మ్రింగివేయుచున్నానా అన్నట్లు ఎగురుచున్న నన్ను (మీరు) చూడగలరు. 21

మూ. విధమిష్యామి జీమూతాన్ కమ్పయిష్యామి పర్వతాన్,
సాగరం శోషయిష్యామి ప్లవమానః సమాహితః. 22

ప్ర. అ. సమాహితః=సావధానచిత్తుడనై, ప్లవమానః=ఎగురుచున్న నేను, జీమూతాన్=మేఘములను, విధమిష్యామి=ఎగురగొట్టగలను. పర్వతాన్= పర్వతములను, కమ్పయిష్యామి=కదల్చి వేయగలను. సాగరమ్=సముద్రమును, శోషయిష్యామి=ఎండింపచేసెదను.

తా. నేను సావధానచిత్తముతో ఎగురుచు మేఘములను ఎగురగొట్టగలను.

పర్వతములను కదల్చివేయుదును. సాగరమును ఎండింప చేయుదును. 22

మూ. వైనతేయస్య సా శక్తిర్మమ యా మారుతస్య వా,
ఋతే సుపర్ణరాజానం మారుతం వా మహాబలమ్. 23
న తద్భూతం ప్రపశ్యామి యన్మాం ప్లుతమనువ్రజేత్.

ప్ర. అ. వైనతేయస్య=గరుత్మంతునకు, మారుతస్య వా=వాయువునకు, యా=ఏ, శక్తిః=శక్తి ఉన్నదో, సా=అది, మమ=నా కున్నది. ప్లుతమ్=ఎగురుచున్న, మామ్=నన్ను, యత్=ఏ, భూతమ్= భూతము(ప్రాణి), అనువ్రజేత్=అనుసరించునో, తత్=అట్టి భూతమును, సుపర్ణరాజానమ్=గరుత్మంతుని, మహాబలమ్=గొప్ప బలము గల, మారుతం వా ఋతే=వాయుదేవుని విడచి మరి దేనినీ, న ప్రపశ్యామి=చూడను.

తా. నేను ఆకాశమునందు ఎగురుచున్నప్పుడు నన్ను అనుసరించగలవారు, గరుత్మంతుడు, మహాబలశాలియైన వాయువు తప్ప మరెవ్వరూ నాకు కనబడుటలేదు.

మూ. నిమేషాన్తరమాత్రేణ నిరాలమ్బనమమ్బరమ్,
సహసా నిష్పతిష్యామి ఘనాద్విద్యుదివోదితా. 24

ప్ర. అ. ఘనాత్=మేఘమునుండి, ఉత్థితా=లేచిన, విద్యుదివ=మెరుపు వలె, నిమేషాన్తరమాత్రేణ=నిమేషవ్యవధానము మాత్రములో, సహసా=వెంటనే, నిరాలమ్బనమ్=ఆలంబనము లేని, అమ్బరమ్=ఆకాశమును, నిష్పతిష్యామి= పొందగలను.

తా. మేఘమునుండి బయలుదేరిన మెరుపు వలె ఒక్క నిమిషములో (కనురెప్పపాటులో) ఆధారము లేని ఆకాశములోనికి వెంటనే ఎగురగలను. 24

మూ. భవిష్యతి హి మే రూపం ప్లవమానస్య సాగరమ్,
విష్ణోః ప్రక్రమమాణస్య తదా త్రీన్విక్రమానివ. 25

ప్ర. అ. సాగరమ్=సాగరమును, ప్లవమానస్య=ఎగిరి దాటుచున్న, మే=నాయొక్క, రూపమ్=రూపము, తదా=ఆ కాలమునందు, త్రీన్=మూడు, విక్రమాన్=పదన్యాసములను, ప్రక్రమమాణస్య=చేయుచున్న, విష్ణోః ఇవ= విష్ణువుయొక్క రూపము వలె, భవిష్యతి=ఉండగలదు.

తా. నేను సముద్రమును దాటుచున్నప్పుడు నా రూపము మూడు పాదన్యాసములు చేయుచున్న విష్ణువు రూపము వలె ఉండును. 25

మూ. బుద్ధ్యా చాహం ప్రపశ్యామి మనశ్చేష్టా చ మే తథా,
అహం ద్రక్ష్యామి వైదేహీం ప్రమోదధ్వం ప్లవఙ్గమాః. 26

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులారా ! అహమ్=నేను, బుద్ధ్యా= బుద్ధిచేత, ప్రపశ్యామి=ఊహించుచున్నాను. మే=నాయొక్క, మనశ్చేష్టా చ=

మనోవ్యాపారము కూడ, తథా=అట్లే ఉన్నది. అహమ్=నేను, వైదేహీమ్= సీతను, ద్రక్ష్యామి=చూడగలను. ప్రమోదధ్వమ్=సంతోషించండి.

తా. వానరులారా ! నా బుద్ధిచేత నేను చూచుచున్నాను. నా మనస్సు కూడ చెప్పుచున్నది నేను సీతను చూడగలను; మీరందరు సంతోషించండి. 26

మూ. మారుతస్య సమో వేగే గరుడస్య సమో జవే,
అయుతం యోజనానాం తు గమిష్యామీతి మే మతిః. 27

ప్ర. అ. వేగే=వేగమునందు, మారుతస్య=వాయువునకు, సమః= సముడను. జవే=వేగమునందు, గరుడస్య=గరుత్మంతునకు, సమః= సముడను. యోజనానామ్=యోజనములయొక్క, అయుతమ్=అయుతమును, గమిష్యామీతి=వెళ్లగలను అని, మే=నాయొక్క, మతిః=ఆలోచన.

తా. వేగములో వాయుదేవునితోను, గరుత్మంతునితోను, సమానుడ నైన నేను పదివేల యోజనముల దూరము గూడ వెళ్లగల నని అనుకొనుచున్నాను.27

మూ. వాసవస్య సవజ్రస్య బ్రహ్మణో వా స్వయంభువః,
విక్రమ్య సహసా హస్తాదమృతం తదిహానయే, 28
లఙ్కాం వాపి సముత్క్షిప్య గచ్ఛేయమితి మే మతిః.

ప్ర. అ. విక్రమ్య=పరాక్రమించి, సవజ్రస్య=వజ్రాయుధముతో కూడిన, వాసవస్య=దేవేంద్రునియొక్క గాని, స్వయంభువః=స్వయముగా జన్మించిన, బ్రహ్మణో వా=బ్రహ్మదేవునియొక్క గాని, హస్తాత్=హస్తమునుండి, సహసా=హటాత్తుగా, అమృతమ్=అమృతమును, ఇహ=ఇక్కడికి, ఆనయే=తీసికొనివచ్చెదను. లఙ్కామ్=లంకను, సముత్క్షిప్య వాపి= ఎత్తియైనా, గచ్ఛేయమ్=వెళ్లుదను, ఇతి=అని, మే=నాయొక్క, మతిః=బుద్ధి.

తా. నేను పరాక్రమము చూపి వజ్రాయుధమును ధరించిన దేవేంద్రుని చేతినుండి గాని, సాక్షాత్తు బ్రహ్మదేవుని చేతిలోనుండి గాని శీఘ్రముగా అమృతమును ఇక్కడికి తీసికొని రాగలను. లంకాపట్టణమునే ఎత్తికొని వెళ్లగలను అని తలచుచున్నాను. 28

మూ. తమేవం వానరశ్రేష్ఠం గర్జన్తమమితప్రభమ్, 29
ప్రహృష్టా హరయస్తత్ర సముదైక్షన్త విస్మితాః.

ప్ర. అ. తత్ర=అక్కడ, ఏవమ్=ఇట్లు, గర్జన్తమ్=గర్జించుచున్న, అమితప్రభమ్=సాటి లేని కాంతి గల, తమ్= ఆ, వానరశ్రేష్ఠమ్= వానరులలో శ్రేష్ఠుడైన హనుమంతుని, హరయః=వానరులు, ప్రహృష్టాః= సంతోషించినవారై, విస్మితాః=ఆశ్చర్యపడుచున్నవారై, సముదైక్షన్త=చూచిరి.

తా. సాటి లేని కాంతి గల ఆ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఇట్లు

గర్జించుచుండగా ఆ వానరులు సంతోషాశ్చర్యములతో ఆతనినే చూచుచుండిరి.29

మూ. తచ్ఛ్రుత్వా వచనం శ్రుత్వా జ్ఞాతీనాం శోకనాశనమ్, 30
ఉవాచ పరిసంహృష్టో జామ్బవాన్ ప్లవగేశ్వరః.

ప్ర. అ. అస్య=ఈతనియొక్క, తత్=ఆ, జ్ఞాతీనామ్= జ్ఞాతులయొక్క, శోకనాశనమ్=శోకమును నశింపచేయు, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, ప్లవగేశ్వరః=వానరప్రభువైన, జామ్బవాన్= జాంబవంతుడు, పరిసంహృష్టః=సంతోషించినవాడై, ఉవాచ=పలికెను.

తా. మిత్రుల శోకమును నశింపచేయు ఆ హనుమంతుని వచనమును విని, వానరనాయకుడైన జాంబవంతుడు సంతోషించి ఇట్లు పలికెను. 30

మూ. వీర కేసరిణః పుత్ర వేగవన్ మారుతాత్మజ, 31
జ్ఞాతీనాం విపులః శోకస్త్వయా తాత ప్రణాశితః.

ప్ర. అ. వీర=వీరుడా ! కేసరిణః=కేసరియొక్క, పుత్ర=పుత్రుడా ! వేగవన్=వేగము గలవాడా ! మారుతాత్మజ=వాయుపుత్రుడా ! తాత=తండ్రీ! త్వయా=నీచేత, జ్ఞాతీనామ్=జ్ఞాతులయొక్క, విపులః=అధికమైన, శోకః=శోకము, ప్రణాశితః=నశింపచేయబడినది.

తా. వీరుడా ! కేసరిపుత్రుడా ! వేగవంతుడా ! నాయనా ! హనుమంతుడా ! నీవు మిత్రుల అత్యధికమైన శోకమును నశింపచేసినావు. 31

మూ. తవ కల్యాణరుచయః కపిముఖ్యాః సమాగతాః, 32
మఙ్గలాన్యర్థసిద్ధ్యర్థం కరిష్యన్తి సమాహితాః.

ప్ర. అ. తవ=నీయొక్క, కల్యాణరుచయః=కల్యాణమునందు ఆసక్తి గల, సమాగతాః=ఇక్కడికి వచ్చి ఉన్న, కపిముఖ్యాః=వానరశ్రేష్ఠులు, సమాహితాః=సావధానచిత్తులై, అర్థసిద్ధ్యర్థమ్=కార్యసిద్ధికొరకు, మఙ్గలాని=మంగళములను, కరిష్యన్తి=చేయగలరు.

తా. నీ కల్యాణమును కోరు వానరశ్రేష్ఠులు కలిసి సావధానచిత్తులై, కార్యసిద్ధికొరకై మంగళములైన కర్మలు చేయగలరు. 32

మూ. ఋషీణాం చ ప్రసాదేన కపివృద్ధమతేన చ, 33
గురూణాం చ ప్రసాదేన సంప్లవ త్వం మహార్ణవమ్.

ప్ర. అ. ఋషీణామ్=ఋషులయొక్క, ప్రసాదేన=అనుగ్రహముచేతను, కపివృద్ధమతేన చ=వానరవృద్ధుల అభిప్రాయము(కోరిక) చేతను, గురూణామ్=గురువులయొక్క, ప్రసాదేన చ=అనుగ్రహముచేతను, త్వమ్=నీవు, మహార్ణవమ్=మహాసముద్రమును, సంప్లవ=దాటుము.

తా. ఋషుల అనుగ్రహముచేతను, పెద్దలైన వానరుల ఆశీస్సుచేతను, గురువుల అనుగ్రహముచేతను నీవు మహాసముద్రమును దాటుము. 33

మూ. స్థాస్యామశ్చైకపాదేన యావదాగమనం తవ, 34
త్వద్గతాని చ సర్వేషాం జీవనాని వనౌకసామ్.

ప్ర. అ. తవ=నీయొక్క, ఆగమనం యావత్=రాకవరకు, ఏకపాదేన= ఒక్క పాదముమీద, స్థాస్యామః=నిలచెదము. సర్వేషామ్=సమస్తమైన, వనౌకసామ్=వానరులయొక్క, జీవనాని=జీవితములు, త్వద్గతాని=నిన్ను పొందినవి.

తా. నీవు వచ్చువరకు మేము ఒంటి పాదము మీద నిలచి ఉందుము. సమస్తమైన వానరుల ప్రాణములు నీమీద ఆధారపడి యున్నవి. 34

మూ. తతశ్చ హరిశార్దూలస్తానువాచ వనౌకసః, 35
కోఽపి లోకే న మే వేగం ప్లవనే ధారయిష్యతి.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరిశార్దూలః=వానరశ్రేష్ఠుడు, తాన్=ఆ, వనౌకసః=వానరులను, ఉవాచ=పలికెను. లోకే=ఈ లోకమునందు, ప్లవనే=ఎగురుటయందు, మే=నాయొక్క, వేగమ్=వేగము, కోఽపి=ఎవ్వడూ, న ధారయిష్యతి=ధరించడు (ధరింపజాలడు).

తా. పిమ్మట వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు వానరులతో ఇట్లనెను - నేను ఎగురునప్పుడు నా వేగమును ఈ లోకములో ఎవ్వడూ సహించజాలడు.35

మూ. ఏతానీహ నగస్యాస్య శిలాసంకటశాలినః, 36
శిఖరాణి మహేన్ద్రస్య స్థిరాణి చ మహాన్తి చ.

ప్ర. అ. శిలాసంకటశాలినః=శిలలచేత ఎత్తైన ప్రదేశముతో ప్రకాశించుచున్న, అస్య=ఈ, మహేన్ద్రస్య నగస్య=మహేంద్రపర్వతముయొక్క, ఏతాని=ఈ, శిఖరాణి=శిఖరములు, స్థిరాణి=స్థిరమైనవి; మహాన్తి చ=పెద్దవి.

తా. శిలలచేత ఎత్తైన ప్రదేశములతో ప్రకాశించుచున్న ఈ మహేంద్రపర్వతము శిఖరములు స్థిరమైనవి; పెద్దవీ కూడ. 36

మూ. ఏషు వేగం గమిష్యామి మహేన్ద్రశిఖరేష్వహమ్, 37
నానాద్రుమవికీర్ణేషు ధాతునిష్యన్దశోభిషు.

ప్ర. అ. నానాద్రుమవికీర్ణేషు=అనేకవిధములైన వృక్షములతో వ్యాప్తములు, ధాతునిష్యన్దశోభిషు=ధాతువులచేత ప్రకాశించుచున్నవి అయిన, ఏషు=ఈ, మహేన్ద్రశిఖరేషు=మహేంద్ర పర్వత శిఖరములమీద, అహమ్=నేను, వేగమ్= వేగమును, గమిష్యామి=పొందగలను.

తా. అనేక వృక్షములతో నిండిన, ధాతువుల సముదాయములతో

ప్రకాశించుచున్న, ఈ మహేంద్రశిఖరములపైన నేను నా వేగమును అందుకొనెదను. 37

మూ. ఏతాని మమ వేగం హి శిఖరాణి మహాన్తి చ, 38
ప్లవతో ధారయిష్యన్తి యోజనానామితః శతమ్.

ప్ర. అ. ఇతః=ఇక్కడినుండి, యోజనానామ్=యోజనములయొక్క, శతమ్= శతమును, ప్లవతః=ఎగురుచున్న, మమ=నాయొక్క, వేగమ్=వేగమును, మహాన్తి=గొప్పవైన, ఏతాని=ఈ, శిఖరాణి=శిఖరములు, ధారయిష్యన్తి=ధరించగలవు.

తా. ఇక్కడినుండి నూరు యోజనముల దూరము ఎగురబోవు నా వేగానికి గొప్పవైన ఈ శిఖరములు తట్టుకొనగలవు. 38

మూ. తతస్తు మారుతప్రఖ్యః స హరిర్మారుతాత్మజః, 39
ఆరురోహ నగశ్రేష్ఠం మహేన్ద్రమరిమర్దనః,
వృతం నానావిధైః పుష్పైర్మృగసేవితశాద్వలమ్. 40
లతాకుసుమసంబాధం నిత్యపుష్పఫలద్రుమమ్,
సింహశార్దూలసహితం మత్తమాతఙ్గసేవితమ్, 41
మత్తద్విజగణోద్ఘుష్టం సలిలోత్పీడసంకులమ్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మారుతప్రఖ్యః=వాయువుతో సమానుడు, మారుతాత్మజః=వాయుపుత్రుడు, అరిమర్దనః=శత్రుసంహారకుడు అయిన, సః హరిః=ఆ హనుమంతుడు, నానావిధైః=అనేకవిధములైన, పుష్పైః= పుష్పములతో, వృతమ్=కూడినది, మృగసేవితశాద్వలమ్=లేళ్లచే సేవింపబడిన పచ్చికబీళ్లు గలది, లతాకుసుమసంబాధమ్=లతలతోను, పుష్పములతోను ఇరుకుగా ఉన్నది. నిత్యపుష్పఫలద్రుమమ్=నిత్యము పుష్పఫలములు గల వృక్షములు గలది, సింహశార్దూలసహితమ్=సింహములతోను పెద్దపులులతోను కూడినది, మత్తమాతఙ్గసేవితమ్=మదించిన ఏనుగులచేత సేవింపబడినది, మత్తద్విజగణోద్ఘుష్టమ్= మదించిన పక్షుల సముదాయములచేత ధ్వనింప చేయబడినది, సలిలోత్పీడసంకులమ్= జలప్రవాహములతో వ్యాకులము అయిన, నగశ్రేష్ఠమ్=పర్వతశ్రేష్ఠమైన, మహేన్ద్రమ్= మహేంద్ర పర్వతమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట వాయుదేవునితో సమానుడు, వాయుదేవుని పుత్రుడు, శత్రుసంహారకుడు అయిన హనుమంతుడు పర్వతశ్రేష్ఠమైన మహేంద్రపర్వతమును ఎక్కెను. ఆ పర్వతము అనేకవిధములైన పుష్పములతో నిండి యుండెను. దాని పచ్చికమైదానములలో లేళ్లు మేయుచుండెను. లతలతోను, పుష్పములతోను, ఇరుకుగా (దట్టముగా) ఉన్న ఆ పర్వతముపై నున్న వృక్షములు నిత్యము ఫలపుష్పములతో నిండి యుండెను. జలప్రవాహములతో నిండిన ఆ పర్వతము మీద సింహములు, పెద్దపులులు, మదించిన ఏనుగులు నివసించుచుండెను. అది

మదించిన పక్షుల కలకలధ్వనులతో నిండి యుండెను. 39-41

మూ. మహద్భిరుచ్ఛ్రితం శృఙ్గైర్మహేన్ద్రం తం మహాబలః,
విచచార హరిశ్రేష్ఠో మహేన్ద్రసమవిక్రమః. 42

ప్ర. అ. మహేన్ద్రసమవిక్రమః=మహేంద్రునితో సమానమైన పరాక్రమము గల, మహాబలః=గొప్ప బలము గల, హరిశ్రేష్ఠః=హనుమంతుడు, మహద్భిః=పెద్దవైన, శృఙ్గైః=శిఖరములతో, ఉచ్ఛ్రితమ్=ఎత్తైన, తమ్=ఆ, మహేన్ద్రమ్=మహేంద్రపర్వతమును, విచచార=సంచరించెను.

తా. మహేంద్రునితో సమానమైన పరాక్రమము, గొప్ప బలమూ గల వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు, పెద్ద శిఖరములతో ఎత్తుగా ఉన్న మహేంద్రపర్వతమును ఎక్కెను. 42

మూ. బాహుభ్యాం పీడితస్తేన మహాశైలో మహాత్మనా,
ররాస సింహాభిహతో మహాన్మత్త ఇవ ద్విపః. 43

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, తేన=ఆ హనుమంతునిచేత, బాహుభ్యామ్=బాహువులచేత, పీడితః=పీడింపబడిన, మహాశైలః=ఆ మహేంద్రపర్వతము, సింహాభిహతః=సింహముచేత కొట్టబడిన, మత్తః=మదించిన, మహాన్=గొప్పదైన, ద్విపః ఇవ=ఏనుగు వలె, ररాస=ధ్వనిచేసెను.

తా. మహాత్ముడైన ఆ హనుమంతుడు బాహువులచేత పీడించగా ఆ మహేంద్రపర్వతము సింహముచేత కొట్టబడ్డిన, మదించిన పెద్ద గజము వలె ధ్వని చేసెను. 43

మూ. ముమోచ సలిలోత్పీడాన్ విప్రకీర్ణశిలోచ్చయః,
విత్రస్తమృగమాతఙ్గః ప్రకమ్పితమహాద్రుమః. 44

ప్ర. అ. విప్రకీర్ణశిలోచ్చయః=చెదరగొట్టబడిన శిలాసముదాయములు గలది, విత్రస్తమృగమాతఙ్గః=భయపడిన లేళ్లు, ఏనుగులు కలది, ప్రకమ్పితమహాద్రుమః=కదల్పబడిన మహావృక్షములు కలది అయిన ఆ పర్వతము, సలిలోత్పీడాన్=జలప్రవాహములను, ముమోచ=విడచెను.

తా. ఆ పర్వతముమీద నున్న రాళ్లన్నీ చెల్లాచెదరయ్యెను. లేళ్లు, ఏనుగులు భయపడెను. మహావృక్షములు చలించెను. అట్టి ఆ పర్వతము నుండి జలప్రవాహము పిండి నట్లు స్రవించెను. 44

మూ. నానాగన్ధర్వమిథునైః పానసంసర్గకర్కశైః,
ఉత్పతద్భిర్విహఙ్గైశ్చ విద్యాధరగణైరపి. 45

త్యజ్యమానమహాసానుః సంనిలీనమహోరగః,
శైలశృఙ్గశిలోత్పాతస్తదాఽభూత్స మహాగిరిః. 46

ప్ర. అ. తదా=అప్పుడు, సః మహాగిరిః=ఆ మహాపర్వతము, పానసంసర్గకర్కశైః= మద్యపానసంబంధముచేత తీవ్రములైన చిత్తములు గల, నానాగన్ధర్వమిథునైః=అనేక గంధర్వమిథునములచేతను, ఉత్పతద్భిః= ఎగిరిపోవుచున్న, విహఙ్గైశ్చ=పక్షులచేతను, విద్యాధరగణైరపి=విద్యాధర సముదాయములచేతను, త్యజ్యమానమహాసానుః=విడవబడుచున్న గొప్ప చరియలు గలది, సంనిలీనమహోరగః=అణగిన మహాసర్పములు గలది, శైలశృఙ్గశిలోత్పాతః= శైలశృంగములనుండి శిలల ఎగురుట కలది, అభూత్=ఆయెను.

తా. మద్యపానముచేత తీవ్రములైన చిత్తములు గల అనేక గంధర్వ మిథునములు, విద్యాధరులు, పక్షులు, ఆ పర్వతము చరియలను విడచి పైకి ఎగిరి పోయెను. మహాసర్పములు అణగిపోయెను. శిఖరములపై నున్న శిలలు ఎగురుచుండెను. 46

మూ. నిఃశ్వసద్భిస్తదా తైస్తు భుజగైరర్ధనిఃసృతైః,
సపతాక ఇవాభాతి స తదా ధరణీధరః. 47

ప్ర. అ. తదా=అప్పుడు, సః ధరణీధరః=ఆ మహేంద్రపర్వతము, నిఃశ్వసద్భిః=బుసలుకొట్టుచున్న, అర్ధనిఃసృతైః=సగము పైకి వచ్చిన, భుజగైః=సర్పములతో, సపతాకః ఇవ=పతాకలతో (చిన్న జెండాలతో) కూడినది వలె, ఆభాతి=ప్రకాశించుచుండెను.

తా. బుసలు కొట్టుచు సగము శరీరములతో పైకి వచ్చిన సర్పములతో ఆ పర్వతము పతాకలచేత అలంకరింపబడి నట్లుండెను. 47

మూ. ఋషిభిస్త్రాససంభ్రాన్తైస్త్యజ్యమానః శిలోచ్చయః,
సీదన్ మహతి కాన్తారే సార్థహీన ఇవాధ్వగః. 48

ప్ర. అ. త్రాససంభ్రాన్తైః=భయముతో కంగారుపడుచున్న, ఋషిభిః= ఋషులచేత, త్యజ్యమానః=విడువబడుచున్న, శిలోచ్చయః=ఆ పర్వతము, సార్థహీనః=సాటి జనుల గుంపుతో శూన్యుడైన వాడు, మహతి=గొప్ప, కాన్తారే=అరణ్యమునందు, సీదన్=నశించుచున్న, అధ్వగః ఇవ=బాటసారి వలె ఉండెను.

తా. భయముతో కంగారుపడుచు ఋషులు విడచి వెళ్లిపోవుచుండగా ఆ మహేంద్రపర్వతము, తోటి బాటసారుల గుంపునుండి విడిపోయి మహారణ్యములో నశించుచున్న బాటసారి వలె ఉండెను. 48

మూ. సవేగవాన్ వేగసమాహితాత్మా
హరిప్రవీరః పరవీరహన్తా,

మనః సమాధాయ మహానుభావో
జగామ లఙ్కాం మనసా మనస్వీ. 49

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే కిష్కిన్ధాకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. వేగవాన్=వేగము గలవాడు, వేగసమాహితాత్మా=వేగము విషయమున సావధానము చేయబడిన చిత్తము గలవాడు, పరవీరహన్తా=శత్రువీరులను సంహరించేవాడు, మనస్వీ=ఉత్తమమైన మనస్సు కలవాడు, మహానుభావః=గొప్ప సామర్థ్యము గలవాడు అయిన, సః=ఆ, హరిప్రవీరః=వానరులలో మహావీరుడైన హనుమంతుడు, మనః=మనస్సును, సమాధాయ=ఏకాగ్రముచేసి, మనసా=మనస్సుచేత, లఙ్కామ్=లంకనుగూర్చి, జగామ=వెళ్లెను.

తా. వేగము గలవాడు, వేగము విషయమున మనస్సును నిలిపినవాడు, శత్రువీరులను సంహరించువాడు, గొప్ప సామర్థ్యము కలవాడు, ఉత్తమమైన మనస్సు కలవాడు, వానరులలో మహావీరుడు అయిన ఆ హనుమంతుడు మనస్సును ఏకాగ్రము చేసి, మనస్సుచేత లంకకు వెళ్లెను. 49

"బాలానందిని"యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు కిష్కింధాకాండలో అరువదిఏడవసర్గ సమాప్తము.

యత్కృపాలేశ సంపర్కాద్వ్యాఖ్యానార్థం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్తాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకిమహర్షిప్రణీత

# శ్రీమద్రామాయణము

# సుందరకాండము

శ్రీః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

బాలానన్దినీసహితము

# శ్రీమద్రామాయణము - సుందరకాండము

## అథ సున్దరకాణ్డప్రారమ్భః - ప్రథమః సర్గః

[*హనుమంతుడు సముద్రము లంఘించుట. మైనాకుడు ఆతనిని గౌరవించుట. సురసను హనుమంతుడు ఓడించుట. సింహికను వధించుట. దక్షిణతటము చేరి అచట లంక శోభను చూచుట*].

మూ. తతో రావణనీతాయాః సీతాయాః శత్రుకర్శనః,
ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శత్రుకర్శనః = శత్రువులను కృశింపచేయు హనుమంతుడు, రావణనీతాయాః = రావణునిచేత తీసికొనివెళ్లబడిన, సీతాయాః = సీతయొక్క, పదమ్ = స్థానమును, అన్వేష్టుమ్ = వెదకుటకొరకు, చారణాచరితే = చారణులచేత (చారణు లనువారు దేవయోనులు) సంచరింపబడిన, పథి = మార్గమునందు, (వెళ్లుటకు) ఇయేష = ఇచ్ఛయించెను.

రా. జాంబవదాదులు ప్రేరేపింపగా, శత్రుసంహారకుడైన హనుమంతుడు, రావణు డపహరించిన సీతను వెదకుటకై, చారణులు మొదలైన దేవతలు సంచరించు ఆకాశమార్గమునందు ప్రయాణము చేయవలెనని నిశ్చయించుకొనెను. 1

మూ. దుష్కరం నిష్ప్రతిద్వన్ద్వం చికీర్షన్కర్మ వానరః,
సముదగ్రశిరోగ్రీవో గవాంపతిరివాబభౌ. 2

ప్ర. అ. వానరః = హనుమంతుడు, దుష్కరమ్ = చేయ శక్యము కాని, కర్మ = పనిని, నిష్ప్రతిద్వన్ద్వమ్ = అడ్డములు (లేదా ఎదిరించువారు) లేకుండగా, చికీర్షన్ = చేయదలచినవాడై, సముదగ్రశిరోగ్రీవః = పైకి ఎత్తబడిన శిరస్సు, కంఠము కలవాడై, గవాంపతిః ఇవ = ఆబోతు వలె, బభౌ = ప్రకాశించెను.

తా. మరెవ్వరూ చేయలేని పని చేయ సంకల్పించిన హనుమంతుడు, ఎట్టి అడ్డంకులూ లేనివాడై, మెడను చాచి, శిరస్సు పైకి ఎత్తి, ఆబోతు వలె ఉండెను.

మూ. అథ వైడూర్యవర్ణేషు శాద్వలేషు మహాబలః,
ధీరః సలిలకల్పేషు విచచార యథాసుఖమ్. 3

ప్ర. అ. అథ = ఆటుపిమ్మట, మహాబలః = గొప్ప బలము గలవాడూ, ధీరః = ధైర్యశాలీ అయిన హనుమంతుడు, వైడూర్యవర్ణేషు = వైడూర్యమణుల వంటి రంగు గలవి, సలిలకల్పేషు = జలముతో సమానములూ అయిన, శాద్వలేషు = పచ్చికబీళ్ళయందు, యథాసుఖమ్ = సుఖము కలుగునట్లుగా, విచచార = సంచరించెను.

తా. పిమ్మట, మహాబలవంతుడూ, ధీరుడూ అయిన హనుమంతుడు వైడూర్యమణులవలె ఆకుపచ్చని వర్ణముతో దూరమునుండి చూచుటకు జలము వలె ఉన్న పచ్చికబీళ్ళపై, సుఖముగా కొంత సేపు ఇటు అటు పచారుచేసెను.

మూ. ద్విజాన్ విత్రాసయన్ ధీమానురసా పాదపాన్ హరన్,
మృగాంశ్చ సుబహూన్నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ. 4

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతుడైన హనుమంతుడు, ద్విజాన్ = పక్షులను, విత్రాసయన్ = భయపెట్టుచు, ఉరసా = వక్షస్థలము చేత, పాదపాన్ = వృక్షములను, హరన్ = హరించుచు, ప్రవృద్ధః = విజృంభించిన, కేసరీ ఇవ = సింహము వలె, సుబహూన్ = అనేకమైన, మృగాంశ్చ = మృగములను కూడ, నిఘ్నన్ = చంపుచు, సంచరించెను.

తా. ధీమంతుడైన ఆ హనుమంతుడు ఇటు నటు వేగముగా సంచరించినపుడు పక్షులన్నీ భయపడినవి. అతని వక్షఃస్థలము ఆఘాతమునకు చెట్లు కూలి పోయినవి. సింహము విజృంభించినట్లు అతడు విజృంభించుటతో అనేక మృగములు కూడా మరణించినవి. 4

మూ. నీలలోహితమాఞ్జిష్ఠపీతవర్ణైః సితాసితైః,
స్వభావవిహితైశ్చిత్రైర్ధాతుభిః సమలంకృతమ్. 5
కామరూపిభిరావిష్టమభీక్ష్ణం సపరిచ్ఛదైః,
యక్షకిన్నరగన్ధర్వైర్దేవకల్పైశ్చ పన్నగైః. 6

ప్ర. అ. గిరితలమ్ = ఆ మహేంద్రపర్వతము క్రింది ప్రాంతము (అధ్యాహృతము), నీలలోహితమాఞ్జిష్ఠపత్రవర్ణైః = నీలము, ఎరుపు, పసుపు, ఆకుపంటి ఆకుపచ్చరంగులుగలవి, సితాసితైః = తెల్లగాను నల్లగాను ఉన్నవి, స్వభావవిహితైః = సహజముగా ఏర్పడినవి, చిత్రైః = నానావర్ణములు గలవి అయిన, ధాతుభిః = ధాతువులచేత, సమలంకృతమ్ = అలంకరింపబడినది. కామరూపిభిః = స్వేచ్ఛానుసారముగా రూపములను ధరింపగలిగిన, సపరిచ్ఛదైః = పరివారములతో కూడిన, యక్షకిన్నరగన్ధర్వైః = యక్ష - కింనర - గంధర్వులతోను, దేవకల్పైః = దేవతలతో సమానులైన, పన్నగైః = సర్పములచేతను, అభీక్ష్ణమ్ = ఎల్లప్పుడు, ఆవిష్టమ్ = చుట్టువారుకొనబడినది.

తా. ఆ మహేంద్రపర్వతప్రాంత మంతా నలుపు, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ మొదలైన చిత్రవర్ణములు గల సహజములైన ధాతువులతో అందముగా ఉండెను. అక్కడ కోరిన రూపములు ధరించ గల యక్షులు, కింనరులు, గంధర్వులు, దేవతాతుల్యులైన పన్నగులు సపరివారముగా నివసించుచుండిరి.

మూ. స తస్య గిరివర్యస్య తలే నాగవరాయుతే,
తిష్ఠన్ కపివరస్తత్ర హ్రదే నాగ ఇవాబభౌ. 7

ప్ర. అ. సః = ఆ, కపివరః = వానరశ్రేష్ఠుడు, తత్ర = అక్కడ, నాగవరాయుతే = శ్రేష్ఠములైన ఏనుగులతో కూడిన, తస్య గిరివర్యస్య = ఆ పర్వతశ్రేష్ఠముయొక్క, తలే = క్రింది ప్రాంతమునందు, తిష్ఠన్ = ఉన్నవాడై. హ్రదే = చెరువులో, నాగః ఇవ = ఏనుగు వలె, ఆబభౌ = ప్రకాశించెను.

తా. ఆ శ్రేష్ఠమైన పర్వతము క్రింది ప్రాంతమునందు అనేక ఉత్తమ గజములు నివసించుచున్నవి. అక్కడ ఉన్న హనుమంతుడు మహాహ్రదములో ఉన్న ఏనుగు వలె ప్రకాశించెను. 7

మూ. స సూర్యాయ మహేన్ద్రాయ పవనాయ స్వయంభువే,
భూతేభ్యశ్చాఞ్జలిం కృత్వా చకార గమనే మతిమ్. 8

ప్ర. అ. సః = అతడు, సూర్యాయ = సూర్యునకు, మహేన్ద్రాయ = మహేంద్రునకు, పవనాయ = వాయుదేవునకు, స్వయంభువే = బ్రహ్మదేవునకు, భూతేభ్యః చ = భూతములకు (భూతములు దేవయోనికి చెందినవారు), అఞ్జలిమ్ = దోసిలిని, కృత్వా = చేసి, గమనే = వెళ్ళుటయందు, మతిమ్ = బుద్ధిని, చకార = చేసెను.

తా. అతడు సూర్యునకు, మహేంద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మదేవునకు, భూతములకు నమస్కరించి బయలుదేరుటకు నిశ్చయించుకొనెను. 8

మూ. అఞ్జలిం ప్రాఙ్ముఖః కృత్వా పవనాయాత్మయోనయే,
తతో హి వవృధే గన్తుం దక్షిణో దక్షిణాం దిశమ్. 9

ప్ర. అ. దక్షిణః = సమర్థుడైన హనుమంతుడు, ప్రాఙ్ముఖః = తూర్పు దిక్కునకు అభిముఖుడై, ఆత్మయోనయే = తనకు కారణభూతుడైన, పవనాయ = వాయుదేవునకు, అఞ్జలిమ్ = దోసిలి, కృత్వా = చేసి, తతః = పిమ్మట, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, గన్తుమ్ = వెళ్ళుటకు, వవృధే హి = వృద్ధి పొందెను.

తా. మహాసామర్థ్యవంతుడైన హనుమంతుడు, తూర్పుగా తిరిగి, తన తండ్రియైన వాయుదేవునకు నమస్కరించి, దక్షిణము దిక్కువైపు వెళ్ళుటకై శరీరమును పెంచెను. 9

మూ. ప్లవఙ్గప్రవరైర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః,
వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు. 10

ప్ర. అ. ప్లవఙ్గప్రవరైః = వానరశ్రేష్ఠులచేత, దృష్టః = చూడబడిన ఆ హనుమంతుడు, ప్లవనే = ఎగురుటయందు, కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము కలవాడై, పర్వసు = పూర్ణిమాపర్వములందు, సముద్రః ఇవ = సముద్రము వలె, రామవృద్ధ్యర్థమ్ = రాముని అభివృద్ధికొరకై, వవృధే = వృద్ధి పొందెను.

రా. అక్కడ ఉన్న వానరు లందరు హనుమంతుని వైపే చూచుచుండిరి. సముద్రము దాటుటకు నిశ్చయించుకొని అతడు పూర్ణిమాపర్వమునందు సముద్రము పెరిగి నట్లు, రామునికి సాహాయ్యము చేయుటకై పెరిగెను. 10

మూ. నిష్ప్రమాణశరీరః సన్ లిలఙ్ఘయిషురర్ణవమ్,
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్.॥

ప్ర. అ. అర్ణవమ్ = సముద్రమును, లిలఙ్ఘయిషుః = లంఘింప దలచిన హనుమంతుడు, నిష్ప్రమాణశరీరః సన్ = ప్రమాణము లేని శరీరము కలవాడై, బాహుభ్యామ్ = బాహువులతోను, చరణాభ్యాం చ = పాదములతోను, పర్వతమ్ = పర్వతమును, పీడయామాస = పీడించెను.

రా. సముద్రమును దాటవలె నను నిశ్చయముతో హనుమంతుడు దేహమును కొలుచుటకు శక్యము కానంతగా, పెద్దగా పెంచి, చేతులతోను, పాదములతోను, పర్వతమును నొక్కిపెట్టెను. 11

మూ. స చచాలాచలశ్చాపి ముహూర్తం కపిపీడితః,
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్పమశాతయత్.

ప్ర. అ. కపిపీడితః = హనుమంతునిచే పీడింపబడిన, సః అచలశ్చాపి = ఆ పర్వతముకూడా, ముహూర్తమ్ = క్షణకాలముపాటు, చచాల = చలించెను. పుష్పితాగ్రాణామ్ = పుష్పించిన అగ్రభాగములు గల, తరూణామ్ = వృక్షముల యొక్క, సర్వమ్ = సమస్తమైన, పుష్పమ్ = పుష్పమును, అశాతయత్ = రాల్చెను.

రా. ఈ విధముగా హనుమంతుడు పీడింపగా ఆ పర్వతము ఒక్క క్షణము ఊగిపోయెను. పూసిన చెట్ల చివర ఉన్న పుష్పము లన్నీ రాలిపోయెను.

మూ. తేన పాదపముక్తేన పుష్పౌఘేన సుగన్ధినా,
సర్వతః సంవృతః శైలో బభౌ పుష్పమయో యథా. 13

ప్ర. అ. శైలః = పర్వతము, పాదపముక్తేన = వృక్షములచేత విడువబడిన, సుగన్ధినా = మంచి గంధము గల, పుష్పౌఘేన = పుష్పముల సము

దాయముచేత, సర్వతః = అంతటా, సంవృతః = కప్పబడినదై, పుష్పమయో యథా = పుష్పముల వికారమైనది వలె, బభౌ = ప్రకాశించెను.

తా. చెట్లనుండి రాలిన పరిమళించుచున్న ఆ పుష్పము లన్నీ అంతటా కప్పివేయుటచే ఆ మహేంద్రపర్వతము పుష్పముల కొండ వలె ప్రకాశించెను.

మూ. తేన చోత్తమవీర్యేణ పీడ్యమానః స పర్వతః,
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః. 14

ప్ర. అ. ఉత్తమవీర్యేణ = గొప్ప పరాక్రమము గల, తేన = ఆతనిచేత, పీడ్యమానః = పీడింపబడుచున్నదై, సః పర్వతః = ఆ పర్వతము, మత్తః = మదించిన, ద్విపః = ఏనుగు, మదమ్ ఇవ = మదోదకమును వలె, సలిలమ్ = ఉదకమును, సంప్రసుస్రావ = స్రవించెను.

తా. మహావీర్యవంతు డైన ఆ హనుమంతుడు పీడించుటచే ఆ పర్వతము మదించిన ఏనుగ మదోదకమును కార్చినట్లు, జలమును స్రవించెను. 14

మూ. పీడ్యమానస్తు బలినా మహేన్ద్రస్తేన పర్వతః,
రీతీర్నిర్వర్తయామాస కాఞ్చనాఞ్జనరాజతీః. 15

ప్ర. అ. బలినా = బలవంతు డైన, తేన = ఆతనిచేత, పీడ్యమానః = పీడింపబడిన, మహేన్ద్రః పర్వతః = మహేంద్రపర్వతము, కాఞ్చనాఞ్జనరాజతీః = బంగారమునకు, కాటుకకు, వెండికి సంబంధించిన, రీతీః = రేఖలను, నిర్వర్తయామాస = కలుగు నట్లు చేసెను.

తా. బలవంతు డైన హనుమంతుడు పీడించుటచే, మహేంద్రపర్వతము పైన ఉన్న బంగారు శిలలు, నీలవర్ణము గల శిలలు, వెండి శిలలు నలిగి దానిపై అక్కడక్కడ, బంగారు గీతలు, నీలిరంగు గీతలు, వెండిరంగు గీతలు ఏర్పడినవి. 15

మూ. ముమోచ చ శిలాః శైలో విశాలాః సమనఃశిలాః,
మధ్యమేనార్చిషా జుష్టో ధూమరాజీరివానలః. 16

ప్ర. అ. శైలః = పర్వతము, మధ్యమేన = మధ్యము మైన, అర్చిషా = జ్వాలతో, జుష్టః = కూడిన, అనలః = అగ్ని, ధూమరాజీరివ = ధూమపంక్తులను

వలె, సమనఃశిలాః=మణిశిలతో కూడిన, విశాలాః=విశాలము లైన, శిలాః = శిలలను, ముమోచ చ = విడచెనుకూడ.

తా. పద్మమజ్వాలతో కూడిన అగ్నినుండి ధూమము బయలుదేరి నట్లు, ఆ పర్వతమునుండి, మణిశిలతో కూడిన రాళ్ళు బయల్వెడలెను.

వి. అగ్నిజ్వాలలు—కాళీ, కరాళీ, విస్ఫులింగినీ, ధూమ్రవర్ణా, విశ్వరుచి, లోహితా, మనోజవా అని ఏడు ఉండును. వానిలో పద్మమజ్వాల ధూమ్రవర్ణ. దానినుండి ధూమము బయలుదేరును. 16

మూ. గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వశః.
గుహావిష్టాని భూతాని వినేదుర్వికృతైః స్వరైః. 17

ప్ర. అ. గుహావిష్టాని=గుహలలో ప్రవేశించి ఉన్న, భూతాని=ప్రాణులు, పీడ్యమానేన=పీడింపబడుచున్న, గిరిణా = పర్వతముచేత, సర్వశః = అన్ని వైపులనుండి, పీడ్యమానాని=పీడింపబడుచున్నవై, వికృతైః = వికృతము లైన, స్వరైః = స్వరములతో, వినేదుః = ధ్వనిచేసినవి.

తా. పర్వతము పీడింపబడినపుడు ఆ పర్వతము గుహలలో నివసించు ప్రాణులు అన్ని వైపులా నలిగిపోవుచు, వికృత మైన స్వరములతో అరచినవి.

మూ. స మహాసత్త్వసంనాదః శైలపీడానిమిత్తజః,
పృథివీం పూరయామాస దిశశ్చోపవనాని చ. 18

ప్ర. అ. శైలపీడానిమిత్తజః = శైలముయొక్క పీడ అను నిమిత్తము వలన కలిగిన, సః = ఆ, మహాసత్త్వసంనాదః = పెద్ద పెద్ద ప్రాణుల ధ్వని, పృథివీమ్=భూమినీ, దిశశ్చ=దిక్కులనూ, ఉపవనాని చ=సమీపమునందున్న అడవులను, పూరయామాస = పూరించెను.

తా. పెద్ద పెద్ద ప్రాణులు పర్వతము నలిగిపోవుటచే చేసిన ఆ ధ్వని భూమినీ, దిక్కులనూ, సమీపమునందున్న అడవులనూ ప్రతిధ్వనింపచేసెను.

మూ. శిరోభిః పృథుభిః సర్పా వ్యక్తస్వస్తికలక్షణైః,
వమన్తః పావకం ఘోరం దదంశుర్దశనైః శిలాః. 19

ప్ర. అ. సర్పాః=సర్పములు, వ్యక్తస్వస్తికలక్షణైః=పడగలు విప్పుటచే స్పష్టముగా కనబడుచున్న స్వస్తికాకారము గల గుర్తులు గల, పృథుభిః = పెద్దవైన, శిరోభిః = శిరస్సులతో, ఘోరమ్=భయంకర మైన, పావకమ్ = అగ్నిని, వమన్తః=కక్కుచున్నవై, దశనైః=దంతములతో, శిలాః = శిలలను, దదంశుః = కరచినవి.

తా. మహాసర్పములు పడగలు విప్పుటచే వాటిపై స్వస్తికాకారములో ఉన్న నల్లని చిహ్నములు స్పష్టముగా కనబడుచున్న పెద్ద పెద్ద తలలనుండి భయంకర మైన విషము కక్కుచు, దంతములతో శిలలను కరచెను. 19

మూ. తాస్తదా సవిషైర్దష్టాః కుపితైస్తైర్మహాశిలాః,
జజ్వలుః పావకోద్దీప్తా బిభిదుశ్చ సహస్రధా. 20

ప్ర. అ. తదా = అప్పుడు, సవిషైః = విషముతో కూడిన, కుపితైః = కోపగించిన, తైః = ఆ సర్పములచేత, దష్టాః = కరవబడిన, తాః మహాశిలాః = ఆ పెద్ద శిలలు, పావకోద్దీప్తాః=అగ్నిచేత ప్రజ్వలింపచేయబడినవై, జజ్వలుః= తగులబడినవి. సహస్రధా = వేయి ముక్కలుగా, బిభిదుశ్చ = బ్రద్దలైపోయినవి.

తా. తీవ్ర మైన విషము గల ఆ మహాసర్పములు కరచుటచే, పెద్ద పెద్ద శిలలు అగ్నిజ్వాలలచే దగ్ధము లై, వేయి ముక్కలుగా బ్రద్దలై పోయినవి. 20

మూ. యాని చౌషధజాలాని తస్మిన్ జాతాని పర్వతే,
విషఘ్నాన్యపి నాగానాం న శేకుః శమితుం విషమ్. 21

ప్ర. అ. తస్మిన్ పర్వతే=ఆ పర్వతమునందు, జాతాని=పుట్టిన, యాని = ఏ, ఔషధజాలాని = ఔషధసమూహము ఉన్నవో, అవి, విషఘ్నాన్యపి = విషమును నశింపచేయున వైనను, నాగానామ్=సర్పముల, విషమ్=విషమును, శమితుమ్ = శమింపచేయుటకు, న శేకుః = సమర్థములు కాలేదు.

తా. ఆ పర్వతముమీద విషసంహారకము లైన ఔషధు లెన్ని ఉన్నను అవి ఆ సర్పముల విషమును శాంతింపచేయలేకపోయెను. 21

మూ. భిద్యతేఽయం గిరిర్భూతైరితి మత్వా తపస్వినః,
త్రస్తా విద్యాధరాస్తస్మాదుత్పేతుః స్త్రీగణైః సహ. 22

పానభూమిగతం హిత్వా హైమమాసవభాజనమ్,
పాత్రాణి చ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్. 23
లేహ్యానుచ్చావచాన్ భక్ష్యాన్ మాంసాని వివిధాని చ,
ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్. 24

ప్ర. అ. అయమ్ = ఈ, గిరిః = పర్వతము, భూతైః = భూతములచేత, భిద్యతే = బ్రద్దలు కొట్టబడుచున్నది: ఇతి = అని, మత్వా = తలచి, తపస్వినః = మునులు, ఉత్పేతుః = పైకి ఎగిరి వెళ్ళిపోయిరి. విద్యాధరాః = విద్యాధరులు, త్రస్తాః = భయపడినవారై, పానభూమిగతమ్ = పానభూమిలో ఉన్న, హైమమ్ = బంగారువికార మైన, ఆసవభాజనమ్ = మద్యపాత్రను, మహార్హాణి = అధిక మైన మూల్యము గల, పాత్రాణి చ = పాత్రలను, హిరణ్మయాన్ = బంగారు వికార మైన, కరకాంశ్చ = పొడవైన చిన్న పాత్రలను, ఉచ్చావచాన్ = అనేక విధము లైన, లేహ్యాన్ = నాలుకతో నాకి తినవలసిన పదార్థములను, భక్ష్యాన్ = భక్షించవలసిన పదార్థములను, వివిధాని = అనేకవిధము లైన, మాంసాని = మాంస ములను, ఆర్షభాణి = వృషభములకు సంబంధించిన, చర్మాణి = చర్మలను, కనకత్సరూన్ = బంగారు ఒరలు గల, ఖడ్గాంశ్చ = ఖడ్గములను, హిత్వా = విడచి, స్త్రీగణైః సహ = స్త్రీసముదాయముతో కూడ, తస్మాత్ = ఆ పర్వతము నుండి, ఉత్పేతుః = ఎగిరిపోయిరి.

తా. ఏవో భూతాలు ఈ పర్వతమును బ్రద్దలుకొట్టి వేయుచున్న వని అనుకొని మును లందరు పైకి ఎగిరి వెళ్ళిపోయిరి. అంతవరకు అక్కడ పాన గోష్ఠులలో ఉన్న విద్యాధరులు భయపడి, మద్యముతో నిండిన బంగారు పెద్ద పాత్రనూ, అమూల్యము లైన (మద్యము వడ్డించు) పాత్రలను, (మద్యము త్రాగు) పొడవైన బంగారు చిన్న పాత్రలను, అనేకవిధము లైన లేహ్యములను, భక్ష్య ములను, అనేకవిధము లైన మాంసములను, నేలపై పరచుకొనిన ఎద్దుల చర్మలను, బంగారు ఒరలలో ఉన్న ఖడ్గములను అక్కడనే విడిచివేసి, తమ తమ ప్రేయసులతో కూడ ఆ పర్వతమును విడచి, పైకి ఎగిరిపోయిరి. 22-24

మూ. కృతకణ్ఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః,
రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే. 25

ప్ర. అ. కృతకణ్ఠగుణాః = చేయబడిన (ధరింపబడిన) కంఠసూత్రములు కలవారు, క్షీబాః = మద్యపానముచేత మదించినవారు, రక్తమాల్యానులేపనాః = ఎఱ్ఱని పుష్పమాలలూ, మైపూతలు కలవారు, రక్తాక్షాః = ఎఱ్ఱని నేత్రములు కలవారు, పుష్కరాక్షాః = పద్మములవంటి నేత్రములు కలవారు అయిన ఆ విద్యాధరులు, గగనమ్=ఆకాశమును ప్రతిపేదిరే=పొందిరి.

తా. కంఠములలో బంగారు త్రాళ్ళు, శిరస్సులపై ఎఱ్ఱని పుష్పమాలలూ ధరించి, శరీరములకు ఎఱ్ఱని అనులేపనములను పూసుకొని, మద్యపానముచే మత్తెక్కి ఉన్న ఆ విద్యాధరులలో కొందరి కళ్లు చాల ఎఱ్ఱగా ఉండెను. కొందరి కళ్ళు పద్మముల (రేకుల) వలె ఉండెను. 25

మూ. హారనూపురకేయూరపారిహార్యధరాః స్త్రియః,
విస్మితాః సస్మితాస్తస్థురాకాశే రమణైః సహ. 26

ప్ర. అ. హారనూపురకేయూరపారిహార్యధరాః = హారములు, అందెలు, బాహుపురులు, కంకణములు ధరించిన, స్త్రియః = స్త్రీలు, విస్మితాః = ఆశ్చర్యపడుచున్నవారై, సస్మితాః = చిరునవ్వులతో కూడినవారై, రమణైః సహ = ప్రియులతో కూడ, ఆకాశే = ఆకాశమునందు, తస్థుః = నిలచిరి.

తా. హారములు, నూపురములు, బాహుపురులు, కంకణములు ధరించిన విద్యాధరస్త్రీలు, ఆశ్చర్యపడుచు, తమ ప్రియులతో కూడ, చిరునవ్వు నవ్వుచు, ఆకాశములో నిలచిరి. 26

మూ. దర్శయన్తో మహావిద్యాం విద్యాధరమహర్షయః,
సహితాస్తస్థురాకాశే వీక్షాఞ్చక్రుశ్చ పర్వతమ్. 27

ప్ర. అ. విద్యాధరమహర్షయః = విద్యాధరులు, మహర్షులు, మహావిద్యామ్ = గొప్ప శక్తిని, దర్శయన్తః = ప్రదర్శించుచు, సహితాః = గుమిగూడినవారై, ఆకాశే = ఆకాశమునందు, తస్థుః = నిలచిరి. పర్వతమ్ = పర్వతమును, వీక్షాం చక్రుశ్చ = చూచిరి కూడ.

తా. అణిమాద్యష్టసిద్ధులు గల విద్యాధరులు, మహర్షులు, ఆధారము

లేకుండ ఆకాశమునందు నిలువ గల తమ మహావిద్యను ప్రదర్శించుచు, గుమి గూడి ఆకాశములో నిలిచి, పర్వతమును చూచిరి. 27

మూ. శుశ్రువుశ్చ తదా శబ్దమృషీణాం భావితాత్మనామ్,
చారణానాం చ సిద్ధానాం స్థితానాం విమలేఽమ్బరే. 28

ప్ర. అ. తదా = అప్పుడు, విమలే = స్వచ్ఛమైన, అమ్బరే = ఆకాశము నందు, స్థితానామ్ = ఉన్న, చారణానామ్ = చారణులయొక్క, సిద్ధానామ్ = సిద్ధులయొక్క, భావితాత్మనామ్ = పరిశుద్ధము చేయబడిన మనస్సులు గల, ఋషీణాం చ = ఋషులయొక్క, శబ్దమ్ = మాటను, శుశ్రువుః = వినిరి .

తా. ఇంతలో వారికి, నిర్మల మైన ఆకాశమునందు నిలచి ఉన్న చారణులు, సిద్ధులు, పవిత్ర మైన మనస్సు గల ఋషులు పలికిన మాటలు వినబడినవి. 28

మూ. ఏష పర్వతసంకాశో హనూమాన్ మారుతాత్మజః,
తితీర్షతి మహావేగః సముద్రం మకరాలయమ్. 29

ప్ర. అ. పర్వతసంకాశః = పర్వతముతో సమానుడు, మారుతాత్మజః = వాయుదేవుని కుమారుడు, మహావేగః = గొప్ప వేగము గలవాడూ అయిన, ఏషః = ఈ, హనూమాన్ = హనుమంతుడు, మకరాలయమ్ = మొసళ్ళకు స్థానమైన, సముద్రమ్ = సముద్రమును, తితీర్షతి = దాట దలచుచున్నాడు.

తా. పర్వతముతో సమాన మైనవాడూ, మహావేగవంతుడూ వాయుపుత్రుడూ అయిన ఈ హనుమంతుడు మకరములకు నివాస మైన సముద్రమును దాట దలచుచున్నాడు. 29

మూ. రామార్థం వానరార్థం చ చికీర్షన్ కర్మ దుష్కరమ్,
సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి.

ప్ర. అ. రామార్థమ్ = రామునికొరకు, వానరార్థం చ = వానరులకొరకూ, దుష్కరమ్ = చేయ శక్యము కాని, కర్మ = పనిని, చికీర్షన్ = చేయ నిచ్ఛయించుచున్న వాడై, సముద్రస్య = సముద్రముయొక్క, దుష్ప్రాపమ్ = పొంద

శక్యము కాని, పరం పారమ్ = అవతలి ఒడ్డును, ప్రాప్తుమ్ = పొందుటకు, ఇచ్ఛంతి = కోరుచున్నారు.

తా. ఇతడు రామునికొఱకూ, వానరులంకొఱకూ, ఇతరు లెవ్వరు చేయ లేని పని చేయ సంకల్పించి, చేరుటకు శక్యము కాని సముద్రము అవలి ఒడ్డు చేరుటకై కోరుచున్నాడు. 30

మూ. ఇతి విద్యాధరాః శ్రుత్వా వచస్తేషాం మహాత్మనామ్,
తమప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్. 31

ప్ర. అ. విద్యాధరాః = విద్యాధరులు, ఇతి = ఇట్లు, మహాత్మనామ్ = మహాత్ము లైన, తేషామ్ = వారియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, పర్వతే = పర్వతమునందు, అప్రమేయమ్ = పోల్చుటకు శక్యముకాని, వానరర్షభమ్ = వానర శ్రేష్ఠు డైన, తమ్ = ఆ హనుమంతుని, దదృశుః = చూచిరి.

తా. విద్యాధరులు, మహాత్ము లైన వారందరు పలుకుచున్న ఈ మాటలు విని, ఆ పర్వతముమీద నిలచి యున్న, సాటిలేని ఆకారము గల, వానరశ్రేష్ఠు డైన ఆ హనుమంతుని చూచిరి. 31

మూ. దుధువే చ స రోమాణి చకమ్పే చాచలోపమః,
ననాద సుమహానాదం సుమహానివ తోయదః. 32

ప్ర. అ. అచలోపమః = పర్వతముతో సమాను డైన, సః = అతడు, రోమాణి = రోమములను, దుధువే చ = దులిపెను. చకమ్పే చ = కంపించెను కూడ. సుమహాన్ = చాల పెద్ద దైన, తోయదః ఇవ = మేఘము వలె, సుమహానాదమ్ = చాల పెద్ద ధ్వని కలుగునట్లుగా, ననాద = ధ్వనిచేసెను.

తా. పర్వతము వంటి శరీరము గల ఆ హనుమంతుడు, ఒక్కమాఱు తన రోమములను దులుపుకొనెను. మహామేఘము వలె గర్జించెను. 32

మూ. అనుపూర్వేణ వృత్తం చ లాఙ్గూలం లోమభిశ్చితమ్,
ఉత్పతిష్యన్ విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్. 33

ప్ర. అ. ఉత్పతిష్యన్ = ఎగురబోవుచున్న ఆ హనుమంతుడు, అను

పూర్వోత్త్యం=పైనుండి క్రిందికి ఒక క్రమముతో, వృత్తమ్=వర్తులముగా ఉన్నది, లోమభిః=రోమములతో, చితమ్=నిండినది అయిన, లాఙ్గూలమ్=తోకను, పక్షిరాజః=గరుత్మంతుడు, ఉరగం యథా=సర్పమును వలె, విచిక్షేప=విసరెను.

తా. ఇంక పైకి ఎగురబోవుచున్న ఆ హనుమంతుడు, మొదట్లో లావు గాను, చివరికి పోయిన కొలది సన్నము గాను ఉన్నది, రోమములతో నిండినది, అయిన తోకను, గరుత్మంతుడు సర్పమును పట్టి జాడించి నట్లు జాడించెను. ౩౩

మూ. తస్య లాఙ్గూలమావిద్ధమాత్తవేగస్య పృష్ఠతః,
దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః. ౩౪

ప్ర. అ. ఆత్తవేగస్య=గ్రహింపబడిన వేగము గల, తస్య=అతని యొక్క, పృష్ఠతః=వెనుకభాగమునందు, ఆవిద్ధమ్=తగులొ్కని ఉన్న, లాఙ్గూలమ్=తోక, గరుడేన=గరుత్మంతునిచేత, హ్రియమాణః=హరింప బడుచున్న, మహోరగః ఇవ=మహా సర్పము వలె, దదృశే=చూడబడెను.

తా. వేగము పుంజుకొని యున్న ఆ హనుమంతుని వీపు మీద నిట్ట నిలువుగా నిలచి ఉన్న తోక, గరుత్మంతుడు పట్టి తీసికొనిపోవుచున్న సర్పము వలె కనబడెను. ౩౪

మూ. బాహూ సంస్తంభయామాస మహాపరిఘసంనిభౌ,
ససాద చ కపిః కట్యాం చరణౌ సంచుకోచ చ. ౩౫

ప్ర. అ. కపిః=హనుమంతుడు, మహాపరిఘసన్నిభౌ=గొప్ప పరిఘ లతో (కోట గడియలతో) సమానములైన, బాహూ=బాహువులను, సంస్తంభయామాస=బిగియపట్టెను. కట్యామ్=కటిప్రదేశమునందు, ససాద=సన్నగిలెను. చరణౌ=పాదములను, సంచుకోచ చ=ముడచెను.

తా. హనుమంతుడు పెద్ద పరిఘల వలె ఉన్న బాహువులు బిగియపట్టి నడుము సన్నము చేసి, పాదములు ముడుచుకొని ఎగురుటకు సిద్ధముగా ఉండెను. ౩౫

మూ. సంహృత్య చ భుజౌ శ్రీమాంస్తథైవ చ శిరోధరామ్,
తేజః సత్త్వం తథా వీర్యమావివేశ స వీర్యవాన్. 36

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తుడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు అయిన, సః = హనుమంతుడు, భుజౌ చ = భుజములను, తథైవ చ = మరియు, శిరోధరామ్ = కంఠమునూ, సంహృత్య = వంచి, తేజః = తేజస్సును, సత్త్వమ్ = బలమును, తథా = మరియు, వీర్యమ్ = పరాక్రమమునూ, ఆవివేశ = పెంచుకొనెను.

తా. అద్భుత మైన శోభ, పరాక్రమము గల హనుమంతుడు, భుజములను, కంఠమును వంచి, తేజస్సును, బలమును, వీర్యమును తెప్పించుకొనెను.

మూ. మార్గమాలోకయన్దూరాదూర్ధ్వం ప్రణిహితేక్షణః,
రురోధ హృదయే ప్రాణానాకాశమవలోకయన్. 37

ప్ర. అ. ఊర్ధ్వమ్ = పైకి, ప్రణిహితేక్షణః = ఉంచబడిన నేత్రములు కల వాడై, దూరాత్ = దూరమునుండి, మార్గమ్ = మార్గమును, ఆలోకయన్ = చూచుచు, ఆకాశమ్ = ఆకాశమును, అవలోకయన్ = చూచుచు, ప్రాణాన్ = ప్రాణములను. హృదయే = హృదయమునందు, రురోధ = నిలిపెను.

తా. నేత్రములను పైకి ఎత్తి దూరముగా నున్న, తాను వెళ్ళవలసిన మార్గము చూచుచు. ఆకాశము వైపు కూడ చూచుచు, ఊపిరి బిగపట్టెను. 37

మూ. పద్భ్యాం దృఢమవస్థానం కృత్వా స కపికుఞ్జరః,
నికుఞ్చ్య కర్ణౌ హనుమానుత్పతిష్యన్ మహాబలః. 38
వానరాన్ వానరశ్రేష్ఠ ఇదం వచనమబ్రవీత్.

ప్ర. అ. కపికుఞ్జరః = వానరులలో గజము వంటివాడూ, మహాబలః = గొప్ప బలము కలవాడూ. వానరశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడూ అయిన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, పద్భ్యామ్ = పాదములతో, దృఢమ్ = దృఢముగా, అవస్థానమ్ = నిలచుటను, కృత్వా = చేసి, కర్ణౌ = చెవులను, నికుఞ్చ్య = వంచి, ఉత్పతిష్యన్ = పైకి ఎగురనున్నవాడై, వానరాన్ = వానరులను గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. వానరుల మధ్య గణము వంటివాడూ, మహాబలశాలి, వానరశ్రేష్ఠుడూ అయిన ఆ హనుమంతుడు పాదములు గట్టిగా అనుకొని నిలిచి, చెవులు వంచి పైకి ఎగురుటకు సిద్ధముగా ఉండి, వానరులతో ఇట్లు పలికెను. 38

మూ. యథా రాఘవనిర్ముక్తః శరః శ్వసనవిక్రమః, 39
గచ్ఛేత్తద్వద్గమిష్యామి లఙ్కాం రావణపాలితామ్.

ప్ర. అ. రాఘవనిర్ముక్తః = రామునిచేత విడువబడిన, శరః = బాణము, యథా = ఎట్లు, గచ్ఛేత్ = వెళ్ళునో అట్లు, శ్వసనవిక్రమః = వాయువు వంటి వేగము కలవాడనై, రావణపాలితామ్ = రావణునిచేత పాలింపబడిన, లఙ్కామ్ = లంకను గూర్చి, గమిష్యామి = వెళ్ళగలను.

తా. రాముడు విడచిన బాణము వలె, నేను వాయువేగముతో రావణుడు పాలించుచున్న లంకకు వెళ్ళెదను. 39

మూ. న హి ద్రక్ష్యామి యది తాం లఙ్కాయాం జనకాత్మజామ్,
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్.

ప్ర. అ. లఙ్కాయామ్ = లంకలో, తాం జనకాత్మజామ్ = ఆ సీతను, న హి ద్రక్ష్యామి యది = (నేను) చూడలేకపోయిన నైతే, అనేన = ఈ, వేగేనైవ హి = వేగముతోనే, సురాలయమ్ = ఇంద్రలోకమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను.

తా. లంకలో సీత కనబడకపోయినచో, ఈ వేగముతోనే స్వర్గలోకమునకు కూడ వెళ్ళెదను. 40

మూ. యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యామ్యకృతశ్రమః, 41
బద్ధ్వా రాక్షసరాజానమానయిష్యామి రావణమ్.

ప్ర. అ. త్రిదివే = స్వర్గమునందు, సీతామ్ = సీతను, న ద్రక్ష్యామి యది వా = చూడలేక పోయినచో, అకృతశ్రమః = చేయబడని శ్రమకలవాడనై, రాక్షసరాజానమ్ = రాక్షసరాజైన, రావణమ్ = రావణుని, బద్ధ్వా = బంధించి, ఆనయిష్యామి = తీసికొనివచ్చెదను.

తా. స్వర్గలోకములో కూడ నాకు సీత కనబడక పోయినచో ఏ మాత్రము శ్రమ చెందక, రావణుని బంధించి తీసికొని వచ్చెదను. 41

మూ. సర్వథా కృతకార్యోఽహమేష్యామి సహ సీతయా, 42
ఆనయిష్యామి వా లఙ్కాం సముత్పాట్య సరావణామ్.

ప్ర. అ. అహమ్ = నేను, సర్వథా = అన్ని విధములం, కృతకార్యః = చేయబడిన కార్యము కలవాడనై, సహ సీతయా = సీతతో కూడ, ఏష్యామి = రాగలను. వా = లేక, సరావణామ్ = రావణునితో కూడిన, లఙ్కామ్ = లంకను, సముత్పాట్య = పెకలించి, ఆనయిష్యామి = తీసికొనిరాగలను.

తా. నేను అన్ని విధములా కార్యము సాధించి, సీతతో తిరిగి వచ్చెదను. లేదా రావణునితో సహా లంకను పెకలించుకొని తీసికొని వచ్చెదను. 42

మూ. ఏవముక్త్వా తు హనుమాన్వానరాన్వానరోత్తమః, 43
ఉత్పపాతాథ వేగేన వేగవానవిచారయన్,
సుపర్ణమివ చాత్మానం మేనే స కపికుఞ్జరః. 44

ప్ర. అ. వానరోత్తమః = వానరులలో శ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమంతుడు, వానరాన్ = వానరులను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, అథ = అటు పిమ్మట, అవిచారయన్ = మరి యొక్క విషయ మేమీ విచారించని వాడై, వేగవాన్ = మహావేగవంతుడై, వేగేన = వేగముతో, ఉత్పపాత = పైకి ఎగిరెను. సః = ఆ, కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడు, ఆత్మానమ్ = తనను, సుపర్ణమివ = గరుత్మంతుని వలె, మేనే చ = తలంచెను కూడ.

తా. వానరులలో శ్రేష్ఠుడూ, మహావేగవంతుడూ అయిన హనుమంతుడు ఆ వానరులతో ఇట్లు పలికి, ఇతర మైన ఆలోచన లన్నీ విడచి, వేగముతో పైకి ఎగిరెను. ఆ సమయమునందు ఆ వానరశ్రేష్ఠుడు తాను సాక్షాత్తు గరుత్మంతుని వంటి వా డని భావించెను. 43, 44

మూ. సముత్పతతి తస్మింస్తు వేగాత్తే నగరోహిణః,
సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతుః సమన్తతః.

ప్ర. అ. తస్మిన్ = అతడు, సముత్పతతి = ఎగురుచుండగా, వేగాత్ = ఆ

వేగమువలన, తే = ఆ, నగరోహాః = పర్వతముపై మొలచిన వృక్షములు, సర్వాన్ = సమస్తమైన, విటపాన్ = కొమ్మలను, సంహృత్య = దగ్గరగా ముడుచుకొని, సమన్తతః = నలు వైపులందు, సముత్పేతుః = ఎగిరినవి.

తా. హనుమంతుడు ఎగురగానే, ఆ వేగమునకు, అక్కడ ఉన్న వృక్షము లన్నీ తమ కొమ్మలు ముడిచిపెట్టుకొని, నలువైపుల పైకి ఎగిరి పోయినవి. 45

మూ. స మత్తకోయష్టిభకాన్ పాదపాన్ పుష్పశాలినః,
ఉద్వహన్నూరువేగేన జగామ విమలేఽమ్బరే 46

ప్ర. అ. సః = అతడు, మత్తకోయష్టికాన్ = మదించిన టీకుకొక్కెర పక్షులు గల, పుష్పశాలినః = పుష్పములతో ప్రకాశించుచున్న, పాదపాన్ = వృక్షములను, ఊరువేగేన = ఊరువుల వేగముచేత, ఉద్వహన్ = ఎగురుగొట్టి తీసికొనిపోవుచు, విమలే = నిర్మలమైన, అమ్బరే = ఆకాశమునందు, జగామ = వెళ్లెను.

తా. మదించిన టీకుకొక్కెర లను పక్షులు నివసించుచున్న, పుష్పములతో నిండిన వృక్షములను తన తొడల వేగముచేత పెకలించి తనతో ఎగురు నట్లు చేయుచు, హనుమంతుడు నిర్మలమైన ఆకాశములో ఎగిరెను. 46

మూ. ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపిమన్వయుః,
ప్రస్థితం దీర్ఘమధ్వానం స్వబన్ధుమివ బాన్ధవాః. 47

ప్ర. అ. ఊరువేగోద్ధతాః = తొడల వేగముచేత పైకి లేచిపోయిన, వృక్షాః = వృక్షములు, దీర్ఘమ్ = దీర్ఘమైన, అధ్వానమ్ = మార్గమును, ప్రస్థితమ్ = ప్రయాణమైన, స్వబన్ధుమ్ = తమ బంధువును, బాన్ధవాః ఇవ = బంధువులు వలె, కపిమ్ = హనుమంతుని, ముహూర్తమ్ = కొంచెము కాలము, అన్వయుః = అనుసరించి వెళ్ళినవి.

తా. తొడల వేగానికి లేచిపోయిన చెట్లు, దూరదేశప్రయాణమునకై బయలుదేరి వెళ్ళుచున్న తమ బంధువును, బంధువు లందరు వెంబడించి వెళ్లి నట్లు, ఆ హనుమంతుని, కొంచెము సేపు వెంబడించి వెళ్ళినవి. 47

మూ. తమూరువేగోన్మథితాః సాలాశ్చాన్యే నగోత్తమాః,
అనుజగ్ముర్హనూమన్తం సైన్యా ఇవ మహీపతిమ్. 48

ప్ర. అ. ఊరువేగోన్మథితాః = తొడల వేగముచేత పెకలించబడిన, సాలాశ్చ = మద్దిచెట్లు, అన్యే = ఇతర మైన, నగోత్తమాః = మహావృక్షములూ, సైన్యాః = సైన్యములు, మహీపతిమ్ ఇవ = రాజును వలె, హనూమన్తమ్ = హనుమంతుని, అనుజగ్ముః = అనుసరించి వెళ్ళినవి.

తా. తొడల వేగముచేత పెకలించివేయబడిన సాలవృక్షములూ, ఇతర మహావృక్షములూ, సైన్యములు రాజు వెనుక వెళ్ళినట్లు, హనుమంతుని వెనుక వెళ్ళినవి. 48

మూ. సుపుష్పితాగ్రైర్బహుభిః పాదపైరన్వితః కపిః,
హనుమాన్ పర్వతాకారో బభూవాద్భుతదర్శనః. 49

ప్ర. అ. సుపుష్పితాగ్రైః = బాగుగా పుష్పించిన శిఖరములు గల, పాదపైః = వృక్షములతో, అన్వితః = కూడిన, కపిః = వానరుడైన, పర్వతాకారః = పర్వతమువంటి ఆకారము గల, హనుమాన్ = హనుమంతుడు, అద్భుతదర్శనః = ఆశ్చర్యకర మైన దర్శనము కలవాడు, బభూవ = ఆయెను.

తా. పర్వతము వంటి ఆకారము గల హనుమంతుని చుట్టూ బాగుగా పుష్పించిన అనేకవృక్షములు చేరుటచే అతడు చూచువారికి చాలా ఆశ్చర్యము కలిగించెను. 49

మూ. సారవన్తోఽథ యే వృక్షా న్యమజ్జన్ లవణామ్భసి,
భయాదివ మహేన్ద్రస్య పర్వతా వరుణాలయే. 50

ప్ర. అ. అథ = పిమ్మట, సారవన్తః = సారముగల, యే = ఏ, వృక్షాః = వృక్షము లున్నవో, అవి, మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, భయాత్ = భయమువలన, పర్వతాః = పర్వతములు, వరుణాలయే ఇవ = సముద్రమునందు వలె, లవణామ్భసి = లవణసముద్రమునందు, న్యమజ్జన్ = మునిగి పోయినవి.

తా. మహేంద్రునికి భయపడి పర్వతములు సముద్రములో మునిగినట్లుగా, బల మైన వృక్షములు లవణసముద్రములో మునిగిపోయినవి. 50

మూ. స నానాకుసుమైః కీర్ణః కపిః సాఙ్కురకోరకైః,
శుశుభే మేఘసంకాశః ఖద్యోతైరివ పర్వతః. 51

ప్ర. అ. సాఙ్కురకోరకైః = అంకురములతోను మొగ్గలతోను కూడిన, నానాకుసుమైః=అనేకవిధము లైన పుష్పములచే, కీర్ణః=వ్యాపింపబడిన, మేఘసంకాశః = మేఘముతో సమాను డైన, సః కపిః=ఆ హనుమంతుడు, ఖద్యోతైః =మినుగురుపురుగులతో నిండిన, పర్వతః ఇవ = పర్వతము వలె, శుశుభే= ప్రకాశించెను.

తా. మేఘము వలె ఉన్న ఆ హనుమంతుని మీద అనేకవిధము లైన పుష్పములు, అంకురములు, మొగ్గలు పడుటచే అతడు అంతట మినుగురు పురుగులు కప్పివేసిన పర్వతము వలె ప్రకాశించెను. 51

మూ. విముక్తా స్తస్య వేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః,
అవశీర్యన్త సలిలే నివృత్తాః సుహృదో యథా. 52

ప్ర. అ. తస్య=హనుమంతునియొక్క, వేగేన= వేగముచేత, విముక్తాః = విడువబడిన, తే ద్రుమాః=ఆ వృక్షములు, పుష్పాణి=పుష్పములను, ముక్త్వా = విడచి, నివృత్తాః = వెనుకకు మరలిన, సుహృదో యథా=స్నేహితులు వలె, సలిలే = ఉదకమునందు, అవశీర్యన్త = పడిపోయినవి.

తా. క్రమముగా హనుమంతుడు దూర మగుటచే, అతని వేగముతో సంబంధము తగ్గిన చెట్లు, అతనిపై పుష్పములు విడచి, ప్రవాసమునకు పోవుచున్న మిత్రుని సాగనంపుటకై కొంత దూరము వెళ్ళిన స్నేహితులు వెనుకకు మరలి నట్లు, నీటిలో పడిపోయినవి. 52

మూ. లఘుత్వేనోపపన్నం తద్విచిత్రం సాగరేఽపతత్,
ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయుసమీరితమ్, 53
తారాచితమివాకాశం ప్రబభౌ చ మహార్ణవః.

ప్ర. అ. లఘుత్వేన = లఘుత్వముతో, ఉపపన్నమ్ = కూడినదీ,

విచిత్రమ్=నానావర్ణములు కలదీ, కపివాయుసమీరితమ్=హనుమంతుని వేగము వలన కలిగిన వాయువుచే ప్రేరేపింపబడినదీ అయిన, ద్రుమాణామ్ = వృక్షముల యొక్క, తత్ = ఆ, వివిధమ్ = అనేకవిధము లైన, పుష్పమ్ = పుష్పము, సాగరే = సముద్రమునందు, అపతత్ = పడెను. మహార్ణవః = మహాసముద్రము, తారాచితమ్ = నక్షత్రములతో నిండిన, ఆకాశమివ = ఆకాశము వలె, ప్రబభౌ చ = ప్రకాశించెను.

తా. హనుమంతుని వేగముచే కలిగిన వాయువు ఎగురగొట్టగా, తేలికగాను, విచిత్రవర్ణములతోను ఉన్న అనేకవిధము లైన పుష్పముల సముదాయము చెట్లనుండి రాలి సముద్రములో పడెను. అప్పు డా సముద్రము నక్షత్రములతో నిండిన ఆకాశము వలె ప్రకాశించెను. 53

మూ. పుష్పౌఘేనానుబద్ధేన నానావర్ణేన వానరః,
బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణవిభూషితః. 54

ప్ర. అ. నానావర్ణేన = అనేకవిధము లైన రంగులు గల, అనుబద్ధేన = దేహానికి అంటుకొని ఉన్న, పుష్పౌఘేన = పుష్పముల సముదాయముచేత, వానరః = హనుమంతుడు, ఆకాశే = ఆకాశమునందు, విద్యుద్గణవిభూషితః = మెరుపుల సముదాయముచేత అలంకరింపబడిన, మేఘః ఇవ = మేఘము వలె, బభౌ = ప్రకాశించెను.

తా. అనేకవిధము లైన రంగుల పుష్పసముదాయము శరీరముపై కప్పివేయుటచే, ఆ హనుమంతుడు, ఆకాశమునందు, మెరుపుల పంక్తులచే అలంకరింపబడిన మేఘము వలె ప్రకాశించెను. 54

మూ. తస్య వేగసమాధూతైః పుష్పైస్తోయమదృశ్యత, 55
తారాభిరభిరామాభిరుదితాభిరివామ్బరమ్.

ప్ర. అ. తస్య = హనుమంతునియొక్క, వేగసమాధూతైః = వేగముచేత ఎగరకొట్టబడిన, పుష్పైః = పుష్పములతో, తోయమ్ = సముద్రజలము, ఉదితాభిః = ఉదయించిన, అభిరామాభిః = మనోహర మైన, తారాభిః = నక్షత్రములతో, అమ్బరమివ = ఆకాశము వలె, అదృశ్యత = కనబడెను.

తా. హనుమంతుని వేగముచే ఎగిరి పడిన పుష్పములతో, ఆ సముద్రజలము, ఉదయించిన, అంద మైన నక్షత్రములతో ఆకాశము వలె ప్రకాశించెను.

మూ. తస్యామ్బరగతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ, 56
పర్వతాగ్రాద్వినిష్క్రాన్తౌ పఞ్చాస్యావివ పన్నగౌ.

ప్ర. అ. ప్రసారితౌ=చాపబడినవై, అమ్బరగతౌ=ఆకాశమునం దున్న, తస్య=హనుమంతునియొక్క, బాహూ = బాహువులు, పర్వతాగ్రాత్=పర్వతాగ్రమునుండి, వినిష్క్రాన్తౌ = పైకి వచ్చిన, పఞ్చాస్యౌ=ఐదు తలలు గల, పన్నగౌ ఇవ=సర్పములు వలె, దదృశాతే=చూడబడినవి.

తా. ఆకాశము పైపు చాపిన హనుమంతుని బాహువులు, పర్వతాగ్రభాగమునుండి బైటకు వచ్చుచున్న ఐదుతలల సర్పముల వలె కనబడెను. 56

మూ. పిబన్నివ బభౌ చాపి సోర్మిమాలం మహార్ణవమ్, 57
పిపాసురివ చాకాశం దదృశే స మహాకపిః.

ప్ర. అ. సః=ఆ, మహాకపిః=హనుమంతుడు, సోర్మిమాలమ్=తరంగపంక్తులతో కూడిన, మహార్ణవమ్ = మహాసముద్రమును, పిబన్నివ=త్రాగివేయుచున్నవాడు వలె, బభౌ=ప్రకాశించెను. ఆకాశమ్ = ఆకాశమును, పిపాసురివ=త్రాగివేయ నిచ్ఛయించుచున్నవాడు వలె, దదృశే=కనబడెను.

తా. ఆ హనుమంతుడు తరంగపంక్తులతో కూడిన మహాసముద్రమును త్రాగివేయుచున్నాడా అన్నట్లు, ఆకాశమును కూడా త్రాగివేయ దలచుచున్నాడా అన్నట్లు కనబడెను. 57

మూ. తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః, 58
నయనే విప్రకాశేతే పర్వతస్థావివానలౌ.

ప్ర. అ. వాయుమార్గానుసారిణః = ఆకాశముపై ఎగురుచున్న, తస్య = హనుమంతునియొక్క, విద్యుత్ప్రభాకారే = మెరుపు కాంతి వంటి కాంతి గల, నయనే = నేత్రములు, పర్వతస్థౌ = పర్వతముపై ఉన్న, అనలౌ ఇవ=(రెండు) అగ్నుల వలె, విప్రకాశేతే = ప్రకాశించుచుండెను.

తా. ఆకాశమార్గమునందు వెళ్లుచున్న ఆ హనుమంతుని నేత్రములు, మెరుపుల వలె మెరయుచు, పర్వతముపైద రెండు నిప్పు సెగల్ల వలె ఉండెను. 58

మూ. పిఙ్గే పిఙ్గాక్షముఖ్యస్య బృహతీ పరిమణ్డలే. 59
చక్షుషీ సంప్రకాశేతే చన్ద్రసూర్యావివోదితౌ.

ప్ర. అ. పిఙ్గాక్షముఖ్యస్య=పచ్చని కండ్లు గల వానరులలో శ్రేష్ఠుడైన హనుమంతునియొక్క, పిఙ్గే=పచ్చగా ఉన్నవి, బృహతీ=పెద్దవి, పరిమణ్డలే=గుండ్రంగా ఉన్నవి అయిన, చక్షుషీ=నేత్రములు, ఉదితౌ=ఉదయించిన, చన్ద్రసూర్యావివ=చంద్రసూర్యులు వలె, సంప్రకాశేతే=ప్రకాశించినవి.

తా. పచ్చగాను, గుండ్రముగాను ఉన్న ఆ హనుమంతుని పెద్ద పెద్ద కళ్ళు, ఉదయించిన చంద్రసూర్యుల వలె ఉండెను. 59

మూ. ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్రమాబభౌ. 60
సన్ధ్యయా సమభిస్పృష్టం యథా తత్సూర్యమణ్డలమ్.

ప్ర. అ. తస్య = హనుమంతునియొక్క, తామ్రమ్ = ఎఱ్ఱనైన, ముఖమ్=ముఖము, తామ్రయా=ఎఱ్ఱనైన, నాసికయా=ముక్కుతో, సన్ధ్యయా=సంధ్యవేళ, సమభిస్పృష్టమ్=స్పృశింపబడిన, తత్=ఆ, సూర్యమణ్డలం యథా=సూర్యమండలము వలె, ఆబభౌ=ప్రకాశించెను.

తా. ఎఱ్ఱగా నున్న ముక్కుతో, హనుమంతుని ఎఱ్ఱనైన ఆ ముఖము, సంధ్యారాగము సంక్రమించిన సూర్యబింబము వలె ప్రకాశించెను. 60

మూ. లాఙ్గూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే, 61
అమ్బరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః.

ప్ర. అ. అమ్బరే=ఆకాశమునందు, ప్లవమానస్య=తేలుచున్న, వాయుపుత్రస్య=హనుమంతునియొక్క, సమావిద్ధమ్ = పైకి ఎత్తి ఉంచబడిన, లాఙ్గూలమ్=తోక, ఉచ్ఛ్రితః=నిలబెట్టబడిన, శక్రధ్వజః ఇవ=ఇంద్రధ్వజము వలె, శోభతే=ప్రకాశించుచున్నది (ప్రకాశించినది).

తా. ఆకాశములో తేలిపోవుచున్న హనుమంతుని లాంగూలము పైకి ఎత్తబడినదై, నిలబెట్టబడిన ఇంద్రధ్వజము వలె (ఇంద్రుని పూజించుటకై చేయు ఉత్సవములో అంగముగా నిలబెట్టబడిన అలంకృతమైన స్తంభము వలె) ప్రకాశించెను. 61

మూ. లాఙ్గూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రోఽనిలాత్మజః, 62
వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః.

ప్ర. అ. శుక్లదంష్ట్రః = తెల్లని కోరలు కలవాడు, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధిమంతుడూ అయిన, మహాన్ = పెద్ద దేహము గల, అనిలాత్మజః = హనుమంతుడు, లాఙ్గూలచక్రేణ = తోక యొక్క చక్రముచేత, పరివేషీ = పరివేషము గల (గూడు కట్టిన), భాస్కరః ఇవ = సూర్యుడు వలె, వ్యరోచత = ప్రకాశించెను.

తా. పెద్ద దేహము, తెల్లని కోరలూ గల, మహాబుద్ధిశాలి యైన ఆ హనుమంతుడు, తోక చక్రాకారముగా ఏర్పడగా, గూడు కట్టిన సూర్యుడు వలె ప్రకాశించెను. 62

మూ. స్ఫిగ్దేశేనాభితామ్రేణ రరాజ స మహాకపిః, 63
మహతా దారితేనేవ గిరిర్గైరికధాతునా.

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, అభితామ్రేణ = ఎఱ్ఱగానున్న, స్ఫిగ్దేశేన = పిరుదుల ప్రదేశముతో, దారితేన = బద్దలుకొట్టబడిన, మహతా = గొప్ప, గైరికధాతునా = గైరిక మను ఎఱ్ఱని ధాతువుతో, గిరిః ఇవ = పర్వతము వలె, రరాజ = ప్రకాశించెను.

తా. ఎఱ్ఱగా ఉన్న పిరుదులతో ఆ హనుమంతుడు విశాల మైన గైరిక ధాతువు ఉన్న ప్రదేశమును బద్దలు కొట్టగా ఆ ఎరుపుతో కూడిన పర్వతము వలె ప్రకాశించెను. 63

మూ. తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్, 64
కక్షాన్తరగతో వాయుర్జీమూత ఇవ గర్జతి.

ప్ర. అ. సాగరమ్ = సముద్రమును, ప్లవమానస్య = దాటుచున్న, తస్య = ఆ, వానరసింహస్య = వానరశ్రేష్ఠుడైన హనుమంతునియొక్క, కక్షాన్తరగతః = చంకల మధ్యనుండి ప్రసరించుచున్న, వాయుః = వాయువు, జీమూతః ఇవ = మేఘము వలె, గర్జతి = గర్జించుచున్నది.

తా. సముద్రమును దాటుచున్న ఆ హనుమంతుని చంకల సందునుండి ప్రసరించుచున్న గాలి ధ్వని మేఘగర్జితము వలె ఉండెను. 64

మూ. ఖే యథా నిపతన్త్యుల్కా హ్యుత్తరాన్తాద్వినిఃసృతా, 65
దృశ్యతే సానుబన్ధా చ తథా స కపికుఞ్జరః.

ప్ర. అ. ఉత్తరాన్తాత్ = ఉత్తరదిక్ప్రాంతమునుండి, వినిఃసృతా = మహా వేగముతో బయలుదేరిన, సానుబన్ధా చ = నిరంతరత్వముతో కూడిన, ఉల్కా = తేజఃపిండము, ఖే = ఆకాశమునందు, యథా = ఎట్లు, దృశ్యతే = చూడబడునో, సః = ఆ, కపికుఞ్జరః = హనుమంతుడు, తథా = అట్లే కనబడుచుండెను.

తా. ఉత్తరదిక్ప్రాంతమునుండి మహావేగముతో బయలుదేరి, దక్షిణము వైపు పోవుచున్న ఉల్క, వేగాతిశయముచే అతిదీర్ఘముగా, నిరంతరముగా ఉన్నట్లు ఆకాశముమీద ఎట్లు కనబడునో, హనుమంతుడు ఆకాశముపై అట్లే కనబడుచుండెను.

ఏదైన పెద్ద తేజఃపిండము ఆకాశముపై మహావేగముతో పోవు నపుడు అది, కొరవి గుండ్రముగా త్రిప్పినపుడు ఒక అగ్నిచక్రము వలె కనబడి నట్లు, అతి దీర్ఘముగా కనబడును. అట్టి తేజఃపుంజముతో హనుమంతుడు పోల్చబడినాడు.

మూ. పతత్పతఙ్గసంకాశో వ్యాయతః శుశుభే కపిః, 66
ప్రవృద్ధ ఇవ మాతఙ్గః కక్ష్యయా బధ్యమానయా.

ప్ర. అ. పతత్పతఙ్గసంకాశః = శీఘ్రగమనము చేయుచున్న సూర్యునితో సమాను డైన, వ్యాయతః = పొడ వైన, కపిః = హనుమంతుడు, బధ్యమానయా = కట్టబడుచున్న (కట్టబడిన), కక్ష్యయా = నడుముత్రాడుచే, ప్రవృద్ధః = పెరిగిన, మాతఙ్గః ఇవ = ఏనుగు వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. మహావేగముతో ప్రయాణము చేయుచున్న సూర్యుడు వలె ఉన్న ఆ హనుమంతుడు, నడుముకు కట్టిన బంగారు గొలుసుచే పొడ వైనట్లున్న గజము వలె కనబడెను. 66

మూ. ఉపరిష్టాచ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా, 67
సాగరే మారుతావిష్టా నౌరివాసీత్ తదా కపిః.

ప్ర. అ. తదా = అప్పుడు, కపిః = హనుమంతుడు, ఉపరిష్టాత్ = పై భాగమునందు, శరీరేణ = శరీరముతోను, సాగరే = సముద్రమునందు, అత గాధయా = క్రిందికి మునిగిన, ఛాయయా చ = నీడతోను, మారుతావిష్టా = గాలిచేత వ్యాప్తమైన, నౌరివ = నావ వలె, ఆసీత్ = ఉండెను.

తా. హనుమంతుని శరీరము సముద్రము పైన ఆకాశములో ఉండెను. శరీరచ్ఛాయ (నీడ) సముద్రముపై బడెను. ఆ విధముగా ఉన్న హనుమంతుడు గాలికి నడచుచున్న ఓడ వలె కనబడెను. 67

మూ. యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః, 68
స స తస్యోరువేగేన సోన్మాద ఇవ లక్ష్యతే.

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, సముద్రస్య = సముద్రము యొక్క, యం యం దేశం = ఏ యే ప్రదేశమును గూర్చి, జగామ = వెళ్ళెనో, సః సః = ఆ యా ప్రదేశము, తస్య = అతనియొక్క, ఊరువేగేన = తొడల వేగముచేత, సోన్మాదః ఇవ = ఉన్మాదముతో కూడినది వలె, లక్ష్యతే = చూడబడెను.

తా. హనుమంతుడు సముద్రముమీద ఏ యే ప్రదేశము వైపు వెళ్లెనో ఆ యా ప్రదేశము, ఉన్మాదము చెందినది వలె కలత చెందెను. 68

మూ. సాగరస్యోర్మిజాలానామురసా శైలవర్ష్మణామ్, 69
అభిఘ్నంస్తు మహావేగః పుప్లువే స మహాకపిః.

ప్ర. అ. మహావేగః = గొప్ప వేగముగల, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, శైలవర్ష్మణామ్ = పర్వతముల వంటి శరీరము గల, సాగరస్య = సముద్రముయొక్క, ఊర్మిజాలానామ్ = తరంగసముదాయములకు (ను), ఉరసా = వక్షఃస్థలముతో, అభిఘ్నన్ = ఢీకొనుచు, పుప్లువే = ఎగిరెను.

తా. మహావేగముగల ఆ హనుమంతుడు, కొండంత ఎత్తుగా లేచుచున్న సముద్రతరంగములను వక్షఃస్థలముతో ఢీకొనుచు ఎగిరెను. 69

మూ. కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిఃసృతః, 70
సాగరం భీమనిర్ఘోషం కమ్పయామాసతుర్భృశమ్.

ప్ర. అ. బలవాన్ = బలము గల, కపివాతశ్చ = హనుమంతునివలన పుట్టిన వాయువు, నిఃసృతః = బయలువెడలిన, మేఘవాతశ్చ = మేఘముల వాయువు, భీమనిర్ఘోషమ్ = భయంకర మైన ధ్వని గల, సాగరమ్ = సముద్రమును, భృశమ్ = మిక్కిలి, కమ్పయామాసతుః = కంపింపచేసినవి.

తా. మంచి బలముతో బయలుదేరిన హనుమంతుని గాలి, మేఘముల గాలి, భయంకర మైన ధ్వని కలుగు నట్లు సముద్రమును కంపింపచేసినవి.

మూ. వికర్షన్నూర్మిజాలాని బృహన్తి లవణామ్భసి, 71
పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ.

ప్ర. అ. కపిశార్దూలః = హనుమంతుడు, లవణామ్భసి = లవణసముద్రమునందు, బృహన్తి = పెద్ద వైన, ఊర్మిజాలాని = తరంగపంక్తులను, వికర్షన్ = లాగికొనిపోవుచు, రోదసీ = భూమ్యాకాశములను, వికిరన్నివ = చిమ్ముచున్నవాడు వలె, పుప్లువే = ఎగిరెను.

తా. హనుమంతుడు, లవణసముద్రములోని పెద్ద పెద్ద తరంగములను తనతో లాగికొనిపోవుచు, వాటిని భూమ్యాకాశముల మధ్య అంతటా చిమ్ముచున్నట్లు ఉండెను. 71

మూ. మేరుమన్దరసంకాశానుద్ధతాన్ స మహార్ణవే, 72
అత్యక్రామన్మహావేగస్తరఙ్గాన్ గణయన్నివ.

ప్ర. అ. మహావేగః = గొప్ప వేగము గల హనుమంతుడు, మహార్ణవే = మహాసముద్రమునందు, ఉద్ధతాన్ = పైకి ఎగిరిన, మేరుమన్దరసంకాశాన్ = మేరుమందరపర్వతములతో సమానము లైన, తరఙ్గాన్ = తరంగములను, గణయన్నివ = లెక్కపెట్టుచున్నవాడు వలె, అత్యక్రామత్ = దాటి వెళ్లెను.

తా. మహావేగవంతు డైన ఆ హనుమంతుడు, మహాసముద్రములో లేచుచున్న మేరుమందరపర్వతములతో సమానము లైన తరంగములను లెక్కపెట్టుచున్నాడా అన్నట్లు, వాటిని దాటుచు వెళ్ళెను. 72

మూ. తస్య వేగసముద్ధూతం జలం సజలదం తదా, 73
అమ్బరస్థం విబభ్రాజ శారదాభ్రమివాతతమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, తస్య = హనుమంతునియొక్క, వేగసము ద్ధూతమ్ = వేగముచేత ఎగురగొట్టబడిన, సజలదమ్ = మేఘముతో కూడిన, జలమ్ = జలము. అమ్బరస్థమ్ = ఆకాశమునం దున్నదై, ఆతతమ్ = వ్యాప్త మైన, శారదాభ్రమివ = శరత్కాలపు మేఘము వలె, విబభ్రాజ = ప్రకాశించెను.

తా. అప్పుడు, హనుమంతుని వేగముచేత పైకి ఎగిరి, మేఘముతో కూడిన జలము, ఆకాశముపై వ్యాపించిన శరత్కాలపు మేఘము వలె ప్రకా శించెను. 73

మూ. తిమినక్రఝషాః కూర్మా దృశ్యన్తే వివృతాస్తదా, 74
వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్.

ప్ర. అ. తదా = అప్పుడు. తిమినక్రఝషాః = తిములు (పెద్ద చేపలు), మొసళ్లు, చేపలు, తాబేళ్లు, వస్త్రాపకర్షణేన = వస్త్రములను తొలగించుటచేత, శరీరిణామ్ = మానవులయొక్క, శరీరాణీవ = శరీరములు వలె. వివృతాః = వివృతములై, దృశ్యన్తే = కనబడుచున్నవి.

తా. సముద్రజలము పైకి ఎగిరిపోవుటచే సముద్రములో ఉన్న తిములూ, మొసళ్లూ, చేపలూ, తాబేళ్లూ, వస్త్రమును లాగివేసినచో మానవుల అవయవము లన్నీ స్పష్టంగా కనబడి నట్లు కనబడినవి 74

మూ. ప్లవమానం సమీక్ష్యాథ భుజఙ్గాః సాగరాలయాః, 75
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, వ్యోమ్ని = ఆకాశమునందు, ప్లవమానమ్ = ఎగురుచున్న, తం కపిశార్దూలమ్ = ఆ హనుమంతుని, సమీక్ష్య = చూచి, సాగరాలయాః = సముద్రమునందు నివాసము గల, భుజఙ్గాః = సర్పములు, సుపర్ణః ఇతి = గరుత్మంతుడు అని, మేనిరే = తలచినవి.

తా. సముద్రములో నివసించు సర్పములు, ఆకాశము మీద ఎగురుచున్న ఆ హనుమంతుని చూచి, గరుత్మంతు డేమో అని అనుకొనెను. 75

మూ. దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజనమాయతా, 76
ఛాయా వానరసింహస్య జలే చారుతరాభవత్.

ప్ర. అ. దశయోజనవిస్తీర్ణా=పది యోజనముల వెడల్పు కలదీ, త్రింశద్యోజనమ్=ముప్పది యోజనములు, ఆయతా=పొడవూ అయిన, వానరసింహస్య=హనుమంతునియొక్క, ఛాయా=నీడ, జలే=నీటిమీద, చారుతరా=చాల అందమైనదీ, అభవత్=అయెను.

తా. జలముమీద ఆ హనుమంతుని, పది యోజనముల వెడల్పు, ముప్పది యోజనముల పొడవు అయిన నీడ, చక్కగా ఉండెను. 76

మూ. శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్రానుగామినీ, 77
తస్య సా శుశుభే ఛాయా వితతా లవణామ్భసి.

ప్ర. అ. వాయుపుత్రానుగామినీ=హనుమంతుని అనుసరించి వెళ్లుచున్నదీ, లవణామ్భసి=లవణసముద్రమునందు, వితతా=వ్యాపించినదీ అయిన, తస్య=అతనియొక్క, సా=ఆ, ఛాయా=నీడ, శ్వేతాభ్రఘనరాజీవ=తెల్లని మేఘముల దట్టమైన పంక్తి వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. సముద్రముమీద విస్తరించి హనుమంతుని అనుసరించి ప్రయాణము చేయుచున్న అతని నీడ దట్టమైన తెల్లని మేఘాల పంక్తి వలె ప్రకాశించెను.

మూ. శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః, 78
వాయుమార్గే నిరాలమ్బే పక్షవానివ పర్వతః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడూ, మహాకాయః=గొప్ప శరీరము కలవాడూ అయిన, సః=ఆ, మహాకపిః=హనుమంతుడు, నిరాలమ్బే=ఆధారము లేని, వాయుమార్గే=వాయుమార్గమునందు, పక్షవాన్=రెక్కలు గల, పర్వతః ఇవ=పర్వతము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. గొప్ప తేజస్సూ, పెద్ద శరీరమూ గల హనుమంతుడు, ఆధారమేదియు లేని వాయుమార్గమునందు, రెక్కలు గల పర్వతము వలె ప్రకాశించెను. 78

మూ. యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపికుఞ్జరః, 79
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః.

ప్ర. అ. బలవాన్ = బలవంతు డైన, అసౌ = ఈ, కపికుఞ్జరః = హనుమంతుడు, వేగేన = వేగముతో, యేన మార్గేణ = ఏ మార్గముచే, యాతి = వెళ్ళుచుండెనో, తేన = ఆ మార్గముచేత, సహసా = వెంటనే, అర్ణవః = సముద్రము, స్రోతీకృతః ఇవ = తోట్టగా చేయబడిన ట్లుండెను.

తా. మహాబలశాలి యైన ఆ హనుమంతుడు ఏ మార్గమున ఎగురుచుండెనో ఆ మార్గమునందు సముద్రము తొట్టి వలె ఏర్పరుచుండెను. 79

మూ. ఆపాతే పక్షిసంఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్, 80
హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా.

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, మారుతో యథా = వాయువు వలె, మేఘజాలాని = మేఘపంక్తులను, ప్రకర్షన్ = లాగుచు, పక్షిసంఘానామ్ = పక్షిసముదాయముల, ఆపాతే = సంచారప్రదేశ మైన ఆకాశమునందు, వ్రజన్ = వెళ్ళుచు, పక్షిరాజః ఇవ = గరుత్మంతుడు వలె ప్రకాశించెను.

తా. హనుమంతుడు వాయువు వలె మేఘపంక్తులను తనతో లాగికొని పోవుచు, పక్షిమార్గమునందు వెళ్ళుచు, గరుత్మంతుడు వలె ప్రకాశించెను.

మూ. పాణ్డురారుణవర్ణాని నీలమాఞ్జిష్ఠకాని చ, 81
కపినాకృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే.

ప్ర. అ. కపినా = హనుమంతునిచేత, ఆకృష్యమాణాని = లాగబడుచున్న, పాణ్డురారుణవర్ణాని = తెల్లని ఎఱ్ఱని రంగులు గలవి, నీలమాఞ్జిష్ఠకాని చ = నల్లని పచ్చని రంగు కలవి అయిన, మహాభ్రాణి = గొప్ప మేఘములు, చకాశిరే = ప్రకాశించినవి.

తా. తెల్లరంగు, ఎఱ్ఱరంగు, నల్లరంగు, పచ్చరంగు గల పెద్ద పెద్ద మేఘములను హనుమంతుడు తన వెంట లాగికొని పోవుచుండగా చూచుటకు ముచ్చటగా నుండెను. 81

మూ. ప్రవిశన్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః, 82
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చన్ద్రమా ఇవ లక్ష్యతే.

ప్ర. అ. అభ్రజాలాని=మేఘసమూహమును, పునః పునః=మాటిమాటికి, ప్రవిశన్=ప్రవేశించుచున్నవాడూ, నిష్పతంశ్చ=బైటకు వచ్చుచున్నవాడూ అయిన ఆ హనుమంతుడు, ప్రచ్ఛన్నశ్చ=కప్పబడుచున్నవాడూ, ప్రకాశశ్చ=పైకి కనబడుచున్నవాడూ అయిన, చన్ద్రమాః ఇవ=చంద్రుడు వలె, లక్ష్యతే=చూడబడుచున్నాడు.

తా. మాటి మాటికి మేఘం వెనుకకు వెళ్ళుచూ, బైటకు వచ్చుచూ ప్రయాణం చేయుచున్న హనుమంతుడు, మేఘం వెనుక దాగుచూ, పైకి కన బడుచూ ఉన్న చంద్రుడు వలె ప్రకాశించెను. 82

మూ. ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవఙ్గం త్వరితం తదా, 83
వవర్షుః పుష్పవర్షాణి దేవగన్ధర్వదానవాః.

ప్ర. అ. తదా=అప్పుడు, త్వరితమ్=తొందరగా, ప్లవమానమ్=ఎగురుచున్న, తం ప్లవఙ్గమ్=ఆ హనుమంతుని, దృష్ట్వా=చూచి, దేవగన్ధర్వదానవాః=దేవతలూ, గంధర్వులూ, దానవులూ, పుష్పవర్షాణి=పుష్పవర్షమును, వవర్షుః=వర్షించిరి.

తా. అప్పుడు శీఘ్రముగా ఎగిరి వెళ్ళుచున్న హనుమంతుని చూచి, దేవతలూ, గంధర్వులూ, దానవులూ అతనిపై పుష్పవర్షము కురిపించిరి. 83

మూ. తతాప న హి తం సూర్యః ప్లవన్తం వానరోత్తమమ్. 84
సిషేవే చ తదా వాయూ రామకార్యార్థసిద్ధయే,

ప్ర. అ. తదా=అప్పుడు, ప్లవన్తమ్=ఎగురుచున్న, తం వానరోత్తమమ్=ఆ హనుమంతుని, సూర్యః=సూర్యుడు, రామకార్యార్థసిద్ధయే=రాముని కార్యమను ప్రయోజనము సిద్ధించుటకై, న హి తతాప=తపింపచేయలేదు. వాయుః చ=వాయువు కూడ, సిషేవే=సేవించెను.

తా. ఆకాశమార్గమునందు ప్రయాణము చేయుచున్న ఆ హనుమంతునకు సూర్యుడు వేడి కలుగకుండు నట్లు చూచెను. వాయువు కూడా సుఖకరముగా వీచెను. రాముని కార్యము సిద్ధింపవలె నను ఉద్దేశ్యముతో వారు అట్లు చేసిరి.

మూ. ఋషయస్తుష్టువుశ్చైవ ప్లవమానం విహాయసా, 85
జగుశ్చ దేవగన్ధర్వాః ప్రశంసన్తో మహౌజసమ్.

ప్ర. అ. విహాయసా=ఆకాశముచేత (నందు), ప్లవమానమ్ = ఎగురు చున్న, మహౌజసమ్ = గొప్ప తేజస్సు గల ఆ హనుమంతుని. ఋషయః= ఋషులు, తుష్టువుశ్చైవ=స్తుతించిరి. దేవగన్ధర్వాః=దేవతలూ, గంధర్వులూ, ప్రశంసన్తః=ప్రశంసించుచు, జగుశ్చ=గానము కూడ చేసిరి.

తా. ఆకాశమార్గమునందు ప్రయాణము చేయుచున్న ఆ మహాతేజశ్శాలి యైన హనుమంతుని చూచి ఋషీశ్వరులు స్తుతించిరి. దేవతలూ, గంధర్వులూ, ఆతని పరాక్రమమును ప్రశంసించుచు గానము చేసిరి. 85

మూ. నాగాశ్చ తుష్టువుర్యక్షా రక్షాంసి విబుధాః ఖగాః. 86
ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్,

ప్ర. అ. విగతక్లమమ్=పోయిన శ్రమ గల (శ్రమయే లేని), కపివరమ్= హనుమంతుని, ప్రేక్ష్య=చూచి, సహసా=వెంటనే, నాగాశ్చ=నాగులు, యక్షాః =యక్షులు, రక్షాంసి=రాక్షసులు, విబుధాః=దేవతలు, ఖగాః=పక్షులు, సర్వే= అందరూ, తుష్టువుః = స్తుతించిరి.

తా. ఏ మాత్రము శ్రమ లేకుండ ఆకాశమునందు ప్రయాణము చేయు చున్న హనుమంతుని చూచిన వెంటనే, ఆశ్చర్యముతో, నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు, పక్షులూ అందరూ కొనియాడిరి. 86

మూ. తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి, 87
ఇక్ష్వాకుకులమానార్థీ చిన్తయామాస సాగరః.

ప్ర. అ. ప్లవగశార్దూలే= వానరశ్రేష్ఠుడైన, తస్మిన్ హనూమతి = ఆ హనుమంతుడు, ప్లవమానే = ఎగురుచుండగా, సాగరః = సముద్రము, ఇక్ష్వాకు కులమానార్థీ= ఇక్ష్వాకువంశమునకు గౌరవము చేయవలె నని కోరుచు, చిన్తయా మాస= ఆలోచించెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతు డీ విధముగా ఆకాశమార్గమున ప్రయాణము చేయుచుండగా చూచిన సముద్రుడు ఇక్ష్వాకువంశము నకు సత్కా రము చేయవలె నను ఉద్దేశ్యముతో ఇట్లు తలచెను. 88

మూ. సాహాయ్యం వానరేన్ద్రస్య యది నాహం హనూమతః,
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్.

ప్ర. అ. అహమ్ = నేను, వానరేన్ద్రస్య = వానరశ్రేష్ఠు డైన, హనూమతః = హనుమంతునకు, సాహాయ్యమ్ = సాహాయ్యమును, న కరిష్యామి యది = చేయకపోయినట్లయితే, వివక్షతామ్ = మాటలాడ దలచుకొనువారికి అనగా నా దోషములను ఎత్తి చూపదలచినవారికి, సర్వవాచ్యః = అన్నివిధాలా నిందింప దగినవాడను, భవిష్యామి = ఆగుదును.

తా. వానరశ్రేష్ఠు డైన ఈ హనుమంతున కిపుడు సాహాయ్యము చేయనిచో నన్ను తప్పు పట్టదలచిన వారికి అన్ని విధాలా అవకాశము కల్పించిన వాడను అగుదును. 88

మూ. అహమిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః. 89
ఇక్ష్వాకుసచివశ్చాయం నావసీదితుమర్హతి.

ప్ర. అ. అహమ్ = నేను, ఇక్ష్వాకునాథేన = ఇక్ష్వాకువంశప్రభు వైన, సగరేణ = సగరునిచేత, వివర్ధితః = పెంచబడితిని. ఇక్ష్వాకుసచివః చ = ఆ ఇక్ష్వాకు వంశీయునకు సాహాయ్యము చేయుచున్న, అయమ్ = ఇతడు, అవసీదితుమ్ = శ్రమచే క్షీణించుటకు, నార్హతి = తగడు.

తా. ఇక్ష్వాకువంశమునకు చెందిన సగరచక్రవర్తి నన్ను వృద్ధి పొందించి నాడు కదా! ఆ ఇక్ష్వాకువంశమునకే చెందిన రామునకు సాహాయ్యము చేయు చున్న ఈ హనుమంతుడు అలసటచే క్షీణించుట యుక్తము కాదు.

మూ. తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః, 90
శేషం చ మయి విశ్రాన్తః సుఖేనాతిపతిష్యతి.

ప్ర. అ. కపిః = హనుమంతుడు, యథా = ఎట్లు, విశ్రమేత = విశ్రమించునో, తథా = అట్లు, మయా = నాచేత, విధాతవ్యమ్ = చేయదగియున్నది. మయి = నాయందు, విశ్రాన్తః = విశ్రమించినవాడై, శేషమ్ = మిగిలిన దూరమును, సుఖేన = సుఖముగా, అతిపతిష్యతి = దాటగలడు.

తా. ఈ హనుమంతుడు నా మీద కొంత సేపు విశ్రమించునట్లు నేను చేయవలెను. కొంచెము విశ్రమించిన తరువాత మిగిలిన దూరమును సుఖముగా, దాటగలడు. 90

మూ. ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్రశ్ఛన్నమమ్భసి, 91
హిరణ్యనాభం మైనాకమువాచ గిరిసత్తమమ్.

ప్ర. అ. సముద్రః = సముద్రుడు, ఇతి = ఇట్లు, సాధ్వీమ్ = మంచి, మతిమ్ = ఆలోచనను, కృత్వా = చేసి, అమ్భసి = ఉదకమునందు, ఛన్నమ్ = కప్పబడియున్న, హిరణ్యనాభమ్ = బంగారము మధ్యప్రదేశమునందు గల, గిరిసత్తమమ్ = పర్వతశ్రేష్ఠమైన, మైనాకమ్ = మైనాకమును గూర్చి, ఉవాచ = పలికెను.

తా. సముద్రుడీ విధముగా మంచి ఆలోచన చేసి, తన జలములో మునిగియున్న, మధ్యప్రదేశమునందు అంతటా బంగారముతో నిండిన, మైనాకమను పర్వతశ్రేష్ఠముతో ఇట్లు పలికెను. 91

మూ. త్వమిహాసురసంఘానాం పాతాళతలవాసినామ్, 92
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘః సంనివేశితః.

ప్ర. అ. గిరిశ్రేష్ఠ = ఓ! పర్వతశ్రేష్ఠమా! త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడ, పాతాళతలవాసినామ్ = పాతాళమునందు నివసించుచున్న, అసురసంఘానామ్ = అసురుల సముదాయమునకు, పరిఘః = గడియగా, దేవరాజ్ఞా = దేవేంద్రుని చేత, సంనివేశితః = ఉంచబడితివి.

తా. ఓ పర్వతశ్రేష్ఠమా! పాతాళములో నివసించు అసురులు పైకి రాకుండా అడ్డుకొనుటకై నిన్ను దేవేంద్రుడు ఇక్కడ, ఒక పెద్ద అడ్డగడియగా ఉంచినాడు. 92

మూ. త్వమేషాం జాతవీర్యాణాం పునరేవోత్పతిష్యతామ్, 93
పాతాళస్యాప్రమేయస్య ద్వారమావృత్య తిష్ఠసి.

ప్ర. అ. జాతవీర్యాణామ్ = పుట్టిన పరాక్రమము గల, ఏషామ్ = ఈ అసురులు, పునరేవ = మరల, ఉత్పతిష్యతామ్ = లేవదలయుచుండగా, త్వమ్ = నీవు, అప్రమేయస్య = కొలుచుటకు శక్యము కాని, పాతాళస్య = పాతాళము యొక్క, ద్వారమ్ = ద్వారమును, ఆవృత్య = ఆవరించి, తిష్ఠసి = ఉంటున్నావు.

తా. ఈ అసురులు పరాక్రమము పెంపొందించుకొని మరల పైకి రావల

నని ప్రయత్నించి నపుడు, నీవు అతివేగాల మైన పాతాళలోకము ద్వారమును మూసివేసి నిలచుచున్నావు. 93

మూ. తిర్యగూర్ధ్వమధశ్చైవ శక్తిస్తే శైల వర్ధితుమ్, 94
తస్మాత్సంచోదయామి త్వాముత్తిష్ఠ గిరిసత్తమ.

ప్ర. అ. శైల = ఓ పర్వతమా! తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వమ్ = పైకి, అధశ్చైవ = క్రిందికి, వర్ధితుమ్ = వృద్ధి పొందుటకు, తే = నీకు, శక్తిః = శక్తి ఉన్నది. గిరిసత్తమ = ఓ గిరిశ్రేష్ఠమా! తస్మాత్ = ఆ కారణమువలన, త్వామ్ = నిన్ను, సంచోదయామి = ప్రేరేపించుచున్నాను. ఉత్తిష్ఠ = లెమ్ము.

తా. ఓ పర్వతశ్రేష్ఠమా! అడ్డముగానూ, పైకీ, క్రిందికీ పెరిగే శక్తి నీకున్నది. అందుచేతనే నిన్ను ప్రేరేపించుచున్నాను. లెమ్ము. 94

మూ. స ఏష కపిశార్దూలస్త్వాముపర్యేతి వీర్యవాన్, 95
హనూమాన్రామకార్యార్థం భీమకర్మా ఖమాప్లుతః.

ప్ర. అ. కపిశార్దూలః = వానరులలో శ్రేష్ఠుడూ, వీర్యవాన్ = పరాక్రమవంతుడూ, భీమకర్మా = భయంకర మైన కర్మ కలవాడూ, అయిన, సః ఏషః = అట్టి ఈ, హనూమాన్ = హనుమంతుడు, రామకార్యార్థమ్ = రాముని పని నిమిత్తమై, ఖమ్ = ఆకాశమును (పై), ఆప్లుతః = ఎగురుచున్నవాడై, త్వామ్ ఉపరి = నీ మీదుగా, ఏతి = వచ్చుచున్నాడు.

తా. వానరశ్రేష్ఠుడూ, భయంకర మైన పని చేయగలవాడూ, పరాక్రమశాలి అయిన ఈ హనుమంతుడు, రాముని పనిమీద, ఆకాశములో ఎగురుచు, నీ మీదుగా వచ్చుచున్నాడు 95

మూ. అస్య సాహ్యం మయా కార్యమిక్ష్వాకుకులవర్తినః, 96
మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమాస్తవ.

ప్ర. అ. అస్య = ఇప్పుడు, ఇక్ష్వాకుకులవర్తినః = ఇక్ష్వాకుకులమును అనుసరించి ప్రవర్తించుచున్న, అస్య = ఇతనికి, మయా = నాచేత, సాహ్యమ్ = సాహాయ్యము, కార్యమ్ = చేయదగినది. మమ = నాకు, ఇక్ష్వాకవః = ఇక్ష్వాకు

వంశీయులు, పూజ్యాః = పూజింపదగినవారు. తవ = నీకు, పూజ్యతమాః = అధికముగా పూజ్యులు.

తా. ఇప్పుడు, ఇక్ష్వాకువంశమునకు చెందిన రాముని పనిమీద వెళ్లుచున్న ఇతనికి, నేను సాహాయ్యము చేయవలెను. ఎందుచేత ననగా నాకు ఇక్ష్వాకు వంశీయులు పూజ్యులు. నీకు అంతకంటెను పూజ్యులు. 96

మూ. కురు సాచివ్యమస్మాకం న నః కార్యమతిక్రమేత్, 97
కర్తవ్యమకృతం కార్యం సతాం మన్యుముదీరయేత్.

ప్ర. అ. అస్మాకమ్ = మాకు, సాచివ్యమ్ = సాహాయ్యమును, కురు = చేయుము. నః = మాయొక్క, కార్యమ్ = కార్యము, న అతిక్రమేత్ = దాటి పోకుండు గాక. కర్తవ్యమ్ = చేయదగిన, కార్యమ్ = కార్యము, అకృతమ్ = చేయబడనిదై, సతామ్ = సత్పురుషులయొక్క, మన్యుమ్ = కోపమును, ఉదీరయేత్ = పెంచును.

తా. మాకు సాహాయ్యము చేయుము. మా పని దాటిపోకుండు నట్లు చూడుము. చేయవలసినపని చేయకున్నచో సత్పురుషులకు కోపము కలిగించును.

మూ. సలిలాదూర్ధ్వముత్తిష్ఠ తిష్ఠత్వేష కపిస్త్వయి, 98
అస్మాకమతిథిశ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః.

ప్ర. అ. సలిలాత్ = ఉదకమునుండి, ఊర్ధ్వమ్ = పైకి, ఉత్తిష్ఠ = లెమ్ము. అస్మాకమ్ = మనకు, అతిథిశ్చైవ = అతిథీ, పూజ్యశ్చ = పూజింప దగినవాడూ, ప్లవతామ్ = ఎగిరేవారిలో, వరః = శ్రేష్ఠుడూ అయిన, ఏషః కపిః = ఈ హను మంతుడు, త్వయి = నీమీద, తిష్ఠతు = నిలచుగాక.

తా. మన పూజ్యుడైన అతిథీ, ఎగరగలిగినవారిలో శ్రేష్ఠుడూ అయిన ఈ హనుమంతుడు నీమీద నిలచుటకు వీలగు నట్లు ఉదకమునుండి పైకి లెమ్ము.

మూ. చామీకరమహానాభ దేవగన్ధర్వసేవిత, 99
హనుమాంస్త్వయి విశ్రాన్తస్తతః శేషం గమిష్యతి.

ప్ర. అ. చామీకరమహానాభ = బంగారువికారమైన విశాలమైన మధ్య భాగము గలవాడా! దేవగన్ధర్వసేవిత = దేవతలచేతను గంధర్వులచేతను సేవింప

బడినవాడా । హనుమాన్ = హనుమంతుడు, త్వయి = నీపై, విశ్రాన్తః = విశ్ర మించిన వాడై, తతః = అటుపిమ్మట, శేషమ్ = మిగిలిన మార్గమును, గమిష్యతి = వెళ్లగలడు.

తా. సువర్ణమయ మైన విశాలమధ్యప్రదేశము గలవాడా! దేవగంధర్వా దులచేత సేవింపబడినవాడా । హనుమంతుడు నీపై కొంత సేపు విశ్రమించి, పిమ్మట, మిగిలిన దూరము ప్రయాణము చేయగలడు. 99

మూ. కాకుత్స్థస్యానృశంస్యం చ మైథిల్యాశ్చ వివాసనమ్,
శ్రమం చ ప్లవగేన్ద్రస్య సమీక్ష్యోత్థాతుమర్హసి.

ప్ర. అ. కాకుత్స్థస్య = రామునియొక్క, అనృశంస్యం చ = సాధుత్వమును, మైథిల్యాః = సీతయొక్క, వివాసనం చ = విదేశవాసమును, ప్లవగేన్ద్రస్య = హనుమంతునియొక్క, శ్రమం చ = శ్రమను, సమీక్ష్య = చూచి, ఉత్థాతుమ్ = లేచుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. రాముని సాధుత్వమును, సీత కష్టములలో ఉన్న దను విషయమును, హనుమంతుని అలసటను దృష్టిలో నుంచుకొని పైకి లెమ్ము. 100

మూ. హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణామ్భసః, 101
ఉత్పపాత జలాత్తూర్ణం మహాద్రుమలతాయుతః.

ప్ర. అ. హిరణ్యనాభః = బంగారము మధ్యభాగమునందు గల, మైనాకః = మైనాకము, లవణామ్భసః = లవణసముద్రముయొక్క వాక్యమును, నిశమ్య = విని, మహాద్రుమలతాయుతః = గొప్ప వృక్షములతోను, లతలతోను కూడిన వాడై, తూర్ణమ్ = శీఘ్రముగా, జలాత్ = జలమునుండి, ఉత్పపాత = పైకి ఎగిరెను.

తా. బంగారు మధ్య భాగము గల ఆ మైనాకము, సముద్రుని మాటలు విని, మహావృక్షలతాదులతో కూడ, వెంటనే, పైకి లేచెను. 101

మూ. స సాగరజలం భిత్త్వా బభూవాభ్యుత్థితస్తదా, 102
యథా జలధరం భిత్త్వా దీప్తరశ్మిర్దివాకరః.

ప్ర. అ. తదా = అప్పుడు, సః = ఆ మైనాకము, సాగరజలమ్ = సముద్ర జలమును, భిత్త్వా = భేదించుకొని, దీప్తరశ్మిః = ప్రకాశించుచున్న కిరణములు గల, దివాకరః = సూర్యుడు, జలధరమ్ = మేఘమును, భిత్త్వా = భేదించుకొని, యథా = ఏట్లో అట్లు, అభ్యుత్థితః = పైకి లేచినవాడు, బభూవ = అయెను.

తా. అప్పుడా మైనాకపర్వతము, ప్రకాశించుచున్న కిరణములు గల సూర్యుడు మేఘమండలమును భేదించుకొని పైకి వచ్చినట్లు సముద్రజలమును చేదించుకొని పైకి వచ్చెను. 102

మూ. స మహాత్మా ముహూర్తేన సర్వతః సలిలావృతః, 103
దర్శయామాస శృఙ్గాణి సాగరేణ నియోజితః,
శాతకుమ్భమయైః శృఙ్గైః సకిన్నరమహోరగైః, 104
ఆదిత్యోదయసంకాశైరాలిఖద్భిరివామ్బరమ్.

ప్ర. అ. సకిన్నరమహోరగైః = కిన్నరులతోను మహాసర్పములతోను కూడినవీ, ఆదిత్యోదయసంకాశైః = సూర్యోదయముతో సమానములూ, అమ్బరమ్ = ఆకాశమును, ఆలిఖద్భిః ఇవ = ఒరయుచున్నట్లు ఉన్నవీ, శాతకుమ్భమయైః = బంగారు వికారమైనవీ అయిన, శృఙ్గైః = శిఖరములతో కూడినవాడూ, సర్వతః = అన్ని వైపులా, సలిలావృతః = నీటిచే కప్పబడినవాడూ అయిన, సః మహాత్మా = ఆ మహాత్ముడు, సాగరేణ = సముద్రముచేత, నియోజితః = ఆజ్ఞాపింపబడిన వాడై, ముహూర్తేన = క్షణకాలములో, శృఙ్గాణి = శిఖరములను, దర్శయామాస = చూపించెను.

తా. గొప్ప బుద్ధి కల ఆ మైనాకపర్వతము సముద్రుని కోరికను అనుసరించి, వెంటనే తన శిఖరములను జలము పైకి వచ్చునట్లు చేసెను. ఆ పర్వతము అన్ని ప్రక్కలా సముద్రజలముతో నిండి యుండెను. ఆకాశమును ఒరయుచున్నట్లున్న ఆ బంగారు శిఖరములు ఉదయించుచున్న సూర్యుడు వలె ప్రకాశించుచుండెను. వాటిపై కింనరులు, మహోరగులు మొదలైన వారు నివసించుచుండిరి. 103, 104

మూ. తప్తజామ్బూనదైః శృఙ్గైః పర్వతస్య సముత్థితైః, 105
ఆకాశం శస్త్రసంకాశమభవత్కాఞ్చనప్రభమ్.

ప్ర. అ. సముత్థితైః = పైకి లేచిన, తప్తజామ్బూనదైః = కరిగిన బంగారము

వలె ఉన్న, పర్వతస్య=పర్వతముయొక్క, శృఙ్గైః=శిఖరముచేత, శస్త్రసంకాశమ్=ఖడ్గము వలె నీలవర్ణమైన, ఆకాశమ్=ఆకాశము, కాఞ్చనప్రభమ్=బంగారము కాంతి కలది, అభవత్=ఆయెను.

తా. పైకి లేచిన ఆ పర్వతశిఖరములు కరిగించిన బంగారము వలె మెరయుచుండుటచే ఇనుము వలె నీలవర్ణముగా ఉన్న ఆకాశము బంగారు కాంతితో ప్రకాశించెను. 105

మూ. జాతరూపమయైః శృఙ్గైర్భ్రాజమానైః స్వయంప్రభైః, 106
ఆదిత్యశతసంకాశః సోఽభవద్గిరిసత్తమః.

ప్ర. అ. స్వయంప్రభైః=స్వయముగానే కాంతి కలవై, భ్రాజమానైః=ప్రకాశించుచున్న, జాతరూపమయైః=బంగారు వికారమైన, శృఙ్గైః=శిఖరములతో, సః=ఆ, గిరిసత్తమః=పర్వతశ్రేష్ఠము, ఆదిత్యశతసంకాశః=వందలకొలది సూర్యులతో సమానము, అభవత్=ఆయెను.

తా. సహజమైన కాంతితో ప్రకాశించుచున్న బంగారు శిఖరములతో ఆ పర్వతము వందలకొలది సూర్యులతో సమానముగా ఉండెను. 106

మూ. తముత్థితమసంగేన హనుమానగ్రతః స్థితమ్, 107
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయమితి నిశ్చితః.

ప్ర. అ. లవణతోయస్య=లవణసముద్రముయొక్క, మధ్యే=మధ్యయందు, అసంగేన=సంబంధ మేదియు లేకుండగా (హటాత్తుగా), ఉత్థితమ్=లేచిన, అగ్రతః=తన ఎదుట నిలచిన, తమ్=ఆ పర్వతమును, హనుమాన్=హనుమంతుడు, అయమ్=ఇది, విఘ్నః ఇతి=విఘ్నము అని, నిశ్చితః=నిశ్చయించుకొనెను.

తా. హటాత్తుగా లవణసముద్రమునుండి లేచి తన ఎదుట నిలచిన ఆ పర్వతము తనకు విఘ్నము కలిగించుటకు వచ్చిన దని హనుమంతుడు నిశ్చయించుకొనెను. 107

మూ. స తముచ్ఛ్రితమత్యర్థం మహావేగో మహాకపిః, 108
ఉరసా పాతయామాస జీమూతమివ మారుతః.

ప్ర. అ. మహావేగః = గొప్ప వేగము గల, సః మహాకపిః = ఆ హనుమంతుడు, అత్యర్థమ్ = మిక్కిలి, ఉచ్ఛ్రితమ్ = ఉన్నత మైన, తమ్ = ఆ పర్వతమును, మారుతః = వాయువు, జీమూతమివ = మేఘమును వలె, ఉరసా = వక్షఃస్థలముచేత, పాతయామాస = పడద్రోసెను.

తా. మహావేగము గల ఆ హనుమంతుడు, చాల ఉన్నత మైన ఆ పర్వతమును, వాయువు మేఘమును పడగొట్టినట్లు, వక్షఃస్థలముతో తీకొని క్రిందికి పడగొట్టెను. 108

మూ. స తదా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః. 109
బుద్ధ్వా తస్య కపేర్వేగం జహర్ష చ ననన్ద చ.

ప్ర. అ. తేన కపినా = ఆ హనుమంతునిచేత, తదా = అట్లు, పాతితః = పడగొట్టబడిన, సః పర్వతోత్తమః = ఆ పర్వతశ్రేష్ఠము, తస్య కపేః = ఆ హనుమంతునియొక్క, వేగమ్ = వేగమును, బుద్ధ్వా = తెలిసికొని, జహర్ష చ = హర్షించెను, ననన్ద చ = ఆనందించెను.

తా. హనుమంతు డా విధముగా క్రిందికి పడద్రోయగా, ఆ పర్వతము హనుమంతున కున్న వేగమును గుర్తించి చాల సంతోషించెను. 109

మూ. తమాకాశగతం వీరమాకాశే సముపస్థితః. 110
ప్రీతో హృష్టమనా వాక్యమబ్రవీ త్పర్వతః కపిమ్.
మానుషం ధారయన్ రూపమాత్మనః శిఖరే స్థితః. 111

ప్ర. అ. పర్వతః = మైనాకపర్వతము, ప్రీతః = ప్రేమ కలదై, హృష్టమనాః = సంతోషించిన మనస్సు కలదై, మానుషమ్ = మనుష్యసంబంధ మైన, రూపమ్ = రూపమును, ధారయన్ = ధరించుచు, ఆత్మనః = తనయొక్క, శిఖరే = శిఖరమునందు, స్థితః = నిలచినదై, ఆకాశగతమ్ = ఆకాశములో ఉన్న, తం వీరం కపిమ్ = ఆ వీరుడైన హనుమంతుని, ఆకాశే = ఆకాశమునందు, సముపస్థితః = సమీపించినదై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ మైనాకపర్వతము ప్రేమతో, చాల సంతోషించిన మనస్సు కలదై మనుష్యరూపముతో తన శిఖరముమీద నిలచి, ఆకాశమునం దున్న వీరు డైన ఆ హనుమంతుని దగ్గరకు వెళ్ళి ఇట్లు పలికెను. 110, 111

మూ. దుష్కరం కృతవాన్కర్మ త్వమిదం వానరోత్తమ,
నిపత్య మమ శృఙ్గేషు విశ్రమస్వ యథాసుఖమ్. 112

ప్ర. అ. వానరోత్తమ = ఓ వానరశ్రేష్ఠుడా, త్వమ్ = నీవు, దుష్కరమ్ = చేయ శక్యము కాని, ఇదమ్ = ఈ, కర్మ = పనిని, కృతవాన్ = చేసినావు. మమ = నాయొక్క, శృఙ్గేషు = శిఖరములపై, నిపత్య = దిగి, యథాసుఖమ్ = సుఖము కలుగు నట్లుగా, విశ్రమస్వ = విశ్రమింపుము.

తా. వానరోత్తమా! నీవు ఎవ్వరూ చేయజాలని పని చేసినావు. నా శిఖరములపై సుఖముగా విశ్రమింపుము. 112

మూ. రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః,
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః 113

ప్ర. అ. ఉదధిః = సముద్రము, రాఘవస్య = రామునియొక్క, కులే = కులమునందు, జాతైః = పుట్టినవారిచేత, పరివర్ధితః = వృద్ధిపొందింపబడినది. సః సాగరః = అట్టి ఆ సముద్రము, రామహితే = రాముని హితమునందు, యుక్తమ్ = ఉద్యుక్తుడ వైన, త్వామ్ = నిన్ను, ప్రత్యర్చయతి = బదులుగా పూజించుచున్నది.

తా. రాముని వంశములో పుట్టినవారు సముద్రమును వృద్ధిపొందించినారు. అందుచే ఈ సముద్రము, రామునికి హితము చేయుటకై ప్రయాణము చేయుచున్న నీకు, ప్రతిపూజ చేయవలె నని కోరుచున్నది. 113

మూ. కృతే చ ప్రతికర్తవ్య మేష ధర్మః సనాతనః,
సోఽయం తత్ప్రతికారార్థీ త్వత్తః సమ్మానమర్హతి. 114

ప్ర. అ. కృతే = ఉపకారము చేయబడిన నపుడు, ప్రతికర్తవ్యమ్ = ప్రత్యుపకారము చేయ దగినది. ఏషః = ఇది, సనాతనః = ప్రాచీన మైన, ధర్మః = ధర్మము. తత్ప్రతికారార్థీ = రఘువంశరాజులకు ప్రత్యుపకారము చేయగోరుచున్న, సః అయమ్ = అట్టి ఈ సముద్రము, త్వత్తః = నీనుండి, సమ్మానమ్ = గౌరవమును, అర్హతి = తగి యున్నాడు.

తా. ఎవ రైన ఉపకారము చేసి నపుడు, వారికి ప్రత్యుపకారము చేయవలెను. ఇది అతిప్రాచీన మైన ధర్మము. నీకు సాహాయ్యము చేయుట ద్వారా రఘువంశరాజులకు ప్రత్యుపకారము చేయ దలచుచున్న ఈ సముద్రుని నీవు గౌరవింపవలెను.

మూ. త్వన్నిమిత్తమనేనాహం బహుమానాత్ప్రచోదితః,
యోజనానాం శతం చాపి కపిరేష సమాప్లుతః, 115
తవ సానుషు విశ్రాన్తః శేషం ప్రక్రమతామితి,
తిష్ఠ త్వం హరిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్. 116

ప్ర. అ. యోజనానాం శతమ్=నూరు యోజనములు, సమాప్లుతః=ఎగిరిన, ఏషః=ఈ, కపిః=హనుమంతుడు, తవ=నీయొక్క, సానుషు=చరియలయందు, విశ్రాన్తః=విశ్రమించినవాడై, శేషమ్=మిగిలిన మార్గమును, ప్రక్రమతామ్=వెళ్ళుగాక, ఇతి=అని, అనేన=ఈ సముద్రునిచేత, త్వన్నిమిత్తమ్=నీ నిమిత్తమై, అహమ్=నేను, బహుమానాత్=గౌరవభావమువలన, ప్రచోదితః=ప్రేరేపింపబడితిని. హరిశార్దూల=ఓ! వానరశ్రేష్ఠుడా! త్వమ్=నీవు, తిష్ఠ=ఆగుము, మయి=నాపై, విశ్రమ్య=విశ్రమించి, గమ్యతామ్=వెళ్ళబడుగాక (వెళ్ళెదవుగాక)

తా. "నూరు యోజనములదూరము దాటుటకై ఎగురుచున్న ఈ హనుమంతుడు కొంతసేపు నీ చరియలపై విశ్రమించి, మిగిలిన దూరము తరువాత ప్రయాణము చేయుగాక" అని ఈ సముద్రుడు నీపై ఉన్న గౌరవభావముచే నన్ను ప్రేరేపించినాడు. అందుచే ఓ! వానరోత్తమా! ఆగి, నాపై విశ్రమించి, వెళ్ళుము. 115, 116

మూ. తదిదం గన్ధవత్స్వాదు కన్దమూలఫలం బహు,
తదాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాన్తోఽనుగమిష్యసి. 117

ప్ర. అ. హరిశ్రేష్ఠ=ఓ! వానరశ్రేష్ఠుడా! తత్=ఆ కారణమువలన, గన్ధవత్=సుగంధము కలదీ, స్వాదు=మధురమైనదీ, బహు=అధికమూ అయిన, కన్దమూలఫలమ్=దుంపలూ ఫలములూ మొదలైన వాటి సముదాయము, ఇదమ్=ఇదిగో. తత్=దానిని. ఆస్వాద్య=తిని, విశ్రాన్తః=విశ్రమించినవాడవై, అను=పిదప, గమిష్యసి=వెళ్ళగలవు.

తా. ఓ! వానర శ్రేష్ఠుడా! ఇదిగో ఇక్కడ మధురమూ, మంచి వాసన గలదీ అయిన కందమూలఫలాదికము అత్యధికముగా ఉన్నది. దీనిని తిని విశ్రమించి, పిదప వెళ్ళుము. 117

మూ. అస్మాకమపి సమ్బన్ధః కపిముఖ్య త్వయాస్తి వై,
ప్రఖ్యాతస్త్రిషు లోకేషు మహాగుణపరిగ్రహః. 118

ప్ర. అ. కపిముఖ్య=వానరులలో ప్రధానుడా! త్రిషు=మూడు, లోకేషు= లోకములందు, ప్రఖ్యాతః=ప్రసిద్ధమూ, మహాగుణ పరిగ్రహః=గొప్ప గుణముల స్వీకారము కలదీ (గొప్ప గుణములచే ఏర్పడినదీ) అయిన, సంబన్ధః=సంబంధము, త్వయా=నీతో, అస్మాకమపి=మాకుకూడా, అస్తి హి=ఉన్నది.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! మాకు కూడా, గొప్ప గుణములచే ఏర్పడిన సంబంధ మొకటి నీతో ఉన్నది. అది మూడు లోకములలోను ప్రసిద్ధ మైనది.

మూ. వేగవన్తః ప్లవన్తో యే ప్లవగా మారుతాత్మజ,
తేషాం ముఖ్యతమం మన్యే త్వామహం కపికుఞ్జర. 119

ప్ర. అ. మారుతాత్మజ=వాయుపుత్రా! కపికుఞ్జర=ఓ! వానరశ్రేష్ఠుడా! వేగవన్తః=వేగము గల, ప్లవన్తః=ఎగురగల, యే=ఏ, ప్లవగాః=వానరులు గలరో, తేషామ్=వారిలో, ముఖ్యతమమ్=చాలా ముఖ్యునిగా, త్వామ్=నిన్ను, అహమ్=నేను, మన్యే=తలచుచున్నాను.

తా. వానరశ్రేష్ఠుడ వైన ఓ హనుమంతుడా! మహావేగముగా ఆకాశ సంచారము చేయ గల వానరులలో నీవు సర్వాధికుడ వని నా అభిప్రాయము.

మూ. అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా,
ధర్మం జిజ్ఞాసమానేన కిం పునస్త్వాదృశో మహాన్. 120

ప్ర. అ. ధర్మమ్ = ధర్మమును. జిజ్ఞాసమానేన=తెలుసుకొన దలచిన వానిచేతను. విజానతా=ధర్మము తెలిసినవానిచేతను. ప్రాకృతోఽపి=సామాన్యు డైనను, అతిథిః = అతిథి, పూజార్హః = పూజకు తగినవాడు. త్వాదృశః = నీవంటి, మహాన్=మహాపురుషుడు, కిం పునః=చెప్ప నేల

తా. ధర్మము తెలియగోరువారూ, తెలిసినవారూ కూడా ఇంటికి వచ్చిన అతిథిని, అతడు సామాన్యవ్యక్తియే యైనను, పూజించవలెను. ఇంక నీవంటి మహాపురుషుడు అతిథిగా వచ్చినప్పుడు వేరే చెప్పవలెనా? 120

మూ. త్వం హి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః,
పుత్రస్తస్యైవ వేగేన సదృశః కపికుఞ్జర. 121

ప్ర. అ. కపికుఞ్జర=ఓ వానరశ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, దేవవరిష్ఠస్య= దేవతలలో శ్రేష్ఠుడైన, మహాత్మనః=మహాత్ము డైన, మారుతస్య=వాయుదేవుని యొక్క, పుత్రః హి=పుత్రుడవు కదా. వేగేన=వేగముచేత, తస్యైవ=అతనికే, సదృశః=సమానుడవు.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! నీవు దేవతలలో శ్రేష్ఠుడైన, మహాత్ముడైన, వాయుదేవుని కుమారుడవు. వేగములో అతనితో సమానుడవు. 121

మూ. పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః,
తస్మాత్త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్.

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! త్వయి = నీవు, పూజితే = పూజింపబడినవాడవగుచుండగా, మారుతః = వాయుదేవుడు, పూజామ్ = పూజను, ప్రాప్నోతి = పొందును. తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, మే = నాకు, పూజనీయః = పూజింపదగినవాడవు. అత్ర = ఈ విషయమునందు, కారణం చ = కారణమును కూడ, శృణు = వినుము.

తా. ఓ ధర్మజ్ఞుడా! నిన్ను పూజించినచో వాయుదేవుని పూజించినట్లే అగును. అందువలన నేను నిన్ను పూజింపవలసి ఉన్నది. ఇందుకు కారణము చెప్పెదను వినుము. 122

మూ. పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్,
తే హి జగ్ముర్దిశః సర్వా గరుడానిలవేగినః. 123

ప్ర. అ. తాత = తండ్రీ! పూర్వమ్ = పూర్వము, కృతయుగే = కృతయుగమునందు, పర్వతాః = పర్వతములు, పక్షిణః = రెక్కలు కలవి, అభవన్ = అయినవి. తే = అవి, గరుడానిలవేగినః = గరుత్మంతుని, వాయుదేవుని వేగమువంటి వేగము గలవై, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను గూర్చి, జగ్ముః = వెళ్ళినవి.

తా. నాయనా! పూర్వము కృతయుగములో పర్వతాలకు రెక్కలు ఉండెడివి. అవి గరుత్మంతుని వేగముతోను, వాయుదేవుని వేగముతోను సమానమైన వేగముతో అన్ని దిక్కులకు వెళ్ళుచుండెడివి. 123

మూ. తతస్తేషు ప్రయాతేషు దేవసంఘాః సహర్షిభిః,
భూతాని చ భయం జగ్ముస్తేషాం పతనశఙ్కయా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేషు = అవి, ప్రయాతేషు = వెళ్ళినవగుచుండగా, సహర్షిభిః = ఋషులతో కూడిన, దేవసంఘాః = దేవతాసముదాయములు,

భూతాని చ = ఇతరప్రాణులున్నూ, తేషామ్ = వాటియొక్క, పతనశంకయా = పతనమును గూర్చిన శంకచేత, భయమ్=భయమును, జగ్ముః=పొందినవి.

తా. అవి ఆ విధముగా ఎగురుచుండుట చూచి, దేవసంఘములు, ఋషులు, ఇతరప్రాణులు, అవి ఎక్కడ మీద పడునో అను శంకచేత భయపడెను. 124

మూ. తతః క్రుద్ధః సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః,
పక్షాన్ చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః. 125

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శతక్రతుః = నూరు యాగములు గల, సహస్రాక్షః=దేవేంద్రుడు, క్రుద్ధః=కోపగించినవాడై, తత్ర తత్ర=అక్కడక్కడ, సహస్రశః = వేలకొలది, పర్వతానామ్ = పర్వతములయొక్క, పక్షాన్ = రెక్కలను, వజ్రేణ=వజ్రముచేత, చిచ్ఛేద = ఛేదించెను.

తా. అప్పుడు నూరు యజ్ఞము లాచరించిన దేవేంద్రుడు కోపించి, వేలకొలది అక్కడక్కడ ఉన్న పర్వతముల రెక్కలను వజ్రాయుధముతో ఖండించెను. 125

మూ. స మాముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్,
తతోఽహం సహసా క్షిప్తః శ్వసనేన మహాత్మనా 126

ప్ర. అ. సః=ఆ, దేవరాట్ = దేవేంద్రుడు, క్రుద్ధః = కోపించినవాడై, వజ్రమ్ = వజ్రమును, ఉద్యమ్య=ఎత్తి, మామ్=నన్ను, ఉపాగతః=చేరినాడు. తతః=అటుపిమ్మట, అహమ్ = నేను, మహాత్మనా=మహాత్ముడైన, శ్వసనేన= వాయుదేవునిచేత, సహసా = వెంటనే, క్షిప్తః = దూరముగా విసరివేయబడితిని.

తా. దేవేంద్రుడు కోపించి, వజ్రమును ఎత్తి, నా పక్షములను ఛేదించుటకై వచ్చెను. అప్పుడు వెంటనే వాయువు నన్ను దూరముగా తీసికొనిపోయెను. 126

మూ. అస్మిన్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ,
గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాభిరక్షితః. 127

ప్ర. అ. ప్లవగోత్తమ = వానరశ్రేష్ఠా, గుప్తపక్షసమగ్రశ్చ = రక్షింపబడిన రెక్కలతో పరిపూర్ణుడుగా ఉన్న నేను, అస్మిన్ = ఈ, లవణతోయే =

లవణసముద్రమునందు, ప్రక్షిప్తః = పడవేయబడినవారమై, తవ పిత్రా = నీ తండ్రిచేత, అభిరక్షితః = రక్షింపబడితిని.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! ఈ విధముగా నీ తండ్రి నన్ను ఈ లవణ సముద్రములో పడవేసి నా రెక్కలు ఛిన్నములు కాకుండ నా శరీరము పరిపూర్ణముగా ఉండునట్లు చేసి నన్ను రక్షించినాడు. 127

మూ. తతోఽహం మానయామి త్వాం మాన్యో హి మమ మారుతః,
త్వయా మే హ్యేష సంబన్ధః కపిముఖ్య మహాగుణః. 128

ప్ర. అ. కపిముఖ్య = వానరులలో ముఖ్యుడా! మారుతః = వాయుదేవుడు, మమ = నాకు, మాన్యః హి = గౌరవింపదగినవాడు కదా! తతః = ఆ కారణము వలన, అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, మానయామి = గౌరవించుచున్నాను. త్వయా = నీతో, మే = నాయొక్క, ఏషః = ఈ, సంబన్ధః = సంబంధము, మహాగుణః = గొప్ప గుణములు కలది.

తా. ఓ వానరోత్తమా! నాకు సహాయము చేసి ఉండుటచేత వాయుదేవుడు నాకు మాననీయుడు. అందుచేత నిన్ను గౌరవించుచున్నాను. నీకును నాకును గల ఈ సంబంధము ఉత్తమగుణములను పట్టి ఏర్పడినది. 128

మూ. అస్మిన్నేవంగతే కార్యే సాగరస్య మమైవ చ,
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వమర్హసి మహాకపే. 129

ప్ర. అ. మహాకపే = వానరోత్తమా! అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, ఏవంగతే = ఈవిధముగా నున్నదగుచుండగా, త్వమ్ = నీవు, ప్రీతమనాః = సంతోషించిన మనస్సు కలవాడవై, సాగరస్య చ = సముద్రునకు, మమైవ చ = నాకూ, ప్రీతిమ్ = ఆనందమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ వానరోత్తమా! ఇట్టి పరిస్థితులలో నీవు, (మా ఆతిథ్యముచేత) సంతోషించి మనస్సుతో, నాకూ, సముద్రునికి సంతోషము కలిగింపుము. 129

మూ. శ్రమం మోక్షయ పూజాం చ గృహాణ కపిసత్తమ,
ప్రీతిం చ బహుమన్యస్వ ప్రీతోఽస్మి తవ దర్శనాత్.

ప్ర. అ. కపిసత్తమ = వానరోత్తమా ! శ్రమమ్ = అలసటను, మోక్షయ = తగ్గించుకొనుము. పూజాం చ = పూజను, గృహాణ = గ్రహింపుము. ప్రీతిమ్ = మా ప్రేమను, బహుమన్యస్వ = గౌరవించుము. తవ = నీయొక్క, దర్శనాత్ = దర్శనమువలన, ప్రీతః అస్మి = సంతోషించినాను.

తా. ఓ వానరోత్తమా ! మా పూజను అందుకొనుము. కొంత సేపు విశ్రమించుము. మా స్నేహమును గౌరవింపుము. నీ దర్శనము నా కెంతో ఆనందము కలిగించినది. 130

మూ. ఏవముక్తః కపిశ్రేష్ఠస్తం నగోత్తమమబ్రవీత్,
ప్రీతో௨స్మి కృతమాతిథ్యం మన్యురేషో௨పనీయతామ్.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలుకబడిన, కపిశ్రేష్ఠః = హనుమంతుడు, తం నగోత్తమమ్ = ఆ పర్వతోత్తమమును గూర్చి, అబ్రవీత్ = పలికెను. ప్రీతః అస్మి = సంతోషించితిని. ఆతిథ్యమ్ = ఆతిథ్యము, కృతమ్ = చేయబడినది. ఏషః = ఈ, మన్యుః = కోపము, అపనీయతామ్ = తొలగింపబడు గాక.

తా. హనుమంతుడు ఆ పర్వతోత్తముని మాటలు విని ఇట్లు పలికెను. నీవు ఆతిథ్యము చేసి నట్లే సంతోషించుచున్నాను. నీ ఆతిథ్యమును స్వీకరించలే దని కోపగించకుము. 131

మూ. త్వరతే కార్యకాలో మే అహశ్చాప్యతివర్తతే,
ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్యమిహాన్తరే. 132

ప్ర. అ. మే = నాయొక్క, కార్యకాలః = కార్యసమయము, త్వరతే = తొందరపెట్టుచున్నది. అహః చ = పగలు కూడా, అతివర్తతే = దాటిపోవుచున్నది. మయా = నాచేత, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, దత్తా చ = ఇవ్వబడినది కూడ. అన్తరే = మధ్యయందు, ఇహ = ఇక్కడ, న స్థాతవ్యమ్ = నిలువకూడదు.

తా. నా కార్యసమయము మించిపోవుచున్నది. పగలు గడచి పోవుచున్నది. నేను నా మిత్రులయెదుట ప్రతిజ్ఞ చేసి ఉన్నాను. అందుచేత కూడ నేను మార్గమధ్యమునందు ఆగుటకు వీలుకాదు. 132

మూ. ఇత్యుక్త్వా పాణినా శైలమాలభ్య హరిపుఙ్గవః,
జగామాకాశమావిశ్య వీర్యవాన్ ప్రహసన్నివ. 133

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, హరిపుఙ్గవః = హనుమంతుడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, శైలమ్ = మైనాకపర్వతమును, పాణినా = హస్తముతో, ఆలభ్య = స్పృశించి, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, ప్రహసన్నివ = నవ్వుచు, జగామ = వెళ్ళెను.

తా. వీర్యవంతుడైన ఆ హనుమంతుడు మైనాకునితో ఇట్లు చెప్పి, తన హస్తముతో సస్నేహముగా స్పృశించి, సంతోషించుచు, ఆకాశమార్గమునందు, ప్రయాణము చేసెను. 134

మూ. స పర్వతసముద్రాభ్యాం బహుమానాదవేక్షితః,
పూజితశ్చోపపన్నాభిరాశీర్భిరనిలాత్మజః. 134

ప్ర. అ. సః = ఆ, అనిలాత్మజః = హనుమంతుడు, పర్వతసముద్రాభ్యామ్ = పర్వతముచేతను, సముద్రముచేతను, బహుమానాత్ = గౌరవముతో, అవేక్షితః = చూడ బడినవాడై, ఉపపన్నాభిః = తగిన, ఆశీర్భిః = ఆశీర్వాదములతో, పూజితః చ = పూజింపబడినాడు కూడ.

తా. ఆ హనుమంతుని మైనాకుడు, సముద్రుడూ గౌరవభావముతో చూచుచు తగిన ఆశీర్వాదవాక్యములతో అభినందించిరి. 134

మూ. అథోర్ధ్వం దూరముత్ప్లుత్య హిత్వా శైలమహార్ణవౌ,
పితుః పన్థానమాస్థాయ జగామ విమలేఽమ్బరే. 135

ప్ర. అ. అథ = అటుపిమ్మట, శైలమహార్ణవౌ = మైనాకపర్వతమును, మహాసముద్రమును, హిత్వా = విడచి, ఊర్ధ్వమ్ = పైకి, దూరమ్ = దూరముగా, ఉత్ప్లుత్య = ఎగిరి, విమలే = స్వచ్ఛ మైన, అమ్బరే = ఆకాశమునందు, పితుః = తండ్రియొక్క, పన్థానమ్ = మార్గమును, ఆస్థాయ = అధిష్ఠించి, జగామ = వెళ్ళెను.

తా. హనుమంతుడు మైనాకపర్వతమును, సముద్రమును విడచి, బాగా పైకి ఎగిరి, నిర్మలమైన ఆకాశమునందు, వాయుమార్గమున ప్రయాణము చేసెను. 135

మూ. భూయశ్చోర్ధ్వం గతిం ప్రాప్య గిరిం తమవలోకయన్,
వాయుసూనుర్నిరాలమ్బే జగామ విమలేఽమ్బరే. 136

ప్ర. అ. వాయుసూనుః=హనుమంతుడు, భూయః చ=మరల, ఊర్ధ్వమ్ =పై భాగమున, గతిమ్ =గమనమును, ప్రాప్య=పొంది, తం గిరిమ్=ఆ పర్వతమును, అవలోకయన్=చూచుచు, నిరాలమ్బే=ఆధారము లేని, విమలే= నిర్మల మైన, అమ్బరే=ఆకాశమునందు, జగామ=వెళ్ళెను.

తా. ఆ వాయునందనుడు, ఇంకా పైకి వెళ్ళి, మైనాకపర్వతమును చూచుచు, ఎట్టి ఆధారమూ లేని, నిర్మల మైన ఆకాశమునందు ప్రయాణము చేసెను. 136

మూ. తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
ప్రశశంసుః సురాః సర్వే సిద్ధాశ్చ పరమర్షయః. 137

ప్ర. అ. హనుమతః=హనుమంతునియొక్క, తత్=ఆ, సుదుష్కరమ్ =చేయుటకు చాల కష్ట మైన, ద్వితీయమ్=రెండవ, కర్మ=(మైనాకమును పడగొట్టుట) అను పనిని (మొదటిది సముద్రతరణము), దృష్ట్వా=చూచి, సర్వే=సమస్త మైన, సురాః=దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః= మహర్షులు, ప్రశశంసుః=ప్రశంసించిరి.

తా. హనుమంతుడు చేసిన, చేయుటకు చాల కష్ట మైన ఆ రెండవ కార్యమును చూచి, దేవతలు, సిద్ధులు, మహర్షులు, అందరూ, ప్రశంసించిరి.

మూ. దేవతాశ్చాభవన్ హృష్టాస్తత్రస్థాస్తస్య కర్మణా,
కాఞ్చనస్య సునాభస్య సహస్రాక్షశ్చ వాసవః. 138

ప్ర. అ. తత్రస్థాః=అక్కడ ఉన్న, దేవతాశ్చ=దేవతలు, సహస్రాక్షః =వేయి కనులు గల, వాసవశ్చ=దేవేంద్రుడు, కాఞ్చనస్య=బంగారువికార మైన, తస్య=ఆ, సునాభస్య=మైనాకముయొక్క, ("సునాభ" అనునది మైనాకము నకు అసలు పేరు అయి ఉండును. మేనక కుమారుడు గాన మైనాక మని పేరు వచ్చినది), కర్మణా=పనిచేత, హృష్టాః=సంతోషించినవారు, అభవన్= అయిరి.

తా. బంగారువికార మైన ఆ సునాభ (మైనాక) పర్వతము చేసిన పనికి, అక్కడ ఉన్న దేవతలు, దేవేంద్రుడు కూడ చాలా సంతోషించిరి. 138

మూ. ఉవాచ వచనం ధీమాన్ పరితోషాత్సగద్గదమ్,
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః. 139

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతు డైన, శచీపతిః = దేవేంద్రుడు, పర్వతశ్రేష్ఠమ్=పర్వతములలో శ్రేష్ఠ మైన, సునాభమ్=సునాభ పర్వతమునుగూర్చి, పరితోషాత్ = ఆనందమువలన, సగద్గదమ్ = గద్గదస్వరముతో కూడినట్లుగా, స్వయమేవ=స్వయముగానే, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. బుద్ధిగలి యైన దేవేంద్రుడు సంతోషముతో డగ్గుత్తిక కలిగిన కంఠస్వరముతో, పర్వతశ్రేష్ఠు డైన ఆ సునాభునితో స్వయముగా ఇట్లు పలికెను.

మూ. హిరణ్యనాభ శైలేన్ద్ర పరితుష్టోఽస్మి తే భృశమ్,
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖమ్.

ప్ర. అ. హిరణ్యనాభ=బంగారము మధ్యప్రదేశమునందు గల, శైలేన్ద్ర = ఓ శైలరాజా ! తే = నీ విషయమున, భృశమ్=మిక్కిలి, పరితుష్టః అస్మి= సంతోషించినాను. సౌమ్య = ఓ సౌమ్యుడా, తే = నీకు, అభయమ్ = అభయమును, ప్రయచ్ఛామి = ఇచ్చుచున్నాను. యథాసుఖమ్ = సుఖముగా, తిష్ఠ = ఉండుము.

తా. హిరణ్యము మధ్యయందు గల ఓ మైనాకుడా ! నీ విషయమున చాలా సంతోషించినాను. ఓ సౌమ్యుడా, నీకు అభయ మిచ్చుచున్నాను. ఇటుపై నీకు ఇష్టము వచ్చిన చోట సుఖముగా ఉండుము. 140

మూ. సాహ్యం కృతం తే సుమహద్విక్రాన్తస్య హనూమతః,
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి. 141

ప్ర. అ. విక్రాన్తస్య = పరాక్రమించుచున్నవాడూ, యోజనశతమ్=నూరు యోజనములు, క్రమతః=దాటుచున్నవాడూ, భయే సతి=భయకారణము కలిగినపుడు కూడ, నిర్భయస్య=భయము లేనివాడూ అయిన, హనూమతః = హను

మంతునకు,తే=నీకు (నీచేత), సుమహత్=చాల గొప్ప, సాహ్యమ్=సాహాయ్యము, కృతమ్=చేయబడినది.

తా. ఎంతో భయపడవలసిన సమయమునందు కూడ ఏ మాత్రము భయము లేక, పరాక్రమము చూపి, నూరు యోజనముల దూరము దాటుచున్న హనుమంతునకు చాల గొప్ప సాహాయ్యము చేసినావు. 141

మూ. రామస్యైష హితాయైవ యాతి దాశరథేర్హరిః,
సత్క్రియాం కుర్వతా తస్య తోషితోఽస్మి దృఢంత్వయా.

ప్ర. అ. ఏషః హరిః = ఈ వానరుడు (హనుమంతుడు), దాశరథేః = దశరథకుమారు డైన, రామస్య=రామునియొక్క, హితాయైవ=హితముకొరకే, యాతి = వెళ్ళుచున్నాడు. తస్య = అతనికి, సత్క్రియామ్ = సత్కారమును, కుర్వతా = చేయుచున్న, త్వయా = నీచేత, దృఢమ్ = మిక్కిలి, తోషితః అస్మి=సంతోష పెట్టబడినాను.

తా. ఈ హనుమంతుడు, దశరథకుమారు డైన రామునకు హితము చేయుటకే వెళ్ళుచున్నాడు. అట్టివానికి నీవు సత్కారము చేసినందుకు నేను చాలా సంతోషించుచున్నాను. 142

మూ. తతః ప్రహర్షమగమద్విపులం పర్వతోత్తమః,
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్. 143

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పర్వతోత్తమః = ఆ పర్వతశ్రేష్ఠము, దేవతానామ్ = దేవతలకు, పతిమ్ = ప్రభు వైన, శతక్రతుమ్ = ఇంద్రుని, పరితుష్టమ్=సంతోషించినవానినిగా, దృష్ట్వా=చూచి, విపులమ్ = అధిక మైన, ప్రహర్షమ్ = ఆనందమును, అగమత్ = పొందెను.

తా. దేవాధీశ్వరు డైన ఇంద్రుడు తన విషయమున సంతోషించినా డను విషయమును తెలిసికొని, ఆ పర్వతశ్రేష్ఠము చాలా ఆనందించెను. 143

మూ. స వై దత్తవరః శైలో బభూవావస్థిత స్తదా,
హనుమాంశ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్. 144

ప్ర. అ. తదా = అప్పుడు, దత్తవరః = ఇవ్వబడిన వరము గల, సః = ఆ, శైలః = పర్వతము, అవస్థితః = అచటనే నిలిచినది, బభూవ = ఆయెను. హనుమాంశ్చ = హనుమంతుడు కూడ, ముహూర్తేన = క్షణకాలములో, సాగరమ్ = సముద్రమును, వ్యతిచక్రామ = దాటెను.

తా. అప్పుడు దేవేంద్రునినుండి వరము పొందిన మైనాకము అక్కడ నిలిచి ఉండగా, హనుమంతుడు అనతికాలములో సముద్రములోని చాల దూరము దాటి వెళ్ళెను. 144

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
అబ్రువన్ సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్. 145

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, సిద్ధాశ్చ = సిద్ధులు, పరమర్షయః = మహర్షులూ, సూర్యసంకాశామ్ = సూర్యునితో సమాన మైన, నాగమాతరమ్ = నాగమాత యైన, సురసామ్ = సురసను గూర్చి, అబ్రువన్ = పలికిరి.

తా. అప్పుడు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, సూర్యునితో సమాన మైన ప్రకాశము గల నాగమాత యైన సురసతో ఇట్లు పలికిరి. 145

మూ. అయం వాతాత్మజః శ్రీమాన్ప్లవతే సాగరోపరి,
హనుమాన్నామ తస్య త్వం ముహూర్తం విఘ్నమాచర,
రాక్షసం రూపమాస్థాయ సుఘోరం పర్వతోపమమ్,
దంష్ట్రాకరాళం పిఙ్గాక్షం వక్త్రం కృత్వా నభఃసమమ్.

ప్ర. అ. హనుమాన్నామ = హనుమంతు డను పేరు గల, శ్రీమాన్ = శ్రీమంతు డైన, అయం = ఈ, వాతాత్మజః = వాయుకుమారుడు, సాగరోపరి = సముద్రముపైన, ప్లవతే = ఎగురుచున్నాడు. త్వమ్ = నీవు, సుఘోరమ్ = దారుణ భయంకరమూ, పర్వతోపమమ్ = పర్వతముతో సమానమూ అయిన, రాక్షసమ్ = రాక్షససంబంధ మైన, రూపమ్ = రూపమును, ఆస్థాయ = గ్రహించి, దంష్ట్రాకరాళమ్ = కోరలతో భయంకరమూ, పిఙ్గాక్షమ్ = పచ్చని నేత్రములు కలదీ, నభఃసమమ్ = ఆకాశముతో సమానమూ అయిన, వక్త్రమ్ = ముఖమును,

కృత్వా = చేసి, ముహూర్తమ్ = క్షణకాలముపాటు, తస్య = వానికి, విఘ్నమ్ = విఘ్నమును, ఆచర = చేయుము.

తా. హనుమంతుడను పేరు గల శ్రీమంతుడైన ఈ వాయుపుత్రుడు సముద్రముపై ఎగురుచున్నాడు. నీవు భయంకరమూ పర్వతసమానమూ అయిన రాక్షసరూపము ధరించి కోరలతో భయంకరముగా ఉన్న, పచ్చని కళ్ళు గల, ఆకాశమంత నోరు చేసుకొని ముహూర్తకాలము ఇతనికి విఘ్నము చేయుము.

మూ. బలమిచ్ఛామహే జ్ఞాతుం భూయశ్చాస్య పరాక్రమమ్,
త్వాం విజేష్యత్యుపాయేన విషాదం వా గమిష్యతి. 147

ప్ర. అ. అస్య = ఇతనియొక్క, బలమ్ = బలమును, భూయః = మరియు, పరాక్రమం చ = పరాక్రమమును. ఉపాయేన = ఉపాయముచేత, త్వామ్ = నిన్ను, విజేష్యతి = జయించగలడా, వా = లేక, విషాదమ్ = దుఃఖమును, గమిష్యతి = పొందగలడా అను విషయమునూ, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము.

తా. ఇతని బలపరాక్రమములను, నిన్ను ఉపాయమేదైన చేసి జయించగలడా లేదా దిగులుపాటు చెందునా అను విషయమును తెలుసుకొనవలెనని కోరుచున్నాము.

మూ. ఏవముక్తా తు సా దేవీ దైవతైరభిసత్కృతా,
సముద్రమధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః. 149
వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్,
ప్లవమానం హనూమన్తమావృత్యేదమువాచ హ. 150

ప్ర. అ. దేవీ = దేవి యైన, సా సురసా = ఆ సురస, దైవతైః = దేవతలచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడినదై, అభిసత్కృతా = పూజింపబడినదై, సముద్రమధ్యే = సముద్రమధ్యమునందు, వికృతమ్ = వికృతమైనదీ, విరూపం చ = వికారమైన రూపము కలదీ, సర్వస్య = అందరికీ, భయావహమ్ = భయము కలిగించేదీ అయిన, రాక్షసం వపుః = రాక్షసశరీరమును, బిభ్రతీ = ధరించుచున్నదై, ప్లవమానమ్ = ఎగురుచున్న, హనూమన్తమ్ = హనుమంతుని, ఆవృత్య = అడ్డుకొని, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. దేవతలు గౌరవపూర్వకముగా ఈ విధముగా కోరగా, ఆ సురసా దేవి అందరికీ భయము కలిగించు చాల వికారముగా ఉన్న రాక్షసశరీరము ధరించినదై ఎగిరి వెళ్లుచున్న హనుమంతుని సముద్రమధ్యమునందు అడ్డుకొని ఇట్లు పలికెను. 149, 150

మూ. మమ భక్షః ప్రదిష్టస్త్వమీశ్వరైర్వానరర్షభ,
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్. 151

ప్ర. అ. వానరర్షభ = ఓ వానరశ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, ఈశ్వరైః = దేవతలచేత, మమ = నాయొక్క, భక్షః = ఆహారముగా, ప్రదిష్టః = ఇవ్వబడినావు. అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, భక్షయిష్యామి = భక్షించెదను. ఇదమ్ = ఈ, మమ = నాయొక్క, ఆననమ్ = ముఖమును, ప్రవిశ = ప్రవేశించుము.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! దేవతలు నిన్ను నాకాహారముగా ఇచ్చినారు. నిన్ను భక్షించెదను. నా ముఖములోనికి ప్రవేశించుము. 151

మూ. ఏవముక్తః సురసయా ప్రాఞ్జలిర్వానరర్షభః,
ప్రహృష్టవదనః శ్రీమానిదం వచనమబ్రవీత్. 152

ప్ర. అ. సురసయా = సురసచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, శ్రీమాన్ = శోభ గల, వానరర్షభః = ఆ వానరశ్రేష్ఠుడు, ప్రహృష్టవదనః = సంతోషించిన ముఖము కలవాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రీమంతుడైన ఆ వానరోత్తముడు, సురస మాటలు విని, ఏమాత్రము దిగులు చెందక, చేతులు జోడించి నమస్కరించుచు ఇట్లు పలికెను. 152

మూ. రామో దాశరథిర్నామ ప్రవిష్టో దణ్డకావనమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా. 153

ప్ర. అ. దాశరథిః = దశరథ కుమారుడైన, రామో నామ = రాముడను పేరు గల వీరుడు, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితోను, భార్యయా = భార్యయైన, వైదేహ్యా చాపి = సీతతోను, దణ్డకావనమ్ = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

రా. దశరథకుమారు డైన రాముడు సోదరు డైన లక్ష్మణునితోను, భార్యయైన సీతతోను దండకారణ్యములో ప్రవేశించినాడు 153

మూ. అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః,
తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ. 154

ప్ర. అ. రాక్షసైః=రాక్షసులతో, బద్ధవైరస్య=కట్టబడిన వైరము కల, తస్య:= ఆ రాముడు, అన్యకార్యవిషక్తస్య = కార్యాంతరమునందు లగ్నుడై ఉండగా, యశస్వినీ = కీర్తిమంతురా లైన, భార్యా = భార్య యైన, సీతా = సీత, రావణేన=రావణునిచేత, హృతా=హరింపబడినది.

రా. ఆ రామునకు రాక్షసులతో వైర మేర్పడినది. ఒకనా డాతడు మరియొక పనిలో ఉండగా అతని భార్య యైన, కీర్తిమంతు రాలైన సీతను రావణుడు అపహరించెను. 154

మూ. తస్యాః సకాశం దూతోఽహం గమిష్యే రామకారణాత్,
కర్తుమర్హసి రామస్య సాహ్యం విషయవాసిని. 155

ప్ర. అ. అహమ్ = నేను, రామకారణాత్ = రాముని నిమిత్తమై, దూతః =దూతనై, తస్యాః=ఆమెయొక్క, సకాశమ్=సమీపమును గూర్చి, గమిష్యే= వెళ్ళగలను. విషయవాసిని = రాముని దేశములో (రాజ్యములో) నివసించుచున్న దానా! రామస్య = రామునకు, సాహ్యమ్ = సాహాయ్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

రా. నేను రాముని ఆజ్ఞచే ఆతని దూతగా సీతదగ్గరకు వెళ్ళుచున్నాను. నీవు రాముని రాజ్యమునందే నివసించుచున్నావు గాన నీవు కూడ రామునకు సాహాయ్యము చేయవలెను. 155

మూ. అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్,
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే. 156

ప్ర. అ. అథవా = అట్లుకానిచో, మైథిలీమ్=సీతను, అక్లిష్టకారిణమ్ = శ్రమపడకుండా పనులు చేయు, రామం చ = రామునీ, దృష్ట్వా = చూచి, తే=

నీయొక్క, వక్త్రిమ్=ముఖమును, అగమిష్యామి = పొందగలను. సత్యమ్ = యథార్థముగా, తే = నీకు, ప్రతిశృణోమి = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. అట్లు నీకు అంగీకారము కాని పక్షమున నేను సీతను చూచి, ఆ విషయము రామునకు తెలిపి, నీ ముఖములోనికి వచ్చెదను. సత్యముగా ప్రతిజ్ఞ చేయుచున్నాను. 156

మూ. ఏవముక్తా హనుమతా సురసా కామరూపిణీ,
అబ్రవీన్నాతివర్తేత కశ్చిదేష వరో మమ. 157

ప్ర. అ. హనుమతా = హనుమంతునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా=పలుక బడిన, కామరూపిణీ = స్వేచ్ఛారూపము గల, సురసా = సురస, అబ్రవీత్ = పలికెను. కశ్చిత్=ఎవ్వరును, నాతివర్తేత = నన్ను అతిక్రమించి పోజాలరు. ఏషః = ఇది, మమ = నాయొక్క, వరః = వరము.

తా. ఇచ్ఛానుసారము రూపము ధరించే శక్తి గల ఆ సురస హనుమంతుని మాటలు విని, "నన్నెవ్వరును అతిక్రమించి పోజాలరు. ఇది నాకున్న వరము" అని పలికెను. 157

మూ. తం ప్రయాన్తం సముద్వీక్ష్య సురసా వాక్యమబ్రవీత్.
బలం జిజ్ఞాసమానా వై నాగమాతా హనూమతః. 158

ప్ర. అ. నాగమాతా = నాగమాత యైన, సురసా=సురస, హనూమతః = హనుమంతునియొక్క, బలమ్ = బలమును, జిజ్ఞాసమానా వై = తెలియగోరు చున్నదై, ప్రయాన్తమ్ = వెళ్ళిపోవుచున్న, తమ్ = అతనిని, సముద్వీక్ష్య = చూచి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. నాగమాత యైన సురస హనుమంతునికి ఎంత బలమున్నదో తెలుసుకొనవలె నను ఉద్దేశ్యముతో, వెళ్ళిపోవుచున్న అతనిని చూచి ఇట్లు పలికెను. 158

మూ. ప్రవిశ్య వదనం మేఽద్య గన్తవ్యం వానరోత్తమ,
వర ఏష పురా దత్తో మమ ధాత్రేతి సత్వరా. 159
వ్యాదాయ విపులం వక్త్రిం స్థితా సా మారుతేః పురః.

ప్ర. అ. వానరోత్తమ = వానరశ్రేష్ఠుడా। అద్య = ఇప్పుడు. మే = నాయొక్క, వదనమ్=ముఖమును, ప్రవిశ్య=ప్రవేశించి, గన్తవ్యమ్=వెళ్లదగి ఉన్నది. ఏషః వరః = ఈ వరము, పురా = పూర్వమునందు, మమ = నాకు, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, దత్తః = ఇవ్వబడినది. ఇతి = ఇట్లు పలికి, సత్వరా = తొందరలో కూడినదై, విపులమ్ = విశాలమైన, వక్త్రమ్ = ముఖమును, వ్యాదాయ = తెరచి, సా=ఆమె, మారుతేః = హనుమంతునియొక్క, పురః = ఎదుట, స్థితా = నిలిచినది.

తా. "ఓ వానరశ్రేష్ఠుడా। నా ముఖములో ప్రవేశించిన పిదపనే నీవు వెళ్ళవలసి ఉన్నది. ఇది నాకు పూర్వము బ్రహ్మదేవుడు ఇచ్చిన వరము". ఇట్లు పలుకుచు ఆమె తొందరగా విశాలమైన ముఖమును తెరచి హనుమంతుని ఎదుట నిలచెను. 159

మూ. ఏవముక్తః సురసయా క్రుద్ధో వానరపుఙ్గవః, 160
అబ్రవీత్కురు వై వక్త్రం యేన మాం విషహిష్యసే.

ప్ర. అ. సురసయా=సురసచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః = పలుకబడిన, వానరపుఙ్గవః = హనుమంతుడు, క్రుద్ధః=కోపించినవాడై, అబ్రవీత్=పలికెను, వక్త్రమ్=ముఖమును, కురు వై = పెద్దది చేయుము. యేన=దేనిచేత, మామ్ = నన్ను, విషహిష్యసే=సహించగలవో.

తా. సురస మాటలు విన్న హనుమంతుడు కోపముతో ఇట్లనెను - "నీవు ఎంత పెద్దగా నీ నోరు తెరచెదవో తెరువుము, నన్నెట్లు సహించెదవో చూచెదను".

మూ. ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజనమాయతః, 161
దశయోజనవిస్తారో బభూవ హనుమాంస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, హనుమాన్=హనుమంతుడు, సురసామ్ = సురసను గూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా=పలికి, క్రుద్ధః = కోపించినవాడై, దశయోజనమ్=పదియోజనములు, ఆయతః=పొడవైనవాడు గాను, దశయోజన విస్తారః=పదియోజనముల వైశాల్యము కలవాడు గాను, బభూవ=ఆయెను.

తా. అప్పుడు, హనుమంతుడు సురసతో, ఇట్లు పలికి, కోపించినవాడై,

పదియోజనముల పొడవు, పది యోజనముల వైశాల్యము ఉండు నట్లు దేహమును పెంచెను, 161

మూ. తం దృష్ట్వా మేఘసంకాశం దశయోజనమాయతమ్, 162
చకార సురసా చాస్యం వింశద్యోజనమాయతమ్.

ప్ర. అ. దశయోజనమ్ = పది యోజనములు, ఆయతమ్ = పొడ వైన, మేఘసంకాశమ్ = మేఘముతో సమాన మైన, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, సురసా చ = సురస కూడ, ఆస్యమ్ = ముఖమును, వింశద్యోజనమ్ = ఇరువది యోజనములు, ఆయతమ్ = పొడ వైనదానినిగా, చకార = చేసెను.

తా. పది యోజనములు పొడవుగా, మేఘము వలె ఉన్న ఆ హనుమంతుని చూచి, సురస కూడ, తన ముఖమును ఇరువది యోజనముల పొడ వగు నట్లు పెంచెను. 162

మూ. హనుమాంస్తు తతః క్రుద్ధస్త్రింశద్యోజనమాయతః. 163
చకార సురసా వక్త్రం చత్వారింశత్తథోచ్ఛ్రితమ్,
బభూవ హనుమాన్వీరః పఞ్చాశద్యోజనోచ్ఛ్రితః. 164

ప్ర. అ. తతః = పిమ్మట, హనుమాంస్తు = హనుమంతు డైతే, క్రుద్ధః = కోపించినవాడై, త్రింశద్యోజనమ్ = ముప్పది యోజనములు, ఆయతః = పొడవాయెను. సురసా = సురస, తథా = అట్లే వక్త్రమ్ = ముఖమును, చత్వారింశత్ = నలుబదియోజనములు, ఉచ్ఛ్రితమ్ = ఎత్తైనదానినిగా, చకార = చేసెను. వీరః = వీరుడైన, హనుమాన్ = హనుమంతుడు, పఞ్చాశద్యోజనోచ్ఛ్రితః = ఏబది యోజనములు ఎత్తు కలవాడు, బభూవ = ఆయెను.

తా. పిమ్మట హనుమంతుడు, కుపితుడై, ముప్పది యోజనముల పొడవాయెను. సురస తన ముఖమును నలుబది యోజనముల ఎత్తు పెంచెను. వీరుడైన హనుమంతుడు ఏబది యోజనముల ఎత్తు పెరిగెను. 163, 164

మూ. చకార సురసా వక్త్రం షష్టియోజనమాయతమ్,
తథైవ హనుమాన్వీరః సప్తతీయోజనోచ్ఛ్రితః. 165

ప్ర. అ. సురసా = సురస, వక్త్రమ్ = ముఖమును, షష్టియోజనమ్ =

అరువది యోజనములు, ఆయతమ్=పొడవైనదానినిగా, చకార=చేసెను. వీరః=వీరు డైన, హనుమాన్=హనుమంతుడు, తథైవ=అట్లే, సప్తతియోజనోచ్ఛ్రితః=డెబ్బది యోజనముల ఎత్తు కలవా డాయెను.

తా. సురస తన ముఖము అరువది యోజనముల పొడవు పెంచెను. వీరు డైన హనుమంతుడు కూడ డెబ్బది యోజనముల పొడ వయ్యెను. 165

మూ. చకార సురసా వక్త్రమశీతియోజనోచ్ఛ్రితమ్,
హనుమానచలప్రఖ్యో నవతీయోజనోచ్ఛ్రితః. 166

ప్ర. అ. సురసా=సురస, వక్త్రమ్=ముఖమును, అశీతియోజనోచ్ఛ్రితమ్=ఎనుబది యోజనముల ఎత్తుగలదానినిగా, చకార = చేసెను. అచలప్రఖ్యః=పర్వతముతో సమాను డైన, హనుమాన్=హనుమంతుడు, నవతీయోజనోచ్ఛ్రితః=తొంబది యోజనముల ఎత్తు కలవాడు అయ్యెను.

తా. సురస తన నోరు ఎనుబది యోజనముల పొడ వుండు నట్లు చేయగా పర్వతాకారు డైన హనుమంతుడు తొంబది యోజనముల ఎత్తు పెరిగెను. 166

మూ. తద్దృష్ట్వా వ్యాదితం త్వాస్యం వాయుపుత్రః సుబుద్ధిమాన్,
దీర్ఘజిహ్వం సురసయా సుఘోరం నరకోపమమ్, 167
సుసంక్షిప్యాత్మనః కాయం బభూవాఙ్గుష్ఠమాత్రకః.

ప్ర. అ. సుబుద్ధిమాన్ = గొప్ప బుద్ధిమంతు డైన, వాయుపుత్రః = హనుమంతుడు, సురసయా=సురసచేత, వ్యాదితమ్=తెరవబడినదీ, దీర్ఘజిహ్వమ్=దీర్ఘ మైన నాలుక కలదీ, సుఘోరమ్=చాల భయంకర మైనదీ, నరకోపమమ్=నరకముతో సమాన మైనదీ, అయిన, తత్ ఆస్యమ్ = ఆ ముఖమును, దృష్ట్వా=చూచి, ఆత్మనః=తనయొక్క, కాయమ్=శరీరమును, సుసంక్షిప్య=బాగుగా కుదించి (చాల చిన్నదిగా చేసి), అఙ్గుష్ఠమాత్రః=బొటనవ్రేలు ప్రమాణము కలవాడు, బభూవ = అయెను.

తా. మహాబుద్ధిశాలి యైన హనుమంతుడు, దీర్ఘ మైన జిహ్వ కలదీ, చాల భయంకరముగా ఉన్నదీ, నరకముతో సమాన మైనదీ అయిన, సురస చాపిన ఆ ముఖమును చూచి, తన దేహమును చాల చిన్నదిగా చేసి, బొటనవ్రేలు పంటి ప్రమాణము కలవాడు అయ్యెను.

వి. ఈ శ్లోకానికి వెనుక "తం ప్రయాన్తం సముద్వీక్ష్య" మొదలు "చకార సురసా వక్త్రం ....... శతయోజనమాయతః" అను శ్లోకం వరకూ ఉన్న (శ్లో. 158—166) ఎనిమిది శ్లోకాలు వాటుల చమత్కారం కోసం ఎవరో రచించి చేర్చి ఉంటారు. శతయోజనవిస్తీర్ణ మైన సముద్రాన్ని లంఘించడానికి బయలు దేరి దాదాపు సగం దూరం వచ్చిన హనుమంతుడు సురసను జయించుటకై మొదట పదియోజనాల పొడవు, పదియోజనాల లావు ఉండే టట్లు శరీరం పెంచి చివరకు తొంభైయోజనాలపొడవు (దానికి తగిన లావు) ఉండే టట్లు పెంచినచో ఇంచుమించు ఈ తీరంనుంచి ఆ తీరంవరకూ వ్యాపించి నట్లే అయిపోయినది. ఇంక ఎగరవలసిన పని లేదు। 167

మూ. సోఽభిపత్యాశు తద్వక్త్రం నిష్పత్య చ మహాజవః,
అన్తరిక్షే స్థితః శ్రీమానిదం వచన మబ్రవీత్. 168

ప్ర. అ. శ్రీమాన్ = శోభావంతుడూ, మహాజవః = గొప్ప వేగము గల వాడూ అయిన, సః = హనుమంతుడు, ఆశు = శీఘ్రముగా, తద్వక్త్రమ్ = ఆమె ముఖమును, అభిపత్య = పొంది, నిష్పత్య చ = బైటకు వచ్చి, అన్తరిక్షే = ఆకాశమునందు, స్థితః = ఉన్నవాడై, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రీమంతు డైన హనుమంతుడు వెంటనే మహావేగముతో ఆమె ముఖము లోనికి, ప్రవేశించి, మరల బైటకు వచ్చి ఆకాశమునందు నిలచి ఇట్లనెను. 168

మూ. ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తు తే,
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీద్వరస్తవ 169

ప్ర. అ. దాక్షాయణి = ఓ దక్షపుత్రీ। తే = నీయొక్క, వక్త్రమ్ = ముఖమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడను, అస్మి హి = అయితిని కదా. తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక, వైదేహీ = సీత, యత్ర = ఎక్కడ ఉన్నదో అక్కడికి, గమిష్యే = వెళ్ళగలను. తవ = నీయొక్క, వరః చ = వరము కూడ, సత్యమ్ = సత్యముగా, ఆసీత్ = అయెను.

తా. దక్షప్రజాపతి కుమార్తె వైన ఓ సురసా। నీ ముఖములోనికి ప్రవే

తించినాను కదా, నీకు నమస్కారము. ఇంక సీత ఉన్న చోటికి వెళ్ళెదను. నీ వరము కూడ సత్య మైనది కదా. 169

మూ. తం దృష్ట్వా వదనాన్ముక్తం చన్ద్రం రాహుముఖాదివ,
అబ్రవీత్సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్. 170

ప్ర. అ. రాహుముఖాత్ = రాహువుయొక్క ముఖమునుండి, చన్ద్రమివ = చంద్రుని వలె, వదనాత్ = తన ముఖమునుండి, ముక్తమ్ = విడువబడిన, తం వానరమ్ = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, సురసా దేవీ = దేవి యైన సురస, స్వేన = తన సంబంధ మైన, రూపేణ = రూపముతో, అబ్రవీత్ = పలికెను.

తా. రాహుముఖమునుండి చంద్రుడు వలె, తన ముఖమునుండి బైటకు వచ్చిన ఆ హనుమంతుని చూచి, ఆ సురస, తన రూపమును ధరించి, ఇట్లు పలికెను. 170

మూ. అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్,
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా. 171

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడ వైన, హరిశ్రేష్ఠ = ఓ వానరశ్రేష్ఠుడా, అర్థసిద్ధ్యై = కార్యసిద్ధికొరకు, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్ళుము. వైదేహీమ్ = సీతను, మహాత్మనా = మహాత్ము డైన, రాఘవేణ = రామునితో, సమానయస్వ = చేర్చుము.

తా. సౌమ్యుడ వైన ఓ! వానరశ్రేష్ఠుడా! కార్యసిద్ధికై సుఖముగా వెళ్ళుము. సీతను మహాత్ము డైన రామునితో చేర్చుము. 171

మూ. తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
సాధు సాధ్వితి భూతాని ప్రశశంసుస్తదా హరిమ్. 172

ప్ర. అ. సుదుష్కరమ్ = చాల కష్టసాధ్య మైన, హనుమతః = హనుమంతునియొక్క, తత్ = ఆ, తృతీయం కర్మ = మూడవ పనిని, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, భూతాని = ప్రాణు లన్నీ, సాధు సాధు ఇతి = బాగు బాగు అని, హరిమ్ = హనుమంతుని, ప్రశశంసుః = ప్రశంసించినవి.

తా. హనుమంతుడు చేసిన, ఇతరు లెవ్వరూ చేయ జాలని ఆ మూడవ పని చూచి, అందరును "చాలా బాగున్నది, చాలా బాగున్నది" అని ప్రశంసించిరి. 172

మూ. స సాగరమనాధృష్యమభ్యేత్య వరుణాలయమ్,
జగామాకాశమావిశ్య వేగేన గరుడోపమః. 173

ప్ర. అ. వేగేన = వేగముచేత, గరుడోపమః = గరుత్మంతునితో సమానుడైన, సః = హనుమంతుడు. అనాధృష్యమ్ = ఎదిరింప శక్యముకాని, వరుణాలయమ్ = వరుణదేవుని నివాసస్థాన మైన, సాగరమ్ = సముద్రమును, అభ్యేత్య = సమీపించి, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, జగామ = వెళ్లెను.

తా. గరుత్మంతునితో సమాన మైన వేగము గల ఆ హనుమంతుడు ఎవ్వరును ఎదిరింప శక్యము కాని, వరుణనివాస మైన సముద్రమును సమీపించి, ఆకాశమార్గమునందు ప్రయాణము చేసెను. 173

మూ. సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే,
చరితే కైశికాచార్యై రైరావతనిషేవితే. 174

సింహకుఞ్జరశార్దూలపతగోరగవాహనైః,
విమానైః సంపతద్భిశ్చ విమలైః సమలంకృతే. 175

వజ్రాశనిసమాఘాతైః పావకై రుపశోభితే,
కృతపుణ్యైర్మహాభాగైః స్వర్గజిద్భిరలంకృతే. 176

వహతా హవ్యమత్యర్థం సేవితే చిత్రభానునా,
గ్రహనక్షత్రచన్ద్రార్కతారాగణవిభూషితే. 177

మహర్షిగణగన్ధర్వనాగయక్షసముకులే,
వివిక్తే విమలే విశ్వే విశ్వావసునిషేవితే. 178

దేవరాజగజాక్రాన్తే చన్ద్రసూర్యపథే శివే,
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే. 179

బహుశః సేవితే వీరై ర్విద్యాధరగణై ర్వరైః,
జగామ వాయుమార్గే తు గరుత్మానివ మారుతిః. 180

ప్ర. అ. వారిధారాభిః = జలధారలచేత లేదా మేఘములచేత, సేవితే = సేవింపబడినదీ, పతగైశ్చ = పక్షులచేత కూడ, నిషేవితే = సేవింపబడినదీ, కైశికాచార్యైః = కైశికమను రాగమును బోధించు తుంబురుడు మొదలైన వారిచేత (ఈ అర్థం సంతృప్తికరంగా లేదు). చరితే = సంచరింపబడినదీ, ఐరావతనిషేవితే = ఐరావతముచేత సేవింపబడినదీ, సింహకుఞ్జరశార్దూలపతగోరగవాహనైః = సింహములు, ఏనుగులు, పెద్ద పులులు, పక్షులు, సర్పములు వాహనములుగా గల (సింహాదులచే మోయబడుచున్న), సంపతద్భిః = మహావేగముతో వచ్చిపడుచున్న, విమలైః = స్వచ్ఛమైన, విమానైః = విమానములచేత, సమలంకృతే = అలంకరింపబడినదీ, వజ్రాశనిసమాఘాతైః = వజ్రముతోను, పిడుగుతోను సమానమైన ఆఘాతము (వేగముగా తగులు దెబ్బ) గల, పావకైః = అగ్నులచేత, ఉపశోభితే = ప్రకాశింపచేయబడినదీ, కృతపుణ్యైః = చేయబడిన పుణ్యము గల, మహాభాగైః = మహాభాగ్యవంతులైన, స్వర్గజిద్భిః = స్వర్గమును జయించినవారిచేత, అలంకృతే = అలంకరింపబడినదీ, అత్యర్థమ్ = మిక్కిలి, హవ్యమ్ = హవిస్సును, వహతా = మోసికొనిపోవుచున్న, చిత్రభానునా = అగ్నిచేత, సేవితే = సేవింపబడినదీ. గ్రహనక్షత్రచన్ద్రార్కతారాగణవిభూషితే = కుజాదిగ్రహములచేతను, అశ్విన్యాదినక్షత్రములచేతను, చంద్రసూర్యులచేతను, తారకలచేతను అలంకరింపబడినదీ, మహర్షిగణగన్ధర్వనాగయక్షసమాకులే = మహర్షుల సముదాయముచేతను, గంధర్వులచేతను, నాగులచేతను, యక్షులచేతను వ్యాకులమైనదీ, వివిక్తే = జనసంబాధము లేనిదీ, విమలే = నిర్మలమైనదీ, విశ్వే = అంతటా వ్యాపించినదీ, విశ్వావసునిషేవితే = విశ్వావసు వను గంధర్వరాజుచేత సేవింపబడినదీ, దేవరాజగజాక్రాన్తే = దేవేంద్రుని గజముచేత సంచరింపబడేదీ, చన్ద్రసూర్యపథే = చంద్రసూర్యుల మార్గమైనదీ, శివే = మంగళకరమైనదీ, జీవలోకస్య = జీవ (భూ) లోకమునకు, బ్రహ్మనిర్మితే = బ్రహ్మదేవునిచేత నిర్మింపబడిన, వితతే = అతివిశాలమైన, వితానే = వితానమైనదీ, (సభామంటపాదులలో ఇంటి అచ్ఛాదనము కనబడకుండునట్లు కట్టిన చిత్రవిచిత్రమైన రంగులు గల లేదా తెల్లని వస్త్రము వితానము "చాందినీ"), వరైః = శ్రేష్ఠులైన, వీరైః = వీరులైన, విద్యాధరగణైః = విద్యాధరుల సము

దాయముల చేత, బహుశః = అనేక విధములుగా, సేవితే = సేవింపబడినదీ అయిన, వాయుమార్గే = ఆకాశమునందు, మారుతిః = హనుమంతుడు, గరుత్మానివ = గరుత్మంతుడు వలె, జగామ = వెళ్లెను.

తా. హనుమంతుడు ఆకాశమునందు గరుత్మంతుడు వలె ఎగురుచు ప్రయాణము చేసెను. ఆ ఆకాశమునందు మేఘములు, పక్షులు, కైశికాచార్యులు ఐరావతము సంచరించుచుండెను. సింహములు, ఏనుగులు, పెద్దపులులు, పక్షులు, సర్పములూ లాగగా, నిర్మల మైన అందమైన ఎన్నో విమానములు మహా వేగముతో సంచరించుచుండెను. (లేదా సింహాద్యాకారములలో ఉన్న అనేక విమానములు సంచరించుటచే చూడ ముచ్చటగా ఉండెను.) అక్కడక్కడ అగ్ని పిండములు ఢీకొని వజ్రమువంటి, పిడుగులవంటి ధ్వనిని కలిగించుచుండెను. పుణ్యకర్మ లాచరించి స్వర్గము జయించిన ఎందరో మహాభాగ్యవంతులు ఆయా ప్రదేశములను అలంకరించి ఉండిరి. యజ్ఞములలో దేవతలకు సమర్పించిన హవిస్సులను మోసికొనిపోవుచు అగ్ని కనబడుచుండెను. చంద్రుడు, సూర్యుడు, ఇతర గ్రహములు, అశ్విన్యాదినక్షత్రములు, తారాగణములు, అందముగా ప్రకాశించుచుండెను. అది అక్కడక్కడ మహర్షిగణములతోను, గంధర్వులతోను, నాగులతోను, యక్షులతోను నిండి ఉండెను. కొన్ని చోట్ల నిర్జనముగా ఉండెను. అతినిర్మల మైన ఆ ఆకాశము అంతటా వ్యాపించి ఉండెను. విశ్వావసు వను గంధర్వరాజు అక్కడనే నివసించుచుండెను. మంగళప్రదమూ, సూర్యచంద్రుల గమనమార్గమూ అయిన ఆకాశమునందు, దేవేంద్రుని గజములు సంచరించుచుండెను. వీరులూ, ఉత్తములూ అయిన విద్యాధరులు అచట అధికముగా విహరించుచుండిరి. ఆ ఆకాశము జీవలోకమును పైభాగమున అందముగా ఉంచుటకై బ్రహ్మదేవుడు కల్పిన వితానము (చాందినీ) వలె ఉండెను. 174–180

మూ. ప్రదృశ్యమానః సర్వత్ర హనుమాన్మారుతాత్మజః,
భేజేఽమ్బరం నిరాలమ్బం లమ్బపక్ష ఇవాద్రిరాట్. 181

ప్ర. అ. సర్వత్ర = అంతటను, ప్రదృశ్యమానః = చూపబడుచున్న, మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, లమ్బపక్షః = వ్రేలాడుచున్న (లేదా పొడవైన) రెక్కలు గల, అద్రిరాట్ ఇవ = పర్వతరాజు

వలె, నిరాలమ్బమ్ = ఆధారము లేని, అమ్బరమ్ = ఆకాశమును, భేజే = పొందెను.

తా. వాయుతనయు డైన ఆ హనుమంతుడు దీర్ఘ మైన రెక్కలు గల మహాపర్వతము వలె, ఎట్టి ఆధారము లేని ఆకాశమార్గమున ప్రయాణము చేయుచు చాల ఎత్తుగా ఎగురుటచేత అన్ని ప్రదేశములనుంచి కనబడుచుండెను. 181

మూ. ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ,
మనసా చిన్తయామాస ప్రవృద్ధా కామరూపిణీ. 182

ప్ర. అ. కామరూపిణీ = ఇచ్ఛానుసారము రూపము కల, సింహికా నామ = సింహిక అను, రాక్షసీ = రాక్షస స్త్రీ, ప్లవమానమ్ = ఎగురుచున్న, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, ప్రవృద్ధా = పెరిగినదై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. స్వేచ్ఛానుసారముగా రూపములను ధరించగలిగిన సింహిక అను ఒక రాక్షసి, ఆకాశమార్గమున వెళ్లుచున్న హనుమంతుని చూచి, దేహమును పెంచుచు, ఇట్లు ఆలోచించెను. 182

మూ. అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యామ్యహమాశితా,
ఇదం హి మే మహత్సత్త్వం చిరస్య వశమాగతమ్.

ప్ర. అ. చిరస్య = చాల కాలానికి, ఇదమ్ = ఈ, మహత్ = గొప్పదైన, సత్త్వమ్ = జంతువు, మే = నా యొక్క, వశమ్ = వశమును, ఆగతమ్ = పొందినది. దీర్ఘస్య = అతి దీర్ఘ మైన, కాలస్య = కాలమునకు, అద్య = నేడు, అహమ్ = నేను ఆశితా = భోజనము చేసినదానను, భవిష్యామి = కాగలను.

తా. ఇంత కాలానికి ఈ పెద్ద జంతువు నేడు నాకు చిక్కినది. చాల కాలము తరువాత నేడు, మంచి భోజనము చేసెదను. 183

మూ. ఇతి సంచిన్త్య మనసా ఛాయామస్య సమాక్షిపత్,
ఛాయాయాం గృహ్యమాణాయాం చిన్తయామాస వానరః.

ప్ర. అ. ఇతి = ఇట్లు, మనసా = మనస్సుతో, సంచిన్త్య = ఆలోచించి, అస్య = ఈతని యొక్క, ఛాయామ్ = నీడను, సమాక్షిపత్ = ఆకర్షించెను. ఛాయాయామ్ =

= సీత, గృహ్యమాణాయామ్ = గ్రహింపబడుచున్న దగుచుండగా, వానరః = హనుమంతుడు, చిన్తయామాస = ఆలోచించెను.

తా. ఆ రాక్షసి ఈ విధముగా ఆలోచించి, హనుమంతుని నీడను ఆకర్షించెను. ఈ విధముగా నీడ ఆకర్షింపబడి నప్పుడు హనుమంతుడు ఇట్లు అనుకొనెను. 184

మూ. సమాక్షిప్తోఽస్మి తరసా పఙ్గూకృతపరాక్రమః,
ప్రతిలోమేన వాతేన మహానౌరివ సాగరే. 185

ప్ర. అ. సాగరే = సముద్రమునందు, ప్రతిలోమేన = ప్రతికూలమైన, వాతేన = వాయువుచేత, మహానౌరివ = గొప్ప పడవ వలె, పఙ్గూకృతపరాక్రమః = కుంటిదిగా చేయబడిన (తగ్గింపబడిన) పరాక్రమము కలవాడనై, తరసా = బలాత్కారముగా, సమాక్షిప్తః = లాగబడినవాడను, అస్మి = అగుచున్నాను.

తా. మహాసముద్రమధ్యమునందు ఎదురుగాలిచే ఓడ నడక వలె హటాత్తుగా నా పరాక్రమము తగ్గిపోయినది. నన్నెవరో ఈడ్చివేయుచున్నట్లున్నది.

మూ. తిర్యగూర్ధ్వమధశ్చైవ వీక్షమాణ స్తతః కపిః,
దదర్శ స మహత్సత్త్వముత్థితం లవణామ్భసి. 186

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కపిః = హనుమంతుడు, తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వమ్ = పైకి, అధశ్చైవ = క్రిందికి, వీక్షమాణః = చూచుచు, లవణామ్భసి = లవణసముద్రమునందు, ఉత్థితమ్ = లేచిన, మహత్ = పెద్ద, సత్త్వమ్ = జంతువును, దదర్శ = చూచెను.

తా. పిమ్మట హనుమంతుడు అడ్డముగాను, పైకి, క్రిందికి చూచుచు లవణసముద్రమునందు లేచిన ఒక మహాజంతువును చూచెను. 186

మూ. తద్దృష్ట్వా చిన్తయామాస మారుతిర్వికృతాననమ్,
కపిరాజేన కథితం సత్త్వమద్భుతదర్శనమ్, 187
ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః.

ప్ర. అ. మారుతిః = హనుమంతుడు, వికృతాననమ్ = వికృతమైన

ముఖము గల, తత్ = ఆ జంతువును, దృష్ట్వా = చూచి, చిన్తయామాస = ఆలోచించెను. కపిరాజేన = సుగ్రీవునిచేత, కథితమ్ = చెప్పబడిన, అద్భుత దర్శనమ్ = అద్భుత మైన దర్శనము గల. ఛాయాగ్రాహి = నీడను ఆకర్షించు. మహావీర్యమ్ = గొప్ప పరాక్రమము గల, తత్ = ఆ. సత్త్వమ్ = జంతువు, ఇదమ్ = ఇదే. అత్ర = ఈ విషయమున, సంశయః = సంశయము, న = లేదు.

తా. హనుమంతుడు, వికృత మైన ముఖము గల ఆ జంతువును చూచి ఇట్లు ఆలోచించెను. చూచుటకు ఆశ్చర్యకరమూ, నీడను ఆకర్షించే మహా వీర్యము కలదీ అయిన, సుగ్రీవుడు చెప్పిన, ఆ జంతువు ఇదే; సందేహము లేదు.

మూ. స తాం బుద్ధ్వార్థతత్త్వేన సింహికాం మతిమాన్కపిః,
వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః.

ప్ర. అ. మతిమాన్ = బుద్ధిమంతు డైన, సః కపిః = ఆ హనుమంతుడు, తామ్ = దానిని, అర్థతత్త్వేన = యథార్థముగా, సింహికామ్ = సింహికనుగా, బుద్ధ్వా = తెలిసికొని, మహాకాయః = గొప్ప దేహముకలవా డగునట్లు, ప్రావృషి = వర్షాకాలమునందు. వలాహకః ఇవ = మేఘము వలె, వ్యవర్ధత = వృద్ధిపొందెను.

తా. బుద్ధిమంతు డైన ఆ హనుమంతుడు ఆమె సింహికయే అను యథార్థమును తెలుసుకొని, వర్షాకాలమునందు మేఘము వలె, దేహము పెంచెను. 188

మూ. తస్య సా కాయముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః, 189
వక్త్రం ప్రసారయామాస పాతాళాన్తరసన్నిభమ్.

ప్ర. అ. సా = ఆ సింహిక, తస్య మహాకపేః = ఆ హనుమంతుని యొక్క, కాయమ్ = శరీరమును, వర్ధమానమ్ = వృద్ధిపొందుచున్న దానినిగా, ఉద్వీక్ష్య = చూచి, పాతాళాన్తరసన్నిభమ్ = పాతాళమధ్యముతో సమాన మైన, వక్త్రమ్ = ముఖమును, ప్రసారయామాస = చాపెను.

తా. హనుమంతుని శరీరము పెరుగుట చూచిన ఆ సింహిక పాతాళ మధ్యము వంటి తన ముఖమును చాపెను. 189

మూ. ఘనరాజీవ గర్జన్తీ వానరం సమభిద్రవత్. 190

స దదర్శ తతస్తస్యా వివృతం సుమహన్ముఖమ్,
కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః. 191

ప్ర. అ. ఘనరాజీవ = మేఘపంక్తి వలె, గర్జన్తీ = గర్జించుచున్నదై, వానరమ్ = హనుమంతుని గూర్చి, సమభిద్రవత్ = పరుగెత్తెను. తతః = అటు పిమ్మట, మేధావీ = బుద్ధిశాలి యైన, మహాకపిః = హనుమంతుడు, తస్యాః = ఆమెయొక్క, వివృతమ్ = తెరవబడిన, కాయమాత్రమ్ = తన దేహముతో సమాన మైన ప్రమాణము గల, సుమహత్ = చాల పెద్ద దైన, ముఖమ్ = ముఖమును, మర్మాణి చ = మర్మప్రదేశములను, దదర్శ = చూచెను.

తా. ఆమె మేఘపంక్తి వలె గర్జించుచు, హనుమంతుని వైపు పరుగెత్తెను. అప్పుడు, బుద్ధిశాలి యైన ఆ హనుమంతుడు, తన దేహమంత ప్రమాణములో ఉన్న, తెరవబడిన, ఆమె నోటిని, మర్మస్థానములనూ చూచెను. 190, 191

మూ. స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః,
సంక్షిప్య ముహురాత్మానం నిష్పపాత మహాబలః. 192

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము కల, వజ్రసంహననః = వజ్రము వంటి దేహము గల, సః కపిః = ఆ హనుమంతుడు, ఆత్మానమ్ = దేహమును, ముహుః = మాటిమాటికి (ఇంకను), సంక్షిప్య = కుదించి, తస్యాః = ఆమెయొక్క, వివృతే = తెరవబడిన, వక్త్రే = ముఖమునందు, నిష్పపాత = పడెను.

తా. వజ్రము వంటి దేహము గల, మహాబలశాలి యైన హనుమంతుడు తన శరీరమును చాలా చిన్నదిగా చేసి, తెరచిన ఆమె నోటిలో పడెను. 192

మూ. ఆస్యే తస్యా నిమజ్జన్తం దదృశుః సిద్ధచారణాః,
గ్రస్యమానం యథా చన్ద్రం పూర్ణం పర్వణి రాహుణా.

ప్ర. అ. సిద్ధచారణాః = సిద్ధులూ, చారణులూ, తస్యాః = ఆమెయొక్క, ఆస్యే = ముఖములో, నిమజ్జన్తమ్ = మునిగిపోవుచున్న ఆ హనుమంతుని, పర్వణి = పూర్ణిమాపర్వమునందు, రాహుణా = రాహువుచేత, గ్రస్యమానమ్ = మ్రింగివేయబడుచున్న, పూర్ణమ్ = పూర్ణు డైన, చన్ద్రం యథా = చంద్రుని వలె, దదృశుః = చూచిరి.

తా. పూర్ణిమయందు రాహువుచేత మ్రింగివేయబడుచున్న పూర్ణచంద్రుడు వలె, హనుమంతుడు ఆమె ముఖములో మునిగిపోవుచుండగా సిద్ధులూ, చారణులూ చూచిరి. 193

మూ. తత స్తస్యా నఖై స్తీక్ష్ణైర్మర్మాణ్యుత్కృత్య వానరః,
ఉత్పపాతాథ వేగేన మనఃసంపాతవిక్రమః. 194

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరః = హనుమంతుడు, తీక్ష్ణైః=తీక్ష్ణమైన, నఖైః = గోళ్ళతో, తస్యాః=ఆ సింహికయొక్క, మర్మాణి = మర్మప్రదేశములను, ఉత్కృత్య=ఛేదించి, అథ = పిమ్మట, మనఃసంపాతవిక్రమః =మనోవేగము వంటి వేగము గలవాడై, వేగేన = వేగముతో, ఉత్పపాత=పైకి ఎగిరెను.

తా. పిమ్మట హనుమంతుడు వాడి యైన గోళ్ళతో ఆమె శరీరములో ఉన్న గుండె మొద లైన మర్మస్థానములను పెకలించివేసి, మనోవేగముతో సమాన మైన వేగముతో పైకి వచ్చెను. 194

మూ. తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ,
స కపిప్రవరో వేగా ద్వవృధే పునరాత్మవాన్. 195

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతు డైన, సః = ఆ, కపిప్రవరః = హనుమంతుడు, తామ్=ఆమెను, దృష్ట్వా చ=చూపు (ఆలోచన)చేతను, ధృత్యా చ= ధైర్యముచేతను, దాక్షిణ్యేన = నేర్పుచేతను, నిపాత్య = పడవేసి, పునః=తిరిగి, వేగాత్=వేగమువలన, వవృధే=వృద్ధిపొందెను.

తా. మహాబుద్ధిశాలి యైన ఆ హనుమంతుడు తగు ఉపాయమును ఆలోచించి, ధైర్యముతోను, నేర్పుతోను ఆ సింహికను సంహరించి, మరల వేగముతో పెరిగెను. 195

మూ. హృతహృత్సా హనుమతా పపాత విధురాంభసి,
తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్. 196
భూతాన్యాకాశచారీణి తమూచుః ప్లవగోత్తమమ్.

ప్ర. అ. సా=ఆ సింహిక, హనుమతా=హనుమంతునిచేత, హృతహృత్=హరింపబడిన హృదయముగలదై, విధురా=వ్యాకులురాలై, అమ్భసి=నీటిలో, పపాత=పడెను. వానరేణ=హనుమంతునిచేత, ఆశు=శీఘ్రముగా, హతామ్=చంపబడిన, పతితామ్=పడిపోయిన, తాం సింహికామ్=ఆ సింహికను, వీక్ష్య=చూచి, ఆకాశచారిణః=ఆకాశమునందు సంచరించుచున్న, భూతాని=భూతములు, తమ్=ఆ, ప్లవగోత్తమమ్=హనుమంతుని గూర్చి, ఊచుః=పలికినవి.

తా. హనుమంతుడు హృదయమును త్రుంచివేయగా ఆ సింహిక మరణించి క్రింద పడిపోయెను. హనుమంతుడు శీఘ్రముగా చంపివేసిన ఆ సింహికను చూచి ఆకాశమునందు సంచరించు సిద్ధగంధర్వాదులు హనుమంతునితో ఇట్లు పలికిరి. 196

మూ. భీమమద్య కృతం కర్మ మహత్సత్త్వం త్వయా హతమ్,
సాధయార్థమభిప్రేతమరిష్టం ప్లవతాం వర.

ప్ర. అ. ప్లవతాం వర=వానరులలో శ్రేష్ఠుడా! అద్య=ఇప్పుడు, త్వయా=నీచేత, మహత్=గొప్ప, సత్త్వమ్=జంతువు, హతమ్=చంపబడినది. భీమమ్=భయంకరమైన, కర్మ=పని, కృతమ్=చేయబడినది. అభిప్రేతమ్=ఇష్టమైన, అర్థమ్=కార్యమును, అరిష్టమ్=మంగళకరమగునట్లుగా. సాధయ=సాధించుము.

తా. ఓ వానరోత్తమా! ఈ గొప్ప జంతువును చంపి, నీవు, ఇపుడు భయంకరమైన కార్యము చేసినావు. నీకిష్టమైన పనిని, మంగళప్రదమగునట్లు సాధించుము. 197

మూ. యస్య త్వేతాని చత్వారి వానరేన్ద్ర యథా తవ, 198
ధృతిర్దృష్టిర్మతిర్దాక్ష్యం స కర్మసు న సీదతి.

ప్ర. అ. వానరేన్ద్ర=ఓ వానరశ్రేష్ఠుడా! యస్య=ఎవనికి, ధృతిః=ధైర్యము, దృష్టిః=మంచి ఆలోచనాశక్తి, మతిః=బుద్ధి, దాక్ష్యమ్=నేర్పు, ఏతాని=ఈ, చత్వారి=నాలుగు లక్షణములు, తవ యథా=నీకు వలె ఉండునో, సః=అతడు, కర్మసు=పనులలో, న సీదతి=నశించడు.

తా. ఓ వానరోత్తమా! నీకున్నట్లు, ఎవనికి, ధైర్యము, సూక్ష్మదృష్టి, బుద్ధి, నేర్పు అను నాలుగు లక్షణము లుండునో అతడు ఏ కార్యము చేయవలసి వచ్చినను వైఫల్యము పొందడు. 198

మూ. స తైః సంభావితః పూజ్యః ప్రతిపన్నప్రయోజనః, 199
జగామాకాశమావిశ్య పన్నగాశనవత్కపిః.

ప్ర. అ. పూజ్యః = పూజింపదగిన. సః కపిః = ఆ హనుమంతుడు, తైః = వారిచేత, సంభావితః = గౌరవించబడినవాడై, ప్రతిపన్నప్రయోజనః = పొందబడిన లేదా (నిర్ణయింపబడిన) ప్రయోజనము కలవాడై, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, పన్నగాశనవత్ = గరుత్మంతుని వలె, జగామ = వెళ్ళెను.

తా. పూజ్యుడైన హనుమంతుడు, వారిచే ఇట్లు స్తుతింపబడుచు, తాను చేయవలసిన కార్యమును గూర్చి నిశ్చయించుకొని, గరుత్మంతుని వలె, ఆకాశమార్గమునందు ప్రయాణము సాగించెను. 199

మూ. ప్రాప్తభూయిష్ఠపారస్తు సర్వతః ప్రతిలోకయన్, 200
యోజనానాం శతస్యాన్తే వనరాజిం దదర్శ సః.

ప్ర. అ. సః = హనుమంతుడు, ప్రాప్తభూయిష్ఠపారః = ఇంచుమించుగా పొందబడిన ఆవలి ఒడ్డు కలవాడై, సర్వతః = నలువైపులా. ప్రతిలోకయన్ = చూచుచు, యోజనానామ్ = యోజనములయొక్క, శతస్య = శతముయొక్క, అన్తే = అంతమునందు, వనరాజిమ్ = వృక్షముల పంక్తిని, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఇంచుమించు ఆవలి ఒడ్డు సమీపించి, నలుమూలల పరికించుచు, నూరు యోజనముల తరవాత ఒక వృక్షపంక్తిని చూచెను. 200

మూ. దదర్శ చ పతన్నేవ వివిధద్రుమభూషితమ్, 201
ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనాని చ.

ప్ర. అ. శాఖామృగశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు, పతన్నేవ = క్రిందికి దిగుచునే. వివిధద్రుమభూషితమ్ = అనేకవిధములైన వృక్షములచేత అలంకరింపబడిన, ద్వీపమ్ = ద్వీపమును, మలయోపవనాని చ = మలయపర్వతప్రాంతమునందలి వనములను, దదర్శ చ = చూచెను.

తా. హనుమంతుడు క్రిందికి దిగగానే, అనేకవృక్షములచేత అలంకరింపబడిన ద్వీపమును, మలయపర్వతప్రాంతములందలి వనములను చూచెను. 201

మూ. సాగరం సాగరానూపం సాగరానూపజాన్ ద్రుమాన్,
సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్.

స మహామేఘసంకాశం సమీక్ష్యాత్మానమాత్మవాన్, 203
నిరున్ధన్తమివాకాశం చకార మతిమాన్ మతిమ్.

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడు, మతిమాన్ = మంచి ఆలోచన కలవాడూ అయిన, సః = హనుమంతుడు, సాగరమ్ = సముద్రమును, సాగరానూపమ్ = సముద్రమునకు సంబంధించిన జలప్రాయప్రదేశమును, సాగరానూపజాన్ = సముద్రము ప్రక్క నున్న జలప్రాయప్రదేశములందు పుట్టిన, ద్రుమాన్ = వృక్షములను, సాగరస్య = సముద్రుని యొక్క, పత్నీనామ్ = భార్యలైన నదుల యొక్క, ముఖాన్యపి చ = ముఖములను (నదులు సముద్రములో కలియు ప్రదేశములను), విలోకయన్ = చూచుచు, మహామేఘసంకాశమ్ = పెద్ద మేఘముతో సమానమైనదీ, ఆకాశమ్ = ఆకాశమును, నిరున్ధన్తమివ = అడ్డగించుచున్నట్లున్న, ఆత్మానమ్ = తనను (తన దేహమును), సమీక్ష్య = చూచి, మతిమ్ = ఆలోచనను, చకార = చేసెను.

తా. బుద్ధిశాలి, మంచి ఆలోచన చేయ గల సమర్థుడూ అయిన ఆ హనుమంతుడు, సముద్రమునూ, సముద్రతీరమునందలి జలప్రాయ (నీటితో నిండిన) ప్రదేశములనూ, ఆ ప్రదేశములలో పెరిగిన వృక్షములనూ, నదీముఖములను చూచుచు, ఆకాశమును అడ్డగించుచున్నట్లున్న, మహామేఘము వలె ఉన్న తన శరీరమును చూచుకొని ఇట్లు తలచెను. 203

మూ. కాయవృద్ధిం ప్రవేగం చ మమ దృష్ట్వైవ రాక్షసాః, 204
మయి కౌతూహలం కుర్యురితి మేనే మహాకపిః.

ప్ర. అ. మమ = నా యొక్క, కాయవృద్ధిమ్ = శరీరము యొక్క వృద్ధినీ, ప్రవేగం చ = వేగమునూ, దృష్ట్వైవ = చూడగానే, రాక్షసాః = రాక్షసులు, మయి = నాయందు, కౌతూహలమ్ = కుతూహలమును, కుర్యుః = చేయుదురు, ఇతి = అని, మహాకపిః = హనుమంతుడు, మేనే = తలంచెను.

తా. నా పెద్ద శరీరమును, వేగమును చూడగానే రాక్షసులు నా విషయమున ''ఇత డెవరా ?'' అని కుతూహలము చూపుదురు అని హనుమంతుడు తలంచెను. 204

మూ. తతః శరీరం సంక్షిప్య తన్మహీధరసన్నిభమ్, 205
పునః ప్రకృతిమాపేదే వీతమోహ ఇవాత్మవాన్.

ప్ర. అ. తతః=ఆ కారణమువలన, తత్=ఆ, మహీధరసన్నిభమ్=పర్వతముతో సమానమైన, తత్=ఆ, శరీరమ్=శరీరమును, సంక్షిప్య=చిన్నది చేసి, వీతమోహః=తొలగిన మోహము గల, ఆత్మవానివ=ఆత్మజ్ఞానవంతుడువలె, ప్రకృతిమ్=స్వభావమును, ఆపేదే=పొందెను.

తా. ఆకారణముచేత హనుమంతుడు పర్వతముతో సమానమైన ఆ శరీరమును చిన్నదిగా చేసి, అజ్ఞానము తొలగిపోయిన ఆత్మజ్ఞాని తన పరమార్థస్వరూపమును పొందినట్లు, సహజరూపమును పొందెను. 205

మూ. తద్రూపమతిసంక్షిప్య హనుమాన్ ప్రకృతౌ స్థితః 206
త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః.

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, తత్=ఆ, రూపమ్=రూపమును, అతిసంక్షిప్య=చాలా చిన్నది చేసి, బలివీర్యహరః=బలియొక్క పరాక్రమమును హరించిన, హరిః=విష్ణువు (త్రివిక్రముడు), త్రీన్=మూడు, క్రమాన్=పాదన్యాసములను, విక్రమ్య ఇవ=చేసి వలె, ప్రకృతౌ=స్వభావమునందు, స్థితః=ఉండెను.

తా. బలిచక్రవర్తి ఐశ్వర్యమును హరించుటకై త్రివిక్రముడైన విష్ణువు (వామనుడు) మూడు అడుగులు వేసిన పిమ్మట తన స్వాభావికమైన వామనరూపమును పొందినట్లు హనుమంతుడు తన పెద్ద రూపమును ఉపసంహరించుకొని స్వాభావికరూపము ధరించెను. 206

మూ. స చారునానావిధరూపధారీ
పరం సమాసాద్య సముద్రతీరమ్,
పరైరశక్యః ప్రతిపన్నరూపః
సమీక్షితాత్మా సమవేక్షితార్థః. 207

ప్ర. అ. చారునానావిధరూపధారీ=సుందరమైన అనేకవిధములైన రూపములను ధరించ సమర్థుడూ, పరైః=శత్రువులచేత, అశక్యః=జయింప

శక్యము కానివాడూ అయిన, సః = హనుమంతుడు, పరమ్ = ఆవలి, సముద్ర తీరమ్ = సముద్రపు ఒడ్డును, సమాసాద్య = పొంది, సమీక్షితాత్మా = చూచు కొనబడిన శరీరముకలవాడై, ప్రతిపన్నరూపః = పొందబడిన రూపముల ఆకారము కలవాడై, సమవేక్షితార్థః = నిశ్చయింపబడిన కార్యము కలవాడై (ఉండెను).

తా. అంత మైన అనేకరూపములు ధరింప సమర్థుడూ, శత్రువులకు జయింప శక్యముకానివాడూ అయిన హనుమంతుడు, సముద్రము ఆవలి ఒడ్డు చేరి, తన మహాప్రమాణ మైన శరీరమును చూచుకొని, ఇంక తానేమి చేయవలెనో నిర్ణయించుకొని, చిన్నరూపము ధరించి ఉండెను. 207

మూ. తతః స లమ్బస్య గిరేః సమృద్ధే
విచిత్రకూటే నిపపాత కూటే,
సకేతకోద్దాలకనాళికేరే
మహాద్రికూటప్రతిమో మహాత్మా. 208

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాద్రికూటప్రతిమః = గొప్ప పర్వతపు దరియతో సమాను డైన, సః = ఆ, మహాత్మా = మహాత్ము డైన హనుమంతుడు, లమ్బస్య గిరేః = లంబ మను పర్వతముయొక్క, విచిత్రకూటే = వివిధవర్ణములు గల శిఖరములు గల, సమృద్ధే = అనేకవిధము లగు వస్తువులతో నిండినదీ, సకేతకోద్దాలకనాళికేరే = మొగలిపొదలతోను, విరిగిచెట్లతోను, కొబ్బరిచెట్లతోను కూడినదీ అయిన, కూటే = శిఖరమునందు, నిపపాత = దిగెను.

తా. పిమ్మట, మహాపర్వతశిఖరమువంటి దేహము గల, మహాత్ము డైన హనుమంతుడు, సర్వవస్తుసమృద్ధమూ, విచిత్ర మైన రంగులు గల చిన్న చిన్న శిఖరములు కలదీ, మొగలి డొంకలు, విరిగిచెట్లు, కొబ్బరిచెట్లు మొదలైన వాటితో నిండినదీ అయిన, లంబపర్వతశిఖరముపై దిగెను. 208

మూ. తతస్తు సంప్రాప్య సముద్రతీరం
సమీక్ష్య లఙ్కాం గిరివర్యమూర్ధ్ని.

కపిస్తు తస్మిన్నిపపాత పర్వతే
విధూయ రూపం వ్యథయన్మృగద్విజాన్. 209

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కపిః తు = హనుమంతుడు, సముద్ర తీరమ్ = సముద్రతీరమును, సంప్రాప్య = పొంది, గిరివర్యమూర్ధ్ని = ఆ గిరి శ్రేష్ఠము పైభాగమునందు, లఙ్కామ్ = లంకను, సమీక్ష్య = చూచి, రూపమ్ = రూపమును (పూర్వశరీరమును), విధూయ = విడచి, మృగద్విజాన్ = మృగములను పక్షులనూ, వ్యథయన్ = బాధించుచు, తస్మిన్ = ఆ, పర్వతే = పర్వతముపైన, నిపపాత = దిగెను.

తా. ఆ హనుమంతుడు సముద్రతీరము చేరి, ఆ మహాపర్వతము పైభాగమునందున్న లంకాపట్టణమును చూచి, తన పూర్వశరీరమును విడచి, ఆ పర్వతముపై దిగెను. అతడు హటాత్తుగా దిగుటచే అక్కడ నున్న మృగములు, పక్షులు భయపడినవి. 209

మూ. స సాగరం దానవపన్నగాయుతం
బలేన విక్రమ్య మహోర్మిమాలినమ్,
నిపత్య తీరే చ మహోదధేస్తదా
దదర్శ లఙ్కా మమరావతీమివ. 210

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సున్దరకాణ్డే
ప్రథమః సర్గః.

ప్ర. అ. సః = హనుమంతుడు, దానవపన్నగాయుతమ్ = దానవులతోను, పన్నగులతోను కూడిన, మహోర్మిమాలినమ్ = గొప్ప తరంగపంక్తులు గల, సాగరమ్ = సముద్రమును, బలేన = బలముచేత, విక్రమ్య = దాటి, మహోదధేః = మహాసముద్రముయొక్క, తీరే = తీరముపై, నిపత్య = దిగి, తదా = అప్పుడు, అమరావతీమివ = స్వర్గరాజధాని యైన అమరావతి వలె ఉన్న, లఙ్కామ్ = లంకను, దదర్శ = చూచెను.

రా. హనుమంతుడు పెద్ద పెద్ద తరంగముల పంక్తులతో నిండినదీ, దానవులకూ, పన్నగులకూ నివాసస్థానమూ అయిన సముద్రమును అలవుచేత దాటి, సముద్రతీరముపై దిగి, అక్కడ అమరావతి వలె ఉన్న లంకాపట్టణమును చూచెను. 210

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో మొదటి సర్గ సమాప్తము.

✱✱

## అథ ద్వితీయః సర్గః

[లంకావర్ణనము, లంకలో ప్రవేశించుటను గూర్చి హనుమంతుడు ఆలోచించుట, చిన్న రూపముతో ఆతడు లంకలో ప్రవేశించుట, చంద్రోదయశోభావర్ణనము]

మూ. స సాగరమనాధృష్యమతిక్రమ్య మహాబలః,
త్రికూటశిఖరే లఙ్కాం స్థితాం స్వస్థో దదర్శ హ. 1

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, సః = హనుమంతుడు, అనాధృష్యమ్ = ఎదిరింప శక్యము కాని, సాగరమ్ = సముద్రమును, అతిక్రమ్య = దాటి, స్వస్థః = ఆయాసము లేకుండ స్వస్థుడై, త్రికూటశిఖరే = త్రికూట పర్వతశిఖరమునందు, స్థితామ్ = ఉన్న, లఙ్కామ్ = లంకను, దదర్శ హ = చూచెను.

తా. మహాబలశాలి యైన హనుమంతుడు, ఎవ్వరును ఎదిరింప శక్యము కాని సముద్రమును దాటి, ఏ మాత్రము అలసట లేనివాడై, త్రికూటపర్వత శిఖరమునం దున్న లంకను చూచెను. 1

మూ. తతః పాదపముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్,
అభివృష్టః స్థితస్తత్ర బభౌ పుష్పమయో యథా. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తత్ర = అక్కడ, స్థితః = నిలచి యున్న, వీర్యవాన్ = పరాక్రమవంతు డైన హనుమంతుడు, పాదపముక్తేన = వృక్షములచే విడువబడిన, పుష్పవర్షేణ = పుష్పముల వర్షముచేత, అభివృష్టః = వర్షింపబడినవాడై, పుష్పమయో యథా = పుష్పముల ఆకార మైనవాడు వలె, బభౌ = ప్రకాశించెను.

తా. అక్కడ నిలచిన హనుమంతునిపై వృక్షములనుండి పుష్పములు వర్షము వలె కురిసెను. వాటిచేత కప్పబడి అతడు పుష్పాలతో నిర్మించిన విగ్రహము వలె కనబడెను. 2

మూ. యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వాప్యుత్తమవిక్రమః,
అనిఃశ్వసన్ కపిస్తత్ర న గ్లానిమధిగచ్ఛతి. 3

ప్ర. అ. ఉత్తమవిక్రమః = ఉత్తమ మైన పరాక్రమము గలవాడు, శ్రీమాన్ = శ్రీమంతుడు అయిన, కపిః = హనుమంతుడు, యోజనానామ్ = యోజనముల, శతమ్ = శతమును, తీర్త్వాపి = దాటి కూడ, అనిఃశ్వసన్ = నిట్టూర్పు కూడ విడవనివాడై, తత్ర = అక్కడ, గ్లానిమ్ = అలసటను, న అధిగచ్ఛతి = పొందలేదు.

తా. మహాపరాక్రమశాలి, శోభాసంపన్నుడూ అయిన ఆ హనుమంతుడు నూరు యోజనముల దూరము దాటినను, ఏ మాత్రము అలసట పొందలేదు. నిట్టూర్పు కూడా విడువలేదు. 3

మూ. శతాన్యహం యోజనానాం క్రమేయం సుబహూన్యపి,
కిం పునః సాగరస్యాన్తం సంఖ్యాతం శతయోజనమ్. 4

ప్ర. అ. అహమ్ = నేను, యోజనానామ్ = యోజనములయొక్క, సుబహూని = అనేక మైన, శతాన్యపి = వందలను కూడ, క్రమేయమ్ = దాటుదును. శతయోజనమ్ = నూరుయోజనములుగా, సంఖ్యాతమ్ = లెక్కపెట్టబడిన, సాగరస్య = సముద్రముయొక్క, అన్తమ్ = అంతమును, కిం పునః = చెప్పనేల?

తా. నేను ఎన్నో వందల యోజనములు కూడ దాటగలను. నూరు యోజనములు అను పరిమితసంఖ్య గల సముద్రదూరము మాట చెప్పవలెనా? 4

మూ. స తు వీర్యవతాం శ్రేష్ఠః ప్లవతామపి చోత్తమః,
జగామ వేగవాన్ లఙ్కాం లఙ్ఘయిత్వా మహోదధిమ్. 5

ప్ర. అ. వీర్యవతామ్ = పరాక్రమవంతులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడూ, ప్లవతామపి = ఎగురగల్గినవారిలో కూడ, ఉత్తమః = ఉత్తముడూ అయిన, సః తు = ఆ

హనుమంతుడు, వేగవాన్ = వేగవంతుడై, మహోదధిమ్ = మహాసముద్రమును, లఙ్ఘయిత్వా = దాటి. లఙ్కామ్ = లంకను గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడూ, ఎగురగలవారిలో ఉత్తముడూ అయిన హనుమంతుడు, వేగముగా మహాసముద్రమును దాటి లంక చేరెను. 5

మూ. శాద్వలాని చ నీలాని గన్ధవన్తి వనాని చ,
గణ్డవన్తి చ మధ్యేన జగామ నగవన్తి చ. 6

ప్ర. అ. నీలాని = నల్లని, శాద్వలాని = పచ్చిక బీళ్లను, గన్ధవన్తి = సువాసన గలవీ, గణ్డవన్తి చ = పెద్ద పెద్ద శిలలు కలవీ, మధ్యేన = మధ్యముచేత (నందు), నగవన్తి చ = కొండలు గలవీ అయిన, వనాని చ = అరణ్యములను, జగామ = సంచరించెను.

తా. నల్లని పచ్చికబీళ్లయందు, మధ్య మధ్య పెద్ద శిలలూ, పర్వతములూ ఉన్న అరణ్యములందూ సంచరించెను. 6

మూ. శైలాంశ్చ తరుసంఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః,
అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః. 7

ప్ర. అ. ప్లవగర్షభః = వానరశ్రేష్ఠుడైన, తేజస్వీ = తేజశ్శాలి యైన, హనుమాన్ = హనుమంతుడు, తరుసంఛన్నాన్ = వృక్షములచేత కప్పబడిన, శైలాంశ్చ = పర్వతములను, పుష్పితాః = పుష్పించిన, వనరాజీశ్చ = వృక్షపంక్తులను, అభిచక్రామ = సంచరించెను.

తా. గొప్ప తేజస్సు కలవాడూ, వానరశ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు వృక్షములతో నిండి యున్న పర్వతములమీదా, పుష్పించిన వృక్షపంక్తుల మీదా సంచరించెను. 7

మూ. స తస్మిన్నచలే తిష్ఠన్వనాన్యుపవనాని చ,
స నగాగ్రే చ తాం లఙ్కాం దదర్శ పవనాత్మజః. 8

ప్ర. అ. సః పవనాత్మజః = ఆ హనుమంతుడు. తస్మిన్ = ఆ, అచలే = పర్వతము మీద, తిష్ఠన్ = నిలచినవాడై, వనాని = వనములను, ఉపవనాని చ = ఉద్యానములను, నగాగ్రే = పర్వతాగ్రమునందు, తామ్ = ఆ, లఙ్కామ్ = లంకను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ పర్వతముపై నిలచి, వనములను, ఉద్యానములను పర్వతాగ్రమునం దున్న లంకాపట్టణమును చూచెను. 8

మూ. సరళాన్ కర్ణికారాంశ్చ ఖర్జూరాంశ్చ సుపుష్పితాన్,
ప్రియాళాన్ముచులిన్దాంశ్చ కుటజాన్ కేతకానపి. 9

ప్రియఙ్గూన్ గన్ధపూర్ణాంశ్చ నీపాన్ సప్తచ్ఛదాంస్తథా,
అసనాన్ కోవిదారాంశ్చ కరవీరాంశ్చ పుష్పితాన్. 10

పుష్పభారనిబద్ధాంశ్చ తథా ముకుళితానపి,
పాదపాన్ విహగాకీర్ణాన్ పవనాధూతమస్తకాన్. 11

హంసకారణ్డవాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః,
ఆక్రీడాన్ వివిధాన్ రమ్యాన్వివిధాంశ్చ జలాశయాన్. 12

సంతతాన్ వివిధైర్వృక్షైః సర్వర్తుఫలపుష్పితైః,
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుఞ్జరః. 13

ప్ర. అ. కపికుఞ్జరః = హనుమంతుడు, సరళాన్ = సరళవృక్షములను, కర్ణికారాంశ్చ = కొండగోగు చెట్లను, సుపుష్పితాన్ = బాగుగా పుష్పించిన, ఖర్జూరాంశ్చ = ఖర్జూరపుచెట్లను, ప్రియాలాన్ = మోరటి చెట్లను, ముచులిందాంశ్చ = నిమ్మచెట్లను, కుటజాన్ = కొండమల్లెచెట్లను, కేతకానపి = మొగలిచెట్లను, గన్ధపూర్ణాన్ = సువాసనతో నిండిన, ప్రియఙ్గూంశ్చ = పిప్పలిచెట్లను, నీపాన్ = మంకెన చెట్లను, తథా = మరియు, సప్తచ్ఛదాన్ = ఏడాకుల అరటిచెట్లను, అసనాన్ = వేగిసచెట్లను, కోవిదారాంశ్చ = కాంచనంచెట్లను, పుష్పితాన్ = పుష్పించిన, కరవీరాంశ్చ = గన్నేరుచెట్లను, పుష్పభారనిబద్ధాంశ్చ = పుష్పముల బరువుచే కట్టబడినవి, తథా = మరియు, ముకులితానపి = మొగ్గలు తొడిగినవి, విహగాకీర్ణాన్ = పక్షులచే వ్యాకులమైనవి, పవనాధూతమస్తకాన్ = గాలిచే కదల్పబడిన శిఖరములు కలవి అయిన, పాదపాన్ = వృక్షములనూ, హంసకారణ్డవాకీర్ణాః = హంసలతోను కారండవపక్షులతోను వ్యాపింపబడినవి, పద్మోత్పలాయుతాః = పద్మములతోను, కలువలతోను కూడినవి అయిన, వాపీః = దిగుడుబావులను, వివిధాన్ = అనేకవిధములైన, రమ్యాన్ = మనోహరములైన, ఆక్రీడాన్ = విహారస్థానములను, సర్వర్తుఫలపుష్పితైః = అన్ని ఋతువులలో లభించు

ఫలములు కలవి, పుష్పించినవి అయిన. వివిధైః = అనేకవిధములైన, వృక్షైః = వృక్షములచేత, సంతతాన్ = చుట్టూ వ్యాప్తములైన, వివిధాన్ = అనేకవిధములైన, జలాశయాంశ్చ = చెరువులను, రమ్యాణి = సుందరమైన, ఉద్యానాని చ = ఉద్యానములను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అక్కడ, సరళవృక్షములూ, కొండగోగుచెట్లూ, బాగుగా పూచిన ఖర్జూరవృక్షములూ, మోరటి, నిమ్మ, కొండమల్లె, మొగలి చెట్లూ, సువాసనగల పిప్పలిచెట్లూ, మంకెన, ఏడాకుల అరటి, వేగిస, కాంచనం చెట్లూ, పుష్పించిన గన్నేరుచెట్లూ, పుష్పముల బరువుతో నిండినవి, మొగ్గ తొడిగినవి, పక్షులతో వ్యాకులముగా నున్నవి, గాలికి కదలుచున్న అగ్రభాగములు గలవి అయిన ఇతరవృక్షములూ, హంసలతోను, కారండవము లను జలపక్షులతోనూ నిండినవి, అధికముగా పద్మములూ, కలువలూ ఉన్నవి అయిన దిగుడుబావులూ, అందమైన, అనేకవిధములైన పొదలు విహరించు ప్రదేశములూ, అన్ని ఋతువులందు లభించు ఫలములతో నిండిన, పుష్పించిన అనేకవిధములైన చెట్లు తీరముల పొంట దట్టముగా ఉన్న చెరువులూ, రమ్యమైన ఉద్యానవనములూ చూచెను. 9-13

మూ. సమాసాద్య చ లక్ష్మీవాన్ లఙ్కాం రావణపాలితామ్,
పరిఖాభిః సపద్మాభిః సోత్పలాభిరలంకృతామ్. 14

సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్,
సమన్తాద్విచరద్భిశ్చ రాక్షసైరుగ్రధన్విభిః. 15

కాఞ్చనేనావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్,
గృహైశ్చ గ్రహసంకాశైః శారదామ్బుదసన్నిభైః. 16

పాణ్డురాభిః ప్రతోళీభిరుచ్చాభిరభిసంవృతామ్,
అట్టాలకశతాకీర్ణాం పతాకాధ్వజమాలినీమ్. 17

తోరణైః కాఞ్చనైర్దివ్యైర్లతాపఙ్క్తివిచిత్రితైః,
దదర్శ హనుమాన్ లఙ్కాం దివి దేవపురీం యథా. 18

ప్ర. అ. లక్ష్మీవాన్ = కాంతిగల, హనుమాన్ = హనుమంతుడు,

లఙ్కామ్ = లంకను, సమాసాద్య = సమీపించి, రావణపాలితామ్ = రావణునిచేత పాలింపబడినదీ, సపద్మైః = పద్మములతో కూడిన, సోత్పలాభిః = కలువలతో కూడిన, పరిఖాభిః = కందకములచేత, అలంకృతామ్ = అలంకరింపబడినదీ, సీతాపహరణార్థేన = సీతను అపహరించుట అనే కారణముచేత, రావణేన = రావణునిచేత, సమన్తాత్ = చుట్టూ, విచరద్భిః = సంచరించుచున్న, ఉగ్రధన్విభిః = భయంకర మైన ధనస్సులు గల, రాక్షసైః = రాక్షసులచేత, సురక్షితామ్ = బాగుగా రక్షింపచేయబడినదీ, కాఞ్చనేన = బంగారువికార మైన, ప్రాకారేణ = ప్రాకారముచేత, ఆవృతామ్ = చుట్టబడినదీ, రమ్యామ్ = సుందర మైన. మహాపురీమ్ = గొప్ప పుర మైనదీ, గిరిసంకాశైః = పర్వతములతో సమానములైన, శారదామ్బుదసన్నిభైః = శరత్కాలమేఘములతో సమానము లైన. గృహైశ్చ = గృహములతో. పాండురాభిః = తెల్ల నైన, ఉచ్చాభిః = ఎత్తైన, ప్రతోలీభిః = ప్రధానవీధులతో, అభిసంవృతామ్ = కూడినదీ, అట్టాలకశతాకీర్ణామ్ = వందలకొలది బురుజులతో నిండినదీ, పతాకాధ్వజమాలినీమ్ = అలంకారార్థము కట్టిన పతాకలయొక్క, ధ్వజములయొక్క పంక్తులు కలదీ, దివ్యైః = సుందరములగు. కాఞ్చనైః = బంగారువికారమైనవి, లతాపఙ్క్తివిచిత్రితైః = చక్కని లతల పంక్తులచే చిత్రముగా ఉన్నట్లు చేయబడినవి అయిన, తోరణైః = ముఖద్వారములతో కూడినదీ, దివి = స్వర్గమునందు, దేవపురీమివ = అమరావతి వలె ఉన్నదీ అయిన, లఙ్కామ్ = ఆ లంకను, దదర్శ = చూచెను.

తా. ఉత్తమ మైన కాంతి గల హనుమంతుడు లంకాపట్టణమును సమీపించి రావణుడు పాలించుచున్న, సుందర మైన మహానగర మైన ఆ లంకను చూచెను. ఆ నగరము చుట్టును పద్మములతోను, కలువలతోను ప్రకాశించుచున్న పరిఖ (అగడ్త) ఉండెను. రావణుడు సీతను అపహరించి ఉండుటచే, రాముడు ఎప్పుడు యుద్ధానికి వచ్చునో అను భయముతో, భయంకరము లైన ధనస్సులు ధరించి అంతట తిరుగుచున్న రాక్షసులచే ఆ నగరమునకు కాపలా కాయించుచుండెను. ఆ నగరము చుట్టు బంగారు ప్రాకార ముండెను. పర్వతముల వలె ఎత్తుగాను, శరత్కాలమేఘముల వలె తెల్లగాను ఉన్న భవనములతో ఆ నగరములోని ప్రధాన మైన వీధులు తెల్లగాను, ఎత్తుగాను కనబడుచుండెను. వందలకొలది బురుజులతోనూ, వరుసగా కట్టిన పతాకలతోను

ధ్వజములతోను ప్రకాశించుచుండెను. అది స్వర్గలోకములో అమరావతి వలె ఉండెను. 14-18

మూ. గిరిమూర్ధ్ని స్థితాం లఙ్కాం పాణ్డురైర్భవనైః శుభైః,
దదర్శ స కపిశ్రేష్ఠః పురమాకాశగం యథా. 19

ప్ర. అ. సః = ఆ, కపిశ్రేష్ఠః = హనుమంతుడు, పాణ్డురైః = తెల్లని, శుభైః = సుందరములైన, భవనైః = భవనములతో, గిరిమూర్ధ్ని = పర్వతము పై భాగమునందు, స్థితామ్ = ఉన్నదీ, ఆకాశగమ్ = ఆకాశములో ఉన్న, పురం యథా = పట్టణము వలె ఉన్న, లఙ్కామ్ = లంకను, దదర్శ = చూచెను.

తా. తెల్లని అందమైన భవనములతో, పర్వతాగ్రమునందు ఉండుటచే ఆ లంక ఆకాశములో నిర్మించిన పురము వలె ఉండెను. అట్టి లంకను హనుమంతుడు చూచెను. 19

మూ. పాలితాం రాక్షసేన్ద్రేణ నిర్మితాం విశ్వకర్మణా.
ప్లవమానామివాకాశే దదర్శ హనుమాన్ పురీమ్. 20

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, రాక్షసేన్ద్రేణ = రాక్షస రాజైన రావణునిచేత, పాలితామ్ = పాలింపబడినదీ, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, నిర్మితామ్ = నిర్మింపబడినదీ, ఆకాశే = ఆకాశమునందు, ప్లవమానామివ = తేలియాడుచున్నట్లున్న, పురీమ్ = ఆ పట్టణమును, దదర్శ = చూచెను.

తా. రావణుడు పాలించుచున్న ఆ లంకాపురమును పూర్వము విశ్వకర్మ నిర్మించెను. హనుమంతునకు ఆ నగరము ఆకాశములో తేలిపోవుచున్నట్లు కనబడెను. 20

మూ. వప్రప్రాకారజఘనాం విపులామ్బునవామ్బరామ్,
శతఘ్నీశూలకేశాన్తామట్టాలకవతంసకామ్, 21
మనసేవ కృతాం లఙ్కాం నిర్మితాం విశ్వకర్మణా,
ద్వారముత్తరమాసాద్య చిన్తయామాస వానరః. 22

ప్ర. అ. వానరః = హనుమంతుడు, వప్రప్రాకారజఘనామ్ = వప్రము

(మట్టిగోడ) ప్రాకారము (శిలానిర్మితప్రాకారము) జఘనముగా కలదీ, విపులామ్బునవామ్బరామ్ = అధిక మైన (పరిఖలలోని) ఉదకమే నూతనవస్త్రముగా గలదీ, శతఘ్నీశూలకేశాన్తామ్ = శతఘ్నులు, శూలములు కేశాంతము (జుట్టు చివరిభాగముగా) గలదీ, అట్టాలకవతంసకామ్ = కోటబురుజులు అను కర్ణభూషణములు కలదీ, మనసా = మనస్సుతో, నిర్మితామివ = నిర్మింపబడినదా అన్నట్లు ఉన్నదీ, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, నిర్మితామ్ = నిర్మింపబడినదీ అయిన, లఙ్కామ్ = లంకను, (చూచెను.) ఉత్తరం ద్వారమ్ = ఉత్తరము వైపున ఉన్న ద్వారమును, ఆసాద్య = చేరి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. ఊహానిర్మితమా అన్నట్లున్న ఆ లంకను విశ్వకర్మ నిర్మించెను. మట్టి గోడలు ప్రాకారము, శిలలతో నిర్మించిన ప్రాకారము దానికి జఘనముగాను, అగడ్తలలో ప్రవహించుచున్న అధిక మైన ఉదకము వస్త్రముగాను, శతఘ్నులు శూలములు అను ఆయుధములు కేశపాశముగాను, కోటబురుజులు కుండలములుగాను ఉండుటచే స్త్రీ వలె ఉన్న ఆ లంకను హనుమంతుడు చూచెను. దాని ఉత్తరద్వారము దగ్గరకు వెళ్ళి అతడు ఆలోచనలో పడెను. 21, 22

మూ. కైలాసశిఖరప్రఖ్యామాలిఖన్తీమివామ్బరమ్,
డీయమానామివాకాశముచ్ఛ్రితైర్భవనోత్తమైః. 23
సంపూర్ణాం రాక్షసైర్ఘోరైర్నాగైర్భోగవతీమివ,
అచిన్త్యాం సుకృతాం స్పష్టాం కుబేరాధ్యుషితాం పురా.
దంష్ట్రిభిర్బహుభిః శూరైః శూలపట్టిసపాణిభిః,
రక్షితాం రాక్షసైర్ఘోరైర్గుహామాశీవిషైరివ. 25
తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః,
రావణం చ రిపుం ఘోరం చిన్తయామాస వానరః. 26

ప్ర. అ. కైలాసశిఖరప్రఖ్యామ్ = కైలాసపర్వతశిఖరముతో సమానమైనదీ, అమ్బరమ్ = ఆకాశమును, ఆలిఖన్తీమివ = ఒరయుచున్నది వలె ఉన్నదీ, ఉచ్ఛ్రితైః = ఉన్నతము లైన, భవనోత్తమైః = ఉత్తమము లైన భవనములచేత, ఆకాశమ్ = ఆకాశమును గూర్చి, డీయమానామివ = ఎగురుచున్నది వలె ఉన్నదీ, నాగైః = సర్పములచేత, భోగవతీమివ = భోగవతీనగరము (పాతాళములోనిది)

వలె, ఘోరైః = భయంకరు లైన, రాక్షసైః = రాక్షసులతో, సంపూర్ణామ్ = నిండినదీ, అచిన్త్యామ్ = ఊహింప శక్యము కానిదీ, సుకృతామ్ = బాగుగా ఏర్పరుపబడినదీ, స్పష్టామ్ = స్పష్ట మైనదీ, పురా = పూర్వము, కుబేరాధ్యుషితామ్ = కుబేరునిచేత అధిష్ఠింపబడినదీ, ఆశీవిషైః = సర్పములచేత, గుహామివ = గుహ వలె, దంష్ట్రిభిః = కోరలుకలవారూ, శూరైః = శూరులూ, శూలపట్టిసపాణిభిః = శూలములు, పట్టసములు చేతులలో కలవారూ, ఘోరైః = భయంకరులూ అయిన, రాక్షసైః = రాక్షసులచేత, రక్షితామ్ = రక్షింపబడినదీ అయిన (లంకను చూచెను). సః వానరః = ఆ హనుమంతుడు, తస్యాః = ఆ లంకయొక్క, మహతీమ్ = గొప్ప దైన, గుప్తిమ్ = రక్షణను, సాగరం చ = సముద్రమును, ఘోరమ్ రిపుమ్ = భయంకరశత్రు వైన, రావణం చ = రావణుని, నిరీక్ష్య = = చూచి, చిన్తయామాస = ఈ విధముగా ఆలోచించెను.

తా. కైలాసశిఖరము వలె ఉన్నతముగా ఉన్న ఆ లంకాపట్టణము ఆకాశమును ఒరయుచున్నట్లున్నది. భవనములు అత్యున్నతములుగా ఉన్నవి. భయంకరు లైన రాక్షసులతో, నాగములతో భోగవతీపట్టణము వలె, నిండి ఉన్నది. దాని శోభ ఊహకు కూడ అందుటలేదు. అతిస్పష్టముగా ప్రకాశించుచున్న ఆ నగరములో పూర్వము కుబేరుడు నివసించుచుండెడివాడు. కోరలు కలవారూ, శూలములు, పట్టసములు అను ఆయుధములు ధరించినవారూ, భయంకరులూ, శూరులూ అయిన ఎందరో రాక్షసులు, సర్పములు గుహను రక్షించుచున్నట్లు, ఆ లంకాపట్టణమును రక్షించుచుండిరి. అట్టి ఆ లంకాపట్టణమునకు ఏర్పరచిన గొప్ప రక్షణవిధానమును, దాని చుట్టును సముద్రమును, చూచి, రావణుడు భయంకరు డైన శత్రు వను విషయమును కూడ గుర్తించి, హనుమంతు డీ విధముగా తలచెను. 23. 26

మూ. అగత్యాపీహ హరయో భవిష్యన్తి నిరర్థకాః,
న హి యుద్ధేన వై లఙ్కా శక్యా జేతుం సురైరపి. 27

ప్ర. అ. హరయః = వానరులు, ఇహ = ఇక్కడికి, అగత్యాపి = వచ్చి కూడా, నిరర్థకాః = ఫలము పొందజాలనివారు, భవిష్యన్తి = కాగలరు. లఙ్కా = లంక, యుద్ధేన = యుద్ధముచేత, సురైరపి = దేవతలచేత కూడ, జేతుమ్ = జయించుటకు, న శక్యా హి = శక్య మైనది కాదు కదా.

తా. వానరులు ఇక్కడికి వచ్చినా ఏమి ప్రయోజనము ఉండదు. దేవతలు కూడా, యుద్ధము చేసి ఈ లంకను జయించలేరు. 27

మూ. ఇమాం తు విషమాం దుర్గాం లఙ్కాం రావణపాలితామ్,
ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః. 28

ప్ర. అ. విషమామ్=చాలా కష్టమైనదీ, దుర్గామ్=ప్రవేశింప శక్యము కానిదీ, రావణపాలితామ్ = రావణునిచేత పాలింపబడినదీ అయిన, ఇమామ్= ఈ, లఙ్కామ్ = లంకను, ప్రాప్యాపి = చేరి కూడా, మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః రాఘవః=ఆ రాముడు, కిం కరిష్యతి=ఏమి చేయగలడు?

తా. రావణుడు పాలించుచున్న. లోనికి ప్రవేశింప శక్యము కాని, ఈ కష్టమైన లంకాపట్టణమునకు వచ్చి కూడ. మహాబాహువైన రాముడు ఏమి చేయగలడు?

మూ. అవకాశో న సాన్త్వస్య రాక్షసేష్వభిగమ్యతే,
న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే. 29

ప్ర. అ. రాక్షసేషు = రాక్షసులవిషయమున, సాన్త్వస్య=సామోపాయమునకు, అవకాశః=అవకాశము, న అభిగమ్యతే=పొందబడదు. దానస్య=దానమునకు, న=అవకాశము లేదు. భేదస్య =భేదమునకు, న=అవకాశము లేదు. యుద్ధస్య = యుద్ధమునకు, నైవ దృశ్యతే=ఏ మాత్రమూ కనబడదు.

తా. రాక్షసుల విషయములో సామమునకు గాని, దానమునకు గాని, భేదానికి గాని అవకాశము లేదు. యుద్ధమునకు ఏ మాత్రమూ అవకాశము లేదు.

మూ. చతుర్ణామేవ హి గతిర్వానరాణాం మహాత్మనామ్,
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః. 30

ప్ర. అ. వాలిపుత్రస్య=అంగదునకు, నీలస్య=నీలునకు, మమ=నాకు, ధీమతః=బుద్ధిమంతుడైన, రాజ్ఞశ్చ=ప్రభువైన సుగ్రీవునకు, మహాత్మనామ్= గొప్ప బలము గల, చతుర్ణామ్ = నలుగురు, వానరాణామేవ=వానరులకే, గతిః హి=(ఇక్కడికి) రాక కదా!

తా. అంగదుడూ, నీలుడూ, ధీమంతు డైన సుగ్రీవుడూ, నేనూ, ఈ నలుగురు వానరులము మాత్రమే ఈ లంకలోనికి రాగలుగుదుము. 30

మూ. యావజ్జానామి వైదేహీం యది జీవతి వా న వా,
తత్రైవ చిన్తయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్.

ప్ర. అ. వైదేహీమ్=సీతను గూర్చి, యది జీవతి వా=జీవించి ఉన్నదా, న వా=లేదా అను విషయమును, యావత్ జానామి=తెలుసుకొనెదను. తామ్=ఆ, జనకాత్మజామ్=సీతను, దృష్ట్వా=చూచి, తత్రైవ=అక్కడనే, చిన్తయిష్యామి=ఆలోచించెదను.

తా. సీత జీవించి ఉన్నదా లేదా అను విషయము ముందుగా తెలుసుకొనవలెను. ఆమె కనబడిన తరువాత ఈ ఆలోచన లన్నీ చేయవచ్చును. ఇప్పుడెందుకు? 31

మూ. తతః స చిన్తయామాస ముహూర్తం కపికుఞ్జరః,
గిరిశృఙ్గే స్థితస్తస్మిన్ రామస్యాభ్యుదయే రతః. 32

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామస్య=రామునియొక్క, అభ్యుదయే=అభ్యుదయమునందు, రతః=ఆసక్తు డైన, సః కపికుఞ్జరః=ఆ వానరశ్రేష్ఠుడు, తస్మిన్=ఆ, గిరిశృఙ్గే=పర్వతశిఖరమునందు, స్థితః=నిలచిన వాడై, ముహూర్తమ్=ముహూర్తకాలముపాటు, సంచిన్తయామాస=ఆలోచించెను.

తా. రాముని అభివృద్ధిని కోరుచున్న ఆ హనుమంతుడు ఆ పర్వత శిఖరముపై నిలచి కొంచెము సేపు ఇట్లు ఆలోచించెను. 32

మూ. అనేన రూపేణ మయా న శక్యా రక్షసాం పురీ,
ప్రవేష్టుం రాక్షసైర్గుప్తా క్రూరైర్బలసమన్వితైః. 33

ప్ర. అ. క్రూరైః=క్రూరులూ, బలసమన్వితైః=బలముతో కూడినవారూ అయిన, రాక్షసైః=రాక్షసులచేత, గుప్తా=రక్షింపబడిన, రక్షసామ్=రాక్షసుల యొక్క, పురీ=పట్టణము, మయా=నాచేత, అనేన=ఈ, రూపేణ=రూపముతో, ప్రవేష్టుమ్=ప్రవేశించుటకు, న శక్యా=శక్య మైనది కాదు.

తా. క్రూరులూ, బలవంతులూ అయిన రాక్షసులు రక్షించుచున్న ఈ లంకాపట్టణమును, నేను ఈ రూపములో ప్రవేశించుటకు శక్యము కాదు. 33

మూ. ఉగ్రౌజసో మహావీర్యా బలవన్తశ్చ రాక్షసాః,
వఞ్చనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా. 34

ప్ర. అ. జానకీమ్ = సీతను, పరిమార్గతా = వెదకుచున్న, మయా = నాచేత, ఉగ్రౌజసః = ఉగ్ర మైన తేజస్సు కలవారూ, మహావీర్యాః = గొప్ప పరాక్రమము కలవారూ, బలవన్తశ్చ = బలవంతులూ అయిన, రాక్షసాః = రాక్షసులు, సర్వే = అందరూ, వఞ్చనీయాః = వంచింపదగినవారు.

తా. ఉగ్ర మైన తేజస్సూ, గొప్ప పరాక్రమమూ, గొప్ప బలమూ గల ఈ రాక్షసుల నందరినీ మోసగించి గాని నేను సీతను వెదకజాలను. 34

మూ. లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లఙ్కా పురీ మయా,
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్.

ప్ర. అ. మే = నాయొక్క, మహత్ = గొప్పదైన, కృత్యమ్ = కార్యమును, సాధయితుమ్ = సాధించుటకు, మయా = నాచేత, లక్ష్యాలక్ష్యేణ = కనబడీ కనబడకుండా ఉండే, రూపేణ = రూపముతో, రాత్రౌ = రాత్రియందు, లఙ్కాపురీ = లంకానగరము, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, ప్రాప్తకాలమ్ = కాలానుగుణ మైన పని.

తా. నే నీ మహాకార్యమును సాధింప వలె నన్నచో, కనబడీ కనబడకుండా ఉండే చిన్న రూపము ధరించి, రాత్రి ఈ లంకలో ప్రవేశించుటయే ఈ సమయమున చేయవలసిన పని. 35

మూ. తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః,
హనుమాన్ చిన్తయామాస వినిశ్చిత్య ముహుర్ముహుః.

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, సురాసురైః = దేవతలచేత గాని అసురులచేత గాని, దురాధర్షామ్ = ఎదిరింప శక్యము కాని, తాదృశీమ్ = అట్టి, తామ్ = ఆ, పురీమ్ = పట్టణమును, దృష్ట్వా = చూచి, వినిశ్చిత్య = నిశ్చయించి, ముహుర్ముహుః = మాటిమాటికి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. దేవతలు గాని అసురులు గాని ఎదిరింప శక్యము కాని అట్టి ఆ లంకాపట్టణము చూచి, హనుమంతుడు తన కర్తవ్య మేదో నిశ్చయించుకొని, దాని నెట్లు సాధింప వలెనా అని మాటిమాటికి ఆలోచించెను. 36

మూ. కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్,
అదృష్టో రాక్షసేన్ద్రేణ రావణేన దురాత్మనా. 37

ప్ర. అ. దురాత్మనా = దుష్టబుద్ధికలవాడూ, రాక్షసేన్ద్రేణ = రాక్షస ప్రభువూ అయిన, రావణేన = రావణునిచేత, అదృష్టః = చూడబడనివాడనై, కేన = ఏ, ఉపాయేన = ఉపాయముచేత, జనకాత్మజామ్ = జనకుని కుమార్తెయైన, మైథిలీమ్ = సీతాదేవిని, పశ్యేయమ్ = చూచెదను.

తా. దుర్బుద్ధియైన ఆ రాక్షసరాజు రావణుని కంట పడకుండా సీతను చూచుటకు ఉపాయ మేమి? 37

మూ. న వినశ్యేత్కథం కార్యం రామస్య విదితాత్మనః,
ఏకామేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్. 38

ప్ర. అ. విదితాత్మనః = ప్రసిద్ధ మైన బుద్ధి గల, రామస్య = రాముని యొక్క, కార్యమ్ = కార్యము, కథమ్ = ఎట్లు, న వినశ్యేత్ = చెడిపోకుండా ఉండును? ఏకః చ = ఒంటరిగా (నేను), రహితే = జనశూన్య మైన ప్రదేశము నందు, ఏకామ్ = ఒంటరిగా ఉన్న, జనకాత్మజామ్ = సీతను. (ఎట్లు), పశ్యేయమ్ = చూచెదను.

తా. మహాబుద్ధిమంతుడుగా ప్రసిద్ధు డైన రాముని కార్యము నేను ఎట్లు ప్రవర్తించినచో చెడిపోకుండా ఉండును? సీత నిర్జన మైన ప్రదేశములో ఒంటరిగా ఉండగా, నేను ఒంటరిగా ఆమెను చూచుటకు ఉపాయ మేమి? 38

మూ. భూతాశ్చార్థా విపద్యన్తే దేశకాలవిరోధితాః,
విక్లబం దూతమాసాద్య తమః సూర్యోదయే యథా. 39

ప్ర. అ. విక్లబమ్ = వ్యాకులం మైన బుద్ధి గల, దూతమ్ = దూతను, ఆసాద్య = పొంది, దేశకాలవిరోధితాః = దేశమునకు కాలమునకు విరుద్ధములుగా చేయబడినవై, భూతాః = సిద్ధ మైన, అర్థాః = కార్యములు, సూర్యోదయే =

సూర్యోదయసమయమునందు, తమః యథా = అంధకారము వలె, విపద్యన్తే = చెడిపోవును.

తా. స్థిరచిత్తము లేని దూతలు దేశకాలములకు విరోధము కల్పించుటచే, సిద్ధముగా ఉన్న పనులు కూడ, సూర్యోదయసమయమునందు అంధకారము నశించి నట్లు చెడిపోవును. 39

మూ. అర్థానర్థాన్తరే బుద్ధిర్నిశ్చితాపి న శోభతే,
ఘాతయన్తి హి కార్యాణి దూతాః పణ్డితమానినః. 40

ప్ర. అ. నిశ్చితా=నిశ్చయింపబడిన, బుద్ధిరపి=బుద్ధి కూడ, (ఆలోచన కూడ), అర్థానర్థాన్తరే = లాభము నష్టము అనువాని మధ్య, న శోభతే = ప్రకాశించదు. పణ్డితమానినః=పండితులమనే అభిమానము గల, దూతాః=దూతలు, కార్యాణి = కార్యములను, ఘాతయన్తి హి = చెరగొట్టుదురు కదా.

తా. ఈ కార్యము చేయవలెను అని నిశ్చయము చేసిన పిమ్మట కూడ లాభనష్టాల ఆలోచనలో పడిన బుద్ధి ప్రకాశించదు. దూతలు బుద్ధిమంతులమను అహంకారముతో కార్యములను చెరగొట్టుచుందురు. 40

మూ. న వినశ్యేత్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్,
లఙ్ఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్. 41

ప్ర. అ. కార్యమ్ = కార్యము, కథమ్ = ఎట్లు, న వినశ్యేత్ = నశించకుండా ఉండును ? వైక్లబ్యమ్ = (బుద్ధికి) వ్యాకులత్వము, కథమ్ = ఎట్లు, న భవేత్ = కలగకుండా ఉండును ? సముద్రస్య=సముద్రముయొక్క, లఙ్ఘనం చ = దాటుట కూడా, కథం ను = ఎట్లు, వృథా = వ్యర్థము, న భవేత్ = కాకుండును ?

తా. వచ్చిన కార్యము ఎట్లు చెడిపోకుండును? బుద్ధి వ్యాకులము కాకుండా చక్కగా పనిచేయు ఉపాయ మేమి ? సముద్రలంఘనము సఫల మెట్లు అగును ? 41

మూ. మయి దృష్టే తు రక్షోభీ రామస్య విదితాత్మనః,
భవేద్వ్యర్థమిదం కార్యం రావణానర్థమిచ్ఛతః. 42

ప్ర. అ. మయి = నేను, రక్షోభిః = రాక్షసులచేత, దృష్టే తు = చూడ బడినవాఁడ నగుచుండఁగా, రావణానర్థమ్ = రావణుని సంహారమును, ఇచ్ఛతః = కోరుచున్న, విదితాత్మనః = ప్రసిద్ధ మైన బుద్ధి గల, రామస్య = రామునియొక్క, ఇదమ్ = ఈ, కార్యమ్ = కార్యము, వ్యర్థమ్ = వ్యర్థము. భవేత్ = అగును.

తా. నన్ను రాక్షసులు చూచినచో, రావణుని సంహరింపవలె నని కోరుచున్న, ప్రసిద్ధబుద్ధిశాలి యైన రాముని కార్యము చెడిపోవును. 42

మూ. న హి శక్యం క్వచిత్ స్థాతుమవిజ్ఞాతేన రాక్షసైః,
అపి రాక్షసరూపేణ కిముతాన్యేన కేన చిత్. 43

ప్ర. అ. రాక్షసైః = రాక్షసులచేత, అవిజ్ఞాతేన = తెలియఁబడకుండఁగా, రాక్షసరూపేణాపి = రాక్షసరూపముతో కూడ, క్వచిత్ = ఏ ప్రదేశమునం దైనను, స్థాతుమ్ = ఉండుటకు, న శక్యం హి = శక్యము కాదు కదా. అన్యేన = మఱియొక, కేన చిత్ = ఏదైన రూపముతో, కిముత = చెప్పనేల.

తా. రాక్షసరూపము ధరించి కూడ, రాక్షసులకు తెలియకుండఁగా ఈ లంకలో ఎక్కడను ఉండుటకు శక్యము కాదు; ఇంక ఇతరరూపముతో మాట చెప్పవలెనా! 43

మూ. వాయురప్యత్ర నాజ్ఞాతశ్చరేదితి మతిర్మమ,
న హ్యస్త్యవిదితం కించిద్రాక్షసానాం బలీయసామ్. 44

ప్ర. అ. అత్ర = ఇక్కడ, వాయురపి = గాలి కూడ, అజ్ఞాతః = తెలియబడనివాఁడై, న చరేత్ = సంచరింపఁజాలదు, ఇతి = అని, మమ = నాయొక్క, మతిః = అభిప్రాయము. బలీయసామ్ = బలవంతు లైన, రాక్షసానామ్ = రాక్షసులకు, అవిదితమ్ = తెలియనిది, కించిత్ = ఏదీ, నాస్తి హి = లేదు కదా!

తా. ఈ పట్టణములో రాక్షసులకు తెలియకుండా గాలి కూడ ఎక్కడా సంచరింపఁజాలం దని నా అభిప్రాయము. బలవంతు లైన రాక్షసులకు తెలియని ప్రదేశ మేదీ లేదు కదా! 44

మూ. ఇహాహం యది తిష్ఠామి స్వేన రూపేణ సంవృతః,
వినాశముపయాస్యామి భర్తురర్థశ్చ హీయతే. 45

ప్ర. అ. అహమ్ = నేను, స్వేన = నా సంబంధ మైన, రూపేణ = రూపముతో, సంవృతః = కూడినవాడనై, ఇహ = ఇక్కడ, తిష్ఠామి యది = ఉన్నట్లయితే, వినాశమ్ = నాశమును, ఉపయాస్యామి = పొందగలను. భర్తుః = ప్రభువుయొక్క, అర్థశ్చ = కార్యము కూడ, హీయతే = చెడిపోవును.

తా. నేను ఈ (పెద్ద) రూపముతోనే ఇక్కడ ఉన్నచో పట్టుబడి చంప బడుదును. ప్రభు వైన సుగ్రీవుని కార్యము చెడిపోవును. 45

మూ. తదహం స్వేన రూపేణ రజన్యాం హ్రస్వతాం గతః,
లఙ్కామభిపతిష్యామి రాఘవస్యార్థసిద్ధయే. 46

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, అహమ్ = నేను, స్వేన రూపేణ = నా రూపముతో, హ్రస్వతామ్ = హ్రస్వత్వమును, గతః = పొందినవాడ నై, రాఘవస్య = రామునియొక్క, అర్థసిద్ధయే = కార్యము సిద్ధించుటకొరకు, రజన్యామ్ = రాత్రియందు, లఙ్కామ్ = లంకను, అభిపతిష్యామి = ప్రవేశించెదను.

తా. అందుచేత, నేను నా రూపము చిన్నదిగా చేసికొని, రాముని కార్యము సాధించుటకై, రాత్రివేళ లంకలో ప్రవేశించెదను. 46

మూ. రావణస్య పురీం రాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్,
విచిన్వన్ భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్. 47

ప్ర. అ. సుదురాసదామ్ = ఏ మాత్రమూ సమీపింప శక్యము కాని, పురీమ్ = పట్టణమును, రాత్రౌ = రాత్రియందు, ప్రవిశ్య = ప్రవేశించి, రావణస్య = రావణునియొక్క, సర్వమ్ = సమస్త మైన, భవనమ్ = గృహమును, విచిన్వన్ = వెదకుచున్నవాడ నై, జనకాత్మజామ్ = సీతను, ద్రక్ష్యామి = చూడగలను.

తా. దగ్గరకు పోవుటకు కూడ శక్యము కాని ఈ లంకాపట్టణములోనికి రాత్రి ప్రవేశించి, రావణుని గృహము నంతను వెదకి, సీతను చూచెదను. 47

మూ. ఇతి సంచిన్త్య హనుమాన్ సూర్యస్యాస్తమయం కపిః,
ఆచకాఙ్క్షే తతో వీరో వైదేహ్యా దర్శనోత్సుకః. 48

ప్ర. అ. వీరః కపిః = వానరవీరు డైన, హనుమాన్ = హనుమంతుడు, ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, వైదేహ్యాః = సీతయొక్క, దర్శనోత్సుకః = దర్శనమునందు ఆసక్తి కలవాడై, తదా = అప్పుడు, సూర్యస్య = సూర్యుని యొక్క, అస్తమయమ్ = అస్తమయమును, ఆచకాఙ్క్షే = కోరెను.

తా. వానరవీరు డైన హనుమంతుడు ఈ విధముగా ఆలోచించి, సీతను చూడవలె నను అభిలాషతో సూర్యాస్తమయమునకై వేచి ఉండెను. 48

మూ. సూర్యే చాస్తం గతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః,
వృషదంశకమాత్రః సన్ బభూవాద్భుతదర్శనః 49

ప్ర. అ. సూర్యే = సూర్యుడు, అస్తం గతే చ = అస్తమించగానే, మారుతిః = హనుమంతుడు, రాత్రౌ = రాత్రియందు, దేహమ్ = దేహమును, సంక్షిప్య = చిన్నది చేసి, వృషదంశకమాత్రః సన్ = పిల్లి అంత ప్రమాణము కలవాడై, అద్భుతదర్శనః = ఆశ్చర్యకర మైన దర్శనము కలవాడు, బభూవ = ఆయెను.

తా. సూర్యుడు అస్తమించగానే, రాత్రియందు హనుమంతుడు, శరీరమును చాల చిన్నది చేసి, పిల్లి యంత ప్రమాణముతో చూచుటకు ఆశ్చర్యము కలుగు నట్లు మారెను. 49

మూ. ప్రదోషకాలే హనుమాంస్తూర్ణముత్ప్లుత్య వీర్యవాన్,
ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్తమహాపథామ్. 50

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, హనుమాన్ = హనుమంతుడు, ప్రదోషకాలే = సాయంకాలమునందు, తూర్ణమ్ = శీఘ్రముగా, ఉత్ప్లుత్య = ఎగిరి, సువిభక్తమహాపథామ్ = చక్కగా విభజింపబడి ఉన్న ప్రధానమార్గములు గల, రమ్యామ్ = సుందర మైన, పురీమ్ = పట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పరాక్రమవంతు డైన హనుమంతుడు సాయంకాలసమయమునందు శీఘ్రముగా ఎగిరి, చక్కగా అమర్చిన విశాలప్రధానమార్గములు గల, సుందర మైన లంకాపట్టణములోనికి ప్రవేశించెను. 50

మూ. ప్రాసాదమాలావితతాం స్తమ్భైః కాఞ్చనరాజతైః,
శాతకుమ్భమయైర్జాలైర్గన్ధర్వనగరోపమామ్. 51

మూ. సప్తభౌమాష్టభౌమైశ్చ స దదర్శ మహాపురీమ్,
తలైః స్ఫటికసంకీర్ణైః కార్తస్వరవిభూషితైః. 52

ప్ర. అ. సః=హనుమంతుడు, ప్రాసాదమాలావితతామ్=మేడల పంక్తులతో నిండినదీ, కాఞ్చనరాజతైః=బంగారు వెండి వికార మైన, స్తమ్భైః=స్తంభములతోను, శాతకుమ్భమయైః=బంగారు వికారములైన, జాలైః=కిటికీలతోను, గన్ధర్వనగరోపమామ్ = గంధర్వనగరముతో (ఇంద్రజాలికులు నిర్మించిన అద్భుత మైన నగరముతో) సమాన మైనదీ, సప్తభౌమాష్టభౌమైః చ = ఏడంతస్తులు, ఎనిమిదంతస్తులు, ఉన్న గృహములతోను, స్ఫటికసంకీర్ణైః = స్ఫటికమాణిక్యములతో వ్యాప్త మైనవి, కార్తస్వరవిభూషితైః = బంగారముతో అలంకరింపబడినవీ అయిన, తలైః = పై భాగములతోను కూడిన, మహాపురీమ్ = మహాపట్టణమును, దదర్శ = చూచెను.

తా. ఆ లంకానగరము ప్రసాదముల పంక్తులతో నిండి ఉండెను. బంగారపు స్తంభములతోను, వెండి స్తంభములతోను, బంగారు కిటికీలతోను, అది గంధర్వనగరము వలె అద్భుతముగా ఉండెను. ఏడంతస్తుల మేడలు, ఎనిమిదంతస్తుల మేడలు ప్రకాశించుచుండెను. బంగారముతో అలంకరించిన పై భాగములపై స్ఫటికమాణిక్యములు పరచబడి ఉండెను. 51, 52

మూ. వైడూర్యమణిచిత్రైశ్చ ముక్తాజాలవిభూషితైః,
తలైః శుశుభిరే తాని భవనాన్యత్ర రక్షసామ్. 53

ప్ర. అ. అత్ర = ఈ లంకాపురమునందు, రక్షసామ్=రాక్షసులయొక్క, భవనాని = భవనములు, వైడూర్యమణిచిత్రైః = వైడూర్యములచే చిత్రింపబడినవి, ముక్తాజాలవిభూషితైః = ముత్యముల సముదాయముచే అలంకరింపబడినవీ అయిన, తలైః=పై భాగములతో, శుశుభిరే = ప్రకాశించినవి.

తా. ఆ లంకాపట్టణములో రాక్షసుల భవనముల పై భాగములు వైడూర్య మాణిక్యములచే చిత్రవర్ణములై, ముత్యాల సముదాయములచే అలంకృతములై, ప్రకాశించుచుండెను. 53

మూ. కాఞ్చనాని చ చిత్రాణి తోరణాని చ రక్షసామ్,
లఙ్కాముద్యోతయామాసుః సర్వతః సమలంకృతామ్.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, కాఞ్చనాని = బంగారు వికార మైన, చిత్రాణి=విచిత్రవర్ణములు గల, తోరణాని=గృహద్వారములు, సమలం కృతామ్ = అలంకరింపబడిన, లఙ్కామ్ = లంకాపట్టణమును, సర్వతః = నలు వైపులందు, ఉద్యోతయామాసుః = ప్రకాశింపచేసినవి.

తా. బంగారముతో నిర్మింపబడిన, విచిత్రవర్ణములు గల రాక్షసగృహ ద్వారములు చక్కగా అలంకరింపబడిన ఆ లంకాపట్టణమును, నలుమూలలా ప్రకాశింపచేయుచుండెను. 54

మూ. అచిన్త్యామద్భుతాకారాం దృష్ట్వా లఙ్కాం మహాకపిః.
ఆసీద్విషణ్ణో హృష్టశ్చ వైదేహ్యా దర్శనోత్సుకః. 55

ప్ర. అ. మహాకపిః = హనుమంతుడు, అచిన్త్యామ్ = ఆలోచించుటకు కూడ శక్యము కానిదీ, అద్భుతాకారామ్ = ఆశ్చర్యకర మైన ఆకారము కలదీ అయిన, లఙ్కామ్ = లంకను, దృష్ట్వా = చూచి, వైదేహ్యాః = సీతయొక్క, దర్శనోత్సుకః = దర్శనమునందు ఆసక్తి కలవాడై, విషణ్ణః = దిగులు చెందిన వాడు, హృష్టశ్చ = సంతోషించినవాడూ, ఆసీత్ = అయెను.

తా. హనుమంతుడు ఊహకు కూడ అందని విధముగా ఉండి, ఆశ్చర్య మును కలిగించు ఆ లంకాపట్టణమును చూచి, వైదేహిని చూడవలెనని కుతూ హలము చెందుచు, ఈ లంకను జయించుట ఎట్లా అని దిగులును, సీతను చూడ గలము గదా అని ఆనందమును కూడ పొందెను. 55

మూ. స పాణ్డురావిద్ధవిమానమాలినీం
మహార్హజామ్బూనదజాలతోరణామ్,
యశస్వినీం రావణబాహుపాలితాం
క్షపాచరైర్భీమబలైః సమావృతామ్. 56

ప్ర. అ. సః = హనుమంతుడు, పాణ్డురావిద్ధవిమానమాలినీమ్ = తెల్లనివీ, దగ్గరదగ్గరగా ఉన్నవీ అయిన గృహపంక్తులు కలదీ, మహార్హజామ్బూనదజాల తోరణామ్ = గొప్ప విలువ గల, బంగారు వికార మైన కిటికీలు, ముఖద్వార ములూ కలదీ, యశస్వినీమ్ = కీర్తి గలదీ, భీమబలైః = భయంకర మైన బలము గల, క్షపాచరైః = రాక్షసులతో, సమావృతామ్ = కూడినదీ, రావణ

బాహుపాలితామ్ = రావణుని బాహువులచేత పాలింపబడినదీ అయిన (లంకను చూచెను).

తా. ఆ లంకానగరములో తెల్లని గృహములు దగ్గర దగ్గరగా ఉండెను. ఆ గృహములలోని కిటికీలు, ముఖద్వారములు బంగారముతో నిర్మింపబడి అధిక మూల్యములై ఉండెను రావణుని బాహుబలముచే రక్షింపబడుచున్న కీర్తిమంత మైన ఆ నగరము, భయంకర మైన బలము గల నిశాచరులతో నిండి ఉండెను.

మూ. చన్ద్రో౽పి సాచివ్యమివాస్య కుర్వం
స్తారాగణైర్మధ్యగతో విరాజన్,
జ్యోత్స్నావితానేన వితత్య లోక
ముత్తిష్ఠతే నైకసహస్రరశ్మిః. 57

ప్ర. అ. నైకసహస్రరశ్మిః = ఎన్నోవేల కిరణములు గల, చన్ద్రో౽పి = చంద్రుడు కూడ, తారాగణైః = నక్షత్రముంగణములతో కూడినవాడై, మధ్యగతః నక్షత్రమధ్యమును పొందినవాడై, విరాజన్ = ప్రకాశించుచు, లోకమ్ = భూలోక మును, జ్యోత్స్నావితానేన = వెన్నెల అను చాందనీతో, వితత్య = కప్పివేసి, అస్య = హనుమంతునకు, సాచివ్యమ్ = సాహాయ్యమును, కుర్వన్నివ = చేయు చున్నవాడు వలె, ఉత్తిష్ఠతే = లేచెను.

తా. ఆ సమయమున, అనేక సహస్రముల కిరణములు గల చంద్రుడు కూడ, నక్షత్రములతో కూడి, వాటి మధ్య ప్రకాశించుచు, వెన్నెల అను చాంద నీతో లోకము నంతను కప్పివేయుచు, హనుమంతునకు సాహాయ్యము చేయుటకా అన్నట్లు పైకి వచ్చెను. 57

మూ. శఙ్ఖప్రభం క్షీరమృణాలవర్ణ
ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్,
దదర్శ చన్ద్రం స హరిప్రవీరః
పోప్లూయమానం సరసీవ హంసమ్. 58

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ద్వితీయః సర్గః

ప్ర. అ. స॥ హరిప్రవీరః=ఆ హనుమంతుడు, ఉద్గర్వమానమ్=పైకి లేచుచున్నవాడూ, శఙ్ఖప్రభమ్=శంఖము వంటి కాంతి కలవాడూ, వ్యవభాసమానమ్=ప్రకాశించుచున్న వాడూ, క్షీరమృణాలవర్ణమ్ = పాలవంటి తామర తూడు వంటి రంగు గలవాడూ, సరసి=సరస్సు నందు, పోప్లూయమానమ్=ఈదుచున్న, హంసమివ=హంస వలె ఉన్నవాడూ అయిన, చన్ద్రమ్=చంద్రుని దదర్శ=చూచెను.

తా. ఉదయించి పైకి వచ్చుచు, ప్రకాశించుచున్న ఆ చంద్రుని కాంతి శంఖకాంతి వలె ఉండెను. అతని వర్ణము పాల వర్ణము వలె, తామరతూడు వర్ణము వలె ఉండెను. ఆ చంద్రుడు సరస్సులో ఈదుచున్న హంస వలె మనోహరముగా ఉండెను. అట్టి చంద్రుని ఆ హనుమంతుడు చూచెను. 58

"బాలనందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ద్వితీయసర్గ సమాప్తము.

* *

# అథ తృతీయః సర్గః

[లంకను చూచి హనుమంతుడు ఆశ్చర్యము నొందుట. లోనికి ప్రవేశింపనున్న హనుమంతుని లంక స్త్రీ రూపమున వచ్చి అడ్డు కొనుట. అతని ప్రహారముచే పీడితురాలై ఆమె హనుమంతునకు లోనికి ప్రవేశించుటకు అనుమతి ఇచ్చుట.]

మూ. స లమ్బశిఖరే లమ్బే లమ్బతోయదసన్నిభే,
సత్త్వమాస్థాయ మేధావీ హనుమాన్ మారుతాత్మజః. 1
నిశి లఙ్కాం మహాసత్త్వో వివేశ కపికుఞ్జరః,
రమ్యకాననతోయాఢ్యాం పురీం రావణపాలితామ్. 2

ప్ర. అ. మేధావీ = బుద్ధిమంతుడూ, మారుతాత్మజః = వాయుపుత్రుడూ, మహాసత్త్వః = గొప్ప బలము కలవాడూ, కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడూ అయిన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, లమ్బశిఖరే = ఉన్నతమైన శిఖరములు కలదీ, లమ్బతోయదసన్నిభే = ఉన్నతమైన మేఘముతో సమానమైనదీ అయిన, లమ్బే = లంబపర్వతమునందు, సత్త్వమ్ = బలమును, ధైర్యమును, ఆస్థాయ = అవలంబించి, రమ్యకాననతోయాఢ్యామ్ = సుందరమైన అడవులతోను, ఉదకముతోను నిండిన, రావణపాలితామ్ = రావణునిచే పాలించబడిన, లఙ్కాం పురీమ్ = లంకానగరమును, నిశి = రాత్రియందు, వివేశ = ప్రవేశించెను.

తా. మహాబుద్ధిశాలీ, వాయునందనుడూ, వానరశ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు, ఉన్నతమైన శిఖరములతో ఎత్తైన మేఘము వలె కనబడుచున్న లంబపర్వతముపై ఉన్నదీ, సుందరమైన అరణ్యములతోను ఉదకస్థానములతోను నిండినదీ, రావణునిచే పాలింపబడినదీ అయిన లంకాపురమును, ధైర్యమవలంబించి ప్రవేశించెను. 1, 2

మూ. శారదామ్బుధరప్రఖ్యైర్భవనైరుపశోభితామ్,
సాగరోపమనిర్ఘోషాం సాగరానిలసేవితామ్,

సుపుష్టబలసంపుష్టాం యథైవ విటపావతీమ్,
చారుతోరణనిర్యూహాం పాణ్డురద్వారతోరణామ్, 4

భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీమివ,
తాం సవిద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గనిషేవితామ్. 5

మన్దమారుతసంచారాం యథేన్ద్రస్యామరావతీమ్,
శాతకుమ్భేన మహతా ప్రాకారేణాభిసంవృతామ్. 6

కిఙ్కిణీజాలఘోషాభిః పతాకాభిరలంకృతామ్.
ఆసాద్య సహసా హృష్టః ప్రాకారమభిపేదివాన్. 7

ప్ర. అ. (సః = హనుమంతుడు), శారదామ్బుధరప్రఖ్యైః = శరత్కాల మేఘములతో సమానము లైన, భవనైః = భవనములచేత, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినదీ, సాగరోపమనిర్ఘోషామ్ = సముద్రముతో సమాన మైన ధ్వని కలదీ, సాగరానిలసేవితామ్=సముద్రపు గాలిచేత సేవింపబడినదీ, సుపుష్టబలసంపుష్టామ్ = బాగుగా పుష్టిచెందిన సేనలతో నిండినదీ, విటపావతీం యథైవ= అలకాపురి వలె ఉన్నదీ, చారుతోరణనిర్యూహామ్ = అందమైన తోరణముల వద్ద నిలచిన గజసమూహములు కలదీ, పాణ్డురద్వారతోరణామ్=తెల్లని ద్వారములు, ముఖద్వారములూ కలదీ, భుజగాచరితామ్ = సర్పములచే సంచరించబడుచు, గుప్తామ్ = వానిచే రక్షింపబడిన, శుభామ్ = సుందర మైన, భోగవతీమివ= (పాతాళములోని) భోగవతీపట్టణము వలె ఉన్నదీ, సవిద్యుద్ఘనాకీర్ణామ్=మెరపులతో కూడిన మేఘములచే వ్యాప్త మైనదీ, జ్యోతిర్మార్గనిషేవితామ్ = నక్షత్ర మార్గముచే సేవింపబడినదీ, మన్దమారుతసంచారామ్=మంద మైన వాయుసంచారము కలదీ, ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, అమరావతీం యథా = అమరావతి వలె ఉన్నదీ, శాతకుమ్భేన = బంగారువికార మైన, మహతా = పెద్ద దైన, ప్రాకారేణ = ప్రాకారముచేత, అభిసంవృతామ్ = చుట్టబడినదీ, కిఙ్కిణీజాల ఘోషాభిః = చిరుమువ్వల సముదాయముల ధ్వనులు గల, పతాకాభిః=పతాకల

చేత, అలంకృతామ్ = అలంకరింపబడినదీ అయిన, తామ్ = ఆ లంకాపురిని, సహసా=శీఘ్రముగా, ఆసాద్య = సమీపించి, హృష్టః = సంతోషించినవాడై, ప్రాకారమ్=ప్రాకారమును, అభిపేదివాన్ = పొందినాడు.

తా. సముద్రముపైనుండి వచ్చుచున్న మందమారుతముచే చల్లగా ఉన్న ఆ లంకానగరము సముద్రఘోషవంటి ధ్వనితో నిండియుండెను. శరత్కాల మేఘముల వలె ఉన్న భవనములతో ప్రకాశించుచుండెను. బాగుగా బలిసిన సైనికులతో నిండి అలకాపట్టణము వలె ఉండెను. ముఖద్వారమువద్ద నిలచిన ఏనుగుల సముదాయము అందముగా కనబడుచుండెను. తెల్లని ద్వారములతోను, ముఖ ద్వారములతోను అది, సర్పములు సంచరించుచున్నదీ, వాని రక్షణలో ఉన్నదీ అయిన మంగళకర మైన భోగవతీనగరము వలె ఉండెను. మెరుపులతో కూడిన మేఘములతో వ్యాప్తమై, నక్షత్రమార్గమును అంటుచు, మందమారుతము సంచరించుచున్న ఆ లంక ఇంద్రుని అమరావతి వలె ప్రకాశించుచుండెను. దాని చుట్టు బాగ పెద్ద దైన బంగారుప్రాకార ముండెను. చిరుమువ్వలతో సవ్వడులు చేయుచున్న పతాకలతో అలంకరింపబడెను. అట్టి ఆ లంకను హనుమంతుడు శీఘ్రముగా సమీపించి, ప్రాకారమువద్దకు వెళ్లెను. 3.7

మూ. విస్మయావిష్టహృదయః పురీమాలోక్య సర్వతః,
జాంబూనదమయైర్ద్వారై ర్వైడూర్యకృతవేదికైః. 8

వజ్రస్ఫటికముక్తాభిర్మణికుట్టిమభూషితైః,
తప్తహాటకనిర్యూహై రాజతామలపాణ్డురైః. 9

వైడూర్యకృతసోపానైః స్ఫాటికాన్తరపాంసుభిః,
చారుసంజవనోపేతైః ఖమివోత్పతితైః శుభైః. 10

క్రౌఞ్చబర్హిణసంఘుష్టై రాజహంసనిషేవితైః,
తూర్యాభరణనిర్ఘోషైః సర్వతః ప్రతినాదితామ్. 11

వస్వోకసారాప్రతిమాం తాం వీక్ష్య నగరీం తతః,
ఖమివోత్పతితాం లఙ్కాం జహర్ష హనుమాన్ కపిః. 12

ప్ర. అ. పురీమ్=పట్టణమును, సర్వతః = అంతటా, ఆలోక్య=చూచి,
విస్మయావిష్టహృదయః = ఆశ్చర్యముతో నిండిన హృదయముగలవా డయ్యెను.
తతః = పిమ్మట, కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు, జామ్బూ
నదమయైః = బంగారువికార మైన, ద్వారైః=ద్వారములతో కూడినవీ, వైడూర్య
కృతవేదికైః = వైడూర్యమాణిక్యములతో చేయబడిన అరుగులు కలవీ, వజ్ర
స్ఫటికముక్తాభిః=వజ్రములతోను, స్ఫటికములతోను, ముత్యములతోను కూడినవీ,
మణికుట్టిమభూషితైః = మాణిక్యవికారము లైన చపటాచేసిన ప్రదేశములతో
అలంకరింపబడినవీ, తప్తహాటకనిర్యూహైః=కరిగించిన బంగారముతో తయారు
చేసిన మదపుటేనుగులు కలవీ, రాజతామలపాణ్డురైః = వెండితో తయారుచేసినవి
వలె నిర్మలములూ, తెల్లనవీ అయినవీ, వైడూర్యకృతసోపానైః = వైడూర్య
మాణిక్యములతో కట్టబడిన మెట్లు గలవీ, స్ఫాటికాన్తరపాంసుభిః = స్ఫటిక
మాణిక్యవికార మైన లోపలి పరాగము గలవీ, చారుసంజవనోపేతైః = అంద
మైన చతుశ్శాలలతో కూడినవీ, క్రౌఞ్చబర్హిణసంఘుష్టైః = క్రౌంచపక్షులచేతను,
నెమళ్ళచేతను ధ్వనిచేయింపబడినవీ, రాజహంసనిషేవితైః = రాజహంసలచేత
సేవింపబడినవీ, ఖమ్=ఆకాశమును గూర్చి, ఉత్పతితైరివ=ఎగురుచున్నవి వలె
ఉన్నవీ అయిన, శుభైః = మంగళకరము లైన గృహములతో కూడినదీ, తూర్యా
భరణనిర్ఘోషైః = తూర్యములయొక్క, ఆభరణములయొక్క ధ్వనులచేత,
సర్వతః=అంతటను, ప్రతినాదితామ్=ప్రతిధ్వనింపచేయబడినదీ, వస్వౌకసారా
ప్రతిమామ్ = పూర్వదిక్కున ఉన్న వస్వౌకసార అను ఇంద్రుని పట్టణముతో
సమాన మైనదీ, ఖమ్=ఆకాశమును గూర్చి, ఉత్పతితామ్ ఇవ=ఎగురుచున్నది
వలె ఉన్న, తామ్ = ఆ, లఙ్కాం నగరీమ్ = లంకానగరమును, వీక్ష్య=చూచి,
జహర్ష = సంతోషించెను.

తా. హనుమంతుడు ఆ నగరమును నలుమూలల చూచి మనస్సులో చాల
ఆశ్చర్యము చెందెను. ఆ నగరమునందలి గృహముల ద్వారములు బంగారముతో
నిర్మింపబడెను. వాటి ఎదుట వైడూర్యమాణిక్యములతో నిర్మించిన అరుగులు
ఉండెను. ఆ గృహము లన్నియు వజ్రములతోను, స్ఫటికములతోను, ముత్య
ములతోను, మాణిక్యములు పరచిన చపటాచేసిన చదు నైన ప్రదేశములతోను,
అక్కడక్కడ నిలబెట్టిన బంగారు మదపుటేనుగులతోను ప్రకాశించుచుండెను.
వెండితో నిర్మించినవి వలె స్వచ్ఛముగా తెల్లగా ఉన్న ఆ గృహములలో మెట్లు

వై దూర్యమాణిక్యములతో నిర్మింపబడెను. ప్రాకారాదులలోపల స్ఫటికమాణిక్యముల పరాగముండెను. క్రౌంచపక్షులు, నెమళ్ళు, రాజహంసలు అక్కడ నివసించుచుండెను. మంగళప్రదములైన ఆ భవనములు ఆకాశములో ఎగిరిపోవుచున్నట్లు కనబడుచుండెను. ఆనగరమంతటను వాద్యముల ధ్వని, ఆభరణముల ధ్వని ప్రతిధ్వనించుచుండెను. ఈ విధముగ వస్వౌకసార అను దేవేంద్రనగరమువలె ఆకాశములోనికి ఎగిరిపోవుచున్నదా అన్నట్లు ఉన్న ఆ లంకాపట్టణమును చూచి హనుమంతుడు సంతోషించెను. 6.12

మూ. తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతేః శుభామ్,
అనుత్తమామృద్ధియుతాం చిన్తయామాస వీర్యవాన్. 13

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన హనుమంతుడు, అనుత్తమామ్ = అత్యుత్తమ మైనదీ, ఋద్ధియుతామ్=ఐశ్వర్యముతో కూడినదీ, రమ్యామ్ = సుందర మైనదీ, శుభామ్=మంగళప్రద మైనదీ అయిన, రాక్షసాధిపతేః=రాక్షస రాజుయొక్క, తాం పురీమ్ = ఆ పట్టణమును, సమీక్ష్య=చూచి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. పరాక్రమవంతుడైన హనుమంతుడు, అత్యుత్తమమూ, ఐశ్వర్య సంపన్నమూ, అతిసుందరమూ, మంగళప్రదమూ అయిన ఆ రావణనగరిని చూచి ఇట్లు ఆలోచించెను. 13

మూ. నేయమన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్,
రక్షితా రావణబలైరుద్యతాయుధధారిభిః. 14

ప్ర. అ. ఉద్యతాయుధధారిభిః = ఎత్తబడిన ఆయుధములను ధరించి ఉన్న, రావణబలైః=రావణుని సేనలచేత, రక్షితా=రక్షింపబడిన, ఇయం నగరీ = ఈపట్టణము. అన్యేన=ఇతరు డెవ్వనిచేతను, బలాత్=బలమువలన, ధర్షయితుమ్=ఎదిరించుటకు, న శక్యా = శక్య మైనది కాదు.

తా. ఆయుధములు ధరించి ఎల్లప్పుడు సర్వసన్నద్ధులై ఉన్న రావణ సైన్యములు రక్షించుచున్న ఈ నగరమును ఎవ్వరూ బలప్రయోగము చేసి ఎదిరించలేరు. 14

మూ. కుముదాఙ్గదయోర్వాపి సుషేణస్య మహాకపేః,
ప్రసిద్ధేయం భవేద్భూమిర్మైన్దద్వివిదయోరపి. 15

ప్ర. అ. ఇయమ్=ఈ, భూమిః=ప్రదేశము, కుముదాఙ్గదయోర్వాపి = కుముదునకూ, అంగదునకూ గాని, మహాకపేః = మహావానరు డైన, సుషేణస్య =సుషేణునకు గాని, మైన్దద్వివిదయోరపి = మైందద్వివిదులకు గాని, ప్రసిద్ధా= బాగుగా తెలిసినది, భవేత్=కావచ్చును.

తా. ఈ ప్రదేశమును కుముదుడు, అంగదుడు, మహాకపి యైన సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు-వీరిలో ఎవ రైన సాధించ కలుగుదురేమో. 15

మూ. వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః,
ఋక్షస్య కపిముఖ్యస్య మమ చైవ గతిర్భవేత్. 16

ప్ర. అ. వివస్వతః = సూర్యునియొక్క, తనూజస్య = కుమారు డైన సుగ్రీవునకు, హరేః = వానరుడైన, కుశపర్వణః=కుశపర్వునకు, కపిముఖ్యస్య = వానరశ్రేష్ఠు డైన, ఋక్షస్య = ఋక్షునకు, మమ చైవ = నాకూ, గతిః=అవ కాశము, భవేత్=అగును.

తా. సుగ్రీవుడు, కుశపర్వుడు, వానరశ్రేష్ఠు డైన ఋక్షుడు, నేను ఇక్కడికి రాగలుగుదుము. 16

మూ. సమీక్ష్య చ మహాబాహో రాఘవస్య పరాక్రమమ్,
లక్ష్మణస్య చ విక్రాన్తమభవత్ప్రీతిమాన్ కపిః. 17

ప్ర. అ. కపిః=హనుమంతుడు, మహాబాహోః=గొప్ప బాహువులు గల, రాఘవస్య=రామునియొక్క, పరాక్రమమ్ = పరాక్రమమును, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, విక్రాన్తం చ=విక్రమమును, సమీక్ష్య=తలచి, ప్రీతిమాన్= ఆనందముకలవాడు, అభవత్ = ఆయెను.

తా. లంక ఎంత గొప్ప బలము కల దైనను రామలక్ష్మణుల మహా పరాక్రమము ముందు నిలువ జాలదు అనే విషయమును గుర్తించి హనుమంతుడు సంతోషించెను. 17

మూ. తాం రత్నవసనోపేతాం కోష్ఠాగారావతంసకామ్,
యన్త్రాగారస్తనీమృద్ధాం ప్రమదామివ భూషితామ్. 18

తాం నష్టతిమిరాం దీపైర్భాస్వరైశ్చ మహాగృహైః,
నగరీం రాక్షసేన్ద్రస్య స దదర్శ మహాకపిః. 19

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, రత్నవసనోపేతామ్ = రత్నము లనెడు (రత్నకాంతు లనెడు) వస్త్రముతో కూడినదీ, కోష్ఠాగారావతంసకామ్=వివిధవస్తుసామగ్రిని నిలువ చేయు గృహములే కర్ణభూషణములుగా కలదీ, యన్త్రాగారస్తనీమ్ =యంత్రగృహములే స్తనములు కలదీ, ఋద్ధామ్ = ఐశ్వర్యముతో కూడినదీ, భూషితామ్=అలంకరించబడిన, ప్రమదామివ=స్త్రీవలె ఉన్నదీ, దీపైః = ప్రజ్వలింపచేయబడిన (దీపములు వెలిగించిన), భాస్వరైశ్చ =ప్రకాశించుచున్న, మహాగృహైః = గొప్ప గృహముంచేత, నష్టతిమిరామ్ = నశించిన చీకటి కలదీ అయిన, తామ్=ప్రసిద్ధమైన. తామ్=ఆ, రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజుయొక్క, నగరీమ్=నగరమును, దదర్శ = చూచెను.

తా. ఆ లంకాపట్టణము రత్నకాంతు లను వస్త్రమును, కోష్ఠాగారము లను కర్ణభూషణములను ధరించి, యన్త్రగృహములు స్తనములుగా ప్రకాశించు చుండగా సర్వసంపత్సమృద్ధమై, చక్కగా అలంకరించుకొనిన స్త్రీ వలె ఉండెను. గృహములలోని దీపములు వెలిగించుటచే ఆ గృహము లన్నియు ప్రకాశించు చుండగా, నగరములోని చీకటి అంతా తొలగిపోయెను. అట్టి లంకాపట్టణమును హనుమంతుడు చూచెను. 18, 19

మూ. అథ సా హరిశార్దూలం ప్రవిశన్తం మహాబలమ్,
నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజమ్. 20

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సా నగరీ= ఆ పట్టణము, హరిశార్దూలమ్ = వానరశ్రేష్ఠుడూ, మహాబలమ్ = గొప్ప బలముకలవాడూ అయిన, పవనాత్మజమ్ = హనుమంతుని, ప్రవిశన్తమ్=ప్రవేశించుచుండగా, స్వేన=తన సంబంధమైన, రూపేణ = రూపముతో, దదర్శ = చూచెను.

తా. మహాబలశాలి, వానరశ్రేష్ఠుడూ అయిన ఆ హనుమంతుడు లోనికి

ప్రవేశించుచుండగా, ఆ లంకానగరి తన రాక్షసస్వరూపముతో అతనిని చూచెను. 20

మూ. సా తం హరివరం దృష్ట్వా లఙ్కా రావణపాలితా,
స్వయమేవోత్థితా తత్ర వికృతాననదర్శనా. 21

ప్ర. అ. రావణపాలితా = రావణునిచేత పాలింపబడిన, సా లఙ్కా = ఆ లంక, తం హరిమ్ = ఆ హనుమంతుని, తత్ర = అక్కడ, దృష్ట్వా = చూచి, వికృతాననదర్శనా = వికృత మైన ముఖమూ నేత్రములూ కలదై, స్వయమేవ = స్వయముగానే, ఉత్థితా = లేచినది.

తా. రావణునిచేత పరిపాలింపబడిన ఆ లంకానగరి హనుమంతుని చూచి, భయంకర మైన ముఖముతోను, నేత్రములతోను స్వయముగా లేచెను. 21

మూ. పురస్తాత్కపివర్యస్య వాయుసూనోరతిష్ఠత,
ముఞ్చమానా మహానాదమబ్రవీత్పవనాత్మజమ్. 22

ప్ర. అ. కపివర్యస్య = వానరశ్రేష్ఠు డైన, వాయుసూనోః = హనుమంతుని యొక్క, పురస్తాత్ = ఎదుట, అతిష్ఠత = నిలచెను. మహానాదమ్ = గొప్పధ్వనిని, ముఞ్చమానా = విడచుచు, పవనాత్మజమ్ = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ లంక వానరశ్రేష్ఠు డైన హనుమంతుని ఎదుట నిలచి, బిగ్గరగా ధ్వని చేయుచు, అతనితో ఇట్లనెను. 22

మూ. కస్త్వం కేన చ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ,
కథయస్వేహ యత్తత్త్వం యావత్ప్రాణా ధరన్తి తే. 23

ప్ర. అ. వనాలయ = వనములో నివసించు ఓ వానరుడా। త్వమ్ = నీవు, కః = ఎవరవు? కేన కార్యేణ = ఏ పనిచేత, ఇహ = ఇచ్చటికి, ప్రాప్తః = వచ్చినావు? తే = నీయొక్క, ప్రాణాః = ప్రాణములు, యావత్ = ఎంతవరకు, ధరన్తి = నిలచునో, అంతలో, ఇహ = ఇక్కడ, తత్త్వమ్ = యథార్థము, యత్ = ఏదియో దానిని, కథయస్వ = చెప్పుము.

తా. ఓ వానరుడా! నువ్వు ఎవ్వరవు! ఇక్కడికి ఎందుకు వచ్చినావు! నేను నీ ప్రాణాలు తీసివేసే లోపల యదార్థ మేమో చెప్పుము. 23

మూ. న శక్యం ఖల్వియం లఙ్కా ప్రవేష్టుం వానర త్వయా,
రక్షితా రావణబలైరభిగుప్తా సమన్తతః 24

ప్ర. అ. వానర = వానరుడా! రావణబలైః = రావణుని సేనలచేత, రక్షితా = రక్షింపబడినదీ, సమన్తతః = అంతటను, అభిగుప్తా = రహస్యముగా ఉంచబడినదీ అయిన, ఇయం లఙ్కా = ఈ లంక, త్వయా = నీచేత, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, న శక్యం ఖలు = శక్యము కాదు కదా.

తా. ఓ! వానరుడా! అన్ని విధములా రహస్యముగా ఉంచి రావణ సైన్యములు రక్షించుచున్న ఈ లంకలోనికి నీవు ప్రవేశింపజాలవు. 24

మూ. అథ తామబ్రవీద్వీరో హనుమానగ్రతః స్థితామ్,
కథయిష్యామి తే తత్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి.

ప్ర. అ. అథ = పిమ్మట, వీరః = వీరుడైన, హనుమాన్ = హనుమంతుడు, అగ్రతః = ఎదుట, స్థితామ్ = నిలచిన, తామ్ = ఆమెను గూర్చి, అబ్రవీత్ = పలికెను. యత్ = దేనిని గూర్చి, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, పరిపృచ్ఛసి = ప్రశ్నించుచున్నావో, తత్త్వమ్ = ఆ యథార్థమును, తే = నీకు, కథయిష్యామి = చెప్పగలను.

తా. హనుమంతుడు తన ఎదుట నిలచిన ఆ లంకతో ఇట్లు పలికెను-నీవు అడిగిన విధముగ యథార్థవిషయ మంతా చెప్పెదను. 25

మూ. కా త్వం విరూపనయనా పురద్వారేఽవతిష్ఠసి,
కిమర్థం చాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా. 26

ప్ర. అ. పురద్వారే = పట్టణముయొక్క ద్వారమునందు, అవతిష్ఠసి = ఉన్నావు, విరూపనయనా = విపరీతమైన రూపమూ నేత్రములూ గల, త్వమ్ = నీవు, కా = ఎవతెవు? దారుణా = భయంకరురాలైన నీవు, మామ్ = నన్ను, రుద్ధ్వా = అడ్డుపెట్టి, కిమర్థమ్ = ఎందుకు, నిర్భర్త్సయసి = భయపెట్టుచున్నావు.

రా. లంకాద్వారమునందు ఉన్నావు; నీ వెవ్వరవు? వికృత మైన ఆకారముతో, నేత్రములతో భయంకరముగా ఉన్న నీవు నన్ను అడ్డుకొని ఎందుకు బెదిరించుచున్నావు? 26

మూ. హనుమద్వచనం శ్రుత్వా లఙ్కా సా కామరూపిణీ,
ఉవాచ వచనం క్రుద్ధా పరుషం పవనాత్మజమ్. 27

ప్ర. అ. కామరూపిణీ = ఇచ్ఛానుసారము రూపము ధరించ గల, సా లఙ్కా = ఆ లంక, హనుమద్వచనమ్ = హనుమంతుని వచనమును, శ్రుత్వా = విని, క్రుద్ధా = కోపగించినదై, పవనాత్మజమ్ = హనుమంతుని గూర్చి, పరుషమ్ = పరుష మైన, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

రా. కోరిన రూపము ధరించగల ఆ లంక హనుమంతుని వాక్యము విని కోపించి, అతనితో నిట్లు కఠినముగా పలికెను. 27

మూ. అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః,
ఆజ్ఞాప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీమిమామ్. 28

ప్ర. అ. రాక్షసరాజస్య = రాక్షసుల ప్రభువు, మహాత్మనః = గొప్ప బుద్ధి కలవాడూ అయిన, రావణస్య = రావణునియొక్క, ఆజ్ఞాప్రతీక్షా = ఆజ్ఞను పరీక్షించేదానను, దుర్ధర్షా = ఎదిరింపశక్యము కానిదానను అయిన, అహమ్ = నేను, ఇమాం నగరీమ్ = ఈ పట్టణమును, రక్షామి = రక్షించుచున్నాను.

రా. నేను మహాబుద్ధిశాలి, రాక్షసరాజూ అయిన రావణుని ఆజ్ఞను పాలించుదానను. నన్నెవ్వరును ఎదిరించలేరు. నే నీ నగరమును రక్షించుచున్నాను.

మూ. న శక్యా మామవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా,
అద్య ప్రాణైః పరిత్యక్తః స్వప్స్యసే నిహతో మయా. 29

ప్ర. అ. మామ్ = నన్ను, అవజ్ఞాయ = అవమానించి, నగరీ = పట్టణము, త్వయా = నీచేత, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, న శక్యా = శక్యము కాదు. అద్య = ఇప్పుడు, మయా = నాచేత, నిహతః = కొట్టబడినవాడవై, ప్రాణైః = ప్రాణములచేత, పరిత్యక్తః = విడువబడినవాడవై, స్వప్స్యసే = నిద్రించగలవు.

తా. నన్ను కాదని నీవు ఈ నగరములో ప్రవేశించజాలవు. ఇప్పుడు నిన్ను నేను చంపనున్నాను. నీవు ప్రాణములు విడిచి దీర్ఘనిద్ర పొందగలవు.

మూ. అహం హి నగరీ లఙ్కా స్వయమేవ ప్లవఙ్గమ,
సర్వతః పరిరక్షామి హ్యేతత్తే కథితం మయా. 30

ప్ర. అ. ప్లవఙ్గమ = ఓ! వానరుడా! అహమ్ = నేను, స్వయమ్ = స్వయముగా, లఙ్కానగరీ = లంకానగరిని, సర్వతః = అన్ని వైపులనుండి, పరిరక్షామి = రక్షించుచున్నాను. ఏతత్ = ఈ విషయము, తే = నీకు, మయా = నాచేత, కథితం హి = చెప్పబడినది కదా.

తా. నేను సాక్షాత్తు లంకానగరమును. ఈ పురమును అన్ని వైపులా రక్షించుచుందును. నా విషయము అడిగినావు గాన నీకు చెప్పినాను. 30

మూ. లఙ్కాయా వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః,
యత్నవాన్స హరిశ్రేష్ఠః స్థితశ్శైల ఇవాపరః. 31

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హరిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, లఙ్కాయాః = లంకయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, యత్నవాన్ = ప్రయత్నము కలవాడై, అపరః = రెండవ, శైలః ఇవ = పర్వతము వలె, స్థితః = నిలచెను.

తా. వానరశ్రేష్ఠుడు, వాయుకుమారుడు అయిన హనుమంతుడు లంక మాటలు విని, అవసరమైనచో ఆమెను ఎదిరించుటకు సిద్ధమగుచు రెండవ పర్వతము వలె నిలచెను. 31

మూ. స తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా వానరపుఙ్గవః,
ఆబభాషేఽథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః. 32

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మేధావీ = బుద్ధిమంతుడు, సత్త్వవాన్ = బలము గలవాడు, ప్లవగర్షభః = ఎగిరివెళ్ళేవారిలో శ్రేష్ఠుడు, వానరపుఙ్గవః = వానరులలో శ్రేష్ఠుడూ అయిన, సః = ఆ హనుమంతుడు, స్త్రీరూపవికృతామ్ = స్త్రీరూపములో ఉన్నదీ, వికారముగా కనబడునదీ అయిన, తామ్ = ఆ లంకను, దృష్ట్వా = చూచి, ఆబభాషే = పలికెను.

తా. అనంతరము, బుద్ధిమంతుడు, బలవంతుడు, ఎగిరి ప్రయాణము చేయువారిలో గొప్పవాడు, వానరశ్రేష్ఠుడూ అయిన ఆ హనుమంతుడు భయంకర మైన స్త్రీరూపములో ఉన్న ఆ లంకను చూచి ఇట్లు పలికెను. 32

మూ. ద్రక్ష్యామి నగరీం లఙ్కాం సాట్టప్రాకారతోరణామ్,
ఇత్యర్థమిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. 33

ప్ర. అ. సాట్టప్రాకారతోరణామ్ = బురుజులతోను, ప్రాకారములతోను, ముఖద్వారములతోను కూడిన, లఙ్కాం నగరీమ్ = లంకాపట్టణమును, ద్రక్ష్యామి = చూడగలను, ఇత్యర్థమ్ = ఈ నిమిత్త మై, ఇహ = ఇచటికి, సంప్రాప్తః = వచ్చినాను. మే = నాకు, పరమ్ = అధిక మైన, కౌతూహలం హి = వేడుక ఉన్నది కదా।

తా. బురుజులతోను, ప్రాకారములతోను, ముఖద్వారములతోను మనోహరముగా ఉన్న ఈ లంకానగరమును చూడవలె నను కోరికతో ఇక్కడికి వచ్చినాను. నాకు ఎంతో కుతూహలముగా ఉన్నది. 33

మూ. వనాన్యుపవనానీహ లఙ్కాయాః కాననాని చ,
సర్వతో గృహముఖ్యాని ద్రష్టుమాగమనం హి మే. 34

ప్ర. అ. లఙ్కాయాః = లంకయొక్క, వనాని = తోటలను, ఉపవనాని = ఉద్యానములను, కాననాని చ = అడవులను, సర్వతః = అంతటా ఉన్న, గృహముఖ్యాని = శ్రేష్ఠ మైన గృహములను, ద్రష్టుమ్ = చూచుట కొరకే, ఇహ = ఇక్కడికి, మే = నాయొక్క, ఆగమనం హి = రాక కదా!

తా. లంకలో ఉన్న తోటలను, ఉద్యానములను, అడవులను నగరములో అంతటా ఉన్న అంద మైన భవనములను చూచుటకే నే నిక్కడకు వచ్చినాను.

మూ. తస్య తద్వచనం శ్రుత్వా లఙ్కా సా కామరూపిణీ,
భూయ ఏవ పునర్వాక్యం బభాషే పరుషాక్షరమ్. 35

ప్ర. అ. కామరూపిణీ = స్వేచ్ఛారూపము గల, లఙ్కా = లంక, తస్య = అతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, పున

= మరల, భూయః . ఏవ = లంకనూ (వెనుకటి వాక్యము కంటె), పరుషా క్షరమ్ = పరుష మైన అక్షరములు గల, వాక్యమ్ = వాక్యమును, అభాషే = పలికెను.

తా. ఇచ్ఛానుసారముగ వివిధరూపములు ధరించగలిగిన ఆ లంక హనుమంతుని మాటలు విని, మరల ఇంకను పరుషముగా పలికెను. 35

మూ. మామనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వరపాలితా,
న శక్యమద్య తే ద్రష్టుం పురీయం వానరాధమ. 36

ప్ర. అ. దుర్బుద్ధే = చెడ్డ బుద్ధి గల, వానరాధమ = ఓ వానరాధముడా! మామ్ = నన్ను, అనిర్జిత్య = జయించకుండగా, రాక్షసేశ్వరపాలితా = రావణునిచే పాలింపబడిన, ఇయం పురీ = ఈ పట్టణము, అద్య = ఇప్పుడు, ద్రష్టుమ్ = చూచుటకు, తే = నీకు, న శక్యమ్ = శక్యము కాదు.

తా. ఓరి దుర్బుద్ధీ! వానరాధమా! నన్ను జయించి కాని నీవు రావణునిచే రక్షింపబడుచున్న ఈ పట్టణములోనికి ప్రవేశింపజాలవు. 36

మూ. తతః స కపిశార్దూలస్తామువాచ నిశాచరీమ్,
దృష్ట్వా పురీమిమాం భద్రే పునర్యాస్యే యథాగతమ్. 37

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ, కపిశార్దూలః = వానరశ్రేష్ఠుడు, తామ్ = ఆ, నిశాచరీమ్ = రాక్షసస్త్రీని గూర్చి, ఉవాచ = పలికెను. భద్రే = మంగళప్రదురాలా! ఇమామ్ = ఈ, పురీమ్ = పట్టణమును, దృష్ట్వా = చూచి, పునః = మరల, యథాగతమ్ = వచ్చినట్లుగానే, యాస్యే = వెళ్ళిపోయెదను.

తా. అప్పు డా హనుమంతుడు, ఆ రాక్షసితో "ఓ! మంగళప్రదురాలా! ఈ పట్టణము ఒక సారి చూచి, వచ్చిన దారినే తిరిగి వెళ్ళిపోయెదను" అని చెప్పెను. 37

మూ. తతః కృత్వా మహానాదం సా వై లఙ్కా భయావహమ్,
తలేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా. 38

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సా లఙ్కా = ఆ లంక, భయావహమ్ =

భయమును కలిగించు, మహానాదమ్ = గొప్ప ధ్వనిని, కృత్వా = చేసి, వేగితా = తొందర పడుచున్నదై, వానరశ్రేష్ఠమ్ = హనుమంతుని, తలేన = అర చేతితో, తాడయామాస = కొట్టెను.

తా. అప్పు డా లంక భయంకరముగా అరచుచు, వేగముగా, ఆ హను మంతునిపై అరచేతితో ఒక్క దెబ్బ చరచెను. 38

మూ. తతః స కపిశార్దూలో లఙ్కయా తాడితో భృశమ్,
నననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః. 39

ప్ర. అ. తతః = అటుపిమ్మట, లఙ్కయా = లంకచేత, భృశమ్ = మిక్కిలి, తాడితః = కొట్టబడిన, వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, పవనాత్మజః = వాయుపుత్రు డైన, సః కపిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడు, సుమహానాదమ్ = = చాల పెద్ద ధ్వని వచ్చునట్లు, ననాద = ధ్వని చేసెను.

తా. లంక ఆ విధముగా గట్టిగా కొట్టగానే పరాక్రమవంతుడూ, వాయు పుత్రుడూ అయిన ఆ హనుమంతుడు చాల బిగ్గరగా అరచెను. 39

మూ. తతః సంవర్తయామాస వామహస్తస్య సోఽఙ్గుళీః,
ముష్టినాభిజఘానైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః. 40
స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధః స్వయం కృతః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, క్రోధమూర్ఛితః = కోపముచే వ్యాపింపబడినవాడై, వామహస్తస్య = ఎడమచేతి యొక్క, అఙ్గుళీః = వేళ్లను, సంవర్తయామాస = ముడచెను. ఏనామ్ = ఈమెను, ముష్టినా = పిడికిలితో, అభిజఘాన = కొట్టెను. స్త్రీ చ ఇతి = స్త్రీ కదా అని, మన్యమానేన = తలచుచున్న అతనిచేత, స్వయమ్ = స్వయముగా, అతిక్రోధః = ఎక్కువ కోపము, న కృతః = చేయబడలేదు.

తా. అప్పుడు హనుమంతుడు క్రోధావిష్టు డై ఎడమచేతి వ్రేళ్లు ముడిచి, పిడికిలితో ఆమెను కొట్టెను. స్త్రీ కదా అను భావముతో అతడు తానుగా ఎక్కువ కోపమును ప్రదర్శింపలేదు. 40

మూ. సా తు తేన ప్రహారేణ విహ్వలాఙ్గీ నిశాచరీ । 41
పపాత సహసా భూమౌ వికృతాననదర్శనా ॥

ప్ర. అ. సా = ఆ, నిశాచరీ తు = రాక్షసి యైతే, తేన ప్రహారేణ = ఆ దెబ్బచేత, విహ్వలాఙ్గీ = వ్యాకుల మైన శరీరము కలదై, వికృతాననదర్శనా = వికృత మైన ముఖము, నేత్రములూ కలదై, సహసా = వెంటనే, భూమౌ = నేలపై, పపాత = పడెను.

తా. ఆ రాక్షసి ఆ దెబ్బతో ఒళ్లు తిరిగి పోగా వికృత మైన ముఖముతోను తేలిపోయిన నేత్రములతోను, వెంటనే నేలపై పడెను. 41

మూ. తతస్తు హనుమాన్ ప్రాజ్ఞస్తాం దృష్ట్వా వినిపాతితామ్ ।
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియం తు తామ్ ॥

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రాజ్ఞః = బుద్ధిమంతుడు, తేజస్వీ = తేజశ్శాలి అయిన, హనుమాన్ = హనుమంతుడు, వినిపాతితామ్ = క్రిందికి పడ వేయబడిన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, తామ్ = ఆమెను, స్త్రియమ్ = స్త్రీనిగా, మన్యమానః = తలచుచు, కృపామ్ = జాలిని, చకార = చేసెను.

తా. పిమ్మట, బుద్ధిమంతుడు, తేజశ్శాలి అయిన హనుమంతుడు ఆమె నేలపై పడిపోవుట చూచి, పాపము! స్త్రీని కొట్టినానే అని అనుకొనుచు, ఆమెపై దయ చూపెను. 42

మూ. తతో వై భృశసంవిగ్నా లఙ్కా సా గద్గదాక్షరమ్ । 43
ఉవాచాగర్వితం వాక్యం హనూమన్తం ప్లవఙ్గమమ్ ॥

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సా = ఆ, లఙ్కా = లంక, భృశసంవిగ్నా = చాలా దిగులు చెందినదై, గద్గదాక్షరమ్ = గద్గద మైన అక్షరములు కలుగునట్లుగా, అగర్వితమ్ = గర్వము లేని, వాక్యమ్ = వాక్యమును, ప్లవఙ్గమమ్ = వానరు డైన, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. అప్పుడా లంక చాల భయపడి, హనుమంతునితో ఏ మాత్రము గర్వము లేని మాటలు, గద్గదస్వరముతో ఇట్లు పలికెను. 43

మూ. ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ, 44
సమయే సౌమ్య తిష్ఠన్తి సత్త్వవన్తో మహాబలాః.

ప్ర. అ. సుమహాబాహో = చాల గొప్ప బాహువులు కలవాడా! హరిసత్తమ = వానరశ్రేష్ఠుడా! ప్రసీద = అనుగ్రహించుము. త్రాయస్వ = రక్షించుము. సౌమ్య = ఓ సౌమ్యుడా! సత్త్వవన్తః = ధైర్యము గల, మహాబలాః = గొప్ప బలము గలవారు, సమయే = కట్టుబాటునందు, తిష్ఠన్తి = ఉందురు.

తా. మహాబాహు వైన ఓ వానరశ్రేష్ఠుడా! అనుగ్రహించి రక్షింపుము. నీవంటి ధైర్యశాలు లైన మహాబలవంతులు "స్త్రీని చంపకూడదు" ఇత్యాది నియమములను దాటరు కదా! 44

మూ. అహం తు నగరీ లఙ్కా స్వయమేవ ప్లవఙ్గమ, 45
నిర్జితాహం త్వయా వీర విక్రమేణ మహాబల.

ప్ర. అ. ప్లవఙ్గమ = ఓ వానరుడా! అహం తు = నేనైతే, స్వయమ్ = స్వయముగా, లఙ్కానగర్యేవ = లంకానగరమునే. మహాబల = గొప్ప బలము కలవాడా! వీర = వీరుడా! అహమ్ = నేను, త్వయా = నీచేత, విక్రమేణ = పరాక్రమము చేత, నిర్జితా = జయింపబడినాను.

తా. ఓ! వానరుడా! నేను సాక్షాత్తు లంకానగరమును. మహాబలశాలి వైన ఓ వీరుడా! నీవు నన్ను పరాక్రమముచేత జయించినావు. 45

మూ. ఇదం తు తథ్యం శృణు వై బ్రువన్త్యా మే హరీశ్వర,
స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ.

ప్ర. అ. హరీశ్వర = ఓ వానరశ్రేష్ఠుడా! పురా = పూర్వము, మమ = నాకు, స్వయంభువా = బ్రహ్మదేవునిచేత, యథా = ఎట్లు, వరదానమ్ = వరదానము, దత్తమ్ = ఇవ్వబడినదో (చేయబడినదో), ఇదమ్ = ఈ, తథ్యం తు = యథార్థము నైతే, బ్రువన్త్యాః = చెప్పుచున్న, మే = నాకు (నా నుండి), శృణు వై = వినుము.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! పూర్వము బ్రహ్మదేవుడు నా కిచ్చిన వరమును గూర్చి యథార్థముగా చెప్పుచున్నాను. వినుము. 46

మూ. యదా త్వాం వానరః కశ్చిద్విక్రమాద్వశమానయేత్. 47
తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయమాగతమ్.

ప్ర. అ. యదా = ఎప్పుడు, కశ్చిత్ = ఒకానొక, వానరః = వానరుడు, విక్రమాత్ = పరాక్రమమువలన, త్వామ్ = నిన్ను, వశమ్ ఆనయేత్ = వశము చేసుకొనునో, తదా = అప్పుడు, రక్షసామ్ = రాక్షసులకు, భయమ్ = భయము, ఆగతమ్ = వచ్చినదిగా, త్వయా = నీచేత, విజ్ఞేయమ్ = తెలియదగినది.

తా. ఏనాడు నిన్ను ఒక వానరుడు తన పరాక్రమముచేత జయించునో ఆ నాడే రాక్షసులకు భయము ప్రాప్తించినట్లు (రానున్నట్లు) తెలుసుకొనుము.

మూ. స హి మే సమయః సౌమ్య ప్రాప్తోఽద్య తవ దర్శనాత్.
స్వయంభూవిహితః సత్యో న తస్యాస్తి వ్యతిక్రమః.

ప్ర. అ. సౌమ్య = ఓ! సౌమ్యుడా! అద్య = ఇప్పుడు, తవ=నీయొక్క, దర్శనాత్ = దర్శనమువలన మే = నాకు, సః సమయః = ఆ సమయము, ప్రాప్తః = వచ్చినది. స్వయంభూవిహితః = బ్రహ్మచేత విధింపబడినది. సత్యః = సత్యమైనది. తస్య = దానికి, వ్యతిక్రమః = మార్పు, నాస్తి = లేదు.

తా. సౌమ్యుడా! ఇప్పుడు నీ దర్శనము కలుగుటవలన ఆ సమయము వచ్చిన దని అనుకొనుచున్నాను. బ్రహ్మ విధించిన ఆ సమయము సత్యమై తీరును. దానికి తిరుగు ఉండదు. 48

మూ. సీతానిమిత్తం రాజ్ఞస్తు రావణస్య దురాత్మనః, 49
రక్షసాం చైవ సర్వేషాం వినాశః సముపాగతః.

ప్ర. అ. దురాత్మనః=దుష్టబుద్ధిగల, రాజ్ఞః=రాక్షసరాజైన, రావణస్య = రావణునకు, సర్వేషామ్ = సమస్తమైన, రక్షసాం చ = రాక్షసులకూ, సీతానిమిత్తమ్ = సీతమూలముగా, వినాశః = నాశనము, సముపాగతః = వచ్చినది.

తా. సీతమూలమున, దురాత్ముడైన రావణునకూ, అందరు రాక్షసులకూ వినాశకాలము సంప్రాప్తించినది. 49

మూ. తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీం రావణపాలితామ్, 50
విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాఞ్ఛసి.

ప్ర. అ. హరిశ్రేష్ఠ=వానరశ్రేష్ఠుడా! తత్ = ఆ కారణమువలన, రావణ
పాలితామ్ = రావణునిచేత పాలింపబడిన, పురీమ్ = లంకాపురిని, ప్రవిశ్య =
ప్రవేశించి, ఇహ = ఇక్కడ, యాని యాని = వేటిని వేటిని, కాఙ్క్షసి = కోరు
చున్నావో, సర్వకార్యాణి = ఆ కార్యము లన్నింటిని, విధత్స్వ = చేయుము.

తా. ఓ! వానరశ్రేష్ఠా! రావణునిచేత పాలింపబడుచున్న ఈ లంకలో
ప్రవేశించి, నీవు ఏ యే పనులు చేయ వలె నని కోరుచున్నావో అవి అన్ని
చేయుము. 50

మూ. ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర
శుభాం పురీం రాక్షసరాజపాలితామ్.
యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీం
విమార్గ సర్వత్ర గతో యథాసుఖమ్. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
తృతీయః సర్గః.

ప్ర. అ. హరీశ్వర = వానరశ్రేష్ఠుడా! శాపోపహతామ్ = శాపముచేత
కొట్టబడినదీ, రాక్షసరాజపాలితామ్ = రావణునిచే పాలింపబడినదీ, శుభామ్ =
మంగళకరమూ అయిన, పురీమ్ = పట్టణమును, యదృచ్ఛయా = స్వేచ్ఛగా,
ప్రవిశ్య = ప్రవేశించి, త్వమ్ = నీవు, సర్వత్ర = అంతటను, గతః = వెళ్ళిన
వాడవై, యథాసుఖమ్ = సుఖముగా, సతీమ్ = పతివ్రత యైన, జనకాత్మజామ్
= సీతను, విమార్గస్వ = వెదకుము.

తా. ఓ వానరోత్తమా! రావణునిచే పాలింపబడుచున్న ఈ శుభమైన
లంకాపట్టణమునకు (నందికేశ్వరుని) శాపము తగిలియున్నది. అట్టి ఈ పట్టణము
లోనికి స్వేచ్ఛగా ప్రవేశించి, సుఖముగా అంతటను సంచరించి, పతివ్రత యైన
సీతను అన్వేషించుము. 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో తృతీయసర్గ సమాప్తము.

# అథ చతుర్థః సర్గః

[హనుమంతుడు లంకలో రావణాంతఃపురమును ప్రవేశించుట]

మూ. స నిర్జిత్య పురీం లఙ్కాం శ్రేష్ఠాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః. 1
అద్వారేణ మహాబాహుః ప్రాకారమభిపుప్లువే.

ప్ర. అ. కపిసత్తమః = వానరులలో శ్రేష్ఠుడూ, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడూ, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడూ అయిన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, కామరూపిణీమ్ = స్వేచ్ఛానుసారముగా రూపము ధరించగలిగిన, శ్రేష్ఠామ్ = శ్రేష్ఠురాలైన, తాం లఙ్కామ్ = ఆ లంకను, విక్రమేణ = పరాక్రమముచేత, నిర్జిత్య = జయించి, అద్వారేణ = ద్వారము కాని ప్రదేశముచేత (నందు), ప్రాకారమ్ = ప్రాకారమును, అభిపుప్లువే = దుమికెను.

తా. మహాతేజశ్శాలీ, వానరశ్రేష్ఠుడూ, మహాబాహువూ అయిన హనుమంతుడు కామరూపము గలదీ, శ్రేష్ఠురాలూ అయిన లంకను ఆ విధముగ తన పరాక్రమముచేత జయించి, శత్రువుల నగరములోనికి ప్రవేశించు నపుడు అనుసరించవలసిన ఆచారము ప్రకారము ద్వారము లేని ప్రదేశమునందు ప్రాకారము పైకి దుమికి దానిని దాటెను. 1

మూ. ప్రవిశ్య నగరీం లఙ్కాం కపిరాజహితంకరః, 2
చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని.

ప్ర. అ. కపిరాజహితంకరః = సుగ్రీవునకు హితమును చేయు, సః = ఆ హనుమంతుడు, లఙ్కాం నగరీమ్ = లంకానగరమును, ప్రవిశ్య = ప్రవేశించి, అథ = పిమ్మట, శత్రూణామ్ = శత్రువులయొక్క, మూర్ధని = శిరస్సుపై, పాదమ్ = పాదమును, చక్రే = చేసెను.

తా. సుగ్రీవునకు హితము చేయ నున్న ఆ హనుమంతుడు లంకా నగరములో ప్రవేశించి శత్రువుల శిరస్సుపై ఎడమకాలు ఉంచెను.

వి. శత్రువుల శిరస్సుపై ఎడమకాలు పెట్టుట అనగా పురములో ప్రవేశించునపుడు మొట్టమొదట ఎడమపాదము ఉంచుట అని అర్థము.

"ప్రయాణకాలే చ గృహప్రవేశే వివాహకాలేఽపి చ దక్షిణాఙ్ఘ్రిమ్,
కృత్వాగ్రత: శత్రుపురప్రవేశే వామం నిదధ్యాచ్చరణం నృపాల:".

అను బృహస్పతివచనము ప్రకారము, ప్రయాణమునందు, గృహప్రవేశమునందు, వివాహసమయమునందు ముందు కుడికాలు ఉంచవలెను. శత్రువుల పట్టణములో ప్రవేశించునపుడు ముందు ఎడమకాలు ఉంచవలెను. హనుమంతుడు ఇక్కడికి ప్రధానముగా సుగ్రీవాజ్ఞను అనుసరించి వచ్చినాడు. అందుచేత సుగ్రీవహితం కరు డని చెప్పబడినది. 2

మూ. ప్రవిష్ట: సత్త్వసంపన్నో నిశాయాం మారుతాత్మజ:, 3
స మహాపథమాస్థాయ ముక్తాపుష్పవిరాజితమ్,
తతస్తు తాం పురీం లఙ్కాం రమ్యామభియయౌ కపి:. 4

ప్ర. అ. సత్త్వసంపన్న: = బలముతో సంపన్నుడైన, స: మారుతాత్మజ: = ఆ హనుమంతుడు, నిశాయామ్ = రాత్రియందు, ముక్తాపుష్పవిరాజితమ్ = ముత్యములతోను, పుష్పములతోను ప్రకాశింపచేయబడిన, మహాపథమ్ = మహామార్గమును, ఆస్థాయ = అధిష్ఠించి, ప్రవిష్ట: = ప్రవేశించెను. తత: = అటు పిమ్మట, కపి: = హనుమంతుడు. తామ్ = ఆ, రమ్యామ్ = సుందరమైన, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును గూర్చి, అభియయౌ = వెళ్లెను.

తా. బలశాలి యైన ఆ హనుమంతుడు, రాత్రియందు, ముత్యములతోను, పుష్పములతోను ప్రకాశింపచేయబడిన రాజమార్గము ద్వారా, ప్రవేశించి, రమ్యమైన ఆ లంకాపురము వైపు వెళ్లెను. 3,4

మూ. హసితోత్కృష్టనినదై స్తూర్యఘోషపురస్సరై:,
వజ్రాంకుశనికాశైశ్చ వజ్రజాలవిభూషితై:, 5
గృహమేఘై: పురీ రమ్యా బభాసే ద్యౌరివామ్బుదై:.

ప్ర. అ. హసితోద్ఘుష్టనినదైః=నవ్వులచేత అధిక మైన ధ్వనులు కలవీ, తూర్యఘోషపురస్సరైః=వాద్యముల ధ్వనులు పూర్వమందు గలవీ, వజ్రాంకుశనికాశైశ్చ=వజ్రములతోను అంకుశములతోను సమాన మైనవీ, వజ్రజాలవిభూషితైః=వజ్రములు అతికిన కిటికీలతో అలంకరింపబడినవీ అయిన, గృహమేఘైః = మేఘముల వంటి గృహములతో, రమ్యా = సుందర మైన, పురీ = లంకాపట్టణము, అమ్బుదైః = మేఘములతో, ద్యౌరివ=ఆకాశము వలె, బభాసే= ప్రకాశించెను.

తా. అధిక మైన నవ్వుల ధ్వనులతో నిండిన లంకాపురములోని గృహములలో అనేక వాద్యములు వినబడుచుండెను. ఆ గృహములు వజ్రములు పొదిగిన కిటికీలతో అలంకరింపబడి యున్నది. కొన్ని వజ్రముల ఆకారములోను కొన్ని అంకుశముల ఆకారములోను నిర్మింపబడి యున్నవి. మేఘముల వలె ఉన్నతము లైన అట్టి గృహములతో లంకానగరము, మేఘములతో ఆకాశము వలె ప్రకాశించుచుండెను.  5

మూ. ప్రజజ్వాల తతో లఙ్కా రక్షోగణగృహైః శుభైః,  6
సితాభ్రసదృశైశ్చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః,
వర్ధమానగృహైశ్చాపి సర్వతః సువిభూషితా.  7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సితాభ్రసదృశైః = తెల్లని మేఘములతో సమాన మైనవీ, చిత్రైః=ఆశ్చర్యకర మైనవీ, పద్మస్వస్తికసంస్థితైః=పద్మము యొక్క స్వస్తికము యొక్క ఆకారము కలవీ, శుభైః = మంగళకర మైనవీ అయిన, రక్షోగణగృహైః=రాక్షససముదాయముల గృహములతోను, వర్ధమానగృహైశ్చాపి=వర్ధమానగృహములతోను, సర్వతః=నలువైపుల, సువిభూషితా= చక్కగా అలంకరించబడినదై, ప్రజజ్వాల=దేదీప్యమానముగా ఉండెను.

తా. ఆ లంకాపట్టణము తెల్లని మేఘముల వంటి ఉన్నత మైన భవనములతో దేదీప్యమానముగా కనబడుచుండెను. కొన్ని రాక్షసగృహములు పద్మాకారములోను, కొన్ని స్వస్తికాకారములోను ఉండెను. కొన్ని వర్ధమానక గృహము లుండెను. ఆశ్చర్యకరములు, మంగళప్రదములూ అయిన ఈ భవనములు లంకాపట్టణమునందంతటను వ్యాపించి ఆ నగరశోభను ఇనుమడింప చేయుచుండెను.  6,7

వి. "చతుశ్శాలా చతుర్ద్వారా సర్వతోభద్రసంజ్ఞితా,
పశ్చిమద్వారరహితా మధ్యావక్రా హయాననా,
దక్షిణద్వారరహితా వర్ధమానా ధనప్రదా.
ప్రాగ్ద్వారరహితా స్వస్తికాఖ్యా పుత్రధనప్రదా".

నాలుగు దిక్కులకు నాలుగు ద్వారములున్న గృహము సర్వతోభద్రము. దీనికే పద్మము అని నామాంతరము. పశ్చిమద్వారము లేక, మధ్యయందు వంకర తిరిగిన చతుశ్శాలాగృహము హయాననము. దక్షిణద్వారము లేనిది వర్ధమానము, ధనప్రద మైనది. తూర్పుద్వారము లేనిది స్వస్తికగృహము; పుత్రధనసంపద నిచ్చునది. 6,7

మూ. తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః,
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననన్ద చ. 8

ప్ర. అ. కపిరాజహితంకరః = సుగ్రీవునకు హితమును చేయు, శ్రీమాన్ = శోభాయుక్తు డైన హనుమంతుడు, రాఘవార్థమ్ = రాముని కార్యముకొరకై, చరన్ = సంచరించుచు, చిత్రమాల్యాభరణామ్ = చిత్ర మైన మాలలు, ఆభరణములూ గల, తామ్ = ఆ లంకాపట్టణమును, దదర్శ చ = చూచెను, ననన్ద చ = సంతోషించెను కూడ.

తా. సుగ్రీవునికి హితమును చేయు శ్రీమంతు డైన ఆ హనుమంతుడు, రాముని కార్యము సాధించుటకై సంచరించుచు, విచిత్ర మైన పుష్పమాలలతోను, ఆభరణములతోను ప్రకాశించుచున్న ఆ లంకను చూచి చాలా సంతోషించెను. 8

మూ. భవనాద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః,
వివిధాకృతిరూపాణి భవనాని తత స్తతః. 9

ప్ర. అ. భవనాత్ = ఒక భవనమునుండి, భవనమ్ = మరి యొక భవనమును గూర్చి, గచ్ఛన్ = వెళ్లుచు, పవనాత్మజః = హనుమంతుడు, తత స్తతః = అంతకంతకు, వివిధాకృతిరూపాణి = అనేకవిధము లైన ఆకారములు, రూపములు గల, భవనాని = భవనములను, దదర్శ = చూచెను.

తా. ఒక ఇంటినుండి మరి యొక ఇంటి వైపు వెళ్లుచు హనుమంతుడు,

ముందుముందుకు వెళ్లిన కొలది, అనేకవిధము లైన ఆకారములు, రూపములు గల భవనములను చూచెను. 9

మూ. శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్,
స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసామివ. 10

ప్ర. అ. దివి = స్వర్గమునందు, అప్సరసామివ = అప్సరస్త్రీలయొక్క వలె, మదసమృద్ధానామ్=మదముతో నిండిన, స్త్రీణామ్=స్త్రీలయొక్క, త్రిస్థాన స్వరభూషితమ్ = మూడు స్థానములందు పుట్టిన మంద్ర-మధ్య-తారస్వరముల చేత భూషింపబడిన, మధురమ్=మధుర మైన, గీతమ్=గానమును, శుశ్రావ= వినెను.

తా. స్వర్గలోకములో అప్సరస్త్రీల వలె పాడుచున్న, మదముతో నిండిన స్త్రీల మధురగానమును వినెను. ఆ గానము ఆయా స్థానములందు పుట్టు మంద్ర-మధ్యమ-తారస్వరము లను స్వరభేదములతో ఒప్పారుచుండెను. 10

మూ. శుశ్రావ కాఞ్చీనినదం నూపురాణాం చ నిఃస్వనమ్,
సోపాననినదాంశ్చైవ భవనేషు మహాత్మనామ్, 11
ఆస్ఫోటితనినాదాంశ్చ క్ష్వేళితాంశ్చ తత స్తతః.

ప్ర. అ. మహాత్మనామ్ = గొప్పవా రైన (అధికైశ్వర్యసంపన్ను లైన) రాక్షసులయొక్క, భవనేషు = భవనములయందు, కాఞ్చీనినదమ్=వడ్డాణముల ధ్వనిని, నూపురాణామ్ = నూపురములయొక్క, నిస్స్వనమ్=ధ్వనిని, సోపాన నినదాంశ్చైవ = మెట్లయొక్క ధ్వనులను, ఆస్ఫోటితనినాదాంశ్చ=వీరులు తమ జబ్బలు చరచుటవలన కలుగు ధ్వనులను, క్ష్వేళితాంశ్చ = భటుల సింహనాద ములను, తత స్తతః = అక్కడక్కడ, శుశ్రావ = వినెను.

తా. మహైశ్వర్యవంతు లైన రాక్షసుల భవనములలో వనితలు నడచు నప్పుడు వినించు వడ్డాణముల చప్పుళ్ళను, అందెల సవ్వడులను, వారు మేడల పై ఎక్కునపుడు దిగునపుడు కలుగు మెట్ల ధ్వనులను వినెను. కొన్ని ప్రదేశములలో మల్లయుద్ధాదులలో వీరులు తమ జబ్బలు చరచుకొను నపుడు కలుగు ధ్వనులను, వారు చేయు సింహనాదములను వినెను. 11

మూ. శుశ్రావ జపతాం తత్ర మన్త్రాన్ రక్షోగృహేషు వై, 12
స్వాధ్యాయనిరతాంశ్చైవ యాతుధానాన్ దదర్శ సః,
రావణ స్తవసంయుక్తాన్ గర్జతో రాక్షసానపి. 13

ప్ర. అ. తత్ర = అక్కడ, రక్షోగృహేషు = రాక్షసుల గృహములందు, జపతామ్ = జపముచేయుచున్న రాక్షసులయొక్క, మన్త్రాన్ = మంత్రములను, శుశ్రావ=వినెను. సః=అతడు, స్వాధ్యాయనిరతాన్=వేదాధ్యయనమందు ఆసక్తులైన, యాతుధానాన్ = రాక్షసులను, దదర్శ=చూచెను. రావణ స్తవసంయుక్తాన్ = రావణుని స్తుతించుటకై కలసి వచ్చిన రాక్షసులను, గర్జతః=గర్జించుచున్న, రాక్షసానపి = రాక్షసులను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు, అక్కడ, రాక్షసగృహములందు, జపము చేయుచున్నవారి మంత్రములను వినెను. వేదాధ్యయననిరతులైన రాక్షసులను చూచెను. రావణుని స్తుతించుటకై వచ్చిన రాక్షసులనూ, గర్జించుచున్న రాక్షసులనూ చూచెను. 12, 13

మూ. రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్,
దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరాన్ బహూన్. 14

ప్ర. అ. మధ్యమే = మధ్యమమైన, గుల్మే = సేనానివేశమునందు, రాజమార్గమ్ = రాజమార్గమును, సమావృత్య = ఆవరించి, స్థితమ్ = ఉన్న, మహత్ = గొప్పదైన, రక్షోబలమ్ = రాక్షససైన్యమును, రావణస్య=రావణునియొక్క, బహూన్ = అనేకులైన, చరాన్ = గూఢచారులను, దదర్శ = చూచెను.

తా. మధ్యమసేనానివేశమునకు సంబంధించిన గొప్ప రాక్షససైన్యము రాజమార్గమును ఆవరించి ఉండగా చూచెను. ఎందరో రావణుని గూఢచారులను కూడ చూచెను. 14

మూ. దీక్షితాన్ జటిలాన్ ముణ్డాన్ గోజినామ్బరవాససః,
దర్భముష్టిప్రహరణానగ్నికుణ్డాయుధాం స్తథా. 15

కూటముద్గరపాణీంశ్చ దణ్డాయుధధరానపి,
ఏకాక్షానేకకర్ణాంశ్చ లమ్బోదరపయోధరాన్. 16

వారిని, సువర్చసః=మంచి తేజస్సు కలవారిని, ధ్వజీన్=ధ్వజములు ధరించిన వారిని, పతాకినశ్చైవ=పతాకలు ధరించినవారిని, వివిధాన్ యుధా=అనేకవిధము ఆయుధములు కలవారిని, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు లంకాపురములో అనేకవిధములుగా ఉన్న రాక్షసులను చూచెను. యజ్ఞదీక్షవహించిన కొందరు జటలు ధరించిరి; కొందరు ముండనము చేయించుకొనిరి; కొందరు ఎద్దుచర్మలను, మరికొందరు ఇతరవస్త్రములను ధరించి ఉండిరి. కొందరు పిడికెడు దర్భలు అభిమంత్రించి శత్రువినాశములకు ఉపయోగించుటచే అవే వారికి ఆయుధములుగా ఉండెను. మరికొందరు మారణహోమాదులు చేయుచుండుటచే ఆ హోమకుండములే వారికి ఆయుధములుగ ఉపయోగపడుచుండెను. కొందరు కూటములు, ముద్గరములు, దండములు అను ఆయుధములను ధరించి ఉండిరి. ఒంటికంటివాళ్లు, ఒంటిచెవివాళ్లు, వ్రేలాడుచున్న పొట్టా, చన్నులూ వలవాళ్లు, భయంకరమైన ఆకారము కలవాళ్లు, వంకరమూతుల వాళ్లు, వికృతరూపము కలవాళ్లు, పొట్టి వాళ్లు- ఈ విధముగ అక్కడ అనేకవిధముల రాక్షసులుండిరి. కొందరు విచిత్రములైన కవచములతో ప్రకాశించుచు ధనస్సులు, ఖడ్గములు, శతఘ్నులు (నూరుగురిని ఒక్కమారు చంపగల ఆయుధవిశేషములు), ముసలములు, ఉత్తమమైన పరిఘలు మొదలైన ఆయుధములు ధరించి ఉండిరి. కొందరు అంతగా లావుగా గాని, సన్నముగా గాని కాక సమముగా ఉండిరి. కొందరు అంతగా పొడవుగా గాని, పొట్టిగా గాని కాక సమప్రమాణములో ఉండిరి. కొందరు చాల తెల్లగా గాని, చాలా నల్లగా గాని కాక చామనఛాయలో ఉండిరి. కొందరికి కొంచెము గూను ఉండెను. కొందరు పొట్టిగా ఉండిరి గాని అంతగా పొట్టిగా లేరు. కొందరు వికృతరూపములతోను, కొందరు అనేకవిధములైన రూపములతోను ఉండిరి. కొందరు మంచి అందమైన ఆకారములతో, తేజస్సుతో ప్రకాశించుచుండిరి. కొందరు ధ్వజములు, కొందరు పతాకలు, కొందరు అనేకవిధములైన ఆయుధములు ధరించి యుండిరి. 15-19

మూ. శక్తివృక్షాయుధాంశ్చైవ పట్టిసాశనిధారిణః, 20
క్షేపణీపాశహస్తాంశ్చ దదర్శ స మహాకపిః,
స్రగ్విణస్త్వనులిప్తాంశ్చ వరాభరణభూషితాన్.

నానావేషసమాయుక్తాన్యథాస్వైరగతాన్ బహూన్।
తీక్ష్ణశూలధరాంశ్చైవ వజ్రిణశ్చ మహాబలాన్. 22

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, శక్తివృక్షాయుధాంశ్చైవ = శక్తులు, వృక్షములు ఆయుధములుగా కలవారిని, పట్టిసాశనిధారిణః = పట్టిసములు అశనులు అను ఆయుధములు ధరించినవారిని, క్షేపణీపాశహస్తాంశ్చ = ఆయుధములను దూరముగా విసరు క్షేపణు లను సాధనములు, పాశములు హస్తములందు కలవారిని, స్రగ్విణః = పుష్పమాలలు కలవారిని. అనులిప్తాంశ్చ = సుగంధాదులు పూసుకొన్నవారిని. వరాభరణభూషితాన్ = శ్రేష్ఠములైన అలంకారములతో అలంకరింపబడినవారిని, నానావేషసమాయుక్తాన్ = అనేకవిధములైన వేషములతో కూడినవారిని, యథాస్వైరగతాన్ = స్వేచ్ఛానుసారము గమనము గల. బహూన్ = చాలమందిని, తీక్ష్ణశూలధరాంశ్చైవ = తీక్ష్ణమైన శూలములను ధరించినవారిని, వజ్రిణశ్చ = వజ్రములు కలవారిని, మహాబలాన్ = గొప్ప బలము కలవారిని. దదర్శ = చూచెను.

తా. అక్కడ హనుమంతుడు చూచిన రాక్షసులలో మహాబలవంతులైన కొందరు శక్తులు, వృక్షములు, పట్టిసములు, అశనులు, క్షేపణులు, పాశములు, తీక్ష్ణమైన శూలములు, వజ్రాయుధములు మొదలైన అనేకఆయుధములు ధరించి ఉండిరి. కొందరు పుష్పమాలలు ధరించి, సుగంధద్రవ్యములు శరీరమునకు అలముకొని, అనేకవిధములైన ఆభరణములతో అలంకరించుకొని, అనేకవిధములైన వేషములు ధరించి ఉండిరి. వారిలో చాలామంది ఇష్టము వచ్చిన చోటులకు వెళ్ళ సమర్థులై ఉండిరి. 20, 21, 22

మూ. శతసాహస్రమవ్యగ్రమారక్షం మధ్యమం కపిః,
రక్షోధిపతినిర్దిష్టం దదర్శాన్తఃపురాగ్రతః 23

ప్ర. అ. కపిః = హనుమంతుడు, అన్తఃపురాగ్రతః = అంతఃపురము ఎదుట. రక్షోధిపతినిర్దిష్టమ్ = రావణుని ఆజ్ఞచే నిలుపబడిన, శతసాహస్రమ్ = నూరు వేల, అవ్యగ్రమ్ = సావధానముగా ఉన్న, మధ్యమమ్ ఆరక్షమ్ = మధ్యమ భాగమునందున్న రక్షకసైన్యమును, దదర్శ = చూచెను.

తా. నూరువేలమంది సైనికులున్న ఒక సేనానివేశము పురమధ్యము

నందు సర్వసమృద్ధముగా, హేమధామముగా ఉండెను. ఆ సేనానివేశము రావణుని ఆజ్ఞ ప్రకారము, అతని అంతఃపురము ఎదుట నిలుపబడి ఉండెను. హనుమంతుడు దానినికూడ చూచెను.

మూ. స తదా తద్గృహం దృష్ట్వా మహాహాటకతోరణమ్,
రాక్షసేన్ద్రస్య విఖ్యాతమద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్, 24
పుణ్డరీకావతంసాభిః పరిఖాభిరలంకృతమ్,
ప్రాకారావృతమత్యన్తం దదర్శ స మహాకపిః. 25

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, మహాహాటకతోరణమ్ = గొప్ప బంగారు ముఖద్వారము గలదీ, అద్రిమూర్ధ్ని = పర్వతశిఖరముపై, ప్రతిష్ఠితమ్ = ఉన్నదీ, విఖ్యాతమ్ = ప్రసిద్ధమైనదీ, పుణ్డరీకావతంసాభిః = పద్మములు అలంకారములుగ గల, పరిఖాభిః = పరిఖలచేత, అలంకృతమ్ = అలంకరించబడినదీ, ప్రాకారావృతమ్ = ప్రాకారముచేత ఆవరింపబడినదీ అయిన, రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, తత్ = ఆ, గృహమ్ = గృహమును, తదా = అప్పుడు, దృష్ట్వా = చూచి, అత్యన్తమ్ = మిక్కిలి, దదర్శ = చూచెను.

తా. ఆ హనుమంతుడు, పెద్ద బంగారు ముఖద్వారము గల రావణుని గృహమును చూచి, మరల దానినే శ్రద్ధగా చూచెను. ప్రసిద్ధమైన ఆ గృహము పర్వతశిఖరముపై ఉండెను. పద్మములతో నిండిన పరిఖలు దానికి అలంకారముగా ఉండెను, దాని చుట్టును పెద్ద ప్రాకారము ఉండెను. 24, 25

మూ. త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాదవినాదితమ్,
వాజిహేషితసంఘుష్టం నాదితం భూషణైస్తథా, 26
రథైర్యానైర్విమానైశ్చ తథా హయగజైః శుభైః,
వారణైశ్చ చతుర్దన్తైః శ్వేతాభ్రనిచయోపమైః, 27
భూషితం రుచిరద్వారం మత్తైశ్చ మృగపక్షిభిః,
రక్షితం సుమహావీర్యైర్యాతుధానైః సహస్రశః, 28
రాక్షసాధిపతేర్గుప్తమావివేశ మహాకపిః.

ప్ర. అ.. మహాకపిః = హనుమంతుడు, త్రివిష్టపనిభమ్ = స్వర్గముతో సమాన మైనదీ దివ్యమ్=శ్రేష్ఠ మైనదీ, వాజిహ్రేషితసంఘుష్టమ్ = గుఱ్ఱముల సకిలింపులచేత ధ్వనింపచేయబడినదీ, తథా=మరియు, భూషణైః = అలంకార ముల చేత, నాదితమ్=ధ్వనింపచేయబడినదీ, రథైః=రథములచేతను, యానైః = వాహనములచేతను, విమానైశ్చ=ఉత్తమగృహములచేతను, తథా=మరియు, శుభైః = మంగళకరము లైన, హయగజైః=గుఱ్ఱములచేతను, ఏనుగులచేతను, శ్వేతాభ్రనిచయోపమైః = తెల్లని మేఘముల గుంపుతో సమానము లైన, చతుర్దన్తైః=నాలుగు దంతములుగల, వారణైశ్చ=మహాగజములచేతను, భూషితమ్= అలంకరింపబడినదీ, మత్తైః = మదించిన, మృగపక్షిభిః = మృగములతోను, పక్షులతోను, రుచిరద్వారమ్=అందమైన ద్వారములు గలదీ, సుమహావీర్యైః = గొప్ప పరాక్రమముగల, సహస్రశః = వేలకొలది, యాతుధానైః = రాక్షసుల చేత, రక్షితమ్ = రక్షింపబడినది అయిన, రాక్షసాధిపతేః = రాక్షసరాజైన రావణునియొక్క గృహమును, గుప్తమ్ = రహస్యముగా, ఆవివేశ = ప్రవేశించెను.

తా. ఆ రావణుని గృహము స్వర్గము వలె ప్రకాశించుచుండెను. ఆ గృహమునందంతటను మధురమైన ధ్వనులు, అశ్వముల సకిలింపులు, భూషణ ధ్వనులు వినవచ్చుచుండెను. రథములు, వాహనములు, విమానములు, ఉత్తమమైన అశ్వములు, గజములు, తెల్లని మేఘముల సముదాయము వంటి, నాలుగేసి దంతములు గల, మహాగజములు ఆ గృహమునకు అలంకారముగా ఉండెను. మదించిన లేళ్లతోను, పక్షులతోను, ద్వారములు ఒప్పుచుండెను. మహాపరాక్రమ వంతు లైన వేలకొలది రాక్షసులు ఆ గృహమును రక్షించుచుండిరి. అట్టి రావణుని గృహమును హనుమంతుడు రహస్యముగా ప్రవేశించెను. 26, 27, 28

మూ. సహేమజామ్బూనదచక్రవాళం
మహార్హముక్తామణిభూషితాన్తమ్,
పరార్థ్యకాలాగురుచన్దనాక్తం
స రావణాన్తఃపురమావివేశ. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుర్థః సర్గః

ప్ర. అ. సః = హనుమంతుడు, సహేమ = బంగారముతో కూడినది, జామ్బూనదచక్రవాళమ్ = బంగారు ప్రాకారమండలము కలదీ, మహార్హముక్తామణిభూషితాన్తమ్ = చాల మూల్యముగల ముత్యములతోను మణులతోను అలంకరింపబడిన మధ్య ప్రదేశము కలది, పరార్థ్యకాలాగురుచన్దనాక్తమ్ = చాల విలువ గల అగురువుతోను చందనముతోను తడుపబడినదీ అయిన, రావణాన్తఃపురమ్ = రావణుని అంతఃపురమును, అభివేశ = ప్రవేశించెను.

తా. బంగారముతో నిండి ఉన్న ఆ రావణాంతఃపురము చుట్టూ బంగారు ప్రాకారము ఉండెను. మధ్యభాగము చాల విలువైన అగరువు, చందనము కలిపిన జలముతో తడుపబడెను. అట్టి రావణాంతఃపురములోనికి హనుమంతుడు ప్రవేశించెను. 29.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో చతుర్థ సర్గ సమాప్తము.

## అథ పఞ్చమః సర్గః

[రావణుని అంతఃపురములో అన్ని ప్రదేశములందు సీతను అన్వేషించి, ఆమె కానరాకపోవుటచే హనుమంతుడు విషాదము చెందుట.]

మూ. తతః స మధ్యంగతమంశుమన్తం
జ్యోత్స్నావితానం మహదుద్వమన్తమ్,
దదర్శ ధీమాన్ దివి భానుమన్తం
గోష్ఠే వృషం మత్తమివ భ్రమన్తమ్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధీమాన్ = బుద్ధిమంతుడైన, సః = హనుమంతుడు, మధ్యమ్ = ఆకాశమధ్యమును, గతమ్ = పొందినవాడూ, అంశుమన్తమ్ = కిరణములు కలవాడూ, మహత్ = గొప్ప, జ్యోత్స్నావితానమ్ = వెన్నెల విస్తారమును, ఉద్వమన్తమ్ = చిమ్ముచున్నవాడూ, గోష్ఠే = గోవులు నివసించు ప్రదేశమునందు, భ్రమన్తమ్ = తిరుగుచున్న, మత్తమ్ = మదించిన, వృషమివ = వృషభము వలె ఉన్నవాడూ అయిన, భానుమన్తమ్ = కిరణములు గల చంద్రుని, దివి = ఆకాశమునందు, దదర్శ = చూచెను.

తా. ఇంతలో ధీశాలి యైన ఆ హనుమంతుడు ఆకాశమధ్యలో ప్రవేశించిన చంద్రుని చూచెను. తెల్లని కిరణములు గల ఆ చంద్రుడు దట్టమైన వెన్నెలను వ్యాపింపచేయుచుండెను. గోశాలలో తిరుగుచున్న ఆబోతు వలె ఆ చంద్రుడు ఆకాశమునందు చూచుటకు చాల ముచ్చటగా ఉండెను. 1

మూ. లోకస్య పాపాని వినాశయన్తం
మహోదధిం చాపి సమేధయన్తమ్,
భూతాని సర్వాణి విరాజయన్తం
దదర్శ శీతాంశుమథాభియాన్తమ్ 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, లోకస్య=లోకముయొక్క, పాపాని=పాపములను, వినాశయన్తమ్=నశింపచేయుచున్నవాడూ, మహోదధిమ్=మహాసముద్రమును, సమేధయన్తం చాపి=వృద్ధిపొందించుచున్నవాడూ, సర్వాణి=సమస్తమైన, భూతాని=ప్రాణులను (లేదా అగ్ని తప్ప నాలుగు మహాభూతములను), విరాజయన్తమ్=ప్రకాశింపచేయుచున్నవాడూ, అభియాన్తమ్=పైకి వచ్చుచున్నవాడూ అయిన, శీతాంశుమ్=చంద్రుని, దదర్శ=చూచెను.

తా. పైకి వచ్చుచున్న, చల్లని కిరణములు గల ఆ చంద్రుడు లోకముల పాపాల నన్నింటిని నశింపచేయుచు, అన్ని ప్రాణులను ప్రకాశింపచేయుచు, సముద్రము ఉప్పొంగునట్లు చేయుచుండెను. హనుమంతుడు అట్టి చంద్రుని చూచెను. 2

మూ. యా భాతి లక్ష్మీర్భువి మన్దరస్థా
తథా ప్రదోషేషు చ సాగరస్థా,
తథైవ తోయేషు చ పుష్కరస్థా
రరాజ సా చారునిశాకరస్థా. 3

ప్ర. అ. భువి=భూమియందు, యా=ఏ, లక్ష్మీః=లక్ష్మి (శోభ), మన్దరస్థా=మందరపర్వతమునం దున్నదై, భాతి=ప్రకాశించుచుండునో, తథా=అట్లే, ప్రదోషేషు=సాయంకాలములందు, సాగరస్థా=సముద్రముపై ఉన్న ఏ లక్ష్మి ప్రకాశించుచుండునో, తథైవ=అట్లే, తోయేషు=ఉదకములలో, పుష్కరస్థా=పద్మములలో ఉన్న ఏ లక్ష్మి ప్రకాశించుచుండునో, సా=ఆ లక్ష్మి, చారునిశాకరస్థా=సుందరమైన చంద్రునిలో ఉన్నదై, రరాజ=ప్రకాశించెను.

తా. ఈ భూతలమునందు, ఏ లక్ష్మి మందరపర్వతముపైన ఉండునో, సాయంసమయములందు ఏ లక్ష్మి సాగరముపై కనబడునో, ఉదకములలో, ఏ లక్ష్మి, పద్మములలో కనబడునో ఆ లక్ష్మియే అపుడు చక్కగా చంద్రుని ఆశ్రయించి ఉండెను. 3

మూ. హంసో యథా రాజతపఞ్జరస్థః
సింహో యథా మన్దరకన్దరస్థః,

వీరో యథా గర్వితకుఞ్జరస్థ
శ్చన్ద్రోఽపి విబభ్రాజ తథామ్బరస్థః. 4

ప్ర. అ. రాజతపఞ్జరస్థః = బంగారు పంజరములో ఉన్న, హంసః = హంస, యథా = ఎట్లు ప్రకాశించునో, మన్దరకన్దరస్థః = మందరపర్వతగుహలో ఉన్న, సింహః = సింహము, యథా = ఎట్లు ప్రకాశించునో, గర్వితకుఞ్జరస్థః = గర్వించిన ఏనుగపై ఉన్న, వీరః = వీరుడు, యథా = ఎట్లు ప్రకాశించునో, అమ్బరస్థః = ఆకాశములో ఉన్న, చన్ద్రః = చంద్రుడు, తథా = అట్లు, విబభ్రాజ = ప్రకాశించెను.

తా. వెండి పంజరములో ఉన్న హంస ఎట్లు ప్రకాశించునో, మందర పర్వతగుహలో ఉన్న సింహము ఎట్లు ప్రకాశించునో, గర్వించిన ఏనుగుపై కూర్చున్న వీరుడు ఎట్లు ప్రకాశించునో, ఆకాశమునందున్న చంద్రుడు ఆ విధముగా ప్రకాశించెను. 4

మూ. స్థితః కకుద్మానివ తీక్ష్ణశృఙ్గో
మహాచలః శ్వేత ఇవోచ్చశృఙ్గః,
హస్తీవ జామ్బూనదబద్ధశృఙ్గో
రరాజ చన్ద్రః పరిపూర్ణశృఙ్గః. 5

ప్ర. అ. తీక్ష్ణశృఙ్గః = తీక్ష్ణ మైన కొమ్ములు గల, స్థితః = నిలిచి యున్న, కకుద్మానివ = ఎత్తైన మూపురము గల వృషభము వలె, ఉచ్చశృఙ్గః = ఎత్తైన, శిఖరములు గల, శ్వేతః = తెల్లని, మహాచలః ఇవ = మహాపర్వతము వలె, జామ్బూనదబద్ధశృఙ్గః = బంగారముతో కట్టబడిన దంతములు గల, హస్తీవ = ఏనుగ వలె, పరిపూర్ణశృఙ్గః = పూర్ణ మైన కళలు గల, చన్ద్రః = చంద్రుడు, రరాజ = ప్రకాశించెను.

తా. పరిపూర్ణ మైన కళలతో కూడిన ఆ చంద్రుడు, తీక్ష్ణ మైన కొమ్ములు గల వృషభము వలె, ఉన్నత మైన శిఖరము గల తెల్లని మహాపర్వతము వలె, దంతములకు బంగారపు తొడుగు తొడిగిన ఏనుగు వలె ప్రకాశించెను. 5

మూ. వినష్టశీతామ్బుతుషారపఙ్కో
మహాగ్రహగ్రాహవినష్టపఙ్కః,

ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాఙ్కో
రరాజ చన్ద్రో భగవాన్ శశాఙ్కః. 6

ప్ర. అ. వినష్టశీతామ్బుతుషారపఙ్కః = తొలగిన చల్లని ఉదకము (మంచు) యొక్క తుంపురు అనెడు పంకము కలవాడూ, మహాగ్రహగ్రాహవినష్టపఙ్కః = పెద్ద గ్రహ మైన సూర్యునియొక్క గ్రహణము చేత. అనగా సూర్యకిరణములు తన బింబముపై ప్రతిఫలించుటచేత, నశించిన మాలిన్యము కలవాడూ, ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాఙ్కః = ప్రకాశలక్ష్మికి ఆశ్రయ మైన నిర్మల మైన మచ్చ కలవాడూ, శశాఙ్కః = చెవుల పిల్లి చిహ్నముగా కల వాడూ అయిన, భగవాన్ = పూజ్యు డైన, చన్ద్రః = చంద్రుడు, రరాజ = ప్రకాశించెను.

తా. చంద్రబింబము ఉదయించి, క్రమముగా పైపైకి రాగా అంత వరకు ఆ చంద్రబింబమును ఆవరించి ఉన్న మంచుతుంపర లను పంకము మెల్ల మెల్లగా తొలగిపోయెను. సూర్యకిరణములు ప్రతిబింబించుటచేత మాలిన్య మంతా పోయి, ఆ చంద్రబింబములో ఉన్న అంకము (మచ్చ) కూడ నిర్మలమై ప్రకాశ లక్ష్మికి ఆశ్రయ మయ్యెను. చెవులపిల్లి అను చిహ్నముతో కూడిన, పూజ్య మైన అట్టి చంద్రబింబము చాల ప్రకాశించుచుండెను. 6

మూ. శిలాతలం ప్రాప్య యథా మృగేన్ద్రో
మహారణం ప్రాప్య యథా గజేన్ద్రః,
రాజ్యం సమాసాద్య యథా నరేన్ద్ర
స్తథాప్రకాశో విరరాజ చన్ద్రః. 7

ప్ర. అ. ప్రకాశః = స్పష్టముగా కనబడుచున్న, చన్ద్రః = చంద్రుడు, మృగేన్ద్రః = సింహము, శిలాతలమ్ = చదు నైన రాతి పైభాగమును, ప్రాప్య = పొంది, యథా = ఎట్లో, గజేన్ద్రః = ఉత్తమ మైన గజము, మహారణమ్ = గొప్ప యుద్ధమును, ప్రాప్య = పొంది, యథా = ఎట్లో, తథా = అట్లు, విరరాజ = ప్రకాశించెను.

తా. ఆకాశముపైకి వచ్చుచున్న ఆ చంద్రుడు శిలాతలము పైకి ఎక్క

నిలిచిన సింహము వలె, యుద్ధరంగములో ప్రవేశించిన మహాగజము వలె, రాజ్యమును పొందిన రాజు వలె ప్రకాశించెను.

మూ. ప్రకాశచన్ద్రోదయనష్టదోషః
ప్రవృత్తరక్షఃపిశితాశదోషః,
రామాభిరామేరితచిత్తదోషః
స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః. 8

ప్ర. అ. ప్రకాశచన్ద్రోదయనష్టదోషః = ప్రకాశించుచున్న చంద్రుని ఉదయముచేత నశించిన చీకటి అను దోషము కలదీ, ప్రవృత్తరక్షఃపిశితాశదోషః = ప్రారంభమైన రాక్షసుల మాంసభోజన మను దోషము కలదీ, రామాభిరామేరితచిత్తదోషః = స్త్రీలచేతను, వారి ప్రియులచేతను విడువబడిన చిత్తమునందలి కోపరూప మైన దోషము కలదీ అయిన, భగవాన్ = పూజ్య మైన, ప్రదోషః = ప్రదోషసమయము, స్వర్గప్రకాశః = స్వర్గమువంటి ప్రకాశము కలది అయెను.

తా. స్వర్గము వలె ప్రకాశించుచున్న, పవిత్ర మైన ఆ సాయంకాల సమయమునందు చంద్రుడు ఉదయించి ప్రకాశించుచుండుటచే చీకటి నశించెను. రాక్షసులు మాంసభక్షణము ప్రారంభించిరి. వనితలు వారి ప్రియులు తమ మనస్సులలోని కోపములను విడచి కలియుచుండిరి. 8

మూ. తన్త్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తాః
స్వపన్తి నార్యః పతిభిః సువృత్తాః,
నక్తంచరాశ్చాపి తథా ప్రవృత్తా
విహర్తుమత్యద్భుతరౌద్రవృత్తాః. 9

ప్ర. అ. కర్ణసుఖాః = చెవులకు సుఖకరము లైన, తన్త్రీస్వనాః = వీణాతంత్రుల ధ్వనులు, ప్రవృత్తాః = ప్రారంభ మైనవి. సువృత్తాః = మంచి చరిత్ర గల, నార్యః = స్త్రీలు, పతిభిః = భర్తలతో, స్వపన్తి = శయనించుచుండిరి. తథా = అట్లే, అత్యద్భుతరౌద్రవృత్తాః = మిక్కిలి ఆశ్చర్యకర మైన ప్రవర్తన గల, నక్తంచరాశ్చాపి = రాక్షసులు కూడ, విహర్తుమ్ = విహరించుటకు, ప్రవృత్తాః = ప్రారంభించిరి.

తా. ఆ సమయమునందు, చెవులకు ఇంపైన వీణాధ్వనులు వినవచ్చు చుండెను. పతివ్రత లైన స్త్రీలు భర్తలతో కలిసి శయనించుచుండిరి. అత్యాశ్చర్యమును కలిగించు భయంకర మైన పనులు చేయు నిశాచరులు కూడా సంచరించుచుండిరి. 9

మూ. మత్తప్రమత్తాని సమాకులాని
రథాశ్వభద్రాసనసంకులాని,
వీరశ్రియా చాపి సమాకులాని
దదర్శ ధీమాన్ స కపిః కులాని.

ప్ర. అ. వీరః = వీరుడూ, ధీమాన్ = బుద్ధిమంతుడూ అయిన, సః కపిః = ఆ హనుమంతుడు, మత్తప్రమత్తాని = మదించి ఏమరుపాటుతో ఉన్న జనులు కలవీ, సమాకులాని = జనులతో నిండినవీ, రథాశ్వభద్రాసనసంకులాని = రథములతోను, అశ్వములతోను, భద్రజాతికి చెందిన ఏనుగులతోను, ఉత్తమ మైన ఆసనములతోను నిండినవీ, శ్రియా చాపి = ఐశ్వర్యముతో, సమాకులాని = కలకలలాడుచున్నవీ అయిన, కులాని = గృహములను, దదర్శ = చూచెను.

తా. వీరుడూ, బుద్ధిమంతుడూ అయిన ఆ హనుమంతుడు అనేక విధము లైన గృహములను చూచెను. కొన్ని గృహములు మదించి ఏమరుపాటుతో ఉన్న జనులతో నిండి ఉండెను. కొన్ని, రథములతోను, అశ్వములతోను, భద్ర జాతికి చెందిన గజములతోను, ఉత్తమము లైన ఆసనములతోను, నిండి యుండెను. ఆ గృహములన్నీ లక్ష్మితో కలకలలాడుచుండెను. 10

మూ. పరస్పరం చాధికమాక్షిపన్తి
భుజాంశ్చ పీనానధినిక్షిపన్తి.
మత్తప్రలాపానధికం క్షిపన్తి
మత్తాని చాన్యోన్యమధిక్షిపన్తి. 11

ప్ర. అ. పరస్పరమ్ = ఒకరి నొకరు, అధికమ్=అధికముగా, ఆక్షిపన్తి = పరిహసించుచున్నవారూ, పీనాన్ = బలిసిన, భుజాన్ చ = భుజములను, అధినిక్షిపన్తి = కదల్చుచున్నవారూ, అధికమ్ = అధికముగా, మత్తప్రలాపాన్= మదించిన ప్రేలాపనలను, క్షిపన్తి = విసరుకొనుచున్నవారూ, మత్తాని=మదించిన,

వారై, పరస్పరమ్=పరస్పరమూ, అధిక్షిపన్తి = ఆక్షేపించుకొనుచున్నవారూ (ఇవన్నీ రాలోవు శ్లోకములోని 'రక్షాంసి' అనుదానికి విశేషణములు).

తా. ఆ గృహములలోని రాక్షసులు ఒకరినొకరు పరిహసించుకొనుచు బలిసిన బాహువులు ఇటు అటు ఆడించుచుండిరి. కొందరు మద్యపానమత్తులై అధికముగా ప్రేలాపనలు చేయుచుండిరి. కొందరు పరస్పరము అధిక్షేపించుకొనుచుండిరి. అట్టి రాక్షసులను హనుమంతుడు చూచెను. 11

మూ. రక్షాంసి వక్షాంసి చ విక్షిపన్తి
గాత్రాణి కాన్తాసు చ విక్షిపన్తి,
రూపాణి చిత్రాణి చ విక్షిపన్తి
దృఢాని చాపాని చ విక్షిపన్తి. 12

ప్ర. అ. వక్షాంసి=వక్షఃస్థలములను, విక్షిపన్తి=విరచుకొనుచున్నవారూ, కాన్తాసు=స్త్రీలపై, గాత్రాణి=శరీరమును, విక్షిపన్తి = పడవేయుచున్నవారూ, చిత్రాణి=విచిత్రములైన, రూపాణి = రూపములను, విక్షిపన్తి = ప్రసరింపచేయుచున్నవారూ, దృఢాని=దృఢములైన, చాపాని=ధనస్సులను, విక్షిపన్తి =ఆడించుచున్నవారూ అయిన, రక్షాంసి=రాక్షసులను, (దదర్శ=చూచెను).

తా. కొందరు రాక్షసులు రొమ్ములు విరచుకొనుచుండిరి. కొందరు తమ ప్రియురాండ్రపై పడుచుండిరి. కొందరు విచిత్రములైన రూపములు ప్రదర్శించుచుండిరి. మరి కొందరు దృఢములైన ధనస్సులు లాగుచుండిరి. 12

మూ. దదర్శ కాన్తాశ్చ సమాలభన్త్య
స్తథా పరాస్తత్ర పునః స్వపన్త్యః,
సురూపవక్త్రాశ్చ తథా హసన్త్యః
క్రుద్ధాః పరాశ్చాపి వినిఃశ్వసన్త్యః. 13

ప్ర. అ. కాన్తాః చ = కొందరు స్త్రీలు, సమాలభన్త్యః = శరీరమునకు చందనాదులు పూసికొనుచు, (ఆసన్=ఉండిరి). తథా = అట్లే, తత్ర=అక్కడ, అపరాః పునః = మరి కొందరు స్త్రీలైతే, స్వపన్త్యః = నిద్రపోవుచుండిరి. తథా = అట్లే, సురూపవక్త్రాః చ=మంచి రూపము, ముఖములు గల మరి కొందరు

స్త్రీలు, హసన్త్యః = నవ్వుచుండిరి. పరాః చ=మరి కొందరు స్త్రీలు, క్రుద్ధాః = కోపించినవారై, వినిఃశ్వసన్త్యః=నిట్టూర్పు విడచుచుండిరి. అట్టి స్త్రీలను, దదర్శ =చూచెను.

తా. ఆ గృహములలో కొందరు సుందరాంగులు శరీరములకు చందనాదులు పూసుకొనుచుండిరి. కొందరు నిద్రపోవుచుండిరి. మంచి రూపము, అందమైన ముఖములుగల మరి కొందరు నవ్వుచుండిరి. కొందరు స్త్రీలు ప్రియులపై కోపించి నిట్టూర్పులు విడచుచుండిరి. అట్టి స్త్రీలను హనుమంతుడు చూచెను. 13

మూ. మహాగజైశ్చాపి తథా నదద్భిః
సుపూజితైశ్చాపి తథా సుసద్భిః,
రరాజ వీరైశ్చ వినిఃశ్వసద్భి
ర్హ్రదో భుజఙ్గైరివ నిఃశ్వసద్భిః. 14

ప్ర. అ. తథా=అట్లే, నదద్భిః = ధ్వనిచేయుచున్న, మహాగజైశ్చాపి = మహాగజములతోను, తథా = మరియు, సుపూజితైః = బాగుగా పూజింపబడిన, సుసద్భిః చాపి=ఉత్తమపురుషులతోను, రరాజ=ప్రకాశించెను. వినిఃశ్వసద్భిః = అధికబలగాలు లగుటచేత దీర్ఘమైన శ్వాసలు విడచుచున్న, వీరైశ్చ=వీరులతో, నిఃశ్వసద్భిః=నిట్టూర్పుచున్న, భుజఙ్గైః = సర్పములతో, హ్రదః ఇవ=మడుగు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. ఆ నగరము ధ్వని చేయుచున్న మహాగజములతోను, సంమానార్హులైన సత్పురుషులతోను నిండి యుండెను. దీర్ఘనిఃశ్వాసములు విడచుచున్న వీరులతో ఆ నగరము బుసలు కొట్టుచున్న సర్పములతో నిండిన మడుగు వలె ప్రకాశించెను. 14

మూ. బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్
సంశ్రద్దధానాన్ జగతః ప్రధానాన్,
నానావిధానాన్ రుచిరాభిధానాన్
దదర్శ తస్యాం పురి యాతుధానాన్. 15

ప్ర. అ. బుద్ధిప్రధానాన్ = బుద్ధియే ప్రధానముగా కలవారు, రుచిరాభి.

దానాన్ = అందమైన మాటలు కలవారు, సంశ్రద్ధధానాన్ = మంచి శ్రద్ధ కలవారు, జగతః = జగత్తునకు, ప్రధానాన్ = ప్రధానులు, నానావిధానాన్ = అనేకవిధములైన ప్రవృత్తులు కలవారూ, రుచిరాభిధానాన్ = అందమైన పేర్లు కలవారూ అయిన, యాతుధానాన్ = రాక్షసులను, తస్యామ్ = ఆ, పురి = పట్టణమునందు, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ నగరములో ఎందరో బుద్ధిజీవులైన, అనగా వివిధ విద్యలలో ప్రవీణులైన రాక్షసులను చూచెను. వారందరును మనోహరముగా మాటలాడుచు తమ తమ విద్యాకర్తవ్యాదులందు మంచి శ్రద్ధతో అనేకవిధములైన కార్యములు చేయుచు జగత్తులో ప్రధానులై యుండిరి. వారి పేర్లు కూడ మనోహరముగా ఉండెను. 15

శ్లో. ననన్ద దృష్ట్వా స చ తాన్ సురూపా
న్నానాగుణానాత్మగుణానురూపాన్,
విద్యోతమానాన్స తదానురూపాన్
దదర్శ కాంశ్చిచ్చ పునర్విరూపాన్. 16

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, సురూపాన్ = మంచి రూపములు కలవారూ, నానాగుణాన్ = అనేకవిధములైన సద్గుణములు కలవారూ, ఆత్మగుణానురూపాన్ = తమ తమ గుణములకు అనుగుణముగా ఉన్నవారూ, విద్యోతమానాన్ = ప్రకాశించుచున్నవారూ అయిన, తాన్ = ఆ బుద్ధిప్రధానులైన పండితులను, దృష్ట్వా = చూచి, ననన్ద = సంతోషించెను. తదా = అప్పుడు, సః = ఆ హనుమంతుడు, విరూపాన్ = వికృతమైన రూపము కలవారు, అనురూపాన్ = తమ రూపములకు అనుగుణముగా ఉన్నవారూ అయిన, కాంశ్చిత్ పునః = మరి కొందరిని కూడా, దదర్శ = చూచెను.

తా. మంచి రూపము గల ఆ బుద్ధిజీవు లందరూ అనేకసద్గుణములతో ఒప్పుచుండిరి. తమ తమ విద్యాదులకు అనుగుణముగా ప్రవర్తించుచు ప్రకాశించుచుండిరి. వారిని చూచి హనుమంతుడు సంతోషించెను. అక్కడ వికృతరూపములు గల మరి కొందరు రాక్షసులు కూడ కనబడిరి. వారి ప్రవృత్తులు వారి రూపములకు అనుగుణముగ ఉండెను. 16

మూ. తతో వరార్హాః సువిశుద్ధభావా
స్తేషాం స్త్రియస్తత్ర మహానుభావాః,
ప్రియేషు పానేషు చ సక్తభావా
దదర్శ తారా ఇవ సుప్రభావాః. 17

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడ, వరార్హాః=ఉత్తమ మైన యోగ్యత కలవారూ, మహానుభావాః=గొప్ప సామర్థ్యము కలవారూ, ప్రియేషు= ప్రియులయందు, పానేషు చ=పానములందును, సక్తభావాః = ఆసక్తి గల హృదయములు కలవారూ, సుప్రభావాః=మంచి ప్రభావము గల, తారాః ఇవ= నక్షత్రముల వలె ఉన్నవారూ అయిన, తేషాం స్త్రియః=ఆ రాక్షసులయొక్క స్త్రీలను, దదర్శ=చూచెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు ఆ గృహములలో అత్యుత్తమ మైన గుణసంపద గలవారూ, గొప్ప ప్రభావము కలవారూ అయిన స్త్రీలను చూచెను. రాక్షసుల భార్య లైన ఆ స్త్రీలు తమ తమ ప్రియులపై ప్రేమాతిశయము కల వారై, మద్యపానాసక్తులై ఉండిరి. మంచి ప్రభావము గల నక్షత్రముల వలె ప్రకాశించుచుండిరి. 17

మూ. శ్రియా జ్వలన్తీస్త్రపయోపగూఢా
నిశీథకాలే రమణోపగూఢాః,
దదర్శ కాశ్చిత్ప్రమదోపగూఢా
యథా విహఙ్గాః కుసుమోపగూఢాః. 18

ప్ర. అ. శ్రియా = కాంతితో, జ్వలన్తీః = ప్రకాశించుచున్నవారూ, త్రపయా=సిగ్గుచేత, ఉపగూఢాః=అధికముగా ఆక్రమించబడినవారూ, నిశీథ కాలే=అర్ధరాత్రసమయమునందు, రమణోపగూఢాః=ప్రియులచేత కౌగలించు కొనబడినవారూ, ప్రమదోపగూఢాః=అత్యధిక మైన ఆనందముచేత కౌగలించు కొనబడినవారూ, కుసుమోపగూఢాః = పుష్పములచేత కప్పబడిన, విహఙ్గాః యథా=పక్షుల వలె ఉన్నవారూ అయిన, కాశ్చిత్=కొందరు స్త్రీలను, దదర్శ= చూచెను.

తా. కాంతితో ప్రకాశించుచున్న కొందరు స్త్రీలు అర్ధరాత్రమునందు తమ ప్రియుల కౌగలింతలలో చిక్కి సిగ్గుపడుచు, ఆహ్లాదభరిత లై ఉండిరి. వారు పుష్పములు కప్పిన పక్షుల వలె ఉండిరి. అట్టి స్త్రీలను కూడ కొందరిని హనుమంతుడు చూచెను. 18

మూ. అన్యాః పునర్హర్మ్యతలోపవిష్టా
స్తత్ర ప్రియాఙ్కేషు సుఖోపవిష్టాః,
భర్తుః ప్రియా ధర్మపరా నివిష్టా
దదర్శ ధీమాన్ మదనాభివిష్టాః. 19

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతు డైన హనుమంతుడు, హర్మ్యతలోపవిష్టాః = మేడల పైభాగములందు ఉన్నవారై, తత్ర = అక్కడ, ప్రియాఙ్కేషు = ప్రియుల ఒడులలో, సుఖోపవిష్టాః = సుఖముగా కూర్చున్నవారూ, భర్తుః = భర్తకు, ప్రియాః = ఇష్ట మైనవారూ, ధర్మపరాః = ధర్మమునందు ఆసక్తి కల వారూ, మదనాభివిష్టాః = మన్మథునిచేత ఆవేశింపబడినవారూ, నివిష్టాః = అనురక్తింపబడినవారూ అయిన, అన్యాః = మఱికొందరు స్త్రీలను, దదర్శ = చూచెను.

తా. మరి కొందరు స్త్రీలు మేడల పైభాగములపై, భర్తల ఒడులలో సుఖముగా కూర్చుండిరి. మన్మథావేశముతో కూడిన వారందరు భర్తల ప్రేమకు పాత్రలై, వారితో రతికేళులు సలుపుచుండిరి. వారందరు ధర్మమార్గమును అనుసరించుచుండిరి. అట్టి స్త్రీలను హనుమంతుడు చూచెను. 19

మూ. అప్రావృతాః కాఞ్చనరాజివర్ణాః
కాశ్చిత్పరార్ధ్యా స్తపనీయవర్ణాః,
పునశ్చ కాశ్చిచ్ఛశలక్ష్మవర్ణాః
కాన్తప్రహీణా రుచిరాఙ్గవర్ణాః. 20

ప్ర. అ. అప్రావృతాః = వస్త్రవిహీన లైన, కాఞ్చనరాజివర్ణాః = బంగారు రేఖల వంటి వర్ణము కల స్త్రీలను, పరార్ధ్యాః = ఆహ్లాదకర మైన సంభోగమునకు తగిన, తపనీయవర్ణాః = పుటము వేసిన బంగారము వంటి రంగు గల, కాశ్చిత్ = మరికొందరు స్త్రీలను, పునశ్చ = మరియు, శశలక్ష్మవర్ణాః = చంద్రుని లోని కలంకము వంటి వర్ణము గల (చామనచాయ గల), కాశ్చిత్ = మరి

కొందరిని. రుచిరాఙ్గవర్ణాః = అందమైన అవయవములు, వర్ణము గల, కాన్త ప్రహీణాః = ప్రియులు లేని మరికొందరిని. (దదర్శ = చూచెను).

తా. ఆక్కడ హనుమంతునకు కనబడిన స్త్రీలలో కొందరు వస్త్రవిహీనలై బంగారు తీగల వలె ఉండిరి. అత్యధిక సంభోగానందము నివ్వగలిగిన మరి కొందరు పుటము పట్టిన బంగారము రంగులో ఉండిరి. కొందరి శరీర వర్ణము చంద్రునిలో మచ్చ రంగు వలె ఉంచెను. అందమైన అవయవములు, వర్ణము గల మరి కొందరు ప్రియవియోగముతో బాధపడుచుండిరి. 20

మూ. తతః ప్రియాన్ ప్రాప్య మనోభిరామాన్
సుప్రీతియుక్తాః సుమనోఽభిరామాః,
గృహేషు హృష్టాః పరమాభిరామాః
హరిప్రవీరః స దదర్శ రామాః. 21

ప్ర. అ. హరిప్రవీరః = ఆ వానరవీరుడు, తతః = అటుపిమ్మట, మనోభిరామాన్ = మనస్సుకు ఆనందమును కలిగించు, ప్రియాన్ = ప్రియులను, ప్రాప్య = పొంది, సుప్రీతియుక్తాః = మంచి ఆనందముతో కూడినవారు, సుమనోభిరామాః = పుష్పములు వలె మనస్సును ఆకర్షించువారు, పరమాభిరామాః = మిక్కిలి సౌందర్యవతులు, గృహేషు = తమ తమ గృహములలో, హృష్టాః = ఆనందముతో కూడినవారూ అయిన, రామాః = స్త్రీలను, దదర్శ = చూచెను. (లేదా గృహేషు గృహములలో, చూచెను అని అర్థము).

తా. అక్కడ స్త్రీ లందరును అతి సౌందర్యవతులై, పుష్పముల వలె మనస్సును ఆకర్షించుచు, తమ మనస్సులకు ఇష్టులైన ప్రియులను చేరి ఆనందించుచుండిరి. ఈ విధముగ తమ తమ గృహములలో సుఖముగా ఉన్న స్త్రీలను హనుమంతుడు చూచెను. 21

మూ. చన్ద్రప్రకాశాశ్చ హి వక్త్రమాలా
వక్రాక్షిపక్ష్మాశ్చ సునేత్రమాలాః,
విభూషణానాం చ దదర్శ మాలాః,
శతహ్రదానామివ చారుమాలాః. 22

ప్ర. అ. చన్ద్రప్రకాశాః=చంద్రుని వంటి ప్రకాశము గల, వక్త్రమాలాః=ముఖపంక్తులను, వక్రాక్షిపక్ష్మాః=వంకరగా ఉన్న కనుల రెప్పలు గల, సునేత్రమాలాః=అందమైన నేత్రపంక్తులను, శతహ్రదానామ్ = మెరపుల యొక్క, హారమాలాః=అందమైన నేత్రపంక్తులను, శతహ్రదానామ్ = మెరపులయొక్క, హారమాలాః = అందమైన హారాల వలె ఉన్న, విభూషణానామ్ = అలంకారములయొక్క, మాలాః చ = మాలలను, దదర్శ=చూచెను.

తా. అక్కడ హనుమంతునకు చంద్రుని వలె ప్రకాశించుచున్న ముఖముల పంక్తులు, రెప్పలు వంకరగా ఉన్న అందమైన నేత్రముల పంక్తులు, మెరపుల పంక్తుల వలె ఉన్న అలంకారముల పంక్తులు. కనబడెను. 22

మూ. న త్వేవ సీతాం పరమాభిజాతాం
పథి స్థితే రాజకులే ప్రజాతామ్,
లతాం ప్రఫుల్లామివ సాధు జాతాం
దదర్శ తన్వీం మనసాభిజాతామ్. 23

ప్ర. అ. పరమాభిజాతామ్ = గొప్ప సౌందర్యము కలది, పథి = ధర్మమార్గమునందు, స్థితే = ఉన్న, రాజకులే = రాజవంశమునందు, ప్రజాతామ్ = ఆవిర్భవించినది, సాధు = బాగుగా, జాతామ్ = పుట్టిన బాగుగా పెరిగిన), ప్రఫుల్లామ్=వికసించిన, లతామ్ ఇవ=లత వలె ఉన్నది, తన్వీమ్=సన్ననిది, మనసా = మనస్సుచేత, అభిజాతామ్=పుట్టినది అయిన, సీతాం తు = సీత నైతే, న దదర్శ = చూడలేదు

తా. హనుమంతునకు ఇందరు స్త్రీలు కనబడినారు కాని, ఉత్తమసౌందర్యవంతురాలూ, ధార్మిక మైన రాజవంశమునందు జనించినదీ (ఆవిర్భవించినదీ), చక్కగా పెరిగిన, పుష్పించిన లతవలె ఉండునదీ, సన్నని శరీరము గలదీ, మనస్సుచేత నిర్మించబడినదా అన్నట్లు అతిసౌకుమార్యము కలదీ అయిన సీత మాత్రము కనబడలేదు. 23

మూ. సనాతనే వర్త్మని సంనివిష్టాం
రామేక్షణాం తాం మదనాభివిష్టామ్,

భర్తుర్మనః శ్రీమదనుప్రవిష్టాం
స్త్రీభ్యో వరాభ్యశ్చ సదా విశిష్టామ్. 24

ప్ర. అ. సనాతనే = అతిప్రాచీన మైన. వర్త్మని = ధర్మమార్గమునందు. సంనివిష్టామ్=నిలచి యున్నదీ, రామేక్షణామ్=మనోహర మైన నేత్రములు కలదీ, (లేదా రామునియందే దృష్టి కలదీ). మదనాభివిష్టామ్=మన్మథునిచేత ఆవేశింప బడినదీ, శ్రీమత్=శోభాయుక్త మైన, భర్తుః=భర్తయొక్క, మనః=మనస్సును, అనుప్రవిష్టామ్ = ప్రవేశించినదీ, వరాభ్యః = శ్రేష్ఠ లైన, స్త్రీభ్యశ్చ=స్త్రీలకంటె, సదా = ఎల్లప్పుడు, విశిష్టామ్ = ఉత్తమురాలు అయిన, తామ్ = ఆ సీతను, (న దదర్శ = చూడలేదు).

తా. (24, 25, 26 శ్లోకాలకు 23 వ శ్లోకముతో అన్వయము). ఆ సీత అతిపురాతనకాలమునుంచి వచ్చుచున్న ధర్మమార్గమునందు స్థిరముగా నిలచినది. రాముని మనస్సులో స్థిరముగా నిలచి యున్నది. ఆమె అన్ని కాలములందును, శ్రేష్ఠ మైన స్త్రీలు అందరికంటె కూడ చాల ఉత్తమురాలు. అట్టి సీత మాత్రము కనబడలేదు.

మూ. ఉష్ణార్దితాం సానుసృతాస్రకణ్ఠీం
పురా వరార్హోత్తమనిష్కకణ్ఠీమ్
సుజాతపక్ష్మామభిరక్తకణ్ఠీం
వనేఽప్రవృత్తామివ నీలకణ్ఠీమ్. 25

ప్ర. అ. ఉష్ణార్దితామ్=విరహతాపముచేత పీడింపబడినదీ, సానుసృతాస్రకణ్ఠీమ్ = అవిచ్ఛిన్నముగా ఉన్న కన్నీళ్లు కంఠమునందు కలదీ, పురా = పూర్వము, వరార్హోత్తమనిష్కకణ్ఠీమ్=అమూల్యము ఉత్తమము అయిన పతకము కంఠమునందు కలదీ, సుజాతపక్ష్మామ్ = చక్కగా పుట్టిన (అంద మైన) రెప్పలు కలదీ, అభిరక్తకణ్ఠీమ్=మధుర మైన కంఠస్వరము కలదీ, వనే=వనమునందు, అప్రవృత్తామ్ = నాట్యము చేయని, నీలకణ్ఠీమివ=ఆడు నెమలి వలె ఉన్న (సీతను మాత్రము చూడలేదు).

తా. విరహతాపముతో బాధపడుచున్న ఆ సీత కంఠము నిరంతరము బాష్పములతో నిండి యున్నది. ఆమె పూర్వము కంఠమునందు సువర్ణనిష్కమును

ధరించెడిది కాని ఇప్పుడు దానిని ధరించుటలేదు. ఆమె కంటిరెప్పలు దట్టముగా అందముగా ఉండును. కంఠస్వరము స్నేహభరితమై ఉండును. నాట్యము మాని అడవిలో నివసించు ఆడు నెమలి వలె ఉన్న ఆ సీత మాత్రము హనుమంతునకు కనబడలేదు. 25

మూ. అవ్యక్తరేఖామివ చన్ద్రరేఖాం
పాంసుప్రదిగ్ధామివ హేమరేఖామ్,
క్షతప్రరూఢామివ బాణరేఖాం
వాయుప్రభిన్నామివ మేఘరేఖామ్. 26

ప్ర. అ. అవ్యక్తరేఖామ్ = అస్పష్టమైన రేఖ గల, చన్ద్రరేఖామివ = చంద్రరేఖ వలె ఉన్నదీ, పాంసుప్రదిగ్ధామ్ = పరాగముచేత పూయబడిన, హేమరేఖామివ = బంగారము రేఖ వలె ఉన్నదీ, క్షతప్రరూఢామ్ = గాయమునందు మొలచిన, బాణరేఖామివ = బాణముయొక్క రేఖ వలె ఉన్నదీ, వాయుప్రభిన్నామ్ = వాయువుచేత చెదరగొట్టబడిన, మేఘరేఖామివ = మేఘపంక్తి వలె ఉన్నదీ అయిన, సీతను మాత్రము చూడలేదు.

తా. సీత అస్పష్టమైన ఆకారము గల చంద్రకళ వలె, పరాగము కప్పిన బంగారు రేఖ వలె, గాయము తగిలి, అది మానిపోయినను ఆనవాలుగా నిలచిన బాణము దెబ్బవలన కలిగిన రేఖ వలె, గాలిచేత చెదరగొట్టబడిన మేఘరేఖ వలె ఉండెను. అట్టి సీతమాత్రము హనుమంతునకు కనబడలేదు. 26

మూ. సీతామపశ్యన్ మనుజేశ్వరస్య,
రామస్య పత్నీం వదతాం వరస్య
బభూవ దుఃఖాభిహతశ్చిరస్య,
ప్లవఙ్గమో మన్ద ఇవాచిరస్య. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చమః సర్గః

ప్ర. అ. ప్లవఙ్గమః = హనుమంతుడు, వదతామ్ = మాటలాడువారిలో, వరస్య = శ్రేష్ఠుడూ, మనుజేశ్వరస్య = మనుజుల ప్రభువూ అయిన, రామస్య =

రామునియొక్క, పత్నీమ్=భార్యయైన, సీతామ్=సీతను, చిరస్య=చిరకాలము, అపశ్యన్=చూడనివాడై, దుఃఖాభిహతః=దుఃఖముచేత కొట్టబడినవాడై, అచిరస్య =కొంచెము సమయము పాటు, మన్దః ఇవ=మందుడు వలె, అభూత్=ఆయెను.

తా. హనుమంతుడు ఇంత సేపు వెదకిన పిమ్మట కూడ, మాట నేర్పు కలవారిలో శ్రేష్ఠుడూ, మానవుల ప్రభువూ అయిన రాముని భార్య అయిన సీత కనబడకపోవుటచే చాల దుఃఖాక్రాంతుడై, కొన్ని క్షణముల పాటు ఉత్సాహశూన్యుడు అయ్యెను. 27

"బాలానందిని" అని శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఐదవ సర్గ సమాప్తము.

## అథ షష్ఠః సర్గః

[హనుమంతుడు సీతకై రావణుని అంతఃపురములో అన్వేషించుట]

మూ. స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్,
విచచార పునర్లఙ్కాం లాఘవేన సమన్వితః. 1

ప్ర. అ. కామరూపధృత్ = ఇచ్ఛానుసారముగా రూపములను ధరించు, సః = ఆ హనుమంతుడు, విమానేషు = గృహములయందు (అన్వేషించి), నికామమ్ = మిక్కిలి, విషణ్ణః = దిగులు చెందినవాడై, లాఘవేన = నేర్పుతో (లేదా శీఘ్రత్వముతో) సమన్వితః = కూడినవాడై, పునః = మరల, లఙ్కామ్ = లంకను, విచచార = సంచరించెను.

తా. స్వేచ్ఛానుసారముగా రూపములను ధరింప సమర్థుడైన ఆ హనుమంతుడు ఆ యా భవనములలో అన్వేషించిన పిదప కూడ సీత కనబడక పోవుటచే దిగులు చెంది మరల ఆ లంకాపట్టణమును నేర్పుతో పరిశీలించుచు సంచరించెను. 1

మూ. ఆససాదాథ లక్ష్మీవాన్రాక్షసేన్ద్రనివేశనమ్,
ప్రాకారేణార్కవర్ణేన భాస్వరేణాభిసంవృతమ్. 2

ప్ర. అ. అథ = అటుపిమ్మట, లక్ష్మీవాన్ = శోభాయుక్తుడైన హనుమంతుడు. అర్కవర్ణేన = సూర్యుని వర్ణము కల, భాస్వరేణ = ప్రకాశించుచున్న, ప్రాకారేణ = ప్రాకారముచేత, అభిసంవృతమ్ = చుట్టబడి ఉన్న, రాక్షసేన్ద్రనివేశనమ్ = రావణుని గృహమును, ఆససాద = సమీపించెను.

తా. పిమ్మట, శోభాశాలియైన ఆ హనుమంతుడు, చుట్టూ బాలసూర్యుని వర్ణము వంటి వర్ణము గల ప్రకాశించుచున్న ప్రాకారము గల రావణుని గృహమును సమీపించెను. 2

మూ. రక్షితం రాక్షసైర్భీమైః సింహైరివ మహావనమ్,
సమీక్షమాణో భవనం చకాశే కపికుఞ్జరః. 3

ప్ర. అ. సింహైః = సింహములచేత, మహావనమివ = మహావనమును వలె, భీమైః = భయంకరులైన, రాక్షసైః = రాక్షసులచేత, రక్షితమ్ = రక్షింపబడిన, భవనమ్ = గృహమును, సమీక్షమాణః = పరిశీలించుచు, కపికుఞ్జరః = హనుమంతుడు, చకాశే = ప్రకాశించెను.

తా. సింహముచేత మహారణ్యము రక్షింపబడుచున్నట్లు, భయంకరులైన రాక్షసులచేత రక్షింపబడుచున్న రావణుని గృహమును పరిశీలనపూర్వకముగా చూచుచున్న ఆ హనుమంతుడు ప్రకాశించెను. 3

మూ. రూప్యకోపహితైశ్చిత్రైస్తోరణైర్హేమభూషితైః,
విచిత్రాభిశ్చ కక్ష్యాభిర్ద్వారైశ్చ రుచిరైర్వృతమ్. 4

ప్ర. అ. (నాల్గవ శ్లోకమునుంచి పదమూడవ శ్లోకము వరకు వరి శ్లోకములలో ఉన్న ద్వితీయాంతము లన్నీ పదమూడవ శ్లోకములోని "వేశ్మ" (గృహము) అను దానికి విశేషణములు).

రూప్యకోపహితైః = వెండితో అలంకరించబడినవి, చిత్రైః = ఆశ్చర్యకరము లైనవి, హేమభూషితైః = బంగారముచేత అలంకరింపబడినవి అయిన, తోరణైః = ముఖద్వారములతోను, విచిత్రాభిః = విచిత్రము లైన, కక్ష్యాభిః = వాకిళ్లతోను, రుచిరైః = సుందరము లైన, ద్వారైశ్చ = ద్వారములతోను, వృతమ్ = కూడిన (గృహమును చూచెను).

తా. రావణుని గృహములోని ముఖద్వారము లన్నీ వెండితోను, బంగారముతోను, అలంకరింపబడెను. వాకిళ్లు సుందరములై ఆశ్చర్యకరములుగా ఉండెను ద్వారము లన్నీ చాల అందముగా ఉండెను. 4

మూ. గజాస్థితైర్మహామాత్రైః శూరైశ్చ విగతశ్రమైః,
ఉపస్థితమసంహార్యైర్హయైః స్యన్దనయాయిభిః. 5

ప్ర. అ. గజాస్థితైః = గజములను అధిష్ఠించి ఉన్నవారూ, శూరైః = శూరులూ, విగతశ్రమైః = తొలగిన శ్రమ గలవారూ అయిన, మహామాత్రైః =

గజపాలకులచేతను, అసంహార్యైః=సంహరింప శక్యముకాని, హయైః=అశ్వముల చేతను (అశ్వారూఢులచేతను), స్యన్దనయాయిభిః=రథములపై నెక్కి సంచరించు వారిచేతను, ఉపస్థితమ్=చేరబడిన, (భవనమును చూచెను).

తా. రావణభవనమునందు, శూరులు, ఏ మాత్రము శ్రమ నెరుగనివారు అయిన గజపాలకులు గజములను అధిష్ఠించి ఉపస్థితులై ఉండిరి. ఎవ్వరును సంహరింప శక్యము కాని అశ్వికులు, రథముల నధిష్ఠించి సంచరించు వీరులు కూడ అక్కడ ఉండిరి. 5

మూ. సింహవ్యాఘ్రతనుత్రాణైర్దాన్తకాఞ్చనరాజతైః,
ఘోషవద్భిర్విచిత్రైశ్చ సదా విచరితం రథైః. 6

ప్ర. అ. సింహవ్యాఘ్రతనుత్రాణైః=సింహముల చర్మములతోను వ్యాఘ్రముల చర్మములతోను నిర్మించిన కవచములు గల, దాన్తకాఞ్చనరాజతైః=దంతముతోను, బంగారముతోను, వెండితోను అలంకరించబడిన, ఘోషవద్భిః=ధ్వని గల, విచిత్రైః=విచిత్రము లైన, రథైః = రథములచేత, సదా = ఎల్లప్పుడూ, విచరితమ్=సంచరించబడిన (రావణభవనమును చూచెను).

తా. దంతపుపనిగిలింతో బంగారు వెండి అలంకారములతో విచిత్రములుగా ఉన్న రథములు అధిక మగు ధ్వని చేయుచు సర్వదా ఆ భవనప్రాంతమునందు సంచరించుచుండెను. ఆ రథములలో సింహవ్యాఘ్రచర్మలతో నిర్మించిన కవచములు అమర్చి ఉండెను. 6

మూ. బహురత్నసమాకీర్ణం పరార్ధ్యాసనభాజనమ్,
మహారథసమావాసం మహారథమహాసనమ్. 7

ప్ర. అ. బహురత్నసమాకీర్ణమ్=అనేకరత్నములతో నిండినదీ, పరార్ధ్యాసనభాజనమ్ = అమూల్యమైన ఆసనములు పాత్రలూ కలదీ, మహారథసమావాసమ్=మహారథులకు నివాసస్థానమూ,మహారథమహాసనమ్=గొప్ప రథములూ గొప్ప ఆసనములూ కలదీ, (అయిన రావణభవనమును చూచెను).

తా. ఆ రావణగృహము అనేకరత్నములతో అలంకృత మై అమూల్యము లైన ఆసనములతోను, పాత్రలతోను నిండి యుండెను. మహారథులు (ఒకే సమ

యమున పదకొండు వేల ధనుర్ధరులతో యుద్ధము చేయువారు) అక్కడ నివసించుచుండిరి. ఆ భవనములో పెద్ద పెద్ద రథములు, ఆసనములు ఉండెను.

మూ. దృశ్యైశ్చ పరమోదారైస్తైస్తైశ్చ మృగపక్షిభిః,
వివిధైర్బహుసాహస్రైః పరిపూర్ణం సమన్తతః. 8

ప్ర. అ. దృశ్యైః = చూడదగిన, పరమోదారైః = చాల అందమైనవీ, వివిధైః = అనేకవిధములైన, బహుసాహస్రైః = అనేకవేల సంఖ్యలో ఉన్న, తైస్తైః = ఆ యా, మృగపక్షిభిః = మృగములతోను, పక్షులతోను, సమన్తతః = అంతటా, పరిపూర్ణమ్ = నిండి ఉన్న (భవనమును చూచెను).

తా. ఆ రావణభవనమునందు ఎటు చూచినను అనేకవిధములైన ఆ యా మృగములు, పక్షులు వేల కొలది ఉండెను. అందమైన ఆ మృగపక్ష్యాదులు చూచుటకు చాల ముచ్చట గొల్పునవై ఉండెను. 8

మూ. వినీతైరన్తపాలైశ్చ రక్షోభిశ్చ సురక్షితమ్,
ముఖ్యాభిశ్చ వరస్త్రీభిః పరిపూర్ణం సమన్తతః. 9

ప్ర. అ. వినీతైః = శిక్షితులూ, అన్తపాలైః = మధ్యభాగమును (లేదా సరిహద్దుప్రదేశములను) రక్షించువారూ అయిన, రక్షోభిః = రాక్షసులచేత, సురక్షితమ్ = బాగుగా రక్షింపబడినదీ, ముఖ్యాభిః = ముఖ్యలైన, వరస్త్రీభిః = శ్రేష్ఠలైన స్త్రీలతో, సమన్తతః = అంతటా, పరిపూర్ణమ్ = నిండినదీ అయిన భవనమును చూచెను.

తా. రక్షణాదికార్యములందు మంచి శిక్షణ పొందిన రాక్షసులు ఆ భవన ప్రాంతమును అంతటనూ రక్షించుచుండిరి. ఆ భవనము ముఖ్యలైన ఎందరో ఉత్తమస్త్రీలతో నిండి యుండెను. 9

మూ. ముదితప్రమదారత్నం రాక్షసేన్ద్రనివేశనమ్,
వరాభరణసంహ్రాదైః సముద్రస్వననిస్వనమ్. 10

ప్ర. అ. ముదితప్రమదారత్నమ్ = ఆనందించిన స్త్రీరత్నములు కలదీ, రాక్షసేన్ద్రనివేశనమ్ = రావణుని నివాసమైనదీ, వరాభరణసంహ్రాదైః = శ్రేష్ఠము

లైన ఆభరణముల ధ్వనులతో, సముద్రస్వననిస్వనమ్ = సముద్రధ్వని వంటి ధ్వని కలదీ అయిన (ఆ భవనమును ప్రవేశించెను).

తా. రావణుని నివాసస్థాన మైన ఆ గృహములో ఎందరో ఉత్తమస్త్రీలు ఆనందముతో నివసించుచుండిరి. సముద్రధ్వని వంటి ఉత్తమాలంకారముల ధ్వని ఆ భవనమునుండి వినవచ్చుచుండెను. 10

మూ. తద్రాజగుణసంపన్నం ముఖ్యైశ్చాగురుచన్దనైః,
మహాజనైః సమాకీర్ణం సింహైరివ మహద్వనమ్. 11

ప్ర. అ. రాజగుణసంపన్నమ్ = రాజచిహ్నములతో కూడినదీ, ముఖ్యైః = శ్రేష్ఠ మైన, అగరుచన్దనైః = అగరువులతోను చందనములతోను (కూడినదీ), సింహైః = సింహములతో వ్యాప్త మైన, మహత్ వనమివ = మహారణ్యము వలె, మహాజనైః = మహాజనులతో, సమాకీర్ణమ్ = వ్యాప్తమూ అయిన (ఆ భవనమును చూచెను).

తా. ఆ భవనములో అక్కడక్కడ ఛత్రచామరాది రాజచిహ్నములు కనబడుచుండెను. అది అతిశ్రేష్ఠము లైన అగరుచందనాదుల సువాసనతో నిండియుండెను. మహాజనులతో (మాననీయులైనవారితో) నిండిన ఆ భవనము సింహములతో మహారణ్యము వలె శోభిల్లుచుండెను. 11

మూ. భేరీమృదఙ్గాభిరుతం శఙ్ఖఘోషవినాదితమ్,
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసైః సదా. 12

ప్ర. అ. భేరీమృదఙ్గాభిరుతమ్ = భేరీలచేతను మృదంగములచేతను ధ్వనింపచేయబడినదీ, శఙ్ఖఘోషవినాదితమ్ = శంఖముల ధ్వనులచే ప్రతిధ్వనింపచేయబడినదీ, నిత్యార్చితమ్ = నిత్యము పూజింపబడినదీ, పర్వహుతమ్ = పౌర్ణమి అమావాస్య మొద లైన పర్వములందు హోమములు చేయబడినదీ, సదా = ఎల్లప్పుడు, రాక్షసైః = రాక్షసులచేత, పూజితమ్ = పూజింపబడినదీ, అయిన (భవనమును చూచెను).

తా. ఆ భవనము భేరీమృదంగధ్వనులతోను, శంఖనాదములతోను ప్రతిధ్వనించుచుండెను. ఆ భవనమునందు నిత్యార్చనలే కాక పూర్ణిమ అమావాస్య

మొద లైన పర్వములందు వివిధహోమములు కూడ జరుగుచుండును. రాక్షసు లందరూ నిత్యమూ, దానిని పూజించుచుందురు. 12

మూ. సముద్రమివ గమ్భీరం సముద్రమివ నిస్స్వనమ్,
మహాత్మనో మహద్వేశ్మ మహారత్నపరిచ్ఛదమ్. 13
మహారత్నసమాకీర్ణం దదర్శ స మహాకపిః.

ప్ర. అ. సముద్రమివ=సముద్రము వలె, గమ్భీరమ్ = గంభీర మైనదీ, నిస్స్వనమ్ = ధ్వనిలేని, సముద్రమివ = సముద్రము వలె ఉన్నదీ, మహారత్న పరిచ్ఛదమ్ = మహారత్నములు పొదిగిన పై కప్పు కలదీ, మహారత్నసమాకీర్ణమ్ = గొప్ప రత్నములతో వ్యాప్తమూ అయిన, మహాత్మనః = మహాత్ము డైన రావణునియొక్క, మహత్ = గొప్ప దైన, వేశ్మ = గృహమును, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా. ఆ భవనమధ్యభాగము సముద్రమధ్యము వలె గంభీరమై నిశ్శబ్దముగా ఉండెను. దాని పైకప్పునకు అనేకమహారత్నములు పొదిగి యుండెను. ఆ భవనము ఎక్కడ చూచినను మహారత్నములతో నిండి ఉండెను. మహాత్ము డైన రావణుని ఆ మహాభవనమును హనుమంతుడు చూచెను. 13

మూ. విరాజమానం వపుషా గజాశ్వరథసంకులమ్. 14
లఙ్కాభరణమిత్యేవ సోఽమన్యత మహాకపిః.
చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః. 15

ప్ర. అ. వపుషా = ఆకారముతో, విరాజమానమ్ = ప్రకాశించుచున్నదీ, గజాశ్వరథసంకులమ్ = గజములతోను, అశ్వములతోను, రథములతోను ఇరుకుగా ఉన్నదీ అయిన ఆ భవనమును, లఙ్కాభరణమ్ ఇత్యేవ = లంకకే ఆభరణ మని, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, అమన్యత = తలంచెను. హనుమాన్ = హనుమంతుడు, తత్ర = అక్కడ, రావణస్య = రావణునియొక్క, సమీపతః = సమీపమునందు, చచార = సంచరించెను.

తా. ఆకారమునందు అత్యద్భుతముగా ప్రకాశించుచు, గజాశ్వరథము లతో కిక్కిరిసి ఉన్న ఆ రావణప్రాసాదము లంకకే అలంకార మని భావించుచు ఆ హనుమంతుడు రావణుని సమీపమున సంచరించెను. 14, 15

మూ. గృహాద్గృహం రాక్షసానాముద్యానాని చ సర్వశః,
వీక్షమాణో ఽప్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. 16

ప్ర. అ. రాక్షసానామ్ = రాక్షసులయొక్క, గృహాత్ = గృహమునుండి, గృహమ్ = గృహమును, ఉద్యానాని చ = ఉద్యానములను, సర్వశః = నలువైపుల, వీక్షమాణః అపి = చూచుచు, అసంత్రస్తః = భయపడనివాడై, ప్రాసాదాంశ్చ = ప్రాసాదములను కూడ, చచార = సంచరించెను.

తా. ఒక గృహమునుండి మరియొక గృహమునకు వెళ్లుచు రాక్షసులగృహము లన్నీ చూచుచు, ఉద్యానములను కూడ నలు వైపుల చూచుచు ఏ మాత్రము భయము లేనివాడై, ప్రాసాదములను (ధనికుల మహాభవనములను) కూడ చూచుచు సంచరించెను. 16

మూ. అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్,
తతో ఽన్యత్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్. 17

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గలవాడూ, మహావేగః = మహావేగము గలవాడూ అయిన హనుమంతుడు, ప్రహస్తస్య = ప్రహస్తుని యొక్క, నివేశనమ్ = గృహమును గూర్చి, అవప్లుత్య = దుమికి, తతః = అక్కడినుండి, మహాపార్శ్వస్య = మహాపార్శ్వునియొక్క, అన్యత్ = మరియొక, వేశ్మ = గృహమును గూర్చి, పుప్లువే = దుమికెను.

తా. పరాక్రమశాలి యైన హనుమంతుడు మహావేగవంతుడై, ముందుగా ప్రహస్తుని గృహముమీదికి దుమికి, అక్కడినుండి మహాపార్శ్వుని ప్రాసాదము మీదికి దుమికెను. 17

మూ. అథ మేఘప్రతీకాశం కుమ్భకర్ణనివేశనమ్,
విభీషణస్య చ తథా పుప్లువే స మహాకపిః. 18

ప్ర. అ. అథ = అటు పిమ్మట, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, మేఘప్రతీకాశమ్ = మేఘముతో సమానమైన, కుమ్భకర్ణనివేశనమ్ = కుంభకర్ణుని గృహమును గూర్చి, తథా = మరియు, విభీషణస్య = విభీషణునియొక్క గృహమును గూర్చి, పుప్లువే = ఎగిరెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు మేఘముతో సమాన మైన కుంభకర్ణుని గృహము పిదప, విభీషణుని గృహముపిదప దుమికెను. 18

మూ. మహోదరస్య చ తథా విరూపాక్షస్య చైవ హి,
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ, 19
వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః.

ప్ర. అ. సః=ఆ, మహాకపిః=హనుమంతుడు, మహోదరస్య=మహోదరునియొక్క, తథా=అట్లే, విరూపాక్షస్య చైవ హి= విరూపాక్షునియొక్క, విద్యుజ్జిహ్వస్య=విద్యుజ్జిహ్వునియొక్క, తథైవ చ=అట్లే, విద్యున్మాలేః= విద్యున్మాలియొక్క, తథైవ=అట్లే, వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రునియొక్క, భవనమ్=భవనమును గూర్చి, పుప్లువే=ఎగిరెను.

తా. హనుమంతుడు క్రమముగా మహోదరుడు, విరూపాక్షుడు విద్యుజ్జిహ్వుడు, విద్యున్మాలి, వజ్రదంష్ట్రుడు అను రాక్షసుల భవనములంపిదకు దుమికెను 19

మూ. శుకస్య చ మహాతేజాః సారణస్య చ ధీమతః.20
తథా చేన్ద్రజితో వేశ్మ జగామ హరియూథపః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, హరియూథపః=వానర సైన్యపాలకు డైన హనుమంతుడు, శుకస్య=శుకునియొక్క, ధీమతః=బుద్ధి మంతు డైన, సారణస్య=సారణునియొక్క, తథా=అట్లే, ఇన్ద్రజితః=ఇంద్ర జిత్తుయొక్క, వేశ్మ=గృహమును గూర్చి, జగామ=వెళ్ళెను.

తా. తేజశ్శాలీ, వానరసైన్యపాలకుడూ అయిన హనుమంతుడు, శుకుని గృహమునకు, బుద్ధిమంతు డైన సారణుని గృహమునకు, ఇంద్రజిత్తు గృహమునకు కూడ వెళ్లెను. 20

మూ. జమ్బుమాలేః సుమాలేశ్చ జగామ హరిసత్తమః. 21
రశ్మికేతోశ్చ భవనం సూర్యకేతో స్తథైవ చ,
వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః. 22

ప్ర. అ. హరిసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, అంశుమాలేః = అంశుమాలి యొక్క గృహమును గూర్చి, సుమాలేశ్చ = సుమాలి గృహమును గూర్చి, ఆగామ = వెళ్లెను. సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, రశ్మికేతోః = రశ్మికేతువుయొక్క, తథైవ చ = అట్లే, సూర్యకేతోః = సూర్యకేతువుయొక్క, తథా = అట్లు, వజ్రకాయస్య = వజ్రకాయునియొక్క, భవనమ్ = భవనమును గూర్చి, పుప్లువే = ఎగిరెను.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు - అంశుమాలి, సుమాలి, కేతువు, సూర్యకేతువు, వజ్రకాయుడు అను రాక్షసుల గృహముల మీదికి దూరదుమికి అక్కడ అన్వేషించెను. 21, 22

మూ. ధూమ్రాక్షస్య చ సంపాతేర్భవనం మారుతాత్మజః,
విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్య చ. 23
శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్య చ.
బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 24
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య నాదినః,
విద్యుజ్జిహ్వేన్ద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ. 25
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి.

ప్ర. అ. మారుతాత్మజః = హనుమంతుడు, ధూమ్రాక్షస్య = ధూమ్రాక్షుని యొక్క, సంపాతేః = సంపాతియొక్క, విద్యుద్రూపస్య = విద్యుద్రూపుని యొక్క, భీమస్య = భీముని యొక్క, ఘనస్య = ఘనుని యొక్క, విఘనస్య చ = విఘనుని యొక్క, శుకనాసస్య = శుకనాసుని యొక్క, వక్రస్య = వక్రుని యొక్క, శఠస్య = శఠుని యొక్క, వికటస్య చ = వికటుని యొక్క, బ్రహ్మకర్ణస్య = బ్రహ్మకర్ణుని యొక్క, దంష్ట్రస్య = దంష్ట్రుని యొక్క, రోమశస్య = రోమశుడను, రక్షసః = రాక్షసుని యొక్క, యుద్ధోన్మత్తస్య = యుద్ధోన్మత్తుని యొక్క, మత్తస్య = మత్తుని యొక్క, ధ్వజగ్రీవస్య = ధ్వజగ్రీవుని యొక్క, నాదినః = నాదియొక్క, విద్యుజ్జిహ్వేన్ద్రజిహ్వానామ్ = విద్యుజ్జిహ్వుల యొక్క, ఇంద్రజిహ్వుల యొక్క, తథా = అట్లే, హస్తిముఖస్య చ = హస్తిముఖుని యొక్క, కరాళస్య = కరాళుని యొక్క, పిశాచస్య = పిశాచుని యొక్క, శోణితాక్షస్య చైవ హి = శోణితాక్షుని యొక్క, భవనమ్ = భవనమును గూర్చి, (దుమికెను)

రా. ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాది, విద్యుజ్జిహ్వులు, ఇంద్రజిహ్వులు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు అను రాక్షసుల గృహముల పైకి గూడ హనుమంతుడు దుమికెను. 23, 24, 25.

మూ. క్రమమాణః క్రమేణైవ హనుమాన్మారుతాత్మజః. 26
తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః,
తేషామృద్ధిమతామృద్ధిం దదర్శ స మహాకపిః. 27

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడూ, మహాయశాః=గొప్ప కీర్తి కలవాడూ, మహాకపిః=వానరులలో గొప్పవాడూ అయిన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, మహార్హేషు=శ్రేష్ఠములైన, తేషు తేషు=ఆ యా, భవనేషు=భవనములలో, క్రమేణైవ=క్రమము చేత, క్రమమాణః=సంచరించుచు, ఋద్ధిమతామ్=ఐశ్వర్యవంతులైన, తేషామ్=ఆ రాక్షసులయొక్క, ఋద్ధిమ్=ఐశ్వర్యమును, దదర్శ=చూచెను.

రా. వానరశ్రేష్ఠుడూ, మహాకీర్తిశాలీ, వాయుపుత్రుడూ అయిన ఆ హనుమంతుడు ఆ యా భవనములను అన్నింటినీ వరుసగా వెదకుచు, ఐశ్వర్యవంతులైన ఆ యా రాక్షసుల సమృద్ధిని చూచెను. 26, 27

మూ. సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమన్తతః,
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్. 28

ప్ర. అ. లక్ష్మీవాన్=శోభావంతుడైన హనుమంతుడు, సమన్తతః=నలువైపులనున్న, సర్వేషామ్=అందరియొక్క, భవనాని=భవనములను, సమతిక్రమ్య=దాటి, అథ=అటుపిమ్మట, రాక్షసేన్ద్రనివేశనమ్=రావణుని గృహమును, ఆససాద=సమీపించెను.

రా. శోభాయుక్తుడైన హనుమంతుడు, రావణుని భవనమునకు నలు ప్రక్కలా ఉన్న ప్రహస్తాదుల గృహములను దాటి, పిమ్మట రావణుని భవనము చేరెను. 28

మూ. రావణస్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః,
విచరన్ హరిశార్దూలో రాక్షసీర్వికృతేక్షణాః, 29
శూలముద్గరహస్తాశ్చ శక్తితోమరధారిణీః.

ప్ర. అ. హరిశార్దూలః = వానరులలో శార్దూలము వంటివాడూ, హరిసత్తమః = వానరశ్రేష్ఠుడూ, అయిన హనుమంతుడు, విచరన్ = సంచరించుచు, రావణస్య = రావణునికి, ఉపశాయిన్యః = సమీపమునందు శయనించి ఉన్న వారూ, వికృతేక్షణాః = వికృతము లైన నేత్రములు కలవారూ, శూలముద్గరహస్తాశ్చ = శూలములు, ముద్గరములు హస్తములందు గలవారూ, శక్తితోమరధారిణీః = శక్తులను, తోమరములను ధరించినవారూ అయిన, రాక్షసీః = రాక్షసస్త్రీలను, దదర్శ = చూచెను.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు అచట సంచరించుచు రావణుని సమీపమున శయనించి ఉన్న, భయంకర మైన నేత్రములు గల రాక్షసస్త్రీలను చూచెను. అతని అంగరక్షకలైన ఆ రాక్షసస్త్రీలు, శూలములు, ముద్గరములు, శక్తులు, తోమరములు మొదలైన ఆయుధములను ధరించి ఉండిరి. 29

మూ. దదర్శ వివిధాన్ గుల్మాన్ తస్య రక్షఃపతేర్గృహే, 30
రాక్షసాంశ్చ మహాకాయాన్నానాప్రహరణోద్యతాన్.

ప్ర. అ. తస్య = ఆ, రక్షఃపతేః = రాక్షసాధిపతియొక్క, గృహే = గృహమునందు, వివిధాన్ = అనేకవిధము లైన, గుల్మాన్ = సేనావిభాగములను, మహాకాయాన్ = పెద్ద దేహములు కలవారూ, నానాప్రహరణోద్యతాన్ = ఎత్తబడిన అనేక విధము లైన ఆయుధములు గలవారూ అయిన, రాక్షసాంశ్చ = రాక్షసులను కూడ, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ రావణుని భవనమునందు అనేకవిధము లైన సైనికుల గుల్మములను (సేనా విభాగములను), అనేక విధము లైన ఆయుధములను ప్రయోగించుటకు సిద్ధముగా ఉంచుకొనిన, పెద్ద పెద్ద దేహములు గల రాక్షసులను చూచెను. 30

మూ. రక్తాన్ శ్వేతాన్ సితాంశ్చైవ హరీంశ్చాపి మహాజవాన్,
కులీనాన్ రూపసంపన్నాన్ గజాన్పరగజారుజాన్,

నిష్ఠితాన్ గజశిక్షాయామైరావతసమాన్యుధి. 32
నిహన్తౄన్ పరసైన్యానాం గృహే తస్మిన్ దదర్శ సః,
క్షరతశ్చ యథా మేఘాన్ స్రవతశ్చ యథా గిరీన్, 33
మేఘస్తనితనిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః.

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, తస్మిన్ = ఆ, గృహే = గృహమునందు, రక్తాన్ = ఎఱ్ఱనివీ, శ్వేతాన్ = తెల్లనివీ, సితాంశ్చైవ = కొంచెము తెల్లనివీ, మహాజవాన్ = గొప్ప వేగము గలవీ అయిన, హరీంశ్చాపి = గుఱ్ఱములనూ, కులీనాన్ = మంచి జాతియందు పుట్టినవీ, రూపసంపన్నాన్ = రూపముతో కూడినవీ, పరగజారుజాన్ = శత్రుగజములను పీడించునవీ, గజశిక్షయామ్ = గజశిక్షయందు, నిష్ఠితాన్ = మంచి జ్ఞానము గలవీ, ఐరావతసమాన్ = ఐరావతముతో సమానమైనవీ, యుధి = యుద్ధమునందు, పరసైన్యానామ్ = శత్రుసైన్యములకు, నిహన్తౄన్ = సంహారకరములైనవీ, క్షరతః = మదోదకమును స్రవించుచున్నవీ, మేఘాన్ యథా = వర్షించుచున్న మేఘములవలెనున్నవీ, స్రవతః = జలము స్రవించుచున్న, గిరీన్ యథా = పర్వతముల వలె ఉన్నవీ, మేఘస్తనితనిర్ఘోషాన్ = మేఘముల ఉరుముల వంటి ఘీంకారములు కలవీ, సమరే = యుద్ధమునందు, పరైః = శత్రువులచేత, దుర్ధర్షాన్ = ఎదిరింప శక్యము కానివీ అయిన, గజాన్ = ఏనుగులనూ, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ గృహమునందు మహావేగము గల గుఱ్ఱములను చూచెను. వానిలో కొన్ని ఎఱ్ఱగాను, కొన్ని చాల తెల్లగాను, కొన్ని కొంచెము తెల్లగాను ఉండెను. అట్లే అతడక్కడ మంచి శిక్షణ పొందిన ఐరావతము వంటి గజములను కూడ చూచెను. ఉత్తమజాతికి చెందిన ఆ గజములు మంచి ఆకారములతో శత్రుగజములకు పీడ కలిగించునవిగా ఉండెను. పరుల సైన్యములను సంహరింపగల సామర్థ్యము గలవి, నిరంతరము మదోదకము స్రవించు ఆ గజములు వర్షించు మేఘముల వలె, జలపాతములతో గూడిన పర్వతముల వలె ఉండెను. మేఘముల ఉరుములవంటి ఘీంకారము గల వానిని యుద్ధరంగములో శత్రువు లెవ్వరూ ఎదిరింపజాలరు. 31, 32, 33

మూ. సహస్రం వాహినీస్తత్ర జాంబూనదపరిష్కృతాః, 34
హేమజాలపరిచ్ఛన్నాస్తరుణాదిత్యసన్నిభాః,

దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే. 35

ప్ర. అ. తత్ర = అక్కడ, రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజైన, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, జాంబూనదపరిష్కృతాః = బంగారముచేత అలంకరింపబడినవీ, హేమజాలపరిచ్ఛన్నాః = బంగారము వాసులచే కప్పబడినవీ, తరుణాదిత్యసన్నిభాః = లేగా పైకి వచ్చిన సూర్యునితో సమానమైనవీ అయిన, సహస్రమ్ = వేలకొలది, వాహినీః = సేనావిభాగములను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అక్కడ రావణగృహమునందు, ఉదయించిన సూర్యునివలె ప్రకాశించుచున్న వెయ్యి సేనావిభాగములను చూచెను. అవన్నియు బంగారముతో కప్పి అలంకరింపబడి ఉండెను.

వి. 'వాహిని' అనగా ఒక సేనావిభాగము. వాహినిలో 81 ఏనుగులు, 81 రథములు, 243 గుఱ్ఱములు, 405 కాలి బంటులు ఉందురు. 34, 35

మూ. శిబికా వివిధాకారాః స కపిర్మారుతాత్మజః.
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణి చ. 36
క్రీడాగృహాణి చాన్యాని దారుపర్వతకానపి.
కామస్య గృహకం రమ్యం దివాగృహకమేవ చ. 37
దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే.

ప్ర. అ. మారుతాత్మజః = వాయుదేవుని పుత్రుడైన, సః కపిః = ఆ హనుమంతుడు, రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజైన, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, వివిధాకారాః = అనేకవిధములైన ఆకారములు గల శిబికాః = పల్లకీలను, చిత్రాణి = ఆశ్చర్యకరములైన, లతాగృహాణి = లతా గృహములను (తీగలతో అల్లిన గృహములను), చిత్రశాలాగృహాణి = చిత్ర శాలల గృహములను (గోడలపై వివిధ వర్ణ చిత్రములు నిర్మించిన గృహములను), అన్యాని = ఇతరములైన, క్రీడాగృహాణి = క్రీడార్థమై నిర్మించిన గృహములను, దారుపర్వతకానపి = కఱ్ఱతో నిర్మించిన చిన్న పర్వతములను, కామస్య = మన్మథుని, గృహకమ్ = గృహమును (మన్మథక్రీడల కుపయోగించు

శయ్యాగారమును), రమ్యమ్ = సుందరమైన, దివాగృహకమేవ చ = పగటి సమయమును గడపు గృహమును, దదర్శ = చూచెను.

తా. వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు రాక్షసేంద్రుడైన రావణుని భవనములో అనేక విధములైన ఆకారములు గల పల్లకీలను, విచిత్రములైన లతాగృహములను, చిత్రశాలలను, ఇతరమైన క్రీడాగృహములను, కఱ్ఱతో నిర్మించిన చిన్న పర్వతములను, కామోపభోగములు అనుభవించు గృహమును, పగటి భాగమును గడపు సుందరమైన గృహమును చూచెను. 36, 37

మూ. స మన్దరగిరిప్రఖ్యం మయూరస్థానసంకులమ్, 38
ధ్వజయష్టిభిరాకీర్ణం దదర్శ భవనోత్తమమ్,
అనేకరత్నసంకీర్ణం నిధిజాలం సమన్తతః, 39
ధీరనిష్ఠితకర్మాన్తం గృహం భూతపతేరివ.

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, మన్దరగిరిప్రఖ్యమ్ = మందరపర్వతముతో సమానమూ, మయూరస్థానసంకులమ్ = నెమళ్ల నివాసస్థానములతో వ్యాకులముగా నున్నదీ, ధ్వజయష్టిభిః = ధ్వజములచేత, ఆకీర్ణమ్ = వ్యాప్తమూ, ధీరనిష్ఠితకర్మాన్తమ్ = ధీరులచేత అధిష్ఠింపబడిన కార్యనిర్వహణము గలదీ, భూతపతేః = కుబేరుని యొక్క, గృహమివ = గృహమువలె ఉన్నదీ అయిన, భవనోత్తమమ్ = శ్రేష్ఠమైన భవనమును, సమన్తతః = అంతటను, అనేకరత్నసంకీర్ణమ్ = అనేకమైన రత్నములతో నిండిన, నిధిజాలమ్ = నిధుల సముదాయమును, దదర్శ = చూచెను.

తా. మందరపర్వతము వలె, కుబేరభవనము వలె, ఉన్న ఆ రావణ భవనము నెమళ్లు నివసించు ప్రదేశములతో వ్యాకులమై, ధ్వజముల దండములతో నిండి ఉండెను. ఆ భవనమునందు, ఎక్కడ చూచిన అనేక రత్నములతో నిండిన అనేక నిధు లుండెను. అక్కడ సమర్థులైన పురుషులు ఆ యా కార్యముల నిర్వహణమును పర్యవేక్షించుచుండిరి. 39

మూ. అర్చిర్భిశ్చాపి రత్నానాం తేజసా రావణస్య చ, 40
విరరాజాథ తద్వేశ్మ రశ్మిమానివ రశ్మిభిః.

ప్ర. అ. తత్=ఆ, వేశ్మ=భవనము, రత్నానామ్=రత్నముల యొక్క, అర్చిర్భిశ్చాపి=కిరణములతోను, రావణస్య=రావణునియొక్క, తేజసా చ=తేజస్సుచేతను, రశ్మిభిః=కిరణములతో, రశ్మిమానివ=సూర్యుడు వలె, విరరాజ=ప్రకాశించెను 40

తా. ఆ భవనము రత్నముల కిరణము చేతను, రావణుని తేజస్సు చేతను కిరణములతో సూర్యుడు ప్రకాశించునట్లు ప్రకాశించెను. 40

మూ. జాంబూనదమయాన్యేవ శయనాన్యాసనాని చ, 41
భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః.

ప్ర. అ. హరియూథపః=వానరసైన్యసంరక్షకుడైన హనుమంతుడు, జాంబూనదమయాన్యేవ=బంగారముతోనే చేయబడిన, శయనాని=శయనములను, ఆసనాని చ=ఆసనములను, ముఖ్యాని=ముఖ్యములైన, భాజనాని=పాత్రలను, దదర్శ=చూచెను.

తా. అక్కడ హనుమంతుడు చూచిన శయనములు, ఆసనములు, ప్రధానమైన పాత్రలూ కూడ బంగారముతోనే చేయబడినవి. 41

మూ. మధ్వాసవకృతక్లేదం మణిభాజనసంకులమ్, 42
మనోరమమసంబాధం కుబేరభవనం యథా,
నూపురాణాం చ ఘోషేణ కాంచీనాం నినదేన చ, 43
మృదంగతలఘోషైశ్చ ఘోషవద్భిర్వినాదితమ్,
ప్రాసాదసంఘాతయుతం స్త్రీరత్నశతసంకులమ్, 44
సువ్యూఢకక్ష్యం హనుమాన్ ప్రవివేశ మహాగృహమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షష్ఠః సర్గః.

ప్ర. అ. మధ్వాసవకృతక్లేదమ్=తేనెతో తయారుచేసిన మద్యముచేత చేయబడిన తడుపుట గలదీ, మణిభాజనసంకులమ్=మాణిక్యపాత్రలతో వ్యాకులముగా నున్నదీ, మనోరమమ్=మనోహరమైనదీ, అసంబాధమ్=ఇరుకులేనిదీ, కుబేరభవనం యథా=కుబేరుని భవనము వలె ఉన్నదీ, నూపురాణామ్.

= నూపురముల యొక్క, ఘోషేణ = ధ్వనిచేతను, కాఞ్చీనామ్ = వడ్డాణముల యొక్క, నినదేన = ధ్వనిచేతను, ఘోషవద్భిః = గంభీరమైన నాదము గల, మృదఙ్గతలఘోషైః = మృదంగములకూ అరచేతులకూ కలిగిన తాకిడిచే పుట్టిన ధ్వనుల చేతనూ, వినాదితమ్ = ధ్వనింపచేయబడినదీ, ప్రాసాదసంఘాతయుతమ్ = ప్రాసాదముల సముదాయముతో కూడినదీ, స్త్రీరత్నశతసంకులమ్ = వందలమంది ఉత్తమస్త్రీలతో నిండియున్నదీ, సువ్యూఢకక్ష్యమ్ = బాగుగా ఏర్పరుపబడిన ఆయా వాకిళ్లు గలదీ అయిన, మహాగృహమ్ = మహాగృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. రావణుని మహాభవనములో నిరంతరము తేనెతో చేసిన ఆసవము పానము జరుగుచుండెను. ఎక్కడ చూచిన మాణిక్యములు పొదిగిన పాత్రలు కనబడుచుండెను. విశాలమై మనోహరముగా ఉన్న ఆ భవనము కుబేర భవనము వలె ఉండెను. అందెల మ్రోతలతోను, వడ్డాణముల చిరుసవ్వళ్లతోను, మృదంగములను అరచేతులతో ఒరయగా పుట్టిన గంభీరమైన నాదములతోను ప్రతిధ్వనించుచుండెను. వందలకొలది స్త్రీలు నివసించుచున్న ఆ మహాభవనము చుట్టును ఎన్నో ప్రాసాదములు ఉండెను. దానిలోని వేరువేరు శాలలు, గదులు వాకిళ్లు చక్కగా అమర్చబడి ఉండెను. అట్టి మహాగృహములోనికి హనుమంతుడు ప్రవేశించెను. 42, 43, 44

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో ఆరవసర్గ సమాప్తము.

## అథ సప్తమః సర్గః

[రావణభవన పుష్పకవిమానముల వర్ణనము]

మూ. స వేశ్మజాలం బలవాన్ దదర్శ
వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్,
యథా మహత్ ప్రావృషి మేఘజాలం
విద్యు త్పినద్ధం సవిహఙ్గజాలమ్. 1

ప్ర. అ. బలవాన్=బలవంతు డైన, సః = ఆ హనుమంతుడు, వ్యాసక్త వైడూర్యసువర్ణజాలమ్ = సంబంధించిన వైడూర్యసువర్ణవికారము లైన కిటికీలు కలదీ, ప్రావృషి = వర్షాకాలమునందు, విద్యుత్పినద్ధమ్ = మెరుపులచేత కట్టబడి నదీ, సవిహఙ్గజాలమ్ = (వర్షముకొరకై ఎదురుచూచుచు ఎగురుచున్న) పక్షుల సముదాయము గలదీ అయిన, మహత్ = గొప్ప, మేఘజాలం యథా = మేఘ సముదాయము వలె ఉన్న, వేశ్మజాలమ్=గృహముల సముదాయమును, దదర్శ = చూచెను.

తా. ఆ మహాభవనములోని గృహము లన్నింటికి వైడూర్యమణులు పొదిగిన బంగారు కిటికీలు అమర్చి ఉండుటచే, అవి వర్షాకాలములో మెరపులతో నిండి, క్రింద పక్షులు ఎగురుచున్న మేఘముల వలె ఉండెను. అట్టి గృహ సముదాయమును హనుమంతుడు చూచెను.

మూ. నివేశనానాం వివిధాశ్చ శాలాః
ప్రధానశఙ్ఖాయుధచాపశాలాః,
మనోహరాశ్చాపి పునర్విశాలాః
దదర్శ వేశ్మాద్రిషు చన్ద్రశాలాః. 2

ప్ర. అ. నివేశనానామ్ = గృహములయొక్క, వివిధాః = అనేకవిధము లైన, శాలాః = శాలలను, ప్రధానశఙ్ఖాయుధచాపశాలాః = ప్రధాన మైన శంఖ

శాలలను, ఆయుధశాలలను, పునః = మరియు, వేశ్మాద్రిషు = పర్వతముల వంటి గృహముల మీద, మనోహరాః = మనోహరము లైన, విశాలాః = విశాలము లైన చన్ద్రశాలాః = చంద్రశాలలను [డాబాలను], దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ గృహములలో అనేకవిధము లైన శాలలను, ప్రధానము లైన కంభశాలలను, ఆయుధశాలలను, పర్వతముల వలె ఉన్నతము లైన గృహముల పైన మనోహరములు, విశాలములు అయిన శాలలను చూచెను.

మూ. గృహాణి నానావసురాజితాని
దేవాసురైశ్చాపి సుపూజితాని,
సర్వైశ్చ దోషైః పరివర్జితాని
కపిర్దదర్శ స్వబలార్జితాని. 3

టీ. కపిః = హనుమంతుడు, నానావసురాజితాని = అనేకవిధము లైన ధనములచే ప్రకాశింపచేయబడినవి, దేవాసురైశ్చాపి = దేవతలచేతను, అసురులచేతను కూడ, సుపూజితాని = బాగుగా పూజింపబడినవి, సర్వైః = సమస్తమైన, దోషైః = దోషములచేత, పరివర్జితాని = విడువబడినవి, స్వబలార్జితాని = (రాక్షసులచే) స్వీయబలముచేత సంపాదింపబడినవి అయిన, గృహాణి = గృహములను, దదర్శ = చూచెను.

తా. అక్కడ హనుమంతుడు చూచిన గృహము లన్ని రాక్షసులు స్వబలముచే సంపాదించినవి. అవి అనేకవిధము లైన ధనములతో ప్రకాశించుచుండెను. దేవతలు, అసురులు కూడ పూజించుటకు తగినవి. ఆ గృహములలో దోషము లేవియు లేవు. 3

తాని ప్రయత్నాభిసమాహితాని
మయేన సాక్షాదివ నిర్మితాని,
మహీతలే సర్వగుణోత్తరాణి
దదర్శ లఙ్కాధిపతేర్గృహాణి. 4

ప్ర. అ. ప్రయత్నాభిసమాహితాని = ప్రయత్నపూర్వకముగా నిర్మింపబడినవి, సాక్షాత్ = సాక్షాత్తూ, మయేన = మయునిచేత, నిర్మితానీవ = నిర్మింప

బడినవా అన్నట్లున్నవి, మహీతలే = భూలోకమునందు, సర్వగుణోత్తరాణి = సమస్తమైన గుణములంతో శ్రేష్ఠమైనవీ అయిన, లంకాధిపతేః = రావణుని యొక్క, తాని గృహాణి=ఆ గృహములను, దదర్శ=చూచెను.

తా. ఆ రావణుని గృహములు, ప్రయత్నపూర్వకముగ నిర్మింపబడుటచే సాక్షాత్తు మయునిచే నిర్మింపబడినవా అన్నట్లు, భూలోకములో సకలగుణములంతో శ్రేష్ఠములుగా ఉండెను. 4

మూ. తతో దదర్శోచ్ఛ్రితమేఘరూపం
మనోహరం కాఞ్చనచారురూపమ్,
రక్షోధిపస్యాత్మబలానురూపం
గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్. 5.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఉచ్ఛ్రితమేఘరూపమ్ = ఉన్నతమైన మేఘము వంటి రూపముకలదీ, మనోహరమ్ = మనోహరమైనదీ, కాఞ్చనచారురూపమ్=బంగారముతో అందమైన రూపము గలదీ, అప్రతిరూపరూపమ్=సాటిలేని రూపము గలదీ, ఆత్మబలానురూపమ్=తన (రావణుని) బలమునకు అనురూపముగా ఉన్నదీ అయిన, రక్షోధిపస్య=రాక్షసాధీశునియొక్క, గృహోత్తమమ్ శ్రేష్ఠమైన గృహమును, దదర్శ=చూచెను.

తా. పిమ్మట, హనుమంతుడు, రావణుని ఉత్తమగృహమును చూచెను. అది అతని బలమునకు తగువిధముగ సాటిలేనిదిగా ఉండెను. ఉన్నతమైన మేఘము వలె కనబడుచుండెను. బంగారపు నగిషీలు మొదలైనవాటితో చాల మనోహరముగా ఉండెను. 5

మూ. మహీతలే స్వర్గమివ ప్రకీర్ణం
శ్రియా జ్వలన్తం బహురత్నకీర్ణమ్,
నానాతరూణాం కుసుమావకీర్ణం
గిరేరివాగ్రం రజసావకీర్ణమ్. 6

ప్ర. అ. మహీతలే = భూతలమునందు, ప్రకీర్ణమ్ = పడవేయబడిన, స్వర్గమివ=స్వర్గము వలె ఉన్నదీ, శ్రియా = శోభతో, జ్వలన్తమ్=ప్రకాశించు

చున్నదీ, బహురత్నకీర్ణమ్ = అనేకము లైన రత్నములతో వ్యాప్త మైనదీ, నానాతరూణామ్ = అనేకవిధము లైన వృక్షములయొక్క, కుసుమావకీర్ణమ్ = పుష్పములచేత కప్పబడినదీ, రజసా = పరాగముచేత, అవకీర్ణమ్=చిమ్మబడిన (కప్పబడిన), గిరేః = పర్వతముయొక్క, అగ్రమివ = శిఖరమువలె ఉన్నదీ అయిన, (5వ శ్లోకములోని "విమానరత్నం దదర్శ" అనుదానితో అన్వయము.) శ్రేష్ఠ మైన విమానమును చూచెను.

తా. హనుమంతు డక్కడ ఒక్క శ్రేష్ఠ మైన విమానమును చూచెను. అది భూలోకములోనికి జారిపడిన స్వర్గము వలె ఉండెను. అనేక రత్నములతో నిండి శోభతో ప్రజ్వరిల్లుచుండెను. అనేకవిధము లైన వృక్షముల పుష్పములు దానిపై చల్లబడి యుండుటచే అది పరాగముచేత కప్పబడిన పర్వతశిఖరము వలె ప్రకాశించుచుండెను. 6

మూ. నారీప్రవేకైరివ దీప్యమానం
తటిద్భిరమ్భోదవదర్చ్యమానమ్,
హంసప్రవేకైరివ వాహ్యమానం
శ్రియా యుతం ఖే సుకృతాం విమానమ్. 7

ప్ర. అ. నారీప్రవేకైః=అత్యుత్తమస్త్రీలతో, దీప్యమానమివ = ప్రకాశింపచేయబడుచున్నదీ, తటిద్భిః = మెరుపులతో, అమ్భోదవత్ = మేఘము వలె, అర్చ్యమానమ్ = పూజింపబడుచున్నదీ (అలంకరింపబడినదీ), హంసప్రవేకైః= శ్రేష్ఠ మైన హంసలచేత, వాహ్యమానమ్ ఇవ= మోయబడుచున్నది వలె ఉన్నదీ, శ్రియా=శోభతో, యుతమ్=కూడినదీ, ఖే = ఆకాశమునందు, సుకృతామ్ = పుణ్యాత్ములయొక్క, విమానమ్=ఉత్తమగృహము వలె ఉన్నదీ (అయిన విమాన రత్నమును చూచెను)

తా. ఉత్తమస్త్రీలతో ప్రకాశించుచున్న ఆ విమానరత్నము, మెరపులచే అలంకరించబడిన మేఘము వలె ఉండెను. హంసలు మోయుచున్నాయా అన్నట్లు ఆకాశమున పైన తేలియాడుచుండెను. ఆకాశముపై ఉన్న పుణ్యాత్ముల విమానము వలె శోభించుచుండెను. 7

మూ. యథా నగాగ్రం బహుధాతుచిత్రం
యథా నభశ్చ గ్రహచన్ద్రచిత్రమ్,

దదర్శ యుక్తీకృతమేఘచిత్రం
విమానరత్నం బహురత్నచిత్రమ్ 8

ప్ర. అ. యుక్తీకృతమేఘచిత్రమ్=తనతో సంబంధించి నట్లు చేయబడిన మేఘము లను చిత్రములు కలదీ, (కావుననే) గ్రహచన్ద్రచిత్రమ్=గ్రహములతోను, చంద్రునితోను చిత్ర మైన, నభః యథా=ఆకాశము వలె ఉన్నదీ, బహురత్నచిత్రమ్=అనేకము లైన రత్నములతో చిత్రముగా ఉన్నదీ. (అందుచేతనే) బహుధాతుచిత్రమ్=అనేక మైన గైరికాదిధాతువులచేత చిత్రమైన, నగాగ్రం యథా =పర్వతాగ్రము వలె ఉన్నదీ అయిన, విమానరత్నమ్ = శ్రేష్ఠ మైన విమానమును, దదర్శ = చూచెను.

తా. చిత్రముల వలె ఉన్న మేఘములు ఆ విమానరత్నము దగ్గర ప్రోగులు పడుటచే అది గ్రహములతోను, చంద్రునితోను చిత్ర మైన ఆకాశము వలె ఉండెను. అనేకరత్నములతో చిత్రవర్ణముగా ఉండుటచేత, అది, అనేకము లైన గైరికాదిధాతువులతో చిత్రవిచిత్రవర్ణములు గల పర్వతాగ్రము వలె ఉండెను. అట్టి విమానరత్నమును హనుమంతుడు చూచెను. 8

మూ. మహీ కృతా పర్వతరాజిపూర్ణా
శైలాః కృతా వృక్షవితానపూర్ణాః,
వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః
పుష్పం కృతం కేసరపత్రపూర్ణమ్. 9

ప్ర. అ. మహీ=భూమి, పర్వతరాజిపూర్ణా=పర్వతపంక్తితో నిండినదిగా, కృతా = చేయబడినది. శైలాః = పర్వతములు, వృక్షవితానపూర్ణాః=వృక్షముల విస్తృతితో నిండినవిగా, కృతాః = చేయబడినవి. వృక్షాః = వృక్షములు, పుష్పవితానపూర్ణాః = పుష్పముల సముదాయముతో నిండినవిగా, కృతాః = చేయబడినవి. పుష్పమ్ = పుష్పము, కేసరపత్రపూర్ణమ్ = కింజల్కములతోను, రేకులతోను నిండినదిగా, కృతమ్ = చేయబడినది. 9

తా. అక్కడ భూమి పర్వతపంక్తులతో నిండి ఉండెను. పర్వతపంక్తులు వృక్షసముదాయముతో నిండి యుండెను. వృక్షములు పుష్పసంపదతో నిండి యుండెను. పుష్పములు కింజల్కములతోను, రేకులతోను నిండి యుండెను. 9

మూ. కృతాని వేశ్మాని చ పాణ్డురాణి
తథా సుపుష్పాణ్యపి పుష్కరాణి,
పునశ్చ పద్మాని సకేసరాణి
ధన్యాని చిత్రాణి తథా వనాని. 10

ప్ర. అ. పాణ్డురాణి = తెల్లనైన, వేశ్మాని చ = గృహములు, కృతాని = నిర్మింపబడినవి. తథా = అట్లే, సుపుష్పాణి = మంచి పుష్పములు గల, పుష్కరాణి చ = సరస్సులు, పునశ్చ = మరియు, సకేసరాణి = కింజల్కములతో కూడిన, పద్మాని = పద్మములు, తథా = మరియు, ధన్యాని = శ్రేష్ఠము లైన, చిత్రాణి = చిత్రవర్ణము గల, వనాని = వనములు నిర్మింపబడినవి.

తా. అక్కడ తెల్లని భవనములు నిర్మించిరి. మంచిపుష్పములతో నిండిన సరస్సులు ఏర్పరచిరి. ఆ సరస్సులలో కింజల్కములతో నిండిన పద్మములు పెంచుచుండిరి. చిత్రములు, ఉత్తమములూ అయిన వనములను పెంచిరి. 10.

మూ. పుష్పాహ్వయం నామవిరాజమానం
రత్నప్రభాభిశ్చ విఘూర్ణమానమ్,
వేశ్మోత్తమానామపి చోచ్చమానం
మహాకపిస్తత్ర మహావిమానమ్. 11

ప్ర. అ. తత్ర = అక్కడ, మహాకపిః = హనుమంతుడు, పుష్పాహ్వయమ్ = పుష్పక మను పేరు గలది, నామవిరాజమానమ్ = పేరుతో (పేరుకు అనుగుణముగా) ప్రకాశించుచున్నదీ, రత్నప్రభాభిః = రత్నకాంతులతో, విఘూర్ణమానమ్ = తిరుగుచున్నట్లున్నదీ, వేశ్మోత్తమానామపి = శ్రేష్ఠ మైన గృహములలో కూడ, ఉచ్చమానమ్ = ఉన్నతప్రమాణము కలదీ అయిన, మహావిమానమ్ = గొప్ప విమానమును, (చూచెను).

తా. హనుమంతుడు అక్కడ పుష్పక మను పేరు గల ఒక మహా విమానమును చూచెను. అది పేరుకు తగినట్లుగా మనోహరముగా ప్రకాశించు చుండెను. దాని చుట్టూ రత్నముల కాంతులు వ్యాపించుటచేత ఆ కాంతుల మధ్య తిరిగిపోవుచున్నట్లు, ఉండెను. అక్కడ ఉన్న ఉత్తమ గృహము లన్నింటిలో అది అత్యున్నతముగా ఉండెను. 11.

మూ. కృతాశ్చ వైదూర్యమయా విహఙ్గా
రూప్యప్రవాలైశ్చ తథా విహఙ్గాః,
చిత్రాశ్చ నానావసుభిర్భుజఙ్గాః
జాత్యానురూపాస్తురగాః శుభాఙ్గాః. 12

ప్ర. అ. వైదూర్యమయాః = వైదూర్యమాణిక్యవికారము లైన, విహఙ్గాః = పక్షులూ, తథా = అట్లే, రూప్యప్రవాలైశ్చ = వెండితోను, పగడములతోను నిర్మించిన, విహఙ్గాః = పక్షులూ, నానావసుభిః = అనేకవిధము లైన ధనములతో, (మణులతో) చిత్రాః = విచిత్రము లైన, భుజఙ్గాః = సర్పములు, జాత్యా = జాతిచేత, అనురూపాః = అనుకూల మైన, శుభాఙ్గాః = శుభకర మైన శరీరము గల, తురగాః = గుఱ్ఱములూ, కృతాః = ఏర్పరుపబడినవి.

తా. ఆ విమానమునందు, అలంకారార్థ మై, వైదూర్యమణులతోను, బంగారముతోను, పగడములతోను నిర్మించిన పక్షులనూ, మాణిక్యములతో విచిత్రవర్ణముగా ఉన్న సర్పములనూ, మంగళకర మైన శరీరములు గల, ఉత్తమజాతికి చెందిన గుఱ్ఱములనూ అమర్చిరి. 12

మూ. ప్రవాళజామ్బూనదపుష్పపక్షాః
సలీలమావర్జితజిహ్మపక్షాః,
కామస్య సాక్షాదివ భాన్తి పక్షాః
కృతా విహఙ్గాః సుముఖాః సుపక్షాః. 13

ప్ర. అ. ప్రవాళజామ్బూనదపుష్పపక్షాః = రెక్కలపై పగడములతోను, బంగారముతోను చేయబడిన పువ్వులు కలవీ, సుపక్షాః = మంచి రెక్కలు గలవీ, సలీలమ్ = విలాసపూర్వకముగా, ఆవర్జితజిహ్మపక్షాః = వంచబడిన వంకర యైన రెక్కలు గలవీ, సుముఖాః = మంచి ముఖములు కలవీ అయిన, విహఙ్గాః = పక్షులు, కృతాః = నిర్మింపబడినవి. సాక్షాత్ = సాక్షాత్తు, కామస్య = మన్మథునియొక్క, పక్షాః ఇవ = పక్షమునకు చెందిన సహాయులు వలె, భాన్తి = ప్రకాశించుచున్నవి.

తా. ఆ విమానముపై మంచి ముఖములు, రెక్కలూ ఉన్న పక్షులను కూడా నిర్మించిరి. విలాసపూర్వకముగా వంచబడిన వంకరగా ఉన్న వాటి

రెక్కలమీద పగడముల పువ్వులు, బంగారు పువ్వులు చెక్కబడి ఉండెను. అట్టి పక్షులు మన్మథుని పక్షమునకు చెందిన అతని సహాయకుల వలె ఉండెను.

మూ. నియుజ్యమానాస్తు గజాః సుహస్తాః
సకేసరాశ్చోత్పలపత్రహస్తాః,
బభూవ దేవీ చ కృతా సుహస్తా
లక్ష్మీస్తథా పద్మిని పద్మహస్తా. 14

ప్ర. అ. పద్మిని = పద్మసరస్సునందు, సుహస్తాః = మంచి తొండములు కలవి, సకేసరాః = (శరీరముపై) కింజల్కములతో కూడినవి, ఉత్పలపత్ర హస్తాః = పద్మములూ తామరాకులూ తొండములందు గలవి, నియుజ్యమానాస్తు = నియమింపబడుచున్నవి. (లక్ష్మీదేవిని స్నానము చేయించుచున్నట్లు చూపబడినవి) అయిన, గజాః = గజములు నిర్మింపబడినవి. తథా = అట్లే, పద్మహస్తా = పద్మములు హస్తమునందు గలదీ, సుహస్తా = అందమైన హస్తములు కలదీ అయిన, దేవీ చ = లక్ష్మీకూడ, కృతా = నిర్మింపబడినదై, బభూవ = ఉండెను.

తా. ఆ పుష్పకవిమానములో, గజలక్ష్మి ఉండెను. అందమైన తొండములతో తామరపూవులను తామరాకులను పైకెత్తి, బంగారు కలశలతో లక్ష్మీదేవిని స్నానము చేయించుచున్న గజములు పద్మసరస్సులో నిలచి ఉండెను. వాటి శరీరమునిండా పద్మకింజల్కములు పడిఉండెను. లక్ష్మీదేవి మనోహరములైన హస్తములతో పద్మములు ధరించి ఉండెను. 14

మూ. ఇతీవ తద్గృహమభిగమ్య శోభనమ్
సవిస్మయో నగమివ చారు శోభనమ్,
పునశ్చ తత్పరమసుగన్ధి సున్దరమ్
హిమాత్యయే నగమివ చారుకన్దరమ్. 15

ప్ర. అ. ఇతీవ = ఈ ప్రకారము, శోభనమ్ = ప్రకాశించుచున్నదీ, చారు శోభనమ్ = అందముగా కాంతిమంతమై ఉన్న, నగమివ = పర్వతము వలె ఉన్నదీ అయిన, తద్గృహమ్ = ఆ గృహమును, అభిగమ్య = సమీపించి, సవిస్మయః = ఆశ్చర్యముతో కూడిన హనుమంతుడు, పరమసుగన్ధి = మిక్కిలి

సుగంధము గలదీ, సున్దరమ్ = సుందరమూ, హిమాత్యయే = వసంతఋతువందు, చారుకన్దరమ్ = అంద మైన గుహలు గల, నగమివ = పర్వతము వలె ఉన్న, తత్ = ఆ గృహమును, పునశ్చ = మరల, సమీపించి చూచెను.

తా. హనుమంతుడు, అంద మైన పర్వతము వలె, మనోహరముగా ఉన్న ఆ గృహమును చూచి ఆశ్చర్యపడుచు, వసంత ఋతువునందు, మంచి సువాసనలతో నిండి అంద మైన గుహలతో మనోహరముగా ఉన్న పర్వతము వలె ఉన్న ఆ గృహమును మరల ఒకమారు ప్రవేశించి అన్వేషించెను. 15

మూ. తతః స తాం కపిరభిపత్య పూజితాం
చరన్ పురీం దశముఖబాహుపాలితామ్,
అదృశ్య తాం జనకసుతాం సుపూజితాం
సుదుఃఖితః పతిగుణవేగనిర్జితామ్. 16

ప్ర అ. తతః = అటుపిమ్మట, సః కపిః = ఆ హనుమంతుడు, పూజితామ్ = పూజింపబడినదీ, దశముఖబాహుపాలితామ్ = రావణుని బాహువులచేత పాలింపబడినదీ అయిన, తాం పురీమ్ = ఆ లంకానగరమును, అభిపత్య = సమీపించి, చరన్ = సంచరించుచు, సుపూజితామ్ = బాగుగా పూజింపబడినదీ, పతిగుణవేగనిర్జితామ్ = భర్త యొక్క గుణములచే వేగముగా (అధికముగా) జయింప బడినదీ అయిన, తాం జనకసుతామ్ = ఆ సీతను, అదృశ్య = చూడక, సుదుఃఖితః = చాల దుఃఖించెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు రావణుని బాహుబలముచేత రక్షింపబడినదీ, గౌరవింపబడినదీ అయిన ఆ లంకానగరము ప్రవేశించి సంచరించుచు, భర్త సద్గుణములచే అధికముగా ఆకర్షింపబడి అతనిమీదనే మనస్సు నిలిపి ఉన్న పూజనీయురా లైన సీతను గానక చాల విషణ్ణు డయ్యెను. 16

మూ. తతస్తదా బహువిధభావితాత్మనః
కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః,
అపశ్యతో௨భవదతిదుఃఖితం మనః
సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః. 17

# ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## సప్తమః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తదా = అప్పుడు, బహువిధభావితాత్మనః = అనేకవిధములుగ భావములతో నిండిన మనస్సు కలవాడూ, కృతాత్మనః = నిశ్చిత మైన మనస్సు కలవాడూ, సువర్త్మనః = మంచి మార్గము గలవాడూ, సుచక్షుషః = మంచి నేత్రములు (దృష్టి) కలవాడూ, ప్రవిచరతః = సంచరించు చున్నవాడూ, జనకసుతామ్ = సీతను, అపశ్యతః = చూడనివాడూ అయిన, మహాత్మనః = మహాత్ము డైన హనుమంతుని యొక్క, మనః = మనస్సు, అతి దుఃఖితమ్ = చాల దుఃఖించినదిగా, అభవత్ = అయెను.

తా. ధర్మమార్గమును అనుసరించు మహాత్ము డైన హనుమంతుడు దృఢ విశ్వాసముతో, నిశితదృష్టితో ఎంత వెదకినను సీత కనబడలేదు. అప్పుడు అతని మనస్సులో ఎన్నో భావములు చెలరేగెను. ఆ విధముగా సంచరించుచు అతడు విషాదము పొందెను. 17

"తారానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో సప్తమసర్గ సమాప్తము.

## అథ అష్టమః సర్గః

[హనుమంతుడు మరల పుష్పకమును అన్వేషించుట]

మూ. స తస్య మధ్యే భవనస్య సంస్థితం
మహద్విమానం మణివజ్రచిత్రితమ్,
ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం
దదర్శ వీరః పవనాత్మజః కపిః. 1

ప్ర. అ. వీరః = వీరుడు, పవనాత్మజః = వాయుపుత్రుడూ అయిన, సః కపిః = ఆ హనుమంతుడు, తస్య భవనస్య = ఆ భవనము యొక్క, మధ్యే = మధ్యయందు, సంస్థితమ్ = ఉన్నదీ, మణివజ్రచిత్రితమ్ = మణులచేతను, వజ్రములచేతనూ చిత్రవర్ణము కలదిగా చేయబడినదీ, ప్రతప్తజాంబూనదజాలకృత్రిమమ్ = కాల్చిన బంగారము సముదాయముతో చేయబడిన నగిషీలు కలదీ అయిన, మహత్ = గొప్పదైన విమానమ్ = విమానమును, దదర్శ = చూచెను.

తా. వీరుడైన ఆ మారుతి, ఆ భవనము మధ్య యందు ఉన్న గొప్ప విమానమును చూచెను. అది మాణిక్యములు, వజ్రములు పొదుగుటచే చిత్ర వర్ణముగా ఉండెను. కాల్చి పరిశుద్ధము చేసిన, బంగారపు సముదాయముతో ఆ విమానమునకు అంతటను, నగిషీలు చెక్కి ఉండెను. 1

మూ. తదప్రమేయాప్రతికారకృత్రిమం
కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా,
దివం గతం వాయుపథప్రతిష్ఠితం
వ్యరాజతాదిత్యపథస్య లక్ష్మవత్. 2

ప్ర. అ. అప్రమేయాప్రతికారకృత్రిమమ్ = సాటిలేనిదీ, ఎదురులేని అలంకార రచన కలదీ, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, స్వయమ్ = స్వయముగా,

సాధ్వితి = చాలా బాగున్నది అని, కృతమ్ = చేయబడినదీ, దివమ్ = ఆకాశమును, గతమ్ = పొందినదీ, వాయుపథప్రతిష్ఠితమ్ = వాయుమార్గమునందు నిలువబడి నదీ అయిన, తత్ = అది, ఆదిత్యపథస్య = సూర్యమార్గమునకు, లక్ష్మవత్ = చిహ్నము వలె, వ్యరాజత = ప్రకాశించెను.

తా. ఆ విమానమునకు చేసిన అలంకరణము సాటిగాని, ఎదురు (పోటీ) గాని లేనిదై ఉండెను. సాక్షాత్తు విశ్వకర్మయే దీనిని నిర్మించి చాల బాగున్న దని మెచ్చుకొనెను. అది ఆకాశమునందు వాయుమార్గమునందు నిలచినదై, సూర్యమార్గమునకు చిహ్నము వలె ప్రకాశించుచుండెను. 2

మూ. న తత్ర కించిన్న కృతం ప్రయత్నతో
న తత్ర కించిన్న మహార్హరత్నవత్,
న తే విశేషా నియతాః సురేష్వపి
న తత్ర కించిన్న మహావిశేషవత్. 3

ప్ర. అ. తత్ర = దానియందు, ప్రయత్నతః = ప్రయత్నపూర్వకముగా, న కృతమ్ = చేయబడనిది, కించిత్ = ఏదియు. న = లేదు తత్ర = దాని యందు, నమహార్హరత్నవత్ = శ్రేష్ఠము లైన రత్నములు లేనిది, కించిత్ = ఏదియు, న = లేదు, తే = ఆ, విశేషాః = పుష్పకవిమానమునకు సంబంధించిన, విశేషములు, సురేష్వపి = దేవతలలో కూడ, న నియతాః = నిశ్చితములుగా లేవు, తత్ర = దానియందు, నమహావిశేషవత్ = గొప్ప విశేషము లేనిది, కించిత్ = ఏదియు, న = లేదు.

తా. ఆ విమానమునందు ప్రయత్నపూర్వకముగా నిర్మింపబడనిది ఏదీ లేదు. దానిపై శ్రేష్ఠము లైన రత్నములు లేనిది ఏదీ లేదు. దానిలో ఉన్న విశేషములు దేవతల గృహములలో కూడ నిశ్చితముగా ఉన్న వని చెప్ప వీలు లేదు. దానిలో గొప్ప విశేషము లేనిది ఏదీ లేదు. 3

మూ. తపఃసమాధానపరాక్రమార్జితం
మనఃసమాధానవిచారచారిణమ్,
అనేకసంస్థానవిశేషనిర్మితం
తతస్తతస్తుల్యవిశేషదర్శనమ్. 4

ప్ర. అ. తపఃసమాధానపరాక్రమార్జితమ్ = తపస్సు చేయుటచేతను పరాక్రమముచేతను సంపాదింపబడినదీ, మనఃసమాధానవిచారచారిణమ్ = (ఎక్కినవారి) మనస్సుయొక్క ఏకాగ్రతవలన కలిగిన ఆలోచనను పట్టి సంచరించునదీ, అనేకసంస్థానవిశేషనిర్మితమ్ = ఆ యా భాగములందు అనేకమైన ఆకారముల విశేషములతో నిర్మింపబడినదీ, తతస్తతః = అక్కడక్కడ, తుల్యవిశేషదర్శనమ్ = సమానమైన విశేషముల దర్శనము గలదీ ( అయిన విమానమును హనుమంతుడు చూచెను).

తా. ఆ విమానము గొప్ప తపస్సు చేయుటచేతను, పరాక్రమముచేతను సంపాదింపబడినది. దానిలో కూర్చున్నవారి అభిప్రాయమును అనుసరించి అది సంచరించును. వివిధ భాగములలో అనేకములైన ఆకారవిశేషములతో నిర్మింపబడినది. అన్ని ప్రదేశములలోను నిర్మాణవైశిష్ట్యము తుల్యముగా ఉండెను 4

మూ. విశేషమాలమ్బ్య విశేషసంస్థితం
విచిత్రకూటం బహుకూటమణ్డితమ్,
మనోఽభిరామం శరదిన్దునిర్మలం
విచిత్రకూటం శిఖరం గిరేర్యథా. 5

ప్ర. అ. విశేషమ్ = నిర్మాణవిశేషమును, ఆలమ్బ్య = అవలంబించి, విశేషసంస్థితమ్ = విశేషరూపమున ఉన్నదీ, విచిత్రకూటమ్ = విచిత్రములైన శిఖరములు కలదీ, బహుకూటమణ్డితమ్ = అనేకములైన శిఖరములచేత అలంకరింపబడినదీ, మనోఽభిరామమ్ = మనస్సునకు ఆకర్షణమైనదీ, శరదిన్దునిర్మలమ్ = శరత్కాలచంద్రుని వలె నిర్మలమైనదీ, గిరేః = పర్వతముయొక్క, విచిత్రకూటమ్ = విచిత్రములైన చిన్న చిన్న శిఖరములు గల, శిఖరం యథా = శిఖరము వలె ఉన్నదీ అయిన విమానమును చూచెను.

తా. ఆ విమానము విశిష్టములైన రీతులలో నిర్మింపబడుటచే దాని రూపము విశిష్టముగా ఉండెను. అనేకములైన శిఖరములతో విచిత్రముగా ఉండెను. మనోహరమై, శరత్కాలచంద్రుని వలె నిర్మలమై, చిన్న చిన్న శిఖరములు గల పర్వతశిఖరము వలె ఉండెను. 5

మూ. వహన్తి యం కుణ్డలశోభితాననా
మహాశనా వ్యోమచరా నిశాచరాః,
వివృత్తవిధ్వస్తవిశాలలోచనా
మహాజవా భూతగణాః సహస్రశః ॥ 7

ప్ర. అ. యమ్ = దేనిని, కుణ్డలశోభితాననాః = కుండలములచేత శోభింపచేయబడిన ముఖము గల, మహాశనాః = గొప్ప ఆహారముగల, వ్యోమచరాః = ఆకాశమునందు సంచరించు, నిశాచరాః = రాక్షసులు, వివృత్తవిధ్వస్తవిశాలలోచనాః = గుండ్రని నేత్రములూ, వంకరగానున్న నేత్రములూ, విశాలము లైన నేత్రములూ గల, మహాజవాః = గొప్ప వేగము గల, భూతగణాః = భూతముల సమూహములు, సహస్రశః = వేలకొలది, వహన్తి = మోయుచున్నవో (దానిని హనుమంతుడు చూచెను).

తా. ఆ విమానమును కుండలములతో శోభించుచున్న ముఖములు కల వారూ, అధిక మైన ఆహారము భుజించువారూ, ఆకాశసంచారులూ అయిన రాక్షసులూ, గుండ్రనికండ్లు, వంకరకండ్లు, విశాలము లైన కండ్లు గల మహావేగవంతము లైన వేలకొలది పిశాచములూ మోయుచుండెను.

మూ. వసన్తపుష్పోత్కరచారుదర్శనం
వసన్తమాసాదపి కాన్తదర్శనమ్,
స పుష్పకం తత్ర విమానముత్తమం
దదర్శ తద్వానరవీరసత్తమః ॥ 8

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సున్దరకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర. అ. వానరవీరసత్తమః = వానరవీరులలో శ్రేష్ఠు డైన, సః = హనుమంతుడు, వసన్తపుష్పోత్కరచారుదర్శనమ్ = వసంతమునందలి పుష్పసమూహము వలె అంద మైన దర్శనముకలదీ, వసన్తమాసాదపి = వసంతమాసముకంటె కూడ, కాన్తదర్శనమ్ = మనోహర మైన దర్శనము గలదీ

అయిన, పుష్పకమ్ = పుష్పక మను పేరు గల, ఉత్తమమ్ = ఉత్తమ మైన, విమానమ్ = విమానమును, తత్ర = అక్కడ, దదర్శ = చూచెను.

తా. వానరవీరులలో శ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు, అక్కడ, వసంతర్తువు లోని పుష్పముల సముదాయము వలె చూచుటకు చాలా అందముగా ఉన్నదీ, వసంతమాసముకంటె కూడ మనోహర మైనదీ, అయిన పుష్పక మను విమాన శ్రేష్ఠమును చూచెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో ఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ నవమః సర్గః

[హనుమంతుడు రావణుని భవనమును, అక్కడ ఉన్న పుష్పకవిమానమును చూచిన విమ్మట అక్కడ నిద్రించుచున్న వేల కొలది స్త్రీలను చూచుట].

మూ. తస్యాలయవరిష్ఠస్య మధ్యే విమలమాయతమ్,
దదర్శ భవనశ్రేష్ఠం హనుమాన్ మారుతాత్మజః. 1

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, తస్య = ఆ, ఆలయవరిష్ఠస్య = శ్రేష్ఠమైన గృహసముదాయముయొక్క, మధ్యే = మధ్యయందు, విపులమ్ = విస్తృతమైనది, ఆయతమ్ = పొడవైనదీ అయిన, భవనశ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన భవనమును, దదర్శ = చూచెను.

తా. వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు, ఉత్తమమైన ఆ భవనసముదాయము మధ్యయందు, విశాలమూ దీర్ఘమూ అయిన ఒక శ్రేష్ఠమైన భవనమును చూచెను. 1

మూ. అర్ధయోజనవిస్తీర్ణమాయతం యోజనం హి తత్,
భవనం రాక్షసేన్ద్రస్య బహుప్రాసాదసంకులమ్. 2

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, తత్ = ఆ, బహుప్రాసాదసంకులమ్ = అనేక ప్రాసాదములతో నిండియున్న, భవనమ్ = భవనమును, అర్ధయోజనవిస్తీర్ణమ్ = అర్ధయోజనము (యోజనములో సగము) వెడల్పు గలదీ; యోజనమ్ = ఒక యోజనము, ఆయతమ్ = పొడవైనది.

తా. చుట్టూ అనేక ప్రాసాదము లున్న ఆ రావణభవనము ఎనిమిది లేదా తొమ్మిది మైళ్లు (యోజనము), పొడవు, నాలుగు లేదా నాలుగున్నర మైళ్లు వెడల్పు ఉండెను. 2

మూ. మార్గమాణస్తు వైదేహీం సీతామాయతలోచనామ్,
సర్వతః పరిచక్రామ హనుమానరిసూదనః. 3

ప్ర. అ. అరిసూదనః = శత్రువినాశకు డైన, హనుమాన్ = హనుమంతుడు, వైదేహీమ్ = విదేహరాజైన జనకుని కూతురు, ఆయతలోచనామ్ = విశాలమైన నేత్రములుకలది అయిన, సీతామ్ = సీతను, మార్గమాణః తు = వెదకుచు, సర్వతః = అంతటా, పరిచక్రామ = తిరిగెను.

తా. శత్రువినాశకు డైన, హనుమంతుడు, విశాలనేత్ర యైన ఆ జనక రాజకుమారి కొరకై అన్వేషించుచు, అంతట తిరిగెను. 3

మూ. ఉత్తమం రాక్షసావాసం హనుమానవలోకయన్,
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్. 4.

చతుర్విషాణైర్ద్విరదైస్త్రివిషాణైస్తథైవ చ,
పరిక్షిప్తమసంబాధం రక్ష్యమాణముదాయుధైః. 5

ప్ర. అ. అథ = అటుపిమ్మట, లక్ష్మీవాన్ = శోభ గల, హనుమాన్ = హనుమంతుడు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, రాక్షసావాసమ్ = రాక్షసుల నివాసస్థానమూ, చతుర్విషాణైః = నాలుగు దంతములు గలవీ, తథైవ చ = అట్లే, త్రివిషాణైః = మూడు దంతములు గలవీ, ద్విరదైః = రెండు దంతములు గలవీ అయిన ఏనుగుల చేత, పరిక్షిప్తమ్ = వ్యాప్త మైనదీ, అసంబాధమ్ = ఇరుకుగా లేనిదీ, ఉదాయుధైః = ఎత్తబడిన ఆయుధములు కల భటులచేత, రక్ష్యమాణమ్ = రక్షింపబడుచున్నదీ అయిన, రాక్షసేన్ద్రనివేశనమ్ = రావణుని గృహమును, అవలోకయన్ = చూచుచు, ఆససాద = సమీపించెను.

తా. పిమ్మట, అద్భుత మైన శోభ గల హనుమంతుడు, అనేక రాక్షసులకు నివాసస్థాన మైన ఆ రావణభవనమును పరిశీలన పూర్వకముగా చూచుచు దానిని సమీపించెను. ఆ భవనమునందు అన్ని ప్రాంతము లందూ రెండు దంతముల ఏనుగులు, మూడు దంతముల ఏనుగులు నాలుగు దంతముల ఏనుగులు తిరుగుచుండెను. ఏ మాత్రము ఇరుకు లేక విశాలముగా ఉన్న, ఆ భవనమును ఆయుధములు ధరించి సర్వదా యుద్ధసన్నద్ధు లైన రాక్షసులు రక్షించుచుండిరి.

మూ. రాక్షసీభిశ్చ పత్నీభి రావణస్య నివేశనమ్,
అహృతాభిశ్చ విక్రమ్య రాజకన్యాభిరావృతమ్. 6
తన్నక్రమకరాకీర్ణం తిమిఙ్గిలఝషాకులమ్,
వాయువేగసమాధూతం పన్నగైరివ సాగరమ్. 7

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, పత్నీభిః = భార్యలైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలతోను, విక్రమ్య = పరాక్రమించి, అహృతాభిః = తీసికొని రాబడిన, రాజకన్యాభిః = రాజకన్యలతోను, ఆవృతమ్ = ఆవరింపబడిన, నివేశనమ్ = గృహమును. (సమీపించెను) నక్రమకరాకీర్ణమ్ = మొసళ్ల చేత, పెద్ద చేపలచేత వ్యాప్తమూ, తిమిఙ్గిలఝషాకులమ్ = తిమింగిలము అను పెద్ద చేపలతోను, చేపలతోను వ్యాకులమూ, వాయువేగసమాధూతమ్ = వాయువేగముచేత కదల్పబడినదీ, పన్నగైః = సర్పములతో కూడినదీ అయిన, సాగరమ్ ఇవ = సముద్రము వలె ఉన్న, తత్ = ఆ భవనమును సమీపించెను.

తా. ఆ భవనము రావణుని భార్యలైన రాక్షసస్త్రీలతోను, అతడు పరాక్రమము చూపి బలాత్కారముగా ఎత్తికొని వచ్చిన రాజకన్యలతోను నిండి యుండెను. ఏనుగులతోను, రక్షకభటాదులతోను వ్యాప్తమై యున్న ఆ భవనము మొసళ్ళు, పెద్దచేపలూ, తిమింగిలములూ, ఝషము అను చేపలూ, సర్పములూ తిరుగుచున్నదీ, వాయువేగముచే కదలుచున్నదీ అయిన సముద్రము వలె భయంకరముగా ఉండెను. 6, 7

మూ. యా హి వైశ్రవణే లక్ష్మీర్యా చేన్ద్రే హరివాహనే,
సా రావణగృహే సర్వా నిత్యమేవానపాయినీ. 8

ప్ర. అ. వైశ్రవణే = కుబేరునియందు, యా = ఏ, లక్ష్మీః = లక్ష్మి (ఐశ్వర్యము) ఉన్నదో, హరివాహనే = ఆకుపచ్చని గుఱ్ఱములు గల, ఇన్ద్రే చ = ఇంద్రునియందు, యా = ఏ లక్ష్మి ఉన్నదో, సా = ఆ, సర్వా = సర్వ విధము లైన లక్ష్మి, రావణగృహే = రావణుని గృహమునందు, నిత్యమేవ = ఎల్లప్పుడు, అనపాయినీ = నాశనము (లేనిదై) నివసించుచున్నది.

తా. కుబేరునికి ఎట్టి ఐశ్వర్య మున్నదో, ఆకుపచ్చ గుఱ్ఱములు కట్టిన రథము వాహనముగా గల ఇంద్రునికి ఎట్టి ఐశ్వర్య మున్నదో అట్టి ఐశ్వర్యము

అంతా రావణుని గృహములో, ఎన్నడును తొలంగిపోక, నిత్యము స్థిరముగా ఉన్నది.  8

మూ. యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ,
తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధి రక్షోగృహే ష్విహ.  9

ప్ర. అ. రాజ్ఞః = యక్షు లైన, కుబేరస్య = కుబేరుని యొక్క, యా = ఏ సమృద్ధి ఉన్నదో, యమస్య = యముని యొక్క, వరుణస్య చ = వరుణుని యొక్క, యా = ఏ లక్ష్మి ఉన్నదో, తాదృశీ = అట్టిది కాని, తద్విశిష్టా వా = దానికంటె విశిష్టము కాని అయిన, ఋద్ధిః = సమృద్ధి, ఇహ = ఇక్కడ, రక్షోగృహేషు = రావణుని గృహమునందు, ఉన్నది.

తా. ఇక్కడ రావణుని భవనములో ఉన్న సమృద్ధి యక్షాధిపతి యైన కుబేరుని సమృద్ధితోను, యముని సమృద్ధితోను, వరుణుని సమృద్ధితోను సమానము గాని, దానికంటె కూడ అధిక మైన దని కాని చెప్పవచ్చును.  9

మూ. తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్యత్సునిర్మితమ్,
బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః.  10

ప్ర. అ. పవనాత్మజః = హనుమంతుడు, తస్య = ఆ, హర్మ్యస్య = భవనము యొక్క, మధ్యస్థమ్ = మధ్యయం దున్నదీ, సునిర్మితమ్ = బాగుగా నిర్మింపబడి నదీ, బహునిర్యూహసంకీర్ణమ్ = అనేకము లైన మదించిన ఏనుగుల ఆకారములో ఉన్న శిఖరములతో వ్యాప్తమూ అయిన, అన్యత్ = మరియొక, వేశ్మ = గృహమును, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ భవనము మధ్య మరి యొక భవనమును (పుష్పకమును) చూచెను. అది చక్కగా నిర్మింపబడిన దై, మత్తగజముల ఆకారములో ఉన్న అనేకశిఖరములతో నిండి యుండెను.  10

మూ. బ్రహ్మణో౽ర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా,
విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్.  11
పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్,
కుబేరమోజసా జిత్వా లేభే తద్రాక్షసేశ్వరః.  12

ప్ర. అ. సర్వరత్నవిభూషితమ్ = సమస్త మైన రత్నములచేత అలంక రింపబడిన, పుష్పకం నామ = పుష్పక మను పేరు గల, యత్ = ఏ, దివ్యమ్ = అద్భుత మైన, విమానమ్ = విమానము, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, దివి = స్వర్గలోకమునందు, బ్రహ్మణః అర్థే = బ్రహ్మకొరకై, కృతమ్ = చేయబడినదో, యత్ = దేనిని, కుబేరః = కుబేరుడు, పితామహాత్ = బ్రహ్మదేవునినుండి, పరేణ = గొప్ప, తపసా = తపస్సుచేత, లేభే = పొందెనో, తత్ = దానిని, రాక్షసేశ్వరః = రావణుడు, బలసా = బలముచేత, కుబేరమ్ = కుబేరుని, జిత్వా = జయించి, లేభే = పొందెను.

తా. అనేకము లైన రత్నములచే అలంకరింపబడిన పుష్పక మను దివ్య మైన విమానమును విశ్వకర్మ బ్రహ్మదేవునికొరకై పూర్వము స్వర్గములో నిర్మించెను. కుబేరుడు గొప్ప తపస్సు చేసి దానిని బ్రహ్మనుండి పొందెను. రావణుడు బలముచేత ఆ కుబేరుని ఓడించి ఆ విమానమును అతనినుండి బలాత్కారముగా హరించెను. 11, 12

మూ. ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః,
సుకృతైరాచితం స్తమ్భైః ప్రదీప్తమివ చ శ్రియా. 13
మేరుమన్దరసఙ్కాశైరుల్లిఖద్భిరివామ్బరమ్,
కూటాగారైః శుభాకారైః సర్వతః సమలంకృతమ్. 14

ప్ర. అ. ఈహామృగసమాయుక్తైః = తోడేళ్ళబొమ్మలతో కూడినవీ, కార్త స్వరహిరణ్మయైః = వెండి బంగారు వికార మైనవీ, సుకృతైః = చక్కగా చేయ బడినవీ అయిన, స్తమ్భైః = స్తంభములతో, ఆచితమ్ = వ్యాప్తమూ, శ్రియా = శోభతో, ప్రదీప్తమివ = ప్రజ్వలించుచున్నది వలె ఉన్నదీ, మేరుమన్దరసఙ్కాశైః = మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానములూ, అమ్బరమ్ = ఆకాశమును, ఉల్లిఖద్భిరివ = వ్రాయుచున్నవి వలె ఉన్నవీ అయిన, శుభాకారైః = శుభకర మైన ఆకారము గల, కూటాగారైః = పైభాగమునందున్న గదులతో, సర్వతః = అంతటా, సమలంకృతమ్ = అలంకరింపబడినదీ అయిన, ("విమానమ్ ఆరురోహ" అను 19 వ శ్లోకములో ఉన్నదానితో అన్వయము - విమానమును ఎక్కెను).

తా. ఆ విమానమునందు తోడేళ్ళ బొమ్మలు చెక్కిన వెండి స్తంభములు, బంగారు స్తంభములు అంతటా ఉండెను. కాంతితో ఆ విమానము ప్రజ్వలించుచున్నట్లుండెను. దాని పైభాగమునందు మేరుపర్వతముతోను, మందరపర్వతముతోను సమానములైన, ఆకాశమును ఒరయుచున్నవా అన్నట్లున్న ఎన్నో అందమైన గదులు ఉండెను.

మూ. జ్వలనార్కప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా,
హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్. 15

ప్ర. అ. విశ్వకర్మణా = విశ్వకర్మచేత, సుకృతమ్ = చక్కగా నిర్మించబడినదీ, జ్వలనార్కప్రతీకాశమ్ = అగ్నితోను, సూర్యునితోను సమానమైనదీ, హేమసోపానసంయుక్తమ్ = బంగారు మెట్లతో కూడినదీ, చారుప్రవరవేదికమ్ = సుందరమైన శ్రేష్ఠమైన అరుగులు కలదీ, (అయిన విమానమును ఎక్కెను).

తా. విశ్వకర్మ ప్రయత్నపూర్వకముగా నిర్మించిన ఆ విమానము అగ్నివలె, సూర్యునివలె ప్రకాశించుచుండెను. దానిలో బంగారు మెట్లు, అందమైన మంచి అరుగులూ ఏర్పరుపబడి ఉండెను. 15

మూ. జాలవాతాయనైర్యుక్తం కాఞ్చనైః స్ఫాటికైరపి,
ఇన్ద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్. 16

ప్ర. అ. కాఞ్చనైః = బంగారువికారములు, స్ఫాటికైరపి = స్ఫటికమణి వికారములూ అయిన, జాలవాతాయనైః = అలంకారార్థమేర్పరచిన చిన్న రంధ్రముల కిటికీలతోను (జాల), గాలివచ్చుటకు ఉపయోగించు పెద్ద కిటికీలతోను, యుక్తమ్ = కూడినదీ, ఇన్ద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్ = ఇంద్రనీలమణులు, మహానీలమణులు పరచిన శ్రేష్ఠములైన అరుగులు కలదీ (అయిన విమానమును ఎక్కెను).

తా. ఆ విమానములో బంగారముతోను, స్ఫటికమాణిక్యములతోను చిన్న చిన్న రంధ్రములు గల అలంకారప్రధానములైన కిటికీలు, గాలి వచ్చు పెద్ద కిటికీలు అమర్చి ఉండెను. ఇంద్రనీలమణులు, మహానీలమణులు పరచిన అరుగులు అందముగా ఏర్పరుపబడెను. (పాలలో వేయగా పాలు నీలవర్ణముగా

ఉన్నట్లు కనబడునది ఇంద్రనీలము. అకారికే చెందినది, తద్భిన్నము మహా నీలము). 16

మూ. విద్రుమేణ విచిత్రేణ మణిభిశ్చ మహాధనైః,
నిస్తులాభిశ్చ ముక్తాభి స్తలేనాభివిరాజితమ్. 17

ప్ర. అ. విచిత్రేణ = విచిత్రవర్ణము గల, విద్రుమేణ = పగడములతోను, మహాధనైః = గొప్ప ధనము (విలువ) గల, మణిభిశ్చ = మణులతోను, నిస్తులాభిః = సాటి లేని, ముక్తాభిః = ముత్యములతోను, (నిర్మింపబడిన), తలేన = అడుగుభాగముచేత, అభివిరాజితమ్ = ప్రకాశింపచేయబడినది (అయిన విమానమును ఎక్కెను.)

తా. ఆ విమానము అడుగుభాగమునందు విచిత్రములైన పగడములు, అమూల్యమైన మణులు, సాటి లేని ముత్యములు అతుకుటచే అది అద్భుతముగ ప్రకాశించుచుండెను. 17

మూ. చన్దనేన చ రక్తేన తపనీయనిభేన చ,
సుపుణ్యగన్ధినా యుక్తమాదిత్యతరుణోపమమ్. 18

ప్ర. అ. రక్తేన = ఎఱ్ఱనిది, తపనీయనిభేన చ = బంగారముతో సమానమైనది, సుపుణ్యగన్ధినా = మంచి సువాసన కలదీ అయిన, చన్దనేన = మంచి గంధముతో, యుక్తమ్ = కూడినదీ, ఆదిత్యతరుణోపమమ్ = తరుణుడైన (మధ్యాహ్నకాలమునందలి) సూర్యునితో సమానమూ (అయిన విమానమును ఎక్కెను).

తా. ఆ విమానమునందంతటను మంచి సువాసన గల ఎఱ్ఱని చందనము, బంగారు రంగు గల చందనము పూయుటచే అది మధ్యాహ్నమునందలి సూర్యుడు వలె ఉండెను. 18

మూ. కూటాగారైర్వరాకారైర్వివిధైః సమలంకృతమ్,
విమానం పుష్పకం దివ్యమారురోహ మహాకపిః. 19

ప్ర. అ. మహాకపిః = హనుమంతుడు, వరాకారైః = శ్రేష్ఠమైన ఆకారము గల, కూటాగారైః = పై భాగములందలి గృహములచేత, సమలం

కృతమ్ = అలంకరింపబడిన, దివ్యమ్ = దివ్యమైన, పుష్పకం విమానమ్ = పుష్పకవిమానమును, ఆరురోహ = ఎక్కెను.

తా. హనుమంతుడు, అంత మైన ఆకారము గల మేడ పైగదులందే అలంకరింపబడిన దివ్యమైన అర్థి పుష్పకవిమానము మీదికి ఎక్కెను. 19

మూ. తత్రస్థః స తదా గన్ధం పానభక్ష్యాన్నసంభవమ్,
దివ్యం సంమూర్ఛితం జిఘ్రద్రూపవన్తమివానిలమ్. 20

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, తదా = అప్పుడు, తత్రస్థః = అక్కడ ఉన్నవాడై, పానభక్ష్యాన్నసంభవమ్ = పానములనుండి, భక్ష్యపదార్థములనుండి, అన్నమునుండి పుట్టిన, దివ్యమ్ = అద్భుతమైన, సంమూర్ఛితమ్ = వ్యాపించిన, రూపవన్తమ్ = రూపము గల, అనిలమివ = వాయువు వలె ఉన్న, గన్ధమ్ = సువాసనను, జిఘ్రన్ = వాసన చూచెను.

తా. హనుమంతుడు అక్కడికి చేరగానే ఆ ప్రాంతమునందు అంతటను వ్యాపించి, మద్యాదిపానీయములు, తినదగిన పిండివంటలు, అన్నములు మొదలైన వాటి అద్భుతమైన సుగంధము వచ్చెను. అది మూర్తీభవించిన వాయువు వలె తీవ్రతరమై ఉండెను. 20

మూ. స గన్ధస్తం మహాసత్త్వం బన్ధుర్బన్ధుమివోత్తమమ్,
ఇత ఏహీత్యువాచేవ తత్ర యత్ర స రావణః. 21

ప్ర. అ. సః గన్ధః = ఆ సువాసన, మహాసత్త్వమ్ = మహాబలశాలి యైన, తమ్ = ఆ హనుమంతుని, ఉత్తమమ్ = ఉత్తముడైన, బన్ధుమ్ = బంధువును, బన్ధురివ = బంధువు వలె, సః రావణః = ఆ రావణుడు, యత్ర = ఎక్కడ ఉండునో, తత్ర = అక్కడికి, ఇతః ఏహి = ఇటువైపు రమ్ము, ఇతి = అని, ఉవాచేవ = పలికినట్లుండెను.

తా. ఆ సువాసన, "ఒక ఉత్తముడైన బంధువు తన బంధువును పిలిచినట్లు మహాబలశాలియైన ఆ హనుమంతుని "ఇటు రమ్ము" అని పిలుచుచున్నదా అన్నట్లు రావణుడున్న ప్రదేశమునకు తీసికొనివెళ్ళెను. 21

మూ. తతస్తాం ప్రస్థితః శాలాం దదర్శ మహతీం శుభామ్,
రావణస్య మనఃకాన్తాం కాన్తామివ వరస్త్రియమ్. 22

ప్ర. అ. తతః=అటు వైపునకు, ప్రస్థితః=బయలుదేరిన హనుమంతుడు, కాన్తామ్=మనోహరురాలైన, వరస్త్రియమివ=శ్రేష్ఠమైన స్త్రీ వలె, రావణస్య=రావణునియొక్క, మనఃకాన్తామ్ = మనస్సునకు ఇష్టమైన, శుభామ్ = మంగళకరమైన, మహతీమ్ = గొప్పదైన, శాలామ్ = శాలను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అటు వైపు వెళ్ళి, అక్కడ, మనోహరురాలైన ఉత్తమస్త్రీ వలె రావణుని మనస్సునకు చాల ఇష్టమైన, అందమైన ఒక పెద్ద శాలను చూచెను. 22

మూ. మణిసోపానవికృతాం హేమజాలవిభూషితామ్,
స్ఫాటికైరావృతతలాం దన్తాన్తరితరూపికామ్. 23

ప్ర. అ. (ఈ శ్లోకములోని, రాబోవు ఐదు శ్లోకములలోను ఉన్న ద్వితీయాంతశబ్దములు పై శ్లోకములోని "శాలామ్" అనుదానికి విశేషణములు. ఆ శాల ఎట్లున్న దనగా:-) మణిసోపానవికృతామ్ = మాణిక్యములు పరచిన మెట్లతో చక్కగా అమర్చబడినదీ, హేమజాలవిభూషితామ్=బంగారు కిటికీలతో అలంకరించబడినదీ, స్ఫాటికైః = స్ఫటికమాణిక్యములతో, ఆవృతతలామ్ = కప్పబడిన క్రింది ప్రదేశముకలదీ, దన్తాన్తరితరూపికామ్ = దంతములచేత మధ్య మధ్య నిర్మించబడిన రూపములుగలదీ.

తా. ఆ శాలలో మాణిక్యములు అతికిన మెట్లు చక్కగా అమర్చబడెను. అది బంగారు కిటికీలతో అలంకరింపబడెను. దాని క్రింది ప్రదేశ మంతా స్ఫటికమాణిక్యములు పరచి ఉండెను. మధ్య మధ్య దంతపు నగిషీలు చెక్కబడెను. 23

మూ. ముక్తాభిశ్చ ప్రవాళైశ్చ రూప్యచామీకరైరపి,
విభూషితాం మణిస్తమ్భైః సుబహుస్తమ్భభూషితామ్. 24

ప్ర. అ. ముక్తాభిశ్చ = ముత్యములతోను, ప్రవాళైశ్చ = పగడములతోను, రూప్యచామీకరైరపి = వెండి బంగారములతోను నిర్మించబడిన, మణి

స్తమ్భైః = మాణిక్యస్తంభములతో, విభూషితామ్ = అలంకరించబడినది, సుబహుస్తమ్భభూషితామ్ = అనేకమైన స్తంభములతో అలంకరించబడినది.

తా. అనేకమైన అధారస్తంభములపై నించి ఉన్న ఆ శాలలో అలంకరణార్థమై, ముత్యములు, పగడములు, వెండి, బంగారము మొదలైన వాటితో నిర్మించిన మణిస్తంభములు అక్కడక్కడ అమర్చబడి యుండెను. 24

మూ. నతైర్ఋజుభిరత్యుచ్చైః సమన్తాత్సువిభూషితైః,
స్తమ్భైః పక్షైరివాత్యుచ్చైర్దివం సంప్రస్థితామివ. 25

ప్ర. అ. నతైః = కొంచెము వంగినవి, ఋజుభిః = వంకర లేనివి, అత్యుచ్చైః = మిక్కిలి ఎత్తైనవి, సమన్తాత్ = అంతటను, సువిభూషితైః = బాగుగా అలంకరింపబడినవి అయిన, స్తమ్భైః = స్తంభములచేత, అత్యుచ్చైః = మిక్కిలి ఎత్తైన, పక్షైః = రెక్కలతో, దివమ్ = ఆకాశమును గూర్చి, సంప్రస్థితామివ = బయలుదేరినది వలె ఉన్నది.

తా. ఆ శాలలో కొంచెము వంగిన కొన్ని స్తంభములు, వంకర లేని బాగా ఎత్తైన కొన్ని స్తంభములు ఉండెను. అవి అన్నియు చక్కగా అలంకరింపబడెను. అట్టి స్తంభములతో ఆ శాల చూచువారికి, ఎత్తైన రెక్కలు చాచుచు పైకి ఆకాశముమీదికి ఎగురుటకు సిద్ధమగుచున్నదా అన్నట్లు కనబడుచుండెను.

మూ. మహత్యా కుథయాస్తీర్ణాం పృథివీలక్షణాఙ్కయా,
పృథివీమివ విస్తీర్ణాం సరాష్ట్రగృహమాలినీమ్. 26

ప్ర. అ. పృథివీలక్షణాఙ్కయా = భూమిమీద ఉండు (నదీసముద్రారణ్య గృహాదులు) లక్షణములు చిహ్నములుగా గల, మహత్యా = పెద్దదైన, కుథయా = చిత్రకంబళముచేత, ఆస్తీర్ణామ్ = పరవబడినది, సరాష్ట్రగృహమాలినీమ్ = రాష్ట్రములతోను గృహపంక్తులతోను కూడిన, విస్తీర్ణామ్ = విశాలమైన, పృథివీమివ = భూమి వలె ఉన్నది.

తా. ఆ శాలలో ఒక పెద్ద చిత్రకంబళము పరవబడి ఉండెను. ఆ కంబళముమీద సముద్రములు, నదులు, వనములు, గృహములు మొదలైన భూమిమీద ఉండు లక్షణము లన్నీ చిత్రింపబడి ఉండుటచే ఆ శాల, రాష్ట్రములతోను, గృహపంక్తులతోను కూడిన విశాలభూతలము వలె ఉండెను. 26

మూ. నాదితాం మత్తవిహగైర్దివ్యగన్ధాధివాసితామ్,
పరార్ధ్యాస్తరణోపేతాం రక్షోధిపనిషేవితామ్. 27

ప్ర. అ. మత్తవిహగైః = మదించిన పక్షులచేత, నాదితామ్ = ధ్వనింప చేయబడినదీ, దివ్యగన్ధాధివాసితామ్ = దివ్య మైన సుగంధముచేత పరిమళింప చేయబడినదీ, పరార్ధ్యాస్తరణోపేతామ్ = అత్యుత్తమము లైన ఆస్తరణములతో కూడినదీ, రక్షోధిపనిషేవితామ్ = రాక్షసరాజుచేత సేవింపబడినదీ.

తా. ఆ శాల మదించిన పక్షులధ్వనులతో ప్రతిధ్వనించుచుండెను. దివ్యము లైన సుగంధములచేత పరిమళింపచేయబడుచుండెను. దాని నేలమీద అత్యుత్తమము లైన ఆస్తరణములు పరవబడెను. అక్కడ రావణుడు సుఖముగా భోగము లనుభవించుచుండెను. 27

మూ. ధూమ్రామగరుధూపేన విమలాం హంసపాణ్డురామ్,
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీమివ సుప్రభామ్. 28

ప్ర. అ. అగరుధూపేన = అగరుధూపముచేత, ధూమ్రామ్ = ధూమ్ర వర్ణముగా ఉన్నదీ, విమలామ్ = స్వచ్ఛ మైనదీ, హంసపాణ్డురామ్ = హంస వలె తెల్లగా ఉన్నదీ, పుష్పోపహారేణ = పుష్పములతో చేసిన అలంకరణముచేత, చిత్రామ్ = చిత్రవర్ణ మైనదీ. సుప్రభామ్ = మంచి కాంతి గల, కల్మాషీమివ = ధేనువు వలె ఉన్నదీ.

తా. ఆ శాల హంస వలె తెల్లగా స్వచ్ఛముగా ఉండెను. అగరుధూపము వేయుటచే ఆ ధూమము అంతటను వ్యాపించి ధూమ్రవర్ణముగా ఉండెను. అంతటను వివిధపుష్పములు చల్లి అలంకరించుటచే చిత్రవర్ణముగా ఉండెను. మంచి కాంతి గల కామధేనువు వలె ఉండెను. 28

మూ. మనఃసంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాదినీమ్,
తాం శోకనాశినీం దివ్యాం శ్రియః సంజననీమివ. 29

ప్ర. అ. మనఃసంహ్లాదజననీమ్ = మనస్సుకు ఆనందము కలిగించునదీ, వర్ణస్యాపి = శరీరవర్ణమునకు కూడ, ప్రసాదినీమ్ = నిర్మలత్వము కూర్చునదీ, శోకనాశినీమ్ = శోకమును నశింపచేయునదీ, శ్రియః = లక్ష్మికి, సంజననీమివ =

పుట్టించునది వలె ఉన్నదీ, దివ్యామ్=అద్భుతమూ అయిన, తామ్ = ఆ శాలను, చూచెను.

తా. ఆ శాల మనస్సునకు ఆనందము కలిగించుటే కాక, దానిలో ఉన్న వారి శరీరకాంతిని, వృద్ధిచేయును. అది లక్ష్మికి పుట్టినిల్లు వలె నున్న దై శోకమును నశింపచేయును. అత్యాశ్చర్యకరముగా ఉండెను. (అట్టి శాలను హనుమంతుడు చూచెను). 29

మూ. ఇన్ద్రియాణీన్ద్రియార్థైస్తు పఞ్చ పఞ్చభిరుత్తమైః,
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా. 30

ప్ర. అ. రావణపాలితా = రావణునిచేత పాలింపబడిన ఆ శాల, తదా = అప్పుడు, మాతేవ = తల్లి వలె, ఉత్తమైః = ఉత్తమము లైన, పఞ్చభిః = ఐదు, ఇన్ద్రియార్థైః = ఇంద్రియవిషయములచేత, పఞ్చ=ఐదు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, తర్పయామాస = తృప్తి పొందించెను.

తా. రావణునిచే పాలింపబడిన ఆ శాల తల్లి వలె ఐదు ఇంద్రియములచే అనుభవింపదగిన ఉత్తమపదార్థములను సమకూర్చుట ద్వారా ఐదు ఇంద్రియములకు తృప్తి కలిగించెను.

వి. ఆ శాల హనుమంతునికి తృప్తి కలిగించినది అను లాపమును గ్రహించి కొందరు దానివలన హనుమంతునకు తృప్తి ఎట్లు కలిగెనో వివరించుచు ఏ మేమో వ్రాసిరి. ఆ శాలలో వివిధభోగములు అనుభవించుచున్న రావణుడూ, అతని అంతఃపురస్త్రీలూ ఆనందడోలికలలో తేలియాడుచుందురు". అని ఆ శాలను వర్ణించుటయందే కవి తాత్పర్య మై ఉండును.

మూ. స్వర్గోఽయం దేవలోకోఽయమిన్ద్రస్యేయం పురీ భవేత్,
సిద్ధిర్వేయం పరా హి స్యాదిత్యమన్యత మారుతిః. 31

ప్ర. అ. అయమ్ = ఇది, స్వర్గః = స్వర్గమా। అయమ్=ఇది, దేవలోకః = దేవలోకమా। ఇయమ్ = ఇది, ఇన్ద్రస్య = ఇంద్రుని యొక్క, పురీ = పట్టణము, భవేత్ = అయి ఉండునా? ఇయమ్ = ఇది, పరా=ఉత్తమ మైన, సిద్ధిః= తపఃసిద్ధి, స్యాద్వా = అయి ఉండునా। ఇతి = అని, మారుతిః = హనుమంతుడు, అమన్యత = తలచెను.

తా. ఇది స్వర్గలోకమా! దేవతల నివాసస్థానమా! ఇంద్రుని పట్టణ మైన అమరావతియా! ఉత్తమ మైన తపఃసిద్ధియా! అని హనుమంతుడు తలంచెను. 31

మూ. ప్రధ్యాయత ఇవాపశ్యత్ప్రదీపాంస్తత్ర కాఞ్చనాన్,
ధూర్తానివ మహాధూర్తైర్దేవనేన పరాజితాన్. 32

ప్ర. అ. మహాధూర్తైః = గొప్ప జూదరులంచే, దేవనేన = జూదము ఆడు టచే, పరాజితాన్ = ఓడింపబడిన, ధూర్తానివ = జూదరులం వలె, ప్రధ్యాయత ఇవ = ఏమో ఆలోచించుచున్నవా అన్నట్లు నిశ్చలముగా ఉన్న, కాఞ్చనాన్ = బంగారువికార మైన, ప్రదీపాన్ = దీపములను, అపశ్యత్ = చూచెను.

తా. జూదములో మంచి నేర్పు గల పెద్ద జూదరులు, జూదములో ఓడించివేయగా ఏమి చేయుటకు తోచక జూదరులం వలె, నిశ్చలము లై, ఆలో చించుచున్నవా అన్న ట్లున్న బంగారు దీపములు, అక్కడ హనుమంతునకు కనబడెను. 32

మూ. దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ,
అర్చిర్భిర్భూషణానాం చ ప్రదీప్తేత్యభ్యమన్యత. 33

ప్ర. అ. దీపానామ్ = దీపములయొక్క, ప్రకాశేన = ప్రకాశముచేతను, రావణస్య = రావణుని యొక్క, తేజసా చ = తేజస్సుచేతను, భూషణానామ్ = అలంకారములయొక్క, అర్చిర్భిః చ = కాంతులచేతను, ప్రదీప్తా ఇతి = మండు చున్న దని, అభ్యమన్యత = తలంచెను.

తా. దీపముల ప్రకాశం, రావణుని తేజస్సూ, అలంకారాల కిరణాలూ, ఈ మూన్నీ, కలియుటచే హనుమంతునకు ఆ భవనము ప్రజ్వలించుచున్నట్లు కనబడెను. 33

మూ. తతోఽపశ్యత్కుథాసీనం నానావర్ణామ్బరస్రజమ్,
సహస్రం వరనారీణాం నానావేష విభూషితమ్. 34

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కుథాసీనమ్ = చిత్రకంబళమునందు కూర్చున్నదీ, నానావర్ణామ్బరస్రజమ్ = అనేక వర్ణములు గల వస్త్రములూ మాలి కలూ గలదీ, నానావేషవిభూషితమ్ = అనేక విధము లైన వేషములంచే అలంక

శింశుపాతినదీ అయిన, వరనారీణామ్ = శ్రేష్ఠ మైన స్త్రీలయొక్క, సహస్రమ్ = సహస్రమును, అపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట, అనేకవిధము లైన రంగులు గల వస్త్రములను, మాలికలను ధరించి, అనేక విధము లైన అలంకారములతో అలంకరించుకొని రాణ మందిరి ఉత్తమస్త్రీలు చిత్రకంబళము పై కూర్చుండి (శయనించి) ఉండగా చూచెను.

మూ. పరివృత్తే ఒర్ధరాత్రే తు పాననిద్రావశం గతమ్,
క్రీడిత్వోపరతం రాత్రౌ సుష్వాప బలవత్తదా. 35

ప్ర. అ. రాత్రౌ = రాత్రియందు, క్రీడిత్వా = క్రీడించి, ఉపరతమ్ = విశ్రమించినదై, పాననిద్రావశం గతమ్ = పానమువలన కలిగిన నిద్రకు వశమై, ఆ స్త్రీ సహస్రము, తదా = అప్పుడు, అర్ధరాత్రే = అర్ధరాత్రము, పరివృత్తే = తిరిగిన దగుచుండగా, బలవత్ = గాఢముగా, సుష్వాప = నిద్రించెను.

తా. ఆ స్త్రీసహస్రము రాత్రి అంతా క్రీడించి, క్రీడనుండి విరమించి, పిదప మద్యపానమువలన కలిగిన నిద్రకు వశమై, అర్ధరాత్రము తిరగగానే గాఢముగా నిద్రించెను. 35

మూ. తత్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాన్తరభూషణమ్,
నిఃశబ్దహంస భ్రమరం యథా పద్మవనం మహత్. 36

ప్ర. అ. నిఃశబ్దాన్తరభూషణమ్ = ధ్వని లేని లోపలి అలంకారము కలదీ, ప్రసుప్తమ్ = నిద్రపోవుచున్న, తత్ = ఆ స్త్రీ సహస్రము, నిఃశబ్దహంసభ్రమరమ్ = నిశ్శబ్దముగా ఉన్న హంసలూ, తుమ్మెదలూ గల, మహత్ = గొప్ప, పద్మవనం యథా = పద్మము వలె, విరురుచే = ప్రకాశించెను.

తా. శరీరమునందలి ఆయా నడుము మొదలైన అవయవముల అలంకారములు నిఃశబ్దములుగా ఉండగా నిద్రించుచున్న ఆ నారీసహస్రము, నిశ్శబ్దముగా ఉన్న హంసలు, తుమ్మెదలూ గల గొప్ప పద్మవనము వలె ప్రకాశించెను.

మూ. తాసాం సంవృతదన్తాని మీలితాక్షీణి మారుతిః,
అపశ్యత్పద్మగన్ధీని వదనాని సుయోషితామ్. 37

ప్ర. అ. మారుతిః = హనుమంతుడు, తాసాం సుయోషితామ్ = ఆ ఉత్తమ స్త్రీలయొక్క, సంవృతదన్తాని = కప్పబడిన దంతములు గల, మీలితాక్షీణి = మూయబడిన నేత్రములు గల, పద్మగన్ధీని = పద్మముల వంటి సువాసనలు గల, వదనాని = ముఖములను, అపశ్యత్ = చూచెను.

తా. ఆ ఉత్తమస్త్రీల పద్మముల సువాసన వంటి సువాసన గల ముఖములు, నేత్రములు మూసికొని, దంతములు కనబడక యుండెను. అట్టి ముఖములను హనుమంతుడు చూచెను. 37

మూ. ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే,
పునః సంవృతపత్రాణి రాత్రావివ బభుస్తదా. 38

ప్ర. అ. తాసామ్ = ఆ స్త్రీలయొక్క ముఖములు, క్షపాక్షయే = రాత్రి క్షీణించిన సమయమునందు, ప్రబుద్ధాని = వికసించిన, పద్మానీవ = పద్మముల వలె, భూత్వా = అయి, పునః = తిరిగి, రాత్రౌ = రాత్రియందు, సంవృతపత్రాణీవ = ముకుళీభవించిన రేకులు గలవి వలె, తదా = అప్పుడు, బభుః = ప్రకాశించినవి.

తా. ఆ స్త్రీల ముఖములు, వారు మేల్కొని యున్నంతసేపు, సూర్యోదయ సమయమునందు వికసించిన పద్మముల వలె యుండి, వారి నిద్రాసమయమునందు ముకుళీభవించిన పత్రములు కల పద్మముల వలె అయినవి. 38

మూ. ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః,
అమ్బుజానీవ ఫుల్లాని ప్రార్థయన్తి పునః పునః. 39

ప్ర. అ. మత్తషట్పదాః = మదించిన తుమ్మెదలు, ఇమాని = ఈ, ముఖపద్మాని = ముఖములే పద్మములను, ఫుల్లాని = వికసించిన, అమ్బుజానీవ = పద్మములను వలె, పునః పునః = మాటిమాటికి, నియతమ్ = తప్పక, ప్రార్థయన్తి = కోరుచున్నవి.

తా. "మదించిన తుమ్మెదలు, ఈ ముఖపద్మములను, వికసించిన పద్మములను వలె మాటిమాటికి ఆస్వాదించుటకై కోరుచుండును; నిశ్చయము". 39

మూ. ఇతి వామన్యత శ్రీమానుపపత్త్యా మహాకపిః,
మేనే హి గుణతస్తాని సమాని సలిలోద్భవైః. 40

ప్ర. అ. శ్రీమాన్ = శోభావంతు డైన, మహాకపిః = హనుమంతుడు, ఉపపత్త్యా = తగుయుక్తిచేత, ఇతివ = ఇట్లు, అమన్యత = తలంచెను. తాని = ఆ ముఖములను, గుణైః = సౌందర్యసుగంధాదిగుణములవలన, సలిలోద్భవైః = పద్మములతో, సమాని = సమ మైనవానినిగా, మేనే హి = తలంచెను గదా.

భా. శ్రీమంతు డైన ఆ హనుమంతుడు ఆ ముఖములను గూర్చి, యుక్తి యుక్తముగా, పైన చెప్పిన విధముగా భావించెను. ఎందుచేత ననగా - సౌందర్య సుగంధాదిగుణములచే ఆ ముఖములు పద్మముల వలె నున్న వని అనుకొనెను.

మూ. సా తస్య శుశుభే శాలా తాభిః స్త్రీభిర్విరాజితా,
శారదీవ ప్రసన్నా ద్యౌస్తారాభిరభిశోభితా. 41

ప్ర. అ. తస్య = ఆ రావణునియొక్క, సా శాలా = ఆ శాల, తాభిః స్త్రీభిః = ఆ స్త్రీలచేత, విరాజితా = ప్రకాశింపచేయబడినదై, తారాభిః = నక్షత్రములచేత, అభిశోభితా = ప్రకాశింపచేయబడిన, ప్రసన్నా = నిర్మలం బైన, శారదీ = శరత్కాలసంబంధ మైన, ద్యౌః ఇవ = ఆకాశము వలె, శుశుభే = శోభించెను.

భా. ఆ స్త్రీలచేత ప్రకాశింపచేయబడిన, ఆ రావణుని శాల, శరత్కాలము నందు నక్షత్రములచేత ప్రకాశింపచేయబడిన, నిర్మలం బైన ఆకాశము వలె శోభించెను. 41

మూ. స చ తాభిః పరివృతః శుశుభే రాక్షసాధిపః,
యథా హ్యుడుపతిః శ్రీమాంస్తారాభిరభిసంవృతః. 42

ప్ర. అ. తాభిః = ఆ స్త్రీలచేత, పరివృతః = చుట్టుకొనబడిన, సః రాక్షసాధిపః = ఆ రాక్షసరాజు, తారాభిః = నక్షత్రములచేత, అభిసంవృతః = చుట్టుకొనబడిన, శ్రీమాన్ = కాంతి గల, ఉడుపతిః యథా = చంద్రుడు వలె, శుశుభే = ప్రకాశించెను.

భా. ఆ స్త్రీలు తన చుట్టును ఉండుటచే, ఆ రావణుడు, నక్షత్రముల మధ్యనున్న, ప్రకాశయుక్తు డైన చంద్రుడు వలె శోభించెను. 42

మూ. యాశ్చ్యవన్తేఽమ్బరాత్తారాః పుణ్యశేషసమావృతాః,
ఇమాస్తాః సంగతాః కృత్స్నా ఇతి మేనే హరిస్తదా. 43

ప్ర. అ. యాః = ఏ, తారాః = నక్షత్రములు. పుణ్యశేషసమావృతాః = పుణ్యముయొక్క శేషముతో కూడిన వై, అమ్బరాత్ = ఆకాశమునుండి, చ్యవన్తే = జారిపడునో, తాః = ఆ. కృత్స్నాః = సమస్తమైన తారలు. ఇమాః = ఈ స్త్రీలుగా, సంగతాః = కలిసి ఉన్నవి, ఇతి = అని, తదా = అప్పుడు, హరిః = హనుమంతుడు, మేనే = తలచెను.

తా. "నక్షత్రములు కొంచెము శేషించిన పుణ్యముతో ఆకాశమునుండి జారి భూమిపై పడిపోవుచుందును గదా. ఆ నక్షత్రములే ఈ స్త్రీల రూపముతో ఇక్కడ చేరినవి" అని హనుమంతుడు భావించెను. 43

మూ. తారాణామివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్,
ప్రభావర్ణప్రసాదాశ్చ విరేజుస్తత్ర యోషితామ్. 44

ప్ర. అ. తత్ర = అక్కడ, యోషితామ్ = స్త్రీలయొక్క, ప్రభావర్ణప్రసాదాశ్చ = కాంతీ, వర్ణమూ, నైర్మల్యమూ కూడ. శుభార్చిషామ్ = శుభమైన కాంతి గల, మహతీనామ్ = పెద్దవైన, తారాణామివ = నక్షత్రముల ప్రభావర్ణప్రసాదముల వలె, సువ్యక్తమ్ = స్పష్టముగా, విరేజుః = ప్రకాశించినవి.

తా. అక్కడ నున్న ఆ స్త్రీల కాంతీ, వర్ణమూ, నైర్మల్యమూ కూడ శుభమైన కాంతి గల పెద్దవైన నక్షత్రముల కాంతివర్ణనైర్మల్యముల వలె ఉండెను.

మూ. వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః,
పానవ్యాయామకాలేషు నిద్రాపహృతచేతసః. 45

ప్ర. అ. పానవ్యాయామకాలేషు = మద్యపానసమయమునందు, రతిసమయమునందు. వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః = తారుమారైన పెద్దవీ లావుగా ఉన్నవీ అయిన పుష్పమాలలు కలవారూ, చెల్లాచెదరైన శ్రేష్ఠమైన అలంకారములు కలవారూ అయిన ఆ స్త్రీలు, నిద్రాపహృతచేతసః = నిద్రచేత అపహరింపబడిన చిత్తములు కలవారై ఉండిరి.

తా. మద్యపానమూ రతికేళులూ చేసే సమయమునందు ఆ స్త్రీలు ధరించిన పెద్దగా లావుగా ఉన్న పుష్పమాలలు తారుమారైపోయినవి. శ్రేష్ఠములైన అలంకారము లన్నీ చెల్లాచెదరైపోయెను. అట్టి ఆ స్త్రీలు ఆ సమయమునందు నిద్రాపరవశత్వము పొంది ఉండిరి. 45

మూ. వ్యావృత్తతిలకాః కాశ్చిత్కాశ్చిదుద్భ్రాన్తనూపురాః,
పార్శ్వే గళితహారాశ్చ కాశ్చిత్పరమయోషితః. 46

ప్ర. అ. కాశ్చిత్=కొందరు, పరమయోషితః=ఉత్తమస్త్రీలు, వ్యావృత్తతిలకాః=రేగిపోయిన తిలకములు కలవారైరి. కాశ్చిత్=కొందరు. ఉద్భ్రాన్తనూపురాః=కదలి స్థానముతప్పిన అందెలు కలవారైరి. కాశ్చిత్=కొందరు, పార్శ్వే=ప్రక్కయందు (ప్రక్కకు), గళితహారాశ్చ=జారిన హారములు కలవారైరి.

తా. ఆ ఉత్తమస్త్రీలలో కొందరి నుదుటి పైది తిలకము రేగిపోయెను. కొందరి అందెల్లు చోటు తప్పెను. కొందరి హారములు ప్రక్కకు వ్రేలాడుచుండెను. 46

మూ. ముక్తాహారావృతాశ్చాన్యాః కాశ్చిద్విస్రస్తవాససః,
వ్యావిద్ధరశనాదామాః కిశోర్య ఇవ వాహితాః. 47

ప్ర. అ. అన్యాః=మరికొందరు స్త్రీలు, ముక్తాహారావృతాః=ముత్యముల చేత చుట్టబడినవారై, కాశ్చిత్ = మరికొందరు. విస్రస్తవాససః = జారిపోయిన వస్త్రములుకలవారై, మరికొందరు, వ్యావిద్ధరశనాదామాః=చిక్కులు పడిన మొలనూలు (వడ్డాణములు) కలవారై, వాహితాః = చాలదూరము నడిపింప బడిన, కిశోర్యః ఇవ= చిన్న ఆడగుఱ్ఱముల వలె ఉండిరి.

తా. కొందరి ముత్యాల హారములు తొలిగి వారి శరీరము చుట్టూ వ్రేలాడుచుండెను. కొందరి వస్త్రములు జారిపోయెను. కొందరి వడ్డాణములు చిక్కులు పడి ఉండగా, వారు చాల దూరము నడిపించిన ఆడగుఱ్ఱముల వలె ఉండిరి. 47

మూ. సుకుణ్డలధరాశ్చాన్యా విచ్ఛిన్నమృదితస్రజః,
గజేన్ద్రమృదితాః ఫుల్లా లతా ఇవ మహావనే. 48

ప్ర. అ. సుకుణ్డలధరాః=మంచి కుండలములు ధరించిన, అన్యాః = మరి కొందరు. విచ్ఛిన్నమృదితస్రజః = తెగిపోయిన, నలిగిన, పుష్పమాలలు కలవారై, మహావనే = మహావనమునందు, గజేన్ద్రమృదితాః = గజరాజుచేత ఆ నలగగొట్టబడిన, ఫుల్లాః=వికసించిన, లతాః ఇవ=లతల వలె ఉండిరి.

తా. నలిగి తెగిపోయిన పుష్పమాలలు ధరించిన కొందరు స్త్రీలు మంచి కుండలములు ధరించి ఉండిరి. ఆ స్త్రీలు, మహావనములో, ఏనుగులు నలగ గొట్టిన, పుష్పించిన లతల వలె ఉండిరి. 48

మూ. చన్ద్రాంశుకిరణాభాశ్చ హారాః కాసాంచిదుత్కటాః,
హంసా ఇవ బభుః సుప్తాః స్తనమధ్యేషు యోషితామ్. 49

ప్ర. అ. కాసాంచిత్ = కొందరు, యోషితామ్ = స్త్రీలయొక్క, స్తన మధ్యేషు = స్తనముల మధ్యములందు, ఉత్కటాః = పెద్దవైన, చన్ద్రాంశుకిరణాభాశ్చ = చంద్రుని కిరణముల వంటి కిరణములు, కాంతి గల, హారాః = ముత్యాల హారములు, సుప్తాః = నిద్రించుచున్న, హంసాః ఇవ = హంసల వలె, బభుః = ప్రకాశించినవి.

తా. చంద్రకిరణముల వలె తెల్లగా ఉన్న పెద్ద పెద్ద ముత్యాలహార ములు, కొందరి స్తనమధ్యములందు నిశ్చలముగా పడి యుండుటచే అవి నిద్రించుచున్న హంసల వలె ప్రకాశించుచుండెను. 49

మూ. అపరాసాం చ వైడూర్యాః కాదమ్బా ఇవ పక్షిణః,
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇవాభవన్. 50

ప్ర. అ. అపరాసాం చ = మరికొందరు స్త్రీలయొక్క, వైడూర్యాః = వైడూర్యమణులతో చేయబడిన హారములు, కాదమ్బాః = కాదంబములను, పక్షిణః ఇవ = పక్షులు వలె, (వీటి ముక్కులు, కాళ్ళు, రెక్కలు ధూమ్రవర్ణ ములుగా ఉండును) అన్యాసామ్ = మరి కొందరు స్త్రీలయొక్క, హేమసూత్రాణి = బంగారు సూత్రములు, చక్రవాకాః ఇవ = చక్రవాకపక్షుల వలె, అభవన్ = ఉండెను.

తా. కొందరు స్త్రీలు ధరించిన వైడూర్యమణిహారములు కాదంబపక్షుల వలె, మరి కొందరు ధరించిన బంగారుసూత్రములు చక్రవాకముల వలె ఉండెను. 50

మూ. హంసకారణ్డవాకీర్ణాశ్చక్రవాకోపశోభితాః,
ఆపగా ఇవ తా రేజుర్జఘనైః పులినైరివ. 51

ప్ర. అ. పులినైరివ = ఇసుక తిన్నెల వలె ఉన్న, జఘనైః = జఘనము లతో, తాః = ఆ స్త్రీలు, హంసకారణ్డవాకీర్ణాః = హంసలతోను, కారండవపక్షుల తోను వ్యాప్తమైన, చక్రవాకోపశోభితాః = చక్రవాకపక్షులచేత అలంకరింపబడిన, ఆపగా ఇవ = నదులు వలె, రేజుః = ప్రకాశించిరి.

తా. ఇసుక తిన్నెల వంటి విశాలము లైన జఘనప్రదేశములతో ఆ స్త్రీలు హంస-కారండవ-చక్రవాకపక్షులతో శోభించుచున్న నదుల వలె ప్రకాశించిరి.

మూ. కిఙ్కిణీజాలసంకోశాస్తా హైమవిపులామ్బుజాః,
భావగ్రాహా యశస్తీరాః సుప్తా నద్య ఇవాబభుః. 52

ప్ర. అ. కిఙ్కిణీజాలసంకోశాః = చిరుమువ్వల సముదాయము అనే మొగ్గలు కలవారూ, హైమవిపులామ్బుజాః = బంగారు ఆభరణము లనే పెద్ద పద్మములు కలవారూ, భావగ్రాహాః = శృంగారాదిచేష్ట లనే మొసళ్లు కలవారూ, యశస్తీరాః = కీర్తి అను తీరములు కలవారూ అయిన, సుప్తాః = నిద్రపోవుచున్న ఆ స్త్రీలు. నద్యః ఇవ = నదులు వలె, ఆబభుః = ప్రకాశించిరి.

తా. అక్కడ నిద్రించుచున్న స్త్రీలు నదుల వలె ప్రకాశించుచుండిరి. వారు ధరించిన చిరుమువ్వలే మొగ్గలు; బంగారు ఆభరణములే పెద్ద పద్మములు; వారి ప్రేమాదిభావములే మొసళ్లు; కీర్తులే తీరములు.

మూ. మృదుష్వఙ్గేషు కాసాం చిత్కుచాగ్రేషు చ సంస్థితాః,
బభూవుర్భూషణానీవ శుభా భూషణరాజయః. 53

ప్ర. అ. కాసాం చిత్ = కొందరు స్త్రీలయొక్క, మృదుషు = మృదువు లైన, అఙ్గేషు = అవయవములందు, కుచాగ్రేషు చ = స్తనముల అగ్రములందూ, సంస్థితాః = ఉన్న, శుభాః = అందమైన, భూషణరాజయః = అలంకారముల రేఖలు, భూషణానీవ = అలంకారములు వలె, బభూవుః = ఉండెను.

తా. అలంకారముల ఒత్తిడికి కొందరి మెత్తని అవయవములపైనా, కుచాగ్రముల పైనా రేఖలు పడెను. అవి ఆ యా అవయవములపై ధరించిన అలంకారములు వలె ఉండెను. 53

మూ. అంశుకాన్తాశ్చ కాసాం చిన్ముఖమారుతకమ్పితాః,
ఉపర్యుపరి వక్త్రాణాం వ్యాధూయన్తే పునః పునః. 54

ప్ర. అ. కాసాం చిత్=కొందరు స్త్రీలయొక్క, ముఖమారుతకమ్పితాః=ముఖవాయువుచేత కదల్పబడిన, అంశుకాన్తాః=వస్త్రాంతములు, వక్త్రాణామ్=ముఖములయొక్క, ఉపర్యుపరి = పై పైన, పునః పునః = మాటి మాటికి, వ్యాధూయన్తే = ఎగురగొట్టబడుచుండెను. 54

తా. కొందరి స్త్రీల శ్వాసనిశ్వాసములచే వస్త్రాంతములు ఎగురుచు, మాటి మాటికి వారి ముఖములపై కొట్టుకొనుచుండెను. 54

మూ. తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః,
నానావర్ణసువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే. 55

ప్ర. అ. నానావర్ణసువర్ణానామ్ = అనేకవిధములైన మంచి వర్ణములు గల, పత్నీనామ్=రావణభార్యలయొక్క, వక్త్రమూలేషు=ముఖముల మూలములందు (కంఠమునందు), తాః = ఆ వస్త్రాంతములు, రుచిరప్రభాః = అందమైన కాంతులు గల, ఉద్ధూతాః = ఎగురవేయబడిన, పతాకాః ఇవ = పతాకలవలె, రేజిరే = ప్రకాశించినవి.

తా. అనేకవిధములైన మంచి రంగులు గల ఆ రావణభార్యల కంఠముల సమీపమునందు, ఆ వస్త్రాంతములు, మంచి కాంతి గల, ఎగురవేసిన పతాకలవలె ప్రకాశించెను.

వి. "నానావర్ణాః సువర్ణానామ్" అను పాఠమున్నచో బాగుండును. "నానావర్ణాః" అనునది 'తాః' అనుదానికి విశేషణముగా చెప్పవచ్చును. కాని అట్టి పాఠము గోరఖ్‌పూర్ ప్రతిలో కూడ లేదు. మరెక్కడైనా ఉండవచ్చునని తోచుచున్నది. 55

మూ. వవల్గుశ్చాత్ర కాసాం చిత్కుణ్డలాని శుభార్చిషామ్,
ముఖమారుతసంసర్గాన్మన్దం మన్దం సుయోషితామ్. 56

ప్ర. అ. శుభార్చిషామ్ = మంచి కాంతి గల, కాసాం చిత్ = కొందరు, యోషితామ్ = స్త్రీలయొక్క, కుణ్డలాని = కుండలములు, అత్ర = ఇచట, ముఖ

మారుతసంసర్గాత్=ముఖవాయువుయొక్క సంబంధమువలన, మన్దం మన్దమ్= మెల్ల మెల్లగా, వవల్గుః=కదలినవి కూడ.

తా. ఉత్తమసౌందర్యవతు లైన కొందరి స్త్రీల కుండలములు, ముఖ వాయుసంబంధముచేత, మెల్ల మెల్లగా కదలుచుండెను. 56

మూ. శర్కరాసవగన్ధైశ్చ ప్రకృత్యా సురభిః సుఖః,
తాసాం వదననిఃశ్వాసః సిషేవే రావణం తదా. 57

ప్ర. అ. తదా=అప్పుడు, ప్రకృత్యా=స్వభావముచేతను, శర్కరాసవగన్ధైశ్చ=శర్కరతో చేయబడిన మద్యము గంధములతోను, సురభిః=పరిమళించుచున్న, సుఖః=సుఖకర మైన, తాసామ్=ఆ స్త్రీలయొక్క, వదననిఃశ్వాసః=ముఖముల నిఃశ్వాసము, రావణమ్=రావణుని, సిషేవే=సేవించెను.

తా. స్వభావసిద్ధముగానే కాకుండా, చక్కెరతో తయారు చేసిన మద్యము గంధముచేత కూడ పరిమళించుచున్న, ఆ స్త్రీల నిట్టూర్పుల వాయువు, అప్పుడు రావణునకు సుఖమును కూర్చి ఆనందము కలిగించెను. 57

మూ. రావణాననశఙ్కాశ్చ కాశ్చిద్రావణయోషితః,
ముఖాని స్మ సపత్నీనాముపాజిఘ్రన్ పునః పునః. 58

ప్ర. అ. కాశ్చిత్=కొందరు, రావణయోషితః=రావణస్త్రీలు, రావణాననశఙ్కాశ్చ = రావణుని ముఖము అను శంక గలవారై, పునః పునః=మాటి మాటికి, సపత్నీనామ్=సవతుల, ముఖాని=ముఖములను, ఉపాజిఘ్రన్=వాసన చూచిరి (ముద్దుపెట్టుకొనిరి).

తా. రావణుని భార్యలలో కొందరు, రావణుని ముఖమే అను భ్రాంతి చేత, తమ ప్రక్క నున్న సవతుల ముఖములను ముద్దుపెట్టుకొనుచుండిరి. 58

మూ. అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః,
అస్వతన్త్రాః సపత్నీనాం ప్రియమేవాచరంస్తదా. 59

ప్ర. అ. రావణే=రావణునియందు, అత్యర్థమ్=మిక్కిలి, సక్తమనసః= లగ్న మైన మనస్సులు గల, తాః = ఆ, వరస్త్రియః = శ్రేష్ఠ లైన స్త్రీలు,

అస్వతన్త్రాః=స్వతంత్రులుకాని వారై (ఒడలు తెలియని స్థితిలో ఉన్న వారై), తదా = అప్పుడు, సపత్నీనామ్ = సవతులకు, ప్రియమేవ = ప్రియమునే. ఆచరన్=చేసిరి.

తా. రావణునిపై మిక్కిలి ఆసక్తమైన మనస్సు గల ఆ స్త్రీలు, నిద్రా మద్యమదములచేత ఒడలు తెలియని స్థితిలో, తమ ప్రక్క నున్న సవతులను రావణుడే అను భ్రాంతిచే ముద్దుపెట్టుకొని వారికి ప్రియమునే చేసిరి. ఎందుచేత ననగా తమను రావణుడే చుంబించుచున్నాడని వారు భ్రాంతిపడుచుండిరి. 59

మూ. బాహూనుపనిధాయాన్యాః పారిహార్యవిభూషితాన్.
అంశుకాని చ రమ్యాణి ప్రమదాస్తత్ర శిశ్యిరే. 60

ప్ర. అ. అన్యాః=మరి కొందరు, ప్రమదాః=స్త్రీలు, పారిహార్యవిభూషితాన్ = కంకణములచేత అలంకరింపబడిన, బాహూన్ = బాహువులను, రమ్యాణి=సుందరములైన, అంశుకాని = వస్త్రములను, ఉపనిధాయ = తలగడలుగా చేసికొని, తత్ర=అక్కడ, శిశ్యిరే=శయనించిరి.

తా. కొందరు స్త్రీలు కంకణములచేత అలంకరించబడిన బాహువులను, మరి కొందరు మంచి వస్త్రములను, తలగడలుగా చేసికొని నిద్రించిరి. 60.

మూ. అన్యా వక్షసి చాన్యస్యాస్తస్యాః కాచిత్పునర్భుజమ్,
అపరా త్వఙ్కమన్యస్యాస్తస్యాశ్చాప్యపరా కుచౌ. 61

ప్ర. అ. అన్యా=ఒక స్త్రీ, అన్యస్యాః=మరియొక స్త్రీయొక్క, వక్షసి= వక్షఃస్థలమునందు, శయనించెను. కాచిత్పునః = మరి యొక స్త్రీ యైతే, తస్యాః=ఆమెయొక్క, భుజమ్=భుజమును, అపరా తు=మరి యొక స్త్రీ యైతే, అన్యస్యాః=మరి యొక స్త్రీయొక్క, అఙ్కమ్=తొడను, అపరా=మరి యొకతె, తస్యాః=ఆమెయొక్క, కుచౌ=కుచములను, తలగడాగా చేసికొని శయనించెను.

తా. ఒక స్త్రీ మరియొకస్త్రీ వక్షస్థలముపై తల పెట్టి నిద్రించెను. ఆమె భుజమును తలగడాగా చేసికొని మరియొకతె శయనించెను. ఒక స్త్రీ మరి యొక స్త్రీ తొడపై శయనింపగా, ఆమె కుచములను తలగడగా చేసికొని మరి యొకతె. శయనించెను. 61

మూ. ఊరుపార్శ్వకటీపృష్ఠమన్యోన్యస్య సమాశ్రితాః,
పరస్పరనివిష్టాఙ్గ్యో మదస్నేహవశానుగాః. 62

ప్ర. అ. మదస్నేహవశానుగాః=మదమునకు, స్నేహమునకు వశంవదలై. అన్యోన్యస్య=పరస్పరముయొక్క, ఊరుపార్శ్వకటీపృష్ఠమ్ = తొడలను, పార్శ్వములను, కటిప్రదేశములను, వీపులను, సమాశ్రితాః=ఆశ్రయించినవారై, పరస్పరనివిష్టాఙ్గ్యః = ఒండొరులపై పడవేయబడిన అవయవములు గలవారై, శయనించిరి.

తా. ఆ స్త్రీ లందరు మదమునకు, స్నేహమునకూ లొంగిపోయి, ఒండొరులపై అవయవములు పడవేసి, ఒండొరుల తొడలను, పార్శ్వములను, కటిప్రదేశమును, వీపును ఆశ్రయించుకొని పండుకొని యుండిరి. 62

మూ. అన్యోన్యభుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా,
మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత్తషట్పదా. 63

ప్ర. అ. అన్యోన్యభుజసూత్రేణ = ఒండొరుల భుజము లనెడు త్రాడుతో, గ్రథితా=కట్టబడిన, సా=ఆ, స్త్రీమాలా=స్త్రీల మాల, సూత్రే = దారమునందు, గ్రథితా=గ్రుచ్చబడిన. మత్తషట్పదా=మదించిన తుమ్మెదలు గల, మాలేవ = పుష్పమాల వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. ఒండొరుల భుజములనే దారముతో గ్రుచ్చబడిన ఆ స్త్రీ మాల (స్త్రీలనే మాల) దారముతో గుచ్చినదీ, మదించిన తుమ్మెదలతో కూడినదీ అయిన పుష్పమాల వలె ప్రకాశించెను. 64

మూ. లతానాం మాధవే మాసి పుల్లానాం వాయుసేవనాత్,
అన్యోన్యమాలాగ్రథితం సంసక్తకుసుమోచ్చయమ్. 64

వ్యతివేష్టితసుస్కన్ధమన్యోన్యభ్రమరాకులమ్,
ఆసీద్వనమివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్. 65

ప్ర. అ. అన్యోన్యమాలాగ్రథితమ్ = పరస్పరమూ మాలగా కట్టబడినదీ, సంసక్తకుసుమోచ్చయమ్ = కలిసిపోయిన పుష్పసముదాయము కలదీ, వ్యతివేష్టితసుస్కన్ధమ్ = చుట్టుకొనబడిన అందమైన భుజములు గలదీ, అన్యోన్య

భ్రమరాకులమ్ = పరస్పరము ముంగురులతో వ్యాకులమూ, అయిన, రావణస్య = రావణునియొక్క, తత్ = ఆ, స్త్రీవనమ్ = స్త్రీసముదాయము, మాధవే మాసి = వైశాఖమాసమునందు, వాయుసంసేవనాత్ = వాయువుయొక్క సంపర్కము వలన, ఫుల్లానామ్ = వికసించిన, లతానామ్ = లతలయొక్క, అన్యోన్యమాలాగ్రథితమ్ = పరస్పరమూ మాలారూపమున కట్టబడినదీ, సంసక్తకుసుమోచ్చయమ్ = లగ్నమైన పుష్పసముదాయము గలదీ, వ్యతివేష్టితసుస్కంధమ్ = చుట్టబడిన మంచి మ్రానులు కలదీ, అన్యోన్యభ్రమరాకులమ్ = పరస్పరము తుమ్మెదలతో వ్యాకులమైనదీ, ఉద్ధూతమ్ = ఎగురుగొట్టబడినదీ అయిన, వనమివ = వనము వలె, ఆసీత్ = ఉండెను.

తా. రావణుని స్త్రీలసముదాయ మనే ఆ వనము వసంతఋతువునందు గాలి సోకుటచేత వికసించిన పుష్పములు గల లతల వనము వలె ఉండెను. ఆ స్త్రీ వనము పరస్పరము మాల వలె కట్టబడి యుండెను. ఒకరు ధరించిన పుష్పములు మరియొకరి పుష్పములతో కలిసిపోయెను. ఒకరి భుజములతో మరొకరి భుజములు చుట్టుకొని ఉండగా ఒండొరుల ముంగురులు కలిసిపోయెను. లతావనము నందు కూడ లత లన్నీ మాలగా అల్లుకొనిపోయి, వాటి పుష్పములు కలిసి పోవును. లతలు చెట్లమాను (స్కంధము)లకు చుట్టుకొనును. తుమ్మెదలు ఒక లత నుండి మరొకదానిమీదికి తిరుగుచుండును. అందుచే స్త్రీవనము లతావనము వలె ఉండెను. 64, 65

మూ. ఉచితేష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా,
వివేకః శక్య ఆధాతుం భూషణాఙ్గామ్బరస్రజామ్. 66

ప్ర. అ. తదా = అప్పుడు, తాసాం యోషితామ్ = ఆ స్త్రీలయొక్క, భూషణాఙ్గామ్బరస్రజామ్ = భూషణములయొక్క, అవయవములయొక్క, వస్త్రములయొక్క, మాలికలయొక్క, వివేకః = వివేకము, సువ్యక్తమ్ = సుస్పష్టముగా, ఆధాతుమ్ = చేయుటకు, ఉచితేష్వపి = అలవాటుపడినవారియందు గూడా, న శక్యః = శక్యము కాదు.

తా. ఆ సమయమునందు ఆ స్త్రీల భూషణములు గాని, అవయవములు గాని, వస్త్రములు గాని, మాలలు గాని, ఏవి ఎవరివో స్పష్టముగా చెప్పుటకు వారితో పరిచయము కలవారికి కూడ శక్యము కాకుండెను. 66

మూ. రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః,
జ్వలన్తః కాఞ్చనా దీపాః ప్రైక్షన్తానిమిషా ఇవ. 67

ప్ర. అ. రావణే = రావణుడు, సుఖసంవిష్టే = సుఖముగా శయనించినవా డగుచుండగా, వివిధప్రభాః = అనేకవిధము లైన కాంతులు గల, తాః స్త్రియః = ఆ స్త్రీలను, జ్వలన్తః = ప్రజ్వలించుచున్న, కాఞ్చనాః దీపాః = బంగారుదీపములు, అనిమిషాః = రెప్పపాటు లేనివై, ప్రైక్షన్త ఇవ = చూచుచుండెనా అన్నట్లుండెను.

తా. రావణుడు మేల్కొని ఉండగా ఎవ్వరును ఆ స్త్రీల వైపు కన్నెత్తి చూడజాలరు. అందుచేత ప్రజ్వలించుచున్న బంగారు దీపములు, రావణుడు సుఖముగా నిద్రించుచున్న సమయమునందు, అనేకవిధము లైన కాంతులు గల ఆ స్త్రీలను, రెప్పపాటు కూడ వేయకుండ చూచుచున్నవా అన్నట్లుండెను 67

మూ. రాజర్షిపితృదైత్యానాం గన్ధర్వాణాం చ యోషితః,
రాక్షసానాం చ యాః కన్యాస్తస్య కామవశం గతాః. 68

ప్ర. అ. రాజర్షిపితృదైత్యానామ్ = రాజర్షులయొక్క, పితృదేవతలయొక్క, దైత్యులయొక్క, గన్ధర్వాణామ్ = గంధర్వులయొక్క, యోషితః = స్త్రీలు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, యాః = ఏ, కన్యాః = కన్యలు గలరో, వారు, తస్య = ఆ రావణునికి, కామవశమ్ = కామముచే వశమును, గతాః = పొందినారు.

తా. రాజర్షుల స్త్రీలు, పితృదేవతల స్త్రీలు, దైత్యుల స్త్రీలు, గంధర్వుల స్త్రీలు, రాక్షసకన్యలు కామముచేతనే రావణునకు వశ మైరి.

మూ. యుద్ధకామేన తాః సర్వా రావణేన హృతాః స్త్రియః,
సమదా మదనేనైవ మోహితాః కాశ్చిదాగతాః. 69

ప్ర. అ. సర్వాః = సమస్త మైన, తాః స్త్రియః = ఆ స్త్రీలు, యుద్ధకామేన = యుద్ధమునందు కోరిక గల, రావణేన = రావణునిచేత, హృతాః = హరింపబడిరి. సమదాః = యౌవనమదముతో కూడిన, కాశ్చిత్ = కొందరు, మదనేన = మన్మథునిచేత, మోహితాః ఏవ = మోహింపబడినవారే అయి, ఆగతాః = రావణుని పొందినారు.

తా. రావణుడు అనేక యుద్ధములు చేసి ఆ స్త్రీల నందరిని జయించి తెచ్చెను. యౌవనోన్మాదము గల కొందరు స్త్రీలు మాత్రము మన్మథప్రేరణచేతనే రావణుని చేరిరి. 69

మూ. న తత్ర కాచిత్ప్రమదా ప్రసహ్య
వీర్యోపపన్నేన గుణేన లబ్ధా,
న చాన్యకామాపి న చాన్యపూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తామ్. 70

ప్ర. అ. వరార్హామ్ = అత్యుత్తమురాలైన, తామ్ = ఆ, జనకాత్మజాం వినా = సీత తప్ప, తత్ర = అక్కడ, కాచిత్ ప్రమదా = ఏ స్త్రీ కూడ, వీర్యోపపన్నేన = వీర్యముతో కూడిన రావణునిచేత, ప్రసహ్య = బలాత్కరించి, లబ్ధా = పొందబడినది, న = లేదు. గుణేన = గుణముచేతనే (లబ్ధా = పొందబడినది). అన్యకామాపి = మరియొకనియందు కామము కలది, న చ = లేదు. అన్యపూర్వా చ = పూర్వము అన్యుడు కలది కూడ, న = లేదు.

తా. అత్యుత్తమురాలైన జానకి తప్ప, పరాక్రమవంతుడైన ఆ రావణుడు బలాత్కారముగా తీసికొని తెచ్చిన స్త్రీ ఒక్కతె కూడ అక్కడ లేదు. అందరు స్త్రీలును అతని గుణములను మెచ్చి వచ్చినవారే. మరొక పురుషునియందు ప్రేమ గల స్త్రీ గాని, పూర్వము ఒక పురుషునికి ప్రియురాలుగా ఉన్న స్త్రీ గాని అక్కడ లేదు. 70

మూ. న చాకులీనా న చ హీనరూపా
నాదక్షిణా నానుపచారయుక్తా,
భార్యాఽభవత్తస్య న హీనసత్త్వా
న చాపి కాన్తస్య న కామనీయా. 71

ప్ర. అ. తస్య = ఆ రావణునియొక్క, భార్యా = భార్య, అకులీనా = సత్కులమునందు పుట్టనిది, న చ అభవత్ = లేకుండెను. హీనరూపా చ = తక్కువ సౌందర్యము కలదికూడ, న = లేకుండెను. అదక్షిణా = నేర్పు లేనిది, న = లేకుండెను, అనుపచారయుక్తా = ఉపచారములతో కూడనిది, న = లేకుండెను, హీన

సత్త్వా = తక్కువ బుద్ధి గలది, న = లేకుండెను. కాన్తస్య = ప్రియునకు, న కామనీయా చ = కోరదగనిది కూడ, న = లేకుండెను.

తా. ఆ రావణుని భార్యలలో, సత్కులమునందు జనించనిది గాని, సౌందర్యహీనురాలు గాని, నేర్పు లేనిది కాని, ఉపచారములు పొందనిది కాని, బుద్ధిహీనురాలు గాని, ప్రియుని మనస్సు ఆకర్షించనిది గాని ఒక్కతె కూడ లేకుండెను. 71

మూ. బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య
యదీదృశీ రాఘవధర్మపత్నీ,
ఇమా యథా రాక్షసరాజభార్యాః
సుజాతమస్యేతి హి సాధుబుద్ధేః. 72

ప్ర. అ. ఇమాః = ఈ, రాక్షసరాజభార్యాః = రాక్షసరాజుయొక్క భార్యలు, యథా = ఎట్లో, రాఘవధర్మపత్నీ = రాముని ధర్మపత్ని యైన సీత కూడ, ఈదృశీ = అట్టిదే అయినచో, అస్య = వీనికి, సుజాతమ్ = మంచిది; ఇతి = అని, సాధుబుద్ధేః = మంచిబుద్ధి గల, హరీశ్వరస్య = హనుమంతునకు, బుద్ధిస్తు = ఆలోచనయైతే, బభూవ = (మొదట) కలిగినది.

తా. రావణుని భార్య లైన ఈ స్త్రీలందరు ఏ విధముగా ఇతనిపై ప్రేమానురాగములతో ఉన్నారో రాముని భార్య యైన సీత కూడ ఆ విధముగానే ఇతని వశ మై పోయినచో వీనికి మంచిది అని ఆ అంతఃపురకాంతలను చూచిన వెంటనే మొట్టమొదట బుద్ధిశాలి యైన హనుమంతునకు ఆలోచన కలిగెను.

వి. సీత ఈ రావణునికి లొంగిపోయినచో ఇతనికి మంచిది అని హనుమంతుడు అనుకొనుట యుక్తము కాదని తలచి వ్యాఖ్యాతలు ఈ శ్లోకానికి ఎన్నో విధాల వ్యాఖ్యలు వ్రాసినారు. కాని అవేవీ అక్షరార్థానికి అనుగుణముగా లేవు. రావణుని అత్యద్భుత మైన ఐశ్వర్యమును చూడగానే హనుమంతుడు ఆశ్చర్య చకితు డై ఈ స్త్రీ లందరూ ఏ విధముగా రావణునికి వశ మై పోయినారో సీత కూడా అట్లే వశ మైపోయి ఉండవచ్చును అని అనుకొనుటలో దోష మేమీ లేదు. సీతను గూర్చి అప్పటికి, అతనికి పూర్తిగా తెలియదు కదా; దేవగంధర్వా

ధుల స్త్రీలే లొంగిపోయినపుడు మనుష్యస్త్రీ మాట చెప్పవలెనా అను భావము కలుగవచ్చును కదా. రాలోవ సర్గ చివర కూడ మండోదరిని చూచి సీతయే అని అతడు మొదట భ్రాంతిపడినాడు కదా! ఇతరస్త్రీలవలె సీత కూడ ఈ రావణునికి వశమై పోయినచో నిజముగా ఇతడు అదృష్టవంతుడే. అప్పుడు రాముడు ఇతనిని సంహరించడు. అట్లుకానిచో వీనికి రాముని చేతిలో మరణము తప్పదు అని హనుమంతుని అభిప్రాయము. సీత రావణుని అంతఃపురములో ఇతరస్త్రీలతో కలిసి ఉండవచ్చు ననే ఉద్దేశ్యముతోనే కదా హనుమంతుడు అంతఃపురములో అన్వేషించుచున్నాడు. హనుమంతుడు మొదట ఈ విధముగా అనుకొని— "ఏమైనా రావణుడు సీత విషయములో చేయకూడని పనియే చేసినాడు'' అని తరువాతి శ్లోకములో అనుకొనును. అలా అనుకొన్నప్పుడు కూడ, తన మొదటి అభిప్రాయమును మార్చుకొన్నట్లు లేదు. ఈ సర్గలోను రాలోవ సర్గలోను కూడ సీత రావణాంతఃపురములో ఇతర స్త్రీలతో పాటు ఉండవచ్చు ననియే హనుమంతుడు అనుకొన్నట్లు తోచును. వ్యాఖ్యాతలు చెప్పిన కొన్ని అర్థాలు :-

1. "ఈ రావణుని భార్యలు తమ భర్తతో కలిసి ఉన్నట్లు సీత కూడ రామునితో కలిసి ఉండే విధముగా రావణుడు సీతను రామునకు తిరిగి ఇచ్చినచో అతనికి మంచిదగును".

2. "గుణవంతురాలైన సీతను రావణుడు హరించినట్లు ఈ రావణ భార్యల నందరిని సుగ్రీవుడు హరించినచో అతనికి మంచి దగును".

3. ''రావణుడు ఈ స్త్రీలకు అపహరించి నట్లు సీతను అపహరించినచో ఇతనికి ఎంత మాత్రము మంగళము కలగదు"

4. "నేను ఈ రావణుని భార్యలను చూచి నట్లు రాముని భార్య యైన సీతను కూడ చూడ గలిగినచో నా జన్మ సఫల మగును.''

5. ''నేను ఈ రావణ భార్యలను చూచి నట్లు రాముని భార్యను కూడ చూడగలిగినచో అంగదాదివానరులు ప్రాయోపవేశము చేయక సుఖముగా ఉందురు."

6. ఈ రావణభార్యలు శోకించి ఉన్నట్లు సీత కూడ శోకించి ఉన్నచో రామునకు ప్రాణహాని కలుగక అతడు సుఖముగా ఉండును".

7. "రావణా! నీవు స్త్రీలను భార్యలనుగా చేసికొన్నట్లు రాముని భార్యను కూడ నీ భార్యగా చేసుకొన్నచో నీకు వినాశము తప్పదు".

8. "సీత ఈ రావణభార్యల వలె అల్పసౌందర్యవతి కాదు. కావుననే ఆమె ఇక్కడ అగపడుటలేదు".

ఈ లాంటి వ్యాఖ్యలకు అంతు ఉండదు. వినేవారికి ఓపిక ఉండవలెను. ప్రాచీన వ్యాఖ్యాతలు కూడ ఈ శ్లోకానికి స్పష్టంగా కనబడు అర్థమును (ప్రతి పదార్థతాత్పర్యములలో చూపినదానిని, గ్రహించి "హనుమంతుడు సీత విషయములో ఆ విధముగా భావించి తన కపిస్వభావమును కనబరచినాడు. అని ఆక్షేపించినారు. దీనిని బట్టి వీరు తరువాత చెప్పిన అర్థాలన్నీ స్వకపోలకల్పితాలని స్పష్ట మగుచున్నది. 72

మూ. పునశ్చ సోఽచిన్తయదార్త రూపో
ధ్రువం విశిష్టా గుణతో హి సీతా,
అథాయమస్యాం కృతవాన్మహాత్మా
లఙ్కేశ్వరః కష్టమనార్యకర్మ. 73

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
నవమః సర్గః.

ప్ర. అ. సః = హనుమంతుడు, ఆర్తరూపః = మిక్కిలి దుఃఖితుడై, పునశ్చ = మరల, అచిన్తయత్ = ఆలోచించెను. సీతా = సీత, ధ్రువమ్ = నిశ్చయముగా, గుణతః = గుణమువలన, విశిష్టా = శ్రేష్ఠురాలు. అథ = అట్టిదైనను, మహాత్మా = గొప్ప బుద్ధి గల, అయం లఙ్కేశ్వరః = ఈ లంకాధిపతియైన రావణుడు, అస్యామ్ = ఈమె విషయమున, అనార్యమ్ = చెడ్డ పనిని, కృతవాన్ = చేసినాడు. కష్టమ్ = ఏమి కష్టము!

తా. సీత గుణములచేత చాలా ఉత్తమురాలు. సందేహము లేదు. అయినను మహాత్ముడైన ఈ రావణుడు ఈమె విషయమున చేయకూడని పని చేసినాడు. ఎంత కష్టము! అని హనుమంతుడు చాల దుఃఖించెను. మరల మనస్సులో అనుకొనెను. 78

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో తొమ్మిదవ సర్గ సమాప్తము.

**

## అథ దశమః సర్గః

[అంతఃపురములో నిద్రించుచున్న రావణుని, ఆతని అంతఃపుర స్త్రీలను హనుమంతుడు చూచుట. అచట మందోదరిని చూచి సీత అని భ్రాంతిపడి, సీత కనబడినది కదా అని ఆతడు సంతోషించుట.]

మూ. తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్.
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్. 1
దాన్తకాఞ్చనచిత్రాఙ్గైర్వైడూర్యైశ్చ వరాసనైః,
మహార్హాస్తరణోపేతైరుపపన్నం మహాధనైః. 2

ప్ర. అ. తత్ర = ఆ అంతఃపురమునందు, అవేక్షమాణః = పరిశీలించుచున్న హనుమాన్ = హనుమంతుడు, దివ్యోపమమ్ = స్వర్గములో ఉండుదానితో సమానమూ, ముఖ్యమ్ = శ్రేష్ఠమూ, స్ఫాటికమ్ = స్ఫటికమణివికారమూ, రత్నభూషితమ్ = రత్నములచేత అలంకరింపబడినదీ, దాన్తకాఞ్చనచిత్రాఙ్గైః = దంతపు నగిషీల చేతను, బంగారముచేతను విచిత్రమైన అవయవములు గల, వైడూర్యైః = వైడూర్యవికారములైన, మహార్హాస్తరణోపేతైః = ఉత్తమమైన ఆస్తరణములతో కూడిన, మహాధనైః = గొప్ప ధనము (మూల్యము) గల, వరాసనైః = శ్రేష్ఠమైన ఆసనములతో, ఉపేతమ్ = కూడినదీ అయిన, శయనాసనమ్ = శయనములూ ఆసనములూ ఉన్న గృహభాగమును, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అంతఃపురమునంతను పరిశీలించుచు, అక్కడ ఒక ప్రక్క స్వర్గములోని దేవేంద్రుని శయనాగారము వలె ఉన్న, శ్రేష్ఠమైన శయ్యాసనాగారమును చూచెను. స్ఫటికమాణిక్యములతో చవటా చేసిన ఆ గృహము రత్నములచే అలంకృతమై ఉండెను. ఆ గృహములో అమూల్యములైన మంచి ఆసనములు అమర్చబడి ఉండెను. ఆ ఆసనముల అవయవములు

దంతపు నగిషీలతోను బంగారముతోను, వైడూర్యమాణిక్యములతోను విచిత్రము లుగా ఉండెను. అత్యుత్తమము లైన ఆసనములపై మంచి విలువ గల ఆస్తరణ ములు పరచి ఉండెను.

మూ. తస్య చైకతమే దేశే సోఽగ్ర్యమాలావిభూషితామ్,
దదర్శ పాణ్డురం ఛత్రం తారాధిపతిసన్నిభమ్. 3

ప్ర. అ. సః = హనుమంతుడు, తస్య = ఆ శయనాగారముయొక్క, ఏకతమే = ఒక, దేశే = ప్రదేశమునందు, అగ్ర్యమాలావిభూషితమ్ = శ్రేష్ఠ మైన పుష్పమాలలచే అలంకరింపబడినదీ, తారాధిపతిసన్నిభమ్ = చంద్రునితో సమానమూ, పాణ్డురమ్ = తెల్లనిదీ అయిన, ఛత్రమ్ = ఛత్రమును, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ శయనగృహమునందు ఒక ప్రక్క, ఉత్తమ మైన మాలలచే అలంకరింపబడినదీ, చంద్రునితో సమానమూ అయిన శ్వేతచ్ఛత్ర మును చూచెను. 3

మూ. జాతరూపపరిక్షిప్తం చిత్రభానుసమప్రభమ్,
అశోకమాలావితతం దదర్శ పరమాసనమ్. 4

వాలవ్యజనహస్తాభిర్వీజ్యమానం సమన్తతః,
గన్ధైశ్చ వివిధైర్జుష్టం వరధూపేన ధూపితమ్. 5

పరమాస్తరణాస్తీర్ణమావికాజినసంవృతమ్,
దామభిర్వరమాల్యానాం సమన్తాదుపశోభితమ్. 6

ప్ర. అ. జాతరూపపరిక్షిప్తమ్ = బంగారముతో చేయబడినదీ, చిత్రభాను సమప్రభమ్ = అగ్నితో సమాన మైన కాంతి గలదీ, అశోకమాలావితతమ్ = అశోకపుష్పమాలలచే వ్యాప్తమూ, వాలవ్యజనహస్తాభిః = వింజామరలు హస్తము లందు గల స్త్రీలచేత, సమన్తతః = నలు వైపుల, వీజ్యమానమ్ = విసరబడు తున్నదీ, వివిధైః = అనేకవిధము లైన, గన్ధైః = సువాసనలచేత, జుష్టమ్ = పొందబడినదీ, వరధూపేన = శ్రేష్ఠ మైన ధూపముచేత, ధూపితమ్ = ధూపింప చేయబడినదీ, పరమాస్తరణాస్తీర్ణమ్ = శ్రేష్ఠ మైన ఆస్తరణముచేత కప్పబడి

నది, ఆవికాజినసంవృతమ్ = గొఱ్ఱెల చర్మములచేత కప్పబడినది, సమన్తాత్ = అంతటను. వరమాల్యానామ్ = శ్రేష్ఠము లైన మాలికల, దామభిః = పంక్తుల చేత, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడినదీ అయిన, వరమాసనమ్ = శ్రేష్ఠమైన ఆసనమును, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అకృత బంగారముతో నిర్మించిన, అగ్ని వంటి కాంతి గల ఉత్తమ మైన ఆసనమును చూచెను. అశోకపుష్పమాలలతో వ్యాప్తమై ఉన్న దాని చుట్టును నిలచి వింజామరలు చేత ధరించిన స్త్రీలు వీచుచుండిరి. అనేకవిధము లైన సుగంధద్రవ్యములతో నిండియున్న దానికి మంచి ధూపము వేసి అధిక మైన సుగంధమును కల్పించిరి. దానిపై గొఱ్ఱెల చర్మములు ఇతరము లైన మంచి ఆచ్ఛాదనములు పరచి ఉండెను. దాని చుట్టు శ్రేష్ఠము లైన పుష్పమాలలు కట్టి ఉండెను. 4, 5, 6

మూ. తస్మిన్ జీమూతసంకాశం ప్రదీప్తోత్తమకుణ్డలమ్,
లోహితాక్షం మహాబాహుం మహారజతవాససమ్. 7

లోహితేనానులిప్తాఙ్గం చన్దనేన సుగన్ధినా,
సన్ధ్యారక్తమివాకాశే తోయదం సతటిద్గణమ్. 8

వృతమాభరణైర్దివ్యైః సురూపం కామరూపిణమ్,
సవృక్షవనగుల్మాఢ్యం ప్రసుప్తమివ మన్దరమ్. 9

క్రీడితోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్,
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్. 10

పీత్వాప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః,
భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్. 11

ప్ర. అ. సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, జీమూతసంకాశమ్ = మేఘముతో సమానుడూ, ప్రదీప్తోత్తమకుణ్డలమ్ = ప్రజ్వలించుచున్న, (ప్రకాశించుచున్న) ఉత్తమము లైన కుండలములు కలవాడూ, లోహితాక్షమ్ = ఎఱ్ఱని నేత్రములు కలవాడూ, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడూ, మహారజతవాససమ్ = బంగారు వస్త్రములు ధరించినవాడూ, లోహితేన = ఎఱ్ఱని,

సుగన్ధినా=మంచి సువాసన గల, చన్దనేన=చందనముచేత, అనులిప్తాఙ్గమ్=పూయబడిన శరీరము గలవాడూ, దివ్యైః=అద్భుత మైన, ఆభరణైః=ఆభరణములతో, వృతమ్=కూడినవాడూ, సన్ధ్యారక్తమ్=సంధ్యాకాలముచే ఎఱ్ఱగా ఉన్న, సతటిద్గణమ్=మెరపుల సముదాయముతో కూడిన, ఆకాశే=ఆకాశము నందలి, తోయదమివ=మేఘము వలె ఉన్నవాడూ, సురూపమ్=మంచి రూపము గలవాడూ, కామరూపిణమ్=స్వేచ్ఛారూపము గలవాడూ, వరాభరణ భూషితమ్=శ్రేష్ఠము లైన అలంకారములచేత అలంకరింపబడినవాడూ, రాత్రౌ=రాత్రియందు, క్రీడిత్వా=రతికేళులు సలిపి, ఉపరతమ్=విరమించినవాడూ, సవృక్షవనగుల్మాఢ్యమ్=వృక్షసముదాయముతోను పొదలతోను నిండిన, ప్రసుప్తమ్=నిద్రించుచున్న, మన్దరమ్ ఇవ=మందర పర్వతము వలె ఉన్నవాడూ, రాక్షసకన్యానామ్=రాక్షసకన్యలకు, ప్రియమ్=ప్రియుడూ, రాక్షసానామ్=రాక్షసులకు, సుఖావహమ్=సుఖము కలిగించువాడూ, పీత్వా=మద్యపానము చేసి, ఉపరతమ్=విరమించిన వాడూ అయిన, తస్మిన్=ఆ, భాస్వరే=ప్రకాశించుచున్న, శయనే=శయనమునందు, ప్రసుప్తమ్=నిద్రించుచున్న, వీరమ్=వీరు డైన, రాక్షసాధిపమ్=రాక్షసరాజును, దదర్శ=చూచెను.

తా. ప్రకాశించుచున్న ఆ శయనముపీద వీరు డైన రావణుడు నిద్రించుచుండెను. అతడు మేఘము వలె ఉండెను. అతని ఉత్తమము లైన కుండలములు మెరయుచుండెను. ఎఱ్ఱని నేత్రములు, మహాబాహువులు గల అతడు బంగారు వస్త్రములు ధరించెను. మంచి సువాసన గల ఎఱ్ఱని చందనము శరీరమంతా పూసికొని, అత్యద్భుతము లైన ఆభరణములు ధరించి ఉన్న అతడు సంధ్యారాగము ప్రసరించి, మెరపులు మెరయుచున్న ఆకాశముపై ఉన్న మేఘము వలె ఉండెను. స్వేచ్ఛానుసారముగా రూపమును ధరించగలిగిన అతని రూపము చాల చక్కగా ఉండెను. శ్రేష్ఠము లైన ఆభరణములు ధరించిన అతడు రాత్రి అంతయు రతికేళులు సలిపి విశ్రమించుచుండెను. అందుచే అతడు వృక్షసమూహములతోను, పొదలతోను నిండిన నిద్రించుచున్న మందర పర్వతము వలె ఉండెను. రాక్షస స్త్రీలకు ప్రియుడు, రాక్షసులకు సుఖమును కలిగించువాడూ అయిన అతడు మద్యపానము చేసి ఆ మత్తుతో నిద్రించుచుండెను. అట్టి రాక్షసరా జైన రావణుని హనుమంతుడు చూచెను. 7-11

మూ. నిఃశ్వసన్తం యథా నాగం రావణం వానరర్షభః,
ఆసాద్య పరమోద్విగ్నః సోఽపాసర్పత్సుభీతవత్. 12

ప్ర.అ. సః వానరర్షభః=ఆ వానరశ్రేష్ఠుడు, నాగం యథా=మహాసర్పము వలె, నిశ్వసన్తమ్ = ఊపిరి వదలుచున్న, రావణమ్=రావణుని, ఆసాద్య= సమీపించి, పరమోద్విగ్నః=మిక్కిలి దిగులు చెందినవాడై, సుభీతవత్ =భాం తయపడినవాడై, అపాసర్పత్ = దూరముగా తొలగిపోయెను.

తా. దీర్ఘనిశ్వాసముంతో, బుసలు కొట్టుచున్న మహాసర్పము వలె ఉన్న ఆ రావణునికి దగ్గరగా వెళ్ళిన ఆ హనుమంతుడు, మిక్కిలి దిగులు చెంది భాం తయపడి దూరముగా వెళ్ళిపోయెను.

వి. హనుమంతునివంటి మహావీరుడు కూడ నిద్రించుచున్న రావణుని దగ్గరనుండి చూడగానే ఒక్కసారి ఉలిక్కిపడి, భయముతో దూరముగా తొలగి పోయినా దనగా అది రావణుని ప్రతాపాతిశయమును సూచించుచున్నది. దీని వలన హనుమంతుని మహత్త్వమునకు ఏదో లోపము వచ్చిన దని భావించి వేరు వేరు భావములు చెప్పుట అనావశ్యకము. ఇదే వాల్మీకి చూపించు కవితాశిల్ప సౌందర్యము. 12

మూ. అథారోహణమాసాద్య వేదికాన్తరమాశ్రితః,
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః. 13

ప్ర. అ. మహాకపిః = హనుమంతుడు, అథ = అటు పిమ్మట, ఆరోహణమ్ = మెట్లమార్గమును, ఆసాద్య = చేరి, వేదికాన్తరమ్ = మరియొక వేదికను, ఆశ్రితః=ఆశ్రయించినవాడై, సుప్తమ్ = నిద్రించుచున్న, రాక్షసశార్దూలమ్= రాక్షసశ్రేష్ఠుని, ప్రేక్షతే స్మ=చూచెను.

తా. పిమ్మట, హనుమంతుడు మెట్ల మీదుగా మరియొక వేదిక ఎక్కి, అక్కడినుండి, నిద్రించుచున్న రావణుని పరీక్షగా చూచెను. 13

మూ. శుశుభే రాక్షసేన్ద్రస్య స్వపతః శయనోత్తమమ్,
గన్ధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్. 14

ప్ర. అ. స్వపతః=నిద్రించుచున్న, రాక్షసేన్ద్రస్య=రాక్షసరాజుయొక్క, శయనోత్తమమ్ = శ్రేష్ఠమైన శయనము, గన్ధహస్తిని=మదపుటేనుగ, సంవిష్టే

=శయనించిన దగుమంతగా, మహత్=గొప్ప, ప్రస్రవణం యథా=సెలయేటి వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. రావణుడు పండుకొని నిద్రించుచున్న ఆ శ్రేష్ఠమైన శయనము మదపుటేనుగ కూర్చున్న పెద్ద సెలయేటివలె ప్రకాశించెను. 14

మూ. కాఞ్చనాఙ్గదనద్ధౌ చ దదర్శ స మహాత్మనః,
విక్షిప్తౌ రాక్షసేన్ద్రస్య భుజావిన్ద్రధ్వజోపమౌ. 15

ఐరావతవిషాణాగ్రైరాపీడనకృతవ్రణౌ,
వజ్రోల్లిఖితపీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ. 16

పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ,
సులక్షణనఖాఙ్గుష్ఠౌ స్వఙ్గులీతలలక్షితౌ. 17

సంహతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ,
విక్షిప్తౌ శయనే శుభ్రే పఞ్చశీర్షావివోరగౌ. 18

శశక్షతజకల్పేన సుశీతేన సుగన్ధినా,
చన్దనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలఙ్కృతౌ. 19

ఉత్తమస్త్రీవిమృదితౌ గన్ధోత్తమనిషేవితౌ,
యక్షపన్నగగన్ధర్వ దేవదానవరావిణౌ. 20

ప్ర. అ. సః = హనుమంతుడు, మహాత్మనః = మహాత్ముడైన, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, కాఞ్చనాఙ్గదనద్ధౌ = బంగారు బాహుపురులచే కట్టబడినవి, విక్షిప్తౌ=దూరముగా పడవేయబడినవి, ఇన్ద్రధ్వజోపమౌ=ఇంద్రధ్వజముతో సమానమైనవి, ఐరావతవిషాణాగ్రైః = ఐరావతముయొక్క దంతాగ్రములచేత, ఆపీడనకృతవ్రణౌ=పొడుచుటచేత చేయబడిన వ్రణములు గలవి, వజ్రోల్లిఖితపీనాంసౌ=వజ్రముచేత రాయబడిన బలిసిన భుజప్రదేశములు గలవి, విష్ణుచక్రపరిక్షతౌ=విష్ణువుయొక్క చక్రముచేత కొట్టబడినవి, పీనౌ=బలిసినవి, సమసుజాతాంసౌ=సమముగా చక్కగా పెరిగిన భుజములు గలవి, సంగతౌ=దేహమునకు సరిపడున ట్లున్నవి, బలసంయుతౌ=బలముతో గూడినవి, సులక్షణ

నఖాఙ్గుష్ఠౌ = మంచి లక్షణములు గల గోళ్లు బొటనవ్రేళ్లు గలవి, స్వఙ్గులితల లక్షితౌ = మంచివేళ్ళతోను అరచేతులతోను కూడినవి, సంహతౌ = దృఢ మైన సంధిబంధములు కలవి, పరిఘాకారౌ = పరిఘ వంటి ఆకారము కలవి, వృత్తౌ = మాంసపుష్టిచే గుండ్రముగా ఉన్నవి, కరికరోపమౌ = ఏనుగ తొండముతో సమాన మైనవి, శుభ్రే = శుభ్ర మైన, శయనే = శయనమునందు, విక్షిప్తౌ = పడ వేయబడిన, పఞ్చశీర్షౌ = ఐదు తలలు గల, ఉరగౌ ఇవ = సర్పముల వలె ఉన్నవి, శశక్షతజకల్పేన = చెవుల పిల్లి రక్తముతో సమాన మైన, సుశీతేన = చాల చల్ల నైన, సుగన్ధినా = మంచి సువాసన గల, పరార్ధ్యేన = శ్రేష్ఠ మైన, చన్దనేన = చందనము చేత, స్వనులిప్తౌ = బాగుగా పూయబడినవి, స్వలంకృతౌ = చక్కగా అలంకరింపబడినవి, ఉత్తమస్త్రీవిమృదితౌ = ఉత్తమస్త్రీలచేత మర్దింపబడినవి, గన్ధోత్తమనిషేవితౌ = ఉత్తమ మైన గంధముచే సేవింపబడినవి, యక్షపన్నగగన్ధర్వదేవదానవరావిణౌ = యక్షులను, పన్నగులను, గంధర్వులను, దేవతలను, దానవులను ఏడ్పించినవి అయిన, భుజౌ = భుజములను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు, శుభ్ర మైన శయనముపైన అటు ఇటు బారచాచి ఉన్న, మహాత్ము డైన ఆ రాక్షసేంద్రుని రెండు బాహువులను చూచెను. బంగారపు బాహుపురులు ధరించి ఇంద్రధ్వజము వలె ఉన్న ఆ బాహువుల మీద ఐరావతము దంతములతో పొడుచుటచే ఏర్పడిన గాయములు కనబడుచుండెను. బలిసిన అతని భుజములు ఆ యా యుద్ధములలో దేవేంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధపు దాపిడిని, విష్ణుచక్రప్రహారములను పొంది ఉండెను. బలిసి, దేహ ప్రమాణమునకు అనుగుణముగా ఉన్న ఆ బాహువులు చక్కని భుజములతో చాల బలము కలవిగా కనబడుచుండెను. వారి గోళ్లు, బొటనవ్రేళ్లు, ఇతరము లైన వ్రేళ్లు, అరచేతులు ఉత్తమలక్షణములతో ప్రకాశించుచుండెను. అవి దృఢ మైన సంధులతో పరిఘల (కోట గడియల) వలె ఉండెను. ఏనుగ తొండము వలె గుండ్రముగా ఉండెను. బాగుగ అలంకరించిన ఆ బాహువులకు కుందేటి రక్తము వలె ఎఱ్ఱ నైన, చల్లని, సుగంధము గల మంచిగంధము పూయబడెను. ఉత్తమ స్త్రీలచే మర్దింపబడుచుండు ఆ బాహువులకు అత్యుత్తమము లైన ఇతర సుగంధ ద్రవ్యములు కూడ పూయబడి ఉండెను. ఆ బాహువులు ఎన్నో పర్యాయములు యక్షులను, పన్నగులను, గంధర్వులను, దేవతలను, దానవులను ఏడ్పించినవి.

మూ. దదర్శ స కపిస్తత్ర బాహూ శయనసంస్థితౌ,
మన్దరస్యాన్తరే సుప్తౌ మహాహీ రుషితావివ. 21

ప్ర. అ. సః కపిః = ఆ హనుమంతుడు, తత్ర = ఆక్కడ, మన్దరస్య = మందరపర్వతముయొక్క, అన్తరే = మధ్యయందు, సుప్తౌ = నిద్రించుచున్న, రుషితౌ = కోపించిన, మహాహీ ఇవ = గొప్ప సర్పముల వలె ఉన్న, శయన సంస్థితౌ = శయనముపై ఉన్న, బాహూ = బాహువులను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆక్కడ మందరపర్వతమునందు నిద్రించుచున్న, కోపస్వభావము గల మహాసర్పముల వలె ఉన్న, ఆ రావణుని రెండు బాహువులను చూచెను. 21

మూ. తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః,
శుశుభేఽచలసంకాశః శృఙ్గాభ్యామివ మన్దరః. 22

ప్ర. అ. అచలసంకాశః = పర్వతముతో సమాను డైన, సః = ఆ, రాక్షసేశ్వరః = రాక్షసశ్రేష్ఠుడు, పరిపూర్ణాభ్యామ్ = నిండుగా ఉన్న, తాభ్యామ్ = ఆ, భుజాభ్యామ్ = రెండు భుజములతో, శృఙ్గాభ్యామ్ = రెండు శిఖరములతో, మన్దరః ఇవ = మందరపర్వతము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. పర్వతముతో సమాను డైన ఆ రావణుడు, చక్కగా బలిసి ఉన్న రెండు భుజములతో మందరపర్వతము వలె ప్రకాశించెను.

మూ. చూతపున్నాగసురభి ర్వకుళోత్తమసంయుతః,
మృష్టాన్నరససంయుక్తః పానగన్ధపురస్కృతః, 23
తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహాముఖాత్,
శయానస్య వినిఃశ్వాసః పూరయన్నివ తద్ గృహమ్. 24

ప్ర. అ. శయానస్య = శయనించి యున్న, తస్య రాక్షససింహస్య = ఆ రాక్షసశ్రేష్ఠునియొక్క, మహాముఖాత్ = గొప్ప ముఖమునుండి, చూతపున్నాగ సురభిః = చూతపుష్పముల వలె, పున్నాగపుష్పముల వలె పరిమళించుచున్నదీ, వకుళోత్తమసంయుతః = శ్రేష్ఠ మైన వకుళపుష్పగంధముతో కూడినదీ, మృష్టాన్న రససంయుక్తః = మృష్టాన్నముయొక్క రసముతో కూడినదీ, పానగన్ధపురస్కృతః

= మద్యగంధము ముందు గలదీ, అయిన, నిఃశ్వాసః = నిశ్శ్వాసము, తత్ = ఆ, గృహమ్ = గృహమును. పూరయన్నివ = నింపుచున్నది వలె, నిశ్చక్రామ = బయల్వెడలెను.

తా. నిద్రించుచున్న ఆ రాక్షసశ్రేష్ఠుని విశాలమైన ముఖమునుండి, నిశ్శ్వసవాయువు, ఆ గృహము నంతను నింపివేయుచున్నట్లు బయలువెడలు చుండెను. చూతపుష్ప - పున్నాగపుష్పముల వలె, ఉత్తమ మైన పొగడపూవుల వలె పరిమళించుచున్న ఆ నిశ్శ్వసవాయువు మధురము లైన అన్నముల రసముం సువాసనలతోను, మద్యగంధముతోను కూడ నిండి యుండెను. 23, 24

మూ. ముక్తామణివిచిత్రేణ కాఞ్చనేన విరాజితమ్,
మకుటేనాపవృత్తేన కుణ్డలోజ్జ్వలితాననమ్. 25

రక్తచన్దనదిగ్ధేన తథా హారేణ శోభినా,
పీనాయతవిశాలేన వక్షసాభివిరాజితమ్. 26

పాణ్డురేణాపవిద్ధేన క్షౌమేణ క్షతజేక్షణమ్,
మహార్హేణ సుసంవీతం పీతేనోత్తమవాససా. 27

మాషరాశిప్రతీకాశం నిశ్శ్వసన్తం భుజఙ్గవత్,
గాఙ్గే మహతి తోయాన్తే ప్రసుప్తమివ కుఞ్జరమ్. 28

చతుర్భిః కాఞ్చనైర్దీపైర్దీప్యమానచతుర్దిశమ్,
ప్రకాశీకృతసర్వాఙ్గం మేఘం విద్యుద్గణైరివ. 29

పాదమూలగతాశ్చాపి దదర్శ సుమహాత్మనః,
పత్నీః స ప్రియభార్యస్య తస్య రక్షఃపతేర్గృహే. 30

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, తస్య రక్షఃపతేః = ఆ రాక్షసరాజు యొక్క, గృహే = గృహమునందు, ముక్తామణివిచిత్రేణ = ముత్యములతోను, మణులతోను విచిత్రవర్ణము గల, కాఞ్చనేన = బంగారు వికారమైన, అపవృత్తేన = ప్రక్కకు ఒరిగిన, మకుటేన = కిరీటముచేత, విరాజితమ్ = ప్రకాశింప చేయబడినవాడును, కుణ్డలోజ్జ్వలితాననమ్ = కుండలములచేత ప్రకాశింపచేయబడిన

ముఖము కలవాడూ, రక్తచన్దనదిగ్ధేన=ఎఱ్ఱని చందనముచేత పూయబడినదీ, హారేణ = హారముతో, శోభినా = ప్రకాశించుచున్నదీ, పీనాయతవిశాలేన = బలిసి పొడవుగా విశాలముగా ఉన్నదీ అయిన, వక్షసా = వక్షఃస్థలముచేత, అభివిరాజితమ్=ప్రకాశింపచేయబడుచున్న వాడూ, పాణ్డరేణ=తెల్లని, అపవిద్ధేన= పైకి జారుచున్న, క్షౌమేణ = పట్టువస్త్రముతో కూడినవాడూ, క్షతజేక్షణమ్ = రక్తము వలె ఎఱ్ఱగా ఉన్న నేత్రములు కలవాడూ, మహార్హేణ = శ్రేష్ఠ మైన, పీతేన = పచ్చని, ఉత్తమవాససా = ఉత్తమ మైన వస్త్రముచేత, సుసంవీతమ్= బాగుగా కట్టబడినవాడూ, మాషరాశిప్రతీకాశమ్=మినుముల రాశితో సమానుడూ, భుజఙ్గవత్ = సర్పమువలె, నిఃశ్వసన్తమ్ = నిట్టూర్పుచున్నవాడూ, మహతి = విశాల మైన, గాఙ్గే = గంగకు సంబంధించిన, తోయాన్తే = జలమధ్యమునందు, ప్రసుప్తమ్ = నిద్రించుచున్న, కుఞ్జరమ్ ఇవ = ఏనుగ వలె ఉన్నవాడూ, కాఞ్చనైః = బంగారువికార మైన, చతుర్భిః = నాలుగు, దీపైః = దీపములచేత, దీప్యమానచతుర్దిశమ్ = ప్రకాశింపచేయబడిన నాలుగు దిక్కులు కలవాడూ, విద్యుద్గణైః = మెఱపుల సముదాయములచేత, ప్రకాశీకృతసర్వాఙ్గమ్=ప్రకాశింప చేయబడిన సకల అవయవములూ గల, మేఘమ్ ఇవ = మేఘము వలె ఉన్న వాడూ అయిన రావణునీ, ప్రియభార్యస్య = ఇష్ట లైన భార్యలు గల, సుమహాత్మనః = చాల మహాత్ము డైన ఆ రావణునియొక్క, పాదమూలగతాః = పాద సమీపమునం దున్న, పత్నీశ్చ = భార్యలను, దదర్శ = చూచెను.

తా. రావణుని శయనాగారములో, హనుమంతుడు, నిద్రించుచున్న రావణునీ, భార్యలపై అధికానురాగవంతు డైన ఆ మహాత్ముని పాదముల చెంత నిద్రించుచున్న అతని భార్యలనూ చూచెను. ఆ రావణుడు, ముత్యములు, మణులు పొదుగుటచేత విచిత్రవర్ణములతో ఉన్న, కొంచెము ప్రక్కకు ఒరిగిన, బంగారు కిరీటముతో ప్రకాశించుచుండెను. అతని ముఖము కుండలములతో ప్రకాశించుచుండెను. పొడవుగా, విశాలముగా, బలిసి ఉన్న అతని వక్షఃస్థలము పూసికొనిన ఎఱ్ఱని చందనముతోను, అంద మైన హారములతోను అలరారుచుండెను. అతడు తెల్లని పట్టువస్త్రమును ఉత్తరీయముగాను, అత్యుత్తమ మైన పీతాంబరమును పరిధానీయము గాను (కట్టు వస్త్రముగాను) ధరించెను. కండ్లు రక్తము వలె ఎఱ్ఱగా ఉండెను. (దీనిని బట్టి ఆ సమయమున అతడు నిద్రలో కండ్లు సగము తెరచికొని ఉండె నని ఊహించవలెను). మహాసర్పము

వలె బుసలుకొట్టుచు, మినుముల రాసివలె ఉన్న అతడు విశాలమైన గంగాజల మధ్యమున నిద్రించుచున్న గజము వలె ఉండెను. నాలుగు దిక్కులను ప్రకాశింపచేయుచున్న నాలుగు దీపములు అతని చుట్టూ ఉండుటచే అతడు మెరపుల సముదాయముచేత అంతటా ప్రకాశించుచున్న మేఘము వలె ఉండెను. 25-30

మూ. శశిప్రకాశవదనా శ్చారుకుణ్డలభూషితాః,
అమ్లానమాల్యాభరణా దదర్శ హరియూథపః, 31

ప్ర. అ. హరియూథపః=హనుమంతుడు, శశిప్రకాశవదనాః=చంద్రుని ప్రకాశమువంటి ప్రకాశము గల ముఖములు గలవారూ, చారుకుణ్డలభూషితాః = అందమైన కుండలములచే అలంకరింపబడినవారూ, అమ్లానమాల్యాభరణాః= వాడని మాలలూ ఆభరణములూ కలవారూ అయిన రావణభార్యలను, దదర్శ= చూచెను.

తా. ఆ రావణుని భార్యల ముఖములు చంద్రుని వలె ప్రకాశించు చుండెను. వారు అందమైన కుండలములు ధరించిరి వారు ధరించిన పుష్ప మాలలు వాడిపోలేదు. అలంకారములు మాయలేదు. 31

మూ. నృత్తవాదిత్రకుశలా రాక్షసేన్ద్రభుజాఙ్కగాః,
వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః. 32

ప్ర. అ. హరిః = హనుమంతుడు, నృత్తవాదిత్రకుశలాః = నృత్తము నందు, వాద్యములందు నేర్పుగలవారు, రాక్షసేన్ద్రభుజాఙ్కగాః = రావణుని భుజములను ఒరిగి పొంది ఉన్నవారూ, వరాభరణధారిణ్యః = శ్రేష్ఠమైన అలంకారములను ధరించినవారూ, నిషణ్ణాః = నిద్రించినవారూ అయిన రావణభార్యలను, దదృశే=చూచెను.

తా. రావణుని భుజముల దగ్గర, తొడల దగ్గర పడి యుండి నిద్రించు చున్న ఆ స్త్రీలు నృత్తమునందు, వివిధవాద్యవాదనమునందు నేర్పుగలవారు. వారందరూ ఉత్తమములైన అలంకారములు ధరించి ఉండిరి. 32

మూ. వజ్రవైడూర్యగర్భాణి శ్రవణాన్తేషు యోషితామ్,
దదర్శ తాపనీయాని కుణ్డలాన్యఙ్గదాని చ. 33

ప్ర. అ. యోషితామ్=ఆ స్త్రీలయొక్క, శ్రవణాన్తేషు = చెవుల చివరి ప్రదేశములందు, వజ్రవైడూర్యగర్భాణి=వజ్రములూ, వైడూర్యములూ గర్భము నందు గలవీ, తాపనీయాని = బంగారు వికార మైనవీ అయిన, కుణ్డలాని = కుండలములనూ, అఙ్గదాని చ = బాహుపురులనూ, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ స్త్రీల చెవులకు ధరించిన, మధ్య నున్న వజ్రముల తోను, వైడూర్యములతోను మెరయుచున్న బంగారు కుండలములను, అట్టివే అయిన బాహుపురులనూ చూచెను. 33

మూ. తాసాం చన్ద్రోపమైర్వక్త్రైః శుభైర్లలితకుణ్డలైః,
విరరాజ విమానం తన్నభస్తారాగణైరివ. 34

ప్ర. అ. లలితకుణ్డలైః = సుందరము లైన కుండలములు గలవి, చన్ద్రోపమైః=చంద్రునితో సమానములూ, శుభైః=సుందరములూ అయిన, తాసామ్= ఆ స్త్రీలయొక్క, వక్త్రైః = ముఖములతో, తత్ విమానమ్ = ఆ విమానము, తారాగణైః = నక్షత్రగణములతో, నభః ఇవ = ఆకాశము వలె, విరరాజ = ప్రకాశించెను.

తా. సుందరము లైన కుండలములు గల, చంద్రుని వంటి వారి ముఖములతో, ఆ విమానము, నక్షత్రసముదాయముతో ఆకాశము ప్రకాశించి నట్లు ప్రకాశించెను. 34

మూ. మదవ్యాయామఖిన్నాస్తా రాక్షసేన్ద్రస్య యోషితః,
తేషు తేష్వవకాశేషు ప్రసుప్తాస్తనుమధ్యమాః. 35

ప్ర. అ. మదవ్యాయామఖిన్నాః=మదముచేతను, రతిశ్రమచేతను అలసిన, తనుమధ్యమాః = సన్నని నడుములు గల, తాః=ఆ, రాక్షసేన్ద్రస్య=రావణుని యొక్క, యోషితః = స్త్రీలు, తేషు తేషు = ఆ యా, అవకాశేషు = అవకాశము లందు, ప్రసుప్తాః = నిద్రించిరి.

తా. సన్నని నడుములు గల ఆ రావణభార్య లందరు, మదముచేతను, రతిశ్రమచేతను అలసిపోయినవారై, ఎక్కడ అవకాశము దొరికిన అక్కడ శయనించిరి. 35

మూ. అఙ్గహారై స్తథైవాన్యా కోమలై ర్నృత్తశాలినీ,
విన్యస్తశుభసర్వాఙ్గీ ప్రసుప్తా వరవర్ణినీ. 36

ప్ర. అ. అన్యా = మరి యొక, నృత్తశాలినీ = నృత్తమునందు నేర్పు గల, వరవర్ణినీ = స్త్రీ, కోమలైః = మృదు వైన, అఙ్గహారైః = అంగవిన్యాసము చేత, తథైవ = అట్లే, విన్యస్తశుభసర్వాఙ్గీ = విన్యాసము చేయబడిన సకలావయవములు కలదై, ప్రసుప్తా = నిద్రించినది.

తా. నృత్తమునందు నేర్పు గల ఒక స్త్రీ, నృత్తము చేయుచున్నపుడు ఎట్టి అంగభంగిమ లుండునో అట్టి అంగభంగిమలనే శయనించినపుడు కూడ చేయుచు నిద్రించెను. 36

మూ. కాచిద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే,
మహానదీప్రకీర్ణేవ నలినీ పోతమాశ్రితా. 37

ప్ర. అ. వీణామ్ = వీణను, పరిష్వజ్య = కౌగలించుకొని, ప్రసుప్తా = నిద్రించుచున్న, కాచిత్ = ఒకానొక స్త్రీ, మహానదీప్రకీర్ణా = మహానదిచేత బైటకు విసరివేయబడినదై, పోతమ్ = నావను, ఆశ్రితా = ఆశ్రయించిన, నలినీవ = పద్మలత వలె, సంప్రకాశతే = ప్రకాశించుచుండెను.

తా. వీణను కౌగలించుకుని నిద్రించుచున్న ఒక వైణికురాలు, మహానదీ ప్రవాహమునకు బైటకు కొట్టుకొని వచ్చి చిన్న నావకు తగుల్కొన్న పద్మలత వలె ప్రకాశించుచుండెను. 37

మూ. అన్యా కక్షగతేనైవ మడ్డుకేనాసితేక్షణా,
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా. 38

ప్ర. అ. కక్షగతేనైవ = చంకలోనే ఉన్న, మడ్డుకేన = మడ్డుక మను వాద్యముతో, ప్రసుప్తా = నిద్రించుచున్న, అన్యా = మరి యొకతె, అసితేక్షణా = నల్లని కండ్లు గల వనిత, వత్సలా = వాత్సల్యవంతురాలూ, బాలపుత్రా = బాలుడైన పుత్రుడు కలదీ అయిన, భామినీవ = స్త్రీ వలె, భాతి = ప్రకాశించుచుండెను.

తా. మడ్డుక మను వాద్యము చంకలో ఉండగానే నిద్రించుచున్న మరి

యొక యువతి, బాలు డైన పుత్రుని చంకలో ఎత్తికొన్న పుత్రవాత్సల్యవంతురా లగు స్త్రీ వలె నుండెను. 38

మూ. పటహం చారుసర్వాఙ్గీ పీడ్య శేతే శుభస్తనీ,
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ. 39

ప్ర. అ. చారుసర్వాఙ్గీ = అంద మైన సకలావయవములు గలదీ, శుభ స్తనీ = అంద మైన స్తనములు గలదీ అయిన, భామినీ = ఒక స్త్రీ, చిరస్య = చిరకాలమునకు, రమణమ్ = ప్రియుని, లబ్ధ్వా = పొంది, పరిష్వజ్యేవ = కౌగ లించుకొని వలె, పటహమ్ = పటహ మనే వాద్యమును, పీడ్య = గట్టిగా కౌగ లించుకొని, శేతే = శయనించెను.

తా. అంద మైన సర్వావయవములూ, మనోహరము లైన స్తనములూ గల మరి యొక యువతి, పటహ మను వాద్యమును, చాలకాలానికి లభించిన ప్రియుని కౌగలించుకొన్నట్లు గట్టిగా కౌగలించుకొని నిద్రించుచుండెను. 39

మూ. కాచిద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా,
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ. 40

ప్ర. అ. కమలలోచనా = కమలములవంటి నేత్రములు గల, కాచిత్ = ఒకానొక వనిత, వంశమ్ = వేణువును, పరిష్వజ్య = కౌగలించుకొని, రహః = రహస్యమునందు, ప్రియతమమ్ = అత్యంతము ప్రియు డైనవానిని, గృహ్య = పట్టుకొని, సకామా = కామముతో కూడిన, కామినీవ = కామిని వలె, సుప్తా = నిద్రించినది.

తా. కమలముల వంటి లోచనములు గల మరి యొక యువతి వేణువును కౌగలించుకొని, కామవంతురా లగు కామిని ప్రియతముని ఏకాంతప్రదేశము నందు గ్రహించి శయనించి నట్లు శయనించెను. 40

మూ. విపఞ్చీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ,
నిద్రావశమనుప్రాప్తా సహ కాన్తేవ భామినీ. 41

ప్ర. అ. నృత్తశాలినీ = నృత్తముతో ప్రకాశించు, అన్యా = మరి యొక స్త్రీ, విపఞ్చీమ్ = ఏడు తీగల వీణను, పరిగృహ్య = గ్రహించి, నియతా =

దానితో సంబద్ధ రాలై, సహకాన్తా = కాంతునితో కూడిన, భామినీవ = స్త్రీ వలె, నిద్రావశమ్ = నిద్రావశమును, అనుప్రాప్తా = పొందినది.

తా. నృత్తమునందు నేర్పు గల మరి యొక వనిత, ఏడు తీగల వీణను గ్రహించి, దానిని దగ్గరగా హృదయమునకు హత్తుకొని, కాంతునితో కూడిన యువతి వలె, నిద్రావశురా లయ్యెను. 41

మూ. అన్యా కనకసంకాశైర్మృదుపీనైర్మనోరమైః,
మృదఙ్గం పరిపీడ్యాఙ్గైః ప్రసుప్తా మత్తలోచనా. 42

ప్ర. అ. మత్తలోచనా = మదించిన నేత్రములు గల, అన్యా = మరి యొక స్త్రీ, కనకసంకాశైః = బంగారముతో సమానములు, మృదుపీనైః = మెత్తనివి, బలిసినవి, మనోహరైః = మనోహరములూ అయిన, అఙ్గైః = అవయవములతో, మృదఙ్గమ్ = మృదంగమును, పరిపీడ్య = కౌగలించుకొని, ప్రసుప్తా = నిద్రించినది.

తా. మదముతో నిండిన నేత్రములు గల మరి యొక యువతి, బంగారు రంగు గలవై, మృదువులై, బలిసి ఉన్న మనోహరములైన అవయవములతో మృదంగమును కౌగలించుకొని నిద్రించెను 42

మూ. భుజపార్శ్వాన్తరస్థేన కక్షగేన కృశోదరీ,
పణవేన సహానిన్ద్యా సుప్తా మదకృతశ్రమా. 43

ప్ర. అ. అనిన్ద్యా = నిందింపబడగని, కృశోదరీ = కృశించిన ఉదరము గల మరి యొక స్త్రీ. మదకృతశ్రమా = మదముచేత చేయబడిన శ్రమ గలదై, భుజపార్శ్వాన్తరస్థేన = భుజముల మధ్యమునం దున్న, కక్షగేన = చంకలో చేరిన, పణవేన సహ = పణవ మను వాద్యముతో కూడ, సుప్తా = నిద్రించెను.

తా. మదముచేత అలసి యున్న మరి యొక కృశోదరి, రెండు భుజముల మధ్య చంకవరకు చేరి ఉన్న పణవముతో కూడ నిద్రించెను. 43

మూ. డిణ్డిమం పరిగృహ్యాన్యా తథైవాసక్తడిణ్డిమా,
ప్రసుప్తా తరుణం వత్సముపగూహ్యేవ భామినీ 44

ప్ర. అ. ఆసక్తడిణ్డిమా = దగ్గరగా ఉన్న డిండిమము గల, అన్యా =

మరి యొక స్త్రీ. డిణ్డిమమ్ = డిండిమమును, పరిగృహ్య = గ్రహించి, తత్రైవ = అక్కడే. తరుణమ్ = వయస్సు ముదిరిన, వత్సమ్ = పుత్రుని, ఉపగూహ్య = కౌగలించుకొని, భామినీ ఇవ = స్త్రీ వలె, ప్రసుప్తా = నిద్రించెను.

తా. మరి యొక వనిత తన దగ్గర నున్న డిండిమ మను వాద్యమును గ్రహించి, అది ఆ విధముగానే ఒడిలో ఉండగా, వయస్సు ముదిరిన కుమారుని కౌగలించుకొని శయనించిన భామిని వలె, శయనించెను. 44

మూ. కాచిదాడమ్బరం నారీ భుజసంయోగపీడితమ్.
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా. 45

ప్ర. అ. కమలపత్రాక్షీ = కమలపత్రముల వంటి నేత్రములు గల, కాచిత్ = ఒకానొక, నారీ = స్త్రీ, ఆడమ్బరమ్ = ఆడంబర మను వాద్యమును, భుజసంయోగపీడితమ్ = భుజముల సంయోగముచేత పీడింపబడినదానినిగా, కృత్వా = చేసి, మదమోహితా = మదముచేత మోహింపచేయబడినదై, ప్రసుప్తా = నిద్రించెను.

తా. కమలపత్రముల వంటి నేత్రములు గల ఒకానొక స్త్రీ ఆడంబర మను వాద్యమును భుజములతో గట్టిగా నొక్కి పట్టి, మదమోహితురాలై నిద్రించెను. 45

మూ. కలశీమపవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ,
వసన్తే పుష్పశబలా మాలేవ పరిమార్జితా. 46

ప్ర. అ. కలశీమ్ = చిన్న కలశను, అపవిధ్య = క్రిందికి వంచివేసి, ప్రసుప్తా = నిద్రించిన, అన్యా భామినీ = మరి యొక స్త్రీ. వసన్తే = వసంతము నందు, పరిమార్జితా = (నీళ్లు చల్లి) పరిశుద్ధము చేయబడిన, పుష్పశబలా = పుష్పములతో విచిత్రవర్ణము గల, మాలేవ = పుష్పమాల వలె, భాతి = ప్రకాశించుచుండెను.

తా. నిద్రలో, ప్రక్కనున్న కలశను దన్నివేసి ఆ నీటితో తడియుచు నిద్రించిన ఒక యువతి, వసంతఋతువులో, విచిత్రవర్ణములు గల పూవులతో నిర్మించి, నీరు చల్లి శుభ్రము చేయబడిన మాల వలె ప్రకాశించుచుండెను. 46

మూ. పాణిభ్యాం చ కుచౌ కాచిత్సువర్ణకలశోపమౌ,
ఉపగూహ్యాబలా సుప్తా నిద్రాబలపరాజితా 47

ప్ర. అ. కాచిత్ = ఒకానొక, అబలా = స్త్రీ, పాణిభ్యామ్ = హస్తములం చేత, సువర్ణకలశోపమౌ = బంగారుకలశములతో సమానము లైన, కుచౌ = తన కుచములను, ఉపగూహ్య = కౌగలించుకొని, నిద్రాబలపరాజితా = నిద్రాబలము చేత వశముచేసికొనబడినదై, సుప్తా = నిద్రించినది.

తా. మరి యొక అబల, బంగారు కలశల వలె ఉన్న తన కుచముం పైననే హస్తము లుంచుకొని, నిద్రకు పూర్తిగా వశురా లై, పండుకొనెను. 47

మూ. అన్యా కమలపత్రాక్షీ పూర్ణేన్దుసదృశాననా,
అన్యామాలిఙ్గ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా. 48

ప్ర. అ. కమలపత్రాక్షీ = కమలపత్రముల వంటి నేత్రములు గలదీ, పూర్ణేన్దుసదృశాననా = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గలదీ అయిన, అన్యా = మరి యొకస్త్రీ, మదవిహ్వలా = మదముచేత వ్యాకులురాలై, సుశ్రోణీమ్ = అంద మైన కటిప్రదేశము గల, అన్యామ్ = మరి యొక స్త్రీని, ఆలిఙ్గ్య = కౌగలించుకొని, ప్రసుప్తా = నిద్రించినది.

తా. పద్మపత్రముల వంటి నేత్రములు, పూర్ణచంద్రుని వంటి ముఖము గల మరి యొక యువతి, మదముచేత ఒళ్లు తెలియనిదై, అంద మైన కటి ప్రదేశము గల మరి యొక స్త్రీని కౌగలించుకొని నిద్రించుచుండెను. 48

మూ. ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః,
నిపీడ్య చ కుచైః సుప్తాః కామిన్యః కాముకానివ. 49

ప్ర. అ. వరస్త్రియః = ఉత్తమ లైన కొందరు స్త్రీలు, విచిత్రాణి = విచిత్రము లైన, ఆతోద్యాని = వాద్యములను, పరిష్వజ్య = కౌగలించుకొని, కామిన్యః = కామము గల స్త్రీలు, కాముకానివ = కామము గల పురుషులను వలె, కుచైః = కుచములతో, నిపీడ్య = పీడించి, సుప్తాః = నిద్రించిరి.

తా. కొందరు ఉత్తమస్త్రీలు అనేక విధము లైన వాద్యములను కౌగ

లించుకొని, కామినులు కాముకులను వలె ఆ వాద్యములను కుచములతో గట్టిగా అదిమిపట్టి, నిద్రించుచుండిరి. 49

మూ. తాసామేకాన్తవిన్యస్తే శయానాం శయనే శుభే,
దదర్శ రూపసంపన్నామపరాం స కపిః స్త్రియమ్. 50

ప్ర. అ. సః కపిః = ఆ హనుమంతుడు, తాసామ్ = ఆ స్త్రీలలో, ఏకాన్తవిన్యస్తే = ఒక ప్రక్క అమర్చబడిన, శుభే = మంగళకర మైన, శయనే = శయనము నందు, శయానామ్ = శయనించి ఉన్న, రూపసంపన్నామ్ = ఉత్తమరూపసంపన్నురా లైన, స్త్రియమ్ = స్త్రీని, దదర్శ = చూచెను.

తా. ఆ స్త్రీలమధ్యలో ఒక వైపు అమర్చిన మంగళకర మైన శయనముపై శయనించి యున్న ఒక అత్యధికసౌందర్యసంపన్నురా లైన అంగన ఆ హనుమంతునకు కనబడెను 50

మూ. ముక్తామణిసమాయుక్తైర్భూషణైః సువిభూషితామ్
విభూషయన్తీమివ తత్స్వశ్రియా భవనోత్తమమ్. 51
గౌరీం కనకవర్ణాభామిష్టామన్తఃపురేశ్వరీమ్,
కపిర్మన్దోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్. 52

ప్ర. అ. కపిః = హనుమంతుడు, ముక్తామణిసమాయుక్తైః = ముత్యములతోను మణులతోను కూడిన, భూషణైః = అలంకారములచేత, సువిభూషితామ్ = చక్కగా అలంకరింపబడినదీ, స్వశ్రియా = తన కాంతిచేత, తత్ = ఆ, భవనోత్తమమ్ = ఉత్తమ మైన భవనమును, విభూషయన్తీమివ = అలంకరించుచున్నది వలె ఉన్నదీ, గౌరీమ్ = పచ్చని శరీరచ్ఛాయ గలదీ, కనకవర్ణాభామ్ = బంగారము రంగు వంటి శరీరకాంతి గలదీ, ఇష్టామ్ = భర్తకు ప్రియురాలూ, అన్తఃపురేశ్వరీమ్ = అంతఃపురమునకు అధిపతి, తత్ర = అక్కడ, శయానామ్ = శయనించినదీ, చారురూపిణీమ్ = అంద మైన రూపము గలదీ, అయిన, మన్దోదరీమ్ = మండోదరిని, (చూచెను).

తా. హనుమంతుడు అక్కడ, ఆ శయనముపై శయనించిన, అత్యద్భుత సౌందర్యవతి యైన మండోదరిని చూచెను. ఆమె, ముత్యములూ, రత్నములూ

పొదిగిన అలంకారములు ధరించెను. తన కాంతిచే ఆ భవనము నంతను అలంకరించుచున్నదా అన్నట్లు ఉండెను. బంగారు చాయ గల ఆమె రావణునకు అత్యంతము ప్రియురాలు. అతని అంతఃపురమునకు అధిపతి. 51, 52

మూ. స తాం దృష్ట్వా మహాబాహుర్భూషితాం మారుతాత్మజః,
తర్కయామాస సీతేతి రూపయౌవనసంపదా, 53
హర్షేణ మహతా యుక్తో ననన్ద హరియూథపః.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః మారుతాత్మజః = ఆ హనుమంతుడు, భూషితామ్ = అలంకరింపబడిన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, రూపయౌవనసంపదా = రూపసంపదచేతను, యౌవనసంపదచేతను, సీతేతి = సీత అని, తర్కయామాస = ఊహించెను. హరియూథపః = వానర సేనాధిపతి యైన ఆ హనుమంతుడు. మహతా = గొప్ప, హర్షేణ = సంతోషముతో, యుక్తః = కూడినవాడై, ననన్ద = ఆనందించెను.

తా. గొప్ప బాహువులు గలవాడూ, వానరయూథమునకు నాయకుడూ అయిన ఆ హనుమంతుడు, అధికముగా అలంకరించుకొని యున్న ఆమెను చూడగానే, ఆమె రూపసంపదను, యౌవనమును బట్టి, ఆమె సీతయై ఉండును అని ఊహించుకొని, అత్యధికముగా సంతోషించెను. 53

మూ. ఆస్ఫోటయామాస చుచుమ్బ పుచ్ఛం
ననన్ద చిక్రీడ జగౌ జగామ,
స్తమ్భానరోహన్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్. 54

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
దశమః సర్గః.

ప్ర. అ. ఆస్ఫోటయామాస = జబ్బలు చరచెను. పుచ్ఛమ్ = తోకను, చుచుమ్బ = ముద్దుపెట్టుకొనెను. ననన్ద = ఆనందించెను. చిక్రీడ = ఆడుకొనెను. జగౌ = పాటపాడెను. జగామ = ఇటు అటు తిరిగెను. స్వామ్ = తన, కపీనామ్ = వానరుల, ప్రకృతిమ్ = స్వభావమును, నిదర్శయన్ = చూపుచు, స్తమ్భాన్ = స్తంభములను, ఆరోహత్ = ఎక్కెను. భూమౌ = నేలపై, నిపపాత = పడెను.

టీ. అప్పుడు ఆ హనుమంతుడు, సీత కనబడినది గదా అను ఆనంద పారవశ్యముతో జబ్బలు చరచుకొనెను; తోక ముద్దుపెట్టుకొనెను; ఆనందించెను; ఆడెను; పాడెను; ఇటు అటు పచారులు చేసెను. సహజమైన వానరస్వభావమును చూపుచు గబగబా స్తంభములపై కెక్కి క్రిందికి దుమికెను. 54

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పదవ సర్గ సమాప్తము.

## అథ ఏకాదశః సర్గః

[ఈమె సీత కాదని నిశ్చయించుకొని హనుమంతుడు మరల పానగృహములో సీతకై వెదకుట. పరస్త్రీ దర్శనముచేత తనకు ధర్మలోపము కలిగినదికదా అని శంకించుకొని "నా మనస్సు నిష్కల్మషముగా ఉన్నదికదా" అని సమాధానపడుట].

మూ. అవధూయ చ తాం బుద్ధిం బభూవావస్థితస్తదా,
ఆగాము చాపరాం చిన్తాం సీతాం ప్రతి మహాకపిః. 1

ప్ర. అ. మహాకపిః=హనుమంతుడు, తదా = అప్పుడు, తామ్=ఆ, బుద్ధిమ్=ఆలోచనను, అవధూయ = తొలగించుకొని, అవస్థితః = సరియైన ఆలోచన కలవాడుగా, బభూవ = ఆయెను. సీతాం ప్రతి = సీతను గూర్చి, అపరామ్=మరి యొక, చిన్తామ్=ఆలోచనను, జగామ=పొందెను.

తా. హనుమంతుడు మండోదరిని చూడగానే, ఈ విధముగా మొదట కలిగిన ఆ ఆలోచనను విడచి, స్వస్థచిత్తుడై, సీతవిషయమున మరి యొక ఆలోచన చేసెను. 1

మూ. న రామేణ వియుక్తా సా స్వప్తుమర్హతి భామినీ,
న భోక్తుం నాప్యలంకర్తుం న పానముపసేవితుమ్. 2
నాన్యం నరముపస్థాతుం సురాణామపి చేశ్వరమ్,
న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి, 3
అన్యేయమితి నిశ్చిత్య పానభూమౌ చచార సః.

ప్ర. అ. సా = ఆ, భామినీ = సీత, రామేణ = రామునితో, వియుక్తా = వియోగము పొందినదై, స్వప్తుమ్ = నిద్రించుటకు, న అర్హతి = తగదు. భోక్తుమ్ = భుజించుటకు, న=తగదు. అలంకర్తుమ్ అపి=అలంకరించుకొనుటకు కూడ, న = తగదు. పానమ్ = పానమును, ఉపసేవితుమ్ = సేవించుటకు, సురాణామ్

= దేవతలయొక్క, ఈశ్వరమపి = ప్రభు వైనను, అన్యమ్ = మరి యొక, నరమ్ = పురుషుని, ఉపస్థాతుమ్ = చేరుటకు, న = తగదు. హి = ఎందుచేత ననగా, రామసమః = రామునితో సమానుడు, కశ్చిత్ = ఒక్కడును, త్రిదశేష్వపి = దేవతలలో కూడ, న విద్యతే హి = లేడు కదా; ఇయమ్ = ఈమె, అన్యా = మరియొకతె, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించుకొని, సః = హనుమంతుడు, పానభూమౌ = పానగృహమునందు, చచార = తిరిగెను.

తా. ఆ సీత రాముడు లేకుండగా నిద్రింపజాలదు. భోజనము కాని, అలంకారధారణము గాని, పానసేవనము కాని చేయజాలదు. రాముని తప్ప పరపురుషుని ఎవ్వనినీ, అతడు సాక్షాత్తు దేవతాధిపతియే అయినను, చేరదు. రామునితో సమానుడు ఎవ్వడూ దేవతలలోకూడ లేడు కదా। అందుచేత ఈమె మరెవ్వరో అయి ఉండును అని నిశ్చయించుకొని హనుమంతుడు మరల ఆ పానగృహములో సంచరించుటకు ప్రారంభించెను. 2, 3

మూ. క్రీడితేనాపరాః క్లాన్తా గీతేన చ తథాపరాః, 4
నృత్తేన చాపరాః క్లాన్తాః పానవిప్రహతాస్తథా.

ప్ర. అ. అపరాః = కొందరు స్త్రీలు, క్రీడితేన = రతిచేత, క్లాన్తాః = అలసిరి. తథా = అట్లే, అపరాః = మరి కొందరు స్త్రీలు, గీతేన = పాడుటచేత అలసిరి. అపరాః = మరికొందరు స్త్రీలు, నృత్తేన = నృత్తము చేయుటచేత, క్లాన్తాః = అలసిరి. తథా = మరియు, మరికొందరు, పానవిప్రహతాః = మద్యపానముచేత స్మృతి తప్పి పడియుండిరి.

తా. ఆ పానగృహములో కొందరు స్త్రీలు రతిచేత అలసిపోయిరి. కొందరు పాటలు పాడి పాడి అలసిరి. మరికొందరు నృత్తముచేత అలసిపోయిరి. మరికొందరు మద్యపానముచే స్మృతి తప్పి పడియుండిరి. 4

మూ. మురజేషు మృదఙ్గేషు పీఠికాసు చ సంస్థితాః, 5
తథాస్తరణముఖ్యేషు సంవిష్టాశ్చాపరాః స్త్రియః.

ప్ర. అ. (కొందరు స్త్రీలు), మురజేషు = మురజములపైన, మృదఙ్గేషు = మృదంగములపైనా, పీఠికాసు చ = చిన్న పీఠములపైనా, సంస్థితాః = శయనిం

రిరి. అపరాః = మరికొందరు, స్త్రియః = స్త్రీలు, ఆస్తరణముఖ్యేషు = ముఖ్యము లైన ఆస్తరణములపై, సంవిష్టాః = శయనించిరి.

తా. కొందరు స్త్రీలు మురజములపైన, మద్దెళ్లపైన, చిన్న పీఠముల పైన ఆనుకొని నిద్రించుచుండిరి. మరి కొందరు మంచి తివాచీలపై శయనించిరి. 5

మూ. అఙ్గనానాం సహస్రేణ భూషితేన విభూషణైః, 6
రూపసల్లాపశీలేన యుక్తగీతార్థభాషిణా,

దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభిధాయినా, 7
రతాభిరతసంసుప్తం దదర్శ హరియూథపః.

ప్ర. అ. విభూషణైః = అలంకారములచేత, భూషితేన = అలంకరించబడి నదీ, రూపసల్లాపశీలేన = రూపమును గూర్చి మాటలాడు స్వభావము గందీ, యుక్తగీతార్థభాషిణా = పాడబడుచున్న గీతముల అర్థమును గూర్చి మాటలాడు కొనునదీ, దేశకాలాభియుక్తేన = దేశకాలములకు అనుగుణముగా ప్రవర్తించు నదీ, యుక్తవాక్యాభిధాయినా = తగిన వాక్యములను పలుకునదీ అయిన, అఙ్గనా నామ్ = స్త్రీలయొక్క, సహస్రేణ = సహస్రముచేత, రతాభిరతసంసుప్తమ్ = రతియందు ఆసక్తివలన కలిగిన నిద్రించుటను, హరియూథపః = హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా. అక్కడ నున్న వేలకొలది స్త్రీలు వివిధాలంకారములతో ప్రకాశించు చుండిరి. వారికి సౌందర్యాదివిషయములను గూర్చి ముచ్చటించుకొనుట అల వాటు. వారు ఎవరైన పాడుచున్న గీతములలోని అర్థమును గూర్చి మాటలాడు కొనుచుందురు. వారందరూ దేశకాలములు తెలిసినవారు. తగు విధముగా మాట లాడువారు. అట్టి స్త్రీలందరూ రతమునందు అభిరతలై (ఆసక్తలై) విరప నిద్రించియుండగా హనుమంతుడు చూచెను. 6, 7

మూ. తాసాం మధ్యే మహాబాహుః శుశుభే రాక్షసేశ్వరః, 8
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథా వృషః.

ప్ర. అ. తాసామ్ = ఆ స్త్రీలయొక్క, మధ్యే = మధ్యయందు, మహాబాహుః = గొప్ప బాహువులు గల, రాక్షసేశ్వరః = రావణుడు, మహతి = గొప్పదైన,

గోష్ఠే=గోశాలయందు, గవామ్ = గోవులయొక్క, మధ్యే = మధ్యయందు, వృషః ఇవ=వృషభము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. మహాబాహు వైన ఆ రావణుడు, ఆ స్త్రీల మధ్య, విశాల మైన గోశాలలో గోవుల మధ్య వృషభము వలె ప్రకాశించెను. 8

మూ. స రాక్షసేన్ద్రః శుశుభే తాభిః పరివృతః స్వయమ్, 9
కరేణుభిర్యథారణ్యే పరికీర్ణో మహాద్విపః.

ప్ర. అ. తాభిః=ఆ స్త్రీలచేత, పరివృతః=చుట్టువారుకొనబడిన, సః రాక్షసేన్ద్రః=ఆ రావణుడు, స్వయమ్=తాను, మహారణ్యే=మహారణ్యమునందు, కరేణుభిః=ఆడ ఏనుగులచేత, పరికీర్ణః=చుట్టువారుకొనబడిన, మహాద్విపః యథా=మహాగజము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. చుట్టూ ఆ స్త్రీలందరూ ఉండగా మధ్యలో ఉన్న ఆ రావణుడు మహారణ్యములో ఆడఏనుగుల మధ్య ఉన్న మహాగజము వలె ప్రకాశించెను. 9

మూ. సర్వకామైరుపేతాం చ పానభూమిం మహాత్మనః, 10
దదర్శ హరిశార్దూలస్తస్య రక్షఃపతేర్గృహే.

ప్ర. అ. హరిశార్దూలః=వానరశ్రేష్ఠుడు, మహాత్మనః=మహాత్ము డైన, తస్య=ఆ, రక్షఃపతేః=రావణునియొక్క, గృహే=గృహమునందు, సర్వకామైః=సమస్త మైన భోగ్యవస్తువులతో, ఉపేతామ్=కూడిన, పానభూమిం చ=పానభూమిని కూడ, దదర్శ=చూచెను.

తా. వానరశ్రేష్ఠు డైన ఆ హనుమంతుడు, మహాత్ము డైన ఆ రాక్షసరాజు గృహమునందు, సమస్తభోగ్యవస్తువులతో నిండి యున్న పానభూమిని చూచెను. 10

మూ. మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః,
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః.

ప్ర. అ. సః=హనుమంతుడు, తత్ర=అక్కడ, పానభూమౌ=పానభూమియందు, భాగశః=వేరు వేరుగా, న్యస్తాని=ఉంచబడిన, మృగాణామ్ = లేళ్ల

యొక్క, మహిషాణాం చ=అడవిదున్నపోతులయొక్క, వరాహాణాం చ=అడవిపందులయొక్క, మాంసాని=మాంసములను, దదర్శ=చూచెను.

తా. హనుమంతు డా పానభూమిలో వేరు వేరుగా ఉంచిన లేళ్ల మాంసములను అడవిదున్నపోతుల మాంసములను, అడవిపందుల మాంసములను చూచెను.

మూ. రౌక్మేషు చ విశాలేషు భాజనేష్వర్ధభక్షితాన్, 12
దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాంస్తథా.

ప్ర. అ. హరిశార్దూలః=హనుమంతుడు, రౌక్మేషు = బంగారువికారమైన, విశాలేషు=విశాలము లైన, భాజనేషు=పాత్రలలో, అర్ధభక్షితాన్=సగము భక్షింపబడిన, మయూరాన్=నెమళ్లను, తథా=మరియు, కుక్కుటాన్=కోళ్లను, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు అక్కడ విశాలము లైన, బంగారు పాత్రలలో, సగము తినగా మిగిలిన నెమళ్లను, కోళ్లను చూచెను. 12

మూ. వరాహవార్ధ్రాణసకాన్ దధిసౌవర్చలాయుతాన్,
శల్యాన్ మృగమయూరాంశ్చ హనుమానన్వవైక్షత. 13

ప్ర. అ. దధిసౌవర్చలాయుతాన్ = పెరుగుతోను, సౌవర్చల మను లవణముతోను, కూడిన, వరాహవార్ధ్రాణసకాన్ = వరాహములను, వార్ధ్రాణసకములను (ఒక విధ మగు పక్షికి, ఒక విధ మైన మేకపోతునకు కూడ వార్ధ్రాణసక మని పేరు), శల్యాన్=శల్యమృగములను, మృగమయూరాంశ్చ = లేళ్లను, నెమళ్లను, కూడ, హనుమాన్ = హనుమంతుడు, అన్వవైక్షత = చూచెను.

తా. హనుమంతు డక్కడ, పెరుగు, సౌవర్చలలవణము కలిపి వండిన వరాహములు, వార్ధ్రాణసకము లను పక్షులు (లేదా ఒక విధ మైన మేకపోతులు) ఏదుపందులు, లేళ్లు, నెమళ్లు, మొద లైన వాటి మాంసములను చూచెను. 13

మూ. క్రకరాన్వివిధాన్ సిద్ధాంశ్చకోరానర్ధభక్షితాన్, 14
మహిషానేకశల్యాంశ్చ ఛాగాంశ్చ కృతనిష్ఠితాన్,
లేహ్యానుచ్చావచాన్ పేయాన్ భోజ్యాని వివిధాని చ. 15

ప్ర. అ. వివిధాన్=అనేకవిధము లైన, సిద్ధాన్=వంట సిద్ధము చేయ బడిన, క్రకరాన్=కక్కెరపక్షులను, అర్ధభక్షితాన్=సగము తినబడిన, చకో రాన్=చకోరపక్షులను, మహిషాన్ = అడవిదున్నలను, ఏకశల్యాంశ్చ=ఏక శల్యము లను మత్స్యములను, కృతనిష్ఠితాన్ = సిద్ధము చేసి ఉంచబడిన, ఛాగాంశ్చ=మేకలను, ఉచ్చావచాన్=అనేకవిధము లైన, లేహ్యాన్=నాకి తిన వలసిన పదార్థములను, పేయాన్ =త్రాగదగిన పదార్థములను, వివిధాని = అనేకవిధము లైన, భోజ్యాని = తినుబండారములను (చూచెను).

తా. హనుమంతుడు అక్కడ తినుటకు సిద్ధముగా ఉన్న కక్కెరపక్షు లను, దున్నపోతులను, ఏకశల్యము లను మత్స్యములను, తయారు చేసి సిద్ధ ముగా ఉంచిన మేకలను, అనేకవిధము లైన లేహ్యములను, పేయములను, వివిధము లైన భోజ్యములను చూచెను. 14, 15

మూ. తథామ్లలవణోత్తంసైర్వివిధై రాగషాడబైః,
హారనూపురకేయూరై రపవిద్ధైర్మహాధనైః. 16
పానభాజనవిక్షిప్తైః ఫలైశ్చ వివిధైరపి,
కృతపుష్పోపహారా భూరధికం పుష్యతి శ్రియమ్. 17

ప్ర. అ. తథా = అట్లే, అమ్లలవణోత్తంసైః = పులుపు, ఉప్పు ప్రధాన ముగా గల. వివిధైః = అనేకవిధము లైన, రాగషాడబైః = రాగషాడబములం తోను. (షాడబ మనగా షడ్రసములు గల పదార్థము లన్నీ కలిపి తయారుచేసిన ఒక భక్ష్యము లేదా పేయము అయిన పదార్థము. ఆరు స్వరములు గల రాగము నకు కూడ షాడబ మని పేరు. ఆ పక్షమున, 'వివిధైః' అనుదానికి వివిధభక్ష్యము లని అర్థము చెప్పి 'రాగషాడబైః' అనుదానికి 'షాడబరాగములచేత' అని అర్థము చెప్పవలెను. నిద్రకు పూర్వము పానశాలలో షాడబరాగగానము జరిగిన దని భావము చెప్పవలెను. కాని ఇక్కడ ప్రకరణానుగుణముగా ఉండుటకు షాడబ శబ్దమునకు "భక్ష్యవిశేషము" లేదా "పేయవిశేషము" అను అర్థమే యుక్తము. 'రాగ' అనగా తెల్ల ఆవాలు, అందుచేత "తెల్లఆవాలు చల్లిన షడ్రససంయోగకృత భక్ష్యవిశేషములు" అని షాడబశబ్దమునకు గోవిందరాజులు ఒక అర్థము చెప్పి "సితామధ్వాదిమధురో ద్రాక్షాదాడిమజో రసః, విరళశ్చేత్ కృతో రాగః సాన్ద్రశ్చేత్ షాడబః స్మృతః" అను ప్రదీపకారుని వాక్యము నుదాహరించి "చక్కెర,

లేనె, మొదలైనవి కలుపుటచే మధురముగా చేయబడిన ద్రాక్షాదాడిమాదిఫలం రసము పల్చగా ఉన్నచో రాగమనీ, గట్టిగా ఉన్నచో షాడబమనీ అర్థమును సూచించినారు. ఈ అర్థము బాగున్నది. భరతుని నాట్యశాస్త్రములో కూడ— "యథా హి గుడాదిభిర్ద్రవ్యైః వ్యంజనైరౌషధిభిశ్చ షాడబాదయో రసా నిర్వర్త్యన్తే" అని షాడబశబ్దార్థము సూచితము). అపవిద్ధైః = ఇటు అటు చిమ్మివేయబడిన, మహాధనైః = గొప్ప మూల్యము గల, హారనూపురకేయూరైః = హారములతోను, నూపురములతోను, కేయూరములతోను, పానభాజనవిక్షిప్తైః = పానపాత్రలందు విడువబడిన, వివిధైః = అనేకవిధములైన, ఫలైశ్చ = ఫలములతోను, కృతపుష్పోపహారా = చేయబడిన పుష్పముల ఉపహారము (అలంకారార్థమై నేలపై పువ్వులు చల్లుట ఉపహారము) గల, భూః = ఆ భూమి, అధికమ్ = అధికముగా, శ్రియమ్ = శోభను, పుష్యతి = పోషించుచుండెను.

తా. ప్రధానముగా పులుపు, ఉప్పు వేసిన వివిధపదార్థములతోను, రాగములతోను, షాడబములతోను, ఇటు నటు చిమ్మబడి ఉన్న అమూల్యములైన హారములతోను, నూపురములతోను, కేయూరములతోను, పానపాత్రలందు వదలవేయబడిన వివిధఫలములతోను, పుష్పములు చల్లి అలంకరింపబడిన ఆ నేల ఎక్కువ శోభను పోషించుచుండెను. 16, 17

మూ. తత్ర తత్ర చ విన్యస్తైః సుశ్లిష్టైః శయనాసనైః,
పానభూమిర్వినా వహ్నిం ప్రదీప్తేవోపలక్ష్యతే. 18

ప్ర. అ. పానభూమిః = ఆ పానభూమి, తత్ర తత్ర = అక్కడక్కడ, విన్యస్తైః = ఉంచబడిన, సుశ్లిష్టైః = చక్కగా అమర్చబడిన, శయనాసనైః = శయనములతోను, ఆసనములతోను, వినా వహ్నిమ్ = అగ్ని లేకుండగనే, ప్రదీప్తేవ = మండుచున్నది వలె, ఉపలక్ష్యతే = చూడబడుచుండెను.

తా. శయనములు, ఆసనములు అక్కడక్కడ ఉంచి, చక్కగా అలంకరించుటచే, ఆ పానశాల అగ్ని లేకుండగనే మండిపోవుచున్నట్లు ఉండెను. 18

మూ. బహుప్రకారైర్వివిధైర్వరసంస్కారసంస్కృతైః,
మాంసైః కుశలసంయుక్తైః పానభూమిగతైః పృథక్. 19

ప్ర. అ. బహుప్రకారైః = అనేకపద్ధతులు గలవి, వివిధైః = అనేక విధము లైనవి, వరసంస్కారసంస్కృతైః = మంచి సంస్కారములచే (వండుట, తాలింపులు వేయుట మొదలైనవానిచే) సంస్కరింపబడినవి, కుశలసంయుక్తైః = నేర్పుగా అమర్చబడినవి, పృథక్ = వేరు వేరుగా, పానభూమిగతైః = పానభూమిని పొందినవి అయిన, మాంసైః = మాంసములతో-(వివిధము లైన మద్యము లచట ఉన్నవి అని ఉత్తరశ్లోకముతో అన్వయము).

తా. ఆ పానభూమిలో అనేకవిధము లైన మాంసములను మంచి పాకాది సంస్కారములచే సంస్కరించి, వానితో అనేకపద్ధతులలో భక్ష్యములను తయారు చేసి, నేర్పుగా, చూచుటకు ఇంపుగా ఉండు నట్లు అమర్చిరి. (అట్టి మాంసములతో పాటు అచట ఉంచబడిన మద్యములు కూడ అచట ఉండెను). 19

మూ. దివ్యాః ప్రసన్నా వివిధాః సురాః కృతసురా అపి,
శర్కరాసవమాధ్వీకపుష్పాసవఫలాసవాః, 20
వాసచూర్ణైశ్చ వివిధైర్మృష్టాస్తైస్తైః పృథక్ పృథక్.

ప్ర. అ. దివ్యాః = శ్రేష్ఠ మైన, ప్రసన్నాః = నిర్మల మైన, వివిధాః = అనేకవిధము లైన, సురాః = (సహజము లైన కల్లువంటి) మద్యములు, శర్కరాసవమాధ్వీకపుష్పాసవఫలాసవాః = శక్కరతో చేసిన మద్యము, తేనెతో చేసిన మద్యము, పువ్వులతో చేసిన మద్యము, పండ్లతో చేసిన మద్యము అను, కృతసురాః అపి = కృత్రిమముగా తయారుచేసిన మద్యములు, తైస్తైః = ఆ యా, వివిధైః = అనేకవిధము లైన, వాసచూర్ణైః = సువాసన కలిగించు చూర్ణములచేత, పృథక్ పృథక్ = వేరువేరుగా, మృష్టాః = సంస్కరింపబడినవి.

తా. శ్రేష్ఠములూ, నిర్మలములూ అయిన సహజముగా లభ్యము లయ్యే మద్యములు, శక్కర, తేనె, పుష్పములు, ఫలములు మొదలగువానితో తయారు చేసిన కృత్రిమమద్యములు, సువాసన కలిగించు వివిధములైన చూర్ణములతో సంస్కరించి వేరువేరుగా అచట ఉంచబడెను. 20

మూ. సంతతా శుశుభే భూమిర్మాల్యైశ్చ బహుసంస్థితైః, 21
హిరణ్మయైశ్చ వివిధైర్భాజనైః స్ఫాటికైరపి.
జాంబూనదమయైశ్చాన్యైః కరకైరభిసంవృతా. 22

ప్ర. అ. బహుసంస్థితైః = అనేకరూపాలలో ఉన్న, మాల్యైశ్చ = పుష్పమాలలతో, సంతతా = నిండినదీ, హిరణ్మయైః = బంగారువికారములు, స్ఫాటికైరపి = స్ఫటికవికారములు అయిన, వివిధైః = అనేకవిధములైన, భాజనైః = పాత్రలతోను, జాంబూనదమయైః = బంగారువికారమైన, అన్యైః = ఇతరములైన, కరకైః = చిన్న పాత్రలతోను, అభిసంవృతా = వ్యాప్తమైనదీ అయిన, భూమిః = భూమి, శుశుభే = ప్రకాశించెను.

తా. ఆ పానభూమియందు అంతటను అనేక ఆకారములలో కట్టిన పుష్పమాలలు, బంగారువికారమైన పెద్ద పాత్రలు, స్ఫటికవికారములైన పాత్రలు, బంగారు చిన్న పాత్రలు ఉండుటచే అది చాల అందముగా ఉండెను. 21, 22

మూ. రాజతేషు చ కుమ్భేషు జామ్బూనదమయేషు చ,
పానశ్రేష్ఠం తదా భూరి కపిస్తత్ర దదర్శ హ. 23

ప్ర. అ. కపిః = హనుమంతుడు, తదా = అప్పుడు, రాజతేషు = వెండివికారమైనవీ, జామ్బూనదమయేషు చ = బంగారువికారమైనవీ అయిన, కుమ్భేషు = కుంభములలో, భూరి = అధికమైన, పానశ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన మద్యమును, దదర్శ హ = చూచెను.

తా. హనుమంతుడు, అప్పుడు, బంగారు కడవలలోను, వెండి కడవలలోను అత్యధికప్రమాణములో ఉన్న, శ్రేష్ఠమైన మద్యమును చూచెను. 23

మూ. సోఽపశ్యచ్ఛాతకుమ్భాని శీధోర్మణిమయాని చ,
రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః. 24

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, శీధోః = మద్యముయొక్క, శాతకుమ్భాని = బంగారువికారమైనవీ, మణిమయాని చ = మాణిక్యవికారమైనవీ, రాజతాని చ = వెండివికారమైనవీ అయిన, పూర్ణాని = నిండిన, భాజనాని = పాత్రలను, అపశ్యత్ = చూచెను.

తా. ఆ వానరశ్రేష్ఠుడు మద్యముతో నింపిన బంగారు పాత్రలను, మణులు పొదిగిన పాత్రలను, వెండి పాత్రలను చూచెను. 24

మూ. క్వచిదర్ధావశేషాణి క్వచిత్పీతాని సర్వశః,
క్వచిన్నైవ ప్రపీతాని పానాని స దదర్శ హ. 25

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, క్వచిత్ = కొన్ని చోట్ల, అర్ధావశేషాణి = సగము మిగిలినవి, క్వచిత్ = కొన్ని చోట్ల, సర్వశః = పూర్తిగా, పీతాని = త్రాగివేయబడినవి, క్వచిత్ = కొన్ని చోట్ల, నైవ ప్రపీతాని = అసలే త్రాగబడనివి అయిన, పానాని = పానములను, దదర్శ హ = చూచెను.

తా. అక్కడ కొన్ని చోట్ల ఉన్న పాత్రలలోని మద్యము సగము మిగిలి ఉండెను. కొన్ని చోట్ల పూర్తిగా త్రాగివేసిరి. కొన్ని చోట్ల అసలే త్రాగలేదు. 25

మూ. క్వచిద్ భక్ష్యాంశ్చ వివిధాన్ క్వచిత్పానాని భాగశః,
క్వచిదన్నావశేషాణి పశ్యన్వై విచచార హ. 26

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, వివిధాన్ = అనేకవిధము లైన, భక్ష్యాంశ్చ = భక్ష్యములను, క్వచిత్ = కొన్ని చోట్ల, భాగశః = వేరు వేరుగా, పానాని = పానములను, క్వచిత్ = కొన్ని చోట్ల, అన్నావశేషాణి = అన్నముల అవశేషములను, పశ్యన్ = చూచుచు, విచచార హ = సంచరించెను.

తా. హనుమంతుడు కొన్ని చోట్ల అనేకవిధము లైన భక్ష్యములను, కొన్ని చోట్ల వేరు వేరుగా మద్యములను, కొన్ని చోట్ల తినగా మిగిలిన అన్నములను చూచుచు సంచరించెను. 26

మూ. క్వచిత్ప్రభిన్నైః కరకైః క్వచిదాలోలితైర్ఘటైః,
క్వచిత్సంపృక్తమాల్యాని జలాని చ ఫలాని చ. 27

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, ప్రభిన్నైః = భిన్న లైన, కరకైః = పాత్రలతోను, క్వచిత్ = కొన్ని చోట్ల, ఆలోలితైః = కలచివేయబడిన, ఘటైః = ఘటములతోను, (కూడిన ప్రదేశములను), క్వచిత్ = కొన్ని చోట్ల, సంపృక్తమాల్యాని = లగ్నమైన మాలలు గల, జలాని చ = జలములను, ఫలాని చ = ఫలములను, (చూచుచు సంచరించెను).

తా. కొన్ని చోట్ల భిన్న లైపోయిన పాత్రలను, కొన్ని చోట్ల కలచివేయ.

లబడిన ఘటములను, కొన్ని చోట్ల పుష్పమాలలతో కూడిన బలములను, ఫలములను చూచుచు హనుమంతుడు సంచరించెను. 27

మూ. శయనాన్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః,
పరస్పరం సమాశ్లిష్య కాశ్చిత్సుప్తా వరాఙ్గనాః. 28

ప్ర. అ. అత్ర=అక్కడ. నారీణామ్ = స్త్రీలయొక్క, శయనాని పునః =శయనము లైతే, బహుధా = అనేకవిధములుగా నుండి, శుభ్రాణి = శుభ్రమైనవి. కాశ్చిత్=కొందరు, వరాఙ్గనాః=స్త్రీలు, పరస్పరమ్ = పరస్పరమూ, సమాశ్లిష్య=కౌగలించుకొని, సుప్తాః=నిద్రించిరి.

తా. అక్కడ నున్న స్త్రీల శయనములు అనేక ఆకారములలో శుభ్రముగా ఉండెను. కొందరు స్త్రీలు ఒండొరులను కౌగలించుకొని నిద్రించుచుండిరి. 28

మూ. కాశ్చిచ్చ వస్త్రమన్యస్యాః స్వపన్త్యాః పరిధాయ చ,
ఆహృత్య చాబలాః సుప్తా నిద్రాబలపరాజితాః. 29

ప్ర. అ. కాశ్చిత్=కొందరు, అబలాః = స్త్రీలు, నిద్రాబలపరాజితాః = నిద్రాబలముచేత ఓడింపబడినవారై, స్వపన్త్యాః=నిద్రించుచున్న, అన్యస్యాః = మఱియొక స్త్రీయొక్క, వస్త్రమ్=వస్త్రమును, ఆహృత్య = లాగికొని, పరిధాయ =కప్పుకొని, సుప్తాః = నిద్రించిరి.

తా. కొందరు స్త్రీలు నిద్రకు పూర్తిగా ఒడలు తెలియక, ప్రక్క నున్న స్త్రీల వస్త్రములను లాగికొని, వాటిని కప్పుకొని నిద్రించుచుండిరి. 29

మూ. తాసాముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్,
నాత్యర్థం స్పన్దతే చిత్రం ప్రాప్య మన్దమివానిలమ్. 30

ప్ర. అ. తాసామ్ = ఆ స్త్రీలయొక్క, గాత్రజమ్ = గాత్రమునందు పుట్టిన (ఉన్న), వస్త్రమ్=వస్త్రము, మాల్యం చ = మాల్యము, ఉచ్ఛ్వాసవాతేన= శ్వాసం గాలిచేత, మన్దమ్ = మంద మైన, అనిలమ్ = వాయువును, ప్రాప్య ఇవ = పొంది వలె, నాత్యర్థమ్=కొంచెముగా, చిత్రమ్ = అందముగా, స్పన్దతే= కదలుచుండెను.

తా. ఆ స్త్రీల నిశ్శ్వాసవాయువులచేత, వారి శరీరముపైని ఉన్న వస్త్రములు, పుష్పమాలలు, మందమారుతముచేత కదలినట్లు, మెల్లగా, చూచుటకు ముచ్చట గొల్పునట్లుగా కదలుచుండెను. 30

మూ. చన్దనస్య చ శీతస్య శీధోర్మధురసస్య చ,
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ, 31
బహుధా మారుతస్తత్ర గన్ధం వివిధముద్వహన్.

ప్ర. అ. తత్ర = అక్కడ, మారుతః = వాయువు, శీతస్య = చల్లని, చన్దనస్య = గంధముయొక్క, శీధోః = మద్యముయొక్క, మధురసస్య చ = తేనె రసముయొక్క, వివిధస్య = అనేకవిధములైన, మాల్యస్య = పుష్పమాలయొక్క, వివిధస్య = అనేకవిధములైన, ధూపస్య చ = ధూపముయొక్క, వివిధమ్ = అనేకవిధములైన, గన్ధమ్ = సువాసనను, బహుధా = అనేకరీతుల (నలుమూలలా), ఉద్వహన్ = మోయుచు (వీచెను).

తా. చల్లని చందనము, మద్యము, తేనె, రసము, అనేకవిధములైన పుష్పమాలలు, అనేకవిధములైన ధూపములు వీని అన్నిటి— వివిధసుగంధములను వ్యాపింపచేయుచు వాయువు నలుమూలల వీచుచుండెను. 31

మూ. స్నానానాం చన్దనానాం చ ధూపానాం చైవ మూర్ఛితః,
ప్రవవౌ సురభిర్గన్ధో విమానే పుష్పకే తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, పుష్పకే విమానే = ఆ పుష్పకవిమానమునందు, స్నానానామ్ = స్నానములయొక్క, చన్దనానాం చ = చందనములయొక్క, ధూపానాం చైవ = ధూపములయొక్క, సురభిః = పరిమళించుచున్న, గన్ధః = సువాసన, మూర్ఛితః = అంతటా వ్యాపించినదై, ప్రవవౌ = వీచెను.

తా. అప్పుడు, స్నానసమయమునందు ఉపయోగించు సుగంధద్రవ్యములు, చందనములు, ధూపములు వీని సుగంధము అంతట వ్యాపించి ఆ పుష్పక విమానమునందు ప్రసరించుచుండెను. 32

మూ. శ్యామావదాతాస్తత్రాన్యాః కాశ్చిత్కృష్ణా వరాఙ్గనాః, 33
కాశ్చిత్ కాఞ్చనవర్ణాఙ్గ్యః ప్రమదా రాక్షసాలయే.

ప్ర. అ. తత్ర=ఆ, రాక్షసాలయే=రావణుని అంతఃపురమునందు, అన్యాః=కొందరు స్త్రీలు, శ్యామావదాతాః = చామనచాయ, తెలుపురంగు గలవారు. కాశ్చిత్ = కొందరు, వరాఙ్గనాః=శ్రేష్ఠులైన స్త్రీలు, కృష్ణాః=నల్లగా ఉన్నవారు. కాశ్చిత్ = కొందరు, ప్రమదాః = స్త్రీలు, కాఞ్చనవర్ణాఙ్గ్యః = బంగారు రంగు శరీరము గలవారు.

తా. రావణాంతఃపురములోని స్త్రీలలో కొందరు చామనచాయగలవాళ్లు, కొందరు తెల్లనివాళ్లు, కొందరు నల్లవాళ్లు, కొందరు బంగారపు వన్నె కలవాళ్లు ఉండిరి. 33

మూ. తాసాం నిద్రావశత్వాచ్చ మదనేన విమూర్ఛితమ్, 34
పద్మినీనాం ప్రసుప్తానాం రూపమాసీద్యథైవ హి.

ప్ర. అ. నిద్రావశత్వాచ్చ=నిద్రాపరవశ లగుటవలనను, మదనేన చ= మన్మథునిచేతను, విమూర్ఛితమ్ = అలసట చెందిన, ప్రసుప్తానామ్ = నిద్రించుచున్న, తాసామ్=ఆ స్త్రీలయొక్క, రూపమ్=రూపము, ప్రసుప్తానామ్=నిద్రించుచున్న (ముకుళించుకొనిపోయిన), పద్మినీనామ్ = పద్మలతల రూపము, యథైవ = ఎట్లో, అట్లు, ఆసీత్ = ఉండెను.

తా. నిద్రాపారవశ్యముచేతను, రతికేళులు సలిపి ఉండుటచేతను అలసిపోయిన ఆ స్త్రీల రూపము, ముకుళీభవించిన పద్మలతల రూపము వలె ఉండెను.

మూ. ఏవం సర్వమశేషేణ రావణాన్తఃపురం కపిః, 35
దదర్శ సుమహాతేజాః న దదర్శ చ జానకీమ్.

ప్ర. అ. సుమహాతేజాః = గొప్ప తేజస్సు గల, కపిః = హనుమంతుడు, ఏవమ్=ఇట్లు, సర్వమ్=సమస్తమైన, రావణాన్తఃపురం=రావణుని అంతఃపురమును, అశేషేణ=పూర్తిగా, దదర్శ=చూచెను. జానకీం చ=జానకిని మాత్రము, న దదర్శ = చూడలేదు.

తా. మహాతేజశ్శాలి యైన హనుమంతుడు ఈ విధముగా, ఆ రావణాంతఃపురము నంతను పూర్తిగా చూచెను గాని జానకి మాత్రము అతనికి కనబడలేదు. 35

మూ. నిరీక్షమాణశ్చ తదా తాః స్త్రియః స మహాకపిః, ౩౬
జగామ మహతీం చిన్తాం ధర్మసాధ్వసశఙ్కితః.

ప్ర. అ. తదా = అప్పుడు, తాః స్త్రియః = ఆ స్త్రీలను, నిరీక్షమాణః = చూచుచున్న, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, ధర్మసాధ్వసశఙ్కితః = ధర్మమునకు సంబంధించిన భయమువలన శంకితుడై, మహతీమ్ = గొప్ప, చిన్తామ్ = చింతను, జగామ = పొందెను.

తా. అప్పుడు ఆ స్త్రీల నంతటిని చూచుచున్న ఆ హనుమంతునకు, ధర్మలోపము చేసినానా అను శంకచే, ఎక్కువ విచారము కలిగెను. ౩౬

మూ. పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్, ౩౭
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి.

ప్ర. అ. ప్రసుప్తస్య = నిద్రించుచున్న, పరదారావరోధస్య = పరభార్యల అంతఃపురముయొక్క, ఇదమ్ = ఈ, మమ = నాయొక్క, నిరీక్షణమ్ = చూచుట, అత్యర్థమ్ = మిక్కిలి, ధర్మలోపమ్ = ధర్మమునకు లోపమును, కరిష్యతి = చేయగలదు.

తా. నేను ఈ విధముగా, నిద్రించుచున్న పరభార్య లున్న అంతఃపురమును చూచినాను. ఇది నాకు చాలా ధర్మలోపమును కలిగించును కదా। ౩౭

మూ. న హి మే పరదారాణాం దృష్టిర్విషయవర్తినీ, ౩౮
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః.

ప్ర. అ. మే = నాయొక్క, దృష్టిః = దృష్టి, పరదారాణామ్ = పరభార్యలయొక్క, విషయవర్తినీ = విషయమునందు ప్రవర్తించునది, న హి = కాదు కదా। అత్ర = ఇక్కడ, మయా = నాచేత, అయమ్ = ఈ, పరదారపరిగ్రహః = భార్యారూపమైన పరుల బంధుజనము, దృష్టః = చూడబడినది.

తా. నేను పరభార్యలను నా దృష్టికి విషయముగా చేసుకొనను కదా; కాని ఈనాడు ఇక్కడ, నేను ఈ పరభార్యలను పరీక్షగా చూడవలసి వచ్చినది।

మూ. తస్య ప్రాదురభూచ్చిన్తా పునరన్యా మనస్వినః, ౩౯
నిశ్చితైకాన్తచిత్తస్య కార్యనిశ్చయదర్శినీ.

ప్ర. అ. మనస్వినః = ఉత్తమ మైన మనస్సు కలవాడూ, నిశ్చితైకాన్త చిత్తస్య = నిశ్చయము గల ఏకాగ్ర మైన చిత్తము కలవాడూ అయిన, తస్య = ఆ హనుమంతునకు, పునః = మరల, కార్యనిశ్చయదర్శినీ = కార్యముయొక్క నిశ్చయమును చూపించు, అన్యా = మరి యొక, చిన్తా = ఆలోచన, ప్రాదుర భూత్ = పుట్టెను.

తా. హనుమంతుడు ఏదైన ఒక కార్యమును నిశ్చయించి దానిపై మనస్సును స్థిరముగా నిలపగలవాడు. ఉత్తమ మైన ఆలోచనలు కలవాడు. అట్టి ఆ హనుమంతునకు మొదట ఇట్టి ఆలోచనలు కలిగినను, మరల, కార్య నిశ్చయమును చూపెడు మరి యొక ఆలోచన కలిగెను. 39

మూ. కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః, 40
న హి మే మనసః కించి ద్వైకృత్యముపపద్యతే.

ప్ర. అ. విశ్వస్తాః = నమ్మకము గల, సర్వాః = సమస్త మైన, రావణ స్త్రియః = రావణుని భార్యలు, మయా = నాచేత, కామం దృష్టాః = చూడబడి ఉండవచ్చును. మే = నాయొక్క, మనసః = మనస్సునకు, కించిత్ = ఏమియు, వైకృత్యమ్ = వికారము, న ఉపజాయతే హి = పుట్టుటలేదు కదా.

తా. పరపురుషు లెవ్వరూ లేరు కదా అను విశ్వాసముతో ఇష్టమువచ్చి నట్లు పరుండి నిద్రించుచున్న రావణుని భార్యలను నేను చూచిన మాట వాస్తవమే యైనను నా మనస్సులో ఎట్టి వికారము కలుగలేదు కదా। 40

మూ. మనో హి హేతుః సర్వేషామిన్ద్రియాణాం ప్రవర్తనే, 41
శుభాశుభాస్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్.

ప్ర. అ. శుభాశుభాసు = శుభములు గాని, అశుభములు గాని అయిన, అవస్థాసు = అవస్థలందు, సర్వేషామ్ = సమస్త మైన, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియ ములయొక్క, ప్రవర్తనే = ప్రవర్తనమునందు, మనః = మనస్సే, హేతుః = హేతువు కదా। మే = నాయొక్క, తచ్చ = ఆ మనస్సు, సువ్యవస్థితమ్ = బాగుగా స్థిరముగా ఉన్నది.

తా. మంచి పరిస్థితులలో గాని, చెడ్డ పరిస్థితులలో గాని (పుణ్యకార్యము లందు గాని, పాపకార్యములందు గాని) ఇంద్రియములు ప్రవర్తించుటకు మనస్సే

కారణము. ఈ స్త్రీలను చూచినను, నా మనస్సు ఎట్టి వికారము చెందక స్థిరముగా ఉన్నది. 41

మూ. నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్, 42
స్త్రియో హి స్త్రీషు దృశ్యన్తే సదా సంపరిమార్గణే.

ప్ర. అ. వైదేహీ = సీత, అన్యత్ర = మరియొకచోట, పరిమార్గితుమ్ = వెదకుటకు, మయా = నాచేత, న శక్యా హి = శక్యమైనది కాదు కదా. సదా = ఎల్లప్పుడును, సంపరిమార్గణే = అన్వేషించుటయందు, స్త్రియః = స్త్రీలు. స్త్రీషు = స్త్రీలలో, దృశ్యన్తే = చూడబడుదురు కదా।

తా. సీతకోసము నేను మరొక చోట ఎక్కడా వెదకజాలను కదా। స్త్రీలను వెదకవలసి వచ్చినపుడు, స్త్రీల మధ్యకే వెళ్ళి వెదకవలసి యుండును గదా।

మూ. యస్య సత్త్వస్య యా యోనిస్తస్యాం తత్పరిమార్గ్యతే,
న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్.

ప్ర. అ. యస్య = ఏ, సత్త్వస్య = జంతువునకు. యా = ఏది, యోనిః = జాతియో, తత్ = ఆ జంతువు, తస్యామ్ = ఆ జాతియందు, పరిమార్గ్యతే = వెదకబడును. నష్టా = తప్పిపోయిన, ప్రమదా = స్త్రీ, మృగీషు = ఆడలేడుల మధ్య, పరిమార్గితుమ్ = అన్వేషించుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. ఏ జంతువు ఏ జాతికి చెందినదో ఆ జంతువును ఆ జాతియందే వెదకవలసి యుండును. తప్పిపోయిన స్త్రీని ఆడ లేళ్ళ మధ్యకు వెళ్ళి వెదికినచో దొరకదు కదా। 43

మూ. తదిదం మార్గితం తావచ్ఛుద్ధేన మనసా మయా, 44
రావణాన్తఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ.

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, మయా = నాచేత, శుద్ధేన = పరిశుద్ధమైన, మనసా = మనస్సుతో, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, రావణాన్తఃపురమ్ = రావణుని అంతఃపురము, మార్గితమ్ = వెదకబడినది. జానకీ చ = జానకి మాత్రము, న దృశ్యతే = చూడబడుటలేదు.

తా. అంతుచేత, నేను నిష్కల్మష మైన మనస్సుతో ఈ రావణాంతః పురమునంతను వెదకినాను; జానకి మాత్రము కనబడుటలేదు. 44

మూ. దేవగన్ధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ వీర్యవాన్, 45
అవేక్షమాణో హనుమాన్నైవాపశ్యత జానకీమ్.

ప్ర. అ. దేవగన్ధర్వకన్యాశ్చ=దేవకన్యలను, గంధర్వకన్యలను, నాగకన్యాశ్చ = నాగకన్యలను, అవేక్షమాణః = చూచుచున్న, వీర్యవాన్ = వీర్యవంతు డైన, హనుమాన్ = హనుమంతుడు, జానకీమ్ = జానకిని, నైవాపశ్యత = చూడలేదు.

తా. వీర్యవంతు డైన ఆ హనుమంతునకు రావణాంతఃపురములో దేవ-గంధర్వ-నాగకన్యలు కనబడిరి గాని సీత మాత్రము కనబడలేదు. 45

మూ. తామపశ్యన్ కపిస్తత్ర పశ్యంశ్చాన్యా వరస్త్రియః, 46
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతుముపచక్రమే.

ప్ర. అ. వీరః = వీరు డైన, కపిః = హనుమంతుడు, తత్ర = అక్కడ, తామ్ = ఆమెను, అపశ్యన్ = చూడనివా డై, అన్యాః = ఇతరు లైన, వరస్త్రియః = శ్రేష్ఠ లైన స్త్రీలను, పశ్యంశ్చ = చూచుచు, తదా = అప్పుడు, అపక్రమ్య = దూరముగా వెళ్ళి, ప్రధ్యాతుమ్ = దీర్ఘముగా ఆలోచించుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. మహావీరు డైన హనుమంతునకు అక్కడ ఎందరో ఉత్తమస్త్రీలు కనబడినారు కాని సీత మాత్రము కనబడలేదు. అపుడు అతడు అక్కడినుండి కొంచెము దూరముగా వెళ్ళి దీర్ఘాలోచన చేయ ప్రారంభించెను. 46

మూ. స భూయస్తు పరం శ్రీమాన్ మారుతిర్యత్నమాస్థితః, 47
ఆపానభూమిముత్సృజ్య తద్విచేతుం ప్రచక్రమే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః మారుతిః = ఆ హనుమంతుడు,

భూయః = మరల, పరమ్ = గొప్ప, యత్నమ్ = ప్రయత్నమును, ఆస్థితః = అవలంబించినవాడై, ఆపానభూమిమ్ = పానభూమిని, ఉత్సృజ్య = విడచి, తత్ = ఆ, అంతఃపురమును, విచేతుమ్ = అన్వేషించుటకు, ప్రచక్రమే = ఉపక్రమించెను.

తా. శ్రీమంతుడైన ఆ హనుమంతుడు ఆ పానభూమిని విడచి, ఇంకనూ ఎక్కువ ప్రయత్నములో ఆ అంతఃపురమును వెదకుటకు ప్రారంభించెను. 47

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పదకొండవ సర్గ సమాప్తము.

## అథ ద్వాదశః సర్గః

*[సీత మరణించిన దేమో అని శంకించి హనుమంతుడు ఉత్సాహ విహీను డగుట; మరల ఉత్సాహము తెచ్చుకొని స్థానాంతరములలో వెదకుట, ఎక్కడా సీత కనబడకపోవుటతో మరల అతడు నిరుత్సాహము చెందుట].*

మూ. స తస్య మధ్యే భవనస్య మారుతి
ర్లతాగృహాంశ్చిత్రగృహాన్నిశాగృహాన్,
జగామ సీతాం ప్రతి దర్శనోత్సుకో
న చైవ తాం పశ్యతి చారుదర్శనామ్. 1

ప్ర. అ. సః మారుతిః = ఆ హనుమంతుడు, తస్య = ఆ, భవనస్య = భవనముయొక్క, మధ్యే = మధ్యయందు, సీతాం ప్రతి = సీతను గూర్చి, దర్శనోత్సుకః = చూచుటయందు ఔత్సుక్యము కలవాడై, లతాగృహాన్ = లతలతో ఏర్పరచిన గృహములను, చిత్రగృహాన్ = చిత్తరువులు వ్రాయుటకై నిర్మించిన గృహములను, నిశాగృహాన్ = రాత్రులు గడపు గృహములను గూర్చి, జగామ = వెళ్ళెను. చారుదర్శనామ్ = అందమైన దర్శనము గల (చూచుటకు చాలా అందమైన), తామ్ = ఆమెను, న చైవ పశ్యతి = చూడలేదు.

తా. ఆ హనుమంతుడు సీతను చూడవలెనను ఔత్సుక్యముతో ఆ భవన మధ్యమునం దున్న లతాగృహములకు, చిత్రగృహములకు, రాత్రిగృహములకు వెళ్ళెను గాని, చూచుటకు చాల అందమైన ఆ సీతను మాత్రము చూడలేక పోయెను.

మూ. స చిన్తయామాస తతో మహాకపిః
ప్రియామపశ్యన్ రఘునన్దనస్య తామ్,

ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే
విచిన్వతో దర్శనమేతి మైథిలీ. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః మహాకపిః = ఆ హనుమంతుడు, రఘునన్దనస్య = రామునియొక్క, ప్రియామ్ = ప్రియురాలైన, తామ్ = ఆ సీతను, అపశ్యన్ = చూడనివాడై, చిన్తయామాస = ఇట్లు ఆలోచించెను. మైథిలీ = మైథిలి, విచిన్వతః = వెదకుచున్న, మే = నాకు, యథా = ఎట్లు, దర్శనమ్ = దర్శనమును, న ఉపైతి = పొందుటలేదో, దానిని పట్టి. సీతా = సీత, ధ్రువమ్ = తప్పక, మ్రియతే = మరణించినది.

తా. ఆ రఘునందనుని భార్య యైన సీత కనబడక పోవుటచే హనుమంతుడు ఈ విధముగా తలచెను. "సీత తప్పక మరణించి యుండును; అందు చేతనే ఎంత వెదకినను నాకు కనబడుట లేదు". 2

మూ. సా రాక్షసానాం ప్రవరేణ జానకీ
స్వశీలసంరక్షణతత్పరా సతీ.
అనేన నూనం ప్రతిదుష్టకర్మణా
హతా భవేదార్యపథే పరే స్థితా. 3

ప్ర. అ. పరే = శ్రేష్ఠమైన, ఆర్యపథే = పూజ్యమైన పాతివ్రత్య ధర్మమునందు, స్థితా = నిలచి యున్న, సా జానకీ = ఆ జానకి, స్వశీలసంరక్షణ తత్పరా సతీ = తన శీలమును రక్షించుకొనుటయందు ఆసక్తి గలదై, ప్రతి దుష్టకర్మణా = చెడ్డపని గల, అనేన = ఈ, రాక్షసానాం ప్రవరేణ = రాక్షసరాజు చేత, హతా = చంపబడినది, భవేత్ = అయి ఉండును. నూనమ్ = నిశ్చయము.

తా. పూజ్యమైన ధర్మమార్గమునందు స్థిరురాలుగా ఉండి, తన శీలమును రక్షించుకొనుటకై ప్రయత్నించిన సీతను ఈ రాక్షసరాజు, తప్పక చంపివేసి ఉండును. 3

మూ. విరూపరూపా వికృతా వివర్ణసో
మహాననా దీర్ఘవిరూపదర్శనాః,
సమీక్ష్య సా రాక్షసరాజయోషితో
భయాద్వినష్టా జనకేశ్వరాత్మజా. 4

ప్ర. అ. సా = ఆ, జనకేశ్వరాత్మజా = జనకమహారాజు కూతురు, విరూపరూపాః = వికార మైన రూపములు కలవారూ, వికృతాః = వికృత స్వభావం గలవారూ, వివర్ణసః = కాంతి లేనివారూ, మహాననాః = పెద్ద ముఖములు కలవారూ, దీర్ఘవిరూపదర్శనాః = పొడ వైన వికృతరూపము గల నేత్రములు గలవారూ అయిన, రాక్షసరాజయోషితః = రావణుని భార్యలను, సమీక్ష్య = చూచి, భయాత్ = భయమువలన, వినష్టా = మరణించినది.

తా. భయంకరము లైన ఆకారములు, పెద్ద ముఖములు, పొడ వైన వికృత మైన నేత్రములుగల, వికృతస్వభావలూ, కాంతివిహీనలూ అయిన రావణుని స్త్రీలను చూడగానే సీత భయపడి మరణించి ఉండును. 4

మూ. సీతామదృష్ట్వా హ్యనవాప్య పౌరుషం
విహృత్య కాలం సహ వానరైశ్చిరమ్,
న మేఽస్తి సుగ్రీవసమీపగా గతిః
సుతీక్ష్ణదణ్డో బలవాంశ్చ వానరః. 5

ప్ర. అ. సీతామ్ = సీతను, అదృష్ట్వా = చూడక, పౌరుషమ్ = పురుష కర్తవ్యమును, అనవాప్య = పొందక, వానరైః సహ = వానరులతో కూడ, చిరం కాలమ్ = చాల కాలము. విహృత్య = విహరించి, మే = నాకు, సుగ్రీవసమీపగా = సుగ్రీవుని సమీపమునకు వెళ్ళు, గతిః = మార్గము, నాస్తి = లేదు. వానరః = సుగ్రీవుడు, సుతీక్ష్ణదణ్డః = మిక్కిలి తీక్ష్ణ మైన దండము గలవాడు. బలవాంశ్చ = బలవంతుడు కూడ.

తా. చాలకాలము వానరులతో కాలక్షేపము చేసి, నా కర్తవ్యమును పూర్తి చేయజాలనివాడనై, సీతను చూడకుండా నేను సుగ్రీవుని వద్దకు తిరిగి వెళ్లే ఉపాయ మేదీ కనబడుటలేదు. అతడు తన ఆజ్ఞను పాటించనివారికి అతి తీవ్ర మైన దండనము విధించును. అతడు మహాబలవంతుడు కూడ. 5

మూ. దృష్టమన్తఃపురం సర్వం దృష్టా రావణయోషితః,
న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః. 6

ప్ర. అ. సర్వమ్ = సమస్త మైన, అన్తఃపురమ్ = అంతఃపురము, దృష్టమ్ = చూడబడినది. రావణయోషితః = రావణుని స్త్రీలు, దృష్టాః = చూడ

వెతికినాను. సాధ్వీ=పతివ్రత యైన, సీతా=సీత, న దృశ్యతే=చూడబడుటలేదు. మమ=నాయొక్క, శ్రమః=శ్రమ, వృథా=వ్యర్థముగా, జాతః=అయినది.

తా. అంతఃపురము నంతను చూచితిని. రావణుని భార్యల నందరిని చూచితిని. సీత మాత్రము కనబడలేదు. నా శ్రమ అంతా వృథా అయినది కదా!

మూ. కిం ను మాం వానరాః సర్వే గతం వక్ష్యన్తి సంగతాః,
గత్వా తత్ర త్వయా వీర కిం కృతం తద్వదస్వ నః. 7

ప్ర. అ. గతమ్=తిరిగి వెళ్ళిన, మామ్=నన్ను, సంగతాః=కలసిన వారై, సర్వే=సమస్త మైన, వానరాః=వానరులు, కిం ను=ఏమి, వక్ష్యన్తి=చెప్పగలరో! వీర=వీరుడా! తత్ర=అక్కడికి, గత్వా=వెళ్ళి, త్వయా=నీచేత, కిమ్=ఏమి, కృతమ్=చేయబడినది! తత్=దానిని, నః=మాకు, వదస్వ=చెప్పుము.

తా. ఉత్తరతీరమునందు నా కోసమై ఎదురు చూచుచున్న వానరు లందరు తిరిగి వెళ్ళిన నన్ను చూచి ఏ మందురో గదా! "ఓ వీరుడా! లంకకు వెళ్ళి నీవు అక్కడ ఏమి చేసినావు? చెప్పుము" అని అడిగెదరు. 7

మూ. అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తామహం జనకాత్మజామ్,
ధ్రువం ప్రాయముపైష్యన్తి కాలస్య వ్యతివర్తనే. 8

ప్ర. అ. తామ్=ఆ, జనకాత్మజామ్=సీతను, అదృష్ట్వా=చూడక, కిమ్=ఏమి, ప్రవక్ష్యామి=చెప్పగలను? కాలస్య=కాలముయొక్క, వ్యతివర్తనే=గడచిపోవుటయందు, ధ్రువమ్=తప్పక, ప్రాయమ్=ప్రాయోపవేశమును, ఉపైష్యన్తి=పొందగలరు.

తా. జనకాత్మజను చూడజాలని నేను వారి ప్రశ్నలకు ఏమి సమాధానము చెప్పగలను? నేను తిరిగి వెళ్లుటలో ఆలస్యము చేసినచో వారు తప్పక ప్రాయోపవేశము చేయుదురు. 8

మూ. కిం వా వక్ష్యతి వృద్ధశ్చ జాంబవానఙ్గదశ్చ సః,
గతం పారం సముద్రస్య వానరాశ్చ సమాగతాః. 9

ప్ర. అ. సముద్రస్య = సముద్రముయొక్క. పారమ్ = ఆవలి ఒడ్డును గూర్చి, గతమ్ = వెళ్ళిన నన్ను, వృద్ధః = వృద్ధుడైన, జాంబవాన్ = జాంబవంతుడు, కిం వా = ఏమి, వక్ష్యతి = చెప్పగలడో। సః = ఆ, అఙ్గదః చ = అంగదుడూ, సమాగతాః = కలిసిన, వానరాః చ = వానరులు, ఏమి అందురో।

తా. నేను సముద్రము ఆవలి ఒడ్డు చేరగానే వృద్ధుడైన జాంబవంతుడు, అంగదుడు, వానరులు, అందరూ కలిసి ఏ మందురో। 9

మూ. అనిర్వేదః శ్రియో మూలమనిర్వేదః పరం సుఖమ్,
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. 10

ప్ర. అ. అనిర్వేదః = నిర్వేదము (దిగులుపాటు) లేకపోవుట (ఉత్సాహము), శ్రియః = అభివృద్ధికి, మూలమ్ = మూలము. అనిర్వేదః = నిర్వేదము లేకపోవుట, పరమ్ = గొప్ప, సుఖమ్ = సుఖహేతువు. అనిర్వేదః = నిర్వేదము లేకపోవుట, సతతమ్ = ఎల్లప్పుడూ, సర్వార్థేషు = సమస్తవిషయములందు, ప్రవర్తకః హి = ప్రవర్తింపచేయునది కదా।

తా. అనిర్వేదము (దిగులు చెందకుండుట) అభివృద్ధికి మూలము. అనిర్వేదమే గొప్ప సుఖహేతువు. ఎల్లప్పుడును అనిర్వేదమే మానవుని సర్వకార్యములందును ప్రవర్తింపచేయుచుండును కదా. 10

మూ. కరోతి సఫలం జన్తోః కర్మ యత్తత్కరోతి సః,
తస్మాదనిర్వేదకృతం యత్నం చేష్టేఽహముత్తమమ్.
అదృష్టాంశ్చ విచేష్యామి దేశాన్రావణపాలితాన్.

ప్ర. అ. (మానవుడు) యత్ = ఏ, కర్మ = పనిని, కరోతి = చేయునో, జన్తోః = మానవునియొక్క, తత్ = దానిని, సఫలమ్ = సఫలమైనదానినిగా, సః = ఆ అనిర్వేదము, కరోతి = చేయును. తస్మాత్ = ఆ కారణమువలన, అహమ్ = నేను, అనిర్వేదకృతమ్ = అనిర్వేదముతో చేయబడిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, యత్నమ్ = ప్రయత్నమును, చేష్టే = చేయుదును. అదృష్టాన్ = చూడబడని, రావణపాలితాన్ = రావణునిచేత పాలింపబడిన, దేశాన్ = ప్రదేశములను, విచేష్యామి తావత్ = అన్వేషించెదను.

తా. అనిర్వేదమే మానవుడు తలపెట్టిన పని సఫల మగు నట్లు చేయును. అందుచేత నేను నిర్వేదము చెందక ఉత్తమ మైన ప్రయత్నము చేసెదను. ఇంత వరకూ చూడని రావణుడు పాలించుచున్న ప్రదేశము లన్నీ మరల వెదకెదను.

మూ. ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణి చ, 12
చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ.
నిష్కుటాన్తరరథ్యాశ్చ విమానాని చ సర్వశః. 13

ప్ర. అ. ఆపానశాలాః = పానశాలలు, విచితాః = వెదకబడినవి. తథా = అట్లే. పుష్పగృహాణి చ = పుష్పగృహములు, చిత్రశాలాశ్చ = చిత్రశాలలు, విచితాః = వెదకబడినవి. భూయః = మరల, క్రీడాగృహాణి చ = క్రీడాగృహములు, నిష్కుటాన్తరరథ్యాశ్చ = ఉద్యానమధ్యమందలి వీధులు, విమానాని చ = విమానములు, సర్వశః = అన్ని వైపులా, వెదకబడినవి.

తా. నే నింతవరకు పానశాలలు, పుష్పగృహములు, చిత్రశాలలు, క్రీడాగృహములు, ఉద్యానమధ్యవీధులు, విమానము (భవనములు) పూర్తిగా వెదకితిని. 12, 13

మూ. ఇతి సంచిన్త్య భూయోఽపి విచేతుముపచక్రమే,
భూమీగృహాం శ్చైత్యగృహాన్ గృహాతిగృహకానపి. 14

ప్ర. అ. ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, భూమీగృహాన్ = భూగృహములను, చైత్యగృహాన్ = నాల్గు వీధుల మొగలలోని గృహములను, గృహాతిగృహకానపి = ప్రధానగృహమునకు దూరముగా నిర్మింపబడిన చిన్న గృహములను కూడ, భూయోఽపి = మరల, విచేతుమ్ = వెదకుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. హనుమంతు డీ విధముగా ఆలోచించి, భూగృహములను, చైత్యగృహములను, ప్రధానగృహములకు దూరముగా నిర్మించిన చిన్న గృహములను మారి మాటికిని వెదకుటకు ప్రారంభించెను. 14

మూ. ఉత్పతన్నిపతం శ్చాపి తిష్ఠన్గచ్ఛన్ పునః పునః,
అపావృణ్వంశ్చ ద్వారాణి కవాటాన్యవఘాటయన్. 15

ప్రవిశన్నిష్పతంశ్చాపి ప్రపతన్నుత్పతన్నపి,
సర్వమప్యవకాశం స విచచార మహాకపిః. 16

ప్ర. అ. సః మహాకపిః=ఆ హనుమంతుడు, పునః పునః=మాటిమాటికి, ఉత్పతన్=పైకి ఎగురుచు, నిష్పతంశ్చాపి=క్రిందికి దుముకుచు, తిష్ఠన్=నిలబడుచు, గచ్ఛన్=నడచుచు, ద్వారాణి = ద్వారములను, అపావృణ్వన్=తెరచుచు, కవాటాని=తలుపులను, అవఘాటయన్=త్రోయుచు, ప్రవిశన్=లోనికి ప్రవేశించుచు, నిష్పతంశ్చాపి = బైటకు వచ్చుచు, ప్రపతన్=దిగుచు, ఉత్పతన్నపి=ఎక్కుచు, సర్వమ్ అపి=సమస్తమైన, అవకాశమ్=అవకాశమును, విచచార=సంచరించెను.

తా. హనుమంతుడు, మాటిమాటికి పైకి ఎగురుచు, క్రిందికి దుముకుచు, ద్వారములు తెరచుచు, తలుపులు త్రోయుచు, లోనికి ప్రవేశించుచు, బైటకు వచ్చుచు, దిగుచు, ఎక్కుచు, ఆ ప్రదేశము లన్నింటిలోను సంచరించెను. 15,16

మూ. చతురఙ్గులమాత్రోఽపి నావకాశః స విద్యతే,
రావణాన్తఃపురే తస్మిన్ యం కపిర్న జగామ సః. 17

ప్ర. అ. తస్మిన్=ఆ, రావణాన్తఃపురే=రావణుని అంతఃపురమునందు, సః కపిః=ఆ హనుమంతుడు, యమ్=ఏ ప్రదేశమును గూర్చి, న జగామ=వెళ్ళలేదో, సః=అట్టి, అవకాశః=చోటు, చతురఙ్గులమాత్రోఽపి = నాలుగు అంగుళముల మాత్రము కూడా, న విద్యతే=లేదు.

తా. హనుమంతుడు ఆ రావణాంతఃపురములో నాలుగు అంగుళముల ప్రదేశము కూడ విడబడకుండగా వెదకెను. 17

మూ. ప్రాకారాన్తరరథ్యాశ్చ వేదికాశ్చైత్యసంశ్రయాః,
దీర్ఘికాః పుష్కరిణ్యశ్చ సర్వం తేనావలోకితమ్. 18

ప్ర. అ. ప్రాకారాన్తరరథ్యాశ్చ=ప్రాకారముల మధ్యయందున్న వీధులు (రోడ్లు), చైత్యసంశ్రయాః=చైత్యములకు (నాలుగు వీధుల కూడలులయందున్న మహావృక్షములకు) చేరి ఉన్న, వేదికాః=అరుగులూ, దీర్ఘికాః=దిగుడుబావులు, పుష్కరిణ్యశ్చ=పద్మసరస్సులు, సర్వమ్=సమస్తమూ, తేన=హనుమంతుని చేత, అవలోకితమ్=చూడబడినవి.

తా. ప్రాకారములలో ఉన్న వీథులూ, చైత్యములకు అనుకొని ఉన్న వేదికలు, దిగుడుబావులు, పద్మసరస్సులూ, వీటి నన్నింటినీ హనుమంతుడు చూచెను. 18

మూ. రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా.
దృష్టా హనుమతా తత్ర న తు సా జనకాత్మజా. 19

ప్ర. అ. వివిధాకారాః = అనేకవిధము లైన ఆకారములు కలవారూ, విరూపాః = వికృతము లైన రూపము గలవారూ, తథా = మరియు, వికృతాః = అంగవికారము గలవారూ అయిన, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, తత్ర = అక్కడ, హనుమతా = హనుమంతునిచేత, దృష్టాః = చూడబడిరి, సా = ఆ, జనకాత్మజా తు = సీత యైతే, న = చూడబడలేదు.

తా. అనేకవిధము లైన ఆకారములతో, వికృతము లైన రూపములతో, వికృతము లైన అవయవములతో ఉన్న రాక్షసస్త్రీలు, హనుమంతునకు, అక్కడ కనబడిరి కాని సీత మాత్రము కనబడలేదు. 19

మూ. రూపేణాప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః.
దృష్టా హనుమతా తత్ర న తు రాఘవనన్దినీ. 20

ప్ర. అ. రూపేణ = సౌందర్యముచేత, లోకే = లోకమునందు, అప్రతిమాః = సాటిలేని, వరాః = శ్రేష్ఠ లైన, విద్యాధరస్త్రియః = విద్యాధరస్త్రీలు, తత్ర = అక్కడ, హనుమతా = హనుమంతునిచేత, దృష్టాః = చూడబడిరి. రాఘవనన్దినీ తు = రామునకు ఆనందమును కలిగించు సీత మాత్రము, న = చూడబడలేదు.

తా. సౌందర్యవిషయమునందు లోకములో సాటి లేని విద్యాధరస్త్రీలు, అక్కడ, హనుమంతునకు కనబడినారు కాని సీత మాత్రము కనబడలేదు. 20

మూ. నాగకన్యా వరారోహాః పూర్ణచన్ద్రనిభాననాః,
దృష్టా హనుమతా తత్ర న తు సీతా సుమధ్యమా. 21

ప్ర. అ. వరారోహాః = అంద మైన పిరుదులు గలవారూ, పూర్ణచన్ద్రనిభాననాః = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖములు గలవారూ అయిన, నాగకన్యాః = నాగకన్యలు, తత్ర = అక్కడ, హనుమతా = హనుమంతునిచేత,

దృష్టాః=చూడబడినారు. సుమధ్యమా = మంచి నడుము గల, సీతా తు = సీత యైతే, న=చూడబడలేదు.

తా. అంద మైన పిరుదులు, పూర్ణచంద్రుని వంటి ముఖములు గల నాగకన్యలు అక్కడ, హనుమంతునకు కనబడినారు గాని అంద మైన నడుము గల సీత మాత్రము కనబడలేదు. 21

మూ. ప్రమథ్య రాక్షసేన్ద్రేణ నాగకన్యా బలాద్ధృతాః,
దృష్టా హనుమతా తత్ర న సా జనకనన్దినీ. 22

ప్ర. అ. రాక్షసేన్ద్రేణ = రావణునిచేత, ప్రమథ్య = అయిలించి, బలాత్= =బలాత్కారముగా, హృతాః = హరింపబడిన, నాగకన్యాః = నాగకన్యలు, తత్ర=అక్కడ, హనుమతా = హనుమంతునిచేత, దృష్టాః = చూడబడిరి. సా =ఆ, జనకనన్దినీ = సీత, న = చూడబడలేదు.

తా. రావణుడు అయిలించి బలాత్కారముగా తీసికొని వచ్చిన నాగకన్యలు, అక్కడ హనుమంతునికి కనబడిరి. కాని సీత మాత్రము కనబడలేదు.

మూ. సోఽపశ్యంస్తాం మహాబాహుః పశ్యంశ్చాన్యా వరస్త్రియః,
విషసాద ముహుర్ధీమాన్ హనుమాన్ మారుతాత్మజః.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, ధీమాన్ = బుద్ధిమంతు డైన, మారుతాత్మజః = వాయుపుత్రు డైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు. తామ్ = ఆ సీతను, అపశ్యన్=చూడనివా డై, అన్యాః=ఇతర లైన, వరస్త్రియః =ఉత్తమస్త్రీలను, పశ్యన్=చూచుచు, ముహుః=మాటిమాటికి (చాలా), విషసాద నిరుత్సాహవంతు డయ్యెను.

తా. మహాబాహువు, ధీమంతుడు, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు అక్కడ ఎందరో ఇతరస్త్రీలు కనబడినను, సీత మాత్రము కనబడకపోవుటచే చాల నిరుత్సాహవంతు డయ్యెను. 23

మూ. ఉద్యోగం వానరేన్ద్రాణాం ప్లవనం సాగరస్య చ,
వ్యర్థం వీక్ష్యానిలసుతశ్చిన్తాం పునరుపాగమత్. 24

ప్ర. అ. వానరేన్ద్రాణామ్ = వానరశ్రేష్ఠులయొక్క, ఉద్యోగమ్ = ప్రయత్నమును, సాగరస్య = సముద్రముయొక్క, ప్లవనం చ = దాటుటను, వ్యర్థమ్ = వ్యర్థమైనదానినిగా, వీక్ష్య = చూచి, అనిలసుతః = హనుమంతుడు, పునః = మరల, చిన్తామ్ = ఆలోచనను, (దుఃఖమును), ఉపాగమత్ = పొందెను.

తా. వానరులు చేసిన ప్రయత్నము, తాను చేసిన సముద్రలంఘనమూ కూడ వ్యర్థమైపోయినవి కదా అని తలచుచు ఆ వాయునందనుడు మరల దుఃఖితు డయ్యెను. 24

మూ. అవతీర్య విమానాచ్చ హనుమాన్ మారుతాత్మజః,
చిన్తాముపజగామాథ శోకోపహతచేతనః. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ద్వాదశః సర్గః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, మారుతాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమంతుడు, విమానాత్ = విమానమునుండి, అవతీర్య = దిగి, శోకోపహతచేతనః = శోకముచేత కొట్టబడిన మనస్సు కలవాడై, చిన్తామ్ = ఆలోచనను, ఉపజగామ = పొందెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు ఆ పుష్పకవిమానమునుండి, క్రిందికి దిగి, దుఃఖముచే కలత చెందిన మనస్సుతో "ఏమి చేయవలెనా" అను ఆలోచనలో పడెను. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో పంద్రెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోదశః సర్గః

*[సీత మరణించి ఉండును అని భావించి హనుమంతుడు విచారించుట. సీత కనబడలేదు అని తెలిపినచో అనర్థము వాటిల్లునను ఉద్దేశ్యముతో వెనుకకు వెళ్ళగూడ దని అతడు నిర్ణయించుకొనుట. మరల వెదకెద మని అనుకొని అశోకవనములో అన్వేషణమును గూర్చి పరిపరివిధముల ఆలోచించుట.]*

మూ. విమానాత్తు సుసంక్రమ్య ప్రాకారం హరియూథపః,
హనుమాన్వేగవానాసీద్యథా విద్యుద్ఘనాన్తరే. 1

ప్ర. అ. హరియూథపః = వానరసేనానాయకుడైన, హనుమాన్ = హనుమంతుడు, విమానాత్ = విమానమునుండి, ప్రాకారమ్ = ప్రాకారమును గూర్చి, సుసంక్రమ్య = దాటి, ఘనాన్తరే = మేఘమధ్యము నందలి, విద్యుత్ యథా = మెరపు వలె, వేగవాన్ = వేగముగలవాడు, ఆసీత్ = ఆయెను.

తా. వానరసేనానాయకుడైన హనుమంతుడు విమానమునుండి ప్రాకారము మీదకు దుమికి, మేఘమధ్యమునందు మెరుపు సంచరించినట్లు మహావేగముగా సంచరించెను. 1

మూ. సంపరిక్రమ్య హనుమాన్రావణస్య నివేశనాత్,
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీద్వచనం కపిః. 2

ప్ర. అ. కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు, రావణస్య = రావణుని యొక్క, నివేశనాత్ = గృహమునుండి, సంపరిక్రమ్య = దూరముగా వెళ్ళి, జానకీమ్ = జనకుని కూతురైన, సీతామ్ = సీతను, అదృష్ట్వా = చూడక, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. హనుమంతుడు రావణుని గృహమునుండి దూరముగా వెళ్ళి, సీత కనబడక పోవుటచే మనస్సులో ఇట్లు అనుకొనెను. 2

మూ. భూయిష్ఠం లోళితా లఙ్కా రామస్య చరతా ప్రియమ్,
న హి పశ్యామి వైదేహీం సీతాం సర్వాఙ్గశోభనామ్. 3

ప్ర. అ. రామస్య = రామునకు, ప్రియమ్ = ప్రియమును, చరతా = ఆచరించుచున్న నాచేత, లఙ్కా = లంక, భూయిష్ఠమ్ = చాలవరకు, లోళితా = కలచివేయబడినది. సర్వాఙ్గశోభనామ్ = సకలావయవములందు అందమైన, వైదేహీమ్ = విదేహరాజపుత్రి యైన, సీతామ్ = సీతను, న హి పశ్యామి = చూడకున్నాను కదా।

తా. రామునకు ప్రియము చేయుటకై నేను సంచరించుచు, లంకాపట్టణము నంతను పూర్తిగా కలచి వేసితిని. సర్వాంగసుందరి యైన సీత మాత్రము కనబడ లేదు. 3

మూ. పల్వలాని తటాకాని సరాంసి సరితస్తథా,
నద్యోఽనూపవనాన్తాశ్చ దుర్గాశ్చ ధరణీధరాః, 4
లోళితా వసుధా సర్వా న తు పశ్యామి జానకీమ్.

ప్ర. అ. పల్వలాని = నీళ్లు ఉన్న చిన్న పల్లములు, తటాకాని = చెరువులు, సరాంసి = పెద్ద సరస్సులు, తథా = మరియు, సరితః = చిన్న ప్రవాహములు, నద్యః = నదులు, అనూపవనాన్తాశ్చ = జలములో నిండిన వనప్రాంతములు, దుర్గాః = వెళ్లుటకు కష్టమైన, ధరణీధరాః = పర్వతములు, సర్వా = సమస్తమైన, వసుధా = భూమి, లోళితా = కలచివేయబడినది. జానకీం తు = జానకి నైతే, న పశ్యామి = చూడను.

తా. నీళ్ళతో నిండిన చిన్న పల్లములు, చెరువులు, పెద్ద చెరువులు, చిన్న నదులు, పెద్దనదులు, అరణ్యప్రాయభూప్రాంతములు, ప్రవేశింప శక్యము కాని పర్వతములు మొత్తము ఇక్కడి భూమి అంతా కలచివేసినాను కాని సీత కనబడలేదు.

మూ. ఇహ సంపాతినా సీతా రావణస్య నివేశనే, 5
ఆఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తామహమ్.

ప్ర. అ. సీతా=సీత, ఇహ=ఇక్కడ, రావణస్య=రావణునియొక్క, నివేశనే=గృహమునందు, (ఉన్నదిగా), గృధ్రరాజేన=గృధ్రరాజైన, సంపాతినా=సంపాతిచేత, ఆఖ్యాతా=చెప్పబడినది. అహమ్=నేను, తామ్=ఆమెను, న చ పశ్యామి=చూడజాలకున్నాను.

తా. సీత ఇక్కడనే రావణుని గృహములో ఉన్నదని గృధ్రరాజైన సంపాతి చెప్పినాడు. కాని ఆమె నాకు కనబడుటలేదు. 5

మూ. కిం ను సీతాథ వైదేహీ మైథిలీ జనకాత్మజా, 6
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్.

ప్ర. అ. అథ=లేక, వైదేహీ=విదేహదేశమునకు చెందినదీ, మైథిలీ=మిథిలానగరమునకు సంబంధించినదీ, జనకాత్మజా=జనకుని కూతురూ అయిన, సీతా=సీత, వివశా=వివశురాలై, దుష్టచారిణమ్=దుష్టప్రవృత్తి గల, రావణమ్=రావణుని, కిం ను ఉపతిష్ఠేత=చేరి ఉండునా!

తా. విదేహదేశమునకు చెందినదీ, మిథిలలో పెరిగినదీ, జనకుని కూతురూ అయిన సీత వేయునది లేక, దుష్టప్రవృత్తి గల రావణుని చేరి యుండునా! 6

మూ. క్షిప్రముత్పతతో మన్యే సీతామాదాయ రక్షసః, 7
బిభ్యతో రామబాణానామన్తరా పతితా భవేత్.

ప్ర. అ. రామబాణానామ్= రామబాణములకు, బిభ్యతః = భయపడుచున్న, రక్షసః=రావణుడు, సీతామ్=సీతను, ఆదాయ=గ్రహించి, క్షిప్రమ్=శీఘ్రముగా, ఉత్పతతః=ఎగురుచుండగా, అన్తరా=మధ్యయందు, పతితా=పడిపోయినది, భవేత్=అయి ఉండును అని, మన్యే=తలచుచున్నాను.

తా. రాముడు ఎక్కడ వచ్చునో అని రామబాణాలకు భయపడుచు రావణుడు సీతను గ్రహించి అతి శీఘ్రముగా ఎగిరిపోవుచున్నప్పుడు, ఆమె మధ్యలో క్రింద పడిపోయి ఉండునేమో! 7

మూ. అథవా హ్రియమాణాయాః పథి సిద్ధనిషేవితే, 8
మన్యే పతితమార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్.

ప్ర. అ. అథవా = లేదా, సిద్ధనిషేవితే=సిద్ధులచేత సేవింపబడిన, పథి= మార్గమునందు, హ్రియమాణాయాః = హరింపబడుచున్న, ఆర్యాయాః = ఆర్య రాలియొక్క, హృదయమ్ = హృదయమును, సాగరమ్=సముద్రమును, ప్రేక్ష్య = చూచి, పతితమ్ = పడిపోయినదానినిగా, మన్యే = తలచుచున్నాను.

తా. లేదా, సిద్ధులు సంచరించు ఆకాశమార్గమునందు అపహరింపబడు చున్నప్పుడు క్రింద నున్న మహాసముద్రమును చూడగానే పూజ్యురా లైన సీత గుండె జారిపోయి ఉండును. 8

మూ. రావణస్యోరువేగేన భుజాభ్యాం పీడితేన చ, 9
తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవితమార్యయా.

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, ఉరువేగేన = గొప్పవేగము చేతను, భుజాభ్యామ్=భుజములచేత, పీడితేన చ = పీడించుటచేతను, విశాలాక్ష్యా = విశాలము లైన నేత్రములు గల, తయా=ఆ, ఆర్యయా = పూజ్యురాలిచేత, జీవితమ్ = జీవితము, త్యక్తమ్ = విడువబడిన దని, మన్యే = తలచెదను.

తా. ఎక్కడ జారిపోవునో అని రావణుడు భుజములతో గట్టిగా అదిమి పట్టి మహావేగముగా తీసికొనిపోవుచున్నపుడు, విశాలాక్షి యైన ఆ పూజ్యురాలు ప్రాణములు విడచియుండు నని తలచెదను.

వి "రావణస్య+ఊరువేగేన" అని పదచ్ఛేదము చేసి "రావణుని తొడల వేగముచేత" అను ప్రాచీనవ్యాఖ్యాతల అర్థము కంటె "రావణస్య+ఉరువేగేన" అను పదచ్ఛేదము చేసి పై అర్థము చెప్పుట యుక్తము. "ఊరువేగేన" అనునది అశ్లీలార్థద్యోతకముగా ఉన్నది. 9

మూ. ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమతస్తదా, 10
విచేష్టమానా పతితా సాగరే జనకాత్మజా.

ప్ర. అ. తదా = అప్పుడు, (రావణుడు), సాగరమ్ ఉపర్యుపరి = సముద్రమునకు పైపైన, క్రమతః = నడచుచుండగా (ఎగురుచుండగా), జనకాత్మజా = సీత, విచేష్టమానా=పొరలుచున్నదై, సాగరే=సముద్రమునందు, నూనమ్=తప్పక, పతితా=పడిపోయినది.

తా. రావణుడు తప్పుడు సముద్రమునకు పై పైన ఎగురుచు వెళ్లుచున్నప్పుడు అతని చేతులలో ఇటు అటు పెనగులాడుచున్న సీత, సముద్రములో పడిపోయి ఉండును. 10

మూ. అహో క్షుద్రేణ చానేన రక్షన్తీ శీలమాత్మనః, 11
అబన్ధుర్భక్షితా సీతా రావణేన తపస్వినీ.

ప్ర. అ. అహో = లేదా, ఆత్మనః = తనయొక్క, శీలమ్ = శీలమును, రక్షన్తీ = రక్షించుకొనుచున్నదీ, అబన్ధుః = బంధువులు లేనిదీ, తపస్వినీ = దీనురాలూ అయిన, సీతా = సీత, క్షుద్రేణ = నీచుడైన, అనేన = ఈ, రావణేన = రావణుని చేత, భక్షితా = భక్షింపబడినదా।

తా. లేదా, బంధువు లెవ్వరూ దగ్గర లేక దీనురాలైన సీత తన శీలమును సంరక్షించుకొనుచు రావణునికి లొంగక పోవుటచే ఆ నీచుడామెను భక్షించెనేమో? 11

మూ. అథవా రాక్షసేన్ద్రస్య పత్నీభిరసితేక్షణా, 12
అదుష్టా దుష్టభావాభిర్భక్షితా సా భవిష్యతి.

ప్ర. అ. అథవా = లేదా, అదుష్టా = దుష్టురాలు కానిదీ, అసితేక్షణా = నల్లని నేత్రములు కలదీ అయిన, సా = ఆమె, దుష్టభావాభిః = దుష్టములైన ఆలోచనలు గల, రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, పత్నీభిః = భార్యలచేత, భక్షితా = భక్షింపబడినది, భవిష్యతి = కాగలదు.

తా. నల్లని నేత్రములు గలదీ, సద్బుద్ధిమంతురాలూ అయిన ఆ సీతను, ఆమె సౌందర్యమునకు అసూయ చెందిన రావణుభార్యలు దుష్టభావముతో భక్షించినారేమో। 12

మూ. సంపూర్ణచన్ద్రప్రతిమం పద్మపత్రనిభేక్షణమ్, 13
రామస్య ధ్యాయతీ వక్త్రం పఞ్చత్వం కృపణా గతా.

ప్ర. అ. కృపణా = దీనురాలైన సీత, సంపూర్ణచన్ద్రప్రతిమమ్ = పూర్ణచంద్రునితో సమానమైన, పద్మపత్రనిభేక్షణమ్ = పద్మపత్రములతో సమానమైన నేత్రములు గల, రామస్య = రామునియొక్క, వక్త్రమ్ = ముఖమును,

ధ్యాయతీ = ధ్యానించుచున్నదై, పఞ్చత్వమ్ = మరణమును, గతా = పొంది యుండును.

తా. దీనురాలైన ఆ సీత, పూర్ణచంద్రునితో సమానమూ, పద్మపత్రముల వంటి నేత్రములు కలదీ అయిన రాముని ముఖమునే ధ్యానించుచు, విరహబాధచే మరణించినదేమో ! 13

మూ. హా రామ లక్ష్మణేత్యేవం హాయోధ్యే చేతి మైథిలీ, 14
విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి.

ప్ర. అ. వైదేహీ = విదేహదేశమునకు సంబంధించిన, మైథిలీ = సీత, హా రామ = అయ్యో। రామా। హా। లక్ష్మణ = అయ్యో। లక్ష్మణా, హా। అయోధ్యే = అయ్యో। అయోధ్యా, ఇతి = అని, బహు = అధికముగా, విలప్య = విలపించి, న్యస్తదేహా = విడువబడిన దేహము గలది, భవిష్యతి = కాగలదు.

తా. విదేహదేశమునందు పుట్టిన జనకరాజకుమారి, అయ్యో। రామా। అయ్యో। లక్ష్మణా। అయ్యో। అయోధ్యానగరమా। అని ఎంతగానో విలపించి దేహము విడచి ఉండును. 14

మూ. అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే, 15
నూనం లాలప్యతే సీతా పఞ్జరస్థేవ శారికా.

ప్ర. అ. అథవా = లేదా, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, నిహితా = ఉంచబడినదై, సీతా = సీత, పఞ్జరస్థా = పంజరమునం దున్న, శారికా ఇవ = గోరింక వలె, నూనమ్ = నిశ్చయముగా, లాలప్యతే = విలపించుచున్నది అని, మన్యే = తలచెదను.

తా. లేదా, రావణుని గృహములో బద్ధురాలై, సీత పంజరములో బంధించిన గోరింక వలె, విలపించుచుండును. 15

మూ. జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా, 16
కథముత్పలపత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్.

ప్ర. అ. జనకస్య = జనకునియొక్క, సుతా = కుమార్తె, రామపత్నీ = రాముని భార్య, సుమధ్యమా = మంచి నడుము గలదీ, ఉత్పలపత్రాక్షీ = నల్లకలువ

రేకుల వంటి నేత్రములు కలదీ అయిన, సీతా = సీత, రావణస్య = రావణుని యొక్క, వశమ్=వశమును, కథమ్=ఎట్లు, వ్రజేత్=పొందును.

తా. జనకమహారాజు కూతురూ, రాముని భార్యా, సుందరమైన నడుము గలదీ, నల్ల కలువరేకుల వంటి నేత్రములు కలదీ అయిన సీత రావణునకు ఎట్లు లొంగిపోవును?

మూ. వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా, 17
రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్.

ప్ర. అ. జనకాత్మజా=జనకుని కుమార్తె యైన సీత, వినష్టా వా=తప్పిపోయినను, ప్రణష్టా వా = పూర్తిగా కనబడకపోయినను, మృతా వా=మరణించినను, ప్రియభార్యస్య = ప్రియ మైన భార్య గల, రామస్య = రామునకు, నివేదయితుమ్ = తెలుపుటకు, న క్షమమ్ = యుక్తము కాదు.

తా. సీత తప్పిపోయినా, పూర్తిగా కనబడకుండా పోయినా, మరణించినా, ఏమైనా, భార్యపై అత్యధికప్రేమ గల రామునకు చెప్పుట మాత్రము యుక్తము కాదు. 17

మూ. నివేద్యమానే దోషః స్యాద్దోషః స్యాదనివేదనే, 18
కథంను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే.

ప్ర. అ. నివేద్యమానే = తెలుపబడగా, దోషః = దోషము, స్యాత్ = అగును. అనివేదనే=తెలుపకున్నను, దోషః=దోషము, స్యాత్ = అగును. కథమ్ = ఎట్లు, కర్తవ్యం ను ఖలు = చేయవలెనో? మే=నాకు, విషమమ్=విషమముగా, ప్రతిభాతి=తోచుచున్నది.

తా. రామునకు చెప్పినా దోషమే, చెప్పకపోయినా దోషమే. ఇప్పుడు నేను ఏమి చేయవలెను? ఈ పరిస్థితి అంతా విషమముగా కనబడుచున్నది. 18

మూ. అస్మిన్నేవంగతే కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిమ్, 19
భవేదితి మతం భూయో హనుమాన్ప్రవిచారయత్.

ప్ర. అ. అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, ఏవంగతే=ఈ విధముగా జరిగిన దగుచుండగా, ప్రాప్తకాలమ్ = కాలానుగుణమైనదీ, క్షమమ్ = యుక్త

మైనదీ, కిమ్=ఏమి, భవేత్=అగును? ఇతి=ఇట్లు, మతమ్ = పక్షమును, హనుమాన్=హనుమంతుడు, భూయః = మరల, ప్రవిచారయత్=ఆలోచించెను.

తా. తలపెట్టిన పని ఈ విధముగా అయినది కదా; ఇప్పు డేమి చేసిన కాలానుగుణముగాను, యుక్తముగాను ఉండును అని హనుమంతుడు చాల సేపు ఆలోచించెను. 19

మూ. యది సీతామదృష్ట్వాహం వానరేన్ద్రపురీమితః । 20
గమిష్యామి తతః కో వా పురుషార్థో భవిష్యతి.

ప్ర. అ. అహమ్=నేను, సీతామ్=సీతను, అదృష్ట్వా=చూడకుండగనే, ఇతః=ఇక్కడనుండి, వానరేన్ద్రపురీమ్ = సుగ్రీవుని పట్టణమును గూర్చి, గమిష్యామి యది=వెళ్ళినట్లయితే, తతః=దానివలన, కః=ఏమి, పురుషార్థః=పురుషార్థము, భవిష్యతి = కాగలదు?

తా. నేను సీతను చూడకుండగనే ఇక్కడినుండి కిష్కింధకు తిరిగి వెళ్ళినచో ఏమి సాధించి నట్లు? 20

మూ. మమేదం లఙ్ఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి, 21
ప్రవేశశ్చైవ లఙ్కాయా రాక్షసానాం చ దర్శనమ్.

ప్ర. అ. మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, సాగరస్య = సాగరముయొక్క, లఙ్ఘనమ్=దాటుట, లఙ్కాయాః = లంకయొక్క, ప్రవేశః=ప్రవేశము, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, దర్శనమ్ = దర్శనము, వ్యర్థమ్= వ్యర్థము, భవిష్యతి = కాగలదు.

తా. నేను సముద్రమును లంఘించుట, లంకలో ప్రవేశించుట, రాక్షసులను చూచుట ఇవన్నీ వ్యర్థ మైపోవును గదా! 21

మూ. కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః, 22
కిష్కిన్ధాం సమనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ.

ప్ర. అ. కిష్కిన్ధామ్ = కిష్కింధను, సమనుప్రాప్తమ్=చేరిన, మామ్= నన్ను, సుగ్రీవః = సుగ్రీవుడు, కిమ్=ఏమి, వక్ష్యతి=చెప్పగలడో, సమాగతాః

=చేరిన, హరయః వా = వానరులు గాని, తౌ=ఆ, దశరథాత్మజౌ వా=దశరథ కుమారులు గాని, ఏమి అందురో।

తా. కిష్కింధకు తిరిగి వెళ్ళిన నన్ను చూచి, సుగ్రీవుడు, అక్కడ కలసి ఉన్న వానరు లందరూ, ఆ రామలక్ష్మణులూ ఏ మందురో। 22

మూ. గత్వా తు యది కాకుత్స్థం వక్ష్యామి పరమప్రియమ్, 23
న దృష్టేతి మయా సీతా తత స్త్యక్ష్యతి జీవితమ్.

ప్ర. అ. గత్వా = వెళ్ళి, కాకుత్స్థమ్=రాముని గూర్చి, మయా=నాచేత, సీతా = సీత, న దృష్టా = చూడబడలేదు, ఇతి = అని, పరమ్ = మిక్కిలి, అప్రియమ్=అప్రియ మైన వాక్యమును, వక్ష్యామి యది=(నేను) చెప్పిన ట్లయితే, తతః = అటు పిమ్మట, జీవితమ్=జీవితమును, త్యక్ష్యతి = విడువగలడు.

తా. నేను రాముని దగ్గరకు వెళ్ళి "సీత కనబడలేదు" అని, దారు ణ అప్రియ మైన మాట చెప్పితో అది వినగానే అతడు ప్రాణములు విడచును. 23

మూ. పరుషం దారుణం క్రూరం తీక్ష్ణమిన్ద్రియతాపనమ్, 24
సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా న స భవిష్యతి.

ప్ర. అ. పరుషమ్ = పరుషమూ, దారుణమ్ = భయంకరమూ, క్రూరమ్ = క్రూరమూ, తీక్ష్ణమ్=తీక్ష్ణమూ, ఇన్ద్రియతాపనమ్=ఇంద్రియములను తపింప చేయునదీ అయిన, సీతానిమిత్తమ్=సీతకు సంబంధించిన, దుర్వాక్యమ్=దుర్వా క్యమును, శ్రుత్వా = విని, సః = అతడు, న భవిష్యతి = ఉండడు.

తా. "సీత కనబడలేదు" అను దుర్వాక్యము రామునకు చాల పరుష మైనది. భయంకరము; క్రూరము; తీక్ష్ణ మైనది: ఇంద్రియములను తపింప చేయునది. అట్టి వాక్యమును వినగానే అత డింక జీవించడు. 24

మూ. తం తు కృచ్ఛ్రగతం దృష్ట్వా పఞ్చత్వగతమానసమ్,
భృశానురక్తో మేధావీ న భవిష్యతి లక్ష్మణః.

ప్ర. అ. కృచ్ఛ్రగతమ్=కష్టము పొందినవాడూ, పఞ్చత్వగతమానసమ్ = మరణము పొందిన మనస్సు కలవాడూ అయిన, తమ్=ఆ రాముని, దృష్ట్వా

= చూచి, భృశానురక్తః = మిక్కిలి అనురాగముగలవాడూ, మేధావీ = మేధావంతుడూ అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, న భవిష్యతి = ఉండడు.

తా. కష్టాలలో చిక్కుకొన్న రాముడు మరణోన్ముఖుడై ఉండుట చూడగానే, అతనియందు చాలా ప్రేమ గలవాడు, మేధావి అయిన లక్ష్మణుడు కూడ జీవించడు. 25

మూ. వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోఽపి మరిష్యతి, 26
భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి.

ప్ర. అ. భ్రాతరౌ = సోదరులను, వినష్టౌ=మరణించినవారినిగా, శ్రుత్వా =విని, భరతోఽపి=భరతుడు కూడ, మరిష్యతి=మరణించగలడు. మృతమ్= మరణించిన, భరతమ్=భరతుని, దృష్ట్వా=చూచి, శత్రుఘ్నశ్చ=శత్రుఘ్నుడు కూడ, న భవిష్యతి=ఉండడు.

తా. రామలక్ష్మణుల మరణవార్త వినగానే భరతుడు మరణించును. భరతుడు మరణించుట చూచి శత్రుఘ్నుడు కూడ మరణించును. 26

మూ. పుత్రాన్మృతాన్సమీక్ష్యాథ న భవిష్యన్తి మాతరః, 27
కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న సంశయః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మాతరః = తల్లులైన, కౌసల్యా చ = కౌసల్య, సుమిత్రా చ=సుమిత్ర, కైకేయీ చ=కైకేయి, పుత్రాన్ = పుత్రులను, మృతాన్ = మరణించినవారినిగా, సమీక్ష్య = చూచి, న భవిష్యన్తి = ఉండరు; సంశయః = సంశయము, న=లేదు.

తా. పుత్రు లందరు మరణించుట చూచి తల్లులైన కౌసల్యా-సుమిత్రా-కైకేయులు కూడ ప్రాణములు విడచెదరు. 27

మూ. కృతజ్ఞః సత్యసన్ధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః, 28
రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్.

ప్ర. అ. కృతజ్ఞః=కృతజ్ఞుడు, సత్యసన్ధః=సత్యమైన ప్రతిజ్ఞకలవాడూ, ప్లవగాధిపః = వానరరాజు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, తథా=ఆ విధముగా,

గతమ్=మరణించిన, రామమ్ = రాముని, దృష్ట్వా = చూచి, తతః=పిమ్మట, జీవితమ్=జీవితమును, త్యక్ష్యతి=విడువగలడు.

తా. కృతజ్ఞుడూ, సత్యసంధుడూ అయిన వానరరాజు సుగ్రీవుడు, ఆ విధముగా రాముడు మరణించుట చూచి, తాను కూడ ప్రాణాలు విడచును. 28

మూ. దుర్మనా వ్యథితా దీనా నిరానన్దా తపస్వినీ, 29
పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్.

ప్ర. అ. భర్తృశోకేన = భర్తృశోకముచేత, పీడితా = పీడింపబడినదీ, దుర్మనాః = దుఃఖముతో కూడిన మనస్సు గలదీ, వ్యథితా = వ్యథ పొందినదీ, దీనా=దీనురాలూ, నిరానన్దా=ఆనందము లేనిదీ, తపస్వినీ = జాలిపడదగినదీ అయిన, రుమా=రుమ, జీవితమ్=జీవితమును, త్యక్ష్యతి=విడువగలదు.

తా. భర్త యైన సుగ్రీవుడు మరణించగానే రుమ, దుఃఖపీడితురాలై కలత చెందిన మనస్సుతో, వ్యథ చెంది, దీనురాలై, ఆనందము లేక, జాలిపడ వలసిన స్థితిలో ప్రాణములు విడచును. 29

మూ. వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా, 30
పఞ్చత్వం చ గతే రాజ్ఞి తారాపి న భవిష్యతి.

ప్ర. అ. వాలిజేన = వాలివలన కలిగిన, దుఃఖేన = దుఃఖముచేత, పీడితా = పీడింపబడినదీ, శోకకర్శితా = శోకముచేత కృశింపచేయబడినదీ అయిన, తారాపి = తారకూడ, రాజ్ఞి = రాజైన సుగ్రీవుడు, పఞ్చత్వమ్ = మరణమును, గతే = పొందినవాడగుచుండగా, న భవిష్యతి = ఉండదు.

తా. ముందుగానే వాలి మరణమువలన కలిగిన దుఃఖము పీడించు చుండగా శోకముచేత కృశింపచేయబడిన తార, సుగ్రీవుడు కూడ మరణించినచో, తాను కూడ మరణించును. 30

మూ. మాతాపిత్రోర్వినాశేన సుగ్రీవవ్యసనేన చ, 31
కుమారోఽప్యఙ్గదః కస్మాద్ధారయిష్యతి జీవితమ్.

తా. కుమారః=చిన్నవాడైన; అఙ్గదోఽపి = అంగదుడు కూడ, మాతాపిత్రోః = తలిదండ్రులయొక్క, వినాశేన = మరణముచేతను, సుగ్రీవస్య =

సుగ్రీవునియొక్క, వ్యసనేన=దుఃఖముచేతను, జీవితమ్ = జీవితమును, కస్మాత్ = ఎందువలన, ధారయిష్యతి=ధరించును?

తా. తలిదండ్రులు మరణించి, సుగ్రీవునకు కూడ అంత అవద వచ్చిన పిదప కుమారు డైన అంగదుడు మాత్రము ఎట్లు జీవించును? 31

మూ. భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః, 32
శిరాంస్యభిహనిష్యన్తి తలైర్ముష్టిభిరేవ చ.

ప్ర. అ. వనౌకసః = వానరులు, భర్తృజేన = ప్రభువువలన కలిగిన, దుఃఖేన = దుఃఖముచేత, అభిభూతాః = తిరస్కరింపబడినవారై, తలైః = అరచేతులతోను, ముష్టిభిరేవ చ = పిడికిళ్ళతోను, శిరాంసి = శిరస్సులను, అభిహనిష్యన్తి = కొట్టుకొనెదరు.

తా. వానరు లందరు తమ ప్రభువునకు కలిగిన దుఃఖమును భరింప జాలక, అరచేతులతోను, పిడికిళ్ళతోను తమ తలలు బాదుకొనెదరు. 32

మూ. సాన్త్వేనానుప్రదానేన మానేన చ యశస్వినా, 33
లాలితాః కపిరాజేన ప్రాణాంస్త్యక్ష్యన్తి వానరాః.

ప్ర. అ. యశస్వినా = కీర్తి గల, కపిరాజేన = సుగ్రీవునిచేత, సాన్త్వేన = మంచి మాటలచేతను, అనుప్రదానేన = చిన్న చిన్న పారితోషికములు ఇచ్చుట చేతను, మానేన = గౌరవించుటచేతను, లాలితాః = లాలింపబడిన, వానరాః = వానరులు, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యన్తి=విడువగలరు.

తా. మంచి మాటలు చెప్పుచు, పారితోషికములు ఇచ్చుచు గౌరవించుచు సుగ్రీవునిచే లాలన చేయబడిన వానరులు, అతడు మరణించగానే ప్రాణములు విడువగలరు. 33

మూ. న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః, 34
క్రీడామనుభవిష్యన్తి సమేత్య కపికుఞ్జరాః.

ప్ర. అ. కపికుఞ్జరాః = వానరశ్రేష్ఠులు, సమేత్య = కలిసి, వనేషు = వనములయందు, క్రీడామ్ = క్రీడను, న అనుభవిష్యన్తి = అనుభవించరు.

శైలేషు = పర్వతములమీద, న = అనుభవించరు. నిరోధేషు వా పునః = గృహా ద్యావరణములందైన, న = అనుభవించరు.

తా. ఇటు పైన వానరు లందరు కలిసి, వెనుకటి వలె వనములందు గాని, పర్వతముంపీద గాని, గృహాదులందు గాని, క్రీడాసుఖమును అనుభవించరు.

మూ. సపుత్రదారాః సామాత్యా భర్తృవ్యసనపీడితాః, 35
శైలాగ్రేభ్యః పతిష్యన్తి సమేషు విషమేషు చ.

ప్ర. అ. సపుత్రదారాః = భార్యాపుత్రులతో కూడినవారై, సామాత్యాః = సహచరులతో కూడినవారై, భర్తృవ్యసనపీడితాః = ప్రభువుయొక్క దుఃఖము చేత పీడింపబడిన వానరులు, శైలాగ్రేభ్యః = పర్వతశిఖరములనుండి, సమేషు = సమ మైన ప్రదేశములందు, విషమేషు చ = మిట్టపల్లము లున్న ప్రదేశములం దును, పతిష్యన్తి = పడగలరు.

తా. వానరు లందరు ప్రభువుకు కలిగిన దుఃఖముచేత పీడింపబడినవారై భార్యాపుత్రులతోను, ఇతరసహచరులతోను కలిసి, పర్వతశిఖరముంపైనుండి సమప్రదేశములందును, విషమప్రదేశములందును దుమికి మరణించగలరు.

వి. "అమాత్య" శబ్దమునకు కూడా ఉందువారు అని వ్యుత్పత్త్యర్థము. అందుచేత ఇక్కడ ప్రకరణానుసారముగా ఆ అర్థమే యుక్తము. మంత్రులు అను అర్థము యుక్తము కాదు. 35

మూ. విషముద్బన్ధనం వాపి ప్రవేశం జ్వలనస్య వా, 36
ఉపవాసమథో శస్త్రం ప్రచరిష్యన్తి వానరాః.

ప్ర. అ. వానరాః = వానరులు, విషమ్ = విషమునుగాని, ఉద్బన్ధనం వాపి = ఉరిపోసికొనుటను గాని, జ్వలనస్య = అగ్నియొక్క, ప్రవేశం వా = ప్రవేశమునుగాని, ఉపవాసమ్ = ఉపవాసమును గాని, అథో = లేక, శస్త్రమ్ = ఆయుధమును గాని, ప్రచరిష్యన్తి = చేయగలరు.

తా. వానరులు విషము తిని గాని, ఉరి పోసికొని గాని, అగ్నిలో ప్రవే శించి గాని, ఉపవాసము చేసి గాని, ఆయుధములతో పొడుచుకొని గాని ప్రాణ ములు విడువగలరు. 36

మూ. ఘోరమారోదనం మన్యే గతే మయి భవిష్యతి, 37
ఇక్ష్వాకుకులనాశశ్చ నాశశ్చైవ వనౌకసామ్.

ప్ర. అ. మయి = నేను, గతే = వెళ్ళినవాడ నగుచుండగా, ఇక్ష్వాకుకుల నాశశ్చ = ఇక్ష్వాకుకులముయొక్క నాశము, వనౌకసామ్ = వానరులయొక్క, నాశశ్చైవ = నాశము, ఘోరమ్ = భయంకర మైన, ఆరోదనమ్ = ఏడ్పు, భవిష్యతి = కాగలదు అని, మన్యే = తలంచెదను.

తా. నేను తిరిగి వెళ్ళినచో ఇక్ష్వాకుకులము నశించును. వానరు లందరు నశించెదరు. ఈ విధముగా భయంకర మైన ఏడ్పు సంభవించును. 37

మూ. సోఽహం నైవ గమిష్యామి కిష్కింధాం నగరీమితః, 38
న చ శక్ష్యామ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం వినా.

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, ఇతః = ఇక్కడినుండి, కిష్కింధాం నగరీమ్ = కిష్కింధానగరమును గూర్చి, నైవ గమిష్యామి = వెళ్ళను. అహమ్ = నేను, మైథిలీం వినా = సీత లేకుండగా, సుగ్రీవమ్ = సుగ్రీవుని, ద్రష్టుమ్ = చూచుటకు, న చ శక్ష్యామి = సమర్థుడను కాజాలను కూడ.

తా. నే నిక్కడనుండి కిష్కింధకు వెళ్ళనే వెళ్ళను. సీత వార్త తెలియకుండగ నేను సుగ్రీవుని చూచుట కూడ శక్యము కాదు. 38

మూ. మయ్యగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ, 39
ఆశయా తౌ ధరిష్యేతే వానరాశ్చ మనస్వినః

ప్ర. అ. మయి = నేను, అగచ్ఛతి = వెళ్ళకుండగా, ఇహస్థే = ఇక్కడనే ఉన్నవాడ నగుచుండగా, ధర్మాత్మానౌ = ధర్మాత్ములును, మహారథౌ = మహారథులును అయిన, తౌ = ఆ రామలక్ష్మణులు, ఆశయా = ఆశచేత, ధరిష్యేతే = జీవించి ఉండగలరు. మనస్వినః = మానవంతులైన, వానరాశ్చ = వానరులు కూడ వించి ఉందురు).

తా. నేను వెళ్ళకుండా ఇక్కడనే ఉండిపోయినచో, ధర్మాత్ములూ మహారథులూ అయిన ఆ రామలక్ష్మణులూ, మానవంతు లైన వానరులూ, 'హనుమంతుడు వచ్చును సీతవార్త తెచ్చును' అను ఆశతో జీవించి ఉందురు. 39

మూ. హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః, 40
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్,
సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే. 41

ప్ర. అ. జనకాత్మజామ్=సీతను. అదృష్ట్వా=చూడక, హస్తాదానః= చేతిలో పడినదానిని గ్రహించుచు, ముఖాదానః=ముఖమునకు అందినదానిని తినుచు, నియతః = నియమవంతుడనై, బహుమూలఫలోదకే = అనేకమైన దుంపలు, ఫలములు, ఉదకము గల, సాగరానూపజే=సముద్రజలల సమీపము నందలి. దేశే=ప్రదేశమునందు, వృక్షమూలికః=వృక్షమూలములను ఆశ్రయించిన వాడనై, వానప్రస్థః=వానప్రస్థుడను, భవిష్యామి = అగుదును.

తా. సీత కనబడకున్నచో నేను నియమము పాటించుచు, వృక్షమూలము నందు నివసించుచు చేతిలో పడినదానిని గ్రహించుచు, నోటికి అందిన దానిని తినుచు దుంపలూ, ఫలములు, ఉదకము సమృద్ధిగా ఉన్న సముద్ర జలప్రాయ ప్రదేశమునందు వానప్రస్థజీవనము గడపెదను. 40, 41

మూ. చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధమరణీసుతమ్,
ఉపవిష్టస్య వా సమ్యగ్లిఙ్గినం సాధయిష్యతః, 42
శరీరం భక్షయిష్యన్తి వాయసాః శ్వాపదాని చ.

ప్ర. అ. చితామ్=చితను. కృత్వా=చేసుకొని, సమిద్ధమ్=ప్రజ్వలించుచున్న, అరణీసుతమ్=అగ్నిని, ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను. వా=లేక, ఉపవిష్టస్య=కూర్చుని ఉన్నవాడనై, లిఙ్గినమ్=అనశనవ్రతమును, సాధయిష్యతః =సాధింపనున్న నాయొక్క, శరీరమ్=శరీరమును, వాయసాః=కాకులు, శ్వాపదాని చ=క్రూరజంతువులూ, భక్షయిష్యన్తి=భక్షించగలవు.

తా. లేదా చితను ఏర్పరచుకొని ప్రజ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించెదను. లేదా అనశనవ్రతమును, అవలంబించి కూర్చున్న నా శరీరమును కాకులు, క్రూరజంతువులు తినివేయగలవు.

వి. 'లిఙ్గినమ్' అనగా లింగము (దేహము) గల ఆత్మ. దానిని 'సాధయిష్యతః' సాధింపనున్న అనగా ఆత్మను దేహమునుండి విడదీయ నున్న అని కొందరు వ్యాఖ్యాతలు అర్థము చెప్పిరి. లింగ మనగా సంన్యాసము. అనగా శిఖ

కుంటుట. దానిని సాధింపనున్న అని గోవిందరాజులు. "లిఙ్గినీమ్' అని గోవింద రాజుల పాఠము. 'లిఙ్గినమ్' లింగరూపు డైన శివుని, సాధయిష్యతః=ధ్యానింపనున్న అను అర్థము కూడా చెప్పవచ్చును. 42

మూ. ఇదం మహర్షిభిర్దృష్టం నిర్యాణమితి మే మతిః, 43
సమ్యగాపః ప్రవేక్ష్యామి న చేత్పశ్యామి జానకీమ్.

ప్ర. అ. ఇదమ్=ఇది, మహర్షిభిః=మహర్షుల చేత, దృష్టమ్=చూడబడిన, నిర్యాణమ్=శరీరత్యాగమార్గము, ఇతి=అని, మే=నాయొక్క, మతిః=అభిప్రాయము. జానకీమ్=సీతను, న చేత్పశ్యామి=చూడకున్నట్లయితే, సమ్యక్=బాగుగా, అపః=ఉదకమును, ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

తా. అట్టి పరిస్థితులలో మహర్షులు చెప్పిన ప్రాణత్యాగోపాయము ఇదే అని నా అభిప్రాయము. అందుచే జానకి కనబడకపోయినచో తిన్నగా పోయి జలములో దుమికెదను. 43

మూ. సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ, 44
ప్రభగ్నా చిరరాత్రాయ మమ సీతామపశ్యతః.

ప్ర. అ. సీతామ్=సీతను, అపశ్యతః=చూడని, మమ=నాయొక్క, చిరరాత్రాయ=చిరకాలము, సుజాతమూలా=దృఢముగా ఏర్పడిన మూలము కలదీ, సుభగా=సుందర మైనదీ, యశస్వినీ=యశస్సుతో కూడినదీ అయిన, కీర్తిమాలా=కీర్తియొక్క మాల (పంక్తి), ప్రభగ్నా=భగ్న మైపోయినది.

తా. యశస్సుతో కూడిన సుందర మైన కీర్తిమాల చాలకాలమునుండి దృఢ మైన మూలముతో పెరిగి ఉన్నది. అట్టి కీర్తిమాల నేడు నేను సీతను చూడజాలక పోవుటచే నశించిపోయినది.

వి. యశస్సుతో కూడిన కీర్తిమాల నశించిన దనగా యశస్సూ, కీర్తి రెండూ నశించిన వని యర్థము. విశిష్టము లైన కార్యములు చేయుటవలన కలిగిన గొప్పతనము యశస్సు. అందరును పొగడుట కీర్తి. 'చిరరాత్రి' అను పాఠము, ఆ పాఠమును అనుసరించి 'దీర్ఘ మైన రాత్రి' అను వ్యాఖ్యానము కూడ యుక్తముగా లేదని తోచుచున్నది. 44

మూ. తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః. 45
నేతః ప్రతిగమిష్యామి తామదృష్ట్వా సితేక్షణామ్.

ప్ర. అ. నియతః = నియమవంతుడూ, వృక్షమూలికః = వృక్షమూలమును ఆశ్రయించినవాడూ అయిన, తాపసో వా = మునిగా నైనా, భవిష్యామి = కాగలను. అసితేక్షణామ్ = నల్లని నేత్రములు గల, తామ్ = ఆ సీతను, అదృష్ట్వా = చూడకుండగా, ఇతః = ఇక్కడినుండి, న ప్రతిగమిష్యామి = తిరిగి వెళ్ళను.

తా. లేదా నియమములు అవలంబించి, వృక్షమూలమునందు కూర్చుండి మునిజీవితమును గడపెదను. నల్లని నేత్రములు గల ఆ సీతను చూడకుండా ఇక్కడినుండి వెనుకకు మాత్రము వెళ్ళను. 45

మూ. యదీతః ప్రతిగచ్ఛామి సీతామనధిగమ్య తామ్, 46
అఙ్గదః సహ తైః సర్వైర్వానరైర్న భవిష్యతి.

ప్ర. అ. తామ్ = ఆ, సీతామ్ = సీతను, అనధిగమ్య = తెలుసుకొనకుండగా, ఇతః = ఇక్కడినుండి, ప్రతిగచ్ఛామి యది = (నేను) తిరిగి వెళ్ళినచో, సర్వైః = సమస్తమైన, తైః = ఆ, వానరైః సహ = వానరులతో కూడ, అఙ్గదః = అంగదుడు, న భవిష్యతి = ఉండడు.

తా. నేను సీత జాడ తెలుసుకొనకుండగా ఇక్కడినుండి తిరిగి వెళ్ళినచో, అంగదుడు, వానరు లందరూ కూడ జీవించరు. 46

మూ. వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి, 47
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసంగమః..

ప్ర. అ. వినాశే = మరణించుటలో, బహవః = అనేకమైన, దోషాః = దోషము లున్నవి, జీవన్ = బ్రతికి ఉన్నవాడు, భద్రాణి = మంగళములను, పశ్యతి = చూచును. తస్మాత్ = ఆ కారణమువలన, ప్రాణాన్ = ప్రాణములను, ధరిష్యామి = ధరించెదను. జీవితసంగమః = జీవించి ఉన్నవారియొక్క కలయిక, ధ్రువః = నిశ్చితము.

తా. మరణించుట అనేక దోషములకు హేతువు. మానవుడు బ్రతికి

ఉన్నతో మంగళములను చూడవచ్చును. అందువలన నేను ప్రాణములను విడు వను. జీవించి ఉన్నవాళ్ళు ఏ నాటికైన తప్పక కలుసుకొందురు. 47

మూ. ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయన్ముహుః, 48
నాధ్యగచ్ఛత్తదా పారం శోకస్య కపికుఞ్జరః.

ప్ర. అ. కపికుఞ్జరః = హనుమంతుడు, ఏవమ్ = ఇట్లు, బహువిధమ్= అనేకవిధము లైన, దుఃఖమ్ = దుఃఖమును, ముహుః = మాటిమాటికి, మనసా= మనస్సుతో, ధారయన్ = నిలుపుకొనుచు, తదా = అప్పుడు, శోకస్య=శోకము యొక్క, పారమ్ = పారమును, నాధ్యగచ్ఛత్=పొందలేదు.

తా. హనుమంతు డీ విధముగా కలిగిన, అనేకవిధము లైన, దుఃఖ మును మనస్సులోనే అణచుకొనుచుండెను. ఆ శోకమునకు అంతము కనబడ కుండెను. 48

మూ. రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్, 49
కామమస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి.

ప్ర. అ. వా = లేదా, దశగ్రీవమ్ = పదికంఠములు కలవాడూ, మహా బలమ్=గొప్ప బలము కలవాడూ అయిన, రావణమ్=రావణుని, వధిష్యామి= చంపెదను. హృతా = హరింపబడిన, సీతా=సీత, కామమ్ అస్తు=ఏ మైన అగు గాక. ప్రత్యాచీర్ణమ్ = ప్రతిక్రియ చేయబడినది, భవిష్యతి = కాగలదు.

తా. హరింపబడిన సీత విషయ మే మైనను, దశకంఠుడు, మహా బలుడూ అయిన రావణుని చంపివేసెదను. దీనితో అతడు చేసినదానికి ప్రతి క్రియ చేసి నట్లు అగును. 49

మూ. అథవైనం సముత్క్షిప్య ఉపర్యుపరి సాగరమ్, 50
రామాయోపహరిష్యామి పశుం పశుపతేరివ.

ప్ర. అ. అథవా=లేదా, ఏనమ్= ఈ రావణుని, సాగరమ్ ఉపర్యుపరి= సముద్రము పై పైన, సముత్క్షిప్య= ఎత్తుకొనివెళ్ళి, పశుపతేః = పశుపుంస్వామి యొక్క, పశుమివ = పశువును వలె, రామాయ=రామునకు, ఉపహరిష్యామి= చేర్చెదను.

తా. లేదా ఈ రావణుని సముద్రము పై పైన ఎత్తికొని పోయి, పశువుల యజమానికి వాని పశువును అప్పగించి నట్లు రామునకు అప్పగించెదను.

వి. 'పశుపతేః = అగ్నికి' అని గోవిందరాజవ్యాఖ్య. 'పశుపతి'శబ్దము శివునియందు యోగరూఢముగాన 'శివునకు' అను అర్థము చెప్పవచ్చును. శివునకు పశుబలిని సమర్పించుట కూడ ప్రసిద్ధమే. "పశునా రుద్రం యజతే" "ఉపహృతపశూ రుద్రః" ఇత్యాద్యుదాహరణములు సిద్ధాంతకౌముద్యాదులలో ప్రసిద్ధములు. వానికి కూడ శ్రుతులే ఆధారము. 50

మూ. ఇతి చిన్తాం సమాపన్నః సీతామనధిగమ్య తామ్, 51
ధ్యానశోకపరీతాత్మా చిన్తయామాస వానరః.

ప్ర. అ. వానరః = హనుమంతుడు, తామ్ = ఆ, సీతామ్ = సీతను, అనధిగమ్య = పొందక (చూడక), ఇతి = ఇట్లు, చిన్తామ్ = చింతను, సమాపన్నః = పొందినవాడై, ధ్యానశోకపరీతాత్మా = ఆలోచనంతోను, శోకముతోను నిండిన మనస్సు కలవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. హనుమంతుడు, సీత కనబడక పోవుటచే ఈ విధముగా చింతించుచు అనేకవిధములైన ఆలోచనలు, శోకము మనస్సును బాధించుచుండగా, ఇట్లు అనుకొనెను. 51

మూ. యావత్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్, 52
తావదేతాం పురీం లఙ్కాం విచినోమి పునః పునః.

ప్ర. అ. రామపత్నీమ్ = రాముని భార్య, యశస్వినీమ్ = కీర్తిగలది అయిన, సీతామ్ = సీతను, యావత్ = ఎంతవరకు, పశ్యామి = చూచెదనో, తావత్ = అంతవరకు, ఏతామ్ = ఈ, లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును, పునః పునః = మాటిమాటికి, విచినోమి = వెదకెదను.

తా. రాముని భార్య, యశశ్శాలిని అయిన సీత కనబడునంతవరకు నేను ఈ లంకాపట్టణమును మాటిమాటికిని వెదకెదను. 52

మూ. సంపాతివచనాచ్చాపి రామం యద్యానయామ్యహమ్, 53
అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహేత్సర్వవానరాన్.

ప్ర. అ. సంపాతివచనాత్=సంపాతియొక్క వచనమువలన, అహమ్= నేను, రామమ్=రాముని, అనయామి యది=తీసికొనివచ్చిన ట్లయితే, రాఘవః= రాముడు, భార్యామ్=భార్యను, అపశ్యన్=చూడనివాడై, సర్వవానరాన్= సమస్తవానరులను, నిర్దహేత్=కాల్చివేయును.

తా. సంపాతి చెప్పినాడు కదా యని, సీత లంకలో ఉన్నదని తెలిపి నేను రాముని ఇక్కడికి తీసికొనివచ్చినచో, ఇక్కడ అతని భార్య కనబడక పోయిన పక్షాన, ఆ రాముడు వానరు లందరినీ కాల్చివేయగలడు. 53

మూ. ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేన్ద్రియః, 54
న మత్కృతే వినశ్యేయుః సర్వే తే నరవానరాః.

ప్ర. అ. నియతాహారః = నియత మైన ఆహారము గలవాడ నై, నియతేన్ద్రియః=నిగ్రహించుకొనబడిన ఇంద్రియములు గలవాడ నై, ఇహైవ= ఇక్కడనే, వత్స్యామి = నివసించెదను. మత్కృతే=నా నిమిత్తముగా, తే=ఆ, నరవానరాః = నరవానరులు, న వినశ్యేయుః = నశించకుందురు గాక.

తా. ఆహారనియమము పాటించుచు, ఇంద్రియములను నిగ్రహించుకొని ఇక్కడనే నివసించెదను. రామాదినరులు, అంగదసుగ్రీవాదివానరులు నా మూలాన నశించకుందురుగాక. 54

అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా, 55
ఇమామధిగమిష్యామి న హీయం విచితా మయా.

ప్ర. అ. మహాద్రుమా = పెద్ద పెద్ద వృక్షములు గల, యా = ఏ, ఇయమ్ = ఈ, అశోకవనికా = అశోకవనము, దృశ్యతే = చూడబడుచున్నదో, ఇమామ్ = దీనిని, అధిగమిష్యామి = పొందెదను. ఇయమ్ = ఇది, మయా = నాచేత, న విచితా హి = వెదకబడలేదు కదా.

తా. పెద్ద పెద్ద వృక్షములతో అశోకవనము ఎదుట కనబడుచున్నది. నేను ఈ వనములో వెదకలేదు. అందుచేత దానిలోనికి వెళ్ళెదను. 55

మూ. వసూన్రుద్రాంస్తథాదిత్యానశ్వినౌ మరుతోఽపి చ, 56
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః.

ప్ర. అ. వసూన్ = అష్టవసువులను, రుద్రాన్ = ఏకాదశరుద్రులను, తథా = మరియు, ఆదిత్యాన్ = ద్వాదశాదిత్యులను, అశ్వినౌ = ఇద్దరు అశ్వినీ దేవతలను, మరుతోఽపి చ = సప్త మరుత్తులను, నమస్కృత్వా=నమస్కరించి, రక్షసామ్=రాక్షసులకు, శోకవర్ధనః=శోకమును వృద్ధిపొందించువాడనై, గమిష్యామి = వెళ్ళెదను

తా. వసువులకు, రుద్రులకు, ఆదిత్యులకు, అశ్వినీదేవతలకు, మరుత్తులకు నమస్కరించి, రాక్షసుల దుఃఖమును వృద్ధిపొందించుటకై, ఈ వనములో ప్రవేశించెదను. 56

మూ. జిత్వా తు రాక్షసాన్ సర్వానిక్ష్వాకుకులనన్దినీమ్, 57
సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే.

ప్ర. అ. సర్వాన్ = సమస్తమైన, రాక్షసాన్ = రాక్షసులను, జిత్వా తు = జయించి, ఇక్ష్వాకుకులనన్దినీమ్ = ఇక్ష్వాకువంశమునకు ఆనందమును కలిగించు సీతను, తపస్వినే = తపస్సు చేసినవానికి, సిద్ధిం యథా = సిద్ధిని వలె, రామాయ = రామునికి, సంప్రదాస్యామి = ఇచ్చెదను.

తా. రాక్షసుల నందరినీ జయించి, తపోధనునకు సిద్ధిని అందించినట్లు, ఇక్ష్వాకుకులానందవర్ధని యైన సీతను రామునివద్దకు చేర్చెదను. 57

మూ. స ముహూర్తమివ ధ్యాత్వా చిన్తావగ్రథితేన్ద్రియః, 58
ఉదతిష్ఠన్మహాతేజా హనుమాన్ మారుతాత్మజః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మారుతాత్మజః = వాయు పుత్రుడైన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, చిన్తావగ్రథితేన్ద్రియః = చింతచేత కట్టబడిన ఇంద్రియములు కలవాడై, ముహూర్తమివ = క్షణకాలము, ధ్యాత్వా = ధ్యానించి, ఉదతిష్ఠత్ = లేచెను.

తా. మహాతేజశ్శాలి, వాయునందనుడూ అయిన ఆ హనుమంతుడు, చింతచేత దుర్బలము లైపోయిన ఇంద్రియములు కలవాడై, క్షణకాలము పాటు ఆలోచించి అశోకవన ప్రవేశోద్యుక్తుడై లేచెను. 58

మూ. నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,

నమోఽస్తు రుద్రేన్ద్రయమానిలేభ్యో
నమోఽస్తు చన్ద్రార్కమరుద్గణేభ్యః. 59

ప్ర. అ. సలక్ష్మణాయ=లక్ష్మణునితో కూడిన, రామాయ=రామునకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. దేవ్యై=దేవి యైన, తస్యై=ఆ, జనకాత్మజాయై చ=సీతకు కూడ, నమస్కారము అగుగాక. రుద్రేన్ద్రయమానిలేభ్యః=రుద్రునకు ఇంద్రునకు, యమునకు వాయుదేవునకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. చన్ద్రార్కమరుద్గణేభ్యః= చంద్రునకు, సూర్యునకు మరుద్గణములకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక.

తా. లక్ష్మణసమేతు డైన రామునకు జనకుని పుత్రి యైన సీతాదేవికిని నమస్కారము. రుద్రునకు, ఇంద్రునకు, యమునకు, వాయుదేవునకు నమస్కారము. చంద్రునకు, సూర్యునకు మరుద్గణములకు నమస్కారము. 59

మూ. స తేభ్యస్తు నమస్కృత్వా సుగ్రీవాయ చ మారుతిః,
దిశః సర్వాః సమాలోక్య హ్యశోకవనికాం గతః. 60

ప్ర. అ. సః మారుతిః=ఆ హనుమంతుడు, తేభ్యః = రామాదులకు, నమస్కృత్వా= నమస్కరించి, సుగ్రీవాయ చ =సుగ్రీవునకు కూడ నమస్కరించి, సర్వాః=సమస్త మైన, దిశః=దిక్కులను, సమాలోక్య= చూచి, అశోకవనికామ్=అశోకవనమును గూర్చి, గతః=వెళ్ళినాడు.

తా. హనుమంతుడు రామాదులకు. సుగ్రీవునకూ నమస్కరించి, ఒక్కసారి అన్ని దిక్కుల వైపు చూచి, అశోకవనము వైపు వెళ్ళెను 60

మూ. స గత్వా మనసా పూర్వమశోకవనికాం శుభామ్,
ఉత్తరం చిన్తయామాస వానరో మారుతాత్మజః. 61

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రు డైన, సః వానరః=ఆ హనుమంతుడు, మనసా=మనస్సుచేత, పూర్వమ్=ముందుగానే, శుభామ్=సుందర మైన, అశోకవనికామ్=అశోకవనమును గూర్చి, గత్వా=వెళ్ళి, ఉత్తరమ్= తరువాత చేయవలసిన దానిని గూర్చి, చిన్తయామాస=ఆలోచించెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు ముందుగానే మనసా ఆ అశోక వనమును ప్రవేశించి, తరువాత చేయవలసిన పనిని గూర్చి ఆలోచించెను. 61

మూ. ధ్రువం తు రక్షోబహులా భవిష్యతి వనాకులా.
అశోకవనికా పుణ్యా సర్వసంస్కారసంస్కృతా. 62

ప్ర. అ. అశోకవనికా = అశోకవనము. ధ్రువమ్ = తప్పక, రక్షోబహులా = రాక్షసులు అధికముగా కలదిగాను, వనాకులా = వృక్షములతో ఆకులముగాను, సర్వసంస్కారసంస్కృతా = సకలసంస్కారములచేత సంస్కరింపబడినదై, పుణ్యా = పుణ్య మైనది గాను. భవిష్యతి = ఉండగలదు.

తా. అశోకవనము రాక్షసులతో నిండినదై, వృక్షములతో వ్యాకుల మై, అన్నివిధము లైన సంస్కారములచేత సంస్కృత మై పుణ్యప్రదముగా ఉండియుండును. 62

మూ. రక్షిణశ్చాత్ర విహితా నూనం రక్షన్తి పాదపాన్,
భగవానపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై, 63
సంక్షిప్తోఽయం మయాత్మా చ రామార్థే రావణస్య చ.

ప్ర. అ. అత్ర = ఇక్కడ, విహితాః = నియమింపబడిన, రక్షిణశ్చ = వనపాలకులు, పాదపాన్ = వృక్షములను, నూనమ్ = తప్పక, రక్షన్తి = రక్షించుచుందురు. సర్వాత్మా = సర్వాంతర్గతు డైన, భగవానపి = పూజ్యు డైన వాయుదేవుడు కూడ, నాతిక్షోభమ్ = ఎక్కువ క్షోభము లేకుండ, ప్రవాతి వై = వీచుచున్నాడు. మయా = నాచేత, రామార్థే = రామునికొరకు, రావణస్య చ = రావణునికి, అయమ్ = ఈ, ఆత్మా = శరీరము, సంక్షిప్తః = చిన్నదిగా చేయబడినది.

తా. ఈ ఉద్యానమునందు రక్షకభటులు నియమితులై తప్పక వృక్షములను రక్షించుచుందురు. సర్వాంతర్యామి, పూజ్యుడు అయిన వాయుదేవుడు కూడ తీవ్రత్వము లేకుండా వీచుచున్నాడు. రాముని కార్యము సిద్ధించుటకు, రావణుని కంటబడకుండుటకు నేను నా శరీరమును చాలా చిన్నదిగా చేసికొన్నాను.

మూ. సిద్ధిం మే సంవిధాస్యన్తి దేవాః సర్షిగణాస్త్విహ, 64
బ్రహ్మా స్వయంభూర్భగవాన్ దేవాశ్చైవ దిశన్తు మే,
సిద్ధిమగ్నిశ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్, 65
వరుణః పాశహస్తశ్చ సోమాదిత్యౌ తథైవ చ.

అశ్వినౌ చ మహాత్మానౌ మరుతః శర్వ ఏవ చ. 66
సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః,
దాస్యన్తి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః. 67

ప్ర. అ. సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, దేవాః = దేవతలు, ఇహ = ఇక్కడ, మే = నాకు, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, సంవిధాస్యన్తి = చేయగలరు, స్వయంభూః = స్వయముగా ఆవిర్భవించిన, భగవాన్ = మాహాత్మ్యము గల, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, దేవాశ్చైవ = దేవతలు, అగ్నిశ్చ = అగ్నిదేవుడు, వాయుశ్చ = వాయుదేవుడు, వజ్రభృత్ = వజ్రమును ధరించిన, పురుహూతశ్చ = దేవేంద్రుడు, పాశహస్తః = పాశము హస్తమునందు గల, వరుణశ్చ = వరుణుడు, తథైవ చ = మరియు, సోమాదిత్యౌ = చంద్రసూర్యులు, మహాత్మానౌ = మహాత్ము లైన, అశ్వినౌ చ = అశ్వినీదేవతలు, మరుతః = మరుత్తులు, శర్వః ఏవ చ = ఈశ్వరుడు, మే = నాకు, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, దిశన్తు = ఇచ్చెదరు గాక. సర్వాణి = సమస్త మైన, భూతాని = భూతములు, యః = ఎవ్వడు. భూతానామ్ = భూతములయొక్క, ప్రభుః = ప్రభువో ఆతడు, అన్యే = ఇతరు లైన యే = ఎవరు, అదృష్టాః = చూడబడనివా రై, పథి = మార్గమునందు, గోచరాః = ఉందురో వారు, మమ = నాకు, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, దాస్యన్తి = ఇవ్వగలరు.

తా. ఋషిగణములు, దేవతలు నాకు ఇక్కడ కార్యసిద్ధిని ఇచ్చెదరుగాక. స్వయముగా ఆవిర్భవించినవాడు, మహామహిమశాలి అయిన బ్రహ్మదేవుడు, దేవతలు, అగ్ని, వాయువు, వజ్రధారి యైన దేవేంద్రుడు, పాశమును ధరించిన వరుణుడు, చంద్రసూర్యులు, మహాత్ము లైన అశ్వినీదేవతలు, మరుత్తులు, శివుడు నాకు కార్యసిద్ధిని ఇచ్చెదరుగాక. సకలభూతములు, భూతముల అధిపతి యైన సర్వేశ్వరుడు కనబడకుండా మార్గములో ఉండు ఇతరదేవతలు నాకు కార్యసిద్ధిని ఇవ్వగలరు. 64-67

మూ. తదున్నసం పాణ్డురదన్తమవ్రణం
శుచిస్మితం పద్మపలాశలోచనమ్,
ద్రక్ష్యే తదార్యావదనం కదా న్వహం.
ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్. 68.

ప్ర. అ. ఉన్నసమ్ = ఉన్నత మైన నాసిక గలది, పాణ్డురదన్తమ్ = తెల్లని దంతములు గలది, అవ్రణమ్ = గాయములు (మచ్చలు మొ॥) లేనిది, శుచిస్మితమ్ = తెల్లని చిరునవ్వు గలది, పద్మపలాశలోచనమ్ = తామరరేకుల వంటి నేత్రములు గలది, ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్=నిర్మల మైన చంద్ర బింబముతో సమాన మైన దర్శనము గలది అయిన, తత్ = ఆ, తదార్యావదనమ్ = పూజ్యురా లైన ఆ సీతయొక్క ముఖమును, అహమ్ = నేను, కదా = ఎప్పుడు, ద్రక్ష్యే ను = చూడగలనో కదా।

తా. ఎత్తైన నాసిక, తెల్లని దంతములు, తెల్లని చిరునవ్వు, తామర రేకుల వంటి నేత్రములు గలదీ, ఎట్టి దోషములూ లేనిదీ చంద్రబింబము వలె కనబడు నదీ అయిన ఆ పూజ్యురా లైన సీతముఖమును ఎప్పుడు చూతునో గదా। 68

మూ. క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా
సుదారుణాలంకృతవేషధారిణా,
బలాభిభూతా హ్యబలా తపస్వినీ
కథం ను మే దృష్టిపథేఽద్య సా భవేత్. 69

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర. అ. క్షుద్రేణ = నీచుడు, పాపేన = పాపాత్ముడు, నృశంసకర్మణా = క్రూర మైన కర్మ గలవాడూ, సుదారుణాలఙ్కృతవేషధారిణా = చాల భయంకర ముగా అలంకరింపబడిన వేషమును ధరించువాడూ అయిన రావణునిచేత, బలాభిభూతా = బలాత్కారముగా తిరస్కరింపబడిన, తపస్వినీ = దీనురా లైన, సా = ఆ, అబలా = దుర్బల యైన సీత, అద్య = ఇప్పుడు, మే = నాయొక్క, దృష్టిపథే = దృష్టిమార్గమునందు, కథం = ఎట్లు, భవేత్ ను = అగునో।

తా. నీచుడు, పాపాత్ముడూ, క్రూర మైన పనులు చేయువాడూ, చాల భయమును కలిగించు నట్లు అలంకరించుకొనిన వేషమును ధరించినవాడూ, అయిన రావణుడు, దీనురాలూ, అబలా అయిన ఆ సీతను బలాత్కారముగా అపహరించినాడు. అట్టి సీత ఎప్పుడు నా కంటికి కనబడునో కదా। 69

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పదమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్దశః సర్గః

[హనుమంతుడు అశోకవనములో ప్రవేశించి దాని శోభను చూచుట. ఒక అశోకవృక్షము మీద దాగి అతడు దానిపైనుండియే వరీక్షగా ఆ వనమును చూచుట].

మూ. స ముహూర్త మివ ధ్యాత్వా మనసా చాధిగమ్య తామ్,
ఆవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః. 1

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః = హనుమంతుడు, ముహూర్త మివ = క్షణకాలము, ధ్యాత్వా = ఆలోచించి, తామ్ = ఆ అశోకవనికను, మనసా = మనస్సు చేత, అధిగమ్య = పొంది, తస్య వేశ్మనః = ఆ గృహము యొక్క, ప్రాకారమ్ = ప్రాకారమును, అవప్లుతః = దిగెను.

తా. మహాతేజశ్శాలి యైన హనుమంతుడు క్షణకాలము ఆలోచించి, మనసా ఆ అశోకవనిలోనికి ప్రవేశించి, ఆ భవనము ప్రాకారమునుండి క్రిందికి దుమికెను. 1

మూ. స తు సంహృష్టసర్వాఙ్గః ప్రాకారస్థో మహాకపిః,
పుష్పితాగ్రాన్ వసన్తాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్. 2
సాలానశోకాన్ భవ్యాంశ్చ చంపకాంశ్చ సుపుష్పితాన్,
ఉద్దాలకాన్నాగవృక్షాంశ్చూతాన్కపిముఖానపి. 3

ప్ర. అ. ప్రాకారస్థః తు = ప్రాకారముమీద నున్నవాడై మాత్రము, సః మహాకపిః = ఆ హనుమంతుడు, సంహృష్టసర్వాఙ్గః = ఉప్పొంగిన సకలశరీరము కలవాడై, వసన్తాదౌ = వసంతప్రారంభమున, పుష్పితాగ్రాన్ = పుష్పించిన శాఖాగ్రములు గల, వివిధాన్ = అనేకవిధము లైన, ద్రుమాన్ = వృక్షములను, దదర్శ = చూచెను. సాలాన్ = సాలములను, భవ్యాన్ = సుందరము లైన,

అశోకాన్ = అశోకములను, సుపుష్పితాన్ = బాగుగా పుష్పించిన, చంపకాంశ్చ = చంపకపుష్పములను, ఉద్దాలకాన్ = విరిగిచెట్లను, నాగవృక్షాన్ = పొన్న చెట్లను, చూతాన్ = మామిడిచెట్లను, కపిముఖానపి = తీగకానుగ చెట్లను (చూచెను).

తా. హనుమంతుడు ప్రాకారముపై ఉండగానే, సంతోషముచేత ఉప్పొంగిన శరీరము కలవాడై, వసంతప్రారంభమునందు పుష్పించిన అగ్రభాగములు గల అనేకవిధము లైన వృక్షములను చూచెను. మద్దిచెట్లు, అందమైన అశోక వృక్షములు, చక్కగా పూసిన సంపెంగచెట్లు, విరిగిచెట్లు, పొన్నచెట్లు, మామిడి చెట్లు, తీగకానుగచెట్లు మొదలైన వాటిని చూచెను. 2, 3

మూ. అథామ్రవణసంఛన్నాం లతాశతసమావృతామ్,
జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్. 4

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ఆమ్రవణసంఛన్నామ్ = మామిడి చెట్ల వనముచేత కప్పబడినదీ, లతాశతసమావృతామ్ = వందలకొలది లతలచే ఆవరింపబడినదీ, అయిన, వృక్షవాటికామ్ = వృక్షవాటికను గూర్చి, జ్యాముక్తః = నారి నుండి విడువబడిన, నారాచః ఇవ = నారాచబాణము వలె, పుప్లువే = ఎగిరెను.

తా. పిమ్మట హనుమంతుడు, వింటి నారి నుండి విడువబడిన నారాచ బాణము వలె మహావేగముతో, అక్కడ ఉన్న వృక్షవాటికలోనికి ప్రవేశించెను. ఆ వృక్షవాటిక అనేకమైన మామిడిచెట్లతోను, వందల కొలది లతలతోను నిండి యుండెను.

మూ. స ప్రవిశ్య విచిత్రాం తాం విహగైరభినాదితామ్,
రాజతైః కాఞ్చనైశ్చైవ పాదపైః సర్వతో వృతామ్. 5
విహగైర్మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమాన్ కపిః. 6
వృతాం నానావిధైర్వృక్షైః పుష్పోపగఫలోపగైః,
కోకిలైర్భృఙ్గరాజైశ్చ మత్తైర్నిత్యనిషేవితామ్. 7
ప్రహృష్టమనుజే కాలే మృగపక్షిసమాకులే,
మత్తబర్హిణసంఘుష్టాం నానాద్విజగణాయుతామ్. 8

ప్ర. అ. కపిః = వానరుడైన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, ప్రహృష్టమనుజే = సంతోషించుచున్న మనుష్యులు కలదీ, మృగపక్షిసమాకులే = మృగములచేత, పక్షులచేత వ్యాకులమూ అయిన, కాలే = వసంతకాలమునందు, విచిత్రామ్ = అనేకవర్ణములు కలదీ, విహగైః = పక్షులచేత, అభినాదితామ్ = ధ్వనింపచేయబడినదీ, రాజతైః = వెండితో చేసినవీ, కాఞ్చనైశ్చైవ = బంగారముతో చేసినవీ అయిన, పాదపైః = వృక్షములతో, సర్వతః = చుట్టూ, వృతామ్ = కూడినదీ, విహగైః = పక్షులచేతను, మృగసంఘైశ్చ = మృగముల సముదాయములచేతను, విచిత్రామ్ = విచిత్రమైనదీ, చిత్రకాననామ్ = చిత్రమైన వనము (వృక్షసముదాయము) కలదీ, ఉదితాదిత్యసంకాశామ్ = ఉదయించిన సూర్యునితో సమానమైనదీ, పుష్పోపగఫలోపగైః = పుష్పములను పొందినవీ ఫలములను పొందినవీ అయిన, నానావిధైః = అనేకవిధములైన, వృక్షైః = వృక్షములతో, వృతామ్ = కూడినదీ, మత్తైః = మదించిన, కోకిలైః = కోకిలలచేతను, భృఙ్గరాజైశ్చ = తుమ్మెదలచేతనూ, నిత్యనిషేవితామ్ = నిత్యమూ సేవింపబడినదీ, మత్తబర్హిణసంఘుష్టామ్ = మదించిన నెమళ్ళచేత ధ్వనింపచేయబడినదీ, నానాద్విజగణాయుతామ్ = అనేకవిధములైన పక్షుల సముదాయములతో కూడినదీ అయిన, తామ్ = ఆ వృక్షవాటికను, ప్రవిశ్య = ప్రవేశించి, దదర్శ = చూచెను.

తా. మనుష్యులూ, మృగపక్ష్యాదులూ ఆనందముతో విహరించుచుండు ఆ వసంతప్రారంభసమయమునందు, వివిధవర్ణములు గల పుష్పములతో ఆ వృక్షవాటిక విచిత్రవర్ణముగా ఉండెను. పక్షుల ధ్వనులతో ప్రతిధ్వనించుచున్న ఆ వృక్షవాటిక చుట్టూ వెండి చెట్లూ, బంగారపు చెట్లూ ఉండెను. అనేకవిధములైన పక్షులు, మృగములు విహరించుచుండుటచే విచిత్రముగా ఉండెను. వృక్షముల గుంపులు కూడ అనేకవర్ణములతో విచిత్రములుగా ఉండెను. ఆ వాటిక ఉదయించుచున్న సూర్యుడువలె ప్రకాశించుచుండెను. దాని చుట్టూ అనేకపుష్పములతో నిండిన వృక్షములూ, ఫలములతో నిండిన వృక్షములూ ఉండెను. మదించిన కోకిలలు, తుమ్మెదలు నిత్యము నివసించు ఆ వాటిక మదించిన నెమళ్ల ధ్వనులతో ప్రతిధ్వనించుచుండెను. అది వివిధపక్షిగణములతో నిండియుండెను. అట్టి వృక్షవాటికను చూచి హనుమంతుడు లోనికి ప్రవేశించెను. 5.8

మూ. మార్గమాణో వరారోహాం రాజపుత్రీమనిన్దితామ్,
సుఖప్రసుప్తాన్విహగాన్బోధయామాస వానరః. 9

ప్ర. అ. వానరః = హనుమంతుడు, వరారోహామ్ = అంద మైన కటి ప్రదేశము గల, అనిన్దితామ్ = నిందింపబడని, రాజపుత్రీమ్ = రాజపుత్రి యైన సీతను, మార్గమాణః = అన్వేషించుచు, సుఖప్రసుప్తాన్ = సుఖముగా నిద్రించు చున్న, విహగాన్ = పక్షులను, బోధయామాస = మేల్కొల్పెను.

తా. అంద మైన కటిప్రదేశము గలదీ, దోషములు లేనిదీ అయిన సీత కొరకై అన్వేషించుచు ఆ వనములో హనుమంతుడు ప్రవేశించగానే చెట్లపై నిద్రించుచున్న పక్షు లన్నీ నిద్రనుండి లేచి ఎగిరిపోయెను. 9

మూ. ఉత్పతద్భిర్ద్విజగణైః పక్షైః సాలాః సమాహతాః,
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః. 10

ప్ర. అ. ఉత్పతద్భిః = ఎగురుచున్న, ద్విజగణైః = పక్షిసమూహముల చేత, పక్షైః = రెక్కలచేత, సమాహతాః = కొట్టబడిన, సాలాః = వృక్షములు, అనేకవర్ణాః = అనేక మైన వర్ణములు గల, వివిధాః = అనేకవిధము లైన, పుష్ప వృష్టయః = పుష్పవృష్టులను, ముముచుః = విడచినవి.

తా. ఎగురుచున్న పక్షుల రెక్కలు తగిలి, వృక్షములు, అనేకవర్ణములు గల, అనేకవిధము లైన పుష్పవృష్టులను వర్షించినవి. 10

మూ. పుష్పావకీర్ణః శుశుభే హనుమాన్ మారుతాత్మజః,
అశోకవనికామధ్యే యథా పుష్పమయో గిరిః. 11

ప్ర. అ. పుష్పావకీర్ణః = పుష్పములచే కప్పబడిన, మారుతాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమంతుడు, అశోకవనికామధ్యే = ఆ అశోక వనము మధ్యయందు, పుష్పమయః = పుష్పముల వికార మైన, గిరిః యథా = పర్వతము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. పుష్పములచే కప్పబడిన వాయుపుత్రు డైన హనుమంతుడు, ఆ అశోకవనమధ్యమునందు, పుష్పమయ మైన పర్వతము వలె ప్రకాశించెను. 11

మూ. దిశః సర్వాః ప్రధావన్తం వృక్షషణ్డగతం కపిమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని వసన్త ఇతి మేనిరే. 12

తా. సర్వాః = సమస్త మైన, దిశః = దిక్కులను గూర్చి, ప్రధావన్తమ్ = పరుగెత్తుచున్న, వృక్షషణ్డగతమ్=వృక్షసముదాయము మధ్య నున్న, కపిమ్ = హనుమంతుని, దృష్ట్వా = చూచి, సర్వాణి = సమస్త మైన, భూతాని=భూతములు, వసన్తః ఇతి = వసంతుడు అని, మేనిరే = తలచినవి.

తా. ఆ చెట్ల లోపుల మధ్య అన్ని వైపులా పరుగెత్తుచున్న ఆ హనుమంతుని చూచిన వారందరూ సాక్షాత్తు వసంతుడే తిరుగుచున్నాడా అని అనుకొనిరి.

మూ. వృక్షేభ్యః పతితైః పుష్పైరవకీర్ణా పృథగ్విధైః,
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా. 13

ప్ర. అ. తత్ర = అక్కడ, వృక్షేభ్యః = వృక్షములనుండి, పతితైః = రాలిన, పృథగ్విధైః = వేరు వేరు విధము లైన, పుష్పైః = పుష్పములచేత, అవకీర్ణా=చల్లబడిన, వసుధా=భూమి, విభూషితా =అలంకరించబడిన, ప్రమదేవ = స్త్రీ వలె, రరాజ=ప్రకాశించెను.

తా. అక్కడ, వేరు వేరు రకముల పూవులు రాలి వాటిచే కప్పబడిన నేల చక్కగా, అలంకరించుకొన్న స్త్రీవలె ప్రకాశించెను. 13

మూ. తరస్వినా తే తరవస్తరసాభిప్రకమ్పితాః,
కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా. 14

ప్ర. అ. తదా=అప్పుడు, తరస్వినా=బలవంతు డైన, కపినా=హనుమంతునిచేత, తరసా = బలముచేత, అభిప్రకమ్పితాః = కదల్పబడిన, తే = ఆ, తరవః = వృక్షములు, విచిత్రాణి=విచిత్రము లైన, కుసుమాని=పుష్పములను, ససృజుః=విడచినవి.

తా. అప్పుడు, బలవంతు డైన ఆ హనుమంతుని బలానికి ఊగిపోయిన ఆ వృక్షములు రంగు రంగుల పువ్వులను రాల్చినవి. 14

మూ. నిర్ధూతపత్రశిఖరాః శీర్ణపుష్పఫలా ద్రుమాః,
నిక్షిప్తవస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః. 15

ప్ర. అ. నిర్ధూతపత్రశిఖరాః = ఎగురకొట్టబడిన ఆకులు గల శాఖాగ్ర

ములు గలవీ, శీర్ణపుష్పఫలాః=రాలిన పుష్పములు, ఫలములు గలవీ అయిన, ద్రుమాః=వృక్షములు, పరాజితాః=ఓడిపోయిన వారై, నిక్షిప్తవస్త్రాభరణాః=ఉంచబడిన వస్త్రములూ ఆభరణములూ గల, ధూర్తా ఇవ = జూదరుల వలె, ఉండెను.

తా. హనుమంతుడు వేగముగా అటు నటు సంచరించుటచే చెట్ల కొమ్మల చివర్లనుండి ఆకులు ఎగిరిపోయినవి. పుష్పములు, ఫలములు రాలిపోయినవి. అందుచే ఆ వృక్షములు, జూదములో ఓడిపోయి, నెగ్గినవారి కర్పించుటకై తమ వస్త్రములూ, అలంకారములూ తీసి క్రింద బెట్టిన జూదరుల వలె ఉండెను. 15

మూ. హనూమతా వేగవతా కమ్పితాస్తే నగోత్తమాః,
పుష్పపర్ణఫలాన్యాశు ముముచుః పుష్పశాలినః. 16

ప్ర. అ. వేగవతా=వేగము గల, హనూమతా = హనుమంతునిచేత, కమ్పితాః = కదల్పబడిన, పుష్పశాలినః = పుష్పములతో ప్రకాశించుచున్న, నగోత్తమాః=ఉత్తమములైన వృక్షములు, ఆశు=శీఘ్రముగా, పుష్పపర్ణఫలాని= పువ్వులను, ఆకులను, పండ్లను, ముముచుః=రాల్చినవి.

తా. పుష్పములతో నిండి యున్న వృక్షములు, హనుమంతుని వేగమునకు ఊగిపోయినవై, వెంటనే పుష్పములను, పత్రములను, ఫలములను రాల్చినవి. 16

మూ. విహఙ్గసఙ్ఘైర్హీనాస్తే స్కన్ధమాత్రాశ్రయా ద్రుమాః,
బభూవురగమాః సర్వే మారుతేనేవ నిర్ధుతాః. 17

ప్ర. అ. సర్వే = సమస్తమైన, తే ద్రుమాః=ఆ వృక్షములు, మారుతేన= వాయువుచేత, నిర్ధుతాః = కదల్పబడిన, అగమాః ఇవ = వృక్షముల వలె, విహఙ్గసఙ్ఘైః = పక్షిసమూహముల చేత, హీనాః = శూన్యములై, స్కన్ధమాత్రాశ్రయాః = మానులు మాత్రమే ఆశ్రయములుగా, బభూవుః = అయినవి.

తా. పక్షు లన్నీ ఎగిరిపోయి, పెద్ద పెద్ద కొమ్మలు మాత్రమే మిగిలిన ఆ వృక్షములు, పెనుగాలి తాకిన వృక్షముల వలె అయినవి. 17

మూ. నిర్ధూతకేశీ యువతిర్యథా మృదితవర్ణకా,
నిష్పీతశుభదన్తోష్ఠీ నఖైర్దన్తైశ్చ విక్షతా. 18

తథా లాఙ్గూలహస్తైశ్చ చరణాభ్యాం చ మర్దితా,
బభూవాశోకవనికా ప్రభగ్నవరపాదపా. 19

ప్ర. అ. లాఙ్గూలహస్తైశ్చ = తోకచేతను, చేతులచేతను, చరణాభ్యాం చ = పాదములచేతను, మర్దితా = నలగగొట్టబడినదీ, ప్రభగ్నవరపాదపా = విరిగిపోయిన శ్రేష్ఠములైన వృక్షములు కలదీ అయిన, అశోకవనికా = అశోకవనము. విధూతకేశీ = చెదరగొట్టబడిన కేశములు కలదీ, మృదితవర్ణకా = నలిగిపోయిన అంగరాగము (దేహమునకు పూసికొనిన సుగంధద్రవ్యము) కలదీ, నిష్పీత శుభదన్తోష్ఠీ = పానముచేయబడిన సుందరమైన దంతములు, ఓష్ఠమూ (పెదవి) కలదీ, నఖైః = గోళ్ళచేతను, దన్తైశ్చ = దంతములచేతను, విక్షతా = గీరబడినదీ అయిన, యువతిః = యువతి, యథా = ఎట్లో, తథా = అట్లు, బభూవ = అయెను.

తా. హనుమంతుని తోకచేత, హస్తములచేత, పాదములచేత నలగగొట్టబడి మంచి వృక్షములన్నీ విరిగిపోవుటచే ఆ అశోకవనము, ప్రియునిచే గాఢముగా చుంబింపబడినదై, నఖక్షతదంతక్షతములతో కూడిన శరీరముతో, చెదిరిపోయిన జుట్టుతో, నలిగిపోయిన రంగుతో ఉన్న యువతి వలె ఉండెను. 18,19

మూ. మహాలతానాం దామాని వ్యథమత్తరసా కపిః,
యథా ప్రావృషి విన్ధ్యస్య మేఘజాలాని మారుతః. 20

ప్ర. అ. కపిః = హనుమంతుడు, మహాలతానామ్ = గొప్పలతలయొక్క, దామాని = వలయములను, తరసా = బలముచేత, మారుతః = వాయువు, ప్రావృషి = వర్షాకాలమునందు, విన్ధ్యస్య = వింధ్యపర్వతముయొక్క, మేఘజాలాని = మేఘపంక్తులను, యథా = ఎట్లో, అట్లు, వ్యథమత్ = తెంపెను.

తా. వర్షాకాలమునందు వాయువు వింధ్యపర్వతముమీద నున్న మేఘపంక్తిని చెదరగొట్టినట్లు, హనుమంతుడు, బలముచే, పెద్దపెద్ద తీగంపొదలను ఛేదించెను. 20

మూ. స తత్ర మణిభూమీశ్చ రాజతీశ్చ మనోరమాః,
తథా కాఞ్చనభూమీశ్చ దదర్శ విచరన్ కపిః. 21

ప్ర. అ. సః = ఆ, కపిః = హనుమంతుడు, తత్ర = అక్కడ, విచరన్ =

సంచరించుచు, మణిభూమీశ్చ = మాణిక్యభూములను, రాజతీశ్చ = వెండి భూములను, తథా = మరియు, మనోరమాః = మనోహరము లైన, కాఞ్చనభూమీశ్చ = బంగారుభూములను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు అక్కడ సంచరించుచు, అతిసుందరము లైన మాణిక్యములు పొదిగిన చపటాలను, వెండి చపటాలను, బంగారు చపటాలను. చూచెను.

మూ. వాపీశ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా,
మహార్హైర్మణిసోపానైరుపపన్నాస్తత స్తతః. 22

ముక్తాప్రవాళసికతాః స్ఫాటికాన్తరకుట్టిమాః,
కాఞ్చనైస్తరుభిశ్చిత్రైస్తీరజైరుపశోభితైః. 23
ఫుల్లపద్మోత్పలవనాశ్చక్రవాకోపకూజితాః,
నత్యూహరుతసంఘుష్టా హంససారసనాదితాః. 24
దీర్ఘాభిర్ద్రుమయుక్తాభిః సరిద్భిశ్చ సమన్తతః,
అమృతోపమతోయాభిః శివాభిరుపసంస్కృతాః. 25
లతాశతైరవతతాః సన్తానకుసుమావృతాః,
నానాగుల్మావృతఘనాః కరవీరకృతాన్తరాః. 26

ప్ర. అ. పరమవారిణా = శ్రేష్ఠ మైన ఉదకముతో, పూర్ణాః = నిండినవి, తత స్తతః = అక్కడక్కడ, మహార్హైః = గొప్పమూల్యము గల, మణిసోపానైః = మాణిక్యముల మెట్లతో, ఉపపన్నాః = కూడినవి, ముక్తాప్రవాళసికతాః = ముత్యములు పొగడములు ఇసుకగా కలవి, స్ఫాటికాన్తరకుట్టిమాః = స్ఫటిక మాణిక్యవికారము లైన, మధ్యమున్న చపటాలు గలవి, తీరజైః = తీరములందు (పుట్టిన) ఉన్న, కాఞ్చనైః = బంగారువికార మైన, చిత్రైః = చిత్రవర్ణములు గల, తరుభిః = వృక్షములచేత, ఉపశోభితాః = ప్రకాశింప చేయబడినవి, ఫుల్ల పద్మోత్పలవనాః = వికసించిన పద్మ సముదాయములూ, కలువల సముదాయములూ, కలవి, చక్రవాకోపకూజితాః = చక్రవాక పక్షులచే సమీపమునందు ధ్వనింపచేయబడినవి, నత్యూహరుతసంఘుష్టాః = నీరు కోళ్ళచే ధ్వనింపచేయబడినవి, హంస సారసనాదితాః = హంసలచేతను, సారస పక్షులచేతను ధ్వనింపచేయబడినవి, దీర్ఘాభిః = పొడ వైన, ద్రుమయుక్తాభిః =

వృక్షములతో కూడిన, అమృతోపమతోయాభిః = అమృతము వంటి ఉదకములు గల, శివాభిః = మంగళకరము లైన, సరిద్భిః = కాలువలచేత, సమన్తతః = నలుమూలలా, ఉపస్కృతాః = అలంకరింపబడినవీ, లతాశతైః = వందలకొలది లతలచేత, ఆవతతాః = వ్యాప్తము లైనవీ, సంతానకుసుమావృతాః = సంతాన వృక్షముల పుష్పములచేత కప్పబడినవీ, నానాగుల్మావృతఘనాః = అనేకవిధము లైన పొదలచే ఆవరింపబడి దట్టముగా ఉన్నవీ, కరవీరకృతాంతరాః = కరవీర వృక్షములచే ఏర్పరుపబడిన మధ్యప్రదేశములు గలవీ అయిన, వివిధాకారాః = అనేక ఆకారములలో ఉన్న, వాపీః చ = దిగుడుబావులను కూడ (చూచెను.)

తా. హనుమంతుడు ఆ అశోకవనమునందు గుండ్రని, కోలని, చతురస్రము, దీర్ఘచతురస్రము మొదలైన వివిధాకారములలో ఉన్న, ఉత్తమ మైన జలముతో నిండిన దిగుడుబావులను కూడ చూచెను. వాటికి అక్కడక్కడ శ్రేష్ఠము లైన మాణిక్యముల మెట్లు ఉండెను. వాటిలో ఇసుకకు బదులు ముత్యములు, పగడములు ఉండెను. వాటి మధ్య కూర్చుండుటకై స్ఫటిక మాణిక్యముల చపటాలు ఉండెను. వాటి తీరములపై బంగారు చెట్లు, చిత్రవర్ణములు గల చెట్లు కృత్రిమముగా నిర్మితము లై ప్రకాశించుచుండెను. పద్మములు, కలువలు గుంపుగుంపులుగా వికసించి ఉండెను. చక్రవాకపక్షులు, నీటికోళ్లు, హంసలు, సారసపక్షులు మొదలైన జలపక్షుల కూతలు మధురముగా వినవచ్చుచుండెను. ఆ దిగుడుబావులకు నలువైపులా, అమృతము వంటి ఉదకముతో నిండినవీ, పొడవైనవీ, మంగళకరములూ, చెట్లచే ఆవరింపబడినవీ అయిన కాలువలు ఒప్పుచుండెను. వందల కొలది తీగలు వ్యాపించి ఉండెను. సంతానక వృక్షముల పుష్పములు వాటిపై రాలి ఉండెను. అనేకవిధము లైన పొదలు, చిన్న మొక్కలు వాటి చుట్టూ దట్టముగా వ్యాపించి ఉండెను. మధ్య మధ్య కరవీర వృక్షము లుండెను. 22-26

మూ. తతోఽమ్బుధరసంకాశం ప్రవృద్ధశిఖరం గిరిమ్,
విచిత్రకూటం కూటైశ్చ సర్వతః పరివారితమ్. 27
శిలాగృహైరవతతం నానావృక్షైః సమావృతమ్,
దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్. 28

ప్ర. అ. తతః = అటుపిమ్మట, హరిశార్దూలః = హనుమంతుడు, జగతి =

జగత్తులో, రమ్యం పర్వతమ్=అందమైన పర్వతమూ, అమ్బుధరసంకాశమ్= మేఘముతో సమానమూ, ప్రవృద్ధశిఖరమ్ = ఎత్తైన శిఖరములు కలదీ, విచిత్ర కూటమ్ = అనేక వర్ణములు గల శిఖరములు గలదీ, సర్వతః = అన్ని వైపు లందు, కూటైః=శిఖరములచే, పరివారితమ్=చుట్టబడి ఉన్నదీ, శిలాగృహైః= గుహలచేత, అవతతమ్ = వ్యాప్తమైనదీ, నానావృక్షైః = అనేకవిధములైన వృక్షములచే, సమావృతమ్ = కప్పబడినదీ అయిన, గిరిమ్ = పర్వతమును దదర్శ = చూచెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు, జగత్తులోని అందమైన పర్వతములలో ఒకటైన, మేఘము వంటి ఎత్తైన శిఖరములు గల పర్వతమును చూచెను. దాని చుట్టును ఉన్న శిఖరములు (చిన్న కొండలు) దానిపై నున్న శిఖరములు విచిత్ర వర్ణములై ఉండెను. అనేకవృక్షములతో నిండిన ఆ పర్వతమునందు, అక్కడక్కడ నివాసయోగ్యములైన గుహలు ఉండెను. 27, 28

మూ. దదర్శ చ నగాత్తస్మాన్నదీం నిపతితాం కపిః,
అఙ్కాదివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్.
జలే నిపతితాగ్రైశ్చ పాదపైరుపశోభితామ్,
వార్యమాణామివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబన్ధుభిః. 30
పునరావృత్తతోయాం చ దదర్శ స మహాకపిః,
ప్రసన్నామివ కాన్తస్య కాన్తాం పునరుపస్థితామ్. 31

ప్ర. అ. కపిః=హనుమంతుడు, తస్మాత్=ఆ, నగాత్ = పర్వతము నుండి, నిపతితామ్=క్రిందికి పడినదీ (ప్రవహించుచున్నదీ), ప్రియస్య=ప్రియుని యొక్క, అఙ్కాత్ = తొడనుండి, సముత్పత్య = క్రిందికి దుమికి, పతితామ్= పడిన, ప్రియామ్ ఇవ=ప్రియురాలి వలె ఉన్నదీ, జలే=జలమునందు, నిపతితాగ్రైః = పడిన అగ్రభాగములు గల, పాదపైః = వృక్షములచేత, ఉపశోభితామ్=ప్రకాశింపచేయబడినదీ, ప్రియబన్ధుభిః = ప్రియునియొక్క బంధువులచేత (లేదా ప్రియులైన బంధువులచేత), వార్యమాణామ్ = నివారింపబడుచున్న, క్రుద్ధామ్ = కోపించిన, ప్రమదామ్ ఇవ = యువతి వలె ఉన్నదీ అయిన, నదీమ్ = నదిని, దదర్శ=చూచెను. ఆవృత్తతోయామ్=మరల వెనుకకు తిరిగిన ఉదకము గలదీ, కాన్తస్య=ప్రియుని విషయమై, ప్రసన్నామ్=ప్రసన్నురాలూ, పునః

= మరల, ఉపస్థితామ్ = దగ్గరకు చేరిన, కాన్తామివ = ప్రియురాలు వలె ఉన్నదీ అయిన ఆ నదిని, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, పునః = మరల, దదర్శ, చూచెను.

తా. [మహాతపఃప్రభావసంపన్నుడైన రావణుడు తన తపోబలము వలన, ఐహికసౌఖ్యానుభవమునకే వినియోగించి అత్యద్భుతములైన భోగ సాధనములు అమర్చుకొన్నట్లు లంకావర్ణనము వలన స్పష్టమగుచున్నది. అశోక వనములో ఒక కృత్రిమపర్వతమున్నది. దాని పైనుంచి ఒక నది (కాలువ) క్రిందికి కొంత దూరము ప్రవహించి, మళ్ళీ వెనుకకు తిరిగి పర్వతము వైపునకే ప్రవహించునట్లు ఏర్పరుపబడినది. దాని తీరములపై ఉన్న వృక్షముల కొమ్మల అగ్రభాగములు ఆ కాలువ నీటికి తగులుచుండెను. ఆ దృశ్యమును ఆది కవి కవిదృష్టితో చూచి వర్ణించుచున్నారు] ఆ పర్వతమునుండి క్రిందికి జారి దూరముగా ప్రవహించి పోతూన్న ఆ నది మగనిమీద అలిగి వానిని విడచి, పుట్టినింటికి పయనమై పోవుచున్న భార్య వలె ఉండెను. దాని నీటిలో పడిన కొమ్మలు "నీవు భర్తను వదలి వెళ్లుట యుక్తము కాదు" అని చెప్పుచు ఆమెను అడ్డగించుచున్న బంధువుల చేతుల వలె ఉండెను. కొంత దూరము పోయి మరల పర్వతము వైపే ప్రవహించుచున్న ఆ నది బంధువుల మాటలు విని, అలక తీరి, మరల భర్తదరి జేరిన యువతివలె ఉండెను. హనుమంతుడు అట్టి నదిని చూచెను. 29-31

మూ. తస్యాదూరాత్స పద్మిన్యో నానాద్విజగణాయుతాః,
దదర్శ హరిశార్దూలో హనుమాన్ మారుతాత్మజః. 32

ప్ర. అ. హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడు, మారుతాత్మజః = వాయుపుత్రుడు అయిన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, తస్య = ఆ పర్వతమునకు, అదూరాత్ = సమీపమునందే, నానాద్విజగణాయుతాః = అనేక పక్షిసముదాయములతో కూడిన, పద్మిన్యః = పద్మసరస్సులను, దదర్శ = చూచెను.

తా. వానరశ్రేష్ఠుడూ, వాయుపుత్రుడూ అయిన ఆ హనుమంతునకు ఆ పర్వతము సమీపమునందే అనేక పక్షిగణములతో కూడిన పద్మసరస్సులు కనబడెను. 32

మూ. కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా,
మణిప్రవరసోపానాం ముక్తాసికతశోభితామ్. 33

వివిధైర్మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ప్రాసాదైః సుమహద్భిశ్చ నిర్మితైర్విశ్వకర్మణా, 34
కాననైః కృత్రిమైశ్చాపి సర్వతః సమలంకృతామ్.

ప్ర. అ. శీతేన=చల్లని, వారిణా = నీటితో, పూర్ణామ్ = నిండినదీ, మణిప్రవరసోపానామ్ = శ్రేష్ఠ మైన మణులతో కట్టిన మెట్లు కలదీ, ముక్తాసికతశోభితామ్ = ముత్యముల ఇసుకచే ప్రకాశింపచేయబడినదీ, వివిధైః = అనేకవిధములైన, మృగసంఘైశ్చ = మృగముల సముదాయముంచేత, విచిత్రామ్=ఆశ్చర్యకరముగా నున్నదీ, చిత్రకాననామ్=చిత్ర మైన అడవులు కలదీ, విశ్వకర్మణా= విశ్వకర్మచేత, నిర్మితైః = నిర్మింపబడిన, సుమహద్భిః = చాలా పెద్ద వైన, ప్రాసాదైః = మేడలచేతను, కృత్రిమైః = కృత్రిమము లైన (సహజములు కాని), కాననైశ్చాపి=వృక్షసముదాయముంచేతను, సర్వతః=నలు వైపులందు. సమలంకృతామ్ = అలంకరింపబడినదీ అయిన, కృత్రిమామ్=మనుష్యాదులచే నిర్మింపబడిన, దీర్ఘికాం చాపి=దిగుడుబావిని కూడ (చూచెను).

తా. చల్లని నీటితో నిండిన ఒక పెద్ద దిగుడుబావిని కూడ చూచెను. మణులతో కట్టిన మెట్లతో, ముత్యాల ఇసుకతో ప్రకాశించుచున్న ఆ దిగుడుబావి దగ్గర అనేకవిధము లైన మృగముల గుంపులు, విచిత్రము లైన చెట్ల తోపులు ఉండెను. దాని చుట్టును ఉన్న విశ్వకర్మ నిర్మించిన పెద్దపెద్ద ప్రాసాదములు. కృత్రిమము లైన వృక్షముల సముదాయములు ముచ్చట గొలుపుచుండెను. 34

మూ. యే కేచిత్పాదపాస్తత్ర పుష్పోపగఫలోపగాః, 35
సచ్ఛత్రాః సవితర్దికాః సర్వే సౌవర్ణవేదికాః.

ప్ర. అ. తత్ర = అక్కడ, పుష్పోపగఫలోపగాః=పుష్పములతోను ఫలములతోను కూడిన, యే కేచిత్=ఏ, పాదపాః = వృక్షము లున్నవో, సర్వే = అవి అన్నీ, సచ్ఛత్రాః=ఛత్రములతో కూడినవి, సవితర్దికాః = పెద్ద అరుగులతో కూడినవి; సౌవర్ణవేదికాః=బంగారు చిన్న తిన్నెలు గలవి.

తా. అక్కడ ఉన్న పుష్పవృక్షముల దగ్గర, ఫలవృక్షముల దగ్గరా కూడ ఛత్రములు, పెద్ద అరుగులు, చిన్న చిన్న బంగారు తిన్నెలు అమర్పబడి ఉండెను. 36

మూ. లతాప్రతానైర్బహుభిః పర్ణైశ్చ బహుభిర్వృతామ్, 36
కాఞ్చనీం శింశపామేకాం దదర్శ హరియూథపః,
వృతాం హేమమయీభిస్తు వేదికాభిః సమన్తతః. 37

ప్ర. అ. హరియూథపః = హనుమంతుడు, బహుభిః = అనేక మైన, లతాప్రతానైః = లతాసముదాయములచేతను, బహుభిః = అనేక మైన, పర్ణైశ్చ = ఆకులచేతను, వృతామ్ = కప్పబడినదీ, సమన్తతః = చుట్టూ, హేమమయీభిః = బంగారు, వేదికాభిః = అరుగులతో, వృతామ్ = కూడినదీ అయిన, కాఞ్చనీమ్ = బంగారువికార మైన, ఏకామ్ = ఒక, శింశపామ్ = శింశపావృక్షమును, దదర్శ = చూచెను.

తా. అక్కడ హనుమంతున కొక బంగారు శింశపావృక్షము కనబడెను. దాని చుట్టు అనేకము లైన లతలు అల్లుకొని ఉండెను. అది ఆకులతో దట్టముగా ఉండెను. దానిచుట్టూ బంగారు వేదికలు ఏర్పరుపబడి ఉండెను. 36, 37

మూ. సోఽపశ్యద్భూమిభాగాంశ్చ గర్తప్రస్రవణాని చ,
సువర్ణవృక్షానపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్. 38

ప్ర. అ. సః = హనుమంతుడు, భూమిభాగాంశ్చ = భూములను, గర్తప్రస్రవణాని చ = గోతులను, సెలయూటలను, అపరాన్ = మరి కొన్ని, శిఖిసన్నిభాన్ = అగ్నితో సమాన మైన, సువర్ణవృక్షాన్ = బంగారు వృక్షములను, అపశ్యత్ = చూచెను

తా. హనుమంతుడు అక్కడ మరి కొన్ని భూభాగములూ, పల్లపుప్రాంతములూ, సెలయూటలూ, అగ్ని వలె ప్రకాశించుచున్న బంగారు వృక్షములూ చూచెను. 38

మూ. తేషాం ద్రుమాణాం ప్రభయా మేరోరివ దివాకరః,
అమన్యత తదా వీరః కాఞ్చనోఽస్మీతి వానరః. 39

ప్ర. అ. తదా = అప్పుడు, వీరః = వీరు డైన, వానరః = హనుమంతుడు, మేరోః = మేరుపర్వతముయొక్క, ప్రభయా = కాంతిచేత, దివాకరః ఇవ = సూర్యుడు వలె, తేషామ్ = ఆ, ద్రుమాణామ్ = వృక్షములయొక్క, ప్రభయా =

కాంతిచేత, కాఞ్చనః = బంగారువికారమైనవాడను. అస్మి = అయి ఉన్నాను, ఇతి = అని. అమన్యత = తలంచెను.

తా. "మేరుపర్వతము కాంతి సంక్రమించుటచే సూర్యుడు వలె, ఈ వృక్షముల కాంతి నాపై ప్రసరించుటచేత నేను బంగారు రంగుగలవాడ నైనాను" అని వీరు డైన హనుమంతుడు తలంచెను.

మూ. తాం కాఞ్చనైస్తరుగణైర్మారుతేన చ వీజితామ్,
కిఙ్కిణీశతనిర్ఘోషాం దృష్ట్వా విస్మయమాగమత్. 40

ప్ర. అ. కాఞ్చనైః = బంగారువికారమైన, తరుగణైః = వృక్షసముదాయములచే చుట్టబడినదీ, మారుతేన = వాయువుచేత, వీజితామ్ = వీచబడినదీ, కిఙ్కిణీశతనిర్ఘోషామ్ = వందల కొలది చిరుగంటల ధ్వని కలదీ అయిన, తామ్ = ఆ శింశుపావృక్షమును, దృష్ట్వా = చూచి, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగమత్ = పొందెను.

తా. ఆ శింశుపావృక్షము చుట్టూ అనేక బంగారు వృక్షము లుండెను. గాలికి కదలి దానికి కట్టిన అనేకములైన చిరుగంటలు చప్పుడు చేయుచుండెను. అట్టి ఆ శింశుపావృక్షమును చూచి హనుమంతుడు ఆశ్చర్యము పొందెను. 40

మూ. స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాఙ్కురపల్లవామ్,
తామారుహ్య మహాబాహుః శింశుపాం పర్ణసంవృతామ్.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః = హనుమంతుడు, పుష్పితాగ్రామ్ = పుష్పించిన అగ్రభాగములు కలదీ, రుచిరామ్ = సుందరమైనదీ, తరుణాఙ్కురపల్లవామ్ = ముదిరిన అంకురములు చిగుళ్ళు కలదీ, పర్ణసంవృతామ్ = ఆకులచే కప్పబడినదీ అయిన, తామ్ = ఆ శింశుపావృక్షమును, ఆరుహ్య = ఎక్కి. (ఇట్లనుకొనెను).

తా. మహాబాహు వైన ఆ హనుమంతుడు పుష్పించిన శాఖాగ్రములతోను మనోహరమై ముదిరిన అంకురములతోను, చిగుళ్ళతోను నిండి యుండి, ఆకులతో దట్టముగా ఉన్న ఆ శింశుపావృక్షము నెక్కి ఇట్లు ఆలోచించెను. 41

మూ. ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శనలాలసామ్,
ఇతశ్చేతశ్చ దుఃఖార్తాం సంపతన్తీం యదృచ్ఛయా. 42

ప్ర. అ. రామదర్శనలాలసామ్=రాముని దర్శనమునందు ఆసక్తి గల, వైదేహీమ్=సీతను, ఇతః=ఇటు వైపు, ద్రక్ష్యామి = చూచెదను. దుఃఖార్తామ్=దుఃఖపీడితురాలై, యదృచ్ఛయా=దైవవశముచేత, ఇతశ్చ ఇతశ్చ=ఇటు నటు, సంపతన్తీమ్ = సంచరించుచుండగా (చూడగలను).

తా. రాముని చూచుటకై అత్యాసక్తితో ఉన్న సీత ఈ ప్రక్క కనబడ వచ్చునేమో, దుఃఖపీడితురాలైన ఆ సీత ఇటు నటు తిరుగుచు దైవవశముచేత నాకు కనబడవచ్చునేమో. 42

మూ. అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః,
చమ్పకైశ్చన్దనైశ్చాపి వకుళైశ్చ విభూషితా. 43

ప్ర. అ. దురాత్మనః=దుష్టాత్ముడైన రావణునియొక్క, ఇయమ్=ఈ, అశోకవనికా = అశోకవనము, దృఢమ్ = నిశ్చితముగా, రమ్యా = సుందరమైనది. చమ్పకైః=సంపెంగచెట్లచేతను, చన్దనైశ్చ=మంచిగంధము చెట్లచేతను, వకుళైశ్చాపి=పొగడచెట్లచేతను, విభూషితా=అలంకరింపబడినది.

తా. దురాత్ముడైన రావణుని ఈ అశోకవనము, చంపకవృక్షములతోను, చందనవృక్షములతోను, వకుళవృక్షములతోను ఒప్పుచున్నది. చాల అందముగా నున్నది. 43

మూ. ఇయం చ నలినీ రమ్యా ద్విజసంఘనిషేవితా,
ఇమాం సా రామమహిషీ నూనమేష్యతి జానకీ. 44

ప్ర. అ. ద్విజసంఘనిషేవితా = పక్షిసముదాయముచేత సేవింపబడిన, ఇయమ్ = ఈ, నలినీ చ=పద్మసరస్సు కూడ, రమ్యా = రమ్యముగా నున్నది. సా = ఆ, రామమహిషీ=రామునిభార్యయైన, జానకీ=జానకి, నూనమ్=తప్పక, ఇమామ్ = దీనిని గూర్చి, ఏష్యతి = రాగలదు.

తా. పక్షిసమూహములచేత సేవింపబడుచున్న ఈ పద్మసరస్సు చాల రమ్యముగా ఉన్నది. రాముని పట్టపురాణియైన ఆ సీత, తప్పక దీనివద్దకు వచ్చును. 44

మూ. సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ,
వనసంచారకుశలా నూనమేష్యతి జానకీ. 45

ప్ర. అ. రామమహిషీ = రాముని భార్య, రాఘవస్య = రామునియొక్క, ప్రియా = ప్రియురాలు, సతీ = పతివ్రత, రామా = మనోహరురాలు, వనసంచారకుశలా = వనమునందు సంచరించుటయందు నేర్పు కలదీ అయిన, సా జానకీ = ఆ జానకి, నూనమ్ = తప్పక, ఏష్యతి = రాగలదు.

తా. రామునకు అత్యంతప్రియురాలైన భార్య, మనోహరురాలు, పతివ్రత, వనములో సంచరించుట యందు నేర్పు (ఆసక్తి) కలదీ అయిన జానకి తప్పక ఈ సరస్సుదగ్గరికి రాగలదు. 45

మూ. అథవా మృగశాబాక్షీ వనస్యాస్య విచక్షణా,
వనమేష్యతి సార్యేహ రామచిన్తానుకర్శితా. 46

ప్ర. అ. అథవా = లేదా, మృగశాబాక్షీ = లేడిపిల్ల కండ్లు వంటి కండ్లు కలదీ, అస్య = ఈ, వనస్య = వనమునకు (వనమువిషయమున), విచక్షణా = నేర్పు గలదీ (పరిచయము గలదీ), రామచిన్తానుకర్శితా = రాముని గూర్చిన చింతచేత కృశింపచేయబడినదీ అయిన, సా = ఆ, ఆర్యా = పూజ్యురాలు, ఇహ = ఇక్కడ, వనమ్ = ఉద్యానవనమును గూర్చి, ఏష్యతి = రాగలదు.

తా. రాముని గూర్చిన ఆలోచనలచే కృశించిపోయినదీ, చిన్న లేడి కళ్ల వంటి కళ్లు కలదీ అయిన ఆ పూజ్యురాలు, ఈ ఉద్యానవనముతో పరిచయము గల దగుటచే, ఈ ఉద్యానమునకు రాగలదు. 46

మూ. రామశోకాభిసంతప్తా సా దేవీ వామలోచనా,
వనవాసే రతా నిత్యమేష్యతే వనచారిణీ. 47

ప్ర. అ. రామశోకాభిసంతప్తా = రాముని గూర్చిన శోకముచే తపింపచేయబడినదీ, వామలోచనా = సుందరమైన నేత్రములు గలదీ, నిత్యమ్ = ఎల్లప్పుడూ, వనవాసే = వనవాసమునందు, రతా = ఆసక్తి గలదీ అయిన, సా = ఆ, దేవీ = దేవి, వనచారిణీ = ఈ ఉద్యానమునందు సంచరించనున్నదై, ఏష్యతే = రాగలదు.

తా. నిత్యము వనవాసమునందు ఆసక్తి గల సుందరనేత్రి యైన ఆ దేవి,

రాముని గూర్చిన శోకముతో బాధపడుచు, ఉద్యానమునందు సంచరించుటకు ఇక్కడికి రాగలదు. 47

మూ. వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా,
రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ. 48

ప్ర. అ. రామస్య = రామునియొక్క, దయితా = ప్రియురాలైన, భార్యా = భార్య, జనకస్య = జనకమహారాజుయొక్క, సుతా = కూతురూ, సతీ = పతివ్రతా అయిన సీత, పురా = పూర్వము, సతతమ్ = ఎల్లప్పుడూ, వనేచరాణామ్ = వనేచరుల విషయమున, స్పృహయతే = ఆసక్తి కలదిగా ఉండెడిది. నూనమ్ = సత్యము.

తా. రామునకు అత్యంతప్రియురాలైన భార్య, జనకుని కూతురూ అయిన ఆ సీత, పూర్వము అరణ్యవాససమయమునందు, వనములో సంచరించు పక్షిమృగాదుల విషయమున, సర్వదా, ప్రేమాసక్తులు కలదై ఉండెడి దను విషయము సత్యము. అందుచే ఆమె ఇక్కడికి రావచ్చును. 48

మూ. సన్ధ్యాకాలమనాః శ్యామా ధ్రువమేష్యతి జానకీ,
నదీం చేమాం శుభజలాం సన్ధ్యార్థే వరవర్ణినీ. 49

ప్ర. అ. శ్యామా = యౌవనమధ్యమునందున్న, వరవర్ణినీ = శ్రేష్ఠమైన దేహవర్ణము గల, జానకీ = సీత, సన్ధ్యాకాలమనాః = సంధ్యాకాలమునందు మనస్సు కలదై, (సంధ్యాకాలమును గుర్తించి), శుభజలామ్ = శుభకరమైన జలము గల, ఇమాం నదీమ్ = ఈ నదిని గూర్చి, సన్ధ్యార్థే = సంధ్యోపాసనము నిమిత్తము, ధ్రువమ్ = తప్పక, ఏష్యతి = రాగలదు.

తా. యౌవనమధ్యస్థురాలూ, మంచి శరీరవర్ణము గలదీ అయిన జానకి, సంధ్యాకాల మను విషయమును గుర్తించి, సంధ్యోపాసననిమిత్తము, తప్పక, పవిత్రజలములు గల ఈ నదికి రాగలదు. 49

మూ. తస్యాశ్చాప్యనురూపేయమశోకవనికా శుభా,
శుభా యా పార్థివేన్ద్రస్య పత్నీ రామస్య సమ్మతా. 50

ప్ర. అ. యా = ఏ సీత, పార్థివేన్ద్రస్య = రాజాధిరాజైన, రామస్య = రామునియొక్క, సంమతా = ప్రియురాలైన, శుభా = మంగళప్రదురాలైన, పత్నీ = భార్యయూ, తస్యాః = అట్టి సీతకు, శుభామంగళకర మైన, ఇయమ్ = ఈ, అశోకవనికా = అశోకవనము, అనురూపాపి చ = అనురూప మైనది కూడ.

తా. మంగళకర మైన ఈ అశోకవనము రాజాధిరాజైన రామునికి అత్యంతప్రేమాస్పదురాలైన భార్య, శుభగుణసంపన్నురాలూ అయిన సీత నివసించుటకు తగినది. 50

మూ. యది జీవతి సా దేవీ తారాధిపనిభాననా,
ఆగమిష్యతి సావశ్య మిమాం శివజలాం నదీమ్. 51

ప్ర. అ. తారాధిపనిభాననా = చంద్రుని వంటి ముఖము గల, సా దేవీ = ఆ దేవి, జీవతి యది = జీవించి ఉన్నట్లయితే, సా = ఆమె, అవశ్యమ్ = తప్పక, ఇమామ్ = ఈ, శివజలామ్ = పవిత్రజలము గల, నదీమ్ = నదిని గూర్చి, ఆగమిష్యతి = రాగలదు.

తా. చంద్రబింబము వంటి ముఖము గల ఆ సీతాదేవి జీవించి ఉన్నట్లయితే, పవిత్ర జలము గల ఈ నదికి తప్పక రాగలదు. 51

మూ. ఏవం తు మత్వా హనుమాన్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేన్ద్రపత్నీమ్,
అవేక్షమాణశ్చ దదర్శ సర్వం
సుపుష్పితే పర్ణఘనే నిలీనః. 52

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుర్దశః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, హనుమాన్ = హనుమంతుడు, ఏవమ్ = ఇట్లు, మత్వా = తలచి, మనుజేన్ద్రపత్నీమ్ = రాజైన రాముని భార్యయైన సీతను, ప్రతీక్షమాణః = నిరీక్షించుచు, సుపుష్పితే = బాగుగా పుష్పించిన, పర్ణఘనే = ఆకుల సమూహమునందు, నిలీనః = అణగి ఉన్నవాడై, అవేక్షమా

దిశః = నలు మూలల పరికించుచు, సర్వమ్ = సమస్తమును, దదర్శ = చూచెను.

తా. మహాత్ముడైన హనుమంతుడీ విధముగా ఆలోచించి, సీత వచ్చునేమో అని ఎదురుచూచుచు, చాలా పుష్పములతో నిండిన దట్టమైన ఆకులు గల కొమ్మపై అణగి ఉన్నవాడై, నలుదిక్కులను పరికించుచు, ఆ ప్రదేశము నంతను చూచెను. 52

"తారానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో పదునాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చదశః సర్గః

[అశోకవనశోభను చూచుచు హనుమంతుడు చైత్యప్రాసాదము దగ్గర దయనీయస్థితిలో ఉన్న సీతను చూచి, ఆమె సీత యై ఉండు నని ఊహించి సంతోషించుట].

మూ. స వీక్షమాణస్తత్రస్థో మార్గమాణశ్చ మైథిలీమ్,
అవేక్షమాణశ్చ మహీం సర్వాం తామన్వవైక్షత. 1

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, తత్రస్థః = అక్కడ నున్నవాడై, వీక్షమాణః = చూచుచు, మైథిలీమ్ = సీతను, మార్గమాణః = వెదకుచు, అవేక్షమాణః = పరిశీలించుచు, సర్వామ్ = సమస్త మైన, తాం మహీమ్ = ఆ భూమిని, అన్వవైక్షత = పరీక్షించెను.

తా. హనుమంతుడు అక్కడనే ఉండి చూచుచు, సీతకై వెదకుచు, ఇటు నటు పరిశీలించుచు, ఆ ప్రదేశము నంతను పరీక్షించెను. 1

మూ. సన్తానకలతాభిశ్చ పాదపైరుపశోభితామ్,
దివ్యగన్ధరసోపేతాం సర్వతః సమలంకృతామ్. 2

తాం స నన్దనసంకాశాం మృగపక్షిభిరావృతామ్,
హర్మ్యప్రాసాదసంబాధాం కోకిలాకులనిస్స్వనామ్. 3

కాఞ్చనోత్పలపద్మాభిర్వాపీభిరుపశోభితామ్,
బహ్వాసనకుథోపేతాం బహుభూమిగృహాయుతామ్. 4

సర్వర్తుకుసుమై రమ్యాం ఫలవద్భిశ్చ పాదపైః,
పుష్పితానామశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్. 5

ప్రదీప్తామివ తత్రస్థో మారుతిః సముదైక్షత,
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణామివాసకృత్. 6

వినిష్పతద్భిః శతశశ్చిత్రైః పుష్పావతంసకైః,
ఆమూలపుష్పనిచితైరశోకైః శోకనాశనైః. 7

పుష్పభారాతిభారైశ్చ స్పృశద్భిరివ మేదినీమ్,
కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః. 8

ప్ర. అ. సః మారుతిః = ఆ హనుమంతుడు, తత్రస్థః = అక్కడ ఉన్న వాడై, సన్తానకలతాభిశ్చ = సంతానకలతలచేతను, (సంతానకము కల్పవృక్షములలో ఒకటి), పాదపైః = సంతానకవృక్షములచేతను, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినదీ, దివ్యగన్ధరసోపేతామ్ = శ్రేష్ఠమైన గంధముతోను, రసముతోను కూడినదీ, సర్వతః = అన్ని వైపులా, సమలంకృతామ్ = అలంకరించబడినదీ, నన్దనసంకాశామ్ = నందనవనముతో సమానముగా, మృగపక్షిభిః = మృగములచేతను, పక్షులచేతను, ఆవృతామ్ = వ్యాప్తముగా, హర్మ్యప్రాసాదసంబాధామ్ = మేడలతోను, ధనికుల గృహములతోను ఇరుకుగా ఉన్నదీ, కోకిలాకులనిస్స్వనామ్ = కోకిలల వ్యాకులములైన ధ్వనులు కలదీ, కాఞ్చనోత్పలపద్మాభిః = బంగారుకలువలూ పద్మములూ గల, వాపీభిః = దిగుడుబావులచేత, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినదీ, బహ్వాసనకుథోపేతామ్ = అనేకములైన ఆసనములతోను, నేలపై పరచుకొనే కంబళ్లతోను కూడినదీ, బహుభూమిగృహాయుతామ్ = అనేకమైన భూగృహములతో కూడినదీ, సర్వర్తుకుసుమైః = సకల ఋతువులలో లభించు పుష్పములతోను, ఫలవద్భిః = ఫలములు గల, పాదపైః = వృక్షములతోను, రమ్యామ్ = సుందరమైనదీ, పుష్పితానామ్ = పుష్పించిన, అశోకానామ్ = అశోకవృక్షములయొక్క, శ్రియా = కాంతిచేత, సూర్యోదయప్రభామ్ = సూర్యోదయము వంటి కాంతి గలదీ, ప్రదీప్తామివ = ప్రజ్వలించుచున్నది వలె ఉన్నదీ, ఆసకృత్ = మాటిమాటికి, వినిష్పతద్భిః = వాలుచున్న, శతశః = వందలకొలది, విహగైః = పక్షులచేత, నిష్పత్రశాఖామ్ = ఆకులు లేని శాఖలు కలదిగా, క్రియమాణామ్ ఇవ = చేయబడుచున్నది వలె ఉన్నదీ, చిత్రైః = చిత్రవర్ణములు కల, పుష్పావతంసకైః = పుష్పములు శిరోభూషణములుగా కల, ఆమూలపుష్పనిచితైః = మొదళ్లవరకు పుష్పములచే వ్యాప్తమైన, శోక

నాశనైః=శోకమును నశింపచేయు. అశోకైః=అశోకవృక్షములతోను, పుష్పశాలాలిభారైశ్చ=పుష్పముల సముదాయముల అధికమైన భారముచే, మేదినీమ్=భూమిని, స్పృశద్భిరివ=స్పృశించుచున్నవి వలె ఉన్న, కుసుమితైః=పుష్పించిన, కర్ణికారైః=కర్ణికారవృక్షములతోను, సుపుష్పితైః=బాగుగా పుష్పించిన, కింశుకైః=కింశుకవృక్షములతోను కూడినదీ అయిన, తామ్=ఆ అశోక వనికను, సముద్వీక్షత=పరిశీలనతో చూచెను.

తా. హనుమంతుడు అక్కడనే ఉండి ఆ అశోకవనము నంతను పరిశీలన పూర్వకముగా చూచెను. అది సంతానకలతలతోను, సంతానక వృక్షములతోను ప్రకాశించుచుండెను. శ్రేష్ఠములైన సువాసనలూ, రసములూ వ్యాపించి ఉండెను. ఆ ఉద్యానము అలంకరింపబడిన నందనవనము వలె ఒప్పుచుండెను. పెంపుడు మృగములు, పక్షులు సంచరించుచుండెను. మేడలతోను, ధనికుల భవనములతోను ఇరుకుగా ఉండెను. కోకిలధ్వనులతో వ్యాప్తమై బంగారు కలువలు, పద్మములూ ఉన్న దిగుడుబావులతో ప్రకాశించుచుండెను. అక్కడక్కడ అనేకవిధములైన ఆసనములు, కంబళ్లు అమర్చి ఉండెను. కొన్ని చోట్ల భూగృహము లుండెను. అన్ని ఋతువులందు లభించు పుష్పములతోను, ఫలవృక్షములతోను రమ్యమైన ఆ అశోకవనిక, అశోకవృక్షము లన్నీ పుష్పించి ఉండుటచే సూర్యోదయసమయమునందలి కాంతి వంటి కాంతితో ఒప్పుచుండెను. మంటలతో నిండినట్లుండెను. వందలకొలది పక్షులు మాటిమాటికీ వ్రాలుచుండుటచే కొమ్మలు ఆకు లన్నీ రాల్చివేయుచున్నట్లుండెను. శాఖాగ్రములనుండి మొదళ్లవరకు పుష్పములతో నిండిన, శోకనాశకములైన అశోకవృక్షములతోను పుష్పముల బరువునకు వంగి నేలను స్పృశించుచున్నట్లున్న కర్ణికారవృక్షములతోను, బాగుగా పుష్పించిన కింశుకవృక్షములతోను నిండి ఉండెను. ౨—౮

మూ. స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః,
పున్నాగాః సప్తపర్ణాశ్చ చంపకోద్దాలకాస్తథా. ౯
వివృద్ధమూలా బహవః శోభన్తే స్మ సుపుష్పితాః,

ప్ర. అ. తేషామ్=ఆ వృక్షములయొక్క, ప్రభయా=కాంతిచేత, సః=ఆ, దేశః=ప్రదేశము, సర్వతః=నలు వైపుల, ప్రదీప్త ఇవ=మండుచున్నట్లున్నది. వివృద్ధమూలాః=బాగా లావెక్కిన మొదళ్లు గల. సుపుష్పితాః=చక్కగా

పుష్పించిన, పున్నాగాః = పున్నాగవృక్షములు, సప్తపర్ణాశ్చ = ఏడాకుల అరటి చెట్లు, తథా = మరియు, చమ్పకోద్దాలకాః = చంపకవృక్షములు, ఉద్దాలక వృక్షములు, శోభన్తే స్మ = ప్రకాశించుచుండెను.

తా. ఆ వృక్షముల కాంతిచేత ఆ ప్రదేశమంతా ప్రజ్వలించుచున్నట్లు ఉండెను. బాగా లావైన మొదళ్ళతో, పుష్పసముదాయములతో, ఆ అశోక వనమునందు, పున్నాగవృక్షములు, ఏడాకుల అరటి చెట్లు, సంపెంగచెట్లు, విరిగిచెట్లు ప్రకాశించుచుండెను. 9

మూ. శాతకుమ్భనిభాః కేచిత్ కేచిదగ్నిశిఖోపమాః, 10
నీలాఞ్జననిభాః కేచిత్తత్రాశోకాః సహస్రశః.

ప్ర. అ. తత్ర = ఆ అశోకవనమునందు, సహస్రశః = వేలకొలది, అశోకాః = అశోకవృక్షములు. కేచిత్ = కొన్ని, శాతకుమ్భనిభాః = బంగారముతో సమాన మైనవి, కేచిత్ = కొన్ని, అగ్నిశిఖోపమాః = అగ్నిజ్వాలలతో సమాన మైనవి, కేచిత్ = కొన్ని, నీలాఞ్జననిభాః = నీలమణితోను, కాటుకతోను సమాన మైనవీ ఉండెను.

తా. అక్కడ ఉన్న వేలకొలది అశోకవృక్షములలో కొన్ని బంగారు వర్ణములతోను, కొన్ని అగ్నిజ్వాల వలెను, కొన్ని ఇంద్రనీలముల వలెను, కాటుక వలెను ఉండెను. 10

మూ. నన్దనం విబుధోద్యానం చిత్రం చైత్రరథం యథా, 11
అతివృత్తమివాచిన్త్యం దివ్యం రమ్యం శ్రియా వృతమ్.
ద్వితీయమివ చాకాశం పుష్పజ్యోతిర్గణాయుతమ్. 12
పుష్పరత్నశతైశ్చిత్రం ద్వితీయం సాగరం యథా,
సర్వర్తుపుష్పైర్నిచితం పాదపైర్మధుగన్ధిభిః. 13
నానానినాదైరుద్యానం రమ్యం మృగగణైర్ద్విజైః,
అనేకగన్ధప్రవహం పుణ్యగన్ధం మనోరమమ్. 14

ప్ర. అ. విబుధోద్యానమ్ = దేవతల ఉద్యాన మైన, నన్దనం యథా = నన్దనము వలె, చిత్రమ్ = ఆశ్చర్యకర మైన, చైత్రరథం యథా = చైత్రరథ

మను కుబేరోద్యానము వలె, అతివృత్తమ్ = అన్నింటిని మించినదీ, అచిన్త్యమ్ = ఊహింప శక్యము కానిదీ, దివ్యమ్ = శ్రేష్ఠ మైనదీ, రమ్యమ్ = సుందర మైనదీ, శ్రియా = శోభతో, వృతమ్ = కూడినదీ, పుష్పజ్యోతిర్గణాయుతమ్ = నక్షత్రముల గణముల వంటి పుష్పములతో కూడినదీ కావుననే, ద్వితీయమ్ = రెండవ, ఆకాశ మివ = ఆకాశము వలె ఉన్నదీ, పుష్పరత్నశతైః = రత్న శతముల వంటి పుష్పములతో, చిత్రమ్ = విచిత్రముగా ఉన్నదీ, కావుననే. ద్వితీయమ్ = రెండవ, సాగరం యథా = సముద్రము వలె ఉన్నదీ, సర్వర్తుపుష్పైః = అన్ని ఋతువులకు సంబంధించిన పుష్పములతోను, మధుగన్ధిభిః = తేనె వాసన గల పాదపైః = వృక్షములతోను, నిచితమ్ = వ్యాప్తమూ, నానానినాదైః = అనేక విధము లైన ధ్వనులు గల, మృగగణైః = మృగముల సముదాయములతోను, ద్విజైః = పక్షులతోను, రమ్యమ్ = సుందర మైనదీ, అనేకగన్ధప్రవహమ్ = అనేకము లైన వాసనలను వీచుచున్నదీ, పుణ్యగన్ధమ్ = పుణ్య మైన గంధము గలదీ, మనోరమమ్ = మనోహరమూ అయిన ఉద్యానమును, (హనుమంతుడు చూచెను)

తా. దేవేంద్రుని నందనము వలె, కుబేరుని విచిత్ర మైన చైత్రరథము వలె, అన్ని ఉద్యానములనూ మించిన శ్రేష్ఠ మైన ఆ అశోకవన మను ఉద్యానమును హనుమంతుడు చూచెను. ఆ ఉద్యానము ఊహించుటకు కూడ శక్యము కాని విధమున సుందరముగా శోభించుచుండెను. నక్షత్రగణములవంటి పుష్పములతో రెండవ ఆకాశము వలె, రత్నముల వంటి వందలాది పుష్పములతో రెండవ సముద్రము వలె కనబడుచుండెను. అన్ని ఋతువులందును లభించు పుష్పములతోను, తేనె సువాసనలతో కూడిన వృక్షములతోను నిండి ఉండెను. అక్కడ, మృగములు పక్షులు అనేక విధము లైన ధ్వనులు చేయుచుండెను. సుగంధముతో నిండి, మనోహరముగా నున్న ఆ ఉద్యానములో అనేక విధము లగు గంధములు ప్రవహించుచున్నట్లు ఉండెను. 11-14

మూ. శైలేన్ద్రమివ గన్ధాఢ్యం ద్వితీయం గన్ధమాదనమ్,
అశోకవనికాయాం తు తస్యాం వానరపుఙ్గవః. 15
స దదర్శావిదూరస్థం చైత్యప్రాసాదముచ్ఛ్రితమ్,
మధ్యే స్తమ్భసహస్రేణ స్థితం కైలాసపాణ్డురమ్. 16
ప్రవాలకృతసోపానం తప్తకాఞ్చనవేదికమ్.

ముష్ణన్తమివ చక్షూంషి ద్యోతమానమివ శ్రియా. 17
విమలం ప్రాంశుభావత్వాదుల్లిఖన్తమివామ్బరమ్.

ప్ర. అ. సః వానరపుఙ్గవః = ఆ వానరశ్రేష్ఠుడు, తస్యామ్ = ఆ, అశోకవనికాయామ్ = అశోకవనిక యందు, మధ్యే = మధ్యయందు, గన్ధాఢ్యమ్ = సువాసనతో నిండినదీ, ద్వితీయమ్ = రెండవ, గన్ధమాదనమివ = గంధమాదనపర్వతము వలె ఉన్నదీ, స్తమ్భసహస్రేణ = వేయి స్తంభములతో, స్థితమ్ = నిలిచినదీ, కైలాసపాణ్డురమ్ = కైలాసము వలె తెల్లనిదీ, ప్రవాళకృతసోపానమ్ = పగడములతో చేయబడిన మెట్లు కలదీ, తప్తకాఞ్చనవేదికమ్ = కాల్చి శుద్ధిచేసిన బంగారు అరుగులు గలదీ, చక్షూంషి = నేత్రములను, ముష్ణన్తమివ = అపహరించుచున్నది వలె ఉన్నదీ, శ్రియా = శోభతో, ద్యోతమానమివ = ప్రజ్వలించుచున్నది వలె ఉన్నదీ, విమలమ్ = నిర్మలమూ, ప్రాంశుభావత్వాత్ = ఉన్నతముగా ఉండుటవలన, అమ్బరమ్ = ఆకాశమును, ఉల్లిఖన్తమివ = ఒరయుచున్నట్లున్నదీ అయిన, అవిదూరస్థమ్ = దగ్గరగానే ఉన్న, ఉచ్ఛ్రితమ్ = ఎత్తైన, చైత్యప్రాసాదమ్ = చైత్యప్రాసాదమును, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఆ అశోకవనమధ్యమునందు, తానున్న వృక్షమునకు దగ్గరగా, సుగంధభరిత మైన రెండవ గంధమాదనపర్వతము వలె ఉన్న, ఉన్నత మైన చైత్యప్రాసాదమును చూచెను. కైలాసము వలె తెల్లగా ఉన్న ఆ ప్రాసాదము వేయి స్తంభములపై నిలచి ఉండెను. దానియందు పగడములతో మెట్లూ, శుద్ధ మైన బంగారముతో తిన్నెలు ఏర్పరుపబడి ఉండెను. కాంతితో ప్రజ్వలించుచున్న ఆ ప్రాసాదము కనులకు మిరుమిట్లు గొలుపుచుండెను. నిర్మల మైన ఆ ప్రాసాదము అత్యున్నత మగుటచే ఆకాశమును ఒరయుచున్నట్లు ఉండెను.

వి. చైత్యశబ్దమునకు చాలా అర్థములు ఉన్నవి. రాజవీథులలో ఉండే పవిత్రవృక్షములు, గ్రామాదుల సరిహద్దులలోని రాతికట్టడములు, మృతుల అస్థులు ఉంచిన కట్టడములు, దేవాలయములు, జైనబౌద్ధాలయములు, సార్వజనికోద్యానాదులలోని కట్టడములు మొద లైన అర్థాలలో దాని ప్రయోగము కనబడుచున్నది. ఇక్కడ ఒక పెద్ద రాతికట్టడము అను అర్థము గ్రహించవలెను. ("చైత్యం పాషాణాదిబన్ధః" అని యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్య II-151)

ఇది అశోకవనమధ్యమున ఉద్యానవిహారమునకై వచ్చువారి విశ్రాంత్యాలయము. రాక్షసకులదేవతల నివాసమునకు కట్టబడిన ప్రాసాదము. రామాయణకాలం నాటికి బౌద్ధమతం లేదు గాన బౌద్ధచైత్యముల వంటి కట్టడము అను ప్రాచీనవ్యాఖ్యాతల వ్యాఖ్య ఉపేక్షణీయము. 15-17

మూ. తతో మలినసంవీతాం రాక్షసీభిః సమావృతామ్, 18
ఉపవాసకృశాం దీనాం నిశ్శ్వసన్తీం పునః పునః,
దదర్శ శుక్లపక్షాదౌ చన్ద్రరేఖామివామలామ్. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, (హనుమంతుడు), మలినసంవీతామ్ = మలిన మైన వస్త్రమును చుట్టబెట్టుకొన్నదీ, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, సమావృతామ్ = చుట్టువారుకొనబడినదీ, ఉపవాసకృశామ్ = ఉపవాసముచే కృశించినదీ, దీనామ్ = దీనురాలూ, పునః పునః = మాటిమాటికీ, నిశ్శ్వసన్తీమ్ = నిట్టూర్చుచున్నదీ, శుక్లపక్షాదౌ = శుక్లపక్షప్రారంభమునందలి, అమలామ్ = నిర్మలమైన, చన్ద్రరేఖామివ = చంద్రరేఖ వలె ఉన్నదీ అయిన ఒక స్త్రీని, దదర్శ = చూచెను. (18 వ శ్లోకము మొదలు 25 1/2 శ్లోకమువరకు ఒకటే అన్వయము. వీటిలో సీత వర్ణింపబడినది).

తా. ఇంతలో హనుమంతునకు, మలిన మైన వస్త్రమును చుట్టబెట్టుకొని, రాక్షసస్త్రీల మధ్య ఉన్న ఒక యువతి కనబడెను. ఆహారము తినకపోవుటచే కృశించి, దీనురాలైన ఆమె మాటి మాటికి నిట్టూర్చుచుండెను. శుక్లపక్ష ప్రారంభమునందలి చంద్రరేఖ వలె నిర్మలముగా, సన్నగా ఉండెను. 18, 19

మూ. మన్దప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్,
పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః. 20

ప్ర. అ. మన్దప్రఖ్యాయమానేన = మెల్లగా పైకి కనబడుచున్న, రూపేణ = రూపముతో, ధూమజాలేన = ధూమసముదాయముచేత, పినద్ధామ్ = కప్పబడిన, రుచిరప్రభామ్ = అందమైన కాంతి గల, విభావసోః = అగ్నియొక్క, శిఖామివ = జ్వాల వలె ఉన్న (ఆమెను చూచెను).

తా. ఆమె రూపవతియే యైనను ఆ రూపము స్పష్టముగా కనబడుట

లేదు. అందుచేత ఆమె, పొగలో కప్పబడిపోయిన అందమైన కాంతి గల అగ్నిజ్వాల వలె ఉండెను. 20

మూ. పీతేనైకేన సంవీతాం క్లిష్టేనోత్తమవాససా,
సపఙ్కామనలఙ్కారాం విపద్మామివ పద్మినీమ్. 21

ప్ర. అ. క్లిష్టేన = నలిగిపోయిన, పీతేన = పచ్చని, ఏకేన = ఒక, ఉత్తమవాససా = ఉత్తమమైన వస్త్రముచేత, సంవీతామ్ = చుట్టబడినదీ, అనలఙ్కారామ్ = అలంకారములు లేనిదీ, కావుననే, సపఙ్కామ్ = పంకముతో కూడిన, విపద్మామ్ = పద్మములు లేని, పద్మినీమివ = పద్మలత వలె ఉన్నదీ అయిన (ఒక యువతిని చూచెను).

తా. ఏ అలంకారములూ లేని ఆమె నలిగిపోయిన ఒక పచ్చని ఉత్తమ వస్త్రమును శరీరమునకు చుట్టబెట్టుకొని, పద్మములు లేనిదీ, బురదతో కూడినదీ అయిన పద్మలత వలె ఉండెను. 21

మూ. వ్రీడితాం దుఃఖసంతప్తాం పరిమ్లానాం తపస్వినీమ్,
గ్రహేణాఙ్గారకేణేవ పీడితామివ రోహిణీమ్. 22

ప్ర. అ. వ్రీడితామ్ = సిగ్గుపడుచున్నదీ, దుఃఖసంతప్తామ్ = దుఃఖముచేత తపింపచేయబడినదీ, పరిమ్లానామ్ = వాడిపోయినదీ, తపస్వినీమ్ = శోచనీయురాలూ, అఙ్గారకేణ గ్రహేణ = అంగారకగ్రహముచేత, పీడితామ్ = పీడింపబడిన, రోహిణీమ్ ఇవ = రోహిణి వలె ఉన్నదీ (అయిన ఒక యువతిని చూచెను).

తా. దుఃఖపీడితురాలై, వాడిపోయిన శరీరచ్ఛాయతో దయనీయస్థితిలో ఉన్న ఆమె సిగ్గుతో తలవంచుకొని కూర్చుండెను. అంగారకగ్రహముచేత పీడింపబడిన రోహిణీనక్షత్రము వలె, కాంతిహీనురాలై ఉండెను. 22

మూ. అశ్రుపూర్ణముఖీం దీనాం కృశామనశనేన చ,
శోకధ్యానపరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్. 23

ప్ర. అ. అశ్రుపూర్ణముఖీమ్ = కన్నీళ్ళతో నిండిన ముఖము గలదీ, దీనామ్ = దీనురాలూ, అనశనేన = ఆహారము తినకపోవుటచే, కృశామ్ = కృశించి

నదీ, శోకధ్యానపరామ్ = శోకముతో ఏదో ఆలోచనలో మునిగి యున్నదీ, నిత్యమ్ = ఎల్లప్పుడూ, దీనామ్ = దీనురాలూ, దుఃఖపరాయణామ్ = దుఃఖమునకు వశ మై పోయినదీ అయిన (ఒక వనితను చూచెను).

తా. ఆమె కన్నీళ్లు కారుచున్న ముఖముతో దీనురాలై, ఆహారము భుజించక పోవుటచేత కృశించి ఉండెను. తొలగని దైన్యముతో, శోకముచేత ఏమేమో ఆలోచనలలో మునిగి దుఃఖాక్రాంతురాలై ఉండెను. 23

మూ. ప్రియం జనమపశ్యన్తీం పశ్యన్తీం రాక్షసీగణమ్,
స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతామివ. 24

ప్ర. అ. ప్రియమ్ = తనకు ఇష్ట మైన, జనమ్ = జనమును, అపశ్యన్తీమ్ = చూడనిదీ, రాక్షసీగణమ్ = రాక్షసస్త్రీల సమూదాయమును, పశ్యన్తీమ్ = చూచుచున్నదీ, స్వగణేన = తనకు సంబంధించిన మృగసమూదాయముతో, హీనామ్ = హీనురాలై, శ్వగణాభివృతామ్ = కుక్కల గుంపుచేత చుట్టుముట్టబడిన, మృగీమ్ ఇవ = ఆడలేడి వలె ఉన్న (ఒక యువతిని చూచెను).

తా. తనకు కావలసిన బంధుజన మెవ్వరూ కనబడక, రాక్షసీగణమునే నిరంతరమూ చూచుచు వాళ్ళ మధ్య నున్న ఆమె స్వజాతీయము లైన లేళ్ళకు దూర మై, కుక్కల గుంపు చుట్టుముట్టిన ఆడలేడి వలె ఉండెను. 24

మూ. నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా,
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీమివ. 25
సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానామకోవిదామ్.

ప్ర. అ. జఘనమ్ = జఘనప్రదేశమును, గతయా = పొందిన, ఏకయా = ఒక, నీలనాగాభయా = నల్లత్రాచుపాము వంటి కాంతి గల, వేణ్యా = జడతో, నీరదాపాయే = వర్షాకాలాంతమునందు, నీలయా = నీలవర్ణ మైన, వనరాజ్యా = వృక్షపంక్తితో, మహీమివ = భూమి వలె ఉన్నదీ, సుఖార్హామ్ = సుఖమునకు తగినదీ, దుఃఖసంతప్తామ్ = దుఃఖముచేత పీడింపబడినదీ, వ్యసనానామ్ = కష్టములకు, అకోవిదామ్ = పరిచితురాలు కానిదీ అయిన (ఒక యువతిని చూచెను.)

తా. కటిప్రదేశమువరకు వ్రేలాడుచున్న, నల్లత్రాచు వంటి ఒక్క-

ఉరతో, ఆమె వర్షాకాలాంతమునందు నల్లని వృక్షపంక్తితో కూడిన భూమి వలె ఉండెను. ఎన్నడును ఇట్టి కష్టము ననుభవించి ఎరుగక, సుఖము ననుభవించుటకే తగిన ఆమె దుఃఖముచే పీడితురాలై ఉండెను. 25

మూ. తాం సమీక్ష్య విశాలాక్షీమధికం మలినాం కృశామ్, 26
తర్కయామాస సీతేతి కారణైరుపపాదిభిః.

ప్ర. అ. విశాలాక్షీమ్ = విశాలము లైన నేత్రములు గలదీ, అధికమ్ = అధికముగా, మలినామ్ = మాలిన్యముతో కూడినదీ, కృశామ్ = కృశించినదీ అయిన, తామ్ = ఆమెను, సమీక్ష్య = చూచి, ఉపపాదిభిః = ఉపపన్నము లైన (యుక్తికి సరిపోవునట్టి), కారణైః = కారణములచేత, సీతేతి = సీత అని, తర్కయామాస = ఊహించెను.

తా. పూర్తిగా మాసిపోయి, కృశించియున్న ఆ విశాలాక్షి యైన యువతిని చూచి హనుమంతుడు యుక్తియుక్తము లైన హేతువులచే, ఆమె సీత యై ఉండు నని ఊహించెను. 26

మూ. హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా, 27
యథారూపా హి దృష్టా వై తథారూపేయమఙ్గనా.

ప్ర. అ. తదా = అప్పుడు, కామరూపిణా = ఇచ్ఛానుసారము రూపము గ్రహించు శక్తి గల, తేన రక్షసా = ఆ రాక్షసునిచేత, హ్రియమాణా = హరింపబడుచున్నదై, యథారూపా = ఎట్టి రూపము గలదిగా, దృష్టా = చూడబడినదో, ఇయమ్ = ఈ, అఙ్గనా = స్త్రీ, తథారూపా = అట్టి రూపము కలది.

తా. ఆ నాడు కామరూపి యైన ఆ రాక్షసునిచే అపహరింపబడుచున్న స్త్రీ ఎట్టి రూపముతో ఉండెనో, అట్టి రూపములోనే ఈ స్త్రీ ఉన్నది. 27

మూ. పూర్ణచన్ద్రాననాం సుభ్రూం చారువృత్తపయోధరామ్, 28
కుర్వతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః.

తాం నీలకేశీం బిమ్బోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్, 29
సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా.

ప్ర. అ. పూర్ణచన్ద్రాననామ్ = పూర్ణచంద్రుని వంటి ముఖము గలది, సుభ్రూమ్=అందమైన కనుబొమ్మలు కలది, చారువృత్తపయోధరామ్=అందముగాను వర్తులాకారముగాను ఉన్న స్తనములు గలది, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రభయా = కాంతిచేత, వితిమిరాః = చీకటి లేనివానినిగా, కుర్వతీమ్ = చేయుచు, దేవీమ్ = దేదీప్యమానముగా ఉన్నది, నీలకేశీమ్ = నల్లని కేశములు కలది, బింబోష్ఠీమ్=దొండపండు వంటి పెదవులు కలది, సుమధ్యామ్ = మంచి నడుము గలది, సుప్రతిష్ఠితామ్=చాల స్థిరమైనది, పద్మపలాశాక్షీమ్ = తామరరేకుల వంటి నేత్రములు గలది, మన్మథస్య = మన్మథునియొక్క, రతిం యథా = రతిదేవి వలె ఉన్న, సీతామ్ = సీతను (చూచెను).

తా. హనుమంతుడు అక్కడ, పూర్ణచంద్రుని వంటి ముఖము, అందమైన కనుబొమ్మలు, సుందరములూ, వర్తులాకారములూ అయిన పయోధరములూ గల సీతను చూచెను. దేదీప్యమానముగా ఉన్న ఆమె తన కాంతిచేత అన్ని దిక్కులనుండి చీకటిని పోగొట్టుచుండెను. నల్లని కేశములు, దొండపండు వంటి పెదవులు, అందమైన నడుము, పద్మపత్రముల వంటి నేత్రములు గల ఆ సీత మన్మథుని భార్యయైన రతి వలె ఉండెను. ఆమె పాతివ్రత్యధర్మమునందు స్థిరముగా నిలిచి ఉండెను. 28, 29

మూ. ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్రప్రభామివ, 30
భూమౌ సుతనుమాసీనాం నియతామివ తాపసీమ్.

ప్ర. అ. (37 వ శ్లోకము వరకు ఉన్న శ్లోకములలోని ద్వితీయాంతములు "సీతామ్" అనుదానికి విశేషణములు. ఆ యా విధములలో ఉన్న సీతను చూచెను అని అన్వయము). పూర్ణచన్ద్రప్రభామివ=పూర్ణచంద్రుని వెన్నెల వలె, సర్వస్య = సమస్తమైన, జగతః = జగత్తుకు, ఇష్టామ్ = ఇష్టురాలూ, నియతామ్ = నియమవంతురాలైన, తాపసీమివ = తపస్సులో ఉన్న స్త్రీ వలె, భూమౌ = నేలపైన, ఆసీనామ్ = కూర్చున్నది, సుతనుమ్ = మంచి శరీరము గలది (అయిన సీతను చూచెను).

తా. పూర్ణచంద్రుని కాంతి వలె ఆమె సకల ప్రాణులకును ఇష్టురాలైనది. మంచి శరీరము గల ఆమె నియమము పాటించుచున్న ఒక తాపసి వలె నేలపై కూర్చుండెను. 30

మూ. నిఃశ్వాసబహులాం భీరుం భుజగేన్ద్రవధూమివ, 31
శోకజాలేన మహతా వితతేన న రాజతీమ్.

ప్ర. అ. భీరుమ్ = భయపడుచున్న, భుజగేన్ద్రవధూమివ= ఆడసర్పము వలె, నిఃశ్వాసబహులామ్ = అధిక మైన నిట్టూర్పులు గలది, మహతా = గొప్ప దైన, వితతేన=విస్తృత మైన, శోకజాలేన=శోకసముదాయముచేత. నరాజతీమ్ = ప్రకాశించకుండా ఉన్నది (అయిన సీతను చూచెను).

తా. సీత భయపడుచున్న ఆడసర్పము వలె అధికముగా నిట్టూర్పుచుం డెను. అత్యధిక మైన దుఃఖసముదాయములో చిక్కుకొని యుండుటచే ప్రకాశ విహీనురా లై ఉండెను. 31

మూ. సంసక్తాం ధూమజాలేన శిఖామివ విభావసోః, 32
తాం స్మృతీమివ సన్దిగ్ధామృద్ధిం నిపతితామివ.

ప్ర. అ. ధూమజాలేన=ధూమపంక్తితో, సంసక్తామ్=కలిసిన, విభావసోః = అగ్నియొక్క, శిఖామివ = జ్వాల వలె ఉన్నది, సన్దిగ్ధామ్ = సందేహముతో కూడిన, స్మృతీమివ = స్మరణశక్తి వలె ఉన్నది, నిపతితామ్ = పడిపోయిన, ఋద్ధిమివ=సమృద్ధి వలె ఉన్నది అయిన, తామ్ = ఆమెను (చూచెను).

తా. ఆ సీత ధూమములో కలిసిపోయిన అగ్నిజ్వాల వలె, సందేహ ములో నిండిన స్మరణశక్తి వలె, నశించిన సమృద్ధి వలె ఉండెను. 32

మూ. విహతామివ చ శ్రద్ధామాశాం ప్రతిహతామివ, 33
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషామివ.

ప్ర. అ. విహతామ్ = కొట్టబడిన, శ్రద్ధామివ = శ్రద్ధ వలె ఉన్నది, ప్రతి హతామ్=అడ్డుకొనబడిన, ఆశామివ = ఆశ వలె ఉన్నది, సోపసర్గామ్ = విఘ్న ములతో కూడిన, సిద్ధిమివ=కార్యసిద్ధి వలె ఉన్నది, సకలుషామ్ = కాలుష్య ముతో కూడిన, బుద్ధిమివ=బుద్ధివలె ఉన్నది, (అయిన ఆ సీతను చూచెను).

తా. ఆ సీత దెబ్బ తిన్న శ్రద్ధ వలె, అడ్డులు తగిలిన ఆశ వలె, విఘ్నము కలిగిన కార్యసిద్ధి వలె, కాలుష్యముతో కూడిన (నిర్మలముగా లేని) బుద్ధి వలె ఉండెను. 33

మూ. అభూతేనాపవాదేన కీర్తిం నిపతితామివ, 34
రామోపరోధవ్యథితాం రక్షోహరణకర్శితామ్.

ప్ర. అ. అభూతేన = సత్యము కాని, అపవాదేన = అపవాదముచేత, నిపతితామ్ = పడిపోయిన, కీర్తిమివ = కీర్తి వలె ఉన్నదీ, రామోపరోధవ్యథితామ్ = రామునికి కలిగిన కష్టములచే బాధపడుచున్నదీ, రక్షోహరణకర్శితామ్ = రాక్షసుడు (తనను) హరించుటచే కృశింపచేయబడినదీ అయిన (సీతను చూచెను).

తా. రామునకు కలిగిన కష్టములకు వ్యథ చెందుచు, రావణునిచే అపహరింపబడుటచే కృశించిపోయిన ఆ సీత అసత్యములైన దోషములను ఆరోపించుటచే చెల్లచిన్న కీర్తి వలె ఉండెను. 34

మూ. అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తతస్తతః, 35
బాష్పాంబుపరిపూర్ణేన కృష్ణవక్రాక్షిపక్ష్మణా,
వదనేనాప్రసన్నేన నిఃశ్వసన్తీం పునః పునః. 36

ప్ర. అ. మృగశాబాక్షీమ్ = లేడి పిల్ల నేత్రముల వంటి నేత్రములు కలదీ, బాష్పాంబుపరిపూర్ణేన = కన్నీళ్లతో నిండిన, కృష్ణవక్రాక్షిపక్ష్మణా = నల్లని వంకరగా నున్న కనురెప్పలు గల, అప్రసన్నేన = ప్రసన్నముగా లేని, వదనేన = ముఖముతో, తతస్తతః = ఇటు నటు, వీక్షమాణామ్ = చూచుచున్నదీ, అబలామ్ = దుర్బలురాలూ అయిన (సీతను చూచెను).

తా. లేడిపిల్ల కళ్ళ వంటి కన్నులు గల ఆ సీత కన్నీళ్ళతో నిండిన, నల్లని వంకర యైన కనురెప్పలు గల, కలతచెందిన ముఖముతో ఇటు నటు చూచుచుండెను. మాటి మాటికి నిట్టూర్పులు విడుచుచుండెను. 35, 36

మూ. మలపఙ్కధరాం దీనాం మణ్డనార్హామమణ్డితామ్,
ప్రభాం నక్షత్రరాజస్య కాలమేఘైరివావృతామ్. 37

ప్ర. అ. మలపఙ్కధరామ్ = మాలిన్యమును పంకమును ధరించినదీ, దీనామ్ = దీనురాలూ, మణ్డనార్హామ్ = అలంకారములకు తగినది, అమణ్డితామ్ = అలంకరించబడనిదీ, కాలమేఘైః = నల్లని మేఘములచేత, ఆవృతామ్ = కప్పబడిన, నక్షత్రరాజస్య = చంద్రునియొక్క, ప్రభామివ = కాంతి వలె ఉన్నదీ (అయిన సీతను చూచెను).

తా. స్నానాదిసంస్కారములు లేకపోవుటచే ఆమె శరీరము మాలిన్యము తోను, పంకముతోను నిండియుండెను. అలంకరించుకొనుటకు తగిన ఆమె ఎట్టి అలంకారములూ లేక, దీనురాలై, నల్లని మేఘముచే కప్పివేయబడిన చంద్రుని కాంతి వలె ఉండెను. 37

మూ. తస్య సందిదిహే బుద్ధిర్ముహుః సీతాం నిరీక్ష్య తు,
ఆమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలామివ. 38

ప్ర. అ. ఆమ్నాయానామ్ = ఆవృత్తులయొక్క, (మళ్ళీ మళ్ళీ చదువుట ఆవృత్తి) అయోగేన = సంబంధము లేక పోవుటచేత, ప్రశిథిలామ్ = శిథిల మై పోయిన, విద్యామివ = విద్య వలె ఉన్న, సీతామ్ = సీతను, నిరీక్ష్య = చూచి, తస్య = హనుమంతునియొక్క, బుద్ధిస్తు = బుద్ధి యైతే, ముహుః = మాటి మాటికి, సందిదిహే = సందేహించెను.

తా. సరి యైన ఆవృత్తులు చేయకపోవుటచే గట్టిపడని విద్య వలె ఉన్న సీతను చూచిన ఆ హనుమంతుని మనస్సులో, ఈమె సీతయా కాదా అను సందేహము మాటి మాటికి ఉదయించెను. 38

మూ. దుఃఖేన బుబుధే సీతాం హనుమాననలంకృతామ్,
సంస్కారేణ యథా హీనాం వాచమర్థాన్తరంగతామ్. 39

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, అనలంకృతామ్ = అలంకరింప బడనిది, సంస్కారేణ = సంస్కారముతో, హీనామ్ = శూన్య మై, అర్థాన్తరమ్ = (చెప్పదలచుకొన్న అర్థము కాక) మరి యొక అర్థమును, గతామ్ = పొందిన, వాచమ్ యథా = వాక్కువలె ఉన్నదీ అయిన, సీతామ్ = సీతను, దుఃఖేన = అతి కష్టముచేత, బుబుధే = గుర్తించెను.

తా. సంస్కారము (వర్ణోచ్చారణవ్యాకరణాది సౌష్ఠవము) లేకపోవుటచే చెప్పదలచిన అర్థమునకు భిన్నముగా మరొక అర్థమును బోధించు వాక్కును శ్రమపడి అర్థము చేసి కొన్నట్లు, హనుమంతుడు, అలంకారవిహీన యై ఉన్న ఆ సీతను అతికష్టముమీద గుర్తించెను. 39

మూ. తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీమనిన్దితామ్,
తర్కయామాస సీతేతి కారణైరుపపాదిభిః. 40

ప్ర. అ. విశాలాక్షీమ్=విశాలము లైన నేత్రములు గల, అనిన్దితామ్= నిందింపబడని, తాం రాజపుత్రీమ్ = ఆ రాజకుమారిని, సమీక్ష్య = చూచి, ఉపపాదిభిః=ఉపపన్నము లైన, కారణైః = హేతువులచేత, సీతేతి = సీత అని, తర్కయామాస = ఊహించెను.

తా. విశాలము లైన నేత్రములు గల, దోషరహితురా లైన ఆ రాజకుమారిని చూచి, హనుమంతుడు, యుక్తియుక్తము లైన హేతువులచే, ఆమె సీతయే అని ఊహించెను. 40

మూ. వైదేహ్యా యాని చాఙ్గేషు తదా రామోఽన్వకీర్తయత్,
తాన్యాభరణజాలాని గాత్రశోభీన్యలక్షయత్. 41
సుకృతౌ కర్ణవేష్టౌ చ శ్వదంష్ట్రౌ చ సుసంస్థితౌ,
మణివిద్రుమచిత్రాణి హస్తేష్వాభరణాని చ. 42
శ్యామాని చిరయుక్తత్వాత్తథా సంస్థానవన్తి చ.

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, యాని=ఏ, ఆభరణజాలాని = ఆభరణముల సముదాయములను, వైదేహ్యాః = సీతయొక్క, అఙ్గేషు = అవయవములందు ఉన్నవానినిగా, అన్వకీర్తయత్ = చెప్పెనో, గాత్రశోభీని = అవయవములందు శోభించుచున్న, తాని=వానిని, అలక్షయత్ = చూచెను. సుకృతౌ = చక్కగా తయారుచేయబడిన, కర్ణవేష్టౌ చ=కుండలములను, సుసంస్థితౌ = బాగుగా అమరి ఉన్న, శ్వదంష్ట్రౌ చ=శ్వదంష్ట్రిములు అను కర్ణాభరణములను, హస్తేషు = ముంజేయి, బుజములు మొదలైన హస్తస్థానములందు, మణివిద్రుమచిత్రాణి=మణులతోను, పొగడములతోను చిత్రము లై ఉన్న, ఆభరణాని చ = ఆభరణములను, చిరయుక్తత్వాత్ = చిరకాలము శరీరముతో సంబంధించి ఉండుటచేత, శ్యామాని=నల్లబడినవి, సంస్థానవన్తి చ=ముద్రలుకలవి (శరీరముపైద తమ ముద్రలు పడునట్లు చేసినవి) అయిన, అలంకారములను చూచెను.

తా. ఆనాడు రాముడు, సీత శరీరముపైద ఏయే అలంకారము లున్నవని చెప్పెనో ఆ అలంకారములు ఆమె అవయవములపైద ప్రకాశించుచుండెను. చక్కగా తయారుచేసిన కుండలములు, బాగుగా అమరి ఉన్న శ్వదంష్ట్రిములను కర్ణాభరణములూ, హస్తములపై ధరించు, మణులతోను పొగడములతోను

పరిత్రమై శైన అభరణములూ, పీఠి నన్నింటినీ హనుమంతుడు చూచెను. దాం కాలము పాటు ధరియుండగా సీత శరీరముపైననే ఉండుటచే అవి కాంతిని మాసిపోయెను. వాటి ముద్రలు కూడ ఆమె అవయవములపై పడెను. 41, 42

మూ. తాన్యేవైతాని మన్యేఽహం యాని రామోఽన్వకీర్తయత్
తత్ర యాన్యవహీనాని తాన్యహం నోపలక్షయే,
యాన్యస్యా నావహీనాని తానీమాని న సంశయః. 44

ప్ర. అ. ఏతాని=ఇవి, రామః=రాముడు, యాని=వేటిని గూర్చి, అన్వకీర్తయత్=చెప్పెనో, తాన్యేవ=అవే అని, అహమ్=నేను, మన్యే=తలంచెదను. తత్ర=వాటిలో, యాని=ఏవి, అవహీనాని=తరిగిపోయినవో, తాని=వాటిని, అహమ్=నేను, నోపలక్షయే=చూడను. అస్యాః=ఈమెయొక్క, యాని=ఏ అలంకారములు, నావహీనాని=తరిగిపోలేదో, తాని=అవి, ఇమాని=ఇవే. సంశయః=సంశయము, న=లేదు.

తా. రాముడు చెప్పిన అలంకారములు ఇవే అని తలచెదను. రావణుడు తనను అపహరించునప్పుడు సీత కొన్ని అలంకారములను తీసి క్రిందపడవే యుటచే తరిగిపోయిన అలంకారములు ఇక్కడ లేవు. తరగనివి (ఆమె క్రింద పడవేయనివి) ఇవే. సంశయము లేదు. 43, 44

మూ. పీతం కనకపట్టాభం స్రస్తం తద్వసనం శుభమ్,
ఉత్తరీయం నగాసక్తం తదా దృష్టం ప్లవఙ్గమైః. 45

ప్ర. అ. పీతమ్=పచ్చనిదీ. కనకపట్టాభమ్=బంగారు పట్టము (పట్టీ) వంటి కాంతి కలదీ, శుభమ్=మంగళకరమైనదీ, ఉత్తరీయమ్=ఉత్తరీయమూ అయిన, స్రస్తమ్=జారవిడవబడినదై, నగాసక్తమ్=పర్వతమునకు తగ్గిన దైన, (పర్వతము పైన పడిన) తత్=ఆ, వసనమ్=వస్త్రము, తదా=ఆనాడు, ప్లవఙ్గమైః=వానరులచేత, దృష్టమ్=చూడబడినది.

తా. బంగారు పట్టీ వలె పచ్చగా ఉన్న, మంగళప్రదమైన, ఆ ఉత్తరీయాంశుకము సీత జారవిడువగా పర్వతముపైన పడినప్పుడు దానిని ఆనాడు వానరులు చూచినారు. 45

మూ. భూషణాని చ ముఖ్యాని దృష్టాని ధరణీతలే,
అనయైవాపవిద్ధాని స్వనవన్తి మహాన్తి చ. 46

ప్ర. అ. అనయైవ = ఈమెచేతనే, ధరణీతలే = నేలపైన, అపవిద్ధాని = పారవేయబడిన, స్వనవన్తి = ధ్వని గల, మహాన్తి = ఉత్తమము లైన, ముఖ్యాని = ప్రధానము లైన, భూషణాని చ = అలంకారములు కూడా, దృష్టాని = చూడబడినవి.

తా. ఈమెయే పారవేయగా చప్పుడు చేయుచూ నేలపై పడిన, అమూల్యము లైన ప్రధానభూషణములను కూడ వానరులు చూచినారు. 46

మూ. ఇదం చిరగృహీతత్వాద్వసనం క్లిష్టవత్తరమ్,
తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమద్యథేతరత్. 47

ప్ర. అ. ఇదమ్ = ఈ, వసనమ్ = వస్త్రము, చిరగృహీతత్వాత్ = చాలకాలమునుండి ధరింపబడుచుండుటవలన, క్లిష్టవత్తరమ్ = ఎక్కువగా నలిగిపోయినది. తథాపి = అట్లైనను. నూనమ్ = నిశ్చయముగా, తద్వర్ణమ్ = ఆ వర్ణము కలది. ఇతరత్ = ఇతర మైనది (ఉత్తరీయము), యథా = ఎట్లో, తథా = అట్లే, శ్రీమత్ = శోభగలది.

తా. ఈమె ధరించిన ఈ వస్త్రము చాలా కాలమునుండి కట్టుకొనుటచే చాలా నలిగిపోయినది. అయినను దాని (ఆ ఉత్తరీయము) రంగు దీని రంగూ ఒక్కటే. అది ఎంత శోభాయుక్తమైనదో ఇదికూడ అంతశోభాయుక్తమై ఉన్నది.

మూ. ఇయం కనకవర్ణాఙ్గీ రామస్య మహిషీ ప్రియా,
ప్రణష్టాపి సతీ యాస్య మనసో న ప్రణశ్యతి. 48

ప్ర. అ. కనకవర్ణాఙ్గీ = బంగారురంగు దేహము గల, ఇయమ్ = ఈమె, రామస్య = రాముని యొక్క, ప్రియా = ప్రియురా లైన, మహిషీ = భార్యయే. సతీ = పతివ్రత యైన, యా = ఏ సీత, ప్రణష్టాపి = కనబడకుండా పోయినను, అస్య = ఈ రామునియొక్క, మనసః = మనస్సునుండి, న ప్రణశ్యతి = తొలగిపోవుటలేదో.

తా. బంగారువన్నె శరీరము గల ఈమె రాముని ప్రియురా లైన సీతయే.

రావణుడు అపహరించుటచే ఈమె కనబడక పోయినా రాముని మనస్సులో మాత్రము ఈమె స్థిరముగా నిలచి ఉన్నది. 48

మూ. ఇయం సా యత్కృతే రామశ్చతుర్భిః పరితప్యతే,
కారుణ్యేనానృశంస్యేన శోకేన మదనేన చ. 49

స్త్రీ ప్రణష్టేతి కారుణ్యాదాశ్రితేత్యానృశంస్యతః,
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ. 50

ప్ర. అ. యత్కృతే = ఎవ్వతె నిమిత్తమై, రామః = రాముడు, ప్రణష్టా = కనబడకుండా పోయినది. స్త్రీ ఇతి = స్త్రీ అని, కారుణ్యాత్ = జాలివలనా, ఆశ్రితేతి = నన్ను ఆశ్రయించి ఉండేది కదా అని, ఆనృశంస్యతః = దయ వలన, నష్టా = కనబడకుండా పోయినది, పత్నీ ఇతి = భార్య అని, శోకేన = శోకముచేత, ప్రియా ఇతి = ప్రియురాలు అనే కారణముచేత, మదనేన = మన్మథుని చేత, (కామముచేత), ఈ విధముగా, కారుణ్యేన = జాలితోను, ఆనృశంస్యేన = దయతోను, శోకేన = శోకముతోను, మదనేన = మన్మథునితోను, చతుర్భిః = ఈ నాలిగింటితో, పరితప్యతే = బాధపడుచున్నాడో, సా = ఆమె, ఇయమ్ = ఈమెయే.

తా. ఎవ్వతెకోసమై రాముడు, జాలి, దయ, శోకము, కామము అను నాల్గింటితో బాధపడుచున్నాడో ఆమె ఈమెయే. కనబడకుండ పోయినది స్త్రీ కదా అని జాలి, ఆమెకు నేను తప్ప మరెవ్వరూ రక్షకులు లేరు కదా అని దయ, కనబడకుండ పోయినది భార్య అగుటచే శోకము. ఆమె ప్రియురా లగుటచే కామము ఈ నాల్గింటితో బాధపడుచున్నాడు. 49, 50

మూ. అస్యా దేవ్యా యథా రూపమఙ్గప్రత్యఙ్గసౌష్ఠవమ్,
రామస్య చ యథా రూపం తస్యేయమసితేక్షణా. 51

ప్ర. అ. అస్యాః = ఈ, దేవ్యాః = దేవియొక్క, రూపమ్ = రూపము, అఙ్గప్రత్యఙ్గసౌష్ఠవమ్ = దేహముయొక్క, అవయవములయొక్క సౌష్ఠవము, (చక్కగా ఉండుట), యథా = ఎట్లో, రామస్య చ = రామునియొక్క కూడా, (రాముని రూపము అంగప్రత్యంగసౌష్ఠవము కూడ) (తథా = అట్లే ఉన్నది).

తస్య = ఆ రాముని యొక్క, రూపమ్ = రూపము యథా = ఎట్లో, ఇయమ్ = ఈ, అసితేక్షణా = నల్లని నేత్రములు గల సీత, (తథా = అట్లే).

తా. ఈ దేవి రూపము, దేహ-దేహావయవముల చక్కదనము ఎట్లున్నవో రాముని రూపము, అతని అంగప్రత్యంగముల చక్కదనము కూడా అట్లే ఉన్నవి. నల్లని నేత్రములు గల సీత రూపము ఆ రాముని రూపమునకు తగి ఉన్నది. 51

మూ. అస్యా దేవ్యా మనస్తస్మింస్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్,
తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి. 52

ప్ర. అ. అస్యాః = ఈ, దేవ్యాః = దేవియొక్క, మనః = మనస్సు, తస్మిన్ = ఆ రామునియందు, తస్య = ఆ రాముని మనస్సు, అస్యాం చ = ఈమెయందు, ప్రతిష్ఠితమ్ = స్థిరముగా నిలువబడి ఉన్నది. తేన = ఆ కారణము చేతనే, ఇయమ్ = ఈమె, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, స చ = ఆ రాముడూ, ముహూర్తమపి = ముహూర్తకాలమైనను, జీవతి = జీవించియున్నాడు (రు).

తా. ఈ సీతాదేవి మనస్సు రామునిపై స్థిరముగా లగ్నమై ఉన్నది. ఆ రాముని మనస్సు కూడ ఈమెపై స్థిరముగా లగ్నమై ఉన్నది. అందుచేతనే ఈ సీతాదేవీ, ధర్మాత్ముడైన రాముడూ, ఒకరిపై ఒకరు ఆశ పెట్టుకొని క్షణకాలమైనా జీవించ కలుగుచున్నారు. 52

మూ. దుష్కరం కృతవాన్రామో హీనో యదనయా ప్రభుః,
ధారయత్యాత్మనో దేహం న శోకేనావసీదతి 53

ప్ర. అ. ప్రభుః = ప్రభువైన, రామః = రాముడు, అనయా = ఈమెతో, హీనః = శూన్యుడై, ఆత్మనః = తనయొక్క, దేహమ్ = దేహమును, ధారయతి ఇతి యత్ = ధరించుచున్నాడు అనునది ఏది కలదో, శోకేన = దుఃఖముచేత, నావసీదతి ఇతి యత్ = మరణించుట లేదన్న మాట ఏది కలదో, దుష్కరమ్ = చేయశక్యముకాని పనిని, కృతవాన్ = చేసినాడు.

తా. ఈ సీతనుండి దూరమైన పిమ్మటకూడ రాముడు ప్రాణములతో

ఉండగలిగినారు, మరలెంతలేదు, అనగా ఆ ప్రభువు నిజముగా చేయ శక్యము కాని పని చేయుచున్నారు కదా। 53

మూ. దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్,
సీతాం వినా మహాబాహుర్ముహూర్తమపి జీవతి. 54

ప్ర. అ. యః = ఏ రాముడు, ఇమామ్ = ఈ, మత్తకాశినీమ్ = యౌవన మదముతో ప్రకాశించుచున్న, సీతాం వినా = సీత లేకుండగా, ముహూర్తమపి = ముహూర్తకాల మైన, జీవతి = జీవించి యున్నాడో, మహాబాహుః = గొప్ప బాహువులు గల, రామః = రాముడు, దుష్కరమ్ = చేయశక్యము కాని పనిని, కురుతే = చేయుచున్నాడు.

తా. యౌవనమదము ఉప్పొంగుచున్న ఈ సీతను విడచి మహాబాహు వైన రాముడు క్షణకాల మైనను జీవించి ఉన్నా డనగా, అతడు చేయ శక్యము కాని పని చేయుచున్నాడు। 54

మూ. ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసంభవః,
జగామ మనసా రామం ప్రశశంస చ తం ప్రభుమ్. 55

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చదశః సర్గః.

ప్ర. అ. పవనసంభవః = హనుమంతుడు, తదా = అప్పుడు, సీతామ్ = సీతను, దృష్ట్వా = చూచి, ఏవమ్ = ఈ విధముగా, హృష్టః = సంతోషించిన వాడై, మనసా = మనస్సులో, రామమ్ = రాముని గూర్చి, జగామ = వెళ్లెను. తమ్ = ఆ, ప్రభుమ్ = ప్రభువును, ప్రశశంస చ = ప్రశంసించెను కూడా.

తా. అప్పుడు ఆ పవనతనయుడు సీత కనబడుటచే ఈ విధముగా సంతోషించుచు, ఒక్కమారు మనసారా రాముని స్మరించి, ఆ రామప్రభువును కొని యాడెను. 55

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పదునైదవసర్గ సమాప్తము.

# సుందరకాండ విషయసూచిక

## అథ షోడశః సర్గః

[హనుమంతుడు సీత శీలమును, సౌందర్యమును ప్రశంసించుట. దుఃఖమగ్నురా లైన ఆమెను గూర్చి దుఃఖించుట].

మూ. ప్రశస్య తు ప్రశస్తవ్యాం సీతాం తాం హరిపుఙ్గవః,
గుణాభిరామం రామం చ పునశ్చిన్తాపరోఽభవత్. 1

ప్ర. అ. హరిపుఙ్గవః = ఆ వానరశ్రేష్ఠుడు, ప్రశస్తవ్యామ్ = ప్రశంసించ దగిన, తామ్ = ఆ, సీతామ్ = సీతను, ప్రశస్య = ప్రశంసించి, గుణాభిరామమ్ = సద్గుణాభిరాము డైన, రామం చ = రాముని కూడ ప్రశంసించి, పునః = మరల, చిన్తాపరః = చింతయందు తత్పరుడై, అభవత్ = అయెను.

తా. ఆ హనుమంతుడు, ప్రశంసింప దగిన ఆ సీతను, సద్గుణాభిరాము డైన రాముణ్ణి మనస్సులో ప్రశంసించి, మరల ఆలోచనలో మునిగిపోయెను. 1

మూ. స ముహూర్తమివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః,
సీతామాశ్రిత్య తేజస్వీ హనుమాన్విలలాప హ. 2

ప్ర. అ. తేజస్వీ = తేజశ్శాలి యైన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, ముహూర్తమివ = క్షణకాలము, ధ్యాత్వా = ఆలోచించి, బాష్పపర్యాకులేక్షణః = కన్నీటితో వ్యాకులము లైన నేత్రములు కలవాడై, సీతామ్ ఆశ్రిత్య = సీతను గూర్చి, విలలాప హ = విలపించెను.

తా. తేజశ్శాలి యైన ఆ హనుమంతుడు ఒక్క క్షణము మనస్సులో ఏమేమో ఆలోచించుచుకొని కన్నీళ్లు కార్చుచు సీతను గూర్చి ఈ విధముగా విలపించెను. 2

మూ. మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా,
యది సీతాపి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః. 3

ప్ర. అ. గురువినీతస్య = గురువుంచేత వినీతు డైన, లక్ష్మణస్య = లక్ష్మణునకు, మాన్యా = గౌరవించ దగినదీ, గురుప్రియా = పెద్దలకు ఇష్టురాలూ అయిన, సీతాపి = సీత కూడ, దుఃఖార్తా యది = దుఃఖముచేత పీడించ బడుచున్న ట్లయితే, కాలః = కాలము. దురతిక్రమః హి = దాట శక్యము కానిది కదా।

తా. గురువుల వద్ద మంచి వినయమును నేర్చుకొన్న లక్ష్మణునికి పూజ్యురాలూ, పెద్దల స్నేహమునకు పాత్రురాలూ అయిన సీతకూడ దుఃఖముతో బాధ పడుచున్న దనగా కాలమును ఎవ్వరూ దాట జాలరు కదా. 3

మూ. రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః,
నాత్యర్థం క్షుభ్యతే దేవీ గఙ్గేవ జలదాగమే. 4

ప్ర. అ. రామస్య = రామునియొక్క, ధీమతః = ధీమంతు డైన, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్క, వ్యవసాయజ్ఞా = ప్రయత్నమును ఎరిగిన, దేవీ = ఈ సీతాదేవి, జలదాగమే = వర్షాకాలమునందు, గఙ్గేవ = గంగ వలె, అత్యర్థమ్ = అధికముగా, న క్షుభ్యతే = క్షోభ చెందుటలేదు.

తా. రాముడూ, బుద్ధిశాలి యైన లక్ష్మణుడూ కూడ వచ్చిన పట్టు విడువక ప్రయత్నము చేయు స్వభావము కలవారు అనే విషయము తెలిసిన దగుటచే ఈ దేవి వర్షాకాలములో గూడ గంగానది అంతగా క్షోభించ నట్లు, ఎక్కువగా క్షోభించుట లేదు (కంగారుపడి పోవుట లేదు.) 4

మూ. తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్,
రాఘవోఽర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా. 5

ప్ర. అ. తుల్యశీలవయోవృత్తామ్ = తుల్య మైన శీలము, వయస్సు, ప్రవర్తనా గలదీ, తుల్యాభిజనలక్షణామ్=తుల్య మైన ఉత్తమవంశము, లక్షణములూ కలదీ అయిన, వైదేహీమ్ = సీతను, రాఘవః = రాముడు, అర్హతి = తగి ఉన్నాడు. ఇయమ్ = ఈ, అసితేక్షణా = నల్లని నేత్రములు గల సీత కూడ, తమ్ = ఆ రాముని, అర్హతి = తగి యున్నది.

తా. తనతో సమాన మైన శీలము, వయస్సు, ప్రవర్తన, సద్వంశము,

ఉత్తమలక్షణములు ఉన్న ఈ సీతకు రాముడే తగిన భర్త. అట్లే రామునకు సీతయే తగిన భార్య. 5

మూ. తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాన్తామివ శ్రియమ్,
జగామ మనసా రామం వచనం చేదమబ్రవీత్. 6

ప్ర. అ. నవహేమాభామ్=నూతనమైన బంగారము వంటి కాంతి గలదీ, శ్రియమివ=లక్ష్మి వలె, లోకకాన్తామ్=లోకమునకు మనోహరురాలూ అయిన, తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, మనసా=మనస్సుతో, రామమ్=రాముని గూర్చి, జగామ=వెళ్ళెను. ఇదమ్=ఈ, వచనం చ=వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. క్రొత్తబంగారము కాంతి వంటి కాంతితో లక్ష్మి వలె లోకమునకు అంతకూ మనోహరురాలైన ఆ సీతను చూచి, హనుమంతుడు మనసా రాముని దగ్గరకు వెళ్ళి (రాముని స్మరించుచు) ఇట్లు అనుకొనెను. 6

మూ. అస్యా హేతోర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః,
రావణప్రతిమో వీర్యే కబన్ధశ్చ నిపాతితః. 7

ప్ర. అ. విశాలాక్ష్యాః=విశాలాక్షియైన, అస్యాః హేతోః=ఈ సీత కొరకై, మహాబలః=గొప్ప బలము గల, వాలీ=వాలి, హతః=చంపబడినాడు. వీర్యే=పరాక్రమమునందు, రావణప్రతిమః=రావణునితో సమానుడైన, కబన్ధశ్చ=కబంధుడు కూడా, నిపాతితః=పడవేయబడినాడు.

తా. విశాలాక్షియైన ఈ సీతకొరకే కదా రాముడు మహాబలశాలియైన వాలిని, పరాక్రమముచేత రావణునితో సమానుడైన కబంధుని సంహరించినాడు.

మూ. విరాధశ్చ హతః సంఖ్యే రాక్షసో భీమవిక్రమః,
వనే రామేణ విక్రమ్య మహేన్ద్రేణేవ శమ్బరః. 8

ప్ర. అ. వనే=వనమునందు, సంఖ్యే=యుద్ధములో, రామేణ=రాముని చేత, విక్రమ్య=పరాక్రమించి, మహేన్ద్రేణ=మహేంద్రుని చేత, శమ్బరః ఇవ=శంబరుడు వలె, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, విరాధః=విరాధుడను రాక్షసుడు కూడా, హతః=చంపబడినాడు.

తా. ఈమె కొరకే కదా రాముడు, అరణ్యములో యుద్ధమునందు, మహేంద్రుడు శంబరాసురుని చంపినట్లు, భయంకర మైన పరాక్రమము గల విరాధు డనే రాక్షసుని చంపినాడు. 8

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః. 9

ప్ర. అ. జనస్థానే=జనస్థానమునందు, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలతో సమానము లైన, శరైః=బాణములతో, భీమకర్మణామ్=భయంకర మైన కర్మ గల, రక్షసామ్= రాక్షసులయొక్క, చతుర్దశ=పదునాలుగు, సహస్రాణి= సహస్రములు, నిహతాని=చంపబడినవి.

తా. ఈమె కొరకే కదా రాముడు, జనస్థానములో, అగ్నిజ్వాలలవంటి బాణములతో భయంకర మైన కర్మ గల పదునాలుగు వేలమంది రాక్షసులను చంపినాడు. 9

మూ. ఖరశ్చ నిహతః సంఖ్యే త్రిశిరాశ్చ నిపాతితః,
దూషణశ్చ మహాతేజా రామేణ విదితాత్మనా. 10

ప్ర. అ. విదితాత్మనా=ప్రసిద్ధ మైన బుద్ధి గల, రామేణ=రామునిచేత, సంఖ్యే=యుద్ధమునందు, ఖరశ్చ=ఖరుడు, నిహతః=చంపబడినాడు. త్రిశిరాశ్చ=త్రిశిరస్సు కూడ, నిపాతితః=పడగొట్టబడినాడు. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, దూషణశ్చ=దూషణుడు కూడ (చంపబడినాడు).

తా. ఈ సీతకొరకే కదా మహాబుద్ధిశాలిగా ప్రసిద్ధు డైన రాముడు యుద్ధములో ఖరుని, త్రిశిరస్సును, మహాబలశాలి యైన దూషణుని చంపినాడు.

మూ. ఐశ్వర్యం వానరాణాం చ దుర్లభం వాలిపాలితమ్,
అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవాన్ లోకసత్కృతమ్.

అస్యాః=ఈమెయొక్క, నిమిత్తే=నిమిత్తమున, సుగ్రీవః=సుగ్రీవుడు, వాలిపాలితమ్=వాలిచేత పాలింపబడినదీ, దుర్లభమ్=తేలికగా పొంద శక్యము కానిదీ, లోకసత్కృతమ్=లోకములచేత పూజింపబడినదీ అయిన, వానరాణామ్ =వానరులయొక్క, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, ప్రాప్తవాన్=పొందినాడు.

తా. వాలి పాలనలో ఉండుటచేత తేలికగా పొంద శక్యము కాని, లోకములో గౌరవింపబడిన వానరరాజ్యమును, సుగ్రీవుడు ఈమె మూలముననే కదా పొందగలిగినాడు. 11

మూ. సాగరశ్చ మయా క్రాన్తః శ్రీమాన్ నదనదీపతిః,
అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీ చేయమవేక్షితా. 12

ప్ర. అ. విశాలాక్ష్యాః = విశాలము లైన నేత్రములు గల, అస్యాః హేతోః = ఈమెకొరకే, మయా = నాచేత, నదనదీపతిః = పశ్చిమము వైపు ప్రవహించు నదములకు, తూర్పు వైపు ప్రవహించు నదులకు ప్రభు వైన, సాగరశ్చ = సముద్రము, క్రాన్తః = దాటబడినది. ఇయమ్ = ఈ, పురీ చ = పట్టణము కూడ, అవేక్షితా = చూడబడినది.

తా. నేను ఈమెకోసమే కదా నదములకు, నదులకు ప్రభు వైన సాగరమును దాటివచ్చి ఈ లంకాపురమును చూచినాను. 12

మూ. యది రామః సముద్రాన్తాం మేదినీం పరివర్తయేత్,
అస్యాః కృతే జగచ్చాపి యుక్తమిత్యేవ మే మతిః. 13

ప్ర. అ. రామః = రాముడు, అస్యాః కృతే = ఈమె నిమిత్తమై, సముద్రాన్తామ్ = సముద్రము అంతముగా గల, మేదినీమ్ = ఈ భూమిని, జగచ్చాపి = జగత్తును అంతయూ కూడ, పరివర్తయేద్యది = తలక్రిందులు చేసినను, యుక్తమిత్యేవ = యుక్తమే అని, మే = నాయొక్క, మతిః = అభిప్రాయము.

తా. రాముడు ఈ సీతకోసమై సముద్రమువరకు వ్యాపించిన భూమినే కాదు జగత్తునంతయూ తలక్రిందు చేసినా యుక్తమే అని నా అభిప్రాయము. 13

మూ. రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా.
త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలామ్.

ప్ర. అ. త్రిషు = మూడు, లోకేషు = లోకములయందు, (ఉన్న), రాజ్యం వా = రాజ్యమా, జనకాత్మజా = జనకుని కుమార్తె యైన, సీతా వా = సీతయా అన్నచో, సకలమ్ = సమస్త మైన, త్రైలోక్యరాజ్యమ్ = త్రిలోకముల రాజ్యము,

సీతాయాః = సీతయొక్క, కలామ్ = పదహారవభాగమును కూడ. నార్హంయాత్ = పొందదు.

తా. మూడు లోకములం పైన అధికారము గొప్పదా జనకుని కూతు రైన సీత గొప్పదా అని చూచినచో, మూడు లోకములపై రాజ్యాధికారము సీతలో పదహారవ పాలుకు కూడా సరిరాదు. 14

మూ. ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః,
సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా. 15
ఉత్థితా మేదినీం భిత్త్వా క్షేత్రే హలముఖక్షతే,
పద్మరేణునిభైః కీర్ణా శుభైః కేదారపాంసుభిః. 16

ప్ర. అ. ఇయమ్ = ఈమె, క్షేత్రే = యజ్ఞభూమి, హలముఖక్షతే = నాగలి కొనచే చీల్చబడిన దగుచుండగా, పద్మరేణునిభైః = పద్మపరాగములతో సమానము లైన, శుభైః = మంగళకరము లైన, కేదారపాంసుభిః = ఆ పొలము లోని పరాగములచేత, కీర్ణా = వ్యాపింపబడినదై, మేదినీమ్ = భూమిని, భిత్త్వా = భేదించుకొని, ఉత్థితా = లేచినది, ధర్మశీలస్య = ధర్మస్వభావుడు, మహాత్మనః = మహాత్ముడు, మైథిలస్య = మిథిలాధీశుడు అయిన, జనకరాజస్య = జనక మహారాజుయొక్క, సుతా = కుమార్తెయూ, భర్తృదృఢవ్రతా = భర్త విషయమున దృఢ మైన పాతివ్రత్యవ్రతము కలదీ అయిన, సా = ఆ, సీతా = సీత.

తా. యజ్ఞభూమిని నాగలితో దున్నుచున్నప్పుడు, పద్మపరాగము వంటి మంగళకరము లైన పరాగములచే కప్పబడిన శరీరముతో ఆ భూమిని భేదించుకొని బైటకు వచ్చినదీ, ధార్మికుడూ, మిథిలాధిపతీ, మహాత్ముడూ అయిన జనక మహారాజ పుత్రికా, దృఢ మైన పాతివ్రత్యధర్మము కలదీ అయిన ఆ సీత ఈమెయే. 15, 16

మూ. విక్రాన్తస్యార్యశీలస్య సంయుగేష్వనివర్తినః,
స్నుషా దశరథస్యైషా జ్యేష్ఠా రాజ్ఞో యశస్వినః. 17

ప్ర. అ. విక్రాన్తస్య = పరాక్రమవంతుడు, ఆర్యశీలస్య = పూజింప దగిన శీలము గలవాడు, సంయుగేషు = యుద్ధములయందు, అనివర్తినః =

మరలనివాడు అయిన, రాజ్ఞః = రాజైన, దశరథస్య = దశరథునియొక్క, యశస్వినీ = కీర్తి గల, జ్యేష్ఠా = శ్రేష్ఠురాలైన, స్నుషా = కోడలు, ఏషా = ఈమెయే.

తా. పరాక్రమవంతుడు, పూజింపదగిన శీలము కలవాడు, యుద్ధములందు వెనుకకు తిరగనివాడు అయిన దశరథమహారాజునకు కీర్తిమంతురాలైన పెద్దకోడలు ఈమెయే.

మూ. ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః,
ఇయం సా దయితా భార్యా రాక్షసీవశమాగతా. 18

ప్ర. అ. ధర్మజ్ఞస్య = ధర్మములు తెలిసినవాడూ, కృతజ్ఞస్య = కృతజ్ఞుడూ, విదితాత్మనః = ప్రసిద్ధమైన బుద్ధి కలవాడూ అయిన, రామస్య = రామునియొక్క, దయితా = ప్రియురాలైన, భార్యా = భార్యయైన, ఇయమ్ = ఈమె, రాక్షసీవశమ్ = రాక్షసస్త్రీల వశమును, ఆగతా = పొందినది.

తా. ధర్మములు తెలిసినవాడూ, కృతజ్ఞుడూ, బుద్ధిమంతుడుగా ప్రసిద్ధి పొందినవాడూ అయిన రామునకు ఇష్టురాలైన భార్యయైన ఈ సీత రాక్షస స్త్రీలకు వశమైనది కదా! 18

మూ. సర్వాన్ భోగాన్ పరిత్యజ్య భర్తృస్నేహబలాత్కృతా,
అచిన్తయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనం వనమ్. 19

సన్తుష్టా ఫలమూలేన భర్తృశుశ్రూషణే రతా,
యా పరాం భజతే ప్రీతిం వనేఽపి భవనే యథా. 20

సేయం కనకవర్ణాఙ్గీ నిత్యం సుస్మితభాషిణీ,
సహతే యాతనామేతామనర్థానా మభాగినీ. 21

ప్ర. అ. యా = ఏ సీత, సర్వాన్ = సమస్తమైన, భోగాన్ = భోగములను, పరిత్యజ్య = విడచి, భర్తృస్నేహబలాత్కృతా = భర్తయందలి ప్రేమచేత, బలాత్కరింపబడినదై, దుఃఖాని = దుఃఖములను, అచిన్తయిత్వా = లెక్కచేయక, నిర్జనమ్ = జనములు లేని, వనమ్ = వనమును, ప్రవిష్టా = ప్రవేశించినదో, ఫలమూ

లేన = ఫలమూలములతో, సంతుష్టా = సంతోషించినదై, భర్తృశుశ్రూషణే = భర్తను సేవించుటయందు, రతా = ఆసక్తురాలో, వనేఽపి = వనమునందు కూడ, భవనే యథా = గృహమునందు వలె, పరామ్ = ఉత్తమ మైన, ప్రీతిమ్ = సంతోషమును, భజతే = పొందుచున్నదో, కనకవర్ణాఙ్గీ = బంగారు రాయతో కూడిన శరీరము గలది, నిత్యమ్ = ఎల్లప్పుడు, సుస్మితభాషిణీ = మంచి చిరునవ్వుతో మాటలాడునది, అనర్థానామ్ = ఆపదలకు, అభాగినీ = తగనిది, అయిన, సా ఇయమ్ = అట్టి ఈ సీత, ఏతామ్ = ఈ, యాతనామ్ = బాధను, సహతే = సహించుచున్నది.

తా. భర్తపై ఉన్న అసాధారణ మైన ప్రేమచేత ఈమె సమస్తభోగములను విడచి, కష్టములకు లెక్కచేయక నిర్జనవనములో ప్రవేశించినది. భర్తకు సేవ చేయుటయందు మాత్రమే ఆసక్తి కలదై, ఫలములతోను, దుంపలతోను సంతుష్టి రెందుచు, వనములో కూడ భవనములో వలె గొప్ప సంతోషమును పొందు చున్నది. అట్టి ఆపదలు ఈమెకు రావలసినవి కాదు. బంగారు వన్నె శరీరము గలది, ఎల్లప్పుడూ చిరునవ్వుతో మాటలాడునది అయిన అట్టి ఈ సీత అట్టి బాధలు అనుభవించుచున్నది. 19, 20, 21

మూ. ఇమాం తు శీలసంపన్నాం ద్రష్టుమర్హతి రాఘవః,
రావణేన ప్రమథితాం ప్రపామివ పిపాసితః. 22

ప్ర. అ. రాఘవః = రాముడు, శీలసంపన్నామ్ = ఉత్తమశీలముతో కూడినది, రావణేన = రావణునిచేత, ప్రమథితామ్ = పీడింపబడినది అయిన, ఇమామ్ = ఈమెను, పిపాసితః = దప్పికొన్నవాడు, ప్రపామివ = చలివేంద్రమును వలె, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హతి = తగియున్నాడు.

తా. రావణుడు ఇంతబాధ పెట్టినా తన ఉత్తమ శీలమును విడువని ఈ సీతను రాముడు చూచినచో, దప్పికొన్నవాడు చలివేంద్రలి కనబడినచో పరమా నందభరితు డైనట్లు, పరమానందభరితు డగును. 22

మూ. అస్యా నూనం పునర్లాభాద్రాఘవః ప్రీతిమేష్యతి,
రాజా రాజ్యపరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్.

ప్ర. అ. రాఘవః = రాముడు, పునః = తిరిగి, అస్యాః = ఈమెయొక్క

లాభాత్ = లాభమువలన, రాజ్యపరిభ్రష్టః = రాజ్యభ్రష్టు డైన, రాజా = రాజు, మేదినీమ్ = భూమిని, పునః = మరల, ప్రాప్యేవ = పొంది వలె, నూనమ్ = తప్పక, ప్రీతిమ్ = ఆనందమును, ఏష్యతి = పొందగలదు.

తా. ఈమె మరల లభించుటచేత రాముడు రాజ్యభ్రష్టుడైన రాజు మరల తన రాజ్యమును పొందినపుడు సంతోషించినట్లు తప్పక సంతోషించును. 23

మూ. కామభోగైః పరిత్యక్తా హీనా బన్ధుజనేన చ,
ధారయత్యాత్మనో దేహం తత్సమాగమకాఙ్క్షిణీ 24

ప్ర. అ. కామభోగైః = కోరికల భోగములచే, పరిత్యక్తా = విడువబడి నదీ, బన్ధుజనేన చ = బంధుజనముతో కూడ, హీనా = శూన్యురాలూ అయిన ఈ సీత, తత్సమాగమకాఙ్క్షిణీ = ఆ రామునియొక్క సమాగమమును కోరుచు, దేహమ్ = దేహమును, ధారయతి = ధరించుచున్నది.

తా. ఈమెకు ఏట్టి కోరికల భోగములు కూడ లేవు. ఒక్క బంధువు కూడ దగ్గర లేడు. అయినను ఎప్పటికైన రాముని సమాగమము కలుగు నను ఆశతో ప్రాణములు విడువకుండ ఉన్నది. 24

మూ. నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్,
ఏకస్థహృదయా నూనం రామమేవానుపశ్యతి. 25

ప్ర. అ. ఏషా = ఈమె, రాక్షస్యః = రాక్షసస్త్రీలను, న పశ్యతి = చూచుటలేదు. ఇమాన్ = ఈ, పుష్పఫలద్రుమాన్ = పుష్పవృక్షములను, ఫలవృక్షములను, న = చూచుటలేదు. ఏకస్థహృదయా = రామునియందు ఒక్కని యందే నిలచిన హృదయము కలదై, రామమేవ = రాముని మాత్రమే, అనుపశ్యతి = ధ్యానించుచున్నది. నూనమ్ = నిశ్చయము.

తా. ఈమె ప్రక్కనే ఉన్న రాక్షసస్త్రీలను కాని, పుష్పవృక్షములను కాని, ఫలవృక్షములను గాని చూచుటలేదు. ఏకాగ్రమైన చిత్తముతో రామమూర్తి మాత్రమే ధ్యానించుచున్నది. సందేహము లేదు. 25

మూ. భర్తా నామ పరం నార్యా భూషణం భూషణాదపి,
ఏషా తు రహితా తేన భూషణార్హా న శోభతే. 26

ప్ర. అ. భర్తా నామ = భర్త అనగా, నార్యాః = స్త్రీకి, భూషణాదపి = అలంకారముకంటె కూడ, వరమ్ = శ్రేష్ఠమైన, భూషణమ్ = అలంకారము. భూషణార్హా = అలంకారములకు తగిన, ఏషా తు = ఈ సీత యైతే, తేన = ఆ భర్తతో, రహితా = శూన్యురాలై, న శోభతే = శోభించుట లేదు.

తా. స్త్రీకి భర్త అనగా సువర్ణరత్నాద్యలంకారములకంటె కూడ శ్రేష్ఠమైన అలంకారము. అలంకారములు ధరింపదగిన ఈ సీత భర్త అను ఆ అలంకారము లేకపోవుటచేత శోభించుట లేదు. 26

మూ. దుష్కరం కురుతే రామో హీనో యదనయా ప్రభుః,
ధారయత్యాత్మనో దేహం న దుఃఖేనావసీదతి. 27

ప్ర. అ. రామః = రాముడు, అనయా = ఈమెతో, హీనః = శూన్యుడైనను, ఆత్మనః = తనయొక్క, దేహమ్ = దేహమును, ధారయతి ఇతి యత్ = ధరించి ఉన్నాడు అనునది ఏది కలదో, దుఃఖేన = దుఃఖముచేత, నావసీదతి ఇతి యత్ = క్రుంగిపోకున్నాడనునది ఏది కలదో, ప్రభుః = ఆ రామప్రభువు, దుష్కరమ్ = చేయ శక్యము కాని పనిని, కురుతే = చేయుచున్నాడు

తా. ఈమె అపహరింపబడిన తరవాత కూడ రాముడు దుఃఖములో నశించకుండా జీవించి ఉన్నాడనగా నిజముగా ఆ రామప్రభువు ఎవ్వరూ చేయలేని పని చేయుచున్నాడు. 27

మూ. ఇమామసితకేశాన్తాం శతపత్రనిభేక్షణామ్,
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః.

ప్ర. అ. అసితకేశాన్తామ్ = నల్లని కేశాంతములు కలదీ, శతపత్రనిభేక్షణామ్ = తామరపూవుల వంటి నేత్రములు కలదీ, సుఖార్హామ్ = సుఖములకు తగినదీ అయిన, ఇమామ్ = ఈమెను, దుఃఖితామ్ = దుఃఖించుచున్నదానినిగా, దృష్ట్వా = చూచి, మమ = నాయొక్క, మనః అపి = మనస్సు కూడ, వ్యథితమ్ = దుఃఖించుచున్నది.

తా. నల్లని కేశములు, పద్మపత్రముల వంటి నేత్రములు గల ఈమె సుఖములను అనుభవించుటకే యుక్తము. అట్టి ఈమెకు కూడ కలిగిన ఈ

కష్టము చూచి, ఈమెతో ఏట్టి సంబంధమూ లేని మధ్యస్థుడ నైన నా మనస్సు కూడ బాధ పడుచున్నది. 28

మూ. క్షితిక్షమా పుష్కరసన్నిభాక్షీ
యా రక్షితా రాఘవలక్ష్మణాభ్యామ్,
సా రాక్షసీభిర్వికృతేక్షణాభిః 29
సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే.

ప్ర. అ. క్షితిక్షమా = భూమివంటి ఓర్పు గలదీ, పుష్కరసన్నిభాక్షీ = పద్మములతో సమాన మైన నేత్రములు గలదీ అయిన, యా = ఏ సీత, రాఘవలక్ష్మణాభ్యామ్ = రామలక్ష్మణులచేత, రక్షితా = రక్షింపబడెనదో, సా = ఆ సీత, వికృతేక్షణాభిః = వికృతము లైన నేత్రములు గల, రాక్షసీభిః = రాక్షసస్త్రీల చేత, సంప్రతి = ఇప్పుడు, వృక్షమూలే = వృక్షమూలమునందు, సంరక్ష్యతే = రక్షింపబడుచున్నది.

ప్ర. ఆ. భూమి వలె ఓర్పుగలదీ, పద్మములతో సమానము లైన నేత్రములు కలదీ అయిన ఏ సీతను రామలక్ష్మణులు రక్షించుచుండెడివారో ఆమెనే ఇప్పుడు రాక్షసస్త్రీలు వృక్షము మూలమునందు కూర్చుండబెట్టి కావలా కాయుచున్నారు. 29

మూ. హిమహతనలినీవ నష్టశోభా
వ్యసనపరమ్పరయా నిపీడ్యమానా.
సహచరరహితేవ చక్రవాకీ
జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా. 30

ప్ర. అ. హిమహతనలినీవ = మంచుచేత కొట్టబడిన పద్మలత వలె, నష్టశోభా = నశించిన శోభ కలదీ, వ్యసనపరమ్పరయా = వ్యసనముల పరంపర చేత, నిపీడ్యమానా = పీడింపబడుచున్నదీ అయిన, జనకసుతా = సీత, సహచరరహితా = సహచరుడు లేని, చక్రవాకీవ = ఆడచక్రవాక పక్షి వలె, కృపణామ్ = దీన మైన, దశామ్ = అవస్థను, ప్రపన్నా = పొందినది.

తా. కష్టములు ఒకదాని తరువాత ఒకటిగా వచ్చి పడి పీడించుచుండగా,

ఈ సీత మంచు దెబ్బ తిన్న తామరపూల తీగ వలె కాంతి కోల్పోయినదై, మగచక్రవాకము ప్రక్కన లేని ఆడ చక్రవాక పక్షివలె దాం శోచనీయమైన అవస్థను పొంది ఉన్నది. 30

మూ. అస్యా హి పుష్పావనతాగ్రశాఖాః
శోకం దృఢం వై జనయన్త్యశోకాః,
హిమవ్యపాయేన చ శీతరశ్మి
రభ్యుత్థితో నైకసహస్రరశ్మిః. 31

ప్ర. అ. పుష్పావనతాగ్రశాఖాః=పుష్పములచేత వంగిన శాఖాగ్రములు గల, అశోకాః=అశోకవృక్షములు, అస్యాః=ఈమెకు, దృఢమ్=అధికముగా, శోకమ్=దుఃఖమును, జనయన్తి=పుట్టించుచున్నవి. హిమవ్యపాయేన=మంచు తొలగిపోవుటచేత, అభ్యుత్థితః=పైకి లేచిన, నైకసహస్రరశ్మిః=అనేక సహస్రముల కిరణములు గల, శీతరశ్మిః చ=చంద్రుడు కూడ, శోకమును కలిగించుచున్నాడు.

తా. పువ్వులతో శాఖాగ్రములు వంగిన అశోకవృక్షములు, మంచు తొలగిపోవుటచే స్పష్టముగా అనేకసహస్రకిరణములతో ప్రకాశించుచున్న చంద్రుడు భర్తృవిరహముతో బాధపడుచున్న ఈమెకు అధికముగా శోకమును కలిగించుచున్నవి. 31

మూ. ఇత్యేవమర్థం కపిరన్వవేక్ష్య
సీతేయమిత్యేవ నివిష్టబుద్ధిః,
సంశ్రిత్య తస్మిన్నిషసాద వృక్షే
బలీ హరీణామృషభస్తరస్వీ. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షోడశః సర్గః.

ప్ర. అ. బలీ=బలవంతుడూ, హరీణామ్=వానరులలో, ఋషభః=శ్రేష్ఠుడూ, తరస్వీ=వేగవంతుడూ అయిన, కపిః=హనుమంతుడు, ఇత్యేవమ్=ఈ విధముగా, అర్థమ్=విషయమును, అన్వవేక్ష్య=పరిశీలించి, ఇయమ్=

ఈమె, సీతా = సీత, ఇత్యేవ = ఈ విధముగానే, నివిష్టబుద్ధిః = నిశ్చిత మైన బుద్ధి కలవాడై, తస్మిన్ = ఆ, వృక్షే = వృక్షమునందు, సంశ్రిత్య = ఆశ్రయించి, నిషసాద = కూర్చుండెను.

తా. బలవంతుడు, వానరశ్రేష్ఠుడూ, వేగవంతుడూ అయిన హనుమంతుడు అక్కడ నున్న పరిస్థితులను జాగర్తగా పరిశీలించి, ''ఈమె సీతయే" అని నిశ్చయించుకొని, ఆ వృక్షమునే ఆశ్రయించి దానిపై కూర్చుండెను. ౪౭

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో పదునారవ సర్గ సమాప్తము.

## అథ సప్తదశః సర్గః

[భయంకరములైన ఆకారములు గల రాక్షసస్త్రీల మధ్య నున్న సీతను చూచి, సీత కనబడినది కదా అని హనుమంతుడు సంతోషించుట].

మూ. తతః కుముదషణ్డాభో నిర్మలం నిర్మలోదయః,
ప్రజగామ నభశ్చన్ద్రో హంసో నీలమివోదకమ్. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, కుముదషణ్డాభః = కలువల సముదాయము కాంతి వంటి కాంతి గల, నిర్మలోదయః = నిర్మలమైన, ఉదయము గల, చన్ద్రః = చంద్రుడు, హంసః = హంస, నీలమ్ = నీలవర్ణమైన, ఉదకమ్ ఇవ = ఉదకమును వలె, నిర్మలమ్ = నిర్మలమైన, నభః = ఆకాశమును, ప్రజగామ = పొందెను.

తా. ఇంతలో కలువల సముదాయము వంటి కాంతి గల, ఉదయ సమయమునందే, నిర్మలముగా, నున్న చంద్రుడు, హంస నీలవర్ణమైన జల ములో ప్రవేశించి నట్లు, నిర్మలమైన ఆకాశములో ప్రవేశించెను. 1

మూ. సాచివ్యమివ కుర్వన్ స ప్రభయా నిర్మలప్రభః,
చన్ద్రమా రశ్మిభిః శీతైః సిషేవే పవనాత్మజమ్. 2

ప్ర. అ. నిర్మలప్రభః = నిర్మలమైన కాంతి గల, సః చన్ద్రమాః = ఆ చంద్రుడు, ప్రభయా = కాంతితో, సాచివ్యమ్ = సాహాయ్యమును, కుర్వన్నివ = చేయుచున్నవాడు వలె, శీతైః = చల్లని, రశ్మిభిః = కిరణములచేత, పవనాత్మజమ్ = హనుమంతుని, సిషేవే = సేవించెను.

తా. నిర్మలమైన కాంతి గల చంద్రుడు, తన కాంతితో హనుమంతునకు సాహాయ్యము చేయుచున్నాడా అన్నట్లు, చల్లని కిరణములచే అతనిని సేవించెను. 2

మూ. స దదర్శ తతః సీతాం పూర్ణచన్ద్రనిభాననామ్,
శోకభారై రివ న్యస్తాం భారైర్నావమివామ్భసి. 3

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = హనుమంతుడు, పూర్ణచన్ద్రనిభాననామ్=పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము కలదీ, భారైః=భారముల చేత, అమ్భసి = నీటియందు, న్యస్తామ్ = క్రిందికి దిగిపోవు నట్లు చేయబడిన, నావమివ = ఓడ వలె, శోకభారైః = దుఃఖభారములచేత, న్యస్తామ్ = క్రుంగ దీయబడినదీ అయిన, సీతామ్=సీతను, దదర్శ = చూచెను.

తా. హనుమంతు డపుడు బరువుచే నీటిలో క్రుంగిపోవుచున్న ఓడ వలె శోకభారముచేత క్రుంగిపోవుచున్న, పూర్ణచంద్రుని వంటి ముఖము గల సీతను స్పష్టముగా చూచెను. 3

మూ. విదృశ్యమానో వైదేహీం హనుమాన్ మారుతాత్మజః.
స దదర్శావిదూరస్థా రాక్షసీర్ఘోరదర్శనాః,

ఏకాక్షీమేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
అకర్ణాం శఙ్కుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాసనాసికామ్.

అతికాయోత్తమాఙ్గీం చ తనుదీర్ఘశిరోధరామ్,
ధ్వస్తకేశీం తథాకేశీం కేశకమ్బలధారిణీమ్. 6

లమ్బకర్ణలలాటాం చ లమ్బోదరపయోధరామ్,
లమ్బోష్ఠీం చుబుకోష్ఠీం చ లమ్బాస్యాం లమ్బజానుకామ్.

హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా,
కరాలాం భుగ్నవక్త్రాం చ పిఙ్గాక్షీం వికృతాననామ్. 8

ప్ర. అ. వైదేహీమ్=సీతను, విదృశ్యమానః=చూచుచున్న, మారుతాత్మజః = వాయుపుత్రు డైన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, అవిదూరస్థాః = సమీపమునందున్న, ఘోరదర్శనాః = భయంకర మైన దర్శనము గల, రాక్షసీః = రాక్షసస్త్రీలను, దదర్శ = చూచెను. ఏకాక్షీమ్=ఒక కన్ను కల దానిని, ఏకకర్ణాం చ = ఒక చెవిగల దానిని, తథా = మరియు, కర్ణప్రావరణామ్

= చెవులే అచ్ఛాదనము గలదానిని, అకర్ణామ్ = చెవులు లేనిదానిని, శఙ్కు-
కర్ణాం చ = శంకువువలె మొనదేరిన చెవులు గల దానిని, మస్తకోచ్ఛ్వాసనాసికామ్
= తలవరకు వ్యాపించిన ముక్కు కలదానిని, అతికాయోత్తమాఙ్గీం చ = శరీరము
నకు మించిన చాల పెద్ద దైన తల గలదానిని, తనుదీర్ఘశిరోధరామ్ = సన్నని
పొడవైన మెడ గల దానిని, ధ్వస్తకేశీమ్ = చెదరిన జుట్టు కల దానిని, తథా =
మరియు, అకేశీమ్ = జుట్టు లేని దానిని, కేశకమ్బలధారిణీమ్ = కంబళి వలె
అల్లుకొని ఉన్న కేశములు ధరించినదానిని (కేశకంబల మనగా విగ్గు కూడ కావ
చ్చును). లమ్బకర్ణలలాటాం చ = వ్రేలాడు చున్న చెవులు లలాటము కలదానిని,
లమ్బోదరపయోధరామ్ = వ్రేలాడుచున్న పొట్టా స్తనములు కలదానిని, లమ్బో
ష్ఠీమ్ = వ్రేలాడుచున్న ముఖము గలదానిని, చుబుకోష్ఠీం చ = గడ్డమునందు
పెదవులు కల దానిని, లమ్బాస్యామ్ = వ్రేలాడుచున్న ముఖము కల దానిని,
లమ్బజానుకామ్ = వ్రేలాడుచున్న మోకాళ్లు గలదానిని, హ్రస్వామ్ = పొట్టి
దానిని, దీర్ఘామ్ = పొడవుగా, ఉన్నదానిని, తథా = మరియు, కుబ్జామ్ = గూను
దానిని, వికటామ్ = వంకరగా ఉన్నదానిని, వామనామ్ = పొట్టిదానిని, తథా
= మరియు, కరాలామ్ = ఎత్తైన పళ్లు గలదానిని, భుగ్నవక్త్రాం చ = వంకర
మూతి కలదానిని, పిఙ్గాక్షీమ్ = పచ్చని కళ్లు గల దానిని, వికృతాననామ్ =
= వికారముతో కూడిన ముఖము గల దానిని చూచెను.

టీ. వాయుపుత్రు డైన ఆ హనుమంతుడు సీతను చూచుటకై పరిశీలనా దృష్టి అటు వైపు ప్రసరింపచేసెను. అప్పు డాతనికి సీత సమీపమునందు, చూచువారికి భయము కలిగించు రాక్షసస్త్రీలు కనబడిరి. ఒకే కన్ను ఉన్నదీ, ఒకే చెవి ఉన్నదీ, గొడుగుం వంటి చెవు లున్నదీ, చెవులు లేనిదీ, మొనలు దేరిన చెవు లున్నదీ, తలవరకు వ్యాపించిన ముక్కు ఉన్నదీ, దేహమునకు మించిన తల ఉన్నదీ, సన్నగా పొడవుగా ఉన్న కంఠము కలదీ, జుట్టు చెల్లా చెదురుగా ఉన్నదీ, జుట్టు లేనిదీ, కంబళి వలె అల్లుకొని పోయిన జుట్టు కలదీ, వ్రేలాడుచున్న చెవులూ నుదురూ గలదీ, వ్రేలాడుచున్న పొట్టా, స్తనములూ గలదీ, వ్రేలాడుచున్న పెదవులు కలదీ, గడ్డముపైన పెదవులు కలదీ, వ్రేలాడు చున్న మూతి కలదీ, వ్రేలాడుచున్న మోకాళ్లు గలదీ, చాల పొట్టిదీ, చాలా పొడ వైనదీ, గూనుదీ, వంకరటింకరగా ఉన్నదీ, మరుగుజ్జూ, ఎత్తుపళ్లదీ, మూతివంక రగా ఉన్నదీ, పచ్చని కళ్లు కలదీ, వికారముగా ఉన్న ముఖముకలదీ కనబడిరి.

మూ. వికృతాః పిఙ్గలాః కాలీః క్రోధనాః కలహప్రియాః,
కాలాయసమహాశూలకూటముద్గరధారిణీః. 9

వరాహమృగశార్దూలమహిషాజశివాముఖీః,
గజోష్ట్రహయపాదీశ్చ నిఖాతశిరసోఽపరాః. 10

ఏకహస్తైకపాదాశ్చ ఖరకర్ణ్యశ్వకర్ణికాః,
గోకర్ణీర్హస్తికర్ణీశ్చ హరికర్ణీస్తథాపరాః. 11

అనాసా అతినాసాశ్చ తిర్యఙ్నాసా వినాసికాః,
గజసన్నిభనాసాశ్చ లలాటోచ్ఛ్వాసనాసికాః. 12

హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదమూళికాః,
అతిమాత్రశిరోగ్రీవా అతిమాత్రకుచోదరీః. 13

అతిమాత్రాస్యనేత్రాశ్చ దీర్ఘజిహ్వానఖాస్తథా,
అజాముఖీర్హస్తిముఖీర్గోముఖీః సూకరీముఖీః. 14

హయోష్ట్రఖరవక్త్రాశ్చ రాక్షసీర్ఘోరదర్శనాః,
శూలముద్గరహస్తాశ్చ క్రోధనాః కలహప్రియాః. 15

కరాలా ధూమ్రకేశీశ్చ రాక్షసీర్వికృతాననాః,
పిబన్తీః సతతం పానం సదా మాంససురాప్రియాః. 16

మాంసశోణితదిగ్ధాఙ్గీర్మాంసశోణితభోజనాః,
తా దదర్శ కపిశ్రేష్ఠో రోమహర్షణదర్శనాః. 17

స్కన్ధవన్తముపాసీనాః పరివార్య వనస్పతిమ్.

ప్ర. అ. వికృతాః = వికారముగా నున్నవాళ్ళనూ, పిఙ్గలాః = పచ్చని వాళ్ళనూ, కాలీః = నల్లనివాళ్ళనూ, క్రోధనాః = కోపస్వభావం కలవాళ్ళనూ, కలహ ప్రియాః = కలహము ఇష్ట మైనవాళ్ళనూ, కాలాయసమహాశూల కూటముద్గర ధారిణీః = ఇనుమువికార మైన పెద్ద శూలములను, గూటములను, ముద్గరము

లను ధరించినవాళ్లనూ, వరాహమృగశార్దూలమహిషాజశివాముఖీః = పందులు, లేళ్ళు, పులులు, దున్నపోతులు, మేకపోతులు, ఆడనక్కలు. వీటి ముఖముల వంటి ముఖములు కలవాళ్లనూ, గజోష్ట్రహయపాదీః చ = ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములు. వీటి పాదముల వంటి పాదములు కలవాళ్ళనూ, నిఖాతశిరసః = కుదించుకొనిపోయిన తలలు గల, అపరాః = మరికొందరినీ, ఏకహస్తైకపాదాశ్చ = ఒకే చెయ్యి కలవాళ్ళనూ, ఒకే పాదము కలవాళ్లనూ, ఖరకర్ణ్యశ్వకర్ణికాః = గాడిదచెవులవాళ్లనూ, గుఱ్ఱపుచెవులవాళ్ళనూ, గోకర్ణీః = ఆవు చెవులవాళ్లనూ, హస్తికర్ణ్యశ్చ = ఏనుగచెవులవాళ్లను, తథా = మరియు, హరికర్ణీః = కోతిచెవుల వాళ్లైన, అపరాః = మరికొందరినీ, అనాసాః = ముక్కు లేనివాళ్ళనూ, అతినాసాశ్చ = పెద్దముక్కువాళ్ళనూ, తిర్యఙ్నాసాః = అడ్డం ముక్కువాళ్ళనూ, వినాసికాః = వంకరముక్కువాళ్లనూ, గజసన్నిభనాసాశ్చ = ఏనుగముక్కు వంటి ముక్కు కలవాళ్లనూ, లలాటోచ్ఛ్వాసనాసికాః = లలాటమువరకు వ్యాపించిన ముక్కు కలవాళ్లనూ, హస్తిపాదాః = ఏనుగపాదముల వంటి పాదములు కలవాళ్లనూ, మహాపాదాః = పెద్ద పాదముల వాళ్లనూ, గోపాదాః = ఆవు పాదముల వాళ్లనూ, పాదచూళికాః = పాదాల మీద జుట్టు కలవాళ్ళనూ, అతిమాత్రశిరోగ్రీవాః = పెద్ద తలలో కంఠములు కలవాళ్లను, అతిమాత్రకుచోదరీః = పెద్ద కుచములు పొట్టలు కలవాళ్లను, అతిమాత్రాస్యనేత్రాశ్చ = పెద్ద నోళ్ళు కళ్లు కలవాళ్ళను, దీర్ఘజిహ్వనఖాః = పొడవైన నాలుకలు గోళ్లు కలవాళ్ళను, తథా = మరియు, అజాముఖీః = ఆడమేక ముఖము వంటి ముఖము కలవాళ్లనూ, హస్తిముఖీః = ఏనుగుల ముఖము వంటి ముఖము కలవాళ్లనూ, గోముఖీః = ఆవుముఖము వంటి ముఖము కలవాళ్లనూ, సూకరీముఖీః = ఆడపంది ముఖము వంటి ముఖము కలవాళ్లను, హయోష్ట్రఖరవక్త్రాశ్చ = గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదలు. వీటి ముఖముల వంటి ముఖములు కలవాళ్లను, ఘోరదర్శనాః = ఘోర మైన దర్శనముగల, రాక్షసీః = రాక్షసస్త్రీలను, (చూచెను). శూలముద్గరహస్తాశ్చ = శూలములు, ముద్గరములు హస్తములందు కలవారూ, క్రోధనాః = కోపము కలవాళ్లూ, కలహప్రియాః = కలహము ప్రియముగ కలవాళ్లు, కరాళాః = ఎత్తుపళ్ల కలవాళ్లు, ధూమ్రకేశీశ్చ = పొగరంగు జుట్టులు కలవాళ్ళు, వికృతాననాః = వికృతములైన ముఖములు కలవాళ్ళు, సతతమ్ = ఎల్లప్పుడు, పానమ్ = మద్యమును, పిబన్తీః = త్రాగుతున్నవాళ్ళు, సదా = ఎల్లప్పుడూ, మాంససురాప్రియాః = మాంసముతోకూడిన కల్లు ఇష్టముగా కలవాళ్ళు, మాంసశోణితదిగ్ధాఙ్గీః =

మాంసముచేత, రక్తముచేత పూయబడిన శరీరము కలవాళ్ళు. మాంసశోణిత భోజనాః=మాంసము రక్తము ఆహారముగా కలవాళ్ళు, రోమహర్షణదర్శనాః= గగుర్పాటు కలిగించే దర్శనముకలవాళ్ళు, స్కన్ధవన్తమ్ = పెద్ద ప్రాను గల, వనస్పతిమ్ = మహావృక్షమును, పరివార్య = చుట్టి, ఉపాసీనాః = కూర్చున్న వాళ్ళు అయిన, తాః = ఆ, రాక్షసీః = రాక్షసస్త్రీలను, కపిశ్రేష్ఠః = హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు వికృతము లైన ఆకారములతో, పచ్చగాను, నల్లగాను ఉన్న, కోపస్వభావము కలవారూ, కలహించే స్వభావము కలవారూ అయిన రాక్షసస్త్రీలను చూచెను. వాళ్లు ఇనుముతో చేసిన పెద్ద శూలములు, కూటములు, ముద్గరములు ధరించి ఉండిరి. వాళ్ల ముఖములు, పందులు, లేళ్లు, పులులు, దున్నపోతులు, మేకపోతులు, ఆడనక్కలు—వీటి ముఖముల వలె ఉండెను. వాళ్ల పాదములు, ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములు—వీటి పాదముల వలె ఉండెను. కొందరి తలలు గుండెలలోనికి దించుకొనిపోయి ఉండెను. ఒంటి చేతులవాళ్ళు, ఒంటి కాళ్లవాళ్ళు, గాడిద చెవులవాళ్ళు, గుఱ్ఱపు చెవులవాళ్ళు, ఆవుచెవుల వాళ్ళు, ఏనుగ చెవులవాళ్ళు, కోతిచెవులవాళ్ళు, ముక్కు లేని వాళ్ళు, పెద్ద ముక్కువాళ్ళు, అడ్డంముక్కువాళ్ళు, వంకరముక్కువాళ్ళు, ఏనుగముక్కువాళ్ళు, నుదుటివరకు వ్యాపించిన ముక్కు లున్నవాళ్ళు, ఏనుగపాదాలవాళ్ళు, పెద్దపాదాలవాళ్ళు, ఎద్దుపాదాలవాళ్ళు, పాదాలమీద జుట్టు ఉన్నవాళ్ళు, పెద్దతలలవాళ్ళు, పొడవు కంఠాలవాళ్ళు, పెద్దచన్నుల వాళ్ళు, గూన కడుపువాళ్ళు, పెద్దమూతులవాళ్ళు, పెద్ద కళ్లవాళ్ళు, పొడవు నాలుకలవాళ్ళు, పొడవు గోళ్లవాళ్ళు, ఉండిరి. ఆ రాక్షసస్త్రీలు, ఆడమేకలు, ఏనుగులు, ఎద్దులు, ఆడపందులు, గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదలు-వీటి ముఖములవంటి ముఖములతో చూచేవారికి భయముకలుగునట్లు ఉండిరి. కోప స్వభావము కల వాళ్లు, కలహప్రియులు అయిన ఆ రాక్షసస్త్రీలు కోరలతో వికారముగా ఉన్న ముఖాలతో, పొగరంగు జుట్టులతో, భయము కలిగించుచు, చేతులలో శూలములు, ముద్గరములు ధరించి ఉండిరి. వాళ్లకు మాంసముతో కూడిన కల్లు చాలా ఇష్టము. నిరంతరము మద్యపానము చేయుచుండిరి. మాంసము, రక్తము వాళ్లకు ఆహార మగుటచే వాళ్ల శరీరములపై మాంస రక్తములు కారిపడి పూసినట్లుండెను. చూచేవారికి గగుర్పాటు కలిగించే ఆ రాక్షసస్త్రీలు విశాల మైన మాను గల ఆ మహావృక్షము చుట్టూ కూర్చుండిరి.

మూ. తస్యాధస్తాచ్చ తాం దేవీం రాజపుత్రీమనిన్దితామ్, 18
లక్షయామాస లక్ష్మీవాన్ హనుమాన్ జనకాత్మజామ్.

ప్ర. అ. లక్ష్మీవాన్ = మంచి శోభ గల, హనుమాన్ = హనుమంతుడు, తస్య = ఆ వృక్షముయొక్క, అధస్తాత్ = క్రింద, రాజపుత్రీమ్ = రాజకుమారి, జనకాత్మజామ్ = జనకుని కూతురు, అనిన్దితామ్ = నిందింపబడనిదీ అయిన, తాం దేవీమ్ = ఆ సీతాదేవిని, లక్షయామాస = చూచెను.

తా. అధిక మైన కాంతి గల హనుమంతుడు, ఆ వృక్షముక్రింద, రాజపుత్రి, జనకుని కూతురు, దోషములు లేనిది అయిన ఆ సీతాదేవిని చూచెను. 18

మూ. నిష్ప్రభాం శోకసన్తప్తాం మలసంకులమూర్ధజామ్, 19
క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితామివ.

(ఇది మొదట 22 1/2 శ్లోకం వరకు ఉన్న నాలుగు శ్లోకాలలో ద్వితీయాంతము లన్నీ 18 వ శ్లోకంలోని 'దేవీమ్' అన్నదానికి విశేషణములు).

ప్ర. అ. నిష్ప్రభామ్ = కాంతి లేనిదీ, శోకసన్తప్తామ్ = శోకముచేత తపింపచేయబడినదీ, మలసంకులమూర్ధజామ్ = మురికితో వ్యాకుల మైన కేశములు గలదీ, క్షీణపుణ్యామ్ = క్షీణించిన పుణ్యము గలదై, చ్యుతామ్ = స్వర్గమునుండి జారిన, భూమౌ = భూమిమీద, నిపతితామ్ = పడిన, తారామివ = నక్షత్రము వలె ఉన్నదీ (అయిన దేవిని చూచెను).

తా. దుఃఖపీడితురాలై, కాంతి కోల్పోయి, మురికితో నిండిన కేశములు గల ఆ సీతాదేవి పుణ్యము క్షీణించగా, స్వర్గభ్రష్ట మై భూమిపై పడిపోయిన నక్షత్రము వలె ఉండెను. 19

మూ. చారిత్రవ్యపదేశాఢ్యాం భర్తృదర్శనదుర్గతామ్, 20
భూషణైరుత్తమైర్హీనాం భర్తృవాత్సల్యభూషణామ్.

ప్ర. అ. చారిత్రవ్యపదేశాఢ్యామ్ = సచ్చరిత మను విశేషముచే ఐశ్వర్యవంతురాలు, భర్తృదర్శనదుర్గతామ్ = భర్త దర్శనము విషయమున దరిద్రురాలు, ఉత్తమైః = ఉత్తమము లైన, భూషణైః = అలంకారములతో, హీనామ్ = శూన్యురాలు, భర్తృవాత్సల్య భూషణామ్ = భర్తయొక్క ప్రేమయే

తా. "ఆమె ఉత్తమశీలము కలది" అను ప్రసిద్ధి అనే గొప్ప ఐశ్వర్యముతో ఒప్పుచున్న ఆ సీతాదేవి భర్తృదర్శనము విషయమున దరిద్రురాలై (భర్త దర్శనము లేనిదై) ఉండెను. ఉత్తమభూషణము లేవీ లేని ఆమెకు భర్తృప్రేమ ఒక్కటే భూషణముగా ఉండెను. 20

మూ. రాక్షసాధిపసంరుద్ధాం బన్ధుభిశ్చ వినా కృతామ్, 21
వియూథాం సింహసంరుద్ధాం బద్ధాం గజవధూమివ.

ప్ర. అ. రాక్షసాధిపసంరుద్ధామ్ = రావణునిచేత బంధింపబడినదై, బన్ధుభిః వినా చ = బంధువులు లేకుండా కూడ, కృతామ్ = చేయబడినదీ, వియూథామ్ = గుంపు లేనిదీ, సింహసంరుద్ధామ్ = సింహముచేత అడ్డగింపబడినదీ, బద్ధామ్ = బంధింపబడినదీ అయిన, గజవధూమివ = ఆడ ఏనుగ వలె ఉన్నదీ (అయిన దేవిని చూచెను)

తా. రావణునిచే బద్ధురాలై బంధువులకు దూరము చేయబడిన ఆ సీతాదేవి సింహముచేత అడ్డగింపబడినదై గుంపునుండి విడిపోయి, బంధింపబడిన ఆడ ఏనుగ వలె ఉండెను. 21

మూ. చన్ద్రరేఖాం పయోదాన్తే శారదాభ్రైరివావృతామ్, 22
క్లిష్టరూపామసంస్పర్శాదయుక్తామివ వల్లకీమ్.

ప్ర. అ. పయోదాన్తే = వర్షాకాలాంతమునందు, శారదాభ్రైః = శరత్కాల మేఘములచేత, ఆవృతామ్ = కప్పబడిన, చన్ద్రరేఖామివ = చంద్రరేఖ వలె ఉన్నదీ, అసంస్పర్శాత్ = సంస్కారము లేకపోవుటవలన, క్లిష్టరూపామ్ = కాంతి విహీనమైన రూపము కలదీ, అయుక్తామ్ = తీగలు సరిచేయని, వల్లకీమివ = వీణ వలె ఉన్నదీ (అయిన దేవిని చూచెను).

తా. ఆ సీతాదేవి వర్షాకాలము గడచిన క్రొత్త దినములలో శరత్కాల మేఘములు ఆవరించిన చంద్రరేఖ వలె ఉండెను. స్నానాదిశరీరసంస్కారములు లేకపోవుటచే ఆమె రూపము కాంతి తగ్గి ఉండెను. ఆమె తీగలు సరిచేయని వీణ వలె ఉండెను. 22

మూ. సీతాం భర్తృవశే యుక్తామయుక్తాం రాక్షసీవశే, 23
అశోకవనికామధ్యే శోకసాగరమాప్లుతామ్.

తాభిః పరివృతాం తత్ర సగ్రహామివ రోహిణీమ్, 24
దదర్శ హనుమాన్ దేవీం లతామకుసుమా మివ.

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, భర్తృవశే=భర్త వశమునందు, యుక్తామ్ = ఉండుటకు తగినదీ, రాక్షసీవశే = రాక్షసస్త్రీల వశమునందు, అయుక్తామ్=ఉండ దగనిదీ, అశోకవనికామధ్యే = అశోకవనమధ్యమునందు, శోకసాగరమ్=శోకసముద్రమును, ఆప్లుతామ్=మునిగినదీ, తత్ర = అక్కడ, తాభిః=ఆ రాక్షసస్త్రీలచే, పరివృతామ్=చుట్టుకొనబడినది, సగ్రహామ్=గ్రహము లతో కూడిన, రోహిణీమివ = రోహిణి వలె ఉన్నదీ, అకుసుమామ్=పుష్పములు లేని, లతామివ = లత వలె ఉన్నదీ అయిన, దేవీమ్ = దేవి యైన, సీతామ్ = సీతను, దదర్శ=చూచెను.

తా. భర్త దగ్గర ఉండ వలసిన సీతాదేవి ఆ విధముగా రాక్షసస్త్రీల వశమునందుండ దగినది కాదు. అశోకవనమధ్యములో శోకసాగరములో మునిగి యున్నది. ఆ రాక్షసస్త్రీ లందరూ చుట్టూ ఉండుటచే ఆమె గ్రహముల మధ్య నున్న రోహిణి వలె ఉండెను. పుష్పములు లేని లత వలె ఉండెను. అట్టి సీతా దేవిని హనుమంతుడు చూచెను. 23,24

మూ. సా మలేన చ దిగ్ధాఙ్గీ వపుషా చాప్యలంకృతా, 25
మృణాలీ పఙ్కదిగ్ధేవ విభాతి న విభాతి చ.

ప్ర. అ. మలేన = మురికిచేత, దిగ్ధాఙ్గీ = పూయబడిన శరీరము కలదీ, వపుషా చాపి = దేహము చేత, అలంకృతా = అలంకరింపబడినదీ అయిన, సా = ఆ సీతాదేవి, పఙ్కదిగ్ధా = బురద చేత పూయబడిన, మృణాలీవ = తామరతూడు వలె, విభాతి = ప్రకాశించుచుండెను; న విభాతి చ = ప్రకాశించకుండెను కూడ.

తా. శరీర మంతా మాలిన్యముతో నిండి యున్నను ఆమె సహజశరీర సౌందర్యము కనబడుచునే ఉండెను. అందుచేత ఆమె బురద పూసిన తామర తూడు వలె ప్రకాశించుచు, ప్రకాశించక ఉండెను. 25

మూ. మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్, 26
సంవృతాం మృగశావాక్షీం దదర్శ హనుమాన్ కపిః.

తాం దేవీం దీనవదనామదీనాం భర్తృతేజసా, 27
రక్షితాం స్వేన శీలేన సీతామసితలోచనామ్.

ప్ర. అ. కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు, పరిక్లిష్టేన = నలిగిపోయిన, మలినేన = మలినమైన, వస్త్రేణ = వస్త్రముచేత, సంవృతామ్ = చుట్టబడినది, మృగశాబాక్షీమ్ = లేడి పిల్ల నేత్రముల వంటి నేత్రములు కలది, దీనవదనామ్ = దీనమైన ముఖము గలది, భర్తృతేజసా = భర్తయొక్క తేజస్సు చేత, అదీనామ్ = దైన్యము లేనిది, స్వేన = తనసంబంధమైన, శీలేన = శీలము చేత, రక్షితామ్ = రక్షింపబడినది, అసితలోచనామ్ = నల్లని నేత్రములు కలది, భామినీమ్ = అత్యుత్తమమైన సౌందర్యము కలదీ, అయిన, తామ్ = ఆ, దేవీం సీతామ్ = సీతాదేవిని, దదర్శ = చూచెను.

తా. లోకోత్తరసౌందర్యవతి యైన ఆ సీతాదేవి నలిగి, మాసి పోయిన వస్త్రమును చుట్టబెట్టుకొని ఉండెను. లేడిపిల్ల కళ్ళవంటి కళ్లు గల ఆమె ముఖము దీనముగా ఉండెను. కాని నల్లని నేత్రములు గల ఆమె భర్త పరాక్రమము ఎరిగిన దగుటచే అంతగా దైన్యము పొందుటలేదు. తన పాతివ్రత్యమే ఆమెను రక్షించుచుండెను. అట్టి సీతాదేవిని హనుమంతుడు చూచెను. 26,27

మూ. తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబనిభేక్షణామ్,
మృగకన్యామివ త్రస్తాం వీక్షమాణాం సమన్తతః,
దహన్తీమివ నిఃశ్వాసైర్వృక్షాన్ పల్లవధారిణః,
సంఘాతమివ శోకానాం దుఃఖస్యోర్మిమివోత్థితామ్. 29

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, మృగశాబనిభేక్షణామ్ = లేడి పిల్ల కళ్ళ వంటి కళ్లు గలది, త్రస్తామ్ = భయపడిన, మృగకన్యామివ = ఆడలేడి పిల్ల వలె, సమన్తతః = అన్ని వైపులా, వీక్షమాణామ్ = చూచుచున్నదీ, పల్లవధారిణః = చిగుళ్లను ధరించిన, వృక్షాన్ = వృక్షములను, నిఃశ్వాసైః = నిట్టూర్పులతో, దహన్తీమివ = కాల్చివేయుచున్నట్లు ఉన్నదీ, శోకానామ్ = శోకముల యొక్క, సంఘాతమివ = ప్రోగు వలె ఉన్నదీ, ఉత్థితామ్ = పైకి లేచిన, దుఃఖస్య = దుఃఖము యొక్క, ఊర్మిమివ = తరంగము వలె ఉన్నదీ అయిన, తాం సీతామ్ = ఆ సీతను, దృష్ట్వా = చూచి, (రాబోవు శ్లోకములోని "ప్రహర్షమతులం లేభే" అను దానితో అన్వయము) చాల సంతోషము పొందెను).

తా. లేడిపిల్ల కళ్ళ వంటి కళ్ళు గల ఆ సీత, భయపడిన అడ లేడి పిల్ల వలె ఇటు అటు చూచుచుండెను. వేరుగా ఉన్న పిట్టూర్పులతో, చిగర్చిన వృక్షము లను కాల్చివేయుచున్నట్లుండెను. ఆమె శోకముల ప్రోగు వలె, పైకి లేచిన దుఃఖతరంగము వలె ఉండెను. అట్టి సీతను చూచి హనుమంతుడు చాలా సంతో షించెను. 28,29

మూ. తాం క్షమాం సువిభక్తాఙ్గీం వినాభరణశోభినీమ్, 30
ప్రహర్షమతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్.

ప్ర. అ. క్షమామ్ = భూదేవివలె ఉన్నది, సువిభక్తాఙ్గీమ్ = చక్కగా విభజింపబడిన అవయవములు కలది, వినాభరణశోభినీమ్ = ఆభరణములు లేక పోయినను ప్రకాశించుచున్నది, అయిన, తాం మైథిలీమ్ = ఆ సీతాదేవిని, ప్రేక్ష్య = చూచి, మారుతిః = హనుమంతుడు, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను.

తా. అలంకారములు లేకపోయినా శోభించుచున్న ఆ సీత అవయవము లన్ని వేరు చేసి ఉంచవలసిన విధములో ఉండెను. ఓర్పుచేత ఆమె సాక్షాత్తు భూదేవి వలె ఉండెను. అట్టి సీతను చూచి హనుమంతుడు చాలా సంతోషించెను.

మూ. హర్షజాని చ సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్,
ముమోచ హనుమాంస్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్.

ప్ర. అ. హనుమాన్ = ఆ హనుమంతుడు, మదిరేక్షణామ్ = మత్తును కలి గించు నేత్రములు గల, తామ్ = ఆమెను, తత్ర = అక్కడ, దృష్ట్వా = చూచి, హర్షజాని = ఆనందమువలన కలుగు, అశ్రూణి = కన్నీళ్ళను, ముమోచ = విడిచెను. రాఘవమ్ = రాముని, నమశ్చక్రే చ = నమస్కరించెను కూడ.

తా. మత్తు కలిగించు నేత్రములు గల ఆ సీతాదేవిని చూచిన సంతోష ముతో హనుమంతుడు ఆనందాశ్రువులు రాల్చి, రాముని స్మరించి నమస్క రించెను. 31

మూ. నమస్కృత్వా చ రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్,
సీతాదర్శనసంహృష్టో హనుమాన్ సంవృతోఽభవత్.

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## సప్తదశః సర్గః.

ప్ర. అ. సీతాదర్శనసంహృష్టః=సీతయొక్క దర్శనముచేత సంతోషించిన, వీర్యవాన్ = పరాక్రమశాలియైన, హనుమాన్ = హనుమంతుడు, రామాయ = రామునకు, లక్ష్మణాయ చ = లక్ష్మణునకు, నమస్కృత్వా = నమస్కరించి, సంవృతః=కప్పబడినవాడు, అభవత్=ఆయెను.

తా. సీత కనబడుటచే ఆనందభరితు డైన పరాక్రమశాలి యైన ఆ హనుమంతుడు, రామునకు, లక్ష్మణునకు నమస్కరించి, చెట్టు ఆకులలో దాగి యుండెను. ౩౨

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో పదునేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టాదశః సర్గః

[రావణుడు అంతఃపుర స్త్రీలతో కలిసి అశోకవనమునకు వచ్చుట; హనుమంతుడు అతనిని చూచుట]

మూ. తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్,
విచిన్వతశ్చ వైదేహీం కించిచ్ఛేషా నిశాభవత్. 1

ప్ర. అ. (హనుమతః=హనుమంతుడు) పుష్పితపాదపమ్ = పుష్పించిన వృక్షములు గల, వనమ్ = వనమును, తథా = అట్లు, విప్రేక్షమాణస్య = చూచుచుండగా, వైదేహీమ్ = సీతాదేవిని, విచిన్వతశ్చ = వెదకుచుండగా, నిశా = రాత్రి, కించిచ్ఛేషా = కొంచెమే శేషము కలది, అభవత్ = ఆయెను

తా. హనుమంతుడు ఆ విధముగా, పుష్పించిన వృక్షములతో నిండిన ఆ వనమును చూచుచు, సీతాదేవిని వెదకుచుండగా రాత్రి కొంచెమే మిగిలెను. (తెల్లవార వచ్చెను) 1

మూ. షడఙ్గవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్,
శుశ్రావ బ్రహ్మఘోషాన్ స విరాత్రే బ్రహ్మరక్షసామ్. 2

ప్ర. అ. సః = హనుమంతుడు, విరాత్రే = తెల్లవారుజామున, షడఙ్గవేదవిదుషామ్ = ఆరు అంగములు గల వేదములందు పండితులు, క్రతుప్రవరయాజినామ్ = శ్రేష్ఠము లైన యజ్ఞములు చేసిన వారు అయిన, బ్రహ్మరక్షసామ్ = బ్రహ్మరాక్షసులయొక్క, బ్రహ్మఘోషాన్ = వేదఘోషలను, శుశ్రావ = వినెను.

తా. షడంగవేదములందు నిష్ణాతులు, అనేకమహాయజ్ఞములు ఆచరించిన వారూ అయిన బ్రహ్మరాక్షసులు తెల్లవారుజామునందే లేచి, వేదములు చదువు చుండగా ఆ వేదఘోషను హనుమంతుడు వినెను. 2

మూ. అథ మఙ్గళవాదిత్రైశ్శబ్దైః శ్రోత్రమనోహరైః,
ప్రాబుధ్యత మహాబాహుర్దశగ్రీవో మహాబలః. ౩

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, దశగ్రీవః = రావణుడు, శ్రోత్రమనోహరైః = చెవులకు మనోహరములైన, మఙ్గళవాదిత్రశబ్దైః = మంగల వాద్యధ్వనులచేత, ప్రాబుధ్యత = లేపబడెను.

తా. ఇంతలో, మహాబాహువు, మహాబలశాలి అయిన దశకంఠుణ్ణి, అతని అనుచరులు, చెవులకు ఇంపైన మంగళవాద్యశబ్దములతో మేల్కొలిపిరి.

మూ. విబుధ్య తు యథాకాలం రాక్షసేన్ద్రః ప్రతాపవాన్,
స్రస్తమాల్యామ్బరధరో వైదేహీమన్వచిన్తయత్. 4

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపము గల, రాక్షసేన్ద్రః = ఆ రాక్షసరాజు, యథాకాలమ్ = తగిన సమయమునందు, విబుధ్య = లేచి, స్రస్తమాల్యామ్బరధరః = జారిపోవుచున్న పుష్పమాలలను, వస్త్రములను ధరించుచున్నవాడై, వైదేహీమ్ = సీతను గూర్చి, అన్వచిన్తయత్ = స్మరించెను.

తా. ప్రతాపవంతుడైన ఆ రావణుడు తగు సమయమునందు లేచెను. అప్పుడే నిద్రనుండి మేల్కొని లేచుటచే అతని మాలికలు, వస్త్రములు జారిపోవు చుండెను. అప్పు డాతనికి సీత విషయము స్మృతికి వచ్చెను. 4

మూ. భృశం నియుక్తస్తస్యాం చ మదనేన మదోత్కటః,
న స తం రాక్షసః కామం శశాకాత్మని గూహితుమ్. 5

ప్ర. అ. తస్యామ్ = ఆ సీతవిషయమై, మదనేన = మన్మథునిచేత, భృశమ్ = మిక్కిలి, నియుక్తః = ప్రేరేపింపబడిన, మదోత్కటః = మదముచేత తీవ్రముగా ఉన్న, సః రాక్షసః = ఆ రాక్షసుడు, తం కామమ్ = ఆ కామమును, ఆత్మని = తనయందు, గూహితుమ్ = కప్పిపుచ్చుకొనుటకు, న శశాక = సమర్థుడు కాలేదు.

తా. అత్యుత్కటమైన మదము గల ఆ రావణుడు ఆ సీతవిషయము

వందు మన్మథుడు ప్రేరేపింపగా కలిగిన ఆ కామమును తనలో అణచుకొనలేక పోయెను.

వి. ఈ ఘట్టంలోని కొన్ని శ్లోకాలకు ప్రాచీనవ్యాఖ్యాతలు రావణునకు సీతపై భక్తియే ఉన్నట్లు, దుర్బుద్ధి లేనట్లు ఏమేమో వ్యాఖ్యానాలు వ్రాసినారు. అవన్నీ వాళ్లభావాలే కాని వాల్మీకి భావాలు కావు. అసంగతంగా కూడా ఉన్నవి. ఈ శ్లోకంలో కూడా "తస్యామ్ = ఆ సీతయందు, భృశమ్ = మిక్కిలి, నియుక్తః = భక్తికలవాడు, మదనే = మన్మథుడున్నను, మదోత్కటః = మదముచే ఉత్కటుడు, న = కాలేదు. కామమును తనలో అణచుకొనుటకు, న శశాక = సమర్థుడు కాలేదా!" ఇత్యాది విశేషార్థములు చెప్పినారు. ఇలాంటి వ్యాఖ్యలు పూర్వాపరవిరుద్ధములు. 19 వ శ్లోకంలో 'కామపరాధీనః' "సీతాసక్తమనాః" (కామమునకు లొంగిపోయినవాడై, సీతయందు లగ్నమైన మనస్సుకలవాడై) అని చెప్పబడినది. దానికి ఉన్నదున్నట్లు గానే అర్థం గ్రహించినారు. మార్చడం కుదరలేదు కాబోలు. దానిని బట్టి చూచినచో ఇక్కడ చెప్పిన అర్థము అనావశ్యకమే కదా! అందుచేత వాక్యానికి ఏ అర్థమో దానినే గ్రహించుట యుక్తము. అట్లు కాని పక్షంలో రామాయణానికి భారతార్థం, భారతానికి భాగవతార్థం చెప్పడంవల్ల స్వపాండిత్యప్రదర్శనమే తప్ప మరొక ప్రయోజనం ఉండదు. ఉన్న కథను ఉన్నట్లుగా తీసికొనడంలో సీతారాముల విషయంలో భక్తి కేమీ లోటు కలగదు. 5

మూ. స సర్వాభరణైర్యుక్తో బిభ్రచ్ఛ్రియమనుత్తమామ్,
తాం నగైర్బహుభిర్జుష్టాం సర్వపుష్పఫలోపగైః. 6

ప్ర. అ. సర్వాభరణైః = సమస్తమైన ఆభరణములతో, యుక్తః = కూడినవాడూ, అనుత్తమామ్ = చాల గొప్పదైన, శ్రియమ్ = శోభను, బిభ్రత్ = ధరించుచున్నవాడూ అయిన, సః = ఆ రావణుడు, సర్వపుష్పఫలోపగైః = సమస్తమైన పుష్పములను ఫలములను పొందు (ఇచ్చు), బహుభిః = అనేకమైన, నగైః = వృక్షములచేత, జుష్టామ్ = పొందబడిన, తామ్ = ఆ, (9 వ శ్లోకములోని "అశోకవనికామేవ ప్రావిశత్" అనుదానితో అన్వయము. అశోక వనమునే ప్రవేశించెను). (7,8,9 శ్లోకాలలోని ద్వితీయాంతపదము లన్నీ, 'అశోక వనికామ్' అనుదానికి విశేషణములు.)

తా. సమస్త మైన ఆభరణములు అలంకరించుకొని, అద్భుతము మైన శోభతో కూడిన ఆ రావణుడు సకలవిధము లైన పుష్పములతోను ఫలములతోను నిండిన వృక్షములు గల అశోకవనికలో ప్రవేశించెను. 6

మూ. వృతాం పుష్కరిణీభిశ్చ నానాపుష్పోపశోభితామ్,
సదామదైశ్చ విహగైర్విచిత్రాం పరమాద్భుతామ్. 7

ప్ర. అ. పుష్కరిణీభిః = సరస్సులతో, వృతామ్ = కూడినదీ, నానా పుష్పోపశోభితామ్ = అనేకవిధము లైన పుష్పములచేత ప్రకాశింపచేయబడినదీ, సదామదైః = ఎల్లప్పుడూ మదము గల, విహగైః = పక్షులతో, విచిత్రామ్ = విచిత్ర మైనదీ, పరమాద్భుతామ్ = చాలా ఆశ్చర్యకర మైనదీ అయిన అశోకవని కలోనికి ప్రవేశించెను.

తా. అనేకవిధము లైన పుష్పములతో శోభించుచున్న ఆ అశోకవనములో అక్కడక్కడ సరస్సు లుండెను. ఎల్లప్పుడూ మదించి ఉన్న పక్షులతో విచిత్ర ముగా ఉన్న వనము అత్యద్భుతముగా ఉండెను. 7

మూ. ఈహామృగైశ్చ వివిధైర్జుష్టాం దృష్టిమనోహరైః,
వీథీః సంప్రేక్షమాణశ్చ మణికాఞ్చనతోరణాః, 8
నానామృగగణాకీర్ణాం ఫలైః ప్రపతితైర్వృతామ్,
అశోకవనికామేవ ప్రావిశత్సంతతద్రుమామ్. 9

ప్ర. అ. మణికాఞ్చనతోరణాః = మాణిక్యవికారములు, బంగారువికార ములు అయిన ముఖద్వారములు గల, వీథీః = వీథులను, సంప్రేక్షమాణశ్చ = చూచుచున్నవాడై, దృష్టిమనోహరైః = చూపునకు మనస్సుకు ఆకర్షకము లైన, వివిధైః = అనేకవిధము లైన, ఈహామృగైశ్చ = ఈహామృగముల చేత, జుష్టామ్ = పొందబడినదీ, నానామృగగణాకీర్ణామ్ = అనేకవిధము లైన మృగముల గుంపు లచే వ్యాప్తమూ, ప్రపతితైః = పడిన, ఫలైః = ఫలములతో, వృతామ్ = కూడి నదీ, సంతతద్రుమామ్ = దట్ట మైన వృక్షములు కలదీ అయిన, అశోకవని కామేవ = అశోకవనమునే, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. ఆ వనమునందు చూచుటకు చాలా అందముగా ఉన్న ఈహామృగ ములు, అనేకవిధము లైన ఇతరమృగములూ ఉండెను. అనేకఫలములు [illegible]

మండి రాలి ఉండెను. చెట్లు దట్టముగా ఉండెను. అట్టి అశోకవనములోనికి, రావణుడు, మాణిక్యములు పొదిగిన బంగారు ముఖద్వారము లున్న వీథులను చూచుచు ప్రవేశించెను. 8, 9

మూ. అఙ్గనాశతమాత్రం తు తం వ్రజన్తమనువ్రజత్,
మహేన్ద్రమివ పౌలస్త్యం దేవగన్ధర్వయోషితః. 10

ప్ర. అ. వ్రజన్తమ్ = వెళ్లుచున్న, తమ్ = ఆ, పౌలస్త్యమ్ = పులస్త్యుని వంశమునందు పుట్టిన రావణుని, అఙ్గనాశతమాత్రమ్ = స్త్రీల శతము, మహేన్ద్రమ్ = మహేంద్రుని, దేవగన్ధర్వయోషితః = దేవతాస్త్రీలు, గంధర్వ స్త్రీలు వలె, అనువ్రజత్ = అనుసరించి వెళ్ళెను.

తా. మహేంద్రుని వెనుక దేవతాస్త్రీలు, గంధర్వస్త్రీలు వెళ్ళు నట్లు, అతని వెనుక వందమంది అంగనలు వెళ్ళిరి. 10

మూ. దీపికాః కాఞ్చనీః కాశ్చిజ్జగృహుస్తత్ర యోషితః,
వాలవ్యజనహస్తాశ్చ తాలవృన్తాని చాపరాః. 11

ప్ర. అ. తత్ర = అక్కడ, కాశ్చిత్ = కొందరు, యోషితః = స్త్రీలు, కాఞ్చనీః = బంగారు వికార మైన, దీపికాః = దీపములను, అపరాః = మరి కొందరు, తాలవృన్తాని = విసనకఱ్ఱలను, జగృహుః = గ్రహించిరి. వాలవ్యజన హస్తాశ్చ = (కొందరు) వింజామరలను హస్తములందు ధరించిరి.

తా. అక్కడ కొందరు స్త్రీలు బంగారు దీపములను, కొందరు వింజామరలను, మరికొందరు విసనకఱ్ఱలను ధరించి అతని వెనుక వచ్చిరి. 11

మూ. కాఞ్చనైరపి భృఙ్గారైర్జహ్రుః సలిలమగ్రతః,
మణ్డలాగ్రాన్ బ్రుసీంశ్చాపి గృహ్యాన్యాః పృష్ఠతో యయుః.

ప్ర. అ. కాఞ్చనైః = బంగారువికార మైన, భృఙ్గారైః = చిన్నపాత్రలతో, అగ్రతః = ముందుభాగమున, సలిలమ్ = ఉదకమును, జహ్రుః = తీసికొని వెళ్ళిరి. అన్యాః = మరికొందరు స్త్రీలు, మణ్డలాగ్రాన్ = ఖడ్గములను, బ్రుసీంశ్చాపి = చిన్న ఆస్తరణలను, గృహ్య = గ్రహించి, పృష్ఠతః = వెనుకనే, యయుః = వెళ్ళిరి.

తా. కొందరు స్త్రీలు బంగారు పాత్రలలో నీళ్లు తీసికొని ముందు నడచుచుండిరి. మరి కొందరు ఖడ్గములు, అస్త్రములూ పట్టుకొని వెనుక వచ్చుచుండిరి.

మూ. కాచిద్రత్నమయీం స్థాలీం పూర్ణాం పానస్య భామినీ,
దక్షిణా దక్షిణేనైవ తదా జగ్రాహ పాణినా. 13

ప్ర. అ. కాచిత్ = ఒకానొక, భామినీ = స్త్రీ, దక్షిణా = రావణునికి కుడి ప్రక్క నున్నదై, రత్నమయీమ్ = రత్నవికారమూ, పూర్ణామ్ = నిండి ఉన్నదీ అయిన, పానస్య = మద్యముయొక్క, స్థాలీమ్ = పాత్రను, దక్షిణేనైవ = కుడి దైన, పాణినా = హస్తముతో, జగ్రాహ = గ్రహించెను.

తా. మరొక వనిత మద్యము నింపిన రత్నఖచితపాత్రను కుడి చేతిలో పట్టుకొని, రావణునికి కుడిప్రక్కనే నడచుచు అతనిని అనుసరించి వెళ్లెను. 13

మూ. రాజహంసప్రతీకాశం ఛత్రం పూర్ణశశిప్రభమ్,
సౌవర్ణదణ్డమపరా గృహీత్వా పృష్ఠతో యయౌ. 14

ప్ర. అ. అపరా = మరియొక స్త్రీ, రాజహంసప్రతీకాశమ్ = రాజహంసతో సమానమూ, పూర్ణశశిప్రభమ్ = పూర్ణచంద్రుని వంటి కాంతి కలదీ అయిన, సౌవర్ణదణ్డమ్ = బంగారు దండము గల, ఛత్రమ్ = ఛత్రమును, గృహీత్వా = గ్రహించి, పృష్ఠతః = వెనుక, యయౌ = వెళ్లెను.

తా. మరియొక స్త్రీ రాజహంసతో సమానమూ, పూర్ణచంద్రుని కాంతి వంటి కాంతి కలదీ అయిన బంగారు దండము గల శ్వేతచ్ఛత్రము పట్టుకొని అతని వెనుకనే వెళ్లెను. 14

మూ. నిద్రామదపరీతాక్ష్యో రావణస్యోత్తమాః స్త్రియః,
అనుజగ్ముః పతిం వీరం ఘనం విద్యుల్లతా ఇవ. 15

ప్ర. అ. నిద్రామదపరీతాక్ష్యః = నిద్రమత్తుతో నిండిన కళ్లు గల వారైన, రావణస్య = రావణునియొక్క, ఉత్తమాః = ఉత్తమ లైన, స్త్రియః = స్త్రీలు, విద్యుల్లతాః = మెరపు తీగెలు, ఘనమివ = మేఘమును వలె, వీరమ్ = వీరు డైన, పతిమ్ = భర్తను, అనుజగ్ముః = అనుసరించి వెళ్ళిరి.

తా. రావణుని ఉత్తమస్త్రీ లందరూ, నిద్రమత్తుతో మూతలు పడుతున్న కళ్లతో, పెద్ద లైన తమ భర్తను, మెరపుతీగలు మేఘమును అనుసరించి వెళ్ళినట్లు వెళ్ళిరి. 15

మూ. వ్యావిద్ధహారకేయూరాః సమామృదితవర్ణకాః,
సమాగళితకేశాన్తాః సస్వేదవదనాస్తథా. 16

ఘూర్ణన్త్యో మదశేషేణ నిద్రయా చ శుభాననాః,
స్వేదక్లిష్టాఙ్గకుసుమాః సుమాల్యాకులమూర్ధజాః. 17

ప్రయాన్తం నైరృతపతిం నార్యో మదిరలోచనాః,
బహుమానాచ్చ కామాచ్చ ప్రియా భార్యాస్తమన్వయుః. 19

ప్ర. అ. వ్యావిద్ధహారకేయూరాః = తగిన స్థానమునుండి తొలగిన హారములు, బాహుపురులూ కలవారూ, సమామృదితవర్ణకాః = చెరిగి పోయిన మైపూతలు కలవారూ, సమాగళితకేశాన్తాః = జారిన జుట్టులు కలవారూ, తథా = మరియు, సస్వేదవదనాః = చెమటతో కూడిన ముఖములు కలవారూ, మదశేషేణ = మద్యమువలన కలిగిన మదముయొక్క శేషముచేతను, నిద్రయా చ = నిద్ర చేతను, ఘూర్ణన్త్యః = తిరిగిపోతున్నవారూ, స్వేదక్లిష్టాఙ్గకుసుమాః = చెమటకు నలిగిన శరీరము లందలి పుష్పములు కలవారూ, సుమాల్యాకులమూర్ధజాః = మంచి మాలికలతో వ్యాకులము లైన కేశములు కలవారూ, మదిరలోచనాః = మత్తును కలిగించు నేత్రములు కలవారూ, ప్రియాః = ఇష్ట లైన, భార్యాః = భార్యలు అయిన, నార్యః = స్త్రీలు, బహుమానాచ్చ = గౌరవమువలనను, కామాచ్చ = కామమువలనను, ప్రయాన్తమ్ = వెళ్ళుచున్న, తమ్ = ఆ, నైరృతపతిమ్ = రాక్షస రాజును, అన్వయుః = అనుసరించి వెళ్ళిరి.

తా. రావణుని ప్రియభార్య లైన ఆ స్త్రీలు, రావణునిపై ఉన్న గౌరవ భావము వలనను, కామమువలనను, అశోకవనములోనికి వెళ్లుచున్న అతనిని అనుసరించి వెళ్ళిరి. వాళ్ల దేహములపై ఉన్న హారములు, బాహుపురులూ, ఇటు అటూ జారిపోయినవి. శరీరమునకు పూసికొనిన సుగంధాంగరాగములు చెరిగి పోయినవి. జుట్టు ముడులు వదులై పోయినవి. ముఖమునకు చెమట పట్టినది. వాళ్ల మద్యపానమువలన కలిగిన, మిగిలిపోయిన మత్తుతోను, నిద్రచేతను, తూలి

పోవుచుండిరి. అంద మైన ముఖములు గల వాళ్ల శరీరముల పైన నున్న పుష్ప మాలలు వెనుకకు నలిగిపోయినవి. కేశపాశములలో పుష్పమాలలు చిక్కుకొని యున్నవి. వారి చూపులు మత్తు కలిగించేవిగా ఉన్నవి. అట్టి యువతులు అతనిని అనుసరించి వెళ్ళిరి. 16, 17, 18

మూ. స చ కామపరాధీనః పతిస్తాసాం మహాబలః,
సీతాసక్తమనా మన్దో మదాఞ్చితగతిర్బభౌ. 19

ప్ర. అ. తాసామ్=ఆ స్త్రీలయొక్క, పతిః=భర్త, మహాబలః =గొప్ప బలము కలవాడు, కామపరాధీనః = కామమునకు లొంగి పోయినవాడు అయిన, స చ=ఆ రావణుడు కూడ, మన్దః=మూఢు డై, సీతాసక్తమనాః=సీతయందు లగ్నమైన మనస్సు కలవాడై, మదాఞ్చితగతిః=మందమూ, సుందరమూ అయిన గమనము గలవాడై, బభౌ=ప్రకాశించెను.

తా. ఆ స్త్రీల భర్త, మహాబలుడు అయిన రావణుడు, కామపరాధీనుడై, సీతయందు లగ్న మైన మనస్సుతో, మందబుద్ధి యై, మందమూ సుందరమూ అయిన నడకతో వచ్చెను. 19

మూ. తతః కాఞ్చీనినాదం చ నూపురాణాం చ నిస్స్వనమ్,
శుశ్రావ పరమస్త్రీణాం స కపిర్మారుతాత్మజః. 20

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మారుతాత్మజః=వాయుపుత్రు డైన, సః కపిః=ఆ హనుమంతుడు, పరమస్త్రీణామ్=ఉత్తమస్త్రీలయొక్క, కాఞ్చీనినాదం చ=వడ్డాణముల ధ్వనిని, నూపురాణామ్= అందెలయొక్క, నిస్స్వనం చ= ధ్వనినీ, శుశ్రావ=వినెను.

తా. అంతలో, వాయుపుత్రు డైన ఆ హనుమంతునకు, ఆ ఉత్తమస్త్రీల వడ్డాణముల ధ్వనులూ, అందెల చప్పుళ్లూ వినబడెను. 20

మూ. తం చాప్రతిమకర్మాణమచిన్త్యబలపౌరుషమ్,
ద్వారదేశమనుప్రాప్తం దదర్శ హనుమాన్ కపిః. 21

ప్ర. అ. కపిః = వానరు డైన, హనుమాన్ = హనుమంతుడు, అప్రతిమ కర్మాణమ్ = సాటి లేని పనులు చేయువాడు, అచిన్త్యబలపౌరుషమ్ = ఊహింప

శక్యము కాని బలము, పౌరుషమూ కలవాడూ, ద్వారదేశమ్=ద్వారప్రదేశమును, అనుప్రాప్తమ్ = చేరినవాడూ అయిన, తం రావణుని కూడ, దదర్శ= చూచెను.

తా. సాటి లేని పనులు చేయగలవాడూ, ఊహింప శక్యము కాని బలమూ పౌరుషమూ కలవాడూ అయిన ఆ రావణుడు ద్వారదేశమును సమీపింపగా హనుమంతు డాతనిని చూచెను. 21

మూ. దీపికాభిరనేకాభిః సమన్తాదవభాసితమ్,
గన్ధతైలావసిక్తాభిర్ధ్రియమాణాభిరగ్రతః. 22

ప్ర. అ. (22,23,24 శ్లోకములలోని ద్వితీయాంతములు పై శ్లోకములోని 'తమ్' అనుదానికి విశేషణములు.) గన్ధతైలావసిక్తాభిః = సుగంధము గల తైలముచే తడపబడినవి, అగ్రతః = ఎదుట, ధ్రియమాణాభిః = ధరింపబడు చున్నవి అయిన, అనేకాభిః = అనేక మైన, దీపికాభిః = దీపములచేత, సమన్తాత్ =నలువైపులా, అవభాసితమ్ = ప్రకాశింపచేయబడినవాడూ అయిన (రావణుని చూచెను).

తా. ఆ రావణుని ఎదుట భాగమునందు, సుగంధతైలములతో తడప బడిన అనేకదీపములను తీసికొని వెళ్లుచుండిరి. నలుమూలల వ్యాపించిన వాని కాంతిలో అతడు ప్రకాశించుచుండెను. 22

మూ. కామదర్పమదైర్యుక్తం జిహ్మతామ్రాయతేక్షణమ్,
సమక్షమివ కన్దర్పమపవిద్ధశరాసనమ్. 23

ప్ర. అ. కామదర్పమదైః = కామముతోను, గర్వముతోను, మదముతోను, యుక్తమ్ = కూడినవాడూ, జిహ్మతామ్రాయతేక్షణమ్ = వంకర యైన, ఎఱ్ఱగా ఉన్న విశాలనేత్రములు కలవాడూ, అపవిద్ధశరాసనమ్=దూరముగా ఉంచబడిన ధనస్సు గల, సమక్షమ్ = ప్రత్యక్ష మైన, కన్దర్పమివ = మన్మథుని వలె ఉన్న వాడూ అయిన, (రావణుని చూచెను).

తా. అతనిలో కామము, దర్పము, మదము స్పష్టముగా కనబడుచుండెను. అతని విశాలము లైన నేత్రములు వంకరగాను, ఎఱ్ఱగాను ఉండెను. అప్పు

రావణుడు సాక్షాత్తు పుష్పధనుస్సు దూరముగా విడచి వచ్చిన మన్మథుడు వలె ఉండెను. 23

మూ. మథితామృతఫేనాభ మరజోవస్త్రముత్తమమ్,
సలీలమనుకర్షన్తం విముక్తం సక్తమఙ్గదే. 24

ప్ర. అ. మథితామృతఫేనాభమ్ = మథింపబడిన అమృతముయొక్క నురుగు వంటి కాంతి గలది, అరజః = పరాగము లేనిది, విముక్తమ్ = జారినది, అఙ్గదే = బాహుపురియందు, సక్తమ్ = తగులుకొన్నది అయిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, వస్త్రమ్ = వస్త్రమును, సలీలమ్ = విలాసతో కూడి నట్లుగా, అనుకర్షన్తమ్ = లాగుచున్న (ఆ రావణుని చూచెను).

తా. ఏ మాత్రము మకిలి లేక, మథించిన అమృతము నురుగు వలె స్వచ్ఛముగా ఉన్న వస్త్రము జారి అంగదమునకు తగుల్కొని వ్రేలాడుచుండెను. దానిని ఆ రావణుడు విలాసముగా లాగికొనుచు నడచుచుండెను. 24

మూ. తం పత్రవిటపే లీనః పత్రపుష్పఘనావృతః,
సమీపమివ సంక్రాన్తం నిధ్యాతుముపచక్రమే. 25

ప్ర. అ. సమీపమ్ = దగ్గరగా, సంక్రాన్తమివ = వచ్చినాడా అన్నట్లున్న, తమ్ = ఆ రావణుని, పత్రవిటపే = ఆకులతో నిండిన కొమ్మపై, లీనః = అణగినవాడై, పత్రపుష్పఘనావృతః = ఆకులయొక్క, పుష్పములయొక్క గుంపుచేత కప్పబడినవాడై, నిధ్యాతుమ్ = చూచుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. హనుమంతుడు ఆకులతో నిండిన కొమ్మపైన అణగి ఉండి, దట్టముగా ఉన్న ఆకులతోను పువ్వులతోను శరీరమును కప్పికొని, తన దగ్గరకే వచ్చినాడా అన్నట్లు ప్రక్కనే ఉన్న ఆ రావణుని పరిశీలనగా చూడ మొదలిడెను. 25

మూ. అవేక్షమాణస్తు తతో దదర్శ కపికుఞ్జరః,
రూపయౌవనసంపన్నా రావణస్య వరస్త్రియః. 26

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కపికుఞ్జరః = హనుమంతుడు, అవేక్షమాణః = నలుదిక్కులా, పరికించుచు, రావణస్య = రావణునియొక్క, రూప

యౌవనసంపన్నాః = రూపముతోను యౌవనముతోను నిండిన, వరస్త్రియః = శ్రేష్ఠ లైన స్త్రీలను, దదర్శ = చూచెను.

తా. హనుమంతుడు ఇటు అటు పరికించి, అక్కడ రావణుని వెంట వచ్చిన, సౌందర్యయౌవనములతో ప్రకాశించుచున్న ఉత్తమస్త్రీలను చూచెను. 26

మూ. తాభిః పరివృతో రాజా సురూపాభిర్మహాయశాః,
తన్మృగద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదావనమ్. 27

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజా = రాక్షసరాజు, సురూపాభిః = మంచి రూపముగల, తాభిః = ఆ స్త్రీలతో, పరివృతః = కూడినవా డై, మృగద్విజసంఘుష్టమ్ = మృగములచేత, పక్షులచేత ధ్వనింపచేయ బడిన, తత్ = ఆ, ప్రమదావనమ్ = ఉద్యానవనమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. మహాకీర్తిశాలి యైన రావణుడు, ఉత్తమసౌందర్యవతు లైన ఆ స్త్రీలతో కలిసి, మృగపక్షుధ్వనులతో నిండిన ఆ ఉద్యానమును ప్రవేశించెను.

మూ. క్షీబో విచిత్రాభరణః శఙ్కుకర్ణో మహాబలః,
తేన విశ్రవసః పుత్రః స దృష్టో రాక్షసాధిపః. 28.
వృతః పరమనారీభిస్తారాభిరివ చన్ద్రమాః,
తం దదర్శ మహాతేజాస్తేజోవన్తం మహాకపిః. 29

ప్ర. అ. క్షీబః = మత్తులో ఉన్నవాడూ, విచిత్రాభరణః = విచిత్రము లైన అలంకారములు కలవాడూ, శఙ్కుకర్ణః = కోణముల వంటి చెవులు కలవాడూ, విశ్రవసః = విశ్రవస్సుయొక్క, పుత్రః = పుత్రుడూ, తారాభిః = నక్షత్రములతో కూడిన, చన్ద్రమాః ఇవ = చంద్రుడు వలె, పరమనారీభిః = ఉత్తమ లైన స్త్రీలతో, వృతః = కూడినవాడూ అయిన, సః = ఆ, రాక్షసాధిపః = రాక్షసరాజు, తేన = ఆ హనుమంతునిచేత, దృష్టః = చూడబడినాడు. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహాకపిః = హనుమంతుడు, తేజోవన్తమ్ = తేజస్సు గల, తమ్ = ఆ రావణుని, దదర్శ = చూచెను.

తా. మద్యపానమత్తు డై, విచిత్రము లైన ఆభరణములను ధరించి, తార లతో కూడిన చంద్రుడు వలె, ఉత్తమస్త్రీలతో కూడి ఉన్న మహాబలశాలి, దీర్ఘము

లైన కర్మములు కలవాడూ, విశ్రవస్సుని కుమారుడూ అయిన ఆ రాక్షసాధిపుని హనుమంతుడు చూచెను. మహాతేజశ్శాలి యైన ఆ హనుమంతుడు, మహాతేజశ్శాలి యైన ఆ రావణుని చూచెను. 28,29

మూ. రావణోఽయం మహాబాహురితి సంచిన్త్య వానరః,
అవప్లుతో మహాతేజా హనుమాన్మారుతాత్మజః. 30

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడు, వానరః = వానరుడు అయిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, హనుమాన్ = హనుమంతుడు, అయమ్ = ఈ, మహాబాహుః = మహాబాహుపు, రావణః = రావణుడు, ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, అవప్లుతః = క్రిందికి దుమికినాడు.

తా. మహాతేజశ్శాలి, వాయునందనుడూ అయిన హనుమంతుడు, "ఈ మహాబాహుడు రావణుడు కదా" అని ఆలోచించి, తా నున్న కొమ్మమీదినుండి క్రింది కొమ్మమీదికి దుమికెను. 30

మూ. స తథాప్యుగ్రతేజాః సన్నిర్ధూతస్తస్య తేజసా,
పత్రగుహ్యాన్తరే సక్తో హనుమాన్ సంవృతోఽభవత్. 31

ప్ర. అ. తథా = అట్లు, ఉగ్రతేజాః సన్నపి = భయంకర మైన తేజస్సు కలవా డైనను, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, తస్య = ఆ రావణుని యొక్క, తేజసా = తేజస్సుచేత, నిర్ధూతః = తిరస్కరింపబడినవాడై, పత్రగుహ్యాన్తరే = ఆకుల గుంపుల మాటున, సక్తః = తగుల్కొన్నవాడై, సంవృతః = కప్పబడిన వాడు, అభవత్ = ఆయెను.

తా. అంతటి మహాతేజస్సు గల హనుమంతుడు కూడ, ఆ రావణుని తేజస్సు ముందు నిలవ జాలక, ఆకులు కప్పిన ప్రదేశమునందు ఎవ్వరికిని కన బడకుండ ఉండెను. 31

మూ. స తామసితకేశాన్తాం సుశ్రోణీం సంహతస్తనీమ్,
దిదృక్షురసితాపాఙ్గాముపావర్తత రావణః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టాదశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, రావణః = రావణుడు, అసితకేశాన్తామ్ = నల్లని కేశములు కలదీ, సుశ్రోణీమ్ = అందమైన కటిప్రదేశము కలదీ, సంహతస్తనీమ్ = దగ్గరగా కలిసి ఉన్న స్తనములు కలదీ, అసితాపాఙ్గామ్ = నల్లని నేత్రాంతములు కలదీ అయిన, తామ్ = ఆ సీతను, దిదృక్షుః = చూడదలచినవాడై, ఉపావర్తత = సమీపించెను.

రా. నల్లని కేశపాశము, అందమైన కటిప్రదేశమూ, దగ్గరగా కలిసి ఉన్న స్తనములూ, నల్లని నేత్రాంతములూ గల సీతను చూడవలెనను కోరికతో ఆ రావణుడు ఆమెను సమీపించెను. ౩౨

'బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పదునెనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనవింశః సర్గః

[రావణుని చూడగానే దుఃఖ–భయ–చింతలలో మునిగిన సీత అవస్థ]

మూ. తస్మిన్నేవ తతః కాలే రాజపుత్రీ త్వనిన్దితా,
రూపయౌవనసంపన్నం భూషణోత్తమభూషితమ్. 1
తతో దృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపమ్,
ప్రావేపత వరారోహా ప్రవాతే కదలీ యథా. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తస్మిన్ = ఆ, కాలే ఏవ = కాలము నందు, రాజపుత్రీ = రాజపుత్రి, అనిన్దితా = దోషములు లేనిది, వరారోహా = శ్రేష్ఠ మైన కటిప్రదేశము కలదీ అయిన, వైదేహీ = సీత, రూపయౌవనసంపన్నమ్ = రూపముతోను, యౌవనముతోను కూడినవాడు, భూషణోత్తమభూషితమ్ = శ్రేష్ఠము లైన భూషణములచే అలంకరించబడినవాడు, రాక్షసాధిపమ్ = రాక్షస ప్రభువూ అయిన, రావణమ్ = రావణుని, దృష్ట్వైవ = చూడగానే, ప్రవాతే = అధిక మైన గాలిలో, కదలీ యథా = అరటి చెట్టు వలె, ప్రావేపత = వణికెను.

తా. ఆ సమయమునందు, రూపయౌవనములతో కూడి, శ్రేష్ఠము లైన భూషణములతో అలంకరించుకొని ఉన్న ఆ రాక్షసరా జైన రావణుని చూడగానే, జనకరాజపుత్రి, దోషములు లేనిది, శ్రేష్ఠ మైన కటిప్రదేశము కలది అయిన సీత పెనుగాలిలో అరటిచెట్టు ఊగిపోయి నట్లు వణికిపోయెను. 1,2

మూ. ఆచ్ఛాద్యోదరమూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ,
ఉపవిష్టా విశాలాక్షీ రుదన్తీ వరవర్ణినీ. 3

ప్ర. అ. విశాలాక్షీ = విశాలము లైన నేత్రములు కలది, వరవర్ణినీ = శ్రేష్ఠ మైన శరీరవర్ణము గలది అయిన ఆ సీత, ఊరుభ్యామ్ = తొడలచేత,

ఉదరమ్ = ఉదరమును, బాహుభ్యామ్ = బాహువులచేత, పయోధరౌ = స్తనములను, అచ్ఛాద్య = కప్పికొని, రుదతీ = ఏడ్చుచు, ఉపవిష్టా = కూర్చున్నది.

తా. విశాలము లైన నేత్రములు, శ్రేష్ఠ మైన శరీరచ్ఛాయా గల ఆ సీత, తొడలతో పొట్టను, బాహువులతో స్తనములను కప్పికొని కూర్చుండెను. ౩

మూ. దశగ్రీవస్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః,
దదర్శ సీతాం దుఃఖార్తాం నావం సన్నామివార్ణవే. ౪

ప్ర. అ. దశగ్రీవస్తు = రావణుడు, రాక్షసీగణైః = రాక్షసస్త్రీల సముదాయముచేత, రక్షితామ్ = రక్షింపబడినదీ, వైదేహీమ్ = విదేహరాజు పుత్రికా, దుఃఖార్తామ్ = దుఃఖముచేత పీడింపబడినదీ, అర్ణవే = సముద్రమునందు, సన్నామ్ = అపదలో చిక్కుకొన్న, నావమివ = ఓడ వలె ఉన్నదీ అయిన, సీతామ్ = సీతను, దదర్శ = చూచెను.

తా. జనకుని పుత్రిక యైన ఆ సీత రాక్షసీగణములచే రక్షింపబడు చుండెను. దుఃఖముచేత పీడింపబడిన ఆమె సముద్రమధ్యమునందు అపదలో చిక్కుకొన్న ఓడ వలె ఉండెను. అట్టి సీతను రావణుడు చూచెను. ౪

మూ. అసంవృతాయామాసీనాం ధరణ్యాం సంశితవ్రతామ్,
ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖామివ వనస్పతేః. ౫

[22 వ శ్లోకం వరకు ఉన్న శ్లోకాలలోని ద్వితీయాంతస్త్రీలింగశబ్దాలు ౪వ శ్లోకంలోని 'సీతామ్' అనుదానికి విశేషణములు. సీత దురవస్థను వర్ణించుచున్నవి.]

ప్ర. అ. అసంవృతాయామ్ = అచ్ఛాదింపబడని, ధరణ్యామ్ = నేలమీద, ఆసీనామ్ = కూర్చున్నదీ, సంశితవ్రతామ్ = తీవ్ర మైన వ్రతము కలదీ, ఛిన్నామ్ = ఛేదింపబడి, భూమౌ = నేలపై, ప్రపతితామ్ = పడిపోయిన, వనస్పతేః = వృక్షముయొక్క, శాఖామివ = కొమ్మవలె ఉన్న (సీతను చూచెను).

తా. కఠోర మైన వ్రతమును పాటించుచున్న సీత కటిక నేలపై కూర్చుండెను. మహావృక్షమునుండి ఛేదింపబడి నేలపై పడిన కొమ్మ వలె ఉండెను. ౫

మూ. మలమణ్డనదిగ్ధాఙ్గీం మణ్డనార్హామమణ్డితామ్,
మృణాలీ పఙ్కదిగ్ధేవ విభాతి న విభాతి చ. 6

ప్ర. అ. మలమణ్డనదిగ్ధాఙ్గీమ్ = మాలిన్యము అనే అలంకారముచేత చిత్ర మైన శరీరము కలదీ, మణ్డనార్హామ్ = అలంకరించుకొనుటకు తగినదీ, అమణ్డితామ్ = అలంకరింపబడనిదీ (అయిన సీతను చూచెను). పఙ్కదిగ్ధా = బురదచేత పూయబడిన, మృణాలీవ = తామరతూడు వలె, విభాతి = ప్రకాశించు చున్నది, న విభాతి చ = ప్రకాశించుటలేదు కూడ.

తా. అలంకరించుకొన దగిన ఆమె అలంకారములను ధరించక మాలిన్య మునే అలంకారముగా ధరించుటచేత ఆమె శరీరము విచిత్రముగా ఉండెను. ఆమె, బురద అంటుకొనిన తామరతూడు వలె ప్రకాశించీ ప్రకాశించకుండగా ఉండెను. 6

మూ. సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః,
సఙ్కల్పహయసంయుక్తైర్యాన్తీమివ మనోరథైః. 7

ప్ర. అ. సంకల్పహయసంయుక్తైః = సంకల్పములు (ఊహలు) అనే గుఱ్ఱములతో కట్టబడిన, మనోరథైః = మనోరథములు (కోరికలు) అనే రథములతో, విదితాత్మనః = ప్రసిద్ధ మైన బుద్ధి గల, రాజసింహస్య = రాజ శ్రేష్ఠు డైన, రామస్య = రామునియొక్క, సమీపమ్ = సమీపమును, గచ్ఛన్తీమివ = వెళ్లుచున్నది వలె ఉన్న (సీతను చూచెను).

తా. ఆ సీత ఊహ లనే గుఱ్ఱములు కట్టిన కోరిక లనే రథము నెక్కి, రాజులలో శ్రేష్ఠుడు, ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడూ అయిన, రాముని దగ్గరకు వెళ్లుచున్నదా అన్న ట్లుండెను. 7

మూ. శుష్యన్తీం రుదతీమేకాం ధ్యానశోకపరాయణామ్,
దుఃఖస్యాన్తమపశ్యన్తీం రామాం రామమనువ్రతామ్. 8

ప్ర. అ. శుష్యన్తీమ్ = ఎండిపోవుచున్నదీ, రుదతీమ్ = ఏడ్చుచున్నదీ, ఏకామ్ = ఒంటరిగా ఉన్నదీ, ధ్యానశోకపరాయణామ్ = ఆలోచనలందు శోకము నకు లొంగిపోయినదీ, దుఃఖస్య = దుఃఖముయొక్క, అన్తమ్ = అంతమును,

అపశ్యత్ సీమ్ = చూచనిది, రామామ్ = మనోహరురాలైనది, రామమ్ = రాముని, అనువ్రతామ్ = అనుసరించిన వ్రతము కలదీ (అయిన సీతను చూచెను).

తా. ఉత్తమసౌందర్యముతో మనోహరురాలైన ఆమె రామునియందే చిత్తము నిలిపి ఉండెను. ఈ దుఃఖమునకు అంతము కనబడక పోవుటచే నిరంతరము ఆలోచనంతో, శోకముతో ఏడ్చుచు, సహాయము ఎవ్వరూ లేక కృశించి పోయెను. 8

మూ. వేష్టమానాం తథావిష్టాం పన్నగేన్ద్రవధూమివ,
ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా. 9

ప్ర. అ. తథా = మరియు, ఆవిష్టామ్ = మణిమంత్రాది ప్రభావమునకు లోనై, వేష్టమానామ్ = చుట్టుకొని పోవుచున్న, పన్నగేన్ద్రవధూమివ = ఆడదైన మహాసర్పమువలె ఉన్నదీ, ధూమకేతునా = ధూమకేతు వను, గ్రహేణ = గ్రహముచేత, ధూప్యమానామ్ = ధూమముచేత ఉక్కిరి బిక్కిరి చేయబడుచున్న, రోహిణీమివ = రోహిణి వలె ఉన్నదీ (అయిన సీతను చూచెను).

తా. ఆ సీత మణిమంత్రాదులచేత కట్టబడి కొట్టుకొనుచున్న మహాసర్పము వలె, ధూమకేతు వను గ్రహముచేత (ధూమముతో) ఉక్కిరిబిక్కిరి చేయబడుచున్న రోహిణి వలె ఉండెను. 9

మూ. వృత్తశీలకులే జాతామాచారవతి ధార్మికే,
పునఃసంస్కారమాపన్నాం జాతామివ చ దుష్కులే. 10

ప్ర. అ. ధార్మికే = ధర్మపరమైన, ఆచారవతి = సదాచారము గల, వృత్తశీలకులే = మంచి వృత్తము, శీలము గల కులమునందు, జాతామ్ = పుట్టినదీ, సంస్కారమ్ = వివాహసంస్కారమును, ఆపన్నామ్ = పొందినదై, దుష్కులే = చెడ్డ కులమునందు, పునః = మరల, జాతామివ చ = పుట్టినది వలె ఉన్నదీ (అయిన సీతను చూచెను).

తా. సీత సదాచారసంపన్నమూ, ధర్మతత్పరమూ, మంచివృత్తశీలములు గలదీ అయిన కులములో పుట్టి, వివాహసంస్కారము ద్వారా మరల దుష్కులములో పునర్జన్మ పొందిన కన్య వలె ఉండెను.

వి. పురుషునకు ఉపనయనసంస్కారము పునర్జన్మవంటి దని చెప్పుదురు. అట్లే స్త్రీకి వివాహసంస్కారము పునర్జన్మసదృశ మని దీని భావమై యుండును. ఈ సుందరకాండలోనే "సీత సంధ్యావందనార్థము ఈ నదికి రావచ్చును" (14సర్గ. 49శ్లో) అను హనుమంతుని వాక్యమును బట్టి స్త్రీలకు కూడ ఉపనయనాది సంస్కారము లున్నట్లు సూచిత మగుచున్నది.

''పురా యుగే తు నారీణాం మౌఞ్జీబన్ధనమిష్యతే,
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా''

అని స్మృతివాక్యము. దీనిని బట్టి చూచినచో ద్వితస్త్రీలకు వివాహము తృతీయ జన్మ మనవచ్చు నేమో. 10

మూ. అభూతేనాపవాదేన కీర్తిం నిపతితామివ,
అమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలామివ. 11

ప్ర. అ. అభూతేన = అసత్యమైన, అపవాదేన = అపవాదముచేత, నిపతితామ్ = పడిపోయిన, కీర్తిమివ = కీర్తి వలె, అమ్నాయానామ్ = అభ్యాసము యొక్క, అయోగేన = సంబంధము లేకపోవుటచేత, ప్రశిథిలామ్ = శిథిలమైన, విద్యామివ = విద్య వలె ఉన్న (సీతను చూచెను).

తా. అప్పు డా సీత, అసత్యదోషారోపణముచేత చెడిపోయిన కీర్తి వలె మాటి మాటికి అధ్యయనము చేయకపోవుటచేత శిథిలమైన విద్య వలె ఉండెను.

మూ. సన్నామివ మహాకీర్తిం శ్రద్ధామివ విమానితామ్,
పూజామివ పరిక్షీణామాశాం ప్రతిహతామివ. 12

ప్ర. అ. సన్నామ్ = క్షీణించిన, మహాకీర్తిమివ = గొప్ప కీర్తి వలె, విమానితామ్ = అవమానింపబడిన, శ్రద్ధామివ = శ్రద్ధ వలె, పరిక్షీణామ్ = తగ్గిపోయిన, పూజామివ = పూజ వలె, ప్రతిహతామ్ = అడ్డుకొనబడిన, ఆశామివ = ఆశ వలె (ఉన్న సీతను చూచెను).

తా. ఆ సీత క్షీణించిన గొప్ప కీర్తి వలె, అవమానింపబడిన శ్రద్ధ వలె, క్షీణించిపోయిన పూజ వలె, దెబ్బతిన్న ఆశ వలె ఉండెను. 12

మూ. ఆయతీమివ విధ్వస్తామాశాం ప్రతిహతామివ,
దీప్తామివ దిశం కాలే పూజామపహృతామివ. 13

ప్ర. అ. విధ్వస్తామ్ = నశింపచేయబడిన, ఆయతీమివ = భవిష్యద్ధనాది లాభము వలె, ప్రతిహతామ్ = అడ్డుకొనబడిన, ఆశామివ = ఆశ వలె, కాలే = ఉత్పాతకాలము (రాబోవు దేశోపద్రవములను సూచించుచు ఆకాశమునందు అకారణముగా భగ్గున మంటలు మొదలగు నవి చెలరేగు కాలము) నందు, దీప్తామ్ = మండిపోవుచున్న, దిశమివ = దిక్కు వలె, అపహృతామ్ = అపహరింపబడిన, పూజామివ = పూజ వలె (ఉన్న సీతను చూచెను).

తా. సీత, లభించు నని ఎదురుచూచుచుండగా రాకుండా పోయిన లాభము వలె, నెరవేర్పబడని ఆశ వలె, ఉత్పాతసమయములందు మండు చున్న దిక్కు వలె, ఒకరికొరకై ఉద్దేశింపగా మరొకరు అపహరించుకొని పోయిన పూజ వలె ఉండెను. 13

మూ. పద్మినీమివ విధ్వస్తాం హతశూరాం చమూమివ,
ప్రభామివ తమోధ్వస్తాముపక్షీణామివాపగామ్. 14

ప్ర. అ. విధ్వస్తామ్ = నశింపచేయబడిన, పద్మినీమివ = పద్మలత వలె, హతశూరామ్ = చంపబడిన శూరులు గల, చమూమివ = సేనవలె, తమోధ్వస్తామ్ = చీకటిచే నశింపచేయబడిన, ప్రభామివ = కాంతి వలె, ఉపక్షీణామ్ = క్షీణించిన, ఆపగా మివ = నది వలె (ఉన్న సీతను చూచెను).

తా. ఆ సీత త్రొక్కివేయబడిన పద్మలత వలె, శూరు లందరూ చచ్చి పోయిన సేన వలె, చీకటి కప్పిన కాంతి వలె, ఎండిపోయిన నది వలె ఉండెను.

మూ. వేదీమివ పరామృష్టాం శాన్తామగ్నిశిఖామివ,
పౌర్ణమాసీమివ నిశాం రాహుగ్రస్తేన్దుమణ్డలామ్. 15

ప్ర. అ. పరామృష్టామ్ = (అపవిత్రులచే) స్పృశింపబడిన, వేదీమివ = అగ్నివేదిక వలె, శాన్తామ్ = శాంతించిన, అగ్నిశిఖామివ = అగ్నిజ్వాల వలె, రాహుగ్రస్తేన్దుమణ్డలామ్ = రాహువుచేత మ్రింగబడిన చంద్రమండలము గల, పౌర్ణమాసీమ్ = పూర్ణిమకు సంబంధించిన, నిశామివ = రాత్రి వలె (ఉన్న సీతను చూచెను).

తా. సీత, అపవిత్రవస్తువుల స్పర్శచే అపవిత్ర మైపోయిన అగ్నివేదిక వలె, కాండించిన అగ్నిజ్వాల వలె, చంద్రమండలమును రాహువు మ్రింగి వేయగా కాంతివిహీనముగా ఉన్న పూర్ణిమారాత్రి వలె ఉండెను. 15

మూ. ఉత్కృష్టపర్ణకమలాం విత్రాసితవిహఙ్గమామ్,
హస్తిహస్తపరామృష్టామాకులాం పద్మినీమివ. 16

ప్ర. అ. హస్తిహస్తపరామృష్టామ్ = ఏనుగ తుండముచేత స్పృశింప బడినదీ, ఉత్కృష్టపర్ణకమలామ్ = లాగివేయబడిన ఆకులు పద్మములూ కలదీ, విత్రాసితవిహఙ్గమామ్ = భయపెట్టబడిన పక్షులు కలదీ, ఆకులామ్ = వ్యాకులమూ అయిన, పద్మినీమివ = పద్మసరస్సు వలె ఉన్న (సీతను చూచెను).

తా. ఏనుగ తొండముతో కొట్టుట ఆకులను పద్మములను లాగివేయగా, పక్షు లన్నీ భయపడి పారిపోగా, వ్యాకులముగా ఉన్న పద్మసరస్సు వలె ఆ సీత మనస్సు కలగిపోయి ఉండెను. 16

మూ. పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితామివ,
పరయా మృజయా హీనాం కృష్ణపక్షనిశామివ. 17

ప్ర. అ. పతిశోకాతురామ్ = భర్తృశోకముచే పీడితురాలూ, విస్రావితామ్ = ప్రవహించు నట్లు చేయబడిన దై, శుష్కామ్ = ఎండిపోయిన, నదీమివ = నది వలె ఉన్నది, పరయా = శ్రేష్ఠ మైన, మృజయా = శరీరసంస్కారముతో, హీనామ్ = శూన్యురాలూ, కృష్ణపక్షనిశామివ = కృష్ణపక్షరాత్రి వలె ఉన్నదీ (అయిన సీతను చూచెను).

తా. భర్తృశోకముచే పీడితురాలై, ఉత్తమశరీరసంస్కార మేమీ లేని ఆ సీత, ఉన్న నీరంతా క్రిందికి ప్రవహించిపోవు నట్లు చేయుటచే ఎండిపోయిన నది వలె కృశించి, కృష్ణపక్షరాత్రి వలె శోభావిహీనురా లై ఉండెను. 17

మూ. సుకుమారీం సుజాతాఙ్గీం రత్నగర్భగృహోచితామ్,
తప్యమానామివోష్ణేన మృణాలీమచిరోద్ధృతామ్. 18

ప్ర. అ. సుకుమారీమ్ = సుకుమారురాలూ, సుజాతాఙ్గీమ్ = చక్కగా ఉన్న అవయవములు కలదీ, రత్నగర్భగృహోచితామ్ = రత్నములు గర్భము

నందు గల గృహములకు అలవాటుపడినది, ఉష్ణేన = వేడిచేత, తప్యమానామ్ = తపింపచేయబడుచున్న, అచిరోద్ధృతామ్ = కొంచెము సేపటి క్రితమే పెకలింపబడిన, మృణాళీమివ = తామరతూడు వలె ఉన్నది (అయిన సీతను చూచెను).

తా. సుకుమారురాలు, చక్కని అవయవనిర్మాణముతో సుందరముగా ఉన్నది, రత్నాలతో నిండిన ఇండ్లలో నివసించుటకు అలవాటుపడినది అయిన ఆ సీత, కొంచెము సేపటి క్రితమే పెకలింపబడి, వేడికి కమిలిపోవుచున్న తామరతూడు వలె ఉండెను. 18

మూ. గృహీతామాళితాం స్తమ్భే యూథపేన వినాకృతామ్,
నిఃశ్వసన్తీం సుదుఃఖార్తాం గజరాజవధూమివ. 19

ప్ర. అ. గృహీతామ్ = పట్టుకొనబడినది, స్తమ్భే = స్తంభమునందు, ఆళితామ్ = కట్టబడినది, యూథపేన వినా = గుంపుకు నాయకుడైన గజము లేకుండా, కృతామ్ = చేయబడినది, నిఃశ్వసన్తీమ్ = నిట్టూర్పుచున్నది, సుదుఃఖార్తామ్ = మిక్కిలి దుఃఖముచే పీడింపబడినది అయిన, గజరాజవధూమివ = గజరాజు భార్య వలె ఉన్నది (అయిన సీతను చూచెను).

తా. ఆటవికులు పట్టుకొని, ఏనుగుల గుంపుకు నాయకుడైన మగ ఏనుగుకు దూరముగా తీసికొనిపోయి స్తంభమునకు బంధింపగా చాల దుఃఖముగా నిట్టూర్పుచున్న ఆడ ఏనుగ వలె, ఆ సీత చాల దుఃఖార్తయై ఉండెను. 19

మూ. ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానామయత్నతః,
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీమివ. 20

ప్ర. అ. దీర్ఘయా = పొడవైన, ఏకయా = ఒక, వేణ్యా = జడతో, అయత్నతః = అప్రయత్నముగా, శోభమానామ్ = ప్రకాశించుచున్నది, నీరదాపాయే = వర్షర్తువు గడచిన పిమ్మట, నీలయా = నల్లనైన, వనరాజ్యా = వనపంక్తితో ప్రకాశించుచున్న, మహీమివ = భూమి వలె ఉన్నది (అయిన సీతను చూచెను).

తా. దీర్ఘమైన ఒక్క జడతో సహజముగానే శోభించుచున్న ఆ సీత, వర్షాకాలాంతమునందు నల్లని వృక్షపంక్తితో ప్రకాశించుచున్న భూమి వలె ఉండెను.

మూ. ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ,
పరిక్షీణాం కృశాం దీనామల్పాహారాం తపోధనామ్ 21

ప్ర. అ. ఉపవాసేన = ఉపవాసముచేతను. శోకేన = దుఃఖముచేతను, ధ్యానేన = ఆలోచన చేతను, భయేన చ = భయముచేతను, పరిక్షీణామ్ = క్షీణించినదీ, కృశామ్ = చిక్కిపోయినదీ, అల్పాహారామ్ = అల్పమైన ఆహారము కలదీ, తపోధనామ్ = తపస్సే ధనముగా కలదీ (అయిన సీతను చూచెను.)

తా. ఉపవాసముచేత, దుఃఖముచేత. ఆలోచనలచేత, భయముచేత కూడ సీత చాలా దుర్బలురాలై, కృశించి దైన్యముతో నిండి యుండెను. అత్యల్పమైన ఆహారమును భుజించుచు జీవించి ఉన్న ఆమె రామధ్యానమను గొప్ప తపస్సు చేయుచుండెను. 21

మూ. అయాచమానాం దుఃఖార్తాం ప్రాఞ్జలిం దేవతామివ,
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవపరాభవమ్. 22

ప్ర. అ. దేవతామివ = దేవతాస్త్రీ వలె ఉన్నదీ, దుఃఖార్తామ్ = దుఃఖముచే పీడింపబడుచున్నదీ, భావేన = మనోభావముచేత, రఘుముఖ్యస్య = రఘువంశ రాజులలో శ్రేష్ఠుడైన రామునియొక్క (రామునిచేత), దశగ్రీవపరాభవమ్ = రావణుని పరాభవమును, అయాచమానామ్ = కోరుకొనుచున్నది (అయిన సీతను చూచెను).

తా. ఆ సీత దేవతాస్త్రీ వలె ఉండెను. దుఃఖార్తురాలై, అంజలి ఘటించి రాముని చేతిలో రావణునకు పరాభవము కలుగవలెనని మనస్సులో కోరుకొనుచుండెను. 22

మూ. సమీక్షమాణాం రుదతీమనిన్దితాం
సుపక్ష్మతామ్రాయతశుక్లలోచనామ్,
అనువ్రతాం రామమతీవ మైథిలీం
ప్రలోభయామాస వధాయ రావణః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సున్దరకాణ్డే
ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. సమీక్షమాణామ్ = నలు వైపులా చూచుచున్నదీ, రుదతీమ్ = ఏడ్చుచున్నదీ, అనిన్దితామ్ = నిందింపఁబడనిదీ, సుపక్ష్మతామ్రాయత శుక్లలోచనామ్ = మంచి రెప్పలు గల. ఎఱ్ఱని, విశాల మైన తెల్లని నేత్రములు కలదీ. అతీవ = మిక్కిలి, రామమ్ = రాముని, అనువ్రతామ్ = అనుసరించిన వ్రతము గలదీ అయిన, మైథిలీమ్=సీతను, రావణః=రావణుఁడు, వధాయ=చంపుటకు, ప్రలోభయామాస = లోభపెట్టెను.

తా. అంద మైన రెప్పలతో చివర ఎఱ్ఱగాను, మధ్య తెల్లగాను ఉన్న విశాలము లైన నేత్రములు గల, దోషలేశము కూడ లేని ఆ సీత నలు వైపులా చూచుచు ఏడ్చుచుండెను. రాముని విషయమున అత్యంత మైన పాతివ్రత్యనియమము అవలంబించి ఉండెను. అట్టి సీతను రావణుఁడు "నేను చెప్పినట్లు వినవిచో చంపెదను'' అని భయపెట్టుచు మంచి మాటలతో కూడ ఆమెకు ఆశ చూపెను. (లేదా తనకు చావు వచ్చుటకే ఆమెను ఆ విధముగా లోభపెట్టెను).

“బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో పందొమ్మిదవసర్గ సమాప్తము.

## అథ ఏంశః సర్గః

### [రావణుడు సీతను లోభపెట్టుట]

మూ. స తాం పరివృతాం దీనాం నిరానన్దాం తపస్వినీమ్,
సాకారైర్మధురైర్వాక్యైర్న్యదర్శయత రావణః. 1

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, పరివృతామ్ = రాక్షసస్త్రీలచేత, చుట్టబడినదీ, దీనామ్ = దీనురాలూ, నిరానన్దామ్=ఆనందము లేనిదీ, తపస్వినీమ్ = జాలి పడదగినదీ అయిన, తామ్ = ఆ సీతను, సాకారైః = ఆకారముతో (హస్తములాదిచేష్టలతో కూడిన) వాక్యైః = మాటలతో, న్యదర్శయత=తెలిపెను.

తా. రాక్షసస్త్రీల మధ్య దీనురాలై, ఆనందము లేక దయనీయస్థితిలో ఉన్న ఆ సీతకు, రావణుడు, హస్తములాదులతో చేష్టలు చేయుచు, మంచి మాటలతో తన అభిప్రాయమును తెలిపెను. 1

మూ. మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరమ్,
అదర్శనమివాత్మానం భయాన్నేతుం త్వమిచ్ఛసి. 2

ప్ర. అ. నాగనాసోరు = ఏనుగ తొండము వంటి తొడలు గలదానా! మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, స్తనోదరమ్ = స్తనములను ఉదరమును, గూహమానా = కప్పికొనుచు, త్వమ్ = నీవు, భయాత్ = భయము వలన, ఆత్మానమ్ = తనను, అదర్శనమ్ = కనబడకుండుటను, నేతుమ్ = పొందించుటకు, ఇచ్ఛసీవ = కోరుచున్నట్లున్నావు.

తా. ఏనుగ తొండము వంటి ఆకారము గల తొడలు గల ఓ సీతా! నీవు నన్ను చూడగానే భయపడి స్తనములను, ఉదరమును కప్పుకొనుచు, అదృశ్యురాలవు అగుటకు కోరుచున్నట్లున్నావు. 2

మూ. కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే,
సర్వాఙ్గగుణసంపన్నే సర్వలోకమనోహరే. 3

ప్ర. అ. విశాలాక్షి = విశాలము లైన నేత్రములు కలదానా! సర్వాఙ్గగుణసంపన్నే = సమస్త అవయవములందు గుణములతో కూడినదానా, సర్వలోకమనోహరే = సమస్తజనులకు మనోహరురాలా, త్వామ్ = నిన్ను, కామయే = కోరుచున్నాను. ప్రియే = ఓ ప్రియురాలా! మామ్ = నన్ను, బహుమన్యస్వ = గౌరవించుము.

తా. విశాలము లైన నేత్రములతో, సద్గుణసంపన్నము లైన సర్వావయవములతో సకలజనుల మనస్సును ఆకర్షించుచున్న ఓ సీతా! నేను నిన్ను కామించుచున్నాను. ఓ ప్రియురాలా! నామీద ప్రేమ చూపుము. 3

మూ. నేహ కేచిన్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః,
వ్యపసర్పతు తే సీతే భయం మత్తః సముత్థితమ్. 4

ప్ర. అ. సీతే = సీతా! ఇహ = ఇక్కడ, మనుష్యాః వా = మనుష్యులు గాని, కామరూపిణః = స్వేచ్ఛారూపములుగల, రాక్షసాః వా = రాక్షసులు కాని, కేచిత్ = ఎవరును, న = లేరు. మత్తః = నావలన, సముత్థితమ్ = కలిగిన, తే = నీయొక్క, భయమ్ = భయము, వ్యపసర్పతు = తొలగుగాక.

తా. ఓ సీతా! నీవు భయపడుటకు ఇక్కడ మనుష్యులు గాని, కామరూపధారు లైన రాక్షసులు గాని ఎవ్వరూ లేరు. నాకు నీపై ప్రేమయే ఉన్నది గాన నావలన కూడ నీ వేమీ భయపడవలసిన పని లేదు. 4

మూ. స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః,
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా. 5

ప్ర. అ. భీరు = భయస్వభావము కలదానా! పరస్త్రీణామ్ = పరస్త్రీల యొక్క, గమనం వా = గమనము (పొందు)గాని, సంప్రమథ్య = బలాత్కరించి, హరణం వా = హరించుటగాని, రక్షసామ్ = రాక్షసులయొక్క, సర్వథైవ = అన్నివిధములచేత, స్వధర్మః = స్వధర్మము. సంశయః = సంశయము, న = లేదు.

తా. భయస్వభావము గల ఓ సీతా! పరదారాగమనము, బలాత్కరించి పరస్త్రీలను అపహరించుటా ఇది అన్నివిధాలా రాక్షసుల స్వధర్మము. ఏ మాత్రము సందేహము లేదు. 5

మూ. ఏవం చైతదకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి,
కామం కామః శరీరే మే యథాకామం ప్రవర్తతామ్. 6

ప్ర. అ. మైథిలి=సీతా! ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లున్నది. కామః = కామము, కామమ్ = అత్యంతము, యథాకామమ్ = దాని ఇష్టము వచ్చినట్లుగా, మే = నాయొక్క, శరీరే = శరీరమునందు, ప్రవర్తతామ్ = ప్రవర్తించుగాక, తు = కాని, అకామామ్ = కామములేని, త్వామ్ = నిన్ను, న స్ప్రక్ష్యామి = స్పృశించను.

తా. సీతా! రాక్షసధర్మ మీ విధముగా ఉన్నది. అయినను, నా శరీరమును కామము దాని ఇష్టము వచ్చినట్లు ఎంత పీడించినను, నీవు నాపై ప్రేమ కలుగు నంతవరకు నిన్ను స్పృశించను. 6

మూ. దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే,
ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూః శోకలాలసా. 7

ప్ర. అ. దేవి = ఓ దేవీ! ఇహ = ఈ విషయమునందు, భయమ్ = భయము, న కార్యమ్ = చేయదగినది కాదు, ప్రియే = ప్రియురాలా! మయి = నాయందు, విశ్వసిహి = విశ్వసించుము, తత్త్వేన = యథార్థముగా, ప్రణయస్వ = ప్రేమ గలదానవగుము, ఏవమ్ = ఇట్లు, శోకలాలసా = శోకముచేత వ్యాకులురాలవు, మా భూః = కాకుము.

తా. ఓ దేవీ! ఈ విషయమున భయపడవలసిన పని లేదు. ఓ ప్రియురాలా! నన్ను విశ్వసించుము. నన్ను నిజముగా ప్రేమించుము. ఈ విధముగా శోకపీడితురాలవు కాకుము. 7

మూ. ఏకవేణీ ధరాశయ్యా ధ్యానం మలినమమ్బరమ్,
అస్థానేఽప్యుపవాసశ్చ నైతాన్యౌపయికాని తే. 8

ప్ర. అ. ఏకవేణీ = ఒంటి జడ, ధరాశయ్యా = నేలపై పడక, ధ్యానమ్ =

చింతతో ఆలోచనము, మలినమ్ = మలిన మైన, అమ్బరమ్ = వస్త్రము, అస్థానే = తగని సమయమునందు, ఉపవాసశ్చ = ఉపవాసము, ఏతాని = ఇవి, తే = నీకు, ఔపయికాని = ఉపయోగించేవి, న = కావు.

తా. ఒంటి జడ, నేలపై పరుండుట, ఏదో ఆలోచన, మాసిన వస్త్రములు, నిష్కారణముగా ఉపవాసము చేయుట-ఇవి నీ కే మాత్రము తగినవి కావు. 8

మూ. విచిత్రాణి చ మాల్యాని చన్దనాన్యగరూణి చ
వివిధాని చ వాసాంసి దివ్యాన్యాభరణాని చ. 9

మహార్హాణి చ పానాని శయనాన్యాసనాని చ
గీతం నృత్తం చ వాద్యం చ లభ మాం ప్రాప్య మైథిలి.

ప్ర. అ. మైథిలి = సీతా! మామ్ = నన్ను, ప్రాప్య = పొంది, విచిత్రాణి = విచిత్రము లైన, మాల్యాని = మాలలను, చన్దనాని = చందనములను, అగరూణి = అగురువులను, వివిధాని = అనేకవిధము లైన, వాసాంసి చ = వస్త్రములను, దివ్యాని = శ్రేష్ఠము లైన, ఆభరణాని చ = అలంకారములను, మహార్హాణి = శ్రేష్ఠము లైన, పానాని = పానములనూ, శయనాని = శయనములను, ఆసనాని చ = ఆసనములను, గీతమ్ = గీతమును, నృత్తం చ = నృత్తమును, వాద్యం చ = వాద్యమును, లభ = పొందుము.

తా. సీతా! నీవు నన్ను పొందినచో, నీకు విచిత్రము లైన మాలలు, చందనములు, అగురువు, అనేకవిధము లైన వస్త్రములు, శ్రేష్ఠము లైన ఆభరణములు, ఉత్తమము లైన మద్యములు, శయనములు, ఆసనములు, గీతము, నృత్తము, వాద్యము లభించగలవు. 9, 10

మూ. స్త్రీరత్నమసి మైవం భూః కురు గాత్రేషు భూషణమ్,
మాం ప్రాప్య హి కథం ను స్యాస్త్వమనర్హా సువిగ్రహే.

ప్ర. అ. స్త్రీరత్నమ్ = స్త్రీలలో రత్నము, అసి = అయి ఉన్నావు. ఏవమ్ = ఇట్లు, మా భూః = ఉండకుము. గాత్రేషు = అవయవములందు, భూషణమ్ = అలంకారమును, కురు = చేయుము, సువిగ్రహే = అందమైన శరీరము

కలదానా! మామ్ = నన్ను, ప్రాప్య = పొంది, త్వమ్ = నీవు, అనర్హా = సుఖ భోగాదులకు అనర్హురాలవు, కథం ను = ఎట్లు, స్యాః = అగుదువు?

తా. సుందర మైన శరీరము గలదానా! నీవు స్త్రీలలో రత్న మైన దానవు. ఈ విధముగా ఉండకూడదు. అవయవములపై అలంకారములను ధరించుము. నన్ను పొందిన పిమ్మట కూడ నీవు భోగాదు లనుభవించుటకు అయోగ్యురాలవు ఎట్లగుదువు?

మూ. ఇదం తే చారు సంజాతం యౌవనం వ్యతివర్తతే,
యదతీతం పునర్నైతి స్రోతః శీఘ్రమపామివ. 12

ప్ర. అ. చారు = సుందరముగా, సంజాతమ్ = పుట్టిన, ఇదమ్ = ఈ, తే యౌవనమ్ = నీ యౌవనము, వ్యతివర్తతే = గడచిపోవుచున్నది; యత్ = ఏ యౌవనము, శీఘ్రమ్ = శీఘ్రముగా, అతీతమ్ = గడచిపోయినదై, అపామ్ = ఉదకముల, స్రోతః ఇవ = ప్రవాహము వలె, పునః = మరల, నైతి = తిరిగిరాదో.

తా. మనోహర మైన నీ యౌవనము గడచిపోవుచున్నది. అది శీఘ్రముగా గడచిపోయిన పిమ్మట, ప్రవహించి వెళ్ళిపోయిన జలము వలె, వెనుకకు మరలి రాదు. 12

మూ. త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృక్,
న హి రూపోపమా హ్యన్యా తవాస్తి శుభదర్శనే. 13

ప్ర. అ. శుభదర్శనే = మంగళకర మైన దర్శనము కలదానా! రూపకర్తా = రూపమును సృజించిన, సః = ఆ, విశ్వసృక్ = ప్రపంచమును సృష్టించిన బ్రహ్మదేవుడు, త్వామ్ = నిన్ను, కృత్వా = చేసి, ఉపరతః = విరమించినాడు అని, మన్యే = తలచెదను. అన్యా = మరి యొక, తవ రూపోపమా = నీ రూపమునకు సాటి, నాస్తి హి = లేదు కదా.

తా. మంగళకర మైన దర్శనము కలదానా! సౌందర్యనిర్మాత యైన ఆ సృష్టికర్త నిన్ను సృజించిన పిమ్మట, ఇక సౌందర్యమును నిర్మించుట విరమించినాడని అనుకొనుచున్నాను. కావుననే నీ సౌందర్యమును పోలిన సౌందర్యము మరొకటి లేదు. 13

మూ. త్వాం సమాసాద్య వైదేహి రూపయౌవనశాలినీమ్,
కః పుమానతివర్తేత సాక్షాదపి పితామహః. 14

ప్ర. అ. వైదేహి = సీతా! రూపయౌవనశాలినీమ్ = రూపముతోను, యౌవనముతోను ప్రకాశించుచున్న, త్వామ్ = నిన్ను, సమాసాద్య = పొంది, సాక్షాత్ = సాక్షాత్తూ, పితామహః = బ్రహ్మదేవుడే అయినా, కః = ఏ, పుమాన్ = పురుషుడు, అతివర్తేత = అతిక్రమించును (విడిచిపెట్టును).

తా. సీతా! రూపయౌవనములతో ప్రకాశించుచున్న నిన్ను చూచినచో సాక్షాత్తు బ్రహ్మదేవుడు కూడ విడిచిపెట్టడు. ఇతరుల మాట చెప్పవలెనా? 14

మూ. యద్యత్పశ్యామి తే గాత్రం శీతాంశుసదృశాననే,
తస్మింస్తస్మిన్ పృథుశ్రోణి చక్షుర్మమ నిబధ్యతే. 15

ప్ర. అ. శీతాంశుసదృశాననే = చంద్రునితో సమానమైన ముఖము గలదానా! పృథుశ్రోణి = పెద్ద కటిప్రదేశము గలదానా! తే = నీయొక్క, యద్యత్ = ఏ యే, గాత్రమ్ = అవయవమును, పశ్యామి = చూచుచున్నానో, తస్మిన్ తస్మిన్ = ఆ యా అవయవమునందు, మమ = నాయొక్క, చక్షుః = నేత్రము, నిబధ్యతే = కట్టబడుచున్నది.

తా. చంద్రునితో సమానమైన ముఖము, పెద్ద కటిప్రదేశము గలదానా! సీతా! నా దృష్టి నీ ఏ యే అవయవముపైన ప్రసరించుచున్నదో దానిపైననే నిలిచిపోవుచున్నది. 15

మూ. భవ మైథిలి భార్యా మే మోహమేనం విసర్జయ,
బహ్వీనాముత్తమస్త్రీణా మాహృతానామితస్తతః. 16
సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ.

ప్ర. అ. మైథిలి = సీతా! మే = నాయొక్క, భార్యా = భార్యవు, భవ = అగుము, ఏనమ్ = ఈ, మోహమ్ = అజ్ఞానమును, విసర్జయ = విడిచిపెట్టుము. ఇతస్తతః = ఆ యా ప్రాంతములనుండి, ఆహృతానామ్ = తీసికొనిరాబడిన, బహ్వీనామ్ = అనేకమైన, మమ = నాయొక్క, ఉత్తమస్త్రీణామ్ = ఉత్తమస్త్రీలలో, సర్వాసామేవ = అందరిలో, అగ్రమహిషీ = ప్రధానురాలవైన పట్టపురాణివి, భవ = అగుము. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. మైథిలీ! ఈ తెలివితక్కువతనమును విడచి, నాకు భార్యవు అగుము. నేను అనేక దేశములనుండి ఎందరినో ఉత్తమస్త్రీలను తీసికొని వచ్చి ఉన్నాను. నీవు, వారందరిలో ప్రధానురాలైన పట్టమహిషివి అగుము. నీకు భద్రము అగుగాక. 16

మూ. లోకేభ్యో యాని రత్నాని సంప్రమథ్యాహృతాని వై, 17
తాని మే భీరు సర్వాణి రాజ్యం చైతదహం చ తే.

ప్ర. అ. భీరు = భయస్వభావము కలదానా! లోకేభ్యః = లోకములనుండి, యాని = ఏ, రత్నాని = రత్నములు, సంప్రమథ్య = బలాత్కారము చేసి, ఆహృతాని వై = తీసికొనిరాబడినవో, తాని = అవి, సర్వాణి = అన్నీ, మే = నాయొక్క, ఏతత్ = ఈ, రాజ్యమ్ = రాజ్యమూ, అహం చ = నేనూ, తే = నీకు సంబంధించినవారము.

తా. ఓ భయస్వభావము గలదానా! ఆయా లోకములను జయించి నేను తీసికొని వచ్చిన అన్ని శ్రేష్ఠవస్తువులూ, ఈ రాజ్యమూ, నేనూ కూడ నీకు చెందినవారము. 17

మూ. విజిత్య పృథివీం సర్వాం నానానగరమాలినీమ్, 18
జనకాయ ప్రదాస్యామి తవ హేతోర్విలాసిని.

ప్ర. అ. విలాసిని = విలాస కలదానా! నానానగరమాలినీమ్ = అనేక నగరముల సముదాయముతో కూడిన, సర్వామ్ = సమస్తమైన, పృథివీమ్ = భూమిని, విజిత్య = జయించి, తవ హేతోః = నీ నిమిత్తము, జనకాయ = జనక మహారాజునకు, ప్రదాస్యామి = ఇవ్వగలను.

తా. ఓ! విలాసినీ! అనేకనగరములతో కూడిన ఈ భూమి నంతను నీకు గాను జయించి, నీ తండ్రియైన జనకునకు ఇచ్చెదను. 18

మూ. నేహ పశ్యామి లోకేఽన్యం యో మే ప్రతిబలో భవేత్,
పశ్య మే సుమహద్వీర్యమప్రతిద్వన్ద్వమాహవే.

ప్ర. అ. యః = ఎవడు, మే = నాకు, ప్రతిబలః = ఎదిరించువాడు, భవేత్ = అగునో, అట్టి, అన్యమ్ = మరి యొకనిని, ఇహ లోకే = ఈ లోకము

నందు, న పశ్యామి = చూడను. ఆహవే = యుద్ధమునందు, అప్రతిద్వన్ద్వమ్ = ఎదిరించువాడు లేని, మే = నాయొక్క, సుమహత్ = చాల గొప్పదైన, వీర్యమ్ = పరాక్రమమును, పశ్య = చూడుము.

తా. ఈ లోకములో నన్నెదిరింపగలిగినవా డెవ్వడూ కనబడడు. యుద్ధములో ఎదిరించువా రెవ్వరూ లేని నా మహాపరాక్రమము ఎంతటిదో గుర్తించుము. 19

మూ. అసకృత్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః, 20
అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః.

ప్ర. అ. మయా = నాచేత, అసకృత్ = అనేకపర్యాయములు, సంయుగే = యుద్ధమునందు, భగ్నాః = ఓడింపబడినవారూ, విమృదితధ్వజాః = నలగగొట్టబడిన ధ్వజములు గలవారూ అయిన, సురాసురాః = దేవతలు రాక్షసులూ కూడ, మమ = నాయొక్క, ప్రత్యనీకేషు = ఎదుటి సేనలయందు, స్థాతుమ్ = నిలబడుటకు, అశక్తాః = అసమర్థులు.

తా. నేను ఎన్నో పర్యాయములు, యుద్ధములలో సురులను అసురులనూ కూడ ఓడించి వారి ధ్వజములను ఛేదించినాను. వారెవ్వరూ నా శత్రుసేనలలో (శత్రువులుగా) నిలబడజాలరు. 20

మూ. ఇచ్ఛ మాం క్రియతామద్య ప్రతికర్మ తవోత్తమమ్, 21
సప్రభాణ్యవసజ్యన్తాం తవాఙ్గే భూషణాని చ,
సాధు పశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా. 22

ప్ర. అ. మామ్ = నన్ను, ఇచ్ఛ = కోరుము. అద్య = ఇప్పుడు, తవ = నీయొక్క, ఉత్తమమ్ = ఉత్తమమైన, ప్రతికర్మ = అలంకరణము, క్రియతామ్ = చేయబడుగాక. తవ = నీయొక్క, అఙ్గే = శరీరమునందు, సప్రభాణి = కాంతితో కూడిన, భూషణాని చ = అలంకారములు, అవసజ్యన్తామ్ = కూర్చబడుగాక. ప్రతికర్మణా = అలంకరణముతో, యుక్తమ్ = కూడిన, తే = నీయొక్క, రూపమ్ = రూపమును, సాధు = బాగుగా, పశ్యామి = చూచెదను.

తా. నాపైన ప్రేమ చూపుము. ఇప్పుడు ఉత్తమమైన అలంకరణము.

చేసికొనుము. నీ శరీరముపైని కాంతి గల అలంకారములను ధరింతుము. నీవు చక్కగా అలంకరించుకొని యుండగా నీ రూపము చూడవలె నని యున్నది. 22

మూ. ప్రతికర్మాభిసంయుక్తా దాక్షిణ్యేన వరాననే,
భుఙ్క్ష్వ భోగాన్యథాకామం పిబ భీరు రమస్వ చ. 23

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠ మైన ముఖము గలదానా! భీరు = భయస్వభావము కలదానా! దాక్షిణ్యేన = సరళ మైన స్వభావముతో, ప్రతికర్మాభిసంయుక్తా = అలంకరణముతో కూడుకొన్నదాన వై, యథాకామమ్ = ఇష్టము వచ్చినట్లుగా, భోగాన్ = భోగములను, భుఙ్క్ష్వ = అనుభవింపుము. పిబ = త్రాగుము. రమస్వ చ = క్రీడింపుము.

తా. అంద మైన ముఖము గల ఓ! భయస్వభావురాలా! సరళ మైన ప్రవృత్తిని అవలంబించి, చక్కగా అలంకరించుకొని, నీ కిష్టము వచ్చినట్లు భోగము లనుభవింపుము; త్రాగుము; ఆనందముగా ఉండుము. 23

మూ. యథేచ్ఛం చ ప్రయచ్ఛ త్వం పృథివీం వా ధనాని చ,
లలస్వ మయి విస్రబ్ధా ధృష్టమాజ్ఞాపయస్వ చ. 24

ప్ర. అ. త్వమ్ = నీవు, పృథివీమ్ = భూమిని, ధనాని చ = ధనములను, యథేచ్ఛమ్ = నీకు ఇచ్ఛవచ్చినట్లు, ప్రయచ్ఛ = దానము చేయుము. విస్రబ్ధా = విశ్వాసము కలదాని వై, మయి = నా విషయమునందు, లలస్వ = క్రీడింపుము. ధృష్టమ్ = నిర్భయముగా, ఆజ్ఞాపయస్వ చ = ఆజ్ఞాపింపుము కూడ.

తా. నీ కిష్ట మైన వారికి భూములను, ధనములను పంచిపెట్టుము. విశ్వాసముతో నన్ను కలిసి ఆనందించుము. నిర్భయముగా నన్ను ఆజ్ఞాపించుము. 24

మూ. మత్ప్రసాదాల్లలన్త్యాశ్చ లలన్తాం బాన్ధవాస్తవ,
బుద్ధిం మమానుపశ్య త్వం శ్రియం భద్రే యశశ్చ మే.

ప్ర. అ. మత్ప్రసాదాత్ = నా అనుగ్రహము వలన, లలన్త్యాః = క్రీడించుచున్న, తవ = నీయొక్క, బాన్ధవాః = బంధువులు, లలన్తామ్ = క్రీడించెదరు

గాక, భద్రే = మంగళప్రదురాలా! త్వమ్ = నీవు, మమ = నాయొక్క, ఋద్ధిమ్ = ఐశ్వర్యమును, మే = నాయొక్క, యశశ్చ = కీర్తినీ, అనుపశ్య = చూడుము.

తా. నా అనుగ్రహముచేత, నీతో పాటు నీ బంధువులు కూడ ఆనందించెదరు గాక. ఓ మంగళప్రదురాలా! నా కెంత ఐశ్వర్యము, కీర్తి ఉన్నవో చూడుము। 25

మూ. కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా,
నిక్షిప్తవిజయో రామో గతశ్రీర్వనగోచరః. 26
వ్రతీ స్థణ్డిలశాయీ చ శఙ్కే జీవతి వా న వా.

ప్ర.అ. సుభగే = ఓ సుందరీ, చీరవాససా = నారబట్టలను ధరించిన, రామేణ = రామునితో, కిమ్ = ఏమి, కరిష్యసి = చేయగలవు? నిక్షిప్తవిజయః = విడువబడిన జయము కలవాడూ, గతశ్రీః = పోయిన రాజ్యలక్ష్మి కలవాడు, వనగోచరః = వనమునందు సంచరించుచున్నవాడు, వ్రతీ = తాపసవ్రతమును అవలంబించిన వాడు, స్థణ్డిలశాయీ చ = నేలపై పరుండువాడు అయిన, రామః = రాముడు, జీవతి వా = జీవించి ఉన్నాడా, న వా = లేదా అని, శఙ్కే = సందేహించుచున్నాను.

తా. ఓ సుందరీ! నారబట్టలు కట్టుకునే రామునితో ఏమి చేసెదవు? విజయము లేక, ఐశ్వర్యము కోల్పోయి, వనములో నివసించుచు, మునివ్రతము అవలంబించి నేలపై పండుకొనే ఆ రాముడు జీవించి ఉన్నారా లేదా అనునది కూడ సందిగ్ధమే। 26

మూ. న హి వైదేహి రామస్త్వాం ద్రష్టుం వాప్యుపలప్స్యతే.
పురోబలాకైరసితైర్మేఘైర్జ్యోత్స్నామివావృతామ్.

ప్ర. అ. వైదేహి = సీతా! రామః = రాముడు, త్వామ్ = నిన్ను, పురోబలాకైః = ముందుభాగమునందు కొంగలు గల, అసితైః = నల్లని, మేఘైః = మేఘములచేత, ఆవృతామ్ = కప్పబడిన, జ్యోత్స్నామివ = వెన్నెలను వలె, ద్రష్టుం వాపి = చూచుటకు కూడ, న హి ఉపలప్స్యతే = అవకాశమును పొందజాలడు కదా।

తా. ఓ! సీతా! ఎదుట కొంగలు ఎగురుచున్న నల్లని మేఘములు కప్పివేసిన వెన్నెలను వలె నిన్ను చూచుటకు కూడ రామునికి శక్యము కాదు. 27

మూ. న చాపి మమ హస్తాత్త్వాం ప్రాప్తుమర్హతి రాఘవః, 28
హిరణ్యకశిపుః కీర్తిమిన్ద్రహస్తగతామివ.

ప్ర. అ. హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, ఇన్ద్రహస్తగతామ్=ఇంద్రుని హస్తమును పొందిన, కీర్తిమివ=కీర్తిని వలె, రాఘవః=రాముడు, మమ హస్తాత్=నా హస్తమునుండి, త్వామ్=నిన్ను, ప్రాప్తుమ్=పొందుటకు, న చాపి అర్హతి=తగడు కూడ.

తా. హిరణ్యకశిపుడు ఇంద్రుని చేతిలో చిక్కిన తన భార్య యైన కీర్తిని పొంద గలిగినాడు. కాని రాముడు మాత్రము నా చేతిక్కిన నిన్ను పొంద జాలడు. 28

మూ. చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని, 29
మనో హరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా.

ప్ర అ. చారుస్మితే=అంద మైన చిరునవ్వు గలదానా! చారుదతి= అంద మైన పలువరస గలదానా! చారునేత్రే= అంద మైన నేత్రములు గలదానా! విలాసిని=విలాస గలదానా! భీరు = భయస్వభావము గలదానా! సుపర్ణః = గరుత్మంతుడు, పన్నగం యథా=సర్పమును వలె, మే = నాయొక్క, మనః = మనస్సును, హరసి=హరించుచున్నావు.

తా. చాల అంద మైన చిరునవ్వు, అంద మైన పలువరస, అంద మైన కన్ను, మనోహరము లైన విలాసలు గల, ఓ భయస్వభావవంతురాల వైన సీతా! గరుత్మంతుడు సర్పమును హరించి నట్లు, నా మనస్సును హరించుచున్నావు.

మూ. క్లిష్టకౌశేయవసనాం తన్వీమప్యనలంకృతామ్, 30
త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభామ్యహమ్.

ప్ర. అ. క్లిష్టకౌశేయవసనామ్=నలిగిపోయిన పట్టుచీర కట్టుకున్నదానవు. తన్వీమ్=కృశించినదానవు అయిన, త్వామ్=నిన్ను, అనలంకృతామపి = అలంకరించుకొనకున్నను, దృష్ట్వా=చూచి, అహమ్=నేను, స్వేషు=నాసంబంధ

మైన, దాశేషు=భార్యయందు, రతిమ్=ఆనందమును, నోపలభామి = పొందుట లేదు.

తా. నీవు నలిగిపోయిన పట్టువస్త్రము కట్టుకొని ఉన్నావు. చిక్కిపోయినావు. ఏ అలంకారములూ ధరించలేదు. నీవు ఇట్టి స్థితిలో ఉన్నను నిన్ను చూచిన పిదప నా భార్యల వలన ఆనందము పొంద జాలకున్నాను. 30

మూ. అన్తఃపురనివాసిన్యః స్త్రియః సర్వగుణాన్వితాః, 31
యావన్త్యో మమ సర్వాసామైశ్వర్యం కురు జానకి.

ప్ర. అ. జానకి=సీతా! మమ=నాయొక్క, అన్తఃపురనివాసిన్యః=అంతఃపురములో నివసించు, సర్వగుణాన్వితాః=సమస్తగుణములతో కూడిన, యావన్త్యః=ఎందరు, స్త్రియః=స్త్రీలు గలరో, సర్వాసామ్=అందరి విషయమునందూ, ఐశ్వర్యమ్=ఆధిపత్యమును, కురు=చేయుము.

తా. ఓ. సీతా! నా అంతఃపురములో ఉత్తమగుణవతులైన ఎందరో స్త్రీలు ఉన్నారు. వారి అందరిపైన నీవు ఆధిపత్యము వహించగలవు. 31

మూ. మమ హ్యసితకేశాన్తే త్రైలోక్యప్రవరాః స్త్రియః, 32
తాస్త్వాం పరిచరిష్యన్తి శ్రియమప్సరసో యథా.

ప్ర. అ. అసితకేశాన్తే = నల్లని కేశములు గలదానా! మమ = నాయొక్క, తాః = ఆ, త్రైలోక్యప్రవరాః = మూడు లోకములందు శ్రేష్ఠలైన, స్త్రియః = స్త్రీలు, అప్సరసః = అప్సరఃస్త్రీలు, శ్రియం యథా = లక్ష్మిని వలె, త్వామ్ = నిన్ను, పరిచరిష్యన్తి = ఉపచరించగలరు.

తా. నల్లని కేశపాశము గల ఓ సీతా! మూడులోకములందూ శ్రేష్ఠలైన నా స్త్రీలు అందరూ అప్సరఃస్త్రీలు లక్ష్మిని సేవించినట్లు నిన్ను సేవించగలరు. 32

మూ. యాని వైశ్రవణే సుభ్రు రత్నాని చ ధనాని చ, 33
తాని లోకాంశ్చ సుశ్రోణి మాం చ భుఙ్క్ష్వ యథాసుఖమ్.

ప్ర. అ. సుశ్రోణి = అందమైన కటిప్రదేశము గలదానా! సుభ్రు = అందమైన కనుబొమ్మలు కలదానా, వైశ్రవణే = కుబేరునియందు, యాని =

వి, రత్నాని=రత్నములు, ధనాని చ = ధనములూ ఉన్నవో, తాని = వాటినీ, లోకాంశ్చ = మూడులోకములను, మాం చ = నన్నూ, యథాసుఖమ్=సుఖము కలుగు నట్లుగా, భుక్ష్వ=అనుభవించుము.

తా. అందమైన కనుబొమ్మలూ, కటిప్రదేశమూ గల ఓ సీతా! కుబేరునికి సంబంధించిన రత్నములనూ, ధనములనూ, మూడు లోకములనూ, నన్నూ కూడ సుఖముగా అనుభవించుము. 33

మూ. న రామస్తపసా దేవి న బలేన న విక్రమైః, 34
న ధనేన మయా తుల్యస్తేజసా యశసాపి వా.

ప్ర. అ. దేవి = సీతా! రామః=రాముడు, తపసా=తపస్సుచేత, మయా = నాతో, న తుల్యః = సమానుడు కాడు. బలేన=బలముచేత, న = కాడు. విక్రమైః = పరాక్రమములచేత, న = కాడు. ధనేన = ధనముచేత గాని. తేజసా =తేజస్సుచేత గాని. యశసాపి వా=కీర్తిచేత గాని, న=సమానుడు కాడు.

తా. సీతా! రాముడు, తపస్సుచేత గాని, బలముచేత గాని, పరాక్రమముచేత గాని, ధనముచేత గాని, తేజస్సుచేత గాని, కీర్తిచేత గాని నాతో సమానుడు కాడు. 34

మూ. పిబ విహర రమస్వ భుంక్ష్వ భోగాన్
ధననిచయం ప్రదిశామి మేదినీం చ,
మయి లల లలనే యథాసుఖం త్వం
త్వయి చ సమేత్య లలన్తు బాన్ధవాస్తే. 35

ప్ర. అ. లలనే=విలాసస్వభావము గలదానా! ధననిచయమ్ = ధనసముదాయమును, మేదినీం చ = భూమినీ, ప్రదిశామి=ఇచ్చెదను, త్వమ్=నీవు, పిబ=త్రాగుము, విహర=విహరించుము. రమస్వ = క్రీడించుము. భోగాన్ = భోగములను, భుంక్ష్వ=అనుభవింపుము. యథాసుఖమ్ = సుఖముగా, మయి= నాయందు, లల=క్రీడించుము. తే=నీయొక్క, బాన్ధవాః=బంధువులు, సమేత్య =కలసి, త్వయి=నీయందు, లలన్తు=క్రీడించెదరు గాక.

తా. విలాసస్వభావము గల ఓ సీతా! నీకు ధనరాశులను, భూమిని ఇచ్చెదను. నీవు ఇష్టము వచ్చి నట్లు త్రాగుము విహరించుము; క్రీడించుము;

భోగములు అనుభవించుము; నాతో కలిసి ఆనందించుము. నీ బంధువు లందరూ కూడ నీతో కలిసి ఆనందించవచ్చును. ౩౫

మూ. కుసుమితతరుజాలసంతతాని
భ్రమరయుతాని సముద్రతీరజాని,
కనకవిమలహారభూషితాఙ్గీ
విహర మయా సహ భీరు కాననాని. ౩౬

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
వింశః సర్గః.

ప్ర. అ. భీరు = భయస్వభావము కలదానా ! కనకవిమలహారభూషితాఙ్గీ = బంగారు వికారములైన, స్వచ్ఛమైన హారములతో అలంకరింపబడిన దేహము కలదానవై, కుసుమితతరుజాలసంతతాని = పుష్పించిన వృక్షసముదాయములతో నిండినవీ, భ్రమరయుతాని = తుమ్మెదలతో కూడినవీ, సముద్రతీరజాని = సముద్ర తీరమునందు పుట్టినవీ అయిన, కాననాని = అరణ్యములను, మయా సహ = నాతో కూడ, విహర = విహరించుము.

తా. భయస్వభావము గల సీతా ! నీవు బంగారువికారములైన, ప్రకాశించుచున్న హారములను అలంకరించుకొని, నాతో కలిసి, పుష్పించిన వృక్షముల సముదాయములతో నిండినవి, తుమ్మెదలతో ధ్వనించుచున్నవి అయిన సముద్రతీరమునందలి ఉద్యానవనములలో విహరించుము. ౩౬

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో ఇరువదవ సర్గ సమాప్తము.

# అథ ఏకవింశః సర్గః

[“నీవు రామునితో పోల్చుటకు కూడ తగని తుచ్ఛుడవు” అని నిందించుచు సీత రావణుని బోధించుట].

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః,
ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ తతః శనైః. 1

ప్ర. అ. సీతా=సీత, రౌద్రస్య=భయంకరు డైన, తస్య=ఆ, రక్షసః=రాక్షసునియొక్క, తత్=ఆ. వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, ఆర్తా=పీడితురాలై, దీనస్వరా=దీన మైన స్వరము గలదై, దీనమ్=దీనముగా, శనైః=మెల్లగా, వచః=వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. భయంకరు డైన ఆ రావణుని మాటలు విని, సీత, దుఃఖించుచు, దీన మైన స్వరము కలదై, మెల్లగా, దీనముగా ఇట్లు పలికెను. 1

మూ. దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ,
చిన్తయన్తీ వరారోహా పతిమేవ పతివ్రతా. 2
తృణమన్తరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా.

ప్ర. అ. దుఃఖార్తా=దుఃఖముచేత పీడింపబడినదీ, తపస్వినీ=జాలిగొల్పు స్థితిలో నున్నదీ, వరారోహా=శ్రేష్ఠ మైన కటిప్రదేశము గలదీ, పతివ్రతా=పతివ్రతా, పతిమేవ=భర్తనే గూర్చి, చిన్తయన్తీ=ఆలోచించుచున్నదీ, శుచిస్మితా=తెల్లని చిరునవ్వు గలదీ అయిన, సీతా=సీత, రుదతీ=ఏడ్చుచున్న దై, వేపమానా=వణకిపోవుచున్న దై, తృణమ్=గడ్డిపరకను, అన్తరతః=మధ్య యందు ఉండునట్లు, కృత్వా=చేసి, ప్రత్యువాచ=బదులు చెప్పెను.

తా. అంద మైన కటి ప్రదేశము, తెల్లని చిరునవ్వు గల మహాపతివ్రత యైన ఆ సీత, దుఃఖపీడితురా లై, దయనీయ మైన స్థితిలో ఏడ్చుచు, భర్తనే

శించుచు, ప్రత్యక్షముగా రావణునితో మాటలాడుటకు ఇష్టము లేకపోవుటచే మధ్య ఒక గడ్డిపరకను అడ్డముగా ఉంచి, వణకిపోవుచు ఇట్లు పలికెను. 2

మూ. నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః, 3
న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్,

ప్ర. అ. మత్తః = నానుండి, మనః = మనస్సును, నివర్తయ = మరల్చు కొనుము. స్వజనే = నీ భార్యలయందు, మనః = మనస్సు, క్రియతామ్=చేయ బడుగాక. పాపకృత్ = పాపము చేయువాడు, సుసిద్ధిమివ = ఉత్తమ మైన సిద్ధిని వలె, మామ్=నన్ను, ప్రార్థయితుమ్ = ప్రార్థించుటకు, న యుక్తమ్ = యుక్తము కాదు.

తా. నీ మనస్సును నామీదనుంచి మరల్చి నీ భార్యలపై నిలుపుము. స్త్రీ భార్యలను ప్రేమించుము. పాపములే చేసినవాడు ఉత్తమ మైన సిద్ధిని ఎట్లు ఆశించకూడదో, అట్లే నీవు నన్ను ఆశించకూడదు. 3

మూ. అకార్యం న మయా కార్యమేకపత్న్యా విగర్హితమ్, 4
కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా.

ప్ర. అ. మహతి = గొప్ప, కులే = కులమునందు, జాతయా = పుట్టిన దానను, పుణ్యమ్ = పవిత్ర మైన, కులమ్=కులమును, సంప్రాప్తయా=పొందిన దానను, ఏకపత్న్యా = ఒకే భర్త కలదానను (పతివ్రతను) అయిన, మయా = నాచేత, విగర్హితమ్ = నిందింపబడిన, అకార్యమ్ = చెడ్డ పని, న కార్యమ్ = చేయదగినది కాదు.

తా. నేను ఉత్తమవంశములో పుట్టి, ఉత్తమ మైన వంశములోనికి కోడలుగా వెళ్ళితిని. పతివ్రతను. నింద్య మైన ఇట్టి అకార్యమును నేను చేయ జాలను. 4

మూ. ఏవముక్త్వా తు వైదేహీ రావణం తం యశస్వినీ, 5
రాక్షసం పృష్ఠతః కృత్వా భూయో వచనమబ్రవీత్.

ప్ర. అ. యశస్వినీ=కీర్తి గల, వైదేహీ=సీత, తం రావణమ్=ఆ రావ ణుని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రాక్షసమ్=ఆ రాక్షసుని, పృష్ఠతః

వెనుకకు, కృత్వా=చేసి, భూయః=మరల, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. కీర్తిమంతురాలైన సీత రావణునితో ఇట్లు పలికి అతని వైపు వీపు త్రిప్పి, మరల ఇట్లు పలికెను. ౫

మూ. నాహమౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ, 6
సాధు ధర్మమవేక్షస్వ సాధు సాధువ్రతం చర.

ప్ర. అ. పరభార్యా=పరభార్యను, సతీ=పతివ్రతను అయిన, అహమ్=నేను, తవ=నీకు, ఔపయికీ=తగిన, భార్యా=భార్యను, న=కాను, ధర్మమ్=ధర్మమును, సాధు=బాగుగా, అవేక్షస్వ=పరిశీలింపుము, సాధువ్రతమ్=సత్పురుషుల వ్రతమును, సాధు=చక్కగా, చర=ఆచరింపుము.

తా. పరభార్యను, పతివ్రతను అయిన నేను నీకు తగిన భార్యను కాను. ధర్మమును బాగుగా చూడుము. సత్పురుషు లనుసరించు నియమములను చక్కగా పాటింపుము. 6

మూ. యథా తవ తథాన్యేషాం దారా రక్ష్యా నిశాచర,
ఆత్మానముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్.

ప్ర. అ. నిశాచర=ఓ! రాక్షసుడా! తవ=నీ భార్యలు, యథా=ఎట్లో, అన్యేషామ్=ఇతరులయొక్క, దారాః=భార్యలు, తథా=అట్లే, రక్ష్యాః=రక్షింప దగినవారు. ఆత్మానమ్=తననే, ఉపమామ్=ఉపమానముగా, కృత్వా=చేసికొని, స్వేషు=తన సంబంధమైన, దారేషు=భార్యలయందు, రమ్యతామ్=రమింప బడుగాక.

తా. ఓ రాక్షసుడా! నీ భార్యలు ఎట్లు రక్షింపదగినవారో ఇతరుల భార్యలు కూడ అట్లే రక్షింపదగినవారు. అందుచేత నిన్నే ఉపమానము చేసి చూచుకొని, నీ భార్యలను ఇతరులు అభిమర్శించినచో నీ కెట్లుండునో అట్లే నీవు ఇతరుల భార్యలను అభిమర్శించినచో వారి కుండు నను విషయము గ్రహించి, నీ భార్యలతో నీవు రమింపుము. 7

మూ. అతుష్టం స్వేషు దారేషు చపలం చలితేన్ద్రియమ్, ౮
నయన్తి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవమ్.

ప్ర. అ. స్వేషు = తన సంబంధ మైన, దారేషు = భార్యలయందు, అతుష్టమ్=సంతృప్తి చెందనివాడూ, చపలమ్ = చపలస్వభావము కలవాడూ, చలితేన్ద్రియమ్=చలించిన ఇంద్రియములు కలవాడూ అయిన, నికృష్టప్రజ్ఞమ్= నీచబుద్ధి గలవానిని, పరదారాః=పరభార్యలు, పరాభవమ్ = పరాభవమును, నయన్తి=పొందింతురు.

తా. చపలస్వభావుడై, తన భార్యలతో సంతృప్తి చెందక ఇంద్రియ నిగ్రహము లేకుండా ఉన్న నీచబుద్ధి కలవానిని, పరభార్యలు పరాభవమును పొందింతురు. (అనగా పరదారాసక్తి వాని పతనమునకు హేతు వగును). 8

మూ. ఇహ సన్తో న వా సన్తి సతో వా నానువర్తసే, 9
తథాహి విపరీతా తే బుద్ధిరాచారవర్జితా.

ప్ర. అ. ఇహ=ఈ దేశములో, సన్తః = సత్పురుషులు, న వా సన్తి= లేరా ? సతః=ఉన్నవారిని, నానువర్తసే వా=నీవు అనుసరించుటలేదా ? తథా హి=అది యుక్తమే (ఎందుచేత ననగా), ఆచారవర్జితా=సదాచారముతో శూన్య మైన, తే=నీయొక్క, బుద్ధిః=బుద్ధి, విపరీతా=విపరీతముగా ఉన్నది.

తా. నీ బుద్ధి సత్ప్రవర్తన లేక విపరీతముగా ప్రసరించుచున్నది; ఈ దేశములో నీకు సద్బుద్ధి బోధించే మంచివారే లేరా, ఉన్నా వారి మాటను నీవు వినుటలేదా ? 9

మూ. వచో మిథ్యాప్రణీతాత్మా పథ్యముక్తం విచక్షణైః, 10
రాక్షసానామభావాయ త్వం వా న ప్రతిపద్యసే.

ప్ర. అ. మిథ్యాప్రణీతాత్మా = అయుక్తమార్గమునందు నడపబడుచున్న బుద్ధి గల, త్వమ్=నీవు, విచక్షణైః=నీతియందు నేర్పు గలవారిచేత, ఉక్తమ్= చెప్పబడిన, పథ్యమ్=హిత మైన, వచః=వచనమును, రాక్షసానామ్=రాక్షసుల యొక్క, అభావాయ=నాశముకొరకు, న ప్రతిపద్యసే=గ్రహించుటలేదా ?

తా. ధర్మమార్గము తెలిసిన సత్పురుషులు నీకు హితము ఉపదేశించినా అధర్మమార్గమునందు ప్రవర్తించుచున్న చిత్తము గల నీవు, రాక్షసుల వినాశము దాపురించుటచే ఆ ఉపదేశమును లెక్కచేయుట లేదా.

మూ. అకృతాత్మానమాసాద్య రాజానమనయే రతమ్. 11
సమృద్ధాని వినశ్యన్తి రాష్ట్రాణి నగరాణి చ.

ప్ర. అ. అకృతాత్మానమ్ = అదుపులో ఉంచుకొనబడని బుద్ధిగలవాడు, అనయే = చెడు మార్గమునందు, రతమ్ = ఆసక్తి కలవాడూ అయిన, రాజానమ్ రాజును, ఆసాద్య = పొంది, సమృద్ధాని = ఐశ్వర్య సంపన్నము లైన, రాష్ట్రాణి = రాష్ట్రములు, నగరాణి చ = నగరములూ కూడ, వినశ్యన్తి = నశించును.

తా. మనస్సు అదుపులో లేక అమార్గమునందు ప్రవర్తించు రాజు పరిపాలనలో ఐశ్వర్యసంపన్నము లైన రాష్ట్రములు, నగరములూ కూడ నశించును. 11

మూ. తథేయం త్వాం సమాసాద్య లఙ్కా రత్నౌఘసంకులా.
అపరాధాత్తవైకస్య నచిరాద్వినశిష్యతి.

ప్ర. అ. తథా = ఆ విధముగా ఉన్న, త్వామ్ = నిన్ను, సమాసాద్య = పొంది, రత్నౌఘసంకులా = శ్రేష్ఠ మైన వస్తువుల సముదాయముతో నిండిన, ఇయమ్ = ఈ, లఙ్కా = లంక, ఏకస్య = ఒక్క, తవ = నీయొక్క, అపరాధాత్ = అపరాధమువలన, నచిరాత్ = కొద్ది కాలములో, వినశిష్యతి = నశించగలదు.

తా. అలాంటి నీవు రాజుగా దొరకుటచే సకలైశ్వర్యసంపన్న మైన ఈ లంక నీ ఒక్కని మూలమున, కొద్ది కాలములో నశించగలదు. 12

మూ. స్వకృతైర్హన్యమానస్య రావణాదీర్ఘదర్శినః. 13
అభినన్దన్తి భూతాని వినాశే పాపకర్మణః.

ప్ర. అ. రావణ = ఓ! రావణా! అదీర్ఘదర్శినః = దూర దృష్టి లేనివాడు, స్వకృతైః = తనచేత చేయబడిన దుష్కార్యములచేత, హన్యమానస్య = కొట్టబడుచున్నవాడు అయిన, పాపకర్మణః = పాపకర్మలు చేయువాని యొక్క, వినాశే = వినాశము కలిగినప్పుడు, భూతాని = ప్రాణులు, అభినన్దన్తి = సంతోషించును.

తా. దీర్ఘదృష్టి లేని పాపాత్ముడు, తను చేసిన పనులే దెబ్బ తీయగా నశించి పోవుచున్నపుడు, వానిని చూచి సకలప్రాణులు సంతోషింతురు. 13

మూ. ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యన్తి నికృతా జనాః,
దిష్ట్యైతద్ వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు నశించిన, పాపకర్మాణమ్=పాపకర్ములు గల, త్వామ్=నిన్ను గూర్చి, నికృతాః=నీచేత అవమానింపబడిన, జనాః=జనులు, హర్షితాః=సంతోషించినవారై, రౌద్రః=క్రూరుడైన రావణుడు, దిష్ట్యా=దైవవశముచేత, ఏతత్=ఈ, వ్యసనమ్=ఆపదను, ప్రాప్తః=పొందినాడు, ఇత్యేవ=అని, వక్ష్యన్తి=పలుకగలరు.

తా. పాపకర్మలు చేయుచున్న నీవు కూడ ఇట్లే నశింతగలవు. అప్పుడు నీచే పీడింపబడిన వారందరూ సంతోషింయుచు, "మన అదృష్టము కొలది ఈ క్రూరునికి ఇట్టి ఆపద వచ్చినది" అనుకొనెదరు. 14

మూ. శక్యా లోభయితుం నాహమైశ్వర్యేణ ధనేన వా. 15
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా.

ప్ర. అ. అహమ్=నేను, ఐశ్వర్యేణ=ఐశ్వర్యముచేత గాని, ధనేన వా=ధనముచేత గాని, లోభయితుమ్=లోభపెట్టుటకు. న శక్యా=శక్యమైన దానను కాను. ప్రభా=కాంతి, భాస్కరేణ యథా=సూర్యునితో వలె, అహమ్=నేను, రాఘవేణ=రామునితో, అనన్యా=వేరుకానిదానిని.

తా. ఐశ్వర్యమునూ, ధనమునూ, చూపించి నన్నెవరూ లోభపెట్టజాలరు. కాంతి సూర్యునినుండి ఏ విధముగా వేరు కాదో ఆ విధముగా నేను రామునినుండి వేరు కాను. 15

మూ. ఉపధాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్, 16
కథం నామోపధాస్యామి భుజమన్యస్య కస్య చిత్.

ప్ర. అ. లోకనాథస్య=సకలలోక ప్రభువైన, తస్య=ఆ రాముని యొక్క, సత్కృతమ్=పూజింపబడిన, భుజమ్=భుజమును, ఉపధాయ=తల

గడగా చేసికొని, అన్యస్య = ఇతరు డైన, కస్య చిత్ = ఏ ఒక్కనియొక్కయో, భుజమ్ = భుజమును, కథం నామ = ఎట్లు, ఉపధాస్యామి = తలగడగా గ్రహింప గలను?

తా. ఇంతకాలమూ, సకలలోకనాథు డైన ఆ రాముని భుజమును తల గడగా ఉపయోగించుకొని సుఖముగా నిద్రించిన నేను ఎవ్వరో మరొక్కని భుజమును తలగడగా ఎట్లు స్వీకరించగలను, 16

మూ. అహమౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః, 17
వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః.

ప్ర. అ. వ్రతస్నాతస్య = విద్యావ్రతస్నానము చేసిన, విదితాత్మనః = ప్రసిద్ధ మైన బుద్ధి గల, విప్రస్య = బ్రాహ్మణునకు, విద్యా ఇవ = విద్య వలె, అహమ్ = నేను, వసుధాపతేః = ఈ భూమి కంతకీ ప్రభు వైన, తస్యైవ = ఆ రామునకే, ఔపయికీ = తగిన, భార్యా = భార్యను.

తా. వేదాధ్యయనము చేయుటకు అవలంబించిన వ్రతమును పూర్తి చేసి కొన్న బ్రాహ్మణునకు ఆ వేదవిద్య ఏ విధముగా తగి యుండునో అట్లే నేను సమస్త మైన భూమికి ప్రభు వైన ఆ రామునకు మాత్రమే భార్య నగుటకు తగిన దానను. 17

మూ. సాధు రావణ రామేణ మాం సమానయ దుఃఖితామ్, 18
వనే వాశితయా సార్ధం కరేణ్వేవ గజాధిపమ్.

ప్ర. అ. రావణ = ఓ రావణా! దుఃఖితామ్ = దుఃఖితురాల నైన, మామ్ = నన్ను, గజాధిపమ్ = గజశ్రేష్ఠమును, వనే = వనమునందు, వాశితయా = ఆడు దైన, కరేణ్వేవ = ఏనుగుతోవలె, రామేణ సార్ధమ్ = రామునితో కూడ, సాధు = బాగుగా, సమానయ = చేర్పుము. (వాశితా శబ్దమునకు, స్త్రీలింగ, కరేణు శబ్దమునకు ఆడఏనుగ అనే అర్థము).

తా. ఓ రావణా! అరణ్యములో ఆడ ఏనుగును గజరాజుతో చేర్చి నట్లు, దుఃఖితురాల నైన నన్ను రామునితో చేర్పుము. అది యుక్తము. 18

మూ. మిత్రమౌపయికం కర్తుం రామః స్థానం పరీప్సతా, 19
వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః.

ప్ర. అ. అసౌ = ఈ, పురుషర్షభః = పురుషశ్రేష్ఠు డైన, రామః = రాముడు, స్థానమ్ = స్థానమును, పరీప్సగా = కోరుచున్నవాడవు, ఘోరమ్ = ఘోర మైన, వధమ్ = వధను, అనిచ్ఛతా చ = కోరని, త్వయా = నీచేత, మిత్రమ్ = స్నేహితుడుగా, కర్తుమ్ = చేయుటకు, ఔపయికమ్ = తగినది.

తా. నీవు నీ రాజ్యమునకు ప్రభువుగా ఉండవలె నన్నచో, ఘోర మైన మరణము పొందకుండా జీవింప వలె నన్నచో పురుషశ్రేష్ఠు డైన ఆ రామునితో స్నేహము చేసికొనుట మంచిది. 19

మూ. విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః। 20
తేన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి.

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మముల నెరిగిన, సః = అతడు, శరణాగత వత్సలః = శరణుజొచ్చినవారియందు ప్రేమ కలవాడుగా, విదితః హి = ప్రసిద్ధుడు కదా. జీవితుమ్ = జీవించుటకు, ఇచ్ఛసి యది = కోరిన దైతే, తే = నీకు, తేన = ఆ రామునితో, మైత్రీ = స్నేహము, భవతు = అగుగాక.

తా. ధర్మము లన్ని తెలిసిన ఆ రాముడు శరణాగతవత్సలు డను విషయము లోకప్రసిద్ధము. నీకు జీవింపవలె నను కోరిక ఉన్నచో ఆ రామునితో స్నేహము చేసికొనుము. 20

మూ. ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలమ్, 21
మాం చాస్మై నియతో భూత్వా నిర్యాతయితుమర్హసి.

ప్ర. అ. త్వమ్ = నీవు. శరణాగతవత్సలమ్ = శరణుజొచ్చిన వారిపై జాలిగల, ఏనమ్ = ఈ రాముని, ప్రసాదయస్వ చ = అనుగ్రహింప చేసుకొనుము. ప్రయతః = నియమవంతుడవు. భూత్వా = అయి, మామ్ = నన్ను, అస్మై = ఈ రామునకు, నిర్యాతయితుమ్ = తిరిగి అప్పజెప్పుటకు, అర్హసి = తగియున్నావు.

తా. శరణాగతవత్సలు డైన ఈ రాముని అనుగ్రహింపచేసుకొనుము, నన్ను యథావిధిగా మరల రామునకు సమర్పింపుము. 21

మూ. ఏవం హి తే భవేత్స్వస్తి సంప్రదాయ రఘూత్తమే, 22
అన్యథా త్వం హి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, రఘూత్తమే = రామునియందు (రామునకు), సంప్రదాయ = ఇచ్చి, తే = నీకు, స్వస్తి = క్షేమము, భవేత్ = అగును. రావణ = రావణా! త్వమ్ = నీవు, అన్యథా = మరి యొక విధముగా, కుర్వాణః = చేయువాడ వై, వధమ్ = వధను, ప్రాప్స్యసి = పొందగలవు.

తా. రావణా! ఈ విధముగా నన్ను రామునకు తిరిగి ఇచ్చివేసినచో నీకు క్షేమము కలుగును. నీవు మరొక విధముగా చేసినచో నీకు మరణము తప్పదు. 22

మూ. వర్జయేద్వజ్రముత్సృష్టం వర్జయేదన్తకశ్చిరమ్, 23
త్వద్విధం తు న సంక్రుద్ధో లోకనాథః స రాఘవః.

ప్ర. అ. త్వద్విధమ్ = నీవంటివానిని, ఉత్సృష్టమ్ = ప్రయోగింపబడిన, వజ్రమ్ = వజ్రాయుధము, వర్జయేత్ = విడిచిపెట్టవచ్చును, చిరమ్ = చిరకాలము, అన్తకః = యముడు కూడ, వర్జయేత్ = విడిచిపెట్టవచ్చును. సంక్రుద్ధః కోపించిన, లోకనాథః = లోకముల ప్రభు వైన, సః = ఆ, రాఘవః = రాముడు మాత్రము, న = విడిచిపెట్టడు.

తా. ఇంద్రుడు ప్రయోగించిన వజ్ర మైనను నీవంటివానిని ఏమీ చేయలేక విడిచిపెట్టవచ్చును; యముడు కూడ చాలకాలము పాటు విడిచిపెట్టవచ్చును. కోపము వచ్చినచో, ఆ లోకనాథు డైన రాముడు మాత్రము విడిచిపెట్టడు. 23

మూ. రామస్య ధనుషః శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనమ్,
శతక్రతువిసృష్టస్య నిర్ఘోషమశనేరివ. 24

ప్ర. అ. శతక్రతువిసృష్టస్య = దేవేంద్రునిచేత ప్రయోగింపబడిన, అశనేః = వజ్రాయుధముయొక్క, నిర్ఘోషమివ = మహాధ్వని వంటి, రామస్య = రామునియొక్క, ధనుషః = ధనస్సుయొక్క, మహాస్వనమ్ = గొప్ప ధ్వని గల, శబ్దమ్ = శబ్దమును, త్వమ్ = నీవు, శ్రోష్యసి = వినగలవు.

తా. నీవు అచిరకాలములో, ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధము ధ్వని వంటి, దిక్కులను పిక్కటిల చేయు రామధనుర్ధ్వనిని వినగలవు. 24

మూ. ఇహ శీఘ్రం సుపర్వాణో జ్వలితాస్యా ఇవోరగాః, 25
ఇషవో నిపతిష్యన్తి రామలక్ష్మణలక్షణాః.

ప్ర. అ. సుపర్వాణః = మంచి కణుపులు కలవీ, జ్వలితాస్యాః = ప్రజ్వలించుచున్న ముఖములు గల, ఉరగాః ఇవ = సర్పముల వలె ఉన్నవీ, రామలక్ష్మణలక్షణాః = రామలక్ష్మణుల చిహ్నములు గలవీ అయిన, ఇషవః = బాణములు, ఇహ = ఈ లంకానగరమునందు, నిపతిష్యన్తి = పడగలవు.

తా. గట్టి కణుపులతో, మండుచున్న ముఖములు గల సర్పముల వలె భయంకరములై, రామలక్ష్మణుల పేర్లతో చిహ్నితములైన బాణములు శీఘ్రకాలములో ఈ లంకానగరమునందు పడగలవు. 25

మూ. రక్షాంసి పరినిఘ్నన్తః పుర్యామస్యాం సమన్తతః, 26
అసంపాతం కరిష్యన్తి పతన్తః కఙ్కవాససః.

ప్ర. అ. కఙ్కవాససః = (సూటిగా వేగముగా పోవుటకై) గ్రద్ధ రెక్కలు కట్టిన బాణములు, అస్యామ్ = ఈ, పుర్యామ్ = పట్టణమునందు, సమన్తతః = అంతటా. రక్షాంసి = రాక్షసులను, పరినిఘ్నన్తః = కొట్టుచున్నవై, అసంపాతమ్ = చోటు లేకుండు నట్లు, కరిష్యన్తి = చేయగలవు.

తా. రామలక్ష్మణుల బాణములు, ఈ నగరములో అంతటా, రాక్షసులను చంపుచు, ఈ నగరము నంతను, కప్పివేయగలవు. 26

మూ. రాక్షసేన్ద్రమహాసర్పాన్ స రామగరుడో మహాన్ 27
ఉద్ధరిష్యతి వేగేన వైనతేయ ఇవోరగాన్.

ప్ర. అ. మహాన్ = గొప్పవాడైన, సః = ఆ, రామగరుడః = రాముడనే గరుత్మంతుడు, రాక్షసేన్ద్రమహాసర్పాన్ = రాక్షసు లనే మహాసర్పములను, వైనతేయః = గరుత్మంతుడు, ఉరగానివ = సర్పములను వలె, వేగేన = వేగముతో, ఉద్ధరిష్యతి = పెకలించివేయగలడు.

తా. గరుత్మంతుడు సర్పమును పెకలించివేసినట్లు రాము డనే ఆ గొప్ప బలశాలి యైన గరుత్మంతుడు రాక్షసు డనే సర్పమును పెకలించివేయగలడు.

మూ. అపనేష్యతి మాం భర్తా త్వత్తః శీఘ్రమరిందమః, 28
అసురేభ్యః శ్రియం దీప్తాం విష్ణుస్త్రిభిరివ క్రమైః.

ప్ర. అ. అరిందమః = శత్రువినాశకు డైన, భర్తా = నా భర్త, మామ్ = నన్ను, త్వత్తః = నీవద్దనుండి, విష్ణుః = విష్ణువు, త్రిభిః = మూడు, క్రమైః = పాదవిన్యాసములచేత, దీప్తామ్ = ప్రకాశించుచున్న, శ్రియమ్ = లక్ష్మిని, అసురేభ్యః ఇవ = రాక్షసులనుండి వలె, అపనేష్యతి = తీసికొనిపోగలడు.

తా. విష్ణువు మూడు అడుగులు వేసి, ప్రకాశించుచున్న లక్ష్మిని అసురులనుండి తీసికొనిపోయి నట్లు నా భర్త యైన రాముడు, శీఘ్రముగా నన్ను నీ వద్దనుండి తీసికొనిపోగలడు. 28

మూ. జనస్థానే హతస్థానే నిహతే రక్షసాం బలే, 29
అశక్తేన త్వయా రక్షః కృతమేతదసాధు వై.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, బలే = సైన్యము, నిహతే = చంపబడిన దగుచుండగా, జనస్థానే = జనస్థానము, హతస్థానే = హతుల స్థాన మైపోయిన దగుచుండగా, రక్షః = ఓ రాక్షసుడా! అశక్తేన = అశక్తుడ వైన, త్వయా = నీచేత, ఏతత్ = ఈ, అసాధు = చెడ్డ పని, కృతం వై = చేయబడినది.

తా. ఓ రాక్షసా! రాముడు రాక్షససైన్యమును చంపివేయుటచేత, జనస్థానము హతస్థానము (చచ్చినవాళ్ల స్థానము) అయినది. అప్పుడు నీ వేమీ చేయలేక ఈ చెడ్డ పని చేసితివి (నన్ను అపహరించితివి). 29

మూ. ఆశ్రమం తు తయోః శూన్యం ప్రవిశ్య నరసింహయోః,
గోచరం గతయోర్భ్రాత్రోరపనీతా త్వయాధమ.

ప్ర. అ. అధమ = ఓ నీచుడా! నరసింహయోః = నరశ్రేష్ఠు లైన, తయోః = ఆ, భ్రాత్రోః = సోదరులు, గోచరమ్ = వెలుపలి ప్రదేశమును గూర్చి, గతయోః = వెళ్ళినవా రగుచుండగా, శూన్యమ్ = వారు లేని, ఆశ్రమమ్ =

ఆశ్రమమును, ప్రవిశ్య = ప్రవేశించి, త్వయా = నీచేత, అపహృతా = అపహరింపఁ బడితిని.

తా. ఓరీ! నీచుఁడా! నరులలో శ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు ఇద్దరూ బైటకు పోయి నపుడు వారు లేని ఆశ్రమములో ప్రవేశించి, నీవు నన్ను అపహరించినావు. 30

మూ. న హి గన్ధముపాఘ్రాయ రామలక్ష్మణయోస్త్వయా. 31
శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయోరివ

ప్ర. అ. శునా = కుక్కచేత, శార్దూలయోరివ = పెద్దపులులయొక్క వలె, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులయొక్క, గన్ధమ్ = గంధమును, ఉపాఘ్రాయ = వాసనచూచి, త్వయా = నీచేత, సందర్శనే = వారి దృష్టిలో, స్థాతుమ్ = నిలచుట, న శక్యం హి = శక్యము కాదు కదా,

తా. పెద్ద పులుల గంధమును వాసన చూచిన కుక్క వాటి ఎదుట ఎట్లు నిలువఁగాలదో, అట్లే రామలక్ష్మణుల గంధము వాసన చూచిన పిమ్మట నీవు వారి ఎదుట నిలువఁగాలవు కదా!

మూ. తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణమస్థిరమ్, 32
వృత్రస్యేవేన్ద్రబాహుభ్యాం బాహోరేకస్య విగ్రహే.

ప్ర. అ. తస్య = అట్టి. తే = నీకు, తాభ్యామ్ = వారిద్దరితో, విగ్రహే = విరోధము కలుగగా, ఇన్ద్రబాహుభ్యామ్ = ఇంద్రుని రెండు బాహువులతో, వృత్రస్య = వృత్రాసురునియొక్క, ఏకస్య = ఒక్క, బాహోః = బాహువు యొక్క, విగ్రహే ఇవ = విరోధము కలిగినప్పుడు వలె, యుగగ్రహణమ్ = ప్రతిద్వంద్విగా ఉండుట, అస్థిరమ్ = స్థిరము కానిది.

తా. ఇంద్రుని రెండు బాహువులతో పోరాడవలసివచ్చి నప్పుడు వృత్రాసురుని ఒక్క బాహువు నిలవఁజాల నట్లు వారిద్దరితో వచ్చిన యుద్ధములో నీవు నిలవ గలుగుట కల్ల. 32

మూ. క్షిప్రం తవ స నాథో మే రామః సౌమిత్రిణా సహ, 33
తోయమల్పమివాదిత్యః ప్రాణానాదాస్యతే శరైః.

ప్ర. అ. మే నాథః = నా భర్త యైన, సః రామః = ఆ రాముడు, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడినవాడై, ఆదిత్యః = సూర్యుడు, అల్పమ్ = స్వల్ప మైన, తోయమివ = ఉదకమును వలె, శరైః = బాణములతో, తవ = నీ యొక్క, ప్రాణాన్ = ప్రాణములను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆదాస్యతే = గ్రహింపగలడు.

తా. అచిరకాలములో నా భర్త యైన రాముడు లక్ష్మణునితో కలిసి వచ్చి చాల తక్కువగా ఉన్న జలమును సూర్యుడు ఎండింపచేసినట్లు బాణములతో నీ ప్రాణములను తీసివేయగలడు. 33

మూ. గిరిం కుబేరస్య గతోఽథవాలయం
సభాం గతో వా వరుణస్య రాజ్ఞః,
అసంశయం దాశరథేర్న మోక్ష్యసే
మహాద్రుమః కాలహతోఽశనేరివ. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. కాలహతః = కాలముచేత హతుడ వైన నీవు, కుబేరస్య = కుబేరునియొక్క, గిరిమ్ = పర్వతమును గూర్చి, అథవా = లేక, ఆలయమ్ = అతని గృహమును గూర్చి, గతః = వెళ్ళినను, రాజ్ఞః = రాజైన, వరుణస్య = వరుణునియొక్క, సభామ్ = సభను గూర్చి, గతో వా = వెళ్ళినను, మహాద్రుమః = మహావృక్షము, అశనేరివ = పిడుగునుండి వలె, దాశరథేః = రామునినుండి, న మోక్ష్యసే = విడిపించుకొనజాలవు.

తా. నీవు నశించు కాలము సమీపించినది. మహావృక్షము దానిపై పడుచున్న పిడుగును ఏ విధముగా తప్పించుకొనజాలదో, అట్లే నీవు, కైలాస పర్వతమునకు పారిపోయినను, కుబేరుని అలకాపురికి వెళ్ళినను, రాజైన వరుణుని సభకు పారిపోయినను రామునినుండి తప్పించుకొనజాలవు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వావింశః సర్గః

[రావణుడు సీతకు రెండు మాసముల గడువు ఇచ్చుట, సీత రావణుని నిందించుట, రావణుడు సీతను భయపెట్టి, ఆమెను వశీంచు కొనవలసినదిగా రాక్షసస్త్రీలను ఆదేశించుట, స్త్రీలతో కలిసి అంతః పురమునకు పోవుట].

మూ. సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసేశ్వరః।
ప్రత్యువాచ తతః సీతాం విప్రియం ప్రియదర్శనామ్. 1

ప్ర. అ. రాక్షసేశ్వరః = రావణుడు, పరుషమ్ = పరుష మైన, సీతాయాః = సీతయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా = విని, తతః=పిమ్మట, ప్రియ దర్శనమ్ = ప్రియము వలె కనబడు, విప్రియమ్ = అప్రియ మైన వాక్యమును, సీతామ్=సీతనుగూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రావణుడు పరుషము లైన సీత మాటలు విని, పైకి ప్రియములుగా ఉన్నట్లు కనబడు అప్రియము లైన మాటలు ఈ విధముగా పలికెను. 1

మూ. యథా యథా సాన్త్వయితా వశ్యః స్త్రీణాం తథా తథా.
యథా యథా ప్రియం వక్తా పరిభూతస్తథా తథా. 2

ప్ర. అ. స్త్రీణామ్ = స్త్రీలకు, యథా యథా = ఏ యే విధముగా, సాన్త్వ యితా = బుజ్జగించువాడో, తథా తథా = ఆ యా విధముగా, వశ్యః = స్వాధీను డగును. యథా యథా = ఏ యే విధముగా, ప్రియమ్ = ప్రియమును, వక్తా = చెప్పువాడో, తథా తథా=ఆ యా విధముగా, పరిభూతః = తిరస్కరించబడును.

తా. స్త్రీలను బుజ్జగించిన కొలది పురుషుడు వాళ్ళకు స్వాధీను డగును. ఇతడు మనకు దాసు డని వాళ్ళు భావింతురు. మంచి మాటలు చెప్పిన కొలది అతనిని వాళ్ళు తిరస్కరించుచుందురు. 2

మూ. సంనియచ్ఛతి మే క్రోధం త్వయి కామః సముత్థితః,
ద్రవతోఽమార్గమాసాద్య హయానివ సుసారథిః. 3

ప్ర. అ. త్వయి=నీ విషయమున, సముత్థితః = ఉదయించిన, కామః = కామము, సుసారథిః = మంచి సారథి, అమార్గమ్=ఆ మార్గమును, ఆసాద్య = పొంది, ద్రవతః=పరుగెత్తుచున్న, హయానివ = గుఱ్ఱములను వలె, మే = నా యొక్క, క్రోధమ్=కోపమును, సంనియచ్ఛతి = అణచుచున్నది.

తా. నాకు నీయందున్న కామము, చెడు మార్గమునందు, పరుగెత్తుచున్న గుఱ్ఱములను సారథి నిగ్రహించినట్లు నా కోపమును అణచివేయుచున్నది. 3

మూ. వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల నిబధ్యతే,
జనే తస్మింస్త్వనుక్రోశః స్నేహశ్చ కిల జాయతే. 4

ప్ర. అ. మనుష్యాణామ్=మనుష్యులయొక్క, కామః = కామము, వామః =ప్రతికూలస్వభావము గలది. యస్మిన్=ఏ, జనే=జనునియందు, నిబధ్యతే = కట్టబడునో, తస్మిన్ = ఆ జనునియందు, అనుక్రోశః=జాలి, స్నేహశ్చ= స్నేహమూ, జాయతే కిల = కలుగుచుండును కదా.

తా. నిజముగా కామము ప్రతికూలస్వభావము కలది. ఎందుచేత ననగా ఏ వ్యక్తిపై కామము కలుగునో ఆ వ్యక్తిపై జాలి, స్నేహము కూడ కలుగు చుండును. 4

మూ. ఏతస్మాత్కారణాన్న త్వాం ఘాతయామి వరాననే,
వధార్హామవమానార్హాం మిథ్యాప్రవ్రజితే రతామ్. 5

ప్ర. అ. వరాననే = సుందరమైన ముఖము గలదానా, ఏతస్మాత్=ఈ, కారణాత్=కారణమువలననే, వధార్హామ్=వధకు తగినదానవూ, అవమానార్హామ్ = అవమానమునకు తగినదానవూ, మిథ్యాప్రవ్రజితే = కపటవనవాసము చేయు రామునియందు, రతామ్ = ఆసక్తి గలదానవూ అయిన, త్వామ్=నిన్ను, న ఘాతయామి=చంపించుటలేదు.

తా. సుందరమైన ముఖము గల సీతా! కపటవనవాసము చేయు

రామునియందు ఆసక్తురాలవై, అవమానించుటకు, చంపుటకూ, తగిన నిన్ను ఈ కారణముచేతనే చంపించలేకుండా ఉన్నాను. 5

మూ. పరుషాణీహ వాక్యాని యాని యాని బ్రవీషి మామ్,
తేషు తేషు వధో యుక్తస్తవ మైథిలి దారుణః. 6

ప్ర. అ. మైథిలి = సీతా। ఇహ = ఇక్కడ, మామ్ = నన్ను గూర్చి, యాని యాని = ఏ యే, పరుషాణి = పరుషము లైన, వాక్యాని = వాక్యములను, బ్రవీషి = పలుకుచున్నావో, తేషు తేషు = ఆ యా వాక్యములయందు, తవ = నీ యొక్క, దారుణః = భయంకర మైన, వధః = వధ, యుక్తః = తగినది

తా. మైథిలీ, నీవు నాతో పలికిన పరుష మైన ఒక్కొక్క మాటకు నిన్ను క్రూరముగా వధించవలసి ఉన్నది. 6

మూ. ఏవముక్త్వా తు వైదేహీం రావణో రాక్షసాధిపః,
క్రోధసంరమ్భసంయుక్తః సీతాముత్తరమబ్రవీత్. 7

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షసరా జైన, రావణః = రావణుడు, వైదేహీమ్ = సీతను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, క్రోధసంరమ్భసంయుక్తః = కోపముతోను తొందరతోను కూడినవా డై, సీతామ్ = సీతను గూర్చి, ఉత్తరమ్ = మరియొక మాటను, అబ్రవీత్ = పలికెను.

తా. రాక్షసరా జైన రావణుడు సీతతో ఈ విధముగా, పలికి కోపముతోను, తొందరతోను కూడినవాడై ఆమెతో మరల ఈ మాట పలికెను. 7

మూ. ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యోఽవధిస్తే మయా కృతః,
తతః శయనమారోహ మమ త్వం వరవర్ణిని. 8

ప్ర. అ. మయా = నాచేత, తే = నీకు, యః = ఏ, అవధిః = అవధి, కృతః = చేయబడినదో ఆ, ద్వౌ = రెండు, మాసౌ = మాసములు, మే = నాకు, రక్షితవ్యౌ = రక్షింపదగినవి. వరవర్ణిని = శ్రేష్ఠ మైన వర్ణము గల సీతా। తతః = అటు పిమ్మట, మమ = నాయొక్క, శయనమ్ = శయనమును, ఆరోహ = ఎక్కుము.

తా. నేను నీకు రెండు మాసముల గడువు ఇచ్చుచున్నాను. ఆ గడువును నేను పాలింపవలసి ఉన్నది. ఓ అంత మైన వర్ణము గలదానా! ఆ గడువు దాటిన వెంటనే నీవు నా శయనము పైకి రావలెను. 8

మూ. ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మామనిచ్ఛతీమ్,
మమ త్వాం ప్రాతరాశార్థమాలభన్తే మహానసే. 9

ప్ర. అ. ద్వాభ్యామ్=రెండు, మాసాభ్యామ్=మాసములకంటె. ఊర్ధ్వమ్=పైన, మామ్=నన్ను, భర్తారమ్=భర్తనుగా, అనిచ్ఛతీమ్=ఇచ్ఛయించని, త్వామ్=నిన్ను, మమ=నాయొక్క, ప్రాతరాశార్థమ్=ప్రాతఃకాలభోజనము కొరకు, మహానసే=వంటయింట్లో, ఆలభన్తే=చంపివేయగలరు.

తా. ఈ గడువు లోగా నీవు నన్ను భర్తగా అంగీకరించకపోయినచో, రెండు మాసముల పిదప నిన్ను నా ప్రాతఃకాలభోజనార్థము వంటింటికి తీసికొనివెళ్ళి చంపివేయగలరు. 9

మూ. తాం తర్జ్యమానాం సంప్రేక్ష్య రాక్షసేన్ద్రేణ జానకీమ్,
దేవగన్ధర్వకన్యాస్తా విషేదుర్వికృతేక్షణాః. 10

ప్ర. అ. రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, తర్జ్యమానామ్=భయపెట్టబడుచున్న, తాం జానకీమ్=ఆ సీతను, సంప్రేక్ష్య=చూచి, తాః=ఆ, దేవగన్ధర్వకన్యాః=దేవకన్యలు, గంధర్వకన్యలు, వికృతేక్షణాః=వికారమును పొందిన నేత్రములు కలవారై, విషేదుః=దుఃఖించిరి.

తా. రావణుడు ఆ విధముగ సీతను భయపెట్టుటను చూచి, దేవగంధర్వకన్యలు, కన్నీళ్ళ, ఎఱ్ఱబడుట మొదలైన వాటితో (వారి) కండ్లు వికారము చెందగా దుఃఖించిరి. 10

మూ. ఓష్ఠప్రకారైరపరా వక్త్రైర్నేత్రైస్తథాపరాః,
సీతామాశ్వాసయామాసుస్తర్జితాం తేన రక్షసా. 11

ప్ర. అ. తేన=ఆ, రక్షసా=రాక్షసునిచేత, తర్జితామ్=భయపెట్టబడిన, తామ్=ఆ, సీతామ్=సీతను, అపరాః=కొందరు, ఓష్ఠప్రకారైః=పెదవుల

శిరంబుచేతను, తథా = అట్లే, అపరాః = మరికొందరు, వక్త్రనేత్రైః = ముఖమును చేతను, నేత్రమును చేతను, ఆశ్వాసయామాసుః = ఓదార్చిరి.

తా. ఆ రాక్షసునిచేత భయపెట్టబడుతున్న సీతను పెదవులు కదల్చి కొందరు, ముఖములు నేత్రములు కదల్చి మరికొందరు ఓదార్చిరి. 11

మూ. తాభిరాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపమ్,
ఉవాచాత్మహితం వాక్యం వృత్తశౌణ్డీర్యగర్వితమ్. 12

ప్ర. అ. తాభిః = వారిచేత, ఆశ్వాసితా = ఓదార్చబడిన, సీతా = సీత, వృత్తశౌణ్డీర్యగర్వితమ్ = సదాచారముయొక్క బలముతో గర్వించిన, ఆత్మహితమ్ = తనకు హితమైన, వాక్యమ్ = వాక్యమును, రాక్షసాధిపమ్ = రాక్షసరాజైన, రావణమ్ = రావణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. దేవగంధర్వకన్యలచేత ఆ విధముగా ఊరడింపబడిన సీత, పాతివ్రత్యబలము, దర్పము ఉట్టిపడు నట్లు, ఆ రాక్షసరాజుతో తనకు హిత మైన వాక్యము పలికెను. 12

మూ. నూనం న తే జనః కశ్చిదస్తి నిఃశ్రేయసే స్థితః,
నివారయతి యో న త్వాం కర్మణోఽస్మాద్విగర్హితాత్.

ప్ర. అ. యః = ఎవ్వడు, త్వామ్ = నిన్ను, విగర్హితాత్ = నింద్య మైన, అస్మాత్ = ఈ, కర్మణః = కర్మనుండి, నివారయతి = నివారించునో అట్టి, తే = నీయొక్క, నిఃశ్రేయసే = క్షేమమునందు, స్థితః = ఆసక్తి గల, జనః = జనుడు, కశ్చిత్ = ఎవ్వడూ, నాస్తి = లేడు, నూనమ్ = నిశ్చయము.

తా. నీ క్షేమమును కోరి నిన్ను ఈ విధ మైన నింద్య మైన పనినుండి నివారించు వారెవ్వరూ ఉన్నట్లు లేరు. ఇది నిశ్చయము. 13

మూ. మాం హి ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీపతేః,
త్వదన్యస్త్రిషు లోకేషు ప్రార్థయేన్మనసాపి కః 14

ప్ర. అ. శచీపతేః = దేవేంద్రుని భార్య యైన, శచీమివ = శచీదేవిని వలె, ధర్మాత్మనః = ధర్మాత్ము డైన రామునియొక్క, పత్నీమ్ = భార్య నైన,

మామ్ = నన్ను, త్రిషు లోకేషు = మూడు లోకములలో, త్వదన్యః = నీకంటె అన్యుడు, కః = ఎవడు, మనసాపి = మనస్సుచేత కూడ, ప్రార్థయేత్ = ప్రార్థించును.

తా. శచీదేవి దేవేంద్రుని భార్య అయి నట్లు నేను ధర్మాత్ము డైన రాముని భార్యను. అట్టి నన్ను ఈ మూడులోకములలో నీవు తప్ప మరెవ్వ డైనా, మనస్సులో కూడ కోరుకొనునా! 14

మూ. రాక్షసాధమ రామస్య భార్యామమితతేజసః,
ఉక్తవానసి యత్పాపం క్వ గతస్తస్య మోక్ష్యసే. 15

ప్ర. అ. రాక్షసాధమ = ఓ! నీచరాక్షసుడా! అమితతేజసః = అమితమైన తేజస్సు గల, రామస్య = రామునియొక్క, భార్యామ్ = భార్య నైన నన్ను గూర్చి, యత్ = ఏ, పాపమ్ = పాపవాక్యమును, ఉక్తవాన్ = పలికినవాడవు, అసి = అయితివో, తస్య = ఆ పాపవాక్యమునకు (నుండి), క్వ = ఎక్కడికి, గతః = వెళ్ళినవాడవై, మోక్ష్యసే = విడువబడగలవు.

తా. ఓ రాక్షసాధమా! అమిత మైన తేజస్సు గల రాముని భార్యనైన నాతో ఈ విధముగ పాపపు మాటలు పలికినందుకు, నీ వెక్కడికి పోయినను ఈ అపరాధమునుండి తప్పించుకొనజాలవు. 15

మూ. యథా దృప్తశ్చ మాతఙ్గః శశశ్చ సహితౌ వనే,
తథా ద్విరదవద్రామస్త్వం నీచ శశవత్ స్మృతః. 16

ప్ర. అ. వనే = వనమునందు, సహితౌ = యుద్ధమునకై తలబడిన, దృప్తః = మదించిన, మాతఙ్గశ్చ = ఏనుగా, శశశ్చ = చెవులపిల్లి, యథా = ఎట్లో, తథా = అట్లే, నీచ = ఓరి నీచుడా! రామః = రాముడు, ద్విరదవత్ = ఏనుగవంటివాడు, త్వమ్ = నీవు, శశవత్ = చెవుల పిల్లి వంటివాడవుగా, స్మృతః = చెప్పబడినావు.

తా. నీవు రామునితో యుద్ధమునకు తలబడుట, వనములో చెవులపిల్లి మదించిన ఏనుగును ఎదిరించుట వంటిది. రాముడు మహాగజము. నీవు చెవుల పిల్లివి. 16

వి. ప్రాచ్యప్రతిలోని శ్లోకము అర్థము దీనికంటె స్పష్టముగా ఉన్నది.

"యథా దృష్టశ్చ మాతఙ్గః శశశ్చ సదృశో యుధి
తథా మాతఙ్గవద్రామస్త్వం నీచః శశవత్ స్మృతః".

మూ. స త్వమిక్ష్వాకునాథం వై క్షిపన్నిహ న లజ్జసే,
చక్షుషోర్విషయం తస్య న తావదుపగచ్ఛసి. 17

ప్ర. అ. సః = అట్టి, త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడ, ఇక్ష్వాకునాథమ్ = ఇక్ష్వాకువంశ ప్రభు వైన రామునిని, క్షిపన్ = నిందించుచు, న లజ్జసే = సిగ్గు పడుటలేదు. తస్య = ఆ రామునియొక్క, విషయం తావత్ = గోచరమునైతే, న ఉపగచ్ఛసి = పొందుటలేదు.

తా. అట్టి నీవు ఈ లంకాపట్టణములో కూర్చుండి, సిగ్గు లేక ఇక్ష్వాకు వంశప్రభు వైన ఆ రాముని నిందించుచున్నావు. అతని కంటికి కనబడుటకు మాత్రము భయపడుచున్నావు. 17

మూ. ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపిఙ్గలే,
క్షితౌ న పతితే కస్మాన్మామనార్య నిరీక్షతః. 18

ప్ర. అ. అనార్య = దుష్టుడా! మామ్ = నన్ను, నిరీక్షతః = చూచుచున్న, తే = నీయొక్క, క్రూరే = క్రూరములూ, విరూపే = వికారముగా ఉన్నవీ, కృష్ణపిఙ్గలే = నల్లగాను పచ్చగాను ఉన్నవి అయిన, ఇమే = ఈ, నయనే = నేత్రములు, క్షితౌ = భూమిపై, కస్మాత్ = ఏ కారణమువలన, న పతితే = పడిపోలేదు!

తా. దుష్టుడా! నన్ను దుర్బుద్ధితో చూచుచున్న, నీ క్రూరములు, వికృతములు అయిన (పిల్లికళ్ల వలె) తెల్లగాను పచ్చగాను ఉన్న కళ్లు నేలమీద ఎందు చేత రాలి పడిపోలేదో తెలియదు! 18

మూ. తస్య ధర్మాత్మనః పత్నీం స్నుషాం దశరథస్య చ,
కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే. 19

ప్ర. అ. ధర్మాత్మనః = ధర్మాత్ము డైన, తస్య = ఆ రామునియొక్క,

పత్నీమ్ = భార్యనూ, దశరథస్య=దశరథునియొక్క, స్నుషాం చ = కోడ లునూ అయిన, మామ్ = నన్ను గూర్చి, వ్యాహరతః = ఇట్లు పలుకుచున్న, తే = నీయొక్క, జిహ్వా = నాలుక, కథమ్=ఎట్లు, న వ్యవశీర్యతే = తెగిపడి పోకున్నది।

తా. ధర్మాత్ము డైన ఆ రాముని భార్యనూ, దశరథుని కోడలినీ అయిన నన్ను గూర్చి ఇలా మాటలాడినందుకు, నీ నాలుక తెగి క్రింద పడలే దెందు చేతనో। 19

మూ. అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్.
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా. 20

ప్ర. అ. భస్మార్హ = భస్మ మగుటకు తగిన, దశగ్రీవ = ఓ రావణా, రామస్య=రామునియొక్క, అసందేశాత్ =ఆజ్ఞ లేకుండుటవలన, తపసః = తపస్సుయొక్క, అనుపాలనాత్=పాలించుటవలనూ, తేజసా = నా తేజస్సుతో, త్వామ్ = నిన్ను, భస్మ=భస్మనుగా, న కుర్మి=చేయకున్నాను.

తా. ఓ। రావణా। నీవు భస్మముగా చేయదగినవాడ వైనను, అట్లు చేయుటకు నాకు రామాజ్ఞ లేకపోవుటచేతను, తపస్సును రక్షించుకొనుటచేతను నా పాతివ్రత్యమహిమచే నిన్ను భస్మము చేయుటలేదు. 20

మూ నాపహర్తుమహం శక్యా త్వయా రామస్య ధీమతః,
విధిస్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః. 21

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతు డైన, రామస్య=రామునకు సంబంధించిన, అహమ్=నేను, త్వయా=నీచేత, అపహర్తుమ్=అపహరించుటకు, న శక్యా= శక్య మైనదానను కాను. తవ=నీయొక్క, వధార్థాయ = వధకొరకే, విధిః=ఈ ఏర్పాటు, విహితః=చేయబడినది. అత్ర = ఈ విషయమునందు, సంశయః = సంశయము, న=లేదు.

తా. బుద్ధిశాలి యైన రామునకు చెందిన నన్ను నీవు అపహరించజాలవు. అయినను ఈ విధముగా నా అపహారము జరిగిన దనగా ఇది నీ మృత్యువు కొరకే వచ్చినది. సందేహము లేదు. 21

మూ. శూరేణ ధనదభ్రాత్రా బలైః సముదితేన చ,
అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్యం త్వయా కృతమ్.

ప్ర. అ. శూరేణ=శూరుడవు, ధనదభ్రాత్రా = కుబేరుని సోదరుడవు, బలైః=సేనలతో, సముదితేన చ =కూడినవాడవూ అయిన, త్వయా = నీచేత, రామమ్=రాముని, అపోహ్య = తొలగించి, కస్మాత్=ఏ కారణమువలన, దార చౌర్యమ్ = భార్యాపహరణము, కృతమ్=చేయబడినది?

తా. "నేను శూరుడను, కుబేరుని సోదరుడను, అనంతబలసంపన్నుడను" అని చెప్పుకొనుచున్నావే! అట్టి నీవు రాముని దూరముగా పంపివేసి ఆతని భార్యనైన నన్ను ఎందువలన అపహరించినావు? 22

మూ. సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
వివృత్య నయనే క్రూరే జానకీమన్వవైక్షత. 23

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, సీతాయాః =సీతయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, క్రూరే=క్రూరములైన, నయనే=నేత్రములను, వివృత్య=త్రిప్పి (పెద్దవి చేసి), జానకీమ్=జానకిని, అన్వవైక్షత=చూచెను.

తా. రాక్షసరాజైన రావణుడు సీత మాటలు విని, క్రూరములైన నేత్రములు పెద్దవి చేసి, సీతను చూచెను. 23

మూ. నీలజీమూతసంకాశో మహాభుజశిరోధరః,
సింహసత్త్వగతిః శ్రీమాన్ దీప్తజిహ్వాగ్రలోచనః. 24

ప్ర. అ. నీలజీమూతసంకాశః = నల్లని మేఘముతో సమానుడు, మహాభుజశిరోధరః=పెద్ద భుజములు, కంఠము కలవాడు, సింహసత్త్వగతిః = సింహము వంటి బలము, గమనము కలవాడు, శ్రీమాన్=శోభాయుక్తుడు, దీప్త జిహ్వాగ్రలోచనః= ప్రజ్వరిల్లుచున్న జిహ్వాగ్రము (నాలుక చివరి భాగము) నేత్రములు కలవాడు, ("అయిన రావణుడు" అని అన్వయము. ఈ శ్లోకము మొదలు 30 వ శ్లోకము వరకు రావణుని వర్ణనము. ప్రథమాంతములు "రావణః" అనుదానికి విశేషణములు).

తా. ఆ రావణుడు నల్లని మేఘము వలె ఉండెను. అతని భుజములు కంఠము చాలా పెద్దవిగా ఉండెను. అతని బలము నరక సింహము బలము నరక వలె ఉండెను. శోభాయుక్తమైన అతని జిహ్వాగ్రము, నేత్రములు కూడ మండుచున్నట్లు ఎఱ్ఱగా ఉండెను. 24

మూ. చలాగ్రమకుటప్రాంశుశ్చిత్రమాల్యానులేపనః,
రక్తమాల్యామ్బరధరస్తప్తాఙ్గదవిభూషణః. 25

ప్ర. అ. చలాగ్రమకుటప్రాంశుః = కదలుచున్న అగ్రభాగము గల కిరీటముతో ఎత్తుగా ఉన్నవాడు, చిత్రమాల్యానులేపనః = చిత్రమైన మాల్యములు, మైపూతలు కలవాడూ, రక్తమాల్యామ్బరధరః = ఎఱ్ఱని మాలలను, వస్త్రములను ధరించినవాడూ, తప్తాఙ్గదవిభూషణః = అగ్నిలో కాల్చిన బంగారముతో చేసిన బాహుపురులు అలంకారములుగా కలవాడూ (అయిన రావణుడు........).

తా. అతడు కిరీటమును ధరించుటచే ఎత్తుగా ఉన్నట్లు కనబడుచుండెను. ఆ కిరీటము పైభాగము కదలుచుండెను. విచిత్రములైన మాలలను, మైపూతలను, ఎఱ్ఱని మాలలను, ఎఱ్ఱని వస్త్రములను ధరించెను. అగ్నిలో కాల్చి శుద్ధము చేసిన బంగారముతో తయారుచేసిన బాహుపురులను అలంకరించుకొనెను. 25

మూ. శ్రోణిసూత్రేణ మహతా మేచకేన సుసంవృతః,
అమృతోత్పాదనద్ధేన భుజగేనేవ మన్దరః. 26

ప్ర. అ. అమృతోత్పాదనద్ధేన = అమృతము పుట్టించుటకై కట్టబడిన, భుజగేన = వాసుకిచేత, మన్దరః ఇవ = మందరపర్వతము వలె, మహతా = గొప్పదైన, మేచకేన = నల్లని, శ్రోణిసూత్రేణ = కటిస్థలమునకు కట్టుకొనెడు త్రాడుచేత, సుసంవృతః = బాగుగా కట్టబడిన (రావణుడు........).

తా. నల్లగా, లావుగా ఉన్న త్రాడును నడుమునకు బిగించిన ఆ రావణుడు, అమృతమునకై, సముద్రమథనము చేయు సమయమున వాసుకిని కట్టిన మందరపర్వతము వలె ఉండెను. 26

మూ. తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః,
శుశుభేఽచలసంకాశః శృఙ్గాభ్యామివ మన్దరః. 27

ప్ర. అ. అచలసంకాశః = పర్వతముతో సమానుడైన, రాక్షసేశ్వరః = రావణుడు. పరిపూర్ణాభ్యామ్ = బాగుగా బలిసి ఉన్న, తాభ్యామ్=ఆ, భుజాభ్యామ్ = భుజములతో, శృఙ్గాభ్యామ్ = శిఖరములతో, మన్దరః ఇవ = మందర పర్వతము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. పర్వతము వలె ఉన్న ఆ రావణుడు, బాగా బలిసిన భుజములతో, రెండు శిఖరములతో కూడిన మందరపర్వతము వలె ప్రకాశించెను. 27

మూ. తరుణాదిత్యవర్ణాభ్యాం కుణ్డలాభ్యాం విభూషితః,
రక్తపల్లవపుష్పాభ్యామశోకాభ్యామివాచలః. 28

ప్ర. అ. తరుణాదిత్యవర్ణాభ్యామ్ = లేత సూర్యుని వంటి రంగు గల, కుణ్డలాభ్యామ్ = కుండలములచేత, విభూషితః = అలంకరింపబడిన అతడు, రక్తపల్లవపుష్పాభ్యామ్ = ఎఱ్ఱని చిగుళ్లు పుష్పములు గల, అశోకాభ్యామ్ = అశోకవృక్షములతో, అచలః ఇవ=పర్వతము వలె ఉండెను.

తా. బాలసూర్యుడు వలె ఎఱ్ఱగా ఉన్న కుండలములు అలంకరించుకొని ఆ రావణుడు, ఎఱ్ఱని చిగుళ్ళూ, పుష్పములూ గల రెండు అశోకవృక్షములతో పర్వతము వలె ప్రకాశించుచుండెను. 28

మూ. స కల్పవృక్షప్రతిమో వసన్త ఇవ మూర్తిమాన్,
శ్మశానచైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః. 29

ప్ర. అ. కల్పవృక్షప్రతిమః = కల్పవృక్షముతో సమానుడైన, సః = అతడు, మూర్తిమాన్ = మూర్తీభవించిన, వసన్తః ఇవ = వసంతఋతువు వలె, ఉండెను. శ్మశానచైత్యప్రతిమః = శ్మశానమునందలి మంటపముతో సమానుడైన అతడు, భూషితోఽపి = అలంకరించబడిన వాడైనను, భయంకరః = భయంకరుడుగా ఉండెను.

తా. కల్పవృక్షము వలె ఉన్న అతడు మూర్తీభవించిన వసంతము వలె ఉండెను. అతడు చక్కగా అలంకరించుకొన్నను, శ్మశానమునం దున్న మండపము వలె భయంకరముగా ఉండెను. 29

మూ. అవేక్షమాణో వైదేహీం కోపసంరక్తలోచనః,
ఉవాచ రావణః సీతాం భుజఙ్గ ఇవ నిఃశ్వసన్. 30

ప్ర. అ. కోపసంరక్తలోచనః = కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల, రావణః = ఆ రావణుడు, వైదేహీమ్ = సీతను, అవేక్షమాణః = చూచుచు, భుజగః ఇవ = సర్పము వలె, నిఃశ్వసన్ = నిట్టూర్చుచు, సీతామ్ = సీతను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. ఆ రావణుడు, సీతను, కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో చూచుచు, సర్పము వలె బుసలు కొట్టుచు, ఆమెతో ఇట్లనెను. 30

మూ. అనయేనాభిసంపన్నమర్థహీనమనువ్రతే,
నాశయామ్యహమద్య త్వాం సూర్యః సన్ధ్యామివౌజసా.

ప్ర. అ. అనయేన = చెడునీతితో, అభిసంపన్నమ్ = కూడినవాడూ, అర్థహీనమ్ = ధనహీనుడూ అయిన రాముని, అనువ్రతే = అనుసరించినదానా! అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, సూర్యః = సూర్యుడు, ఓజసా = తేజస్సుతో, సన్ధ్యామివ = సంధ్యను వలె, నాశయామి = నశింపచేసెదను.

తా. చెడ్డ నీతిని అనుసరించువాడు, ధనము లేనివాడు అయిన రామునిపై మక్కువ కలదానా! సూర్యుడు తన కాంతిచేత సంధ్యను నశింపచేయు నట్లు నేను నిన్ను ఇప్పుడే నశింపచేసెదను. 31

మూ. ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణః శత్రురావణః,
సందిదేశ తతః సర్వా రాక్షసీర్ఘోరదర్శనాః. 32

ప్ర. అ. రాజా = రాక్షసరాజూ, శత్రురావణః = శత్రువులను ఏడిపించువాడూ అయిన, రావణః = రావణుడు, మైథిలీమ్ = సీతను గూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = అటుపిమ్మట, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము గల, సర్వాః = సమస్తమైన, రాక్షసీః = రాక్షసస్త్రీలను, సందిదేశ = ఆజ్ఞాపించెను.

తా. శత్రువులను ఏడిపించు రాక్షసరాజైన ఆ రావణుడు సీతతో ఇట్లు పలికి చూచువారికి భయంకరముగా ఉన్న రాక్షసస్త్రీల నందరిని ఇట్లు ఆజ్ఞాపించెను. 32

మూ. ఏకాక్షీమేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
గోకర్ణీం హస్తికర్ణీం చ లమ్బకర్ణీమకర్ణికామ్. 33

హస్తిపాద్యశ్వపాద్యౌ చ గోపాదీం పాదచూళికామ్,
ఏకాక్షీమేకపాదీం చ పృథుపాదీమపాదికామ్, ౩౪

అతిమాత్రశిరోగ్రీవామతిమాత్రకుచోదరీమ్,
అతిమాత్రాస్యనేత్రాం చ దీర్ఘజిహ్వామజిహ్వికామ్. ౩౫

అనాసికాం సింహముఖీం గోముఖీం సూకరీముఖీమ్.

ప్ర. అ. ఏకాక్షీమ్ = ఒక కన్ను కల, ఏకకర్ణాం చ = ఒక చెవికలదానినీ, తథా = మరియు, కర్ణప్రావరణామ్ = చెవులు ఆచ్ఛాదనముగా కలదానిని, గోకర్ణీమ్ = ఆవుచెవులుదానినీ, హస్తికర్ణీం చ = ఏనుగుచెవులుదానిని, లమ్బకర్ణీమ్ = వ్రేలాడుచున్న చెవులు కలదానిని, అకర్ణికామ్ = చెవులు లేనిదానిని, హస్తిపాద్యశ్వపాద్యౌ చ = ఏనుగుపాదములదానిని, గుఱ్ఱము పాదములదానిని, గోపాదీమ్ = ఆవుపాదములదానిని, పాదచూళికామ్ = పాదాంపై జుట్టు ఉన్నదానిని, ఏకాక్షీమ్ = ఒక కన్ను కలది, ఏకపాదీం చ = ఒక పాదము కలదీ అయినదానిని, పృథుపాదీమ్ = పెద్ద పాదములు కలదానిని, అపాదికామ్ = పాదములు లేనిదానిని, అతిమాత్రశిరోగ్రీవామ్ = పెద్ద తల, కంఠము కలదానిని, అతిమాత్రకుచోదరీమ్ = పెద్ద స్తనములు ఉదరము కలదానిని, అతిమాత్రాస్యనేత్రాం చ = పెద్ద నోరు, కళ్ళు కలదానిని, దీర్ఘజిహ్వామ్ = పొడ వైన నాలుక కలదానిని, అజిహ్వికామ్ = నాలుక లేనిదానిని, అనాసికామ్ = ముక్కు లేనిదానిని, సింహముఖీమ్ = సింహపు ముఖము దానిని, గోముఖీమ్ = ఆవు ముఖముదానిని, సూకరీముఖీమ్ = = పందిముఖము దానిని (ఈ రాక్షసస్త్రీలను ఆజ్ఞాపించెను).

తా. ఒకే కన్ను, ఒకే చెవి కలదానిని, గొడుగు చెవులదానిని, ఆవు చెవులందానిని, ఏనుగు చెవులందానిని, వ్రేలాడు చెవులందానిని, చెవులు లేనిదానిని, ఏనుగు పాదములదానిని, గుఱ్ఱము పాదములదానిని, ఆవు పాదములదానిని, పాదాలమీద జుట్టు ఉన్నదానిని, ఒకే కన్ను ఒకే పాదము ఉన్నదానిని, పెద్ద పాదముల దానిని, పాదాలు లేనిదానిని, పెద్ద తలా కంఠమూ గలదానిని, పెద్ద పెద్ద స్తనములు, పొట్టా కలదానిని, పెద్ద నోరు, కళ్లూ కలదానిని, పొడ వైన నాలుక కలదానిని, నాలుక లేనిదానిని, ముక్కు లేనిదానిని, సింహముఖము దానిని, ఆవు ముఖము దానిని, పంది ముఖము దానిని ఆజ్ఞాపించెను. ౩౪-౩౫.

మూ. యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ, 36
తథా కురుత రాక్షస్యః సర్వాః క్షిప్రం సమేత్య చ.

ప్ర. అ. రాక్షస్యః = రాక్షసస్త్రీలులారా! జానకీ = జనకుని కూతురైన, సీతా=సీత, క్షిప్రమ్=శీఘ్రముగా, యథా=ఎట్లు, మద్వశగా = నా వశమును పొందినది, భవతి=అగునో, తథా=అట్లు, సర్వాః=మీరందరూ, క్షిప్రమ్=శీఘ్రముగా, సమేత్య చ=కలిసి, కురుత=చెయ్యండి.

తా. ఓ రాక్షసస్త్రీలులారా! మీరందరూ శీఘ్రముగా కలిసి ప్రయత్నించి జనకుని కూతురైన సీత నాకు శీఘ్రముగా వశమగు నట్లు చెయ్యండి. 36

మూ. ప్రతిలోమానులోమైశ్చ సామదానాదిభేదనైః, 37
ఆవర్తయత వైదేహీం దణ్డస్యోద్యమనేన చ.

ప్ర. అ. ప్రతిలోమానులోమైశ్చ=ప్రతికూలము లైన పనులచేతను, అనుకూలము లైన పనులచేతను, సామదానాదిభేదనైః = సామము (బుజ్జగించుచు చెప్పుట), దానము మొదలైన వానిచేత, భేదోపాయముచేత, దణ్డస్య = దండోపాయముయొక్క, ఉద్యమనేన చ = ప్రయోగముచేతను, వైదేహీమ్ = సీతను, ఆవర్తయత = లొంగదీయండి.

తా. ప్రతికూలము లైన కార్యములు చేసి కాని, అనుకూలము లైన కార్యములు చేసి కాని, సామ-దాన-భేదోపాయములను ప్రయోగించి కాని, దండమును ప్రయోగించి గాని సీతను లొంగదీసుకొనండి. 37

మూ. ఇతి ప్రతిసమాదిశ్య రాక్షసేన్ద్రః పునః పునః, 38
కామమన్యుపరీతాత్మా జానకీం పర్యతర్జయత్.

ప్ర. అ. రాక్షసేన్ద్రః = రావణుడు, పునః పునః = మాటిమాటికి, ఇతి= ఇట్లు, ప్రతిసమాదిశ్య = ఆజ్ఞాపించి, కామమన్యుపరీతాత్మా = కామముతోను కోపముతోను నిండిన మనస్సు గలవాడై, జానకీమ్ = జానకిని, పర్యతర్జయత్ = భయపెట్టెను.

తా. రావణుడు ఆ రాక్షసస్త్రీలను ఈ విధముగా అనేక పర్యాయములు ఆజ్ఞాపించి, కామముతోను కోపముతోను నిండిన మనస్సుతో, సీతను భయపెట్టెను.

మూ. ఉపగమ్య తతః శీఘ్రం రాక్షసీ ధాన్యమాలినీ, 39
పరిష్వజ్య దశగ్రీవమిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధాన్యమాలినీ = ధాన్యమాలిని అను. రాక్షసీ = రాక్షసస్త్రీ, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఉపగమ్య = సమీపించి, దశగ్రీవమ్ రావణుని, పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును. అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు ధాన్యమాలిని అను రాక్షసస్త్రీ తొందరగా రావణుని వద్దకు వచ్చి, అతనిని కౌగలించుకొని ఇట్లనెను.

మూ. మయా క్రీడ మహారాజ సీతయా కిం తవానయా, 40
వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర.

ప్ర. అ. మహారాజ = మహారాజా! మయా=నాతో, క్రీడ=క్రీడించుము. రాక్షసేశ్వర = రాక్షసరాజా! వివర్ణయా=చెడిపోయిన శరీరవర్ణము గలదీ, కృపణయా = దీనురాలూ, మానుష్యా = మనుష్యస్త్రీ అయిన, అనయా = ఈ, సీతయా = సీతతో, తవ = నీకు. కిమ్ = ఏమి ప్రయోజనము?

తా. మహారాజా! నీవు హాయిగా నాతో విహరింపుము. రాక్షసాధిపా! చెడ్డ శరీరవర్ణము గల దీనురాలైన మనుష్యస్త్రీ ఈ సీతతో నీకేమి సుఖము కలుగును? 40

మూ. నూనమస్యా మహారాజ న దివ్యాన్ భోగసత్తమాన్, 41
విదధాత్యమరశ్రేష్ఠస్తవ బాహుబలార్జితాన్.

ప్ర. అ. మహారాజ = మహారాజా! అమరశ్రేష్ఠః=బ్రహ్మదేవుడు, తవ = నీయొక్క, బాహుబలార్జితాన్ = బాహుబలముచేత అర్జింపబడిన, దివ్యాన్ = దివ్యములైన, భోగసత్తమాన్ = శ్రేష్ఠములైన భోగములను, అస్యాః = ఈమెకు, న విదధాతి = కల్పించలేదు. నూనమ్ = నిశ్చయము.

తా. మహారాజా! నీ బాహుబలముచేత సంపాదించిన దివ్యములైన ఉత్తమభోగములను బ్రహ్మదేవుడు ఈమెకు వ్రాసిపెట్టలేదు. ఇది నిజము. 41

మూ. అకామాం కామయానస్య శరీరముపతప్యతే. 42
ఇచ్ఛన్తీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా.

ప్ర. అ. అకామామ్ = కామములేని స్త్రీని, కామయానస్య = కామించుచున్నవానియొక్క, శరీరమ్ = శరీరము, ఉపతప్యతే = బాధచెందును. ఇచ్ఛన్తీమ్ = కోరుచున్న స్త్రీని, కామయానస్య = కామించువానికి, శోభనా = మంచి, ప్రీతిః = ఆనందము, భవతి = ఆగును.

తా. ఏ పురుషుడైనను తనపై ప్రేమ లేని స్త్రీని కామించినచో వాని శరీరమునకు బాధము మాత్రమే కలుగును. తనపై ప్రేమ ఉన్న స్త్రీని కామించు వానికి మంచి ఆనందము కలుగును. 42

మూ. ఏవముక్తస్తు రాక్షస్యా సముత్క్షిప్తస్తతో బలీ, 43
ప్రహసన్మేఘసంకాశో రాక్షసః స న్యవర్తత.

ప్ర. అ. రాక్షస్యా = ఆ రాక్షసస్త్రీచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, బలీ = బలవంతుడైన, మేఘసంకాశః = మేఘముతో సమానుడైన, సః = ఆ, రాక్షసః = రావణుడు, తతః = అటుపిమ్మట, సముత్క్షిప్తః = ఆమెచే పైకి ఎత్తబడినవాడై, ప్రహసన్ = నవ్వుచు, న్యవర్తత = మరలెను.

తా. బలవంతుడు, మేఘముతో సమానుడూ అయిన రావణునితో ఆ ధాన్యమాలి ఇట్లు పలికి, అతనిని కౌగలించుకొని పైకి లేవదీసెను. అపు డాతడు నవ్వుచు వెనుకకు మరలెను. 43

మూ. ప్రస్థితః స దశగ్రీవః కమ్పయన్నివ మేదినీమ్, 44
జ్వలద్భాస్కరవర్ణాభం ప్రవివేశ నివేశనమ్.

ప్ర. అ. సః = ఆ, దశగ్రీవః = రావణుడు, మేదినీమ్ = భూమిని, కమ్పయన్నివ = కంపింపచేయుచున్నవాడు వలె, ప్రస్థితః = ప్రయాణమైనవాడై, జ్వలద్భాస్కరవర్ణాభమ్ = ప్రకాశించుచున్న సూర్యుని కాంతి వంటి కాంతి గల, నివేశనమ్ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఆ దశకంఠుడు భూమిని కంపింపచేయుచున్నట్లు నడచి వెళ్ళి, ప్రకాశించుచున్న సూర్యుని కాంతి వంటి కాంతి గల గృహమును ప్రవేశించెను.

మూ. దేవగన్ధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ సర్వతః, 45
పరివార్య దశగ్రీవం వివిశుస్తం గృహోత్తమమ్.

ప్ర. అ. దేవగన్ధర్వకన్యాశ్చ = దేవకన్యలు, గంధర్వకన్యలు, నాగకన్యాశ్చ = నాగకన్యలు, సర్వతః = నలువైపులా, దశగ్రీవమ్ = రావణుని, పరివార్య = చుట్టి, తమ్ = ఆ, గృహోత్తమమ్ = గృహశ్రేష్ఠమును, వివిశుః = ప్రవేశించిరి.

తా. ఆ దశకంఠునితో కూడా వచ్చిన దేవకన్యలు, గంధర్వకన్యలు, నాగకన్యలు నలుమూలలా అతనిని పరివేష్టించి, ఆ శ్రేష్ఠమైన గృహములో ప్రవేశించిరి. 45

మూ. స మైథిలీం ధర్మపరామవస్థితాం
ప్రవేపమానాం పరిభర్త్స్య రావణః,
విహాయ సీతాం మదనేన మోహితః
స్వమేవ వేశ్మ ప్రవివేశ భాస్వరమ్. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ద్వావింశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, రావణః = రావణుడు, ధర్మపరామ్ = ధర్మపరురాలుగా, అవస్థితామ్ = స్థిరముగా ఉన్న, ప్రవేపమానామ్ = వణకుచున్న, మైథిలీమ్ = సీతను, పరిభర్త్స్య = భయపెట్టి, సీతామ్ = సీతను, విహాయ = విడచి, భాస్వరమ్ = ప్రకాశించుచున్న, స్వమ్ = తన సంబంధమైన, వేశ్మైవ = గృహమునే, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఆ రావణుడు ధర్మమార్గమునందు స్థిరముగా నిలచి ఉన్న, భయముతో వణకిపోవుచున్న సీతను ఈ విధముగా భయపెట్టి, ఆమెను విడచి, మన్మథునిచేత మోహితుడై, ప్రకాశించుచున్న తన గృహములోనికి ప్రవేశించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోవింశః సర్గః

*[రాక్షసస్త్రీలు సీతకు ఉపదేశించుట]*

మూ. ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణః శత్రురావణః,
సందిశ్య చ తతః సర్వా రాక్షసీర్నిర్జగామ హ. 1

ప్ర. అ. రాజా = రాక్షసరాజూ, శత్రురావణః = శత్రువులను ఏడ్పించే వాడూ అయిన, రావణః = రావణుడు, మైథిలీమ్ = సీతనుగూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = ఆటు పిమ్మట, సర్వాః = సమస్త మైన, రాక్షసీః = రాక్షసస్త్రీలను, సందిశ్య చ = ఆజ్ఞాపించి, నిర్జగామ = బయటు వెడలిపోయెను.

తా. రాక్షసరాజూ, శత్రువులను ఏడ్పించేవాడూ అయిన రావణుడు సీతతో ఇట్లు పలికి, "సీతను లొంగదీయుడు" అని రాక్షసస్త్రీలను ఆజ్ఞాపించి వెళ్ళి పోయెను. 1

మూ. నిష్క్రాన్తే రాక్షసేన్ద్రే తు పునరన్తఃపురం గతే,
రాక్షస్యో భీమరూపాస్తాః సీతాం సమభిదుద్రువుః. 2

ప్ర. అ. రాక్షసేన్ద్రే = రావణుడు, నిష్క్రాన్తే = నిష్క్రమించినవాడై, పునః = మరల, అన్తఃపురమ్ = అంతఃపురమును, గతే = పొందినవా డగుచుండగా, భీమరూపాః = భయంకర మైన రూపములు గల, తాః = ఆ, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, సీతామ్ = సీతను గూర్చి, సమభిదుద్రువుః = పరుగెత్తికొని వెళ్ళిరి.

తా. రావణుడు తిరిగి వెళ్లి అంతఃపురములో ప్రవేశించిన పిమ్మట, భయంకరము లైన రూపములు గల ఆ రాక్షసస్త్రీలు సీత దగ్గరకు పరుగెత్తి వెళ్ళిరి.

మూ. తతః సీతాముపాగమ్య రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
పరం పరుషయా వాచా వైదేహీమిదమబ్రువన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, సీతామ్ = సీతను, ఉపాగమ్య = చేరి, క్రోధమూర్ఛితాః = క్రోధముతో నిండినవారై, పరమ్ = మిక్కిలి, పరుషయా = పరుష మైన, వాచా = వాక్కుతో, వైదేహీమ్ = సీతను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట ఆ రాక్షసస్త్రీలు క్రోధావేశముతో సీతను సమీపించి, పరుష ముగా మాటలాడుచు సీతతో ఇట్లనిరి. 3

మూ. పౌలస్త్యస్య వరిష్ఠస్య రావణస్య మహాత్మనః,
దశగ్రీవస్య భార్యాత్వం సీతే న బహుమన్యసే. 4

ప్ర. అ. సీతే = సీతా! పౌలస్త్యస్య = పులస్త్యుని వంశములో పుట్టిన వాడూ, వరిష్ఠస్య = శ్రేష్ఠుడూ, మహాత్మనః = గొప్ప బుద్ధి కలవాడూ, దశగ్రీవస్య = పదికంఠములు కలవాడూ అయిన, రావణస్య = రావణునికి, భార్యాత్వమ్ = భార్య అగుటను, న బహుమన్యసే = నీవు గౌరవించుట లేదు.

తా. సీతా! పది కంఠములు గల రావణుడు, పులస్త్యవంశములో పుట్టిన వాడు; సర్వశ్రేష్ఠుడు; మహాత్ముడు; అట్టి రావణునికి భార్య వగుటకు నీవు ఇచ్ఛగించుట లేదు. ఎంత తెలివితక్కువ దానవు! 4

మూ. తతస్త్వేకజటా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
ఆమన్త్ర్య క్రోధతామ్రాక్షీ సీతాం కరతలోదరీమ్. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఏకజటా నామ = ఏకజట అనే, రాక్షసీ = రాక్షసి, క్రోధతామ్రాక్షీ = క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలదై, కరతలోదరీమ్ = పిడికెడు ఉదరము గల, సీతామ్ = సీతను, ఆమన్త్ర్య = పిలచి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట, ఏకజట యను ఒక రాక్షసి, కోపముతో కన్నులు ఎఱ్ఱజేసి, సన్నని పిడికెడు ఉదరము గల సీతను సంబోధించి ఇట్లు పలికెను. 5

మూ. ప్రజాపతీనాం షణ్ణాం తు చతుర్థో యః ప్రజాపతిః,
మానసో బ్రహ్మణః పుత్రః పులస్త్య ఇతి విశ్రుతః. 6

ప్ర. అ. షణ్ణామ్ = ఆరుగురు, ప్రజాపతీనామ్ = ప్రజాపతులలో, యః = ఎవ్వఁడు, చతుర్థః = నాల్గవ, ప్రజాపతిః = ప్రజాపతియో, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, మానసః = మనస్సువల్ల పుట్టిన పుత్రః = పుత్రు డైన అతడు, పులస్త్యః ఇతి = పులస్త్యుఁడు అని, విశ్రుతః = ప్రసిద్ధుఁడు.

తా. బ్రహ్మదేవుని మానస(మనస్సునుండి పుట్టిన) పుత్రు డైన, పులస్త్యుఁడను పేరుతో ప్రసిద్ధు డైన ప్రజాపతి, ఆరుగురు ప్రజాపతులలో నాల్గవవాఁడు.

మూ. పులస్త్యస్య తు తేజస్వీ మహర్షిర్మానసః సుతః,
నామ్నా స విశ్రవా నామ ప్రజాపతిసమప్రభః. 7

ప్ర. అ. నామ్నా = పేరుచేత, విశ్రవానామ = విశ్రవసు అని ప్రసిద్ధు డైన, ప్రజాపతిసమప్రభః = బ్రహ్మదేవునితో సమాన మైన కాంతి గల, తేజస్వీ = తేజశ్శాలి యైన, సః మహర్షిః = ఆ మహర్షి, పులస్త్యస్య = పులస్త్యునియొక్క, మానసః = మనస్సు నుండి జన్మించిన, సుతః = కుమారుడు.

తా. విశ్రవసు అని ప్రసిద్ధ మైన నామధేయము గల, బ్రహ్మదేవునితో సమాన మైన కాంతి గల, తేజశ్శాలి యైన మహర్షి, పులస్త్యుని మానసపుత్రుఁడు.

మూ. తస్య పుత్రో విశాలాక్షి రావణః శత్రురావణః,
తస్య త్వం రాక్షసేన్ద్రస్య భార్యా భవితుమర్హసి, 8
మయోక్తం చారుసర్వాఙ్గి వాక్యం కిం నానుమన్యసే.

ప్ర. అ. విశాలాక్షి = విశాలము లైన నేత్రములు గలదానా! శత్రురావణః = శత్రువులను ఏడ్పించెడివా డైన, రావణః = రావణుఁడు, తస్య = ఆ విశ్రవసునియొక్క, పుత్రః = పుత్రుఁడు, త్వమ్ = నీవు, రాక్షసేన్ద్రస్య = రాక్షసుల ప్రభు వైన, తస్య = ఆ రావణునియొక్క, భార్యా = భార్యగా, భవితుమ్ = అగుటకు, అర్హసి = తగినదానవు. చారుసర్వాఙ్గి = అంద మైన సకలావయవములు కలదానా! మయా = నాచేత, ఉక్తమ్ = పలుకఁబడిన, వాక్యమ్ = వాక్యమును, కిమ్ = ఎందువలన, నానుమన్యసే = అంగీకరింపవు ?

తా. ఓ విశాలాక్షి! శత్రువులను ఏడ్పించిన రావణుఁడు ఆ విశ్రవసుని

కుమాటను. నీవు రాక్షసరాజైన ఆ రావణుని భార్యవు అగుము. అందమైన సకలావయవములు గల ఓ సీతా! నే చెప్పిన మాట విన వేమి? 8

మూ. తతో హరిజటా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్. 9
వివర్త్య నయనే కోపాన్మార్జారసదృశేక్షణా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మార్జారసదృశేక్షణా=పిల్లితో సమానమైన కళ్లు గల, హరిజటానామ=హరిజట అను పేరు గల, రాక్షసీ=రాక్షసి, కోపాత్=కోపమువలన, నయనే=నేత్రములను, వివర్త్య=త్రిప్పి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట, పిల్లికళ్ళ వంటి కళ్లుగల, హరిజట అను రాక్షసి, కోపముతో కళ్లు పెద్దవి చేసి త్రిప్పుచు ఇట్లు పలికెను. 9

మూ. యేన దేవాస్త్రయస్త్రింశద్దేవరాజశ్చ నిర్జితాః, 10
తస్య త్వం రాక్షసేన్ద్రస్య భార్యా భవితుమర్హసి.

ప్ర. అ. యేన=ఎవనిచేత, త్రయస్త్రింశత్=ముప్పదిముగ్గురు, దేవాః=దేవతలూ, దేవరాజశ్చ=దేవతల రాజూ, నిర్జితాః=జయింపబడినారో, తస్య=అట్టి, రాక్షసేన్ద్రస్య=రాక్షసరాజునకు, త్వమ్=నీవు, భార్యా=భార్యగా, భవితుమ్=అగుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ముప్పదిముగ్గురు దేవతలను వారి ప్రభువైన దేవేంద్రుని జయించిన రాక్షసరాజునకు నీవు భార్య వగుట మంచిది. 10

మూ. తతస్తు ప్రఘసా నామ రాక్షసీ క్రోధమూర్ఛితా, 11
భర్త్సయన్తీ తదా ఘోరమిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రఘసా నామ=ప్రఘస అను పేరు గల, రాక్షసీ=రాక్షసస్త్రీ, క్రోధమూర్ఛితా=కోపముచే వ్యాపింపబడినదై, తదా=అప్పుడు, భర్త్సయన్తీ=భయపెట్టుచున్నదై, ఘోరమ్=ఘోరమైన, ఇదమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట ప్రఘస అను ఒక రాక్షసి కోపావిష్టురాలై, సీతను భయపెట్టుచు, ఘోరమైన వాక్యము పలికెను. 11

మూ. వీర్యోత్సిక్తస్య శూరస్య సంగ్రామేష్వనివర్తినః, 12
బలినో వీర్యయుక్తస్య భార్యాత్వం కిం న లప్స్యసే.

ప్ర. అ. వీర్యోత్సిక్తస్య=పరాక్రమముచేత గర్వించినవాడూ, శూరస్య=శూరుడూ, సంగ్రామేషు=యుద్ధములందు, అనివర్తినః=వెనుకకు మరలనివాడూ, బలినః=బలవంతుడూ, వీర్యయుక్తస్య=పరాక్రమముతో కూడినవాడూ అయిన రావణునికి, భార్యాత్వమ్=భార్యాత్వమును, కిమ్=ఎందువలన, న లప్స్యసే=పొందవు?

తా. రావణుడు మహాబలవంతుడు; వీర్యవంతుడు; వీర్యముతో గర్వించినవాడు; శూరుడు; యుద్ధములలో వెనుకకు మరలనివాడు. అట్టి రావణుని భార్య అగుటకు ఎందుచేత అంగీకరించకున్నావు? 12

మూ. ప్రియాం బహుమతాం భార్యాం త్యక్త్వా రాజా మహాబలః,
సర్వాసాం చ మహాభాగాం త్వాముపైష్యతి రావణః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రావణః=రావణుడు, ప్రియామ్=ప్రియురాలూ, బహుమతామ్= గౌరవపాత్రురాలూ, సర్వాసామ్=భార్యలందరిలోకీ, మహాభాగామ్=గొప్ప భాగ్యము కలదీ అయిన, భార్యామ్= భార్యను (మందోదరిని), త్యక్త్వా=విడచి, త్వామ్=నిన్ను, ఉపైష్యతి=పొందగలడు.

తా. మందోదరి రావణుని భార్యలందరిలోకీ చాలా భాగ్యము కలది. రావణునకు ప్రియురాలు, గౌరవపాత్రురాలు. అట్టి ఆమెను కూడ విడచి మహాబలశాలి యైన రావణుడు నిన్నే పొందగలడు. 13

మూ. సమృద్ధం స్త్రీసహస్రేణ నానారత్నోపశోభితమ్, 14
అన్తఃపురం సముత్సృజ్య త్వాముపైష్యతి రావణః.

ప్ర. అ. రావణః=రావణుడు, స్త్రీసహస్రేణ=వేయిమంది స్త్రీలతో, సమృద్ధమ్=నిండిన, నానారత్నోపశోభితమ్=అనేకవిధములైన శ్రేష్ఠవస్తువులచే ప్రకాశింపచేయబడిన, అన్తఃపురమ్=అంతఃపురమును, సముత్సృజ్య=విడచి, త్వామ్=నిన్ను, ఉపైష్యతి=పొందగలడు.

తా. వేయిమంది స్త్రీలతో నిండినదై, అనేక రత్నములచేత ప్రకాశింపచేయబడిన అంతఃపురమును విడచి రావణుడు నిన్ను చేరగలడు. 14

మూ. అన్యా తు వికటా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్, 15
అసకృద్దేవతా యుద్ధే నాగగన్ధర్వదానవాః
నిర్జితాః సమరే యేన స తే పార్శ్వముపాగతః. 16

ప్ర. అ. వికటా నామ = వికట అను పేరు గల, అన్యా = మరి యొక్క, రాక్షసీ తు = రాక్షసస్త్రీ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. యేన = ఎవనిచేత, అసకృత్ = అనేకపర్యాయములు, యుద్ధే = యుద్ధమునందు, దేవతాః = దేవతలు, సమరే = యుద్ధమునందు, నాగగన్ధర్వదానవాః = నాగులు, గంధర్వులు, దానవులు, నిర్జితాః = జయింపబడినారో, సః = ఆ రావణుడు, తే = నీయొక్క, పార్శ్వమ్ = ప్రక్కకు, ఆగతః = వచ్చినాడు.

తా. వికట అను మరి యొక రాక్షసస్త్రీ ఇట్లు పలికెను— యుద్ధాలలో అనేకపర్యాయములు దేవనాగగంధర్వదానవులను ఓడించిన రావణుడు ఇప్పుడు నీ చెంతకు వచ్చినాడు. 16

మూ. తస్య సర్వసమృద్ధస్య రావణస్య మహాత్మనః.
కిమద్య రాక్షసేన్ద్రస్య భార్యాత్వం నేచ్ఛసేఽధమే 17

ప్ర. అ. అధమే = ఓ! నీచురాలా! సర్వసమృద్ధస్య = అన్ని విధాలా ఐశ్వర్యసంపన్నుడూ, మహాత్మనః = గొప్ప బుద్ధి కలవాడు, రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజూ అయిన, తస్య = అట్టి, రావణస్య = రావణునకు, భార్యాత్వమ్ = భార్యాత్వమును, అద్య = ఇప్పుడు, కిమ్ = ఎందువలన, నేచ్ఛసే = ఇచ్ఛయించుటలేదు.

తా. ఓ! నీచురాలా! సకలైశ్వర్యసంపన్నుడూ, మహాత్ముడూ, రాక్షసరాజూ అయిన అట్టి రావణునికి భార్య అగుటకు అంగీకరించవేమి? 17

మూ. తతస్తు దుర్ముఖీ నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
యస్య సూర్యో న తపతి భీతో యస్య చ మారుతః, 18
న వాతి స్మాయతాపాఙ్గే కిం త్వం తస్య న తిష్ఠసి.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దుర్ముఖీ నామ = దుర్ముఖి అను, రాక్షసీ = రాక్షసి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఆయతాపాఙ్గే = దీర్ఘ మైన

నేత్రాంతములు కలదానా। యస్య=ఎవనికి, భీతః=భయపడినవాడై, సూర్యః= సూర్యుడు, న తపతి = తీక్ష్ణముగా ఎండకాయడో, యస్య = ఎవనికి, భీతః = భయపడినవాడై, మారుతః = వాయువు, న వాతి స్మ = గట్టిగా వీచదో, తస్య = వానికి, త్వమ్ = నీవు, కిమ్ = ఎందువలన, న తిష్ఠసి = అనుకూలు రాలవుగా ఉండవు ?

తా. పిమ్మట దుర్ముఖి అను రాక్షసి ఇట్లు పలికెను. ఓ। దీర్ఘనేత్రాంత ములు కలదానా ! ఏ రావణునికి భయపడి సూర్యుడు గట్టిగా ఎండ కాయడో, ఎవనికి భయపడి గాలి గట్టిగా వీచదో, అట్టి రావణుని ఆజ్ఞ ప్రకారము నీవు ఎందుకు నడచుకొనుటలేదు ? 18

మూ. పుష్పవృష్టిం చ తరవో ముముచుర్యస్య వై భయాత్.
శైలాశ్చ సుభ్రు పానీయం జలదాశ్చ యదేచ్ఛతి.

తస్య నైర్ఋతరాజస్య రాజరాజస్య భామిని. 20
కిం త్వం న కురుషే బుద్ధిం భార్యార్థే రావణస్య హి.

ప్ర. ఆ సుభ్రు = మంచి కనుబొమ్మలుగల, భామిని = ఓ। సీతా! యస్య = ఎవనియొక్క, భయాత్ = భయమువలన, తరవః = వృక్షములు, పుష్పవృష్టిమ్ = పుష్పవర్షమును, ముముచుః = విడచినవో, యదా = ఎప్పుడు, ఇచ్ఛతి=కోరునో, అప్పుడు, శైలాశ్చ=పర్వతములు, జలదాశ్చ=మేఘములూ, పానీయమ్ = ఉదకమును, విడచినవో, నైర్ఋతరాజస్య = రాక్షసరాజూ, రాజ రాజస్య = రాజులకు కూడ రాజూ అయిన, తస్య = అట్టి, రావణస్య = రావణుని యొక్క, భార్యార్థే = భార్యగా ఉండుటకొరకు, బుద్ధిమ్ = బుద్ధిని, త్వమ్=నీవు, కిమ్ = ఎందువలన, న కురుషే = చేయుటలేదు ?

తా. అందమైన కనుబొమ్మలు గల ఓ సీతా ! రాక్షసరాజూ, రాజాధి రాజూ అయిన ఏ రావణునికి భయపడి వృక్షములు పుష్పవర్షము కురిపించు చుండునో, ఏ రావణుడు కోరినప్పు డెల్ల పర్వతములు, మేఘములు కూడ జలము విడచుచుండునో అట్టి రావణునికి భార్య అగుటకు అంగీకరించకున్నా వేమి ? 19, 20

మూ. సాధు తే తత్త్వతో దేవి కథితం సాధు భామిని, 21
గృహాణ సుస్మితే వాక్యమన్యథా న భవిష్యసి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రయోవింశః సర్గః.

ప్ర. అ. సుస్మితే = మంచి చిరునవ్వు గల, భామిని = సౌందర్యముగల, దేవి = ఓ ! సీతా ! సాధు = బాగుగా, తత్త్వతః = యథార్థముగా, తే = నీకు, కథితమ్ = చెప్పబడిన. సాధు = మంచిదైన, వాక్యమ్ = వాక్యమును, గృహాణ = గ్రహింపుము. అన్యథా = అట్లు కానిచో, న భవిష్యసి = ఉండవు.

తా. అందమైన చిరునవ్వు గల సౌందర్యవతి వైన ఓ ! సీతా ! చక్కగా, యథార్థముగా నీకు చెప్పుచున్నాను. నా మాట వినుము. అట్లు కానిచో నీ వింక జీవింపవు. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో ఇరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుర్వింశః సర్గః

[సీత రాక్షసస్త్రీల మాటలు తిరస్కరించుట; వాళ్లు సీతను భయ పెట్టుట]

మూ. తతః సీతాముపాగమ్య రాక్షస్యో వికృతాననాః,
పరుషం పరుషా నార్యః ఊచుస్తాం వాక్యమప్రియమ్. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పరుషాః = క్రూరస్వభావము గల, వికృతాననాః = వికృతము లైన ముఖములు గల, రాక్షస్యః నార్యః = రాక్షస స్త్రీలు, తాం సీతామ్ = ఆ సీతను, ఉపాగమ్య = సమీపించి, అప్రియమ్ = అప్రియ మైన, వాక్యమ్ = వాక్యమును, పరుషమ్ = పరుషముగా, ఊచుః = పలికిరి.

తా. పిమ్మట క్రూరస్వభావము గల, వికృతము లైన ముఖములతో భయంకరముగా ఉన్న రాక్షసస్త్రీలు సీతను సమీపించి పరుషముగా అప్రియము లైన మాటలు పలికిరి. 1

మూ. కిం త్వమన్తఃపురే సీతే సర్వభూతమనోహరే,
మహార్హశయనోపేతే న వాసమనుమన్యసే. 2

ప్ర. అ. సీతే = సీతా! త్వమ్ = నీవు, సర్వభూతమనోహరే = సకల భూతములకు మనోహరమూ, మహార్హశయనోపేతే = అత్యుత్తమము లైన శయనములతో కూడినదీ అయిన, అన్తఃపురే = అంతఃపురమునందు, వాసమ్ = నివాసమును, కిమ్ = ఎందువలన, నానుమన్యసే = అంగీకరించుటలేదు?

తా. ఓ! సీతా! రావణాంతఃపురము అందరికీ మనోహర మైనది; శ్రేష్ఠము లైన శయనములతో అలంకరింపబడినది. అట్టి అంతఃపురములో నివసించుటకు ఏల అంగీకరింపవు? 2

మూ. మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహుమన్యసే.
ప్రత్యాహర మనో రామాన్న త్వం జాతు భవిష్యసి. 3

ప్ర. అ. మానుషీ = మనుష్యస్త్రీ వైన నీవు, మానుషస్యైవ = మనుష్యునకే, భార్యాత్వమ్ = భార్య యగుటను, బహుమన్యసే = గొప్పదిగా తలంచు చున్నావు. రామాత్ = రామునినుండి, మనః = మనస్సును, ప్రత్యాహర = మరల్పుము. త్వమ్=నీవు, జాతు=ఎన్నటను, న భవిష్యసి=ఉండవు.

తా. నీవు మనుష్యస్త్రీవి అగుటచే మనుష్యుని భార్యగా ఉండుటయే గొప్ప అని తలచుచున్నావు. ఇంక రామునినుండి నీ మనస్సును మరల్చుకొనుము. అట్లు కానిచో నీ వెన్నటికి జీవించవు. 3

మూ. త్రైలోక్యవసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్,
భర్తారముపసంగమ్య విహరస్వ యథాసుఖమ్. 4

ప్ర. అ. త్రైలోక్యవసుభోక్తారమ్ = మూడు లోకముల ఐశ్వర్యమును అనుభవించు, రాక్షసేశ్వరమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుని, భర్తారమ్= భర్తనుగా, ఉపసంగమ్య = చేరి, యథాసుఖమ్ = సుఖముగా, విహరస్వ = విహరింపుము.

తా. రాక్షసరాజైన రావణుడు మూడు లోకముల ఐశ్వర్యమును అనుభవించువాడు. అతనిని భర్తగా చేరి సుఖముగా విహరింపుము. 4

మూ. మానుషీ మానుషం తం తు రామమిచ్ఛసి శోభనే,
రాజ్యాద్భ్రష్టమసిద్ధార్థం విక్లబం త్వమనిన్దితే. 5

ప్ర. అ. శోభనే = మంగళప్రదురాలా! అనిన్దితే = నిందింపబడనిదానా! మానుషీ = మనుష్యస్త్రీ వైన, త్వం తు = నీవైతే, రాజ్యాత్ = రాజ్యమునుండి, భ్రష్టమ్=భ్రష్టుడూ, అసిద్ధార్థమ్=సఫలముకాని కార్యములు కలవాడు, విక్లబమ్ =వ్యాకులుడూ అయిన, మానుషమ్=మనుష్యుడైన, తం రామమ్=ఆ రాముని, ఇచ్ఛసి=కోరుచున్నావు।

తా. మంగళప్రదురాలవు, దోషరహితురాలవు అయిన ఓ! సీతా! మనుష్యస్త్రీ వగుటచే నీవు మనుష్యుడైన ఆ రాముడే కావాలని కోరుకొను

యున్నావు. అతడు రాజ్యభ్రష్టుడు. ఏకార్యములు సాధించలేనివాడు. కష్టాంతో వ్యాకులుడై ఉన్నాడు. 5

మూ. రాక్షసీనాం వచః శ్రుత్వా సీతా పద్మనిభేక్షణా,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యామిదం వచనమబ్రవీత్. 6

ప్ర. అ. పద్మనిభేక్షణా = పద్మముతో సమాన మైన నేత్రములు గల, సీతా = సీత, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీలయొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, అశ్రుపూర్ణాభ్యామ్ = కన్నీళ్ళతో నిండిన, నేత్రాభ్యామ్ = నేత్రములతో, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పద్మముల వంటి నేత్రములు గల సీత, రాక్షసస్త్రీల మాటలు విని, కన్నీళ్ల నిండిన నేత్రములతో ఇట్లు పలికెను. 6

మూ. యదిదం లోకవిద్విష్టముదాహరథ సంగతాః,
నైతన్మనసి వాక్యం మే కిల్బిషం ప్రతిభాతి వః. 7

ప్ర. అ. సంగతాః = కలిసిన మీరందరూ, లోకవిద్విష్టమ్ = లోకములో ద్వేషింపబడిన, యత్ = ఏ, ఇదమ్ = ఈ వాక్యమును, మే = నా విషయమునందు, ఉదాహరథ = పలుకుచున్నారో, ఏతత్ = ఇది, వః = మీయొక్క, మనసి = మనస్సునందు, కిల్బిషమ్ = పాప మైనదిగా, న ప్రతిభాతి = తోచుటలేదా?

తా. మీ రందరూ కలసి, నాతో, లోకులు నిందించే మాటలు మాటలాడుచున్నారు; ఇవి పాపపు మాట లని మీకు తోచుటలేదా? 7

మూ. న మానుషీ రాక్షసస్య భార్యా భవితుమర్హతి,
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః. 8

ప్ర. అ. మానుషీ = మనుష్యస్త్రీ, రాక్షసస్య = రాక్షసునకు, భార్యా = భార్యగా, భవితుమ్ = అగుటకు, న అర్హతి = తగదు. సర్వాః = మీ రందరూ, కామమ్ = స్వేచ్ఛగా, మామ్ = నన్ను, ఖాదత = తినివెయ్యండి. వః = మీయొక్క, వచః = వచనమును, న కరిష్యామి = చెయ్యను.

తా. మనుష్యస్త్రీ రాక్షసునకు భార్య అగుట యుక్తము కాదు. మీ

తండ్రియూ కలిసి నన్ను చంపి తినివేసినా సరే; పితు చెప్పినట్లు మాత్రము చెయ్యను. 8

మూ. దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః,
తం నిత్యమనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా. 9

ప్ర. అ. దీనో వా = దీను డైనను, రాజ్యహీనో వా = రాజ్యహీను డైనను, యః = ఎవడు, మే = నాకు, భర్తా = భర్త యో, సః = అతడే, మే = నాకు, గురుః = పూజ్యుడు. సువర్చలా = సువర్చల, సూర్యం యథా = సూర్యుని వలె, నిత్యమ్ = ఎల్లప్పుడు, తమ్ = అతనిని గూర్చి, అనురక్తా = అనురాగము కలదానను, అస్మి = అయి ఉన్నాను.

తా. దీను డైనా, రాజ్యభ్రష్టు డైనా, నా భర్తయే నాకు పూజ్యుడు. సువర్చల సూర్యునియందు అనురాగముతో ఉన్నట్లు, నేను ఎల్లప్పుడు నా భర్త యందే అనురాగముతో ఉందును. 9

మూ. యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి,
అరుంధతీ వసిష్ఠం చ రోహిణీ శశినం యథా. 10

లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనం యథా,
సావిత్రీ సత్యవన్తం చ కపిలం శ్రీమతీ యథా, 11

సౌదాసం మదయన్తీవ కేశినీ సగరం యథా,
నైషధం దమయన్తీవ భైమీ పతిమనువ్రతా. 12

తథాహమిక్ష్వాకువరం రామం పతిమనువ్రతా.

ప్ర. అ. మహాభాగా = ఉత్తమభాగ్యవంతురా లైన, శచీ = శచీదేవి, యథా = ఎట్లు, శక్రమ్ = దేవేంద్రుని, సముపతిష్ఠతి = చేరునో, అరుంధతీ = అరుంధతి వసిష్ఠం చ = వసిష్ఠుని చేరునో, రోహిణీ = రోహిణి, శశినమ్ = చంద్రుని, యథా = ఎట్లు చేరునో, లోపాముద్రా = లోపాముద్ర, అగస్త్యమ్ = అగస్త్యుని, యథా = ఎట్లు చేరునో, సుకన్యా = సుకన్య, చ్యవనమ్ = చ్యవనుని, యథా = ఎట్లు చేరునో, సావిత్రీ = సావిత్రి, సత్యవన్తమ్ = సత్యవంతుని ఎట్లు చేరునో, శ్రీమతీ = శ్రీమతి.

కపిలమ్=కపిలుని, యథా=ఎట్లు సేవనో అట్లు, సౌదాసమ్=సౌదాసుని, మదయన్తీవ=మదయంతి వలె, కేశినీ=కేశిని, సగరం యథా = సగరుని వలె, పతిమ్=భర్త యైన, నైషధమ్=నలుని, అనువ్రతా=అనుసరించిన వ్రతముగల, భైమీ=భీముని కుమార్తె యైన, దమయన్తీవ=దమయంతి వలె, తథా= అట్లే, అహమ్=నేను, ఇక్ష్వాకువరమ్=ఇక్ష్వాకురాజులలో శ్రేష్ఠుడైన, పతిమ్ = భర్త యైన, రామమ్=రాముని, అనువ్రతా=అనుసరించిన వ్రతము కలదానను.

తా. మహాభాగ్యవంతురాలైన శచీదేవి దేవేంద్రుని వలె, అరుంధతి వసిష్ఠుని వలె, రోహిణి చంద్రుని వలె, లోపాముద్ర అగస్త్యుని వలె, సుకన్య చ్యవనుని వలె, సావిత్రి సత్యవంతుని వలె, శ్రీమతి కపిలుని వలె, మదయంతి సౌదాసుని వలె, కేశిని సగరుని వలె, భీమపుత్రి యైన దమయంతి నలుని వలె నేను ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడైన రామునే అనుసరింతుదానను. 10-12

మూ. సీతాయా వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
భర్త్సయన్తి స్మ పరుషైర్వాక్యై రావణచోదితాః.

ప్ర. అ. రావణచోదితాః = రావణునిచేత ప్రేరేపింపబడిన, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, సీతాయాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, క్రోధమూర్ఛితాః = క్రోధముచే వ్యాపింపబడినవారై, పరుషైః = పరుషము లైన, వాక్యైః = వాక్యములచేత, భర్త్సయన్తి స్మ = భయపెట్టిరి.

తా. రావణునిచేత ప్రేరేపింపబడిన ఆ రాక్షసస్త్రీలు, సీత మాటలు విని కోపముతో నిండినవారై, పరుషము లైన మాటలతో ఆమెను భయపెట్టిరి. 13

మూ. అవలీనః స నిర్వాక్యో హనుమాన్ శింశుపాద్రుమే, 14
సీతాం సన్తర్జయన్తీస్తా రాక్షసీరశృణోత్ కపిః.

ప్ర. అ. కపిః = వానరుడైన, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, నిర్వాక్యః = మాటలాడని వాడై, శింశుపాద్రుమే = శింశుపావృక్షమునందు, అవలీనః = దాగి ఉన్నవాడై, సీతామ్ = సీతను, సన్తర్జయన్తీః = భయపెట్టుచున్న తాః = ఆ, రాక్షసీః = రాక్షసస్త్రీలను, అశృణోత్ = వినెను.

తా. ఆ హనుమంతుడు ఏమీ మాటలాడకుండా ఆ శింశుపావృక్షము పైననే దాగి ఉండి సీతను భయపెట్టుచున్న రాక్షసస్త్రీల మాటలు వినుచుండెను.

వి. ఈ సందర్భములో హనుమంతుడు మాటలాడే ప్రసక్తియే లేదు గాన "నిర్వాక్యః" అనే విశేషణము అనర్థకముగా కనబడుచున్నది. ఇంత జరుగుచున్నా హనుమంతుడు తాను బైటపడలేదు అనే భావము చెప్పకొనవలసి ఉండును. అందుచేత ప్రాచ్యపాఠము బాగున్నది.

''అవలీనస్తు తద్వాక్యం హనుమాన్ శింశపాద్రుమే,
సీతాం సంతర్జయన్తీనాం రాక్షసీనాం స శుశ్రువే" అని ప్రా. పాఠము.

మూ. తామభిక్రమ్య సంక్రుద్ధా వేపమానాం సమన్తతః. 15
భృశం సంలిలిహుర్దీప్తాన్ ప్రలమ్బాన్ దశనచ్ఛదాన్.

ప్ర. అ. వేపమానామ్ = వణకుచున్న, తామ్ = ఆ సీతను, సమన్తతః = నలువైపులా, అభిక్రమ్య = సమీపించి, సంక్రుద్ధాః = కోపగించినవారై, దీప్తాన్ = ఎఱ్ఱగా ప్రకాశించుచున్న, ప్రలమ్బాన్ = వ్రేలాడుచున్న, దశనచ్ఛదాన్ = పెదవులను, భృశమ్ = మిక్కిలి, సంలిలిహుః = నాకిరి.

తా. ఆ రాక్షసస్త్రీలు వణకిపోవుచున్న సీతను నలు మూలల చుట్టుముట్టి కోపముతో, వ్రేలాడుచున్న ఎఱ్ఱని తమ పెదవులను నాకుచు, సీతను చంపి తిని వేయుద మన్నట్లు సూచించుచుండిరి. 15

మూ. ఊచుశ్చ పరమక్రుద్ధాః ప్రగృహ్యాశు పరశ్వధాన్, 16
నేయమర్హతి భర్తారం రావణం రాక్షసాధిపమ్.

ప్ర. అ. పరమక్రుద్ధాః = చాలా కోపించినవారై, ఆశు = శీఘ్రముగా, పరశ్వధాన్ = గండ్ర గొడ్డండ్లను, ప్రగృహ్య = గ్రహించి, ఊచుశ్చ = ఇట్లు పలికిరి కూడ. ఇయమ్ = ఈమె, రాక్షసాధిపమ్ = రాక్షసరాజైన, రావణమ్ = రావణుని, భర్తారమ్ = భర్తనుగా, నార్హతి = తగదు.

తా. వారు చాలా కోపముతో వెంటనే, గండ్రగొడ్డళ్లు చేతులలో ధరించి ఇట్లనిరి. "ఈమె రాక్షసరాజైన రావణునకు భార్య అగుటకు తగదు". 16

మూ. సా భర్త్స్యమానా భీమాభీ రాక్షసీభిర్వరాననా, 17
సబాష్పమపమార్జన్తీ శింశపాం తాముపాగమత్.

ప్ర. అ. భీమాభిః = భయంకర మైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, భర్త్స్యమానా = భయపెట్టబడుచున్న, సా = ఆ, వరాననా = శ్రేష్ఠ మైన ముఖము గల సీత, సబాష్పమ్ = కన్నీళ్లతో కూడి నట్లుగా, అపసర్పన్తీ = అక్కడినుండి తొలగుచున్న దై, తామ్ = ఆ, శింశుపామ్ = శింశుపావృక్షమును ఉపాగమత్ = చేరెను.

తా. భయంకర మైన ఆ రాక్షసస్త్రీలు భయపెట్టుచుండగా సుందర మైన ముఖము గల సీత, కన్నీళ్లు కార్చుచు అచటినుండి దూరముగా పోయి ఆ శింశుపావృక్షము వైపు వెళ్ళెను. 17

మూ. తతస్తాం శింశుపాం సీతా రాక్షసీభిః సమావృతా, 18
అభిగమ్య విశాలాక్షీ తస్థౌ శోకపరిప్లుతా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విశాలాక్షీ = విశాలము లైన నేత్రములు గల, సీతా = సీత, తాం శింశుపామ్ = ఆ శింశుపావృక్షమును, అభిగమ్య = సమీపించి, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, సమావృతా = చుట్టువారుకొనబడి నదై, శోకపరిప్లుతా = దుఃఖముతో నిండినదై, తస్థౌ = ఉండెను

తా. పిమ్మట విశాలాక్షి యైన ఆ సీత శింశుపావృక్షమును చేరి, అక్కడ కూడ రాక్షసస్త్రీలు చుట్టుముట్టగా, దుఃఖాక్రాంతయై నిలచెను. 18

మూ. తాం కృశాం దీనవదనాం మలినామ్బరధారిణీమ్, 19
భర్త్సయాంచక్రిరే సీతాం రాక్షస్యస్తాం సమన్తతః.

ప్ర. అ. తాః = ఆ, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, కృశామ్ = కృశించినది, దీనవదనామ్ = దీన మైన ముఖము గలది, మలినామ్బరధారిణీమ్ = మలిన మైన వస్త్రములను ధరించినది అయిన, తాం సీతామ్ = ఆ సీతను, సమన్తతః = నలు వైపులనుండి, భర్త్సయాంచక్రిరే = భయపెట్టిరి.

తా. కృశించి, దీన మైన ముఖముతో, మలిన మైన వస్త్రములను ధరించి యున్న ఆ సీతను, ఆ రాక్షసస్త్రీలు, చుట్టు చేరి, భయపెట్టిరి. 19

మూ. తతస్తాం వినతా నామ రాక్షసీ భీమదర్శనా, 20
అబ్రవీత్కుపితాకారా కరాళా నిర్ణతోదరీ.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, భీమదర్శనా = భయంకర మైన దర్శనము కలదీ, కుపితాకారా = కోపగించిన ఆకారము గలది, కరాళా = వంకర టింకరగా ఉన్నది, నిర్ణతోదరీ = లోతుగా దించుకొనిపోయిన ఉదరము గంది అయిన, వినతా నామ = వినత అను, రాక్షసీ = రాక్షసస్త్రీ, తామ్ = ఆమెనుగూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట, చూచువారికి భయము కలిగించు వినత యను రాక్షసి ఇట్లు పలికెను. ఆమె దేహము వంకరటింకరగా ఉండెను. ఆమె కోపముతో నిండియుండెను. ఆమె పొట్ట లోతుకు పోయి ఉండెను. 20

మూ. సీతే పర్యాప్త మేతావద్భర్తుః స్నేహో నిదర్శితః, 21
సర్వత్రాతికృతం భద్రే వ్యసనాయోపకల్పతే.

ప్ర. అ. సీతే = సీతా! భర్తుః = భర్త యొక్క (యందు), స్నేహః = స్నేహము, నిదర్శితః = చూపబడినది. ఏతావత్ = ఇంతమాత్రము, పర్యాప్తమ్ = చాలును. భద్రే = మంగళప్రదురాలా! సర్వత్ర = అంతటా, అతికృతమ్ = అతిగా చేయబడినది, వ్యసనాయ = కష్టమునకు, ఉపకల్పతే = ఏర్పడును.

తా. సీతా! నీ భర్తపై నీ వింతవరకూ చూపించిన ప్రేమ చాలును. ఓ మంగళప్రదురాలా! ఏ విషయమునందైనను అతిగా చేసినచో అది కష్టాలకు దారి తీయును. 21

మూ. పరితుష్టాస్మి భద్రం తే మానుషస్తే కృతో విధిః, 22
మమాపి తు వచః పథ్యం బ్రువన్త్యాః కురు మైథిలి.

ప్ర. అ. మైథిలి = సీతా! పరితుష్టా = సంతోషించినదానను, అస్మి = అయినాను. తే = నీవు (నీచేత), మానుషః = మనుష్యసంబంధ మైన, విధిః = ధర్మము, కృతః = నిర్వర్తింపబడినది. తే = నీకు, భద్రమ్ = మంగళ మగు గాక. బ్రువన్త్యాః = చెప్పుచున్న, మమ = నాయొక్క, పథ్యమ్ = పథ్య మైన, వచః అపి = వాక్యమును కూడ, కురు = చేయుము.

తా. ఓ సీతా! ఒక మనుష్యస్త్రీ చేయవలసిన ధర్మమును నిర్వర్తించినావు. చాలా సంతోషము! నీకు క్షేమ మగు గాక. నేను చెప్పుచున్న హితవాక్యమును కూడ విని, అట్లు ఆచరింపుము. 22

మూ. రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్, 23
విక్రాన్తం రూపవన్తం చ సురేశమివ వాసవమ్,
దక్షిణం త్యాగశీలం చ సర్వస్య ప్రియదర్శనమ్. 24

ప్ర. అ. సర్వరక్షసామ్=సమస్త మైన రాక్షసులకు, భర్తారమ్ = భర్త యైన వాడూ, విక్రాన్తమ్= విక్రమించువాడూ, రూపవన్తం చ = సౌందర్యవంతుడూ, సురేశమ్ = దేవతాప్రభు వైన, వాసవమివ = దేవేంద్రుని వంటి వాడూ, దక్షిణమ్ = నేర్పుగలవాడూ, త్యాగశీలం చ = త్యాగస్వభావము కల వాడూ, సర్వస్య = అందరికీ, ప్రియదర్శనమ్ = ప్రియ మైన దర్శనము కల వాడూ అయిన, రావణమ్=రావణుని, భర్తారమ్=భర్తనుగా, భజ=పొందుము.

తా. సకలరాక్షసులకు ప్రభు వైన రావణుని భర్తగా పొందుము. అతడు పరాక్రమవంతుడు; సౌందర్యవంతుడు; దేవతల అధిపతి యైన దేవేంద్రుని వంటివాడు. నేర్పు కలవాడు. త్యాగశీలము కలవాడు. చూచేవా రందరికీ ఆనందము కలిగించువాడు. 23, 24

మూ. మానుషం కృపణం రామం త్యక్త్వా రావణమాశ్రయ,
దివ్యాఙ్గరాగా వైదేహి దివ్యాభరణభూషితా, 25
అద్యప్రభృతి సర్వేషాం లోకనామీశ్వరీ భవ.

ప్ర. అ. మానుషమ్ = మానవుడూ, కృపణమ్ = దీనుడూ అయిన, రామమ్ = రాముని, త్యక్త్వా = విడచి, రావణమ్ = రావణుని, ఆశ్రయ = ఆశ్రయించుము. వైదేహి = సీతా! దివ్యాఙ్గరాగా=శ్రేష్ఠ మైన అంగరాగము గలదానవై, దివ్యాభరణభూషితా=శ్రేష్ఠములైన అలంకారములతో అలంకరించబడిన దానవై, అద్యప్రభృతి=నేడు మొదలు, సర్వేషామ్ = సమస్త మైన, లోకానామ్ = లోకములకు, ఈశ్వరీ = ప్రభువుగా, భవ=అగుము.

తా. సీతా! మానవుడూ, దీనుడూ అయిన రాముణ్ణి విడిచిపెట్టి రావణుని ఆశ్రయించుము. నేటినుండి దివ్యము లైన అంగరాగములను (మైపూతలను) శరీరమునకు పూసికొని శ్రేష్ఠము లైన అలంకారములు అలంకరించుకొని సకల లోకములకు ప్రభువు అగుము. 25

మూ. అగ్నేః స్వాహా యథా దేవీ శచీ వేన్ద్రస్య శోభనే, 26
కిం తే రామేణ వైదేహి కృపణేన గతాయుషా.

ప్ర. అ. శోభనే=మంగళప్రదురాలా! అగ్నేః=అగ్నియొక్క, దేవీ=భార్య యైన, స్వాహా యథా=స్వాహాదేవి వలె, ఇన్ద్రస్య=ఇంద్రుని భార్య యైన, శచీవ=శచీదేవివలె, (లోకాతీతసుందరాలవు అగుము). వైదేహి=సీతా! కృపణేన=దీనుడూ, గతాయుషా = గడచిపోయిన ఆయుర్దాయము కలవాడూ అయిన, రామేణ=రామునితో, కిమ్=ఏమి ప్రయోజనము?

తా. మంగళప్రదురాలవైన సీతా! అగ్నిదేవుని భార్య యైన స్వాహాదేవి వలె, ఇంద్రుని భార్య యైన శచీదేవి వలె లోకాతీతురాలవు అగుము. దీను డైన రామునితో నీ కేమి ప్రయోజన మున్నది. అతని ఆయుర్దాయము తీరిపోయినది.

మూ. ఏతదుక్తం చ మే వాక్యం యది త్వం న కరిష్యసి, 27
అస్మిన్ముహూర్తే సర్వాస్త్వాం భక్షయిష్యామహే వయమ్.

ప్ర. అ. ఉక్తమ్=పలుకబడిన, మే=నాయొక్క, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, త్వమ్=నీవు, న కరిష్యసి యది=చేయకపోయినచో, వయమ్=మేము, సర్వాః=అందరము, అస్మిన్=ఈ, ముహూర్తే=క్షణమునందే, త్వామ్=నిన్ను, భక్షయిష్యామహే=భక్షించెదము.

తా. నేను చెప్పినట్లు నీవు చేయకపోయినచో, మే మందరమూ కలిసి ఈ క్షణంలోనే నిన్ను చంపి తినివేసెదము. 27

మూ. అన్యా తు వికటా నామ లమ్బమానపయోధరా. 28
అబ్రవీత్కుపితా సీతాం ముష్టిముద్యమ్య గర్జతీ.

ప్ర. అ. లమ్బమానపయోధరా=వ్రేలాడుచున్న స్తనములు గల, వికటా నామ=వికట అను పేరు గల, అన్యా తు=మరియొక స్త్రీ యైతే, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, కుపితా = కోపగించినదై, గర్జతీ = గర్జించుచు, సీతామ్=సీతను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. వ్రేలాడుచున్న స్తనములు గల వికట అను మరొక రాక్షసి, కోపముతో పిడికిలి ఎత్తి గర్జించుచు సీతతో ఇట్లు పలికెను. 28

మూ. బహూన్యప్రియరూపాణి వచనాని సుదుర్మతే. 29
అనుక్రోశాన్మృదుత్వాచ్చ సోఢాని తవ మైథిలి.

ప్ర. అ. సుదుర్మతే=చాలా చెడ్డ బుద్ధి గల, మైథిలి = సీతా! అప్రియ రూపాణి=చాలా అప్రియము లైన, బహూని=అనేకము లైన, తవ వచనాని=నీ మాటలు, అనుక్రోశాత్=జాలివలనా, మృదుత్వాచ్చ=మెత్తతనమువలనా, సోఢాని = సహించబడినవి.

తా. చాలా చెడ్డ బుద్ధి గల సీతా! నీవు చాలా అప్రియముగా పలికిన ఎన్నో మాటలు, నీపై జాలివలన మెత్తతనము చూపి సహించినాము. 29

మూ. న చ నః కురుషే వాక్యం హితం కాలపురస్కృతమ్.
ఆనీతాసి సముద్రస్య పారమన్యైర్దురాసదమ్,
రావణాన్తఃపురం ఘోరం ప్రవిష్టా చాసి మైథిలి. 31

ప్ర. అ. మైథిలి = సీతా! కాలపురస్కృతమ్ = కాలముచేత గౌరవింపబడినదీ, హితమ్ = నీకు హితమూ అయిన, నః = మాయొక్క, వాక్యమ్ = వాక్యమును, న కురుషే చ = నీవు చేయుటలేదు. అన్యైః = ఇతరులచేత, దురాసదమ్ = పొంద శక్యము కాని, సముద్రస్య = సముద్రము యొక్క, పారమ్ = ఆవలి ఒడ్డును గూర్చి, ఆనీతా = తీసికొనిరాబడినదానవు, అసి=అయి ఉన్నావు. ఘోరమ్ = భయంకర మైన, రావణాన్తఃపురమ్ = రావణుని అంతఃపురమును, ప్రవిష్టా=ప్రవేశించినదానవు, అసి=అయి ఉన్నావు.

తా. సీతా! కాలానుగుణముగా మేము చెప్పిన హితవాక్యములను నీవు వినుటలేదు. ఇతరు లెవ్వరూ చేరలేని సముద్రము ఆవలి ఒడ్డుకు తీసికొని వచ్చి నిన్ను భయంకర మైన రావణాంతఃపురములో ఉంచినారు! 30,31

మూ. రావణస్య గృహే రుద్ధామస్మాభిస్తు సురక్షితామ్,
న త్వాం శక్తః పరిత్రాతుమపి సాక్షాత్పురన్దరః. 32

ప్ర అ. రావణస్య = రావణునియొక్క, గృహే = గృహమునందు, రుద్ధామ్ = బంధింపబడినదానవై, అస్మాభిః = మాచేత, సురక్షితామ్ = బాగుగా

రక్షింపబడిన, త్వామ్=నిన్ను, పరిత్రాతుమ్=రక్షించుటకు, సాక్షాత్=సాక్షాత్తు. పురన్దరః అపి=దేవేంద్రుడు కూడ, న శక్తః=సమర్థుడు కాడు.

తా. రావణుని గృహములో అంతఃపురాంతమై మేము జాగ్రత్తగా రక్షించుచున్న నిన్ను రక్షించుటకు సాక్షాత్తు దేవేంద్రునికి కూడ శక్యము కాదు. 32

మూ. కురుష్వ హితవాదిన్యా వచనం మమ మైథిలి,
అలమశ్రుప్రపాతేన త్యజ శోకమనర్థకమ్. 33

ప్ర. అ. మైథిలి=సీతా! హితవాదిన్యాః=హితమును చెప్పుచున్న, మమ=నాయొక్క, వచనమ్=మాటను, కురుష్వ=చేయుము. అశ్రుప్రపాతేన=కన్నీర్లయొక్క పడుటచేత, అలమ్=చాలును, అనర్థకమ్=వ్యర్థమైన, శోకమ్=దుఃఖమును, త్యజ=విడిచిపెట్టుము.

తా. సీతా! నేను చెప్పుచున్న హితవాక్యమును విని ఆ ప్రకారము చేయుము. కన్నీర్లు కార్పకుము. వ్యర్థమైన దుఃఖమును విడిచిపెట్టుము. 33

మూ. భజ ప్రీతిం చ హర్షం చ త్యజైతాం నిత్యదైన్యతామ్,
సీతే రాక్షసరాజేన సహ క్రీడ యథాసుఖమ్. 34

ప్ర. అ. సీతే=సీతా! ప్రీతిం చ=ప్రేమను, హర్షం చ=సంతోషమును, భజ=పొందుము. ఏతామ్=ఈ, నిత్యదైన్యతామ్=నిత్యము దైన్యము కలిగి ఉండుటను, త్యజ=విడిచిపెట్టుము. రాక్షసరాజేన సహ=రాక్షసరాజుతో కూడ, యథాసుఖమ్=సుఖముగా, క్రీడ=క్రీడింపుము.

తా. సీతా! ప్రేమతోను, సంతోషముతోను ఉంటూ, ఈ నిత్యదైన్యమును విడిచిపెట్టుము. రావణునితో కలిసి సుఖముగా క్రీడింపుము. 34

మూ. జానాసి హి యథా భీరు స్త్రీణాం యౌవనమధ్రువమ్,
యావన్న తే వ్యతిక్రామేత్తావత్సుఖమవాప్నుహి. 35

ప్ర. అ. భీరు=భయస్వభావము గలదానా! స్త్రీణామ్=స్త్రీలయొక్క, యౌవనమ్=యౌవనము, యథా=ఎట్లు, అధ్రువమ్=స్థిరము కానిదో, జానాసి హి=ఎరుగుదువు కదా! తే=నీయొక్క యౌవనము, యావత్=ఎంతలో, న

వ్యతిక్రామేత్ = దాటిపోకుండా ఉండునో, తావత్ = అంతలోగా, సుఖమ్ = సుఖమును, అవాప్నుహి = పొందుము.

తా. భయస్వభావము గలదానా! స్త్రీల యౌవనము స్థిరము కాదను విషయము నీకు తెలియును కదా; నీ యౌవనము గడచిపోవుటకు ముందుగానే సుఖము అనుభవింపుము. ౩౫

మూ. ఉద్యానాని చ రమ్యాణి పర్వతోపవనాని చ,
సహ రాక్షసరాజేన చర త్వం మదిరేక్షణే. ౩౬

ప్ర. అ. మదిరేక్షణే = మత్తు కలిగించే నేత్రములు గల సీతా! త్వమ్ = నీవు, రాక్షసరాజేన = రాక్షసరాజుతో కూడ, రమ్యాణి = రమ్యము లైన, ఉద్యానాని = ఉద్యానములను, పర్వతోపవనాని = పర్వతములను, వాటి సమీపమునందున్న వనములను, చర = సంచరించుము.

తా. మత్తు కలిగించు చూపులు గల సీతా! నీవు రావణునితో కలిసి, రమ్యము లైన ఉద్యానములలోనూ, పర్వతములపైనా, వాటి దగ్గర నున్న వనములలోనూ హాయిగా విహరించుము. ౩౬

మూ. స్త్రీసహస్రాణి తే సప్త వశే స్థాస్యన్తి సున్దరి,
రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్. ౩౭

ప్ర. అ. సున్దరి = ఓ సుందరీ! సప్త = ఏడు, స్త్రీసహస్రాణి = స్త్రీల సహస్రములు, తే = నీయొక్క, వశే = వశమునందు, స్థాస్యన్తి = ఉండగలవు. సర్వరక్షసామ్ = సమస్త మైన రాక్షసుల, భర్తారమ్ = ప్రభు వైన, రావణమ్ = రావణుని, భర్తారమ్ = భర్తనుగా, భజ = పొందుము.

తా. ఓ సుందరీ! సకలరాక్షసులకు ప్రభు వైన రావణుని భర్తగా అంగీకరించుము. అట్లు చేసినచో ఏడువేలమంది స్త్రీలు నీ చెప్పుచేతలలో ఉండగలరు.

మూ. ఉత్పాట్య వా తే హృదయం భక్షయిష్యామి మైథిలి,
యది మే వ్యాహృతం వాక్యం న యథావత్కరిష్యసి.

ప్ర. అ. మైథిలి = సీతా! వ్యాహృతమ్ = పలుకబడిన, మే = నాయొక్క,

వాక్యమ్ = వాక్యమును, యథావత్ = పలికిన విధముగా, న కరిష్యసి యది = చేయకపోయనచో, తే హృదయమ్ = నీ హృదయమును, ఉత్పాట్య వా = పెల్లగించి యైనా, భక్షయిష్యామి = భక్షించెదను.

తా. సీతా! నీవు నా మాట ప్రకారము చేయకపోయినచో నీ గుండెను చీల్చి తినివేసెదను. 38

మూ. తతశ్చణ్డోదరీ నామ రాక్షసీ క్రోధమూర్ఛితా,
భ్రామయన్తీ మహచ్ఛూలమిదం వచనమబ్రవీత్. 39

ప్ర. అ. తతః = అటుపిమ్మట, చణ్డోదరీనామ = చండోదరి అను, రాక్షసీ = రాక్షసి, క్రోధమూర్ఛితా = క్రోధముచే వ్యాపింపబడినదై, మహత్ = పెద్ద, శూలమ్ = శూలమును, భ్రామయన్తీ = త్రిప్పుచు, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిదప, చండోదరి అను రాక్షసస్త్రీ చాలా కోపముతో పెద్ద శూలమును త్రిప్పుచు ఇట్లు పలికెను. 39

మూ. ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కమ్పిపయోధరామ్,
రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహానభూత్.

ప్ర. అ. హరిణలోలాక్షీమ్ = లేడి వలె చంచలము లైన నేత్రములు గల, త్రాసోత్కమ్పిపయోధరామ్ = భయముచేత కదలుచున్న స్తనములు కల, రావణేన = రావణుని చేత, హృతామ్ = హరించబడిన, ఇమామ్ = ఈమెను, దృష్ట్వా = చూచి, మే = నాకు, మహాన్ = గొప్ప, దౌహృదః = కోరిక (చూలింతరాలికి ప్రియమైన భక్ష్యము మీద కలుగు కోరిక దౌహృదము) అభూత్ = కలిగినది.

తా. లేడి కండ్ల వలె చంచలము లైన నేత్రములు, భయముచే కదలుచున్న స్తనములు గల ఈ సీతను రావణుడు అపహరించి తీసికొని వచ్చినప్పుడు, ఈమెను చూడగానే నాకొక కోరిక కలిగినది. 40

మూ. యకృత్ప్లీహమథోత్పీడం హృదయం చ సబన్ధనమ్,
అన్త్రాణ్యపి తథా శీర్షం ఖాదేయమితి మే మతిః. 41

ప్ర. అ. యకృత్ = హృదయము కుడిప్రక్క నుండు మాంసమును, ప్లీహమ్ = హృదయమునకు ఎడమప్రక్క నుండు మాంసమును. ఉత్పీడమ్ = హృదయమునకు పై నుండు మాంసమును, సబన్ధనమ్ = బంధనముతో కూడిన, హృదయం చ = హృదయమును, అన్త్రాణ్యపి చ = ప్రేగులను, తథా = మరియు, శీర్షమ్ = శిరస్సును, ఖాదేయమ్ ఇతి = తిందును అని, మే = నాకు, మతిః = ఇచ్ఛ ఉన్నది.

తా. ఈమె గుండెకాయ దగ్గర ఉండు యకృత్తు, ప్లీహము, ఉత్పీడము అను మాంసములను, బంధనముతో (గుండె కాయను పట్టి ఉంచునది) సహా గుండెకాయను, ప్రేగులను, శిరస్సును తినవలె నని నాకు కోరిక ఉన్నది. 41

మూ. తతస్తు ప్రఘసా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
కణ్ఠమస్యా నృశంసాయాః పీడయామ కిమాస్యతే. 42

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రఘసా నామ = ప్రఘస అను, రాక్షసీ = రాక్షసస్త్రీ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అస్యాః = ఈ, నృశంసాయాః = క్రూరురాలియొక్క, కణ్ఠమ్ = కంఠమును, పీడయామ = నులిమివేసెదము. కిమ్ = ఎందువలన, ఆస్యతే = ఈ విధముగా కూర్చుండుట జరుగుచున్నది.

తా. పిమ్మట ప్రఘస అను రాక్షసి పలికెను. క్రూరురాలైన ఈ సీత కంఠము నులిమివేసెదము. ఎందుకు ఈ విధంగా ఊరక కూర్చుంటము.

మూ. నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ,
నాత్ర కశ్చన సందేహః ఖాదతేతి స వక్ష్యతి. 43

ప్ర. అ. సా = ఆ, మానుషీ = మనుష్యస్త్రీ, మృతేతి = మరణించినది అని, తతః = పిమ్మట, రాజ్ఞే = రాజునకు, నివేద్యతామ్ = తెలియపరచబడు గాక. ఖాదత = తినివెయ్యండి, ఇతి = అని. సః = అతడు, వక్ష్యతి = చెప్పగలడు, అత్ర = ఈ విషయమునందు, సన్దేహః = సందేహము, న = లేదు.

తా. పిదప "ఆ మనుష్యస్త్రీ మరణించినది" అని రాజుకు చెప్పెదము. "మీరు తిని వెయ్యండి" అని అతడు తప్పక చెప్పగలడు. 43

మూ. తతస్త్వజాముఖీ నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
విశస్యేమాం తతః సర్వాః సమాన్ కురుత పీలుకాన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అజాముఖీ నామ = అజాముఖి అను, రాక్షసీ = రాక్షసస్త్రీ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సర్వాః = మీరందరూ, ఇమామ్ = ఈమెను, విశస్య = చంపి, తతః = పిమ్మట, సమాన్ = సమానము లైన, పీలుకాన్ = మాంసఖండములను, కురుత = చెయ్యండి.

తా. పిమ్మట అజాముఖి అను మరొక రాక్షసి ఇట్లు పలికెను.— "ఈమెను చంపివేసి సమానము లైన మాంసఖండములను చెయ్యండి". 44

మూ. విభజామ తతః సర్వా వివాదో మే న రోచతే,
పేయమానీయతాం క్షిప్రం లేహ్యముచ్చావచం బహు.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సర్వాః = మనమందరము, విభజామ = పంచుకొనెదము. మే = నాకు, వివాదః = కలహము, న రోచతే = ఇష్టము కాదు క్షిప్రమ్ = శీఘ్రముగా, పేయమ్ = మద్యము, ఉచ్చావచమ్ = అనేకవిధము లైన, బహు = అధిక మైన, లేహ్యమ్ = లేహ్యము (నాకి తినవలసిన పదార్థము) ఆనీయతామ్ = తీసికొనిరాండుగాక.

తా. "తరువాత మన మందరము సమముగా పంచుకొనెదము. ఎక్కువ తక్కువ అని వివాదము నాకు ఇష్టము లేదు. వెంటనే మద్యము, అనేక విధము లైన లేహ్య పదార్థములు తీసికొనిరండు". 45

మూ. తతః శూర్పణఖా నామ రాక్షసీ వాక్యమబ్రవీత్,
అజాముఖ్యా యదుక్తం హి తదేవ మమ రోచతే. 46

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శూర్పణఖా నామ = శూర్పణఖ అను పేరుగల, రాక్షసీ = రాక్షసి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అజాముఖ్యా = అజాముఖిచేత, యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడినదో, తదేవ = అదే, మమ = నాకు, రోచతే = ఇష్ట మగుచున్నది.

తా. పిదప శూర్పణఖ అను రాక్షసి ఇట్లు పలికెను. అజాముఖి చెప్పినట్లే చేయుట నాకు కూడా ఇష్టము. 46

మూ. సురా చానీయతాం క్షిప్రం సర్వశోకవినాశినీ,
మానుషం మాంసమాస్వాద్య నృత్యామోథ నికుమ్భిలామ్.

ప్ర. అ. క్షిప్రమ్ = శీఘ్రముగా, సర్వశోకవినాశినీ = సమస్తము లైన శోకములను నశింపచేయు, సురా చ = మద్యము కూడ, ఆనీయతామ్ = తీసికొని రాబడుగాక. మానుషమ్ = మనుష్యసంబంధ మైన, మాసమ్ = మాంసమును, ఆస్వాద్య = తిని, అథ = పిమ్మట, నికుమ్భిలామ్ = లంక పశ్చిమద్వారమునం దున్న నికుంభిల అను శక్తిని గూర్చి, నృత్యామః = నృత్యము చేసెదము.

తా. సకలశోకములను నశింపచేయు మద్యము కూడ వెంటనే తీసికొని రండు. మనుష్యమాంసము తిని, పిమ్మట, నికుంభిలాప్రీత్యర్థ మై నృత్యము చేసెదము. 47

మూ. ఏవం సంభర్త్స్యమానా సా సీతా సురసుతోపమా,
రాక్షసీభిః సుఘోరాభిర్ధైర్యముత్సృజ్య రోదితి. 48

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుర్వింశః సర్గః.

ప్ర. అ. సుఘోరాభిః = చాలా భయంకర లైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలం చేత, ఏవమ్ = ఇట్లు, సంభర్త్స్యమానా = భయపెట్టపడుచున్నదై, సురసుతోపమా = దేవకన్యతో సమానురా లైన, సా సీతా = ఆ సీత, ధైర్యమ్ = ధైర్యమును, ఉత్సృజ్య = విడచి, రోదితి = ఏడ్చుచున్నది.

తా. భయంకర లైన రాక్షసస్త్రీలు ఈ విధముగా భయపెట్టుచుండగా, దేవ కన్యతో సమానురా లైన ఆ సీత, ధైర్యము కోల్పోయి ఏడ్చుచుండెను. 48

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదినాల్గవసర్గ సమాప్తము.

## అథ షడ్వింశః సర్గః

[రాక్షసస్త్రీలు అనేకవిధముల భయపెట్టుచుండగా సీత శోకార్త యై విలపించుట].

మూ. అథ తాసాం వదన్తీనాం పరుషం దారుణం బహు,
రాక్షసీనామసౌమ్యానాం రురోద జనకాత్మజా. 1

ప్ర. అ. అథ=అటు పిమ్మట. అసౌమ్యానామ్=క్రూరస్వభావము గల, తాసామ్=ఆ, రాక్షసీనామ్=రాక్షసస్త్రీలు, పరుషమ్=పరుషముగాను, దారుణమ్=భయంకరముగాను, బహు=అధికముగా, వదన్తీనామ్=మాటలాడుచుండగా, జనకాత్మజా=సీత. రురోద=ఏడ్చెను.

తా. క్రూరస్వభావము గల ఆ రాక్షసస్త్రీలు ఆ విధముగా పరుషముగా భయము కలుగు నట్లు అధికముగా మాటలాడుచుండగా, వారి మాటలు విని సీత ఏడ్చెను. 1

మూ. ఏవముక్తా తు వైదేహీ రాక్షసీభిర్మనస్వినీ,
ఉవాచ పరమత్రస్తా బాష్పగద్గదయా గిరా. 2

ప్ర. అ. రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలుకబడిన, మనస్వినీ=ఉత్తమ మైన మనస్సు గల (ఆత్మాభిమానవంతురాలైన), వైదేహీ=సీత, పరమత్రస్తా=మిక్కిలి భయపడినదై, బాష్పగద్గదయా=కన్నీటిచే డగ్గుత్తికతో కూడిన, గిరా=వాక్కులతో, ఉవాచ=పలికెను.

తా. ఆత్మాభిమానవంతురాలైన సీత, ఆ రాక్షసస్త్రీల మాటలు విని, చాల భయపడినదై, కన్నీటిచే కలిగిన డగ్గుత్తికతో ఇట్లు పలికెను. 2

మూ. న మానుషీ రాక్షసస్య భార్యా భవితుమర్హతి,
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః. 3

ప్ర. అ. మానుషీ = మనుష్యస్త్రీ, రాక్షసస్య = రాక్షసునియొక్క, భార్యా = భార్యగా, భవితుమ్ = అగుటకు, న అర్హతి = తగదు. సర్వాః = మీరందరూ, కామమ్ = ఇష్టమువచ్చినట్లు, మామ్ = నన్ను, ఖాదత = తినండి. వః = మీ యొక్క, వచః = వాక్యమును, న కరిష్యామి = చేయను.

తా. మనుష్యస్త్రీ రాక్షసుని భార్య అగుట కుదరదు. మీరందరూ నన్ను చంపి తినివేసినలో తినివేయండి. మీ మాట మాత్రం నేను చెయ్యను. 3

మూ. సా రాక్షసీమధ్యగతా సీతా సురసుతోపమా,
న శర్మ లేభే దుఃఖార్తా రావణేన చ తర్జితా. 4

ప్ర. అ. రాక్షసీమధ్యగతా = రాక్షసస్త్రీల మధ్యయందున్న, సురసుతోపమా = దేవకన్యతో సమానురాలైన, రావణేన చ = రావణుని చేత కూడ, తర్జితా = భయపెట్టబడిన, సా సీతా = ఆ సీత, దుఃఖార్తా = దుఃఖముచేత పీడింపబడినదై, శర్మ = సుఖమును, న లేభే = పొందలేదు.

తా. రాక్షసస్త్రీల మధ్యలో ఉన్న దేవకన్యాసదృశురాలైన ఆ సీత అంతకు పూర్వమే రావణుడు కూడ భయపెట్టి ఉండుటచే దుఃఖపీడితురాలై, ఏ మాత్రము సుఖము లేకుండ ఉండెను. 4

మూ. వేపతే స్మాధికం సీతా విశన్తీవాఙ్గమాత్మనః,
వనే యూథపరిభ్రష్టా మృగీ కోకైరివార్దితా. 5

ప్ర. అ. వనే = వనమునందు, యూథపరిభ్రష్టా = తన గుంపునుండి దూరమై పోయినదై, కోకైః = తోడేళ్ళచేత, అర్దితా = పీడింపబడిన, మృగీవ = ఆడలేడి వలె, సీతా = సీత, ఆత్మనః = తనయొక్క, అఙ్గమ్ = శరీరమును, విశన్తీవ = ప్రవేశించుచున్నది వలె, అధికమ్ = అధికముగా, వేపతే స్మ = వణికిపోయెను.

తా. వనములో తన గుంపునుండి దూరమైపోయి, తోడేళ్ళ చేత బాధింపబడుచున్న లేడి వలె, సీత, భయముచేత తన శరీరములోనికి క్రుంగిపోవుచున్నట్లు, ముడుచుకొని పోవుచు వణికిపోయెను. 5

మూ. సా త్వశోకస్య విపులాం శాఖామాలమ్బ్య పుష్పితామ్,
చిన్తయామాస శోకేన భర్తారం భగ్నమానసా. 6

ప్ర. అ. శోకేన=శోకముచేత, భగ్నమానసా = విరిగిపోయిన మనస్సు గల, సా తు=ఆ సీత, అశోకస్య=అశోకవృక్షముయొక్క, పుష్పితామ్=పుష్పించిన, విపులామ్=విశాలమైన, శాఖామ్=కొమ్మను, ఆలమ్బ్య = పట్టుకొని, భర్తారమ్=భర్తను గూర్చి, చిన్తయామాస=చింతించెను.

తా. శోకముచేత ఉత్సాహశూన్య మైన మనస్సుతో సీత, పుష్పించిన, పెద్ద దైన అశోకవృక్షశాఖను పట్టుకొని నిలబడి, భర్తను గూర్చియే ఆలోచించుచుండెను. 6

మూ. సా స్నాపయన్తీ విపులౌ స్తనౌ నేత్రజలస్రవైః,
చిన్తయన్తీ న శోకస్య తదాన్తమధిగచ్ఛతి. 7

ప్ర. అ. తదా=అప్పుడు, సా=సీత, నేత్రజలస్రవైః=కన్నీళ్ళ స్రావములచేత, విపులౌ=విశాలములైన, స్తనౌ=స్తనములను, స్నాపయన్తీ=స్నానము చేయించుచు, చిన్తయన్తీ=ఆలోచించుచు, శోకస్య=దుఃఖముయొక్క, అన్తమ్=అంతమును, న అధిగచ్ఛతి=పొందలేదు.

తా. అప్పుడా సీత, కారుచున్న కన్నీళ్లతో విశాలములైన స్తనములను తడుపుచు, భర్తను గూర్చి ఆలోచించుచు, శోకమునకు అంతమును పొందజాలక పోయెను. 7

మూ. సా వేపమానా పతితా ప్రవాతే కదళీ యథా,
రాక్షసీనాం భయత్రస్తా వివర్ణవదనాభవత్. 8

ప్ర. అ. సా=ఆ సీత, ప్రవాతే=అధిక మైన గాలి గల స్థలమునందు, పతితా=పడిపోయిన (వంగిపోయిన), కదళీ యథా=అరటిచెట్టు వలె, వేపమానా=వణకిపోవుచున్నదై, రాక్షసీభయసంత్రస్తా=రాక్షసస్త్రీలవలన కలుగు భయము (ఆపద) వలన భయపడి, వివర్ణవదనా = చెడిన రంగు గల ముఖము గలదై, అభవత్=ఆయెను.

తా. ఆ సీత, రాక్షసస్త్రీలనుండి ఆపద రాగలదని భయపడుచు అధిక

మైన గాలి ఉన్న ప్రదేశములోని వంగిపోయిన అరటిచెట్టు వలె, వణకుచుండెను. ఆమె ముఖము రంగు మారిపోయెను. 8

మూ. తస్యాః సా దీర్ఘవిపులా వేపన్త్యాః సీతయా తదా,
దదృశే కమ్పినీ వేణీ వ్యాళీవ పరిసర్పతీ. 9

("వేపన్త్యాః పరమస్త్రియాః" అను ప్రాచ్యపాఠము బాగున్నది. పై పాఠములో విభక్తులు కుదరవు).

ప్ర. అ. వేపన్త్యాః = వణకుచున్న, తస్యాః = ఆ, పరమస్త్రియాః = ఉత్తమస్త్రీ యైన సీతయొక్క, దీర్ఘవిపులా = పొడవుగాను విశాలముగాను ఉన్న, కమ్పినీ = కదలుచున్న, సా = ఆ, వేణీ = జడ, పరిసర్పతీ = కదలుచున్న, వ్యాళీవ = సర్పము వలె, దదృశే = చూడబడెను.

తా. సీత వణకిపోవుచున్నప్పుడు, విశాలము, దీర్ఘము అయిన ఆమె జడ కూడ కదలుచు, ప్రాకుచున్న సర్పము వలె కనబడుచుండెను. 9

మూ. సా నిఃశ్వసన్తీ దుఃఖార్తా శోకోపహతచేతనా.
ఆర్తా వ్యసృజదశ్రూణి మైథిలీ విలలాప చ. 10

ప్ర. అ. దుఃఖార్తా = దుఃఖముచేత పీడింపబడినదీ, శోకోపహతచేతనా = శోకముచేత కొట్టబడిన బుద్ధికలది, ఆర్తా = రాక్షసస్త్రీలచేత, పీడింపబడినది అయిన, సా = ఆ, మైథిలీ = సీత, నిఃశ్వసన్తీ = నిట్టూర్పుచున్నదై, అశ్రూణి = కన్నీళ్ళను, వ్యసృజత్ = విడచెను. విలలాప చ = విలపించెను కూడ.

తా. భర్తృవియోగదుఃఖముతో బాధపడుచున్న ఆ సీత మనస్సు శోకముచేత వ్యాకుల మయ్యెను. రాక్షసస్త్రీలు కూడ భయపెట్టుటచే ఆమె చాల దుఃఖించుచు, కన్నీళ్ళు కార్చుచు ఇట్లు విలపించెను. 10

మూ. హా రామేతి చ దుఃఖార్తా హా పునర్లక్ష్మణేతి చ,
హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ. 11

ప్ర. అ. భామినీ = సీత, దుఃఖార్తా = దుఃఖపీడితురాలై, హా రామేతి = హా రామా! అని, పునః = మరల, హా లక్ష్మణేతి = హా! లక్ష్మణా! అని, మమ =

నాయికక్కా, కర్త్రుభిః = అత్తగారైన, హా కౌసల్యే = హా! కౌసల్యా అని, హా! సుమిత్రేతి = హా! సుమిత్రా! అని విలపించెను.

తా. సీత దుఃఖార్తురాలై, అయ్యో! రామా! అయ్యో లక్ష్మణా! అయ్యో! నా అత్తగారైన కౌసల్యా! అయ్యో సుమిత్రా! అని విలపించెను. 11

మూ. లోకప్రవాదః సత్యోఽయం పణ్డితైః సముదాహృతః,
అకాలే దుర్లభో మృత్యుః స్త్రియా వా పురుషస్య వా. 12
యదాహమేవం క్రూరాభీ రాక్షసీభిరిహార్దితా,
జీవామి హీనా రామేణ ముహూర్తమపి దుఃఖితా. 13

ప్ర. అ. అహమ్ = నేను, ఏవమ్ = ఈ విధముగా, క్రూరాభిః = క్రూరలైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, అర్దితా = పీడింపబడినదాననై, ఇహ = ఇక్కడ, రామేణ = రామునితో, హీనా = దూరమైనదాన్నై, దుఃఖార్తా = దుఃఖముచేత పీడితురాలనై, ముహూర్తమపి = క్షణకాలమైనను, యదా = ఎప్పుడు, జీవామి = జీవించుచున్నానో, స్త్రియాః వా = స్త్రీకి గాని, పురుషస్య వా = పురుషునకు గాని, అకాలే = కాలము కాని కాలమునందు, మృత్యుః = మరణము, దుర్లభః = దుర్లభము అని, పణ్డితైః = పండితులచేత, సముదాహృతః = చెప్పబడిన, లోకప్రవాదః = లోకములోని ప్రవాదము, సత్యః = సత్యమైనది.

తా. నేను రామునకు దూరముగా, ఇక్కడ, క్రూరురాళ్లైన రాక్షసస్త్రీలు పెట్టు బాధ అనుభవించుచు, దుఃఖితురాలనై, క్షణకాలముకూడ జీవించి ఉండుట అనునది ఊహింపరాని విషయము. అయినను జీవించియే ఉన్నాను. దీనిని బట్టి "స్త్రీయైనా, పురుషుడైనా మరణించవలెనని కోరుకున్నను సమయము ఆసన్నమయే వరకూ మరణము రాదు" అను పండితులు చెప్పే లోకప్రవాదము సత్యము.

మూ. ఏషాల్పపుణ్యా కృపణా వినశిష్యామ్యనాథవత్,
సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగైరివాహతా. 14

ప్ర. అ. అల్పపుణ్యా = అల్పమైన పుణ్యము కలదానను, కృపణా = దీనురాలను అయిన, ఏషా = ఈ నేను, అనాథవత్ = అనాథురాలను వలె, సముద్రమధ్యే = సముద్రమధ్యమునందు, వాయువేగైః = వాయువు యొక్క

వేగముచేత, ఆహతా = కొట్టబడిన, పూర్ణా = నిండిన, నౌః ఇవ = ఓడ వలె విశీర్ష్యామి = నశించెదను.

తా. అల్పమైన పుణ్యము గల దీనురాల నైన, నేను నాథుడు లేని సామాన్య స్త్రీ వలె, సముద్రమధ్యములో వాయువేగముచేత కొట్టబడిన సరుకులతో నిండిన ఓడ వలె నశించగలను. 14

మూ. భర్తారం తమపశ్యన్తీ రాక్షసీవశమాగతా,
సీదామి ఖలు శోకేన కూలం తోయహతం యథా. 15

ప్ర. అ. భర్తారమ్ = నా భర్త యైన, తమ్ = ఆ రాముని, చూడనిదాననై, రాక్షసీవశమ్ = రాక్షసస్త్రీల వశమును, ఆగతా = పొందినదాననై, తోయహతమ్ = నీటిచేత కొట్టబడిన, తీరం యథా = ఒడ్డు వలె, శోకేన = శోకముతో, సీదామి ఖలు = నశించుచున్నాను కదా.

తా. ఈ రాక్షసస్త్రీలకు లొంగిపోయి నా భర్తను చూడలేక, నేను, నీటిచే కూల్చబడిన ఒడ్డు వలె, శోకముతో నశించుచున్నాను కదా. 15

మూ. తం పద్మదళపత్రాక్షం సింహవిక్రాన్తగామినమ్,
ధన్యాః పశ్యన్తి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్.

ప్ర. అ. ("పద్మదళరక్తాక్షమ్" అను ప్రత్యపాఠము యుక్తము). పద్మదళరక్తాక్షమ్ = పద్మదళముల వంటి ఎఱ్ఱనైన నేత్రములు గలవాడు, సింహవిక్రాన్తగామినమ్ = సింహము వలె పరాక్రమపూర్వకముగా నడుచువాడు, కృతజ్ఞమ్ = కృతజ్ఞుడు, ప్రియవాదినమ్ = ప్రియముగా మాటలాడువాడూ అయిన తమ్ = ఆ, మే = నాయొక్క, నాథమ్ = భర్తను, ధన్యాః = ధన్యులు, పశ్యన్తి = చూచెదరు.

తా. నా నాథు డైన రాముడు పద్మము రేకుల వంటి ఎఱ్ఱని నేత్రములు కలవాడు. సింహము వలె హుందాగా నడచువాడు. కృతజ్ఞుడు, ప్రియముగా మాటలాడువాడు. అట్టి నా నాథుని అదృష్టవంతులు మాత్రమే చూచెదరు. 16

మూ. సర్వథా తేన హీనాయా రామేణ విదితాత్మనా,
తీక్ష్ణం విషమివాస్వాద్య దుర్లభం మమ జీవితమ్. 17

ప్ర. అ. విదితాత్మనా=ప్రసిద్ధ మైన బుద్ధి గల. తేన=ఆ. రామేణ= రామునితో, హీనాయాః=హీనురాలం నైన, మమ = నాకు, తీక్ష్ణమ్= తీక్ష్ణ మైన. విషమ్ = విషమును, ఆస్వాద్యేవ=తిని వలె, జీవితమ్=జీవితము. సర్వథా = అన్ని విధములా, దుర్లభమ్ = దుర్లభ మైనది.

తా. ప్రసిద్ధ మైన బుద్ధి గల ఆ రాముడు లేకుండా నే నింక జీవించుట, తీక్ష్ణ మైన విషము తిన్న పిమ్మట జీవించుట ఎంత కష్టమో అంత కష్టము. 17

మూ. కీదృశం తు మహా పాపం మయా జన్మాన్తరే కృతమ్,
యేనేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణమ్.

ప్ర. అ. యేన=దేనిచేత, మయా =నాచేత, ఘోరమ్=భయంకరమూ, సుదారుణమ్=చాలా దారుణమూ అయిన, ఇదమ్ = ఈ, దుఃఖమ్=దుఃఖము, ప్రాప్యతే = పొందబడుచున్నదో అట్టి. కీదృశమ్=ఏ విధ మైన, మహా పాపమ్= గొప్ప పాపము, మయా=నాచేత, జన్మాన్తరే=జన్మాంతరమునందు, కృతమ్ = చేయబడినదో కదా।

తా. నే నిప్పుడు అతిదారుణమూ, భయంకరమూ అయిన దుఃఖమును అనుభవించుచున్నాను. పూర్వజన్మలో నే నెట్టి మహా పాపము చేసితినో కదా। 18

మూ. జీవితం త్యక్తుమిచ్ఛామి శోకేన మహతావృతా,
రాక్షసీభిశ్చ రక్ష్యన్త్యా రామో నాసాద్యతే మయా. 19

("మయా నావాప్యతే కామో రాక్షసీభిః సురక్షితా" అను ప్రాచ్యపాఠము యుక్తము. రాబోయే శ్లోకము దీనికి అనుగుణముగా ఉన్నది).

ప్ర. అ. మహతా=గొప్ప, శోకేన=దుఃఖముతో, వృతా=కూడిన నేను, జీవితమ్=జీవితమును, త్యక్తుమ్=విడచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. కామః =ఈ కోరిక, మయా=నాచేత, న అవాప్యతే=పొందబడదు. రాక్షసీభిః=రాక్షస స్త్రీలచేత, సురక్షితా=బాగా రక్షింపబడి ఉన్నాను కదా।

తా. గొప్ప శోకముతో బాధపడుచున్న నాకు మరణింపవలె నను కోరిక ఉన్నది. కాని ఈ రాక్షసస్త్రీలు రక్షించుచుండగా నా కీ కోరిక తీరదు. 19

మూ. ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతామ్,
న శక్యం యత్పరిత్యక్తుమాత్మచ్ఛన్దేన జీవితమ్. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షడ్వింశః సర్గః.

ప్ర. అ. మానుష్యమ్=మనుష్యత్వమును గూర్చి, ధిక్ అస్తు=నింద అగుగాక. పరవశ్యతామ్=పరుల వశము నందుటను గూర్చి, ధిక్ అస్తు=నింద అగుగాక. యత్=ఏ కారణమువలన, ఆత్మచ్ఛన్దేన=తన ఇష్టము ప్రకారము, జీవితమ్=జీవితమును, పరిత్యక్తుమ్=విడచుటకు, న శక్యమ్=శక్యము కాదో.

తా. ఇష్టము వచ్చినప్పుడు చచ్చుటకు కూడ శక్యము కాకుండా ఉన్నది। ఛీ! మనుష్యత్వము ఎంత చెడ్డది! ఛీ! పరాధీనత్వము ఎంత దుఃఖకర మైనది! 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదియారవ సర్గ సమాప్తము.

# అథ షడ్వింశః సర్గః

[సీత దీనముగా విలపించుచు ప్రాణములు విడువవలెనని నిశ్చయించుకొనుట].

మూ. ప్రసక్తాశ్రుముఖీ త్వేవం బ్రువతీ జనకాత్మజా,
అధోగతముఖీ బాలా విలప్తుముపచక్రమే. 1

ప్ర. అ. ప్రసక్తాశ్రుముఖీ = నిరంతరము కారుచున్న కన్నీళ్లు గల ముఖము గలది, బాలా = బాల యైన, జనకాత్మజా = సీత, ఏవమ్ = ఇట్లు, బ్రువతీ = పలుకుచున్నదై, అధోగతముఖీ = క్రిందికి ఉన్న ముఖము గలదై, విలప్తుమ్ = విలపించుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. బాల (చిన్న వయస్సు గలది) అయిన సీత నిరంతరముగా కన్నీళ్లు కారుచున్న ముఖముతో ఇట్లు పలుకుచు, తల వంచి, ఈ విధముగా విలపించుటకు ప్రారంభించెను. 1

మూ. ఉన్మత్తేవ ప్రమత్తేవ భ్రాన్తచిత్తేవ శోచతీ,
ఉపావృత్తా కిశోరీవ వివేష్టన్తీ మహీతలే. 2

ప్ర. అ. ఉన్మత్తేవ = ఉన్మత్తురాలి వలె, ప్రమత్తేవ = బాగ మత్తెక్కినది వలె, భ్రాన్తచిత్తేవ = భ్రాంతి చెందిన చిత్తము కలది వలె, శోచతీ = ఏడ్చుచు, ఉపావృత్తా (ఆయాసమును పోగొట్టుటకై) నేలపై పండుకొనబెట్టబడిన, కిశోరీవ = అరగుఱ్ఱమువలె, మహీతలే = నేలమీద, వివేష్టన్తీ = దొర్లుచున్నదై (విలపించెను).

తా. ఆమె, పిచ్చిదాని వలె, మత్తులో ఉన్నదానివలె, భ్రాంతి చెందిన మనస్సు కలది వలె, ఏడ్చుచు పండుకొనబెట్టబడిన అరగుఱ్ఱము వలె నేలపై దొర్లుచు విలపించెను. 2

మూ. రాఘవస్య ప్రమత్తస్య రక్షసా కామరూపిణా;
రావణేన ప్రమథ్యాహమానీతా క్రోశతీ బలాత్. ౪

ప్ర. అ. రాఘవస్య=రాముడు, ప్రమత్తస్య=ఏమరుపాటు చెంది ఉండగా, కామరూపిణా=స్వేచ్ఛారూపము గల, రక్షసా=రాక్షసు డైన, రావణేన=రావణుని చేత, ప్రమథ్య=బలాత్కరించి, క్రోశతీ=ఏడ్చుచున్న, అహమ్=నేను, బలాత్=బలమువలన, ఆనీతా=తీసికొనిరాబడితిని.

తా. రాముడు ఏమరి ఉన్న సమయములో కామరూపి యైన రాక్షసుడు, రావణుడు ఏడ్చుచున్న నన్ను తన బలముచే బలాత్కారముగా తీసికొని వచ్చి నాడు. ౪

మూ. రాక్షసీవశమాపన్నా భర్త్స్యమానా సుదారుణమ్,
చిన్తయన్తీ సుదుఃఖార్తా నాహం జీవితుముత్సహే. ౫

ప్ర. అ. రాక్షసీవశమ్=రాక్షసస్త్రీల వశమును, ఆపన్నా=పొందినదాననై, సుదారుణమ్=మిక్కిలి దారుణముగా, భర్త్స్యమానా=భయపెట్టబడుచున్న దానను, చిన్తయన్తీ=చింతించుచున్నదానను, సుదుఃఖార్తా=దుఃఖముచేత చాలా పీడింపబడినదానను అయిన, అహమ్=నేను, జీవితుమ్=జీవించుటకు, న ఉత్సహే=కోరను.

తా. ఈ రాక్షసస్త్రీలు తమ వశములో ఉన్న నన్ను చాల దారుణముగా భయపెట్టుచున్నారు. దుఃఖముచేత మిక్కిలి పీడితురాల నై ఈ విధముగా చింతించుచు జీవించుటకు ఇచ్ఛగింపను. ౫

మూ. న హి మే జీవితేనార్థో నైవార్థైర్న చ భూషణైః,
వసన్త్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్. ౬

ప్ర. అ. మహారథమ్=మహారథు డైన, రామం వినా=రాముడు లేకుండగా, రాక్షసీమధ్యే=రాక్షసస్త్రీల మధ్యయందు, వసన్త్యాః=నివసించుచున్న, మే=నాకు, జీవితేన=జీవితముచేత, అర్థః=ప్రయోజనము, న=లేదు. అర్థైః=ధనములచేత, న=లేదు. భూషణైశ్చ=భూషణములచేత కూడ, న=లేదు.

తా. మహారథు డైన రామునకు దూరముగా రాక్షసస్త్రీల మధ్య నివసించుచున్న నాకు, ధనములతో గాని, అలంకారములతో గాని, చివరికి ప్రాణములతో గాని పని లేదు. 5

మూ. అశ్మసారమిదం నూనమథవాప్యజరామరమ్,
హృదయం మమ యేనేదం న దుఃఖేనావశీర్యతే. 6

ప్ర. అ. అథవా = లేదా, మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, హృదయమ్ = హృదయము, నూనమ్ = యథార్థముగా, అశ్మసారమ్ = ఇనుము. అజరామరమపి = జరామరణములు లేనిది. యేన = ఏ కారణముచేత, దుఃఖేన = దుఃఖముచేత, నావశీర్యతే = నశించుటలేదో.

తా. లేదా — ఈ నా హృదయము, నిజముగా ఇనుముతో చేయబడినది. దుర్బలత్వము గాని, నాశనము గాని లేనిది. అందుచేతనే ఇంత దుఃఖము వచ్చినా కూడ బ్రద్దలగుట లేదు. 6

మూ. ధిఙ్మామనార్యామసతీం యాహం తేన వినా కృతా,
ముహూర్తమపి రక్షామి జీవితం పాపజీవితా. 7

ప్ర. అ. పాపజీవితా = పాప మైన జీవితము గల, యా = ఏ, అహమ్ = నేను, తేన వినా = ఆ రామునితో కూడ ఉండకుండు నట్లు, కృతా = చేయబడిన దాన నైనను, ముహూర్తమపి = క్షణకాల మైనను. జీవితమ్ = జీవితమును, రక్షామి = రక్షించుచున్నానో అట్టి. అనార్యామ్ = గౌరవమునకు అనర్హురాలను, అసతీమ్ = చెడ్డదానను అయిన, మామ్ = నన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక.

తా. ఆ రామునకు దూరము చేయబడి కూడ, పాపజీవితము గల నేను నా జీవితమును ముహూర్తముకంటె అధికముగా రక్షించుకొని ఉన్నా ననగా ఛీ! నేను ఎంత అనార్యురాలను! ఎంత చెడ్డదానిని! 7

మూ. న చ మే జీవితే శ్రద్ధా సుఖే వా తం ప్రియం వినా,
భర్తారం సాగరాన్తాయా వసుధాయాః ప్రియంవదమ్.

ప్ర. అ. సాగరాన్తాయాః = సాగరము అంతమునందు గల, వసుధాయాః = భూమికి, భర్తారమ్ = ప్రభువూ, ప్రియంవదమ్ = ప్రియముగా మాటలాడు

వాడూ అయిన, తమ్=ఆ, ప్రియం వినా=భర్త యైన రాముడు లేకుండా. మే =నాకు, జీవితే=జీవితమునందు గాని, సుఖే వా=సుఖమునందు గాని, శ్రద్ధా= శ్రద్ధ, కా=ఏమి।

తా. నా భర్త సముద్రమువరకు వ్యాపించి యున్న భూమికి ప్రభువు- ప్రియముగానే మాటలాడువాడు. అట్టి భర్తకు దూర మైన నాకు జీవితముపై కాని, సుఖము పై కాని ఆసక్తి ఎందుకు? 8

మూ. ఛిద్యతాం భక్ష్యతాం వాపి శరీరం విసృజామ్యహమ్,
న చాప్యహం చిరం దుఃఖం సహేయం ప్రియవర్జితా. 9

ప్ర. అ. అహమ్ = నేను, శరీరమ్=శరీరమును, విసృజామి=విడచెదను. ఛిద్యతామ్=ముక్కలుకొట్టబడుగాక। భక్ష్యతాం వాపి= లేదా భక్షింపబడుగాక। ప్రియవర్జితా=భర్తతో శూన్యురాల నైన, అహమ్=నేను, చిరమ్=చిరకాలము, దుఃఖమ్=దుఃఖమును, న చ సహేయమ్=సహించను.

తా. ఈ శరీరమును చీల్చివేసినా సరే, భక్షించినా సరే। నేను శరీరమును విడుచుటకు సిద్ధముగా ఉన్నాను. భర్తకు దూరమై ఇంక చిరకాలము ఈ దుఃఖ మును సహించను. 9

మూ. చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్,
రావణం కిం పునరహం కామయేయం విగర్హితమ్. 10

ప్ర. అ. నిశాచరమ్=రాక్షసుడు, విగర్హితమ్=నిందితుడు అయిన, రావణమ్=రావణుని, అహమ్=నేను, సవ్యేన=ఎడమ దైన, చరణేనాపి= పాదముతో కూడా, న స్పృశేయమ్=స్పృశించను. కామయేయం కిం పునః= వానిని కామింతును కూడానా।

తా. నిందింపదగినవాడూ, రాక్షసుడూ అయిన రావణుని ఎడమకాలితో కూడ స్పృశింపను. అట్టి వానిని నేను కోరుదునా। 10

మూ. ప్రత్యాఖ్యాతం న జానాతి నాత్మానం నాత్మనః కులమ్,
యో నృశంసస్వభావేన మాం ప్రార్థయితుమిచ్ఛతి. 11

ప్ర. అ. యః=ఏ రావణుడు, నృశంసస్వభావేన=క్రూర మైన స్వభావముతో, మామ్=నన్ను, ప్రార్థయితుమ్ = ప్రార్థించుటకు, అర్హతి=అర్హుడగుచున్నాడో, అసౌ ఈ రావణుడు, ఆత్మానమ్ = తనను, ప్రత్యాఖ్యాతమ్ = ప్రత్యాఖ్యానము చేయబడినవానినిగా, న జానాతి=తెలుసుకొనజాలకున్నాడు. ఆత్మనః = తనయొక్క, కులమ్ = కులమును, న=తెలిసికొనుటలేదు.

తా. క్రూరత్వముతో నన్ను ప్రార్థించవలె నని కోరుచున్న ఈ రావణుడు తనను నేను నిరాకరించుచున్నా నను విషయమును గాని, తన కులమర్యాదను గాని గుర్తింపజాలకున్నాడు. 11

మూ. ఛిన్నా భిన్నా విభక్తా వా దీప్తే వాగ్నౌ ప్రదీపితా,
రావణం నోపతిష్ఠేయం కిం ప్రలాపేన వశ్చిరమ్. 12

ప్ర. అ. ఛిన్నా వా = ఛేదింపబడినను, భిన్నా వా = ముక్కలు కొట్టబడినను, దీప్తే = ప్రజ్వలించుచున్న, అగ్నౌ = అగ్నియందు, ప్రదీపితా వా=ప్రజ్వలింపచేయబడినను, రావణమ్=రావణుని, నోపతిష్ఠేయమ్ = చేరను. చిరమ్ = చిరకాలము, వః = మీయొక్క, ప్రలాపేన = పేలాపనచేత, కిమ్ = ఏమి ప్రయోజనము?

తా. మీరు నన్ను కోసినను, ముక్కలు కొట్టినను, మండుచున్న అగ్నిలో పడవేసినను రావణుని చేరను. మీరు ఎంతసేపు ఏమి ప్రేలినను ప్రయోజనము లేదు 12

మూ. ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చ సానుక్రోశశ్చ రాఘవః,
సద్వృత్తో నిరనుక్రోశః శఙ్కే మద్భాగ్యసంక్షయాత్. 13

ప్ర. అ. రాఘవః = రాముడు, ఖ్యాతః = ప్రసిద్ధుడు, ప్రాజ్ఞః = బుద్ధిమంతుడు. సానుక్రోశశ్చ = జాలి కలవాడు. సద్వృత్తః = మంచి నడవడిక కలవాడు. మద్భాగ్యసంక్షయాత్ = నా భాగ్యము క్షీణించుటచేత, నిరనుక్రోశః = జాలి లేనివా డైనాడు అని, శఙ్కే = సందేహించుచున్నాను.

తా. రాముడు ప్రసిద్ధుడు. మహాబుద్ధిశాలి. కృతజ్ఞత కలవాడు. జాలి

కలవారు. మంచి చరితము కలవారు. ఇప్పుడు నా అదృష్టము బాగుండక పోవుటచేతనే నాపై జాలి లేనివా రైనా రేమో అని శంకించుచున్నాను. 13

మూ. రాక్షసానాం సహస్రాణి జనస్థానే చతుర్దశ,
యేనైకేన నిరస్తాని స మాం కిం నాభిపద్యతే. 14

ప్ర. అ. ఏకేన = అసహాయు డైన, యేన = ఎవనిచేత, జనస్థానే = జనస్థానమునందు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ = పదునాలుగు, సహస్రాణి = వేలు, నిరస్తాని = ఎగురకొట్టబడినవో, సః = ఆ రాముడు, మామ్ = నన్ను, కిమ్ = ఎందువలన, నాభిపద్యతే = రక్షించకున్నారో।

తా. ఏ రాముడు ఒంటరిగానే, జనస్థానములో పదునాలుగు వేల రాక్షసులను సంహరించినాడో అత డీ నాడు నన్నెందుచేత రక్షించుట లేదో। 14

మూ. నిరుద్ధా రావణేనాహమల్పవీర్యేణ రక్షసా,
సమర్థః ఖలు మే భర్తా రావణం హన్తుమాహవే. 15

ప్ర. అ. అహమ్ = నేను, అల్పవీర్యేణ = అల్ప మైన వీర్యము గల, రక్షసా = రాక్షసు డైన, రావణేన = రావణునిచేత, నిరుద్ధా = బంధింపబడినాను. మే భర్తా = నా భర్త, ఆహవే = యుద్ధమునందు, రావణమ్ = రావణుని, హన్తుమ్ = చంపుటకు, సమర్థః ఖలు = సమర్థుడు కదా.

తా. అల్ప మైన పరాక్రమము గల ఈ రాక్షసుడు, రావణుడు నన్ను బంధించినాడు. నా భర్త యుద్ధములో వీనిని సంహరించుటకు సమర్థుడు. 15

మూ. విరాధో దణ్డకారణ్యే యేన రాక్షసపుఙ్గవః,
రణే రామేణ నిహతః స మాం కిం నాభిపద్యతే. 16

ప్ర. అ. యేన = ఏ, రామేణ = రామునిచేత, దణ్డకారణ్యే = దండకారణ్యమునందు, రణే = యుద్ధమునందు, రాక్షసపుఙ్గవః = రాక్షసశ్రేష్ఠు డైన, విరాధః = విరాధుడు, నిహతః = చంపబడినాడో, సః = అతడు, మామ్ = నన్ను, కిమ్ = ఎందువలన, నాభిపద్యతే = రక్షించుట లేదో।

తా. ఏ రాముడు, దండకారణ్యమునందు యుద్ధములో, రాక్షసశ్రేష్ఠ

తైన విరాధుని చంపినాడో అట్టి రాముడు నన్ను ఎందుచేత రక్షించుట లేదో। 16

మూ. కామం మధ్యే సముద్రస్య లఙ్కేయం దుష్ప్రధర్షణా,
న తు రాఘవబాణానాం గతిరోధో భవిష్యతి. 17

ప్ర. అ. సముద్రస్య = సముద్రముయొక్క, మధ్యే = మధ్యయందు, ఇయమ్ = ఈ, లఙ్కా = లంక, దుష్ప్రధర్షణా కామమ్ = ఎదిరింప శక్యము కానిదే కావచ్చును. తు = కాని, రాఘవబాణానామ్ = రాముని బాణముల యొక్క, గతిరోధః = గమనమునకు అడ్డు, న భవిష్యతి = ఉండదు.

తా. సముద్రమధ్యమునం దున్న ఈ లంక జయింప శక్యము కాక పోవచ్చును. కాని రాముని బాణముల గమనాన్ని ఏది అడ్డుకొనగలదు? 17

మూ. కిం ను తత్కారణం యేన రామో దృఢపరాక్రమః,
రక్షసాపహృతాం భార్యామిష్టాం నాభ్యవపద్యతే. 18

ప్ర. అ. తత్ = ఆ, కారణమ్ = కారణము, కిం ను = ఏమో? యేన = దేనిచేత, దృఢపరాక్రమః = నిశ్చితమైన పరాక్రమము గల, రామః = రాముడు, రక్షసా = రాక్షసునిచేత, అపహృతామ్ = అపహరింపబడిన, ఇష్టామ్ = ప్రియురాలైన, భార్యామ్ = భార్యను, నాభ్యవపద్యతే = రక్షించుట లేదో,

తా. వ్యర్థము కాని పరాక్రమము గల రాముడు, రాక్షసునిచేత అపహరింపబడిన ప్రియభార్య నైన నన్ను రక్షించుటకై రాకుండుటకు కారణ మేమో? 18

మూ. ఇహస్థాం మాం న జానీతే శఙ్కే లక్ష్మణపూర్వజః,
జానన్నపి స తేజస్వీ ధర్షణం మర్షయిష్యతి. 19

ప్ర. అ. లక్ష్మణపూర్వజః = రాముడు, మామ్ = నన్ను, ఇహస్థామ్ = ఇక్కడ ఉన్నదానినిగా, న జానీతే = ఎరుగడు అని, శఙ్కే = శంకించుచున్నాను. జానన్నపి = తెలిసికూడ, సః = ఆ, తేజస్వీ = తేజశ్శాలి యైన రాముడు, ధర్షణమ్ = అవమానమును, మర్షయిష్యతి = సహించునా?

తా. నేను ఇక్కడ ఉన్నట్లుగా రామునకు తెలియదని నా సందేహము. తేజస్వి యైన ఆ రాముడు, తెలిసి కూడ, ఈ అవమానమును సహించునా? 19

మూ. హృతేతి యోఽధిగత్వా మాం రాఘవాయ నివేదయేత్,
గృధ్రరాజోఽపి స రణే రావణేన నిపాతితః. 20

ప్ర. అ. యః = ఏ జటాయువు, అధిగత్వా = (రాముని) చేరి, హృతేతి = సీత హరింపబడినది అని, రాఘవాయ = రామునికి, నివేదయేత్ = తెలుపునో, సః = ఆ, గృధ్రరాజోఽపి = గృధ్రముల రాజైన జటాయువు కూడా, రావణేన = రావణునిచేత, రణే = యుద్ధమునందు, హతః = చంపబడినాడు.

తా. రాముని వద్దకు వెళ్ళి, సీత రావణునిచేత హరింపబడినదని చెప్పగల జటాయువును రావణుడు యుద్ధములో చంపివేసినాడు. 20

మూ. కృతం కర్మ మహత్తేన మాం తథాఽభ్యవపద్యతా,
తిష్ఠతా రావణద్వన్ద్వే వృద్ధేనాపి జటాయుషా. 21

ప్ర. అ. మామ్ = నన్ను, తథా = అట్లు, అభ్యవపద్యతా = రక్షించిన, వృద్ధేనాపి = వృద్ధుడైనను, రావణద్వన్ద్వే = రావణునితో ద్వంద్వయుద్ధమునందు, తిష్ఠతా = నిలచిన, తేన జటాయుషా = ఆ జటాయువుచేత, మహత్ = గొప్ప, కర్మ = పని, కృతమ్ = చేయబడినది.

తా. వృద్ధుడైనా రావణునితో ద్వంద్వయుద్ధానికై తలపడి నన్ను రక్షించుటకై ప్రయత్నించిన ఆ జటాయువు చాలా గొప్ప పని చేసినాడు. 21

మూ. యది మామిహ జానీయాద్వర్తమానాం స రాఘవః,
అద్య బాణైరభిక్రుద్ధః కుర్యాల్లోకమరాక్షసమ్. 22

ప్ర. అ. సః = ఆ, రాఘవః = రాముడు, మామ్ = నన్ను, ఇహ = ఇక్కడ, వర్తమానామ్ = ఉన్నదానినిగా, జానీయాద్యది = ఎరిగి ఉన్నచో, అభిక్రుద్ధః = కోపించినవాడై, లోకమ్ = లోకమును, బాణైః = బాణములచేత, అద్య = ఇప్పుడు, అరాక్షసమ్ = రాక్షసులు లేనిదానినిగా, కుర్యాత్ = చేయును.

తా- నే నెక్కడ ఉన్నట్లు రామునకు తెలిసి ఉన్నట్లయితే అతడు కోపించి బాణములతో ఈ లోకములో రాక్షసులే లేకుండ అట్లు చేసి ఉండేవాడు. 22

మూ. విధమేచ్చ పురీం లఙ్కాం శోషయేచ్చ మహోదధిమ్,
రావణస్య చ నీచస్య కీర్తిం నామ చ నాశయేత్. 23

ప్ర. అ. లఙ్కాం పురీమ్ = లంకాపట్టణమును, విధమేచ్చ = ఊడ్చి వేయును. మహోదధిమ్ = మహాసముద్రమును, శోషయేచ్చ = ఎండింపచేయును. నీచస్య = నీచు డైన, రావణస్య = రావణునియొక్క, కీర్తిమ్ = కీర్తిని, నామ చ = పేరునూ, నాశయేత్ = నశింపచేయును.

తా. రాముడు లంకాపట్టణమును ఊడ్చివేయును. మహాసముద్రమును ఎండింపచేయును. నీచు డైన రావణుని కీర్తిని, పేరునూ నశింపచేయును. 23

మూ. తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహే గృహే,
యథాహమేవం రుదతీ తథా భూయో న సంశయః. 24

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, యథా = ఎట్లు, ఏవమ్ = ఈ విధముగా, రుదతీ = ఏడ్చుచున్నానో, తథా = అట్లే, గృహే గృహే = ప్రతిగృహమునందూ, నిహతనాథానామ్ = చంపబడిన భర్తలు గల, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీలయొక్క, (ఏడ్పు), భూయః = మాటి మాటికి (అధిక ముగా) (అగును). సంశయః = సంశయము, న = లేదు.

తా. అప్పుడు నే నెట్లు ఏడ్చుచున్నానో అట్లే ఈ లంకలోని ప్రతిఇంటి లోను, భర్తలు మరణించిన రాక్షసస్త్రీల ఏడ్పు అధికముగా వినబడును. సందేహము లేదు.

వి. ఈ శ్లోకమునకు పదాలు అధ్యాహారము తెచ్చుకొని అర్థము చెప్ప వలసి ఉన్నది. ప్రాచ్యపాఠము ఇట్లున్నది.

"తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహే గృహే.
యథా మే రుదితైరేవం ప్రగీతేవ పురీ భవేత్.''

"అప్పుడు నా ఏడ్పుచేత వలె, ప్రతిగృహమునందు భర్తలు మరణించిన స్త్రీల ఏడ్పులచేత, ఈ నగరము గోలపెట్టుచున్నట్లు అగును'' అని దీని భావము. 24

మూ. అన్విష్య రక్షసాం లఙ్కాం కుర్యాద్రామః సలక్ష్మణః,
న హి తాభ్యాం రిపుర్దృష్టో ముహూర్తమపి జీవతి. 25

ప్ర. అ. సలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, రక్షసామ్ = రాక్షసులయొక్క, లఙ్కామ్ = లంకను, అన్విష్య = వెదకి, (శత్రు నాశనమ్ = శత్రునాశనమును), కుర్యాత్ = చేయును. తాభ్యామ్ = వారిద్దరిచేత, దృష్టః = చూడబడిన, రిపుః = శత్రువు, ముహూర్తమపి = క్షణకాల మైనా, న జీవతి హి = జీవించడు కదా.

తా. లక్ష్మణసమేతు డైన రాముడు రాక్షసుల పుర మైన ఈ లంకను వెదకి, శత్రుసంహారము చేయగలడు. వా రిద్దరి కంట బడిన శత్రువు క్షణ కాలము కూడ జీవించజాలడు కదా।

వి. "అన్విష్యారాక్షసీం లఙ్కాం కుర్యాద్రామః సలక్ష్మణః"

అను ప్రాచ్యపాఠము గూడ నున్నది. దీనిలోకూడ 'అరాక్షసామ్' అని సంధి యుండ వలెను. "రాముడు లంకను రాక్షసులు లేనిదానిగా చేయును". అని దాని అర్థము. 25

మూ. చితాధూమాకులపథా గృధ్రమణ్డలసంకులా,
అచిరేణ తు లఙ్కేయం శ్మశానసదృశీ భవేత్. 26

ప్ర. అ. ఇయమ్ = ఈ, లఙ్కా = లంక, అచిరేణ = కొద్దికాలములో, చితాధూమాకులపథా = చితల ధూమముచేత వ్యాకుల మైన మార్గములు కలది గాను, గృధ్రమణ్డలసంకులా = గ్రద్దల మండలములతో వ్యాకుల మైనది గాను, శ్మశానసదృశీ = శ్మశానముతో సమాన మైనది గాను, భవేత్ = అగును.

తా. కొద్ది దినములలో ఈ లంక శ్మశానము వలె అయిపోవును. దీని మార్గములన్నీ చితలనుండి బయలుదేరు ధూమముతో వ్యాకులము లై యుండును. దీనిపై గ్రద్దలు మండలాకారముగా తిరుగుచుండును. 26

మూ. అచిరేణైవ కాలేన ప్రాప్స్యామ్యేవ మనోరథమ్,
దుష్ప్రస్థానోఽయమాఖ్యాతి సర్వేషాం వో విపర్యయమ్.

ప్ర. అ. అచిరేణ కాలేనైవ=దగ్గర కాలమునందే, మనోరథమ్=మనోరథమును, ప్రాప్స్యామ్యేవ=తప్పక పొందగలను. అయమ్=ఈ, దుష్ప్రస్థానః=చెడ్డ నడవడిక. సర్వేషామ్=సమస్తులైన, వః=మీయొక్క, విపర్యయమ్==కీడును, ఆఖ్యాతి=చెప్పుచున్నది.

తా. దాఁ దగ్గర కాలములోనే నా మనోరథము తప్పక తీరగలదు. మీరు నడిచే ఈ చెడు నడవడిక మీ రందరూ నశింప నున్నా రని చెప్పు చున్నది. 27

మూ. యాదృశానీహ దృశ్యన్తే లఙ్కాయామశుభాని వై,
అచిరేణైవ కాలేన భవిష్యతి హతప్రభా. 28

ప్ర. అ. ఇహ=ఇక్కడ, లఙ్కాయామ్=లంకలో, యాదృశాని=ఎట్టి, అశుభాని=అశుభములు, దృశ్యన్తే=చూడబడుచున్నవో వానిని పట్టి, అచిరేణైవ=దాఁ దగ్గరగా ఉన్న, కాలేన=కాలముచేత, హతప్రభా=కొట్టబడిన కాంతిగలది, భవిష్యతి=కాగలదు.

తా. ఈ లంకలో అశుభము లైన శకునములు అనేకములు కనబడు చున్నవి. వానిని బట్టి ఈ లంక కొద్ది దినములలోనే కాంతివిహీనము కాగలదు. 28

మూ. నూనం లఙ్కా హతే పాపే రావణే రాక్షసాధమే,
శోషం యాస్యతి దుర్ధర్షా ప్రమదా విధవా యథా. 29

ప్ర. అ. పాపే=పాపాత్ముఁడూ, రాక్షసాధమే=నీచరాక్షసుఁడూ అయిన, రావణే=రావణుఁడు, హతే=చంపబడినవాఁ డగుచుండగా, దుర్ధర్షా=ఇంతవరకూ ఎదిరింప శక్యము కాకుండా ఉన్న, లఙ్కా=లంక, నూనమ్=తప్పక, విధవా=భర్త లేని, ప్రమదా యథా=స్త్రీ వలె, శోషమ్=ఎండిపోవుటను, యాస్యతి=పొందగలదు.

తా. పాపాత్ముఁడు, రాక్షసాధముఁడూ అయిన రావణుఁడు చంపబడును. అప్పుడు ఈ లంక భర్త మరణించిన స్త్రీ వలె ఎండిపోవును. తప్పదు. 29

మూ. పుణ్యోత్సవసముత్థా చ నష్టభర్త్రీ సరాక్షసీ,
భవిష్యతి పురీ లఙ్కా నష్టభర్త్రీ యథాఙ్గనా. 30

ప్ర. అ. నష్టభర్త్రీ=నశించిన ప్రభువుగల, లఙ్కాపురీ=లంకాపట్టణము, సరాక్షసీ=రాక్షసస్త్రీలతో మాత్రమే కూడినదై, నష్టభర్త్రీ= మరణించిన భర్త గల, అఙ్గనా యథా=స్త్రీ వలె, పుణ్యోత్సవసముత్థా చ=పుణ్యోత్సవములనుండి లేచినది, (దూరమైనది), భవిష్యతి=కాగలదు.

తా. ప్రభు వైన రావణుడు, రాక్షసులూ మరణించుటతో ఈ లంకలో రాక్షసస్త్రీలు మాత్రమే మిగులుదురు. అప్పు డీ లంక భర్త మరణించిన స్త్రీ వలె, పుణ్యోత్సవములకు దూరము కాగలదు. 30

మూ. నూనం రాక్షసకన్యానాం రుదన్తీనాం గృహే గృహే,
శ్రోష్యామి నచిరాదేవ దుఃఖార్తానామిహ ధ్వనిమ్. 31

ప్ర. అ. నచిరాదేవ=కొద్ది కాలములోనే, ఇహ=ఇక్కడ, గృహే గృహే=ప్రతి ఇంటిలోను, దుఃఖార్తానామ్= దుఃఖముచేత పీడింపబడిన, రుదన్తీనామ్=ఏడ్చుచున్న, రాక్షసకన్యానామ్=రాక్షసకన్యలయొక్క, ధ్వనిమ్ =ధ్వనిని, నూనమ్=తప్పక, శ్రోష్యామి=వినగలను.

తా. ఈ నగరములో ప్రతి ఇంటియందు, రాక్షసకన్యలు దుఃఖార్తలై ఏడ్చుచుండగా, ఆ ధ్వనిని అచిరకాలములోనే, తప్పక వినగలను. 31

మూ. సాన్ధకారా హతద్యోతా హతరాక్షసపుఙ్గవా,
భవిష్యతి పురీ లఙ్కా నిర్దగ్ధా రామసాయకైః. 32

ప్ర. అ. లఙ్కాపురీ=లంకాపట్టణము, రామసాయకైః=రాముని బాణముల చేత, నిర్దగ్ధా=కాల్చివేయబడినదై, సాన్ధకారా=అంధకారముతో కూడినది, హతద్యోతా= నశింపచేయబడిన కాంతి గలది, హతరాక్షసపుఙ్గవా=చంపబడిన రాక్షసశ్రేష్ఠులు కలది, భవిష్యతి=కాగలదు.

తా. రాముడు బాణములతో ఈ లంకను కాల్చివేయును. దీనిలోని రాక్షసవీరు లందరూ మరణింతురు. అప్పు డిది కాంతివిహీనమై అంధకారబంధురమై పోవును. 32

మూ. యది నామ స శూరో మాం రామో రక్తాన్తలోచనః,
జానీయాద్వర్తమానాం హి రావణస్య నివేశనే. 33

ప్ర. అ. శూరః = శూరుడు, రక్తాన్తలోచనః = ఎఱ్ఱనైన నేత్రాంతములు కలవాడూ అయిన, సః రామః = ఆ రాముడు, మామ్ = నన్ను, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, వర్తమానామ్ = ఉన్నదానినిగా, యది నామ జానీయాత్ = తెలుసుకొనునా।

తా. శూరుడూ, ఎఱ్ఱని నేత్రాంతములు కలవాడూ అయిన రాముడు నేనిక్కడ రావణుని గృహములో ఉన్నట్లు తెలిసికొనగల్గునా। 33

మూ. అనేన తు నృశంసేన రావణేనాధమేన మే,
సమయో యస్తు నిర్దిష్టస్తస్య కాలోఽయమాగతః. 34
న చ మే విహితో మృత్యురస్మిన్ దుష్టే న వర్తతే.

ప్ర. అ. నృశంసేన = క్రూరుడు, అధమేన = అధముడు అయిన, అనేన = ఈ, రావణేన = రావణునిచేత, యః = ఏ, సమయః = సమయము, మే = నాకు; నిర్దిష్టః = చెప్పబడినదో, తస్య = దానికి, అయమ్ = ఈ, కాలః = కాలము, ఆగతః = వచ్చినది. మే = నాకు, విహితః = విధింపబడిన, సః = ఆ, మృత్యుః = మృత్యువు, అస్మిన్ = ఈ, దుష్టే = దుష్టుని విషయమున, న వర్తతే = ప్రవర్తించుట లేదు.

తా. క్రూరుడు, నీచుడు అయిన ఈ రావణుడు నా కిచ్చిన గడువు పూర్తి కావచ్చుచున్నది. నాకు విధించిన ఈ మృత్యువు ఈ దుర్మార్గునికి ఎందువలన వచ్చుట లేదో।

వి. "న చ మే" ఇత్యాది శ్లోకార్థము వావిళ్లప్రతిలో లేదు, గోరఖ్‌పూర్ ప్రతిలోను ఇతరప్రతులలోను ఉన్నది. ప్రాచ్యప్రతిలో ఈ ఘట్టంలోని శ్లోకాలలో చాలావరకు లేవు. 34

మూ. అకార్యం యే న జానన్తి నైర్ఋతాః పాపకారిణః, 35
అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సాంప్రతమ్,
నైతే ధర్మం విజానన్తి రాక్షసాః పిశితాశనాః. 36

ప్ర. అ. పాపకారిణః = పాపము చేయు, యే = ఏ, నైర్ఋతాః = రాక్షసులు, అకార్యమ్ = అకార్యమును, న జానన్తి = ఎరుగరో, అధర్మాత్తు = వారియొక్క అధర్మమువలన నతే, సాంప్రతమ్ = ఇప్పుడు, మహోత్పాతః = గొప్ప ఉపద్రవము, భవిష్యతి = కాగలదు, పిశితాశనాః = పచ్చి మాంసము తిను, ఏతే = ఈ, రాక్షసాః = రాక్షసులు, ధర్మమ్ = ధర్మమును, న జానన్తి = ఎరుగరు.

తా. పాపమునను చేయు ఈ రాక్షసులకు ఏది చేయగూడదని పనియూ తెలియదు. వీళ్లు చేసే అధర్మమువలన, ఇపుడు మహోపద్రవము జరుగ నున్నది. పచ్చి మాంసము తినే ఈ రాక్షసులకు ధర్మ మేదో తెలియదు. 35, 36

మూ. ధ్రువం మాం ప్రాతరాశార్థే రాక్షసః కల్పయిష్యతి,
సాహం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శనమ్. 37
రామం రక్తాన్తనయనమపశ్యన్తీ సుదుఃఖితా.

ప్ర. అ. రాక్షసః = రావణుడు, ధ్రువమ్ = తప్పక, మామ్ = నన్ను, ప్రాతరాశార్థే = ప్రాతఃకాలపు భోజనము కొరకు, కల్పయిష్యతి = చేసికొన గలడు. సా = అట్టి, అహమ్ = నేను, ప్రియదర్శనమ్ = ప్రియ మైన దర్శనము గల, తం వినా = ఆ రాముడు లేకుండా, కథమ్ = ఎట్లు, కరిష్యామి = చేయు దును? రక్తాన్తనయనమ్ = ఎఱ్ఱని నేత్రాంతములు గల, రామమ్ = రాముని, అపశ్యన్తీ = చూడని దాననై, సుదుఃఖితా = చాలా దుఃఖించుచున్నాను.

తా. ఆ రాక్షసుడు నన్ను తప్పకుండగా ప్రాతఃకాలపు భోజనముకొరకు వండించివేయును. చూచువారికి ఆనందము కలిగించు రాముడు దగ్గర లేని నేను ఏమి చేయగలను? ఎఱ్ఱని నేత్రాంతములు గల ఆ రాముని చూడజాలక పోవుటచే నేను చాలా దుఃఖములో ఉన్నాను. 37

మూ. యది కశ్చిత్ ప్రదాతా మే విషస్యాద్య భవేదిహ, 38
క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినా వినా

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మే = నాకు, విషస్య = విషముయొక్క (మును) ప్రదాతా = ఇచ్చేవాడు, కశ్చిత్ = ఎవడైనా, ఇహ = ఇక్కడ, భవేద్యది = ఉన్నట్లయితే, పతినా వినా = భర్త కూడా లేని నేను, క్షిప్రమ్ = శీఘ్రముగా, దేవమ్ = దేవు డైన, వైవస్వతమ్ = యముని, పశ్యేయమ్ = చూచెడిదానను.

తా. నా కొక్కరు ఎవరైనా విషము ఇచ్చేవారు ఉన్నట్లయితే భర్త దగ్గర లేని నేను, వెంటనే యమధర్మరాజు సన్నిధికి వెళ్ళి యుండెడి దానను. 38

మూ. నాజానాజ్జీవతీం రామః స మాం లక్ష్మణపూర్వజః, 39
జానన్తౌ తౌ న కుర్యాతాం నోర్వ్యాం హి మమ మార్గణమ్.

ప్ర. అ. లక్ష్మణపూర్వజః = లక్ష్మణుని అన్నగారైన, సః రామః = ఆ రాముడు, మామ్ = నన్ను, జీవతీమ్ = జీవించి ఉన్నదానినిగా, నాజానాత్ = ఎరిగి యుండలేదు. తౌ = వారిద్దరూ, జానన్తౌ = ఎరిగియున్నవారై, మమ = నాయొక్క, మార్గణమ్ = అన్వేషణమును, ఉర్వ్యామ్ = భూమియందు, న కుర్యాతామ్ ఇతి న = చేయరను మాట ఉండదు.

తా. లక్ష్మణుని అన్నగారైన రామునకు నేను ఇంకా జీవించే ఉన్నట్లు తెలిసి ఉండదు. అట్లు తెలిసి ఉన్నచో వారిద్దరూ ఈ భూమిపై నాకొరకు వెదక కుండా ఉండరుకదా! 39

మూ. నూనం మమైవ శోకేన స వీరో లక్ష్మణాగ్రజః. 40
దేవలోకమితో యాతస్త్యక్త్వా దేహం మహీతలే

ప్ర. అ. వీరః = వీరుడు, లక్ష్మణాగ్రజః = లక్ష్మణుని అన్నగారు అయిన, సః = ఆ రాముడు, మమ = నా యొక్క, శోకేనైవ = శోకము చేతనే, మహీతలే = భూలోకమునందు, దేహమ్ = దేహమును, త్యక్త్వా = విడచి, ఇతః = ఇక్కడినుండి దేవలోకమ్ = దేవలోకమును గూర్చి, యాతః = వెళ్ళిపోయినాడు. నూనమ్ = నిశ్చయము.

తా. వీరుడైన ఆ రాముడు నా శోకముతోనే క్రుంగిపోయి భూలోకములో దేహమును చాలించి స్వర్గమునకు వెళ్ళిపోయి ఉండును నిశ్చయము. 40

మూ. ధన్యాః దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః, 41
మమ పశ్యన్తి యే నాథం రామం రాజీవలోచనమ్.

ప్ర. అ. మమ = నాయొక్క, నాథమ్ = నాథుడు, రాజీవలోచనమ్ = పద్మముల వంటి నేత్రములు కలవాడు అయిన, రామమ్ = రాముని, యే = ఎవరు,

పశ్యన్తి=చూచుచున్నారో అట్టి, దేవాః=దేవతలు, సగన్ధర్వాః= గంధర్వులతో కూడిన, సిద్ధాశ్చ= సిద్ధులూ, పరమర్షయః =మహర్షులూ, ధన్యాః =ధన్యులు కదా.

తా. నా నాథుడు, రాజీవలోచనుడూ, అయిన రాముని స్వర్గములో చూడగల్గుచున్న దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, ధన్యాత్ములు కదా! 41

మూ. అథవా న హి తస్యార్థో ధర్మకామస్య ధీమతః, 42
మయా రామస్య రాజర్షేర్భార్యయా పరమాత్మనః.

ప్ర. అ. అథవా = లేదా, ధర్మకామస్య = ధర్మమునందు కోరికగలవాడు, ధీమతః = బుద్ధిమంతుడు, రాజర్షేః = రాజా ఋషి కూడ అయినవాడు, పరమాత్మనః = ఉత్తమమైన మనస్సు కలవాడు అయిన, తస్య = ఆ, రామస్య = రామునకు, భార్యయా = భార్యనైన, మయా = నాచేత, అర్థః = ప్రయోజనము, న హి = లేదు కదా.

తా. లేదా రాముడు జీవించియే ఉండవచ్చును. బుద్ధిమంతుడు, ధర్మనిష్ఠ గలవాడు, ఉత్తమమైన మనస్సు కలవాడు రాజర్షి అయిన ఆ రామునకు భార్యనైన నావలన ప్రయోజనము ఏమి ఉండును (అనగా ధర్మదృష్టి కలవాడగుటచే వైరాగ్యము చెంది నన్ను మరచినాడేమో అని భావము).

మూ. దృశ్యమానే భవేత్ప్రీతిః సౌహృదం నాస్త్యపశ్యతః, 43
నాశయన్తి కృతఘ్నాస్తు న రామో నాశయిష్యతి.

ప్ర. అ. దృశ్యమానే = చూడబడుచున్నవానియందు, ప్రీతిః = స్నేహము భవేత్ = అగును. అపశ్యతః = చూడనివానికి, సౌహృదమ్ = ప్రేమ, నాస్తి = లేదు. కృతఘ్నాః = కృతఘ్నులు, నాశయన్తి = స్నేహమును నశింపచేయుదురు. రామస్తు = రాముడైతే, న నాశయిష్యతి = నశింపచేయడు.

తా. ఎవరైన వ్యక్తి ఎదురుగా కనబడుచున్నంతవరకు ఆ వ్యక్తి మీద ప్రేమ ఉండును. కనబడనప్పుడు ప్రేమ ఉండదు. కాని ఇది కృతఘ్నులైన ఇతరులవిషయములో యథార్థము కావచ్చును. రాముడు ఆ విధముగా ప్రేమను మరచిపోవువాడు కాడు. 43

మూ. కిం ను మే న గుణాః కేచిత్ కింవా భాగ్యక్షయో మమ,
యాహం సీదామి రామేణ హీనా ముఖ్యేన భామినీ.

ప్ర. అ. భామినీ = స్త్రీ నైన, యా = ఏ, అహమ్ = నేను, ముఖ్యేన = ముఖ్యు డైన, రామేణ వినా = రాముడు లేకుండా, సీదామి = క్షీణించుచున్నానో, మే = అట్టి నాకు, కేచిత్ = ఏవీ, గుణాః = సద్గుణములు, న కిం ను = లేవా? కిం వా = లేక, మమ = నా యొక్క, భాగ్యక్షయః = భాగ్యముయొక్క క్షయము జరిగినదా?

తా. స్త్రీ నైన నేను, సర్వలోకముఖ్యు డైన రాముడు లేకుండా ఈ విధంగా నశించిపోవుచున్నాను; నాలో ఏమీ సద్గుణాలు లేవా? లేక నా భాగ్యము క్షీణించిపోయినదా? దీనికి కారణ మేమి? 44

మూ. శ్రేయో హి జీవితాన్మర్తుం విహీనాయా మహాత్మనః. 45
రామాదక్లిష్టచారిత్రాచ్ఛూరాచ్ఛత్రునిబర్హణాత్.

ప్ర. అ. అక్లిష్టచారిత్రాత్ = క్లేశము లేని చరిత్ర కలవాడు, శూరాత్ = శూరుడు, శత్రునిబర్హణాత్ = శత్రుసంహారకుడూ, మహాత్మనః = మహాత్ముడూ అయిన, రామాత్ = రామునినుండి, విహీనాయాః = హీనురాలు నైన, మే = నాకు, జీవితాత్ = జీవితముకంటె, మర్తుమ్ = మరణించుటకొరకు, శ్రేయః = శ్రేయస్కరము.

తా. మహాత్ముడు, క్లేశము (వ్యర్థప్రయాస) లేని చరిత్ర కలవాడు, శూరుడు, శత్రువినాశకుడు, అయిన రాముడు లేని నేను జీవించుటకంటె, మరణించుటయే మేలు. 45

మూ. అథవా న్యస్తశస్త్రౌ తౌ వనే మూలఫలాశినౌ, 46
భ్రాతరౌ హి నరశ్రేష్ఠౌ సంవృత్తౌ వనగోచరౌ.

ప్ర. అ. అథవా = లేదా, నరశ్రేష్ఠౌ = నరులలో శ్రేష్ఠు లైన, తౌ = ఆ, భ్రాతరౌ = సోదరులు, న్యస్తశస్త్రౌ = పరిత్యజించబడిన ఆయుధములు కలవారై, వనే = వనమునందు, మూలఫలాశనౌ = దుంపలు ఫలములు ఆహారముగా కలవారై, వనగోచరౌ = వనవాసులుగా, సంవృత్తౌ = అయిపోయి ఉందురు.

తా. లేదా, నరశ్రేష్ఠు లైన ఆ సోదరు లిద్దరూ, శస్త్రపరిత్యాగము చేసి వనములో దుంపలు పండ్లు తినుచు వననివాసులు అయిపోయి ఉందురు. 46

మూ. అథవా రాక్షసేన్ద్రేణ రావణేన దురాత్మనా, 47
ఛద్మనా ఘాతితౌ శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. అథవా=లేదా, శూరౌ=శూరు లైన, భ్రాతరౌ=సోదరు లైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, దురాత్మనా=దుష్టబుద్ధి గల, రాక్షసేన్ద్రేణ=రాక్షసరా జైన, రావణేన=రావణునిచేత, ఛద్మనా=వంచనచేత, ఘాతితౌ=చంపబడియుందురు.

తా. లేదా— శూరు లైన సోదరులు, ఆ రామలక్ష్మణులను, దురాత్ము డైన రాక్షసరాజు రావణుడు కపటోపాయముచేత చంపించి ఉండును. 47

మూ. సాహమేవంగతే కాలే మర్తుమిచ్ఛామి సర్వథా. 48
న చ మే విహితో మృత్యురస్మిన్ దుఃఖేఽపి వర్తతే.

ప్ర. అ. ఏవంగతే=ఈ విధముగా ఏర్పడిన, కాలే=కాలమునందు, సా=అట్టి, అహమ్=నేను, సర్వథా=అన్ని విధములా, మర్తుమ్=మరణించుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. అస్మిన్=ఈ, దుఃఖేఽపి=దుఃఖమునందు కూడ, మే=నాకు, మృత్యుః=మృత్యువు, విహితః=విధించబడి, న వర్తతే=లేదు.

తా. ఈ విధముగా ఏర్పడిన ఈ సమయమునందు నేను మరణించవలె నని పూర్తిగా కోరుచున్నాను. కాని ఇట్టి దుఃఖసమయములో కూడ నాకు మృత్యువు రాకున్నది. 48

మూ. ధన్యాః ఖలు మహాత్మానో మునయస్త్యక్తకిల్బిషాః 49
జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే.

ప్ర. అ. మహాత్మానః=గొప్ప బుద్ధి కలవారు, త్యక్తకిల్బిషాః=విడువబడిన పాపము కలవారు, జితాత్మానః=అణచబడిన మనస్సు కలవారు, మహాభాగాః=మహాభాగ్యవంతులు, (గొప్ప ప్రభావము కలవారు), అయిన, మునయః

మునులు, ధన్యాః ఖలు=ధన్యులు కదా. యేషామ్= ఎవరికి, ప్రియాప్రియే= ప్రియముకాని, అప్రియము కాని, న స్తః=ఉండవో।

తా. మహాత్ములు, పాపములను పరిత్యజించినవారు, మనస్సును జయించిన వారు, మహాప్రభావవంతులు అయిన మునులు ధన్యాత్ములుకదా। వారికి ప్రియము గాని అప్రియము గాని ఉండదు. 49

మూ. ప్రియాన్న సంభవేద్దుఃఖమప్రియాదధికం భయమ్, 50
తాభ్యాం హి యే వియుజ్యన్తే నమస్తేషాం మహాత్మనామ్.

ప్ర. అ. ప్రియాత్=ప్రియమువలన, దుఃఖమ్=దుఃఖముగాని, అప్రియాత్=అప్రియమువలన, అధికమ్=అధికమైన, భయమ్=భయముగాని, న సంభవేత్=కలుగదు. యే=ఎవరు, తాభ్యామ్=ప్రియాప్రియములనుండి, వియుజ్యన్తే వియుక్తులగుదురో, తేషామ్ = అట్టి, మహాత్మనామ్ = మహాత్ములకు, నమః = నమస్కారము.

తా. ఆ మహాత్ములకు ప్రియమైనదానినుండి అది దొరకలేదే అను దుఃఖము గాని, అప్రియమునుండి అధికమైన భయము గాని ఉండదు. ఈ విధముగా ప్రియాప్రియములకు దూరముగా నుండువారికి నమస్కారము.

వి. "ప్రియాన్న సంభవే ద్దుఃఖమప్రియాదధికం భవేత్" అని గోరఖ్‌పూర్ ప్రతిలో పాఠము. "ప్రియవస్తువు దుఃఖమును కలిగించదు. ఆనందమునే కలిగించును. అప్రియవస్తువు అధికదుఃఖమును కలిగించును. ఆ రెండూ లేని వారికి నమస్కారము" అని దాని భావము చెప్పవచ్చును.

మూ. సాహం త్యక్తా ప్రియేణైవ రామేణ విదితాత్మనా, 51
ప్రాణాంస్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతా వశమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షడ్వింశః సర్గః

ప్ర. అ. ప్రియేణైవ = ప్రియుడైన, విదితాత్మనా = ప్రసిద్ధమైన బుద్ధి గల, రామేణ = రామునిచేత, త్యక్తా = విడువబడినదానను, పాపస్య=పాపాత్ము

త్మైన, రావణస్య = రావణునియొక్క, వశమ్ = వశమును, గతా = పొందిన దానను అయిన, సా అహమ్ = అట్టి నేను, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యామి = విడచెదను.

తా. ప్రసిద్ధమైన బుద్ధి గలవాడూ, ప్రియుడూ అయిన రామునకు దూరమై, పాపాత్ముడైన రావణుని వశములో ఉన్న నేను ప్రాణత్యాగము చేసెదను. 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో ఇరువదిఆరవ సర్గ సమాప్తము.

* * *

# అథ సప్తవింశః సర్గః

[త్రిజటాస్వప్నము. రామునకు విజయము, రాక్షసులకు వినాశము వచ్చునని ఆ స్వప్నమునందు సూచన లభించుట.]

మూ. ఇత్యుక్తాః సీతయా ఘోరం రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
కాశ్చిజ్జగ్ముస్తదాఖ్యాతుం రావణస్య దురాత్మనః. 1

ప్ర. అ. సీతయా = సీతచేత, ఇతి = ఇట్లు, ఉక్తాః = పలుకబడిన, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, ఘోరమ్ = తీవ్రముగా, క్రోధమూర్ఛితాః = క్రోధము చేత వ్యాపింపబడినవారు అయిరి. కాశ్చిత్ = కొందరు, తత్ = దానిని, దురాత్మనః = దురాత్ముడైన, రావణస్య = రావణునకు, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, జగ్ముః = వెళ్ళిరి.

తా. సీత మాటలు విని రాక్షసస్త్రీలు దారుణ కోపావేశము చెందిరి. వారిలో కొందరు, సీత మాటలను గూర్చి దురాత్ముడైన రావణునకు చెప్పుటకై వెళ్ళిరి.

మూ. తతః సీతాముపాగమ్య రాక్షస్యో ఘోరదర్శనాః,
పునః పరుషమేకార్థమనర్థార్థమథాబ్రువన్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము గల, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, సీతామ్ = సీతను, ఉపాగమ్య = చేరి, అథ = అనంతరము, పునః = మరల, అనర్థార్థమ్ = అనర్థకరమైన ప్రయోజనము కలదియు, ఏకార్థమ్ = ఒకే అర్థముగల, పరుషమ్ = పరుషవాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. చూచుటకు భయంకరముగా ఉండు ఆ రాక్షసస్త్రీలు సీతను సమీపించి, మరల పూర్వము చెప్పిన విషయమునే చెప్పుచు, అనర్థకరమైన పరుష వాక్యములు పలికిరి. 2

మూ. అద్యేదానీం తవానార్యే సీతే పాపవినిశ్చయే,
రాక్షస్యో భక్షయిష్యన్తి మాంసమేతద్యథాసుఖమ్. ౩

ప్ర. అ. అనార్యే = అనార్యురాలా। పాపవినిశ్చయే = పాపనిశ్చయము గలదానా। సీతే = సీతా। అద్య = నేడు, ఇదానీమ్ = ఇప్పుడే, తవ = నీ యొక్క, ఏతత్ = ఈ, మాంసమ్ = మాంసమును, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, యథాసుఖమ్ = సుఖము కలుగునట్లుగా, భక్షయిష్యన్తి = భక్షించగలరు.

తా. అనార్యురాలవు, పాపనిశ్చయము గలదానవూ అయిన ఓ। సీతా। రాక్షసస్త్రీలు, ఈనాడు, ఇప్పుడే, నీ మాంసమును సుఖముగా భక్షించెదరు. ౩

మూ. సీతాం తాభిరనార్యాభిర్దృష్ట్వా సంతర్జితాం తదా,
రాక్షసీ త్రిజటా వృద్ధా శయానా వాక్యమబ్రవీత్. ౪

ప్ర. అ. తదా = అప్పుడు, అనార్యాభిః = చెడ్డవారైన, తాభిః = ఆ రాక్షసస్త్రీలచేత, సంతర్జితామ్ = భయపెట్టబడిన, సీతామ్ = సీతను, దృష్ట్వా = చూచి, శయానా = అంతవరకూ నిద్రించి ఉన్న, వృద్ధా = వృద్ధురాలైన, త్రిజటా = త్రిజట అను, రాక్షసీ = రాక్షసి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు, చెడ్డవారైన ఆ రాక్షసస్త్రీలు సీతను ఆ విధముగా భయపెట్టుచుండగా చూచి, అంతవరకూ నిద్రించిన త్రిజట అనే ఒక వృద్ధరాక్షసి ఇట్లు పలికెను. ౪

మూ. ఆత్మానం ఖాదతానార్యా న సీతాం భక్షయిష్యథ,
జనకస్య సుతామిష్టాం స్నుషాం దశరథస్య చ. ౫

ప్ర. అ. అనార్యాః = ఓ। దుష్టస్త్రీలారా। ఆత్మానమ్ = తమనుతామే, ఖాదత = తినండి, జనకస్య = జనకుని యొక్క, ఇష్టామ్ = ఇష్టురాలైన, సుతామ్ = పుత్రికా, దశరథస్య = దశరథుని యొక్క, స్నుషాం చ = కోడలూ అయిన, సీతామ్ = సీతను, న భక్షయిష్యథ = మీరు భక్షింపరు.

తా. ఓ। దుష్టలారా। మీరు భక్షింపవలసినది జనకుని ప్రియపుత్రికా, దశరథుని కోడలూ ఐన సీతను కాదు, మిమ్ములను మీరు భక్షించుడు. ౫

మూ. స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః,
రాక్షసానామభావాయ భర్తురస్యా భవాయ చ. 6

ప్ర. అ. అద్య=ఇప్పుడు, దారుణః=భయంకరమైనదీ, రోమహర్షణః=రోమాంచము కలిగించునదీ అయిన, స్వప్నః=స్వప్నము, రాక్షసానామ్=రాక్షసులయొక్క, అభావాయ=వినాశముకొరకూ, అస్యాః=ఈమెయొక్క, భర్తుః=భర్తయొక్క, భవాయ=అభ్యుదయము కొరకూ, మయా=నా చేత, దృష్టః=చూడబడినది.

తా. ఇప్పుడే నా కొక భయంకరము, రోమాంచము పుట్టించునదీ అయిన స్వప్నము వచ్చినది. అది రాక్షసుల వినాశమును, ఈమె భర్త అభ్యుదయమును సూచించుచున్నది. 6

మూ. ఏవముక్తాస్త్రిజటయా రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
సర్వా ఏవాబ్రువన్భీతాస్త్రిజటాం తామిదం వచః. 7

ప్ర. అ. త్రిజటయా=త్రిజటచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలుకబడిన, క్రోధమూర్ఛితాః=కోపముచే వ్యాపింపబడిన, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, సర్వాః ఏవ=అందరూ, భీతాః=భయపడినవారై, తామ్=ఆ, త్రిజటామ్=త్రిజటను గూర్చి, ఇదమ్=ఈ, వచః=వచనమును, అబ్రువన్=పలికిరి.

తా. క్రోధముతో నిండి ఉన్న ఆ రాక్షసస్త్రీ లందరూ త్రిజట మాటలు విని, భయపడుచు ఆమెతో ఇట్లనిరి. 7

మూ. కథయస్వ త్వయా దృష్టః స్వప్నోఽయం కీదృశో నిశి,
తాసాం శ్రుత్వా తు వచనం రాక్షసీనాం ముఖాచ్చ్యుతమ్,
ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితమ్.

ప్ర. అ. నిశి=రాత్రియందు, త్వయా=నీచేత, దృష్టః=చూడబడిన, అయమ్=ఈ, స్వప్నః=స్వప్నము, కీదృశః=ఎట్టిది? కథయస్వ=చెప్పుము. తాసామ్=ఆ, రాక్షసీనామ్=రాక్షసస్త్రీలయొక్క, ముఖాత్=ముఖమునుండి, చ్యుతమ్=వచ్చిన, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, త్రిజటా=త్రిజట,

కాలే = ఆ సమయమునందు. స్వప్నసంశ్రితమ్ = స్వప్నమునకు సంబంధించిన, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. "నీవు రాత్రి ఎట్టి స్వప్నమును చూచితివో చెప్పుము". త్రిజట రాక్షస స్త్రీల మాట విని తనకు ఆ సమయమునందు (ఉషఃకాలమునందు) వచ్చిన స్వప్నమును గూర్చి చెప్పెను. 8

మూ. గజదన్తమయీం దివ్యాం శిబికామన్తరిక్షగామ్, 9
యుక్తాం హంససహస్రేణ స్వయమాస్థాయ రాఘవః,
శుక్లమాల్యామ్బరధరో లక్ష్మణేన సహాగతః 10

ప్ర. అ. రాఘవః = రాముడు, శుక్లమాల్యామ్బరధరః = తెల్లని మాలలను, వస్త్రములను ధరించినవాడై, గజదన్తమయీమ్ = ఏనుగు దంతములతో నిర్మింపబడిన, అన్తరిక్షగామ్ = ఆకాశమునందు సంచరించు, హంససహస్రేణ = వేయి హంసల చేత, యుక్తామ్ = కట్టబడిన, శిబికామ్ = పల్లకిని, స్వయమ్ = స్వయముగా, ఆస్థాయ = అధిష్ఠించి, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడ, ఆగతః = వచ్చినాడు.

తా. లక్ష్మణసహితుడైన రాముడు, తెల్లని మాలలు, వస్త్రములు ధరించి, వెయ్యి హంసలు మోయగా ఆకాశమునందు సంచరించుచున్న, ఏనుగు దంతములతో నిర్మించిన పల్లకిని ఎక్కి వచ్చినాడు. 9,10

మూ. స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లామ్బరావృతా,
సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వతమాస్థితా. 11

ప్ర. అ. సీతా చ = సీత కూడ, శుక్లామ్బరావృతా = తెల్లని వస్త్రముల చేత ఆచ్ఛాదింపబడినదై, సాగరేణ = సముద్రము చేత, పరిక్షిప్తమ్ = చుట్టబడిన, శ్వేతమ్ = తెల్లని, పర్వతమ్ = పర్వతమును, ఆస్థితా = అధిష్ఠించి ఉన్నదిగా, మయా = నా చేత, అద్య = ఇప్పుడు, స్వప్నే = స్వప్నమునందు, దృష్టా = చూడబడినది.

తా. సీత కూడ తెల్లని వస్త్రములు ధరించి, చుట్టూ సముద్రమున్న తెల్లని పర్వతముపైన ఉన్నట్లుగా నా చేత ఇప్పుడు స్వప్నములో కనబడినది. 11

మూ. రామేణ సంగతా సీతా భాస్కరేణ ప్రభా యథా,
రాఘవశ్చ మయా దృష్టశ్చతుర్దంష్ట్రిం మహాగజమ్,
ఆరూఢః శైలసంకాశం చచార సహలక్ష్మణః.

ప్ర. అ. సీతా = సీత, రామేణ = రామునితో, ప్రభా = కాంతి, భాస్కరేణ యథా = సూర్యునితోవలె, సంగతా = కలిసినది. రాఘవశ్చ = రాముడుకూడ, చతుర్దంష్ట్రిమ్ = నాలుగు దంతములు గల, శైలసంకాశమ్ = పర్వతముతో సమాన మైన, మహాగజమ్ = గొప్ప గజమును, ఆరూఢః = ఎక్కినవాడుగా, మయా = నాచేత, దృష్టః = చూడబడినాడు. సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, చచార = సంచరించెను.

తా. కాంతి సూర్యునితో కలిసినట్లు, సీత రామునితో కలిసెను. మరి రాముడు నాలుగు దంతాలు ఉన్న, పర్వతము వంటి మహాగజము నెక్కి, లక్ష్మణునితో కూడి సంచరించుచున్నట్లు నాకు కనబడెను. 12

మూ. తతస్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా. 13
శుక్లమాల్యామ్బరధరౌ జానకీం పర్యుపస్థితౌ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, స్వతేజసా = తమ తేజస్సుతో, దీప్యమానౌ = ప్రకాశించుచున్న, శుక్లమాల్యామ్బరధరౌ = తెల్లని మాలలను వస్త్రములను ధరించిన, తౌ = ఆ, నరశార్దూలౌ = నరశ్రేష్ఠులైన రామలక్ష్మణులు, జానకీమ్ = జానకిని, పర్యుపస్థితౌ = సమీపించిరి.

తా. పిమ్మట ఆ నరశ్రేష్ఠులైన రామలక్ష్మణులు తమ కాంతితో ప్రకాశించుచు, తెల్లని మాలలను వస్త్రములను ధరించి జానకి దగ్గరకు వచ్చినట్లుగా నాకు కనబడిరి. 13

మూ. తతస్తస్య నగస్యాగ్రే హ్యాకాశస్థస్య దన్తినః, 14
భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కన్ధమాశ్రితా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, జానకీ = సీత, తస్య = ఆ, నగస్య = పర్వతముయొక్క, అగ్రే = అగ్రభాగమందు, భర్త్రా = భర్తయైన రామునిచేత,

పరిగృహీతస్య=పట్టుకొనబడిన. ఆకాశస్థస్య = ఆకాశమునందున్న, హస్తినః= ఏనుగయొక్క, స్కన్ధమ్=మూపును, ఆశ్రితా=ఆశ్రయించినది.

తా. పిమ్మట జానకి ఆ పర్వతాగ్రమునందు, ఆకాశమునం దున్న ఆ గజమును రాముడు నిలువగా, దాని మూపుపైకి ఎక్కెను. 14

మూ. భర్తురఙ్కాత్సముత్పత్య తతః కమలలోచనా, 15
చన్ద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కమలలోచనా = పద్మముం బంటి నేత్రములు గల సీత, భర్తుః = భర్తయొక్క, అఙ్కాత్ = అంకమునుండి, సముత్పత్య = పైకి లేచి, పాణినా = హస్తముతో, చన్ద్రసూర్యౌ = చంద్రసూర్యులను, పరిమార్జతీ = తుడుచుచున్నదిగా, మయా = నాచేత, దృష్టా = చూడబడినది.

తా. అటుపిమ్మట, కమలముల వంటి నేత్రములు గల సీత, భర్త అంకమునుండి పైకి లేచి, చేతితో చంద్రసూర్యులను తుడుచుచున్నట్లు నాకు కనబడినది. 15

మూ. తతస్తాభ్యాం కుమారాభ్యామాస్థితః స గజోత్తమః, 16
సీతయా చ విశాలాక్ష్యా లఙ్కాయా ఉపరి స్థితః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తాభ్యామ్ = ఆ, కుమారాభ్యామ్ = రామలక్ష్మణులచేతను, విశాలాక్ష్యా = విశాలము లైన నేత్రములు గల, సీతయా చ = సీతచేతను, ఆస్థితః = అధిష్ఠింపబడిన, సః = ఆ, గజోత్తమః = శ్రేష్ఠమైన గజము, లఙ్కాయాః = లంకయొక్క, ఉపరి = పైన, స్థితః = నిలిచినది.

తా. అటు పిమ్మట, రామలక్ష్మణులు, విశాలాక్షి యైన సీతా ఎక్కి ఉన్న ఆ మహాగజము లంక పైభాగమునందు నిలచెను. 16

మూ. పాణ్డురర్షభయుక్తేన రథేనాష్టయుజా స్వయమ్, 17
ఇహోపయాతః కాకుత్స్థః సీతయా సహ భార్యయా.

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, భార్యయా = భార్య యైన, సీతయా సహ = సీతతో కూడ, పాణ్డురర్షభయుక్తేన = తెల్లని వృషభములు కట్టబడిన,

అష్టయుజా=ఎనిమిది వృషభములు కట్టిన, రథేన=రథములో, స్వయమ్= స్వయముగా, ఇహ=ఇక్కడికి, ఉపయాతః=వచ్చినాడు.

తా. రాముడు, భార్య యైన సీతతో, తెల్లని ఎనిమిది వృషభములు కట్టిన రథములో ఇక్కడికి స్వయముగా వచ్చినాడు.

వి. "పాణ్డురర్షభయుక్తేన" అని చెప్పి "అష్టయుజా" అని మరల అనుటలో సమన్వయము సరిగా కుదురుటలేదు. ప్రాచ్యపాఠములో "పాణ్డురర్షభయుక్తేన రథేనాశ్వయుజా స్వయమ్" అను పాఠ మున్నది. దానికి రాముడు తెల్లని వృషభము కట్టిన రథముపై ఒక మాటు, అశ్వములు కట్టిన రథముపై ఒకమాటు కనబడినా డని అర్థము చెప్పవచ్చును. 17

మూ. లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ వీర్యవాన్, 18
ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ్,
ఉత్తరాం దిశమాలోక్య జగామ పురుషోత్తమః. 19

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడు, పురుషోత్తమః = పురుషులలో శ్రేష్ఠుడు అయిన రాముడు, భ్రాత్రా = సోదరు డైన, లక్ష్మణేన = లక్ష్మణునితోను, సీతయా సహ = సీతతోను, దివ్యమ్ = దివ్యము, సూర్యసన్నిభమ్ = సూర్యునితో సమానము అయిన, పుష్పకం విమానమ్ = పుష్పకవిమానమును, ఆరుహ్య = ఎక్కి, ఉత్తరామ్ = ఉత్తరపు దైన, దిశమ్ = దిక్కును, ఆలోక్య = చూచి, జగామ = వెళ్లెను.

తా. పరాక్రమవంతుడు, పురుషశ్రేష్ఠుడు అయిన ఆ రాముడు, సోదరుడైన లక్ష్మణునితోను, సీతతోను కలిసి, సూర్యుడు వలె ప్రకాశించుచున్న, దివ్యమైన పుష్పకవిమానము ఎక్కి, ఉత్తరదిక్కు వైపు వెళ్ళెను. 18,19

మూ. ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణుపరాక్రమః,
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ రాఘవః. 20

ప్ర. అ. విష్ణుపరాక్రమః = విష్ణువు వంటి పరాక్రమము గల, రాఘవః = రఘువంశసంజాతు డైన, రామః = రాముడు, భ్రాత్రా = సోదరు డైన,

లక్ష్మణేన = లక్ష్మణునితోను, సీతయా సహ = సీతతోను, స్వప్నే = స్వప్నము నందు, ఏవమ్ = ఇట్లు, మయా = నాచేత, దృష్టః = చూడబడినాడు.

తా. విష్ణువుతో సమాన మైన పరాక్రమము గల ఆ రాముని, అతని సోదరు డైన లక్ష్మణుని, సీతను, నేను ఈ విధముగా స్వప్నములో చూచితిని.

మూ. న హి రామో మహాతేజాః శక్యో జేతుం సురాసురైః,
రాక్షసైర్వాఽపి చాన్యైర్వా స్వర్గః పాపజనైరివ. 21

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, సురాసురైః = సురులచేత గాని అసురులచేత గాని, రాక్షసైర్వాపి = రాక్షసులచేత గాని, అన్యైర్వా = ఇతరులచేత గాని, స్వర్గః = స్వర్గము, పాపజనైరివ = పాపాత్ములచేత వలె, జేతుమ్ = జయించుటకు, న శక్యః = శక్యు డైనవాడు కాడు కదా।

తా. పాపాత్ములు స్వర్గము నే విధముగా జయించలేరో, అదే విధముగ, సురులు గాని, అసురులు గాని, రాక్షసులు గాని, ఇతరులు గాని మహాతేజశ్శాలి యైన రాముని జయించ జాలరు. 21

మూ. రావణశ్చ మయా దృష్టః క్షితౌ తైలసముక్షితః,
రక్తవాసాః పిబన్ మత్తః కరవీరకృతస్రజః. 22

ప్ర. అ. రావణశ్చ = రావణుడు కూడ, క్షితౌ = భూమియందు, తైలసముక్షితః = తైలముచేత పూయబడినవాడై, రక్తవాసాః = ఎఱ్ఱని వస్త్రములు కలవాడై, కరవీరకృతస్రజః = కరవీరపుష్పములచేత కట్టబడిన మాలలు కలవాడై, పిబన్ = తైలము త్రాగుచు, మత్తః = మదించినవాడుగా, మయా = నాచేత, దృష్టః = చూడబడినాడు.

తా. రావణుడు ఎఱ్ఱని వస్త్రములు, ఎఱ్ఱని కరవీరపుష్పముల మాలలు ధరించి, శరీరమునకు తైలము పూసికొని, తైలము త్రాగుచు, మత్తుడై నేలపై పడి యున్నట్లు నాకు కనబడినాడు. 22

మూ. విమానాత్పుష్పకాదద్య రావణః పతితో భువి,
కృష్యమాణః స్త్రియా దృష్టో ముండః కృష్ణాంబరః పునః,

ప్ర. అ. అద్య = ఇప్పుడు, పుష్పకాత్ విమానాత్ = పుష్పకవిమానము నుండి, భువి = నేలమీద, పతితః = పడిపోయిన, ముణ్డః = శిరస్సు గొరిగింపబడినవాడూ, కృష్ణామ్బరః = నల్లని వస్త్రములు కలవాడూ అయిన, రావణః = రావణుడు, స్త్రియా = స్త్రీచేత, కృష్యమాణః = లాగబడుచు, పునః = మరల, దృష్టః = చూడబడినాడు

భా. ముండితమైన శిరస్సుతో, నల్లని వస్త్రములు ధరించిన రావణుడు పుష్పకవిమానమునుండి నేలపై పడిపోయినట్లు, అతనిని ఒక స్త్రీ ఈడ్చుచున్నట్లు నాకు మరల కనబడెను. 23

మూ. రథేన ఖరయుక్తేన రక్తమాల్యానులేపనః।
పిబంస్తైలం హసన్నృత్యన్ భ్రాన్తచిత్తాకులేన్ద్రియః॥ 24

ప్ర. అ. రక్తమాల్యానులేపనః = ఎఱ్ఱని మాలలు మైపూతలు కలవాడై, తైలమ్ = తైలమును, పిబన్ = త్రాగుచు, హసన్ = నవ్వుచు, నృత్యన్ = నృత్యము చేయుచు, భ్రాన్తచిత్తాకులేన్ద్రియః = భ్రాంతి చెందిన చిత్తము, వ్యాకులము లైన ఇంద్రియములు కలవాడై, ఖరయుక్తేన = గాడిదలచే కట్టబడిన, రథేన = రథముచేత, (యయౌ = వెళ్ళెను).

భా. రావణుడు ఎఱ్ఱని మాలలు ధరించి, ఎఱ్ఱని మైపూత పూసికొని, తైలము త్రాగుచు, భ్రాంతి చెందిన చిత్తముతో, వ్యాకులము లైన ఇంద్రియములతో నవ్వుచు, నృత్యము చేయుచు, గాడిదలు కట్టిన రథము ఎక్కి వెళ్ళెను. 24

మూ. గర్దభేన యయౌ శీఘ్రం దక్షిణాం దిశమాస్థితః।
పునరేవ మయా దృష్టో రావణో రాక్షసేశ్వరః। 25
పతితోఽవాక్శిరా భూమౌ గర్దభాద్భయమోహితః॥

ప్ర. అ. దక్షిణాం దిశమ్ = దక్షిణపు దిక్కును, ఆస్థితః = అవలంబించినవాడై, గర్దభేన = గాడిదచేత, శీఘ్రమ్ = శీఘ్రముగా, యయౌ = వెళ్ళెను. రాక్షసేశ్వరః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, భయమోహితః = భయముచేత మోహితుడై, గర్దభాత్ = గర్దభముపైనుండి, అవాక్శిరాః = క్రిందికి శిరస్సు కలవాడై, పతితః = పడినవాడుగా, మయా = నాచేత, పునరేవ = మరల, దృష్టః = చూడబడెను.

తా. రావణుడు గాడిదను ఎక్కి దక్షిణపు దిక్కు వైపు వెళ్ళిపోయెను. రాక్షసులలో శ్రేష్ఠుడైన రావణుడు భయముతో దిక్కు తోచక, ఆ గాడిదమీదనుండి తల క్రిందుగా నేలపై పడినట్లు మరల నాకు కనబడినాడు. 25

మూ. సహసోత్థాయ సంభ్రాన్తో భయార్తో మదవిహ్వలః. 26
ఉన్మత్త ఇవ దిగ్వాసా దుర్వాక్యం ప్రలపన్ బహు,
దుర్గన్ధం దుస్సహం ఘోరం తిమిరం నరకోపమమ్, 27
మలపఙ్కం ప్రవిశ్యాశు మగ్నస్తత్ర స రావణః.

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, సహసా = శీఘ్రముగా, ఉత్థాయ = లేచి, సంభ్రాన్తః = భ్రాంతి చెందినవాడై, భయార్తః = భయముచే పీడితుడై, మదవిహ్వలః = మదముచేత వ్యాకులుడై, దిగ్వాసాః = దిగంబరుడై, ఉన్మత్తః ఇవ = పిచ్చివాడు వలె, బహు = అధికముగా, దుర్వాక్యమ్ = చెడ్డమాటలను, ప్రలపన్ = ప్రేలుచు, దుర్గన్ధమ్ = దుర్గంధము కలదీ, దుస్సహమ్ = సహింప శక్యము కానిదీ, ఘోరమ్ = భయంకరమైనదీ, తిమిరమ్ = చీకటిగా ఉన్నదీ, నరకోపమమ్ = నరకముతో సమానమైనదీ అయిన, మలపఙ్కమ్ = మలము యొక్క బురదను, ప్రవిశ్య = ప్రవేశించి, ఆశు = శీఘ్రముగా, తత్ర = దానిలో, మగ్నః = మునిగిపోయినాడు.

తా. ఆ రావణుడు వెంటనే లేచి, కంగారు పడుచు, భయముచే పీడితుడై, మదముతో వ్యాకులుడై, దిగంబరుడై, పిచ్చివాని వలె ఏమేమో చాలా చెడ్డ మాటలు పలుకుచు సహింపరాని దుర్గంధముతో భయంకరమైన, అంధకారబంధురమైన, నరకము వంటి మలపంకమును ప్రవేశించి దానిలో మునిగిపోయెను.

మూ. కణ్ఠే బద్ధ్వా దశగ్రీవం ప్రమదా రక్తవాసినీ, 28
కాళీ కర్దమలిప్తాఙ్గీ దిశం యామ్యాం ప్రకర్షతి.

ప్ర. అ. రక్తవాసినీ = ఎఱ్ఱని వస్త్రములు ధరించిన, కాళీ = నల్లగా ఉన్న, కర్దమలిప్తాఙ్గీ = బురదచేత పూయబడిన శరీరము గల, ప్రమదా = స్త్రీ, దశగ్రీవమ్ = రావణుని, కణ్ఠే = కంఠమునందు, బద్ధ్వా = కట్టి, యామ్యాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, ప్రకర్షతి = లాగుచున్నది.

తా. ఎఱ్ఱని వస్త్రములు ధరించి, శరీర మంతా ఎఱ్ఱని పూసికొని ఉన్న ఒక నల్లని స్త్రీ రావణుని మెడకు త్రాడు కట్టి దక్షిణము వైపు ఈడ్చుచుండెను.

మూ. ఏవం తత్ర మయా దృష్టః కుమ్భకర్ణో నిశాచరః, 29
రావణస్య సుతాః సర్వే దృష్టాస్తైలసముక్షితాః.

ప్ర. అ. తత్ర = స్వప్నములో, నిశాచరః = రాక్షసు డైన, కుమ్భకర్ణః = కుంభకర్ణుడు, మయా = నాచేత, ఏవమ్ = ఈ విధముగా, దృష్టః = చూడబడి నాడు. రావణస్య = రావణునియొక్క, సుతాః = కుమారులు, సర్వే = అందరూ, తైలసముక్షితాః = తైలముచేత తడుపబడినవారుగా, దృష్టాః = చూడబడినారు.

తా. నిశాచరు డైన కుంభకర్ణుడు కూడా నాకు స్వప్నములో ఇట్లే కన బడినాడు. రావణుని కుమారు లందరు తైలము పూసికొని ఉండిరి. 29

మూ. వరాహేణ దశగ్రీవః శింశుమారేణ చేన్ద్రజిత్, 30
ఉష్ట్రేణ కుమ్భకర్ణశ్చ ప్రయాతా దక్షిణాం దిశమ్.

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు. వరాహేణ = వరాహముచేత. ఇన్ద్రజిత్ = ఇంద్రజిత్తు, శింశుమారేణ చ = మొసలిచేత, కుమ్భకర్ణః = కుంభకర్ణుడు, ఉష్ట్రేణ చ = ఒంటెచేత, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, ప్రయాతాః = వెళ్ళిరి.

తా. వరాహము నెక్కి రావణుడు, మొసలి నెక్కి ఇంద్రజిత్తు, ఒంటెను ఎక్కి కుంభకర్ణుడు దక్షిణదిక్కు వైపు వెళ్ళినారు. 30

మూ. ఏక స్తత్ర మయా దృష్టః శ్వేతచ్ఛత్రో విభీషణః, 31
శుక్లమాల్యామ్బరధరః శుక్లగన్ధానులేపనః.

ప్ర. అ. తత్ర = వారిలో, ఏకః = ఒక్క, విభీషణః = విభీషణుడే, శ్వేతచ్ఛత్రః = తెల్లని ఛత్రము కలవాడుగాను, శుక్లమాల్యామ్బరధరః = తెల్లని మాలలను, వస్త్రములను, ధరించినవాడుగాను, శుక్లగన్ధానులేపనః = తెల్లని గంధము పైపూతగలవాడు గాను, మయా = నాచేత, దృష్టః = చూడబడినాడు.

తా. వారిలో ఒక్క విభీషణుడు మాత్రమె తెల్లని మాలలను, వస్త్రము

ధను ధరించి, తెల్లని మంచి గంధము పూసికొని, శ్వేతచ్ఛత్రము ధరించి నాకు కనబడెను. 31

మూ. శంఖదుందుభినిర్ఘోషైర్నృత్తగీతైరలంకృతః, 32
ఆరుహ్య శైలసంకాశం మేఘస్తనితనిస్వనమ్,
చతుర్దన్తం గజం దివ్యమాస్తే తత్ర విభీషణః, 33
చతుర్భిః సచివైః సార్ధం వైహాయసముపస్థితః.

ప్ర. అ. విభీషణః = విభీషణుడు, శంఖదుందుభినిర్ఘోషైః = శంఖముల యొక్క, దుందుభులయొక్క ధ్వనులతోను, నృత్తగీతైః = నృత్తములతోను, గీతములతోను, అలంకృతః = అలంకరింపబడినవాడై, శైలసంకాశమ్ = పర్వతముతో సమానమైన, మేఘస్తనితనిస్వనమ్ = మేఘముయొక్క ఉరుము వంటి ధ్వని గల, చతుర్దన్తమ్ = నాలుగు దంతములు గల, దివ్యమ్ = దివ్యమైన, గజమ్ = ఏనుగును, ఆరుహ్య = ఎక్కి, తత్ర = అక్కడ, ఆస్తే = ఉన్నాడు. చతుర్భిః = నలుగురు, సచివైః సార్ధమ్ = మంత్రులతో కూడ, వైహాయసమ్ = ఆకాశమును, ఉపస్థితః = పొంది ఉన్నాడు.

తా. ఆ విభీషణుడు, శంఖదుందుభుల ధ్వనులు, నృత్తములు, గీతములు మొదలైనవి చుట్టూ జరుగుచుండగా, ఉరుము వంటి ధ్వని గల, పర్వతము వంటి, నాలుగు దంతాల ఏనుగును ఎక్కి, నలుగురు మంత్రులతో కలిసి ఆకాశముమీద ఉండెను. 32, 33

మూ. సమాజశ్చ మయా దృష్టో గీతవాదిత్రనిఃస్వనః, 34
పిబతాం రక్తమాల్యానాం రక్షసాం రక్తవాససామ్.

ప్ర. అ. పిబతామ్ = తైలమును త్రాగుచున్న, రక్తమాల్యానామ్ = ఎఱ్ఱని మాలలు ధరించిన, రక్తవాససామ్ = ఎఱ్ఱని వస్త్రములుగల, రక్షసామ్ = రాక్షసులయొక్క, గీతవాదిత్రనిఃస్వనః = గీతములయొక్క, వాద్యములయొక్క ధ్వని గల, సమాజశ్చ = సమాజము కూడ, మయా = నాచేత, దృష్టః = చూడబడెను.

తా. రాక్షసు లందరూ గుమిగూడి, నూనె త్రాగుచు, ఎఱ్ఱని మాలలు,

శస్త్రములు ధరించి, వాద్యాలు వాయించుచు, పాటలు పాడుచూ ఉన్నట్లు నేను చూచితిని. ౩౪

మూ. లఙ్కా చేయం పురీ రమ్యా సవాజిరథకుఞ్జరా। ౩౫
సాగరే పతితా దృష్టా భగ్నగోపురతోరణా॥

ప్ర. అ. రమ్యా=సుందరమైన, ఇయమ్=ఈ, లఙ్కా పురీ చ=లంకా పట్టణము కూడ, సవాజిరథకుఞ్జరా=గుఱ్ఱములతోను, ఏనుగులతోను కూడినదై, భగ్నగోపురతోరణా=విరుగగొట్టబడిన గోపురములు ముఖద్వారములు కలదై, సాగరే=సముద్రమునందు, పతితా=పడినదిగా, దృష్టా=చూడబడినది.

తా. రమ్యమైన ఈ లంకాపట్టణములోని గోపురములూ, ముఖద్వారములూ భగ్నము లైపోయినట్లూ, అశ్వములతోను గజములతోను సహా ఈ లంక సముద్రములో మునిగిపోయినట్లూ నాకు కనబడినది. ౩౫

మూ. లఙ్కా దృష్టా మయా స్వప్నే రావణేనాభిరక్షితా। ౩౬
దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా॥

ప్ర. అ. రావణేన=రావణునిచేత, అభిరక్షితా = రక్షింపబడిన, లఙ్కా=లంక, రామస్య=రామునియొక్క, దూతేన = దూత యైన, తరస్వినా=వేగవంతు డైన, వానరేణ=వానరునిచేత, దగ్ధా=కాల్చబడినదిగా, మయా=నాచేత, స్వప్నే=స్వప్నమునందు, దృష్టా=చూడబడినది.

తా. రావణుడు రక్షించుచున్న ఈ లంకాపట్టణమును రాముని దూత, మహావేగవంతుడూ అయిన ఒక వానరుడు కాల్చివేసినట్లు నేను స్వప్నము చూచితిని. ౩౬

మూ. పీత్వా తైలం ప్రనృత్తాశ్చ ప్రహసన్త్యో మహాస్వనాః। ౩౭
లఙ్కాయాం భస్మరూక్షాయాం సర్వా రాక్షసయోషితః॥

ప్ర. అ. భస్మరూక్షాయామ్=బూడిదతో భయంకరముగా ఉన్న, లఙ్కాయామ్=లంకలో, సర్వాః=సమస్తమైన, రాక్షసస్త్రియః=రాక్షసస్త్రీలు, తైలమ్=తైలమును, పీత్వా=త్రాగి, ప్రహసన్త్యః=అట్టహాసము చేయుచు, మహాస్వనాః=గొప్పధ్వని కలవారై, ప్రనృత్తాః=[illegible] నృత్తము చేయుచుండిరి.

తా. లంక యందలి యాతరలో నిండ ఉంచెను. ఆసిలోని స్త్రీ లందరూ తైలము త్రాగుచు, మహాధ్వనితో అట్టహాసములు చేయుచు పెళ్లిగ గంతులు వేయుచుండిరి. 37

మూ. కుమ్భకర్ణాదయశ్చైతే సర్వే రాక్షసపుఙ్గవాః। 38
రక్తం నివసనం గృహ్య ప్రవిష్టా గోమయహ్రదే.

ప్ర. అ. కుమ్భకర్ణాదయః=కుంభకర్ణుడు మొదలైన, ఏతే=ఈ, సర్వే=సమస్తమైన, రాక్షసపుఙ్గవాః=రాక్షసశ్రేష్ఠులు, రక్తమ్=ఎఱ్ఱని, నివసనమ్=వస్త్రమును, గృహ్య=గ్రహించి, గోమయహ్రదే = పేడతో నిండిన గోతిలో, ప్రవిష్టాః=ప్రవేశించిరి.

తా. కుంభకర్ణాదిరాక్షసశ్రేష్ఠు లందరూ ఎఱ్ఱని వస్త్రములు ధరించి, పేడతో నిండిన గోతులలో మునిగిపోయిరి. 38

మూ. అపగచ్ఛత నశ్యధ్వం సీతామాప్నోతి రాఘవః। 39
ఘాతయేత్పరమామర్షీ యుష్మాన్ సార్ధం హి రాక్షసైః.

ప్ర. అ. అపగచ్ఛత = తొలగిపొండి. నశ్యధ్వమ్=నశించండి. రాఘవః = రాముడు, సీతామ్ = సీతను, ఆప్నోతి = పొందును. పరమామర్షీ = అధికమైన కోపము కలవాడై, రాక్షసైః సార్ధమ్ = రాక్షసులతో కూడ, యుష్మాన్ = మిమ్ములను, ఘాతయేత్=చంపించును.

తా. మీరు తొలగిపొండి; చావండి। రాముడు సీతను పొందుట తథ్యము. అతడు తన భార్యను పీడించినా రనే కోపముతో, రాక్షసులతో పాటు మిమ్ము లను కూడ చంపించివేయును. 39

మూ. ప్రియాం బహుమతాం భార్యాం వనవాసమనువ్రతామ్,
భర్త్సితాం తర్జితాం వాపి నానుమంస్యతి రాఘవః.

ప్ర. అ. రాఘవః = రాముడు, ప్రియామ్ = ప్రియురాలు, బహుమతామ్ = బహుమానపాత్రురాలు, వనవాసమ్ = వనవాసమును, అనువ్రతామ్ = అనుసరించి వ్రతము పాలించినదీ అయిన, భార్యామ్ = భార్యను, భర్త్సితామ్ = మర

బాధలు చూపి భయ పెట్టబడినను, తర్జితాం వాపి=దూషించి బెదిరింపబడినను, నామర్షయేత్=అంగీకరించడు.

తా. సీత రామునకు అతిప్రియురాలు, బహుమానపాత్రురాలు అయిన భార్య. అతనిని అనుసరించి వచ్చి వనవాసవ్రతమును అవలంబించిన సాధ్వి. అట్టి భార్యను ఎవ రైన భయ పెట్టినా, దూషించినా రాముడు సహించడు. 40

మూ. తదలం క్రూరవాక్యైశ్చ సాన్త్వమేవాభిధీయతామ్, 41
అభియాచామ వైదేహీమేతద్ధి మమ రోచతే.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన. క్రూరవాక్యైః=క్రూరవాక్యములచేత, అలమ్=చాలును. సాన్త్వమేవ=మంచి మాటయే, అభిధీయతామ్=చెప్పబడుగాక. వైదేహీమ్=సీతను. అభియాచామ=ప్రతిమాలుకొందము. ఏతద్ధి=ఇదే. మే=నాకు, రోచతే=ఇష్ట మగుచున్నది.

తా. అందుచేత సీతతో పరుషవాక్యములు పలుకవద్దు. మంచి మాటలే చెప్పండి. సీతను ప్రతిమాలుకుందాము. నాకు ఇదే ఇష్టము. 41

మూ. యస్యామేవంవిధః స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే,
సా దుఃఖైర్వివిధైర్ముక్తా ప్రియం ప్రాప్నోత్యనుత్తమమ్.

ప్ర. అ. యస్యామ్=ఎవతె, దుఃఖితాయామ్=దుఃఖితురాలై ఉండగా, ఏవంవిధః=ఈ విధ మైన, స్వప్నః=స్వప్నము, ప్రదృశ్యతే=చూడబడునో, సా=ఆ స్త్రీ, వివిధైః=అనేకవిధము లైన, దుఃఖైః=దుఃఖములచేత, ముక్తా=విడవబడినదై, అనుత్తమమ్=అత్యుత్తమ మైన, ప్రియమ్=ప్రియమును, ప్రాప్నోతి=పొందును.

తా. ఎవ్వ రైన స్త్రీ కష్టాలలో ఉన్నప్పుడు ఈ విధ మైన స్వప్నము వచ్చునో, ఆమె సర్వదుఃఖములనుండి విముక్తురాలై, అత్యుత్తమ మైన ప్రియమును పొందును. 42

మూ. భర్త్సితామపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా, 43
రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానాముపస్థితమ్.

ప్ర. అ. రాక్షస్యః = రాక్షసస్త్రీలారా! భర్త్సితామపి = భయ పెట్టబడిన దైనను ఈమెను, యాచధ్వమ్ = ప్రార్థింపుడు. వివక్షయా = చెప్పవలె నను కోరికచే, కిమ్ = ఏమి ప్రయోజనము? రాక్షసానామ్ = రాక్షసులకు, రాఘవాత్ = రామునివలన, ఘోరమ్ = ఘోర మైన, భయమ్ = భయము, ఉపస్థితమ్ = ఏర్పడినది.

తా. రాక్షసస్త్రీలారా! ఇంకా ఏమేమో చెప్ప ప్రయోజనము లేదు. ఇంత వరకు ఈమెను భయపెట్టినాము. ఇప్పుడింక ఈమెను ప్రార్థించుకొనుట మంచిది. రాక్షసులకు రామునినుండి గొప్ప అపద ఏర్పడినది. 43

మూ. ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా, 44
అలమేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్.

ప్ర. అ. రాక్షస్యః = రాక్షసస్త్రీలలారా! జనకాత్మజా = జనకుని కుమార్తె యైన, ఏషా = ఈ, మైథిలీ = సీత, ప్రణిపాతప్రసన్నా = నమస్కారమాత్రేత ప్రసన్నురాలై, మహతః = గొప్ప, భయాత్ = భయమునుండి, పరిత్రాతుమ్ = రక్షించుటకు, అలమ్ = సమర్థురాలు.

తా. రాక్షసస్త్రీలలారా! జనకాత్మజ యైన ఈ సీతను నమస్కరించి అనుగ్రహింపచేసుకొన్నచో ఈమె మనలను మహాభయమునుండి రక్షింప గలదు. 44

మూ. అపి చాస్యా విశాలాక్ష్యా న కించిదుపలక్షయే, 45
విరూపమపి చాఙ్గేషు సుసూక్ష్మమపి లక్షణమ్.

ప్ర. అ. అపిచ = మరియు, విశాలాక్ష్యాః = విశాలాక్షి యైన, అస్యాః = ఈమెయొక్క, అఙ్గేషు = అవయవములయందు, సుసూక్ష్మమపి = చాల సూక్ష్మ మైనను, విరూపమ్ = చెడ్డదైన, లక్షణమ్ = లక్షణమును, కించిదపి = కొంచెము కూడ, న ఉపలక్షయే = చూడను.

తా. విశాలాక్షి యైన ఈ సీత అవయవములలో, అంతము లేని దుఃఖమును సూచించు చెడ్డ లక్షణము, అతిసూక్ష్మమైనది కూడ, ఏదీ, నాకు కనబడుట లేదు. 45

"ఇయం ద్వైగుణ్యదోషేణ శక్తే దుఃఖముపాగతా
అదుఃఖార్హామిమాం దేవీం న క్లేశయితుమర్హతి."

"ఈమె కేవలము రెండు గుణాల ప్రభావంచేత (రజస్తమోగుణాల ప్రభావంచేత) ఈ దుఃఖమును పొందినదని అనుకొనుచున్నాను. దుఃఖములకు తగని ఈ దేవిని దుఃఖపెట్టకండి" అని దీని అర్థము. ఈమె శరీరమునందు గాని, విడివిడిగా అవయవాలయందు గాని ఏ దోషమూ లేకపోయినా మన కండ్లకు కనిపించని రజస్తమోగుణాల ప్రభావం ఏదో ఈమెకు దుఃఖం కలిగిస్తూన్నది. ఆ గుణాలు రావణాదులలో ఉద్రిక్తములై సీతను బాధించవచ్చును కదా! అని భావము 46

మూ. అర్థసిద్ధిం తు వైదేహ్యాః పశ్యామ్యహముపస్థితామ్, 47
దశగ్రీవవినాశం చ విజయం రాఘవస్య చ.

ప్ర. అ. అహమ్ = నేను, వైదేహ్యాః = సీతయొక్క, అర్థసిద్ధిం తు = కార్యసిద్ధి నైతే, ఉపస్థితామ్ = సమీపించినదానినిగా, పశ్యామి = చూచుచున్నాను. దశగ్రీవవినాశం చ = రావణుని వినాశనమును, రాఘవస్య = రామునియొక్క, విజయం చ = విజయమును కూడ, (దగ్గరనే ఉన్నట్లు చూచుచున్నాను).

భా. సీతకు కార్యసిద్ధి త్వరలోనే కలుగునట్లు కనుపించుచున్నది. రావణుని వినాశమూ, రాముని విజయమూ కూడా దగ్గరలోనే ఉన్నట్లు కన బడుచున్నది. 47

మూ. నిమిత్తభూతమేతత్తు శ్రోతుమస్యా మహత్ప్రియమ్, 48
దృశ్యతే చ స్ఫురచ్చక్షుః పద్మపత్రమివాయతమ్.

ప్ర. అ. అస్యాః = ఈమెయొక్క, మహత్ = గొప్పదైన, ప్రియమ్ = ప్రియమును, శ్రోతుమ్ = వినుటకు, నిమిత్తభూతమ్ = నిమిత్త మగుచు, స్ఫురత్ = అదురుచున్న, ఏతత్ = ఈ, పద్మపత్రమివ = తామర రేకు వలె, ఆయతమ్ = పొడవైన, చక్షుః = నేత్రము, దృశ్యతే = కనబడుచున్నది.

భా. ఈమె గొప్ప ప్రియవార్తను విననున్నది అను విషయమునకు సూచకముగా, పద్మపత్రము వలె ఆయతమైన ఈ నేత్రము (సీత ఎడమ కన్ను) అదురుచున్నది. 48

మూ. ఈషచ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః ।
అకస్మాదేవ వైదేహ్యా బాహురేకః ప్రకమ్పతే.

ప్ర. అ. దక్షిణాయాః=సమర్థురాలైన (సౌరుస్వభావముగల), అస్యాః= ఈ, వైదేహ్యాః = సీతయొక్క, అదక్షిణః = ఎడమ దైన, ఏకః బాహుః = ఒక బాహువు, అకస్మాదేవ = అకస్మాత్తుగా, హృషితః = పొంగినదై, ఈషత్ = కొంచెము, ప్రకమ్పతే=వణకుచున్నది.

తా. సౌరుస్వభావము గల ఈ సీత ఎడమ భుజము హఠాత్తుగా పొంగినదై, కొంచెము అదరుచున్నది. 49

మూ. కరేణుహస్తప్రతిమః సవ్యశ్చోరురనుత్తమః, 50
వేపమానః సూచయతి రాఘవం పురతః స్థితమ్.

ప్ర. అ. కరేణుహస్తప్రతిమః = ఏనుగు తొండముతో సమానమూ, అనుత్తమః = శ్రేష్ఠమూ అయిన, సవ్యః = ఎడమ, ఊరుః = తొడ, వేపమానః= వణకుచు, రాఘవమ్ = రాముని, పురతః = ఎదటనే, స్థితమ్ = ఉన్నవానినిగా సూచయతి = సూచించుచున్నది

తా. ఏనుగు తొండముతో సమానమూ, శ్రేష్ఠమూ అయిన ఈ సీత ఎడమ తొడ అదరుచున్నది. రాముడు దగ్గరనే ఉన్నాడని ఇది సూచించు చున్నది. 50

మూ. పక్షీ చ శాఖానిలయం ప్రవిష్టః
పునః పునశ్చోత్తమసాన్త్వవాదీ,
సుస్వాగతాం వాచముదీరయానః
పునః పునశ్చోదయతీవ హృష్టః. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
నవవింశః సర్గః.

ప్ర. అ. పక్షీ చ=పక్షికూడ, శాఖానిలయమ్=కొమ్మపై నున్న గూడును, ప్రవిష్టః=ప్రవేశించినదై, పునః పునః=మాటి మాటికి, ఉత్తమసా న్త్వవాదీ=

ఉత్తమ మైన ఓదార్పుమాటలను పలుకుచు, సుస్వాగతమ్ = మంచి స్వాగతమును చెప్పు, వాచమ్ = వాక్యమును, ఉదీరయానః = చెప్పుచు, హృష్టః = సంతోషించినదై, పునః పునః = మాటి మాటికి, చోదయతీవ = ప్రేరేపించుచున్నట్లున్నది.

తా. ఒక పక్షి కొమ్మపై ఉన్న గూటిలో కూర్చుండి, మాటి మాటికి ఊరడింపుమాటలు పలుకుచు, చాలా ఉత్సాహముతో కూడినదై, స్వాగతవచనములు పలుకుచు, "రాముడు రానున్నాడు' అని సీతకు చెప్పుచున్న ట్లున్నది.

వి. శకుని (పక్షి) ధ్వనులను బట్టి రాబోవు శుభాశుభములను తెలుసుకొను పద్ధతి పూర్వము చాలా ప్రచారములో ఉండెడిది. మన మిపుడు అలాంటి సర్వం ప్రదాయా లన్నిటికీ దూర మైపోయినాము।

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశః సర్గః

[సీత విలపించుట ప్రాణములు విడచుటకు ఉద్యమించుట]

మూ. సా రాక్షసేన్ద్రస్య వచో నిశమ్య
తద్రావణస్యాప్రియమప్రియార్తా,
సీతా వితత్రాస యథా వనాన్తే
సింహాభిపన్నా గజరాజకన్యా. 1

ప్ర. అ. సా సీతా = ఆ సీత, రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజైన, రావణస్య = రావణునియొక్క, అప్రియమ్ = అప్రియమైన, తత్ = ఆ, వచః = వాక్యమును, నిశమ్య = విని, అప్రియార్తా = దుఃఖముచే పీడింపబడినదై, (ప్రియుడైన రాముడు లేక పోవుటచే ఆర్తురాలై,) వనాన్తే = వనమధ్యమునందు, సింహాభిపన్నా = సింహముచేత ఆక్రమింపబడిన, గజరాజకన్యా యథా = చిన్న ఆడ ఏనుగు వలె, వితత్రాస = భయపడెను.

తా. ఆ సీత రాక్షసరాజైన రావణుని అప్రియములైన మాటలు విని, దుఃఖముతో బాధపడుచు, (లేదా రాముడు లేకపోవుటచేత బాధపడుచు) వనమధ్యమునందు సింహముచేత ఆక్రమించబడిన చిన్న ఆడ ఏనుగు వలె భయపడెను. 1

మూ. సా రాక్షసీమధ్యగతా చ భీరు
ర్వాగ్భిర్భృశం రావణతర్జితా చ,
కాన్తారమధ్యే విజనే విసృష్టా
బాలేవ కన్యా విలలాప సీతా. 2

ప్ర. అ. రాక్షసీమధ్యగతా = రాక్షసస్త్రీల మధ్యము పొందినది, భీరుః = భయస్వభావము కలది, భృశమ్ = మిక్కిలి, వాగ్భిః = వాక్కులచేత, రావణ

తర్జితా చ = రాక్షసునిచేత భయపెట్టబడినది అయిన, సా = ఆ, సీతా = సీత, విజనే = జనులు లేని, కాంతారమధ్యే = అడవి మధ్యయందు, విసృష్టా = విడువ బడిన, బాలా = బాల యైన, కన్యా ఇవ = కన్య వలె, విలలాప = విలపించెను.

తా. రాక్షసస్త్రీలమధ్య ఉన్న భయస్వభావము గల ఆ సీత రావణుడు కూడ మాటలతో అధికముగా భయపెట్టుటచేత, విజన మైన అడవిమధ్యములో ఒంటరిగా విడిచిపెట్టబడిన, బాల యైన కన్య వలె విలపించెను. 2

మూ. సత్యం బతేదం ప్రవదన్తి లోకే
నాకాలమృత్యుర్భవతీతి సన్తః,
యత్రాహమేవం పరిభర్త్స్యమానా
జీవామి దీనా క్షణమప్యపుణ్యా. 3

ప్ర. అ. లోకే = లోకమునందు, అకాలమృత్యుః = అకాలమునందు మృత్యువు, న భవతి = రాదు, ఇతి = అని, ఇదమ్ = ఈ మాటను, సత్యమ్ = నిజముగానే, సన్తః = సత్పురుషులు, ప్రవదన్తి = చెప్పుదురు. యత్ర = ఏ కారణమునందు (వలన), ఏవమ్ = ఇట్లు, పరిభర్త్స్యమానా = భయపెట్టబడు చున్న, అపుణ్యా = పుణ్యము లేని, అహమ్ = నేను, దీనా = దీనురాల నై, క్షణ మపి = క్షణకాల మైనను, జీవామి = జీవించుచున్నానో. బత = ఎంత కష్టము!

తా. పాపాత్మురాల నైన నేను ఈ విధముగ వీరందరూ భయపెట్టు చున్నా దీనురాలనై, క్షణమైనా జీవించుచున్నాను అనగా, అకాలము నందు మరణము రాదు అని సత్పురుషులు లోకములో చెప్పు మాట సత్యమే! ఎంత కష్టము! 3

మూ. సుఖాద్విహీనం బహుదుఃఖపూర్ణ
మిదం తు నూనం హృదయం స్థిరం మే,
విశీర్యతే యన్న సహస్రధాద్య
వజ్రాహతం శృఙ్గమివాచలస్య. 4

ప్ర. అ. సుఖాత్ = సుఖమునుండి, విహీనమ్ = హీన మైనదీ, బహు దుఃఖపూర్ణమ్ = అధిక మైన దుఃఖముతో నిండినదీ అయిన, ఇదమ్ = ఈ,

మే = నాయొక్క, హృదయమ్ = హృదయము, నూనమ్ = నిశ్చయముగా, స్థిరమ్ = స్థిర మైనది, యత్ = ఏ కారణమువలన, వజ్రాహతమ్ = వజ్రముచేత కొట్టబడిన, అచలస్య = పర్వతముయొక్క, శృఙ్గమివ = శిఖరము వలె, సహస్రధా = వెయ్యి ముక్కలుగా, అద్య = ఇప్పుడు, న విశీర్యతే = బ్రద్దలగుట లేదు.

తా. ఎట్టి సుఖమూ లేక, అత్యధిక మైన దుఃఖముతో నిండిన ఈ నా హృదయము నిజముగా చాల గట్టిది. అందుచేతనే వజ్రముతో కొట్టబడిన పర్వత శిఖరము వలె ఇప్పుడు కూడా అది వెయ్యి ముక్కలుగా బ్రద్దలగుట లేదు. ౪

మూ. నైవాస్తి దోషో మమ నూనమత్ర
వధ్యాహమస్యాప్రియదర్శనస్య,
భావం న చాస్యాహమనుప్రదాతు
మలం ద్విజో మన్త్రమివాద్విజాయ. ౫

ప్ర. అ. అత్ర = ఈ విషయమునందు, మమ = నాయొక్క, దోషః = దోషము, నైవాస్తి = లేదు. అహమ్ = నేను, అప్రియదర్శనస్య = అప్రియ మైన దర్శనము గల, అస్య = ఈ రావణునకు, వధ్యా = వధ్యురాలను, అస్మి = అయితిని. అహమ్ = నేను, అస్య = వీనికి, భావమ్ = భావమును, ద్విజః = ద్విజుడు, అద్విజాయ = ద్విజుడు కానివానికి, మన్త్రమివ = మంత్రమును వలె, అనుప్రదాతుమ్ = ఇచ్చుటకు, న అలమ్ = సమర్థురాలను కాను.

తా. ఈ విషయములో నా దోష మేమీ లేకుండగానే చూచుటకు అప్రియు డైన ఈ రావణుడు నన్ను చంప నున్నాడు. ద్విజుడు ద్విజుడు కాని వానికి మంత్రమును ఏ విధముగా ఇవ్వజాలడో, నేను, అదే విధముగ వీనికి నా మనస్సును ఇవ్వజాలను.

వి. ప్రాచ్యపాఠములో ఈ శ్లోకం క్రింది విధంగా ఉన్నది.

"నూనం త్విదానీం మమ శేషమస్తి వధ్యాస్మి తస్యాప్రియదర్శనస్య
భావం న తస్యాహమనుప్రవద్యాం మహాద్విజో బ్రహ్మ యథా న శూద్రే"

"నా హృదయము వెయ్యి ముక్కలు కావలసినది; కాలేదు, ఇంక మిగిలిన దేమనగా నే నీతనికి వధ్యురాల నైతిని. ద్విజుడు వేదమును ఏ విధముగా శూద్రు-

జీవించగలనో లేక వెంటనే నే నీరవ భావమును అనుసరించగలను'' అని దీని భావము.                                                                 5

మూ. నూనం మమాఙ్గాన్యచిరాదనార్యః
శస్త్రైః శితైశ్ఛేత్స్యతి రాక్షసేన్ద్రః,
తస్మిన్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజన్తోరివ శల్యకృన్తః.                                                                 6

ప్ర. అ. లోకనాథే = లోకములకు ప్రభు వైన, తస్మిన్ = రాముడు, అనాగచ్ఛతి = రానివాడగుచుండగా, అనార్యః = చెడ్డవా డైన, రాక్షసేన్ద్రః = రాక్షసరాజు, శల్యకృన్తః = శల్యమును ఛేదించువాడు (శస్త్రచికిత్సకుడు), గర్భస్థజన్తోరివ = గర్భములో ఉన్న జంతువుయొక్క అవయవములను వలె, మమ = నాయొక్క, అఙ్గాని = అవయవములను, నూనమ్ = తప్పక, శితైః = వాడి యైన, శస్త్రైః = శస్త్రములతో, ఛేత్స్యతి = ఛేదించగలడు.

తా. లోకములకు ప్రభు వైన రాముడు రాకున్నచో, చెడ్డవా డైన ఈ రావణుడు శస్త్రచికిత్సకుడు గర్భములో ఉన్న శిశువును ఛేదించినట్లు, నా అవయవములను వాడి యైన శస్త్రములతో తప్పక ఛేదించును.                                                                 6

మూ. దుఃఖం బతేదం మమ దుఃఖితాయా
మాసౌ చిరాయాధిగమిష్యతో ద్వౌ,
బద్ధస్య వధ్యస్య తథా నిశాన్తే
రాజాపరాధాదివ తస్కరస్య.                                                                 7

ప్ర. అ. రాజాపరాధాత్ = రాజు విషయమున జరిగిన అపరాధము వలన, బద్ధస్య = బంధింపబడినవాడూ, నిశాన్తే = రాత్రియొక్క అంతమునందు, వధ్యస్య = చంపదగిన వాడూ అయిన, తస్కరస్య ఇవ = దొంగకు వలె, దుఃఖితాయాః = దుఃఖించుచున్న, మమ = నాకు, ద్వౌ = రెండు, మాసౌ = మాసములు, చిరాయ = చాలకాలమునకు, అధిగమిష్యతః = గడవగలవు. ఇదమ్ = ఇది, దుఃఖమ్ = పెద్ద దుఃఖకారణము. బత = అయ్యో!

తా. రాజు విషయములో చేసిన అపరాధమునకు బద్ధు డై తెల్లవారు

కాముని వెంటపడితి యున్న దొంగను వలె దుఃఖితురాలనైన నాకు ఇచ్చిన రెండు మాసములు గడువు అంత్యముగా గడచును. అయ్యో! ఎంత కష్టము వచ్చి పడినది. 7

మూ. హా రామ హా లక్ష్మణ హా సుమిత్రే
హా రామమాతః సహ మే జనన్యా,
ఏషా విపద్యామ్యహమల్పభాగ్యా
మహార్ణవే నౌరివ మూఢవాతా. 8

ప్ర. అ. హా రామ = అయ్యో! రామా! హా లక్ష్మణ = అయ్యో! లక్ష్మణా! హా సుమిత్రే = అయ్యో సుమిత్రా! మే = నాయొక్క, జనన్యా సహ = తల్లితో కూడ, హా రామమాతః = అయ్యో! కౌసల్యా, అల్పభాగ్యా = అల్పమైన భాగ్యము గల, ఏషా = ఈ, అహమ్ = నేను, మహార్ణవే = మహాసముద్రమునందు, మూఢవాతా = నిలదిపోలున గాలి గల, ('వాతమూఢా' అను ప్రాచ్యపాఠము కాగు న్నది. "వాయువు చేత ఎటూ పోజాలని' అని అర్థము) నౌరివ = ఓడ వలె, విపద్యామి = నశించుచున్నాను.

తా. అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో సుమిత్రా! అయ్యో కౌసల్యా! అయ్యో! నా తల్లీ! దుర్భాగ్యవంతురాలనైన నేను మహాసముద్రములో గాలిచేత ఎటు వెళ్లటకూ వీలు లేని ఓడ వలె, నశించుచున్నాను. 8

మూ. తరస్వినౌ ధారయతా మృగస్య
సత్త్వేన రూపం మనుజేంద్రపుత్రౌ,
నూనం విశస్తౌ మమ కారణాత్తౌ
సింహర్షభౌ ద్వావివ వైద్యుతేన. 9

ప్ర. అ. మృగస్య = మృగముయొక్క, రూపమ్ = రూపమును, ధారయతా = ధరించుచున్న, సత్త్వేన = ప్రాణిచేత, తరస్వినౌ = వేగవంతులైన, తౌ = ఆ, మనుజేంద్రపుత్రౌ = దశరథకుమారులు, వైద్యుతేన = మెరుపుతో సంబంధించిన పిడుగుచేత, ద్వౌ = రెండు, సింహర్షభౌ ఇవ = శ్రేష్ఠమైన సింహములు వలె, మమ కారణాత్ = నా కారణమువలన, నూనమ్ = నిశ్చయముగా, విశస్తౌ = చంపబడినారు.

తా. ఆ ప్రాణి ఎవరో మృగరూపమును ధరించి మహాబలశాలు లైన ఆ రామలక్ష్మణులను, పితృగ శ్రేష్ఠము లైన రెండు సింహములను చంపివేసి నట్లు, నా మూఢత్వమున చంపివేసినది. సందేహము లేదు. 9

మూ. నూనం స కాలో మృగరూపధారీ
మామల్పభాగ్యాం లులుభే తదానీమ్,
యత్రార్యపుత్రం విససర్జ మూఢా
రామానుజం లక్ష్మణపూర్వజం చ. 10

ప్ర. అ. నూనమ్ = నిజముగా, సః = ఆ, కాలః = కాలము, మృగరూపధారీ = మృగరూపమును ధరించినదై, తదానీమ్ = అప్పుడు, అల్పభాగ్యామ్ = అల్ప మైన భాగ్యము గల, మామ్ = నన్ను, లులుభే = లోభ పెట్టెను. యత్ర = ఏ సమయమునందు, మూఢా = మూఢురాల నై, రామానుజమ్ = లక్ష్మణుని, లక్ష్మణపూర్వజమ్ = లక్ష్మణుని అన్నగా నైన, ఆర్యపుత్రం చ = ఆర్య పుత్రుని విససర్జ = విడచితినో.

తా. నిజముగా ఆనాడు కాలపురుషుడు, మృగము రూపములో వచ్చి దురదృష్టవంతురాల నైన నన్ను లోభపెట్టినాడు. అందుచేతనే, నేను, తెలివి తక్కువతనముచే ఆర్యపుత్రుని, లక్ష్మణుని కూడ దూరముగా పంపివేసితిని. 10

మూ. హా రామ సత్యవ్రత దీర్ఘబాహో
హా పూర్ణచన్ద్రప్రతిమానవక్త్ర,
హా జీవలోకస్య హితః ప్రియశ్చ
వధ్యాం న మాం వేత్సి హి రాక్షసానామ్. 11

ప్ర. అ. సత్యవ్రత = సత్యనియమవంతుడవూ, దీర్ఘబాహో = దీర్ఘ బాహువులు గలవాడవు అయిన, హా రామ = అయ్యో! రామా! హా! పూర్ణచన్ద్రప్రతిమానవక్త్ర = అయ్యో! పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గలవాడా! హా = అయ్యో! జీవలోకస్య = ప్రాణిలోకమునకు, హితః = హితుడవూ, ప్రియశ్చ = ప్రియుడవూ అయిన నీవు, మామ్ = నన్ను, రాక్షసానామ్ = రాక్షసులకు, వధ్యామ్ = వధ్యురాల నైన దానినిగా, న వేత్సి = ఎరుగవు కదా!

తా. సర్వప్రత్యక్షవూ, దీర్ఘము లైన బాహువులు కలవాడవూ అయిన ఓ రామా! చంద్రుని వంటి ముఖము గలవాడా! అయోధ్యా ప్రాణిలోకానికి హితము చేయువాడవు, ప్రియుడవూ అయిన నీకు, నేను రాక్షసుల చేతిలో చిక్కి వధ్యురాలనుగా ఉన్నా నని తెలియదు కదా! 11

మూ. అనన్యదైవత్వమియం క్షమా చ
భూమౌ చ శయ్యా నియమశ్చ ధర్మే,
పతివ్రతాత్వం విఫలం మమేదం
కృతం కృతఘ్నేష్వివ మానుషాణామ్. 12

ప్ర. అ. అనన్యదైవత్వమ్ = భర్త తప్ప మరి యొక దేవత లేకుండుట, ఇయమ్ = ఈ, క్షమా చ = ఓర్పు, భూమౌ = నేలపై, శయ్యా = శయనించుట, ధర్మే = ధర్మమునందు, నియమశ్చ = నియమము, పతివ్రతాత్వమ్ = పతివ్రతగా ఉండుట, మమ = నాయొక్క, ఇదమ్ = ఇది అంతా, కృతఘ్నేషు = కృతఘ్నుల విషయములో, మానుషాణామ్ = మనుష్యుల, కృతమివ = చేయబడినఉపకారాదికము వలె, విఫలమ్ = వ్యర్థమై పోయినది.

తా. మనుష్యులు కృతఘ్నులకు చేసిన ఉపకారము ఎట్లు వ్యర్థ మైపోవునో, అట్లే, నేను భర్తను తప్ప మరి ఏ దేవుని పూజించకుండుట, ఈ ఓర్పు, నేల మీద శయనించుట, ధర్మనియమము, పతివ్రతాత్వము— ఇవి అన్నీ వ్యర్థమై పోయినవి. 12

మూ. మోఘో హి ధర్మశ్చరితో మయాయం
తథైకపత్నీత్వమిదం నిరర్థమ్,
యా త్వాం న పశ్యామి కృశా వివర్ణా
హీనా త్వయా సంగమనే నిరాశా. 13

ప్ర. అ. యా = ఏ నేను, త్వామ్ = నిన్ను, న పశ్యామి = చూచుట లేదో, త్వయా = నీతో, హీనా = హీనురాలనై, సంగమనే = నీ సంగమునందు, నిరాశా = ఆశ లేనిదాననై, కృశా = కృశించి, వివర్ణా = చెడిన రంగు గలదాననై ఉన్నానో, మయా = అట్టి నా చేత, చరితః = ఆచరింపబడిన, అయమ్ = ఈ,

ధర్మః = ధర్మము మోఘః హి = వ్యర్థము కదా. తథా = అట్లే, ఇదమ్ = ఈ, ఏకపత్నీత్వమ్ = పతివ్రతాత్వము కూడ. నిరర్థమ్ = వ్యర్థ మైపోయినది.

తా. నీకు దూరమై, నిన్ను చూడజాలక, నిన్ను కలుసుకొందు ననే ఆశ కూడ లేక, దిక్కు, సౌందర్యము చెడి ఉన్న నేను చేసిన ఈ ధర్మమంతా వ్యర్థ మైనది. ఈ పతివ్రతాత్వము కూడ నిష్ప్రయోజనము. 13

మూ. పితుర్నిదేశం నియమేన కృత్వా
వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభి
స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః. 14

ప్ర. అ. త్వమ్ = నీవు, పితుః = తండ్రియొక్క, నిదేశమ్ = ఆజ్ఞను, నియమేన = నియమముతో, కృత్వా = చేసి, చరితవ్రతశ్చ = ఆచరింపబడిన సత్యపాలనవ్రతము కలవాడవై, వనాత్ = వనమునుండి, నివృత్తః = మరలినవాడ వై, వీతభయః = పోయిన భయము కలవాడవై, కృతార్థః = కృతార్థుడ వై, విపులేక్షణాభిః = విశాలము లైన నేత్రములు గల, స్త్రీభిః = స్త్రీలతో, రంస్యసే = క్రీడింపగలవు అని, మన్యే = తలంచెదను.

తా. నీవు తండ్రి ఆజ్ఞను నియమపూర్వకముగా పాలించి, సత్యవ్రతమును ఆచరించి, వనమునుండి అయోధ్యకు తిరిగి వెళ్ళినవాడ వై, కృతార్థుడ వై, ఎట్టి భయములు లేక, విశాలము లైన నేత్రములు గల స్త్రీలతో విహరింపగల వని అనుకొనుచున్నాను. 14

మూ. అహం తు రామ త్వయి జాతకామా
చిరం వినాశాయ నిబద్ధభావా,
మోఘం చరిత్వాథ తపో వ్రతం చ
త్యక్ష్యామి ధిగ్జీవితమల్పభాగ్యామ్. 15

ప్ర. అ. రామ = ఓ! రామా! త్వయి = నీయందు, జాతకామా = పుట్టిన కోరిక గల, అహం తు = నే నైతే, వినాశాయ = నాశనముకొరకే, చిరమ్ = చిర కాలము, నిబద్ధభావా = నీపై నిలుపబడిన మనస్సు కలదాననై, తపః = తప

స్వప్నం, వ్రతం చ = వ్రతమును, మోఘమ్ = వ్యర్థముగా, చరిత్వా = ఆచరించి, జీవితమ్ = జీవితమును, త్యక్ష్యామి = విడువగలను. అల్పభాగ్యామ్ = అల్పమైన భాగ్యము గల నన్ను గూర్చి, ధిక్ = నింద అగుగాక.

మూ. సా జీవితం క్షిప్రమహం త్యజేయం
విషేణ శస్త్రేణ శితేన వాపి,
విషస్య దాతా న హి మేఽస్తి కశ్చి
చ్ఛస్త్రస్య వా వేశ్మని రాక్షసస్య. 16

ప్ర. అ. సా అహమ్ = అట్టి నేను, క్షిప్రమ్ = శీఘ్రముగా, జీవితమ్ = జీవితమును, విషేణ = విషముచేత గాని, శితేన = వాడి యైన, శస్త్రేణ వాపి = ఆయుధముచేత గాని, త్యజేయమ్ = విడచెదను. రాక్షసస్య = రాక్షసునియొక్క, వేశ్మని = గృహమునందు, మే = నాకు. విషస్య = విషముయొక్క (ను) గాని, శస్త్రస్య వా = ఆయుధముయొక్క (ను) గాని, దాతా = ఇచ్చువాడు, కశ్చిత్ = ఒక్కడూ, నాస్తి = లేడు.

భా. అట్టి నేను విషముచేత గాని, శస్త్రముచేత గాని శీఘ్రముగా నా జీవితమును విడచెదను. రాక్షసుని ఇంటిలో నాకు విషముగాని శస్త్రము గాని ఎవ్వరూ ఇవ్వరు గదా! 16

మూ. ఇతీవ దేవీ బహుధా విలప్య
సర్వాత్మనా రామమనుస్మరన్తీ,
ప్రవేపమానా పరిశుష్కవక్త్రా
నగోత్తమం పుష్పితమాససాద.

ప్ర. అ. దేవీ = సీత, ఇతీవ = ఇట్లు, బహుధా = అనేకవిధములుగా, విలప్య = విలపించి, సర్వాత్మనా = అన్ని విధములా, రామమ్ = రాముని, అనుస్మరన్తీ = స్మరించుచున్నదై, ప్రవేపమానా = వణకిపోవుచు, పరిశుష్కవక్త్రా = ఎండిన ముఖము గలదై, పుష్పితమ్ = పుష్పించిన, నగోత్తమమ్ = శ్రేష్ఠమైన వృక్షమును, ఆససాద = సమీపించెను.

భా. సీత ఇట్లు అనేకవిధములుగా విలపించి, సర్వవిధాల రాముని

స్మరించుచు, పశ్చాత్తాపపడుచున్నదై, ఎండిపోయిన ముఖముతో పుష్పించిన ఆ శింశుపావృక్షము దగ్గరకు వెళ్ళెను. 17

మూ. శోకాభితప్తా బహుధా విచిన్త్య
సీతాథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా,
ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్ర
మహం గమిష్యామి యమస్య మూలమ్. 18

ప్ర. అ. శోకాభితప్తా = శోకముచే తపింపచేయబడిన, సీతా = సీత, బహుధా = అనేకవిధములుగా, విచిన్త్య = ఆలోచించి, అథ = అటు పిమ్మట, వేణ్యుద్గ్రథనమ్ = జడ అను ఉరిత్రాడును, గృహీత్వా = గ్రహించి, అహమ్ = నేను, వేణ్యుద్గ్రథనేన = జడ అను ఉరిత్రాడుతో, ఉద్బధ్య = ఉరివేసికొని, శీఘ్రమ్ = శీఘ్రముగా, యమస్య = యమునియొక్క మూలమ్ = సమీపమును, గమిష్యామి = వెళ్ళెదను (అని నిర్ణయించుకొనెను).

ఆ శోకముతో బాధపడుచున్న సీత ఇట్లు అనేకవిధముల ఆలోచించి ఉరిత్రాడు వలె ఉన్న జడను చేతితో పట్టుకొని, ఇట్లు నిర్ణయించెను. "నేను జడను ఉరిపోసికొని, శీఘ్రముగా యమలోకమునకు వెళ్ళెదను." 18

మూ. ఉపస్థితా సా మృదుసర్వగాత్రీ
శాఖాం గృహీత్వాథ నగస్య తస్య,
తస్యాస్తు రామం ప్రవిచిన్తయన్త్యా
రామానుజం స్వం చ కులం శుభాఙ్గ్యాః. 19

శోకానిమిత్తాని తథా బహూని
ధైర్యార్జితాని ప్రవరాణి లోకే,
ప్రాదుర్నిమిత్తాని తదా బభూవుః
పురాపి సిద్ధాన్యుపలక్షితాని. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టావింశః సర్గః.

ప్ర. అ. అత=అటు పిమ్మట, మృదుసర్వగాత్రీ = మృదు వైన సకలావయవములు గల, సా=ఆ సీత, తస్య=ఆ, నగస్య=వృక్షముయొక్క, శాఖామ్=కొమ్మను, గృహీత్వా=గ్రహించి, ఉపస్థితా=నిలచినది. రామమ్=రాముని, లక్ష్మణమ్=లక్ష్మణుని, స్వం కులం చ=తన కులమును గూర్చి, ప్రవిచిన్తయన్త్యాః=ఆలోచించుచున్న, శుభాఙ్గ్యాః=శుభకర మైన అవయవములు గల, తస్యాః తు=ఆమెకు, తదా=అప్పుడు, శోకానిమిత్తాని=శోకమునకు నిమిత్తము కానివి, ధైర్యార్జితాని=సంపాదింపబడిన ధైర్యము గలవి, లోకే=లోకమునందు, ప్రవరాణి=శ్రేష్ఠ మైనవి, తథా=మరియు, పురాపి=పూర్వము కూడ, సిద్ధాని=సఫలము లైనవిగా, ఉపలక్షితాని=చూడబడిన, బహూని=అనేకము లైన, నిమిత్తాని=శకునములు, ప్రాదుర్బభూవుః=ఆవిర్భవించెను.

తా. మృదు వైన సకలావయవములు గల ఆ సీత ఆ వృక్షశాఖను గ్రహించి నిలచెను. రాముని, లక్ష్మణుని, తన కులమును గూర్చి ఆలోచించుచున్న, శుభ మైన అవయవములు గల ఆ సీతకు ధైర్యమును కలిగించు అనేకము లైన శుభశకునములు కనబడెను. శోకమును తొలగించేవి, అత్యుత్తమములుగా లోకములో ప్రసిద్ధము లైనవి అయిన ఆ శకునములు పూర్వము కూడ అనేక పర్యాయములు కనబడి సఫలము లయ్యెను.

వి. రావణుడు సీతను అపహరించి లంకలో ప్రవేశపెట్టినది మొదలు ప్రతి దినము అతడు, రాక్షసస్త్రీలు ఆమెను పరుషవాక్యములతో భయపెట్టుచునే ఉండి ఉందు రని మనము ఊహించుకొనవచ్చును. ఈ విధముగా పది మాసములనుండి బాధపడుచున్న సీత ఆనాడే, హనుమంతుడు అక్కడకు చేరిన దినమునందే, ఉరిపోసికొని ఆత్మహత్య చేసికొనవలె నని అనుకొన్న దనుట సమంజసముగా లేదు. అంతే కాకుండా సీత వంటి మహాధర్మాత్మురాలు ఆత్మహత్య వంటి పాపకార్యమునకు ఒడికట్టు ననుట ఆమె చరిత్రకే కళంకము. ప్రాచ్యప్రతిలో ఈ ఆత్మహత్యాప్రయత్నప్రస్తావము కాని, చివరకి "నా కెవ్వరైనా విషము గాని, శస్త్రము గాని ఇచ్చిన బాగుండెడిది" అని ఆమె అనుకొన్న మాటలు కాని లేవు. 19, 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో ఇరువది ఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనత్రింశః సర్గః

[సీతకు కొన్ని శుభశకునములు కనబడుట]

మూ. తథాగతాం తాం వ్యథితామనిన్దితాం
వ్యపేతహర్షాం పరిదీనమానసామ్,
శుభాం నిమిత్తాని శుభాని భేజిరే
నరం శ్రియా జుష్ట మివోపజీవినః. 1

ప్ర. అ. తథాగతామ్ = అట్టి పరిస్థితులలో ఉన్నదీ, వ్యథితామ్ = వ్యథ చెందినదీ, అనిన్దితామ్ = నిందింపలేనిదీ, వ్యపేతహర్షామ్ = తొలగిన ఆనందము కలదీ, పరిదీనమానసామ్ = దీన మైన మనస్సు కలదీ, శుభామ్ = మంగళప్రదు రాలూ అయిన, తామ్ = ఆమెను, శ్రియా = ఐశ్వర్యముచే, జుష్టమ్ = పొందబడిన, నరమ్ = నరుని, ఉపజీవినః ఇవ = అతనిపై ఆధారపడి జీవించు భృత్యులు వలె, శుభాని = శుభము లైన, నిమిత్తాని = శకునములు, భేజిరే = సేవించినవి.

తా. వ్యథ చెంది, సంతోషము లేక దీన మైన మనస్సుతో ఉన్న దోష లేశశూన్య యైన, మంగళప్రదురా లైన ఆ సీతను, ఐశ్వర్యము లభించిన మను ష్యుని భృత్యు లందరూ వచ్చి చేరినట్లు, శుభశకునములు వచ్చి చేరినవి. (సీతకు శుభశకునములు కనబడినవి.) 1

మూ. తస్యాః శుభం వామమరాళపక్ష్మ
రాజీవృతం కృష్ణవిశాలశుక్లమ్,
ప్రాస్పన్దతైకం నయనం సుకేశ్యాః
మీనాహతం పద్మమివాభితామ్రమ్. 2

ప్ర. అ. సుకేశ్యాః = అంద మైన కేశపాశము గల, తస్యాః = ఆమె యొక్క, శుభమ్ = మంగళకర మైనదీ, అరాలపక్ష్మరాజీవృతమ్ = వంకర యైన

చెప్పంబ చెంద్రుకం వంక్తి కంటి, కృష్ణవిశాలశుక్లమ్ = నల్లగాను, విశాలముగాను తెల్లగాను ఉన్నది అయిన, వామం నయనమ్=ఎడమ నేత్రము, మీనాహతమ్= మీనముచేత కొట్టబడిన, అభితామ్రమ్=ఎర్రనైన, ఏకమ్=ఒక, పద్మమివ= పద్మము వలె, ప్రాస్పన్దత=అదిరెను.

తా. అంద మైన రేఖలు గల ఆ సీత వామనయనము వంకరగా ఉన్న రెప్పల చెంద్రుకం వంక్తితో, కదలక పై, విశాలముగాను, నల్లగాను తెల్లగాను ఉండెను. ఆ వామనయనము, మీనము తాకిడికి ఎర్రని పద్మ మొకటి కదలి నట్లు అదరెను. 2

మూ. భుజశ్చ చార్వఞ్చితపీనవృత్తః
పరార్ధ్యకాలాగురుచన్దనార్హః,
అనుత్తమేనాధ్యుషితః ప్రియేణ
చిరేణ వామః సమవేపతాశు. 3

ప్ర. అ. చార్వఞ్చితపీనవృత్తః = అంద మైనది, ఉత్తమము, బలిసినది, వర్తులమూ అయినది, పరార్ధ్యకాలాగురుచన్దనార్హః = శ్రేష్ఠ మైన కాలాగురుకు చందనమునకు తగినది, అనుత్తమేన = మిక్కిలి ఉత్తము డైన, ప్రియేణ = ప్రియునిచేత, చిరేణ = చిరకాలము, అధ్యుషితః = అధిష్ఠింపబడినది అయిన, వామః భుజశ్చ = ఎడమ భుజము కూడ, ఆశు = శీఘ్రముగా, సమవేపత = అదరెను.

తా. సీతాదేవి ఎడమభుజము చక్కగా, చూచుటకు ముచ్చట గొల్పుచు బలిసి, వృత్తముగా (గుండ్రముగా) ఉండెను. అది శ్రేష్ఠ మైన అగురువు, చంద నము పూసికొనుటకు తగినది. చాలకాలము ఆ భుజమును తలగడగా చేసికొని అత్యుత్తమ పురుషు డైన రాముడు శయనించుచుండెడివాడు. అట్టి భుజముకూడ వెంటనే అదరెను. 3

మూ. గజేన్ద్రహస్తప్రతిమశ్చ పీన
స్తయోర్ద్వయోః సంహతయోః సుజాతః,
ప్రస్పన్దమానః పునరూరురస్యా
రామం పురస్తాత్ స్థితమాచచక్షే. 4

ప్ర. అ. సంహతయోః = దగ్గరగా కలిసి ఉన్న, తయోః ద్వయోః = ఆ రెండు తొడలలో, గజేన్ద్రహస్త ప్రతిమః = ఏనుగు తొండముతో సమానమూ, పీనః = బలిసినదీ, సుజాతః = సుందరమూ అయిన, అస్యాః ఊరుః = ఈమె యొక్క (ఎడమ) తొడ, ప్రస్పన్దమానః = అదురుచు, రామమ్ = రాముని, పుర స్తాత్ = ఎదుటనే, స్థితమ్ = ఉన్నవానినిగా, అచచక్షే = చెప్పెను.

తా. దగ్గరగా కలసి ఉన్న ఆమె రెండు తొడలలో ఒక ఎడమ తొడ అదురుచు రాముడు ఎదుటనే ఉన్నాడని ఆమెకు చెప్పెను. సుందర మైన ఆ తొడ ఏనుగు తొండము వలె బలిసి ఉండెను.

వి. రెండు తొడలలో ఒకటి ఈ విధముగా ఉన్నది అని విశేషణములు వేయుటచే రెండవది మరొక విధముగా ఉన్నట్లు తోచును. అందుచేత ప్రాచ్య పాఠము బాగున్నది.

"గజేన్ద్రహస్తప్రతిమశ్చ పీనః పీతోరురేకః సుభగః సుజాతః,
ప్రస్పన్దమానః కనకావదాతో రామం పురస్తాత్ స్థితమాచచక్షే."

అని ఆ పాఠము. "కనకావదాతః = బంగారము వలె పరిశుద్ధమూ, సుభగః = చాల శుభకరమూ ఆయిన, ఏకః = ఒక, పీతోరుః = పచ్చని తొడ.......అని అర్థము. 4

మూ. శుభం పునర్హేమసమానవర్ణ
మీషద్రజోధ్వస్తమివామలాక్ష్యాః,
వాసః స్థితాయాః శిఖరాగ్రదన్త్యాః
కించిత్ పరిస్రంసత చారుగాత్ర్యాః, 3

ప్ర. అ. పునః = మరియు, అమలాక్ష్యాః = నిర్మలము లైన నేత్రములు గలదీ, శిఖరాగ్రదన్త్యాః = మొనలు అగ్రమునందు గల దంతములు గలదీ, చారుగాత్ర్యాః = అంద మైన శరీరము గలదీ, స్థితాయాః = నిలచి ఉన్నదీ అయిన సీతయొక్క, శుభమ్ = మంగళప్రద మైనదీ, హేమసమానవర్ణమ్ = బంగారముతో సమాన మైన వర్ణము గలదీ, ఈషత్ = కొంచెము, రజోధ్వస్తమివ = పరాగముచేత మలినముగా ఉన్నట్లున్నది, వాసః = వస్త్రము, కించిత్ = కొంచెము, పరిస్రంసత = జారెను.

తా. నిర్మలము లైన నేత్రములు, కొనలు తేలిన దంతములు, అంద మైన శరీరమూ గల ఆ సీత నిలిచి ఉండగా, మంగళప్రదమూ, బంగారముతో సమాన మైన రంగు గలదీ, పరాగము కప్పివేయుటచే కొంచెము కాంతి విహీన ముగా ఉన్నదీ అయిన వస్త్రము, కొంచెము జారెను. 5

మూ. ఏతైర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూః
సంబోధితా ప్రాగపి సాధు సిద్ధైః,
వాతాతపక్లాన్తమివ ప్రణష్టం
వర్షేణ బీజం ప్రతిసంజహర్ష. 6

ప్ర. అ. ప్రాగపి = పూర్వము కూడ, సాధు = బాగుగా, సిద్ధైః = సఫలము లైన, ఏతైః = ఈ, నిమిత్తైః = నిమిత్తములచేతను, అపరైశ్చ = మరి కొన్ని ఇతర నిమిత్తములచేతను, సంబోధితా = బోధింపబడిన, సుభ్రూః = అంద మైన కనుబొమ్మలు గల సీత, వాతాతపక్లాన్తమ్ = గాలిచేతా, ఎండచేతా వాడిపోయిన, ప్రణష్టమ్ = కనబడకుండా పోయిన, బీజమ్ = బీజము, వర్షేణ ఇవ = వర్షముచేత వలె, ప్రతిసంజహర్ష = సంతోషించెను.

తా. పూర్వము కూడ అనేక పర్యాయములు సత్ఫలమును ఇచ్చిన ఈ శకునములు, మరి కొన్ని ఇతర శకునములు శుభము రానున్న దని సూచింపుటచే, మంచి కనుబొమ్మలు గల సీత, గాలికీ ఎండకూ ఎండిపోయి, కనబడకుండా పోయిన విత్తనము వర్షము కురియగానే మొలకెత్తి నట్లు ఆనందించెను.

మూ. తస్యాః పునర్బింబఫలాధరోష్ఠం
స్వక్షిభ్రుకేశాన్తమరాళపక్ష్మ,
వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం
రాహోర్ముఖాచ్చన్ద్ర ఇవ ప్రముక్తః. 7

ప్ర. అ. ("సితశుక్లదంష్ట్రమ్" అను పాఠము కంటె 'సితచారుదన్తమ్' అను ప్రాచీనపాఠము బాగున్నది) పునః = మరియు, తస్యాః = ఆమెయొక్క, బింబఫలాధరోష్ఠమ్ = దొండపండు వంటి అధరోష్ఠము కలదీ, స్వక్షిభ్రుకేశాన్తమ్ = అంద మైన నేత్రములూ, కనుబొమ్మలూ కలదీ, అరాళపక్ష్మ = వక్ర మైన రెప్పలు కలదీ, సితచారుదన్తమ్ = తెల్లని అంద మైన దంతములు కలదీ,

అయిన, వక్త్రమ్ = ముఖము, రాహోః = రాహువుయొక్క, ముఖాత్ = ముఖము నుండి, ప్రముక్తః = విడువబడిన, చన్ద్రః ఇవ = చంద్రుడు వలె, బభాసే = ప్రకాశించెను.

తా. దొండపండు వంటి అధరోష్ఠమూ, అంద మైన నేత్రములు, కను బొమ్మలు కేశాంతములూ, వంకర యైన రెప్పలూ, తెల్లని అంద మైన దంతములూ గల ఆమె ముఖము రాహుముఖమునుండి బైటకు వచ్చిన చంద్రబింబము వలె ప్రకాశించెను. 7

మూ. సా వీతశోకా వ్యపనీతతన్ద్రీ
శాన్తజ్వరా హర్షవిబుద్ధసత్త్వా।
అశోభతార్యా వదనేన శుక్లే
శీతాంశునా రాత్రిరివోదితేన. 8

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. ఆర్యా = పూజ్యురా లైన, సా = ఆ సీత, వీతశోకా = తొలంగి పోయిన శోకము గలదై, వ్యపనీతతన్ద్రీ = తొలగింపబడిన అలసత్వము గలదై, శాన్తజ్వరా = శాంతించిన మనస్తాపము కలదై, హర్షవిబుద్ధసత్త్వా = సంతోషముతో వికసించిన మనస్సు కలదై, వదనేన = ముఖముచేత, శుక్లే = శుక్ల పక్షమునందు, ఉదితేన = ఉదయించిన, శీతాంశునా = చంద్రునిచేత, రాత్రిరివ = రాత్రి వలె, అశోభత = ప్రకాశించెను.

తా. పూజ్యురా లైన ఆ సీత శోకము తొలగెను. అలసత్వము పోయెను. మానసికసంతాపము శాంతించెను. సంతోషముతో మనస్సు వికసించెను. అప్పు డామె తేజోవంత మైన ముఖముతో, శుక్లపక్షమునందు ఉదయించిన చన్ద్రునితో రాత్రి ప్రకాశించు నట్లు ప్రకాశించెను. 8

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఇరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ త్రింశః సర్గః

[సీతతో ఎట్లు సంభాషణము చేయవలెనా అని హనుమంతుడు ఆలోచించుట.]

మూ. హనుమానపి విక్రాన్తః సర్వం శుశ్రావ తత్త్వతః,
సీతాయాస్త్రిజటాయాశ్చ రాక్షసీనాం చ తర్జనమ్. 1

ప్ర. అ. విక్రాన్తః = పరాక్రమవంతు డైన, హనుమానపి = హనుమంతుడు కూడా, సీతాయాశ్చ = సీతయొక్కయు, త్రిజటాయాశ్చ = త్రిజటయొక్కయు, సర్వమ్ = వాక్యము నంతనూ, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీలయొక్క, తర్జనమ్ = భయ పెట్టుటను, తత్త్వతః = యథార్థముగా, శుశ్రావ = వినెను.

తా. పరాక్రమశాలి యైన హనుమంతుడు కూడా, సీత మాటలను, త్రిజట స్వప్నవృత్తాంతమును, రాక్షసస్త్రీలు భయపెట్టుచు పలికిన మాటలను, సర్వమును, యథాతథముగ వినెను. 1

మూ. అవేక్షమాణస్తాం దేవీం దేవతామివ నన్దనే,
తతో బహువిధాం చిన్తాం చిన్తయామాస వానరః. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వానరః = హనుమంతుడు, నన్దనే = నందనవనమునందు, దేవతామివ = దేవతను వలె, తాం దేవీమ్ = ఆ సీతాదేవిని, అవేక్షమాణః = చూచుచు, బహువిధామ్ = అనేకవిధము లైన, చిన్తామ్ = ఆలోచ నను, చిన్తయామాస = ఆలోచించెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు, నందనవనములో ఉన్న దేవతాస్త్రీ వలె ఉన్న ఆ సీతాదేవిని చూచుచు, అనేకవిధముల ఆలోచించెను. 2

మూ. యాం కపీనాం సహస్రాణి సుబహూన్యయుతాని చ,
దిక్షు సర్వాసు మార్గన్తే సేయమాసాదితా మయా. 3

ప్ర. అ. కపీనామ్ = వానరులయొక్క, సుబహూని = అనేకము లైన, సహస్రాణి=సహస్రములు, అయుతాని చ=అయుతములు. సర్వాసు = సమస్త మైన, దిక్షు=దిక్కులందు, యామ్=ఏ సీతను, మార్గన్తే = వెదకుచున్నారో, సా ఇయమ్=అట్టి ఈ సీత, మయా=నాచేత, ఆసాదితా=పొందబడినది.

తా. ఎన్నో వేలకొలది, అయుతములకొలది (పదివేలు అయుతము) వానరులు సకలదిక్కులందు ఏ సీతకై వెదకుచున్నారో ఆమెను నేను చూడగలిగినాను. 3

మూ. చారేణ తు సుయుక్తేన శత్రోః శక్తిమవేక్షతా,
గూఢేన చరతా తావదవేక్షితమిదం మయా. 4

ప్ర. అ. ("శత్రోః శక్తివ్యపేక్షయా" అను ప్రాచ్యపాఠము బాగున్నది.) సుయుక్తేన=బాగ జాగ్రత్తగా ఉన్నవాడనూ, శత్రోః=శత్రువుయొక్క, శక్తివ్యపేక్షయా=శక్తియొక్క దృష్టిచేత, గూఢేన=గూఢుడనై, చరతా = సంచరించుచున్నవాడనూ, చారేణ=గూఢచారిని అయిన, మయా=నాచేత, ఇదమ్ = ఇది, అవేక్షితం తావత్=చూడబడినది.

తా. నేను శత్రుబలమును దృష్టిలో నుంచుకొని అతిజాగరూకతతో, గూఢముగా, గూఢచారి వలె సంచరించుచు ఈ విషయము లన్నీ తెలుసుకొన్నాను. 4

మూ. రాక్షసానాం విశేషశ్చ పురీ చేయమవేక్షితా,
రాక్షసాధిపతేరస్య ప్రభావో రావణస్య చ. 5

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులయొక్క, విశేషశ్చ=విశేషము (చూడబడినది). ఇయమ్=ఈ, పురీ చ=పట్టణము, అవేక్షితా=చూడబడినది, అస్య=ఈ, రాక్షసాధిపతేః=రాక్షసరాజైన, రావణస్య = రావణునియొక్క, ప్రభావశ్చ =ప్రభావము కూడా, చూడబడినది.

తా. రాక్షసుల విశేషమును, ఈ పురమును, రాక్షసాధిపతి యైన రావణుని ప్రభావమును చూచినాను. 5

మూ. యుక్తం తస్యాప్రమేయస్య సర్వసత్త్వదయావతః,
సమాశ్వాసయితుం భార్యాం పతిదర్శనకాఙ్క్షిణీమ్. 6

ప్ర. అ. సర్వసత్త్వదయావతః = సకలప్రాణులందు దయ గలవారు, అప్రమేయస్య = ఊహింప శక్యము కాని ప్రభావము కలవారూ అయిన, తస్య = ఆ రామునియొక్క, పతిదర్శనకాఙ్క్షిణీమ్ = భర్తయొక్క దర్శనమును కోరుచున్న, భార్యామ్ = భార్య యైన సీతను, సమాశ్వాసయితుమ్ = ఊరడింపచేయుటకు, యుక్తమ్ = యుక్తము.

తా. సకలప్రాణులందు దయ గల, ఊహింప శక్యము కాని ప్రభావము గల రాముని భార్య పతిదర్శనమునకై తల్లడిల్లుచున్నది. ఈమెను ఓదార్చుట యుక్తము. 6

మూ. అహమాశ్వాసయామ్యేనాం పూర్ణచన్ద్రనిభాననామ్,
అదృష్టదుఃఖాం దుఃఖార్తాం దుఃఖస్యాన్తమగచ్ఛతీమ్. 7

ప్ర. అ. పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము కలదీ, అదృష్టదుఃఖామ్ = చూడబడని దుఃఖము కలదీ, దుఃఖార్తామ్ = దుఃఖముచేత పీడింపబడినదీ, దుఃఖస్య = దుఃఖముయొక్క, అన్తమ్ = అంతమును, అగచ్ఛతీమ్ = పొందనిదీ అయిన, ఏనామ్ = ఈమెను, అహమ్ = నేను, ఆశ్వాసయామి = ఓదార్చెదను.

తా. పూర్ణచంద్రుని వంటి ముఖము గల ఈ సీత పూర్వ మెన్నడు ఇట్టి దుఃఖము ననుభవించలేదు. ఇప్పుడు దుఃఖార్తురా లై ఈ దుఃఖమునకు అంతము చూడజాలకున్నది. అట్టి ఈమెను ఓదార్చెదను. 7

మూ. యద్యప్యహమిమాం దేవీం శోకోపహతచేతనామ్,
అనాశ్వాస్య గమిష్యామి దోషవద్గమనం భవేత్. 8

ప్ర. అ. శోకోపహతచేతనామపి = శోకముచేత పీడింపబడిన బుద్ధి గలదైనను, ఇమాం దేవీమ్ = ఈ దేవిని, అహమ్ = నేను, అనాశ్వాస్య = ఓదార్చకుండగా, యది గమిష్యామి = వెళ్ళిన ట్లయితే, గమనమ్ = నా గమనము, దోషవత్ = దోషము గలది, భవేత్ = అగును.

తా. ఈ సీత శోకముచేత వికల మైన మనస్సుతో బాధపడుచున్నపుడు కూడ నేను ఈమెను ఓదార్చకుండా తిరిగి వెళ్ళినచో నా గమనము పొరబాటే అగును. 8

మూ. గతే హి మయి తత్రేయం రాజపుత్రీ యశస్వినీ,
పరిత్రాణమవిన్దన్తీ జానకీ జీవితం త్యజేత్. 9

ప్ర. అ. మయి = నేను, తత్ర = అక్కడికి, గతే = వెళ్ళినవాడ నగుచుండగా, యశస్వినీ = కీర్తిమంతురాలు, రాజపుత్రీ = రాజకుమారి అయిన, జానకీ = సీత, పరిత్రాణమ్ = రక్షణమును, అవిన్దన్తీ = పొందనిదై, జీవితమ్ = జీవితమును, త్యజేత్ = విడువవచ్చును.

తా. నేను తిరిగి వెళ్ళిపోయిన పిమ్మట రాజకుమారి, కీర్తిమంతురాలు అయిన సీత, రక్షణోపాయ మేదీ లభించక ప్రాణత్యాగము చేయవచ్చును. 9

మూ. మయా చ స మహాబాహుః పూర్ణచన్ద్రనిభాననః,
సమాశ్వాసయితుం న్యాయ్యః సీతాదర్శనలాలసః. 10

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, పూర్ణచన్ద్రనిభాననః = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము కలవాడు, సీతాదర్శనలాలసః = సీతాదర్శనమునందు ఆత్యాసక్తి కలవాడు అయిన, సః = ఆ రాముడు, మయా = నాచేత, సమాశ్వాసయితుమ్ = ఓదార్చుటకు, న్యాయ్యః = తగినవాడు.

తా. పూర్ణచంద్రుని వంటి ముఖము కలవాడు, మహాబాహువు అయిన ఆ రాముడు సీతను చూడవలె నని చాల ఆసక్తితో ఉన్నాడు. అట్టి రాముని ఓదార్చుట కూడ నా కర్తవ్యము. 10

మూ. నిశాచరీణాం ప్రత్యక్షమనర్హం చాభిభాషితమ్,
కథన్ను ఖలు కర్తవ్యమిదం కృచ్ఛ్రగతో హ్యహమ్. 11

ప్ర. అ. నిశాచరీణామ్ = రాక్షసస్త్రీలయొక్క, ప్రత్యక్షమ్ = ఎదుట, అభిభాషితమ్ = మాటలాడుట, అనర్హమ్ = తగినది కాదు. ఇదమ్ = ఇది, కథమ్ = ఎట్లు, కర్తవ్యం ఖలు ను = చేయదగినదో, అహమ్ = నేను, కృచ్ఛ్రగతో హి = కష్టములో ఉన్నాను కదా.

తా. రాక్షసస్త్రీల ఎదుట మాట లాడుట యుక్తము కాదు. అప్పుడు ఈ పని నే నెట్లు చేయవలెనో కదా. నేను కష్టపరిస్థితిలో చిక్కుకొన్నాను. 11

మూ. అనేన రాత్రిశేషేణ యది నాశ్వాస్యతే మయా,
సర్వథా నాస్తి సన్దేహః పరిత్యక్ష్యతి జీవితమ్. 12

ప్ర. అ. అనేన = ఈ, రాత్రిశేషేణ = రాత్రియొక్క మిగిలిన భాగము చేత, మయా = నాచేత, నాశ్వాస్యతే యది = ఓదార్చబడకపోయినచో, జీవితమ్ = జీవితమును, పరిత్యక్ష్యతి = విడువగలదు. సర్వథా = అన్ని విధముల, సన్దేహః = సందేహము, నాస్తి = లేదు.

తా. తెల్లవారే లోగా నేను ఈమెను ఓదార్చకున్నచో తప్పక ఈమె ప్రాణములను త్యజించును. సందేహము లేదు. 12

మూ. రామశ్చ యది పృచ్ఛేన్మాం కిం మాం సీతాబ్రవీద్వచః,
కిమహం తం ప్రతి బ్రూయామసంభాష్య సుమధ్యమామ్.

ప్ర. అ. సీతా = సీత. మామ్ = నన్ను గూర్చి, కిమ్ = ఏమి, వచః = వచనమును, అబ్రవీత్ = పలికెను అని, రామశ్చ = రాముడు, మామ్ = నన్ను, పృచ్ఛేద్యది = అడిగిన ట్లయితే, సుమధ్యమామ్ = మంచి నడుము గల ఈ సీతను గూర్చి, అసంభాష్య = మాటలాడకుండగా, అహమ్ = నేను, తం ప్రతి = ఆ రాముని గూర్చి, కిమ్ = ఏమి, బ్రూయామ్ = పలుకుదును.

తా. నేను సీతతో మాటలాడకుండానే వెళ్ళిన పిమ్మట — "సీత నాతో ఏమి చెప్పమన్నది" అని రాముడు అడిగినచో నే నాతనికి ఏమి సమాధానము చెప్పగలను. 13

మూ. సీతాసన్దేశరహితం మామితస్త్వరయా గతమ్,
నిర్దహేదపి కాకుత్స్థః క్రుద్ధస్తీవ్రేణ చక్షుషా. 14

ప్ర. అ. సీతాసన్దేశరహితమ్ = సీతాసందేశము లేనివాడ నై, ఇతః = ఇక్కడినుండి, త్వరయా = తొందరతో, గతమ్ = వెళ్ళిన, మామ్ = నన్ను, కాకుత్స్థః = రాముడు, క్రుద్ధః = కోపగించినవాడై, తీవ్రేణ = తీవ్ర మైన, చక్షుషా = నేత్రముతో, నిర్దహేదపి = కాల్చివేయును కూడ.

తా. నేను సీత సందేశ మేదీ తీసికొనకుండా, ఇక్కడినుండి తొందరగా వెళ్ళిపోయినచో రాముడు కోపించి తీవ్ర మైన దృష్టితో కాల్చివేయును గూడ.

మూ. యది చోద్యోజయిష్యామి భర్తారం రామకారణాత్,
వ్యర్థమాగమనం తస్య ససైన్యస్య భవిష్యతి. 15

ప్ర. అ. రామకారణాత్ = రాముని నిమిత్త మై, భర్తారమ్ = ప్రభు వైన సుగ్రీవుని, యది చ ఉద్యోజయిష్యామి = ప్రయత్నవంతుని చేసినచో, ససైన్యస్య = సైన్యముతో కూడిన, తస్య = అతనియొక్క, ఆగమనమ్ = రాక, వ్యర్థమ్ = వ్యర్థము, భవిష్యతి = కాగలదు.

తా. నేను సుగ్రీవుని రామునికి సాహాయ్యము చేయుటకై బయలుదేరదీసి తీసుకొనివచ్చినచో, ఈలోగా సీత మరణించినచో సేనాసహితు డైన అతని రాక వ్యర్థ మై పోవును. 15

మూ. అన్తరం త్వహమాసాద్య రాక్షసీనామిహ స్థితః,
శనైరాశ్వాసయిష్యామి సంతాపబహుళామిమామ్. 16

ప్ర. అ. అహమ్ = నేను, ఇహ = ఇక్కడ, స్థితః = ఉన్నవాడ నై, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీలలో, అన్తరమ్ = అవకాశమును, ఆసాద్య = పొంది, సంతాపబాహుళామ్ = అధిక మైన దుఃఖము గల, ఇమామ్ = ఈమెను, శనైః = మెల్లగా, ఆశ్వాసయిష్యామి = ఓదార్చెదను.

తా. నేను ఇక్కడనే ఉండి, ఈ రాక్షసస్త్రీలు కొంచెము ఏమరుపాటుతో ఉన్నప్పుడు బాలా దుఃఖపడుచున్న ఈ సీతను మెల్లగా ఓదార్చెదను. 16

మూ. అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,
వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతామ్.

ప్ర. అ. అహం తు = నేనైతే, అతితనుః = చాల సూక్ష్మముగా ఉన్నాను; విశేషతః = విశేషించి, వానరశ్చ = వానరుడను. ఇహ = ఇప్పుడు, సంస్కృతామ్ = సంస్కృత మైన, మానుషీమ్ = మనుష్యసంబంధ మైన, వాచం చ = వాక్కును కూడ, ఉదాహరిష్యామి = పలుకగలను.

తా. ఇప్పుడు చాల చిన్న శరీరముతో ఉన్న నేను, విశేషించి వానరుడనై యుండి, సంస్కృత మైన మనుష్యవాక్కును ఉచ్చరించవలసి ఉన్నది.

వి. నేను చాలా చిన్నదైన శరీరము గల వానరుడనై యుండి మనుష్య వాక్యాలతో మాటలాడవలసి ఉన్నది. అప్పుడు సీత ఎట్లా నమ్ముతుంది! అని ఈ శ్లోకభావమై యుండును. ఈ భావమే రాబోవు శ్లోకములో స్పష్టీకరింపబడినది. నేను మనుష్యభాషలో మాటలాడతాను కాబట్టి ఈ రాక్షసస్త్రీలకు అర్థము కాదులే అను భావము అంత యుక్తముగా కనిపించదు. ఏ భాషలో మాటలాడినా సీతతో మాటలాడుతు రాక్షసస్త్రీలకు కనబడినచో ప్రమాదమే కదా! 18వ శ్లోకం దృష్ట్యా ఈ శ్లోకం అనవసరము. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. 17

మూ. యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి. 18
వానరస్య విశేషేణ కథం స్యాదభిభాషణమ్.

ప్ర. అ. ద్విజాతిరివ = ద్విజాతు వలె, సంస్కృతామ్ = సంస్కృతమైన, వాచమ్=వాక్కును, ప్రదాస్యామి యది=ఇచ్చినచైతే (పలికినచైతే), సీతా = సీత, మామ్ = నన్ను, రావణమ్ = రావణునిగా, మన్యమానా = తలంచుచు, భీతా భవిష్యతి = భయపడగలదు. విశేషేణ = విశేషించి, వానరస్య = వానరునకు, అభిభాషణమ్ = మాటలాడుట, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును?

తా. నేను ద్విజాతు వలె సంస్కృతమైన భాషలో మాటలాడినచో నన్ను రావణుడని తలచి సీత భయపడును. విశేషించి, వానరుడు మాటలాడుట అనునది అసంభావ్యము కదా! 18

మూ. అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్యమర్థవత్, 19
మయా సాన్త్వయితుం శక్యా నాన్యథేయమనిన్దితా.

ప్ర. అ. అవశ్యమేవ = తప్పక, మయా = నాచేత, అర్థవత్ = అర్థముగల, మానుషమ్=మనుష్యసంబంధమైన, వాక్యమ్ = వాక్యము, వక్తవ్యమ్= చెప్పదగియున్నది. అనిన్దితా = నిందింపబడని, ఇయమ్= ఈమె, అన్యథా = మరియొక విధముగా, సాన్త్వయితుమ్ = ఓదార్చుటకు, న శక్యా = శక్యమైనది కాదు.

తా. స్పష్టమైన అర్థమును బోధించు మనుష్యవాక్యాలతోనే మాటలా

కుట తప్పదు. అట్లు కానిచో, కోమలహృదయురా లైన ఈ సీతను ఓదార్చుట ఎట్లు కుదురును? 19

మూ. సేయమాలోక్య మే రూపం జానకీ భాషితం తథా, 20
రక్షోభిస్త్రాసితా పూర్వం భూయస్త్రాసం గమిష్యతి.

ప్ర. అ. పూర్వమ్=ముందుగానే, రక్షోభిః=రాక్షసులచేత, త్రాసితా=భయపెట్టబడిన, సా అయమ్=అట్టి ఈ, జానకీ=జానకి, మే=నాయొక్క, రూపమ్=రూపమును, తథా=మరియు, భాషితమ్=భాషను, ఆలోక్య=చూచి, భూయః=మరల, త్రాసమ్=భయమును, గమిష్యతి=పొందగలదు.

తా. నా రూపమును చూచి, నా భాషను వినగానే అసలే ఇంతవరకు రాక్షసులచేత భయపెట్టబడు చున్న సీత మరల ఇంకా భయపడును. 20

మూ. తతో జాతపరిత్రాసా శబ్దం కుర్యాన్మనస్వినీ, 21
జానానా మాం విశాలాక్షీ రావణం కామరూపిణమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మనస్వినీ=ఉత్తమ మైన మనస్సు కలదీ, విశాలాక్షీ=విశాలనేత్రములు కలదీ అయిన సీత, మామ్=నన్ను, కామరూపిణమ్=స్వేచ్ఛారూపము గల, రావణమ్= రావణునిగా, జానానా=తలచు చున్నదై, జాతపరిత్రాసా=పుట్టిన భయము కలదై, శబ్దమ్=శబ్దమును, కుర్యాత్=చేయును.

తా. పిదప ఉత్తమ మైన మనస్సు గల ఈ విశాలాక్షి, నన్ను ఇచ్ఛానుసారముగా రూపములు ధరించగలిగిన రావణుడే అని భావించి, భయపడి అరవవచ్చును. 21

మూ. సీతయా చ కృతే శబ్దే సహసా రాక్షసీగణః, 22
నానాప్రహరణో ఘోరః సమేయాదన్తకోపమః.

ప్ర. అ. సీతయా=సీతచేత, శబ్దే=శబ్దము, కృతే=చేయబడిన దగు చుండగా, సహసా=వెంటనే, నానాప్రహరణః= అనేకవిధము లైన ఆయుధములు గల, ఘోరః=భయంకర మైన, అన్తకోపమః=యమునితో సమాన మైన, రాక్షసీగణః=రాక్షసస్త్రీల సమూదాయము, సమేయాత్=గూడిగూడును.

తా. సీత భయపడి అరవగానే, యముని వలె భయంకర మైన రాక్షస స్త్రీల సముదాయము, అనేకవిధము లైన ఆయుధములు ధరించి సమిగూడి వచ్చును. 22

మూ. తతో మాం సంపరిక్షిప్య సర్వతో వికృతాననాః, 23
వధే చ గ్రహణే చైవ కుర్యుర్యత్నం యథాబలమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వికృతాననాః = వికృతము లైన ముఖములు గల ఆ రాక్షసస్త్రీలు, మామ్ = నన్ను, సర్వతః = అన్ని వైపులనుండి, సంపరిక్షిప్య = చుట్టుముట్టి, వధే చ = చంపుటయందు, గ్రహణే చైవ = పట్టుకొనుట యందు, యథాబలమ్ = వారి శక్త్యనుసారముగా, యత్నమ్ = ప్రయత్నమును, కుర్యుః = చేయుదురు.

తా. వికృతము లైన ముఖములు గల ఆ రాక్షసస్త్రీలు, నన్ను నలుమూలలనుండి చుట్టుముట్టి, పట్టుకొనుటకూ, చంపుటకూ వారి బలము నంతా ప్రయోగించి ప్రయత్నము చేయుదురు. 23

మూ. గృహ్య శాఖాః ప్రశాఖాశ్చ స్కన్ధాంశ్చోత్తమశాఖినామ్,
దృష్ట్వా విపరిధావన్తం భవేయుర్భయశఙ్కితాః.

ప్ర. అ. ఉత్తమశాఖినామ్ = ఉత్తమము లైన వృక్షములయొక్క, శాఖాః = కొమ్మలను, ప్రశాఖాశ్చ = చిన్న కొమ్మలను, స్కన్ధాంశ్చ = మానులను, గృహ్య = గ్రహించి, విపరిధావన్తమ్ = పరుగెత్తుచున్న నన్ను, దృష్ట్వా = చూచి, భయశఙ్కితాః = భయముచేత శంక గలవారు, భవేయుః = అగుదురు.

తా. అపుడు నేను వాళ్లకు దొరకకుండా మహావృక్షముల కొమ్మలూ, చిన్న కొమ్మలూ, మానులూ, పట్టుకొని ఇటు అటు పరుగెత్తుచుండగా చూచి వాళ్లకు భయము, శంకా కలుగును. 24

మూ. మమ రూపం చ సంప్రేక్ష్య వనే విచరతో మహత్, 25
రాక్షస్యో భయవిత్రస్తా భవేయుర్వికృతాననాః.

ప్ర. అ. వికృతాననాః = వికృతము లైన ముఖములు గల, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, వనే = వనమునందు, విచరతః = సంచరించుచున్న, మమ = నా

యొక్క, మహత్ = పెద్ద దైన, రూపమ్ = రూపమును, సంప్రేక్ష్య = చూచి, భయవిత్రస్తాః = భయకారణమువలన భయపడినవారు, భవేయుః = అగుదురు.

తా. నేను వనములో తిరుగుచున్నప్పుడు, నా పెద్ద ఆకారమును చూచి వికృతముఖములు గల ఈ రాక్షసస్త్రీలు భయపడుదురు. 25

మూ. తతః కుర్యుః సమాహ్వానం రాక్షస్యో రక్షసామపి. 26
రాక్షసేన్ద్రనియుక్తానాం రాక్షసేన్ద్రనివేశనే.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, రాక్షసేన్ద్రనివేశనే = రావణుని గృహములో, రాక్షసేన్ద్రనియుక్తానామ్ = రావణునిచేత నియమింపబడిన, రక్షసామ్ అపి = రాక్షసులయొక్క కూడ, సమాహ్వానమ్ = ఆహ్వానమును, కుర్యుః = చేయుదురు.

తా. పిమ్మట ఆ రాక్షసస్త్రీలు రావణుని గృహములో అతనిచేత నియుక్తులై ఉన్న రాక్షసులను కూడ పిలచెదరు. 26

మూ. తే శూలశక్తినిస్త్రింశవివిధాయుధపాణయః, 27
ఆపతేయుర్విమర్దేఽస్మిన్వేగేనోద్వేగకారణాత్.

ప్ర. అ. తే = వారు, అస్మిన్ = ఈ, విమర్దే = యుద్ధమునందు, శూలశక్తినిస్త్రింశవివిధాయుధపాణయః = శూలములు, ఖడ్గములు అనేకవిధము లైన ఆయుధములు హస్తములందు కలవారై, ఉద్వేగకారణాత్ = భయావేశము వలన, వేగేన = వేగముతో, ఆపతేయుః = వచ్చి పడుదురు.

తా. అప్పుడు ఆ రాక్షసులు, భయావేశముతో, శీఘ్రముగా, శూలములు, శక్తులు, ఖడ్గములు మొదలైన ఆయుధములు ధరించి యుద్ధమునకు దిగుదురు.

మూ. సంరుద్ధస్తైస్తు పరితో విధమన్ రక్షసాం బలమ్, 28
శక్నుయాం న తు సంప్రాప్తుం పరం పారం మహోదధేః.

ప్ర. అ. తైః = వారిచేత, పరితః = చుట్టూ, సంరుద్ధః = అడ్డగింపబడినవాడనై, రక్షసామ్ = రాక్షసులయొక్క, బలమ్ = సైన్యమును, విధమన్ =

ఎగురఁగొట్టుచు, మహోదధేః = మహాసముద్రముయొక్క, పరం పారమ్ = అవతలి యొడ్డును, సంప్రాప్తుమ్ = పొందుటకు, న శక్నుయామ్ = సమర్థుడను కాజాలను.

తా. వాళ్ళందరూ నలుమూలలా చుట్టుముట్టగా, ఆ రాక్షససైన్యమును సంహరించుచు నేను సముద్రము అవతలి యొడ్డును చేరజాలకపోవచ్చును. 27

మూ. మాం వా గృహ్ణీయురాప్లుత్య బహవః శీఘ్రకారిణః, 29
స్యాదియం చాగృహీతార్థా మమ చ గ్రహణం భవేత్.

ప్ర. అ. శీఘ్రకారిణః = శీఘ్రముగా పనిచేయు, బహవః = చాలమంది రాక్షసులు, ఆప్లుత్య = నాపైకి ఎగిరి, మామ్ = నన్ను, గృహ్ణీయుః వా = గ్రహింపవచ్చును. ఇయం చ = ఈ సీత, అగృహీతార్థా = తెలియబడని విషయము గలది, స్యాత్ = అగును. మమ = నాయొక్క, గ్రహణం చ = గ్రహణము కూడ, భవేత్ = అగును.

తా. లేదా — ఈ రాక్షసులలో చాలా చురుకైనవాళ్ళు కొందరు నామీద దుమికి, నన్ను పట్టుకొనవచ్చును. అప్పుడు సీతకు నేను వచ్చిన విషయమే తెలియకుండా పోవును. నేను పట్టుబడిపోవుదును. 29

మూ. హింసాభిరుచయో హింస్యురిమాం వా జనకాత్మజామ్, 30
విపన్నం స్యాత్తతః కార్యం రామసుగ్రీవయోరిదమ్.

ప్ర. అ. వా = లేదా, హింసాభిరుచయః = హింసయందు ఆసక్తి గల ఈ రాక్షసులు, ఇమామ్ = ఈ, జనకాత్మజామ్ = సీతను, హింస్యుః = చంపివేయవచ్చును. తతః = అటుపిమ్మట, రామసుగ్రీవయోః = రామసుగ్రీవులయొక్క, ఇదమ్ = ఈ, కార్యమ్ = కార్యము, విపన్నం స్యాత్ = చెడిపోవును.

తా. లేదా, హింసాప్రియులైన ఈ రాక్షసులు సీతను చంపివేయవచ్చును. అట్లు జరిగినచో రామసుగ్రీవుల ఈ కార్యము చెడిపోవును. 30

మూ. ఉద్దేశే నష్టమార్గేఽస్మిన్ రాక్షసైః పరివారితే, 31
సాగరేణ పరిక్షిప్తే గుప్తే వసతి జానకీ.

ప్ర. అ. జానకీ = జానకి, నష్టమార్గే = నష్టమైన మార్గములు గల (దారులు

లేని), రాక్షసైః = రాక్షసులచేత, పరివారితే = చుట్టబడిన, సాగరేణ = సాగరముచేత, పరిక్షిప్తే = చుట్టబడిన, గుప్తే = రహస్యమైన, అస్మిన్ = ఈ, దుర్గే = ప్రదేశమునందు, వసతి = నివసించుచున్నది.

తా. దానికి రహస్య మైన ప్రదేశములో నివసించుచున్నది. ఇక్కడికి చేరుటకు దారులు లేవు. దీని చుట్టూ సముద్ర మున్నది. రాక్షసులు అన్ని మూలలా నిలచి రక్షించుచున్నారు. 31

మూ. విశస్తే వా గృహీతే వా రక్షోభిర్మయి సంయుగే, 32
నాన్యం పశ్యామి రామస్య సహాయం కార్యసాధనే.

ప్ర. అ. మయి = నేను, సంయుగే = యుద్ధమునందు, రక్షోభిః = రాక్షసులచేత, విశస్తే వా = చంపబడినా. గృహీతే వా = పట్టుకొనబడినా, రామస్య = రామునకు, కార్యసాధనే = కార్యమును సాధించుటయందు. అన్యమ్ = మరియొక, సహాయమ్ = సహాయుని, న పశ్యామి = చూడను.

తా. యుద్ధములో నన్ను రాక్షసులు చంపివేసినా, బంధించినా, ఈ లంకకు వచ్చి సీతాన్వేషణకార్యమునందు రామునకు సాహాయ్యము చేసేవాడు మరొక డెవ్వడూ నాకు కనబడుటలేదు. 32

మూ. విమృశంశ్చ న పశ్యామి యో హతే మయి వానరః, 33
శతయోజనవిస్తీర్ణం లఙ్ఘయేత మహోదధిమ్.

ప్ర. అ. మయి = నేను, హతే = చంపబడినవాడ నగుచుండగా, యః = ఏ, వానరః = వానరుడు, శతయోజనవిస్తీర్ణమ్ = నూరు యోజనముల వెడల్పుగల, మహోదధిమ్ = మహాసముద్రమును, లఙ్ఘయేత = లంఘించునో, విమృశన్ చ = ఆలోచించి గూడ. న పశ్యామి = చూడను.

తా. నన్ను ఏళ్లు చంపివేసినచో, శతయోజనవిస్తీర్ణ మైన ఈ మహాసముద్రమును లంఘించగల వానరు డెవ్వడూ. ఎంత ఆలోచించినా, నాకు కనబడుట లేదు. 33

మూ. కామం హన్తుం సమర్థోఽస్మి సహస్రాణ్యపి రక్షసామ్,
న తు శక్ష్యామి సంప్రాప్తుం పరం పారం మహోదధేః.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, సహస్రాణ్యపి = సహస్రము లను కూడా, హన్తుమ్ = చంపుటకు, సమర్థః = సమర్థుడను, అస్మి = అయిఉన్నాను. తు = కాని, మహోదధేః = మహాసముద్రముయొక్క, పరం పారమ్ = అవలి ఒడ్డును, సంప్రాప్తుమ్ = చేరుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాజాలను.

తా. వేలకొలది రాక్షసులను కూడ చంపుటకు తగిన సామర్థ్యము నా కున్నది. నిజమే! కాని అంత యుద్ధము చేసిన పిమ్మట మహా సముద్రము అవతలి ఒడ్డు చేరు సామర్థ్యము నాకు ఉండకపోవచ్చును. 34

మూ. అనత్యాని చ యుద్ధాని సంశయో మే న రోచతే, 35
కశ్చ నిఃసంశయం కార్యం కుర్యాత్ప్రాజ్ఞః ససంశయమ్.

ప్ర. అ. యుద్ధాని = యుద్ధములు, అసత్యాని చ = అసత్యమైనవి కూడ. సంశయః = సంశయము, మే = నాకు, న రోచతే = ఇష్టము కాదు. కః = ఏ, ప్రాజ్ఞః = బుద్ధిమంతుడు, నిఃసంశయమ్ = సంశయము లేని, కార్యమ్ = కార్యమును, ససంశయమ్ = సంశయముతో కూడినదానినిగా, కుర్యాత్ = చేయును?

తా. యుద్ధములో జయాపజయములు అనిశ్చితములు. నాకు సంశయ మిష్టము కాదు. బుద్ధిమంతు డెవ డైనా సంశయము లేని పనిని సంశయాస్పదము చేయునా? 35

మూ. ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవేదనభిభాషణే, 36
ఏష దోషో మహాన్హి స్యాన్మమ సీతాభిభాషణే.

ప్ర. అ. అనభిభాషణే = మాటలాడకపోవుట జరిగినచో, వైదేహ్యాః = సీతయొక్క, ప్రాణత్యాగశ్చ = ప్రాణత్యాగము, భవేత్ = అగును. సీతాభిభాషణే = సీతతో మాటలాడుట జరిగినచో, మమ = నాకు, ఏషః = ఈ, మహాన్ = గొప్ప, దోషః = దోషము, స్యాత్ = అగును.

తా. నేను సీతతో మాటలాడకుండా వెళ్ళిపోయినచో సీత ప్రాణత్యాగము చేయవచ్చును. సీతతో మాటలాడినచో నాకు ఈ విధముగ ఆపద సంభవించ వచ్చును. 36

మూ. భూతాశ్చార్థా వినశ్యన్తి దేశకాలవిరోధితాః, 37
విక్లబం దూతమాసాద్య తమః సూర్యోదయే యథా.

ప్ర. అ. విక్లబమ్=వ్యాకులం మైన చిత్తము గల, దూతమ్=దూతను, ఆసాద్య=పొంది, భూతాః=సిద్ధముగా నున్న, అర్థాః=కార్యములు, దేశకాలవిరోధితాః=దేశకాలములకు విరుద్ధముగా చేయబడిన వై, సూర్యోదయే=సూర్యోదయ సమయమునందు, తమః యథా=చీకటి వలె, వినశ్యన్తి=నశించును.

తా. ఫలోన్ముఖముగా నున్న కార్యములు కూడ వివేకశూన్యు డైన దూత చేతిలో పడి, సూర్యోదయము కాగానే తమస్సు తొలంగి నట్లు నశించును. 37

మూ. అర్థానర్థాన్తరే బుద్ధిర్నిశ్చితాపి న శోభతే, 38
ఘాతయన్తి హి కార్యాణి దూతాః పణ్డితమానినః.

ప్ర. అ. అర్థానర్థాన్తరే=లాభనష్టముల మధ్య, బుద్ధిః=బుద్ధి, నిశ్చితాపి=నిశ్చిత మైనను, న శోభతే=ప్రకాశింపదు, పణ్డితమానినః=పండితుల మని తలచు, దూతాః=దూతలు, కార్యాణి=కార్యములను, ఘాతయన్తి హి=చెడగొట్టుదురు గదా.

తా. ఏది లాభకరమో, ఏది నష్టమును కలిగించునో నిర్ణయించుకొన్న కార్యమునందు కూడ, వివేకహీను లైన దూతలను నియమించినచో ఆ కార్యములు సఫలములు కావు. ఎందుచేత ననగా, పండితుల మను దురభిమానము గల దూతలు కార్యములను చెడగొట్టుదురు. 38

మూ. న వినశ్యేత్ కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్,
లఙ్ఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్.

ప్ర. అ. కార్యమ్=కార్యము, కథమ్=ఎట్లు, న వినశ్యేత్=నశింపకుండా ఉండును. వైక్లబ్యమ్=బుద్ధివ్యాకులత్వము, కథమ్=ఎట్లు, న భవేత్=కలుగదు. సముద్రస్య=సముద్రముయొక్క, లఙ్ఘనం చ=లంఘనము కూడ, కథంను=ఎట్లు, వృథా=వ్యర్థము; న భవేత్=కాకుండును.

తా. ఇప్పుడు నే నేవిధముగా ప్రవర్తించినచో కార్యము చెడిపోకుండా

ఉండును? బుద్ధికి వ్యాకులత్వము కలుగకుండా ఉండును? నేను చేసిన ఈ సముద్రలంఘనము వ్యర్థము కాకూడ దన్నచో నే నేమి చేయవలెను? 39

మూ. కథం ను ఖలు వాక్యం మే శృణుయాన్నోద్విజేత వా,
ఇతి సంచిన్త్య హనుమాంశ్చకార మతిమాన్మతిమ్. 40

ప్ర. అ. (సీత), మే వాక్యమ్=నా మాటను, కథం ను=ఎట్లు, శృణుయాత్=వినును? న ఉద్విజేత వా=భయపడకుండా కూడ ఉండును, ఇతి=ఇట్లు, సంచిన్త్య=ఆలోచించి, మతిమాన్=బుద్ధిమంతు డైన, హనుమాన్=హనుమంతుడు, మతిమ్=బుద్ధిని, చకార=చేసెను.

తా. సీత నా మాటలు విని భయపడకుండా ఉండుటకు ఉపాయ మేమి? బుద్ధిమంతు డైన హనుమంతుడు ఈ విధముగా ఆలోచించి తా నేమి చేయవలెనో నిశ్చయించుకొనెను. 40

మూ. రామమక్లిష్టకర్మాణం సుబన్ధుమనుకీర్తయన్, 41
నైనాముద్వేజయిష్యామి తద్బన్ధుగతమానసామ్.

ప్ర. అ. అక్లిష్టకర్మాణమ్=క్లేశము లేని కర్మలు కలవాడు, సుబన్ధుమ్=ఉత్తమబంధువూ అయిన, రామమ్=రాముని గూర్చి, అనుకీర్తయన్=కీర్తించినచో, తద్బన్ధుగతమానసామ్=ఆ బంధువునే పొందిన మనస్సు గల, ఏనామ్=ఈమెను, నోద్వేజయిష్యామి=భయ పెట్టను.

తా. సీత మనస్సు అత్యుత్తమబంధు వైన రామునియందే లగ్నమై ఉన్నది. శ్రమపడకుండా పనులను చేయ గల సమర్థుడూ, ఉత్తమబంధువూ అయిన రాముణ్ణి గూర్చి కీర్తించినచో ఈమె భయపడకుండా ఉండును. 41

మూ. ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః. 42
శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్,
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరమ్. 43
శ్రద్ధాస్యతి యథాహీయం తథా సర్వం సమాదధే.

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకురాజులలో, వరిష్ఠస్య=గొప్పవా డైన, విదితాత్మనః=ప్రసిద్ధ మైన బుద్ధి గల, రామస్య=రామునకు సంబంధించిన,

శుభాని= మంగళప్రదము లైన, వచనాని= వచనములను, సమర్పయన్= సమర్పించుచు, (పలుకుచు), మధురామ్=మధుర మైన, గిరమ్= వాక్కును, ప్రబ్రువన్=పలుకుచు, సర్వాణి= అన్నింటిని, శ్రావయిష్యామి=వినిపించుచేసె దను. ఇయమ్=ఈమె, యథా=ఎట్లు, శ్రద్దాస్యతి=నమ్మగలదో, సర్వమ్= సమస్తమునూ, సమాదధే = చేసెదను.

తా. ఇక్ష్వాకువంశరాజులలో శ్రేష్ఠుడూ, ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడూ అయిన, రామునకు సంబంధించిన, మంగళప్రదము లైన వచనములు పలుకుచు మధురముగా మాటలాడుచు, రాముని అన్ని కార్యములను ఈమెకు విని పించెదను. ఈమెకు బాగా నమ్మకము కలుగు నట్లు చేసెదను. 42, 43

మూ. ఇతి స బహువిధం మహానుభావో
జగతిపతేః ప్రమదామవేక్షమాణః,
మధురమవితథం జగాద వాక్యం
ద్రుమవిటపాన్తరమాస్థితో హనూమాన్. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రింశః సర్గః.

ప్ర. అ. మహానుభావః = గొప్ప ప్రభావము గల, సః హనూమాన్ = ఆ హనుమంతుడు, ద్రుమవిటపాన్తరమ్=చెట్ల కొమ్మల మధ్యభాగమును, ఆస్థితః = అధిష్ఠించి ఉన్నవాడై, జగతిపతేః = భూమికి అధిపతి యైన రామునియొక్క, ప్రమదామ్ = భార్య యైన సీతను, అవేక్షమాణః = చూచుచు, బహువిధమ్ = అనేకవిధము లైన, అవితథమ్ = వ్యర్థము కాని, వాక్యమ్=వాక్యమును, ఇతి = ఇట్లు, జగాద=పలికెను.

తా. గొప్ప ప్రభావము గల ఆ హనుమంతుడు చెట్టు కొమ్మల మధ్య భాగియుండి సీతను చూచుచు మధురములు, వ్యర్థము కానివి, అనేక విధములు అయిన మాటలు ఇట్లు పలికెను. 44

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదవ సర్గ సమాప్తము.

# అథ ఏకత్రింశః సర్గః

[హనుమంతుడు సీతకు కనబడకుండా ఉండి ఆమెకు రాముని కథ వినిపించుట].

మూ. ఏవం బహువిధాం చిన్తాం చిన్తయిత్వా మహాకపిః,
సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ. 1

ప్ర. అ. మహాకపిః = హనుమంతుడు, ఏవమ్ = ఇట్లు, బహువిధామ్ = అనేకవిధము లైన, చిన్తామ్ = చింతను, చిన్తయిత్వా = చింతించి, వైదేహ్యాః = సీతయొక్క, సంశ్రవే = వినుకలియందు, మధురమ్ = మధుర మైన, వాక్యమ్ = వాక్యమును, వ్యాజహార హ = పలికెను.

తా. హనుమంతుడు ఈ విధముగా బహురీతుల ఆలోచించి, సీతకు విన బడునట్లుగా మధుర మైన వాక్యమును పలికెను 1

మూ. రాజా దశరథో నామ రథకుఞ్జరవాజిమాన్,
పుణ్యశీలో మహాకీర్తిరిక్ష్వాకూణాం మహాయశాః. 2

ప్ర. అ. రథకుఞ్జరవాజిమాన్ = రథములు, ఏనుగులు, గుఱ్ఱములూ కల వాడు, పుణ్యశీలః = పుణ్య మైన స్వభావము కలవాడు, మహాకీర్తిః = గొప్ప కీర్తి కలవాడు, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశరాజులలో, మహాయశాః = గొప్ప కీర్తి కలవాడు అయిన, దశరథో నామ = దశరథుడను పేరు గల, రాజా = రాజు (ఉండెను.)

తా. ఇక్ష్వాకువంశీయులలో గొప్ప యశస్సు గల, పుణ్యస్వభావవంతు డైన దశరథు డనే రాజు ఉండెను. అతడు రథగజాశ్వసైన్యములతో మహా బలశాలి యై గొప్ప కీర్తి కలవా డై ఉండెను. 2

మూ. రాజర్షీణాం గుణశ్రేష్ఠస్తపసా చర్షిభిః సమః,
చక్రవర్తికులే జాతః పురన్దరసమో బలే. ౩

ప్ర. అ. (అతడు), రాజర్షీణామ్ = రాజర్షులలో, గుణశ్రేష్ఠః = గుణముల చేత శ్రేష్ఠుడు. తపసా = తపస్సుచేత, ఋషిభిః = ఋషీశ్వరులతో, సమః = సమానుడు. చక్రవర్తికులే = చక్రవర్తుల కులమునందు, జాతః = పుట్టినవాడు. బలే = బలమునందు, పురన్దరసమః = దేవేంద్రునితో సమానుడు.

తా. ఆ దశరథుడు గుణములచేత రాజర్షులందరిలోను శ్రేష్ఠుడు. తపస్సు చేత ఋషులతో సమానుడు. చక్రవర్తుల కులమునందు పుట్టినవాడు. బలములో దేవేంద్రునితో సమానుడు. ౩

మూ. అహింసారతిరక్షుద్రో ఘృణీ సత్యపరాక్రమః,
ముఖ్యశ్చేక్ష్వాకువంశస్య లక్ష్మీవాన్ లక్ష్మివర్ధనః. ౪

ప్ర. అ. (అతడు), అహింసారతిః = అహింసయందు ఆసక్తి కలవాడు. అక్షుద్రః = నీచుడు కానివాడు. ఘృణీ = దయ గలవాడు. సత్యపరాక్రమః = సత్యమైన పరాక్రమము గలవాడు. ఇక్ష్వాకువంశస్య = ఇక్ష్వాకువంశమునకు, ముఖ్యశ్చ = ముఖ్యుడు. లక్ష్మీవాన్ = ఐశ్వర్యము గలవాడు. లక్ష్మివర్ధనః = లక్ష్మిని వృద్ధి పొందించువాడు.

తా. ఆ దశరథుడు అహింసాపరుడు. నీచస్వభావము లేనివాడు. దయాశీలుడు సత్యమైన పరాక్రమము గలవాడు. ఇక్ష్వాకువంశములో చాలా ప్రధానమైనవాడు. ఐశ్వర్యసంపన్నుడు. ఐశ్వర్యమును పెంపొందించువాడు. ౪

మూ. పార్థివవ్యఞ్జనైర్యుక్తః పృథుశ్రీః పార్థివర్షభః,
పృథివ్యాం చతురన్తాయాం విశ్రుతః సుఖదః సుఖీ. ౫

ప్ర. అ. (అతడు), పార్థివవ్యఞ్జనైః = రాజలక్షణములతో, యుక్తః = కూడినవాడు. పృథుశ్రీః = గొప్ప ఐశ్వర్యము కలవాడు, పార్థివర్షభః = రాజులలో శ్రేష్ఠుడు, చతురన్తాయామ్ = నాలుగు అంతములు (సరిహద్దులు) గల, పృథివ్యామ్ = భూమియందు, విశ్రుతః = ప్రసిద్ధుడు. సుఖదః = సుఖమును ఇచ్చువాడు. సుఖీ = సుఖవంతుడు.

తా. (ఆ దశరథమహారాజు) ఉత్తమ రాజ లక్షణములు కలవాడు. గొప్ప ఐశ్వర్యము కలవాడు. రాజులలో శ్రేష్ఠుడు. నాలుగు సముద్రముల వరకు వ్యాపించిన భూమిలో ప్రసిద్ధుడు. తాను సుఖపడుచు ఇతరులను కూడ సుఖ పెట్టువాడు. 5.

మూ. తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠస్తారాధిపనిభాననః।
రామో నామ విశేషజ్ఞః శ్రేష్ఠః సర్వధనుష్మతామ్. 6

ప్ర. అ. తస్య = ఆ దశరథునకు, ప్రియః = ఇష్టమైనవాడు, తారాధిపనిభాననః = చంద్రునివంటి ముఖము గలవాడు, విశేషజ్ఞః = విశేషములను ఎరిగినవాడు, సర్వధనుష్మతామ్ = సకలధనుర్ధరులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడూ అయిన, రామో నామ = రాము డను పేరు గల, జ్యేష్ఠః పుత్రః = జ్యేష్ఠపుత్రుడు, (అస్తి = ఉన్నాడు.)

తా. ఆ దశరథునకు ప్రియుడైన రాము డను పేరు గల జ్యేష్ఠపుత్రుడు ఉన్నాడు. అతడు చంద్రుని వంటి ముఖము కలవాడు. మానవులలోను, ఇతర వస్తువులలోను ఉన్న విశేషమును గుర్తించ సమర్థుడు. ధనుర్ధరు లందరిలో శ్రేష్ఠుడు. 6.

మూ. రక్షితా స్వస్య వృత్తస్య స్వజనస్య చ రక్షితా,
రక్షితా జీవలోకస్య ధర్మస్య చ పరంతపః. 7

ప్ర. అ. పరంతపః = శత్రువులను బాధించ గల ఆ రాముడు, స్వస్య = తన సంబంధమైన, వృత్తస్య = చరిత్రమునకు, రక్షితా = రక్షకుడు. స్వజనస్య = స్వజనమునకు, రక్షితా = రక్షకుడు. జీవలోకస్య = ప్రాణుల సముదాయమునకు, ధర్మస్య చ = ధర్మమునకూ, రక్షితా = రక్షకుడు.

తా. శత్రువులను పీడించు ఆ రాముడు తన నడవడికలో ఎట్టి లోపము లేకుండా రక్షించుకొనుచుండును. తన వాళ్ళను, సకలజీవలోకమును, సకలధర్మములను రక్షించువాడు. 7

మూ. తస్య సత్యాభిసంధస్య వృద్ధస్య వచనాత్పితుః,
సభార్యః సహ చ భ్రాత్రా వీరః ప్రవ్రాజితో వనమ్. 8

ప్ర. అ. సత్యాభిసన్ధస్య=సత్యమైన సంకల్పము గల, వృద్ధస్య=వృద్ధుడైన, పితుః= తండ్రియైన, తస్య = ఆ దశరథునియొక్క, వచనాత్ = వచనమువలన, వీరః=వీరుడైన ఆ రాముడు, సభార్యః=భార్యతో కూడినవాడై, సహ చ భ్రాత్రా=సోదరునితో కూడ కూడిన వాడై, వనమ్=వనమును గూర్చి, ప్రవ్రాజితః=ప్రవాసము పంపబడెను.

తా. సత్యమైన సంకల్పము గలవాడు, తన తండ్రి, వృద్ధుడూ అయిన ఆ దశరథమహారాజు ఆజ్ఞచేత వీరుడైన ఆ రాముడు భార్యతోను, సోదరుని తోను అరణ్యమునకు ప్రవాసము వెళ్లెను. 8

మూ. తేన తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా,
రాక్షసా నిహతాః శూరా బహవః కామరూపిణః. 9

ప్ర. అ. తత్ర=ఆ, మహారణ్యే=మహారణ్యమునందు, మృగయామ్=వేటను గూర్చి, పరిధావతా=పరుగెత్తుచున్న, తేన=ఆ రామునిచేత, శూరాః=శూరులు, కామరూపిణః=స్వేచ్ఛారూపము గలవారు అయిన, బహవః=అనేకులు, రాక్షసాః=రాక్షసులు, నిహతాః=చంపబడినారు.

తా. ఆ అరణ్యములో వేటాడు సందర్భములో ఆ రాముడు శూరులూ స్వేచ్ఛారూపధారులూ అయిన చాలమంది రాక్షసులను సంహరించెను. 9

మూ. జనస్థానవధం శ్రుత్వా హతౌ చ ఖరదూషణౌ,
తత స్త్వమర్షాపహృతా జానకీ రావణేన తు, 10
వఞ్చయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, జనస్థానవధమ్=జనస్థానములోని రాక్షసుల వధను, హతౌ=చంపబడిన, ఖరదూషణౌ చ=ఖరదూషణులను గూర్చి, శ్రుత్వా=విని, వనే=వనమునందు, రామమ్=రాముని, మృగరూపేణ=మృగముయొక్క రూపముచేత, మాయయా=మాయచేత, వఞ్చయిత్వా=వంచించి, రావణేన=రావణునిచేత, జానకీ=జానకి, అమర్షాపహృతా=కోపముచే అపహరించబడినది.

తా. పిమ్మట, రావణుడు జనస్థానములోని రాక్షసుల వధను, ఖరదూషణులు

వర్తను విని, కోపముతో మాయామృగరూపముచేత అరణ్యములో రాముని వంచించి, సీతను అపహరించెను. 10

మూ. స మార్గమాణస్తాం దేవీం రామః సీతామనిన్దితామ్,
ఆససాద వనే మిత్రం సుగ్రీవం నామ వానరమ్.

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, అనిన్దితామ్=నిందింపబడని, దేవీమ్ = దేవి యైన, తాం సీతామ్ = ఆ సీతను, మార్గమాణః = వెదకుచు, వనే = వనమునందు, సుగ్రీవం నామ=సుగ్రీవు డను పేరు గల, వానరమ్=వానరుని, మిత్రమ్ = మిత్రునిగా, ఆససాద = పొందెను.

తా. రాముడు ఎట్టి దోషములూ లేని ఆ సీతాదేవిని వెదకుచు, అరణ్యములో సుగ్రీవు డనే వానరునితో మైత్రి చేసికొనెను. 11

మూ. తతః స వాలినం హత్వా రామః పరపురంజయః, 12
ప్రాయచ్ఛత్కపిరాజ్యం తత్సుగ్రీవాయ మహాబలః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పరపురంజయః = శత్రుపురములను జయించువాడు, మహాబలః = గొప్ప బలము గలవాడు అయిన, సః రామః = ఆ రాముడు, వాలినమ్=వాలిని, హత్వా = చంపి, తత్ = ఆ, కపిరాజ్యమ్=వానర రాజ్యమును, సుగ్రీవాయ=సుగ్రీవునకు, ప్రాయచ్ఛత్=ఇచ్చెను.

తా. పిమ్మట, శత్రుపురములను జయించు, మహాబలు డైన ఆ రాముడు వాలిని చంపి ఆ వానరరాజ్యమును సుగ్రీవునకు ఇచ్చెను. 12

మూ. సుగ్రీవేణాపి సందిష్టా హరయః కామరూపిణః 13
దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వన్తి సహస్రశః.

ప్ర. అ. సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, సందిష్టాః = పంపబడిన, కామరూపిణః=స్వేచ్ఛారూపము గల, హరయః=వానరులు, సహస్రశః=వేలకొలది, సర్వాసు = సమస్త మైన, దిక్షు=దిక్కులందు, తాం దేవీమ్=ఆ దేవిని, విచిన్వన్తి = వెదకుచున్నారు.

తా. సుగ్రీవుడు ఆజ్ఞాపించి పంపగా, స్వేచ్ఛారూపధారణసమర్థు లైన వేలకొలది వానరులు ఆ సీతాదేవికొరకై అన్నిదిక్కులందు వెదకుచున్నారు. 13

మూ. అహం సంపాతివచనాచ్ఛతయోజనమాయతమ్, 14
అస్యా హేతోర్విశాలాక్ష్యాః సాగరం వేగవాన్ ప్లుతః.

ప్ర. అ. అహమ్ = నేను, సంపాతివచనాత్ = సంపాతి మాటవలన, వేగవాన్ = వేగవంతుడనై, అస్యాః = ఈ, విశాలాక్ష్యాః హేతోః = విశాలము లైన నేత్రములు గల సీతకొరకై, శతయోజనమ్ = నూరు యోజనములు, ఆయతమ్ = పొడవు గల, సాగరం = సాగరమును, ప్లుతః = దాటినాను.

తా. సంపాతి మాటలచే, విశాలనేత్రములు గల సీత ఇక్కడ నున్నదని తెలుసుకొని, నేను, ఈమెకొరకై, మహావేగముతో, నూరు యోజనములు పొడ వైన సముద్రమును దాటితిని.

మూ. యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మవతీం చ తామ్,
అశ్రౌషం రాఘవస్యాహం సేయమాసాదితా మయా.

ప్ర. అ. అహమ్ = నేను, రాఘవస్య = రామునివలన, తామ్ = ఆ సీతను, యథారూపామ్ = ఎట్టిరూపము గలదానినిగా, యథావర్ణామ్ = ఎట్టి వర్ణము గలదానినిగా, యథాలక్ష్మవతీం చ = ఎట్టి గుర్తులుగలదానినిగా, అశ్రౌషమ్ = వింటినో, సా = అట్టి రూపవర్ణచిహ్నములు గల, ఇయమ్ = ఈ సీత, మయా = నాచేత, ఆసాదితా = పొందబడినది.

తా. రాముడు ఆ సీతకు ఎట్టిరూపము, ఎట్టి వర్ణము, ఎట్టి గుర్తులు ఉన్నట్లు చెప్పెనో అట్టి రూప-వర్ణ-చిహ్నములతోనే ఇపుడు నే నీమెను కనుగొన్నాను.

మూ. విరరామైవముక్త్వాసౌ వాచం వానరపుఙ్గవః, 16
జానకీచాపి తచ్ఛ్రుత్వా పరం విస్మయమాగతా.

ప్ర. అ. అసౌ = ఆ, వానరపుఙ్గవః = వానరశ్రేష్ఠుడు, ఏవమ్ = ఇట్లు, వాచమ్ = వాక్కును, ఉక్త్వా = పలికి, విరరామ = విరమించెను. జానకీ చాపి = జానకి కూడ, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, పరమ్ = మిక్కిలి, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆగతా = పొందినది.

తా. హనుమంతుడు ఈ మాటలు పలికి ఊరకుండెను. ఈ మాటలు వినగానే సీత చాలా ఆశ్చర్యపడెను. 16

మూ. తతః సా వక్రకేశాన్తా సుకేశీ కేశసంవృతమ్, 17
ఉన్నమ్య వదనం భీరుః శింశపావృక్షమైక్షత.

ప్ర. అ. ("సుకేశీ కేశసంవృతమ్"కు బదులు "క్లేశసంవృతచేతనా" అను ప్రాచ్యపాఠము బాగున్నది). తతః = అటుపిమ్మట, వక్రకేశాన్తా = వంకరగా ఉన్న కేశాంతములు గల, భీరుః = భయస్వభావము గల, క్లేశసంవృతచేతనా = దుఃఖముచేత కప్పివేయబడిన చైతన్యము గల, సా = ఆ సీత, వదనమ్ = ముఖమును, ఉన్నమ్య = ఎత్తి, శింశపావృక్షమ్ = శింశపావృక్షమును, ఐక్షత = చూచెను.

తా. దుఃఖముచేత కప్పబడిన, చైతన్యము (ఆలోచనాశక్తి) గలదీ, వంకరగా ఉన్న కేశాంతములు గలదీ, భయస్వభావురాలూ అయిన ఆ సీత, ముఖము నెత్తి ఆ శింశపావృక్షము వైపు చూచెను. 17

మూ. నిశమ్య సీతా వచనం కపేశ్చ
దిశశ్చ సర్వాః ప్రదిశశ్చ వీక్ష్య,
స్వయం ప్రహర్షం పరమం జగామ
సర్వాత్మనా రామమనుస్మరన్తీ 18

ప్ర. అ. సీతా = సీత, కపేః = హనుమంతునియొక్క, వచనమ్ = వచనమును, నిశమ్య = విని, సర్వాః = సమస్తమైన, దిశశ్చ = దిక్కులను, ప్రదిశశ్చ = విదిక్కులను, వీక్ష్య = చూచి, స్వయమ్ = తాను, సర్వాత్మనా = అన్ని విధములా, రామమ్ = రాముని, అనుస్మరన్తీ = స్మరించుచున్నదై, పరమమ్ = గొప్ప, ప్రహర్షమ్ = ఆనందమును, జగామ = పొందెను.

తా. హనుమంతుని మాటలు విన్న సీత దిక్కులు, విదిక్కులు చూచుచు, మనస్సులో సర్వవిధములా రాముణ్ణే స్మరించుచు, చాల సంతోషించెను. 18

మూ. సా తిర్యగూర్ధ్వం చ తథాప్యధస్తా
న్నిరీక్షమాణా తమచిన్త్యబుద్ధిమ్,
దదర్శ పిఙ్గాధిపతేరమాత్యం
వాతాత్మజం సూర్యమివోదయస్థమ్. 19

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## ఏకత్రింశః సర్గః

ప్ర. అ. సా = ఆ సీత, తిర్యక్ = అడ్డంగాను, ఊర్ధ్వం చ = పైకి, తథాపి = మరియు, అధస్తాత్ = క్రిందా, నిరీక్షమాణా = చూచుచున్నదై, అచిన్త్య బుద్ధిమ్ = ఊహించ శక్యము కాని బుద్ధి కలవాడు, పిఙ్గాధిపతేః = సుగ్రీవుని యొక్క, అమాత్యమ్ = మంత్రి, ఉదయస్థమ్ = ఉదయాచలముపై ఉన్న, సూర్యమివ = సూర్యుడు వలె ఉన్నవాడూ అయిన, తం వాతాత్మజమ్ = ఆ హనుమంతుని, దదర్శ = చూచెను.

తా. సీత ప్రక్కలకూ, పైకీ, క్రిందకీ చూచుచు, ఊహింప శక్యముకాని బుద్ధిబలము కలవాడూ, సుగ్రీవుని అమాత్యుడూ, వాయుకుమారుడూ అయిన, ఉదయాచలముపై నున్న సూర్యుడు వలె ఉన్న హనుమంతుని చూచెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పది ఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వాత్రింశః సర్గః

[హనుమంతుని మాటిన సీతకు కలిగిన ఆలోచనలు]

మూ. తతః శాఖాన్తరే లీనం దృష్ట్వా చలితమానసా,
వేష్టితార్జునవస్త్రం తం విద్యుత్సంఘాతపిఙ్గలమ్. 1

ప్ర. తతః = అటుపిమ్మట, (సీత), శాఖాన్తరే = కొమ్మల మధ్య, లీనమ్ = అణగి ఉన్నవాడూ, వేష్టితార్జునవస్త్రమ్ = చుట్టుకొనబడిన తెల్లని వస్త్రము కలవాడూ, విద్యుత్సంఘాతపిఙ్గలమ్ = మెరుపుల గుంపు వలె పచ్చగా ఉన్నవాడూ అయిన, తమ్ = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, చలితమానసా = చలించిన (ఉలిక్కిపడిన) మనస్సు కలదైనది.

తా. పిమ్మట ఆ సీత, మెరుపుల ప్రోగు వలె పచ్చని శరీరముతో, తెల్లని వస్త్రము ధరించి, కొమ్మల మధ్య అణగి యున్న ఆ హనుమంతుని చూచి ఉలిక్కిపడెను.

మూ. సా దదర్శ కపిం తత్ర ప్రశ్రితం ప్రియవాదినమ్,
ఫుల్లాశోకోత్కరాభాసం తప్తచామీకరేక్షణమ్. 2

ప్ర. ఆ. సా = ఆ సీత, తత్ర = అక్కడ, ఫుల్లాశోకోత్కరాభాసమ్ = వికసించిన అశోకపుష్పముల ప్రోగువంటి కాంతి కలవాడూ, తప్తచామీకరేక్షణమ్ = కరిగించిన బంగారమువంటి నేత్రములు కలవాడూ, ప్రశ్రితమ్ = వినయముతో ఉన్నవాడూ, ప్రియవాదినమ్ = ప్రియముగా మాటలాడుచున్నవాడూ అయిన, కపిమ్ = వానరుని, దదర్శ = చూచెను.

తా. సీత, అక్కడ, వికసించిన అశోకపుష్పముల ప్రోగు వంటి శరీర కాంతితో, కరిగించిన బంగారము వంటి నేత్రములతో, వినీతుడై, ప్రియ వాక్యములు పలుకు చున్న వానరుని చూచెను. 2

మూ. మైథిలీ చిన్తయామాస విస్మయం పరమం గతా,
అహో భీమమిదం రూపం వానరస్య దురాసదమ్, 3
దుర్నిరీక్షమితి జ్ఞాత్వా పునరేవ ముమోహ సా.

ప్ర. అ. మైథిలీ = సీత, పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, గతా = పొందినదై, చిన్తయామాస = ఆలోచించెను. అహో = ఆహా! వానరస్య = వానరునియొక్క, దురాసదమ్ = సమీపించుటకు శక్యము కాని, ఇదమ్ = ఈ, రూపమ్ = రూపము, భీమమ్ = భయంకరముగా ఉన్నది. దుర్నిరీక్షమ్ = చూచుటకు శక్యము కానిది. ఇతి = ఇట్లు, జ్ఞాత్వా = తలచి, సా = ఆమె. పునరేవ = మరల, ముమోహ = మోహము చెందెను.

తా. హనుమంతుని చూడగానే సీత ఆశ్చర్యపడుచు. "ఆహో! ఈ వానరుని రూపము భయంకరముగాను, సమీపింప శక్యముకానిదిగాను, చూచుటకు శక్యము కానిది గాను ఉన్నది. ఆమె ఈ విధముగా తలచి మరల మోహము చెందెను 3

మూ. విలలాప భృశం సీతా కరుణం భయమోహితా, 4
రామరామేతి దుఃఖార్తా లక్ష్మణేతి చ భామినీ,
రురోద బహుధా సీతా మన్దం మన్దస్వరా సతీ. 5

ప్ర. అ. భామినీ = ఉత్తమకాంతివంతురాలైన, సీతా = సీత, భయమోహితా = భయముచేత మోహింపబడినదై, దుఃఖార్తా = దుఃఖముచేత పీడితురాలై, రామ రామేతి = రామా! రామా! అని, లక్ష్మణేతి చ = లక్ష్మణా! అని, భృశమ్ = మిక్కిలి, కరుణమ్ = దీనముగా, విలలాప = విలపించెను. సీతా = సీత, మన్దస్వరా సతీ = మంద మైన స్వరము గలదై, బహుధా = అనేకవిధములు, రురోద = ఏడ్చెను.

తా. మంచి కాంతి గల స్త్రీయైన సీత, భయముచే మోహితురాలై, దుఃఖముచేత పీడితురాలై, రామా! రామా! అనుచు, లక్ష్మణా! అనుచు, దీనముగా మిక్కిలి విలపించెను. మంద మైన స్వరముతో అనేకవిధముల ఏడ్చెను. 4, 5

మూ. సా తం దృష్ట్వా హరిశ్రేష్ఠం వినీతవదుపస్థితమ్,
మైథిలీ చిన్తయామాస స్వప్నోఽయమితి భామినీ. 6

ప్ర. అ. భామినీ=కాంతిమంతురా లైన, సా మైథిలీ=ఆ సీత, వినీతవత్=వినయవంతు డై, ఉపస్థితమ్=వచ్చిన, తమ్=ఆ, హరిశ్రేష్ఠమ్=వానరశ్రేష్ఠుని, దృష్ట్వా=చూచి, అయమ్= ఇది, స్వప్నః=స్వప్నము, ఇతి=అని, చిన్తయామాస=ఆలోచించెను.

తా. కాంతిమంతురా లైన ఆ సీత, వినయముతో సమీపమునం దున్న ఆ హనుమంతుని చూచి "ఇది స్వప్నమై యుండును" అని అనుకొనెను. 6

మూ. సా వీక్షమాణా పృథుభుగ్నవక్త్రం,
శాఖామృగేన్ద్రస్య యథోక్తకారమ్,
దదర్శ పిఙ్గప్రవరం మహార్హం,
వాతాత్మజం బుద్ధిమతాం వరిష్ఠమ్. 7

ప్ర. అ. సా=ఆ సీత, వీక్షమాణా=ఇటు నటు చూచుచు, పృథుభుగ్నవక్త్రమ్=పెద్దదీ వక్రముగా నున్నదీ అయిన ముఖము గలవాడూ, శాఖామృగేన్ద్రస్య=వానరరాజైన సుగ్రీవునియొక్క, యథోక్తకారమ్=చెప్పిన విధముగా చేయు భృత్యుడూ, పిఙ్గప్రవరమ్=వానరులలో శ్రేష్ఠుడూ, మహార్హమ్=గొప్ప గౌరవపాత్రుడూ, బుద్ధిమతామ్=బుద్ధిమంతులలో, వరిష్ఠమ్=గొప్పవాడూ అయిన, వాతాత్మజమ్=హనుమంతుని, దదర్శ=చూచెను.

తా. సీత ఇటు అటు పర్యవేక్షించుచు, విశాలమూ వక్రమూ అయిన ముఖము కలవాడూ, సుగ్రీవుని అనుచరుడూ, వానరశ్రేష్ఠుడూ, గౌరవమునకు తగినవాడూ, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడూ అయిన హనుమంతుని చూచెను. 7

మూ. సా తం సమీక్ష్యైవ భృశం విసంజ్ఞా
గతాసుకల్పేవ బభూవ సీతా,
చిరేణ సంజ్ఞాం ప్రతిలభ్య భూయో
విచిన్తయామాస విశాలనేత్రా. 8

ప్ర. అ. సా సీతా = ఆ సీత, తమ్ = ఆ హనుమంతుని, సమీక్ష్యైవ = చూడగానే, భృశమ్ = మిక్కిలి, విసంజ్ఞా = సంజ్ఞ లేనిదై, గతాసుకల్పేవ = ప్రాణములు పోయినది వలె, బభూవ = అయెను. విశాలనేత్రా = విశాలము లైన నేత్రములు గల ఆమె, చిరేణ = చాలకాలముచేత, సంజ్ఞామ్ = సంజ్ఞను, ప్రతిలభ్య = పొంది, భూయః = మరల, విచిన్తయామాస = ఆలోచించెను.

తా. ఆ సీత హనుమంతుని చూడగానే మిక్కిలి సంజ్ఞను కోల్పోయి, ప్రాణములు పోయినది వలె అయ్యెను. విశాలనేత్ర యైన ఆమె చాల సేపటికి సంజ్ఞను పొంది, మరల ఇట్లు ఆలోచించెను. 8.

మూ. స్వప్నే మయాయం వికృతోఽద్య దృష్టః
శాఖామృగః శాస్త్రగణైర్నిషిద్ధః,
స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ
తథా పితుర్మే జనకస్య రాజ్ఞః. 9

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మయా = నాచేత, వికృతః = వికృత మైన ఆకారము గల, శాస్త్రగణైః = శాస్త్రసముదాయముచేత, నిషిద్ధః = నిషేధింపబడిన, శాఖామృగః = వానరము, స్వప్నే = స్వప్నమునందు, దృష్టః = చూడబడినది, సలక్ష్మణాయ = లక్ష్మణునితో కూడిన, రామాయ = రామునకు, తథా = మరియు, మే పితుః = నా తండ్రి యైన, జనకస్య రాజ్ఞః = జనకమహారాజునకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక.

తా. నా కీనాడు స్వప్నములో, వికృతాకారము గల వానరము కనబడినది. వానరము స్వప్నములో కనబడుట మంచిది కా దని శాస్త్రములు నిషేధించుచున్నవి. లక్ష్మణసహితు డైన రామునకు నా తండ్రి యైన జనకమహారాజునకు క్షేమ మగుగాక. 9

మూ. స్వప్నోఽపి నాయం న హి మేఽస్తి నిద్రా
శోకేన దుఃఖేన చ పీడితాయాః,
సుఖం హి మే నాస్తి యతోఽస్మి హీనా
తేనేన్దుపూర్ణప్రతిమాననేన. 10

ప్ర. అ. అయమ్ = ఇది, స్వప్నోఽపి = స్వప్నము కూడ, న = కాదు-

శోకేన = శోకముచేతను, దుఃఖేన చ = దుఃఖముచేతను, పీడితాయాః = పీడింపబడిన, మే = నాకు, నిద్రా = నిద్ర, నాస్తి హి = లేదు కదా! మే = నాకు, సుఖమ్ = సుఖము, నాస్తి హి = లేదు కదా! యతః = ఎందువలన, ఇన్దుపూర్ణప్రతిమాననేన = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గల, తేన = రామునితో, హీనా, హీనురాలను (వియుక్తురాలను), అస్మి = అయి ఉన్నానో!

తా. ఇది స్వప్న మై ఉండదు. శోకదుఃఖములతో పీడితురాల నైన నాకు నిద్ర అనేది లేదు కదా? పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గల ఆ రాముడు దగ్గర లేని నాకు సుఖమే లేదు కదా! 10

మూ. రామేతి రామేతి సదైవ బుద్ధ్యా
విచిన్త్య వాచా బ్రువతీ తమేవ,
తస్యానురూపం చ కథాం తదర్థా
మేవం ప్రపశ్యామి తథా శృణోమి. 11

ప్ర. అ. రామేతి రామేతి = రామా! రామా! అని, సదైవ = ఎల్లప్పుడూ, బుద్ధ్యా = బుద్ధితో, విచిన్త్య = ఆలోచించి, తమేవ = ఆ రామునే, బ్రువతీ = ఉచ్చరించుచున్న దాన నై, తస్య = దానికి, అనురూపమ్ = తగు నట్లు, తదర్థామ్ అదే విషయము గల, కథామ్ = కథను, ఏవమ్ = ఈ విధముగా, ప్రపశ్యామి = చూచుచున్నాను. తథా = మరియు, శృణోమి = వినుచున్నాను.

తా. నేను సర్వదా మనస్సులో రామునే స్మరించుచు, రామా! రామా! అని ఉచ్చరించుచు ఉండుటచేత, దానికి అనుగుణముగా ఆ రామునకు సంబంధించిన మాటలే వినుచున్నట్లు, ఆ విషయములే కనబడుచున్నట్లు అనిపించు చున్నది. 11

మూ. అహం హి తస్యాద్య మనోభవేన
సంపీడితా తద్గతసర్వభావా,
విచిన్తయన్తీ సతతం తమేవ
తథైవ పశ్యామి తథా శృణోమి. 12

ప్ర. అ. అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, తస్య = ఆ రామునకు

సంబంధించిన, మనోభవేన = మన్మథునిచేత, సంపీడితా = పీడింపబడినదాన నై, తద్గతసర్వభావా = అతనియందే చేరిన సమస్తభావము కలదాననై, సతతమ్ = ఎల్లప్పుడూ, తమేవ = అతనిని గూర్చియే, విచిన్తయన్తీ = ఆలోచించుచున్న దాన నై, తథైవ = అట్లే, పశ్యామి = చూచుచున్నాను. తథైవ = అట్లే, శృణోమి = వినుచున్నాను.

తా. నే నిపుడు రామవిరహముతో బాధపడుచు అతనిని గూర్చి మన్మథు నిచే పీడింపబడుచున్నాను. నా మనస్సు పూర్తిగా రామునియందు లగ్నమై ఉన్నది. ఆ రాముణ్ణి గూర్చియే సర్వదా స్మరించుచున్నాను. అందుచేత ఆ రాముని గూర్చియే వినుచున్నట్లు ఆ విషయములే చూచుచున్నట్లు అనిపించు చున్నది. 12

మూ. మనోరథః స్యాదితి చిన్తయామి
తథాపి బుద్ధ్యా చ వితర్కయామి,
కిం కారణం తస్య హి నాస్తి రూపం
సువ్యక్తరూపశ్చ వదత్యయం మామ్. 13

ప్ర. అ. మనోరథః = మనోరథము, స్యాత్ = సఫలమగును, ఇతి = అని, చిన్తయామి = చింతించుచున్నాను. బుద్ధ్యాపి చ = బుద్ధిచేత గూడ, తథా = అట్లే, వితర్కయామి = ఊహించుచున్నాను. తస్య = ఆ మనోరథమునకు, రూపమ్ = రూపము, నాస్తి హి = లేదు కదా! అయమ్ = ఇతడు, సువ్యక్తరూపః = బాగుగా స్పష్టమైన రూపము గలవాడై, మామ్ = నన్ను గూర్చి, వదతి = మాటలాడు చున్నాడు. కారణమ్ = కారణము, కిమ్ = ఏమో!

తా. ఎప్పటికైనా నా మనోరథము సఫలమగు నను ఆశతో మనస్సులో కూడ ఆ విధముగానే ఊహించుచున్నాను. కాని మనోరథమునకు రూపము ఉండదు కదా! ఇతడు మాత్రము స్పష్టమైన ఆకారముతో, నాతో మాటలాడు చున్నాడు. దీనికి కారణము ఏమై ఉండునో. 13

మూ. నమోఽస్తు వాచస్పతయే సవజ్రిణే
స్వయంభువే చైవ హుతాశనాయ చ,
అనేన చోక్తం యదిదం మమాగ్రతో
వనౌకసా తచ్చ తథాస్తు నాన్యథా. 14

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సున్దరకాణ్డే, ద్వాత్రింశః సర్గః

ప్ర. అ. సవజ్రిణే = దేవేంద్రునితో కూడిన, వాచస్పతయే = బృహస్పతికి, స్వయంభువే చైవ = బ్రహ్మకు, హుతాశనాయ చ = అగ్నిదేవునకు, నమః = నమస్కారము. అస్తు = అగుగాక. అనేన = ఈ, వనౌకసా = వానరునిచేత, మమ అగ్రతః = నా ఎదుట, యత్ = ఏ, ఇదమ్ = ఈ వాక్యము, ఉక్తమ్ = పలుకబడినదో, తత్ = అది, తథా = అట్లే, అస్తు = అగుగాక. అన్యథా = మరొక విధముగా, న = కాకుండుగాక.

తా. బృహస్పతికి, దేవేంద్రునికి, బ్రహ్మదేవునకు, అగ్నిదేవునకు నమస్కరించుచున్నాను. ఈ వానరుడు నా ఎదుట చెప్పినమాటలు సత్యమగు గాక; అసత్యము కాకుండుగాక। 14

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయస్త్రింశః సర్గః

[సీత హనుమంతునకు తన విషయము చెప్పుచు తన అరణ్యాగమనమును, రావణుడు తనను అపహరించుటను వర్ణించుట].

మూ. సోఽవతీర్య ద్రుమాత్తస్మాద్విద్రుమప్రతిమాననః,
వినీతవేషః కృపణః ప్రణిపత్యోపసృత్య చ. 1

తామబ్రవీన్మహాతేజా హనూమాన్ మారుతాత్మజః,
శిరస్యఞ్జలిమాధాయ సీతాం మధురయా గిరా. 2

ప్ర. అ. విద్రుమప్రతిమాననః = పొగడములతో సమానమైన ముఖము గలవాడును, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడును, మారుతాత్మజః = వాయుపుత్రుడును అయిన, సః హనూమాన్ = ఆ హనుమంతుడు, తస్మాత్ = ఆ, ద్రుమాత్ = వృక్షమునుండి, అవతీర్య = దిగి, వినీతవేషః = వినయముతో కూడిన వేషము కలవాడై, కృపణః = దీనుడై, ప్రణిపత్య = నమస్కరించి, ఉపసృత్య = సమీపించి, శిరసి = శిరస్సునందు, అఞ్జలిమ్ = దోసిలిని, ఆధాయ = ఉంచి, తాం సీతామ్ = ఆ సీతను గూర్చి, మధురయా = మధురమైన, గిరా = వాక్కుతో, అబ్రవీత్ = పలికెను.

తా. పగడము వలె ఎఱ్ఱనైన ముఖము కలవాడు, మహాతేజశ్శాలి, వాయుపుత్రుడును అయిన ఆ హనుమంతుడు, వినయముతో కూడిన వేషము గలవాడై, దీనుడై ఆ సీతను సమీపించి, తలపై దోసిలి పట్టి నమస్కరించుచు మధురమైన వాక్కుతో ఇట్లు పలికెను. 1, 2

మూ. కా ను పద్మపలాశాక్షి, క్లిష్టకౌశేయవాసిని,
ద్రుమస్య శాఖామాలమ్బ్య తిష్ఠసి త్వమనిన్దితే. 3

ప్ర. అ. పద్మపలాశాక్షి = పద్మపత్రముల వంటి నేత్రములు గలదానా!

క్లిష్టకౌశేయవాసిని = నలిగిపోయిన పట్టుబట్ట ధరించినదానా! అనిన్దితే = నిందింప తగనిదానా! ద్రుమస్య = వృక్షముయొక్క, శాఖామ్ = కొమ్మను, ఆలమ్బ్య = పట్టుకొని, తిష్ఠసి = నిలబడి యున్నావు! కా ను = ఎవ్వతెవు?

తా. పద్మపత్రముల వంటి నేత్రములు గలదానా! నలిగిపోయిన పట్టుబట్ట ధరించినదానా! ఎట్టి దోషములు లేనిదానా! ఇక్కడ ఈ చెట్టు కొమ్మను పట్టుకొని నిలబడి ఉన్నావు; నీ వెవ్వతెవు? ౩

మూ. కిమర్థం తవ నేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్,
పుణ్డరీకపలాశాభ్యాం విప్రకీర్ణమివోదకమ్. 4

ప్ర. అ. పుణ్డరీకపలాశాభ్యామ్ = రెండు పద్మపత్రములనుండి, విప్రకీర్ణమ్ = చిమ్మబడిన, ఉదకమ్ ఇవ = ఉదకము వలె, తవ = నీయొక్క, నేత్రాభ్యామ్ = నేత్రములనుండి, శోకజమ్ = శోకమువలన కలిగిన, వారి = నీరు, కిమర్థమ్ = ఎందువలన, స్రవతి = కారుచున్నది.

తా. రెండు తామరపూవు రేకులనుండి నీరు కారినట్లు నీ నేత్రములనుండి కన్నీరు కారుచున్నది; కారణ మేమి? 4

మూ. సురాణామసురాణాం వా నాగగన్ధర్వరక్షసామ్,
యక్షాణాం కిన్నరాణాం వా కా త్వం భవసి శోభనే. 5

ప్ర. అ. శోభనే = మంగళప్రదురాలా! త్వమ్ = నీవు, సురాణామ్ = దేవతలలో కాని, అసురాణాం వా = రాక్షసులలో కాని, నాగగన్ధర్వరక్షసామ్ = నాగ గంధర్వ రాక్షసులలో కాని, యక్షాణామ్ = యక్షులలో కాని, కిన్నరాణాం వా = కిన్నరులలో గాని, కా = ఎవతెవు, భవసి = అగుచున్నావు.

తా. ఓ! మంగళప్రదురాలా! సురులు, అసురులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు - వీరిలో నీవు ఏ జాతికి చెందినదానవు? 5

మూ. కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే,
వసూనాం హి వరారోహే దేవతా ప్రతిభాసి మే. 6

ప్ర. అ. వరాననే = శ్రేష్ఠమైన ముఖము కలదానా! త్వమ్ = నీవు,

రుద్రాణామ్ = రుద్రులలో గాని, మరుతాం వా = మరుత్తులలో గాని, వసూనామ్ = వసువులలో గాని, కా = ఎవ్వతెవు. భవసి = అగుచున్నావు? వరారోహే = శ్రేష్ఠ మైన కటిప్రదేశము గలదానా। దేవతా = దేవతవుగా, మే = నాకు, ప్రతిభాసి = తోచుచున్నావు.

తా. అంద మైన ముఖము గలదానా। నీవు, రుద్రగణములో గాని, మరుద్గణములో గాని, వసుగణములో గాని చేరినదానవా? శ్రేష్ఠ మైన కటిప్రదేశము గలదానా। నీవు దేవతాస్త్రీవి అయి ఉందువని నాకు తోచుచున్నది. 6

మూ. కిం ను చన్ద్రమసా హీనా పతితా విబుధాలయాత్,
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా. 7

ప్ర. అ. చన్ద్రమసా = చంద్రునితో, హీనా = శూన్యురాలూ, విబుధాలయాత్ = స్వర్గమునుండి, పతితా = పడినది, జ్యోతిషామ్ = నక్షత్రములలో, శ్రేష్ఠా = శ్రేష్ఠురాలూ, శ్రేష్ఠసర్వగుణాన్వితా = శ్రేష్ఠము లైన సమస్తగుణములతో కూడినదీ అయిన, రోహిణీ కిం ను = రోహిణివా?

తా. నీవు స్వర్గమునుండి భూలోకములో పడి, చంద్రునికి దూర మైన, నక్షత్రములలో శ్రేష్ఠురా లైన, శ్రేష్ఠము లైన గుణములు గల రోహిణివా? 7

మూ. కా త్వం భవసి కల్యాణి త్వమనిన్దితలోచనే,
కోపాద్వా యది వా మోహాద్భర్తారమసితేక్షణే, 8
వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యాణ్యరున్ధతీ.

ప్ర. అ. ("కా త్వం భవసి....లోచనే" అను శ్లోకార్ధము రెండు "త్వమ్" లతో ఉన్నది అనవసరము. గోరఖ్‌పూర్ ప్రతిలో లేదు.)

అసితేక్షణే = నల్లని నేత్రములు గలదానా। త్వమ్ = నీవు, కోపాద్వా = కోపమువలన గాని, యది వా = లేక, మోహాత్ = మోహము (అజ్ఞానము) వలన గాని, భర్తారమ్ = భర్త యైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, కోపయిత్వా = కోపింప చేసి వచ్చిన, కల్యాణీ = మంగళప్రదురా లైన, అరున్ధతీ = అరుంధతి, నాసి = కావు కదా?

తా. ఓ। నల్లని నేత్రములు గలదానా। భర్త యైన వసిష్ఠునకు; కోపము

వలననో, అజ్ఞానమువలననో కోపము కలిగించి ఇక్కడికి వచ్చిన అతుంధలివి కావు కదా! 8

మూ. కో ను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే, 9
అస్మాల్లోకాదముం లోకం గతం త్వమనుశోచసి.

ప్ర. అ. సుమధ్యమే = మంచి నడుము గలదానా! అస్మాత్ = ఈ, లోకాత్ = లోకమునుండి, అముం లోకమ్ = పరలోకమును గూర్చి, గతమ్ = వెళ్ళిపోయిన ఎవనిని గూర్చి, త్వమ్ = నీవు, అనుశోచసి = దుఃఖించుచున్నావో అట్టి, తే = నీయొక్క, పుత్రః = పుత్రుడు, పితా = తండ్రి, భ్రాతా = సోదరుడు, భర్తా వా = లేదా భర్త, కో ను = ఎవ్వరు?

తా. మంచి నడుము గలదానా! నీవు మరణించిన వారి నెవరినో గూర్చి దుఃఖించుచున్నట్లున్నది. ఆ విధముగా మరణించినవారు నీ పుత్రుడా, తండ్రియా, సోదరుడా, భర్తయా?

వి. ఈ ప్రశ్న చాలా అసంగతముగా, అమంగళార్థరూపముగా ఉన్నది. పూర్వార్థానికి నీ పుత్రు డెవ్వరు, తండ్రి ఎవ్వరు... ఇత్యాదివిధముగా అర్థం చెప్పి దానిని వేరుచేయడానికి కూడ వీలు లేదు. 'వా' అని ఉండుటచే "నీ కుమారుడు" ఇత్యాదివిధముగానే అర్థము చెప్పవలసి ఉండును. అలా చెప్పినా కూడా ఉత్తరార్థంలో అశ్లీలము ఉండనే ఉన్నది. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. 9

మూ. రోదనాదతినిఃశ్వాసాద్భూమిసంస్పర్శనాదపి, 10
న త్వాం దేవీమహం మన్యే రాజ్ఞః సంజ్ఞావధారణాత్.

ప్ర. అ. రోదనాత్ = ఏడ్పులవలనను, అతినిఃశ్వాసాత్ = చాలా నిట్టూర్పులవలనను, భూమిసంస్పర్శనాదపి = భూమిని స్పృశించుటవలనను, రాజ్ఞః = రాజాయొక్క, సంజ్ఞావధారణాత్ = చిహ్నముల నిశ్చయమువలనను, త్వామ్ = నిన్ను, దేవీమ్ = దేవతాస్త్రీనిగా, అహమ్ = నేను, న మన్యే = తలపను.

తా. నీవు ఏడ్చుచున్నావు. ఎక్కువ నిట్టూర్చుచున్నావు. భూమిని స్పృశించుచున్నావు. నీయందు రాజలక్షణము లున్నవి. వీనిని అన్నింటిని వల్ల నీవు దేవతాస్త్రీవి కా వని తలంచుచున్నాను 10

మూ. వ్యఞ్జనాని చ తే యాని లక్షణాని చ లక్షయే, 11
మహిషీ భూమిపాలస్య రాజకన్యా చ మే మతా.

ప్ర. అ. తే = నీయొక్క, యాని = ఏ, వ్యఞ్జనాని = చిహ్నములను, లక్షణాని చ = సాముద్రికలక్షణములను, లక్షయే = చూచుచున్నానో, వాటిని పట్టి, భూమిపాలస్య = చక్రవర్తియొక్క, మహిషీ = రాణివి గాను, రాజకన్యా చ = రాజకన్యవు గాను, మే = నాకు, మతా = తోచుచున్నావు.

తా. నీ అవయవసౌష్ఠవము మొదలైన చిహ్నములు, సాముద్రికశాస్త్రోక్త లక్షణములు చూడగా, నీవు చక్రవర్తి భార్య యైన క్షత్రియవనిత వై యుందువని ఊహించుచున్నాను. 11

మూ. రావణేన జనస్థానాద్బలాదపహృతా యది, 12
సీతా త్వమసి భద్రం తే తన్మమాచక్ష్వ పృచ్ఛతః.

ప్ర. అ. త్వమ్ = నీవు, జనస్థానాత్ = జనస్థానమునుండి, రావణేన = రావణునిచేత, బలాత్ = బలాత్కారముగా, అపహృతా = అపహరింపబడిన, సీతా = సీతవు, అసి యది = అయిన ట్లయితే, తత్ = దానిని, పృచ్ఛతః = అడుగుచున్న, మమ = నాకు, ఆచక్ష్వ = చెప్పుము. తే = నీకు, భద్రమ్ = మంగళము అగుగాక.

తా. నేను అడుగుచున్నాను; చెప్పుము. నీకు మంగళము అగును. రావణుడు జనస్థానమునుండి బలాత్కారముగా ఎత్తికొని వచ్చిన సీతవు కావు కద.

మూ. యథా హి తవ వై దైన్యం రూపం చాప్యతిమానుషమ్,
తపసా చాన్వితో వేషస్త్వం రామమహిషీ ధ్రువమ్.

ప్ర. అ. తవ = నీయొక్క, దైన్యమ్ = దైన్యము, అతిమానుషమ్ = మనుష్యులను అతిక్రమించిన, రూపం చ = రూపము, తపసా = తపస్సుతో, అన్వితః = కూడిన, వేషః = వేషము, యథా = ఎట్లున్నదో, దానిని పట్టి, త్వమ్ = నీవు, ధ్రువమ్ = నిశ్చయముగా, రామమహిషీ = రామభార్యవే.

తా. నీ దైన్యమును, మనుష్యులలో ఎవ్వరియందూ కనబడని సౌందర్య

మును, తపస్సును సూచించు వేషమును చూడగా నీవు రాముని భార్యవే అని స్పష్టముగా తెలియుచున్నది. 13

మూ. సా తస్య వచనం శ్రుత్వా రామకీర్తనహర్షితా, 14
ఉవాచ వాక్యం వైదేహీ హనుమన్తం ద్రుమాశ్రితమ్.

ప్ర. అ. సా వైదేహీ = ఆ సీత, తస్య=అతనియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా = విని, రామకీర్తనహర్షితా = రాముణ్ణి గూర్చి చెప్పుటచేత సంతోషింపచేయబడినదై, ద్రుమాశ్రితమ్=వృక్షమును ఆశ్రయించి ఉన్న, హనుమన్తమ్ = హనుమంతుని గూర్చి, వాక్యమ్= వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. హనుమంతుని మాటలు విన్న సీత, రాముణ్ణి గూర్చి చెప్పుటచే చాల సంతోషించుచు, చెట్టుపైన నున్న అతనితో ఇట్లనెను. 14

మూ. పృథివ్యాం రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః, 15
స్నుషా దశరథస్యాహం శత్రుసైన్యప్రతాపినః.

ప్ర. అ. అహమ్ = నేను, పృథివ్యామ్=భూమియందు, రాజసింహానామ్ = రాజశ్రేష్ఠులలో, ముఖ్యస్య=ప్రధానుడూ, విదితాత్మనః=ప్రసిద్ధ మైన బుద్ధి కలవాడూ, శత్రుసైన్యప్రతాపినః = శత్రువుల సైన్యమును తపింపచేయువాడూ అయిన, దశరథస్య=దశరథునియొక్క, స్నుషా=కోడలిని.

తా. నేను, భూమండలములోని రాజు లందరికంటె గొప్పవాడు, ప్రసిద్ధ మైన బుద్ధిబలము కలవాడు, శత్రుసైన్యములను బాధించువాడు అయిన దశరథుని కోడలిని. 15

మూ. దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః, 16
సీతేతి నామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః.

ప్ర. అ. అహమ్ = నేను, వైదేహస్య = విదేహదేశరాజూ, మహాత్మనః= గొప్ప బుద్ధి కలవాడూ అయిన, జనకస్య = జనకునియొక్క, దుహితా = కుమార్తెను. నామ్నా = పేరుచేత, సీతేతి నామ = సీత అను ప్రసిద్ధి గల, అహమ్ = నేను, ధీమతః = బుద్ధిమంతు డైన, రామస్య = రామునియొక్క, భార్యా = భార్యను.

తా. నేను మహాత్ముడైనట్టి, విదేహదేశప్రభువూ అయిన జనకుని కుమార్తెను. నా పేరు సీత. ధీమంతు డైన రాముని భార్యను. 16

మూ. సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే, 17
భుఞ్జానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ.

ప్ర. అ. అహమ్=నేను, తత్ర=అక్కడ, రాఘవస్య=రామునియొక్క, నివేశనే = గృహమునందు, మానుషాన్ = మనుష్యులకు లభించు, భోగాన్ = భోగములను, భుఞ్జానా = అనుభవించుచు, సర్వకామసమృద్ధినీ = సమస్తకామ సమృద్ధి కలదాననై, ద్వాదశ = పండ్రెండు, సమాః = సంవత్సరములను, ఉంటిని.

తా. నేను అక్కడ రాముని ఇంటిలో మనుష్యులకు లభించుటకు వీలున్న సకలభోగములు అనుభవించుచు, సమస్తకామముల సమృద్ధితో, పండ్రెండు సంవత్సరములు ఉంటిని. 17

మూ. తతస్త్రయోదశే వర్షే రాజ్యేనేక్ష్వాకునన్దనమ్, 18
అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, త్రయోదశే = పదమూడవ, వర్షే = సంవత్సరమునందు, సోపాధ్యాయః = పురోహితులతో కూడిన, రాజా = దశరథ మహారాజు, ఇక్ష్వాకునన్దనమ్= ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన రాముని, రాజ్యేన = రాజ్యముచేత, అభిషేచయితుమ్ = అభిషేకింపచేయుటకు, ప్రచక్రమే = ప్రారంభించెను.

తా. పిమ్మట పదమూడవ సంవత్సరమునందు, దశరథమహారాజు, పురోహితులతో కూడి, ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన రామునకు రాజ్యాభిషేకము చేయుటకు ప్రయత్నించెను. 18

మూ. తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవస్యాభిషేచనే, 19
కైకేయీ నామ భర్తారం దేవీ వచనమబ్రవీత్.

ప్ర. అ. తస్మిన్ = ఆ, రాఘవస్య = రామునియొక్క, అభిషేచనే = అభిషేకము, సంభ్రియమాణే = ఏర్పడుచుండగా, కైకేయీ నామ = కైకేయి

అను పేరు గల, దేవీ=రాణి, భర్తారమ్ = భర్తనుగూర్చి, వచనమ్=వచనమును అబ్రవీత్ = పలికెను.

తా. రామాభిషేకమునకు ఏర్పాట్లు జరుగుచుండగా కైకేయి అను రాణి భర్త యైన దశరథునితో ఇట్లనెను. 19

మూ. న పిబేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనమ్, 20
ఏష మే జీవితస్యాన్తో రామో యద్యభిషిచ్యతే.

ప్ర. అ. న పిబేయమ్=నీరు త్రాగను. ప్రత్యహమ్=ప్రతిదినము, భోజనమ్ =భోజనమును, న ఖాదేయమ్ = తినను. రామః=రాముడు, యది అభిషిచ్యతే= అభిషేకింపబడిన ట్లయితే, ఏషః=ఇది, మే=నాయొక్క, జీవితస్య = జీవితము యొక్క, అన్తః = అంతము.

తా. నీవు రామునకు పట్టాభిషేకము చేసినచో నేనిదిమొదలు ఏ దినము నందూ నీళ్ళు త్రాగను; ఆహారము తినను. ఇదే నా జీవితమునకు అంతము. 20

మూ. యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ, 21
తచ్చేన్న వితథం కార్యం వనం గచ్ఛతు రాఘవః.

ప్ర. అ. నృపతిసత్తమ=ఓ! రాజశ్రేష్ఠుడా! త్వయా=నీచేత, ప్రీత్యా =ప్రేమతో, యత్=ఏ, తత్ వాక్యమ్=ఆ మాట, ఉక్తమ్=చెప్పబడినదో, తత్=అది, వితథమ్ = వ్యర్థము, న కార్యం యది = చేయబడకుండవలె నన్నచో, రాఘవః=రాముడు, వనమ్=వనమును గూర్చి, గచ్ఛతు=వెళ్లుగాక.

తా. ఓ! రాజశ్రేష్ఠుడా! నీవు నాకు ప్రేమపూర్వకముగా పలికిన మాటదక్కై నీవు నిలిచినచో రాముని అరణ్యమునకు పంపుము. 21

మూ. స రాజా సత్యవాగ్దేవ్యా వరదానమనుస్మరన్, 22
ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూరమప్రియమ్.

ప్ర. అ. సత్యవాక్=సత్య మైన వాక్కు గల, సః రాజా = ఆ రాజు, దేవ్యాః=రాణియొక్క, వరదానమ్=వరదానమును, అనుస్మరన్=స్మరించుచు, కైకేయ్యాః = కైకేయియొక్క, క్రూరమ్ = క్రూర మైన, అప్రియమ్ = అప్రియ మైన, వచనమ్=వచనమును శ్రుత్వా = విని, ముమోహ=మోహమునొందెను.

తా. ఆ దశరథమహారాజు క్రూరమూ, అప్రియమూ అయిన కైకేయి మాట విని, రాణికి తా నిచ్చిన వరదానమును స్మరింతుచు, మూర్ఛ పోయెను. 22

మూ. తతస్తు స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః, 23
జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుదన్రాజ్యమయాచత.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సత్యే = సత్యమునందు, ధర్మే = ధర్మమునందు, వ్యవస్థితః = నిలిచిన, స్థవిరః = వృద్ధు డైన, రాజా = రాజు, రుదన్ = ఏడ్చుచు, యశస్వినమ్ = కీర్తి గల, జ్యేష్ఠమ్ = జ్యేష్ఠు డైన, పుత్రమ్ = పుత్రుని, రాజ్యమ్ = రాజ్యమును, అయాచత = యాచించెను.

తా. సత్యధర్మములందు స్థిరముగా నిలిచిన, వృద్ధు డైన ఆ రాజు అపుడు "నే నిచ్చిన రాజ్యము మరల నా కిమ్ము" అని యశఃశాలి యైన జ్యేష్ఠ పుత్రుని యాచించెను. 23

మూ. స పితుర్వచనం శ్రీమానభిషేకాత్పరం ప్రియమ్. 24
మనసా పూర్వమాసాద్య వాచా ప్రతిగృహీతవాన్.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః = ఆ రాముడు, పితుః = తండ్రి యొక్క, వచనమ్ = వచనమును, అభిషేకాత్ = అభిషేకముకంటె, పరమ్ = మిక్కిలి, ప్రియమ్ = ప్రియ మైనదానినిగా, మనసా = మనస్సుతో, పూర్వమ్ = ముందుగా, ఆసాద్య = పొంది, వాచా = వాక్కుతో, ప్రతిగృహీతవాన్ = స్వీకరించెను.

తా. శ్రీమంతు డైన ఆ రాముడు తండ్రి ఆజ్ఞను అభిషేకముకంటె గూడ చాలా ప్రియ మైన దానినిగా మనసా భావించి, పిదప మాటతో అంగీకరించెను. 24

మూ. దద్యాన్న ప్రతిగృహ్ణీయాన్న బ్రూయాత్కించిదప్రియమ్,
అపి జీవితహేతోర్వా రామః సత్యపరాక్రమః.

ప్ర. అ. సత్యపరాక్రమః = సత్య మైన పరాక్రమము గల, రామః = రాముడు, దద్యాత్ = ఇచ్చును. న ప్రతిగృహ్ణీయాత్ = ప్రతిగ్రహించడు. జీవిత

హేతోర్వా = జీవితము కొరకైనా, కించిత్ = ఏమియు, అప్రియమ్ = అప్రియమును, న బ్రూయాత్ = పలుకడు.

తా. సత్యమైన పరాక్రమము గల రాముడు ఇతరులకు దానము చేయును గాని తాను ఇతరులనుండి ప్రతిగ్రహించడు. జీవితమునకు ఆపద సంభవించి నప్పుడు కూడ అప్రియమును మాటలాడడు. 25

మూ. స విహాయోత్తరీయాణి మహార్హాణి మహాయశాః, 26
విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = ఆ రాముడు, మహార్హాణి = చాల విలువ గల, ఉత్తరీయాణి = ఉత్తరీయములను, విహాయ = విడచి, మనసా = మనస్సుచేత, రాజ్యమ్ = రాజ్యమును, విసృజ్య = విడచి, మామ్ = నన్ను, జనన్యై = తల్లికి, సమాదిశత్ = అప్పగించెను.

తా. గొప్ప కీర్తి గల ఆ రాముడు చాల విలువైన వస్త్రములను విడచి, నారచీరలు ధరించి, రాజ్యమును పరిత్యజించవలె నని దృఢముగా సంకల్పించి నన్ను తన తల్లికి అప్పచెప్పెను. 26

మూ. సాహం తస్యాగ్రతస్తూర్ణం ప్రస్థితా వనచారిణీ, 27
న హి మే తేన హీనాయా వాసః స్వర్గేఽపి రోచతే.

ప్ర. అ. సా అహమ్ = అట్టి నేను, వనచారిణీ = వనమునందు సంచరించు చున్న దాననై, తూర్ణమ్ = శీఘ్రముగా, తస్య = ఆ రామునియొక్క, అగ్రతః = ఎదుట, ప్రస్థితా = ప్రయాణ మైతిని, తేన = అతనితో, హీనయాః = కూన్యురాల నైన, మే = నాకు, స్వర్గేఽపి = స్వర్గములో కూడ, వాసః = నివాసము, న రోచతే హి = ఇష్టము కాదు కదా!

తా. రాముడు లేకున్నచో నాకు స్వర్గములో నివాసము కూడ ఇష్టము కాదు. అందుచే నేను వనములో సంచరించుటకై నిశ్చయించుకొని, వెంటనే అతనికంటె ముందుగానే అడవికి బయలుదేరితిని. 27

మూ. ప్రాగేవ తు మహాభాగః సౌమిత్రిర్మిత్రనందనః, 28
పూర్వజస్యానుయాత్రార్థే ద్రుమచీరైరలంకృతః.

ప్ర. అ. మహాభాగః=గొప్ప భాగ్యము గలవాడు, పితృవత్సలః=పితృ లను ఆనందింపచేయువాడు అయిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, ప్రాగేవ=ముందు గానే, పూర్వజస్య=అన్నగారియొక్క, అనుయాత్రార్థే =అనుసరించి వెళ్లుటకై, ద్రుమచీరైః=నారచీరలతో, అలంకృతః=అలంకరింపబడెను.

తా. మహాభాగ్యవంతుడు, పితృలకు ఆనందకరుడు అయిన లక్ష్మణుడు, అన్నగారిని అనుసరించి వెళ్లుటకై, నా కంటె ముందే నారచీరలు ధరించి సిద్ధముగా ఉండెను. 28

మూ. తే వయం భర్తురాదేశం బహుమాన్య దృఢవ్రతాః, 29
ప్రవిష్టాః స్మ పురాదృష్టం వనం గమ్భీరదర్శనమ్.

ప్ర. అ. తే=అట్టి, వయమ్=మేము, భర్తుః=ప్రభు వైన దశరథమహా రాజుయొక్క, ఆదేశమ్=ఆజ్ఞను, బహుమాన్య= గౌరవించి, దృఢవ్రతాః = దృఢ మైన నియమము కలవారమై, పురా=పూర్వము, అదృష్టమ్=చూడబడని, గమ్భీరదర్శనమ్=గంభీర మైన దర్శనము గల, వనమ్=వనమును, ప్రవిష్టాః స్మః=ప్రవేశించితిమి.

తా. ఈ విధముగ మే మందరము రాజాజ్ఞ పాలించుచు, దృఢ మైన నియమములు అనుసరించుచు, మేము పూర్వ మెన్నడూ చూడని, చూచుటకు భయంకరముగా నుండు అరణ్యములో ప్రవేశించితిమి. 29

మూ. వసతో దణ్డకారణ్యే తస్యాహమమితౌజసః, 30
రక్షసాపహృతా భార్యా రావణేన దురాత్మనా.

ప్ర. అ. దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, వసతః=నివసించుచున్న, అమితౌజసః=గొప్ప తేజస్సు గల, తస్య=ఆ రామునియొక్క, భార్యా=భార్య నైన, అహమ్=నేను, దురాత్మనా=దుష్టబుద్ధి గల, రావణేన=రావణునిచేత, అపహృతా=అపహరింపబడితిని.

తా. అనంత మైన తేజస్సు గల ఆ రాముడు దండకారణ్యములో నివ సించుచుండగా, అతని భార్య నైన నన్ను దురాత్ము డైన రావణుడు అపహ రించినాడు. 30

మూ. ద్వౌ మాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః, 31
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తతస్త్యక్ష్యామి జీవితమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. తేన = వానిచేత, ద్వౌ = రెండు, మాసౌ = మాసములను, మే = నాకు, జీవితానుగ్రహః = జీవితముయొక్క అనుగ్రహము, కృతః = చేయ బడినది. తతః = ఆ కారణమువలన, ద్వాభ్యామ్ = రెండు, మాసాభ్యామ్ = మాసముల కంటె, ఊర్ధ్వమ్ = పైన, జీవితమ్ = జీవితమును, త్యక్ష్యామి = విడువ గలను.

తా. ఆ రావణుడు నాకు రెండు మాసముల పాటు జీవితమును అను గ్రహించినాడు. రెండు మాసాల తరువాత నేను ప్రాణములు వదలవలెను. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుస్త్రింశః సర్గః

[హనుమంతుని విషయమున సీతకు సందేహము కలుగుట. హనుమంతుడు ఆ సందేహమును తొలగించుట. సీత కోరగా హనుమంతుడు శ్రీరాముని గుణములు వర్ణించి చెప్పుట].

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా హనుమాన్ హరిపుఙ్గవః,
దుఃఖాద్దుఃఖాభిభూతాయాః సాన్త్వముత్తరమబ్రవీత్. 1

ప్ర. అ. హరిపుఙ్గవః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమంతుడు, దుఃఖాత్ = ఒక దుఃఖమునుండి, దుఃఖాభిభూతాయాః = మరియొక దుఃఖముచేత తిరస్కరింపబడిన (ఆవరింపబడిన), తస్యాః = ఆ సీతయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సాన్త్వమ్ = ఓదార్పు రూపమైన, ఉత్తరమ్ = ప్రత్యుత్తరమును, అబ్రవీత్ = పలికెను.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు, ఒక దుఃఖము తరువాత మరొక దుఃఖములో చిక్కుకొని ఉన్న ఆ సీత పలికిన మాటలు విని, ఓదార్పుతో ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 1

మూ. అహం రామస్య సందేశాద్దేవి దూతస్తవాగతః,
వైదేహి కుశలీ రామస్త్వాం చ కౌశలమబ్రవీత్. 2

ప్ర. అ. దేవి = ఓ దేవీ! వైదేహి = సీతా! అహమ్ = నేను, రామస్య = రామునియొక్క, సందేశాత్ = సందేశమువలన, తవ = నీయొక్క, దూతః = దూతగా, ఆగతః = వచ్చినాను. కుశలీ = క్షేమముగా నున్న, రామః = రాముడు, త్వాం చ = నిన్ను కూడ, కుశలమ్ = కుశలమును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. విదేహరాజకుమారి వైన ఓ సీతాదేవీ! నేను రాముడు పంపగా, నీ

వర్తకు దూత నై వచ్చినాను. రాముడు క్షేమముగా ఉన్నాడు. నిన్ను కూడా నీ క్షేమమును గూర్చి అడుగుచున్నాడు. (నీ క్షేమమును తెలుసుకొమ్మని నాతో చెప్పినాడు). 2

మూ. యో బ్రాహ్మమస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాంవరః,
స త్వాం దాశరథీ రామో దేవి కౌశలమబ్రవీత్. 3

ప్ర. అ. దేవి = ఓ దేవీ! వేదవిదామ్ = వేదవేత్తలలో, వరః = శ్రేష్ఠుడైన, యః = ఎవ్వరు, బ్రాహ్మమ్ అస్త్రమ్ = బ్రహ్మాస్త్రమును, వేదాంశ్చ = వేదములను, వేద = ఎరుగునో, సః = అట్టి, దాశరథిః = దశరథకుమారుడైన, రామః = రాముడు, త్వామ్ = నిన్ను, కౌశలమ్ = క్షేమమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఓ దేవీ! వేదవేత్తలలో గొప్పవాడు, దశరథకుమారుడూ అయిన నీ రాముడు బ్రహ్మాస్త్రమును, సకలవేదములను ఎరుగునో ఆ రాముడు నీ క్షేమమును తెలిసికొని రమ్మన్నాడు. 3

మూ. లక్ష్మణశ్చ మహాతేజా భర్తుస్తేఽనుచరః ప్రియః,
కృతవాన్ శోకసంతప్తః శిరసా తేఽభివాదనమ్. 4

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడూ, తే భర్తుః = నీ భర్త యొక్క, ప్రియః = ఇష్టుడైన, అనుచరః = అనుచరుడూ అయిన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, శోకసంతప్తః = శోకముచేత తపింపచేయబడినవాడై, శిరసా = శిరస్సుతో, తే = నీయొక్క, అభివాదనమ్ = నమస్కారమును, కృతవాన్ = చేసినాడు.

తా. నీ భర్తకు చాల ఇష్టుడైన అనుచరుడూ, గొప్ప తేజస్సు కలవాడూ అయిన లక్ష్మణుడు కూడ శోకముతో బాధపడుచు శిరస్సు వంచి నీకు అభివాదనము చేసినాడు. 4

మూ. సా తయోః కుశలం దేవీ నిశమ్య నరసింహయోః,
ప్రీతిసంహృష్టసర్వాఙ్గీ హనుమన్తమథాబ్రవీత్. 5

ప్ర. అ. సా దేవీ = ఆ సీతాదేవి, తయోః = ఆ, నరసింహయోః = నర

శ్రేష్ఠులైన, రామలక్ష్మణులయొక్క, కుశలమ్ = క్షేమమును, నిశమ్య = విని, ప్రీతిసంహృష్టసర్వాంగీ = ఆనందముతో వికసించిన సమస్త అవయవములు కలదై, అత = పిమ్మట, హనుమన్తమ్ = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ సీతాదేవి నరులలో శ్రేష్ఠులైన రామలక్ష్మణుల క్షేమవార్త విన గానే ఆనందముతో గగుర్పొడిచిన సకలావయవములతో, హనుమంతునితో ఇట్లనెను. 5

మూ. కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా,
ఏతి జీవన్తమానన్దో నరం వర్షశతాదపి. 6

ప్ర. అ. జీవన్తమ్ = జీవించి ఉన్న, నరమ్ = నరుని, వర్షశతాదపి = నూరు సంవత్సరాలకైనా, ఆనన్దః = ఆనందము, ఏతి = పొందును. ఇయమ్ = ఈ, లౌకికీ = లోకమునకు సంబంధించిన, గాథా = గాథ, కల్యాణీ = మంగళప్రద మైనదిగా, మా = నన్ను గూర్చి, (నాకు) ప్రతిభాతి = తోచుచున్నది.

తా. "మానవుడు కనుక జీవించి ఉన్నట్లయితే నూరు సంవత్సరాలకైనా ఆనందమును పొంద కలుగుతాడు". లోకములో ఉన్న ఈ సామెత మంగళకర మైనది, సత్యమైనది అని నేను తలచుచున్నాను. 6

మూ. తయా సమాగతే తస్మిన్ ప్రీతిరుత్పాదితాద్భుతా,
పరస్పరేణ చాలాపం విశ్వస్తౌ తౌ ప్రచక్రతుః. 7

ప్ర. అ. సమాగతే = వచ్చిన, తస్మిన్ = ఆ హనుమంతునియందు, తయా = ఆమెచేత, అద్భుతా = ఆశ్చర్యకర మైన, ప్రీతిః = స్నేహము, ఉత్పాదితా = పుట్టింపబడినది (చూపబడినది), తౌ = వారిద్దరూ, విశ్వస్తౌ = విశ్వసించిన వారై, పరస్పరేణ = పరస్పరముతో, ఆలాపం చ = సంభాషణను కూడ, చక్రతుః = చేసిరి.

తా. తన దగ్గరకు వచ్చిన ఆ హనుమంతునిపై సీత అద్భుత మైన స్నేహమును చూపెను. వారిద్దరూ విశ్వాసము కలవారై పరస్పరము సంభాషణము చేసిరి. 7

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా హనుమాన్హరియూథపః,
సీతాయాః శోకదీనాయాః సమీపముపచక్రమే. 8

ప్ర. అ. హరియూథపః = వానర సేనాపతి యైన, హనుమాన్ = హనుమంతుడు, శోకదీనాయాః = శోకముచేత దీనురా లైన. తస్యాః = ఆ, సీతాయాః = సీతయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సమీపమ్ = సమీపమును గూర్చి, ఉపచక్రమే = మెల్లగా అరిగి వెళ్లెను.

తా. వానర సేనాధిపతి యైన హనుమంతుడు శోకముచేత దీనురా లైన ఆ సీత మాట విని మెల్ల మెల్లగా ఆమె దగ్గరగా వెళ్ళెను. 8

మూ. యథా యథా సమీపం స హనుమానుపసర్పతి,
తథా తథా రావణం సా తం సీతా పరిశఙ్కతే. 9

ప్ర. అ. సః హనుమాన్ = ఆ హనుమంతుడు, యథా యథా = ఎట్లు ఎట్లు, సమీపమ్ = సమీపమును గూర్చి, ఉపసర్పతి = వచ్చుచున్నాడో, తథా తథా = అట్లు అట్లు, సా సీతా = ఆ సీత, తమ్ = అతనిని, రావణమ్ = రావణునిగా, పరిశఙ్కతే = శంకించుచున్నది.

తా. హనుమంతుడు తనకు దగ్గరగా వచ్చిన కొలది. ఆ సీత, అతడు రావణు డై యుండు నని సందేహించెను. 9

మూ. అహో ధిగ్దుష్కృతమిదం కథితం హి యదస్య మే,
రూపాన్తరముపాగమ్య స ఏవాయం హి రావణః. 10

ప్ర. అ. అహో = అయ్యో! ధిక్ = ఛీ! మే = నాయొక్క, ఇదమ్ = ఈ, అస్య = ఏనికి, కథితమ్ = చెప్పుట, దుష్కృతమ్ = చెడ్డ పని చేయబడినది. అయమ్ = ఇతడు, రూపాన్తరమ్ = మరియొక రూపమును, ఉపాగమ్య = పొంది (వచ్చిన), సః రావణః హి = ఆ రావణుడే కదా!

తా. అయ్యో! ఛీ! ఛీ! నేను ఏ విషయ మంతా ఏనికి చెప్పి ఎంత తప్పు చేసితిని! ఆ రావణుడే ఈ రూపము ధరించి వచ్చినాడు. 10

మూ. తామశోకస్య శాఖాం సా విముక్త్వా శోకకర్శితా,
తస్యామేవానవద్యాఙ్గీ ధరణ్యాం సముపావిశత్. 11

ప్ర. అ. అనవద్యాఙ్గీ = దోషములు లేని అవయవములు గల, సా = ఆ సీత, అశోకస్య = అశోకవృక్షముయొక్క, తామ్ = ఆ, శాఖామ్ = కొమ్మను, విముచ్య = విడచి, శోకకర్శితా = శోకముచేత కృశింపచేయబడిన దై, తస్యామ్ = ఆ, ధరణ్యామేవ = నేలమీదనే, సముపావిశత్ = కూర్చుండెను.

తా. దోషములు లేని శరీరము గల ఆ సీత ఆ అశోకవృక్షశాఖను విడచి, శోకముచేత దుర్బలురాలై, నేలపైననే కూర్చుండెను. 11

మూ. హనుమానపి దుఃఖార్తాం తాం దృష్ట్వా భయమోహితామ్,
అవన్దత మహాబాహు స్తతస్తాం జనకాత్మజామ్ 12
సా చైనం భయవిత్రస్తా భూయో నైవాభ్యుదైక్షత.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, హనుమానపి = హనుమంతుడు కూడ, దుఃఖార్తామ్ = దుఃఖముచేత పీడింపబడిన, భయమోహితామ్ = భయముచేత మోహము చెందిన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, తతః = అటుపిమ్మట, తాం జనకాత్మజామ్ = ఆ సీతను, అవన్దత = నమస్కరించెను. సా చ = ఆమె కూడ, భయవిత్రస్తా = భయముతో వణకుచు, ఏనమ్ = ఇతనిని, భూయః = మరల, నాభ్యుదైక్షత = చూడలేదు.

తా. దుఃఖార్తురాలై భయముచేత ఏమీ ఆలోచింప లేని స్థితిలో ఉన్న ఆ సీతను చూచి, మహాబాహువైన హనుమంతుడు ఏమి చేయుటకూ తోచక కేవలము నమస్కరించెను. సీత కూడ భయభ్రాంతురాలై మరల హనుమంతుని వైపు చూడలేదు. 12

మూ. తం దృష్ట్వా వన్దమానం తు సీతా శశినిభాననా, 13
అబ్రవీద్దీర్ఘముచ్ఛ్వస్య వానరం మధురస్వరా.

ప్ర. అ. శశినిభాననా = చంద్రునితో సమానమైన ముఖము గల, సీతా = సీత, తమ్ = అతనిని, వన్దమానమ్ = నమస్కరించుచున్నవానినిగా, దృష్ట్వా = చూచి, దీర్ఘమ్ = దీర్ఘముగా, ఉచ్ఛ్వస్య = నిట్టూర్చి, మధురస్వరా = మధురమైన స్వరము గలదై, వానరమ్ = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. చంద్రబింబము వంటి ముఖము గల సీత ఆ హనుమంతుడు తనకు

నమస్కరించుచున్నట్లు చూచి, దీర్ఘముగా నిట్టూర్చి మధురమైన స్వరముతో, అతనితో ఇట్లనెను. 15

మూ. మాయాం ప్రవిష్టో మాయావీ యది త్వం రావణః స్వయమ్,
ఉత్పాదయసి మే భూయః సంతాపం తన్న శోభనమ్.

ప్ర. అ. త్వమ్ = నీవు, మాయామ్ = మాయను, ప్రవిష్టః = ప్రవేశించిన, మాయావీ = మాయావి యైన, స్వయమ్ = స్వయముగా, రావణః యది = రావణుడవైతే, మే = నాకు, భూయః = ఇంకను, సంతాపమ్ = బాధను, ఉత్పాదయసి = పుట్టించుచున్నావు. తత్ = అది, శోభనమ్ = మంచిది, న = కాదు.

తా. నీవు, సాక్షాత్తు, మాయారూపములో వచ్చిన రావణుడవే అయితే, నాకు మరల బాధ కలిగించుచున్నావు. ఇట్లు నాకు మాటి మాటికి బాధ కలిగించుట మంచిది కాదు. 14

మూ. అథవా నైతదేవం హి యన్మయా పరిశఙ్కితమ్, 17
మనసో హి మమ ప్రీతిరుత్పన్నా తవ దర్శనాత్.

ప్ర. అ. అథవా = లేదా, మయా = నాచేత, యత్ = ఏది, పరిశఙ్కితమ్ = శంకింపబడినదో, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, న హి = కాదు. తవ = నీ యొక్క, దర్శనాత్ = దర్శనమువలన, మమ = నాయొక్క, మనసః = మనస్సునకు, ప్రీతిః = సంతోషము, ఉత్పన్నా హి = పుట్టినది కదా.

తా. లేదా—నేను శంకించినది నిజము కాదు. ఎందుచేత ననగా నిన్ను చూడగానే నా మనస్సునకు ఆనందము కలిగినది. 17

మూ. యది రామస్య దూతస్త్వమాగతో భద్రమస్తు తే, 18
పృచ్ఛామి త్వాం హరిశ్రేష్ఠ ప్రియా రామకథా హి మే.

ప్ర. అ. త్వమ్ = నీవు, రామస్య = రామునియొక్క, దూతః = దూతగా, ఆగతః యది = వచ్చినట్లయితే, తే = నీకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక. హరిశ్రేష్ఠ = ఓ ! వానరశ్రేష్ఠా ! మే = నాకు, రామకథా = రాముని కథ, ప్రియా హి = ఇష్టమైనది కదా ! త్వామ్ = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను.

తా. నీవు రాముని దూతగా వచ్చినవాడవే అయితే నీకు శ్రమముగాక। ఓ। వానరశ్రేష్ఠా। నాకు రామకథ చాలా ఇష్టము. అందుచే నిన్ను అడుగుచున్నాను. 18

మూ. గుణాన్రామస్య కథయ ప్రియస్య మమ వానర, 19
చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః.

ప్ర. అ. వానర = ఓ। వానరా। మమ = నాయొక్క, ప్రియస్య = ప్రియుడైన, రామస్య = రామునియొక్క, గుణాన్ = గుణములను, కథయ = చెప్పుము. సౌమ్య = ఓ। సౌమ్యుడా। నదీకూలమ్ = నది ఒడ్డును, రయః యథా = వేగము వలె, మే = నాయొక్క, చిత్తమ్ = చిత్తమును, హరసి = హరించుచున్నావు.

తా. ఓ। వానరా। నా ప్రియుడైన రాముని గుణములను వర్ణించి చెప్పుము. ప్రవాహవేగము నది ఒడ్డును హరించినట్లు నా చిత్తమును హరించుచున్నావు. 19

మూ. అహో స్వప్నస్య సుఖతా యాహమేవం చిరాహృతా, 20
ప్రేషితం నామ పశ్యామి రాఘవేణ వనౌకసమ్.

ప్ర. అ. స్వప్నస్య = స్వప్నముయొక్క, సుఖతా = సుఖకరమగుట, అహో = ఎంత ఆశ్చర్యము। చిరాహృతా = చిరకాలము క్రితమే హరింపబడిన, యా = ఏ నేను, రాఘవేణ = రామునిచేత, ప్రేషితం నామ = పంపబడిన, వనౌకసమ్ = వానరుని, ఏవమ్ = ఈ విధముగా, పశ్యామి కిల = చూచుచున్నానో।

తా. చాల కాలము క్రితము అపహరింపబడిన నేను రాముడు పంపిన వానరుని చూచుచున్నానట. ఎంత సుఖకరమైన స్వప్నము వచ్చినది। 20

మూ. స్వప్నేఽపి యద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్,
పశ్యేయం నావసీదేయం స్వప్నేఽపి మమ మత్సరీ.

ప్ర. అ. అహమ్ = నేను, స్వప్నేఽపి = స్వప్నమునందైనా, సహలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడిన, వీరమ్ = వీరుడైన, రాఘవమ్ = రాముని, పశ్యేయం యది = చూడగలిగినట్లయితే, నావసీదేయమ్ = వశించకుందును,

మమ = నా విషయమునందు, స్వప్నోఽపి = స్వప్నము కూడ, మత్సరీ = కోపము గలది.

తా. లక్ష్మణసమేతుడైన వీరుడైన రాముడు నాకు స్వప్నములో కనబడి నను నేను జీవించగలిగేదానను. నా విషయములో స్వప్నము కూడా పగ పట్టి యున్నది.

మూ. నాహం స్వప్నమిమం మన్యే స్వప్నే దృష్ట్వా హి వానరమ్,
న శక్యోఽభ్యుదయః ప్రాప్తుం ప్రాప్తశ్చాభ్యుదయో మమ.

ప్ర. అ. అహమ్ = నేను, ఇమమ్ = దీనిని, స్వప్నమ్ = స్వప్నమునుగా, న మన్యే = తలపను. స్వప్నే = స్వప్నమునందు, వానరమ్ = వానరుని, దృష్ట్వా = చూచి, అభ్యుదయః = అభ్యుదయము (భాగ్యాభివృద్ధి), ప్రాప్తుమ్ = పొందుటకు, న శక్యః = శక్యమైనది కాదు, మమ = నాకు, అభ్యుదయః = అభ్యుదయము, ప్రాప్తః చ = వచ్చినది.

తా. ఇది స్వప్నమని అనుకొనను. స్వప్నములో వానరుని చూచినవారు అభ్యుదయము పొందజాలరు. నాకు అభ్యుదయము కలిగినది కదా. 22

మూ. కిం ను స్యాచ్చిత్తమోహోఽయం భవేద్వాతగతిస్త్వియమ్,
ఉన్మాదజో వికారో వా స్యాదియం మృగతృష్ణికా.

ప్ర. అ. అయమ్ = ఇది, చిత్తమోహః = చిత్తముయొక్క మోహము, స్యాత్ కిం ను = అగునా? ఇయమ్ = ఇది, వాతగతిః = వాతముయొక్క ప్రకోపము, భవేత్ = అగునా? ఉన్మాదజః = ఉన్మాదము (పిచ్చి) వలన కలిగిన, వికారో వా = వికారమా? ఇయమ్ = ఇది, మృగతృష్ణికా = ఎండమావులు, స్యాత్ = అగునా?

తా. నా కేమైనా చిత్తమునకు మోహము కలిగినదా? ఇది ఏమైనా వాతప్రకోపమా? ఉన్మాదమువలన కలిగిన వికారమా? లేక ఇదంతా ఏమీ లేని ఎండమావులేనా? 23

మూ. అథవా నాయమున్మాదో మోహోఽప్యున్మాదలక్షణః 24.
సంబుధ్యే చాహమాత్మానమిమం చాపి వనౌకసమ్.

ప్ర. అ. అథవా = లేదా, అయమ్ = ఇది, ఉన్మాదః = ఉన్మాదము గాని,

ఉన్మాదలక్షణః=ఉన్మాదము వంటి లక్షణములు గల, మోహోఽపి=మోహము కూడ గాని, న=కాదు. అహమ్=నేను. ఆత్మానమ్=నన్ను గూర్చి, ఇమమ్= ఈ, వనౌకసమ్=వానరుని గూర్చి, సంబుధ్యే=తెలుసుకొనుచున్నాను.

తా. లేదా—ఇది ఉన్మాదమూ కాదు, ఉన్మాదలక్షణము లున్న మోహమూ కాదు. ఎందుచేత ననగా-నేను నన్ను, ఈ వానరునీ కూడ గుర్తుపట్ట గలుగుచున్నాను. 24

మూ. ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలమ్, 25
రక్షసాం కామరూపత్వాన్మేనే తం రాక్షసాధిపమ్.

ప్ర. అ. సీతా=సీత, ఇత్యేవమ్=ఈ విధముగా, బలాబలమ్ = (వివిధ యుక్తులలోని) బలాబలములను (ఏది సంభావ్యము, ఏది కాదు అను విషయమును), బహుధా=అనేకవిధములుగా, సంప్రధార్య=నిర్ణయించి, రక్షసామ్ = రాక్షసులు, కామరూపత్వాత్=కామరూపము కలవారగుటవలన, తమ్=అతనిని, రాక్షసాధిపమ్ = రావణునిగా, మేనే=తలంచెను.

తా. సీత ఈ విధముగ పరి పరి విధముల బలాబలములను ఆలోచించి, రాక్షసులు కామరూపులు గాన ఇతడు రావణుడే అని చివరికి నిర్ణయించు కొనెను. 2

మూ. ఏతాం బుద్ధిం తదా కృత్వా సీతా సా తనుమధ్యమా, 26
న ప్రతివ్యాజహారాథ వానరం జనకాత్మజా.

ప్ర. అ. తదా=అప్పుడు, తనుమధ్యమా=సన్నని నడుము గల, జనకాత్మజా=జనకుని కుమార్తెయైన, సా సీతా=ఆ సీత, ఏతామ్ = ఈ, బుద్ధిమ్ =బుద్ధిని, కృత్వా= చేసి. అథ = అటుపిమ్మట, వానరమ్ = హనుమంతుని గూర్చి, న ప్రతివ్యాజహార=తిరిగి పలకలేదు.

తా. అప్పుడు, సన్నని నడుము గల, జనకాత్మజయైన ఆ సీత ఈ విధముగా నిర్ణయించుకొని, ఇక హనుమంతునకు ప్రత్యుత్తర మివ్వలేదు. 26

మూ. సీతాయాశ్చింతితం బుద్ధ్వా హనుమాన్మారుతాత్మజః, 27
శ్రోత్రానుకూలైర్వచనైస్తదా తాం సంప్రహర్షయత్.

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, సీతాయాః=సీతయొక్క, చిన్తితమ్=ఆలోచనను, బుద్ధ్వా=తెలిసికొని, తదా=అప్పుడు, తామ్=ఆమెను, శ్రోత్రానుకూలైః=చెవులకు అనుకూలము లైన, వచనైః=మాటలతో, సంప్రహర్షయత్=సంతోష పెట్టెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు సీత ఆలోచనను కనిపెట్టి, అప్పుడామెను చెవులకు అనుకూలము లైన మాటలతో సంతోషపెట్టెను. 27

మూ. ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాన్తః శశీ యథా, 28
రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా,
విక్రమేణోపపన్నశ్చ యథా విష్ణుర్మహాయశాః. 29

ప్ర. అ. (రాముడు), ఆదిత్యః ఇవ=సూర్యుడు వలె, తేజస్వీ=గొప్ప తేజస్సు కలవాడు. శశీ యథా=చంద్రుడు వలె, లోకకాన్తః = లోకమునకు మనోహరుడు. దేవః=దేవుడైన, వైశ్రవణో యథా=కుబేరుడు వలె, సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకమునకు, రాజా=రాజు. మహాయశాః=గొప్ప కీర్తి కలవాడు. విష్ణుః యథా = విష్ణువు వలె, విక్రమేణ = పరాక్రమముతో, ఉపపన్నశ్చ=కూడినవాడు.

తా. రాముని తేజస్సు సూర్యుని తేజస్సు వంటిది. అతడు చంద్రుడు వలె లోకములకు (జనులకు) మనోహరుడు. కుబేరుడువలె సకలలోకములకు ప్రభువు. విష్ణువు వలె పరాక్రమవంతుడు. గొప్పకీర్తి కలవాడు. 28, 29

మూ. సత్యవాదీ మధురవాగ్దేవో వాచస్పతిర్యథా,
రూపవాన్ సుభగః శ్రీమాన్ కన్దర్ప ఇవ మూర్తిమాన్. 30

ప్ర. అ. సత్యవాదీ=సత్యము పలుకువాడు. దేవః=దేవుడైన, వాచస్పతిః యథా = బృహస్పతి వలె, మధురవాక్ = మధురమైన వాక్కు కలవాడు. రూపవాన్=రూపవంతుడు. సుభగః=మంచి భాగ్యము కలవాడు. శ్రీమాన్ = శోభ కలవాడు. మూర్తిమాన్=శరీరము గల, కన్దర్పః ఇవ=మన్మథుడు వలె ఉన్నవాడు.

తా. రాముడు సత్యమునే పలుకును. బృహస్పతి వలె మధురముగా

మాటలాడును. రూపవంతుడు. మంచి భాగ్యము కలవాడు. మంచి కీర్తి కల వాడు. దేహము ధరించిన మన్మథుని వలె ఉండును. 30

మూ. స్థానక్రోధః ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః,
బాహుచ్ఛాయామవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః. 31

ప్ర. అ. స్థానక్రోధః = తగినవాని విషయమున కోపము గలవాడు. ప్రహర్తా చ = తగిన వారిని దెబ్బతీయువాడు. లోకే = లోకమునందు, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, మహారథః = మహారథుడు. (తనను, సారథిని, గుఱ్ఱములను రక్షించుకొనుచు పదివేలమంది ధనుర్ధరులతో యుద్ధము చేయగలవాడు మహారథుడు). లోకః = లోకము, యస్య = ఏ, మహాత్మనః = మహాత్ముని యొక్క, బాహుచ్ఛాయామ్ = బాహువుల నీడను, సమాశ్రితః = ఆశ్రయించినదో.

భా. రాముడు కోపము చూప వలసిన సమయములో కోపము చూపించును. తగినవారిని సంహరించును. లోకములో శ్రేష్ఠుడైన మహారథుడు. ఆ మహాత్ముని బాహువుల నీడను ఆశ్రయించుకొని లోకము జీవించుచున్నది. 31

మూ. అపకృష్యాశ్రమపదాన్మృగరూపేణ రాఘవమ్,
శూన్యే యేనాపనీతాసి తస్య ద్రక్ష్యసి యత్ ఫలమ్. 32

ప్ర. అ. యేన = ఏ రావణునిచేత, రాఘవమ్ = రాముని, మృగరూపేణ = మృగరూపముచేత, ఆశ్రమపదాత్ = ఆశ్రమస్థానమునుండి, అపకృష్య = దూరముగా తీసికొనిపోయి, శూన్యే = శూన్యమైన పర్ణశాలయందు, అపనీతా అసి = అపహరింపబడితివో, తస్య = ఆ రావణునకు, యత్ = ఏ, ఫలమ్ = ఫలము కలుగునో, ద్రక్ష్యసి = చూడగలవు.

భా. రావణుడు మాయామృగమును చూపి, రాముడు దూరముగా వెళ్ళి పోవునట్లు చేసి, శూన్యమైన పర్ణశాలనుండి నిన్ను అపహరించినాడు కదా। దానికి అతని కెట్టి ఫలము లభింపనున్నదో నీవే చూడగలవు. 32

మూ. న చిరాద్రావణం సంఖ్యే యో వధిష్యతి వీర్యవాన్,
రోషప్రముక్తైరిషుభిర్జ్వలద్భిరివ పావకైః. 33
తేనాహం ప్రేషితో దూతస్త్వత్సకాశమిహాగతః,
త్వద్వియోగేన దుఃఖార్తః స త్వాం కౌశలమబ్రవీత్. 34

ప్ర. అ. విక్రమవాన్=పరాక్రమవంతు డైన, యః=ఏ రాముడు, నచిరాత్=అచిరకాలములో, రోషప్రముక్తైః=రోషముతో విడువబడిన, జ్వలద్భిః=ప్రకాశించుచున్న, పావకైః ఇవ=అగ్నుల వలె ఉన్న, ఇషుభిః=బాణములచేత, సంఖ్యే=యుద్ధమునందు, రావణమ్=రావణుని, వధిష్యతి=చంపగలడో, తేన=అట్టి రామునిచేత, దూతః=దూతగా, ప్రేషితః=పంపబడినవాడనై, ఇహ=ఇక్కడికి, త్వత్సకాశమ్=నీ సమీపమును, ఆగతః=వచ్చినాను. త్వద్వియోగేన=నీ వియోగముచేత, దుఃఖార్తః=దుఃఖముచేత పీడింపబడిన, సః=ఆ రాముడు, త్వామ్=నిన్ను గూర్చి, కౌశలమ్=కుశలవార్తను, అబ్రవీత్=పలికెను.

తా. పరాక్రమవంతు డైన ఏ రాముడు ఇంక అతిశీఘ్రముగానే, మండుచున్న అగ్నుల వలె ఉన్న బాణములను కోపముతో ప్రయోగించి, యుద్ధములో రావణుని సంహరించ నున్నాడో ఆ రాముడే నన్ను దూతగా చేసి నన్నిక్కడికి నీ దగ్గరకు పంపినాడు. అతడు నీ వియోగముతో చాలా బాధపడుచున్నాడు. అతడు నీ కుశలమును తెలిసికొన గోరుచున్నాడు. ౩౩, ౩౪

మూ. లక్ష్మణశ్చ మహాతేజాః సుమిత్రానన్దవర్ధనః,
అభివాద్య మహాబాహుః స త్వాం కౌశలమబ్రవీత్. ౩౫

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సుమిత్రానన్దవర్ధనః=సుమిత్ర యొక్క ఆనందమును వృద్ధిపొందించు, మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః లక్ష్మణశ్చ=ఆ లక్ష్మణుడు కూడా, త్వామ్=నిన్ను, అభివాద్య=నమస్కరించి, కౌశలమ్=క్షేమమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాతేజశ్శాలి, సుమిత్ర ఆనందమును వృద్ధిపొందించువాడు, మహాబాహువు అయిన ఆ లక్ష్మణుడు కూడ, నీకు నమస్కరించి నీ క్షేమవృత్తాంతమును అడిగినాడు (అడుగుచున్నాడు). ౩౫

మూ. రామస్య చ సఖా దేవి సుగ్రీవో నామ వానరః,
రాజా వానరముఖ్యానాం స త్వాం కౌశలమబ్రవీత్. ౩౬

ప్ర. అ. దేవి=ఓ దేవీ!, రామస్య=రామునియొక్క, సఖా=స్నేహితుడు, వానరముఖ్యానామ్=వానరశ్రేష్ఠులయొక్క, రాజా=రాజు అయిన,

సుగ్రీవో నామ=సుగ్రీవు డను పేరు గల, సః వానరః=ఆ వానరుడు, త్వామ్ = నిన్ను, కౌశలమ్=క్షేమమును, అబ్రవీత్=పలికెను.

తా. దేవి ! రాముని స్నేహితుడు, వానరరాజు అయిన ఆ సుగ్రీవుడు కూడ నీ క్షేమము అడిగినాడు (అడుగ మన్నాడు). ౩౬

మూ. నిత్యం స్మరతి రామస్త్వాం ససుగ్రీవః సలక్ష్మణః,
దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశమాగతా. ౩౭

ప్ర. అ. ససుగ్రీవః=సుగ్రీవునితో కూడిన, సలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, రామః=రాముడు, త్వామ్ = నిన్ను, నిత్యమ్=ఎల్లప్పుడూ, స్మరతి= స్మరించుచున్నాడు. వైదేహి=సీతా ! రాక్షసీవశమ్=రాక్షసస్త్రీవశమును, ఆగతా = చెందిన నీవు, దిష్ట్యా=దైవవశముచేత, జీవసి=జీవించి ఉన్నావు.

తా. రామలక్ష్మణసుగ్రీవులు నిత్యము నిన్నే స్మరించుచున్నారు. ఓ ! వైదేహీ ! రాక్షసస్త్రీల వశములో ఉన్నా నీవు దైవవశముచేత జీవించి ఉన్నావు. ౩౭

మూ. నచిరాద్ద్రక్ష్యసే రామం లక్ష్మణం చ మహాబలమ్,
మధ్యే వానరకోటీనాం సుగ్రీవం చామితౌజసమ్. ౩౮

ప్ర. అ. రామమ్=రాముణ్ణి, మహాబలమ్=గొప్పబలము గల, లక్ష్మణం చ = లక్ష్మణుణ్ణీ, వానరకోటీనామ్ = కోట్లకొలది వానరుల, మధ్యే = మధ్యయందున్న, అమితౌజసమ్=గొప్ప తేజస్సు గల, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణీ, నచిరాత్ = కొంచెము కాలములో, ద్రక్ష్యసే = చూడగలవు.

తా. నీవు కొద్ది దినములలోనే రాముణ్ణి, మహాబలు డైన లక్ష్మణుణ్ణి, కోట్ల కొలది వానరులతో కూడి వచ్చిన మహాతేజశాలి యైన సుగ్రీవుణ్ణి చూడగలవు.

మూ. అహం సుగ్రీవసచివో హనుమాన్నామ వానరః,
ప్రవిష్టో నగరీం లఙ్కాం లఙ్ఘయిత్వా మహోదధిమ్. ౩౯

ప్ర. అ. అహమ్ = నేను, సుగ్రీవసచివః = సుగ్రీవుని సచివుడ నైన, హనుమాన్నామ = హనుమంతు డను పేరు గల, వానరః = వానరుడను, మహో

దధిమ్ = మహాసముద్రమును, లఙ్ఘయిత్వా = దాటి, లఙ్కాం నగరీమ్ = లంకా నగరమును, ప్రవిష్టః = ప్రవేశించినాను.

తా. నేను సుగ్రీవుని సచివుఁడైన వానరుఁడను. నా పేరు హనుమంతుఁడు. మహాసముద్రమును దాటి లంకానగరములో ప్రవేశించినాను. 39

మూ. కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః,
త్వాం ద్రష్టుముపయాతోఽహం సమాశ్రిత్య పరాక్రమమ్.

ప్ర. అ. దురాత్మనః = దుష్టబుద్ధియైన, రావణస్య = రావణునియొక్క, మూర్ధ్ని = శిరస్సుమీఁద, పదన్యాసమ్ = పాదన్యాసమును, కృత్వా = చేసి, పరాక్రమమ్ = పరాక్రమమును, సమాశ్రిత్య = ఆశ్రయించి, అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఉపయాతః = వచ్చినాను.

తా. నేను పరాక్రమమును చూపుచు, దురాత్ముఁడైన రావణుని శిరస్సుపై పాదము ఉంచి, నిన్ను చూచుటకై వచ్చినాను. 40

మూ. నాహమస్మి తథా దేవి యథా మామవగచ్ఛసి,
విశఙ్కా త్యజ్యతామేషా శ్రద్ధత్స్వ వదతో మమ. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుస్త్రింశః సర్గః

ప్ర. అ. దేవి = ఓ దేవీ! మామ్ = నన్ను గూర్చి, యథా = ఎట్లు, అవగచ్ఛసి = తెలుసుకొనుచున్నావో (భావించుచున్నావో), అహమ్ = నేను, తథా = అట్లు, నాస్మి = కాను. ఏషా = ఈ, విశఙ్కా = సందేహము, త్యజ్యతామ్ = విడువఁబడుఁగాక. వదతః = చెప్పుచున్న, మమ = నాకు, శ్రద్ధత్స్వ = నమ్ముము.

తా. ఓ! దేవీ! నేను నీవు అనుకొన్నట్లు రావణుఁడను కాను. ఈ సందేహమును విడిచిపెట్టుము. నా మాట నమ్ముము. 41

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చత్రింశః సర్గః

[సీత కోరికను అనుసరించి హనుమంతుడు రాముని శరీర లక్షణములను, గుణములను వర్ణించి చెప్పి, నరవానరుల మైత్రి ఎట్లు జరిగెనో కూడ తెలిపి, ఆమెకు తనపై విశ్వాసము కలుగునట్లు చేయుట]

మూ. తాం తు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్,
ఉవాచ వచనం సాన్త్వమిదం మధురయా గిరా. 1

ప్ర. అ. వైదేహీ=సీత, వానరర్షభాత్=వానరశ్రేష్ఠుడైన హనుమంతుని నుండి, తామ్=ఆ, రామకథామ్=రామకథను, శ్రుత్వా=విని, మధురయా=మధురమైన, గిరా=వాక్కుతో (స్వరముతో), సాన్త్వమ్=బుజ్జగింపుగా ఉన్న ("సత్యమ్" అను ప్రాచ్యపాఠము బాగున్నది. 'యథార్థమైన' అని అర్థము), ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. సీత హనుమంతుడు చెప్పిన ఆ రామకథను విని, మధురస్వరముతో యథార్థమైన వచనమును ఇట్లు పలికెను. 1

మూ. క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్,
వానరాణాం నరాణాం చ కథమాసీత్సమాగమః. 2

ప్ర. అ. తే=నీకు, రామేణ=రామునితో, సంసర్గః=సంబంధము, క్వ=ఎక్కడ జరిగెను? లక్ష్మణమ్=లక్ష్మణుని, కథమ్=ఎట్లు, జానాసి=ఎరుగుదువు? వానరాణామ్=వానరులయొక్క, నరాణాం చ=నరులయొక్క, సమాగమః=సమాగమము, కథమ్=ఎట్లు, ఆసీత్=అయెను.

తా. సీత రామునితో సంబంధము ఎక్కడ కలిగినది? లక్ష్మణుని ఎట్లు ఎరుగుదువు? వానరులకూ, నరులకూ సంబంధము ఎట్లు ఏర్పడినది? 2

మూ. యాని రామస్య లిఙ్గాని లక్ష్మణస్య చ వానర,
తాని భూయః సమాచక్ష్వ న మాం శోకః సమావిశేత్. 3

ప్ర. అ. వానర = ఓ హనుమంతుడా! రామస్య = రామునియొక్క, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్క, యాని = ఏ, లిఙ్గాని = గుర్తులు కలవో, తాని = వానిని, సమాచక్ష్వ = చెప్పుము. మామ్ = నన్ను, భూయః = మరల, శోకః = శోకము, న సమావిశేత్ = చేరదు.

తా. ఓ హనుమంతుడా! రాముని లక్షణములను, లక్ష్మణుని లక్షణములను వర్ణించి చెప్పుము. అవి విన్నచో నన్ను మరల శోకము ఆవహించదు. 3

మూ. కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశమ్,
కథమూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే. 4

ప్ర. అ. తస్య = ఆ, రామస్య = రామునియొక్క, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్క, సంస్థానమ్ = ఆకారము, కీదృశమ్ = ఎట్టిది? రూపమ్ = రూపము, కీదృశమ్ = ఎట్టిది? ఊరూ = తొడలు, కథమ్ = ఎట్లు ఉండును? బాహూ = బాహువులు, కథమ్ = ఎట్లు ఉండును? మే = నాకు, శంస = చెప్పుము.

తా. ఆ రామలక్ష్మణుల ఆకారము ఎట్లు ఉండును? రూప మెట్లుండును? తొడలు ఎట్లుండును? బాహువులు ఎట్లుండును? నాకు చెప్పుము. 4

మూ. ఏవముక్తస్తు వైదేహ్యా హనుమాన్మారుతాత్మజః,
తతో రామం యథాతత్త్వమాఖ్యాతుముపచక్రమే. 5

ప్ర. అ. వైదేహ్యా = సీతచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, మారుతాత్మజః = వాయుకుమారుడైన, హనుమాన్ = హనుమంతుడు, తతః = పిమ్మట, రామమ్ = రాముని గూర్చి, యథాతత్త్వమ్ = ఉన్నది ఉన్నట్లుగా, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. వాయుకుమారుడైన హనుమంతుడు సీత మాట విని, రాముని గూర్చి ఉన్న దున్నట్లు వర్ణించి చెప్పుటకు ఉపక్రమించెను. 5

మూ. జానన్తీ బత దిష్ట్యా మాం వైదేహి పరిపృచ్ఛసి,
భర్తుః కమలపత్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ. 6

ప్ర. అ. కమలపత్రాక్షి = తామరరేకుల వంటి నేత్రములు కలదానా!

వైదేహి=సీతాదేవీ, జానన్తీ = తెలిసినదాన వగుచునే, దిష్ట్యా=నా భాగ్యముచేత, భర్తుః = భర్తయొక్క, లక్ష్మణస్య చ=లక్ష్మణునియొక్క, సంస్థానమ్=ఆకారమును, పరిపృచ్ఛసి = అడుగుచున్నావు. అత=ఎంత ఆనందము.

రా. కమలపత్రముల వంటి నేత్రములు గల ఓ! సీతాదేవీ! నా అదృష్టముచే, నీవు తెలిసి ఉండి కూడ నీ భర్త యైన రాముని ఆకారమునూ, లక్ష్మణుని ఆకారమునూ గూర్చి అడుగుచున్నావు. చాల సంతోషము. 6

మూ. యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ యాని వై,
లక్షితాని విశాలాక్షి వదతః శృణు తాని మే. 7.

ప్ర. అ. విశాలాక్షి = విశాలము లైన నేత్రములు కలదానా! రామస్య= రామునియొక్క, యాని లక్షణాని=ఏ లక్షణములు, లక్ష్మణస్య చ=లక్ష్మణుని యొక్క, యాని=ఏ లక్షణములు, లక్షితాని = చూడబడినవో, తాని = వానిని, వదతః=చెప్పుచున్న, మే=నాకు (నానుండి), శృణు=వినుము.

రా. ఓ! విశాలాక్షీ! నేను గుర్తించిన రాముని లక్షణములనూ, లక్ష్మణుని లక్షణములనూ చెప్పెదను; వినుము. 7

మూ. రామః కమలపత్రాక్షః సర్వసత్త్వమనోహరః,
రూపదాక్షిణ్యసంపన్నః ప్రసూతో జనకాత్మజే. 8

ప్ర. అ. జనకాత్మజే = ఓ! జనకరాజపుత్రీ! రామః = రాముడు, కమలపత్రాక్షః=కమలపత్రముల వంటి నేత్రములు కలవాడు. సర్వసత్త్వమనోహరః= సమస్తప్రాణుల మనస్సును ఆకర్షించువాడు. రూపదాక్షిణ్యసంపన్నః=రూపముతోను దాక్షిణ్యముతోను (నేర్పుతోను) కూడినవాడుగా, ప్రసూతః=కనబడినాడు (పుట్టినాడు).

రా. సీతా! రాముని కండ్లు పద్మముల రేకుల వలె విశాల మైనవి. అతడు సమస్త మైన ప్రాణుల మనస్సును ఆకర్షించు సౌందర్యము కలవాడు. అతడు పుట్టుక తోనే మంచి రూపముతోను, దాక్షిణ్యముతోను జనించినాడు. 8

మూ. తేజసాదిత్యసంకాశః క్షమయా పృథివీసమః,
బృహస్పతిసమో బుద్ధ్యా యశసా వాసవోపమః. 9

ప్ర. అ. తేజసా = తేజస్సుచేత, ఆదిత్యసంకాశః = సూర్యునితో సమానుడు. క్షమయా = ఓర్పుచేత, పృథివీసమః = భూమితో సమానుడు. బుద్ధ్యా = బుద్ధిచేత, బృహస్పతిసమః = బృహస్పతితో సమానుడు. యశసా = కీర్తిచేత, వాసవోపమః = దేవేంద్రునితో సమానుడు.

తా. రాముడు తేజస్సుచేత సూర్యునితోను, ఓర్పుచేత భూమితోను, బుద్ధిచేత బృహస్పతితోను, కీర్తిచేత దేవేంద్రునితోను సమానుడు. 9

మూ. రక్షితా జీవలోకస్య స్వజనస్యాభిరక్షితా,
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః. 10

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించు ఆ రాముడు, జీవలోకస్య = ప్రాణిలోకమునకు, రక్షితా = రక్షకుడు. స్వజనస్య = తనవారికి, అభిరక్షితా = అధికముగా, రక్షకుడు. స్వస్య = తనసంబంధమైన, వృత్తస్య = చరిత్రకు, ధర్మస్య చ = ధర్మమునకు, రక్షితా = రక్షకుడు.

తా. శత్రుసంహారకుడైన రాముడు ప్రపంచకములోని ప్రాణులందరినీ, విశేషించి తనవారినీ, తన నడవడికనూ, ధర్మమునూ బాగుగా రక్షించుచుండును.

మూ. రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా,
మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చ సః. 11

ప్ర. అ. భామిని = సీతా, రామః = రాముడు, లోకస్య = ప్రపంచకమునకు, చాతుర్వర్ణ్యస్య = నాలుగు వర్ణములకు. రక్షితా = రక్షకుడు. సః = అతడు, లోకానామ్ = లోకముల, మర్యాదానామ్ = కట్టుబాట్లకు. కర్తా = చేయువాడు, కారయితా చైవ = చేయించేవాడు కూడ.

తా. ఓ సీతా! రాముడు ఈ సమస్త ప్రపంచకమును, నాలుగు వర్ణములవారినీ రక్షించుచుండును. లోకములో కట్టుబాట్లు ఏర్పరచి అందరూ ఆ కట్టుబాట్లకు లొంగి ఉండునట్లు చూచుచుండును. 11

మూ. అర్చిష్మానర్చితోఽత్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః,
సాధూనాముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్. 12

ప్ర. అ. అర్చిష్మాన్ = కాంతి గలవాడు. అత్యర్థమ్ = మిక్కిలి, అర్చితః = పూజింపబడినవాడు. బ్రహ్మచర్యవ్రతే = బ్రహ్మచర్యవ్రతమునందు, స్థితః = ఉన్నవాడు. సాధూనామ్ = సత్పురుషులయొక్క, ఉపకారజ్ఞః = ఉపకారమును ఎరిగినవాడు. కర్మణామ్ = కర్మలయొక్క, ప్రచారజ్ఞశ్చ = ప్రవృత్తిని కూడ ఎరిగినవాడు.

తా. రాముడు కాంతిమంతుడు. మిక్కిలి గౌరవింపబడినవాడు. బ్రహ్మచర్యవ్రతములో ఉన్నవాడు. సత్పురుషులకు ఉపకార మెట్లు చేయవలెనో తెలిసినవాడు. ఆయా కర్మల ప్రయోజనము, ఫలితము తెలిసినవాడు. అనగా ఏ పని చేసిన ఎట్టి ఫలితము కలుగునో ఊహింప గలవాడు. 12

మూ. రాజవిద్యావినీతశ్చ బ్రాహ్మణానాముపాసితా,
శ్రుతవాన్ శీలసంపన్నో వినీతశ్చ పరంతపః. 13

ప్ర. అ. రాజవిద్యావినీతశ్చ = రాజవిద్యలో శిక్షణ పొందినవాడు, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులకు, ఉపాసితా = గౌరవించువాడు, శ్రుతవాన్ = శాస్త్రాభ్యాసము కలవాడు. శీలసంపన్నః = మంచి శీలముతో కూడినవాడు. వినీతః = వినయవంతుడు, పరంతపః = శత్రువులను పీడించువాడు.

తా. రాముడు రాజనీతిని చక్కగా అభ్యసించెను. బ్రాహ్మణుల విషయమున గౌరవము చూపును. విద్యాశీల సంపన్నుడు. వినయవంతుడు. శత్రువులను పీడించువాడు. 13

మూ. యజుర్వేదవినీతశ్చ వేదవిద్భిః సుపూజితః,
ధనుర్వేదే చ వేదేషు వేదాఙ్గేషు చ నిష్ఠితః. 14

ప్ర. అ. యజుర్వేదవినీతశ్చ = యజుర్వేదమునందు శిక్షణము పొందినవాడు. వేదవిద్భిః = వేదవేత్తలచేత, సుపూజితః = బాగుగా పూజింపబడినవాడు. ధనుర్వేదే చ = ధనుర్వేదమునందు. వేదేషు = ఇతర వేదములయందు, వేదాఙ్గేషు చ = వేదాంగములయందు, నిష్ఠితః = ప్రవీణుడు.

తా. రాముడు స్వశాఖ యైన యజుర్వేదమును చక్కగా అధ్యయనము చేసెను. వేదవేత్త లందరు అతనిని గౌరవించుచుందురు. ధనుర్వేదమునందు,

పొందిన మూడు వేదములందు, ఉపవేదములందు, వేదాంగములయందు పాండిత్యము కలవాడు. 14

మూ. విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవః శుభాననః,
గూఢజత్రుః సుతామ్రాక్షో రామో దేవి జనైః శ్రుతః. 15

ప్ర. అ. దేవి = ఓ దేవీ! రామః = రాముడు. విపులాంసః = విశాలము లైన భుజములు కలవాడు. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు. కమ్బుగ్రీవః = శంఖము వంటి కంఠము గలవాడు. శుభాననః = మంగళప్రద మైన ముఖము కలవాడు. గూఢజత్రుః = పైకి కనబడని మూపుల సంధి యెముకలు కలవాడు. సుతామ్రాక్షః = అంత మైన ఎఱ్ఱని నేత్రములు కలవాడు. జనైః = జనులచేత, శ్రుతః = వినబడినవాడు.

తా. రాముని భుజములు విశాలమైనవి. బాహువులు దీర్ఘమైనవి. కంఠము శంఖాకారములో ఉండును. ముఖము మంగళప్రద మైనది. మూపు సంధి ఎముకలు పైకి కనబడవు. సుందరము లైన ఆఱ్ఱని నేత్రములు ఎఱ్ఱగా ఉండును. రాముని గూర్చి విననివారు లోకములో లేరు. 15

మూ. దున్దుభిస్వననిర్ఘోషః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,
సమః సమవిభక్తాఙ్గో వర్ణం శ్యామం సమాశ్రితః. 16

ప్ర. అ. దున్దుభిస్వననిర్ఘోషః = దుందుభిధ్వని వంటి కంఠధ్వని కలవాడు. స్నిగ్ధవర్ణః = నిగనిగలాడు శరీరచ్ఛాయ గలవాడు. ప్రతాపవాన్ = ప్రతాపవంతుడు. సమః = పొట్టిగా గాని, పొడవుగా గాని కాక సమముగా ఉన్నవాడు. సమవిభక్తాఙ్గః = సమముగా విభజింపబడిన అవయవములు కలవాడు. శ్యామమ్ = నల్లని, వర్ణమ్ = వర్ణమును, సమాశ్రితః = ఆశ్రయించినవాడు.

తా. రాముని కంఠధ్వని దుందుభిధ్వని వలె గంభీరముగా ఉండును. రంగు నిగనిగ లాడుచుండును. అతడు గొప్ప ప్రతాపము గలవాడు. (పొట్టి పొడవులు లేక) సమముగా ఉండును. అతని అవయవము లన్నీ సమముగా విభక్తము లై ఉండును. అతని శరీరచ్ఛాయ శ్యామము (చామన). 16

మూ. త్రిస్థిరః త్రిప్రలమ్బశ్చ త్రిసమస్త్రిషు చోన్నతః,
త్రితామ్రస్త్రిషు చ స్నిగ్ధో గమ్భీరస్త్రిషు నిత్యశః. 17

ప్ర. అ. (రాముడు), త్రిస్థిరః = వక్షస్థలము, ముంజేయి, పిడికిలి అను మూడింటియందు స్థైర్యము కలవాడు. "ఉరశ్చ మణిబన్ధశ్చ ముష్టిశ్చ నృపతేః స్థిరాః" అని సాముద్రికశాస్త్రప్రకారము ఇది రాజలక్షణము. త్రిప్రలమ్బశ్చ = కనుబొమ్మలు, ముష్కములు, బాహువులు అను మూడింటియందు దీర్ఘత్వము కలవాడు. "ప్రలమ్బా యస్య స ధనీ భ్రువౌ ముష్కౌ చ బాహవః" అని ఇది ధనికలక్షణముగా చెప్పబడినది. త్రిసమః = తలవెంట్రుకలు, ముష్కములు, మోకాళ్ళు అను మూడింటియందు హెచ్చుతగ్గులు లేకుండా సమముగా ఉన్నవాడు. "కేశాగ్రం వృషణం జాను సమా యస్య స భూపతిః" అని ఇది రాజలక్షణము. త్రిషు = బొడ్డు, క్రిందికడుపు, వక్షస్థలము అను మూడింటియందు, ఉన్నతః = ఎత్తైనవాడు (బొరవు గలవాడు). "నాభ్యస్తాయుక్షవక్షోభి రున్నతః క్షితిపో భవేత్" అని ఇదికూడ రాజలక్షణము, త్రితామ్రః = నేత్రాంతములు, గోళ్లు, అరచేతులు - అరకాళ్ళు అను మూడింటియందు ఎఱ్ఱగాఉన్నవాడు. "నేత్రాన్త నఖపాణ్యంఘ్రితలై స్తామ్రైః సుఖీ భవేత్" - అని ఇది సుఖవంతుని లక్షణము. త్రిషు చ = పాదములయం దున్న రేఖలు, తలవెంట్రుకలు లింగమణి అను మూడింటియందు, స్నిగ్ధః = నునుపుకలవాడు. "స్నిగ్ధా భవన్తి త్వే యేషాం పాదరేఖాః శిరోరుహాః తథా లిఙ్గమణి స్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్" అని ఇది మహాభాగ్యవంతుని లక్షణము. నిత్యశః = ఎల్లప్పుడూ, త్రిషు = కంఠధ్వని, నడక, నాభి అను మూడింటియందు, గమ్భీరః = గంభీరుడు (నాభిలో గాంభీర్య మనగా లోతు). "స్వరే గతౌ చ నాభౌ చ గమ్భీరస్త్రిషు శస్యతే" అని ఇది ప్రశంసాపాత్రుని లక్షణము.

తా. రాముని వక్షస్థలము, ముంజేయి, పిడికిలి స్థిరముగా ఉండును. అతని కనుబొమ్మలు, ముష్కములు, బాహువులు దీర్ఘములు. కేశములు, ముష్కములు, మోకాళ్లు హెచ్చుతగ్గులు లేకుండా ఉండును. నాభి, కడుపు క్రింది భాగము, వక్షస్థలము బొరవుగా ఉండును. నేత్రాంతములు, గోళ్లు, అరచేతులు అరకాళ్లు ఎఱ్ఱగా ఉండును. పాదరేఖలు, కేశములు, లింగమణి నున్నగా ఉండును. కంఠధ్వని, నడక, నాభి గంభీరముగా ఉండును. 17

మూ. త్రివలీవాంస్త్ర్యవనతశ్చతుర్వ్యఙ్గస్త్రిశీర్షవాన్,
చతుష్కలశ్చతుర్లేఖశ్చతుష్కిష్కుశ్చతుస్సమః. 18

త్రి. ఆ. త్రివలీవాన్ = ఉదరమునందు మూడు ముడతలు కలవాడు. త్ర్యవనతః = స్తనములు, స్తనాగ్రములు, రేఖలు అను మూడింటియందు లోతైన వాడు. "పీనోన్నతైర్నిమ్నైః శుభవరయుక్చూచుకైః స్తనైః సుభగః. స్నిగ్ధా నిమ్నా రేఖా ధనినాం తద్వ్యత్యయేన నిస్స్వానామ్" అని చెప్పినట్లు బలిసి వర్తులముగా స్తనము లుండుట రాజలక్షణము. స్తనాగ్రములు లోతుగా ఉండుట ధనిక లక్షణము. రేఖలు సున్నగా లోతుగా ఉండుట ధనికలక్షణము. తద్భిన్నముగా ఉండుట దరిద్రలక్షణము. చతుర్వ్యఙ్గః = కంఠము, లింగము, వీపు, పిక్క అను నాలుగు హ్రస్వములుగా ఉన్నవాడు. "గ్రీవా ప్రజననం పృష్ఠం హ్రస్వం జఙ్ఘా చ పూజ్యతే" అని చెప్పినట్లు ఇవి పూజ్యాని లక్షణములు. త్రిశీర్షవాన్ = మూడు సుళ్లు శిరస్సునందు కలవాడు. "ఆవర్తత్రయరుచిరం యస్య శిరః స క్షితీశ్వరాం నేతా" అని ఇది రాజుల నాయకుని లక్షణము. చతుష్కలః = నాలుగు వేదములను సూచించు రేఖలు కలవాడు. "మూలేఽఙ్గుష్ఠస్య వేదానాం చతస్రస్తిస్ర ఏవ వా, ఏకా ద్వే వా యథాయోగం రేఖా జ్ఞేయా ద్విజన్మనామ్" అని చెప్పుటచే అంగుష్ఠము మొదట్లో ఎన్ని రేఖ లుండునో అన్ని వేదములలో ప్రావీణ్య ముండును. చతుర్లేఖః = నాలుగు రేఖలు కలవాడు. "లలాటే యస్య దృశ్యన్తే చతుస్త్రిద్వ్యేకరేఖికాః, శతద్వయం శతం షష్టిస్తస్యాయుర్వింశతి స్తథా" (లలాటముమీద ఒక రేఖ ఉన్నచో ఇరవై సంవత్సరములు, మూడు ఉన్నచో అరవై సంవత్సరములు, రెండు ఉన్నచో నూరు సంవత్సరాలు నాలుగు ఉన్నచో రెండు వందల సంవత్సరాలు ఆయుర్దాయము). "యస్య పాదతలే వజ్రధ్వజాఙ్కుశపద్మాః, రేఖాః సమ్యక్ ప్రకాశన్తే మనుజేన్ద్రం తమాదిశేత్" (అరకాలిలో వజ్ర-ధ్వజ-శంఖ-అంకుశముల ఆకారములుగ రేఖ లున్నవాడు మనుజేంద్రుడగును). "పాణౌ చతస్రో రేఖాశ్చ యస్య భిన్నస్త్వఙ్గురాః" (ఇట్టి నాలుగు రేఖలు విరిగిపోకుండగా చేతిలో ఉన్నవాడు కూడ మనుజేంద్రు డగును). ఈ విధముగా ఆ యా అవయవములలో నాలుగేసి రేఖలు కలవా డని అర్థము. చతుష్కిష్కుః = నాలుగు హస్తముల ప్రమాణము కలవాడు. ఇరవైనాలుగు అంగుళములు ఒక హస్తము. అందుచేత తొంబైఆరు అంగుళములు ఎత్తైనవాడు అని అర్థము. "షణ్ణవత్యఙ్గులోత్సేధో యః పుమాన్ స దివౌకసః" (తొంభైఆరు అంగుళాలు పొడవైనవాడు దేవతలతో సమానుడు). చతుస్సమః = బాహువులు, మోకాళ్లు, తొడలు, పిక్కలు అను నాల్గింటియందు సమముగా హెచ్చు తగ్గులు లేకుండా ఉన్నవాడు. "బాహూ జానూరుజఙ్ఘాశ్చ చత్వార్యేత సమాని చ".

తా. రాముని ఉదరముపై మూడు ముడత లున్నవి. అతని స్తనములు, స్తనాగ్రములు, రేఖలు పల్లముగా ఉండును. కంఠము, లింగము, వీపు, పిక్కలు హ్రస్వములుగా ఉండును. అతని తలపై మూడు సుళ్లు ఉండును. అంగుష్ఠము మొదట నాలుగు రేఖ లుండును. అతని నుదుటిపైన, అరచేతులందును, అరకాళ్ల లోను నాలుగేసి రేఖలు ఉండును. అతడు తొంబదియారు అంగుళముల ఎత్తు ఉండును. అతని బాహువులు, మోకాళ్లు, తొడలు, పిక్కలు సమానములుగా ఉండును

వి. "స్థిరా త్రిరేఖా సుతగోపపన్నా స్నిగ్ధా సుమాంసోపచితా సువృత్తా, నచాతిదీర్ఘా చతురఙ్గులా చ గ్రీవా చ దీర్ఘా త్రివలీహ ధన్యా" (కంఠము స్థిరముగా, మూడురేఖలతో అంద మైనదై, సుందర మై, బలిసి గుండ్రముగా ఉండవలెను. ఎక్కువ పొడవుగా ఉండకూడదు. నాలుగు అంగుళముల పొడవు ఉండవలెను) అని చెప్పినట్లు "త్రివలీవాన్" అనుదానికి కంఠముపైన మూడు రేఖలు కలవాడు అని కూడ అర్థము వ్యాఖ్యానములలో ఉన్నది. స్తనములు పల్లముగా ఉన్నవి అనగా అర్థ మేమో తెలియలేదు. 18

మూ. చతుర్దశసమద్వన్ద్వశ్చతుర్దంష్ట్రశ్చతుర్గతిః,
మహోష్ఠహనునాసశ్చ పఞ్చస్నిగ్ధోఽష్టవంశవాన్. 19

ప్ర. అ. చతుర్దశసమద్వన్ద్వః = పదునాలుగు జతలు సమముగా (హెచ్చు తగ్గులు లేకుండా) ఉన్నవాడు. రెండేసిగా ఉన్న కనుబొమ్మలు, ముక్కు రంధ్రములు, నేత్రములు, చెవులు, పెదవులు, స్తనాగ్రములు, మోచేతులు, ముంజేతులు, మోకాళ్లు, ముష్కములు, చేతులు, పాదములు, పిరుదులపై ఎత్తైన కండరములు, హెచ్చుతగ్గులు లేకుండా ఉన్న వని అర్థము. "భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణావోష్ఠౌ చ చూచుకే, కూర్పరౌ మణిబన్ధౌ చ జానునీ వృషణౌ కటీ, కరౌ పాదౌ స్ఫిచౌ యస్య సమౌ జ్ఞేయః స భూపతిః" అని చెప్పిన విధముగ ఇవి రాజలక్షణములు. చతుర్దంష్ట్రః = నాలుగు కోరలు (వాడిగా ఉన్న దంతాలు) కలవాడు. పండ్లవరుసలు రెండింటిలో మధ్య ఉన్న నాలుగు పండ్లకు ప్రక్క ఉన్న నాలుగు పండ్లకు దంష్ట్ర లని పేరు. కాంతి గలవి, పెద్దవి, తీక్ష్ణ మైనవి, సమములు అయిన దంష్ట్రలు మంగళకరము లని చెప్పబడినది. "స్నిగ్ధా ఘనాశ్చ దశనాః సుతీక్ష్ణదంష్ట్రాః సమాశ్చ శుభాః". చతుర్గతిః = నాలుగు మృగముల

నడక వంటి. అనగా సింహము, పెద్దపులి, ఏనుగ, వృషభము-వీని నడకవంటి నడక గలవాడు. మహోష్ఠహనునాసశ్చ = పెద్దవైన, (అనగా కొట్టవచ్చినట్లు అందముగా కనబడే) పెదవులు, గడ్డము, ముక్కు కలవాడు. "బంధుజీవకుసుమ ప్రవాలోదరో మాంసలో రుధిరబిమ్బరూపధృక్, పూర్ణమాంసలహనుస్తు భూమిప స్తుఙ్గతుఙ్గరుధిరాకృతిస్తథా" (మంకెనపువ్వు వంటి రంగుతో ఒలిసి మనోహర మై, దొండపండు ఆకారముతో ఉన్న అధరోష్ఠము, బలిసి నిండుగా ఉన్న గడ్డము, ఎత్తైన ముక్కు ఉన్నవాడు రాజగును అని చెప్పబడినది. పఞ్చస్నిగ్ధః = కాంతితో నిగనిగలాడుచుండు నేత్రములు, దంతములు, చర్మము, పాదాలు, కేశాలు అను ఈ ఐదు కలవాడు, "చక్షుః స్నేహేన సౌభాగ్యం దన్తస్నేహేన భోజనమ్, త్వచః స్నేహేన శయనం పాదస్నేహేన వాహనమ్ "స్నిగ్ధనిమ్నరుతుశ్చైరా స్తథా మూర్ధజాః సుఖకరాః". నేత్రములు నిగనిగలాడువారికి సౌభాగ్యము. దంతములు నిగనిగలాడువారికి మంచి భోజనము, చర్మము నిగనిగలాడువారికి మంచి శయనము, పాదములు నిగనిగలాడువారికి వాహనసౌఖ్యము, నల్లగా, మెల్లగా, వంకరగా నిగనిగలాడు కేశములు కలవానికి సుఖము కలుగును) అని సాముద్రికశాస్త్రము. అష్టవంశవాన్ = అందమైన ఎనిమిది వంశకములు కల వాడు. రెండు చేతులు, కాలివ్రేళ్ళు, చేతివ్రేళ్ళు, రెండు తొడలు, రెండు పిక్కలు. వీనికి వంశకము అని పేరు. "బాహూ చ నంతౌ చోరూ జఙ్ఘే చేత్యష్టవంశకాః".

తా. రాముని కనుబొమ్మలు, నాసికారంధ్రములు, నేత్రములు, చెవులు, పెదవులు, స్తనాగ్రములు, మోచేతులు, మణికట్లు, మోకాళ్ళు, ముష్కములు, పిరుదులు, చేతులు, పాదములు, పిరుదులపై ఎత్తైన కండరములు— జంటలుగా ఉన్న ఈ అన్ని అంగములూ సమములుగా ఉండును. అందమైన నాలుగు దంష్ట్రలు ఉండును. అతడు సింహము వలె, పెద్దపులి వలె, ఏనుగ వలె వృషభము వలె నడచును. అతని పెదవులు, గడ్డము, ముక్కు, చాల అందముగా ఉండును. అతని కండ్లు, పండ్లు, చర్మము, పాదములు, కేశములు, నిగనిగలాడుచుండును. అతని బాహువులు, వ్రేళ్ళు, తొడలు, పిక్కలు అను అష్టవంశములు తీర్చిదిద్దిన ట్లుండును. 19

మూ. దశపద్మో దశబృహత్ త్రిభిర్వ్యాప్తో ద్విశుక్లవాన్,
షడున్నతో నవతనుస్త్రిభిర్వ్యాప్నోతి రాఘవః. 20

ప్ర. అ. రాఘవః = రాముడు, దశపద్మః=పద్మము వలె ఉన్న ముఖము, నేత్రములు, నోరు, నాలుక, పెదవులు, దవడలు, స్తనములు, గోళ్లు, హస్తములు, పాదములు అను పది అవయవములు కలవాడు. "ముఖనేత్రాస్యజిహ్వోష్ఠ తాలుస్తనసఖాః కరౌ, పాదౌ చ దశ పద్మాని పద్మాకారాణి యస్య చ" అని సాముద్రికశాస్త్రము. దశబృహత్ = శిరస్సు, లలాటము, చెవులు, కంఠము, వక్షము, హృదయము, నోరు, చేతులు, కాళ్లు, వీపు అను ఈ పది అవయవములు పెద్దవిగా ఉన్నవాడు. "శిరోలలాటే శ్రవణే గ్రీవా వక్షశ్చ హృత్తథా, ఉదరం పాణిపాదౌ చ పృష్ఠం దశ బృహన్తి చ". త్రిభిః = తేజస్సు, యశస్సు, లక్ష్మి అను మూడింటిచేత; వ్యాప్తః=(లోకమును) వ్యాపించినవాడు. "త్రిభిర్వ్యాప్తశ్చ యస్య స్యాత్తేజసా యశసా శ్రియా". ద్విశుక్లవాన్=శుద్ధములైన మాతృవంశపితృవంశములు కలవాడు. "ద్వే శుక్లే తు శుభే శుద్ధే వంశౌ మాతుః పితుస్తథా" అని శాస్త్రము. షడున్నతః = చంకలు, కడుపు, వక్షము, ముక్కు, మూపు, లలాటము అను ఆరు అంగములు ఉన్నతములైనవి కలవాడు, "కక్షః కుక్షిశ్చ వక్షశ్చ ఘ్రాణస్కన్ధౌ లలాటికా, సర్వభూతేషు నిర్దిష్టా ఉన్నతాఙ్గాః శుభప్రదాః" అని సాముద్రికము. నవతనుః = తొమ్మిదింట సూక్ష్మమైనవాడు. వ్రేళ్ల కణుపులు, వెండ్రుకలు, రోమములు, గోళ్లు, చర్మము, లింగము, పీనము, దృష్టి, బుద్ధి సూక్ష్మములుగా (సన్నగా అని అవయవముల పక్షమునందు, దృష్టి బుద్ధిపక్షమునందు మంచి చురుకు గలవని అర్థము) ఉండవలెనని సాముద్రికశాస్త్రము. "సూక్ష్మాణ్యఙ్గులిపర్వాణి కేశరోమనఖత్వచః, శేఫశ్చ యేషాం సూక్ష్మాణి తే నరా దీర్ఘజీవినః" "అస్ఫుటితాగ్రం సూక్ష్మం శ్మశ్రు శుభం మృదు చ సంతతం స్నిగ్ధమ్" "సూక్ష్మదృక్ సూక్ష్మబుద్ధిశ్చ యో నరః స సుఖీ భవేత్" త్రిభిః=పూర్వాహ్ణమధ్యాహ్నకాలము లను మూడింటిచేత, వ్యాప్నోతి =(ధర్మార్థ కామములను) పొందుచున్నాడు.

తా. రాముని ముఖము, కండ్లు, నోరు, నాలుక, పెదవులు, దవడలు, స్తనములు, గోళ్లు, హస్తములు, పాదములు- ఈ పదీ పద్మములవలె ఉండును. శిరస్సు, లలాటము, చెవులు, కంఠము, వక్షము, హృదయము, కడుపు, చేతులు, కాళ్లు, వీపు-ఈ పదీ పెద్దవిగా ఉండును. తేజస్సు, కీర్తి, సంపద అను ఈ మూడింటిచేత లోకము నంతను వ్యాపించినాడు. అతని మాతృపితృవంశములు రెండూ కూడ పరిశుద్ధమైనవి. చంకలు, కడుపు, వక్షము, ముక్కు,

మూపు, లలాటము ఈ మూడు ఉన్నతము లై ఉండును. అతని వ్రేళ్లు కణుపులు, తలవెండ్రుకలు, రోమములు, గోళ్లు, చర్మము, లింగము, మీసము, దృష్టి, బుద్ధి అను తొమ్మిది సూక్ష్మములుగా ఉండును. అతడు పూర్వాహ్ణమధ్యాహ్నాపరాహ్ణములయందు ధర్మార్థకామములను సంపాదించుచుండును. 20

మూ. సర్వధర్మపరః శ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః,
దేశకాలవిభాగజ్ఞః సర్వలోకప్రియంవదః. 21

ప్ర. అ. సర్వధర్మపరః=సర్వధర్మములందు ఆసక్తి కలవాడు. శ్రీమాన్ =శ్రీమంతుడు. సంగ్రహానుగ్రహే = జనులను చేరదీయుటయందు వారిని అనుగ్రహించుటయందు, రతః=ఆసక్తి గలవాడు. దేశకాలవిభాగజ్ఞః=దేశకాలముల విభాగమును ఎరిగినవాడు. సర్వలోకప్రియంవదః = అందరికి ప్రియముగా మాటలాడువాడు.

తా. రాముడు సర్వధర్మములందు ఆసక్తి కలవాడు. శ్రీమంతుడు. జనులను దగ్గరకు తీయుటయందు, వారిని అనుగ్రహించుటయందు ఆసక్తి కలవాడు. దేశకాలముల యుక్తాయుక్తత్వముల (మంచిచెడ్డల) జ్ఞానము కలవాడు. అందరికి ప్రియముగా మాటలాడువాడు. 21

మూ. భ్రాతా తస్య చ ద్వైమాత్రః సౌమిత్రిరపరాజితః,
అనురాగేణ రూపేణ గుణైశ్చైవ తథావిధః. 22

ప్ర. అ. తస్య = ఆ రామునియొక్క, ద్వైమాత్రః = సవతితల్లి కుమారుడైన, భ్రాతా = సోదరుడైన, అపరాజితః = ఎవ్వరిచేతను పరాజితుడు కాని, సౌమిత్రిః = లక్ష్మణుడు. అనురాగేణ = అనురాగముచేత, రూపేణ = రూపముచేత, గుణైశ్చైవ = గుణములచేత, తథావిధః = ఆ రామునివంటివాడు.

తా. ఎవ్వరిచేతను పరాజితుడు కాని లక్ష్మణుడు రాముని సవతితల్లి కుమారుడైన సోదరుడు. అతడు అనురాగముచేత, రూపముచేత, గుణములచేత కూడ రాముని వంటి వాడే.

వి. గోరఖ్‌పూర్ ప్రతిలో "స సువర్ణచ్ఛవిః శ్రీమాన్ రామః శ్యామో మహాయశాః" అను పాదద్వయము అధికముగా ఉన్నది. ఆ లక్ష్మణుడు బంగారువన్నె వాడు. రాముడు శ్యామవర్ణుడు. 22

మూ. రాఘవౌ నరశార్దూలౌ త్వద్దర్శనసముత్సుకౌ,
విచిన్వన్తౌ మహీం కృత్స్నామస్మాభిరభిసంగతౌ. 24

ప్ర. అ. నరశార్దూలౌ = నరశ్రేష్ఠులైన, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరూ, త్వద్దర్శనసముత్సుకౌ = నీ దర్శనమునందు ఆసక్తి కలవారై, కృత్స్నామ్ = సమస్తమైన, మహీమ్ = భూమిని, విచిన్వన్తౌ = అన్వేషించుచున్నవారై, అస్మాభిః = మాతో, అభిసంగతౌ = కలిసినారు.

తా. మనుజులలో శ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణు లిద్దరూ నిన్ను చూచుటకు ఆసక్తితో భూమిపై అంతటా సంచరించుచు మమ్ములను కలుసుకొన్నారు.

మూ. త్వామేవ మార్గమాణౌ తౌ విచరన్తౌ వసుంధరామ్,
దదర్శతుర్మృగపతిం పూర్వజేనావరోపితమ్. 25
ఋశ్యమూకస్య పృష్ఠే తు బహుపాదపసంకులే,
భ్రాతుర్భయార్తమాసీనం సుగ్రీవం ప్రియదర్శనమ్. 26

ప్ర. అ. త్వామేవ = నిన్నే, మార్గమాణౌ = వెదకుచున్నవారై, వసుంధరామ్ = భూమిని, విచరన్తౌ = సంచరించుచున్న, తౌ = ఆ రామలక్ష్మణులు, బహుపాదపసంకులే = అనేకములైన వృక్షములతో వ్యాకులమైన, ఋశ్యమూకస్య పృష్ఠే = ఋశ్యమూకపర్వతము పైభాగమునందు, ఆసీనమ్ = కూర్చున్నవాడూ, పూర్వజేన = అన్నచేత, అవరోపితమ్ = సింహాసనమునుండి దింపివేయబడినవాడూ, భ్రాతుః = అన్ననుండి, భయార్తమ్ = భయముచేత పీడితుడూ, ప్రియదర్శనమ్ = ప్రియమైన దర్శనము గలవాడూ, మృగపతిమ్ = వానరప్రభువూ అయిన, సుగ్రీవమ్ = సుగ్రీవుని, దదర్శతుః = చూచిరి.

తా. నీ కోసమే భూమి నంతనూ వెదకుచు తిరుగుచున్న ఆ రామలక్ష్మణులు అనేకవృక్షములతో నిండిన ఋశ్యమూకపర్వతశిఖరమునందు కూర్చొని ఉన్న వానరప్రభువైన సుగ్రీవుని చూచిరి. చూచుటకు ఆనందమును కలిగించు ఆ సుగ్రీవుడు తన సోదరుడు రాజ్యమునుండి తొలగించుటచే అతనికి భయపడి ఆ పర్వతముపై నివసించుచుండెను. 25, 26

మూ. వయం తు హరిరాజం తం సుగ్రీవం సత్యసంగరమ్,
పరిచర్యాస్మహే రాజ్యాత్పూర్వజేనావరోపితమ్. 27

ప్ర. అ. వయం తు = మేమైతే, పూర్వజేన = అన్నచేత, రాజ్యాత్ = రాజ్యమునుండి, అవరోపితమ్ = దింపివేయబడిన, సత్యసంగరమ్ = సత్యమైన ప్రతిజ్ఞ గల, హరిరాజమ్ = వానరప్రభు వైన, తమ్ = ఆ, సుగ్రీవమ్ = సుగ్రీవుని, పరిచర్యామహే = సేవించుచున్నాము.

తా. సత్యమైన ప్రతిజ్ఞ గల ఆ సుగ్రీవుని అన్న రాజ్యభ్రష్టుని చేయగా మేము ఆ వానరరాజైన సుగ్రీవునే సేవించుచు ఉన్నాము. 27

మూ. తతస్తౌ చీరవసనౌ ధనుఃప్రవరపాణినౌ,
ఋశ్యమూకస్య శైలస్య రమ్యం దేశముపాగతౌ. 28

ప్ర. అ. తతః = అటుపిమ్మట, చీరవసనౌ = నారచీరలు ధరించినవారు, ధనుఃప్రవరపాణినౌ = శ్రేష్ఠము లైన ధనస్సులు హస్తములందు కలవారు అయిన, తౌ = ఆ రామలక్ష్మణులు, ఋశ్యమూకస్య శైలస్య = ఋశ్యమూక పర్వతముయొక్క, రమ్యమ్ = సుందర మైన, దేశమ్ = ప్రదేశమును గూర్చి, ఉపాగతౌ = వచ్చినారు

తా. ఇంతలో నారచీరలు ధరించి, శ్రేష్ఠము లైన ధనస్సులు చేతులలో ధరించి ఆ రామలక్ష్మణులు ఆ ఋశ్యమూకపర్వతప్రాంతమునకు వచ్చినారు.

మూ. స తౌ దృష్ట్వా నరవ్యాఘ్రౌ ధన్వినౌ వానరర్షభః,
అభిప్లుతో గిరేస్తస్య శిఖరం భయమోహితః. 29

ప్ర. అ. సః = ఆ, వానరర్షభః = వానరశ్రేష్ఠుడు, ధన్వినౌ = ధనుర్ధరులైన, తౌ = ఆ, నరవ్యాఘ్రౌ = నరశ్రేష్ఠులను, దృష్ట్వా = చూచి, భయమోహితః = భయముచేత ఆలోచన తప్పినవాడై, తస్య = ఆ, గిరేః = పర్వతముయొక్క, శిఖరమ్ = శిఖరమును గూర్చి, అభిప్లుతః = దుమికినాడు.

తా. వానరశ్రేష్ఠు డైన ఆ సుగ్రీవుడు ధనుర్ధరు లై వచ్చుచున్న, మనుష్యశ్రేష్ఠు లైన రామలక్ష్మణులను చూడగానే భయభ్రాంతు డై ఆ పర్వతము శిఖరము పైకి ఎక్కెను. 29

మూ. తతః స శిఖరే తస్మిన్వానరేన్ద్రో వ్యవస్థితః,
తయోః సమీపం మారుతేవ ప్రేషయామాస సత్వరమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ, వానరర్షభః = వానరశ్రేష్ఠుడు, తస్మిన్ = ఆ, శిఖరే = శిఖరమునందు, వ్యవస్థితః = నిలచినవాడై, మామేవ = = నన్నే, తయోః = ఆ ఇద్దరియొక్క, సమీపమ్ = సమీపమును, సత్వరమ్ = తొందరగా, ప్రేషయామాస = పంపెను.

తా. పిమ్మట ఆ సుగ్రీవుడు తాను ఆ పర్వతశిఖరముపైననే ఉండి, వారి దగ్గరకు నన్నే శీఘ్రముగా పంపినాడు. 30

మూ. తావహం పురుషవ్యాఘ్రౌ సుగ్రీవవచనాత్ప్రభూ,
రూపలక్షణసంపన్నౌ కృతాఞ్జలిరుపస్థితః. 31

ప్ర. అ. అహమ్ = నేను, సుగ్రీవవచనాత్ = సుగ్రీవుని వచనమువలన, పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులూ, ప్రభూ = సమర్థులూ, రూపలక్షణసంపన్నౌ = మంచి రూపముతోను, సల్లక్షణములతోను కూడినవారు అయిన, తౌ = ఆ రామలక్ష్మణులను, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడనై, ఉపస్థితః = = చేరితిని.

తా. సుగ్రీవాజ్ఞానుసారము నేను పురుషశ్రేష్ఠులు, సర్వసమర్థులు, సౌందర్యము, మంచిలక్షణములూ కలవారూ అయిన ఆ రామలక్ష్మణుల దగ్గరకు నమస్కరించుచు వెళ్ళినాను. 31

మూ. తౌ పరిజ్ఞాతతత్త్వార్థౌ మయా ప్రీతిసమన్వితౌ,
పృష్ఠమారోప్య తం దేశం ప్రాపితౌ పురుషర్షభౌ. 32

ప్ర. అ. పరిజ్ఞాతతత్త్వార్థౌ = తెలియబడిన యథార్థము గల, ప్రీతిసమన్వితౌ = సంతోషముతో కూడిన, పురుషర్షభౌ = పురుషశ్రేష్ఠులైన, తౌ = ఆ రామలక్ష్మణులు, మయా = నాచేత, పృష్ఠమ్ = వీపును, ఆరోప్య = అధిష్ఠింపచేసి, తం దేశమ్ = ఆ ప్రదేశమును, ప్రాపితౌ = పొందింపబడిరి.

తా. పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు సుగ్రీవుని గూర్చిన యథార్థవిషయము తెలిసికొని సంతోషించిరి. అప్పుడు నేను వారిని నా వీపు పైన ఎక్కించుకొని సుగ్రీవుడున్న చోటుకు తీసుకొనిపోయితిని. 32

మూ. నివేదితౌ చ తత్త్వేన సుగ్రీవాయ మహాత్మనే,
తయోరన్యోన్యసల్లాపాద్భృశం ప్రీతిరజాయత. 33

ప్ర. అ. మహాత్మనే = మహాత్ముడైన, సుగ్రీవాయ = సుగ్రీవునికొరకు, తత్త్వవద్యథార్థముగా, నివేదితౌ = తెలుపబడిరి. తయోః = వారిద్దరికి, అన్యోన్య సంలాపాత్ = పరస్పరము మాటలాడుకొనుటవలన, భృశమ్ = మిక్కిలి, ప్రీతిః = ప్రేమ, అజాయత = పుట్టెను.

తా. నేను మహాత్ముడైన సుగ్రీవునకు రామలక్ష్మణులను గూర్చిన యథార్థ విషయములను తెలిపితిని. పరస్పర సంభాషణానంతరము, రామసుగ్రీవు లిద్దరికి అన్యోన్యము స్నేహము కలిగెను. 33

మూ. తతస్తౌ ప్రీతిసంపన్నౌ హరీశ్వరనరేశ్వరౌ,
పరస్పరకృతాశ్వాసౌ కథయా పూర్వవృత్తయా. 34

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రీతిసంపన్నౌ = స్నేహముతో కూడిన, తౌ = ఆ, హరీశ్వరనరేశ్వరౌ = వానరాధిపతి యైన సుగ్రీవుడూ, నరాధిపతియైన రాముడు, పూర్వవృత్తయా = పూర్వము జరిగిన, కథయా = కథచేత, పరస్పర కృతాశ్వాసౌ = పరస్పరము చేయబడిన విశ్వాసము కలవా రైరి.

తా. ఈ విధముగా రామసుగ్రీవుల మధ్య స్నేహము ఏర్పడిన పిమ్మట, పూర్వము జరిగిన కథలను చెప్పుకొనుటచే వా రిద్దరికి పరస్పరము విశ్వాసము ఏర్పడినది. 34

మూ. తతః స సాన్త్వయామాస సుగ్రీవం లక్ష్మణాగ్రజః,
స్త్రీహేతోర్వాలినా భ్రాత్రా నిరస్తమురుతేజసా. 35

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ, లక్ష్మణాగ్రజః = రాముడు, ఉరుతేజసా = గొప్ప తేజస్సు గల, భ్రాత్రా = సోదరు డైన, వాలినా = వాలిచేత, నిరస్తమ్ = దూరముగా పంపివేయబడిన, సుగ్రీవమ్ = సుగ్రీవుని, సాన్త్వయామాస = ఓదార్చెను.

తా. పిమ్మట రాముడు సోదరుడూ, గొప్ప తేజస్సు కలవాడూ అయిన వాలిచేత, స్త్రీ నిమిత్తమై, (అనగా సుగ్రీవుని భార్యయైన రుమను వశము చేసుకొనుట కై) రాజ్యమునుండి వెడలగొట్టబడిన సుగ్రీవుని ఓదార్చెను. 35

మూ. తత స్త్రీనాశజం శోకం రామస్యాక్లిష్టకర్మణః.
లక్ష్మణో వానరేన్ద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్. 36

ప్ర. అ. తతః=అటు పిమ్మట, లక్ష్మణః=లక్ష్మణుడు, అక్లిష్టకర్మణః=శ్రమపడకుండా పనులుచేయు, రామస్య=రామునియొక్క, త్వన్నాశజమ్=నీవు కనబడకపోవుట వలన కలిగిన, శోకమ్=దుఃఖమును, వానరేన్ద్రాయ=వానరరాజైన, సుగ్రీవాయ=సుగ్రీవునకు, న్యవేదయత్=తెలిపెను.

తా. పిమ్మట, శ్రమపడకుండా పనులు సాధించు రామునికి, నీవు కనబడకపోవుటచేత కలిగిన దుఃఖమును గూర్చి లక్ష్మణుడు వానరప్రభు వైన సుగ్రీవునకు తెలిపెను. 36

మూ. స శ్రుత్వా వానరేన్ద్రస్తు లక్ష్మణేనేరితం వచః,
తదాసీన్నిష్ప్రభో ఽత్యర్థం గ్రహగ్రస్త ఇవాంశుమాన్.

ప్ర. అ. సః=ఆ. వానరేన్ద్రస్తు=సుగ్రీవు డైతే, లక్ష్మణేన=లక్ష్మణుని చేత, ఈరితమ్ = పలుకబడిన, వచః=వచనమును, శ్రుత్వా=విని, తదా=అప్పుడు, గ్రహగ్రస్తః=రాహువుచేత మ్రింగబడిన, అంశుమానివ=సూర్యుడు వలె, అత్యర్థమ్=మిక్కిలి, నిష్ప్రభః=కాంతి లేనివాడు, ఆసీత్=అయెను.

తా. ఆ సుగ్రీవుడు లక్ష్మణుడు చెప్పినది విని, రాహువు మ్రింగిన సూర్యుడు వలె మిక్కిలి కాంతివిహీను డయ్యెను. 37

మూ. తత స్త్వద్గాత్రశోభీని రక్షసా హ్రియమాణయా,
యాన్యాభరణజాలాని పాతితాని మహీతలే. 38
తాని సర్వాణి రామాయ ఆనీయ హరియూథపాః,
సంహృష్టా దర్శయామాసుర్గతిం తు న విదు స్తవ. 39

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రక్షసా=రాక్షసునిచేత, హ్రియమాణయా=హరింపబడుచున్న నీచేత, త్వద్గాత్రశోభీని=నీ శరీరమునందు శోభించు చున్న, యాని=ఏ, ఆభరణజాలాని=అలంకారముల సముదాయములు, మహీతలే, నేలపై, పాతితాని=పడవేయబడినవో, తాని సర్వాణి=వాటిని అన్నింటిని, ఆనీయ=తీసుకొని వచ్చి, హరియూథపాః=వానరనాయకులు, సంహృష్టాః=సంతోషించుచున్నవారై, రామాయ=రామునకు, దర్శయామాసుః=చూపించిరి. తవ=నీయొక్క, గతిం తు=గతి నైతే, న విదుః=ఎరుగ రైరి.

తా. రావణుడు హరించుచున్నప్పుడు సీత నీ శరీరముపై ప్రకాశించుచున్న ఏ అలంకారములను తీసి భూమిమీద పడవేసితివో వాటిని అన్నింటిని తీసికొనివచ్చి వానరనాయకులు, సంతోషపూర్వకముగా, రామునకు చూపించిరి. కాని నీ దారి మాత్రము వారికి తెలియకపోవుటచే చెప్పలేకపోయిరి. 38, 39.

మూ. తాని రామాయ దత్తాని మయైవోపహృతాని చ
స్వనవన్త్యవకీర్ణాని తస్మిన్విగతచేతసి. 40

ప్ర. అ. మయైవ = నాచేతనే, ఉపహృతాని = దగ్గరకు తీసికొని వెళ్ళబడినవై, తాని = ఆ అలంకారములు, రామాయ = రామునకు, దత్తాని = ఇవ్వబడినవి. తస్మిన్ = అతడు, విగతచేతసి = పోయిన మనస్సు కలవాడగుచుండగా, (మూర్ఛ చెందగా), స్వనవన్తి = ధ్వని గల ఆ ఆభరణములు, అవకీర్ణాని = చిమ్మివేయబడినవి.

తా. నేనే వాటిని రామునివద్దకు తీసికొనిపోయి అతనికి ఇచ్చితిని. అపుడు వాటిని గ్రహించగానే రాముడు మూర్ఛపోవుటచే అవి అన్నీ చప్పుడు చేయుచు నలుమూలలా చెల్లాచెదరై పడిపోయినవి. 40

మూ. తాన్యఙ్కే దర్శనీయాని కృత్వా బహువిధం తవ,
తేన దేవప్రకాశేన దేవేన పరిదేవితమ్. 41

ప్ర. అ. దర్శనీయాని = సుందరములైన, తవ = నీయొక్క, తాని = ఆ అలంకారములను, అఙ్కే = ఒడిలో, కృత్వా = ఉంచుకొని, దేవప్రకాశేన = దేవతాపురుషునితో సమానుడైన, తేన = ఆ, దేవేన = ప్రభువైన రామునిచేత, బహువిధమ్ = అనేకవిధములుగా, పరిదేవితమ్ = విలపించుట.

తా. దేవతాపురుషునితో సమానుడైన, ప్రభువైన ఆ రాముడు, నీ సుందరములైన ఆ ఆభరణములు ఒడిలో ఉంచుకొని పరిపరివిధముల విలపించెను. 41

మూ. పశ్యతస్తాని రుదతస్తామ్యతశ్చ పునః పునః,
ప్రాదీపయన్ దాశరథేస్తాని శోకహుతాశనమ్. 42

ప్ర. అ. తాని = వాటిని, పశ్యతః = చూచుచున్న, రుదతః = ఏడ్చు

చున్న, పునః పునః = మాటి మాటికి, తామ్యతః = పరితపించుచున్న, దాశ
రథేః = రామునియొక్క, శోకహుతాశనమ్ = శోకాగ్నిని, తాని = అవి, ప్రాదీప
యన్ = ప్రజ్వలింపచేసినవి.

తా. రాముడు ఆ అలంకారములను చూచుచు, ఏడ్చుచు, మాటి మాటికి పరితపించెను. ఈ విధముగ ఆ అలంకారములు రాముని శోకాగ్నిని ప్రజ్వలింప చేసినవి 42

మూ. శయితం చ చిరం తేన దుఃఖార్తేన మహాత్మనా,
మయాపి వివిధై ర్వాక్యైః కృచ్ఛ్రాదుత్థాపితః పునః. 43

ప్ర. అ. దుఃఖార్తేన = దుఃఖపీడితు డైన, తేన = ఆ, మహాత్మనా = మహాత్మునిచేత, శయితం చ = శయనించుట. మయాపి = నాచేత, వివిధైః = = అనేకవిధము లైన, వాక్యైః = మాటలంతో, కృచ్ఛ్రాత్ = అతికష్టముగా, పునః = మరల, ఉత్థాపితః = లేపబడినాడు.

తా. దుఃఖార్తు డైన ఆ మహాత్ముడు చాల సేపు అట్లే నేలపై పడి యుండెను. అప్పుడు నేను ఏవేవో మాటలు చెప్పి అతనిని లేవదీసితిని. 43

మూ. తాని దృష్ట్వా మహాబాహుర్దర్శయిత్వా ముహుర్ముహుః,
రాఘవః సహ సౌమిత్రిః సుగ్రీవే స న్యవేదయత్. 44

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః రాఘవః = ఆ రాముడు, సహసౌమిత్రిః = లక్ష్మణునితో కూడినవాడై, తాని = ఆ అలంకారములను, ముహుః ముహుః = మాటిమాటికి, దర్శయిత్వా = ప్రక్క నున్నవారికి చూపించి, సుగ్రీవే = సుగ్రీవునియందు, న్యవేదయత్ = ఇచ్చెను.

తా. మహాబాహు వైన ఆ రాముడు లక్ష్మణసహితు డై, ఆ అలంకారములను మాటిమాటికి చూచి, ప్రక్క నున్న వారికి చూపి, వానిని సుగ్రీవునకు ఇచ్చెను. 44

మూ. స తవాదర్శనాదార్యే రాఘవః పరితప్యతే,
మహతా జ్వలతా నిత్యమగ్నినేవాగ్నిపర్వతః. 45

ప్ర. అ. ఆర్యే = పూజ్యురాలా! సః రాఘవః = ఆ రాముడు, తవ =

సీయొక్క, అదర్శనాత్ = కనబడక పోవుటవలన, నిత్యమ్ = ఎల్లప్పుడు, జ్వలతా = మండుచున్న, మహతా = గొప్ప, అగ్నినా = అగ్నిచేత, అగ్నిపర్వతః ఇవ = అగ్నిపర్వతము వలె, పరితప్యతే = తపించుచున్నాడు.

తా. పూజ్యురాలా! సీవు కనబడకపోవుటచే, ఆ రాముడు నిత్యమూ ప్రజ్వలించుచున్న అగ్నిచేత అగ్నిపర్వతము వలె, తపించుచున్నాడు. 45

మూ. త్వత్కృతే తమనిద్రా చ శోకశ్చిన్తా చ రాఘవమ్,
తాపయన్తి మహాత్మానమగ్న్యగారమివాగ్నయః. 46

ప్ర. అ. త్వత్కృతే = నీ నిమిత్తమై, మహాత్మానమ్ = మహాత్ముడైన, తం రాఘవమ్ = ఆ రాముణ్ణి, అనిద్రా చ = నిద్రలేకపోవడము, శోకః = దుఃఖము, చిన్తా చ = చింతా, అగ్న్యగారమ్ = అగ్నిగృహమును, అగ్నయః ఇవ = అగ్నులు వలె, తాపయన్తి = తపింపచేయుచున్నవి.

తా. నీ నిమిత్తమై మహాత్ముడైన ఆ రాముణ్ణి, నిద్రలేకపోవడము, శోకమూ, చింతా అగ్నిగృహమును అగ్నులు తపింపచేయు నట్లు తపింపచేయుచున్నవి. 46

మూ. తవాదర్శనశోకేన రాఘవః ప్రవిచాల్యతే,
మహతా భూమికమ్పేన మహానివ శిలోచ్చయః. 47

ప్ర. అ. తవ = సీయొక్క, అదర్శనశోకేన = కనబడకపోవుటచే కలిగిన శోకముచేత, రాఘవః = రాముడు, మహతా = గొప్పదైన, భూమికమ్పేన = భూకంపముచేత, మహాన్ = గొప్ప, శిలోచ్చయః ఇవ = పర్వతము వలె, ప్రవిచాల్యతే = చలింపచేయబడుచున్నాడు.

తా. గొప్ప భూకంపము పెద్ద పర్వతమును కదల్చివేసి నట్లు సీవు కనబడకపోవుటచే కలిగిన శోకము రాముణ్ణి కదల్చివేయుచున్నది. 47

మూ. కాననాని సురమ్యాణి నదీః ప్రస్రవణాని చ,
చరన్న రతిమాప్నోతి త్వామపశ్యన్నృపాత్మజే. 48

ప్ర. అ. నృపాత్మజే = రాజకుమారీ, త్వామ్ = నిన్ను, అపశ్యన్ =

చూడనివాడై, (రాముడు), సురమ్యాణి = చాల అందమైన, కాననాని = అడవులను, నదీః = నదులను, ప్రస్రవణాని చ = సెలయేళ్లను, చరన్ = సంచరించుచున్నా కూడ, రతిమ్ = ఆనందమును, న ఆప్నోతి = పొందుటలేదు.

తా. ఓ! దేవీ! అందమైన అరణ్యములలోను, నదీతీరములందు, సెలయేళ్ల దగ్గరగా సంచరించుచున్నను రాముడు, నీవు కనబడకపోవుటచేత, ఆనందమును పొందుటలేదు. 48

మూ. స త్వాం మనుజశార్దూల! క్షిప్రం ప్రాప్స్యతి రాఘవః,
సమిత్రబాన్ధవం హత్వా రావణం జనకాత్మజే. 49

ప్ర. అ. జనకాత్మజే = ఓ జనకనందినీ! మనుజశార్దూలః = మనుజులలో శ్రేష్ఠుడైన, సః రాఘవః = ఆ రాముడు, సమిత్రబాన్ధవమ్ = మిత్రులతోను, బంధువులతోను కూడిన, రావణమ్ = రావణుని, హత్వా = చంపి, త్వామ్ = నిన్ను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రాప్స్యతి = పొందగలడు.

తా. ఓ! సీతాదేవీ! మనుష్యులలో శ్రేష్ఠుడైన రాముడు, రావణుని మిత్ర బంధు సహితముగా సంహరించి, శీఘ్రముగా నిన్ను పొందగలడు. 49

మూ. సహితౌ రామసుగ్రీవావుభావకురుతాం తదా,
సమయం వాలినం హన్తుం తవ చాన్వేషణం తథా. 50

ప్ర. అ. తదా = అప్పుడు, రామసుగ్రీవౌ = రామసుగ్రీవులు, ఉభౌ = ఇద్దరూ, సహితౌ = కలిసినవారై, వాలినమ్ = వాలిని, హన్తుమ్ = చంపుటకు, తథా = మరియు, తవ = నీయొక్క, అన్వేషణమ్ = అన్వేషణమును చేయుటకూ, సమయమ్ = ఒప్పందమును, అకురుతామ్ = చేసిరి.

తా. ఆనాడు రామసుగ్రీవులిద్దరూ కలిసి నప్పుడు, రాముడు వాలిని చంపవలెనని, సుగ్రీవుడు నిన్ను వెదకించవలెనని ఒప్పందము చేసికొన్నారు.

మూ. తతస్తాభ్యాం కుమారాభ్యాం వీరాభ్యాం స హరీశ్వరః,
కిష్కిన్ధాం సముపాగమ్య వాలీ యుద్ధే నిపాతితః. 51

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వీరాభ్యామ్ = వీరులైన, తాభ్యామ్ = ఆ,

కుమారాభ్యామ్ = యువకులైన రామలక్ష్మణులచేత, కిష్కింధామ్ = కిష్కింధను, సముపాగమ్య = చేరి, హరీశ్వరః = వానరరాజైన, సః = ఆ, వాలీ = వాలి, యుద్ధే = యుద్ధమునందు. నిపాతితః = పడవేయబడినాడు.

తా. పిమ్మట వీరులైన ఆ రాజకుమారు లిద్దరూ కిష్కింధకు వెళ్ళిరి. అక్కడ వానరరాజైన వాలిని రాముడు యుద్ధములో చంపెను. 51

మూ. తతో నిహత్య తరసా రామో వాలినమాహవే,
సర్వర్క్షహరిసంఘానాం సుగ్రీవమకరోత్పతిమ్. 52

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, ఆహవే = యుద్ధమునందు, తరసా = బలముచేత, వాలినమ్ = వాలిని, నిహత్య = చంపి, సుగ్రీవమ్ = సుగ్రీవుని, సర్వర్క్షహరిసంఘానామ్ = సమస్తమైన, ఎలుగుబంటుల, వానరుల సముదాయములకు, పతిమ్ = ప్రభువునుగా, అకరోత్ = చేసెను.

తా. పిమ్మట రాముడు యుద్ధమునందు, బలముచేత, వాలిని చంపి, సమస్తమైన ఎలుగుబంటుల సముదాయమునకు, వానరుల సముదాయమునకు సుగ్రీవుని రాజుగా చేసెను. 52

మూ. రామసుగ్రీవయోరైక్యం దేవ్యేవం సమజాయత,
హనుమన్తం చ మాం విద్ధి తయోర్దూతమిహాగతమ్. 53

ప్ర. అ. దేవి = ఓ దేవీ! రామసుగ్రీవయోః = రామసుగ్రీవుల యొక్క, ఐక్యమ్ = స్నేహము, ఏవమ్ = ఇట్లు, సమజాయత = కలిగెను. మామ్ = నన్ను, తయోః = వారిద్దరియొక్క, దూతమ్ = దూతగా, ఆగతమ్ = వచ్చిన, హనుమన్తమ్ = హనుమంతునిగా, విద్ధి = తెలిసికొనుము

తా. ఓ! దేవీ! రామసుగ్రీవుల మధ్య స్నేహము ఈ విధముగ ఏర్పడెను. నేను వారిద్దరూ పంపగా, నీ వద్దకు దూతగా వచ్చిన హనుమంతుడను. 53

మూ. స్వరాజ్యం ప్రాప్య సుగ్రీవః సమానీయ హరీశ్వరాన్,
త్వదర్థం ప్రేషయామాస దిశో దశ మహాబలాన్. 54

ప్ర. అ. సుగ్రీవః = సుగ్రీవుడు, స్వరాజ్యమ్ = తన రాజ్యమును, ప్రాప్య =

పొంది, మహాబలాన్ = గొప్పబలము గల, హరీశ్వరాన్ = వానరప్రముఖులను, సమానీయ = రప్పించి, త్వదర్థమ్ = నీ నిమిత్తమై, దశ = పది, దిశః = దిక్కులను, ప్రేషయామాస = పంపెను.

తా. సుగ్రీవుడు స్వరాజ్యము లభించిన పిమ్మట మహాబలశాలు లైన వానరనాయకులను రప్పించి, నిన్ను అన్వేషించుటకై, పదిదిక్కులకు పంపెను.

మూ. ఆదిష్టా వానరేన్ద్రేణ సుగ్రీవేణ మహౌజసా,
అద్రిరాజప్రతీకాశాః సర్వతః ప్రస్థితా మహీమ్. 55

ప్ర. అ. వానరేన్ద్రేణ = వానరరాజైన, మహౌజసా = గొప్ప తేజస్సు గల, సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, ఆదిష్టాః = ఆజ్ఞాపించబడిన, అద్రిరాజప్రతీకాశాః = పర్వతరాజుతో సమానులైన ఆ వానరులు, సర్వతః = నలువైపులా, మహీమ్ = భూమిని గూర్చి, ప్రస్థితాః = ప్రయాణమైరి.

తా. మహాతేజశ్శాలి యైన వానరరాజు సుగ్రీవుడు ఆజ్ఞాపించుటచే, హిమవత్పర్వతము వంటి ఆకారము గల వానరులు అన్ని వైపులా భూమిని వెదకుటకై, బయలుదేరిరి. 55

మూ. తతస్తే మార్గమాణా వై సుగ్రీవవచనాతురాః,
చరన్తి వసుధాం కృత్స్నాం వయమన్యే చ వానరాః. 56

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే = అట్టి, వయమ్ = మేము, అన్యే = ఇతరు లైన, వానరాః చ = వానరులూ, సుగ్రీవవచనాతురాః = సుగ్రీవాజ్ఞకు భయపడుచున్నవారై, మార్గమాణాః = అన్వేషించుచు, కృత్స్నామ్ = సమస్తమైన వసుధామ్ = భూమిని, చరన్తి = సంచరించుచున్నారు.

తా. అట్టి మేము, ఇతరవానరులు కూడ సుగ్రీవాజ్ఞ నెరవేర్పవలె నను ఆతురతతో, నిన్ను అన్వేషించుచు, ఈ పృథివి పై అంతా తిరుగుచున్నాము. 56

మూ. అఙ్గదో నామ లక్ష్మీవాన్ వాలిసూనుర్మహాబలః,
ప్రస్థితః కపిశార్దూలస్త్రిభాగబలసంవృతః. 57

ప్ర. అ. లక్ష్మీవాన్ = లక్ష్మీవంతుడు, వాలిసూనుః = వాలికుమారుడు,

మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, అఙ్గదో నామ = అంగదుడను పేరు గల, హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడు, త్రిభాగబలసంవృతః = మూడవ వంతు సైన్యముతో కూడినవాడై, ప్రస్థితః = ప్రయాణమైనాడు.

తా. లక్ష్మీసంపన్నుడు, వాలిపుత్రుడు, మహాబలశాలి అయిన అంగదుడను వానరశ్రేష్ఠుడు మూడవవంతు సైన్యమును తీసికొని సీ అన్వేషణమునకై బయలుదేరినాడు. 57

మూ. తేషాం నో విప్రణష్టానాం విన్ధ్యే పర్వతసత్తమే,
భృశం శోకపరీతానామహోరాత్రగణా గతాః. 58

ప్ర. అ. విన్ధ్యే = వింధ్య మను, పర్వతసత్తమే = పర్వతశ్రేష్ఠమునందు, విప్రణష్టానామ్ = దారి తప్పినవారమూ, భృశమ్ = మిక్కిలి, శోకపరీతానామ్ = దుఃఖముతో నిండిన, తేషామ్ = అట్టి, నః = మాకు, అహోరాత్రగణాః = పగళ్లు రాత్రుల సముదాయములు, గతాః = వెళ్ళినవి.

తా. మే మందరమూ వింధ్యపర్వతమునందు దారి తప్పి మిక్కిలి దుఃఖాక్రాంతుల మై యుండగా ఎన్నో పగళ్లు, రాత్రులు గడచిపోయినవి. 58

మూ. తే వయం కార్యనైరాశ్యాత్కాలస్యాతిక్రమేణ చ,
భయాచ్చ కపిరాజస్య ప్రాణాం స్త్యక్తుం వ్యవస్థితాః. 59

ప్ర. అ. తే వయమ్ = అట్టి మేము, కార్యనైరాశ్యాత్ = కార్యము విషయమున నిరాశాభావమువలనను, కాలస్య = కాలము యొక్క, అతిక్రమేణ చ = దాటిపోవుటచేతను, కపిరాజస్య = సుగ్రీవుని యొక్క, భయాచ్చ = భయము వలనను, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్తుమ్ = విడుచుటకు, వ్యవస్థితాః = నిశ్చయించుకొంటిమి.

తా. అట్టి పరిస్థితిలో మేము కార్యము సాధించలేకపోయినా మనే నిరాశాభావముచేత, సుగ్రీవు డిచ్చిన గడువు దాటిపోవుటచేత, సుగ్రీవుడు దండించునను భయముచేత, ప్రాణత్యాగము చేయవలె నని నిశ్చయించుకొంటిమి. 59

మూ. విచిత్య వనదుర్గాణి గిరిప్రస్రవణాని చ,
అనాసాద్య పదం దేవ్యాః ప్రాణాం స్త్యక్తుం సముద్యతాః.

ప్ర. అ. వనదుర్గాణి = వనములలోని దుర్గమప్రదేశములను, గిరిప్రస్రవణాని చ = పర్వతములను, సెలయేళ్లను, విచిత్య = వెదకి, దేవ్యాః = దేవివైన నీయొక్క, పదమ్ = స్థానమును, అనాసాద్య = పొందక, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్తుమ్ = విడుచుటకు, సముద్యతాః = సిద్ధమైతిమి.

తా. అడవులలో ప్రవేశింప శక్యము కాని ప్రదేశములను, నదులను, సెలయేళ్లను వెదకినను నీ వెక్కడా కనబడకపోవుటచే ప్రాణములను విడుచుటకు సిద్ధపడితిమి. 60

మూ. దృష్ట్వా ప్రాయోపవిష్టాంశ్చ సర్వాన్వానరపుఙ్గవాన్
భృశం శోకార్ణవే మగ్నః పర్యదేవయదఙ్గదః. 61

తవ నాశం చ వైదేహి వాలినశ్చ వధం తథా
ప్రాయోపవేశమస్మాకం మరణం చ జటాయుషః. 62

ప్ర. అ. వైదేహి = ఓ సీతాదేవీ! ప్రాయోపవిష్టాన్ = ప్రాయోపవేశము చేసిన, సర్వాన్ = సమస్తమైన, వానరపుఙ్గవాన్ = వానరశ్రేష్ఠులను, దృష్ట్వా = చూచి, అఙ్గదః = అంగదుడు, భృశమ్ = మిక్కిలి, శోకార్ణవే = శోకసముద్రమునందు, మగ్నః = మునిగినవాడై, తవ = నీయొక్క, నాశం చ = కనబడకుండాపోవుటను, తథా = మరియు, వాలినః = వాలియొక్క, వధం చ = వధను, జటాయుషః = జటాయువుయొక్క, మరణం చ = మరణమును, అస్మాకమ్ = మాయొక్క, ప్రాయోపవేశమ్ = ప్రాయోపవేశమును గూర్చి, పర్యదేవయత్ = విలపించెను.

తా. ఓ సీతాదేవీ! వానరశ్రేష్ఠు లందరూ ఈ విధముగా ప్రాణత్యాగమునకై ఆహారము విసర్జించి పండుకొని ఉండుట చూచి, అంగదుడు, చాల దుఃఖసముద్రములో మునిగినవాడై, నీ అపహరణమునూ, వాలి వధనూ, జటాయు మరణమునూ, మే మందరమూ ప్రాయోపవేశము చేయుటనూ గూర్చి విలపించెను. 61, 62

మూ. తేషాం నః స్వామిసందేశాన్నిరాశానాం ముమూర్షతామ్,
కార్యహేతోరివాయాతః శకునిర్వీర్యవాన్ మహాన్. 63

ప్ర. అ. స్వామిసందేశాత్ = రాజాజ్ఞవలన, నిరాశానామ్=ప్రాణములందు ఆశ లేనివార మై, ముమూర్షతామ్ = మరణించ దలచి యున్న, తేషామ్=అట్టి, నః = మాయొక్క, కార్యహేతోరివ = కార్యముకొరకు అన్నట్లు, వీర్యవాన్ = పరాక్రమము గల, మహాన్ = గొప్ప, శకునిః = పక్షి, ఆయాతః = వచ్చినది.

తా. "ఇచ్చిన గడువు లోపుగా రాకపోయినచో చంపెదను" అను సుగ్రీవాజ్ఞను స్మరించి, ప్రాణములందు ఆశ వదలుకొని, మేము మరణించుటకు సిద్ధముగా ఉండగా, మేము వచ్చిన పని సఫలము చేయుటకా అన్నట్లు, పరాక్రమవంతు డైన ఒక గొప్ప పక్షిరాజు అక్కడికి వచ్చెను. 63

మూ. గృధ్రరాజస్య సోదర్యః సంపాతిర్నామ గృధ్రరాట్,
శ్రుత్వా భ్రాతృవధం కోపాదిదం వచనమబ్రవీత్. 64

ప్ర. అ. గృధ్రరాజస్య=గృధ్రరా జైన జటాయువుయొక్క, సోదర్యః= సోదరు డైన, సంపాతిర్నామ = సంపాతి అను, గృధ్రరాట్ = గృధ్రరాజు, భ్రాతృవధమ్ = సోదరుని వధను, శ్రుత్వా = విని, కోపాత్ = కోపమువలన, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. జటాయువు సోదరు డైన సంపాతి అనే ఆ గృధ్రరాజు సోదరుని వధను గూర్చి విని కోపముతో ఇట్లు పలికెను. 64

మూ. యవీయాన్ కేన మే భ్రాతా హతః క్వ చ నిపాతితః,
ఏతదాఖ్యాతుమిచ్ఛామి భవద్భిర్వానరోత్తమాః. 65

ప్ర. అ. మే = నాయొక్క, యవీయాన్ = చిన్నవా డైన, భ్రాతా = సోదరుడు, కేన = ఎవనిచేత, హతః = చంపబడినవాడు? క్వ = ఎక్కడ, నిపాతితః = పడగొట్టబడినాడు? వానరోత్తమాః=వానరోత్తములారా! భవద్భిః= మీచేత, ఏతత్ = దీనిని, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. వానరోత్తములారా! నా తమ్ము డైన జటాయువును ఎవ్వడు, ఎక్కడ, చంపి పడవేసినాడో చెప్పుడు 65

మూ. అఙ్గదోఽకథయత్తస్య జనస్థానే మహద్వధమ్,
రక్షసా భీమరూపేణ త్వాముద్దిశ్య యథాతథమ్. 66

ప్ర. అ. త్వామ్ = నిన్ను, ఉద్దిశ్య = ఉద్దేశించి, భీమరూపేణ = భయంకర మైన రూపము గల, రక్షసా = రాక్షసునిచేత, జనస్థానే = జనస్థానమునందు, మహద్వధమ్ = ఆ మహాపక్షి యొక్క వధను, యథాతథమ్ = జరిగినది జరిగినట్లుగా, అఙ్గదః = అంగదుడు, తస్య = ఆ సంపాతికి, అకథయత్ = చెప్పెను.

తా. అప్పుడు అంగదుడు, జనస్థానములో భయంకర మైన రూపము గల రాక్షసుడు, నీ నిమిత్త మై చేసిన ఆ మహాపక్షి వధను గూర్చి, యథాతథముగా ఆ సంపాతికి చెప్పెను. 66

మూ. జటాయుషో వధం శ్రుత్వా దుఃఖిత స్సోఽరుణాత్మజః,
త్వాం శశంస వరారోహే వసన్తీం రావణాలయే. 67

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠ మైన కటిప్రదేశము గల ఓ సీతాదేవీ! సః = ఆ, అరుణాత్మజః = అరుణుని కుమారు డైన సంపాతి, జటాయుషః = జటాయువు యొక్క, వధమ్ = వధను, శ్రుత్వా = విని, దుఃఖితః = దుఃఖించినవా డై, త్వామ్ = నిన్ను, రావణాలయే = రావణుని గృహమునందు, వసన్తీమ్ = నివసించుచున్నదానినిగా, శశంస = చెప్పెను.

తా. సీతాదేవీ! ఆ సంపాతి జటాయువు మరణమును విని చాల దుఃఖించెను. నీవు రావణుని గృహములో ఉన్నట్లు అతడు మాకు చెప్పెను. 67

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సంపాతేః ప్రీతివర్ధనమ్,
అఙ్గదప్రముఖా స్తూర్ణం తతః సంప్రస్థితా వయమ్. 68

ప్ర. అ. తస్య = ఆ, సంపాతేః = సంపాతియొక్క, ప్రీతివర్ధనమ్ = సంతోషమును వృద్ధిపొందించు, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అఙ్గదప్రముఖాః = అంగదుడు నాయకుడుగా గల, వయమ్ = మేము, తూర్ణమ్ = శీఘ్రముగా, తతః = అక్కడినుండి, ప్రస్థితాః = బయలుదేరితిమి.

తా. సంతోషజనక మైన ఆ సంపాతి మాటలు విని అంగదుడు మొద లైన మే మందరము అక్కడినుండి వెంటనే బయలుదేరితిమి. 68

మూ. విన్ధ్యాదుత్థాయ సంప్రాప్తాః సాగరస్యాన్త ముత్తరమ్,
త్వద్దర్శనకృతోత్సాహా హృష్టా స్తుష్టాః ప్లవఙ్గమాః. 69

ప్ర. అ. ప్లవఙ్గమాః = వానరులు, త్వద్దర్శనకృతోత్సాహాః = నీ దర్శనమునందు చేయబడిన ఉత్సాహము కలవారై, హృష్టాః = హర్షించినవారై, తుష్టాః = సంతోషించినవారై, విన్ధ్యాత్ = వింధ్యపర్వతమునుండి, ఉత్థాయ = లేచి, సాగరస్య = సముద్రముయొక్క, ఉత్తరమ్ = ఉత్తరమునందున్న, అన్తమ్ = తీరమును, సంప్రాప్తాః = చేరినారు.

తా. వానరు లందరు చాలా సంతోషించి, నిన్ను చూచ వలె నను ఉత్సాహముతో వింధ్యపర్వతమునుండి బయలుదేరి, సముద్రము ఉత్తరపు తీరము చేరిరి. 69

మూ. అఙ్గదప్రముఖాః సర్వే వేలోపాన్తముపస్థితాః।
చిన్తాం జగ్ముః పునర్భీతాస్త్వద్దర్శనసముత్సుకాః॥ 70

ప్ర. అ. అఙ్గదప్రముఖాః = అంగదుడు మొదలైన, సర్వే = అందరూ, త్వద్దర్శనసముత్సుకాః = నీ దర్శనమునందు ఆసక్తి కలవారై, వేలోపాన్తమ్ = సముద్రతీరప్రాంతమును, ఉపస్థితాః = చేరినవారై, భీతాః = భయపడినవారై, పునః = మరల, చిన్తామ్ = చింతను, జగ్ముః = పొందిరి.

తా. అంగదుడు మొదలైన వానరు లందరూ నిన్ను చూడవలె నను ఔత్సుక్యముతో సముద్రము చేరి, అక్కడ సముద్రమును చూడగానే భయపడి, మరల చింతాగ్రస్తులైరి. 70

మూ. అథాహం హరిసైన్యస్య సాగరం ప్రేక్ష్య సీదతః,
వ్యవధూయ భయం తీవ్రం యోజనానాం శతం ప్లుతః।

ప్ర. అ. అథ = అటుపిమ్మట, అహమ్ = నేను, సాగరమ్ = సముద్రమును, ప్రేక్ష్య = చూచి, సీదతః = దిగులు చెందుచున్న, హరిసైన్యస్య = వానరసైన్యము యొక్క, తీవ్రమ్ = తీవ్రమైన, భయమ్ = భయమును, వ్యవధూయ = తొలగించి, యోజనానామ్ = యోజనములయొక్క, శతమ్ = శతమును, ప్లుతః = దాటితిని.

తా. అప్పుడు నేను, సముద్రమును చూచి దిగులుచెందిన ఆ వానరసైన్యమునకు కలిగిన తీవ్రమైన భయమును తొలగించి, నూరు యోజనముల దూరము దుమికితిని. 71

మూ. లఙ్కా చాపి మయా రాత్రౌ ప్రవిష్టా రాక్షసాకులా,
రావణశ్చ మయా దృష్టస్త్వం చ శోకపరిప్లుతా. 72

ప్ర. అ. రాక్షసాకులా = రాక్షసులతో వ్యాకుల మైన, లఙ్కా చాపి = లంక కూడ, మయా = నాచేత, రాత్రౌ = రాత్రియందు, ప్రవిష్టా = ప్రవేశింప బడినది. మయా = నాచేత, రావణశ్చ = రావణుడు కూడ, దృష్టః = చూడబడినాడు. శోకపరిప్లుతా = శోకముతో నిండిన, త్వం చ = నీవు కూడ చూడబడితివి

తా. నేను రాక్షసులతో నిండిన లంకలో రాత్రి ప్రవేశించి, రావణునీ, దుఃఖములో మునిగి యున్న నిన్నూ చూచినాను. 72

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం యథావృత్తమనిన్దితే,
అభిభాషస్వ మాం దేవి దూతో దాశరథేరహమ్. 73

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడనిదానా, దేవి = ఓ దేవీ, ఏతత్ = ఇది, సర్వమ్ = అంతా, యథావృత్తమ్ = జరిగినది జరిగి నట్లుగా, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది. మామ్ = నన్ను గూర్చి, అభిభాషస్వ = మాటలాడుము. అహమ్ = నేను, దాశరథేః = రాముని యొక్క, దూతః = దూతను.

తా. ఎట్టి దోషములూ లేని ఓ సీతాదేవీ, ఈ విషయము నంతా నీకు యథార్థముగా చెప్పినాను. నేను రాముని దూతను. నాతో మాటలాడుము. 73

మూ. తం మాం రామకృతోద్యోగం త్వన్నిమిత్తమిహాగతమ్,
సుగ్రీవసచివం దేవి బుధ్యస్వ పవనాత్మజమ్. 74

ప్ర. అ. దేవి = ఓ దేవీ, తం మామ్ = అట్టి నన్ను, రామకృతోద్యోగమ్ = రామునినిమిత్తమై చేయబడిన ప్రయత్నము గలవాడనూ, త్వన్నిమిత్తమ్ = నీ నిమిత్త మై, ఇహ = ఇక్కడికి, ఆగతమ్ = వచ్చినవాడనూ, సుగ్రీవసచివమ్ = సుగ్రీవుని మంత్రినీ అయిన, పవనాత్మజమ్ = వాయుపుత్రునిగా, బుధ్యస్వ = తెలిసికొనుము.

తా. ఓ దేవీ, నేను రామునికోసమై ప్రయత్నము చేసి, ఇక్కడకు వచ్చినాను. సుగ్రీవుని మంత్రిని. వాయుదేవుని కుమారుడను. ఈ విషయము తెలిసికొనుము. 74

మూ. కుశలీ తవ కాకుత్స్థః సర్వశస్త్రభృతాం వరః,
గురోరారాధనే యుక్తో లక్ష్మణశ్చ సులక్షణః. 75

ప్ర. అ. సర్వశస్త్రభృతామ్ = సమస్తమైన ఆయుధధారులలో, వరః = శ్రేష్ఠుడైన, తవ = నీయొక్క, కాకుత్స్థః = రాముడు, కుశలీ = క్షేమముగా ఉన్నాడు. గురోః = అన్నగారియొక్క, ఆరాధనే = సేవయందు, యుక్తః = సంలగ్నుడై ఉన్న, సులక్షణః = మంచి లక్షణములు గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ క్షేమముగా ఉన్నాడు.

తా. అస్త్రధారులందరిలోను శ్రేష్ఠుడైన నీ రాముడు క్షేమముగా ఉన్నాడు. అన్నగారి సేవ చేయుటయందు శ్రద్ధ గల, మంచి లక్షణములు గల లక్ష్మణుడు కూడ క్షేమముగా ఉన్నాడు. 75

మూ. తస్య వీర్యవతో దేవి భర్తుస్తవ హితే రతః,
అహమేకస్తు సంప్రాప్తః సుగ్రీవవచనాదిహ. 76

ప్ర. అ. దేవి = దేవీ! వీర్యవతః = పరాక్రమవంతుడైన, తవ = నీయొక్క, భర్తుః = భర్తయైన, తస్య = రామునియొక్క, హితే = హితమునందు, రతః = ఆసక్తుడనైన, అహమ్ = నేను, సుగ్రీవవచనాత్ = సుగ్రీవుని ఆజ్ఞవలన, ఇహ = ఇక్కడికి, ఏకః = ఒక్కడనే, ప్రాప్తః = వచ్చినాను.

తా. ఓ! దేవీ! పరాక్రమవంతుడు, నీ భర్త అయిన ఆ రాముని హితమునందు ఆసక్తి గల నేను సుగ్రీవుని ఆజ్ఞచే, ఒంటరిగా ఇక్కడికి వచ్చినాను. 76

మూ. మయేయమసహాయేన చరతా కామరూపిణా,
దక్షిణా దిగనుక్రాన్తా త్వన్మార్గవిచయైషిణా. 77

ప్ర. అ. త్వన్మార్గవిచయైషిణా = నీ జాడను వెదకుటకు కోరుచున్నవాడనూ, కామరూపిణా = కామరూపము గల (ఇష్టము వచ్చిన రూపము ధరించ గల) వాడనూ, అసహాయేన = సహాయుడు లేనివాడనూ, చరతా = సంచరించు వాడనూ అయిన, మయా = నాచేత, ఇయమ్ = ఈ, దక్షిణా దిక్ = దక్షిణదిక్కు, అనుక్రాన్తా = పొందబడినది.

తా. స్వేచ్ఛానుసారముగా రూపములు ధరించ గలిగిన నేను, నీ జాడ

వెదకికొనుటకై ఎవ్వరూ సహాయులు లేకుండా, ఒంటరిగా సంచరించు, ఈ దక్షిణ దిక్కునకు వచ్చితిని. 77

మూ. దిష్ట్యాహం హరిసైన్యానాం త్వన్నాశమనుశోచతామ్,
అపనేష్యామి సంతాపం తవాభిగమశంసనాత్. 78

ప్ర. అ. దిష్ట్యా = భాగ్యవశముచేత, అహమ్ = నేను, త్వన్నాశమ్ = నీవు కనబడకపోవుటనుగూర్చి, అనుశోచతామ్ = దుఃఖించుచున్న, హరిసైన్యానామ్ = వానరసైన్యములయొక్క, సంతాపమ్ = తాపమును, తవ = నీయొక్క, అభిగమశంసనాత్ = లభించుటను గూర్చి చెప్పుటవలన, అపనేష్యామి = తొలగింపగలను.

తా. భాగ్యవశముచేత, నేను, నీవు కనబడితివని చెప్పి, నీవు కనబడక పోవుటచే దుఃఖించుచున్న వానరసైన్యముల సంతాపమును తొలగించెదను. 78

మూ. దిష్ట్యా హి మమ న వ్యర్థం దేవి సాగరలఙ్ఘనమ్,
ప్రాప్స్యామ్యహమిదం దిష్ట్యా త్వద్దర్శనకృతం యశః.

ప్ర. అ. దేవి = ఓ దేవీ! దిష్ట్యా = అదృష్టముచేత, మమ = నాయొక్క, సాగరలఙ్ఘనమ్ = సాగరమును దాటుట, న వ్యర్థమ్ = వ్యర్థము కాలేదు. దిష్ట్యా = అదృష్టముచేత, అహమ్ = నేను, త్వద్దర్శనకృతమ్ = నీ దర్శనమువలన కలిగిన, ఇదమ్ = ఈ, యశః = కీర్తిని, ప్రాప్స్యామి = పొందగలను.

తా. ఓ దేవీ! నా అదృష్టము బాగున్నది; నేను సాగరము లంఘించుట వ్యర్థము కాలేదు. నిన్ను చూడగలిగితి నను కీర్తిని పొందగలను. ఇదికూడ నా అదృష్టమే. 79

మూ. రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వామభిపత్స్యతే,
సమిత్రబాన్ధవం హత్వా రావణం రాక్షసాధిపమ్. 80

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, రాఘవశ్చ = రాముడు, సమిత్రబాన్ధవమ్ = మిత్రులతోను బంధువులతోను కూడిన, రాక్షసాధిపమ్ = రాక్షసరాజైన, రావణమ్ = రావణుని, హత్వా = చంపి, క్షిప్రమ్ = శీఘ్రముగా, త్వామ్ = నిన్ను, అభిపత్స్యతే = పొందగలడు.

తా. మహాపరాక్రమశాలి యైన రాముడు రాక్షసాధిపతి యైన రావణుని పుత్రబంధుసహితముగా సంహరించి, శీఘ్రముగా నిన్ను పొందగలడు. 80

మూ. మాల్యవాన్నామ వైదేహి గిరీణాముత్తమో గిరిః,
తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః. 81

ప్ర. అ. వైదేహి = సీతాదేవీ! గిరీణామ్ = పర్వతములలో, ఉత్తమః = ఉత్తమ మైన, మాల్యవాన్నామ = మాల్యవంత మను, గిరిః = పర్వత మున్నది. తతః = అక్కడినుండి, కేసరీ = కేసరి అను, హరిః = వానరుడు, గోకర్ణమ్ = గోకర్ణ మను, పర్వతమ్ = పర్వతమును గూర్చి, గచ్ఛతి = వెళ్లుచున్నాడు (వెళ్ళెను).

తా. ఓ! సీతాదేవీ! పర్వతము లన్నింటిలోను శ్రేష్ఠ మైన మాల్యవంత మను పర్వత మున్నది. అక్కడినుండి కేసరి అను వానరుడు గోకర్ణపర్వతము నకు వెళ్ళెను. 81

మూ. స చ దేవర్షిభిర్దిష్టః పితా మమ మహాకపిః,
తీర్థే నదీపతేః పుణ్యే శమ్బసాదనముద్ధరత్. 82

ప్ర. అ. దేవర్షిభిః = దేవతలచేతను, ఋషులచేతను, దిష్టః = ఆజ్ఞాపింప బడినవాడై, మమ = నాయొక్క, పితా = తండ్రి యైన, సః మహాకపిః = ఆ కేసరి, నదీపతేః = సముద్రముయొక్క, పుణ్యే = పవిత్ర మైన, తీర్థే = తీర్థము నందు, శమ్బసాదనమ్ = శంబసాదను డను రాక్షసుని, ఉద్ధరత్ = సంహ రించెను.

తా. నా తండ్రి యైన ఆ కేసరి, దేవతలు, ఋషులు ప్రార్థింపగా, సముద్ర తీరమునం దున్న పవిత్రతీర్థమునందు శంబసాదను డను రాక్షసుని చంపెను.

మూ. తస్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి,
హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా. 83

ప్ర. అ. మైథిలి = ఓ! సీతాదేవీ! అహమ్ = నేను, తస్య = ఆ, హరిణః = వానరు డైన కేసరియొక్క, క్షేత్రే = భార్యయందు, వాతేన = వాయుదేవుని

చేత, జాతః = పుట్టితిని. స్వేన కర్మణా ఏవ = నా పనిచేతనే, లోకే = లోకము నందు, హనుమానితి = హనుమంతుడు అని, విఖ్యాతః = ప్రసిద్ధి పొందితిని.

తా. ఓ సీతాదేవీ! నేను ఆ కేసరి భార్యయందు వాయుదేవునివలన పుట్టి నాను. నేను చేసిన పనిచే వల్ల నాకు లోకములో హనుమంతు డను ప్రసిద్ధి వచ్చినది. ౮౩

మూ. విశ్వాసార్థం తు వైదేహి భర్తురుక్తా మయా గుణాః,
అచిరాద్రాఘవో దేవి త్వామితో నయితానఘే. ౮౪

ప్ర. అ. వైదేహి = ఓ సీతాదేవీ! విశ్వాసార్థమ్ = నీకు నమ్మకము కలి గించుటకై, మయా = నాచేత, భర్తుః = నీ భర్త యైన రామునియొక్క, గుణాః = గుణములు, ఉక్తాః = చెప్పబడినవి, దేవి = ఓ దేవీ! రాఘవః = రాముడు, అచిరాత్ = కొద్ది కాలములో, త్వామ్ = నిన్ను, ఇతః = ఇక్కడినుండి, నయితా = తీసికొనిపోగలడు.

తా. ఓ సీతాదేవీ! నీకు నమ్మకము కలిగించుటకై, నీ భర్త యైన రాముని గుణములు వర్ణించి చెప్పినాను. ఓ దేవీ! కొద్దికాలములో రాముడు నిన్ను ఇక్కడనుండి తీసికొని వెళ్ళగలడు. ౮౪

మూ. ఏవం విశ్వాసితా సీతా హేతుభిః శోకకర్శితా,
ఉపపన్నైరభిజ్ఞానైర్దూతం తమవగచ్ఛతి. ౮౫

ప్ర. అ. శోకకర్శితా = శోకముచేత కృశింపచేయబడిన, సీతా = సీత, ఏవమ్ = ఈ విధముగా, హేతుభిః = తగిన హేతువులచేత, విశ్వాసితా = విశ్వసింపచేయబడినదై, ఉపపన్నైః = తగిన, అభిజ్ఞానైః = ఆనవాళ్ళచేత, తమ్ = అతనిని, దూతమ్ = దూతనుగా, అవగచ్ఛతి = తెలుసుకొనుచున్నది (తెలుసు కొన్నది).

తా. శోకముచేత కృశింపచేయబడిన సీత ఈ విధముగా, సరి యైన హేతువులను చూపుట ద్వారా హనుమంతునిచే విశ్వాసము కలుగు నట్లు చేయ బడినదై, సరి యైన ఆనవాళ్ళను బట్టి అతడు దూతయే అని తెలుసుకొనెను.

మూ. అతులం చ గతా హర్షం ప్రహర్షేణ చ జానకీ,
నేత్రాభ్యాం వక్రపక్ష్మాభ్యాం ముమోచానన్దజం జలమ్.

ప్ర. అ. జానకీ = సీత, అతులమ్ = సాటి లేని, హర్షమ్ = ఆనందమును, గతా చ = పొందినది కూడ. ప్రహర్షేణ = అధిక మైన ఆనందముతో, వక్రపక్ష్మాభ్యామ్ = వంకర యైన రెప్పలు గల, నేత్రాభ్యామ్=నేత్రములతో, ఆనన్దజమ్ = ఆనందమువలన కలిగిన, జలమ్ = జలమును, ముమోచ=విడచెను.

తా. జానకి సాటి లేని సంతోషమును కూడ పొందెను. అధిక మైన ఆనందముతో, వంకర యైన రెప్పలు గల నేత్రములనుండి ఆనందబాష్పము రాల్చెను. 86

మూ. చారు తద్వదనం తస్యాస్తామ్రశుక్లాయతేక్షణమ్,
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్. 87

ప్ర అ. విశాలాక్ష్యాః = విశాలము లైన నేత్రములు గల, తస్యాః = ఆ, సీతయొక్క, చారు=అంద మైన, తామ్రశుక్లాయతేక్షణమ్ = ఎఱ్ఱగాను, తెల్లగాను, దీర్ఘముగాను ఉన్న నేత్రములుగల, తత్ = ఆ, వదనమ్=ముఖము, రాహుముక్తః =రాహువుచేత విడువబడిన, ఉడురాట్ ఇవ = నక్షత్రములరాజైన చంద్రుడు వలె, అశోభత = ప్రకాశించెను.

తా. ఎఱ్ఱగాను, తెల్లగాను, దీర్ఘముగాను ఉన్న నేత్రములు గలదీ, సుందరమూ అయిన ఆ విశాలాక్షి యైన సీత ముఖము రాహువు విడచిన చంద్రుడు వలె ప్రకాశించెను 87

మూ. హనుమన్తం కపిం వ్యక్తం మన్యతే నాన్యథేతి సా,
అథోవాచ హనూమాంస్తాముత్తరం ప్రియదర్శనామ్. 88

ప్ర. అ. సా = ఆమె, హనుమన్తమ్ = హనుమంతుని, వ్యక్తమ్=స్పష్టముగా, కపిమ్ = వానరునిగానే, మన్యతే = తలచెను. అన్యథా ఇతి=మరొక విధముగా ఉన్నవా డని, న = తలపలేదు. అథ=అటు పిమ్మట, హనూమాన్ = హనుమంతుడు, ప్రియదర్శనామ్=ప్రియ మైన దర్శనము గల, తామ్=ఆమెను గూర్చి, ఉత్తరమ్ = పై మాటను, ఉవాచ = పలికెను.

తా. హనుమంతుఁడు వానరుఁడే అని, మరొకఁడు ఎవ్వఁడూ కాఁడని ఆ సీత తెలిసికొనెను. పిమ్మట హనుమంతుఁడు దూతవానికి ఆనందమును కలిగించు ఆ సీతతో మరల ఇట్లనెను. 88

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి,
కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియామ్యహమ్. 89

ప్ర. అ. మైథిలి=ఓ! సీతాదేవీ! తే=నీకు, ఏతత్ సర్వమ్=ఇది అంతా, ఆఖ్యాతమ్=చెప్పఁబడినది. సమాశ్వసిహి=ఊరడిల్లుము. కిమ్=ఏమి, కరోమి=చేయుదును? తే=నీకు, కథం వా=ఎట్లు, రోచతే=ఇష్ట మగును? అహమ్=నేను, ప్రతియామి=తిరిగి వెళ్లుచున్నాను.

తా. ఓ! సీతాదేవీ! నీ కిది అంతా చెప్పినాను కదా. నీవు ఊరడిల్లుము. నీ కొరకు నే నేమి చేయవలెనో, నీ కేది ఇష్టమో చెప్పుము. నే నిఁక తిరిగి వెళ్లెదను. 89

మూ. హతేఽసురే సంయతి శమ్బసాదనే
కపిప్రవీరేణ మహర్షిచోదనాత్,
తతోఽస్మి వాయుప్రభవో హి మైథిలి
ప్రభావతస్తత్ప్రతిమశ్చ వానరః. 90

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చత్రింశః సర్గః.

ప్ర. అ. మైథిలి=ఓ! సీతాదేవీ! సంయతి=యుద్ధమునందు, శమ్బసాదనే=శంబసాదను డను, అసురే=అసురుఁడు, కపిప్రవీరేణ=కపివీరు డైన కేసరిచేత, మహర్షిచోదనాత్=మహర్షుల ప్రేరేపణమువలన, హతే సతి=చంపఁబడిన వాఁ డగుచుండఁగా, అతః=పిమ్మట, వాయుప్రభవః=వాయువువలన పుట్టినవాఁడను, ప్రభావతః=ప్రభావమువలన, తత్ప్రతిమః=అతనితో సమాను డను అయిన, వానరః=వానరు డను, అస్మి=అయి ఉన్నాను.

తా. ఓ సీతాదేవీ! మహర్షులు ప్రేరేపింప, కపివీరుడైన కేసరి, యుద్ధమందు, శంబసాదను డను అసురుని చంపిన పిమ్మట నేను వాయువువలన జనించిన వానరుడను. ప్రభావముచేత నేను ఆ వాయుదేవుని అంతటి వాడను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పది యైదవ సర్గ సమాప్తము.

* * *

# అథ షట్త్రింశః సర్గః

[హనుమంతుడు సీతకు రామముద్రిక నిచ్చుట. రాముడు వచ్చి దుఃఖ సముద్రమునుండి ఎప్పుడు ఉద్ధరించును అని ఆత్రముతో సీత ప్రశ్నించుట. రామునకు ఆమెపై ఉన్న ప్రేమను వర్ణించి చెప్పి హనుమంతుడు ఆమెను ఓదార్చుట].

మూ. భూయ ఏవ మహాతేజా హనూమాన్ పవనాత్మజః,
అబ్రవీత్ ప్రశ్రితం వాక్యం సీతాప్రత్యయకారణాత్. 1

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, పవనాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, సీతాప్రత్యయకారణాత్ = సీతకు నమ్మకము కలుగుట అనే కారణము వలన (నమ్మకము కొరకై), భూయ ఏవ = మరల, ప్రశ్రితమ్ = వినయపూర్వక మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజశ్శాలి వాయుపుత్రుడూ అయిన హనుమంతుడు, సీతకు నమ్మకము కలుగుటకై, మరల వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 1

మూ. వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః,
రామనామాఙ్కితం చేదం పశ్య దేవ్యఙ్గుళీయకమ్. 2

ప్ర. అ. మహాభాగే = గొప్ప భాగ్యము గలదానా! అహమ్ = నేను, ధీమతః = బుద్ధిమంతు డైన, రామస్య = రాముని యొక్క, దూతః = దూత నైన, వానరః = వానరుడను. దేవి = ఓ దేవీ! రామనామాఙ్కితమ్ = రాముని పేరుతో చిహ్నిత మైన, ఇదమ్ = ఈ, అఙ్గుళీయకం చ = ఉంగరమును కూడా, పశ్య = చూడుము.

తా. ఓ మహాభాగ్యవంతురాలా! నేను బుద్ధిశాలి యైన రాముని దూతను. ఓ దేవీ! రాముని పేరు గుర్తు ఉన్న ఈ ఉంగరమును చూడుము. 2

మూ. ప్రత్యయార్థం తవానీతం తేన దత్తం మహాత్మనా,
సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి 3

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, తేన = ఆ రామునిచేత, దత్తమ్ = ఇవ్వబడిన ఈ ఉంగరము, తవ = నీయొక్క, ప్రత్యయార్థమ్ = నమ్మకము కొరకు, ఆనీతమ్ = తీసికొనిరాబడినది. సమాశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రమ్ = మంగళమగుగాక। క్షీణదుఃఖఫలా = క్షీణించిన దుఃఖఫలము కలదానవు, అసి హి = అయితివి కదా।

తా. మహాత్ముడైన ఆ రాము డిచ్చిన ఈ ఉంగరమును, నీ నమ్మకమునకై తీసికొని వచ్చినాను. ఊరడిల్లుము. నీకు మంగళ మగుగాక. నీ దుఃఖఫలము తొలగిపోవు సమయము వచ్చినది. 3

మూ. గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్,
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్. 4

ప్ర. అ. భర్తుః = భర్తయొక్క, కరవిభూషణమ్ = హస్తాలంకార మైన ఆ ఉంగరమును, గృహీత్వా = గ్రహించి, ప్రేక్షమాణా = చూచుచున్న, సా జానకీ = ఆ జానకి. భర్తారమ్ = భర్తను, సంప్రాప్తా ఇవ = చేరినది వలె, ముదితా = సంతోషించినది, అభవత్ = అయెను.

తా. ఆ జానకి, భర్త ఉంగరమును గ్రహించి చూచుచు, భర్తను చేరి నంత సంతోషము పొందెను. 4

మూ. చారు తద్వదనం తస్యాస్తామ్రశుక్లాయతేక్షణమ్,
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్. 5

(దీని టీకా తాత్పర్యములకు, ౩౩వ సర్గలోని ౬౬ శ్లోకము చూడుడు).

మూ. తతః సా హ్రీమతీ బాలా భర్తృసన్దేశహర్షితా,
పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్. 6

ప్ర. అ. తతః = అటు పిమ్మట, బాలా = బాల యైన, సా = ఆ సీత, భర్తృసందేశహర్షితా = భర్తయొక్క సందేశముచేత సంతోషింపచేయబడినదై,

హ్రీమతీ=సిగ్గు గలది, సంతుష్టా=సంతోషించుచు, ప్రియమ్ = ప్రియవాక్యమును, కృత్వా=చేసి, మహాకపిమ్=హనుమంతుని, ప్రశశంస=ప్రశంసించెను.

తా. భర్త వార్తను అందించి హనుమంతునిచేత సంతోషపెట్టబడిన దానం తైన (నిర్మలహృదయము గల) ఆ సీత సిగ్గుపడుచు, చాల సంతోషించుచు, ప్రియవాక్యము పలుకుచు, ఆ హనుమంతుని ప్రశంసించెను. 6

మూ. విక్రాన్తస్త్వం సమర్థస్త్వం ప్రాజ్ఞస్త్వం వానరోత్తమ,
యేనేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్. 7

ప్ర. అ. వానరోత్తమ=ఓ వానరశ్రేష్ఠుడా! ఏకేన = ఒంటరివాడవైన, యేన త్వయా=ఏ నీచేత, ఇదమ్=ఈ, రాక్షసపదమ్=రాక్షసస్థానము, ప్రధర్షితమ్=తిరస్కరింపబడినదో, త్వమ్=అట్టి నీవు, విక్రాన్తః=పరాక్రమవంతుడవు. త్వమ్ = నీవు, సమర్థః=సమర్థుడవు. త్వమ్=నీవు, ప్రాజ్ఞః=చాలబుద్ధిశాలివి.

తా. ఓ వానరోత్తమా! నీవే పరాక్రమవంతుడవు, నీవే సమర్థుడవు. నీవే బుద్ధిశాలివి. అందుచేతనే నీవు ఒంటరిగా ఈ రాక్షసుల నగరములో నిర్భయముగా ప్రవేశించితివి. 7

మూ. శతయోజనవిస్తీర్ణః సాగరో మకరాలయః,
విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః. 8

ప్ర. అ. విక్రమశ్లాఘనీయేన=పరాక్రమముచేత శ్లాఘింపదగిన, క్రమతా =దాటిన నీచేత, శతయోజనవిస్తీర్ణః= నూరు యోజనముల విస్తారము గల, మకరాలయః=మొసళ్ళకు నిలయమైన, సాగరః=సముద్రము, గోష్పదీకృతః = ఆవుపాదము వంటిదిగా చేయబడినది.

తా. శ్లాఘింపదగిన పరాక్రమము గల నీవు, నూరు యోజనముల విస్తారము గలదీ, మొసళ్ళకు నివాసస్థానమూ అయిన సముద్రమును ఆవు పాదం వంటిదానినిగా చేసి, దాటినావు. 8

మూ. న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ,
యస్య తే నాస్తి సంత్రాసో రావణాన్నాపి సంభ్రమః. 9

ప్ర. అ. వానరర్షభ=వానరశ్రేష్ఠుడా! యస్య=ఏ, తే=నీకు, రావణాత్=రావణునినుండి, సంత్రాసః=భయము, నాస్తి=లేదో, సంభ్రమః అపి=కంగారు కూడ, న=లేదో, త్వామ్=అట్టి నిన్ను, ప్రాకృతమ్=సామాన్యుడైన, వానరమ్ వానరునిగా, న మన్యే=తలపను.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! రావణునివల్ల భయము గాని, కొంతైనను తొట్రుపాటు గాని నీలో కనబడుటలేదు. నీవు సామాన్యుడైన వానరుడవని అనుకొనను. 9

మూ. అర్హసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుమ్,
యద్యసి ప్రేషితస్తేన రామేణ విదితాత్మనా. 10

ప్ర. అ. కపిశ్రేష్ఠ=వానరశ్రేష్ఠుడా! విదితాత్మనా=ప్రసిద్ధమైన బుద్ధిగల, తేన=ఆ, రామేణ=రామునిచేత, ప్రేషితః=పంపబడినవాడవు, అసి యది=అయితే, మయా=నాతో, సమభిభాషితుమ్=మాటలాడుటకు, అర్హసే=తగి యున్నావు.

తా. ఓ వానరశ్రేష్ఠా! నిన్ను బుద్ధిమంతుడుగా ప్రసిద్ధుడైన ఆ రాముడు పంపినచో నాతో మాటలాడుటకు తగి ఉన్నావు. 10

మూ. ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితమ్,
పరాక్రమమవిజ్ఞాయ మత్సకాశం విశేషతః. 11

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, రామః=రాముడు, పరాక్రమమ్=పరాక్రమమును, అవిజ్ఞాయ=తెలిసికొనకుండగా, అపరీక్షితమ్=పరీక్షింపబడనివానిని, న ప్రేషయిష్యతి హి=పంపడు కదా! విశేషతః=విశేషించి, మత్సకాశమ్=నా సమీపమునకు పంపడు కదా!

తా. ఎదిరించుటకు శక్యము కాని రాముడు, నిన్ను పరీక్షించకుండగా, నీ పరాక్రమము ఎట్టిదో తెలిసికొనకుండగా పంపి ఉండడు కదా! అందులోను నావద్దకు అసలే పంపి ఉండడు కదా. 11

మూ. దిష్ట్యా చ కుశలీ రామో ధర్మాత్మా సత్యసంగరః,
లక్ష్మణశ్చ మహాతేజాః సుమిత్రానందవర్ధనః. 12

ప్ర. అ. దిష్ట్యా = భాగ్యవశముచేత, ధర్మాత్మా = ధర్మాత్ముడు, సత్య సంగరః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు అయిన, రామః = రాముడు, మహా తేజాః = గొప్ప తేజస్సు కలవాడు, సుమిత్రానన్దవర్ధనః = సుమిత్రయొక్క ఆనందమును వృద్ధిపొందించు, లక్ష్మణశ్చ = లక్ష్మణుడూ, కుశలీ = కుశలముగా నున్నారు

తా. ధర్మాత్ముడూ, సత్యమైన ప్రతిజ్ఞ కలవాడూ అయిన రాముడూ, మహాతేజశ్శాలీ, సుమిత్ర ఆనందమును వృద్ధి పొందించువాడూ అయిన లక్ష్మణుడూ భాగ్యవశముచేత క్షేమముగా ఉన్నారు. 12

మూ. కుశలీ యది కాకుత్స్థః కిం న సాగరమేఖలామ్,
మహీం దహతి కోపేన యుగాన్తాగ్నిరివోత్థితః. 13

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, కుశలీ యది = క్షేమముగా ఉన్నట్లయితే, ఉత్థితః = పైకి లేచిన (విజృంభించిన), యుగాన్తాగ్నిరివ = ప్రళయ కాలాగ్ని వలె, సాగరమేఖలామ్ = సముద్రము వడ్డాణముగా గల, మహీమ్ = భూమిని, కోపేన = కోపముతో, కిమ్ = ఎందువలన, న దహతి = కాల్చివేయుట లేదు?

తా. రాముడు క్షేమముగా ఉన్నచో, ప్రజ్వలించుచున్న ప్రళయకాలాగ్ని వలె సముద్రమువరకు వ్యాపించి యున్న భూమిని, కోపముతో కాల్చివేయుటలేదేమి? 13

మూ. అథవా శక్తిమన్తౌ తౌ సురాణామపి నిగ్రహే,
మమైవ తు న దుఃఖానామస్తి మన్యే విపర్యయః. 14

ప్ర. అ. అథవా = లేదా, తౌ = ఆ రామలక్ష్మణులు, సురాణామపి = దేవతలయొక్క కూడ, నిగ్రహే = నిగ్రహించుటయందు, శక్తిమన్తౌ = శక్తి కలవారే, తు = కాని, మమ = నాయొక్క, దుఃఖానామేవ = దుఃఖములకే, విపర్యయః = అంతము, నాస్తి = లేదు అని, మన్యే = తలంచెదను.

తా. లేదా అది వారి లోపమని చెప్పుటకు వీలు లేదు. ఆ రామలక్ష్మణులు దేవతలను కూడ నిగ్రహించ సమర్థులు. కాని నా దుఃఖాలకే అంతము లేదని తలంచెదను. 14

మూ. కచ్చిన్న వ్యథితో రామః కచ్చిన్న పరితప్యతే,
ఉత్తరాణి చ కార్యాణి కురుతే పురుషోత్తమః. 15

ప్ర. అ. రామః = రాముడు, న వ్యథితః కచ్చిత్ = వ్యథ చెందుటలేదు కదా? న పరితప్యతే కచ్చిత్ = దుఃఖించుటలేదు కదా? పురుషోత్తమః = పురుషులలో ఉత్తముడైన రాముడు, ఉత్తరాణి = తరువాత చేయవలసిన, కార్యాణి = కార్యములను, కురుతే = చేయుచున్నాడా?

తా. రాముడు మనస్సులో బాధపడుట లేదుకదా? దుఃఖించుటలేదు కదా? ఆ పురుషోత్తముడు శత్రువును జయించుటకై చేయవలసిన పనులన్నీ చేయుచున్నాడా? 15

మూ. కచ్చిన్న దీనః సంభ్రాన్తః కార్యేషు న చ ముహ్యతి,
కచ్చిత్పురుషకార్యాణి కురుతే నృపతేః సుతః. 16

ప్ర. అ. నృపతేః సుతః = రాజకుమారుడైన ఆ రాముడు, దీనః = దీనుడు, సంభ్రాన్తః = తొందరపాటుచెందుచున్నవాడూ, న కచ్చిత్ = కాదు కదా? కార్యేషు = పనులలో, న చ ముహ్యతి = మోహము చెందుటలేదు కదా? పురుషకార్యాణి = మానవప్రయత్నముతో చేయవలసిన పనులను, కచ్చిత్ కురుతే = చేయుచున్నాడా?

తా. రాజకుమారుడైన ఆ రాముడు దైన్యమూ, భ్రాంతీ లేకుండా ఉన్నాడా? పనులలో తొందరపాటుపడుట లేదు కదా? ప్రయత్నము చేసి సాధించవలసిన కార్యములను చేయుచున్నాడు కదా? 16

మూ. ద్వివిధం త్రివిధోపాయముపాయమపి సేవతే,
విజిగీషుః సుహృత్కచ్చిన్మిత్రేషు చ పరంతపః. 17

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించు ఆ రాముడు, ద్వివిధమ్ = రెండు విధములైన, ఉపాయమ్ = ఉపాయమును (సామదానములను), త్రివిధోపాయమపి = మూడు విధములైన ఉపాయమును (దానభేదదండోపాయములను), అపి సేవతే = అవలంబించుచున్నాడా? విజిగీషుః = శత్రువులను జయించుటకు ఇచ్ఛ కలవాడై, మిత్రేషు = మిత్రుల విషయమున, సుహృత్ కచ్చిత్ = మంచి హృదయముతో ఉన్నాడా?

తా. శత్రుసంహారకు డైన ఆ రాముడు, అవసరమును బట్టి సామదాన భేదములను, అనేకతంత్రోపాయములను అవలంబించుచున్నాడా? శత్రువులయందును కోరి మిత్రుల విషయమున మైత్రితో ప్రవర్తించుచున్నాడా? 17

మూ. కచ్చిన్మిత్రాణి లభతే మిత్రైశ్చాప్యభిగమ్యతే,
కచ్చిత్కల్యాణమిత్రశ్చ మిత్రైశ్చాపి పురస్కృతః. 18

ప్ర. అ. మిత్రాణి=మిత్రులను, కచ్చిత్ లభతే=పొందుచున్నాడు కదా? మిత్రైః=మిత్రులచేత, అపి అభిగమ్యతే=చేరబడుచున్నాడా? కల్యాణమిత్రశ్చ కచ్చిత్=శుభకరు లైన మిత్రులు కలవాడు కదా? మిత్రైశ్చ=మిత్రులచేత, అపి పురస్కృతః=గౌరవింపబడుచున్నాడు కదా?

తా. రాముడు మిత్రులను సంపాదించుకొనుచున్నాడు కదా? ఇతరులు కూడ అతని మైత్రిని కోరి అతనిని చేరుచున్నారు కదా? అతని మిత్రు లందరూ మంచివారే కదా? మిత్రులు అతనిని గౌరవించుచున్నారు కదా? 18

మూ. కచ్చిదాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః,
కచ్చిత్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే. 19

ప్ర. అ. పార్థివాత్మజః=రాజకుమారుడు, దేవానామ్=దేవతలయొక్క, ప్రసాదమ్=అనుగ్రహమును, ఆశాస్తి కచ్చిత్=కోరుచున్నాడు కదా? పురుషకారం చ=పురుషకారమును, దైవం చ=దైవమును, కచ్చిత్ ప్రతిపద్యతే=పొందుచున్నాడు కదా?

తా. రాజకుమారు డైన రాముడు దేవతల అనుగ్రహమును కోరి వారిని ఆరాధించుచున్నాడు కదా? పురుషకారానికి, దైవానికి సమ మైన ప్రాధాన్యం ఇచ్చి, వాటిని సమముగా సేవించుచున్నాడు కదా? 19

మూ. కచ్చిన్న విగతస్నేహః ప్రవాసాన్మయి రాఘవః,
కచ్చిన్మాం వ్యసనాదస్మాన్మోక్షయిష్యతి వానర. 20

ప్ర. అ. రాఘవః=రాముడు, ప్రవాసాత్=ప్రవాసమువలన, మయి=నాయందు, విగతస్నేహః=పోయిన స్నేహము కలవాడు, న కచ్చిత్=కాడు కదా? వానర=హనుమంతుడా! మామ్=నన్ను, అస్మాత్=ఈ, వ్యసనాత్=వ్యసనమునుండి, మోక్షయిష్యతి కచ్చిత్=విడిపించునా?

తా. ఓ హనుమంతుడా! నేను దూరముగా ఉండిపోవుటవలన రామునికి నాపైఁగల ప్రేమ తగ్గిపోలేదు కదా? నన్ను ఈ కష్టమునుండి తరలు విడిపించునా?

మూ. సుఖానాముచితో నిత్యమసుఖానామనౌచితః,
దుఃఖముత్తరమాసాద్య కచ్చిద్రామో న సీదతి. 21

ప్ర. అ. నిత్యమ్ = నిత్యమూ, సుఖానామ్ = సుఖములకు, ఉచితః = అలవాటుపడినవాడూ, అసుఖానామ్ = కష్టములకు, అనౌచితః = అలవాటు లేనివాడూ అయిన, రాఘవః = రాముడు, ఉత్తరమ్ = అధిక మైన, దుఃఖమ్ = దుఃఖమును, ఆసాద్య = పొంది, న సీదతి కచ్చిత్ = క్రుంగిపోవుట లేదుకదా?

తా. రాముడు సుఖాలకు అలవాటుపడినవాడు కాని దుఃఖాలకు అలవాటుపడినవాడు కాదు. అట్టి రాముడు ఇప్పుడు వచ్చిన ఈ అత్యధిక మైన దుఃఖానికి క్రుంగిపోవుటలేదు కదా? 21

మూ. కౌసల్యాయాస్తథా కచ్చిత్సుమిత్రాయాస్తథైవ చ,
అభీక్ష్ణం శ్రూయతే కచ్చిత్కుశలం భరతస్య చ. 22

ప్ర. అ. కౌసల్యాయాః = కౌసల్యయొక్క, తథా = మరియు, సుమిత్రాయాః = సుమిత్రయొక్క, తథైవ చ = మరియు, భరతస్య = భరతునియొక్క, కుశలమ్ = క్షేమము, అభీక్ష్ణమ్ = అధికముగా, శ్రూయతే కచ్చిత్ = వినబడుచున్నదా?

తా. కౌసల్య, సుమిత్ర, భరతుడు క్షేమముగా ఉన్నట్లు వార్తలు ఎక్కువగా వచ్చుచున్నవా? 22

మూ. మన్నిమిత్తేన మానార్హః కచ్చిచ్ఛోకేన రాఘవః,
కచ్చిన్నాన్యమనా రామః కచ్చిన్మాం తారయిష్యతి. 23

ప్ర. అ. మానార్హః = గౌరవమునకు తగిన, రాఘవః = రాముడు, మన్నిమిత్తేన = నాకొరకైన, శోకేన = శోకముచేత, (పరితప్యతే) కచ్చిత్ = బాధపడుచున్నాడా? రామః = రాముడు, అన్యమనాః = మరొక దృష్టికలవాడు, న కచ్చిత్ = కాడు కదా? మామ్ = నన్ను, కచ్చిత్ తారయిష్యతి = కాపాడ చేయునా?

తా. గొరభర్త యైన రాముడు నా నిమిత్తమై కలిగిన శోకముతో బాధ పడుచున్నాడా? రాముడు ఇతరదృష్టి ఏది లేక నన్ను శోకమునుండి దాటించునా?

మూ. కచ్చిదక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః,
ధ్వజినీం మన్త్రిభిర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే. 24

ప్ర. అ. భ్రాతృవత్సలః = సోదరునియందు ప్రేమ గల, భరతః = భరతుడు, మత్కృతే = నా నిమిత్తమై, మన్త్రిభిః = మంత్రులచేత, గుప్తామ్ = రక్షింపబడిన. భీమామ్ = భయంకర మైన, అక్షౌహిణీమ్ = అక్షౌహిణి ప్రమాణము గల. ధ్వజినీమ్ = సేనను, కచ్చిత్ ప్రేషయిష్యతి = పంపును గదా?

తా. సోదరునియందు ప్రేమ గల భరతుడు, నా నిమిత్తమై, మంత్రుల చేత రక్షింపబడిన, అక్షౌహిణి ప్రమాణము గల, భయంకర మైన సైన్యమును పంపునుగదా? 24

మూ. వానరాధిపతిః శ్రీమాన్ సుగ్రీవః కచ్చిదేష్యతి,
మత్కృతే హరిభిర్వీరైర్వృతో దన్తనఖాయుధైః. 25

ప్ర. అ. మత్కృతే = నా నిమిత్త మై, శ్రీమాన్ = శ్రీమంతు డైన, వానరాధిపతిః = వానరప్రభు వైన, సుగ్రీవః = సుగ్రీవుడు, దన్తనఖాయుధైః = దంతములు, నఖములు ఆయుధములుగా గల, వీరైః = వీరు లైన, హరిభిః = వానరులతో, వృతః = కూడినవాడై, ఏష్యతి కచ్చిత్ = రాగలడు కదా?

తా. శ్రీమంతుడు, వానరాధిపతి అయిన సుగ్రీవుడు, దంతములు, నఖములు ఆయుధములుగా గల వీరు లైన వానరులతో కూడి నా కొరకై రాగలడు కదా? 25

మూ. కచ్చిచ్చ లక్ష్మణః శూరః సుమిత్రానన్దవర్ధనః,
అస్త్రవిచ్ఛరజాలేన రాక్షసాన్విధమిష్యతి. 26

ప్ర. అ. శూరః = శూరుడు, సుమిత్రానన్దవర్ధనః = సుమిత్రయొక్క ఆనందమును వృద్ధి పొందించువాడు, అస్త్రవిత్ = అస్త్రములను ఎరిగినవాడు అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, శరజాలేన = బాణముల సమూహముచేత, రాక్షసాన్ = రాక్షసులను, కచ్చిత్ విధమిష్యతి = ఎగురగొట్టివేయును కదా?

తా. తారుడు, మైన్దుడు అనంతరము కలిగింపువాడు, అస్త్రవిద్యలో ప్రసిద్ధుడు అయిన లక్ష్మణుడు, బాణముల సముదాయములతో రాక్షసులను సంహరింతును కదా? 26

మూ. రౌద్రేణ కచ్చిదస్త్రేణ జ్వలతా నిహతం రణే,
ద్రక్ష్యామ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనమ్. 27

ప్ర. అ. జ్వలతా = ప్రజ్వలించుచున్న, రౌద్రేణ = భయంకర మైన, అస్త్రేణ = అస్త్రముచేత, రణే = యుద్ధమునందు, ససుహృజ్జనమ్ = స్నేహితులతో సహా, నిహతమ్ = చంపబడిన, రావణమ్ = రావణుని, అల్పేన కాలేన = అల్ప మైన కాలముచేత, ద్రక్ష్యామి కచ్చిత్ = చూడగలను కదా?

తా. మిత్రజనసహితు డైన రావణుడు ప్రజ్వలించుచున్న భయంకర మైన అస్త్రముచేత యుద్ధరంగమునందు చంపబడగా, అచిరకాలములో చూడగలను కదా? 27

మూ. కచ్చిన్న తద్ధేమసమానవర్ణం
తస్యాననం పద్మసమానగన్ధి,
మయా వినా శుష్యతి శోకదీనం
జలక్షయే పద్మమివాతపేన. 28

ప్ర. అ. తస్య = ఆ రామునియొక్క, హేమసమానవర్ణమ్ = బంగారముతో సమాన మైన వర్ణము కలది, పద్మసమానగన్ధి = పద్మముతో సమాన మైన గంధము కలది అయిన, తత్ = ఆ, ఆననమ్ = ముఖము, మయా వినా = నేను లేకపోవుటచేత, శోకదీనమ్ = శోకముచేత దీన మై, జలక్షయే = జలము క్షీణించగా, ఆతపేన = ఎండచేత, పద్మమివ = పద్మము వలె, న శుష్యతి కచ్చిత్ = ఎండి పోవుట లేదు కదా?

తా. బంగారముతో సమాన మైన రంగు గలది, పద్మముతో సమాన మైన సువాసన గలది అయిన, రాముని ఆ ముఖము, నేను దగ్గర లేకపోవుటచేత శోకముతో దీనమై, నీరు ఎండిపోయి నప్పుడు ఎండచేత పద్మము వలె శుష్కించ లేదు కదా?

వి. రాముడు శ్యామలవర్ణుడు (సు. 35. 16) అని మూలమున "సోమసమానవర్ణమ్" అని వర్ణించుట యుక్తముగా లేదు. "సోమసమానకాన్తమ్" అను ప్రాచీనపాఠము బాగున్నది. "చంద్రుని వలె మనోహరమైనది" అని అర్థము. మనోహరత్వములోనే చంద్రునితో సామ్యము; వర్ణములో కాదు. 28

మూ. ధర్మాపదేశాత్త్యజతశ్చ రాజ్యం
మాం చాప్యరణ్యం నయతః పదాతిమ్,
నాసీద్వ్యథా యస్య న భీర్న శోకః
కచ్చిత్స ధైర్యం హృదయే కరోతి. 29

ప్ర. అ. ధర్మాపదేశాత్ = ధర్మ మనే వంకవలన ("ధర్మోపదేశాత్" అను ప్రాచ్యపాఠము యుక్తము. ధర్మముయొక్క ఉపదేశమువలన. "తండ్రి సత్య వాక్యమువలన" లేదా "లోకమునకు ధర్మము ఉపదేశించుట అను కారణము వలన" అని అర్థము.) రాజ్యమ్ = రాజ్యమును, త్యజతః = విడచినవాడూ, మాం చాపి = నన్ను కూడ, పదాతిమ్ = కాలినడకచే ప్రయాణము చేయుదానినిగా, అరణ్యమ్ = అరణ్యమును గూర్చి, నయతః = తీసికొనివెళ్లుచున్నవాడూ అయిన, యస్య = ఏ రామునకు, వ్యథా = మనోవ్యథ, నాసీత్ = కలుగలేదో, భీః = భయము, న = కలుగలేదో, శోకః = శోకము, న = కలుగలేదో, సః = ఆట్టి రాముడు, హృదయే = హృదయమునందు, ధైర్యమ్ = ధైర్యమును, కరోతి కచ్చిత్ = చేయుచున్నాడు కదా?

తా. పితృవాక్యపాలనరూప ధర్మోపదేశమువలన రాజ్యమును విడచి, నన్ను కాలి నడకచే అరణ్యమునకు తీసికొనివెళ్లుచున్నప్పుడు కూడ ఏ రామునకు మనోవ్యథ కాని, భయము కాని, శోకము కాని కలుగలేదో అట్టి రాముడు ధైర్యముగా ఉన్నాడు కదా? 29

మూ. న చాస్య మాతా న పితా చ నాన్యః
స్నేహాద్విశిష్టోఽస్తి మయా సమో వా,
తావత్త్వహం దూత జిజీవిషేయం
యావత్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య. 30

ప్ర. అ. అస్య = ఈ రామునకు, స్నేహాత్ = స్నేహమువలన, మయా

= హితో, సమో వా = సమనుడు గాని, అధికో = అధికుడు గాని, మాతా = తల్లి, న = కాదు. పితా = తండ్రి, న = కాదు, అన్యః = మరియెవ్వరూ, నాస్తి = లేదు. దూత = ఓ! దూత వైన హనుమంతుడా! ప్రియస్య = ప్రియునియొక్క, ప్రవృత్తిమ్ = వృత్తాంతమును, యావత్ = ఎంతవరకు, శృణుయామ్ = వింటినో, తావత్ తు = అంతవరకు, అహమ్ = నేను, జీవిషేయమ్ = జీవించ నిచ్ఛ యింతును.

తా. హనుమంతుడా! రామునకు స్నేహము విషయమున తల్లిగాని, తండ్రి గాని, మరి ఏ ఇతరవ్యక్తి గాని నాతో సమానులు లేరా అధికులు లేరు. ప్రియుని వృత్తాంతమును వినునంతవరకే జీవించవలె నని కోరుచున్నాను.

మూ. ఇతీవ దేవీ వచనం మహార్థం
తం వానరేన్ద్రం మధురార్థముక్త్వా,
శ్రోతుం పునస్తస్య వచోభిరామం
రామార్థయుక్తం విరరామ రామా. ౩౧

ప్ర. అ. దేవీ = దేవి యైన, రామా = సీత, తం వానరేన్ద్రమ్ = ఆ హనుమంతుని గూర్చి, మహార్థమ్ = గొప్ప అర్థము గల, మధురార్థమ్ = మధుర మైన అర్థము గల, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, తస్య = అతనియొక్క, అభిరామమ్ = మనోహర మైనదీ, రామార్థయుక్తమ్ = రామునకు సంబంధించిన విషయములతో కూడినదీ అయిన, వచః = వాక్యమును, పునః = మరల, శ్రోతుమ్ = వినుటకు, విరరామ = ఊరకుండెను.

తా. ఆ సీతాదేవి హనుమంతునితో ఆ విధముగా గొప్పదీ, మధురమూ అయిన అర్థము గల మాటలు పలికి, రామునకు సంబంధించిన విషయములు తెలిపే మనోహర మైన హనుమంతుని మాటలు వినుటకై ఊరకుండెను. ౩౧

మూ. సీతాయా వచనం శ్రుత్వా మారుతిర్భీమవిక్రమః,
శిరస్యఞ్జలిమాధాయ వాక్యముత్తరమబ్రవీత్. ౩౨

ప్ర. అ. భీమవిక్రమః = భయంకర మైన పరాక్రమము గల, మారుతిః = హనుమంతుడు, సీతాయాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, శిరసి = శిరస్సునందు, అఞ్జలిమ్ = దోసిలిని, ఆధాయ = ఉంచి,

ఉత్తరమ్ = ఉత్తర (బదులు) రూప మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భయంకర మైన పరాక్రమము గల హనుమంతుడు సీత మాటలు విని, శిరస్సుపై అంజలి ఘటించి ఇట్లు బదులు చెప్పెను. 32

మూ. న త్వామిహస్థాం జానీతే రామః కమలలోచనే,
తేన త్వాం నానయత్యాశు శచీమివ పురన్దరః. 33

ప్ర. అ. కమలలోచనే = కమలములవంటి నేత్రములు గల సీతాదేవీ! త్వామ్ = నిన్ను, ఇహస్థామ్ = ఇక్కడ ఉన్నదానినిగా, రామః = రాముడు, న జానీతే = ఎరుగడు. తేన = ఆ కారణముచేత, పురన్దరః = దేవేంద్రుడు, శచీమివ = శచీదేవిని వలె, త్వామ్ = నిన్ను, ఆశు = శీఘ్రము. నానయతి = తీసుకొనివెళ్లుటలేదు.

తా. ఓ సీతాదేవీ! నీవు ఇక్కడ ఉన్నట్లు రామునకు తెలియదు. అందు చేతనే, దేవేంద్రుడు భార్య యైన శచీదేవిని తీసికొనివెళ్ళి నట్లు నిన్ను శీఘ్రముగా తీసికొనివెళ్ళలేదు. 33

మూ. శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్రమేష్యతి రాఘవః,
చమూం ప్రకర్షన్మహతీం హర్యృక్షగణసంకులామ్. 34

ప్ర. అ. ("మమ శ్రుత్వైవ తు వచః" అను ప్రాచ్యపాఠము బాగున్నది) మమ = నాయొక్క, వచః = వాక్యమును, శ్రుత్వైవ తు = వినగానే, రాఘవః = రాముడు, హర్యృక్షగణసంకులామ్ = వానరగణములతోను, ఋక్ష (ఎలుగుబంట్లు) గణములతోను నిండిన, మహతీమ్ = గొప్ప, చమూమ్ = సేనను, ప్రకర్షన్ = లాగికొనుచు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు.

తా. నా మాట వినిన వెంటనే రాముడు వానరగణములతోను, ఎలుగు బంట్ల గుంపులతోను నిండిన పెద్ద సైన్యముతో శీఘ్రముగా రాగలడు. 34

మూ. విష్టమ్భయిత్వా బాణౌఘైరక్షోభ్యం వరుణాలయమ్,
కరిష్యతి పురీం లఙ్కాం కాకుత్స్థః శాన్తరాక్షసామ్. 35

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, అక్షోభ్యమ్ = క్షోభింప శక్యము కాని,

వరుణాలయమ్=సముద్రమును, బాణౌఘైః=బాణ సమూహముచేత, విష్టమ్భయిత్వా=స్తంభింపచేసి, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, గతరాక్షసామ్=గతించిన రాక్షసులు కలదానినిగా, కరిష్యతి=చేయగలడు.

తా. రాముడు, క్షోభింప శక్యము కాని సముద్రమును బాణసమూహము చేత స్తంభింపచేసి (కదలకుండు నట్లు చేసి), లంకాపట్టణములోని రాక్షసుల నందరిని నశింపచేయగలడు. 35

మూ. తత్ర యద్యన్తరా మృత్యుర్యది దేవాః సహాసురాః,
స్థాస్యన్తి పథి రామస్య స తానపి వధిష్యతి. 36

ప్ర. అ. తత్ర=ఆ సమయమునందు, రామస్య=రాముని యొక్క, పథి=మార్గమునందు, అన్తరా=మధ్యయందు, మృత్యుః=మృత్యుదేవత గాని, సహాసురాః=అసురులతో గూడిన, దేవాః=దేవతలు గాని, స్థాస్యన్తి యది=నిలచి నట్లయితే, సః=ఆ రాముడు, తానపి=వాళ్ళను కూడ, వధిష్యతి=చంపగలడు.

తా. ఆ సమయమునందు, మృత్యుదేవత గాని అసురులు గాని, దేవతలు గాని రాముని మార్గములో అడ్డుతగిలినచో అతడు వాళ్ళను కూడ చంపగలడు.

మూ. తవాదర్శనజేనార్యే శోకేన స పరిప్లుతః,
న శర్మ లభతే రామః సింహార్దిత ఇవ ద్విపః 37

ప్ర. అ. ఆర్యే=ఓ పూజ్యురాలా! సః రామః=ఆ రాముడు, తవ=నీయొక్క, అదర్శనజేన=కనబడకపోవుటచేత కలిగిన, శోకేన=శోకముతో, పరిప్లుతః=నిండినవాడై, సింహార్దితః=సింహముచేత పీడింపబడిన, ద్విపః ఇవ=ఏనుగ వలె, శర్మ=సుఖమును, న లభతే=పొందుటలేదు.

తా. ఓ పూజ్యురాలా! నీవు కనబడని దుఃఖముతో నిండిన ఆ రాముడు, సింహముచేత పీడింపబడిన ఏనుగ వలె సుఖము పొందజాలకున్నాడు. 37

మూ. మలయేన చ విన్ధ్యేన మేరుణా మన్దరేణ చ,
దర్దురేణ చ తే దేవి శపే మూలఫలేన చ. 38
యథా సునయనం వల్గు బిమ్బోష్ఠం చారుదర్శనమ్,
ముఖం ద్రక్ష్యసి రామస్య పూర్ణచన్ద్రమివోదితమ్. 39

ప్ర. అ. దేవి = ఓ సీతాదేవీ, మలయేన చ = మలయ పర్వతముచేత, విన్ధ్యేన = వింధ్యపర్వతముచేత, మేరుణా = మేరుపర్వతముచేత, దర్దురేణ = దర్దురపర్వతముచేత, మూలఫలేన = మూలఫలములచేత, తే = నీకు, శపే = ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. యథా = ఏమనగా, సునయనమ్ = మంచి నేత్రములు గలదీ, వల్గు = సుందర మైనదీ, బిమ్బోష్ఠమ్ = దొండపండు వంటి పెదవులు గలదీ, చారుదర్శనమ్ = అంద మైన దర్శనము కలదీ, ఉదితమ్ = ఉదయించిన, పూర్ణచన్ద్రమివ = పూర్ణచంద్రుడు వలె ఉన్నదీ అయిన, రామస్య = రాముని యొక్క, ముఖమ్ = ముఖమును, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. ఓ దేవీ! మలయపర్వతముపైనా, వింధ్యపర్వతముపైనా, మేరు పర్వతముపైనా, మందరపర్వతముపైనా, దర్దురపర్వతముపైనా, మా ఆహార మైన కందమూలములపైనా ఒట్టుపెట్టి చెప్పుచున్నాను. సుందరము లైన నేత్రములు కలదీ, మనోహరమూ, దొండపండువంటి పెదవులు కలదీ, చూచుటకు అంద మైనదీ, ఉదయించిన పూర్ణచంద్రునితో సమానమూ అయిన రాముని ముఖమును తప్పక చూడగలవు.

వి. వనవాసములో ఉన్న రామునకు కుండలములు లేవు గాన "చారుకుణ్డలమ్" అను పాఠమునకు బదులు "చారుదర్శనమ్" అను ప్రాచ్యపాఠము గ్రహింపబడినది. 38, 39

మూ. క్షిప్రం ద్రక్ష్యసి వైదేహి రామం ప్రస్రవణే గిరౌ,
శతక్రతుమివాసీనం నాగరాజస్య మూర్ధని. 40

ప్ర. అ. వైదేహి = సీతాదేవీ! ప్రస్రవణే గిరౌ = ప్రస్రవణపర్వతమునందు, రామమ్ = రాముని, నాగరాజస్య = గజరాజైన ఐరావతముయొక్క, మూర్ధని = శిరస్సుమీద (మూపుమీద), ఆసీనమ్ = కూర్చున్న, శతక్రతుమ్ ఇవ = దేవేంద్రుని వలె, క్షిప్రమ్ = శీఘ్రముగా, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. సీతాదేవీ! ఐరావతము మూపు మీద కూర్చున్న దేవేంద్రుడు వలె ప్రస్రవణపర్వతము పై ఉన్న రాముని శీఘ్రముగా చూడగలవు. 40

మూ. న మాంసం రాఘవో భుఙ్క్తే న చాపి మధు సేవతే,
వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పఞ్చమమ్.

ప్ర. అ. రామః = రాముడు, మాంసమ్ = మాంసమును, న భుఙ్క్తే = తినుట లేదు. మధు అపి = మద్యమును కూడ, న సేవతే = సేవించుటలేదు. నిత్యమ్ = ప్రతిదినము, పఞ్చమమ్ = సాయంకాలమును (నందు), సువిహితమ్ = చక్కగా ఏర్పరుపబడిన, వన్యమ్ = వనమునందు తగిన, భక్తమ్ = అన్నమును అశ్నాతి = తినుచున్నారు.

తా. రాముడు మాంసాహారమును భుజించుటలేదు. మద్యమును సేవించుట లేదు. ప్రతిదినము సాయంకాలము మాత్రమే వానప్రస్థులకు తగిన, చక్కగా ఏర్పరుప బడిన ఫలమూలాద్యాహారమును మాత్రమే భుజించుచున్నారు.

వి. ప్రాతఃకాలము, సంగవకాలము, మధ్యాహ్నము, అపరాహ్ణము, సాయంకాలము అని పగటి భాగము ఐదు భాగములుగా విభజింపబడినది. 41

మూ. నైవ దంశాన్న మశకాన్న కీటాన్న సరీసృపాన్,
రాఘవోఽపనయేద్గాత్రాత్త్వద్గతేనాన్తరాత్మనా. 42

ప్ర. అ. రాఘవః = రాముడు, త్వద్గతేన = నిన్ను చేరియున్న, అన్తరాత్మనా = మనస్సుతో, గాత్రాత్ = శరీరమునుండి, దంశాన్ = అడవి ఈగలను, నైవ అపనయేత్ = తొలగించుకొనుటలేదు. మశకాన్ = దోమలను, న = తొలగించుకొనుటలేదు. కీటాన్ = పురుగులను, న = తొలగించుకొనుటలేదు, సరీసృపాన్ = సర్పములను కూడ, న = తొలగించుకొనుటలేదు.

తా. రాముడు తన మనస్సు పూర్తిగా నీ మీదనే నిలచి ఉండుటచే శరీరము మీద ప్రాలిన (కుట్టే) అడవి ఈగలను గాని, దోమలను గాని శరీరము మీద పాకే పురుగులను గాని, సర్పములను గాని తొలగించుకొనుటలేదు. 42

మూ. నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోకపరాయణః,
నాన్యచ్చిన్తయతే కించిత్స తు కామవశంగతః. 43

ప్ర. అ. రామః = రాముడు, నిత్యమ్ = నిత్యమూ, ధ్యానపరః = ధ్యానము నందు ఆసక్తి కలవాడు. నిత్యమ్ = ఎల్లప్పుడూ, శోకపరాయణః = శోకమునందు ఆసక్తి కలవాడు. సః = అతడు, కామవశంగతః = మన్మథునికి వశుడై, అన్యత్ = మరొకదానిని దేనిని, న చిన్తయతే = ఆలోచించుటలేదు.

తా. రాముడు ఎల్లవేళలా ఏదో ఆలోచించుచు, దుఃఖాక్రాంతుడై ఉన్నాడు. మన్మథునకు వశుడై అతడు నిన్ను తప్ప మరి దేనిని గూర్చి కూడా ఆలోచించుటలేదు. 43

మూ. అనిద్రః సతతం రామః సుప్తోఽపి చ నరోత్తమః,
సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే. 44

ప్ర. అ. రామః=రాముడు, సతతమ్=ఎల్లప్పుడూ, అనిద్రః=నిద్ర లేకుండానే ఉన్నాడు. నరోత్తమః=ఆ నరశ్రేష్ఠుడు, సుప్తోఽపి=కొంచెము నిద్రించినా, సీతేతి=సీతా అని, మధురామ్=మధుర మైన, వాణీమ్=వాక్కును, వ్యాహరన్=పలుకుచు, ప్రతిబుధ్యతే=మేల్కొనుచున్నాడు.

తా. రామునకు దాంపరకు నిద్రయే లేదు. ఎప్పుడైనా కొంచెము నిద్ర పట్టినా ఆ నరోత్తముడు "సీతా సీతా" అని అనుచు మేల్కొనుచున్నాడు. 44

మూ. దృష్ట్వా ఫలం వా పుష్పం వా యద్వాన్యత్సుమనోహరమ్,
బహుశో హా ప్రియేత్యేవం శ్వసంస్త్వామభిభాషతే. 45

ప్ర. అ. ఫలం వా=ఫలమును కాని, పుష్పం వా=పుష్పమును కాని, యద్వా=లేక, సుమనోహరమ్=చాల అంద మైన, అన్యత్=మరొక వస్తువును గాని, దృష్ట్వా=చూచి, శ్వసన్=నిట్టూర్చుచు, హా ప్రియేత్యేవమ్=హా! ప్రియురాలా! అని, త్వామ్=నిన్ను గూర్చి, బహుశః=అనేక పర్యాయములు, అభిభాషతే=మాటలాడుచుండును.

తా. ఏదైన పండు కాని, పువ్వు కాని, అంద మైన మరేదైన వస్తువు కాని కనబడినపుడు 'హా ప్రియే'! అని నిన్ను అనేకవిధముల స్మరించుచు నిట్టూర్పు విడుచుచుండును. 45

మూ. స దేవి నిత్యం పరితప్యమాన
స్త్వామేవ సీతేత్యభిభాషమాణః,
ధృతవ్రతో రాజసుతో మహాత్మా
తవైవ లాభాయ కృతప్రయత్నః. 46

ప్ర. అ. దేవి=ఓ! సీతాదేవీ! మహాత్మా=మహాత్ము డైన, సః=ఆ,

రాజసుతః = రాజకుమారు డైన రాముడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, పరితప్యమానః = బాధపడుచు, సీతేతి = సీతా అని, త్వామేవ = నిన్ను గూర్చియే, అభిభాషమాణః = మాటలాడుచు, ధృతవ్రతః = అవలంబింపబడిన వ్రతము కలవాడై, తవ = నీ యొక్క, లాభార్థమేవ = లాభముకొరకే, కృతప్రయత్నః = చేయబడిన ప్రయత్నము గలవాడు.

తా. ఓ సీతాదేవీ! మహాత్ము డైన ఆ రాజకుమారుడు, రాముడు, నిత్యము దుఃఖించుచున్నాడు. 'సీతా' అని నిన్నే తలచుచున్నాడు. నియమము అవలంబించి నిన్ను పొందుటకే ప్రయత్నము చేయుచున్నాడు. 46

మూ. సా రామసంకీర్తనవీతశోకా
రామస్య శోకేన సమానశోకా,
శరన్ముఖే సాంబుదశేషచన్ద్రా
నిశేవ వైదేహసుతా బభూవ. 47

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షట్త్రింశః సర్గః.

ప్ర. అ. రామస్య = రాముని యొక్క, శోకేన = శోకముతో, సమానశోకా = సమాన మైన శోకము కల, రామసంకీర్తనవీతశోకా = రాముని గూర్చి వర్ణించుట చేత, తొలగిన శోకముగల, సా = ఆ, వైదేహసుతా = సీత, శరన్ముఖే = శరత్కాల ప్రారంభమునందు, సాంబుదశేషచన్ద్రా = మేఘముల శేషముతో కూడిన చంద్రుడు గల, నిశేవ = రాత్రివలె, బభూవ = ఆయెను (ఉండెను).

తా. రామునకు ఎంత శోకము ఉండెనో, సీతకు కూడ అంత శోకమే ఉండెను. కాని రాముని వర్ణనము వినుటచే ఆమె శోకము కొంత తగ్గెను. ఇట్లు శోకానందములతో అప్పుడా సీత, శరత్కాలప్రారంభమునందు కొంచెము మేఘాలు మిగిలి ఉండగా చంద్రునితో కూడిన రాత్రి వలె ఉండెను. 47

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పైఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తత్రింశః సర్గః

[రాముని శీఘ్రముగా తీసికొని రమ్మని సీత హనుమంతునితో చెప్పుట; తనతో రాముని వద్దకు రమ్మని హనుమంతుడు ఆమెను కోరుట; సీత అందుకు నిరాకరించుట].

మూ. సా సీతా వచనం శ్రుత్వా పూర్ణచన్ద్రనిభాననా,
హనూమన్తమువాచేదం ధర్మార్థసహితం వచః. 1

ప్ర. అ. పూర్ణచన్ద్రనిభాననా = పూర్ణచంద్రునితో సమాన మైన ముఖము గల, సా = ఆ, సీతా = సీత, తద్వచనమ్ = హనుమంతుని వచనమును, శ్రుత్వా = విని, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, ఇదమ్ = ఈ, ధర్మార్థసహితమ్ = ధర్మార్థములతో కూడిన, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పూర్ణచంద్రుని వంటి ముఖము గల ఆ సీత హనుమంతుని మాటలు విని, ధర్మార్థములకు సంమత మైన మాట అతనితో ఇట్లనెను. 1

మూ. అమృతం విషసంసృష్టం త్వయా వానర భాషితమ్,
యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః. 2

ప్ర. అ. వానర = హనుమంతుడా! రామః = రాముడు, అన్యమనాః న ఇతి యత్ = ఇతరము లైన ఆలోచనలు లేనివారై ఉన్నారు అనునది ఏది కలదో, శోకపరాయణః ఇతి చ యత్ = దుఃఖముతో నిండి యున్నారు అనునది కూడ ఏది కలదో, త్వయా = నీచేత, భాషితమ్ = పలుకబడిన మాట, విషసంసృష్టమ్ = విషముతో కూడిన, అమృతమ్ = అమృతము. లేదా- యత్ = ఏ కారణము వలన, రామః = రాముడు, అన్యమనాః = ఇతరమనస్కుడు, న = కాడో, యత్ = ఏ కారణమువలన, శోకపరాయణుడు ఐ ఉన్నాడో, ఆ కారణము వలన....... అని కూడ అర్థము చెప్పవచ్చును.

తా. హనుమంతుడా! రాముడు ఆతురదృష్టి లేకుండా ఉన్నాడనీ, శోకముతో నిండి ఉన్నాడనీ చెప్పినావు. అందుచేత నీ మాటలు విషము కలిపిన అమృతము వలె ఉన్నవి. ౨

మూ. ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వాతిదారుణే,
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాన్తః పరికర్షతి. ౩

ప్ర. అ. కృతాన్తః = దైవము, పురుషమ్ = పురుషుణ్ణి, రజ్వా = త్రాడుతో, బద్ధ్వా ఇవ = కట్టి వలె, సువిస్తీర్ణే = బాగా అధిక మైన, ఐశ్వర్యే వా = ఐశ్వర్యము లోనికి గాని, అతిదారుణే = చాలా భయంకర మైన, వ్యసనే వా = వ్యసనములోనికి గాని, పరికర్షతి = ఈడ్చుకొనిపోవుచుండును.

తా. దైవము అత్యధిక మైన ఐశ్వర్యములోనికి గాని, అతిభయంకర మైన దుఃఖములోనికి గాని, పురుషుణ్ణి, త్రాడు కట్టి ఈడ్చుకొని పోయినట్లు ఈడ్చుకొనిపోవును. ౩

మూ. విధిర్నూనమసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ,
సౌమిత్రిం మాం చ రామం చ వ్యసనైః పశ్య మోహితాన్.

ప్ర. అ. ప్లవగోత్తమ = ఓ! వానరశ్రేష్ఠుడా! ప్రాణినామ్ = ప్రాణులకు, నూనమ్ = నిశ్చయముగా, విధిః = దైవము, అసంహార్యః = దాట శక్యము కానిది. వ్యసనైః = కష్టములచేత, మోహితాన్ = బాధపెట్టబడుచున్న, సౌమిత్రిమ్ = లక్ష్మణునీ, మాం చ = నన్నూ, రామం చ = రాముణ్ణీ, పశ్య = చూడుము.

తా. ఓ హనుమంతుడా! ప్రాణు లెవ్వరూ దైవమును దాటజాలరు. ఇది నిశ్చయము. లక్ష్మణుడూ, రాముడూ, నేనూ కష్టాలలో చిక్కుకొని ఎంత బాధ పడుచున్నామో చూడుము. ౪

మూ. శోకస్యాస్య కదా పారం రాఘవోఽధిగమిష్యతి,
ప్లవమానః పరిశ్రాన్తో హతనౌః సాగరే యథా. ౫

ప్ర. అ. సాగరే = సముద్రమునందు, హతనౌః = బ్రద్ద లైపోయిన ఓడ కలవాడై, ప్లవమానః = ఈదుచు, పరిశ్రాన్తః యథా = అలసిపోయిన పురుషుడు

వలె, రాఘవః = రాముడు, అస్య = ఈ, శోకస్య = శోకముయొక్క, పారమ్ = అంతమును, కదా = ఎప్పుడు, అధిగమిష్యతి = పొందగలడో కదా।

తా. సముద్రమధ్యములో ఓడ బ్రద్దలైపోగా ఈది, ఈది, అలసి పోయిన వాడు వలె ఉన్న రాముడు ఈ శోకము అంతమును ఎప్పుడు చూడునో కదా। 5

మూ. రాక్షసానాం వధం కృత్వా సూదయిత్వా చ రావణమ్,
లఙ్కామున్మూలితాం కృత్వా కదా ద్రక్ష్యతి మాం పతిః.

ప్ర. అ. పతిః = నా భర్త యైన రాముడు, రాక్షసానామ్ = రాక్షసుల యొక్క, వధమ్ = వధను, కృత్వా = చేసి, రావణం చ = రావణుని కూడ, సూదయిత్వా = సంహరించి, లఙ్కామ్ = లంకను, ఉన్మూలితామ్ = పెకిలించి వేయబడినదానినిగా, కృత్వా = చేసి, మామ్ = నన్ను, కదా = ఎప్పుడు, ద్రక్ష్యతి = చూడగలడో।

తా. నా భర్త రాక్షసులను సంహరించి, రావణుని హతమార్చి, లంకా పట్టణమును పూర్తిగా నశింపచేసి, న న్నెపుడు చూడగలడో కదా। 6

మూ. స వాచ్యః సంత్వరస్వేతి యావదేవ న పూర్యతే,
అయం సంవత్సరః కాలస్తావద్ధి మమ జీవితమ్. 7

ప్ర. అ. అయమ్ = ఈ, సంవత్సరః కాలః = సంవత్సరకాలము, యావదేవ = ఎంతలో, న పూర్యతే = నిండిపోదో, అంతలో, సంత్వరస్వ ఇతి = తొందర పడుము అని, సః = ఆ రాముడు, వాచ్యః = చెప్పదగినవాడు. మమ = నాయొక్క, జీవితమ్ = జీవితము, తావద్ధి = అంతవరకు మాత్రమే కదా।

తా. ఈ సంవత్సరకాలము పూర్తి అగుటకుముందే నన్ను రక్షింపుటకై తొందరపడవలె నని ఆ రామునితో చెప్పుము. ఎందుచేత ననగా నేను అంత వరకు మాత్రమే జీవించగలను. 7

మూ. వర్తతే దశమో మాసో ద్వౌ తు శేషౌ ప్లవంగమ,
రావణేన నృశంసేన సమయో యః కృతో మమ.

ప్ర. అ. ప్లవంగమ = హనుమంతుడా! నృశంసేన = క్రూరుడైన, రావణేన = రావణునిచేత, మమ = నాకు, యః = ఏ, సమయః = గడువు, కృతః = చేయబడినదో దానిలో, దశమః = పదవ, మాసః = మాసము, వర్తతే = నడచుచున్నది. ద్వౌ తు = రెండు మాసములు మాత్రమే. శేషౌ = మిగిలి ఉన్నవి.

తా. 8. హనుమంతుడా, క్రూరుడైన రావణుడు నాకిచ్చిన గడువులో అప్పుడు పదవ మాసము జరుగు చున్నది. ఇంక రెండుమాసములు మిగిలి ఉన్నవి. 8

మూ. విభీషణేన చ భ్రాత్రా మమ నిర్యాతనం ప్రతి,
అనునీతః ప్రయత్నేన న చ తత్కురుతే మతిమ్. 9

ప్ర. అ. భ్రాత్రా = సోదరుడైన, విభీషణేన = విభీషణునిచేత, మమ = నాయొక్క, నిర్యాతనం ప్రతి = తిరిగి ఇచ్చివేయుటను గూర్చి, ప్రయత్నేన = ప్రయత్నముచేత, అనునీతః = బ్రతిమాలుకొనబడినవాడైనను, తత్ = ఆ విషయమునందు, మతిమ్ = బుద్ధిని, న కురుతే = చేయుటలేదు.

తా. "సీతను రామునకు తిరిగి ఇచ్చివేయుము" అని సోదరుడైన విభీషణుడు ఆ రావణుని ఎంత బ్రతిమాలి చెప్పినను అతడు అట్టి ఆలోచన చేయుట లేదు. 9

మూ. మమ ప్రతిప్రదానం హి రావణస్య న రోచతే,
రావణం మార్గతే సంఖ్యే మృత్యుః కాలవశం గతమ్. 10

ప్ర. అ. మమ = నాయొక్క, ప్రతిప్రదానమ్ = తిరిగి ఇచ్చివేయుట, రావణస్య = రావణునకు, న రోచతే = ఇష్టమగుట లేదు. కాలవశం గతమ్ = కాలమునకు వశుడైపోయిన, రావణమ్ = రావణుని, సంఖ్యే = యుద్ధమునందు, మృత్యుః = మృత్యువు, మార్గతే = అన్వేషించుచున్నది.

తా. నన్ను తిరిగి ఇచ్చివేయుట రావణునకు ఏ మాత్రము ఇష్టముకాదు. అతడు కాలానికి లొంగి పోయినాడు; యుద్ధములో అతనిని మృత్యువు వెదకు చున్నది. 10

మూ. జ్యేష్ఠా కన్యా నలా నామ విభీషణసుతా కపే,
తయా మమేదమాఖ్యాతం మాత్రా ప్రహితయా స్వయమ్.

ప్ర. అ. కపే = హనుమంతుడా! నలా = నల అను పేరు గల, జ్యేష్ఠా = పెద్ద దైన, విభీషణసుతా = విభీషణుని కుమార్తె ఉన్నది. మాత్రా = తల్లిచేత, ప్రహితయా = పంపబడిన, తయా = ఆమెచేత, స్వయమ్ = స్వయముగా, ఇదమ్ = ఇది, మమ = నాకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. హనుమంతుడా! విభీషణుని పెద్దకూతు రైన నల, తల్లి పంపగా వచ్చి స్వయముగా నాతో ఈ విషయము చెప్పినది.

మూ. అసంశయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః,
అన్తరాత్మా చ మే శుద్ధస్తస్మింశ్చ బహవో గుణాః. 12

ప్ర. అ. హరిశ్రేష్ఠ = వానరోత్తమా! పతిః = నా భర్త యైన రాముడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, మామ్ = నన్ను, అసంశయమ్ = నిస్సంశయముగా, ప్రాప్స్యతి = పొందగలడు. మే = నా యొక్క, అన్తరాత్మా చ = అంతరాత్మ, శుద్ధః = పరిశుద్ధముగా ఉన్నది. తస్మింశ్చ = ఆ రామునియందు కూడ, బహవః = అనేకము లైన, గుణాః = సద్గుణము లున్నవి.

తా. హనుమంతుడా! నిస్సంశయముగా నా భర్త నన్ను శీఘ్రముగా పొందగలడు. ఎందుచేతననగా నా అంతరాత్మ (మనసు) పరిశుద్ధముగా ఉన్నది. ఆ రామునియందు అనేక సద్గుణములు యున్నవి. 12

మూ. ఉత్సాహః పౌరుషం సత్త్వమానృశంస్యం కృతజ్ఞతా,
విక్రమశ్చ ప్రభావశ్చ సన్తి వానర రాఘవే. 13

ప్ర. అ. వానర = హనుమంతుడా! రాఘవే = రామునియందు, ఉత్సాహః = ఉత్సాహము, పౌరుషమ్ = పురుషకారము, సత్త్వమ్ = బలము, ఆనృశంస్యమ్ = క్రూరత్వము లేకుండుట, కృతజ్ఞతా = కృతజ్ఞత్వము, విక్రమశ్చ = పరాక్రమము, ప్రభావశ్చ = ప్రభావము (అధికారనిర్వాహణ శక్తి) సన్తి = ఉన్నవి.

తా. హనుమంతుడా! రామునిలో ఉత్సాహము, పురుషప్రయత్నము

చేయుట, బలము, క్రూరస్వభావము లేకుండుట, కృతజ్ఞత్వము, పరాక్రమము, ప్రభావము మొదలైన సద్గుణములు ఉన్నవి. 13

మూ. చతుర్దశసహస్రాణి రాక్షసానాం జఘాన యః,
జనస్థానే వినా భ్రాత్రా శత్రుః కస్తస్య నోద్విజేత్. 14

ప్ర. అ. యః = ఏ రాముడు, జనస్థానే = జనస్థానమునందు, వినా భ్రాత్రా = సోదరుడు కూడ లేకుండా, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, చతుర్దశసహస్రాణి = పదునాలుగువేలను, జఘాన = చంపెనో, తస్య = అట్టి రామునకు, కః = ఏ, శత్రుః = శత్రువు, నోద్విజేత్ = భయపడకుండా ఉండును?

తా. ఏ రాముడు, లక్ష్మణుని సహాయము కూడ లేకుండ, జనస్థానములో పదునాలుగువేలమంది రాక్షసులను చంపెనో అతనికి ఏ శత్రువు భయపడడు?

మూ. న స శక్యస్తులయితుం వ్యసనైః పురుషర్షభః,
అహం తస్య ప్రభావజ్ఞా శక్రస్యేవ పులోమజా. 15

ప్ర. అ. పురుషర్షభః = పురుషులలో శ్రేష్ఠుడైన, సః = ఆ రాముడు, వ్యసనైః = కష్టములచేత. తులయితుమ్ = చలింపచేయుటకు, న శక్యః = శక్యమైనవాడు కాడు. పులోమజా = శచీదేవి, శక్రస్యేవ = దేవేంద్రునియొక్క వలె, అహమ్ = నేను, తస్య = ఆ రామునియొక్క, ప్రభావజ్ఞా = ప్రభావమును ఎరిగినదానను.

తా. పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడు ఎన్ని కష్టములు వచ్చినను చలించడు. శచీదేవి దేవేంద్రుని ప్రభావము తెలిసినట్లు, నాకు రాముని ప్రభావము బాగుగా తెలియును. 15

మూ. శరజాలాంశుమాన్ శూరః కపే రామదివాకరః,
శత్రురక్షోమయం తోయముపశోషం నయిష్యతి. 16

ప్ర. అ. కపే = హనుమంతుడా! శూరః = శూరుడు, శరజాలాంశుమాన్ = బాణసమూహము అను కిరణములు గలవాడు అయిన, రామదివాకరః = రాముడనే సూర్యుడు, శత్రురక్షోమయమ్ = శత్రువులైన రాక్షసులనే, తోయమ్ = ఉదకమును, ఉపశోషమ్ = ఎండిపోవుటను, నయిష్యతి = పొందింపగలడు.

తా. హనుమంతుడా! బాణసమూహము అనే కిరణములు గల, శూరుడైన రాముడనే సూర్యుడు, శత్రువులైన రాక్షసులనే జలమును ఎండింపచేయగలడు.

మూ. ఇతి సంజల్పమానాం తాం రామార్థే శోకకర్శితామ్,
అశ్రుసంపూర్ణనయనామువాచ వచనం కపిః 17

ప్ర. అ. ఇతి=ఇట్లు, సంజల్పమానామ్= మాటలాడుచున్నది, రామార్థే =రామునినిమిత్తము, శోకకర్శితామ్=శోకముచేత కృశింపచేయబడినది, అశ్రుసంపూర్ణనయనామ్= కన్నీళ్ళతో నిండిన నేత్రములు కలది అయిన, తామ్=ఆ సీతను గూర్చి, కపిః= హనుమంతుడు, వచనమ్=వచనమును, ఉవాచ = పలికెను.

తా. రామునికొరకై శోకముతో కృశించి, కన్నీళ్ళతో నిండిన నేత్రములతో ఈ విధముగా పలుకుచున్న సీతతో హనుమంతుడిట్లనెను. 17

మూ. శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్రమేష్యతి రాఘవః,
చమూం ప్రకర్షన్మహతీం హర్యృక్షగణసంకులామ్. 18

(ప్రతిపదార్థ తాత్పర్యములకు ౩౬వ సర్గలోని ౪౪వ శ్లోకం చూడండి)

మూ. అథవా మోచయిష్యామి త్వామద్యైవ వరాననే,
అస్మాద్దుఃఖాదుపారోహ మమ పృష్ఠమనిన్దితే. 19

ప్ర. అ. అథవా=లేదా, వరాననే= సుందరమైన ముఖము గల సీతాదేవీ! త్వామ్=నిన్ను, అద్యైవ= ఇప్పుడే, అస్మాత్ = ఈ, దుఃఖాత్=దుఃఖము నుండి, మోచయిష్యామి= విడిపింపచేసెదను. అనిన్దితే= నింధింపబడనిదానా! మమ= నాయొక్క, పృష్ఠమ్= వీపును, ఉపారోహ= ఎక్కుము.

తా. సుందరమైన ముఖము గల ఓ! సీతాదేవీ! లేదా నిన్ను ఇప్పుడే ఈ దుఃఖమునుండి విముక్తురాలిని చేసెదను. ఓ! దోషరహితురాలా! నా వీపుపై ఎక్కుము. నిన్నిప్పుడే రాముని వద్దకు చేర్చెదను. 19

మూ. త్వాం హి పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్,
శక్తిరస్తి హి మే వోఢుం లఙ్కామపి సరావణామ్. 20

ప్ర. అ. త్వామ్=నిన్ను, పృష్ఠగతామ్=వీపుపై ఉన్నదానినిగా, కృత్వా =చేసి, సాగరమ్=సముద్రమును, సంతరిష్యామి= దాటెదను. సరావణామ్ = రావణునితో కూడిన, లఙ్కామపి = లంకను కూడ, వోఢుమ్ = మోయుటకు, మే=నాకు, శక్తిః=శక్తి, అస్తి హి=ఉన్నది కదా!

తా. నిన్ను నా వీపుపై కూర్చుండ బెట్టుకొని సముద్రమును దాటెదను. రావణునితో సహా ఈ లంకను కూడా మోయుటకు నాకు శక్తి ఉన్నది. 20

మూ. అహం ప్రస్రవణస్థాయ రాఘవాయాద్య మైథిలి,
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుతమివానలః. 21

ప్ర. అ. మైథిలి= సీతాదేవీ! అనలః=అగ్ని, హుతమ్=హోమము చేయబడిన, హవ్యమ్=హోమద్రవ్యమును, శక్రాయ=దేవేంద్రునకు వలె, నిన్ను, అహమ్=నేను, ప్రస్రవణస్థాయ=ప్రస్రవణపర్వతముమీద ఉన్న, రాఘవాయ=రామునకు, అద్యైవ=ఇప్పుడే, ప్రాపయిష్యామి=పొందింపచేసెదను.

తా. సీతాదేవీ! హోమము చేసిన హోమద్రవ్యమును అగ్నిదేవుడు దేవేంద్రునకు అందజేసినట్లు, నేను, నిన్ను ప్రస్రవణపర్వతముమీద ఉన్న రామునకు ఇప్పుడే అందజేసెదను. 21

మూ. ద్రక్ష్యస్యద్యైవ వైదేహి రాఘవం సహలక్ష్మణమ్,
వ్యవసాయసమాయుక్తం విష్ణుం దైత్యవధే యథా. 22

ప్ర. అ. వైదేహి=సీతాదేవీ! దైత్యవధే=దైత్యుల వధయందు, వ్యవసాయసమాయుక్తమ్=ఉద్యమముతో కూడిన, విష్ణుం యథా=విష్ణువును వలె, వ్యవసాయసమాయుక్తమ్=రాక్షసవధకై ఉద్యమము చేయుచున్న, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రాఘవమ్=రాముని, అద్యైవ=ఇప్పుడే. ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ సీతాదేవీ! విష్ణువు దైత్యులను సంహరించుటకై ఉద్యమించు చున్నట్లు, లక్ష్మణసమేతుడైన రాముడు రాక్షసవధకై ఉద్యమించుచున్నాడు. అట్టి రాముని నీ విప్పుడే చూడగలవు. 22

మూ. త్వద్దర్శనకృతోత్సాహమాశ్రమస్థం మహాబలమ్,
పురందరమివాసీనం నాగరాజస్య మూర్ధని. 23

ప్ర. అ. త్వద్దర్శనకృతోత్సాహమ్=నీ దర్శనమునిమిత్తము చేయబడిన ఉత్సాహము కలవాడు, ఆశ్రమస్థమ్=ఆశ్రమమునందు ఉన్నవాడు, మహాబలమ్=గొప్ప బలము కలవాడూ, నాగరాజస్య=ఐరావతముయొక్క, మూర్ధని=

శిరస్సుపై, ఆసీనమ్=కూర్చున్న, పురందరమివ=దేవేంద్రునివలె ఉన్న రామునిఁ చూడగలవు.

తా. మహాబలశాలి యైన రాముడు, నిన్ను చూడవలె నను ఉత్సాహముతో ఐరావతముపైన కూర్చున్న ఇంద్రుడు వలె, ఆశ్రమములో ఉన్నాడు. అట్టి రాముని ఇప్పుడే చూడగలవు. 23

మూ. పృష్ఠమారోహ మే దేవి మా వికాఙ్క్షస్వ శోభనే,
యోగమన్విచ్ఛ రామేణ శశాఙ్కేనేవ రోహిణీ. 24

ప్ర. అ. ('మా విచారయ శోభనే' అను ప్రాచ్యపాఠము స్పష్టార్థముగా ఉన్నది). దేవి=ఓ! దేవీ! మమ=నాయొక్క. పృష్ఠమ్=వీపును, ఆరోహ = ఎక్కుము. శోభనే=మంగళప్రదురాలా! మా విచారయ = ఆలోచింపకుము. రోహిణీ = రోహిణి, శశాఙ్కేనేవ = చంద్రునితో వలె, రామేణ = రామునితో, యోగమ్=సంబంధమును, అన్విచ్ఛ=కోరుము.

తా. మంగళప్రదురాల వైన ఓ! సీతాదేవి! నా వీపుపైకి ఎక్కుము. ఆలోచింపకుము. రోహిణి చంద్రుని దగ్గరకు వెళ్ళినట్లు రాముని దగ్గరకు వెళ్లుటకు నిశ్చయించుకొనుము. 24

మూ. కథయన్తీవ చన్ద్రేణ సూర్యేణ చ మహార్చిషా,
మత్పృష్ఠమధిరుహ్య త్వం తరాకాశమహార్ణవౌ. 25

ప్ర. అ. త్వమ్ = నీవు, మత్పృష్ఠమ్ = నా వీపును, అధిరుహ్య = ఎక్కి, చన్ద్రేణ = చంద్రునితోను, మహార్చిషా = గొప్ప తేజస్సు గల, సూర్యేణ = సూర్యునితోను, కథయన్తీవ = చెప్పుచున్నదానవు వలె, ఆకాశమహార్ణవౌ = ఆకాశమును, మహాసముద్రమును, తర = దాటుము.

తా. నీవు నా వీపుపై ఎక్కి చంద్రునితోను, మహాతేజస్సు గల సూర్యునితోను మాటలాడుచున్నావా అన్నట్లు ఆకాశమార్గమునందు ప్రయాణము చేసి మహాసముద్రమును దాటుము. 25

మూ. న హి మే సమ్ప్రయాతస్య త్వామితో నయతోఽఙ్గనే,
అనుగన్తుం గతిం శక్తాః సర్వే లఙ్కానివాసినః. 26

ప్ర. అ. అఙ్గనే=ఓ సీతాదేవీ! త్వామ్=నిన్ను, ఇతః=ఇక్కడి నుండి, నయతః=తీసికొనివెళ్లుచున్న, సమ్ప్రయాతస్య=ప్రయాణ మైన, మే=నా యొక్క, గతిమ్=గమనమార్గమును, అనుగన్తుమ్=అనుసరించుటకు, సర్వే=సమస్త మైన, లఙ్కానివాసినః=లంకలో నివసించువారు, న శక్తాః=సమర్థులు కారు.

తా. ఓ సీతాదేవీ! నేను ఇక్కడినుండి నిన్ను తీసికొని వెళ్ళిపోవునప్పుడు ఈ లంకలో ఉన్నవారిలో ఎవ్వరూ కూడ నా వెంట రాలేరు. 26

మూ. యథైవాహమిహ ప్రాప్తస్తథైవాహమసంశయమ్,
యాస్యామి పశ్య వైదేహి త్వాముద్యమ్య విహాయసమ్.

ప్ర. అ. వైదేహి=ఓ సీతాదేవీ! అహమ్=నేను, యథైవ=ఎట్లు, ఇహ=ఇచటికి, ప్రాప్తః=వచ్చినానో, తథైవ=అట్లే, త్వామ్=నిన్ను, ఉద్యమ్య=ఎత్తికొని, విహాయసమ్=ఆకాశమును గూర్చి, అసంశయమ్=నిస్సంశయముగ, యాస్యామి=వెళ్ళెదను, పశ్య=చూడుము.

తా. ఓ; సీతాదేవీ! నేను ఇక్కడికి వచ్చినప్పుడు ఎట్లు వచ్చినానో అట్లే నిన్ను నా వీపుపై ఎక్కించుకొని ఆకాశమార్గములో వెళ్ళెదను. సందేహములేదు. చూడుము. 27

మూ. మైథిలీ తు హరిశ్రేష్ఠాచ్ఛ్రుత్వా వచనమద్భుతమ్,
హర్షవిస్మితసర్వాఙ్గీ హనుమన్తమథాబ్రవీత్. 28.

ప్ర. అ. మైథిలీ తు=సీత యైతే, హరిశ్రేష్ఠాత్=హనుమంతునినుండి, అద్భుతమ్=ఆశ్చర్యకర మైన, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని. హర్షవిస్మితసర్వాఙ్గీ=సంతోషముతో వికసించిన సకలదేహము కలదై, అథ=అటు పిమ్మట, హనుమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆశ్చర్యకరము లైన హనుమంతుని మాటలు వినగానే సీత సంతోషముతో వికసించిన సకలావయవములు కలదై అతనితో ఇట్లు పలికెను. 28

మూ. హనుమన్ దూరమధ్వానం కథం మాం వోఢుమిచ్ఛసి,
తదేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప. 29

ప్ర. అ. హనుమన్=హనుమంతుడా! దూరమ్=దూరమైన, అధ్వానమ్=మార్గమును, మామ్=నన్ను, వోఢుమ్=మోయుటకు, కథమ్=ఎట్లు, ఇచ్ఛసి=కోరుచున్నావు. హరియూథప=ఓ వానరసేనానాయకుడా! తే=నీ యొక్క, కపిత్వమ్=వానరుడగుట, తదేవ హి=అదియే కదా అని, మన్యే=తలచుచున్నాను.

తా. ఓ! హనుమంతుడా! ఇంత దూరమైన మార్గము నన్ను మోసికొని వెళ్ళవలెనని నీ వెట్లు అనుకొనుచున్నావు? ఓ! వానరనాయకుడా! దీనిని బట్టి నీవు వానరుడవని నిరూపించుకొనుచున్నావు! 29

మూ. కథం వాల్పశరీరస్త్వం మామితో నేతుమిచ్ఛసి,
సకాశం మానవేన్ద్రస్య భర్తుర్మే ప్లవగర్షభ. 30

ప్ర. అ. ప్లవగర్షభ=ఓ! వానరశ్రేష్ఠుడా! అల్పశరీరః=అల్పమైన శరీరము గల, త్వమ్=నీవు, ఇతః=ఇక్కడినుండి, మే=నా యొక్క, భర్తుః=భర్త యైన, మానవేన్ద్రస్య=మానవులకు ప్రభువైన రాముని యొక్క, సకాశమ్=సమీపమును, నేతుమ్=తీసికొని వెళ్ళుటకు, కథం వా=ఎట్లు, ఇచ్ఛసి==కోరుచున్నావు.

తా. ఓ! వానరోత్తమా! ఇంత చిన్న శరీరము గల నీవు, నన్ను, ఇక్కడి నుండి నా భర్త యైన రామునివద్దకు తీసికొనిపోగలవని ఎట్లు అనుకొను చున్నావు? 30

మూ. సీతాయా వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః,
చిన్తయామాస లక్ష్మీవాన్ నవం పరిభవం కృతమ్ 31

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, లక్ష్మీవాన్=శోభగల, హనుమాన్=హనుమంతుడు, సీతాయాః=సీత యొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, నవమ్=క్రొత్త, పరిభవమ్=పరాభవమును, కృతమ్=చేయబడిన దానినిగా, చిన్తయామాస=ఆలోచించెను.

తా. వాయుపుత్రుడూ శోభాసంపన్నుడూ, అయిన హనుమంతుడు సీత మాటలు విని, "అహో! ఈనాడు నా కొక క్రొత్త అవమానము జరిగినది కదా", అని భావించెను. 31

మూ. న మే జానాతి సత్త్వం వా ప్రభావం వాసితేక్షణా,
తస్మాత్ పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః.

ప్ర. అ. అసితేక్షణా=నల్లని నేత్రములు గల, వైదేహీ=సీతాదేవి, మే=నాయొక్క, సత్త్వం వా=బలమును గాని, ప్రభావం వా=ప్రభావమునుగాని, న జానాతి=ఎరుగదు. తస్మాత్=ఆ కారణము వలన, కామతః=ఇచ్ఛానుసారముగా మమ=నాయొక్క, యత్=ఏ, రూపమ్=రూపము ఉన్నదో దానిని, పశ్యతు=చూచుగాక.

తా. నల్లని నేత్రములు గల ఈ సీతకు నా బలము గాని, ప్రభావము గాని తెలియదు. అందుచేత నేను ఇచ్ఛానుసారముగా ఏట్టి రూపము ధరించ గలనో ఈమెకు చూపెదను. 32

మూ. ఇతి సంచిన్త్య హనుమాంస్తదా ప్లవగసత్తమః,
దర్శయామాస వైదేహ్యాః స్వరూపమరిమర్దనః. 33

ప్ర. అ. ప్లవగసత్తమః=వానరులలో గొప్పవాడు, అరిమర్దనః=శత్రు సంహారకుడు అయిన, హనుమాన్=హనుమంతుడు, ఇతి=ఇట్లు, సంచిన్త్య=ఆలోచించి, తదా=అప్పుడు, స్వరూపమ్=తన రూపమును, వైదేహ్యాః=సీతా దేవికి, దర్శయామాస=చూపించెను.

తా. వానరశ్రేష్ఠుడు, శత్రుసంహారకుడు అయిన హనుమంతుడు ఈ విధముగా ఆలోచించి, సీతాదేవికి తన స్వరూపమును చూపించెను. 33

మూ. స తస్మాత్పాదపాద్ధీమానాప్లుత్య ప్లవగర్షభః,
తతో వర్ధితుమారేభే సీతాప్రత్యయకారణాత్. 34

ప్ర. అ. ధీమాన్=బుద్ధిమంతుడు, ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడూ అయిన, సః=ఆ హనుమంతుడు, తస్మాత్=ఆ, పాదపాత్=వృక్షమునుండి, ఆప్లుత్య=క్రిందికి దుమికి, తతః=అటుపిమ్మట, సీతాప్రత్యయకారణాత్=సీతకు నమ్మకము కలుగుటకై, వర్ధితుమ్=వృద్ధి పొందుటకు, ఆరేభే=ప్రారంభించెను.

తా. ధీమంతుడు, వానరశ్రేష్ఠుడు అయిన హనుమంతుడు ఆ వృక్షము

నుండి క్రిందికి దుమికి, సీతకు నమ్మకము కలిగించుటకై పెరుగుటకు ప్రారంభించెను. ౩౪

మూ. మేరుమన్దరసంకాశో బభౌ దీప్తానలప్రభః,
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః. ౩౫

ప్ర. అ. వానరోత్తమః = ఆ హనుమంతుడు, మేరుమన్దరసంకాశః = మేరుమందరపర్వతములతో సమానుడై, దీప్తానలప్రభః = ప్రజ్వలించుచున్న అగ్ని వంటి కాంతి గలవాడై, బభౌ = ప్రకాశించెను. సీతాయాః = సీతయొక్క, అగ్రతః = ఎదుట, వ్యవతస్థే చ = నిలచెను కూడ.

తా. ఆ వానరోత్తముడైన హనుమంతుడు మేరుపర్వతము వలె, మందర పర్వతము వలె ఉన్నతమైన శరీరముతో, ప్రజ్వలించుచున్న అగ్ని వంటి కాంతితో ప్రకాశించుచు సీత ఎదుట నిలచెను. ౩౫

మూ. హరిః పర్వతసంకాశస్తామ్రవక్త్రో మహాబలః,
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీమిదమబ్రవీత్. ౩౬

ప్ర. అ. పర్వతసంకాశః = పర్వతముతో సమానుడు, తామ్రవక్త్రః = ఎఱ్ఱని ముఖము కలవాడు, మహాబలః = గొప్ప బలము గలవాడు, వజ్రదంష్ట్రనఖః = వజ్రమువంటి కోరలు గోళ్లు కలవాడు, భీమః = భయంకరుడు అయిన, హరిః = హనుమంతుడు, వైదేహీమ్ = సీతను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఎఱ్ఱని ముఖముతోను వజ్రము వంటి కోరలతోను, గోళ్లతోను, భయంకరుడై, పర్వతము వలె ఉన్న మహాబలశాలియైన ఆ హనుమంతుడు సీతతో ఇట్లు పలికెను. ౩౬

మూ. సపర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణామ్,
లఙ్కామిమాం సనాథాం వా నయితుం శక్తిరస్తి మే.

ప్ర. అ. సపర్వతవనోద్దేశామ్ = పర్వతములతోను, వనప్రదేశములతోను కూడినది, సాట్టప్రాకారతోరణామ్ = కోటబురుజులతోను, ప్రాకారములతోను, ముఖద్వారములతోను కూడినది, సనాథామ్ = ప్రభువైన రావణునితో కూడినది

అయిన, ఇమామ్ = ఈ, లఙ్కాం వా = లంక నైన కూడ, నయితుమ్ = తీసికొని పోవుటకు, మే = నాకు, శక్తిః = శక్తి, అస్తి = ఉన్నది.

తా. పర్వతములు, వనప్రదేశములు, కోటబురుజులు, ప్రాకారములు, ముఖద్వారములు, ప్రభు వైన రావణుడు వీరి అన్నింటితో సహా ఈ లంకాపురమును కూడా తీసికొని వెళ్లుటకు నాకు శక్తి ఉన్నది. 37

మూ. తదవస్థాప్యతాం బుద్ధిరలం దేవి వికాఙ్క్షయా,
విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణమ్. 38

ప్ర. అ. దేవి = ఓ దేవీ! తత్ = ఆ కారణమువలన, వికాఙ్క్షయా = సందేహముచేత, అలమ్ = చాలును, బుద్ధిః = బుద్ధి, అవస్థాప్యతామ్ = స్థిరము చేయబడుగాక! వైదేహి = ఓ సీతాదేవీ! సహలక్ష్మణమ్ = లక్ష్మణసహితు డైన, రాఘవమ్ = రాముని, విశోకమ్ = శోకము లేనివానినిగా, కురు = చేయుము.

తా. సీతాదేవీ! ఈ కారణముచే, సందేహము విడచి మనస్సును స్థిరముగా చేసికొనుము. నా వెంట వచ్చి లక్ష్మణసమేతు డైన రాముని దుఃఖము పోగొట్టుము. 38

మూ. తం దృష్ట్వా భీమసంకాశమువాచ జనకాత్మజా,
పద్మపత్రవిశాలాక్షీ మారుతస్యౌరసం సుతమ్. 39

ప్ర. అ. పద్మపత్రవిశాలాక్షీ = పద్మపత్రములవలె విశాలము లైన నేత్రములు గల, జనకాత్మజా = సీత, భీమసంకాశమ్ = భయంకరుడూ, మారుతస్య = వాయుదేవునియొక్క, ఔరసం సుతమ్ = ఔరసపుత్రుడూ అయిన, తమ్ = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, ఉవాచ = ఇట్లు పలికెను.

తా. పద్మపత్రములవలె విశాలము లైన నేత్రములు గల సీత, భయంకరాకారముతో ఉన్న ఆ వాయుదేవుని ఔరసపుత్రు డైన హనుమంతుని చూచి ఇట్లనెను. 39

మూ. తవ సత్త్వం బలం చైవ విజానామి మహాకపే,
వాయోరివ గతిం చైవ తేజశ్చాగ్నేరివాద్భుతమ్. 40

ప్ర. అ. మహాకపే = ఓ మహావానరుడా! తవ = నీ యొక్క, సత్త్వమ్ =

ధైర్యమును, బలం చైవ = బలమును, వాయోరివ = వాయువుయొక్క వలె, గతిమ్=గమనశక్తిని, అగ్నేరివ=అగ్నియొక్క వలె, అద్భుతమ్=ఆశ్చర్యకర మైన, తేజః = తేజస్సును, విజానామి = నేను ఎరుగుదును

తా. ఓ వానరోత్తమా! నీ ధైర్యమును, బలమును, వాయువునకు వలె నీ కున్న అడ్డులేని గమనమును, అగ్ని తేజస్సువలె అద్భుత మైన నీ తేజస్సునూ నేను ఎరుగుదును. 40

మూ. ప్రాకృతోఽన్యః కథం చేమాం భూమిమాగన్తుమర్హతి,
ఉదధేరప్రమేయస్య పారం వానరపుఙ్గవ. 41

ప్ర. అ. వానరపుఙ్గవ=ఓ వానరశ్రేష్ఠుడా! ప్రాకృతః=సామాన్యు డైన, అన్యః = మరి యొకడు, అప్రమేయస్య = ఊహింప శక్యము కాని, ఉదధేః = సముద్రముయొక్క, పారమ్ = ఆవలి ఒడ్డును, ఇమామ్ = ఈ, భూమిమ్ = ప్రదేశమును, ఆగన్తుమ్ = వచ్చుటకు, కథమ్ = ఎట్లు, అర్హతి = తగి ఉన్నాడు?

తా. ఓ వానరశ్రేష్ఠుడా! ఊహింప శక్యము కాని ఈ సముద్రమును దాటి, సామాన్యు డెవ్వ డైనా ఈ ప్రదేశమునకు రాగలడా? 41

మూ. జానామి గమనే శక్తిం నయనే చాపి తే మమ,
అవశ్యం సంప్రధార్యాశు కార్యసిద్ధిర్మహాత్మనః. 42

ప్ర. అ. గమనే = వెళ్లుటయందు, మమ = నాయొక్క, నయనే = తీసికొని వెళ్లుటయందు, శక్తిమ్ = నీ సామర్థ్యమును, జానామి = ఎరుగుదును. మహాత్మనః = మహాత్ము డైన రాముని యొక్క, కార్యసిద్ధిః = కార్యముయొక్క సిద్ధి, అవశ్యమ్ = తప్పక. ఆశు = శీఘ్రముగా, సంప్రధార్యా = నిర్ణయింప తగినది.

తా. నీవు నన్ను తీసికొని వెళ్లగల వను విషయమును నే నెరుగుదును. మహాత్ము డైన రాముని కార్యము ఎట్లు చెడిపోకుండునో మనము నిర్ణయించ వలసి ఉన్నది. 42

మూ. అయుక్తం తు కపిశ్రేష్ఠ మమ గన్తుం త్వయానఘ,
వాయువేగసవేగస్య వేగో మాం మోహయేత్తవ. 43

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! కపిశ్రేష్ఠ = ఓ వానరశ్రేష్ఠుడా! త్వయా = నీతో, మమ = నాకు, గన్తుమ్ = వెళ్లుటకు, అయుక్తమ్ = యుక్తము కాదు. వాయువేగసవేగస్య = వాయువేగముతో సమాన మైన వేగము గల్గి, తవ = నీయొక్క, వేగః = వేగము, మామ్ = నన్ను, మోహయేత్ = మనస్సు కంగారుపడు నట్లు చేయవచ్చును.

తా. నేను నీతో వెళ్లుట యుక్తము కాదు. ఎందుచేత ననగా వాయువేగముతో సమాన మైన వేగముతో నీవు వెళ్ళుచున్నప్పుడు నా మనసు కంగారు పడవచ్చును. 43

మూ. అహమాకాశమాపన్నా హ్యుపర్యుపరి సాగరమ్,
ప్రపతేయం హి తే పృష్ఠాద్భయాద్వేగేన గచ్ఛతః. 44

ప్ర. అ. సాగరమ్ ఉపర్యుపరి = సముద్రానికి చాల ఎత్తున, ఆకాశమ్ = ఆకాశమును, ఆపన్నా = పొందిన, అహమ్ = నేను, వేగేన = వేగముతో, గచ్ఛతః వెళ్లుచున్న, తే = నీయొక్క, పృష్ఠాత్ = వీపునుండి, భయాత్ = భయమువలన, ప్రపతేయమ్ = పడిపోవుదును.

తా. నీవు మహావేగముతో వెళ్లుచున్నప్పుడు నీ వీపుపైన ఉన్న నేను సముద్రమునకు చాలా ఎత్తుగా ఆకాశములో ప్రవేశించగానే కళ్లు తిరిగి క్రింద పడిపోవుదును. 44

మూ. పతితా సాగరే చాహం తిమినక్రఝషాకులే,
భవేయమాశు వివశా యాదసామన్నముత్తమమ్ 45

ప్ర. అ. తిమినక్రఝషాకులే = తిములతోను, మొసళ్ళతోను, ఝషము లను పెద్ద చేపలతోను వ్యాకుల మైన, సాగరే = సముద్రమునందు, పతితా = పడిపోయిన, అహమ్ = నేను, వివశా = వివశురాల నై, ఆశు = శీఘ్రముగా, యాదసామ్ = జలజంతువులయొక్క, ఉత్తమమ్ = ఉత్తమ మైన, అన్నమ్ = అన్నముగా, భవేయమ్ = అయిపోవుదును.

తా. నేను వివశురాల నై, తిములతోను (పెద్దచేప), మొసళ్ళతోను సొర చేపలతోను, నిండిన సముద్రములో పడిపోయి, జలజంతువులకు మంచి ఆహారము అయిపోవుదును. 45

మూ. న చ శక్ష్యే త్వయా సార్ధం గన్తుం శత్రువినాశన,
కళత్రవతి సన్దేహస్త్వయ్యపి స్యాదసంశయః. 46

ప్ర. అ. శత్రువినాశన = శత్రువులను నశింపచేయువాడా! త్వయా సార్ధమ్ = నీతో కూడ, గన్తుమ్ = వెళ్ళుటకు, న శక్ష్యే చ = సమర్థురాలను కాజాలను. కళత్రవతి = రక్షింపదగిన వ్యక్తి గల, త్వయ్యపి = నీయందు కూడ, సందేహః = సందేహము, స్యాత్ = అగును; అసంశయః = సంశయము లేదు.

తా. శత్రువినాశకుడ వైన ఓ హనుమంతుడా! నేను నీతో వచ్చుట మంచిది కాదు. నీవు నీతో ఉన్న నన్ను కూడ రక్షించవలసి యుండును కదా! అప్పుడు నీ ప్రాణాలకు కూడా సందేహము కలుగవచ్చును. 46

మూ. హ్రియమాణాం తు మాం దృష్ట్వా రాక్షసా భీమవిక్రమాః
అనుగచ్ఛేయురాదిష్టా రావణేన దురాత్మనా. 47

ప్ర. అ. హ్రియమాణామ్ = హరింపబడుచున్న, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, భీమవిక్రమాః = భయంకర మైన పరాక్రమము గల, రాక్షసాః = రాక్షసులు, దురాత్మనా = దుష్టస్వభావము గల, రావణేన = రావణునిచేత, ఆదిష్టాః = ఆజ్ఞాపించబడినవా రై, అనుగచ్ఛేయుః = వెంబడింతురు.

తా. నీవు నన్ను తీసికొనిపోవుచుండగా చూచి, భయంకర మైన పరాక్రమము గల రాక్షసులు, దురాత్ము లైన రావణుడు ప్రేరేపింపగా నిన్ను వెంబడింతురు. 47

మూ. తైస్త్వం పరివృతః శూరైః శూలముద్గరపాణిభిః,
భవేస్త్వం సంశయం ప్రాప్తో మయా వీర కళత్రవాన్.

ప్ర. అ. త్వమ్ = నీవు, శూలముద్గరపాణిభిః = శూలములు, ముద్గరములు హస్తములందు గల, తైః = ఆ, శూరైః = శూరు లైన రాక్షసులచేత, పరివృతః = చుట్టబడినవాడవు అయెదవు. వీర = ఓ వీరుడా, మయా = నాచేత, కళత్రవాన్ = రక్షింపదగిన వ్యక్తి గల, త్వమ్ = నీవు, సంశయమ్ = సంశయమును, ప్రాప్తః = పొందినవాడవు, భవేః = అగుదువు.

తా. ఓ వీరుడా! శూలములు, ముద్గరములు, హస్తములందు ధరించిన

ఆ క్రూరులు నిన్ను చుట్టుముట్టెదరు. ఆ సమయమునందు, నన్ను కూడ రక్షింప వలసిన నీ పరిస్థితి సంశయములో పడును. 48

మూ. సాయుధా బహవో వ్యోమ్ని రాక్షసాస్త్వం నిరాయుధః,
కథం శక్ష్యసి సంయాతుం మాం చైవ పరిరక్షితుమ్. 49

ప్ర. అ. వ్యోమ్ని = ఆకాశమునందు, సాయుధాః = ఆయుధములతో కూడిన, రాక్షసాః = రాక్షసులు, బహవః = చాలామంది ఉందురు. త్వమ్ = నీవు, నిరాయుధః = ఆయుధములు లేనివాడవు. సంయాతుమ్ = వెళ్లుటకు, మామ్ = నన్ను, పరిరక్షితుం చ = రక్షించుటకు. కథమ్ = ఎట్లు, శక్ష్యసి = సమర్థుడ వగుదువు ?

తా. ఆకాశముపైన అనేకులు రాక్షసులు ఆయుధములు ధరించి వచ్చెదరు. నీవో ఆయుధము ఏదీ లేక ఒంటరిగా ఉందువు. ఇటు నన్ను రక్షించుకొనుచు ఎట్లు ప్రయాణము సాగింపగలవు? 49

మూ. యుధ్యమానస్య రక్షోభిస్తవ తైః క్రూరకర్మభిః,
ప్రపతేయం హి తే పృష్ఠాద్భయార్తా కపిసత్తమ. 50

ప్ర. అ. కపిసత్తమ = వానరశ్రేష్ఠుడా! తవ = నీవు, క్రూరకర్మభిః = క్రూర మైన కర్మ గల, తైః = ఆ, రక్షోభిః = రాక్షసులతో, యుధ్యమానస్య = యుద్ధము చేయుచుండగా, భయార్తా = భయముచేత పీడితురాల నై, తే = నీ యొక్క, పృష్ఠాత్ = వీపునుండి, ప్రపతేయం హి = పడిపోవుదును కదా!

తా. వానరశ్రేష్ఠా! నీవు క్రూర మైన పనులు చేయు రాక్షసులతో యుద్ధము చేయుచుండగా, నేను భయముచే పీడితురాల నై, నీ వీపునుండి పడిపోవుదును.

మూ. అథ రక్షాంసి భీమాని మహాన్తి బలవన్తి చ,
కథంచిత్సాంపరాయే త్వాం జయేయుః కపిసత్తమ. 51

ప్ర. అ. కపిసత్తమ = ఓ వానరశ్రేష్ఠుడా! అథ = అటుపిమ్మట, భీమాని = భయంకరులు, మహాన్తి = పెద్ద శరీరము కలవారు, బలవన్తి చ = బలము కలవారు అయిన, రక్షాంసి = రాక్షసులు, సాంపరాయే = యుద్ధమునందు, కథంచిత్ = ఏదో విధముగా, త్వామ్ = నిన్ను, జయేయుః = జయింతురు.

తా. వానరోత్తమా! అప్పుడు, భయంకరులు, గొప్ప దేహములు గలవారు, బలవంతులు అయిన రాక్షసులు ఏదో విధముగ నిన్ను జయించి వేయవచ్చును.

మూ. అథవా యుధ్యమానస్య పతేయం విముఖస్య తే,
పతితాం చ గృహీత్వా మాం నయేయుః పాపరాక్షసాః.

ప్ర. అ. అథవా = లేదా, యుధ్యమానస్య = యుద్ధము చేయుచున్న, తే = నీవు, విముఖస్య = (నా విషయమున), ఏమరిపాటుతో ఉండగా, పతేయమ్ = పడిపోవుదును. పతితామ్ = పడిన, మామ్ = నన్ను, గృహీత్వా = గ్రహించి, పాపరాక్షసాః = పాపాత్ములైన రాక్షసులు, నయేయుః = తీసికొని పోవుదురు.

తా. లేదా నీవు యుద్ధము చేయుచు నా విషయమున ఏమరిపాటుతో ఉండగా నేను క్రింద పడిపోవచ్చును. అప్పుడు నన్ను రాక్షసులు పట్టి తీసికొని పోవచ్చును. 52

మూ. మాం వా హరేయుస్త్వద్ధస్తాద్విశసేయురథాపి వా,
అవ్యవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయపరాజయౌ. 53

ప్ర. అ. త్వద్ధస్తాత్ = నీ చేతినుండి, మామ్ = నన్ను, హరేయుః = హరింతురు. అథాపి వా = లేదా, విశసేయుః = చంపివేయుదురు. యుద్ధే = యుద్ధమునందు, జయపరాజయౌ = జయపరాజయములు, అవ్యవస్థౌ = వ్యవస్థ లేనివిగా, దృశ్యేతే హి = చూడబడుచున్నవి కదా.

తా. లేదా ఆ రాక్షసులు నీ నుండి నన్ను హరించవచ్చును. లేదా చంపి వేయవచ్చును. యుద్ధములో జయపరాజయములు నిశ్చితములు కావు కదా. జయము కలుగవచ్చును. పరాజయము కలుగవచ్చును. 53

మూ. అహం వాపి విపద్యేయం రక్షోభిరభితర్జితా,
త్వత్ప్రయత్నో హరిశ్రేష్ఠ భవేన్నిష్ఫల ఏవ తు. 54

ప్ర. అ. రక్షోభిః = రాక్షసులచేత అభితర్జితా = భయపెట్టబడినదాననై, అహమ్ = నేను, విపద్యేయం వాపి = ఆపద చెందవచ్చును. హరిశ్రేష్ఠ = ఓ! వానరశ్రేష్ఠా! త్వత్ప్రయత్నః = నీ ప్రయత్నము, నిష్ఫలం ఏవ తు = నిష్ఫలమే, భవేత్ = అగును.

తా. వానరోత్తమా! లేదా రాక్షసులు నన్ను భయపెట్టగా నే నాపద చెందవచ్చును. ఇట్లు నీ ప్రయత్నము విఫలమే అగును. 54

మూ. కామం త్వమసి పర్యాప్తో నిహన్తుం సర్వరాక్షసాన్।
రాఘవస్య యశో హీయేత్త్వయా శస్తైస్తు రాక్షసైః॥ 55

ప్ర. అ. త్వమ్=నీవు, సర్వరాక్షసాన్=అందరు రాక్షసులను, నిహన్తుమ్=చంపుటకు, పర్యాప్తః అసి కామమ్=నిశ్చయముగ సమర్థుడవు అయి ఉండవచ్చును. త్వయా=నీచేత, శస్తైః=చంపబడిన, రాక్షసైః=రాక్షసులచేత, రాఘవస్య=రామునియొక్క, యశః=కీర్తి, హీయేత్=తగ్గిపోవును.

తా. నీవు రాక్షసులను అందరినీ చంపుటకు సమర్థుడవే. కాని రాక్షసులందరిని నీవే చంపినచో రాముని కీర్తికి దెబ్బ తగులును. 55

మూ. అథవాదాయ రక్షాంసి న్యసేయుః సంవృతే హి మామ్।
యత్ర తే నాభిజానీయుర్హరయో నాపి రాఘవౌ॥ 56

ప్ర. అ. అథవా=లేదా, రక్షాంసి=రాక్షసులు, మామ్=నన్ను, ఆదాయ=గ్రహించి, యత్ర=ఏ స్థలమునందు, తే హరయః=ఆ వానరులు గాని, రాఘవౌ అపి=రామలక్ష్మణులు గాని, నాభిజానీయుః=గుర్తింపజాలరో, సంవృతే=అట్టి రహస్యప్రదేశమునందు, న్యసేయుః=ఉంచివేయుదురు.

తా. లేదా—రాక్షసులు నన్ను తీసికొనిపోయి వానరులకు గాని, రామలక్ష్మణులకు గాని తెలియని రహస్యప్రదేశమునందు ఎక్కడనైనా దాచివేయవచ్చును. 56

మూ. ఆరమ్భస్తు మదర్థోఽయం తతస్తవ నిరర్థకః।
త్వయా హి సహ రామస్య మహానాగమనే గుణః॥ 57

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మదర్థః=నా కొరకైన, తవ=నీయొక్క, ఆరమ్భస్తు=కార్యారంభమైనచో, నిరర్థకః=వ్యర్థమగును. త్వయా సహ=నీతో కూడ, రామస్య=రామునియొక్క, ఆగమనే=వచ్చుటయందు, మహాన్=గొప్ప, గుణః=గుణము ఉన్నది.

తా. అప్పుడు నాకోసం నీవు చేసిన ప్రయత్నమంతా వ్యర్థమైపోవును. అందువేత రాముడు నీతో కలిసి వచ్చుటయే మంచిది. 57

మూ. మయి జీవితమాయత్తం రాఘవస్య మహాత్మనః,
భ్రాతౄణాం చ మహాబాహో తవ రాజకులస్య చ. 58

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! మహాత్మనః = మహాత్ముడైన, రాఘవస్య = రాముని యొక్క, భ్రాతౄణామ్ = అతని సోదరులయొక్క, తవ = నీయొక్క, రాజకులస్య చ = నీ రాజకుటుంబముయొక్క, జీవితమ్ = జీవితము. మయి = నాయందు, ఆయత్తమ్ = అధీనమైనది.

తా. హనుమంతుడా! మహాత్ముడైన రాముడూ, అతని సోదరులూ, నీవూ, నీ రాజైన సుగ్రీవుడు మొదలైన వారూ వీరందరి జీవితము నామీద ఆధారపడి ఉన్నది కదా! 58

మూ. తౌ నిరాశౌ మదర్థం తు శోకసంతాపకర్శితౌ,
సహ సర్వర్క్షహరిభిస్త్యక్ష్యతః ప్రాణసంగ్రహమ్. 59

ప్ర. అ. మదర్థమ్ = నా నిమిత్తమై, శోకసంతాపకర్శితౌ = శోకము చేతను, సంతాపముచేతను, కృశించచేయబడి ఉన్న, తౌ = ఆ రామలక్ష్మణులు, నిరాశౌ = నిరాశులై, సర్వర్క్షహరిభిః సహ = సమస్తమైన ఎలుగుబంట్లతోను, వానరులతోను, ప్రాణసంగ్రహమ్ = ప్రాణరక్షణమును, త్యక్ష్యతః = విడువగలరు.

తా. నా నిమిత్తమై శోకసంతాపముతో కృశించి ఉన్న ఆ రామలక్ష్మణులు, సమస్తమైన ఎలుగుబంటులు, వానరులు, నిరాశచే ప్రాణములు విడచెదరు.

మూ. భర్తుర్భక్తిం పురస్కృత్య రామాదన్యస్య వానర,
న స్పృశామి శరీరం తు పుంసో వానరపుంగవ. 60

ప్ర. అ. వానరపుంగవ = వానరులలో శ్రేష్ఠుడవైన, వానర = హనుమంతుడా! భర్తుః = భర్తయొక్క (యందు), భక్తిమ్ = భక్తిని, పురస్కృత్య = పురస్కరించుకొని, రామాత్ = రామునికంటె, అన్యస్య = ఇతరుడైన, పుంసః = పురుషునియొక్క, శరీరం తు = శరీరమును, న స్పృశామి = స్పృశించను.

తా. వానరోత్తమా! పాతివ్రత్యధర్మమును అనుసరించి నేను రాముడు తప్ప మరి యే పురుషుని శరీరమును స్పృశించను.

వి. ఈ శ్లోకములోని ఉత్తరార్థమునకు బదులు "నాహం స్ప్రష్టుం స్వతో గాత్రమిచ్ఛేయం వానరోత్తమ" అను గోరఖ్‌పూరు పాఠము కూడా ఉన్నది. "అహమ్ = నేను, స్వతః = నా అంతట నేనుగా, స్ప్రష్టుమ్ = స్పృశించుటకు, నేచ్ఛేయమ్ = ఇచ్ఛయించను" అని అర్థము. స్వతః అని చెప్పటంలో అందమున్నది. తరువాతి శ్లోకం ఈ భావాన్నే వివరిస్తున్నారు. 60

మూ. యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా,
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. 61

ప్ర. అ. అహమ్ = నేను, బలాత్ = బలాత్కారమువలన, రావణస్య = రావణునియొక్క, గాత్రసంస్పర్శమ్ = శరీరస్పర్శను, గతా యత్ = పొందినా నన్నచో, అనీశా = శక్తి లేనిదానను గాను, వివశా సతీ = పరాధీనురాలనుగాను ఉన్న నేను, వినాథా = రక్షించువాడు లేనిదాన నై, కిం కరిష్యామి = ఏమి చేయుదును?

తా. బలాత్కారమువలన, రావణుని శరీరస్పర్శ నాకు కలిగిన దన్నచో ఆ సమయములో రక్షించే నాథుడు లేక స్వయముగా రక్షించుకొనే శక్తి లేక, పరాధీనురాల నైన నేను ఏమి చేయగలను?

మూ. యది రామో దశగ్రీవమిహ హత్వా సబాన్ధవమ్,
మామితో గృహ్య గచ్ఛేత తత్తస్య సదృశం భవేత్. 62

ప్ర. అ. రామః = రాముడు, సబాన్ధవమ్ = బంధువులతో కూడిన, దశగ్రీవమ్ = రావణుని, ఇహ = ఇక్కడ, హత్వా = చంపి, మామ్ = నన్ను, ఇతః = ఇక్కడి నుండి, గృహ్య = గ్రహించి, గచ్ఛేత యది = వెళ్ళిన ట్లయితే, తత్ = అది, తస్య = అతనికి, సదృశమ్ = తగినది, భవేత్ = అగును.

తా. రాము డిక్కడ బంధుసహితు డైన రావణుని సంహరించి, నన్ను ఈ ప్రదేశము నుండి తీసికొని వెళ్ళినచో అది అతనికి యుక్తముగా ఉండును. 62

మూ. శ్రుతా హి దృష్టాశ్చ మయా పరాక్రమా
మహాత్మనస్తస్య రణావమర్దినః,
న దేవగన్ధర్వభుజఙ్గరాక్షసా
భవన్తి రామేణ సమా హి సంయుగే. 63

ప్ర. అ. శత్రుఘాతినః = యుద్ధమునందు శత్రువులను పీడించు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ రాముని యొక్క, పరాక్రమాః = పరాక్రమములు, మయా = నాచేత, శ్రుతాః = వినబడినవి. దృష్టాశ్చ = చూడబడినవి కూడ. సంయుగే = యుద్ధమునందు, దేవగన్ధర్వనాగరాక్షసాః = దేవతలు, గంధర్వులు, నాగులు, రాక్షసులు, రామేణ = రామునితో, సమాః = సమానమైనవారు, న హి = కారు కదా!

తా. యుద్ధములో శత్రువులను సంహరించు ఆ రాముని పరాక్రమాలను గూర్చి నేను వినుటయే కాదు, స్వయముగా కూడ చూచినాను. యుద్ధములో దేవతలు గాని, గంధర్వులు గాని, నాగులు గాని, రాక్షసులు గాని రాముని ముందు నిలువజాలరు. 63

మూ. సమీక్ష్య తం సంయతి చిత్రకార్ముకమ్
మహాబలం వాసవతుల్యవిక్రమమ్,
సలక్ష్మణం కో విషహేత రాఘవం
హుతాశనం దీప్తమివానలేరితమ్. 64

ప్ర. అ. చిత్రకార్ముకమ్ = చిత్రమైన ధనస్సు కలవాడు, మహాబలమ్ = గొప్ప బలము కలవాడు, వాసవతుల్యవిక్రమమ్ = దేవేంద్రునితో సమానమైన పరాక్రమము కలవాడు, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడినవాడు, అనిలేరితమ్ = వాయువుచే ప్రజ్వలింపచేయబడిన, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, హుతాశనమివ = అగ్ని వలె ఉన్నవాడు అయిన, తం రాఘవమ్ = ఆ రాముని, సమితి = యుద్ధమునందు, సమీక్ష్య = చూచి, కః = ఎవరు, విషహేత = సహించగలరు.

తా. చిత్రమైన ధనస్సు ధరించి, మహాబలశాలి, దేవేంద్రునివంటి పరాక్రమము గలవాడు అయిన రాముడు లక్ష్మణసహితుడై, వాయువుచే ప్రజ్వలింపచేయబడుచున్న అగ్ని వలె యుద్ధభూమిలో నిలచి ఉండగా చూచి, ఎవ్వరైన నిలువ గలరా? 64

మూ. సలక్ష్మణం రాఘవమాజిమర్దనం
దిశాగజం మత్తమివ వ్యవస్థితమ్,
సహేత కో వానరముఖ్య సంయుగే
యుగాన్తసూర్యప్రతిమం శరార్చిషమ్. 65

ప్ర. అ. వానరముఖ్య=ఓ వానరశ్రేష్ఠుడా! సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడినవాడు, అరిమర్దనమ్ = యుద్ధములో సంహరించువాడు, మత్తమ్ = మదించిన, దిగ్గజమివ=దిగ్గజము వలె, వ్యవస్థితమ్=నిలిచినవాడు, శరార్చిషమ్=శరము అనే కిరణములు కలవాడు, యుగాన్తసూర్యప్రతిమమ్=యుగాంతము నందలి సూర్యునితో సమానుడూ అయిన, రాఘవమ్=రామునితో, సంయుగే = యుద్ధమునందు, కః = ఎవ్వడు, సహేత = సహింపగలడు?

తా. యుద్ధములో శత్రుసంహారకు డైన, లక్ష్మణసహితు డైన రాముడు శరము అనే కిరణములతో ప్రళయకాలసూర్యుడు వలె ప్రకాశించుచు, మదించిన దిగ్గజము వలె నిలచి యుండగా యుద్ధభూమిలో అతనిని ఎవ్వడు ఎదుర్కొనగలడు? 65

మూ. స మే హరిశ్రేష్ఠ సలక్ష్మణం పతిం
సయూథపం క్షిప్రమిహోపపాదయ,
చిరాయ రామం ప్రతి శోకకర్శితాం
కురుష్వ మాం వానరముఖ్య హర్షితామ్. 66

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. హరిశ్రేష్ఠ=వానరశ్రేష్ఠుడా! సః = అట్టి నీవు, సలక్ష్మణమ్ = లక్ష్మణునితో కూడినవాడూ, సయూథపమ్ = సేనానాయకులతో కూడినవాడూ అయిన, పతిమ్ = నా భర్తను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఇహ = ఇక్కడికి, ఉపపాదయ = పొందింపుము. వానరముఖ్య = వానరులలో శ్రేష్ఠుడా! రామం ప్రతి = రాముని గూర్చి, చిరాయ = చిరకాలమునుండి, శోకకర్శితామ్ = శోకముచేత కృశింపచేయబడిన, మామ్ = నన్ను, హర్షితామ్ = సంతోషింపచేయబడిన దానినిగా, కురుష్వ = చేయుము.

తా. వానరశ్రేష్ఠు డైన హనుమంతుడా! నా భర్తను, లక్ష్మణుని, వానర సేనానాయకులను శీఘ్రముగా ఇక్కడికి తీసికొని రమ్ము. రామునిగూర్చి శోకముతో కృశించి ఉన్న నాకు హర్షము కలిగింపుము.

వి. ఈ ఘట్టంలో దాక్షిణాత్యపాఠంలో 26 శ్లోకాలు ఉన్నవి. ఇవి తనతో రామునివద్దకు రమ్మని పలికిన హనుమంతుని మాటలకు సీత చెప్పిన సమాధానము. దీనిలో మూడు అంశాలు ఉన్నవి. (1) తాను హనుమంతుని వీపుపై ఎక్కి వెళ్ళుటచే రాగల అపాయముల వర్ణనము (2) పరపురుషుని స్పృశించనను తన నియమము (3) రామపరాక్రమాతిశయవర్ణనము. మొదటి విషయమే అతి విస్తృతముగా 20 శ్లోకాలలో వర్ణింపబడినది. రెండవ అంశము రెండే శ్లోకాలలో చెప్పబడినది. దీనిని బట్టి సీత తనకూ హనుమంతునకూ, అపాయము రావచ్చు ననీ, కార్యభంగము కలుగు ననీ ఈ విషయాలకే రెండవ అంశంకంటె ఎక్కువప్రాధాన్యం ఇచ్చుచున్నట్లు కనబడుచున్నది. ఇంక మూడవ అంశమైన రామపరాక్రమవర్ణనానికి ఇక్కడ అవశ్యకతయే లేదు. దాని విషయమున హనుమంతునికి గూడ విప్రతిపత్తి లేదు కదా. అతడు కోరినదల్లా సీతను క్షేమముగా రాముని వద్దకు చేర్చి వారి దుఃఖమును తొలగించుట. వాస్తవానికి రెండవ అంశానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం సముచితం. అందుచేత ప్రాచ్యపాఠము బాగున్నట్లు తోచుచున్నది. దానిలో ఈ ఘట్టములో ఐదే శ్లోకాలున్నవి. రెండు శ్లోకాలలో సీత హనుమంతుని గమనవేగమునకు ఆగలేక తాను సముద్రములో పడిపోయి, జలజంతువులకు ఆహారమై పోవుదును అను ఆశంకను వ్యక్తపరచినది. తరువాతి రెండు శ్లోకాలలో పరపురుషస్పర్శ తాను చేయదుగాన హనుమంతునితో వెళ్లే ప్రసక్తి లేదన్నట్లు చెప్పి ఐదవశ్లోకంలో రాముడు క్షేమంగా తీసికొని రమ్మని ఈ 66వ శ్లోకంలో వలె హనుమంతుని కోరినది 66

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టత్రింశః సర్గః

[సీత హనుమంతునకు చిత్రకూటమునందు జరిగిన కాకవృత్తాంతమును గూర్చి చెప్పి, రామునకు నమ్మకము కలుగుటకై హనుమంతునకు చూడామణిని ఇచ్చుట].

మూ. తతః స కపిశార్దూలస్తేన వాక్యేన తోషితః,
సీతామువాచ తచ్ఛ్రుత్వా వాక్యం వాక్యవిశారదః. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వాక్యవిశారదః = మాటలలో నేర్పు గల, సః కపిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడు, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, తేన వాక్యేన = ఆ వాక్యము చేత, తోషితః = సంతోషింపచేయబడినవాడై, సీతామ్ = సీతను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిదప, మాటలలో నేర్పరి యైన ఆ హనుమంతుడు, సీత పలికిన మాటలు విని, చాలా సంతోషించి, ఆమెతో ఇట్లు పలికెను. 1

మూ. యుక్తరూపం త్వయా దేవి భాషితం శుభదర్శనే,
సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్య చ. 2

ప్ర. అ. శుభదర్శనే = మంగళప్రదమైన దర్శనము గలదానా! దేవి = ఓ దేవీ! త్వయా = నీచేత, భాషితమ్ = పలుకబడినది, యుక్తరూపమ్ = చాలా యుక్తముగా ఉన్నది. స్త్రీస్వభావస్య = స్త్రీల స్వభావమునకు, సాధ్వీనామ్ = పతివ్రతలయొక్క, వినయస్య చ = వినయమునకు, సదృశమ్ = తగినదిగా ఉన్నది

తా. మంగళప్రదమైన దర్శనము గల ఓ సీతాదేవీ! నీవు చెప్పిన విషయము చాలా బాగున్నది. స్త్రీల స్వభావమునకు, పతివ్రతల వినయానికి అనుగుణముగా ఉన్నది. 2

మూ. స్త్రీత్వం న తు సమర్థం హి సాగరం వ్యతివర్తితుమ్,
మామధిష్ఠాయ విస్తీర్ణం శతయోజనమాయతమ్. 3

ప్ర. అ. మామ్ = నన్ను, అధిష్ఠాయ = అధిష్ఠించి, విస్తీర్ణమ్ = విశాలమూ, శతయోజనమ్ = నూరు యోజనములు, ఆయతమ్ = దీర్ఘమూ అయిన, సాగరమ్ = సముద్రమును, వ్యతివర్తితుమ్ = దాటుటకు, స్త్రీత్వమ్ = స్త్రీ నై ఉండుట (స్త్రీ స్వభావము), న సమర్థం హి = సమర్థము కాదు కదా!

తా. నా వీపుపై ఎక్కి, అతివిశాలమూ, నూరు యోజనాలు దీర్ఘమూ అయిన సముద్రమును దాటుట స్త్రీకి చాల కష్ట మైన విషయము. 3

మూ. ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే,
రామాదన్యస్య నార్హామి సంస్పర్శమితి జానకి. 4
ఏతత్తే సదృశం దేవి పత్న్యాస్తస్య మహాత్మనః,
కా హ్యన్యా త్వామృతే దేవి బ్రూయాద్వచనమీదృశమ్.

ప్ర. అ. వినయాన్వితే = వినయముతో కూడినదానా! జానకి = ఓ! సీతాదేవీ! రామాత్ = రామునికంటె, అన్యస్య = ఇతరుని యొక్క, సంస్పర్శమ్ = స్పర్శను, నార్హామీతి = చేయ తగను (చేయను) అని, యత్ = ఏ, ద్వితీయమ్ = రెండవ, కారణమ్ = కారణమును, బ్రవీషి = చెప్పుచున్నావో, ఏతత్ = ఇది, తస్య = ఆ, మహాత్మనః = మహాత్ము డైన రాముని యొక్క, పత్న్యాః = భార్య వైన, తే = నీకు, సదృశమ్ = తగి యున్నది. దేవి = ఓ! దేవీ! త్వామ్ ఋతే = నీవు తప్ప, అన్యా = మరి యొక, కా = ఏ స్త్రీ, ఈదృశమ్ = ఇట్టి, వచనమ్ = వచనమును, బ్రూయాత్ = పలుకును!

తా. వినయవంతురాల వైన జానకీ! రాముడు తప్ప, ఇతరుని ఎవ్వనినీ స్పృశింపను అని నీవు చెప్పిన రెండవ కారణము మహాత్ము డైన ఆ రాముని భార్య వైన నీకే తగి ఉన్నది. ఓ! దేవీ! నీవు తప్ప మరి యే స్త్రీ యైనా ఇట్టి మాట చెప్పగలదా! 4, 5

మూ. శ్రోష్యతే చైవ కాకుత్స్థః సర్వం నిరవశేషతః,
చేష్టితం యత్త్వయా దేవి భాషితం మమ చాగ్రతః. 6

తా. దేవి = ఓ! దేవీ! త్వయా = నీచేత, యత్ = ఏది, చేష్టితమ్ = చేయ బడినదో, మమ = నాయొక్క, అగ్రతః = ఎదుట, భాషితం చ = పలుకబడినదో, సర్వమ్ = అంతయూ, నిరవశేషతః = పూర్తిగా, రాఘవః = రాముడు, శ్రోష్యతి = వినగలడు.

తా. ఓ! దేవీ! నీవు ఏ విధముగా ప్రవర్తించినావో, నా ఎదుట ఏ మేమి మాటలాడినావో దాని నంతనూ రామునకు పూర్తిగా తెలుపగలను. 6

మూ. కారణైర్బహుభిర్దేవి రామప్రియచికీర్షయా,
స్నేహప్రసన్నమనసా మయైతత్సముదీరితమ్. 7

ప్ర. అ. దేవి = ఓ! దేవీ! బహుభిః = అనేకములైన, కారణైః = కారణ ములచేతను. రామప్రియచికీర్షయా = రామునకు ప్రియము చేయవలెనను ఇచ్ఛ చేతను, స్నేహప్రసన్నమనసా = స్నేహముచేత ద్రవించిన మనస్సు గల, మయా = నాచేత, ఏతత్ = ఇది, సముదీరితమ్ = చెప్పబడినది.

తా. ఓ! సీతాదేవీ! అనేక కారణములు ఉండుటచేతను, రామునకు ప్రియము చేయవలెనను ఇచ్ఛచేతను, స్నేహముచే నా మనస్సు కరిగి నే నిట్లు చెప్పినాను. 7

మూ. లఙ్కాయా దుష్ప్రధర్షత్వాద్దుస్తరత్వాన్మహోదధేః,
సామర్థ్యాదాత్మనశ్చైవ మయైతత్సముదీరితమ్. 8

ప్ర. అ. లఙ్కాయాః = లంక, దుష్ప్రధర్షత్వాత్ = ఎదిరింప శక్యము కాని దగుట వలనను, మహోదధేః = మహాసముద్రము, దుస్తరత్వాత్ = దాట శక్యముకాని దగుటవలనను, ఆత్మనః = నాయొక్క, సామర్థ్యాచ్చైవ = సామర్థ్యము వలనను, మయా = నాచేత, ఏతత్ = ఇది, సముదీరితమ్ = చెప్పబడినది.

తా. లంక ఎదిరింపశక్యము కానిది. మహాసముద్రమును దాటుట దాల కష్టము. నాకు నిన్ను తీసికొనిపోవుటకు తగిన సామర్థ్యము కూడ ఉన్నది. ఈ అన్ని కారణములను దృష్టిలో ఉంచుకొని నే నిట్లు చెప్పినాను. 8

మూ. ఇచ్ఛామి త్వాం సమానేతుమద్యైవ రఘుబన్ధునా,
గురుస్నేహేన భక్త్యా చ నాన్యథైతదుదాహృతమ్. 9

ప్ర. అ. గురుస్నేహేన = గొప్ప స్నేహముచేతను, భక్త్యా చ = భక్తి చేతను, త్వామ్ = నిన్ను, రఘునన్దనా = రామునితో. అద్యైవ = ఇప్పుడే, సమానేతుమ్ = చేర్చుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. ఏతత్ = ఈ వాక్యము, అన్యథా = మరొక విధముగా, న ఉదాహృతమ్ = పలకబడలేదు.

తా. మీ విషయమున నా కున్న గొప్ప స్నేహముచేతను, భక్తిచేతను, ఇప్పుడే నిన్ను రాముని దగ్గరకు తీసికొనివెళ్ళవలె నను కోరికచేతను ఇట్లు పలికి నాను కాని మరొక కారణ మేదీ లేదు. 9

మూ. యది నోత్సహసే యాతుం మయా సార్ధమనిన్దితే,
అభిజ్ఞానం ప్రయచ్ఛ త్వం జానీయాద్రాఘవో హి యత్.

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడని ఓ సీతాదేవీ! మయా సార్ధమ్ = నాతో కూడ, యాతుమ్ = వెళ్లుటకు, నోత్సహసే యది = ఇచ్ఛయించన ట్లయితే, యత్ = దేనిని, రాఘవః = రాముడు, జానీయాత్ = గుర్తుపట్టునో, అభిజ్ఞానమ్ = అట్టి అనవాలును, త్వమ్ = నీవు, ప్రయచ్ఛ = ఇమ్ము.

తా. దోషము లేని ఓ సీతాదేవీ! నీవు నాతో కూడ రామునివద్దకు వెళ్లుటకు ఇష్టపడనిచో, రాముడు గుర్తించే అనవాలు ఏదైనా ఇమ్ము. 20

మూ. ఏవముక్తా హనుమతా సీతా సురసుతోపమా,
ఉవాచ వచనం మన్దం బాష్పప్రగ్రథితాక్షరమ్. 11
ఇదం శ్రేష్ఠమభిజ్ఞానం బ్రూయాస్త్వం తు మమ ప్రియమ్.

ప్ర. అ. హనుమతా = హనుమంతుని చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, సురసుతోపమా = దేవకన్యతో సమానురా లైన, సీతా = సీత, బాష్పప్రగ్రథితాక్షరమ్ = బాష్పముతో గ్రుచ్చబడిన అక్షరములు గల, వచనమ్ = వచనమును, మన్దమ్ = మందముగా, ఉవాచ = పలికెను. త్వం తు = నీవు, మమ = నాయొక్క, ప్రియమ్ = ప్రియుని గూర్చి, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠ మైన, ఇదమ్ = ఈ, అభిజ్ఞానమ్ = అనవాలును, బ్రూయాః = చెప్పుము.

తా. దేవకన్యతో సమానురా లైన సీత హనుమంతుని మాటలు విని, కన్నీటితో అక్షరములు కూర్చిన మాటలతో మందముగా ఇట్లు పలికెను. "నీవు నా భర్త యైన రామునితో ఈ విషయమును శ్రేష్ఠ మైన గుర్తుగా చెప్పుము". 11

మూ. శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా, 12
తాపసాశ్రమవాసిన్యాః ప్రాజ్యమూలఫలోదకే,
తస్మిన్ సిద్ధాశ్రితే దేశే మన్దాకిన్యావిదూరతః. 13
తస్యోపవనషణ్డేషు నానాపుష్పసుగన్ధిషు,
విహృత్య సలిలే క్లిన్నా మమాఙ్కే సముపావిశః. 14

ప్ర. అ. పురా = పూర్వము, చిత్రకూటస్య శైలస్య = చిత్రకూటపర్వతము యొక్క, పూర్వోత్తరే = ఈశాన్యపుదిక్కున ఉన్న, పాదే = సమీపమునందున్న చిన్న పర్వతమునందు, (పెద్ద పర్వతము ప్రక్కనే ఉన్న చిన్న పర్వతమునకు "పాదము" అని పేరు), ప్రాజ్యమూలఫలోదకే = అధిక మైన మూలములు, ఫలములు, ఉదకమూ గల, తస్మిన్ = ఆ, సిద్ధాశ్రితే = సిద్ధులచే ఆశ్రయింపబడిన, దేశే = ప్రదేశమునందు, మన్దాకిన్యావిదూరతః = గంగకు సమీపమునందు. తస్య = ఆ పాదపర్వతము యొక్క, నానాపుష్పసుగన్ధిషు = అనేకవిధము లైన పుష్పముల సువాసనతో కూడిన, ఉపవనషణ్డేషు = సమీప వన సముదాయములందు, సలిలే = జలములో, విహృత్య = విహరించి, క్లిన్నా = తడిసినదాన వై, తాపసాశ్రమవాసిన్యాః = ఋషుల ఆశ్రమమునందు నివసించు చున్న, మమ = నాయొక్క, అఙ్కే = సమీపమునందు, సముపావిశః = కూర్చుంటివి.

తా. చిత్రకూటపర్వతమునకు సంబంధించిన ఈశాన్యపు పాదపర్వతము నందు, సిద్ధులు నివసించే ఒక ప్రదేశము ఉన్నది. అది మూలఫలోదకములతో సమృద్ధ మైనది. గంగానదికి దగ్గరగా ఉన్న ఆ ప్రదేశమునందు, నేను (మనము) ఋషుల ఆశ్రమములో నివసించుచుండగా, పూర్వము నీ వొక దినమున, వివిధ పుష్పముల సువాసనలతో నిండిన ఉపవనప్రాంతములందు, జలములో విహ రించి, తడిసి నా సమీపమునందే కూర్చుంటివి. 12, 13, 14

మూ. తతో మాంససమాయుక్తో వాయసః పర్యతుణ్డయత్,
తమహం లోష్టముద్యమ్య వారయామి స్మ వాయసమ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మాంససమాయుక్తః = మాంసమునందు ఆసక్తి గల, వాయసః = కాకి, పర్యతుణ్డయత్ = ముక్కుతో పొడిచెను. అహమ్ =

వేసి, లోష్టమ్ = మట్టి బెడ్డను, ఉద్యమ్య = ఎత్తి, తమ్ = ఆ, వాయసమ్ = కాకిని, వారయామి స్మ = నివారించితిని.

తా. ఇంతలో ఒక కాకి వచ్చి మాంసమునందు, ఆసక్తి చే నన్ను ముక్కుతో పొడవ ప్రారంభించినది. అప్పుడు నేను మట్టి బెడ్డను విసరి దానిని నివారించితిని. 15

మూ. దారయన్ స చ మాం కాకస్తత్రైవ పరిలీయతే,
న చాప్యుపారమన్మాంసాద్భక్షార్థీ బలిభోజనః. 16

ప్ర. అ. సః కాకః = ఆ కాకి, మామ్ = నన్ను, దారయన్ = చీల్చుచు, తత్రైవ = అక్కడనే. పరిలీయతే = దాగుచుండెను. భక్షార్థీ = ఆహారమును కోరుచున్న, బలిభోజనః = కాకి, మాంసాత్ = మాంసమునుండి, న ఉపారమచ్చాపి = విరమించ లేదు కూడ.

తా. ఆ కాకి నన్ను మాటిమాటికి పొడుచుచు, పారిపోయి దాగికొనుచుండెను. అది ఎంతసేపైనను ఇట్లే చేయుచు మాంసమునుండి మరలలేదు. 16

మూ. ఉత్కర్షన్త్యాం చ రశనాం క్రుద్ధాయాం మయి పక్షిణా,
స్రస్యమానే చ వసనే తతో దృష్టా త్వయాహ్యహమ్. 17

ప్ర. అ. మయి = నేను, పక్షిణా = పక్షిచేత, క్రుద్ధాయామ్ = కోపించినదాన నగుచుండగా, వసనే = వస్త్రము, స్రస్యమానే చ = జారిపోవుచుండగా, (నేను) రశనామ్ = వడ్డాణమును, ఉత్కర్షన్త్యాం చ = పైకి లాగికొనుచుండగా, తతః = పిమ్మట, త్వయా = నీచేత, అహమ్ = నేను, దృష్టా = చూడబడితిని.

తా. నాకు ఆ కాకిపై చాల కోపము వచ్చినది. ఒక ప్రక్క వస్త్రము జారిపోవుచుండెను. దానిని సరిచేసికొనుటకై నేను వడ్డాణమును పైకి లాగుకొనుచుంటిని. ఆ సమయమునందు నీవు నన్ను చూచితివి. 17

మూ. త్వయాపహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా,
భక్షగృధ్నేన కాకేన దారితా త్వాముపాగతా. 18

ప్ర. అ. తదా = అప్పుడు, క్రుద్ధా = కోపించిన, అహమ్ = నేను, త్వయా

= నీచేత, అవహసితా = పరిహసింపబడినదాన నై, సంలజ్జితా = సిగ్గుపడితిని. భక్షగృధ్నేన = ఆహారమునందు ఆసక్తిగల, కాకేన = కాకిచేత, దారితా = చీల్చ బడినదాన నై, త్వామ్ = నిన్ను, ఉపాగతా = చేరితిని.

తా. అపుడు ఆ కాకిమీద కోపముతో ఉన్న నన్ను నీవు పరిహసింపగా నేను సిగ్గు చెందితిని. ఆహారముకొరకై ఆ కాకి నన్ను చీరగా నేను నీవద్దకు వచ్చితిని. 18

మూ. ఆసీనస్య చ తే శ్రాన్తా పునరుత్సఙ్గమావిశమ్,
క్రుధ్యన్తీ చ ప్రహృష్టేన త్వయాహం పరిసాన్త్వితా. 19

ప్ర. అ. శ్రాన్తా = అలసినదాన నై, ఆసీనస్య = కూర్చొని యున్న, తే = నీయొక్క, ఉత్సఙ్గమ్ = ఒడిని, పునః = మరల, ఆవిశమ్ = ప్రవేశించితిని. క్రుధ్యన్తీ = కోపగించిన, అహమ్ = నేను, ప్రహృష్టేన = సంతోషించిన, త్వయా = నీచేత, పరిసాన్త్వితా = ఓదార్చబడినాను.

తా. నేను అలసిపోయి, అచటనే కూర్చొని యున్న నీ ఒడిలో కూర్చుంటిని. అప్పుడు కోపముతో ఉన్న నన్ను నీవు నవ్వుతు ఓదార్చితివి. 19

మూ. బాష్పపూర్ణముఖీ మన్దం చక్షుషీ పరిమార్జతీ,
లక్షితాహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా. 20

ప్ర. అ. నాథ = ఓ! నాథా! వాయసేన = కాకిచేత, ప్రకోపితా = కోపింప చేయబడినదాన నై, బాష్పపూర్ణముఖీ = బాష్పముతో నిండిన ముఖము గల దానను, మన్దమ్ = మెల్లిగా, చక్షుషీ = నేత్రములను, పరిమార్జతీ = తుడుచుకొను చున్నదానను అయిన, అహమ్ = నేను, త్వయా = నీచేత, లక్షితా = చూడబడితిని.

తా. నాథా! ఆ విధముగ కాకి కోపము కలిగించుటచే ముఖము కన్నీళ్లతో నిండగా, మెల్లగా నేత్రములు తుడుచుకొనుచున్న నన్ను నీవు చూచితివి. 20

మూ. పరిశ్రమాత్ప్రసుప్తా చ రాఘవాఙ్కేఽప్యహం చిరమ్,
పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాఙ్కే భరతాగ్రజః. 21

ప్ర. అ. అహమపి = నేను కూడా, పరిశ్రమాత్ = అలసటవలన, రాఘవాఙ్కే = రాముని ఒడిలో, చిరమ్ = చిరకాలము, ప్రసుప్తా చ = నిద్రించితిని,

పర్యాయేణ = పర్యాయముచేత, (నా తరవాత), భరతాగ్రజః = రాముడు, మమ = నాయొక్క, అఙ్కే = ఒడిలో, ప్రసుప్తః = నిద్రపోయినాడు.

తా. నేను ఎక్కువ అలసట చెంది ఉండుటచేత రాముని ఒడిలో చాల సేపు నిద్రించితిని. పిదప రాముడు నా ఒడిలో నిద్రించినాడు. 22

మూ. స తత్ర పునరేవాథ వాయసః సముపాగమత్,
తతః సుప్తప్రబుద్ధాం మాం రామస్యాఙ్కాత్సముత్థితామ్,
వాయసః సహసాగమ్య విదదార స్తనాన్తరే,
పునః పునరథోత్పత్య విదదార స మాం భృశమ్. 23

ప్ర. అ. అథ = అటు పిమ్మట, సః వాయసః = ఆ కాకి, పునరేవ = మరల, తత్ర = అచటికి, సముపాగమత్ = వచ్చెను. తతః = అటు పిమ్మట, సః = ఆ, వాయసః = కాకి, సహసా = శీఘ్రముగా, ఆగమ్య = వచ్చి, సుప్తప్రబుద్ధామ్ = నిద్రించి మేల్కొన్నదాననై, రామస్య = రామునియొక్క, అఙ్కాత్ = తొడనుండి, సముత్థితామ్ = లేచిన, మామ్ = నన్ను, స్తనాన్తరే = స్తనముల మధ్యయందు, విదదార = చీల్చెను. అథ = మరియు, పునః = మాటి మాటికి, ఉత్పత్య = ఎగిరి, మామ్ = నన్ను, భృశమ్ = మిక్కిలి, విదదార = చీల్చెను.

తా. పిదప, ఆ కాకి అక్కడికి మళ్ళీ వచ్చి నిద్రనుండి మేల్కొని రాముని తొడనుండి లేచిన నా దగ్గరకు వచ్చి, స్తనమధ్యప్రదేశమునందు చీరెను. మాటి మాటికి ఎగిరి ఎగిరి అది నన్ను చాల ఎక్కువగా చీరెను. 22,23

మూ. తతః సముక్షితో రామో ముక్తైః శోణితబిన్దుభిః,
వాయసేన తతస్తేన బలవత్క్లిశ్యమానయా. 24
న మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రామః = రాముడు, ముక్తైః = విడువ బడిన (స్రవించిన), శోణితబిన్దుభిః = రక్తబిందువులచేత, సముక్షితః = తడుప బడెను. తతః = అటుపిమ్మట, తేన వాయసేన = ఆ కాకిచేత, బలవత్ = అధికముగా, క్లిశ్యమానయా = బాధపెట్టబడుచున్న, మయా = నాచేత, శ్రీమాన్ = శ్రీమంతుడు, పరంతపః = శత్రువులను పీడింపచేయువాడు, సుఖసుప్తః = సుఖ

ముగా నిద్రపోవుచున్నవాడు అయిన, సః=ఆ రాముడు, బోధితః=మేల్కొల్పబడినాడు.

తా. అప్పుడు స్రవించిన రక్తబిందువులు మీద పడి రాముని దేహము తడిసెను. ఆ విధముగ ఆ కాకి నన్ను బాధించుచుండగా, నేను సుఖముగా నిద్ర పోవుచున్న, శోభావంతుడు, శత్రుసంహారి అయిన రాముని మేల్కొలిపితిని. 24

మూ. స మాం దృష్ట్వా మహాబాహుర్వితున్నాం స్తనయో స్తదా,
ఆశీవిష ఇవ క్రుద్ధః శ్వసన్ వాక్యమభాషత.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః = ఆ రాముడు, తదా = అప్పుడు, స్తనయోః = స్తనములందు. వితున్నామ్=పీడింపబడిన, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, క్రుద్ధః=కోపించిన, ఆశీవిష ఇవ=సర్పము వలె, శ్వసన్ = బుసకొట్టుచు, వాక్యమ్ = వాక్యమును, అభాషత = పలికెను.

తా. మహాబాహు వైన ఆ రాముడు, అప్పుడు స్తనములపై పీడింపబడిన నన్ను చూచి, కోపించిన సర్పము వలె బుసలు గొట్టుచు ఇట్లు పలికెను. 25

మూ. కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాన్తరమ్. 26
కః క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా.

ప్ర. అ. నాగనాసోరు=ఏనుగ తొండము వంటి తొడలు గల ఓ సీతా! తే = నీయొక్క, స్తనాన్తరమ్ = స్తనముల మధ్యభాగము, కేన = ఎవనిచేత, విక్షతం వై=గాయపరచబడినది? సరోషేణ=రోషముతో కూడిన, పఞ్చవక్త్రేణ= ఐదుముఖములుగల,భోగినా=సర్పముతో, కః=ఎవడు, క్రీడతి=ఆడుచున్నాడు?

తా. ఏనుగ తొండము వంటి ఊరువులు గల సీతా! నీ స్తనమధ్యప్రదేశమునందు గాయపరచినవాడు ఎవడు? కోపించిన ఐదు తలల మహాసర్పముతో ఆడుకొంటున్నవాడు ఎవడు? 26

మూ. వీక్షమాణ స్తత స్తం వై వాయసం సమవైక్షత, 27
నఖైః సరుధిరైస్తీక్ష్ణైర్మామేవాభిముఖం స్థితమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వీక్షమాణః=చూచుచు. సరుధిరైః=రక్త

ముతో కూడిన, దీప్తైః = దీప్తము లైన, నఖైః = గోళ్లతో, మామేవ = నన్నే. అభిముఖమ్ = అభిముఖముగా, స్థితమ్ = ఉన్న. తం వాయసమ్ = ఆ కాకిని, సముదైక్షత = చూచెను.

తా. పిమ్మట ఆ రాముడు నాలుగు వైపుల పరికించి, రక్తముతో కూడిన వాడి యైన గోళ్లతో నాకె ఎదురుగా ఉన్న ఆ కాకిని చూచెను. 27

మూ. పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః, 28
ధరాన్తరగతః శీఘ్రం పవనస్య గతౌ సమః.

ప్ర. అ. పతతామ్ = పక్షులలో, వరః = శ్రేష్ఠ మైన, సః వాయసః = ఆ కాకి. శక్రస్య = ఇంద్రునియొక్క, పుత్రః కిల = పుత్రు డట. ధరాన్తరగతః = పర్వతమర్త్యములందు నివసించునది. శీఘ్రమ్ = శీఘ్రముగా, గతౌ = వెళ్లుటలో, పవనస్య = వాయువునకు, సమః = సమాన మైన దట.

తా. పక్షులలో శ్రేష్ఠ మైన ఆ కాకి దేవేంద్రుని కుమారు డట. పర్వత మర్త్యములందు నివసించు నట. శీఘ్రగమనములో వాయువుతో సమాన మట. 28

మూ. తతస్తస్మిన్ మహాబాహుః కోపసంవర్తితేక్షణః, 29
వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మతిమతామ్ = బుద్ధిమంతులలో వరః = శ్రేష్ఠుడైన, మహాబాహుః = గొప్ప బాహువులుగల ఆ రాముడు, కోపసంవర్తితేక్షణః = కోపముచేత త్రిప్పబడిన నేత్రములు కలవాడై, తస్మిన్ = ఆ, వాయసే = కాకి యందు, క్రూరామ్ = క్రూర మైన, మతిమ్ = బుద్ధిని, కృతవాన్ = చేసినాడు.

తా. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, మహాబాహువు అయిన ఆ రాముడు, అప్పుడు, కోపముతో కండ్లు త్రిప్పుచు, ఆ కాకివిషయమున క్రూర మైన నిర్ణయమును చేసెను. 29

మూ. స దర్భం సంస్తరాద్గృహ్య బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్,
స దీప్త ఇవ కాలాగ్నిర్జజ్వాలాభిముఖో ద్విజమ్.

ప్ర. అ. సః = ఆ రాముడు, సంస్తరాత్ = ఆ స్తరణమునుండి, దర్భమ్ = దర్భను, గృహ్య = గ్రహించి, బ్రాహ్మేణ అస్త్రేణ = బ్రహ్మాస్త్రముతో, యోజ

దర్భ = కూర్చను. సః = ఆ, దీప్తః = ప్రజ్వరించుచున్న దర్భ, కాలాగ్నిరివ = ప్రళయకాలాగ్ని వలె; ద్విజమ్ అభిముఖః = ఆ పక్షికి అభిముఖమై, జజ్వాల = ప్రజ్వరించెను.

తా. రాముడు దర్భాసనమునుండి ఒక దర్భ తీసికొని, దానిపై బ్రహ్మాస్త్రమును సంధించెను. ఆ దర్భ ప్రళయకాలాగ్ని వలె, ఆ పక్షిఎదుట ప్రజ్వరించెను.

మూ. స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి, ౩౧
తత స్తం వాయసం దర్భః సోఽమ్బరేఽనుజగామ హ.

ప్ర. అ. సః = ఆ రాముడు, ప్రదీప్తమ్ = మండుచున్న, తం దర్భమ్ = ఆ దర్భను, తం వాయసం ప్రతి = ఆ కాకిని గూర్చి, చిక్షేప = విసరెను. తతః = అటు విసురుట, సః దర్భః = ఆ దర్భ, తం వాయసమ్ = ఆ కాకిని, అమ్బరే = ఆకాశమునందు, అనుజగామ హ = అనుసరించెను.

తా. రాము డా మండుచున్న దర్భను ఆ కాకివైపు విసరగా, ఆ దర్భ, ఆకాశమునందు దానిని తరుముకొనుచు వెళ్ళెను. ౩౧

మూ. అనుసృష్టస్తదా కాకో జగామ వివిధాం గతిమ్, ౩౨
త్రాణకామ ఇమం లోకం సర్వం వై విచచార హ.

ప్ర. అ. తదా = అప్పుడు, కాకః = కాకి, అనుసృష్టః = అనుసరింపబడిన దై, వివిధామ్ = అనేకవిధము లైన, గతిమ్ = గతిని, జగామ = వెళ్ళెను (పరుగెత్తెను). త్రాణకామః = రక్షణమునందు కోరిక గల దై, ఇమమ్ = ఈ, సర్వమ్ = సమస్త మైన, లోకమ్ = లోకమును, విచచార హ = సంచరించెను.

తా. అప్పుడు, ఆ దర్భ తరుముకొని వచ్చుచుండగా, ఆ కాకి, ఎన్ని విధముల ఎగురుచు పోవుటకు వీ లగునో అన్ని విధముల ఎగురుచు పోయెను. రక్షణము కోరుచు ఈ లోకములో అంతటా తిరిగెను. ౩౨

మూ. స పిత్రా చ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః, ౩౩
త్రీన్ లోకాన్ సమ్పరిక్రమ్య తమేవ శరణం గతః.

ప్ర. అ. సః = ఆ కాకి, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను,

సంపరిక్రమ్య = సంచరించి, పిత్రా = తండ్రి యైన ఇంద్రునిచేత, సమహర్షిభిః = మహర్షులతో కూడిన, సురైః = దేవతలచేతను, పరిత్యక్తః = విడువబడినదై, తమేవ = ఆ రాముణ్ణే, శరణం గతః = శరణుపొందినది.

తా. ఆ కాకి రక్షకుని కొరకై మూడు లోకాలు తిరిగి, తండ్రి యైన ఇంద్రుడు, ఇతరదేవతలు, మహర్షులు కూడ తమకు వానిని రక్షించు శక్తి లేదని పరిత్యజించగా చివరికి వచ్చి ఆ రాముణ్ణే శరణుపొందినది. 33

మూ. స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, 34
వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్.

ప్ర. అ. శరణ్యః=శరణాగతరక్షకు డైన, సః కాకుత్స్థః=ఆ రాముడు, శరణాగతమ్ = శరణుకోర్చినది, భూమౌ = నేలపై, నిపతితమ్=పడినది, అయిన, తమ్ = ఆ కాకిని, వధార్హమపి = చంప దగినదే యైనను, కృపయా = జాలిచేత, పర్యపాలయత్ = పరిపాలించెను.

తా. శరణాగతరక్షకు డైన ఆ రాముడు, శరణు కోర్చి నేలపై పడి నమస్కరించుచున్న ఆ కాకిని, అది చంప దగినదే అయినను, జాలిగొని రక్షించెను. 34

మూ. పరిద్యూనం విషణ్ణం చ స తమాయాన్తమబ్రవీత్, 35
మోఘం కర్తుం న శక్యం తు బ్రాహ్మమస్త్రం తదుచ్యతామ్.

ప్ర. అ. సః=ఆ రాముడు, పరిద్యూనమ్=అలసిపోయినది, విషణ్ణమ్=దిగులుపాటు చెందినది అయిన, ఆయాన్తమ్ = వచ్చుచున్న, తమ్ = దానిని గూర్చి, అబ్రవీత్=పలికెను. బ్రాహ్మమ్ అస్త్రమ్ = బ్రహ్మాస్త్రము, మోఘమ్= వ్యర్థ మైనదిగా, కర్తుమ్ = చేయుటకు, న శక్యం తు = శక్యము కాదు, తత్ = ఆ కారణమువలన, ఉచ్యతామ్ = ఏమి చేయవలెనో చెప్పబడుగాక.

తా. అలసిపోయి దుఃఖించుచు వచ్చుచున్న ఆ కాకిని చూచి, రాముడు. "బ్రహ్మాస్త్రమును వ్యర్థముచేయుట శక్యము కాదు. అందుచేత ఏమిచేయవలెనో చెప్పుము" అని పలికెను. 35

మూ. హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇత్యథ సోఽబ్రవీత్. ౩౬
తత స్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్,
దత్త్వా స దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః. ౩౭

ప్ర. అ. అథ = అటు పిమ్మట, సః = ఆ కాకి, త్వచ్ఛరః = నీ బాణము, దక్షిణాక్షి = కుడి కన్నును, హినస్తు = హింసించుగాక, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను. తతః = అటుపిమ్మట, సః = ఆ దర్భ, తస్య కాకస్య = ఆ కాకియొక్క, దక్షిణమ్ = కుడి దైన, అక్షి = నేత్రమును, హినస్తి స్మ = హింసించెను. సః = ఆ కాకి, దక్షిణమ్ = కుడి కన్నును, దత్త్వా = ఇచ్చి, ప్రాణేభ్యః = ప్రాణములవలన, పరిరక్షితః = రక్షింపబడినది.

తా. "నీ బాణముతో నా కుడి కన్నును హింసింపుము" అని ఆ కాకి కోరగా, రాముడు ప్రయోగించిన ఆ దర్భ ఆ కాకి కుడి కంటిని హింసించెను. ఈ విధముగా ఆ కాకి తన కుడికన్ను ఇచ్చివేసి ప్రాణములను రక్షించుకొనెను.

మూ. స రామాయ నమస్కృత్వా రాజ్ఞే దశరథాయ చ,
విసృష్టస్తేన వీరేణ ప్రతిపేదే స్వమాలయమ్. ౩౮

ప్ర. అ. సః = ఆ కాకి, రామాయ = రామునకు, రాజ్ఞే = రాజైన, దశరథాయ చ = దశరథునకు, నమస్కృత్వా = నమస్కరించి, తేన = ఆ, వీరేణ = వీరుడైన రామునిచేత, విసృష్టః = విడువబడినదై, స్వమ్ = తన సంబంధమైన, ఆలయమ్ = నివాసమును, ప్రతిపేదే = పొందెను.

తా. ఆ కాకి రామునకూ, దశరథమహారాజునకూ నమస్కారము చేసి, రాముని అనుజ్ఞ తీసికొని తన నివాసమునకు వెళ్ళిపోయెను. ౩౮

మూ. మత్కృతే కాకమాత్రే తు బ్రహ్మాస్త్రం సముదీరితమ్,
కస్మాద్యో మా హర త్త్వత్తః క్షమసే తం మహీపతే. ౩౯

ప్ర. అ. మహీపతే = రాజా! మత్కృతే = నా నిమిత్త మై, కాకమాత్రే = కాకియందు కూడ, బ్రహ్మాస్త్రమ్ = బ్రహ్మాస్త్రము, సముదీరితమ్ = ప్రయోగింపబడినది. త్వత్తః = నీనుండి, మా = నన్ను, యః = ఎవడు, అహరత్ =

హరించెనో. తమ్ = వానిని, కస్మాత్ = ఏ కారణమువలన, క్షమసే = క్షమించు చున్నావు?

తా. మహారాజా! నన్ను బాధించినందుకు ఒక కాకిపైన కూడ బ్రహ్మాస్త్రమును ప్రయోగించితివి కదా! నీవద్దనుండి నన్నే అపహరించుకొని పోయిన వానిని ఇట్లు క్షమించి ఊరకున్నావేమి? 39

మూ. స కురుష్వ మహోత్సాహః కృపాం మయి నరర్షభ,
త్వయా నాథవతీ నాథ హ్యనాథా ఇవ దృశ్యతే. 40

ప్ర. అ. నరర్షభ = నరశ్రేష్ఠుడా! సః = అట్టి నీవు, మహోత్సాహః = గొప్ప ఉత్సాహము కలవాడవై, మయి = నాయందు, కృపామ్ = జాలిని, కురుష్వ = చేయుము. నాథ = ఓ! నాథుడా! త్వయా = నీచేత, నాథవతీ = నాథుడు కల స్త్రీ, అనాథా ఇవ = నాథుడు లేనిది వలె, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడవైన ఓ! రామా! నీవు గొప్ప ఉత్సాహముతో శత్రుసంహారము చేసి నాపై కృప చూపుము. ఓ! నాథా నీవు నాథుడవై ఉండగా నేను ఇపుడు అనాథురాలను వలె అయితిని. 40

మూ. ఆనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతః,
జానామి త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్,

అపారపారమక్షోభ్యం గామ్భీర్యాత్సాగరోపమమ్,
భర్తారం ససముద్రాయా ధరణ్యా వాసవోపమమ్.

ప్ర. అ. ఆనృశంస్యమ్ = క్రూరముగా లేకపోవుట, (దయ), పరః = ఉత్తమమైన, ధర్మః = ధర్మముగా, మయా = నాచేత, త్వత్తః ఏవ = నీనుండియే, శ్రుతః = వినబడినది. త్వామ్ = నిన్ను, మహావీర్యమ్ = గొప్ప పరాక్రమము కలవానినిగాను, మహోత్సాహమ్ = గొప్ప ఉత్సాహము కలవానినిగాను, మహాబలమ్ = గొప్ప బలము కలవానినిగాను, అపారపారమ్ = పొంద శక్యము కాని అంతము కలవానినిగాను (నీ వెంతటివాడవో ఊహించుటకు కూడ శక్యము కాదు అని భావము), అక్షోభ్యమ్ = క్షోభింపచేయ శక్యముకానివానినిగాను, గామ్భీర్యాత్ = గాంభీర్యమువలన, సాగరోపమమ్ = సముద్రముతో సమానునిగను,

నసముద్రాయాః = సముద్రముతో కూడిన, ధరణ్యాః = భూమియొక్క, భర్తారమ్ = ప్రభువునుగాను, వాసవోపమమ్ = దేవేంద్రునితో సమానునిగాను, జానామి = ఎరుగుదును.

తా. దయ ధర్మములలో కెల్ల ఉత్తమధర్మమను విషయమును నీవే నాకు చెప్పితివి కదా! నీవు గొప్ప వీర్యము, ఉత్సాహము, బలము కలవాడవు. నీ వెంతటివాడవో ఎవ్వరూ తెలిసికొనజాలరు. నిన్నెవ్వరూ క్షోభింపచేయజాలరు. గాంభీర్యములో సముద్రమువంటివాడవు. సముద్రసహితమైన భూమండలమునకు అంతకూ ప్రభువు అయినవాడవు. దేవేంద్రునితో సమానుడవు. ఈ విషయము అన్నీ నాకు తెలియును. 41,42

మూ. ఏవమస్త్రవిదాం శ్రేష్ఠః సత్యవాన్ బలవానపి,
కిమర్థమస్త్రం రక్షస్సు న యోజయసి రాఘవ. 43

ప్ర. అ. రాఘవ = రామా! ఏవమ్ = ఇట్లు, అస్త్రవిదామ్ = అస్త్రవేత్తలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడవు, సత్యవాన్ = సత్యవంతుడవు, బలవానపి = బలవంతుడవు అయినను, రక్షస్సు = రాక్షసులమీద, అస్త్రమ్ = అస్త్రమును, కిమర్థమ్ = ఎందువలన, న యోజయసి = సంధించుట లేదు?

తా. రామా! ఈ విధముగా అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడ వైనా, సత్యవంతుడ వైనా, బలవంతుడ వైనా, నీవు రాక్షసులమీద అస్త్రములను ఎందువలన ప్రయోగించుట లేదు! 43

మూ. న నాగా నాపి గన్ధర్వా నాసురా న మరుద్గణాః,
రామస్య సమరే వేగం శక్తాః ప్రతిసమీహితుమ్. 44

ప్ర. అ. సమరే = యుద్ధమునందు, రామస్య = రామునియొక్క, వేగమ్ = వేగమును, ప్రతిసమీహితుమ్ = ఎదుర్కొనుటకు, నాగాః = నాగులు, న శక్తాః = సమర్థులు కారు. గన్ధర్వా అపి = గంధర్వులు కూడ, న = సమర్థులు కారు. అసురాః = అసురులు, న = సమర్థులు కారు. మరుద్గణాః = దేవతల గణములు, న = సమర్థులు కారు.

తా. నాగులు కాని, గంధర్వులు కాని, అసురులు కాని, దేవతాగణములు కాని యుద్ధములో రాముని వేగమును ఎదుర్కొనుటకు సమర్థులు కారు. 44

మూ. తస్య వీర్యవతః కచ్చిద్యద్యస్తి మయి సంభ్రమః,
కిమర్థం న శరైస్తీక్ష్ణైః క్షయం నయతి రాక్షసాన్. 45

ప్ర. అ. వీర్యవతః=పరాక్రమవంతు డైన, తస్య=ఆ రామునకు, మయి=నావిషయమునందు, కచ్చిత్=ఏ దైన, సంభ్రమః=తొందర, అస్తి యది=ఉన్నట్లయితే, తీక్ష్ణైః=తీక్ష్ణము లైన, శరైః=బాణములతో, రాక్షసాన్=రాక్షసులను, కిమర్థమ్=ఎందువలన, క్షయమ్=వినాశనమును, న నయతి=పొందించుటలేదు.

తా. పరాక్రమశాలి యైన ఆశ్రీ రామునకు నా విషయమునందు ఏ మాత్ర మైన తొందర ఉన్నచో, అతడు తీక్ష్ణము లైన శరములతో ఈ రాక్షసులను వధింపచేయుటలే దేమి? 45

మూ. భ్రాతురాదేశమాదాయ లక్ష్మణో వా పరంతపః,
కస్య హేతోర్న మాం వీరః పరిత్రాతి మహాబలః. 46

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించువాడూ, మహాబలః=గొప్ప బలము కలవాడు, వీరః = వీరుడు అయిన, లక్ష్మణో వా = లక్ష్మణు డైనను, భ్రాతుః=సోదరునియొక్క, ఆదేశమ్= ఆజ్ఞను, ఆదాయ=గ్రహించి, కస్య= హేతోః=ఏ కారణమువలన, మామ్=నన్ను, న పరిత్రాతి= రక్షించుట లేదు?

తా. శత్రువులను పీడించువాడు, మహావీరుడు, మహాబలుడు అయిన లక్ష్మణు డైనా, అన్నగారి ఆజ్ఞచేత నన్ను, ఎందువలన రక్షించుటలేదు? 46

మూ. యది తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ,
సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మాముపేక్షతః. 47

ప్ర. అ. వాయ్వగ్నిసమతేజసౌ = వాయువుతోను, అగ్నితోను సమాన మైన తేజస్సు గల, పురుషవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులైన, తౌ=ఆ రామలక్ష్మణులు, సురాణామ్=దేవతలకు కూడ, దుర్ధర్షౌ యది అపి=ఎదిరింప శక్యముకానివారై ఉండి కూడ, మామ్=నన్ను, కిమర్థమ్=ఎందుకొరకు, ఉపేక్షతః=ఉపేక్షించు చున్నారో కదా

తా. వాయ్వగ్నులతో సమాన మైన తేజస్సు గల పురుషశ్రేష్ఠు లైన ఆ రామలక్ష్మణులను దేవతలు కూడ ఎదిరింప జాలరు. అట్టివారై ఉండి కూడ వారు నన్ను ఎందువలన ఉపేక్షించుచున్నారో॥ 47

మూ. మమైవ దుష్కృతం కించిన్మహ దస్తి న సంశయః,
సమర్థావపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ. 48

ప్ర. అ. మమైవ = నాయొక్కయే, మహత్ = గొప్ప దైన, కించిత్ = ఏదో, దుష్కృతమ్ = పాపము, అస్తి = ఉన్నది. సంశయః = సంశయము, న = లేదు. యత్ = ఏ కారణమువలన, సమర్థావపి = సమర్థులే అయినను, పరంతపౌ = శత్రువులను పీడించు, తౌ = ఆ రామలక్ష్మణులు, మామ్ = నన్ను, న అవేక్షేతే = చూచుటలేరో.

తా. నేనే ఏదో గొప్ప పాపము చేసి ఉన్నాను. సందేహము లేదు. అందు చేతనే, సమర్థు లై యుండి కూడ, శత్రుపీడకు లైన ఆ రామలక్ష్మణులు నన్ను ఉపేక్షించుచున్నారు. 48

మూ. వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్,
అథాబ్రవీన్మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. 49

ప్ర. అ. అథ = అటు పిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మారుతాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమంతుడు, వైదేహ్యాః = సీతదేవి, సాశ్రు = కన్నీళ్లతో కూడుకొన్నట్లు, కరుణమ్ = జాలి గొలుపు నట్లు, భాషితమ్ = పలుకబడిన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అబ్రవీత్ = పలికెను.

తా. సీత కన్నీళ్లు కార్చుచు దీనముగా పలికిన మాటలు విని మహాతేజశ్శాలి, వాయునందనుడు అయిన హనుమంతుడు ఇట్లు పలికెను. 49

మూ. త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే,
రామే దుఃఖాభిపన్నే చ లక్ష్మణః పరితప్యతే. 50

ప్ర. అ. దేవి = ఓ సీతాదేవీ! రామః = రాముడు, త్వచ్ఛోకవిముఖః = నిన్ను గూర్చిన శోకముచేత భోగాదులందు ఆసక్తి లేనివా డై ఉన్నాడు. సత్యేన

=సత్యముచేత, తే=నీకు, శపే=ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. రామః=రాముడు, దుఃఖాభిపన్నః=దుఃఖముచేత ఆక్రమింపబడినవాడగుచుండగా, లక్ష్మణః చ = లక్ష్మణుడు కూడ, పరితప్యతే = దుఃఖించుచున్నాడు.

తా. ఓ! సీతాదేవీ! నీ వియోగమువలన కలిగిన దుఃఖముచేత రాముడు భోగాదులందు ఆసక్తి లేకుండా ఉన్నాడు. సత్యము మీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. రాముడు దుఃఖాక్రాంతుడైనప్పుడల్లా లక్ష్మణుడు కూడ దుఃఖించుచున్నాడు. 50

మూ. కథం చిద్భవతీ దృష్టా న కాలః పరిదేవితుమ్,
ఇమం ముహూర్తం దుఃఖానాం ద్రక్ష్యస్యన్తమనిన్దితే. 51

ప్ర. అ. కథం చిత్=ఎటులనో, భవతీ=నీవు, దృష్టా=చూడబడినావు. పరిదేవితుమ్=విలపించుటకు, కాలః=కాలము, న=కాదు. అనిన్దితే=నిందింపబడనిదానా! ఇమమ్=ఈ, ముహూర్తమ్=ముహూర్తమునందే, దుఃఖానామ్ = దుఃఖములయొక్క, అన్తమ్=అంతమును, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ! దోషములు లేని సీతాదేవీ! అదృష్టవశముచేత నీవు కనబడితివి. ఇక ఇది విలపించుటకు సమయము కాదు. స్వల్పకాలములోనే దుఃఖముల అంతము చూడగలవు. 51

మూ. తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ మహాబలౌ,
త్వద్దర్శనకృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః. 52

ప్ర. అ. పురుషవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులు, మహాబలౌ=గొప్ప బలము కలవారు, త్వద్దర్శనకృతోత్సాహౌ=నీ దర్శనమునందు చేయబడిన ఉత్సాహము కలవారు అయిన, ఉభౌ = ఇద్దరైన, తౌ రాజపుత్రౌ = ఆ రాజకుమారులు, లఙ్కామ్=లంకను, భస్మీకరిష్యతః = భస్మము చేయగలరు.

తా. పురుషులలో శ్రేష్ఠులు, మహాబలశాలులు అయిన ఆ రాజపుత్రు లిద్దరూ నిన్ను చూడవలె నని ఉత్సాహముతో ఉన్నారు. వారు లంకను భస్మము చేసి వేయగలరు. 52

మూ. హత్వా చ సమరే క్రూరం రావణం సహబాన్ధవమ్,
రాఘవస్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీం ప్రతి. 53

ప్ర. అ. విశాలాక్షి = విశాలము లైన నేత్రములు గల ఓ సీతాదేవీ! రాఘవః = రాముడు, సమరే = యుద్ధమునందు, సహబాన్ధవమ్ = బంధువులతో కూడిన, క్రూరమ్ = క్రూరు డైన, రావణమ్ = రావణుని, హత్వా = చంపి, స్వాం పురీం ప్రతి = తన పట్టణమును గూర్చి, త్వామ్ = నిన్ను, నేష్యతి = తీసికొని వెళ్ళగలడు.

తా. ఓ! విశాలాక్షీ! రాముడు క్రూరు డైన రావణుని, అతని బంధువులను, రణరంగములో సంహరించి, నిన్ను తన పట్టణమునకు తీసికొని వెళ్ళగలడు. 53

మూ. బ్రూహి యద్రాఘవో వాచ్యో లక్ష్మణశ్చ మహాబలః,
సుగ్రీవో వాపి తేజస్వీ హరయోఽపి సమాగతాః. 54

ప్ర. అ. రాఘవః = రాముడు, యత్ = ఏది, వాచ్యః = చెప్పదగినవారో, మహాబలః = గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు గాని, తేజస్వీ = తేజస్సు గల, సుగ్రీవో వాపి = సుగ్రీవుడు గాని, సమాగతాః = కలిసి ఉన్న, హరయోఽపి = వానరులు గాని, ఏది చెప్పదగినవారో అది, బ్రూహి = చెప్పుము.

తా. రామునకు గాని, మహాబలశాలి యైన లక్ష్మణునకు గాని, తేజశ్శాలి యైన సుగ్రీవునకు గాని, కలిసి ఉన్న ఇతర వానరులకు గాని ఏమి చెప్పవలెనో చెప్పుము. 54

మూ. ఇత్యుక్తవతి తస్మింస్తు సీతా సురసుతోపమా,
ఉవాచ శోకసంతప్తా హనుమన్తం ప్లవంగమమ్. 55

ప్ర. అ. తస్మిన్ = ఆ హనుమంతుడు, ఇతి = ఇట్లు, ఉక్తవతి = పలికినవాడగుచుండగా, సురసుతోపమా = దేవకన్యతో సమాను రాలైన, సీతా = సీత, శోకసన్తప్తా = దుఃఖముచేత పీడింపబడినదై, ప్లవంగమమ్ = వానరు డైన, హనుమన్తమ్ = హనుమంతుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. హనుమంతుని మాటలు విని, దేవకన్యతో సమానురా లైన సీత, శోకపీడితయై ఆ హనుమంతునితో ఇట్లనెను. 55

మూ. కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ,
తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ. 56

ప్ర. అ. లోకభర్తారమ్ = లోకములకు ప్రభు వైన, యమ్ = ఏ రాముని, మనస్వినీ = ఉత్తమ మైన మనస్సు గల, కౌసల్యా = కౌసల్య, సుషువే = కనెనో, తమ్ = అట్టి రాముని, మమార్థే = నా కొరకై (నా పక్షమున), సుఖమ్ = సుఖమును, పృచ్ఛ = అడుగుము. శిరసా = శిరస్సుతో, అభివాదయ చ = నమస్కరించుము.

తా. ఉత్తమ మైన మనస్సు గల కౌసల్య లోకములకు ప్రభు వైన ఏ రాముని కనెనో అట్టి రామునకు నా పక్షమున శిరస్సు వంచి నమస్కారము చేసి సుఖము నడుగుము. 56

మూ. స్రజశ్చ సర్వరత్నాని ప్రియా యాశ్చ వరాఙ్గనాః,
ఐశ్వర్యం చ విశాలాయాం పృథివ్యామపి దుర్లభమ్. 57

పితరం మాతరం చైవ సంమాన్యాభిప్రసాద్య చ,
అనుప్రవ్రజితో రామం సుమిత్రా యేన సుప్రజాః. 58

ప్ర. అ. యేన = ఎవ్వనిచేత, సుమిత్రా = సుమిత్ర, సుప్రజాః = మంచి సంతానము గలదో, అట్టి లక్ష్మణుడు, స్రజశ్చ = మాలికలను, సర్వరత్నాని = సమస్త మైన శ్రేష్ఠవస్తువులను, ప్రియాః = ఇష్ట మైన, యాః = ఏ, వరాఙ్గనాః = శ్రేష్ఠ మైన స్త్రీలు ఉన్నారో వారిని, విశాలాయామ్ = విశాల మైన, పృథివ్యామ్ = భూమియందు, దుర్లభమ్ = పొందుటకు కష్ట మైన, ఐశ్వర్యం చాపి = ఐశ్వర్యమును, (త్యక్త్వా = విడచి), పితరమ్ = తండ్రిని, మాతరం చాపి = తల్లిని, సంమాన్య = గౌరవించి, అభిప్రసాద్య చ = అనుగ్రహింప చేసికొని, రామమ్ = రాముని, అనుప్రవ్రజితః = అనుసరించి ప్రవాసమునకు వెళ్ళినాడు.

తా. సుమిత్ర సుపుత్రు డైన లక్ష్మణుడు, మాలికలను, ఉత్తమము లైన భోగ్యవస్తువులను, ప్రియ లైన ఉత్తమస్త్రీలను, విశాల మైన భూమండలము

ఎంతో అనాయాసముగా లభించిన ఐశ్వర్యమును విడచి, తల్లిదండ్రులకు నమస్కరించి వారిని అనుమతింపచేసికొని, రామునితో కలసి ప్రవాసమునకు వెళ్ళినాడు. 57, 58

మూ. అనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖమనుత్తమమ్,
అనుగచ్ఛతి కాకుత్స్థం భ్రాతరం పాలయన్వనే. 59

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన లక్ష్మణుడు, అనుత్తమమ్ = చాల గొప్పదైన, సుఖమ్ = సుఖమును, త్యక్త్వా = విడచి, భ్రాతరమ్ = సోదరుడైన, కాకుత్స్థమ్ = రాముణ్ణి, వనే = వనమునందు, ఆనుకూల్యేన = అనుకూలముగా నుండుటచే, పాలయన్ = పాలించుచు, అనుగచ్ఛతి = అనుసరించి వెళ్ళెను.

తా. ధర్మాత్ముడైన లక్ష్మణుడు అత్యుత్తమమైన సుఖమును పరిత్యజించి, సోదరుడైన రామునకు అనుకూలముగా ఉంటూ, అరణ్యములో అతని సంరక్షణము చేయుచు అతనిని అనుసరించి వెళ్ళినాడు. 59

మూ. సింహస్కన్ధో మహాబాహుర్మనస్వీ ప్రియదర్శనః,
పితృవద్వర్తతే రామే మాతృవన్మాం సమాచరన్. 60

ప్ర. అ. సింహస్కన్ధః = సింహము వంటి మూపు గలవాడు, మహాబాహుః = గొప్ప బాహువులు గలవాడు, మనస్వీ = ఉత్తమమైన మనస్సు కలవాడు, ప్రియదర్శనః = ప్రియమైన దర్శనము కలవాడు అయిన లక్ష్మణుడు, మామ్ = నన్ను, మాతృవత్ = తల్లిని వలె, సమాచరన్ = చూచుచు, రామే = రాముని యందు, పితృవత్ = తండ్రియందు వలె, వర్తతే = ప్రవర్తించుచున్నాడు.

తా. సింహము వంటి మూపు, పెద్ద బాహువులు, ఉత్తమమైన మనస్సూ కలవాడు, చూచువారికి ఆనందము కలిగించువాడు అయిన లక్ష్మణుడు నన్ను తల్లి వలె చూచుకొనుచు, రాముని విషయమున తండ్రి విషయమునందు వలె ప్రవర్తించును. 60

మూ. హ్రియమాణాం తదా వీరో న తు మాం వేద లక్ష్మణః,
వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహుభాషితా. 61
రాజపుత్రః ప్రియః శ్రేష్ఠః సదృశః శ్వశురస్య మే.

ప్ర. అ. వీరః=వీరు డైన, లక్ష్మణః=లక్ష్మణుడు, తదా=అప్పుడు, మామ్ =నన్ను, హ్రియమాణామ్ =హరింపబడుచున్నదానినిగా, న వేద=ఎఱుగడు. వృద్ధోపసేవీ= వృద్ధులను సేవించువాడు, లక్ష్మీవాన్=లక్ష్మీవంతుడు, శక్తః= సమర్థుడు, న బహుభాషితా = ఎక్కువగా మాటలాడనివాడు, మే=నాయొక్క, శ్వశురస్య= మామగా రైన దశరథునకు, సదృశః = సమాను డైన, (తగిన), ప్రియః =ప్రియుడు, శ్రేష్ఠః =శ్రేష్ఠుడు అయిన, రాజపుత్రః= రాజకుమారుడు.

తా. వీరు డైన లక్ష్మణునకు ఆ నాడు నన్ను రావణుడు హరించుచున్నట్లు తెలియదు. అతడు పెద్దలను సేవించువాడు. శోభ కలవాడు. సమర్థు డైనను అధికముగా మాటలాడడు. నా మామగా రైన దశరథునకు తగిన, ఇష్టుడు, శ్రేష్ఠుడు అయిన రాజకుమారుడు. 61

మూ. మమ ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః, 62
నియుక్తో ధురి యస్యాం తు తాముద్వహతి వీర్యవాన్.

ప్ర. అ. రామస్య=రామునియొక్క, భ్రాతా=సోదరు డైన, లక్ష్మణః= లక్ష్మణుడు, నిత్యమ్=ఎల్లప్పుడూ, మమ=నాకు, ప్రియతరః=చాల ఇష్ట మైన వాడు. వీర్యవాన్=పరాక్రమవంతు డైన ఆ లక్ష్మణుడు, యస్యామ్=ఏ, ధురి= కార్యభారమునందు, నియుక్తః=నియమింపబడువాడో, తామ్=దానిని, ఉద్వహతి=చక్కగా భరించును.

తా. రాముని సోదరు డైన లక్ష్మణుడు నిత్యము నాకు చాల ఇష్టుడు. పరాక్రమశాలి యైన అతనికి ఏ కార్యభారమును అప్పచెప్పినను దానిని అతడు చక్కగా పూర్తి చేయును. 62

మూ. యం దృష్ట్వా రాఘవో నైవ వృత్తమార్యమనుస్మరేత్,
స మమార్థాయ కుశలం వక్తవ్యో వచనాన్మమ.

ప్ర. అ. యమ్ = ఎవనిని, దృష్ట్వా = చూచి, రాఘవః = రాముడు, వృత్తమ్ = మరణించిన, ఆర్యమ్ = తండ్రిని, న అనుస్మరేత్ = స్మరింపడో, సః = అట్టి లక్ష్మణుడు, మమ=నాయొక్క, అర్థాయ = ప్రయోజనము కొరకై, మమ = నాయొక్క, వచనాత్ = వచనమువలన, కుశలమ్ = క్షేమమును, వక్తవ్యః = చెప్పదగినవాడు.

తా. ఏ లక్ష్మణుని కూడుకొనుచు రాముడు స్వర్గస్థు డైన తన తండ్రిగారిని గూర్చి చెంగపెట్టుకొనుటలేదో అట్టి లక్ష్మణునితో నా కోరకై, నా మాటగా కుశలవార్తను చెప్పుము. (నే నాతని క్షేమము అడిగినా నని చెప్పుము). 64

మూ. మృదుర్నిత్యం శుచిర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః, 65
యథా హి వానరశ్రేష్ఠ దుఃఖక్షయకరో భవేత్,
త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ. 66

ప్ర. అ. వానరశ్రేష్ఠ = వానరులలో శ్రేష్ఠుడా! హరిసత్తమ = వానరులలో మంచివాడా! మృదుః = మృదు వైనవాడూ, నిత్యమ్ = ఎల్లప్పుడు, శుచిః = పరిశుద్ధుడూ, దక్షః = సమర్థుడూ, రామస్య = రామునకు, ప్రియః = ఇష్టుడూ అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, యథా = ఎట్లు, దుఃఖక్షయకరః = దుఃఖక్షయము చేయువాడు, భవేత్ = అగునో ఆ విధముగా, అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యసాధనమునందు, త్వమ్ = నీవు, ప్రమాణమ్ = ప్రమాణ మైన వాడవు.

తా. వానరశ్రేష్ఠు డైన ఓ హనుమంతుడా! మృదు వైన స్వభావము కలవాడూ, ఎల్లప్పుడు పరిశుద్ధుడు, సమర్థుడు, రామునకు చాల ఇష్టుడు అయిన లక్ష్మణుడు నా దుఃఖములను నశింపచేయు నట్లు ఈ కార్యమును సాధించుట అనేది నీ మీదనే ఆధారపడియున్నది. 66

మూ. రాఘవస్త్వత్సమారమ్భాన్మయి యత్నపరో భవేత్,
ఇదం బ్రూయాశ్చ మే నాథం శూరం రామం పునః పునః.

ప్ర. అ. రాఘవః = రాముడు, త్వత్సమారమ్భాత్ = నీయొక్క ప్రయత్నము వలన, మయి = నా విషయమై, యత్నపరః = ప్రయత్నపరుడు, భవేత్ = అగును. మే = నాయొక్క, నాథమ్ = నాథుడు, శూరమ్ = శూరుడూ అయిన, రామమ్ = రాముని గూర్చి, పునః పునః = మాటి మాటికి, ఇదమ్ = ఈ వాక్యమును, బ్రూయాః = చెప్పుము.

తా. నీవు చేసే ప్రయత్నమును బట్టి రాముడు, నా విషయమున ప్రయత్నము చేయును. నా నాథుడు, శూరుడు అయిన రామునితో ఈ మాట మాటి మాటికి చెప్పుము. 67

మూ. జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ,
ఊర్ధ్వం మాసాన్న జీవేయం సత్యేనాహం బ్రవీమి తే.

ప్ర. అ. దశరథాత్మజ = రామా! మాసమ్ = ఒక మాసమును మాత్రమే, జీవితమ్ = జీవితమును, ధారయిష్యామి = ధరించగలను. మాసాత్ = మాసము కంటె, ఊర్ధ్వమ్ = పైన, న జీవేయమ్ = జీవించను. అహమ్ = నేను, సత్యేన = సత్యముతో, తే = నీకు, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. "రామా! నేను ఒక్క మాసము మాత్రమే జీవించెదను. మాసము దాటి జీవించను. సత్యము చెప్పుచున్నాను". 68

మూ. రావణేనోపరుద్ధాం మాం నికృత్యా పాపకర్మణా,
త్రాతుమర్హసి వీర త్వం పాతాలాదివ కౌశికీమ్. 69

ప్ర. అ. వీర = ఓ! వీరుడా! పాపకర్మణా = పాపమైన కర్మ గల, రావణేన = రావణునిచేత, నికృత్యా = అవమానముచేత, ఉపరుద్ధామ్ = బంధింపబడిన, మామ్ = నన్ను, త్వమ్ = నీవు, పాతాలాత్ = పాతాళమునుండి, కౌశికీమివ = దేవేంద్రుని లక్ష్మిని వలె, త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. "వీరుడా! పాపాత్ముడైన రావణునిచే అవమానపూర్వకముగా బంధింపబడి ఉన్న నన్ను, పాతాళమునుండి ఇంద్రుని లక్ష్మిని రక్షించిన నట్లు నీవు రక్షించవలెను". 69

మూ. తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్,
ప్రదేయో రాఘవాయేతి సీతా హనుమతే దదౌ. 70

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సీతా = సీత, వస్త్రగతమ్ = వస్త్రములో ఉన్న, శుభమ్ = మంగళకర మైన, దివ్యమ్ = శ్రేష్ఠ మైన, చూడామణిమ్ = చూడామణిని, (శిరస్సుపై అలంకారముగా ధరించు మణిని), ముక్త్వా = ముడి విప్పి, రాఘవాయ = రామునకు, ప్రదేయః = ఇవ్వతగినది, ఇతి = అని చెప్పి, హనుమతే = హనుమంతునకు, దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట సీత కొంగులో ముడిపెట్టి ఉన్న చూడామణిని, ముడి విప్పి తీసి, "దీనిని రామునకు ఇమ్ము" అని చెప్పుచు హనుమంతునకు ఇచ్చెను. 70

మూ. ప్రతిగృహ్య తతో వీరో మణిరత్నమనుత్తమమ్,
అఙ్గుల్యా యోజయామాస న హ్యస్య ప్రాభవద్భుజః. 71

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వీరః = వీరుడైన హనుమంతుడు, అనుత్తమమ్ = దానిం ఉత్తమమైన, మణిరత్నమ్ = శ్రేష్ఠమైన మణిని, ప్రతిగృహ్య = స్వీకరించి, అఙ్గుల్యా = వ్రేలితో, యోజయామాస = కూర్చెను. అస్య = వాని యొక్క, భుజః = భుజము, న ప్రాభవత్ హి = సరిపోలేదు కదా.

తా. హనుమంతుడా శ్రేష్ఠమైన చూడామణిని గ్రహించి, అది భుజానికి పెట్టుకొనుటకు సరిపోవకపోవుటచేత వ్రేలికి దాల్చుకొనెను.

వి. ఇక్కడ ఈ శ్లోకం పాఠం సరిగా కుదురుటలేదు. 'చూడామణి' అనే పేరునుబట్టి అది శిరస్సుపై ధరించు మణి అని తెలియుచున్నది. అది అట్టిదే అని రాముని మాటలను బట్టి స్పష్టమగును. ఈ శ్లోకాన్ని బట్టి చూడగా అదేదో భుజానికి పెట్టుకొనే దండకడియంవంటి దన్నట్టూ సీతనుండి దానిని తీసికొని హనుమంతుడు మొదట తన భుజానికి పెట్టుకోవడానికి ప్రయత్నించి, అది దాంక పోవుటచేత ఉంగరం వలె వ్రేలికి పెట్టుకున్నట్టు కనబడుతున్నది. ఇది అసంగతము. సీత అలంకారాన్ని హనుమంతుడు, భక్తిపూర్వకముగా, మరొక విధముగా, జాగర్తచేసి తనదగ్గర ఉంచుకొనవలెను కాని ఆమె ధరించు నట్లు తాను కూడా ధరించుట, లేదా ధరింప యత్నించుట మర్యాదరాని దగును. అందుచేత ఈ శ్లోకం అసంగతము. ప్రాచ్యపాఠము లాగున్నది -

"సా నిరీక్ష్య తతః వస్త్రం వేణ్యాం గ్రథితముత్తమమ్,
విముచ్య ప్రదదౌ తస్మై మణిరత్నం హనూమతే.
దేహ్యాఽయం రాఘవాయేతి సీతా సురసుతోపమా"

ఏదైనా అనవాలు ఇమ్ము అని హనుమంతుడు ప్రార్థింపగా సీత అటు ఇటు చూచి పరికించింది, తన చేతిలో ఉన్న మణిశ్రేష్ఠమును తీసి "ఇది రామున కిమ్ము" అని హనుమంతునకిచ్చెను అని దీని భావము. దీని తరువాత (దాక్షిణాత్య ప్రతిలో 72వ శ్లోకంగా ఉన్న) 'మణిరత్నం కపివరః..........పార్శ్వతః స్థితః'' అను శ్లోకమున్నది. ఈ ("ప్రతిగృహ్య" అన్నది) శ్లోకము లేదు. 71

మూ. మణిరత్నం కపివరః ప్రతిగృహ్యాభివాద్య చ,
సీతాం ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వతః స్థితః. 72

ప్ర. అ. కపివరః = వానరశ్రేష్ఠుడు, మణిరత్నమ్=ఆ శ్రేష్ఠ మైన మణిని, ప్రతిగృహ్య = స్వీకరించి, సీతామ్=సీతను, అభివాద్య చ = నమస్కరించి, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, ప్రణతః=నమ్రుడై, పార్శ్వతః =ప్రక్కన, స్థితః=ఉండెను.

తా. హనుమంతుడు ఆ మణిశ్రేష్ఠమును గ్రహించి, సీతకు నమస్కరించి ప్రదక్షిణపూర్వకముగా ఆమె ప్రక్కకు వెళ్ళి నిలచెను. 72

మూ. హర్షేణ మహతా యుక్తః సీతాదర్శనజేన సః,
హృదయేన గతో రామం శరీరేణ తు విష్ఠితః. 73

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, సీతాదర్శనజేన = సీత యొక్క దర్శనము వలన కలిగిన, మహతా = గొప్ప, హర్షేణ= సంతోషముతో, యుక్తః = కూడినవాడై, హృదయేన = హృదయముతో, రామమ్=రాముని గూర్చి, గతః = వెళ్ళినాడు. శరీరేణ తు=శరీరముతో మాత్రము, విష్ఠితః = అక్కడ నిలిచి ఉండెను.

తా. హనుమంతుడు సీత దర్శనము లభించినందుకు (సీత కనబడి నందుకు) చాల సంతోషించుచు, మనస్సుతో రామునివద్దకు వెళ్ళిపోయెను. అతని శరీరము మాత్రమే అక్కడ ఉండెను 73

మూ. మణివరముపగృహ్య తం మహార్హం
జనకనృపాత్మజయా ధృతం ప్రభావాత్,
గిరిరివ పవనావధూతముక్తః
సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే. 74

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టత్రింశః సర్గః.

ప్ర. అ. మహార్హమ్=చాలా శ్రేష్ఠ మైనదీ, జనకనృపాత్మజయా= సీత

చేత, ధృతమ్=ధరింపబడినదీ అయిన, తం మణివరమ్=ఆ శ్రేష్ఠ మైన మణిని. ఉపగృహ్య=గ్రహించి, (ఆ హనుమంతుడు), ప్రభావాత్= దాని యొక్క ప్రభావము వలన, పవనావధూతముక్తః=వాయువు చేత కదల్పబడి విడువబడిన. గిరిరివ=పర్వతము వలె, సుఖితమనాః=సుఖముతో కూడిన మనస్సు కలవాడై, ప్రతిసంక్రమమ్=తిరిగి సముద్రమును దాటుటను, ప్రపేదే=పొందెను. (ఆలోచించెను).

తా. సీతాదేవి ధరించిన ఆ శ్రేష్ఠ మైన మణిని తీసికొనగానే, దాని ప్రభావము చేత, హనుమంతుడు, గాలికి కదల్పబడి విడువబడిన పర్వతము వలె, సుఖించినవాడై (స్వస్థ చిత్తుడై) తిరిగి వెళ్లుటకు ఆలోచించెను.

వి. ఇక్కడ గాలికి కదలి మరల నిలచిన పర్వతమును ఉపమానముగా చెప్పుట అంతగా స్వాభావికముగా లేదు. గాలికి పర్వతాలు కదలవు కదా! ఇంక అభూతోపమ అని చెప్పాలి. ఇక్కడ ప్రాచ్యపాఠములో చూడామణి ప్రభావము సూచిత మగుచున్నది. ఆ పాఠమిది :-

"మణివరముపగృహ్య తం మహార్హం
జనకనృపాత్మజయా (అయా) ధృతం పురస్తాత్,
ద్రుమ ఇవ పవనావధూతమూర్తిః
తుళితతనుర్హనుమాన్ కృతస్తదాసీత్."

"అంతవరకు సీత ధరించిన ఆ చూడామణిని గ్రహించగానే దాని ప్రభావము చేత హనుమంతుని శరీరము గాలిచే కదల్చివేయబడిన చెట్టు వలె గజగజలాడిపోయెను" అని దీని భావము. చూడామణిద్వారా ఆ జగజ్జనని శక్తి సంక్రమించగానే హనుమంతుని శరీరము అట్లగుట స్వాభావికము. ఈ శక్తి సంక్రమము చేతనే అతడు తిరిగి వెళ్ళేలోగా అంత మహాపరాక్రమము చూపగలిగినాడు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనచత్వారింశః సర్గః

*[చూడామణిని తీసికొని తిరుగు ప్రయాణము చేయుటకు సిద్ధమగుచున్న హనుమంతునితో సీత శ్రీరాములను ప్రోత్సహించవలెనని చెప్పుట, వారందరు సముద్రమును ఎట్లు లంఘించకలరో అను సంశయమును వ్యక్తము చేయగా హనుమంతుడు వానరుల పరాక్రమమును వర్ణించి చెప్పి అమెను ఊరడించుట.]*

మూ. మణిం దత్త్వా తతః సీతా హనూమన్తమథాబ్రవీత్,
అభిజ్ఞానమభిజ్ఞాతమేతద్రామస్య తత్త్వతః. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సీతా = సీత, మణిమ్ = మణిని, దత్త్వా = ఇచ్చి, అథ = పిదప, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఏతత్ = ఈ, అభిజ్ఞానమ్ = గుర్తు, రామస్య = రామునకు, తత్త్వతః = యథార్థముగా, అభిజ్ఞాతమ్ = తెలిసినది.

తా. సీత హనుమంతునకు చూడామణిని ఇచ్చిన పిమ్మట అతనితో ఇట్లు చెప్పెను- "ఈ అభిజ్ఞానము (ఆనవాలుగా ఇచ్చిన వస్తువు)ను గూర్చి రామునకు పూర్తిగా తెలియును. 1

మూ. మణిం తు దృష్ట్వా రామో వై త్రయాణాం సంస్మరిష్యతి,
వీరో జనన్యా మమ చ రాజ్ఞో దశరథస్య చ. 2

ప్ర. అ. మణిమ్ = మణిని, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, త్రయాణామ్ = ముగ్గురిని (ని), జనన్యాః = నా తల్లిని (ని), మమ చ = నన్నూ, రాజ్ఞః = రాజైన, దశరథస్య చ = దశరథుని, సంస్మరిష్యతి = స్మరించగలడు.

తా. ఈ చూడామణి చూడగానే రాముడు, నా తల్లినీ, నన్నూ, దశరథ మహారాజునూ, ఈ ముగ్గురినీ స్మరించగలడు. 2

మూ. స భూయస్త్వం సముత్సాహచోదితో హరిసత్తమ,
అస్మిన్ కార్యసమారమ్భే ప్రచిన్తయ యదుత్తరమ్. 3

ప్ర. అ. హరిసత్తమ = వానరశ్రేష్ఠా। సః త్వమ్ = అట్టి నీవు, భూయః = మరల, సముత్సాహచోదితః = ఉత్సాహముచేత ప్రేరితుడవై, అస్మిన్ = ఈ, కార్యసమారమ్భే = కార్యప్రారంభమునందు, యత్ = ఏది, ఉత్తరమ్ = తరవాత చేయదగినదో, ప్రచిన్తయ = ఆలోచింపుము.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! నీవు మరల ఉత్సాహముచేత ప్రేరేపింపబడినవాడవై, ఈ కార్యము విషయమున, మున్ముందు ఏమి చేయవలెనో ఆలోచింపుము.

మూ. త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ,
హనుమన్ యత్నమాస్థాయ దుఃఖక్షయకరో భవ. 4
తస్య చిన్తయతో యత్నో దుఃఖక్షయకరో భవేత్.

ప్ర. అ. హరిసత్తమ = వానరశ్రేష్ఠుడా। అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యమును సమకూర్చుటయందు, త్వమ్ = నీవే, ప్రమాణమ్ = ప్రమాణము. హనుమన్ = హనుమంతుడా! యత్నమ్ = ప్రయత్నమును, ఆస్థాయ = అవలంబించి, దుఃఖక్షయకరః = దుఃఖముయొక్క నాశనమును చేయువాడవు, భవ = అగుము. తస్య = అట్టి నీవు, చిన్తయతః = ఆలోచించినచో, యత్నః = ప్రయత్నము, దుఃఖక్షయకరః = దుఃఖమును నశింపచేయునది, భవేత్ = అగును.

తా. ఓ వానరశ్రేష్ఠుడా! ఈ కార్యమును సంధించుటలో నీవే సరియైన నిర్ణయము తీసికొనవలెను. హనుమంతుడా! ప్రయత్నము చేసి నా దుఃఖమును నశింపచేయుము. నీవు బాగుగా ఆలోచించి ప్రయత్నించినచో దుఃఖములు నశించును. 4

మూ. స తథేతి ప్రతిజ్ఞాయ మారుతిర్భీమవిక్రమః, 5
శిరసా వన్ద్య వైదేహీం గమనాయోపచక్రమే.

ప్ర. అ. భీమవిక్రమః = భయంకరమైన పరాక్రమము గల, సః మారుతిః = ఆ హనుమంతుడు, తథేతి = అట్లే అని, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, వైదేహీమ్ = సీతను, శిరసా = శిరస్సుతో, వన్ద్య = నమస్కరించి, గమనాయ = వెళ్లుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. భయంకర మైన పరాక్రమము గల హనుమంతుడు అట్లే చేసెదను అని ప్రతిజ్ఞ చేసి, సీతకు శిరస్సు వంచి నమస్కరించి, వెళ్లుటకు ఉద్యుక్తుడాయెను.

మూ. జ్ఞాత్వా సంప్రస్థితం దేవీ వానరం మారుతాత్మజమ్, 6
బాష్పగద్గదయా వాచా మైథిలీ వాక్యమబ్రవీత్.

ప్ర. అ. దేవీ=దేవి యైన, మైథిలీ=సీత, మారుతాత్మజమ్=వాయుపుత్రు డైన, వానరమ్=హనుమంతుని, సంప్రస్థితమ్=ప్రయాణ మైనవానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, బాష్పగద్గదయా = బాష్పముచే గద్గదికతో కూడిన, వాచా = వాక్కుతో, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వాయుపుత్రుడు ప్రయాణ మైనట్లు తెలిసికొని సీతాదేవి, బాష్పముచేత గద్గదితమైన వాక్కుతో ఇట్లనెను. 6

మూ. కుశలం హనుమన్ బ్రూయాః సహితౌ రామలక్ష్మణౌ. 7
సుగ్రీవం చ సహామాత్యం వృద్ధాన్ సర్వాంశ్చ వానరాన్,
బ్రూయాస్త్వం వానరశ్రేష్ఠ కుశలం ధర్మసంహితమ్. 8

ప్ర. అ. వానరశ్రేష్ఠ = వానరులలో శ్రేష్ఠుడా! హనుమన్ = హనుమంతుడా! సహితౌ=కూడి యున్న, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను గూర్చి, కుశలమ్=కుశలము, బ్రూయాః=చెప్పుము. సహామాత్యమ్ = మంత్రులతో కూడిన, సుగ్రీవం చ=సుగ్రీవుని గూర్చి, వృద్ధాన్ = వృద్ధు లైన, సర్వాన్ = సమస్త మైన, వానరాన్=వానరులను గూర్చి, త్వమ్=నీవు, ధర్మసంహితమ్ ధర్మముతో కూడిన, కుశలమ్=కుశలమును, బ్రూయాః=చెప్పుము.

తా. వానరశ్రేష్ఠుడ వైన ఓ! హనుమంతుడా! రామలక్ష్మణు లిద్దరికీ, మంత్రిసమేతు డైన సుగ్రీవునకూ, నేను వారి కుశలము అడిగి నట్లు చెప్పుము. పెద్ద వారైన ఇతరవానరులకు కూడ, ధర్మసంయుతముగా, నేను కుశల మడిగి నట్లు చెప్పుము. 7,8

మూ. యథా చ స మహాబాహుర్మాం తారయతి రాఘవః,
అస్మాద్దుఃఖాంబుసంరోధాత్ త్వం సమాధాతుమర్హసి. 9

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః రాఘవః = ఆ రాముడు, అస్మాత్ = ఈ, దుఃఖాంబుసంరోధాత్ = దుఃఖ మనే సముద్రము నుండి, యథా=ఎట్లు, తారయతి = దాటించునో, ఆ విధముగ, త్వమ్ = నీవు, సమాధాతుమ్=చేయుటకు, అర్హసి=తగి యున్నావు.

తా. మహాబాహు వైన ఆ రాముడు నన్ను ఈ దుఃఖసముద్రమునుండి ఉద్ధరించు ఉపాయమును చేయుము. 9

మూ. జీవన్తీం మాం యథా రామః సంభావయతి కీర్తిమాన్,
తత్తథా హనుమన్ వాచ్యం వాచా ధర్మమవాప్నుహి. 10

ప్ర. అ. హనుమన్=హనుమంతుడా! కీర్తిమాన్=కీర్తి గల, రామః = రాముడు, మామ్=నన్ను, జీవన్తీమ్=జీవించి యుండగా, యథా=ఎట్లు, సంభావయతి=ఆదరించునో, తత్=అది, తథా = అట్లు, వాచ్యమ్ = చెప్పదగినది. వాచా=మాటచేత, ధర్మమ్=ధర్మమును, అవాప్నుహి=పొందుము.

తా. హనుమంతుడా! కీర్తిమంతు డైన రాముడు, నేను ప్రాణముతో యుండగా పొంది ఆదరించు నట్లు తగు విధముగా చెప్పుము. మాటతో ఉపకారము చేసి పుణ్యము కట్టుకొనుము. 10

మూ. నిత్యముత్సాహయుక్తాశ్చ వాచః శ్రుత్వా త్వయేరితాః,
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మదవాప్తయే. 11

ప్ర. అ. త్వయా=నీచేత, ఈరితాః = పలుకబడిన, ఉత్సాహయుక్తాః = ఉత్సాహముతో కూడిన, వాచః=వాక్యములను, నిత్యమ్=నిత్యము, శ్రుత్వా= విని, మదవాప్తయే=నన్ను పొందుటకు, దాశరథేః=రామునియొక్క, పౌరుషమ్ =పౌరుషము, వర్ధిష్యతే=వృద్ధిపొందగలదు.

తా. నీవు నిత్యము ఉత్సాహభరితము లైన మాటలు చెప్పగా విని విని, రామునకు నన్ను ఈ ఆపదనుండి ఉద్ధరించ వలె నని పౌరుషము వృద్ధి పొందును. 11

మూ. మత్సన్దేశయుతా వాచస్త్వత్తః శ్రుత్వా చ రాఘవః,
పరాక్రమవిధిం వీరో విధివత్సంవిధాస్యతి. 12

ప్ర. అ. వీరః = వీరు డైన, రాఘవః = రాముడు, త్వత్తః = నీనుండి, మత్సందేశయుతాః = నా సందేశముతో కూడిన, వాచః = వాక్యములను, శ్రుత్వా = విని, విధివత్ = యథావిధిగా, పరాక్రమవిధిమ్ = పరాక్రమప్రయోగమును, సంవిధాస్యతి = చేయగలడు.

తా. వీరు డైన రాముడు, నా సందేశముతో కూడిన మాటలు నీవు చెప్పగా విని, చేయవలసిన రీతితో పరాక్రమప్రదర్శనము చేయగలడు. 12

మూ. సీతాయా వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః,
శిరస్యఞ్జలిమాధాయ వాక్యముత్తరమబ్రవీత్. 13

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమంతుడు, సీతాయాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, శిరసి = శిరస్సుపై, అఞ్జలిమ్ = దోసిలిని, ఆధాయ = ఉంచి, ఉత్తరమ్ = బదులుగా, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు సీత మాటలు విని, శిరస్సుపై అంజలి ఘటించి, ఈ విధముగ బదులు చెప్పెను. 13

మూ. క్షిప్రమేష్యతి కాకుత్స్థో హర్యృక్షప్రవరైర్యుతః,
యస్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి. 14

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, హర్యృక్షప్రవరైః = వానరశ్రేష్ఠులతోను, భల్లూకశ్రేష్ఠులతోను కూడినవాడై, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు. యః = ఏ రాముడు, యుధి = యుద్ధమునందు, అరీన్ = శత్రువులను, విజిత్య = జయించి, తే = నీయొక్క, శోకమ్ = శోకమును, వ్యపనయిష్యతి = తొలగించగలడో.

తా. రాముడు వీరు లైన వానరులతోను, భల్లూకములతోను కలిసి శీఘ్రముగా వచ్చి, యుద్ధములో శత్రువులను ఓడించి నీ శోకమును తొలగింప గలడు. 14

మూ. న హి పశ్యామి మర్త్యేషు నాసురేషు సురేషు వా,
యస్తస్య క్షిపతో బాణాన్ స్థాతుముత్సహతేఽగ్రతః. 15

ప్ర. అ. యః = ఎవడు, బాణాన్ = బాణములను, కిరతః = ప్రయోగించు చున్న, తస్య = ఆ రామునియొక్క, అగ్రతః = ఎదుట, స్థాతుమ్ = నిలుచుటకు, తత్సహాతే = సమర్థ శక్తునో అట్టి వానిని. మర్త్యేషు = మానవులలో గాని, దాన వేషు = దానవులలో గాని, సురేషు వా = దేవతలలో గాని, న హి పశ్యామి = చూడను.

రా. రాముడు బాణములు ప్రయోగించుచుండగా, అతని ఎదుట నిలువ గలవారు, నాకు, దానవులలో గాని, నరులలో గాని, సురులలో గాని ఒక్కడూ కనబడుటలేదు. 15

మూ. అప్యర్కమపి పర్జన్యమపి వైవస్వతం యమమ్,
స హి సోఢుం రణే శక్తస్తవ హేతోర్విశేషతః. 16

ప్ర. అ. సః = ఆ రాముడు, రణే = యుద్ధరంగమునందు, అర్కమపి = సూర్యు నైనా, పర్జన్యమపి = ఇంద్రు నైనా, వైవస్వతమ్ = సూర్యుని కుమారు డైన, యమమ్ = యము నైనా, సోఢుమ్ = సహించుటకు, శక్తః = సమర్థుడు. తవ హేతోః = నీ నిమిత్తమైతే, విశేషతః = విశేషించి సహించ సమర్థుడు.

రా. రాముడు యుద్ధరంగములో సూర్యు డైనా, ఇంద్రు డైనా, సూర్య కుమారు డైన యము డైనా ఎదిరించ సమర్థుడు. నీ కోస మైతే విశేషించి ఎది రించ సమర్థుడు. 16

మూ. స హి సాగరపర్యన్తాం మహీం సాధితుమర్హతి,
త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనన్దిని. 17

ప్ర. అ. సః = ఆ రాముడు, సాగరపర్యన్తామ్ = సాగరమువరకు వ్యాపించి ఉన్న, మహీమ్ = భూమిని, సాధితుమ్ = సాధించుటకు, అర్హతి హి = తగి యున్నాడు కదా. జనకనన్దిని = ఓ సీతాదేవీ రామస్య = రామునియొక్క, జయః = జయము. త్వన్నిమిత్తో హి = నీ కొరకే అయినది కదా.

రా. ఆ రాముడు సముద్రమువరకు వ్యాపించి యున్న ఈ భూమిని అంతనూ జయించుటకు సమర్థుడు. ఓ సీతాదేవీ, రాముడు సంపాదించే ఈ జయము కూడ నీ కొరకే కదా. 17

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సమ్యక్సత్యం సుభాషితమ్,
జానకీ బహుమేనేఽథ వచనం చేదమబ్రవీత్. 18

ప్ర. అ. జానకీ = సీత, తస్య = ఆ హనుమంతునియొక్క, సత్యమ్ = సత్య మైన, సమ్యక్ = బాగుగా, సుభాషితమ్ = మధురముగా పలుకబడిన, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, బహుమేనే = గౌరవించెను. అథ = అటుపిమ్మట, ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. హనుమంతుడు చక్కగా, మధురముగా పలికిన ఆ మాటలు విని, సీత అతనిని మెచ్చుకొనుచు ఇట్లు పలికెను. 18

మూ. తతస్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునః పునః,
భర్తృస్నేహాన్వితం వాక్యం సౌహార్దాదనుమానయత్. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సీతా = సీత, ప్రస్థితమ్ = ప్రయాణ మైన, తమ్ = అతనిని, పునః పునః = మాటి మాటికి, వీక్షమాణా = చూచుచు, భర్తృస్నేహాన్వితమ్ = తన భర్తయందు స్నేహముతో కూడిన, వాక్యమ్ = అతని వాక్యమును, సౌహార్దాత్ = స్నేహమువలన, అనుమానయత్ = గౌరవించెను.

తా. పిదప, సీత తిరిగి వెళ్ళుటకు ప్రయాణ మైన ఆ హనుమంతుని వైపు మాటి మాటికి చూచుచు, తన భర్త యైన రామునిపై అతనికి ఉన్న స్నేహమును సూచించుచున్న అతని మాటలను, స్నేహపూర్వకముగా అభినందించెను. 19

మూ. యది వా మన్యసే వీర వసైకాహమరిందమ,
కస్మింశ్చిత్సంవృతే దేశే విశ్రాన్తః శ్వో గమిష్యసి. 20

ప్ర. అ. అరిందమ = శత్రువులను సంహరించేవాడా! వీర = వీరుడా! మన్యసే యది = బాగుండు నని తలచినచో, కస్మింశ్చిత్ = ఒకానొక, సంవృతే = రహస్య మైన, దేశే = ప్రదేశమునందు, ఏకాహమ్ = ఒక రోజు, వస = నివసించుము. విశ్రాన్తః = విశ్రమించినవాడ వై, శ్వః = రేపు, గమిష్యసి = వెళ్ళగలవు.

తా. శత్రుసంహారకుడ వైన ఓ వీరుడా! నీకు అంగీకారయోగ్య మైనచో, ఒక్క రోజుపాటు ఏదైన రహస్య మైన ప్రదేశములో ఉండుము. విశ్రాంతి తీసికొని రేపు వెళ్ళవచ్చును. 20

మూ. మమ చేదల్పభాగ్యాయాః సాన్నిధ్యాత్తవ వానర,
అస్య శోకస్య మహతో ముహూర్తం మోక్షణం భవేత్.

ప్ర. అ. వానర = హనుమంతుడా! తవ = నీయొక్క, సాన్నిధ్యాత్ = సాంనిధ్యమువలన, అల్పభాగ్యాయాః = అల్పమైన భాగ్యము గల, మమ = నాయొక్క, మహతః = గొప్పదైన, అస్య శోకస్య = ఈ శోకమునకు, ముహూర్తమ్ = క్షణకాలము, మోక్షణమ్ = విమోక్షము, భవేత్ చేత్ = కలుగును.

తా. నీవు ఈ సమీపమునందు ఉన్నచో అల్పభాగ్యవంతురాల నైన నా ఈ గొప్ప శోకమునకు క్షణకాలము పాటు శాంతి కలుగును. 21

మూ. గతే హి హరిశార్దూల పునరాగమనాయ తు
ప్రాణానామపి సందేహో మమ స్యాన్నాత్ర సంశయః. 22

ప్ర. అ. హరిశార్దూల = వానరశ్రేష్ఠుడా! పునరాగమనాయ = తిరిగి వచ్చుటకు, గతే = వెళ్ళినవాడ వగుచుండగా, మమ = నాయొక్క, ప్రాణానామపి = ప్రాణములకు కూడ, సన్దేహః = సందేహము, స్యాత్ = అగును. అత్ర = ఈ విషయమునందు, సందేహః = సందేహము, న = లేదు.

తా. ఓ వానరశ్రేష్ఠా! నీవు తిరిగి వచ్చుటకై వెళ్ళిన తరువాత నేను బ్రతికి ఉందునో ఉండనో సందేహమే. ఈ విషయమున సంశయము లేదు. 22

మూ. తవాదర్శనజః శోకో భూయో మాం పరితాపయేత్,
దుఃఖాద్దుఃఖపరామృష్టాం దీపయన్నివ వానర. 23

ప్ర. అ. వానర = హనుమంతుడా! దుఃఖాత్ = ఒక దుఃఖమునుండి, దుఃఖపరామృష్టామ్ = మరొక దుఃఖముచేత స్పృశింపబడిన, మామ్ = నన్ను, తవ = నీయొక్క, అదర్శనజః = కనబడకపోవుటవలన కలుగు, శోకః = శోకము, దీపయన్నివ = మండించుచున్నది వలె, భూయః = మరల, పరితాపయేత్ = తపింపచేయును.

తా. హనుమంతుడా! ఒక దుఃఖము తరవాత మరొక దుఃఖముతో బాధపడు చున్న నన్ను, నీవు కనబడకపోవుటవలన కలుగు దుఃఖము కాల్చివేయు చున్నట్లు ఇంకను, తపింపచేయును. 23

మూ. అయం చ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః,
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర. 24

ప్ర. అ. వీర=వీరుడా! హరీశ్వర = వానరశ్రేష్ఠుడా! త్వత్సహాయేషు = నీకు సహాయు లైన, హర్యృక్షేషు=వానరుల విషయమునందు, భల్లూకముల విషయమునందు, అయమ్ = ఈ, సుమహాన్ = చాల గొప్ప దైన, సన్దేహః = సందేహము, మమ అగ్రతః=నా ఎదుట, తిష్ఠతీవ=నిలుచున్న ట్లున్నది.

తా. వీరుడ వైన వానరశ్రేష్ఠుడా! నీకు సహాయభూతు లైన వానరభల్లూకముల విషయమునందు ఒక పెద్ద సందేహము నా ఎదుట నిలచి ఉన్నది. 24

మూ. కథం ను ఖలు దుష్పారం తరిష్యన్తి మహోదధిమ్,
తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ. 25

ప్ర. అ. తాని=ఆ, హర్యృక్షసైన్యాని=వానరభల్లూకసైన్యములు గాని, తౌ=ఆ, నరవరాత్మజౌ వా=రాజకుమారులు గాని, దుష్పారమ్=దాట శక్యము కాని, మహోదధిమ్=మహాసముద్రమును, కథం ను = ఎట్లు, తరిష్యన్తి = దాట గలరు?

తా. ఆ వానర భల్లూకసైన్యములు గాని, ఆ రామలక్ష్మణులు గాని దాట శక్యము కాని మహాసముద్రమును ఎట్లు దాటగలరో! 25

మూ. త్రయాణామేవ భూతానాం సాగరస్యాస్య లఙ్ఘనే,
శక్తిః స్యాద్వైనతేయస్య తవ వా మారుతస్య వా. 26

ప్ర. అ. అస్య=ఈ, సాగరస్య=సముద్రముయొక్క, లఙ్ఘనే=దాటుట యందు, వైనతేయస్య వా=గరుత్మంతునకు గాని, తవ వా=నీకు గాని, మారుతస్య వా = వాయువునకు గాని, త్రయాణామ్=ముగ్గురు, భూతానామ్ = ప్రాణులకే, శక్తిః = శక్తి, స్యాత్ = ఉండవచ్చును.

తా. గరుత్మంతుడు, నీవు, వాయుదేవుడు ఈ ముగ్గురు మాత్రమే ఈ సముద్రమును దాట సమర్థులు. 26

మూ. తదస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే,
కిం పశ్యసి సమాధానం త్వం హి కార్యవిదాం వరః. 27

ప్ర. అ. వీర = వీరుడా! తత్ = ఆ కారణమువలన, ఏవమ్ = ఇట్లు, దురతిక్రమే = అతిక్రమింప శక్యము కాని, అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యము నిర్వహించుటయందు, కిమ్ = ఏ, సమాధానమ్ = ఉపాయమును, పశ్యసి = చూచుచున్నావు? త్వమ్ = నీవు, కార్యవిదామ్ = కార్యవేత్తలలో, వరః హి = గొప్పవాడవు కదా?

తా. ఓ వీరుడా! ఈ విధముగ ఈ కార్యమును సాధించుట అనేది చాల కష్టముగా కనబడు చున్నది. అట్టి స్థితిలో నీ వేమి ఉపాయము ఆలోచించితివి? కార్యము లెట్లు సాధింపవలెనో తెలిసినవారిలో నీవు శ్రేష్ఠుడవు కదా? 27

మూ. కామమస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే.
పర్యాప్తః పరవీరఘ్న యశస్యస్తే ఫలోదయః. 28

ప్ర. అ. పరవీరఘ్న = శత్రువీరులను సంహరించువాడా! అస్య కార్యస్య = ఈ కార్యముయొక్క, పరిసాధనే = సాధించుటయందు, త్వమ్ = నీవు, ఏక ఏవ = ఒక్కడవే, పర్యాప్తః కామమ్ = సమర్థుడవే. తే = నీయొక్క, ఫలోదయః = ఫలముయొక్క లాభము, యశస్యః = యశస్సును కలిగించేది.

తా. శత్రువీరులను నశింపచేయు ఓ హనుమంతుడా! ఈ కార్యమును నీవే ఒంటరిగా సాధింపగలవు. నీ కార్యము సఫలమై యశస్సును కలిగించును.

మూ. బలైః సమగ్రైర్యది మాం రావణం జిత్య సంయుగే,
విజయీ స్వపురం యాయాత్ తత్తస్య సదృశం భవేత్. 29

ప్ర. అ. (రాముడు), సంయుగే = యుద్ధమునందు, సమగ్రైః = సమస్తమైన, బలైః = సైన్యములతో, రావణమ్ = రావణుని, జిత్య = జయించి, మామ్ = నన్ను, (గ్రహించి), విజయీ = విజయవంతుడై, స్వపురమ్ = తన పురమును గూర్చి, యాయాత్ యది = వెళ్ళిన ట్లయితే, తత్ = అది, తస్య = అతనికి, సదృశమ్ = తగినది, భవేత్ = అగును.

తా. రాముడు యుద్ధములో రావణుని సకలసేనలతో జయించి, నన్ను తీసికొని తన పట్టణమునకు వెళ్ళినచో అది అయనకు తగి ఉండును. 29

మూ. శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః,
మాం నయేద్యది కాకుత్స్థః తత్తస్య సదృశం భవేత్. 30

ప్ర. అ. పరబలార్దనః=శత్రుసేనలను పీడించు, కాకుత్స్థః=రాముడు, లఙ్కామ్=లంకను, శరైః=బాణములచేత, సంకులామ్=వ్యాకులము మైనదానినిగా, కృత్వా=చేసి, మామ్=నన్ను, నయేద్యది=తీసికొని వెళ్ళిన ట్లయితే, తత్=అది, తస్య=అతనికి, సదృశమ్=సమానము (తగినది), భవేత్=అగును.

తా. శత్రుసేనలను సంహరించు రాముడు లంకను బాణములతో నింపి, నన్ను తీసికొనివెళ్ళినచో అది అతనికు తగిన దై యుండును. 30

మూ. తద్యథా తస్య విక్రాన్తమనురూపం మహాత్మనః,
భవేదాహవశూరస్య తథా త్వముపపాదయ. 31

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, మహాత్మనః=మహాత్ముడూ, ఆహవశూరస్య=యుద్ధములో శూరుడూ అయిన, తస్య=ఆ రాముని యొక్క, అనురూపమ్=తగిన, విక్రాన్తమ్=పరాక్రమించుట, యథా=ఎట్లు, భవేత్=అగునో, తథా=అట్లు, త్వమ్=నీవు, ఉపపాదయ=ఏర్పరచుము.

తా. అందుచేత యుద్ధములో శూరుడూ, మహాబుద్ధిశాలి యైన ఆ రాముడు తనకు తగిన విధముగా పరాక్రమము చూపించునట్లు చేయుము. 31

మూ. తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశమ్య హనుమాన్ శేషం వాక్యముత్తరమబ్రవీత్. 32

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు. అర్థోపహితమ్=మంచి అర్థముతో కూడినదీ, ప్రశ్రితమ్=వినయపూర్వకమూ, హేతుసంహితమ్=యుక్తులతో కూడినదీ అయిన, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, నిశమ్య=విని, శేషమ్=మిగిలిన, ఉత్తరం వాక్యమ్=ప్రత్యుత్తరరూప మైన వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు, మంచి అర్థముతో కూడినదీ, వినయసంపన్నమూ, యుక్తిసంగతమూ అయిన ఆ వాక్యమును విని ప్రత్యుత్తరరూపముగ తాను చెప్పవలసిన మిగిలిన మాట నిట్లు చెప్పెను. 32

మూ. దేవి హర్యృక్షసైన్యానామీశ్వరః ప్లవతాం వరః,
సుగ్రీవః సత్త్వసంపన్నస్తవార్థే కృతనిశ్చయః. 33

ప్ర. అ. దేవి=ఓ దేవీ! హర్యృక్షసైన్యానామ్ = వానరభల్లూకసైన్యములకు, ఈశ్వరః = ప్రభువు, ప్లవతాం వరః = వానరులలో శ్రేష్ఠుడూ అయిన, సత్త్వసంపన్నః = బలముతో కూడిన, సుగ్రీవః = సుగ్రీవుడు, తవ అర్థే = నీ నిమిత్తమై, కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము కలవాడు.

తా. ఓ! సీతాదేవీ! వానరభల్లూకసైన్యముల అధిపతి, వానరశ్రేష్ఠుడూ, బలశాలి అయిన సుగ్రీవుడు నిన్నెట్లైన రక్షింప వలె నని దృఢనిశ్చయముతో ఉన్నాడు. 33

మూ. స వానరసహస్రాణాం కోటీభిరభిసంవృతః,
క్షిప్రమేష్యతి వైదేహి రాక్షసానాం నిబర్హణః. 34

ప్ర. అ. వైదేహి=ఓ! సీతాదేవీ! సః=ఆ సుగ్రీవుడు, వానరసహస్రాణామ్ =వేలకొలది వానరులయొక్క, కోటీభిః = కోటులతో, అభిసంవృతః = కూడినవాడై, రాక్షసానామ్=రాక్షసులకు, నిబర్హణః=సంహారము చేయువాడై, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఏష్యతి=రాగలడు.

తా. ఓ! సీతాదేవీ! ఆ సుగ్రీవుడు వేలకొలది, కోట్లకొలది వానరులు వెంట రాగా, రాక్షసులను చంపుటకై శీఘ్రముగా రాగలడు. 34

మూ. తస్య విక్రమసంపన్నాః సత్త్వవన్తో మహాబలాః,
మనఃసంకల్పసంపాతా నిదేశే హరయః స్థితాః. 35

ప్ర. అ. విక్రమసంపన్నాః = పరాక్రమముతో కూడినవారు, సత్త్వవన్తః = కష్టములను సహించు శక్తి కలవారు, మహాబలాః=గొప్ప బలము కలవారు, మనఃసంకల్పసంపాతాః = మనస్సుయొక్క సంకల్పము ప్రకారము శీఘ్రముగా వెళ్లగలవారు అయిన, హరయః = వానరులు, తస్య = ఆ సుగ్రీవునియొక్క, నిదేశే = ఆజ్ఞయందు, స్థితాః = ఉన్నారు.

తా. పరాక్రమవంతులు, కష్టసహనశక్తి కలవారు, మహాబలశాలులును, వెళ్ల దలచిన ఏ ప్రదేశమున కైనా వెళ్ళగలవారు అయిన ఎందరో వానరులు ఆ సుగ్రీవుని ఆజ్ఞకు కట్టుబడి ఉన్నారు. 35

మూ. యేషాం నోపరి నాధస్తాన్న తిర్యక్సజ్జతే గతిః,
న చ కర్మసు సీదన్తి మహత్స్వమితతేజసః. 36

ప్ర. అ. యేషామ్ = ఏ వానరులయొక్క, గతిః=గమనము, ఉపరి = ఆకాశము పైన, న సజ్జతే=అడ్డపడదో, అధస్తాత్ = క్రింద, న = అడ్డపడదో, తిర్యక్=అడ్డముగా, న = అడ్డపడదో, (అట్టివారు ఉన్నారు) అమితతేజసః = అనంత మైన తేజస్సు గల వారు, మహత్సు = గొప్ప వైన, కర్మసు=పనుల విషయమున, న సీదన్తి=దుఃఖించరు.

తా. ఆకాశముపై గాని, క్రింద గాని, అడ్డముగా గాని వారి గమనానికి ఎక్కడా అడ్డము ఉండదు. అపరిమిత మైన తేజస్సు గల ఆ వానరులు ఎట్టి పెద్ద పనులు చేయవలసివచ్చినను వెనుదీయరు. 36

మూ. అసకృత్తైర్మహోత్సాహైః ససాగరధరాధరా,
ప్రదక్షిణీకృతా భూమిర్వాయుమార్గానుసారిభిః. 37

ప్ర. అ. మహోత్సాహైః=గొప్ప ఉత్సాహము గలవారు, వాయుమార్గానుసారిభిః = ఆకాశమును అనుసరించువారు అయిన, తైః = ఆ వానరులచేత, అసకృత్ = అనేక పర్యాయములు, ససాగరధరాధరా=సాగరములతోను పర్వతములతోను కూడిన, భూమిః=భూమి, ప్రదక్షిణీకృతా=ప్రదక్షిణము చేయబడినది.

తా. మహోత్సాహవంతు లైన ఆ వానరులు అనేకపర్యాయములు, ఆకాశమార్గమునందు సంచరించుచు, సముద్రపర్వతాదులతో కూడిన ఈ భూమిని ప్రదక్షిణము చేసిరి. 37

మూ. మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సన్తి తత్ర వనౌకసః,
మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసన్నిధౌ. 38

ప్ర. అ. తత్ర = వారిలో, మద్విశిష్టాశ్చ = నాకంటె గొప్పవారు, తుల్యాశ్చ = సమానులు అయిన, వనౌకసః = వానరులు, సన్తి = ఉన్నారు. మత్తః = నాకంటె, ప్రత్యవరః = తక్కువవారు, కశ్చిత్ = ఒక్కడూ, సుగ్రీవసన్నిధౌ = సుగ్రీవుని వద్ద, నాస్తి = లేడు.

తా. ఆ వానరులలో కొందరు వానరులు నాకంటె గొప్పవారు. కొందరు నాతో సమానులు. నాకు తీసిపోయేవాడు ఒక్కడు కూడ సుగ్రీవుని దగ్గర లేడు

మూ. అహం తావదిహ ప్రాప్తః కిం పునస్తే మహాబలాః,
న హి ప్రకృష్టాః ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరే జనాః. 39

ప్ర. అ. అహం తావత్ = నేనే, ఇహ = ఇక్కడికి, అనుప్రాప్తః = వచ్చినాను. మహాబలాః = గొప్ప బలము గల, తే = వారు, కిం పునః = చెప్పనేల? ప్రకృష్టాః = శ్రేష్ఠులైనవారు, న ప్రేష్యన్తే హి = పంపబడరు కదా. ఇతరే = శ్రేష్ఠులు కాని, జనాః = జనులు, ప్రేష్యన్తే హి = పంపబడుదురు కదా.

తా. నేనే ఇక్కడికి వచ్చినా నంటే మహాబలవంతులైన వాళ్ళ మాట చెప్పవలెనా? ఏ పనిమీద నైనా సామాన్యులను పంపుదురు కాని శ్రేష్ఠులను పంపరు కదా? 39

మూ. తదలం పరితాపేన దేవి శోకో వ్యపైతు తే.
ఏకోత్పాతేన తే లఙ్కామేష్యన్తి హరియూథపాః. 40

ప్ర. అ. దేవి = సీతాదేవీ. తత్ = ఆ కారణమువలన, పరితాపేన = చింతచేత, అలమ్ = చాలును. తే = నీయొక్క, శోకః = శోకము, వ్యపైతు = తొలగుగాక. తే = ఆ, హరియూథపాః = వానర సేనానాయకులు, ఏకోత్పాతేన = ఒక్క గంతులో, లఙ్కామ్ = లంకను గూర్చి, ఏష్యన్తి = రాగలరు.

తా. ఓ! సీతాదేవీ! అందుచేత నీవు విచారించకుము. నీ దుఃఖము విడిచిపెట్టుము. ఆ వానర సేనానాయకు లందరు ఒక్క దుముకులో లంక చేరగలరు.

మూ. మమ పృష్ఠగతౌ తౌ చ చన్ద్రసూర్యావివోదితౌ,
త్వత్సకాశం మహాసత్త్వౌ నృసింహావాగమిష్యతః. 41

ప్ర. అ. మహాసత్త్వౌ = గొప్ప బలము గల, నృసింహౌ = నరశ్రేష్ఠులైన, తౌ చ = ఆ రామలక్ష్మణులు కూడ, మమ = నాయొక్క, పృష్ఠగతౌ = వీపుపై కూర్చున్నవారై, ఉదితౌ = ఉదయించిన, చన్ద్రసూర్యావివ = చంద్రసూర్యులవలె, త్వత్సకాశమ్ = నీ సమీపమునకు, ఆగమిష్యతః = రాగలరు.

తా. గొప్ప బలము గల నరశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు, నా భుజములపై ఎక్కి, ఉదయించిన సూర్యచంద్రుల వలె నీ దగ్గరకు రాగలరు. 41

మూ. తతో వీరౌ నరవరౌ సహితౌ రామలక్ష్మణౌ,
ఆగమ్య నగరీం లఙ్కాం సాయకైర్విధమిష్యతః. 42

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వీరౌ = వీరులు, నరవరౌ = నరశ్రేష్ఠులు అయిన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, సహితౌ = కలిసినవారై, ఆగమ్య = వచ్చి, లఙ్కాం నగరీమ్ = లంకాపట్టణమును, సాయకైః = బాణములచేత, విధమిష్యతః = నశింపచేయగలరు.

తా. నరులలో శ్రేష్ఠులు, వీరులు అయిన రామలక్ష్మణులు కలిసి వచ్చి, బాణములచేత లంకానగరమును నశింపచేయగలరు. 42

మూ. సగణం రావణం హత్వా రాఘవో రఘునన్దనః,
త్వామాదాయ వరారోహే స్వపురీం ప్రతియాస్యతి. 43

ప్ర. అ. వరారోహే = మంచి నితంబము గల ఓ సీతాదేవీ! రఘునన్దనః = రఘువంశమునకు ఆనందము కలిగించు, రాఘవః = రాముడు, సగణమ్ = పరివారముతో గూడిన, రావణమ్ = రావణుని, హత్వా = చంపి, త్వామ్ = నిన్ను, ఆదాయ = తీసికొని, స్వపురీమ్ = తన పట్టణమును గూర్చి, ప్రతియాస్యతి = తిరిగివెళ్లగలడు.

తా. ఓ సీతాదేవీ! రఘువంశమునకు ఆనందము కలిగించు రాముడు పరివారముతో కూడిన రావణుని సంహరించి, నిన్ను తీసికొని తన పట్టణమునకు తిరిగి వెళ్లగలడు. 43

మూ. తదాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాఙ్క్షిణీ,
నచిరాద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలన్తమివానలమ్. 44

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, ఆశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రమ్ = మంగళము అగుగాక. త్వమ్ = నీవు, కాలకాఙ్క్షిణీ = కాలమును కోరుదానవు, భవ = అగుము. ప్రజ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, అనలమ్ ఇవ = అగ్ని వలె ఉన్న, రామమ్ = రాముని, నచిరాత్ = కొద్ది కాలములో, ద్రక్ష్యసే = చూడగలవు.

తా. అందువలన నీవు ఊరడిల్లుము. నీకు క్షేమ మగుగాక. కాలమునకై వేచి యుండుము. ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న రాముని కొద్దికాలములో చూడగలవు. 44

మూ. నిహతే రాక్షసేన్ద్రేఽస్మిన్ సపుత్రామాత్యబాన్ధవే,
త్వం సమేష్యసి రామేణ శశాఙ్కేనేవ రోహిణీ 45

ప్ర. అ. సపుత్రామాత్యబాన్ధవే = పుత్రులతోను, అమాత్యులతోను, బంధువులతోను కూడిన, అస్మిన్ = ఈ, రాక్షసేన్ద్రే = రాక్షసరాజు, నిహతే = చంపబడినవాడగుచుండగా, త్వమ్ = నీవు, రోహిణీ = రోహిణి. శశాఙ్కేనేవ = చంద్రునితో వలె, రామేణ = రామునితో, సమేష్యసి = కలవగలవు.

తా. ఈ రాక్షసరాజు పుత్రులతోను, అమాత్యులతోను, బంధువులతోను సహా చంపబడిన పిమ్మట నీవు, రోహిణి చంద్రునితో కలిసి నట్లు, రామునితో కలవగలవు. 45

మూ. క్షిప్రం త్వం దేవి శోకస్య పారం యాస్యసి మైథిలి,
రావణం చైవ రామేణ నిహతం ద్రక్ష్యసేఽచిరాత్. 46

ప్ర. అ. దేవి = ఓ! దేవీ! మైథిలి = ఓ! మైథిలీ! త్వమ్ = నీవు, క్షిప్రమ్ = శీఘ్రముగా, శోకస్య = శోకముయొక్క, పారమ్ = అంతమును, యాస్యసి = పొందగలవు అచిరాత్ = కొద్ది కాలములో, రామేణ = రామునిచేత, రావణమ్ = రావణుని, నిహతం = చంపబడినవానినిగా, ద్రక్ష్యసే చైవ = చూడగలవు కూడ.

తా. ఓ! సీతాదేవీ! నీవు శీఘ్రముగా శోకము అంతము చూడగలవు. అచిరకాలములో రామునిచే సంహరించబడిన రావణుని చూడగలవు. 46

మూ. ఏవమాశ్వాస్య వైదేహీం హనుమాన్మారుతాత్మజః,
గమనాయ మతిం కృత్వా వైదేహీం పునరబ్రవీత్. 47

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, వైదేహీమ్ = సీతను, ఏవమ్ = ఇట్లు, ఆశ్వాస్య = ఓదార్చి, గమనాయ = వెళ్లుటకు, మతిమ్ = బుద్ధి, కృత్వా = చేసి, పునః = మరల, వైదేహీమ్ = సీతను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు సీతను ఈ విధముగ ఓదార్చి, తిరిగి వెళ్లుటకు నిశ్చయించుకొని సీతతో మరల ఇట్లు పలికెను. 47

మూ. తమరిఘ్నం కృతాత్మానం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్,
లక్ష్మణం చ ధనుష్పాణిం లఙ్కాద్వారముపాగతమ్. 48

ప్ర. అ. లఙ్కాద్వారమ్ = లంకాపట్టణము ద్వారమును, ఉపాగతమ్ = చేరిన, అరిఘ్నమ్ = శత్రువులను సంహారము చేయువాడూ, కృతాత్మానమ్ = నిశ్చయించుకొనిన బుద్ధి కలవాడూ అయిన, తం రాఘవమ్ = ఆ రాముని, ధనుష్పాణిమ్ = ధనస్సు హస్తమునందు గల, లక్ష్మణం చ = లక్ష్మణుని, క్షిప్రమ్ = శీఘ్రముగా, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. శత్రువులను సంహరించుటకు దృఢముగా నిశ్చయించుకొనిన శత్రుసంహారకు డైన రాముడు, ధనస్సు చేతిలో ధరించి లక్ష్మణుడు లంకాద్వారమునకు శీఘ్రముగా రాగలరు. నీవు వారిని చూడగలవు. 48

మూ. నఖదంష్ట్రాయుధాన్వీరాన్ సింహశార్దూలవిక్రమాన్,
వానరాన్వారణేన్ద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్.

ప్ర. అ. నఖదంష్ట్రాయుధాన్ = గోళ్లు, కోరలు ఆయుధములుగా గలవారూ, వీరాన్ = వీరులూ, సింహశార్దూలవిక్రమాన్ = సింహముల వంటి, పెద్దపులుల వంటి పరాక్రమము గలవారూ, వారణేన్ద్రాభాన్ = గజరాజుల వంటి కాంతి గలవారూ అయిన, సంగతాన్ = కలిసి వచ్చిన, వానరాన్ = వానరులను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. వానరులు సింహములూ, పెద్దపులులూ వంటి పరాక్రమము గలవారు. వారి శరీరములు ఏనుగుల వలె ఉన్నత మైనవి. వారికి గోళ్ళు కోరలే ఆయుధాలు. అట్టి వానరు లందరూ కలిసి శీఘ్రముగా రాగలరు. వారిని నీవు చూడగలవు. 49

మూ. శైలామ్బుదనికాశానాం లఙ్కామలయసానుషు,
నర్దతాం కపిముఖ్యానామార్యే యూథాన్యనేకశః. 50

ప్ర. అ. ఆర్యే = ఓ పూజ్యురాలా! శైలామ్బుదనికాశానామ్ = శైలములతోను, మేఘములతోను, సమానులైన, నర్దతామ్ = గర్జించుచున్న, కపిముఖ్యానామ్ = వానరశ్రేష్ఠులయొక్క, అనేకశః = అనేకములైన, యూథాని = గుంపులను, లఙ్కామలయసానుషు = లంకయందు, మలయపర్వతము చరియలయందు (చూడగలవు).

తా. ఓ! పూజ్యురాలా! పర్వతాల వలె, మేఘాల వలె ఉన్న వానరశ్రేష్ఠుల అనేకమైన సంఘాలు లంకలోను, మలయపర్వతప్రాంతములందును గర్జించుచు సంచరించుచుండగా నీవు చూడగలవు. ౫౦

మూ. స తు మర్మణి ఘోరేణ తాడితో మన్మథేషుణా,
న శర్మ లభతే రామః సింహార్దిత ఇవ ద్విపః. ౫౧

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, ఘోరేణ = తీక్ష్ణమైన, మన్మథేషుణా = మన్మథుని బాణముచేత, మర్మణి = మర్మప్రదేశమునందు, తాడితః = కొట్టబడినవాడై, సింహార్దితః = సింహముచేత పీడింపబడిన, ద్విపః ఇవ = ఏనుగవలె, శర్మ = సుఖమును, న లభతే = పొందుట లేదు.

తా. తీక్ష్ణమైన మన్మథబాణముచేత మర్మస్థానమునందు కొట్టబడి రాముడు సింహముచేత పీడింపబడిన ఏనుగు వలె సుఖమును పొందక వాలుచున్నాడు. ౫౧

మూ. మా రుదో దేవి శోకేన మా భూత్తే మనసోఽప్రియమ్,
శచీవ పత్యా శక్రేణ భర్త్రా నాథవతీ హ్యసి. ౫౨

ప్ర. అ. దేవి = సీతాదేవీ! శోకేన = దుఃఖముతో, మా రుదః = ఏడవకుము. తే = నీయొక్క, మనసః = మనస్సునకు, అప్రియమ్ = అప్రియము, మా భూత్ = లేకపోవుగాక! పత్యా = భర్తయైన, శక్రేణ = దేవేంద్రునితో, శచీవ = శచీదేవి వలె, భర్త్రా = భర్తయైన రామునిచేత, నాథవతీ = రక్షకుడు కలదానవు. అసి హి = అయి ఉన్నావు కదా.

తా. ఓ! సీతాదేవీ! దుఃఖముతో ఏడవకుము. నీ మనస్సునకు దుఃఖము

కలుగకుండుగాక. శచీదేవికి భర్త యైన దేవేంద్రుడు రక్షకుడుగా ఉన్నట్లు నీకు భర్త యైన రాముడు రక్షకుడుగా ఉన్నాడు కదా!

మూ. రామాద్విశిష్టః కోఽన్యోఽస్తి కశ్చిత్సౌమిత్రిణా సమః,
అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ. 53

ప్ర. అ. రామాత్ = రామునికంటె, విశిష్టః = గొప్పవాడు, అన్యః = మరి యొకడు, కః = ఎవడు, అస్తి = ఉన్నాడు? సౌమిత్రిణా = లక్ష్మణునితో, సమః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వ డైనా ఉన్నాడా? అగ్నిమారుతకల్పౌ = అగ్నితోను వాయువుతోను సమాను లైన, తౌ భ్రాతరౌ = ఆ సోదరు లిద్దరూ, తవ = నీకు, సంశ్రయౌ = ఆశ్రయముగా ఉన్నారు.

తా. రామునికంటె గొప్పవాడు గాని, లక్ష్మణునితో సమానుడు గాని మరొకడు ఎవ్వ డైనా ఉన్నాడా? అగ్నివాయువులతో సమాను లైన ఆ సోదరు లిద్దరూ నీకు ఆశ్రయముగా ఉన్నారు కదా! నీ కేమి భయము? 53

మూ. నాస్మింశ్చిరం వత్స్యసి దేవి దేశే
రక్షోగణై రధ్యుషితేఽతిరౌద్రే,
న తే చిరాదాగమనం ప్రియస్య
క్షమస్వ మత్సంగమకాలమాత్రమ్. 54

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. దేవి = ఓ సీతాదేవీ! రక్షోగణైః = రాక్షససమూహముల చేత, అధ్యుషితే = అధిష్ఠింపబడిన, అతిరౌద్రే = మిక్కిలి భయంకర మైన, అస్మిన్ దేశే = ఈ ప్రదేశమునందు, చిరమ్ = చిరకాలము, న వత్స్యసి = నివసించవు. తే ప్రియస్య = నీ భర్త యొక్క, ఆగమనమ్ = రాక, చిరాత్ = ఆలస్యముగా, న = కాదు. మత్సంగమకాలమాత్రమ్ = నేను చేరునంతసమయము మాత్రమే, క్షమస్వ = ఓపికపట్టుము.

రా. ౬. దేవీ! రాక్షసగణములతో నిండి అతిభయంకర మైన ఈ ప్రదేశములో ఇంక నీవు చాలకాలము ఉండవు. రాముడు నీకడకు వచ్చుటలో ఏ మాత్రము ఆలస్యము ఉండదు. నేను తిరిగి వెళ్ళి ఆ రామునితో కలిసే టంత కాలము ఓపికపట్టుము. ౨౬

"తారానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ముప్పదితొమ్మిదవ సర్గ సమాప్తము.

* * *

## అథ చత్వారింశః సర్గః

[సీత రామునకు మరల సందేశము చెప్పుట. హనుమంతుడు ఆమెను ఓదార్చి ఉత్తర దిక్కు వైపు ప్రయాణమగుట].

మూ. శ్రుత్వా తు వచనం తస్య వాయుసూనోర్మహాత్మనః,
ఉవాచాత్మహితం వాక్యం సీతా సురసుతోపమా. 1

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ, వాయుసూనోః = హనుమంతునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సురసుతోపమా = దేవకన్యతో సమానురాలైన, సీతా = సీత, ఆత్మహితమ్ = తనకు హితమైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. దేవకన్యతో సమానురాలైన సీత, మహాత్ముడైన హనుమంతుని మాటలు విని, తనకు హితమైన వాక్యము ఇట్లు పలికెను. 1

మూ. త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర,
అర్ధసంజాతసస్యేవ వృష్టిం ప్రాప్య వసుంధరా. 2

ప్ర. అ. వానర = హనుమంతుడా! ప్రియవక్తారమ్ = ప్రియముగా మాటలాడు, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, (నేను), అర్ధసంజాతసస్యా = సగము మొలిచిన సస్యము గల, వసుంధరా = భూమి, వృష్టిమ్ = వర్షమును, ప్రాప్యేవ = పొందిన వలె, సంప్రహృష్యామి = సంతోషించుచున్నాను.

తా. హనుమంతుడా! సగము సగము సస్యము మొలిచిన భూమి వర్షము పడగానే వికసించి నట్లు మంచి మాటలు చెప్పుచున్న నిన్ను చూచి, నేను ఆనందించుచున్నాను. 2

మూ. యథా తం పురుషవ్యాఘ్రం గాత్రైః శోకాభికర్శితైః,
సంస్పృశేయం సకామాహం తథా కురు దయాం మయి.

ప్ర. అ. సకామా = కోరికతో కూడిన, అహమ్ = నేను, శోకకర్శితైః = శోకముచేత కృశింపచేయబడిన, గాత్రైః = అవయవములచేత, తం పురుషవ్యాఘ్రమ్ = పురుషులలో శ్రేష్ఠుడైన ఆ రాముని, యథా = ఎట్లు, సంస్పృశేయమ్ = స్పృశింతునో, తథా = అట్లు, మయి = నాయందు, దయామ్ = దయను, కురు = చేయుము.

తా. దుఃఖముచేత కృశించిన అవయవములతో నేను పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడ్ని స్పృశింపవలెనని నాకు కోరిక ఉన్నది. నాపై దయచూపి ఆ కోరిక సఫలమగునట్లు చేయుము. 3

మూ. అభిజ్ఞానం చ రామస్య దద్యా హరిగణోత్తమ,
క్షిప్తా మిషీకాం కాకస్య కోపాదేకాక్షిశాతనీమ్. 4

ప్ర. అ. హరిగణోత్తమ = వానరుల గణములో ఉత్తముడవైన ఓ హనుమంతుడా! కోపాత్ = కోపమువలన, క్షిప్తామ్ = విసరబడినదీ, కాకస్య = కాకి యొక్క. ఏకాక్షిశాతనీమ్ = ఒక కన్నును నశింపచేసినది అయిన, ఇషీకామ్ = ఇషిక అను తృణమును, రామస్య = రామునకు, అభిజ్ఞానమ్ = ఆనవాలుగా, దద్యాః = ఇమ్ము. (చెప్పుము).

తా. హనుమంతుడా! కోపముతో కాకిపై విసరగా దాని కన్నును నశింప చేసిన ఇషికను రామునకు ఆనవాలుగా చెప్పుము. 4

మూ. మనఃశిలాయాస్తిలకో గణ్డపార్శ్వే నివేశితః,
త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తుమర్హసి. 5

ప్ర. అ. తిలకే = బొట్టు, ప్రణష్టే = చెరిగిపోయిన దగుచుండగా, త్వయా = నీచేత, మనశ్శిలాయాః = మణిసిలయొక్క, తిలకః = బొట్టు, గణ్డపార్శ్వే = చెక్కిలి ప్రక్క, నివేశితః కిల = ఉంచబడినది కదా! తమ్ = దానిని, స్మర్తుమ్ = స్మరించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. "రామా! ఒకనాడు నా నుదుట తిలకము చెరిగిపోయెను. అప్పుడు నీవు మణిసిల తీసి, దానితో, నుదుట తిలకము ఉంచుటకు బదులు గండస్థలముపై ఉంచితివి. ఆ విషయమును గుర్తు చేసికొనుము". 5

మూ. స వీర్యవాన్ కథం సీతాం హృతాం సమనుమన్యసే.
వసన్తీం రక్షసాం మధ్యే మహేన్ద్రవరుణోపమః. 6

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడవు, మహేన్ద్రవరుణోపమః = మహేంద్రునితోను వరుణునితోను సమానుడవూ అయిన, సః = అట్టి నీవు, హృతామ్ = హరింపబడినదై, రక్షసామ్ = రాక్షసులయొక్క, మధ్యే = మధ్య యందు, వసన్తీమ్ = నివసించుచున్న, సీతామ్ = సీతను, కథమ్ = ఎట్లు, సమను మన్యసే = అట్లే ఉండిపోవుటకు అంగీకరించుచున్నావు?

తా. "పరాక్రమవంతుడవు, మహేంద్రవరుణులతో సమానుడవు అయిన అట్టి నీవు, సీత (నేను) హరింపబడి రాక్షసుల మధ్య నివసించుచుండగా ఎందుకు ఉపేక్షించుచున్నావు"? 6

మూ. ఏష చూడామణిర్దివ్యో మయా సుపరిరక్షితః,
ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వామివానఘ. 7

ప్ర. అ. అనఘ = దోషములు లేని రామా! దివ్యః = దివ్యమైన, ఏషః = ఈ, చూడామణిః = చూడామణి, మయా = నాచేత, సుపరిరక్షితః = బాగుగా రక్షింపబడినది. వ్యసనే = దుఃఖమునందు, ఏతమ్ = దీనిని, దృష్ట్వా = చూచుకొని, త్వామివ = నిన్ను చూచినట్లు, ప్రహృష్యామి = సంతోషించుచున్నాను.

తా. "దోషము లేశమైనను లేని ఓ రామా! దివ్యమైన ఈ చూడామణిని చాలా జాగరూకతతో కాపాడుకొనుచున్నాను. ఈ దుఃఖకాలములో దీని చూచుకొనుచు, నిన్ను చూచినట్లు సంతోషించుచున్నాను". 7

మూ. ఏష నిర్యాతితః శ్రీమాన్మయా తే వారిసమ్భవః,
అతః పరం న శక్ష్యామి జీవితుం శోకలాలసా. 8

ప్ర. అ. శ్రీమాన్ = శోభకలది, వారిసమ్భవః = ఉదకములో జనించినదీ అయిన, ఏషః = ఈ చూడామణి, తే = నీకు, నిర్యాతితః = పంపివేయబడినది. శోకలాలసా = దుఃఖముచేత వ్యాకులురాలనైన నేను, అతః పరమ్ = ఇటుపైన, జీవితుమ్ = జీవించుటకు, న శక్ష్యామి = సమర్థురాలను కాను.

తా. "జలములో పుట్టిన, శోభాయుక్తమైన ఈ చూడామణిని నీకు పంపి వేయుచున్నాను. శోకముతో వ్యాకులురాలనైన నేను ఇటుపైన జీవింపజాలను".

మూ. అసహ్యాని చ దుఃఖాని వాచశ్చ హృదయచ్ఛిదః,
రాక్షసీనాం సుఘోరాణాం త్వత్కృతే మర్షయామ్యహమ్.

ప్ర. అ. అహమ్=నేను, అసహ్యాని=సహింప శక్యము కాని, దుఃఖాని=దుఃఖములను, సుఘోరాణామ్ = చాల భయంకర లైన, రాక్షసీనామ్ = రాక్షస స్త్రీలయొక్క, హృదయచ్ఛిదః = హృదయమును భేదించు, వాచశ్చ=మాటలను, త్వత్కృతే=నీ నిమిత్తమై, మర్షయామి=సహించుచున్నాను.

తా. "నీవు ఏనాటి కైన రాకపోదువా అను ఆశతో భరింపరాని కష్టములను, చాల భయంకరము లైన రాక్షసస్త్రీల మాటలను నేను సహించుచున్నాను."

మూ. ధారయిష్యామి మాసం తు జీవితం శత్రుసూదన,
ఊర్ధ్వం మాసాన్న జీవిష్యే త్వయా హీనా నృపాత్మజ.

ప్ర. అ. శత్రుసూదన = శత్రువులను నాశనము చేయువాడా! నృపాత్మజ= రాజకుమారా! మాసం తు = ఒక్క మాసముమాత్రమే, జీవితమ్=జీవితమును, ధారయిష్యామి = ధరించెదను. త్వయా = నీతో, హీనా=శూన్యురాల నైన నేను, మాసాత్ = ఒక మాసముకంటె, ఊర్ధ్వమ్ = పైన, న జీవిష్యే=జీవించను.

తా. "శత్రుసంహారకుడ వైన రామా! నేను ఒక్క మాసము మాత్రమే జీవించగలను. అటు పైన, నీవు లేకుండా జీవించలేను." 10

మూ. ఘోరో రాక్షసరాజోఽయం దృష్టిశ్చ న సుఖా మయి,
త్వాం చ శ్రుత్వా విషజ్జన్తం న జీవేయమహం క్షణమ్.

ప్ర. అ. అయమ్=ఈ, రాక్షసరాజః=రాక్షసరాజు, ఘోరః=భయంకర మైనవాడు. మయి = నా విషయమునందు, దృష్టిః=అతని దృష్టి, సుఖా = సుఖకర మైనదిగా, న=లేదు. త్వామ్=నిన్ను, విషజ్జన్తమ్=ఆలస్యము చేయుచున్నవానినిగా, శ్రుత్వా=విని, అహమ్=నేను, క్షణమ్=క్షణకాల మైనా, న జీవేయమ్=జీవించను.

తా. "ఈ రావణుడు చాల క్రూరుడు. నా విషయములో ఇతని దృష్టి సరిగా లేదు. నీవు ఇంకా ఆలస్యముచేయుచున్నా వని తెలిసినచో నేను క్షణకాల మైనను జీవించను''. 11

మూ. వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితమ్,
అథాబ్రవీన్మహాతేజా హనుమాన్మారుతాత్మజః. 12

ప్ర. అ. అథ = అటుపిమ్మట. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మారుతాత్మజః = వాయుపుత్రు డైన హనుమాన్ = హనుమంతుడు, సాశ్రు = కన్నీళ్ళతో కూడి నట్లుగా, భాషితమ్ = పలుకబడిన, కరుణమ్ = దీన మైన, వైదేహ్యాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట, గొప్పతేజస్సు గల, మారుతాత్మజు డైన హనుమంతుడు, ఆ సీత కన్నీళ్లు కార్చుచు దీనముగా పలికిన మాటలను విని ఇట్లనెను.

మూ. త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే,
రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే. 13
కథంచిద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్,
ఇమం ముహూర్తం దుఃఖానామన్తం ద్రక్ష్యసి భామిని. 14
తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రావరిందమౌ,
త్వద్దర్శనకృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః. 15
హత్వా చ సమరే క్రూరం రావణం సహబాన్ధవమ్,
రాఘవౌ త్వాం విశాలాక్షి స్వాం పురీం ప్రాపయిష్యతః.

ఈ శ్లోకాలు నాలుగూ ౩౯వ సర్గలో 50, 51, 52, 53 శ్లోకాలుగా చిన్న చిన్న మార్పులతో ఉన్నవి. 14వ శ్లోకంలో 'అనిందితే'కి బదులు 'భామిని' (ఓ వనితా!) అని ఉన్నది. 15వ శ్లోకంలో 'మహాబలౌ'కు బదులు 'అరిందమౌ' (శత్రునాశకులు) అని ఉన్నది. 16 వ శ్లోకం చివరి రెండుపాదాలు "రామ స్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీం ప్రతి"కి బదులు పైవిధముగా ఉన్నది. 'రామలక్ష్మణులు నిన్ను తమ పురమునకు తీసికొనివెళ్ళగలరు" అని అర్థము.

మూ. యత్తు రామో విజానీయాదభిజ్ఞానమనిన్దితే,
ప్రీతిసంజననం తస్య భూయస్త్వం దాతుమర్హసి. 17

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడని ఓ సీతాదేవీ! రామః = రాముడు

యత్ = ఏ. అభిజ్ఞానమ్ = ఆనవాలును, విజానీయాత్ = గుర్తించునో, తస్య = ఆ రామునకు, ప్రీతిసంజననమ్ = సంతోషమును కలిగించు, అట్టి ఆనవాలును, భూయః = మరల, త్వమ్ = నీవు, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. దోషములు లేని సీతాదేవీ! రాముడు గుర్తించగలిగిన, రామునకు సంతోషము కలిగించు మరొక అభిజ్ఞాన మేదైన ఉన్నచో అది కూడ ఇమ్ము. 17

మూ. సాఽబ్రవీద్దత్తమేవేతి మయాభిజ్ఞానముత్తమమ్,
ఏతదేవ హి రామస్య దృష్ట్వా మత్కేశభూషణమ్, 18
శ్రద్ధేయం హనుమన్వాక్యం తవ వీర భవిష్యతి.

ప్ర. అ. మయా = నాచేత, ఉత్తమమ్ = ఉత్తమ మైన, అభిజ్ఞానమ్ = అభిజ్ఞానము, దత్తమేవ = ఇవ్వబడినదే, ఇతి = అని, సా = ఆమె, అబ్రవీత్ = పలికెను. వీర = వీరుడా! హనుమన్ = హనుమంతుడా! ఏతత్ = ఈ, మత్కేశభూషణమ్ = నా కేశాలంకార మైన చూడారత్నమును, దృష్ట్వా = చూచి, తవ వాక్యమ్ = నీ మాట, రామస్య = రామునకు, శ్రద్ధేయమ్ = విశ్వసింపదగినది, భవిష్యతి = కాగలదు.

తా. "ఉత్తమ మైన అభిజ్ఞానమును నీ కిదివరకే ఇచ్చినాను. వీరుడ వైన ఓ! హనుమంతుడా! నా కేశభూషణ మైన ఈ మణిని చూడగానే రాముడు నీ మాటలు విశ్వసించును" అని సీత పలికెను 18

మూ. స తం మణివరం గృహ్య శ్రీమాన్ ప్లవగసత్తమః 19
ప్రణమ్య శిరసా దేవీం గమనాయోపచక్రమే.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః = ఆ, ప్లవగసత్తమః = వానరశ్రేష్ఠుడు, తం మణివరమ్ = శ్రేష్ఠ మైన ఆ మణిని, గృహ్య = గ్రహించి, దేవీమ్ = సీతాదేవిని, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, గమనాయ = వెళ్లుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. శ్రీమంతుడు, వానరులలో శ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు ఆ శ్రేష్ఠ మైన మణిని గ్రహించి, సీతకు తల వంచి నమస్కరించి తిరిగి వెళ్ళుటకు ఉద్యుక్తుడాయెను. 19

మూ. తముత్పాతకృతోత్సాహమవేక్ష్య హరిపుంగవమ్. 20
వర్ధమానం మహావేగమువాచ జనకాత్మజా,
అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పగద్గదయా గిరా. 21

ప్ర. అ. జనకాత్మజా = సీతాదేవి, ఉత్పాతకృతోత్సాహమ్ = ఎగురుట యందు చేయబడిన ఉత్సాహము కలవాడూ, వర్ధమానమ్ = పెరుగుచున్నవాడూ, మహావేగమ్ = గొప్ప వేగము గలవాడూ అయిన, తం హరిపుంగవమ్ = ఆ వానర శ్రేష్ఠుని, అవేక్ష్య = చూచి, అశ్రుపూర్ణముఖీ = కన్నీళ్ళతో నిండిన ముఖము కలదై, దీనా = దీనురాలై, బాష్పగద్గదయా = బాష్పముతో డగ్గుత్తిక చెందిన, గిరా = వాక్కుతో, ఉవాచ = పలికెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు పైకి ఎగురుటకు ఉత్సాహముతో దేహమును పెంచుచుండగా, మహావేగవంతుడైన అతనిని చూచి సీత కన్నీళ్లతో నిండిన ముఖముతో, దీనురాలై, బాష్పముచేత డగ్గుత్తికతో కూడిన కంఠస్వరముతో ఇట్లు పలికెను. 20, 21

మూ. హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సుగ్రీవం చ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్.

ప్ర. అ. హనుమన్ = హనుమంతుడా! సింహసంకాశౌ = సింహములతో సమానులైన, భ్రాతరౌ = సోదరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, సహామాత్యమ్ = మంత్రులతో కూడిన, సుగ్రీవం చ = సుగ్రీవుని, సర్వాన్ = మిగిలిన అందరినీ గూర్చి, అనామయమ్ = ఆరోగ్యమును, బ్రూయాః = చెప్పుము.

తా. హనుమంతుడా! సింహముల వంటివారైన, సోదరులైన రామలక్ష్మణులనూ, అమాత్యసమేతుడైన సుగ్రీవుని, ఇతరులందరినీ, నేను కుశలం మడిగి నట్లు చెప్పుము. 22

మూ. యథా చ స మహాబాహుర్మాం తారయతి రాఘవః
అస్మాద్దుఃఖాంబుసంరోధాత్త్వం సమాధాతుమర్హసి. 23

(ఇదే శ్లోకము 39 వ సర్గలో 9 వ శ్లోకంగా వచ్చినది. అది చూడుడు.)

మూ. ఇమం చ తీవ్రం మమ శోకవేగం
రక్షోభిరేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గతః సమీపమ్
శివశ్చ తేఽధ్వాఽస్తు హరిప్రవీర. 24

ప్ర. అ. హరిప్రవీర = వానరులలో గొప్ప వీరుడా! రామస్య=రాముని యొక్క, సమీపమ్=సమీపమును గూర్చి, గతః = వెళ్ళినవాడవై, మమ = నా యొక్క, ఇమమ్=ఈ, తీవ్రమ్=తీవ్రమైన, శోకవేగమ్=శోకముయొక్క వేగమును, ఏభిః=ఈ, రక్షోభిః=రాక్షసస్త్రీలచేత, పరిభర్త్సనం చ=భయపెట్టుటను, బ్రూయాః=చెప్పుము. తే=నీయొక్క, అధ్వా = మార్గము, శివః=మంగళకరమైనది, అస్తు=అగుగాక.

తా. ఓ వానరవీరుడా! నీవు రామునివద్దకు వెళ్ళి తీవ్రమైన నా ఈ దుఃఖవేగమును గూర్చి, ఈ రాక్షసస్త్రీలు నన్ను భయపెట్టుచున్నారను విషయము అయనకు తెలుపుము. నీ మార్గము సుఖకర మగుగాక. 24

మూ. స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః
కపిః కృతార్థః పరిహృష్టచేతాః,
అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం
దిశం హ్యుదీచీం మనసా జగామ. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చత్వారింశః సర్గః.

ప్ర. అ. సః కపిః=ఆ హనుమంతుడు, రాజపుత్ర్యాః=రాజకుమారి యైన సీతచేత, ప్రతివేదితార్థః=తెలుపబడిన విషయము గలవాడై, కృతార్థః=సాధింపబడిన కార్యము గలవాడై, పరిహృష్టచేతాః = సంతోషించిన మనస్సు గలవాడై, కార్యమ్ = కార్యమును, అల్పావశేషమ్=కొంచెమే మిగిలి ఉన్నదానినిగా, ప్రసమీక్ష్య = చూచి, ఉదీచీమ్=ఉత్తరము, దిశమ్ = దిక్కును గూర్చి, మనసా = మనస్సుతో, జగామ=వెళ్ళెను.

తా. కార్యము సాధించుటచే సంతోషించుచున్న మనస్సు గల ఆ హనుమంతుడు, సీత చెప్పిన విషయము లన్ని గ్రహించి, ఇంక చేయవలసినది కొంచెమే మిగిలి యున్న దని అనుకొనుచు, ఉత్తరపు దిక్కునకు వెళ్ళిపోయి నట్లే భావించెను. ౨౬

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకచత్వారింశః సర్గః

### [హనుమంతుడు ఉద్యానమును ధ్వంసము చేయుట]

మూ. స చ వాగ్భిః ప్రశస్తాభిర్గమిష్యన్ పూజిత స్తయా,
తస్మాద్దేశాదపక్రమ్య చిన్తయామాస వానరః. 1

ప్ర. అ. గమిష్యన్ = వెళ్ళనున్న, సః వానరః = ఆ హనుమంతుడు, తయా = సీతచేత, ప్రశస్తాభిః = ప్రశస్తము లైన, వాగ్భిః = మాటలతో, పూజితః = ఆదరించబడినవాడై, తస్మాత్ = ఆ, దేశాత్ = ప్రదేశమునుండి, అపక్రమ్య = దూరముగా వెళ్ళి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. తిరిగి వెళ్లుటకు సిద్ధముగా ఉన్న ఆ హనుమంతుని ఆ సీత మంచి మాటలతో ఆదరించెను. పిదప అతడు ఆ ప్రదేశమునుండి కొంచెము దూరముగా వెళ్ళి ఇట్లు ఆలోచించెను. 1

మూ. అల్పశేషమిదం కార్యం దృష్టేయమసితేక్షణా,
త్రీనుపాయానతిక్రమ్య చతుర్థ ఇహ దృశ్యతే. 2

ప్ర. అ. ఇదం కార్యమ్ = ఈ పని, అల్పశేషమ్ = కొంచెము మిగిలి ఉన్నది. ఇయమ్ = ఈ, అసితేక్షణా = నల్లని నేత్రములు గల సీత, దృష్టా = చూడబడినది. త్రీన్ = మూడు, ఉపాయాన్ = ఉపాయములను, అతిక్రమ్య = దాటి, ఇహ = ఇక్కడ, చతుర్థః = నాల్గవ ఉపాయము, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. నల్లని కన్నులు గల ఈ సీతను చూచినాను. ఇంక నేను చేయవలసినది కొంచెమే మిగిలి ఉన్నది. ఇప్పుడు సామదానభేదము లను మూడు ఉపాయములను విడిచిపెట్టి నాల్గవ దైన దండోపాయమునే ప్రయోగించవలసి ఉన్నది. 2

మూ. న సామ రక్షస్సు గుణాయ కల్పతే
న దానమర్థోపచితేషు యుజ్యతే,
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమస్త్వేవ మమేహ రోచతే. 3

ప్ర. అ. రక్షస్సు=రాక్షసుల విషయములో, సామ = సామోపాయము (మంచిమాటలు చెప్పుట), గుణాయ=గుణమునకు, న కల్పతే=సమర్థము కాదు. అర్థోపచితేషు=ధనముచేత బలిసినవారి విషయమున, దానమ్=దానోపాయము, న యుజ్యతే=యుక్తము కాదు. బలదర్పితాః=బలముచేత గర్వించిన, జనాః=జనులు, భేదసాధ్యాః=భేదోపాయముచేత (విరదీయుటచేత) సాధింప దగినవారు, న=కారు. ఇహ=ఇక్కడ, మమ=నాకు, పరాక్రమస్త్వేవ=పరాక్రమమొక్కటే, రోచతే=ఇష్టమగుచున్నది.

తా. రాక్షసుల విషయములో సామోపాయము కుదరదు. ధనముతో బలిసి యున్నవాళ్ల విషయములో దానము పనిచేయదు. బలముతో గర్వించి యున్నవాళ్ల విషయములో భేదోపాయము సరిపడదు. అందుచేత ఇప్పుడు నాకు పరాక్రమమును చూపుట అనునది ఒక్కటే సముచిత మని కనబడుచున్నది. 3

మూ. న చాస్య కార్యస్య పరాక్రమాదృతే
వినిశ్చయః కశ్చిదిహోపపద్యతే,
హతప్రవీరా హి రణే హి రాక్షసాః
కథం చిదీయుర్యదిహాద్య మార్దవమ్. 4

ప్ర. అ. ఇహ=ఇక్కడ, అస్య=ఈ, కార్యస్య=కార్యమునకు, పరాక్రమాత్ ఋతే=పరాక్రమము తప్ప, వినిశ్చయః=నిర్ణయము, కశ్చిత్=ఏదీ, న ఉపపద్యతే=కుదరదు. యత్=ఎందువలన అనగా, రణే=యుద్ధమునందు, హతప్రవీరాః=చంపబడిన వీరులు గల వారై, రాక్షసాః=రాక్షసులు, అద్య=ఇప్పుడు, ఇహ=ఇక్కడ, కథం చిత్=ఎట్లో, మార్దవమ్=మృదుత్వమును, ఈయుః=పొందవచ్చును.

తా. ఇక్కడ ఈ కార్యమునందు పరాక్రమము చూపుట తప్ప మరొక

ఉపాయ మేదీ లేదు, ఎందుచేత ననగా యుద్ధములో మహావీరుల నందరినీ చంపి వేసినచో మిగిలిన రాక్షసులు ఏదో విధముగా ఇప్పుడు లొంగిపోవచ్చును. 4

మూ. కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్,
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తుమర్హతి.

ప్ర. అ. కార్యే = చేయదగిన, కర్మణి = పని. నిర్దిష్టే = చెప్పబడిన దగుచుండగా, యః = ఎవ్వడు, పూర్వకార్యావిరోధేన = మొదటి పనికి విరోధము లేకుండు నట్లు, బహూన్యపి = అధికము లైన కార్యములను కూడ, సాధయేత్ = సాధించునో, సః = అతడు, కార్యమ్ = కార్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హతి = తగియున్నాడు.

తా. ఏదైన ఒక కార్యము చేయవలె నని ఆజ్ఞాపించి నపుడు, ఆ కార్యమునకు విరోధము లేకుండా ఇతరము లైన అనేక కార్యములను కూడ ఎవడు సాధించునో అతడే కార్యములను సాధింప సమర్థుడు. 5

మూ. న హ్యేకః సాధకో హేతుః స్వల్పస్యాపీహ కర్మణః,
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే. 6

ప్ర. అ. ఇహ = ఇక్కడ (కార్యములను సాధించు విషయములో), స్వల్పస్య అపి = స్వల్పమే యైనను, కర్మణః = కర్మకు, సాధకః = సాధించే, హేతుః = హేతువు, ఏకః = ఒక్కడే, న హి = కాదు కదా. యః = ఎవడు, అర్థమ్ = కార్యమును, బహుధా = అనేకవిధములుగా, వేద = ఎరుగునో, సః = అతడే, అర్థసాధనే = కార్యమును సాధించుటయందు, సమర్థః = సమర్థుడు.

తా. ఎంత చిన్న కార్యమైనా, దానిని సాధించుటకు ఒకే ఉపాయ ముండదు. అనేక ఉపాయము లుండవచ్చును. అందుచేత ఒక కార్యమును సాధించుటకు అనేకము లైన ఉపాయములు ఎవనికి తెలియునో అతడే కార్యములు సాధించుటకు సమర్థుడు. 6

మూ. ఇహైవ తావత్కృతనిశ్చయో హ్యహం
యది వ్రజేయం ప్లవగేశ్వరాలయమ్,
పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవి
త్తతః కృతం స్యాన్మమ భర్తృశాసనమ్. 7

ప్ర. అ. అహమ్ = నేను, ఇత్థైవ తావత్ = ఇక్కడనే, పరాత్మసమ్మర్ద విశేషతత్త్వవిత్ = శత్రువులయొక్క, మనవారియొక్క యుద్ధమునందలి విశేషమును తెలిసికొన్నవాడనై, ప్లవగేశ్వరాలయమ్=సుగ్రీవుని గృహమును గూర్చి, ప్రతియాం యది = వెళ్ళినట్లయితే, తతః = అప్పుడు, మమ = నాకు (నాచేత), భర్తృశాసనమ్ = ప్రభువు ఆజ్ఞ, కృతమ్ = చేయబడినది, స్యాత్ = అగును.

తా. యుద్ధములో శత్రువుల బలమునందు, మన వారి బలమునందు ఎట్టి తారతమ్య మున్నదో నేను ఇక్కడనే తెలుసుకొని, అటు పిమ్మట సుగ్రీవుని వద్దకు వెళ్ళినచో అప్పుడు నేను ప్రభువు ఆజ్ఞను బాగుగా నిర్వహించినట్లు అగును. 7.

మూ. కథం ను ఖల్వద్య భవేత్సుఖాగతం
ప్రసహ్య యుద్ధం మమ రాక్షసైః సహ,
తథైవ ఖల్వాత్మబలం చ సారవ
త్సమానయేన్మాం చ రణే దశాననః. 8

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మమ = నాకు, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, ప్రసహ్య=బలాత్కారముగా, (తప్పక) యుద్ధమ్ = యుద్ధము, కథం ను = ఎట్లు, సుఖాగతమ్ = సుఖముగా వచ్చినది, భవేత్ = అగునో? తథైవ=అట్లే (మరియు), ఆత్మబలం చ = నా బలము, సారవత్ = సారము (ఫలము) కలది, ఎట్లగునో? సః=ఆ, దశాననః చ = రావణుడు కూడ, మామ్ = నన్ను, రణే = యుద్ధమునందు, మానయేత్ = గౌరవించునో?

తా. నా కిప్పుడు రాక్షసులతో సులభముగా, యుద్ధము, తప్పక వచ్చే ఉపాయమేమో కదా? అట్లే నా బలము సఫలము ఎట్లగునో కదా? ఆ రావణుడు యుద్ధములో నన్నెట్లు మెచ్చునో కదా? 8

మూ. తతః సమాసాద్య రణే దశాననం
సమన్త్రివర్గం సబలప్రయాయినమ్,
హృది స్థితం తస్య మతం బలం చ వై
సుఖేన మత్వాహమితః పునర్వ్రజే. 9

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సమన్త్రివర్గమ్ = మంత్రిగణముతో కూడిన, సబలప్రయాయినమ్ = సైన్యములోను అనుచరులతోను కూడిన, దశాననమ్ = రావణుని, రణే = యుద్ధమునందు, సమాసాద్య = పొంది, తస్య = వానియొక్క, హృది = హృదయమునందు, స్థితమ్ = ఉన్న, మతమ్ = అభిప్రాయమును, బలం చ వై = బలమును, మత్వా = తెలిసికొని, అహమ్ = నేను, ఇతః = ఇక్కడి నుండి, సుఖేన = సుఖముతో, పునః = మరల, ప్రజే = వెళ్లెదను.

తా. రావణుని, అతని మంత్రులను, సైన్యమును, అనుచరులను యుద్ధములో ఎదిరించి, అతని మనస్సులో ఉన్న అభిప్రాయమును, అతని కున్న బలమును తెలిసికొని, నేను సుఖముగా ఇక్కడినుండి తిరిగి వెళ్లెదను. 9

మూ. ఇదమస్య నృశంసస్య నన్దనోపమముత్తమమ్,
వనం నేత్రమనఃకాన్తం నానాద్రుమలతాయుతమ్. 10

ప్ర. అ. నృశంసస్య = క్రూరు డైన. అస్య = ఈ రావణునియొక్క, ఇదమ్ = ఈ, నేత్రమనఃకాన్తమ్ = నేత్రములకు, మనస్సుకూ మనోహర మైన, నానాద్రుమలతాయుతమ్ = అనేకవిధము లైన, వృక్షములతోను లతలతోనుకూడిన, ఉత్తమమ్ = ఉత్తమ మైన, వనమ్ = ఉద్యానవనము, నన్దనోపమమ్ = నందన వనముతో సమాన మైనది.

తా. క్రూరు డైన ఈ రావణుని ఉత్తమ మైన ఉద్యానవనము అనేకవిధము లైన వృక్షములతోను, లతలతోను, నేత్రములను, మనస్సును ఆకర్షించునదై నందనవనము వలె ఉన్నది. 10

మూ. ఇదం విధ్వంసయిష్యామి శుష్కం వనమివానలః,
అస్మిన్ భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః. 11

ప్ర. అ. శుష్కమ్ = ఎండిపోయిన, వనమ్ = వనమును, అనలః ఇవ = అగ్ని వలె, ఇదమ్ = ఈ వనమును, విధ్వంసయిష్యామి = నశింపచేసెదను. అస్మిన్ = ఈ వనము, భగ్నే = భగ్న మైన దగుచుండగా, తతః = అటుపిమ్మట, దశాననః = రావణుడు, కోపమ్ = కోపమును, కరిష్యతి = చేయగలడు.

తా. ఎండిపోయిన అడవిని అగ్ని కాల్చివేసి నట్లు ఈ ఉద్యానమును నశింప చేసెదను. దీనిని భగ్నము చేసినచో అప్పుడు రావణునకు కోపము కలుగును.

మూ. తతో మహత్సాశ్వమహారథద్విపం
బలం సమాదేక్ష్యతి రాక్షసాధిపః,
త్రిశూలకాలాయసపట్టిసాయుధం
తతో మహద్యుద్ధమిదం భవిష్యతి 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట. రాక్షసాధిపః = రావణుడు, సాశ్వమహారథద్విపమ్ = అశ్వములతోను. గొప్ప రథములతోను ఏనుగులతోను కూడిన, మహత్ = గొప్ప, త్రిశూలకాలాయసపట్టిసాయుధమ్ = త్రిశూలములు, ఇనుముతో చేసిన పట్టిసములు ఆయుధములుగా గల, బలమ్ = సైన్యమును, సమాదేక్ష్యతి = ఆజ్ఞాపించగలడు. తతః = అటు పిమ్మట, ఇదమ్ = ఈ, మహత్ = గొప్ప, యుద్ధమ్ = యుద్ధము, భవిష్యతి = కాగలదు.

తా. అప్పుడు రావణుడు అశ్వములతోను, మహారథములతోను (లేదా మహారథులతోను) ఏనుగులతోను నిండినదీ, త్రిశూలములు ఇనుప పట్టిసములు మొదలైన ఆయుధములతో కూడినదీ అయిన గొప్ప సైన్యమును ఆజ్ఞాపించగలడు. అప్పుడు గొప్ప యుద్ధము జరుగగలదు. 12

మూ. అహం తు తైః సంయతి చణ్డవిక్రమైః
సమేత్య రక్షోభిరసహ్యవిక్రమః,
నిహత్య తద్రావణచోదితం బలం
సుఖం గమిష్యామి కపీశ్వరాలయమ్. 13

ప్ర. అ. అహం తు = నేను కూడా, చణ్డవిక్రమైః = తీక్ష్ణమైన పరాక్రమము గల, తైః = ఆ, రక్షోభిః = రాక్షసులతో, సంయతి = యుద్ధమునందు, సమేత్య = కలిసి, అసహ్యవిక్రమః = సహింప శక్యము కాని పరాక్రమము గలవాడనై, రావణచోదితమ్ = రావణునిచేత ప్రేరేపింపబడిన, తత్ = ఆ, బలమ్ = సైన్యమును, నిహత్య = చంపి, సుఖమ్ = సుఖముగా, కపీశ్వరాలయమ్ = సుగ్రీవుని స్థానమును గూర్చి గమిష్యామి = వెళ్ళగలను.

తా. నేను కూడా తీక్ష్ణమైన పరాక్రమము గల ఆ రాక్షసులను యుద్ధములో ఎదుర్కొని, సహింప శక్యము కాని బలముతో రావణుడు పంపిన ఆ సైన్యమును చంపి, సుఖముగా సుగ్రీవునివద్దకు వెళ్ళెదను. 13

మూ. తతో మారుతవత్క్రుద్ధో మారుతిర్భీమవిక్రమః,
ఊరువేగేన మహతా ద్రుమాన్ క్షేప్తుమథారభత్. 14

ప్ర. అ. తతః=అటు పిమ్మట, భీమవిక్రమః=భయంకర మైన పరాక్రమము గల, మారుతిః=హనుమంతుడు, క్రుద్ధః=కోపగించినవా డై, అథ=అటు పిమ్మట, మహతా=గొప్ప, ఊరువేగేన=తొడల వేగముచేత, మారుతవత్=వాయువు వలె, ద్రుమాన్=వృక్షములను, క్షేప్తుమ్=విసిరివేయుటకు, ఆరభత్=ప్రారంభించెను.

తా. ఈ విధముగా ఆలోచించి, భయంకర మైన పరాక్రమము గల హనుమంతుడు, కోపించినవాడై, గొప్పదైన తొడల వేగముచేత, వృక్షములను, వాయువు విరచివేసి నట్లు విరచివేసి, పడవేయ ప్రారంభించెను. 14

మూ. తతస్తు హనుమాన్వీరో బభఞ్జ ప్రమదావనమ్,
మత్తద్విజసమాఘుష్టం నానాద్రుమలతాయుతమ్. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరః=వీరు డైన, హనుమాన్=హనుమంతుడు, మత్తద్విజసమాఘుష్టమ్=మదించిన పక్షులచేత ధ్వనింపచేయబడినదీ, నానాద్రుమలతాయుతమ్=అనేకము లైన వృక్షములతోను లతలతోను కూడినదీ అయిన, ప్రమదావనమ్=ఉద్యానవనమును, బభఞ్జ=విరచెను.

తా. అప్పు డా వీరు డైన హనుమంతుడు, మదించిన పక్షుల ధ్వనితో నిండినదీ, అనేకవిధము లైన వృక్షలతాదులతో వ్యాప్తమూ అయిన ఆ ఉద్యానవనమును విరిచివేసెను. 15

మూ. తద్వనం మథితైర్వృక్షైర్భిన్నైశ్చ సలిలాశయైః,
చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూవాప్రియదర్శనమ్. 16

ప్ర. అ. తత్ వనమ్=ఆ వనము, మథితైః=నలిపివేయబడిన, వృక్షైః=వృక్షములతోను, భిన్నైః=పగులకొట్టబడిన, సలిలాశయైః=చెరువులతోను, చూర్ణితైః=నలగకొట్టబడిన, పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరములతోను, అప్రియదర్శనమ్=సంతోషజనకము కాని దర్శనము కలది, బభూవ=అయ్యెను.

తా. హనుమంతుడు ఆ వనములోని చెట్లు విరుగగొట్టెను. సరస్సుల గట్లు త్రెంచివేసెను. పర్వతశిఖరములను నలగగొట్టెను. ఈ విధముగా ఆ ఉద్యాన వనము చూచుటకు సంతోషము కలిగించని స్థితిలో ఉండెను. 16

మూ. నానాశకున్తవిరుతైః ప్రభిన్నైః సలిలాశయైః,
తామ్రైః కిసలయైః క్లాన్తైః క్లాన్తద్రుమలతాయుతమ్. 17

న బభౌ తద్వనం తత్ర దావానలహతం యథా,
వ్యాకులావరణా రేజుర్విహ్వలా ఇవ తా లతాః. 18

ప్ర. అ. క్లాన్తద్రుమలతాయుతమ్ = వాడిపోయిన వృక్షములతోను లతలతోను కూడిన, తత్ వనమ్ = ఆ వనము, నానాశకున్తవిరుతైః = అనేకవిధము లైన పక్షుల ధ్వనులతోను, ప్రభిన్నైః = బ్రద్దలుకొట్టబడిన, సలిలాశయైః = చెరువులతోను, క్లాన్తైః = వాడిపోయిన, తామ్రైః = ఎఱ్ఱని, కిసలయైః = చిగుళ్ళతోను, దావానలహతం యథా = దావాగ్నిచేత కొట్టబడినది వలె, న బభౌ = ప్రకాశించ లేదు. వ్యాకులావరణాః = వ్యాకుల మైన ఆవరణములు (తీగకు ఆధారముగా ఉండుటకు నిలిపిన కఱ్ఱలు మొదలైనవి) గల, తాః లతాః = ఆ లతలు, విహ్వలాః ఇవ = దుఃఖాక్రాంత లైన స్త్రీల వలె, రేజుః = ప్రకాశించినవి.

తా. ఆ ఉద్యానములో అనేకవిధము లైన పక్షులు అరుపులు ప్రారంభించెను. చెరువుల గట్లు తెగిపోయెను. ఎఱ్ఱని చిగుళ్లు, అనేకవిధము లైన వృక్షములు, లతలు వాడిపోయెను. ఈ విధముగ అది దావాగ్నిచే కాల్చివేయబడి నట్లు కనబడుచుండెను. ఆధార మైన స్తంభములు, చెట్లు మొద లైనవి అస్తవ్యస్తము లగుటచేత లతలు, దుఃఖాక్రాంత లైన స్త్రీల వలె పడి యుండెను. 17,18

మూ. లతాగృహైశ్చిత్రగృహైశ్చ నాశితై
ర్మహోరగైర్వ్యాలమృగైశ్చ నిర్ధుతైః,
శిలాగృహైరున్మథితైస్తథా గృహైః
ప్రణష్టరూపం తదభూన్మహద్వనమ్. 19

ప్ర. అ. మహత్ = గొప్ప దైన, తత్ వనమ్ = ఆ ఉద్యానవనము, నాశితైః = నశింపచేయబడిన, లతాగృహైః = పొదరిండ్లతోను, చిత్రగృహైః = చిత్ర

(చిత్రరూపములువేసి ఉంచు) గృహములలోను, నిర్ధూతైః = ఎగురగొట్టబడిన, మహో రగైః = మహాసర్పములతోను, వ్యాళమృగైశ్చ = క్రూరమృగములతోను, తథా = మరియు, ఉన్మథితైః = పగులగొట్టబడిన, శిలాగృహైః = రాతి ఇండ్లతోను, గృహైః = ఇతరగృహములతోను, ప్రణష్టరూపమ్ = నశించిన సౌందర్యము కలది. అభూత్ = అయెను.

తా. హనుమంతుడు గొప్పదైన ఆ ఉద్యానములోని లతాగృహములను, చిత్రగృహములను నశింపచేసెను. మహాసర్పములను, ఇతరక్రూరమృగములను ఎగురగొట్టెను. రాతి కట్టడములను ఇతరగృహములను పడగొట్టెను. అట్టి లతా గృహాదులతో ఆ ఉద్యానము తన సౌందర్యము నంతను కోల్పోయెను. 19

మూ. సా విహ్వలాఽశోకలతాప్రతానా
వనస్థలీ శోకలతాప్రతానా,
జాతా దశాస్యప్రమదావనస్య
కపేర్బలాద్ధి ప్రమదావనస్య. 20

ప్ర. అ. దశాస్యప్రమదా + అవనస్య = రావణుని స్త్రీలను రక్షించు (ఆనందింపచేయు), ప్రమదావనస్య = ఉద్యానముయొక్క, అశోకలతాప్రతానా = అశోకలతల సమూహము గల, సా వనస్థలీ = ఆ వనస్థలి, కపేః = కపియొక్క, బలాత్ = బలమువలన, విహ్వలా = వ్యాకులమైనదై, శోకలతాప్రతానా = శోకము అను లతల సముదాయము గలదై, జాతా = అయినది. (ప్రతానమనగా వెదుళ్ళు మొదలైన వానితో ఎత్తుగా, నలుచదరం మొదలైన ఆకారములలో నిర్మించిన పందిరిపై పాకిన తీగల పందిరి).

తా. రావణుని స్త్రీలకు ఆనందము కలిగించు అశోకలతల సముదాయము గల ఆ ఉద్యానవనప్రదేశము, హనుమంతుని బలముచే, శోకమను లతకు ప్రతానముగా (పందిరిగా) అయ్యెను. 20

మూ. స తస్య కృత్వా జగతీపతేర్మహా
న్మహద్వ్యలీకం మనసో మహాత్మనః,
యుయుత్సురేకో బహుభిర్మహాబలైః
శ్రియా జ్వలంస్తోరణమాస్థితః కపిః. 21

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, మహాత్మనః = మహాత్ము లైన, తస్య = ఆ, జగతీపతేః = భూమికి ప్రభు వైన రావణునియొక్క, మనసః = మనస్సునకు, మహత్ = గొప్ప, వ్యలీకమ్ = అప్రియమును, కృత్వా = చేసి, మహాబలైః = గొప్ప బలము గల, బహుభిః = అనేకులతో, ఏకః = ఒంటరిగా, యుయుత్సుః = యుద్ధము చేయదలచుచున్నవాడై, శ్రియా = శోభతో, జ్వలన్ = ప్రజ్వరిల్లుచు, తోరణమ్ = ముఖద్వారమును, ఆస్థితః = ఆశ్రయించిఉండెను.

తా. ఆ హనుమంతుడు మహాత్ము డైన ఆ రావణుని మనస్సునకు ఆ విధముగా గొప్ప అప్రియమును చేసి, చాలమంది మహాబలశాలు లైన వీరులతో ఒంటరిగానే యుద్ధము చేయుటకు నిశ్చయించుకొని, ఆ ఉద్యానము తోరణము (ముఖద్వారము) దగ్గర నిలిచి ఉండెను. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విచత్వారింశః సర్గః

[ఎప్పుడో ఉద్యానవమును ధ్వంసము చేసి పక్షు రాక్షసస్త్రీలు తెలుపగా విని రావణుడు కింకరులను పంపగా హనుమంతుడు వారిని సంహరించుట.]

మూ. తతః పక్షినినాదేన వృక్షభఙ్గస్వనేన చ,
బభూవుస్త్రాససంభ్రాన్తాః సర్వే లఙ్కానివాసినః. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పక్షినినాదేన = పక్షుల ధ్వనిచేతను, వృక్షభఙ్గస్వనేన చ = వృక్షములను విరచిన ధ్వనిచేతను, సర్వే = సమస్త మైన, లఙ్కానివాసినః = లంకలో నివసించువారు, త్రాససంభ్రాన్తాః = భయముచేత చలించినవారు, బభూవుః = అయిరి.

తా. అప్పుడు లంకలో ఉన్నవా రందరు పక్షుల అరపులు, వృక్షములు విరిగిపోయి నప్పుడు కలిగిన ధ్వని విని భయముచేత చలించిపోయిరి. 1

మూ. విద్రుతాశ్చ భయత్రస్తా వినేదుర్మృగపక్షిణః,
రక్షసాం చ నిమిత్తాని క్రూరాణి ప్రతిపేదిరే. 2

ప్ర. అ. మృగపక్షిణః = మృగములూ, పక్షులూ, విద్రుతాః = పారిపోవుచున్నవై, భయత్రస్తాః = భయముతో వ్యాకులము లై, వినేదుః = ధ్వనిచేసినవి. రక్షసాం చ = రాక్షసులకు కూడ, క్రూరాణి = క్రూరము లైన, నిమిత్తాని = శకునములు, ప్రతిపేదిరే = వచ్చి చేరినవి.

తా. ఆ ఉద్యానములోని మృగములు, పక్షులూ భయముతో వ్యాకులము లై పారిపోవుచు ధ్వని చేసెను. రాక్షసులకు భయసూచకము లైన శకునములు కనబడినవి. 2

మూ. తతో గతాయాం నిద్రాయాం రాక్షస్యో వికృతాననాః,
తద్వనం దదృశుర్భగ్నం తం చ వీరం మహాకపిమ్. 3.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వికృతాననాః = వికృతము లైన ముఖములు గల, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, నిద్రాయామ్ = నిద్ర, గతాయామ్ = పోయిన దగుచుండగా, భగ్నమ్ = విరిగియున్న, తత్ వనమ్ = ఆ వనమును, వీరమ్ = వీరు డైన, తం మహాకపిం చ = ఆ గొప్ప వానరుని, దదృశుః = చూచిరి.

తా. అప్పుడు, వికృతము లైన ముఖములు గల రాక్షసస్త్రీలు నిద్రనుండి మేల్కొని, విరిగిపోయి ఉన్న ఆ ఉద్యానమును, వీరు డైన ఆ హనుమంతుని చూచిరి. 3.

మూ. స తా దృష్ట్వా మహాబాహుర్మహాసత్త్వో మహాబలః,
చకార సుమహద్రూపం రాక్షసీనాం భయావహమ్. 4.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, మహాసత్త్వః = గొప్ప ధైర్యము కలవాడు, మహాబలః = గొప్ప బలము గలవాడు అయిన, సః = ఆ హనుమంతుడు, తాః = ఆ రాక్షసస్త్రీలను, దృష్ట్వా = చూచి, రాక్షసీనామ్ = ఆ రాక్షసస్త్రీలకు, భయావహమ్ = భయమును కలిగించు, సుమహత్ = చాలా పెద్ద దైన, రూపమ్ = రూపమును, చకార = చేసెను.

తా. గొప్ప బాహువులు, గొప్ప ధైర్యము, గొప్ప బలము గల ఆ హనుమంతుడు ఆ రాక్షసస్త్రీలను చూచి, వాళ్లను ఇంకను భయపెట్టుటకై, ఇంకా పెద్ద దైన ఆకారము ధరించెను. 4

మూ. తతస్తం గిరిసంకాశమతికాయం మహాబలమ్,
రాక్షస్యో వానరం దృష్ట్వా పప్రచ్ఛుర్జనకాత్మజామ్. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గిరిసంకాశమ్ = పర్వతముతో సమానుడూ, అతికాయమ్ = పెద్ద శరీరము కలవాడూ, మహాబలమ్ = గొప్ప బలము కలవాడూ అయిన, తం వానరమ్ = ఆ వానరుని, దృష్ట్వా = చూచి, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, జనకాత్మజామ్ = సీతను, పప్రచ్ఛుః = అడిగిరి.

తా. పిమ్మట ఆ రాక్షసస్త్రీలు, పెద్ద శరీరముతో పర్వతము వలె ఉన్న మహాబలశాలి యైన ఆ వానరుని చూచి సీతను ఇట్లు ప్రశ్నించిరి. 5

మూ. కోఽయం కస్య కుతో వాఽయం కిం నిమిత్తమిహాగతః,
కథం త్వయా సహానేన సంవాదః కృత ఇత్యుత. 6

ప్ర. అ. అయమ్ = ఇతడు, కః = ఎవడు ? కస్య = ఎవరివాడు ? అయమ్ = ఇతడు, కుతః = ఎక్కడినుండి, కిం నిమిత్తమ్ = ఏందునిమిత్తము, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినాడు ? ఉత = మరియు, అనేన = వీనిచేత, త్వయా సహ = నీతోకూడ, సంవాదః = సంభాషణము, కృతః = చేయబడినది?

తా. ఇతడు ఎవడు ? ఎవరికి సంబంధించినవాడు ? ఇతడు ఇక్కడికి ఎక్కడినుండి, ఎందుకు వచ్చినాడు ? నీతో ఇతడు ఏమి మాటలాడినాడు ? 6

మూ. ఆచక్ష్వ నో విశాలాక్షి మా భూత్తే సుభగే భయమ్,
సంవాదమసితాపాఙ్గే త్వయా కిం కృతవానయమ్. 7

ప్ర. అ. విశాలాక్షి = విశాలము లైన నేత్రములు కలదానా! నః = మాకు, ఆచక్ష్వ = చెప్పుము. సుభగే = సౌభాగ్యవంతురాలా! తే = నీకు, భయమ్ = భయము, మా భూత్ = లేకపోవు గాక, అసితాపాఙ్గే = నల్లని నేత్రాంతములు కలదానా! అయమ్ = ఇతడు, త్వయా = నీతో, కిమ్ = ఏమి, సంవాదమ్ = సంవాదమును, కృతవాన్ = చేసినాడు ?

తా. సౌభాగ్యవంతురాల వైన ఓ! విశాలాక్షీ! నీ వేమి భయపడకుము. మాకు చెప్పుము. నల్లని నేత్రాంతములు గల ఓ! సీతా! ఇతడు నీతో ఏమి మాటలాడినాడు ? 7

మూ. అథాబ్రవీత్తదా సాధ్వీ సీతా సర్వాఙ్గసున్దరీ,
రక్షసాం భీమరూపాణాం విజ్ఞానే మమ కా గతిః. 8

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సాధ్వీ = పతివ్రత, సర్వాఙ్గసున్దరీ = అన్ని అవయవములందు సౌందర్యము గలది అయిన, సీతా = సీత, తదా = అప్పుడు, అబ్రవీత్ = పలికెను. భీమరూపాణామ్ = భయంకర మైన రూపము

గం. రక్షసామ్ = రాక్షసులయొక్క, గతిః = జ్ఞానము, మమ = నాకు, కా = ఏది ?

తా. ఆ మాటలు విని, పతివ్రతా, సకలావయవములందు సౌందర్యవతి అయిన సీత ఇట్లు పలికెను. ''భయంకర మైన రూపము గల రాక్షసులను గూర్చి తెలుసుకొనుటకు నాకు జ్ఞానము (శక్తి) ఎక్కడ ఉన్నది?'' 8

మూ. యూయమేవాభిజానీత యోఽయం యద్వా కరిష్యతి,
అహిరేవ హ్యహేః పాదాన్ విజానాతి న సంశయః. 9

ప్ర. అ. అయమ్ = ఇతడు, యః = ఎవరో, యద్వా = ఏమి, కరిష్యతి = చేయగలడో, యూయమేవ = మీరే, అభిజానీత = గుర్తింతురు. అహేః = సర్పముయొక్క, పాదాన్ = పాదములను, అహిరేవ = సర్పమే, విజానాతి = తెలుసుకొనును. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఇతడు ఎవరో, ఏమి చేయ నున్నాడో మీకే తెలియవలెను. పాము పాదాలు పాముకే తెలియును కదా! ఈ విషయములో సందేహ మేమీ లేదు. 9

మూ. అహమప్యస్య భీతాస్మి నైనం జానామి కో న్వయమ్,
వేద్మి రాక్షసమేవైనం కామరూపిణమాగతమ్. 10

ప్ర. అ. అహమపి = నేను కూడా, అస్య = వీనికి, భీతా అస్మి = భయపడుచున్నాను. ఏనమ్ = ఇతనిని గూర్చి, కో ను = ఎవ్వరో, అహమ్ = నేను, న జానామి = ఎరుగను. ఏనమ్ = ఈతనిని, ఆగతమ్ = వచ్చిన, కామరూపిణమ్ = కామరూపము గల, రాక్షసమేవ = రాక్షసునిగా మాత్రమే, వేద్మి = ఎరుగుదును.

తా. ఇతని చూచి నాకు కూడా భయము వేయుచున్నది. ఇత డెవడో నే నెరుగను. ఎవడో కామరూపము గల రాక్షసుడే ఇట్లు వచ్చినా డని నేను అనుకొనుచున్నాను. 10

మూ. వైదేహ్యా వచనం శ్రుత్వా రాక్షస్యో విద్రుతా దిశః,
స్థితాః కాశ్చిద్గతాః కాశ్చిద్రావణాయ నివేదితుమ్. 11

ప్ర. అ. వైదేహ్యాః = సీతయొక్క. వచనమ్ = వచనమును. శ్రుత్వా = విని, రాక్షస్యః = రాక్షసస్త్రీలు. దిశః = దిక్కులను గూర్చి, విద్రుతాః = పారి పోయిరి. కాశ్చిత్ = కొందరు, స్థితాః = అక్కడనే ఉండిపోయిరి. కాశ్చిత్ = కొందరు. రావణాయ = రావణునికి, నివేదితుమ్ = తెలుపుటకు, గతాః = వెళ్ళిరి.

తా. కొందరు రాక్షసస్త్రీలు సీత మాటలు విని, హనుమంతునికి భయ పడుచు ఆ యా దిక్కులకు పారిపోయిరి. కొందరు సీతను రక్షించుటకై అక్కడనే ఉండిపోయిరి. మరికొందరు ఆ విషయము రావణునకు చెప్పుటకై వెళ్ళిరి. 11

మూ. రావణస్య సమీపే తు రాక్షస్యో వికృతాననాః,
విరూపం వానరం భీమమాఖ్యాతుముపచక్రముః. 12

ప్ర. అ. వికృతాననాః = వికృతము లైన ముఖములు గల, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, రావణస్య = రావణునియొక్క, సమీపే = సమీపమునందు, విరూపమ్ = విపరీత మైన రూపము గల, భీమమ్ = భయంకరు డైన, వానరమ్ = వానరుని గూర్చి, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రముః = ఉపక్రమించిరి.

తా. వికృత మైన ముఖము గల రాక్షసస్త్రీలు రావణునివద్దకు వెళ్ళి, అతనితో వికృత మైన రూపముతో భయంకరుడుగా ఉన్న వానరుని గూర్చి చెప్పుటకు ప్రారంభించిరి. 12

మూ. అశోకవనికామధ్యే రాజన్ భీమవపుః కపిః,
సీతయా కృతసంవాద స్తిష్ఠత్యమితవిక్రమః. 13

ప్ర. అ. రాజన్ = రాజా, సీతయా = సీతతో, కృతసంవాదః = చేయ బడిన సంభాషణము గల, భీమవపుః = భయంకర మైన శరీరము గల, అమిత విక్రమః = మేర లేని పరాక్రమము గల, కపిః = వానరుడు, అశోకవనికామధ్యే = అశోకవనమధ్యమునందు, తిష్ఠతి = ఉన్నాడు.

తా. మహారాజా! భయంకర మైన శరీరము, అమిత మైన పరాక్రమము గల ఒక వానరుడు అశోకవనమధ్యలో ఉన్నాడు. అతడు సీతతో సంభాషణము చేసినాడు. 13

మూ. న చ సా జానకీ సీతా హరిం హరిణలోచనా,
అస్మాభిర్బహుధా పృష్టా నివేదయితుమిచ్ఛతి. 14

ప్ర. అ. హరిణలోచనా=లేడి వంటి నేత్రములు కలదీ, జానకీ=జనకుని పుత్రి అయిన, సీతా=సీత, అస్మాభిః=మాచేత, బహుధా=అనేకవిధములుగా, పృష్టా=అడగబడినను, తమ్=అతనిని గూర్చి, నివేదయితుమ్=తెలుపుటకు, న ఇచ్ఛతి=ఇష్టపడుటలేదు.

తా. లేడి నేత్రముల వంటి నేత్రములు గల, జనకనందిని యైన సీత, మేమెంత అడిగినను అతనిని గూర్చి చెప్పుటలేదు. 14

మూ. వాసవస్య భవేద్దూతో దూతో వైశ్రవణస్య వా,
ప్రేషితో వాపి రామేణ సీతాన్వేషణకాఙ్క్షయా. 15

ప్ర. అ. వాసవస్య=దేవేంద్రునియొక్క, దూతః=దూతగాని, వైశ్రవణస్య=కుబేరునియొక్క, దూతో వా=దూత గాని, సీతాన్వేషణకాఙ్క్షయా=సీతను అన్వేషించుటయందు కోరికచేత, రామేణ=రామునిచేత, ప్రేషితో వాపి=పంపబడిన దూత గాని, భవేత్=అయి ఉండును.

తా. అతడు దేవేంద్రుని దూత గాని, కుబేరుని దూత గాని, సీతను వెదకుటకై రాముడు పంపిన దూత గాని అయి ఉండును. 15

మూ. తేన త్వద్భుతరూపేణ యత్తత్తవ మనోహరమ్,
నానామృగగణాకీర్ణం ప్రమృష్టం ప్రమదావనమ్. 16

ప్ర. అ. అద్భుతరూపేణ=ఆశ్చర్యకర మైన రూపము గల, తేన=వానిచేత, మనోహరమ్=మనోహర మైనదీ, నానామృగగణాకీర్ణమ్=అనేకవిధము లైన మృగసముదాయములతో వ్యాప్తమూ అయిన, యత్=ఏ, తవ=నీయొక్క, ప్రమదావనమ్=ఉద్యానవన మున్నదో, అది, ప్రమృష్టమ్=తుడిచిపెట్టివేయబడినది.

తా. ఆశ్చర్యకర మైన రూపము గల అతడు, మనోహరమూ, అనేకవిధము లైన మృగములతోను పక్షులతోను నిండినది అయిన నీ ఉద్యానవనమును తుడిచిపెట్టివేసినాడు. 16

మూ. న తత్ర కశ్చిదుద్దేశో యస్తేన న వినాశితః,
యత్ర సా జానకీ సీతా స తేన న వినాశితః. 17

ప్ర. అ. తేన = వానిచేత, యః = ఏది, న వినాశితః = నశింపచేయబడ లేదో, అస్తి, ఉద్దేశః = ప్రదేశము, తత్ర = అక్కడ, కశ్చిత్ = ఏదీ, న=లేదు. సా = ఆ, జానకీ = జనకుని కుమార్తె యైన, సీతా = సీత, యత్ర = ఎక్కడ ఉన్నదో, సః = అది, తేన = అతనిచేత, న వినాశితః = నశింపచేయబడలేదు.

తా. ఆ ఉద్యానములో అతడు నశింపచేయని ప్రదేశ మేదీ లేదు. సీత ఎక్కడ కూర్చుండునో ఆ ప్రదేశమును మాత్రము అతడు నశింపచేయలేదు. 17

మూ. జానకీరక్షణార్థం వా శ్రమాద్వా నోపలభ్యతే,
అథవా కః శ్రమస్తస్య సైవ తేనాభిరక్షితా. 18

ప్ర. అ. జానకీరక్షణార్థం వా = జానకిని రక్షించుటకొరకో, శ్రమాద్వా = శ్రమవలననో, నోపలభ్యతే = తెలియుటలేదు. అథవా = లేదా, తస్య = అతనికి, శ్రమః = శ్రమ, కః = ఏమిటి? తేన = వానిచేత, సైవ = ఆమెయే, అభిరక్షితా = రక్షింపబడినది.

తా. అతడు జానకిని రక్షించుటకై ఆ ప్రదేశమును నశింపచేయకుండా విడచినాడో శ్రమవలన అట్లు చేసినాడో తెలియదు. లేదా-అతనికి శ్రమ ఏమిటి? జానకిని రక్షించుటకే అత డట్లు చేసినాడు. 18

మూ. చారుపల్లవపుష్పాఢ్యం యం సీతా స్వయమాస్థితా,
ప్రవృద్ధః శింశపావృక్షః స చ తేనాభిరక్షితః. 19

ప్ర. అ. సీతా = సీత, చారుపల్లవపుష్పాఢ్యమ్ = అందమైన చిగుళ్లతోను పుష్పములతోను నిండిన, యమ్ = దేనిని, స్వయమ్ = స్వయముగా, ఆస్థితా = ఆశ్రయించినదో, సః = ఆ, ప్రవృద్ధః = పెరిగిన, శింశపావృక్షః = శింశపా వృక్షము, తేన = అతనిచేత, అభిరక్షితః = రక్షింపబడినది.

తా. అందమైన చిగుళ్ళతోను, పుష్పములతోను నిండి ఉన్న ఏ శింశపా వృక్షమును సీత స్వయముగా ఆశ్రయించినదో, దానిని అతడు భగ్నము చేయలేదు. 19

మూ. తస్యోగ్రరూపస్యోగ్రం త్వం దణ్డమాజ్ఞాతుమర్హసి,
సీతా సంభాషితా యేన తద్వనం చ వినాశితమ్. 20

ప్ర. అ. యేన = ఏ వానరునిచేత, సీతా = సీత, సంభాషితా = భాషింపబడినదో, తత్ వనం చ = ఆ వనము కూడ, వినాశితమ్ = నశింపచేయబడినదో, తస్య = ఆ, ఉగ్రరూపస్య = భయంకర మైన రూపము గల వానరునకు, త్వమ్ = నీవు, ఉగ్రమ్ = భయంకర మైన, దణ్డమ్ = దండమును, ఆధాతుమ్ = విధించుటకు, అర్హసి = తగియున్నావు.

భా. సీతతో మాటలాడి, ఆ వనమును నశింపచేసిన, భయంకరాకారు డైన ఆ వానరునకు నీవు, భయంకర మైన దండమును విధింపుము. 20

మూ. మనఃపరిగృహీతాం తాం తవ రక్షోగణేశ్వర,
కః సీతామభిభాషేత యో న స్యాత్త్యక్తజీవితః. 21

ప్ర. అ. రక్షోగణేశ్వర = రాక్షససమూహమునకు ప్రభువా! తవ = నీయొక్క, మనః పరిగృహీతామ్ = మనస్సుచేత పరిగ్రహింపబడిన, తాం సీతామ్ = ఆ సీతను గూర్చి, యః = ఎవడు, త్యక్తజీవితః = విడువబడిన జీవితము కల వాడు, న స్యాత్ = కాడో, అట్టి, కః = ఎవడు, అభిభాషేత = భాషణము చేయును?

భా. ఓ రాక్షసరాజా! తన జీవితమును విడచుటకు సిద్ధముగా ఉన్నవాడు తప్ప మ రెవ్వ డైనా, నీవు మనస్సుతో స్వీకరించిన సీతతో మాట్లాడునా? 21

మూ. రాక్షసీనాం వచః శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
హుతాగ్నిరివ జజ్వాల కోపసంవర్తితేక్షణః. 22

ప్ర. అ. రాక్షసేశ్వరః = రాక్షసప్రభు వైన, రావణః = రావణుడు, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీలయొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, కోపసంవర్తితేక్షణః = కోపముచేత త్రిప్పబడిన నేత్రములు కలవాడై, హుతాగ్నిః ఇవ = హోమముచేయబడిన అగ్ని వలె, జజ్వాల = మండిపడెను.

భా. రాక్షసరా జైన రావణుడు, రాక్షసస్త్రీల మాటలు వినగానే, కోపముతో నేత్రములు పెద్దవిగా చేసి హోమము చేసిన అగ్ని వలె, మండిపడెను. 22

మూ. తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపతన్నాస్రబిన్దవః,
దీప్తాభ్యామివ దీపాభ్యాం సార్చిషః స్నేహబిన్దవః. 23

ప్ర. అ. క్రుద్ధస్య = కోపించిన, తస్య = అతనియొక్క, నేత్రాభ్యామ్ = నేత్రములనుండి, దీప్తాభ్యామ్ = ప్రజ్వలించుచున్న, దీపాభ్యామ్ = దీపములనుండి, సార్చిషః = జ్వాలలతో కూడిన, స్నేహబిన్దవః ఇవ = తైలబిందువులు వలె, అస్రబిన్దవః = కన్నీటి బిందువులు, ప్రావతన్ = పడినవి.

తా. కోపించిన అతని నేత్రములనుండి, మండుచున్న దీపములనుండి మంటతో కూడిన తైలబిందువులు పడినట్లు, కన్నీటి బిందువులు, రాలెను. 23

మూ. ఆత్మనః సదృశాన్ క్రూరాన్ కింకరాన్నామ రాక్షసాన్,
వ్యాదిదేశ మహాతేజా నిగ్రహార్థం హనూమతః. 24

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల ఆ రావణుడు, హనూమతః = హనుమంతునియొక్క, నిగ్రహార్థమ్ = నిగ్రహించుటకొరకు, ఆత్మనః = తనకు, సదృశాన్ = తగిన, క్రూరాన్ = క్రూరులైన, కింకరాన్నామ = కింకరులను పేరు గల, రాక్షసాన్ = రాక్షసులను, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ రావణుడు, హనుమంతుని పట్టుకొనుటకు, తనతో సమానులైన, క్రూరులైన కింకరులను పేరు గల రాక్షసులను పంపెను.

మూ. తేషామశీతిసాహస్రం కింకరాణాం తరస్వినామ్,
నిర్యయుర్భవనా త్తస్మాత్కూటముద్గరపాణయః. 25

మహోదరా మహాదంష్ట్రా ఘోరరూపా మహాబలాః,
యుద్ధాభిమనసః సర్వే హనుమద్గ్రహణోద్యతాః. 26

ప్ర. అ. తరస్వినామ్ = బలవంతులైన, తేషాం కింకరాణామ్ = ఆ కింకరులయొక్క, అశీతిసాహస్రమ్ = ఎనభైవేలను, (ఆజ్ఞాపించెను). మహోదరాః = పెద్ద ఉదరములు కలవారూ, మహాదంష్ట్రాః = పెద్ద కోరలు కలవారూ, ఘోరరూపాః = భయంకరములైన ఆకారములు కలవారూ, మహాబలాః = గొప్ప బలము కలవారూ, యుద్ధాభిమనసః = యుద్ధము చేయుటయందు ఆసక్తి కలవారూ అయిన, సర్వే = అందరూ, కూటముద్గరపాణయః = కూటములు ముద్గరములు హస్తములందు కలవారై, హనుమద్గ్రహణోద్యతాః = హనుమంతుని పట్టు

కొనుటలో ఆసక్తి కలవారై, తస్మాత్ = ఆ, భవనాత్ = గృహమునుండి, నిర్య యుః = బయలుదేరిరి.

తా. బలవంతు లైన ఎనభైవేలమంది కింకరులను ఆజ్ఞాపించెను. పెద్ద పెద్ద ఉదరములూ, పొడవైన కోరలూ, భయంకర మైన ఆకారములు గల ఆ మహాబలశాలు లైన కింకరు లందరూ కూటములు, ముద్గరములు అను ఆయుధములు ధరించి, యుద్ధము చేయవలె నను ఉత్సాహముతో, హనుమంతుని పట్టుకొనుటకై ఆ గృహమునుండి వెడలిరి.

మూ. తే కపీన్ద్రం సమాసాద్య తోరణస్థమవస్థితమ్,
అభిపేతుర్మహావేగాః పతఙ్గా ఇవ పావకమ్. 27

ప్ర. అ. తే = వారు, తోరణస్థమ్ = ముఖద్వారమునం దున్న, అవస్థితమ్ = స్థిరముగా నిలచి ఉన్న, కపీన్ద్రమ్ = హనుమంతుని, సమాసాద్య = సమీపించి, మహావేగాః = గొప్ప వేగము గలవారై, పతఙ్గాః = మిడతలు, పావకమ్ ఇవ = అగ్నినిగూర్చి వలె, అభిపేతుః = ఎదురుగా వెళ్ళిరి.

తా. ఆ కింకరులు, ముఖద్వారము దగ్గర స్థిరముగా నిలచి ఉన్న ఆ హనుమంతునిదగ్గరకు చేరి, మిడతలు అగ్ని వైపు ఎగిరి నట్లు, ఆతనిమీదికి అతి వేగముగా వెళ్ళిరి 27

మూ. తే గదాభిర్విచిత్రాభిః పరిఘైః కాఞ్చనాఙ్గదైః,
ఆజఘ్నుర్వానరశ్రేష్ఠం శరైశ్చాదిత్యసన్నిభైః. 28

ప్ర. అ. తే = వారు, విచిత్రాభిః = విచిత్రము లైన, గదాభిః = గదల తోను, కాఞ్చనాఙ్గదైః = బంగారు కట్లు గల, పరిఘైః = పరిఘలతోను, ఆదిత్య సంనిభైః = సూర్యునితో సమానము లైన, శరైశ్చ = బాణములతోను, వానర శ్రేష్ఠమ్ = వానరశ్రేష్ఠు డైన హనుమంతుని, ఆజఘ్నుః = కొట్టిరి.

తా. ఆ కింకరులు అనేకవిధము లైన గదలతోను, బంగారు కట్లు గల పరిఘలతోను, సూర్యుని వలె మెరయుచున్న బాణములతోను హనుమంతుని కొట్టిరి. 28

మూ. ముద్గరైః పట్టిసైః శూలైః ప్రాసతోమరశక్తిభిః,
పరివార్య హనూమన్తం సహసా తస్థురగ్రతః. 29

ప్ర. అ. ముద్గరైః = ముద్గరములతోను, పట్టిసైః = పట్టిసములతోను, శూలైః = శూలములతోను, ప్రాసతోమరశక్తిభిః = ప్రాసలతోను, తోమరములతోను, శక్తులతోను, సహసా = శీఘ్రముగా, హనుమన్తమ్ = హనుమంతుని, పరివార్య = చుట్టుముట్టి, అగ్రతః = అతని ఎదుట, తస్థుః = నిలిచిరి.

తా. ఆ కింకరులు ముద్గరములు, పట్టిసములు, శూలములు, ప్రాసలు, తోమరములు, శక్తులు ధరించి, వెంటనే హనుమంతుని చుట్టుముట్టి, అతని ఎదుట నిలిచిరి. 29

మూ. హనుమానపి తేజస్వీ శ్రీమాన్పర్వతసన్నిభః,
క్షితావావిధ్య లాఙ్గూలం ననాద చ మహాస్వనమ్. 30

ప్ర. అ. తేజస్వీ=తేజస్సు గలవాడు, శ్రీమాన్=శోభాయుక్తుడు, పర్వతసన్నిభః = పర్వతముతో సమానుడు అయిన, హనుమానపి = హనుమంతుడు కూడ, లాఙ్గూలమ్ = తోకను, క్షితౌ = నేలపై, ఆవిధ్య = కొట్టి, మహాస్వనమ్= గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననాద చ = ధ్వని చేసెను.

తా. గొప్ప తేజస్సు, శోభ గల, పర్వతసమానుడైన హనుమంతుడు కూడ వారలను చూడగానే తోక నేలపై వేసి కొట్టి గొప్ప శబ్దము కలుగునట్లు ధ్వని చేసెను. 30

మూ. స భూత్వా సుమహాకాయో హనుమాన్ మారుతాత్మజః,
ధృష్టమాస్ఫోటయామాస లఙ్కాం శబ్దేన పూరయన్. 31

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, సుమహాకాయః = చాల పెద్ద దేహము కలవాడుగా, భూత్వా=అయి, శబ్దేన = శబ్దముచేత, లఙ్కామ్ = లంకను, పూరయన్ = నింపుచు, ధృష్టమ్= గట్టిగా, ఆస్ఫోటయామాస = జబ్బలు చరచెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు దేహము చాల పెద్దదిగా పెంచి, లంకాపట్టణమంతా మారుమ్రోగేటట్లు జబ్బలు చరిచెను. 31

మూ. తస్యాస్ఫోటితశబ్దేన మహతా సానునాదినా,
పేతుర్విహఙ్గా గగనాదుచ్చైశ్చేదమఘోషయత్, 32

ప్ర. అ. సానునాదినా = ప్రతిధ్వనితో కూడిన, మహతా = గొప్ప దైన, తస్య = ఆ హనుమంతునియొక్క, ఆస్ఫోటితశబ్దేన = జబ్బలు చరచిన చప్పుడు చేత, విహగాః = పక్షులు, గగనాత్ = ఆకాశమునుండి, పేతుః = పడిపోయినవి. ఉచ్చైః = గట్టిగా, ఇదమ్ = దీనిని, ఆఘోషయత్ చ = ఘోషించెను కూడ.

తా. ప్రతిధ్వని కలుగు నట్లుగా హనుమంతుడు జబ్బలు చరచి చేసిన ఆ ధ్వనికి పక్షులు రాలి క్రింద పడిపోయెను. హనుమంతు డీ విధముగా, బిగ్గరగా, ఘోషణము కూడ చేసెను. 32

మూ. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. 33

ప్ర. అ. అతిబలః = అత్యధిక మైన బలము గల, రామః = రాముడు, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు, మహాబలః = గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, సర్వోత్కర్షగా ఉన్నాడు. రాఘవేణ = రామునిచేత, అనుపాలితః = పాలింపబడిన, రాజా = రాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు.

తా. లోకాతీత మైన బలము గల రాముడు సర్వోత్కర్షగా ఉన్నాడు. మహాబలశాలి యైన లక్ష్మణుడు. రామునిచేత పాలింపబడిన సుగ్రీవమహారాజు కూడ సర్వోత్కర్షగా ఉన్నాడు. 33

మూ. దాసోఽహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః,
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః. 34

ప్ర. అ. శత్రుసైన్యానామ్ = శత్రుసైన్యములను, నిహన్తా = సంహారకుడను, మారుతాత్మజః = వాయుపుత్రుడను, హనుమాన్ = హనుమంతు డను పేరు గలవాడను అయిన, అహమ్ = నేను, కోసలేన్ద్రస్య = కోసలదేశరాజూ, అక్లిష్టకర్మణః = శ్రమపడకుండా పనులు సాధించువాడూ అయిన, రామస్య = రాముని యొక్క, దాసః = దాసుడను.

తా. శత్రువుల సైన్యములను సంహరింపగలవాడను, వాయుపుత్రుడను అయిన నా పేరు హనుమంతుడు. నేను శ్రమపడకుండా కార్యములను సాధింప సమర్థ డైన కోసలాధిపతి యైన రాముని దాసుడను. 34

మూ. న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. 35

ప్ర. అ. సహస్రశః=వేల కొలది, శిలాభిః=శిలలతోను, పాదపైశ్చ=వృక్షములతోను, ప్రహరతః=కొట్టుచున్న, మే=నాకు, యుద్ధే=యుద్ధమునందు, రావణసహస్రమ్ = రావణులయొక్క సహస్రము కూడ, ప్రతిబలమ్ = ఎదుట నిలువగల బలము కలది, న భవేత్=కాజాలదు.

తా. నేను వేలకొలది శిలలు, వృక్షములు ప్రయోగించుచు యుద్ధము చేయుచున్నప్పుడు వెయ్యిమంది రావణులు కూడ యుద్ధరంగములో నా ఎదుట నిలవజాలరు. 35

మూ. అర్దయిత్వా పురీం లఙ్కామభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. 36

ప్ర. అ. సర్వరక్షసామ్=సమస్తమైన రాక్షసులు, మిషతామ్=చూచుచుండగా, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, అర్దయిత్వా=పీడించి, మైథిలీమ్=సీతను, అభివాద్య చ = నమస్కరించి, సమృద్ధార్థః=పూర్తి చేసికొనబడిన కార్యము కలవాడనై, గమిష్యామి=తిరిగి వెళ్లగలను.

తా. రాక్షసు లందరూ చూచుచుండగానే నేను లంకాపట్టణమును పీడించి, సీతకు నమస్కరించి, నే వచ్చిన పని పూర్తి చేసికొని వెళ్లగలను. 36

మూ. తస్య సన్నాదశబ్దేన తేఽభవన్భయశఙ్కితాః,
దదృశుశ్చ హనూమన్తం సన్ధ్యామేఘమివోన్నతమ్. 37

ప్ర. అ. తే=వారు, తస్య=ఆ హనుమంతునియొక్క, సంనాదశబ్దేన=గొప్ప అరపుల ధ్వనిచేత, భయశఙ్కితాః=భయముచేత శంకితులై, అభవన్=అయిరి. సన్ధ్యామేఘమివ = సంధ్యాకాలమేఘము వలె, ఉన్నతమ్=ఎత్తైన, హనూమన్తమ్=హనుమంతుని, దదృశుశ్చ=చూచిరి కూడ.

తా. ఆ కింకరులు హనుమంతుడు బిగ్గరగా అరచుటచేత కలిగిన ఆ శబ్దమును విని భయభ్రాంతులై, సంధ్యాకాలమేఘము వలె ఉన్నతుడుగా ఉన్న ఆ హనుమంతుని చూచిరి. 37

మూ. స్వామిసందేశనిఃశఙ్కా స్తతస్తే సర్వరాక్షసాః,
చిత్రైః ప్రహరణైర్భీమైరభిపేతు స్తతస్తతః. 38

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తే=ఆ, రాక్షసాః= రాక్షసులు, స్వామి సందేశనిఃశఙ్కాః = ప్రభువు ఆజ్ఞచేత శంక లేని వారై, తతస్తతః = ఆ యా వైపులనుండి, భీమైః=భయంకరము లైన, చిత్రైః=విచిత్రము లైన, ప్రహరణైః =ఆయుధములతో, కపిమ్=హనుమంతుని గూర్చి, అభిపేతుః=ఎదురుగా వచ్చి పడిరి.

తా. తమ ప్రభువు ఆజ్ఞాపించుటచే ఇంక ఆ రాక్షసులు శంక విడచి, భయంకరము లైన అనేకవిధము లైన ఆయుధములతో ఆ హనుమంతునిపైకు వెళ్ళిరి. 38

మూ. స తైః పరివృతః శూరైః సర్వతః సమహాబలః,
ఆససాదాయసం భీమం పరిఘం తోరణాశ్రితమ్ 39

ప్ర. అ. సమహాబలః = గొప్ప బలముతో కూడిన, సః = ఆ హనుమంతుడు, శూరైః=శూరు లైన, తైః=ఆ రాక్షసులచేత, సర్వతః=నలు వైపులా, పరివృతః = చుట్టబడినవాడై, తోరణాశ్రితమ్ = ముఖద్వారమును ఆశ్రయించి ఉన్న, భీమమ్=భయంకర మైన, ఆయసమ్=ఇనుప దైన, పరిఘమ్=పరిఘను (పెద్దగడియ), ఆససాద=పొందెను.

తా. శూరు లైన ఆ రాక్షసు లందరూ చుట్టుముట్టగానే, మహాబలశాలి యైన హనుమంతుడు ముఖద్వారమున కున్న భయంకర మైన ఇనుప గడియను సమీపించెను. 39

మూ. స తం పరిఘమాదాయ జఘాన రజనీచరాన్,
స పన్నగమివాదాయ స్ఫురన్తం వినతాసుతః, 40
విచచారామ్బరే వీరః పరిగృహ్య చ మారుతిః.

ప్ర. అ. సః=హనుమంతుడు, తం పరిఘమ్=ఆ పరిఘను, ఆదాయ =గ్రహించి, రజనీచరాన్=రాక్షసులను, జఘాన=చంపెను. వీరః=వీరు డైన, సః మారుతిః = ఆ హనుమంతుడు, వినతాసుతః=గరుత్మంతుడు, స్ఫురన్తమ్=

కదలుచున్న, పన్నగమ్=సర్పమును, అరాయేవ=గ్రహించి వలె, పరిగృహ్య = ఆ పరిఘను గ్రహించి, అమ్బరే = ఆకాశమునందు, విచచార=సంచరించెను.

తా. వీరు డైన ఆ హనుమంతుడు ఆ పరిఘను గ్రహించి రాక్షసులను చంపెను. కొట్టుకొనుచున్న మహాసర్పమును వంజాతో పట్టి గరుత్మంతుడు ఆకాశములో తిరిగి నట్లు ఆ పరిఘను చేతిలో పట్టుకొని ఆకాశములో తిరిగెను. 40

మూ. స హత్వా రాక్షసాన్వీరాన్ కింకరాన్మారుతాత్మజః. 41
యుద్ధాకాఙ్క్షీ పునర్వీరస్తోరణం సముపాశ్రితః.

ప్ర. అ. వీరః = వీరు డైన, సః మారుతాత్మజః = ఆ హనుమంతుడు, వీరాన్ = వీరు లైన, కింకరాన్ = కింకరు లను పేరు గల, రాక్షసాన్=రాక్షసులను, హత్వా = చంపి, పునః=మరల, యుద్ధాకాఙ్క్షీ=యుద్ధమును కోరుచున్నవాడై, తోరణమ్=ముఖద్వారమును, సముపాశ్రితః=ఆశ్రయించినాడు.

తా. మహావీరు డైన ఆ హనుమంతుడు కింకరు లను వీరు లైన ఆ రాక్షసులను చంపి, ఇంకను యుద్ధము చేయుటకై సన్నద్ధు డై, మరల ఆ ముఖద్వారము దగ్గరనే నిలచెను. 41

మూ. తత స్తస్మాద్భయాన్ముక్తాః కతిచి త్తత్ర రాక్షసాః. 42
నిహతాన్ కింకరాన్ సర్వాన్రావణాయ న్యవేదయన్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తత్ర = అక్కడ, తస్మాత్ = ఆ, భయాత్ = భయమునుండి, ముక్తాః = విముక్తు లైన, కతి చిత్ = కొందరు, రాక్షసాః = రాక్షసులు, సర్వాన్ = సమస్త మైన, కింకరాన్ = కింకరులను, నిహతాన్ = చంపబడినవారినిగా, రావణాయ = రావణునకు, న్యవేదయన్ = తెలిపిరి.

తా. అక్కడ ఆ భయమునుండి ఎట్లో తప్పించుకొన్న కొందరు రాక్షసులు రావణుని దగ్గరకు వెళ్ళి కింకరు లందరూ చంపబడి నట్లు తెలిపిరి. 42

మూ. స రాక్షసానాం నిహతం మహద్బలం
నిశమ్య రాజా పరివృత్తలోచనః,
సమాదిదేశాప్రతిమం పరాక్రమే
ప్రహస్తపుత్రం సమరే సుదుర్జయమ్. 43

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, రాజా = రావణుడు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, మహత్ = గొప్పదైన, బలమ్ = సైన్యమును, నిహతమ్ = చంపబడినదానినిగా, నిశమ్య = విని, పరివృత్తలోచనః = త్రిప్పబడిన నేత్రములు కలవాడై, పరాక్రమే = పరాక్రమమునందు, అప్రతిమమ్ = సాటి లేనివాడూ, సమరే = యుద్ధమునందు, సుదుర్జయమ్ = జయించుటకు శక్యము కానివాడూ అయిన, ప్రహస్తపుత్రమ్ = ప్రహస్తుని కుమారుని, సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. రాక్షసుల ఆ పెద్ద సేన చంపబడిన సట్లు విన్న రావణుడు, కోపముతో కళ్లు త్రిప్పుచు, పరాక్రమములో సాటిలేనివాడూ యుద్ధములో జయింప శక్యము కానివాడూ అయిన ప్రహస్తపుత్రుని, యుద్ధమునకు వెళ్లుమని ఆజ్ఞాపించెను. 43

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిచత్వారింశః సర్గః

[హనుమంతుడు చైత్యప్రాసాదమును ధ్వంసము చేసి దాని రక్షకులను వధించుట]

మూ. తతః స కింకరాన్ హత్వా హనుమాన్ ధ్యానమాస్థితః,
వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః. 1

తస్మాత్ప్రాసాదమద్యైవమిమం విధ్వంసయామ్యహమ్,
ఇతి సంచిన్త్య హనుమాన్ మనసా దర్శయన్ బలమ్. 2

చైత్యప్రాసాదముత్ప్లుత్య మేరుశృఙ్గమివోన్నతమ్,
ఆరురోహ హరిశ్రేష్ఠో హనుమాన్ మారుతాత్మజః. 3

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, కింకరాన్ = కింకరులను, హత్వా = చంపి, ధ్యానమ్ = ఆలోచనను, ఆస్థితః = అవలంబించెను (పొందెను). మయా = నాచేత, వనమ్ = వనము, భగ్నమ్ = విరగగొట్టబడినది. చైత్యప్రాసాదః = వనమధ్యమునందున్న భవనము, న వినాశితః = నశింపచేయబడలేదు. తస్మాత్ = ఆ కారణమువలన, అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, ఇమమ్ = ఈ, ప్రాసాదమ్ = ప్రాసాదమును, ఏవమ్ = ఇట్లే, విధ్వంసయామి = నశింపచేసెదను. హరిశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడు, మారుతాత్మజః = వాయుపుత్రుడు, హనుమాన్ = విశిష్టమైన గడ్డము గలవాడు అయిన, హనుమాన్ = హనుమంతుడు, మనసా = మనస్సుతో, ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, బలమ్ = బలమును, దర్శయన్ = చూపుచు, మేరుశృఙ్గమివ = మేరు పర్వతశిఖరము వలె, ఉన్నతమ్ = ఉన్నతమైన, చైత్యప్రాసాదమ్ = ఉద్యాన వనమధ్యమునందున్న ప్రాసాదమును గూర్చి, ఉత్ప్లుత్య = ఎగిరి, ఆరురోహ = ఎక్కెను.

తా. కింకరులను చంపిన పిమ్మట, హనుమంతు డీ విధముగా ఆలోచించెను. "నేను ఉద్యానవనమును విరిచివేసినాను కాని ఈ చైత్యప్రాసాదమును నశింపజేయలేదు. అందుచే దీనిని ఇప్పుడే నశింపజేసెదను." వానరశ్రేష్ఠుడు, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు మనస్సులో ఈ విధముగా ఆలోచించు

[illegible]

[హనుమంతుడు చైత్యప్రాసాదమును ధ్వంసము చేసి దాని రక్షకులను వధించుట]

మూ. తతః స కింకరాన్ హత్వా హనుమాన్ ధ్యానమాస్థితః,
వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః. 1

తస్మాత్ప్రాసాదమద్యైవమిమం విధ్వంసయామ్యహమ్,
ఇతి సంచిన్త్య హనుమాన్ మనసా దర్శయన్ బలమ్. 2

చైత్యప్రాసాదముత్ప్లుత్య మేరుశృఙ్గమివోన్నతమ్,
ఆరురోహ హరిశ్రేష్ఠో హనుమాన్ మారుతాత్మజః. 3

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, కింకరాన్ = కింకరులను, హత్వా = చంపి, ధ్యానమ్ = ఆలోచనను, ఆస్థితః = అవలంబించెను (పొందెను). మయా = నాచేత, వనమ్ = వనము, భగ్నమ్ = విరగగొట్టబడినది. చైత్యప్రాసాదః = వనమధ్యమునందున్న భవనము, న వినాశితః = నశింపజేయబడలేదు. తస్మాత్ = ఆ కారణమువలన, అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, ఇమమ్ = ఈ, ప్రాసాదమ్ = ప్రాసాదమును, ఏవమ్ = ఇట్లే, విధ్వంసయామి = నశింపజేసెదను. హరిశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడు, మారుతాత్మజః = వాయుపుత్రుడు, హనుమాన్ = విశిష్టమైన గడ్డము గలవాడు అయిన, హనుమాన్ = హనుమంతుడు, మనసా = మనస్సుతో, ఇతి = ఇట్లు, సంచిన్త్య = ఆలోచించి, బలమ్ = బలమును, దర్శయన్ = చూపుచు, మేరుశృఙ్గమివ = మేరుపర్వతశిఖరము వలె, ఉన్నతమ్ = ఉన్నతమైన, చైత్యప్రాసాదమ్ = ఉద్యానవనమధ్యమునందున్న ప్రాసాదమును గూర్చి, ఉత్ప్లుత్య = ఎగిరి, ఆరురోహ = ఎక్కెను.

ప్ర. అ. స॥ మారుతాత్మజః = ఆ హనుమంతుడు, ప్రభావాత్ = ప్రభావము వలన, సుమహాకాయః = దాం పెద్ద శరీరము కలవాడు, భూత్వా = అయి, శబ్దేన = శబ్దముచేత, లఙ్కామ్ = లంకను, పూరయన్ = నింపుచు, ధృష్టమ్ = గట్టిగా, ఆస్ఫోటయామాస = అబ్బలు చరచెను.

తా. ఆ హనుమంతుడు, ప్రభావముచేత తన శరీరమును దాం పెద్దదిగా పెంచి, లంకాపట్టణ మంతా శబ్దముతో నిండిపోవు నట్లు, గట్టిగా అబ్బలు చరచెను. 6

మూ. తస్యాస్ఫోటితశబ్దేన మహతా శ్రోత్రఘాతినా,
పేతుర్విహఙ్గమా స్తత్ర చైత్యపాలాశ్చ మోహితాః. 7

ప్ర. అ. తస్య = హనుమంతునియొక్క, శ్రోత్రఘాతినా = చెవులను పీడించు, మహతా = గొప్ప దైన, ఆస్ఫోటితశబ్దేన = అబ్బలు చరచిన శబ్దము చేత, తత్ర = అక్కడ, విహఙ్గమాః = పక్షులు, పేతుః = పడిపోయినవి. చైత్య పాలాశ్చ = ఆ చైత్యమును రక్షించువారు కూడ, మోహితాః = మోహము చెందిరి.

తా. చెవులను పీడించు నట్లు హనుమంతుడు చేసిన ఆ గొప్ప అబ్బలు చరచిన ధ్వనిచేత, అక్కడ పక్షులు ఆకాశమునుండి రాలి పడిపోయెను. చైత్య రక్షకులు కూడ మూర్ఛపోయిరి. 7

మూ. అస్త్రవిజ్జయతాం రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. 8

దాసోఽహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః,
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః. 9

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. 10

అర్దయిత్వా పురీం లఙ్కామభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. 11

(ఈ నాలుగు శ్లోకములు 42 వ సర్గలో 33, 34, 35, 36 శ్లోకాలుగా వచ్చినవి. "అస్త్రవిత్ = అస్త్రముల నన్నింటిని ఎరిగిన, రామః = రాముడు, అయతామ్ = సర్వోత్కర్షగా ఉండుగాక" అని ఈ పాదములో మాత్రమే కొంచెము భేద మున్నది). 8-11

మూ. ఏవముక్త్వా విమానస్థశ్చైత్యస్థాన్ హరియూథపః,
నవాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయన్ భయమ్. 12

ప్ర. అ. హరియూథపః = వానర సేనానాయకు డైన, హనుమంతుడు, విమానస్థః = చైత్యప్రాసాదముపై నిలచినవాడై, చైత్యస్థాన్ = ఆ చైత్యప్రాసాదములో ఉన్నవారిని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, భీమనిర్హ్రాదః = భయంకర మైన ధ్వని కలవాడై, రక్షసామ్ = రాక్షసులకు, భయమ్ = భయమును, జనయన్ = పుట్టించుచు, ననాద = ధ్వనిచేసెను.

తా. వానర సేనానాయకు డైన ఆ హనుమంతుడు, చైత్యప్రాసాదముపైన నిలచి, ఆ ప్రాసాదమును రక్షించువారితో ఇట్లు పలికి, భయంకరముగా గర్జించుచు, రాక్షసులకు భయముకలుగు నట్లు ధ్వని చేసెను. 12

మూ. తేన శబ్దేన మహతా చైత్యపాలాః శతం యయుః,
గృహీత్వా వివిధానస్త్రాన్ ప్రాసాన్ ఖడ్గాన్ పరశ్వథాన్
విసృజన్తో మహాకాయా మారుతిం పర్యవారయన్.

ప్ర. అ. మహతా = గొప్ప దైన, తేన శబ్దేన = ఆ శబ్దముచేత, శతమ్ = వందమంది, చైత్యపాలాః = చైత్యపాలకులు, వివిధాన్ = అనేకవిధము లైన, అస్త్రాన్ = అస్త్రములను, ప్రాసాన్ = ప్రాసలను, ఖడ్గాన్ = కత్తులను, పరశ్వథాన్ = గండ్రగొడ్డళ్ళను, గృహీత్వా = గ్రహించి, యయుః = వెళ్ళిరి. మహాకాయాః = పెద్ద దేహము గల వాళ్లు, విసృజన్తః = ఆయుధములను ప్రయోగించుచు, మారుతిమ్ = హనుమంతుని, పర్యవారయన్ = చుట్టుముట్టిరి.

తా. ఆ గొప్ప శబ్దమును విని వందమంది చైత్యపాలకులు అనేక విధము లైన అస్త్రములు, ప్రాసలు, ఖడ్గములు, గండ్రగొడ్డళ్లు ధరించి హనుమంతుని మీదికి వెళ్ళిరి. పెద్ద పెద్ద దేహములు గల వాళ్లు ఆ ఆయుధములు ప్రయోగించుచు హనుమంతుని చుట్టుముట్టిరి. 13

మూ. తే గదాభిర్విచిత్రాభిః పరిఘైః కాఞ్చనాఙ్గదైః. 14
ఆజఘ్నుర్వానరశ్రేష్ఠం శరైశ్చాదిత్యసన్నిభైః.

ప్ర. అ. (చూ. 42వ సర్గలోని 28 వ శ్లోకం). 14

మూ. ఆవర్త ఇవ గఙ్గాయాస్తోయస్య విపులో మహాన్, 15
పరిక్షిప్య హరిశ్రేష్ఠం స బభౌ రక్షసాం గణః.

ప్ర. అ. సః = ఆ, రక్షసాం గణః = రాక్షసుల సముదాయము, హరిశ్రేష్ఠమ్ = వానరశ్రేష్ఠు డైన హనుమంతుని, పరిక్షిప్య = చుట్టుముట్టి, గఙ్గాయాః = గంగానది యొక్క, తోయస్య = జలముయొక్క, మహాన్=గొప్ప, విపులః = విశాల మైన, ఆవర్త ఇవ = సుడి వలె, బభౌ = ప్రకాశించెను.

తా. వానరశ్రేష్ఠు డైన హనుమంతుని చుట్టూ నిలచి ఉన్న ఆ రాక్షస సముదాయము గంగానదిలో జలముతో ఏర్పడిన చాల పెద్ద దైన సుడి వలె ప్రకాశించెను. 15

మూ. తతో వాతాత్మజః క్రుద్ధో భీమం రూపం సమాస్థితః. 16
ప్రాసాదస్య మహాంస్తస్య స్తమ్భం హేమపరిష్కృతమ్,
ఉత్పాటయిత్వా వేగేన హనుమాన్ పవనాత్మజః. 17
తతస్తం భ్రామయామాస శతధారం మహాబలః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వాతాత్మజః = హనుమంతుడు, క్రుద్ధః = కోపగించినవాడై, భీమమ్ = భయంకర మైన, రూపమ్=రూపమును, సమాస్థితః = గ్రహించెను. మహాన్ = పెద్ద దేహము గలవాడు అయిన, పవనాత్మజః = వాయుపుత్రుడు, మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, హనుమాన్ = హనుమంతుడు, తస్య ప్రాసాదస్య = ఆ ప్రాసాదము యొక్క, హేమపరిష్కృతమ్ = బంగారముచే అలంకరింపబడిన, స్తమ్భమ్ = స్తంభమును. ఉత్పాటయిత్వా = పెకలించి, తతః = అటుపిమ్మట, శతధారమ్ = నూరు అంచులు గల, తమ్ = దానిని, వేగేన = వేగముతో, భ్రామయామాస = తిప్పెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు కోపించి భయంకర మైన రూపము దాల్చెను. ఆ ప్రసాదమునం దున్న బంగారముచే అలంకృత మైన పెద్ద స్తంభ

మును పెకలించి, వాయుపుత్రుడు, మహాశరీరముగలవాడు, మహాబలశాలి అయిన హనుమంతుడు, ఆ నూరు అంచులు గల స్తంభమును వేగముగా త్రిప్పెను.

మూ. తత్ర చాగ్నిః సమభవత్ప్రాసాదశ్చాప్యదహ్యత. 18
దహ్యమానం తతో దృష్ట్వా ప్రాసాదం హరియూథపః,
స రాక్షసశతం హత్వా వజ్రేణేన్ద్ర ఇవాసురాన్, 19
అన్తరిక్షే స్థితః శ్రీమానిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తత్ర = అక్కడ, అగ్నిః చ = అగ్ని కూడ, సమభవత్ = పుట్టెను. ప్రాసాదశ్చ = ప్రాసాదము కూడ, అదహ్యత = దహింపబడెను. తతః = అటు పిమ్మట, సః హరియూథపః = ఆ హనుమంతుడు, దహ్యమానమ్ = = కాల్చివేయబడుచున్న, ప్రాసాదమ్ = ప్రాసాదమును, దృష్ట్వా = చూచి. ఇన్ద్రః = ఇంద్రుడు, వజ్రేణ = వజ్రముతో, అసురానివ = అసురులను వలె, రాక్షసశతమ్ = నూర్గురు రాక్షసులను, హత్వా = చంపి, శ్రీమాన్ = శోభాయుక్తుడై, అన్తరిక్షే = ఆకాశమునందు, స్థితః = ఉన్నవాడై, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. హనుమంతుడా స్తంభమును అట్లు త్రిప్పగా అక్కడ అగ్ని పుట్టెను. ఆ ప్రాసాద మంతా మండిపోయెను. హనుమంతు డా ప్రాసాదము ఆ విధముగా మండిపోవుచుండగా చూచి, ఇంద్రుడు వజ్రాయుధముతో అసురులను చంపినట్లు నూరుగురు రాక్షసులను చంపి, శోభాయుక్తుడై, ఆకాశముమీద నిలచి ఇట్లు పలికెను. 18, 19

మూ. మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనామ్. 20
బలినాం వానరేన్ద్రాణాం సుగ్రీవవశవర్తినామ్,
అటన్తి వసుధాం కృత్స్నాం వయమన్యే చ వానరాః.

ప్ర. అ. మహాత్మనామ్ = పెద్ద దేహములు గలవారు, బలినామ్ = బలవంతులైన వారు, సుగ్రీవవశవర్తినామ్ = సుగ్రీవుని వశమునందున్నవారూ అయిన, మాదృశానామ్ = నావంటి, వానరేన్ద్రాణామ్ = వానరశ్రేష్ఠులయొక్క, సహస్రాణి = సహస్రములు, విసృష్టాని = పంపబడినవి. వయమ్ = మేము, అన్యే = ఇతరు

లైన, వానరాశ్చ = వానరులూ, కృత్స్నామ్=సమస్త మైన, వసుధామ్=భూమిని అటన్తి=తిరుగుచున్నారు.

తా. పెద్ద పెద్ద దేహములు కలవారు, బలశాలులు, సుగ్రీవుని ఆజ్ఞకు లొంగినవారూ అయిన నావంటి వానరులు వేలకొలది పంపబడియున్నారు. మేము మరి కొందరు ఇతరవానరులు కూడ భూమిమీద అంతటా సంచరించుచున్నారు (ము).

మూ. దశనాగబలాః కేచిత్కేచిద్దశగుణోత్తరాః,
కేచిన్నాగసహస్రస్య బభూవుస్తుల్యవిక్రమాః. 22

ప్ర. అ. కేచిత్ = కొందరు, దశనాగబలాః = పది ఏనుగుల బలము కలవారు, కేచిత్ = కొందరు, దశగుణోత్తరాః = పది రెట్లు అధిక మైనవారు, కేచిత్ = కొందరు, నాగసహస్రస్య = వెయ్యి ఏనుగులకు, తుల్యవిక్రమాః = సమాన మైన పరాక్రమము కలవారు, బభూవుః = ఉండిరి (ఉన్నారు).

తా. ఈ వానరులలో కొందరు పది ఏనుగుల బలము గలవారు. కొందరు నూరు ఏనుగుల బలము గలవారు. కొందరు వెయ్యి ఏనుగుల బలము గలవారు.

మూ. సన్తి చౌఘబలాః కేచిత్కేచిద్వాయుబలోపమాః,
అప్రమేయబలాశ్చాన్యే తత్రాసన్ హరియూథపాః. 23

ప్ర. అ. కేచిత్ = కొందరు, ఓఘబలాః = మహాజలప్రవాహము వంటి బలము గలవారు, సన్తి = ఉన్నారు. కేచిత్ = కొందరు, వాయుబలోపమాః = వాయుబలముతో సమాన మైన బలము గలవారు. తత్ర = వారిలో, అన్యే = మరికొందరు, హరియూథపాః = వానరసేనానాయకులు, అప్రమేయబలాశ్చ = కొలవ శక్యము కాని బలము కలవారు కూడ, ఆసన్ = ఉండిరి (ఉన్నారు). ('ఓఘము' ఒక సంఖ్య అనే అర్థం ఏ నిఘంటువులోను కనబడలేదు).

తా. కొందరు మహాజలప్రవాహము వంటి బలము గలవారు ఉన్నారు. కొందరు వాయువుతో సమాన మైన బలము గలవారు. కొందరు వానరనాయకుల బలము ఇంత అని కొలుచుటకు శక్యము కాదు. 23

మూ. ఈదృగ్విధైస్తు హరిభిర్వృతో దన్తనఖాయుధైః,
శతైః శతసహస్రైశ్చ కోటిభిరయుతైరపి, 24
ఆగమిష్యతి సుగ్రీవః సర్వేషాం వో నిషూదనః.

ప్ర. అ. ఉదగ్రైః = ఉద్ధతులైన, దన్తనఖాయుధైః = దంతములు నఖములు ఆయుధములుగా గల, శతైః = వందలు, అయుతైః = పదివేలు, శతసహస్రైః = లక్షలు, కోటిభిః = కోట్లు, హరిభిః = వానరులతో, వృతః = కూడిన వాడై, సుగ్రీవః = సుగ్రీవుడు, సర్వేషామ్ = సమస్తమైన, వః = మీకు, (మిమ్ములను), నిషూదనః = సంహరింప నున్నవాడై, ఆగమిష్యతి = రాగలడు.

తా. సుగ్రీవుడు ఈ విధమైన బలము గలవారు, దంతములు గోళ్లు ఆయుధములుగా కలవారు అయిన వానరులు వందలకొలది, పదివేల కొలది, లక్షల కొలది, కోట్ల కొలది వెంటరాగా మిమ్ములనందరిని చంపుటకు రాగలడు.

మూ. నేయమస్తి పురీ లఙ్కా న యూయం న చ రావణః,
యస్మాదిక్ష్వాకునాథేన బద్ధం వైరం మహాత్మనా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. యస్మాత్ = ఎందువలన, మహాత్మనా = మహాత్ముడైన, ఇక్ష్వాకునాథేన = ఇక్ష్వాకు వంశప్రభువైన రామునితో, వైరమ్ = వైరము, బద్ధమ్ = కట్టబడినదో, అందువలన, ఇయమ్ = ఈ, లఙ్కాపురీ = లంకాపట్టణము, నాస్తి = లేదు. యూయమ్ = మీరు, న = లేరు. రావణః చ = రావణుడు కూడ, న = లేడు.

తా. మీరు మహాత్ముడైన రామునితో విరోధము పెట్టుకొన్నారు. అందువలన ఈ లంకానగరము ఇంక ఉండదు. మీరు ఉండరు. రావణుడు కూడ ఉండడు. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుశ్చత్వారింశః సర్గః

[హనుమంతుడు ప్రహస్తపుత్రుడైన జంబుమాలిని వధించుట]

మూ. సందిష్టో రాక్షసేన్ద్రేణ ప్రహస్తస్య సుతో బలీ.
జమ్బుమాలీ మహాదంష్ట్రో నిర్జగామ ధనుర్ధరః.

రక్తమాల్యామ్బరధరః స్రగ్వీ రుచిరకుణ్డలః,
మహాన్వివృత్తనయనశ్చణ్డః సమరదుర్జయః. 2

ధనుః శక్రధనుఃప్రఖ్యం మహద్రుచిరసాయకమ్,
విస్ఫారయాణో వేగేన వజ్రాశనిసమస్వనమ్. 3

ప్ర. అ. మహాదంష్ట్రః = పెద్ద కోరలు కలవాడు, ధనుర్ధరః = ధనస్సు ధరించినవాడు, రక్తమాల్యామ్బరధరః = ఎఱ్ఱని మాలలు వస్త్రములు ధరించిన వాడు, స్రగ్వీ = అందమైన మాలలు కలవాడు, రుచిరకుణ్డలః = అందమైన కుండలములు కలవాడు, మహాన్ = పెద్ద దేహము కలవాడు, వివృత్తనయనః = త్రిప్పబడిన నేత్రములు (లేదా గుండ్రని నేత్రములు) కలవాడు, చణ్డః = తీవ్ర మైనవాడు, సమరదుర్జయః = యుద్ధములో జయింప శక్యము కానివాడు, బలీ = బలశాలి, ప్రహస్తస్య సుతః = ప్రహస్తుని కుమారుడు అయిన, జమ్బు మాలీ = జంబుమాలి, రాక్షసేన్ద్రేణ = రావణునిచేత, సన్దిష్టః = ఆజ్ఞాపించబడినవా డై, మహత్ = పెద్దది, రుచిరసాయకమ్ = అందమైన బాణములు కలది, వజ్రా శనిసమప్రభమ్ = వజ్రముతోను, పిడుగుతోను సమానమైన కాంతి గలది, శక్రధనుఃప్రఖ్యమ్ = ఇంద్రధనస్సుతో సమానమూ అయిన, ధనుః = ధనస్సును, వేగేన = వేగముతో, విస్ఫారయాణః = లాగుచు, నిర్జగామ = బయలు దేరెను.

తా. ప్రహస్తుని కుమారుడూ, బలశాలీ అయిన జంబుమాలి, రావణుని ఆజ్ఞచేత ధనుర్ధరుడై బయలుదేరెను. పెద్ద కోరలు గలవాడు ఎఱ్ఱని వస్త్ర

మాలలు, వస్త్రములు, అందమైన అభరణములు, కుండలములు ధరించెను. పెద్ద దేహముతో, గుండ్రని కళ్ళతో, భయంకరుడుగా ఉన్న అతడు యుద్ధములో జయింప శక్యము కానివాడు. ఇంద్రధనస్సు వలె చాలా పెద్దదీ, అందమైన బాణములు కలదీ అయిన ధనస్సును వజ్రముతోను, పిడుగుతోను సమానమైన ధ్వని కలుగు నట్లు అతడు చరచుచుండెను. 1-3

మూ. తస్య విస్ఫారఘోషేణ ధనుషో మహతా దిశః,
ప్రదిశశ్చ నభశ్చైవ సహసా సమపూర్యత. 4

ప్ర. అ. తస్య=ఆ, ధనుషః=ధనస్సుయొక్క, మహతా=గొప్పదైన, విస్ఫారఘోషేణ = చరచుటవలన కలిగిన ధ్వనిచేత, దిశః=దిక్కులు, ప్రదిశశ్చైవ=విదిక్కులు, నభశ్చైవ=ఆకాశము, సహసా=వెంటనే, సమపూర్యత= నింపబడెను,

తా. ఆ ధనస్సును చరచుటచే కలిగిన గొప్ప ధ్వని వెంటనే దిక్కులను, విదిక్కులను, ఆకాశమును నింపివేసెను. 4

మూ. రథేన ఖరయుక్తేన తమాగతముదీక్ష్య సః,
హనుమాన్వేగసంపన్నో జహర్ష చ ననాద చ. 5

ప్ర. అ. ఖరయుక్తేన = గాడిదలతో కట్టబడిన, రథేన = రథముచేత, ఆగతమ్ = వచ్చిన, తమ్ = అతనిని, ఉదీక్ష్య = చూచి, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, వేగసంపన్నః = వేగముతో కూడినవాడై, జహర్ష చ = ఆనందించెను, ననాద చ = ధ్వనిచేసెను కూడ.

తా. గాడిదలు కట్టిన రథ మెక్కి వచ్చిన అతనిని చూచి, హనుమంతుడు, వేగసంపన్నుడై, సంతోషముతో ధ్వని చేసెను. 5

మూ. తం తోరణవిటఙ్కస్థం హనుమన్తం మహాకపిమ్,
జమ్బుమాలీ మహాబాహుర్వివ్యాధ నిశితైః శరైః. 6

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, జమ్బుమాలీ = జంబుమాలి, తోరణవిటఙ్కస్థమ్=ముఖద్వారము శిఖరమునం దున్న, మహాకపిమ్=

మహాబాహువు లైన, తం హనుమన్తమ్=ఆ హనుమంతుని, నిశితైః=వాడి యైన, శరైః=బాణములతో, వివ్యాధ=కొట్టెను.

తా. మహాబాహు వైన ఆ జంబుమాలి, ముఖద్వారము పైభాగముపై నిలచి ఉన్న మహాకపి హనుమంతునిపై వాడి యైన బాణములు ప్రయోగించెను.

మూ. అర్ధచన్ద్రేణ వదనే శిరస్యేకేన కర్ణినా,
బాహ్వోర్వివ్యాధ నారాచైర్దశభిస్తం కపీశ్వరమ్. 7

ప్ర. అ. అర్ధచంద్రేణ=అర్ధచంద్రాకార మైన బాణముతో, వదనే=ముఖమునందు, ఏకేన=ఒక, కర్ణినా=వంకరములికి గల బాణముతో, శిరసి=శిరస్సునందు, దశభిః=పది, నారాచైః=పూర్తిగా ఇనుముతో చేసిన బాణములతో, బాహ్వోః=బాహువులమీదను, తం కపీశ్వరమ్=ఆ హనుమంతుని, వివ్యాధ=కొట్టెను.

తా. అర్ధచంద్రబాణముతో ముఖముమీద, ఒక కర్ణిబాణముతో శిరస్సు మీద, పది నారాచబాణములతో బాహువులమీద ఆ హనుమంతుని కొట్టెను. 7

మూ. తస్య తచ్ఛుశుభే తామ్రం శరేణాభిహతం ముఖమ్,
శరదీవామ్బుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా. 8

ప్ర. అ. శరేణ=బాణముచేత, అభిహతమ్=కొట్టబడిన, తామ్రమ్=ఎఱ్ఱనైన, తత్=ఆ, తస్య ముఖమ్=అతని ముఖము, శరది=శరత్కాలమునందు, భాస్కరరశ్మినా=సూర్యకిరణముచేత, విద్ధమ్=గ్రుచ్చబడిన, ఫుల్లమ్=వికసించిన, అమ్బుజమివ=పద్మము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. హనుమంతుని ఎఱ్ఱని ముఖముపై బాణము దెబ్బ తగులుటచే అది, శరత్కాలమునందు సూర్యకిరణస్పర్శచే వికసించిన పద్మము వలె ప్రకాశించెను.

మూ. తత్తస్య రక్తం రక్తేన రఞ్జితం శుశుభే ముఖమ్,
యథాకాశే మహాపద్మం సిక్తం చన్దనబిన్దుభిః. 9

ప్ర. అ. రక్తేన=రక్తముచేత, రఞ్జితమ్=పూయబడిన, రక్తమ్=సహజముగా ఎఱ్ఱనైన, తస్య=హనుమంతునియొక్క, తత్=ఆ, ముఖమ్=ముఖము,

చన్దనబిన్దుభిః = చందనము బిందువులచేత, సిక్తమ్ = తడుపబడిన, ఆకాశే = ఆకాశమునం దున్న, మహాపద్మం యథా = పెద్ద పద్మము వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. స్వభావము చేతనే ఎఱ్ఱగా ఉన్న హనుమంతుని ముఖము రక్తముతో తడియుటచే, ఆకాశమధ్యమునం దున్న పెద్ద పద్మముమీద ఎఱ్ఱని చందనము చుక్కలు పడి నట్లు ఉండెను. 9

మూ. చుకోప బాణాభిహతో రాక్షసస్య మహాకపిః,
తతః పార్శ్వేఽతివిపులాం దదర్శ మహతీం శిలామ్. 10

ప్ర. అ. బాణాభిహతః = బాణములచేత కొట్టబడిన, మహాకపిః = హనుమంతుడు, రాక్షసస్య = ఆ రాక్షసునికి, చుకోప = కోపించెను. తతః = అటు పిమ్మట, పార్శ్వే = ప్రక్కన, అతివిపులామ్ = చాల విశాల మైన, మహతీమ్ = గొప్ప దైన, శిలామ్ = శిలను, దదర్శ = చూచెను.

తా. బాణముల దెబ్బ తిన్న హనుమంతుడు ఆ రాక్షసునిపై చాల కోపించి, ప్రక్కనే ఉన్న అతివిశాల మైన ఒక ఱాతిబండను చూచెను. 10

మూ. తరసా తాం సముత్పాట్య చిక్షేప బలవద్బలీ,
తాం శరైర్దశభిః క్రుద్ధస్తాడయామాస రాక్షసః. 11

ప్ర. అ. బలీ = బలవంతు డైన హనుమంతుడు, తామ్ = ఆ శిలను, తరసా = బలముతో, సముత్పాట్య = పెకలించి, బలవత్ = బలముగా, చిక్షేప = విసరెను. రాక్షసః = రాక్షసుడు, క్రుద్ధః = కోపగించినవా డై, తామ్ = ఆ శిలను, దశభిః = పది, శరైః = బాణములతో, తాడయామాస = కొట్టెను.

తా. బలశాలి యైన హనుమంతుడు ఆ ఱాతిబండను పెకలించి, చాల బలముగా దానిని విసరెను. ఆ రాక్షసుడు కోపించి, దానిని పది బాణాలతో ముక్కలు చేసెను. 11

మూ. విపన్నం కర్మ తద్దృష్ట్వా హనుమాంశ్చణ్డవిక్రమః,
సాలం విపులముత్పాట్య భ్రామయామాస వీర్యవాన్. 12

ప్ర. అ. తణ్ణవిక్రమః=తీక్ష్ణమైన పరాక్రమము గల, వీర్యవాన్=బలము గల, హనుమాన్=హనుమంతుడు, తత్ కర్మ=ఆ పనిని, విపన్నమ్=విఫలమైనదానినిగా, దృష్ట్వా=చూచి, విపులమ్=చాల పెద్దదైన, సాలమ్=మద్దిచెట్టును, ఉత్పాట్య=పెకలించి, భ్రామయామాస=త్రిప్పెను.

తా. భయంకరమైన పరాక్రమము కలవాడు, బలశాలి అయిన హనుమంతుడు తాను విసరిన శిల నిష్ఫలమైనట్లు చూచి, పెద్ద మద్దిచెట్టు నొకదానిని పెకలించి, దానిని త్రిప్పెను. 12

మూ. భ్రామయన్తం కపిం దృష్ట్వా సాలవృక్షం మహాబలమ్,
చిక్షేప సుబహూన్ బాణాన్ జమ్బుమాలీ మహాబలః. 13

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, జమ్బుమాలీ=జంబుమాలి, సాలవృక్షమ్=సాలవృక్షమును, భ్రామయన్తమ్=త్రిప్పుచున్న, మహాబలమ్=గొప్ప బలము గల, కపిమ్=హనుమంతుని, దృష్ట్వా=చూచి, సుబహూన్=చాలా అధికమైన, బాణాన్=బాణములను, చిక్షేప=విసరెను.

తా. మహాబలవంతుడైన ఆ జంబుమాలి, మహాబలశాలియైన హనుమంతుడు సాలవృక్షమును త్రిప్పుట చూచి అనేకమైన బాణములు ప్రయోగించెను. 13

మూ. సాలం చతుర్భిశ్చిచ్ఛేద వానరం పఞ్చభిర్భుజే,
ఉరస్యేకేన బాణేన దశభిస్తు స్తనాన్తరే. 14

ప్ర. అ. సాలమ్=సాలవృక్షమును, చతుర్భిః=నాలుగు బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. వానరమ్=హనుమంతుని, పఞ్చభిః=ఐదు బాణములతో, భుజే=భుజమునందు, ఉరసి=వక్షఃస్థలమునందు, ఏకేన బాణేన=ఒక్క బాణముతోను, స్తనాన్తరే=స్తనముల మధ్య, దశభిః=పది బాణములతోను, (కొట్టెను).

తా. జంబుమాలి నాలుగు బాణములచేత సాలవృక్షమును ఛేదించి, హనుమంతుని ఐదు బాణాలతో భుజమునందు, ఒక బాణముతో వక్షఃస్థలమునందు, పది బాణాలతో స్తనముల మధ్య కొట్టెను. 14

మూ. స శరైః పూరితతనుః క్రోధేన మహతా వృతః,
తమేవ పరిఘం గృహ్య భ్రామయామాస వేగితః. 15

ప్ర. అ. శరైః = బాణములతో, పూరితతనుః = నిండబడిన శరీరముగల, సః = హనుమంతుడు, మహతా = గొప్ప, క్రోధేన = కోపముతో, వృతః = కూడినవాడై, వేగితః = వేగము దాల్చినవాడై, తం పరిఘమేవ = ఆ పరిఘనే గృహ్య = గ్రహించి, భ్రామయామాస = త్రిప్పెను.

తా. దేహమంతా శరములతో నిండిపోవుటచే హనుమంతుడు చాల క్రోధము చెంది, వేగమును అవలంబించి, ఆ పరిఘనే గ్రహించి త్రిప్పెను. 15

మూ. అతివేగోఽతివేగేన భ్రామయిత్వా బలోత్కటః,
పరిఘం పాతయామాస జమ్బుమాలేర్మహోరసి. 16

ప్ర. అ. బలోత్కటః = బలముచేత అతితీవ్రముగా ఉన్న హనుమంతుడు, అతివేగః = చాల వేగము కలవాడై, పరిఘమ్ = పరిఘను, అతివేగేన = చాల వేగముచేత, భ్రామయిత్వా = త్రిప్పి, జమ్బుమాలేః = జంబుమాలియొక్క, మహోరసి = విశాలమైన వక్షఃస్థలమునందు, పాతయామాస = పడవేసెను

తా. అత్యధికమైన బలము, మహావేగము గల హనుమంతుడు, పరిఘను మహావేగముతో త్రిప్పి విశాలమైన జంబుమాలి వక్షఃస్థలముపైకి విసిరెను. 16

మూ. తస్య చైవ శిరో నాస్తి న బాహూ న చ జానునీ,
న ధనుర్న రథో నాశ్వాస్తత్రాదృశ్యన్త నేషవః. 17

ప్ర. అ. తత్ర = అక్కడ, తస్య = ఆ జంబుమాలియొక్క, శిరః చైవ = శిరస్సు, నాస్తి = లేదు. బాహూ = బాహువులు, న = లేవు. జానునీ = మోకాళ్లు, న = లేవు. ధనుః = ధనస్సు, న = లేదు. రథః = రథము, న = లేదు. అశ్వాః = గుఱ్ఱములు (గాడిదలు), నాదృశ్యన్త = చూడబడలేదు. ఇషవః = బాణములు, న = చూడబడలేదు.

తా. (ఆ పరిఘ పడి రథాశ్వాదులతో కూడ ఆ జంబుమాలి ఒక ముద్దగా అయి పోవుటచేత) అతని శిరస్సుగాని, బాహువులు గాని, మోకాళ్లు గాని, ధనస్సు గాని, రథము గాని, అశ్వములు గాని, బాణాలు గాని అక్కడ కనబడలేదు. 17

మూ. స హతః సహసా తేన జమ్బుమాలీ మహాబలః,
పపాత నిహతో భూమౌ చూర్ణితాఙ్గవిభూషణః. 18

ప్ర. అ. తేన = హనుమంతునిచేత, హతః = కొట్టబడిన, మహాబలః = గొప్ప బలముగల, జమ్బుమాలీ = జంబుమాలి, సహసా = వెంటనే, నిహతః = చంపబడినవాడై, చూర్ణితాఙ్గవిభూషణః = చూర్ణముచేయబడిన అవయవములు, అలంకారములు కలవాడై, భూమౌ = నేలపైన, పపాత = పడెను.

తా. హనుమంతుడా విధముగ పరిఘతో కొట్టగానే, మహాబలవంతుడైన జంబుమాలి, వెంటనే అవయవములు, అలంకారములు చూర్ణమైపోగా, చచ్చి నేలపై పడెను. 18

మూ. జమ్బుమాలిం చ సహతం కింకరాంశ్చ మహాబలాన్,
చుక్రోధ రావణః శ్రుత్వా కోపసంరక్తలోచనః. 19

ప్ర. అ. రావణః = రావణుడు, జమ్బుమాలిం చ = జంబుమాలిని, నిహతమ్ = చంపబడినవానినిగా, మహాబలాన్ = గొప్ప బలము గల, కింకరాంశ్చ = కింకరులను కూడ (చంపబడినవారినిగా), శ్రుత్వా = విని, కోపసంరక్తలోచనః = కోపముతో ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, చుక్రోధ = కోపించెను.

తా. రావణుడు, మహాబలశాలులైన కింకరులు మరణించినట్లు, పిదప జంబుమాలి కూడ మరణించినట్లు విని చాల కోపించెను. కోపోద్రేకము చేత అతని కన్నులు ఎఱ్ఱబడెను. 19

మూ. స రోషసంవర్తితతామ్రలోచనః
ప్రహస్తపుత్రే నిహతే మహాబలే,
అమాత్యపుత్రానతివీర్యవిక్రమాన్
సమాదిదేశాశు నిశాచరేశ్వరః. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. మహాబలే = గొప్ప బలము గల, ప్రహస్తపుత్రే = ప్రహస్తుని కుమారుడు, నిహతే = చంపబడినవాడగుచుండగా, సః నిశాచరేశ్వరః = ఆ

రావణుడు, రోషసంవర్తితతామ్రలోచనః = రోషముతో త్రిప్పబడిన ఎఱ్ఱని నేత్రములు కలవాడై, ఆశు = వెంటనే, అతివీర్యవిక్రమాన్ = అధిక మైన బలము, పరాక్రమము గల, అమాత్యపుత్రాన్ = మంత్రుల కుమారులను, సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. మహాబలశాలి యైన ప్రహస్తపుత్రుడు మరణించుటచే ఆ రావణుడు, రోషముతో ఎఱ్ఱని నేత్రములను త్రిప్పుచు, అధిక మైన బలపరాక్రమములు గల మంత్రిపుత్రులను వెంటనే యుద్ధమునకు వెళ్లుడు అని ఆదేశించెను. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చచత్వారింశః సర్గః

### [హనుమంతుడు ఏడుగురు మంత్రిపుత్రులను వధించుట]

మూ. తతస్తే రాక్షసేన్ద్రేణ చోదితా మన్త్రిణః సుతాః,
నిర్యయుర్భవనాత్తస్మాత్సప్త సప్తార్చిరోచిషః। 1

మహాబలపరీవారా ధనుష్మన్తో మహాబలాః,
కృతాస్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః పరస్పరజయైషిణః. 2

హేమజాలపరిక్షిప్తైర్ధ్వజవద్భిః పతాకిభిః,
తోయదస్వననిర్ఘోషైర్వాజియుక్తైర్మహారథైః. 3

తప్తకాఞ్చనచిత్రాణి చాపాన్యమితవిక్రమాః,
విస్ఫారయన్తః సంహృష్టాస్తటిత్వన్త ఇవామ్బుదాః। 4

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సప్తార్చిరోచిషః=అగ్నివంటి కాంతి గల వారూ, మహాబలపరీవారాః=గొప్ప సైన్యము పరివారముగా కలవారూ, ధనుష్మన్తః=ధనుర్ధరులు, మహాబలాః=గొప్ప బలము గలవారు, కృతాస్త్రాః=అభ్యసింపబడిన అస్త్రములు కలవారూ, అస్త్రవిదామ్=అస్త్రవేత్తలలో, శ్రేష్ఠాః=శ్రేష్ఠులూ, పరస్పరజయైషిణః=ఒండొరుల జయమును కోరుచున్నవారు, అమిత విక్రమాః=అత్యధికమైన పరాక్రమము గలవారు అయిన. సప్త=ఏడుగురైన, తే=ఆ, మన్త్రిణః=మంత్రియొక్క, సుతాః=కుమారులు, రాక్షసేన్ద్రేణ=రాక్షస రాజుచేత, చోదితాః=ప్రేరేపింపబడినవారై, సంహృష్టాః=సంతోషించినవారై, తప్తకాఞ్చనచిత్రాణి=పరిశుద్ధమైన బంగారముతో చిత్రవర్ణములైన, చాపాని=ధనస్సులను, విస్ఫారయన్తః=చరచుచు, తటిత్వన్తః=మెరుపులు గల, అమ్బుదాః ఇవ=మేఘములు వలె, హేమజాలపరిక్షిప్తైః=బంగారపు జాలములతో (చిక్కములతో) చుట్టబడిన, ధ్వజవద్భిః=పెద్ద జండాలు కలిగి, పతాకిభిః=చిన్న

అందాలు కలవి, తోయదస్వననిర్ఘోషైః = మేఘధ్వని వంటి ధ్వనికలవి, వాజి యుక్తైః = గుఱ్ఱములతో కూడినవి అయిన, మహారథైః = మహారథములతో, తస్మాత్ = ఆ, భవనాత్ = భవనమునుండి, నిర్యయుః = బయలు వెడలిరి.

తా. పిమ్మట, అగ్నితో సమాన మైన కాంతి గల, మహాబలశాలు లైన ఆ మంత్రికుమారు లేడుగురు, రావణుడు ప్రేరేపించుటచే, అశ్వములు కట్టిన మహారథములపై ఎక్కి ఆ భవనమునుండి బయలుదేరిరి. మేఘధ్వని వంటి ధ్వనులు గల ఆ రథములకు చుట్టూ బంగారు జాలము కట్టబడెను. యోధుల చిహ్నము లైన ధ్వజములు, అలంకరణార్థము లైన పతాకలు (చిన్న జెండాలు) వాటిపై ఎగురుచుండెను. ధనస్సులను ధరించిన మహాబలశాలు లైన ఆ మంత్రి కుమారుల వెనుక పెద్ద సైన్యము కూడ బయలుదేరెను. బాగుగా అస్త్రవిద్యలో ఆరితేరిన ఆ మంత్రికుమారులు అస్త్రవేత్తలలో శ్రేష్ఠులు. వాళ్ళు జయమును సంపాదించుటకై ఒకరిపై ఒకరు పోటీపడుచుండిరి. మంచి ఉత్సాహముతో పరి శుద్ధ మైన బంగారముతో చిత్రవర్ణములుగా ఉన్న ధనస్సులను చరచుచున్న ఆ మంత్రికుమారులు, మెరుపులతో కూడిన మేఘముల వలె ఉండిరి. 1-4

మూ. జనన్యస్తు తతస్తేషాం విదిత్వా కింకరాన్ హతాన్,
బభూవుః శోకసంభ్రాన్తాః సబాన్ధవసుహృజ్జనాః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేషామ్ = వారియొక్క, సబాన్ధవసుహృజ్జనాః = బంధువులతోను, స్నేహితులతోను కూడిన, జనన్యస్తు = తల్లు లైతే, కింకరాన్ = కింకరులను, హతాన్ = చంపబడినవారినిగా, విదిత్వా = తెలుసుకొని, శోకసంభ్రాన్తాః = దుఃఖముచేత పీడింపబడినవారు, బభూవుః = అయిరి.

తా. కింకరుల వంటి మహావీరులే చంపబడినా రను విషయము తెలిసిన ఆ మంత్రికుమారుల తల్లులు, బంధువులు, మిత్రులు కూడ, ఏమగుదురో కదా అని దుఃఖముతో వ్యాకులత్వము చెందిరి. 5

మూ. తే పరస్పరసంఘర్షాత్తప్తకాఞ్చనభూషణాః,
అభిపేతుర్హనూమన్తం తోరణస్థమవస్థితమ్. 6

ప్ర. అ. తప్తకాఞ్చనభూషణాః = శుద్ధ మైన బంగారు అలంకారములు

గల, తే = వారు. పరస్పరసంఘర్షాత్ = పరస్పరము పోటీవలన, తోరణస్థమ్ = ముఖద్వారము వద్ద ఉన్న, అవస్థితమ్ = యుద్ధానికి సిద్ధముగా ఉన్న, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, అభిపేతుః = ఎదురుగా వెళ్ళిరి.

తా. పరిశుద్ధమైన బంగారముతో చేసిన అలంకారములు ధరించిన ఆ మంత్రిపుత్రులు ముఖద్వారము వద్ద యుద్ధానికి సిద్ధముగా నిలబడిన హనుమంతుని పైకి, ఒకరిపై ఒకరు పోటీ పడుతు, వెళ్ళిరి. 6

మూ. సృజన్తో బాణవృష్టిం తే రథగర్జితనిఃస్వనాః,
వృష్టిమన్త ఇవామ్భోదా విచేరుర్నైరృతామ్బుదాః. 7

ప్ర. అ. రథగర్జితనిఃస్వనాః = రథములయొక్క మేఘగర్జనమువంటి ధ్వని గల, తే = ఆ, నైరృతామ్బుదాః = మేఘముల వంటి రాక్షసులు, బాణవృష్టిమ్ = బాణముల వర్షమును, సృజన్తః = సృష్టించుచున్నవారై, వృష్టిమన్తః = వర్షము గల, అమ్భోదాః ఇవ = మేఘములు వలె, విచేరుః = సంచరించిరి.

తా. మేఘముల వలె ఉన్న ఆ రాక్షసులు, ఉరుముల వంటి రథధ్వనులు వ్యాపించగా బాణవర్షము వర్షించుచు, వర్షించుచున్న మేఘముల వలె సంచరించిరి. 7

మూ. అవకీర్ణస్తతస్తాభిర్హనుమాన్ శరవృష్టిభిః,
అభవత్సంవృతాకారః శైలరాడివ వృష్టిభిః. 8

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తాభిః శరవృష్టిభిః = ఆ శరవర్షముల చేత, అవకీర్ణః = చల్లబడిన, హనుమాన్ = హనుమంతుడు, వృష్టిభిః = వర్షముల చేత, సంవృతాకారః = కప్పబడిన ఆకారము గల, శైలరాడివ = పర్వతరాజువలె, అభవత్ = అయెను.

తా. అప్పుడా బాణవర్షము కప్పివేయగా, హనుమంతుడు, వర్షముచే కప్పివేయబడిన పర్వతరాజు వలె ఉండెను. 8

మూ. స శరాన్మోఘయామాస తేషామాశుచరః కపిః,
రథవేగం చ వీరాణాం విచరన్విమలేఽమ్బరే. 9

ప్ర. అ. అతిచరః = శీఘ్రముగా సంచరించు, సః కపిః = ఆ హను మంతుడు, విమలే = నిర్మల మైన, అమ్బరే = ఆకాశమునందు, విచరన్ = సంచ రించుచు, తేషాం వీరాణామ్ = ఆ వీరులయొక్క, శరాన్ = బాణములను, రథ వేగం చ = రథముల వేగమును, మోఘయామాస = వ్యర్థము చేసెను.

తా. అతిశీఘ్రముగా సంచరించు ఆ హనుమంతుడు, నిర్మల మైన ఆకా శమునందు తిరుగుచు, వీరు లైన ఆ రాక్షసులు ప్రయోగించిన బాణములు, వారి రథాల వేగము కూడ నిష్ఫల మగు నట్లు చేసెను. 9

మూ. స తైః క్రీడన్ధనుష్మద్భిర్వ్యోమ్ని వీరః ప్రకాశతే,
ధనుష్మద్భిర్యథా మేఘైర్మారుతః ప్రభురమ్బరే. 10

ప్ర. అ. వ్యోమ్ని = ఆకాశమునందు, ధనుష్మద్భిః = ధనుర్ధరు లైన, తైః = ఆ రాక్షసులతో, క్రీడన్ = ఆడుకొనుచున్న, సః వీరః = ఆ వీరుడు, అమ్బరే = ఆకాశమునందు, ధనుష్మద్భిః = ఇంద్రధనుస్సులు గల, మేఘైః = మేఘములతో ఆడుకొనుచున్న, ప్రభుః = ప్రభు వైన, మారుతః యథా = వాయువు వలె, ప్రకాశతే = ప్రకాశించుచుండెను.

తా. ఇంద్రధనస్సులతో కూడిన మేఘములతో వాయుదేవుడు ఆకాశము నందు ఆడుకొనుచున్నట్లు, హనుమంతుడు, ధనస్సులు ధరించి ఉన్న ఆ మంత్రి పుత్రులతో ఆకాశమార్గమునందు క్రీడించెను. 10

మూ. స కృత్వా నినదం ఘోరం త్రాసయంస్తాం మహాచమూమ్,
చకార హనుమాన్వేగం తేషు రక్షస్సు వీర్యవాన్. 11

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, సః = హనుమంతుడు, ఘోరమ్ = భయంకర మైన, నినదమ్ = ధ్వనిని, కృత్వా = చేసి, తామ్ = ఆ, మహాచమూమ్ = గొప్ప సైన్యమును, త్రాసయన్ = భయపెట్టుచు, తేషు రక్షస్సు = ఆ రాక్షసుల విషయమునందు, వేగమ్ = వేగమును, చకార = చేసెను.

తా. పరాక్రమశాలి యైన హనుమంతుడు ఆ మహాసేనకు భయము కలుగు నట్లు గొప్ప ధ్వని చేసి ఆ రాక్షసుల విషయమున వేగముగా ప్రవ ర్తించెను. 11

మూ. తలేనాభ్యహనత్కాంశ్చిత్పాదైః కాంశ్చిత్పరంతపః,
ముష్టినాభ్యహనత్కాంశ్చిన్నఖైః కాంశ్చిద్వ్యదారయత్.

ప్ర. అ. పరంతపః = శత్రుసంహారకు డైన ఆ హనుమంతుడు, కాంశ్చిత్=కొందరిని. తలేన=అరచేతితో, అభ్యహనత్=కొట్టెను. కాంశ్చిత్= కొందరిని, పాదైః = పాదాఘాతములచేత, కాంశ్చిత్ = కొందరిని, ముష్టినా = పిడికిలిచేత, అభ్యహనత్ = కొట్టెను. కాంశ్చిత్=కొందరిని, నఖైః = గోళ్ళతో, వ్యదారయత్ = చీల్చెను.

తా. శత్రుసంహారకు డైన ఆ హనుమంతుడు కొందరిని అరచేతులతోను, కొందరిని పాదాఘాతములతోను, కొందరిని గ్రుద్దులతోను కొట్టి చంపెను. మరి కొందరిని గోళ్ళతో చీల్చివేసెను. 12

మూ. ప్రమమాథోరసా కాంశ్చిదూరుభ్యామపరాన్ కపిః.
కేచిత్తస్య నినాదేన తత్రైవ పతితా భువి. 13

ప్ర. అ. కపిః = హనుమంతుడు, కాంశ్చిత్ = కొందరిని, ఉరసా =వక్షస్థలముచేతను, అపరాన్ = మరి కొందరిని, ఊరుభ్యామ్ = తొడలతోను, ప్రమమాథ = నలిపివేసెను. కేచిత్ = కొందరు, తస్య = అతనియొక్క, నినాదేన = ధ్వనిచేత, తత్రైవ = అక్కడనే, భువి = నేలమీద, పతితాః=పడిరి.

తా. హనుమంతుడు కొందరిని వక్షఃస్థలముచేతను, మరి కొందరిని తొడలచేతను మథించి చంపెను. మరికొందరు ఆ హనుమంతుడు చేసిన ధ్వనికే క్రింద పడిపోయిరి. 13

మూ. తతస్తేష్వవసన్నేషు భూమౌ నిపతితేషు చ,
తత్సైన్యమగమత్సర్వం దిశో దశ భయార్దితమ్. 14

ప్ర. అ. తేషు = ఆ రాక్షసులు, అవసన్నేషు=నశించినవారై, భూమౌ= నేలపై, నిపతితేషు చ=పడిపోయినవా రగుచుండగా, తతః=పిమ్మట, సర్వమ్= సమస్త మైన, తత్ = ఆ, సైన్యమ్ = సైన్యము, భయార్దితమ్ = భయముచేత పీడింపబడిన దై, దశ దిశః=పది దిక్కులను గూర్చి, అగమత్=పారిపోయెను.

తా. ఆ రాక్షసు లీ విధముగా మరణించి నేలపై పడిపోవుట చూచి, మిగిలిన సైన్య మంతా భయముచేత పిరికిదై పదిదిక్కులకు పారిపోయెను. 14

మూ. వినేదుర్విస్వరం నాగా నిపేతుర్వాజినః,
భగ్ననీడధ్వజచ్ఛత్త్రైర్భూశ్చ కీర్ణాఽభవద్రథైః. 15

ప్ర. అ. నాగాః = ఏనుగులు, విస్వరమ్ = విపరీత మైన స్వరము కలుగు నట్లుగా, వినేదుః = ధ్వని చేసినవి. వాజినః = అశ్వములు, భువి = నేలమీద, నిపేతుః = పడిపోయినవి. భూశ్చ = భూమి కూడ, భగ్ననీడధ్వజచ్ఛత్త్రైః = విరిగిపోయిన పైకప్పులు, ధ్వజములు, ఛత్రములు, గల, రథైః = రథములతో, కీర్ణా అభవత్ = వ్యాప్త మైనది.

తా. ఏనుగులు విపరీతస్వరముతో ధ్వని చేసినవి. అశ్వములు నేలపై పడినవి. భూమికూడ, పైకప్పులు, ధ్వజములు, ఛత్రములు విరిగిపోయిన రథములతో వ్యాప్త మై యుండెను. 15

మూ. స్రవతా రుధిరేణాథ స్రవన్త్యో దర్శితాః పథి,
వివిధైశ్చ స్వరైర్లఙ్కా ననాద వికృతం తదా. 16

ప్ర. అ. అథ = అటు పిమ్మట, స్రవతా = స్రవించుచున్న, రుధిరేణ = రక్తముచేత, పథి = మార్గమునందు, స్రవన్త్యః = నదులు, దర్శితాః = చూపబడినవి. తదా = అప్పుడు, లఙ్కా = లంక, వివిధైః = అనేకవిధము లైన, స్వరైః = స్వరములతో, వికృతమ్ = వికారముగా, ననాద = మారుమ్రోగెను.

తా. పిమ్మట స్రవించుచున్న రక్తముచేత మార్గమునందు కాల్వలు ఏర్పడినవి. అప్పుడు అనేకవిధము లైన స్వరములతో లంక మార్మోగెను. 16

మూ. స తాన్ ప్రవృద్ధాన్వినిహత్య రాక్షసాన్
మహాబలశ్చణ్డపరాక్రమః కపిః,
యుయుత్సురన్యైః పునరేవ రాక్షసై
స్తమేవ వీరోఽభిజగామ తోరణమ్. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చచత్వారింశః సర్గః.

ప్ర. అ. వీరః = వీరు డైన, మహాబలః = గొప్ప బలము గల, తీవ్ర విక్రమః = తీవ్ర మైన పరాక్రమము గల, సః కపిః = ఆ హనుమంతుడు, ప్రవృద్ధాన్ = బలముచేత పెరిగిన, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, వినిహత్య = చంపి, అన్యైః = ఇతరు లైన, రాక్షసైః = రాక్షసులతో, యుయుత్సుః = యుద్ధము చేయ దలచినవాడై, పునరేవ = తిరిగి, తమ్ = ఆ, తోరణమేవ = తోరణమునే, అభిజగామ = చేరెను.

రా. వీరుడు, మహాబలశాలి, తీవ్ర మైన పరాక్రమము కలవాడూ అయిన ఆ హనుమంతుడు అధిక మైన బలము గల ఆ రాక్షసులను చంపి, ఇతర రాక్షసులతో కూడ యుద్ధము చేయవలె నను ఇచ్ఛతో; మళ్ళీ ఆ తోరణము దగ్గరకే వెళ్ళి నిలిచెను. 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో నలుబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ షట్చత్వారింశః సర్గః

*[హనుమంతుడు రావణుని ఐదుగురు సేనాపతులను వధించుట]*

మూ. హతాన్ మన్త్రిసుతాన్ బుద్ధ్వా వానరేణ మహాత్మనా,
రావణః సంవృతాకారశ్చకార మతిముత్తమామ్. 1

ప్ర. అ. రావణః=రావణుడు, మహాత్మనా=మహాత్ముడైన, వానరేణ=వానరునిచేత, మన్త్రిసుతాన్ = మంత్రికుమారులను, హతాన్ = చంపబడిన వారినిగా, బుద్ధ్వా=తెలిసికొని, సంవృతాకారః=కప్పబడిన ఆకారము కలవాడై, ఉత్తమామ్=ఉత్తమమైన, మతిమ్=ఆలోచనను, చకార=చేసెను.

తా. మహాత్ముడైన హనుమంతుడు మంత్రిపుత్రులను వధించినట్లు విని రావణుడు, మనస్సులోని దిగులు పైకి కనబడకుండ లోపలనే అణచుకొని, ఒక ఉత్తమమైన ఆలోచన చేసెను. 1

మూ. స విరూపాక్షయూపాక్షౌ దుర్ధరం చైవ రాక్షసమ్,
ప్రఘసం భాసకర్ణం చ పఞ్చ సేనాగ్రనాయకాన్. 2

సందిదేశ దశగ్రీవో వీరాన్నయవిశారదాన్,
హనుమద్గ్రహణవ్యగ్రాన్వాయువేగసమాన్యుధి. 3

ప్ర. అ. సః దశగ్రీవః = ఆ రావణుడు, వీరాన్ = వీరులూ, నయవిశారదాన్ = నీతియందు సమర్థులూ, హనుమద్గ్రహణవ్యగ్రాన్ = హనుమంతుని పట్టుకొనుటయందు తొందరపడుచున్నవారూ, యుధి = యుద్ధమునందు, వాయువేగసమాన్ = వాయువేగముతో సమానులు అయిన, విరూపాక్షయూపాక్షౌ = విరూపాక్షయూపాక్షులను, దుర్ధరమ్ = దుర్ధరుడను, రాక్షసం చైవ = రాక్షసుని, ప్రఘసమ్ = ప్రఘసుని, భాసకర్ణం చ = భాసకర్ణుని, సేనాగ్రనాయకాన్ = సేనాప్రధాననాయకులైన, పఞ్చ = ఈ ఐదుగురుని, సందిదేశ = ఆజ్ఞాపించెను.

తా. ఆ దశగ్రీవుడు వీరులూ, నీతిలో నిపుణులూ, హనుమంతుని పట్టు కొనుటకు తొందరపడుచున్నవారూ, యుద్ధములో వాయువేగములో సమానులూ అయిన విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అను ఐదుగురు సేనాప్రధాననాయకులను ఆజ్ఞాపించెను. 2, 3

మూ. యాత సేనాగ్రగాః సర్వే మహాబలపరిగ్రహాః,
సవాజిరథమాతఙ్గాః స కపిః శాస్యతామితి. 4

ప్ర. అ. సేనాగ్రగాః=ఓ సేనాపతులారా! సర్వే=మీ రందరు, మహాబలపరిగ్రహాః = మహాసేనయొక్క స్వీకారము కలవారై, సవాజిరథమాతఙ్గాః = అశ్వములతోను, రథములతోను, ఏనుగులతోను కూడినవారై, యాత = వెళ్ళండి. సః కపిః = ఆ వానరుడు, శాస్యతామ్=శిక్షింపబడుగాక, ఇతి=అని (ఆజ్ఞాపించెను).

తా. "ఓ సేనానాయకులారా! పెద్ద సైన్యమును తీసికొని, అశ్వములను, రథములను, గజములను తీసికొని, మీరందరు వెళ్ళి ఆ వానరుని శిక్షించండి" అని ఆజ్ఞాపించెను. 4

మూ. యత్తైశ్చ ఖలు భావ్యం స్యాత్తమాసాద్య వనాలయమ్,
కర్మ చాపి సమాధేయం దేశకాలవిరోధితమ్. 5

ప్ర. అ. తమ్=ఆ, వనాలయమ్ = వానరుని, ఆసాద్య=సమీపించి, యత్తైః చ=ప్రయత్నవంతులుగా కూడ, భావ్యమ్ = కావలసి ఉన్నది. దేశకాలవిరోధితమ్ = దేశకాలములకు విరుద్ధముగా ఉన్న, కర్మ చాపి = పని కూడ, సమాధేయమ్=సరిచేయ దగినది.

తా. "మీరు ఆ వానరుని విషయములో చాల ప్రయత్నపూర్వకముగా వ్యవహరించవలెను. పనులలో దేశవిరోధము, కాలవిరోధము లేకుండ చూచుకొనవలెను". 5

మూ. న హ్యహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్,
సర్వథా తన్మహద్భూతం మహాబలపరిగ్రహమ్. 6

ప్ర. అ. అహమ్=నేను, కర్మణా = అతడు చేసిన పనిచేత, ప్రతితర్క-

యన్ = తలంచుచు, తమ్ = అతనిని, కపిమ్ = వానరునిగా, న మన్యే = తలంపను. సర్వథా = అన్ని విధములా, తత్ = అది, మహాబలపరిగ్రహమ్ = గొప్ప బల ముసు స్వీకరించిన, మహత్ = గొప్ప దైన, భూతమ్ = భూతము.

తా. "అతడు చేసిన పనిని బట్టి చూడగా నా కతడు వానరు డని తోచుట లేదు. అదేదో మహాబలము గల మహాభూత మై యుండును. సందేహము లేదు".

మూ. భవేదిన్ద్రేణ వా సృష్టమస్మదర్థం తపోబలాత్,
సనాగయక్షగన్ధర్వా దేవాసురమహర్షయః. 7

యుష్మాభిః సహితైః సర్వైర్మయా సహ వినిర్జితాః,
తైరవశ్యం విధాతవ్యం వ్యళీకం కించిదేవ నః. 8

తదేవ నాత్ర సందేహః ప్రసహ్య పరిగృహ్యతామ్,
నావమాన్యో భవద్భిశ్చ హరిర్ధీరపరాక్రమః. 9

ప్ర. అ. అస్మదర్థమ్ = మనకొరకై, తపోబలాత్ = తపోబలమువలన, ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, సృష్టం వా = సృష్టింపబడిన దైనా, భవేత్ = కావచ్చును. సహితైః = కలిసి యున్న, సర్వైః = సమస్త మైన, యుష్మాభిః సహ = మీతో కూడిన, మయా = నాచేత. సనాగయక్షగన్ధర్వాః = నాగులతోను, యక్షులతోను, గంధర్వులతోను కూడిన, దేవాసురమహర్షయః = దేవతలు, అసురులు, మహర్షులు, వినిర్జితాః = జయింపబడినారు. తైః = వాళ్ళచేత, నః = మనకు, కించిదేవ = ఏ దైన, వ్యళీకమ్ = అపకారము. అవశ్యమ్ = తప్పక, విధాతవ్యమ్ = చేయ దగినది. తదేవ = అట్టి భూతమే. అత్ర = ఈ విషయమునందు, సందేహః = సందేహము, న = లేదు. ప్రసహ్య = బలాత్కారముగా, పరిగృహ్యతామ్ = పట్టుకొన బడుగాక. ధీరపరాక్రమః = గొప్ప పరాక్రమము గల, హరిః = ఈ వానరుడు, భవద్భిః = మీచేత, నావమాన్యః = అవమానింప దగినవాడు కాదు.

తా. "ఈ మహాభూతమును, మనకొరకై, ఇంద్రుడేనా తపోబలముతో సృష్టించి యుండాలి. నేను మీరందరు వెంట రాగా, పూర్వము నాగులను, యక్షులను, గంధర్వులను, దేవతలను, అసురులను, మహర్షులను జయించి యున్నాను కదా. వాళ్లందరూ మన కేదో ఒక అపకారము చేయుటకు ప్రయత్నించుచునే

ఉంటుంది. అంతటిదేగా ఇది ఇట్టి మహాభూతమే; సందేహము లేదు. దానిని బల ప్రయోగము చేసి పట్టుకొనవలెను. మహాపరాక్రమము గల ఈ వానరుని విషయములో ఏమి చిన్న మాట అనకూడదు." 7—9

మూ. దృష్టా హి హరయః పూర్వం మయా విపులవిక్రమాః,
వాలీ చ సహసుగ్రీవో జామ్బవాంశ్చ మహాబలః. 10

నీలః సేనాపతిశ్చైవ యే చాన్యే ద్వివిదాదయః,
నైవం తేషాం గతిర్భీమా న తేజో న పరాక్రమః, 11
న మతిర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్.

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, మయా=నాచేత, విపులవిక్రమాః=అధిక మైన పరాక్రమము గల, హరయః=వానరులు, సహసుగ్రీవః=సుగ్రీవునితో కూడిన, వాలీ చ=వాలి, మహాబలః=గొప్ప బలము గల, జామ్బవాంశ్చ= జాంబవంతుడు, సేనాపతిః=సేనాపతి యైన, నీలః=నీలుడు, ద్వివిదాదయః= ద్వివిదుడు మొద లైన, అన్యే చ=ఇతరులు, యే=ఎవ రున్నారో వారూ, దృష్టాః హి=చూడబడినారు కదా. తేషామ్=వారియొక్క, గతిః=నడక, ఏవమ్= ఇట్లు, భీమా=భయంకర మైనది, న=కాదు. తేజః=తేజస్సు, న=కాదు. పరాక్రమః=పరాక్రమము, న=కాదు. మతిః=బుద్ధి, న=కాదు. బలోత్సాహౌ= బలము ఉత్సాహము కూడ (కావు. రూపపరికల్పనమ్=రూపమును చేయుట, న=కాదు.

తా. "వాలి, సుగ్రీవుడు, మహాబలశాలి యైన జాంబవంతుడు, సేనాపతి యైన నీలుడు, ద్వివిదుడు మొద లైన అత్యధిక మైన బలము గల వానరులను ఎందరినో పూర్వము నేను చూచి ఉన్నాను. వాళ్ళకు ఇంత భయంకర మైన గతి కాని, తేజస్సు కాని, పరాక్రమము కాని లేదు. ఇంత బుద్ధి, బలము, ఉత్సాహము, రూపమును మార్చ దగిన శక్తి కూడ లేవు." 10, 11

మూ. మహత్సత్త్వమిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితమ్. 12
ప్రయత్నం మహదాస్థాయ క్రియతామస్య నిగ్రహః,

ప్ర. అ. ఇదమ్=ఇది, కపిరూపమ్=కపిరూపము గలదై, వ్యవస్థితమ్

= ఉన్న, మహత్ = గొప్ప, సత్త్వమ్ = ప్రాణిగా, జ్ఞేయమ్ = తెలియ దగినది. మహత్ = గొప్ప, ప్రయత్నమ్ = ప్రయత్నమును, ఆస్థాయ = అవలంబించి, అస్య = దీనియొక్క, నిగ్రహః = నిగ్రహము, క్రియతామ్ = చేయబడుగాక.

తా. "ఇదేదో వానరరూపములో ఉన్న మహాభూత మనే విషయము గుర్తుంచుకొని ప్రయత్నపూర్వకముగా దీనిని నిగ్రహింపుడు." 12

మూ. కామం లోకాస్త్రయః సేన్ద్రాః ససురాసురమానవాః, 13
భవతామగ్రతః స్థాతుం న పర్యాప్తా రణాజిరే.

ప్ర. అ. సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, ససురాసురమానవాః = సురులతోను, అసురులతోను, మానవులతోను కూడిన, త్రయః = మూడు, లోకాః = లోకములు, రణాజిరే = యుద్ధరంగమునందు, భవతామ్ = మీయొక్క, అగ్రతః = ఎదుట, స్థాతుమ్ = నించుటకు, న పర్యాప్తాః కామమ్ = సరిపడినవారు కారు అనునది నిజమే.

తా. "ఇంద్రునితోను, సురులతోను, అసురులతోను, మానవులతోను, సహా మూడు లోకములూ కూడ రణరంగములో మీ ఎదుట నిలువజాల వనే విషయం వాస్తవమే." 13

మూ. తథాపి తు నయజ్ఞేన జయమాకాఙ్క్షతా రణే, 14
ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధిర్హి చఞ్చలా.

ప్ర. అ. తథాపి తు = అట్లయినను, రణే = యుద్ధమునందు, జయమ్ = జయమును, ఆకాఙ్క్షతా = కోరుచున్న, నయజ్ఞేన = నీతి తెలిసినవానిచేత, ప్రయత్నేన = ప్రయత్నపూర్వకముగా, ఆత్మా = తాను, రక్ష్యః = రక్షించుకొనదగినవాడు. యుద్ధసిద్ధిః = యుద్ధమునందు సిద్ధి, చఞ్చలా హి = చంచల మైనది కదా.

తా. "అయినా కూడ, యుద్ధములో జయము పొందవలె నని కోరు నీతివిశారదుడు, ప్రయత్నపూర్వకముగా తనను తాను కాపాడుకొనవలెను. ఎందుచేత నవగా యుద్ధములో జయ మనేది చంచల మైనది". 14

మూ. తే స్వామివచనం సర్వే ప్రతిగృహ్య మహౌజసః. 15
సముత్పేతుర్మహావేగా హుతాశసమతేజసః,

రథైర్మత్తైశ్చ మాతఙ్గైర్వాజిభిశ్చ మహాజవైః, 16
శస్త్రైశ్చ వివిధైస్తీక్ష్ణైః సర్వైశ్చోపచితా బలైః.

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గలవారు, హుతాశసమతేజసః = అగ్నితో సమ మైన తేజస్సు కలవారు అయిన, తే సర్వే=వారు అందరు, స్వామివచనమ్=ప్రభువు వాక్యమును, ప్రతిగృహ్య = స్వీకరించి, మహావేగాః=గొప్ప వేగము గలవారై, రథైః=రథములచేత, మత్తైః=మదించిన, మాతంగైః=ఏనుగులచేత, మహాజవైః=గొప్ప వేగము గల, వాజిభిశ్చ=గుఱ్ఱములచేత, తీక్ష్ణైః=తీక్ష్ణము లైన, వివిధైః=అనేకవిధము లైన, శస్త్రైః=ఆయుధములచేత, సర్వైః=సమస్తము లైన, బలైః=సేనలచేత, ఉపచితాః = వృద్ధిపొందించబడినవారై, సముత్పేతుః=శీఘ్రముగా వెళ్ళిరి.

తా. మహాబలవంతులు, అగ్నితో సమాన మైన తేజస్సు కలవారు అయిన వారందరూ ప్రభువు ఆజ్ఞను పాలించుచు, రథములచేత, మదించిన ఏనుగులచేత, మహావేగము గల అశ్వములచేత, తీక్ష్ణము లైన వివిధశస్త్రములచేత, సమస్త మైన సేనలచేత తమ బలమును పెంపొందించుకొని మహావేగముతో బయలుదేరిరి. 15, 16

మూ. తత స్తం దదృశుర్వీరా దీప్యమానం మహాకపిమ్, 17
రశ్మిమన్తమివోద్యన్తం స్వతేజోరశ్మిమాలినమ్,
తోరణస్థం మహోత్సాహం మహాసత్త్వం మహాబలమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరాః = ఆ వీరులు, స్వతేజోరశ్మిమాలినమ్ = తన తేజస్సుయొక్క కిరణముల మాలలు కలవాడు, ఉద్యన్తమ్ = ఉదయించుచున్న, రశ్మిమన్తమివ=సూర్యునివలె, దీప్యమానమ్=ప్రకాశించుచున్నవాడు, తోరణస్థమ్=ముఖద్వారమునందు ఉన్నవాడూ, మహోత్సాహమ్=గొప్ప ఉత్సాహము కలవాడూ, మహాసత్త్వమ్=గొప్ప మనోధైర్యము కలవాడు, మహాబలమ్ = గొప్ప బలము కలవాడూ అయిన, తం మహాకపిమ్ = ఆ వానరుని, దదృశుః = చూచిరి.

తా. గొప్ప ఉత్సాహము, గొప్ప ధైర్యము, గొప్ప బలము గల ఆ

హనుమంతుడు ముఖద్వారమువద్ద నిలచి ఉండెను. అతని శరీరమునుండి బయలువెడలిన తేజస్సు కిరణములు చుట్టూ వ్యాపించగా, అతడు ఉదయించు చున్న సూర్యుడు వలె ఉండెను. అట్టి హనుమంతుడ్ని ఆ వీరు లందరు చూచిరి.

మూ. మహామతిం మహావేగం మహాకాయం మహాబలమ్,
తం సమీక్ష్యైవ తే సర్వే దిక్షు సర్వాస్వవస్థితాః, 19
తైస్తైః ప్రహరణైర్భీమైరభిపేతు స్తత స్తతః.

ప్ర. ఆ సర్వే = వారందరూ, మహామతిమ్ = గొప్ప బుద్ధి కలవాడూ; మహావేగమ్ = గొప్ప వేగము కలవాడూ, మహాకాయమ్ = గొప్ప శరీరము కల వాడూ, మహాబలమ్ = గొప్పబలము కలవాడూ అయిన, తమ్ = ఆ హనుమంతుని, సమీక్ష్యైవ = చూడగానే, సర్వాసు = సమస్తమైన, దిక్షు = దిక్కులందు, అవస్థితాః = నిలబడినవారై, తత స్తతః = ఆ యా వైపులనుండి, భీమైః = భయంకరమైన, తైస్తైః = ఆయా, ప్రహరణైః = ఆయుధములతో, అభిపేతుః = ఎదిరించిరి.

తా. గొప్ప బుద్ధి, గొప్ప వేగము, గొప్ప దేహము, గొప్ప బలము గల ఆ హనుమంతుని చూడగానే ఆ రాక్షసు లందరు అన్ని దిక్కులందు నిలచి, ఆ యా ప్రదేశాలనుండి, భయంకరములైన ఆ యా ఆయుధాలతో అతనిని ఎదుర్కొనిరి. 19

మూ. తస్య పఞ్చాయసాస్తీక్ష్ణాః శితాః పీతముఖాః శరాః, 20
శిరస్యుత్పలపత్రాభా దుర్ధరేణ నిపాతితాః.

ప్ర. ఆ. తీక్ష్ణాః = తీక్ష్ణమైనవీ, శితాః = వాడియైనవీ, పీతముఖాః = పచ్చని అగ్రభాగములు కలవీ, ఉత్పలపత్రాభాః = నల్లకలువ రేకుల వంటి కాంతి గలవీ, ఆయసాః = ఇనుపవీ అయిన, పఞ్చ = ఐదు, శరాః = బాణ ములు, దుర్ధరేణ = దుర్ధరునిచేత, తస్య = ఆ హనుమంతునియొక్క, శిరసి = శిరస్సునందు, నిపాతితాః = పడవేయబడినవి.

తా. దుర్ధరుడు తీక్ష్ణములు, వాడియైనవి, పచ్చని అగ్రభాగములు కలవి, నల్లకలువ రేకుల వంటి రంగు కలవి అయిన ఐదు ఇనుప బాణములను హనుమంతుని తలపై ప్రయోగించెను. 20

మూ. స తైః పఞ్చభిరావిద్ధః శరైః శిరసి వానరః, 21
ఉత్పపాత నదన్ వ్యోమ్ని దిశో దశ వినాదయన్.

ప్ర. అ. వానరః = ఆ హనుమంతుడు, తైః = ఆ, పఞ్చభిః = ఐదు, శరైః = బాణములచేత, శిరసి = శిరస్సుమీద, ఆవిద్ధః = కొట్టబడినవాడై, నదన్ = ధ్వని చేయుచు, దశ దిశః = పది దిక్కులను, వినాదయన్ = ప్రతిధ్వనింపచేయుచు, వ్యోమ్ని = ఆకాశమునందు, ఉత్పపాత = ఎగిరెను.

తా. శిరస్సుపై ఆ అయిదు బాణముల ప్రహారము తగలంగానే, హనుమంతుడు పది దిక్కులు ప్రతిధ్వనించు నట్లు ధ్వని చేయుచు, ఆకాశములోనికి ఎగిరెను. 21

మూ. తతస్తు దుర్ధరో వీరః సరథః సజ్యకార్ముకః, 22
కిరన్ శరశతైస్తీక్ష్ణైరభిపేదే మహాబలః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాబలః = గొప్ప బలము గల, వీరః = వీరు డైన, దుర్ధరః = దుర్ధరుడు, సరథః = రథముతో కూడినవా డై, సజ్యకార్ముకః = ఎక్కుపెట్టబడిన నారి గల ధనస్సుతో కూడినవా డై, తీక్ష్ణైః = తీక్ష్ణము లైన, శరశతైః = వందలకొలది శరముల చేత, కిరన్ = చిమ్ముచు, అభిపేదే = హనుమంతుని ఎదిరించెను.

తా. పిమ్మట, మహాబలవంతుడు, వీరుడూ అయిన దుర్ధరుడు రథముతో ఆకాశము పైకి ఎగిరి, ధనస్సును ఎక్కుపెట్టి, తీక్ష్ణము లైన వందల కొలది శరములు చిమ్ముచు, హనుమంతుని ఎదిరించెను. 22

మూ. స కపిర్వారయామాస తం వ్యోమ్ని శరవర్షిణమ్, 23
వృష్టిమన్తం పయోదాన్తే పయోదమివ మారుతః.

ప్ర. అ. సః కపిః = ఆ హనుమంతుడు, వ్యోమ్ని = ఆకాశమునందు, శరవర్షిణమ్ = శరములను వర్షించుచున్న, తమ్ = అతనిని, పయోదాన్తే = వర్షాకాలము అంతమునందు, వృష్టిమన్తమ్ = వర్షము గల, పయోదమ్ = మేఘమును, మారుతః ఇవ = వాయువు వలె, వారయామాస = నివారించెను. 23

తా. ఆకాశమునంతయు ఆ విధముగ శరవర్షము కురిపించుచున్న ఆ దుర్ధరుని, హనుమంతుడు, వర్షించుచున్న మేఘమును, వర్షాకాలాంతమునందు, వాయువు వారించి నట్లు వారించెను. 23

మూ. అర్ద్యమానస్తతస్తేన దుర్ధరేణానిలాత్మజః, 24
చకార కదనం భూయో వ్యవర్ధత చ వేగవాన్.

ప్ర. అ. తేన = ఆ, దుర్ధరేణ = దుర్ధరునిచేత, అర్ద్యమానః = పీడింపబడుచున్న, అనిలాత్మజః = వాయునందనుడు, తతః = అటు పిమ్మట, కదనమ్ = యుద్ధమును, చకార = చేసెను. వేగవాన్ = వేగవంతుడై, భూయః = మరల, వ్యవర్ధత = పెరిగెను.

తా. దుర్ధరు డీ విధముగా పీడింపగా హనుమంతుడు యుద్ధము చేయుచు, వేగవంతుడై మరల శరీరమును పెంచెను. 24

మూ. స దూరం సహసోత్పత్య దుర్ధరస్య రథే హరిః, 25
నిపపాత మహావేగో విద్యుద్రాశిర్గిరావివ.

ప్ర. అ. సః హరిః = ఆ హనుమంతుడు, సహసా = హఠాత్తుగా, ఉత్పత్య = ఎగిరి, మహావేగః = గొప్ప వేగము గలవాడై, గిరౌ = పర్వతముపైన, విద్యుద్రాశిరివ = మెరుపుల రాశి వలె, దుర్ధరస్య = దుర్ధరుని యొక్క, రథే = రథముపైన, నిపపాత = పడెను.

తా. హనుమంతుడు హఠాత్తుగా చాలా పైకి ఎగిరి, మహావేగముతో, మెరుపుల సముదాయము పర్వతముపైన పడి నట్లు దుర్ధరుని రథముపైన పడెను. 25

మూ. తతః స మథితాష్టాశ్వం రథం భగ్నాక్షకూబరమ్, 26
విహాయ న్యపతద్భూమౌ దుర్ధరస్త్యక్తజీవితః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః దుర్ధరః = ఆ దుర్ధరుడు, మథితాష్టాశ్వమ్ = నంగకొట్టబడిన ఎనిమిది గుఱ్ఱములు గల, భగ్నాక్షకూబరమ్ = విరిగిన ఇరుసులు నొగలు కఱ్ఱ గల, రథమ్ = రథమును, విహాయ = విడచి,

త్యక్తజీవితః = విడువబడిన జీవితము గలవాడై, భూమౌ = నేలపై, న్యపతత్ = పడెను.

తా. హనుమంతుడు రథముమీద పడగానే దాని ఇరుసులు, విలువు కఱ్ఱ విరిగిపోయెను. ఎనిమిది గుఱ్ఱములు నలిగిపోయెను. దుర్ధరుడు దానినుండి క్రింద పడి ప్రాణములు విడచెను. 26

మూ. తం విరూపాక్షయూపాక్షౌ దృష్ట్వా నిపతితం భువి, 27
సంజాతరోషౌ దుర్ధర్షావుత్పేతతురరిందమౌ.

ప్ర. అ. దుర్ధర్షౌ = ఎదిరింప శక్యము కానివారు, అరిందమౌ = శత్రుసంహారకులు అయిన, విరూపాక్షయూపాక్షౌ = విరూపాక్షయూపాక్షులు, భువి = నేలపై, నిపతితమ్ = పడిన, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, సంజాతరోషౌ = పుట్టిన రోషము కలవారై, ఉత్పేతతుః = పైకి ఎగిరిరి

తా. ఎదిరింప శక్యము కానివారు, శత్రుసంహారకులూ అయిన విరూపాక్ష యూపాక్షులు. ఆ దుర్ధరుడు నేలపై పడిపోయి నట్లు చూచి, చాల కోపించి, ఆకాశములోనికి ఎగిరిరి.

మూ. స తాభ్యాం సహసోత్పత్య విష్ఠితో విమలేఽమ్బరే, 27
ముద్గరాభ్యాం మహాబాహుర్వక్షస్యభిహతః కపిః.

ప్ర. అ. విమలే = స్వచ్ఛమైన, అమ్బరే = ఆకాశమునందు, విష్ఠితః = నిలచియున్న, మహాబాహుః = గొప్ప బాహువులుగల, సః కపిః = ఆ హనుమంతుడు, తాభ్యామ్ = వారిచేత, సహసా = శీఘ్రముగా, ఉత్పత్య = ఎగిరి, ముద్గరాభ్యామ్ = ముద్గరములతో, వక్షసి = వక్షఃస్థలమునందు, అభిహతః = కొట్టబడెను.

తా. ఆ రాక్షసు లిద్దరూ శీఘ్రముగా పైకి ఎగిరి, నిర్మలమైన ఆకాశములో ఉన్న మహాబాహువైన హనుమంతుని, ముద్గరములతో వక్షఃస్థలముపై కొట్టిరి. 28

మూ. తయోర్వేగవతోర్వేగం వినిహత్య మహాబలః, 29
నిపపాత పునర్భూమౌ సువర్ణసమవిక్రమః.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల సుపర్ణసమవిక్రమః = గరుత్మంతునితో సమాన మైన పరాక్రమముగల హనుమంతుడు, వేగవతోః = వేగము గల, తయోః = ఆ రాక్షసులయొక్క, వేగమ్ = వేగమును, వినిహత్య = అణచివేసి, పునః = మరల, భూమౌ = నేలమీదకు, నిపపాత = దిగెను.

తా. గరుత్మంతునితో సమాన మైన పరాక్రమము కలవాడూ, మహాబలశాలి అయిన హనుమంతుడు వేగవంతు లైన ఆ రాక్షసుల వేగమును అణచివేసి, మళ్ళి నేలమీదకు దిగెను. 29

మూ. స సాలవృక్షమాసాద్య తముత్పాట్య చ వానరః, 30
తావుభౌ రాక్షసౌ వీరౌ జఘాన పవనాత్మజః.

ప్ర. అ. వానరః = వానరు డైన, సః పవనాత్మజః = ఆ హనుమంతుడు, సాలవృక్షమ్ = సాలవృక్షమును, ఆసాద్య = సమీపించి, తమ్ = దానిని, ఉత్పాట్య చ = పెకలించి, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరు, వీరౌ = వీరు లైన, రాక్షసౌ = రాక్షసులను, జఘాన = చంపెను.

తా. ఆ హనుమంతుడు ఒక సాలవృక్షము దగ్గరకు వెళ్ళి, దానిని పెకలించి, దానితో ఆ రాక్షసవీరు లిద్దరిని వధించెను. 30

మూ. తతస్తాంస్త్రీన్ హతాన్ జ్ఞాత్వా వానరేణ తరస్వినా, 31
అభిపేదే మహావేగః ప్రసహ్య ప్రఘసో హరిమ్,
భాసకర్ణశ్చ సంక్రుద్ధః శూలమాదాయ వీర్యవాన్. 32

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తరస్వినా = బలము గల, వానరేణ = హనుమంతునిచేత, తాన్ త్రీన్ = ఆ ముగ్గురినీ, హతాన్ = చంపబడినవారినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, ప్రఘసః = ప్రఘసుడు, మహావేగః = గొప్ప వేగము గలవాడై, ప్రసహ్య = బలాత్కారముగా, అభిపేదే = ఎదిరించెను. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, భాసకర్ణశ్చ = భాసకర్ణుడు కూడ, సంక్రుద్ధః = కోపించినవా డై, శూలమ్ = శూలమును, ఆదాయ = గ్రహించి, (అభిపేదే = ఎదిరించెను).

తా. మహాబలశాలి యైన హనుమంతుడు ఆ ముగ్గురు రాక్షసులను వధించుట చూచి ప్రఘసుడు, మహా వేగముతో, బలమును చూపుచు, హనుమంతుని

ఎదిరించెను. పరాక్రమవంతు డైన భాసకర్ణుడు కూడ శూలము గ్రహించి అతని మీదకు వెళ్ళెను. 31,32

మూ. ఏకతః కపిశార్దూలం యశస్వినమవస్థితౌ,
పట్టిసేన శితాగ్రేణ ప్రఘసః ప్రత్యయోధయత్. 33
భాసకర్ణశ్చ శూలేన రాక్షసః కపిసత్తమమ్.

ప్ర. అ. యశస్వినమ్ = కీర్తిమంతు డైన, కపిశార్దూలమ్ = వానరశ్రేష్ఠు డైన హనుమంతుని గూర్చి, ఏకతః = ఒక ప్రక్క, అవస్థితౌ = నిలచిరి. ప్రఘసః = ప్రఘసుడు, శితాగ్రేణ = వాడి యైన అగ్రము గల, పట్టిసేన = పట్టిసముతో, కపిసత్తమమ్ = హనుమంతుని, ప్రత్యయోధయత్ = ఎదిరించి యుద్ధము చేసెను. భాసకర్ణః = భాసకర్ణుడను, రాక్షసః = రాక్షసుడు, శూలేన = శూలముతో, ఎదిరించి యుద్ధము చేసెను.

తా. వాళ్ళిద్దరూ, కీర్తిమంతు డైన ఆ వానరశ్రేష్ఠునకు ఎదురుగా ఒక ప్రక్క నిలచిరి. ప్రఘసుడు వాడి యైన అగ్రము గల పట్టిసముతో హనుమంతుని ఎదిరించి యుద్ధము చేసెను. భాసకర్ణుడు శూలముతో యుద్ధము చేసెను. 33

మూ. స తాభ్యాం విక్షతైర్గాత్రైరసృగ్దిగ్ధతనూరుహః, 34
అభవద్వానరః క్రుద్ధో బాలసూర్యసమప్రభః.

ప్ర. అ. తాభ్యామ్ = వా రిద్దరిచేత, విక్షతైః = కొట్టబడిన, గాత్రైః = అవయవములతో, అసృగ్దిగ్ధతనూరుహః = రక్తముచేత పూయబడిన రోమములు గల, సః వానరః = ఆ హనుమంతుడు, బాలసూర్యసమప్రభః = బాలసూర్యునితో సమాన మైన కాంతి కలవాడై, క్రుద్ధః = కోపించినవాడు, అభవత్ = అయెను.

తా. ఆ రాక్షసు లిరువురు కొట్టి అవయవములకు గాయములు చేయగా, రక్తముతో శరీరముపై ఉన్న రోమములు తడియుటచే హనుమంతుడు బాల సూర్యుడు వలె ప్రకాశించెను. అప్పు డాతడు కోపోద్రిక్తు డయ్యెను. 34

మూ. సముత్పాట్య గిరేః శృఙ్గం సమృగవ్యాళపాదపమ్, 35
జఘాన హనుమాన్ వీరో రాక్షసౌ కపికుఞ్జరః.

ప్ర. అ. కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడు, వీరః = వీరుడు అయిన, హను

హనూమాన్ = హనుమంతుడు, సమృగవ్యాళపాదపమ్ = మృగములతోను, సర్పములతోను, వృక్షములతోను కూడిన, గిరిశృఙ్గమ్ = పర్వతశిఖరమును, సముత్పాట్య = పెకలించి, రాక్షసౌ = ఆ రాక్షసు లిద్దరినీ, జఘాన = చంపెను.

తా. వానరశ్రేష్ఠుడు, వీరుడు అయిన హనుమంతుడు మృగములతోను, సర్పములతోను, వృక్షములతోను సహా ఒక పర్వతశిఖరము పెకలించి ఆ రాక్షసుల నిద్దరినీ చంపివేసెను. 35

మూ. తతస్తేష్వవసన్నేషు సేనాపతిషు పఞ్చసు, 36
బలం తదవశేషం చ నాశయామాస వానరః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తేషు = ఆ, పఞ్చసు = ఐదుగురు, సేనాపతిషు = సేనాపతులు, అవసన్నేషు = నశించిన వారగుచుండగా, వానరః = హనుమంతుడు, తత్ = ఆ, అవశేషమ్ = మిగిలిన, బలమ్ = సైన్యమును, నాశయామాస = నశింపచేసెను.

తా. ఆ అయిదుగురు సేనాపతులు మరణించిన పిమ్మట, హనుమంతుడు మిగిలిన సైన్యమును కూడ సంహరించెను. 36

మూ. అశ్వైరశ్వాన్ గజైర్నాగాన్ యోధైర్యోధాన్రథై రథాన్,
స కపిర్నాశయామాస సహస్రాక్ష ఇవాసురాన్.

ప్ర. అ. సః కపిః = ఆ హనుమంతుడు, సహస్రాక్షః = దేవేంద్రుడు, అసురానివ = అసురులను వలె, అశ్వైః = అశ్వములచేత, అశ్వాన్ = అశ్వములను, గజైః = గజములచేత, నాగాన్ = గజములను, యోధైః = యోధులచేత, యోధాన్ = యోధులను, రథైః = రథములచేత, రథాన్ = రథములను, నాశయామాస = నశింపచేసెను.

తా. హనుమంతుడు అశ్వములమీద అశ్వాలను, గజములమీద గజములను, యోధులమీద యోధులను, రథాలమీద రథాలను వేసి కొట్టి, దేవేంద్రుడు అసురులను సంహరించినట్లు సంహరించెను. 37

మూ. హతైర్నాగైశ్చ తురగైర్భగ్నాక్షైశ్చ మహారథైః. 38
హతైశ్చ రాక్షసైర్భూమీ రుద్ధమార్గా సమన్తతః.

ప్ర. అ. హతైః=చంపబడిన, నాగైః = ఏనుగులచేతను, తురగైః=గుఱ్ఱములచేతను, భగ్నాక్షైః=విరగ కొట్టబడిన ఇరుసులు గల, మహారథైః=పెద్ద రథములచేతను, హతైః = చంపబడిన, రాక్షసైః = రాక్షసులచేతను, భూమిః = భూమి, సమన్తతః=అంతటా, రుద్ధమార్గా = అడ్డుకొనబడిన మార్గములు కలది అయ్యెను.

తా. చచ్చిపడి ఉన్న గజములతోను, అశ్వములతోను, రాక్షసులతోను, ఇరుసులు విరిగిన మహారథములతోను నలుమూలలా, భూమిపై నడుచుటకు (శక్యము) కాకుండా ఉండెను. 38

మూ. తతః కపిస్తాన్ ధ్వజినీపతీన్ రణే
నిహత్య వీరాన్ సబలాన్ సవాహనాన్,
తదైవ వీరః పరిగృహ్య తోరణం
కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరః=వీరుడైన, కపిః=హనుమంతుడు, వీరాన్ = వీరులు, సబలాన్ = సైన్యముతో కూడినవారు, సవాహనాన్ = వాహనములతో కూడినవారు అయిన, తాన్ = ఆ, ధ్వజినీపతీన్=సేనాపతులను, రణే = యుద్ధమునందు, నిహత్య = చంపి, తదైవ = అట్లే, తోరణమ్=ముఖద్వారమును, పరిగృహ్య=గ్రహించి, ప్రజాక్షయే = ప్రజల వినాశమునందు (కొరకు), కాలః ఇవ=యముడు వలె, కృతక్షణః = చేయబడిన నిరీక్షణము కలవాడై, (ఉండెను).

తా. వీరుడైన హనుమంతుడు సేనావాహన సహితులైన ఆ సేనానాయకులను యుద్ధరంగములో వధించి, వెనుకటివలె ఆ తోరణమునే ఆశ్రయించి, ప్రజలను సంహరించుటకై యముడు నిరీక్షించునట్లు రాక్షసుల రాకకై నిరీక్షించుచుండెను. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదియారవ సర్గ సమాప్తము.

# అథ సప్తచత్వారింశః సర్గః

## [హనుమంతుడు అక్షకుమారుని వధించుట]

మూ. సేనాపతీన్ పఞ్చ స తు ప్రమాపితాన్
హనూమతా సానుచరాన్ సవాహనాన్,
నిశమ్య రాజా సమరోద్ధతోన్ముఖం
కుమారమక్షం ప్రసమైక్షతాగ్రతః. 1

ప్ర. అ. సః రాజా = ఆ రావణుడు. సానుచరాన్ = అనుచరులతో కూడిన, సవాహనాన్ = వాహనాలతో కూడిన. పఞ్చ = ఐదుగురు, సేనాపతీన్ = సేనాపతులను, హనూమతా = హనుమంతునిచేత, హతాన్ = చంపబడినవారినిగా, నిశమ్య = విని, సమరోద్ధతోన్ముఖమ్ = యుద్ధమునందు తీవ్రమైనవాడు, యుద్ధాభిముఖుడూ అయిన, అగ్రతః = తన ఎదుట కూర్చున్న, కుమారమ్ = కుమారుడైన, అక్షమ్ = అక్షుణ్ణి, ప్రసమైక్షత = చూచెను.

తా. ఐదుగురు సేనాపతులను కూడా, సవాహనపరివారముగా హనుమంతుడు చంపివేసినట్లు విని రావణుడు, యుద్ధములో ఉద్ధతుడూ, యుద్ధోన్ముఖుడూ అయిన, ఎదుటనే కూర్చొని ఉన్న తనకుమారుడైన అక్షుని వైపు చూచెను. 1

మూ. స తస్య దృష్ట్యర్పణసంప్రచోదితః
ప్రతాపవాన్ కాఞ్చనచిత్రకార్ముకః,
సముత్పపాతాథ సదస్యుదీరితో
ద్విజాతిముఖ్యైర్హవిషేవ పావకః. 2

ప్ర. అ. అథ = అటు పిమ్మట, తస్య = రావణుని యొక్క, దృష్ట్యర్పణసంప్రచోదితః = దృష్టిని ప్రసరింపచేయుటచేత ప్రేరేపింపబడినవాడై, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, సః = ఆ అక్షుడు, కాఞ్చనచిత్రకార్ముకః = బంగా

రము చేత చిత్రవర్ణమైన ధనస్సు కలవాడై, సదసి = యజ్ఞమునందు, ద్విజాతి ముఖ్యైః = శ్రేష్ఠులైన బ్రాహ్మణులచేత, హవిషా = హవిస్సుచేత, ఉదీరితః = ప్రజ్వలింపచేయబడిన, పావకః ఇవ = అగ్ని వలె, సముత్పపాత = వేగముగా లేచెను.

తా. ప్రతాపవంతుడైన ఆ అక్షుడు, రావణుని దృష్టిచే ప్రేరితుడై, బంగారముచేత చిత్రవర్ణమైన ధనస్సు ధరించి, యజ్ఞములో బ్రాహ్మణశ్రేష్ఠులు ప్రజ్వలింపచేసిన అగ్ని వలె, వెంటనే లేచెను. 2

మూ. తతో మహద్బాలదివాకరప్రభం
ప్రతప్తజాంబూనదజాలసంతతమ్,
రథం సమాస్థాయ యయౌ స వీర్యవాన్
మహాహరిం తం ప్రతి నైరృతర్షభః. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః నైరృతర్షభః = రాక్షసశ్రేష్ఠుడు, బాలదివాకరప్రభమ్ = బాలసూర్యుని వంటి కాంతి గలదీ, ప్రతప్తజాంబూనదజాలసంతతమ్ = కరిగించిన బంగారము జాలముతో (వలతో) చుట్టబడినదీ అయిన, మహత్ = గొప్ప, రథమ్ = రథమును, సమాస్థాయ = అధిష్ఠించి, తమ్ = ఆ, మహాహరిం ప్రతి = మహావానరుని గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. పరాక్రమవంతుడైన ఆ రాక్షసశ్రేష్ఠుడు, చుట్టూ పరిశుద్ధమైన బంగారు జాలము కట్టుటచే బాలసూర్యుని వంటి కాంతితో మెరయుచున్న గొప్ప రథమును అధిష్ఠించి, ఆ వానరోత్తమునితో యుద్ధమునకై వెళ్లెను. 3

మూ. తతస్తపఃసంగ్రహసంచయార్జితం
ప్రతప్తజాంబూనదజాలశోభితమ్,
పతాకినం రత్నవిభూషితధ్వజం
మనోజవాష్టాశ్వవరైః సుయోజితమ్. 4

ప్ర. అ. (4, 5 శ్లోకాలలోని ద్వితీయాంతాలన్నీ 6వ శ్లోకంలోని "రథమ్" అనేదానికి విశేషణాలు). తతః = అటు పిమ్మట, తపఃసంగ్రహసంచ

యార్జితమ్ = తపఃసంపాదనముల సముదాయముల చేత (అనేకవిధము లైన తపస్సులచేత) సంపాదింపబడినదీ, ప్రతప్తజాంబూనదజాలశోభితమ్=కరిగించబడిన బంగారపు జాలముచేత శోభింప చేయబడినదీ, పతాకినమ్ = పతాకలతో కూడినదీ, రత్నవిభూషితధ్వజమ్ = రత్నములచేత అలంకరింపబడిన ధ్వజము గలదీ, మనోజవాష్టాశ్వవరైః = మనోవేగము వంటి వేగము గల ఎనిమిది శ్రేష్ఠము లైన అశ్వములతో, సుయోజితమ్ = బాగుగా కూర్చబడినదీ (అయిన రథము నెక్కి వెళ్ళెను).

తా. ఆ రథమును అతడు ఎన్నో తపస్సుల సముదాయములు చేసి సంపాదించుకొనెను. కరిగించిన పరిశుద్ధ మైన బంగారు వలతో అది ప్రకాశించు చుండెను. దానిపై అలంకరణార్థమై చిన్న పతాకలు, రత్నములచే అలంకృత మైన ధ్వజము అమర్చబడి ఉండెను. మనోవేగముతో సమాన మైన వేగము గల ఎనిమిది గుఱ్ఱములు దానికి కట్టి యుండెను. 4

మూ. సురాసురాధృష్యమసంగచారిణం
రవిప్రభం వ్యోమచరం సమాహితమ్,
సతూణమష్టాసి నిబద్ధబన్ధురం
యథాక్రమావేశితశక్తితోమరమ్. 5

ప్ర. అ. సురాసురాధృష్యమ్ = సురులచేతను, అసురులచేతను, ఎదిరింప శక్యము కానిదీ, అసంగచారిణమ్ = అడ్డు లేకుండా నడిచేదీ, రవిప్రభమ్ = సూర్యుని వంటి కాంతి గలదీ, వ్యోమచరమ్ = ఆకాశముమీద కూడ సంచరించేదీ, సమాహితమ్ = చక్కగా అమర్చబడినదీ, సతూణమ్ = అంబులపొదులతో కూడినదీ, అష్టాసి=ఎనిమిది కత్తులు కలదీ, నిబద్ధబన్ధురమ్=కట్టబడిన గంటలు కలదీ, యథాక్రమావేశితశక్తితోమరమ్=క్రమానుసారముగా ఉంచబడిన శక్తులు, తోమరములు గలది (అయిన రథము నెక్కి వెళ్ళెను).

తా. ఆ రథమును సురులు, అసురులు కూడా ఎదిరించజాలరు. అది ఎక్కడనైనా అడ్డులేకుండా ప్రయాణము చేయగలదు. సూర్యునివంటి కాంతి గల, గంటలు కట్టిన, ఆ రథము ఆకాశముమీద కూడ సంచరించగలదు. చక్కగా కూర్చబడిన ఆ రథముమీద ఆయా స్థానములందు అంబులపొదులు, ఎనిమిది ఖడ్గములు, శక్తులు, తోమరములు అమర్చబడియుండెను. 5

మూ. విరాజమానం ప్రతిపూర్ణవస్తునా
సహేమదామ్నా శశిసూర్యవర్చసా,
దివాకరాభం రథమాస్థితస్తతః
స నిర్జగామామరతుల్యవిక్రమః. 6

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అమరతుల్యవిక్రమః = దేవతలతో సమాన మైన పరాక్రమము గల, సః = అతడు, సహేమదామ్నా = బంగారు మాలలతో కూడినదీ, శశిసూర్యవర్చసా = చంద్రసూర్యులవంటి కాంతి గలదీ అయిన, ప్రతిపూర్ణవస్తునా = నిండిన సామగ్రితో, విరాజమానమ్ = ప్రకాశించు చున్నదీ, దివాకరాభమ్ = సూర్యుని వంటి కాంతి కలదీ అయిన, రథమ్ = రథమును, ఆస్థితః = అధిష్ఠించినవా డై, నిర్జగామ = బయలుదేరెను.

తా. దేవతలతో సమాన మైన పరాక్రమము గల ఆ అక్షకుమారుడు, బంగారు మాలలచే అలంకరింపబడి, చంద్రసూర్యుల వలె ప్రకాశించుచున్న పరిపూర్ణ సామాగ్రి ఉంచిన, సూర్యుని వంటి కాంతి గల రథము నెక్కి బయలు దేరెను. 6

మూ. స పూరయన్ ఖం చ మహీం చ సాచలాం
తురఙ్గమాతఙ్గమహారథస్వనైః,
బలైః సమేతైః సహ తోరణస్థితమ్
సమర్థమాసీనముపాగమత్కపిమ్. 7

ప్ర. అ. సః = అతడు, తురఙ్గమాతఙ్గమహారథస్వనైః = అశ్వముల యొక్క, ఏనుగులయొక్క, రథములయొక్క, ధ్వనులచేత, ఖం చ = ఆకాశమును, సాచలామ్ = పర్వతములతో కూడిన, మహీం చ = భూమినీ, పూరయన్ = నింపుచు, సమేతైః = కలిసి వచ్చిన, బలైః సహ = సేనలతో కూడినవా డై, తోరణస్థితమ్ = తోరణము వద్ద ఉన్నవాడు, సమర్థమ్ = సమర్థుడూ, ఆసీనమ్ = కూర్చొని ఉన్నవాడూ అయిన, మహాకపిమ్ = హనుమంతుని, ఉపాగమత్ = సమీపించెను

తా. ఆ అక్షకుమారుడు కలిసి వచ్చిన సైన్యముతో, అశ్వ గజ మహా రథముల ధ్వనులతో ఆకాశమును, పర్వతాలతో కూడిన భూమిని నింపుచు వచ్చి తోరణమువద్ద కూర్చున్న, సమర్థు డైన హనుమంతుని సమీపించెను. 7

మూ. స తం సమాసాద్య హరిం హరీక్షణో
యుగాన్తకాలాగ్నిమివ ప్రజాక్షయే,
అవస్థితం విస్మితజాతసంభ్రమః
సమైక్షతాక్షో బహుమానచక్షుషా. 8

ప్ర. అ. హర్యక్షః = సింహము వంటి నేత్రములు గల, సః అక్షః = ఆ అక్షుడు, ప్రజాక్షయే = ప్రజలను నశింపచేయుటయందు (కు), అవస్థితమ్ = నిలచి ఉన్న, కాలాగ్నిమ్ ఇవ = ప్రళయకాలాగ్ని వలె ఉన్న, తమ్ = ఆ, హరిమ్ హనుమంతుని, సమాసాద్య = సమీపించి, విస్మితజాతసంభ్రమః = ఆశ్చర్యపడిన వాడై, పుట్టిన తొందర కలవాడై, బహుమానచక్షుషా = గౌరవదృష్టితో, సమైక్షత = చూచెను.

తా. సింహము వంటి నేత్రములు గల ఆ అక్షకుమారుడు, ప్రజలను నశింపచేయుటకు సిద్ధముగా ఉన్న ప్రళయకాలాగ్ని వలె ఉన్న హనుమంతుని సమీపించి, ఆశ్చర్యచకితు డై, గౌరవదృష్టితో చూచెను. 8

మూ. స తస్య వేగం చ కపేర్మహాత్మనః
పరాక్రమం చారిషు పార్థివాత్మజః,
విధారయన్ స్వం చ బలం మహాబలో
హిమక్షయే సూర్య ఇవాభివర్ధతే. 9

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, పార్థివాత్మజః = రాజకుమారుడైన, సః = ఆ అక్షకుమారుడు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య కపేః = ఆ హనుమంతునియొక్క, వేగం చ = వేగమును, అరిషు = శత్రువుల విషయము నందు, పరాక్రమం చ = పరాక్రమమును, స్వమ్ = తన సంబంధమైన, బలం చ = బలమును, విధారయన్ = అంచనావేసికొనుచు, హిమక్షయే = మంచు తొలగిన పిమ్మట, సూర్య ఇవ = సూర్యుడు వలె, అభివర్ధతే = వృద్ధి పొందెను.

తా. గొప్ప బలము గల ఆ రాజకుమారుడైన అక్షకుమారుడు, మహాత్ముడైన ఆ హనుమంతుని వేగమును, శత్రువుల విషయమున అతడు చూపుచున్న పరాక్రమమును, తన కున్న బలమును అంచనా వేసికొనుచు, మంచు తొలగిన సూర్యుడు వలె వృద్ధి పొందెను. 9

మూ. స జాతమన్యుః ప్రసమీక్ష్య విక్రమం
స్థిరం స్థిరః సంయతి దుర్నివారణమ్,

సమాహితాత్మా హనుమన్తమాహవే
ప్రచోదయామాస శరైస్త్రిభిః శితైః.

ప్ర. అ. సంయతి = యుద్ధమునందు, దుర్నివారణమ్ = నివారింప శక్యము కాని, స్థిరమ్ = స్థిర మైన, విక్రమమ్ = (హనుమంతుని), పరాక్రమమును, ప్రసమీక్ష్య = చూచి, సః = అక్షకుమారుడు, జాతమన్యుః = పుట్టిన కోపము కలవాడై, స్థిరః = స్థిరు డై, సమాహితాత్మా = సావధాన మైన చిత్తము కలవా డై, హనుమన్తమ్ = హనుమంతుని, శితైః = వాడియైన, త్రిభిః శరైః = మూడు బాణములచేత, ఆహవే = యుద్ధమునందు, ప్రచోదయామాస = ప్రేరేపించెను.

తా. ఆ అక్షకుమారుడు యుద్ధములో నివారింప శక్యము కాని, చలనము లేని, హనుమంతుని పరాక్రమమును చూచి, కోపించినవా డై తాను కూడ స్థిరుడై, సావధాన మైన మనస్సుతో, వాడి యైన మూడు బాణములు ప్రయోగించి హనుమంతుని యుద్ధానికి పురిగొల్పెను. 10

మూ. తతః కపిం తం ప్రసమీక్ష్య గర్వితం
జితశ్రమం శత్రుపరాజయోర్జితమ్,
అవైక్షతాక్షః సముదీర్ణమానసః
సబాణపాణిః ప్రగృహీతకార్ముకః. 11

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః అక్షః = ఆ అక్షకుమారుడు, గర్వితమ్ = గర్వించినవాడు, శత్రుపరాజయోర్జితమ్ = శత్రువుల పరాజయముచేత విజృంభించినవాడూ అయిన, తం కపిమ్ = ఆ హనుమంతుని, జితశ్రమమ్ = జయించబడిన శ్రమ కలవానినిగా, ప్రసమీక్ష్య = గ్రహించి, బాణపాణిః = బాణములు హస్తమునందు కలవాడై, ప్రగృహీతకార్ముకః = గ్రహింపబడిన ధనస్సు కలవాడై, సముదీర్ణమానసః = గర్వించిన మనస్సు కలవా డై, అవైక్షత = చూచెను.

తా. ఆ హనుమంతుడు గర్వితు డై, శత్రువులను జయించుటచే విజృంభించినవాడై, శ్రమ ఏ మాత్రము లేకుండ ఉన్నా డని గ్రహించిన ఆ అక్షకుమారుడు బాణములను ధనస్సును ధరించి, ఉత్సాహపూర్ణ మైన మనస్సుతో అతనిని చూచెను. 11

మూ. స హేమనిష్కాఙ్గదచారుకుణ్డలః
సమాససాదాశుపరాక్రమః కపిమ్,
తయోర్బభూవాప్రతిమః సమాగమః
సురాసురాణామపి సంభ్రమప్రదః. 12

ప్ర. అ. ఆశుపరాక్రమః = శీఘ్ర మైన పరాక్రమము గల, హేమనిష్కాఙ్గదచారుకుణ్డలః = బంగారు కంఠాలంకారము, బాహుపురులు, అంద మైన కుండలములు గల, సః = అక్షకుమారుడు, కపిమ్ = హనుమంతుని, సమాససాద = సమీపించెను. తయోః = వారిద్దరియొక్క, అప్రతిమః = సాటి లేని, సమాగమః = యుద్ధములో కలియుట, సురాసురాణామపి = సురులకు అసురులకు కూడ, సంభ్రమప్రదః = తొందరను కలిగించేది, అభూత్ = ఆయెను.

తా. బంగారు కంఠసూత్రము, బాహుపురులు, అంద మైన కుండలములు ధరించినవాడు, శీఘ్రముగా పరాక్రమమును చూపువాడు అయిన ఆ అక్ష కుమారుడు, హనుమంతుని సమీపించెను. సాటి లేని వారి కలయిక, దేవాసురులకు కూడ ఆశ్చర్యము కలిగించేదిగా ఉండెను. 12

మూ. రరాస భూమిర్న తతాప భానుమాన్
వవౌ న వాయుః ప్రచచాల చాచలః,
కపేః కుమారస్య చ వీక్ష్య సంయుగం
ననాద చ ద్యౌరుదధిశ్చ చుక్షుభే. 13

ప్ర. అ. కపేః = హనుమంతునియొక్క, కుమారస్య చ = అక్షకుమారుని యొక్క, సంయుగమ్ = యుద్ధమును, వీక్ష్య = చూచి, భూమిః = భూమి, రరాస = ధ్వని చేసెను. భానుమాన్ = సూర్యుడు, న తతాప = ప్రకాశించలేదు. వాయుః = వాయువు, న వవౌ = వీచలేదు. అచలః చ = పర్వతము కూడా, ప్రచచాల = చలించెను. ద్యౌః = ఆకాశము, ననాద చ = ధ్వనిచేసెను. ఉదధిశ్చ = సముద్రము కూడ, చుక్షుభే = క్షోభించెను.

తా. హనుమంతుడు, అక్షకుమారుడు చేయుచున్న యుద్ధమును చూచి భూమి దద్దరిల్లెను. సూర్యుడు ప్రకాశించలేదు. వాయువు వీచలేదు. పర్వతము కూడ చలించెను. ఆకాశము ధ్వనించెను. సముద్రము కూడ క్షోభ చెందెను. 13

మూ. తతః స వీరః సుముఖాన్ పతత్రిణః
సువర్ణపుఙ్ఖాన్ సవిషానివోరగాన్,
సమాధిసంయోగవిమోక్షతత్త్వవి
చ్ఛరానథ త్రీన్ కపిమూర్ధ్న్యపాతయత్. 14

ప్ర. అ. తతః = అప్పుడు, అథ = అటు పిమ్మట, వీరః = వీరుడు, సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్ = గురిపెట్టుట, బాణము సంధించుట, విడచుట, వీటి తత్త్వము ఎఱిగిన, సః = అక్షకుమారుడు, సుముఖాన్ = మంచి అగ్రములు కలవి, సువర్ణపుఙ్ఖాన్ = బంగారు పొన్నులు కలవి, పతత్రిణః = రెక్కలు గలవి, సవిషాన్ = విషముతో కూడిన, ఉరగానివ = సర్పముల వలె ఉన్నవి అయిన, త్రీన్ = మూడు, శరాన్ = బాణములను, కపిమూర్ధ్ని = హనుమంతుని శిరస్సుపై, అపాతయత్ = పడవేసెను.

తా. అప్పుడు సరిగా గురి చూచి, బాణములను బాగుగా సంధించి విడచుటలో మంచి నేర్పు గల వీరుడైన ఆ అక్షకుమారుడు, మంచి అగ్రభాగములు, రెక్కలు, బంగారుపొన్నులు ఉన్నవి, విషముతోకూడిన సర్పముల వలె ఉన్నవి అయిన మూడు బాణములతో హనుమంతుని శిరస్సుపై కొట్టెను. 14

మూ. స తైః శరైర్మూర్ధ్ని సమం నిపాతితైః
క్షరన్నసృగ్దిగ్ధవివృత్తలోచనః,
నవోదితాదిత్యనిభః శరాంశుమాన్
వ్యరాజతాదిత్య ఇవాంశుమాలికః. 15

ప్ర. అ. సమమ్ = ఒకే సమయమునందు, మూర్ధ్ని = శిరస్సుమీద, నిపాతితైః = పడవేయబడిన, తైః శరైః = ఆ బాణములచేత, క్షరన్ = రక్తమును స్రవించుచున్నవాడు, అసృగ్దిగ్ధవివృత్తలోచనః = రక్తముచేత పూయబడిన తిరిగిపోవుచున్న నేత్రములు గలవాడు, నవోదితాదిత్యనిభః = నూతనముగా ఉదయించిన సూర్యునితో సమానుడు, శరాంశుమాన్ = శరములే కిరణములుగా కలవాడు అయిన, సః = ఆ హనుమంతుడు, అంశుమాలికః = కిరణముల పంక్తి గల, ఆదిత్య ఇవ = సూర్యుడు వలె, వ్యరాజత = ప్రకాశించెను.

తా. ఒకే సమయమునందు మూడు బాణములతో శిరస్సుమీద కొట్టుటచే

ఆ హనుమంతుని ముఖమునుండి రక్తము స్రవించెను. రక్తముతో తడిసి తిరిగి పోవుచున్న కళ్ళతో, బాణము లనే కిరణములతో కూడిన అతడు అప్పుడే ఉదయించిన సూర్యుడు వలె ఉండెను. 15

మూ. తతః స పిఙ్గాధిపమన్త్రిసత్తమః
సమీక్ష్య తం రాజవరాత్మజం రణే,
ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకం
జహర్ష చాపూర్యత చాహవోన్ముఖః. 16

ప్ర. అ. తతః = అటు పిమ్మట. సః = ఆ, పిఙ్గాధిపమన్త్రిసత్తమః = వానరరాజైన సుగ్రీవుని మన్త్రులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు, ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకమ్ = గొప్పవైన విచిత్రములైన ఆయుధములు, చిత్రమైన ధనస్సు గల, తమ్ = ఆ, రాజవరాత్మజమ్ = రాజకుమారుని, రణే = యుద్ధమునందు, సమీక్ష్య = చూచి, జహర్ష = సంతోషించెను. ఆహవోన్ముఖః = యుద్ధము చేయుటకు అభిముఖుడై, ఆపూర్యత చ = లావెక్కెను.

తా. సుగ్రీవుని మంత్రులలో శ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు, ఉత్తమములైన విచిత్రములైన ఆయుధములతోను, చిత్రమైన ధనస్సుతోను యుద్ధానికి వచ్చిన ఆ అక్షకుమారుని చూచి, సంతోషించుచు, యుద్ధోన్ముఖుడై దేహమును పెంచెను. 16

మూ. స మన్దరాగ్రస్థ ఇవాంశుమాలీ
వివృద్ధకోపో బలవీర్యసంయుతః,
కుమారమక్షం సబలం సవాహనం
దదాహ నేత్రాగ్నిమరీచిభిస్తదా. 17

ప్ర. అ. మన్దరాగ్రస్థః = మందరపర్వతశిఖరముపై ఉన్న, అంశుమాలీ ఇవ = సూర్యుడు వలె ఉన్న, బలవీర్యసంయుతః = బలముతోను, పరాక్రమముతోను కూడిన, సః = ఆ హనుమంతుడు, వివృద్ధకోపః = వృద్ధిపొందిన కోపము కలవాడై, సబలమ్ = సైన్యముతో కూడినవాడూ, సవాహనమ్ = వాహనముతో కూడినవాడూ అయిన, కుమారమ్ = కుమారుడైన, అక్షమ్ = అక్షుణ్ణి,

తదా = అప్పుడు, నేత్రాగ్నిమరీచిభిః = నేత్రాగ్నికిరణములచేత, దదాహ = కాల్చివేసెను.

తా. మందరపర్వతశిఖరాగ్రముపై ఉన్న సూర్యుని వలె ఉన్నవాడు, బలపరాక్రమములు కలవాడు అయిన ఆ హనుమంతుడు అత్యధిక మైన కోప ముతో అప్పుడా అక్షకుమారుని, అతని సేనను, వాహనములను నేత్రములం దున్న అగ్నికిరణములతో కాల్చివేయుచు న్నట్లు చూచెను. 17

మూ. తతః స బాణాసనచిత్రకార్ముకః
శరప్రవర్షో యుధి రాక్షసామ్బుదః,
శరాన్ముమోచాశు హరీశ్వరాచలే
వలాహకో వృష్టిమివాచలోత్తమే. 18

ప్ర. అ. తతః = అటు పిమ్మట, బాణాసనచిత్రకార్ముకః = ధనస్సు అనే చిత్రవర్ణ మైన ధనస్సు (ఇంద్రధనస్సు) గల, శరప్రవర్షః = బాణము లనే అధికవర్షము గల, సః రాక్షసామ్బుదః = ఆ రాక్షసు డనే మేఘము, యుధి = యుద్ధమునందు, ఆశు = శీఘ్రముగా, హరీశ్వరాచలే = హనుమంతుడనే పర్వత ముపై, వలాహకః = మేఘము, అచలోత్తమే = ఉన్నత మైన పర్వతముపై, వృష్టిమివ = వర్షమును వలె, శరాన్ = బాణములను, ముమోచ = విడచెను

తా. ధనస్సు అనే ఇంద్రధనస్సు ధరించి, బాణవర్ష మనే వర్షము కురి పించుచున్న ఆ రాక్షసుడనే మేఘము, ఉన్నత మైన పర్వతముమీద మేఘము వర్షము కురిపించి నట్లు, ఆ హనుమంతునిమీద వెంటనే బాణములు కురిపించెను.

మూ. తతః కపిస్తం రణచణ్డవిక్రమం
వివృద్ధతేజోబలవీర్యసంయుతమ్,
కుమారమక్షం ప్రసమీక్ష్య సంయుగే
ననాద హర్షాద్ఘనతుల్యవిక్రమమ్. 19

ప్ర. అ. తతః = అటు పిమ్మట, కపిః = హనుమంతుడు, రణచణ్డవిక్ర మమ్ = రణమునందు తీవ్ర మైన పరాక్రమము కలవాడు, వివృద్ధతేజోబలవీర్య సంయుతమ్ = వృద్ధి పొందిన తేజస్సుతోను, బలముతోను, పరాక్రమముతోను

కూడినవాడు, ఘనతుల్యవిక్రమమ్ = మేఘముతో సమాన మైన ఆకాశగమనము గలవాడు అయిన, తమ్ = ఆ, కుమారమ్ అక్షమ్ = అక్షకుమారుని, సంయుగే = యుద్ధమునందు, ప్రసమీక్ష్య = చూచి, హర్షాత్=సంతోషమువలన, ననాద= ధ్వనిచేసెను.

తా. పిమ్మట ఆ హనుమంతుడు యుద్ధమునందు తీవ్ర మైన పరాక్రమము కలవాడు, వృద్ధిపొందిన తేజస్సు, బలము, వీర్యము కలవాడు, మేఘమువలె ఆకాశమునందు నడుచుటకు సమర్థుడు అయిన ఆ అక్షకుమారుడు యుద్ధమునకు వచ్చుట చూచి సంతోషముతో ధ్వని చేసెను. 19

మూ. స బాలభావాద్యుధి వీర్యదర్పితః
ప్రవృద్ధమన్యుః క్షతజోపమేక్షణః,
సమాససాదాప్రతిమం కపిం రణే
గజో మహాకూపమివావృతం తృణైః. 20

ప్ర. అ. బాలభావాత్ = బాలు డగుటవలన, యుధి = యుద్ధమునందు, వీర్యదర్పితః=పరాక్రమముచేత గర్వించినవాడు, ప్రవృద్ధమన్యుః=వృద్ధిపొందిన కోపము గలవాడు, క్షతజోపమేక్షణః=రక్తముతో సమాన మైన నేత్రములు కలవాడు అయిన, సః = ఆ అక్షకుమారుడు, రణే = యుద్ధమునందు, అప్రతిమమ్ =సాటిలేని, కపిమ్ = హనుమంతుని, గజః = ఏనుగు, తృణైః=తృణములచేత, ఆవృతమ్ = కప్పబడిన, మహాకూపమివ = పెద్ద కూపమును వలె, సమాససాద = సమీపించెను.

తా. చిన్నవా డగుటచే, యుద్ధములో పరాక్రమముచేత గర్వించిన ఆ అక్షకుమారుడు, అధిక మైన కోపముతో, కన్నులు రక్తము వలె ఎఱ్ఱవడగా గడ్డిచే కప్పబడి యున్న మహాకూపమును ఏనుగు వలె, యుద్ధములో సాటి లేని ఆ హనుమంతుని సమీపించెను. 20

మూ. స తేన బాణైః ప్రసభం నిపాతితై
శ్చకార నాదం ఘననాదనిఃస్వనః
సముత్పపాతాశు నభః స మారుతి
ర్భుజోరువిక్షేపణఘోరదర్శనః. 21

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, తేన = అక్షకుమారునిచేత, ప్రసభమ్ = బలపూర్వకముగా, నిహితైః = వేయబడిన, బాణైః = బాణములచేత, ఘనస్వనః = మేఘధ్వని వంటి ధ్వని కలవాడై, నాదమ్ = ధ్వనిని, చకార = చేసెను. సః మారుతిః = ఆ హనుమంతుడు, భుజోరువిక్షేపణఘోరదర్శనః = భుజములను, తొడలను విసరుటచే భయంకరమైన దర్శనము కలవాడై, ఆశు = శీఘ్రముగా, నభః = ఆకాశమును గూర్చి, సముత్పపాత = ఎగిరెను.

తా. ఆ అక్షకుమారుడు బాణములతో బలపూర్వకముగా కొట్టుటచే ఆ హనుమంతుడు ఉరుముల వంటి ధ్వనితో గొప్ప ధ్వని చేసి, చూచువారికి భయము కలుగునట్లుగా కాళ్ళు చేతులు విసరుచు, శీఘ్రముగా ఆకాశముపైకి ఎగిరెను. 21

మూ. సముత్పతన్తం సమభిద్రవద్బలీ
స రాక్షసానాం ప్రవరః ప్రతాపవాన్.
రథీ రథిశ్రేష్ఠతమః కిరన్ శరైః
పయోధరః శైలమివాశ్మవృష్టిభిః. 22

ప్ర. అ. బలీ = బలవంతుడు, రాక్షసానామ్ = రాక్షసులలో, ప్రవరః = శ్రేష్ఠుడు, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడు, రథీ = రథికుడు, రథిశ్రేష్ఠతమః = రథికులలో శ్రేష్ఠుడు అయిన, సః = ఆ అక్షకుమారుడు, పయోధరః = మేఘము, అశ్మవృష్టిభిః = వడగళ్ళవానచేత, శైలమివ = పర్వతమును వలె, శరైః = బాణములతో, కిరన్ = చిమ్ముచు, ఉత్పతన్తమ్ = పైకి ఎగురుచున్న ఆ హనుమంతుని, సమభిద్రవత్ = తరుముచు వెళ్లెను.

తా. బలవంతుడు, రాక్షసులలో శ్రేష్ఠుడు, ప్రతాపవంతుడు, రథికుడు, రథికులలో శ్రేష్ఠుడు అయిన ఆ అక్షకుమారుడు పైకి ఎగురుచున్న ఆ హనుమంతునిపై, మేఘము పర్వతముపైన వడగళ్లు కురిపించునట్లు బాణములు కురిపించుచు, అతని వెనువెంటనే పైకి వెళ్లెను. 22

మూ. స తాన్ శరాంస్తస్య హరిర్విమోక్షయం
శ్చచార వీరః పథి వాయుసేవితే,
శరాన్తరే మారుతవద్వినిష్పత
న్మనోజవః సంయతి భీమవిక్రమః. 23

ప్ర. అ. మనోజవః = మనస్సు వంటి వేగము గలవాడు, సంయతి = యుద్ధమునందు, చణ్డవిక్రమః = తీవ్ర మైన పరాక్రమము కలవాడు, వీరః = వీరుడు అయిన, సః హరిః = ఆ హనుమంతుడు, శరాన్తరే = బాణముల మధ్య, మారుతవత్ = వాయువు వలె, వినిష్పతన్ = తిరుగుచు, తస్య = ఆ అక్షకుమారుని యొక్క, శరాన్ = బాణములను, విమోక్షయన్ = విడిపించుకొనుచు, వాయుసేవితే = వాయువుచేత సేవింపబడిన, పథి = మార్గమునందు, చచార = సంచరించెను.

తా. మనోవేగము వంటి వేగము గలవాడు, యుద్ధమునందు తీవ్ర మైన పరాక్రమము గలవాడు, మహావీరుడు అయిన ఆ హనుమంతుడు, బాణమునకు బాణమునకూ మధ్య వాయువు వలె తిరుగుచు అతని బాణములనుండి తప్పించుకొనుచు, ఆకాశ మార్గమునందు సంచరించెను. 23

మూ. తమాత్తబాణాసనమాహవోన్ముఖం
ఖమాస్తృణన్తం విశిఖైః శరోత్తమైః,
అవైక్షతాక్షం బహుమానచక్షుషా
జగామ చిన్తాం చ స మారుతాత్మజః. 24

ప్ర. అ. సః మారుతాత్మజః = ఆ హనుమంతుడు, ఆత్తబాణాసనమ్ = గ్రహింపబడిన ధనస్సు కలవాడు, ఆహవోన్ముఖమ్ = యుద్ధమునకు సన్నద్ధుడూ, విశిఖైః = అనేకవిధము లైన అగ్రభాగములు గల, శరోత్తమైః = ఉత్తమము లైన బాణములచేత, ఖమ్ = ఆకాశమును, ఆస్తృణన్తమ్ = ఆచ్ఛాదించుచున్నవాడు అయిన, తమ్ = ఆ, అక్షమ్ = అక్షుణ్ణి, బహుమానచక్షుషా = గౌరవభావముతో కూడిన దృష్టితో, అవైక్షత = చూచెను, చిన్తాం చ = చింతను కూడ, జగామ = పొందెను.

తా. ఆ అక్షకుమారుడు ధనుర్ధరుడై, యుద్ధము చేయుటకు సన్నద్ధుడై, అనేకవిధము లైన అగ్రభాగము లున్న శ్రేష్ఠ మైన బాణాలతో ఆకాశము నంతనూ కప్పివేయుచుండగా హనుమంతుడు అతనిని గౌరవభావముతో చూచుచు, ఆలోచనలో పడెను. 24

మూ. తతః శరైర్భిన్నభుజాన్తరః కపిః
కుమారవీరేణ మహాత్మనా నదన్,
మహాభుజః కర్మవిశేషతత్త్వవి
ద్విచిన్తయామాస రణే పరాక్రమమ్. 25

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాభుజః = గొప్ప భుజములు గల వాడు, కర్మవిశేషతత్త్వవిత్ = పనులలోని విశేషముల యథార్థస్వరూపమును గుర్తించగలవాడు అయిన, కపిః = హనుమంతుడు, మహాత్మనా = మహాత్ము డైన, కుమారవీరేణ = వీరు డైన ఆ అక్షకుమారునిచేత, భిన్నభుజాన్తరః = భేదింపబడిన వక్షస్థలము కలవాడై, నదన్ = ధ్వనిచేయుచు, రణే = యుద్ధమునందు, పరాక్రమమ్ = శత్రువుయొక్క ఆక్రమణమును గూర్చి, విచిన్తయామాస = ఆలోచించెను.

తా. అప్పుడు మహాభుజుడు, ఆయా కార్యముల యథార్థస్వరూపము తెలిసినవాడూ అయిన ఆ హనుమంతుడు, మహాత్ముడు, వీరుడూ అయిన ఆ అక్షకుమారుడు బాణములతో వక్షస్థలమును చీల్చివేయుచుండగా, యుద్ధములో ఈ శత్రువును ఎట్లు ఆక్రమించవలెనా అని ఆలోచించెను. 25

మూ. అబాలవద్బాలదివాకరప్రభః
కరోత్యయం కర్మ మహన్మహాబలః,
న చాస్య సర్వాహవకర్మశోభినః
ప్రమాపణే మే మతిరత్ర జాయతే. 26

ప్ర. అ. బాలదివాకరప్రభః = బాలసూర్యుని వంటి కాంతి గల వాడు, మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, అయమ్ = ఇతడు, అబాలవత్ = ఆరితేరిన యువకుడు వలె, మహత్ = గొప్ప, కర్మ = కార్యము, కరోతి = చేయుచున్నాడు. అత్ర = ఇక్కడ, సర్వాహవకర్మశోభినః = సమస్త మైన యుద్ధ కార్యములచే శోభించుచున్న, అస్య = ఈతనియొక్క, ప్రమాపణే = చంపుట యందు, మే = నాయొక్క, మతిః = బుద్ధి, న చ జాయతే = పుట్టుటలేదు.

తా. "బాలసూర్యుని వంటి కాంతి గల, మహాబలు డైన ఈ అక్షకుమారుడు ఆరితేరిన యువకుడు వలె కార్యములు చేయుచున్నాడు. యుద్ధములో చేయ

దగిన అన్ని పనులను చక్కగా నిర్వహించుచున్నాడు. ఇప్పు డితనిని చంపుటకు నాకు మనసొప్పుటలేదు.''   26

మూ. అయం మహాత్మా చ మహాంశ్చ వీర్యతః
సమాహితశ్చాతిసహశ్చ సంయుగే,
అసంశయం కర్మగుణోదయాదయం
సనాగయక్షైర్మునిభిశ్చ పూజితః.   27

ప్ర. అ. అయమ్ = ఇతడు, మహాత్మా చ = గొప్ప బుద్ధి కలవాడు, వీర్యతః చ = వీర్యమువలన కూడ. మహాన్ = గొప్పవాడు. సమాహితః = సావధానచిత్తుడు. సంయుగే = యుద్ధమునందు, అతిసహః = చాల శ్రమను సహించ సమర్థుడు. అయమ్ = ఇతడు. అసంశయమ్ = నిఃసంశయముగా, కర్మగుణోదయాత్ = కార్యములందు అభివృద్ధి కలుగుటవలన, సనాగయక్షైః = నాగయక్షులతో కూడిన, మునిభిశ్చ = మునులచేత కూడ, పూజితః = పూజింపబడినవాడు.

తా. ''ఇతడు మహాబుద్ధిశాలి. పరాక్రమముచేత కూడ గొప్పవాడు. సావధానమైన చిత్తము కలవాడు యుద్ధములో ఎంత శ్రమ నైనను సహించగలవాడు. కార్యములలో చూపుచున్న నేర్పును బట్టి ఇతనిని నాగులు, యక్షులు, మునులు మొదలగువారు కూడ తప్పక మెచ్చుకొందురు."   27

మూ. పరాక్రమోత్సాహవివృద్ధమానసః
సమీక్షతే మాం ప్రముఖాగ్రతః స్థితః,
పరాక్రమో హ్యస్య మనాంసి కమ్పయే
త్సురాసురాణామపి శీఘ్రగామినః.   28

ప్ర. అ. పరాక్రమోత్సాహవివృద్ధమానసః = పరాక్రమముచేత, ఉత్సాహముచేత వృద్ధి పొందిన మనస్సు కలవాడై, ప్రముఖాగ్రతః = ఎదుట దగ్గరగా, స్థితః = నిలిచినవాడై, మామ్ = నన్ను, సమీక్షతే = చూచుచున్నాడు. శీఘ్రగామినః = శీఘ్రముగా సంచరించు, అస్య = ఇతనియొక్క, పరాక్రమః = పరాక్రమము, సురాసురాణామ్ = సురులయొక్క అసురులయొక్క, మనాంసి అపి = మనస్సులను కూడ, ప్రకమ్పయేత్ = కంపింపచేయును.

తా. "ఈతడు నాకు చాల దగ్గరగా నిలచి, పరాక్రమోత్సాహములతో వృద్ధి పొందిన మనస్సుతో, నన్ను చూచుచున్నాడు అతిక్రమముగా పనులు చేయు ఈతని పరాక్రమము చూచి సురాసురుల మనస్సులు కూడ భయపడును".

మూ. న ఖల్వయం నాభిభవేదుపేక్షితః
పరాక్రమో హ్యస్య రణే వివర్ధతే,
ప్రమాపణం త్వేవ మమాద్య రోచతే
న వర్ధమానోఽగ్నిరుపేక్షితుం క్షమః 29

ప్ర. అ. అయమ్ = ఇతడు, ఉపేక్షితః = ఉపేక్షించబడినవాడై, నాభిభవేత్ న ఖలు = తిరస్కరించడను మాట లేదు. రణే=యుద్ధమునందు, అస్య = వీనియొక్క, పరాక్రమః = పరాక్రమము, వర్ధతే హి = వృద్ధిపొందుచున్నది కదా. అద్య = ఇప్పుడు, ప్రమాపణం త్వేవ = ఇతనిని చంపుటే, మమ = నాకు, రోచతే = ఇష్టమగుచున్నది. వర్ధమానః = వృద్ధి పొందుచున్న, అగ్నిః=అగ్ని, ఉపేక్షితుమ్ = ఉపేక్షించుటకు, న క్షమః = తగినది కాదు.

తా. "ఇంక ఈతనిని ఉపేక్షించినచో ఇతడు తప్పక నన్ను తిరస్కరించును. ఎందుచేతననగా, రణములో ఈతని పరాక్రమము పెరిగిపోవుచున్నది. అందుచేత ఇప్పు డీతని చంపుటయే మంచిది. పెరిగిపోవుచున్న అగ్నిని ఉపేక్షింపకూడదు కదా।" 29

మూ ఇతి ప్రవేగం తు పరస్య చిన్తయన్
స్వకర్మయోగం చ విధాయ వీర్యవాన్,
చకార వేగం తు మహాబలస్తదా
మతిం చ చక్రేఽస్య వధే మహాకపిః. 30

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతుడు. మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, మహాకపిః = హనుమంతుడు, ఇతి=ఇట్లు, పరస్య=శత్రువు యొక్క, ప్రవేగమ్ = వేగమును, చిన్తయన్ = ఆలోచించుచు, స్వకర్మయోగం చ = తన కార్యముయొక్క యోగమును (ఆలోచనను) కూడ, విధాయ = చేసి, తదా=అప్పుడు, వేగమ్=వేగమును, చకార = చేసెను. అస్య=ఈతనియొక్క, వధే = వధయందు, మతిం చ = బుద్ధిని కూడ, చక్రే = చేసెను.

తా. పరాక్రమవంతుడు, మహాబలశాలి అయిన హనుమంతుడు ఈ విధముగా శత్రువు బలమును గూర్చి ఆలోచించి, తాను చేయవలసిన కార్యము ఆలోచన కూడ చేసి, వేగమును చూపించెను. అతనిని చంపుటకు కూడ నిర్ణయము చేసికొనెను. 30

మూ. స తస్య తానష్టహయాన్ మహాజవాన్
సమాహితాన్ భారసహాన్వివర్తనే,
జఘాన వీరః పథి వాయుసేవితే
తలప్రహారైః పవనాత్మజః కపిః. 31

ప్ర. అ. వీరః=వీరుడు, పవనాత్మజః=వాయుపుత్రుడు అయిన, సః కపిః=ఆ హనుమంతుడు, వాయుసేవితే=వాయువుచేత సేవింపబడిన, పథి=మార్గమునందు, మహాజవాన్ = గొప్ప వేగము గలవి, సమాహితాన్ = జాగరూకతతో కూడినవి, వివర్తనే=మలుపులు తిరుగుటయందు, భారసహాన్=భారమును మోయ గల్గినవి అయిన, తాన్ = ఆ, అష్ట = అరు, హయాన్ = అశ్వములను, తలప్రహారైః = అరచేతుల దెబ్బలచే, జఘాన = చంపెను.

తా. వీరుడైన ఆ హనుమంతుడు, ఆకాశమార్గములో, మహావేగము గలవి, జాగరూకతతో కూడినవి, మలుపులు తిరుగునపుడు రథభారమును మోయుటలో సమర్థమైనవి, అయిన ఎనిమిది గుఱ్ఱములను అరచేతులతో కొట్టి చంపెను. 31

మూ. తతస్తలేనాభిహతో మహారథః
స తస్య పిఙ్గాధిపమన్త్రినిర్జితః,
ప్రభగ్ననీడః పరిముక్తకూబరః
పపాత భూమౌ హతవాజిరమ్బరాత్. 32

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తలేన = అరచేతితో, అభిహతః=కొట్టబడినదీ, పిఙ్గాధిపమన్త్రినిర్జితః = వానరరాజైన సుగ్రీవుని మంత్రియైన హనుమంతుని చేత జయింపబడినదీ అయిన, తస్య = అక్షకుమారునియొక్క, మహారథః=గొప్ప రథము, ప్రభగ్ననీడః=విరగగొట్టబడిన లోపలి భాగము కలదై,

పరిముక్తకూబరః = ఊడిపోయిన పొరవు కళ్లు కలదై, హతవాజీః = చంపబడిన అశ్వములు గలదై, అమ్బరాత్ = ఆకాశమునుండి, భూమౌ = నేలమీద, పపాత = పడెను.

తా. అపుడు హనుమంతుడు అరచేతితో కొట్టగా ఆ అక్షకుమారుని రథము తోపలిభాగము విరిగిపోయి, నిలువుకూళము ఊడిపోయి, గుఱ్ఱములు మరణించగా ఆకాశమునుండి నేలమీద పడెను. ౩౨

మూ. స తం పరిత్యజ్య మహారథో రథం
సకార్ముకః ఖడ్గధరః ఖముత్పతన్,
తపోభియోగాదృషిరుగ్రవీర్యవాన్
విహాయ దేహం మరుతామివాలయమ్. ౩౩

ప్ర. అ. మహారథః = మహారథు డైన, సః = ఆ అక్షకుమారుడు, రథమ్ = రథమును, పరిత్యజ్య = విడచి, సకార్ముకః = ధనస్సుతో కూడినవా డై, ఖడ్గధరః = ఖడ్గమును ధరించినవాడై, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పతన్ = ఎగురుచు, ఉగ్రవీర్యవాన్ = ఉగ్ర మైన తపశ్శక్తి కలవాడు, దేహమ్ = దేహమును, విహాయ = విడచి, తపోభియోగాత్ = తప స్సంబంధమువలన, మరుతామ్ = దేవతల యొక్క, ఆలయమ్ = నివాస మైన స్వర్గమును గూర్చి ఎగురుచున్న వాడు అయిన, ఋషిః ఇవ = ఋషి వలె, (అదృశ్యత = చూడబడెను).

తా. మహారథు డైన ఆ అక్షకుమారుడు రథమును విడచి, ధనస్సు, ఖడ్గము చేత ధరించి, ఆకాశము మీదికి ఎగిరెను. అపు డాతడు ఉగ్ర మైన తపః శక్తిగలవా డై, తపఃప్రభావము చేత స్వర్గలోకమునకు ఎగిరి వెళ్లుచున్న ఋషి వలె కనబడెను. ౩౩

మూ. తతః కపిస్తం విచరన్తమమ్బరే
పతత్త్రిరాజానిలసిద్ధసేవితే,
సమేత్య తం మారుతతుల్యవిక్రమః
క్రమేణ జగ్రాహ స పాదయోర్దృఢమ్. ౩౪

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మారుతతుల్యవిక్రమః = వాయువుతో

సమాన మైన పరాక్రమము గల, కపిః = హనుమంతుడు, పతత్రిరాజానిలసిద్ధ సేవితే = గరుత్మంతునిచేత, వాయువుచేత, సిద్ధులచేత సేవింపబడిన, అమ్బరే= ఆకాశమునందు, విచరన్తమ్ = సంచరించుచున్న, తమ్ = ఆతనిని, సమేత్య= సమీపించి, క్రమేణ = క్రమముచేత, తమ్ = ఆతనిని, పాదయోః = పాదముల యందు, దృఢమ్ = గట్టిగా, జగ్రాహ = పట్టుకొనెను.

తా. వాయువుతో సమాన మైన పరాక్రమము గల ఆ హనుమంతుడు అప్పుడు, గరుత్మంతుడు, వాయువు, సిద్ధులు సంచరించు ఆకాశమునందు సంచరించుచున్న ఆ అక్షకుమారుని వద్దకు మెల్లగా వెళ్ళి, ఆతని పాదాలు గట్టిగా పట్టుకొనెను 34

మూ. స తం సమావిధ్య సహస్రశః కపి
ర్మహోరగం గృహ్య ఇవాణ్డజేశ్వరః,
ముమోచ వేగాత్పితృతుల్యవిక్రమో
మహీతలే సంయతి వానరోత్తమః. 35

ప్ర. అ. పితృతుల్యవిక్రమః=తన తండ్రితో సమాన మైన పరాక్రమము కలవాడు, వానరోత్తమః=వానరులలో శ్రేష్ఠుడు అయిన, సః కపిః=ఆ హనుమంతుడు, అణ్డజేశ్వరః=గరుత్మంతుడు, మహోరగమ్=మహాసర్పమును, గృహ్య ఇవ = గ్రహించి వలె, తమ్ = ఆ అక్షకుమారుని, సంయతి = యుద్ధమునందు, సహస్రశః=వెయ్యిమార్లు (అనేకపర్యాయములు), సమావిధ్య=విసిరి (త్రిప్పి), వేగాత్ =వేగమువలన (వేగముగా), మహీతలే = నేలమీద, ముమోచ = విసిరి కొట్టెను.

తా. తన తండ్రి యైన వాయుదేవుని వంటి పరాక్రమము గల, వానరోత్తము డైన ఆ హనుమంతుడు గరుత్మంతుడు మహాసర్పమును వలె, ఆ అక్షకుమారుని పట్టుకొని, ఆతనిని అనేకపర్యాయములు విసురుగా త్రిప్పి, త్రిప్పి నేల మీద వేసి కొట్టెను. 35

మూ. స భగ్నబాహూరుకటీశిరోధరః
క్షరన్నసృఙ్నిర్మథితాస్థిలోచనః,

సంభిన్నసంధిః ప్రవికీర్ణబన్ధనో
హతః క్షితౌ వాయుసుతేన రాక్షసః. 36

ప్ర. అ. సః రాక్షసః = ఆ రాక్షసుడు, భగ్నబాహూరుకటీశిరోధరః = విరిగిన బాహువులు, తొడలు, కటిప్రదేశము, కంఠము కలవాడై, అసృక్ = రక్తము, క్షరన్ = స్రవించుచు, నిర్మథితాస్థిలోచనః = మథింపబడిన ఎముకలు నేత్రములు కలవాడై, సంభిన్నసన్ధిః = విరుగగొట్టబడిన సంధులు కలవాడై, ప్రవికీర్ణబన్ధనః = శిథిల మైన శరీరబంధము కలవాడై, వాయుసుతేన = హనుమంతునిచేత, క్షితౌ = భూమిమీద, హతః = చంపబడెను.

తా. హనుమంతుడు ఆ విధముగా నేలపై కొట్టి చంపగా ఆ రాక్షసుని బాహువులు, తొడలు, కటిప్రదేశము, కంఠము విరిగిపోయెను. రక్తము స్రవించుచుండెను. ఎముకలు, కన్నులు నలిగిపోయెను. సంధులు ఊడిపోయెను. శరీరబంధమంతా శిథిల మైపోయెను. అట్టి స్థితిలో అతడు మరణించెను. 36

మూ. మహాకపిర్భూమితలే నిపీడ్య తం
చకార రక్షోధిపతేర్మహద్భయమ్,
మహర్షిభిశ్చక్రచరైర్మహావ్రతైః
సమేత్య భూతైశ్చ సయక్షపన్నగైః.
సురైశ్చ సేన్ద్రైర్భృశజాతవిస్మయైః,
ర్హతే కుమారే స కపిర్నిరీక్షితః. 37

ప్ర. అ. మహాకపిః = హనుమంతుడు, తమ్ = అతనిని, భూమితలే = నేల మీద, నిపీడ్య = నలగకొట్టి, రక్షోధిపతేః = రావణునకు, మహత్ = గొప్ప, భయమ్ = భయమును, చకార = చేసెను. కుమారే = అక్షకుమారుడు, హతే = చంపబడిన వాడగుచుండగా, సః కపిః = ఆ హనుమంతుడు, భృశజాతవిస్మయైః = అధికముగా కలిగిన ఆశ్చర్యము కల, చక్రచరైః = జ్యోతిశ్చక్రమునందు సంచరించు, మహావ్రతైః = గొప్ప వ్రతములు గల, మహర్షిభిః = మహర్షులచేత, సయక్షపన్నగైః = యక్షులతోను పన్నగులతోను కూడిన, భూతైశ్చ = భూతములచేత, సేన్ద్రైః = ఇంద్రునితో కూడిన, సురైశ్చ = దేవతలచేత, సమేత్య = కలిసి, నిరీక్షితః = చూడబడెను.

తా. అక్షకుమారుని ఆ విధముగా హనుమంతుడు సంహరించగా, జ్యోతి శ్చక్రములో సంచరించు మహానియమవంతు లైన మహర్షులు, భూతములు యక్షులు, పన్నగులు, దేవేంద్రుడు, దేవతలు, వీరందరూ కలిసి, అత్యధిక మైన ఆశ్చర్యముతో అతనిని చూచిరి. 37

మూ. నిహత్య తం వజ్రసుతోపమప్రభం
కుమారమక్షం క్షతజోపమేక్షణమ్,
తమేవ వీరోఽభిజగామ తోరణం
కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. వీరః = వీరు డైన హనుమంతుడు, వజ్రసుతోపమప్రభమ్ = ఇంద్రుని కుమారు డైన జయంతునితో సమాన మైన కాంతి కలవాడు, క్షతజోప మేక్షణమ్=రక్తముతో సమాన మైన నేత్రములు కలవాడు అయిన, తమ్ అక్షమ్ =ఆ అక్షకుమారుని, నిహత్య=చంపి, ప్రజాక్షయే = ప్రజలను సంహరించుట యందు, కృతక్షణః = చేయబడిన నిరీక్షణము గల, కాలః ఇవ = యముని వలె, తమ్=ఆ, తోరణమేవ=తోరణమునే, అభిజగామ=చేరెను.

తా. వీరు డైన హనుమంతుడు, జయంతుని వంటి కాంతి కలవాడు, రక్తము వంటి నేత్రములు కలవాడు అయిన ఆ అక్షకుమారుణ్ణి చంపి, ప్రజలను సంహరించుటకై ఓరిక చేసికొని కూర్చున్న యముడు వలె, ఆ తోరణము దగ్గరనే ఇతరరాక్షసుల రాకకై నిరీక్షించుచుండెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టచత్వారింశః సర్గః

[ఇంద్రజిత్తుతో యుద్ధము చేసి హనుమంతుడు, అతని అస్త్రములచేత బద్ధుడై రావణుని సభలోనికి వెళ్ళుట.]

మూ. తతస్తు రక్షోధిపతిర్మహాత్మా
హనూమతాక్షే నిహతే కుమారే,
మనః సమాధాయ స దేవకల్పం
సమాదిదేశేన్ద్రజితం సరోషః. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాత్మా = గొప్ప బుద్ధి గల, సః = ఆ, రక్షోధిపతిః = రాక్షసరాజు, హనూమతా = హనుమంతునిచేత, కుమారే = కుమారుడైన, అక్షే = అక్షుడు, నిహతే = చంపబడగా, సరోషః = కోపముతో కూడినవాడై, మనః = మనస్సును, సమాధాయ = కుదుటపరుచుకొని, దేవకల్పమ్ = దేవతలతో సమానుడైన, ఇన్ద్రజితమ్ = ఇంద్రజిత్తును, సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. ఈ విధముగ హనుమంతుడు అక్షకుమారుని సంహరించెనని తెలిసిన మహాత్ముడైన రావణుడు మనస్సు కుదుటపరచుకొని, కోపముతో కూడినవాడై దేవతాతుల్యుడైన ఇంద్రజిత్తును యుద్ధమునకు వెళ్లుమని ఆదేశించెను. 1

మూ. త్వమస్త్రవిచ్ఛస్త్రవిదాం వరిష్ఠః
సురాసురాణామపి శోకదాతా,
సురేషు సేన్ద్రేషు చ దృష్టకర్మా
పితామహారాధనసంచితాస్త్రః. 2

ప్ర. అ. త్వమ్ = నీవు, అస్త్రవిత్ = అస్త్రములు ఎరిగినవాడవు. శస్త్రవిదామ్ = శస్త్రప్రయోగము తెలిసినవారిలో, వరిష్ఠః = గొప్పవాడవు, సురాసురాణా

మపి = సురులకు అసురులకు కూడ, శోకదాతా = శోకమును ఇచ్చువాడవు. సేన్ద్రేషు = ఇంద్రునితో కూడిన, సురేషు = దేవతలతో కూడ. దృష్టకర్మా = చూడబడిన కార్యము కలవాడవు. పితామహారాధనసంచితాస్త్రః = బ్రహ్మదేవుని ఆరాధించుటచేత సంపాదింపబడిన అస్త్రములు కలవాడవు.

తా. నీవు అస్త్రము లన్నీ తెలిసినవాడవు. శస్త్రముల ప్రయోగము తెలిసినవారిలో ప్రముఖుడవు. సురులకు అసురులకు కూడ దుఃఖమును కల్గించినవాడవు. బ్రహ్మదేవుని ఆరాధించి అస్త్రములను సంపాదించిన నీ కార్యకౌశలమును ఇంద్రాదిదేవతలు కూడ చవిచూచి ఉన్నారు. 2

మూ. తవాస్త్రబలమాసాద్య ససురాః సమరుద్గణాః,
న శేకుః సమరే స్థాతుం సురేశ్వరసమాశ్రితాః. 3

ప్ర. అ. తవ = నీయొక్క. అస్త్రబలమ్ = అస్త్రబలమును, ఆసాద్య = పొంది (ఎదిరించి), ససురాః = సురులతో కూడిన, సమరుద్గణాః = దేవతాగణములతో కూడిన, సురేశ్వరసమాశ్రితాః = దేవేంద్రుని ఆశ్రయించినవారు కూడ, సమరే = యుద్ధమునందు. స్థాతుమ్ = నిలచుటకు, న శేకుః = సమర్థులు కాలేదు.

తా. దేవేంద్రుని ఆశ్రయించుకొని ఉన్న సురులు, మరుద్గణములు (ఆయా దేవతల గణములు) కూడ యుద్ధములో నీ అస్త్రబలము ఎదుట నిలువ లేకపోయినారు. 3

మూ. న కశ్చిత్ త్రిషు లోకేషు సంయుగే నగతశ్రమః,
భుజవీర్యాభిగుప్తశ్చ తపసా చాభిరక్షితః, 4
దేశకాలవిభాగజ్ఞస్త్వమేవ మతిసత్తమః.

ప్ర. అ. సంయుగే = నీతో యుద్ధమునందు, నగతశ్రమః = పొందబడిన శ్రమకలవాడు కానివాడు (శ్రమ పొందనివాడు), కశ్చిత్ = ఎవ్వడూ, త్రిషు లోకేషు = మూడు లోకాలలో, న = లేడు. మతిసత్తమః = బుద్ధిచేత గొప్పవాడవైన, త్వమేవ = నీవే, భుజవీర్యాభిగుప్తశ్చ = భుజబలముచేత రక్షింపబడిన వాడవు, తపసా = తపస్సుచేత, అభిరక్షితః చ = రక్షింపబడిన వాడవు కూడ. దేశకాలవిభాగజ్ఞః = దేశకాలముల విభాగమును ఎరిగినవాడవు.

తా. యుద్ధములో నిన్నెదిరించి ఓడిపోనివా డెవ్వరూ మూడు లోకాంలోను లేరు. మంచి బుద్ధి గలవాడవు నీవు. నీయఖ్యబలముచేత, తపోబలముచేత రక్షింపబడినవాడవు. ఏ దేశములో, ఏ కాలములో ఏ పని చేయవలెనో తెలిసినవాడవు.

మూ. న తేఽస్త్యశక్యం సమరేషు కర్మణా
న తేఽస్త్యకార్యం మతిపూర్వమన్త్రితే,
న సోఽస్తి కశ్చిత్త్రిషు సంగ్రహేషు వై
న వేద యస్తేఽస్త్రబలం బలం చ తే. 5

ప్ర. అ. సమరేషు=యుద్ధములందు, కర్మణా=కార్యముచేత, తే=నీకు, అశక్యమ్=శక్యము కానిది, నాస్తి=లేదు. మతిపూర్వమన్త్రితే=బుద్ధిపూర్వకముగా ఆలోచన చేయుటయందు, తే=నీకు, అకార్యమ్=చేయశక్యము కానిది, నాస్తి=లేదు. త్రిషు=మూడు, సంగ్రహేషు=లోకములలో, యః=ఎవరు, తే=నీయొక్క, అస్త్రబలమ్=అస్త్రముల బలమును, తే బలం చ=నీ బలమును, న వేద=ఎరుగరో, సః=అట్టివాడు, కశ్చిత్=ఎవ్వరూ, నాస్తి=లేరు.

తా. యుద్ధములలో నీవు ప్రయత్నించి సాధింపరాని కార్యము లేదు. బుద్ధితో ఆలోచించి నీవు చేయజాలని కార్యము కూడ లేదు. నీకున్న బలమునూ, నీ అస్త్రబలమునూ గూర్చి తెలియనివాడు ఎవ్వరూ, ఈ మూడులోకములలోను లేరు. 5

మూ. మమానురూపం తపసో బలం చ తే
పరాక్రమశ్చాస్త్రబలం చ సంయుగే,
న త్వాం సమాసాద్య రణావమర్దే
మనః శ్రమం గచ్ఛతి నిశ్చితార్థమ్. 6

ప్ర. అ. తే=నీయొక్క, తపసః=తపస్సుయొక్క, బలమ్=బలము, మమ=నాకు, అనురూపమ్=తగినది. సంయుగే=యుద్ధమునందు, పరాక్రమశ్చ=పరాక్రమము, బలం చ=బలమూ (నాకు తగినవి). రణావమర్దే=యుద్ధసంఘర్షమునందు, త్వామ్=నిన్ను, సమాసాద్య=పొంది, మనః=మనస్సు, నిశ్చితార్థమ్=నిశ్చితమైన ప్రయోజనము కలదై, శ్రమమ్=బాధను, న గచ్ఛతి=పొందదు.

తా. నీ తపోబలములోను, యుద్ధమునందు నీవు చూపు బలపరాక్రమములలోను కూడ నీవు నాకు అన్ని విధాలా తగినవాడవు. యుద్ధములు వచ్చినప్పుడు నా మనస్సు నిన్ను తలచుకొని, తప్పక విజయము కలుగు నను నిశ్చయముతో నిశ్చింతగా ఉందును. 6

మూ. నిహతాః కింకరాః సర్వే జమ్బుమాలీ చ రాక్షసః,
ఆమాత్యపుత్రా వీరాశ్చ పఞ్చ సేనాగ్రయాయినః, 7
బలాని సుసమృద్ధాని సాశ్వనాగరథాని చ.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, కింకరాః = కింకరులు, జమ్బుమాలీ = జంబుమాలి అను, రాక్షసశ్చ = రాక్షసుడు, వీరాః = వీరులైన, అమాత్యపుత్రాః = మంత్రిపుత్రులు, పఞ్చ = ఐదుగురు, సేనాగ్రయాయినః = సేనానాయకులు, నిహతాః = చంపబడినారు. సుసమృద్ధాని = బాగా సమృద్ధములైన, సాశ్వనాగరథాని చ = అశ్వములతోను, గజములతోను, రథములతోను కూడిన, బలాని చ = సైన్యములు కూడ (చంపబడినవి).

తా. కింకరులందరు, జంబుమాలి, వీరులైన అమాత్యపుత్రులు, ఐదుగురు సేనానాయకులు, అశ్వగజరథాలతో సహా పూర్తి సేనలు చంపబడినవి.

మూ. సహోదరస్తే దయితః కుమారోఽక్షశ్చ సూదితః, 8
న హి తేష్వేవ మే సారో యస్త్వయ్యరినిషూదన.

ప్ర. అ. తే = నీయొక్క, దయితః = ఇష్టుడైన, సహోదరః = సోదరుడైన, కుమారః అక్షశ్చ = అక్షకుమారుడు కూడ, సూదితః = చంపబడినాడు. అరినిషూదన = శత్రువులను సంహారము చేయువాడా! మే = నాకు, త్వయి = నీయందు, యః = ఏ, సారః = బలము ఉన్నదో అది, తేష్వేవ = వీరందరియందు, న హి = లేదు కదా.

తా. నీ ప్రియసోదరుడు అక్షకుమారుడు కూడ చంపబడినాడు. ఓ! శత్రుసంహారకా! నాకున్న బలమంతా నీలోనే ఉన్నది. వారిలో లేదు. 8

మూ. ఇదం హి దృష్ట్వా మతిమన్ మహద్బలం
కపేః ప్రభావం చ పరాక్రమం చ.

త్వమాత్మనశ్చాపి సమీక్ష్య సారం
కురుష్వ వేగం స్వబలానురూపమ్. 9

ప్ర. అ. మతిమన్ = బుద్ధిమంతుడా। త్వమ్ = నీవు, కపేః = వానరుని యొక్క, ఇదమ్ = ఈ, మహత్ = గొప్ప, బలమ్ = బలమును, ప్రభావం చ = ప్రభావమును. పరాక్రమం చ = పరాక్రమమును. దృష్ట్వా = చూచి, ఆత్మనః = నీయొక్క, సారం చాపి = బలమును, సమీక్ష్య = చూచి, స్వబలానురూపమ్ = నీ బలమునకు అనురూప మైన. వేగమ్ = వేగమును, కురుష్వ = చేయుము.

తా. ఓ బుద్ధిమంతుడా। ఆ వానరుని ఈ బలమును, ప్రభావమును, పరాక్రమమును దృష్టిలో ఉంచుకొని, నీ బలమును కూడ చూచుకొని, నీవు, నీ బలమునకు అనురూప మైన వేగమును చేయుము. 9

మూ. బలావమర్దస్త్వయి సంనికృష్టే
యథా గతే శామ్యతి శాన్తశత్రౌ,
తథా సమీక్ష్యాత్మబలం పరం చ
సమారభస్వాస్త్రవిదాం వరిష్ఠ. 10

ప్ర. అ. అస్త్రవిదామ్ = అస్త్రవేత్తలలో, వరిష్ఠ = గొప్పవాడా, త్వయి = నీవు. సంనికృష్టే = యుద్ధములో సన్నిహితుడ వై ఉండగా, శాన్తశత్రౌ = శాంతించిన శత్రువు, గతే = వెళ్ళిపోయినవా డగుచుండగా (మరణించగా), బలావమర్దః = సేనాసంఘర్షము (యుద్ధము), యథా = ఎట్లు, శామ్యతి = శాంతించునో, తథా = అవిధముగా, ఆత్మబలమ్ = నీబలమును, పరం చ = శత్రువును, సమీక్ష్య = చూచి, సమారభస్వ = ప్రారంభించుము.

తా. అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడ వైన ఓ కుమారా। నీవు యుద్ధరంగములో ప్రవేశించిన పిమ్మట శత్రువు శాంతించి మరణించగా యుద్ధము ఎట్లు ఆగిపోవునో అట్లు, నీ బలమును, శత్రుబలమును చూచుకొని కార్యము ప్రారంభించుము.

వి. పై శ్లోకంలో అన్వయం సరిగా కుదరుట లేదు. ప్రాచ్యపాఠం బాగున్నది.
"బలావమర్దస్త్వయి సంనివిష్టో
యథా న గచ్ఛేయురుదారసత్త్వాః,

తథా సమీక్ష్యాత్మబలం పరం చ
ప్రజ్ఞాహవం కర్మ సమారభస్వ".

"యుద్ధము నీపైనే ఆధార పడి ఉన్నది. నీవు యుద్ధానికి వెళ్లుము. మహాబలగాలులు ఏ విధముగా ఆక్షేపింతరో ఆ విధముగా నీ బలమును, శత్రు బలమును చూచుకొని కార్యమును ప్రారంభించుము" అని అర్థము. అన్వయము బాగున్నది. 11

మూ. న వీరసేనా గణశోచ్య (వ్య) వన్తి
న వజ్రమాదాయ విశాలసారమ్,
న మారుతస్యాస్య గతేః ప్రమాణం
న చాగ్నికల్పః కరణేన హన్తుమ్. 12

ప్ర. అ. వీర=వీరుడా! గణశోచి=గుంపుల కొలది రాక్షసులను దుఃఖ పెట్టుచున్న ఆ వానరుని విషయమున, సేనాః=సేనలు. న అవన్తి = రక్షింపవు. "గణశోఽవ్యవన్తి" అని పాఠాంతర మున్నట్లు ఒక వ్యాఖ్యాత వ్రాసినారు. అప్పుడు అర్థం గణశోఽపి=గుంపుల కొలది కూడ, సేనాః న అవన్తి=సేనలు రక్షింప జాలవు. అల్పసారమ్=తగ్గిపోయిన సారముగల, వజ్రమ్=వజ్రమును, ఆదాయ = గ్రహించి, న విశ = ప్రవేశింపకుము. ఇది ప్రాచీనవ్యాఖ్యాతలు వ్రాసిన అర్థము. అంత సంతృప్తికరంగా లేదు. విశాలసారమ్=అధికమైన శక్తి గల, వజ్రమ్=వజ్రమును, ఆదాయ=గ్రహించినను, న = ప్రయోజనము లేదు అని అర్థము చెప్పిన బాగుండునేమో? (సాధారణంగా నిషేధించేటప్పుడు 'మా విశ' అని ప్రయోగముండును గాని "న విశ" అని ఉండదు). అస్య=ఈ వానరునియొక్క, గతేః=గతికి, మారుతస్య=వాయువుయొక్క గతి, న ప్రమాణమ్=ప్రమాణము (కొలత) కాదు. అగ్నికల్పః=అగ్నితో సమానుడు, కరణేన=పిడికిలి మొదలైన సాధనములచేత, హన్తుమ్=చంపుటకు, న=శక్యమైన వాడు కాడు.

తా. ఓ వీరుడా! గుంపుల కొలది సేన లున్నను అవి రక్షింపజాలవు. అధిక మైన సారము గల వజ్రము కూడ ఈతనివిషయమునందు ఉపయోగింపదు. వాయువు గతికూడ ఈతని గతికి సరి రాదు. అగ్ని వంటి ఇతనిని సామాన్యము లైన పిడికిలి మొదలైన సాధనాలతో చంప శక్యము కాదు.

వి. ఏదో అర్థం చెప్పినా ఈ శ్లోకం సమస్యాశ్లోకం వలెనే ఉన్నది. ఇది ప్రాచ్యపాఠంలో లేదు. 12

మూ. తమేవమర్థం ప్రసమీక్ష్య సమ్యక్
స్వకర్మసామ్యాద్ధి సమాహితాత్మా,
స్మరంశ్చ దివ్యం ధనుషోఽస్త్రవీర్యం
వ్రజాక్షతం కర్మ సమారభస్వ. 13

ప్ర. అ. తమ్ = ఆ, ఏవమ్ = ఈ విధముగా ఉన్న, అర్థమ్ = విషయమును, సమ్యక్ = బాగుగా, ప్రసమీక్ష్య = చూచి, స్వకర్మసామ్యాత్ = తన కార్యముయొక్క సమత్వమువలన, సమాహితాత్మా = సావధానచిత్తుడవై, ధనుషః = ధనస్సుయొక్క, దివ్యమ్ = దివ్యమైన, అస్త్రవీర్యమ్ = అస్త్రముల బలమును, స్మరంశ్చ = స్మరించుచు, వ్రజ = వెళ్లుము. కర్మ = కార్యము, అక్షతమ్ = ఏట్టి విఘాతమూ లేకుండగా, సమారభస్వ = ప్రారంభించుము.

తా. అందుచేత ఈ విషయము లన్నీ బాగుగా పరిశీలించి, ఇది నీకే సంబంధించిన పని వంటిది అను భావముతో సావధానచిత్తుడవై, నీ ధనుస్సుకు సంబంధించిన దివ్యమైన అస్త్రముల పరాక్రమమును స్మరించుచు, యుద్ధమునకు వెళ్లుము. ఏట్టి భంగము లేకుండ కార్యమును ప్రారంభించుము. 13

మూ. న ఖల్వియం మతిః శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయామ్యహమ్,
ఇయం చ రాజధర్మాణాం క్షత్రియస్య మతిర్మతా. 14

ప్ర. అ. అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, సంప్రేషయామి ఇతి యత్ = పంపుచున్నా నన్న మాట ఏది కలదో. ఇయం మతిః = ఈ బుద్ధి, శ్రేష్ఠా = శ్రేష్ఠమైనది, న ఖలు = కాదు కదా! ఇయమ్ = ఇది, రాజధర్మాణామ్ = రాజధర్మములకు సంబంధించిన, క్షత్రియస్య = క్షత్రియునియొక్క, మతిః = బుద్ధిగా, మతా = చెప్పబడినది.

తా. ఈ విధముగా నేను నిన్ను పంపుచున్నా ననగా, ఇది శ్రేష్ఠమైన ఆలోచన కాదు. కాని ఇది క్షత్రియుడు చేయవలసిన రాజధర్మములకు సంబంధించిన ఆలోచన. 14

మూ॥ నానాశస్త్రేషు సంగ్రామే వైశారద్యమరిందమ,
అవశ్యమేవ బోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే. 15

ప్ర. అ. అరిందమ = శత్రువులను నశింపచేయువాడా! సంగ్రామే = యుద్ధమునందు, నానాశస్త్రేషు = అనేకవిధము లైన ఆయుధములందు, వైశారద్యమ్ = నేర్పు, అవశ్యమేవ = తప్పక, బోద్ధవ్యమ్ = తెలియ దగినది. రణే = యుద్ధమునందు, విజయశ్చ = జయమును కూడ, కామ్యః = కోర దగినది.

తా. ఓ! శత్రువినాశకుడా! యుద్ధములో ఉపయోగించు అనేకవిధము లైన ఆయుధముల ప్రయోగములో నేర్పు సంపాదించవలెను. రణమునందు విజయమును కూడ కోరుకొనవలెను. ఇది రాజధర్మము. 15

మూ॥ తతః పితు స్తద్వచనం నిశమ్య
ప్రదక్షిణం దక్షసుతప్రభావః,
చకార భర్తారమదీనసత్త్వో
రణాయ వీరః ప్రతిపన్నబుద్ధిః. 16

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దక్షసుతప్రభావః = దేవతల వంటి ప్రభావము గల, వీరః = వీరు డైన, ఇంద్రజిత్తు, పితుః = తండ్రియొక్క, తత్ వచనమ్ = ఆ మాటను, నిశమ్య = విని, అదీనసత్త్వః = దీనము కాని బుద్ధి కలవాడై, రణాయ = యుద్ధముకొరకు, ప్రతిపన్నబుద్ధిః = నిశ్చయింపబడిన బుద్ధి కలవాడై, భర్తారమ్ = ప్రభు వైన రావణుని, ప్రదక్షిణం చకార = ప్రదక్షిణము చేసెను.

తా. దేవతల వంటి ప్రభావము గల వీరు డైన ఆ ఇంద్రజిత్తు తండ్రి మాటలు విని, దైన్యము లేని మనస్సుతో యుద్ధము చేయుటకు నిర్ణయించుకొని, తండ్రి యైన రావణునకు ప్రదక్షిణము చేసెను. 16

మూ॥ తతస్తైః స్వగణై రిష్టైరింద్రజిత్ ప్రతిపూజితః,
యుద్ధోద్ధతః కృతోత్సాహః సంగ్రామం ప్రత్యపద్యత. 17

ప్ర. అ. తతః = అటు పిమ్మట, యుద్ధోద్ధతః = యుద్ధమునందు గర్వితు డైన, ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, ఇష్టైః = ఇష్టు లైన, తైః స్వగణైః = ఆ తనవారి

చేత, ప్రతిపూజితః=పూజింపబడినవాడై, కృతోత్సాహః=చేయబడిన ఉత్సాహము కలవాడై, సంగ్రామమ్ = యుద్ధమును. ప్రత్యపద్యత = పొందెను.

తా. ఇష్టులైన తనవారందరూ కొనియాడుచుండగా, ఇంద్రజిత్తు మంచి ఉత్సాహముతో యుద్ధరంగమునకు వెళ్లెను. 17

మూ. శ్రీమాన్ పద్మపలాశాక్షో రాక్షసాధిపతేః సుతః,
నిర్జగామ మహాతేజాః సముద్ర ఇవ పర్వసు 18

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తుడు, పద్మపలాశాక్షః = పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన, రాక్షసాధిపతేః సుతః = రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు, పర్వసు = పర్వములయందు, సముద్రః ఇవ = సముద్రము వలె, నిర్జగామ = బయలుదేరెను.

తా. అధికమైన శోభ కలవాడు, పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, మహాతేజశాలీ అయిన ఆ ఇంద్రజిత్తు పర్వములయందు సముద్రము వలె ఉప్పొంగి యుద్ధమునకై బయలువెడలెను. 18

మూ. స పక్షిరాజోపమతుల్యవేగై
ర్వ్యాఘ్రైశ్చతుర్భిః సితతీక్ష్ణదంష్ట్రైః,
రథం సమాయుక్తమసంగవేగం
సమారురోహేన్ద్రజిదిన్ద్రకల్పః. 19

ప్ర. అ. ఇన్ద్రకల్పః = ఇంద్రునితో సమానుడైన, సః ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, పక్షిరాజోపమతుల్యవేగైః = గరుత్మంతునితో సమానమైన వేగము గల, సితతీక్ష్ణదంష్ట్రైః = తీక్ష్ణమైన తెల్లని కోరలు గల, చతుర్భిః = నాలుగు, వ్యాఘ్రైః = క్రూరమృగములతో, సమాయుక్తమ్ = కూర్చబడిన, అసంగవేగమ్ = అడ్డులేని వేగము గల, రథమ్ = రథమును, సమారురోహ = ఎక్కెను.

తా. ఇంద్రునితో సమానుడైన ఆ ఇంద్రజిత్తు అడ్డు లేని వేగము గల రథము నెక్కెను. దానికి గరుత్మంతుని వంటి వేగము గలవి, తెల్లని తీక్ష్ణములైన దంతములు కలవి అయిన క్రూరమృగములు (పెద్దపులులు, తోడేళ్లు మొ.) కట్టబడెను. 19

మూ. స రథీ ధన్వినాం శ్రేష్ఠః శస్త్రజ్ఞోఽస్త్రవిదాం వరః,
రథేనాభియయౌ క్షిప్రం హనుమాన్యత్ర సోఽభవత్. 20

ప్ర. అ. రథీ = రథము కలవాడు, ధన్వినామ్ = ధనుర్ధరులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు, శస్త్రజ్ఞః = శస్త్రములు తెలిసినవాడు, అస్త్రవిదామ్ = అస్త్రములు తెలిసినవారిలో, వరః = శ్రేష్ఠుడూ అయిన, సః = అతడు, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, యత్ర = ఎక్కడ, అభవత్ = ఉండెనో అక్కడికి, క్షిప్రమ్ = శీఘ్రముగా, రథేన = రథముచేత, అభియయౌ = వెళ్లెను.

తా. ఆ ఇంద్రజిత్తు ధనుర్ధరులలో శ్రేష్ఠుడు శస్త్రముల ప్రయోగములో నిపుణుడు. అస్త్రములు తెలిసినవారిలో శ్రేష్ఠుడు. ఉత్తమమైన రథము కలవాడు. అట్టి ఇంద్రజిత్తు రథమును అధిరోహించి, హనుమంతుడున్న ప్రదేశమునకు వెళ్లెను. 20

మూ. స తస్య రథనిర్ఘోషం జ్యాస్వనం కార్ముకస్య చ,
నిశమ్య హరివీరోఽసౌ సంప్రహృష్టతరోఽభవత్. 21

ప్ర. అ. సః అసౌ = అట్టివాడైన ఈ, హరివీరః = హనుమంతుడు, తస్య = ఆ ఇంద్రజిత్తుయొక్క, రథనిర్ఘోషమ్ = రథధ్వనిని, కార్ముకస్య = ధనస్సుయొక్క, జ్యాస్వనం చ = నారి ధ్వనిని, నిశమ్య = విని, సంప్రహృష్టః = చాలా సంతోషించినవాడు, అభవత్ = అయెను.

తా. అప్పుడా హనుమంతుడు, ఇంద్రజిత్తు రథధ్వనిని, ధనుష్టంకారమును విని చాల సంతోషించెను. 21

మూ. సుమహచ్చాపమాదాయ శితశల్యాంశ్చ సాయకాన్,
హనుమన్తమభిప్రేత్య జగామ రణపణ్డితః. 22

ప్ర. అ. రణపణ్డితః = యుద్ధమునందు పండితుడైన ఆ ఇంద్రజిత్తు, సుమహత్ = చాల పెద్దదైన, చాపమ్ = ధనస్సును, శితశల్యాన్ = వాడియైన అగ్రభాగములు గల, సాయకాన్ = బాణములను, ఆదాయ = గ్రహించి, హనుమన్తమ్ = హనుమంతుని, అభిప్రేత్య = ఉద్దేశించి, జగామ = వెళ్ళెను.

తా. యుద్ధములో ప్రవీణుడైన ఆ ఇంద్రజిత్తు గొప్ప ధనస్సును, వాడి

మైన అగ్రభాగములు గల బాణములను ధరించి, హనుమంతునిపైకి యుద్ధానికి వెళ్ళెను. 22

మూ. తస్మింస్తతః సంయతి జాతహర్షే
రణాయ నిర్గచ్ఛతి చాపపాణౌ,
దిశశ్చ సర్వాః కలుషా బభూవు
ర్మృగాశ్చ రౌద్రా బహుధా వినేదుః. 23

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సంయతి = యుద్ధమునందు, జాతహర్షే = పుట్టిన సంతోషము గల, తస్మిన్ = ఆ ఇంద్రజిత్తు, చాపపాణౌ = ధనస్సు హస్తమునందు కలవాడై, రణాయ = యుద్ధముకొరకు, నిర్గచ్ఛతి సతి = బయలుదేరుచుండగా, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులు, కలుషాః = కలుషములు, బభూవుః = అయినవి. రౌద్రాః = భయంకరములైన, మృగాశ్చ = మృగములు కూడ, బహుధా = అనేకవిధములుగా, వినేదుః = ధ్వని చేసినవి.

తా. యుద్ధములో ఉత్సాహవంతుడైన ఆ ఇంద్రజిత్తు ధనస్సు ధరించి యుద్ధానికై బయలుదేరుచుండగా, దిక్కులన్నీ మలినముగా ఉన్నట్లు కనబడినవి. క్రూరమృగములు కూడ అనేకవిధముల అరచినవి. 23

మూ. సమాగతాస్తత్ర తు నాగయక్షా
మహర్షయశ్చక్రచరాశ్చ సిద్ధాః,
నభః సమావృత్య చ పక్షిసంఘా
వినేదురుచ్చైః పరమప్రహృష్టాః. 24

ప్ర. అ. తత్ర = అక్కడికి, సమాగతాః = వచ్చిన, నాగయక్షాః = నాగులు, యక్షులు, చక్రచరాః = జ్యోతిశ్చక్రమునందు సంచరించు, మహర్షయః = మహర్షులు, సిద్ధాశ్చ = సిద్ధులు, పక్షిసంఘాః = పక్షిసముదాయములు. నభః = ఆకాశమును, సమావృత్య = ఆవరించి, పరమప్రహృష్టాః = చాల సంతోషించినవారై, ఉచ్చైః = గట్టిగా, వినేదుః = ధ్వనిచేసిరి.

తా. అక్కడ కలిసిన నాగులు, యక్షులు, జ్యోతిశ్చక్రమునందు సంచరించు మహర్షులు, సిద్ధులు, పక్షిసముదాయములు, ఆకాశమును ఆవరించి, చాల సంతోషముతో గట్టిగా ధ్వనిచేసెను. 24

మూ. ఆయాన్తం సరథం దృష్ట్వా తూర్ణమిన్ద్రజితం కపిః,
వినవాద మహానాదం వ్యవర్ధత చ వేగవాన్. 25

ప్ర. అ. కపిః = హనుమంతుడు, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆయాన్తమ్ = వచ్చుచున్న, సరథమ్ = రథముతో కూడిన, ఇన్ద్రజితమ్ = ఇంద్రజిత్తును, దృష్ట్వా = చూచి, మహానాదమ్ = గొప్పధ్వని కలుగునట్లుగా, వినవాద = ధ్వనిచేసెను. వేగవాన్ = వేగవంతుడై, వ్యవర్ధత చ = వృద్ధి పొందెను కూడ.

తా. రథముపై ఎక్కి శీఘ్రముగా వచ్చుచున్న ఇంద్రజిత్తును చూచి, హనుమంతుడు పెద్దశబ్దము కలుగు నట్లు ధ్వని చేసి, వేగముతో వృద్ధిపొందెను. 25

మూ. ఇన్ద్రజిత్తు రథం దివ్యమాస్థిత శ్చిత్రకార్ముకః,
ధనుర్విస్ఫారయామాస తటిదూర్జితనిస్స్వనమ్. 26

ప్ర. అ. ఇన్ద్రజిత్తు = ఇంద్రజిత్తైతే, దివ్యమ్ = దివ్యమైన, రథమ్ = రథమును, ఆస్థితః = అధిష్ఠించినవాడై, చిత్రకార్ముకః = చిత్రమైన ధనస్సు కలవాడై, తటిదూర్జితనిస్స్వనమ్ = మెరుపు వలె గొప్ప ధ్వని గల, ధనుః = ధనస్సును, విస్ఫారయామాస = చరచెను.

తా. ఇంద్రజిత్తు దివ్యమైన రథము నెక్కి, చిత్రమైన ధనస్సు ధరించి, మెరుపువలె (పిడుగువలె) అధికమైన ధ్వని కలుగు నట్లు ధనస్సు చరచెను. 26

మూ. తతః సమేతావతితీక్ష్ణవేగౌ
మహాబలౌ తౌ రణనిర్విశఙ్కౌ,
కపిశ్చ రక్షోధిపతేస్తనూజః
సురాసురేన్ద్రావివ బద్ధవైరౌ. 27

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అతితీక్ష్ణవేగౌ = చాల తీక్ష్ణమైన వేగము గలవారూ, మహాబలౌ = గొప్ప బలము గలవారూ, రణనిర్విశఙ్కౌ = యుద్ధమునందు భయము లేనివారూ అయిన, తౌ = ఆ, కపిశ్చ = హనుమంతుడు, రక్షోధిపతేః = రావణునియొక్క, తనూజః = కుమారుడూ, బద్ధవైరౌ = కట్టబడిన వైరము గల, సురాసురేన్ద్రావివ = దేవేంద్రుడూ, అసురప్రభువూ వలె, సమేతౌ = యుద్ధానికి కలియబడిరి.

తా. చాల తీక్ష్ణమైన వేగముగలవారు, గొప్ప బలము గలవారు, యుద్ధములో భయము లేనివారు అయిన ఆ హనుమదింద్రజిత్తులు, వైరముతో కూడిన దేవేంద్ర-అసురేంద్రులు వలె యుద్ధరంగములో కలిసిరి. 27

మూ. స తస్య వీరస్య మహారథస్య
ధనుష్మతః సంయతి సంమతస్య,
శరప్రవేగం వ్యహనత్ప్రవృద్ధ
శ్చచార మార్గే పితుర ప్రమేయః. 28

ప్ర. అ. అప్రమేయః = ఊహింప శక్యము కాని బలము గల, సః = హనుమంతుడు, ప్రవృద్ధః = వృద్ధిపొందినవాడై, మహారథస్య = మహారథుడు, ధనుష్మతః = ధనుర్ధరుడు, సంయతి = యుద్ధమునందు, సంమతస్య = గౌరవింపబడినవాడు అయిన, తస్య వీరస్య = వీరుడైన ఆ ఇంద్రజిత్తుయొక్క, శరప్రవేగమ్ = బాణముల వేగమును, వ్యహనత్ = వ్యర్థము చేసెను, పితుః = తండ్రియైన వాయుదేవునియొక్క, మార్గే = మార్గమునందు, చచార = సంచరించెను.

తా. సాటి లేని పరాక్రమము గల ఆ హనుమంతుడు పెచ్చు పెరిగిపోయినవాడై, మహారథుడు, ధనుర్ధరుడు, యుద్ధములో గౌరవింపబడినవాడు, వీరుడు అయిన ఆ ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణముల వేగమును వ్యర్థము చేసి ఆకాశమార్గమునందు సంచరించెను. 28

మూ. తతః శరానాయతతీక్ష్ణశల్యాన్
సుపత్రిణః కాఞ్చనచిత్రపుఙ్ఖాన్,
ముమోచ వీరః పరవీరహన్తా
సుసన్నతాన్ వజ్రనిపాతవేగాన్. 29

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పరవీరహన్తా = శత్రువీరులను వధించు, వీరః = వీరుడైన ఇంద్రజిత్తు, ఆయతతీక్ష్ణశల్యాన్ = పొడవైనవి, తీక్ష్ణమైన ములుకులు కలవి, సుపత్రిణః = మంచి రెక్కలు కలవి, కాఞ్చనచిత్రపుఙ్ఖాన్ = బంగారు చిత్రవర్ణములైన పొన్నులు కలవి, సుసన్నతాన్ = బాగుగా వంగినవి, వజ్రనిపాతవేగాన్ = వజ్రపాతము వంటి వేగము గలవి అయిన, శరాన్ = బాణములను, ముమోచ = విడచెను.

తా. శత్రువీరులను సంహరించు ఆ ఇంద్రజిత్తు, అప్పుడు పొడవైనవి, తీక్ష్ణమైన ములుకులు కలవి, మంచి రెక్కలు కట్టినవి, బంగారు విచిత్రవర్ణము లైన పొన్నులు కలవి, బాగా వంగిన అగ్రభాగములు కలవి అయిన బాణము లను ప్రయోగించెను. 29

మూ. తతః స తత్స్యన్దననిఃస్వనం చ
మృదఙ్గభేరీపటహస్వనం చ,
వికృష్యమాణస్య చ కార్ముకస్య
నిశమ్య ఘోషం పునరుత్పపాత. 30

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ హనుమంతుడు, తత్స్యన్దననిఃస్వనం చ = ఆ రథముయొక్క ధ్వనిని, మృదఙ్గభేరీపటహస్వనం చ = మృదంగ భేరీ-పటహముల ధ్వనిని, వికృష్యమాణస్య = లాగబడుచున్న, కార్ముకస్య = ధనస్సుయొక్క, ఘోషమ్ = ధ్వనిని, నిశమ్య = విని, పునః = మరల, ఉత్పపాత = ఎగిరెను.

తా. అప్పు డా హనుమంతుడు, రథధ్వనిని, మృదంగ-భేరీ-పటహముల ధ్వనిని, ధనస్సు లాగిన ధ్వనిని విని, మరల ఎగిరెను. 30

మూ. శరాణామన్తరేష్వాశు వ్యవర్తత మహాకపిః,
హరిస్తస్యాభిలక్ష్యస్య మోఘయన్ లక్ష్యసంగ్రహమ్. 31

ప్ర. అ. మహాకపిః = మహా వానరుడైన, హరిః = హనుమంతుడు, ఆశు = శీఘ్రముగా, అభిలక్ష్యస్య = లక్ష్యమును కొట్టుటయందు నేర్పరి యైన, తస్య = ఇంద్రజిత్తుయొక్క, లక్ష్యసంగ్రహమ్ = లక్ష్యముయొక్క గ్రహణమును, మోఘయన్ = వ్యర్థము చేయుచు, శరాణామ్ = బాణముల, అన్తరేషు = మధ్యము లందు, వ్యవర్తత = సంచరించెను.

తా. గురి చూచి కొట్టుటలో చాల నేర్పరి యైన ఇంద్రజిత్తు లక్ష్యమును వ్యర్థము చేయుచు, హనుమంతుడు, అతిశీఘ్రముగా అతని బాణముల మధ్య సంచరించెను. 31

మూ. శరాణామగ్రత స్తస్య పునః సమభివర్తత,
ప్రసార్య హస్తౌ హనుమానుత్పపాతానిలాత్మజః. 32

ప్ర. అ. అనిలాత్మజః=వాయుపుత్రు డైన, హనుమాన్=హనుమంతుడు, పునః=మరల, తస్య=అతనియొక్క, శరాణామ్ = బాణములయొక్క, అగ్రతః=ఎదుట, సమభివర్తత=ఉండెను. హస్తౌ=హస్తములను, ప్రసార్య =చాపి, ఉత్పపాత=పైకి ఎగిరెను.

తా. వాయుకుమారు డైన హనుమంతుడు కొంత సేపు బాణములు తప్పించు కొనుచు తిరిగి, మరల అతని బాణములకు ఎదురుగా నిలబడెను. పిదప రెండు చేతులూ చాపి ఆకాశముమీదికి ఎగిరెను. 32

మూ. తావుభౌ వేగసంపన్నౌ రణకర్మవిశారదౌ,
సర్వభూతమనోగ్రాహి చక్రతుర్యుద్ధముత్తమమ్. 33

ప్ర. అ. వేగసంపన్నౌ=వేగముతో కూడినవారూ, రణకర్మవిశారదౌ=యుద్ధము చేయుటలో నేర్పు గలవారూ అయిన, తౌ ఉభౌ=వారిద్దరూ, సర్వభూతమనోగ్రాహి=సకలభూతముల మనస్సును ఆకర్షించు, ఉత్తమమ్=ఉత్తమ మైన, యుద్ధమ్=యుద్ధమును, చక్రతుః=చేసిరి.

తా. వేగముతో కూడినవారూ, యుద్ధముచేయుటలో నేర్పరులూ అయిన ఆ ఇద్దరూ కూడ, అందరి మనస్సులకు ఆశ్చర్యము కలిగించు విధముగా యుద్ధము చేసిరి 33.

మూ. హనూమతో వేద న రాక్షసోఽన్తరం
న మారుతిస్తస్య మహాత్మనోఽన్తరమ్,
పరస్పరం నిర్విషహౌ బభూవతుః
సమేత్య తౌ దేవసమానవిక్రమౌ. 34

ప్ర. అ. రాక్షసః=ఇంద్రజిత్తు, హనూమతః=హనుమంతునియొక్క, అన్తరమ్=ఛిద్రమును (లోపమును), న వేద = తెలుసుకొనజాలకపోయెను. మారుతిః=హనుమంతుడు, మహాత్మనః=మహాత్ము డైన, తస్య=ఆ ఇంద్రజిత్తుయొక్క ఛిద్రమును, న=తెలుసుకొనలేక పోయెను. దేవసమానవిక్రమౌ=దేవతలతో సమాన మైన పరాక్రమము గల, తౌ=వాళ్ళిద్దరు, సమేత్య=యుద్ధముతో కలిసి, పరస్పరమ్=పరస్పరము, నిర్విషహౌ=సహింప అసమర్థులుగా, బభూవతుః=అయిరి.

తా. హనుమంతునిలో నున్న లోపాలను ఇంద్రజిత్తు కాని, ఇంద్రజిత్తులో నున్న లోపాలను హనుమంతుడు కాని తెలిసికొనలేకపోయెను. దేవతలతో సమాన మైన పరాక్రమము గల వారిద్దరు యుద్ధములో తలపడి ఒకరి కొకరు లొంగకుండ ఉండిరి. ౩౪

మూ. తతస్తు లక్ష్యే స విహన్యమానే
శరేష్వమోఘేషు చ సంపతత్సు,
జగామ చింతాం మహతీం మహాత్మా
సమాధిసంయోగసమాహితాత్మా. 35

ప్ర. అ. తతః = అటు పిమ్మట, లక్ష్యే = లక్ష్యము, విహన్యమానే = వ్యర్థము చేయబడుచుండగా, అమోఘేషు = వ్యర్థము కాని, శరేషు = బాణములు, సంపతత్సు = క్రింద పడిపోవుచుండగా, మహాత్మా = గొప్ప బుద్ధి కల, సమాధి సంయోగసమాహితాత్మా = లక్ష్యము చూచుటయందు, బాణము కూర్చుటయందు స్థిరముగా నిలుపబడిన చిత్తము గల, సః = ఇంద్రజిత్తు, మహతీమ్ = గొప్ప, చింతామ్ = ఆలోచనను, జగామ = పొందెను.

తా. వ్యర్థము లగుటకు వీలులేని బాణములు కూడ గురి తప్పి క్రింద పడి పోవుచుండగా, గొప్ప బుద్ధిశాలి, గురి చూచుటయందు, బాణమును సంధించుట యందు సావధాన మైన చిత్తము గల ఆ ఇంద్రజిత్తు పెద్ద ఆలోచనలో పడెను.

మూ. తతో మతిం రాక్షసరాజసూను
శ్చకార తస్మిన్ హరివీరముఖ్యే,
అవధ్యతాం తస్య కపేః సమీక్ష్య
కథం నిగచ్ఛేదితి నిగ్రహార్థమ్. 36

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రాక్షసరాజసూనుః = రాక్షసరాజైన రావణుని కుమారుడు, తస్య కపేః = ఆ హనుమంతునియొక్క, అవధ్యతామ్ = చంపుటకు శక్యము కాకుండుటను, సమీక్ష్య = చూచి, నిగ్రహార్థమ్ = నిగ్రహించుటకు, కథమ్ = ఎట్లు, నిగచ్ఛేత్ = లొంగును, ఇతి = అని, తస్మిన్ = ఆ, హరివీరముఖ్యే = హనుమంతుని విషయమున, మతిమ్ = ఆలోచనను, చకార = చేసెను.

తా. హనుమంతుని చంపుటకు శక్యము కాదు అను విషయమును చూచి, ఆ ఇంద్రజిత్తు, "ఇతడు పట్టుకొనుటకు ఎట్లు లొంగును" అని ఆలోచించి, వానర వీరులలో ముఖ్యుడైన హనుమంతుని గూర్చి ఒక నిర్ణయము చేసెను. 36

మూ. తతః పైతామహం వీరః సోఽస్త్రమస్త్రవిదాం వరః,
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి. 37

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వీరః=వీరుడు, అస్త్రవిదామ్=అస్త్రవేత్తలలో, వరః=శ్రేష్ఠుడు, సుమహాతేజాః=చాల గొప్ప తేజస్సు కలవాడు అయిన, సః=ఆ ఇంద్రజిత్తు, తం హరిప్రవరం ప్రతి=ఆ వానరశ్రేష్ఠుని గూర్చి, పైతామహమ్=బ్రహ్మసంబంధమైన, అస్త్రమ్=అస్త్రమును, సందధే=సంధించెను.

తా. పిమ్మట, వీరుడు, అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడు, చాల గొప్ప తేజస్సు కలవాడు అయిన ఆ ఇంద్రజిత్తు హనుమంతునిపై బ్రహ్మాస్త్రమును సంధించెను.

మూ. అవధ్యోఽయమితి జ్ఞాత్వా తమస్త్రేణాస్త్రతత్త్వవిత్,
నిజగ్రాహ మహాబాహుర్మారుతాత్మజమిన్ద్రజిత్. 38

ప్ర. అ. అస్త్రతత్త్వవిత్=అస్త్రముల తత్త్వమును ఎరిగినవాడు, మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడు అయిన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, అయమ్=ఇతడు, అవధ్యః=చంప శక్యము కానివాడు, ఇతి=అని, జ్ఞాత్వా=తెలుసుకొని, తమ్=ఆ, మారుతాత్మజమ్=హనుమంతుని, అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచేత, నిజగ్రాహ=నిగ్రహించెను.

తా. అస్త్రముల బలాబలములు తెలిసినవాడు, మహాబాహువు అయిన ఇంద్రజిత్తు "ఇతనిని చంపుట శక్యము కాదు" అని తెలిసికొని, ఆ హనుమంతుని బ్రహ్మాస్త్రముచేత బంధించెను. 38

మూ. తేన బద్ధస్తతోఽస్త్రేణ రాక్షసేన స వానరః,
అభవన్నిర్విచేష్టశ్చ పపాత స మహీతలే. 39

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసేన=రాక్షసునిచేత, అస్త్రేణ=అస్త్రముచేత, బద్ధః=కట్టబడిన, సః వానరః=ఆ వానరుడు, నిర్విచేష్టః=

చేష్టలేనివాడు, అభవత్ = అయ్యెను. సః=అతడు, మహీతలే=నేలపై, పపాత= పడెను.

తా. అప్పుడు ఇంద్రజిత్తుచేత బ్రహ్మాస్త్రమును ప్రయోగించి బంధింప బడిన ఆ హనుమంతుడు కదలజాలక నేలపై పడిపోయెను. 39

మూ. తతోఽథ బుద్ధ్వా స తదస్త్రబన్ధం
ప్రభోః ప్రభావాద్విగతాత్మవేగః,
పితామహానుగ్రహమాత్మనశ్చ
విచిన్తయామాస హరిప్రవీరః. 40

ప్ర. అ. తతః=అందువలన, అథ=అటుపిమ్మట, సః హరిప్రవీరః=ఆ హనుమంతుడు, తదస్త్రబన్ధమ్=ఆ అస్త్రబంధమును, బుద్ధ్వా = తెలిసికొని, ప్రభోః=ప్రభువైన బ్రహ్మయొక్క, ప్రభావాత్=ప్రభావమువలన, విగతాత్మవేగః=పోయిన తన వేగము గలవాడై, ఆత్మనః=తనయొక్క, పితామహానుగ్రహమ్=బ్రహ్మయొక్క అనుగ్రహమును గూర్చి, విచిన్తయామాస=ఆలోచించెను

తా. అపుడు ఆ హనుమంతుడు అస్త్రబంధముచే తాను బంధింపబడి నట్లు తెలుసుకొని, బ్రహ్మదేవుని ప్రభావముచె తన వేగమును కోల్పోయినవాడై, తన విషయమున బ్రహ్మదేవుని అనుగ్రహమును గూర్చి కూడ స్మరించెను. 40

మూ. తతః స్వాయమ్భువైర్మన్త్రైర్బ్రహ్మాస్త్రమభిమన్త్రితమ్,
హనుమాంశ్చిన్తయామాస వరదానం పితామహాత్. 41

ప్ర. అ. తతః=అటు పిమ్మట, హనుమాన్=హనుమంతుడు, స్వాయంభువైః=బ్రహ్మకు సంబంధించిన, మన్త్రైః=మంత్రములచేత, అభిమన్త్రితమ్=అభిమంత్రించబడిన, బ్రహ్మాస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, తెలిసికొని, పితామహాత్=బ్రహ్మదేవునివలన, వరదానమ్ = వరదానమును, చిన్తయామాస=గుర్తుచేసి కొనెను.

తా. ఇంద్రజిత్తు బ్రాహ్మమంత్రములచేత అభిమంత్రించిన బ్రహ్మాస్త్రమును ప్రయోగించినా డని తెలుసుకొని, హనుమంతుడు తనకు బ్రహ్మదేవు డిచ్చిన వరమును గురు చేసికొనెను. 41

మూ. న మేఽస్త్రబన్ధస్య చ శక్తిరస్తి
విమోక్షణే లోకగురోః ప్రభావాత్,
ఇత్యేవ మత్వా విహితోఽస్త్రబన్ధో
మయాత్మయోనేరనువర్తితవ్యః. 42

ప్ర. అ. లోకగురోః = లోకములకు గురువైన బ్రహ్మదేవునియొక్క, ప్రభావాత్ = ప్రభావమువలన, అస్త్రబన్ధస్య = అస్త్రబంధముయొక్క, విమోక్షణే = విడిపించుట యందు, మే = నాకు, శక్తిః = శక్తి, నాస్తి = లేదు, ఇత్యేవ = ఇట్లే, మత్వా = తెలిసికొని, విహితః = (శత్రువుచేత) చేయబడిన, ఆత్మయోనేః = బ్రహ్మదేవునియొక్క, అస్త్రబన్ధః = అస్త్రముచేత బంధనము, మయా = నాచేత, అనువర్తితవ్యః = అనుసరించతగినది.

తా. "ఈ అస్త్రబంధమును విడిపించుకొను శక్తి నాకు లేదు. బ్రహ్మదేవుని ప్రభావము అట్టిది. ఈ విషయము తెలిసికొని నేను ఈ బ్రహ్మాస్త్ర బంధమునకు కట్టుబడియే ఉండవలెను." 42

మూ. స వీర్యమస్త్రస్య కపిర్విచార్య
పితామహానుగ్రహమాత్మనశ్చ,
విమోక్షశక్తిం పరిచిన్తయిత్వా
పితామహాజ్ఞామనువర్తతే స్మ. 43

ప్ర. అ. సః కపిః = ఆ హనుమంతుడు, అస్త్రస్య = అస్త్రముయొక్క, వీర్యమ్ = బలమును, విచార్య = ఆలోచించి, ఆత్మనః = తనయొక్క, పితామహానుగ్రహం చ = బ్రహ్మదేవుని అనుగ్రహమును కూడ, ఆలోచించి, విమోక్షశక్తిమ్ = విడిపించుకొనే శక్తిని, పరిచిన్తయిత్వా = ఆలోచించి, పితామహాజ్ఞామ్ = బ్రహ్మదేవుని ఆజ్ఞను, అనువర్తతే స్మ = అనుసరించి ఉండెను.

తా. హనుమంతుడు బ్రహ్మాస్త్రప్రభావమును, తన విషయమున బ్రహ్మదేవుని అనుగ్రహమును స్మరించుచు, ఆ అస్త్రమునుండి విడిపించుకొనుటకు తన కున్న శక్తిని కూడ తెలుసుకొని, బ్రహ్మదేవుని ఆజ్ఞకు బద్ధుడై ఉండెను. 43

మూ. అస్త్రేణాపి హి బద్ధస్య భయం మమ న జాయతే,
పితామహమహేన్ద్రాభ్యాం రక్షితస్యానిలేన చ. 44

ప్ర. అ. పితామహమహేన్ద్రాభ్యామ్=బ్రహ్మదేవునిచేతను, మహేంద్రుని చేతను, అనిలేన చ=వాయుదేవునిచేతను, రక్షితస్య=రక్షింపబడిన, మే=నాకు, అస్త్రేణ=అస్త్రముచేత, బద్ధస్యాపి=కట్టబడినను, భయమ్=భయము, న జాయతే=కలుగుట లేదు.

తా. నన్ను బ్రహ్మదేవుడు, మహేంద్రుడు, వాయుదేవుడు రక్షించుచుండుటచే, అస్త్రముచేత బంధింపబడినను నాకు భయమేమీ కలుగుటలేదు. 44

మూ. గ్రహణే చాపి రక్షోభిర్మహన్మే గుణదర్శనమ్,
రాక్షసేన్ద్రేణ సంవాదస్తస్మాద్గృహ్ణన్తు మాం పరే. 45

ప్ర. అ. రక్షోభిః=రాక్షసులచేత, గ్రహణే చాపి=గ్రహణము జరిగినను, మే=నాకు, మహత్=గొప్ప, గుణదర్శనమ్=గుణముల దర్శనము ఉన్నది. రాక్షసేన్ద్రేణ=రావణునితో, సంవాదః=సంవాదము (జరుగును). తస్మాత్=అందువలన, మామ్=నన్ను, పరే=శత్రువులు, గృహ్ణన్తు=పట్టుకొందురు గాక.

తా. నన్ను రాక్షసులు పట్టుకొన్నా లాభమే కలుగును. ఎందుచేత ననగా నేను రావణునితో మాటలాడవచ్చును, అందుచేత శత్రువులు నన్ను పట్టుకొందురుగాక. 45

మూ. స నిశ్చితార్థః పరవీరహన్తా
సమీక్ష్యకారీ వినివృత్తచేష్టః,
పరైః ప్రసహ్యాభిగతైర్నిగృహ్య
ననాద తైస్తైః పరిభర్త్స్యమానః. 46

ప్ర. అ. పరవీరహన్తా=శత్రువీరులను చంపేవాడు, సమీక్ష్యకారీ=ఆలోచించి పనులు చేసేవాడూ అయిన, సః=ఆ హనుమంతుడు, నిశ్చితార్థః=నిశ్చయింపబడిన విషయముగలవాడై, వినివృత్తచేష్టః=నివర్తించిన చేష్టలు కలవాడై, అభిగతైః=తన మీదకు వచ్చిన, తైస్తైః=ఆయా, పరైః=శత్రువుల

చేత, ప్రసహ్య=బలాత్కారముగా, నిగృహ్య=నిగ్రహించి, పరితర్ప్యమానః= బాధపెట్టబడుచున్నవాడై, ననాద=ధ్వనిచేసెను.

తా. శత్రువీరులను సంహరించేవాడూ, ఆలోచించి పనులు చేసేవాడూ అయిన ఆ హనుమంతుడు ఈ విధముగా తన కర్తవ్యమును నిర్ణయించుకొని, చేష్టలు ఉడిగి పడి ఉండెను. ఆ యా శత్రువు లందరు దగ్గరకు వచ్చి బలాత్కారముగా పట్టుకొని బాధపెట్టుచుండగా, బిగ్గరగా అరచెను. 46

మూ. తతస్తం రాక్షసా దృష్ట్వా నిర్విచేష్టమరిందమమ్,
బబన్ధుః శణవల్కైశ్చ ద్రుమచీరైశ్చ సంహతైః. 47

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రాక్షసాః=రాక్షసులు, అరిందమమ్= శత్రుసంహారకుడైన, తమ్=ఆ హనుమంతుని, నిర్విచేష్టమ్=చేష్టలు లేనివానినిగా, దృష్ట్వా=చూచి, శణవల్కైశ్చ=జనపనారలచేతను, సంహతైః= పేనబడిన, ద్రుమచీరైశ్చ=చెట్ల నారచీరలచేతను, బబన్ధుః=కట్టిరి.

తా. అప్పుడా రాక్షసులు, శత్రుసంహారకుడైన ఆ హనుమంతుడు కదలకుండా పడియుండుట చూచి, అతనిని, జనపనారలతోను, పేనిన చెట్ల నార చీరలతోను కట్టిరి. 47

మూ. స రోచయామాస పరైశ్చ బన్ధనం
ప్రసహ్య వీరైరభినిగ్రహం చ,
కౌతూహలాన్మాం యది రాక్షసేన్ద్రో
ద్రష్టుం వ్యవస్యేదితి నిశ్చితార్థః. 48

ప్ర. అ. రాక్షసేన్ద్రః=రావణుడు, మామ్=నన్ను, కౌతూహలాత్= వేడుకవలన, ద్రష్టుమ్=చూచుటకు, వ్యవస్యేద్యది=నిశ్చయించవచ్చును, ఇతి= అని, నిశ్చితార్థః=నిశ్చయింపబడిన విషయము కలవాడై, సః=హనుమంతుడు, పరైః=శత్రువులచేత, బన్ధనమ్=బంధనమును, వీరైః=వీరులచేత, ప్రసహ్య= బలాత్కరించి, అభినిగ్రహం చ=నిగ్రహమును, రోచయామాస=ఇష్టపడెను.

తా. "రావణుడు కుతూహలముతో నన్ను చూడ వలెనని అనుకొనినా అనుకొనవచ్చును," అని మనస్సులో నిశ్చయించుకొని, హనుమంతుడు, శత్రు వీరులు బలాత్కారముగా తనను పట్టుకొని బంధించుటకు ఇష్టపడెను. 48

మూ. స బద్ధస్తేన వల్కేన విముక్తో౽స్త్రేణ వీర్యవాన్,
అస్త్రబన్ధః స చాన్యం హి న బన్ధమనువర్తతే. 49

ప్ర. అ. తేన = ఆ, వల్కేన = నారచీరచేత, బద్ధః = కట్టబడిన, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః = హనుమంతుడు, అస్త్రేణ = అస్త్రముచేత, విముక్తః = విడవబడినాడు. సః = ఆ, అస్త్రబన్ధః = అస్త్రబంధనము, అన్యమ్ = మరియొక, బన్ధమ్ = బంధనమును, న అనువర్తతే హి = అనుసరించి ఉండదు కదా.

తా. నారచీరలతో కట్టిన వెంటనే, వీర్యవంతుడైన ఆ హనుమంతుడ్ని అస్త్రము విడిచివేసెను. ఎందుచేత ననగా మరొకదానితో కట్టినపుడు ఆ అస్త్ర బంధము నిలువదు. 49

మూ. అథేన్ద్రజిత్తు ద్రుమచీరబద్ధం
విచార్య వీరః కపిసత్తమం తమ్,
విముక్తమస్త్రేణ జగామ చిన్తాం
నాన్యేన బద్ధో హ్యనువర్తతే౽స్త్రమ్. 50

ప్ర. అ. అథ = అటుపిమ్మట, వీరః = వీరుడైన, ఇన్ద్రజిత్తు = ఇంద్రజిత్తైతే, ద్రుమచీరబద్ధమ్ = నారచీరలచేత కట్టబడిన, తమ్ = ఆ, కపిసత్తమమ్ = వానరశ్రేష్ఠుని, అస్త్రేణ = అస్త్రముచేత, విముక్తమ్ = విడవబడినవానినిగా, విచార్య = ఆలోచించి (తెలుసుకొని), చిన్తామ్ = చింతను, జగామ = పొందెను. అన్యేన = మరొకదానిచేత, బద్ధః = కట్టబడినవాడు, అస్త్రమ్ = అస్త్రమును, నానువర్తతే హి = అనుసరించడు కదా.

తా. నారచీరలతో కట్టిన ఆ హనుమంతుని బ్రహ్మాస్త్రము విడిచివేసినదను విషయమును గుర్తించి, ఇంద్రజిత్తు ఆలోచనలో పడెను. "మరొకదానితో కట్టబడిన వానిని అస్త్రబంధము విడిచివేయును కదా!" 50

మూ. అహో మహత్కర్మ కృతం నిరర్థకం
న రాక్షసైర్మన్త్రగతిర్విమృష్టా,
పునశ్చ మన్త్రే విహతే౽స్త్రమన్య
త్ప్రవర్తతే సంశయితాః స్మ సర్వే. 51

ప్ర. అ. అహో = అయ్యో! మహత్ = గొప్ప దైన, కర్మ = పని, నిరర్థకమ్ = వ్యర్థ మైనదిగా, కృతమ్ = చేయబడినది. రాక్షసైః = రాక్షసుల చేత. మన్త్రగతిః = మంత్రము యొక్క విధానము, న విమృష్టా = ఆలోచింప బడలేదు. మన్త్రే = మంత్రము, విహతే = కొట్టబడిన దగుచుండగా, అన్యత్ = మరి యొక, అస్త్రమ్ = అస్త్రము, న ప్రవర్తతే = ప్రవర్తింపదు. సర్వే = అందరము, సంశయితాః = సంశయగ్రస్తులము, స్మ = అయితిమి.

తా. "అయ్యో! ఈ రాక్షసులు మంత్రవిధానమును ఆలోచించకుండగా, ఇంతటి మహాకార్యమును వ్యర్థము చేసినారు. మంత్రము ఒకసారి విహత మై పోయి నపుడు మరి యొక అస్త్రము పని చేయదు కదా! ఇప్పుడు అందరము సంశయాస్పద మైన పరిస్థితిలో ఉంచబడినాము". 51

మూ. అస్త్రేణ హనుమాన్ ముక్తో నాత్మానమవబుధ్యత,
కృష్యమాణస్తు రక్షోభిస్తైశ్చ బన్ధైర్నిపీడితః. 52

ప్ర. అ. అస్త్రేణ = అస్త్రముచేత, ముక్తః = విడువబడిన, హనుమాన్ = హనుమంతుడు, తైః = ఆ, రక్షోభిః = రాక్షసులచేత, కృష్యమాణః = లాగబడు చున్నవాడై, బన్ధైః = బంధములచేత, నిపీడితః = పీడింపబడుచున్న వాడై, ఆత్మానమ్ = తనను, న అవబుధ్యత = తెలిసికొనలేదు.

తా. అస్త్రముచే విముక్తు డైన ఆ హనుమంతుడు రాక్షసులు తనను బంధించి ఈడ్చుకొనిపోవుచుండగా తాను అస్త్రవిముక్తు డై నట్లు గ్రహించలేదు.

మూ. హన్యమానస్తతః క్రూరై రాక్షసైః కాష్ఠముష్టిభిః,
సమీపం రాక్షసేన్ద్రస్య ప్రాకృష్యత స వానరః. 53

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః వానరః = ఆ హనుమంతుడు, క్రూరైః = క్రూరు లైన, రాక్షసైః = రాక్షసులచేత, కాష్ఠముష్టిభిః = కఱ్ఱలచేత, పిడికిళ్ళచేతను, హన్యమానః = కొట్టబడుచు, రాక్షసేన్ద్రస్య = రావణుని యొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి, ప్రాకృష్యత = ఈడ్వబడెను.

తా. పిమ్మట, క్రూరు లైన ఆ రాక్షసులు హనుమంతుని కఱ్ఱలతోను, పిడికిళ్ళతోను కొట్టుచు రావణునివద్దకు ఈడ్చుకొని వెళ్ళిరి. 53

మూ. అథేన్ద్రజిత్తం ప్రసమీక్ష్య ముక్త
మస్త్రేణ బద్ధం ద్రుమచీరసూత్రైః ।
వ్యదర్శయత్తత్ర మహాబలం తం
హరిప్రవీరం సగణాయ రాజ్ఞే. 54

ప్ర. అ. అథ = అటు పిమ్మట. ద్రుమచీరసూత్రైః = నారచీరలచేతను, తాళ్లచేతను, బద్ధమ్ = కట్టబడిన, తమ్ = వానిని, అస్త్రేణ = అస్త్రముచేత, ముక్తమ్ = విడువబడినవానినిగా. ప్రసమీక్ష్య = చూచి. ఇన్ద్రజిత్ = ఇంద్రజిత్తు, మహాబలమ్ = గొప్ప బలము గల, తం హరిప్రవీరమ్ = ఆ వానరశ్రేష్ఠుని, తత్ర = అక్కడ. సగణాయ = పరివారముతో కూడిన, రాజ్ఞే = రాజునకు, వ్యదర్శయత్ = చూపెను

తా. పిమ్మట ఇంద్రజిత్తు ఆ వానరశ్రేష్ఠుడు నారచీరలచేతను, తాళ్లచేతను కట్టబడి బ్రహ్మాస్త్రమునుండి విముక్తుడైనట్లు తెలిసికొని, అతనిని అట్లే బంధించి తీసికొని వెళ్లి, పరివారసమేతుడైన రావణునకు చూపెను. 54

మూ. తం మత్తమివ మాతఙ్గం బద్ధం కపివరోత్తమమ్,
రాక్షసా రాక్షసేన్ద్రాయ రావణాయ న్యవేదయన్. 55

ప్ర. అ. మత్తమ్ = మదించిన, మాతఙ్గమివ = ఏనుగ వలె ఉన్న, బద్ధమ్ = కట్టబడిన, కపివరోత్తమమ్ = కపివరులలో శ్రేష్ఠుడైన, తమ్ = ఆ హనుమంతుని, రాక్షసాః = రాక్షసులు, రాక్షసేన్ద్రాయ = రాక్షసరాజైన, రావణాయ = రావణునకు, న్యవేదయన్ = చూపిరి.

తా. మదించిన ఏనుగు వలె ఉన్న, బంధింపబడిన ఆ హనుమంతుని తీసికొని వెళ్ళి రాక్షసులు రావణునకు ఆ వానరు డితడే అని తెలిపిరి. 55

మూ. కోఽయం కస్య కుతో వాత్ర కిం కార్యం కో వ్యపాశ్రయః,
ఇతి రాక్షసవీరాణాం తత్ర సంజజ్ఞిరే కథాః. 56

ప్ర. అ. అయమ్ = ఇతడు, కః = ఎవడు? కస్య = ఎవరికి సంబంధించినవాడు? కుతో వా = ఎక్కడినుండి వచ్చినాడు? అత్ర = ఇక్కడ, కిమ్ =

ఏమి; కార్యమ్=పని? వ్యపాశ్రయః=పీనికి ఆశ్రయమిచ్చినవారు, కః=ఎవరు? ఇతి = అని. తత్ర = అక్కడ, రాక్షసవీరాణామ్=రాక్షసవీరుల, కథాః=కథలు, సంజజ్ఞిరే = కలిగినవి.

తా. ఇతడు ఎవ్వరు? ఎవరివాడు? ఎక్కడినుండి వచ్చినాడు? ఇక్కడ ఇతనికి ఏమి పని? ఇతని ఆశ్రయము ఏది? (సహాయకులు ఎవరు?) అని ఆ సభలోని రాక్షసవీరులు ఒకరితో ఒకరు అనుకొనిరి. 56

మూ. హన్యతాం దహ్యతాం వాపి భక్ష్యతామితి చాపరే,
రాక్షసాస్తత్ర సంక్రుద్ధాః పరస్పరమథాబ్రువన్. 57

ప్ర. అ. అథ = పిమ్మట, అపరే = మరికొందరు, రాక్షసాః = రాక్షసులు, సంక్రుద్ధాః = కోపించినవారై, హన్యతామ్ = చంపబడుగాక, దహ్యతాం చాపి = కాల్చివేయబడు గాక; భక్ష్యతామ్ = భక్షింపబడుగాక, ఇతి = అని, పరస్పరమ్ = పరస్పరము, అబ్రువన్ = పలికిరి.

తా. మరి కొందరు రాక్షసులు చాల కోపించినవారై, "పీనిని చంపండి; కాల్చివేయండి; భక్షించండి" అని ఒకరితో ఒకరు పలికిరి. 57

మూ. అతీత్య మార్గం సహసా మహాత్మా
స తత్ర రక్షోధిపపాదమూలే,
దదర్శ రాజ్ఞః పరిచారవృద్ధాన్
గృహం మహారత్నవిభూషితం చ. 58

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, సః = ఆ హనుమంతుడు, సహసా = శీఘ్రముగా, మార్గమ్=మార్గమును, అతీత్య = దాటి వెళ్ళి, తత్ర = అక్కడ, రాజ్ఞః= రావణునియొక్క, మహారత్నవిభూషితమ్ = గొప్ప రత్నములచేత అలంకరించబడిన, గృహమ్ = గృహమును, రక్షోధిపపాదమూలే = రావణుని పాదాల చెంత, పరిచారవృద్ధాన్ = మంత్రివృద్ధులను, దదర్శ = చూచెను.

తా. ఆ మార్గమును శీఘ్రముగా దాటి వెళ్ళిన పిమ్మట మహాత్ముడైన ఆ హనుమంతుడు, అక్కడ మహారత్నములచేత అలంకరింపబడిన రావణుని గృహమును, ఆ రావణుని పాదాల చెంత మంత్రివృద్ధులను చూచెను. 58

మూ. స దదర్శ మహాతేజా రావణః కపిసత్తమమ్,
రక్షోభిర్వికృతాకారైః కృష్యమాణమితస్తతః. 59

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః రావణః = ఆ రావణుడు, వికృతాకారైః = వికృత మైన ఆకారము గల, రక్షోభిః = రాక్షసులచేత, ఇత స్తతః = ఇటు అటు, కృష్యమాణమ్ = లాగబడుచున్న, కపిసత్తమమ్ = వానర శ్రేష్ఠు డైన హనుమంతుని, దదర్శ = చూచెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ రావణుడు, వికృతము లైన ఆకారములు గల రాక్షసులచేత ఇటు అటు లాగబడుచున్న హనుమంతుని చూచెను. 59

మూ. స రోషసంవర్తితతామ్రదృష్టి
ర్దశాననస్తం కపిమన్వవేక్ష్య,
అథోపవిష్టాన్ కులశీలవృద్ధాన్
సమాదిశత్తం ప్రతి మన్త్రిముఖ్యాన్. 61

ప్ర. అ. సః దశాననః = ఆ రావణుడు, రోషసంవర్తితతామ్రదృష్టిః = రోషముతో త్రిప్పబడిన ఎఱ్ఱని నేత్రములు కలవాడై, తం కపిమ్ = ఆ హను మంతుని, అన్వవేక్ష్య = చూచి, అథ = అటుపిమ్మట, ఉపవిష్టాన్ = అక్కడ కూర్చొనియున్న, కులశీలవృద్ధాన్ = కులముచేత శీలముచేత వృద్ధు లైన, మన్త్రి ముఖ్యాన్ = ముఖ్యు లైన మంత్రులను, తం ప్రతి = ఆ హనుమంతుని గూర్చి, సమాదిశత్ = ఆజ్ఞాపించెను.

తా. ఆ రావణుడు కోపముతో, ఎఱ్ఱ నైన నేత్రములను త్రిప్పుచు, ఆ హనుమంతుని చూచి, పిమ్మట అక్కడ కూర్చుని యున్న, కులముచేతను, శీలముచేతను పెద్దవా రైన ముఖ్యు లైన మంత్రులను, "ఈతనిని గూర్చి తెలిసి కొనండి" అని ఆజ్ఞాపించెను. 61

మూ. యథాక్రమం తైః స కపిర్విపృష్టః
కార్యార్థమర్థస్య చ మూలమాదౌ,
నివేదయామాస హరీశ్వరస్య
దూతః సకాశాదహమాగతోఽస్మి. 62

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టచత్వారింశః సర్గః.

ప్ర. అ. తైః = ఆ మంత్రులచేత, యథాక్రమమ్ = క్రమానుసారముగా కార్యార్థమ్ = అతడు వచ్చిన పనిని గూర్చి, అర్థస్య = కార్యముయొక్క, మూలమ్ = మూలమును గూర్చి, విపృష్టః = అడగబడిన, సః కపిః = ఆ హనుమంతుడు, హరీశ్వరస్య సకాశాత్ = సుగ్రీవుని వద్ద నుండి, ఆగతః అస్మి = వచ్చినాను. అని, ఆదౌ = ముందుగా, నివేదయామాస = తెలిపెను.

తా. "నీవు వచ్చిన పని ఏమి? ఆ పనిపై పంపినవా రెవరు?" అని ఆ మంత్రులు క్రమముగా ప్రశ్నింపగా హనుమంతుడు- "నేను సుగ్రీవుని దూతగా వచ్చినాను" అని ముందుగా చెప్పెను. ౬౨

"తారానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో నలుబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనపఞ్చాశః సర్గః

[ప్రతాపశాలి యైన రావణుని రూపమును చూడగానే హను మంతుని మనస్సులో అనేక విధము లైన భావములు కలుగుట].

మూ. తతః స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః,
హనుమాన్ క్రోధతామ్రాక్షో రక్షోధిపమవైక్షత. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భీమవిక్రమః = భయంకర మైన పరా క్రమము గల, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, తస్య = రావణునియొక్క, తేన కర్మణా = ఆ కార్యముచేత, విస్మితః = ఆశ్చర్యపడినవా డై, క్రోధ తామ్రాక్షః = క్రోధముచేత ఎఱ్ఱ నైన నేత్రములు గలవాడై, రక్షోధిపమ్ = ఆ రావ ణుని, అవైక్షత = చూచెను.

తా. భయంకర మైన పరాక్రమము గల హనుమంతుడు "ఈతడు నన్ను కూడ బంధింపచేసి తన దగ్గరకు రప్పించుకొన్నాడు కదా" అని ఆశ్చర్య పడుచు క్రోధముచేత కళ్ళు ఎఱ్ఱబడగా, ఆ రావణుని చూచెను. 1

మూ. భ్రాజమానం మహార్హేణ కాఞ్చనేన విరాజతా,
ముక్తాజాలావృతేనాథ మకుటేన మహాద్యుతిమ్. 2

ప్ర. అ. (ఈ శ్లోకము మొదలు 14వ శ్లోకంవరకు ఉన్న శ్లోకాలకు ఒకటే అన్వయము. ఈ శ్లోకాలలో ఉన్న ద్వితీయాంతా లన్నీ 14వ శ్లోకంలో ఉన్న 'రాక్షసపతిమ్'అను దానికి విశేషణములు). మహార్హేణ = గొప్ప ప్రాశస్త్యముకలదీ, కాఞ్చనేన = బంగారు వికారమైనదీ, విరాజతా = ప్రకాశించుచున్నదీ, అథ = మరియు ముక్తాజాలావృతేన = ముత్యాల సముదాయముచేత చుట్టబడినదీ అయిన, మకుటేన = కిరీటముతో, భ్రాజమానమ్ = ప్రకాశించుచున్నవాడు, మహాద్యుతిమ్ = గొప్ప కాంతి కలవాడూ అయిన (రావణుని చూచెను).

తా. గొప్పకాంతి గల ఆ రావణుడు బాగా ప్రశంసింప దగిన, ముత్యాలు కూర్చిన, మెరిసిపోవు చున్న బంగారు కిరీటముతో ప్రకాశించుచుండెను.

మూ. వజ్రసంయోగసంయుక్తైర్మహార్హమణివిగ్రహైః,
హైమైరాభరణైశ్చిత్రైర్మనసేవ ప్రకల్పితైః. 3

ప్ర. అ. వజ్రసంయోగసంయుక్తైః = వజ్రముల పొదుగుటతో కూడిన, మహార్హమణివిగ్రహైః = శ్రేష్ఠ మైన మణులు గల రూపములు గల, మనసా=మనస్సుచేత, ప్రకల్పితైరివ=కల్పింపబడినవా అన్నట్లున్న, చిత్రైః= విచిత్రము లైన, హైమైః = బంగారు వికారము లైన, ఆభరణైః = అలంకారములతో ఉన్న (రావణుని చూచెను).

తా. ఆ రావణుడు వజ్రములు, చాల ప్రశస్తము లైన మణులు పొదిగిన, మనస్సుతో నిర్మించినవా అన్నట్లున్న, విచిత్రము లైన బంగారు ఆభరణములు అలంకరించుకొని ఉండెను. 3

మూ. మహార్హక్షౌమసంవీతం రక్తచన్దనరూషితమ్,
స్వనులిప్తం విచిత్రాభిర్వివిధాభిశ్చ భక్తిభిః. 4

ప్ర. అ. మహార్హక్షౌమసంవీతమ్ = శ్రేష్ఠము లైన తెల్లని పట్టుబట్టలచే కట్టబడినవాడు, రక్తచన్దనరూషితమ్ = ఎఱ్ఱని చందనముచేత పూయబడినవాడు, విచిత్రాభిః = విచిత్రము లైన, వివిధాభిశ్చ = అనేక విధము లైన, భక్తిభిః = (శరీరముపై వేరు వేరు రంగులతో వేసిన) రచనలచేత, స్వనులిప్తమ్=బాగుగా పూయబడినవాడు అయిన (రావణుని చూచెను).

తా. ఆ రావణుడు శ్రేష్ఠము లైన పట్టుబట్టలు ధరించి, ఎఱ్ఱని చందనము పూసుకొనెను. అతని శరీరముపై అనేక విధముల విచిత్రము లైన బొమ్మలు చిత్రింపబడి ఉండెను. 4

మూ. విచిత్రం దర్శనీయైశ్చ రక్తాక్షైర్భీమదర్శనైః,
దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః ప్రలమ్బదశనచ్ఛదైః. 5

శిరోభిర్దశభిర్వీరం భ్రాజమానం మహౌజసమ్,
నానావ్యాళసమాకీర్ణైః శిఖరైరివ మన్దరమ్. 6

ప్ర. అ. దర్శనీయైః = సుందర మైనవి, రక్తాక్షైః = ఎఱ్ఱని కన్నులు కలవి, భీమదర్శనైః = భయంకర మైన దర్శనము కలవి, దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః = ప్రకాశించుచున్న తీక్ష్ణము లైన పెద్ద కోరలు కలవి, ప్రలమ్బదశనచ్ఛదైః = వ్రేలాడుచున్న పెదవులు కలవి అయిన, దశభిః = పది, శిరోభిః = శిరస్సులతో విచిత్రమ్ = విచిత్రముగా ఉన్నవాడును, నానావ్యాళసమాకీర్ణైః = అనేక క్రూర మృగములతో వ్యాప్తము లైన, శిఖరైః = శిఖరములతో, మన్దరమ్ ఇవ = మందర పర్వతము వలె, భ్రాజమానమ్ = ప్రకాశించుచున్నవాడు, మహాబలమ్ = గొప్ప బలము కలవాడు, వీరమ్ = వీరుడు అయిన (రావణుని చూచెను).

తా. మహాబలశాలి యైన ఆ రావణుడు, అనేక క్రూరమృగములతో నిండిన శిఖరములతో మందరపర్వతము వలె, సుందరములు, ఎఱ్ఱని కన్నులు కలవి, చూచుటకు భయంకరములుగా ఉన్నవి, ప్రకాశించుచున్న తీక్ష్ణ మైన కోరలు గలవి, వ్రేలాడుచున్న పెదవులు గలవి అయిన పది తలలతో విచిత్రముగా ప్రకాశించుచుండెను. 5, 6

మూ. నీలాఞ్జనచయప్రఖ్యం హారేణోరసి రాజతా,
పూర్ణచన్ద్రాభవక్త్రేణ సబాలార్కమివామ్బుదమ్. 7

ప్ర. అ. నీలాఞ్జనచయప్రఖ్యమ్ = నల్లని కాటుక గుట్ట వలె ఉన్నవాడు, ఉరసి = వక్షఃస్థలమునందు, రాజతా = ప్రకాశించుచున్న, హారేణ = హారముతోను, పూర్ణచన్ద్రాభవక్త్రేణ = పూర్ణచంద్రుని వంటి కాంతిగల ముఖముతోను, సబాలార్కమ్ = బాల సూర్యునితో కూడిన, అమ్బుదమివ = మేఘము వలె ఉన్నవాడు అయిన (రావణుని చూచెను).

తా. అతని వక్షఃస్థలముపై ముత్యాలహారము ప్రకాశించుచుండెను. ముఖము పూర్ణచంద్రుడు వలె ఉండెను. నల్లని కాటుక కొండ వలె ఉన్న ఆట్టి రావణుడు బాలసూర్యునితో కూడిన మేఘము వలె ఉండెను. 7

మూ. బాహుభిర్బద్ధకేయూరైశ్చన్దనోత్తమరూషితైః,
భ్రాజమానాఙ్గదైః పీనైః పఞ్చశీర్షైరివోరగైః. 8

ప్ర. అ. బద్ధకేయూరైః = కట్టబడిన బాహుపురులు కలవి, చన్దనోత్తమ

తర మైన బుద్ధి కలవారు అయిన మరికొందరు రాక్షసమంత్రులు కూడ ఆ రావణుని ప్రక్కనే కూర్చుండి, దేవతలు దేవేంద్రుని సేవించి నట్లు సేవించుచుండిరి.

మూ. అపశ్యద్రాక్షసపతిం హనుమానతితేజసమ్,
విష్ఠితం మేరుశిఖరే సతోయమివ తోయదమ్. 14

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, అతితేజసమ్ = గొప్ప తేజస్సు కలవాడు, మేరుశిఖరే = మేరుపర్వతశిఖరమునందు, విష్ఠితమ్ = నిలచి ఉన్న, సతోయమ్ = జలముతో కూడిన, తోయదమ్ ఇవ = మేఘము వలె ఉన్నవాడూ అయిన, రాక్షసపతిమ్ = రావణుని, అపశ్యత్ = చూచెను.

తా. అతితేజశ్శాలి యైన ఆ రావణుడు, ఉన్నత మైన ఆసనముమీద, మేరుపర్వతశిఖరముమీద ఉన్న నీటితో నిండిన, మేఘము వలె ఉండెను. అట్టి రావణుని హనుమంతుడు చూచెను. 14

మూ. స తైః సంపీడ్యమానోఽపి రక్షోభిర్భీమవిక్రమైః,
విస్మయం పరమం గత్వా రక్షోధిపమవైక్షత. 15

ప్ర. అ. సః = హనుమంతుడు, భీమవిక్రమైః = భయంకర మైన పరాక్రమము గల, రక్షోభిః = రాక్షసులచేత, సంపీడ్యమానోఽపి = పీడింపబడుచున్నను, పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, గత్వా = పొంది, రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను.

తా. భయంకర మైన పరాక్రమము గల ఆ రాక్షసు లెంత మూల పీడించు చున్నను ఆ హనుమంతు డా రావణుని ఆశ్చర్యముతో చూచెను. 15

మూ. భ్రాజమానం తతో దృష్ట్వా హనుమాన్రాక్షసేశ్వరమ్,
మనసా చిన్తయామాస తేజసా తస్య మోహితః 16

ప్ర. అ. తతః = అటు పిమ్మట, హనుమాన్ = హనుమంతుడు, భ్రాజమానమ్ = ప్రకాశించుచున్న, రాక్షసేశ్వరమ్ = రాక్షసరాజును, దృష్ట్వా = చూచి, తస్య = అతనియొక్క, తేజసా = తేజస్సుచేత, మోహితః = మోహింపచేయబడిన వాడై, మనసా = మనస్సులో, చిన్తయామాస = ఆలోచించెను.

తా. పిమ్మట, హనుమంతుడు, ప్రకాశించుచున్న రావణుని చూచి అతని తేజస్సుచేత మోహము చెందినవాడై మనస్సులో ఇట్లు అనుకొనెను. 16

మూ. అహో రూపమహో ధైర్యమహో సత్త్వమహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా. 17

ప్ర. అ రాక్షసరాజస్య = ఈ రాక్షసరాజుయొక్క, రూపమ్ = రూపము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది। ధైర్యమ్ = ధైర్యము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది। సత్త్వమ్ = బలము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది। ద్యుతిః = కాంతి, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది। సర్వలక్షణయుక్తతా = సమస్త లక్షణములతో కూడి యుండుట. అహో = ఎంత ఆశ్చర్యకర మైనది।

తా. అహా! ఏమి ఈ రావణుని రూపము! ఏమి ధైర్యము! ఏమి బలము! ఏమి కాంతి! ఏమి సర్వలక్షణసంపన్నత్వము! 17

మూ. యద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః,
స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా. 18

ప్ర. అ. అయమ్ = ఈ, అధర్మః = అధర్మము, బలవాన్ = బలము కలది, న స్యాద్యది = కాకున్నచో, అయమ్ = ఈ, రాక్షసేశ్వరః = రాక్షసరాజు, సశక్రస్య = దేవేంద్రసహిత మైన, సురలోకస్యాపి = దేవలోకమునకు కూడ, రక్షితా = రక్షకుడు, స్యాత్ = కావచ్చును.

తా. ఏనిలో బలవత్తర మైన ఈ అధర్మమే లేకున్నచో ఈ రాక్షసరాజు ఇంద్రునితో సహా దేవలోకాని కంతకు ప్రభువు అయి ఉండెడివాడు. 18

మూ అస్య క్రూరైర్నృశంసైశ్చ కర్మభిర్లోకకుత్సితైః,
సర్వే బిభ్యతి ఖల్వస్మాల్లోకాః సామరదానవాః, 19
అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తుమేకార్ణవం జగత్.

ప్ర. అ. క్రూరైః = క్రూరములు, నృశంసైశ్చ = మానవులను హింసించేవి, లోకకుత్సితైః = లోకములో నింద్యములూ అయిన, అస్య కర్మభిః = ఇతని పనులచేత, సామరదానవాః = అమరులతోను దానవులతోను కూడిన, సర్వే = సమస్త మైన, లోకాః = లోకములు, అస్మాత్ = ఇతనినుండి, బిభ్యతి హి = భయ

వచ్చుచున్నవి కదా। అయమ్=ఇతడు, క్రుద్ధః=కోపించినవాడై, జగత్=జగత్తును, ఏకార్ణవమ్=ఒకే సముద్రమునుగా, కర్తుమ్=చేయుటకు, ఉత్సహేత హి సమర్థుడగును కదా।

తా. ఇతడు లోకములో నిందింపబడు క్రూరకర్మలతో అందరిని హింసించుచుండుటచేత దేవతలతో, దానవులతో సహా సకలలోకములు ఇతని నుండి భయపడుచున్నవి. కోపగించినచో ఇతడు ఈ జగత్తునంతనూ ఒక్క సముద్రముగా చేసి వేయగలడు. 19

మూ. ఇతి చిన్తాం బహువిధామకరోన్మతిమాన్ హరిః, 20
దృష్ట్వా రాక్షసరాజస్య ప్రభావమమితౌజసః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకోనపఞ్చాశః సర్గః.

ప్ర. అ. అమితౌజసః=అపరిమితమైన తేజస్సు గల, రాక్షసరాజస్య=రాక్షసరాజుయొక్క, ప్రభావమ్=ప్రభావమును, దృష్ట్వా=చూచి, మతిమాన్=బుద్ధిమంతుడైన, హరిః=హనుమంతుడు, ఇతి=ఇట్లు, బహువిధామ్=అనేకవిధములైన, చిన్తామ్=చింతను, అకరోత్=చేసెను.

తా. బుద్ధిమంతుడైన హనుమంతుడు, అపరిమితమైన తేజస్సు గల ఆ రావణుని ప్రభావము చూచి, ఈ విధముగా అనేకములైన ఆలోచనలు చేసెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో నలుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చాశః సర్గః

[రావణుడు ప్రేరేపింపగా లంకకు ఎందుకు వచ్చినావని ప్రహస్తుడు హనుమంతుని ప్రశ్నించుట, రాముని దూతగా వచ్చినానని హనుమంతుడు చెప్పుట.]

మూ. తముద్వీక్ష్య మహాబాహుః పిఙ్గాక్షం పురతః స్థితమ్,
కోపేన మహతావిష్టో రావణో లోకరావణః,
శఙ్కాహృతాత్మా దధ్యౌ స కపీన్ద్రం తేజసావృతమ్.

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు కల, లోకరావణః=లోకములను ఏడ్పించిన, సః రావణః=ఆ రావణుడు, పురతః=ఎదుట, స్థితమ్=నిలచి ఉన్న, తం పిఙ్గాక్షమ్=ఆ వానరుని, ఉద్వీక్ష్య=తల ఎత్తి చూచి, మహతా=గొప్ప, కోపేన=కోపముతో, ఆవిష్టః=ఆవేశింపబడినవాడై, శఙ్కాహృతాత్మా=శంకచేత హరింపబడిన మనస్సు కలవాడై, తేజసా=తేజస్సుచేత, ఆవృతమ్=కప్పబడియున్న, కపీన్ద్రమ్=వానరశ్రేష్ఠునిగూర్చి, దధ్యౌ=ఇట్లు ఆలోచించెను.

తా. గొప్ప బాహువులు కలవాడు, లోకములను ఏడ్పించినవాడు అయిన ఆ రావణుడు తన ఎదుట నిలచిన ఆ వానరుని, తల యెత్తి చూచి, కోపావిష్టుడై మనస్సులో ఏవేవో శంకలు కలుగగా, గొప్ప తేజస్సుచేత ఆవరింపబడి ఉన్న ఆ వానరశ్రేష్ఠుని గూర్చి ఈ విధముగా ఆలోచించెను. 1

మూ. కిమేష భగవాన్నన్దీ భవేత్సాక్షాదిహాగతః, 2
యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచాలితే పురా,
సోఽయం వానరమూర్తిః స్యాత్కింస్విద్బాణోఽపి వాసురః. 3

ప్ర. అ. ఏషః=ఇతడు, పురా=పూర్వము, మయా=నాచేత, కైలాసే=కైలాసము, సంచాలితే=కదల్పబడిన దగుచుండగా, యేన=ఎవ్వనిచేత, శప్తః

అస్మి = శపించబడితినో, అత్ర, భగవాన్ = పూజ్యుడైన, సాక్షాత్ = సాక్షాత్తూ, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చిన, నన్దీ = నందీశ్వరుడు, కిం భవేత్ = అయి ఉండునా? సః అయమ్ = అట్టి ఇతడు, వానరమూర్తిః = వానరమూర్తి ధరించిన, మహాసురః = మహాసురుడైన, బాణః = బాణుడు, స్యాత్ కిం స్విత్ = అయి ఉండునా?

తా. "పూర్వము నేను కైలాసపర్వతమును కదల్చినపుడు నన్ను శపించిన నందియే ఈ రూపముతో ఇక్కడికి వచ్చినాడా, లేక ఇతడు వానరరూపముతో వచ్చిన మహాసురుడైన బాణుడా." 2, 3

మూ. స రాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మన్త్రిసత్తమమ్,
కాలయుక్తమువాచేదం వచో ఽవిపులమర్థవత్. 4

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, రోషతామ్రాక్షః = రోషముతో ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, మన్త్రిసత్తమమ్ = మంత్రిశ్రేష్ఠుడైన, ప్రహస్తమ్ = ప్రహస్తుని గూర్చి, కాలయుక్తమ్ = కాలమునకు తగినది, అర్థవత్ = అర్థము కలది, అవిపులమ్ = సంక్షిప్తమూ అయిన, ఇదం వచః = ఈ వచనమును, ఉవాచ = పలికెను.

తా. ఆ రావణుడు, రోషముచేత ఎఱ్ఱబడిన నేత్రములతో, మంత్రిశ్రేష్ఠుడైన ప్రహస్తునితో, కాలానుగుణము, అర్థపూర్ణము, సంక్షిప్తము అయిన ఈ మాట పలికెను. 4

మూ. దురాత్మా పృచ్ఛ్యతామేష కుతః కిం వాత్ర కారణమ్,
వనభఙ్గే చ కో ఽస్యార్థో రాక్షసీనాం చ తర్జనే. 5

ప్ర. అ. ఏషః = ఈ, దురాత్మా = దురాత్ముడు, పృచ్ఛ్యతామ్ = అడుగబడుగాక. కుతః = ఎక్కడనుండి వచ్చినాడు? అత్ర = ఈ వచ్చుటయందు, కిం కారణమ్ = కారణమేమి? వనభఙ్గే చ = వనమును విరచుటయందు, రాక్షసీనామ్ = రాక్షసస్త్రీల, తర్జనే = భయపెట్టుటయందు, అస్య = వీనికి, అర్థః = ప్రయోజనము, కః = ఏది?

తా. "ఈ దురాత్ముడు ఎక్కడనుండి వచ్చినాడో, ఎందుకు వచ్చినాడో, వనమును విరిచివేసి రాక్షసస్త్రీలను ఎందుకు భయపెట్టినాడో అడుగుము". 5

మూ. మత్పురీమప్రధృష్యాం వాగమనే కిం ప్రయోజనమ్,
ఆయోధనే వా కిం కార్యం పృచ్ఛ్యతామేష దుర్మతిః. 6

ప్ర. అ. అప్రధృష్యామ్ = ఎదిరింప శక్యము కాని, మత్పురీమ్ = నా పట్టణమును గూర్చి, ఆగమనే = వచ్చుటయందు, కిం ప్రయోజనమ్ = ఏమి ప్రయోజనము? ఆయోధనే వా = యుద్ధము చేయుటయందు, కిం కార్యమ్ = ఏమి కార్యము? ఏషః దుర్మతిః = ఈ దుర్బుద్ధి, పృచ్ఛ్యతామ్ = ప్రశ్నింపబడుగాక.

తా. "ఎదిరింప శక్యము కాని నా నగరమునకు ఏ ప్రయోజనమును ఉద్దేశించి వచ్చినాడో, ఎందుకు యుద్ధము చేసినాడో ఈ దుర్మతిని అడుగుము".

మూ. రావణస్య వచః శ్రుత్వా ప్రహస్తో వాక్యమబ్రవీత్,
సమాశ్వసిహి భద్రం తే న భీః కార్యా త్వయా కపే. 7

ప్ర. అ. ప్రహస్తః = ప్రహస్తుడు, రావణస్య = రావణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. కపే = ఓ! వానరుడా! సమాశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. త్వయా = నీచేత, భీః = భయము. న కార్యా = చేయదగినది కాదు.

తా. రాముని మాటలు విని ప్రహస్తుడు హనుమంతునితో ఇట్లు పలికెను. "ఓ! వానరుడా! ఊరడిల్లుము (కంగారుపడకుము). నీకు క్షేమమగుగాక. నీవేమీ భయపడ నవసరము లేదు". 7

మూ. యది తావత్త్వమిన్ద్రేణ ప్రేషితో రావణాలయమ్,
తత్త్వమాఖ్యాహి మా భూత్తే భయం వానర మోక్ష్యసే. 8

ప్ర. అ. వానర = వానరుడా! త్వమ్ = నీవు, ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, రావణాలయమ్ = రావణుని గృహమును గూర్చి, ప్రేషితః యది తావత్ = పంపబడి ఉన్నట్లయితే, తత్త్వమ్ = యథార్థమును, ఆఖ్యాహి = చెప్పుము. తే = నీకు, భయమ్ = భయము, మా భూత్ = కలుగకుండుగాక. మోక్ష్యసే = విడువబడ గలవు.

తా. "ఓ! వానరుడా! నీవు ఇంద్రుడు పంపగా ఈ లంకకు వచ్చినావా? యథార్థము చెప్పుము; భయపడకుము. నిన్ను విడిచివేయగలము". 8

మూ. యది వైశ్రవణస్య త్వం యమస్య వరుణస్య చ,
చారరూపమిదం కృత్వా ప్రవిష్టో నః పురీమిమామ్, 9
విష్ణునా ప్రేషితో వాపి దూతో విజయకాంక్షిణా.

ప్ర. అ. ఇదమ్ = ఈ, చారరూపమ్ = గూఢచారిరూపమును, కృత్వా = చేసి (ధరించి), నః = మాయొక్క, ఇమాం పురీమ్ = ఈ పట్టణమును, ప్రవిష్టః = ప్రవేశించిన, త్వమ్ = నీవు, వైశ్రవణస్య = కుబేరునకు సంబంధించినవాడవా, యమస్య = యమునకు సంబంధించినవాడవా, వరుణస్య చ = వరుణునకు సంబంధించినవాడవా, విజయకాంక్షిణా = విజయమును కోరుచున్న, విష్ణునా = విష్ణువుచేత, దూతః = దూతగా, ప్రేషితో వాపి = పంపబడినావా?

తా. "ఈ గూఢచారిరూపముతో మా నగరములోనికి ప్రవేశించినావు. నిన్ను కుబేరుడు పంపినాడా? యముడు పంపినాడా? వరుణుడు పంపినాడా? లేక, విజయమును కోరుచు విష్ణువు నిన్ను దూతగా పంపినాడా"? 9

మూ. న హి తే వానరం తేజో రూపమాత్రం తు వానరమ్. 10
తత్త్వతః కథయస్వాద్య తతో వానర మోక్ష్యసే.

ప్ర. అ. వానర = ఓ! వానరుడా! తే = నీయొక్క, రూపమాత్రం తు = రూపము మాత్రమే, వానరమ్ = వానరునికి సంబంధించినది. తేజః = తేజస్సు, వానరమ్ = వానరునకు సంబంధించినది. న హి = కాదు కదా. అద్య = ఇప్పుడు, తత్త్వతః = యథార్థముగా, కథయస్వ = చెప్పుము. తతః = అటు పిమ్మట, మోక్ష్యసే = విడువబడగలవు.

తా. "ఓ! వానరా! నీ రూపము వానరరూపము వలె ఉన్నది. కాని నీ తేజస్సు మాత్రము వానరులకు ఉండదగినది కాదు. ఇప్పుడు సత్యము చెప్పుము. పిదప నిన్ను విడిచిపెట్టివేసెదము". 10

మూ. అనృతం వదతశ్చాపి దుర్లభం తవ జీవితమ్. 11
అథవా యన్నిమిత్తస్తే ప్రవేశో రావణాలయే.

ప్ర. అ. తవ = నీవు, అనృతమ్ = అసత్యమును, వదతః = చెప్పినచో, జీవితమ్ = జీవితము, దుర్లభమ్ = దుర్లభ మైనది. అథవా = లేదా, రావణాలయే =

రావణుని గృహములో, తే ప్రవేశః=నీ ప్రవేశము, యన్నిమిత్తః=ఏ నిమిత్తము కలదో (అది చెప్పుము).

తా. "అసత్యము చెప్పినచో నీవు జీవించుట కష్టము. లేదా ఎవ్వరూ పంపకుండా నువ్వే వచ్చినచో, రావణగృహములోనికి ఎందుకు వచ్చినావో చెప్పుము". 11

మూ. ఏవముక్తో హరిశ్రేష్ఠస్తదా రక్షోగణేశ్వరమ్, 12
అబ్రవీన్నాస్మి శక్రస్య యమస్య వరుణస్య వా.
ధనదేన న మే సఖ్యం విష్ణునా నాస్మి చోదితః, 13
జాతిరేవ మమ త్వేషా వానరోఽహమిహాగతః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, హరిశ్రేష్ఠః=హనుమంతుడు, తదా=అప్పుడు, రక్షోగణేశ్వరమ్ = రాక్షసాధిపతి యైన రావణుని గూర్చి, అబ్రవీత్=పలికెను. శక్రస్య=ఇంద్రునకు గాని, యమస్య=యమునకు గాని, వరుణస్య వా=వరుణునకుగాని సంబంధించినవాడను, నాస్మి=కాను. మే= నాకు, ధనదేన=కుబేరునితో, సఖ్యమ్=స్నేహము, న=లేదు. విష్ణునా = విష్ణువుచేత, చోదితః= ప్రేరేపింపబడినవాడను, న=కాను. ఏషా=ఇది, మమ= నాయొక్క, జాతిరేవ=జాతియే. అహమ్=నేను, వానరః = వానరుడను ఇహ=ఇక్కడికి ఆగతః = వచ్చినాను.

తా. ప్రహస్తుని మాటలు విని హనుమంతుడు రావణునితో ఇట్లు పలికెను. "నేను యమునకు గాని, దేవేంద్రునకి గాని, వరుణునికి గాని సంబంధించిన వాడను కాను. నాకు కుబేరునితో సంబంధ మేదీ లేదు. నన్ను విష్ణువు పంపలేదు. నేను మారు రూపములో రాలేదు. నేను వానరుడను. ఇదే నా జాతి. ఈ నగరానికి రావలె ననియే వచ్చినాను. 12, 13

మూ. దర్శనే రాక్షసేన్ద్రస్య దుర్లభే తదిదం మయా, 14
వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితమ్.

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రాక్షసప్రభు వైన నీయొక్క, దర్శనే=దర్శనము, దుర్లభే=దుర్లభ మైనదగుచుండగా, మయా=నాచేత, తత్=ఆ, ఇదమ్=ఈ, వనమ్=వనము, రాక్షసరాజస్య= రాక్షసరాజ వైన నీయొక్క, దర్శనార్థే= దర్శనమునిమిత్త మై, వినాశితమ్=నశింపచేయబడినది.

తా. నీ దర్శనము అంత తేలికగా లభించదు కావున, నీ దర్శనము లభించుటకై, ప్రసిద్ధ మైన ఆ ఉద్యానవనమును నాశనము చేసినాను. 14

మూ. తతస్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాఙ్క్షిణః,
రక్షణార్థం తు దేహస్య ప్రతియుద్ధా మయా రణే. 15

ప్ర. అ. తతః=అటు పిమ్మట, బలినః=బలవంతు లైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, యుద్ధకాఙ్క్షిణః=యుద్ధము కోరుచున్నవా రై, ప్రాప్తాః=వచ్చినారు, దేహస్య=దేహముయొక్క, రక్షణార్థం తు = రక్షణముకొరకే మయా = నాచేత, రణే=యుద్ధమునందు, ప్రతియుద్ధాః= యుద్ధములో ఎదిరింపబడినారు.

తా. అపుడు బలవంతు లైన ఆ రాక్షసు లందరూ యుద్ధము చేయుటకై వచ్చినారు. నాకు నా దేహమును రక్షించుకొనుటకు మాత్రమే వారితో యుద్ధము చేయవలసి వచ్చినది. 15

మూ. అస్త్రపాశైర్న శక్యోఽహం బద్ధుం దేవాసురైరపి, 16
పితామహాదేవ వరో మమాప్యేషోఽభ్యుపాగతః.

ప్ర. అ. అహమ్=నేను, దేవాసురైరపి=దేవతలచేతను అసురులచేతను కూడ, అస్త్రపాశైః=అస్త్రపాశములచేత, బద్ధుమ్=బంధించుటకు, న శక్యః= శక్య మైనవాడను కాను. ఏషః వరః= ఈ వరము, మమాపి=నాకు కూడా, పితామహాదేవ=బ్రహ్మదేవునినుండియే, అభ్యుపాగతః=వచ్చినది.

తా. దేవతలు, అసురులు కూడ నన్ను అస్త్రపాశములతో బంధింపజాలరు. (నీకు ఏవేవో వరములు లభించి నట్లే) నాకు కూడ ఈ వరము బ్రహ్మదేవుని నుండే లభించినది. 16

మూ. రాజానం ద్రష్టుకామేన మయాస్త్రమనువర్తితమ్, 17
విముక్తో హ్యహమస్త్రేణ రాక్షసైస్త్వభిపీడితః,
కేనచిద్రాజకార్యేణ సంప్రాప్తోఽస్మి తవాన్తికమ్. 18

ప్ర. అ. రాజానమ్=రాజ వైన నిన్ను, ద్రష్టుకామేన=చూడవలె నని కోరిక గల, మయా=నాచేత, అస్త్రమ్=అస్త్రము, అనువర్తితమ్=అనుసరింపబడినది. రాక్షసైః=రాక్షసులచేత, అభిపీడితః తు=బంధింపబడగానే, అహమ్=

నేను, అస్త్రేణ=అస్త్రముచేత, విముక్తో హి = విడువబడితిని కదా. కేనచిత్ = ఒకానొక, రాజకార్యేణ=రాజకార్యముచేత, తవ=నీయొక్క, అన్తికమ్=సమీపమును గూర్చి, సంప్రాప్తః అస్మి=వచ్చినాను.

తా. నిన్ను చూడవలెనను కోరికచేతనే నేను అస్త్రబంధమునకు లొంగియుంటిని. రాక్షసులు నన్ను బంధింపగానే అస్త్రము నన్ను విడిచివేసినది. ఒకానొక రాజకార్యముచేత నేను నీవద్దకు వచ్చినాను. 18

మూ. దూతోఽహమితి విజ్ఞేయో రాఘవస్యామితౌజసః,
శ్రూయతాం చాపి వచనం మమ పథ్యమిదం ప్రభో. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చాశః సర్గః.

ప్ర. అ. అహమ్ = నేను, అమితౌజసః = అపరిమితమైన తేజస్సు గల, రాఘవస్య = రాముని యొక్క, దూతః ఇతి = దూతను అని, విజ్ఞేయః = తెలియదగినవాడను. ప్రభో = ఓ రాక్షసరాజా! పథ్యమ్ = హితమైన, ఇదమ్ = ఈ, మమ వచనమ్ = నా వచనము, శ్రూయతాం చాపి = వినబడుగాక.

తా. ఓ రాక్షసరాజా! నేను అపరిమితమైన తేజస్సుగల రాముని దూతనని తెలిసికొనుము. హితమైన మాట చెప్పుచున్నాను, వినుము. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకపఞ్చాశః సర్గః

[హనుమంతుడు రాముని ప్రభావము వర్ణించి చెప్పుచు రావణు నకు నీతి ఉపదేశించుట].

మూ. తం సమీక్ష్య మహాసత్త్వం సత్త్వవాన్ హరిసత్తమః,
వాక్యమర్థవదవ్యగ్రస్తమువాచ దశాననమ్. 1

ప్ర. అ. సత్త్వవాన్ = బలవంతు డైన, హరిసత్తమః = హనుమంతుడు, మహాసత్త్వమ్ = గొప్ప బలము గల, తం దశాననమ్ = ఆ రావణుని, సమీక్ష్య = చూచి, అవ్యగ్రమ్ = కంగారు లేకుండగా, అర్థవత్ = అర్థయుక్తమైన, వాక్యమ్ = వాక్యమును, తమ్ = వానిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. మహాబలవంతు డైన హనుమంతుడు, మహాబలవంతు డైన ఆ రావణుని చూచి, ఏ మాత్రము భయము చెందక, అతనితో అర్థయుక్త మైన వాక్య మిట్లు పలికెను. 1

మూ. అహం సుగ్రీవసందేశాదిహ ప్రాప్తస్తవాలయమ్,
రాక్షసేన్ద్ర హరీశస్త్వాం భ్రాతా కుశలమబ్రవీత్. 2

ప్ర. అ. రాక్షసేన్ద్ర = ఓ! రాక్షసరాజా! అహమ్ = నేను, సుగ్రీవసందేశాత్ = సుగ్రీవుని ఆజ్ఞ వలన, ఇహ = ఇక్కడికి, తవ ఆలయమ్ = నీ గృహమును గూర్చి, ప్రాప్తః = వచ్చినాను. భ్రాతా = సోదరు డైన, హరీశః = ఆ వానరప్రభు వైన సుగ్రీవుడు, త్వామ్ = నిన్ను గూర్చి, కుశలమ్ = కుశలమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఓ! రాక్షసరాజా! నేను సుగ్రీవుని ఆజ్ఞచే ఇక్కడికి వచ్చినాను. వానరరా జైన, నీ సోదరుడు, సుగ్రీవుడు నిన్ను కుశల మడిగినాడు. 2

మూ. భ్రాతుః శృణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః,
ధర్మార్థోపహితం వాక్యమిహ చాముత్ర చ క్షమమ్. 3

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, భ్రాతుః = సోదరుడైన, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, సమాదేశమ్ = వార్తయైనది, ఇహ చ = ఈ లోకమునందు, అముత్ర చ = పరలోకమునందు, క్షమమ్ = శుభమును కూర్చుటకు సమర్థమైనది, ధర్మార్థోపహితమ్ = ధర్మముతోను, అర్థముతోను కూడినది అయిన, వాక్యమ్ = వాక్యమును, శృణు = వినుము.

తా. మహాత్ముడైన నీ సోదరుడు సుగ్రీవుడు వార్త పంపినాడు. ధర్మార్థములతో కూడినవి, ఇహపరలోకములందు శ్రేయస్కరములూ అయిన ఆ మాటలు వినుము. 3

మూ. రాజా దశరథో నామ రథకుఞ్జరవాజిమాన్,
పితేవ బన్ధుర్లోకస్య సురేశ్వరసమద్యుతిః 4

ప్ర. అ. రథకుఞ్జరవాజిమాన్ = రథములు, ఏనుగులు, గుఱ్ఱములు కలవాడు, లోకస్య = లోకమునకు, పితేవ = తండ్రి వంటి వాడు, సురేశ్వరసమద్యుతిః = దేవేంద్రునితో సమానమైన కాంతి గలవాడు అయిన, దశరథో నామ = దశరథుడనే పేరు గల, రాజా = రాజు ఉండెను.

తా. రథములు, ఏనుగులు, గుఱ్ఱములు కలవాడు. లోకమునకు తండ్రి వంటివాడు, దేవేంద్రునితో సమానమైన కాంతి కలవాడు అయిన దశరథుడను రాజు ఉండెను. 4

మూ. జ్యేష్ఠస్తస్య మహాబాహుః పుత్రః ప్రియకరః ప్రభుః,
పితుర్నిదేశాన్నిష్క్రాన్తః ప్రవిష్టో దణ్డకావనమ్. 5
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చాపి భార్యయా,
రామో నామ మహాతేజా ధర్మ్యం పన్థాన మాస్థితః. 6

ప్ర. అ. తస్య = అతనియొక్క, జ్యేష్ఠః పుత్రః = జ్యేష్ఠపుత్రుడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, ప్రియకరః = ప్రియమును చేయువాడు, ప్రభుః = ప్రభువు, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడు అయిన,

రామో నామ=రాముడు, ధర్మ్యమ్=ధర్మసంయుత మైన, పన్థానమ్=మార్గమును, ఆస్థితః=ఆశ్రయించినవాడై, పితుః=తండ్రియొక్క, నిదేశాత్=ఆజ్ఞవలన, నిష్క్రాన్తః=బయలుదేరినవాడై, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన=లక్ష్మణుని తోను, భార్యయా=భార్య యైన, సీతయా చాపి=సీతతోను, దణ్డకావనమ్= దండకావనమును, ప్రవిష్టః=ప్రవేశించినాడు.

తా. ఆ దశరథుని జ్యేష్ఠకుమారుడు, మహాబాహువు, తండ్రికి ప్రియము చేయువాడు, మహాతేజశ్శాలి అయిన, మా ప్రభు వైన రాముడు, తండ్రి ఆజ్ఞచే, ధర్మమార్గమును అవలంబించి, అయోధ్యను విడచి, సోదరు డైన లక్ష్మణుని తోను, భార్య యైన సీతతోను, దండకావనములో ప్రవేశించినాడు. 5, 6

మూ. తస్య భార్యా వనే నష్టా సీతా పతిమనువ్రతా,
వైదేహస్య సుతా రాజ్ఞో జనకస్య మహాత్మనః. 7

ప్ర. అ. వైదేహస్య=విదేహదేశాధిపతి, మహాత్మనః = మహాత్ముడూ అయిన, జనకస్య=జనకు డనే, రాజ్ఞః=రాజాయొక్క, సుతా = కుమార్తై, పతిమ్=భర్తను, అనువ్రతా=అనుసరించినది, తస్య = ఆ రామునియొక్క, భార్యా=భార్య అయిన, సీతా=సీత, వనే=వనమునందు, నష్టా=కనబడ కుండ పోయినది.

తా. విదేహదేశాధిపతి యైన మహాత్ము డైన జనకమహారాజు పుత్రి, భర్తనే అనుసరించి యుండేది, రాముని భార్య అయిన సీత అరణ్యములో కనబడ కుండ పోయినది. 7

మూ. స మార్గమాణస్తాం దేవీం రాజపుత్రః సహానుజః,
ఋశ్యమూకమనుప్రాప్తః సుగ్రీవేణ సమాగతః. 8

ప్ర. అ. తాం దేవీమ్=ఆ దేవిని, మార్గమాణః=వెదకుచు, సహానుజః= తమ్మునితో కూడిన, సః రాజపుత్రః=ఆ రాజకుమారుడు, ఋశ్యమూకమ్= ఋశ్యమూకపర్వతమును, అనుప్రాప్తః=చేరినవాడై, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమాగతః=కలిసెను.

తా. తమ్మునితో కూడిన ఆ రాజకుమారు డైన రాముడు, సీతాదేవిని వెదకికొనుచు ఋశ్యమూకపర్వతము చేరి, అక్కడ సుగ్రీవుని కలుసుకొనెను. 8

మూ. తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్,
సుగ్రీవస్యాపి రామేణ హరిరాజ్యం నివేదితమ్. 9

ప్ర. అ. తేన = ఆ సుగ్రీవునిచేత, తస్య = ఆ రామునకు, సీతాయాః = సీతయొక్క, పరిమార్గణమ్ = వెదకుట, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినది. రామేణాపి = రామునిచేత కూడ, సుగ్రీవస్య = సుగ్రీవునకు, హరిరాజ్యమ్ = వానర రాజ్యము, నివేదితమ్ = తెలుపబడినది (ప్రతిజ్ఞ చేయబడినది).

తా. సీతను వెదకించెద నని సుగ్రీవుడు రామునకు ప్రతిజ్ఞ చేసి చెప్పగా, నీకు వానరరాజ్యము ఇచ్చెద నని రాముడు సుగ్రీవునకు ప్రతిజ్ఞ చేసి చెప్పెను. 9

మూ. తతస్తేన మృధే హత్వా రాజపుత్రేణ వాలినమ్,
సుగ్రీవః స్థాపితో రాజ్యే హర్యృక్షాణాం గణేశ్వరః. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తేన = ఆ, రాజపుత్రేణ = రామునిచేత, వాలినమ్ = వాలిని, మృధే = యుద్ధమునందు, హత్వా = చంపి, సుగ్రీవః = సుగ్రీవుడు, హర్యృక్షాణామ్ = వానరులయొక్క భల్లూకములయొక్క, గణేశ్వరః = గణములకు ప్రభువుగా, రాజ్యే = రాజ్యమునందు, స్థాపితః = స్థాపించ బడినాడు.

తా. పిమ్మట రాముడు యుద్ధములో వాలిని సంహరించి సుగ్రీవుణ్ణి వానరభల్లూకగణముల అధిపతినిగా, రాజ్యమునందు స్థాపించెను. 10

మూ. త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుఙ్గవః,
రామేణ నిహతః సంఖ్యే శరేణైకేన వానరః. 11

ప్ర. అ. వానరపుఙ్గవః = వానరులలో శ్రేష్ఠుడైన, వాలీ = వాలి, త్వయా = నీచేత, విజ్ఞాతపూర్వశ్చ = పూర్వమే తెలియబడినవాడు. వానరః = ఆ వాలి, రామేణ = రామునిచేత, సంఖ్యే = యుద్ధమునందు, ఏకేన = ఒక, శరేణ = బాణముచేత, నిహతః = చంపబడినాడు.

తా. వాలి ఎవరో నీకు పూర్వమే తెలియును కదా. ఆ వాలిని రాముడు, యుద్ధములో ఒక్క బాణముతో చంపినాడు. 11

మూ. స సీతామార్గణే వ్యగ్రః సుగ్రీవః సత్యసంగరః,
హరీన్ సంప్రేషయామాస దిశః సర్వా హరీశ్వరః. 12

ప్ర. అ. సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు, హరీశ్వరః = వానరప్రభువూ అయిన, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, సీతామార్గణే = సీతను అన్వేషించుటయందు, వ్యగ్రః = ఆకులత చెందినవాడై, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను గూర్చి, హరీన్ = వానరులను, సంప్రేషయామాస = పంపెను.

తా. సత్యమైన ప్రతిజ్ఞ గల, వానరప్రభువైన సుగ్రీవుడు సీతను అన్వేషించవలె నని చాల వ్యాకులుడై, అన్ని దిక్కులకు వానరులను పంపెను.

మూ. తాం హరీణాం సహస్రాణి శతాని నియుతాని చ,
దిక్షు సర్వాసు మార్గన్తే హ్యధశ్చోపరి చామ్బరే. 13

ప్ర. అ. హరీణామ్ = వానరులయొక్క, సహస్రాణి = సహస్రములు, శతాని = వందలు, నియుతాని చ = లక్షలు. తామ్ = ఆమెను, సర్వాసు = సమస్తమైన, దిక్షు = దిక్కులందు, అధశ్చ = క్రింద, ఉపరి = పైన, అమ్బరే చ = ఆకాశమునందు, మార్గన్తే = వెదకుచున్నారు.

తా. వందల కొలది, వేల కొలది, లక్షల కొలది వానరులు, ఆ సీత కొరకు అన్ని దిక్కులందు, పాతాళములోను, పైన ఆకాశమునందూ కూడ వెదకుచున్నారు. 13

మూ. వైనతేయసమాః కేచిత్ కేచిత్తత్రానిలోపమాః,
అసంగగతయః శీఘ్రా హరివీరా మహాబలాః. 14

ప్ర. అ. తత్ర = ఆ వానరులలో, మహాబలాః = గొప్ప బలము గల, కేచిత్ = కొందరు, హరివీరాః = వానరులు, వైనతేయసమాః = గరుత్మంతునితో సమానులు. కేచిత్ = కొందరు, అనిలోపమాః = వాయువుతో సమానులు, శీఘ్రాః = వేగముగా పోవువారు. అసంగగతయః = అడ్డు లేని గమనము కలవారు.

తా. ఆ వానరులలో మహాబలవంతులైన కొందరు వానరవీరులు గరుత్మంతుని బోలినవారు. మరికొందరు వాయువువంటివారు. అడ్డు లేని గమనము కలవారై ఎక్కడికైనా అతిశీఘ్రముగా పోగలరు. 14

మూ. అహం తు హనుమాన్నామ మారుతస్యౌరసః సుతః।
సీతాయాస్తు కృతే తూర్ణం శతయోజనమాయతమ్॥ 15
సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షురిహాగతః।

ప్ర. అ. మారుతస్య = వాయుదేవునియొక్క, ఔరసః సుతః = ఔరస పుత్రుడ నైన, హనుమాన్నామ = హనుమంతుడను పేరు గల, అహం తు = నేనైతే, సీతాయాః కృతే = సీతనిమిత్తమై, తూర్ణమ్ = శీఘ్రముగా, శతయోజనమ్ = నూరు యోజనములు, ఆయతమ్ = పొడవైన, సముద్రమ్ = సముద్రమును, లంఘయిత్వైవ = లంఘించియే, తామ్ = ఆమెను, దిదృక్షుః = చూడదలచినవాడనై, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినాను.

తా. నేను సాక్షాత్తు వాయుదేవుని కుమారుడను. నా పేరు హనుమంతుడు. నేను సీతకొరకై శతయోజనవిస్తీర్ణమైన సముద్రమును శీఘ్రముగా లంఘించి ఆమెను చూచుటకై ఇక్కడికి వచ్చినాను. 15

మూ. భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా॥ 16
తద్భవాన్ దృష్టధర్మార్థస్తపఃకృతపరిగ్రహః।
పరదారాన్ మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వమర్హసి॥ 17

ప్ర. అ. భ్రమతా = తిరుగుచున్న, మయా = నాచేత, తే = నీయొక్క, గృహే = గృహమునందు, జనకాత్మజా = సీత, దృష్టా = చూడబడినది. భవాన్ = నీవు, దృష్టధర్మార్థః = చూడబడిన ధర్మార్థములు కలవాడవు. తపఃకృత పరిగ్రహః = చేయబడిన తపస్సంపాదనము కలవాడవు. తత్ = ఆ కారణము వలన, మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధి కలవాడా! త్వమ్ = నీవు, పరదారాన్ = పరభార్యను, ఉపరోద్ధుమ్ = అడ్డుపెట్టుటకు (బంధించుటకు), న అర్హసి = తగవు.

తా. నేను లంకలో తిరుగుచు, తిరుగుచు, నీ యింటిలో సీతను చూచినాను. నీవు ధర్మార్థముల స్వరూపము తెలిసినవాడవు. గొప్ప తపస్సు చేసినావు. అందువలన, ఓ మహాబుద్ధిశాలీ! నీవు పరభార్యను నీ యింటిలో నుంచుకొనుట యుక్తము కాదు. 16, 17

మూ. న హి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు।
మూలఘాతిషు సజ్జన్తే బుద్ధిమన్తో భవద్విధాః॥ 18

ప్ర. అ. భవద్విధాః = నీ వంటి, బుద్ధిమన్తః = బుద్ధిమంతులు, ధర్మ విరుద్ధమ్ = ధర్మమునకు విరుద్ధములు, అత్యపాయమ్ = అధిక మైన అపాయము కలవి, మూలఘాతిషు = మూలమునే నశింపచేయునవి అయిన, కర్మసు = పను లలో, న సజ్జన్తే హి = ఆసక్తులు కారు కదా।

తా. నీ వంటి బుద్ధిమంతులు, ధర్మానికి విరుద్ధ మైనవి, అనేక అపాయములతో కూడినవి, మూలమునే నశింపచేయునవి అయిన పనులు చేయరు కదా। 18

మూ. కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినామ్,
శరాణామగ్రతః స్థాతుం శక్తో దేవాసురేష్వపి. 19

ప్ర. అ. లక్ష్మణముక్తానామ్ = లక్ష్మణునిచేత విడువబడినవి, రామ కోపానువర్తినామ్ = రాముని కోపమును అనుసరించునవి అయిన, శరాణామ్ = శరముల, అగ్రతః = ఎదుట, స్థాతుమ్ = నిలుచుటకు, దేవాసురేష్వపి = దేవతల లోను అసురులలోను కూడ, కః = ఎవడు, శక్తః = సమర్థుడు?

తా. రామునికి కోపము వచ్చుట చూచి లక్ష్మణుడు ప్రయోగించిన బాణముల ఎదుట, సురాసురులలో కూడ ఎవ్వ డైనా నిలువగలడా? 19

మూ. న చాపి త్రిషు లోకేషు రాజన్విద్యేత కశ్చన,
రాఘవస్య వ్యళీకం యః కృత్వా సుఖమవాప్నుయాత్.

ప్ర. అ. రాజన్ = రాజా! యః = ఎవడు, రాఘవస్య = రామునకు, వ్యళీకమ్ = అపకారమును, కృత్వా = చేసి, సుఖమ్ = సుఖమును, అవాప్నుయాత్ = పొందునో, అట్టివాడు, త్రిషు = మూడు, లోకేషు = లోకములందు, కశ్చన = ఎవడూ, న విద్యేత = ఉండడు.

తా. రావణా! మూడు లోకములలో ఏ ఒక్కడూ కూడ రామునకు అపకారము చేసి సుఖముగా ఉండజాలడు. 20

మూ. తత్త్రికాలహితం వాక్యం ధర్మ్యమర్థానుబన్ధి చ,
మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్. 21

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, త్రికాలహితమ్ = మూడు కాలము లందూ హిత మైనదీ, ధర్మ్యమ్=ధర్మసంమతమూ, అర్థానుబన్ధి చ = అర్థమునకు కూడ సంబంధించినదీ అయిన, వాక్యమ్ = వాక్యమును, మన్యస్వ = అంగీక రింపుము. నరదేవాయ = రామునకు, జానకీ = సీత, ప్రతిదీయతామ్ = తిరిగి ఇవ్వబడుగాక.

తా. అందుచే నీవు మూడు కాలములలోనూ కూడ హిత మైనది, ధర్మ సంమతము, అర్థమును కూర్చునదీ అయిన నా మాట వినుము. సీతను రామునకు తిరిగి ఇచ్చివేయుము. 21

మూ. దృష్టాహీయం మయా దేవీ లబ్ధం యదిహ దుర్లభమ్,
ఉత్తరం కర్మ యచ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః. 22

ప్ర. అ. మయా = నాచేత, ఇయం దేవీ = ఈ సీతాదేవి, దృష్టా హి = చూడబడినది కదా. యత్ = ఏది, దుర్లభమ్ = పొంద శక్యము కానిదో అది, ఇహ = ఇక్కడ, లబ్ధమ్ = పొందబడినది. ఉత్తరమ్ = తరువాతి దైన, యత్ = ఏ, కర్మ = పని, శేషమ్ = మిగిలి ఉన్నదో, తత్ర = అక్కడ, రాఘవః = రాముడు, నిమిత్తమ్ = నిమిత్తము.

తా. నేను సీతాదేవిని చూచినాను. మరెక్కడా లభించని సీతాదర్శనము ఇక్కడ లభించినది. ఇటు పైన మిగిలిన ఏ కార్యము చేయవలెనో అది రాముడే నిర్ణయించగలడు. 22

మూ. లక్షితేయం మయా సీతా తథా శోకపరాయణా,
గృహ్య యాం నాభిజానాసి పఞ్చాస్యామివ పన్నగీమ్.

ప్ర. అ. తథా = ఆ విధముగా, శోకపరాయణా = శోకమునకు అధీనురా లైన, ఇయం సీతా = ఈ సీత, మయా = నాచేత, లక్షితా = చూడబడినది. పఞ్చాస్యామ్ = ఐదు ముఖములు గల, పన్నగీమివ = ఆడ సర్పమువంటి, యామ్ = ఏ సీతను, గృహ్య = గ్రహించి, నాభిజానాసి = తెలుసుకొనజాలకున్నావో,

తా. ఐదు తలల సర్పము వంటి ఏ సీతను పట్టుకొని నీవు రాబోవు గొప్ప అపాయమును గుర్తించజాలకున్నావో అట్టి సీతను, శోకములో మునిగి యున్నదిగా నేను చూచినాను. 23

మూ. నేయం జరయితుం శక్యా సాసురైరమరైరపి,
విషసంసృష్టమత్యర్థం భుక్తమన్నమివౌజసా. 24

ప్ర. అ. అత్యర్థమ్=మిక్కిలి, విషసంసృష్టమ్=విషముతో కలిసిన, భుక్తమ్=భుజింపబడిన, అన్నమివ=అన్నము వలె, ఇయమ్=ఈమె, సాసురైః=అసురులతో కూడిన, అమరైరపి=దేవతలచేత కూడ, ఓజసా=పరాక్రమముచేత (జఠరాగ్నిచేత అని కూడ రెండవ అర్థము) జరయితుమ్=జీర్ణింపచేసుకొనుటకు, న శక్యా=శక్య మైనది కాదు.

తా. ఎక్కువగా విషము కలిసిన అన్నము తిని ఎవ్వరూ ఏ విధముగా జీర్ణింప చేసికొనజాలరో అదే విధముగ ఈ సీతను, అసురులు గాని, సురులు గాని, ఎవ్వరూ జీర్ణింపచేసికొన జాలరు. 24

మూ. తపఃసంతాపలబ్ధస్తే యోఽయం ధర్మపరిగ్రహః,
న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణపరిగ్రహః. 25

ప్ర. అ. తపఃసంతాపలబ్ధః=తపస్సు చేయుటచేత పొందబడిన, తే=నీయొక్క, యః=ఏ, అయమ్=ఈ, ధర్మపరిగ్రహః=ధర్మ ఫల మైన, ఆత్మప్రాణపరిగ్రహః=ఆత్మయొక్క ప్రాణములయొక్క స్వీకారము అనగా జీవనము కలదో, సః=అది, నాశయితుమ్=నశింపచేయుటకు, న న్యాయ్యః=న్యాయ మైనది కాదు.

తా. నీవు తపస్సు చేసి తత్ఫలితముగాను, ఇతరధర్మముల ఫలము గాను దీర్ఘాయుర్దాయమును పొంది ఉన్నావు. దానిని నశింపచేసికొనుట మంచిది కాదు.

వి. ఇది కొంచెం క్లిష్టాన్వయంగానే ఉన్నది. ప్రాచ్యపాఠంలో ఈ శ్లోకం మరొకవిధంగా ఉన్నది.

"తపఃసంతానలబ్ధస్తే యోఽయమృద్ధిపరిచ్ఛదః,
రామో నాశయితుం శక్తః సాత్మప్రాణపరిగ్రహః".

తపఃసంతానలబ్ధః=తపస్సుయొక్క సంతానము చేత (అనగా నిరంతర దీర్ఘ తపస్సుచేత) పొందబడిన, తే=నీయొక్క, ఋద్ధిపరిచ్ఛదః=ఐశ్వర్యపరికరము,

పార్శ్వత్రాణపరిగ్రహః = అర్శ్వరక్షణలో కూడినది ఏది ఉన్నదో, దానిని, రాముడు నశింపచేయుటకు సమర్థుడు. అనగా తపస్సు చేసి నీవు సంపాదించుకొన్న ఐశ్వర్యాన్నీ, నీ ఆయుస్సునూ కూడా రాముడు నశింపచేయగలడు అని భావము. 25

సూ. అవధ్యతాం తపోభిర్యాం భవాన్ సమనుపశ్యతి,
ఆత్మనః సాసురైర్దేవైర్హేతుస్తత్రాప్యయం మహాన్. 26

ప్ర. అ భవాన్=నీవు, తపోభిః=నీవు చేసిన తపస్సులచేత, ఆత్మనః= నీకు, సాసురైః = అసురులతో కూడిన, దేవైః=దేవతలచేత కూడ, యామ్=ఏ, అవధ్యతామ్=అవధ్యత్వమును, సమనుపశ్యసి = చూచుచున్నావో, తత్రాపి = ఆ విషయమునందు కూడ, అయమ్=ఈ, మహాన్=గొప్ప, హేతుః=హేతువు, ఉన్నది.

తా. తపస్సుచేత నేను అసురులనుండి. సురులనుండి కూడ మరణము లేకుండు నట్లు చేసికొన్నాను కదా అని నీవు అనుకొనుచుండవచ్చును. కాని అది కూడ సరికాదని చెప్పుటకు హేతువు వినుము. 26

సూ. సుగ్రీవో న హి దేవోఽయం నాసురో న చ రాక్షసః,
న దానవో న గన్ధర్వో న యక్షో న చ పన్నగః. 27
తస్మాత్ప్రాణపరిత్రాణం కథం రాజన్ కరిష్యసి.

ప్ర. అ. అయం సుగ్రీవః = ఈ సుగ్రీవుడు, దేవః = దేవుడు, న హి= కాడు కదా, అసురః న = అసురుడు కాడు. రాక్షసః చ న = రాక్షసుడు కూడ కాడు. దానవః న=దానవుడు కాడు. గన్ధర్వః న=గంధర్వుడు కాడు. యక్షః= న=యక్షుడు కాడు. పన్నగశ్చ న = పన్నగుడు కూడ కాడు. రాజన్=రాజా, తస్మాత్ = వానినుండి, ప్రాణపరిత్రాణమ్=ప్రాణముల రక్షణమును, కథమ్ = ఎట్లు, కరిష్యసి=చేయగలవు?

తా. ఈ సుగ్రీవుడు దేవుడు కాని, అసురుడు కాని, రాక్షసుడు కాని, దానవుడు కాని, గంధర్వుడు కాని, యక్షుడు కాని, పన్నగుడు కాని కాడు కదా! అందుచేత ఆ సుగ్రీవుని నుండి నీవు నీ ప్రాణములను ఎట్లు రక్షించుకొనేరవు? 27

మూ. న తు ధర్మోపసంహారమధర్మఫలసంహితమ్. 28
తదేవ ఫలమన్వేతి ధర్మశ్చాధర్మనాశనః.

ప్ర. అ. ధర్మోపసంహారమ్ = ధర్మఫలము, అధర్మఫలసంహితమ్ = అధర్మముయొక్క ఫలముతో కూడినది, న తు = కాదు. తత్ = ఆ, ఫలమేవ = ధర్మముయొక్క ఫలమే, అన్వేతి = అనుసరించి వచ్చును. ధర్మశ్చ = ధర్మము, అధర్మనాశనః = అధర్మమును నశింపచేయునది.

తా. ధర్మఫలము అధర్మఫలముతో కలిసి ఉండదు. ఆ ధర్మఫలమే అనుసరించి వచ్చుచుండును. ధర్మము అధర్మాన్ని నశింపచేయును.

వి. ఇది ప్రాచీనుల వ్యాఖ్యానము. భావం ఏమీ సరిగా కుదరటం లేదు. చెప్పే అర్థం ప్రకరణానికి అనుకూలంగా ఉండాలి కదా? "తపస్సు చేసి అవధ్యత్వం సంపాదించినాము కదా అని అనుకొని ప్రయోజనం లేదు" అని వెనుక చెప్పి, రాలోవు శ్లోకంలో హనుమంతుడు "ఇంతవరకు నీవు ధర్మ ఫలాన్ని అనుభవించినావు, ఇటుపైన అధర్మఫలం అనుభవించవలసి ఉంటుంది' అని చెప్పనున్నాడు. మధ్యలో ఉన్న ఈ శ్లోకం పూర్వోత్తరాలకు సంబంధం ఉండేటిగా ఉండాలి కదా? పైన చెప్పిన అర్థం తదనుగుణంగా లేదు. ఏదో కల్పించి చెప్పవలసి ఉంది. అందుచేత దీని అర్థం ఈ విధంగా చెపితే బాగుంటుం దని నా అభిప్రాయం.

ధర్మోపసంహారమ్ = ధర్మమును (పుణ్యమును) క్షీణముచేయు, తదేవ ఫలమ్ = ఆ ధర్మఫలమే, అధర్మఫలసంహితమ్ = అధర్మము ఇవ్వవలసిన ఫలముతో కలిసినదై, న అన్వేతి = అనుబద్ధమై రాదు. ధర్మః = ధర్మము, అధర్మనాశనశ్చ = అధర్మమును నశింపచేసేది కూడ, న = కాదు ("న" ఇక్కడ కూడా అన్వయించుకొనవలెను).

"ధర్మఫలమును అనుభవింపగా అనుభవించగా ఆ ధర్మము తగ్గిపోవు చుండును. ఈ విధముగా ధర్మమును తగ్గించే ధర్మఫలము, అధర్మము తన ఫలము ఇవ్వడానికి ప్రారంభించిన తరవాత కూడ అనువర్తించదు. ధర్మము అధర్మాన్ని నశింప చేయజాలదు" అని తాత్పర్యం. అనగా ధర్మఫలం అధర్మ ఫలానుభవం ప్రారంభం అయ్యేవరకే; అంతవరకు నువ్వు పూర్వము ఎంత

ధర్మము చేసినా ఇటుపైన అధర్మఫలం అనుభవించవలసిందే. ఈ భావాన్నే రాబోవు శ్లోకంలో స్పష్టంగా చెప్పనున్నాడు.

ప్రాచ్యపాఠంలో శ్లోకం భిన్నంగా ఉన్నది

"న హి ధర్మోఽప్యసంహార్యో విధర్మఫలసంహితః,
తదేవ ఫలమాప్నోతి ధర్మాణాం ఫలనాశనః".

ధర్మోఽపి=ధర్మము కూడ, అసంహార్యః=తొలగింప శక్యముకానిది, న హి= కాదు కదా. విధర్మఫలసంహితః = అధర్మముయొక్క ఫలముతో కూడినవాడు అనగా అధర్మఫలమును అనుభవింపవలసి ఉన్నవాడు, ధర్మాణామ్=ధర్మముల యొక్క, ఫలనాశనః = ఫలమును నశింపచేయువాడై, తదేవ ఫలమ్ = అధర్మ ఫలమునే, ఆప్నోతి = పొందును అని దీని అర్థము.

"అధర్మం బలీయమైనప్పుడు ధర్మం కూడా వెనక్కి పోతుంది. అధర్మఫలం అనుభవించవలసివచ్చినప్పుడు ధర్మఫలం నశించి ఆ అధర్మ ఫలమే లభిస్తుంది" అని దీని భావం. 28

మూ. ప్రాప్తం ధర్మఫలం తావద్భవతా నాత్ర సంశయః,
ఫలమస్యాప్యధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే. 29

ప్ర. అ. భవతా = నీచేత, ధర్మఫలమ్ = ధర్మముయొక్క ఫలము, ప్రాప్తం తావత్ = పొందబడినది. అత్ర = ఈ విషయమునందు, సంశయః = సంశయము, న = లేదు. అస్య = ఈ, అధర్మస్య = అధర్మముయొక్క, ఫలమపి = ఫలమును కూడ, క్షిప్రమేవ = శీఘ్రముగానే, ప్రపత్స్యసే = పొందగలవు.

తా. నీ వింతవరకు ధర్మఫలమును పొందినావు. ఈ విషయములో సందేహము లేదు. అచిరకాలమునందే అధర్మమునకు ఫలమును కూడ పొందగలవు. 29

మూ. జనస్థానవధం బుద్ధ్వా బుద్ధ్వా వాలివధం తథా, 30
రామసుగ్రీవసఖ్యం చ బుధ్యస్వ హితమాత్మనః.

ప్ర. అ. జనస్థానవధమ్=జనస్థానములో జరిగిన రాక్షసవధను, బుద్ధ్వా=తెలిసికొని. తథా=మరియు. వాలివధమ్=వాలియొక్క వధను. బుద్ధ్వా=తెలిసికొని. రామసుగ్రీవసఖ్యం చ=రామసుగ్రీవుల స్నేహమును కూడా తెలిసికొని. ఆత్మనః=నీయొక్క, హితమ్=హితమును. బుధ్యస్వ=తెలిసికొనుము.

తా. జనస్థానములో రాక్షసుల వధను, వాలి వధను, రామసుగ్రీవుల మధ్య స్నేహ మేర్పడిన దను విషయమును గుర్తుంచుకొని నీకు ఏది హితమో ఆలోచించుకొనుము. 30

మూ. కామం త్వహమపి ఏకః సవాజిరథకుంజరామ్, 31
లంకాం నాశయితుం శక్తః తస్యైష తు న నిశ్చయః.

ప్ర. అ. అహమ్=నేను, ఏకోఽపి=ఒక్కడనే అయినను, సవాజిరథకుంజరామ్=గుఱ్ఱములతోను, రథములతోను, ఏనుగులతోను కూడిన, లంకామ్=లంకను, నాశయితుమ్=నశింపచేయుటకు. కామమ్=నిస్సంశయముగా, శక్తః అస్మి=సమర్థుడను. ఏషః తు=ఇదైతే, తస్య=ఆ రామునియొక్క, నిశ్చయః=నిశ్చయము, న=కాదు.

తా. అశ్వగజరథాదులతో కూడిన లంకను నేనొక్కడనే నశింపచేయగలను కాని ఇది రాముని నిర్ణయమునకు అనుగుణము కాదు. 31

మూ. రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్షగణసంనిధౌ 32
ఉత్సాదనమమిత్రాణాం సీతా యైస్తు ప్రధర్షితా.

ప్ర. అ. రామేణ=రామునిచేత, హర్యృక్షగణసంనిధౌ=వానరుల యొక్క భల్లూకములయొక్క గణముల ఎదుట, యైః=ఎవరిచేత, సీతా=సీత, ప్రధర్షితా=తిరస్కరింపబడినదో, తేషామ్ అమిత్రాణామ్=శత్రువులయొక్క, ఉత్సాదనమ్=వినాశనము. ప్రతిజ్ఞాతం హి=ప్రతిజ్ఞ చేయబడినది కదా.

తా. ఎందుచేత ననగా- రాముడు వానరగణముల సమక్షమందు, భల్లూకగణముల సమక్షమందు, "సీత నపహరించిన శత్రువులను నశింపచేసెదను" అని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. 32

మూ. అపకుర్వన్హి రామస్య సాక్షాదపి పురందరః, 33
న సుఖం ప్రాప్నుయాదన్యః కిం పునస్త్వద్విధో జనః.

ప్ర. అ. రామస్య = రామునకు, అపకుర్వన్ = అపకారము చేసినచో, సాక్షాత్ = సాక్షాత్తు, పురందరః అపి = దేవేంద్రుడు కూడ, సుఖమ్ = సుఖమును, న ప్రాప్నుయాత్ = పొందడు. త్వద్విధః = నీవంటి, జనః = జనుడు, కిం పునః = చెప్పనేల.

తా. రామునకు అపకారము చేసినచో సాక్షాత్తు దేవేంద్రుడు కూడా సుఖముగా ఉండజాలడు. నీ వంటివాని మాట చెప్పవలెనా! 33

మూ. యాం సీతేత్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే, 34
కాలరాత్రీతి తాం విద్ధి సర్వలఙ్కావినాశినీమ్.

ప్ర. అ. యామ్ = ఏ స్త్రీని, సీతా ఇతి = సీత అని, అభిజానాసి = అనుకొనుచున్నావో, యా ఇయమ్ = ఏ ఈ స్త్రీ. తే వశే = నీ వశమునందు, తిష్ఠతి = ఉన్నదో, తామ్ = ఆమెను, సర్వలఙ్కావినాశినీమ్ = సమస్తమైన లంకను నశింపచేసే, కాలరాత్రిం ఇతి = కాలరాత్రి అని, విద్ధి = తెలుసుకొనుము.

తా. ఏ స్త్రీని నీవు సీత అని అనుకొనుచున్నావో, ఏ స్త్రీ నీ వశములో బందీగా ఉన్నదో ఆమె సమస్తమైన లంకను నశింపచేసే కాలరాత్రి అని తెలుసుకొనుము. 34

మూ. తదలం కాలపాశేన సీతావిగ్రహరూపిణా, 35
స్వయం స్కన్ధావసక్తేన క్షమమాత్మని చిన్త్యతామ్

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, సీతావిగ్రహరూపిణా = సీత శరీరము యొక్క రూపము గల, స్వయమ్ = స్వయముగా, స్కన్ధావసక్తేన = కంఠానికి తగుల్కొన్న, కాలపాశేన = కాలపాశముచేత, అలమ్ = చాలును. ఆత్మని = నీ విషయమున, క్షమమ్ = యుక్తమైనది, చిన్త్యతామ్ = ఆలోచింపబడునుగాక.

తా. అందుచేత సీతాశరీరరూపములో ఉన్న కాలపాశమును నీ అంతట నీవే మెడకు తగుల్కొనకుము. నీకు ఏది హితమో ఆలోచించుకొనుము. 35

మూ. సీతాయాస్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్. ౩౬
దహ్యమానామిమాం పశ్య పురీం సాట్టప్రతోళికామ్.

ప్ర. అ. సీతాయాః = సీతయొక్క, తేజసా = తేజస్సుచేత, దగ్ధామ్ = కాల్పబడిన, రామకోపప్రపీడితామ్ = రాముని కోపముచేత పీడింపబడినదై, దహ్యమానామ్ = కాల్చివేయబడుచున్న, సాట్టప్రతోళికామ్ = కోట బురుజుల తోను వీథులతోను కూడిన, ఇమామ్ = ఈ, పురీమ్ = పట్టణమును, పశ్య = చూడుము.

తా. కోట బురుజులతోను, వీథులతోను కూడిన ఈ లంకాపట్టణమును, సీత తేజస్సు ముందుగానే కాల్చివేసినది. రాముని కోపముచే పీడిత మై ఈ పట్టణము దగ్ధ మని మండిపోవుచున్నది చూడుము. (జరిగ బోవుదానిని జరుగుచున్నట్లు వర్ణించి చెప్పుచున్నాడు). ౩౬

మూ. స్వాని మిత్రాణి మన్త్రీంశ్చ జ్ఞాతీన్ భ్రాతౄన్ సుతాన్ హితాన్
భోగాన్ దారాంశ్చ లఙ్కాం చ మా వినాశ ముపానయ.

ప్ర. అ. స్వాని = నీ సంబంధ మైన, మిత్రాణి = మిత్రులను, మన్త్రీంశ్చ = మంత్రులను, జ్ఞాతీన్ = దగ్గర బంధువులను, భ్రాతౄన్ = సోదరులను, సుతాన్ = కుమారులను, హితాన్ = హితులను, భోగాన్ = భోగములను, దారాంశ్చ = భార్యలను, లఙ్కాం చ = లంకను, వినాశమ్ = వినాశమును, మా ఉపానయ = పొందింపకుము.

తా. నీ మిత్రులు, మంత్రులు, జ్ఞాతులు, సోదరులు, కుమారులు, హితులు భోగములు, భార్యలు, లంక ఇవన్నీ నశించిపోవు నట్లు ప్రవర్తింపకుము. ౩౭

మూ. సత్యం రాక్షసరాజేన్ద్ర శృణుష్వ వచనం మమ, ౩౮
రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః.

ప్ర. అ. రాక్షసరాజేన్ద్ర = ఓ రాక్షసచక్రవర్తీ, రామదాసస్య = రాముని దాసుడను, దూతస్య = దూతను, విశేషతః = విశేషించి, వానరస్య = వానరు

తా. ఓ రాక్షసరాజా ! లోకత్రయమునకు ప్రభు వైన రాముని ఎదుట యుద్ధములో, దేవతలు, దైత్యులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, యక్షులు వీరితో ఎవ్వరూ కూడ నిలబడజాలరు. 44

మూ. బ్రహ్మా స్వయమ్భూశ్చతురాననో వా
రుద్రస్త్రినేత్రస్త్రిపురాన్తకో వా,
ఇన్ద్రో మహేన్ద్రః సురనాయకో వా
త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్. 45

ప్ర. అ. యుధి = యుద్ధమునందు, రామవధ్యమ్ = రామునిచేత చంప దగినవానిని, స్వయంభూః = స్వయముగా జన్మించిన, చతురాననః = నాలుగు ముఖములు కల, బ్రహ్మా వా = బ్రహ్మదేవుడు గాని, త్రినేత్రః = మూడు నేత్రములు గల, త్రిపురాన్తకః = త్రిపురసంహారకు డైన, రుద్రో వా = రుద్రుడు గాని, ఇన్ద్రః = అధికైశ్వర్యము కలవాడు, సురనాయకః = దేవతల ప్రభువు అయిన, మహేన్ద్రః వా = మహేంద్రుడు కాని, త్రాతుమ్ = రక్షించుటకు, న శక్తాః = సమర్థులు కారు

తా. యుద్ధములో రాముడు చంపదలచుకొన్నవానిని, స్వయముగా పుట్టిన, చతుర్ముఖు డైన బ్రహ్మదేవుడు గాని, మూడు నేత్రములు గల, త్రిపుర సంహారము చేసిన రుద్రుడు గాని, అధికైశ్వర్యవంతుడు, దేవతాప్రభువు అయిన మహేంద్రుడు గాని రక్షింపజాలరు.

వి. ఈ శ్లోకాలను, ప్రధానంగా 45వ శ్లోకాన్ని పట్టి బ్రహ్మరుద్రాదుల కంటె విష్ణువే అధికు డను విషయము స్పష్ట మగుచున్నది. విష్ణ్వవతార మైన రాముణ్ణి సర్వజగత్సృష్ట్యాదిసమర్థునిగా చెప్పుట జరిగినది కదా అని గోవింద రాజాదుల అభిప్రాయం. దీని నంతనీ అర్థవాదగా మాత్రమే గ్రహించాలని కొందరి అభిప్రాయం. త్రిమూర్తులకు అభేదాన్ని అంగీకరించినవారికి ఇలాంటి బాధ లేవీ లేనే లేవు. "సీతాయాస్తేజసా దగ్ధామ్" అనే 36వ శ్లోకం మొదలు, ''న సౌఖ్యవో పేతమ్'' అనే 46వ శ్లోకం వరకూ ఉన్న 11 శ్లోకాలు ప్రాచ్య ప్రతిలో లేవు. 45

మూ. స సౌష్ఠవోపేతమదీనవాదినః
కపేర్నిశమ్యాప్రతిమోఽప్రియం వచః,
దశాననః కోపవివృత్తలోచనః
సమాదిశత్తస్య వధం మహాకపేః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. అప్రతిమః = సాటి లేని, సః దశాననః = ఆ రావణుడు, అదీనవాదినః = నిర్భయముగా మాటలాడుచున్న, కపేః = హనుమంతునియొక్క, సౌష్ఠవోపేతమ్ = సౌష్ఠవముతో కూడిన, అప్రియమ్ = తనకు ప్రియము కాని, వచః = వచనమును, నిశమ్య = విని, కోపవివృత్తలోచనః = కోపముచేత త్రిప్పబడిన నేత్రములు కలవాడై, తస్య = ఆ, మహాకపేః = హనుమంతునియొక్క, వధమ్ = వధను, సమాదిశత్ - ఆజ్ఞాపించెను.

తా. సాటి లేని ఆ దశాననుడు, నిర్భయముగా మాటలాడుచున్న ఆ హనుమంతుడు పలికిన, సౌష్ఠవముతో కూడిన, అప్రియవచనములు విని, కోపముతో నేత్రములు త్రిప్పుచు, "ఈ వానరుని వధింపుడు" అని ఆజ్ఞాపించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందర కాండలో ఏబదిఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

[దూతను వధించుట తగ దని బోధించుచు విభీషణుడు, మరొక దండన మేదైన ఇవ్వ మని రావణుని కోరుట. రావణుడు అందుకు అంగీకరించుట].

మూ. తస్య తద్వచనం శ్రుత్వా వానరస్య మహాత్మనః,
ఆజ్ఞాపయద్వధం తస్య రావణః క్రోధమూర్ఛితః. 1

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య వానరస్య = ఆ హనుమంతునియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, క్రోధమూర్ఛితః = క్రోధముచేత వ్యాపింపబడినవాడై, తస్య = అతని యొక్క, వధమ్ = వధను, అజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

తా. మహాత్ముడైన ఆ హనుమంతుని మాటలు విని, క్రోధావిష్టుడై రావణుడు "వీనిని చంపుడు" అని ఆజ్ఞాపించెను.

మూ. వధే తస్య సమాజ్ఞప్తే రావణేన దురాత్మనా,
నివేదితవతో దౌత్యం నానుమేనే విభీషణః. 2

ప్ర. అ. దురాత్మనా = దుష్టబుద్ధి గల, రావణేన = రావణునిచేత, తస్య = అతనియొక్క, వధే = వధ, సమాజ్ఞప్తే = ఆజ్ఞాపించబడినదగుచుండగా, విభీషణః = విభీషణుడు, దౌత్యమ్ = దూత చేయవలసిన దానిని, నివేదితవతః = తెలిపిన అతని వధను, నానుమేనే = అంగీకరించలేదు.

తా. దురాత్ముడైన రావణుడు హనుమంతుని వధింపు డని ఆజ్ఞాపించుట చూచి, విభీషణుడు, దూతధర్మమును నిర్వర్తించిన అతని వధకు ఇష్టపడలేదు.

మూ. తం రక్షోధిపతిం క్రుద్ధం తచ్చ కార్యముపస్థితమ్,
విదిత్వా చిన్తయామాస కార్యం కార్యవిధౌ స్థితః. 3

ప్ర. అ. కార్యవిధౌ = కార్యమును సాధించుటయందు, స్థిరః = నిలచిన, (సమర్థుడైన) విభీషణుడు, తమ్ = ఆ, రక్షోధిపతిమ్ = రావణుని. క్రుద్ధమ్ = కోపగించినవానినిగాను, ఉపస్థితమ్ = వచ్చి ఉన్న, తత్ = ఆ, కార్యం చ = కార్యమును, విదిత్వా = తెలిసికొని, కార్యమ్ = చేయదగిన పనిని గూర్చి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. కార్యమును సాధించుటలో నేర్పరియైన ఆ విభీషణుడు, రావణుడు కోపించిన విషయమును గుర్తించి, దూతవధ అను కార్యము జరుగనున్నదని తెలుసుకొని, "ఇప్పుడు ఏమి చేయవలెనా" అని ఆలోచించెను. 3

మూ. నిశ్చితార్థస్తతః సామ్నా పూజ్యం శత్రుజిదగ్రజమ్,
ఉవాచ హితమత్యర్థం వాక్యం వాక్యవిశారదః. 4

ప్ర. అ. తతః = అటు పిమ్మట, నిశ్చితార్థః = నిశ్చయము చేయబడిన కార్యము కలవాడై, శత్రుజిత్ = శత్రువులను జయించువాడు, వాక్యవిశారదః = మాటలలో నేర్పు గలవాడు అయిన విభీషణుడు, పూజ్యమ్ = పూజించ దగిన వాడైన, అగ్రజమ్ = అన్నగారిని గూర్చి, అత్యర్థమ్ = మిక్కిలి. హితమ్ = హితమైన, వాక్యమ్ = వాక్యమును, సామ్నా = సామముతో, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట శత్రుసంహారకుడు, మాటలలో నేర్పరి అయిన ఆ విభీషణుడు తాను అనుసరించ వలసిన పద్ధతిని నిశ్చయము చేసికొని, పూజ్యుడైన అన్నగారితో చాల హితమైన వాక్యమును ఈ విధముగ సామపూర్వకముగ పలికెను. 4

మూ. క్షమస్వ రోషం త్యజ రాక్షసేన్ద్ర
ప్రసీద మద్వాక్యమిదం శృణుష్వ,
వధం న కుర్వన్తి పరావరజ్ఞా
దూతస్య సన్తో వసుధాధిపేన్ద్రాః. 5

ప్ర. అ. రాక్షసేన్ద్ర = రాక్షసరాజా! క్షమస్వ = క్షమించుము. రోషమ్ = రోషమును, త్యజ = విడువుము, ప్రసీద = అనుగ్రహించుము, ఇదమ్ = ఈ, మద్వాక్యమ్ = నా వాక్యమును, శృణుష్వ = వినుము. పరావరజ్ఞాః = ఏది

మంచిదో, ఏది చెడ్డదో ఎరిగిన, సన్తః=మంచివారైన, వసుధాధిపేన్ద్రాః=రాజ శ్రేష్ఠులు, దూతస్య = దూతయొక్క, వధమ్=వధను, న కుర్వన్తి = చెయ్యరు.

తా. రాక్షసరాజా! క్షమింతుము. రోషము విడిచిపెట్టుము. అనుగ్రహించి నా మాట వినుము. మంచి చెడ్డలు తెలిసిన, సత్పురుషులైన రాజశ్రేష్ఠులు దూతను వధించరు. 5

మూ. రాజధర్మవిరుద్ధం చ లోకవృత్తేశ్చ గర్హితమ్,
తవ చాసదృశం వీర కపేరస్య ప్రమాపణమ్. 6

ప్ర. అ. వీర = వీరుడా! అస్య = ఈ, కపేః = వానరునియొక్క, ప్రమాపణమ్ = చంపుట, రాజధర్మవిరుద్ధం చ = రాజధర్మమునకు విరుద్ధము. లోకవృత్తేశ్చ = లోకమర్యాదకు కూడ, గర్హితమ్=నింద్యము. తవ చ = నీకు కూడ, అసదృశమ్ = తగనిది.

తా. ఓ! వీరుడా! ఈ వానరుని చంపుట రాజధర్మానికి విరుద్ధమైనది. లోకమర్యాదప్రకారము కూడ నింద్యము. ఇది నీవు చేయవలసిన పని కాదు.

మూ. ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మవిశారదః,
పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్. 7

ప్ర. అ. త్వమేవ = నీవే, ధర్మజ్ఞశ్చ = ధర్మము తెలిసిన వాడవు. కృతజ్ఞశ్చ=కృతజ్ఞుడవు. రాజధర్మవిశారదః=రాజధర్మములందు నేర్పు గలవాడవు. భూతానామ్ = ప్రాణుల, పరావరజ్ఞః = తారతమ్యము ఎరిగినవాడవు. పరమార్థవిత్= యథార్థము ఎరిగినవాడవు.

తా. నీవు ధర్మాలు తెలిసినవాడవు. కృతజ్ఞుడవు. రాజధర్మాలలో నేర్పు కలవాడవు. ప్రాణులలో ఉన్న తారతమ్యము తెలిసినవాడవు. నీకు తెలియని పరమార్థము లేదు. 7

మూ. గృహ్యన్తే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః,
తతః శాస్త్రవిపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్. 8

ప్ర. అ. త్వద్విధాః = నీవంటి, విపశ్చితోఽపి = పండితులు కూడ, రోషేణ = కోపముచేత, గృహ్యన్తే యది = గ్రహింపబడిన ట్లయితే, తతః = అప్పుడు, శాస్త్రవిపశ్చిత్త్వమ్ = శాస్త్రపాండిత్యము, కేవలమ్ = కేవలము, శ్రమ ఏవ హి = శ్రమయే కదా.

తా. నీ వంటి పండితులు కూడ రోషమునకు లొంగిపోయినచో, శాస్త్రములలో పాండిత్యము సంపాదించుట కేవలము శ్రమగానే మిగిలిపోవును కదా! 8

మూ. తస్మాత్ప్రసీద శత్రుఘ్న రాక్షసేన్ద్ర దురాసద,
యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతదణ్డో విధీయతామ్. 9

ప్ర. అ. శత్రుఘ్న = శత్రుసంహారకుడా! దురాసద = ఎదిరింప శక్యము కానివాడా! రాక్షసేన్ద్ర = రాక్షసరాజా! తస్మాత్ = ఆ కారణమువలన, ప్రసీద = అనుగ్రహించుము. యుక్తాయుక్తమ్ = యుక్తాయుక్తములను, వినిశ్చిత్య = నిశ్చయించి, దూతదణ్డః = దూతయొక్క దండనము, విధీయతామ్ = విధింపబడుగాక.

తా. శత్రుసంహారకుడవు, శత్రువులచే ఎదిరింప శక్యముకానివాడవు అయిన ఓ రాక్షసరాజా! అందువలన నీవు ప్రసన్నుడ వై, మంచి చెడుగులు నిర్ణయించి, ఈ దూతకు తగిన దండము విధింపుము. 9

మూ. విభీషణవచః శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
రోషేణ మహతావిష్టో వాక్యముత్తరమబ్రవీత్. 10

ప్ర. అ. రాక్షసేశ్వరః = రాక్షసప్రభు వైన, రావణః = రావణుడు, విభీషణవచః = విభీషణుని వచనమును, శ్రుత్వా = విని, మహతా = గొప్ప, రోషేణ = రోషముచేత, ఆవిష్టః = ఆవేశింపబడినవా డై, ఉత్తరమ్ = ప్రత్యుత్తర రూప మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాక్షసరా జైన రావణుడు విభీషణుని మాటలు విని, చాల కోపముతో ఈ విధముగ ప్రత్యుత్తర మిచ్చెను. 10

మూ. న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన,
తస్మాదేనం వధిష్యామి వానరం పాపకారిణమ్. 11

ప్ర. అ. శత్రుసూదన = శత్రువినాశకుడా! పాపానామ్ = పాపాత్ముల యొక్క, వధే = వధయందు, పాపమ్ = పాపము, న విద్యతే = లేదు, తస్మాత్ = ఆ కారణమువలన, పాపకారిణమ్ = పాపములు చేసిన, ఏనమ్ = ఈ, వానరమ్ = వానరుణ్ణి, వధిష్యామి = వధించెదను.

తా. ఓ! శత్రుసంహారకుడా! పాపాత్ములను వధించినను పాపము కలుగదు. అందువలన, పాపము నాచరించిన ఈ వానరుణ్ణి, వధించెదను. 11

మూ. అధర్మమూలం బహుదోషయుక్త
మనార్యజుష్టం వచనం నిశమ్య,
ఉవాచ వాక్యం పరమార్థతత్త్వం
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః. 12

ప్ర. అ. బుద్ధిమతామ్ = బుద్ధిమంతులలో, వరిష్ఠః = శ్రేష్ఠుడైన, విభీషణః = విభీషణుడు, అధర్మమూలమ్ = అధర్మమునకు మూలము, బహుదోషయుక్తమ్ = చాల కోపముతో కూడినది, అనార్యజుష్టమ్ = పెద్దవారిచేత అంగీకరింపబడనిది అయిన, వచనమ్ = ఆ వచనమును, నిశమ్య = విని, పరమార్థతత్త్వమ్ = ఉత్తమమైన కార్యనిర్ణయము గల, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన విభీషణుడు, అధర్మమునకు మూలము, అధికమైన రోషముతో నిండినది, దుష్టులు మాత్రమే అంగీకరించేది, అయిన ఆ వాక్యమును విని, ఉత్తమమైన కార్యనిర్ణయమును తెలుపు వాక్యమును పలికెను. 12

మూ. ప్రసీద లఙ్కేశ్వర రాక్షసేన్ద్ర
ధర్మార్థయుక్తం వచనం శృణుష్వ,
దూతానవధ్యాన్ సమయేషు రాజన్
సర్వేషు సర్వత్ర వదన్తి సన్తః. 13

ప్ర. అ. లఙ్కేశ్వర = లంకాధిపతియైన, రాక్షసేన్ద్ర = రాక్షసరాజా! ప్రసీద = అనుగ్రహించుము, ధర్మార్థయుక్తమ్ = ధర్మార్థములతో కూడిన,

వచనమ్ = వచనమును, శృణుష్వ=వినుము. రాజన్=రాజా। సర్వేషు=సమస్తమైన, సమయేషు = సమయములందు, సర్వత్ర = అన్ని ప్రదేశములందు, దూతాన్ = దూతలను, అవధ్యాన్=చంప దగనివారినిగా, సన్తః=సత్పురుషులు వదన్తి = చెప్పుచున్నారు.

తా. లంకాధిపతి వైన ఓ। రాక్షసరాజా। అనుగ్రహింపుము. ధర్మార్థములతో కూడిన నే చెప్పు మాట వినుము. ఓ। రాజా। ఏ కాలమునందూ, ఏ దేశమునందూ కూడ దూతలను చంపకూడదు అని సత్పురుషులు చెప్పుచున్నారు. 13

మూ. అసంశయం శత్రురయం ప్రవృద్ధః
కృతం హ్యనేనాప్రియమప్రమేయమ్,
న దూతవధ్యాం ప్రవదన్తి సన్తో
దూతస్య దృష్టా బహవో హి దణ్డాః. 14

ప్ర. అ. అయమ్ = ఈ, శత్రుః = శత్రువు, ప్రవృద్ధః=మితిమీరినాడు. అసంశయమ్=సంశయము లేదు. అనేన=ఇతనిచేత. అప్రమేయమ్=లెక్కించ శక్యము కాని, అప్రియమ్ = అప్రియము. కృతం హి = చేయబడినది కదా. సన్తః = సత్పురుషులు, దూతవధ్యామ్ = దూతవధను, న ప్రవదన్తి = చెప్పరు. దూతస్య=దూతకు, బహవః=అనేక మైన, దణ్డాః=దండనములు, దృష్టాః హి= చూడబడుచున్నవి కదా.

తా. శత్రు వైన ఈ వానరుడు మితి మీరి ప్రవర్తించినాడను మాట నిజమే. ఇతడు లెక్క లేనంత అప్రియము చేసినాడు. ఏ మైనా సత్పురుషులు దూతల వధను అంగీకరించరు. దూతలకు విధింప దగిన అనేక ఇతర దండనలు ఉన్నవి కదా। 14

మూ. వైరూప్యమఙ్గేషు కశాభిఘాతో
మౌణ్డ్యం తథా లక్షణసంనిపాతః,
ఏతాన్ హి దూతే ప్రవదన్తి దణ్డాన్
వధస్తు దూతస్య న నః శ్రుతోఽస్తి. 15

ప్ర. అ. అఙ్గేషు = అవయవములందు, వైరూప్యమ్ = వికారము, కశాభిఘాతః = కొరడాలచేత కొట్టడము, మౌణ్డ్యమ్ = ముండనము చేయుట, తథా = మరియు, లక్షణసన్నిపాతః = గుర్తులు వేయుట, ఏతాన్ = వీటిని, దూతే = దూతయందు, దణ్డాన్ = దండములనుగా, ప్రవదన్తి = చెప్పుచున్నారు. దూతస్య = దూతయొక్క, వధస్తు = వధ యైతే, నః = మనకు, శ్రుతః = వినబడినదిగా, నాస్తి = లేదు.

తా. అవయవములను ఛేదించుట మొదలైనవానిచే శరీరమునకు వికారము కలిగించుట, కొరడాలతో కొట్టుట, తల గొరిగి పంపుట, ఏమైన గుర్తులు దేహముమీద వేయుట ఇవి దూతకు ఇవ్వవలసిన దండనములు అని చెప్పుదురు. దూతలను చంపుట అనేదానిని మన మెన్నడూ వినలేదు కదా! 15

మూ. కథం చ ధర్మార్థవినీతబుద్ధిః
పరావరప్రత్యయనిశ్చితార్థః,
భవద్విధః కోపవశే హి తిష్ఠేత్
కోపం నియచ్ఛన్తి హి సత్త్వవన్తః. 16

ప్ర. అ. ధర్మార్థవినీతబుద్ధిః = ధర్మార్థములందు శిక్షిత మైన బుద్ధి గల, పరావరప్రత్యయనిశ్చితార్థః = మంచిచెడ్డల జ్ఞానమునందు నిశ్చిత మైన విషయము గల, భవద్విధః = నీవంటివాడు, కోపవశే = కోపవశమునందు, కథమ్ = ఎట్లు, తిష్ఠేత్ = ఉండును? సత్త్వవన్తః = బుద్ధిమంతులు, కోపమ్ = కోపమును, నియచ్ఛన్తి హి = అణచుకొందురు కదా.

తా. ధర్మార్థములను గూర్చి బాగుగా నేర్చిన బుద్ధి కలిగి, మంచిచెడ్డల విషయమున నిశ్చిత మైన జ్ఞానము గల నీవంటివాడు ఇంత శీఘ్రముగా కోపమునకు వశు డెట్లగును? బుద్ధిమంతులు కోపాన్ని నిగ్రహించుకొందురు కదా?

మూ. న ధర్మవాదే న చ లోకవృత్తే
న శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి,
విద్యేత కశ్చిత్తవ వీరతుల్య
స్త్వం హ్యుత్తమః సర్వసురాసురాణామ్. 17

ప్ర. అ. వీర = ఓ! వీరుడా, ధర్మవాదే = ధర్మమునకు సంబంధించిన సంభాషణమునందు, తవ = నీకు, తుల్యః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వడూ, న విద్యేత = ఉండడు, లోకవృత్తే = లోకవ్యవహారమునందు, న = ఉండడు. శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి = శాస్త్రములను గ్రహించుటయందు, ఇతరుల ఆలోచనలను గ్రహించుటయందును కూడ, న = ఉండడు. త్వమ్ = నీవు, సర్వసురాసురాణామ్ = అందరు సురాసురులలో, ఉత్తమః హి = ఉత్తముడవు కదా!

తా. ఓ! వీరుడా! ధర్మమును గూర్చిన వాదమునందు గాని, లోకవ్యవహారజ్ఞానమునందు గాని, శాస్త్రములను, ఇతరులబుద్ధిని గ్రహించుటయందు గాని నీతో సమానుడు ఎవ్వడూ లేడు. నీవు ఈ విషయములందు సురాసురులలో ఉత్తముడవు కదా. 17

మూ. శూరేణ వీరేణ నిశాచరేన్ద్ర
సురాసురాణామపి దుర్జయేన,
త్వయా ప్రగల్భాః సురదైత్యసంఘా
జితాశ్చ యుద్ధేష్వసకృన్నరేన్ద్రాః. 18

ప్ర. అ. నిశాచరేన్ద్ర = రాక్షసరాజా! శూరేణ = శూరుడవు, వీరేణ = వీరుడవు, సురాసురాణామపి = సురులకు అసురులకు కూడ. దుర్జయేన = జయింప శక్యము కాని వాడవు అయిన, త్వయా = నీచేత, ప్రగల్భాః = ప్రగల్భులైన, సురదైత్యసంఘాః = దేవతలయొక్క దైత్యులయొక్క సంఘములు, నరేన్ద్రాః = రాజులు, యుద్ధేషు = యుద్ధములలో, అసకృత్ = అనేకపర్యాయములు, జితాశ్చ జయింపబడినారు.

తా. ఓ! రాక్షసరాజా! నీవు శూరుడవు. వీరుడవు. సురాసురులు కూడ నిన్ను జయింప జాలరు. నీవు అనేక పర్యాయములు యుద్ధములలో బలాఢ్యులైన సురదైత్యుల సముదాయములను, ఎందరో రాజులను జయించినావు. 18

మూ. న చాప్యస్య కపేర్ఘాతే కంచిత్పశ్యామ్యహం గుణమ్,
తేష్వయం పాత్యతాం దణ్డో యైరయం ప్రేషితః కపిః.

ప్ర. అ. అస్య = ఈ, కపేః = వానరునియొక్క, ఘాతే = చంపుటయందు, అహమ్ = నేను, కంచిత్ గుణమ్ = ఏ గుణమును కూడా, న పశ్యామి =

చూడను. అయమ్ = ఈ, దణ్డః = దండము, కైః=ఎవరిచేత, అయం కపిః = ఈ వానరుడు, ప్రేషితః = పంపబడినాడో, తేషు = వారిపై, పాత్యతామ్=పడ వేయబడుగాక.

రా. ఈ వానరుని చంపుటవల్ల నా కేమీ ప్రయోజనము కనబడుటలేదు. ఈ మరణదండమును. ఈ వానరుని పంపినవారిమీద ప్రయోగింపుము. 19

మూ. సాధుర్వా యది వాసాధుః పరైరేష సమర్పితః,
బ్రువన్ పరార్థం పరవాన్న దూతో వధమర్హతి. 20.

ప్ర. అ. సాధుర్వా = మంచివాడైనా, అసాధుర్యది వా = చెడ్డవాడైనా, ఏషః = ఇతడు, పరైః = శత్రువుంచేత, సమర్పితః = పంపబడినవాడు. పరార్థమ్ = ఇతరులకొరకై, బ్రువన్ = మాటలాడుచున్న, పరవాన్ = పరాధీనుడైన, దూతః = దూత, వధమ్ = వధను, న అర్హతి = తగడు.

రా. ఇతడు మంచివాడైనా, చెడ్డవాడైనా, ఇతరులు పంపినవాడే కదా. తన కేవిధమైన స్వాతంత్ర్యము లేక పరుల పక్షాన మాటలాడే దూతను చంపకూడదు. 20

మూ. అపి చాస్మిన్ హతే రాజన్నాన్యం పశ్యామి ఖేచరమ్,
ఇహ యః పునరాగచ్ఛేత్పరం పారం మహోదధేః. 21

ప్ర. అ. రాజన్ = రాజా, అపి చ = మరొక విషయమేమనగా, అస్మిన్ = ఇతడు, హతే = చంపబడినవాడగుచుండగా, యః = ఎవ్వడు, మహోదధేః = మహాసముద్రముయొక్క, పరం పారమ్ = అవలి ఒడ్డును (కు), పునః = మరల, ఇహ = ఇక్కడికి, ఆగచ్ఛేత్ = వచ్చునో, అట్టి, అన్యమ్ = మరియొక, ఖేచరమ్ = ఆకాశములో సంచరించగలవానిని, న పశ్యామి = చూడను.

రా. రాజా! ఇతనిని చంపివేసినచో, ఈ మహాసముద్రము అవతలి ఒడ్డున ఇక్కడికి రాగల, ఆకాశమునందు సంచరించగల మరొకడెవ్వడూ నాకు కనబడుటలేదు. 21

మూ. తస్మాన్నాస్య వధే యత్నః కార్యః పరపురంజయ,
భవాన్ సేన్ద్రేషు దేవేషు యత్నమాస్థాతుమర్హతి. 22

ప్ర. అ. పరపురంజయ = శత్రుపురములను జయించువాడా! తస్మాత్ = ఆ కారణమువలన, అస్య = ఈతనియొక్క, వధే = వధయందు, యత్నః = ప్రయత్నము, న కార్యః = చేయదగినది కాదు. భవాన్ = నీవు, సేన్ద్రేషు = ఇంద్రునితో కూడిన, దేవేషు = దేవతలపై, యత్నమ్ = ప్రయత్నమును, ఆస్థాతుమ్ = అవలంబించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. శత్రుపురములను జయించువాడా! అందువల్ల నీ వీతని వధకై ప్రయత్నము చేయకుము. నీ వింద్రునిపైన, తక్కిన దేవతలపైన అట్టి ప్రయత్నము చేయుము.

మూ. అస్మిన్వినష్టే న హి వీరమన్యం
పశ్యామి యస్తౌ నరరాజపుత్రౌ.
యుద్ధాయ యుద్ధప్రియ దుర్వినీతా
వుద్యోజయేద్దీర్ఘపథావరుద్ధౌ. 23

ప్ర. అ. యుద్ధప్రియ = యుద్ధము ప్రియముగా కలవాడా! అస్మిన్ = ఇతడు, వినష్టే = మరణించినవా డగుచుండగా, దుర్వినీతౌ = గర్వించి యున్నవారు, దీర్ఘపథావరుద్ధౌ = దీర్ఘమార్గముచేత అడ్డుకొనబడినవారు అయిన, తౌ నరరాజపుత్రౌ = ఆ రాజకుమారులను, యుద్ధాయ = యుద్ధముకొరకు, ఉద్యోజయేత్ = సన్నద్ధులను చేయునో, అట్టి, అన్యమ్ = మరియొక, దూతమ్ = దూతను, న పశ్యామి హి = చూడను.

తా. యుద్ధప్రియుడ వైన ఓ రాక్షసరాజా! ఈతడు మరణించినచో, చాలా దూరములో ఉన్న, గర్వితులైన ఆ రాజకుమారులను యుద్ధానికి తీసికొనిరా గలిగిన మరొక దూత ఎవ్వడూ నాకు కనబడడు. 23

మూ. పరాక్రమోత్సాహమనస్వినాం చ
సురాసురాణామపి దుర్జయేన,
త్వయా మనోనన్దన నైరృతానాం
యుద్ధాయతిర్నాశయితుం న యుక్తా. 24

ప్ర. అ. నైరృతానామ్=రాక్షసులకు, మనోనన్దన=మనస్సుకు ఆనందము కలిగించువాడా! పరాక్రమోత్సాహమనస్వినాం చ=పరాక్రమము, ఉత్సాహము, ఉన్నతమైన మనస్సు కల, సురాసురాణామపి=సురాసురులకు కూడ, దుర్జయేన=జయింప శక్యము కాని, త్వయా=నీచేత, యుద్ధాయతిః=యుద్ధము యొక్క రాక, నాశయితుమ్=నాశనము చేయుటకు, న యుక్తా=యుక్తమైనది కాదు.

రా. రాక్షసుల మనస్సుకు ఆనందము కలిగించువాడా! పరాక్రమము, ఉత్సాహము, మనోధైర్యము గల సురాసురులు కూడ నిన్ను జయించజాలరు. అట్టి నీవు యుద్ధము వచ్చే అవకాశమునకు అడ్డుగలగకూడదు. 24

మూ. హితాశ్చ శూరాశ్చ సమాహితాశ్చ
కులేషు జాతాశ్చ మహాగుణేషు,
మనస్వినః శస్త్రభృతాం వరిష్ఠాః
కోట్యగ్రతస్తే సుభృతాశ్చ యోధాః. 25

ప్ర. అ. తే=నీకు, హితాశ్చ=హితులు, శూరాశ్చ=శూరులు, సమాహితాశ్చ=అప్రమత్తులుగా ఉన్నవాళ్ళు, మహాగుణేషు=గొప్ప గుణములు గల, కులేషు=కులములందు, జాతాః=పుట్టినవాళ్ళు, మనస్వినః=ఆత్మాభిమానము కలవాళ్ళు, శస్త్రభృతామ్=శస్త్రధారులలో, వరిష్ఠాః=శ్రేష్ఠులు, సుభృతాశ్చ=బాగుగా పోషింపబడినవాళ్ళు అయిన, యోధాః=యోధులు, కోట్యగ్రతః=కోటి కంటె ఎక్కువగా, (ఉన్నారు).

రా. బాగుగా పోషింపబడుచు నీ హితమునే కోరు యోధులు నీవద్ద, కోటికి మించి ఉన్నారు. వాళ్ళందరూ శూరులు; ఏమరుపాటు లేనివాళ్ళు; ఆత్మాభిమానవంతులు; శస్త్రధారులలో శ్రేష్ఠులు. 25

మూ. తదేకదేశేన బలస్య తావ
త్కేచిత్తవాదేశకృతోఽభియాన్తు,
తౌ రాజపుత్రౌ వినిగృహ్య మూఢౌ
పరేషు తే భావయితుం ప్రభావమ్. 26

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, తవ = నీయొక్క, ఆదేశకృతః = ఆజ్ఞను నిర్వహించు, కేచిత్ = కొందరు, బలస్య = సేనయొక్క, ఏకదేశేన = ఒక భాగముతో, మూఢౌ = మూఢులైన, తౌ = ఆ, రాజపుత్రౌ = రాజపుత్రులను, వినిగృహ్య = నిగ్రహించి, పరేషు = శత్రువులపై, తే = నీయొక్క, ప్రభావమ్ = ప్రభావమును, భావయితుమ్ = ప్రసరింపచేయుటకు, అభియాన్తు = వెళ్లెదరు గాక.

భా. అందుచే, ఆ సైన్యములో కొంత భాగమును తీసికొని, నీ ఆజ్ఞాకరులు కొందరు, మూఢులైన ఆ రాజకుమారులిద్దరినీ జయించి, నీ ప్రభావమును నీ శత్రువులందరిపై ప్రసరింపచేయుటకు యుద్ధానికై వెళ్లట మంచిది. 26

మూ. నిశాచరాణామధిపోఽనుజస్య
విభీషణస్యోత్తమవాక్యమిష్టమ్,
జగ్రాహ బుద్ధ్యా సురలోకశత్రు
ర్మహాబలో రాక్షసరాజముఖ్యః 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ. నిశాచరాణామ్ = రాక్షసుల, అధిపః = ప్రభువు, సురలోకశత్రుః = దేవలోకమునకు శత్రువు, మహాబలః = గొప్ప బలము గలవాడూ, రాక్షసరాజముఖ్యః = రాక్షసరాజులలో ముఖ్యుడు అయిన రావణుడు, అనుజస్య = తమ్ముడైన, విభీషణస్య = విభీషణునియొక్క, ఇష్టమ్ = ఇష్టమైన, ఉత్తమవాక్యమ్ = ఉత్తమమైన వాక్యమును, బుద్ధ్యా = బుద్ధితో, జగ్రాహ = గ్రహించెను.

భా. రాక్షసులకు రాజు, దేవలోకశత్రువు, మహాబలశాలి, రాక్షసరాజులలో శ్రేష్ఠుడూ అయిన రావణుడు తమ్ముడైన విభీషణుని ఇష్టము, ఉత్తమము అయిన వాక్యమును బుద్ధితో గ్రహించెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిపఞ్చాశః సర్గః

[రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పు ముట్టించి నగరములో త్రిప్పుట]

మూ. తస్య తద్వచనం శ్రుత్వా దశగ్రీవో మహాత్మనః,
దేశకాలహితం వాక్యం భ్రాతురుత్తరమబ్రవీత్. 1

ప్ర అ. దశగ్రీవః = రావణుడు, మహాత్మనః = మహాత్ముడైన, భ్రాతుః = సోదరుడైన, తస్య = ఆ విభీషణుని యొక్క, దేశకాలహితమ్ = దేశకాలములకు హిత మైన, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, ఉత్తరమ్ = ప్రత్యుత్తర మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రావణుడు మహాత్ముడూ తన సోదరుడూ అయిన ఆ విభీషణుడు పలికిన, దేశకాలానుగుణమై, హిత మైన మాట విని, ఇట్లు పలికెను. 1

మూ. సమ్యగుక్తం హి భవతా దూతవధ్యా విగర్హితా,
అవశ్యం తు వధాదన్యః క్రియతామస్య నిగ్రహః, 2

ప్ర. అ. భవతా = నీచేత, సమ్యక్ = బాగుగా, ఉక్తం హి = చెప్పబడినది కదా. దూతవధ్యా = దూతయొక్క వధ, విగర్హితా = నింద్య మైనది, వధాత్ = వధ కంటె, అన్యః = మరి యొక్క, నిగ్రహః = దండనము, అస్య = వీనికి, అవశ్యమ్ = తప్పక, క్రియతామ్ = చేయబడుగాక.

తా. నీవు చెప్పినది బాగున్నది. దూతను చంపుట నింద్య మైనది. అందుచేత వీనికి వధ కాక మరియొక దండన మేదైన తప్పక అవ్వవలెను. 2

మూ. కపీనాం కిల లాఙ్గూలమిష్టం భవతి భూషణమ్,
తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు. 3

ప్ర. అ. కపీనామ్ = వానరులకు, లాఙ్గూలమ్ = తోక, ఇష్టమ్ = ఇష్ట మైన, భూషణమ్ = అలంకారముగా, భవతి కిల = అయి ఉన్న దట. అస్య = వీనియొక్క, తత్ = ఆ లాంగూలము, శీఘ్రమ్ = శీఘ్రముగా, దీప్యతామ్ = కాల్చబడుగాక. దగ్ధేన = కాల్చబడిన, తేన = దానితో, గచ్ఛతు = వెళ్లుగాక.

తా. వానరులకు తోక చాలా ఇష్ట మైన అలంకార మట. దానికి నిప్పు అంటించుడు. కాలిపోయిన తోకతో ఇతడు వెనుకకు వెళ్లు నట్లు చేయుడు.

మూ. తతః పశ్య న్త్విమం దీనమఙ్గవైరూప్యకర్శితమ్,
సమిత్రజ్ఞాతయః సర్వే బాన్ధవాః ససుహృజ్జనాః 4

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అఙ్గవైరూప్యకర్శితమ్ = శరీరము యొక్క వైరూప్యము చేత కృశింపచేయబడి, దీనమ్ = దీను డైన, ఇమమ్ = ఇతనిని, సమిత్రజ్ఞాతయః = మిత్రులతోను జ్ఞాతులతోను కూడిన, ససుహృజ్జనాః = స్నేహితులతో కూడిన, సర్వే = సమస్త మైన, బాన్ధవాః = బంధువులు, పశ్యన్తు = చూచెదరుగాక.

తా. అప్పుడు, అంగవికారముచేత కృశుడై, దీనుడై ఉన్న ఈతనిని మిత్రులు, జ్ఞాతులు, మిత్రులతో కూడిన బంధువులు చూచెదరుగాక. 4

మూ. ఆజ్ఞాపయ ద్రాక్షసేన్ద్రః పురం సర్వం సచత్వరమ్,
లాఙ్గూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్. 5

ప్ర. అ. ప్రదీప్తేన = మండుచున్న, లాఙ్గూలేన = తోకతో, రక్షోభిః = రాక్షసులచేత, సచత్వరమ్ = చతుష్పథములతో కూడిన, సర్వమ్ = సమస్త మైన, పురమ్ = పట్టణమును, పరిణీయతామ్ = త్రిప్పబడుగాక, అని, రాక్షసేన్ద్రః = రావణుడు, ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

తా. మండు చున్న తోకతో ఇతనిని, రాక్షసులు పురములోని చతుష్పథాలతో సహా అన్ని ప్రాంతములందూ త్రిప్పుదురు గాక అని రావణుడు ఆజ్ఞాపించెను. 5

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్కశాః,
వేష్టయన్తి స్మ లాఙ్గూలం జీర్ణైః కార్పాసకైః పటైః. 6

ప్ర. అ. తస్య = రావణునియొక్క. తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, కోపకర్కశాః = కోపముతో కఠినస్వభావు లైన, రాక్షసాః = రాక్షసులు, జీర్ణైః = జీర్ణము లైన, కార్పాసకైః పటైః = నూలు బట్టలతో, లాఙ్గూలమ్ = తోకను, వేష్టయన్తి స్మ = చుట్టబెట్టిరి.

తా. కోపముచేత కఠిన మైన స్వభావము గల ఆ రాక్షసులు రావణుని మాటలు విని, పాత నూలుబట్టలు హనుమంతుని తోకకు చుట్టబెట్టిరి. 6

మూ. సంవేష్ట్యమానే లాఙ్గూలే వ్యవర్ధత మహాకపిః,
శుష్కమిన్ధనమాసాద్య వనేష్వివ హుతాశనః. 7

ప్ర. అ. లాఙ్గూలే = తోక, సంవేష్ట్యమానే = చుట్టబడుచున్న దగుచుండగా, మహాకపిః = హనుమంతుడు, వనేషు = వనములందు, శుష్కమ్ = ఎండిన, ఇన్ధనమ్ = కట్టెలను, ఆసాద్య = పొంది, హుతాశనః ఇవ = అగ్ని వలె, వ్యవర్ధత = వృద్ధి పొందెను.

తా. రాక్షసు లావిధముగా తోకకు బట్టలు చుట్టుచుండగా, హనుమంతుడు, వనములో ఎండిన కట్టెలు లభించిన అగ్ని వలె వృద్ధి చెందెను. 7

మూ. తైలేన పరిషిచ్యాథ తేఽగ్నిం తత్రాభ్యపాతయన్,
లాఙ్గూలేన ప్రదీప్తేన రాక్షసాంస్తానపాతయత్. 8
రోషామర్షపరీతాత్మా బాలసూర్యసమాననః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తే = వాండ్లు, తైలేన = తైలముతో, పరిషిచ్య = తడిపి, తత్ర = ఆ తోకమీద, అగ్నిమ్ = అగ్నిని, అభ్యపాతయన్ = ఉంచిరి. బాలసూర్యసమాననః = బాలసూర్యునితో సమాన మైన ముఖము గల హనుమంతుడు, రోషామర్షపరీతాత్మా = కోపముతోను, ఓర్పులేకపోవుటతోను నిండిన మనస్సు కలవాడై, ప్రదీప్తేన = మండుచున్న, లాఙ్గూలేన = తోకతో, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, అపాతయత్ = పడవేసెను.

తా. పిమ్మట ఆ రాక్షసులు తైలముతో తడిపి, ఆ తోకకు నిప్పు ముట్టించిరి. అప్పుడు తోక మండుచుండగా, బాలసూర్యుని వంటి ముఖము గల హనుమంతుడు, పట్టరాని కోపముతో, ఆ రాక్షసుల నందరిని క్రిందికి పడద్రోసెను. 8

మూ. లాఙ్గూలం సంప్రదీప్తం తు ద్రష్టుం తస్య హనూమతః, 9
సహస్త్రీబాలవృద్ధాశ్చ జగ్ముః ప్రీతా నిశాచరాః.

ప్ర. అ. తస్య హనూమతః = ఆ హనుమంతునియొక్క, సంప్రదీప్తమ్ = మండుచున్న, లాఙ్గూలమ్ = తోకను, ద్రష్టుమ్ = చూచుటకు, నిశాచరాః = రాక్షసులు, ప్రీతాః = సంతోషించుచున్నవారై, సహస్త్రీబాలవృద్ధాశ్చ = స్త్రీబాలవృద్ధులతో కూడినవారై, జగ్ముః = వెళ్ళిరి.

తా. రాక్షసు లందరూ సంతోషించుచు, హనుమంతుని ప్రజ్వలించుచున్న తోకను చూచుటకై స్త్రీలతో, బాలులతో, వృద్ధులతో సహా అక్కడికి వెళ్ళిరి. 9

మూ. స భూయః సంగతైః క్రూరై రాక్షసైర్హరిసత్తమః, 10
నిబద్ధః కృతవాన్వీర స్తత్కాలసదృశీం మతిమ్.

ప్ర. అ. వీరః = వీరు డైన, సః హరిసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, సంగతైః = కలిసిన, క్రూరైః = క్రూరు లైన, రాక్షసైః = రాక్షసులచేత, భూయః = మరల, నిబద్ధః = కట్టబడినవా డై, తత్కాలసదృశీమ్ = ఆ కాలమునకు తగిన, మతిమ్ = బుద్ధిని, కృతవాన్ = చేసినాడు.

తా. ఆ రాక్షసు లందరూ చేరి వీరు డైన ఆ హనుమంతుని మరల బంధించిరి. అప్పు డాతడు ఆ సమయానికి తగిన ఆలోచన చేసెను 10

మూ. కామం ఖలు న మే శక్తా నిబద్ధస్యాపి రాక్షసాః, 11
ఛిత్త్వా పాశాన్ సముత్పత్య హన్యామహమిమాన్ పునః.

ప్ర. అ. రాక్షసాః = ఈ రాక్షసులు, నిబద్ధస్యాపి = బంధింపబడినవాడ నైనా, మే = నా విషయమున, న శక్తాః కామం ఖలు = (అపకారము చేయుటకు) సమర్థులు కానే కారు. అహమ్ = నేను, పునః = మరల, పాశాన్ = పాశములను, ఛిత్త్వా = ఛేదించి, సముత్పత్య = ఎగిరి, ఇమాన్ = వీళ్ళను, హన్యామ్ = చంపుదును.

తా. ఈ రాక్షసులు నన్ను బంధించినా నన్నేమీ చేయజాలరనుట నిజమే. ఎందుచేత ననగా ఈ పాశములు తెంచుకొని, పైకి ఎగిరి వీళ్ళ నందరినీ చంపగలను. 11

మూ. యది భర్తుర్హితార్థాయ చరన్తం భర్తృశాసనాత్, 12
బధ్నన్త్యేతే దురాత్మానో న తు మే నిష్కృతిః కృతా.

ప్ర. అ. భర్తుః = ప్రభువైన రామునియొక్క, హితార్థాయ = హితము కొరకై, చరన్తమ్ = ప్రవర్తించుచున్న నన్ను, ఏతే దురాత్మానః = ఈ దుర్మతులు, భర్తృశాసనాత్ = వాళ్ల ప్రభువైన రావణుని ఆజ్ఞవలన, బధ్నన్తి యది = బంధించి నట్లయితే, మే = నాకు, నిష్కృతిః = ప్రతిక్రియ, న కృతా = చేయబడలేదు.

తా. నా ప్రభువైన రాముని హితము కొరకై నేను ప్రవర్తించుచున్నాను. అట్టి నన్ను ఈ దుర్మతులు తమ ప్రభువు ఆజ్ఞను అనుసరించి బంధించినా వాళ్లేదో నాకు ప్రతిక్రియ చేయుటలో సఫలులైనారు అని నేను విచారించవలసిన పనిలేదు.

మూ. సర్వేషామేవ పర్యాప్తో రాక్షసానామహం యుధి, 13
కిం తు రామస్య ప్రీత్యర్థం విషహిష్యేఽహమీదృశమ్,
లఙ్కా చారయితవ్యా మే పునరేవ భవేదితి. 14

ప్ర. అ. యుధి = యుద్ధమునందు, అహమ్ = నేను, సర్వేషామేవ = సమస్తమైన, రాక్షసానామ్ = రాక్షసులకు, పర్యాప్తః = సరిపోయినవాడను. కిం తు = కాని, రామస్య = రామునియొక్క, ప్రీత్యర్థమ్ = ప్రీతికొరకై, అహమ్ = నేను, ఈదృశమ్ = ఇట్టిదానిని, లఙ్కా = లంక, పునరేవ = మరల, చారయితవ్యా = సంచరింపచేయబడదగినది, భవేత్ = అగును, ఇతి = ఈ కారణము వలన, విషహిష్యే = సహించెదను.

తా. యుద్ధములో ఈ రాక్షసుల నందరినీ చంపుటకు నేనొక్కడనే చాలుదును. అయినా రాముని సంతోషముకొరకూ, వీళ్లు నన్ను లంక అంతా త్రిప్పుచుండగాన లంకను మళ్లీ చూచుటకొరకూ, ఈ బంధనాదులను సహించెదను. 14

మూ. రాత్రౌ న హి సుదృష్టా మే దుర్గకర్మవిధానతః,
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లఙ్కా నిశాక్షయే. 15

ప్ర. అ. లఙ్కా = లంక, దుర్గకర్మవిధానతః = దుర్గకర్మవిధి ననుసరించి, రాత్రౌ = రాత్రియందు, సుదృష్టా = బాగుగా చూడ బడినది, న హి = కాదు

కరా. నిశాక్షయే = పగలు, మయా = నాచేత, అపశ్యే మేవ = తప్పక, ద్రష్టవ్యా = చూడదగినది.

తా. నేనీ లంకను రాత్రి చూచి నప్పుడు దీని దుర్గనిర్మాణాదులను సరిగా చూడలేదు. అందుచేత దీనిని పగలు బాగుగా చూడవలెను. 15

మూ. కామం బద్ధస్య మే భూయః పుచ్ఛస్యోద్దీపనేన చ,
పీడాం కుర్వన్తు రక్షాంసి న మేఽస్తి మనసః శ్రమః. 16

ప్ర. అ. భూయః = మరల, బద్ధస్య = కట్టబడిన, మే = నాకు, పుచ్ఛస్య = తోకయొక్క, ఉద్దీపనేన చ = ప్రజ్వలింపచేయుటచేత కూడా, రక్షాంసి = రాక్షసులు, కామమ్ = వారి ఇష్టము వచ్చి నట్లు, పీడామ్ = పీడను. కుర్వన్తు = చేయుదురుగాక. మే = నాయొక్క, మనసః = మనస్సుకు, శ్రమః = శ్రమ. నాస్తి = లేదు.

తా. ఈ రాక్షసులు నన్ను మళ్ళీ బంధించి, తోకకు నిప్పుకూడా అంటించి పీడించినచో పీడింతురు గాక। నా మనస్సుకు ఏ మాత్రము శ్రమ లేదు. 16

మూ. తతస్తే సంవృతాకారం సత్త్వవన్తం మహాకపిమ్,
పరిగృహ్య యయుర్హృష్టా రాక్షసాః కపికుఞ్జరమ్. 17

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే రాక్షసాః = ఆ రాక్షసులు, హృష్టాః = సంతోషించినవారై, సంవృతాకారమ్ = కప్పబడిన ఆకారము కలవాడు (మనో భావములను రహస్యముగా ఉంచుకొన్నవాడు), సత్త్వవన్తమ్ = బలము కల వాడు, కపికుఞ్జరమ్ = వానరశ్రేష్ఠుడు అయిన, మహాకపిమ్ = హనుమంతుని, పరిగృహ్య = పట్టుకొని, యయుః = వెళ్ళిరి.

తా. మహాబలశాలీ, వానరశ్రేష్ఠుడూ అయిన ఆ హనుమంతుడు మనస్సులోని భావము పైకి తెలియనీయక పడి యుండగా, ఆ రాక్షసులు పట్టుకొని, సంతోషించుచు వెళ్ళిరి. 17

మూ. శఙ్ఖభేరీనినాదైస్తం ఘోషయన్తః స్వకర్మభిః,
రాక్షసాః క్రూరకర్మాణశ్చారయన్తి స్మ తాం పురీమ్. 18

ప్ర. అ. క్రూరకర్మాణః = క్రూర మైన కర్మలు గల, రాక్షసాః = రాక్షసులు, తమ్ = ఆ హనుమంతుని, శఙ్ఖభేరీనినాదైశ్చ = శంఖధ్వనులతోను భేరీధ్వనులతోను, స్వకర్మభిః = అతని కర్మంచేత, ఘోషయన్తః = చాటుచు, తాం పురీమ్ = ఆ పట్టణమును, చారయన్తి స్మ = త్రిప్పిరి.

తా. క్రూర మైన పనులు చేయు ఆ రాక్షసులు, శంఖములు భేరీలు మ్రోగించుచు, ఆ హనుమంతుడు చేసిన వనభంగము మొదలైన అపరాధములను ఘోషించుచు, అతనిని ఆ నగరమునందు అంతటా త్రిప్పిరి. 18

మూ. అన్వీయమానో రక్షోభిర్యయౌ సుఖమరిందమః,
హనుమాంశ్చారయామాస రాక్షసానాం మహాపురీమ్. 19

ప్ర. అ. అరిందమః = శత్రువులను పీడించు, హనుమాన్ = హనుమంతుడు, రక్షోభిః = రాక్షసులచేత, అన్వీయమానః = అనుసరింపబడుచున్నవాడై, సుఖమ్ = సుఖముగా, యయౌ = వెళ్లెను. రాక్షసానామ్ = రాక్షసులయొక్క, మహాపురీమ్ = మహానగరమును, చారయామాస = సంచరించెను.

తా. శత్రువినాశకు డైన ఆ హనుమంతుడు రాక్షసులు వెంట రాగా సుఖముగా వెళ్లి, రాక్షసుల మహానగర మైన లంకలో తిరిగెను. 19

మూ. అథాపశ్యద్విమానాని విచిత్రాణి మహాకపిః,
సంవృతాన్ భూమిభాగాంశ్చ సువిభక్తాంశ్చ చత్వరాన్ 20

ప్ర. అ. అథ = అటు పిమ్మట, మహాకపిః = హనుమంతుడు, విచిత్రాణి = విచిత్రము లైన, విమానాని = గృహములను, సంవృతాన్ = కప్పబడిన, భూమిభాగాంశ్చ = భూమిలోని ప్రదేశములను, సువిభక్తాన్ = బాగుగా తీర్పబడిన, చత్వరాన్ = చతుష్పథములను, అపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట హనుమంతుడు అక్కడ విచిత్రము లైన విమానములను, రహస్య మైన భూగృహములను, బాగుగా తీర్చిన చతుష్పథాలను చూచెను. 20

మూ. వీథీశ్చ గృహసంబాధాః కపిః శృఙ్గాటకాని చ,
తథా రథ్యోపరథ్యాశ్చ తథైవ గృహకాన్తరాన్, 21
గృహాంశ్చ మేఘసంకాశాన్ దదర్శ పవనాత్మజః.

ప్ర. అ. పవనాత్మజః = వాయుపుత్రు డైన, కపిః = హనుమంతుడు, గృహసంబాధాః = గృహములతో ఇరుకుగా ఉన్న, వీథీః = వీథులను, శృఙ్గాటకాని చ = చతుష్పథములను, తథా = మరియు, రథ్యోపరథ్యాశ్చ = మార్గములను, చిన్నమార్గములను, తథైవ చ = మరియు, గృహకాన్తరాన్ = చిన్న గృహములను, మేఘసంకాశాన్ = మేఘములతో సమాన మైన, గృహాంశ్చ = పెద్ద గృహములను, దదర్శ = చూచెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు గృహాలతో ఇరుకుగా ఉన్న వీథులనూ, చతుష్పథాలను, పెద్ద మార్గములను, చిన్న మార్గములను, చిన్న గృహములను, మేఘముల వంటి ఎత్తైన గృహములను చూచెను. 20, 21

మూ. చత్వరేషు చతుష్కేషు రాజమార్గే తథైవ చ, 22.
ఘోషయన్తి కపిం సర్వే చారీక ఇతి రాక్షసాః.

ప్ర. అ. సర్వే = సమస్త మైన, రాక్షసాః = రాక్షసులు, చత్వరేషు = చతుష్పథములందు, చతుష్కేషు = నాలుగు స్తంభాల మండపములందు, తథైవ చ = మరియు, రాజమార్గే = రాజమార్గమునందు, కపిమ్ = హనుమంతునిగూర్చి, చారీకః ఇతి = గూఢచారి అని, ఘోషయన్తి = చాటుచుండిరి.

తా. ఆ రాక్షసు లందరూ హనుమంతుని చతుష్పథాలకు, నాలుగు స్తంభాల మండపాలకు రాజమార్గమునకూ తీసికొని పోయి "ఇత డొక గూఢచారి" అని చాటుచుండిరి. 22

మూ. స్త్రీబాలవృద్ధా నిర్జగ్ముస్తత్ర తత్ర కుతూహలాత్, 23
తం ప్రదీపితలాఙ్గూలం హనుమన్తం దిదృక్షవః.

ప్ర. అ. ప్రదీపితలాఙ్గూలమ్ = కాల్చబడిన తోక గల, తం హనుమన్తమ్ = ఆ హనుమంతుణ్ణి, దిదృక్షవః = చూడదలచినవా రై, స్త్రీబాలవృద్ధాః = స్త్రీలు, బాలులు, వృద్ధులు, తత్ర తత్ర = ఆ యా ప్రదేశములలో, కుతూహలాత్ = కుతూహలమువలన, నిర్జగ్ముః = బైటకు వచ్చిరి.

తా. తోక కాల్చిన హనుమంతుని చూడవలె ననే కుతూహలముతో ఆ యా ప్రదేశములనుండి, స్త్రీలు, బాలులు, వృద్ధులు బైటకు వచ్చిరి. 23

మూ. దీప్యమానే తత స్తత్ర లాఙ్గూలాగ్రే హనూమతః, 24
రాక్షస్య స్తా విరూపాక్ష్యః శంసు ర్దేవ్యా స్తదప్రియమ్

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తత్ర = అక్కడ, హనూమతః = హనుమంతుని యొక్క, లాఙ్గూలాగ్రే = తోకయొక్క అగ్రభాగము, దీప్యమానే = వెలిగింపబడు చుండగా, విరూపాక్ష్యః = వికృత మైన నేత్రములు గల, తాః రాక్షస్యః = ఆ రాక్షసస్త్రీలు, దేవ్యాః = సీతాదేవికి, అప్రియమ్ = అప్రియ మైన, తత్ = దానిని, శశంసుః = చెప్పిరి.

తా. అప్పుడు హనుమంతుని తోక చివరి భాగమును రాక్షసులు వెలిగించుచున్నప్పుడు, వికృత మైన నేత్రములు గలస్త్రీలు, అప్రియ మైన ఆ విషయమును సీతాదేవికి తెలిపిరి. 24

మూ. య స్త్వయా కృతసంవాదః సీతే తామ్రముఖః కపిః, 25
లాఙ్గూలేన ప్రదీప్తేన స ఏష పరిణీయతే.

ప్ర. అ. సీతే = సీతా! యః = ఏ, తామ్రముఖః = ఎఱ్ఱని ముఖము గల, కపిః = వానరుడు, త్వయా = నీతో, కృతసంవాదః = చేయబడిన భాషణము కలవాడో, స ఏషః = అట్టి ఈ వానరుడు, ప్రదీప్తేన = ప్రజ్వలింపబడిన, లాఙ్గూలేన = తోకతో, పరిణీయతే = (పట్టణము చుట్టూ) త్రిప్పబడుచున్నాడు.

తా. సీతా! నీతో మాటలాడిన, ఎఱ్ఱని ముఖము గల వానరుణ్ణి, అతని తోకకు నిప్పు అంటించి పట్టణములో త్రిప్పుచున్నారు. 25

మూ. శ్రుత్వా తద్వచనం క్రూరమాత్మాపహరణోపమమ్, 26
వైదేహీ శోకసంతప్తా హుతాశనముపాగమత్.

ప్ర. అ. వైదేహీ = సీత, ఆత్మాపహరణోపమమ్ = తనయొక్క అపహరణముతో సమాన మైన, క్రూరమ్ = క్రూర మైన, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, శోకసంతప్తా = శోకముచేత తపింపచేయబడిన దై, హుతాశనమ్ = అగ్నిని, ఉపాగమత్ = ఉపాసించెను.

తా. తనను రావణుడు అపహరించినప్పుడు ఎంత దుఃఖము కలిగెనో అంత దుఃఖమును కలిగించు క్రూర మైన ఆ మాట విని, సీత దుఃఖతప్తురాలై, అగ్నిని (జ్వలింపచేసి) ఉపాసించెను. 26

మూ. మఙ్గళాభిముఖీ తస్య సా తదాసీన్మహాకపేః, 27
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, సా = ఆమె, మహాకపేః = హనుమంతుని యొక్క, మఙ్గలాభిముఖీ = క్షేమమును ఆకాంక్షించునది, ఆసీత్ = అయెను. విశాలాక్షీ = విశాలాక్షి యైన ఆ సీత, ప్రయతా = పరిశుద్ధ మైన మనస్సు కలదై, హవ్యవాహనమ్ = అగ్నిదేవుని, ఉపతస్థే = సేవించెను (ప్రార్థించెను).

తా. అప్పుడు, విశాలము లైన నేత్రములు గల ఆ సీత హనుమంతుని క్షేమమును కోరుచు, పరిశుద్ధ మైన చిత్తముతో అగ్నిదేవుని ప్రార్థించెను. 27

మూ. యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః,
యది వాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః. 28

ప్ర. అ. పతిశుశ్రూషా = భర్తయొక్క సేవ, అస్తి యది = ఉన్నట్లయితే, తపః = తపస్సు, చరితమ్ = చేయబడినదై, అస్తి యది = ఉన్నట్లయితే, ఏకపత్నీత్వమ్ = పాతివ్రత్యము, అస్తి చ యది = ఉన్నట్లయితే, త్వమ్ = నీవు, హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ = అగుము.

తా. అగ్నిదేవా! నేను పతిసేవ చేసినదాననే అయితే, నే నెట్టి తపస్సు చేసి ఉన్న ట్లయితే, నాకు పాతివ్రత్యమే ఉన్నట్లయితే, హనుమంతుని విషయమున చల్లగా ఉండుము. 28

మూ. యది కించిదనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః, 29
యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః.

ప్ర. అ. ధీమతః = బుద్ధిమంతు డైన, తస్య = ఆ రామునకు, మయి = నాయందు, కించిత్ = కొంచె మైనా, అనుక్రోశః = దయ, అస్తి యది = ఉన్నట్లయితే, మే = నాకు, భాగ్యశేషః = భాగ్యముయొక్క శేషము, యది వా = ఉన్నట్లయితే, హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ = అగుము.

తా. అగ్నిదేవా! బుద్ధిశాలి యైన ఆ రామునకు నాపై ఏ కొంచె మైనా దయ ఉన్న ట్లయితే, నా భాగ్యము ఏ మైనా శేషించి ఉంటే హనుమంతునకు చల్లగా అగుము. 29

మూ. యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసామ్,
స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః.

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః=ఆ రాముడు, మామ్=నన్ను, వృత్తసంపన్నామ్ = సత్ప్రవర్తనతో కూడినదానినిగాను, తత్సమాగమలాలసామ్=అతని సమాగమమునందు చాలా ఆసక్తి కలదానినిగాను, విజానాతి యది =ఎరిగి ఉన్నట్లయితే, హనూమతః=హనుమంతునకు, శీతః=చల్లనివాడవు, భవ = అగుము.

తా. నేను చెడని సత్ప్రవర్తనతో అతనిని కలియుటకు చాల ఔత్సుక్యముతో ఉన్నానని ధర్మాత్ముడైన ఆ రాముడు అనుకొనుచున్నచో హనుమంతునకు చల్లగా అగుము. 30

మూ. యది మాం తారయేదార్యః సుగ్రీవః సత్యసంగరః, 31
అస్మాద్దుఃఖామ్బుసంరోధాచ్ఛీతో భవ హనూమతః.

ప్ర. అ. ఆర్యః=పూజ్యుడు, సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, అస్మాత్ = ఈ, దుఃఖామ్బుసంరోధాత్=దుఃఖసముద్రమునుండి, మామ్=నన్ను, తారయేద్యది = దాటింపగలవాడైతే, హనూమతః=హనుమంతునకు, శీతః=చల్లనివాడవు, భవ=అగుము.

తా. పూజ్యుడు, సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు అయిన సుగ్రీవుడు నన్ను ఈ దుఃఖసముద్రమునుండి దాటించుట జరుగనున్నచో హనుమంతునకు చల్లగా ఉండుము.

వి. ఈ శ్లోకం ప్రాచ్యప్రతిలో లేదు. పై మూడు శ్లోకాలు సీతాదేవి తన పాతివ్రత్యం పైనా, తన పవిత్రతాన్ని రాముడు గుర్తించుట పైనా ఒట్టు పెట్టి హనుమంతుణ్ణి రక్షింపుమని అగ్నిదేవుని కోరుచున్నది. అట్టి సందర్భంలో సుగ్రీవుని మాట ఎత్తడం అంత సమంజసంగా లేదు కదా? లక్ష్మణుని మాట కూడా ఎత్తలేదు కదా! ఏదో శకునం చూచే వాళ్ళు అనుకొనే మాట వలె ఉన్నది. ఈశ్లోకం లేకపోవడమే ఉచితం. పై మూడుశ్లోకాలలో "శీతో భవ"కు బదులు "శివో భవ" అని ప్రాచ్యపాఠములో ఉన్నది. "శివః" అనడంలో అన్ని విధాలా హనుమంతు

నకు మంగళప్రదుఁడ వగుము అను విస్పష్టార్థం లభిస్తుంది. రాబోవు శ్లోకంలో కూడా 'శివం' అని ఉన్నది. 31

మూ. తతస్తీక్ష్ణార్చిరవ్యగ్రః ప్రదక్షిణశిఖోఽనలః, 32
జజ్వాల మృగశావాక్ష్యాః శంసన్నివ శివం కపేః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అనలః = అగ్నిదేవుడు, మృగశావాక్ష్యాః = లేడిపిల్ల కన్నుల వంటి కన్నులు గల సీతకు, కపేః = హనుమంతునియొక్క, శివమ్ = క్షేమమును, శంసన్నివ = చెప్పుచున్నాడా అన్నట్లు, తీక్ష్ణార్చిః = తీక్ష్ణమైన జ్వాలలు కలవాడై, ప్రదక్షిణశిఖః = ప్రదక్షిణమైన శిఖలు కలవాడై, అవ్యగ్రః = తొట్రుపాటు లేనివాడై, జజ్వాల = ప్రజ్వలించెను.

తా. అప్పుడు ఆ అగ్నిదేవుడు హనుమంతుడు క్షేమముగా ఉన్నాడను విషయమును సీతకు చెప్పుచున్నాడా అన్నట్లు తీక్ష్ణమైన మంటలతో, తొట్రుపాటు లేకుండ, ప్రదక్షిణముగా ఉన్న (కుడి వైపునకు తిరుగుచున్న) జ్వాలాగ్రములతో, ప్రజ్వలించెను. 32

మూ. హనుమజ్జనకశ్చాపి పుచ్ఛానలయుతోఽనిలః, 33
వవౌ స్వాస్థ్యకరో దేవ్యాః ప్రాలేయానిలశీతలః.

ప్ర. అ. హనుమజ్జనకః = హనుమంతుని తండ్రి యైన, అనిలః = వాయువు, పుచ్ఛానలయుతః = పుచ్ఛమునందున్న అగ్నితో కూడినవాడై, దేవ్యాః = సీతకు, స్వాస్థ్యకరః = చిత్తస్వాస్థ్యమును కలిగించుచు, ప్రాలేయానిలశీతలః = మంచుగాలి వలె చల్లనై, వవౌ = వీచెను.

తా. హనుమంతుని తండ్రి యైన వాయుదేవుడు కూడ, తోకపైన నున్న అగ్నితో కూడినవాడై, దేవి మనస్సు కుదుటపడునట్లు, చలిగాలి వలె చల్లగా వీచెను.

వి. సీతాదేవి తన ఎదుట అగ్నిని ప్రజ్వలింపచేసి ప్రార్థించినప్పుడు ఆ అగ్ని ప్రదక్షిణజ్వాలలతో శుభసూచనము చేయుట యుక్తముగానే ఉన్నది. సీత దగ్గర వాయుదేవుడు కూడ చల్లగా వీచినాడు అని చెప్పినచో అది కూడా శుభ-

సూచక మని అనుకొనవచ్చును. ఆ వాయువు హనుమంతుని తోకపైన ఉన్న అగ్నితో కలిసి ఉన్నాడు అని చెప్పుటలో అట్టి వాయువు సీత మనస్సుకు స్వాస్థ్యము ఎట్లు చేకూర్చగలదు? హనుమంతు డెక్కడో నగరపీఠంలో ఉన్నాడు కదా? అందుచేతనే కాతోలు ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. ౩౩

మూ. దహ్యమానే చ లాఙ్గూలే చిన్తయామాస వానరః, ౩౪
ప్రదీప్తోఽగ్నిరయం కస్మాన్న మాం దహతి సర్వతః.

ప్ర. అ. లాఙ్గూలే = తోక, దహ్యమానే = దహింపబడుచుండగా, వానరః = హనుమంతుడు, చిన్తయామాస = ఆలోచించెను. సర్వతః = అంతటా, ప్రదీప్తః = ప్రజ్వలించుచున్న, అయమ్ అగ్నిః = ఈ, అగ్ని. మామ్ = నన్ను, కస్మాత్ = ఎందువలన, న దహతి = దహించుటలేదు?

తా. తన తోక దహింపబడుచుండుట చూచి హనుమంతు డిట్లు అనుకొనెను. అంతటా మండుచున్న ఈ అగ్ని నన్ను ఎందువలన దహించుట లేదో! ౩౪

మూ. దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజమ్,
శిశిరస్యేవ సంఘాతో లాఙ్గూలాగ్రే ప్రతిష్ఠితః.

ప్ర. అ. మహాజ్వాలః = గొప్ప జ్వాల కలదిగా, దృశ్యతే = చూడబడు చున్నది. మే = నాకు, రుజమ్ = బాధను, న కరోతి చ = చేయుట లేదు. లాఙ్గూలాగ్రే = తోక చివర, శిశిరస్య = మంచుయొక్క, సంఘాతః = ముద్ద, ప్రతిష్ఠితః ఇవ = ఉంచబడి న ట్లున్నది. ('సంపాతః' అనుపాఠము కంటె 'సంఘాతః' అను ప్రాచ్యపాఠము బాగున్నది).

తా. ఈ అగ్ని పెద్ద జ్వాలలతో కనబడుచున్నది. కాని నాకు మాత్రము ఏమీ బాధ కలిగించుటలేదు. నా తోక చివర మంచుముద్ద పెట్టినట్లు ఉన్నది?

మూ. అథవా తదిదం వ్యక్తం యద్దృష్టం ప్లవతా మయా, ౩౬
రామప్రభావాదాశ్చర్యం పర్వతః సరితాం పతౌ.

(''పర్వతో దధిసంగమే" అను ప్రాచ్యపాఠం బాగున్నది).

ప్ర. అ. అథవా = లేదా, యత్ = ఏ కారణమువలన, ప్లవతా = ఎగురు చున్న, మయా = నాచేత, రామప్రభావాత్ = రామునియొక్క ప్రభావమువలన, పర్వతోదధిసంగమే = పర్వతముతోను, సముద్రముతోను కలియుటయందు, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యము, దృష్టమ్ = చూడబడినదో, తత్ = అందువలన, ఇదమ్ = ఇది, వ్యక్తమ్ = స్పష్టమైనది.

రా. లేదా - నేను సముద్రలంఘనము చేయునప్పుడు, రాముని ప్రభావము వలన, మైనాకముతోను, తద్ద్వారా సముద్రునితోను సంబంధము ఆశ్చర్యకరముగా ఏర్పడినది కదా। దానిని బట్టి దీని కారణము స్పష్టమగుచున్నది. 36

మూ. యది తావత్సముద్రస్య మైనాకస్య చ ధీమతః, 37
రామార్థం సంభ్రమస్తాదృక్కిమగ్నిర్న కరిష్యతి

ప్ర. అ. సముద్రస్య = సముద్రమునకు, ధీమతః = బుద్ధిమంతుడైన, మైనాకస్య = మైనాకమునకు, రామార్థమ్ = రాముని నిమిత్తమై, తాదృక్ = అట్టి, సంభ్రమః యది = (సాహాయ్యము చేయవలెనను) తొందర ఉన్నచో, అగ్నిః = అగ్ని, కిమ్ = ఎందువలన, న కరిష్యతి = చెయ్యడు ?

రా. సముద్రుడూ, ధీమంతుడైన మైనాకుడూ రామునికి సాహాయ్యము చేయవలెనని అంతగా తొందర చూపినప్పుడు అగ్నిదేవుడు మాత్రము అట్లు ఎందుకు చెయ్యడు ? 37

మూ. సీతాయాశ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ, 38
పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః.

ప్ర. అ. సీతాయాః = సీతాదేవియొక్క, ఆనృశంస్యేన = దయచేత, రాఘవస్య = రామునియొక్క, తేజసా = తేజస్సుచేత, మమ పితుః = నా తండ్రి యొక్క, సఖ్యేన = స్నేహముచేత, పావకః = అగ్ని, మామ్ = నన్ను, న దహతి = కాల్చుట లేదు.

రా. నాపై సీతాదేవికి ఉన్న దయచేతను, రాముని తేజస్సు చేతను, నా తండ్రియైన వాయుదేవునితో తన కున్న స్నేహముచేతను, అగ్నిదేవుడు నన్ను కాల్చుట లేదు. 38

మూ. భూయః స చిన్తయామాస ముహూర్తం కపికుఞ్జరః, 39
ఉత్పపాతాథ వేగేన ననాద చ మహాకపిః.

ప్ర. అ. కపికుఞ్జరః = వానర శ్రేష్ఠుడైన, సః మహాకపిః = ఆ హనుమంతుడు, భూయః = మరల, చిన్తయామాస = ఆలోచించెను. అథ = అటు పిమ్మట. వేగేన = వేగముతో, ఉత్పపాత = ఎగిరెను. ననాద చ = ధ్వని చేసెను కూడ.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు మరల ఒక క్షణము ఆలోచించి, వేగముగా పైకి ఎగిరి, గర్జించెను. 39

మూ. పురద్వారం తతః శ్రీమాన్ శైలశృఙ్గమివోన్నతమ్, 40
విభక్తరక్షఃసంబాధమాససాదానిలాత్మజః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, శ్రీమాన్ = అధికమైన శోభ గల, అనిలాత్మజః = హనుమంతుడు, శైలశృఙ్గమివ = పర్వతశిఖరము వలె, ఉన్నతమ్ = ఉన్నతమైనది, విభక్తరక్షఃసంబాధమ్ = దూరము చేయబడిన రాక్షసుల ఒరుపు (గుంపు) గలదియైన, పురద్వారమ్ = పట్టణము ద్వారమును, ఆససాద = సమీపించెను.

తా. పిమ్మట శ్రీమంతుడైన ఆ హనుమంతుడు, పర్వతశిఖరము వలె ఉన్నతమై, రాక్షసుల గుంపులనుండి దూరముగా ఉన్న నగరద్వారము దగ్గరకు (మీదికి) వెళ్ళెను. 40

మూ. స భూత్వా శైలసంకాశః క్షణేన పునరాత్మవాన్, 41
హ్రస్వతాం పరమాం ప్రాప్తో బన్ధనాన్యవశాతయత్.

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, సః = ఆ హనుమంతుడు, శైలసంకాశః = పర్వతముతో సమానుడు, భూత్వా = అయి, క్షణేన = క్షణకాలములో, హ్రస్వతామ్ = హ్రస్వత్వమును, ప్రాప్తః = పొందినవాడై, బన్ధనాని = బంధనములను, అవశాతయత్ = విదల్చెను.

తా. బుద్ధిశాలియైన అతడు పర్వతమంత ఆకారము పెంచి, మరు క్షణములో చిన్న ఆకారము దాల్చి బంధనములను విదల్చి వేసికొనెను. 41

మూ. విముక్తశ్చాభవచ్ఛ్రీమాన్ పునః పర్వతసన్నిభః, 42
వీక్షమాణశ్చ దదృశే పరిఘం తోరణాశ్రితమ్.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతు డైన, ఆ హనుమంతుడు, విముక్తశ్చ= బంధములనుండి విముక్తుడై, పునః=మరల, పర్వతసన్నిభః = పర్వతముతో సమానుడు, అభవత్=అయెను. వీక్షమాణశ్చ=చూచుచు, తోరణాశ్రితమ్=తోరణమును ఆశ్రయించి ఉన్న, పరిఘమ్=పరిఘను, దదృశే=చూచెను.

తా. హనుమంతు డా బంధనములు జారిపోగానే మరల పర్వత మంత శరీరము ధరించి ఇటు అటు పరికించి, అక్కడ తోరణమునకు అమర్చబడిన పరిఘను చూచెను. 42

మూ. స తం గృహ్య మహాబాహుః కాలాయసపరిష్కృతమ్,
రక్షిణస్తాన్ పునః సర్వాన్సూదయామాస మారుతిః.

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః మారుతిః = ఆ హనుమంతుడు, కాలాయసపరిష్కృతమ్=ఇనుముతో పరిష్కరింపబడిన (బిగింపబడిన), తమ్=ఆ పరిఘను, పునః=మరల, గృహ్య = గ్రహించి, సర్వాన్= సమస్త మైన, తాన్ రక్షిణః=ఆ రక్షకులను, సూదయామాస=చంపెను.

తా. మహాబాహు వైన ఆ హనుమంతుడు ఇనుముతో బిగింపబడిన ఆ పరిఘను పట్టి గ్రహించి, ఆ రక్షకుల నందరినీ చంపివేసెను. 43

మూ. స తాన్నిహత్వా రణచణ్డవిక్రమః
సమీక్షమాణః పునరేవ లఙ్కామ్,
ప్రదీప్తలాఙ్గూలకృతార్చిమాలీ
ప్రకాశతాదిత్య ఇవార్చిమాలీ. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రిపఞ్చాశః సర్గః.

ప్ర. అ. రణచణ్డవిక్రమః=యుద్ధమునందు తీవ్ర మైన పరాక్రమము గల, సః=ఆ హనుమంతుడు, తాన్=వాళ్లను, నిహత్య = చంపి, పునరేవ=

మరల, లఙ్కామ్=లంకను, సమీక్షమాణః=చూచుచు, ప్రదీప్తలాఙ్గూలకృతార్చిర్మాలీ=మండుచున్న తోకచేత చేయబడిన జ్వాలల మాల కలవాడై, అర్చిర్మాలీ=కిరణముల పంక్తి గల, ఆదిత్య ఇవ=సూర్యుడు వలె, ప్రకాశత=ప్రకాశించెను.

తా. యుద్ధములో తీవ్ర మైన పరాక్రమముచు ప్రదర్శించిన ఆ హనుమంతుడు ఆ రాక్షసుల సంహరించి చంపి, మళ్ళీ లంక వైపే చూచుచు, మండుచున్న తోకచేత తన చుట్టూ అగ్ని జ్వాలల మాలలు విస్తరించుటచే, కిరణ పంక్తులతో కూడిన సూర్యుడు వలె ప్రకాశించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపఞ్చాశః సర్గః

## [లంకాదహనము_రాక్షసుల విలాపములు]

మూ. వీక్షమాణ స్తతో లఙ్కాం కపిః కృతమనోరథః, 1
వర్ధమానసముత్సాహః కార్యశేషమచి న్తయత్.

ప్ర. అ. తతః = అటు పైన, కృతమనోరథః = పూర్తిచేయబడిన మనోరథము గల, కపిః = హనుమంతుడు, లఙ్కామ్ = లంకను, వీక్షమాణః = చూచుచున్న వాడై, వర్ధమానసముత్సాహః = వృద్ధిపొందుచున్న ఉత్సాహము కలవాడై, కార్యశేషమ్ = మిగిలిన కార్యమును గూర్చి, అచి న్తయత్ = ఆలోచించెను.

తా. పిమ్మట తన మనోరథమును (కోరిన పనిని) పూర్తిచేసికొన్న హనుమంతుడు లంకను చూచుచు, వృద్ధి పొందు చున్న ఉత్సాహముతో మిగిలిన కార్యమును గూర్చి ఆలోచించెను.

మూ. కిం ను ఖల్వవశిష్టం మే క ర్తవ్యమిహ సాంప్రతమ్, 2
యదేషాం రక్షసాం భూయః సంతాపజననం భవేత్.

ప్ర. అ. యత్ = ఏది, ఏషామ్ = ఈ, రక్షసామ్ = రాక్షసులకు, భూయః = మరల, సంతాపజననమ్ = సంతాపమును కలిగించేది, భవేత్ = అగునో, అట్టి, కిం ను = ఏ, క ర్తవ్యమ్ = కార్యము, మే = నాకు, ఇహ = ఇక్కడ, సాంప్రతమ్ = ఇప్పుడు, అవశిష్టమ్ = మిగిలినది.

తా. ఏ పని ఈ రాక్షసులకు ఇంకా సంతాపాన్ని కలిగించునో అట్టి, నేను ఇక్కడ చేయవలసిన కార్యము, ఇప్పు డేమి మిగిలి ఉన్నది? 2

మూ. వనం తావత్ప్రమథితం ప్రకృష్టా రాక్షసా హతాః, 3
బలైకదేశః క్షపితః శేషం దుర్గవినాశనమ్.

ప్ర. అ. వనమ్ = వనము, ప్రమథితం తావత్ = నశింపచేయబడినది. ప్రకృష్టాః = శ్రేష్ఠులైన. రాక్షసాః = రాక్షసులు, హతాః = చంపబడినారు. బలైకదేశః = సైన్యములో ఒక భాగము, క్షపితః = నశింపచేయబడినది. దుర్గవినాశనమ్ = దుర్గమును నశింపచేయుట, శేషమ్ = మిగిలినది.

తా. వనమును విరిచినాను ఉత్తములైన రాక్షసులను చంపినాను. సైన్యములో ఒక భాగము నశింపచేసినాను ఇంక దుర్గమును నశింపచేయుట మిగిలినది. 3

మూ. దుర్గే వినాశితే కర్మ భవేత్సుఖపరిశ్రమమ్,
అల్పయత్నేన కార్యేఽస్మిన్ మమ స్యాత్సఫలః శ్రమః. 4

ప్ర. అ. దుర్గే = దుర్గము, వినాశితే = నశింపచేయబడినదగుచుండగా, కర్మ = కార్యము, సుఖపరిశ్రమమ్ = సుఖమైన (అల్పమైన) పరిశ్రమ గలది, భవేత్ = అగును. అస్మిన్ = ఈ, కార్యే = కార్యమునందు, అల్పయత్నేన = అల్పమైన ప్రయత్నముచేత, శ్రమః = శ్రమ, సఫలః = సఫలము, స్యాత్ = అగును.

తా. దుర్గమును కూడ నశింపచేసినచో తరువాత చేయవలసిన పని-అనగా రాముడు వచ్చి చేయవలసిన యుద్ధము, అల్పపరిశ్రమచేతనే సాధ్య మగును. నేను అల్పప్రయత్నము చేసి ఈ పని పూర్తిచేసినచో ఇంతవరకూ చేసినది సఫలమగును. 4

మూ. యో హ్యయం మమ లాఙ్గూలే దీప్యతే హవ్యవాహనః,
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తుమేభిర్గృహోత్తమైః. 5

ప్ర. అ. మమ = నాయొక్క, లాఙ్గూలే = తోకమీద, యః = ఏ, అయమ్ హవ్యవాహనః = ఈ అగ్ని, దీప్యతే = ప్రజ్వలించుచున్నదో, అస్య = దీనికి, ఏభిః = ఈ, గృహోత్తమైః = శ్రేష్ఠములైన గృహములతో, సంతర్పణమ్ = తృప్తిపరచుట, కర్తుమ్ = చేయుటకు, న్యాయ్యమ్ = న్యాయమైనది.

తా. ఈ ఉత్తమగృహములతో, నా తోకమీద ఉన్న అగ్నికి సంతర్పణము చేయుట న్యాయము. 5

మూ. తతః ప్రదీప్తలాఙ్గూలః సవిద్యుదివ తోయదః,
భవనాగ్రేషు లఙ్కాయా విచచార మహాకపిః. 6

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రదీప్తలాఙ్గూలః = కాల్చబడిన తోక గల, మహాకపిః = హనుమంతుడు, సవిద్యుత్ = మెరుపులతో కూడిన, తోయదః ఇవ = మేఘము వలె, లఙ్కాయాః = లంకయొక్క, భవనాగ్రేషు = భవనముల పైభాగములందు, విచచార = సంచరించెను.

తా. ఆ హనుమంతుడు ప్రజ్వలించుచున్న తోకతో, మెరుపులతో కూడిన మేఘము వలె, లంకయందలి గృహముల పైభాగములపైన సంచరించెను. 6

మూ. గృహాద్గృహం రాక్షసానాముద్యానాని చ వానరః,
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. 7

ప్ర. అ. సః వానరః = ఆ హనుమంతుడు, ఉద్యానాని చ = ఉద్యానములను, ప్రాసాదాంశ్చ = ప్రాసాదములను, వీక్షమాణః = చూచుచు, అసంత్రస్తః = భయము లేనివాడై, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, గృహాత్ = ఒక గృహమునుండి, గృహమ్ = మరి యొక గృహమును, చచార = సంచరించెను.

తా. హనుమంతుడు ఉద్యానములను, ప్రాసాదములను చూచుచు, ఏమాత్రము భయపడక, రాక్షసుల ఒక గృహమునుండి మరి యొక గృహమునకు సంచరించెను. 7

మూ. అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్,
అగ్నిం తత్ర స నిక్షిప్య శ్వసనేన సమో బలీ. 8
తతోఽన్యత్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్,
ముమోచ హనుమానగ్నిం కాలానలశిఖోపమమ్. 9

ప్ర. అ. మహావేగః = గొప్ప వేగము కలవాడు, శ్వసనేన = వాయువుతో, సమః = సమానుడైన, బలీ = బలముకలవాడు, వీర్యవాన్ = పరాక్రమముకలవాడు అయిన, సః = హనుమంతుడు, ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క, నివేశనమ్ = గృహమునుగూర్చి, అవప్లుత్య = దిగి, తత్ర = దానిమీద, అగ్నిమ్ = అగ్నిని, నిక్షిప్య = ఉంచి, తతః = దానిమీదనుండి, అన్యత్ = మరి యొక, మహా

పార్శ్వస్య = మహాపార్శ్వునియొక్క, వేశ్మ = గృహమును గూర్చి, పుప్లువే = దుమికెను. హనుమాన్ = హనుమంతుడు, కాలానలశిఖోపమమ్ = ప్రళయకాలాగ్ని శిఖ వంటి, అగ్నిమ్ = అగ్నిని, ముమోచ = దానిపై విడచెను.

తా. మహావేగవంతుడు, బలములో వాయువుతో సమానుడు, పరాక్రమవంతుడు అయిన హనుమంతుడు ప్రహస్తుని గృహముపై దుమికి, దానిమీద అగ్నిని ఉంచి, దానిపైనుంచి మహాపార్శ్వుని గృహముమీదికి దుమికి. దానిమీద ప్రళయకాలాగ్నిశిఖ వంటి అగ్నిని విడచెను. 8, 9

మూ. వజ్రదంష్ట్రస్య చ తదా పుప్లువే స మహాకపిః,
శుకస్య చ మహాతేజాః సారణస్య చ ధీమతః. 10

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః మహాకపిః = ఆ హనుమంతుడు, తదా = అప్పుడు, వజ్రదంష్ట్రస్య చ = వజ్రదంష్ట్రునియొక్క, శుకస్య = శుకునియొక్క, ధీమతః = బుద్ధిమంతు డైన, సారణస్య చ = సారణునియొక్క గృహమును గూర్చి, పుప్లువే = ఎగిరెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ హనుమంతుడు అప్పుడు వరుసగా వజ్రదంష్ట్ర-శుక-సారణుల భవనముల మీదికి దుమికెను. 10

మూ. తథా చేన్ద్రజితో వేశ్మ దదాహ హరియూథపః,
జమ్బుమాలేః సుమాలేశ్చ దదాహ భవనం తతః. 11

ప్ర. అ. హరియూథపః = హనుమంతుడు, తథా = మరియు, ఇన్ద్రజితః = ఇంద్రజిత్తుయొక్క, వేశ్మ = గృహమును, దదాహ = కాల్చెను. తతః = అటు పిమ్మట, జమ్బుమాలేః = జంబుమాలియొక్క, సుమాలేశ్చ = సుమాలియొక్క, భవనమ్ = భవనమును, దదాహ = కాల్చెను.

తా. హనుమంతుడు ఇంద్రజిత్తు గృహమును కాల్చెను. పిదప జంబుమాలి సుమాలుల గృహములను కాల్చెను. 11

మూ. రశ్మికేతోశ్చ భవనం సూర్యశత్రోస్తథైవ చ,
హ్రస్వకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 12
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః,

విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథా హస్తిముఖస్య చ. 13
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి,
కుమ్భకర్ణస్య భవనం మకరాక్షస్య చైవ హి 14
యజ్ఞశత్రోశ్చ భవనం బ్రహ్మశత్రోస్తథైవ చ,
నరాన్తకస్య కుమ్భస్య నికుమ్భస్య దురాత్మనః. 15
వర్జయిత్వా మహాతేజా విభీషణగృహం ప్రతి,
క్రమమాణః క్రమేణైవ దదాహ హరిపుఙ్గవః. 16

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, హరిపుఙ్గవః=హనుమంతుడు, క్రమేణైవ=క్రమముచేతనే, క్రమమాణః=తిరుగుచు, విభీషణగృహం ప్రతి=విభీషణుని గృహమును గూర్చి, వర్జయిత్వా=విడిచిపెట్టి, రశ్మికేతోశ్చ=రశ్మికేతువుయొక్క, భవనమ్=భవనమును, తథైవ చ=మరియు, సూర్యశత్రోః=సూర్యశత్రువుయొక్క, హ్రస్వకర్ణస్య=హ్రస్వకర్ణునియొక్క, దంష్ట్రస్య=దంష్ట్రునియొక్క, రక్షసః=రాక్షసుడైన, రోమశస్య=రోమశునియొక్క, యుద్ధోన్మత్తస్య=యుద్ధోన్మత్తునియొక్క, మత్తస్య=మత్తునియొక్క, రక్షసః=రాక్షసుడైన, ధ్వజగ్రీవస్య=ధ్వజగ్రీవునియొక్క, ఘోరస్య=భయంకరుడైన, విద్యుజ్జిహ్వస్య=విద్యుజ్జిహ్వునియొక్క, తథా=మరియు, హస్తిముఖస్య చ=హస్తిముఖునియొక్క, కరాళస్య=కరాళునియొక్క, పిశాచస్య=పిశాచునియొక్క, శోణితాక్షస్య చైవ హి=శోణితాక్షునియొక్క, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, భవనమ్=భవనమును, మకరాక్షస్య చైవ హి=మకరాక్షుని భవనమును, యజ్ఞశత్రోశ్చ భవనమ్=యజ్ఞశత్రువుయొక్క భవనమును, తథైవ చ=మరియు, బ్రహ్మశత్రోః=బ్రహ్మశత్రువుయొక్క, నరాన్తకస్య=నరాంతకునియొక్క, కుంభస్య=కుంభునియొక్క, దురాత్మనః=దురాత్ముడైన, నికుమ్భస్య=నికుంభునియొక్క గృహమును కాల్చెను.

తా. మహాతేజశ్శాలియైన హనుమంతుడు, విభీషణుని భవనము తప్ప, వరుసగా ఒక భవనము తరవాత మరొక భవనము మీదికి వెళ్లుచు, రశ్మికేతువు, సూర్యశత్రుడు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, భయంకరుడైన విద్యుజ్జిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు, కుంభకర్ణుడు, మకరాక్షుడు, యజ్ఞశత్రువు, బ్రహ్మశత్రువు,

నరాంతకుడు, కుంభుడు, దురాత్ము లైన నికుంభుడు అను రాక్షసుల భవనము లను కాల్చెను. 12_16

మూ. తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః,
గృహేష్వృద్ధిమతామృద్ధిం దదాహ స మహాకపిః. 17

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, సః మహాకపిః = ఆ హనుమం తుడు, ఋద్ధిమతామ్=ఐశ్వర్యవంతులయొక్క, మహార్హేషు=శ్రేష్ఠము లైన, తేషు తేషు = ఆ యా, గృహేషు = గృహములయందు, ఋద్ధిమ్=సంపదను, దదాహ = కాల్చివేసెను.

తా. గొప్ప కీర్తి గల ఆ హనుమంతుడు, ధనికుల శ్రేష్ఠము లైన ఆ యా గృహములలో ఉన్న సంపదను కాల్చివేసెను. 17

మూ. సర్వేషాం సమతిక్రమ్య రాక్షసేన్ద్రస్య వీర్యవాన్,
ఆససాదాథ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్. 18

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, లక్ష్మీవాన్ = శోభాయుక్తు డైన హనుమంతుడు, సర్వేషామ్=అందరియొక్క గృహములను, సమతిక్రమ్య =దాటి, అథ=అటు పిమ్మట, రాక్షసేన్ద్రస్య=రాక్షసరా జైన రావణునియొక్క, నివేశనమ్=గృహమును, ఆససాద=సమీపించెను.

తా. పరాక్రమవంతుడు, శోభాశాలీ అయిన హనుమంతుడు అందరి భవనములను దాటి పిదప రావణుని గృహమును చేరెను. 18

మూ. తతస్తస్మిన్ గృహే ముఖ్యే నానారత్నవిభూషితే,
మేరుమన్దరసంకాశే సర్వమఙ్గళశోభితే. 19
ప్రదీప్తమగ్నిముత్సృజ్య లాఙ్గూలాగ్రే ప్రతిష్ఠితమ్,
ననాద హనుమాన్ వీరో యుగాన్తజలదో యథా. 20

ప్ర. అ. తతః=అటు పైన, వీరః=వీరు డైన, హనుమాన్ = హనుమం తుడు, నానారత్నవిభూషితే = అనేకవిధము లైన రత్నములతో అలంకరించ బడిన, మేరుమన్దరసంకాశే = మేరుపర్వతముతోను మందరపర్వతముతోను

సమాన మైన, తస్మిన్=ఆ, ముఖ్యే = ముఖ్యమైన, గృహే = గృహమునందు, లాఙ్గూలాగ్రే=తన తోక చివర, ప్రతిష్ఠితమ్=ఉన్న, ప్రదీప్తమ్=మండుచున్న, అగ్నిమ్ = అగ్నిని, ఉత్సృజ్య = విడచి, యుగాన్తజలదో యథా = ప్రలయకాల మేఘము వలె, ననాద=ధ్వని చేసెను.

తా. పిమ్మట, వీరు డైన హనుమంతుడు, అనేకవిధము లైన రత్నముల చేత అలంకరింపబడినది, మేరుమందరపర్వతములతో సమానమూ, సకలమంగళములతోను శోభించుచున్నదీ అయిన ఆ ప్రధానగృహముపైన, తన తోక చివర నున్న అగ్నిని ఉంచి, ప్రలయకాలంమేఘము వలె గర్జించెను. 19, 20

మూ. శ్వసనేన చ సంయోగాదతివేగో మహాబలః,
కాలాగ్నిరివ జజ్వాల ప్రావర్ధత హుతాశనః. 21

ప్ర. అ. హుతాశనః=అగ్ని, శ్వసనేన=వాయువుతో, సంయోగాత్ = సంయోగమువలన, అతివేగః=చాలా వేగము కలదై, మహాబలః=గొప్ప బలము కలదై, ప్రావర్ధత = పెరిగెను. కాలాగ్నిరివ = ప్రలయకాలాగ్ని వలె, జజ్వాల = ప్రజ్వలించెను.

తా. వాయువు కూడ సహాయ మగుటచే ఆ అగ్ని మహాబలముతో, మహావేగముతో, వృద్ధి పొంది, ప్రలయకాలాగ్ని వలె ప్రజ్వరిలంచెను. 21

మూ. ప్రదీప్తమగ్నిం పవనస్తేషు వేశ్మస్వచారయత్,
అభూచ్ఛ్వసనసంయోగాదతివేగో హుతాశనః. 22

ప్ర. అ. పవనః = వాయువు, ప్రదీప్తమ్ = ప్రజ్వలించుచున్న, అగ్నిమ్ = అగ్నిని, తేషు = ఆ, వేశ్మసు = గృహములపైన, అచారయత్ = సంచరింపచేసెను. శ్వసనసంయోగాత్ = వాయువుతో సంయోగమువలన, హుతాశనః = అగ్ని, అతివేగః = చాలా వేగము కలది, అభూత్ = అయెను.

తా. వాయువు, మండుచున్న అగ్నిని ఒక ఇంటినుండి మరొక ఇంటికి ప్రసరింపచేసెను. వాయువుతో సంయోగమువలన అగ్ని వేగము చాల హెచ్చెను.

మూ. తాని కాఞ్చనజాలాని ముక్తామణిమయాని చ,
భవనాన్యవశీర్యన్త రత్నవన్తి మహాన్తి చ. 23

ప్ర. అ. కాఞ్చనజాలాని = బంగారు కిటికీలు కలవి, ముక్తామణిమయాని చ = ముత్యములు, మణుల వికారమైనవి. రత్నవన్తి = రత్నములు కలవి, మహాన్తి చ = గొప్పవి అయిన, తాని భవనాని = ఆ భవనములు, అవశీర్యన్త = బ్రద్దలైపోయినవి.

తా. బంగారు కిటికీలతో కూడినవి, ముత్యములతోను మణులతోను రత్నములతోను నిండినవి, పెద్దవి అయిన ఆ భవనములు బ్రద్దలై పడిపోయినవి.

మూ. సంజజ్ఞే తుములః శబ్దో రాక్షసానాం ప్రధావతామ్,
స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సాహోర్జితశ్రియామ్, 24
నూనమేషోఽగ్నిరాయాతః కపిరూపేణ హా ఇతి.

ప్ర. అ. స్వగృహస్య = తమ గృహములయొక్క, పరిత్రాణే = రక్షించుటయందు (కొరకు) ప్రధావతామ్ = పరుగెత్తుచున్నవారు, భగ్నోత్సాహోర్జితశ్రియామ్ = భగ్నమైన ఉత్సాహము అధికమైన సంపద కలవారు అయిన, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, "హా = అయ్యో ! నూనమ్ = నిజముగా, ఏషః అగ్నిః = ఈ అగ్ని, కపిరూపేణ = వానరరూపముతో, ఆయాతః = వచ్చినాడు, ఇతి = అని, తుములః = వ్యాకులమైన, శబ్దః = శబ్దము, సంజజ్ఞే = పుట్టెను.

తా. తమ భవనములను రక్షించుకొనుటకై అటు నటు పరుగెత్తుచు, ఉత్సాహమును సంపదలను కోల్పోయిన రాక్షసులు, "అయ్యో ! ఈ వానరుని రూపములో అగ్నిదేవుడు వచ్చినాడు కదా !" అని బిగ్గరగా అరచుచుండిరి. 25

మూ. క్రన్దన్త్యః సహసా పేతుః స్తనంధయధరాః స్త్రియః, 25
కాశ్చిదగ్నిపరీతేభ్యో హర్మ్యేభ్యో ముక్తమూర్ధజాః,
పతన్త్యో రేజిరేఽభ్రేభ్యః సౌదామిన్య ఇవామ్బరాత్. 26

ప్ర. అ. కాశ్చిత్ = కొందరు, స్త్రియః = స్త్రీలు, స్తనంధయధరాః = చంటి బిడ్డలను ఎత్తికొన్నవారై, ముక్తమూర్ధజాః = విడిపోయిన కేశములు కలవారై, క్రన్దన్త్యః = ఏడ్చుచు, అగ్నిపరీతేభ్యః = అగ్నిచేత చుట్టుముట్టబడిన, హర్మ్యేభ్యః = మేడలనుండి, సహసా = శీఘ్రముగా, పేతుః = పడిరి. అమ్బరాత్ = ఆకాశమునుండి, అభ్రేభ్యః = మేఘములనుండి, పతన్త్యః = పడుచున్న, సౌదామిన్యః ఇవ = మెరుపులు వలె, రేజిరే = ప్రకాశించిరి.

తా. కొందరు స్త్రీలు, అరచుచు, చంటి బిడ్డలను చంకన పెట్టుకొని, జుట్టు విరబోసుకొని, నిప్పు చుట్టుముట్టిన మేడలపై నుండి క్రిందికి దుమికిరి. ఆ విధముగా పడుచున్నప్పుడు ఆ స్త్రీలు ఆకాశముపైనున్న మేఘములనుండి క్రిందికి పడుచున్న మెరుపుల వలె ప్రకాశించిరి. 25, 26

మూ. వజ్రవిద్రుమవైదూర్యముక్తారజతసంహితాన్,
విచిత్రాన్ భవనాద్ధాతూన్ స్యన్దమానాన్ దదర్శ సః. 27

ప్ర. అ. సః = ఆ హనుమంతుడు, వజ్రవిద్రుమవైదూర్యముక్తారజత సంహితాన్ = వజ్రములతోను, పగడములతోను, వైడూర్యములతోను, ముత్యములతోను, వెండితోను కలిసిన, విచిత్రాన్ = విచిత్రవర్ణములు కల, భవనాత్ = గృహము(ల) నుండి, స్యన్దమానాన్ = స్రవించుచున్న, ధాతూన్ = ధాతువులను (రంగులను), దదర్శ = చూచెను.

తా. కాలిపోయిన భవనములనుండి వజ్ర-విద్రుమ-వైడూర్య-ముక్తా-రజతములు కలిసిన విచిత్రరూపములు గల ధాతువులు స్రవించుచుండగా ఆ హనుమంతుడు చూచెను. 27

మూ. నాగ్నిస్తృప్యతి కాష్ఠానాం తృణానాం చ యథా తథా,
హనుమాన్ రాక్షసేన్ద్రాణాం వధే కించిన్న తృప్యతి. 28
న హనూమద్విశస్తానాం రాక్షసానాం వసున్ధరా.

ప్ర. అ. అగ్నిః = అగ్ని, కాష్ఠానామ్ = కట్టెలకు, తృణానామ్ = తృణములకు, యథా = ఎట్లు, న తృప్యతి = తృప్తి చెందదో, తథా = అట్లే, హనుమాన్ = హనుమంతుడు, రాక్షసేన్ద్రాణామ్ = రాక్షసులయొక్క, వధే = వధయందు, కించిత్ = కొంచెము కూడ, న తృప్యతి = తృప్తి చెందలేదు. వసున్ధరా = భూమి, హనుమద్విశస్తానామ్ = హనుమంతునిచేత చంపబడిన, రాక్షసానామ్ = రాక్షసులకు, న = తృప్తిపడలేదు.

తా. అగ్నికి ఎన్ని కాష్ఠములు వేసినను, ఎంత తృణము వేసినను తృప్తి ఉండదు. అట్లే ఎంతమంది రాక్షసులను చంపినా హనుమంతునకు తృప్తి కలుగలేదు. హనుమంతుడు ఎంతమంది రాక్షసులను చంపి పడవేసినా భూమికి తృప్తి కలుగలేదు. 28

మూ. క్వచిత్కింశుకసంకాశాః క్వచిచ్ఛాల్మలిసన్నిభాః, 29
క్వచిత్కుఙ్కుమసంకాశాః శిఖా వహ్నేశ్చకాశిరే.

ప్ర. అ. వహ్నేః = అగ్నియొక్క, శిఖాః = శిఖలు, క్వచిత్ = కొన్ని చోట్ల, కింశుకసంకాశాః = మోదుగపువ్వుతో సమానములుగాను, క్వచిత్ = కొన్ని చోట్ల, శాల్మలిసన్నిభాః = బూరుగపువ్వుతో సమానములుగాను, క్వచిత్ = కొన్ని చోట్ల, కుఙ్కుమసంకాశాః = కుంకుమపువ్వుతో సమానములు గాను, చకాశిరే = ప్రకాశించినవి.

తా. అగ్నిశిఖలు కొన్నిచోట్ల కింశుకపుష్పముల వలె, కొన్ని చోట్ల బూరుగపువ్వుల వలె, కొన్ని చోట్ల కుంకుమపువ్వుల వలె వేరు వేరు రంగులతో ప్రకాశించెను. 29

మూ. హనూమతా వేగవతా వానరేణ మహాత్మనా,
లఙ్కాపురం ప్రదగ్ధం తద్రుద్రేణ త్రిపురం యథా. 30

ప్ర. అ. వేగవతా వానరేణ = వేగముగల వానరు డైన, మహాత్మనా = మహాత్ము డైన, హనూమతా = హనుమంతునిచేత, తత్ = ఆ, లఙ్కాపురమ్ = లంకాపురము, రుద్రేణ = రుద్రునిచేత, త్రిపురం యథా = త్రిపురము వలె, ప్రదగ్ధమ్ = కాల్పబడినది.

తా. వేగవంతు డైన వానరుడు, మహాత్ముడూ అయిన హనుమంతుడు, ఆ లంకాపురమును, రుద్రుడు త్రిపురము కాల్చి నట్లు కాల్చివేసెను. 30

మూ. తతస్తు లఙ్కాపురపర్వతాగ్రే
సముత్థితో భీమపరాక్రమో ఽగ్నిః,
ప్రసార్య చూడావలయం ప్రదీప్తో
హనూమతా వేగవతా విసృష్టః. 31

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వేగవతా = వేగము గల, హనూమతా = హనుమంతునిచేత, విసృష్టః = విడువబడిన, భీమపరాక్రమః = భయంకర మైన పరాక్రమము గల, అగ్నిః = అగ్ని, చూడావలయమ్ = శిఖల వలయమును, ప్రసార్య = ప్రసరింప జేసి, ప్రదీప్తః = మండుచున్న దై, లఙ్కాపురపర్వతాగ్రే = లంకాపురమునందు, పర్వతాగ్రమునందు, సముత్థితః = లేచినది.

తా. వేగవంతు డైన హనుమంతుడు విడచిన, భయంకర మైన పరాక్రమము గల అగ్ని, శిఖావలయమును ప్రసరింప చేసి, ప్రజ్వరించుచు, లంకలోను, లంక యున్న పర్వతాగ్రముపైనను పైకి ఎగసెను. 31

మూ. యుగాన్తకాలానలతుల్యవేగః
సమారుతోఽగ్నిర్వవృధే దివిస్పృక్,
విధూమరశ్మిర్భవనేషు సక్తో
రక్షఃశరీరాజ్యసమర్పితార్చిః. 32

ప్ర. అ. విధూమరశ్మిః = ధూమము లేని మంటలు కలది, భవనేషు = గృహములందు, సక్తః = సంబంధించినది, రక్షఃశరీరాజ్యసమర్పితార్చిః = రాక్షసుల శరీరము అనే ఆజ్యముచేత కూర్చబడిన జ్వాలలు కలది అయిన, అగ్నిః = అగ్ని, సమారుతః = వాయువుతో కూడినదై, దివిస్పృక్ = ఆకాశమును స్పృశించుచు, యుగాన్తకాలానలతుల్యవేగః = యుగాంతము నందలి ప్రలయకాలాగ్నితో సమాన మైన వేగము గలదై, వవృధే = వృద్ధి పొందెను.

తా. ఆ భవనములమీద వ్యాపించిన ఆ అగ్ని, వాయువు కూడ కలియుటచే యుగాంతమునందు ప్రలయకాలాగ్ని వలె మహావేగముతో, ఆకాశము నంటుచు వృద్ధి పొందెను. ధూమము లేని మంటలు చెలరేగెను. రాక్షసుల శరీరము అనే ఆజ్యముచే ఆ అగ్నిజ్వాలలు పెరిగెను. 32

మూ. ఆదిత్యకోటీసదృశః సుతేజా,
లఙ్కాం సమస్తాం పరివార్య తిష్ఠన్,
శబ్దైరనేకైరశనిప్రరూఢై
ర్భిన్దన్నివాణ్డం ప్రబభౌ మహాగ్నిః. 33

ప్ర. అ. ఆదిత్యకోటీసదృశః = కోటి సూర్యులతో సమానము, సుతేజాః = మంచి తేజస్సు గలది. సమస్తామ్ = సమస్త మైన, లఙ్కామ్ = లంకను, పరివార్య = చుట్టి, తిష్ఠన్ = ఉన్న, మహాగ్నిః = గొప్ప అగ్ని. అనేకైః = అనేకము లైన, అశనిప్రరూఢైః = పిడుగు వలె అత్యధిక మైన, శబ్దైః = ధ్వను

లతో, అణ్డమ్ = బ్రహ్మాండమును. భిన్దన్నివ = భేదించుచున్నది వలె, ప్రబభౌ = ప్రకాశించెను.

తా. కోటిసూర్యులతో సమాన మైన తేజస్సుతో లంక నంతను చుట్టి ఉన్న ఆ మహాగ్ని, పిడుగుల వంటి అనేకవిధము లైన ధ్వనులతో బ్రహ్మాండమును బ్రద్దలుకొట్టుచున్నట్లు ఉండెను. 33

మూ. తత్రామ్బరాదగ్నిరతిప్రవృద్ధో
రూక్షప్రభః కింశుకపుష్పచూడః,
నిర్వాణధూమాకులరాజయశ్చ
నీలోత్పలాభాః ప్రచకాశిరేఽభ్రాః. 34

ప్ర. అ తత్ర = అక్కడ, రూక్షప్రభః = తీవ్ర మైన కాంతి గల, కింశుక పుష్పచూడః = కింశుకపుష్పము వంటి అగ్రభాగము గల, అగ్నిః = అగ్ని, అంబరాత్ = ఆకాశమువరకు, అతిప్రవృద్ధః = మిక్కిలి పెరిగినది. అభ్రాః = మేఘములు, నిర్వాణధూమాకుల రాజయః = అగ్ని ఆరిపోవుటచే బయలుదేరిన ధూమముచేత వ్యాకులము లైన పంక్తులు కలవై, నీలోత్పలాభాః = నల్ల కలువల కాంతి వంటి కాంతి గలవై, ప్రచకాశిరే = ప్రకాశించినవి.

తా. అక్కడ, అగ్ని తీవ్ర మైన కాంతితో, కింశుకపుష్పముల వంటి అగ్రభాగములతో ఆకాశమువరకు వ్యాపించెను. మేఘములు, అక్కడక్కడ ఆరిపోయిన అగ్నినుండి బయలుదేరిన ధూమముచేత కప్పబడుటచే నల్లకలువల వలె ప్రకాశించెను. 34

మూ. వజ్రీ మహేన్ద్రస్త్రిదశేశ్వరో వా
సాక్షాద్యమో వా వరుణోఽనిలో వా,
రుద్రోఽగ్నిరర్కో ధనదశ్చ సోమో
న వానరోఽయం స్వయమేవ కాలః. 35

(36, 37, 38 శ్లోకాలకు 39 వ శ్లోకములోని "రక్షోగణాః ఇత్యేవమ్ ఊచుః" అనేదానితో అన్వయము.)

ప్ర. అ. అయమ్ = ఇతడు, వానరః = వానరుడు, న = కాడు, వజ్రీ = వజ్రధారి యైన, త్రిదశేశ్వరః = దేవతాప్రభు వైన, మహేన్ద్రః వా = మహేంద్రుడు గాని, సాక్షాత్ = సాక్షాత్తు, యమో వా = యముడు గాని, వరుణః = వరుణుడు గాని, అనిలో వా = వాయువు గాని, రుద్రః = రుద్రుడు గాని, అగ్నిః = అగ్ని గాని, అర్కః = సూర్యుడు గాని, ధనదశ్చ = కుబేరుడు గాని, సోమః = సోముడు గాని, స్వయమ్ = స్వయముగా, కాలః ఏవ వా = కాలపురుషుడో గాని (అయి ఉండును అని రాక్షసులు పలికిరి.)

తా. ఇతడు వానరుడు కాడు; వజ్రాయుధము ధరించేవాడు, దేవతాప్రభువూ అయిన మహేంద్రుడు గాని, కుబేరుడు కాని, సాక్షాత్తు యముడు కాని, రుద్రుడు కాని, సూర్యుడు కాని, చంద్రుడు కాని, సాక్షాత్తు కాలపురుషుడు కాని అయి ఉండవలెను అని రాక్షసులు అనుకొనిరి. 35

మూ. కిం బ్రహ్మణః సర్వపితామహస్య
సర్వస్య ధాతుశ్చతురాననస్య,
ఇహాగతో వానరరూపధారీ
రక్షోపసంహారకరః ప్రతాపః. 36

ప్ర. అ. సర్వపితామహస్య = సకలలోకములకు పితామహుడు, సర్వస్య = అందరికి, ధాతుః = పోషకుడు, చతురాననస్య = నాలుగు ముఖములు కలవాడు అయిన, బ్రహ్మణః = బ్రహ్మదేవునియొక్క, రక్షోపసంహారకరః = రాక్షసులను నశింపచేసే, ప్రతాపః = ప్రతాపము, వానరరూపధారీ = వానరరూపమును ధరించినదై, ఇహ = ఇక్కడికి. ఉపయాతః కిమ్ = వచ్చెనా ?

తా. సకలలోకాలకీ పితామహుడు, సకలజగత్తులను పోషించేవాడు, నాలుగు ముఖములు కలవాడు అయిన బ్రహ్మదేవుని ప్రకోపము, రాక్షససంహారము చేయుటకై వానరరూపము ధరించి వచ్చెనా ? 36

మూ. కిం వైష్ణవం వా కపిరూపమేత్య
రక్షోవినాశాయ పరం సుతేజః,
అనన్తమవ్యక్తమచిన్త్యమేకం
స్వమాయయా సాంప్రతమాగతం వా. 37

ప్ర. అ. అనన్తమ్ = అంతము లేనిది, అవ్యక్తమ్ = ఇంద్రియములకు గోచరించనిది, అచిన్త్యమ్ = ఊహింప శక్యము కానిది, ఏకమ్ = సాటియైన పరొకటి లేనిది, అయిన, వైష్ణవమ్ = విష్ణు సంబంధమైన, పరమ్ = శ్రేష్ఠమైన, సుతేజః = గొప్ప తేజస్సు, సాంప్రతమ్ = ఇప్పుడు, రక్షోవినాశాయ = రాక్షసుల నాశముకొరకు, స్వమాయయా = తన మాయచేత, కపిరూపమ్ = వానరరూపమును, ఏత్య = పొంది, ఆగతం కిం వా = వచ్చినదా ?

తా. అనంతము, ఇంద్రియములకు గోచరించనిది, ఊహింప శక్యము కానిది, ఏకైకము అత్యుత్తమము అయిన విష్ణుతేజస్సు, తన మాయచే వానర రూపము ధరించి, ఇప్పుడు రాక్షసులను నశింపచేయుటకు వచ్చినదా ?

మూ. ఇత్యేవమూచుర్బహవో విశిష్టా
రక్షోగణా స్తత్ర సమేత్య సర్వే,
స ప్రాణిసంఘాం సగృహాం సవృక్షాం
దగ్ధాం పురీం తాం సహసా సమీక్ష్య. 38

ప్ర. అ. సప్రాణిసంఘామ్ = ప్రాణుల సంఘములతో కూడినది, సగృహామ్ = గృహములతో కూడినది, సవృక్షామ్ = వృక్షములతో కూడినది అయిన, తాం పురీమ్ = ఆ నగరమును, సహసా = శీఘ్రముగా, దగ్ధామ్ = కాల్పబడినదానినిగా, సమీక్ష్య = చూచి, బహవః = అనేకులు, విశిష్టాః = ఉత్తములు అయిన, సర్వే = సమస్తమైన, రక్షోగణాః = రాక్షసగణములు, తత్ర = అక్కడ, సమేత్య = కలిసి, ఇత్యేవమ్ = ఇట్లు, ఊచుః = పలికిరి.

తా. ప్రాణిసంఘములు, గృహములు, వృక్షములు వీటి అన్నింటితో సహా ఆ లంకాపురము శీఘ్రముగా కాలిపోవుటను చూచి అక్కడ అనేకరాక్షసులు, గుంపులుగా చేరి, ఈ విధముగా పలికిరి. 38

మూ. తతస్తు లఙ్కా సహసా ప్రదగ్ధా
సరాక్షసా సాశ్వరథా సనాగా,
సపక్షిసంఘా సమృగా సవృక్షా
రురోద దీనా తుములం సశబ్దమ్. 39

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సరాక్షసా = రాక్షసులతో కూడినది, సాశ్వరథా = అశ్వములతోను రథములతోను కూడినది, సనాగా = ఏనుగులతో కూడినది, సపక్షిసంఘా = పక్షిసముదాయములతో కూడినది, సమృగా = మృగములతో కూడినది, సవృక్షా = వృక్షములతో కూడినది అయిన, లఙ్కా = లంక, సహసా = వెంటనే, ప్రదగ్ధా = కాల్పబడిన దై, దీనా = దీన మై, తుములమ్ = వ్యాకులముగా, సశబ్దమ్ = శబ్దముతో కూడి నట్లుగా, రురోద = ఏడ్చెను.

తా. రాక్షసులు, అశ్వములు, రథములు, గజములు, పక్షిసముదాయములు, మృగములు, వృక్షములు—వీరి అన్నిటితో సహా శీఘ్రముగా కాల్చివేయబడిన లంకానగరము, దైన్యముతో, వ్యాకులధ్వనులతో ఏడ్చెను. 39

మూ. హా తాత హా పుత్రక కాన్త మిత్ర
హా జీవితం భోగయుతం సుపుణ్యమ్,
రక్షోభిరేవం బహుధా బ్రువద్భిః
శబ్దః కృతో ఘోరరవః సుభీమః. 40

ప్ర. అ. హా తాత = అయ్యో! తండ్రీ! హా పుత్రక! = అయ్యో! కుమారా! కాన్త = అయ్యో! ప్రియుడా! మిత్ర = అయ్యో! మిత్రుడా! భోగయుతమ్ = భోగములతో కూడిన, సుపుణ్యమ్ = చాల పుణ్య మైన, హా జీవితమ్ = అయ్యో! జీవితమా! ఏవమ్ = ఇట్లు, బహుధా = అనేకవిధములుగా, బ్రువద్భిః = పలుకుచున్న, రక్షోభిః = రాక్షసులచేత, ఘోరరవః = ఘోర మైన ధ్వని గల, సుభీమః = చాల భయంకర మైన, శబ్దః = శబ్దము, కృతః = చేయబడినది.

తా. అయ్యో! తండ్రీ! అయ్యో! కుమారా! అయ్యో! ప్రియుడా! అయ్యో! మిత్రుడా! అయ్యో! సకలభోగపూర్ణ మైన ఓ! పుణ్యజీవనమా! అని విలపించుచు రాక్షసులు, ఘోర మైన ధ్వని గల, భయంకర మైన శబ్దమును చేసిరి. 40

మూ. హుతాశనజ్వాలసమావృతా సా
హతప్రవీరా పరివృత్తయోధా,
హనూమతః క్రోధబలాభిభూతా
బభూవ శాపోపహతేవ లఙ్కా. 41

ప్ర. అ. హుతాశనజ్వాలసమావృతా = అగ్నిజ్వాలలచేత కప్పబడినదీ, హతప్రవీరా = చంపబడిన ఉత్తమవీరులు కలదీ, పరివృత్తయోధా = తిరిగిపోయిన యోధులు కలదీ, హనూమతః = హనుమంతుని యొక్క, క్రోధబలాభిభూతా = కోప బలముచేత పరాజిత మైనది అయిన, సా లఙ్కా = ఆ లంక, శాపోపహతేవ = శాపముచేత కొట్టబడినది వలె, బభూవ = ఆయెను.

తా. హనుమంతుని కోపబలము ఆక్రమించగా, ఆ లంక అగ్నిజ్వాలలు చుట్టుముట్టగా, మహావీరు లందరు మరణించి, యోధులు తిరిగిపోయి, ఎవ్వరో మహాపురుషుని శాపము తగిలినది వలె ఉండెను. 41

మూ. స సంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం
సముజ్జ్వలజ్జ్వాలహుతాశనాఙ్కితామ్,
దదర్శ లఙ్కాం హనుమాన్ మహామనాః
స్వయంభుకోపోపహతామివావనిమ్. 42

ప్ర. అ. మహామనాః = గొప్ప మనస్సు గల, హనుమాన్ = హనుమంతుడు, ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసామ్ = తొందరతో కూడిన భయపడిన రాక్షసులు కలది, సముజ్జ్వలజ్జ్వాలహుతాశనాఙ్కితామ్ = ప్రకాశించుచున్న జ్వాలలు గల అగ్ని చేత చిహ్నిత మైనది (తో కూడినది) అయిన, లఙ్కామ్ = లంకను, స్వయంభుకోపోపహతామ్ = బ్రహ్మయొక్క కోపముచేత కొట్టబడిన, అవనిమ్ ఇవ = భూమి వలె ఉన్న, లఙ్కామ్ = లంకను, దదర్శ = చూచెను.

తా. అప్పు డా లంకలోని రాక్షసు లందరూ కంగారుతో భయపడుచుండిరి. పైకి ఎగురుచున్న జ్వాలలతో ఆ అగ్ని అంతటా వ్యాపించెను. ఈ విధముగ ఆ పురము బ్రహ్మకోపముచేత పాడుపడు నట్లు చేయబడిన భూమి వలె ఉండెను. అట్టి లంకను గొప్ప మనస్సు గల హనుమంతుడు చూచెను. 42

మూ. భఙ్క్త్వా వనం పాదపరత్నసంకులం
హత్వా తు రక్షాంసి మహాన్తి సంయుగే,
దగ్ధ్వా పురీం తాం గృహరత్నమాలినీమ్
తస్థౌ హనూమాన్ పవనాత్మజః కపిః. 43

ప్ర. అ. పవనాత్మజః కపిః=వాయుపుత్రు డైన వానరు డైన, హనూమాన్ =హనుమంతుడు, పాదపరత్నసంకులమ్=శ్రేష్ఠము లైన వృక్షములతో నిండి యున్న, వనమ్=ఉద్యానమును, భఙ్క్త్వా = విరుగఁగొట్టి, సంయుగే=యుద్ధమునందు, మహాన్తి=గొప్ప, రక్షాంసి=రాక్షసులను, హత్వా=చంపి, గృహరత్నమాలినీమ్=గృహశ్రేష్ఠముల పంక్తులు గల, తాం పురీమ్=ఆ పట్టణమును, దగ్ధ్వా=కాల్చి, తస్థౌ=నిలిచి ఉండెను.

తా. వాయునందను డైన హనుమంతుడు శ్రేష్ఠము లైన వృక్షములతో నిండిన వనమును విరుగఁగొట్టి, యుద్ధములో గొప్ప గొప్ప రాక్షసులను సంహరించి, శ్రేష్ఠము లైన గృహముల పంక్తులతో ఒప్పారుచున్న ఆ నగరమును కాల్చి, నిలిచి ఉండెను. 43

మూ. త్రికూటశృఙ్గాగ్రతలే విచిత్రే
ప్రతిష్ఠితో వానరరాజసింహః,
ప్రదీప్తలాఙ్గూలకృతార్చిమాలీ
వ్యరాజతాదిత్య ఇవాంశుమాలీ. 44

ప్ర. అ. విచిత్రే=విచిత్ర మైన, త్రికూటశృఙ్గాగ్రతలే=త్రికూటపర్వతశిఖరాగ్రముమీద, ప్రతిష్ఠితః=నిలచియున్న, ప్రదీప్తలాఙ్గూలకృతార్చిమాలీ=ప్రజ్వలించుచున్న తోకచేత ఏర్పరుపఁబడిన జ్వాలల మాలలు గల, వానరరాజసింహః=శ్రేష్ఠు డైన ఆ వానరనాయకుడు, అంశుమాలీ = కిరణముల పంక్తి గల, ఆదిత్యః ఇవ=సూర్యుడు వలె, వ్యరాజత=ప్రకాశించెను.

తా. ప్రజ్వలించుచున్న తోకచేత జ్వాలల మాల ఏర్పడిన ఆ హనుమంతుడు, విచిత్ర మైన ఆ త్రికూటపర్వతశిఖరాగ్రమునందు, కిరణముల మాలలతో కూడిన సూర్యుడు వలె ప్రకాశించెను. 44

మూ. స రాక్షసాంస్తాన్ సుబహూంశ్చ హత్వా
వనం చ భఙ్క్త్వా బహుపాదపం తత్,
విసృజ్య రక్షోభవనేషు చాగ్నిం
జగామ రామం మనసా మహాత్మా. 45

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, సః = హనుమంతుడు, సుబహూన్ = చాల అధికసంఖ్యలో ఉన్న, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, హత్వా = చంపి, బహుపాదపమ్ = అనేకవృక్షములు గల, తత్ వనం చ = ఆ వనమును కూడ, భక్త్వా = విరిచి, రక్షోభవనేషు = రాక్షసగృహములపై, అగ్నిమ్ = అగ్నిని, విసృజ్య = విడచి, మనసా = మనస్సుతో, రామమ్ = రాముని గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. మహాత్ముడైన ఆ హనుమంతుడు అనేకరాక్షసులను చంపి, ఎన్నో వృక్షములతో నిండిన ఆ ఉద్యానమును భగ్నము చేసి, రాక్షసుల గృహముల మీద అగ్నిని ఉంచి మనస్సుతో రామునివద్దకు వెళ్ళెను. 45

మూ. తతస్తు తం వానరవీరముఖ్యం
మహాబలం మారుతతుల్యవేగమ్,
మహామతిం వాయుసుతం వరిష్ఠం
ప్రతుష్టువుర్దేవగణాశ్చ సర్వే. 46

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వానరవీరముఖ్యమ్ = వానరవీరులలో ముఖ్యుడు, మహాబలమ్ = గొప్ప బలము గలవాడు, మారుతతుల్యవేగమ్ = వాయువుతో సమాన మైన వేగము గలవాడు, మహామతిమ్ = గొప్ప బుద్ధి గలవాడు, వరిష్ఠమ్ = శ్రేష్ఠుడు అయిన, తం వాయుసుతమ్ = ఆ హనుమంతుని, సర్వే = సమస్త మైన, దేవగణాః = దేవతాగణములు, ప్రతుష్టువుః = స్తుతించినవి.

తా. అప్పుడు, వానరవీరులలో ముఖ్యుడు, గొప్ప బలము గలవాడు, వాయువుతో సమాన మైన వేగము గలవాడు, గొప్ప బుద్ధిమంతుడు, శ్రేష్ఠుడు అయిన ఆ హనుమంతుని దేవత లందరు స్తుతించిరి. 46

మూ. భక్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే,
దగ్ధ్వా లఙ్కాపురీం రమ్యాం రరాజ స మహాకపిః. 47

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహాకపిః = హనుమంతుడు, వనమ్ = వనమును, భక్త్వా = విరచి, సంయుగే = యుద్ధమునందు, రక్షాంసి = రాక్షసులను, హత్వా = చంపి, రమ్యామ్ = సుందర మైన, లఙ్కాపురీమ్ = లంకా పట్టణమును, దగ్ధ్వా = కాల్చి, రరాజ = ప్రకాశించెను.

తా. గొప్ప తేజస్సు గల హనుమంతుడు వనమును విరచి, యుద్ధములో రాక్షసులను చంపి, సుందర మైన లంకాపట్టణమును కాల్చి, ప్రకాశించెను 47

మూ. తత్ర దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
దృష్ట్వా లఙ్కాం ప్రదగ్ధాం తాం విస్మయం పరమం గతాః.

ప్ర. అ. తత్ర=అక్కడ, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, దేవాః=దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=గొప్ప ఋషులు, దగ్ధామ్=కాల్చబడిన, తాం లఙ్కాం పురీమ్=ఆ లంకాపట్టణమును, దృష్ట్వా=చూచి, పరమమ్=గొప్ప, విస్మయమ్=ఆశ్చర్యమును, గతాః=పొందినారు.

తా. అక్కడ ఆ లంకాపట్టణము కాల్చివేయబడగా చూచి, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, గొప్ప ఋషులు చాల ఆశ్చర్యము చెందిరి. 48

మూ. తం దృష్ట్వా వానరశ్రేష్ఠం హనుమన్తం మహాకపిమ్,
కాలాగ్నిరితి సంచిన్త్య సర్వభూతాని తత్రసుః 49

ప్ర. అ. వానరశ్రేష్ఠమ్ = వానరులలో శ్రేష్ఠుడు, మహాకపిమ్ = గొప్ప వానరుడు అయిన, తం హనుమన్తమ్ = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, కాలాగ్నిరితి = కాలాగ్ని అని, సంచిన్త్య = భావించి, సర్వభూతాని = సకల ప్రాణులు కూడ, తత్రసుః=భయపడినవి.

తా. వానరశ్రేష్ఠు డైన ఆ హనుమంతుని చూచి, సకలభూతములు కూడ, అతడు సాక్షాత్తు కాలాగ్నియే అని భావించి భయపడినవి. 49

మూ. దేవాశ్చ సర్వే మునిపుఙ్గవాశ్చ
గన్ధర్వవిద్యాధరనాగయక్షాః,
భూతాని సర్వాణి మహాన్తి తత్ర
జగ్ముః పరాం ప్రీతి మతుల్యరూపామ్. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుః పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తత్ర=అక్కడ, సర్వే = సమస్త మైన, దేవాశ్చ = దేవతలు,

మునిపుఙ్గవాః = మునిశ్రేష్ఠులు, గన్ధర్వవిద్యాధరనాగయక్షాః = గంధర్వులు, విద్యాధరులు, నాగులు, యక్షులు, మహాన్తి=గొప్పవైన, సర్వాణి=సమస్తమైన, భూతాని=ప్రాణులు, అతుల్యరూపామ్=సాటి లేని, పరామ్=గొప్ప, ప్రీతిమ్=సంతోషమును, జగ్ముః=పొందిరి.

తా. హనుమంతుడు చేసిన ఆ లంకాదహనము చూచి దేవతలు, మునులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, యక్షులు, సమస్తమైన గొప్ప ప్రాణులు సాటి లేని గొప్ప సంతోషము పొందిరి. 50

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చపఞ్చాశః సర్గః

[*సీత కూడ అగ్నిచే దహింపబడిన దేమో అని హనుమంతుడు భయపడుట, ఆ భయము నివృత్తి యగుట*]

మూ. సందీప్యమానాం విత్రస్తాం త్రస్తరక్షోగణాం పురీమ్,
అవేక్ష్య హనుమాన్ లఙ్కాం చిన్తయామాస వానరః. 1

ప్ర. అ. వానరః=వానరు డైన, హనుమాన్ = హనుమంతుడు, సందీప్యమానామ్=మండింప బడుచున్నది, విత్రస్తామ్=భయపడినది, త్రస్తరక్షోగణామ్ = భయపడిన రాక్షసగణము కలది అయిన, లఙ్కాం పురీమ్=లంకానగరమును, అవేక్ష్య = చూచి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. దహింపబడుచున్న దై, భయపడినదీ. భయాక్రాంతు లైన రాక్షసగణములు కలదీ అయిన ఆ లంకాపురమును చూచి హనుమంతుడు ఇట్లు ఆలోచించెను. 1

మూ. తస్యాఽభూత్సుమహాంస్త్రాసః కుత్సా చాత్మన్యజాయత,
లఙ్కాం ప్రదహతా కర్మ కింస్విత్ కృతమిదం మయా.

ప్ర. అ. తస్య = అతనికి, సుమహాన్ = చాల గొప్ప దైన, త్రాసః = భయము, అభూత్ = ఆయెను. ఆత్మని = తనయందు, కుత్సా చ=నింద కూడ, అజాయత = కలిగెను. లఙ్కామ్ = లంకను, ప్రదహతా = కాల్చుచున్న, మయా = నాచేత, ఇదమ్ = ఈ, కింస్విత్ = ఏ, కర్మ=పని, కృతమ్=చేయబడినది.

తా. అప్పుడు హనుమంతునకు చాల భయము కలిగెను. తన విషయమున నిందాబుద్ధి కూడ కలిగెను. లంకను కాల్చివేయుచు నే నెంత పని చేసితిని.

మూ. ధన్యాస్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోపముత్థితమ్,
నిరున్ధన్తి మహాత్మానో దీప్తమగ్నిమివామ్భసా. 3

ప్ర. అ. ఉత్థితమ్ = బయలుదేరిన, కోపమ్ = కోపమును, బుద్ధ్యా = బుద్ధి చేత, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, అగ్నిమ్ = అగ్నిని, అంభసా ఇవ = ఉదకము చేత వలె, యే = ఎవరైతే, నిరుంధన్తి = అడగించుకొందురో, మహాత్మానః = గొప్ప బుద్ధి గల, తే = ఆ, పురుషశ్రేష్ఠాః = పురుషశ్రేష్ఠులు, ధన్యాః = ధన్యులు కదా.

తా. మండుచున్న అగ్నిని నీటితో ఆర్పివేసినట్లు, పుట్టిన కోపమును ఎవరు అణచుకొందురో, గొప్ప బుద్ధి గల అట్టి పురుషశ్రేష్ఠులు ధన్యులు కదా! ౩

మూ. క్రుద్ధః పాపం న కుర్యాత్కః క్రుద్ధో హన్యాద్గురూనపి,
క్రుద్ధః పరుషయా వాచా నరః సాధూనధిక్షిపేత్. ౪

ప్ర. అ. క్రుద్ధః = కోపించిన, కః = ఎవడు, పాపమ్ = పాపమును, న కుర్యాత్ = చేయడు? క్రుద్ధః = కోపించినవాడు, గురూనపి = పూజ్యులను కూడ, హన్యాత్ = చంపును. క్రుద్ధః = కోపించిన, నరః = నరుడు, పరుషయా = పరుషమైన, వాచా = వాక్కులతో, సాధూన్ = సత్పురుషులను, అధిక్షిపేత్ = ఆక్షేపించును.

తా. కోపించినవాడు ఎవడు పాపము చేయడు? కోపించినవాడు పూజ్యులైన పెద్దలను కూడ చంపివేయును. కోపించిన నరుడు సత్పురుషులను కూడ పరుషములైన మాటలతో ఆక్షేపించును. ౪

మూ. వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్,
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్. ౫

ప్ర. అ. ప్రకుపితః = బాగుగా కోపించినవాడు, కర్హిచిత్ = ఎన్నడూ, వాచ్యావాచ్యమ్ = పలుకదగిన మాటను పలుకకూడని మాటను, న విజానాతి = ఎరుగడు. క్రుద్ధస్య = కోపించినవానికి, అకార్యమ్ = చేయకూడని పని, న అస్తి = ఉండదు, అవాచ్యమ్ = పలుకకూడనిది కూడ, క్వచిత్ = ఎప్పుడును, న విద్యతే = ఉండదు.

తా. చాలా కోపించినవానికి ఏది పలుకవలెనో, ఏది పలుకకూడదో ఎన్నడూ తెలియదు. కోపించినవానికి ఎట్టి పరిస్థితులలోను చేయకూడని పని గాని, అనకూడని మాట గాని ఉండదు. ౫

మూ. యః సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి।
యథోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే. 6

ప్ర. అ. ఉరగః=సర్పము, జీర్ణామ్ = జీర్ణ మైన, త్వచం యథా=కుబుసమును వలె, యః = ఎవడు, సముత్పతితమ్ = హఠాత్తుగా పుట్టిన, క్రోధమ్= క్రోధమును, క్షమయైవ = ఓర్పుచేతనే, నిరస్యతి=తొలగించుకొనునో, సః వై = అతడే, పురుషః = ఉత్తమపురుషుడుగా, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. సర్పము విడిచి పోయిన చర్మమును (కుబుసమును) విడచివేసినట్లు, పుట్టిన కోపమును ఓర్పుచేత తొలగించుకొనువాడే ఉత్తమపురుషుడు. 6

మూ. ధిగస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్,
అచిన్తయిత్వా తాం సీతామగ్నిదం స్వామిఘాతకమ్. 7

ప్ర. అ. తాం సీతామ్ = ఆ సీతను గూర్చి, అచిన్తయిత్వా = ఆలోచింపకుండగా, అగ్నిదమ్ = అగ్నిని ఇచ్చినవాడను, స్వామిఘాతకమ్ = ప్రభువుకు ద్రోహము చేసినవాడను, సుదుర్బుద్ధిమ్ = చాలా దుర్బుద్ధి కలవాడను, నిర్లజ్జమ్ =లజ్జ లేనివాడను, పాపకృత్తమమ్=పాపము చేసినవారిలో గొప్పవాడను అయిన, మామ్ = నన్ను గూర్చి, ధిక్ అస్తు = నింద అగుగాక.

తా. ఛీ! నే నెంత సిగ్గు లేని దుర్బుద్ధిని। సీతను గూర్చి ఆలోచింపకుండగా లంకకు చిచ్చుపెట్టినాను. ప్రభుకార్యమును పాడుచేసిన మహాపాపాత్ముడను। 7

మూ. యది దగ్ధా త్వియం లఙ్కా నూనమార్యాపి జానకీ.
దగ్ధా తేన మయా భర్తుర్హతం కార్యమజానతా. 8

ప్ర. అ. ఇయమ్=ఈ, లఙ్కా=లంక, దగ్ధా యది=కాల్చబడిన ట్లయితే, ఆర్యా = పూజ్యురా లైన, జానక్యపి=జానకి కూడ, దగ్ధా=కాల్చబడినది. తేన= ఆ కారణముచేత, అజానతా = తెలియని, మయా = నాచేత, భర్తుః = ప్రభువు యొక్క, కార్యమ్ = కార్యము, హతమ్ = కొట్టబడినది (పాడుచేయబడినది).

తా. ఈ లంక కాలిపోయినచో పూజ్యురా లైన సీత కూడ కాలిపోయియే

ఉంతును. ఈ విధముగా నేను తెలిసి తక్కువతనముచేత ప్రభువు కార్యమును పాడుచేసినాను। 8

మూ. యదర్థమయమారమ్భస్తత్కార్యమవసాదితమ్,
మయా హి దహతా లఙ్కాం న సీతా పరిరక్షితా. 9

ప్ర. అ. యదర్థమ్ = ఏ కార్యము నిమిత్తము, అయమ్ = ఈ, ఆరమ్భః = ప్రయత్నమో, తత్ కార్యమ్ = ఆ కార్యము, అవసాదితమ్ = చెరగొట్టబడి నది. లఙ్కామ్ = లంకను, దహతా = కాల్చుచున్న, మయా = నాచేత, సీతా = సీత, న పరిరక్షితా హి = రక్షింపబడలేదు.

తా. ఏ కార్యము సాధించుటకు ఈ ప్రయత్నమంతా జరిగినదో ఆ కార్యమును చెరగొట్టినాను. ఎందుచేత ననగా లంకాపట్టణమును కాల్చే సమయము నందు నేను సీతాదేవిని రక్షించలేదు. 9

మూ. ఈషత్కార్యమిదం కార్యం కృతమాసీన్న సంశయః,
తస్య క్రోధాభిభూతేన మయా మూలక్షయః కృతః. 10

ప్ర. అ. ఇదం కార్యమ్ = ఈ కార్యము, ఈషత్కార్యమ్ = ఇంక కొంచెము మాత్రమే చేయవలసినదిగా, కృతమ్ = చేయబడినది, ఆసీత్ = అయెను. క్రోధాభిభూతేన = కోపముచేత తిరస్కరింపబడిన (అధిక మైన కోపము గల) మయా = నాచేత, తస్య = అట్టి కార్యముయొక్క మూలక్షయః = మూలమునకే వినాశము, కృతః = చేయబడినది. సంశయః = సంశయము, న = లేదు.

తా. తలపెట్టిన ఈ కార్యము చాలవరకు పూర్తి యైనది. కాని నేను కోపావేశముతో మూలమునకే వినాశము చేసినాను; సందేహము లేదు. 10

మూ. వినష్టా జానకీ నూనం న హ్యదగ్ధః ప్రదృశ్యతే,
లఙ్కాయాం కశ్చిదుద్దేశః సర్వా భస్మీకృతా పురీ. 11

ప్ర. అ. నూనమ్ = నిశ్చయముగా, జానకీ = జానకి, వినష్టా = నశించినది. లఙ్కాయామ్ = లంకలో, కశ్చిత్ = ఏ, ఉద్దేశః = ప్రదేశము కూడ, అదగ్ధః = కాల్చబడనిది, న ప్రదృశ్యతే హి = చూడబడుటలేదుకదా. సర్వా = సమస్తమైన, పురీ = పట్టణము, భస్మీకృతా = భస్మము చేయబడినది.

తా. లంకాపట్టణ మంతా భస్మమైపోయినది. ఈ పట్టణములో కాల్చబడని ప్రదేశ మేదీ కనబడుటలేదు. అందుచేత జానకి కూడ తప్పక కాలిపోయి ఉండును. 11

మూ. యది తద్విహతం కార్యం మమ ప్రజ్ఞావిపర్యయాత్,
ఇహైవ ప్రాణసంన్యాసో మమాపి హ్యద్య రోచతే. 12

ప్ర. అ. మమ=నాయొక్క, ప్రజ్ఞావిపర్యయాత్=బుద్ధివైపరీత్యమువలన, తత్=ఆ, కార్యమ్=కార్యము, విహతం యది=నష్ట మైనచో, మమాపి=నాకు కూడా, ఇహైవ=ఇక్కడనే, ప్రాణసంన్యాసః = ప్రాణపరిత్యాగము, అద్య= =ఇప్పుడు, రోచతే=ఇష్ట మగుచున్నది.

తా. నా బుద్ధివైపరీత్యముచే ఈ కార్యము చెడిపోయిన పక్షాన, ఇప్పుడు నేను కూడ ఇక్కడనే ప్రాణపరిత్యాగము చేయుట మంచిది. 12

మూ. కిమగ్నౌ నిపతామ్యద్య ఆహోస్విద్బడబాముఖే,
శరీరమాహో సత్త్వానాం దద్మి సాగరవాసినామ్. 13

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అగ్నౌ=అగ్నియందు, నిపతామి=పడుదునా? ఆహోస్విత్=లేక, బడబాముఖే=బడబాగ్ని (సముద్రములోని అగ్ని) ముఖమునందు పడుదునా? ఆహో = లేక, శరీరమ్ = శరీరమును, సాగరవాసినామ్ = సముద్రములో నివసించు సత్త్వానామ్ = జంతువులకు, దద్మి=ఇచ్చెదనా?

తా. ఇప్పుడు నేను అగ్నిలో దుముకుదునా? బడబాగ్నిలో పడుదునా, లేక సముద్రములో నున్న జంతువులకు నా శరీరమును ఆహారముగా ఇచ్చివేయుదునా? 13

మూ. కథం హి జీవతా శక్యో మయా ద్రష్టుం హరీశ్వరః,
తౌ వా పురుషశార్దూలౌ కార్యసర్వస్వఘాతినా. 14

ప్ర. అ. కార్యసర్వస్వఘాతినా = కార్యముయొక్క సకలఫలమును చెరగొట్టిన, మయా = నాచేత, జీవతా=జీవించియుండి, హరీశ్వరః=సుగ్రీవుడు, ద్రష్టుమ్=చూచుటకు, కథం వా=ఎట్లు, శక్యః=శక్యమైనవాడు? పురుష

శార్దూలౌ = పురుషశ్రేష్ఠులైన, తౌ వా = ఆ రామలక్ష్మణులైనా, చూచుటకు ఎట్లు శక్యమైనవారు ?

తా. మొత్తము కార్యము అంతా చెడగొట్టిన నేను ప్రాణాలతో ఉండి, సుగ్రీవునకు గాని, పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులకు గాని నా ముఖము ఎట్లు చూపగలను ? 14

మూ. మయా ఖలు తదేవేదం రోషదోషాత్ప్రదర్శితమ్,
ప్రథితం త్రిషు లోకేషు కపిత్వమనవస్థితమ్. 15

ప్ర. అ. మయా = నాచేత, రోషదోషాత్ = రోష మనే దోషమువలన, త్రిషు లోకేషు = మూడు లోకములందు. ప్రథితమ్ = ప్రసిద్ధమైన, అనవస్థితమ్ = స్థిరత్వములేని, తత్ = ఆ, ఇదమ్ = ఈ, కపిత్వమ్ = కపిత్వము, ప్రదర్శితం ఖలు = చూపబడినది కదా ?

తా. నేను కోపావేశములో, మూడు లోకములలోను ప్రసిద్ధమైన, కపులకు సహజమైన చపలత్వమును చూపినాను. 15

మూ. ధిగస్తు రాజసం భావమనీశమనవస్థితమ్,
ఈశ్వరేణాపి యద్రాగాన్మయా సీతా న రక్షితా. 16

ప్ర. అ. అనీశమ్ = సమర్థము కానిది (అదుపులో ఉంచజాలనిది), అనవస్థితమ్ = స్థిరత్వము లేనిది అయిన, రాజసమ్ = రజోగుణప్రధానమైన, భావమ్ = భావమును గూర్చి, ధిక్ అస్తు = నింద అగు గాక. యత్ = ఏ కారణమువలన, ఈశ్వరేణాపి = సమర్థుడనైనను, మయా = నాచేత, రాగాత్ = రజోగుణప్రభావమువలన, సీతా = సీత, న రక్షితా = రక్షింపబడలేదో ;

తా. ఛీ ! రాజసప్రవృత్తి ఎంత చెడ్డది ! ఇది అదుపులో ఉండదు. చపలత్వమును కలిగించును. దీని ప్రభావముచేతనే నేను, సీతను రక్షించుటకు సమర్థుడనై ఉండి కూడ ఆమెను రక్షించజాలకపోయితిని. 16

మూ. వినష్టాయాం తు సీతాయాం తావుభౌ వినశిష్యతః,
తయోర్వినాశే సుగ్రీవః సబన్ధుర్వినశిష్యతి, 17

ప్ర. అ. సీతాయామ్ = సీత, వినష్టాయామ్ = మరణించిన దగుచుండగా, తౌ ఉభౌ = ఆ రామలక్ష్మణులిద్దరూ, వినశిష్యతః = మరణింతెదరు. తయోః = వారి ద్దరియొక్క, వినాశే = మరణము కలుగగా, సబన్ధుః = బంధుసమేతు డైన, సుగ్రీవః = సుగ్రీవుడు, వినశిష్యతి = నశించగలడు.

తా. సీత మరణించినతో ఆ రామలక్ష్మణు లిద్దరూ కూడ మరణింతురు. వారు మరణించినతో బంధువులందరితో సుగ్రీవుడు మరణించగలడు. 17

మూ. ఏతదేవ వచః శ్రుత్వా భరతో భ్రాతృవత్సలః,
ధర్మాత్మా సహశత్రుఘ్నః కథం శక్ష్యతి జీవితుమ్. 18

ప్ర. అ. ఏతదేవ = ఈ, వచః = వచనమును (వార్తను) శ్రుత్వా = విని, భ్రాతృవత్సలః = సోదరులయందు ప్రేమ గల, ధర్మాత్మా = ధర్మాత్ము డైన, సహశత్రుఘ్నః = శత్రుఘ్నునితో కూడిన, భరతః = భరతుడు, జీవితుమ్ = జీవించుటకు, కథమ్ = ఎట్లు, శక్ష్యతి = సమర్థుడగును ?

తా. ఈ వార్త విన్న పిమ్మట, సోదరునియందు ప్రేమ గల, ధర్మాత్ము డైన భరతుడు, శత్రుఘ్నుడు కూడ ఎట్లు జీవించగలరు ? 18

మూ. ఇక్ష్వాకువంశే ధర్మిష్ఠే గతే నాశమసంశయమ్,
భవిష్యన్తి ప్రజాః సర్వాః శోకసన్తాపపీడితాః. 19

ప్ర. అ. ధర్మిష్ఠే = ధర్మనిష్ఠగల, ఇక్ష్వాకువంశే = ఇక్ష్వాకువంశము, నాశమ్ = నాశమును, గతే = పొందిన దగుచుండగా, సర్వాః = సమస్త మైన, ప్రజాః = ప్రజలు, అసంశయమ్ = నిస్సంశయముగా, శోకసంతాపపీడితాః = శోకముచేతను, మనస్తాపము చేతను పీడింపబడినవారు, భవిష్యన్తి = కాగలరు.

తా. ధర్మమార్గనిరత మైన ఇక్ష్వాకువంశము నశించిన పిమ్మట ప్రజ లందరు శోకముచేత, మనస్తాపముచేత పీడితు లై పోవుదురు. సందేహము లేదు.

మూ. తదహం భాగ్యరహితో లుప్తధర్మార్థసంగ్రహః, 20
రోగదోషపరీతాత్మా వ్యక్తం లోకవినాశనః.

తా. భరతుడు మొదలైన ముగ్గురు సోదరులకు పూజ్యురాలు, రాముని మనస్సునకు అత్యంత ప్రియురాలు అయిన ఆ సీత అగ్నిలో ఎట్లు నశించును ?

మూ. యద్వా దహనకర్మాయం సర్వత్ర ప్రభురవ్యయః,
స మే దహతి లాఙ్గూలం కథమార్యాం ప్రధక్ష్యతి. 26

ప్ర. అ. యద్వా = లేదా, సర్వత్ర = అంతటను, ప్రభుః = సమర్థుడు, అవ్యయః = నాశము లేనివాడు అయిన, అయమ్ = ఈ, దహనకర్మా = అగ్ని, మే = నాయొక్క, లాఙ్గూలమ్ = తోకను, న దహతి = కాల్చుట లేదు. ఆర్యామ్ = పూజ్యురాలైన సీతను, కథమ్ = ఎట్లు, ప్రధక్ష్యతి = కాల్చును ?

తా. ఎక్కడా ఏ విధమైన అడ్డూ లేక ప్రసరింప గలిగిన ఈ అగ్ని నా తోకనే కాల్చలేదు కదా; సీతను ఎట్లు కాల్చ గలదు ? 26

మూ. పునశ్చాచిన్తయత్తత్ర హనుమాన్విస్మితస్తదా,
హిరణ్యనాభస్య గిరేర్జలమధ్యే ప్రదర్శనమ్. 27

ప్ర. అ. తదా = అప్పుడు, హనుమాన్ = హనుమంతుడు, విస్మితః = ఆశ్చర్యము పొందిన వాడై, జలమధ్యే = సముద్రజలమధ్యమునందు, హిరణ్యనాభస్య = హిరణ్యనాభుడను, గిరేః = పర్వతముయొక్క, ప్రదర్శనమ్ = దర్శనమును గూర్చి, తత్ర = అక్కడ, పునః = మరల, అచిన్తయత్ = ఆలోచించెను.

తా. అప్పుడు హనుమంతుడు తాను వచ్చుచున్నప్పుడు జలమధ్యమునందు మైనాకపర్వతము కనబడుటను గూర్చి ఆశ్చర్యపూర్వకముగా స్మరించెను. 27

మూ. తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి,
అపి సా నిర్దహేదగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి. 28

ప్ర. అ. తపసా = తపస్సుచేతను, సత్యవాక్యేన = సత్యవాక్యముచేతను, భర్తరి = భర్తవిషయమున, అనన్యత్వాచ్చ = ఏకాగ్రచిత్త ముండుటవలనను, సా = ఆ సీత, అగ్నిమ్ = అగ్నిని, నిర్దహేత్ అపి = కాల్చివేయును కూడ. తామ్ = ఆమెను, అగ్నిః = అగ్ని, న ప్రధక్ష్యతి = కాల్చదు.

తా. తపస్సుచేత, సత్యవాక్యముచేత, భర్త విషయమున ఏకాగ్రమైన

శక్తిచేత సీత అగ్నినే కాల్చివేయును. ఆమెను అగ్ని కాల్చజాలదు. 28

మూ. స తథా చిన్తయంస్తత్ర దేవ్యా ధర్మపరిగ్రహమ్,
శుశ్రావ హనుమాన్వాక్యం చారణానాం మహాత్మనామ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, తథా = ఆ విధముగా, దేవ్యాః = సీతాదేవి యొక్క, ధర్మపరిగ్రహమ్ = ధర్మముయొక్క స్వీకారమును (ధర్మపరత్వమును) గూర్చి, చిన్తయన్ = ఆలోచించుచున్న, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, మహాత్మనామ్ = మహాత్ములైన, చారణానామ్ = చారణులయొక్క, వాక్యమ్ = వాక్యమును, శుశ్రావ = వినెను.

తా. అక్కడ, ఆ విధముగా, సీతాదేవి ధర్మపరాయణురా లను విషయమును గూర్చి ఆలోచించుచున్న హనుమంతునకు మహాత్ములైన చారణుల మాటలు వినవచ్చెను. 29

మూ. అహో ఖలు కృతం కర్మ దుష్కరం హి హనూమతా,
అగ్నిం విసృజతాఽభీక్ష్ణం భీమం రాక్షసవేశ్మని. 30

ప్ర. అ. రాక్షసవేశ్మని = రావణుని గృహమునందు, అభీక్ష్ణమ్ = మిక్కిలి, భీమమ్ = భయంకర మైన, అగ్నిమ్ = అగ్నిని, విసృజతా = విడచిన, హనూమతా = హనుమంతునిచేత, దుష్కరమ్ = చేయ శక్యము కాని, కర్మ = పని, కృతం ఖలు = చేయబడినదికదా । అహో = ఎంత ఆశ్చర్యము ।

తా. చాల భయంకర మైన అగ్నిని రావణుని గృహమునకు ముట్టించిన హనుమంతుడు ఎవ్వరూ చేయజాలని పని చేసినాడు. ఎంత ఆశ్చర్యము । 30

మూ. ప్రపలాయితరక్షఃస్త్రీ బాలవృద్ధ సమాకులా,
జనకోలాహలాధ్మాతా క్రన్దతీ వాద్రికన్దరైః. 31

ప్ర. అ. ప్రపలాయితరక్షఃస్త్రీబాలవృద్ధసమాకులా = పరుగెత్తుచున్న రాక్షసులతోను, వాళ్ళ స్త్రీలతోను, బాలురతోను, వృద్ధులతోను వ్యాకుల మైనదీ, జనకోలాహలాధ్మాతా = జనుల కోలాహలముచేత నింపబడినది అయిన లంక, అద్రికన్దరైః = పర్వతగుహలచేత, క్రన్దతీవ = ఏడ్చుచున్నట్లున్నది.

## అథ షట్పఞ్చాశః సర్గః

[హనుమంతుడు మరల సీతాదర్శనము చేసి, లంకనుండి బయలుదేరి సముద్రమును లంఘించుట]

మూ. తతస్తు శింశపామూలే జానకీం పర్యవస్థితామ్,
అభివాద్యాబ్రవీద్దిష్ట్యా పశ్యామి త్వామిహాక్షతామ్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శింశపావృక్షే = శింశపావృక్షమునందు (నకు), పర్యవస్థితామ్ = సమీపించి ఉన్న, జానకీమ్ = జానకిని, అభివాద్య = నమస్కరించి, అబ్రవీత్ = పలికెను. దిష్ట్యా = దైవవశముచేత, అక్షతామ్ = ఏ మాత్రము అపాయము లేకుండా ఉన్న, త్వామ్ = నిన్ను, ఇహ = ఇక్కడ, పశ్యామి = చూచుచున్నాను.

తా. పిమ్మట హనుమంతుడు శింశపావృక్షసమీపమునందున్న జానకిని చూచి నమస్కరించి—"నీవు దైవవశముచే ఏ అపాయము లేకుండ ఉండగా చూడగలిగినాము" అని పలికెను. 1

మూ. తతస్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునః పునః,
భర్తృస్నేహాన్వితం వాక్యం హనూమన్తమభాషత. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రస్థితమ్ = ప్రయాణమైన, తం హనూమన్తమ్ = ఆ హనుమంతుని, పునః పునః = మాటి మాటికి, వీక్షమాణా = చూచుచున్నదై, సీతా = సీత, భర్తృస్నేహాన్వితమ్ = భర్తయందు స్నేహముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, అభాషత = పలికెను.

తా. పిమ్మట, సీత తిరిగి వెళ్ళుటకు బయలుదేరిన ఆ హనుమంతుని వైపు మాటి మాటికి చూచుచు, భర్తపై స్నేహముతో నిండిన వాక్యము పలికెను.

మూ. కామమస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్యస్తే ఫలోదయః. 3

ప్ర. అ. పరవీరఘ్న=శత్రువీరులను సంహరించువాడా ! అస్య కార్యస్య =ఈ కార్యముయొక్క, పరిసాధనే=సాధించుటయందు, త్వమ్=నీవు, ఏకః ఏవ =ఒక్కడవే, కామమ్ = నిశ్చయముగా, పర్యాప్తః = సరిపోయినవాడవు. తే= నీయొక్క. ఫలోదయః = ఫలముయొక్క ప్రభావము, యశస్యః = కీర్తిప్రదము.

తా. శత్రువీరులను సంహరించే ఓ ! హనుమంతుడా ! ఈ కార్యమును సాధించుటకు నీ వొక్కడవే చాలు ననుటలో సందేహము లేదు. నీ ఫలాతి శయము ప్రశంసింప దగినది. 3

మూ. శరైస్తు సంకులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః,
మాం నయేద్యది కాకుత్స్థస్తత్తస్య సదృశం భవేత్. 4

ప్ర. అ. తు = కాని, పరబలార్దనః = శత్రుసైన్యమును నశింపచేయు, కాకుత్స్థః=రాముడు, లఙ్కామ్ = లంకను, శరైః=బాణములచేత, సంకులామ్ =వ్యాకులమైనదానినిగా, కృత్వా = చేసి, మామ్=నన్ను, నయేద్యది = తీసికొని వెళ్ళిన ట్లయితే, తత్=అది, తస్య = అతనికి, సదృశమ్ = తగినది, భవేత్ = అగును.

తా. అయినను, శత్రుసేనలను సంహరించు రాముడు లంకను శరము లచే వ్యాకుల మగు నట్లు చేసి, నన్ను తీసికొని వెళ్లుట అతనికి తగి యుండును.

మూ. తద్యథా తస్య విక్రాన్తమనురూపం మహాత్మనః,
భవత్యాహవశూరస్య తథా త్వముపపాదయ. 5

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, మహాత్మనః = గొప్ప బుద్ధి కల వాడూ, ఆహవశూరస్య = యుద్ధములో శూరుడూ అయిన, తస్య = ఆ రాముని యొక్క, విక్రాన్తమ్ = పరాక్రమము, అనురూపమ్ = తగు విధముగా, యథా= ఎట్లు, భవతి= అగునో, తథా = అట్లు, త్వమ్ = నీవు, ఉపపాదయ = చేయుము.

తా. అందువలన, నీవు, యుద్ధములో శూరుడైన ఆ మహాత్ముని పరాక్ర మమునకు ఏమి చేసిన తగి యుండునో అట్లు చేయుము. 5

మూ. తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశమ్య హనుమాం స్తస్యా వాక్యముత్తరమబ్రవీత్. 6

ప్ర. అ. హనుమాన్ = హనుమంతుడు, ప్రశ్రితమ్ = వినయముతో కూడి నది, హేతుసంహితమ్ = హేతుసంమతము, అర్థోపహితమ్ = మంచి అర్థముతో కూడినదీ అయిన, తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, నిశమ్య = విని, ఉత్తరమ్ = ప్రత్యుత్తర రూప మైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సీత పలికిన మంచి అర్థము గల, తగిన కారణములతో కూడిన ఆ మాటలు విని, హనుమంతుడు ఈ విధముగ ప్రత్యుత్తర మిచ్చెను. 6

మూ. క్షిప్రమేష్యతి కాకుత్స్థో హర్యృక్షప్రవరైర్వృతః,
యస్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి. 7

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, హర్యృక్షప్రవరైః = వానర నాయకుల తోను, భల్లూకనాయకులతోను, వృతః = కూడినవా డై, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు. యః = ఏ రాముడు, యుధి = యుద్ధమునందు, అరీన్ = శత్రువులను, విజిత్య = జయించి, తే = నీయొక్క, శోకమ్ = దుఃఖమును, వ్యపనయిష్యతి = తొలగించగలడో.

తా. రాముడు వానరభల్లూకనాయకులతో కూడి శీఘ్రముగా వచ్చి, యుద్ధములో శత్రువులను జయించి, నీ శోకమును తొలగించగలడు. 7.

మూ. ఏవమాశ్వాస్య వైదేహీం హనుమాన్ మారుతాత్మజః,
గమనాయ మతిం కృత్వా వైదేహీమభ్యవాదయత్. 8

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమం తుడు, వైదేహీమ్ = సీతను, ఏవమ్ = ఇట్లు, ఆశ్వాస్య = ఓదార్చి, గమనాయ = వెళ్లుటకు, మతిమ్ = బుద్ధిని, కృత్వా = చేసి, వైదేహీమ్ = సీతను, అభ్యవాద యత్ = నమస్కరించెను.

తా. వాయుపుత్రు డైన హనుమంతుడు సీతతో ఇట్లు పలికి, తిరిగి వెళ్ళుటకు నిశ్చయించుకొని, సీతకు అభివాదనము చేసెను. 8

మూ. తతః స కపిశార్దూలః స్వామిసందర్శనోత్సుకః,
ఆరురోహ గిరిశ్రేష్ఠమరిష్టమరిమర్దనః. 9

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అరిమర్దనః = శత్రుసంహారకు డైన, సః = ఆ, కపిశార్దూలః = వానరశ్రేష్ఠు డైన హనుమంతుడు, స్వామిసందర్శనోత్సుకః = ప్రభువుయొక్క దర్శనమునందు ఆసక్తి కలవాడై, అరిష్టమ్ = అరిష్టమను, గిరిశ్రేష్ఠమ్ = పర్వతశ్రేష్ఠమును, ఆరురోహ = ఎక్కెను.

తా. పిమ్మట, శత్రుసంహారకు డైన ఆ హనుమంతుడు ప్రభువును చూచుటకు ఆసక్తితో మంగళప్రద మైన పర్వతశ్రేష్ఠమును ఎక్కెను. 9

మూ. తుఙ్గపద్మకజుష్టాభిర్నీలాభిర్వనరాజిభిః,
సోత్తరీయమివామ్భోదైః శృఙ్గాన్తరవిలమ్బిభిః. 10

(ఇది మొదలు 21వ శ్లోకము వరకు ఒకటే అన్వయము. ద్వితీయాంత పదములన్నీ 21వ శ్లోకములో ఉన్న "పర్వతమ్" అను దానికి విశేషణములు).

ప్ర. అ. తుఙ్గపద్మకజుష్టాభిః = ఎత్తైనవి, ఎఱ్ఱని మచ్చలు కలవీ అయిన ఏనుగులతో కూడిన, నీలాభిః = నల్ల నైన, వనరాజిభిః = వనపంక్తులతో కూడినది, శృఙ్గాన్తరవిలమ్బిభిః = శిఖరముల మధ్య భాగములందు వ్రేలాడుచున్న, అమ్భోదైః = మేఘములచేత, సోత్తరీయమివ = ఉత్తరీయముతో కూడినది వలె ఉన్న (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతమునందు అంతటా నల్లని వనముల పంక్తులు ఉండెను. ఆ వనములలో ఎఱ్ఱని మచ్చ లున్న ఎత్తైన ఏనుగులు ఉండెను. శిఖరముల మధ్య మేఘములు వ్రేలాడుచుండుటచే ఆ పర్వతము ఉత్తరీయము ధరించి నట్లు ఉండెను. 10

మూ. బోధ్యమానమివ ప్రీత్యా దివాకరకరైః శుభైః,
ఉన్మిషన్తమివోద్ధూతైర్లోచనైరివ ధాతుభిః. 11

ప్ర. అ. శివైః = మంగళకరము లైన, దివాకరకరైః = సూర్యుని కిరణములచేత, ప్రీత్యా = ప్రేమతో, ద్యోత్యమానమివ = మేలొల్కొల్పబడుచున్నది వలె ఉన్నది. ఉద్ధూతైః = పైకి ఎగురగొట్టబడిన, లోచనైరివ = నేత్రముల వలె ఉన్న, ధాతుభిః = ధాతువులచేత, ఉన్మిషన్తమివ = కండ్లు విప్పి చూచుచున్నది వలె ఉన్న (పర్వతము నెక్కెను).

తా. ఆ పర్వతముమీద ఉన్న గైరికాదిధాతువులు అక్కడక్కడ పైకి స్పష్టముగా కనబడుచుండెను. అందుచే ఆ పర్వతము మంగళకరము లైన సూర్యకిరణములు ప్రేమపూర్వకముగ మేలొల్కొల్పగా (ధాతువు లను) కన్లు తెరచి చూచుచున్నట్లు ఉండెను. 11

మూ. తోయౌఘనిస్వనైర్మన్ద్రైః ప్రాధీతమివ పర్వతమ్.
ప్రగీతమివ విస్పష్టైర్నానాప్రస్రవణస్వనైః. 12

ప్ర. అ. మన్ద్రైః = గంభీరము లైన, తోయౌఘనిస్వనైః = జలప్రవాహముల ధ్వనులచేత, ప్రాధీతమివ = వేదాధ్యయనము చేయుచున్నది వలె ఉన్నదీ, విస్పష్టైః = స్పష్టము లైన, నానాప్రస్రవణస్వనైః = అనేకవిధము లైన సెలయేళ్ల చప్పుళ్ల చేత, ప్రగీతమివ = గానము చేయుచున్నది వలె ఉన్నదీ, పర్వతమ్ = అనేక కఠిన భాగములు కలదీ అయిన, (పర్వతమును ఎక్కెను).

తా. అనేక కఠినభాగములు ఉన్న ఆ పర్వతము గంభీరము లైన జలప్రవాహధ్వనులచేత వేదాధ్యయనముచేయుచున్నట్లు ఉండెను. సెలయేళ్ల అనేకవిధము లైన ధ్వనులు స్పష్టముగా వినబడుచుండుటచే అది గానము చేయుచున్నట్లు ఉండెను. 12

మూ. దేవదారుభిరత్యుచ్చైరూర్ధ్వబాహుమివ స్థితమ్.
ప్రపాతజలనిర్ఘోషైః ప్రాక్రుష్టమివ సర్వతః. 13

ప్ర. అ. అత్యుచ్చైః = చాల ఉన్నతము లైన, దేవదారుభిః = దేవదారు వృక్షములచేత, ఊర్ధ్వబాహుమివ = పైకి ఎత్తబడిన బాహువులు కలది వలె, స్థితమ్ = ఉన్నదీ, ప్రపాతజలనిర్ఘోషైః = జలపాతములలోని నీటి ధ్వనులచేత,

సర్వతః = అంతట, ప్రాక్రుష్టమివ = అరచుచున్నది వలె ఉన్న (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతము దేవదారువృక్షములు చాల ఎత్తుగా ఉండుటచే చేతులు పైకెత్తి నిలబడినది వలె ఉండెను. జలపాతములలోని నీటి ధ్వనులచే అది నలుమూలల అరచుచున్నట్లు ఉండెను. 13

మూ. వేపమానమివ శ్యామైః కమ్పమానైః శరధ్వనైః,
వేణుభిర్మారుతోద్ధూతైః కూజన్తమివ కీచకైః. 14

ప్ర. అ. శ్యామైః = నల్లగా నున్న, కమ్పమానైః = కదలుచున్న, శరధ్వనైః = శరత్కాలము నందలి వనములచేత, వేపమానమివ = వణుకుచున్నది వలె ఉన్నదీ, మారుతోద్ధూతైః = వాయువుచేత పూరింపబడిన, కీచకైః = వెదురు బొంగులచేత, కూజన్తమివ=కూయుచున్నది వలె ఉన్నదీ అయిన (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతము కదలు చున్న నల్లని శరత్కాలవనములచేత వణకు చున్నది వలె, గాలిచేత నింపబడిన వెదురుబొంగులచేత కూయుచున్నది వలె ఉండెను. 14

మూ. నిఃశ్వసన్తమివామర్షాద్ఘోరైరాశీవిషోత్తమైః,
నీహారకృతగమ్భీరైర్ధ్యాయన్తమివ గహ్వరైః. 15

ప్ర. అ. ఘోరైః = భయంకరము లైన, ఆశీవిషోత్తమైః = శ్రేష్ఠము లైన సర్పములచేత, నిఃశ్వసన్తమివ = నిట్టూర్పుచున్నట్లు ఉన్నది, నీహారకృతగమ్భీరైః = మంచుచేత కప్పబడిన లోతైన, గహ్వరైః = గుహలతో, ధ్యాయన్తమివ = ధ్యానము చేయుచున్నట్లు ఉన్నది అయిన పర్వతమును ఎక్కెను.

తా. ఆ పర్వతము భయంకరము లైన మహాసర్పములతో వ్యాప్తమై ఉండుటచే కోపముతో నిట్టూర్పుచున్న ట్లుండెను. లోతైన గుహలు మంచుచేత కప్పబడి యుండుటచే ఆ పర్వతము ధ్యానము చేయుచున్న ట్లుండెను. 15

మూ. మేఘపాదనిభైః పాదైః ప్రక్రాన్తమివ సర్వతః,
జృమ్భమాణమివాకాశే శిఖరైరభ్రమాలిభిః. 16

ప్ర. అ. మేఘపాండరనిభైః = మేఘముల పాండరముతో సమానము లైన, పాదైః = సమీపమునందున్న చిన్న పర్వతములచేత, సర్వతః = నలు వైపుల, ప్రస్థాస్తమివ = నడచుచున్నది వలె ఉన్నది. అభ్రమాలిభిః = మేఘపంక్తులు గల శృంగైః = శిఖరములచేత, ఆకాశే = ఆకాశమునందు, జృమ్భమాణమివ = ఆవులించుచున్నది వలె ఉన్నది అయిన పర్వతమును ఎక్కెను.

తా. ఆ పర్వతము మేఘముల పాండరము వలె ఉన్న, చిన్న చిన్న పర్వతములు దగ్గరగా ఉండుటచే నడచుచున్నట్లు ఉండెను. మేఘపంక్తులతో కూడిన శిఖరములతో ఆకాశమునందు ఆవులించుచున్న ట్లుండెను. 16

మూ. కూటైశ్చ బహుధా కీర్ణైః శోభితం బహుకన్దరైః,
సాలతాలాశ్వకర్ణైశ్చ వంశైశ్చ బహుభిర్వృతమ్. 17

ప్ర. అ. బహుధా = అనేకవిధములుగా, కీర్ణైః = వ్యాప్తము లైన, బహుకన్దరైః = అనేకము లైన గుహలు గల, కూటైశ్చ = శిఖరములచేత, శోభితమ్ = ప్రకాశింపచేయబడినది, బహుభిః = అనేకము లైన, సాలతాలాశ్వకర్ణైశ్చ = సాలవృక్షములతోను, తాటిచెట్లతోను, అశ్వకర్ణవృక్షములతోను, వంశైశ్చ = వెదుళ్ల తోను, వృతమ్ = కూడినదీ అయిన (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతము మీద, అనేకము లైన గుహలు కల ఎన్నో శిఖరములు ప్రకాశించుచుండెను. దానిపై అనేకము లైన సాల. తాల. అశ్వకర్ణవృక్షములు, వెదుళ్లు ఉండెను. 17

మూ. లతావితానైర్వితతైః పుష్పవద్భిరలంకృతమ్,
నానామృగగణాకీర్ణం ధాతునిష్యన్దభూషితమ్. 18

ప్ర. అ. వితతైః = విస్తృతము లైన, పుష్పవద్భిః = పుష్పములు గల, లతావితానైః = లతాసముదాయములచేత, అలంకృతమ్ = అలంకరింపబడినది, నానామృగగణాకీర్ణమ్ = అనేకము లైన మృగముల గణములచేత వ్యాప్తమూ, ధాతునిష్యన్దభూషితమ్ = ధాతువుల స్రావములచే అలంకరింపబడినదీ అయిన (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతము పుష్పములు విరివిగా కల లతాసముదాయములచే అలంకరింపబడినదై, అనేక మృగ గణములచే వ్యాప్తమై యుండెను. 18

మూ. బహుప్రస్రవణోపేతం శిలాసంచయసంకటమ్,
మహర్షియక్షగన్ధర్వకిన్నరోరగసేవితమ్. 19

ప్ర. అ. బహుప్రస్రవణోపేతమ్ = అనేకము లైన సెలయేళ్ళతో కూడినది, శిలాసంచయసంకటమ్ = శిలల సముదాయముచేత ఇరుకుగా ఉన్నది, మహర్షియక్షగన్ధర్వకిన్నరోరగసేవితమ్ = మహర్షులచేత, యక్షులచేత, గంధర్వులచేత, కింనరులచేత, ఉరగులచేత సేవింపబడినది అయిన (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతముమీద అనేకము లైన సెలయేళ్లు ఉండెను. రాళ్లు కుప్పలు కుప్పలుగా పడి యుండుటచే ఇరుకుగా ఉండెను. దానిపై మహర్షులు, యక్షులు, గంధర్వులు, కింనరులు, ఉరగులు నివసించుచుండిరి. 19

మూ. లతాపాదపసంఘాతం సింహాధ్యుషితకన్దరమ్,
వ్యాఘ్రసంఘసమాకీర్ణం స్వాదుమూలఫలద్రుమమ్. 20

ప్ర. అ. లతాపాదపసంఘాతమ్ = లతలయొక్క వృక్షములయొక్క సముదాయము కలది, సింహాధ్యుషితకన్దరమ్ = సింహములచేత అధిష్ఠింపబడిన గుహలు కలది, వ్యాఘ్రసంఘసమాకీర్ణమ్ = పెద్దపులుల సముదాయముచే వ్యాప్తమూ, స్వాదుమూలఫలద్రుమమ్ = మధుర మైన దుంపలు, ఫలవృక్షములు కలది అయిన (పర్వతమును ఎక్కెను).

తా. ఆ పర్వతము మీద అనేక లతలు, వృక్షములు, ఉండెను. గుహలలో సింహములు నివసించుచుండెను. అది పెద్దపులులతో వ్యాప్త మై యుండెను. దానిపై మధురము లైన దుంపలు, ఫలవృక్షములు ఉండెను. 20

మూ. తమారురోహ హనుమాన్ పర్వతం పవనాత్మజః,
రామదర్శనశీఘ్రేణ ప్రహర్షేణాభిచోదితః. 21

ప్ర. అ. పవనాత్మజః = వాయుపుత్రు డైన, హనుమాన్ = హనుమంతుడు,

రామదర్శనశీఘ్రేణ = రాముని దర్శనముచేత శీఘ్రము మైన, ప్రహర్షేణ = సంతోషముచేత, అభిచోదితః = ప్రేరేపింపబడినవాడై, తం పర్వతమ్ = ఆ పర్వతమును, ఆరురోహ = ఎక్కెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు రాముని దర్శనముకొఱకై తొందర పడుచున్న సంతోషముతో ఆ పర్వతమును ఎక్కెను. 21

మూ. తేన పాదతలాక్రాన్తా రమ్యేషు గిరిసానుషు,
సఘోషాః సమశీర్యన్త శిలాశ్చూర్ణీకృతాస్తతః. 22

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రమ్యేషు = సుందరమైన, గిరిసానుషు = పర్వతముల చరియలయందు, తేన = ఆ హనుమంతునిచేత, పాదతలాక్రాన్తాః = పాదముల అడుగుభాగములచేత ఆక్రమింపబడిన. శిలాః = శిలలు, సఘోషాః = ధ్వనులతో కూడినవై, చూర్ణీకృతాః = చూర్ణము చేయబడినవై, సమశీర్యన్త = సలిగిపోయినవి.

తా. అప్పుడు, రమ్యములైన పర్వతముల చరియలయందున్న శిలలు, ఆ హనుమంతుని పాదముల క్రింద బడి, పెద్ద చప్పుడుతో నలిగి చూర్ణమై పోయెను. 22

మూ. స తమారుహ్య శైలేన్ద్రం వ్యవర్ధత మహాకపిః,
దక్షిణాదుత్తరం పారం ప్రార్థయన్ లవణామ్భసః. 23

ప్ర. అ. సః మహాకపిః = ఆ హనుమంతుడు, లవణామ్భసః = లవణ సముద్రముయొక్క, దక్షిణాత్ = దక్షిణతీరమునుండి, ఉత్తరం పారమ్ = ఉత్తరపు ఆవలి ఒడ్డును, ప్రార్థయన్ = కోరుచు, తం శైలేన్ద్రమ్ = ఆ పర్వతమును, ఆరుహ్య = ఎక్కి, వ్యవర్ధత = వృద్ధి హొందెను.

తా. ఆ హనుమంతుడు లవణసముద్రము దక్షిణతీరమునుండి ఉత్తరతీరమును చేరుటకై కోరుచు, ఆ పర్వతమును ఎక్కి, దేహమును పెంచెను. 23

మూ. అధిరుహ్య తతో వీరః పర్వతం పవనాత్మజః,
దదర్శ సాగరం భీమం మీనోరగనిషేవితమ్. 24

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వీరః=వీరు డైన, పవనాత్మజః=హను మంతుడు, పర్వతమ్ = పర్వతమును, అధిరుహ్య=ఎక్కి, మీనోరగనిషేవితమ్ =మీనములచేతను ఉరగములచేతను సేవింపబడిన, భీమమ్=భయంకర మైన, సాగరమ్ = సముద్రమును, దదర్శ=చూచెను.

తా. పిమ్మట వీరు డైన హనుమంతుడు పర్వతమును ఎక్కి, మీనములం తోను ఉరగములతోను నిండిన, భయంకర మైన సముద్రమును చూచెను. 24

మూ. స మారుత ఇవాకాశం మారుతస్యాత్మసంభవః,
ప్రపేదే హరిశార్దూలో దక్షిణాదుత్తరాం దిశమ్. 25

ప్ర. అ. మారుతస్య = వాయుదేవునియొక్క, ఆత్మసంభవః = కుమారు డైన, సః హరిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడు, దక్షిణాత్ = దక్షిణదిక్కునుండి, ఉత్తరాం దిశమ్ = ఉత్తరదిక్కును గూర్చి, మారుతః ఇవ = వాయువు వలె, ఆకాశమ్=ఆకాశమును, ప్రపేదే=పొందెను.

తా. వాయునందను డైన ఆ హనుమంతుడు దక్షిణదిక్కునుండి ఉత్తర దిక్కునకు పోవుటకై, వాయువు వలె, ఆకాశమును పొందెను (ఎగిరెను). 25

మూ. స తదా పీడితస్తేన కపినా పర్వతోత్తమః,
రరాస సహ తైర్భూతైః ప్రవిశన్వసుధాతలమ్. 26
కమ్పమానైశ్చ శిఖరైః పతద్భిరపి చ ద్రుమైః.

ప్ర. అ. తదా=అప్పుడు, తేన కపినా=ఆ హనుమంతునిచేత, పీడితః= పీడింపబడిన, సః పర్వతోత్తమః=ఆ పర్వతశ్రేష్ఠము, తైః=ఆ, భూతైః సహ= భూతములతో కూడ, వసుధాతలమ్=భూమిని, ప్రవిశన్=ప్రవేశించుచు, కమ్ప మానైః = కదలుచున్న, శిఖరైః = శిఖరములతోను, పతద్భిః = పడిపోవుచున్న, ద్రుమైః = వృక్షములతోను, రరాస=ధ్వనిచేసెను.

తా. హనుమంతుడు అప్పుడు పీడించగా, ఆ పర్వతము, ఆ అన్ని ప్రాణులతోను నేలలోనికి క్రుంగిపోవుచు, కదలిపోవు చున్న శిఖరములతోను, పడి పోవు చున్న వృక్షములతోను గొప్ప ధ్వని చేసెను. 26

మూ. తస్యోరువేగోన్మథితాః పాదపాః పుష్పశాలినః, 27
నిపేతుర్భూతలే రుగ్ణాః శక్రాయుధహతా ఇవ.

ప్ర. అ. తస్య=ఆ హనుమంతునియొక్క, ఊరువేగాత్=తొడల వేగము వలన, మథితాః=కదల్చివేయబడిన, పుష్పశాలినః=పుష్పములతో ప్రకాశించుచున్న, పాదపాః=వృక్షములు, రుగ్ణాః=శిథిలములై, శక్రాయుధహతా ఇవ=వజ్రాయుధముచేత కొట్టబడినవి వలె, భూతలే=నేలపై, నిపేతుః=పడినవి.

తా. పుష్పములతో ప్రకాశించుచున్న వృక్షములు, ఆ హనుమంతుని తొడల వేగముచేత ఊపివేయబడినవై, శిథిలములై, వజ్రాయుధముచేత కొట్టబడినవి వలె నేలమీద పడిపోయినవి. 27

మూ. కన్దరాన్తరసంస్థానాం పీడితానాం మహౌజసామ్, 28
సింహానాం నినదో భీమో నభో భిన్దన్ స శుశ్రువే.

ప్ర. అ. కన్దరాన్తరసంస్థానామ్=గుహల మధ్యలో నివసించుచున్నవి, పీడితానామ్=పీడించబడినవి, మహౌజసామ్=గొప్ప తేజస్సు కలవి అయిన, సింహానామ్=సింహములయొక్క, భీమః=భయంకరమైన, సః నినదః=ఆ ధ్వని, నభః=ఆకాశమును, భిన్దన్=భేదించుచు, శుశ్రువే=వినబడెను.

తా. గుహలలో ఉన్న, గొప్ప పరాక్రమము గల సింహములు పీడింపబడి భయంకరముగ గర్జించగా, ఆ ధ్వని ఆకాశమును భేదించుచు వినబడెను. 28

మూ. త్రస్తవ్యావిద్ధవసనా వ్యాకులీకృతభూషణాః, 29
విద్యాధర్యః సముత్పేతుః సహసా ధరణీధరాత్.

ప్ర. అ. విద్యాధర్యః=విద్యాధరస్త్రీలు, త్రస్తవ్యావిద్ధవసనాః=భయముచే వ్యాకులమైన వస్త్రములు కలవారై, వ్యాకులీకృతభూషణాః=వ్యాకులముగా చేయబడిన అలంకారములు కలవారై, సహసా=వెంటనే, ధరణీధరాత్=పర్వతమునుండి, సముత్పేతుః=పైకి ఎగిరిరి.

తా. విద్యాధరస్త్రీలు భయముచేత వస్త్రములు వ్యత్యస్తములు కాగా, వ్యాకులమైన అలంకారములతో, వెంటనే ఆ పర్వతమునుండి పైకి ఎగిరిపోయిరి.

మూ. అతిప్రమాణా బలినో దీప్తజిహ్వా మహావిషాః, 30
నిపీడితశిరోగ్రీవా వ్యచేష్టన్త మహాహయః

ప్ర. అ. అతిప్రమాణాః = పెద్ద ప్రమాణము కలవి, బలినః = బలము కలవి, దీప్తజిహ్వాః = ప్రజ్వలించుచున్న నాలుకలు గలవి, మహావిషాః = గొప్ప విషము కలవి అయిన, మహాహయః = మహాసర్పములు, నిపీడితశిరోగ్రీవాః = నలగకొట్టబడిన శిరస్సు కంఠములు కలవై, వ్యచేష్టన్త = కొట్టుకొనెను.

తా. పెద్దప్రమాణము, గొప్ప బలము, ప్రకాశించుచున్న నాలుకలు గల పెద్ద సర్పములు, శిరస్సులు, కంఠములు నలిగిపోవుటచే కొట్టుకొనినవి. 30

మూ. కిన్నరోరగగన్ధర్వయక్షవిద్యాధరాస్తదా, 31
పీడితం తం నగవరం త్యక్త్వా గగనమాస్థితాః.

ప్ర. అ. తదా = అప్పుడు, కిన్నరోరగగన్ధర్వయక్షవిద్యాధరాః = కిన్నరులు, ఉరగులు, గంధర్వులు, యక్షులు, విద్యాధరులు, పీడితమ్ = పీడింపబడిన, తం నగవరమ్ = ఆ పర్వతశ్రేష్ఠమును, త్యక్త్వా = విడచి, గగనమ్ = ఆకాశమును, ఆస్థితాః = ఆశ్రయించిరి.

తా. అప్పుడు కిన్నర - ఉరగ - గంధర్వ - యక్ష - విద్యాధరులు పీడింపబడు చున్న ఆ పర్వతమును విడచి ఆకాశము నాశ్రయించిరి. 31

మూ. స చ భూమిధరః శ్రీమాన్ బలినా తేన పీడితః, 32
సవృక్షశిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్.

ప్ర. అ. బలినా = బలవంతుడైన, తేన = ఆ హనుమంతునిచేత, పీడితః = పీడింపబడిన, సవృక్షశిఖరోదగ్రః = వృక్షములతో కూడిన శిఖరములచే ఉన్నతమైన, శ్రీమాన్ = శోభాయుక్తమైన, సః భూమిధరః చ = ఆ పర్వతము, రసాతలమ్ = పాతాళమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. బలవంతుడైన ఆ హనుమంతునిచే పీడింపబడినదై, శోభాయుక్తము, వృక్షము లున్న శిఖరములతో చాల ఉన్నతమూ అయిన ఆ పర్వతము పాతాళ ములో ప్రవేశించెను. 32

మూ. దశయోజనవిస్తారస్త్రింశద్యోజనముచ్ఛ్రితః, 33
ధరణ్యాం సమతాం యాతః స బభూవ ధరాధరః.

ప్ర. అ. దశయోజనవిస్తారః = పది యోజనముల విస్తారము కలది, త్రింశద్యోజనమ్ = ముప్పది యోజనములు. ఉచ్ఛ్రితః = ఉన్నతమూ అయిన, సః ధరాధరః = ఆ పర్వతము. ధరణ్యామ్ = భూమియందు, సమతామ్ = సమత్వమును, యాతః = పొందినది, బభూవ = ఆయెను.

తా. పది యోజనముల వైశాల్యము, ముప్పది యోజనముల ఎత్తు గల ఆ పర్వతము నేలలో దిగిపోయి, నేలతో సమాన మైపోయెను. 33

మూ. స లిలఙ్ఘయిషుర్భీమం సలీలం లవణార్ణవమ్, 34
కల్లోలాస్ఫాలవేలాన్తముత్పపాత నభో హరిః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. సః హరిః = ఆ హనుమంతుడు, భీమమ్ = భయంకరము, కల్లోలాస్ఫాలవేలాన్తమ్ = తరంగములచేత కొట్టబడిన తీరప్రాంతములు కలది అయిన, లవణార్ణవమ్ = లవణసముద్రమును, సలీలమ్ = అనాయాసముగా, లిలఙ్ఘయిషుః = దాట గోరుచున్నవా డై, ఉత్పపాత = ఎగిరెను.

తా. తరంగములు వేగముగా తాకుచున్న తీరప్రాంతము గల ఆ భయంకర మైన లవణసముద్రమును అనాయాసముగా దాటవలె నను కోరికతో హనుమంతుడు ఆకాశముపైకి ఎగిరెను. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో ఏబదియారవ సర్గ సమాప్తము.

## అథ సప్తపఞ్చాశః సర్గః

[హనుమంతుడు సముద్రము దాటి వెళ్ళి జాంబవదంగదాదులను చేరుట]

మూ॥ స చన్ద్రకుముదం రమ్యం సార్కకారణ్డవం శుభమ్.
తిష్యశ్రవణకాదమ్బమభ్రశైవాలశాద్వలమ్. 1

పునర్వసుమహామీనం లోహితాఙ్గమహాగ్రహమ్.
ఐరావతమహాద్వీపం స్వాతిహంసవిలోళితమ్. 2

వాతసంఘాతజాతోర్మి చన్ద్రాంశుశిశిరామ్బుమత్,
భుజఙ్గయక్షగన్ధర్వప్రబుద్ధకమలోత్పలమ్. 3

హనుమాన్ మారుతగతిర్మహానౌరివ సాగరమ్,
అపారమపరిశ్రాన్తః పుప్లువే గగనార్ణవమ్. 4

ప్ర. అ. మారుతగతిః = వాయువు వంటి గమనము గల, హనుమాన్ = హనుమంతుడు, అపరిశ్రాన్తః = అలసట లేనివాడై, సచన్ద్రకుముదమ్ = చంద్రు డనే కలువ కలది, సార్కకారణ్డవమ్ = సూర్యు డనే కారండవపక్షి గలదీ, శుభమ్ = మంగళప్రద మైనదీ, తిష్యశ్రవణకాదమ్బమ్ = పుష్యమీ శ్రవణనక్షత్రము లను హంసలు కలది, అభ్రశైవాలశాద్వలమ్ = మేఘము లను పచ్చికబీళ్ళ వంటి నాచు కలది, పునర్వసుమహామీనమ్ = పునర్వసు అను పెద్ద మీనము కలది, లోహితాఙ్గమహాగ్రహమ్ = కుజు డను గొప్ప మొసలి కలది, ఐరావతమహాద్వీపమ్ = ఐరావత మను పెద్ద ద్వీపము కలది, స్వాతిహంసవిలోళితమ్ = స్వాతి యను హంసచేత కదల్పబడినది, వాతసంఘాతజాతోర్మి = వాయుసమురాయములే పుట్టుచున్న తరంగములు కలది, చన్ద్రాంశుశిశిరామ్బుమత్ = చంద్రకిరణము లను చల్లని ఉదకము కలది, భుజఙ్గయక్షగన్ధర్వప్రబుద్ధకమలోత్పలమ్ = సర్ప ములు, యక్షులు, గంధర్వులు అను వికసించిన పద్మములు నల్లకలువలు కలది,

అపారమ్ = అంతములేనిది అయిన, గగనార్ణవమ్=ఆకాశ మను సముద్రమును, మహానౌః = గొప్ప ఓడ, సాగరమ్ ఇవ=సముద్రమును వలె, పుప్లువే = ఎగిరెను (ఎగిరి దాటెను).

తా. వాయువేగము వంటి వేగము గల హనుమంతుడు, ఏ మాత్రము అలసట లేనివాడై, ఆకాశ మనే అపార మైన సముద్రమును, పెద్ద ఓడ సముద్రమును దాటి నట్లు దాటెను. శుభ మైన ఆ ఆకాశసముద్రములో చంద్రు డను తెల్లకలువ, సూర్యు డను కారండవపక్షి, పుష్యశ్రవణనక్షత్రములను కలహంసలు, మేఘము లను పచ్చికబీళ్ళ వంటి నాచులు, పునర్వసువు అను గొప్ప మీనము, కుజు డను పెద్ద మొసలి, ఐరావత మను పెద్ద ద్వీపము, స్వాతీనక్షత్ర మను హంస, గాలితెర లను తరంగములు, చంద్రకిరణము లను చల్లని ఉదకము, సర్పయక్ష-గంధర్వు లను వికసించిన పద్మములు, నల్లకలువలు ప్రకాశించు చుండెను. 1-4

మూ. గ్రసమాన ఇవాకాశం తారాధిపమివోల్లిఖన్,
హరన్నివ సనక్షత్రం గగనం సార్కమణ్డలమ్. 5

మారుతస్యాత్మజః శ్రీమాన్ కపిర్వ్యోమచరో మహాన్,
హనుమాన్మేఘజాలాని వికర్షన్నివ గచ్ఛతి. 6

ప్ర. అ. మారుతస్య = వాయువుయొక్క, ఆత్మజః = కుమారుడు, శ్రీమాన్ = శోభాయుక్తుడు, మహాన్ = గొప్ప, కపిః = వానరుడు, అయిన, హనుమాన్ = హనుమంతుడు, వ్యోమచరః = ఆకాశములో సంచరించుచు, ఆకాశమ్ = ఆకాశమును, గ్రసమానః ఇవ = మ్రింగుచున్నవాడు వలె, తారాధిపమ్=చంద్రుని, ఉల్లిఖన్నివ=ఒరయుచున్నవాడు వలె, సనక్షత్రమ్=నక్షత్రములతో కూడిన, సార్కమణ్డలమ్ = చంద్రమండలముతో కూడిన, గగనమ్ = ఆకాశమును, హరన్నివ = హరించుచున్నవాడు వలె, మేఘజాలాని = మేఘపంక్తులను, వికర్షన్నివ = లాగుచున్నవాడు వలె, గచ్ఛతి = వెళ్లుచుండెను.

తా. వాయుదేవుని పుత్రుడు, శ్రీమంతుడు, మహాప్రమాణము గల వానరుడు అయిన ఆ హనుమంతుడు, ఆకాశవీథిలో ఎగురుచున్నప్పుడు, అతడు ఆకాశమును మ్రింగివేయుచున్నట్లు, చంద్రుని ఒరయు చున్నట్లు, నక్షత్రసూర్య

మండలాదులతో కూడిన ఆకాశమును హరించు చున్నట్లు కనబడెను. ఆ విధముగ హనుమంతుడు మేఘముల పంక్తులను లాగుచు వెళ్ళెను. 5,6

మూ. పాణ్డరారుణవర్ణాని నీలమాఞ్జిష్ఠకాని చ,
హరితారుణవర్ణాని మహాభ్రాణి చకాశిరే. 7

ప్ర. అ. పాణ్డరారుణవర్ణాని = తెల్లని ఎఱ్ఱని రంగు గలవి, నీలమాఞ్జిష్ఠకాని చ = నీలవర్ణము, పసుపుపచ్చని రంగు గలవి, హరితారుణవర్ణాని = పచ్చని రంగు, ముదురు ఎరుపు రంగు గలవి అయిన, మహాభ్రాణి = గొప్ప మేఘములు, చకాశిరే = ప్రకాశించినవి.

తా. ఆకాశములో, తెలుపు, ఎరుపు, నీలము, పసుపుపచ్చన, ముదిరిన ఎరుపు మొదలైన అనేక విధములైన రంగులతో పెద్ద మేఘములు ప్రకాశించినవి.

మూ. ప్రవిశన్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః,
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చన్ద్రమా ఇవ లక్ష్యతే 8

ప్ర. అ. అభ్రజాలాని = మేఘముల సముదాయములను, ప్రవిశన్ = ప్రవేశించుచు, పునః పునః = మాటి మాటికి, నిష్పతంశ్చ = బైటకు వచ్చుచు, హనుమంతుడు, ప్రచ్ఛన్నశ్చ = కప్పబడినవాడు, ప్రకాశశ్చ = బైటకు వచ్చి ప్రకాశించుచున్నవాడు అయిన, చన్ద్రమాః ఇవ = చంద్రుడు వలె, లక్ష్యతే = చూడబడుచుండెను.

తా. మాటి మాటికి మేఘములలో ప్రవేశించుచు, బైటకు వచ్చుచు ఉన్న హనుమంతుడు, మేఘాలవెనుక మరుగు పడుచు, బైటకు వచ్చుచు ఉన్న చంద్రుడు వలె ప్రకాశించెను.

మూ. వివిధాభ్రఘనాసన్నగోచరో ధవళామ్బరః,
దృశ్యాదృశ్యతనుర్వీరస్తదా చన్ద్రాయతేఽమ్బరే. 9

ప్ర. అ. తదా = అప్పుడు, వివిధాభ్రఘనాసన్న గోచరః = అనేకవిధములైన దట్టమైన మేఘములకు సమీపమునందున్నవాడు, ధవళామ్బరః = తెల్లని వస్త్రములు కలవాడు, దృశ్యాదృశ్యతనుః = కనబడుచు, కనబడక ఉండు

శరీరము కలవాడు అయిన, వీరః = వీరు డైన ఆ హనుమంతుడు, అమ్బరే = ఆకాశమునందు, చన్ద్రాయతే = చంద్రుడు వలె కనబడుచుండెను.

తా. అనేకవిధము లైన దట్టమైన మేఘముల సమీపమున ఎగురుచున్న తెల్లని వస్త్రము ధరించిన ఆ హనుమంతుడు, ఆకాశమునందు, ఒకప్పుడు కన బడుచు, మరొకప్పుడు కనబడకుండ ఉన్న దేహము కలవాడై చంద్రుడు వలె ఉండెను. 9

మూ. తార్క్ష్యాయమాణో గగనే బభాసే వాయునన్దనః,
దారయన్మేఘబృన్దాని నిష్పతంశ్చ పునః పునః. 10
నదన్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః.

ప్ర. అ. మేఘబృన్దాని = మేఘముల సముదాయములను, దారయన్ = చీల్చుచు, పునః పునః = మాటిమాటికి, నిష్పతంశ్చ = బైటకు వచ్చుచు, మహతా = గొప్ప, నాదేన = శబ్దముతో, నదన్ = అరచుచు, మేఘస్వనమహాస్వనః = ఉరుముల వంటి గొప్ప ధ్వని గల, వాయునన్దనః = హనుమంతుడు, గగనే = ఆకాశమునందు, తార్క్ష్యాయమాణః = గరుత్మంతుడు వలె ప్రవర్తించుచు, బభాసే = ప్రకాశించెను.

తా. ఆ హనుమంతుడు మేఘసముదాయములను చీల్చుచు, మాటిమాటికి బైటకు వచ్చుచు, గొప్ప శబ్దము వచ్చునట్లు మహానాదము చేయుచు, ఉరుముల వంటి ధ్వని చేయుచు, ఆకాశములో గరుత్మంతుడు వలె ఎగిరెను. 10

మూ. ప్రవరాన్ రాక్షసాన్ హత్వా నామ విశ్రావ్య చాత్మనః, 11
ఆకులాం నగరీం కృత్వా వ్యథయిత్వా చ రావణమ్,
అర్దయిత్వా బలం ఘోరం వైదేహీమభివాద్య చ, 12
ఆజగామ మహాతేజాః పునర్మధ్యేన సాగరమ్.

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల హనుమంతుడు, ప్రవరాన్ = శ్రేష్ఠు లైన, రాక్షసాన్ = రాక్షసులను, హత్వా = చంపి, ఆత్మనః = తన యొక్క, నామ = పేరును, విశ్రావ్య = వినిపింప చేసి, నగరీమ్ = లంకానగరమును, ఆకులామ్ = వ్యాకుల మైన దానినిగా, కృత్వా = చేసి, రావణమ్ = రావణుని, వ్యథయిత్వా = మనోవ్యథ కలవానినిగా చేసి, ఘోరమ్ = భయంకర మైన

బలమ్ = సైన్యమును, అర్దయిత్వా = పీడించి, వైదేహీమ్ = సీతను, అభివాద్య చ = నమస్కరించి, పునః = తిరిగి, సాగరం మధ్యేన = సాగరమధ్యమార్గము చేత, ఆజగామ = వచ్చెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ హనుమంతుడు, రాక్షసులలో శ్రేష్ఠు లైన వారిని చంపి, తన పేరు చాటి, లంకను వ్యాకులము చేసి, రావణునకు మనోవ్యథ కలిగించి, భయంకర మైన రాక్షససైన్యమును పీడింపచేసి, మరల సాగరమధ్యమున ఎగురుచు తిరిగి వచ్చెను. 11, 12

మూ. పర్వతేన్ద్రం సునాభం చ సముపస్పృశ్య వీర్యవాన్, 13
జ్యాముక్త ఇవ నారాచో మహావేగోఽభ్యుపాగతః

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన హనుమంతుడు, పర్వతేన్ద్రమ్ = పర్వతశ్రేష్ఠు డైన, సునాభం చ = మైనాకుని, సముపస్పృశ్య = స్పృశించి, జ్యాముక్తః = నారిచేత విడువబడిన, నారాచః ఇవ = నారాచబాణము వలె, మహావేగః = గొప్ప వేగము గలవాడై, అభ్యుపాగతః = వచ్చెను

తా. పరాక్రమశాలి యైన హనుమంతుడు మార్గమధ్యమునందు మైనాక పర్వతమును స్నేహపూర్వకముగా స్పృశించి, ధనస్సు నారి విడచిన నారాచ బాణము వలె మహావేగముతో వచ్చెను. 13

మూ. స కించిదనుసంప్రాప్తః సమాలోక్య మహాగిరిమ్, 14
మహేన్ద్రం మేఘసంకాశం ననాద హరిపుఙ్గవః.

ప్ర. అ. సః = ఆ, హరిపుఙ్గవః = వానరశ్రేష్ఠుడు, మహాగిరిమ్ = మహాపర్వత మైన, మేఘసంకాశమ్ = మేఘముతో సమాన మైన, మహేన్ద్రమ్ = మహేంద్రపర్వతమును, కించిత్ = కొంచెము, అనుసంప్రాప్తః = సమీపించిన వా డై, సమాలోక్య = చూచి, ననాద = ధ్వని చేసెను.

తా. ఆ హనుమంతుడు మేఘముతో సమాన మైన మహాపర్వత మైన మహేంద్రగిరిని కొంచెము సమీపించి, దానిని చూడగానే ధ్వని చేసెను. 14

మూ. స పూరయామాస కపిర్దిశో దశ సమన్తతః, 15
నదన్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః.

ప్ర. అ. మేఘస్వనమహాస్వనః = మేఘధ్వని వంటి గొప్ప ధ్వనిగల, సః కపిః = ఆ హనుమంతుడు, నదన్ = ధ్వనిచేయుచు, మహతా = గొప్పదైన, నాదేన = ధ్వనిచేత, దశ దిశః = పది దిక్కులను, సమన్తతః = అంతటా, పూరయామాస = నింపెను.

తా. ఉరుముల వంటి ధ్వని గల ఆ హనుమంతుడు, ధ్వనిచేయుచు, ఆ గొప్ప ధ్వనిచేత పది దిక్కులను కూడ, అంతటా నింపివేసెను. 15

మూ. స తం దేశమనుప్రాప్తః సుహృద్దర్శనలాలసః. 16
ననాద హరిశార్దూలో లాఙ్గూలం చాప్యకమ్పయత్.

ప్ర. అ. తం దేశమ్ = ఆ ప్రదేశమును, అనుప్రాప్తః = చేరిన, సుహృద్దర్శనలాలసః = మిత్రులను చూచుటకై వేగిరపడుచున్న, సః హరిశార్దూలః = ఆ హనుమంతుడు, ననాద = ధ్వనిచేసెను. లాఙ్గూలమ్ = తోకను, అకమ్పయచ్చ = కదల్చెను కూడ.

తా. మిత్రులను చూడవలె నను ఆత్యాసక్తితో ఆ ప్రదేశమును చేరిన హనుమంతుడు బిగ్గరగా అరచి తోకను త్రిప్పుట కూడ చేసెను. 16

మూ. తస్య నానద్యమానస్య సుపర్ణచరితే పథి. 17
ఫలతీవాస్య ఘోషేణ గగనం సార్కమణ్డలమ్.

ప్ర. అ. సుపర్ణచరితే = గరుత్మంతునిచేత సంచరింపబడిన, పథి = ఆకాశమార్గమునందు, నానద్యమానస్య = అధికముగా ధ్వని చేయుచున్న, అస్య = ఈ హనుమంతునియొక్క, ఘోషేణ = ధ్వనిచేత, సార్కమణ్డలమ్ = సూర్యమండలసహిత మైన, గగనమ్ = ఆకాశము, ఫలతీవ = బ్రద్దలగుచున్నట్లు ఉండెను.

తా. గరుత్మంతుడు సంచరించు ఆకాశమార్గమునందు మహాధ్వని చేయుచున్న ఆ హనుమంతుని ధ్వనికి సూర్యమండలసహిత మైన ఆకాశము బ్రద్దలై పోయి నట్లయ్యెను. 17

మూ. యే తు తత్రోత్తరే తీరే సముద్రస్య మహాబలాః. 18
పూర్వం సంవిష్టితాః శూరా వాయుపుత్రదిదృక్షవః.

మహతో వాతనున్నస్య తోయదస్యేవ గర్జితమ్. 19
శుశ్రువుస్తే తదా ఘోషమూరువేగం హనూమతః.

ప్ర. అ. తత్ర = అక్కడ, సముద్రస్య = సముద్రముయొక్క, ఉత్తరే తీరే = ఉత్తరతీరమునందు, పూర్వమ్ = పూర్వమే, సంవిష్టాః = ఉన్న (చేరియున్న), మహాబలాః = గొప్ప బలము గల, శూరాః = శూరు లైన, వాయుపుత్ర దిదృక్షవః = హనుమంతుని చూడదలచుచున్న, యే = ఏ వానరులు కలరో, తే = వారు, తదా = అప్పుడు, వాతనున్నస్య = వాయువుచేత కదల్పబడిన, మహతః = గొప్ప దైన, తోయదస్య = మేఘముయొక్క, గర్జితమ్ ఇవ = గర్జితము వలె ఉన్న, హనూమతః = హనుమంతునియొక్క, ఘోషమ్ = ధ్వనిని, ఊరువేగమ్ = తొడల వేగమును, శుశ్రువుః = వినిరి.

తా. ఉత్తరసముద్రతీరమునందు పూర్వమే ఉన్న బలశాలులు, శూరులు, అయిన వానరులు వాయునందనుని చూచుటకై ఆతురతతో నిరీక్షించుచుండిరి. ఆ వానరులకు, అప్పుడు, వాయువుచేత కదల్పబడుచున్న పెద్ద మేఘముయొక్క ధ్వని వలె, హనుమంతుడు చేసిన ధ్వని, అతని తొడల వేగము వినవచ్చెను.

మూ. తే దీనమనసః సర్వే శుశ్రువుః కాననౌకసః, 20
వానరేన్ద్రస్య నిర్ఘోషం పర్జన్యనినదోపమమ్.

ప్ర. అ. దీనమనసః = దీనము లైన మనస్సులు గల, తే = ఆ, సర్వే = సమస్త మైన, కాననౌకసః = వానరులు, వానరేన్ద్రస్య = హనుమంతునియొక్క, పర్జన్యనినదోపమమ్ = మేఘధ్వనితో సమాన మైన, నిర్ఘోషమ్ = ధ్వనిని, శుశ్రువుః = వినిరి.

తా. అంతవరకు సీతవార్త ఏదీ తెలియకపోవుటచేత దైన్యము చెందిన మనస్సులు గల ఆ వానరు లందరు ఉరుముం వంటి హనుమంతుని ధ్వనిని వినిరి.

మూ. నిశమ్య నదతో నాదం వానరాస్తే సమన్తతః, 21
బభూవురుత్సుకాః సర్వే సుహృద్దర్శనకాఙ్క్షిణః.

ప్ర. అ. సమన్తతః = నలు మూలలా ఉన్న, సర్వే = సమస్త మైన, తే వానరాః = ఆ వానరులు, నదతః = ధ్వనిచేయుచున్న హనుమంతునియొక్క,

నాదమ్ = ధ్వనిని, నిశమ్య=విని, సుహృద్దర్శనకాంక్షిణః=మిత్రుని దర్శనమును కోరుచు, ఉత్సుకాః = వేడుకగలవారు, బభూవుః = అయిరి.

తా. అక్కడ అన్ని ప్రదేశములందును ఉన్న ఆ వానరు లందరూ, ధ్వని చేయుచున్న హనుమంతుని ఆ శబ్దమును విని, అతని చూడవలె నను ఔత్సుక్యముతో నిండి యుండిరి. 21

మూ. జామ్బవాన్ స హరిశ్రేష్ఠః ప్రీతిసంహృష్టమానసః, 22
ఉపామన్త్ర్య హరీన్ సర్వానిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. హరిశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడైన, సః జామ్బవాన్ = ఆ జాంబవంతుడు, ప్రీతిసంహృష్టమానసః=ఆనందముతో వికసించిన మనస్సు కలవాడై, సర్వాన్ = సమస్తమైన, హరీన్=వానరులను, ఉపామన్త్ర్య = దగ్గరకు పిలచి, ఇదమ్ = ఈ, వచనమ్=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వానరులలో శ్రేష్ఠుడైన జాంబవంతుడు ఆనందముచే వికసించిన మనస్సుతో, ఆ వానరు లందరిని పిలచి, ఈ వాక్యము పలికెను. 22

మూ. సర్వథా కృతకార్యోఽసౌ హనుమాన్నాత్ర సంశయః, 23
న హ్యస్యాకృతకార్యస్య నాద ఏవంవిధో భవేత్.

ప్ర. అ. అసౌ=ఈ, హనుమాన్ = హనుమంతుడు, సర్వథా=అన్ని విధములా, కృతకార్యః=చేయబడిన కార్యము కలవాడు. అకృతకార్యస్య = చేయబడని కార్యము గల, అస్య=ఈతనియొక్క, నాదః = ధ్వని, ఏవంవిధః = ఈ విధమైనది, న భవేత్ హి=కాదు కదా.

తా. హనుమంతుడు అన్ని విధములచేతను కార్యము సఫలము చేసికొని వచ్చుచున్నాడు. ఇందుకు సందేహము లేదు. పని పూర్తి కానిచో ఇతని ధ్వని ఈ విధముగ ఉండదు కదా. 23

మూ. తస్య బాహూరువేగం చ నినాదం చ మహాత్మనః, 24
నిశమ్య హరయో హృష్టాః సముత్పేతుస్తతస్తతః.

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ హనుమంతునియొక్క,

బాహూరువేగం చ=బాహువులయొక్క తొడలయొక్క వేగమును, నినాదం చ =ధ్వనినీ, నిశమ్య=విని, హృష్టాః=సంతోషించినవారై, హరయః=వానరులు, తత స్తతః=ఆ యా ప్రదేశములనుండి, సముత్పేతుః=గంతులు వేసిరి.

తా. మహాత్ముడైన ఆ హనుమంతుని బాహువుల వేగమును, తొడల వేగమును, ధ్వనిని విని, వానరులు, సంతోషించినవారై, ఆ యా ప్రదేశములనుండి గంతులు వేయుచు ఎగిరిరి. 24

మూ. తే నగాగ్రాన్నగాగ్రాణి శిఖరాచ్ఛిఖరాణి చ, 25
ప్రహృష్టాః సమపద్యన్త హనూమన్తం దిదృక్షవః.

ప్ర. అ. తే=ఆ వానరులు, ప్రహృష్టాః= సంతోషించినవారై, హనూమన్తమ్=హనుమంతుని, దిదృక్షవః=చూడ నిచ్ఛ గలవారై, నగాగ్రాత్ = ఒక చెట్టుచివరి కొమ్మనుండి, నగాగ్రాణి=ఇతరవృక్షముల చివరి భాగములను; శిఖరాత్=ఒక పర్వతశిఖరమునుండి; శిఖరాణి చ=పర్వతశిఖరములను, సమపద్యన్త=పొందిరి.

తా. ఆ వానరులు సంతోషించుచు హనుమంతుణ్ణి చూడవలెనను కోరికతో ఒక చెట్టు చివరనుండి మరి కొన్ని చెట్లచివరిభాగములను, ఒక శిఖరమునుండి ఇతర శిఖరములను ఎక్కిరి. 25

మూ. తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖాః సువిష్ఠితాః, 26
వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యన్త వానరాః.

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, ప్రీతాః=సంతోషించినవారై, పాదపాగ్రేషు=వృక్షాగ్రములయందు, శాఖాః=కొమ్మలను, గృహ్య=గ్రహించి, సువిష్ఠితాః=బాగుగా నిలచినవారై, ప్రశాఖాః=చిన్న కొమ్మలను, వాసాంసీవ =వస్త్రములను వలె, సమావిధ్యన్త=దులిపిరి.

తా. ఆ వానరులు సంతోషముతో వృక్షాగ్రముల మీద కొమ్మలు పట్టుకొని స్థిరముగా నిలచి, చిన్న కొమ్మలను బట్టలు దులిపినట్లు దులిపివేసిరి. 26

మూ. గిరిగహ్వరసంలీనో యథా గర్జతి మారుతః, 27
ఏవం జగర్జ బలవాన్ హనుమాన్మారుతాత్మజః.

ప్ర. అ. గిరిగహ్వరసంలీనః = పర్వతముల గుహలయందు అణగిన (ప్రవేశించిన), మారుతః = వాయువు, యథా = ఎట్లు, గర్జతి = గర్జించునో, బలవాన్ = బలవంతుడు, మారుతాత్మజః = వాయుకుమారుడు అయిన, హనుమాన్ = హనుమంతుడు, ఏవమ్ = ఇట్లు, జగర్జ = గర్జించెను.

తా. వాయుపుత్రుడు, బలశాలీ అయిన హనుమంతుడు, పర్వతగుహలో ప్రవేశించిన వాయువు ఎట్లు గర్జించునో అట్లు గర్జించెను. 27

మూ. తమభ్రఘనసంకాశమాపతన్తం మహాకపిమ్, 28
దృష్ట్వా తే వానరాః సర్వే తస్థుః ప్రాఞ్జలయస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, అభ్రఘనసంకాశమ్ = దట్టమైన మేఘముతో సమానుడు, ఆపతన్తమ్ = శీఘ్రముగా వచ్చి పడుచున్నవాడూ అయిన, తం మహాకపిమ్ = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, తే = ఆ, సర్వే = సమస్తమైన, వానరాః = వానరులు, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్లు కలవారై, తస్థుః = నిలిచిరి.

తా. అప్పుడు దట్టమైన మేఘము వలె అతిశీఘ్రముగా వచ్చి క్రిందికి వాలుచున్న ఆ హనుమంతుని చూచి ఆ వానరు లందరు దోసిళ్లు పట్టి నిలిచిరి. 28

మూ. తతస్తు వేగవాంస్తస్య గిరేర్గిరినిభః కపిః, 29
నిపపాత మహేన్ద్రస్య శిఖరే పాదపాకులే.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, గిరినిభః = పర్వతముతో సమానుడు, వేగవాన్ = వేగవంతుడు అయిన, కపిః = హనుమంతుడు, తస్య = ఆ, మహేన్ద్రస్య = మహేంద్ర మను, గిరేః = పర్వతముయొక్క, పాదపాకులే = వృక్షములచేత వ్యాకులమైన, శిఖరే = శిఖరముపైద, నిపపాత = దిగెను.

తా. పిమ్మట పర్వతముతో సమానుడైన ఆ హనుమంతుడు, మహావేగముతో వచ్చి చెట్లతో నిండిన ఆ మహేంద్రపర్వతశిఖరముపై దిగెను. 29

మూ. హర్షేణాపూర్యమాణోఽసౌ రమ్యే పర్వతనిర్ఝరే, 30
ఛిన్నపక్ష ఇవాకాశాత్పపాత ధరణీధరః.

ప్ర. అ. హర్షేణ = సంతోషముచేత, ఆపూర్యమాణః = నింపబడుచున్న, అసౌ = ఈ హనుమంతుడు, ఛిన్నపక్షః = ఛేదింపబడిన రెక్కలు గల, ధరణీధరః ఇవ = పర్వతము వలె, రమ్యే = సుందరమైన, పర్వతనిర్ఝరే = పర్వతము నందలి జల ప్రవాహమునందు, ఆకాశాత్ = ఆకాశమునుండి, పపాత = పడెను.

తా. హనుమంతుడు సంతోషముతో ఉబ్బిపోవుచు, రెక్కలు తెగగొట్టిన పర్వతము వలె, ఆకాశమునుండి పర్వతముపై నున్న సుందరమైన సెలయేటిలో దిగెను. 30

మూ. తతస్తే ప్రీతమనసః సర్వే వానరపుఙ్గవాః, 31
హనుమన్తం మహాత్మానం పరివార్యోపతస్థిరే,
పరివార్య చ తే సర్వే పరాం ప్రీతిముపాగతాః. 32

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సర్వే = సమస్తమైన, తే = ఆ, వానరపుఙ్గవాః = వానరశ్రేష్ఠులు, ప్రీతమనసః = సంతోషించుచున్న మనస్సులు కలవారై, మహాత్మానమ్ = మహాత్ముడైన, హనుమన్తమ్ = హనుమంతుణ్ణి, పరివార్య = చుట్టి, ఉపతస్థిరే = సేవించిరి. తే సర్వే = వాళ్ళందరూ, పరివార్య = హనుమంతుని చుట్టి, పరామ్ = శ్రేష్ఠమైన, ప్రీతిమ్ = సంతోషమును, ఉపాగతాః = పొందిరి.

తా. పిమ్మట ఆ వానరశ్రేష్ఠులందరూ చాల సంతోషించిన మనస్సుతో మహాత్ముడైన ఆ హనుమంతుని చుట్టూ చేరి అతనిని సేవించిరి. ఆ విధముగ చుట్టూ చేరిన వాళ్ళందరూ గొప్ప సంతోషము పొందిరి 31, 32

మూ. ప్రహృష్టవదనాః సర్వే తమరోగముపాగతమ్,
ఉపాయనాని చాదాయ మూలాని చ ఫలాని చ, 33
ప్రత్యర్చయన్ హరిశ్రేష్ఠం హరయో మారుతాత్మజమ్.

ప్ర. అ. సర్వే హరయః = ఆ వానరులందరూ, ప్రహృష్టవదనాః = వికసించిన ముఖములు కలవారై, మూలాని చ = దుంపలను, ఫలాని చ = ఫలములను, ఉపాయనాని = కానుకలుగా, ఆదాయ = గ్రహించి, అరోగమ్ = రోగము

లేకుండగా, ఉపాగతమ్ = వచ్చిన, హరిశ్రేష్ఠమ్ = వానర శ్రేష్ఠు డైన, మారు తాత్మజమ్ = హనుమంతుని, ప్రత్యర్చయన్ = పూజించిరి.

తా. ఆ వానరు లందరూ, వికసించిన ముఖములతో, మూలములను, ఫలములను కానుకలుగా తీసికొని వచ్చి, రోగము లేకుండగా తిరిగి వచ్చిన, వానరశ్రేష్ఠు డైన హనుమంతుని పూజించిరి. 33

మూ. హనుమాంస్తు గురూన్ వృద్ధాన్ జామ్బవత్ప్రముఖాంస్తదా,
కుమారమఙ్గదం చైవ సో౽వన్దత మహాకపిః.

ప్ర. అ. తదా = అప్పుడు, మహాకపిః = వానరశ్రేష్ఠు డైన, హనుమాంస్తు = హనుమంతు డైతే, గురూన్ = పూజ్యులు, వృద్ధాన్ = వృద్ధులూ అయిన, జామ్బవత్ప్రముఖాన్ = జాంబవంతుడు మొదలైన వారిని, కుమారమ్ = రాజ కుమారు డైన, (యువరాజైన), అఙ్గదం చైవ = అంగదుని, అవన్దత = నమస్క రించెను.

తా. అప్పుడు, వానరశ్రేష్ఠు డైన హనుమంతుడు, పూజ్యులు, వృద్ధులూ అయిన జాంబవంతుడు మొదలైనవారికి, యువరా జైన అంగదునకు నమస్క రించెను. 34

మూ. స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః, 35
దృష్టా సీతేతి విక్రాన్తః సంక్షేపేణ న్యవేదయత్.

ప్ర. అ. విక్రాన్తః = పరాక్రమించినవాడు, పూజ్యః = పూజింప దగిన వాడు అయిన, సః = ఆ హనుమంతుడు, తాభ్యామ్ = ఆ జాంబవదంగదులచేత, పూజితః = పూజింపబడిన వాడై, కపిభిః = ఇతర వానరులచేత, ప్రసాదితః = అనుగ్రహింపచేసికొనబడిన వా డై, సీతా = సీత, దృష్టా = చూడబడినది, ఇతి = అని, సంక్షేపేణ = సంక్షేపముతో, న్యవేదయత్ = తెలిపెను.

తా. తన పరాక్రమము చూపినవాడు, పూజ్యుడు అయిన ఆ హనుమంతుని జాంబవంతుడు, అంగదుడు పూజించిరి. ఇతర వానరులందరు అనుగ్రహింపచేసి కొనిరి. (అతనికి సంతోషము కలుగునట్లు ప్రవర్తించిరి). అప్పు డాతడు సీతను చూచితిని అని సంక్షిప్తముగా చెప్పెను. 35

మూ. నిషసాద చ హస్తేన గృహీత్వా వాలినః సుతమ్, 36
రమణీయే వనోద్దేశే మహేన్ద్రస్య గిరేస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, వాలినః = వాలియొక్క, సుతమ్ = కుమారుని, హస్తేన = హస్తముచేత, గృహీత్వా = గ్రహించి, మహేన్ద్రస్య గిరేః = మహేంద్ర పర్వతముయొక్క, రమణీయే = సుందరమైన, వనోద్దేశే = వనప్రదేశమునందు, నిషసాద చ = కూర్చుండెను.

తా. అప్పుడు హనుమంతుడు అంగదుని (హస్తమును) హస్తముతో పట్టుకొని ఆ మహేంద్రపర్వతముపై, రమణీయమైన వనప్రదేశమునందు కూర్చుండెను. 36

మూ. హనుమానబ్రవీద్ధృష్టస్తదా తాన్వానరర్షభాన్, 37
అశోకవనికాసంస్థా దృష్టా సా జనకాత్మజా.
రక్ష్యమాణా సుఘోరాభీ రాక్షసీభిరనిన్దితా. 38
ఏకవేణీధరా బాలా రామదర్శనలాలసా,
ఉపవాసపరిశ్రాన్తా జటిలా మలినా కృశా. 39

ప్ర. అ. తదా = అప్పుడు, హృష్టః = సంతోషించిన, హనుమాన్ = హనుమంతుడు, తాన్ = ఆ, వానరర్షభాన్ = వానరశ్రేష్ఠులను గూర్చి, అబ్రవీత్ = పలికెను. అశోకవనికాసంస్థా = అశోకవనములో ఉన్నది. సుఘోరాభిః = చాలా భయము కలిగించు. రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత. రక్ష్యమాణా = రక్షింపబడుచున్నది, అనిన్దితా = నిందింపబడనిది, ఏకవేణీధరా = ఒకే జడను ధరించినది, బాలా = చిన్నవయస్సులో ఉన్నది, రామదర్శనలాలసా = రాముని చూచుటయందు ఆసక్తి కలది, ఉపవాసపరిశ్రాన్తా = ఉపవాసములచేత అలసిపోయినది, జటిలా = జడలు ధరించినది, మలినా = మలినముగా ఉన్నది, కృశా = చిక్కినది అయిన, సా జనకాత్మజా = ఆ సీతాదేవి, దృష్టా = చూడబడినది.

తా. అప్పుడు సంతోషభరితుడైన హనుమంతుడు ఆ వానరశ్రేష్ఠులతో ఇట్లు పలికెను. అశోకవనములో ఉన్న సీతను చూచినాను. ఎట్టి దోషము లేనిది, ఒకే జడను ధరించి ఉన్నది అయిన ఆమెను భయంకరులైన రాక్షసస్త్రీలు రక్షించుచున్నారు. చిన్న వయస్సులో ఉన్న ఆమె రాముని చూచుటకై తహతహ

లాడుచున్నది. జటాధారిణియై స్నానాది సంస్కారములు లేకపోవుటచే మలిను
రాలై కృశించి యున్న ఆమె ఉపవాసముంచేత అలసిపోయి యున్నది. 38, 39

మూ. తతో దృష్టేతి వచనం మహార్థమమృతోపమమ్,
నిశమ్య మారుతేః సర్వే ముదితా వానరాభవన్. 40

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దృష్టా = చూడబడినది, ఇతి = అను, మారుతేః = హనుమంతునియొక్క, మహార్థమ్ = శ్రేష్ఠమైన అర్థము గల, అమృతోపమమ్ = అమృతముతో సమానమైన, వచనమ్ = మాటను, నిశమ్య = విని, సర్వే = సమస్తమైన, వానరాః = వానరులు, ముదితాః = సంతోషించిన వారు, అభవన్ = అయిరి.

తా. అప్పుడు హనుమంతుడు పలికిన, గొప్ప అర్థము గల, అమృతము వంటి "చూచినాను" అను మాట వినగానే ఆ వానరు లందరు సంతోషించిరి. 40

మూ. క్ష్వేళన్త్యన్యే నదన్త్యన్యే గర్జన్త్యన్యే మహాబలాః,
చక్రుః కిలకిలామన్యే ప్రతిగర్జన్తి చాపరే. 41

ప్ర. అ. మహాబలాః = గొప్ప బలము గల, అన్యే = కొందరు, క్ష్వేళన్తి = సింహనాదము చేయుచున్నారు (చేసిరి). అన్యే = మరి కొందరు, నదన్తి = ధ్వని చేయు చున్నారు. అన్యే = మరికొందరు, గర్జన్తి = గర్జించుచున్నారు. అన్యే = మరి కొందరు, కిలకిలామ్ = కిలకిల ధ్వనిని, చక్రుః = చేసిరి. అపరే = మరి కొందరు, ప్రతిగర్జన్తి = తిరిగి గర్జించుచున్నారు.

తా. మహాబలవంతులైన వానరులలో కొందరు సింహనాదము చేసిరి. కొందరు ధ్వని చేసిరి. కొందరు గర్జించిరి. కొందరు కిలకిల మను ధ్వని చేసిరి. మరికొందరు ప్రతిగర్జనము చేసిరి. 41

మూ. కేచిదుచ్ఛ్రితలాఙ్గూలాః ప్రహృష్టాః కపికుఞ్జరాః,
ఆయతాఞ్చితదీర్ఘాణి లాఙ్గూలాని ప్రవివ్యధుః 42

ప్ర. అ. ప్రహృష్టాః = సంతోషించిన, కేచిత్ = కొందరు, కపికుఞ్జరాః = వానరశ్రేష్ఠులు, ఉచ్ఛ్రితలాఙ్గూలాః = ఎత్తబడిన తోకలు కలవారై, ఆయతా

ఉచ్ఛ్రితదీర్ఘాణి = నిలువుగా చేయబడిన పొడవైన, లాఙ్గూలాని = తోకలను, ప్రవి వ్యధుః = దులిపిరి.

తా. మహాబలవంతులైన వానరులలో కొందరు చాల సంతోషించి, తోకలు ఎత్తి, అట్లు నిలువుగా ఉండు నట్లు ఎత్తిన, పొడవైన తోకలను ఝాడించిరి.

మూ. అపరే చ హనూమన్తం వానరా వారణోపమమ్,
ఆప్లుత్య గిరిశృఙ్గేభ్యః సంస్పృశన్తి స్మ హర్షితాః. 43

ప్ర. అ. అపరే = మరికొందరు, వానరాః = వానరులు, హర్షితాః = సంతోషించినవారై, గిరిశృఙ్గేభ్యః = పర్వతశిఖరములనుండి, ఆప్లుత్య = దిగి, వారణోపమమ్ = ఏనుగుతో సమానుడైన, హనూమన్తమ్ = హనుమంతుని, సంస్పృశన్తి స్మ = స్పృశించిరి.

తా. మరి కొందరు వానరులు సంతోషముతో పర్వతశిఖరములనుండి క్రిందికి దుమికి, ఏనుగుతో సమానుడైన ఆ హనుమంతుని స్పృశించిరి. 43

మూ. ఉక్తవాక్యం హనూమన్తమఙ్గదస్తమథాబ్రవీత్,
సర్వేషాం హరివీరాణాం మధ్యే వచనముత్తమమ్. 44

ప్ర. అ. అథ = అటు పిమ్మట, అఙ్గదః = అంగదుడు, ఉక్తవాక్యమ్ = పలుకబడిన వాక్యము గల, హనూమన్తమ్ = హనుమంతుని గూర్చి, సర్వేషామ్ = సమస్తమైన, హరివీరాణామ్ = వానరవీరుల, మధ్యే = మధ్యయందు, ఉత్తమమ్ = ఉత్తమమైన, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. హనుమంతుని మాటలు విన్న పిమ్మట, అంగదుడు సమస్తమైన వానరవీరుల మధ్య ఆతనితో ఉత్తమమైన వచనము పలికెను. 44

మూ. సత్త్వే వీర్యే న తే కశ్చిత్సమో వానర విద్యతే,
యదవప్లుత్య విస్తీర్ణం సాగరం పునరాగతః. 45

ప్ర. అ. వానర = హనుమంతుడా! యత్ = ఏ కారణమువలన, విస్తీర్ణమ్ = విస్తృతమైన, సాగరమ్ = సముద్రమును, అవప్లుత్య = దాటి, పునః = మరల, ఆగతః = వచ్చినావో, అందువలన, సత్త్వే = బలమునందు, వీర్యే = పరాక్ర

మమునందు, తే = నీకు, సమః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వఁడును, న విద్యతే = లేడు.

తా. హనుమంతుఁడా! పదినూర్ల మైళ్ల సముద్రము దాటి మరల వచ్చినావు. బలముచేత గాని, పరాక్రమముచేత గాని నీకు సాటి ఎవ్వఁడూ లేడు. 45

మూ. అహో స్వామిని తే భక్తిరహో వీర్యమహో ధృతిః,
దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ. 46
దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థః శోకం సీతావియోగజమ్.

ప్ర. అ. స్వామిని = ప్రభువుపై, తే = నీయొక్క, భక్తిః = భక్తి, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది! వీర్యమ్ = పరాక్రమము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది! ధృతిః = ధైర్యము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది! దిష్ట్యా = మన అదృష్టముచే, త్వయా = నీచేత, రామపత్నీ = రాముని భార్య, యశస్వినీ = కీర్తి గలది అయిన, దేవీ = సీతాదేవి, దృష్టా = చూడఁబడినది. దిష్ట్యా = అదృష్టవశముచేత, కాకుత్స్థః = రాముడు, సీతావియోగజమ్ = సీతావియోగమువల్ల కలిగిన, శోకమ్ = శోకమును, త్యక్ష్యతి = విడువగలడు.

తా. ఏమి నీ ప్రభుభక్తి! ఏమి నీ పరాక్రమము! ఏమి నీ ధైర్యము! మన అదృష్టము కొలఁది నీవు కీర్తిమంతురాలు, రామభార్య అయిన ఆ దేవిని చూచితివి. అదృష్టవశముచే సీతావియోగమువలన కలిగిన రాముని శోకము తొలఁగి పోవును. 46

మూ. తతోఽఙ్గదం హనూమన్తం జామ్బవన్తం చ వానరాః,
పరివార్య ప్రముదితా భేజిరే విపులాః శిలాః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, వానరాః = వానరులు, ప్రముదితాః = చాలా సంతోషించిన వారై, అఙ్గదమ్ = అంగదుని, హనూమన్తమ్ = హనుమంతుని, జామ్బవన్తం చ = జాంబవంతుని, పరివార్య = చుట్టుముట్టి, విపులాః = విశాలము లైన, శిలాః = శిలలను, భేజిరే = పొందిరి.

తా. పిమ్మట వానరు లందరు చాల సంతోషించుచు, అంగదునికి హనుమంతునికి జాంబవంతునికి చుట్టూ శిలాతలములపై కూర్చుండిరి. 47

మూ. శ్రోతుకామాః సముద్రస్య లఙ్ఘనం వానరోత్తమాః, 48
దర్శనం చాపి లఙ్కాయాః సీతాయా రావణస్య చ,
తస్థుః ప్రాఞ్జలయః సర్వే హనుమద్వచనోన్ముఖాః. 49

ప్ర. అ. సర్వే=సమస్త మైన. వానరోత్తమాః=వానరశ్రేష్ఠులు. సముద్రస్య=సముద్రముయొక్క. లఙ్ఘనమ్=దాటుటను. లఙ్కాయాః=లంకయొక్క. సీతాయాః=సీతయొక్క. రావణస్య చ=రావణునియొక్క. దర్శనం చాపి=దర్శనమును, శ్రోతుకామాః=వినుటయందు కోరిక గలవారై, ప్రాఞ్జలయః=కట్టిన చేతులు కలవారై. హనుమద్వచనోన్ముఖాః=హనుమంతుని వచనము నకై అభిముఖులై, తస్థుః=ఉండిరి.

తా. ఆ వానరశ్రేష్ఠు లందరూ సముద్రము దాటుట, లంకను, సీతను రావణుని చూచుట మొదలైన విషయములను వినగోరుచు, హనుమంతుని మాటలకై, ఎదురు చూచుచు అంజలి ఘటించి ఉండిరి. 48, 49

మూ. తస్థౌ తత్రాఙ్గదః శ్రీమాన్ వానరైర్బహుభిర్వృతః,
ఉపాస్యమానో విబుధైర్దివి దేవపతిర్యథా. 50

ప్ర. అ. తత్ర=అక్కడ. శ్రీమాన్=శ్రీమంతు డైన. బహుభిః=అనేకు లైన. వానరైః=వానరులతో. వృతః=కూడిన. అఙ్గదః=అంగదుడు. దివి=స్వర్గలోకమునందు. విబుధైః=దేవతలచేత. ఉపాస్యమానః=ఉపాసింపబడు చున్న, దేవపతిర్యథా=దేవేంద్రుడు వలె. తస్థౌ=ఉండెను.

తా. వానరు లందరూ చుట్టూ కూర్చుండి సేవించుచుండగా, అంగదుడు, స్వర్గలోకమునందు దేవతలచేత సేవింపబడుచున్న దేవేంద్రుడు వలె ప్రకాశించెను. 50

మూ. హనూమతా కీర్తిమతా యశస్వినా
తథాఙ్గదేనాఙ్గదబద్ధబాహునా,
ముదా తదాధ్యాసితమున్నతం మహ
న్మహీధరాగ్రం జ్వలితం శ్రియాభవత్. 51

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. కీర్తిమతా=కీర్తి గల. హనూమతా = హనుమంతునిచేతను. తథా=మరియు. యశస్వినా = కీర్తి గల. అఙ్గదబద్ధబాహునా = బాహుపురులతో కట్టబడిన బాహువులు గల. అఙ్గదేన=అంగదునిచేతను. తదా=అప్పుడు. ముదా=ఆనందముతో. అధ్యాసితమ్= అధిష్ఠింపబడిన. ఉన్నతమ్ = ఉన్నతమైన. మహత్ = గొప్పదైన. మహీధరాగ్రమ్ = పర్వతశిఖరము. తదా = అప్పుడు. శ్రియా=శోభతో. జ్వలితం=ప్రజ్వలించుచున్నది. అభవత్=అయెను.

తా. అప్పుడు కీర్తిమంతుడైన హనుమంతుడు, బాహువులకు బాహుపురులు ధరించిన అంగదుడు, సంతోషించుచు ఉన్నతమైన ఆ పర్వతము పైభాగమున కూర్చొని యుండగా అది శోభతో ప్రజ్వలించెను. ౬1

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టపఞ్చాశః సర్గః

[జాంబవంతుడు అడుగగా హనుమంతుడు తాను లంకకు బయలు దేరినది మొదలు జరిగిన విషయములను చెప్పుట].

మూ. తతస్తస్య గిరేః శృఙ్గే మహేన్ద్రస్య మహాబలాః,
హనుమత్ప్రముఖాః ప్రీతిం హరయో జగ్మురుత్తమామ్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాబలాః = గొప్ప బలము గల, హనుమత్ప్రముఖాః = హనుమంతుడు మొదలైన, హరయః = వానరులు, తస్య = ఆ, మహేన్ద్రస్య గిరేః = మహేంద్రపర్వతముయొక్క, శృఙ్గే = శిఖరమునందు, ఉత్తమామ్ = గొప్పదైన, ప్రీతిమ్ = సంతోషమును, జగ్ముః = పొందిరి.

తా. ఆ మహేంద్రపర్వతశిఖరమునందు, మహాబలశాలు లైన హనుమంతుడు మొదలైన వానరులు అత్యధిక మైన సంతోషమును పొందిరి. 1

మూ. తం తతః ప్రీతిసంహృష్టః ప్రీతిమన్తం మహాకపిమ్,
జామ్బవాన్కార్యవృత్తాన్తమపృచ్ఛదనిలాత్మజమ్. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ప్రీతిసంహృష్టః = సంతోషముతో ఉబ్బిపోవుచున్న, జామ్బవాన్ = జాంబవంతుడు, ప్రీతిమన్తమ్ = సంతోషముతో కూడిన, మహాకపిమ్ = గొప్ప వానరు డైన, అనిలాత్మజమ్ = హనుమంతుని, కార్యవృత్తాన్తమ్ = సీతాన్వేషణకార్యమునకు సంబంధించిన వృత్తాంతమును గూర్చి, అపృచ్ఛత్ = అడిగెను.

తా. పిమ్మట అత్యధిక మైన సంతోషముతో నిండి యున్న జాంబవంతుడు, సంతోషభరితు డైన ఆ హనుమంతుని, సీతాన్వేషణము చేయుటకు అతడు బయలుదేరిన పిమ్మట ఏ మేమి జరిగినదో చెప్పుమని కోరెను. 2

మూ. కథం దృష్టా త్వయా దేవీ కథం వా తత్ర వర్తతే,
తస్యాం వా స కథంవృత్తః క్రూరకర్మా దశాననః 3

ప్ర. అ. దేవీ = సీతాదేవి, త్వయా = నీచేత, కథమ్ = ఎట్లు, దృష్టా = చూడబడినది? తత్ర = అక్కడ, కథం వా = ఎట్లు, వర్తతే = ఉన్నది? క్రూర కర్మా = క్రూరమైన కర్మ గలం, సః దశాననః = ఆ రావణుడు, తస్యామ్ = ఆమె విషయమునందు. కథంవృత్తః = ఎట్టి ప్రవృత్తి కలవాడు?

తా. నీవు సీతాదేవిని ఎట్లు చూచినావు? ఆమె అక్కడ ఎట్లున్నది? క్రూర కార్యములు చేయు ఆ రావణుడు ఆమె విషయమున ఎట్లు ప్రవర్తించుచున్నాడు?

మూ. తత్త్వతః సర్వమేతన్నః ప్రబ్రూహి త్వం మహాకపే,
శ్రుతార్థాశ్చిన్తయిష్యామో భూయః కార్యవినిశ్చయమ్. 4

ప్ర. అ. మహాకపే = హనుమంతుడా! ఏతత్ = దీనిని, సర్వమ్ = అంతయూ, తత్త్వతః = యథార్థముగా, త్వమ్ = నీవు, నః = మాకు, ప్రబ్రూహి = చెప్పుము. శ్రుతార్థాః = వినబడిన విషయము గలవారమై, భూయః = మరల, కార్యవినిశ్చయమ్ = కార్యముయొక్క నిశ్చయమును గూర్చి, చిన్తయిష్యామః = ఆలోచించెదము.

తా. హనుమంతుడా! ఈ విషయము లన్నీ జరిగినవి జరిగి నట్లు మాకు చెప్పుము. విషయము తెలిసిన పిమ్మట చేయవలసిన పనిని గూర్చి ఆలోచించె దము. 4

మూ. యశ్చార్థస్తత్ర వక్తవ్యో గతైరస్మాభిరాత్మవాన్,
రక్షితవ్యం చ యత్తత్ర తద్భవాన్ వ్యాకరోతు నః 5

ప్ర. అ. గతైః = వెళ్ళిన, అస్మాభిః = మనచేత, తత్ర = అక్కడ, యః = ఏ, అర్థః = విషయము, వక్తవ్యః = చెప్పదగినదో, యత్ = ఏది, తత్ర = అక్కడ, రక్షితవ్యం చ = రహస్యముగా ఉంచ దగినదో, తత్ = దానిని, ఆత్మవాన్ = బుద్ధిమంతుడ వైన, భవాన్ = నీవు, నః = మాకు, వ్యాకరోతు = స్పష్టముగా చెప్పెదవు గాక.

తా. మనము అక్కడికి వెళ్ళిన పిమ్మట ఏ విషయములు చెప్పవలెనో,

ఏ విషయములు రహస్యముగా ఉంచవలెనో బుద్ధిమంతుడ వైన నీవు స్పష్టముగా చెప్పుము. 5

మూ. స నియుక్త స్తత స్తేన సంప్రహృష్టతనూరుహః,
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత. 6

ప్ర. అ తేన=ఆ జాంబవంతునిచేత, నియుక్తః=ఆజ్ఞాపింపబడిన, సః=ఆ హనుమంతుడు, సంప్రహృష్టతనూరుహః=గగుర్పొడిచిన రోమములు కలవాడై, తతః=అటుపిమ్మట, దేవ్యై=దేవి యైన, సీతాయై=సీతకు, శిరసా=శిరస్సుతో, ప్రణమ్య=నమస్కరించి, ప్రత్యభాషత=తిరిగి పలికెను.

తా. జాంబవంతుడు అట్లు ఆజ్ఞాపింపగా, హనుమంతుడు శరీరము గగుర్పాటు చెందగా, తల వంచి సీతాదేవికి నమస్కరించి ఇట్లు పలికెను. 6

మూ. ప్రత్యక్షమేవ భవతాం మహేన్ద్రాగ్రాత్ ఖమాప్లుతః,
ఉదధేర్దక్షిణం పారం కాఙ్క్షమాణః సమాహితః. 7

ప్ర. అ. ఉదధేః=సముద్రముయొక్క, దక్షిణమ్=దక్షిణమునం దున్న, పారమ్=తీరమును, కాఙ్క్షమాణః=కోరుచున్నవాడ నై, సమాహితః=సావధానచిత్తుడ నై, భవతామ్=మీయొక్క, ప్రత్యక్షమేవ=ప్రత్యక్షముగానే, మహేన్ద్రాగ్రాత్=మహేంద్రపర్వతమునుండి, ఖమ్=ఆకాశమును గూర్చి, ఆప్లుతః=ఎగిరినాను.

తా. సముద్రదక్షిణతీరమును చేరవలె నను ఉద్దేశ్యముతో, సావధానచిత్తుడ నై, నేను మీ ఎదుటనే మహేంద్రపర్వతమునుండి ఆకాశము పైకి ఎగిరితిని కదా! 7

మూ. గచ్ఛతశ్చ హి మే ఘోరం విఘ్నరూపమివాభవత్,
కాఞ్చనం శిఖరం దివ్యం పశ్యామి సుమనోహరమ్. 8

ప్ర. అ. గచ్ఛతః=వెళ్లుచున్న, మే=నాకు, ఘోరమ్=భయంకర మైన, విఘ్నరూపమివ=విఘ్నము వంటిది, అభవత్=ఆయెను. కాఞ్చనమ్=బంగారు వికార మైన, దివ్యమ్=దివ్య మైన, సుమనోహరమ్=చాలా మనోహర మైన, శిఖరమ్=శిఖరమును, పశ్యామి=చూచుచున్నాను (చూచితిని).

తా. నేను వెళ్లి నప్పుడు ఒక భయంకర మైన విఘ్నమువంటిది ఏర్పడి నది. నా కొక దివ్యము, సుందరము అయిన బంగారు శిఖరము కనబడినది. 8

మూ. స్థితం పన్థానమావృత్య మేనే విఘ్నం చ తం నగమ్,
ఉపసంగమ్య తం దివ్యం కాఞ్చనం నగసత్తమమ్, 9
కృతా మే మనసా బుద్ధిర్భేత్తవ్యోఽయం మయేతి చ.

ప్ర. అ. పన్థానమ్ = మార్గమును, ఆవృత్య=ఆవరించి, స్థితమ్ = ఉన్న, తం నగమ్ = ఆ పర్వతమును, విఘ్నమ్=విఘ్నమునుగా, మేనే = తలచితిని. దివ్యమ్ = దివ్య మైన, కాఞ్చనమ్=బంగారు వికార మైన, తం నగసత్తమమ్= ఆ పర్వతశ్రేష్ఠమును. ఉపసంగమ్య = సమీపించి, అయమ్ = ఇది. మయా = నాచేత, భేత్తవ్యః ఇతి=బ్రద్దలుకొట్ట దగినది అని, మే మనసా=నా మనస్సుతో. బుద్ధిః = ఆలోచన, కృతా = చేయబడినది.

తా. మార్గమును ఆవరించి నిలచి ఉన్న ఆ పర్వతమును ఒక విఘ్నముగా భావించితిని. దివ్య మైన ఆ బంగారుపర్వతశ్రేష్ఠమును సమీపించిన పిమ్మట, "దీనిని బ్రద్దలుకొట్టవలెను" అను బుద్ధి నాకు కలిగెను. 9

మూ. ప్రహతం చ మయా తస్య లాఙ్గూలేన మహాగిరేః, 10
శిఖరం సూర్యసంకాశం వ్యశీర్యత సహస్రధా.

ప్ర. అ. మయా = నాచేత, లాఙ్గూలేన=తోకతో, ప్రహతమ్=కొట్టబడిన, తస్య మహాగిరేః = ఆ మహాపర్వతముయొక్క, సూర్యసంకాశమ్ = సూర్యుని వంటి, శిఖరమ్=శిఖరము, సహస్రధా=వేయి ముక్కలుగా, వ్యశీర్యత=బ్రద్దలై పోయెను.

తా. నేను తోకతో కొట్టగా, సూర్యునివంటి ఆ మహాపర్వతశిఖరము వేయి ముక్కలుగా బ్రద్ద లై పోయెను. 10

మూ. వ్యవసాయం చ తం బుద్ధ్వా స హోవాచ మహాగిరిః, 11
పుత్రేతి మధురాం వాణీం మనః ప్రహ్లాదయన్నివ.

ప్ర. అ. సః మహాగిరిః = ఆ మహాపర్వతము, తమ్=ఆ, వ్యవసాయమ్ = నిశ్చయమును, బుద్ధ్వా = తెలిసికొని, మనః = మనస్సును, ప్రహ్లాదయన్నివ

= సంతోషపెట్టుచున్నవారు వలె, పుత్ర ఇతి = "పుత్రా!" అని, మధురామ్ = మధుర మైన, వాణీమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ మహాపర్వతము నా ఉద్యమమును తెలిసికొని, మనస్సుకు ఆనందము కలుగు నట్లుగా, మధుర మైన వాక్యముతో "నాయనా!" అని పిలిచెను. 11

మూ. పితృవ్యం చాపి మాం విద్ధి సఖాయం మాతరిశ్వనః, 12
మైనాకమితి విఖ్యాతం నివసన్తం మహోదధౌ.

ప్ర. అ. మహోదధౌ = మహాసముద్రమునందు నివసన్తమ్ = నివసించుచున్నవాడనూ, మాతరిశ్వనః = వాయుదేవునియొక్క, సఖాయమ్ = స్నేహితుడను, విఖ్యాతమ్ = ప్రసిద్ధుడను అయిన, మామ్ = నన్ను, మైనాకమితి = మైనాకుని గాను, పితృవ్యం చాపి = నీ తండ్రి సోదరుని గాను, విద్ధి = తెలుసుకొనుము.

తా. మహాసముద్రములో నివసించుచున్న నేను వాయుదేవుని స్నేహితుడ నైన మైనాకుడను. ప్రసిద్ధుడను నీకు పినతండ్రి వంటి వాడను. 12

మూ. పక్షవన్తః పురా పుత్ర బభూవుః పర్వతోత్తమాః, 13
ఛన్దతః పృథివీం చేరుర్బాధమానాః సమన్తతః.

ప్ర. అ. పుత్ర = కుమారా! పురా = పూర్వము, పర్వతోత్తమాః = శ్రేష్ఠము లైన పర్వతములు, పక్షవన్తః = రెక్కలు గలవిగా, బభూవుః = ఉండినవి. బాధమానాః = ప్రజలను బాధించుచు, ఛన్దతః = స్వేచ్ఛానుసారముగా, సమన్తతః = అంతటను, పృథివీమ్ = భూమిని, చేరుః = సంచరించినవి.

తా. నాయనా! పూర్వము మహాపర్వతములకు రెక్కలుండెడివి. అవి ప్రాణులకు బాధ కలిగించుచు భూమిమీద అంతటను సంచరించుచుండెడివి. 13

మూ. శ్రుత్వా నగానాం చరితం మహేన్ద్రః పాకశాసనః, 14
చిచ్ఛేద భగవాన్ పక్షాన్ వజ్రేణైషాం సహస్రశః.

ప్ర. అ. పాకశాసనః = పాకాసురుని సంహరించిన, భగవాన్ = పూజ్యు డైన, మహేన్ద్రః = మహేంద్రుడు, నగానామ్ = పర్వతములయొక్క, చరితమ్ = చరితమును (నడవడికను), శ్రుత్వా = విని, ఏషామ్ = వీనియొక్క, పక్షాన్ =

రెక్కలను, వజ్రేణ = వజ్రముచేత, సహస్రశః = వేయి ముక్కలుగా, చిచ్ఛేద = ఛేదించెను.

తా. పాకాసురసంహారి యైన భగవంతు డైన దేవేంద్రుడు ఆ పర్వతముల చలనమును విని వజ్రాయుధముచేత వాని రెక్కలను వేలకొలది ముక్కలుగా ఛేదించెను. 14

మూ. అహం తు మోక్షిత స్తస్మా త్తవ పిత్రా మహాత్మనా, 15
మారుతేన తదా వత్స ప్రక్షిప్తోఽస్మి మహార్ణవే.

ప్ర. అ. వత్స = ఓ వత్సా! అహం తు = నే నైతే. తవ = నీయొక్క, పిత్రా = తండ్రి యైన, మహాత్మనా = మహాత్ము డైన, మారుతేన = వాయుదేవుని చేత, తదా = అప్పుడు, తస్మాత్ = ఆ దేవేంద్రునినుండి, మోక్షితః = విడిపింపబడినవాడ నై, మహార్ణవే = మహాసముద్రమునందు, ప్రక్షిప్తః అస్మి = విసరివేయబడితిని.

తా. వత్సా! మహాత్ము డైన నీ తండ్రి వాయుదేవుడు నన్ను మహాసముద్రములో పడు నట్లు ఎగురగొట్టి నన్ను మాత్రము మహేంద్రుని బారినుండి రక్షించినాడు. 15

మూ. రామస్య చ మయా సాహ్యే వర్తితవ్య మరిందమ, 16
రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేన్ద్రసమవిక్రమః.

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడా! మయా = నాచేత, రామస్య = రామునకు, సాహ్యే = సహాయము చేయుటయందు. వర్తితవ్యమ్ = ప్రవర్తింపవలసి యున్నది. మహేన్ద్రసమవిక్రమః = మహేంద్రునితో సమాన మైన పరాక్రమము గల, రామః = రాముడు, ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు.

తా. శత్రుసంహారకుడ వైన ఓ హనుమంతుడా! నేను రామునకు సహాయము చేయవలెను. మహేంద్రునితో సమాన మైన పరాక్రమము గల రాముడు ధర్మమును రక్షించువారిలో శ్రేష్ఠుడు కదా! 16

మూ. ఏతచ్ఛ్రుత్వా వచ స్తస్య మైనాకస్య మహాత్మనః. 17

కార్యమావేద్య తు గిరేరుద్యతం చ మనో మమ,
తేన చాహమనుజ్ఞాతో మైనాకేన మహాత్మనా. 18

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య మైనాకస్య=ఆ మైనాకుని యొక్క, వచః = వచనమును, శ్రుత్వా=విని, కార్యమ్=నా కార్యమును, గిరేః = ఆ పర్వతమునకు, ఆవేద్య=తెలిపి, మమ = నాయొక్క, మనః = మనస్సు, ఉద్యతమ్ = ప్రయాణోన్ముఖ మైనది. అహమ్ = నేను, తేన = ఆ, మహాత్మనా = మహాత్ముడైన, మైనాకేన = మైనాకునిచేత, అనుజ్ఞాతః = ఇవ్వబడిన అనుజ్ఞ కలవాడ నైతిని.

తా. మహాత్ముడైన ఆ మైనాకుని మాటలు విని, అతనికి నా కార్యమును తెలిపి నేను ప్రయాణమునకు ఉద్యుక్తుడ నైతిని. మహాత్ముడైన ఆ మైనాకుడు కూడ నాకు వెళ్లుటకు అనుజ్ఞ ఇచ్చెను. 17, 18

మూ. స చాప్యన్తర్హితః శైలో మానుషేణ వపుష్మతా,
శరీరేణ మహాశైలః శైలేన చ మహోదధౌ. 19

ప్ర. అ. సః = ఆ, శైలః = పర్వతము, మానుషేణ వపుష్మతా=మనుష్యసంబంధిశరీరము గల రూపముతో, అన్తర్హితః = అంతర్ధానము చెందెను. మహాశైలః = ఆ మహాపర్వతము, శైలేన = పర్వతరూప మైన, శరీరేణ చ = శరీరముతో కూడ, మహోదధౌ = మహాసముద్రమునందు, అన్తర్హితః=అంతర్ధానము చెందెను.

తా. పర్వతములలో గొప్ప దైన ఆ మైనాకపర్వతము మనుష్యరూపముతో అంతర్ధానము చెందెను. దాని పర్వతరూపము కూడ సముద్రములో మునిగి పోయెను. 19

మూ. ఉత్తమం జవమాస్థాయ శేషం పన్థానమాస్థితః,
తతోఽహం సుచిరం కాలం వేగేనాభ్యాగమం పథి 20

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అహమ్=నేను, ఉత్తమమ్ = ఉత్తమ మైన, జవమ్ = వేగమును, ఆస్థాయ = అవలంబించి, శేషమ్ = మిగిలిన, పన్థానమ్= మార్గమును, ఆస్థితః=పొందినవాడ నై, సుచిరం కాలమ్=చాల కాలము, వేగేన = వేగముతో, అభ్యాగమమ్ = వెళ్ళితిని.

తా. పిమ్మట నేను అధిక మైన వేగమును అవలంబించి, మిగిలిన మార్గమును గ్రహించి, వేగముగా చాల సేపు మార్గములో ప్రయాణము చేసితిని. 20

మూ. తతః పశ్యామ్యహం దేవీం సురసాం నాగమాతరమ్,
సముద్రమధ్యే సా దేవీ వచనం మామభాషత. 21

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, నాగమాతరమ్ = నాగమాత యైన, సురసామ్ = సురసను, పశ్యామి = చూచితిని. సా దేవీ = ఆ దేవి, సముద్రమధ్యే = సముద్రమధ్యమునందు, మామ్ = నన్ను గూర్చి, వచనమ్ = వాక్యమును, అభాషత = పలికెను.

తా. పిమ్మట నేను సముద్రమధ్యమునందు నాగమాత యైన సురసాదేవిని చూచితిని. ఆమె నాతో ఇట్లనెను. 21

మూ. మమ భక్షః ప్రదిష్టస్త్వమమరైర్హరిసత్తమ,
అతస్త్వాం భక్షయిష్యామి విహితస్త్వం చిరస్య మే. 22

ప్ర. అ. హరిసత్తమ = వానరశ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, మమ = నాయొక్క, భక్షః = ఆహారముగా, అమరైః = దేవతలచేత, ప్రదిష్టః = చూపబడినావు. అతః = అందువలన, త్వామ్ = నిన్ను, భక్షయిష్యామి = భక్షించగలను. త్వమ్ = నీవు, మే = నాకు, చిరస్య = చిరకాలానికి, విహితః = (ఆహారముగా) ఏర్పరుపబడినావు.

తా. ఓ! వానరశ్రేష్ఠా! దేవతలు నిన్ను నాకు ఆహారముగా చూపినారు. అందువలన నిన్ను భక్షించెదను. నీవు చాలకాలానికి నాకు లభించినావు. 22

మూ. ఏవముక్తః సురసయా ప్రాఞ్జలిః ప్రణతః స్థితః,
వివర్ణవదనో భూత్వా వాక్యం చేదముదీరయమ్. 23

ప్ర. అ. సురసయా = సురసచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన నేను, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడనై, ప్రణతః = నమస్కరించుచు, స్థితః = నిలచితిని. వివర్ణవదనః = చెడిన రంగు గల ముఖము కలవాడను, భూత్వా = అయి, ఇదమ్ = ఈ, వాక్యం చ = వాక్యమును కూడ, ఉదీరయమ్ = పలికితిని.

తా. సురస మాటలు విని నేను అంజలి ఘటించి నమస్కరించుచు నిం
చితిని. భయముచేత పాలిపోయిన ముఖముతో ఇట్లు పలికితిని. 23

మూ. రామో దాశరథిః శ్రీమాన్ ప్రవిష్టో దణ్డకావనమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ పరంతపః. 24

ప్ర. అ. దాశరథిః = దశరథకుమారుడు, శ్రీమాన్ = శోభాయుక్తుడు, పరంతపః = శత్రుపీడకుడు అయిన, రామః = రాముడు, దణ్డకావనమ్ = దండకారణ్యమును, భ్రాత్రా = సోదరు డైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితోను, సీతయా చ = సీతతోను, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. దశరథకుమారుడు, లక్ష్మీసంపన్నుడు, శత్రుసంహారకుడు అయిన రాముడు, సోదరు డైన లక్ష్మణునితోను, సీతతోను కలిసి దండకారణ్యమును ప్రవేశించెను. 24

మూ. తస్య సీతా హృతా భార్యా రావణేన దురాత్మనా,
తస్యాః సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్.

ప్ర. అ. తస్య = ఆ రామునియొక్క, భార్యా = భార్య యైన, సీతా = సీత, దురాత్మనా = దుష్టబుద్ధి యైన, రావణేన = రావణునిచేత, హృతా = హరింపబడినది. అహమ్ = నేను, రామశాసనాత్ = రాముని ఆజ్ఞవలన, దూతః = దూత నై, తస్యాః = ఆమెయొక్క, సకాశమ్ = సమీపమును గూర్చి, గమిష్యే = వెళ్ళగలను.

తా. దుష్టబుద్ధి యైన రావణుడు, రాముని భార్య యైన సీతను హరించెను. నేను రాముని ఆజ్ఞచేత, ఆమె వద్దకు దూతగా వెళ్లుచున్నాను. 25

మూ. కర్తుమర్హసి రామస్య సాహాయ్యం విషయే సతీ,
అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్, 26
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే.

ప్ర. అ. విషయే = రాముని దేశములో, సతీ = ఉన్న నీవు, రామస్య = రామునకు, సాహాయ్యమ్ = సాహాయ్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి యున్నావు. అథవా = లేదా. మైథిలీమ్ = సీతను, అక్లిష్టకారిణమ్ = శ్రమపడకుండా

పనులు చేయు, రామం చ=రామునీ, దృష్ట్వా=చూచి, తే=నీయొక్క, వక్త్రమ్ =ముఖమును గూర్చి, ఆగమిష్యామి=రాగలను. సత్యమ్=సత్యముగా, తే= నీకు, ప్రతిశృణోమి=ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. రాముని దేశములోనే నివసించుచున్న సీవు రామునకు సాహాయ్యము చేయవలెను. లేదా, నేను సీతనూ, శ్రమపడకుండా పనులు చేయు రాముణ్ణి చూచి నీ కాహారముగా నీ ముఖములో ప్రవేశించెదను. నిజముగా ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. 26

మూ. ఏవముక్తా మయా సా తు సురసా కామరూపిణీ, 27
అబ్రవీన్నాతివర్తేత కశ్చిదేష వరో మమ.

ప్ర. అ. మయా=నాచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, కామరూపిణీ=స్వేచ్ఛారూపము గల, సా సురసా=ఆ సురస, అబ్రవీత్=పలికెను. కశ్చిత్=ఎవ్వరూ, నాతివర్తేత=(నన్ను)అతిక్రమింపజాలరు, ఏషః=ఇది, మమ =నాయొక్క, వరః=వరము.

తా. స్వేచ్ఛానుసారము రూపములు ధరించగలిగిన ఆ సురస నామాటలు విని."నన్నెవ్వరూ దాటి పోజాలరు; ఇది నా కున్న వరము" అని పలికెను. 27

మూ. ఏవముక్తః సురసయా దశయోజనమాయతః, 28
తతోఽర్ధగుణవిస్తారో బభూవాహం క్షణేన తు.

ప్ర. అ. సురసయా=సురసచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, దశయోజనమ్=పది యోజనములు, ఆయతః=పొడవైన, అహమ్=నేను, తతః =అటు పిమ్మట, క్షణేన=క్షణకాలములో, అర్ధగుణవిస్తారః=దానికి సగము రెట్టింపైన (పెరిగిన) విస్తారము కలవాడను. బభూవ=అయితిని.

తా. పది యోజనముల పొడవున్న నేను సురస మాటలు విని, క్షణకాలములో పదునైదు యోజనముల విస్తార మందు నట్లు నా శరీరము పెంచితిని.

మూ. మత్ప్రమాణానురూపం చ వ్యాదితం చ ముఖం తయా,
తద్దృష్ట్వా వ్యాదితం చాస్యం హ్రస్వం హ్యకరవం వపుః,
తస్మిన్ ముహూర్తే చ పునర్బభూవాఙ్గుష్ఠమాత్రకః. 30

ప్ర. అ. తయా = ఆమెచేత, ముఖమ్ = ముఖము, మత్ప్రమాణానురూపమ్ = నా ప్రమాణమునకు అనుగుణముగా, వ్యాదితమ్ = తెరవబడినది. వ్యాదితమ్ = తెరవబడిన, తత్ = ఆ, ఆస్యమ్ = ముఖమును, దృష్ట్వా = చూచి, వపుః = శరీరమును, హ్రస్వమ్ = చిన్నదానినిగా, అకరవమ్ = చేసితిని. తస్మిన్ = ఆ, ముహూర్తే = ముహూర్తకాలమునందే, పునః = మరల, అఙ్గుష్ఠమాత్రకః = బొటనవ్రేలు ప్రమాణము కలవాడను, బభూవ = అయితిని.

తా. ఆమె తన ముఖమును నా దేహప్రమాణమునకు చాలునంతగా తెరచెను. ఆ విధముగ తెరచిన ముఖమును చూచి నా శరీరమును చిన్నదిగా చేసి, ఆ క్షణమునందే బొటనవ్రేలంత ప్రమాణము కలవాడను అయితిని. 30

మూ. అభిపత్యాశు తద్వక్త్రం నిర్గతోఽహం తతః క్షణాత్,
అబ్రవీత్సురసా దేవీ స్వేన రూపేణ మాం పునః. 31

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, ఆశు = శీఘ్రముగా, తద్వక్త్రమ్ = ఆమె ముఖమును, అభిపత్య = ప్రవేశించి, క్షణాత్ = క్షణకాలములో, నిర్గతః = బైటకు వచ్చితిని. దేవీ = దేవి యైన, సురసా = సురస, స్వేన = తన సంబంధమైన, రూపేణ = రూపముతో, పునః = మరల, మామ్ = నన్ను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. నేను వెంటనే ఆమె ముఖములో ప్రవేశించి, క్షణకాలములో దాని నుండి బైటకు వచ్చితిని. అప్పుడు సురస తన నిజస్వరూపముతో మరల ఇట్లు పలికెను. 31

మూ. అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్,
సమానయ చ వైదేహీం రాఘవేణ మహాత్మనా. 32
సుఖీ భవ మహాబాహో ప్రీతాస్మి తవ వానర.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా, హరిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠుడా, అర్థసిద్ధ్యై = కార్యసిద్ధికొరకు, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్లుము. వైదేహీమ్ = సీతాదేవిని, మహాత్మనా = మహాత్ముడైన, రాఘవేణ = రామునితో, సమానయ = చేర్చుము. మహాబాహో = గొప్ప బాహువులు గల, వానర = వానరుడా, సుఖీ

= సుఖవంతుడవు, భవ = అగుము. తవ = నీ విషయమున, ప్రీతా అస్మి = సంతోషించినాను.

తా. సౌమ్యుడవైన ఓ! వానరశ్రేష్ఠా! కార్యసిద్ధికొరకై సుఖముగా వెళ్లుము. సీతను మహాత్ముడైన రామునితో చేర్పుము. మహాబాహువైన ఓ! వానరుడా! సుఖముగా ఉండుము నీ విషయమున సంతోషించినాను. ౩౨

మూ. తతోఽహం సాధు సాధ్వీతి సర్వభూతైః ప్రశంసితః, ౩౩
తతోఽన్తరిక్షం విపులం ప్లుతోఽహం గరుడో యథా.

ప్ర. అ. తతః = అటు పిమ్మట. అహమ్ = నేను, సర్వభూతైః = సమస్త భూతములచేతను, సాధు సాధ్వితి = బాగు బాగు అని, ప్రశంసితః = ప్రశంసింపబడితిని. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, గరుడో యథా = గరుత్మంతుడు వలె, విపులమ్ = విశాలమైన, అన్తరిక్షమ్ = ఆకాశమును, ప్లుతః = దాటితిని.

తా. అప్పుడు నన్ను అక్కడ ఉన్న సకలప్రాణులు "బాగు! బాగు!" అని ప్రశంసించెను. పిదప నేను గరుత్మంతుడు వలె, విశాలమైన ఆకాశములో ఎగిరితిని. ౩౩

మూ. ఛాయా మే నిగృహీతా చ న చ పశ్యామి కించన, ౩౪
సోఽహం విహతవేగస్తు దిశో దశ విలోకయన్,
న కించిత్తత్ర పశ్యామి యేన మేఽపహృతా గతిః. ౩౫

ప్ర. అ. మే = నాయొక్క, ఛాయా = నీడ, నిగృహీతా = పట్టుకొనబడెను. కించన = దేనినీ, న చ పశ్యామి = చూడలేదు. విహతవేగః = కొట్టబడిన వేగముగల, సః అహమ్ = అట్టి నేను, దశ దిశః = పది దిక్కులను, విలోకయన్ = చూచుచు, యేన = దేనిచేత, మే = నాయొక్క, గతిః = గమనము, అపహృతా = అపహరింపబడినదో అట్టి దానిని. కించిత్ = దేనినీ కూడ, తత్ర = అక్కడ, న చ పశ్యామి = చూడలేదు.

తా. ఇంతలో నా నీడను ఎవ్వరో పట్టుకొనిరి. నాకు ఏదీ కనబడలేదు. వేగము తగ్గిపోగానే నేను పది దిక్కులూ చూచితిని. కాని నా గమనవేగమును అడ్డగించినదేదీ నాకు కనబడలేదు. ౩౪, ౩౫

మూ. తతో మే బుద్ధిరుత్పన్నా కిం నామ గమనే మమ,
ఈదృశో విఘ్న ఉత్పన్నో రూపం యత్ర న దృశ్యతే.

ప్ర. అ. తతః=అటు పిమ్మట. మే=నాకు, బుద్ధిః=ఆలోచన, ఉత్పన్నా=పుట్టినది. మమ=నాయొక్క, గమనే=గమనమునందు, యత్ర=ఎక్కడ, రూపమ్=రూపము, న దృశ్యతే=కనబడుట లేదో, అక్కడ, కిం నామ=ఏ విధి? ఈదృశః=ఇట్టి, విఘ్నః=విఘ్నము, ఉత్పన్నః=పుట్టినది.

తా. "ఈ ప్రదేశమునందు ఎవ్వరూ కనబడుటలేదు. కాని నా గమనమునకు ఇట్టి విఘ్నము కలిగినది? ఏమిది?" అని నాకు ఆలోచన కలిగెను. 36

మూ. అధోభాగేన మే దృష్టిః శోచతా పాతితా మయా,
తతోఽద్రాక్షమహం భీమాం రాక్షసీం సలిలేశయామ్. 37

ప్ర. అ. శోచతా=ఆలోచించుచున్న, మయా=నాచేత, అధోభాగేన=క్రింది వైపు. మే=నాయొక్క, దృష్టిః=దృష్టి, పాతితా=ప్రసరింపచేయబడినది. తతః=అటు పిమ్మట, అహమ్=నేను, భీమామ్=భయంకరురాలైన, సలిలేశయామ్=నీటిలో శయనించు, రాక్షసీమ్=రాక్షసస్త్రీని, అద్రాక్షమ్=చూచితిని.

తా. ఇట్లు ఆలోచించుచు నేను క్రిందివైపు దృష్టిని ప్రసరింపచేయుగా, నీటిలో శయనించి యున్న భయంకరురాలైన ఒక రాక్షసస్త్రీ కనబడెను. 37

మూ. ప్రహస్య చ మహానాదముక్తోఽహం భీమయా తయా,
అవస్థితమసంభ్రాన్తమిదం వాక్యమశోభనమ్. 38

ప్ర. అ. భీమయా=భయంకరురాలైన, తయా=ఆమెచేత, మహానాదమ్=గొప్ప ధ్వని కలుగునట్లుగా, ప్రహస్య=నవ్వి, అవస్థితమ్=నిశ్చితముగాను, అసంభ్రాన్తమ్=ఎట్టి కంగారు లేకుండాను, ఇదమ్=ఈ, అశోభనమ్=చెడ్డదైన, వాక్యమ్=వాక్యమును, అహమ్=నేను, ఉక్తః=పలుకబడితిని.

తా. భయంకరురాలైన ఆమె వికటాట్టహాసము చేయుచు, నాతో నిశ్చితముగాను, ఏమాత్రము వెరపు లేకుండగాను, ఈ చెడ్డ వాక్యమును పలికెను.

మూ. క్వాసి గన్తా మహాకాయ క్షుధితాయా మమేప్సితః,
తక్షః ప్రీణయ మే దేహం చిరమాహారవర్జితమ్. 39

ప్ర. అ. మహాకాయ = పెద్ద దేహము కలవాడా! క్వ = ఎక్కడికి, గన్తా = వెళ్లేవాడవు, అసి = అయి ఉన్నావు? క్షుధితాయాః = ఆకలిగొన్న, మమ = నాకు, ఈప్సితః = ఇష్ట మైన, భక్షః = ఆహార మై, చిరమ్ = చిరకాలము, ఆహారవర్జితమ్ = ఆహారము లేని దైన, మే = నాయొక్క, దేహమ్ = దేహమును, ప్రీణయ = సంతృప్తిపరచుము.

తా. ఓ! పెద్ద శరీరము కలవాడా! ఎక్కడికి వెళ్లెదవు? ఆకలిగొన్న నా శరీరము చాల కాలమునుండి ఆహారము లేకుండా ఉన్నది. నాకు ఇష్ట మైన ఆహారముగా అయి ఈ దేహమునకు తృప్తి కలిగింపుము. 39

మూ. బాఢమిత్యేవ తాం వాణీం ప్రత్యగృహ్ణామహం తతః,
ఆస్యప్రమాణాదధికం తస్యాః కాయమపూరయమ్. 40

ప్ర. అ. అహమ్ = నేను, బాఢమ్ ఇత్యేవ = తప్పక అట్లే చేసెదను అని, తాం వాణీమ్ = ఆ వాక్యమును, ప్రత్యగృహ్ణామ్ = స్వీకరించితిని. తతః = అటు పిమ్మట, తస్యాః = ఆమెయొక్క, ఆస్యప్రమాణాత్ = ముఖప్రమాణము కంటె, అధికమ్ = అధిక మగు నట్లుగా, కాయమ్ = (నా) శరీరమును, అపూరయమ్ = పెంచితిని.

తా. "తప్పక అట్లే చేసెదను" అని పలుకుచు నేను ఆమె మాటలకు అంగీకరించి నా దేహమును ఆమె ముఖము ప్రమాణముకంటె అధికముగా ఉండునట్లు పెంచితిని. 40

మూ. తస్యాశ్చాస్యం మహద్భీమం వర్ధతే మమ భక్షణే,
న చ మాం సాధు బుబుధే మమ వా వికృతం కృతమ్.

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, మహత్ = పెద్ద దైన, భీమమ్ = భయంకర మైన, ఆస్యం చ = ముఖము కూడా, మమ భక్షణే = నాయొక్క భక్షణము నందు, వర్ధతే = వృద్ధిపొందుచున్నది. మామ్ = నన్ను గూర్చి గాని, కృతమ్ = చేయబడిన, మమ = నాయొక్క, వికృతమ్ = వికారమును గాని, సాధు = బాగుగా, న బుబుధే = తెలిసికొనలేదు.

తా. నన్ను భక్షించుటకై, చాల పెద్దదీ, భయంకరమూ అయిన ఆమె ముఖము కూడ పెరిగెను. ఆమెకు నన్ను గూర్చి గాని, నేను చేయ దలచిన వికారమును (ఆమెను చంపే ఉపాయమును) గూర్చి గాని బాగుగా తెలియలేదు.

మూ. తతోఽహం విపులం రూపం సంక్షిప్య నిమిషాన్తరాత్,
తస్యా హృదయమాదాయ ప్రపతామి నభఃస్థలమ్. 42

ప్ర. అ. తతః = పిమ్మట, అహమ్ = నేను, నిమిషాన్తరాత్ = మరొక నిమిషములో, విపులమ్ = విశాలమైన, రూపమ్ = రూపమును, సంక్షిప్య = కుదించి, తస్యాః = ఆమె యొక్క, హృదయమ్ = హృదయమును, ఆదాయ = గ్రహించి నభః స్థలమ్ = ఆకాశమును గూర్చి, ప్రపతామి = ఎగురుచున్నాను (ఎగిరితిని).

తా. పిదప నేను మరుక్షణములో విశాలమైన నా రూపమును చిన్నది చేసి, ఆమె గుండెకాయను త్రుంచి తీసికొని ఆకాశములోనికి ఎగిరితిని. 42

మూ. సా విసృష్టభుజా భీమా పపాత లవణామ్భసి,
మయా పర్వతసంకాశా నికృత్తహృదయా సతీ. 43

ప్ర. అ. భీమా = భయంకరురాలైన, పర్వతసంకాశా = పర్వతముతో సమానురాలైన, సా = ఆమె, మయా = నాచేత, నికృత్తహృదయా సతీ = ఛేదింపబడిన హృదయము కలదై, విసృష్టభుజా = చాపబడిన భుజములు కలదై, లవణామ్భసి = లవణసముద్రమునందు, పపాత = పడెను.

తా. భయంకరురాలు, పర్వతము వంటిదీ అయిన ఆమె హృదయమును నేను ఛేదించి వేయుటచే, ఆమె చేతులు చాపి లవణసముద్రములో పడిపోయెను.

మూ. శృణోమి ఖగతానాం చ సిద్ధానాం చారణైః సహ,
రాక్షసీ సింహికా భీమా క్షిప్రం హనుమతా హతా. 44

ప్ర. అ. చారణైః సహ = చారణులతో కూడ, ఖగతానామ్ = ఆకాశమును పొందిన, సిద్ధానామ్ = సిద్ధులయొక్క, భీమా = భయంకరమైన, రాక్షసీ = రాక్షసి, సింహికా = సింహిక, క్షిప్రమ్ = శీఘ్రముగా, హనుమతా = హనుమంతునిచేత, హతా = చంపబడినది అను మాటలను శృణోమి = వినుచున్నాను (వింటిని).

తా. అప్పుడు ఆకాశమునందు సంచరించిన సిద్ధులు, చారణులు—"హనుమంతుడు భయంకరరాక్షసి యైన సింహికను శీఘ్రముగా చంపివేసినాడు" అని అనుచుండగా వింటిని. 44

మూ. తాం హత్వా పునరేవాహం కృత్యమాత్యయికం స్మరన్
గత్వా చ మహదధ్వానం పశ్యామి నగమణ్డితమ్, 45
దక్షిణం తీరముదధేర్లఙ్కా యత్ర చ సా పురీ.

ప్ర. అ. అహమ్ = నేను, తామ్=ఆమెను, హత్వా=చంపి, పునరేవ= తిరిగి, ఆత్యయికమ్=తొందరగా చేయదగిన, కృత్యమ్=కృత్యమును, స్మరన్ =స్మరించుచు, మహత్ అధ్వానమ్=గొప్ప మార్గమును, గత్వా=వెళ్ళి, యత్ర= ఎక్కడ, సా = ఆ, లఙ్కాపురీ=లంకాపుర మున్నదో, అట్టి, ఉదధేః=సముద్రము యొక్క, దక్షిణం తీరమ్ = దక్షిణతీరమును, పశ్యామి=చూచుచున్నాను. (చూచితిని).

తా. నేను ఆ సింహికను చంపి, తొందరగా చేయ దగిన నా కర్తవ్యమును గూర్చి మరల స్మరించుచు, చాల దూరము ప్రయాణము చేసి వృక్షములచే అలంకరింపబడిన లంకాపట్టణము సముద్రదక్షిణ తీరమును చూచితిని. 45

మూ. అస్తం దినకరే యాతే రక్షసాం నిలయం పురమ్, 46
ప్రవిష్టోఽహమవిజ్ఞాతో రక్షోభిర్భీమవిక్రమైః.

ప్ర. అ. దినకరే=సూర్యుడు, అస్తం యాతే=అస్తాద్రిని పొందగా, అహమ్=నేను, భీమవిక్రమైః= భయంకర మైన పరాక్రమము గల, రక్షోభిః= రాక్షసులచేత, అవిజ్ఞాతః= తెలియబడని వాడనై, రక్షసామ్=రాక్షసులకు, నిలయమ్=స్థాన మైన, పురమ్=పట్టణమును, ప్రవిష్టః=ప్రవేశించితిని.

తా. సూర్యుడు అస్తమించిన పిదప, నేను, భయంకర మైన పరాక్రమము గల రాక్షసులకు కనబడకుండగా, రాక్షసనివాస మైన లంకాపట్టణము ప్రవేశించితిని. 46

మూ. తత్ర ప్రవిశతశ్చాపి కల్పాన్తఘనసన్నిభా, 47
అట్టహాసం విముఞ్చన్తీ నారీ కాప్యుత్థితా పురః.

ప్ర. అ. తత్ర = ఆ పట్టణమునందు, ప్రవిశతః = ప్రవేశించుచున్న నాయొక్క, పురః = ఎదుట, కల్పాన్తఘనసన్నిభా = కల్పాంతము నందలి మేఘముతో సమానమైన, కాపి = ఒకానొక, నారీ = స్త్రీ, అట్టహాసమ్ = అట్టహాసమును, విముఞ్చన్తీ = విడచుచు(చేయుచు), ఉత్థితా = లేచినది.

తా. నేను నగరములో ప్రవేశించుచుండగా, ప్రలయకాలమేఘము వలె ఉన్న ఒక స్త్రీ అట్టహాసము చేయుచు నా ఎదుట లేచి నిలచినది. 47

మూ. జిఘాంసన్తీం తతస్తాం తు జ్వలదగ్నిశిరోరుహామ్, 48
సవ్యముష్టిప్రహారేణ పరాజిత్య సుభైరవామ్,
ప్రదోషకాలే ప్రవిశం భీతయాహం తయోదితః. 49

ప్ర. అ. తతః = అటు పిమ్మట, జిఘాంసన్తీమ్ = చంప దలచుచున్నదీ, జ్వలదగ్నిశిరోరుహామ్ = మండుచున్న అగ్ని వంటి కేశములు కలదీ అయిన, సుభైరవామ్ = చాల భయంకరురాలైన, తామ్ = ఆమెను, సవ్యముష్టిప్రహారేణ = ఎడమ పిడికిలి దెబ్బచే, పరాజిత్య = ఓడించి, ప్రదోషకాలే = సాయంకాల సమయమునందు, ప్రవిశమ్ = ప్రవేశించితిని. భీతయా = భయపడిన, తయా = ఆమెచేత, అహమ్ = నేను, ఉదితః = పలుకబడితిని.

తా. మండుచున్న అగ్ని వంటి కేశములు కలదీ, చాల భయంకరురాలూ అయిన ఆమె నన్ను చంపుటకు ఉద్యమించగా, నేను ఆమెను ఎడమ చేతి గుద్దుతో ఓడించి ప్రదోషసమయమునందు ప్రవేశించితిని. అప్పుడు భయపడిన ఆమె ఇట్లు పలికెను. 48 49

మూ. అహం లఙ్కాపురీ వీర నిర్జితా విక్రమేణ తే,
యస్మాత్తస్మాద్విజేతాసి సర్వరక్షాంస్యశేషతః. 50

ప్ర. అ. వీర = ఓ వీరుడా! అహమ్ = నేను, లఙ్కాపురీ = లంకాపురిని. యస్మాత్ = ఏ కారణమువలన, తే = నీయొక్క, విక్రమేణ = పరాక్రమముచేత, నిర్జితా = జయింపబడితినో, తస్మాత్ = ఆ కారణమువలన, సర్వరక్షాంసి = సమస్తరాక్షసులను, అశేషతః = పూర్తిగా, విజేతాసి = జయించగలవు.

తా. ఓ వీరుడా! నేను లంకాపురిని. నీవు నన్ను నీ పరాక్రమముచేత జయించినావు. అందువలన సకలరాక్షసులను, నిశ్శేషముగా జయించగలవు. 50

మూ. తత్రాహం సర్వరాత్రం తు విచిన్వన్ జనకాత్మజామ్,
రావణాన్తఃపురగతో న చాపశ్యం సుమధ్యమామ్. 51

ప్ర. అ. అహమ్ = నేను, తత్ర = అక్కడ, రావణాన్తఃపురగతః = రావణుని అంతఃపురమునకు వెళ్ళినవాడనై, సర్వరాత్రమ్ = రాత్రి అంతా, జనకాత్మజామ్ = సీతను, విచిన్వన్ = అన్వేషించుచు, సుమధ్యమామ్ = మంచి నడుము గల ఆ సీతను, న అపశ్యం చ = చూడలేదు.

తా. అక్కడ నేను రావణుని అంతఃపురమునకు వెళ్ళి రాత్రి అంతా సీత కొరకై వెదకితిని కాని, మంచి నడుము గల ల సీత కనబడలేదు. 51

మూ. తతః సీతామపశ్యంస్తు రావణస్య నివేశనే,
శోకసాగరమాసాద్య న పారముపలక్షయే. 52

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, సీతామ్ = సీతను, అపశ్యంస్తు = చూడనివాడనై, తతః = అటుపిమ్మట, శోకసాగరమ్ = శోకసముద్రమును, ఆసాద్య = పొంది, పారమ్ = దాని అవతలి ఒడ్డును, న ఉపలక్షయే = చూడజాలకపోతిని.

తా. రావణుని గృహములో సీత కనబడకపోవుటచేత నేను శోకసముద్రములో పడి దాని అంతము చూడజాలకపోయితిని. 52

మూ. శోచతా చ మయా దృష్టం ప్రాకారేణ సమావృతమ్,
కాఞ్చనేన వికృష్టేన గృహోపవనముత్తమమ్. 53

ప్ర. అ. శోచతా = దుఃఖించుచున్న, మయా = నాచేత, కాఞ్చనేన = బంగారువికారమైన, వికృష్టేన = పొడవైన, ప్రాకారేణ = ప్రాకారముచేత, సమావృతమ్ = కప్పబడిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, గృహోపవనమ్ = గృహమునకు సంబంధించిన ఉద్యానము, దృష్టమ్ = చూడబడినది.

తా. దుఃఖాక్రాంతుడనైన నేను, చుట్టూ దీర్ఘమైన బంగారు ప్రాకారము ఉన్న, రావణుని గృహమునకు దగ్గరగా ఉన్న ఉత్తమమైన ఉద్యానము చూచితిని. 53

మూ. స ప్రాకారమవప్లుత్య పశ్యామి బహుపాదపమ్,
అశోకవనికామధ్యే శింశుపాపాదపో మహాన్. 54
తమారుహ్య చ పశ్యామి కాఞ్చనం కదలీవనమ్.

ప్ర. అ. సః=అట్టి నేను, ప్రాకారమ్=ప్రాకారమును, అవప్లుత్య=దాటి, బహుపాదపమ్ = అనేకవృక్షములు గల ఉద్యానమును, పశ్యామి = చూచుచున్నాను (చూచితిని). అశోకవనికామధ్యే = అశోకవనమధ్యమునందు, మహాన్ = గొప్పదైన, శింశుపాపాదపః=శింశుపావృక్షము ఉండెను. తమ్ = దానిని, ఆరుహ్య=ఎక్కి, కాఞ్చనమ్= బంగారు, కదళీవనమ్= అరటి తోపును, పశ్యామి చూచితిని.

తా. నేను ప్రాకారము దాటి అనేకవృక్షములతో కూడిన ఉద్యానమును చూచితిని. అశోకవనమధ్యమునందు పెద్ద శింశుపావృక్షము ఉండెను. దానిని ఎక్కి బంగారు అరటిచెట్ల తోపు చూచితిని. 54

మూ. అదూరే శింశుపావృక్షాత్పశ్యామి వరవర్ణినీమ్, 55
శ్యామాం కమలపత్రాక్షీముపవాసకృశాననామ్,
తదేకవాసఃసంవీతాం రజోధ్వస్తశిరోరుహామ్. 56
శోకసన్తాపదీనాఙ్గీం సీతాం భర్తృహితే స్థితామ్,
రాక్షసీభిర్విరూపాభిః క్రూరాభిరభిసంవృతామ్, 57
మాంసశోణితభక్షాభిర్వ్యాఘ్రీభిర్హరిణీమివ.

ప్ర. అ. శింశుపావృక్షాత్ = శింశుపావృక్షమునుండి, అదూరాత్ = సమీపమునందు, వరవర్ణినీమ్=శ్రేష్ఠమైన వర్ణము గలదీ, శ్యామామ్=యౌవనమధ్యమునందున్నది, కమలపత్రాక్షీమ్ = పద్మపత్రముల వంటి నేత్రములు కలది, ఉపవాసకృశాననామ్ = ఉపవాసములచేత వాడిపోయిన ముఖము కలది, తదేకవాసఃసంవీతామ్ = ఆ ఒకే వస్త్రముచేతనే చుట్టబడినది, రజోధ్వస్తశిరోరుహామ్= పరాగముచేత చెడిపోయిన కేశములు గలది, శోకసంతాపదీనాఙ్గీమ్=శోకముతోను, తాపముతోను దీనమైన శరీరము గలది, భర్తృహితే = భర్తయొక్క హితమునందు, స్థితామ్=ఉన్నది, విరూపాభిః=వికృతరూపములు కలవారు, క్రూరాభిః =క్రూరురాళ్లు, మాంసశోణితభక్షాభిః=మాంసమును రక్తమును భక్షించువాళ్ళ

అయిన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, వ్యాఘ్రీభిః = ఆడపులులచేత, హరిణీమివ = ఆడ లేడి వలె, అభిసంవృతామ్ = చుట్టబడినది అయిన, సీతామ్ = సీతను, పశ్యామి = చూచితిని.

తా. శింశుపావృక్షమునకు దగ్గరనే ఉత్తమ మైన శరీరచ్ఛాయ గల, యౌవనమధ్యస్థురాలైన సీతను చూచితిని. కమలపత్రముల వంటి కళ్లు గల ఆమె ముఖము ఉపవాసములచేత వాడిపోయి ఉండెను. ఆమె ఆ వస్త్రము నొక్కదానినే చుట్టబెట్టుకొని ఉండెను. ఆమె కేశములు ధూళిచేత కప్పి శోభావిహీనములై ఉండెను. శోకముచేత, మనస్తాపముచేత దీన మైన (కృశించిన) శరీరము గల ఆమెను, వికృతరూపములు, క్రూరస్వభావము కలవాళ్లు, మాంసరక్తములను ఆహారముగా తీసికొను వాళ్లు అయిన రాక్షసస్త్రీలు, ఆడ లేడిని ఆడ పెద్దపులులు చుట్టుముట్టి ఉన్నట్లు చుట్టి ఉండిరి. ఆమె భర్త హితమును గూర్చియే ఆలోచించుచుండెను.

శ్లో. సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః, 58
ఏకవేణీధరా దీనా భర్తృచిన్తాపరాయణా,
భూమిశయ్యా వివర్ణాఙ్గీ పద్మినీవ హిమాగమే, 59
రావణాద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా,
కథం చిన్మృగశాబాక్షీ తూర్ణమాసాదితా మయా. 60

ప్ర. అ. ముహుర్ముహుః = మాటి మాటికి, తర్జ్యమానా = భయపెట్టబడు చున్నది, ఏకవేణీధరా = ఒక జడను ధరించినది, దీనా = దీనురాలు, భర్తృచిన్తాపరాయణా = భర్తను గూర్చిన ఆలోచనతో నిండినది, భూమిశయ్యా = నేలయే శయ్యగా గలది, వివర్ణాఙ్గీ = రంగు చెడిన శరీరము గలది, హిమాగమే = శిశిరఋతువునందు, పద్మినీవ = పద్మలత వలె ఉన్నది, రావణాత్ = రావణునినుండి, వినివృత్తార్థా = నివర్తించిన ప్రయోజనము గలది, మర్తవ్యకృతనిశ్చయా = మరణించవలెనని చేయబడిన నిశ్చయము గలది అయిన, సా = ఆమె, మయా = నాచేత, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీలమధ్య, ఆసాదితా = పొందబడినది. మృగశాబాక్షీ = లేడిపిల్ల కళ్లవంటి కళ్ళు గల ఆమె, మయా = నాచేత, కథం చిత్ = ఎటులనో, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆసాదితా = పొందబడినది.

తా. ఒకే జడతో దీనురాలై భర్తను గూర్చియే ఆలోచించుచున్న ఆ సీత రాక్షసస్త్రీల మధ్య ఉండెను. వాళ్లు ఆమెను మాటిమాటికి భయపెట్టు

చుండిరి. నేలపైననే శయనించుచు, రంగు మారిపోయిన ఆమె శిశిరఋతువునందలి పద్మలత వలె నుండెను. ఆమె రావణుని విషయమున విముఖురాలై మరణించ వలె నని నిశ్చయము చేసికొనెను. లేడి పిల్ల కళ్ళ వంటి కళ్లు గల ఆర్త సీతను నేను శ్రమముగా ఎట్లో చూడ గలిగితిని. 58-60

మూ. తాం దృష్ట్వా తాదృశీం నారీం రామపత్నీం యశస్వినీమ్,
తత్రైవ శింశుపావృక్షే పశ్యన్నహమవస్థితః. 61

ప్ర. అ. అహమ్ = నేను, తాదృశీమ్ = ఆర్త, నారీమ్ = స్త్రీ యైన, యశస్వినీమ్ = కీర్తిమంతురాలైన, తాం రామపత్నీమ్ = ఆ రామభార్యను, దృష్ట్వా = చూచి, తత్ర = అక్కడ (అ), శింశుపావృక్షే ఏవ = శింశుపావృక్షమునందే, పశ్యన్ = చూచుచు, అవస్థితః = ఉంటిని.

తా. కీర్తిమంతురాలు, రాముని భార్య అయిన ఆ సీత ఆర్త స్థితిలో నాకు కనబడినది. నేనామెను చూచుచు, ఆ శింశుపావృక్షము పైననే ఉండిపోయితిని.

మూ. తతో హలహలాశబ్దం కాఞ్చీనూపురమిశ్రితమ్,
శృణోమ్యధికగమ్భీరం రావణస్య నివేశనే. 62

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రావణస్య = రావణుని యొక్క, నివేశనే = గృహమునందు, కాఞ్చీనూపురమిశ్రితమ్ = వడ్డాణముల ధ్వనితోను నూపురముల ధ్వనితోను కలిసిన, అధికగమ్భీరమ్ = మిక్కిలి గంభీరమైన, హలహలాశబ్దమ్ = కోలాహలమును, శృణోమి = వినుచున్నాను (వింటిని).

తా. ఇంతలో రావణుని గృహములో, వడ్డాణముల ధ్వనితోను, అందెల ధ్వనితోను, కలిసిన, చాలా గంభీరమైన కోలాహలము వినబడెను. 62

మూ. తతోఽహం పరమోద్విగ్నః స్వం రూపం ప్రత్యసంహరమ్,
అహం తు శింశుపావృక్షే పక్షీవ గహనే స్థితః. 63

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, పరమోద్విగ్నః = మిక్కిలి దిగులు చెందిన వాడనై, స్వం రూపమ్ = తన రూపమును, ప్రత్యసంహరమ్ = తగ్గించితిని. అహం తు = నేనైతే, గహనే = దట్టమైన, శింశుపావృక్షే = శింశుపావృక్షమునందు, పక్షీవ = పక్షి వలె, స్థితః = ఉంటిని.

తా. అప్పుడు నేను చాలా భయపడి నా రూపమును చిన్నది చేసికొని, దట్టమైన శింశుపావృక్షము మీద పక్షి వలె దాగి యుంటిని. 63

మూ. తతో రావణదారాశ్చ రావణశ్చ మహాబలః,
తం దేశం సమనుప్రాప్తా యత్ర సీతాభవత్ స్థితా. 64

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రావణదారాశ్చ = రావణుని భార్యలు, మహాబలః = గొప్ప బలము గల, రావణశ్చ = రావణుడు, సీతా = సీత, యత్ర = ఎక్కడ, స్థితా = ఉన్నది, అభవత్ = ఆయెనో, తమ్ = ఆ, దేశమ్ = ప్రదేశమును, సమనుప్రాప్తాః = చేరినారు.

తా. ఇంతలో మహాబలశాలియైన రావణుడు, అతని భార్యలు, సీత ఉన్న ప్రదేశమునకు వచ్చిరి 64

మూ. తం దృష్ట్వాథ వరారోహా సీతా రక్షోగణేశ్వరమ్,
సంకుచ్యోరూ స్తనౌ పీనౌ బాహుభ్యాం పరిరభ్య చ. 65

ప్ర. అ. అథ = అటు పిమ్మట, వరారోహా = శ్రేష్ఠమైన కటి ప్రదేశము గల, సీతా = సీత, రక్షోగణేశ్వరమ్ = రాక్షసగణమునకు ప్రభువైన, తమ్ = అతనిని. దృష్ట్వా = చూచి, ఊరూ = తొడలను, బాహుభ్యామ్ = బాహువులచేత, సంకుచ్య = ముడుచుకొని, పీనౌ = బలిసిన, స్తనౌ = స్తనములను, పరిరభ్య చ = కౌగలించుకొని (ఉండెను).

తా. సుందరమైన కటి ప్రదేశము గల సీత ఆ రావణుని చూచి తొడలను బాహువులచే దగ్గరగా ముడుచుకొని, బలిసిన స్తనములను బాహువులచే ఆచ్ఛాదించుకొనెను. 65

మూ. విత్రస్తాం పరమోద్విగ్నాం వీక్షమాణాం తతస్తతః,
త్రాణం కించిదపశ్యన్తీం వేపమానాం తపస్వినీమ్. 66
తామువాచ దశగ్రీవః సీతాం పరమదుఃఖితామ్,
అవాక్ఛిరాః ప్రపతితో బహుమన్యస్వ మామితి. 67

ప్ర. అ. విత్రస్తామ్ = భయపడినది, పరమోద్విగ్నామ్ = మిక్కిలి దిగులు చెందినది, తతస్తతః = అటు నటు, వీక్షమాణామ్ = చూచుచున్నది, కించిత్ =

పది, త్రాణమ్ = రక్షణమును, అపశ్యన్తీమ్ = చూడనిది, వేపమానామ్ = వణకి పోవుచున్నదీ, తపస్వినీమ్ = దీనురాలూ, పరమదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖించి నదీ అయిన, తాం సీతామ్ = ఆ సీతను గూర్చి, దశగ్రీవః = రావణుడు, అవాక్శిరాః = క్రిందికి వంచబడిన శిరస్సు కలవాడై, ప్రపతితః = నేంపై పడినవాడై, మామ్ = నన్ను, బహుమన్యస్వ = ఆదరించుము, ఇతి = అని, ఉవాచ = పలికెను.

తా. అప్పుడా సీత చాల దిగులు చెంది, భయపడుచు, రక్షకు లెవ్వరూ లేక, ఇటునటు చూచుచు వణకిపోవుచుండెను. ఈ విధముగ చాల దుఃఖితురాలై దైన్యముతో ఉన్న ఆమెతో రావణుడు తలక్రిందికి వంచి, నేంపై వ్రాలి, "నన్ను అంగీకరింపుము" అని పలికెను. 66, 67

మూ. యది చేత్త్వం తు దర్పాన్మాం నాభినన్దసి గర్వితే
ద్వౌ మాసావన్తరం సీతే పాస్యామి రుధిరం తవ. 68

ప్ర. అ. గర్వితే = గర్వితురాలా! సీతే = సీతా! త్వమ్ = నీవు, దర్పాత్ = గర్వమువలన, మామ్ = నన్ను, నాభినన్దసి యది చేత్ = అభినందింపకపోయినచో, ద్వౌ మాసౌ అన్తరమ్ = రెండు మాసములు అవధిగా, తవ = నీయొక్క రుధిరమ్ = రక్తమును, పాస్యామి = త్రాగగలను.

తా. గర్వితురాలవైన సీతా! నీవు దర్పముచేత నన్ను అంగీకరించక పోయినచో, రెండు మాసముల గడువు దాటిన పిమ్మట నీ రక్తము త్రాగెదను.

మూ. ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య రావణస్య దురాత్మనః,
ఉవాచ పరమక్రుద్ధా సీతా వచనముత్తమమ్, 69

ప్ర. అ. దురాత్మనః = దుర్బుద్ధియైన, తస్య = ఆ, రావణస్య = రావణుని యొక్క, ఏతత్ = ఈ, వచః = వచనమును, శ్రుత్వా = విని, సీతా = సీత, పరమక్రుద్ధా = మిక్కిలి కోపించినదై, ఉత్తమమ్ = ఉత్తమమైన, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. దుర్బుద్ధియైన రావణుడు పలికిన ఈ మాటలు విని సీత చాలా కోపించినదై ఉత్తమమైన వాక్యము పలికెను. 69

మూ. రాక్షసాధమ రామస్య భార్యామమితతేజసః,
ఇక్ష్వాకుకులనాథస్య స్నుషాం దశరథస్య చ, 70
అవాచ్యం వదతో జిహ్వా కథం న పతితా తవ.

ప్ర. అ. రాక్షసాధమ = ఓ! నీచుడ వైన రాక్షసుడా! అమితతేజసః = అత్యధిక మైన తేజస్సు గల, రామస్య = రాముని యొక్క, భార్యామ్ = భార్యను, ఇక్ష్వాకుకులనాథస్య = ఇక్ష్వాకువంశప్రభు వైన, దశరథస్య = దశరథుని యొక్క, స్నుషాం చ = కోడలూ అయిన నన్ను గూర్చి, అవాచ్యమ్ = పలుక కూడని మాటలు, వదతః = పలుకుచున్న, తవ = నీ యొక్క, జిహ్వా = నాలుక, కథమ్ = ఎట్లు, న పతితా = పడిపోలేదు.

తా. ఓ! రాక్షసాధమా! అమిత మైన తేజస్సు గల రాముని భార్యనూ, ఇక్ష్వాకువంశమునకు ప్రభు వైన దశరథుని కోడలినీ అయిన నా విషయమున ఇట్లు అనకూడని మాటలాడుచున్న నీ నాలుక ఎందుచేత పడిపోవుట లేదు? 70

మూ. కిం చిద్వీర్యం తవానార్య యో మాం భర్తురసన్నిధౌ, 71
అపహృత్యాగతః పాప తేనాదృష్టో మహాత్మనా.

ప్ర. అ. అనార్య = దుష్టుడా! పాప = పాపాత్ముడా! యః = ఏ నీవు, భర్తుః = భర్త యొక్క, అసంనిధౌ = సాన్నిధ్యము లేనప్పుడు, మామ్ = నన్ను, అపహృత్య = అపహరించి, మహాత్మనా = మహాత్ము డైన, తేన = అతనిచేత, అదృష్టః = చూడబడనివాడ వై, ఆగతః = వచ్చినావో అట్టి, తవ = నీ యొక్క, వీర్యమ్ = పరాక్రమము, కిం చిత్ = చాల అల్ప మైనది.

తా. ఓరీ! అనార్యుడా! పాపాత్ముడా! నా భర్త దగ్గర లేనప్పుడు, ఆ మహాత్ముడు చూడకుండగా, నన్ను అపహరించి తీసికొని వచ్చిన నీ పరాక్రమము అత్యల్ప మైనది. 71

మూ. న త్వం రామస్య సదృశో దాస్యేఽప్యస్య న యుజ్యసే,
యజ్ఞీయః సత్యవాదీ చ రణశ్లాఘీ చ రాఘవః

ప్ర. అ. త్వమ్ = నీవు, రామస్య = రామునకు, సదృశః = తగినవాడవు, న = కావు. అస్య = ఈతనికి, దాస్యేఽపి = దాస్యముచేయుటయందు కూడ, న

యుజ్యసే=తగవు. రాఘవః=రాముడు, యజ్వియః=యాగములు చేయువాడు, సత్యవాదీ=సత్యమునే పలుకువాడు, రణశ్లాఘీ చ=రణమునందు ప్రశంస కల వాడు.

తా. నీకు రామునితో పోలికయే లేదు. నీవు రామునికి దాసుడుగా ఉండుటకు కూడ తగవు. రాముడు యాగములు చేయువాడు. సత్యవాది. యుద్ధములో ప్రశంస లందుకొన్నవాడు. 72

మూ. జానక్యా పరుషం వాక్యమేవముక్తో దశాననః, 73
జజ్వాల సహసా కోపాచ్చితాస్థ ఇవ పావకః.

ప్ర. అ. జానక్యా=జానకిచేత, ఏవమ్=ఇట్లు, పరుషమ్=పరుషముగా, ఉక్తః=పలుకబడిన, దశాననః=రావణుడు, సహసా=వెంటనే, చితాస్థః=చితయందున్న, పావకః ఇవ=అగ్ని వలె, కోపాత్=కోపమువలన, జజ్వాల=మండిపడెను.

తా. రావణుడు జానకి పలికిన ఈ పరుషవాక్యములు విని కోపముతో, చితలో ఉన్న అగ్ని వలె, వెంటనే మండిపడెను. 73

మూ. వివృత్య నయనే క్రూరే ముష్టిముద్యమ్య దక్షిణమ్, 74
మైథిలీం హన్తుమారబ్ధః స్త్రీభిర్హాహాకృతం తదా.

ప్ర. అ. క్రూరే=క్రూరము లైన, నయనే=నేత్రములను, వివృత్య=త్రిప్పి, దక్షిణమ్=కుడి దైన, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, మైథిలీమ్=సీతను, హన్తుమ్=చంపుటకు, ఆరబ్ధః=ప్రారంభించెను. తదా=అప్పుడు, స్త్రీభిః=స్త్రీలచేత, హాహాకృతమ్=హాహాకారము చేయబడినది.

తా. అతడు క్రూరము లైన నేత్రములు పెద్దవి చేసి, కుడి పిడికిలి ఎత్తి సీతను చంపుట కై ఉద్యమించెను. అది చూచి అక్కడనున్న స్త్రీలందరు హాహా కారము చేసిరి. 74

మూ. స్త్రీణాం మధ్యాత్సముత్పత్య తస్య భార్యా దురాత్మనః,
వరా మందోదరీ నామ తయా స ప్రతిషేధితః.

ప్ర. అ. దురాత్మనః=దుష్టబుద్ధి గల, తస్య=అతని యొక్క, భార్యా=

భార్య యైన, మందోదరీ నామ=మందోదరి అను పేరు గల, వరా=ఉత్తమురా
లైన స్త్రీ. స్త్రీణామ్=స్త్రీలయొక్క, మధ్యాత్=మధ్యనుండి, సముత్పత్య=ఎగిరి
(ముందుకు వచ్చెను). తయా=ఆమెచేత, సః=అతడు, ప్రతిషేధితః=నివారింప
బడెను.

తా. అప్పుడు దురాత్ము డైన ఆ రావణుని భార్య యైన ఉత్తమురా లైన
మందోదరి స్త్రీల మధ్యనుండి శీఘ్రముగా ముందుకు వచ్చి అతనిని నివా
రించెను.

వి. రావణుణ్ణి నివారించినది "ధాన్యమాలిని" అను భార్య అని 22వ
సర్గలో వావిళ్ళ ప్రతిలోను, గోరఖ్‌పూర్ ప్రతిలోను ఉన్నది. ఈ ప్రతులలో
ఇక్కడ మాత్రము "మందోదరీ" అని ఉన్నది. ప్రాచ్యపాఠములో రెండు
చోట్లా మందోదరి అనియే ఉన్నది. 75

మూ. ఉక్తశ్చ మధురాం వాచం తయా స మదనార్దితః, 76
సీతయా తవ కిం కార్యం మహేన్ద్రసమవిక్రమ.

ప్ర. అ. మదనార్దితః=మన్మథునిచేత పీడితు డైన, సః=అతడు, తయా
=ఆమెచేత, మధురామ్=మధుర మైన, వాచమ్=వాక్కును, ఉక్తః చ=పలుక
బడినాడు కూడ. మహేన్ద్రసమవిక్రమ=మహేంద్రునితో సమాన మైన పరాక్ర
మము కలవాడా! సీతయా=సీతతో, తవ=నీకు, కిం కార్యమ్=ఏమి పని
ఉన్నది?

తా. మన్మథపీడితు డైన అతనితో ఆమె మధురముగా ఇట్లు పలికెను.
మహేంద్రునితో సమాన మైన పరాక్రమము గల వాడా! నీకు ఈ సీతతో ఏమి
పని! 76

మూ. దేవగన్ధర్వకన్యాభిర్యక్షకన్యాభిరేవ చ, 77
సార్ధం ప్రభో రమస్వేహ సీతయా కిం కరిష్యసి.

ప్ర. అ. ప్రభో=ఓ! ప్రభూ! దేవగన్ధర్వకన్యాభిః = దేవకన్యలతోను,
గంధర్వకన్యలతోను, యక్షకన్యాభిరేవ చ సార్ధమ్=యక్షకన్యలతోను, ఇహ=
ఇక్కడ, రమస్వ=క్రీడింపుము. సీతయా=సీతతో, కిం కరిష్యసి=ఏమి చేయ
గలవు!

తా. నాథా! నీవు దేవకన్యలతోను, గంధర్వకన్యలతోను, యక్షకన్యలతోను కూడి క్రీడింతువు. నీకు సీతతో ఏమి ప్రయోజనము! 77

మూ. తతస్తాభిః సమేతాభిర్నారీభిః స మహాబలః, 78
ప్రసాద్య సహసా నీతో భవనం స్వం నిశాచరః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, సః నిశాచరః=ఆ రావణుడు, సమేతాభిః=కలిసిన, తాభిః నారీభిః=ఆ స్త్రీలచేత, ప్రసాద్య= అనుగ్రహింపచేసికొని, సహసా=శీఘ్రముగా, స్వం భవనమ్=తన భవనమును గూర్చి, నీతః=తీసికొనివెళ్ళబడినాడు.

తా. పిమ్మట ఆ స్త్రీ లందరు కలిసి మహాబలవంతు డైన ఆ రాక్షసుని అనుగ్రహింపచేసికొని వెంటనే గృహములోనికి తీసికొని వెళ్ళిరి. 78

మూ. యాతే తస్మిన్ దశగ్రీవే రాక్షస్యో వికృతాననాః. 79
సీతాం నిర్భర్త్సయామాసుర్వాక్యైః క్రూరైః సుదారుణైః.

ప్ర. అ. తస్మిన్ దశగ్రీవే=ఆ రావణుడు, యాతే=వెళ్ళినవా డగుచుండగా, వికృతాననాః= వికృత మైన ముఖములు గల, రాక్షస్యః=రాక్షస స్త్రీలు, క్రూరైః=క్రూరములు, సుదారుణైః=చాల దారుణములు అయిన, వాక్యైః మాటలతో, సీతామ్=సీతను, నిర్భర్త్సయామాసుః=భయపెట్టిరి.

తా. ఆ రావణుడు వెళ్ళిపోయిన పిదప, వికృతము లైన ముఖములు గల రాక్షసస్త్రీలు, క్రూరములు, చాలా దారుణములు అయిన మాటలతో సీతను భయపెట్టిరి. 79

మూ. తృణవద్భాషితం తాసాం గణయామాస జానకీ, 80
గర్జితం చ తదా తాసాం సీతాం ప్రాప్య నిరర్థకమ్.

ప్ర. అ. జానకీ=సీత, తాసామ్=ఆ స్త్రీలయొక్క, భాషితమ్=భాషణమును, తృణవత్=గడ్డిపరకను వలె, గణయామాస= పరిగణించెను. తదా= అప్పుడు, తాసామ్=ఆ రాక్షసస్త్రీలయొక్క, గర్జితమ్=గర్జనము, సీతామ్= సీతను, ప్రాప్య=పొంది, నిరర్థకమ్=వ్యర్థ మైనది.

తా. జానకి ఆ రాక్షసస్త్రీల మాటలను గడ్డిపరక వలె నిర్లక్ష్యము చేసెను. ఆ స్త్రీల గర్జన లన్నీ సీత విషయములో వ్యర్థ మైనవి.

మూ. వృథాగర్జితనిశ్చేష్టా రాక్షస్యః పిశితాశనాః। ౪౧
రావణాయ శశంసుస్తాః సీతాధ్యవసితం మహత్.

ప్ర. అ. పిశితాశనాః = పచ్చి మాంసము తిను, తాః రాక్షస్యః = ఆ రాక్షసస్త్రీలు, వృథాగర్జితనిశ్చేష్టాః = వ్యర్థ మైన గర్జితము కలవా రగుటచే నిశ్చేష్ట లై, మహత్ = గొప్ప దైన, తత్ = ఆ, సీతాధ్యవసితమ్ = సీత నిర్ణయమును, రావణాయ = రావణునకు, శశంసుః = చెప్పిరి.

తా. పచ్చి మాంసము తినే ఆ రాక్షసస్త్రీలు తమ గర్జనలు వ్యర్థమగుటచే ఏమీ చేయజాలక, గొప్ప దైన ఆ సీత నిశ్చయమును రావణునకు తెలిపిరి. ౪౧

మూ. తతస్తాః సహితాః సర్వా విహతాశా నిరుద్యమాః, ౪౨
పరిక్షిప్య సమన్తాత్తాం నిద్రావశముపాగతాః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సర్వాః = సమస్త మైన, తాః = ఆ స్త్రీలు, సహితాః = కలిసినవా రై, విహతాశాః = హతాశ లై, నిరుద్యమాః = ప్రయత్నము లేనివారై, తామ్ = సీతను, సమన్తాత్ = అంతట, పరిక్షిప్య = చుట్టుకొని, నిద్రావశమ్ = నిద్రావశమును, ఉపాగతాః = పొందినారు

తా. పిమ్మట ఆ స్త్రీలందరు కలిసి, సీత మనస్సు మార్చే ఆశను వదలుకొని, ఆ ప్రయత్నము మానివేసి, సీత చుట్టూ పండుకొని నిద్రించిరి. ౪౨

మూ. తాసు చైవ ప్రసుప్తాసు సీతా భర్తృహితే రతా, ౪౩
విలప్య కరుణం దీనా ప్రశుశోచ సుదుఃఖితా.

ప్ర. అ. తాసు = ఆ స్త్రీలు, ప్రసుప్తాసు = నిద్రించినవా రగుచుండగా, భర్తృహితే = భర్తయొక్క హితమునందు, రతా = ఆసక్తిగల, సీతా = సీత, దీనా = దీనురా లై, కరుణమ్ = జాలి కలుగు నట్లుగా, విలప్య = విలపించి, సుదుఃఖితా = చాల దుఃఖించిన దై, ప్రశుశోచ = ఎక్కువగా ఏడ్చెను.

తా. ఆ రాక్షసస్త్రీలు నిద్రపోయిన పిమ్మట, భర్త హితమునే కోరు ఆ

సీత దీనురాలై వారి కలుగు నట్లు విలపించి, వారి దుఃఖించుట అధికముగా ఏడ్చెను. 83

మూ. తాసాం మధ్యాత్సముత్థాయ త్రిజటా వాక్యమబ్రవీత్ 84
ఆత్మానం ఖాదత క్షిప్రం న సీతా వినశిష్యతి,
జనకస్యాత్మజా సాధ్వీ స్నుషా దశరథస్య చ. 85

ప్ర. అ. తాసామ్ = ఆ రాక్షసస్త్రీలయొక్క, మధ్యాత్ = మధ్యనుండి, సముత్థాయ = లేచి, త్రిజటా = త్రిజట, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆత్మానమ్ = మిమ్ములనే, ఖాదత = తినండి. జనకస్య = జనకుని యొక్క, ఆత్మజా = కూతురు, సాధ్వీ = పతివ్రత, దశరథస్య = దశరథునియొక్క, స్నుషా = కోడలు అయిన, సీతా = సీత, న వినశిష్యతి = నశించదు.

తా. ఆ రాక్షసస్త్రీల మధ్యలోనుండి త్రిజట అను రాక్షసి లేచి ఇట్లు పలికెను. మిమ్ములను మీరే శీఘ్రముగా తినండి. జనకుని కూతురు, పతివ్రత, దశరథుని కోడలు అయిన సీత మాత్రము నశించదు. 84, 85

మూ. స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః,
రక్షసాం చ వినాశాయ భర్తురస్యా జయాయ చ. 86

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులయొక్క, వినాశాయ చ = నాశనమునకు, అస్యాః = ఈమె యొక్క, భర్తుః = భర్త యొక్క, జయాయ చ = జయము కొరకు, అద్య = ఇప్పుడు, మయా = నాచేత, దారుణః = భయంకరము, రోమహర్షణః = రోమాంచము కలిగించునదీ అయిన, స్వప్నః = స్వప్నము, దృష్టః = చూడబడినది.

తా. ఇప్పుడు నాకు ఒక భయంకర మైన, గగుర్పాటు కలిగించే స్వప్నము వచ్చినది. అది రాక్షసుల నాశమును, ఈమె భర్త విజయమును సూచించుచున్నది. 86

మూ. అలమస్మాత్పరిత్రాతుం రాఘవాద్రాక్షసీగణమ్,
అభియాచామ వైదేహీమేతద్ధి మమ రోచతే. 87

ప్ర. అ. అస్మాత్ = ఈ, రామవాత్ = రామునినుండి, రాక్షసీగణమ్ = రాక్షసస్త్రీల సముదాయమును, పరిత్రాతుమ్ = రక్షించుటకు, అలమ్ = (ఈమె) చాలును, వైదేహీమ్ = సీతను, అభియాచామ = ప్రార్థించెదము, ఏతత్ = ఇది, మమ = నాకు, రోచతే హి = ఇష్ట మగుచున్నది కదా.

తా. ఈ సీతను ప్రార్థించెదము. ఈమె రామునినుండి, రాక్షసస్త్రీల నందఱిని రక్షింప సమర్థురాలు. నాకు ఇట్లు చేయుట మంచి దని తోచుచున్నది. 87

మూ. యస్యా హ్యేవంవిధః స్వప్నో దుఃఖితాయాః ప్రదృశ్యతే,
సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా సుఖమాప్నో త్యనుత్తమమ్. 88
ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా.

ప్ర. అ. యస్యాః = ఏ స్త్రీ, దుఃఖితాయాః = దుఃఖితురాలై యుండగా, ఏవంవిధః = ఈ విధ మైన, స్వప్నః = స్వప్నము, ప్రదృశ్యతే = చూడబడునో, సా = ఆమె, వివిధైః = అనేక విధము లైన, దుఃఖైః = దుఃఖములచే, విముక్తా = విడువబడిన దై, అనుత్తమమ్ = అత్యధిక మైన, సుఖమ్ = సుఖమును, ఆప్నోతి = పొందును. జనకాత్మజా = జనకుని కూతు రైన, మైథిలీ = సీత, ప్రణిపాత ప్రసన్నా హి = నమస్కారము చేయుటచే ప్రసన్నురా లగును కదా.

తా. ఏ స్త్రీ దుఃఖితురాలై, యుండగా ఇట్టి స్వప్నము కనబడునో, ఆమె దుఃఖములను వీడి సుఖము పొందును. సీత నమస్కారము చేసినంత మాత్రముననే ప్రీతినొందును. 88

మూ. తతః సా హ్రీమతీ బాలా భర్తుర్విజయహర్షితా, 89
అవోచద్యది తత్తథ్యం భవేయం శరణం హి వః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, హ్రీమతీ = సిగ్గుపడుచున్న, బాలా = చిన్న వయస్సు గల, సా = ఆ సీత, భర్తుః = భర్త యొక్క, విజయహర్షితా = విజయముచేత సంతోషించినదై, అవోచత్ = పలికెను. తత్ = అది, తథ్యం యది = సత్యమే అయినచో, వః = మీకు, శరణమ్ = శరణము, భవేయమ్ = అగుదును.

తా. తన భర్తకు విజయము కలుగు నని వినగానే సంతోషించుచు చిన్న

వయస్సులో ఉన్న ఆ సీత, సిగ్గుపడుచు. "అతి సత్యమే అయినచో మిమ్ముం సంరక్షించెదను" అని పలికెను.

వి. త్రిజటాస్వప్న వృత్తాంతమును వర్ణించిన 27వ సర్గలో సీత ఈ విధముగా అన్నట్లు లేదు. గోరఖ్‌పూర్ ప్రతిలో మాత్రం ఈ శ్లోకమే 27వ సర్గ చివర కూడా ఉన్నది. ప్రాచ్యపాఠంలో అసలు హనుమంతుడు త్రిజటా స్వప్న వృత్తాంతమును జాంబవదాదులకు చెప్పినట్లే లేదు. సీత ఇట్లు అన్నట్లు లేకుండా ఉంచేనే ఉచితముగా ఉంటుంది. 28వ సర్గలో సీత ప్రాణపరిత్యాగోద్యమం చేసినట్లు వర్ణించిన తీరును పట్టి దూరగా ఆ రాక్షసస్త్రీలు ఏమి మాటలాడుకుంటున్నారో సీత ఏ మాత్రము విన్నట్లు కనపడదు. అదే ఉచితము.

మూ. తాం చాహం తాదృశీం దృష్ట్వా సీతాయా దారుణాం దశామ్,
చిన్తయామాస విశ్రాన్తో న చ మే నిర్వృతం మనః.

ప్ర. అ. అహమ్=నేను, విశ్రాన్తః=విశ్రమించిన వాడనై, సీతాయాః=సీత యొక్క, తాదృశీమ్=అట్టి, తామ్=ఆ, దారుణామ్=దారుణ మైన, దశామ్=అవస్థను, దృష్ట్వా=చూచి, చిన్తయామాస=ఆలోచించితిని. మే=నాయొక్క, మనః=మనస్సు, న నిర్వృతమ్=ఊరటచెందలేదు.

తా. నేను కొంత సేపు విశ్రమించి సీతకు సంభవించిన దారుణ మైన అట్టి అవస్థను చూచి, ఏమి చేయవలెనా అని ఆలోచించితిని. కాని నా మనస్సుకు ఊరట లభించలేదు. 90

మూ. సంభాషణార్థం చ మయా జానక్యాశ్చిన్తితో విధిః, 91
ఇక్ష్వాకూణాం హి వంశస్తు తతో మమ పురస్కృతః.

ప్ర. అ. మయా=నాచేత, జానక్యాః=జానకియొక్క, సంభాషణార్థమ్=సంభాషణముకొరకు, విధిః=ఉపాయము, చిన్తితః=ఆలోచింపబడినది. తతః=పిమ్మట, ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశ రాజుల, వంశస్తు=వంశము, మమ=నాకు (నాచే), పురస్కృతః=ముందు ఉంచబడినది.

తా. జానకితో సంభాషణ చేయుటకు ఉపాయమును గూర్చి ఆలోచించి, నేను ఇక్ష్వాకువంశీయుల చరిత్రను ప్రారంభములో వర్ణించితిని. 91

మూ. శ్రుత్వా తు గదితాం వాచం రాజర్షిగణపూజితామ్, 92
ప్రత్యభాషత మాం దేవీ బాష్పైః పిహితలోచనా.

ప్ర. అ. దేవీ=దేవి యైన సీత, రాజర్షిగణపూజితామ్=రాజర్షుల సముదాయముచేత పూజింపబడిన, గదితామ్=నాచే పలుకబడిన, వాచమ్=వాక్యమును, శ్రుత్వా=విని, బాష్పైః=కన్నీళ్ళచేత, పిహితలోచనా=కప్పబడిన నేత్రములు గలదై, మామ్=నన్ను గూర్చి, ప్రత్యభాషత=తిరిగి పలికెను.

తా. రాజర్షి సముదాయముంచేత ఆదరింపబడు నేను పలికిన మాటలు విని, సీతాదేవి కన్నీళ్లు కప్పిన కన్నులతో, నాతో ఇట్లు పలికెను. 92

మూ. కస్త్వం కేన కథం చేహ ప్రాప్తో వానరపుఙ్గవ, 93
కా చ రామేణ తే ప్రీతిస్తన్మే శంసితుమర్హసి.

ప్ర. అ. వానరపుఙ్గవ=ఓ! వానరశ్రేష్ఠా! త్వమ్=నీవు, కః=ఎవ్వరవు? కేన=ఏ కారణముచేత, కథమ్=ఎట్లు, ఇహ=ఇక్కడికి, ప్రాప్తః=వచ్చినావు? తే=నీకు, రామేణ=రామునితో, ప్రీతిః=స్నేహము, కా=ఏమిటి? తత్=దానిని, మే=నాకు, శంసితుమ్=చెప్పుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ! వానరశ్రేష్ఠా! నీవు ఎవ్వరవు? ఎందుకు వచ్చినావు? ఎట్లు వచ్చినావు? నీకు రామునితో స్నేహము ఎట్లు ఏర్పడినది? దీని సంతను నాకు చెప్పుము. 93

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా హ్యహమప్యబ్రువం వచః, 94
దేవి రామస్య భర్తుస్తే సహాయో భీమవిక్రమః,
సుగ్రీవో నామ విక్రాన్తో వానరేన్ద్రో మహాబలః. 95

ప్ర. అ. తస్యాః=ఆమెయొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, అహమపి=నేను, వచః=వచనమును, అబ్రువమ్=పలికితిని. దేవి=ఓ! దేవీ! తే=నీయొక్క, భర్తుః=భర్తయొక్క, సహాయః=సహాయుడు, మహాబలః=గొప్ప బలము కలవాడు, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము కలవాడు, సుగ్రీవో నామ=సుగ్రీవుడను పేరు గలవాడు అయిన, విక్రాన్తః=పరాక్రమవంతుడైన, వానరేన్ద్రః=వానరశ్రేష్ఠుడు ఉన్నాడు.

తా. ఆమె మాటలు విని నేను ఇట్లు పలికితిని. "దేవీ! నీ భర్త యైన రామునకు సహాయభూతుడు, భయంకర మైన పరాక్రమము కలవాడు, మహా బలశాలి, పరాక్రమమును చూపువాడు అయిన సుగ్రీవు డను వానరరాజు ఉన్నాడు". 95

మూ. తస్య మాం విద్ధి భృత్యం త్వం హనుమన్తమిహాగతమ్,
భర్త్రాహం ప్రేషితస్తుభ్యం రామేణాక్లిష్టకర్మణా. 96

ప్ర. అ. ఇహ=ఇక్కడికి, ఆగతమ్=వచ్చిన, మామ్=నన్ను, తస్య=ఆ సుగ్రీవునియొక్క, భృత్యమ్=భృత్యునిగా, త్వమ్=నీవు, విద్ధి=తెలుసుకొనుము. అహమ్=నేను, భర్త్రా=నీ భర్త యైన, అక్లిష్టకర్మణా=శ్రమ చెందకుండ పనులు చేయు, రామేణ=రామునిచేత, తుభ్యమ్=నీకొరకు, ప్రేషితః=పంపబడితిని.

తా. ఇక్కడకు వచ్చిన నేను ఆ సుగ్రీవుని భృత్యుడను. నీ భర్త యైన, శ్రమపడకుండా కార్యము నిర్వహించు రాముడు నీ నిమిత్తమై నన్నిచటికి పంపినాడు. 96

మూ. ఇదం చ పురుషవ్యాఘ్రః శ్రీమాన్ దాశరథిః స్వయమ్,
అఙ్గులీయమభిజ్ఞానమదాత్తుభ్యం యశస్విని. 97

ప్ర. అ. యశస్విని=కీర్తిమంతురాలా! పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుడు, శ్రీమాన్=శ్రీమంతుడు అయిన, దాశరథిః=రాముడు, స్వయమ్=స్వయముగా, ఇదమ్=ఈ, అఙ్గులీయమ్=ఉంగరమును, తుభ్యమ్=నీకు, అభిజ్ఞానమ్=ఆనవాలుగా, అదాత్=ఇచ్చెను

తా. కీర్తిమంతురాలా! పురుషశ్రేష్ఠుడు లక్ష్మీసంపన్నుడు, అయిన రాముడు ఈ ఉంగరమును నీకు ఆనవాలుగా, స్వయముగా ఇచ్చినాడు. 97

మూ. తదిచ్ఛామి త్వయాజ్ఞప్తం దేవి కిం కరవాణ్యహమ్,
రామలక్ష్మణయోః పార్శ్వం నయామి త్వాం కిముత్తరమ్.

ప్ర. అ. దేవి=ఓ! దేవీ! తత్=ఆ కారణమువలన, త్వయా=నీచేత, ఆజ్ఞప్తమ్=ఆజ్ఞాపనను, ఇచ్ఛామి=కోరుచున్నాను. అహమ్=నేను, కిమ్=

ఏమి, కరవాణి = చేయుదును: త్వామ్ = నిన్ను, రామలక్ష్మణయోః = రామ లక్ష్మణులయొక్క, పార్శ్వమ్ = పార్శ్వమును గూర్చి, నయామి = తీసికొని వెళ్ళెదను. ఉత్తరమ్ = ప్రత్యుత్తరము, కిమ్ = ఏమి?

తా. దేవీ! ఆ కారణముచే నే నేమి చేయవలెనో ఆజ్ఞాపించుము. నిన్ను రామ లక్ష్మణుల దగ్గరకు తీసికొనివెళ్లెదను. నీ వేమందువు? 98

మూ. ఏతచ్ఛ్రుత్వా విదిత్వా చ సీతా జనకనన్దినీ.
ఆహ రావణముత్సార్య రాఘవో మాం నయత్వితి. 99

ప్ర. అ. జనకనన్దినీ = జనకుని కుమార్తె యైన, సీతా = సీత, ఏతత్ = ఈ మాటను, శ్రుత్వా = విని, విదిత్వా చ = తెలుసుకొని, రాఘవః = రాముడు, రావణమ్ = రావణుని, ఉత్సార్య = చంపి, మామ్ = నన్ను, నయతు = తీసికొనివెళ్లు గాక, ఇతి = అని, ఆహ = పలికెను.

తా. జనకుని కుమార్తె యైన సీతాదేవి నా మాటలు విని, విషయమును గ్రహించి, "రాముడు రావణుని సంహరించి నన్ను తీసికొనివెళ్లవలెను" అని పలికెను. 99

మూ. ప్రణమ్య శిరసా దేవీమహమార్యామనిన్దితామ్,
రాఘవస్య మనోహ్లాదమభిజ్ఞానమయాచిషమ్. 100

ప్ర. అ. అహమ్ = నేను, ఆర్యామ్ = పూజ్యురాలు, అనిన్దితామ్ = నిందింప బడనిది అయిన, దేవీమ్ = సీతాదేవిని, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, రాఘవస్య = రామునకు, మనోహ్లాదమ్ = మనస్సునకు ఆనందము కలిగించు, అభిజ్ఞానమ్ = ఆనవాలును, అయాచిషమ్ = కోరితిని.

తా. నేను పూజ్యురాలు, ఎట్టి దోషములూ లేనిదీ అయిన సీతాదేవికి శిరస్సు వంచి నమస్కరించి, రాముని మనస్సునకు ఆహ్లాదము కలిగించు ఆనవాలు ఏదైనా ఇమ్మని ఆమెను ప్రార్థించితిని. 100

మూ. అథ మామబ్రవీత్సీతా గృహ్యతామయముత్తమః,
మణిర్యేన మహాబాహూ రామస్త్వాం బహుమన్యతే. 101

ప్ర. అ. అథ = పిమ్మట, సీతా = సీత, మామ్ = నన్ను గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఉత్తమః = ఉత్తమ మైన, అయమ్ = ఈ, మణిః = మాణిక్యము. గృహ్యతామ్ = గ్రహించబడుగాక, యేన = దేనిచేత, మహాబాహుః = గొప్ప బాహువులు గల, రామః = రాముడు, త్వామ్ = నిన్ను, బహుమన్యతే = గౌరవించునో.

తా. పిమ్మట సీతాదేవి నాతో ఇట్లు పలికెను. "ఉత్తమ మైన ఈ మణిని తీసికొనుము. దీనిని చూచి, మహాబాహువైన రాముడు నిన్ను ఆదరించగలడు".

మూ. ఇత్యుక్త్వా తు వరారోహా మణిప్రవరమద్భుతమ్,
ప్రాయచ్ఛత్పరమోద్విగ్నా వాచా మాం సందిదేశ హ.

ప్ర. అ. వరారోహా = శ్రేష్ఠ మైన కటి ప్రదేశము గల ఆ సీతాదేవి. ఇతి = ఇట్లు. ఉక్త్వా = పలికి, అద్భుతమ్ = ఆశ్చర్యకర మైన, మణిప్రవరమ్ = శ్రేష్ఠ మైన మాణిక్యమును, ప్రాయచ్ఛత్ = ఇచ్చెను. పరమోద్విగ్నా = మిక్కిలి దిగులు చెందిన దై, మామ్ = నన్ను, వాచా = వాక్కుతో, సందిదేశ హ = సందేశము నిచ్చి పంపెను.

తా. శ్రేష్ఠ మైన కటిప్రదేశము గల సీతాదేవి ఇట్లు పలికి, ఆశ్చర్యకర మైన ఉత్తమ మైన మాణిక్యమును ఇచ్చెను. చాల దిగులు చెందిన దై, మాటలతో కూడ నాకు సందేశము నిచ్చెను. 102

మూ. తత స్తస్యై ప్రణమ్యాహం రాజపుత్ర్యై సమాహితః,
ప్రదక్షిణం పరిక్రామమిహాభ్యుద్గతమానసః. 103

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్ = నేను, తస్యై = ఆ, రాజపుత్ర్యై = రాజకుమారికి, ప్రణమ్య = నమస్కరించి, సమాహితః = సావధానచిత్తుడ నై, ఇహ = ఇక్కడికి, అభ్యుద్గతమానసః = వెళ్ళిన మనస్సు కలవాడనై, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణముగా, పరిక్రామమ్ = నడచితిని.

తా. పిమ్మట నేను సావధానచిత్తముతో రాజపుత్రి యైన సీతకు నమస్కరించి, మనస్సు ఇక్కడికి బయలుదేరి రాగా, ఆమెకు ప్రదక్షిణము చేసితిని. 103

మూ. ఉక్తో௨హం పునరేవేదం నిశ్చిత్య మనసా తయా,
హనుమన్ మమ వృత్తాన్తం వక్తుమర్హసి రాఘవే. 104

ప్ర. అ. అహమ్ = నేను, తయా = ఆమెచేత, మనసా = మనస్సుతో, నిశ్చిత్య=నిశ్చయించి, పునరేవ=మరల, ఉక్తః=పలుకబడితిని. హనుమన్ = హనుమంతుడా! రామవే = రామునియందు (రామునకు), మమ = నాయొక్క, వృత్తాన్తమ్=వృత్తాంతమును, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఆమె మనస్సులో ఏదో నిశ్చయించుకొని మరల నాతో ఇట్లు పలికెను. "హనుమంతుడా! రామునకు నా వృత్తాంత మంతా చెప్పుము. 104

మూ. యథా శ్రుత్వైవ నచిరాత్తావుభౌ రామలక్ష్మణౌ,
సుగ్రీవసహితౌ వీరావుపేయాతాం తథా కురు. 105

ప్ర. అ. వీరౌ=వీరులైన, తౌ = ఆ, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉభౌ = ఇద్దరూ, శ్రుత్వైవ = వినగానే, సుగ్రీవసహితౌ = సుగ్రీవసహితులై, న చిరాత్ = శీఘ్రముగా, యథా=ఎట్లు, ఉపేయాతామ్=వచ్చెదరో, తథా=అట్లు, కురు=చేయుము.

తా. వీరులైన ఆ రామలక్ష్మణు లిద్దరూ విన్న వెంటనే సుగ్రీవునితో కలిసి ఇక్కడికి వచ్చు నట్లు చేయుము. 105

మూ. యద్యన్యథా భవేదేతద్ద్వౌ మాసౌ జీవితం మమ,
న మాం ద్రక్ష్యతి కాకుత్స్థో మ్రియే సాహమనాథవత్.

ప్ర. అ. అన్యథా = మరొక విధముగా, భవేద్యది = అయిన ట్లయితే, మమ=నాయొక్క, జీవితమ్=జీవితము, ద్వౌ = రెండు, మాసౌ = మాసములు మాత్రమే. కాకుత్స్థః = రాముడు, మామ్=నన్ను, న ద్రక్ష్యతి=చూడడు. సా అహమ్=అట్టి నేను, అనాథవత్=నాథుడు లేనిదానను వలె, మ్రియే=మరణించెదను.

తా. రామలక్ష్మణులు రాకున్నచో నా జీవితము రెండుమాసములు మాత్రమే ఉండును. అటుపై రాముడు నన్ను చూడజాలడు. అట్టి నేను అనాథురాలను వలె మరణించెదను. 106

మూ. తచ్ఛ్రుత్వా కరుణం వాక్యం క్రోధో మామభ్యవర్తత,
ఉత్తరం చ మయా దృష్టం కార్యశేషమనంతరమ్. 107

ప్ర. అ. కరుణమ్=దీనమైన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, మామ్=నన్ను, క్రోధః=కోపము, అభ్యవర్తత=వ్యాపించెను. ఉత్తరమ్=ఆటు పిమ్మట. అనన్తరమ్=తరువాత చేయదగిన, కార్యశేషమ్=కార్యము యొక్క శేషము, మయా=నాచేత, దృష్టమ్=చూడబడినది.

తా. జాలి గొలుపు ఆ మాట వినగానే నాకు చాల కోపము కలిగెను. పిమ్మట (నేను) తరవాత చేయవలసిన, మిగిలిపోయిన పనిని గూర్చి ఆలోచించితిని. 107

మూ. తతోఽవర్ధత మే కాయస్తదా పర్వతసన్నిభః।
యుద్ధకాఙ్క్షీ వనం తచ్చ వినాశయితుమారభే. 108

ప్ర. అ. తతః=ఆటు పిమ్మట, తదా=అప్పుడు, మే=నాయొక్క, కాయః=శరీరము, పర్వతసంనిభః=పర్వతముతో సమానమై, అవర్ధత=పెరిగెను. యుద్ధకాఙ్క్షీ=యుద్ధమును కోరుచున్నవాడనై, తత్=ఆ, వనమ్=వనమును, వినాశయితుమ్=నశింపచేయుటకు, ఆరభే=ప్రారంభించితిని.

తా. అప్పుడు నా శరీరము పర్వతముతో సమానముగా పెరిగెను. యుద్ధము కోరుచు ఆ వనమును నశింపచేయుటకు ప్రారంభించితిని. 108

మూ. తద్భగ్నం వనషణ్డం తు భ్రాన్తత్రస్తమృగద్విజమ్,
ప్రతిబుద్ధా నిరీక్షన్తే రాక్షస్యో వికృతాననాః. 109

ప్ర. అ. వికృతాననాః=వికృతములైన ముఖములు గల, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, ప్రతిబుద్ధాః=మేల్కొన్నవారై, భగ్నమ్=విరగగొట్టబడినది, భ్రాన్తత్రస్తమృగద్విజమ్=తిరుగుచున్న, భయపడిన మృగములు పక్షులు కలది అయిన, తత్=ఆ, వనషణ్డమ్=వనసమూహమును, నిరీక్షన్తే=చూచిరి.

తా. వికృతములైన ముఖములు గల రాక్షసస్త్రీలు నిద్రనుండి లేచి, భయముతో పారిపోవుచున్న మృగములు, పక్షులు గల విరగగొట్టబడిన వనమును చూచిరి. 109

మూ. మాం చ దృష్ట్వా వనే తస్మిన్ సమాగమ్య తతస్తతః,
తాః సమభ్యాగతాః క్షిప్రం రావణాయాచచక్షిరే. 110

ప్ర. అ. తతస్తతః = ఆ యా ప్రదేశములనుండి, సమాగమ్య = వచ్చి, తస్మిన్ వనే = ఆ వనమునందు, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, తాః = ఆ స్త్రీలు, క్షిప్రమ్ = శీఘ్రముగా, సమభ్యాగతాః = వెళ్లినవారై, రావణాయ = రావణునకు, ఆచచక్షిరే = చెప్పిరి.

తా. ఆ రాక్షసస్త్రీలు ఆ యా ప్రదేశములనుండి వచ్చి, వనములో నన్ను చూచి, వెంటనే వెళ్లి రావణునకు చెప్పిరి. 110

మూ. రాజన్వనమిదం దుర్గం తవ భగ్నం దురాత్మనా,
వానరేణ హ్యవిజ్ఞాయ తవ వీర్యం మహాబల. 111

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గల, రాజన్ = రాజా! దురాత్మనా = దుర్బుద్ధియైన, వానరేణ = వానరునిచేత, తవ = నీయొక్క, వీర్యమ్ = పరాక్రమమును, అవిజ్ఞాయ = తెలియక, దుర్గమ్ = ప్రవేశింప శక్యము కాని, తవ = నీయొక్క, ఇదం వనమ్ = ఈ వనము, భగ్నమ్ = విరుగగొట్టబడినది.

తా. మహాబలవంతుడ వైన ఓ! రాజా! దురాత్ముడైన వానరుడు, నీ పరాక్రమమును గూర్చి తెలియక ప్రవేశింప శక్యముకాని నీ ఉద్యానమును విరచి వేసినాడు. 111

మూ. దుర్బుద్ధేస్తస్య రాజేన్ద్ర తవ విప్రియకారిణః,
వధమాజ్ఞాపయ క్షిప్రం యథాసౌ విలయం వ్రజేత్. 112

ప్ర. అ. రాజేన్ద్ర = మహారాజా! అసౌ = ఈ వానరుడు, యథా = ఎట్లు, విలయమ్ = నాశమును, వ్రజేత్ = పొందునో అట్లు, తవ = నీకు, విప్రియకారిణః = అపకారము చేసిన, దుర్బుద్ధేః = దుర్బుద్ధియైన, తస్య = వానియొక్క, వధమ్ = వధను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము.

తా. మహారాజా! నీకు అపకారము చేసిన ఆ దుర్బుద్ధి గల వానరుడు నాశమును పొందునట్లు వెంటనే వానిని సంహరింపుటకై ఆజ్ఞాపింపుము. 112

మూ. తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రేణ విసృష్టా భృశదుర్జయాః,
రాక్షసాః కింకరా నామ రావణస్య మనోనుగాః. 113

ప్ర. అ. తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, రాక్షసేన్ద్రేణ = రావ

వాని చేత, భృశదుర్ధర్షయా = మిక్కిలి జయింప శక్యము కాని, రావణస్య = రావణునియొక్క, మనోనుగాః = మనస్సును అనుసరించిన, కింకరా నామ = కింకరు లను పేరు గల, రాక్షసాః = రాక్షసులు, విసృష్టాః = పంపబడినారు.

తా. రావణుడు ఆ మాటలు విని, తన మనస్సును అనుసరించి ప్రవర్తించువారు, జయింప శక్యము కానివారు అయిన కింకరు లను రాక్షసులను పంపెను.

మూ. తేషామశీతిసాహస్రం శూలముద్గరపాణినామ్,
మయా తస్మిన్వనోద్దేశే పరిఘేణ నిషూదితమ్. 114

ప్ర. అ. తస్మిన్ = ఆ, వనోద్దేశే = వనప్రదేశమునందు, శూలముద్గరపాణినామ్ = శూలములు, ముద్గరములు, హస్తములందు గల, తేషామ్ = ఆ కింకరులయొక్క, అశీతిసాహస్రమ్ = ఎనుబది వేలు, మయా = నాచేత, పరిఘేణ = పరిఘచేత, నిషూదితమ్ = నశింపచేయబడినది.

తా. నేను ఆ వనమునందు, శూలములు, ముద్గరములు ధరించి వచ్చిన ఆ ఎనుబది వేల కింకరులను పరిఘతో చంపివేసితిని. 114

మూ. తేషాం తు హతశేషా యే తే గత్వా లఘువిక్రమాః,
నిహతం చ మహత్సైన్యం రావణాయాచచక్షిరే. 115

ప్ర. అ. తేషామ్ = వారిలో, యే = ఎవరు, హతశేషాః = చంపగా మిగిలిన వారో, తే = వారు, లఘువిక్రమాః = శీఘ్రగమనము కలవారై, గత్వా = వెళ్ళి, మహత్ = గొప్ప, సైన్యమ్ = సైన్యమును, నిహతమ్ = చంపబడినదానినిగా, రావణాయ = రావణునకు, ఆచచక్షిరే = చెప్పిరి

తా. ఆ రాక్షసులలో చావగా మిగిలినవాళ్లు శీఘ్రముగా పరుగెత్తి వెళ్ళి "ఆ మహాసైన్య మంతా నశింప చేయబడినది" అని రావణునకు తెలిపిరి.

మూ. తతో మే బుద్ధిరుత్పన్నా చైత్యప్రాసాదమాక్రమమ్,
తత్రస్థాన్ రాక్షసాన్ హత్వా శతం స్తమ్భేన వై పునః,
లలామభూతో లఙ్కాయాః స వై విధ్వంసితో మయా.

ప్ర. అ. తతః = ఆటు పిమ్మట, మే = నాకు, బుద్ధిః = ఆలోచన, ఉత్పన్నా =

=పడ్డినది. చైత్యప్రాసాదమ్=చైత్యప్రాసాదమును, ఆక్రమమ్=ఆక్రమించితిని. స్తమ్భేన = స్తంభముచేత, తత్రస్థాన్ = అక్కడ నున్న, శతమ్ = నూరుగురు, రాక్షసాన్ = రాక్షసులను, హత్వా = చంపి. పునః = మరల, మయా = నాచేత, లఙ్కాయాః = లంకయొక్క, అలఙ్కారభూతః = అలంకార మైన, సః = ఆ ప్రాసాదము, విధ్వంసితః=నశింపచేయబడినది.

తా. అప్పుడు నాకు ఒక ఆలోచన కలిగినది. అక్కడ ఉద్యానములోని ప్రధాన మైన ప్రాసాదమును (చైత్యప్రాసాదమును), ఆక్రమించి, అక్కడ నున్న రాక్షసులను స్తంభముతో చంపి, లంకకే అలంకార మైన ఆ ప్రాసాదమును నశింపచేసితిని. 116

మూ. తతః ప్రహస్తస్య సుతం జమ్బుమాలినమాదిశత్, 117
రాక్షసైర్బహుభిః సార్ధం ఘోరరూపైర్భయానకైః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఘోరరూపైః = ఘోర మైన రూపము గల, భయానకైః=భయంకరు లైన, బహుభిః=అనేకు లైన, రాక్షసైః సార్ధమ్= రాక్షసులతో కూడ, ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క, సుతమ్ = కుమారు డైన, జమ్బుమాలినమ్ = జంబుమాలిని, ఆదిశత్ = ఆజ్ఞాపించెను.

తా. పిమ్మట రావణుడు ఘోరము లైన రూపములతో భయంకరులుగా ఉన్న అనేక రాక్షసులతో, ప్రహస్తుని కుమారు డైన జంబుమాలిని ఆజ్ఞాపించెను.

మూ. తం మహాబలసంపన్నం రాక్షసం రణకోవిదమ్, 118
పరిఘేణాతిఘోరేణ సూదయామి సహానుగమ్.

ప్ర. అ. మహాబలసంపన్నమ్=గొప్ప బలముతో కూడినవాడు, రణకోవిదమ్=యుద్ధమునందు ప్రవీణుడు అయిన, సహానుగమ్=అనుచరులతో కూడిన, తం రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, ఘోరేణ = ఘోర మైన, పరిఘేణ = పరిఘచేత సూదయామి = సంహరించితిని.

తా. మహాబలవంతుడు, యుద్ధములో ప్రవీణుడు అయిన ఆ రాక్షసుని, పరివారసహితముగ, భయంకర మైన పరిఘతో సంహరించితిని. 118

మూ. తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రస్తు మన్త్రిపుత్రాన్ మహాబలాన్,
పదాతిబలసంపన్నాన్ ప్రేషయామాస రావణః.

ప్ర. అ. రాక్షసేన్ద్రః = రాక్షసప్రభు వైన. రావణః = రావణుడు, మహాబలాన్ = గొప్ప బలము గల, పదాతిబలసంపన్నాన్ = కాల్బలంటుల సైన్యముతో కూడిన, మన్త్రిపుత్రాన్ = మంత్రికుమారులను, ప్రేషయామాస = పంపెను.

తా. రాక్షసాధిపతి యైన రావణుడు అతని మరణమును విని, మహాబలవంతు లైన మంత్రిపుత్రులను కాల్బలంటుల సైన్యముతో పంపెను. 119

మూ. పరిఘేణైవ తాన్ సర్వాన్ నయామి యమసాదనమ్,
మన్త్రిపుత్రాన్ హతాఞ్ఛ్రుత్వా సమరే లఘువిక్రమాన్,
పఞ్చ సేనాగ్రగాన్ శూరాన్ ప్రేషయామాస రావణః.

ప్ర. అ. తాన్ సర్వాన్ = వారి నందరిని, పరిఘేణైవ = పరిఘచేతనే, యమసాదనమ్ = యమగృహమును, నయామి = పొందించితిని. రావణః = రావణుడు, సమరే = యుద్ధమునందు, లఘువిక్రమాన్ = శీఘ్ర మైన పరాక్రమము గల, మన్త్రిపుత్రాన్ = మంత్రిపుత్రులను, హతాన్ = చంపబడినవారినిగా, శ్రుత్వా = విని, శూరాన్ = శూరు లైన, పఞ్చ = ఐదుగురు, సేనాగ్రగాన్ = సేనానాయకులను, ప్రేషయామాస = పంపెను.

తా. నేను వారి నందరిని కూడ ఆ పరిఘతోనే చంపివేసితిని. రావణుడు శీఘ్రముగా పరాక్రమము చూపు ఆ మంత్రిపుత్రులు యుద్ధములో మరణించి రని విని, శూరు లైన ఐదుగురు సేనానాయకులను పంపెను. 120, 121

మూ. తానహం సహసైన్యాన్వై సర్వానేవాభ్యసూదయమ్,
తతః పునర్దశగ్రీవః పుత్రమక్షం మహాబలమ్, 122
బహుభీ రాక్షసైః సార్ధం ప్రేషయామాస రావణః.

ప్ర. అ. అహమ్ = నేను, సహసైన్యాన్ = సైన్యముతో కూడిన, తాన్ సర్వాన్ = ఆ మంత్రిపుత్రుల నందరిని, అభ్యసూదయమ్ = సంహరించివేసితిని. తతః = అటు పిమ్మట, దశగ్రీవః = పది కంఠములు గల, రావణః = రావణుడు, మహాబలమ్ = గొప్ప బలము గల, పుత్రమ్ = పుత్రు డైన, అక్షమ్ = అక్షుని, బహుభిః = అనేకు లైన, రాక్షసైః సార్ధమ్ = రాక్షసులతో కూడ, ప్రేషయామాస = పంపెను.

తా. నేను సైన్యసహితముగా ఆ మంత్రిపుత్రుల నందరినీ చంపివేసితిని. అప్పుడు పది తలలు గల రావణుడు, మహాబలవంతుడు తన పుత్రుడు అయిన అక్షకుమారుని చాలామంది రాక్షసులతో కూడ పంపెను. 122

మూ. తం తు మన్దోదరీపుత్రం కుమారం రణపణ్డితమ్, 123
సహసా ఖం సముత్క్రాన్తం పాదయోశ్చ గృహీతవాన్,
చర్మాసినం శతగుణం భ్రామయిత్వా వ్యపేషయమ్. 124

ప్ర. అ. రణపణ్డితమ్ = రణమునందు పండితుడు, మన్దోదరీపుత్రమ్ = మండోదరి కుమారుడు, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఉత్క్రాన్తమ్ = ఎగిరినవాడు, చర్మాసినమ్ = ఖడ్గము డాలు కలవాడు అయిన. తం కుమారమ్ = ఆ అక్షకుమారుని, సహసా = హఠాత్తుగా, పాదయోః = పాదములయందు, గృహీతవాన్ = గ్రహించితిని. శతగుణమ్ = నూరు పర్యాయములు, భ్రామయిత్వా = త్రిప్పి, వ్యపేషయమ్ = పిండివేసితిని.

తా. మండోదరి పుత్రుడు, యుద్ధములో నేర్పు కలవాడు అయిన ఆ అక్షయకుమారుడు కత్తి డాలు ధరించి ఆకాశము పైకి ఎగురగా హఠాత్తుగా అతని పాదాలు పట్టుకొని, అనేక పర్యాయములు త్రిప్పి నేలకు వేసికొట్టి ముద్ద అగు నట్లు చేసితిని. 123, 124

మూ. తమక్షమాగతం భగ్నం నిశమ్య స దశాననః,
తత ఇన్ద్రజితం నామ ద్వితీయం రావణః సుతమ్, 125
వ్యాదిదేశ సుసంక్రుద్ధో బలినమ్ యుద్ధదుర్మదమ్.

ప్ర. అ. దశాననః = పది ముఖములు గల, సః రావణః = ఆ రావణుడు, ఆగతమ్ = యుద్ధానికి వచ్చిన, అక్షమ్ = అక్షుడి, భగ్నమ్ = చంపబడినవానినిగా, నిశమ్య = విని, సుసంక్రుద్ధః = చాల కోపించినవాడై, తతః = అటు పిమ్మట, బలినమ్ = బలవంతుడు, యుద్ధదుర్మదమ్ = యుద్ధమునందు పెద్దమదము కలవాడు అయిన, ఇన్ద్రజితం నామ = ఇంద్రజిత్తు అను, ద్వితీయమ్ = మరి యొక, సుతమ్ = కుమారుని, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

తా. పది తలలు గల ఆ రావణుడు, యుద్ధమునందు, అక్షకుమారుడు

మరణించి నట్లు విని, చాల కోపించినవాడై, బలవంతుడు, యుద్ధములో శ్రద్ధ అహంకారము గలవాడు అయిన ఇంద్రజిత్తు అను మరొక కుమారుని పంపెను.

మూ. తచ్చాప్యహం బలం సర్వం తం చ రాక్షసపుఙ్గవమ్. 126
నష్టౌజసం రణే కృత్వా పరం హర్షముపాగమమ్.

ప్ర. అ. అహమ్ = నేను సర్వమ్ = సమస్తమైన, తత్ = ఆ, బలం చ = సైన్యమును, తమ్ = ఆ, రాక్షసపుఙ్గవం చ = రాక్షసశ్రేష్ఠుని, రణే = యుద్ధమునందు, నష్టౌజసమ్ = నశించిన తేజస్సు కలుగునట్లు, కృత్వా = చేసి, పరమ్ = అధికమైన, హర్షమ్ = సంతోషమును, ఉపాగమమ్ = పొందితిని.

తా. నేను యుద్ధములో ఆ సైన్యము నంతా అయింది, రాక్షసశ్రేష్ఠుడైన ఇంద్రజిత్తును కాంతిహీనునిగా చేసి చాల సంతోషము పొందితిని. 126

మూ. మహతాపి మహాబాహుః ప్రత్యయేన మహాబలః, 127
ప్రేషితో రావణేనైవ సహ వీరైర్మదోత్కటైః.

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన ఆ ఇంద్రజిత్తు, మదోత్కటైః = గర్వముచేత తీవ్రముగా ఉన్న, వీరైః సహ = వీరులతో కూడ, రావణేనైవ = రావణునిచేతనే, మహతా = గొప్పదైన, ప్రత్యయేన = నమ్మకముతో, ప్రేషితః = పంపబడెను.

తా. మహాబాహువు, మహాబలశాలి అయిన ఆ ఇంద్రజిత్తును గర్వముతో తీవ్రస్వభావులైన వీరులతో కూడ, ఎంతో నమ్మకముతో రావణుడే పంపెను.

మూ. సోఽవిషహ్యం హి మాం బుద్ధ్వా స్వం బలం చావమర్దితమ్,
బ్రాహ్మేణాస్త్రేణ స తు మాం ప్రాబధ్నాచ్చాతివేగితః.

ప్ర. అ. సః = ఆ ఇంద్రజిత్తు. మామ్ = నన్ను, అవిషహ్యమ్ = సహింప శక్యము కానివానినిగా, బుద్ధ్వా = తెలుసుకొని, స్వమ్ = తన సంబంధమైన, బలం చ = సైన్యమును కూడ, అవమర్దితమ్ = నశింపచేయబడినదానినిగా తెలుసుకొని, స తు = అతడు, అతివేగితః = చాల వేగము కలవాడై, మామ్ = నన్ను, బ్రాహ్మేణ అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత, ప్రాబధ్నాత్ = కట్టెను.

తా. ఆ ఇంద్రజిత్తు తన సైన్యము నశించిపోవుట చూచి, నేను ఎదిరింప శక్యము కానివాడను అను విషయము కూడా తెలుసుకొని, ఎక్కువ వేగమును చూపుచు నన్ను బ్రహ్మాస్త్రముతో బంధించెను. 128

మూ. రజ్జుభిశ్చాభిబధ్నన్తి తతో మాం తత్ర రాక్షసాః, 129
రావణస్య సమీపం చ గృహీత్వా మాముపానయన్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తత్ర = అక్కడ, రాక్షసాః = రాక్షసులు, మామ్ = నన్ను, రజ్జుభిః = త్రాళ్లచేత, అభిబధ్నన్తి = బంధించిరి. మామ్ = నన్ను, గృహీత్వా = పట్టుకొని, రావణస్య = రావణునియొక్క, సమీపమ్ = సమీపమును, ఉపానయన్ = పొందించిరి.

తా. పిమ్మట రాక్షసులు, అక్కడ నన్ను పట్టి, త్రాళ్లతో కట్టి రావణుని దగ్గరకు తీసికొని వెళ్లిరి. 129

మూ. దృష్ట్వా సంభాషితశ్చాహం రావణేన దురాత్మనా, 130
పృష్టశ్చ లఙ్కాగమనం రాక్షసానాం చ తం వధమ్.

ప్ర. అ. అహమ్ = నేను, దురాత్మనా = దుర్బుద్ధియైన, రావణేన = రావణునిచేత, దృష్ట్వా = చూచి, సంభాషితశ్చ = మాటలాడబడితిని. లఙ్కాగమనమ్ = లంకకు వచ్చుటను గూర్చి, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, తమ్ = ఆ, వధమ్ = వధను గూర్చి, పృష్టశ్చ = అడగబడితిని కూడ.

తా. దురాత్ముడైన రావణుడు నన్ను చూచి మాటలాడెను. "నీవు లంకకు ఎందుకు వచ్చినావు? రాక్షసులను అట్లు ఎందుకు వధించినావు?" అని ప్రశ్నించెను. 130

మూ. తత్సర్వం చ మయా తత్ర సీతార్థమితి జల్పితమ్, 131
అస్యాస్తు దర్శనాకాఙ్క్షీ ప్రాప్తస్త్వద్భవనం విభో.
మారుతస్యౌరసః పుత్రో వానరో హనుమానహమ్. 132

ప్ర. అ. తత్ = ఆ, సర్వమ్ = అంతా, సీతార్థమితి = సీతకొరకు అని, మయా = నాచేత, తత్ర = అక్కడ, జల్పితమ్ = పలకబడెను. విభో = రాక్షసరాజా! అస్యాః = ఆమెయొక్క, దర్శనాకాఙ్క్షీ = దర్శనము కోరుచున్నవాడనై,

త్వద్భవనమ్ = నీ గృహమును గూర్చి, ప్రాప్తః = వచ్చినాను. అహమ్ = నేను, మారుతస్య = వాయుదేవునియొక్క, ఔరసః పుత్రః = ఔరసపుత్రుడ నైన, వానరః = వానరుడ నైన, హనుమాన్ = హనుమంతుడను.

తా. "నేను ఈ పను లన్నీ సీతకొరకై చేసితిని" అని నేను చెప్పితిని. "రాక్షసరాజా! సీతను చూడవలె నని నీ భవనమునకు వచ్చితిని. నేను వాయుదేవుని ఔరసపుత్రుడను, వానరుడను, నా పేరు హనుమంతుడు". 131, 132

మూ. రామదూతం చ మాం విద్ధి సుగ్రీవసచివం కపిమ్,
సోఽహం దౌత్యేన రామస్య త్వత్సకాశమిహాగతః. 133

ప్ర. అ. కపిమ్ = వానరుడ నైన, మామ్ = నన్ను, రామదూతమ్ = రాముని దూతను గాను, సుగ్రీవసచివమ్ = సుగ్రీవుని మంత్రినిగాను, విద్ధి = తెలిసికొనుము. సః అహమ్ = అట్టి నేను, రామస్య = రామునియొక్క, దౌత్యేన = దౌత్యముచేత, త్వత్సకాశమ్ = నీ సమీపమును గూర్చి, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినాను.

తా. వానరుడ నైన నేను రాముని దూతను, సుగ్రీవుని సచివుడను. నేను రాముని దౌత్యమును పురస్కరించుకొని ఇక్కడికి వచ్చినాను. 133

మూ. సుగ్రీవశ్చ మహాతేజాః స త్వాం కుశలమబ్రవీత్,
ధర్మార్థకామసహితం హితం పథ్యమువాచ చ. 134

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః సుగ్రీవశ్చ = ఆ సుగ్రీవుడు, త్వామ్ = నిన్ను, కుశలమ్ = క్షేమమును, అబ్రవీత్ = పలికెను. ధర్మార్థకామసహితమ్ = ధర్మ-అర్థ-కామములతో కూడిన, పథ్యమ్ = మంచిని కలిగించు, హితమ్ = హిత మైన వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ సుగ్రీవుడు, నీ కుశలమును అడిగినాడు. ధర్మ-అర్థ-కామములకు అనుకూల మైన, లాభకర మైన, హితవచనము కూడ చెప్పినాడు. 134

మూ. వసతో ఋశ్యమూకే మే పర్వతే విపులద్రుమే,
రాఘవో రణవిక్రాన్తో మిత్రత్వం సముపాగతః. 135

ప్ర. అ. విపులద్రుమే = ఉన్నతము లైన (అధిక మైన) వృక్షములు గల, ఋశ్యమూకే = ఋశ్యమూక పర్వతమునందు, వసతః = నివసించుచున్న, మే = నాకు, రణవిక్రాన్తః = యుద్ధమునందు పరాక్రమశాలి యైన, రాఘవః = రాముడు, మిత్రత్వమ్ = మిత్రత్వమును, ఉపాగతః = పొందినాడు.

తా. ఉన్నతము లైన వృక్షములతో నిండిన ఋశ్యమూకపర్వతమునందు నివసించుచుండగా, యుద్ధములో గొప్ప పరాక్రమము గల రాముడు నాకు మిత్రు డైనాడు. 135

మూ. తేన మే కథితం రాజ్ఞా భార్యా మే రక్షసా హృతా,
తత్ర సాహాయ్యమస్మాకం కార్యం సర్వాత్మనా త్వయా.

ప్ర. అ. రాజ్ఞా = రాజైన, తేన = అతనిచేత, మే = నాకు, కథితమ్ = చెప్పబడినది. మే భార్యా = నా భార్య, రక్షసా = రాక్షసునిచేత, హృతా = హరింపబడినది. తత్ర = ఆ విషయమున, త్వయా = నీ చేత, సర్వాత్మనా = సర్వ విధముల, అస్మాకమ్ = మాకు, సాహాయ్యమ్ = సాహాయ్యము, కార్యమ్ = చేయదగినది.

తా. రాజైన ఆ రాముడు నాతో ఇట్లు పలికెను. "నా భార్యను రాక్షసుడు అపహరించినాడు. నీవు ఆ విషయమున నాకు సర్వవిధముల సాహాయ్యముచే చేయవలెను". 136

మూ. మయా చ కథితం తస్మై వాలినశ్చ వధం ప్రతి,
తత్ర సాహాయ్యహేతోర్మే సమయం కర్తుమర్హసి. 137

ప్ర. అ. మయా చ = నాచేత కూడ, వాలినః = వాలియొక్క, వధం ప్రతి = వధను గూర్చి, తస్మై = అతనికి, కథితమ్ = చెప్పబడినది. తత్ర = ఆ విషయమున, మే = నాకు, సాహాయ్యహేతోః = సాహాయ్యము నిమిత్త మై, సమయమ్ = ఒప్పందమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. నేను కూడ వాలివధను గూర్చి, ఆ రామునకు తెలిపి, "నీవు ఆ విషయమున నాకూ సాహాయ్యము చేయవలెను" అని అతనిని కోరితిని. 137

మూ. వాలినా హృతరాజ్యేన సుగ్రీవేణ మహాప్రభుః,
చక్రేఽగ్నిసాక్షికం సఖ్యం రాఘవః సహ లక్ష్మణః. 138

ప్ర. అ. మహాప్రభుః = గొప్ప ప్రభు వైన, సహ లక్ష్మణః = లక్ష్మణ సమేతు డైన, రాఘవః = రాముడు, వాలినా = వాలిచేత, హృతరాజ్యేన = హరింప బడిన రాజ్యము గల, సుగ్రీవేణ = సుగ్రీవునితో, అగ్నిసాక్షికమ్ = అగ్ని సాక్షిగా ఉండగా, సఖ్యమ్ = స్నేహమును, చక్రే = చేసెను.

తా. సుగ్రీవుని రాజ్యమును వాలి హరించెను. అట్టి సుగ్రీవునితో మహా ప్రభువు, లక్ష్మణసమేతుడు అయిన రాముడు అగ్నిసాక్షిగా స్నేహము చేసెను. 138

మూ. తేన వాలినముత్పాట్య శరేణైకేన సంయుగే,
వానరాణాం మహారాజః కృతః స ప్లవతాం ప్రభుః. 139

ప్ర. అ. తేన = ఆ రామునిచేత, సంయుగే = యుద్ధమునందు, ఏకేన = ఒక, శరేణ = బాణముచేత, వాలినమ్ = వాలిని, ఉత్పాట్య = పెకలించి, ప్లవతామ్ = వానరులయొక్క, ప్రభుః = ప్రభు వైన, సః = ఆ సుగ్రీవుడు, వానరాణామ్ = వానరులయొక్క, మహారాజః = మహారాజుగా, కృతః = చేయబడినాడు.

తా. ఆ రాముడు, యుద్ధములో, ఒక్క బాణముచేత వాలిని చంపి, వానరప్రభు వైన సుగ్రీవుని వానరరాజుగా చేసినాడు. 139

మూ. తస్య సాహాయ్యమస్మాభిః కార్యం సర్వాత్మనా త్విహ,
తేన ప్రస్థాపితస్తుభ్యం సమీపమిహ ధర్మతః. 140

ప్ర. అ. ఇహ = ఇప్పుడు, అస్మాభిః = మాచేత, సర్వాత్మనా = అన్ని విధములు, తస్య = అతనికి, సాహాయ్యమ్ = సాహాయ్యము, కార్యమ్ = చేయదగినది. తేన = ఆ కారణముచేత, (ఇతడు), తుభ్యమ్ = నీకొరకు, సమీపమ్ = సమీపమును, ధర్మతః = ధర్మానుసారముగా, ప్రస్థాపితః = పంపబడినాడు.

తా. ఇప్పుడు మేము ఆ రామునకు సర్వవిధాలా సాహాయ్యము చేయవలసి ఉన్నది. అందుచేతనే ఇతనిని ధర్మానుసారముగా నీవద్దకు పంపుచున్నాను.

మూ. క్షిప్రమానీయతాం సీతా దీయతాం రాఘవాయ చ,
యావన్న హరయో వీరా విధమన్తి బలం తవ. 141

ప్ర. అ. వీరాః = వీరు లైన, హరయః = వానరులు, తవ = నీయొక్క, బలమ్ = సైన్యమును, యావత్ = ఎంతలో, న విధమన్తి = నశింపచేయరో, అంతలో, సీతా = సీత, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆనీయతామ్ = తీసికొనిరాబడుగాక; రాఘవాయ = రామునకు, దీయతాం చ = ఇవ్వబడుగాక.

తా. వీరు లైన వానరులు నీ సైన్యమును నశింపచేయుటకు ముందుగానే నీవు శీఘ్రముగా సీతను తీసుకొని వచ్చి రామునకు ఇచ్చివేయుము. 141

మూ. వానరాణాం ప్రభావో హి న కేన విదితః పురా,
దేవతానాం సకాశం చ యే గచ్ఛన్తి నిమన్త్రితాః. 142

ప్ర. అ. యే = ఎవరు, నిమన్త్రితాః = పిలవబడినవారై, దేవతానామ్ = దేవతలయొక్క, సకాశమ్ = సమీపమును గూర్చి, గచ్ఛన్తి పురా = వెళ్లెదరో, అట్టి, వానరాణామ్ = వానరులయొక్క, ప్రభావః = ప్రభావము, కేన = ఎవనిచేత, న విదితః = తెలియబడలేదు.

తా. ఏ వానరులు పిలిచితే దేవతల దగ్గరకు కూడ వెళ్లెదరో అట్టి వానరుల ప్రభావము తెలియనివాడు ఎవరు? 142

మూ. ఇతి వానరరాజస్త్వామాహేత్యభిహితో మయా,
మామైక్షత తతః క్రుద్ధశ్చక్షుషా ప్రదహన్నివ. 143

ప్ర. అ. ఇతి = ఇట్లు, వానరరాజః = వానరరాజు, త్వామ్ = నిన్ను గూర్చి, ఆహ = చెప్పుచున్నాడు, ఇతి = అని, మయా = నాచేత, అభిహితః = పలుకబడినవాడై, తతః = అటు పిమ్మట, క్రుద్ధః = కోపగించినవాడై, చక్షుషా = నేత్రముతో, ప్రదహన్నివ = కాల్చివేయుచున్నవాడు వలె, మామ్ = నన్ను, ఐక్షత = చూచెను.

తా. వానరరాజైన సుగ్రీవుడు నీతో ఇట్లు చెప్పినాడు అని నేను చెప్పగానే అతడు కోపించి, నేత్రముతో కాల్చుచున్నవాడు వలె నన్ను చూచెను. 143

మూ. తేన వధ్యోఽహమాజ్ఞప్తో రక్షసా రౌద్రకర్మణా,
మత్ప్రభావమవిజ్ఞాయ రావణేన దురాత్మనా. 144

ప్ర. అ. రౌద్రకర్మణా = భయంకర మైన కర్మ గల, రక్షసా = రాక్షసుడు, దురాత్మనా = దురాత్ముడు అయిన, తేన రావణేన = ఆ రావణునిచేత, మత్ప్రభావమ్ = నాయొక్క ప్రభావమును, అవిజ్ఞాయ = తెలియకుండా, అహమ్ = నేను, వధ్యః = చంపదగినవాడనుగా, ఆజ్ఞప్తః = ఆజ్ఞాపింపబడితిని.

తా. భయంకరమైన కర్మ గల రాక్షసుడు, దురాత్ముడు అయిన ఆ రావణుడు, నా ప్రభావము ఏట్టిదో తెలిసికొనక, నన్ను చంపవలసినదిగా ఆజ్ఞాపించెను. 144

మూ. తతో విభీషణో నామ తస్య భ్రాతా మహామతిః,
తేన రాక్షసరాజో౽సౌ యాచితో మమ కారణాత్. 145

ప్ర. అ. విభీషణో నామ = విభీషణుడు అను, మహామతిః = గొప్పబుద్ధి గల, తస్య = అతనియొక్క, భ్రాతా = సోదరుడు, (ఉన్నాడు). తతః = అటు పిమ్మట, తేన = అతనిచేత, అసౌ = ఈ, రాక్షసరాజః = రాక్షసరాజు, మమ కారణాత్ = నా కారణమువలన, యాచితః = యాచింపబడినాడు.

తా. అటు పిమ్మట, గొప్ప బుద్ధిగల విభీషణుడను ఆ రావణుని సోదరుడు, నా నిమిత్త మై ఆ రాక్షసరాజును ప్రార్థించెను. 145

మూ. నైవం రాక్షసశార్దూల త్యజ్యతామేష నిశ్చయః,
రాజశాస్త్రవ్యపేతో హి మార్గః సంసేవ్యతే త్వయా 146

ప్ర. అ. రాక్షసశార్దూల = రాక్షసశ్రేష్ఠా, ఏవమ్ = ఇట్లు, న = కాదు. ఏషః = ఈ, నిశ్చయః = నిశ్చయము, త్యజ్యతామ్ = విడువబడుగాక, రాజశాస్త్రవ్యపేతః = రాజశాస్త్రమునుండి దూరమైన, మార్గః = మార్గము, త్వయా = నీచేత, సంసేవ్యతే హి = సేవింపబడుచున్నది కదా.

తా. ఓ: రాక్షసశ్రేష్ఠా! ఇట్లు చేయకూడదు. ఈ నిశ్చయము విడచిపెట్టుము. నీవు రాజశాస్త్రమునకు విరుద్ధ మైన మార్గమును అనుసరించుచున్నావు.

మూ. దూతవధ్యా న దృష్టా హి రాజశాస్త్రేషు రాక్షస,
దూతేన వేదితవ్యం చ యథార్థం హితవాదినా. 147

ప్ర. అ. రాక్షస=రావణా! రాజశాస్త్రేషు=రాజశాస్త్రములందు, దూత వధ్యాం=దూతను చంపుట, న దృష్టా హి = చూడబడలేదు. హితవాదినా =హితమును పలుకు, దూతేన=దూతచేత, యథార్థమ్ = యథార్థము, వేదితవ్యమ్=తెలియ దగినది.

తా. రావణా! రాజశాస్త్రంలో దూతలను చంపుట అనేది కనబడదు. హితమును చెప్పే దూత యథార్థమును తెలిసికొనవలెను. 147

మూ. సుమహత్యపరాధేఽపి దూతస్యాతులవిక్రమ.
విరూపకరణం దృష్టం న వధోఽస్తీతి శాస్త్రతః. 148

ప్ర. అ. అతులవిక్రమ=సాటిలేని పరాక్రమముకలవాడా! సుమహతి=చాల గొప్ప దైన, అపరాధేఽపి=అపరాధ మున్నను, దూతస్య=దూతయొక్క, విరూపకరణమ్=విరూపునిగా చేయుట, దృష్టమ్=చూడబడినది. శాస్త్రతః=శాస్త్రానుసారముగా, వధః=వధ, నాస్తి=లేదు.

తా. సాటి లేని పరాక్రమము కలవాడా! ఎంత అపరాధము చేసినను, దూతకు ఏ దైన వైరూప్యము (అవయవఖండనాదికము చేయుట) చెప్పబడినది గాని శాస్త్రములలో దూతను చంపుట విధింపబడలేదు. 148

మూ. విభీషణేనైవముక్తో రావణః సందిదేశ తాన్,
రాక్షసానేతదేవాస్య లాఙ్గూలం దహ్యతామితి. 149

ప్ర. అ విభీషణేన=విభీషణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, రావణః=రావణుడు, అస్య=ఇతనియొక్క, ఏతత్=ఈ, లాఙ్గూలమ్=తోక, దహ్యతామితి=కాల్చివేయబడు గాక అని, తాన్ రాక్షసాన్=ఆ రాక్షసులను, సందిదేశ=ఆజ్ఞాపించెను. 149

తా. రావణుడు విభీషణుని మాటలు విని, "ఇతని తోక కాల్చివేయుడు" అని రాక్షసులను ఆజ్ఞాపించెను. 150

మూ. తతస్తస్య వచః శ్రుత్వా మమ పుచ్ఛం సమన్తతః,
వేష్టితం శణవల్కైశ్చ జీర్ణైః కార్పాసజైః పటైః. 150

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తస్య=అతనియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, మమ పుచ్ఛమ్=నా తోక, సమన్తతః=అంతటా,

శణవల్కైః=జనపనార బట్టల చేతను, క్షౌమైః=చినికిపోయిన, కార్పాసకైః= వత్తినుండి పుట్టిన, వస్త్రైః=వస్త్రములచేతను, వేష్టితమ్=చుట్టబడినది.

తా. ఆ రావణుని మాటలు విసిన వెంటనే రాక్షసులు జనపనార గుడ్డల తోను చినికిపోయిన నూలుబటలతోను, నా తోక అంతటా చుటలెదిరి. 150

మూ. రాక్షసాః సిద్ధసన్నాహా స్తతస్తే చణ్డవిక్రమాః,
తదాదహ్యన్త మే పుచ్ఛం నిఘ్నన్తః కాష్ఠముష్టిభిః,
బద్ధస్య బహుభిః పాశైర్యన్త్రితస్య చ రాక్షసైః

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సిద్ధసంనాహాః=సిద్ధమైన సంనాహము గల, చణ్డవిక్రమాః=తీవ్రమైన పరాక్రమము గల, రాక్షసాః=రాక్షసులు, కాష్ఠముష్టిభిః=కఱ్ఱలతోను పిడికిళ్ళతోను, నిఘ్నన్తః=కొట్టుచు, బహుభిః= అనేకములైన, పాశైః=పాశములచేత, బద్ధస్య=కట్టబడినవానను, రాక్షసైః= రాక్షసులచేత, యన్త్రితస్య=కదలకుండచేయబడినవాడను అయిన, మే= నాయొక్క, పుచ్ఛమ్=తోకను, తదా=అప్పుడు, అదహ్యన్త=కాల్చిరి.

తా. సంనాహములను పూర్తి చేసిన, తీవ్రమైన పరాక్రమము గల, ఆ రాక్షసులు. నన్ను కఱ్ఱలతోను, పిడికిళ్ళతోను కొట్టుచు, అనేకములైన పాశము లచే బంధింపబడి, రాక్షసులచేత కదలకుండ చేయబడిన నా పుచ్ఛమును కాల్చిరి. 150, 151

మూ. తతస్తే రాక్షసాః శూరా బద్ధం మామగ్నిసంవృతమ్,
అఘోషయన్రాజమార్గే నగరద్వారమాగతాః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట. శూరాః=శూరులైన, రాక్షసాః=రాక్షసులు, నగరద్వారమ్=పట్టణముద్వారమును, ఆగతాః=పొందినవారై, బద్ధమ్= కట్టబడినవాడను, అగ్నిసంవృతమ్=అగ్నిచేత చుట్టబడియున్న వాడను అయిన, మామ్=నన్ను, రాజమార్గే=రాజమార్గమునందు, అఘోషయన్=ఘోషించిరి.

తా. పిమ్మట శూరులైన ఆ రాక్షసులు బంధింపబడి, అగ్నిచే చుట్ట బడిన నన్ను నగరద్వారమువద్దకు తీసికొని పోయి, నన్ను గూర్చి, రాజమార్గ ములో ఘోషణ చేసిరి. 152

మూ. తతో౽హం సుమహద్రూపం సంక్షిప్య పునరాత్మనః,
విమోచయిత్వా తం బన్ధం ప్రకృతిస్థః స్థితః పునః,
ఆయసం పరిఘం గృహ్య తాని రక్షాంస్యసూదయమ్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట. అహమ్=నేను, ఆత్మనః=నాయొక్క, సుమహత్=చాల పెద్దదైన, రూపమ్=రూపమును, పునః=మరల, సంక్షిప్య=చిన్నది చేసి, తం బన్ధమ్=ఆ బంధమును, విమోచయిత్వా=విడిపించుకొని, పునః=మరల, ప్రకృతిస్థః=సహజస్థితిని పొందినవాడనుగా, స్థితః=ఉంటిని. ఆయసమ్=ఇనుప దైన, పరిఘమ్=పరిఘను, గృహ్య=గ్రహించి, తాని రక్షాంసి=ఆ రాక్షసులను, అసూదయమ్=చంపితిని.

తా. పిమ్మట నేను చాల పెద్దదైన రూపమును మరల చిన్నదిగా చేసి, ఆ బంధమును విడిపించుకొని, స్వాభావికస్థితిని పొంది, మరల ఆ ఇనుప పరిఘను తీసికొని ఆ రాక్షసుల నందరిని చంపితిని. 153, 154

మూ. తతస్తన్నగరద్వారం వేగేనాప్లుతవానహమ్,
పుచ్ఛేన చ ప్రదీప్తేన తాం పురీం సాట్టగోపురామ్,
దహామ్యహమసంభ్రాన్తో యుగాన్తాగ్నిరివ ప్రజాః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, అహమ్=నేను, వేగేన=వేగముతో, తత్=ఆ, నగరద్వారమ్=నగరద్వారమునుగూర్చి, ఆప్లుతవాన్=దుమికితిని. అహమ్=నేను, అసంభ్రాన్తః=భయము లేని వాడనై, యుగాన్తాగ్నిః=ప్రళయ కాలమునందలి అగ్ని, ప్రజాః ఇవ=ప్రజలను వలె, సాట్ట ప్రాకారగోపురామ్=బురుజులతోను, ప్రాకారములతోను, గోపురములతోను కూడిన, తాం పురీమ్=ఆ పట్టణమును, ప్రదీప్తేన=మండుచున్న, పుచ్ఛేన=తోకచే, దహామి=కాల్చి వేసినాను.

తా. పిమ్మట నేను వేగముగా ఆ నగరద్వారముపైకి దుమికితిని. ప్రజ్వలించుచున్న పుచ్ఛముచేత, బురుజులతోను, ప్రాకారములతోను, గోపురముల తోను కూడిన ఆ నగరమును ప్రళయకాలము నందలి అగ్ని ప్రజలను దహించి వేసినట్లు ఏ మాత్రము కంగారు పడక, కాల్చివేసితిని. 155

మూ. వినష్టా జానకీ వ్యక్తం న హ్యదగ్ధః ప్రదృశ్యతే, 156
లఙ్కాయాం కశ్చిదుద్దేశః సర్వా భస్మీకృతా పురీ.

ప్ర. అ. చూ. 55వసర్గ 12వ శ్లోకం.

మూ. దహతా చ మయా లఙ్కాం దగ్ధా సీతా న సంశయః,
రామస్య హి మహత్కార్యం మయేదం వితథీకృతమ్.

ప్ర. అ. లఙ్కామ్ = లంకను, దహతా = కాల్చుచున్న, మయా = నాచేత, సీతా = సీత, దగ్ధా = కాల్చబడినది. సంశయః = సంశయము, న = లేదు. మయా = నాచేత, రామస్య = రామునియొక్క, ఇదమ్ = ఈ, మహత్ = గొప్పదైన, కార్యమ్ = కార్యము, వితథీకృతమ్ = వ్యర్థము చేయబడినది.

తా. లంక కాలిపోయినది గాన సీత కూడ కాలిపోయియే ఉండును. సందేహము లేదు. నేను రాముని ఈ మహాకార్యమును వ్యర్థము చేసితిని. 157

మూ. ఇతి శోకసమావిష్టశ్చిన్తామహముపాగతః, 158
అథాహం వాచమశ్రౌషం చారణానాం శుభాక్షరామ్.
జానకీ న చ దగ్ధేతి విస్మయోదన్తభాషిణామ్. 159

ప్ర. అ. ఇతి = ఇట్లు, శోకసమావిష్టః = శోకముచే నింపబడినవాడనై, అహమ్ = నేను, చిన్తామ్ = చింతను, ఉపాగతః = పొందితిని. అథ = అటు పిమ్మట, అహమ్ = నేను, జానకీ = జానకి, న చ దగ్ధా = దహింపబడలేదు, ఇతి = అని, విస్మయోదన్తభాషిణామ్ = ఆశ్చర్యముతో వార్తను పలుకుచున్న, చారణానామ్ = చారణులయొక్క, శుభాక్షరామ్ = మంగళప్రదము లైన అక్షరములు గల, వాచమ్ = వాక్కును, అశ్రౌషమ్ = వింటిని.

తా. ఈ విధముగ శోకాక్రాంతుడ నై నేను చింత పొందితిని. పిమ్మట "జానకి దహింపబడలేదు" అని ఆశ్చర్యముతో మాటలాడుచున్న చారణుల, మంగళకరము లైన అక్షరములు గల వాక్కును వింటిని.

మూ. తతో మే బుద్ధిరుత్పన్నా శ్రుత్వా తామద్భుతాం గిరమ్,
అదగ్ధా జానకీత్యేవం నిమిత్తైశ్చోపలక్షితా. 160

ప్ర. అ. అద్భుతామ్ = ఆశ్చర్యకర మైన, తాం గిరమ్ = ఆ వాక్కును శ్రుత్వా = విని, తతః = పిమ్మట, జానకీ = జానకి, అదగ్ధా = కాల్పబడలేదు, ఇత్యేవమ్ = అని, మే = నాకు, బుద్ధిః = బుద్ధి, ఉత్పన్నా = పుట్టినది. నిమిత్తైశ్చ = శుభశకునములచేత కూడ, ఉపలక్షితా = (కాల్పబడనట్లు) ఊహింప బడినది.

తా. ఆశ్చర్యకర మైన ఆ మాటలు విన్న పిమ్మట నాకు—"జానకి దహింపబడి యుండదు" అను ఆలోచన కలిగినది. కొన్ని సుశకునములను బట్టి కూడ అట్లు ఊహించితిని. 160

మూ. దీప్యమానే తు లాఙ్గూలే న మాం దహతి పావకః.
హృదయం చ ప్రహృష్టం మే వాతాః సురభిగన్ధినః.

ప్ర. అ. లాఙ్గూలే = తోక, దీప్యమానే = కాల్పబడు చుండగా, పావకః = అగ్ని, మామ్ = నన్ను, న దహతి = కాల్పుటలేదు. మే = నాయొక్క, హృదయం చ = హృదయము కూడ, ప్రహృష్టమ్ = సంతోషించుచున్నది. వాతాః = వాయువులు, సురభిగన్ధినః = మంచి గంధము గలవి. 161

తా. నా తోక కాల్పబడుచున్నను అగ్ని నన్ను దహించుట లేదు. నా హృదయము కూడ సంతుష్టముగా ఉన్నది. వాయువులు మంచి గంధమును ప్రసరింపచేయుచున్నవి. 161

మూ. తైర్నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః,
ఋషివాక్యైశ్చ సిద్ధార్థైరభవం హృష్టమానసః. 162

ప్ర. అ. దృష్టార్థైః = చూడబడిన ఫలములు గల, తైః = ఆ, నిమిత్తైః = నిమిత్తములచేతను, మహాగుణైః = గొప్ప గుణములు గల, కారణైశ్చ = కారణము లచేతను, సిద్ధార్థైః = సిద్ధ మైన ప్రయోజనము గల, ఋషివాక్యైశ్చ = ఋషుల వాక్యముల చేతను, హృష్టమానసః = సంతోషించిన మనస్సు కలవాడను అభవమ్ = అయితిని.

తా. పూర్వము సఫలములుగా చూడబడిన ఆ శకునములచేతను, గొప్ప గుణములు గల కారణములచేతను, తప్పక యథార్థము లైన ఋషుల వాక్యముల చేతను నా మనస్సు సంతోషించినది. 162

మూ. పునర్దృష్ట్వా చ వైదేహీం విసృష్టశ్చ తయా పునః,
తతః పర్వతమాసాద్య తత్రారిష్టమహం పునః, 163
ప్రతిప్లవనమారేభే యుష్మద్దర్శనకాఙ్క్షయా.

ప్ర. అ. వైదేహీమ్ = సీతను, పునః = మరల, దృష్ట్వా చ = చూచి, తయా = ఆమెచేత, పునః = మరల, విసృష్టః = విడువబడినవాడనై, తతః = పిమ్మట, అరిష్టపర్వతమ్ = అరిష్టపర్వతమును, పునః = మరల, ఆసాద్య = పొంది, అహమ్ = నేను, యుష్మద్దర్శనకాఙ్క్షయా = మీయొక్క దర్శనమునందు కోరికతో, ప్రతిప్లవనమ్ = తిరిగి ఎగురుటను, ఆరేభే = ప్రారంభించితిని.

తా. సీతాదేవిని మరల చూచి, ఆమె అనుజ్ఞ పొంది, పిమ్మట అరిష్ట పర్వతమును మరల పొంది, మిమ్ములను చూడవలెనను కోరికతో మరల ఎగు రుట (సముద్రలంఘనము) ప్రారంభించితిని. 163

మూ. తతః పవనచన్ద్రార్కసిద్ధగన్ధర్వసేవితమ్, 164
పన్థానమహమాక్రమ్య భవతో దృష్టవానిహ

ప్ర. అ. తతః = పిమ్మట, అహమ్ = నేను, పవనచన్ద్రార్కసిద్ధగన్ధర్వసేవితమ్ = వాయు-చంద్ర-సూర్య-సిద్ధ-గంధర్వులచేత సేవింపబడిన, పన్థానమ్ = ఆకాశమార్గమును, ఆక్రమ్య = ఆశ్రయించి, ఇహ = ఇక్కడ, భవతః = మిమ్ము లను, దృష్టవాన్ = చూచితిని.

తా. పిమ్మట నేను వాయు-చంద్ర-సూర్య-సిద్ధ-గంధర్వులచే సేవింప బడు ఆకాశమార్గమును అవలంబించి, ఇక్కడ, మిమ్ములను చూచితిని. 164

మూ. రాఘవస్య ప్రభావేణ భవతాం చైవ తేజసా,
సుగ్రీవస్య చ కార్యార్థం మయా సర్వమనుష్ఠితమ్.

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, ప్రభావేణ = ప్రభావముచేత, భవతామ్ = మీయొక్క, తేజసా చైవ = తేజస్సు చేతను, సుగ్రీవస్య = సుగ్రీవుని యొక్క, కార్యార్థం చ = కార్యము కొరకు, మయా = నాచేత, సర్వమ్ = సమ స్తము, అనుష్ఠితమ్ = చేయబడినది.

తా. రాముని ప్రతాపముచేత, మీ తేజస్సుచేత, సుగ్రీవుని కార్యము సాధించుటకు నేను అన్ని పనులు చేసితిని. 165

మూ. ఏతత్సర్వం మయా తత్ర యథావదుపపాదితమ్, 166
అత్ర యన్న కృతం శేషం తత్సర్వం క్రియతామితి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ ఏతత్ = ఇది, సర్వమ్ = అంతయు, తత్ర = అక్కడ, మయా = నాచేత, యథావత్ = ఎట్లు చేయవలెనో అట్లు, ఉపపాదితమ్ = చేయబడినది. అత్ర = ఈ కార్యమునందు, యత్ = ఏది, న కృతమ్ = చేయబడలేదో, శేషమ్ = మిగిలిన, తత్ = అది, సర్వమ్ = అంతా, క్రియతామ్ = చేయబడుగాక.

తా. నేను అక్కడ ఈ కార్యముల నన్నింటిని తగు విధముగా చేసితిని. నేను చేయగా మిగిలిన కార్య మంతా చేయుడు.

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో ఏబదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనషష్టితమః సర్గః

[హనుమంతుడు సీత దురవస్థను వర్ణించి చెప్పి, లంకను ఆక్రమించుటకై వానరులను ప్రోత్సాహపరచుట].

మూ. ఏతదాఖ్యాయ తత్సర్వం హనుమాన్ మారుతాత్మజః,
భూయః సముపచక్రామ వచనం వక్తుముత్తరమ్. 1

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, సర్వమ్ = సమస్తమైన. తత్ ఏతత్ = దీనిని, ఆఖ్యాయ = చెప్పి, భూయః = మరల, ఉత్తరం వచనమ్ = తరువాతి వాక్యమును, వక్తుమ్ = చెప్పుటకు, సముపచక్రామ = ప్రారంభించెను

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు జరిగిన ఈ విషయము అంతా చెప్పి, మరల, తాను చెప్ప దలచిన మాటలను ఇట్లు చెప్పెను. 1

మూ. సఫలో రాఘవోద్యోగః సుగ్రీవస్య చ సంభ్రమః,
శీలమాసాద్య సీతాయా మమ చ ప్రవణం మనః. 2

ప్ర. అ. రాఘవోద్యోగః = రాముని ప్రయత్నము, సుగ్రీవస్య = సుగ్రీవుని యొక్క, సంభ్రమః చ = తొందర (ఉత్సాహము), సీతాయాః = సీత యొక్క, శీలమ్ = పవిత్రమైన శీలమును, ఆసాద్య = పొంది, సఫలః = సఫలమైనది. మమ = నా యొక్క, మనః చ = మనస్సు కూడ, ప్రవణమ్ = ఆమె యందు భక్తితో లగ్నమైనది.

తా. సీతాదేవి పాతివ్రత్యమహిమచే రాముని ప్రయత్నము, సుగ్రీవుని ఉత్సాహమూ కూడా సఫలములు కానున్నవి. భక్తితో నా మనస్సు ఆమెపై లగ్నమైనది. 2

మూ. తపసా నిర్దహేల్లోకాన్ క్రుద్ధో వా నిర్దహేదపి,
సర్వథాతిప్రవృద్ధోఽసౌ రావణో రాక్షసాధిపః. 3

ప్ర. అ. సర్వథా=అన్ని విధములం, అతిప్రవృద్ధః=చాల వృద్ధి చెందిన, అసౌ = ఈ, రాక్షసాధిపః = రాక్షసప్రభు వైన, రావణః = రావణుడు, తపసా= = తపస్సుచేత, లోకాన్ = లోకములను, నిర్దహేత్ = కాల్చివేయవచ్చును. క్రుద్ధో వాపి = కోపగించినను. నిర్దహేదపి (శత్రువులు మొదలైన వారిని) కాల్చి వేయవచ్చును

తా. రాక్షసరాజైన రావణుడు అన్ని విధముల చాల బలము కలవాడు. అతడు తన తపోబలముచేత లోకాలను కాల్చివేయగలడు. కోపించినచో ఎవరి నైనను నశింపచేయగలడు. 3

మూ. తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్.
న తదగ్నిశిఖా కుర్యాత్సంస్పృష్టా పాణినా సతీ, 4
జనకస్యాత్మజా కుర్యాద్యత్క్రోధకలుషీకృతా.

ప్ర. అ. తామ్ = ఆ సీతాదేవిని, స్పృశతః = స్పృశించిన, తస్య = వానియొక్క, గాత్రమ్ = శరీరము, తపసా = తపస్సుచేత, న వినాశితమ్ = నశింపచేయబడలేదు. క్రోధకలుషీకృతా = క్రోధముచే కలతబెట్టబడిన, జనకస్య ఆత్మజా = జనకుని కుమార్తె యైన సీత, యత్ = దేనిని, కుర్యాత్ = చేయునో, తత్ = దానిని, పాణినా=హస్తముచేత, సంస్పృష్టా సతీ=స్పృశించబడిన, అగ్ని శిఖా = అగ్నిజ్వాల కూడ, న కుర్యాత్ = చేయదు.

తా. రావణుడు ఆమెను స్పృశించినను అతని శరీరము భస్మము కాలే దన్నచో దానికి కారణము అతని తపస్సే. కోపముచేత మనస్సు కలుష మైన పుడు సీత చేయ గలిగిన దానిని, చేతితో స్పృశించిన అగ్నిజ్వాల కూడ చేయ జాలదు. 4

మూ. జామ్బవత్ప్రముఖాన్ సర్వాననుజ్ఞాప్య మహాహరీన్, 5
అస్మిన్నేవం గతే కార్యే భవతాం చ నివేదితే,
న్యాయ్యం స్మ సహ వైదేహ్యా ద్రష్టుం తౌ పార్థివాత్మజౌ.

ప్ర. అ. భవతామ్ = మీకు, నివేదితే = తెలుపబడిన, అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, ఏవం గతే = ఈ విధముగా ఉండగా, జాంబవత్ప్రముఖాన్ = జాంబవంతుడు మొదలైన, మహాహరీన్ = గొప్ప వానరులను, సమనుజ్ఞాప్య = అంగీకరింపచేసి, వైదేహ్యా సహ = సీతతో కూడ, తౌ = ఆ, పార్థివాత్మజౌ = రాజకుమారులను, ద్రష్టుమ్ = చూచుటకు, న్యాయ్యం స్మ = న్యాయ్యమైనది కదా।

తా. మీకు చెప్పిన విధముగ ఈ కార్యము ఈ విధముగ ఉన్నది. ఇట్టి పరిస్థితిలో జాంబవంతుడు మొదలైన వానరనాయకుల అనుజ్ఞ తీసికొని, సీతను కూడ మనతో తీసికొని వెళ్ళియే, ఆ రామలక్ష్మణులను చూచుట యుక్తము కదా। 5, 6

మూ. అహమేకోఽపి పర్యాప్తః సరాక్షసగణాం పురీమ్,
తాం లఙ్కాం తరసా హన్తుం రావణం చ మహాబలమ్.

ప్ర. అ. అహమ్ = నేను, ఏకోఽపి = ఒక్కడనే, సరాక్షసగణామ్ = రాక్షసగణములతో కూడిన, తాం లఙ్కాం పురీమ్ = ఆ లంకాపురమును, మహాబలమ్ = గొప్ప బలము గల, రావణం చ = రావణుని, తరసా = వేగముచేత, హన్తుమ్ = చంపుటకు, పర్యాప్తః = చాలినవాడను.

తా. రాక్షసగణములతో కూడిన ఆ లంకాపట్టణమును నశింపచేయుటకు మహాబలశాలి యైన రావణుని సంహరించుటకు కూడ నేనొక్కడనే చాలుదును.

మూ. కిం పునః సహితో వీరైర్బలవద్భిః కృతాత్మభిః,
కృతాస్త్రైః ప్లవగైః శూరైర్భవద్భిర్విజయైషిభిః. 8

ప్ర. అ. బలవద్భిః = బలవంతులు, కృతాత్మభిః = నియత మైన మనస్సు కలవారు, కృతాస్త్రైః = చేయబడిన (నేర్వబడిన), అస్త్రప్రయోగము గలవారు, శూరైః = శూరులు, విజయైషిభిః = విజయమును కోరువారు, ప్లవగైః = వానరులు అయిన, భవద్భిః = మీతో, సహితః = కూడినవాడనై, కిం పునః = చెప్ప నేల?

తా. మీ రందరు బలవంతులు. మనస్సును వశములో ఉంచుకొన్నవారు. అస్త్రప్రయోగమునందు నిపుణులు. శూరులు. విజయమును కోరువారు. అట్టి మీతో కలిసి యుద్ధానికి వెళ్ళినచో చెప్పవలెనా। 8

మూ. అహం తు రావణం యుద్ధే ససైన్యం సపురఃసరమ్,
సహపుత్రం వధిష్యామి సహోదరయుతం యుధి. 9

ప్ర. అ. అహం తు = నేనైతే, యుద్ధే = యుద్ధమునందు, ససైన్యమ్ = సైన్యముతో కూడినవాడు, సపురఃసరమ్ = ముందు నడిచే పరివారముతో కూడిన వాడు, సపుత్రమ్ = పుత్రునితో కూడినవాడు, సహోదరయుతమ్ = సహోదరులతో కూడినవాడు అయిన, రావణమ్ = రావణుని, యుధి = యుద్ధమునందు, వధిష్యామి = చంపెదను.

తా. సైన్యముతో యుద్ధమునకు వచ్చిన రావణుని, అతని ముందు నడచు పరివారమును, అతని పుత్రులను, సహోదరులను కూడ యుద్ధములో వధించగలను. 9

మూ. బ్రాహ్మమైన్ద్రం చ రౌద్రం చ వాయవ్యం వారుణం తథా,
యది శక్రజితోఽస్త్రాణి దుర్నిరీక్షాణి సంయుగే, 10
తాన్యహం విధమిష్యామి హనిష్యామి చ రావణమ్.

ప్ర. అ. బ్రాహ్మమ్ = బ్రహ్మాస్త్రమును, ఐన్ద్రం చ = ఐంద్రాస్త్రమును, రౌద్రం చ = రౌద్రాస్త్రమును, వాయవ్యమ్ = వాయవ్యాస్త్రమును, తథా = మరియు, వారుణమ్ = వారుణాస్త్రమును, శక్రజితః = ఇంద్రజిత్తుయొక్క, అస్త్రాణి = అస్త్రములు, దుర్నిరీక్షాణి యది = చూడ శక్యము కానిచో, తాని = వాటిని, సంయుగే = యుద్ధమునందు, విధమిష్యామి = ఎగురగొట్టి వేయగలను. రాక్షసాన్ = రాక్షసులను, హనిష్యామి చ = చంపగలను.

తా. బ్రహ్మాస్త్రమును, ఐంద్రాస్త్రమును, రౌద్రాస్త్రమును, వాయవ్యాస్త్రమును, వారుణాస్త్రమును, ఇంద్రజిత్తు ప్రయోగించు, చూచుటకు శక్యము కాని ఇతరాస్త్రములను కూడ యుద్ధములో ఎగురగొట్టి వేయగలను. రాక్షసులను చంపగలను. 10

మూ. భవతా మభ్యనుజ్ఞాతో విక్రమో మే రుణద్ధి తమ్. 11
మయాతులా విసృష్టా హి శైలవృష్టిర్నిరన్తరా,
దేవానపి రణే హన్యాత్కిం పునస్తాన్నిశాచరాన్. 12

ప్ర. అ. భవతామ్=మీయొక్క (మీ చేత), అభ్యనుజ్ఞాతః=అనుమతింపబడిన, మే=నాయొక్క, విక్రమః = పరాక్రమము, తమ్ = ఆ రావణుని, రుణద్ధి= ఆరికట్టుచున్నది, (అరికట్టి బంధింపగలదు). మయా =నాచేత, విసృష్టా =విడవబడిన, అతులా =సాటి లేని, నిరన్తరా = అవకాశము లేని, శైలవృష్టిః =శిలలవర్షము, రణే= యుద్ధమునందు, దేవానపి = దేవతలను కూడ హన్యాత్ = చంపును. తాన్=ఆ, నిశాచరాన్ = రాక్షసులను, కిం పునః = చెప్పనేల?

తా. మీరు అనుమతించినచో నా పరాక్రమము ఆ రావణుని బంధింపగలదు. యుద్ధములో నేను నిరంతరముగా వర్షించిన శిలావృష్టి దేవతలను కూడ చంపగలదు. రాక్షసుల మాట చెప్పవలెనా?

వి. "భవతామననుజ్ఞాతం రుణద్ధి మమ విక్రమమ్" అను ప్రాచ్యపాఠము బాగున్నది. 'మీ అనుజ్ఞ లేకపోవుట నా పరాక్రమమును అడ్డు పెట్టుచున్నది' అని అర్థము. 12

మూ. సాగరోఽప్యతియాద్వేలాం మన్దరః ప్రచలేదపి,
న జామ్బవన్తం సమరే కమ్పయేదరివాహినీ. 13

ప్ర. అ. సాగరః=సముద్రము, వేలామ్=తీరమును, అతియాదపి = దాటవచ్చును. మన్దరః = మందరపర్వతము, ప్రచలేదపి = చలింపవచ్చును. సమరే = యుద్ధమునందు, అరివాహినీ = శత్రుసైన్యము, జామ్బవన్తమ్ = జాంబవంతుని, న కమ్పయేత్ = కంపింప చేయజాలదు.

తా. సముద్రము తీరము దాటిన దాటవచ్చును. మందరపర్వతము చలింపవచ్చును. కాని సమరములో జాంబవంతుని శత్రుసేన కదల్పజాలదు.

మూ. సర్వరాక్షససంఘానాం రాక్షసా యే చ పూర్వకాః,
అలమేకో వినాశాయ వీరో వాలిసుతః కపిః. 14

ప్ర. అ. వీరః =వీరుడు, వాలిసుతః =వాలికుమారుడు అయిన, కపిః =అంగదుడు. ఏకః =ఒక్కడే, సర్వరాక్షససంఘానామ్ =సమస్తమైన రాక్షస సముదాయముల, పూర్వకాః =నాయకులు, యే =ఎవరున్నారో, వారి యొక్క, వినాశాయ = నశింపచేయుటకు, అలమ్ = చాలును.

తా. వీరు లైన వాలిపుత్రుడు అంగదుడు ఒక్కడే, సకలరాక్షససము దాయముల నాయకులను కూడ, సంహరించుటకు సమర్థుడు. 14

మూ. పనసస్యోరువేగేన నీలస్య చ మహాత్మనః,
మన్దరోఽప్యవశీర్యేత కిం పునర్యుధి రాక్షసాః. 15

ప్ర. అ. పనసస్య = పనసునియొక్క, మహాత్మనః = మహాత్ము లైన, నీలస్య చ = నీలునియొక్క, ఉరువేగేన = గొప్పవేగముచేత, మన్దరోఽపి = మందరపర్వతము కూడ, అవశీర్యేత = భగ్న మైపోవును. యుధి=యుద్ధములో రాక్షసాః = రాక్షసులు, కిం పునః = చెప్ప నేల?

తా. మహాత్ము లైన పనసుడు, నీలుడు చూపు మహావేగముచేత మందర పర్వతము కూడ, భగ్న మైపోవును. యుద్ధములో రాక్షసుల విషయము చెప్ప వలెనా? 15

మూ. సదేవాసురయక్షేషు గన్ధర్వోరగపక్షిషు,
మైన్దస్య ప్రతియోద్ధారం శంసత ద్వివిదస్య వా. 16

ప్ర. అ. సదేవాసురయక్షేషు = దేవతలతోను, అసురులతోను యక్షులతోను, గన్ధర్వోరగపక్షిషు = గంధర్వులతోను, ఉరగులతోను, పక్షులతోను, మైన్దస్య=మైందునకు గాని, ద్వివిదస్య వా = ద్వివిదునకు గాని, ప్రతియోద్ధారమ్ = ఎదిరించి యుద్ధము చేయువానిని, శంసత = చెప్పండి.

తా. దేవ-అసుర-గంధర్వ-ఉరగ-పక్షులలో ఎవ్వ రైన మైందునకు గాని, ద్వివిదునకు గాని ఎదురుగా నిలచి యుద్ధము చేయగలరా? చెప్పుడు. 16

మూ. అశ్విపుత్రౌ మహాభాగావేతౌ ప్లవగసత్తమౌ,
ఏతయోః ప్రతియోద్ధారం న పశ్యామి రణాజిరే. 17

ప్ర. అ. అశ్విపుత్రౌ = అశ్వినీదేవతల పుత్రు లైన, ఏతౌ = ఈ, మహాభాగౌ = మహాభాగ్యవంతు లైన మైందద్వివిదులు, ప్లవగసత్తమౌ = వానరులలో శ్రేష్ఠులు రణాజిరే=రణరంగమునందు, ఏతయోః=ఈ ఇద్దరికి, ప్రతియోద్ధారమ్ = ఎదిరించి యుద్ధము చేయువానిని, న పశ్యామి = చూడను.

తా. అశ్వినీదేవతల పుత్రులూ, మహాభాగ్యవంతులూ అయిన ఈ మైంద ద్వివిదులు వానరులలో శ్రేష్ఠులు. రణరంగములో వీరిని ఎదిరించి యుద్ధము చేయగలవా రెవ్వరూ కనబడరు. 17

మూ. పితామహవరోత్సేకాత్పరమం దర్పమాస్థితౌ,
అమృతప్రాశనావేతౌ సర్వవానరసత్తమౌ. 18

ప్ర. అ. పితామహవరోత్సేకాత్ = బ్రహ్మ ఇచ్చిన వరమువలన కలిగిన అతిశయము వలన, పరమమ్ = గొప్ప, దర్పమ్ = దర్పమును, ఆస్థితౌ = అవలంబించిన, ఏతౌ = ఈ, వానరసత్తమౌ = వానరశ్రేష్ఠులు, అమృతప్రాశనౌ = అమృతమును తిన్నవారు.

తా. బ్రహ్మదేవు డిచ్చిన వరమువలన కలిగిన అతిశయముచే దృప్తులై, వానరశ్రేష్ఠు లైన ఈ మైందద్వివిదులు అమృతమును భుజించిరి. 18

మూ. అశ్వినోర్మాననార్థం హి సర్వలోకపితామహః,
సర్వావధ్యత్వమతులమనయోర్దత్తవాన్ పురా. 19

ప్ర. అ. పురా = పూర్వము, సర్వలోకపితామహః = సమస్తలోకములకు పితామహు డైన బ్రహ్మదేవుడు, అశ్వినోః = అశ్వినీదేవతలయొక్క, మాననార్థమ్ = గౌరవించుటకొరకు, అనయోః = వీరికి, అతులమ్ = సాటి లేని, సర్వావధ్యత్వమ్ = అందరిచేతనూ (ఎవ్వరిచేతనూ) చంపశక్యులు కాకుండుటను, దత్తవాన్ = ఇచ్చినాడు.

తా. పూర్వము, బ్రహ్మదేవుడు ఈ మైందద్వివిదులకు ఎవ్వరిచేతను చంప శక్యము కాకుండుట అను సాటి లేని వరమును ఇచ్చెను. 19

మూ. వరోత్సేకేన మత్తౌ చ ప్రమథ్య మహతీం చమూమ్,
సురాణా మమృతం వీరౌ పీతవన్తౌ ప్లవంగమౌ. 20

ప్ర. అ. వరోత్సేకేన = వరమువలన కలిగిన అతిశయముచేత, మత్తౌ చ = మదించినవా రై, వీరౌ = వీరు లైన, ప్లవఙ్గమౌ = ఈ ఇద్దరు వానరులు, సురాణామ్ = దేవతలయొక్క, మహతీమ్ = గొప్ప దైన, చమూమ్ = సేనను, ప్రమథ్య = మథించి, అమృతమ్ = అమృతమును, పీతవన్తౌ = త్రాగినారు.

తా. వరమువలన కలిగిన అతిశయముచేత మదించిన వీరులైన ఈ మైందద్వివిదులు, గొప్ప దేవతాసైన్యమును జయించి అమృతమును త్రాగిరి.

మూ. ఏతావేవ హి సంక్రుద్ధౌ సవాజిరథకుఞ్జరామ్,
లఙ్కాం నాశయితుం శక్తౌ సర్వే తిష్ఠన్తు వానరాః. 21

ప్ర. అ. సంక్రుద్ధౌ = కోపించిన, ఏతావేవ = ఈ మైందద్వివిదులే, సవాజిరథకుఞ్జరామ్ = అశ్వములతోను, రథములతోను ఏనుగులతోను కూడిన, లఙ్కామ్ = లంకను, నాశయితుమ్ = నశింపచేయుటకు, శక్తౌ = సమర్థులు, సర్వే = సమస్తమైన, వానరాః = వానరులు, తిష్ఠన్తు = ఉందురుగాక.

తా. ఇతరవానరు లందరి మాట అట్లుండగా, ఈ మైందద్వివిదులే కోపించినచో అశ్వములతోను, రథములతోను, ఏనుగులతోను కూడిన ఆ లంకా నగరము నంతా నశింపచేయ గలరు. 21

మూ. మయైవ నిహతా లఙ్కా దగ్ధా భస్మీకృతా పునః,
రాజమార్గేషు సర్వత్ర నామ విశ్రావితం మయా. 22

ప్ర. అ. లఙ్కా = లంక, మయైవ = నాచేతనే, నిహతా = నశింపచేయబడినది. రాజమార్గేషు = రాజమార్గములయందు, సర్వత్ర = అంతటా, మయా = నాచేత, నామ = పేరు, విశ్రావితమ్ = వినిపింపబడినది.

తా. నేనే లంకను నశింపచేసి, కాల్చి భస్మము చేసి అన్ని రాజమార్గము లందు పేరును చాటితిని.

మూ. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. 23
అహం కోసలరాజస్య దాసః పవనసంభవః
హనుమానితి సర్వత్ర నామ విశ్రావితం మయా. 24

ప్ర. అ. అతిబలః = అధికమైన బలము గల, రామః = రాముడు, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు. మహాబలః = గొప్ప బలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, సర్వోత్కర్షగా ఉన్నాడు. రాఘవేణ = రాముని చేత, అభిపాలితః = పాలింపబడిన, రాజా = రాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు,

జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు. పవనసంభవః = వాయుకుమారుడ నైన, అహమ్ = నేను, కోసలరాజస్య = కోసలాధిపతి యైన రామునియొక్క, దాసః = దాసుడ నైన, హనుమాన్ = హనుమంతుడను; ఇతి = ఇట్లు, మయా = నాచేత, నామ = పేరు, విశ్రావితమ్ = చాటబడినది.

తా. "మహాబలశాలి యైన రాముడు, అధికమైన బలము గల లక్ష్మణుడు సర్వోత్కర్షగా ఉన్నారు. రామునిచేత పాలింపబడిన వానర రాజైన సుగ్రీవుడు సర్వోత్కర్షగా ఉన్నాడు. వాయుపుత్రుడ నైన నేను రాముని దాసుడనైన హనుమంతుడను" అని నేను రామాదుల పేర్లను అంతటా ఘోషించితిని. 23, 24

మూ. అశోకవనికామధ్యే రావణస్య దురాత్మనః,
అధస్తాచ్ఛింశుపావృక్షే సాధ్వీ కరుణమాస్థితా. 25
రాక్షసీభిః పరివృతా శోకసంతాపకర్శితా,
మేఘలేఖాపరివృతా చన్ద్రలేఖేవ నిష్ప్రభా, 26
అచిన్తయన్తీ వైదేహీ రావణం బలదర్పితమ్

ప్ర. అ. దురాత్మనః = దుర్బుద్ధి యైన, రావణస్య = రావణునియొక్క, అశోకవనికామధ్యే = అశోకవనమధ్యమందు, శింశుపావృక్షే = శింశుపావృక్షము (యొక్క), అధస్తాత్ = క్రింద, సాధ్వీ = పతివ్రతా, రాక్షసీభిః = రాక్షసస్త్రీల చేత, పరివృతా = చుట్టబడినదీ, శోకసంతాపకర్శితా = శోకముచేత, మనస్తాపము చేత కృశింపచేయ బడినదీ, మేఘలేఖాపరివృతా = మేఘరేఖచేత చుట్టబడిన, చన్ద్రలేఖేవ = చంద్రరేఖ వలె, నిష్ప్రభా = కాంతి లేనిదీ, బలదర్పితమ్ = బలము చేత గర్వించిన, రావణమ్ = రావణుని, అచిన్తయన్తీ = ఆలోచించనిదీ అయిన, వైదేహీ = సీత, కరుణమ్ = దైన్యమును, ఆస్థితా = అవలంబించి ఉన్నది.

తా. దురాత్ము డైన రావణుని అశోకవనమధ్యమునందు, శింశుపావృక్ష మూలమునందు మహాపతివ్రత యైన సీత దైన్యముతో ఉన్నది. శోకముతోను, మనస్తాపముతోను కృశించిన ఆమె చుట్టూ రాక్షసస్త్రీలు కాపలా కాయుచున్నారు. ఆమె చుట్టూ మేఘరేఖ ఉన్న చంద్రరేఖ వలె కాంతి విహీనురా లై ఉన్నది. ఆమె, బలము చేత గర్వించిన రావణుని గూర్చి మనసా కూడ స్మరించుట లేదు.

మూ. పతివ్రతా చ సుశ్రోణీ అవష్టబ్ధా చ జానకీ. 27
అనురక్తా హి వైదేహీ రామం సర్వాత్మనా శుభా,
అనన్యచిత్తా రామే చ పౌలోమీవ పురన్దరే. 28

ప్ర. అ. పతివ్రతా = పతివ్రత యైన, సుశ్రోణీ = అందమైన కటి ప్రదేశము గల, జానకీ = జానకి, అవష్టబ్ధా = నిరోధింపబడి ఉన్నది. శుభా = మంగళప్రదురాలైన, వైదేహీ = సీత, సర్వాత్మనా = అన్ని విధములా, రామమ్ = రాముని, అనురక్తా = అనురాగము గలది. పురందరే = దేవేంద్రుని విషయమున, పౌలోమీవ = శచీదేవి వలె, రామే = రామునియందు, అనన్యచిత్తా = ఏకాగ్రమైన చిత్తము గలది.

తా. అందమైన కటిప్రదేశముగల, పతివ్రతయైన జానకి లంకలో నిరోధింపబడి ఉన్నది. మంగళప్రదురాలైన ఆ వైదేహి సర్వవిధముల రామునియందు అనురాగవంతురాలై ఉన్నది. శచీదేవి దేవేంద్రునియందు ఏకాగ్రచిత్తురాలై ఉన్నట్లు, రామునియందు ఏకాగ్రచిత్తురాలై ఉన్నది. 27, 28

మూ. తదేకవాసఃసంవీతా రజోధ్వస్తా తథైవ చ,
శోకసంతాపదీనాఙ్గీ సీతా భర్తృహితే రతా. 29

ప్ర. అ. తదేకవాసఃసంవీతా = ఆ ఒక్క వస్త్రమునే కట్టుకొని ఉన్నది, తథైవ చ = మరియు, రజోధ్వస్తా = పరాగముచేత శోభావిహీనురాలూ, శోకసంతాపదీనాఙ్గీ = శోకముచేత సంతాపముచేత దీనమైన శరీరము గలదీ అయిన, సీతా = సీత, భర్తృహితే = భర్తయొక్క హితమునందే, రతా = ఆసక్తి గలది.

తా. ఆ సీతాదేవి ఆ ఒక్క వస్త్రమునే చుట్టబెట్టుకొని, శరీర మంతా దుమ్ము కప్పివేయుటచే కాంతివిహీనురాలై ఉన్నది. ఆమె శరీరము శోకముచేత, సంతాపముచేత దుర్బలమైపోయినది. ఆమె భర్త హితమునే సర్వవిధాల కోరుకొనుచున్నది. 29

మూ. సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః,
రాక్షసీభిర్విరూపాభిర్దృష్టా హి ప్రమదావనే, 30
ఏకవేణీధరా దీనా భర్తృచిన్తాపరాయణా.

అధఃశయ్యా వివర్ణాఙ్గీ పద్మినీవ హిమాగమే,
రావణాద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా. 31

ప్ర. అ. విరూపాభిః = వికృతములైన ఆకారములు గల, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, ముహుర్ముహుః = మాటి మాటికి, తర్జ్యమానా = భయపెట్టబడుచున్నది, ఏకవేణీధరా = ఒకే జడను ధరించినది, దీనా = దీనురాలు, భర్తృచిన్తాపరాయణా = భర్తను గూర్చిన చింతయందు లగ్నమైనది, అధఃశయ్యా = నేల శయనముగా గలది, హిమాగమే = శిశిరఋతువునందు, పద్మినీవ = పద్మలత వలె, వివర్ణాఙ్గీ = చెడిన రంగు గల శరీరము గలది, రావణాత్ = రావణునినుండి, వినివృత్తార్థా = మరలిన ప్రయోజనము గలది, మర్తవ్యకృతనిశ్చయా = మరణించవలెనని చేయబడిన నిశ్చయము కలది అయిన, సా = ఆ సీత, మయా = నాచేత, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల మధ్యయందు, ప్రమదావనే = ఉద్యానవనమునందు, దృష్టా = చూడబడినది.

తా. ఆ సీతను నేను రాక్షసస్త్రీలమధ్య ఉద్యానవనమునందు చూచితిని. ఆమెను రాక్షసస్త్రీలు మాటిమాటికి భయపెట్టుచుండిరి. ఒకే జడతో దీనురాలైన ఆమె భర్తను గురించిన చింతలో మగ్నయై ఉన్నది. నేలపై శయనించుచు, రంగు మారిపోయిన శరీరముతో ఆమె శిశిరఋతువునందలి పద్మలత వలె ఉన్నది. ఆమె రావణుని విషయమున విముఖురాలై మరణించవలెనని నిశ్చయించుకొన్నది. 30, 31

మూ. కథం చిన్మృగశావాక్షీ విశ్వాసముపపాదితా, 32
తతః సంభాషితా చైవ సర్వమర్థం చ దర్శితా,
రామసుగ్రీవసఖ్యం చ శ్రుత్వా ప్రీతిముపాగతా. 33

ప్ర. అ. మృగశావాక్షీ = లేడిపిల్ల కండ్ల వంటి కళ్లు గల ఆమె, కథంచిత్ = అతికష్టముగా, విశ్వాసమ్ = విశ్వాసమును, ఉపపాదితా = పుట్టించబడినది. తతః = అటు పిమ్మట, సంభాషితా చైవ = మాటలాడబడినదై, సర్వమ్ = సమస్తమైన, అర్థం చ = విషయమును, దర్శితా = చూపబడినది. రామసుగ్రీవసఖ్యం చ = రామసుగ్రీవుల స్నేహమును కూడ, శ్రుత్వా = విని, ప్రీతిమ్ = సంతోషమును, ఉపాగతా = పొందినది.

తా. లేడి పిల్ల కళ్ళవంటి కళ్లు గల ఆ సీతకు అతికష్టముగా విశ్వాసము కలిగించితిని. పిమ్మట ఆమెతో మాటలాడి విషయము లన్నీ తెలిపితిని. రామసుగ్రీవుల మధ్య స్నేహము ఏర్పడిన దను విషయము విని ఆమె సంతోషము పొందినది. ౩౨, ౩౩

మూ. నియతః సముదాచారో భక్తిర్భర్తరి చోత్తమా,
యన్న హన్తి దశగ్రీవం సా మహాత్మా కృతాగసమ్. ౩౪

ప్ర. అ. మహాత్మా = మహాత్మురా లైన, సా = ఆమె, కృతాగసమ్ = చేయబడిన అపరాధము గల, దశగ్రీవమ్ = రావణుని, న హన్తి ఇతి యత్ = చంపుటలేదను మాట ఏది కలదో దానికి, నియతః = నిశ్చిత మైన, సముదాచారః = సముదాచారము (నియమములను పాటించు స్వభావము), భర్తరి = భర్తయందు, ఉత్తమా = ఉత్తమ మైన, భక్తిః = భక్తి (కారణము).

తా. మహాత్మురా లైన ఆ సీతాదేవి అపరాధము చేసిన ఆ రావణుని చంపుటలేదన్నచో అందుకు నియమములను పాటించుటయందు ఆమె కున్న శ్రద్ధ, భర్తపైద ఉత్తమ మైన భక్తి కారణము.

మూ నిమిత్తమాత్రం రామస్తు వధే తస్య భవిష్యతి,
సా ప్రకృత్యైవ తన్వఙ్గీ తద్వియోగాచ్చ కర్శితా, ౩౫
ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా.

ప్ర. అ. రామస్తు = రాము డైతే, తస్య = ఆ రావణునియొక్క, వధే = = వధయందు, నిమిత్తమాత్రం = కేవలం నిమిత్తము మాత్రమే, భవిష్యతి = కాగలడు. ప్రకృత్యైవ = స్వభావము చేత, తన్వఙ్గీ = సన్నని శరీరము గలది, తద్వియోగాత్ = రాముని వియోగము వలన, కర్శితా చ = కృశించిన, సా = ఆ సీత, ప్రతిపత్పాఠశీలస్య = ప్రతిపత్తునందు పఠించు స్వభావము గల వాని యొక్క, విద్యేవ = విద్య వలె, తనుతామ్ = కృశత్వమును, గతా = పొందినది.

తా. ఆ రావణుని చంపుటకు రాముడు కేవలము నిమిత్తము మాత్రమే కాగలడు. స్వభావముచేతనే సన్నని శరీరము గల ఆ సీత, రాముని వియోగము చేత కృశించినదై, ప్రతిపత్తునందు చదివేవాని చదువు వలె చాల సన్నబడి పోయినది. ౩౫

మూ. ఏవమత్ర మహాభాగా సీతా శోకపరాయణా, ౩౯
యదత్ర ప్రతికర్తవ్యం తత్సర్వముపపాద్యతామ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకోనషష్టితమః సర్గః

ప్ర. అ. మహాభాగా = మహాభాగ్యవంతురాలైన, సీతా = సీత, అత్ర = ఇక్కడ, ఏవమ్ = ఈ విధముగా, శోకపరాయణా = శోకమునకు అధీనురాలై ఉన్నది. అత్ర = ఈ విషయమున, యత్ = ఏది, ప్రతికర్తవ్యమ్ = ప్రతిక్రియ చేయదగినదో, తత్ సర్వమ్ = అది అంతా, ఉపపాద్యతామ్ = చేయబడుగాక.

తా. మహాభాగ్యవంతురాలైన సీత ఈ విధముగా లంకానగరములో శోకములో మునిగి ఉన్నది. అందుచేత ఈ విషయమునందు చేయవలసిన ప్రతిక్రియ చేయబడుగాక. ౩౯

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో ఏబదితొమ్మిదవసర్గ సమాప్తము.

## అథ షష్టితమః సర్గః

[లంకను జయించి సీతను మనమే తీసికొని రావలె నని అంగదుడు ఉత్సాహముతో పలుకుట; అట్లు చేయుట యుక్తము కాదని జాంబవంతుడు చెప్పుట].

మూ. తస్య తద్వచనం శ్రుత్వా వాలిసూనురభాషత,
అయుక్తం తు వినా దేవీం దృష్టవద్భిశ్చ వానరాః,
సమీపం గన్తుమస్మాభి రాఘవస్య మహాత్మనః.

ప్ర. అ. తస్య = హనుమంతునియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, వాలిసూనుః = వాలిపుత్రుడు, అభాషత = పలికెను. వానరాః = వానరులారా! దృష్టవద్భిః = (సీతాదేవిని) చూచిన, అస్మాభిః = మనచేత, దేవీం వినా = దేవి లేకుండా, మహాత్మనః = మహాత్ము డైన, రాఘవస్య = రామునియొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి, గన్తుమ్ = వెళ్ళుటకు, అయుక్తం తు = యుక్తము కాదు.

తా. హనుమంతుని మాటలు విని అంగదుడు ఇట్లు పలికెను. వానరులారా! దేవిని చూచిన పిమ్మట కూడ మనము ఆమెను మనతో తీసికొనిపోకుండా మహాత్ము డైన రాముని వద్దకు వెళ్లుట యుక్తము కాదు. 1

మూ. దృష్టా దేవీ న చానీతా ఇతి తత్ర నివేదనమ్, 2
అయుక్తమివ పశ్యామి భవద్భిః ఖ్యాతవిక్రమైః.

ప్ర. అ. ఖ్యాతవిక్రమైః = ప్రసిద్ధ మైన పరాక్రమము గల, భవద్భిః = మీచేత, దేవీ = దేవి, దృష్టా = చూడబడినది, న ఆనీతా చ = తీసికొని రాబడ లేదు, ఇతి = ఇట్లు, తత్ర = అక్కడ, నివేదనమ్ = తెలుపుట, అయుక్తమివ = = అయుక్తమును వలె, పశ్యామి = చూచుచున్నాను.

తా. "దేవిని చూచినాము, కాని ఆమెను తీసుకొని రాలేదు" అని ప్రసిద్ధ మైన పరాక్రమము గల వీరు అక్కడికి వెళ్ళి చెప్పుట అయుక్త మని నా అభిప్రాయము. 2

మూ. న హి నః ప్లవనే కశ్చిన్నాపి కశ్చిత్పరాక్రమే, 3
తుల్యః సామరదైత్యేషు లోకేషు హరిసత్తమాః.

ప్ర. అ. హరిసత్తమాః = వానరశ్రేష్ఠులారా! సామరదైత్యేషు = దేవతలతోను, దైత్యులతోను కూడిన, లోకేషు = లోకములయందు, ప్లవనే = ఎగురుట యందు, నః = మనకు, తుల్యః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వడూ, న హి = లేడు కదా. పరాక్రమేఽపి = పరాక్రమము నందు కూడ, తుల్యుడు, కశ్చిత్ = ఎవ్వడూ, న = లేడు.

తా. ఓ వానరశ్రేష్ఠులారా! దేవతలతోను, దైత్యులతోను కూడిన లోకములలో ఎగురుట యందు గాని, పరాక్రమమునందు గాని మనతో సమానుడు ఎవ్వడు లేడు కదా! 3

మూ. తేష్వేవం హతవీరేషు రాక్షసేషు హనూమతా, 4
కిమన్యదత్ర కర్తవ్యం గృహీత్వా యామ జానకీమ్.

ప్ర. అ. తేషు = ఆ, రాక్షసేషు = రాక్షసులు, హనూమతా = హనుమంతుని చేత, ఏవమ్ = ఇట్లు, హతవీరేషు = చంపబడిన వీరులు కలవా రగుచుండగా, అత్ర = ఈ విషయమునందు, కిమ్ = ఏమి, అన్యత్ = మరి యొకటి, కర్తవ్యమ్ = చేయదగినది? జానకీమ్ = జానకిని, గృహీత్వా = గ్రహించి, యామ = వెళ్ళెదము.

తా. రాక్షసులలోని వీరుల నందరినీ హనుమంతు డీ విధముగ చంపివేసినాడు కదా! ఇంక మనము చేయవలసిన మరొక పని ఏమున్నది? జానకిని తీసుకొనియే వెళ్ళెదము. 4

మూ. తమేవం కృతసంకల్పం జామ్బవాన్ హరిసత్తమః, 5
ఉవాచ పరమప్రీతో వాక్యమర్థవదర్థవిత్.

ప్ర. అ. అర్థవిత్ = కార్యమును ఎరిగిన, హరిసత్తమః = వానరశ్రేష్ఠ

త్రైన, జామ్బవాన్ = జాంబవంతుడు, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, ఏవమ్ = ఇట్లు, కృతసంకల్పమ్ = చేయబడిన సంకల్పము గల, తమ్ = అతనిని గూర్చి, అర్థవత్ = ఉత్తమ మైన అర్థము గల, వాక్యమ్ = వాక్యమును ఉవాచ = పలికెను.

తా. ఏ కార్యము ఎట్లు చేయవలెనో తెలిసినవాడు, వానరశ్రేష్ఠుడు అయిన జాంబవంతుడు చాల సంతోషించినవాడై, ఈ విధముగా సంకల్పము చేసిన ఆ అంగదునితో ఉత్తమ మైన అర్థము గల వాక్యమును పలికెను. 5

మూ. న తావదేషా మతిరక్షమా నో
యథా భవాన్ పశ్యతి రాజపుత్ర,
యథా తు రామస్య మతిర్నివిష్టా
తథా భవాన్ పశ్యతు కార్యసిద్ధిమ్. 6

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షష్టితమః సర్గః.

ప్ర. అ. రాజపుత్ర = రాజకుమారా! భవాన్ = నీవు, యథా = ఎట్లు, పశ్యతి = చూచుచున్నావో, ఏషా = ఈ, మతిః = ఆలోచన, నః = మనకు, అక్షమా = తగనిది, న తావత్ = కాదు. తు = కాని, రామస్య = రామునియొక్క, మతిః = బుద్ధి, యథా = ఎట్లు, నివిష్టా = ఉన్నదో, తథా = అట్లు, భవాన్ = నీవు, కార్యసిద్ధిమ్ = కార్యసిద్ధిని, పశ్యతు = చూచెదవు గాక.

తా. రాజకుమారా! నీవు చేసిన ఆలోచన మనకు తగనిది కాదు. యుక్తమైనదే. కాని రాముని ఆలోచన ఎట్లు ఉండునో ఆ విధముగా నీవు కార్యసిద్ధి కలుగు నట్లు ఆలోచించుము. 6

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో అరువదవ సర్గ సమాప్తము.

## అథ ఏకషష్టితమః సర్గః

[వానరులు మధువనములో ప్రవేశించి మధువును, ఫలములను యథేష్టముగా తినుట, వనరక్షకులను నేలపై పడవేసి ఈడ్చుట].

మూ. తతో జామ్బవతో వాక్యమగృహ్ణన్త వనౌకసః,
అఙ్గదప్రముఖా వీరా హనుమాంశ్చ మహాకపిః. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, అఙ్గదప్రముఖాః=అంగదుడు మొదలైన, వీరాః=వీరులైన, వనౌకసః=వానరులు, మహాకపిః=వానరులలో గొప్పవాడైన, హనుమాంశ్చ=హనుమంతుడు, జామ్బవతః=జాంబవంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, అగృహ్ణన్త=గ్రహించిరి.

తా. పిమ్మట అంగదుడు మొదలైన వీరులైన వానరులూ, వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు జాంబవంతుని వాక్యమును అంగీకరించిరి. 1

మూ. ప్రీతిమన్తస్తతః సర్వే వాయుపుత్రపురఃసరాః,
మహేన్ద్రాగ్రం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః. 2

మేరుమన్దరసంకాశా మత్తా ఇవ మహాగజాః,
ఛాదయన్త ఇవాకాశం మహాకాయా మహాబలాః 3

సభాజ్యమానం భూతైస్తమాత్మవన్తం మహాబలమ్,
హనూమన్తం మహావేగం వహన్త ఇవ దృష్టిభిః. 4

రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుం చ పరమం యశః,
సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభిరున్నతాః. 5

ప్రియాఖ్యానోన్ముఖాః సర్వే సర్వే యుద్ధాభినన్దినః,
సర్వే రామప్రతీకారే నిశ్చితార్థా మనస్వినః. 6

## అథ ఏకషష్టితమః సర్గః

[వానరులు మధువనములో ప్రవేశించి మధువును, ఫలములను యథేష్టముగా తినుట, వనరక్షకులను నేలపై పడవేసి ఈడ్చుట].

మూ. తతో జామ్బవతో వాక్యమగృహ్ణన్త వనౌకసః,
అఙ్గదప్రముఖా వీరా హనుమాంశ్చ మహాకపిః. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, అఙ్గదప్రముఖాః=అంగదుడు మొదలైన, వీరాః=వీరులైన, వనౌకసః=వానరులు, మహాకపిః=వానరులలో గొప్పవాడైన, హనుమాంశ్చ=హనుమంతుడు, జామ్బవతః=జాంబవంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, అగృహ్ణన్త=గ్రహించిరి.

తా. పిమ్మట అంగదుడు మొదలైన వీరులైన వానరులూ, వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు జాంబవంతుని వాక్యమును అంగీకరించిరి. 1

మూ. ప్రీతిమన్తస్తతః సర్వే వాయుపుత్రపురఃసరాః,
మహేన్ద్రాగ్రిం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః. 2

మేరుమన్దరసంకాశా మత్తా ఇవ మహాగజాః,
ఛాదయన్త ఇవాకాశం మహాకాయా మహాబలాః. 3

సభాజ్యమానం భూతైస్తమాత్మవన్తం మహాబలమ్,
హనూమన్తం మహావేగం వహన్త ఇవ దృష్టిభిః. 4

రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుం చ పరమం యశః,
సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభిరున్నతాః. 5

ప్రియాఖ్యానోన్ముఖాః సర్వే సర్వే యుద్ధాభినన్దినః,
సర్వే రామప్రతీకారే నిశ్చితార్థా మనస్వినః. 6

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మేరుమన్దరసంకాశాః=మేరు–మందర పర్వతములతో సమానులు, మత్తాః=మదించిన, గజాః ఇవ=ఏనుగులు వలె ఉన్నవారు, ఆకాశమ్=ఆకాశమును, ఛాదయన్తః ఇవ=కప్పుచున్న ట్లున్నవారు, మహాకాయాః=గొప్ప శరీరములు కలవారు, మహాబలాః=గొప్ప బలము గల వారు అయిన, ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, సర్వే=అందరు, మహేన్ద్రాద్రిమ్=మహేంద్రపర్వతమును, పరిత్యజ్య=విడచి, ప్రీతిమన్తః=సంతోషముగలవారై, వాయుపుత్రపురస్సరాః = హనుమంతుడు, పురఃసరుడుగా, (ముందు నడచు వాడుగా) కలవారై, భూతైః=ప్రాణులచేత, సభాజ్యమానమ్=ఆదరింపబడుచున్న వాడు, ఆత్మవన్తమ్=మంచి బుద్ధి కలవాడు, మహాబలమ్=గొప్ప బలము గల వాడు, మహావేగమ్=గొప్ప వేగము గలవాడు అయిన, హనూమన్తమ్=హనుమంతుని, దృష్టిభిః=దృష్టులచేత, వహన్తః ఇవ=మోయుచున్నవారు వలె, రాఘవే=రామునియందు, అర్థనిర్వృత్తిమ్=కార్యసాఫల్యమును, పరమమ్=గొప్ప, యశః=కీర్తిని, కర్తుమ్=చేయుటకు, సమాధాయ=నిశ్చయించుకొని, సమృద్ధార్థాః=సఫలమైన, కార్యము కలవారై, కర్మసిద్ధిభిః= కార్యసిద్ధులచే, ఉన్నతాః=చాలఉత్సాహవంతులై, పుప్లువుః=ఎగిరి వెళ్ళిరి. సర్వే=అందరూ, ప్రియాఖ్యానోన్ముఖాః=ప్రియమును చెప్పుటకు ఉన్ముఖులై, ఉండిరి. సర్వే=అందరూ, యుద్ధాభినన్దినః=యుద్ధమును అభినందించువారు. మనస్వినః=ఉన్నతమైన మనస్సు గల, సర్వే=అందరూ, రామప్రతీకారే= రాముని ప్రతీకారము నందు, నిశ్చితార్థాః=నిశ్చయింపబడిన కార్యము కలవారు.

తా. పిమ్మట, మేరుమందర పర్వతముల వలె, మదించిన మహాగజముల వలె ఉన్న ఆ వానరశ్రేష్ఠు లందరు, వాయుపుత్రుణ్ణి ముందు ఉంచుకొని, మహేంద్రాద్రిని విడచి, సంతోషముతో ఎగిరి వెళ్ళిరి. పెద్ద దేహములు, అధికమైన బలము గల వాళ్లు ఆకాశమును కప్పివేయుచున్నట్లు ఉండిరి. సమస్త ప్రాణులచేత గౌరవింపబడుచున్న బుద్ధిశాలీ, మహాబలుడూ అయిన, మహావేగవంతుడైన హనుమంతుని వారు తమ దృష్టులతో మోయుచున్నట్లు ఉండిరి. రాముని కార్యమును సఫలము చేయుటకు, గొప్ప కీర్తిని సంపాదించుటకు నిశ్చయించుకొనిరి. కార్యమును సఫలము చేసికొని, ఆ కార్యసిద్ధిచే అధికోత్సాహముతో ఉండిరి. వారందరూ ప్రియవార్తను చెప్పుటకు తొందరపడుచుండిరి. అందరు యుద్ధమును అభినందించుచుండిరి. ఆత్మాభిమానవంతులైన వా రందరు రాముని

విషయమున రావణుడు చేసిన అపకారమునకు ప్రతిక్రియ చేయ నిశ్చయించు కొని యుండిరి. 2_6

మూ. ప్లవమానాః ఖమాప్లుత్య తతస్తే కాననౌకసః,
నన్దనోపమమాసేదుర్వనం ద్రుమలతాయుతమ్. 7

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే = ఆ, కాననౌకసః = వానరులు, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఆప్లుత్య = ఎగిరి, ప్లవమానాః = ఆకాశములో తేలి యాడుచు, ద్రుమలతాయుతమ్ = వృక్షములతోను, లతలతోను కూడిన, నన్దనోపమమ్ = నందనవనముతో సమాన మైన, వనమ్ = వనమును, ఆసేదుః = చేరిరి.

తా. పిమ్మట ఆ వానరులు ఆకాశముపైకి ఎగిరి, తేలియాడుచు, వృక్షములతోను లతలతోను కూడిన నందనవనముతో సమాన మైన ఉద్యాన వనమును చేరిరి. 7

మూ. యత్తన్మధువనం నామ సుగ్రీవస్యాభిరక్షితమ్,
అధృష్యం సర్వభూతానాం సర్వభూతమనోహరమ్. 8

ప్ర. అ. అభిరక్షితమ్ = రక్షింపబడినది, సర్వభూతానామ్ = సకల ప్రాణులకు, అధృష్యమ్ = అతిక్రమింప శక్యముకానిది, సర్వభూతమనోహరమ్ = సకలప్రాణులకు మనోహరమూ అయిన, యత్ = ఏ, సుగ్రీవస్య = సుగ్రీవుని యొక్క, మధువనం నామ = మధువన మనునది కలదో, తత్ = ఆ వనమును (చేరిరి). 8

మూ. యద్రక్షతి మహావీర్యః సదా దధిముఖః కపిః,
మాతులః కపిముఖ్యస్య సుగ్రీవస్య మహాత్మనః. 9

ప్ర అ మహాత్మనః = మహాత్ముడు, కపిముఖ్యస్య = వానరనాయకుడు అయిన, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, మాతులః = మేనమామ, మహావీర్యః = గొప్ప పరాక్రమము గలవాడు అయిన, దధిముఖః = దధిముఖు డనే, కపిః = వానరుడు, యత్ = దేనిని, సదా = ఎల్లప్పుడు, రక్షతి = రక్షించుచున్నాడో (ఆ వనమును చేరిరి).

తా. మహాత్ముడు, వానరరాజు అయిన సుగ్రీవుని మేనమామ, మహా పరాక్రమవంతుడు అయిన దధిముఖుడు అను వానరుడు ఎల్లప్పుడు దానిని రక్షించుచుండును. 9

మూ. తే తద్వనముపాగమ్య బభూవుః పరమోత్కటాః,
వానరా వానరేన్ద్రస్య మనఃకాన్తతమం మహత్. 10

ప్ర. అ. తే = ఆ, వానరాః = వానరులు, వానరేన్ద్రస్య = సుగ్రీవుని యొక్క, మనఃకాన్తతమమ్ = మనస్సునకు చాల మనోహరమైన, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, వనమ్ = వనమును, ఉపాగమ్య = చేరి, పరమోత్కటాః = చాల వేడుక కలవారు, బభూవుః = అయిరి.

తా. ఆ వానరులు, వానరరాజైన సుగ్రీవుని మనస్సునకు చాల ప్రియమైన ఆ గొప్ప వనమును చేరగానే వారికి దానిలోని మధువు మొదలగువాటిని ఆస్వాదించుటకు ఎక్కువ ఆసక్తి కలిగెను. 10

మూ. తతస్తే వానరా హృష్టా దృష్ట్వా మధువనం మహత్,
కుమారమభ్యయాచన్త మధూని మధుపిఙ్గలాః 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మధుపిఙ్గలాః = తేనెవలె పింగల వర్ణము గల, తే వానరాః = ఆ వానరులు, మహత్ = గొప్పదైన, మధువనమ్ = మధువనమును, దృష్ట్వా = చూచి, హృష్టాః = సంతోషించినవారై, కుమారమ్ = అంగదుని, మధూని = మధువులను, అభ్యయాచన్త = యాచించిరి.

తా. పిమ్మట తేనె వలె పింగలవర్ణము గల ఆ వానరులు, గొప్పదైన ఆ మధువనమును చూచి, సంతోషించినవారై, మధువుల నిమిత్తమై అంగదుని ప్రార్థించిరి. 11

మూ. తతః కుమారస్తాన్ వృద్ధాన్ జామ్బవత్ప్రముఖాన్ కపీన్,
అనుమాన్య దదౌ తేషాం నిసర్గం మధుభక్షణే. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కుమారః = అంగదుడు, వృద్ధాన్ = వృద్ధులైన, తాన్ = ఆ, జామ్బవత్ప్రముఖాన్ = జాంబవంతుడు మొదలైన, కపీన్ = వానరులను, అనుమాన్య = అంగీకరింపచేసి, తేషామ్ = వారికి, మధు

భక్షణే = మధువును భక్షించుటయందు, నిసర్గమ్=స్వేచ్ఛను (అనుజ్ఞను), దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట అంగదుడు జాంబవంతుడు మొదలైన వృద్ధులైన వానరుల అనుమతి తీసికొని, వానరులకు మధువును భక్షించుటకు అనుమతి ఇచ్చెను. 12

మూ. తతశ్చానుమతాః సర్వే సంప్రహృష్టా వనౌకసః,
ముదితాః ప్రేరితాశ్చాపి ప్రనృత్యన్తోఽభవంస్తదా. 13

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సర్వే = సమస్తమైన, వనౌకసః = వానరులు, అనుమతాః = అనుమతింపబడినవారై, సంప్రహృష్టాః = చాల సంతోషించిరి. తదా = అప్పుడు, ప్రేరితాః = (మధుభక్షణమునకై) ప్రేరేపింపబడిన ఆ వానరులు, ముదితాః=సంతోషించినవారై, ప్రనృత్యన్తః=అధికముగా నృత్యము చేయుచున్నవారు, అభవన్ = అయిరి.

తా. పిమ్మట, అనుమతింపబడిన ఆ వానరులు అందరు చాల సంతోషించిరి. ఈ విధముగ ప్రేరితులై సంతోషించిన ఆ వానరులు నృత్యము చేసిరి.

మూ. గాయన్తి కేచిత్ప్రణమన్తి కేచి
న్నృత్యన్తి కేచిత్ప్రహసన్తి కేచిత్,
పతన్తి కేచిద్విచరన్తి కేచి
త్ప్లవన్తి కేచిత్ప్రలపన్తి కేచిత్. 14

ప్ర. అ. కేచిత్ = కొందరు, గాయన్తి = గానము చేయుచున్నారు. కేచిత్ = కొందరు, ప్రణమన్తి = నమస్కరించుచున్నారు. కేచిత్ = కొందరు, నృత్యన్తి = నాట్యము చేయుచున్నారు. కేచిత్ = కొందరు, ప్రహసన్తి = నవ్వుచున్నారు. కేచిత్=కొందరు, పతన్తి=క్రింద పడుచున్నారు. కేచిత్=కొందరు, విచరన్తి = సంచరించుచున్నారు, కేచిత్=కొందరు, ప్లవన్తి = పైకి ఎగురుచున్నారు. కేచిత్ = కొందరు, ప్రలపన్తి = ప్రేలుచున్నారు.

తా. మధుపానముచేత కొందరు పాడుచున్నారు. కొందరు దండాలు పెట్టుచున్నారు. కొందరు ఆడుచున్నారు. కొందరు నవ్వుచున్నారు. కొందరు క్రిందపడుచున్నారు. కొందరు పరార్లుచేయుచున్నారు. కొందరు ఎగురుచున్నారు. కొందరు ఏమేమో ప్రేలుచున్నారు. 14

మూ. పరస్పరం కేచిదుపాశ్రయన్తే
పరస్పరం కేచిదుపాక్రమన్తే,
పరస్పరం కేచిదుపబ్రువన్తే
పరస్పరం కేచిదుపారమన్తే. 15

ప్ర. అ. కేచిత్ = కొంతమంది, పరస్పరమ్ = పరస్పరము. ఉపాశ్రయన్తే = ఆశ్రయించుచున్నారు. కేచిత్ = కొందరు, పరస్పరమ్ = పరస్పరము, ఉపాక్రమన్తే = ఆక్రమించుచున్నారు. కేచిత్ = కొందరు, పరస్పరమ్ = పరస్పరము, ఉపబ్రువన్తే = మాటలాడుచున్నారు. కేచిత్ = కొందరు, పరస్పరమ్ = పరస్పరము, ఉపారమన్తే = క్రీడించుచున్నారు.

తా. కొందరు ఒండొరులతో అట్టాలట్టాలు వేసికొని తిరుగుచున్నారు. కొందరు ఒండొరులపైన ఎక్కుచున్నారు. కొందరు ఒండొరులతో మాటలాడు కొనుచున్నారు. కొందరు ఒండొరులతో క్రీడించుచున్నారు. 15

మూ. ద్రుమాద్ద్రుమం కేచిదభిద్రవన్తే
క్షితౌ నగాగ్రాన్నిపతన్తి కేచిత్,
మహీతలాత్కేచిదుదీర్ణవేగా
మహాద్రుమాగ్రాణ్యభిసంపతన్తి. 16

ప్ర. అ. కేచిత్ = కొందరు, ద్రుమాత్ = ఒక చెట్టుమీద నుంచి, ద్రుమమ్ = మరొక చెట్టును గూర్చి, అభిద్రవన్తే = పరుగెత్తుచున్నారు. కేచిత్ = కొందరు, నగాగ్రాత్ = వృక్షాగ్రమునుండి, క్షితౌ = నేలమీదకు, నిపతన్తి = పడుచున్నారు. కేచిత్ = కొందరు, ఉదీర్ణవేగాః = అత్యధికమైన వేగము గలవారై, మహీతలాత్ = భూమినుండి, మహాద్రుమాగ్రాణి = మహావృక్షముల అగ్రములను గూర్చి, అభిసంపతన్తి = పరుగెత్తుచున్నారు.

తా. కొందరు ఒక చెట్టుమీదనుంచి మరొక చెట్టువైపుకు పరుగెత్తుచున్నారు. కొందరు చెట్టుమీదనుంచి నేలమీదికి ఉరుకుచున్నారు. కొందరు మహావేగముతో నేలమీదనుంచి మహావృక్షములపైకి పరుగెత్తుచున్నారు. 16

మూ. గాయన్తమన్యః ప్రహసన్నుపైతి
హసన్తమన్యః ప్రరుదన్నుపైతి,

రుద న్తమన్యః ప్రణదన్నుపైతి
నుద న్తమన్యః ప్రణదన్నుపైతి. 17

ప్ర. అ. గాయ న్తమ్=పాడుచున్నవానిని, అన్యః=మరొకడు, ప్రహసన్ =నవ్వుచు, ఉపైతి=సమీపించుచున్నాడు. హస న్తమ్=నవ్వుచున్నవానిని, అన్యః =మరి యొకడు, ప్రరుదన్ = ఏడ్చుచు, ఉపైతి = సమీపించుచున్నాడు. రుద న్తమ్= ఏడ్చుచున్నవానిని, అన్యః=మరియొకడు, ప్రణుదన్=త్రోయుచు, ఉపైతి=సమీపించుచున్నాడు. నుద న్తమ్ = తోయుచున్నవానిని, అన్యః=మరి యొకడు, ప్రణదన్ = అరచుచు, ఉపైతి = సమీపించుచున్నాడు

తా. ఒకడు పాడుచుండగా మరొకడు నవ్వుతూ అతని వేధుచున్నాడు. నవ్వుచున్నవానిని మరొకడు ఏడ్చుచు సమీపించుచున్నాడు. ఏడ్చుచున్నవానిని మరొకడు గెంటుచు సమీపించుచున్నాడు. గెంటుచున్నవానిని మరొకడు అరచుచు సమీపించుచున్నాడు. 18

మూ. సమాకులం తత్కపిసైన్యమాసీ
న్మధుప్రపానోత్కటసత్త్వచేష్టమ్.
న చాత్రకశ్చిన్న బభూవ మత్తో
న చాత్రకశ్చిన్న బభూవ తృప్తః. 18

ప్ర. అ. మధుప్రపానోత్కటసత్త్వచేష్టమ్=మధువును అధికముగా త్రాగుటచే తీవ్రముగా ఉన్న మనస్సులూ, చేష్టలూ గల, తత్=ఆ, కపిసైన్యమ్= వానరసైన్యము, సమాకులమ్=వ్యాకులముగా, ఆసీత్=అయెను. అత్ర = ఈ సైన్యములో, కశ్చిత్=ఏ ఒక్కడూ, మత్తః=మదించినవాడు, న బభూవ ఇతి న=కాలేదన్నమాటలేదు. అత్ర=ఈ సైన్యములో, కశ్చిత్=ఒక్కడూ, తృప్తః =తృప్తిచెందినవాడు, న బభూవ ఇతి న=కాలేదన్నమాటలేదు.

తా. మధువును అధికముగా త్రాగుటచే మనస్సులూ, చేష్టలూ కూడ తీవ్రములుగా ఉండుటచేత ఆ వానరసైన్యమంతా వ్యాకులముగా ఉండెను. ఆ సైన్యములో మత్తెక్కనివాడు కాని, తృప్తిచెందనివాడు కాని లేకుండెను. 18

మూ. తతో వనం తత్ పరిభక్ష్యమాణం
ద్రుమాంశ్చ విధ్వంసితపత్రపుష్పాన్,

సమీక్ష్య కోపాద్దధివక్త్రనామా
నివారయామాస కపిః కపీంస్తాన్. 19

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దధివక్త్రనామా = దధివక్త్రుడు అను పేరు గల, కపిః = వానరుడు, పరిభక్ష్యమాణమ్ = భక్షింపబడుచున్న, తత్ = ఆ, వనమ్=వనమును, విధ్వంసితపత్రపుష్పాన్ = ధ్వంసము చేయబడిన ఆకులు పువ్వులు గల, ద్రుమాంశ్చ = వృక్షములను, సమీక్ష్య=చూచి, కోపాత్=కోపము వలన, తాన్ కపీన్=వానరులను, నివారయామాస=నివారించెను.

తా. పిమ్మట దధిముఖుడను వానరుడు, వానరులందరూ ఆ వనమును భక్షించుటను, వృక్షముల ఆకులను, ఫలములను పాడుచేయుచుండుటను చూచి కోపముతో వాళ్ళను నివారించెను. 19

మూ. స తైః ప్రవృద్ధైః పరిభర్త్స్యమానో
వనస్య గోప్తా హరివీరవృద్ధః,
చకార భూయో మతిముగ్రతేజా
వనస్య రక్షాం ప్రతి వానరేభ్యః. 20

ప్ర. అ. ప్రవృద్ధైః=మితిమీరి ప్రవర్తించుచున్న, తైః=ఆ వానరులచేత, పరిభర్త్స్యమానః = భయ పెట్టబడుచున్న, వనస్య గోప్తా = వనమునకు రక్షకుడైన, హరివీరవృద్ధః = వానరవీరులలో వృద్ధుడైన, ఉగ్రతేజాః = ఉగ్రమైన తేజస్సు గల దధిముఖుడు, వానరేభ్యః = వానరులనుండి, వనస్య = వనము యొక్క, రక్షాం ప్రతి = రక్షణమును గూర్చి, భూయః = మరల, మతిమ్= బుద్ధిని, చకార=చేసెను.

తా. వనమునకు రక్షకుడు, ఉగ్రమైన తేజస్సు కలవాడు, వృద్ధవానర వీరుడు అయిన దధిముఖుడు మితిమీరి ప్రవర్తించుచున్న ఆ వానరులు భయ పెట్టగా, వాళ్ళనుండి వనమును రక్షించువిషయమున మరి యొకసారి ఆలోచన చేసెను. 20

మూ. ఉవాచ కాంశ్చిత్పరుషాణి ధృష్ట
మసక్తమన్యాంశ్చ తలైర్జఘాన,

సమేత్య కైశ్చిత్కలహం చకార
తథైవ సామ్నోపజగామ కాంశ్చిత్. 21

ప్ర. అ. కాంశ్చిత్ = కొందరిని, పరుషాణి = పరుషవాక్యములను, ఉవాచ = పలికెను. అన్యాంశ్చ = మరి కొందరిని, అసక్తమ్ = అడ్డులేకుండగా, తలైః = అరచేతులతో, ధృష్టమ్ = ధైర్యముగా, జఘాన = కొట్టెను. సమేత్య = దగ్గరకు వెళ్ళి, కైశ్చిత్ = కొందరితో, కలహమ్ = కలహమును, చకార = చేసెను. తథైవ = అట్లే, కాంశ్చిత్ = కొందరిని, సామ్నా = సామముతో, ఉపజగామ = సమీపించెను.

తా. కొందరితో పరుషవాక్యములు పలికెను. ధైర్యముగా మరికొందరిని ఎట్టి అడ్డము లేకుండ అరచేతులతో కొట్టెను. కొంతమంది దగ్గరకు వెళ్ళి వాళ్ళతో కలహించెను. కొందరిని సామపూర్వకముగా ప్రార్థించెను. 21

మూ. స తైర్మదాదప్రతివార్యవేగై
ర్బలాచ్చ తేన ప్రతివార్యమాణైః,
ప్రధర్షితస్త్యక్తభయైః సమేత్య
ప్రకృష్యతే చాప్యనవేక్ష్య దోషమ్. 22

ప్ర. అ. మదాత్ = మదమువలన, అప్రతివార్యవేగైః = నివారింప శక్యము కాని వేగము కలవారు, తేన = ఆ దధిముఖునిచేత, బలాత్ = బలాత్కారముగా ప్రతివార్యమాణైః = నివారింపబడుచున్నవారు, త్యక్తభయైః = విడవబడిన భయము గలవారు అయిన. తైః = ఆ వానరులచేత, ప్రధర్షితః = ఎదిరింపబడినవాడై, సః = ఆ దధిముఖుడు, దోషం చ = దోషమును కూడ, అనవేక్ష్య = చూడక, సమేత్య = కలిసి, ప్రకృష్యతే చ = లాగబడెను కూడ.

తా. ఆ దధిముఖుడు బలప్రయోగము చేసి నివారించగా, మధుమదము చేత నివారింప శక్యము కాని వేగముతో, ఆ వానరులు భయము విడచి, దోషమను విషయము కూడ గుర్తించక, ఆ దధిముఖుని ఎదిరించి, ఇటు అటు లాగిరి. 22

మూ. నఖైస్తుదన్తో దశనైర్దశన్త
స్తలైశ్చ పాదైశ్చ సమాపయన్తః,

మదాత్కృపిం తం కపయః సమగ్రా
మహావనం నిర్విషయం చ చక్రుః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. సమగ్రాః = సమస్తమైన, కపయః = వానరులు, మదాత్ = మదమువలన, నఖైః = గోళ్లచేత, తుదన్తః = పీడించుచు, దశనైః = దంతములచేత, దశన్తః = కరచుచు, తలైశ్చ = అరచేతులతోను, పాదైశ్చ = పాదములతోను, తం కపిమ్ = ఆ దధిముఖుని, సమాపయన్తః = సమాప్తిపొందించుచు, మహావనమ్ = ఆ మహావనమును, నిర్విషయమ్ = అనుభవించదగిన వస్తువులు లేనిదానినిగా, చక్రుః = చేసిరి.

తా. ఆ వానరులందరూ, మదావేశముతో, ఆ దధిముఖుని గోళ్ళతో పీక్కుచు, దంతాలతో కరచుచు, అరచేతులతోను, పాదాలతోను, ప్రాణాలు పోవునా అన్నట్లు కొట్టుచు ఆ మహావనములోని పదార్థాల నన్నింటినీ కాజేసిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో అరువదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విషష్టితమః సర్గః

*[వానరులు దధిముఖుని, ఇతర వనరక్షకులను పరాభవించుట; దధిముఖుడు భృత్యసహితుడై సుగ్రీవుని వద్దకు వెళ్ళుట].*

మూ. తానువాచ హరిశ్రేష్ఠో హనుమాన్వానరర్షభః,
అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః, 1
అహమావారయిష్యామి యుష్మాకం పరిపన్థినః.

ప్ర. అ. హరిశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడు, వానరర్షభః = వానరులలో వృషభము వంటి వాడు అయిన, హనుమాన్ = హనుమంతుడు, తాన్ = వారిని గూర్చి, ఉవాచ = పలికెను. వానరాః = వానరులారా! యూయమ్ = మీరు, అవ్యగ్రమనసః = వ్యగ్రత (కంగారు) లేని మనస్సు కలవారై, మధు = మధువును, సేవత = సేవించండి. అహమ్ = నేను, యుష్మాకమ్ = మీయొక్క, పరిపన్థినః = శత్రువులను, ఆవారయిష్యామి = నివారించెదను.

తా. వానరులలో శ్రేష్ఠుడు వంటివాడు, వానరులలో ఉత్తముడు అయిన హనుమంతుడు వారితో ఇట్లనెను. "ఓ! వానరులారా! మీ రేమీ దిగులు లేకుండా మధువును సేవించండి. నేను మీకు అడ్డుచెప్పేవారిని నివారించెదను. 1

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం హరీణాం ప్రవరోఽఙ్గదః, 2
ప్రత్యువాచ ప్రసన్నాత్మా పిబన్తు హరయో మధు.

ప్ర. అ. హనుమతః = హనుమంతునియొక్క, వాక్యమ్ = వాక్యమును శ్రుత్వా = విని, హరీణామ్ = వానరులలో, ప్రవరః = శ్రేష్ఠుడైన, అఙ్గదః = అంగదుడు, ప్రసన్నాత్మా = ప్రసన్నమైన మనస్సు గలవాడై, ప్రత్యువాచ = తిరిగి పలికెను. హరయః = వానరులు, మధు = మధువును, పిబన్తు = త్రాగుదురు గాక.

తా. వానరులలో శ్రేష్ఠుడైన అంగదుడు హనుమంతుని మాటలు విని, సంతోషించిన మనస్సు కలవాడై, తిరిగి పలికెను "వానరులు మధువును త్రాగుదురు గాక". 2

మూ. అవశ్యం కృతకార్యస్య వాక్యం హనుమతో మయా, 3
అకార్యమపి కర్తవ్యం కిమఙ్గ పునరీదృశమ్.

ప్ర. అ. కృతకార్యస్య = చేయబడిన కార్యము గల, హనుమతః = హనుమంతుని యొక్క, వాక్యమ్ = వాక్యము, అకార్యమపి = చేయగూడనిదైనను; మయా = నాచేత, అవశ్యమ్ = తప్పక, కర్తవ్యమ్ = చేయదగినది. ఈదృశం పునః = ఇట్టి కార్యమైతే, కిమఙ్గ = చెప్పవలెనా।

తా. కార్యము సాధించుకొని వచ్చిన హనుమంతుని మాట చేయకూడనిదైనను నేను తప్పక చేయవలెను. ఇలాంటి మాట విషయము చెప్పవలెనా। 3

మూ. అఙ్గదస్య ముఖాచ్ఛ్రుత్వా వచనం వానరర్షభాః, 4
సాధుసాధ్వితి సంహృష్టా వానరాః ప్రత్యపూజయన్.

ప్ర. అ. వానరర్షభాః = వానరులలో వృషభము వంటి వారైన, వానరాః = వానరులు, అఙ్గదస్య = అంగదుని యొక్క, ముఖాత్ = ముఖమునుండి, వచః = వచనమును, శ్రుత్వా = విని, సంహృష్టాః = సంతోషించినవారై, సాధు సాధ్వితి = బాగు బాగు అని, ప్రత్యపూజయన్ = పూజించిరి.

తా. వానరులలో వృషభముల వంటి వానరులు అంగదుని ముఖము నుండి వచ్చిన మాట విని, చాలా సంతోషించి, "బాగు బాగు" అని అభినందించిరి. 4

మూ. పూజయిత్వాఙ్గదం సర్వే వానరా వానరర్షభమ్, 5
జగ్ముర్మధువనం యత్ర నదీవేగ ఇవ ద్రుమమ్.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, రాక్షసాః = రాక్షసులు, వానరర్షభమ్ = వానరశ్రేష్ఠుడైన, అఙ్గదమ్ = అంగదుని, పూజయిత్వా = పూజించి, మధువనమ్ = మధువనము, యత్ర = ఎక్కడ ఉన్నదో అక్కడికి, నదీవేగః = నదీవేగము, ద్రుమమ్ ఇవ = వృక్షమును గూర్చి వలె, జగ్ముః = వెళ్లిరి.

తా. వానరు లందరు వానరశ్రేష్ఠు డైన అంగదుని పూజించి మధువన మున్న చోటికి నదీవేగము వృక్షము వైపు వెళ్ళు నట్లు వెళ్ళిరి.

వి. "నదీవేగ ఇవ ద్రుమమ్" అనే ఉపమాలంకారంలో వాల్మీకి ఉప మానాలలో ఉండవలసిన సౌందర్యం లేదు. ఈ ఉపమానం లేని ప్రాచ్యపాఠం ఇలా ఉన్నది.

"పూజయిత్వాఙ్గదం సర్వే యూథపా యూథపర్షభమ్
జగ్ముర్మధువనం సర్వే పానాయ సగణాస్తదా"

వావిళ్ళవారి ప్రతిలోను, గోరఖ్‌పూర్ ప్రతిలోను కూడ 61వ సర్గలోనే వానరులు మధువనం ప్రవేశించి యథేచ్ఛగా మధుపానం చేసి అడ్డుకొనడానికి ప్రయత్నిం చిన దధిముఖుణ్ణి లెక్క సేయక బాధ పెట్టిన ట్లున్నది. ఈ సర్గలో హనుమంతుని అభిప్రాయం ప్రకారం అంగదుడు వానరులకు యథేష్టంగా మధుపానం చేయడానికి అనుమతి ఇచ్చి నట్లు, వారట్లు ప్రవర్తించి నట్లు చెప్పబడినది. ప్రాచ్యపాఠంలో హనుమంతుడే ఆ వానరుల కోరికను అనుసరించి మధువనములో మధువు నాస్వా దించుటకు వానరులకు అనుమతి యిమ్మని అంగదుని కోరినట్లు, అంగదుడు అనుమతి ఇచ్చి నట్లు దధిముఖాదులు అడ్డుకొనగా వాళ్లను హనుమదంగదాదులు ఎదిరించి నట్లు ఉన్నది. ఆ కథాక్రమము బాగున్నట్లు తోచుచున్నది. 5

మూ. తే ప్రవిష్టా మధువనం పాలానాక్రమ్య వీర్యతః, 6
అతిసర్గాచ్చ పటవో దృష్ట్వా శ్రుత్వా చ మైథిలీమ్,
పపుః సర్వే మధు తదా రసవత్ఫలమాదదుః.

ప్ర. అ. మైథిలీమ్ = సీతను, దృష్ట్వా = చూచి, శ్రుత్వా = విని. అతి సర్గాచ్చ = (అంగదుని) అనుమతివలనను, పటవః = సమర్థు లైన (నిర్భయు లైన), తే = ఆ, సర్వే = వానరు లందరూ. మధువనమ్ = మధువనమును, ప్రవిష్టాః = ప్రవేశించినవా రై, పాలాన్ = పాలకులను, వీర్యతః = పరాక్రమము వలన, ఆక్రమ్య = ఆక్రమించి, తదా = అప్పుడు, మధు = మధువును, పపుః = త్రాగిరి. రసవత్ = రసము గల, ఫలమ్ = ఫలమును, ఆదదుః = తీసికొనిరి.

తా. సీతను చూచి వినియుండుటచేతను, అంగదుడు అనుమతించుట చేతను నిర్భయు లై, ఆ వానరులందరు మధువనములో ప్రవేశించి, వనపాలకు

లను పరాక్రమముచేత ఆక్రమించి, మధువును త్రాగిరి. రుచిగా నున్న ఫలము లను తినిరి. 6, 7

మూ. ఉత్పత్య చ తతః సర్వే వనపాలాన్ సమాగతాన్,
తాడయన్తి స్మ శతశః సక్తాన్మధువనే తదా. 8

టీ. తదా=అప్పుడు, సర్వే=వారందరూ, మధువనే=మధువనమునందు, శతశః=వందలు వందలుగా, సక్తాన్=కలిసి యున్న, సమాగతాన్=వచ్చిన, వనపాలాన్=వనపాలకులను, ఉత్పత్య=ఎగిరి, తతః=అటుపిమ్మట, తాడయన్తి స్మ=కొట్టిరి.

తా. పిమ్మట ఆ వానరు లందరు. అప్పు డా మధువనములో తమను అడ్డుకొనుటకై వందలు వందలుగా వచ్చిన వనపాలకులపైకి దుమికి వాళ్ళను కొట్టిరి. 8

మూ. మధూని ద్రోణమాత్రాణి బాహుభిః పరిగృహ్య తే,
పిబన్తి సహితాః సర్వే నిఘ్నన్తి స్మ తథాపరే. 9

ప్ర. అ. తే సర్వే=ఆ వానరులు అందరూ, బాహుభిః=బాహువులతో, ద్రోణమాత్రాణి=ద్రోణము ప్రమాణముగల. (ద్రోణ మనగా ద్రవపదార్థములను కొలిచే ఒక పెద్ద ప్రమాణము) మధూని=మధువులను, పరిగృహ్య=గ్రహించి, సహితాః=కలిసినవారై, పిబన్తి=త్రాగిరి. అపరే=మరికొందరు, నిఘ్నన్తి స్మ =(అడ్డు తగిలినవారిని) కొట్టిరి.

తా. ఆ వానరు లందరు కలిసి బాహువులతో ద్రోణముల కొలది మధువులు గ్రహించి త్రాగిరి. మరి కొందరు అడ్డుకొనేవాళ్ళను కొట్టిరి. 9

మూ. కేచిత్పీత్వా ప్రవిధ్యన్తి మధూని మధుపిఙ్గలాః,
మధూచ్ఛిష్టేన కేచిచ్చ జఘ్నురన్యోన్యముత్కటాః. 10

ప్ర. అ. మధుపిఙ్గలాః=మధువు వలె పింగళవర్ణము గల, కేచిత్=కొందరు వానరులు, మధూని=మధువులను, పీత్వా=త్రాగి, ప్రవిధ్యన్తి=పారవేయుచున్నారు, కేచిచ్చ=కొంతమంది, మధూచ్ఛిష్టేన=త్రాగగా మిగిలిన మధువుతో, ఉత్కటాః=మత్తుచేత తీవ్రముగా ఉన్నవారై, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నుః=వేశిరి.

తా. కొంతమంది వానరులు మధువులను కడుపు పట్టినంత త్రాగి, త్రాగగా మిగిలినదానిని దూరముగా విసిరివేయుచుండిరి. కొందరు త్రాగగా మిగిలిన మధువు చేత పట్టుకొని తీవ్ర మైన మదముతో ఒకరిపైకి ఒకరు దుముకుచుండిరి.

వి. మధూచ్ఛిష్ట మనగా తేనె తీసివేసిన తేనెపట్టు. అదే మైనముగా వండుతారు. దానిని గ్రహించివెళ్ళిరి అను ప్రాచీనుల అర్థముకంటె పై అర్థము బాగున్నదని నా అభిప్రాయము. వానరులు మధువనములో ప్రవేశించి తేనెటీగలతో నిండిన తేనెపట్టులు పిండికొని త్రాగినా రన్నట్లు చాలామంది అభిప్రాయము. ఆ ఈగలతో నిండిన పట్టులు త్రాగుట అంత శక్య మైన పని కాదు కదా. అందుచేత ఈత, తాడి, కొబ్బరి చెట్లకు కల్లు గీసేవారు కుండలు గట్టి ఆ మద్యమును సేకరించి నట్లు ఈ మధువనములో వివిధోపాయములతో (పుష్పఫలాదులతో) మధువు తయారు చేసి దానిని భద్రపరచేవా రనీ, దానినే ఈ వానరులు త్రాగి ఉంటా రనీ చెప్పినచో బాగుంటుంది. 10

మూ. అపరే వృక్షమూలే తు శాఖాం గృహ్య వ్యవస్థితాః,
అత్యర్థం చ మదగ్లానాః పర్ణాన్యాస్తీర్య శేరతే. 11

ప్ర. అ. అపరే=మరి కొందరు, శాఖామ్=కొమ్మను, గృహ్య = పట్టుకొని, వృక్షమూలే = వృక్షము మొదట్లో, వ్యవస్థితాః = ఉండిరి. అత్యర్థమ్ = మిక్కిలి, మదగ్లానాః=మత్తెక్కిన మరికొందరు, పర్ణాని = ఆకులను, ఆస్తీర్య = పరచుకొని, శేరతే=పండుకొనిరి.

తా. కొందరు కొమ్మలు పట్టుకొని చెట్ల మొదళ్ళ దగ్గర కూర్చుండిరి. ఎక్కువ మత్తులో ఉన్నవాళ్లు ఆకులు పరచుకొని పండుకొనిరి. 11

మూ. ఉన్మత్తభూతాః ప్లవగా మధుమత్తాశ్చ హృష్టవత్,
క్షిపన్తి చ తథాన్యోన్యం స్ఖలన్తి చ తథాపరే. 12

ప్ర. అ. మధుమత్తాః = మధువుచేత మదించిన, ప్లవగాః = వానరులు, ఉన్మత్తభూతాః=ఉన్మాదము పొందినవారువలె అయి, హృష్టవత్=సంతోషించినవారై, అన్యోన్యమ్ = పరస్పరము, క్షిపన్తి = త్రోసుకొనుచున్నారు. అపరే = మరికొందరు, స్ఖలన్తి చ = తొట్రుపడుచున్నారు.

తా. మధుపానముచే మత్తెక్కిన కొందరు వానరులు, ఉన్మత్తులై, సంతోషముతో ఒకరి నొకరు త్రోసికొను చుండిరి. మరి కొందరు పాత్రులపడుచు నడచుచుండిరి. 12

మూ. కేచిత్ క్ష్వేలాం ప్రకుర్వన్తి కేచిత్ కూజన్తి హృష్టవత్,
హరయో మధునా మత్తాః కేచిత్సుప్తా మహీతలే. 13

ప్ర. అ. కేచిత్ = కొందరు. క్ష్వేలామ్ = సింహనాదమును, ప్రకుర్వన్తి = చేయుచున్నారు. కేచిత్ = కొందరు, హృష్టవత్ = సంతోషించినవారై, కూజన్తి = కూయుచున్నారు. మధునా = మధువుచేత, మత్తాః = మదించిన, కేచిత్ హరయః = కొందరు వానరులు, మహీతలే = నేలపైన, సుప్తాః = నిద్రించిరి.

తా. కొందరు సింహనాదములు చేయుచుండిరి. కొందరు సంతోషించి ఈలలు వేయుచుండిరి. మధువుచేత ఎక్కువ మత్తెక్కిన మరి కొందరు నేలపైన నిద్రించుచుండిరి. 13

మూ. కృత్వా కేచిద్ధసన్త్యన్యే కేచిత్కుర్వన్తి చేతరత్,
కృత్వా కేచి ద్వదన్త్యన్యే కేచిద్బుధ్యన్తి చేతరత్. 14

ప్ర. అ. కేచిత్ = కొందరు, కృత్వా = ఏ మేమో చేసి. హసన్తి = నవ్వుచున్నారు. అన్యే = ఇతరు లైన, కేచిత్ = కొందరు, ఇతరత్ = మరి యొక కార్యమును, కుర్వన్తి = చేయుచున్నారు. కేచిత్ = కొందరు, కృత్వా = చేసి, వదన్తి = చెప్పుచున్నారు, అన్యే = ఇతరు లైన, కేచిత్ = కొందరు, ఇతరత్ = మరొక విషయమును, బుధ్యన్తి = తెలుసుకొనుచున్నారు.

తా. కొందరు ఏ మేమో వికృతచేష్టలు చేసి నవ్వుచుండగా మరికొందరు మరొక చేష్ట చేయు చుండిరి. కొందరు తాము చేసిన దానిని గూర్చి వర్ణించి చెప్పు చుండగా మరి కొందరు దానిని మరొక విధముగా అర్థము చేసికొను చుండిరి. 14

మూ. యేఽప్యత్ర మధుపాలాః స్యుః ప్రేష్యా దధిముఖస్య తు,
తేఽపి తైర్వానరైర్భీమైః ప్రతిషిద్ధా దిశో గతాః. 15

ప్ర. అ. అత్ర = ఈ మధువనమునందు, దధిముఖస్య = దధిముఖుని

యొక్క, ప్రేష్యాః = కింకరు లైన, మధుపాలాః = మధురక్షకులు, యే = ఎవరు, సన్తి = ఉందురో, తే౽పి = వారు కూడ, భీమైః = భయంకరులైన, వానరైః = వానరులచేత, ప్రతిషిద్ధాః = నిరాకరింపబడినవారై (తమ పని చేయకుండేటట్లు చేయబడినవారై), దిశః = దిక్కులను గూర్చి, గతాః = వెళ్ళిరి.

తా. ఆ మధువనములో దధిముఖుని కింకరు లైన మధుపాలకులు ఆ భయంకరు లైన వానరులు బాధించుటచే పలు దిక్కులకు పారిపోయిరి. 15

మూ. జానుభిస్తు ప్రకృష్టాశ్చ దేవమార్గం ప్రదర్శితాః,
అబ్రువన్ పరమోద్విగ్నా గత్వా దధిముఖం వచః. 16

ప్ర. అ. జానుభిః = మోకాళ్ళచేత, ప్రకృష్టాః = లాగబడినవారై, దేవమార్గమ్ = గుహ్యప్రదేశమును, ప్రదర్శితాః = చూపబడిన ఆ రక్షకులు, పరమోద్విగ్నాః = చాల దిగులు చెందినవారై, దధిముఖమ్ = దధిముఖుని గూర్చి, గత్వా = వెళ్ళి, వచః = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ వానరులు ఆ రక్షకులను మోకాళ్ళతో పొడచి, నేలమీద ఈడ్చిరి. వాళ్ళకు గుహ్యప్రదేశమును చూపిరి. అప్పుడు ఆ రక్షకులు చాల భయపడి దధిముఖునివద్దకు వెళ్ళి ఇట్లు పలికిరి. 16

మూ. హనూమతా దత్తవరైర్హతం మధువనం బలాత్,
వయం చ జానుభిః కృష్టా దేవమార్గం చ దర్శితాః. 17

ప్ర. అ. హనూమతా = హనుమంతునిచేత, దత్తవరైః = ఇవ్వబడిన వరము గల వానరులచేత, మధువనమ్ = మధువనము, బలాత్ = బలమువలన, హతమ్ = పాడుచేయబడినది. వయం చ = మేము, జానుభిః = మోకాళ్ళచేత, కృష్టాః = (పొడిచి) లాగబడితిమి. దేవమార్గమ్ = గుహ్య ప్రదేశమును, దర్శితాః = చూపబడితిమి.

తా. హనుమంతుని అనుజ్ఞ పొంది వానరులు మధువనమును తమ ఇష్టము వచ్చినట్లు పాడుచేసినారు. మమ్ములను మోకాళ్లతో పొడిచి ఈడ్చినారు. మాకు గుహ్యప్రదేశములను కూడ (ఎవరికి చెప్పుకుంటారో చెప్పుకోండి అన్నట్లు) చూపినారు. 17

మూ. తతో దధిముఖః క్రుద్ధో వనపస్తత్ర వానరః,
హతం మధువనం శ్రుత్వా సాన్త్వయామాస తాన్ హరీన్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తత్ర=అక్కడ, వనపః=వనపాలకు డైన, దధిముఖః=దధిముఖుడను, వానరః=వానరుడు, క్రుద్ధః=కోపించిన వాడై, మధువనమ్=మధువనమును, హతమ్=పాడుచేయబడినదానినిగా, శ్రుత్వా=విని, హరీన్=ఆ వానరులను, సాన్త్వయామాస=ఓదార్చెను.

తా. పిమ్మట, అక్కడ వనమును పాలించు ఆ దధిముఖుడు మధువనము పాడుచేయబడిన దను విషయము విని, ఆ వానరులను ఓదార్చెను. 18

మూ. ఇహాగచ్ఛత గచ్ఛామో వానరాన్ బలదర్పితాన్,
బలేన వారయిష్యామో మధు భక్షయతో వయమ్. 19

ప్ర. అ. ఇహ=ఇక్కడికి, ఆగచ్ఛత=రండి. గచ్ఛామః=వెళ్లెదము. వయమ్=మనము. బలదర్పితాన్=బలముచేత గర్వితులైన, మధు=మధువును, భక్షయతః=భక్షించుచున్న, వానరాన్=వానరులను, బలేన=బలముచేత, వారయిష్యామః=నివారించెదము.

తా. ఇటు రండి. మనము అక్కడికి వెళ్ళి, బలముచేత దృప్తులై మధువును భక్షించుచున్న ఆ వానరులను బలప్రయోగముచేతనే నివారించెదము. 19

మూ. శ్రుత్వా దధిముఖస్యేదం వచనం వానరర్షభాః,
పునర్వీరా మధువనం తేనైవ సహసా యయుః. 20

ప్ర. అ. వీరాః=వీరులైన, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, దధిముఖస్య=దధిముఖునియొక్క, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, సహసా=శీఘ్రముగా, తేనైవ=ఆ దధిముఖునితో, పునః=మరల, మధువనమ్=మధువనమును గూర్చి, యయుః=వెళ్ళిరి.

తా. వీరు లైన ఆ వానరశ్రేష్ఠులు దధిముఖుని మాటలు విని, వెంటనే అతనితో కలసి మరల ఆ మధువనమునకు వెళ్ళిరి. 20

మూ. మధ్యే చైషాం దధిముఖః ప్రగృహ్య తరసా తరుమ్,
సమభ్యధావద్వేగేన తే చ సర్వే ప్లవంగమాః. 21

ప్ర. అ. ఏషామ్=ఈ వానరులయొక్క, మధ్యే=మధ్యయందు, దధిముఖః=దధిముఖుడు, తరసా=వేగముచేత, తరుమ్=వృక్షమును, ప్రగృహ్య=గ్రహించి, వేగేన=వేగముతో, సమభ్యధావత్ = పరుగెత్తెను. తే=ఆ, సర్వే=సమస్తమైన, ప్లవంగమాః చ=వానరులు కూడ పరుగెత్తిరి. 21

తా. దధిముఖుడు ఆ వానరులమధ్య వృక్షమును గ్రహించి వేగముగా పరుగెత్తుకొని వచ్చెను. అతని అనుచరులైన వానరులు కూడ పరుగెత్తుకొని వచ్చిరి. 21

మూ. తే శిలాః పాదపాంశ్చాపి పర్వతాంశ్చాపి వానరాః,
గృహీత్వాభ్యగమన్ క్రుద్ధా యత్ర తే కపికుఞ్జరాః. 22

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, క్రుద్ధాః=కోపించినవారై, శిలాః=రాళ్లను, పాదపాంశ్చాపి = వృక్షములను, పర్వతాంశ్చాపి = పర్వతములను, గృహీత్వా=గ్రహించి, తే=ఆ, కపికుఞ్జరాః=వానరశ్రేష్ఠులు, యత్ర=ఎక్కడ ఉన్నారో అక్కడికి, అభ్యగమన్ = వెళ్ళిరి.

తా. ఆ వానరులు కోపించినవారై, రాళ్ళు, చెట్లు, కొండలు పట్టుకొని, అంగదాదివానరశ్రేష్ఠు లున్న చోటికి వెళ్ళిరి. 22

మూ. తే స్వామివచనం వీరా హృదయేష్వవసజ్య తత్,
త్వరయా హ్యభ్యధావన్త సాలతాలశిలాయుధాః. 23

ప్ర. అ. వీరాః=వీరులైన, తే=వారు, తత్=ఆ, స్వామివచనమ్=తమ ప్రభువుయొక్క మాటను, హృదయేషు=హృదయములందు, అవసజ్య=ఉంచుకొని, సాలతాలశిలాయుధాః=మద్దిచెట్లు, తాటిచెట్లు, శిలలు ఆయుధములుగా కలవారై, త్వరయా=తొందరతో, అభ్యధావన్త=పరుగెత్తిరి.

తా. వీరులైన ఆ వానరులు తమ ప్రభువు ఆజ్ఞను మనస్సులో ఉంచుకొని, మద్దిచెట్లను, తాటిచెట్లను, శిలలను ఆయుధములుగా ధరించి తొందరగా పరుగెత్తి వెళ్ళిరి. 23

మూ. వృక్షస్థాంశ్చ తలస్థాంశ్చ వానరాన్ బలదర్పితాన్,
అభ్యక్రామంస్తతో వీరాః పాలాస్తత్ర సహస్రశః. 24

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పీతాః = పీడులైన, పాలాః=వన పాలకులు, సహస్రశః=వేలకొలంది, వృక్షస్థాంశ్చ=వృక్షములపై ఉన్నవాళ్ళు, తలస్థాంశ్చ = వృక్షముల మొదళ్ళలో ఉన్న వాళ్లు అయిన, బలదర్పితాన్ = బలముచేత గర్వించిన, వానరాన్=వానరులను, అభ్యక్రామన్=ఆక్రమించిరి.

తా. పీడు లైన ఆ వానరులు వేలకొలది వెళ్ళి అక్కడ, చెట్లమీద, చెట్ల మొదళ్లలోను ఉన్న, బలముచే దృప్తులైన వానరులను ఆక్రమించిరి. 24

మూ. అథ దృష్ట్వా దధిముఖం క్రుద్ధం వానరపుఙ్గవాః,
అభ్యధావన్త వేగేన హనుమత్ప్రముఖాస్తదా. 25

ప్ర. అ. అథ = అటు పిమ్మట, హనుమత్ప్రముఖాః = హనుమంతుడు మొదలైన, వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, తదా = అప్పుడు, దధిముఖమ్ = దధిముఖుని, క్రుద్ధమ్ = కోపగించినవానినిగా, దృష్ట్వా=చూచి, వేగేన = వేగముతో, అభ్యధావన్త = ఎదురుగా పరుగెత్తిరి.

తా. అప్పుడు, కోపముతో వచ్చుచున్న ఆ దధిముఖుని చూచి, హనుమంతుడు మొదలైన ఆ వానరశ్రేష్ఠులు వేగముతో అతనిని ఎదిరించుటకై వెళ్ళిరి. 25

మూ. తం సవృక్షం మహాబాహుమాపతన్తం మహాబలమ్,
ఆర్యకం ప్రాహరత్తత్ర బాహుభ్యాం కుపితోఽఙ్గదః.

ప్ర. అ. కుపితః = కోపించిన, అఙ్గదః = అంగదుడు, సవృక్షమ్ = వృక్షముతో కూడినవాడు, మహాబాహుమ్=గొప్ప బాహువులు కలవాడు, మహాబలమ్ = గొప్ప బలము గలవాడు, ఆపతన్తమ్ = శీఘ్రముగా వచ్చుచున్నవాడు అయిన, తమ్ = ఆ, ఆర్యకమ్ = తండ్రి మేనమామను, తత్ర = అక్కడ, బాహుభ్యామ్=బాహువులతో, ప్రాహరత్ = కొట్టెను.

తా. వృక్షము ధరించి వచ్చుచున్న మహాబాహువు, మహాబలుడు అయిన, ఆ తండ్రి మేనమామ యైన దధిముఖుని చూచి, అంగదుడు కోపముతో, బాహువులతో కొట్టెను. 26

మూ. మదాన్ధశ్చ న వేదైనమార్యకోఽయం మమేతి సః,
అథైనం నిష్పిపేషాశు వేగవద్వసుధాతలే. 27

ప్ర. అ. సః = అతడు, మదాన్ధశ్చ = మదాంధు డై, అయమ్ = ఇతడు, మమ = నాయొక్క, ఆర్యకః = ఆర్యకుడు, ఇతి = అని, ఏనమ్ = ఇతనిని గూర్చి, న వేద = తెలుసుకొనలేదు. అథ = అటు పిమ్మట, ఏనమ్ = ఇతనిని, వసుధాతలే = నేలమీద, వేగవత్ = వేగముగా, ఆశు = శీఘ్రముగా, నిష్పిపేష = నలిపివేసెను.

తా. ఆ అంగదుడు మదాంధు డై ఇతడు ఆర్యకుడు అను విషయమును కూడ గుర్తించలేదు. పిదప శీఘ్రముగా అతనిని వేగముగా నేలమీద పడవేసి నలిపివేసెను. 27

మూ. స భగ్నబాహూరుభుజో విహ్వలః శోణితోక్షితః,
ముమోహ సహసా వీరో ముహూర్తం కపికుఞ్జరః. 28

ప్ర. అ. భగ్నబాహూరుభుజః = విరగగొట్టబడిన బాహువులు, తొడలు, భుజములుగల, విహ్వలః = వ్యాకులు డైన, శోణితోక్షితః = రక్తముచే తడప బడిన, సః = ఆ, వీరః = వీరు డైన, కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడు, సహసా = వెంటనే, ముహూర్తమ్ = క్షణకాలము పాటు, ముమోహ = మోహము చెందెను.

తా. అప్పు డా వీరు డైన దధిముఖుని బాహువులు, తొడలు, భుజములు విరిగిపోయెను. రక్తముతో తడిసి వ్యాకులు డై అతడు వెంటనే ముహూర్త కాలము పాటు మూర్ఛ చెందెను. 28

మూ. స సమాశ్వస్య సహసా సంక్రుద్ధో రాజమాతులః,
వానరాన్వారయామాస దణ్డేన మధుమోహితాన్. 29

ప్ర. అ. రాజమాతులః = సుగ్రీవుని మేనమామ యైన, సః = అతడు, సహసా = శీఘ్రముగా, సమాశ్వస్య = ఊరడిల్లి, సంక్రుద్ధః = కోపగించినవా డై, మధుమోహితాన్ = మధువుచేత మత్తెక్కి ఉన్న, వానరాన్ = వానరులను, దణ్డేన = దండనముచేత, వారయామాస = నివారించెను.

తా. సుగ్రీవుని మేనమామ యైన ఆ దధిముఖుడు వెంటనే తెప్పరిల్లి, బాగ కోపించినవాడై, మధువు త్రాగి మత్తెక్కి ఉన్న ఆ వానరులను దండ ప్రయోగము చేసి నివారించెను. 29

మూ. స కథంచిద్విముక్తస్తైర్వానరై ర్వానరర్షభః,
ఉవాచైకాన్తమాశ్రిత్య భృత్యాన్ స్వాన్ సముపాగతాన్.

ప్ర. అ. తైః = ఆ, వానరైః = వానరులచేత, కథంచిత్ = ఎట్లో, విముక్తః = విడువబడిన, సః = ఆ, వానరర్షభః = వానరశ్రేష్ఠుడు, ఏకాన్తమ్ = ఏకాంతప్రదేశమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, సముపాగతాన్ = వచ్చిన, స్వాన్ = తన సంబంధ మైన, భృత్యాన్ = భృత్యులను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. ఆ దధిముఖుడు ఆ వానరులనుండి ఎట్లో తప్పించుకొని, ఏకాంత స్థానమునకు వెళ్ళి, అక్కడికి వచ్చిన తన భృత్యులతో ఇట్లు పలికెను. ౩౦

మూ. ఏతే తిష్ఠన్తు గచ్ఛామో భర్తా నో యత్ర వానరః,
సుగ్రీవో విపులగ్రీవః సహ రామేణ తిష్ఠతి. ౩౧

ప్ర. అ. ఏతే = ఈ వానరులు, తిష్ఠన్తు = ఉందురుగాక. నః = మనయొక్క, భర్తా = ప్రభువు, వానరః = వానరుడు, విపులగ్రీవః = విశాల మైన కంఠము కలవాడు అయిన, సుగ్రీవః = సుగ్రీవుడు, యత్ర = ఎక్కడ, రామేణ సహ = రామునితో కూడ, తిష్ఠతి = ఉన్నాడో అక్కడికి, గచ్ఛామః = వెళ్లెదము.

తా. ఈ వానరులను ఇక్కడే ఉండనిండు. మనము, మనప్రభువు, విశాల మైన కంఠము గలవాడు అయిన సుగ్రీవుడు రామునితో కూడ ఎక్కడ ఉన్నాడో అక్కడికి వెళ్లెదము. ౩౧

మూ. సర్వం చైవాఙ్గదే దోషం శ్రావయిష్యామి పార్థివే,
అమర్షీ వచనం శ్రుత్వా ఘాతయిష్యతి వానరాన్. ౩౨

ప్ర. అ. అఙ్గదే = అంగదునియం దున్న, సర్వమ్ = సమస్త మైన, దోషమ్ = అపరాధమును, పార్థివే = రాజునందు (రాజునకు), శ్రావయిష్యామి = వినిపించెదను. వచనమ్ = నా వచనమును, శ్రుత్వా = విని, అమర్షీ = కోపము గలవా డై, వానరాన్ = వానరులను, ఘాతయిష్యతి = చంపింపగలడు.

తా. అంగదుడు చేసిన అపరాధమును అంతా రాజుకు చెప్పెదను. నా మాటవిని, అతడు కోపముతో వానరులను అందరినీ చంపించగలడు. ౩౨

మూ. ఇష్టం మధువనం హ్యేతత్సుగ్రీవస్య మహాత్మనః,
పితృపైతామహం దివ్యం దేవైరపి దురాసదమ్. ౩౩

ప్ర. అ. పితృపైతామహమ్ = తండ్రితాతలనాటిది, దివ్యమ్ = శ్రేష్ఠ మైనది, దేవైరపి = దేవతలచేత గూడ, దురాసదమ్ = పొంద శక్యముకానిది అయిన, ఏతత్ మధువనమ్ = ఈమధువనము, మహాత్మనః = మహాత్ముడైన, పార్థివస్య = రాజునకు. ఇష్టం హి = ఇష్ట మైనది కదా.

తా. ఈ మధువనము రాజునకు చాల ఇష్ట మైనది. శ్రేష్ఠము, దేవతలచేత కూడ ఆక్రమింప శక్యము కాని ఈ వనము మహాత్ము డైన సుగ్రీవుని తండ్రి తాతలనుండి వచ్చుచున్నది. 33

మూ. స వానరానిమాన్ సర్వాన్ మధులుబ్ధాన్ గతాయుషః,
ఘాతయిష్యతి దణ్డేన సుగ్రీవః ససుహృజ్జనాన్.

ప్ర. అ. సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, మధులుబ్ధాన్ = మధువునందు దురాశ కలవారు, గతాయుషః = క్షీణించిన ఆయుర్దాయము కలవారు, ససుహృజ్జనాన్ = స్నేహితులతో కూడినవారు అయిన, ఇమాన్ = ఈ, సర్వాన్ = సమస్త మైన, వానరాన్ = వానరులను, దణ్డేన = దండముచేత, ఘాతయిష్యతి = చంపింపగలడు.

తా. మధువునందు దురాశాపరు లైన ఈ వానరుల ఆయుస్సు క్షీణించినది. స్నేహితులు సహితముగా వీరి నందరినీ ఆ సుగ్రీవుడు దండించి చంపింపగలడు. 34

మూ. వధ్యా హ్యేతే దురాత్మానో నృపాజ్ఞాపరిభావినః,
అమర్షప్రభవో రోషః సఫలో నో భవిష్యతి. 35

ప్ర. అ. నృపాజ్ఞాపరిభావినః = రాజాజ్ఞను తిరస్కరించిన, ఏతే = ఈ, దురాత్మానః = దుర్బుద్ధులు, వధ్యాః హి = చంప దగినవారు కదా. అమర్షప్రభవః = సహించలేకపోవుట కారణముగా గల, నః రోషః = మన రోషము, సఫలః = సఫలము, భవిష్యతి = కాగలదు.

తా. రాజాజ్ఞను తిరస్కరించిన ఈ దుర్బుద్ధులు చంప దగినవారు. వీరి పనులు సహించలేకపోవుటచే కలిగిన మన రోషము సఫలము కాగలదు. 35

మూ. ఏవముక్త్వా దధిముఖో వనపాలాన్మహాబలః,
జగామ సహసోత్పత్య వనపాలైః సమన్వితః. 36

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, దధిముఖః = దధిముఖుడు, వనపాలాన్ = వనపాలురను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సహసా = శీఘ్రముగా, వనపాలైః = వనపాలురతో, సమన్వితః = కూడినవాడై, ఉత్పత్య = ఎగిరి, ఆగామ = వెళ్లెను.

తా. మహాబలశాలి యైన దధిముఖుడు వనపాలురతో ఇట్లు పలికి, వారితో కూడినవాడై, శీఘ్రముగా ఎగిరి వెళ్ళెను. 86

మూ. నిమేషాన్తరమాత్రేణ స హి ప్రాప్తో వనాలయః,
సహస్రాంశుసుతో ధీమాన్ సుగ్రీవో యత్ర వానరః. 87

ప్ర. అ. సః = ఆ, వనాలయః = వానరుడు, సహస్రాంశుసుతః = సూర్యుని కుమారుడు, ధీమాన్ = బుద్ధిమంతుడు అయిన, సుగ్రీవః వానరః = సుగ్రీవుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో అక్కడికి, నిమేషాన్తరమాత్రేణ = రెండవ నిమేష మాత్రకాలముచే, ప్రాప్తః = వెళ్లెను.

తా. ఆ దధిముఖుడు రెండవ నిమేషములో, సూర్యకుమారుడు, ధీమంతుడు, వానరుడు అయిన సుగ్రీవు డున్న చోటికి వెళ్ళెను. 87

మూ. రామం చ లక్ష్మణం చైవ దృష్ట్వా సుగ్రీవమేవ చ,
సమప్రతిష్ఠాం జగతీమాకాశాన్నిపపాత హ. 88

ప్ర. అ. రామం చ = రాముని, లక్ష్మణం చైవ = లక్ష్మణుని, సుగ్రీవమేవ చ = సుగ్రీవుని, దృష్ట్వా = చూచి, ఆకాశాత్ = ఆకాశమునుండి, సమప్రతిష్ఠామ్ = సమాన మైన స్థితిగల, జగతీమ్ = భూమిని గూర్చి, నిపపాత = దిగెను.

తా. రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, సుగ్రీవుణ్ణి చూచి, ఆకాశమునుండి చదు నైన నేలపై దిగెను. 88

మూ. సంనిపత్య మహావీర్యః సర్వైస్తైః పరివారితః,
హరిర్దధిముఖః పాలైః పాలానాం పరమేశ్వరః. 89
స దీనవదనో భూత్వా కృత్వా శిరసి చాఞ్జలిమ్,
సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ పర్యపీడయత్.

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
## ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, తైః పాలైః = ఆ వనపాలకులచేత, పరివారితః = చుట్టువారుకొనబడిన, పాలానామ్ = ఆ పాలకులకు, పరమేశ్వరః = ప్రధాన ప్రభువైన, హరిః = వానరుడైన, మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, సః దధిముఖః = ఆ దధిముఖుడు, దీనవదనః = దీనమైన ముఖము గలవాడై, శిరసి = శిరస్సుమీద, అఞ్జలిమ్ = దోసిలిని, కృత్వా = చేసి, సంనిపత్య = నేలపైబడి, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, శుభే = మంగళప్రదములైన, చరణౌ = పాదములను, మూర్ధ్నా = శిరస్సుచేత, పర్యపీడయత్ = స్పృశించెను.

తా. వనపాలకులకు ప్రధానాధిపతియైన మహాపరాక్రమవంతుడైన దధిముఖుడు, దీనమైన ముఖముతో, శిరస్సుపై అంజలి ఘటించి, నేలపైబడి, సుగ్రీవుని మంగళకరములైన పాదములను, శిరస్సుతో స్పృశించి నమస్కరించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో అరువదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిషష్టితమః సర్గః

[మధువనమును ధ్వంసింపచేసిన వార్త దధిముఖునినుండి విని, హనుమదాదులు కార్యము సాధించి యుందు రని సుగ్రీవుడు తలచుట.]

మూ. తతో మూర్ధ్నా నిపతితం వానరం వానరర్షభః,
దృష్ట్వైవోద్విగ్నహృదయో వాక్యమేతదువాచ హ. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వానరర్షభః=వానరశ్రేష్ఠు డైన సుగ్రీవుడు, మూర్ధ్నా=శిరస్సుచేత, నిపతితమ్ = పడిన, వానరమ్=దధిముఖుణ్ణి, దృష్ట్వైవ= చూడగానే, ఉద్విగ్నహృదయః=దిగులు చెందిన హృదయము కలవాడై, ఏతత్ =ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. పిమ్మట తన పాదములపై శిరస్సు ఉంచి నమస్కరించుచున్న దధిముఖుణ్ణి చూడగానే, వానరశ్రేష్ఠు డైన సుగ్రీవుడు దిగులు చెందిన మనస్సుతో ఇట్లు పలికెను.

మూ. ఉత్తిష్ఠోత్తిష్ఠ కస్మాత్త్వం పాదయోః పతితో మమ,
అభయం తే భవేద్వీర సర్వమేవాభిధీయతామ్. 2

ప్ర. అ. వీర=వీరుడా! ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము త్వమ్=నీవు, కస్మాత్ = ఏ కారణమువలన, మమ = నాయొక్క, పాదయోః = పాదములపై, పతితః=పడినావు? తే = నీకు, అభయమ్ = అభయము, భవేత్ = అగు గాక. సర్వమేవ=సమస్తము, అభిధీయతామ్=చెప్పబడు గాక.

తా. ఓ వీరుడా! లెమ్ము లెమ్ము. నీవు నా పాదములపై ఎందుకు పడినావు? నీకు అభయ మగు గాక. ఏమి జరిగినదో అంతా చెప్పుము. 2

మూ. స తు విశ్వాసితస్తేన సుగ్రీవేణ మహాత్మనా,
ఉత్థాయ సుమహాప్రాజ్ఞో వాక్యం దధిముఖోఽబ్రవీత్. 3

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముఁ డైన, తేన సుగ్రీవేణ=ఆ సుగ్రీవునిచేత, విశ్వాసితః=విశ్వసింపచేయఁబడిన, సుమహాప్రాజ్ఞః=చాలఁ గొప్ప బుద్ధిమంతుఁ డైన, సః దధిముఖః=ఆ దధిముఖుఁడు, ఉత్థాయ=లేచి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ముఁ డైన సుగ్రీవుఁ డీ విధముగ విశ్వాసము కలిగించఁగా, చాలఁ బుద్ధిమంతుఁ డైన దధిముఖుఁడు లేచి, ఇట్లు పలికెను. 3

మూ. నైవర్క్షరజసా రాజన్న త్వయా నాపి వాలినా,
వనం నిసృష్టపూర్వం హి భక్షితం తచ్చ వానరైః. 4

ప్ర. అ. రాజన్=రాజా, వనమ్=మధువనము, ఋక్షరజసా=ఋక్షరజస్సుచేత, నైవ నిసృష్టపూర్వం హి=పూర్వ మెన్నఁడూ ఇవ్వఁబడలేదు. త్వయా=నీచేత, న=ఇవ్వఁబడలేదు. వాలినాపి=వాలిచేత కూడ, న=కాదు. తచ్చ=అది, వానరైః=వానరులచేత, భక్షితమ్=భక్షింపఁబడినది.

తా. రాజా! మధువనమును నీ తండ్రి యైన ఋక్షరజస్సు గాని, నీవు గాని, వాలి గాని, స్వేచ్ఛగా అనుభవించుటకై పూర్వమెవ్వరికీ ఇచ్చి ఉండలేదు కదా, ఆ మధువనమును వానరులు భక్షించివేసినారు. 4

మూ. ఏభిః ప్రధర్షితాశ్చైవ వానరా వనరక్షిభిః,
మధూన్యచిన్తయిత్వేమాన్ భక్షయన్తి పిబన్తి చ. 5

ప్ర. అ. ఏభిః=ఈ, వనరక్షిభిః=వనరక్షకులచేత, ప్రధర్షితాశ్చైవ=భయపెట్టఁబడిన, వానరాః=వానరులు, ఇమాన్=వీళ్లను, అచిన్తయిత్వా=లెక్కచేయక, మధూని=మధువులను, భక్షయన్తి=భక్షించుచున్నారు. పిబన్తి చ=త్రాగుచున్నారు కూడా.

తా. ఈ వనరక్షకులు వారిని అడ్డుకొనఁగా ఆ వానరులు వీళ్ళను లెక్కచేయక, మధువులను తినివేయుచున్నారు; త్రాగివేయుచున్నారు. 5

మూ. శిష్టమత్రాపవిధ్యన్తి భక్షయన్తి తథాపరే,
నివార్యమాణాస్తే సర్వే భ్రువౌ వై దర్శయన్తి హి. 6

ప్ర. అ. శిష్టమ్=మిగిలినదానిని, అత్ర = ఇక్కడ, అవవిధ్యన్తి = పార చేయుచున్నారు. తథా = మరియు, అపరే = మరికొందరు, భక్షయన్తి=భక్షించు చున్నారు. తే సర్వే = వాళ్ళందరూ, నివార్యమాణాః=నివారింపబడుచున్నవారై, భ్రువః = కనుబొమ్మలను, దర్శయన్తి చ=చూపుచున్నారు.

తా. కొందరు త్రాగగా మిగిలినదానిని పారవేయుచుండగా, మరి కొందరు దానిని తీసికొని భక్షించుచున్నారు. మేము వాళ్లను నివారింపగా కోపముతో కను బొమ్మలు విరచుచున్నారు. 6

మూ. ఇమే హి సంరబ్ధతరా స్తథా తైః సంప్రధర్షితాః,
వారయన్తో వనా త్తస్మాత్క్రుద్ధై ర్వానరపుఙ్గవైః. 7

ప్ర. అ. సంరబ్ధతరాః = ఎక్కువతొందరపడుచున్నవారై, తథా = మరియు, తస్మాత్=ఆ, వనాత్=వనమునుండి, వారయన్తః=నివారించుచున్న, ఇమే=వీళ్లు, క్రుద్ధైః=కోపించిన, తైః వానరపుఙ్గవైః=ఆ వానరశ్రేష్ఠులచేత, సంప్రధర్షితాః=బెదిరింపబడినారు.

తా. ఈ వనపాలకులు తొందరగా వెళ్ళి వాళ్లను నివారింపగా, ఆ వానర శ్రేష్ఠులు, కోపముతో వీళ్లను బెదిరించిరి. 7

మూ. తత స్తైర్బహుభిర్వీరై ర్వానరై ర్వానరర్షభ,
సంరక్తనయనైః క్రోధాద్ధరయః ప్రవిచాలితాః. 8

ప్ర. అ. వానరర్షభ=వానరశ్రేష్ఠుడా! తతః = అటు పిమ్మట, క్రోధాత్ =కోపమువలన, సంరక్తనయనైః=ఎఱ్ఱనైన నేత్రములు గల, వీరైః=వీరులైన, బహుభిః=అనేకులైన, తైః వానరైః = ఆ వానరులచేత, హరయః=వానరులు, ప్రవిచాలితాః=తరుమబడినారు.

తా. ఓ వానరశ్రేష్ఠా! అప్పుడు కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో, అధికసంఖ్యలో ఉన్న, వీరులైన, ఆ వానరులు, వనరక్షకులను తరిమివేసిరి. 8

మూ. పాణిభిర్నిహతాః కేచిత్కేచిజ్జానుభిరాహతాః,
ప్రకృష్టాశ్చ యథాకామం దేవమార్గం చ దర్శితాః. 9

ప్ర. అ. కేచిత్ = కొందరు, పాణిభిః = పాదములచేత, నిహతాః = కొట్టబడిరి. కేచిత్ = కొందరు, జానుభిః = మోకాళ్ళచేత, ఆహతాః = కొట్టబడిరి. యథాకామమ్ = ఇష్టము వచ్చినట్లు, ప్రకృష్టాః = ఈడ్చబడినవారై, దేవమార్గమ్ = గుహ్యప్రదేశమును, దర్శితాః చ = చూపబడినారు కూడ.

తా. ఆ వానరులు, ఈ వనరక్షకులలో కొందరిని చేతులతో కొట్టిరి. కొందరిని మోకాళ్ళతో పొడిచిరి. ఇష్టము వచ్చినట్లు ఈడ్చి గుహ్యప్రదేశము కూడ చూపించిరి. 9

మూ. ఏవమేతే హతాః వీరా స్త్వయి తిష్ఠతి భర్తరి,
కృత్స్నం మధువనం చైవ ప్రకామం తైః ప్రభక్ష్యతే. 10

ప్ర. అ. త్వయి = నీవు, భర్తరి = ప్రభువుగా, తిష్ఠతి = ఉండగా, ఏతే = ఈ, వీరాః = వీరులు, ఏవమ్ = ఇట్లు, హతాః = కొట్టబడినారు. తైః = వారిచేత, కృత్స్నమ్ = సమస్తమైన, మధువనం చైవ = మధువనము కూడ, ప్రకామమ్ = మిక్కిలి, ప్రభక్ష్యతే = భక్షింపబడుచున్నది.

తా. నీవు ప్రభువుగా ఉండగా కూడ వీరులైన ఈ వనరక్షకులను ఆ వానరులు ఈ విధముగా కొట్టి, మధువనమును పూర్తిగా భక్షించివేయుచున్నారు.

మూ. ఏవం విజ్ఞాప్యమానం తం సుగ్రీవం వానరర్షభమ్,
అపృచ్ఛత్తం మహాప్రాజ్ఞో లక్ష్మణః పరవీరహా. 11

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, విజ్ఞాప్యమానమ్ = విజ్ఞాపనచేయబడుచున్న, వానరర్షభమ్ = వానరశ్రేష్ఠుడైన, తం సుగ్రీవమ్ = ఆ సుగ్రీవుని, పరవీరహా = శత్రువీరులను సంహరించువాడు, మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధి కలవాడు అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, అపృచ్ఛత్ = అడిగెను.

తా. దధిముఖు డీ విధముగ సుగ్రీవునకు విజ్ఞాపన చేయుచుండగా, మహాబుద్ధిశాలి, శత్రువీరసంహారకుడు అయిన లక్ష్మణుడు సుగ్రీవుని ఇట్లుప్రశ్నించెను.

మూ. కిమయం వానరో రాజన్ వనపః ప్రత్యుపస్థితః,
కం చార్థమభినిర్దిశ్య దుఃఖితో వాక్యమబ్రవీత్. 12

ప్ర. అ. రాజన్=రాజా, వనపః=మధువనపాలకు డైన, అయం వానరః =ఈ వానరుడు, కిమ్=ఎందుకు. ప్రత్యుపస్థితః=వచ్చినాడు? దుఃఖితః =దుఃఖితు డై, కమ్=ఏ, అర్థమ్ = విషయమును, అభినిర్దిశ్య = నిర్దేశించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్=పలికెను?

తా. రాజా! వనపాలకు డైన ఈ వానరుడు ఎందుకు వచ్చినాడు? ఇతడు దుఃఖితుడై ఏదో విషయమును గూర్చి చెప్పుచున్నాడు; అది ఏమి? 12

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా,
లక్ష్మణం ప్రత్యువాచేదం వాక్యం వాక్యవిశారదః. 13

ప్ర.అ. మహాత్మనా=మహాత్ము డైన, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః=పలుకబడిన, వాక్యవిశారదః=మాటలలో నేర్పరి యైన, సుగ్రీవః =సుగ్రీవుడు, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. మహాత్ము డైన లక్ష్మణుని మాటలు విని, మాటలలో నేర్పు గల సుగ్రీవుడు లక్ష్మణున కిట్లు బదులు చెప్పెను. 13

మూ. ఆర్య లక్ష్మణ సంప్రాహ వీరో దధిముఖః కపిః,
అఙ్గదప్రముఖై ర్వీరై ర్భక్షితం మధు వానరైః, 14
విచిత్య దక్షిణామాశామాగతై ర్హరిపుఙ్గవైః.

ప్ర. అ. ఆర్య=పూజ్యు డైన, లక్ష్మణ=లక్ష్మణుడా! వీరః=వీరు డైన, కపిః =వానరు డైన, దధిముఖః=దధిముఖుడు, సంప్రాహ = చెప్పుచున్నాడు, దక్షిణామ్ ఆశామ్=దక్షిణదిక్కును, విచిత్య = అన్వేషించి, ఆగతైః = వచ్చిన, హరిపుఙ్గవైః = వానరులలో శ్రేష్ఠు లైన, వీరైః = వీరు లైన, అఙ్గదప్రముఖైః = అంగదుడు మొదలైన, వానరైః=వానరులచేత, మధు=మధువు, భక్షితమ్ = భక్షింపబడినది.

తా. పూజ్యు డైన లక్ష్మణుడా! ఈ దధిముఖుడు—"దక్షిణదిక్కు వెదకి తిరిగి వచ్చిన వానరశ్రేష్ఠులు, వీరులు అయిన అంగదాదివానరులు మధువును తినివేసినారు" అని చెప్పుచున్నాడు. 14

వి. వాయవ్యప్రతిలో గాని, గోరఖ్‌పూర్ ప్రతిలో గాని, దధిముఖునిమాటలలో అంగదాదులు మధువనమును చెల్లాచెదరుచేసినారని చెప్పినట్లు లేదు. సుగ్రీవుడు ఇక్కడ అంగదాదు లావిధముగ చేసినట్లు చెప్పుచున్నాడు. అతనికి ఆ వానరులు అంగదాదు లని ఎట్లు తెలిసినదో సూచన లేదు. ప్రాచ్యప్రతిలో ఒక శ్లోకములో అంగదాదులు మధువనభంగము చేసిన ట్లున్నది.

"అఙ్గదః సహితైః సర్వైర్హనుమత్ప్రముఖైః కపిః,
దృష్ట్వా మధూన్యపాస్యైవ సర్వానస్మానభక్షయత్." 14

మూ. నైషామకృతకృత్యానామీదృశః స్యాదుపక్రమః. 15
ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః,
ధర్షితం చ వనం కృత్స్నముపయుక్తం చ వానరైః 16

ప్ర. అ. ఆగతైః=తిరిగి వచ్చిన, తైః వానరైః=ఆ వానరులచేత, మధువనమ్=మధువనము, యథా=ఎట్లు, ప్రమథితమ్=భగ్నము చేయబడినదో, కృత్స్నమ్=సమస్తమైన, వనమ్=ఆ వనము, ధర్షితమ్=ఆక్రమింపబడిన దై, ఉపయుక్తం చ=ఉపయోగింపబడినదో, (తథా=దానినిబట్టి చూడగా), ఏషామ్=ఈ వానరులు, అకృతకృత్యానామ్=కార్యమును సఫలము చేయనివారైనచో, ఈదృశః=ఇట్టి, ఉపక్రమః=కార్యపద్ధతి, న స్యాత్=ఉండజాలదు.

తా. తిరిగి వచ్చిన ఈ వానరులు మధువనమును ఆక్రమించి, దానిని పాడుచేసి, దాని నంతయూ అనుభవించినా రనగా, తాము వెళ్ళిన పనిని సఫలము చేసికొననిచో వా రట్లు ప్రవర్తింపరు. 15, 16

మూ. వనం యదాభిపన్నాస్తే సాధితం కర్మ వానరైః,
దృష్టా దేవీ న సన్దేహో న చాన్యేన హనూమతా. 17

ప్ర. అ. తే=ఆ వానరులు, యదా=ఎప్పుడు, వనమ్=మధువనమును, అభిపన్నాః=పొందినారో, అప్పుడు, వానరైః=వానరులచేత, కర్మ=పని, సాధితమ్=సాధింపబడినది. దేవీ=సీతాదేవి, దృష్టా=చూడబడినది. సన్దేహః=సందేహము, న=లేదు. అన్యేన=మరెవ్వనిచేత, న=కాదు. హనూమతా=హనుమంతునిచేతనే (చూడబడినది).

తా. ఆ వానరులు మధువనమును అతిక్రమించినారనగా వానరులు పనిని సాధించియే యుందురు. దేవి కనబడినది; సందేహము లేదు. మఱెవ్వరో కాదు; హనుమంతుడే ఆ దేవిని చూచి యుండును. 17

మూ. న హ్యన్యః సాధనే హేతుః కర్మణోఽస్య హనూమతః,
కార్యసిద్ధిర్మతిశ్చైవ తస్మిన్వానరపుఙ్గవే. 18
వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్.

ప్ర. అ. అస్య కర్మణః=ఈ పనియొక్క, సాధనే=సాధించుటయందు, హనూమతః=హనుమంతునికంటె, అన్యః=ఇతరుడు, హేతుః=కారణభూతుడు, న హి = కాజాలడు కదా? కార్యసిద్ధిః=కార్యసిద్ధి, మతిశ్చైవ=మంచి ఆలోచన, వ్యవసాయశ్చ=ప్రయత్నము, వీర్యం చ=పరాక్రమము, శ్రుతం చాపి = శాస్త్రజ్ఞానము, తస్మిన్ వానరపుఙ్గవే= ఆ వానరశ్రేష్ఠునియందు, ప్రతిష్ఠితమ్ = స్థిరముగా ఉన్నది(వి).

తా. హనుమంతుడు తప్ప మఱెవ్వరూ ఈ పని సాధించ జాలరు. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతునిలో కార్యసిద్ధి, ఆలోచనాశక్తి, ప్రయత్నము, పరాక్రమము, శాస్త్రజ్ఞానము మొదలైన మంచి లక్షణములు స్థిరముగా ఉన్నవి. 18

మూ. జామ్బవాన్యత్ర నేతా స్యాదఙ్గదశ్చ మహాబలః,
హనుమాంశ్చాప్యధిష్ఠాతా న తస్య గతిరన్యథా. 19

ప్ర. అ. యత్ర=ఏ కార్యమునందు, జామ్బవాన్=జాంబవంతుడు, నేతా=నాయకుడుగా, స్యాత్=ఉండునో, మహాబలః=గొప్ప బలము గల, అఙ్గదశ్చ = అంగదుడు కూడ, నాయకుడుగా ఉండునో, హనుమాంశ్చ=హనుమంతుడు, అధిష్ఠాతా=అధ్యక్షుడుగా ఉండునో, తస్య=ఆ కార్యముయొక్క, గతిః=గతి [ఫలము], అన్యథా=మఱొక విధముగా, న=కాజాలదు.

తా. ఏ కార్యసంపాదనమునందు జాంబవంతుడు, మహాబలశాలియైన అంగదుడూ నాయకులుగా ఉందురో, హనుమంతుడు అధ్యక్షుడుగా ఉండునో, అది తప్పక సఫలమగును గాని, మఱొక విధముగా కాజాలదు. 19

మూ. అఙ్గదప్రముఖై ర్వీరై ర్హతం మధువనం కిల, 20
వారయన్తశ్చ సహితా స్తదా జానుభిరాహతాః.

ప్ర. అ. అఙ్గదప్రముఖైః = అంగదుడు మొదలైన, వీరైః = వీరులచేత, మధువనమ్ = మధువనము, హతం కిల = పాడుచేయబడిన దట. సహితాః = కలిసి వెళ్ళినవారై, వారయన్తః చ = నివారించుచున్న వనపాలకులు కూడ, తదా = అప్పుడు, జానుభిః = మోకాళ్ళచేత, ఆహతాః = కొట్టబడినారు.

తా. అంగదుడు మొదలైన వీరులు మధువనమును భగ్నము చేసినారట. వనపాలకు లందరూ కలిసి నివారించగా వాళ్లను మోకాళ్ళతో పొడిచినా రట. 20

మూ. ఏతదర్థమయం ప్రాప్తో వక్తుం మధురవాగిహ, 21
నామ్నా దధిముఖో నామ హరిః ప్రఖ్యాతవిక్రమః.

ప్ర. అ. నామ్నా = పేరుచేత, దధిముఖో నామ = దధిముఖు డని ప్రసిద్ధి పొందిన, ప్రఖ్యాతవిక్రమః = ప్రసిద్ధ మైన పరాక్రమము గల, హరిః = వానరుడు, ఏతదర్థమ్ = ఈ విషయమును, వక్తుమ్ = చెప్పుటకు, మధురవాక్ = మధుర మైన వాక్కు. కల వాడై. ఇహ = ఇక్కడికి, ప్రాప్తః = వచ్చినాడు.

తా. ప్రసిద్ధ మైన పరాక్రమము గల దధిముఖు డనే వానరుడు ఈ విష యమునే చెప్పుటకై, మనకందరికీ మధుర మైన వాక్కు పలుకుచు ఇక్కడికి వచ్చినాడు. 21

మూ. దృష్టా సీతా మహాబాహో సౌమిత్రే పశ్య తత్త్వతః, 22
అభిగమ్య తథా సర్వే పిబన్తి మధు వానరాః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల, సౌమిత్రే = లక్ష్మణా! సీతా = సీత, దృష్టా = చూడబడినది. తత్త్వతః = యథార్థమును, పశ్య = చూడుము [తెలిసికొనుము]. తథా = మరియు, వానరాః = వానరులు, సర్వే = అందరూ, అభిగమ్య = చేరి, మధు = మధువును, పిబన్తి = త్రాగుచున్నారు.

తా. ఓ! మహాబాహా! లక్ష్మణా! సీత జాడ తెలిసిన దను సత్యమును తెలుసుకొనుము. ఎందుచేత ననగా వానరు లందరూ చేరి మధువు త్రాగుచున్నారు.

మూ. న చాప్యదృష్ట్వా వైదేహీం విశ్రుతాః పురుషర్షభ, 23
వనం దత్తవరం దివ్యం ధర్షయేయుర్వనౌకసః.

ప్ర. అ. పురుషర్షభ = ఓ! పురుషశ్రేష్ఠుడా! విశ్రుతాః = ప్రసిద్ధులైన, వనౌకసః = వానరులు, వైదేహీమ్ = సీతను, అదృష్ట్వా = చూడకుండగా, దత్తవరమ్ = ఇవ్వబడిన వరము గలది, దివ్యమ్ = దివ్యమూ అయిన. వనమ్ = మధువనమును. న ధర్షయేయుః = ఆక్రమింపరు.

తా. ఓ! పురుషశ్రేష్ఠా! కీర్తిమంతులైన హనుమదాదివానరులు, సీతను చూడక పోయినచో, ఎవ్వరూ చొరగూడదు అను నియమముతో కాపాడబడుచున్న ఆ ఉత్తమమైన మధువనమును ఆక్రమించరు. 23

మూ. తతః ప్రహృష్టో ధర్మాత్మా లక్ష్మణః సహ రాఘవః. 24
శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనాచ్చ్యుతామ్,
ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణశ్చ మహాబలః. 25

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సహ రాఘవః = రామునితో కూడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రహృష్టః = సంతోషించెను. సుగ్రీవవదనాత్ = సుగ్రీవుని ముఖమునుండి, చ్యుతామ్ = వచ్చిన, కర్ణసుఖామ్ = చెవులకు సుఖకరమైన, వాణీమ్ = వాక్కును, శ్రుత్వా = విని, రామః = రాముడు, ప్రాహృష్యత = సంతోషించెను. మహాబలః = గొప్పబలము గల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, భృశమ్ = మిక్కిలి, ప్రాహృష్యత = సంతోషించెను.

తా. అప్పుడు రామసహితుడైన ధర్మాత్ముడైన లక్ష్మణుడు సంతోషించెను. సుగ్రీవుని ముఖమునుండి వెలువడిన, చెవులకు సుఖము కలిగించు ఆ వాణిని విని రాముడు, మహాబలశాలియైన లక్ష్మణుడు సంతోషించిరి. 25

మూ. శ్రుత్వా దధిముఖస్యేదం సుగ్రీవః సంప్రహృష్య చ,
వనపాలం పునర్వాక్యం సుగ్రీవః ప్రత్యభాషత. 26

ప్ర. అ. సుగ్రీవః = మంచి కంఠము గల, సుగ్రీవః = సుగ్రీవుడు, దధిముఖస్య = దధిముఖునియొక్క, ఇదమ్ = ఈ వాక్యమును, శ్రుత్వా = విని, సంప్రహృష్య చ = బాగా సంతోషించి, పునః = తిరిగి, వనపాలమ్ = ఆ వనపాలుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యభాషత = పలికెను.

రా. అందమైన కంఠము గల సుగ్రీవుడు దధిముఖుని మాటలు విని చాల సంతోషించి, అతనితో మరల ఇట్లు పలికెను. 26

మూ. ప్రీతో ఽస్మి సో ఽహం యద్భుక్తం వనం తైః కృతకర్మభిః,
మర్షితం మర్షణీయం చ చేష్టితం కృతకర్మణామ్. 27

ప్ర. అ. కృతకర్మభిః=చేయవలసిన కార్యము గల, తైః=ఆ వానరుల చేత, వనమ్=మధువనము, యత్ భుక్తమ్=అనుభవింపబడెను అనునది ఏది కలదో, దానివలన, సః అహమ్=అట్టి నేను, ప్రీతః అస్మి=సంతోషించినాను. కృతకర్మణామ్=చేయవలసిన కార్యము గల ఆ వానరులయొక్క, మర్షణీయమ్=సహింపదగిన, చేష్టితమ్=పని. మర్షితమ్=సహింపబడినది.

రా. వెళ్ళిన పని చేసికొని వచ్చిన ఆ వానరులు మధువనమును అనుభవించినందుకు నేను సంతోషించినాను. పని పూర్తిచేసికొని వచ్చిన వాళ్లు చేసిన ఆపని. మధువనభంగము క్షమింపదగినదే గాన క్షమించినాను. 27

మూ. ఇచ్ఛామి శీఘ్రం హనుమత్ప్రధానాన్
శాఖామృగాంస్తాన్ మృగరాజదర్పాన్,
ద్రష్టుం కృతార్థాన్ సహ రాఘవాభ్యాం
శ్రోతుం చ సీతాధిగమే ప్రయత్నమ్. 28

ప్ర. అ. హనుమత్ప్రధానాన్=హనుమంతుడు ప్రధానుడుగా గల, మృగరాజదర్పాన్=సింహము వంటి దర్పము గల, కృతార్థాన్=చేయవలసిన కార్యము గల, తాన్=ఆ, శాఖామృగాన్=వానరులను, రాఘవాభ్యాం సహ=రామలక్ష్మణులతో కూడిన నేను, ద్రష్టుమ్=చూచుటకు, సీతాధిగమే=సీతను పొందుటయందు, ప్రయత్నమ్=ప్రయత్నమును, శ్రోతుం చ=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

రా. పని సఫలము చేసికొని వచ్చినవారు, సింహము వంటి దర్పము గలవారు అయిన హనుమంతుడు నాయకుడుగా ఉన్న ఆ వానరు లందరిని చూడవలె ననీ, సీతను పొందుటకు చేసిన ప్రయత్నమును వినవలె ననీ, రామలక్ష్మణులు నేను కూడ కోరుచున్నాము. 28

మూ. ప్రీతిస్ఫీతాక్షౌ సంప్రహృష్టౌ కుమారౌ
దృష్ట్వా సిద్ధార్థౌ వానరాణాం చ రాజా,
అఙ్గైః సంహృష్టైః కర్మసిద్ధిం విదిత్వా
బాహ్వోరాసన్నాం సోఽతిమాత్రం ననన్ద. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
త్రిషష్టితమః సర్గః

ప్ర. అ. సః = ఆ, వానరాణాం రాజా = వానరరాజు, ప్రీతిస్ఫీతాక్షౌ = సంతోషముతో వికాసము లైన నేత్రములు కలవారు, సంప్రహృష్టౌ=గగుర్పాటు పొందినవారు, సిద్ధార్థౌ = సిద్ధ మైన కార్యము కలవారు అయిన, కుమారౌ = ఆ రాజకుమారులను, దృష్ట్వా = చూచి, సంహృష్టైః = గగుర్పాటు చెందిన, అఙ్గైః = అవయవములతో కూడినవా డై, కర్మసిద్ధిమ్=కార్యసిద్ధిని, బాహ్వోః = చేతులయందు, ఆసన్నామ్ = సమీపించినదానినిగా, విదిత్వా = తెలిసికొని, అతిమాత్రమ్ = మిక్కిలి, ననన్ద = సంతోషించెను.

తా. సీతాన్వేషణకార్యము సఫలమగుటచే ఆ రామలక్ష్మణు లిద్దరు సంతోషముచే వికసించిన నేత్రములు కలవారై, గగుర్పాటు చెందిరి. వారిని చూచి సుగ్రీవుడు శరీరము గగుర్పాటుచెందగా, కార్యసిద్ధి చేతులలో ఉన్నట్లు గ్రహించి చాల సంతోషించెను. 29

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో
అరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుఃషష్టితమః సర్గః

[దధిముఖుని ద్వారా సుగ్రీవసందేశమును విని హనుమంతుడు మొదలైన వానరులు కిష్కింధకు వెళ్ళుట. హనుమంతుడు శ్రీరామునకు నమస్కరించి తాను సీతను చూచినట్లు తెలుపుట]

మూ. సుగ్రీవేణైవముక్తస్తు హృష్టో దధిముఖః కపిః,
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చాభ్యవాదయత్. 1

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, కపిః=వానరుడైన, దధిముఖః=దధిముఖుడు, హృష్టః=సంతోషించినవాడై, రాఘవమ్=రాముని, లక్ష్మణం చైవ=లక్ష్మణుని, సుగ్రీవం చ=సుగ్రీవుని, అభ్యవాదయత్=నమస్కరించెను.

తా. దధిముఖుడు సుగ్రీవుని మాటలు విని, సంతోషించి, రామునకు, లక్ష్మణునకు, సుగ్రీవునకు నమస్కరించెను. 1

మూ. స ప్రణమ్య చ సుగ్రీవం రాఘవౌ చ మహాబలౌ,
వానరైః సహితః శూరైర్దివమేవోత్పపాత హ. 2

ప్ర. అ. సః=అతడు, సుగ్రీవమ్=సుగ్రీవుని, మహాబలౌ=మహాబలము గల, రాఘవౌ చ=రామలక్ష్మణులను, ప్రణమ్య=నమస్కరించి, శూరైః=శూరులైన, వానరైః=వానరులతో, సహితః=కూడినవాడై, దివమేవ=ఆకాశమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను.

తా. అతడు సుగ్రీవునకు, మహాబలశాలులైన రామలక్ష్మణులకు నమస్కరించి శూరులైన వానరులతో కలిసి, ఆకాశముపైకి ఎగిరెను. 2

మూ. స ప్రవిష్టో మధువనం దదర్శ హరియూథపాన్,
విమదానుత్థితాన్సర్వాన్ మేహమానాన్ మదాత్యయే. 3

ప్ర. అ. మధువనమ్ = మధువనమును, ప్రవిష్టః = ప్రవేశించిన, సః = అతడు, ప్రమదాన్ = మదము కొలంగినవారు, మదాత్యయే = మదము తొలంగిన దగుచుండగా, వేపమానాన్ = వణకుచున్నవారు (తూలుచున్నవారు) అయిన, సర్వాన్ = సమస్త మైన, హరియూథపాన్ = వానరనాయకులను, దదర్శ = చూచెను.

తా. ఆ దధిముఖుడు మధువనమునకు వెళ్ళి, అక్కడ మదము తగ్గిలేచి, మత్తు తగ్గుటచే కొంచెము తూలుచు ఉన్న ఆ వానరనాయకు లందరినీ చూచెను.

వి. ''మేహమానాన్ మధూదకమ్'' (మధువుతో కలిసిన మూత్రము విడచుచున్న) అన్న పాఠం అశ్లీలంగా ఉండడంచేత ప్రాచ్యపాఠం గ్రహించ బడినది. 3

మూ. స తానుపాగమద్వీరో బద్ధ్వా కరపుటాఞ్జలిమ్,
ఉవాచ వచనం శ్లక్ష్ణమిదం హృష్టవదఙ్గదమ్. 4

ప్ర. అ. వీరః = వీరు డైన, సః = ఆ దధిముఖుడు, కరపుటాఞ్జలిమ్ = కరపుటముతో దోసిలిని, బద్ధ్వా = కట్టి, తాన్ = వారిని, ఉపాగమత్ = సమీపించెను. హృష్టవత్ = సంతోషించినవాడు వలె, అఙ్గదమ్ = అంగదుని గూర్చి, శ్లక్ష్ణమ్ = మృదు వైన, ఇదం వచనమ్ = ఈ వచనమును, ఉవాచ = పలికెను.

తా. వీరు డైన ఆ దధిముఖుడు అంజలి ఘటించి వారి వద్దకు వెళ్ళి అంగదునితో సంతోషపూర్వకముగా ఈ మృదు వైన వాక్యమును పలికెను. 4

మూ. సౌమ్య రోషో న కర్తవ్యో యదేతత్పరివారితమ్,
అజ్ఞానాద్రక్షిభిః క్రోధాద్భవన్తః ప్రతిషేధితాః. 5

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! ఏతత్ = ఈ విధముగా. యత్ పరివారితమ్ = నివారింపబడినది అనునది ఏది కలదో, దానిని గూర్చి, రోషః = కోపము, న కర్తవ్యః = చేయదగినది కాదు. భవన్తః = మీరు, రక్షిభిః = రక్షకులచేత, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, క్రోధాత్ = కోపమువలన, ప్రతిషేధితాః = నివారింపబడినారు.

తా. ఓ! సౌమ్యుడా! ఈ వనరక్షకులు, త ... పిమ్మ
ఆను నివారించినారు, అట్లు నివారించినందుకు కో ... 5

మూ. యువరాజ స్త్వమీశశ్చ వనస్యాస్య
మౌర్ఖ్యాత్ పూర్వం కృతో దోషః ... పర్హతి

ప్ర. అ. మహాబల=ఓ మహాబలవంతుడా! ... రాజు=
యువరాజవు. అస్య వనస్య=ఈ వనమునకు, ( ... కూడా.
పూర్వమ్=ముందు. మౌర్ఖ్యాత్=మూర్ఖత్వముచం ... ృతః=
చేయబడినది. తమ్ = దానిని. భవాన్=నీవు. క్షన్త ... ర్హతి=
తగియున్నావు.

తా. నీవు యువరాజవు. ఈ వనము పై అ( ... ఇంతకు
ముందు, మూర్ఖత్వముచే తప్పు చేసినాము. దానిని ... 6

మూ. ఆఖ్యాతం హి మయా గత్వా పితృవ్యస్య తవానఘ,
ఇహోపయాతం సర్వేషామేతేషాం వనచారిణామ్. 7

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! మయా = నాచేత, గత్వా = వెళ్ళి, తవ=నీయొక్క, పితృవ్యస్య=పినతండ్రికి. సర్వేషామ్ = సమస్త మైన, ఏతేషామ్ = ఈ, వనచారిణామ్ = వానరులయొక్క, ఇహ = ఇక్కడికి, ఉప యాతమ్=వచ్చుట, ఆఖ్యాతం హి=చెప్పబడినది కదా.

తా. దోషములు లేనివాడా! ఈ వానరు లందరు ఇక్కడకు వచ్చి నట్లు, నేను వెళ్ళి నీ పినతండ్రికి తెలిపితిని. 7

మూ. స త్వదాగమనం శ్రుత్వా సహైభి ర్హరియూథపైః,
ప్రహృష్టో న తు రుష్టోఽసౌ వనం శ్రుత్వా ప్రధర్షితమ్.

ప్ర. అ. సః = ఆ నీ పినతండ్రి, ఏభిః = ఈ, హరియూథపైః సహ = వానరనాయకులతో కూడ, త్వదాగమనమ్ = నీ రాకను, శ్రుత్వా = విని, ప్రహృష్టః=సంతోషించినాడు. తు=కాని, వనమ్=వనమును, ప్రధర్షితమ్ = చెరచబడినదానినిగా, శ్రుత్వా = విని, అసౌ = ఇతడు, న రుష్టః=కోపించలేదు.

తా. నీవు, ఈ వానరనాయకులతో కలిసి వచ్చినట్లు విని నీ పినతండ్రి సంతోషించినాడు. మధువనము చెరచబడిన దని విని కూడ అతడు కోపించ లేదు. 8

మూ. ప్రహృష్టో మాం పితృవ్యస్తే సుగ్రీవో వానరేశ్వరః,
శీఘ్రం ప్రేషయ సర్వాంస్తానితి హోవాచ పార్థివః. 9

ప్ర. అ. తే పితృవ్యః = నీ పినతండ్రి, వానరేశ్వరః = వానరప్రభువు, పార్థివః = రాజు అయిన, సుగ్రీవః = సుగ్రీవుడు, ప్రహృష్టః = సంతోషించినవాడై, తాన్ సర్వాన్ = వారి నందరిని, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రేషయ = పంపుము, ఇతి = అని, మామ్ = నన్ను గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. వానరరాజు, రాజ్యాధిపతి, నీ పినతండ్రి అయిన సుగ్రీవుడు సంతోషించి, ''వాళ్ళ నందరిని శీఘ్రముగా పంపుము'' అని నాతో చెప్పినాడు. 9

మూ. శ్రుత్వా దధిముఖస్యేదం వచనం శ్లక్ష్ణమఙ్గదః,
అబ్రవీత్తాన్ హరిశ్రేష్ఠో వాక్యం వాక్యవిశారదః. 10

ప్ర. అ. దధిముఖస్య = దధిముఖునియొక్క, ఇదమ్ = ఈ, శ్లక్ష్ణమ్ = మృదువైన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, హరిశ్రేష్ఠః = వానరులలో శ్రేష్ఠుడు, వాక్యవిశారదః = మాటలయందు నేర్పు గలవాడు అయిన, అఙ్గదః = అంగదుడు, తాన్ = ఆ వానరులను గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వానరులలో శ్రేష్ఠుడూ, మాటలలో నేర్పరి అయిన అంగదుడు దధిముఖుని మృదువైన మాటలు విని, ఆ వానరులతో ఇట్లు పలికెను. 10

మూ. శఙ్కే శ్రుతోఽయం వృత్తాన్తో రామేణ హరియూథపాః,
తత్ క్షమం నేహ నః స్థాతుం కృతే కార్యే పరంతపాః.

ప్ర. అ. పరంతపాః = శత్రుసంహారకు లైన, హరియూథపాః = వానరనాయకులారా! అయం వృత్తాన్తః = ఈ వృత్తాంతము, రామేణ = రామునిచేత, శ్రుతః = వినబడినది అని, శఙ్కే = ఊహించుచున్నాను. తత్ = ఆ కారణము

వలన, కార్యే=కార్యము, కృతే = చేయబడిన దగుచుండగా, ఇహ = ఇక్కడ, స్థాతుమ్ = ఉండుటకు, నః=మనకు, న క్షమమ్ = తగినది కాదు.

తా. శత్రుసంహారకు లైన ఓ వానరశ్రేష్ఠులారా! ఈ వృత్తాంతము రాముడు విని ఉంటాడని తలంచెదను. కార్యము పూర్తిచేసిన పిమ్మట మనము ఇంకా ఇక్కడనే ఉండుట యుక్తము కాదు. 11

మూ. పీత్వా మధు యథాకామం విశ్రాన్తా వనచారిణః,
కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర మే గురుః. 12

ప్ర. అ. వనచారిణః=వానరులు, యథాకామమ్=ఇష్టము వచ్చినట్లుగా, మధు=మధువును, పీత్వా=త్రాగి, విశ్రాన్తాః=విశ్రమించినారు. కిమ్ = ఏమి, శేషమ్=మిగిలినది? మే=నాయొక్క, గురుః=పినతండ్రి యైన, సుగ్రీవః = సుగ్రీవుడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో, తత్ర = అక్కడికి, గమనమ్ = వెళ్లుటయే మిగిలినది.

తా. వానరు లందరు ఇష్టము వచ్చినట్లు మధువు త్రాగి విశ్రమించినారు. ఇంక మిగిలినది ఏమి? నా పినతండ్రి యైన సుగ్రీవుడు ఉన్న చోటికి వెళ్ళుటయే ఇంక చేయవలసిన పని. 12

మూ. సర్వే యథా మాం వక్ష్యన్తి సమేత్య హరియూథపాః,
తథాస్మి కర్తా కర్తవ్యే భవద్భిః పరవానహమ్. 13

ప్ర. అ. సర్వే=సమస్తమైన, హరియూథపాః = వానరనాయకులు, సమేత్య=కలిసి, మామ్=నన్ను గూర్చి, యథా=ఎట్లు, వక్ష్యన్తి=చెప్పగలరో, తథా=అట్లు, కర్తా=చేయువాడను, అస్మి=అయి ఉన్నాను. కర్తవ్యే=కర్తవ్యము విషయమున, అహమ్=నేను, భవద్భిః=మీచేత, పరవాన్=పరాధీనుడను.

తా. వానరనాయకు లందరూ కలిసి ఆలోచించి ఏమి చెప్పెదరో అట్లు చేసెదను. ఇపు డేమి చేయవలెను అను విషయమున నేను మీకు అధీనుడను; మీరు చెప్పినట్లు చేసెదను.

మూ. నాజ్ఞాపయితుమీశోఽహం యువరాజోఽస్మి యద్యపి,
అయుక్తం కృతకర్మాణో యూయం ధర్షయితుం మయా.

ప్ర. అ. అహమ్ = నేను, యువరాజః = యువరాజునుగా, అస్మి యద్యపి = అయి ఉన్నను, ఆజ్ఞాపయితుమ్ = ఆజ్ఞాపించుటకు, న ఈశః = సమర్థుడను కాను. కృతకర్మాణః = చేయబడిన పని గల, యూయమ్ = మీరు, మయా = నాచేత, ధర్షయితుమ్ = ఎదిరించుటకు, అయుక్తమ్ = యుక్తము కాదు.

తా. నేను యువరాజునే అయినను మిమ్ములను ఆజ్ఞాపింపజాలను. కార్యమును నిర్వర్తించిన మీ మాట కాదనుట నాకు యుక్తము కాదు. 15

మూ. బ్రువతశ్చాఙ్గదస్యైవం శ్రుత్వా వచనమవ్యయమ్,
ప్రహృష్టమనసో వాక్యమిదమూచుర్వనౌకసః. 16

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువతః = పలుకుచున్న, అఙ్గదస్య = అంగదునియొక్క, అవ్యయమ్ = ఉత్తమ మైన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, వనౌకసః = వానరులు, ప్రహృష్టమనసః = సంతోషించిన మనస్సు కల వారై, ఇదమ్ = ఈ వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. అంగదుడు పలికిన ఆ ఉత్తమ మైన మాట విని, వానరులు సంతోషించిన మనస్సులతో ఇట్లు పలికిరి. 16

మూ. ఏవం వదతి కో రాజన్ ప్రభుః సన్ వానరర్షభ,
ఐశ్వర్యమదమత్తో హి సర్వో௨హమితి మన్యతే. 17

ప్ర. అ. వానరర్షభ = వానరశ్రేష్ఠుడ వైన, రాజన్ = రాజా! ప్రభుః సన్ = ప్రభు వై యుండి, కః = ఎవడు, ఏవమ్ = ఇట్లు, వదతి = పలుకును? సర్వః = ప్రతివాడు, ఐశ్వర్యమదమత్తః = ఐశ్వర్యమదముచేత మదించినవా డై, అహమ్ ఇతి = "నేను" అని, మన్యతే హి = తలచుచుండును కదా ?

తా. వానరశ్రేష్ఠుడ వైన ఓ! యువరాజా! ప్రభు వై యుండి ఎవడు ఇట్లు పలుకును? ప్రతివాడూ ఐశ్వర్యముచే మదించి "నేను , నేను" అనుకొనుచుండును కదా ! 17

మూ. తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్,
సన్నతిర్హి తవాఖ్యాతి భవిష్యచ్ఛుభయోగ్యతామ్. 18

ప్ర. అ. ఇదం వాక్యమ్=ఈ వాక్యము, తవ త=నీకే, సుసదృశమ్= చాల తగి యున్నది. అన్యస్య=ఇతరునకు, కస్య చిత్=ఎవనికీ, న=తగినది కాదు. తవ=నీ యొక్క, సన్నతిః=వినయము, భవిష్యత్ఫలయోగ్యతామ్= రానున్న ఫలమునకు యోగ్యత్వమును, ఆఖ్యాతి=చెప్పుచున్నది.

భా. ఇట్లు మాట్లాడుట నీకే తగును. ఇతరు లెవ్వరూ ఇట్లు మాట్లాడ జాలరు. నీలో ఉన్న వినయము నీకు ముమ్ముందు మంచి ఫలము కలుగ నున్న దని, దానికి నీవు యోగ్యుడ వని సూచించుచున్నది. 18

మూ. సర్వే వయమపి ప్రాప్తాస్తత్ర గన్తుం కృతక్షణాః,
స యత్ర హరివీరాణాం సుగ్రీవః పతిరవ్యయః. 19

ప్ర. అ. ప్రాప్తాః=ఇక్కడికి వచ్చిన, వయమ్=మేము, సర్వేఽపి= అందరము, హరివీరాణామ్=వానరవీరులయొక్క, పతిః=ప్రభువు, అవ్యయః= వినాశము లేనివాడు అయిన, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో, తత్ర=అక్కడికి, గన్తుమ్=వెళ్ళుటకు, కృతక్షణాః=చేయబడిన అవకాశము గలవారము (వేచియున్నాము).

భా. ఇక్కడికి చేరిన మే మందరము కూడ, వానరనాయకుల ప్రభువు, నిత్యాభివృద్ధిమంతుడు అయిన సుగ్రీవుడు ఉన్న స్థానమునకు వెళ్లుటకు వేచి ఉన్నాము. 19

మూ. త్వయా హ్యనుక్తైర్హరిభిర్నైవ శక్యం పదాత్పదమ్,
క్వచిద్గన్తుం హరిశ్రేష్ఠ బ్రూమః సత్యమిదం తు తే. 20

ప్ర. అ. హరిశ్రేష్ఠ=వానరశ్రేష్ఠుడా! త్వయా=నీచేత, అనుక్తైః=ఆజ్ఞాపించబడని, హరిభిః=వానరులచేత, పదాత్=ఒక అడుగునుండి, పదమ్= మరొక అడుగును, క్వచిత్=ఎక్కడికిని, గన్తుమ్=వెళ్లుటకు, న శక్యమ్= శక్యము కాదు. సత్యమ్=సత్య మైన, ఇదమ్=ఈ వాక్యమును, తే=నీకు, బ్రూమః=చెప్పుచున్నాము.

భా. ఓ వానరశ్రేష్ఠా! నీ ఆజ్ఞ లేకుండా వానరులు అడుగు తీసి అడుగు పెట్టి ఎక్కడికీ వెళ్ళజాలరు. నీకు సత్యముగా చెప్పుచున్నాము. 20

మూ. ఏవం తు వదతాం తేషామఙ్గదః ప్రత్యువాచ హ,
బాఢం గచ్ఛామ ఇత్యుక్త్వా ఖముత్పేతుర్మహాబలాః. 21

ప్ర. అ. తేషామ్ = వాళ్లు, ఏవమ్ = ఇట్లు, వదతామ్ = పలుకుచుండగా, అఙ్గదః = అంగదుడు, బాఢమ్ = తప్పక, గచ్ఛామ = వెళ్లెదము, అని, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, మహాబలాః = గొప్ప బలము గల ఆ వానరులు, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పేతుః = ఎగిరిరి.

తా. ఆ వానరుల మాట విని అంగదుడు "తప్పక వెళ్లెదము" అని పలికెను. ఇట్లు పలికిన పిదప మహాబలవంతులైన వానరులు ఆకాశముపైకి ఎగిరిరి. 21

మూ. ఉత్పతన్తమనూత్పేతుః సర్వే తే హరియూథపాః,
కృత్వాకాశం నిరాకాశం యన్త్రోత్క్షిప్తా ఇవాచలాః. 22

ప్ర. అ. సర్వే = సమస్తమైన, తే హరియూథపాః = ఆ వానరనాయకులు, యన్త్రోత్క్షిప్తాః = యంత్రముచేత ఎత్తబడిన, అచలాః ఇవ = పర్వతములు వలె, ఆకాశమ్ = ఆకాశమును, నిరాకాశమ్ = అవకాశము లేనిదానినిగా, కృత్వా = చేసి, ఉత్పతన్తమ్ = పైకి ఎగురుచున్న ఆ అంగదుని, అనూత్పేతుః = అనుసరించి ఎగిరిరి.

తా. ఆ వానరనాయకు లందరు యంత్రముచేత పైకి ఎత్తబడిన పర్వతముల వలె, ఆకాశములో అవకాశము లేకుండ చేయుచు, పైకి ఎగురుచున్న ఆ అంగదుని అనుసరించి ఎగిరిరి. 22

మూ. తేఽమ్బరం సహసోత్పత్య వేగవన్తః ప్లవఙ్గమాః,
వినదన్తో మహానాదం ఘనా వాతేరితా యథా. 23

ప్ర. అ. వేగవన్తః = వేగము గల, తే ప్లవఙ్గమాః = ఆ వానరులు, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినదన్తః = ధ్వనిచేయుచు, వాతేరితాః = వాయువుచేత ప్రేరేపింపబడిన, ఘనాః యథా = మేఘములు వలె, సహసా = శీఘ్రముగా, అమ్బరమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పత్య = ఎగిరి, వెళ్ళిరి.

తా. వేగము గల ఆ వానరనాయకులు, అత్యధికముగా ధ్వని చేయుచు గాలికి ఎగురుచున్న మేఘముల వలె, శీఘ్రముగా ఆకాశముపై ఎగిరి వెళ్ళిరి. 23

మూ. అఙ్గదే హ్యనసమ్ప్రాప్తే సుగ్రీవో వానరాధిపః,
ఉవాచ శోకోపహతం రామం కమలలోచనమ్. 24

ప్ర. అ. అఙ్గదే = అంగదుడు, అనసమ్ప్రాప్తే = రాకుండగా (వచ్చుటకు పూర్వము), వానరాధిపః = వానరరాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు, శోకోపహతమ్ = శోకముచేత పీడింపబడిన, కమలలోచనమ్ = కమలముల వంటి నేత్రములు గల, రామమ్ = రాముని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. అంగదుడు ఇంకా అక్కడికి చేరక పూర్వము వానరరాజైన సుగ్రీవుడు, శోకముచేత పీడింపబడిన మనస్సు గల, పద్మముల వంటి నేత్రములు గల రామునితో ఇట్లు పలికెను. 24

మూ. సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ న సంశయః,
నాగన్తుమిహ శక్యం తైరతీతే సమయే హి నః. 25

ప్ర. అ. సమాశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. దేవీ = దేవి, దృష్టా = చూడబడినది. సంశయః = సంశయము, న = లేదు. నః = మనయొక్క, సమయే = సమయము, అతీతే = గడచిన దగుచుండగా, తైః = వారిచేత, ఇహ = ఇక్కడికి, ఆగన్తుమ్ = వచ్చుటకు, న శక్యమ్ = శక్యము కాదు.

తా. రామా! ఊరడిల్లుము. నీకు క్షేమమగుగాక. దేవి కనబడినది. సందేహము లేదు. మన పెట్టిన సమయము గడచిన పిమ్మట వాళ్లు ఇక్కడికి రాజాలరు. 25

మూ. న మత్సకాశమాగచ్ఛేత్కృత్యే హి వినిపాతితే,
యువరాజో మహాబాహుః ప్లవతాం ప్రవరోఽఙ్గదః. 26

ప్ర. అ. యువరాజః = యువరాజు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు. ప్లవతామ్ = వానరులలో, ప్రవరః = శ్రేష్ఠుడూ అయిన, అఙ్గదః = అంగదుడు, కృత్యే = కార్యము, వినిపాతితే = చెడగొట్టబడిన దగుచుండగా, మత్సకాశమ్ = నా సమీపమును, నాగచ్ఛేత్ = రాడు.

తా. మహాబాహువు, వానరులలో శ్రేష్ఠుడు, యువరాజు అయిన అంగదుడు, కార్యము చెడిపోయిన పక్షాన నా దగ్గరికి వచ్చేవాడు కాడు. 26

మూ. యద్యప్యకృతకృత్యానామీదృశః స్యాదుపక్రమః,
భవేత్స దీనవదనో భ్రాన్తవిప్లుతమానసః. 27

ప్ర. అ. అకృతకృత్యానామ్ = చేయబడని కార్యము కల ఈ వానరుల యొక్క, ఉపక్రమః = ఉద్యమము, ఈదృశః = ఇట్టిది, యద్యపి స్యాత్ = అయినను కూడ, సః = ఆ అంగదుడు, దీనవదనః = దీనమైన ముఖము గలవాడు, భ్రాన్తవిప్లుతమానసః = భ్రాంతి చెందినదీ దుఃఖాక్రాంతమూ అయిన మనస్సు కలవాడు, భవేత్ = అయి ఉండును.

తా. కార్యము సఫలముచేయకనే ఈ వానరులు ఈ విధముగా ప్రవర్తించినా కూడ (తిరిగి వచ్చినా కూడ) ఈ అంగదుడు దీనమైన ముఖముతో, భ్రాంతి చెంది దుఃఖాక్రాంతమైన మనస్సుతో దిగులుగా ఉండెడివాడు. 27

మూ. పితృపైతామహం చైతత్పూర్వకైరభిరక్షితమ్,
న మే మధువనం హన్యాదహృష్టః ప్లవగేశ్వరః. 28
కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసిహి సువ్రత.

ప్ర. అ. ప్లవగేశ్వరః = వానరప్రభువైన అంగదుడు, అహృష్టః = సంతోషము లేనివాడైనచో, పితృపైతామహమ్ = తండ్రితాతల నాటిదైన, పూర్వకైః = పూర్వపురుషులచేత, అభిరక్షితమ్ = రక్షింపబడిన, మే మధువనమ్ = నా మధువనమును, న హన్యాత్ = పాడుచేసెడివాడు కాడు. కౌసల్యాసుప్రజాః = కౌసల్యసుపుత్రుడవైన, సువ్రత = మంచి నియమము గల, రామ = రామా! సమాశ్వసిహి = ఊరడిల్లుము.

తా. అంగదుడు సంతోషముతో ఉండక పోయినచో, తండ్రితాతలనాటిది, పూర్వపురుషులచేత రక్షింపబడినది అయిన నా మధువనమును నాశనముచేసెడివాడు కాడు. కౌసల్య సుపుత్రుడవు, ఉత్తమనియమవంతుడవూ అయిన ఓ! రామా! ఊరడిల్లుము. 28

మూ. దృష్టా దేవీ న సన్దేహో నచాన్యేన హనూమతా, 29
న హ్యన్యః కర్మణో హేతుః సాధనేఽస్య హనూమతః.

ప్ర. అ. రా. మూ. 64వ సర్గ. 17వ శ్లోకం.

మూ. హనూమతి హి సిద్ధిశ్చ మతిశ్చ మతిసత్తమ, 30
వ్యవసాయశ్చ వీర్యం చ సూర్యే తేజ ఇవ ధ్రువమ్.

ప్ర. అ. మతిసత్తమ = బుద్ధిచేత గొప్పవాడా! హనూమతి = హనుమంతుని యందు, సూర్యే = సూర్యునియందు, తేజః ఇవ = తేజస్సు వలె, సిద్ధిశ్చ = కార్యసిద్ధి, మతిశ్చ = బుద్ధి, వ్యవసాయశ్చ = ప్రయత్నము, వీర్యం చ = పరాక్రమము, ధ్రువమ్ = నిశ్చయముగా ఉన్నవి.

తా. బుద్ధిమంతులలో శ్రేష్ఠు డైన రామా! హనుమంతునియందు కార్య సిద్ధి, బుద్ధి, నిరంతరప్రయత్నము, పరాక్రమము అను లక్షణములు, సూర్యుని యందు తేజస్సు వలె నిశ్చితముగా ఉండును. 30

మూ. కామ్యహాస్యత్ర నేతా స్యాదఙ్గదశ్చ బలేశ్వరః,
హనుమాంశ్చాప్యధిష్ఠాతా న తస్య గతిరన్యథా. 31

ప్ర. అ. రా. మూ. 64వ సర్గ. 19వ శ్లోకం. అక్కడ ఉన్న "అఙ్గదశ్చ మహాబలః"కు బదులు "అఙ్గదశ్చ బలేశ్వరః" అని ఇక్కడ పాఠము. "అంగదుడు సేనాధిపతిగా ఉండునో" అని అర్థము. 31

మూ. మా భూశ్చిన్తాసమాయుక్తః సమ్ప్రత్యమితవిక్రమ, 32
తతః కిలకిలాశబ్దం శుశ్రావాసన్నమమ్బరే,
హనుమత్కర్మదృప్తానాం నర్దతాం కాననౌకసామ్, 33
కిష్కిన్ధాముపయాతానాం సిద్ధిం కథయతామివ.

ప్ర. అ. అమితవిక్రమ = అమిత మైన పరాక్రమము కలవాడా! సంప్రతి = ఇప్పుడు, చిన్తాసమాయుక్తః = చింతతో కూడినవాడవు, మా భూః = అవకుము. తతః = అటు పిమ్మట, హనుమత్కర్మదృప్తానామ్ = హనుమంతుని కార్యముచేత గర్వితులు, నర్దతామ్ = ధ్వనిచేయుచున్న వారు, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, కథయతామివ = చెప్పుచున్నవారు వలె ఉన్నవారు అయిన, కిష్కిన్ధామ్ = కిష్కింధను, ఉపయాతానామ్ = పొందిన, కాననౌకసామ్ = వానరులయొక్క, అమ్బరే = ఆకాశమునందు, ఆసన్నమ్ = సమీపించిన, కిలకిలాశబ్దమ్ = కిలకిలాశబ్దమును, శుశ్రావ = వినెను.

తా. "అపరిమితపరాక్రమవంతుడ వైన ఓ! రామా! ఇపుడు చింతా క్రాంతుడవు కాకుము". ఇంతలో హనుమంతుడు చేసిన కార్యముచే గర్వితు లై ధ్వని చేయుచు, కార్యసిద్ధిని చెప్పుచున్నారా అన్న ట్లున్న ఆ వానరులు కిష్కింధను సమీపించగా, వారి కిలకిలారావము ఆకాశముమీద దగ్గరగా వినవచ్చెను.

మూ. తతః శ్రుత్వా నినాదం తం కపీనాం కపిసత్తమః, 34
అయతాఞ్చితలాఙ్గూలః సోఽభవద్ధృష్టమానసః

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః కపిసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, కపీనామ్ = వానరులయొక్క, తం నినాదమ్ = ఆ ధ్వనిని, శ్రుత్వా = విని, ఆయతాఞ్చితలాఙ్గూలః = నిలువుగా వంచబడిన తోక కలవాడై, హృష్టమానసః = సంతోషించిన మనస్సు కలవాడు, అభవత్ = అయెను.

తా. పిమ్మట ఆ సుగ్రీవుడు వానరుల ధ్వనిని విని, సంతోషించిన మనస్సుకలవాడై, తోకను నిలువుగా ఎత్తి నిలచెను. 34

మూ. అజగ్ముస్తేఽపి హరయో రామదర్శనకాఙ్క్షిణః, 35
అఙ్గదం పురతః కృత్వా హనూమన్తం చ వానరమ్.

ప్ర. అ. తే హరయః అపి = ఆ వానరులు కూడా, అఙ్గదమ్ = అంగదుని వానరమ్ = వానరు డైన, హనూమన్తమ్ = హనుమంతుని, పురతః = ఎదుట, కృత్వా = ఉంచుకొని, రామదర్శనకాఙ్క్షిణః = రాముని దర్శనము కోరుచున్న వారై, అజగ్ముః = వచ్చిరి.

తా. ఆ వానరులు కూడ, అంగదుని, హనుమంతుని తమ ముందు ఉంచుకొని, రాముని చూడవలె నను ఉత్కంఠతో వచ్చిరి. 35

మూ. తేఽఙ్గదప్రముఖా వీరాః ప్రహృష్టాశ్చ ముదాన్వితాః,
నిపేతుర్హరిరాజస్య సమీపే రాఘవస్య చ. 36

ప్ర. అ. అఙ్గదప్రముఖాః = అంగదుడు మొద లైన, తే వీరాః = ఆ వీరులు, ప్రహృష్టాశ్చ = సంతోషించినవా రై, ముదా = ఆనందముతో, అన్వితాః = కూడినవా రై, హరిరాజస్య = సుగ్రీవునియొక్క, రాఘవస్య చ = రామునియొక్కయు, సమీపే = సమీపమునందు, నిపేతుః = పడిరి (దిగిరి).

తా. అంగదుడు మొద లైన ఆ వీరులు సంతోషించుచు, ఆనందభరితు లై, రామసుగ్రీవుల ఎదుట దిగిరి. 36

మూ. హనుమాంశ్చ మహాబాహుః ప్రణమ్య శిరసా తతః, 37
నియతామక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాబాహుః = గొప్ప బాహువులు గల, హనుమాన్ = హనుమంతుడు, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, దేవీమ్ = సీతాదేవిని, నియతామ్ = నియమవంతురాలినిగాను, అక్షతామ్ = ఆరోగ్యవంతురాలిని గాను, రాఘవాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. పిదప, గొప్ప బాహువులు గల హనుమంతుడు శిరస్సు వంచి నమస్కరించి, సీతాదేవి పాతివ్రత్యనియమమును కాపాడుకొనుచు, ఆరోగ్యవంతురా లై యున్నట్లు రామునకు తెలిపెను. 37

మూ. దృష్టా దేవీతి హనుమద్వదనాదమృతోపమమ్,
ఆకర్ణ్య వచనం రామో హర్షమాప సలక్ష్మణః. 38

ప్ర. అ. సలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, హనుమద్వదనాత్ = హనుమంతుని ముఖమునుండి, అమృతోపమమ్ = అమృతముతో సమాన మైన, దేవీ దృష్టా ఇతి = "సీతాదేవి చూడబడినది" అని, వచనమ్ = వచనమును, ఆకర్ణ్య = విని, హర్షమ్ = సంతోషమును, ఆప = పొందెను.

తా. లక్ష్మణసమేతు డైన రాముడు. "సీతాదేవి కనబడినది" అని హనుమంతుని ముఖమునుండి వెడలిన వచనమును విని సంతోషించెను. 38

మూ. నిశ్చితార్థం తతస్తస్మిన్ సుగ్రీవం పవనాత్మజే,
లక్ష్మణః ప్రీతిమాన్ ప్రీతం బహుమానాదవైక్షత. 39

ప్ర. అ. తతః = అటుపిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, తస్మిన్ పవనాత్మజే = ఆ హనుమంతునియందు, నిశ్చితార్థమ్ = నిశ్చయింపబడిన విషయము గల, ప్రీతమ్ = సంతోషించిన, సుగ్రీవమ్ = సుగ్రీవుని, బహుమానాత్ = గౌరవభావముతో, అవైక్షత = చూచెను.

తా. పిమ్మట లక్ష్మణుడు సంతోషించుచు, హనుమంతుడు తప్పక కార్యము

సాధింతును అను విశ్వాసమును ప్రకటించిన, సంతోషించిన, ఆ సుగ్రీవుని గౌరవ భావముతో చూచెను. 39

మూ. ప్రీత్యా చ పరయోపేతో రాఘవః పరవీరహా, 40
బహుమానేన మహతా హనుమన్తమవైక్షత.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
చతుష్షష్టితమః సర్గః.

ప్ర. అ. పరవీరహా = శత్రువీరులను సంహరించు, రాఘవః = రాముడు, పరయా = గొప్ప, ప్రీత్యా = సంతోషముతో, ఉపేతః = కూడినవాడై, మహతా = గొప్పదైన, బహుమానేన = గౌరవభావముతో, హనుమన్తమ్ = హనుమంతుని, అవైక్షత = చూచెను.

తా. శత్రువీరులను సంహరించు రాముడు గొప్ప ఆనందము పొంది. హనుమంతుని అధిక మైన గౌరవభావముతో చూచెను. 40

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో అరువదినాలవసర్గ సమాప్తము.

## అథ పఞ్చషష్టితమః సర్గః

[హనుమంతుడు శ్రీరామునకు సీతావృత్తాంతము చెప్పుట]

మూ. తతః ప్రస్రవణం శైలం తే గత్వా చిత్రకాననమ్,
ప్రణమ్య శిరసా రామం లక్ష్మణం చ మహాబలమ్. 1

యువరాజం పురస్కృత్య సుగ్రీవమభివాద్య చ,
ప్రవృత్తిమథ సీతాయాః ప్రవక్తుముపచక్రముః. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే = ఆ వానరులు, చిత్రకాననమ్ = చిత్రము లైన అడవులు గల, ప్రస్రవణం శైలమ్ = ప్రస్రవణపర్వతమును గూర్చి, యువరాజమ్ = యువరాజును, పురస్కృత్య = ముందు ఉంచుకొని, గత్వా = వెళ్ళి, రామమ్ = రాముణ్ణి, మహాబలమ్ = గొప్ప బలము గల, లక్ష్మణం చ = లక్ష్మణుణ్ణి, శిరసా = శిరస్సుచేత, ప్రణమ్య = నమస్కరించి, సుగ్రీవమ్ = సుగ్రీవుని, అభివాద్య చ = నమస్కరించి, అథ = అటు పిమ్మట, సీతాయాః సీతయొక్క, ప్రవృత్తిమ్ = వార్తను, ప్రవక్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రముః = ప్రారంభించిరి.

తా. ఆ వానరులు యువరా జైన అంగదుని ముందు ఉంచుకొని, చిత్ర మైన అడవులు గల ప్రస్రవణపర్వతమునకు వెళ్ళి, రామునకు, మహాబలశాలి యైన లక్ష్మణునకు శిరసా నమస్కరించి, సుగ్రీవునకు నమస్కరించి, పిమ్మట సీతవార్తను చెప్పుటకు ప్రారంభించిరి. 1,2

మూ. రావణాన్తఃపురే రోధం రాక్షసీభిశ్చ తర్జనమ్,
రామే సమనురాగం చ యశ్చాయం సమయః కృతః. 3
ఏతదాఖ్యాన్తి తే సర్వే హరయో రామసన్నిధౌ.

ప్ర. అ. సర్వే = సమస్త మైన, తే హరయః = ఆ వానరులు, రావణాన్తః

పురే = రావణుని అంతఃపురమునందు, రోధమ్ = నిరోధమును, రాక్షసీభిః =
రాక్షసస్త్రీలచేత, తర్జనం చ = భయపెట్టుటను, రామే = రామునియందు, సమను
రాగం చ = అనురాగమును, యః = ఏ, అయమ్ = ఈ, సమయః = గడువు,
కృతః = చేయబడినదో, ఏతత్ = దీని నంతను, రామసంనిధౌ = రామునివద్ద,
ఆఖ్యాన్తి = చెప్పుచుండిరి.

తా. ఆ వానరు లందరూ, సీత రావణుని అంతఃపురములో నిరోధింపబడి
ఉండుట, రాక్షసస్త్రీలు భయపెట్టుట, ఆమెకు రామునిమీద ఉన్న అనురాగము,
రావణుడు ఇచ్చిన రెండు మాసాల గడువు—ఈ విషయము లన్నీ రాముని ఎదుట
చెప్పుటకు ప్రారంభించిరి. 3

మూ. వైదేహీమక్షతాం శ్రుత్వా రామస్తూత్తరమబ్రవీత్, 4
క్వ సీతా వర్తతే దేవీ కథం చ మయి వర్తతే,
ఏతన్మే సర్వమాఖ్యాత వైదేహీం ప్రతి వానరాః. 5

ప్ర. అ. వైదేహీమ్ = సీతను, అక్షతామ్ = క్షేమముగా ఉన్నదానినిగా,
శ్రుత్వా = విని, రామస్తు = రాముడైతే, ఉత్తరమ్ = ప్రత్యుత్తరమును, అబ్రవీత్
= పలికెను. దేవీ = దేవి యైన, సీతా = సీత, క్వ = ఎక్కడ, వర్తతే =
ఉన్నది ? మయి = నా విషయమునందు, కథమ్ = ఎట్లు, వర్తతే = ఉన్నది.
వానరాః = వానరులారా ! వైదేహీం ప్రతి = సీతను గూర్చి, ఏతత్ = దీనిని, సర్వమ్
= అంతనూ, మే = నాకు, ఆఖ్యాత = చెప్పుడు.

తా. సీత క్షేమముగా ఉన్నదను విషయము విని రాముడు ఇట్లు పలి
కెను. "వానరులారా ! సీత ఎక్కడ ఉన్నది ? నా విషయమునందు ఏ అభి
ప్రాయముతో ఉన్నది ? సీతకు సంబంధించిన ఈ విషయము లన్నీ నాకు
చెప్పుడు." 4, 5

మూ. రామస్య గదితం శ్రుత్వా హరయో రామసన్నిధౌ,
చోదయన్తి హనూమన్తం సీతావృత్తాన్తకోవిదమ్. 6

ప్ర. అ. హరయః = వానరులు, రామస్య = రామునియొక్క, గదితమ్
= మాటను, శ్రుత్వా = విని, సీతావృత్తాన్తకోవిదమ్ = సీతావృత్తాంతము ఎరిగిన,

హనూమన్తమ్ = హనుమంతుని, రామసన్నిధౌ = రామునివద్దకు, తోరయన్తి = ముందుకు త్రోసిరి.

తా. ఆ వానరులు రాముని మాటలు విని, సీత వృత్తాంతము తెలిసిన హనుమంతుణ్ణి, "నువ్వు చెప్పుము" అని రాముని ముందుకు త్రోసిరి. 6

మూ. శ్రుత్వా తు వచనం తేషాం హనుమాన్ మారుతాత్మజః,
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి. 7
ఉవాచ వాక్యం వాక్యజ్ఞః సీతాయా దర్శనం యథా.

ప్ర. అ. మారుతాత్మజః = వాయుపుత్రుడు, వాక్యజ్ఞః = మాటలు తెలిసిన వారు (మాటలాడుటలో నేర్పరి) అయిన, హనుమాన్ = హనుమంతుడు, తేషామ్ = ఆ వానరులయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, దేవ్యై = దేవి యైన, సీతాయై = సీతకు, తాం దిశం ప్రతి = ఆ దిక్కును గూర్చి, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, సీతాయాః = సీతయొక్క, దర్శనమ్ = దర్శనము, యథా = ఎట్లు జరిగినదో, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మాటలలో నేర్పరి, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు ఆ వానరుల మాటలు విని, సీత ఉన్న దిక్కు వైపు తిరిగి సీతాదేవికి శిరస్సు వంచి నమస్కరించి, సీతను తా నెట్లు చూచెనో తెలుపుచు ఇట్లు పలికెను. 7

మూ. సముద్రం లఙ్ఘయిత్వాహం శతయోజనమాయతమ్, 8
అగచ్ఛం జానకీం సీతాం మార్గమాణో దిదృక్షయా.

ప్ర. అ. అహమ్ = నేను, శతయోజనమ్ = నూరు యోజనములు, ఆయతమ్ = పొడవైన, సముద్రమ్ = సముద్రమును, లఙ్ఘయిత్వా = దాటి, జానకీమ్ = జనకుని కుమార్తె యైన, సీతామ్ = సీతను, మార్గమాణః = వెదకుచు, దిదృక్షయా = ఆమెను చూడ వలె నను కోరికతో, అగచ్ఛమ్ = వెళ్ళితిని.

తా. నేను నూరు యోజనములు పొడ వైన సముద్రమును లంఘించి, జనకుని కుమార్తె యైన సీతను వెదకుచు, ఆమెను చూడ వలె నను కోరికతో వెళ్ళితిని. 8

మూ. తత్ర లఙ్కేతి నగరీ రావణస్య దురాత్మనః,	9
దక్షిణస్య సముద్రస్య తీరే వసతి దక్షిణే.

ప్ర. అ. తత్ర = అక్కడ, దక్షిణస్య సముద్రస్య = దక్షిణసముద్రము యొక్క, దక్షిణే తీరే = దక్షిణతీరమునందు దురాత్మనః = దుష్టబుద్ధి గల, రావణస్య = రావణునియొక్క, లఙ్కేతి = లంక అను, నగరీ = పట్టణము, వసతి = ఉన్నది.

తా. అక్కడ, దక్షిణసముద్ర దక్షిణతీరమునందు, దురాత్ము డైన రావణుని లంక అను నగరము ఉన్నది.	9

మూ. తత్ర దృష్టా మయా సీతా రావణాన్తఃపురే సతీ,	10
సంన్యస్య త్వయి జీవన్తీ రామా రామ మనోరథమ్.

ప్ర. అ. రామ = ఓ ! రామా ! తత్ర = అక్కడ, రావణాన్తఃపురే = రావణుని అంతఃపురమునందు, సతీ = పతివ్రత, త్వయి = నీయందు, మనోరథమ్ = కోరికను, సంన్యస్య = ఉంచి, జీవన్తీ = జీవించుచున్న, రామా = స్త్రీ. సీతా = సీత, మయా = నాచేత, దృష్టా = చూడబడినది.

తా. రామా ! ఆ లంకలో, రావణాంతఃపురములో నేను పతివ్రత యైన సీతను చూచితిని. ఆమె తన మనోరథము లన్నీ నీ మీదనే ఉంచుకుని జీవించుచున్నది.	10

మూ. దృష్టా మే రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః,	11
రాక్షసీభిర్విరూపాభీ రక్షితా ప్రమదావనే.

ప్ర. అ. ప్రమదావనే = ఉద్యానవనమునందు, విరూపాభిః = వికృతము లైన రూపములు గల, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత, రక్షితా = రక్షింపబడినదీ, ముహుర్ముహుః = మాటి మాటికి, తర్జ్యమానా = భయపెట్టబడుచున్నదీ అయిన, ఆ సీత, మే = నాకు, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల మధ్యయందు, దృష్టా = చూడబడినది.

తా. ఉద్యానవనములో, వికృతము లైన ముఖములు గల రాక్షసస్త్రీలు

ఆ సీతను రక్షించుచున్నారు. మాటి మాటికి ఆమెను భయపెట్టుచున్నారు. అట్టి సీతను నేను రాక్షసస్త్రీల మధ్య చూచితిని. 11

మూ. దుఃఖమాపద్యతే దేవీ త్వయా వీర సుఖోచితా. 12
రావణాన్తఃపురే రుద్ధా రాక్షసీభిః సురక్షితా,
ఏకవేణీధరా దీనా త్వయి చిన్తాపరాయణా. 13
అధఃశయ్యా వివర్ణాఙ్గీ పద్మినీవ హిమాగమే,
రావణాద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా. 14
దేవీ కథం చిత్కాకుత్స్థ త్వన్మనా మార్గితా మయా.

ప్ర. అ. వీర = ఓ ! వీరుడా ! త్వయా = నీతో, సుఖోచితా = సుఖమునకు అలవాటు పడిన, దేవీ = ఆ దేవి, దుఃఖమ్ = దుఃఖమును, ఆపద్యతే = పొందుచున్నది, కాకుత్స్థ = రామా ! ఏకవేణీధరా = ఒకే జడను ధరించినది, దీనా = దీనురాలు, త్వయి = నీయందు, చిన్తాపరాయణా = చింతలో మునిగి ఉన్నది, అధఃశయ్యా = నేల శయనముగా గలది, హిమాగమే = శిశిరఋతువునందు, పద్మినీవ = పద్మలత వలె, వివర్ణాఙ్గీ = రంగు మారిన శరీరము గలది, రావణాత్ = రావణునినుండి, వినివృత్తార్థా = మరలిన ప్రయోజనము కలది. మర్తవ్యకృత నిశ్చయా = చావ వలె నని నిశ్చయము చేసికొన్నది, త్వన్మనాః = నీ మీదనే మనస్సు కలదీ అయిన, దేవీ = ఆ దేవి, కథంచిత్ = ఎటులనో, మయా = నాచేత, మార్గితా = వెదకబడినది.

తా. ఓ ! వీరుడా ! నీతో కలిసి సుఖము ననుభవించుటకు అలవాటుపడిన ఆ దేవి ఇప్పుడు దుఃఖ మనుభవించుచున్నది. ఆమె నిన్ను గూర్చిన ఆలోచన లోనే నిండినదై, ఒకే జడతో దీనురాలై యున్నది. నేలమీదనే పండుకొనుచు, రంగు మారిన శరీరము గల ఆమె శిశిరఋతువులో పద్మలత వలె ఉన్నది. ఆమె రావణునియందు ఏ మాత్రము దృష్టి లేనిదై అతని చేతిలో చచ్చుటకే నిశ్చయించుకొన్నది. రామా ! నీ మీదనే మనస్సు నిలుపుకొని ఉన్న ఆ సీతా దేవిని నేను ఎట్లో అన్వేషించ గలిగితిని. 12, 13, 14

మూ. ఇక్ష్వాకుకులవిఖ్యాతిం శనైః కీర్తియతానఘ, 15
సా మయా నరశార్దూల విశ్వాసముపపాదితా.

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా। నరశార్దూల = నరశ్రేష్ఠుడ వైన రామా। ఇక్ష్వాకుకులవిఖ్యాతిమ్ = ఇక్ష్వాకువంశము యొక్క ప్రసిద్ధిని, శనైః = మెల్లగా, కీర్తయతా = వర్ణించిన, మయా = నాచేత. సా = ఆమె, విశ్వాసమ్ = విశ్వాసమును, ఉపపాదితా = పుట్టించబడినది.

తా. దోషములు లేని, మనుష్యశ్రేష్ఠుడ వైన ఓ! రామా! నేను ఇక్ష్వాకు వంశము కీర్తిని మెల్లగా వర్ణించుచు, సీతాదేవికి నాపై విశ్వాసము కలుగు నట్లు చేసితిని. 15

మూ. తతః సంభాషితా దేవీ సర్వమర్థం చ దర్శితా. 16
రామసుగ్రీవసఖ్యం చ శ్రుత్వా ప్రీతిముపాగతా.
నియతః సముదాచారో భక్తిశ్చాస్యాస్తథా త్వయి. 17

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దేవీ = సీతాదేవి, సంభాషితా = మాటలాడ బడినది. సర్వమ్ = సమస్త మైన, అర్థమ్ = విషయమును, దర్శితా = చూప బడినది (తెలుపబడినది). రామసుగ్రీవసఖ్యం చ = రామసుగ్రీవుల స్నేహమును, శ్రుత్వా = విని, ప్రీతిమ్ = సంతోషమును, ఉపాగతా = పొందినది. అస్యాః = ఈమెయొక్క, సముదాచారః = సచ్చరిత్రపాలనము, నియతః = స్థిరముగా నున్నది. తథా = అట్లే, త్వయి = నీయందు, భక్తిశ్చ = భక్తి కూడ, స్థిరముగా నున్నది.

తా. పిమ్మట నేను సీతాదేవితో సంభాషణము చేసి విషయము లన్నీ తెలిపితిని. రామసుగ్రీవుల మధ్య స్నేహ మేర్పడిన దని తెలిసికొని ఆమె సంతోషించినది. ఆమె సదాచారనిష్ఠతో నీపై స్థిర మైన భక్తితో ఉన్నది. 16, 17

మూ. ఏవం మయా మహాభాగా దృష్టా జనకనన్దినీ,
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ. 18

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా। ఉగ్రేణ = ఉగ్ర మైన, తపసా = తపస్సుతోను, త్వద్భక్త్యా = నీపై భక్తితోను, యుక్తా = కూడిన, మహాభాగా = మహాభాగ్యవంతురా లైన, జనకనన్దినీ = సీతాదేవి, మయా = నాచేత, ఏవమ్ = ఇట్లు, దృష్టా = చూడబడినది.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! నీయందు అనంతభక్తితో ఉగ్రమైన తపస్సు చేయుచున్న మహాభాగ్యవంతురాలైన సీతాదేవిని నేను ఈస్థితిలో చూచితిని. 18

మూ. అభిజ్ఞానం చ మే దత్తం యథా వృత్తం తవాన్తికే,
చిత్రకూటే మహాప్రాజ్ఞ వాయసం ప్రతి రాఘవ. 19

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధిగల, రాఘవ = రామా! చిత్రకూటే = చిత్రకూటమునందు, తవ = నీయొక్క, అన్తికే = సమీపమునందు, వాయసం ప్రతి = కాకిని గూర్చి, యథా = ఎట్లు, వృత్తమ్ = జరిగినదో, అది, అభిజ్ఞానమ్ = ఆనవాలుగా, మే = నాకు, దత్తమ్ = ఇవ్వబడినది.

తా. మహాబుద్ధిశాలివైన ఓ రామా! చిత్రకూటపర్వతముమీద, నీ దగ్గర జరిగిన కాకవృత్తాంతమును ఆమె ఆనవాలుగా చెప్పినది. 19

మూ. విజ్ఞాప్యశ్చ నరవ్యాఘ్రో రామో వాయుసుత త్వయా,
అఖిలేనేహ యద్దృష్టమితి మామాహ జానకీ. 20

ప్ర. అ. వాయుసుత = హనుమంతుడా! నరవ్యాఘ్రః = మనుష్యశ్రేష్ఠుడైన, రామః = రాముడు, త్వయా = నీచేత, ఇహ = ఇక్కడ, యత్ = ఏది, దృష్టమ్ = చూడబడినదో, అఖిలేన = దాని అంతటిచేతను, విజ్ఞాప్యః = తెలుపదగినవాడు, ఇతి = అని, జానకీ = సీత, మామ్ = నన్ను గూర్చి, ఆహ = పలికినది.

తా. "ఓ హనుమంతుడా! నీవు ఇక్కడ చూచినది అంతా మనుష్యశ్రేష్ఠుడైన రామునకు చెప్పవలెను" అని సీతాదేవి నాతో అనెను. 20

మూ. అయం చాస్మై ప్రదాతవ్యో యత్నాత్సుపరిరక్షితః,
బ్రువతా వచనాన్యేవం సుగ్రీవస్యోపశృణ్వతః. 21

ప్ర. అ. సుగ్రీవస్య = సుగ్రీవుడు, ఉపశృణ్వతః = వినుచుండగా, ఏవమ్ = ఇట్లు, వచనాని = వచనములను, బ్రువతా = చెప్పుచున్న నీచేత, యత్నాత్ = ప్రయత్నమువలన, సుపరిరక్షితః = బాగా రక్షింపబడిన, అయం చ = ఈ మణి కూడ, అస్మై = ఈ రామునకు, ప్రదాతవ్యః = ఇవ్వదగినది.

తా. సుగ్రీవుడు దగ్గరనే ఉండి వినుచుండగా నీవు ఈ మాట అన్నిచెప్పి, నేను ప్రయత్నపూర్వకముగా రక్షించి ఉంచిన ఈ మణిని రామునకు ఇవ్వవలెను. 21

మూ. ఏష చూడామణిః శ్రీమాన్ మయా సుపరిరక్షితః,
మనఃశిలాయాస్తిలకో గణ్డపార్శ్వే నివేశితః, 22
త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తుమర్హసి.

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తమైన, ఏషః = ఈ, చూడామణిః = చూడామణి, మయా = నాచేత, సుపరిరక్షితః = బాగుగా రక్షింపబడినది.

తా. శోభాయుక్తమైన ఈ చూడామణిని నేను చాల జాగర్తగా సంరక్షించినాను. "మనశ్శిలాయాః" ఇత్యాది శ్లోకానికి చూ. 40వ సర్గ, 5వ శ్లోకము. 22

మూ. ఏష నిర్యాతితః శ్రీమాన్ మయా తే వారిసంభవః. 23
ఏతం దృష్ట్వా ప్రమోదిష్యే వ్యసనే త్వామివానఘ.

ప్ర. అ. తా. చూ. 40వ సర్గ 7వ శ్లోకము. అక్కడ 'ప్రమోదిష్యే' కి బదులు "ప్రహృష్యామి" అని ఉన్నది. ప్రమోదిష్యే = సంతోషించగలను. 23

మూ. జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ, 24
ఊర్ధ్వం మాసాన్న జీవేయం రక్షసాం వశమాగతా.

ప్ర. అ. దశరథాత్మజ = రామా! మాసమ్ = ఒక మాసమును, జీవితమ్ = జీవితమును, ధారయిష్యామి = ధరించెదను. రక్షసామ్ = రాక్షసులయొక్క, వశమ్ = వశమును, ఆగతా = పొందిన నేను, మాసాత్ = మాసముకంటె, ఊర్ధ్వమ్ = పైన, న జీవేయమ్ = జీవించను.

తా. రామా! నేను ఒక్క మాసము మాత్రమే జీవితము ధరింతును. రాక్షసులకు వశురాలనైపోయిన నేను మాసము తరవాత జీవింపజాలను. 24

మూ. ఇతి మాంత్రబ్రవీత్సీతా కృశాఙ్గీ ధర్మచారిణీ, 25
రావణాన్తఃపురే రుద్ధా మృగీవోత్ఫుల్లలోచనా.

ప్ర. అ. కృశాఙ్గీ = కృశించిన శరీరము కలది, ధర్మచారిణీ = ధర్మమును ఆచరింపుచున్నది, రావణాన్తఃపురే = రావణుని అంతఃపురమునందు, రుద్ధా = నిరోధింపబడినది, మృగీవ = ఆడ లేడి వలె, ఉత్ఫుల్లలోచనా = వికసించిన నేత్రములు గలది అయిన, సీతా = సీత, మామ్ = నన్ను గూర్చి, ఇతి = ఇట్లు, అబ్రవీత్ = పలికెను.

తా. రావణాంతఃపురములో నిరోధింపబడి, శరీరము కృశించి, ధర్మమును ఆచరింపుచున్నది, ఆడలేడి వలె వికసించిన నేత్రములు కలది అయిన సీత నాతో ఈ విధముగ చెప్పినది. 25

మూ. ఏతదేవ మయాఖ్యాతం సర్వం రాఘవ యద్యథా, 26
సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్.

ప్ర. అ. రాఘవ = రామా! యత్ = ఏది, యథా = ఎట్లు జరిగినదో, ఏతత్ = ఇది, సర్వమేవ = సమస్తము, మయా = నాచేత, ఖ్యాతమ్ = చెప్పబడినది. సర్వథా = అన్ని విధములచేత, సాగరజలే = సముద్రజలమునందు, సంతారః = సేతువు, ప్రవిధీయతామ్ = నిర్మింపబడుగాక.

తా. రాఘవా! ఈ విషయము అంతా జరిగినది జరిగినట్లు చెప్పినాను లంకను ఆక్రమించుటకై సర్వవిధాల సముద్రోదకముపైన సేతువు బంధింపవలెను. 26

మూ. తౌ జాతాశ్వాసౌ రాజపుత్రౌ విదిత్వా
తచ్చాభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ,
దేవ్యా చాఖ్యాతం సర్వమేవానుపూర్వ్యా
ద్వాచా సంపూర్ణం వాయుపుత్రః శశంస. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. వాయుపుత్రః = హనుమంతుడు, తౌ రాజపుత్రౌ = ఆ రాజకుమారులను, జాతాశ్వాసౌ = పుట్టిన విశ్వాసము కలవారినిగా, విదిత్వా = తెలుసుకొని, తత్ = ఆ, అభిజ్ఞానమ్ = ఆనవాలును, రాఘవాయ = రామునకు,

ప్రదాయ = ఇచ్చి, దేవ్యాః = సీతాదేవిచేత, ఆఖ్యాతమ్ = చెప్పబడిన, సర్వమేవ = సమస్తమును, సంపూర్ణమ్ = పూర్తిగా, అనుపూర్వ్యాత్ = క్రమమును అనుసరించి, వాచా = వాక్కుతో, శశంస = చెప్పెను.

తా. హనుమంతుడు ఆ రామలక్ష్మణులకు ఊరట కలిగినదని గుర్తించి ఆనవాలుగా తెచ్చిన ఆ చూడామణిని రామునకు ఇచ్చి, సీతాదేవి సందేశము నంతను పూర్తిగా, క్రమము తప్పకుండగా మాటలలో చెప్పెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో అరువదియైదవ సర్గ సమాప్తము.

## అథ షట్‌షష్టితమః సర్గః

[రాముడు సీత వృత్తాంతము విని చూడామణిని చూచుచు సీత కొరకు విలపించుట.]

మూ. ఏవముక్తో హనుమతా రామో దశరథాత్మజః,
తం మణిం హృదయే కృత్వా ప్రరురోద సలక్ష్మణః. 1

ప్ర. అ. హనుమతా = హనుమంతునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, సలక్ష్మణః = లక్ష్మణసమేతు డైన, దశరథాత్మజః = దశరథపుత్రు డైన, రామః = రాముడు, తం మణిమ్ = ఆ మణిని, హృదయే = హృదయముపై, కృత్వా = ఉంచుకొని, ప్రరురోద హ = ఏడ్చెను.

తా. లక్ష్మణసహితు డైన ఆ దశరథకుమారుడు, రాముడు, హనుమంతుని మాటలు విని, ఆ చూడామణిని హృదయముపీద ఉంచుకొని ఏడ్చెను. 1

మూ. తం తు దృష్ట్వా మణిశ్రేష్ఠం రాఘవః శోకకర్శితః,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యాం సుగ్రీవమిదమబ్రవీత్. 2

ప్ర. అ. తం మణిశ్రేష్ఠమ్ = ఆ శ్రేష్ఠ మైన మణిని, దృష్ట్వా = చూచి, రాఘవః = రాముడు, శోకకర్శితః = శోకముచేత కృశింపచేయబడినవా డై, అశ్రుపూర్ణాభ్యామ్ = కన్నీళ్లతో నిండిన, నేత్రాభ్యామ్ = నేత్రములతో, సుగ్రీవమ్ = సుగ్రీవుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రేష్ఠ మైన ఆ మణిని చూడగానే రాముడు శోకముచే పీడితు డై, కన్నీళ్ళతో నిండిన నేత్రములతో, సుగ్రీవునితో ఇట్లు పలికెను. 2

మూ. యథైవ ధేనుః స్రవతి స్నేహాద్వత్సస్య వత్సలా,
తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్. 2

ప్ర. అ. వత్సలా = లేగదూడయందు అధిక ప్రేమ గల, ధేనుః = ధేనువు, వత్సస్య = లేగదూడయొక్క, స్నేహాత్ = స్నేహమువలన, యథైవ = ఎట్లు, స్రవతి = స్రవించునో, మమ హృదయమపి = నా హృదయము కూడ, మణిరత్నస్య = శ్రేష్ఠమైన ఈ మణియొక్క, దర్శనాత్ = దర్శనమువలన, తథా = అట్లే అగుచున్నది.

తా. లేగదూడయందు అధికమైన ప్రేమ ఉన్న ధేనువు దూడపై స్నేహముచేత ఎట్లు ద్రవించునో, నా హృదయము కూడ ఈ శ్రేష్ఠమైన మణిని చూడగానే ద్రవించుచున్నది. 3

మూ. మణిరత్నమిదం దత్తం వైదేహ్యాః శ్వశురేణ మే,
వధూకాలే యథాబద్ధమధికం మూర్ధ్ని శోభతే. 4

ప్ర. అ. వధూకాలే = వివాహవధువుగా ఉన్నప్పుడు, మూర్ధ్ని = శిరస్సుపై, అబద్ధమ్ = కట్టబడినదై, యథా = ఎట్లు, శోభతే = ప్రకాశించునో, ఆ విధముగా, ఇదమ్ = ఈ, మణిరత్నమ్ = శ్రేష్ఠమైన మణి, మే శ్వశురేణ = నా మామగారి చేత, వైదేహ్యాః = సీతకు, దత్తమ్ = ఇవ్వబడినది.

తా. వివాహసమయమునందు వధువైన సీత తలపై కట్టగా అధికముగా శోభించు నిమిత్తము ఈ మణిని నా మామగారు సీతకు ఇచ్చినారు. 4

మూ. అయం హి జలసంభూతో మణిః సజ్జనపూజితః,
యజ్ఞే పరమతుష్టేన దత్తః శక్రేణ ధీమతా. 5

ప్ర. అ. జలసంభూతః = జలమునుండి పుట్టినది, సజ్జనపూజితః = సజ్జనులచేత పూజింపబడినది అయిన, అయం మణిః = ఈ మాణిక్యము, యజ్ఞే = యజ్ఞమునందు, పరమతుష్టేన = మిక్కిలి సంతోషించిన, ధీమతా = బుద్ధిమంతుడైన, శక్రేణ = దేవేంద్రునిచేత, దత్తః = ఇవ్వబడినది.

తా. ఈ మణి జలములో పుట్టినది. సజ్జనులచే పూజింపబడు ఈ మణిని జనకమహారాజు చేసిన ఒక యజ్ఞమునందు చాలా సంతోషించిన, ధీమంతుడైన దేవేంద్రుడు అతని కిచ్చినాడు. 5

మూ. ఇమం దృష్ట్వా మణిశ్రేష్ఠం యథా తాతస్య దర్శనమ్,
అద్యాస్మ్యవగతః సౌమ్య వైదేహస్య తథా విభోః. 6

ప్ర. అ. సౌమ్య = ఓ ! సౌమ్యుడా ! అద్య = ఇప్పుడు, ఇమమ్ = ఈ, మణిశ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన మణిని, దృష్ట్వా = చూచి, తాతస్య = తండ్రిగారి యొక్క, తథా = మరియు, విభోః = ప్రభువైన, వైదేహస్య = జనకమహారాజు యొక్క, దర్శనమ్ = దర్శనము, యథా = ఎట్లో, అట్లు, అవగతః = తెలుసుకొనుచున్నాను.

తా. సౌమ్యుడవైన సుగ్రీవా ! ఈ మణిశ్రేష్ఠమును చూడగానే నాకు నా తండ్రిగారిని, పూజ్యుడైన జనకమహారాజును చూచినట్లు అనిపించుచున్నది.

మూ. అయం హి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః,
అస్యాద్య దర్శనేనాహం ప్రాప్తాం తామివ చిన్తయే. 7

ప్ర. అ. అయం మణిః = ఈ మణి, మే ప్రియాయాః = నా ప్రియురాలి యొక్క, మూర్ధ్ని = శిరస్సుపైన, శోభతే హి = ప్రకాశించుచున్నది కదా. అద్య = ఇప్పుడు, అస్య = దీనియొక్క, దర్శనేన = దర్శనముచేత, తామ్ = ఆమెను, ప్రాప్తామివ = పొందబడినదానిని వలె, చిన్తయే = ఆలోచించుచున్నాను.

తా. ఈ మణి నా ప్రియురాలి శిరస్సుపై అధికముగా శోభించును. ఇప్పుడు ఇది కనబడుటచేత, నా ప్రియురాలే లభించినట్లు భావించుచున్నాను.

మూ. కిమాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునః పునః,
పిపాసుమివ తోయేన సిఞ్చన్తీ వాక్యవారిణా. 8

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! పిపాసుమ్ = దప్పికొన్నవానిని, తోయేన ఇవ = ఉదకముతో వలె, వాక్యవారిణా = వాక్యము అను ఉదకముతో, సిఞ్చన్తీ = తడుపుచున్నదై, వైదేహీ = విదేహరాజకుమార్తెయైన, సీతా = సీత, కిమ్ = ఏమి. పునః పునః = మారిమారికి, ఆహ = పలికినది ? బ్రూహి = చెప్పుము.

తా. దప్పికొన్నవానిని ఉదకముతో తడిపినట్లు మాట అనే ఉదకముతో తడుపుచు, జనకరాజనందినియైన సీత మాటిమాటికి ఏమన్నదో చెప్పుము.

వి. ఈ శ్లోకభావము సరిగా లేదు. వాక్యోదకముతో సీత ఎక్కడో ఉన్న రాముణ్ణి తడిపే ప్రసక్తి లేదు. అందుచేత "సీత అన్న మాటలు మాటిమాటికి చెప్పి, ఆ మాట లనే ఉదకముతో నన్ను తడుపుము'' అని హనుమంతునితో రాము డన్నచో బాగుండును. కాని "సిఞ్చన్తీ" అనేది 'సీతా' అనేదానికి విశేషణముగా ప్రయోగింపబడినది గాన ఈ భావం చెప్పడం కుదరదు. అందుచేత "సిఞ్చంస్త్వే" అను పాఠ మున్నచో బాగుండును. కాని వావిళ్ళప్రతిలో గాని, గోరఖ్‌పూర్ ప్రతిలో గాని ఇట్లు లేదు. మనం స్వతంత్రించి మార్చుట యుక్తము కాదు. కాని పాఠ్యపాఠంలో— "శోకాగ్నినా దహ్యమానం సిఞ్చ మాం వాక్యవారిణా" అను పాఠమున్నది. అది బాగున్నది. (శోకాగ్నిచేత దహింపబడుచున్న నన్ను నీమాట లనే ఉదకముతో తడుపుము అని అర్థము).

మూ. ఇతస్తు కిం దుఃఖతరం యదిమం వారిసంభవమ్,
మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీమాగతాం వినా. 9

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! వారిసంభవమ్ = ఉదకములో పుట్టిన, ఇమం మణిమ్ = ఈ మణిని, వైదేహీమ్ = సీతను, ఆగతాం వినా = రాకుండగా, యత్ పశ్యామి = చూచుచున్నాను అనునది ఏది కలదో, ఇతః = దీనికంటె, దుఃఖతరమ్ = అధికముగా దుఃఖ మెనది, కిమ్ = ఏమి ?

తా. లక్ష్మణా! సీత రాకుండగా, ఉదకములో పుట్టిన మణిని మాత్రము చూచుచున్నాను; ఇంత కంటె కష్టము మరేమి ఉండును ? 9

మూ. చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి,
క్షణం సౌమ్య న జీవేయం వినా తామసితేక్షణామ్. 10

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! వైదేహీ = సీత, మాసమ్ = ఒక మాసము, ధరిష్యతి యది = జీవించిన ట్లయితే, చిరమ్ = చిరకాలము, జీవతి = జీవించును. సౌమ్య = ఓ ! సౌమ్యుడా ! తామ్ = ఆ, అసితేక్షణాం వినా = సీత లేకుండగా, క్షణమ్ = క్షణకాలము కూడ, న జీవేయమ్ = జీవించను.

తా. సౌమ్యుడా ! సీత ఒక మాసము జీవించగలిగినచో చిరకాలము

జీవించు చున్న దనవలెను. నల్లని కళ్లు గల ఆ సీత లేనిదే నేను క్షణకాలము కూడ జీవించజాలను. 10

మూ. నయ మామపి తం దేశం యత్ర దృష్టా మమ ప్రియా,
న తిష్ఠేయం క్షణమపి ప్రవృత్తిముపలభ్య చ. 11

ప్ర. అ. మమ = నాయొక్క, ప్రియా = ప్రియురాలు, యత్ర = ఎక్కడ, దృష్టా = చూడబడినదో, మామపి = నన్ను కూడ, తం దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, నయ = తీసికొనివెళ్లుము. ప్రవృత్తిమ్ = వార్తను. ఉపలభ్య చ = పొంది కూడ, క్షణమపి = క్షణకాల మైనా, న తిష్ఠేయమ్ = ఉండను.

తా. నన్ను కూడ నా ప్రియురాలు కనబడిన ప్రదేశమునకు తీసికొని వెళ్లుము. ఆమె జాడ తెలిసిన పిమ్మట కూడ ఇంక క్షణకాల మైనా నిలువ జాలను. 11

మూ. కథం సా మమ సుశ్రోణీ భీరుభీరుః సతీ సదా,
భయావహానాం ఘోరాణాం మధ్యే తిష్ఠతి రక్షసామ్. 12

ప్ర. అ. సదా = ఎల్లప్పుడు, భీరుభీరుః సతీ = చాల భయము కలదై ఉన్న, మమ సుశ్రోణీ = నా ప్రియురా లైన ఆ అంద మైన కటిప్రదేశము గల సీత, భయావహానామ్ = భయమును కలిగించు, ఘోరాణామ్ = క్రూరు లైన, రక్షసామ్ = రాక్షసులయొక్క, మధ్యే = మధ్యయందు, కథమ్ = ఎట్లు, తిష్ఠతి = ఉంటూన్నది.

తా. ఎల్లప్పుడూ మిక్కిలి భయపడుచు ఉండే, సుశ్రోణి యైన నా ప్రియురాలు, భయమును కలిగించు, క్రూరు లైన రాక్షసుల మధ్య ఎట్లు ఉంటూన్నదో కదా। 12

మూ. శారదస్తిమిరోన్ముక్తో నూనం చన్ద్ర ఇవామ్బుదైః,
ఆవృతం వదనం తస్యా న విరాజతి రాక్షసైః. 13

ప్ర. అ. తిమిరోన్ముక్తః = చీకటిచేత విడవబడిన, అమ్బుదైః = మేఘములచేత కప్పబడిన, చన్ద్రః ఇవ = చంద్రుడు వలె, రాక్షసైః = రాక్షసులచేత,

అవృతమ్ = ఆవరింపబడిన, తస్యాః = ఆమెయొక్క. వదనమ్ = ముఖము, న విరాజతి = ప్రకాశించదు. నూనమ్ = నిశ్చయము.

తా. చీకటినుండి వెలుపడిన చంద్రబింబము మేఘములచే కప్పబడి ఎట్లు ప్రకాశించదో అట్లే ఆమె ముఖము, రాక్షసులచేత ఆవరింపబడినదై ప్రకాశించదు; సత్యము.

వి. ముఖము రాక్షసులచేత ఆవరింపబడినది అనునది అంతగా సంగతము కాదు. సీత ఆవరింపబడవచ్చును గాని ముఖము మాత్రము ఆవరింపబడదు కదా. అందుచేత "అవృతః వదనం తస్యాః న విరాజతి సాంప్రతమ్" అను గోరఖ్‌పూర్ పాఠము బాగున్నది. "అవృతః చన్ద్రః ఇవ = ఆవరింపబడిన చంద్రుడు వలె, సంప్రతి = ఇప్పుడు, ఆమె ముఖము ప్రకాశించదు" అని అర్థము. 13

మూ. కిమాహ సీతా హనుమంస్తత్త్వతః కథయాద్య మే,
ఏతేన ఖలు జీవిష్యే భేషజేనాతురో యథా. 14

ప్ర. అ. హనుమన్ = హనుమంతుడా! సీతా = సీత, కిమ్ = ఏమి, ఆహ = చెప్పినది? అద్య = ఇప్పుడు, తత్త్వతః = యథార్థముగా, మే = నాకు, కథయ = చెప్పుము. ఆతురః = రోగి, భేషజేన యథా = మందుచేత వలె, ఏతేన = దీనిచే, జీవిష్యే ఖలు = జీవించగలను గదా?

తా. హనుమంతుడా! సీత ఇంకా ఏమన్నదో, ఇప్పుడు, యథార్థముగా చెప్పుము. రోగి ఔషధముచేత జీవించినట్లు ఆమె మాటలు వినుటచే జీవించెదను.

మూ. మధురా మధురాలాపా కిమాహ మమ భామినీ,
మద్విహీనా వరారోహా హనుమన్ కథయస్వ మే. 15

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
షట్షష్టితమః సర్గః.

ప్ర. అ. మధురా = మధురస్వభావము కలది, మధురాలాపా = మధురమైన మాటలు కలది, వరారోహా = శ్రేష్ఠమైన కటిప్రదేశము కలది, మద్విహీనా

= నాతో భాష్యమాణా అయిన, మమ భామినీ = నా స్త్రీ (నా ప్రియురాలు), కిమ్ = ఏమి. ఆహ = చెప్పినది ? మే = నాకు, కథయస్వ = చెప్పుము.

తా. మధుర మైన స్వభావము కలది, మధురముగా మాటలాడునది, అందమైన కటి ప్రదేశము కలది, నా వియోగమును అనుభవించుచున్నది అయిన నా ప్రియురాలు ఏ మన్నది? నాకు చెప్పుము. 16

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో అరువదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తషష్టితమః సర్గః

[హనుమంతుడు రామునకు సీతా సందేశమును చెప్పుట.]

మూ. ఏవముక్తస్తు హనుమాన్ రాఘవేణ మహాత్మనా,
సీతాయా భాషితం సర్వం న్యవేదయత రాఘవే. 1

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, హనుమాన్ = హనుమంతుడు, సీతాయాః = సీత యొక్క, భాషితమ్ = వాక్యమును, సర్వమ్ = అంతనూ, రాఘవే = రామునియందు (నికి), న్యవేదయత = తెలిపెను.

తా. మహాత్ముడైన రాముని వచనమును విని హనుమంతుడు సీత పలికిన మాట లన్నీ రామునకు తెలిపెను.

మూ. ఏవముక్తవతీ దేవీ జానకీ పురుషర్షభ,
పూర్వవృత్తమభిజ్ఞానం చిత్రకూటే యథాతథమ్. 2

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! దేవీ = దేవి యైన, జానకీ = జానకి, చిత్రకూటే = చిత్రకూటపర్వతమునందు, పూర్వవృత్తమ్ = పూర్వము జరిగిన దానిని, అభిజ్ఞానమ్ = ఆనవాలుగా, యథాతథమ్ = జరిగినది జరిగినట్లుగా, ఏవమ్ = ఇట్లు, ఉక్తవతీ = పలికినది.

తా. పురుషశ్రేష్ఠుడా! సీతాదేవి చిత్రకూటమునందు పూర్వము జరిగిన విషయమును ఆనవాలుగా, జరిగినది జరిగి నట్లు చెప్పెను. 2

మూ. సుఖసుప్తా త్వయా సార్ధం జానకీ పూర్వముత్థితా,
వాయసః సహసోత్పత్య విదదార స్తనాన్తరే. 3

ప్ర. అ. త్వయా సార్ధమ్ = నీతో కూడ, సుఖసుప్తా = సుఖముగా

నిద్రించిన, జానకీ = జానకి, పూర్వమ్ = ముందుగా, ఉత్థితా = లేచినది. వాయసః = కాకి, సహసా = శీఘ్రముగా, ఉత్పత్య = ఎగిరి, స్తనాన్తరే = స్తనమధ్యమునందు, విరరాద = చీల్చెనట.

తా. నీతో(నీ సమీపమున)సుఖముగా నిద్రించిన జానకి ముందుగా లేచెను. అప్పుడు ఒక కాకి హఠాత్తుగా ఎగిరి వచ్చి ఆమెను స్తనముల మధ్య చీల్చె నట.

మూ. పర్యాయేణ చ సుప్తస్త్వం దేవ్యఙ్కే భరతాగ్రజ.
పునశ్చ కిల పక్షీ స దేవ్యా జనయతి వ్యథామ్. 4

ప్ర. అ. భరతాగ్రజ = రామా ! త్వమ్ = నీవు, పర్యాయేణ = క్రమముచేత, దేవ్యఙ్కే = సీత ఒడిలో, సుప్తః = నిద్రించితివి, సః పక్షీ = ఆ పక్షి, పునశ్చ = మరల, దేవ్యాః = దేవికి, వ్యథామ్ = బాధను, జనయతి కిల = కలిగించినదట.

తా. రామా! నీవు పిమ్మటగా సీత అంకముపైన తల ఉంచి నిద్రించితి వట. ఆ కాకి మరల వచ్చి సీతకు బాధకలిగించినదట. 6

మూ. పునః పునరథోత్పత్య విరరాద భృశం కిల,
తత స్త్వం బోధిత స్తస్యాః శోణితేన సముక్షితః. 5

ప్ర. అ. పునః పునః = మాటిమాటికి, ఉత్పత్య = వచ్చి, భృశమ్ = అధికముగా, విరరాద కిల = చీల్చెనట. తతః = అటు పిమ్మట, త్వమ్ = నీవు, తస్యాః = ఆమెయొక్క, శోణితేన = రక్తముచేత, సముక్షితః = తడపబడినవాడవై, బోధితః కిల = లేపబడితి వట

తా. ఆ కాకి మాటిమాటికి వచ్చి ఎక్కువగా చీల్చెనట. అప్పుడు నీవు ఆమె రక్తముచేత తడపబడినవాడవై మేల్కొంటి వట. 5

మూ. వాయసేన చ తేనైవ సతతం బాధ్యమానయా,
బోధితః కిల దేవ్యా త్వం సుఖసుప్తః పరంతప. 6

ప్ర. అ. పరంతప = శత్రువులను బాధించువాడా ! తేన = ఆ, వాయసేనైవ = కాకిచేతనే, సతతమ్ = ఎడతెగకుండా, బాధ్యమానయా = బాధింపబడుచున్న, దేవ్యా = సీతాదేవిచేత, సుఖసుప్తః = సుఖముగా నిద్రించుచున్న, త్వమ్ = నీవు, బోధితః కిల = నిద్రనుండి లేపబడితి వట.

తా. శత్రుసంహారకుడ వైన రామా! ఆ కాకి ఈ విధముగ ఎడతెగకుండా బాధించగా ఆ దేవి సుఖముగా నిద్రించుచున్న నిన్ను మేల్కొల్పినదట.

మూ. తాం తు దృష్ట్వా మహాబాహో దారితాం చ స్తనాన్తరే,
ఆశీవిష ఇవ క్రుద్ధో నిశ్వసన్నభ్యభాషథాః. 7

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! స్తనాన్తరే = స్తన మధ్యమునందు, దారితామ్ = చీల్చబడిన, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, క్రుద్ధః = కోపగించినవాడ వై, ఆశీవిష ఇవ = సర్పము వలె, నిశ్వసన్ = బుస గొట్టుచు, అభ్యభాషథాః = పలికితి వట.

తా. ఓ! మహాబాహూ! స్తనమధ్యమునందు చీల్చబడిన ఆ దేవిని చూచి, కోపించినవాడవై, సర్పము వలె బుసలుగొట్టుచు పలికితి వట. 7

మూ. నఖాగ్రైః కేన తే భీరు దారితం తు స్తనాన్తరమ్,
కః క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా. 8

ప్ర. అ. భీరు = భయస్వభావము కలదానా! తే = నీయొక్క, స్తనాన్తరమ్ = స్తనమధ్యము, కేన = ఎవనిచేత, నఖాగ్రైః = గోళ్ళ అగ్రభాగములచేత, దారితమ్ = చీల్చబడినది? సరోషేణ = కోపముతో కూడిన, పఞ్చవక్త్రేణ = ఐదు ముఖములు గల, భోగినా = సర్పముతో, కః = ఎవడు, క్రీడతి = క్రీడించుచున్నాడు?

తా. భయస్వభావము గల ఓ! సీతా! నీ స్తనమధ్యమును ఎవడు చీల్చినాడు? కోపముతో కూడిన, ఐదు ముఖముల సర్పముతో ఎవడు ఆడుకొనుచున్నాడు! 8

మూ. నిరీక్షమాణః సహసా వాయసం సమవైక్షథాః,
నఖైః సరుధిరైస్తీక్ష్ణైస్తామేవాభిముఖం స్థితమ్. 9

ప్ర. అ. నిరీక్షమాణః = పరికించి చూచుచు, సరుధిరైః = రక్తముతో కూడిన, తీక్ష్ణైః = తీక్ష్ణము లైన, నఖైః = గోళ్ళతో, తామేవ అభిముఖమ్ = ఆమెకే ఎదురుగా, స్థితమ్ = ఉన్న, వాయసమ్ = కాకిని, సహసా = శీఘ్రముగా, సమవైక్షథాః = చూచితి వట.

తా. నీవు శీఘ్రముగా అటు ఇటు పరికించి చూడగా, రక్తముతో కూడిన తీక్ష్ణము లైన గోళ్లతో ఆ సీతకే అభిముఖముగా ఉన్న ఆ కాకి కనబడిన దట. 9

మూ. సుతః కిల స శక్రస్య వాయసః పతతాం వరః,
ధరాన్తరచరః శీఘ్రం పవనస్య గతౌ సమః. 10

ప్ర. అ. రా. సు. ३८వ సర్గ, २४వ శ్లోకము.

మూ. తత స్తస్మిన్మహాబాహో కోపసంవర్తితేక్షణః,
వాయసే త్వం కృతాః క్రూరాం మతిం మతిమతాం వర.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా ! మతిమతామ్ = బుద్ధిమంతులలో, వర = శ్రేష్ఠుడా ! త్వమ్ = నీవు, కోపసంవర్తితేక్షణః = కోపము చేత త్రిప్పబడిన నేత్రములు కలవాడ వై, తతః = అటు పిమ్మట, తస్మిన్ వాయసే = ఆ కాకివిషయమున, క్రూరామ్ = క్రూర మైన, మతిమ్ = బుద్ధిని, కృతాః = చేసితి వట.

తా. గొప్పబాహువులు కలవాడా ! బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా ! పిమ్మట నీవు కోపముతో కళ్లు పెద్దవి చేసి, ఆ కాకివిషయమునందు క్రూర మైన ఆలోచనను చేసితి వట. 11

మూ. స దర్భం సంస్తరాద్గృహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః,
ప్రదీప్త ఇవ కాలాగ్నిర్జజ్వాలాభిముఖః ఖగమ్. 12

ప్ర. అ. రా. సు. ३८వ సర్గ, ३0వ శ్లోకం. అక్కడ "బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్" అని ఉన్నది. "బ్రహ్మాస్త్రేణ = బ్రహ్మాస్త్రముతో, అయోజయః హి = కూర్చితివి" అని ఇక్కడ అర్థము. 'ద్విజమ్'కు బదులు 'ఖగమ్'; అర్థముసమానమే.

మూ. క్షిప్తవాంస్త్వం ప్రదీప్తం హి దర్భం తం వాయసం ప్రతి.
తతస్తు వాయసం దీప్తః స దర్భోఽనుజగామ హ. 13

ప్ర. అ. త్వమ్ = నీవు, ప్రదీప్తమ్ = మండు చున్న, తం దర్భమ్ = ఆ దర్భను, వాయసం ప్రతి = కాకిని గూర్చి, క్షిప్తవాన్ = విసిరితివి. తతః = అటు

పిమ్మట, సః దర్భః=ఆ దర్భ, దీప్తః=మండుచున్నదై, వాయసమ్ = కాకిని, అనుజగామ హ=అనుసరించెను.

తా. నీవు మండుచున్న ఆ దర్భను కాకిమీదకు విసిరితివట. అప్పుడు ఆ దర్భ మండుచు ఆ కాకిని తరుముకొని వెళ్ళినదట. 13

మూ. స పిత్రా చ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః,
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త్రాతారం నాధిగచ్ఛతి. 14

ప్ర. అ. సః = ఆ కాకి, పిత్రా చ = తండ్రియైన ఇంద్రునిచేత, సమహర్షిభిః=మహర్షులతో కూడిన, సురైశ్చ = దేవతలచేతను, పరిత్యక్తః = విడవబడిన దై, త్రీన్=మూడు, లోకాన్ =లోకములను, సంపరిక్రమ్య=చుట్టు తిరిగి వచ్చి, త్రాతారమ్=రక్షకుని, నాధిగచ్ఛతి = పొందలేదు.

తా. ఆ కాకిని తండ్రియైన ఇంద్రుడు, దేవతలు, మహర్షులు కూడ వదిలివేయగా అది మూడు లోకములు చుట్టు తిరిగినను రక్షకుడు ఎవ్వరూ లభించలేదు. 14

మూ. పునరేవాగతస్త్రస్తస్త్వత్సకాశమరిందమ,
స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, 15
వధార్హమపి కాకుత్స్థ కృపయా పర్యపాలయః.

ప్ర. అ. అరిందమ=శత్రుసంహారకుడా! త్రస్తః = భయపడినవాడై, పునరేవ=మరల, త్వత్సకాశమ్=నీ సమీపమును, ఆగతః = వచ్చినాడు. తరువాత శ్లోకానికి చూ. 38వ సర్గ 34వ శ్లోకము. అక్కడ "కాకుత్స్థః పర్యపాలయత్" అని ఉన్నది. "కాకుత్స్థ = రామా; పర్యపాలయః = పాలించితివి" అని ఇక్కడ అర్థము.

తా. శత్రుసంహారకా! ఆ కాకి భయపడినదై మరల నీ దగ్గరికే వచ్చినది. రామా! అప్పుడు శరణాగతరక్షకుడ వైన నీవు, శరణు కోల్పి నేలపై పడిన ఆ కాకి చంపదగినదే యైనను దానిని దయతో రక్షించితివట. 15

మూ. మోఘమస్త్రం న శక్యం తు కర్తుమిత్యేవ రాఘవ, 16
భవాంస్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్.

ప్ర. అ. రాఘవ=రామా! అస్త్రమ్=అస్త్రము, మోఘమ్=వ్యర్థమైనదిగా కర్తుమ్=చేయుటకు, న శక్యమ్=శక్యము కాదు, ఇత్యేవ=అని, భవాన్=నీవు, తస్య కాకస్య=ఆ కాకియొక్క, దక్షిణమ్ అక్షి=కుడి కంటిని, హినస్తి స్మ=హింసించితివి పట.

తా. రామా! అస్త్రము వ్యర్థము కాకూడదు అను అభిప్రాయము మాత్రము చేతనే నీవు ఆ కాకి కుడి కన్ను కొట్టివేసితి వట. 16

మూ. రామ త్వాం స నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ, 17
విసృష్టస్తు తదా కాకః ప్రతిపేదే స్వమాలయమ్.

ప్ర. అ. రామ=రామా! తదా=అప్పుడు, సః కాకః=ఆ కాకి, విసృష్టః=విడువబడినదై, త్వామ్=నిన్ను, రాజ్ఞే=రాజైన, దశరథాయ చ=దశరథునకు, నమస్కృత్య=నమస్కరించి, స్వమ్=తనసంబంధమైన, ఆలయమ్=స్థానమును, ప్రతిపేదే=పొందెను.

తా. రామా! అప్పుడా కాకి విడువబడినదై, నీకు, నీ తండ్రియైన దశరథునకు నమస్కరించి తన నివాసమునకు వెళ్ళిపోయె పట. 17

మూ. ఏవమస్త్రవిదాం శ్రేష్ఠః సత్త్వవాన్ శీలవానపి, 18
కిమర్థమస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః.

ప్ర. అ. శీలవానపి=మంచి శీలము కలవాడైనను, చూ. 33వ సర్గ. 49వ శ్లోకం.

తా. ఈ విధముగ అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడైనను, బలము కలవాడైనను, ఉత్తమశీలము కలవాడైనను రాముడు రాక్షసులపై అస్త్రమును ఎందువలన ప్రయోగించుటలేదు? 18

మూ. న నాగా నాపి గన్ధర్వా నాసురా న మరుద్గణాః, 19
న చ సర్వే రణే శక్తా రామం ప్రతి సమాసితుమ్.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, రామం ప్రతి=రామునికి ఎదురుగా, ప్రతి సమాసితుమ్=నిలుచుటకు, నాగాః=నాగులు, న శక్తాః=సమర్థులు కారు. గన్ధ

ర్వాః అపి=గంధర్వులు, న=కారు. అసురాః=అసురులు, న=కారు. మరుద్గణాః =దేవతాగణములు, న=కారు. సర్వే=వారందరూ కలిసి కూడ, న=కారు

తా. నాగులు గాని, గంధర్వులు గాని, అసురులు గాని, దేవతాగణములు గాని, వీరందరూ కలిసి గాని యుద్ధములో రాముని ఎదుట నిలువజాలరు. 19

మూ. తస్య వీర్యవతః కచ్చిద్యద్యస్తి మయి సంభ్రమః, 20
క్షిప్రం సునిశితైర్బాణైర్హన్యతాం యుధి రావణః.

ప్ర. అ. వీర్యవతః=పరాక్రమవంతు డైన, తస్య=ఆ రామునకు, మయి =నా విషయమున, సంభ్రమః=తొందర, అస్తి యది=ఉన్నట్లయితే, సునిశితైః=బాగా వాడి యైన, బాణైః=బాణములచేత, రావణః=రావణుడు, క్షిప్రమ్ =శీఘ్రముగా, యుధి=యుద్ధమునందు, హన్యతామ్=చంపబడునుగాక.

తా. పరాక్రమవంతు డైన ఆ రామునకు నా విషయమునందు ఏ మైన తొందర ఉన్నచో తీక్ష్ణము లైన బాణములచేత యుద్ధములో రావణుడు చంపబడుగాక. 20

మూ. భ్రాతురాదేశమాజ్ఞాయ లక్ష్మణో వా పరంతపః, 21
స కిమర్థం నరవరో న మాం రక్షతి రాఘవః.

ప్ర. అ. పరంతపః=శత్రుసంహారకుడు, నరవరః=నరశ్రేష్ఠుడు, రాఘవః=రఘువంశసంజాతుడు అయిన, సః లక్ష్మణో వా=ఆ లక్ష్మణు డైనా, భ్రాతుః=సోదరునియొక్క, ఆదేశమ్=ఆజ్ఞను, ఆజ్ఞాయ=తెలిసికొని, మామ్ =నన్ను, కిమర్థమ్=ఎందుకు, న రక్షతి=రక్షించుటలేదు?

తా. శత్రుసంహారకుడు, నరశ్రేష్ఠుడు, రఘువంశాలంకారభూతుడు అయిన ఆ లక్ష్మణు డైనా అన్నగారి ఆజ్ఞ పొంది నన్ను రక్షించవచ్చును కదా?

మూ. శక్తౌ తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ, 22
సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మాముపేక్షతః.

ప్ర. అ. శక్తౌ=సమర్థు లైన, మూ. 38 వ సర్గ. 47వ శ్లోకం.

తా. సమర్థులు, వాయువుతోను అగ్నితోను సమానమైన తేజస్సు కలవారు, దేవతలకు కూడ ఎదిరింపశక్యము కానివారు అయిన ఆ పురుషశ్రేష్ఠులు నన్ను ఎందుచేత ఉపేక్షించుచున్నారు? 22

మూ. మమైవ దుష్కృతం కించిన్మహదస్తి న సంశయః, 23
సమర్థౌ సహితౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ.

ప్ర. అ. రా. మూ. 38వ సర్గ, 48వ శ్లోకం.

మూ. వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితమ్,
పునరప్యహమార్యాం తామిదం వచనమబ్రువమ్. 24

ప్ర. అ. కరుణమ్ = దీనము, సాశ్రుభాషితమ్ = కన్నీళ్ళతో కూడిన మాటలు గలది అయిన, వైదేహ్యాః = సీతయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అహమ్ = నేను, పునరపి = మరల, తామ్ ఆర్యామ్ = ఆ పూజ్యురాలిని గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రువమ్ = పలికితిని.

తా. దీనములు, కన్నీళ్ళతో కూడిన వాక్యములు గల సీతాదేవి మాటలు విని, నేను మరల పూజ్యురాలైన ఆమెతో ఇట్లు పలికితిని. 24

మూ. త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే. 25
రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే.

ప్ర. అ. రా. దుఃఖాభిభూతే = దుఃఖముచేత తిరస్కరింపబడినవా డగుచుండగా (దుఃఖాక్రాంతు డగుచుండగా మూ. 38వ సర్గ. 50వ శ్లోకం) 25

మూ. కథం చిద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్, 26
అస్మిన్ముహూర్తే దుఃఖానామన్తం ద్రక్ష్యసి భామిని.

ప్ర. అ. రా. భామిని = ఓ వనితా. మూ. 38వ సర్గ. 52వ శ్లోకం.

మూ. తావుభౌ నరశార్దూలౌ రాజపుత్రావనిన్దితౌ, 27
త్వద్దర్శనకృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః.

ప్ర. అ. రా. నరశార్దూలౌ = నరశ్రేష్ఠులు, అనిన్దితౌ = నిందింపబడని వారు. చూ. 31వ సర్గ, 52వ శ్లోకం. 27

మూ. హత్వా చ సమరే రౌద్రం రావణం సహ బాన్ధవమ్, 28
రాఘవస్త్వాం వరారోహే స్వాం పురీం నయతే ధ్రువమ్.

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠ మైన కటిప్రదేశము గలదానా। రాఘవః = రాముడు, రౌద్రమ్ = భయంకరుడు, సహబాన్ధవమ్ = బంధువులతో కూడిన వాడు అయిన, రావణమ్ = రావణుని, సమరే = యుద్ధమునందు, హత్వా చ = చంపి, త్వామ్ = నిన్ను, స్వాం పురీమ్ = తన పట్టణమును గూర్చి, నయతే = = తీసికొని వెళ్లును. ధ్రువమ్ = నిశ్చయము.

తా. ఓ। దేవీ। రాముడు భయంకరు డైన రావణుని, అతని బంధువులను యుద్ధములో చంపి నిన్ను తప్పక తన అయోధ్యాపురికి తీసికొని వెళ్ళగలడు. 28

మూ. యత్తు రామో విజానీయాదభిజ్ఞానమనిన్దితే, 29
ప్రీతిసంజననం తస్య ప్రదాతుం త్వమిహార్హసి.

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడనిదానా। రామః = రాముడు, యత్ = దేనిని, విజానీయాత్ = గుర్తించునో అట్టి, తస్య = ఆ రామునకు, ప్రీతిసంజననమ్ = సంతోషమును కలిగించు, అభిజ్ఞానమ్ = ఆనవాలును, ఇహ = ఇప్పుడు, ప్రదాతుమ్ = ఇచ్చుటకు, త్వమ్ = నీవు, అర్హసి = తగి యున్నావు.

తా. దోషరహితురాల వైన ఓ। దేవీ। రామునకు సంతోషమును కలిగించెడి, అతడు గుర్తింపగలిగినది అయిన ఆనవాలు వేరైన ఒకటి ఇమ్ము. 29

మూ. సాభివీక్ష్య దిశః సర్వా వేణ్యుద్గ్రథితముత్తమమ్, 30
ముక్త్వా వస్త్రాద్దదౌ మహ్యం మణిమేతం మహాబల.

ప్ర. అ. మహాబల = గొప్ప బలము కలవాడా। సా = ఆ సీత, సర్వాః = సమస్త మైన, దిశః = దిక్కులను, అభివీక్ష్య = చూచి, వేణ్యుద్గ్రథితమ్ = వేణి యందు గుచ్ఛబడినదైన, ఉత్తమమ్ = ఉత్తమ మైన, ఏతం మణిమ్ = ఈ మాణిక్యమును, వస్త్రాత్ = వస్త్రమునుండి, ముక్త్వా = విప్పి, మహ్యమ్ = నాకు, దదౌ = ఇచ్చెను.

తా. మహాబలశాలి వైన ఓ! రామా! ఆమె అన్ని దిక్కుల వైపు చూచి, తాను వేణిలో ధరించే ఈ ఉత్తమ మైన మణిని బట్టమునుండి విప్పి నా కిచ్చెను. 30

మూ. ప్రతిగృహ్య మణిం దివ్యం తవ హేతో రఘూద్వహ,
శిరసా తాం ప్రణమ్యార్యామహ మాగమనే త్వరే.

ప్ర. అ. రఘూద్వహ = రామా! దివ్యమ్ = దివ్య మైన, మణిమ్ = మణిని, తవ హేతోః = నీ కొరకై, ప్రతిగృహ్య = గ్రహించి, ఆర్యామ్ = పూజ్యురా లైన, తామ్ = ఆమెను, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, అహమ్ = నేను, ఆగమనే = తిరిగి వచ్చుటయందు, త్వరే = తొందర పడితిని.

తా. రామా! నేను ఆ దివ్య మైన మణిని నీ కొరకై ఆమెనుండి తీసికొని, పూజ్యురా లైన ఆమెకు శిరస్సు వంచి నమస్కరించి తిరిగి వచ్చు తొందరలో ఉంటిని. 31

మూ. గమనే చ కృతోత్సాహమవేక్ష్య వరవర్ణినీ, 32
వివర్ధమానం చ హి మామువాచ జనకాత్మజా.

ప్ర. అ. వరవర్ణినీ = శ్రేష్ఠ మైన వర్ణము గల, జనకాత్మజా = సీత, గమనే = వెళ్ళుటయందు, కృతోత్సాహమ్ = చేయబడిన ఉత్సాహము గల, వివర్ధమానం చ = దేహముచేత పెరుగుచున్న, మామ్ = నన్ను, అవేక్ష్య = చూచి, ఉవాచ = పలికెను.

తా. మంచి వర్ణము గల ఆ జానకి తిరిగి వచ్చే ఉత్సాహముతో శరీరము పెంచుచున్న నన్ను చూచి ఇట్లు పలికెను. 32

మూ. అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పసందిగ్ధభాషిణీ. 33
మమోత్పతనసంభ్రాన్తా శోకవేగసమాహతా.

ప్ర. అ. అశ్రుపూర్ణముఖీ = కన్నీళ్ళతో నిండిన ముఖము గలదై, దీనా = దీనురా లై, బాష్పసందిగ్ధభాషిణీ = డగ్గుత్తికచే అస్పష్టముగ పలుకుచున్నదై, మమ = నాయొక్క, ఉత్పతనసంభ్రాన్తా = ఎగిరి వెళ్ళిపోవుటను గూర్చి దిగులు

చెందినదై, శోకవేగసమాహతా = శోకవేగముచేత కొట్టబడినదై, (ఆమె ఇట్లు పలికెను).

తా. నేను తిరిగి వెళ్ళిపోవు చున్నానని దిగులు చెందిన ఆ దీనురాలి ముఖము కన్నీళ్ళతో నిండి యుండెను. డగ్గుత్తికచే ఆమె మాటలు అస్పష్టముగా ఉండెను. శోకవేగముచేత పీడితురాలై ఉండెను. 33

మూ. హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ, 34
సుగ్రీవం చ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్.

ప్ర. అ. హనుమన్ = హనుమంతుడా! సింహసంకాశౌ = సింహములతో, సమానులైన, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులను. ఉభౌ = ఇద్దరిని, సహామాత్యమ్ = మంత్రులతో కూడిన, సుగ్రీవం చ = సుగ్రీవుణ్ణి, సర్వాన్ = అందరినీ, అనామయమ్ = ఆరోగ్యమును, బ్రూయాః = చెప్పుము.

తా. ఓ! హనుమంతుడా! సింహముల వంటి ఆ రామలక్ష్మణు లిద్దరినీ, మంత్రిసమేతుడైన సుగ్రీవుని, అందరినీ కూడ క్షేమ మడిగినానని చెప్పుము.

మూ. యథా చ స మహాబాహుర్మాం తారయతి రాఘవః,
అస్మాద్దుఃఖామ్బుసంరోధాత్త్వం సమాధాతుమర్హసి.

ప్ర. అ. తా. 39వ సర్గ 9వ శ్లోకం.

మూ. ఇమం చ తీవ్రం మమ శోకవేగం
రక్షోభిరేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గతః సమీపమ్
శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర. 36

ప్ర. అ. తా. చూ. 40వ సర్గ. 24వ శ్లోకం.

మూ. ఏతత్తవార్యా నృపరాజసింహ
సీతా వచః ప్రాహ విషాదపూర్వమ్,
ఏతచ్చ బుద్ధ్వా గదితం మయా త్వం
శ్రద్ధత్స్వ సీతాం కుశలాం సమగ్రామ్. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సుందరకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. నృపరాజసింహ = రాజరాజశ్రేష్ఠా! ఆర్యా = పూజ్యురా లైన, సీతా = సీత, విషాదపూర్వమ్ = దుఃఖపూర్వకముగా, ఏతత్ వచః = ఈ వచనమును, తవ = నీకు, ఆహ = చెప్పినది. మయా = నాచేత, గదితమ్ = చెప్పబడిన, ఏతత్ = దీనిని, బుద్ధ్వా = తెలిసికొని, సీతామ్ = సీతను, సమగ్రామ్ = పరిపూర్ణురాలిని గాను, కుశలామ్ = క్షేమముగా ఉన్న దానిని గాను, శ్రద్ధత్స్వ = నమ్ముము.

తా. రాజాధిరాజా! పూజ్యురా లైన సీత చాలా దుఃఖించుచు నీకు చెప్పమని ఈ మాటలు చెప్పినది. నేను చెప్పిన ఈ మాటలు విని, సీత పరిపూర్ణ క్షేమములో ఉన్నదను విషయమును నమ్ముము. 37

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
సుందరకాండలో అరువదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్టషష్టితమః సర్గః

[సీతకు కలిగిన సందేహమును తా నెట్లు నివారించెనో హను మంతుడు చెప్పుట.]

మూ. అథాహముత్తరం దేవ్యా పునరుక్తః ససంభ్రమమ్,
తవ స్నేహాన్నరవ్యాఘ్ర సౌహార్దాదనుమాన్య వై. 1

ప్ర. అ. నరవ్యాఘ్ర = మనుష్యశ్రేష్ఠుడా! అథ = అటు పిమ్మట, అహమ్ = నేను, దేవ్యా = సీతాదేవిచేత, తవ = నీయొక్క, స్నేహాత్ = స్నేహము వలన, సౌహార్దాత్ = మంచి హృదయము కలిగి ఉండుటవలనను, అనుమాన్య = అనుమతించి, పునః = మరల, ఉత్తరమ్ = ప్రత్యుత్తరమును, ససంభ్రమమ్ = తొందరతో కూడుకొన్నట్లుగా, ఉక్తః = పలుకబడితిని.

తా. ఓ నరశ్రేష్ఠుడా! పిమ్మట ఆ సీతాదేవి నీమీద నున్న ప్రేమ వలన, సౌహార్దమువలన నాకు అనుమతి ఇచ్చి, తొందరగా మరల ఇట్లు పలికెను. 1

మూ. ఏవం బహువిధం వాచ్యో రామో దాశరథిస్త్వయా,
యథా మామాప్నుయాచ్ఛీఘ్రం హత్వా రావణమాహవే.

ప్ర. అ. దాశరథిః = దశరథకుమారు డైన, రామః = రాముడు, ఆహవే = యుద్ధమునందు, రావణమ్ = రావణుని, శీఘ్రమ్ = శీఘ్రముగా, హత్వా = చంపి, మామ్ = నన్ను, యథా = ఎట్లు, ఆప్నుయాత్ = పొందునో, తథా = అట్లు, ఏవమ్ = ఇట్లు, బహువిధమ్ = అనేకవిధములుగ, వాచ్యః = చెప్పదగిన వాడు

తా. దశరథకుమారు డైన రాముడు యుద్ధములో శీఘ్రముగా రావణుని చంపి, నన్ను పొందు నట్లుగా ఈ విధముగ అన్ని విషయములు చెప్పవలెను. 2

మూ. యది వా మన్యసే వీర వసైకాహమరిందమ,
కస్మింశ్చిత్సంవృతే దేశే విశ్రాన్తః శ్వో గమిష్యసి. 3

ప్ర. అ. రా. చూ. 39వ సర్గ, 20వ శ్లోకం.

మూ. మమ చాప్యల్పభాగ్యాయాః సాన్నిధ్యాత్తవ వీర్యవన్,
అస్య శోకవిపాకస్య ముహూర్తం స్యాద్విమోక్షణమ్. 4

ప్ర. అ. వీర్యవన్ = పరాక్రమవంతుడా! తవ = నీయొక్క, సాన్నిధ్యాత్ = సాన్నిధ్యమువలన, అల్పభాగ్యాయాః = అల్పమైన భాగ్యము గల, మమ = నాయొక్క, అస్య = ఈ, శోకవిపాకస్య = దుఃఖవిపాకమునకు, ముహూర్తమ్ = ముహూర్తకాలమైనా, విమోక్షణమ్ = విడుదల, స్యాత్ = కలుగవచ్చును.

తా. ఓః పరాక్రమవంతుడా! దురదృష్టవంతురాలనైన నాకు, నీవు దగ్గర ఉండుటచే, ఈ శోకపరిపాకము నుండి ముహూర్తసమయమైనను విమోచనము కలుగవచ్చును. 4

మూ. గతే హి త్వయి విక్రాన్తే పునరాగమనాయ వై,
ప్రాణానామపి సన్దేహో మమ స్యాన్నాత్ర సంశయః. 5

ప్ర. అ. విక్రాన్తే = పరాక్రమవంతుడవైన, త్వయి = నీవు. చూ. 39వ సర్గ, 22వ శ్లోకము.

తా. పరాక్రమవంతుడవైన నీవు తిరిగి వచ్చుటకై వెళ్ళిపోయిన పిమ్మట నేను జీవించి ఉందునా అనేది కూడ సందేహాస్పదమే. ఇందులో సందేహము లేదు. 5

మూ. తవాదర్శనజః శోకో భూయో మాం పరితాపయేత్,
దుఃఖాద్దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీమ్. 6

ప్ర. అ. దుఃఖాత్ = ఒక దుఃఖము తరవాత, దుఃఖభాగినీమ్ = మరొక దుఃఖమును పొందుచున్నదానను, దుర్గతామ్ = దీనురాలను, దుఃఖభాగినీమ్ = దుఃఖములనే పొందేదానను అయిన, మామ్ = నన్ను, తవ = నీయొక్క, అదర్శ

నాశః = కనబడక పోవుటవలన కలిగిన, శోకః = శోకము, భూయః = అధికము, పరితాపయేత్ = బాధింతును.

తా. ఒక దుఃఖము తరువాత మరొక దుఃఖమును అనుభవించుచు, దీను రాలనై, దుఃఖములు అనుభవించుటకే పుట్టిన నాకు నీవు కనబడకపోవుటచే దుఃఖము ఇంకా అధిక మగును. 6

మూ. అయం చ వీర సన్దేహస్తిష్ఠతీవ మమాగ్రతః,
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర. 7

ప్ర. అ. రా. మూ. 39వ సర్గ, 24వ శ్లోకం.

మూ. కథం ను ఖలు దుష్పారం తరిష్యన్తి మహోదధిమ్,
తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ. 8

ప్ర. అ. రా. మూ. 39వ సర్గ. 24వ శ్లోకం.

మూ. త్రయాణామేవ భూతానాం సాగరస్యాస్య లఙ్ఘనే,
శక్తిః స్యాద్వైనతేయస్య తవ వా మారుతస్య వా. 9

ప్ర. అ. రా. మూ. 39వ సర్గ, 26వ శ్లోకం.

మూ. తదస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే,
కిం పశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాం వర. 10

ప్ర. అ. రా. మూ. 39వ సర్గ, 27వ శ్లోకం, "కార్యవిదామ్ = కార్య వేత్తంలో. వర=శ్రేష్ఠుడా, బ్రూహి=చెప్పుము.

మూ. కామమస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్యస్తే ఫలోదయః. 11

ప్ర. అ. రా. మూ. 39వ సర్గ. 28వ శ్లోకం.

మూ. బలైః సమగ్రైర్యది మాం హత్వా రావణమాహవే,
విజయీ స్వాం పురీం రామో నయేత్తత్స్యాద్యశస్కరమ్.

ప్ర. అ. రామః = రాముడు, రావణమ్ = రావణుని, సమగ్రైః = సమస్తమైన, బలైః = సైన్యములతో కూడ, ఆహవే = యుద్ధమునందు, హత్వా = చంపి, విజయీ = విజయవంతుడై, స్వామ్ = తన సంబంధమైన, పురీమ్ = పట్టణమును గూర్చి, మామ్ = నన్ను, నయేద్యది = తీసికొనివెళ్ళిన ట్లయితే, తత్ = అది, యశస్కరమ్ = యశస్సును కలిగించేది, స్యాత్ = అగును.

తా. రాముడు యుద్ధములో సమస్త సైన్యములతో సహా రావణుని చంపి, విజయవంతుడై నన్ను తన నగరమునకు తీసికొని వెళ్ళినచో అతి యశస్కరముగా నుండును. 12

మూ. యథాహం తస్య వీరస్య వనాదుపధినా హృతా,
రక్షసా తద్భయాదేవ తథా నార్హతి రాఘవః. 13

ప్ర. అ. అహమ్ = నేను, రక్షసా = రాక్షసునిచేత, వీరస్య = వీరుడైన రాముని యొక్క, ఉపధినా = వంచనచేత, యథా = ఎట్లు, హృతా = హరింపబడితినో, తథా = అట్లు, తద్భయాదేవ = ఆ రాక్షసునినుండి భయము వలన, రాఘవః = రాముడు, నార్హతి = తగడు.

తా. రావణుడు వీరుడైన రాముని మోసగించి నన్ను హరించి నట్లు, రాముడు ఆ రావణునికి భయపడి ఆ విధముగ నన్ను తీసికొనివెళ్లుట యుక్తము కాదు. 13

మూ. బలైస్తు సంకులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః,
మాం నయేద్యది కాకుత్స్థస్తత్తస్య సదృశం భవేత్. 14

ప్ర. అ. తా. బలైః = సేనలచేత, చూ. ౩౮వ సర్గ. ౬౦వ శ్లోకం.

మూ. తద్యథా తస్య విక్రాన్తమనురూపం మహాత్మనః,
భవేదాహవశూరస్య తథా త్వముపపాదయ. 15

ప్ర. అ. తా. భవేత్ = అగునో. చూ. ౩౯వ సర్గ. ౩౧వ శ్లోకం.

మూ. తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశమ్యాహం తతః శేషం వాక్యముత్తరమబ్రవమ్.

ప్ర. అ. అహమ్=నేను, అర్థోపహితమ్=అర్థముతో కూడినది, ప్రశ్రితమ్ =వినయముతో కూడినది, హేతుసంహితమ్=హేతువులతో కూడినది అయిన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, తతః=పిమ్మట, శేషమ్= మిగిలిన, ఉత్తరమ్=ప్రత్యుత్తరరూపమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవమ్ =పలికితిని.

తా. ఉత్తమమైన అర్థము కలది, వినయసంపన్నము, యుక్తియుక్తము అయిన ఆ మాటలు విని నేను దానికి ప్రత్యుత్తరముగా ఇట్లు చెప్పితిని. 16

మూ. దేవి హర్యృక్షసైన్యానామీశ్వరః ప్లవతాం వరః,
సుగ్రీవః సత్త్వసంపన్నస్తవార్థే కృతనిశ్చయః. 17

ప్ర. అ తా. చూ. 39వ సర్గ, 34వ శ్లోకం 17

మూ. తస్య విక్రమసంపన్నాః సత్త్వవన్తో మహాబలాః,
మనఃసంకల్పసంపాతా నిదేశే హరయః స్థితాః. 18

యేషాం నోపరి నాధస్తాన్న తిర్యక్సజ్జతే గతిః,
న చ కర్మసు సీదన్తి మహత్స్వమితతేజసః. 19

ప్ర. అ. తా. చూ. 39వ సర్గ 35, 36 శ్లోకాలు, ఏషామ్=వీరియొక్క.

మూ. అసకృత్తైర్మహాభాగైర్వానరైర్బలదర్పితైః,
ప్రదక్షిణీకృతా భూమిర్వాయుమార్గానుసారిభిః. 20

ప్ర. అ. మహాభాగైః= మహాభాగ్యవంతులు, బలదర్పితైః=బలముచేత గర్వించినవారు, వాయుమార్గానుసారిభిః= వాయుమార్గమును అనుసరించువారు అయిన, తైః=ఆ, వానరైః=వానరులచేత, భూమిః=భూమి, ప్రదక్షిణీకృతా= ప్రదక్షిణము చేయబడినది.

తా. గొప్ప భాగ్యము కలవారైన ఆ వానరులు బలముచే గర్వించి, ఆకాశమార్గమున బయలుదేరి భూమినంతను అనేకపర్యాయములు ప్రదక్షిణము చేసిరి. 20

మూ. మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సన్తి తత్ర వనౌకసః,
మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసంనిధౌ. 21

అహం తావదిహ ప్రాప్తః కిం పునస్తే మహాబలాః,
న హి ప్రకృష్టాః ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరే జనాః.

ప్ర. అ. రా. సు. 39వ సర్గ. 37, 38 శ్లోకాలు.

మూ. తదలం పరితాపేన దేవి మన్యుర్వ్యపైతు తే,
ఏకోత్పాతేన వై లఙ్కామేష్యన్తి హరియూథపాః. 23

ప్ర. అ. రా. సు. 39వ సర్గ, 39వ శ్లోకం. మన్యుః=దుఃఖము. 23

మూ. మమ పృష్ఠగతౌ తౌ చ చన్ద్రసూర్యావివోదితౌ,
త్వత్సకాశం మహాభాగే నృసింహావాగమిష్యతః. 24

ప్ర. అ. రా. సు. 39వ సర్గ. 41వ శ్లోకం. "మహాభాగే=గొప్ప భాగ్యము కలదానా."

మూ. అరిఘ్నం సింహసంకాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్,
లక్ష్మణం చ ధనుష్పాణిం లఙ్కాద్వారముపస్థితమ్. 25

ప్ర. అ. సు. 39వ సర్గ. 43వ శ్లోకం. "సింహసంకాశమ్=సింహముతో సమానుడు"

మూ. నఖదంష్ట్రాయుధాన్వీరాన్ సింహశార్దూలవిక్రమాన్,
వానరాన్వారణేన్ద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్.

ప్ర. అ. రా. సు. 39వ సర్గ. 40వ శ్లోకం.

మూ. శైలామ్బుదనికాశానాం లఙ్కామలయసానుషు,
నర్దతాం కపిముఖ్యానామచిరాచ్ఛ్రోష్యసి స్వనమ్. 27

ప్ర. అ. శైలామ్బుదనికాశానామ్=శైలములతోను మేఘములతోను సమానమైన, లఙ్కామలయసానుషు=లంకయందు మలయపర్వతము చరియలయందు,

నర్దతామ్ = ధ్వని చేయుచున్న, కపిముఖ్యానామ్ = వానరశ్రేష్ఠులయొక్క, స్వనమ్=ధ్వనిని, అచిరాత్=కొద్దికాలములో, శ్రోష్యసి=వినగలవు.

తా. పర్వతమువంటి, మేఘములవంటి పెద్ద దేహము గల వానర శ్రేష్ఠులు, లంకలోను, మలయపర్వతము చరియల పైన ధ్వని చేయుచుండగా అచిరకాలములో వినగలవు. 27

మూ. నివృత్తవనవాసం చ త్వయా సార్ధమరిందమమ్,
అభిషిక్తమయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్.

ప్ర. అ. నివృత్తవనవాసమ్=పూర్తియైన వనవాసము కలవాడు, అరిందమమ్=శత్రుసంహారకుడు, అయోధ్యాయామ్=అయోధ్యలో, త్వయా సార్థమ్=నీతో కూడ, అభిషిక్తమ్ = రాజ్యాభిషిక్తుడూ అయిన, రాఘవమ్= రాముని, క్షిప్రమ్=శీఘ్రముగా, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. శత్రుసంహారకుడైన రాముడు వనవాసము పూర్తి చేసికొని అయోధ్యా నగరములో నీతో కలిసి రాజ్యాభిషిక్తుడు అగుటను చూడగలవు. 28

మూ. తతో మయా వాగ్భిరదీనభాషిణా
శివాభిరిష్టాభిరభిప్రసాదితా,
జగామ శాన్తిం మమ మైథిలాత్మజా
తవాపి శోకేన తదాభిపీడితా. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే సున్దరకాణ్డే
అష్టషష్టితమః సర్గః.
సమాప్తశ్చాయం సున్దరకాణ్డః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తవ=నీయొక్క, శోకేనాపి= శోకము చేతకూడ, తదా=అప్పుడు, అభిపీడితా=పీడింపబడిన, మైథిలాత్మజా = సీత, అదీనభాషిణా=దైన్యము లేకుండా మాటలాడిన, మయా=నాచేత, శివాభిః = మంగళకరములు, ఇష్టాభిః=ఇష్టములు అయిన, మమ=నాయొక్క, వాగ్భిః= మాటల చేత, అభిప్రసాదితా=ఓదార్చబడినదై, శాన్తిమ్=శాంతిని, జగామ= పొందెను.

తా. నీవు శోకములో ఉన్నావు అని ఎనుటరేత కూడ సీత ఎక్కువ దుఃఖించుచుండెను. అట్టి ఆమెను నేను, దైన్యము లేకుండా మాటలాడుచు, మంగళ ప్రదములు, ఇష్టములు అయిన మాటలతో ఓదార్చగా ఆమె మనస్సులో శాంతి పొందినది. 29

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు సుందరకాండలో అరువదిఎనిమిదవ సర్గ సమాప్తము.

సుందరకాండ సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.

దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్తాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీ। శ్రీ। శ్రీ।

# స్మార్తాదీనాం శ్రీమద్రామాయణోపక్రమే
# అనుసంధేయాః శ్లోకాః

### అథ శ్రీమహాగణపతిధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

అగజాననపద్మార్కం గజానన మహర్నిశమ్,
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే. 2

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యాః స్యు స్తం నమామి గజాననమ్. 3

### సరస్వతీ ప్రార్థనా

శారదా శారదాంభోజవదనా వదనాంబుజే
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్. 1

యా కుందేందుతుషారహారధవలా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా,
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిర్దేవైః సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా. 2

దోర్భి ర్యుక్తా చతుర్భి స్స్ఫటికమణిమయీ మక్షమాలాం దధానా
హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసా కుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా. 3

### వాల్మీకినమస్క్రియా—

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 3

ఆంజనేయనమస్క్రియా.

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 1

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 2

ఆమిషీకృతమార్తాండం గోష్పదీకృతసాగరమ్,
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమా మ్యహమ్. 3

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 4

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్. 5

యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్. 6

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

## శ్రీరామాయణప్రార్థనా

వాల్మీకిస్మృతిమందరేణ మథిత స్సీతారమాసంభవ
స్సుగ్రీవామరభూరుహో౽ంగదగజ స్సౌమిత్రిచంద్రోదయః,
వాతోత్పన్నమణి ర్విభీషణసుధః పౌలస్త్యహాలాహలః
శ్రీరామాయణదుగ్ధసింధు రమలో భూయా త్స నశ్శ్రేయసే. 1

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధి జరావిపత్తిమరణై రత్యంత సోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్. 2

తదుపగత సమాస సంధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్. 5

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా. 6

## శ్రీరామధ్యానమ్

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 1

వామే భూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చాత్ సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ,

సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్. 2

మాతా రామో మత్పితా రామచంద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః,
సర్వస్వం మే రామచంద్రో దయాళు
ర్నాన్యం దైవం నైవ జానే న జానే. 3

సాకేతే శరదిందుకుందధవళే సౌధే మహామండపే
పర్యస్తాగరుధూపదీపవలితే కర్పూరదీపోజ్జ్వలే,
సుగ్రీవాంగదజాంబవత్పరివృతం సౌమిత్రిణా సేవితం
లీలామానుషవిగ్రహం రఘువరం రామం భజే శ్యామలమ్. 4

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః. 5

తతః శ్రీకోశపతి శ్రీరామావాహనాది నైవేద్యాంతపూజా విధేయా.
పారాయణావసానే చ పునః పూజా కర్తవ్యా.

## పారాయణసమాపనసమయే
## అనుసంధేయశ్లోకత్రయమ్

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవంతు. 1

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాః సంతు నిర్భయాః. 2

అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః,
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్. 3

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 4

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 5

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః. 6

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 7

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్. 8

యన్మంగళం సువర్ణస్య వినతాఽకల్పయత్ పురా,
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్. 9

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్. 10

త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్. 11

ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే,
మంగళాని మహాబాహో దిశంతు తవ సర్వదా. 12

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
శ్రీరాఘవాయేతి సమర్పయామి. 13

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ శ్రీరాఘవ నమోఽస్తుతే. 14

ఆత్మా త్వం శివా మతిః పరిజనాః ప్రాణాః శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః।
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం రామాస్తు తే పూజనమ్. 15

సీతావివాహపట్టాభిషేకసర్గయోస్తు 'ఇయం సీతా మమ సుతా' 'అభ్యషించ న్నరవ్యాఘ్రమ్' ఇతి శ్లోకపఠనాత్ పూర్వం విశేషతో ధ్యానావాహన నైవేద్యాది సీతారామానందసపర్యా సంవిధేయా.

అనేన శ్రీమద్రామాయణపారాయణేన భగవాన్ సర్వదేవతాత్మకః సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రః సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు.

# శ్రీవైష్ణవైః శ్రీమద్రామాయణపారాయణారంభే
# పఠనీయాః శ్లోకాః

ప్రథమతః స్వస్వసంప్రదాయనిర్వాహకాచార్యానుసంధానమ్. తతః

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్,
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్. 1

యో నిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే. 2

మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా. 3

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్. 4

అథ శ్రీశైలపూర్ణవిషయమ్

పితామహస్యాపి పితామహాయ
ప్రాచేతసాదేశ ఫలప్రదాయ,
శ్రీభాష్యకారోత్తమదేశికాయ
శ్రీశైలపూర్ణాయ నమో నమస్తాత్.

ఇతి శ్లోక మారభ్య శ్రీభాష్యకారప్రభృతి స్వాచార్య పర్యంత విషయాః స్వసాంప్రదాయికాః శ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్యప్రభృతి శ్రీధర పర్యంత ప్రతివ్యక్తి విషయాః శ్లోకా అనుసంధేయాః.

## విష్వక్సేనధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే. 2

## శ్రీహయగ్రీవధ్యానమ్

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే. 1

అతుంగగురకలారాస స్థూలంకత్య పయుషే,
తుంగాయ మహసే తస్మై తురంగాయ ముఖే నమః. 2

## వాల్మీకిధ్యానమ్

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 3

## ఆంజనేయ ప్రార్థనా

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 1

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 2

అమితీకృతమార్తాండం గోష్పదీకృతసాగరమ్,
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమామ్యహమ్. 3

మనోజవం మారుతతుల్యవేగం
    జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
    శ్రీరామదూతం శిరసా నమామి. 4

ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం
    యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
    నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 5

ఆంజనేయ మతిపాటలాననం
    కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం
    భావయామి పవమాననందనమ్. 6

యత్ర యత్ర రఘునాథకీర్తనం
    తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం
    మారుతిం నమత రాక్షసాంతకమ్ 7

శ్రీరామాయణప్రార్థనా

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా. 1

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 2

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్. 5

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్ పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు.
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం,
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్. 6

తదుపగతసమాససంధియోగం
సమమధురోపనతార్థవాక్యబద్ధమ్
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 7

శ్రీరామ ప్రార్థనా.

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్,
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి. 8

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ 9

తతో యథాశక్తి శ్రీసీతాపతి భగవదారాధనం కార్యమ్.

అథ - ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్.
తప స్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్.

ఇతి శ్లోకద్వయం పఠిత్వా 'శ్రీ రఘునందనపరబ్రహ్మణే నమః'
ఇత్యుక్త్వా పారాయణం పూరయేత.

## పారాయణసమాపనే అనుసంధేయశ్లోకక్రమః

ఏవమేతత్ పురావృత్త మాఖ్యానం భద్రమస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్. 1

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః. 2

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః. 3

కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్. 4

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు. 5

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 6

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామల మూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్. 7

విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్. 8

పితృభక్తాయ సతతం భ్రాతృభిః సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్. 9

త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్. 10

సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్. 11

దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్. 12

సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్. 13

హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే.
వాలిప్రమథనా యాస్తు మహాధీరాయ మంగళమ్ 14

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్. 15

ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా.
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్. 16

మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్. 17

కాయేన వాచా మనసేంద్రియైర్వా,
బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి. 18

తతః పితామహస్య ఛాత్రస్య స్వాచార్యపర్యంతశ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్య మారభ్య శ్రీధరపర్యంతా గురుపరంపరాఽనుసంధేయా. సీతావివాహపట్టాభిషేకసర్గయోస్తు 'ఇయం సీతా మమ సుతా' 'అభ్యషించ న్నరవ్యాఘ్రం' ఇతి శ్లోకపఠనాత్ పూర్వం మధ్యే విశేషతో భగవదారాధనం చ కర్తవ్యమ్.

# మాధ్వానాం రామాయణపారాయణోపక్రమే
# అనుసంధేయాః శ్లోకాః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

లక్ష్మీనారాయణం వందే తద్భక్తప్రవరో హి యః,
శ్రీమదానందతీర్థాఖ్యో గురుస్తం చ నమామ్యహమ్. 2

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా,
ఆదా వంతే చ మధ్యే చ విష్ణుః సర్వత్ర గీయతే. 3

సర్వవిఘ్నప్రశమనం సర్వసిద్ధికరం పరమ్,
సర్వజీవప్రణేతారం వందే విజయదం హరిమ్. 4

సర్వాభీష్టప్రదం రామం సర్వారిష్టనివారకమ్,
జానకీజాని మనిశం వందే మద్గురువందితమ్. 5

అభ్రమం భంగరహిత మజడం విమలం సదా,
ఆనందతీర్థ మతులం భజే తాపత్రయాపహమ్. 6

భవతి యదనుభావా దేడమూకోఽపి వాగ్మీ
జడమతి రపి జంతు ర్జాయతే ప్రాజ్ఞమౌలిః,
సకలవచనచేతోదేవతా భారతీ సా
మమ వచసి విధత్తాం సన్నిధిం మానసే చ. 7

మిథ్యాసిద్ధాంతదుర్ధ్వాంత విధ్వంసన విచక్షణః,
జయతీర్థాఖ్యతరణి ర్భాసతాం నో హృదంబరే. 8

చిత్రైః పదైశ్చ గంభీరై ర్వాక్యై ర్మానై రఖండితైః,
గురుభావం వ్యంజయంతీ భాతి శ్రీజయతీర్థవాక్. 9

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 10

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 11

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 12

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 13

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 14

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి. 15

ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 16

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్. 17

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్. 18

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా. 19

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్. 20

తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్ 21

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్.
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 22

వందే వంద్యం విధిభవమహేంద్రాది బృందారకేంద్రైః
వ్యక్తం వ్యాప్తం స్వగుణగణతో దేశతః కాలతశ్చ,
ధూతావద్యం సుభగతిమయై ర్మంగళై ర్దృష్ట మంగైః
సానాథ్యం నో విదధ దధికం బ్రహ్మ నారాయణాఖ్యమ్. 23

భూషారత్నం భువనవలయ స్యాఖిలాశ్చర్యరత్నం
లీలారత్నం జలధిదుహితు ర్దేవతామౌళిరత్నమ్,
చింతారత్నం జగతి భజతాం సత్సరోజద్యురత్నం
కౌసల్యాయా లసతు మమ హృన్మండలే పుత్రరత్నమ్. 24

మహావ్యాకరణాంభోధి మంథమానస మందరమ్,
కవయంతం రామకీర్త్యా హనుమంత ముపాస్మహే. 25

ముఖ్యప్రాణాయ భీమాయ నమో యస్య భుజాన్తరమ్.
నానావీరసువర్ణానాం నికషాశ్మాయితం బభౌ. 26

స్వాంతస్థానంతశయ్యాయ పూర్ణజ్ఞానమహార్ణసే,
ఉత్తుంగవాక్తరంగాయ మధ్వదుగ్ధాబ్ధయే నమః. 27

వాల్మీకేర్గౌః పునీయాన్నో మహీధరపదాశ్రయా,
యద్దుగ్ధ ముపజీవంతి కవయస్తర్ణకా ఇవ. 28

సూక్తిరత్నాకరే రమ్యే మూలరామాయణార్ణవే,
విహరంతో మహీయాంసః ప్రీయంతాం గురవో మమ. 29

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యో వదేత్,
తస్య నిస్సరతే వాణీ జహ్నుకన్యాప్రవాహవత్. 30

(పారాయణసమాపనవిధి శ్రీవైష్ణవులకు వలె)

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః.

13వ సర్గ శ్లో. 59 (పుట 273.274)

శ్రీరామాయ నమః

# శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# యుద్ధకాండము

## మొదటి సంపుటము

శ్రీః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

బాలానందినీసహిత మగు

# శ్రీమద్రామాయణము - యుద్ధకాండము

## అథ ప్రథమః సర్గః

[శ్రీరాముడు హనుమంతుని ప్రశంసించి అతనిని కౌగలించుకొనుట. సముద్రమును దాటుట ఎట్లా అని ఆలోచించుట.]

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం యథావదభిభాషితమ్,
రామః ప్రీతిసమాయుక్తో వాక్యముత్తరమబ్రవీత్. 1

ప్ర. అ. రామః=రాముడు, యథావత్=ఉన్నదున్నట్లుగా, అభిభాషితమ్=పలుకబడిన, హనుమతః=హనుమంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, ప్రీతిసమాయుక్తః=ఆనందముతో కూడినవాడై, ఉత్తరమ్=ప్రత్యుత్తరరూపమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు ఉన్నదున్నట్లుగా చెప్పుచు పలికిన మాటలు విని, రాముడు సంతోషించుచు ఇట్లు పలికెను. 1

మూ. కృతం హనుమతా కార్యం సుమహద్భువి దుర్లభమ్,
మనసాపి యదన్యేన న శక్యం ధరణీతలే. 2

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, యత్=ఏది, ధరణీతలే=భూతలమునందు, అన్యేన=ఇతరునిచేత, మనసాపి=మనస్సుచేత కూడ, న శక్యమ్=శక్యము కాదో అట్టి, సుమహత్=చాల గొప్పదైన, భువి=భూలోకమునందు, దుర్లభమ్=దుర్లభమైన, కార్యమ్=కార్యము, కృతమ్=చేయబడినది.

తా. ఈ భూలోకములోని ఇతరు లెవ్వరూ మనస్సుచేత కూడ చేయజాలని భూమియందు దుర్లభమైన గొప్ప కార్యమును హనుమంతుడు చేసినాడు. 2

మూ. న హి తం పరిపశ్యామి యస్తరేత మహోదధిమ్,
అన్యత్ర గరుడాద్వాయోరన్యత్ర చ హనూమతః. 3

ప్ర. అ. గరుడాత్=గరుత్మంతునికంటె, వాయోః=వాయువుకంటె, అన్యత్ర=వేరుగా, హనూమతః=హనుమంతుని కంటె, అన్యత్ర=వేరుగా, యః=ఎవడు, మహోదధిమ్=మహాసముద్రమును, తరేత=దాటునో, తమ్=అట్టి వానిని, న పరిపశ్యామి హి=చూడను కదా!

తా. గరుత్మంతుడు, వాయువు, ఈ హనుమంతుడు తప్ప సముద్రమును దాటగలిగినవా రెవ్వరూ మరొకరు నాకు కనబడుటలేదు. 3

మూ. దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్,
అప్రధృష్యాం పురీం లఙ్కాం రావణేన సురక్షితామ్, 4
ప్రవిష్టః సత్త్వమాశ్రిత్య జీవన్కో నామ నిష్క్రమేత్.

ప్ర. అ. దేవదానవయక్షాణామ్=దేవతలకు, దానవులకు, యక్షులకు, గన్ధర్వోరగరక్షసామ్=గంధర్వులకు, ఉరగులకు, రాక్షసులకు, అప్రధృష్యామ్=ఎదిరింప శక్యము కానిది, రావణేన=రావణునిచేత, సురక్షితామ్=బాగుగా రక్షింపబడినది అయిన, లఙ్కాం పురీమ్=లంకాపురమును, సత్త్వమ్=బలమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, ప్రవిష్టః=ప్రవేశించినవాడై, కో నామ=ఎవడు, జీవన్=జీవించుచున్నవాడై, నిష్క్రమేత్=తిరిగివచ్చును?

తా. దేవ - దానవ - యక్ష - గంధర్వ - ఉరగ - రాక్షసులలో ఎవ్వరూ కూడ ఎదిరింపరాని, రావణపాలితమైన లంకలో కేవలము తన బలముతో ప్రవేశించి ఎవడైనా ప్రాణాలతో తిరిగిరాగలడా? 4

మూ. కో విశేత్సుదురాధర్షాం రాక్షసైశ్చ సురక్షితామ్, 5
యో వీర్యబలసంపన్నో న సమః స్యాద్ధనూమతః.

ప్ర. అ. యః=ఎవడు, వీర్యబలసంపన్నః=పరాక్రమముతోను బలము తోను కూడినవాడై, హనూమతః=హనుమంతునితో, సమః=సమానుడు, న స్యాత్=కాకుండునో, అట్టి, కః=ఎవడు, సుదురాధర్షామ్=మిక్కిలి ఎదిరింప శక్యము కానిది, రాక్షసైః=రాక్షసులచేత, సురక్షితామ్=బాగుగా రక్షింపబడినది అయిన లంకను, విశేత్=ప్రవేశించును ?

తా. ఎదిరింప శక్యము కానిది, రాక్షసులచేత బాగుగా రక్షింపబడు చున్నదీ అయిన లంకలోనికి, వీర్యబలముతో సంపన్నుడై, హనుమంతునితో సమానుడైనవాడు తప్ప మరెవ్వడు ప్రవేశింపగలడు? 5

మూ. భృత్యకార్యం హనుమతా సుగ్రీవస్య కృతం మహత్, 6
ఏవం విధాయ స్వబలం సదృశం విక్రమస్య చ.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, విక్రమస్య=పరాక్రమమునకు, సదృశమ్ =సమానమైన, స్వబలమ్= తన బలమును, విధాయ=చేసి(చూపి), సుగ్రీవస్య=సుగ్రీవునకు, మహత్=గొప్ప, భృత్యకార్యమ్=భృత్యుని కార్యము, కృతమ్=చేయబడినది.

తా. హనుమంతుడు పరాక్రమమునకు తగిన తన బలమును ప్రదర్శించి, సుగ్రీవునకు భృత్యుడు చేయవలసిన గొప్ప కార్యమును సాధించిపెట్టినాడు.6

మూ. యో హి భృత్యో నియుక్తః సన్ భర్త్రా కర్మణి దుష్కరే, 7
కుర్యాత్తదనురాగేణ తమాహుః పురుషోత్తమమ్.

ప్ర. అ. యః=ఏ, భృత్యః=భృత్యుడు, దుష్కరే=చేయ శక్యము కాని, కర్మణి =పనియందు, భర్త్రా= ప్రభువుచేత, నియుక్తః సన్=నియమింపబడినవాడై, తత్=ఆ పనిని, అనురాగేణ=ఆసక్తితో, కుర్యాత్=చేయునో, తమ్=అతనిని, పురుషోత్తమమ్=పురుషులలో శ్రేష్ఠునిగా, ఆహుః=చెప్పెదురు.

తా. చేయుటకు చాల కష్టమైన పని చేయుటకు ప్రభువు నియమించగా ఆ పనిని ఆసక్తితో చేయు భృత్యుడు పురుషులలో శ్రేష్ఠుడు అని చెప్పెదురు.7

మూ. యో నియుక్తః పరం కార్యం న కుర్యాన్నృపతేః ప్రియమ్, 8
భృత్యో యుక్తః సమర్థశ్చ తమాహుర్మధ్యమం నరమ్.

ప్ర. అ. యః=ఏ, భృత్యః=భృత్యుడు, యుక్తః=బుద్ధియుక్తుడై, సమర్థః చ= సమర్థుడై ఉండి కూడ, నియుక్తః=నియోగింపబడినవాడై, నృపతేః=రాజునకు, ప్రియమ్=ఇష్టమైన, కార్యమ్=కార్యమును, పరమ్= అధికముగా, న కుర్యాత్=చేయడో, తమ్=వానిని, మధ్యమం నరమ్=మధ్యముడైన నరునిగా, ఆహుః=చెప్పెదురు.

తా. బుద్ధిమంతుడై యుండి, సమర్థుడై ఉండి కూడ ఏ భృత్యుడు రాజుకు ప్రియమైన పనిని చెప్పినదానికంటె అధికము చేయడో అతడు మధ్యముడైన నరుడని చెప్పెదురు. 8

మూ. నియుక్తో నృపతేః కార్యం న కుర్యాద్యః సమాహితః, 9
భృత్యో యుక్తః సమర్థశ్చ తమాహుః పురుషాధమమ్.

ప్ర. అ. నియుక్తః=నియోగింపబడిన, యః=ఏ, భృత్యః=భృత్యుడు, యుక్తః=బుద్ధియుక్తుడైనను, సమర్థశ్చ=సమర్థుడైనను, నృపతేః=రాజుయొక్క, కార్యమ్=కార్యమును, సమాహితః=సావధానచిత్తుడై, న కుర్యాత్=చేయడో, తమ్=వానిని, పురుషాధమమ్=పురుషులలో అధమునిగా, ఆహుః=చెప్పెదురు.

తా. ఒక కార్యమునందు నియుక్తుడైన భృత్యుడు, బుద్ధిమంతుడై ఉండి, సమర్థుడై ఉండి కూడ ప్రభువు కార్యమును శ్రద్ధగా చేయకపోయినచో వాడు పురుషులలో అధముడు అని చెప్పుదురు. 9

మూ. తన్నియోగే నియుక్తేన కృతం కృత్యం హనూమతా, 10
న చాత్మా లఘుతాం నీతః సుగ్రీవశ్చాపి తోషితః.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, నియోగే=కార్యమునందు, నియుక్తేన=నియమింపబడిన, హనూమతా=హనుమంతునిచేత, కృత్యమ్=కార్యము, కృతమ్=చేయబడినది. ఆత్మా=తాను, లఘుతామ్=లఘుత్వమును, న నీతః=పొందింపబడలేదు. సుగ్రీవశ్చాపి=సుగ్రీవుడు కూడ, తోషితః=సంతోషపెట్టబడినాడు.

తా. కార్యమును చేయుటకై నియుక్తుడైన హనుమంతుడు ఆ పనిని సాధించినాడు. తనను ఏ మాత్రము తేలికపరచుకొనలేదు. సుగ్రీవునకు సంతోషము కలిగించినాడు. 10

మూ. అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః, 11
వైదేహ్యా దర్శనేనాద్య ధర్మతః పరిరక్షితాః.

ప్ర. అ. వైదేహ్యాః=సీతయొక్క, దర్శనేన=దర్శనముచేత, అద్య=ఇప్పుడు, అహం చ=నేను, రఘువంశశ్చ=రఘువంశము, మహాబలః=గొప్పబలము గల, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, ధర్మతః=ధర్మానుసారముగా, పరిరక్షితాః=రక్షింపబడినాము.

తా. హనుమంతు డిప్పుడు సీతను చూచి వచ్చి నన్ను, రఘువంశమును, మహాబలుడైన లక్ష్మణుని ధర్మానుసారము రక్షించినాడు. 11

మూ. ఇదం తు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి, 12
యదిహాస్య ప్రియాఖ్యాతుర్న కుర్మి సదృశం ప్రియమ్.

ప్ర. అ. తు=కాని, ప్రియాఖ్యాతుః=ప్రియమైన వార్తను చెప్పిన, అస్య=ఈతనికి, సదృశమ్=తగిన, ప్రియమ్=ప్రియమును, యత్ న కుర్మి=నేను చేయుటలేదు అనునది ఏది కలదో, ఇదమ్=ఇది, దీనస్య=దీనుడనైన, మమ=నాయొక్క, మనః=మనస్సును, భూయః=అధికముగా, ప్రకర్షతి=లాగుచున్నది.

తా. కాని నేను, ప్రియవార్తను చెప్పిన ఈతనికి తగు ప్రియమును చేయజాలకున్నాను. అదియే దీనుడ నైన నా మనస్సును చాల పీడించుచున్నది.

మూ. ఏష- సర్వస్వభూతస్తు పరిష్వజ్గో హనూమతః, 13
మయా కాలమిమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః.

ప్ర. అ. మయా=నాచేత, ఇమమ్=ఈ, కాలమ్=కాలమును, ప్రాప్య=పొంది, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=అట్టి, హనూమతః=హనుమంతునకు, సర్వస్వభూతః=నా సర్వస్వమైన, ఏషః పరిష్వఙ్గః=ఈ ఆలింగనము, దత్తః=ఇవ్వబడినది.

తా. అట్టి మహాత్ముడైన హనుమంతునకు, ఈ సమయమునందు నేను నా సర్వస్వమైన ఆలింగనమును ఇచ్చుచున్నాను. 13

మూ. ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాఙ్గో రామస్తం పరిషస్వజే, 14
హనుమన్తం కృతాత్మానం కృతవాక్యముపాగతమ్.

ప్ర. అ. రామః=రాముడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, ప్రీతిహృష్టాఙ్గః=సంతోషముచే వికసించిన శరీరము కలవాడై, కృతాత్మానమ్=వినీతమైన (అదుపులో ఉంచుకొనబడిన) బుద్ధి గలవాడు, కృతవాక్యమ్=చేయుబడిన వాక్యము (ఆజ్ఞ) కలవాడు అయిన, ఉపాగతమ్=వచ్చిన, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని, పరిషస్వజే=కౌగలించుకొనెను.

తా. రాము డిట్లు పలికి, సంతోషముతో శరీరము పులకించగా, వినయముతో కూడిన బుద్ధి గల తన కార్యమును పూర్తిచేసి వచ్చిన హనుమంతుని కౌగలించుకొనెను. 14

మూ. ధ్యాత్వా పునరువాచేదం వచనం రఘుసత్తమః, 15
హరీణామీశ్వరస్యాపి సుగ్రీవస్యోపశృణ్వతః.

ప్ర. అ. రఘుసత్తమః=రాముడు, ధ్యాత్వా=ఆలోచించి, హరీణామ్=వానరులయొక్క, ఈశ్వరస్య=ప్రభువైన, సుగ్రీవస్య=సుగ్రీవుడు, ఉపశృణ్వతః=వినుచుండగా, పునః=మరల, ఇదం వచనమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాముడు కొంచెము సేపు ఏదో ఆలోచించి, వానరప్రభువైన సుగ్రీవుడు వినుచుండగా మరల ఇట్లు పలికెను. 15

మూ. సర్వథా సుకృతం తావత్సీతాయాః పరిమార్గణమ్, 16
సాగరం తు సమాసాద్య పునర్నష్టం మనో మమ.

ప్ర. అ. సీతాయాః=సీతయొక్క, పరిమార్గణమ్=అన్వేషణము, సర్వథా=అన్ని విధముల, సుకృతమ్=బాగుగా చేయబడినది. తు=కాని, సాగరమ్=సముద్రమును, సమాసాద్య=చేరి, మమ మనః=నా మనస్సు,

పునః=మరల, నష్టమ్=నష్టమైనది.

తా. మీరు అన్ని విధాలా సీతాన్వేషణమును చక్కగా చేసినారు. కాని నా మనస్సు సముద్రము స్ఫురించగానే ఏమి చేయవలెనో తోచకుండ అయిపోవుచున్నది. 16

మూ. కథం నామ సముద్రస్య దుష్పారస్య మహామ్భసః, 17
హరయో దక్షిణం పారం గమిష్యన్తి సమాగతాః.

ప్ర. అ. సమాగతాః=కలిసి ఉన్న, హరయః=వానరులు, దుష్పారస్య=దాటశక్యము కానిది, మహామ్భసః=గొప్ప జలము గలది అయిన, సముద్రస్య=సముద్రముయొక్క, దక్షిణమ్=దక్షిణపుదైన, పారమ్=ఒడ్డును, కథమ్=ఎట్లు, గమిష్యన్తి=పొందగలరో ?

తా. ఈ వానరులందరూ కలిసి అధికమైన జలముతో అగాధమై దాటశక్యము కాని సముద్రము దక్షిణతీరమును ఎట్లు చేరగలరో! 17

మూ. యద్యప్యేష తు వృత్తాన్తో వైదేహ్యా గదితో మమ, 18
సముద్రపారగమనే హరీణాం కిమివోత్తరమ్.

ప్ర. అ. వైదేహ్యా=సీతయొక్క, ఏషః=ఈ, వృత్తాన్తః=వృత్తాంతము, మమ=నాకు, గదితో యద్యపి=చెప్పబడినదైనను, హరీణామ్=వానరులయొక్క, సముద్రపారగమనే=సముద్రమును దాటుటయందు, ఉత్తరమ్= ఉత్తరము, కిమ్=ఏమి ?

తా. నాకు సీతావృత్తాంతము తెలిసినది. అది బాగుగానే ఉన్నది కాని ఈ సముద్రమును వానరు లెట్లు దాటగలరు అనుదానికి సమాధానమేమి ?18

మూ. ఇత్యుక్త్వా శోకసంభ్రాన్తో రామః శత్రునిబర్హణః, 19
హనూమన్తం మహాబాహుస్తతో ధ్యానముపాగమత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ప్రథమః సర్గః

ప్ర. అ. శత్రునిబర్హణః=శత్రుసంహారకుడు, మహాబాహుః=గొప్ప బాహువులు గలవాడు అయిన, రామః=రాముడు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, శోకసంభ్రాన్తః= శోకముచేత భ్రాంతి చెందినవాడై, తతః=అటుపిమ్మట, ధ్యానమ్=ధ్యానమును, ఉపాగమత్=పొందెను.

తా. శత్రుసంహారకుడు, మహాబాహువు అయిన రాముడు హనుమంతునితో ఇట్లు పలికి శోకాక్రాంతుడై ఆలోచింపసాగెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో మొదటిసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

[సుగ్రీవుడు శోకసంతప్తుడైన రామునకు ధైర్యము చెప్పుట.]

మూ. తం తు శోకపరిద్యూనం రామం దశరథాత్మజమ్,
ఉవాచ వచనం శ్రీమాన్ సుగ్రీవః శోకనాశనమ్. 1

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, శోకపరిద్యూనమ్=శోకముచేత సంతప్తుడైన, దశరథాత్మజమ్=దశరథకుమారుడైన, తమ్=ఆ, రామమ్=రామునిగూర్చి, శోకనాశనమ్=దుఃఖమును నశింపచేయు, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. దశరథకుమారుడైన రాముడు ఆ విధముగా దుఃఖించుచుండగా శ్రీమంతుడైన సుగ్రీవుడు ఆతనితో శోకమును తొలగించు ఈ వచనము పలికెను. 1

మూ. కిం త్వయా తప్యతే వీర యథాన్యః ప్రాకృతస్తథా,
మైవం భూస్త్యజ సంతాపం కృతఘ్న ఇవ సౌహృదమ్. 2

ప్ర. అ. వీర=వీరుడా, అన్యః=ఇతరుడైన, ప్రాకృతః=సాధారణపురుషుడు, యథా=ఎట్లో, తథా=అట్లు, త్వయా=నీచేత, కిమ్=ఎందువలన, తప్యతే=దుఃఖించుట చేయబడుచున్నది ? ఏవమ్=ఇట్లు, మా భూః=అవకుము, కృతఘ్నః=కృతఘ్నుడు, సౌహృదమ్ ఇవ=స్నేహమును వలె, సంతాపమ్=తాపమును, త్యజ=విడువుము.

తా. వీరుడా ! సాధారణమానవుడు వలె ఇట్లు దుఃఖించుచున్నావేమి ? నీవు ఈ విధముగా ఉండగూడదు. కృతఘ్నుడు స్నేహమును విడిచినట్లు నీ శోకమును విడిచిపెట్టుము. 2

మూ. సంతాపస్య చ తే స్థానం న హి పశ్యామి రాఘవ,
ప్రవృత్తావుపలబ్ధాయాం జ్ఞాతే చ నిలయే రిపోః. 3

ప్ర. అ. రాఘవ=రామా ! ప్రవృత్తౌ=(సీత) వృత్తాంతము, ఉపలబ్ధాయామ్= పొందబడిన దగుచుండగా, తే=నీయొక్క, సంతాపస్య=దుఃఖమునకు, స్థానమ్=అవకాశమును, న పశ్యామి హి=చూడను కదా !

తా. రామా ! సీత వార్త తెలిసినది. శత్రువు ఎక్కడ ఉన్నాడో కూడ తెలిసినది. అందుచేత ఇంక నీవు దుఃఖించుటకు కారణ మేమీ నాకు కనబడుటలేదు. 3

మూ. మతిమాన్ శాస్త్రవిత్ప్రాజ్ఞః పణ్డితశ్చాసి రాఘవ,
త్యజేమాం ప్రాకృతాం బుద్ధిం కృతాత్మేవార్థదూషణీమ్. 4

ప్ర. అ. రాఘవ=రామా! మతిమాన్=బుద్ధిమంతుడవు, శాస్త్రవిత్=శాస్త్రములు వెరిగినవాడవు, ప్రాజ్ఞః=ఆలోచనాశక్తి గలవాడవు, పణ్డితశ్చ=నిర్ణయము చేయు సమర్థుడవు, అసి=అయియున్నావు. కృతాత్మా=నిగ్రహించుకొనబడిన బుద్ధి గలవాడు, అర్థదూషణీమ్=కార్యవిఘాతమును కలిగించు, బుద్ధిమ్ ఇవ=బుద్ధిని వలె, ఇమామ్=ఈ, ప్రాకృతామ్=సామాన్యమైన, బుద్ధిమ్=బుద్ధిని, త్యజ= విడువుము.

తా. రామా ! నీవు బుద్ధిమంతుడవు. శాస్త్రము తెలిసినవాడవు. ఆలోచనాశక్తి కలవాడవు. తగు నిర్ణయములు చేయగలవాడవు. అందుచేత బుద్ధిమంతుడు కార్యవిఘాతకమైన ఆలోచనలు విడచినట్లు ఈ సామాన్యపు ఆలోచనలను విడిచిపెట్టుము. 4

మూ. సముద్రం లఙ్ఘయిత్వా తు మహానక్రసమాకులమ్,
లఙ్కామారోహయిష్యామో హనిష్యామశ్చ తే రిపుమ్. 5

ప్ర. అ. మహానక్రసమాకులమ్=గొప్ప మొసళ్లతో వ్యాకులమైన, సముద్రమ్= సముద్రమును, లఙ్ఘయిత్వా=దాటి, లఙ్కామ్=లంకను, ఆరోహయిష్యామః= ఎక్కెదము. తే=నీయొక్క, రిపుమ్=శత్రువును, హనిష్యామశ్చ=చంపెదము.

తా. పెద్ద మొసళ్లతో నిండి ఉన్న సముద్రము దాటి లంకలో ప్రవేశించెదము. నీ శత్రువును సంహరించెదము. 5

మూ. నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః,
సర్వార్థా వ్యవసీదన్తి వ్యసనం చాధిగచ్ఛతి. 6

ప్ర. అ. నిరుత్సాహస్య=ఉత్సాహము లేనివాడు, దీనస్య=దీనుడు, శోకపర్యాకులాత్మనః=శోకముచేత వ్యాకులమైన బుద్ధి కలవాడు అయిన పురుషునియొక్క, సర్వార్థాః=అన్ని కార్యములు, వ్యవసీదన్తి=నశించును. వ్యసనం చ=ఆపదను కూడ, అధిగచ్ఛతి=పొందును.

తా. ఉత్సాహము లేక శోకముచేత బుద్ధి వ్యాకులమై, దీనుడుగా ఉన్న పురుషుని కార్యము లన్నీ చెడిపోవును. అతడు కష్టాల పొందును. 6

మూ. ఇమే శూరాః సమర్థాశ్చ సర్వతో హరియూథపాః,
త్వత్ప్రియార్థం కృతోత్సాహాః ప్రవేష్టుమపి పావకమ్, 7
ఏషాం హర్షేణ జానామి తర్కశ్చాపి దృఢో మమ.

ప్ర. అ. సర్వశః=నలుప్రక్కలందు ఉన్న, ఇమేః=ఈ, హరియూథపాః=వానరసేనానాయకులు, శూరాః=శూరులు, సమర్థాశ్చ=సమర్థులు. త్వత్ప్రియార్థమ్=నీ ప్రియముకొరకు, పావకమ్=అగ్నిని, ప్రవేష్టుమ్ అపి= ప్రవేశించుటకు కూడ, కృతోత్సాహాః=చేయబడిన ఉత్సాహము కలవారు. ఏషామ్=వీరియొక్క, హర్షేణ=సంతోషముచేత, జానామి=తెలిసికొనుచున్నాను. మమ=నాయొక్క, తర్కశ్చాపి=ఊహకూడ, దృఢః=దృఢమైనది.

తా. మన చుట్టూ నిలచి ఉన్న ఈ వానరనాయకు లందరూ శూరులు, సమర్థులు. నీకు ప్రియమును చేయుటకై అగ్నిలో దుముకుటకు కూడ ఉత్సాహవంతులై ఉన్నారు. నే నీ విషయమును వీరి సంతోషమును బట్టి తెలుసుకొనుచున్నాను. నా కీ విషయమున పూర్తి నమ్మక మున్నది. 7

మూ. విక్రమేణ సమానేష్యే సీతాం హత్వా యథా రిపుమ్, 8
రావణం పాపకర్మాణం తథా త్వం కర్తుమర్హసి.

ప్ర. అ. రిపుమ్=శత్రువు, పాపకర్మాణమ్=పాపకర్మ గలవాడు అయిన, రావణమ్=రావణుని, విక్రమేణ=పరాక్రమముచేత, హత్వా=చంపి, సీతామ్=సీతను, యథా=ఎట్లు, సమానేష్యే=తీసికొని రాగలనో, తథా=అట్లు, త్వమ్=నీవు, కర్తుమ్= చేయుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. శత్రువు, పాపకర్మలు ఆచరించువాడు అయిన రావణుని పరాక్రమముచేత చంపి, సీతను, నేను తీసికొనివచ్చుటకు తగిన ఉపాయమును ఆలోచింపుము. 8

మూ. సేతురత్ర యథా బద్ధ్యేద్యథా పశ్యేమ తాం పురీమ్, 9
తస్య రాక్షసరాజస్య తథా త్వం కురు రాఘవ.

ప్ర. అ. రాఘవ=రామా ! అత్ర=ఇక్కడ (సముద్రమునందు,) సేతుః=సేతువు, యథా=ఎట్లు, బధ్యేత్=కట్టబడునో, తస్య=ఆ, రాక్షస రాజస్య=రాక్షసరాజుయొక్క, తామ్=ఆ, పురీమ్=పట్టణమును, యథా=ఎట్లు పశ్యేమ=చూచెదమో, తథా=అట్లు, త్వమ్=నీవు, కురు=చేయుము.

తా. రామా ! సముద్రముపై సేతువు కట్టి రాక్షసరాజైన ఆ రావణుని నగరమైన లంకను మనము చేరు ఉపాయము ఆలోచింపుము.9

మూ. దృష్ట్వా తాం హి పురీం లఙ్కాం త్రికూటశిఖరే స్థితామ్, 10
హతం చ రావణం యుద్ధే దర్శనాదవధారయ.

ప్ర. అ. త్రికూటశిఖరే=త్రికూటపర్వతశిఖరమునందు, స్థితామ్=ఉన్న, తామ్= ఆ, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, దృష్ట్వా=చూచి,

యుద్ధే=యుద్ధమునందు, దర్శనాత్=దర్శనమువలననే, రావణమ్=రావణుని, హతమ్=చంపబడినవానినిగా, అవధారయ=నిశ్చయించుము.

తా. మనము త్రికూటపర్వతశిఖరము మీద ఉన్న లంకాపురమును చూచిన పిమ్మట యుద్ధములో రావణుడు మన కంటపడిన వెంటనే అతడు మరణించగలడని నమ్ముము. 10

మూ. అబద్ధ్వా సాగరే సేతుం ఘోరే చ వరుణాలయే, 11
లఙ్కా న మర్దితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః.

ప్ర. అ. ఘోరే=భయంకరమైన, వరుణాలయే=వరుణుని నివాసమైన, సాగరే=సముద్రమునందు, సేతుమ్=సేతువును, అబద్ధ్వా=కట్టకుండగా, లఙ్కా=లంక, సేన్ద్రైః=ఇంద్రునితోకూడిన, సురాసురైః అపి=సురాసురుల చేత కూడ, మర్దితుమ్=పీడించుటకు, న శక్యా=శక్యమైనది కాదు.

తా. భయంకరము, వరుణుని నివాసస్థానమూ అయిన సాగరమునందు సేతువును బంధించకుండగా ఇంద్రసహితులైన సురాసురులు కూడ లంకను పీడింపజాలరు. 11

మూ. సేతుర్బద్ధః సముద్రే చ యావల్లఙ్కాసమీపతః, 12
సర్వం తీర్ణం చ మే సైన్యం జితమిత్యుపధారయ.
ఇమే హి సమరే వీరా హరయః కామరూపిణః. 13

ప్ర. అ. లఙ్కాసమీపతః=లంక సమీపమునందు, సముద్రే=సముద్రమునందు, యావత్=ఎంతలో, సేతుః=సేతువు, బద్ధః=కట్టబడినదో, మే=నాయొక్క, సర్వం సైన్యమ్=సమస్తమైన సైన్యము, తీర్ణమ్=దాటినదో, అంతలో, జితమ్ ఇతి=మనచే జయించబడినది అని, ఉపధారయ=నిశ్చయించుము. కామరూపిణః=స్వేచ్ఛారూపముగల, ఇమే=ఈ, హరయః=వానరులు, సమరే=యుద్ధమునందు, వీరాః హి=వీరులు.

తా. లంకాసమీపమునందు సముద్రముమీద సేతువును బంధించి నా సైన్యము అంతా దాటిన వెంటనే మనము జయించితి మనియే నమ్ముము. ఇచ్ఛానుసారము రూపములను ధరించ గలిగిన ఈ వానరులు యుద్ధములో వీరులు. 12,13

మూ. తదలం విక్లబాం బుద్ధిం రాజన్ సర్వార్థనాశినీమ్,
పురుషస్య హి లోకేఽస్మిన్ శోకః శౌర్యాపకర్షణః. 14

ప్ర. అ. రాజన్=రాజా! తత్=ఆ కారణమువలన, సర్వార్థనాశినీమ్=సక

లకార్యములను నశింపచేయును, విక్లబామ్=వ్యాకులమైన, బుద్ధిమ్=బుద్ధిని వహించి, అలమ్=చాలును. అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, పురుషస్య=పురుషునకు, శోకః=శోకము, శౌర్యాపకర్షణః=శౌర్యమును తగ్గించివేయునది.

తా. రాజా ! అందుచే సకలకార్యములను నశింపచేయు మనోవ్యాకులత్వమును విడిచిపెట్టుము. ఈ లోకములో శోకము మానవుని శౌర్యమును తగ్గించివేయును. 14

మూ. యత్తు కార్యం మనుష్యేణ శౌండీర్యమవలమ్బ్యతామ్,
తదలంకరణాయైవ కర్తుర్భవతి సత్వరమ్. 15

ప్ర. అ. మనుష్యేణ=మనుష్యునిచేత, యత్=ఏ, శౌండీర్యమ్=శూరత్వము, కార్యం తు=చేయదగినదో, అది, అవలమ్బ్యతామ్=అవలంబింపబడుగాక. తత్=అది, సత్వరమ్=శీఘ్రముగా, కర్తుః=కర్తకు, అలంకరణాయైవ=అలంకారము (కార్యసాధనము) కొరకే, భవతి=అగును.

తా. మనుష్యుడు చూపవలసిన శౌర్యమును అవలంబించుము. అది దానిని చూపువానికి తప్పక కార్యసాధకము అగును. 15

మూ. అస్మిన్ కాలే మహాప్రాజ్ఞ సత్త్వమాతిష్ఠ తేజసా,
శూరాణాం హి మనుష్యాణాం త్వద్విధానాం మహాత్మనామ్,
వినష్టే వా ప్రనష్టే వా శోకః సర్వార్థనాశనః.

ప్ర. అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి కలవాడా ! అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, తేజసా=తేజస్సుతో, సత్త్వమ్=బలమును, ఆతిష్ఠ=అవలంబించుము. శూరాణామ్= శూరులు, మహాత్మనామ్=మహాత్ములు అయిన, త్వద్విధానామ్=నీవంటి, మనుష్యాణామ్= మనుష్యులకు, వినష్టే వా=కనబడకుండపోయినప్పుడు, ప్రనష్టే వా=నశించినప్పుడు, శోకః= శోకము, సర్వార్థనాశనః=సకలప్రయోజనములను నశింపచేయునది.

తా. మహాబుద్ధిశాలి వైన ఓ ! రామా ! ఈ సమయమునందు తేజస్సుతో బలమును చూపుము. ఎవరైన కనబడకుండ పోయినప్పుడు గాని, నశించి నప్పుడు గాని నీవంటి శూరులు, మహాత్ములు అయిన పురుషులు శోకము చెందుట సకలకార్యములను నశింపచేయును. 16

మూ. తత్త్వం బుద్ధిమతాం శ్రేష్ఠః సర్వశాస్త్రార్థకోవిదః, 17
మద్విధైః సచివైః సార్థమరిం జేతుం సమర్హసి.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, బుద్ధిమతామ్=బుద్ధిమంతులలో,

శ్రేష్ఠః=శ్రేష్ఠుడవు, సర్వశాస్త్రార్థకోవిదః=సమస్తమైన శాస్త్రవిషయములను ఎఱిగినవాడవు అయిన, త్వమ్=నీవు, మద్విధైః=నావంటి, సచివైః సార్థమ్=సహాయులతో కూడినవాడవై, అరిమ్=శత్రువును, జేతుమ్=జయించుటకు, సమర్థః=తగి ఉన్నావు.

తా. నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. సమస్తమైన శాస్త్రవిషయములు తెలిసినవాడవు. అందుచేత నీవు నావంటి సహాయులతో కలిసి శత్రువును జయించుము. 17

మూ. న హి పశ్యామ్యహం కంచిత్త్రిషు లోకేషు రాఘవ, 18
గృహీతధనుషో యస్తే తిష్ఠేదభిముఖో రణే.

ప్ర. అ. రాఘవ=రామా ! రణే=యుద్ధమునందు, గృహీతధనుషః=ధరింపబడిన ధనస్సు గల, తే=నీయొక్క, అభిముఖే=అభిముఖమునందు, యః=ఎవడు, తిష్ఠేత్=నిలబడునో అట్టి, కంచిత్=ఎవనినీ, త్రిషు=మూడు, లోకేషు=లోకములయందు, అహమ్=నేను, న పశ్యామి హి=చూడనుకదా !

తా. రామా ! నీవు యుద్ధరంగములో ధనస్సు ధరించి ఉండగా నీకు ఎదురుగా నిలబడగలవాడు ఎవ్వడూ నాకు ఈ మూడు లోకములలో కూడ కనబడుటలేదు. 18

మూ. వానరేషు సమాసక్తం న తే కార్యం విపత్స్యతే, 19
అచిరాద్ద్రక్ష్యసే సీతాం తీర్త్వా సాగరమక్షయమ్.

ప్ర. అ. వానరేషు=వానరులయందు, సమాసక్తమ్=సంబంధించి ఉన్న, తే కార్యమ్=నీ కార్యము, న విపత్స్యతే=విపత్తును పొందదు. అక్షయమ్=అంతము లేని, సాగరమ్= సముద్రమును, తీర్త్వా=దాటి, అచిరాత్=అచిరకాలములో, సీతామ్=సీతను, ద్రక్ష్యసే=చూడగలవు.

తా. వానరులు చేయవలసి ఉన్న నీ కార్యము ఎన్నటికీ చెడదు. నీవు అచిరకాలములో అపారమైన సముద్రమును దాటి సీతను చూడగలవు. 19

మూ. తదలం శోకమాలమ్బ్య క్రోధమాలమ్బ్య భూపతే, 20
నిశ్చేష్టాః క్షత్రియా మన్దాః సర్వే చణ్డస్య బిభ్యతి.

ప్ర. అ. భూపతే=రాజా ! తత్=ఆ కారణమువలన, శోకమ్=శోకమును, ఆలమ్బ్య=అవలంబించి, అలమ్=చాలును. క్రోధమ్=క్రోధమును, ఆలమ్బ్య= అవలంబింపుము. నిశ్చేష్టాః=ప్రయత్నములేని, క్షత్రియాః=క్షత్రియులు, మన్దాః= మందులు. చణ్డస్య=తీక్ష్ణమైనవానికి, సర్వే=అందరూ, బిభ్యతి=భయపడుదురు.

తా. అందువేత, ఓ ! రాజా ! శోకమును అవలంబించకుము. శత్రువుమీద క్రోధమును చూపుము. ప్రయత్నవిహీనులైన క్షత్రియులు మందులు. శూరుడై కోపమును చూపువానికి అందరూ భయపడుచుందురు. 20

మూ. లఙ్ఘనార్థం చ ఘోరస్య సముద్రస్య నదీపతేః, 21
సహాస్మాభిరిహోపేతః సూక్ష్మబుద్ధిర్విచారయ.

ప్ర. అ. సూక్ష్మబుద్ధిః=సూక్ష్మబుద్ధి గల నీవు, ఇహ=ఇప్పుడు, అస్మాభిః సహ= మాతో కూడ, ఉపేతః=కూడినవాడవై, నదీపతేః=నదుల ప్రభువైన, ఘోరస్య=భయంకరమైన, సముద్రస్య=సముద్రముయొక్క, లఙ్ఘనార్థమ్=లంఘనము కొరకు, విచారయ= ఆలోచింపుము.

తా. సూక్ష్మబుద్ధి గల నీవు ఇప్పుడు, నదులకు ప్రభువైన, భయంకరమైన సముద్రమును ఎట్లు దాటవలెనో మా అందరితో కలిసి ఆలోచింపుము. 21

మూ. లఙ్ఘితే తత్ర తైః సైన్యైర్జితమిత్యేవ నిశ్చిను, 22
సర్వం తీర్ణం చ మే సైన్యం జితమిత్యవధార్యతామ్.

ప్ర. అ. తైః=ఆ, సైన్యైః=సైన్యములచేత, తత్ర=ఆ సముద్రము, లఙ్ఘితే=లంఘింపబడిన దగుచుండగా, జితమిత్యేవ=జయింపబడినదే (జయించుటయే) అని, నిశ్చిను=నిశ్చయించుము. మే=నాయొక్క, సర్వమ్=సమస్తమైన, సైన్యమ్=సైన్యము, తీర్ణమ్=దాటినచో, జితమితి=జయించుట అని, అవధార్యతామ్=నిశ్చయించబడుగాక.

తా. సైన్యములు ఆ సముద్రమును దాటినచో మనకు జయము వచ్చినదని నిశ్చయించుము. నా సైన్యమంతా సముద్రమును దాటినా జయము లభించినదని నిస్సంశయముగా చెప్పవచ్చును. 22

మూ. ఇమే హి హరయః శూరాః సమరే కామరూపిణః, 23
తానరీన్విధమిష్యన్తి శిలాపాదపవృష్టిభిః.

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, శూరాః=శూరులు, కామరూపిణః=స్వేచ్ఛానుసారము రూపములు ధరించువారు అయిన, ఇమే హరయః=ఈ వానరులు, శిలాపాదపవృష్టిభిః= శిలలయొక్క, వృక్షములయొక్క వర్షములచే, తాన్=ఆ, అరీన్=శత్రువులను, విధమిష్యన్తి హి=నశింపచేయుగలరు కదా !

తా. ఈ వానరులందరు ఇష్టానుసారము రూపములు ధరించగలవారు. యుద్ధమునందు శూరులు. వీరు శిలలను, వృక్షములను వర్షించి శత్రువులను నశింపచేయుగలరు. 23

మూ. కథం చిత్పరిపశ్యామి లఙ్ఘితం వరుణాలయమ్, 24
హతమిత్యేవ తం మన్యే యుద్ధే శత్రునిబర్హణ.

ప్ర. అ. శత్రునిబర్హణ=శత్రువులను నశింపచేయు ఓ ! రామా! వరుణాలయమ్= సముద్రమును, కథంచిత్=ఎటులనో, లఙ్ఘితమ్=దాటబడినదానినిగా, పరిపశ్యామి= చూచుచున్నాను. యుద్ధే=యుద్ధమునందు, తం=ఆ రావణుని, హతమిత్యేవ= చంపబడినవానినిగానే, మన్యే=తలంచెదను.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! ఏదో విధముగ సముద్రమును దాటివేయుగలమని, యుద్ధమునందు రావణుడు చంపబడు నని ఊహించుచున్నాను.

మూ. కిముక్త్వా బహుధా చాపి సర్వథా విజయీ భవాన్, 25
నిమిత్తాని చ పశ్యామి మనో మే సంప్రహృష్యతి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్వితీయః సర్గః.

ప్ర. అ. బహుధా=అనేకవిధములుగా, ఉక్త్వా=చెప్పి, కిమ్=ఏమి ప్రయోజనము ? సర్వథా=అన్నివిధముల, భవాన్=నీవు, విజయీ=విజయము కలవాడవు. నిమిత్తాని=మంచి నిమిత్తములను (శకునములను) కూడ, పశ్యామి=చూచుచున్నాను. మే=నాయొక్క, మనః=మనస్సు, సంప్రహృష్యతి=సంతోషించుచున్నది.

తా. ఇంక చాల మాటలు చెప్పనేల ? అన్నివిధములా నీకు విజయము లభించును. నాకు మంచి శకునములు కనబడుచున్నవి. నా మనస్సు ఉత్సాహభరితమై ఉన్నది. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ద్వితీయసర్గ సమాప్తము.

# అథ తృతీయః సర్గః

[సుగ్రీవుని మాటలు విని పిమ్మట రాముడు లంకను గూర్చి సవివరముగా చెప్పుమని హనుమంతుని అడుగుట; అతడు చెప్పుట.]

మూ. సుగ్రీవస్య వచః శ్రుత్వా హేతుమత్పరమార్థవత్,
ప్రతిజగ్రాహ కాకుత్స్థో హనూమన్తమథాబ్రవీత్. 1

ప్ర. అ. కాకుత్స్థః=రాముడు, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, హేతుమత్=హేతువులు కలది, పరమార్థవత్=గొప్ప అర్థము కలది అయిన, వచః=వచనమును, శ్రుత్వా=విని, ప్రతిజగ్రాహ=స్వీకరించెను. అథ=అటుపిమ్మట, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు పలికిన యుక్తియుక్తములైన మంచి అర్థము గల మాటలు విని రాముడు నీవు చెప్పినది నిజమే అని అంగీకరించెను. పిమ్మట హనుమంతునితో ఇట్లు పలికెను. 1

మూ. తపసా సేతుబన్ధేన సాగరోచ్ఛోషణేన చ,
సర్వథాపి సమర్థోఽస్మి సాగరస్యాస్య లఙ్ఘనే. 2

ప్ర. అ. తపసా=తపస్సుచేతను, సేతుబన్ధేన=సేతుబంధముచేతను, సాగరోచ్ఛోషణేన చ=సముద్రమును ఎండించుటచేతను, సర్వథాపి=అన్ని విధముల, అస్య సాగరస్య=ఈ సముద్రముయొక్క, లఙ్ఘనే=లంఘనమునందు, సమర్థః=సమర్థుడను, అస్మి=అయి ఉన్నాను.

తా. తపస్సుచేత గాని, సేతువును నిర్మించి గాని, సముద్రమును ఎండిపోవునట్లు చేసి గాని, అన్ని విధాలా ఈ సముద్రమును దాటుటకు నేను సమర్థుడను. 2

మూ. కతి దుర్గాణి దుర్గాయా లఙ్కాయాస్తద్బ్రవీష్వ మే,
జ్ఞాతుమిచ్ఛామి తత్సర్వం దర్శనాదివ వానర. 3

ప్ర. అ. వానర=హనుమంతుడా! దుర్గాయాః=ప్రవేశింప కష్టమైన, లఙ్కాయాః=లంకకు, కతి=ఎన్ని, దుర్గాణి=దుర్గములు ఉన్నవో, బ్రవీష్వ=చెప్పుము. తత్=దానిని, సర్వమ్=సమస్తమును, దర్శనాదివ=చూచుటవలన వలె, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. హనుమంతుడా! ప్రవేశించుటకు కష్టమైన ఆ లంకాపట్టణములో ఎన్ని దుర్గములు ఉన్నవో చెప్పుము. ఆ విషయము నంతను ప్రత్యక్షముగా

చూచి నట్లు తెలిసికొన గోరుచున్నాను. 3

మూ. బలస్య పరిమాణం చ ద్వారదుర్గక్రియామపి,
గుప్తికర్మ చ లఙ్కాయా రక్షసాం సదనాని చ. 4
యథాసుఖం యథావచ్చ లఙ్కాయామసి దృష్టవాన్,
సర్వమాచక్ష్వ తత్త్వేన సర్వథా కుశలో హ్యసి. 5

ప్ర. అ. బలస్య=సైన్యముయొక్క, పరిమాణం చ=పరిమాణమును, ద్వారదుర్గక్రియామపి=ద్వారములను, దుర్గక్రియను, లఙ్కాయాః=లంకయొక్క, గుప్తికర్మ చ=రక్షణకర్మను, రక్షసామ్=రాక్షసులయొక్క, సదనాని చ=గృహములను, యథాసుఖమ్=సుఖముగాను, యథావచ్చ=యథార్థముగాను, లఙ్కాయామ్=లంకయందు, దృష్టవాన్=చూచినవాడవు, అసి= అయియున్నావు. సర్వమ్=దాని నంతను, తత్త్వేన= యథార్థముగా, ఆచక్ష్వ=చెప్పుము. సర్వథా=అన్ని విధముల, కుశలః=నేర్పుగలవాడవు, అసి హి=అయి ఉన్నావు కదా !

తా. సైన్యపరిమాణమును, ద్వారముల ఏర్పాటును, దుర్గముల నిర్మాణమును, లంకలో చేసిన ఇతర రక్షణోపాయములను, రాక్షసుల గృహములను, నీవు సుఖముగా, ఉన్నవి ఉన్నట్లుగా లంకలో చూచినావు కదా? దాని నంతను వివరముగా చెప్పుము. నీవు చాల సమర్థుడవు కదా! 4,5

మూ. శ్రుత్వా రామస్య వచనం హనుమాన్ మారుతాత్మజః,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో రామం పునరథాబ్రవీత్. 6

ప్ర. అ. వాక్యవిదామ్=వాక్యములను ఎరిగినవారిలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడు, మారుతాత్మజః=వాయుపుత్రుడు అయిన, హనుమాన్=హనుమంతుడు, రామస్య=రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, అథ=పిమ్మట, పునః=తిరిగి, రామమ్= రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మాటలాడుటలో మంచి నేర్పు గలవాడు, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు రాముని మాటలు విని, అతనితో మరల ఇట్లు అనెను.

మూ. శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే దుర్గకర్మవిధానతః,
గుప్తా పురీ తథా లఙ్కా రక్షితా చ యథా బలైః. 7

ప్ర.అ. లఙ్కా పురీ = లంకాపట్టణము, యథా = ఎట్లు, దుర్గకర్మవిధానతః = దుర్గకర్మల ఏర్పాటుచేత, గుప్తా = రక్షింపబడినదో, బలైః= సైన్యములచేత, యథా = ఎట్లు, రక్షితా చ = రక్షింపబడినదో, సర్వమ్ = అంతయూ, ఆఖ్యాస్యే = చెప్పగలను. శ్రూయతామ్= వినబడుగాక.

తా.. దుర్గములను ఏర్పాటు చేయుట ద్వారా లంకాపట్టణము ఏ విధముగా రక్షింపబడుచున్నదో, సైన్యములచేత ఎట్లు రక్షింపబడుచున్నదో ఆ విషయము నంతా చెప్పెదను ; వినుము. 7

మూ. రాక్షసాశ్చ యథా స్నిగ్ధా రావణస్య చ తేజసా,
పరాం సమృద్ధిం లఙ్కాయాః సాగరస్య చ భీమతామ్, 8
విభాగం చ బలౌఘస్య నిర్దేశం వాహనస్య చ,
ఏవముక్త్వా కపిశ్రేష్ఠః కథయామాస తత్త్వవిత్. 9

ప్ర. అ. రాక్షసాః = రాక్షసులు, యథా = ఎట్లు, స్నిగ్ధాః=స్నేహముకలవారుగా ఉన్నారో ఆ విషయమును, రావణస్య = రావణునియొక్క, తేజసా = తేజస్సుచేత, లఙ్కాయాః=లంకయొక్క, పరామ్= ఉత్కృష్టమైన, సమృద్ధిమ్=సమృద్ధిని, సాగరస్య=సముద్రముయొక్క, భీమతామ్= భయంకరత్వమును, బలౌఘస్య=సేనాసమురాయముయొక్క, విభాగమ్ =విభాగమును, వాహనస్య=వాహనముయొక్క, నిర్దేశం చ = ఏర్పాటును, చెప్పెదను. తత్త్వవిత్=యథార్థమును ఎరిగిన, కపిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, కథయామాస=చెప్పెను.

తా. రాక్షసుల ప్రభుభక్తి, రావణుని తేజస్సుచేత లంకలో ఉన్న గొప్ప సమృద్ధి, సముద్రము భయంకరముగా ఉండుట, సేనావిభాగములు, వాహనముల ఏర్పాట్లు, ఈ విషయములను అన్నింటినీ చెప్పెదను, అని పలికి లంకను గూర్చిన విశేషము లన్నీ ఎరిగిన హనుమంతుడు ఇట్లు పలికెను. 8,9

మూ. హృష్టప్రముదితా లఙ్కా మత్తద్విపసమాకులా,
మహతీ రథసంపూర్ణా రక్షోగణనిషేవితా. 10

ప్ర. అ. మహతీ=విశాలమైన, లఙ్కా=లంక, హృష్టప్రముదితా=సంతోషించుచున్నది, ఆనందించుచున్నది. మత్తద్విపసమాకులా=మదించిన ఏనుగులతో వ్యాకులమైనది. రథసంపూర్ణా= రథములతో నిండినది, రక్షోగణనిషేవితా=రాక్షసుల గణములచేత సేవింపబడినది.

తా. మదించిన ఏనుగులతోను, రథములతోను నిండినదై, రాక్షసగణముల నివాసముగా ఉన్న అతివిశాలమైన ఆ లంక సంతోషానందములతో ప్రకాశించుచున్నది. 10

మూ. దృఢబద్ధకవాటాని మహాపరిఘవన్తి చ,
చత్వారి విపులాన్యస్యా ద్వారాణి సుమహాన్తి చ. 11

ప్ర. అ. అస్యాః = ఈ లంకయొక్క, సుమహాన్తి=చాల

పెద్దవైన, విపులాని=విశాలములైన, చత్వారి=నాలుగు, ద్వారాణి=ద్వారములు, దృఢబద్ధకవాటాని=దృఢముగా కట్టబడిన తలుపులుగలవి, మహాపరిఘవన్తి చ=గొప్ప పరిఘలు (గడియలు)గలవి.

తా. ఆ నగరమునకు చాల పెద్దవైన, విశాలములైన, నాలుగు ద్వారము లున్నవి. దృఢములైన వాటి తలుపులు పెద్ద గడియలతో బంధింపబడి ఉన్నవి. 11

మూ. తత్రేషూపలయన్త్రాణి బలవన్తి మహాన్తి చ,
ఆగతం ప్రతిసైన్యం తైస్తత్ర ప్రతినివార్యతే. 12

ప్ర. అ. తత్ర=అక్కడ, బలవన్తి=బలము గలవి, మహాన్తి చ=గొప్పవీ అయిన, ఇషూపలయన్త్రాణి=బాణములు శిలల యంత్రములు ఉన్నవి. తత్ర=అక్కడ, ఆగతమ్=వచ్చిన, ప్రతిసైన్యమ్=శత్రుసైన్యము, తైః=ఆ యంత్రములచేత, ప్రతినివార్యతే=నివారింపబడుచున్నది.

తా. అక్కడ పెద్ద పెద్ద, బలమైన యంత్రము లున్నవి. అవి బాణములను, శిలలను ప్రయోగించును. వాటి సహాయ్యముతో అక్కడికి వచ్చిన శత్రుసైన్యమును నివారించుచుందురు. 12

మూ. ద్వారేషు సంస్కృతా భీమాః కాలాయసమయాః శితాః,
శతశో రచితా వీరైః శతఘ్న్యో రక్షసాం గణైః. 13

ప్ర. అ. సంస్కృతాః=సంస్కరింపబడినవి (సిద్ధముగా ఉంచబడినవి), భీమాః=భయంకరములు, కాలాయసమయాః=ఇనుపవికారమైనవి, శితాః=వాడియైనవి అయిన, శతశః=వందలకొలది, శతఘ్న్యః=శతఘ్నులు (ఒక్క యత్నములో నూరుగురిని చంపే యంత్రములు), రక్షసామ్=రాక్షసులయొక్క, గణైః=గణములతో, ద్వారేషు=ద్వారములయందు, రచితాః=రచింపబడినవి.

తా. భయంకరములు, వాడియైనవి, ఇనుముతో తయారు చేయబడినవి అయిన వందలకొలది శతఘ్నులను ఏ క్షణమునందైనను, ఉపయోగించుటకు వీలుగా సంస్కరించి, ద్వారములవద్ద అమర్చినారు. వాటిని ఉపయోగించగల అనేక రాక్షసులు గూడ అక్కడ నియమింపబడి ఉన్నారు. 13

మూ. సౌవర్ణస్తు మహాంస్తస్యాః ప్రాకారో దుష్ప్రధర్షణః,
మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాన్తరః. 14

ప్ర.అ. తస్యాః=ఆ లంకయొక్క, సౌవర్ణః=బంగారువికారము, మహాన్=గొప్పది, మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాన్తరః=మణులచేత, పగడములచేత, వైడూర్యములచేత, ముత్యములచేత అందముగా చేయబడిన

మధ్యభాగము గల, ప్రాకారః=ప్రాకారము, దుష్ప్రధర్షణః=ఎదిరింప శక్యము కానిది.

తా. చాల పెద్దదైన ఆ నగరము బంగారపు ప్రాకారమును ఎవ్వరూ అతిక్రమింపజాలరు. అది మధ్య మధ్య మణులతోను, పగడములతోను, వైడూర్యములతోను, ముత్యములతోను అలంకరింపబడి ఉన్నది. 14

మూ. సర్వతశ్చ మహాభీమాః శీతతోయా మహాశుభాః,
అగాధా గ్రాహవత్యశ్చ పరిఖా మీనసేవితాః. 15

ప్ర. అ. సర్వతః=ఆ ప్రాకారము చుట్టూ, మహాభీమాః=చాల భయంకరములు, శీతతోయాః= చల్లని ఉదకములు గలవి, మహాశుభాః=చాల సుందరములు, అగాధాః= లోతైనవి, గ్రాహవత్యశ్చ=మొసళ్లు గలవి, మీనసేవితాః=మీనములచేత సేవింపబడినవి అయిన, పరిఖాః=పరిఖ లున్నవి.

తా. ఆ ప్రాకారముల చుట్టూ చాల భయంకరములైన అందమైన పరిఖలు ఉన్నవి. చల్లని జలముతో నిండిన ఆ పరిఖలలో మొసళ్లు, మీనములు నివసించుచుండును. 15

మూ. ద్వారేషు తాసాం చత్వారః సంక్రమాః పరమాయతాః,
యన్త్రైరుపేతా బహుభిర్మహద్భిర్గృహపంక్తిభిః. 16

ప్ర. అ. ద్వారేషు=ద్వారములయందు, పరమాయతాః=చాల పొడవైనవి, బహుభిః= అనేకములైన, యన్త్రైః=యంత్రములతోను, మహద్భిః=గొప్పవైన, గృహపంక్తిభిః= గృహముల పంక్తులతోనూ, ఉపేతాః=కూడినవి అయిన, తాసాం సంక్రమాః= వాటి వంతెనలు ఉన్నవి.

తా. ప్రాకారద్వారములకు ఎదురుగా ఆ పరిఖలమీద చాల పొడవైన నాలుగు వంతెనలు ఉన్నవి. వాటిపై అనేకమైన యంత్రములు అమర్చబడినవి; పెద్ద గృహముల పంక్తులు కూడ ఉన్నవి. 16

మూ. త్రాయన్తే సంక్రమాస్తత్ర పరసైన్యాగతే సతి,
యన్త్రైస్తైరవకీర్యన్తే పరిఖాసు సమన్తతః. 17

ప్ర. అ. తత్ర=అక్కడ, పరసైన్యాగతే సతి=శత్రుసైన్యముయొక్క ఆగమనము కలుగుచుండగా, సంక్రమాః=వంతెనలు, త్రాయన్తే=రక్షింపబడు చున్నవి. సమన్తతః=అన్ని ప్రక్కలా, పరిఖాసు=పరిఖలయందు, తైః=ఆ, యన్త్రైః=యంత్రములచేత, అవకీర్యన్తే= (బాణశిలాదులు) చిమ్మబడుచున్నవి.

తా. పరసైన్యము వచ్చినప్పుడు ఆ యంత్రములద్వారా పరిఖల అన్ని

వైపులయందు బాణశిలాదులను వర్షించి ఆ వంతెనలను రక్షించుచుందురు.17

మూ. ఏకస్త్వకమ్ప్యో బలవాన్ సంక్రమః సుమహాదృఢః,
కాఞ్చనైర్బహుభిః స్తమ్భైర్వేదికాభిశ్చ శోభితః. 18

ప్ర.అ. కాఞ్చనైః=బంగారము వికారమైన, బహుభిః=అనేకమైన, స్తమ్భైః= స్తంభములచేతను, వేదికాభిశ్చ=వేదికలచేతను, శోభితః=ప్రకాశింపచేయబడినది, బలవాన్= బలము గలది, సుమహాదృఢః=చాల దృఢమూ అయిన, ఏకః=ఒక్క, సంక్రమస్తు= వంతెనయైతే, అకమ్ప్యః=కదల్ప శక్యము కానిది.

భా. వాటిలో ఒక వంతెన చాల బలముగా, దృఢముగా, కదల్ప శక్యము కానిదై ఉన్నది. అది అనేకమైన బంగారు స్తంభములలోను, వేదికలలోను ప్రకాశించుచుండును. 18

మూ. స్వయం ప్రకృతిమాపన్నో యుయుత్సూ రామ రావణః,
ఉత్థితశ్చాప్రమత్తశ్చ బలానామనుదర్శనే. 19

ప్ర. అ. రామ=రామా ! స్వయమ్=స్వయముగా, యుయుత్సుః=యుద్ధము చేయగోరుచున్నవాడు, ప్రకృతిమ్=స్వస్థత్వమును, ఆపన్నః=పొందినవాడు అయిన, రావణః= రావణుడు, ఉత్థితశ్చ= సిద్ధముగా ఉన్నాడు. బలానామ్=సేనలయొక్క, అనుదర్శనే= దర్శనమునందు, అప్రమత్తశ్చ=ప్రమాదము (ఏమరుపాటు)లేనివాడు.

భా. రామా! రావణుడు స్వయముగా యుద్ధము చేయుటకు సన్నద్ధుడై ఉన్నాడు. అయినను అతని మనస్సులో భయ మనేది లేదు. సైన్యములను పరీక్షించుటలో ఏమరిపాటు లేక ఉత్సాహవంతుడై ఉన్నాడు. 19

మూ. లఙ్కా పునర్నిరాలమ్బా దేవదుర్గా భయావహా,
నాదేయం పార్వతం వాన్యం కృత్రిమం చ చతుర్విధమ్.

ప్ర.అ. దేవదుర్గా=దేవతలకు కూడ వెళ్ల శక్యముకాని, నిరాలమ్బా=పైకి ఎక్కుటకు ఆధారము లేని, లఙ్కా పునః=లంకయైతే, భయావహా=భయమును కలిగించునది. నాదేయమ్= నదికి సంబంధించినది, పార్వతమ్=పర్వతసంబద్ధము, వాన్యమ్=వనసంబద్ధము, కృత్రిమం చ=కృత్రిమము అయిన, చతుర్విధమ్=నాలుగు విధములుం దుర్గ మున్నది.

భా. ఎత్తైన పర్వతశిఖరము మీద ఉండుటచే ఆ లంకలో ప్రవేశించుటకు ఆధార మేదీ లేదు. భయంకరమైన ఆ లంకలో దేవతలు కూడ ప్రవేశించజాలరు. ఆ లంకాపట్టణము చుట్టూ నది ప్రవహించుటచే నదీదుర్గము,

పర్వతము ఉండుటచేత పర్వతదుర్గము, అరణ్యము ఉండుటచే వనదుర్గము, కట్టిన ప్రాకారముండుటచేత కృత్రిమదుర్గము అను నాలుగు దుర్గములు ఆ లంక చుట్టూ ఉన్నవి. 20

మూ. స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ,
నౌపథశ్చాపి నాస్త్యత్ర నిరాదేశశ్చ సర్వశః. 21

ప్ర. అ. రాఘవ=రామా! దూరపారస్య=దూరమైన అవతలి ఒడ్డు గల, సముద్రస్య= సముద్రముయొక్క, పారే=(దక్షిణ)తీరమునందు, స్థితా=ఉన్నది. అత్ర=ఇక్కడ, నౌపథశ్చ=ఓడల మార్గము కూడ, నాస్తి=లేదు. సర్వశః=అన్ని వైపులా, నిరాదేశశ్చ= వార్తాసంచారము లేనిది.

తా. రామా! ఆ లంక అతిదూరమైన సముద్రదక్షిణతీరమునందు ఉన్నది. అక్కడికి వెళ్లుటకు నౌకామార్గము లేదు. ఏ వైపునుండీ కూడా వార్తలను పంపు అవకాశము లేదు. 21

మూ. శైలాగ్రే రచితా దుర్గా సా పూర్దేవపురోపమా,
వాజివారణసంపూర్ణా లఙ్కా పరమదుర్జయా. 22

ప్ర. అ. దుర్గా=ప్రవేశింప శక్యము కానిది, దేవపురోపమా=అమరావతితో సమానమైన, సా=ఆ, పూః=పట్టణము, శైలాగ్రే=పర్వతాగ్రమునందు, రచితా=రచింపబడినది. వాజివారణసంపూర్ణా=గుఱ్ఱములతోనూ ఏనుగులతోను నిండిన, సా=ఆ, లఙ్కా=లంక, పరమదుర్జయా=మిక్కిలి జయింప శక్యము కానిది.

తా. అమరావతితో సమానమైన ఆ లంకాపట్టణము శైలాగ్రమునందు నిర్మింపబడినది. ప్రవేశింప శక్యము కానిది. గుఱ్ఱములతోను, ఏనుగులతోను నిండిన ఆ పురమును ఎవ్వరూ జయింపజాలరు. 22

మూ. పరిఖాశ్చ శతఘ్న్యశ్చ యన్త్రాణి వివిధాని చ,
శోభయన్తి పురీం లఙ్కాం రావణస్య దురాత్మనః. 23

ప్ర. అ. దురాత్మనః=దురాత్ముడైన, రావణస్య=రావణునియొక్క, పురీమ్=పట్టణమైన, లఙ్కామ్=లంకను, పరిఖాశ్చ=పరిఖలు, శతఘ్న్యశ్చ=శతఘ్నులు, వివిధాని= అనేకవిధములైన, యన్త్రాణి చ=యంత్రములు, శోభయన్తి=ప్రకాశింపచేయుచున్నవి.

తా. దురాత్ముడైన ఆ రావణుని పట్టణమైన ఆ లంకకు పరిఖలు, శతఘ్నులు, అనేకవిధములైన యంత్రములు అలంకారములుగా ఉన్నవి. 23

మూ. అయుతం రక్షసామత్ర పూర్వద్వారం సమాశ్రితమ్,
శూలహస్తా దురాధర్షాః సర్వే ఖడ్గాగ్రయోధినః. 24

ప్ర. అ. అత్ర=ఈ లంకాపురమునందు, రక్షసామ్=రాక్షసులయొక్క, అయుతమ్= అయుతము(పదివేలు), పూర్వద్వారమ్=తూర్పు ద్వారమును, సమాశ్రితమ్=ఆశ్రయించి ఉన్నారి. సర్వే=అందరూ, శూలహస్తాః=శూలములు హస్తములందు గలవారు. దురాధర్షాః=ఎదిరింప శక్యము కానివారు. ఖడ్గాగ్రయోధినః=ఖడ్గములతో సేనాగ్రమునందు యుద్ధము చేయువారు.

తా. ఆ లంకలో పదివేలమంది రాక్షసులు తూర్పుద్వారమునందు కాపలా ఉన్నారు. వాళ్ళందరూ శూలములను హస్తములందు ధరించి ఉందురు. సేనాగ్రమునందు ఖడ్గములు ధరించి యుద్ధము చేయగలవారు. 24

మూ. నియుతం రక్షసామత్ర దక్షిణద్వారమాశ్రితమ్,
చతురఙ్గేణ సైన్యేన యోధాస్తత్రాప్యనుత్తమాః. 25

ప్ర. అ. అత్ర=ఇక్కడ, రక్షసామ్=రాక్షసులయొక్క, నియుతమ్=నియుతము(లక్ష), దక్షిణద్వారమ్=దక్షిణద్వారమును, ఆశ్రితమ్=ఆశ్రయించి ఉన్నది. తత్రాపి=అక్కడ కూడ, చతురఙ్గేణ=చతురంగమైన, సైన్యేన=సైన్యముతో కూడిన, యోధాః=యోధులు, అనుత్తమాః=చాల శ్రేష్ఠులు.

తా. లంక దక్షిణద్వారమునందు లక్షమంది రాక్షసులు కాపలా కాయుచున్నారు. చతురంగసైన్యముతో కూడి అక్కడ ఉన్న యోధులు కూడ చాల శ్రేష్ఠమైన వారు. 25

మూ. ప్రయుతం రక్షసామత్ర పశ్చిమద్వారమాశ్రితమ్,
చర్మఖడ్గధరాః సర్వే తథా సర్వాస్త్రకోవిదాః. 26

ప్ర. అ. అత్ర=ఇక్కడ, రక్షసామ్=రాక్షసులయొక్క, ప్రయుతమ్=ప్రయుతము (పది లక్షలు), పశ్చిమద్వారమ్=పశ్చిమద్వారమును, ఆశ్రితమ్=ఆశ్రయించినది. సర్వే= అందరును, చర్మఖడ్గధరాః=చర్మలను ఖడ్గములను ధరించినవారు. తథా=మరియు, సర్వాస్త్రకోవిదాః=సమస్తమైన అస్త్రములు ఎరిగినవారు.

తా. లంకలో పది లక్షలమంది రాక్షసులు పశ్చిమద్వారమునందు కాపలా కాయుచున్నారు. కత్తి, డాలు ధరించి ఉన్న ఆ రాక్షస అందరూ అన్ని అస్త్రములయందు నైపుణ్యము గలవారు. 26

మూ. న్యర్బుదం రక్షసామత్ర ఉత్తరద్వారమాశ్రితమ్,
రథినశ్చాశ్వవాహాశ్చ కులపుత్రాః సుపూజితాః. 27

ప్ర. అ. అత్ర=ఇక్కడ, రక్షసామ్=రాక్షసులయొక్క, న్యర్బుదమ్=న్యర్బుదము(కోటి), ఉత్తరద్వారమ్=ఉత్తరద్వారమును, ఆశ్రితమ్=ఆశ్రయించి ఉన్నారు. రథినః=రథము గలవారు, అశ్వవాహాశ్చ=అశ్వములు వాహనములుగా గలవారు, సుపూజితాః=బాగుగా పూజించబడిన, కులపుత్రాః=సత్కులములందు పుట్టినవారు ఉన్నారు.

తా. ఉత్తరద్వారమునందు ఒక కోటిమంది రాక్షసులు కాపలా కాయుచున్నారు. వారిలో రథికులు, అశ్వములు వాహనములుగా గలవారు, మాననీయులైన ఉత్తమకులసంజాతులు ఉన్నారు. 27

మూ. శతశోఽథ సహస్రాణి మధ్యమం స్కన్ధమాశ్రితాః,
యాతుధానా దురాధర్షాః సాగ్రకోటిశ్చ రక్షసామ్. 28

ప్ర. అ. అథ=మరియు, శతశః=వందలకొలది, సహస్రాణి=వేలు, దురాధర్షాః= ఎదిరింప శక్యముకాని, యాతుధానాః=రాక్షసులు, మధ్యమస్కన్ధమ్=మధ్యలో ఉన్న సేనానివేశమును, ఆశ్రితాః=ఆశ్రయించి ఉన్నారు. రక్షసామ్=రాక్షసులయొక్క, సాగ్రకోటిశ్చ=అగ్రముతో కూడిన (కొంచెము ఎక్కువైన) కోటి కూడ, అక్కడ ఉన్నారు.

తా. మధ్యయందున్న సేనానివేశములో వందలకొలది వేల సంఖ్యలో ఎదిరింప శక్యము కాని రాక్షసులు, కోటికి మించిన రాక్షసులు ఉన్నారు. 28

మూ. తే మయా సంక్రమా భగ్నాః పరిఖాశ్చావపూరితాః,
దగ్ధా చ నగరీ లఙ్కా ప్రాకారాశ్చావసాదితాః. 29
బలైకదేశః క్షపితో రాక్షసానాం మహాత్మనామ్.

ప్ర. అ. మయా=నాచేత, తే=ఆ, సంక్రమాః=వంతెనలు, భగ్నాః=విరుగగొట్టబడినవి. పరిఖాశ్చ=పరిఖలు కూడ, అవపూరితాః=నింపివేయబడినవి. లఙ్కా నగరీ= లంకాపట్టణము, దగ్ధా చ=కాల్చివేయబడినది. ప్రాకారాశ్చ=ప్రాకారములు కూడ, అవసాదితాః=నశింపచేయబడినవి. మహాత్మనామ్=మహాత్ములైన, రాక్షసానామ్= రాక్షసులయొక్క, బలైకదేశః=సేనలో ఒక భాగము, క్షపితః=నశింపచేయబడినది.

తా. నేను ఆ వంతెనలను కూల్చివేసితిని. పరిఖలు నింపివేసితిని. లంకానగరమును కాల్చివేసితిని. ప్రాకారములను కూల్చివేసితిని. మహావీరులైన రాక్షసుల సైన్యములో ఒక భాగమును నశింపచేసితిని. 29

మూ. యేన కేన తు మార్గేణ తరామ వరుణాలయమ్, 30
హతేతి నగరీ లఙ్కా వానరైరుపధార్యతామ్.

ప్ర. అ. యేన కేన చ=ఏదో ఒక, మార్గేణ=మార్గముచేత, వరుణాలయమ్=సముద్రము, తీర్ణః=దాటబడెను. వానరైః=వానరులచేత, లఙ్కా నగరీ=లంకానగరి, హతా ఇతి=నశింపచేయబడినదని, ఉపధార్యతామ్=నిశ్చయించబడుగాక.

తా. ఏదో మార్గముచేత సముద్రమును దాటెదము. వానరులు లంకానగరమును నశింపచేసినారే అని నిశ్చయించుకొనుము. 30

మూ. అఙ్గదో ద్వివిదో మైన్దో జామ్బవాన్ పనసోఽనలః, 31
నీలః సేనాపతిశ్చైవ బలశేషేణ కిం తవ.
ప్లవమానా హి గత్వా తాం రావణస్య మహాపురీమ్. 32
సపర్వతవనాం భిత్త్వా సఖాతాం చ సతోరణామ్,
సప్రాకారాం సభవనామానయిష్యన్తి రాఘవ. 33

ప్ర. అ. రాఘవ=రామా ! బలశేషేణ=మిగిలిన సేనచేత, తవ=నీకు, కిమ్=ఏమి ప్రయోజనము? అఙ్గదః=అంగదుడు, ద్వివిదః=ద్వివిదుడు, మైన్దః=మైందుడు, జామ్బవాన్=జాంబవంతుడు, పనసః=పనసుడు, అనలః=అనలుడు, సేనాపతిః=సేనాపతియైన, నీలశ్చైవ=నీలుడు, ప్లవమానాః=ఎగురుచు, గత్వా=వెళ్ళి, సపర్వతవనామ్=పర్వతములతోను, వనములతోను కూడిన, సఖాతామ్=పరిఖలతో కూడిన, సతోరణామ్=ముఖద్వారములతో కూడిన, సప్రాకారామ్=ప్రాకారములతో కూడిన, సభవనామ్=భవనములతో కూడిన, తామ్=ఆ, రావణస్య మహాపురీమ్=రావణుని మహానగరమును, భిత్త్వా=భేదించి, ఆనయిష్యన్తి=(సీతను)తీసికొని రాగలరు.

తా. రామా ! మిగిలిన సైన్యము మాట ఎందుకు ? అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, అనలుడు, సేనాపతియైన నీలుడు ఎగురుచు వెళ్ళి పర్వతములు, వనములు, పరిఖలు, ముఖద్వారములు, ప్రాకారములు, భవనములు వీటితో కూడిన, రావణుని మహానగరమైన ఆ లంకను నశింపచేసి సీతను తీసికొని రాగలరు. 31-33

మూ. ఏవమాజ్ఞాపయ క్షిప్రం బలానాం సర్వసంగ్రహమ్,
ముహూర్తేన తు యుక్తేన ప్రస్థానమభిరోచయ. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే తృతీయః సర్గః

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, బలానామ్=సేనలయొక్క, సర్వసంగ్రహమ్=సమస్తమైన సంగ్రహమును (ఒక చోట చేర్చుటను), క్షిప్రమ్=శీఘ్రముగా, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపించుము. యుక్తేన=తగిన ముహూర్తముచేత, ప్రస్థానమ్=ప్రయా

ణమును గూర్చి, ఆలోచించుటకు=క్షణించుటకు.

తా. వెంటనే సకలసైన్యములు కలిసి వచ్చునట్లు ఆజ్ఞాపించి మంచి ముహూర్తమునందు ప్రయాణము చేయుటకు నిశ్చయింతుము. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో మూడవసర్గ సమాప్తము.

# అథ చతుర్థః సర్గః

[రాముడు వానరసైన్యముతో బయలుదేరి సముద్రతీరమునందు విడియుట.]

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం యథావదనుపూర్వశః,
తతోఽబ్రవీన్మహాతేజా రామః సత్యపరాక్రమః. 1

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడు, సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము కలవాడు అయిన, రామః=రాముడు, హనుమతః=హనుమంతుని యొక్క, యథావత్= యథార్థమైన, వాక్యమ్=వాక్యమును, అనుపూర్వశః=క్రమానుసారముగా, శ్రుత్వా= విని, తతః=అటుపిమ్మట, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప తేజస్సు, సత్యమైన పరాక్రమము గల రాముడు హనుమంతుడు చెప్పిన యథార్థమైన మాటలను క్రమానుసారముగా విని ఇట్లు పలికెను. 1

మూ. యాం నివేదయసే లఙ్కాం పురీం భీమస్య రక్షసః,
క్షిప్రమేనాం మథిష్యామి సత్యమేతద్బ్రవీమి తే. 2

ప్ర. అ. భీమస్య=భయంకరుడైన, రక్షసః=రాక్షసునియొక్క, పురీమ్=పట్టణమైన, యామ్=ఏ, లఙ్కామ్=లంకను గూర్చి, నివేదయసే=తెలుపుచున్నావో, ఏనామ్=దీనిని, క్షిప్రమ్=శీఘ్రముగా, మథిష్యే=మథించగలను. ఏతత్=దీనిని, సత్యమ్= సత్యముగా, తే=నీకు, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. నీవు చెప్పిన భయంకరుడైన ఆ రాక్షసుని పట్టణమైన లంకను శీఘ్రముగా అల్లకల్లోలము చేసెదను. నీకు నిజముగా చెప్పుచున్నాను. 2

మూ. అస్మిన్ ముహూర్తే సుగ్రీవ ప్రయాణమభిరోచయ,
యుక్తో ముహూర్తో విజయః ప్రాప్తో మధ్యం దివాకరః. 3

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా! అస్మిన్ = ఈ, ముహూర్తే=ముహూర్తమునందు, ప్రయాణమ్=ప్రయాణమును గూర్చి, అభిరోచయ=ఇష్టపడుము. యుక్తః=యుక్తమైన, విజయః=విజయ మను, ముహూర్తః=ముహూర్తము. దివాకరః=సూర్యుడు, మధ్యమ్ = ఆకాశమధ్యమును, ప్రాప్తః =పొందినాడు.

తా. సుగ్రీవా! ఈ ముహూర్తమునందే ప్రయాణమును నిశ్చయించుము. ఇది విజయ మనే తగిన ముహూర్తము. సూర్యుడు ఆకాశమధ్యమునందున్నాడు.

మూ. సీతాం హృత్వా తు తద్యాతు క్వాసౌ యాస్యతి జీవితః,
సీతా శ్రుత్వాభియానం మే ఆశామేష్యతి జీవితే, 4
జీవితాన్తేఽమృతం స్పృష్ట్వా పీత్వా విషమివాతురః.

ప్ర. అ. తత్=ఆ రాక్షసుడు, సీతామ్=సీతను, హృత్వా=హరించి, యాతు=వెళ్లుగాక, అసౌ=ఇతడు, జీవితః=జీవించినవాడై, క్వ=ఎక్కడికి, యాస్యతి=వెళ్లగలడు? సీతా=సీత, మే=నాయొక్క, అభియానమ్ = యుద్ధప్రయాణమును, శ్రుత్వా=విని, విషమ్=విషమును, పీత్వా= త్రాగి, ఆతురః=పీడితుడైనవాడు, జీవితాన్తే=ప్రాణాపాయసమయమునందు, అమృతమ్=అమృతమును, స్పృష్ట్వా ఇవ=స్పృశించి నటె, జీవితే=జీవితమునందు, ఆశామ్=ఆశను, యాస్యతి=పొందగలదు.

తా. ఆ రావణుడు సీతను హరించుగాక. కాని అతడు ప్రాణముతో ఎక్కడకు వెళ్లగలడు? నేను యుద్ధమునకై ప్రయాణమైతి నని విని సీతకు, విషము త్రాగి పీడితుడైనవానికి ప్రాణాపాయసమయమునందు అమృతమును స్పృశించుటచేత నటె, జీవితమునందు ఆశ కలుగును. 4

మూ. ఉత్తరా ఫల్గునీ హ్యద్య శ్వస్తు హస్తేన యోక్ష్యతే, 5
అభిప్రయామ సుగ్రీవ సర్వానీకసమావృతాః.

ప్ర. అ. అద్య=నేడు, ఉత్తరా ఫల్గునీ హి=ఉత్తరఫల్గుని కదా? శ్వస్తు=రేపైతే, హస్తేన=హస్తతో, యోక్ష్యతే=(చంద్రుడు) కలియుగలడు. సుగ్రీవ=సుగ్రీవుడా! సర్వానీకసమావృతాః=సమస్తమైన సైన్యములతో కూడినవారమై, అభిప్రయామ=వెళ్లుదము.

తా. నేడు ఉత్తరఫల్గునీనక్షత్రము. చంద్రుడు రేపు హస్తనక్షత్రములో ఉండును. అందుచే సుగ్రీవా ! సకలసైన్యములతో కూడి నేడే బయలుదేరెదము.

మూ. నిమిత్తాని చ పశ్యామి యాని ప్రాదుర్భవన్తి వై, 6
నిహత్య రావణం సీతామానయిష్యామి జానకీమ్.

ప్ర. అ. యాని=ఏ, ప్రాదుర్భవన్తి=పుట్టుచున్న, నిమిత్తాని=శకునములను, పశ్యామి=చూచుచున్నానో, వాటిని పట్టి, రావణమ్=రావణుని, నిహత్య=చంపి, జానకీమ్=జనకరాజపుత్రియైన, సీతామ్=సీతను, ఆనయిష్యామి=తీసికొనిరాగలను.

తా. ఇప్పుడు ఏ శకునములు కనబడుచున్నవో వాటిని బట్టి నేను రావణుని సంహరించి సీతను తీసికొనిరాగల నని తలచుచున్నాను. 6

మూ. ఉపరిష్టాద్ధి నయనం స్ఫురమాణమిదం మమ, 7
విజయం సమనుప్రాప్తం శంసతీవ మనోరథమ్.

ప్ర. అ. ఉపరిష్టాత్=పైభాగమునందు, స్ఫురమాణమ్=అదురుచున్న, మమ=నాయొక్క, ఇదమ్=ఈ, నయనమ్=నేత్రము, మనోరథమ్=మనోరథమునకు విషయమైన (కోరబడుచున్న), విజయమ్=విజయమును, సమనుప్రాప్తమ్=వచ్చినదానినిగా, శంసతీవ=చెప్పుచున్నట్లు ఉన్నది.

తా. పైభాగమునందు అదురుచున్న నా నేత్రము నేను కోరుచున్న విజయము లభించినట్లు (లభించ నున్నట్లు) చెప్పుచున్నదా అన్నట్లు ఉన్నది.7

మూ. తతో వానరరాజేన లక్ష్మణేన సుపూజితః, 8
ఉవాచ రామో ధర్మాత్మా పునరప్యర్థకోవిదః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరరాజేన=సుగ్రీవునిచేతను, లక్ష్మణేన=లక్ష్మణునిచేతను, సుపూజితః=బాగుగా పూజించబడిన, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, అర్థకోవిదః=కార్యములను ఎరిగిన, రామః=రాముడు, పునరపి=మరల, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట సుగ్రీవుడు, లక్ష్మణుడు రాముని మాటలను అంగీకరించి అతనిని పూజించిరి. ధర్మాత్ముడు, కార్యములను ఎరిగినవాడు అయిన రాముడు మరల ఇట్లనెను. 8

మూ. అగ్రే యాతు బలస్యాస్య నీలో మార్గమవేక్షితుమ్, 9
వృతః శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్.

ప్ర. అ. నీలః=నీలుడు, తరస్వినామ్=బలము గల, వానరాణామ్=వానరులయొక్క, శతసహస్రేణ=లక్షతో, వృతః=కూడినవాడై, మార్గమ్=మార్గమును, అవేక్షితుమ్=చూచుటకు, అస్య=ఈ, బలస్య=సైన్యముయొక్క, అగ్రే=అగ్రమునందు, యాతు=వెళ్లుగాక.

తా. నీలుడు బలవంతులైన లక్షమంది వానరులతో కలిసి, మార్గమును చూచుటకై, ఈ సేనకు ముందు వెళ్లుగాక. 9

మూ. ఫలమూలవతా నీల శీతకాననవారిణా, 10
పథా మధుమతా చాశు సేనాం సేనాపతే నయ.

ప్ర. అ. సేనాపతే=సేనాపతివైన, నీల=నీలుడా! ఫలమూలవతా=ఫలమూలములు కలది, శీతకాననవారిణా=చల్లని అడవులు, ఉదకము కలది, మధుమతా=తేనె గలది అయిన, పథా=మార్గముచేత, ఆశు=శీఘ్రముగా,

సేనామ్=సేనను, నయ=నడిపించుము.

తా. సేనాపతివైన ఓ! నీలుడా! ఈ సైన్యమును, ఫలములు, మూలములు(దుంపలు), చల్లని అడవులు, ఉదకము, కలిగి ఉన్న మార్గమున శీఘ్రముగా ప్రయాణము చేయించుము. 10

మూ. దూషయేయుర్దురాత్మానః పథి మూలఫలోదకమ్, 11
రాక్షసాః పరిరక్షేథాస్తేభ్యస్త్వం నిత్యముద్యతః.

ప్ర. అ. దురాత్మానః=దురాత్ములైన, రాక్షసాః=రాక్షసులు, పథి=మార్గమునందు, మూలఫలోదకమ్=మూలములను, ఫలములను, ఉదకమును, దూషయేయుః=పాడుచేయుదురు. త్వమ్=నీవు, నిత్యమ్=ఎల్లప్పుడూ, ఉద్యతః=ఉద్యుక్తుడవై (ప్రయత్నశీలుడవై), తేభ్యః=వాళ్లనుండి, పరిరక్షేథాః=రక్షింపుము.

తా. మనము ప్రయాణము చేసే మార్గములో ఉన్న మూల-ఫల-జలములను దురాత్ములైన రాక్షసులు పాడుచేయవచ్చును. అందుచే నీవు జాగర్తతో వాళ్లనుండి మూలాదులను రక్షించుము. 11

మూ. నిమ్నేషు వనదుర్గేషు వనేషు చ వనౌకసః, 12
అభిప్లుత్యాభిపశ్యేయుః పరేషాం నిహితం బలమ్.

ప్ర. అ. వనౌకసః=వానరులు, నిమ్నేషు=పల్లములయందు, వనదుర్గేషు=వనదుర్గములయందు, వనేషు చ=వనములయందు, అభిప్లుత్య=దుమికి, పరేషామ్=శత్రువులయొక్క, నిహితమ్=అక్కడ ఉంచబడిన, బలమ్=సేనను, అభిపశ్యేయుః=చూచెదరుగాక.

తా. వానరులు పల్లపు ప్రదేశములలోను, దుర్గములైన అరణ్యములలోను, వనములలోను ప్రవేశించి అక్కడ ఎవరైనా శత్రుసైనికులు ఉన్నారా అని చూచెదరుగాక. 12

మూ. యత్తు ఫల్గు బలం కించిత్తదత్రైవోపపద్యతామ్, 13
ఏతద్ధి కృత్యం ఘోరం నో విక్రమేణ ప్రయుజ్యతామ్.

ప్ర. అ. ఫల్గు=దుర్బలమైన, యత్ కించిత్=ఏ కొంచెము, బలమ్=సేన ఉన్నదో, తత్=అది, అత్రైవ=ఇక్కడనే, ఉపపద్యతామ్=ఉండుగాక. నః=మన యొక్క, ఏతత్=ఈ, కృత్యమ్=కార్యము, ఘోరం హి=భయంకరమైనదికదా! విక్రమేణ=పరాక్రమముచేత, ప్రయుజ్యతామ్=ప్రయోగింపవలయుగాక.

తా. బలము లేని సైన్యము కిష్కింధలోనే ఉండిపోవుగాక. ఎందుచేత ననగా మనము చేయు మన్న ఈ కార్యము చాల భయంకరమైనది;

పరాక్రమముచేత సాధింపదగినది. 13

మూ. సాగరౌఘనిభం భీమమగ్రానీకం మహాబలాః, 14
కపిసింహాః ప్రకర్షన్తు శతశోఽథ సహస్రశః.

ప్ర. అ. శతశః=వందలకొలది, అథ=మరియు, సహస్రశః=వేలకొలది, మహాబలాః=గొప్ప బలము గల, కపిసింహాః=వానరశ్రేష్ఠులు, సాగరౌఘనిభమ్=సముద్రమునందలి జలసముదాయముతో సమానమైన, భీమమ్=భయంకరమైన, అగ్రానీకమ్=ముందు నడవవలసిన సేనను, ప్రకర్షన్తు=నడిపింతురుగాక.

తా. మహాబలవంతులైన వానరవీరులు వందలకొలది, వేలకొలది సంఘములుగా ఏర్పడి సముద్రజలసముదాయము వంటి భయంకరమైన, ముందు వెళ్ళవలసిన సైన్యమును నడిపింతురు గాక. 14

మూ. గజశ్చ గిరిసంకాశో గవయశ్చ మహాబలః, 15
గవాక్షశ్చాగ్రతో యాంతు గవాం దృప్తా ఇవర్షభాః.

ప్ర. అ. గిరిసంకాశః=పర్వతముతో సమానుడైన, గజశ్చ=గజుడు, మహాబలః=గొప్ప బలము గల, గవయశ్చ=గవయుడు, గవాక్షశ్చ=గవాక్షుడు, దృప్తాః=గర్వించిన, ఋషభాః=ఎద్దు, గవామ్ ఇవ=గోవుల(ఎద్దుల)ముందు వలె, అగ్రతః=ఎదుట, యాంతు=వెళ్ళుగాక.

తా. మదించిన ఆబోతు ఎద్దుల మందకు ముందు నడచుచు వెళ్ళినట్లు, పర్వతము వంటి గజుడు, మహాబలుడైన గవయుడు, గవాక్షుడు సైన్యము ముందు నడచెదరుగాక. 15

మూ. యాతు వానరవాహిన్యా వానరః ప్లవతాం పతిః, 16
పాలయన్ దక్షిణం పార్శ్వమృషభో వానరర్షభః.

ప్ర. అ. ప్లవతాం పతిః=వానరుల నాయకుడు, వానరర్షభః=వానరశ్రేష్ఠుడు అయిన, ఋషభః వానరః=ఋషభుడను వానరుడు, వానరవాహిన్యాః=వానరసేన యొక్క, దక్షిణమ్=కుడిదైన, పార్శ్వమ్=పార్శ్వమును, పాలయన్=పాలించుచు, యాతు=వెళ్ళుగాక.

తా. వానరుల నాయకుడు, వానరశ్రేష్ఠుడూ అయిన ఋషభుడు, వానరసేన కుడి పార్శ్వమును రక్షించుచు వెళ్ళుగాక. 16

మూ. గన్ధహస్తీవ దుర్ధర్షస్తరస్వీ గన్ధమాదనః, 17
యాతు వానరవాహిన్యాః సవ్యం పార్శ్వమధిష్ఠితః.

ప్ర. అ. గన్ధహస్తీవ=మత్తగజము వలె, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, తరస్వీ=బలము గల, గన్ధమాదనః=గంధమాదనుడు, వానరవాహిన్యాః=వానరసేన యొక్క, వామమ్=ఎడమదైన, పార్శ్వమ్=పార్శ్వమును, అధిష్ఠితః=అధిష్ఠించిన వాడై, యాతు=వెళ్ళుగాక.

తా. మదించిన ఏనుగు వలె ఎదిరింప శక్యము కానివాడు, బలశాలి అయిన గంధమాదనుడు వానరసైన్యము ఎడమ ప్రక్కను అధిష్ఠించి (పాలించుచు) వెళ్ళుగాక. 17

మూ. యాస్యామి బలమధ్యేఽహం బలౌఘమభిహర్షయన్. 18
అధిరుహ్య హనూమన్త మైరావత మివేశ్వరః.

ప్ర. అ. అహమ్ =నేను, ఈశ్వరః =దేవేంద్రుడు, ఐరావతమివ = ఐరావతమునువలె, హనూమన్తమ్ = హనుమంతుని, అధిరుహ్య =ఎక్కి, బలౌఘమ్ = సేనాసముదాయమును, అభిహర్షయన్=సంతోషపెట్టుచు, బలమధ్యే= సేన మధ్యయందు, యాస్యామి = వెళ్ళగలను.

తా. నేను, దేవేంద్రుడు ఐరావతము నెక్కినట్లు హనుమంతునిమీద ఎక్కి , సేనాసముదాయమునకు ఉత్సాహమును వృద్ధి చేయుచు, సేన మధ్యలో వెళ్ళెదను. 18

మూ. అఙ్గదేనైష సంయాతు లక్ష్మణశ్చాన్తకోపమః, 19
సార్వభౌమేన భూతేశో ద్రవిణాధిపతిర్యథా.

ప్ర. అ. అన్తకోపమః = యమునితో సమానుడైన, ఏష లక్ష్మణశ్చ = ఈ లక్ష్మణుడు, భూతేశః = యక్షుల ప్రభువైన, ద్రవిణాధిపతిః = కుబేరుడు, సార్వభౌమేన యథా = సార్వభౌమ మను ఏనుగు చేత వలె, అఙ్గదేన =అంగదునిచేత, సంయాతు = వెళ్ళుగాక.

తా. యక్షుల ప్రభువైన కుబేరుడు సార్వభౌమ మను దిగ్గజమును అధిష్ఠించి నట్లు యమునితో సమానుడైన ఈ లక్ష్మణుడు అంగదుని అధిరోహించి వెళ్ళుగాక. 19

మూ. జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః, 20
ఋక్షరాజో మహాసత్త్వః కుక్షిం రక్షన్తు తే త్రయః.

ప్ర. అ. ఋక్షరాజః = భల్లూకముల రాజు, మహాసత్త్వః = గొప్ప బలము గలవాడు అయిన, జామ్బవాంశ్చ = జాంబవంతుడు, సుషేణశ్చ=సుషేణుడు, వేగదర్శీ = వేగదర్శి అను, వానరశ్చ=వానరుడు, తే =ఆ, త్రయః =ముగ్గురూ,

కుక్షిమ్ = మధ్యభాగమును, రక్షన్తు= రక్షించెదరు గాక.

తా. మహాబలవంతుడు, భల్లూకరాజు అయిన జాంబవంతుడు, సుషేణుడు, వేగవంతుడు ఈ ముగ్గురూ సేనామధ్యభాగమును రక్షించెదరుగాక.

మూ. రాఘవస్య వచః శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః, 21
వ్యాదిదేశ మహావీర్యో వానరాన్వానరర్షభః.

ప్ర. అ. రాఘవస్య =రాముని యొక్క, వచః =వచనమును, శ్రుత్వా =విని, వాహినీపతిః= సర్వసేనాపతియు, వానరర్షభః = వానరశ్రేష్ఠుడు అయిన, మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, సుగ్రీవః = సుగ్రీవుడు, వానరాన్ = వానరులను, వ్యాదిదేశ =ఆజ్ఞాపించెను.

తా. రాముని మాటలు విని, సర్వసేనాధిపతి, మహాపరాక్రమవంతుడు, వానరశ్రేష్ఠుడు అయిన సుగ్రీవుడు వానరులను, రాముడు చెప్పినట్లు చేయుటకు ఆజ్ఞాపించెను. 21

మూ. తే వానరగణాః సర్వే సముత్పత్య మహౌజసః, 22
గుహాభ్యః శిఖరేభ్యశ్చ ఆశు పుప్లువిరే తదా.

ప్ర. అ. తదా= అప్పుడు, మహౌజసః=గొప్ప వేగము గల, సర్వే = సమస్తమైన, తే= ఆ, వానరగణాః = వానరగణములు, సముత్పత్య= ఒక్కుమ్మడిగా లేచి, గుహాభ్యః= గుహలనుండి, శిఖరేభ్యశ్చ=శిఖరములనుండి, ఆశు= శీఘ్రముగా, పుప్లువిరే =ఎగిరిరి.

తా. గొప్ప తేజస్సు గల ఆ వానరు లందరూ ఒక్కుమ్మడిగా లేచి వెంటనే గుహలనుండి, శిఖరములనుండి పైకి ఎగిరిరి. 22

మూ. తతో వానరరాజేన లక్ష్మణేన చ పూజితః, 23
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్.

ప్ర. అ. తతః =అటుపిమ్మట, వానరరాజేన=సుగ్రీవునిచేత, లక్ష్మణేన చ= లక్ష్మణుని చేత, పూజితః =పూజింపబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామః = రాముడు, ససైన్యః =సైన్యముతో కూడినవాడై, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట ధర్మాత్ముడైన రాముడు సుగ్రీవునిచేత, లక్ష్మణునిచేత పూజింపబడుచు దక్షిణదిక్కు వైపు ప్రయాణ మాయెను. 23

మూ. శతైః శతసహస్రైశ్చ కోటిభిశ్చాయుతైరపి, 24
వారణాభైశ్చ హరిభిర్యయౌ పరివృతస్తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, వారణాభైః =ఏనుగులవంటి కాంతి గల, శతైః =వందలు, శతసహస్రైః =లక్షలు, కోటిభిశ్చ =కోట్లు, అయుతైరపి=పదివేలు, హరిభిః = వానరులచేత, పరివృతః =పరివృతుడై (చుట్టబడినవాడై) యయౌ=వెళ్లెను.

తా. అప్పుడా రాముడు వందలకొలది, పదివేలకొలది, లక్షలకొలది, కోట్లకొలది ఏనుగుల వంటి వానరులతో కూడినవాడై వెళ్లెను. 24

మూ. తం యాన్తమనుయాన్తి సా మహతీ హరివాహినీ, 25
హృష్టాః ప్రముదితాః సర్వే సుగ్రీవేణాభి పాలితాః.

ప్ర. అ. మహతీ =గొప్పదైన, సా= ఆ, హరివాహినీ = వానరసేన, యాన్తమ్ = వెళ్లుచున్న, తమ్ = ఆతనిని, అనుయాన్తి = అనుసరించి వెళ్లుచున్నదిగా(ఉండెను). సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, పాలితాః = పాలించబడిన ఆ వానరులు, సర్వే =అందరూ, హృష్టాః=సంతోషించినవారై, ప్రముదితాః =చాల సంతోషించుచున్నవారై (ఉండిరి.)

తా. విశాలమైన ఆ వానరసేన ముందు వెళ్లుచున్న ఆ రాముని అనుసరించి వెళ్లెను. సుగ్రీవునిచేత పాలింపబడిన ఆ వానరు అందరు ఉత్సాహవంతులై చాల సంతోషించుచుండిరి. 25

మూ. ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవంగమాః, 26
క్ష్వేళన్తో నినదన్తశ్చ జగ్ముర్వై దక్షిణాం దిశమ్.

ప్ర. అ. ప్లవంగమాః =వానరులు, ప్లవన్తః = ఎగురుచు, ఆప్లవన్తః = మండలాకారముగా ఎగురుచు, గర్జన్తశ్చ = గర్జించుచు, క్ష్వేళన్తః =సింహనాదము చేయుచు, నినదన్తశ్చ = అరచుచు, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును గూర్చి, జగ్ముః వై = వెళ్లిరి.

తా. ఆ వానరులు ఎగురుచు, మండలాకారముగా ఎగురుచు, గర్జించుచు, సింహనాదములు చేయుచు, అరచుచు దక్షిణము వైపు వెళ్లిరి. 26

మూ. భక్షయన్తః సుగన్ధీని మధూని చ ఫలాని చ, 27
ఉద్వహన్తో మహావృక్షాన్ మఞ్జరీపుఞ్జధారిణః.

ప్ర. అ. సుగన్ధీని = మంచి వాసన గల, మధూని=తేనెలను, ఫలాని చ= ఫలములను, భక్షయన్తః =భక్షించుచు, మఞ్జరీపుఞ్జధారిణః =గుత్తుల సముదాయములను ధరించుచున్న, మహావృక్షాన్ = మహావృక్షములను, ఉద్వహన్తః =మోయుచు(వెళ్లిరి).

తా. దారిలో మంచి సువాసన గల తేనెలను, ఫలములను భక్షించుచు,

గుత్తుల సముదాయములతో నిండిన పెద్ద వృక్షములను మోయుచు వెళ్లిరి.27

మూ. అన్యోన్యం సహసా దృప్తా నిర్వహన్తి క్షిపన్తి చ, 28
పతన్త్యుత్పతన్త్యన్యే పాతయన్త్యపరే పరాన్.

ప్ర.అ. దృప్తాః =గర్వించిన ఆ వానరులు, అన్యోన్యమ్ = పరస్పరము, నిర్వహన్తి = పైకి ఎత్తి మోయుచున్నారు; సహసా = వెంటనే, క్షిపన్తి = క్రిందికి విసిరవేయుచున్నారు. అన్యే = కొందరు, పతన్తః చ=క్రిందికి దుముకుచు, ఉత్పతన్తి= ఎగురుచున్నారు. అపరే=మరి కొందరు, పరాన్ =ఇతరులను, పాతయన్తి=పడవేయుచున్నారు.

తా. గర్వించిన కొందరు వానరులు పరస్పరము పైకి ఎత్తి క్రిందికి పడవేయుచుండిరి. కొందరు క్రిందికి దుమికి పైకి ఎగురుచుండిరి. మరికొందరు ఇతరులను క్రిందికి పడద్రోయుచుండిరి. 28

మూ. రావణో నో నిహన్తవ్యః సర్వే చ రజనీచరాః, 29
ఇతి గర్జన్తి హరయో రాఘవస్య సమీపతః.

ప్ర. అ. నః = మనకు, రావణః = రావణుడు, నిహన్తవ్యః = చంపదగినవాడు. సర్వే =సమస్తమైన, రజనీచరాశ్చ = రాక్షసులు కూడ (చంప దగినవారు). ఇతి =అని, హరయః =వానరులు, రాఘవస్య =రామునియొక్క, సమీపతః = సమీపమునందు, గర్జన్తి =గర్జించుచున్నారు.

తా. రామునకు దగ్గరగా ఉన్న వానరులు మనము రావణుని, సమస్తమైన రాక్షసులను చంపవలెను అని గర్జించుచుండిరి. 29

మూ. పురస్తాదృషభో నీలో వీరః కుముద ఏవ చ, 30
పన్థానం శోధయన్తి స్మ వానరైర్బహుభిః సహ.

ప్ర. అ. ఋషభః =ఋషభుడు, నీలః = నీలుడు, వీరః = వీరుడైన, కుముద ఏవ చ= కుముదుడు, బహుభిః =అనేకులైన, వానరైః = వానరులతో కూడ, పురస్తాత్= ముందు, పన్థానమ్ = మార్గమును, శోధయన్తి స్మ =శోధించుచుండిరి.

తా. ఋషభుడు, నీలుడు, వీరుడైన కుముదుడు వీరందరు వానరులతో కలిసి ముందు నడచుచు సైన్యము వచ్చే మార్గమును బాగుచేయుచుండిరి.30

మూ. మధ్యే తు రాజా సుగ్రీవో రామో లక్ష్మణ ఏవ చ, 31
బలిభిర్బహుభిర్భీమైర్వృతాః శత్రునిబర్హణాః.

ప్ర. అ. మధ్యే =మధ్యయందు, రాజా = రాజైన, సుగ్రీవః =

సుగ్రీవుడు, రామః = రాముడు, లక్ష్మణః ఏవ చ= లక్ష్మణుడు, బలిభిః = బలముగల, భీమైః = భయంకరులైన, బహుభిః = చాలమంది వానరులతో, వృతాః = కూడినవారై, శత్రునిబర్హణాః = శత్రువులను సంహరింపనున్నవారై (వెళ్లిరి).

తా. శత్రుసంహారకులైన వానరరాజైన సుగ్రీవుడు, రాముడు, లక్ష్మణుడు బలవంతులు, భయంకరులు అయిన వానరులతో కూడి సేనామధ్యమునందు ప్రయాణము చేసిరి. 31

మూ. హరిః శతబలిర్వీరః కోటీభిర్దశభిర్వృతః, 32
సర్వామేకో హ్యవష్టభ్య రరక్ష హరివాహినీమ్.

ప్ర. అ. దశభిః =పది, కోటిభిః = కోటులతో, వృతః= కూడిన, వీరః = వీరుడైన, శతబలిః = శతబలి అను, హరిః = వానరుడు, ఏకః =ఒక్కడే, సర్వామ్ = సమస్తమైన, హరివాహినీమ్ = వానరసేనను, అవష్టభ్య =అధిష్ఠించి, రరక్ష = రక్షించెను.

తా. పదికోట్ల వానరులతో కూడిన వీరుడైన శతబలి ఒక్కడే వానరసైన్యము నంతను అధిష్ఠించి రక్షించుచుండెను. 32

మూ. కోటీశతపరీవారః కేసరీ పనసో గజః, 33
అర్కశ్చ బహుభిః పార్శ్వమేకం తస్యాభిరక్షతి.

ప్ర. అ. కోటీశతపరీవారః =నూరు కోట్ల పరివారము గల, కేసరీ=కేసరి, పనసః = పనసుడు, గజః =గజుడు, బహుభిః =అనేక వానరులతో కూడిన, అర్కః చ =అర్కుడు, తస్య= దానియొక్క, ఏకమ్ =ఒక, పార్శ్వమ్ = పార్శ్వమును, అభిరక్షతి=రక్షించుచున్నాడు.

తా. నూరు కోట్ల పరివారము గల కేసరి, పనసుడు, గజుడు, చాలమంది వానరులతో కూడిన అర్కుడు ఒక సైన్యపార్శ్వమును రక్షించుచుండిరి.

మూ. సుషేణో జామ్బవాంశ్చైవ ఋక్షైర్బహుభిరావృతౌ, 34
సుగ్రీవం పురతః కృత్వా జఘనం సంరరక్షతుః.

ప్ర. అ. సుషేణః = సుషేణుడు, జామ్బవాంశ్చైవ=జాంబవంతుడు, బహుభిః = అనేకులైన, ఋక్షైః =భల్లూకములతో, ఆవృతౌ =ఆవరింపబడినవారై, సుగ్రీవమ్ = సుగ్రీవుని, పురతః =ముందు, కృత్వా = ఉంచుకొని, జఘనమ్ = సేన వెనుకభాగమును, సంరరక్షతుః= రక్షించిరి.

తా. అనేకభల్లూకములతో కూడిన సుషేణజాంబవంతులు సుగ్రీవుని ఎదుట ఉండుకొని సైన్యము వెనుకభాగమును రక్షించుచుండిరి. 34

మూ. తేషాం సేనాపతిర్వీరో నీలో వానరపుఙ్గవః, 35
సంయతశ్చరతాం శ్రేష్ఠస్తద్బలం పర్యపాలయత్.

ప్ర. అ. తేషామ్ = వారియొక్క, సేనాపతిః = సేనాపతి, వీరః = వీరుడు, వానరపుఙ్గవః = వానరశ్రేష్ఠుడు, సంయతః = ఆత్మసంయమనము కలవాడు, చరతామ్ = సంచరించువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు అయిన, నీలః = నీలుడు, తత్ = ఆ, బలమ్ = సేనను, పర్యపాలయత్ = పాలించెను.

తా. ఆ వానరుల సేనాపతి, వీరుడు, వానరశ్రేష్ఠుడు, నియమవంతుడు, ప్రాణులలో శ్రేష్ఠుడు అయిన నీలుడు సైన్యమును పర్యవేక్షించుచు పాలించుచుండెను. 35

మూ. వలీముఖః ప్రజఙ్ఘశ్చ జమ్భోఽథ రభసః కపిః, 36
సర్వతశ్చ యయుర్వీరాస్త్వరయన్తః ప్లవఙ్గమాన్.

ప్ర. అ. వీరాః = వీరులైన, వలీముఖః = వలీముఖుడు, ప్రజఙ్ఘశ్చ = ప్రజంఘుడు, జమ్భః = జంభుడు, అథ = మరియు, కపిః = వానరుడైన, రభసః = రభసుడు, ప్లవఙ్గమాన్ = వానరులను, త్వరయన్తః = తొందరపెట్టుచున్నవారై, సర్వతః = అన్ని వైపులా, యయుః = వెళ్లిరి.

తా. వలీముఖుడు, ప్రజంఘుడు, జంభుడు, రభసుడు, ఈ వీరులందరు నాల్గుప్రక్కలా తిరుగుచు, వానరులను తొందరపెట్టుచు వెళ్లిరి. 36

మూ. ఏవం తే హరిశార్దూలా గచ్ఛన్తో బలదర్పితాః, 37
అపశ్యన్త గిరిశ్రేష్ఠం సహ్యం గిరిశతాయుతమ్.
సరాంసి చ సుపుల్లాని తటాకాని వరాణి చ. 38

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, గచ్ఛన్తః = వెళ్లుచున్న, బలదర్పితాః = బలముచే గర్వించిన, తే = ఆ, హరిశార్దూలాః = వానరశ్రేష్ఠులు, గిరిశతాయుతమ్ = అనేక చిన్నపర్వతములతో కూడిన, గిరిశ్రేష్ఠమ్ = పర్వతశ్రేష్ఠమైన, సహ్యమ్ = సహ్యపర్వతమును, సుపుల్లాని = బాగా వికసించిన, సరాంసి = సరస్సులను, వరాణి = శ్రేష్ఠములైన, తటాకాని చ = చెరువులను, అపశ్యన్త = చూచిరి.

తా. బలముచేత గర్వించిన ఆ వానరశ్రేష్ఠులు ఈ విధముగా వెళ్లుచు, అనేకమైన చిన్న పర్వతములతో కూడిన, పర్వతశ్రేష్ఠమైన సహ్యపర్వతమును, వికసించిన పుష్పములు గల సరస్సులను, శ్రేష్ఠములైన చెరువులను చూచిరి.

(చిన్నది తటాకము. పెద్దది సరస్సు) 37, 38

మూ. రామస్య శాసనం జ్ఞాత్వా భీమకోపస్య భీతవత్,
వర్జయన్నగరాభ్యాశాంస్తథా జనపదానపి. 39

సాగరౌఘనిభం భీమం తద్వానరబలం మహత్,
నిఃససర్ప మహాఘోరం భీమఘోషమివార్ణవమ్. 40

ప్ర. అ. సాగరౌఘనిభమ్ = సముద్రజలసముదాయముతో సమానమైన, భీమమ్ = భయంకరమైన, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, వానరబలమ్ = వానరసైన్యము, భీమకోపస్య = భయంకరమైన కోపము గల, రామస్య = రామునియొక్క, శాసనమ్ = ఆజ్ఞను, జ్ఞాత్వా = తెలిసికొని, భీతవత్ = భయపడినదై, నగరాభ్యాశాన్ = నగరసమీపప్రాంతములను, తథా = మరియు, జనపదానపి = గ్రామములను, వర్జయన్ = వర్జించుచు (దూరముగా విడచుచు), మహాఘోరమ్ = చాల భయంకరము, మహాఘోషమ్ = గొప్ప ధ్వని గల, అర్ణవమ్ ఇవ = సముద్రము వలె, నిఃససర్ప = ప్రయాణము చేసెను.

తా. సముద్రజలసముదాయము వలె భయంకరముగా ఉన్న ఆ గొప్ప వానరసైన్యము, భయంకరమైన కోపము గల రాముని ఆజ్ఞను స్మరించుచు, భయపడి, నగర సమీపప్రాంతములను, గ్రామములను పరిహరించుచు చాల భయంకరము, భయంకరమైన ధ్వని గలదీ అయిన సముద్రము వలె ప్రయాణము చేసెను. 39, 40

మూ. తస్య దాశరథేః పార్శ్వే శూరాస్తే కపికుఞ్జరాః,
తూర్ణమాపుప్లువుః సర్వే సదశ్వా ఇవ చోదితాః. 41

ప్ర. అ. శూరాః = శూరులైన, తే = ఆ, సర్వే = సమస్తమైన, కపికుఞ్జరాః = వానరశ్రేష్ఠులు, తస్య = ఆ, దాశరథేః = రామునియొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, చోదితాః = తోలబడిన, సదశ్వాః ఇవ = ఉత్తమాశ్వముల వలె, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆపుప్లువుః = ఎగిరిరి.

తా. శూరులైన ఆ వానరశ్రేష్ఠు లందరూ, తోలిన ఉత్తమాశ్వముల వలె రాముని ప్రక్క శీఘ్రముగా ఎగురుచు వెళ్లిరి. 41

మూ. కపిభ్యాముహ్యమానౌ తౌ శుశుభాతే నరర్షభౌ,
మహద్భ్యామివ సంస్పృష్టౌ గ్రహాభ్యాం చన్ద్రభాస్కరౌ. 42

ప్ర. అ. కపిభ్యామ్ = ఇద్దరు వానరులచేత, ఉహ్యమానౌ = మోయబడుచున్న, తౌ = ఆ, నరర్షభౌ = నరశ్రేష్ఠులు, మహద్భ్యామ్ = పెద్ద,

గ్రహాభ్యామ్ = గ్రహములచేత, సంస్పృష్టౌ = స్పృశింపబడిన, చన్ద్రభాస్కరౌ ఇవ = చంద్రసూర్యులు వలె, శుశుభాతే = ప్రకాశించిరి.

తా. హనుమదంగదుల భుజముల నెక్కి వెళ్లుచున్న ఆ రామలక్ష్మణులు రెండు పెద్ద గ్రహములతో కూడిన సూర్యచంద్రుల వలె ప్రకాశించిరి. 42

మూ. తతో వానరరాజేన లక్ష్మణేన సుపూజితః,
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్. 43

ప్ర. అ. తా. 23 వ శ్లోకము చూడుడు.

మూ. తమఙ్గదగతో రామం లక్ష్మణః శుభయా గిరా,
ఉవాచ పరిపూర్ణార్థం పూర్ణార్థప్రతిభానవాన్. 44

ప్ర. అ. అఙ్గదగతః = అంగదునిపై ఉన్న, పూర్ణార్థప్రతిభానవాన్ = పూర్ణమైన అర్థస్ఫూర్తి గల, లక్ష్మణః = లక్ష్మణుడు, శుభయా = శుభమైన, గిరా= వాక్కుతో, తం రామమ్ = ఆ రాముని గూర్చి, పరిపూర్ణార్థమ్=పరిపూర్ణమైన అర్థము గలుగునట్లుగా, ఉవాచ = పలికెను.

తా. పరిపూర్ణమైన అర్థజ్ఞానము గల లక్ష్మణుడు, అంగదుని భుజముపై కూర్చుండి ప్రయాణము చేయుచు, పరిపూర్ణమైన అర్థము కలుగునట్లు రామునితో శుభకరమైన మాటలు పలికెను. 44

మూ. హృతామవాప్య వైదేహీం క్షిప్రం హత్వా చ రావణమ్,
సమృద్ధార్థః సమృద్ధార్థామయోధ్యాం ప్రతియాస్యసి. 45

ప్ర. అ. రావణమ్ = రావణుని, క్షిప్రమ్ = శీఘ్రముగా, హత్వా = చంపి, హృతామ్ = అపహరింపబడిన, వైదేహీమ్ = సీతను, అవాప్య చ = పొంది, సమృద్ధార్థః = పూర్తియైన కార్యము కలవాడవై, సమృద్ధార్థామ్ = సమృద్ధముగా ఉన్న ధనము గల, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ప్రతియాస్యసి = వెళ్లగలవు.

తా. (నీవు) రావణుని శీఘ్రముగా సంహరించి, వానిచేత అపహరింపబడిన సీతను పొంది, కృతకృత్యుడవై, ఐశ్వర్యసమృద్ధమైన అయోధ్యకు వెళ్లగలవు. 45

మూ. మహాన్తి చ నిమిత్తాని దివి భూమౌ చ రాఘవ,
శుభాని తవ పశ్యామి సర్వాణ్యేవార్థసిద్ధయే, 46
అనువాతి శివో వాయుః సేనాం మృదుహితః సుఖః.

ప్ర. అ. రాఘవ=రామా! దివి=ఆకాశ మందు, భూమౌ చ=భూమి

యుందును, మహాస్త్ర=గొప్ప, నిమిత్తాని=శకునములను, తవ = నీయొక్క, అర్థసిద్ధయే = కార్యసిద్ధికొరకు, సర్వాణి = సమస్తమైన, శుభాన్యేవ = శుభములనే, పశ్యామి = చూచుచున్నాను. శివః = మంగళకరము, హృదుహితః = మృదువు హితము , సుఖః = సుఖకరమూ అయిన, వాయుః = వాయువు, సేనామ్=సేనను, అనువాతి=అనుసరించి వీచుచున్నది.

తా. నీ కార్యసిద్ధిని సూచించు అన్నీ శుభశకునములు కనబడుచున్నవి. మంగళకరము, మృదువు, హితము, సుఖకరము అయిన వాయువు సేనకు అనుకూలముగా (సేన ఏ వైపునకు వెళ్ళుచున్నదో ఆ వైపునకే) వీచుచున్నది.

మూ. పూర్ణవల్గుస్వరాశ్చేమే ప్రవదన్తి మృగద్విజాః, 47
ప్రసన్నాశ్చ దిశః సర్వా విమలశ్చ దివాకరః.

ప్ర. అ. ఏతే= ఈ, మృగద్విజాః =మృగములు, పక్షులు, పూర్ణవల్గుస్వరాః = పూర్ణము మధురము అయిన స్వరము గలవై, ప్రవదన్తి = పలుకుచున్నవి. సర్వాః = సమస్తమైన , దిశశ్చ = దిక్కులు కూడ, ప్రసన్నాః = నిర్మలములైనవి. దివాకరశ్చ = సూర్యుడు కూడ, విమలః = స్వచ్ఛముగా ఉన్నాడు.

తా. ఈ మృగములు పక్షులు కూడ పూర్ణము మధురమూ అయిన స్వరముతో ధ్వని చేయుచున్నవి. దిక్కు అన్నీ ప్రసన్నములుగా ఉన్నవి. సూర్యుడు నిర్మలముగా ఉన్నాడు. 47

మూ. ఉశనా చ ప్రసన్నార్చిరను త్వాం భార్గవో గతః, 48
బ్రహ్మరాశిర్విశుద్ధశ్చ శుద్ధాశ్చ పరమర్షయః,
అర్చిష్మన్తః ప్రకాశన్తే ధ్రువం సర్వే ప్రదక్షిణమ్. 49

ప్ర. అ. భార్గవః = భృగుమహర్షి పుత్రుడైన, ఉశనా చ= శుక్రుడు కూడ, ప్రసన్నార్చిః =ప్రసన్నమైన కాంతి కలవాడై, త్వామ్ = నిన్ను, అనుగతః = అనుసరించినాడు. బ్రహ్మరాశిః = సప్తర్షిమండలము గల ధ్రువుడు, విశుద్ధః = పరిశుద్ధముగా ఉన్నాడు. సర్వే = సమస్తమైన, పరమర్షయః = మహర్షులు, శుద్ధాః = పరిశుద్ధులై, అర్చిష్మన్తః = కాంతి గలవారై, ధ్రువమ్ = ధ్రువుని, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణముగా, ప్రకాశన్తే = ప్రకాశించుచున్నారు.

తా. భృగుమహర్షి పుత్రుడైన శుక్రుడు ప్రసన్నమైన కాంతితో నీకు అనుకూలముగా ఉన్నాడు. సప్తర్షిమండలముతో కూడిన ధ్రువుడు పరిశుద్ధముగా ఉన్నాడు. సప్తర్షులు అందరూ కూడ పరిశుద్ధులై, కాంతిమంతులై ధ్రువునికి ప్రదక్షిణముగా సంచరించుచు ప్రకాశించుచున్నారు. 48,49

మూ. త్రిశఙ్కుర్విమలో భాతి రాజర్షిః సపురోహితః,
పితామహః పురోఽస్మాకమిక్ష్వాకూణాం మహాత్మనామ్. 50

ప్ర. అ. అస్మాకమ్=మనయొక్క, పితామహః=పితామహుడు, మహాత్మనామ్= మహాత్ములైన, ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశీయులకు సంబంధించినవాడు, రాజర్షిః=రాజర్షి అయిన, త్రిశఙ్కుః=త్రిశంకువు, విమలః=స్వచ్ఛమైనవాడై, పురః=ఎదుట, సపురోహితః= పురోహితునితో కూడినవాడై, భాతి=ప్రకాశించుచున్నాడు.

తా. మహాత్ములైన ఇక్ష్వాకువంశీయుల వంశమునందు జన్మించినవాడూ, మన ముత్తాత, రాజర్షీ అయిన త్రిశంకువు, ఎదుట, పురోహితుడైన విశ్వామిత్రునితో ప్రకాశించుచున్నాడు. 50

మూ. విమలే చ ప్రకాశేతే విశాఖే నిరుపద్రవే, 51
నక్షత్రం పరమస్మాకమిక్ష్వాకూణాం మహాత్మనామ్.

ప్ర. అ. విమలే=నిర్మలములైన, విశాఖే=విశాఖానక్షత్రములు(విశాఖానక్షత్రములో రెండు చుక్క లుండును గాన ద్వివచనము) నిరుపద్రవే=ఉపద్రవము లేనివై, ప్రకాశేతే=ప్రకాశించుచున్నవి. మహాత్మనామ్=మహాత్ములైన, అస్మాకమ్=మనయొక్క, ఇక్ష్వాకూణామ్= ఇక్ష్వాకువంశీయులైనవారియొక్క, పరమ్=శ్రేష్ఠమైన, నక్షత్రమ్=నక్షత్రము.

తా. విశాఖానక్షత్రములు ఉపద్రవ మేమీ (దుష్టగ్రహసంబంధాదికము) లేనివై నిర్మలములై ప్రకాశించుచున్నవి. ఇది మహాత్ములైన మన ఇక్ష్వాకువంశీయుల నక్షత్రము. 51

మూ. నైరృతం నైరృతానాం చ నక్షత్రమభిపీడ్యతే, 52
మూలో మూలవతా స్పృష్టో ధూప్యతే ధూమకేతునా.

ప్ర. అ. నైరృతానామ్=రాక్షసులయొక్క, నక్షత్రమ్=నక్షత్రమైన, నైరృతమ్= మూలనక్షత్రము, అభిపీడ్యతే= పీడింపబడుచున్నది. మూలవతా=మూలము గల, ధూమకేతునా= ధూమకేతువుచేత(తోకచుక్కచేత), స్పృష్టః=స్పృశింపబడినదై, మూలః=మూలనక్షత్రము, ధూప్యతే=తపింపచేయబడుచున్నది.

తా. నిరృతి దేవతగా గల, రాక్షసనక్షత్రమైన మూలనక్షత్రము పీడింపబడుచున్నది. మొదలుగల (అనగా స్తంభాకారముగా ఉన్న) తోకచుక్క స్పృశించుటచే మూలనక్షత్రము తపింపచేయబడుచున్నది. 52

మూ. సర్వం చైతద్వినాశాయ రాక్షసానాముపస్థితమ్, 53
కాలే కాలగృహీతానాం నక్షత్రం గ్రహపీడితమ్.

ప్ర. అ. ఏతత్=ఇది, సర్వమ్=అంతా, రాక్షసానామ్=రాక్షసులయొక్క, వినాశాయ=వినాశముకొరకు, ఉపస్థితమ్=వచ్చినది. కాలగృహీతానామ్=మృత్యువుచేత గ్రహింపబడినవారియొక్క, నక్షత్రమ్=నక్షత్రము, కాలే=కాలమునందు, గ్రహపీడితమ్=గ్రహముచేత పీడింపబడినది అగును.

తా. మృత్యువు ఆసన్నమైనవారి నక్షత్రము గ్రహముచేత పీడింపబడును కదా ! అందుచేత ఇది అంతా రాక్షసుల వినాశమునకే వచ్చినది.

వి. మిట్టమధ్యాహ్నములో లక్ష్మణునకు నక్షత్రములు కనబడుట అసంభావ్యము. అందుచేత ఈ ఏడారు శ్లోకాలు ప్రక్షిప్తములై ఉండును లేదా లక్ష్మణుడు ఊహించి చెప్పుచున్నాడని ఎట్లో సమర్థించుకొనవలెను. 53

మూ. ప్రసన్నాః సురసాశ్చాపో వనాని ఫలవన్తి చ,
ప్రవాన్తి నాధికా గన్ధా యథర్తుకుసుమా ద్రుమాః. 54

ప్ర.అ. ఆపః=ఉదకములు, ప్రసన్నాః=ప్రసన్నముగా ఉన్నవి. సురసాః=మంచి రుచి గలవి. వనాని=వనములు, ఫలవన్తి చ=ఫలములు గలవి. గన్ధాః=గంధము గల వాయువులు, అధికాః=అధికములై, న ప్రవాన్తి=వీచుటలేదు. ద్రుమాః=వృక్షములు, యథర్తుకుసుమాః=ఋతువులను అనుసరించి పుష్పములు గలవి.

తా. జలములు నిర్మలములుగా నున్నవి. వాటి రుచి బాగున్నది. వనములు ఫలములతో నిండినవి. గంధముతో నిండిన వాయువులు మందముగా వీచుచున్నవి. వృక్షములు ఋతువుల ప్రకారము పుష్పించినవి. 54

మూ. వ్యూఢాని కపిసైన్యాని ప్రకాశన్తేఽధికం ప్రభో,
దేవానామివ సైన్యాని సంగ్రామే తారకామయే, 55
ఏవమార్య సమీక్ష్యైతత్ ప్రీతో భవితుమర్హసి.

ప్ర. అ. ప్రభో = ఓ! ప్రభూ!, వ్యూఢాని = వ్యూహములుగా ఏర్పడిన, కపిసైన్యాని = వానరసైన్యములు, తారకామయే = తారకుని వధ జరిగిన, సంగ్రామే = యుద్ధమునందు, దేవానామ్ = దేవతలయొక్క, సైన్యానీవ = సైన్యములువలె, అధికమ్ = అధికముగా, ప్రకాశన్తే = ప్రకాశించుచున్నవి. ఆర్య = ఓ! పూజ్యుడా!, ఏవమ్ =ఇట్లు, ఏతత్=దీనిని, సమీక్ష్య = చూచి, ప్రీతః = సంతోషించినవాడవుగా, భవితుమ్ = అగుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ఓ! ప్రభూ! వ్యూహములుగా ఏర్పడిన ఈ కపిసైన్యాలు తారకాసురుని సంహారసమయమునందు దేవతల సైన్యములు వలె అధికముగా ప్రకాశించుచున్నవి. అన్నా! ఈ విధముగా ఉన్న ఈ శుభశకునములను చూచి నీవు సంతోషము పొందుము. 55

మూ. ఇతి భ్రాతరమాశ్వాస్య హృష్టః సౌమిత్రిరబ్రవీత్, 56
అథావృత్య మహీం కృత్స్నాం జగామ హరివాహినీ ,
ఋక్షవానరశార్దూలైర్నఖదంష్ట్రాయుధై రపి. 57

ప్ర. అ. హృష్టః = సంతోషించిన, సౌమిత్రిః = లక్ష్మణుడు, భ్రాతరమ్ = సోదరుని, ఆశ్వాస్య = ఓదార్చి, ఇతి = ఇట్లు, అబ్రవీత్ = పలికెను. అథ = ఆటుపిమ్మట, హరివాహినీ = వానరసేన, నఖదంష్ట్రాయుధైః = గోళ్ళు, కోరలు ఆయుధములుగా కల, ఋక్షవానరశార్దూలైః = శ్రేష్ఠులైన భల్లూకములతోను వానరులతోను, కృత్స్నామ్= సమస్తమైన, మహీమ్ = భూమిని, ఆవృత్య = కప్పి, జగామ = వెళ్ళెను.

తా. సంతోషించిన లక్ష్మణుడు సోదరుని ఓదార్చుచు పైవిధముగా పలికెను. అప్పుడు వానరసేన గోళ్ళు, కోరలు ఆయుధములుగా గల శ్రేష్ఠములైన భల్లూకములచేతను, వానరులచేతను భూమినంతను కప్పివేయుచు ప్రయాణము చేసెను. 56, 57

మూ. కరాగ్రైశ్చరణాగ్రైశ్చ వానరై రుద్ధతం రజః,
భీమమన్తర్దధే లోకం నివార్య సవితుః ప్రభామ్, 58
సపర్వతవనాకాశం దక్షిణాం హరివాహినీ,
ఛాదయన్తీ యయౌ భీమా ద్యామివామ్బుదసన్తతిః. 59

ప్ర. అ. వానరైః = వానరులచేత, కరాగ్రైః = హస్తాగ్రములచేత, చరణాగ్రైశ్చ=పాదాగ్రములచేత, ఉద్ధతమ్ = ఎగురగొట్టబడిన, భీమమ్ = భయంకరమైన, రజః = పరాగము, సవితుః = సూర్యునియొక్క, ప్రభామ్ = కాంతిని, నివార్య = నివారించి, సపర్వతవనాకాశమ్ = పర్వతములతోను,వనముల తోను, ఆకాశముతోను కూడిన, లోకమ్ = లోకమును, అన్తర్దధే = కప్పివేసెను. భీమా = భయంకరమైన, హరివాహినీ = వానరసేన, అమ్బుదసన్తతిః = మేఘసముదాయము, ద్యామివ = ఆకాశమునువలె, దక్షిణామ్ = దక్షిణదిక్కును, ఛాదయన్తీ = కప్పుచున్నదై, యయౌ = వెళ్ళెను.

తా. వానరులు హస్తాగ్రములచేత, పాదాగ్రములచేత ఎగురగొట్టిన భయంకరమైన పరాగము సూర్యుని కాంతిని నివారించి, పర్వతములతోను,

అరణ్యములతోను, ఆకాశముతోను గూడిన లోకమును కప్పివేసెను. భయంకరమైన ఆ సేన, మేఘసముదాయము ఆకాశమును కప్పినట్లు దక్షిణదిక్కును కప్పుచు వెళ్ళెను. 58,59

మూ. ఉత్తరన్త్యాశ్చ సేనాయాః సతతం బహుయోజనమ్,
నదీస్రోతాంసి సర్వాణి సస్యన్దుర్విపరీతవత్. 60

ప్ర. అ. సతతమ్=అవిచ్ఛిన్నముగా, సేనాయాః=సేన, ఉత్తరన్త్యాః=దాటుచుండగా, నదీస్రోతాంసి=నదీప్రవాహములు, బహుయోజనమ్=చాల యోజనముల దూరము, విపరీతవత్= విపరీతముగా, సస్యన్దుః=ప్రవహించినవి.

తా. సేన అవిచ్ఛిన్నముగా నదులలో దిగి వాటిని దాటుచున్నప్పుడు అవి అనేకయోజనముల దూరము వెనుకకు ప్రవహించినవి. 60

మూ. సరాంసి విమలామ్భాంసి ద్రుమాకీర్ణాంశ్చ పర్వతాన్,
సమాన్ భూమిప్రదేశాంశ్చ వనాని ఫలవన్తి చ. 61
మధ్యేన చ సమన్తాచ్చ తిర్యక్చాధః సమావిశత్.

ప్ర. అ. మహతీ=గొప్పదైన, చమూః=సేన, విమలామ్భాంసి=స్వచ్ఛమైన ఉదకము గల, సరాంసి=సరస్సులను, ద్రుమాకీర్ణాన్=వృక్షములతో నిండిన, పర్వతాంశ్చ=పర్వతములను, సమాన్=సమములైన, భూమిప్రదేశాంశ్చ=భూముల ప్రదేశములను, ఫలవన్తి=ఫలములు గల, వనాని చ =వనములను, సా=ఆ సేన, మధ్యేన=మధ్యభాగముచేతను, సమన్తాత్= నలువైపుల, తిర్యక్=అడ్డముగాను, అధశ్చ=క్రింద, ఆవిశత్=ప్రవేశించెను.

తా. ఆ సేన నిర్మలమైన ఉదకము గల సరస్సులు, వృక్షములతో నిండిన పర్వతములు, సమమైన ప్రదేశములు, ఫలములతో నిండిన వనములు వీటి నన్నింటిని మధ్యభాగములందు, నలువైపులనుండి, అడ్డముగాను, క్రింది భాగమునుండి ప్రవేశించినవి. 61

మూ. సమావృత్య మహీం కృత్స్నాం జగామ మహతీ చమూః. 62
తే హృష్టవదనాః సర్వే జగ్ముర్మారుతరంహసః.

ప్ర. అ. మహతీ=గొప్పదైన, చమూః=సేన, కృత్స్నామ్=సమస్తమైన, మహీమ్= భూమిని, సమావృత్య=కప్పి, జగామ=వెళ్ళెను. మారుతరంహసః=వాయువువంటి వేగము గల, తే సర్వే=వాళ్ళందరూ, హృష్టవదనాః=సంతోషించిన ముఖములు గలవారై, జగ్ముః= వెళ్ళిరి.

తా. గొప్పదైన ఆ సేన సమస్తమైన భూమిని కప్పుచు వెళ్ళెను.

వాయువుతో సమానమైన వేగము గల ఆ వానరు లందరూ సంతోషించిన ముఖములతో వెళ్లిరి. 62

మూ. హరయో రాఘవస్యార్థే సమారోపితవిక్రమాః, 63
హర్షం వీర్యం బలోద్రేకార్దర్శయన్తః పరస్పరమ్,
యౌవనోత్సేకజాద్దర్పాద్వివిధాంశ్చక్రురధ్వని. 64

ప్ర. అ. రాఘవస్యార్థే=రామునికొరకై, సమారోపితవిక్రమాః=ఆరోపించు కొనబడిన పరాక్రమము గల, హరయః=వానరులు, బలోద్రేకాత్=బలాధిక్యమువలన, హర్షమ్= సంతోషమును, వీర్యమ్=పరాక్రమమును, పరస్పరమ్=పరస్పరము, దర్శయన్తః= చూపించుకొనుచు, అధ్వని=మార్గమునందు, యౌవనోత్సేకజాత్=యౌవ నాధిక్యమువలన కలిగిన, దర్పాత్=దర్పమువలన, వివిధాన్=అనేకవిధములైన వ్యవహారములను, చక్రుః=చేసిరి.

తా. రామకార్యసాధనము నిమిత్తము ఆ వానరులు సహజముగా లేని బలమును కూడ తెచ్చి పెట్టికొనుచు, బలాధిక్యమువలన, పరస్పరము సంతోషమును, వీర్యమును చూపుచు, యౌవనోద్రేకమువలన కలిగిన గర్వముతో మార్గమునందు అనేకచేష్టలు చేసిరి. 63, 64

మూ. తత్ర కేచిద్ద్రుతం జగ్మురుత్పేతుశ్చ తథాపరే,
కేచిత్కిలకిలాం చక్రుర్వానరా వనగోచరాః. 65

ప్ర. అ. తత్ర=అక్కడ, వనగోచరాః=వనవాసులైన, కేచిత్=కొందరు, వానరాః= వానరులు, ద్రుతమ్=శీఘ్రముగా, జగ్ముః=వెళ్లిరి. తథా=అట్లే, అపరే= మరికొందరు వానరులు, ఉత్పేతుశ్చ=పైకి ఎగిరిరి. కేచిత్=కొందరు, కిలకిలామ్=కిలకిలాధ్వనిని, చక్రుః=చేసిరి.

తా. వనములో సంచరించే ఆ వానరులలో కొందరు అక్కడ శీఘ్రముగా నడచి వెళ్లుచుండిరి. కొందరు ఎగురుచుండిరి. మరి కొందరు కిచకిచలాడుచుండిరి. 65

మూ. ప్రాస్ఫోటయంశ్చ పుచ్ఛాని సంనిజఘ్నుః పదాన్యపి,
భుజాన్విక్షిప్య శైలాంశ్చ ద్రుమానన్యే బభఞ్జిరే. 66

ప్ర. అ. పుచ్ఛాని=తోకలను, ప్రాస్ఫోటయన్=చరిచిరి(జాడించిరి). పదాని= పాదములను, సంనిజఘ్నుః అపి=నేలపై కొట్టిరి. అన్యే=మరి కొందరు, భుజాన్= భుజములను, విక్షిప్య=విసిరి, శైలాంశ్చ=శైలములను, ద్రుమాన్=వృక్షములను, బభఞ్జిరే=విరిచిరి.

తా. కొందరు తోకలు గట్టిగా జాడించుచుండిరి. కొందరు నేలమీద అడుగులు గట్టిగా వేయుచుండిరి. కొందరు భుజములు విసరుచు పర్వతములను, వృక్షములను విరచుచుండిరి. 66

మూ. ఆరోహన్తశ్చ శృఙ్గాణి గిరీణాం గిరిగోచరాః,
మహానాదాన్ ప్రముఞ్చన్తి క్ష్వేడామన్యే ప్రచక్రిరే. 67

ప్ర. అ. గిరిగోచరాః=వానరులు, గిరీణామ్=పర్వతములయొక్క, శృఙ్గాణి=శిఖరములను, ఆరోహన్తశ్చ=ఎక్కుచు, మహానాదాన్=గొప్ప ధ్వనులను, ప్రముఞ్చన్తి=విడచుచుండిరి. అన్యే=మరికొందరు, క్ష్వేడామ్=సింహనాదమును, ప్రచక్రిరే=చేసిరి.

తా. కొందరు వానరులు పర్వతశిఖరములెక్కి గొప్ప ధ్వనులు చేయుచుండిరి. మరికొందరు సింహనాదములు చేయుచుండిరి. 67

మూ. ఊరువేగైశ్చ మమృదుర్లతాజాలాన్యనేకశః,
జృమ్భమాణాశ్చ విక్రాన్తా విచిక్రీడుః శిలాద్రుమైః. 68

ప్ర. అ. ఊరువేగైః=తొడలవేగములచేత, అనేకశః=అనేకముగా, లతాజాలాని=లతా సముదాయములను, మమృదుః=మర్దించిరి. జృమ్భమాణాః=అవయవములను కదల్చుచు, విక్రాన్తాః=పరాక్రమవంతులైన ఆ వానరులు, శిలాద్రుమైః=శిలలతోను వృక్షములతోను, విచిక్రీడుః=క్రీడించిరి.

తా. కొందరు తొడల వేగములచేత అనేకములైన లతాసముదాయములను నలగగొట్టుచుండిరి. మరికొందరు పరాక్రమశాలులు అవయవములను కదల్చుచు శిలలతోను, వృక్షములతోను క్రీడించుచుండిరి. 68

మూ. తతః శతసహస్రైశ్చ కోటిభిశ్చ సహస్రశః,
వానరాణాం సుఘోరాణాం శ్రీమత్పరివృతా మహీ. 69

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహీ=భూమి, సుఘోరాణామ్=చాల భయంకరులైన, వానరాణామ్=వానరులయొక్క, శతసహస్రైశ్చ=లక్షలచేతను, సహస్రశః=వేలకొలది, కోటిభిః=కోటులచేతను, శ్రీమత్=శోభాయుక్తమగు నట్లుగా, పరివృతా=వ్యాప్తమైనది.

తా. పిమ్మట భూమి అంతయు వేలకొలది, లక్షలకొలది, కోట్లకొలది భయంకరులైన వానరులచేత కప్పబడి శోభాయుక్తముగా ఉండెను. 69

మూ. సా స్మ యాతి దివారాత్రం మహతీ హరివాహినీ,
ప్రహృష్టముదితాః సర్వే సుగ్రీవేణాభిపాలితాః. 70

వానరాస్త్వరితా యాన్తి సర్వే యుద్ధాభినన్దినః,
ప్రమోక్షయిషవః సీతాం ముహూర్తం క్వాపి నావసన్. 71

ప్ర. అ. మహతీ=గొప్పదైన, సా హరివాహినీ=ఆ వానరసేన, దివారాత్రమ్= పగళ్లయందు రాత్రులందు, యాతి స్మ=ప్రయాణముచేయుచుండెను. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, అభిపాలితాః=పాలింపబడిన, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, ప్రహృష్టముదితాః=సంతోషించినవారై, ఆనందించినవారై ఉండిరి. సర్వే=అందరూ, యుద్ధాభినన్దినః=యుద్ధమును కోరుచు, త్వరితాః=తొందరపడుచున్నవారై, యాన్తి= వెళ్లుచుండిరి. సీతామ్=సీతను, ప్రమోక్షయిషవః=విడిపింప దలచిన ఆ వానరులు, క్వాపి= ఎక్కడా కూడ, ముహూర్తమ్=క్షణకాలము కూడ, నావసన్=నివసించలేదు.

తా. విశాలమైన ఆ వానరసేన రేయింబగళ్లు ప్రయాణము చేయుచునే ఉండెను. సుగ్రీవుని రక్షణలో ఉన్న ఆ వానరు లందరు ఆనందోత్సాహములతో నిండి ఉండిరి. అందరు యుద్ధోత్సాహముతో శీఘ్రముగా వెళ్లుచుండిరి. సీతను విడిపింప దలచుచున్న వారు ముహూర్తకాలము కూడ ఎక్కడా నిలబడలేదు.

మూ. తతః పాదపసంబాధం నానామృగసమాయుతమ్,
సహ్యపర్వతమాసాద్య వానరాస్తే సమారుహన్. 72

ప్ర. అ. తతః= అటుపిమ్మట, తే వానరాః=ఆ వానరులు, పాదపసంబాధమ్=చెట్లతో ఇరుకుగా ఉన్నది, నానామృగసమావృతమ్=అనేకవిధములైన మృగములతో కూడినది అయిన, సహ్యపర్వతమ్=సహ్యపర్వతమును, ఆసాద్య=పొంది, సమారుహన్=ఎక్కిరి.

తా. పిమ్మట ఆ వానరులు వృక్షములతో దట్టముగా ఉన్న, అనేకమృగములతో నిండిన సహ్యపర్వతము చేరి దానిమీదికి ఎక్కిరి. 72

మూ. కాననాని విచిత్రాణి నదీప్రస్రవణాని చ,
పశ్యన్నపి యయౌ రామః సహ్యస్య మలయస్య చ. 73

ప్ర. అ. రామః అపి=రాముడు కూడ, సహ్యస్య=సహ్యపర్వతముయొక్క, మలయస్య చ=మలయపర్వతముయొక్క, విచిత్రాణి=విచిత్రములైన, కాననాని=అడవులను, నదీప్రస్రవణాని చ=నదులను, సెలయేళ్లను, పశ్యన్=చూచుచు, యయౌ=వెళ్లెను.

తా. రాముడు కూడ సహ్యమలయపర్వతముల విచిత్రములైన అడవులను, నదులను, సెలయేళ్లను చూచుచు వెళ్లెను. 73

మూ. చమ్పకాంస్తిలకాంశ్చూతాన్ ప్రసేకాన్ సిన్దువారకాన్,
తినిశాన్ కరవీరాంశ్చ భజన్తి స్మ ప్లవంగమాః. 74

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, చమ్పకాన్=చంపకవృక్షములను, తిలకాన్=తిలకవృక్షములను, చూతాన్=మామిడిచెట్లను, ప్రసేకాన్=ప్రసేకవృక్షములను, సిన్దువారకాన్=సిందువారవృక్షములను, తినిశాన్=తినిశవృక్షములను, కరవీరాంశ్చ=కరవీరవృక్షములను, భజన్తి స్మ =సేవించుచుండిరి.

తా. వానరులు మార్గములో ఉన్న చంపక-తిలక-చూత-ప్రసేక-సిందువారక-తినిశ-కరవీర వృక్షములను సేవించిరి. (వాటి ఫలాదులను అనుభవించిరి.) 74

మూ. అశోకాంశ్చ కరఞ్జాంశ్చ ప్లక్షన్యగ్రోధపాదపాన్,
జమ్బూకామలకాన్నాగాన్ భజన్తి స్మ ప్లవఙ్గమాః. 75

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, అశోకాన్=అశోకవృక్షములను, కరఞ్జాంశ్చ= కరంజవృక్షములను, ప్లక్షన్యగ్రోధపాదపాన్=ప్లక్షవృక్షములను, మఱ్ఱిచెట్లను, జమ్బూకామలకాన్=నేరేడుచెట్లను, ఉసిరిచెట్లను, నాగాన్=నాగవృక్షములను, భజన్తి స్మ=సేవించిరి.

తా. వానరులు అశోక-కరంజ-ప్లక్ష-న్యగ్రోధ-జంబుక-ఆమలక వృక్షములను సేవించిరి. 75

మూ. ప్రస్తరేషు చ రమ్యేషు వివిధాః కాననద్రుమాః,
వాయువేగప్రచలితాః పుష్పైరవకిరన్తి తాన్. 76

ప్ర. అ. రమ్యేషు=సుందరములైన, ప్రస్తరేషు=చరియలయందున్న, వివిధాః= అనేకవిధములైన, కాననద్రుమాః=అడవిచెట్లు, వాయువేగప్రచలితాః=వాయువేగముచేత చలించినవై, తాన్=ఆ వానరులను, పుష్పైః=పువ్వులతో, అవకిరన్తి=చల్లినవి.

తా. సుందరములైన చరియలమీద ఉన్న ఆరణ్యవృక్షములు వాయువేగముచేత కదలినవై ఆ వానరులమీద పుష్పములు చల్లినవి. 76

మూ. మారుతః సుఖసంస్పర్శో వాతి చన్దనశీతలః,
షట్పదైరనుకూజద్భిర్వనేషు మధుగన్ధిషు. 77

ప్ర. అ. మధుగన్ధిషు=మకరందసుగంధము గల, వనేషు=వనములయందు, అనుకూజద్భిః=ధ్వనిచేయుచున్న, షట్పదైః=తుమ్మెదలతో కూడిన, సుఖసంస్పర్శః=సుఖస్పర్శ గల, చన్దనశీతలః=చందనమువలె చల్లగా ఉన్న,

మారుతః=వాయువు, వాతి=వీచుచున్నది.

తా. మకరందము సువాసనలు గల వనములలో చందనము వలె చల్లగా ఉన్న వాయువు, ధ్వని చేయుచున్న తుమ్మెదలతో కూడినదై శరీరమునకు సుఖస్పర్శ కలిగించుచు వీచెను. 77

మూ. అధికం శైలరాజస్తు ధాతుభిస్తు విభూషితః.
ధాతుభ్యః ప్రసృతో రేణుర్వాయువేగేన ఘట్టితః. 78
సుమహద్వానరానీకం ఛాదయామాస సర్వతః.

ప్ర. అ. శైలరాజస్తు=ఆ పర్వతరాజైతే, ధాతుభిః=ధాతువులచేత, అధికమ్=అధికముగా, విభూషితః=అలంకరింపబడినది. వాయువేగేన=వాయువేగముచేత, ఘట్టితః=కొట్టబడినదై, రేణుః=పరాగము, ధాతుభ్యః=ధాతువులనుండి, ప్రసృతః=ప్రసరించినదై, సుమహత్= చాల పెద్దదైన, వానరానీకమ్=వానరసేనను, సర్వతః=అన్నివైపులా, ఛాదయామాస= కప్పివేసెను.

తా. ఆ సహ్యపర్వతము గైరికాదిధాతువులతో అధికముగా ప్రకాశించుచుండెను. వాయువేగము ఆఘాతముచేత ఆ ధాతువులనుండి పరాగము ఎగిరి విశాలమైన ఆ సైన్యమును అంతటా కప్పివేసెను. 78

మూ. గిరిప్రస్థేషు రమ్యేషు సర్వతః సంప్రపుష్పితాః, 79
కేతక్యః సిన్దువారాశ్చ వాసన్త్యశ్చ మనోరమాః,
మాధవ్యో గన్ధపూర్ణాశ్చ కున్దగుల్మాశ్చ పుష్పితాః. 80
చిరిబిల్వా మధూకాశ్చ వఞ్జులా వకులాస్తథా,
రక్షకాస్తిలకాశ్చైవ నాగవృక్షాశ్చ పుష్పితాః. 81
చూతాః పాటలికాశ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః,
ముచులిన్దార్జునాశ్చైవ శింశపాః కుటజాస్తథా. 82
ధవాః శాల్మలయశ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః.
హిన్తాలాస్తినిశాశ్చైవ చూర్ణకా నీపకాస్తథా. 83
నీలాశోకాశ్చ సరలా అఙ్కోలాః పద్మకాస్తథా,
ప్రీయమాణైః ప్లవంగైస్తు సర్వే పర్యాకులీకృతాః. 84

ప్ర. అ. రమ్యేషు = రమ్యములైన, గిరిప్రస్థేషు = పర్వతముల చరియలమీద, సర్వతః = అన్ని వైపులా, సంప్రపుష్పితాః = పుష్పించిన, కేతక్యః = మొగలిడొంకలు, సిన్దువారాశ్చ = సిందువార వృక్షములు, మనోరమాః = సుందరములు, వాసన్త్యః = వసంతఋతువులో పుష్పించునవి అయిన, మాధవ్యః = మాధవీలతలు, పుష్పితాః = పుష్పించిన, గన్ధపూర్ణాః = సుగంధముతో

నిండిన, కున్దగుల్మాశ్చ = మల్లెల డొంకలు, చిరిబిల్వాః = చిరిబిల్వములు, మధూకాశ్చ = మధూకములు, వఞ్జులాః = వంజులములు, తథా = మరియు, వకులాః = పొగడచెట్లు, రఞ్జకాః = రంజకములు, తిలకాశ్చైవ = తిలకములు, పుష్పితాః = పుష్పించిన, నాగవృక్షాశ్చ = నాగవృక్షములు, చూతాః = చూతవృక్షములు, పాటలికాశ్చైవ= పాటలిక వృక్షములు, పుష్పితాః = పుష్పించిన, కోవిదారాశ్చ =కోవిదారములు, ముచులిన్దార్జునాశ్చైవ = ముచులిందములు, మద్దిచెట్లు, శింశపాః = శింశపావృక్షములు, తథా = మరియు, కుటజాః = కొండమల్లెచెట్లు, ధవాః = ధవవృక్షములు, శాల్మలయశ్చైవ = బూరుగుచెట్లు, తథా = మరియు, రక్తాః కురవాః = ఎఱ్ఱ గోరింటచెట్లు, హింతాలాః = హింతాలములు, తినిశాశ్చైవ = తినిశములు, చూర్ణకాః = చూర్ణకములు, తథా = మరియు, నీపకాః = నీపవృక్షములు, నీలాశోకాః = నీలాశోకములు, వరలాః = వరలములు, అఙ్కోలాః = అంకోలములు, తథా = మరియు, పద్మకాః = పద్మకములు, సర్వే = అవి అన్నీ, ప్రీయమాణైః = సంతోషించుచున్న, ప్లవగైః = వానరులచేత, పర్యాకులీకృతాః = వ్యాకులము చేయబడినవి.

తా. సంతోషభరితులైన ఆ వానరులు, రమ్యములైన ఆ పర్వతము చరియలమీద ఉన్న పుష్పించిన మొగలిడొంకలను, సిందువారములను, వసంత ఋతువులో పుష్పించు మనోహరములైన మాధవీలతలను, పుష్పించి సుగంధముతో నిండిన మల్లెతీగలను, చిరిబిల్వ - మధూక - వంజుల - వకుల - రంజక - తిలక - నాగ - చూత - పాటలిక - కోవిదార - ముచులింద - అర్జున - శింశపా - కుటజ - ధవవృక్షములను, బూరుగుచెట్లను, ఎఱ్ఱగోరింటచెట్లను, హింతాల - తినిశ - చూర్ణక - నీపక - నీలాశోక - వరల- అంకోల-పద్మకములను వ్యాకులము చేసిరి. 79 - 84

మూ. వాప్యస్తస్మిన్ గిరౌ రమ్యాః పల్వలాని తథైవ చ,
చక్రవాకానుచరితాః కారణ్డవనిషేవితాః. 85
ప్లవైః క్రౌఞ్చైశ్చ సంకీర్ణా వరాహమృగసేవితాః,
ఋక్షైస్తరక్షుభిః సింహైః శార్దూలైశ్చ భయావహైః. 86
వ్యాలైశ్చ బహుభిర్భీమైః సేవ్యమానాః సమన్తతః,
పద్మైః సౌగన్ధికైః ఫుల్లైః కుముదైశ్చోత్పలైస్తథా. 87
వారిజైర్వివిధైః పుష్పై రమ్యాస్తత్ర జలాశయాః.

ప్ర. అ. తస్మిన్ = ఆ, గిరౌ = పర్వతమునందు, రమ్యాః = సుందరమైన, వాప్యః = దిగుడుబావులు, తథైవ చ=మరియు, పల్వలాని చ = చిన్న చెరువులు, తత్ర = అక్కడ, చక్రవాకానుచరితాః = చక్రవాకములచేత

సంచరించబడినవి, కారణ్డవనిషేవితాః = కారండవపక్షులచేత సేవింపబడినవి, ప్లవైః = నీటికాకులతోను, క్రౌఞ్చైః = క్రౌంచపక్షులతోను, సంకీర్ణాః = వ్యాప్తములైనవి, వరాహమృగసేవితాః = వరాహములచేతను, లేళ్ళచేతను సేవించబడినవి, ఋక్షైః = ఎలుగుబంట్లచేతను, తరక్షుభిః = తరక్షువులచేతను, సింహైః = సింహములచేతను, భయావహైః = భయంకరములైన, శార్దూలైశ్చ = పెద్దపులులచేతను, భీమైః = భయంకరములైన, బహులైః = అనేకమైన, వ్యాళైః = దుష్టగజములచేతను, సమన్తతః = అన్నివైపులా, సేవ్యమానాః = సేవించబడుచున్నవి, పద్మైః = పద్మములతోను, ఫుల్లైః = వికసించిన, సౌగన్ధికైః = కలువలతోను, కుముదైః = తెల్లకలువలతోను, తథా = మరియు, ఉత్పలైః = నల్లకలువలతోను, వారిజైః = నీటిలో పుట్టిన, వివిధైః = అనేకవిధములైన, పుష్పైః = పుష్పములతోను, రమ్యాః = సుందరములైన, జలాశయాః = సరస్సులు, (వ్యాకులము చేయబడినవి.)

తా. ఆ పర్వతముమీద దిగుడుబావులు, రమ్యములైన చిన్న చెరువులు, సుందరమైన సరస్సులు ఉండెను. వాటియందు చక్రవాకములు, కారండవములు, నీటికాకులు, క్రౌంచపక్షులు విహరించుచుండెను. వరాహములు, లేళ్ళు, ఎలుగుబంట్లు, చిరుతపులులు, సింహములు, భయంకరములైన పులులు, భయంకరములైన అనేకమైన దుష్టగజములు, నలుమూలలా వాటి జలమును త్రాగుచు ఆశ్రయించి ఉండెను. పద్మములు, మంచి సువాసన గల కలువలు, తెల్ల కలువలు, నల్లకలువలు, ఇంకా జలమునందు పుట్టు ఇతర పుష్పములు - నీటితో ఆ సరస్సులు నిండి యుండెను. వాటిని కూడ వానరులు వ్యాకులము చేసిరి. 85-87

మూ. తస్య సానుషు కూజన్తి నానాద్విజగణాస్తథా. 88

స్నాత్వా పీత్వోదకాన్యత్ర జలే క్రీడన్తి వానరాః,
అన్యోన్యం ప్లావయన్తి స్మ శైలమారుహ్య వానరాః. 89

ప్ర. అ. తథా = మరియు, తస్య = ఆ పర్వతముయొక్క, సానుషు = చరియలయందు, నానాద్విజగణాః = అనేకమైన పక్షిసముదాయములు, కూజన్తి = ధ్వనిచేయుచున్నవి. వానరాః = వానరులు, జలే = జలమునందు, స్నాత్వా = స్నానముచేసి, ఉదకాని = ఉదకములను, పీత్వా = త్రాగి, క్రీడన్తి = ఆడుకొనుచున్నారు. వానరాః = వానరులు, శైలమ్ = పర్వతమును, ఆరుహ్య = ఎక్కి, అన్యోన్యమ్ = పరస్పరము, ప్లావయన్తి స్మ = తడుపుకొనుచుండిరి.

తా. ఆ పర్వతము చరియలపై అనేకవిధములైన పక్షులు కూయుచుండెను. వానరులు ఆ జలములో స్నానము చేసి, నీళ్ళు త్రాగి

క్రీడించిరి. ఆ పర్వతము నెక్కి జలములతో పరస్పరము తడుపుకొనిరి. 88,89

మూ. ఫలాన్యమృతగన్ధీని మూలాని కుసుమాని చ,
బభక్షుర్వానరాస్తత్ర పాదపానాం మదోత్కటాః. 90

ప్ర. అ. తత్ర = అక్కడ, మదోత్కటాః = మదముచేత తీవ్రముగా ఉన్న, వానరాః = వానరులు, పాదపానామ్ = వృక్షములయొక్క, అమృతగన్ధీని = అమృతగంధము గల, ఫలాని = ఫలములను, మూలాని = మూలములను, కుసుమాని చ = పుష్పములను, బభక్షుః = తినిరి.

తా. అధికమైన మదము గల ఆ వానరులు అక్కడ నున్న చెట్లనుండి అమృతము వంటి సువాసన గల ఫలములను, మూలములను, పుష్పములను కోసిరి. 90

మూ. ద్రోణమాత్రప్రమాణాని లమ్బమానాని వానరాః,
యయుః పిబన్తః స్వస్థాస్తే మధూని మధుపిఙ్గలాః. 91

ప్ర. అ. మధుపిఙ్గలాః = తేనెవలె పచ్చగా ఉన్న, తే వానరాః = ఆ వానరులు, లమ్బమానాని = వ్రేలాడుచున్న, ద్రోణమాత్రప్రమాణాని = ద్రోణము (కుంచమువంటి ఒక కొలత), మధూని = తేనెలను, పిబన్తః = త్రాగుచున్నవారై, స్వస్థాః = సంతోషవంతులై, యయుః = వెళ్లిరి.

తా. తేనె రంగు శరీరములు గల ఆ వానరులు వ్రేలాడుచున్న ద్రోణము ప్రమాణము గల తేనెలను త్రాగుచు, సంతోషించుచు వెళ్లిరి. 91

మూ. పాదపానవభఞ్జన్తో వికర్షన్తస్తథా లతాః,
విధమన్తో గిరివరాన్ ప్రయయుః ప్లవగర్షభాః. 92

ప్ర. అ. ప్లవగర్షభాః = ఆ వానరశ్రేష్ఠులు, పాదపాన్ = వృక్షములను, అవభఞ్జన్తః = విరచుచు, తథా = మరియు, లతాః = లతలను, వికర్షన్తః = లాగుచు, గిరివరాన్ = పర్వతశ్రేష్ఠములను, విధమన్తః = చిమ్మివేయుచు, ప్రయయుః = వెళ్లిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు చెట్లను విరచుచు తీగలను లాగుచు, కొండలను ఇటు అటు ఎగురగొట్టుచు వెళ్లిరి. 92

మూ. వృక్షేభ్యోఽన్యే తు కపయో నదన్తో మధురర్పితాః,
అన్యే వృక్షాన్ ప్రపద్యన్తే ప్రపిబన్త్యపి చాపరే. 93

ప్ర. అ. అన్యే = మరికొందరు, కపయః = వానరులు,

మధురక్తాః = మధువుచేత మత్తులై, వృక్షేభ్యః = వృక్షములనుండి, నదన్తః = ధ్వనిచేయుచు (వెళ్లిరి). అన్యే = మరికొందరు, వృక్షాన్ = వృక్షములను, ప్రపద్యన్తే = పొందుచుండిరి. అపరే = మరికొందరు, ప్రపిబన్తి = అధికముగా త్రాగుచుండిరి.

తా. కొందరు వానరులు మధుపానముచేత మత్తులై ధ్వని చేయుచు చెట్లనుండి వెళ్లిరి. కొందరు వృక్షములను పొందిరి. మరికొందరు అధికముగా త్రాగుచుండిరి. 93

మూ. బభూవ వసుధా తైశ్చ సంపూర్ణా హరిపుఙ్గవైః,
యథా కలమకేదారైః పక్వైరివ వసున్ధరా. 94

ప్ర. అ. తైః = ఆ, హరిపుఙ్గవైః = వానరశ్రేష్ఠులతో, సంపూర్ణా = నిండిన, వసున్ధరా = భూమి, పక్వైః = పక్వములైన, కలమకేదారైః = వరిచేలతో, వసున్ధరా యథైవ = భూమి వలె, బభూవ = ఉండెను.

తా. (పచ్చని శరీరములు గల) ఆ వానరశ్రేష్ఠులతో నిండిన భూమి ముగ్గిన వరిచేలతో నిండిన భూమి వలె ఉండెను. 94

మూ. మహేన్ద్రమథ సంప్రాప్య రామో రాజీవలోచనః,
ఆరురోహ మహాబాహుః శిఖరం ద్రుమభూషితమ్. 95

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు కలవాడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు అయిన, రామః = రాముడు, మహేన్ద్రమ్ = మహేంద్ర పర్వతమును, సంప్రాప్య = పొంది, ద్రుమభూషితమ్ = వృక్షములచేత అలంకరింపబడిన, శిఖరమ్ = శిఖరమును, ఆరురోహ = ఎక్కెను.

తా. పిమ్మట పద్మములవంటి నేత్రములు గల మహాబాహువైన రాముడు మహేంద్రపర్వతమును చేరి వృక్షములచేత అలంకరింపబడిన శిఖరమును ఎక్కెను. 95

మూ. తతః శిఖరమారుహ్య రామో దశరథాత్మజః,
కూర్మమీనసమాకీర్ణమపశ్యత్సలిలాకరమ్. 96

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దశరథాత్మజః = దశరథకుమారుడైన, రామః = రాముడు, శిఖరమ్ = శిఖరమును, ఆరుహ్య = ఎక్కి, కూర్మమీనసమాకీర్ణమ్ = తాబేళ్లతోను, చేపలతోను వ్యాప్తమైన, సలిలాకరమ్ = నీటితో వ్యాకులమైన సముద్రమును, అపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట దశరథకుమారుడైన రాముడు శిఖరము నెక్కి, తాబేళ్లతోను, చేపలతోను వ్యాప్తమై జలముతో వ్యాకులముగా ఉన్న సముద్రమును చూచెను. 96

మూ. తే సహ్యం సమతిక్రమ్య మలయం చ మహాగిరిమ్,
ఆసేదురానుపూర్వ్యేణ సముద్రం భీమనిఃస్వనమ్. 97

ప్ర. అ. తే = వారు, సహ్యమ్ = సహ్యపర్వతమును, మహాగిరిమ్ = మహాపర్వతమైన, మలయం చ = మలయమును కూడ, సమతిక్రమ్య = దాటి, అనుపూర్వ్యేణ = క్రమముగా, భీమనిఃస్వనమ్ = భయంకరమైన ధ్వని గల, సముద్రమ్ = సముద్రమును, ఆసేదుః = పొందిరి.

తా. వారు సహ్యపర్వతమును, మలయపర్వతమును దాటి క్రమముగా, భయంకరమైన ధ్వని గల సముద్రమును సమీపించిరి. 97

మూ. అవరుహ్య జగామాశు వేలావనమనుత్తమమ్,
రామో రమయతాం శ్రేష్ఠః ససుగ్రీవః సలక్ష్మణః. 98

ప్ర. అ. ససుగ్రీవః = సుగ్రీవునితో కూడినవాడు, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడు, రమయతామ్ = ఆనందింపచేయువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడూ అయిన, రామః = రాముడు, అవరుహ్య = దిగి, ఆశు = శీఘ్రముగా, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, వేలావనమ్ = సముద్రతీరమునందలి వనమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ఆనందము కలిగించువారిలో శ్రేష్ఠుడైన రాముడు సుగ్రీవలక్ష్మణ సమేతుడై ఆ పర్వతము దిగి, సముద్రతీరమునం దున్న వనమునకు వెళ్లెను.98

మూ. అథ ధౌతోపలతలాం తోయౌఘైః సహసోత్థితైః,
వేలామాసాద్య విపులాం రామో వచనమబ్రవీత్. 99

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామః = రాముడు, సహసా = శీఘ్రముగా, ఉత్థితైః = లేచిన, తోయౌఘైః = జలసముదాయములచేత, ధౌతోపలతలామ్ = కడగబడిన శిలాతలములు గల, విపులామ్ = విశాలమైన, వేలామ్ = సముద్రతీరమును, ఆసాద్య = పొంది, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట రాముడు, హఠాత్తుగా లేచుచున్న ఉదకసముదాయములచేత (తరంగములచేత) కడిగివేయబడిన శిలలతో నిండిన సముద్రతీరమును సమీపించి ఇట్లు పలికెను. 99

మూ. ఏతే వయమనుప్రాప్తాః సుగ్రీవ వరుణాలయమ్,
ఇహేదానీం విచిన్తా సా యా నః పూర్వముపస్థితా. 100

ప్ర. అ. సుగ్రీవ = సుగ్రీవుడా ! ఏతే వయమ్ = ఈ మనము, వరుణాలయమ్ = సముద్రమును, సమనుప్రాప్తాః = చేరినాము. యా = ఏది, పూర్వమ్ = పూర్వము కలిగినదో, సా = ఆ, విచిన్తా = చింత, ఇహ = ఇక్కడ, ఇదానీమ్ = ఇప్పుడు, నః = మనకు, ఉపస్థితా = వచ్చినది.

తా. సుగ్రీవా ! ఇదిగో మనము సముద్రము దగ్గరకు వచ్చినాము. మనము పూర్వ మనుకొన్న "సముద్రమును దాటుట ఎట్లా" అను చింత ఇక్కడ ఇప్పుడు వచ్చినది. 100

మూ. అతః పరమతీరోఽయం సాగరః సరితాం పతిః,
న చాయమనుపాయేన శక్యస్తరితుమర్ణవః. 101

ప్ర. అ. సరితాం పతిః = నదుల భర్తయైన, అయం సాగరః = ఈ సముద్రము, అతః పరమ్ = ఇటుపిమ్మట, అతీరః = తీరము లేనిది. అయమ్ = ఈ, అర్ణవః = సముద్రము, అనుపాయేన = ఉపాయము లేకుండగా, తరితుమ్ = దాటుటకు, న శక్యః = శక్యమైనది కాదు.

తా. నదుల భర్తయైన ఈ సముద్రమునకు ఇటుపైన తీరము లేదు. దీనిని ఉపాయముచేత గాని దాటలేము. 101

మూ. తదిహైవ నివేశోఽస్తు మన్త్రః ప్రస్తూయతామిహ,
యథేదం వానరబలం పరం పారమవాప్నుయాత్. 102

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, ఇహైవ = ఇక్కడనే, నివేశః = సేనానివేశము, అస్తు = అగుగాక. ఇదమ్ = ఈ , వానరబలమ్ = వానరసేన, యథా = ఎట్లు, పరం పారమ్ = అవతలి ఒడ్డును, అవాప్నుయాత్ = పొందునో, మన్త్రః = ఆలోచన, ఇహ = ఇక్కడ, ప్రస్తూయతామ్ = ప్రస్తావించబడుగాక.

తా. అందువలన, ఇక్కడ సైన్యము విడియుగాక. ఈ వానరసేన అవతలి ఒడ్డు చేరు ఉపాయమును, ఇక్కడ ఆలోచించెదము. 102

మూ. ఇతీవ స మహాబాహుః సీతాహరణకర్శితః,
రామః సాగరమాసాద్య వాసమాజ్ఞాపయత్తదా. 103

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, సీతాహరణకర్శితః = సీతాహరణముచేత కృశింపచేయబడినవాడు, అయిన, సః రామః

= ఆ రాముడు, తదా = అప్పుడు, సాగరమ్ = సముద్రమును, ఆసాద్య = సమీపించి, ఇతి = ఈ విధముగా, వాసమ్ = నివాసమును, ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

తా. సీతాపహరణమువలన కృశించి ఉన్న మహాబాహువైన ఆ రాముడు అప్పుడు సముద్రసమీపము చేరి ఈ విధముగా "సేన ఆగవలెను" అని ఆజ్ఞాపించెను. 103

మూ. సర్వాః సేనా నివేశ్యన్తాం వేలాయాం హరిపుఙ్గవ,
సంప్రాప్తో మన్త్రకాలో నః సాగరస్యేహ లఙ్ఘనే. 104

ప్ర. అ. హరిపుఙ్గవ = సుగ్రీవా ! సర్వాః = సమస్తమైన, సేనాః = సేనలు, వేలాయామ్ = సముద్రతీరమునందు, నివేశ్యన్తామ్ = నిలుపబడుగాక. ఇహ = ఇక్కడ, సాగరస్య = సముద్రముయొక్క, లఙ్ఘనే = దాటుటవిషయమునందు, నః = మనకు, మన్త్రకాలః = ఆలోచనకు సమయము, సంప్రాప్తః = వచ్చినది.

తా. ఓ వానరశ్రేష్ఠుడా ! సేనలను అన్నింటినీ సముద్రతీరమునందు విడిది చేయించుము. ఇక్కడ మనకు, సముద్రమును దాటుట విషయమున ఆలోచించు సమయము వచ్చినది. 104

మూ. స్వాం స్వాం సేనాం సముత్సృజ్య మా చ కశ్చిత్కుతో వ్రజేత్,
గచ్ఛన్తు వానరాః శూరా జ్ఞేయం ఛన్నం భయం చ నః. 105

ప్ర. అ. కశ్చిత్ = ఎవ్వరును, స్వాం స్వామ్ = తన తన, సేనామ్ = సేనను, సముత్సృజ్య = విడచి, కుతః = ఎటువైపూ కూడ, మా వ్రజేత్ = వెళ్ళకుందురుగాక. నః = మనకు, ఛన్నమ్ = రహస్యముగా ఉన్న, భయమ్ = భయము, జ్ఞేయం చ = తెలియదగినది. శూరాః = శూరులైన, వానరాః = వానరులు, గచ్ఛన్తు = వెళ్లెదరుగాక.

తా. ఎవ్వరూ తమ తమ సేనను విడచి ఎక్కడికీ వెళ్ళకూడదు. ఎందుచేత ననగా మనకు రహస్యమైన భయహేతువు ఉండవచ్చును. అందుచే శూరులైన వానరులు వెళ్లి తమ తమ సైన్యములను పర్యవేక్షించుకొనుచుండవలెను.

మూ. రామస్య వచనం శ్రుత్వా సుగ్రీవః సహలక్ష్మణః,
సేనాం నివేశయత్తీరే సాగరస్య ద్రుమాయుతే. 106

ప్ర. అ. సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, సుగ్రీవః = సుగ్రీవుడు, రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా =

విని, సాగరస్య = సముద్రముయొక్క, ద్రుమాయుతే = వృక్షములతో కూడిన, తీరే = తీరమునందు, సేనామ్ = సేనను, నివేశయత్ = విడిపెను.

తా. రాముని మాటలు విని సుగ్రీవలక్ష్మణులు, వృక్షములతో కూడిన సముద్రతీరమునందు సేనను విడిది చేయించిరి. 106

మూ. విరరాజ సమీపస్థం సాగరస్య చ తద్బలమ్,
మధుపాణ్డుజలః శ్రీమాన్ ద్వితీయ ఇవ సాగరః. 107

ప్ర. అ. సాగరస్య = సముద్రముయొక్క, సమీపస్థమ్ = సమీపము నందున్న, తత్ = ఆ, బలమ్ = సేన, మధుపాణ్డుజలః = తేనె వలె పచ్చని జలము గల, శ్రీమాన్ = శోభాయుక్తమైన, ద్వితీయః = రెండవ, సాగరః ఇవ = సముద్రము వలె, విరరాజ = ప్రకాశించెను.

తా. సముద్రసమీపమునం దున్న ఆ సైన్యము తేనె వలె పచ్చని రంగు గల జలముతో నిండిన రెండవ సాగరము వలె ప్రకాశించెను. 107

మూ. వేలావనముపాగమ్య తతస్తే హరిపుఙ్గవాః,
వినివిష్టాః పరం పారం కాఙ్క్షమాణా మహోదధేః. 108

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే = ఆ, హరిపుఙ్గవాః = వానరశ్రేష్ఠులు, వేలావనమ్ = సముద్రతీరమునందున్న వనమును, ఉపాగమ్య = పొంది, మహోదధేః = మహాసముద్రముయొక్క, పరం పారమ్ = ఆవలి ఒడ్డును, కాఙ్క్షమాణాః = కోరుచు, వినివిష్టాః = నివాసముచేసిరి.

తా. పిమ్మట ఆ వానరశ్రేష్ఠులు సముద్రతీరమునందలి వనమును చేరి, ఆ మహాసముద్రము అవతలి ఒడ్డు చేరవలె నని కోరుచు అక్కడ విడిది చేసిరి. 108

మూ. తేషాం నివిశమానానాం సైన్యసంనాహనిఃస్వనః,
అన్తర్ధాయ మహానాదమర్ణవస్య ప్రశుశ్రువే. 109

ప్ర. అ. తేషామ్ = ఆ వానరులు, నివిశమానానామ్ = నివేశముచేయుచుండగా, సైన్యసంనాహనిఃస్వనః = సైన్యచలనమువలన కలిగిన ధ్వని, అర్ణవస్య = సముద్రముయొక్క, మహానాదమ్ = మహాధ్వనిని, అన్తర్ధాయ = కప్పివేసి, ప్రశుశ్రువే = వినబడెను.

తా. ఆ వానరు లందరు నివేశము చేయుచుండగా, సైన్యసంచలనము వలన పుట్టిన ధ్వని సముద్రము చేయు మహాధ్వనిని కప్పివేసి వినబడెను.

మూ. సా వానరాణాం ధ్వజినీ సుగ్రీవేణాభిపాలితా,
త్రిధా నివిష్టా మహతీ రామస్యార్థపరాభవత్. 110

ప్ర. అ. త్రిధా = మూడు విధములుగా, నివిష్టా = నివేశము చేసి ఉన్నది, సుగ్రీవేణ = సుగ్రీవునిచేత, అభిపాలితా = పాలింపబడినది అయిన, సా = ఆ, వానరాణామ్ = వానరులయొక్క, ధ్వజినీ = సేన, రామస్య = రామునియొక్క, అర్థపరా = కార్యమునందు ఆసక్తి కలది, అభవత్ = అయెను.

తా. మూడు భాగములుగా ( వానరములు, గోపుచ్ఛములు భల్లూకములు అని) విభక్తమై విడిది చేసి ఉన్న, సుగ్రీవపాలితమైన ఆ వానర సేన రాముని కార్యమును పూర్తిచేయవలె నను నిశ్చయముతో ఉండెను. 110

మూ. సా మహార్ణవమాసాద్య హృష్టా వానరవాహినీ,
వాయువేగసమాధూతం పశ్యమానా మహార్ణవమ్. 111

ప్ర. అ. సా = ఆ, హరివాహినీ = వానరసేన, మహార్ణవమ్ = మహాసముద్రమును, ఆసాద్య = చేరి, వాయువేగసమాధూతమ్ = వాయువేగముచేత కదల్పబడిన, మహార్ణవమ్ = మహాసముద్రమును, పశ్యమానా = చూచుచున్నదై, హృష్టా = సంతోషించినది.

తా. ఆ వానరసేన మహాసముద్రమును చేరి, వాయువేగముచేత కదల్పబడుచున్న ఆ సముద్రమును చూచుచు సంతోషించెను. 111

మూ. దూరపారమసంబాధం రక్షోగణనిషేవితమ్,
పశ్యన్తో వరుణావాసం నిషేదుర్హరియూథపాః. 112

ప్ర. అ. దూరపారమ్ = దూరమైన అవతలి తీరము గలది, అసంబాధమ్ = విశాలమూ, రక్షోగణనిషేవితమ్ = రాక్షసులచేత సేవింపబడినది అయిన, వరుణావాసమ్ = సముద్రమును, పశ్యన్తః = చూచుచున్నవారై, హరియూథపాః = వానరసేనానాయకులు, నిషేదుః = కూర్చుండిరి.

తా. విశాలము, రాక్షసనివాసమూ అయిన ఆ సముద్రము అవతలి ఒడ్డు చాల దూరాన ఉండెను. అట్టి సముద్రమును చూచుచు వానరనాయకులు అక్కడ నిలిచిరి. 112

మూ. చణ్డనక్రగ్రాహం ఘోరం క్షపాదౌ దివసక్షయే,
హసన్తమివ ఫేనౌఘైర్నృత్యన్తమివ చోర్మిభిః. 113

ప్ర. అ. చణ్డనక్రగ్రాహమ్ = క్రూరమైన మొసళ్ళుకలది, ఘోరమ్=

భయంకరము, దివసక్షయే = సాయంకాలమునందు, క్షపాదౌ = రాత్రి ప్రారంభమునందు, ఫేనహాసైః = నురుగుల సముదాయములచేత, హసన్తమివ = నవ్వుచున్నట్లున్నది, ఊర్మిభిః = తరంగములచేత, నృత్యన్తమివ = నాట్యము చేయుచున్నట్లున్నది అయిన సముద్రమును చూచుచుండిరి.

తా. దివసాంతమునందు, రాత్రిప్రారంభసమయమునందు, అనగా సంధ్యాకాలమునందు, క్రూరమైన మొసళ్లతో భయంకరముగా ఉన్న ఆ సముద్రము నురుగుల సముదాయములచేత నవ్వుచున్నట్లు, తరంగములచేత నృత్యము చేయుచున్నట్లు కనబడుచుండెను. 113

మూ. చన్ద్రోదయే సముద్ధూతం ప్రతిచన్ద్రసమాకులమ్,
చణ్డానిలమహాగ్రాహైః కీర్ణం తిమితిమిఙ్గిలైః. 114

ప్ర. అ. చన్ద్రోదయే = చంద్రోదయసమయమునందు, సముద్ధూతమ్ = పొంగుచున్నది, ప్రతిచన్ద్రసమాకులమ్ = చంద్రప్రతిబింబములచేత వ్యాకులము, చణ్డానిలమహాగ్రాహైః = తీవ్రమైన వాయువుల వంటి గొప్ప మొసళ్లతోను, తిమితిమిఙ్గిలైః = తిములతోను తిమింగిలములతోను, కీర్ణమ్ = వ్యాప్తము అయిన సముద్రమును చూచుచుండిరి.

తా. ఆ సముద్రము చంద్రోదయసమయమునందు పొంగుచుండెను. అంతటా చంద్రుని ప్రతిబింబములతో నిండి ఉండెను. తీవ్రమైన వాయువు వంటి పెద్ద మొసళ్లతోను, తిములతోను, తిమింగిలములతోను వ్యాప్తమై ఉండెను.

మూ. దీప్తభోగైరివాకీర్ణం భుజఙ్గైర్వరుణాలయమ్,
అవగాఢం మహాసత్త్వైర్నానాశైలసమాకులమ్. 115
సుదుర్గం దుర్గమార్గం తమగాధమసురాలయమ్.

ప్ర. అ. దీప్తభోగైరివ = ప్రజ్వలించుచున్న పడగలు కలవి వలె ఉన్న, భుజఙ్గైః = సర్పములచేత, ఆకీర్ణమ్ = వ్యాప్తము, వరుణాలయమ్ = వరుణుని నివాసము, మహాసత్త్వైః = గొప్ప జంతువులచేత, అవగాఢమ్ = ప్రవేశించబడినది, నానాశైలసమాకులమ్ = అనేకపర్వతములతో వ్యాకులము, సుదుర్గమ్ = ప్రవేశింప శక్యము కానిది, దుర్గమార్గమ్ = ప్రవేశింప శక్యము కాని మార్గము కలది, అగాధమ్ = చాల లోతైనది, నానాశైలసమాకులమ్ = అనేకపర్వతములతో వ్యాకులముగా ఉన్నది అయిన సముద్రమును చూచుచుండిరి.

తా. వరుణునకు నివాసస్థానమైన ఆ సముద్రము మండుచున్న పడగలతో కూడినవా అన్నట్లున్న సర్పములతో వ్యాప్తమై ఉండెను. దానిలో అనేకములైన పెద్ద జంతువులు, అనేకపర్వతములు మునిగి ఉండెను. వాటిచేత

లోనికి ప్రవేశింప శక్యముకాని ఆ సముద్రపు మార్గము కూడ ప్రవేశింప శక్యము కాకుండెను. అగాధమైన ఆ సముద్రము అసురుల నివాసస్థానమై ఉండెను. 115

మూ. మకరైర్నాగభోగైశ్చ విగాఢా వాతలోలితాః, 116
ఉత్పేతుశ్చ నిపేతుశ్చ ప్రవృద్ధా జలరాశయః.

ప్ర. అ. మకరైః = మొసళ్లచేతను, నాగభోగైశ్చ = సర్పముల శరీరములచేతను, విగాఢాః = ప్రవేశింపబడిన, వాతలోలితాః = వాయువుచేత కదల్పబడిన, ప్రవృద్ధాః = వృద్ధిపొందిన, జలరాశయః = జలరాశులు, ఉత్పేతుశ్చ = ఎగిరినవి ; నిపేతుశ్చ = క్రింద బడినవి.

తా. మొసళ్లు, సర్పములు మునిగి ఉన్న జలరాశులు వాయువుచేత కదల్పబడినవై, వృద్ధి చెంది, పైకి ఎగిరి పడుచుండెను. 116

మూ. అగ్నిచూర్ణమివావిద్ధం భాస్వరామ్బుమహోరగమ్, 117
సురారినిలయం ఘోరం పాతాలవిషమం సదా.

ప్ర. అ. ఆవిద్ధమ్ = చల్లబడిన, అగ్నిచూర్ణమివ = అగ్నిచూర్ణము వలె ఉన్నది, భాస్వరామ్బుమహోరగమ్ = ప్రకాశించుచున్న ఉదకము మహాసర్పములు కలది, సదా = ఎల్లప్పుడు, సురారినిలయమ్ = రాక్షసులకు నివాసము, ఘోరమ్ = భయంకరము, పాతాలవిషమమ్ = పాతాలము వలె భయంకరము అయిన సముద్రమును చూచిరి.

తా. ఆ సముద్రము అంతటా అగ్ని చూర్ణము చల్లినట్లు (పై భాగమునందు నక్షత్రాదిప్రతిబింబముచేత) మెరయుచుండెను. ప్రకాశించుచున్న ఉదకము, మహాసర్పములు గల ఆ సముద్రము ఎల్లప్పుడు రాక్షసులకు నిలయమై పాతాళమువలె భయంకరమై ఘోరముగా ఉండెను. 117

మూ. సాగరం చామ్బరప్రఖ్యమమ్బరం సాగరోపమమ్, 118
సాగరం చామ్బరం చేతి నిర్విశేషమదృశ్యత.

ప్ర. అ. సాగరమ్ = సముద్రము, అమ్బరప్రఖ్యమ్ = ఆకాశమువలె ఉండెను. అమ్బరమ్ = ఆకాశము, సాగరోపమమ్ = సముద్రము వలె ఉండెను. సాగరం చ = సముద్రము, అమ్బరం చేతి = ఆకాశము అని, నిర్విశేషమ్ = భేదము లేకుండగా, అదృశ్యత = కనబడెను.

తా. సముద్రము ఆకాశము వలె ఉండెను. ఆకాశము సముద్రము వలె ఉండెను. సముద్రమూ, ఆకాశమూ అను భేదము లేకుండా కనబడుచుండెను. 118

మూ. సంపృక్తం నభసాప్యమ్భః సంపృక్తం చ నభోఽమ్భసా, 119
తాదృగ్రూపే చ దృశ్యేతే తారారత్నసమాకులే.

ప్ర. అ. అమ్భః = ఉదకము, నభసా = ఆకాశముతో, సంపృక్తమ్ = కలిసినది. తారారత్నసమాకులే = నక్షత్రములతోను రత్నములతోను వ్యాకులములైన ఆ రెండూ, తాదృగ్రూపే = ఒకదానితో ఒకటి సమానమైన రూపము గలవిగా, దృశ్యేతే = కనబడుచున్నవి.

తా. సముద్రజలము ఆకాశముతోను, ఆకాశము సముద్రజలముతోను కలిసిపోయెను. అందుచే నక్షత్రములతో నిండిన ఆకాశము, రత్నములతో నిండిన సముద్రము పరస్పరము తుల్యములై ఉండెను. 119

మూ. సముత్పతితమేఘస్య వీచిమాలాకులస్య చ, 120
విశేషో న ద్వయోరాసీత్సాగరస్యామ్బరస్య చ.

ప్ర. అ. సముత్పతితమేఘస్య = ఎగురుచున్న మేఘములు గల, సాగరస్య = సముద్రమునకు, వీచిమాలాకులస్య = తరంగపంక్తులతో వ్యాకులమైన, అమ్బరస్య చ = ఆకాశమునకు, ద్వయోః = రెండింటికి, విశేషః = భేదము, నాసీత్ = లేకుండెను.

తా. మేఘములు ఎగురుచున్న ఆకాశమునకు, తరంగపంక్తులతో వ్యాకులమైన సముద్రమునకు, ఈ రెండింటికి భేదము కనబడలేదు. 120

మూ. అన్యోన్యైరాహతాః సక్తాః సస్వనుర్భీమనిఃస్వనాః, 121
ఊర్మయః సిన్ధురాజస్య మహాభేర్య ఇవామ్బరే.

ప్ర. అ. అన్యోన్యైః = ఒకదానితో ఒకటి, సక్తాః = కలసిన, ఆహతాః = కొట్టబడిన, భీమనిఃస్వనాః = భయంకరమైన ధ్వని గల, సిన్ధురాజస్య = సముద్రముయొక్క, ఊర్మయః = తరంగములు, అమ్బరే = ఆకాశమునందు, మహాభేర్య ఇవ = పెద్ద భేరీలు వలె, సస్వనుః = ధ్వనిచేసినవి.

తా. ఒకదానితో ఒకటి కలిసి కొట్టుకొనుచున్న సముద్రతరంగములు భయంకరమైన శబ్దముతో ఆకాశమునందు, పెద్ద భేరీలు వలె ధ్వనిచేయుచుండెను.

మూ. రత్నౌఘజలసంనాదం విషక్తమివ వాయునా, 122
ఉత్పతన్తమివ క్రుద్ధం యాదోగణసమాకులమ్,

దదృశుస్తే మహాత్మానో వాతాహతజలాశయమ్, 123
అనిలోద్ధూతమాకాశే ప్రలపన్తమివోర్మిభిః.

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, తే = ఆ వానరులు, రత్నౌఘజలసంనాదమ్ = రత్నముల సముదాయముతోను జలముతోను ధ్వని చేయుచున్నది, వాయునా = వాయువుతో, విషక్తమివ = కలసిపోయినట్లున్నది, క్రుద్ధమివ = కోపించినది వలె, ఉత్పతన్తమ్ = పైకి ఎగురుచున్నది, యాదోగణసమాకులమ్ = జలజంతువుల సముదాయముతో నిండినది, వాతాహత జలాశయమ్ = వాయువుచేత కొట్టబడిన జలమునకు నిలయము, ఆకాశే = ఆకాశమునందు, అనిలోద్ధూతమ్ = వాయువుచేత ఎగురగొట్టబడినది, ఊర్మిభిః = తరంగములచేత, ప్రలపన్తమ్ ఇవ = మాటలాడుచున్నట్లున్నది అయిన సముద్రమును, దదృశుః = చూచిరి.

తా. మహాత్ములైన ఆ వానరులు ఆ సముద్రమును చూచిరి. అది వాయువుతో కలిసిపోయిన ట్లుండి, రత్నాల ప్రోగుల ధ్వనులతోను, జలధ్వనులతోను నిండి, కోపించినదా అన్నట్లు పైకి ఎగురుచుండెను. జలజంతువుల సముదాయముతో నిండిన ఆ సముద్రములోని జలము వాయువుచేత కొట్టబడుచుండెను. వాయువు ఆకాశము మీదికి ఎగురగొట్టుచుండగా బయలుదేరిన తరంగములతో అది ఏమేమో మాటలాడుచున్నట్లుండెను. 122,123

మూ. తతో విస్మయమాపన్నా హరయో దదృశుః స్థితాః, 124
భ్రాన్తోర్మిజాలసంనాదం ప్రలోలమివ సాగరమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుర్థః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, స్థితాః = నిలచిన, హరయః = వానరులు, భ్రాన్తోర్మిజాలసంనాదమ్ = తిరుగుచున్న తరంగసముదాయముల ధ్వని గల, ప్రలోలమివ = కదలిపోవుచున్నదా అన్నట్లున్న, సాగరమ్ = సముద్రమును, విస్మయమ్ = ఆశ్చర్యమును, ఆపన్నాః = పొందినవారై, దదృశుః = చూచిరి.

తా. ఆ సముద్రము పైకి లేచి మెలికలు తిరుగుచున్న తరంగముల ధ్వనులతో నిండి కదలిపోవుచున్నదా అన్నట్లుండెను. ఆ వానరులందరు ఆశ్చర్యచకితులై అక్కడ నిలచి ఆ సముద్రమును చూచిరి. 124

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో చతుర్థసర్గ సమాప్తము.

# అథ పఞ్చమః సర్గః

[రాముడు సీతను స్మరించుచు విలపించుట.]

మూ. సా తు నీలేన విధివత్ స్వారక్షా సుసమాహితా,
సాగరస్యోత్తరే తీరే సాధు సా వినివేశితా. 1

ప్ర. అ. నీలేన=నీలునిచేత, విధివత్=నియమానుసారముగా, స్వారక్షా=బాగుగా రక్షింపబడినది, సుసమాహితా=బాగుగా కూర్చబడినదీ (సావధానము చేయబడినదీ) అయిన, సా=ప్రసిద్ధమైన, సా=ఆ సేన, సాగరస్య=సముద్రముయొక్క, ఉత్తరే తీరే=ఉత్తరతీరమునందు, సాధు=బాగుగా, వినివేశితా=నిలుపబడినది.

తా. నీలుడు యథావిధిగా సావధానము చేయుచు, బాగుగా రక్షించుచున్న ఆ సేన సముద్రము ఉత్తరతీరమునందు బాగుగా నిలుపబడెను. 1

మూ. మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ తత్ర వానరపుఙ్గవౌ,
విచేరతుశ్చ తాం సేనాం రక్షార్థం సర్వతో దిశమ్. 2

ప్ర. అ. తత్ర=అక్కడ, వానరపుఙ్గవౌ=వానరశ్రేష్ఠులైన, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చైవ=ద్వివిదుడు, ఉభౌ=ఇద్దరూ, రక్షార్థమ్=రక్షణము నిమిత్తము, సర్వతో దిశమ్=అన్ని దిక్కులవైపు, తాం సేనామ్=ఆ సేనను, విచేరతుః=సంచరించిరి.

తా. వానరశ్రేష్ఠులైన మైందద్వివిదు లిద్దరూ రక్షణము నిమిత్తము ఆ సేనలో అన్ని దిక్కులందు సంచరించిరి. 2

మూ. నివిష్టాయాం తు సేనాయాం తీరే నదనదీపతేః,
పార్శ్వస్థం లక్ష్మణం దృష్ట్వా రామో వచనమబ్రవీత్. 3

ప్ర. అ. నదనదీపతేః=కొండకాలువలకు నదులకు పతియైన సముద్రముయొక్క, (పశ్చిమాభిముఖముగా ప్రవహించునది 'నదము'. పూర్వాభిముఖముగా ప్రవహించునది 'నది') తీరే=తీరమునందు, సేనాయామ్=సేన, నివిష్టాయామ్=నిలిచినదగుచుండగా, రామః=రాముడు, పార్శ్వస్థమ్=పార్శ్వమునందున్న, లక్ష్మణమ్=లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. సముద్రతీరమునందు సైన్యము నిలిచిన పిమ్మట రాముడు ప్రక్కనే ఉన్న లక్ష్మణునితో ఇట్లు పలికెను. 3

మూ. శోకశ్చ కిల కాలేన గచ్ఛతా హ్యపగచ్ఛతి,
మమ చాపశ్యతః కాన్తామహన్యహని వర్ధతే. 4

ప్ర. అ. శోకః=శోకము, గచ్ఛతా=గడచుచున్న, కాలేన=కాలముచేత, అపగచ్ఛతి కిల=తొలగిపోవునట. కాన్తామ్=ప్రియురాలిని, అపశ్యతః=చూడని, మమ చ= నాయొక్క శోకము, అహన్యహని=ప్రతిదినమునందు, వర్ధతే=వృద్ధిపొందుచున్నది.

తా. కాలము గడచుచుండగా శోకము శాంతించు నని చెప్పుదురు. కాని నా ప్రియురాలు కనబడకుండుటచేత నా శోకము రోజురోజుకు వృద్ధిచెందుచున్నది. 4

మూ. న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి చ,
ఏతదేవానుశోచామి వయోఽస్యా హ్యతివర్తతే. 5

ప్ర. అ. ప్రియా=ప్రియురాలు, దూరే=దూరమునందున్న దని, మే=నాకు, దుఃఖమ్=దుఃఖము, న=లేదు. హృతేతి చ=హరింపబడిన దని కూడ, మే=నాకు, దుఃఖమ్=దుఃఖము, న=లేదు. అస్యాః=ఈమెయొక్క, వయః=వయస్సు, అతి వర్తతే హి=దాటిపోవుచున్నది కదా! ఏతదేవ=దీనినిగూర్చియే, అనుశోచామి= దుఃఖించుచున్నాను.

తా. ప్రియురాలు దూరమునందున్నందుకు నాకు దుఃఖము లేదు. ఆమె హరింపబడినందుకు నాకు దుఃఖము లేదు. ఆమె వయస్సు దాటిపోవుచున్నది. దీనిని గూర్చియే విచారించుచున్నాను. 5

మూ. వాహి వాత యతః కాన్తా తాం స్పృష్ట్వా మామపి స్పృశ,
త్వయి మే గాత్రసంస్పర్శశ్చన్ద్రే దృష్టిసమాగమః. 6

ప్ర. అ. వాత=వాయువా! కాన్తా=ప్రియురాలు, యతః=ఎటువైపున ఉన్నదో అటువైపు నుండి, వాహి=వీచుము. తామ్=ఆమెను, స్పృష్ట్వా=స్పృశించి, మామపి= నన్నుకూడ, స్పృశ=స్పృశించుము. మే=నాకు, గాత్రసంస్పర్శః=నా ప్రియురాలి గాత్రస్పర్శ, త్వయి=నీయందు లభించును. దృష్టిసమాగమః=చూపుల కలయిక, చన్ద్రే=చంద్రునియందు లభించును.

తా. ఓ! వాయువా! నా ప్రియురాలు ఉన్న వైపునుండి ఇటు వీచుము. ఆమెను స్పృశించి నన్నుకూడ స్పృశించుము. నీ ద్వారా నాకు నా ప్రియురాలి శరీరము స్పర్శ లభించును. ఆమె చూచిన చంద్రుని చూచుటచే ఆమె చూపులతో నా చూపులకు సంబంధము ఏర్పడును. 6

మూ. తన్మే దహతి గాత్రాణి విషం పీతమివాశయే,
హా నాథేతి ప్రియా సా మాం హ్రియమాణా యదబ్రవీత్. 7

ప్ర. అ. హ్రియమాణా=హరింపబడుచున్న, సా ప్రియా=ఆ ప్రియురాలు, హా నాథ ఇతి= అయ్యో! నాథా! అని, అబ్రవీత్ ఇతి యత్=పలికిన దను

మాట ఏది కలదో, తత్=అది, పీతమ్=త్రాగబడిన, విషమ్ ఇవ=విషము వలె, ఆశయే=నా హృదయమునందున్నదై, మే=నాయొక్క, గాత్రాణి=అవయవములను, దహతి=కాల్చివేయుచున్నది.

తా. హరింపబడుచున్న సమయమునందు నా ప్రియురాలు హా! నాథా! అని విలపించి ఉండును. అది నా మనస్సులో ఉండి, త్రాగిన విషము వలె నా అవయవములను కాల్చివేయుచున్నది. 7

మూ. తద్వియోగేన్ధనవతా తచ్చిన్తావిపులార్చిషా,
రాత్రిందివం శరీరం మే దహ్యతే మదనాగ్నినా. 8

ప్ర. అ. తద్వియోగేన్ధనవతా=ఆమె వియోగ మను కట్టెలు కలది, తచ్చిన్తావిపులార్చిషా=ఆమె చింత అను నిర్మలమైన జ్వాల గలది అయిన, మదనాగ్నినా=మన్మథాగ్నిచేత, మే=నాయొక్క, శరీరమ్=శరీరము, రాత్రిందివమ్=రేయింబవళ్లు, దహ్యతే=కాల్చబడుచున్నది.

తా. ఆమె వియోగ మనే కట్టెలు, ఆమెను గూర్చిన చింత అనే తీవ్రమైన జ్వాలలు గల మన్మథాగ్ని రేయింబవళ్లు నా శరీరమును కాల్చివేయుచున్నది. 8

మూ. అవగాహ్యార్ణవం స్వప్స్యే సౌమిత్రే భవతా వినా,
ఏవం చ ప్రజ్వలన్ కామో న మాం సుప్తం జలే దహేత్. 9

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! భవతా వినా=నీవు లేకుండగా, అర్ణవమ్=సముద్రమును, అవగాహ్య=ప్రవేశించి, స్వప్స్యే=నిద్రపోయెదను. ఏవం చ=ఈ విధముగా, జలే=జలమునందు, సుప్తమ్=నిద్రించిన, మామ్=నన్ను, ప్రజ్వలన్=ప్రజ్వలించుచున్న, కామః=కామము, న దహేత్=దహించదు.

తా. లక్ష్మణా! నీవు లేకుండగా నేనొక్కడనే ఈ సముద్రములో దిగి పండుకొనెదను. ఈ విధముగా సముద్రములో నిద్రించుచున్న నన్ను ప్రజ్వలించుచున్న కామము కాల్చకుండా ఉండునేమో! 9

మూ. బహ్వేతత్కామయానస్య శక్యమేతేన జీవితుమ్,
యదహం సా చ వామోరూరేకాం ధరణిమాశ్రితౌ. 10

ప్ర. అ. అహమ్=నేను, సా=ఆ, వామోరూః చ=సుందరములైన ఊరువులు గల సీత, ఏకామ్=ఒక్క, ధరణిమ్=భూమిని, ఆశ్రితౌ ఇతి యత్=ఆశ్రయించినాము అనునది ఏది కలదో, ఏతత్=ఇది, కామయానస్య=కామము గల నాకు, బహు=చాల ఎక్కువ. ఏతేన=దీనిచేత, జీవితుమ్=జీవించుటకు, శక్యమ్=శక్యము.

తా. నేను, ఆమె ఒకే భూమిమీద ఉన్నాము అనునదియే కామాతురుడనైన నాకు ఎంతో గొప్ప విషయము; దీనిచేత జీవించుటకు శక్య మగును. 10

మూ. కేదారస్యేవ కేదారః సోదకస్య నిరూదకః,
ఉపస్నేహేన జీవామి జీవన్తీం యచ్ఛృణోమి తామ్. 11

ప్ర. అ. తామ్=ఆమెను, జీవన్తీమ్=జీవించి ఉన్నదానినిగా, యత్=ఎందువలన, శృణోమి=వినుచున్నానో అందువలన, సోదకస్య=ఉదకముతో కూడిన, కేదారస్య= వరిచేనుయొక్క, ఉపస్నేహేన=తడుపుచేత, నిరూదకః=నీరు లేని, కేదారః ఇవ=వరిచేను వలె, జీవామి=జీవించుచున్నాను.

తా. ఆమె జీవించి ఉన్నదని వినుటచే, నీళ్లు లేని వరిచేను నీళ్లు ఉన్న వరిచేను, ప్రక్కన ఉండుటచే దాని తడి తగిలి జీవించినట్లు జీవించుచున్నాను.

మూ. కదా ను ఖలు సుశ్రోణీం శతపత్రాయతేక్షణామ్,
విజిత్య శత్రూన్ ద్రక్ష్యామి సీతాం స్ఫీతామివ శ్రియమ్. 12

ప్ర. అ. శత్రూన్=శత్రువులను, విజిత్య=జయించి, సుశ్రోణీమ్=అందమైన కటిస్థలము కలది, శతపత్రాయతేక్షణామ్=పద్మములవలె విశాలములైన నేత్రములు కలది, స్ఫీతామ్= అధికమైన, శ్రియమివ=రాజ్యలక్ష్మివలె ఉన్నది అయిన, సీతామ్=సీతను, కదా ఖలు=ఎప్పుడు, ద్రక్ష్యామి=చూచెదనో!

తా. నేను శత్రువులను జయించి, అందమైన కటిప్రదేశము, పద్మములవంటి నేత్రములు గల, సమృద్ధమైన రాజ్యలక్ష్మివలె ఉన్న సీతను ఎన్నడు చూడగలనో కదా? 12

మూ. కదా సుచారుదన్తోష్ఠం తస్యాః పద్మమివాననమ్,
ఈషదున్నమ్య పాస్యామి రసాయనమివాతురః. 13

ప్ర. అ. సుచారుదన్తోష్ఠమ్=చాల అందమైన దంతములు ఓష్ఠములు కల, పద్మమివ= పద్మమువలె ఉన్న, తస్యాః=ఆమెయొక్క, ఆననమ్=ముఖమును, ఈషత్=కొంచెము, ఉన్నమ్య=ఎత్తి, ఆతురః=రోగి, రసాయనమివ=శరీరారోగ్యసిద్ధిని కలిగించు ఔషధమునువలె, కదా=ఎప్పుడు, పాస్యామి=పానముచేసెదనో!

తా. అందమైన దంతములు, ఓష్ఠములు కల పద్మతుల్యమైన ఆమె ముఖమును కొంచెము పైకెత్తి రోగి శరీరారోగ్యవర్ధకమైన రసాయన మనే ఔషధమును త్రాగినట్లు ఎన్నడు త్రాగెదనో! 13

మూ. తౌ తస్యాః సహితౌ పీనౌ స్తనౌ తాలఫలోపమౌ,
కదా ను ఖలు సోత్కమ్పౌ హసన్త్యా మాం భజిష్యతః. 14

ప్ర. అ. హసన్త్యాః=నవ్వుచున్న, తస్యాః=ఆమెయొక్క, సహితౌ=దగ్గరగా ఉన్నవి, పీనౌ=బలిసినవి, తాలఫలోపమౌ=తాలఫలములతో సమానములు, సోత్కమ్పౌ=కంపముతో కూడినవి అయిన, తౌ=ఆ, స్తనౌ=స్తనములు, మామ్=నన్ను, కదా ఖలు=ఎప్పుడు, భజిష్యతః ను=పొందగలవో కదా!

తా. దగ్గరగా కలిసి ఉన్నవి, బలిసినవి, తాలఫలముల వలె ఉన్నవి, కదలుచున్నవి అయిన ఆమె స్తనములు నా కెప్పుడు ఆనందము కలిగించునోకదా!

మూ. సా నూనమసితాపాఙ్గీ రక్షోమధ్యగతా సతీ,
మన్నాథా నాథహీనేవ త్రాతారం నాధిగచ్ఛతి. 15

ప్ర. అ. అసితాపాఙ్గీ=నల్లని నేత్రాంతములు కలది, మన్నాథా=నేను నాథుడుగా కలదీ అయిన, సా=ఆమె, రక్షోమధ్యగతా సతీ=రాక్షసుల మధ్యను పొందినదై, నూనమ్=నిశ్చయముగా, నాథహీనేవ=నాథుడు లేనిది వలె, త్రాతారమ్=రక్షకుణ్ణి, నాధిగచ్ఛతి=పొందుటలేదు.

తా. నల్లని నేత్రాంతములు గల ఆ సీత రాక్షసుల మధ్య ఉన్నదై, నాథుడనైన నేను ఉన్నను, నాథుడు లేనిది వలె రక్షకు లెవ్వరూ లేక దుఃఖించుచున్నది! 15

మూ. కథం జనకరాజస్య దుహితా మమ చ ప్రియా,
రాక్షసీమధ్యగా శేతే స్నుషా దశరథస్య చ. 16

ప్ర. అ. జనకరాజస్య=జనకమహారాజుయొక్క, దుహితా=కూతురు, మమ=నాయొక్క, ప్రియా=ప్రియురాలు, దశరథస్య=దశరథునియొక్క, స్నుషా=కోడలు అయిన ఆ సీత, రాక్షసీమధ్యగా=రాక్షసస్త్రీల మధ్యయం దున్నదై, కథమ్=ఎట్లు, శేతే=శయనించుచున్నదో!

తా. జనకమహారాజు కూతురు, నా భార్య, దశరథుని కోడలు అయిన ఆ సీత, రాక్షసస్త్రీల మధ్య ఎట్లు శయనించుచున్నదో కదా! 16

మూ. అవిక్షోభ్యాణి రక్షాంసి సా విధూయోత్పతిష్యతి,
విధూయ జలదాన్నీలాన్ శశిలేఖా శరత్స్వివ. 17

ప్ర. అ. శరత్సు=శరత్కాలమునందు, శశిలేఖా=చంద్రరేఖ, నీలాన్=నల్లనైన, జలదాన్=మేఘములను, విధూయ ఇవ=తొలగించి వలె, సా=ఆమె, అవిక్షోభ్యాణి=క్షోభింప శక్యము కాని, రక్షాంసి=రాక్షసులను, విధూయ=దూరముగా త్రోసివేసి, ఉత్పతిష్యతి=పైకి రాగలదు.

తా. శరత్కాలమునందు చంద్రరేఖ నల్లని మేఘములను తప్పించుకొని

పైకి వచ్చినట్లు ఆమె క్షోభింప శక్యము కాని రాక్షసులను దూరముగా త్రోసివేసి పైకి రాగలదు. 17

మూ. స్వభావతనుకా నూనం శోకేనానశనేన చ,
భూయస్తనుతరా సీతా దేశకాలవిపర్యయాత్. 18

ప్ర. అ. స్వభావతనుకా=స్వభావముచేతనే సన్నమైన, సీతా=సీత, దేశకాలవిపర్యయాత్= దేశకాలముల వైపరీత్యమువలన, శోకేన=శోకముచేతను, అనశనేన=భుజించకపోవుటచేతను, నూనమ్=నిశ్చయముగా, భూయః=ఇంకను, తనుతరా=ఎక్కువ చిక్కి ఉండును.

తా. స్వభావముచేతనే సన్నముగా ఉండు సీత దేశకాలముల వైపరీత్యము వలన, శోకముచేతను, భుజించకపోవుటచేతను ఇంకను చిక్కిపోయి ఉండును.18

మూ. కదా ను రాక్షసేన్ద్రస్య నిధాయోరసి సాయకాన్,
సీతాం ప్రత్యాహరిష్యామి శోకముత్సృజ్య మానసమ్. 19

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, సాయకాన్= బాణములను, నిధాయ=ఉంచి, మానసమ్=మనస్సుకు సంబంధించిన, శోకమ్=శోకమును, ఉత్సృజ్య=విడచి, సీతామ్=సీతను, కదా ను=ఎప్పుడు, ప్రత్యాహరిష్యామి=తిరిగి తీసికొని వచ్చెదనో!

తా. రావణుని వక్షఃస్థలముపై బాణములను ప్రయోగించి, మనస్సులోని శోకమును తొలగించుకొని సీతను ఎప్పుడు తిరిగి తీసికొని వచ్చెదనో కదా!19

మూ. కదా ను ఖలు మే సాధ్వీ సీతా సురసుతోపమా,
సోత్కణ్ఠా కణ్ఠమాలమ్బ్య మోక్ష్యత్యానన్దజం జలమ్. 20

ప్ర. అ. సాధ్వీ=పతివ్రత, సురసుతోపమా=దేవతాస్త్రీతో సమానురాలు అయిన, సీతా= సీత, సోత్కణ్ఠా=వేడుకతో కూడినదై, మే=నాయొక్క, కణ్ఠమ్=కంఠమును, ఆలమ్బ్య=పట్టుకొని, కదా ఖలు=ఎప్పుడు, ఆనన్దజమ్=ఆనందమువలన కలిగిన, జలమ్=జలమును, మోక్ష్యతి ను=విడచునో కదా!

తా. పతివ్రత, దేవతాస్త్రీతో సమానురాలూ అయిన సీత వేడుకతో నా కంఠమును కౌగలించుకొని ఆనందమువలన కలిగిన కన్నీళ్ళను ఎప్పుడు విడచునో కదా! 20

మూ. కదా శోకమిమం ఘోరం మైథిలీవిప్రయోగజమ్,
సహసా విప్రమోక్ష్యామి వాసః శుక్లేతరం యథా. 21

ప్ర. అ. మైథిలీవిప్రయోగజమ్=సీతావియోగమువలన కలిగిన, ఘోరమ్=భయంకరమైన, ఇమమ్=ఈ, శోకమ్=శోకమును, కుచైలమ్=వల్లని, వాసః యుథా=వస్త్రమును వలె, కదా=ఎప్పుడు, సహసా=వెంటనే, విప్రమోక్ష్యామి నుండి విడువగలనో!

తా. సీతావియోగమువలన కలిగిన ఈ శోకమును, మాసిపోయిన వస్త్రమును విడచి నట్లు, వెంటనే ఎప్పుడు విడచెదనో! 21

మూ. ఏవం విలపతస్తస్య తత్ర రామస్య ధీమతః,
దినక్షయాన్మన్దవపుర్భాస్కరో<sup></sup>ఽస్తముపాగతః. 22

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య=ఆ, రామస్య=రాముడు, తత్ర=అక్కడ, ఏవమ్=ఇట్లు, విలపతః=విలపించుచుండగా, దినక్షయాత్=దినము క్షీణించుటవలన, మన్దవపుః=మందమైన శరీరము గల, భాస్కరః=సూర్యుడు, అస్తమ్ ఉపాగతః=అస్తాద్రిని పొందెను.

తా. బుద్ధిమంతుడైన రాముడు అక్కడ ఈ విధముగా విలపించుచుండగా పగలు గడచిపోవుటచే మందమైన శరీరము గల సూర్యుడు అస్తమించెను.22

మూ. ఆశ్వాసితో లక్ష్మణేన రామః సన్ధ్యాముపాసత,
స్మరన్ కమలపత్రాక్షీం సీతాం శోకాకులీకృతః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చమః సర్గః.

ప్ర. అ. కమలపత్రాక్షీమ్=కమలపత్రములవంటి నేత్రములు గల, సీతామ్=సీతను, స్మరన్=స్మరించుచు, శోకాకులీకృతః=శోకముచేత వ్యాకులము చేయబడిన, రామః=రాముడు, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ఆశ్వాసితః=ఓదార్చబడినవాడై, సన్ధ్యామ్=సంధ్యను, ఉపాసత=ఉపాసించెను.

తా. పద్మపత్రములవంటి నేత్రములు గల సీతను స్మరించుచు శోకముతో బాధపడుచున్న ఆ రాముడిని లక్ష్మణుడు ఓదార్చెను. పిదప అతడు సంధ్యను ఉపాసించెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండములో పంచమసర్గ సమాప్తము.

# అథ షష్ఠః సర్గః

[లంకలో రావణుడు రాక్షసులతో ఆలోచన చేయుట.]

మూ. లఙ్కాయాం తు కృతం కర్మ ఘోరం దృష్ట్వా భయావహమ్,
రాక్షసేన్ద్రో హనుమతా శక్రేణేవ మహాత్మనా, 1
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్ హ్రియా కిఞ్చిదవాఙ్ముఖః.

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, శక్రేణేవ=దేవేంద్రునిచేత వలె, హనుమతా=హనుమంతునిచేత, లఙ్కాయామ్=లంకయందు, కృతమ్=చేయబడిన, భయావహమ్=భయమును కలిగించు, ఘోరమ్=ఘోరమైన, కర్మ=పనిని, దృష్ట్వా=చూచి, రాక్షసేన్ద్రః=రావణుడు, హ్రియా=సిగ్గుచేత, కిఞ్చిత్=కొంచెము, అవాఙ్ముఖః=క్రిందికి ముఖము గలవాడై, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ముడైన హనుమంతుడు, దేవేంద్రుడు వలె లంకలో చేసిన భయంకరములు, ఘోరములు అయిన కృత్యములను చూచి, రావణుడు సిగ్గులో కొంచెము తల వంచుకొని మంత్రులు అందరితో ఇట్లు పలికెను. 1

మూ. ధర్షితా చ ప్రవిష్టా చ లఙ్కా దుష్ప్రసహా పురీ, 2
తేన వానరమాత్రేణ దృష్టా సీతా చ జానకీ.

ప్ర. అ. వానరమాత్రేణ=వానరమాత్రుడైన, తేన=వానిచేత, దుష్ప్రసహా=సహింప శక్యము కాని, లఙ్కా పురీ=లంకాపట్టణము, ధర్షితా చ=ఎదిరించ బడినది, ప్రవిష్టా చ=ప్రవేశించబడినది. జానకీ=జనకరాజకుమారియైన, సీతా చ=సీత కూడ, దృష్టా=చూడబడినది.

తా. ఆ వానరమాత్రుడు వచ్చి ఎదిరింప శక్యము కాని లంకానగరమును ఎదిరించి, ప్రవేశించి, జనకరాజకుమారియైన సీతను చూడగలిగినాడు! 2

మూ. ప్రాసాదో ధర్షితశ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః, 3
ఆవిలా చ పురీ లఙ్కా సర్వా హనుమతా కృతా.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, చైత్యః ప్రాసాదః=చైత్యప్రాసాదము, ధర్షితః=ధ్వంసముచేయబడినది. ప్రవరాః=శ్రేష్ఠులైన, రాక్షసాః=రాక్షసులు, హతాః=చంపబడినారు. సర్వా=సమస్తమైన, లఙ్కా పురీ=లంకాపట్టణము, ఆవిలా=వ్యాకులమైనదిగా, కృతా=చేయబడినది.

తా. ఆ హనుమంతుడు చైత్యప్రాసాదమును ధ్వంసము చేసినాడు. గొప్ప

రాక్షసవీరులను చంపివేసినాడు. లంకాపట్టణమునంతా వ్యాకులము చేసినాడు.3

మూ. కిం కరిష్యామి భద్రం వో కిం వా యుక్తమనన్తరమ్, 4
ఉచ్యతాం నః సమర్థం యత్కృతం చ సుకృతం భవేత్.

ప్ర. అ. వః=మీకు, భద్రమ్=మంగళ మగుగాక. కిమ్=ఏమి, కరిష్యామి= చేసెదను? అనన్తరమ్=తరువాత చేయవలసినది, కిం వా=ఏది, యుక్తమ్=యుక్తము? నః=మనకు, యత్=ఏది, సమర్థమ్=హితమో, కృతమ్=చేయబడినదై, సుకృతమ్=బాగుగా చేయబడినది, భవేత్=అగునో, అది, ఉచ్యతామ్=చెప్పబడుగాక.

తా. మీకందరికి క్షేమ మగుగాక. ఇప్పుడు నేనేమి చేయవలెను? ఏది యుక్తము? ఏది చేసినచో మంచిదిగా ఉండునో, ఏది మనకు హితమో అది చెప్పుడు. 4

మూ. మన్త్రమూలం చ విజయం ప్రవదన్తి మనస్వినః, 5
తస్మాద్వై రోచయే మన్త్రం రామం ప్రతి మహాబలాః.

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గలవారలారా! విజయమ్=విజయమును, మన్త్రమూలమ్=మంత్రమే మూలముగా కలదానినిగా, మనస్వినః=ఉత్తమమైన మనస్సు కలవారు, ప్రవదన్తి=చెప్పెదరు. తస్మాత్=ఆ కారణమువలన, రామం ప్రతి=రాముని గూర్చి, మన్త్రమ్=ఆలోచనను, రోచయే=ఇష్టపడుచున్నాను.

తా. ఓ! మహాబలశాలులారా! మంత్రము (ఆలోచన) వలననే విజయము సిద్ధించునని పండితులు చెప్పెదరు. అందుచే రాముని విషయమున ఆలోచించవలెనని కోరుచున్నాను. 5

మూ. త్రివిధాః పురుషా లోకే ఉత్తమాధమమధ్యమాః, 6
తేషాం తు సమవేతానాం గుణదోషౌ వదామ్యహమ్.

ప్ర. అ. లోకే=లోకమునందు, ఉత్తమాధమమధ్యమాః=ఉత్తములు, మధ్యములు, అధములు అను, త్రివిధాః=మూడు విధములైన, పురుషాః=పురుషులు ఉందురు. సమవేతానామ్=కలసిన (మొత్తము), తేషామ్=వారియొక్క, గుణదోషౌ=గుణదోషములను, అహమ్=నేను, వదామి=చెప్పుచున్నాను.

తా. లోకములో ఉత్తములు, మధ్యములు, అధములు అను మూడు విధాల మనుష్యులుందురు. వారి అందరి గుణదోషములను గూర్చి చెప్పెదను.6

మూ. మన్త్రిభిర్హితసంయుక్తైః సమర్థైర్మన్త్రనిర్ణయే, 7
మిత్రైర్వాపి సమానార్థైర్బాన్ధవైరపి వాధికైః,

సహితో మన్త్రయిత్వా యః కర్మారమ్భాన్ ప్రవర్తయేత్, 8
దైవే చ కురుతే యత్నం తమాహుః పురుషోత్తమమ్.

ప్ర. అ. యః=ఎవడు, హితసంయుక్తైః=హితపరులు, మన్త్రనిర్ణయే= మంత్రమును నిర్ణయించుటయందు, సమర్థైః=సమర్థులు అయిన, మన్త్రిభిః=మంత్రులతో గాని, సమానార్థైః=సమానమైన ప్రయోజనము గల, మిత్రైర్వాపి=మిత్రులతోగాని, అధికైః= అధికులైన, బాన్ధవైర్వాపి=బంధువులతో గాని, సహితః=కూడినవాడై, మన్త్రయిత్వా= ఆలోచించి, కర్మారమ్భాన్=కార్యముల ఆరంభములను, ప్రవర్తయేత్=ప్రవర్తింపచేయునో, దైవే చ=దైవమువిషయమునందు కూడ, యత్నమ్=ప్రయత్నమును, కురుతే=చేయునో, తమ్=ఆతనిని, పురుషోత్తమమ్=పురుషులలోఉత్తమునిగా, ఆహుః=చెప్పెదురు.

తా. హితమును కోరువారు, మంత్రమును నిర్ణయించుటయందు సమర్థులూ అయిన మంత్రులతో గాని, ఒకే విధమైన ప్రయోజనము గల మిత్రులతో గాని, అధికులైన బంధువులతో గాని కలిసి ఆలోచన చేసి ఎవడు పనులను ప్రారంభించునో, దైవమును అనుకూలము చేసికొనుటకు కూడ యత్నము చేయునో ఆతడు పురుషులలో ఉత్తముడు అని చెప్పెదురు. 7, 8

మూ. ఏకోఽర్థం విమృశేదేకో ధర్మే ప్రకురుతే మనః, 9
ఏకః కార్యాణి కురుతే తమాహుర్మధ్యమం నరమ్.

ప్ర. అ. (ఎవడు) ఏకః=ఒంటరివాడై, అర్థమ్=కార్యమును గూర్చి, విమృశేత్= విమర్శించునో, ఏకః=ఒంటరివాడై, ధర్మే=ధర్మమునందు, మనః=మనస్సును, ప్రకురుతే=చేయునో, ఏకః=ఒంటరివాడై, కార్యాణి=కార్యములను, కురుతే= చేయునో, తం నరమ్=ఆ మనుష్యుని, మధ్యమమ్=మధ్యమునిగా, ఆహుః= చెప్పుచున్నారు.

తా. ఎవడు ఒంటరిగానే ఆలోచన చేయునో, ఒంటరిగానే ధర్మమును నిర్ణయించునో, ఒంటరిగానే పనులు చేయునో ఆతనిని మధ్యముడు అని అందురు. 9

మూ. గుణదోషా వనిశ్చిత్య త్యక్త్వా దైవవ్యపాశ్రయమ్, 10
కరిష్యామీతి యః కార్యముపేక్షేత్స నరాధమః.

ప్ర. అ. "వ్యక్తం దైవవ్యపాశ్రయః" అను ప్రాచ్యపాఠము బాగున్నది. యః=ఎవడు, గుణదోషౌ=గుణదోషములను, వ్యక్తమ్=స్పష్టముగా, అనిశ్చిత్య=నిశ్చయించక, దైవవ్యపాశ్రయః=దైవమే ఆశ్రయముగా కలవాడై, కరిష్యామి ఇతి=చేసెదనులే అని, కార్యమ్= కార్యమును, ఉపేక్షేత్=ఉపేక్షించునో,

సః=అతడు, నరాధమః=నరులలో అధముడు.

తా. గుణదోషములను సరిగా నిర్ణయించకుండగా దైవము మీదనే ఆధారపడి, "చేయవచ్చునులే" అని కార్యమును ఉపేక్షించువాడు నరాధముడు. 10

మూ. యథేమే పురుషా నిత్యముత్తమాధమమధ్యమాః, 11
ఏవం మన్త్రోఽపి విజ్ఞేయ ఉత్తమాధమమధ్యమః.

ప్ర. అ. నిత్యమ్=ఎల్లప్పుడు, ఇమే=ఈ, పురుషాః=పురుషులు, యథా=ఎట్లు, ఉత్తమాధమమధ్యమాః=ఉత్తములు, అధములు, మధ్యములుగా ఉన్నారో, ఏవమ్=ఇట్లు, మన్త్రోఽపి=మంత్రము కూడ, ఉత్తమాధమమధ్యమః=ఉత్తమము, అధమము, మధ్యమము అని, విజ్ఞేయః=తెలియదగినది.

తా. పురుషులలో ఉత్తములు, మధ్యములు, అధములు ఉన్నట్లే మంత్రములో కూడ ఉత్తమము, మధ్యమము, అధమము, అను భేదములు నిత్యము ఉన్నవి. 11

మూ. ఐకమత్యముపాగమ్య శాస్త్రదృష్టేన చక్షుషా, 12
మన్త్రిణో యత్ర నిరతాస్తమాహుర్మన్త్రముత్తమమ్.

ప్ర. అ. మన్త్రిణః=మంత్రులు, శాస్త్రదృష్టేన=శాస్త్రమునందు చూడబడిన, చక్షుషా=దృష్టితో, ఐకమత్యమ్=ఐకమత్యమును, ఉపాగమ్య=పొంది, యత్ర=దేనియందు, నిరతాః=ఆసక్తులై ఉందురో, తమ్=ఆ, మన్త్రమ్=మంత్రమును, ఉత్తమమ్=ఉత్తమమైనదానినిగా, ఆహుః=చెప్పుదురు.

తా. శాస్త్రములో చెప్పబడిన దృష్టిని (విధానమును) అనుసరించి, ఐకమత్యమును పొంది, మంత్రులు ఏ ఆలోచనయందు స్థిరముగా ఉందురో అది ఉత్తమము. 12

మూ. బహ్వీరపి మతీర్గత్వా మన్త్రిణామర్థనిర్ణయః, 13
పునర్యత్రైకతాం ప్రాప్తః స మన్త్రో మధ్యమః స్మృతః.

ప్ర. అ. బహ్వీః=అనేకవిధములైన, మతీః=ఆలోచనలను, గత్వాపి=పొందినను, మన్త్రిణామ్=మంత్రులయొక్క, అర్థనిర్ణయః=కార్యనిర్ణయము, పునః=మరల, యత్ర=ఎక్కడ, ఏకతామ్=ఏకత్వమును, ప్రాప్తః=పొందినదో, సః=ఆ, మన్త్రః=ఆలోచన, మధ్యమః=మధ్యమముగా, స్మృతః=చెప్పబడినది.

తా. మొదట అభిప్రాయభేదము ఉన్నను మంత్రులు చేసే నిర్ణయము చివరికి ఒకే విధముగా ఉన్నట్లయితే ఆ మంత్రము మధ్యమము. 13

మూ. అన్యోన్యమతిమాస్థాయ యత్ర సంప్రతిభాష్యతే, 14
న చైకమత్యే శ్రేయోఽస్తి మన్త్రః సోఽధమ ఉచ్యతే.

ప్ర. అ. యత్ర=దేనియందు, అన్యోన్యమతిమ్=వేరు వేరు బుద్ధిని (అభిప్రాయమును), ఆస్థాయ=అవలంబించి, సంప్రతిభాష్యతే=భాషణము చేయబడునో, ఐకమత్యే=ఐకమత్యము విషయమున, శ్రేయః=ప్రీతి, నాస్తి=లేదో, సః మన్త్రః=ఆ మంత్రము, అధమః=అధమముగా, మతః=చెప్పబడినది.

తా. ఎవరికి వారు వేరు వేరు అభిప్రాయములతో మాటలాడుచు ఐకమత్యము నందు ప్రీతిని చూపించక చేయు మంత్రము అధమము. 14

మూ. తస్మాత్సుమన్త్రితం సాధు భవన్తో మతిసత్తమాః, 15
కార్యం సంప్రతిపద్యన్తామేతత్కృత్యం మతం మమ.

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, మతిసత్తమాః=ఉత్తమమైన బుద్ధిగల, భవన్తః= మీరు, సుమన్త్రితమ్=బాగుగా ఆలోచించబడిన, సాధు=మంచిదైన, కార్యమ్=కార్యమును, సంప్రతిపద్యన్తామ్=పొందెదరుగాక. ఏతత్=ఇది, మమ=నాకు, కృత్యమ్= చేయువలసినదిగా, మతమ్=ఇష్టము.

తా. అందుచే ఉత్తమమైన బుద్ధి గల మీరందరు బాగుగా ఆలోచించి ఇప్పుడు చేయువలసిన కార్యమును నిర్ణయింపుడు. దానినే నేను అంగీకరించి చేసెదను. 15

మూ. వానరాణాం హి ధీరాణాం సహస్రైః పరివారితః, 16
రామోఽభ్యేతి పురీం లఙ్కామస్మాకముపరోధకః.

ప్ర. అ. రామః=రాముడు, ధీరాణామ్=ధీరులైన, వానరాణామ్=వానరుల యొక్క, సహస్రైః=సహస్రములతో, పరివారితః=కూడినవాడై, అస్మాకమ్=మనకు, ఉపరోధకః= అడ్డుకొనుచున్నవాడై, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును గూర్చి, అభ్యేతి=వచ్చుచున్నాడు.

తా. రాముడు ధీరులైన వేలకొలది వానరులతో కలిసి మనలను ఎదిరించుటకై లంకాపురమునకు వచ్చుచున్నాడు. 16

మూ. తరిష్యతి చ సువ్యక్తం రాఘవః సాగరం సుఖమ్, 17
తరసా యుక్తరూపేణ సానుజః సబలానుగః.

ప్ర. అ. రాఘవః=రాముడు, యుక్తరూపేణ=తగిన, తరసా=బలముచేత, సానుజః=తమ్మునితో కూడినవాడై, సబలానుగః=సైన్యముతోను అనుచరులతోను కూడినవాడై, సాగరమ్=సముద్రమును, సువ్యక్తమ్=తప్పక, సుఖమ్=సుఖముగా,

తరిష్యతి వ= దాటగలడు కూడ.

తా. రాముడు తగిన బలముచేత, తమ్మునితోను, సైన్యముతోను, ఇతరులైన అనుచరులతోను కూడినవాడై సముద్రమును సుఖముగా తప్పక దాటగలడు. 17

మూ. సముద్రముచ్ఛోషయతి వీర్యేణాన్యత్కరోతి వా, 18
తస్మిన్నేవంవిధే కార్యే విరుద్ధే వానరైః సహ,
హితం పురే చ సైన్యే చ సర్వం సంమన్త్ర్యతాం మమ. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షష్ఠః సర్గః.

ప్ర. అ. సముద్రమ్=సముద్రమును, ఉచ్ఛోషయతి=ఎండించును. వీర్యేణ=పరాక్రమముచేత, అన్యద్వా=మరొకటి ఏదైనా, కరోతి=చేయును. వానరైః సహ=వానరులతో కూడ, విరుద్ధే=విరోధముతో కూడిన, తస్మిన్=ఆ, ఏవంవిధే=ఈ విధమైన, కార్యే=కార్యమునందు, మమ=నాయొక్క, పురే=పట్టణమునందు, సైన్యే=సైన్యమునందు, హితమ్=హితమైన, సర్వమ్=సమస్తము, సంమన్త్ర్యతామ్=ఆలోచింపబడుగాక.

తా. రాముడు సముద్రమును ఎండింపచేసినా చేయవచ్చును. పరాక్రమముచేత మరేమైనా చేయవచ్చును. అందుచేత వానరులతో కూడ విరోధము కలిగి ఇట్టి పరిస్థితి ఏర్పడిన ఈ సమయమునందు నా పురమునకు, సైన్యమునకు ఏది హితమో అట్టి కార్యమును ఆలోచించుడు. 18, 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఆరవసర్గ సమాప్తము.

# అథ సప్తమః సర్గః

[రాక్షసులు తమ తమ బలమును ప్రకటించుచు "ఏ మాత్రము దిగులుచెంద వలసిన పని లేదు" అని రావణునకు చెప్పుట.]

మూ. ఇత్యుక్తా రాక్షసేన్ద్రేణ రాక్షసాస్తే మహాబలాః,
ఊచుః ప్రాఞ్జలయః సర్వే రావణం రాక్షసేశ్వరమ్, 1
ద్విషత్పక్షమవిజ్ఞాయ నీతిబాహ్యాస్త్వబుద్ధయః.

ప్ర. అ. రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, ఇతి=ఇట్లు, ఉక్తాః=పలుకబడిన, మహాబలాః=గొప్ప బలము గలవారు, నీతిబాహ్యాః=నీతికి దూరమైనవారు, అబుద్ధయః=బుద్ధిహీనులు అయిన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, సర్వే=అందరూ, ప్రాఞ్జలయః =ఎత్తబడిన దోసిళ్ళు గలవారై, ద్విషత్పక్షమ్=శత్రుపక్షమును, అవిజ్ఞాయ=తెలిసికొనక, రాక్షసేశ్వరమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుని గూర్చి, ఊచుః=పలికిరి.

తా. రాక్షసరాజైన రావణుని మాటలు విని, మహాబలశాలులు, నీతికి దూరమైనవారు, బుద్ధిహీనులు అయిన ఆ రాక్షసు లందరు అంజలి ఘటించి శత్రువున కున్న బలాబలములు తెలియక అతనితో ఇట్లు పలికిరి. 1

మూ. రాజన్ పరిఘశక్త్యృష్టిశూలపట్టిశసంకులమ్, 2
సుమహన్నో బలం కస్మాద్విషాదం భజతే భవాన్.

ప్ర. అ. రాజన్=రాజా! పరిఘశక్త్యృష్టిశూలపట్టిశసంకులమ్=పరిఘలతోను, శక్తులతోను, తీక్ష్ణములైన దండములతోను, శూలములతోను, పట్టిశములతోను నిండిన, నః బలమ్=మన సేన, సుమహత్=చాల గొప్పది. భవాన్=నీవు కస్మాత్=ఎందువలన, విషాదమ్=దిగులుపాటును, భజతే=పొందుచున్నావు?

తా. రాజా! పరిఘలు, శక్తులు, ఋష్టులు, పట్టిశములు వీటితో నిండిన గొప్ప సైన్యము మన కున్నది. నీవు ఎందుకు దిగులు చెందెదవు? 2

మూ. త్వయా భోగవతీం గత్వా నిర్జితాః పన్నగా యుధి, 3
కైలాసశిఖరావాసీ యక్షైర్బహుభిరావృతః,
సుమహత్కదనం కృత్వా వశ్యస్తే ధనదః కృతః. 4

ప్ర. అ. త్వయా=నీచేత, భోగవతీమ్=భోగవతీనగరమును, గత్వా=వెళ్ళి, యుధి=యుద్ధమునందు, పన్నగాః=సర్పములు, నిర్జితాః=జయింపబడినవి. కైలాసశిఖరావాసీ=కైలాసశిఖరమునందు నివసించువాడు, బహుభిః=అనేకులైన, యక్షైః=యక్షులతో, ఆవృతః=కూడినవాడు అయిన, ధనదః=కుబేరుడు, సుమహత్=చాల

గొప్ప, కదనమ్=యుద్ధమును, కృత్వా=చేసి, తే=నీకు, వశ్యః=లొంగినవాడుగా, కృతః=చేయబడినవాడు.

తా. నీవు పాతాళమునందున్న భోగవతీనగరమునకు వెళ్లి యుద్ధములో పన్నగులను జయించినావు. చాలమంది యక్షులతో కలిసి కైలాసపర్వతమునందు నివసించుచున్న కుబేరునితో గొప్ప యుద్ధముచేసి అతనిని లొంగదీసుకొన్నావు.

మూ. స మహేశ్వరసఖ్యేన శ్లాఘమానస్త్వయా విభో,
విర్జితః సమరే రోషాల్లోకపాలో మహాబలః. 5

ప్ర. అ. విభో=ఓ! ప్రభూ! మహేశ్వరసఖ్యేన=మహేశ్వరునితో స్నేహముచేత, శ్లాఘమానః=శ్లాఘించుకొనుచున్న, మహాబలః=గొప్ప బలము గల, లోకపాలః=లోకపాలుడైన, సః=ఆ కుబేరుడు, త్వయా=నీచేత, రోషాత్=కోపము వలన, సమరే=యుద్ధమునందు, నిర్జితః=జయించబడినవాడు.

తా. ఓ! ప్రభూ! మహేశ్వరుని స్నేహితుడ నని గర్వపడుచున్న మహాబలుడు, లోకపాలుడూ అయిన ఆ కుబేరునిపై కోపించి నీవు యుద్ధములో ఓడించినావు. 5

మూ. వినిపాత్య చ యక్షౌఘాన్విక్షోభ్య వినిగృహ్య చ,
త్వయా కైలాసశిఖరాద్విమానమిదమాహృతమ్. 6

ప్ర. అ. యక్షౌఘాన్=యక్షుల సముదాయములను, వినిపాత్య=పడగొట్టి, విక్షోభ్య=క్షోభింపచేసి, వినిగృహ్య చ=బంధించి, త్వయా=నీచేత, కైలాసశిఖరాత్=కైలాస శిఖరమునుండి, ఇదమ్=ఈ, విమానమ్=విమానము, ఆహృతమ్=తీసికొనిరాబడినది.

తా. నీవు యక్షుల సముదాయములను పడగొట్టి, క్షోభింపచేసి, కొందరిని బంధించి కైలాసపర్వతశిఖరమునుండి (అలకాపట్టణమునుండి) ఈ విమానము తీసికొనివచ్చినావు. 6

మూ. మయేన దానవేన్ద్రేణ త్వద్భయాత్సఖ్యమిచ్ఛతా,
దుహితా తవ భార్యార్థే దత్తా రాక్షసపుఙ్గవ. 7

ప్ర. అ. రాక్షసపుఙ్గవ=ఓ! రాక్షసశ్రేష్ఠుడా! త్వద్భయాత్=నీనుండి భయమువలన, సఖ్యమ్=స్నేహమును, ఇచ్ఛతా=కోరుచున్న, దానవేన్ద్రేణ=దానవుల ప్రభువైన, మయేన=మయునిచేత, దుహితా=పుత్రిక, తవ=నీకు, భార్యార్థే=భార్యగా, దత్తా= ఇవ్వబడినది.

తా. దానవప్రభువైన మయుడు నీకు భయపడి, నీతో మైత్రిని కోరి,

తన కుమార్తెయైన మండోదరిని నీకు ఇచ్చి వివాహము చేసినాడు. 7

మూ. దానవేన్ద్రో మహాబాహో వీర్యోత్సిక్తో దురాసదః,
విగృహ్య వశమానీతః కుమ్భీనస్యాః సుఖావహః. 8

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! వీర్యోత్సిక్తః=పరాక్రమముచేత గర్వించినవాడు, దురాసదః=ఎదిరింపశక్యము కానివాడు, కుమ్భీనస్యాః=కుంభీనసియొక్క, సుఖావహః=సుఖముకలిగించువాడు (భర్త) అయిన, దానవేన్ద్రః=దానవరాజు, విగృహ్య=విరోధము చేసి, వశమ్=వశమును, ఆనీతః=పొందింపబడినాడు.

తా. ఓ! మహాబాహూ! దానవుల ప్రభువు, పరాక్రమముచేత గర్వించినవాడు, ఎదిరింప శక్యము కానివాడు, నీ సోదరియైన కుంభీనసి భర్త అయిన మధువును యుద్ధము చేసి ఓడించితివి. 8

మూ. నిర్జితాస్తే మహాబాహో నాగా గత్వా రసాతలమ్,
వాసుకిస్తక్షకః శఙ్ఖో జటీ చ వశమాహృతాః. 9

ప్ర. అ. మహాబాహో=ఓ! మహాబాహూ! రసాతలమ్=రసాతలమును గూర్చి, గత్వా=వెళ్ళి, తే=నీకు, (నీచేత), నాగాః=నాగులు, నిర్జితాః=జయింపబడినారు. వాసుకిః=వాసుకి, తక్షకః=తక్షకుడు, శఙ్ఖః=శంఖుడు, జటీ చ=జటి, వశమ్=వశమును, ఆహృతాః=పొందింపబడిరి.

తా. ఓ! మహాబాహూ! నీవు రసాతలమునకు వెళ్ళి నాగులను జయించితివి. వాసుకిని, తక్షకుని, శంఖుని, జటిని వశము చేసికొంటివి. 9

మూ. అక్షయా బలవన్తశ్చ శూరా లబ్ధవరాః పునః,
త్వయా సంవత్సరం యుద్ధ్వా సమరే దానవా విభో. 10
స్వబలం సముపాశ్రిత్య నీతా వశమరిన్దమ,
మాయాశ్చాధిగతాస్తత్ర బహ్వ్యో వై రాక్షసాధిప. 11

ప్ర. అ. అరిన్దమ=శత్రుసంహారకుడా! రాక్షసాధిప=రాక్షసరాజా! విభో=ఓ! ప్రభూ! త్వయా=నీచేత, సంవత్సరమ్=సంవత్సరకాలము, యుద్ధ్వా=యుద్ధముచేసి, అక్షయాః=నాశనము లేనివారు, బలవన్తశ్చ=బలము కలవారు, శూరాః=శూరులు, పునః=మరియు, లబ్ధవరాః=పొందబడిన వరములు కలవారు అయిన, దానవాః=దానవులు, స్వబలమ్=తన బలమును, సముపాశ్రిత్య=ఆశ్రయించి, సమరే=యుద్ధమునందు, వశం నీతాః=వశము చేసికొనబడినారు. తత్ర=అక్కడ, బహ్వ్యః=అనేకమైన, మాయాశ్చ=మాయలు కూడ, అధిగతాః=పొందబడినవి.

తా. శత్రుసంహారకుడవు, రాక్షసరాజవు అయిన ఓ! ప్రభూ! నీవు

సంవత్సరకాలము యుద్ధము చేసి, స్వబలముచేత శూరులైన కాలకేయులు అను దానవులను జయించితివి. ఆ దానవులు బ్రహ్మవలన వరములు పొంది మార్గము చేసినను మరల పుట్టు శక్తి కలవారగుటచే క్షయము లేనివారు. మహాబలవంతులు. అట్టివారిని కూడ యుద్ధములో స్వబలముచేత లొంగదీసికొని వాళ్లనుండి అనేక మాయలను నేర్చుకొంటివి. 10,11

మూ. శూరాశ్చ బలవన్తశ్చ వరుణస్య సుతా రణే,
నిర్జితాస్తే మహాభాగ చతుర్విధబలానుగాః. 12

ప్ర. అ. మహాభాగ=మహాభాగ్యవంతుడా! శూరాశ్చ=శూరులు, బలవన్తశ్చ= బలము గలవారు, చతుర్విధబలానుగాః=నాలుగు విధములైన సైన్య ములు అనుచరులుగా గల, వరుణస్య=వరుణునియొక్క, సుతాః=కుమారులు, రణే=యుద్ధమునందు, తే=నీకు (నీచేత), నిర్జితాః=జయింపబడిరి.

తా. ఓ! మహాభాగ్యవంతుడా! నాలుగు విధములైన సైన్యముగల, శూరులు, బలవంతులు అయిన వరుణుని పుత్రులను నీవు రణములో జయించితివి. 12

మూ. మృత్యుర్దణ్డమహాగ్రాహం శాల్మలీద్రుమమణ్డితమ్,
కాలపాశమహావీచిం యమకింకరపన్నగమ్. 13
మహాజ్వరేణ దుర్ధర్షం యమలోకమహార్ణవమ్,
అవగాహ్య త్వయా రాజన్యమస్య బలసాగరమ్. 14
జయశ్చ విపులః ప్రాప్తో మృత్యుశ్చ ప్రతిషేధితః,
సుయుద్ధేన చ తే సర్వే లోకాస్తత్ర సుతోషితాః. 15

ప్ర. అ. రాజన్=రాజా ! మృత్యుర్దణ్డమహాగ్రాహమ్=యమదండ మనే పెద్ద మొసలి గలది, శాల్మలీద్రుమమణ్డితమ్=బూరుగుచెట్టు ఆకారము గల ముళ్ళతో నిండిన ఆయుధవిశేషములచేత అలంకరింపబడినది, కాల పాశమహావీచిమ్=యమపాశమనే గొప్పతరంగము కలది, యమకింకరపన్నగమ్= యమకింకరులనే సర్పములు కలది, మహాజ్వరేణ=మహాజ్వరము ఉండుటచేత, దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము కానిది అయిన, యమలోకమహార్ణవమ్=యమలోక మనే మహాసముద్రమును, యమస్య=యమునియొక్క, బలసాగరమ్=సేనాసముద్ర మును, అవగాహ్య=ప్రవేశించి, త్వయా=నీచేత, విపులః=గొప్ప, జయశ్చ=జయము, ప్రాప్తః=పొందబడినది. మృత్యుశ్చ=మృత్యువు, ప్రతిషేధితః=ఓడింపబడినాడు. తత్ర=అక్కడ, తే=నీయొక్క, సుయుద్ధేన=మంచి యుద్ధముచేత, సర్వే=సమస్త మైన, లోకాః=జనులు, సుతోషితాః=బాగా సంతోషింపచేయబడినారు.

తా. .రాజా! నీవు యమలోక మనే మహాసముద్రమును, యమునిసైన్య మను సాగరమును ప్రవేశించి గొప్ప విజయమును సాధించి యముని పారిపోవు నట్లు చేసినావు. ఆ సముద్రము యమదండ మను పెద్ద మొసలితోను, శాల్మలివృక్షాకారములో ఉన్న ముల్లతో నిండిన ఆయుధములతోను, కాలపాశ మను పెద్ద తరంగములతోను, యమభటు లను సర్పములతోను భయంకరమై అక్కడ మహాజ్వరదేవత ఉండుటచే ఎదిరింప శక్యము కానిదై ఉండెను. అక్కడ నీవు చేసిన గొప్ప యుద్ధమును చూచి జనులందరు చాల సంతోషించిరి. 13-15

మూ. క్షత్రియైర్బహుభిర్వీరైః శక్రతుల్యపరాక్రమైః,
ఆసీద్వసుమతీ పూర్ణా మహద్భిరివ పాదపైః. 16

ప్ర. అ. వసుమతీ=భూమి, వీరైః=వీరులు, శక్రతుల్యపరాక్రమైః=దేవేంద్రునితో సమానమైన పరాక్రమము కలవారు అయిన, బహుభిః=అనేకులైన, క్షత్రియైః=క్షత్రియులతో, మహద్భిః=గొప్ప, పాదపైరివ=వృక్షములతో వలె, పూర్ణా=నిండినది, ఆసీత్=అయెను.

తా. ఈ భూమిమీద అంతటా, వృక్షములు వ్యాపించి ఉన్నట్లు, వీరులు, ఇంద్రునితో సమానమైన పరాక్రమము కలవారు అయిన అనేకక్షత్రియులు వ్యాపించి ఉండెడివారు. 16

మూ. తేషాం వీర్యగుణోత్సాహైర్న సమో రాఘవో రణే,
ప్రసహ్య తే త్వయా రాజన్ హతాః సమరదుర్జయాః. 17

ప్ర. అ. రాజన్=రాజా! రాఘవః=రాముడు, రణే=యుద్ధమునందు, వీర్యగుణోత్సాహైః=వీర్యముచేతను, గుణములచేతను, ఉత్సాహముచేతను, తేషామ్=వారికి, సమః=సమానుడు, న=కాడు. సమరదుర్జయాః=యుద్ధములో జయింప శక్యముకాని, తే=ఆ క్షత్రియులు, త్వయా=నీచేత, ప్రసహ్య=బలాత్కరించి, హతాః=చంపబడినారు.

తా. రాజా! యుద్ధములో వారు చూపిన వీర్యము, గుణములు, ఉత్సాహము వాటిని పట్టి వారికి రాముడు సాటిరాడు. యుద్ధములో జయింప శక్యము కాని అట్టి క్షత్రియులను కూడ నీవు ఎదిరించి చంపివేసినావు. 17

మూ. తిష్ఠ వా కిం మహారాజ శ్రమేణ తవ వానరాన్,
అయమేకో మహారాజ ఇన్ద్రజిత్ క్షపయిష్యతి. 18

ప్ర. అ. మహారాజ=మహారాజా! వా=లేదా, తిష్ఠ=నీవు ఉండుము. తవ=నీకు, శ్రమేణ=శ్రమచేత, కిమ్=ఎందుకు ? మహారాజ=ఓ! మహారాజా! అయమ్= ఈ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, ఏకః=ఒక్కడే, వానరాన్=వానరులను,

క్షపయిష్యతి= నశింపచేయుగలడు.

రా. మహారాజా! నీకు శ్రమ ఎందుకు? నీవు ఉండుము. ఈ వానరుల నందరినీ ఈ ఇంద్రజిత్తు ఒక్కడే నశింపచేయుగలడు. 18

మూ. అనేన హి మహారాజ మాహేశ్వరమనుత్తమమ్,
ఇష్ట్వా యజ్ఞం వరో లబ్ధో లోకే పరమదుర్లభః. 19

ప్ర. అ. మహారాజ=మహారాజా! మాహేశ్వరమ్=మహేశ్వరుడు దేవతగా గల, అనుత్తమమ్=చాల ఉత్తమమైన, యజ్ఞమ్=యజ్ఞమును, ఇష్ట్వా=చేసి, అనేన= వీనిచేత, లోకే=లోకమునందు, పరమదుర్లభః=మిక్కిలి దుర్లభమైన, వరః=వరము, లబ్ధః హి=పొందబడినదికదా?

రా. మహారాజా! ఈ ఇంద్రజిత్తు మహేశ్వరుడు దేవతగా గల చాల శ్రేష్ఠమైన యజ్ఞము చేసి లోకములో ఇతరుల కెవ్వరికీ లభించని వరమును పొందినాడు. 19

మూ. శక్తితోమరమీనం చ వికీర్ణాన్త్రశైవలమ్,
గజకచ్ఛపసంబాధమశ్వమణ్డూకసంకులమ్. 20
రుద్రాదిత్యమహాగ్రాహం మరుద్వసుమహోరగమ్,
రథాశ్వగజతోయౌఘం పదాతిపులినం మహత్. 21
అనేన హి సమాసాద్య దేవానాం బలసాగరమ్,
గృహీతో దైవతపతిర్లఙ్కాం చాపి ప్రవేశితః. 22

ప్ర. అ. అనేన=వీనిచేత, శక్తితోమరమీనం చ=శక్తులు తోమరములు అను మీనములు గలది, వికీర్ణాన్త్రశైవలమ్=ఇటు అటు చిమ్మి వేయబడిన ప్రేగు లను నాచు గలది, గజకచ్ఛపసంబాధమ్=ఏనుగు లను తాబేళ్లతో వ్యాకులము, అశ్వమణ్డూకసంకులమ్=గుఱ్ఱము లను కప్పలతో వ్యాప్తము, రుద్రాదిత్యమహాగ్రాహమ్=ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు అను పెద్ద మొసళ్లు గలది, మరుద్వసుమహోరగమ్=సప్తమరుత్తులు అష్టవసువులు అను మహాసర్ప ములు కలది, రథాశ్వగజతోయౌఘమ్=రథములు, అశ్వములు, గజములు అను జలసముదాయము గలది, పదాతిపులినమ్=కాల్బంటు లను ఇసుక తిన్నెలు కలది అయిన, దేవానామ్ =దేవతలయొక్క, మహత్=గొప్ప, బలసాగరమ్=సేనాసముద్ర మును, సమాసాద్య=పొంది, దైవతపతిః= దేవేంద్రుడు, గృహీతః=గ్రహింపబడినాడు. లఙ్కామ్=లంకను, ప్రవేశితశ్చాపి= ప్రవేశపెట్టబడినాడు.

రా. ఈ ఇంద్రజిత్తు దేవతల సైన్య మను సముద్రములో ప్రవేశించి, దేవేంద్రుని పట్టుకొని, లంకకు తీసికొనివచ్చెను. ఆ సైన్యసముద్రము శక్తులు,

తోమరములు అను మీనములతోను, వందరవందరగా పడి యున్న ప్రేగులు అను నాచుతోను నిండి, ఏనుగు అను తాబేళ్లతో ఇరుకుగా ఉండెను. దానిలో అశ్వము అను కప్పలు ఎగురుచుండెను. ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు అను పెద్ద మొసళ్లతోను, సప్తమరుత్తులు, అష్టవసువులు అను మహాసర్పములతోను భయంకరముగా ఉండెను. కాలిబంటు లనే ఇసుకతిన్నెలు గల ఆ సముద్రము రథములు, అశ్వములు, గజములు అను జలముతో నిండి ఉండెను. 20-22

మూ. పితామహనియోగాచ్చ ముక్తః శమ్బరవృత్రహా,
గతస్త్రివిష్టపం రాజన్ సర్వదేవనమస్కృతః. 23

ప్ర. అ. రాజన్=రాజా! సర్వదేవనమస్కృతః=సమస్తదేవతలచేత నమస్కరింపబడిన, శమ్బరవృత్రహా=శంబరవృత్రాసురులను చంపిన ఆ దేవేంద్రుడు, పితామహనిదేశాత్=బ్రహ్మదేవుని ఆజ్ఞవలన, ముక్తః=విడువబడినవాడై, త్రివిష్టపమ్=స్వర్గమును గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. రాజా! సకలదేవతలచేతను నమస్కరింపబడిన, వృత్రశంబరాసుర సంహారకుడైన ఆ దేవేంద్రుణ్ణి బ్రహ్మదేవుని ఆజ్ఞచే నీ కుమారుడు విడువగా అతడు స్వర్గలోకమునకు వెళ్లినాడు. 23

మూ. తమేవ త్వం మహారాజ విసృజేన్ద్రజితం సుతమ్,
యావద్వానరసేనాం తాం సరామాం నయతి క్షయమ్. 24

ప్ర. అ. మహారాజ=మహారాజా! త్వమ్=నీవు, సుతమ్=కుమారుడైన, తమ్=ఆ, ఇన్ద్రజితమేవ=ఇంద్రజిత్తునే, విసృజ=పంపుము. సరామామ్=రామునితో కూడిన, తామ్=ఆ, వానరసేనామ్=వానరసేనను, క్షయమ్=క్షయమును, యావత్ నయతి=పొందింపగలడు.

తా. మహారాజా! నీ కుమారుడైన ఆ ఇంద్రజిత్తును పంపిన చాలును. అతడే రామునితో సహా ఆ వానరసేనను నశింపచేయగలడు. 24

మూ. రాజన్నాపదయుక్తేయమాగతా ప్రాకృతాజ్జనాత్,
హృది నైవ త్వయా కార్యా త్వం వధిష్యసి రాఘవమ్. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తమః సర్గః.

ప్ర. అ. రాజన్=రాజా! అయుక్తా=తగని, ఇయమ్=ఈ, ఆపత్=ఆపద, ప్రాకృతాత్=సామాన్యుడైన, జనాత్=జనునినుండి, ఆగతా=వచ్చినది. త్వయా=నీచేత, హృది=హృదయమునందు, నైవ కార్యా=చేయదగినది కాదు. త్వమ్=నీవు, రాఘవమ్=రాముణ్ణి, వధిష్యసి=చంపగలవు.

తా. రాజా! నీకు రాకూడని ఈ ఆపద సామాన్యమానవుని నుండి వచ్చినది. దీని నీవు మనస్సులో పెట్టుకొనకుము. నీవు రాముణ్ణి చంపివేయఁగలవు. 25

"భావానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఏడవసర్గ సమాప్తము.

# అథ అష్టమః సర్గః

(ప్రహస్తాదులు తమ బలమును ప్రశంసించుకొనుచు "రామాదులను చంపివేసెదము" అని చెప్పి రావణునకు ధైర్యము చెప్పుట.)

మూ. తతో నీలాంబుదప్రఖ్యః ప్రహస్తో నామ రాక్షసః,
అబ్రవీత్ప్రాంజలిర్వాక్యం శూరః సేనాపతిస్తదా. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శూరః=శూరుడు, సేనాపతిః=సేనాపతి, నీలాంబుదప్రఖ్యః=నల్లని మేఘముతో సమానుడు అయిన, ప్రహస్తో నామ=ప్రహస్తుడను పేరు గల, రాక్షసః=రాక్షసుడు, ప్రాంజలిః=కట్టబడిన దోసిలి కలవాడై, తదా=అప్పుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట నల్లని మేఘముతో సమానుడు, శూరుడు, సేనాపతి అయిన ప్రహస్తుడనే రాక్షసుడు అప్పుడు చేతులు జోడించి ఇట్లు పలికెను.1

మూ. దేవదానవగన్ధర్వాః పిశాచపతగోరగాః,
సర్వే ధర్షయితుం శక్యాః కిం పునర్మానవౌ రణే. 2

ప్ర. అ. దేవదానవగన్ధర్వాః=దేవతలు దానవులు గంధర్వులు, పిశాచపతగోరగాః=పిశాచములు పక్షులు సర్పములు, సర్వే=అందరూ, రణే=యుద్ధమునందు, ధర్షయితుమ్=ఎదిరించుటకు, శక్యాః=శక్యమైనవారు. మానవౌ=ఇద్దరు మానవులు, కిం పునః=చెప్పనేల ?

తా. నీవు యుద్ధములో దేవతలను, దానవులను, గంధర్వులను, పిశాచములను, పక్షులను, సర్పములను అందరినీ ఎదిరించగలవు; ఇద్దరు మానవుల మాట చెప్పవలెనా ? 2

మూ. సర్వే ప్రమత్తా విశ్వస్తా వఞ్చితాః స్మ హనూమతా,
న హి మే జీవతో గచ్ఛేజ్జీవన్ స వనగోచరః. 3

ప్ర. అ. ప్రమత్తాః=ఏమరిపాటు చెంది ఉన్నవారము, విశ్వస్తాః=విశ్వాసము కలవారము అయిన, సర్వే=మనమందరము, హనూమతా=హనుమంతునిచేత, వఞ్చితాః స్మ=వంచింపబడితిమి. మే=నేను, జీవతః=జీవించి ఉండగా, సః=ఆ, వనగోచరః=వానరుడు, జీవన్=జీవించినవాడై, న గచ్ఛేత్ హి=వెళ్లడు కదా ?

తా. మన మందరము ఎవరేమి చేయగలరులే అను నమ్మకముతో ఏమరిపాటు చెంది ఉన్నప్పుడు హనుమంతుడు మనల నందరిని మోసము చేసినాడు. అట్లు కానిచో నేను జీవించి ఉండగా ఆ వానరుడు ప్రాణాలతో

తిరిగి వెళ్లగలుగునా ? 3

మూ. సర్వాం సాగరపర్యన్తాం సశైలవనకాననామ్,
కరోమ్యవానరాం భూమిమాజ్ఞాపయతు మాం భవాన్. 4

ప్ర. అ. సాగరపర్యన్తామ్=సముద్రమువరకు ఉన్న, సశైలవనకాననామ్=శైలములతోను, అడవులతోను కూడిన, సర్వామ్=సమస్తమైన, భూమిమ్=భూమిని, అవానరామ్=వానరులు లేనిదానినిగా, కరోమి=చేయుదును. భవాన్=నీవు, మామ్=నన్ను, ఆజ్ఞాపయతు=ఆజ్ఞాపించెదవుగాక.

తా. సముద్రపర్యంతమైన ఈ భూమియందు, పర్వతములమీదా అడవులలోను ఒక్క వానరుడు కూడ లేకుండ చేసెదను; నీ వాజ్ఞాపింపుము.4

మూ. రక్షాం చైవ విధాస్యామి వానరాద్రజనీచర,
నాగమిష్యతి తే దుఃఖం కించిదాత్మాపరాధజమ్. 5

ప్ర. అ. రజనీచర=ఓ ! రావణా ! వానరాత్=వానరునినుండి, రక్షాం చైవ=రక్షను కూడ, విధాస్యామి=చేసెదను. తే=నీకు, ఆత్మాపరాధజమ్=నీ అపరాధమువలన కలిగిన, దుఃఖమ్=దుఃఖము, కించిత్=కొంచెము కూడ, నాగమిష్యతి=రాదు.

తా. రాక్షసరాజా ! సుగ్రీవాదులనుండి ఆపద కలుగకుండా నేను రక్షణమునకు ఏర్పాట్లు చేసెదను. నీవు చేసిన సీతాపహరణరూపమైన అపరాధమువలన నీకేమీ దుఃఖము రాకుండ చూచెదను. 5

మూ. అబ్రవీత్తు సుసంక్రుద్ధో దుర్ముఖో నామ రాక్షసః,
ఇదం న క్షమణీయం హి సర్వేషాం నః ప్రధర్షణమ్. 6

ప్ర. అ. దుర్ముఖో నామ=దుర్ముఖుడను, రాక్షసః=రాక్షసుడు, సుసంక్రుద్ధః=చాలా కోపించినవాడై, తమ్=అతనిని గూర్చి, అబ్రవీత్=పలికెను. నః=మనకు, సర్వేషామ్=అందరికీ, ఇదమ్=ఈ, ప్రధర్షణమ్=ఎదిరించుట, న క్షమణీయం హి=సహించదగినది కాదు కదా.

తా. దుర్ముఖుడను రాక్షసుడు చాల కోపముతో రావణునితో ఇట్లనెను. ఆ వానరుడు మనందరికీ చేసిన ఈ అవమానము సహించరానిది. 6

మూ. అయం పరిభవో భూయః పురస్యాన్తఃపురస్య చ,
శ్రీమతో రాక్షసేన్ద్రస్య వానరేన్ద్రప్రధర్షణమ్. 7

ప్ర. అ. పురస్య=పట్టణముయొక్క, అన్తఃపురస్య చ=అంతఃపురము యొక్క, అయమ్=ఈ, పరిభవః=తిరస్కారము, శ్రీమతః=శ్రీమంతుడైన, రాక్ష

సేన్ద్రస్య=రాక్షసేంద్రునియొక్క, వానరేన్ద్రప్రధర్షణమ్=సుగ్రీవునిచేత ప్రధర్షణము, ధూయః=శంకను, సహింపరానిది.

తా. లంకాపురమునకు, అంతఃపురమునకు హనుమంతుడు చేసిన ఈ పరాభవము, సుగ్రీవుడు శ్రీమంతుడైన రావణుని ఎదిరించుచు వచ్చుట - ఇవి శంకను సహింపరానివి. 7

మూ. అస్మిన్ ముహూర్తే గత్వైకో నివర్తిష్యామి వానరాన్,
ప్రవిష్టాన్ సాగరం భీమమమ్బరం వా రసాతలమ్. 8

ప్ర. అ. అస్మిన్=ఈ, ముహూర్తే=ముహూర్తమునందు, ఏకః=ఒక్కడనే, గత్వా=వెళ్లి, సాగరమ్=సముద్రమును గాని, భీమమ్=భయంకరమైన, రసాతలమ్=పాతాళమును గాని, అమ్బరం వా=ఆకాశమును గాని,ప్రవిష్టాన్=ప్రవేశించిన, వానరాన్= వానరులను, నివర్తిష్యామి=నివర్తింపచేసెదను.

తా. ఈ క్షణమునందే బయలుదేరి వెళ్లి నేను వానరులను వార్లు సముద్రములో ప్రవేశించినా, భయంకరమైన పాతాళమునకు వెళ్లినా, ఆకాశములోనికి ఎగిరినా మరల్చెదను (చంపివేసెదను). 8

మూ. తతోఽబ్రవీత్సుసంక్రుద్ధో వజ్రదంష్ట్రో మహాబలః,
ప్రగృహ్య పరిఘం ఘోరం మాంసశోణితదూషితమ్. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, వజ్రదంష్ట్రః= వజ్రదంష్ట్రుడు, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, మాంసశోణితదూషితమ్=మాంసముచేతను, రక్తముచేతను దూషితమైన, ఘోరమ్=భయంకరమైన, పరిఘమ్=పరిఘను, ప్రగృహ్య= గ్రహించి, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట గొప్ప బలము గల వజ్రదంష్ట్రుడు మాంసము, రక్తము పూసి ఉన్న భయంకరమైన పరిఘను గ్రహించి చాల కోపములో ఇట్లు పలికెను.

మూ. కిం వో హనుమతా కార్యం కృపణేన తపస్వినా,
రామే తిష్ఠతి దుర్ధర్షే సుగ్రీవేఽపి సలక్ష్మణే. 10

ప్ర. అ. దుర్ధర్షే=ఎదిరింప శక్యముగాని, రామే=రాముడు, సలక్ష్మణే= లక్ష్మణునితో కూడిన, సుగ్రీవేఽపి=సుగ్రీవుడు, తిష్ఠతి=ఉండగా, కృపణేన=దీనుడు, తపస్వినా=జాలిపడదగినవాడు అయిన, హనుమతా=హనుమంతునితో, వః=మనకు, కార్యమ్=పని, కిమ్=ఏమి ఉన్నది ?

తా. ఎదిరింప శక్యము కాని రాముడు, సుగ్రీవుడు, లక్ష్మణుడు ఉండగా, దీనుడు (రహస్యసంచారాదులు చేసినవా డగుటచే) జాలిపడదగినవాడు

అయిన హనుమంతునితో మన కేమి పని ? 10

మూ. అద్య రామం ససుగ్రీవం పరిఘేణ సలక్ష్మణమ్,
ఆగమిష్యామి హత్వైకో విక్షోభ్య హరివాహినీమ్. 11

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఏకః=ఒక్కడనే, పరిఘేణ=పరిఘచేత, ససుగ్రీవమ్=సుగ్రీవునితో కూడిన, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రామమ్=రాముల్ని, హత్వా=చంపి, హరివాహినీమ్=వానరసైన్యమును, విక్షోభ్య=క్షోభింపచేసి, ఆగమిష్యామి=వచ్చెదను.

తా. ఇప్పుడు నేనొక్కడనే వెళ్లి పరిఘతో రామలక్ష్మణసుగ్రీవులను వధించి వానరసేనను క్షోభింపచేసి వచ్చెదను. 11

మూ. ఇదం మమాపరం వాక్యం శృణు రాజన్యదీచ్ఛసి,
ఉపాయకుశలో హ్యేవ జయేచ్ఛత్రూనతన్ద్రితః. 12

ప్ర. అ. రాజన్=రాజా! యది ఇచ్ఛసి=నీవు ఇష్టపడినట్లయితే, మమ=నాయొక్క, అపరమ్=మరియొక, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, శృణు=వినుము. ఉపాయకుశలః ఏవ=ఉపాయములందు నేర్పరియే, అతన్ద్రితః=అలసత్వము లేనివాడై, శత్రూన్=శత్రువులను, జయేత్ హి=జయించును కదా !

తా. రాజా ! నీవు ఇష్టపడితే నేను మరొక మాట చెప్పెదను వినుము. ఉపాయములయందు నేర్పు కలవాడు మాత్రమే అలసత్వము (సోమరితనము) లేనివాడై శత్రువులను జయించగలుగును. 12

మూ. కామరూపధరాః శూరాః సుభీమా భీమదర్శనాః,
రాక్షసా వా సహస్రాణి రాక్షసాధిప నిశ్చితాః, 13
కాకుత్స్థముపసంగమ్య బిభ్రతో మానుషం వపుః,
సర్వే హ్యసంభ్రమా భూత్వా బ్రువన్తు రఘుసత్తమమ్. 14

ప్ర. అ. రాక్షసాధిప=రాక్షసరాజా ! కామరూపధరాః=స్వేచ్ఛానుసారము రూపము ధరించగల, శూరాః=శూరులైన, సుభీమాః=చాల భయంకరులైన, భీమదర్శనాః=భయంకరమైన దర్శనము గల, సహస్రాణి=వేలకొలది, రాక్షసాః=రాక్షసులు, నిశ్చితాః=నిశ్చయింపబడినవారై (లేదా నిశ్చితమైన బుద్ధి గలవారై), మానుషమ్=మనుష్యసంబంధమైన, వపుః=శరీరమును, బిభ్రతః=ధరించుచున్నవారై, కాకుత్స్థమ్=రాముని, ఉపసంగమ్య=సమీపించి, సర్వే=అందరూ, అసంభ్రమాః=సంభ్రమము (కంగారు) లేనివారై, రఘుసత్తమమ్=రామునిగూర్చి, బ్రువన్తు=పలుకుదురుగాక.

తా. ఓ! రాక్షసరాజా! స్వేచ్ఛానుసారము రూపములను ధరించగల వారు, శూరులు, చాల భయంకరులు, చూచువారికి భయము కలిగించువారు, దృఢనిశ్చయవంతులు అయిన వేలకొలది రాక్షసులు మనుష్యరూపము ధరించి అందరూ రాముని వద్దకు వెళ్లి ఏ మాత్రము కంగారుపడక ఆతనితో ఇట్లు పలుకవలెను. 13, 14

మూ. ప్రేషితా భరతేనైవ భ్రాత్రా తవ యవీయసా,
స హి సేనాం సముత్థాప్య క్షిప్రమేవోపయాస్యతి. 15

ప్ర. అ. తవ=నీయొక్క, యవీయసా=చిన్న, భ్రాత్రా=సోదరుడైన, భరతేనైవ=భరతునిచేత, ప్రేషితాః=పంపబడితిమి. సః=ఆతడు, సేనామ్=సేనను, సముత్థాప్య=సిద్ధముచేసి, క్షిప్రమేవ=శీఘ్రముగానే, ఉపస్థాస్యతి=సమీపించగలడు.

తా. మమ్ము నీ తమ్ముడైన భరతుడు పంపినాడు. ఆతడు సైన్యమును సిద్ధము చేసికొని వచ్చుచున్నాడు. 15

మూ. తతో వయమితస్తూర్ణం శూలశక్తిగదాధరాః,
చాపబాణాసిహస్తాశ్చ త్వరితాస్తత్ర యామహే. 16

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వయమ్=మేము, శూలశక్తిగదాధరాః=శూలములను, శక్తులను, గదలను ధరించినవారమై, చాపబాణాసిహస్తాశ్చ=ధనస్సులు, బాణములు, ఖడ్గములు హస్తములయందు కలవారమై, ఇతః=ఇక్కడినుండి, తూర్ణమ్=శీఘ్రముగా, తత్ర=అక్కడికి, త్వరితాః=తొందరపడుచున్నవారమై, యామహే=వెళ్లెదము.

తా. పిదప మేము శీఘ్రముగా శూలములు, శక్తులు, గదలు, ధనుర్బాణములు, ఖడ్గములు ధరించి, తొందరపడుచు అక్కడికి వెళ్లెదము. 16

మూ. ఆకాశే గణశః స్థిత్వా హత్వా తాం హరివాహినీమ్,
అశ్మశస్త్రమహావృష్ట్యా ప్రాపయామ యమక్షయమ్. 17

ప్ర. అ. ఆకాశే=ఆకాశమునందు, గణశః=గుంపులుగా, స్థిత్వా=ఉండి, తామ్=ఆ, హరివాహినీమ్=వానరసేనను, అశ్మశస్త్రమహావృష్ట్యా=రాళ్లయొక్క, ఆయుధములయొక్క, గొప్పవర్షముచేత, హత్వా=కొట్టి, యమక్షయమ్=యమలోకమును, ప్రాపయామ=పొందించెదము.

తా. ఆకాశములో గుంపులు గుంపులుగా నిలచి ఆ వానరసేనపై రాళ్లను, ఆయుధములను కురిపించి కొట్టి యమలోకమునకు పంపివేసెదము.

మూ. ఏవం చేదుపసర్పేతామనయం రామలక్ష్మణౌ,
అవశ్యమపనీతేన జహతామేవ జీవితమ్. 18

ప్ర. అ. రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ఏవమ్=ఇట్లు, అనయమ్=వంచనను, ఉపసర్పేతాం యది=పొందినట్లయితే, అవశ్యమేవ=తప్పక, అపనీతేన=ఈ తప్పుడుదారిపట్టించుటచేత, జీవితమ్=జీవితమును, జహతామేవ=విడచెదరు.

తా. రామలక్ష్మణులు ఈ విధముగా మనము చేసిన వంచనలో చిక్కుకొన్నచో తప్పక ఈ వంచనచేత జీవితమును విడవగలరు. 18

మూ. కౌమ్భకర్ణిస్తతో వీరో నికుమ్భో నామ వీర్యవాన్,
అబ్రవీత్పరమక్రుద్ధో రావణం లోకరావణమ్. 19

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కౌమ్భకర్ణిః=కుంభకర్ణుని కుమారుడు, వీరః=వీరుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, నికుమ్భో నామ=నికుంభుడనువాడు, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, లోకరావణమ్=లోకములను మొరపెట్టించిన, రావణమ్=రావణుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. వీరుడు, పరాక్రమవంతుడు అయిన నికుంభుడను కుంభకర్ణుని కుమారుడు చాల కోపించి, లోకములను మొరపెట్టించిన రావణునితో ఇట్లు పలికెను. 19

మూ. సర్వే భవన్తస్తిష్ఠన్తు మహారాజేన సంగతాః,
అహమేకో హనిష్యామి రాఘవం సహలక్ష్మణమ్, 20
సుగ్రీవం సహనూమన్తం సర్వాంశ్చైవాత్ర వానరాన్.

ప్ర. అ. భవన్తః=మీరు, సర్వే=అందరూ, మహారాజేన=మహారాజుతో, సంగతాః=కూడినవారై, తిష్ఠన్తు=ఉందురు గాక. అహమ్=నేను, ఏకః=ఒక్కడనే, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రాఘవమ్=రాముణ్ణి, సహనూమన్తమ్=హనుమంతునితో కూడిన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, సర్వాన్=సమస్తమైన, వానరాంశ్చైవ=వానరులను, అత్ర=ఇక్కడ, హనిష్యామి=చంపగలను.

తా. మహారాజా, మీరందరూ అట్లే ఉండండి. నే నొక్కడనే వెళ్లి రామలక్ష్మణులను, సుగ్రీవహనుమంతులను వానరులను అందరిని చంపివేసెదను.

మూ. తతో వజ్రహనుర్నామ రాక్షసః పర్వతోపమః, 21
క్రుద్ధః పరిలిహన్ సృక్కాం జిహ్వయా వాక్యమబ్రవీత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పర్వతోపమః=పర్వతముతో సమానుడైన, వజ్రహనుర్నామ=వజ్రహనువు అను పేరు గల, రాక్షసః=రాక్షసుడు, క్రుద్ధః=కోపించి

సన్నారై, జిహ్వయా=నాలుకతో, సృక్వాణౌ=పెదవిని, పరిలిహన్=నాకుచు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట వజ్రహనువు అను పర్వతము వంటి ఆకారము గల రాక్షసుడు నాలుకతో పెదవులు నాకుచు, కోపముతో ఇట్లు పలికెను. 21

మూ. స్వైరం కుర్వన్తు కర్మాణి భవన్తో విగతజ్వరాః. 22
ఏకో౭హం భక్షయిష్యామి తాం సర్వాం హరివాహినీమ్,
స్వస్థాః క్రీడన్తు నిశ్చిన్తాః పిబన్తు మధు వారుణీమ్. 23

ప్ర. అ. భవన్తః=మీరు, విగతజ్వరాః=పోయిన చింత గలవారై, స్వైరమ్=స్వేచ్ఛగా, కర్మాణి=కర్మలను, కుర్వన్తు=చేయుదురుగాక. స్వస్థాః=స్వస్థులై, క్రీడన్తు=క్రీడించెదరుగాక. నిశ్చిన్తాః=చింతలేనివారై, వారుణీం మధు=మద్యమును, పిబన్తు=త్రాగెదరుగాక. అహమ్=నేను, ఏకః=ఒక్కడనే, తామ్=ఆ, సర్వామ్=సమస్తమైన, హరివాహినీమ్=వానర సేనను, భక్షయిష్యామి=భక్షించెదను.

తా. మీరందరు ఏ చింతా లేనివారై నిర్భయముగా మీ పనులు చేసికొనుడు. స్వస్థులై క్రీడింపుడు. నిశ్చింతులై మద్యపానము చేయుడు. నేను ఒక్కడనే ఆ వానరసైన్యము నంతను భక్షించెదను (చంపెదను). 22, 23

మూ. అహమేకో వధిష్యామి సుగ్రీవం సహలక్ష్మణమ్,
సాఙ్గదం చ హనూమన్తం సర్వాంశ్చైవాత్ర వానరాన్. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే౭ష్టమః సర్గః.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, అహమ్=నేను, ఏకః=ఒక్కడనే, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవమ్=సుగ్రీవుని, సాఙ్గదమ్=అంగదునితో కూడిన, హనూమన్తమ్=హనుమంతుని, సర్వాన్=సమస్తమైన, వానరాంశ్చ=వానరులను, వధిష్యామి= చంపగలను.

తా. ఇప్పుడు నేను ఒక్కడనే లక్ష్మణసుగ్రీవులను, హనుమంతుని, అంగదుని, సమస్తవానరులను చంపివేసెదను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో అష్టమసర్గ సమాప్తము.

# అథ నవమః సర్గః

[సగర్వముగా మాటలాడుచున్న ఆ రాక్షసులను వారించి విభీషణుడు నీతి వాక్యములు చెప్పుటకు ప్రారంభించుట, రావణుడు తన గృహములో ప్రవేశించుట.]

మూ. తతో నికుమ్భో రభసః సూర్యశత్రుర్మహాబలః,
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ మహాపార్శ్వమహోదరౌ. 1
అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసాః,
ఇన్ద్రశత్రుశ్చ బలవాంస్తతో వై రావణాత్మజః. 2
ప్రహస్తోఽథ విరూపాక్షో వజ్రదంష్ట్రో మహాబలః,
ధూమ్రాక్షోఽథ నికుమ్భశ్చ దుర్ముఖశ్చైవ రాక్షసః. 3
పరిఘాన్ పట్టిశాన్ శూలాన్ ప్రాసాన్ శక్తిపరశ్వధాన్,
చాపాని చ సుబాణాని ఖడ్గాంశ్చ విపులామ్బుభాన్. 4
ప్రగృహ్య పరమక్రుద్ధాః సముత్పత్య చ రాక్షసాః,
అబ్రువన్ రావణం సర్వే ప్రదీప్తా ఇవ తేజసా. 5

ప్ర. అ. తతః=అటు పిమ్మట, నికుమ్భః=నికుంభుడు, రభసః=రభసుడు, మహాబలః=గొప్ప బలము గల, సూర్యశత్రుః=సూర్యశత్రువు, సుప్తఘ్నః=సుప్తఘ్నుడు, యజ్ఞకోపశ్చ=యజ్ఞకోపుడు, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులు, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, అగ్నికేతుశ్చ=అగ్నికేతువు, రశ్మికేతుశ్చ=రశ్మికేతువు అను, రాక్షసాః=రాక్షసులు, తతః=అటు పిమ్మట, బలవాన్=బలవంతుడు, రావణాత్మజః=రావణుని పుత్రుడు అయిన, మహాబలః=గొప్ప బలము గల, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, అథ=మరియు, నికుమ్భశ్చ=నికుంభుడు, దుర్ముఖశ్చైవ=దుర్ముఖు డను, రాక్షసః=రాక్షసుడు, పట్టిశాన్=పట్టిశములను, పరిఘాన్=పరిఘలను, శూలాన్=శూలములను, ప్రాసాన్=ప్రాసములను, శక్తిపరశ్వధాన్=శక్తులను గండ్రగొడ్డళ్ళను, సుబాణాని=మంచి బాణములు గల, చాపాని=ధనస్సులను, విపులామ్బుభాన్= విశాలమైన నీటివంటి కాంతి గల, ఖడ్గాంశ్చ=ఖడ్గములను, ప్రగృహ్య= గ్రహించి, పరమక్రుద్ధాః=చాల కోపించినవారై, తేజసా=తేజస్సుచేత, ప్రదీప్తాః ఇవ= ప్రజ్వలించుచున్నవారు వలె ఉన్న, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, సముత్పత్య= లేచి, రావణమ్=రావణునిగూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. అటు పిమ్మట తేజస్సుతో మండుచున్నారా అన్నట్లున్న నికుంభుడు, రభసుడు, మహాబలవంతుడైన సూర్యశత్రువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మహాపార్శ్వమహోదరులు, ఎదిరింప శక్యము కాని దుర్ధర్షుడు, రశ్మికేతువు,

రావణకుమారుడైన బలవంతుడైన ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, గొప్ప బలముగల వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, నికుంభుడు, దుర్ముఖుడు అను ఈ రాక్షసు లందరు పరిఘలు, పట్టిశములు, శూలములు, ప్రాసములు, శక్తులు, గండ్రగొడ్డళ్లు, మంచి బాణములు గల ధనస్సులు, లోతైన నీటి రంగు గల ఖడ్గములు ధరించి లేచి రావణునితో ఇట్లు పలికిరి. 1-5

మూ. అద్య రామం వధిష్యామః సుగ్రీవం సహలక్ష్మణమ్,
కృపణం చ హనూమన్తం లఙ్కా యేన ప్రధర్షితా. 6

ప్ర. అ. రామమ్=రాముణ్ణి, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవం చ= సుగ్రీవుణ్ణి, యేన=ఎవనిచేత, లఙ్కా=లంక, ప్రధర్షితా=ఎదిరించబడి నదో అట్టి, కృపణమ్=దీనుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, అద్య=ఇప్పుడే, వధిష్యామః= చంపగలము.

తా. రామలక్ష్మణసుగ్రీవులను, లంకను పాడుచేసిన దీనుడైన ఆ హనుమంతుణ్ణి ఇప్పుడే చంపివేసెదము. 6

మూ. తాన్ గృహీతాయుధాన్ సర్వాన్వారయిత్వా విభీషణః,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం పునః ప్రత్యుపవేశ్య తాన్. 7

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, గృహీతాయుధాన్=గ్రహింపబడిన ఆయుధ ములు గల, తాన్ సర్వాన్=వాళ్లనందరినీ, వారయిత్వా=వారించి, తాన్=వాళ్లను, ప్రత్యుపవేశ్య= తిరిగి కూర్చుండబెట్టి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. విభీషణుడు, ఆయుధములు ధరించి లేచిన ఆ రాక్షసుల నందరినీ నివారించి, వాళ్లను మరల కూర్చుండునట్లు చేసి అంజలి ఘటించి ఇట్లు పలికెను. 7

మూ. అప్యుపాయైస్త్రిభిస్తాత యోऽర్థః ప్రాప్తుం న శక్యతే,
తస్య విక్రమకాలాంస్తాన్యుక్తానాహుర్మనీషిణః. 8

ప్ర. అ. తాత=తండ్రీ ! యః=ఏ, అర్థః=కార్యము, త్రిభిః=మూడు, ఉపాయైరపి=ఉపాయములచేత కూడ, ప్రాప్తుమ్=పొందుటకు, న శక్యతే=శక్యము కాదో, తస్య=ఆ కార్యమునకు, విక్రమకాలాన్=విక్రమమునకు కాలములను, యుక్తాన్= యుక్తమైన వాటినిగా, మనీషిణః=బుద్ధిమంతులు, ఆహుః= చెప్పెదరు.

తా. (ఇంద్రజిత్తుతో కాని మరొక మంత్రితో కాని ఈ మాట అనుచున్నాడు) నాయనా! ఒక కార్యమును సామ-దాన-భేదోపాయములు

మూడింటివలన సాధింపజాలనప్పుడే పరాక్రమమును చూపుటకు తగిన కాల మని బుద్ధిమంతులు చెప్పుదురు. 8

మూ. ప్రమత్తేష్వభియుక్తేషు దైవేన ప్రహతేషు చ,
విక్రమాస్తత్ర సిధ్యన్తి పరీక్ష్య విధినా కృతాః. 9

ప్ర. అ. తాత=తండ్రీ ! ప్రమత్తేషు=ఏమరుపాటు చెంది ఉన్నవారి విషయమునందు, అభియుక్తేషు=మరొక శత్రువుచేత ఆక్రమింపబడినవారియందు, దైవేన=దైవముచేత, ప్రహతేషు చ=కొట్టబడినవారియందు, పరీక్ష్య=పరీక్షించి, విధినా=శాస్త్రముచేత, కృతాః=చేయబడిన, విక్రమాః=పరాక్రమములు, సిధ్యన్తి=సిద్ధించును.

తా. నాయనా ! ఏమరి ఉన్నవాడు, మరొక శత్రువుచేత ఆక్రమించబడినవాడు, దైవము ప్రతికూలముగా ఉన్నవాడు - వీరి విషయమున బాగుగా పరీక్షించి శాస్త్రానుసారముగా పరాక్రమమును ఉపయోగించినచో అది సఫల మగును. 9

మూ. అప్రమత్తం కథం తం తు విజిగీషుం బలే స్థితమ్,
జితరోషం దురాధర్షం తం ధర్షయితు మిచ్ఛథ. 10

ప్ర. అ. అప్రమత్తమ్=ఏమరుపాటు లేనివాడు, విజిగీషుమ్=జయింప కోరిక గలవాడు, బలే=బలమునందు, స్థితమ్=ఉన్నవాడు, జితరోషమ్=జయించబడిన రోషము గలవాడు, దురాధర్షమ్=ఎదిరింప శక్యము కానివాడు అయిన, తమ్=ప్రసిద్ధుడైన, తమ్=ఆ రాముణ్ణి, కథమ్=ఎట్లు, ధర్షయితుమ్=ఎదిరించుటకు, ఇచ్ఛథ=కోరుచున్నారు?

తా. ఆ రాముడు బలవంతుడై, ఏ మాత్రము ఏమరుపాటు లేక, జయించవలె నను కోరికతో ఉన్నాడు. కోపమును జయించినవాడు, ఎదిరింప శక్యము కానివాడు అయిన ఆ రాముణ్ణి ఎట్లు ఎదిరించగల మని అనుకొను చున్నారు? 10

మూ. సముద్రం లఙ్ఘయిత్వా తు ఘోరం నదనదీపతిమ్,
గతిం హనూమతో లోకే కో విద్యాత్తర్కయేత వా. 11

ప్ర. అ. నదనదీపతిమ్=నదములకు నదులకు పతియైన, ఘోరమ్=భయంకరమైన, సముద్రమ్=సముద్రమును, లఙ్ఘయిత్వా=దాటి, హనుమతః=హనుమంతునియొక్క, గతిమ్=గమనమును, లోకే=లోకమునందు, కః=ఎవడు, విద్యాత్=తెలిసికొనును, తర్కయేత వా=ఊహించును ?

తా. (పశ్చిమముఖముగా ప్రవహించే) నదములకు (పూర్వాభిముఖముగా ప్రవహించే) నదులకు పతియైన సముద్రమును దాటి వచ్చి హనుమంతుడు తిరిగి వెళ్లిపోయినా డనగా దీనిని ఎవరైన తెలిసికొనగలరా? ఊహించగలరా ? 11

మూ. బలాన్యపరిమేయాని వీర్యాణి చ నిశాచరాః,
పరేషాం సహసావజ్ఞా న కర్తవ్యా కథంచన. 12

ప్ర. అ. నిశాచరాః=రాక్షసులారా ! పరేషామ్=శత్రువులయొక్క, బలాని=సైన్యములు, వీర్యాణి చ=పరాక్రమములు, అపరిమేయాని=కొలవ శక్యము కానివి. కథంచన=ఏ విధముగాను కూడ, సహసా=శీఘ్రముగా, అవజ్ఞా=అవమానము, న కర్తవ్యా= చేయదగినది కాదు.

తా. రాక్షసులారా ! శత్రువుల సైన్యములు, పరాక్రమములు కూడ ఇంత అని చెప్ప శక్యము కానివి. అందుచే ఏ విధముగాను కూడ ఆలోచన లేకుండగా వారి విషయమున అనాదరము చూపకూడదు. 12

మూ. కిం చ రాక్షసరాజస్య రామేణాపకృతం పురా,
ఆజహార జనస్థానాద్యస్య భార్యాం యశస్వినః. 13

ప్ర. అ. యశస్వినః=కీర్తిమంతుడైన, యస్య=ఏ రామునియొక్క, భార్యామ్= భార్యను, జనస్థానాత్=జనస్థానమునుండి, ఆజహార=తీసికొనివచ్చెనో, రామేణ=ఆ రామునిచేత, పురా=పూర్వము, రాక్షసరాజస్య=రాక్షసరాజుకు, కిమ్=ఏమి, అపకృతమ్=అపకారము చేయబడినది ?

తా. ఈ రాక్షసరాజు కీర్తిమంతుడైన రాముని భార్యను జనస్థానము నుండి అపహరించినాడు కదా! అట్లు చేయుటకు రాముడు పూర్వమేమైన అపకారము చేసినాడా? 13

మూ. ఖరో యద్యతివృత్తస్తు స రామేణ హతో రణే,
అవశ్యం ప్రాణినాం ప్రాణా రక్షితవ్యా యథాబలమ్. 14

ప్ర. అ. అతివృత్తః=అధికమైన ప్రవర్తన గల, ఖరః=ఖరుడు, రణే=యుద్ధమునందు, రామేణ=రామునిచేత, హతః యది=చంపబడినట్లయితే, ప్రాణినా=ప్రాణిచేత, యథాబలమ్=బలానుసారముగా, ప్రాణాః=ప్రాణములు, అవశ్యమ్=తప్పక, రక్షితవ్యాః=రక్షింపదగినవి కదా ?

తా. మితిమీరి ప్రవర్తించిన ఖరుణ్ణి రాముడు యుద్ధములో చంపినా డనగా అందులో తప్పేమి ? ఏ ప్రాణియైనా తన బలము ననుసరించి ప్రాణములను తప్పక రక్షించుకొనవలెను కదా ? 14

మూ. ఏతన్నిమిత్తం వైదేహీభయం నః సుమహద్భవేత్,
ఆహృతా సా పరిత్యాజ్యా కలహార్థే కృతేన కిమ్. 15

ప్ర. అ. ఏతన్నిమిత్తమ్=ఇందునిమిత్తమై, నః=మనకు, సుమహత్=చాల గొప్పదైన, వైదేహీభయమ్=సీతవలన భయము, భవేత్=అగును. ఆహృతా=తీసి కొనిరాబడిన, సా= ఆమె, పరిత్యాజ్యా=విడువదగినది. కలహార్థే=కలహముకొరకు, కృతేన=చేయుటచేత, కిమ్= ఏమి ప్రయోజనము ?

తా. అందుచేత మనకు సీతవలన గొప్ప భయము కలుగును. తీసికొనివచ్చిన ఆమెను మరల వెనుకకు పంపివేయవలెను. కలహమునకు మూలమైన కార్యములను చేసి ఏమి ప్రయోజనము ? 15

మూ. న తు క్షమం వీర్యవతా తేన ధర్మానువర్తినా,
వైరం నిరర్థకం కర్తుం దీయతామస్య మైథిలీ. 16

ప్ర. అ. వీర్యవతా=పరాక్రమవంతుడు, ధర్మానువర్తినా=ధర్మమును అనుసరించుచున్నవాడు అయిన, తేన=ఆ రామునితో, నిరర్థకమ్=వ్యర్థముగా, వైరమ్=వైరమును, కర్తుమ్= చేయుటకు, న తు క్షమమ్=శక్యమైనది (యుక్తము) కాదు. మైథిలీ=సీత, అస్య=ఇతనికి, దీయతామ్=ఇచ్చివేయబడుగాక.

తా. పరాక్రమవంతుడు, ధర్మమును అనుసరించువాడు అయిన రామునితో వ్యర్థముగా వైరము పెట్టుకొనుట మంచిది కాదు. సీతను అతనికి ఇచ్చివేయవలెను. 16

మూ. యావన్న సగజాం సాశ్వాం బహురత్నసమాకులామ్,
పురీం దారయతే బాణైర్దీయతామస్య మైథిలీ. 17

ప్ర. అ. సగజామ్=గజములతో కూడినది, సాశ్వామ్=అశ్వములతో కూడినది, బహురత్నసమాకులామ్=అనేకరత్నములతో, (శ్రేష్ఠవస్తువులతో)నిండినది అయిన, పురీమ్=లంకను, బాణైః=బాణములచేత, యావత్=ఎంతలో, న దారయతే=చీల్చివేయడో అంతలో, అస్య= ఇతనికి, మైథిలీ= సీత, దీయతామ్=ఇవ్వ బడుగాక.

తా. గజములతోను, అశ్వములతోను, అనేకరత్నములతోను నిండి ఉన్న ఈ లంకాపట్టణము, రాముడు బాణములచేత చీల్చివేయకముందే సీతను అతనికి అర్పించుట మంచిది. 17

మూ. యావత్సుఘోరా మహతీ దుర్ధర్షా హరివాహినీ,
నావస్కన్దతి నో లఙ్కాం తావత్సీతా ప్రదీయతామ్. 18

ప్ర. అ. సుఘోరాం=చాల భయంకరము, దుర్ధర్షాం=ఎదిరింప శక్యము కానిది, మహతీం=గొప్పది అయిన, హరివాహినీం=వానరసేన, యావత్=ఎంతలో, నః=మన యొక్క, లఙ్కామ్=లంకను, నావస్కన్దతి=ఆక్రమించదో, తావత్=అంతలో, సీతా=సీత, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. చాల భయంకరము, ఎదిరింప శక్యము కానిదీ అయిన గొప్ప వానరసేన మన లంకను ఆక్రమించుటకు పూర్వమే సీతను ఇచ్చివేయవలెను.18

మూ. వినశ్యేద్ధి పురీ లఙ్కా శూరాః సర్వే చ రాక్షసాః,
రామస్య దయితా పత్నీ న స్వయం యది దీయతే. 19

ప్ర. అ. రామస్య=రామునియొక్క, దయితా=ప్రియురాలైన,పత్నీ=భార్య, స్వయమ్= స్వయముగా, న దీయతే యది=ఇవ్వబడనిచో, లఙ్కా పురీ=లంకాపురము, వినశ్యేత్ హి= నశించును కదా ? సర్వే=సమస్తమైన, రాక్షసాశ్చ=రాక్షసులుకూడ, నశించెదరు.

తా. రాముని ప్రియభార్యయైన సీతను అతనికి స్వయముగా తీసికొనివెళ్ళి అప్పగించనిచో ఈ లంకాపురము, రాక్షసులందరూ కూడ నశించగలరు. 19

మూ. ప్రసాదయే త్వాం బన్ధుత్వాత్కురుష్వ వచనం మమ,
హితం తథ్యం త్వహం బ్రవీమి దీయతామస్య మైథిలీ. 20

ప్ర. అ. బన్ధుత్వాత్=బంధుత్వమువలన, త్వామ్=నిన్ను, ప్రసాదయే= అనుగ్రహింపచేసికొనుచున్నాను. మమ=నాయొక్క, వచనమ్=వచనమును, కురుష్వ= చేయుము. అహమ్=నేను, హితమ్=హితము, తథ్యం తు=సత్యము అయిన . మాటనే, బ్రవీమి=చెప్పుచున్నాను. అస్య=ఈతనికి, మైథిలీ=సీత, దీయతామ్=ఇవ్వబడుగాక.

తా. నేను బంధువు నగుటచేత ప్రతిమాలుచున్నాను. నా మాట వినుము. నేను హితము, సత్యము అయిన మాట చెప్పుచున్నాను. రామునకు సీతను ఇచ్చివేయుము. 20

మూ. పురా శరత్సూర్యమరీచిసంనిభాన్
నవాగ్రపుఙ్ఖాన్ సుదృఢాన్నృపాత్మజః,
సృజత్యమోఘాన్విశిఖాన్వధాయ తే
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 21

ప్ర. అ. నృపాత్మజః=రాజకుమారుడైన రాముడు, శరత్సూర్యమరీచిసంనిభాన్= శరత్కాలసూర్యుని కిరణములతో సమానములు, నవాగ్రపుఙ్ఖాన్=మొనలను

శైన అగ్రములు, పొన్నులు కలవి, సుదృఢాన్=చాల దృఢములు, అమోఘాన్=వ్యర్థము కానివి అయిన, విశిఖాన్=బాణములను, తే=నీయొక్క, వధాయ=వధకొరకు, పురా స్సృజతి=విడువగలడు. మైథిలీ=సీత, దాశరథాయ=రామునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. రాముడు నిన్ను చంపుటకై శరత్కాలసూర్యుని కిరణములతో సమానములు, నూతనములైన కొనలు పొన్నులు కలవి, చాల దృఢములు, వ్యర్థము కానివి అయిన శరములను విడువగలడు. అంతకు ముందుగానే రామునకు సీతను ఇచ్చి వేయుము. 21

మూ. త్యజాశు కోపం సుఖధర్మనాశనం
భజస్వ ధర్మం రతికీర్తివర్ధనమ్,
ప్రసీద జీవేమ సపుత్రబాన్ధవాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 22

ప్ర. అ. సుఖధర్మనాశనమ్=సుఖమును ధర్మమును నశింపచేయు, కోపమ్=కోపమును, ఆశు=శీఘ్రముగా, త్యజ=విడువుము. రతికీర్తివర్ధనమ్=ఆనందమును కీర్తిని వృద్ధిపొందించు, ధర్మమ్=ధర్మమును, భజస్వ=సేవింపుము. ప్రసీద=అనుగ్రహింపుము. సపుత్రబాన్ధవాః=పుత్రులతోను బంధువులతోను కూడినవారమై, జీవేమ=జీవించెదము. మైథిలీ=సీత, దాశరథాయ=రామునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. సుఖమును ధర్మమును నశింపచేయు కోపమును వెంటనే విడిచిపెట్టి ఆనందమును, కీర్తిని వృద్ధిపొందించు ధర్మమును సేవింపుము. అనుగ్రహింపుము. మన మందరము పుత్రులతోను, బంధువులతోను కలిసి సుఖముగా జీవించెదము. రామునకు సీతను ఇచ్చివేయుము. 22

మూ. విభీషణవచః శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
విసర్జయిత్వా తాన్ సర్వాన్ ప్రవివేశ స్వకం గృహమ్. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే నవమః సర్గః.

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, తాన్=వారలను, సర్వాన్=అందరిని, విసర్జయిత్వా=విడిచి, స్వకమ్=తనసంబంధమైన, గృహమ్=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. రాక్షసరాజైన రావణుడు విభీషణుని మాటలు విన్న పిమ్మట ఆ రాక్షసులం దరిని పంపివేసి ఇంటిలోనికి వెళ్ళిపోయెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో తొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ దశమః సర్గః

*[విభీషణుడు అన్నగారి ఇంటికి వెళ్ళి, చెడ్డ శకునములను గూర్చి చెప్పుచు మరల ఆతనికి ఉపదేశించుట.]*

మూ. తతః ప్రత్యుషసి ప్రాప్తే ప్రాప్తధర్మార్థనిశ్చయః,
రాక్షసాధిపతేర్వేశ్మ భీమకర్మా విభీషణః. 1

ప్ర.అ. తతః=అటుపిమ్మట, ప్రాప్తధర్మార్థనిశ్చయః=పొందబడిన ధర్మార్థముల నిశ్చయముగల, భీమకర్మా=భయంకరమైన కర్మ గల, విభీషణః=విభీషణుడు, ప్రత్యుషసి= ప్రాతఃకాలము, ప్రాప్తే=వచ్చినదగుచుండగా, రాక్షసాధిపతేః=రావణు నియొక్క, వేశ్మ= గృహమును, (ప్రవివేశ=ప్రవేశించెను.)

తా. పిమ్మట ధర్మార్థముల విషయమునందు స్థిరమైన నిశ్చయము గలవాడు, భయంకరమైన కర్మ కలవాడు అయిన విభీషణుడు ప్రాతఃకాలమునందు రావణుని గృహమునకు వెళ్లెను. 1

మూ. శైలాగ్రచయసంకాశం శైలశృఙ్గమివోన్నతమ్,
సువిభక్తమహాకక్ష్యం మహాజనపరిగ్రహమ్. 2

ప్ర.అ. శైలాగ్రచయసంకాశమ్=పర్వతశిఖరముల సముదాయముతో సమానము, శైలశృఙ్గమివ=పర్వతశిఖరమువలె, ఉన్నతమ్=ఉన్నతము, సువిభక్తమహాకక్ష్యమ్=బాగుగా విభజించబడిన విశాలములైన గదులు కలది, మహాజనపరిగ్రహమ్=మహాజనులచేత గ్రహింపబడినది (అయిన గృహమును ప్రవేశించెను).

తా. ఆ గృహము పర్వతశిఖరముల సముదాయము వలె ఉండెను. పర్వతశిఖరమువలె ఎత్తుగా ఉండెను. ఆ గృహములోని గదులన్నీ చక్కగా వేరు వేరుగా ఉండెను. గొప్ప పండితులు అక్కడ నివసించుచుండిరి. 2

మూ. మతిమద్భిర్మహామాత్రైరనురక్తైరధిష్ఠితమ్,
రాక్షసైరాప్తపర్యాప్తైః సర్వతః పరిరక్షితమ్. 3

ప్ర.అ. మతిమద్భిః=బుద్ధిమంతులైన, అనురక్తైః=అనురాగవంతులైన, మహామాత్రైః= ప్రధానులచేత, అధిష్ఠితమ్=అధిష్ఠింపబడినది, ఆప్తపర్యాప్తైః=ఆప్తులు సమర్థులు అయిన, రాక్షసైః=రాక్షసులచేత, సర్వతః=అన్నివైపులా, పరిరక్షితమ్=రక్షింపబడినది (అయిన గృహమును ప్రవేశించెను).

తా. ఆ గృహమునందు, మహాబుద్ధిమంతులు, అనురాగవంతులు అయిన ప్రధానులు నివసించుచుండిరి. ఆప్తులు, సమర్థులు అయిన రాక్షసులు అంతటా దానిని రక్షించుచుండిరి. 3

మూ. మత్తమాతఙ్గనిశ్వాసైర్వ్యాకులీకృతమారుతమ్,
శఙ్ఖఘోషమహాఘోషం తూర్యసంబాధనాదితమ్. 4

ప్ర.అ. మత్తమాతఙ్గనిశ్వాసైః=మదించిన ఏనుగుల నిట్టూర్పులచేత, వ్యాకులీకృతమారుతమ్=వ్యాకులము చేయబడిన వాయువు గలది, శఙ్ఖఘోషమహాఘోషమ్=శంఖధ్వనులచేత గొప్ప ఘోష గలది, తూర్యసంబాధనాదితమ్=తూర్యముల సముదాయముచేత ధ్వనింపచేయబడినది అయిన (గృహమును ప్రవేశించెను)

తా. మదించిన గజముల నిశ్వాసములచేత అక్కడ గాలి వ్యాకులముగా చేయబడుచుండెను. శంఖఘోషములతోను, అనేకతూర్యముల ధ్వనులతోను మారుమ్రోగుచుండెను. 4

మూ. ప్రమదాజనసంబాధం ప్రజల్పితమహాపథమ్,
తప్తకాఞ్చననిర్వ్యూహం భూషణోత్తమభూషితమ్. 5

ప్ర.అ. ప్రమదాజనసంబాధమ్=స్త్రీజనముతో కిక్కిరిసి ఉన్నది, ప్రజల్పితమహాపథమ్= మాటలాడుకొనుచున్న విశాలమార్గములు గలది, తప్తకాఞ్చననిర్వ్యూహమ్=ఉత్తమమైన బంగారము వికారమైన బురుజులు గలది, భూషణోత్తమభూషితమ్=ఉత్తమములైన అలంకారములచేత అలంకరించబడినది (అయిన గృహమును ప్రవేశించెను).

తా. ఆ గృహము స్త్రీజనముతో కిక్కిరిసి ఉండెను. విశాలములైన మార్గములయందు జనుల సంభాషణ కోలాహలము వినబడుచుండెను. బంగారు బురుజులతోను, ఉత్తమములైన అలంకారములతోను, అలంకరింపబడి ఉండెను.5

మూ. గన్ధర్వాణామివావాసమాలయం మరుతామివ,
రత్నసంచయసంబాధం భవనం భోగినామివ. 6

ప్ర.అ. గన్ధర్వాణామ్=గంధర్వులయొక్క, ఆవాసమ్ ఇవ=గృహమువలె ఉన్నది, మరుతామ్=మరుత్తుల, ఆలయమ్ ఇవ=భవనము వలె ఉన్నది, రత్నసంచయసంబాధమ్= రత్నముల సముదాయముతో నిండినది, భోగినామ్=సర్పములయొక్క, భవనమ్ ఇవ=భవనము వలె ఉన్నది (అయిన గృహమును ప్రవేశించెను).

తా. ఆ రావణభవనము గంధర్వుల గృహమువలె, మరుత్తుల గృహము వలె, రత్నముల సముదాయముతో నిండి ఉండుటచే (పాతాళములోని) సర్పముల గృహము వలె ఉండెను. 6

మూ. తం మహౌఘమివాదిత్యస్తేజోవిస్తృతరశ్మిమాన్,
అగ్రజస్యాలయం వీరః ప్రవివేశ మహాద్యుతిః. 7

ప్ర.అ. మహాద్యుతిః=గొప్ప కాంతి గల, వీరః=వీరుడైన విభీషణుడు, తేజో విస్తృతరశ్మిమాన్=తేజస్సుతో విస్తృతమైన కిరణములు గల, ఆదిత్యః=సూర్యుడు, మహాభ్రమివ=మహామేఘమును వలె, అగ్రజస్య=అన్నయైన రావణునియొక్క, తమ్ ఆలయమ్=ఆ గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. గొప్ప కాంతి గల వీరుడైన ఆ విభీషణుడు తేజస్సుతో నిండిన కిరణములు గల సూర్యుడు మహామేఘమును ప్రవేశించినట్లు, అన్నయైన రావణుని గృహమును ప్రవేశించెను. 7

మూ. పుణ్యాన్ పుణ్యాహఘోషాంశ్చ వేదవిద్భిరుదాహృతాన్,
శుశ్రావ సుమహాతేజా భ్రాతుర్విజయసంశ్రితాన్. 8

ప్ర.అ. సుమహాతేజాః=చాల గొప్ప తేజస్సు గల ఆ విభీషణుడు, భ్రాతుః=సోదరునియొక్క, విజయసంశ్రితాన్=విజయమునకు సంబంధించిన, వేదవిద్భిః=వేదవేత్తలచేత, ఉదాహృతాన్=పలకబడిన, పుణ్యాన్=పుణ్యములైన, పుణ్యాహఘోషాన్=పుణ్యాహమంత్రములను, శుశ్రావ చ=వినెను కూడ.

తా. మహాతేజశ్శాలియైన ఆ విభీషణుడు అక్కడ తన సోదరుని విజయమును గూర్చి వేదవేత్తలు చదువుచున్న పవిత్రములైన పుణ్యాహమంత్రములను వినెను. 8

మూ. పూజితాన్ దధిపాత్రైశ్చ సర్పిర్భిః సుమనోక్షతైః,
మన్త్రవేదవిదో విప్రాన్ దదర్శ స మహాబలః. 9

ప్ర.అ. మహాబలః=గొప్ప బలము గల, సః=అతడు, దధిపాత్రైశ్చ=పెరుగు నింపిన పాత్రలచేతను, సర్పిర్భిః=నేతులచేతను, సుమనోక్షతైః=పుష్పములచే తను, అక్షతలచేతను, పూజితాన్=పూజింపబడిన, మన్త్రవేదవిదః=మంత్రములను బ్రాహ్మణములను ఎరిగిన, విప్రాన్=బ్రాహ్మణులను, దదర్శ=చూచెను.

తా. మహాబలశాలియైన ఆ విభీషణుడు అక్కడ దధిపాత్రలు, నెయ్యి, పుష్పములు, అక్షతలు సమర్పించి పూజింపబడుచున్న, మంత్రములలోను బ్రాహ్మణములలోను ప్రవీణులైన, బ్రాహ్మణులను చూచెను.

వి. వేదములో ఒక భాగమునకు, మంత్రము అని, ఒక భాగమునకు బ్రాహ్మణము అని పేర్లు. యజ్ఞాదులు చేయునప్పుడు చదువునవి మంత్రములు. ఈ యజ్ఞమును ఈ ఫలము నిమిత్తము చేయవలెను ఇత్యాదివిధముగ కర్మలను విధించేవి బ్రాహ్మణములు. 9

మూ. స పూజ్యమానో రక్షోభిర్దీప్యమానం స్వతేజసా,
ఆసనస్థం మహాబాహుర్వవన్దే ధనదానుజమ్. 10

ప్ర.అ. రక్షోభిః=రాక్షసులచేత, పూజ్యమానః=పూజింపబడుచున్న, మహా బాహుః= గొప్ప బాహువులు గల, సః=ఆ విభీషణుడు, స్వతేజసా=తన తేజస్సుతో, దీప్యమానమ్= ప్రకాశించుచున్న, ఆసనస్థమ్=ఆసనముపైన ఉన్న, ధనదానుజమ్=కుబేరుని తమ్ముడైన రావణుని, వవన్దే=నమస్కరించెను.

తా. మహాబాహువైన ఆ విభీషణుడు రాక్షసులచేత పూజింపబడుచు లోపల ప్రవేశించి, తన సహజతేజస్సుతో ప్రకాశించుచు, ఆసనాసీనుడై ఉన్న రావణునకు నమస్కరించెను. 10

మూ. స రాజదృష్టిసంపన్నమాసనం హేమభూషితమ్,
జగామ సముదాచారం ప్రయుజ్యాచారకోవిదః. 11

ప్ర.అ. ఆచారకోవిదః=ఆచారమును ఎరిగిన, సః=ఆతడు, సము దాచారమ్="జయ" శబ్దమును ప్రయోగించుట మొదలైన ఆచారమును, ప్రయుజ్య=ప్రయోగించి, రాజదృష్టిసంపన్నమ్= రాజుయొక్క దృష్టిచేత సమకూర్చబడిన, హేమభూషితమ్=బంగారముచేత అలంకరింపబడిన, ఆసనమ్= ఆసనమును, జగామ=పొందెను.

తా. ఏ సమయములో ఎట్లు ప్రవర్తింపవలెనో తెలిసిన ఆ విభీషణుడు, రాజదర్శనసమయమునందు అనుసరింపవలసిన ఆచారమును ("జయ విజ యీభవ" ఇత్యాది శబ్దములు పలుకుట మొదలైనవానిని) పాటించి, మహారాజైన రావణుడు కనుసంజ్ఞచేసి చూపిన బంగారు ఆసనముపై కూర్చుండెను. 11

మూ. స రావణం మహాత్మానం విజనే మన్త్రిసన్నిధౌ,
ఉవాచ హితమత్యర్థం వచనం హేతునిశ్చితమ్. 12

ప్ర.అ. సః=ఆతడు, విజనే=ఇతరజనములు లేని, మన్త్రిసన్నిధౌ=మంత్రుల సన్నిధియందు, మహాత్మానమ్=మహాత్ముడైన, రావణమ్=రావణుని గూర్చి, హేతుని శ్చితమ్=హేతువులచేత నిశ్చయింపబడినది, అత్యర్థమ్=మిక్కిలి, హితమ్= హితము అయిన, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. ఇతరజనులు ఎవ్వరూ లేక మంత్రులు మాత్రమే ఉన్న ప్రదేశములో, ఆ విభీషణుడు మహాత్ముడైన రావణునితో, హేతువులచేత నిశ్చితము, మిక్కిలి హితము అయిన వచనమును పలికెను. 12

మూ. ప్రసాద్య భ్రాతరం జ్యేష్ఠం సాన్త్వేనోపస్థితక్రమః,
దేశకాలార్థసంవాది దృష్టలోకపరావరః. 13

ప్ర.అ. దృష్టలోకపరావరః=చూడబడిన లోకమునందు మంచిచెడ్డలు గల విభీషణుడు, సాన్త్వేన= బ్రతిమాలుకొనుటచేత, జ్యేష్ఠం భ్రాతరమ్=అన్నగారిని,

ప్రసాద్య=అనుగ్రహింపచేసికొని, ఉపస్థితక్రమః=అనుసరింపబడిన క్రమముకలవాడై, దేశకాలార్థసంవాది=దేశమునకు, కాలమునకు ప్రయోజనమునకు అనుగుణమైన వాక్యమును పలికెను.

తా. లోకములోని మంచి చెడ్డలను ఎరిగిన ఆ విభీషణుడు మంచి మాటలతో అన్నగారిని అనుగ్రహింప చేసికొని, దేశకాలప్రయోజనములకు అనుగుణమైన వాక్యమును పలికెను. 13

మూ. యదా ప్రభృతి వైదేహీ సంప్రాప్తేహ పరంతప,
తదా ప్రభృతి దృశ్యన్తే నిమిత్తాన్యశుభాని నః. 14

ప్ర.అ. పరంతప=ఓ ! శత్రుసంహారకుడా ! వైదేహీ=సీత, యదా ప్రభృతి= ఎప్పటినుండి, ఇహ=ఇక్కడికి, సంప్రాప్తా=వచ్చినదో, తదా ప్రభృతి=అది మొదలు, నః=మనకు, అశుభాని=అశుభములైన, నిమిత్తాని=శకునములు, దృశ్యన్తే= చూడబడుచున్నవి.

తా. ఓ ! శత్రుసంహారకా ! సీత వచ్చినది మొదలు ఇక్కడ మనకు అశుభమును సూచించు శకునములు కనబడుచున్నవి. 14

మూ. సస్ఫులిఙ్గః సధూమార్చిః సధూమకలుషోదయః,
మన్త్రసంధుక్షితోఽప్యగ్నిర్న సమ్యగభివర్ధతే. 15

ప్ర.అ. మన్త్రసంధుక్షితః అపి=మంత్రముల సముదాయముతో హోమము చేయబడినదైనను, అగ్నిః=అగ్ని, సస్ఫులిఙ్గః=స్ఫులింగములతో కూడినదై (పైకి ఎగురు అగ్నికణములు స్ఫులింగములు) , సధూమార్చిః=ధూమముతో కూడిన జ్వాలలు కలదై, సధూమకలుషోదయః=ధూమముతో కలిసి కలుషముగా ఉన్న పుట్టుక కలదై, సమ్యక్=బాగుగా, నాభివర్ధతే=వృద్ధిపొందుటలేదు.

తా. మంత్రములతో యథావిధిగా హోమము చేసినను అగ్ని బాగుగా ప్రజ్వలించుటలేదు. ఎక్కువగా స్ఫులింగములు ఎగురుచున్నవి. జ్వాలతో ధూమము కలియుచున్నది. అగ్నిపుట్టునప్పుడే ధూమముతో కలిసి పుట్టుటచే ప్రకాశహీనముగా ఉంటున్నది. 15

మూ. అగ్నిష్ఠేష్వగ్నిశాలాసు తథా బ్రహ్మస్థలీషు చ,
సరీసృపాణి దృశ్యన్తే హవ్యేషు చ పిపీలికాః. 16

ప్ర.అ. అగ్నిష్ఠేషు=అగ్ని ఉండు వంటఇళ్లు మొదలైన వాటియందు, అగ్నిశాలాసు=అగ్నిశాలలయందు, తథా=మరియు, బ్రహ్మస్థలీషు చ=వేదాధ్యయనస్థలములయందు, సరీసృపాణి=సర్పములు, దృశ్యన్తే=చూడబడుచున్నవి. హవ్యేషు=హవ్యములయందు, పిపీలికాః= చీమలు, కనబడుచున్నవి.

తా. వంటఇండ్లలోను, అగ్నిగృహములలోను, వేదాధ్యయనశాలలలోను సర్పములు కనబడుచున్నవి. హోమము చేయు నెయ్యి, పాయసము మొదలైన వాటిలో చీమలు కనబడుచున్నవి. 16

మూ. గవాం పయాంసి స్కన్నాని విమదా వరకుఞ్జరాః,
దీనమశ్వాః ప్రహేషన్తే న చ గ్రాసాభినన్దినః. 17

ప్ర.అ. గవామ్=గోవులయొక్క, పయాంసి=పాలు, స్కన్నాని=విరిగిపోవుచున్నది. వరకుఞ్జరాః=శ్రేష్ఠమైన ఏనుగులు, విమదాః=మదము లేకుండా ఉన్నవి. అశ్వాః= గుఱ్ఱములు, దీనమ్=దీనముగా, ప్రహేషన్తే=సకిలించుచున్నవి. గ్రాసాభినన్దినః= పచ్చగడ్డిని అభినందించుచున్నవి, న చ=కాదు.

తా. ఆవుల పాలు విరిగిపోవుచున్నవి. ఉత్తమమైన ఏనుగులు కూడ మదము లేకుండా ఉన్నవి. గుఱ్ఱములు దీనముగా సకిలించుచు పచ్చగడ్డియందు ఆసక్తి చూపుట లేదు. 17

మూ. ఖరోష్ట్రాశ్వతరా రాజన్భిన్నరోమాః స్రవన్తి చ,
న స్వభావేఽవతిష్ఠన్తే విధానైరపి చిన్తితాః. 18

ప్ర.అ. రాజన్=రాజా ! ఖరోష్ట్రాశ్వతరాః =గాడిదలు, ఒంటెలు, కంచరగాడిదలు, భిన్నరోమాః =ఊడిపోయిన రోమములు గలవై, స్రవన్తి చ=కన్నీళ్లు కార్చుచున్నవి. విధానైః=శాస్త్రోక్తపద్ధతులచేత, చిన్తితాః అపి=చికిత్స చేయబడిన వైనను, స్వభావే= స్వభావమునందు, న అవతిష్ఠన్తే= ఉండుట లేదు.

తా. గాడిదలు, ఒంటెలు, కంచరగాడిదల రోమములు ఊడిపోయి కన్నీళ్లు కార్చుచున్నవి. యథాశాస్త్రముగా చికిత్స చేసినను స్వాస్థ్యమును పొందుటలేదు. 18

మూ. వాయసాః సఙ్ఘశః క్రూరా వ్యాహరన్తి సమన్తతః,
సమవేతాశ్చ దృశ్యన్తే విమానాగ్రేషు సఙ్ఘశః. 19

ప్ర.అ. క్రూరాః=క్రూరములైన, వాయసాః=కాకులు, సఙ్ఘశః=గుంపులుగా, సమన్తతః=అంతటా, వ్యాహరన్తి=అరచుచున్నవి. విమానాగ్రేషు=గృహాగ్రములయందు, సఙ్ఘశః=గుంపులుగా, సమవేతాః=కూడుచున్నవిగా, దృశ్యన్తే=కనబడుచున్నవి.

తా. క్రూరములైన కాకులు గుంపులుగా గుంపులుగా చేరి అరచుచున్నవి. గుంపులుగా కలిసి ఇండ్ల పైభాగములందు కూర్చుంటున్నవి.19

మూ. గృధ్రాశ్చ పరిలీయన్తే పురీముపరి పిణ్డితాః,
ఉపసృష్టాశ్చ సన్ధ్యే ద్వే వ్యాహరన్త్యశివం శివాః. 20

ప్ర.అ. గృధ్రాశ్చ=గ్రద్దలు, పురీముపరి=పట్టణముపైన, పరిపిణ్డితాః= మండ లాకారముగ తిరుగుచు, పరిలీయన్తే=అణగుచున్నవి(వాలుచున్నవి). శివాః=నక్కలు, ద్వే సంధ్యే=రెండు సంధ్యలను, ఉపసృష్టాః=సమీపించినవై, అశివమ్=అమంగళ ముగా, వ్యాహరన్తి=కూయుచున్నవి.

తా. గ్రద్దలు పట్టణముమీద మండలాకారముగా తిరుగుచు వాలుచున్నవి. రెండు సంధ్యాకాలములయందు నక్కలు నగరసమీపము చేరి అమంగళముగా కూయుచున్నవి. 20

మూ. క్రవ్యాదానాం మృగాణాం చ పురద్వారేషు సఙ్ఘశః,
శ్రూయన్తే విపులా ఘోషాః సవిస్ఫూర్జితనిఃస్వనాః. 21

ప్ర.అ. పురద్వారేషు=పట్టణము ద్వారములయందు, సంఘశః=గుంపులుగా ఏర్పడిన, క్రవ్యాదానామ్=మాంసమును భక్షించు, మృగాణామ్=మృగములయొక్క, సవిస్ఫూర్జితనిఃస్వనాః=పిడుగు చప్పుడు వంటి ధ్వని గల, విపులాః=అధికమైన, ఘోషాః= అరపులు, శ్రూయన్తే=వినబడుచున్నవి.

తా. మాంసాహారులైన క్రూరమృగములు గుంపులు గుంపులుగా నగరద్వారముల వద్ద చేరి పిడుగు చప్పుళ్ల వంటి అత్యధికమైన ధ్వనులు చేయుచున్నవి. 21

మూ. తదేవం ప్రస్తుతే కార్యే ప్రాయశ్చిత్తమిదం క్షమమ్,
రోచయే వీర వైదేహీ రాఘవాయ ప్రదీయతామ్. 22

ప్ర.అ. వీర=వీరుడా ! తత్=ఆకారణమువలన, ఏవమ్=ఈ విధముగా, ప్రస్తుతే=ప్రస్తుతమైన, కార్యే=దుష్టనిమిత్తములకు పరిహారము చేసికొనుట అను కార్యమునందు, ఇదమ్=దీనిని, క్షమమ్=తగిన, ప్రాయశ్చిత్తమ్=ప్రాయశ్చిత్తము ముగా, రోచయే= ఇష్టపడుచున్నాను. వైదేహీ=సీత, రాఘవాయ=రామునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. ఓ ! వీరుడా ! ఈ విధముగా దుష్టనిమిత్తములు కనబడుటచేత వాటికి పరిహారము చేయవలసి ఉన్నది గాన రామునకు సీతను ఇచ్చివేయుటయే తగిన పరిహార మని నేను తలచుచున్నాను. 22

మూ. ఇదం చ యది వా మోహాల్లోభాద్వా వ్యాహృతం మయా,
తత్రాపి చ మహారాజ న దోషం కర్తుమర్హసి. 23

ప్ర.అ. మహారాజ=ఓ !మహారాజా ! ఇదమ్=ఇది, మయా=నాచేత, మోహాద్వా= మోహము వల్లనైనా, లోభాద్వా=లోభమువల్లనైనా, వ్యాహృతం యది=పలకబడినట్లయితే, తత్రాపి=దాని విషయమునందు కూడ, దోషమ్=దోష

మును, కర్తుమ్=చేయుటకు (తలచుటకు), నార్హసి=తగవు.

తా. మహారాజా ! నే నీ మాటలు అజ్ఞానమువలనగాని, లోభము (మన మందరము సుఖముగా ఉండవలెనను కోరిక) వలనగాని పలుకుచున్నను నీవు మరొక విధముగా భావింపకుము (కోపింపకుము). 23

మూ. అయం హి దోషః సర్వస్య జనస్యాస్యోపలక్ష్యతే,
రక్షసాం రాక్షసీనాం చ పురస్యాన్తఃపురస్య చ. 24

ప్ర.అ. అయమ్=ఈ, దోషః=దుర్నిమిత్తము, రక్షసామ్=రాక్షసులకు, రాక్షసీనాం చ=రాక్షసస్త్రీలకు, పురస్య=పట్టణమునకు, అన్తఃపురస్య చ=అంతః పురమునకు, అస్య=ఈ, సర్వస్య=సమస్తమైన, జనస్య=జనమునకు, ఉపలక్ష్యతే హి= కనబడుచున్నది కదా.

తా. ఈ దుర్నిమిత్తములు నాకు మాత్రమే కాదు; రాక్షసులకు, రాక్షసస్త్రీలకు, పట్టణమునకు, అంతఃపురమునకు, ఇక్కడ ఉన్న అందరికీ కనబడుచున్నవి. 24

మూ. ప్రాపణే చాస్య మన్త్రస్య నివృత్తాః సర్వమన్త్రిణః,
అవశ్యం చ మయా వాచ్యం యద్దృష్టమథవా శ్రుతమ్. 25
సంవిధాయ యథాన్యాయం తద్భవాన్ కర్తుమర్హతి.

ప్ర.అ. అస్య=ఈ, మన్త్రస్య=ఆలోచనయొక్క, ప్రాపణే=పొందించుటయందు, సర్వమన్త్రిణః=అందరు మంత్రులూ, నివృత్తాః=నివర్తించినవారు. యత్=ఏది, దృష్టమ్=చూడబడినదో, అథవా=లేక, శ్రుతమ్=వినబడినదో, అది, మయా=నాచేత, అవశ్యమ్=తప్పక, వాచ్యమ్=చెప్పదగినది. తత్=ఆ కారణమువలన, భవాన్=నీవు, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, సంవిధాయ=ఏర్పరచి, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. ఈ విషయమును నీకు చెప్పుటకు మంత్రు లందరూ సందేహించుచున్నారు. నేను చూచినది, విన్నది తప్పక నీకు చెప్పవలెను గాన చెప్పుచున్నాను. అందుచేత నీవు న్యాయానుసారముగా ఏమి చేయవలెనో అది చేయుము. 25

మూ. ఇతి స్వమన్త్రిణాం మధ్యే భ్రాతా భ్రాతరమూచివాన్, 26
రావణం రక్షసాం శ్రేష్ఠం పథ్యమేతద్విభీషణః.

ప్ర.అ. భ్రాతా=సోదరుడైన, విభీషణః=విభీషణుడు, స్వమన్త్రిణామ్=తన మంత్రుల మధ్యయందున్న, భ్రాతరమ్=సోదరుడైన, రక్షసాం శ్రేష్ఠమ్=రాక్షసులలో శ్రేష్ఠుడైన, రావణమ్=రావణుని గూర్చి, ఇతి=ఈ విధముగా, పథ్యమ్=హితమైన,

ఏతత్=ఈ వాక్యమును, ఉవాచ=పలికినాడు.

తా. సోదరుడైన విభీషణుడు మన్త్రుల మధ్యనున్న రాక్షసశ్రేష్ఠుడు, సోదరుడు అయిన రావణునితో ఈ విధముగా హితమైన వాక్యము పలికెను.26

మూ. హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీతకాలాయతిసంప్రతిక్షమమ్,
నిశమ్య తద్వాక్యముపస్థితజ్వరః
ప్రసక్తవానుత్తరమేత దబ్రవీత్. 27

ప్ర.అ. ప్రసక్తవాన్=రామునితో వైరమునందు ఆసక్తి గల ఆ రావణుడు, హితమ్=హితము, మహార్థమ్=గొప్ప అర్థము గలది, మృదు=మృదువు, హేతు సంహితమ్=హేతువులతో కూడినది, వ్యతీతకాలాయతిసంప్రతిక్షమమ్=గడచిన కాలమునందు, రాబోవు కాలమునందు, ఈ కాలమునందు కూడ తగినది అయిన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, ఉపస్థితజ్వరః=కలిగిన కోపము గలవాడై, ఏతత్=ఈ, ఉత్తరమ్=ఉత్తరమును, అబ్రవీత్=పలికెను.

తా. రామునితో విరోధము పెట్టుకొనుటయందే ఆసక్తి గల ఆ రావణుడు హితము, గొప్ప అర్థము గలది, మృదువు, హేతువులతో కూడినది, భూత-వర్తమాన-భవిష్యత్కాలములలో తగినది అయిన అతని మాట విని, కోపించి ఈ విధముగా సమాధానము చెప్పెను. 27

మూ. భయం న పశ్యామి కుతశ్చిదప్యహం
న రాఘవః ప్రాప్స్యతి జాతు మైథిలీమ్,
సురైః సహేన్ద్రైరపి సంగరే కథం
మమాగ్రతః స్థాస్యతి లక్ష్మణాగ్రజః. 28

ప్ర.అ. అహమ్ = నేను, కుతశ్చిదపి=ఎవనినుండి కూడ, భయమ్ = భయమును, న పశ్యామి=చూడను. రాఘవః=రాముడు, జాతు=ఎన్నడును, మైథిలీమ్=సీతను, న ప్రాప్స్యతి=పొందడు. సహేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సురైరపి=దేవతలతో కలిసి వచ్చినను, లక్ష్మణాగ్రజః=రాముడు, సంగరే=యుద్ధమునందు, మమ=నాయొక్క, అగ్రతః= ఎదుట,కథమ్=ఎట్లు, స్థాస్యతి=నిలువ గలడు ?

తా. భయమునకు కారణ మేమీ నాకు కనబడుట లేదు. రాముడు ఏనాటికీ సీతను పొందజాలడు. ఇంద్రాదిదేవతలతో కలిసి వచ్చినను రాముడు యుద్ధములో నా ఎదుట నిలువగలడా ? 28

మూ. ఇత్యేవముక్త్వా సురసైన్యనాశనో
మహాబలః సంయతి చణ్డవిక్రమః,
దశాననో భ్రాతరమాప్తవాదినం
విసర్జయామాస తదా విభీషణమ్. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే దశమః సర్గః.

ప్ర.అ. సురసైన్యనాశనః = దేవతల సైన్యమును నశింపచేయువాడు, మహాబలః = గొప్ప బలము గలవాడు, సంయతి = యుద్ధమునందు, చణ్డవిక్రమః = తీవ్రమైన పరాక్రమము గలవాడు అయిన, దశాననః = రావణుడు, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, ఆప్తవాదినమ్ = హితమును చెప్పుచున్న, విభీషణమ్ = విభీషణుని, తదా = అప్పుడు, విసర్జయామాస = పంపివేసెను.

తా. దేవతాసైన్యమును నశింపజేసినవాడు, మహాబలము కలవాడు, యుద్ధములో తీవ్రమైన పరాక్రమము కలవాడు అయిన రావణుడు ఇట్లు పలికి, తనకు హితమును బోధించుచున్న విభీషణుని పంపివేసెను. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో దశమసర్గ సమాప్తము.

# అథ ఏకాదశః సర్గః

[రావణుడు మరల మంత్రగృహమునకు వెళ్లుట; మంత్రులు, విభీషణుడు కూడ అక్కడికి వెళ్లుట.]

మూ. స బభూవ కృశో రాజా మైథిలీకామమోహితః,
అసన్మానాచ్చ సుహృదాం పాపః పాపేన కర్మణా. 1

ప్ర. అ. మైథిలీకామమోహితః=సీతయందు కామముచేత మోహితుడైన, సః=ఆ, పాపః=పాపాత్ముడైన, రాజా=రాక్షసరాజు, సుహృదామ్=మంచి హృదయము కలవారియొక్క, అసన్మానాచ్చ =సన్మానము లేకపోవుట వలనను, పాపేన=పాపమైన, కర్మణా=కర్మచేతను, కృశః=కృశించినవాడు, బభూవ=అయెను.

తా. సీతయందు కామముచేత మోహింపబడిన పాపాత్ముడైన ఆ రావణుడు మంచి హృదయము గల విభీషణాదులను అవమానించుటచేతను, పాపకర్మచేతను కృశించిపోయెను. 1

మూ. అతీతసమయే కాలే తస్మిన్వై యుధి రావణః,
అమాత్యైశ్చ సుహృద్భిశ్చ ప్రాప్తకాలమమన్యత. 2

ప్ర. అ. రావణః=రావణుడు, తస్మిన్=ఆ, అతీతసమయే=సమయము మించిపోయిన, కాలే=కాలమునందు, అమాత్యైశ్చ=మంత్రులతోను, సుహృద్భిశ్చ= మిత్రులతోను, యుధి=యుద్ధమునందు, ప్రాప్తకాలమ్= కాలమునకు తగిన విషయమును, అమన్యత=ఆలోచించెను.

తా. సమయము మించిపోయిన ఆ కాలమునందు రావణుడు మంత్రులతోను, మిత్రులతోను కలిసి యుద్ధములో చేయదగిన దానిని గూర్చి ఆలోచించెను.

2

మూ. స హేమజాలవితతం మణివిద్రుమభూషితమ్,
ఉపగమ్య వినీతాశ్వమారురోహ మహారథమ్. 3

ప్ర. అ. సః=అతడు, హేమజాలవితతమ్=బంగారు వలచేత కప్పబడిన, మణివిద్రుమభూషితమ్=మణులచేతను, పగడములచేతను అలంకరించబడిన, వినీతాశ్వమ్=శిక్షితములైన గుఱ్ఱములు గల, మహారథమ్ = గొప్ప రథమును, ఉపగమ్య=సమీపించి, ఆరురోహ=ఎక్కెను.

తా. అతడు బంగారు వల కప్పిన, మణులతోను పగడములతోను

అలంకరింపబడిన, శిక్షితములైన గుఱ్ఱములు గల గొప్ప రథమును సమీపించి దానిపై ఎక్కెను. 3

మూ. తమాస్థాయ రథశ్రేష్ఠం మహామేఘసమస్వనమ్,
ప్రయయౌ రక్షసాం శ్రేష్ఠో దశగ్రీవః సభాం ప్రతి. 4

[illegible]

ప్ర. అ. మైథిలీకామమోహితః=సీతయందు కామముచేత మోహితుడైన, సః=ఆ, పాపః=పాపాత్ముడైన, రాజా=రాక్షసరాజు, సుహృదామ్=మంచి హృదయము కలవారియొక్క, అసమ్మానాచ్చ=సన్మానము లేకపోవుట వలనను, పాపేన=పాపమైన, కర్మణా=కర్మచేతను, కృశః=కృశించినవాడు, బభూవ=అయెను.

తా. సీతయందు కామముచేత మోహింపబడిన పాపాత్ముడైన ఆ రావణుడు మంచి హృదయము గల విభీషణాదులను అవమానించుటచేతను, పాపకర్మచేతను కృశించిపోయెను. 1

మూ. అతీతసమయే కాలే తస్మిన్వై యుధి రావణః,
అమాత్యైశ్చ సుహృద్భిశ్చ ప్రాప్తకాలమమన్యత. 2

ప్ర. అ. రావణః=రావణుడు, తస్మిన్=ఆ, అతీతసమయే=సమయము మించిపోయిన, కాలే=కాలమునందు, అమాత్యైశ్చ=మంత్రులతోను, సుహృద్భిశ్చ=మిత్రులతోను, యుధి=యుద్ధమునందు, ప్రాప్తకాలమ్= కాలమునకు తగిన విషయమును, అమన్యత=ఆలోచించెను.

తా. సమయము మించిపోయిన ఆ కాలమునందు రావణుడు మంత్రులతోను, మిత్రులతోను కలిసి యుద్ధములో చేయదగిన దానిని గూర్చి ఆలోచించెను.

2

మూ. స హేమజాలవితతం మణివిద్రుమభూషితమ్,
ఉపగమ్య వినీతాశ్వమారురోహ మహారథమ్. 3

ప్ర. అ. సః=అతడు, హేమజాలవితతమ్=బంగారు వలచేత కప్పబడిన, మణివిద్రుమభూషితమ్=మణులచేతను, పగడములచేతను అలంకరింపబడిన, వినీతాశ్వమ్=శిక్షితములైన గుఱ్ఱములు గల, మహారథమ్ = గొప్ప రథమును, ఉపగమ్య=సమీపించి, ఆరురోహ=ఎక్కెను.

తా. అతడు బంగారు వల కప్పిన, మణులతోను పగడములతోను

ప్ర. అ. అతిరథాః=అతిరథులైన రాక్షసులు, రథైః=రథములచేతను, మత్తైః=మదించిన, వరవారణైః= శ్రేష్ఠములైన ఏనుగులచేతను, అక్రీడద్భిః=క్రీడించుచున్న, వాజిభిః=అశ్వములచేతను, దశగ్రీవమ్=రావణుని, శీఘ్రమ్=శీఘ్రముగా, అనుప్రయయుః=అనుసరించి వెళ్లిరి.

తా. అతిరథులైన రాక్షసులు రథములను, మదించిన శ్రేష్ఠములైన గజములను, క్రీడించుచున్న అశ్వములను ఎక్కి శీఘ్రముగా రావణుని వెంట వెళ్లిరి. 7

మూ. గదాపరిఘహస్తాశ్చ శక్తితోమరపాణయః,
పరశ్వధధరాశ్చాన్యే తథాన్యే శూలపాణయః. 8

ప్ర. అ. గదాపరిఘహస్తాశ్చ=గదలు, పరిఘలు హస్తములందు కలవారు, శక్తితోమరపాణయః=శక్తులు, తోమరములు హస్తములందు గలవారు, పరశ్వధధరాః=గండ్రగొడ్డళ్లు ధరించిన, అన్యే=మరికొందరు, శూలపాణయః=శూలములు హస్తములందు గల, అన్యే చ=మరికొందరు (అనుసరించి వెళ్లిరి).

తా. కొందరు గదలను, పరిఘలను ధరించిరి. కొందరు శక్తులు, తోమరములు ధరించిరి. కొందరు గండ్రగొడ్డళ్లు ధరించిరి. మరికొందరు శూలములు ధరించిరి. 8

మూ. తతస్తూర్యసహస్రాణాం సంజజ్ఞే నిఃస్వనో మహాన్,
తుములః శఙ్ఖశబ్దశ్చ సభాం గచ్ఛతి రావణే. 9

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రావణే=రావణుడు, సభామ్=సభను గూర్చి, గచ్ఛతి=వెళ్లుచుండగా, తూర్యసహస్రాణామ్=వేలకొలది వాద్యములయొక్క, మహాన్=గొప్పదైన, నిస్వనః=ధ్వని, తుములః=వ్యాకులమైన, శఙ్ఖశబ్దశ్చ=శంఖధ్వని, సంజజ్ఞే=పుట్టెను.

తా. పిమ్మట రావణుడు సభాభవనమునకు వెళ్లుచున్న సమయమునందు వేలకొలది వాద్యముల ధ్వని, వ్యాకులమైన శంఖధ్వని బయలుదేరెను. 9

మూ. స నేమిఘోషేణ మహాన్సహసాభివినాదయన్,
రాజమార్గం శ్రియా జుష్టం ప్రతిపేదే మహారథః. 10

ప్ర. అ. మహాన్=గొప్పదైన, సః=ఆ, మహారథః=మహారథము, నేమిఘోషేణ=చక్రాగ్రముల ధ్వనిచేత, అభివినాదయన్=ధ్వనింపచేయుచు, శ్రియా=శోభచేత, జుష్టమ్=పొందబడిన, రాజమార్గమ్=రాజమార్గమును, సహసా=శీఘ్రముగా, ప్రతిపేదే=పొందెను.

తా. ఆ మహారథము చక్రాంతముల ధ్వనిచేత ధ్వనింపచేయుచు శీఘ్రముగా సుందరమైన రాజమార్గమును ప్రవేశించెను. 10

మూ. విమలం చాతపత్రం చ ప్రగృహీతమశోభత,
పాణ్డురం రాక్షసేన్ద్రస్య పూర్ణస్తారాధిపో యథా. 11

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, విమలమ్=నిర్మలము, పాణ్డురమ్=తెల్లనిది అయిన, ప్రగృహీతమ్= గ్రహింపబడిన, ఆతపత్రమ్=గొడుగు, పూర్ణః=పూర్ణముగా ఉన్న, తారాధిపో యథా=చంద్రుడు వలె, అశోభత= ప్రకాశించెను.

తా. రావణుని శిరస్సుమీద పట్టిన, నిర్మలముగా తెల్లగా ఉన్న ఛత్రము పూర్ణచంద్రుడు వలె ప్రకాశించెను. 11

మూ. హేమమఞ్జరిగర్భే చ శుద్ధస్ఫటికవిగ్రహే,
చామరవ్యజనే తస్య రేజతుః సవ్యదక్షిణే. 12

ప్ర. అ. హేమమఞ్జరిగర్భే=బంగారు సూత్రములు గర్భమునందు గల, శుద్ధస్ఫటికవిగ్రహే=శుద్ధమైన స్ఫటికమువంటి ఆకారము గల, చామరవ్యజనే= చమరీమృగమునకు సంబంధించిన వింజామరలు, తస్య= అతనియొక్క, సవ్యదక్షిణే=సవ్యదక్షిణపార్శ్వములయందు, రేజతుః=ప్రకాశించినవి.

తా. అతని కుడి ఎడమ ప్రక్కలయందు, మధ్య మధ్య బంగారు సూత్రములు గల, పరిశుద్ధమైన స్ఫటికములో సమానమైన ఆకారముగల చామరములు ప్రకాశించుచుండెను. 12

మూ. తే కృతాఞ్జలయః సర్వే రథస్థం పృథివీస్థితాః,
రాక్షసా రాక్షసశ్రేష్ఠం శిరోభిస్తం వవన్దిరే. 13

ప్ర. అ. పృథివీస్థితాః=నేలమీద ఉన్న, సర్వే=సమస్తమైన, తే రాక్షసాః= ఆ రాక్షసులు, కృతాఞ్జలయః= చేయబడిన దోసిళ్లు గలవారై, రథస్థమ్=రథముమీద ఉన్న, రాక్షసశ్రేష్ఠమ్=రాక్షసులలో శ్రేష్ఠుడైన, తమ్=అతనిని, శిరోభిః=శిరస్సులచేత, వవన్దిరే=నమస్కరించిరి.

తా. నేలమీద నిలచియున్న ఆ రాక్షసులందరు రథముమీద నున్న ఆ రాక్షసశ్రేష్ఠునకు తలలు వంచి అంజలి ఘటించి నమస్కరించిరి. 13

మూ. రాక్షసైః స్తూయమానః సన్ జయాశీర్భిరరిందమః,
ఆససాద మహాతేజాః సభాం విరచితాం తదా. 14

ప్ర. అ. తదా=అప్పుడు, అరిందమః=శత్రువులను పీడించువాడు, మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడు అయిన రావణుడు, రాక్షసైః=రాక్షసులచేత, జయాశీర్భిః=జయ శబ్దముతో కూడిన ఆశీర్వాదవాక్యములతో, స్తూయమానః=స్తుతింప బడుచు, విరచితామ్=ఏర్పరుపబడిన, సభామ్=సభను, ఆససాద=సమీపించెను.

తా. శత్రుసంహారకుడు,మహాతేజశ్శాలి అయిన రావణుడు రాక్షసులచేత "జయ విజయీ భవ" అను ఆశీర్వాదవాక్యములతో స్తుతింపబడుచు, అప్పుడు, ఏర్పరచిన సభను సమీపించెను. 14

మూ. సువర్ణరజతాస్తీర్ణాం విశుద్ధస్ఫటికాన్తరామ్,
విరాజమానో వపుషా రుక్మపట్టోత్తరచ్ఛదామ్. 15
తాం పిశాచశతైః షడ్భిరభిగుప్తాం సదాప్రభామ్,
ప్రవివేశ మహాతేజాః సుకృతాం విశ్వకర్మణా. 16

ప్ర. అ. వపుషా = దేహముతో, విరాజమానః=ప్రకాశించుచున్న, మహాతేజాః=గొప్ప తేజస్సు గల రావణుడు, సువర్ణరజతాస్తీర్ణామ్=బంగారము చేతను, వెండిచేతను చుట్టూ కప్పబడినది, విశుద్ధస్ఫటికాన్తరామ్= పరిశుద్ధమైన స్ఫటికమాణిక్యవికారమైన మధ్యభాగము గలది, రుక్మపట్టోత్తరచ్ఛదామ్=బంగారు వస్త్రము పై ఆస్తరణముగా గలది, షడ్భిః=ఆరు, పిశాచశతైః=పిశాచముల వందలచేత, అభిగుప్తామ్=రక్షించబడినది, సదాప్రభామ్=ఎల్లప్పుడు కాంతి గలది, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, సుకృతామ్=చక్కగా నిర్మించబడినది అయిన, తామ్= ఆ సభను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఆ సభాభవనము ప్రాంతభాగములయందు బంగారముచేత, వెండిచేత కప్పబడి మధ్యభాగమున స్ఫటికమాణిక్యములు పొదగబడి ఉండెను. దాని పైభాగమున బంగారువస్త్రము కప్పబడెను. నిత్యము ప్రకాశించుచున్న ఆ సభను ఆరువందల పిశాచములు రక్షించుచుండెను. విశ్వకర్మ చక్కగా నిర్మించిన ఆ సభను మహాతేజశ్శాలి, ప్రకాశించుచున్న శరీరము కలవాడు అయిన ఆ రావణుడు ప్రవేశించెను. 15, 16

మూ. తస్యాం చ వైదూర్యమయం ప్రియకాజినసంవృతమ్,
మహత్సోపాశ్రయం భేజే రావణః పరమాసనమ్. 17

ప్ర. అ. సః=ఆ, రావణః=రావణుడు, తస్యామ్=ఆ సభయందు, వైదూర్యమయమ్= వైదూర్యమాణిక్యవికారము, ప్రియకాజినసంవృతమ్=ప్రియకమ్ను గమునొక్క, చర్మముచేత కప్పబడినది, సోపాశ్రయమ్=దిండుతో కూడినది అయిన, మహత్=గొప్పదైన, పరమాసనమ్=శ్రేష్ఠమైన ఆసనమును, భేజే=పొందెను.

తా. రావణుడు ఆ సభలో వైడూర్యమాణిక్యవికారమైన శ్రేష్ఠమైన ఆసనముపై కూర్చుండెను. ప్రియకమృగాజినము కప్పిన ఆ ఆసనముమీద దిండులు అమర్చబడి ఉండెను. 17

మూ. తతః శశాసేశ్వరవద్దూతాన్ లఘుపరాక్రమాన్,
సమానయత మే క్షిప్రమిహైతాన్ రాక్షసానితి. 18
కృత్యమస్తి మహజ్జాతే కర్తవ్యమితి శత్రుభిః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, లఘుపరాక్రమాన్=శీఘ్రమైన గమనము గల, దూతాన్=దూతలను, ఈశ్వరవత్=ప్రభువువలె, (ప్రభువుగా), మహత్=గొప్పదైన, కృత్యమ్=కృత్యము, అస్తి=ఉన్నది. శత్రుభిః= శత్రువులచేత, కర్తవ్యమ్ ఇతి=చేయదగినది అని, జానే=ఎరుగుదును; ఏతాన్=ఈ, రాక్షసాన్=రాక్షసులను, క్షిప్రమ్=శీఘ్రముగా, మే=నాకు, ఇహ=ఇక్కడికి, సమానయత=తీసికొనిరండి, ఇతి=అని, శశాస=ఆజ్ఞాపించెను.

తా. పిమ్మట రావణుడు రాజాధికారము చూపుచు "గొప్ప కార్యము ఉన్నది; శత్రువులు ఏమి చేయుచున్నారో తెలిసినది. అందుచేత రాక్షసులనందరిని శీఘ్రముగా నావద్దకు ఇక్కడికి తీసికొనిరండు" అని శీఘ్రముగా వెళ్లు దూతలను ఆజ్ఞాపించెను. 18

మూ. రాక్షసాస్తద్వచః శ్రుత్వా లఙ్కాయాం పరిచక్రముః, 19
అనుగేహమవస్థాయ విహారశయనేషు చ,
ఉద్యానేషు చ రక్షాంసి చోదయన్తో హ్యభీతవత్. 20

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, తద్వచః=ఆతని వచనమును, శ్రుత్వా=విని, విహారశయనేషు= విహరించుప్రదేశములందు, శయనములందు, ఉద్యానేషు చ=ఉద్యానములందు, అవస్థాయ=ఉండి విహరించుచున్న, రక్షాంసి=రాక్షసులను, చోదయన్తః=ప్రేరేపించుచు, అభీతవత్=భయములేనివారై, లఙ్కాయామ్=లంకలో, అనుగేహమ్=ప్రతిగృహమును, పరిచక్రముః=వెళ్లిరి.

తా. రాక్షసు లాతని మాటలు విని విహారస్థానములలోను, శయనములపైన, ఉద్యానములలోను విహరించుచున్న రాక్షసుల నందరిని ప్రేరేపించుచు, భయపడక లంకలోని ఇంటింటికి వెళ్లిరి. 19, 20

మూ. తే రథాన్ రుచిరానేకే దృప్తానేకే దృఢాన్ హయాన్,
నాగానేకేఽధిరురుహుర్జగ్ముశ్చైకే పదాతయః. 21

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, ఏకే=కొందరు, రుచిరాన్=సుందరములైన, రథాన్=రథములను, ఏకే=కొందరు, దృప్తాన్=గర్వించిన, దృఢాన్=దృఢములైన,

హయాన్=గుఱ్ఱములను, ఏకే=కొందరు, నాగాన్=ఏనుగులను, అధిరురుహుః=ఎక్కిరి. ఏకే=కొందరు, పదాతయః=నడచువారై, జగ్ముః=వెళ్లిరి.

తా. ఆ రాక్షసులలో కొందరు అందమైన రథములను ఎక్కిరి. కొందరు గర్వించి బలముగల గుఱ్ఱములను ఎక్కిరి. కొందరు ఏనుగులను ఎక్కిరి. కొందరు కాలినడకచేత వెళ్లిరి. 21

మూ. సా పురీ పరమాకీర్ణా రథకుఞ్జరవాజిభిః,
సంపతద్భిర్విరురుచే గరుత్మద్భిరివామ్బరమ్. 22

ప్ర. అ. సంపతద్భిః=శీఘ్రముగా వచ్చుచున్న, రథకుఞ్జరవాజిభిః=రథములచేత, ఏనుగులచేత, గుఱ్ఱములచేత, పరమాకీర్ణా=అధికముగా వ్యాప్తమైన, సా పురీ=ఆ పట్టణము, గరుత్మద్భిః=పక్షులచేత, అమ్బరమివ=ఆకాశమువలె, విరురుచే=ప్రకాశించెను.

తా. శీఘ్రముగా వచ్చుచున్న రథములచేత, ఏనుగులచేత, గుఱ్ఱములచేత, పూర్తిగా వ్యాపింపబడిన ఆ నగరము పక్షులతో నిండిన ఆకాశము వలె ప్రకాశించెను. 22

మూ. తే వాహనాన్యవస్థాప్య యానాని వివిధాని చ,
సభాం పద్భిః ప్రవివిశుః సింహా గిరిగుహామివ. 23

ప్ర. అ. తే=వాళ్లు, వాహనాని=గజాదివాహనములను, వివిధాని=అనేకవిధములైన, యానాని చ= రథాదియానములను, అవస్థాప్య=నిలిపి, సింహాః=సింహములు, గిరిగుహామివ=పర్వతగుహను వలె, సభామ్=సభను, పద్భిః=పాదములచేత, ప్రవివిశుః=ప్రవేశించిరి.

తా. ఆ రాక్షసులు రథగజాదివాహనములను నిలిపి, సింహములు పర్వతగుహలో ప్రవేశించినట్లు ఆ సభలోనికి పాదచారులై ప్రవేశించిరి. 23

మూ. రాజ్ఞః పాదౌ గృహీత్వా తు రాజ్ఞా తే ప్రతిపూజితాః,
పీఠేష్వన్యే బృసీష్వన్యే భూమౌ కేచిదుపావిశన్. 24

ప్ర. అ. తే=వాళ్లు, రాజ్ఞః=రాజుయొక్క, పాదౌ=పాదములను, గృహీత్వా=గ్రహించి, రాజ్ఞా= రాజుచేత, ప్రతిపూజితాః=పూజింపబడినవారై, అన్యే=కొందరు, పీఠేషు=ఆసనములయందు, అన్యే=కొందరు, బృసీషు=ఆస్తరణములమీద, కేచిత్=కొందరు, భూమౌ=నేలమీద, ఉపావిశన్=కూర్చుండిరి.

తా. వాళ్లు రాజుకు పాదాభివందనము చేసిరి. రాజుచే అభినందింపబడి కొందరు ఆసనములమీద, కొందరు ఆస్తరణములమీద, మరికొందరు నేలమీద

మార్చుండిరి. 24

మూ. తే సమేత్య సభాయాం వై రాక్షసా రాజశాసనాత్,
యథార్హముపతస్థుస్తే రావణం రాక్షసాధిపమ్. 25

ప్ర. అ. తే రాక్షసాః=ఆ రాక్షసులు, రాజశాసనాత్=రాజాజ్ఞవలన, సభాయామ్=సభయందు, సమేత్య=చేరి, తే=వారు, రాక్షసాధిపమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుని, యథార్హమ్=తగు విధముగా, ఉపతస్థుః= సమీపించిరి.

తా. ఆ రాక్షసులు రాజాజ్ఞానుసారము సభలో చేరి రాక్షసరాజైన రావణుని తగు విధముగా సమీపించిరి. 25

మూ. మన్త్రిణశ్చ యథాముఖ్యా నిశ్చితార్థేషు పణ్డితాః,
అమాత్యాశ్చ గుణోపేతాః సర్వజ్ఞా బుద్ధిదర్శనాః. 26
సమీయుస్తత్ర శతశః శూరాశ్చ బహవస్తథా,
సభాయాం హేమవర్ణాయాం సర్వార్థస్య సుఖాయ వై. 27

ప్ర. అ. నిశ్చితార్థేషు=నిశ్చయింపబడిన కార్యములయందు, పణ్డితాః=పండితులైన, మన్త్రిణశ్చ=మంత్రులు, గుణోపేతాః=గుణములతో కూడిన, సర్వజ్ఞాః=అన్నియు తెలిసిన, బుద్ధిదర్శనాః=బుద్ధియే దర్శనసాధనముగా గల, అమాత్యాశ్చ=అమాత్యులు, తథా=మరియు, శతశః=వందలకొలది, బహవః=అనేకులైన, శూరాః=శూరులు, తత్ర= అక్కడ, హేమవర్ణాయామ్=బంగారు వర్ణము గల, సభాయామ్=సభయందు, సర్వార్థస్య= సమస్తకార్యములయొక్క, సుఖాయ వై=సుఖముకొరకు, యథాముఖ్యాః=ముఖ్యుల క్రమమును అనుసరించినవారై, సమీయుః=చేరిరి.

తా. నిశ్చయించిన కార్యములను ఆచరించుటయందు పండితులైన మంత్రులు, సద్గుణవంతులు, అన్నీ తెలిసినవారు, బుద్ధిబలముచేత చూడగలిగినవారు అయిన అమాత్యులు, వందలకొలది ఎందరో శూరులు సకల కార్యమును సుఖముగా నిర్ణయించుటకై అక్కడ బంగారువర్ణము గల సభకు వారి వారి అధికారక్రమమును పాటించుచు వచ్చి చేరిరి. 26, 27

మూ. తతో మహాత్మా విపులం సుయుగ్యం
రథం వరం హేమవిచిత్రితాఙ్గమ్,
శుభం సమాస్థాయ యయౌ యశస్వీ
విభీషణః సంసదమగ్రజస్య. 28

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడైన, యశస్వీ=కీర్తి గల, విభీషణః=విభీషణుడు, విపులమ్=విశాలము, సుయుగ్యమ్=మంచి గుఱ్ఱములు

గలది, హేమవిచిత్రితాఙ్గమ్=బంగారముచేత చిత్రవర్ణము కలదిగా చేయబడిన అవయవములు (ఆ యా భాగములు) కలది, శుభమ్=మంగళప్రదము అయిన, వరమ్=శ్రేష్ఠమైన, రథమ్=రథమును, అస్థాయ=అధిష్ఠించి, అగ్రజస్య=అన్నగారి యొక్క, సంసదమ్=సభను గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. పిమ్మట, కీర్తిశాలి, మహాత్ముడు అయిన విభీషణుడు విశాలము, మంచి గుఱ్ఱములు కట్టినది, బంగారముచేత చిత్రితమైన ఆ యా భాగములు కలది, మంగళప్రదము శ్రేష్ఠము అయిన రథమునెక్కి అన్నగారి సభకు వెళ్లెను.

మూ. స పూర్వజాయావరజః శశంస
నామాథ పశ్చాచ్చరణౌ వవన్దే,
శుకః ప్రహస్తశ్చ తథైవ తేభ్యో
దదౌ యథార్హం పృథగాసనాని. 29

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సః=ఆ, అవరజః=తమ్ముడు, పూర్వజాయ=అన్నగారికి, నామ=తనపేరును, శశంస=చెప్పెను. పశ్చాత్=పిమ్మట, చరణౌ=పాదములను, వవన్దే=నమస్కరించెను. శుకః=శుకుడు, ప్రహస్తశ్చ=ప్రహస్తుడూ కూడ, తథైవ=అట్లే (నమస్కరించిరి). తేభ్యః=వారికి, యథార్హమ్=తగువిధముగా, ఆసనాని=ఆసనములను, పృథక్=వేరువేరుగా, దదౌ=ఇచ్చెను.

తా. తమ్ముడైన విభీషణుడు అన్నగారికి తన పేరు చెప్పుచు పాదాభివందనము చేసెను. శుకుడు, ప్రహస్తుడూ కూడ అట్లే చేసిరి. అప్పుడా రావణుడు వారందరికీ యోగ్యతానుసారముగా వేరు వేరు ఆసనములను చూపి కూర్చుండు డని ఆజ్ఞాపించెను. 29

మూ. సువర్ణనానామణిభూషణానాం
సువాససాం సంసది రాక్షసానామ్,
తేషాం పరార్ధ్యాగురుచన్దనానాం
స్రజాం చ గన్ధాః ప్రవవుః సమన్తాత్. 30

ప్ర. అ. సంసది=సభయందు, సువర్ణనానామణిభూషణానామ్=బంగారముతోను అనేకవిధములైన మణులతోను చేసిన అలంకారములు గలవారు, సువాససామ్=మంచి వస్త్రములు గలవారు అయిన, తేషాం రాక్షసానామ్=ఆ రాక్షసులయొక్క, పరార్ధ్యాగురుచన్దనానామ్=శ్రేష్ఠమైన అగురుయొక్క చందనము యొక్క, స్రజాం చ=పుష్పమాలలయొక్క, గన్ధాః=సువాసనలు, సమన్తాత్=అంతటా, ప్రవవుః=వీచినవి.

తా. అనేకవిధములైన మణులు పొదిగిన బంగారు అలంకారములు,

మంచి వస్త్రములు ధరించి ఆ సభకు వచ్చిన రాక్షసుల శ్రేష్ఠమైన అగురువు, చందనము సువాసనలు పుష్పమాలల సువాసనలు అంతటా వీచినవి. 30

మూ. న చుక్రుశుర్నానృతమాహ కశ్చి
త్సభాసదో నాపి జజల్పురుచ్చైః,
సంసిద్ధార్థాః సర్వ ఏవోగ్రవీర్యా
భర్తుః సర్వే దదృశుశ్చాననం తే. 31

ప్ర. అ. సభాసదః=సభలో ఉన్నవారు, న చుక్రుశుః=గట్టిగా అరవలేదు. కశ్చిత్=ఒక్కడును, అనృతమ్= అసత్యమును, న ఆహ=పలుకలేదు. ఉచ్చైః=గట్టిగా, న జజల్పుః అపి=మాటలాడలేదు. సర్వే=వారందరూ, సంసిద్ధార్థాః=సిద్ధమైన కార్యము గలవారు, ఉగ్రవీర్యాః=ఉగ్రమైన పరాక్రమము గలవారు. తే సర్వే=వారందరూ, భర్తుః=ప్రభువుయొక్క, ఆననమ్=ముఖమును, దదృశుః=చూచిరి.

తా. ఆ సభాసదులలో ఏ ఒక్కరూ గట్టిగా మాటలాడుట గాని, అరచుట గాని చేయలేదు. అసత్యము పలుకలేదు. అందరూ కార్యములను సాధించినవారే. అందరూ భయంకరమైన పరాక్రమము కలవారే. అందరూ ప్రభువు ముఖము చూచుచు కూర్చుండిరి. 31

మూ. స రావణః శస్త్రభృతాం మనస్వినాం
మహాబలానాం సమితౌ మనస్వీ,
తస్యాం సభాయాం ప్రభయా చకాశే
మధ్యే వసూనామివ వజ్రహస్తః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకాదశః సర్గః.

ప్ర. అ. తస్యామ్=ఆ, సభాయామ్=సభయందు, మనస్వీ=ఉత్తమమైన మనస్సు గల (ఆత్మాభిమానముగల), సః రావణః=ఆ రావణుడు, శస్త్రభృతామ్=ఆయుధములను ధరించిన, మనస్వినామ్= ఆత్మాభిమానవంతులైన, మహాబలానామ్=గొప్ప బలము గల ఆ రాక్షసులయొక్క, సమితౌ=సముదాయమునందు, వసూనామ్=వసువులయొక్క, మధ్యే=మధ్యయందు, వజ్రహస్తః ఇవ=దేవేంద్రుడు వలె, ప్రభయా=కాంతిచేత, చకాశే=ప్రకాశించెను.

తా. ఆత్మాభిమానవంతుడైన ఆ రావణుడు ఆ సభలో, ఆయుధములను ధరించిన ఆత్మాభిమానవంతులైన, మహాబలశాలులైన ఆ రాక్షసుల సమూహములో వసువుల మధ్య దేవేంద్రుడు వలె కాంతితో ప్రకాశించెను. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో
పదకొండవసర్గ సమాప్తము.

# అథ ద్వాదశః సర్గః

[నగరరక్షణాదికమునకు తగు సంవిధానము చేయవలె నని, నిద్రనుండి లేచిన కుంభకర్ణునకు ఈ వృత్తాంతము నంతా చెప్పవలె నని రావణుడు ప్రహస్తుని ఆదేశించుట.]

మూ. స తాం పరిషదం కృత్స్నాం సమీక్ష్య సమితింజయః,
ప్రబోధయామాస తదా ప్రహస్తం వాహినీపతిమ్. 1

ప్ర. అ. తదా=అప్పుడు, సమితింజయః=యుద్ధములో జయించు, సః=ఆ రావణుడు, కృత్స్నామ్= సమస్తమైన, తాం పరిషదమ్=ఆ పరిషత్తును, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, వాహినీపతిమ్= సేనాపతియైన, ప్రహస్తమ్=ప్రహస్తుని, ప్రబోధయామాస=తెలిపెను (ఆజ్ఞాపించెను).

తా. అప్పుడు యుద్ధములలో విజయమును పొందు ఆ రావణుడు ఆ పరిషత్తును అంతా చూచి, సేనాపతియైన ప్రహస్తుని ఇట్లు ఆజ్ఞాపించెను. 1

మూ. సేనాపతే యథా తే స్యుః కృతవిద్యాశ్చతుర్విధాః,
యోధా నగరరక్షాయాం తథా వ్యాదేష్టుమర్హసి. 2

ప్ర. అ. సేనాపతే=సేనాపతీ ! చతుర్విధాః=నాలుగువిధములైన, కృతవిద్యాః=చేయబడిన, (నేర్పబడిన) విద్య గల, తే=ఆ, యోధాః=యోధులు, నగరరక్షాయామ్=నగరముయొక్క రక్షణమునందు, యథా=ఎట్లు, స్యుః= ఉందురో, తథా=అట్లు, వ్యాదేష్టుమ్=ఆజ్ఞాపించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. సేనాపతీ ! సుశిక్షితులైన ఆ చతుర్విధయోధులు, (చతురంగ సైన్యమునకు సంబంధించిన యోధులు) నగరరక్షయందు జాగరూకులై ఉండునట్లు ఆజ్ఞాపింపుము. 2

మూ. స ప్రహస్తః ప్రతీతాత్మా చికీర్షన్ రాజశాసనమ్,
వినిక్షిపద్ బలం సర్వం బహిరన్తశ్చ మన్దిరే. 3

ప్ర. అ. ప్రతీతాత్మా=సావధానచిత్తుడైన, సః=ఆ, ప్రహస్తః=ప్రహస్తుడు, రాజశాసనమ్=రాజాజ్ఞను, చికీర్షన్=చేయగోరుచున్నవాడై, మన్దిరే=గృహమునందు, బహిః=వెలుపల, అన్తశ్చ=లోపల, సర్వమ్= సమస్తమైన, బలమ్=సైన్యమును, వినిక్షిపత్=ఉంచెను.

తా. సావధానచిత్తుడైన ప్రహస్తుడు రాజాజ్ఞ ప్రకారము, గృహము వెలుపల, లోపల కూడ సైన్యము నంతయూ ఉంచెను. 3

మూ. తతో విక్షిప్య బలం సర్వం నగరగుప్తయే,
ప్రహస్తః ప్రముఖే రాజ్ఞో నిషసాద జగాద చ. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రహస్తః=ప్రహస్తుడు, సర్వమ్=సమస్తమైన, బలమ్=సేనను, నగరగుప్తయే=నగరరక్షణముకొరకు, విక్షిప్య=ఉంచి, రాజ్ఞః=రాజుయొక్క, ప్రముఖే=ఎదుట, నిషసాద= కూర్చుండెను. జగాద చ=పలికెను కూడ.

తా. పిమ్మట ప్రహస్తుడు సైన్యమునంతను నగరరక్షణముకొరకై నిలిపి రాజు ఎదుట కూర్చుండి ఇట్లు పలికెను. 4

మూ. విహితం బహిరన్తశ్చ బలం బలవతస్తవ,
కురుష్వావిమనాః క్షిప్రం యదభిప్రేతమస్తి తే. 5

ప్ర. అ. బలవతః=బలవంతుడైన, తవ=నీయొక్క, బలమ్=సైన్యము, బహిః=వెలుపల, అన్తశ్చ=లోపల, విహితమ్=ఏర్పరుపబడినది. అవిమనాః=వికారము లేని మనస్సు కలవాడవై, తే=నీకు, యత్=ఏది, అభిప్రేతమ్= ఇష్టము, అస్తి=ఉన్నదో దానిని, క్షిప్రమ్=శీఘ్రముగా, కురుష్వ=చేయుము.

తా. బలవంతుడవైన నీ సైన్యమును లోపల వెలుపల కూడ నిలిపితిని. ఇప్పుడు ఏ వికారమూ లేనివాడవై నీ కిష్టమైన పనిని చేయుము.5

మూ. ప్రహస్తస్య వచః శ్రుత్వా రాజా రాజ్యహితైషిణః,
సుఖేప్సుః సుహృదాం మధ్యే వ్యాజహార స రావణః. 6

ప్ర. అ. రాజా=రాజైన, సః=ఆ, రావణః=రావణుడు, రాజ్యహితైషిణః=రాజ్యముయొక్క హితమును కోరు, ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, సుఖేప్సుః=సుఖమును పొంద దలచినవాడై, సుహృదామ్=మిత్రులయొక్క, మధ్యే=మధ్యయందు, వ్యాజహార=పలికెను.

తా. రాక్షసరాజైన ఆ రావణుడు రాజ్యము హితమును కోరు ప్రహస్తుని మాటలు విని సుఖమును పొందగోరుచున్నవాడై, మిత్రుల మధ్య ఇట్లు పలికెను. 6

మూ. ప్రియాప్రియే సుఖం దుఃఖం లాభాలాభే హితాహితే,
ధర్మకామార్థకృచ్ఛ్రేషు యూయమర్హథ వేదితుమ్. 7

ప్ర. అ. యూయమ్=మీరు, ధర్మకామార్థకృచ్ఛ్రేషు=ధర్మమునకు, కామమునకు, అర్థమునకు సంబంధించిన కష్టములయందు, ప్రియాప్రియే=ప్రియమును అప్రియమును, సుఖమ్=సుఖమును, దుఃఖమ్=దుఃఖమును, లాభాలాభే=లాభమును

నష్టమును, హితాహితే=హితమును అహితమును, వేదితుమ్=తెలిసికొనుటకు, అర్హథ=తగి ఉన్నారు.

తా. ధర్మార్థకామములకు సంబంధించిన కష్టము లేర్పడినప్పుడు ఏది ప్రియమో ఏది అప్రియమో, ఏది సుఖమో ఏది దుఃఖమో, ఏది లాభమో ఏది నష్టమో, ఏది హితమో ఏది అహితమో మీరు బాగుగా నిర్ణయింపగలరు. 7

మూ. సర్వకృత్యాని యుష్మాభిః సమారబ్ధాని సర్వదా,
మన్త్రకర్మనియుక్తాని న జాతు విఫలాని మే. 8

ప్ర. అ. సర్వదా=ఎల్లప్పుడు, యుష్మాభిః=మీచేత, సమారబ్ధాని=ప్రారంభింపబడిన, మన్త్రకర్మనియుక్తాని=ఆలోచనాపూర్వకముగా చేయబడిన, మే=నాయొక్క, సర్వకృత్యాని= సమస్తకృత్యములు, జాతు=ఎన్నడును, న విఫలాని=విఫలములు కాలేదు.

తా. ఎల్లప్పుడు మీరు ప్రారంభించి ఆలోచనాపూర్వకముగా నిర్వహించిన నా కార్యము లేవీ ఎన్నడూ వ్యర్థము కాలేదు. 8

మూ. ససోమగ్రహనక్షత్రైర్మరుద్భిరివ వాసవః,
భవద్భిరహమత్యర్థం వృతః శ్రియమవాప్నుయామ్ . 9

ప్ర. అ. ససోమగ్రహనక్షత్రైః=చంద్రునితోను, గ్రహములతోను, నక్షత్రములతోను కూడిన, మరుద్భిః=దేవతలతో, వాసవః ఇవ=దేవేంద్రుడు వలె, భవద్భిః=మీతో, వృతః= కూడిన, అహమ్=నేను, అత్యర్థమ్=మిక్కిలి, శ్రియమ్=ఐశ్వర్యమును, అవాప్నుయామ్=పొందెదను.

తా. చంద్రగ్రహనక్షత్రములు, ఇతరదేవతలు చుట్టూ ఉన్న దేవేంద్రుడు వలె, మీరందరూ చుట్టూ ఉన్న నేను మిక్కిలి ఐశ్వర్యమును పొందగలను. 9

మూ. అహం తు ఖలు సర్వాన్వః సమర్థయితుముద్యతః,
కుమ్భకర్ణస్య తు స్వప్నాన్నేమమర్థమచోదయమ్. 10

ప్ర. అ. అహమ్=నేను, వః=మిమ్ములను, సర్వాన్=అందరినీ, సమర్థయితుమ్=గుర్తుచేయుటకు, ఉద్యతః=ఉద్యుక్తుడను. కుమ్భకర్ణస్య తు= కుంభకర్ణునకైతే, స్వప్నాత్=నిద్రవలన, ఇమమ్=ఈ, అర్థమ్=విషయమును, న అచోదయమ్=తెలుపలేదు.

తా. నేను మీకందరికీ మరల గుర్తుచేయుటకు ప్రయత్నించుచున్నాను. కుంభకర్ణునకు మాత్రము అతడు నిద్రలో ఉండుటచేత పూర్వము ఈ విషయమును తెలుపలేదు. 10

మూ. అయం హి సుప్తః షణ్మాసాన్ కుమ్భకర్ణో మహాబలః,
సర్వశస్త్రభృతాం ముఖ్యః స ఇదానీం సముత్థితః. 11

ప్ర. అ. సర్వశస్త్రభృతామ్=సమస్తమైన శస్త్రధారులలో, ముఖ్యః=ముఖ్యుడైన, అయమ్=ఈ, మహాబలః=గొప్ప బలముగల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, షట్ మాసాన్=ఆరు మాసములను, సుప్తః హి=నిద్రించినవాడు కదా! సః=అతడు, ఇదానీమ్=ఇప్పుడు, సముత్థితః=లేచినవాడు.

తా. గొప్ప బలము గలవాడు, ఆయుధములను పట్టిన వీరులందరిలో ముఖ్యుడు అయిన కుంభకర్ణుడు ఆరు మాసములు నిద్రించి ఇప్పుడు లేచి ఉన్నాడు. 11

మూ. ఇయం చ దణ్డకారణ్యాద్రామస్య మహిషీ ప్రియా,
రక్షోభిశ్చరితోద్దేశాదానీతా జనకాత్మజా. 12

ప్ర. అ. రామస్య=రామునియొక్క, ప్రియా=ప్రియురాలైన, మహిషీ=భార్యయైన, ఇయమ్=ఈ, జనకాత్మజా=సీత, రక్షోభిః=రాక్షసులచేత, చరితోద్దేశాత్=సంచరించబడిన ప్రదేశము గల, దణ్డకారణ్యాత్=దండకారణ్యమునుండి, ఆనీతా=తీసుకొని రాబడినది.

తా. రాముని ప్రియురాలైన భార్యయైన సీతను రాక్షసులు సంచరించు దండకారణ్యమునుండి తీసికొని వచ్చితిని. 12

మూ. సా మే న శయ్యామారోఢుమిచ్ఛత్యలసగామినీ,
త్రిషు లోకేషు చాన్యా మే న సీతాసదృశీ మతా. 13

ప్ర. అ. అలసగామినీ=మందముగా నడుచు, సా=ఆమె, మే=నాయొక్క, శయ్యామ్=శయ్యను, ఆరోఢుమ్=ఎక్కుటకు, న ఇచ్ఛతి=ఇచ్ఛయించుటలేదు. త్రిషు=మూడు, లోకేషు=లోకములలో, అన్యా=మరియొక స్త్రీ, సీతాసదృశీ=సీతతో సమానురాలుగా, మే=నాకు, న మతా=అంగీకరింపబడినది కాదు.

తా. మందగామిని యైన ఆ సీత నా శయనమును ఎక్కుటకు అంగీకరించుట లేదు. ఈ మూడులోకాలలోను సీతతో సమానురాలు మరొక స్త్రీ ఉన్నదని నేను భావించను. 13

మూ. తనుమధ్యా పృథుశ్రోణీ శరదిన్దునిభాననా,
హేమబిమ్బనిభా సౌమ్యా మాయేవ మయనిర్మితా. 14

ప్ర. అ. తనుమధ్యా=సన్నని నడుముగలది, పృథుశ్రోణీ=పెద్దదైన పిరు

దులు గలది, శరభిన్దునిభాననా=శరత్కాలచన్ద్రునితో సమానమైన ముఖము గలది, హేమబిమ్బనిభా=బంగారు ప్రతిమతో సమానురాలు, సౌమ్యా=సౌమ్యురాలు, మయనిర్మితా=మయునిచేత నిర్మింపబడిన, మాయేవ=మాయవలె ఉన్నది.

తా. ఆమె నడుము సన్ననిది. కటిప్రదేశము విశాలము. ముఖము శరత్కాలచన్ద్రుని వలె ఉన్నది. బంగారు ప్రతిమ వలె ఉన్న ఆమె మయుడు నిర్మించిన మాయ వలె ఉన్నది. 14

మూ. సులోహితతలౌ శ్లక్ష్ణౌ చరణౌ సుప్రతిష్ఠితౌ,
దృష్ట్వా తామ్రనఖౌ తస్యా దీప్యతే మే శరీరజః. 15

ప్ర. అ. సులోహితతలౌ=బాగా ఎఱ్ఱనైన అడుగు భాగములు గలవి, శ్లక్ష్ణౌ=మృదువుగా ఉన్నవి, సుప్రతిష్ఠితౌ=బాగుగా నేలమీద ఆనునవి, తామ్రనఖౌ=ఎఱ్ఱని గోళ్లు గలవి అయిన, తస్యాః=ఆమెయొక్క, చరణౌ=పాదములను, దృష్ట్వా=చూచి, మే= నాయొక్క, శరీరజః=మన్మథుడు, దీప్యతే=వృద్ధిపొందుచున్నాడు.

తా. మృదువైన ఆమె పాదముల అడుగు భాగములు చాలా ఎఱ్ఱగా ఉన్నవి. నేలపై చక్కగా ఆను ఆ పాదముల గోళ్లు ఎఱ్ఱగా ఉన్నవి. అట్టి పాదములను చూచి నా కామము వృద్ధిపొందుచున్నది. 15

మూ. హుతాగ్నిరర్చిఃసంకాశామేనాం సౌరీమివ ప్రభామ్,
ఉన్నసం విమలం వల్గు వదనం చారులోచనమ్, 16
పశ్యంస్తదవశస్తస్యాః కామస్య వశమేయివాన్.

ప్ర. అ. హుతాగ్నిరర్చిఃసంకాశామ్=హోమము చేయుబడిన అగ్నియొక్క జ్వాలతో సమానురాలైన, సౌరీమ్=సూర్యసంబంధమైన, ప్రభామివ=కాంతివలె ఉన్న, ఏనామ్=ఈమెను, ఉన్నసమ్=ఎత్తైన ముక్కు గల, విమలమ్=నిర్మలమైన, వల్గు=సుందరమైన, చారులోచనమ్=అందమైన నేత్రములుగల, తస్యాః=ఆమె యొక్క, తత్=ఆ, వదనమ్= ముఖమును, పశ్యన్=చూచుచు, అవశః=నావశములో లేనివాడనై, కామస్య= కామముయొక్క, వశమ్=వశమును, ఏయివాన్=పొందితిని.

తా. హోమము చేసినప్పుడు బయలుదేరిన అగ్నిజ్వాల వలె, సూర్య కిరణమువలె ఉన్న ఈమెను, ఎత్తైన ముక్కుతో, అందమైన నేత్రములతో సుందరముగా నిర్మలముగా ఉన్న ఈమె ముఖమును చూడగానే కామమునకు వశుడను అయితిని. 16

మూ. క్రోధహర్షసమానేవ దుర్వర్ణకరణేవ చ, 17
శోకసంతాపనిత్యేవ కామేన కలుషీకృతః.

ప్ర. అ. క్రోధహర్షసమావేశ=క్రోధమునందు, సంతోషమునందు సమానము, దుర్వర్ణకరణేన చ=చెడ్డవర్ణమును కలిగించునది, శోకసంతాపవి ధ్వేన=శోకసమయమునందు, సంతాపము కలిగిన సమయమునందూ కూడ విశ్వము అయిన, కామేన=కామముచేత, కలుషీకృతః=కలుషము చేయబడితిని.

తా. ఈ కామము నన్ను క్రోధసమయమునందు, సంతోషసమయ మునందు, శోకసమయమునందు, సంతాపసమయమునందు కూడ సమముగా విశ్వమూ వెంటాడుచున్నది. అట్టి కామముతో నిండి ఉన్నాను 17

మూ. సా తు సంవత్సరం కాలం మామయాచత భామినీ. 18
ప్రతీక్షమాణా భర్తారం రామమాయతలోచనా,
తన్మయా చారునేత్రాయాః ప్రతిజ్ఞాతం వచః శుభమ్. 19
శ్రాన్తోఽహం సతతం కామాద్యాతో హయ ఇవాధ్వని.

ప్ర. అ. భర్తారమ్=భర్తయైన, రామమ్=రామున్ని, ప్రతీక్షమాణా= ఎదురుచూచుచున్న, ఆయతలోచనా=విశాలములైన నేత్రములు గల, సా=ఆ, భామినీ=సీత, మామ్=నన్ను, సంవత్సరం కాలమ్=సంవత్సరకాలమును, అయా చత=కోరెను. మయా=నాచేత, చారునేత్రాయాః=సుందరములైన నేత్రములు గల ఆమెయొక్క, శుభమ్= శుభమైన, తత్=ఆ, వచః=వచనము, ప్రతిజ్ఞాతమ్=అంగీక రింపబడినది. సతతమ్= అవిచ్ఛిన్నముగా, అధ్వని=మార్గమునందు, యాతః=వెళ్ళిన, హయః ఇవ= గుఱ్ఱము వలె, అహమ్=నేను, కామాత్=కామమువలన, శ్రాన్తః= అలసిపోయినాను.

తా. విశాలనేత్రియైన ఆ సీత భర్తకొరకై ఎదురుచూచుచు, ఒక సంవత్సరము కాలము ఇమ్మని నన్ను కోరినది. సుందరములైన నేత్రములు గల ఆమె శుభవచనమును నేను అంగీకరించితిని. ఆగకుండా పరుగెత్తిన గుఱ్ఱమువలె నేను కామమువలన చాల అలసిపోయి ఉన్నాను.

వి. ఈ శ్లోకము సీత చరిత్రకు చాలా విరుద్ధముగా ఉన్నది. సభ్యులను తప్పుదారి పట్టించుటకు, రావణుడు తానే ఇచ్చిన గడువును సీత అడుగగా ఇచ్చినట్లు చెప్పినాడని సమర్థించుకొనవలెను. ఇంత స్పష్టంగా తన దురుద్దేశ్యమును నిర్భయముగా పైకి చెప్పవానికి ఆ రాక్షసులకు భయపడవలసిన పని ఏమున్నది ? ఏమైనా ఈ శ్లోకము చాల అసంగతము. వాస్తవానికి ఈ ఘట్టంలో ప్రాచ్యపాఠానికి, దాక్షిణాత్యపాఠానికి చాలా భేదము ఉన్నది. రావణుడు మొదట మంత్రులతో మంత్రణములు చేసినట్లు, విభీషణుడు చేసిన ఉపదేశమును వినకుండా వెళ్ళిపోయినట్లు, మరల విభీషణుడు రావణుని ఇంటికి

వెళ్లి దుశ్శకునాదులను వర్ణించి చెప్పి అతనికి మరల ఉపదేశించినట్లు, రెండవసారి పురములోని రాక్షసు లందరిని సభకు పిలిపించి రావణుడు వారికి విషయమును తెలిపినట్లు, కుంభకర్ణుడు కూడ సభకు వచ్చినట్లు, ఈ పాఠములో ఉన్నది. కాని ప్రాచ్యపాఠములో రావణుడు ఒకేసారి మంతనాలు జరిపినట్లున్నది. విభీషణుడు చేసిన దుశ్శకునవర్ణనాదికము, రావణుని సభాగమనవర్ణనము, సీతవిషయమై రావణుడు తన కామమును వ్యక్తీకరించుచు పలికిన ఈ మాటలు, కుంభకర్ణుని మాటలు, విభీషణుని ఉపదేశ మున్న 14వ సర్గ, ఇంద్రజిత్తుకు విభీషణునికి మధ్యసంవాదము-ఇవి ప్రాచ్యపాఠములో లేవు. రావణుడు మంత్రుల సభలో రాజధర్మాలను గూర్చి దీర్ఘముగా ఉపన్యసించి తాపసుడుగా ఉండవలసిన రాముడు భార్యాసహితుడై ఉండుట, రాక్షసులను చంపుట అను అధర్మకార్యములు చేసినాడు గాన తాను సీతను అపహరించవలసివచ్చిన దని దోష మంతా రామునిదే అన్నట్లు చెప్పెను. ఇతర మంత్రులు అతనిని సమర్థించుదురు. "ఏదో విధముగా రావణుని మనస్సు మార్చుము" అని తల్లి కోరి ఉండుటచే విభీషణుడు మూడునాలుగు పర్యాయములు ఆ పరిషత్తులోనే రావణునికి ఉపదేశించును. చివరికి రావణుడు కోపముతో కత్తి తీసి విభీషణున్ని కాలితో తన్ని ఆసనమునుండి క్రిందికి పడద్రోసి చంపుటకు ప్రయత్నించగా ప్రహస్తుడు నివారించును. అప్పుడు విభీషణుడు రాముని శరణుపొందును. రెండవ సమావేశంలో పౌరులను పిలిపించినట్లు దాక్షిణాత్యపాఠములో ఉన్నదిగాని ఒక్క పౌరుడు కూడ మాటలాడినట్లు లేదు. అందుచేతను ఇంకా కొన్ని కారణాంచేతను ప్రాచ్యపాఠము బాగున్నట్లు తోచుచున్నది. 18,19

మూ. కథం సాగరమక్షోభ్యం తరిష్యన్తి వనౌకసః, 20
బహుసత్త్వసమాకీర్ణం తౌ వా దశరథాత్మజౌ.

ప్ర. అ. అక్షోభ్యమ్=క్షోభింప శక్యము కాని, బహుసత్త్వసమాకీర్ణమ్=అనేక మృగములతో నిండిన, సాగరమ్=సముద్రమును, వనౌకసః=వానరులు కాని, తౌ=ఆ, దశరథాత్మజౌ వా=రామలక్ష్మణులు కాని, కథమ్=ఎట్లు, తరిష్యన్తి=దాటగలరు ?

తా. అనేక జంతువులతో వ్యాప్తమైన క్షోభింప శక్యము కాని సముద్రమును వానరులు కాని, ఆ రామలక్ష్మణులు కాని ఎట్లు దాటగలరు ? 20

మూ. అథవా కపినైకేన కృతం నః కదనం మహత్, 21
దుర్జ్ఞేయాః కార్యగతయో బ్రూత యస్య యథామతి.

ప్ర. అ. అథవా=లేదా, ఏకేన=ఒక, కపినా=వానరునిచేత, నః=

మనయొక్క, మహత్=గొప్ప, కదనమ్=హింస, కృతమ్=చేయబడినది. కార్యగతయః=కార్యముల గతులు, దుర్జ్ఞేయాః=తెలియ శక్యము కానివి. యుష్మ=ఎవనికి, యథామతి=బుద్ధిని అనుసరించి, ఏది తోచునో దానిని, బ్రూత=చెప్పుడు.

తా. లేదా, ఒక్క వానరుడు వచ్చి మనకు చాల నష్టము చేసినాడు. అందువేత, ఎప్పు డేమి జరుగునో తెలిసికొనుట కష్టము. మీ మీ బుద్ధి ననుసరించి ఏమి చేయవలెనో చెప్పుడు. 21

మూ. మానుషాన్నో భయం నాస్తి తథాపి తు విమృశ్యతామ్, 22
తదా దేవాసురే యుద్ధే యుష్మాభిః సహితో ఉజయమ్,
తే మే భవన్తశ్చ తథా సుగ్రీవప్రముఖాన్ హరీన్. 23
పరే పారే సముద్రస్య పురస్కృత్య నృపాత్మజౌ,
సీతాయాః పదవీం ప్రాప్య సంప్రాప్తౌ వరుణాలయమ్. 24

ప్ర. అ. మానుషాత్=మనుష్యునివలన, నః=మనకు, భయమ్=భయము, నాస్తి =లేదు. తథాపి=అయినను, విమృశ్యతామ్=విమర్శింపబడుగాక. తదా=అప్పుడు, దేవాసురే యుద్ధే=దేవాసురయుద్ధమునందు, యుష్మాభిః=మీతో, సహితః=కూడిన వాడనై, అజయమ్=జయించితిని. మే=నాకు సంబంధించిన, తే=ఆ, భవన్తశ్చ=మీరు కూడ, తథా=అట్లు జయించితిరి. నృపాత్మజౌ=రాజకుమారులైన రామలక్ష్మణులు, సీతాయాః= సీతయొక్క, పదవీమ్=స్థానమును, ప్రాప్య=పొంది (తెలిసికొని), సుగ్రీవప్రముఖాన్= సుగ్రీవుడు మొదలైన, హరీన్=వానరులను, పురస్కృత్య=ముందు ఉంచుకొని, సముద్రస్య=సముద్రముయొక్క, పరే పారే=అవతలి ఒడ్డున, వరుణాలయమ్= సముద్రమును, సంప్రాప్తౌ=పొందినారు.

తా. మనుష్యునివలన మనకేమీ భయము లేదు. అయినను మీరు ఆలోచించండి. పూర్వము నేను మీతో కలిసి దేవాసురయుద్ధములో దేవతలను జయించినాను. మీరు కూడ జయించినారు. రామలక్ష్మణులు సీత జాడ తెలిసికొని సుగ్రీవాదివానరులతో కలిసి సముద్రము అవతలితీరమునందు, సముద్ర సమీపమునకు వచ్చినారు. 22 - 24

మూ. అదేయా చ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ,
భవద్భిర్మన్త్ర్యతాం మన్త్రః సునీతం చాభిధీయతామ్. 25

ప్ర. అ. యథా=ఎట్లు, సీతా=సీత, అదేయా=ఇవ్వదగనిదో (ఇవ్వనంసి ఉండదో), దశరథాత్మజౌ=రామలక్ష్మణులు, వధ్యౌ చ=చంపదగినవారో, (ఆ విధముగా), భవద్భిః= మీచేత, మన్త్రః=ఆలోచన, మన్త్ర్యతామ్=చేయబడుగాక. సునీతమ్=బాగుగా ఆలోచింపబడిన విషయము, అభిధీయతాం చ=చెప్పబడుగాక.

తా. సీతను ఇవ్వకుండగా ఎట్లు ఉండగలమో, రామలక్ష్మణులను ఎట్లు చంపగలమో బాగుగా ఆలోచించి చెప్పుడు. 25

మూ. న హి శక్తిం ప్రపశ్యామి జగత్యన్యస్య కస్యచిత్,
సాగరం వానరైస్తీర్త్వా నిశ్చయేన జయో మమ. 26

ప్ర. అ. వానరైః=వానరులతో కలిసి, సాగరమ్=సముద్రమును, తీర్త్వా=దాటి (వచ్చుటకు), అన్యస్య=ఇతరునకు, కస్యచిత్=ఎవనికి, శక్తిమ్=శక్తిని, న ప్రపశ్యామి=చూడను. మమ=నాకు, జయః=జయము, నిశ్చయేన=నిశ్చయముచేత కలుగును.

తా. రాక్షసులు తప్ప మరెవ్వరు వానరులతో కలిసి సముద్రము దాటి రాజాలరు. అందుచేత నాకే జయము తప్పక లభింపగలదు. 26

మూ. తస్య కామపరీతస్య నిశమ్య పరిదేవితమ్,
కుమ్భకర్ణః ప్రక్రుద్ధోऽథ వచనం చేదమబ్రవీత్. 27

ప్ర. అ. కామపరీతస్య=కామముతో నిండిన, తస్య=అతనియొక్క, పరిదేవితమ్= ఏడ్పును (ఏడ్పువలె ఉన్న అసంబద్ధప్రలాపమును), నిశమ్య=విని, కుమ్భకర్ణః= కుంభకర్ణుడు, ప్రక్రుద్ధః=కోపించెను. ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్ చ=పలికెను కూడ.

తా. కామార్తుడైన ఆ రావణుని అసంబద్ధప్రలాపమును విని కుంభకర్ణుడు కోపించి ఇట్లు పలికెను. 27

మూ. యదా తు రామస్య సలక్ష్మణస్య
ప్రసహ్య సీతా ఖలు సా ఇహోపనీతా,
సకృత్సమీక్ష్యైవ సునిశ్చితం తదా
భజేత చిత్తం యమునేవ యామునమ్. 28

ప్ర. అ. సలక్ష్మణస్య=లక్ష్మణునితో కూడిన, రామస్య=రామునియొక్క, సీతా=సీత, ప్రసహ్య=బలాత్కారపూర్వకముగా, యదా=ఎప్పుడు, ఇహ=ఇక్కడికి, ఉపనీతా=తీసికొనిరాబడినదో, తదా=అప్పుడే, సకృత్=ఒక్కమారు, సమీక్ష్యైవ=పరిశీలించి చేసి ఉన్నచో, చిత్తమ్=చిత్తము, యమునా=యమున, యామునమ్=యమునా ప్రవాహమును వలె, సునిశ్చితమ్=మంచి నిశ్చయమును, భజేత=పొంది ఉండెడిది.

తా. రాముని భార్యయైన సీతను బలాత్కారపూర్వకముగా ఇక్కడికి తీసికొనివచ్చునప్పుడే నీవు బాగుగా ఆలోచించి ఉన్నచో చిత్తము, యమున

యమునాహ్రదములో చేరినట్లు, ఒక స్థైర్యమును పొంది ఉండెడిది.

వి. ఈ శ్లోకానికి సమన్వయం సరిగా కుదురుట లేదు. కుంభకర్ణుడు సభలో ఉన్నట్లు గాని, అతడు మాటలాడినట్లు గాని ప్రాచ్యపాఠములో లేదని వెనుక చూపి ఉన్నాము. 28

మూ. సర్వమేతన్మహారాజ కృతమప్రతిమం తవ,
విధీయేత సహాస్మాభిరాదావేవాస్య కర్మణః. 29

ప్ర. అ. మహారాజ=మహారాజా ! అస్య=ఈ, కర్మణః=సీతా హరణరూపమైన కర్మయొక్క, ఆదావేవ=ప్రారంభమునందే, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తమైన, కృతమ్=మంత్రణరూపమైన కార్యము, తవ=నీకు (నీచేత), అస్మాభిః సహ=మాతోకూడ, విధీయేత యది=చేయబడిఉన్నట్లయితే, అప్రతిమమ్=సాటిలేనిదిగా ఉండెడిది.

తా. మహారాజా ! నీవు సీతాహరణము చేయుటకు పూర్వమే ఈ మంత్రణమును మాతో కలిసి చేసి ఉన్నచో బాగుండెడిది. 29

మూ. న్యాయేన రాజకార్యాణి యః కరోతి దశానన,
న స సంతప్యతే పశ్చాన్నిశ్చితార్థమతిర్నృపః. 30

ప్ర. అ. దశానన=రావణా ! యః=ఏ, నృపః=రాజు, న్యాయేన=న్యాయముచేత, నిశ్చితార్థమతిః=నిశ్చితమైన కార్యము గల బుద్ధిగలవాడై, రాజకార్యాణి= రాజకార్యములను, కరోతి=చేయునో, సః=అతడు, పశ్చాత్=పిమ్మట, న సంతప్యతే=సంతాపము చెందడు.

తా. రావణా ఏ రాజు కార్యములను న్యాయానుసారముగా నిశ్చయించుకొని చేయునో అతనికి పశ్చాత్తాపము చెందవలసిన పని ఉండదు.

మూ. అనుపాయేన కర్మాణి విపరీతాని యాని చ,
క్రియమాణాని దుష్యన్తి హవీంష్యప్రయతేష్వివ. 31

ప్ర. అ. అనుపాయేన=ఉపాయము లేకుండగా, క్రియమాణాని=చేయబడుచున్న, విపరీతాని=విపరీతమైన, కర్మాణి=కర్మలు, అప్రయతేషు=నియమము లేనివారియందు, హవీంషి ఇవ=హవిస్సుల వలె, దుష్యన్తి=చెడిపోవును.

తా. ఉపాయమును ఆలోచించకుండగా చేసిన కర్మలు విపరీతములైన, అశుచియైనవార్ల ఇచ్చు హవిస్సుల వలె చెడిపోవును. 31

మూ. యః పశ్చాత్పూర్వకార్యాణి కర్మాణ్యభిచికీర్షతి,
పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ. 32

ప్ర. అ. యః=ఎవడు, పూర్వకార్యాణి=ముందు చేయవలసిన, కర్మాణి= కర్మలను, పశ్చాత్=తరువాత, అపరకార్యాణి=తరువాత చేయవలసిన పనులను, పూర్వం చ= ముందుగాను, చికీర్షతి=చేయదలచునో, సః=అతడు, నయానయౌ=నీతిని నీతికానిదానిని, న వేద=ఎరుగడు.

తా. నీతి ఏదో, నీతి కానిది ఏదో తెలియనివాడే ముందు చేయవలసిన పనులు తరువాత, తరువాత చేయవలసిన పనులు ముందు చేయుచుండును.

మూ. చపలస్య తు కృత్యేషు ప్రసమీక్ష్యాధికం బలమ్,
ఛిద్రమన్యే ప్రపద్యన్తే క్రౌఞ్చస్య ఖమివ ద్విజాః. 33

ప్ర. అ. అధికమ్=అధికమైన, బలమ్=బలమును, ప్రసమీక్ష్య=చూచుకొని, కృత్యేషు=కార్యములందు, చపలస్య=చపలుడైనవానియొక్క, ఛిద్రమ్=ఛిద్రమును, క్రౌఞ్చస్య=క్రౌంచపక్షియొక్క, ఖమ్=ఛిద్రమును, ద్విజాః ఇవ=పక్షులు వలె, ప్రపద్యన్తే=పొందుదురు.

తా. అధికమైన బల మున్నది కదా అని కార్యములను చాపల్యముతో చేయువాని ఛిద్రములను (వానిలోని లోపములను) కుమారస్వామి క్రౌంచపర్వతమునకు చేసిన రంధ్రము ద్వారా పక్షులు ప్రయాణము చేసి ఈ మూలనుండి ఆ మూలకు వెళ్లినట్లు ఇతరులు గ్రహించి తద్ద్వారా లాభమును పొందుదురు. 33

మూ. త్వయేదం మహదారబ్ధం కార్య మప్రతిచిన్తితమ్,
దిష్ట్యా త్వాం నావధీద్రామో విషమిశ్రమివామృతమ్. 34

ప్ర. అ. త్వయా=నీచేత, అప్రతిచిన్తితమ్=బాగుగా ఆలోచించబడని, ఇదమ్=ఈ, మహత్=గొప్ప, కార్యమ్=కార్యము, ఆరబ్ధమ్=ప్రారంభించబడినది. విషమిశ్రమ్= విషముతో కలిసిన, ఆమిషమ్ ఇవ=మాంసమువలె, రామః=రాముడు, త్వామ్= నిన్ను, దిష్ట్యా=దైవవశముచేత, నావధీత్=చంపలేదు.

తా. నీవు సరిగా ఆలోచించకుండగా ఈ గొప్ప కార్యమును ప్రారంభించినావు. విషము కలిసిన మాంసము వలె రాముడు, నీ అదృష్టము కొలది నిన్ను చంపలేదు. 34

మూ. తస్మాత్త్వయా సమారబ్ధం కర్మ హ్యప్రతిమం పరైః,
అహం సమీకరిష్యామి హత్వా శత్రూం క్షపానఘ. 35

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా ! తస్మాత్=ఆ కారణమువలన, త్వయా= నీచేత, సత్రైః=శత్రువులతో, సమారబ్ధమ్=ప్రారంభింప బడిన, అప్రతిమమ్=సాటిలేని, కర్మ=పనిని, అహమ్=నేను, తవ=నీయొక్క, శత్రూన్=శత్రువులను, హత్వా=చంపి, సమీకరిష్యామి=సమముగా ఉండునట్లు చేసెదను.

తా. దోషరహితుడవైన రావణా ! అందుచే నీవు శత్రువుల విషయమునందు ప్రారంభించిన ఈ గొప్ప కార్యమును, నేను ఆ శత్రువులను చంపి సరిచేసెదను. 35

మూ. అహముత్సాదయిష్యామి శత్రూంస్తవ నిశాచర,
యది శక్రవివస్వన్తౌ యది పావకమారుతౌ, 36
తావహం యోధయిష్యామి కుబేరవరుణావపి.

ప్ర. అ. నిశాచర=రాక్షసా ! అహమ్=నేను,తవ=నీయొక్క, శత్రూన్=శత్రువులను, ఉత్సాదయిష్యామి=నశింపచేసెదను. శక్రవివస్వన్తౌ=దేవేంద్రుడు సూర్యుడు అయినా, పావకమారుతౌ=అగ్ని వాయువూ అయినా, కుబేరవ రుణావపి=కుబేరుడూ వరుణుడూ అయినా, తౌ=వారిని, అహమ్=నేను, యోధయిష్యామి=యుద్ధము చేయించెదను.

తా. రావణా ! నీ శత్రువులను నేను నశింపచేసెదను. ఆ శత్రువులు ఇంద్రసూర్యులైనా, అగ్నివాయువులైనా, కుబేరవరుణులైనా వారితో యుద్ధము చేసెదను. 36

మూ. గిరిమాత్రశరీరస్య మహాపరిఘయోధినః, 37
నర్దతస్తీక్ష్ణదంష్ట్రస్య బిభీయాద్వై పురన్దరః.

ప్ర. అ. గిరిమాత్రశరీరస్య=పర్వతప్రమాణమైన శరీరము కలవాడను, మహాపరిఘయోధినః= గొప్ప పరిఘతో యుద్ధము చేయుచున్నవాడను, తీక్ష్ణదం ష్ట్రస్య=తీక్షములైన కోరలు కలవాడను, నర్దతః=ధ్వని చేయుచున్నవాడను అయిన నాకు, పురన్దరః=దేవేంద్రుడు కూడ, బిభీయాత్ వై=భయపడును కదా.

తా. పర్వతము వంటి శరీరము, తీక్షమైన కోరలు గల నేను గొప్ప పరిఘను ధరించి యుద్ధము చేయుచు గర్జించుచుండగా దేవేంద్రుడు కూడ భయపడును కదా ! 37

మూ. పునర్మాం స ద్వితీయేన శరేణ నిహనిష్యతి, 38
తతోఽహం తస్య పాస్యామి రుధిరం కామమాశ్వస.

ప్ర. అ. సః=ఆ రాముడు, ద్వితీయేన=రెండవ, శరేణ=బాణ

ముతో, మామ్=నన్ను, పునః=మరల, విహనిష్యతి=కొట్టగలడు. తతః=అంతకంటె పూర్వమే, తస్య=వానియొక్క, రుధిరమ్=రక్తమును, పాస్యామి=త్రాగెదను. కామమ్=మిక్కిలి, ఆశ్వస=ఊరడిల్లుము.

తా. రాముడు నన్నొక బాణముతో కొట్టి మరల రెండవ బాణము ప్రయోగించుటకు పూర్వమే అతని రక్తమును త్రాగివేసెదను. నీవు నిర్భయముగా ఉండుము. 38

మూ. వధేన వై దాశరథేః సుఖావహం
జయం తవాహర్తుమహం యతిష్యే,
హత్వా చ రామం సహ లక్ష్మణేన
ఖాదామి సర్వాన్ హరియూథముఖ్యాన్. 39

ప్ర. అ. దాశరథేః=రామునియొక్క, వధేన=వధచేత, తవ=నీకు, సుఖావహమ్=సుఖమును కలిగించు, జయమ్=జయమును, ఆహర్తుమ్=సంపాదించుటకు, అహమ్=నేను, యతిష్యే=ప్రయత్నించెదను. లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడా, రామమ్=రాముణ్ణి, హత్వా=చంపి, సర్వాన్=సమస్తమైన, హరియూథముఖ్యాన్=వానరనాయకులను, ఖాదామి=తినెదను.

తా. రాముణ్ణి చంపివేసి నీకు సుఖమును కలిగించు జయమును సంపాదించిపెట్టుటకు ప్రయత్నించెదను. రామలక్ష్మణులను చంపిన పిమ్మట వానరనాయకుల నందరిని తినివేసెదను. 39

మూ. రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కార్యాణి హితాని విజ్వరః,
మయా తు రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి. 40

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్వాదశః సర్గః.

ప్ర. అ. కామమ్=స్వేచ్ఛగా, రమస్వ=క్రీడించుము. అగ్ర్యవారుణీమ్=శ్రేష్ఠమైన మద్యమును, పిబ=త్రాగుము. విజ్వరః= పోయిన మనోవ్యథకలవాడవై, హితాని=హితములైన, కార్యాణి=కార్యములను, కురుష్వ=చేయుము. రామే=రాముడు, మయా=నాచేత, యమక్షయమ్= యముని గృహమును, గమితే=పొందింపబడినవాడగుచుండగా, సీతా=సీత, చిరాయ= చిరకాలమునకు, వశగా=వశము చెందునది. భవిష్యతి=కాగలదు.

తా. స్వేచ్ఛగా క్రీడించుము. శ్రేష్ఠమైన మద్యమును సేవించుము. ఏ భయమూ లేనివాడవై హితములైన కార్యములు చేసికొనుము. నేను రాముణ్ణి

చంపివేసిన పిమ్మట సీత చాల కాలము నీ వశురాలై ఉండును. 40

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పండ్రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయోదశః సర్గః

[సీతను బలాత్కారముగా అనుభవింపుము అని మహాపార్శ్వుడు చెప్పగా, బ్రహ్మశాప ముండుటచే అట్లు చేయజాలను అని చెప్పుచు రావణుడు తన పరాక్రమమును ప్రశంసించుకొనుట.]

మూ. రావణం క్రుద్ధమాజ్ఞాయ మహాపార్శ్వో మహాబలః,
ముహూర్త మనుసంచిన్త్య ప్రాఞ్జలిర్వాక్య మబ్రవీత్. 1

ప్ర. అ. రావణమ్=రావణుని, క్రుద్ధమ్=కోపించినవానినిగా, ఆజ్ఞాయ=తెలిసికొని, మహాబలః=గొప్ప బలము గల, మహాపార్శ్వః=మహాపార్శ్వుడు, ముహూర్తమ్=ముహూర్తకాలము, అనుసంచిన్త్య=ఆలోచించి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. కుంభకర్ణుని మాటలకు రావణునకు కోపము వచ్చినట్లు గ్రహించి గొప్ప బలము గల మహాపార్శ్వుడు కొంచెము సేపు ఆలోచించి, అంజలి ఘటించుచు ఇట్లు పలికెను. 1

మూ. యః ఖల్వపి వనం ప్రాప్య మృగవ్యాలనిషేవితమ్,
న పిబేన్మధు సంప్రాప్య స నరో బాలిశో ధ్రువమ్. 2

ప్ర. అ. యః నరః=ఏ నరుడు, మృగవ్యాలనిషేవితమ్=మృగములచేతను దుష్టగజములచేతను సేవింపబడిన, వనమ్=వనమును, ప్రాప్య=పొంది, మధు=మద్యమును (తేనెను), సంప్రాప్య=పొంది, న పిబేత్=త్రాగడో, సః=అతడు, ధ్రువమ్=నిశ్చయముగా, బాలిశః=మూఢుడు.

తా. క్రూరమృగములతో వ్యాప్తమై ప్రవేశింప శక్యము కాని అరణ్యములో ప్రవేశించి మధువును పొందిన పిమ్మట కూడ ఆ మధువును త్రాగనివాడు మూఢుడు. 2

మూ. ఈశ్వరస్యేశ్వరః కోఽస్తి తవ శత్రునిబర్హణ,
రమస్వ సహ వైదేహ్యా శత్రూనాక్రమ్య మూర్ధసు. 3

ప్ర. అ. శత్రునిబర్హణ=శత్రువినాశకుడా! ఈశ్వరస్య=సర్వసమర్థుడవైన, తవ=నీకు, ఈశ్వరః=ఈశ్వరుడు (ప్రభువు), కః=ఎవడు, అస్తి=ఉన్నాడు? శత్రూన్=శత్రువులను, మూర్ధసు=శిరస్సులమీద, ఆక్రమ్య=ఆక్రమించి, వైదేహ్యా సహ=సీతతో కూడ, రమస్వ=క్రీడింపుము.

తా. ఓ! శత్రువినాశకుడా! సర్వసమర్థుడవైన నీకు ప్రభువు ఎవరు? నీవు శత్రువుల శిరస్సులపై పాదముంచి సీతతో కూడ క్రీడింపుము. 3

మూ. బలాత్కుక్కుటవృత్తేన ప్రవర్తస్వ మహాబల,
ఆక్రమ్యాక్రమ్య సీతాం వై తాం భుఙ్క్ష్వ చ రమస్వ చ. 4

ప్ర. అ. మహాబల=గొప్ప బలము కలవాడా ! బలాత్=బలాత్కారమువలన, కుక్కుటవృత్తేన=కోడియొక్క వర్తనలో (కోడిపుంజు కోడిపెట్టను బలాత్కరించినట్లు), ప్రవర్తస్వ=ప్రవర్తింపుము. తాం సీతామ్=ఆ సీతను, ఆక్రమ్య ఆక్రమ్య=ఆక్రమించి ఆక్రమించి, భుఙ్క్ష్వ=అనుభవింపుము. రమస్వ చ=ఆనందింపుము.

తా. ఓ ! మహాబలుడా ! కోడిపుంజు ప్రవర్తించినట్లు ప్రవర్తించి, సీతను బలాత్కారమువేత ఆక్రమించి ఆక్రమించి, అనుభవింపుము; ఆనందింపుము.4

మూ. లబ్ధకామస్య తే పశ్చాదాగమిష్యతి కిం భయమ్,
ప్రాప్తమప్రాప్తకాలం వా సర్వం ప్రతివిధాస్యతే. 5

ప్ర. అ. లబ్ధకామస్య=పొందబడిన కోరిక గల, తే=నీకు, పశ్చాత్=పిదప, కిం భయమ్=ఏమి భయము, ఆగమిష్యతి=రాగలదు? ప్రాప్తమ్=వచ్చినది గాని, అప్రాప్తకాలమ్=ఇంకను రానిదిగాని, సర్వమ్=సమస్తమూ, ప్రతివిధాస్యతే=ప్రతిక్రియ చేయబడగలదు.

తా. నీ కోరిక తీరిన తరువాత ఇంక నీకేమి భయము? అటుపైన ఏమైన ఆపాయము వచ్చినతో దానికి, రానున్నదానికి ప్రతిక్రియ చేసుకొందము. 5

మూ. కుమ్భకర్ణః సహాస్మాభిరిన్ద్రజిచ్చ మహాబలః,
ప్రతిషేధయితుం శక్తౌ సవజ్రమపి వజ్రిణమ్. 6

ప్ర. అ. అస్మాభిః సహ=మాతో కూడ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, మహాబలః=గొప్పబలము గల, ఇన్ద్రజిత్ చ=ఇన్ద్రజిత్తూ, సవజ్రమ్=వజ్రాయుధముతో కూడిన, వజ్రిణమ్ అపి=ఇంద్రుని కూడ, ప్రతిషేధయితుమ్= అడ్డుకొనుటకు, శక్తౌ=సమర్థులు.

తా. కుంభకర్ణుడు, మహాబలశాలియైన ఇంద్రజిత్తు మాతో కలిసి వజ్రాయుధమును ధరించిన ఇంద్రునికూడ ఎదిరించగలరు. 6

మూ. ఉపప్రదానం సాన్త్వం వా భేదం వా కుశలైః కృతమ్,
సమతిక్రమ్య దణ్డేన సిద్ధిమర్థేషు రోచయే. 7

ప్ర.అ. కుశలైః=కార్యములందు నేర్పుగలవారిచేత, కృతమ్=చేయబడిన, ఉపప్రదానమ్=దానమును గాని, సాన్త్వం వా=సామోపాయమును గాని, భేదం

వా=భేదోపాయమును గాని, సముత్క్రమ్య=దాటి (విడచి), అర్థేషు=కార్యముల విషయమునందు, దణ్డేన=దండముచేత, సిద్ధిమ్=కార్యసిద్ధిని, రోచయే=ఇష్టపడుచున్నాను.

తా. కార్యములను సాధించుటకై కొందరు బుద్ధిమంతులు దానమును గాని, సామమును గాని, భేదమును గాని ప్రయోగించుచుందురు. ఆ మూడింటిచేత కాక దండముచేతనే కార్యము సాధించుట నా కిష్టము. 7

మూ. ఇహ ప్రాప్తాన్వయం సర్వాన్ శత్రూంస్తవ మహాబల,
వశే శస్త్రప్రతాపేన కరిష్యామో న సంశయః. 8

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా ! వయమ్=మేము, ఇహ=ఇక్కడికి, ప్రాప్తాన్=వచ్చిన, తవ=నీయొక్క, సర్వాన్=సమస్తమైన, శత్రూన్=శత్రువులను, శస్త్రప్రతాపేన=ఆయుధముల ప్రతాపముచేత, వశే=వశమునందు, కరిష్యామః=చేసెదము. సంశయః=సంశయము, న=లేదు.

తా. ఓ ! మహాబలుడా ! వచ్చిన నీ శత్రువుల నందరినీ మేము ఆయుధబలముచేత వశముచేసికొనగలము; సంశయము లేదు. 8

మూ. ఏవముక్తస్తదా రాజా మహాపార్శ్వేన రావణః,
తస్య సంపూజయన్వాక్యమిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తదా=అప్పుడు, మహాపార్శ్వేన=మహాపార్శ్వునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, రాజా=రాజైన, రావణః=రావణుడు, తస్య=వానియొక్క, వాక్యమ్=వాక్యమును, సంపూజయన్=పూజించుచు, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు మహాపార్శ్వుని మాటలు విని, మెచ్చుకొనుచు ఇట్లు పలికెను. 9

మూ. మహాపార్శ్వ నిబోధ త్వం రహస్యం కించిదాత్మనః,
చిరవృత్తం తదాఖ్యాస్యే యదవాప్తం పురా మయా. 10

ప్ర. అ. మహాపార్శ్వ=మహాపార్శ్వుడా ! ఆత్మనః=నాయొక్క, కించిత్=ఒకానొక, రహస్యమ్=రహస్యమును, నిబోధ=తెలిసికొనుము. పురా=పూర్వము, మయా=నాచేత, యత్=ఏది, అవాప్తమ్=పొందబడినదో, చిరవృత్తమ్=చిరకాలము క్రితము జరిగిన, తత్=దానిని, ఆఖ్యాస్యే=చెప్పెదను.

తా. మహాపార్శ్వుడా ! నాకు సంబంధించిన ఒక రహస్యమును తెలిసికొనుము. పూర్వము చాలకాలము క్రితము జరిగిన, నాకు జరిగిన

విషయమును చెప్పెదను. 10

మూ. పితామహస్య భవనం గచ్ఛన్తీం పుఞ్జికస్థలామ్,
చఞ్చూర్యమాణామద్రాక్షమాకాశేఽగ్నిశిఖామివ. 11

ప్ర. అ. పితామహస్య=బ్రహ్మదేవునియొక్క, భవనమ్=గృహమును గూర్చి, గచ్ఛన్తీమ్=వెళ్లుచున్నది, ఆకాశే=ఆకాశమునందు, చఞ్చూర్యమాణామ్=నక్కి నక్కి పోవుచున్నది, అగ్నిశిఖామివ=అగ్నిశిఖ వలె ఉన్నదీ అయిన, పుఞ్జికస్థలామ్=పుంజికస్థలను, అద్రాక్షమ్=చూచితిని.

తా. అగ్నిశిఖ వలె ప్రకాశించుచున్న పుంజికస్థల అను అప్సరస్త్రీ నన్ను చూచి భయపడి నక్కి నక్కి బ్రహ్మదేవుని గృహమునకు ఆకాశమార్గమున వెళ్లుచుండగా చూచితిని. 11

మూ. సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః,
స్వయంభూభవనం ప్రాప్తా లోలితా నలినీ యథా. 12

ప్ర. అ. వివసనా=వస్త్రరహితురాలుగా, కృతా=చేయబడిన, సా=ఆమె, మయా=నాచేత, ప్రసహ్య=బలాత్కరించి, భుక్తా=అనుభవింపబడినది. తతః=అటు పిమ్మట, లోలితా=నలిపివేయబడిన, నలినీ యథా=పద్మలత వలె, స్వయంభూభవనమ్=బ్రహ్మదేవుని గృహమును గూర్చి, గతా=వెళ్లినది.

తా. నేను ఆమెను వివస్త్రను చేసి బలాత్కారముగా అనుభవించితిని. పిదప ఆమె నలిపివేసిన పద్మలత వలె బ్రహ్మదేవుని గృహమునకు వెళ్లినది.12

మూ. తచ్చ తస్య తదా మన్యే జ్ఞాతమాసీన్మహాత్మనః,
అథ సంకుపితో వేధా మామిదం వాక్యమబ్రవీత్. 13

ప్ర. అ. తదా=అప్పుడు, తచ్చ=అది, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ బ్రహ్మదేవునకు, జ్ఞాతమ్= తెలియబడినది, ఆసీత్=అయెను అని, మన్యే=తలచెదను. అథ=అటుపిమ్మట, సంకుపితః=కోపించిన, వేధాః=బ్రహ్మదేవుడు, మామ్=నన్ను గూర్చి, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడా విషయము మహాత్ముడైన బ్రహ్మదేవునకు తెలిసినదని అనుకొనుచున్నాను. అందుచేతనే ఆ బ్రహ్మదేవుడు కోపించి, నాతో ఇట్లు పలికెను. 13

మూ. అద్యప్రభృతి యామన్యాం బలాన్నారీం గమిష్యసి,
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః. 14

ప్ర. అ. అద్యప్రభృతి=నేడు మొదలుకొని, అన్యామ్=ఇతరురాలైన, యామ్=ఎవ్వరైనా, నారీమ్=స్త్రీని, గమిష్యసి=పొందగలవో, తదా=అప్పుడు, తే=నీ యొక్క, మూర్ధా=శిరస్సు, శతధా=నూరుగా, ఫలిష్యతి= బ్రద్దలవగలదు; సంశయః=సంశయము, న=లేదు.

తా. ఈనాడు మొదలు నీవెవరైన పరస్త్రీని బలాత్కారముగా పొంది నట్లయితే నీ శిరస్సు నూరు ముక్కలుగా బ్రద్దలగును; సందేహము లేదు. 14

మూ. ఇత్యహం తస్య శాపస్య భీతః ప్రసభమేవ తామ్,
నారోహయే బలాత్సీతాం వైదేహీం శయనే శుభే. 15

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, తస్య=అతని, శాపస్య=శాపమునకు, భీతః=భయపడినవాడనై, అహమ్=నేను, వైదేహీమ్=విదేహరాజపుత్రికయైన, తాం సీతామ్=ఆ సీతను, ప్రసభమేవ=తొందరగా, బలాత్=బలాత్కారమువలన, శుభే=సుందరమైన, శయనే=శయనమునందు, నారోహయే=ఎక్కించుటలేదు.

తా. నేను ఈ విధముగా బ్రహ్మ ఇచ్చిన శాపమునకు భయపడి సీతను హఠాత్తుగా బలాత్కరించి నా సుందరమైన శయనముపైకి ఎక్కించుటలేదు.

మూ. సాగరస్యేవ మే వేగో మారుతస్యేవ మే గతిః,
నైతద్దాశరథిర్వేద హ్యాసాదయతి తేన మామ్. 16

ప్ర. అ. మే=నాయొక్క, వేగః=వేగము, సాగరస్యేవ=సాగరముయొక్క వేగము వంటిది. మే=నాయొక్క, గతిః=గమనము, మారుతస్యేవ=వాయువు యొక్క గమనము వంటిది. ఏతద్=దీనిని, దాశరథిః=రాముడు, న వేద= ఎరుగడు. తేన=ఆ కారణముచేత, మామ్=నన్ను, ఆసాదయతి హి=సమీపించుచున్నాడు గదా !

తా. నా వేగము సముద్రవేగము వంటిది. నా గమనము వాయుగమనము వంటిది. రాముడు ఈ విషయమును ఎరుగక పోవుటచేత నామీదికి వచ్చుచున్నాడు. 16

మూ. కో హి సింహమివాసీనం సుప్తం గిరిగుహాశయే,
క్రుద్ధం మృత్యుమివాఽసీనం సంబోధయితుమిచ్ఛతి. 17

ప్ర. అ. గిరిగుహాశయే=పర్వతగుహాప్రదేశమునందు, ఆసీనమ్=కూర్చొని ఉన్న, సుప్తమ్=నిద్రించుచున్న, సింహమ్ ఇవ=సింహమును వలె, ఆసీనమ్=కూర్చొని ఉన్న, క్రుద్ధమ్=కోపించిన, మృత్యుమ్ ఇవ= మృత్యువువలె ఉన్నవానిని, కో

హ=ఎవరు, సంబోధయితుమ్=లేపుటకు, ఇచ్ఛతి=కోరును.

తా. అట్లు కానిచో పర్వతగుహలో నిద్రించుచున్న సింహమును వలె, కోపించి కూర్చున్న మృత్యువును ఎలె నన్ను లేపుటకు ఎవరు ప్రయత్నించును?

మూ. న మత్తో నిర్గతాన్ బాణాన్ ద్విజిహ్వాన్ పన్నగానివ,
రామః పశ్యతి సంగ్రామే తేన మామభిగచ్ఛతి. 18

ప్ర. అ. రామః=రాముడు, మత్తః=నానుండి, నిర్గతాన్=బయలుదేరిన, ద్విజిహ్వాన్=రెండు నాలుకలు గల, పన్నగానివ=సర్పములు వలె ఉన్న, బాణాన్=బాణములను, సంగ్రామే=యుద్ధమునందు, న పశ్యతి=చూడలేరు. తేన=ఆ కారణముచేతనే, మామ్=నన్ను, అభిగచ్ఛతి=ఎదిరించి వచ్చుచున్నాడు.

తా. యుద్ధములో నేను ప్రయోగించిన, రెండు నాల్కల సర్పముల వలె ఉన్న బాణములను రాముడు చూడలేదు. అందుచేతనే నన్ను ఎదిరించుటకై వచ్చుచున్నాడు ! 18

మూ. క్షిప్రం వజ్రసమైర్బాణైః శతశః కార్ముకచ్యుతైః,
రామమాదీపయిష్యామి ఉల్కాభిరివ కుఞ్జరమ్. 19

ప్ర. అ. శతశః=వందల సంఖ్యలో, కార్ముకచ్యుతైః=ధనస్సునుండి బయలుదేరిన, వజ్రసమైః=వజ్రముతో సమానమైన, బాణైః=బాణములచేత, రామమ్=రాముణ్ణి, ఉల్కాభిః=కొరవులచేత, కుఞ్జరమ్ ఇవ=ఏనుగును వలె, క్షిప్రమ్=శీఘ్రముగా, ఆదీపయిష్యామి=ప్రజ్వలింపచేసెదను.

తా. వందల సంఖ్యలో ధనస్సునుండి బయలుదేరిన బాణములచేత, రాముణ్ణి, కొరవులచేత ఏనుగును పీడించినట్లు శీఘ్రముగా పీడించెదను. 19

మూ. తచ్చాస్య బలమాదాస్యే బలేన మహతా వృతః,
ఉదితః సవితా కాలే నక్షత్రాణాం ప్రభామివ. 20

ప్ర. అ. మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, వృతః=కూడిన వాడనై, కాలే=ప్రాతఃకాలమునందు, ఉదితః=ఉదయించిన, సవితా=సూర్యుడు, నక్షత్రాణామ్=నక్షత్రములయొక్క, ప్రభామివ=కాంతిని వలె, అస్య=వీనియొక్క, తత్=ఆ, బలమ్=బలమును. ఆదాస్యే=గ్రహించెదను (అణచివేసెదను).

తా. ప్రాతఃకాలమునందు ఉదయించిన సూర్యుడు నక్షత్రముల కాంతిని అణచివేసినట్లు, నేను, సైన్యముతో కూడినవాడనై అతని బలమును అణచివేసెదను. 20

మూ. న వాసవేనాపి సహస్రచక్షుషా
యుధాస్మి శక్యో వరుణేన వా పునః,
మయా త్వియం బాహుబలేన నిర్జితా
పురా పురీ వైశ్రవణేన పాలితా. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రయోదశః సర్గః.

ప్ర. అ. సహస్రచక్షుషా=వేయి నేత్రములు గల, వాసవేనాపి=దేవేంద్రుని చేత నైనను, వరుణేన వా పునః=వరుణుని చేతనైనను, యుధా=యుద్ధముచేత, న శక్యః అస్మి=శక్యమైనవాడను కాను. పురా=పూర్వము, వైశ్రవణేన=కుబేరుని చేత, పాలితా=పాలించబడిన, ఇయం పురీ=ఈ పట్టణము, మయా=నాచేత, బాహుబలేన= బాహుబలముచేత, నిర్జితా=జయించబడినది.

తా. వేయి నేత్రములు గల దేవేంద్రుడు గాని, వరుణుడు గాని యుద్ధము చేసి నన్ను గెలువజాలరు. పూర్వము కుబేరుడు పాలించిన ఈ లంకాపురమును నేను బాహుబలముచేత జయించినాను. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్దశః సర్గః

[రామబాణములు రాక్షసుల శిరస్సులను ఖండించుటకు పూర్వమే సీతను రామునకు అప్పగించుము అని విభీషణుడు రావణునకు ఉపదేశించుట.]

మూ. నిశాచరేన్ద్రస్య నిశమ్య వాక్యం
స కుమ్భకర్ణస్య చ గర్జితాని,
విభీషణో రాక్షసరాజముఖ్య
మువాచ వాక్యం హితమర్థయుక్తమ్. 1

ప్ర. అ. సః విభీషణః=ఆ విభీషణుడు, నిశాచరేన్ద్రస్య=రాక్షసరాజుయొక్క, వాక్యమ్= వాక్యమును, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, గర్జితాని=గర్జనములను, నిశమ్య=విని, హితమ్=హితము, అర్థయుక్తమ్=అర్థముతో కూడినది అయిన, వాక్యమ్= వాక్యమును, రాక్షసరాజముఖ్యమ్=రాక్షసరాజశ్రేష్ఠుడైన ఆ రావణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. రావణుని మాటలను, కుంభకర్ణుని గర్జితములను విని విభీషణుడు రావణునితో హితము, మంచి అర్థము కలది అయిన వాక్యమును పలికెను. 1

మూ. వృతో హి బాహ్వన్తరభోగరాశి
శ్చిన్తావిషః సుస్మితతీక్ష్ణదంష్ట్రః,
పఞ్చాఙ్గులీపఞ్చశిరోఽతికాయః
సీతామహాహిస్తవ కేన రాజన్. 2

ప్ర. అ. రాజన్=రాజా ! బాహ్వన్తరభోగరాశిః=వక్షఃస్థలమను పడగలపైభాగము గలది, చిన్తావిషః=చింత అను విషము గలది, సుస్మితతీక్ష్ణదంష్ట్రః=మంచి చిరునవ్వు అను తీక్ష్ణములైన కోరలు గలది, పఞ్చాఙ్గులీపఞ్చశిరోఽతికాయః=ఐదు వ్రేళ్లు అను ఐదు శిరస్సులు, విశాలమైన శరీరము కలది అయిన, సీతామహాహిః=సీత అను గొప్ప సర్పము, కేన=ఎవనిచేత, తవ=నీకు, వృతః=చుట్టబడినది.

తా. రాజా ! సీత అను ఈ మహాసర్పాన్ని నీ మెడకు చుట్టబెట్టినవాడు ఎవడు ? దీనికి వక్షఃస్థలమే పడగల విశాలప్రదేశము. చింతయే విషము. చిరునవ్వే కోరలు. ఐదు వ్రేళ్లే ఐదు తలలు. దీని శరీరము చాల పెద్దది. 2

మూ. యావన్న లఙ్కాం సమభిద్రవన్తి
వలీముఖాః పర్వతకూటమాత్రాః,

దంష్ట్రాయుధాశ్చైవ నఖాయుధాశ్చ
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 3

ప్ర. అ. పర్వతకూటమాత్రాః=పర్వతశిఖరముల ప్రమాణము కలవారు, దంష్ట్రాయుధాః= కోరలే ఆయుధములుగా కలవారు, నఖాయుధాశ్చ=నఖములే ఆయుధములుగా కలవారు అయిన, వలీముఖాః=వానరులు, యావత్=ఎంతలో, లఙ్కామ్=లంకనుగూర్చి, న సమభిద్రవన్తి= శీఘ్రముగా రారో అంతలో, దాశరథాయ=రామునకు, మైథిలీ=సీత, ప్రదీయతామ్= ఇవ్వబడుగాక.

తా. కోరలు, గోళ్లు ఆయుధములుగా ఉపయోగించు పర్వతశిఖరప్రమాణవంతులైన వానరులు లంకను ముట్టుముట్టక ముందే సీతను రామునకు ఇచ్చివేయుము. 3

మూ. యావన్న గృహ్ణన్తి శిరాంసి బాణా
రామేరితా రాక్షసపుఙ్గవానామ్,
వజ్రోపమా వాయుసమానవేగాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 4

ప్ర. అ. వజ్రోపమాః=వజ్రముతో సమానములు, వాయుసమానవేగాః=వాయువుతో సమానమైన వేగము గలవి అయిన, రామేరితాః=రామునిచేత ప్రేరేపింపబడిన, బాణాః=బాణములు, రాక్షసపుఙ్గవానామ్=రాక్షసశ్రేష్ఠులయొక్క, శిరాంసి=శిరస్సులను, యావత్=ఎంతలో, న గృహ్ణన్తి=గ్రహించవో, అంతలో, మైథిలీ=సీత, దాశరథాయ=రామునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. వజ్రసమానములైనవి, వాయువు వంటి వేగము గలవి అయిన రాముడు ప్రయోగించిన బాణములు రాక్షసవీరుల శిరస్సులను ఛేదించుటకు ముందే సీతను రామునకు ఇచ్చివేయుము. 4

మూ. న కుమ్భకర్ణోన్ద్రజితౌ చ రాజం
స్తథా మహాపార్శ్వమహోదరౌ వా,
నికుమ్భకుమ్భౌ చ తథాతికాయః
స్థాతుం సమర్థా యుధి రాఘవస్య. 5

ప్ర. అ. రాజన్=రాజా ! కుమ్భకర్ణేన్ద్రజితౌ=కుంభకర్ణుడు గాని ఇంద్రజిత్తు గాని, తథా=మరియు, మహాపార్శ్వమహోదరౌ వా=మహాపార్శ్వుడు గాని మహోదరుడు గాని, నికుమ్భకుమ్భౌ=నికుంభుడు గాని కుంభుడు గాని, తథా=మరియు, అతికాయః= అతికాయుడు కాని, యుధి=యుద్ధమునందు, రాఘవస్య=రామునియెదుట, స్థాతుమ్= నిలచుటకు, సమర్థాః=సమర్థులు, న=కారు.

రా. రాజా ! కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, మహాపార్శ్వుడు, మహోదరుడు, నికుంభుడు, కుంభుడు, అతికాయుడు - వీరిలో ఏ ఒక్కడూ కూడ యుద్ధములో రాముని ఎదుట నిలువజాలడు. 5

మూ. జీవంస్తు రామస్య న మోక్ష్యసే త్వం
గుప్తః సవిత్రాప్యథవా మరుద్భిః,
న వాసవస్యాఙ్కగతో న మృత్యో
ర్నభో న పాతాలమనుప్రవిష్టః. 6

ప్ర. అ. త్వమ్=నీవు, సవిత్రా=సూర్యునిచేత, అథవా=లేక, మరుద్భిః=మరుత్తులచేత, గుప్తః=రక్షింపబడినను, జీవన్=జీవించియుండగా, రామస్య=రాము నకు (రామునిచేత), న మోక్ష్యసే=విడువబడవు. వాసవస్య=దేవేంద్రునియొక్క, అఙ్కగతః= సమీపమును పొందినను, న=విడువబడవు. మృత్యోః=యముని సమీప మునందున్నను, న=విడువబడవు. నభః=ఆకాశమును, పాతాలమ్=పాతాలమును, అనుప్రవిష్టః= ప్రవేశించినను, న=విడువబడవు.

రా. నిన్ను సూర్యుడు గాని, మరుత్తులు గాని రక్షించుచున్నను, నీవు దేవేంద్రునివద్దకు గాని, యమునివద్దకు గాని వెళ్లి వారి రక్షణము కోరినను, ఆకాశమును, పాతాలమును ప్రవేశించినను నిన్ను రాముడు ప్రాణములతో విడువడు. 6

మూ. నిశమ్య వాక్యం తు విభీషణస్య
తతః ప్రహస్తో వచనం బభాషే,
న నో భయం విద్మ న దైవతేభ్యో
న దానవేభ్యోఽప్యథవా కదాచిత్. 7

ప్ర. అ. విభీషణస్య=విభీషణునియొక్క, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, తతః=ఆటుపిమ్మట, ప్రహస్తః=ప్రహస్తుడు, వచనమ్=వచనమును, బభాషే= పలికెను. నః=మాకు, భయమ్=భయమును, న విద్మ=ఎరుగము. దైవతేభ్యః= దేవతలనుండి, న=ఎరుగము. అథవా=లేదా, దానవేభ్యః=దానవులనుండి, కదాచిత్=ఎన్నడూ, న=ఎరుగము.

రా. విభీషణుని మాటలు విని ప్రహస్తుడు పలికెను. "మాకు భయ మనేది తెలియదు. మాకు దేవతలవలన గాని, దానవులవలన గాని ఎన్నడూ భయము లేదు." 7

మూ. న యక్షగన్ధర్వమహోరగేభ్యో
భయం న సంఖ్యే పతగోరగేభ్యః,

కథం ను రామాద్భవితా భయం నో
నరేన్ద్రపుత్రాత్సమరే కదాచిత్. 8

ప్ర. అ. యక్షగన్ధర్వమహోరగేభ్యః=యక్షులనుండి, గంధర్వులనుండి, మహాసర్పములనుండి, సంఖ్యే=యుద్ధమునందు, భయమ్=భయము, న=లేదు. పతగోరగేభ్యః= పక్షులనుండి సర్పములనుండి, న=లేదు. నరేంద్రపుత్రాత్=రాజకుమారుడైన, రామాత్= రామునినుండి, నః=మాకు, కదాచిత్=ఎప్పుడైనా, సమరే=యుద్ధమునందు, భయమ్=భయము, కథమ్=ఎట్లు, భవితా=ఉండగలదు?

తా. మాకు యుద్ధములో గంధర్వులనుండి గాని, మహోరగులనుండి గాని, పక్షులనుండి గాని, ఉరగులనుండి గాని భయము లేదు. అట్టి మాకు రాజకుమారుడైన రామునినుండి, యుద్ధములో ఎప్పుడైనా భయ ముండునా? 8

మూ. ప్రహస్తవాక్యం త్వహితం నిశమ్య
విభీషణో రాజహితానుకాంక్షీ,
తతో మహార్థం వచనం బభాషే
ధర్మార్థకామేషు నివిష్టబుద్ధిః. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజహితానుకాంక్షీ=రాజుయొక్క హితమును కోరుచున్నవాడు, ధర్మార్థకామేషు=ధర్మార్థకామములయందు, నివిష్టబుద్ధిః=స్థిరముగా ఉంచబడిన బుద్ధి కలవాడు అయిన, విభీషణః=విభీషణుడు, అహితమ్=హితముకాని, ప్రహస్తవాక్యమ్=ప్రహస్తుని వాక్యమును, నిశమ్య=విని, మహార్థమ్=గొప్ప అర్థము గల, వచనమ్=వచనమును, బభాషే=పలికెను.

తా. ధర్మార్థకామముల విషయమునందు స్థిరమైన బుద్ధి గలవాడు, రాజు హితమును కోరువాడు అయిన విభీషణుడు, ప్రహస్తుని హితముకాని మాటలు విని ఇట్లు మంచి అర్థము గల వాక్యమును పలికెను. 9

మూ. ప్రహస్త రాజా చ మహోదరశ్చ
త్వం కుమ్భకర్ణశ్చ యథార్థజాతమ్,
బ్రవీత రామం ప్రతి తన్న శక్యం
యథా గతిః స్వర్గమధర్మబుద్ధేః. 10

ప్ర. అ. ప్రహస్త=ప్రహస్తుడా ! రాజా చ=రాజూ, మహోదరశ్చ=మహోదరుడు, త్వమ్=నీవు, కుమ్భకర్ణశ్చ=కుంభకర్ణుడూ, రామం ప్రతి=రాముణ్ణి గూర్చి, అర్థజాతమ్=విషయసముదాయమును, యథా=ఎట్లు, బ్రవీత=చెప్పుచున్నారో, తత్=అది, అధర్మబుద్ధేః=అధర్మబుద్ధి కలవానికి, స్వర్గమ్=స్వర్గమును గూర్చి, గతిః=గమనము, యథా=ఎట్లో, అట్లే, న శక్యమ్=శక్యము కాదు.

తా. ప్రహస్తుడా ! రాముని విషయములో మన రాజూ, మహోదరుడూ, నీవు, కుంభకర్ణుడూ చెప్పిన విధముగా చేయుట, అధర్మశీలునికి స్వర్గమునకు వెళ్లుట ఎట్లు శక్యము కాదో అట్లు శక్యము కాదు. 10

మూ. వధస్తు రామస్య మయా త్వయా చ
ప్రహస్త సర్వైరపి రాక్షసైర్వా,
కథం భవేదర్థవిశారదస్య
మహార్ణవం తర్తు మివాప్లవస్య. 11

ప్ర. అ. ప్రహస్త=ప్రహస్తుడా! మయా=నాచేత గాని, త్వయా చ=నీ చేత గాని, సర్వైః=సమస్తమైన, రాక్షసైర్వా=రాక్షసులచేత గాని, అర్థవిశారదస్య=కార్యములయందు నేర్పు గల, రామస్య=రామునియొక్క, వధః=వధ, అప్లవస్య=నావ లేనివానికి, మహార్ణవమ్=మహాసముద్రమును, తర్తుమ్ ఇవ=దాటుటకు వలె, కథమ్=ఎట్లు, భవేత్=శక్యమగును ?

తా. ప్రహస్తా ! కార్యములలో నేర్పు గల రాముణ్ణి చంపుట అనునది నాకు గాని, నీకు గాని, రాక్షసులందరికీ గాని, నావ లేనివానికి సముద్రమును దాటుట వలె, ఎట్లు శక్య మగును ? 11

మూ. ధర్మప్రధానస్య మహారథస్య
ఇక్ష్వాకువంశప్రభవస్య రాజ్ఞః,
పురోఽస్య దేవాశ్చ తథావిధస్య
కృత్యేషు శక్తస్య భవన్తి మూఢాః. 12

ప్ర. అ. ధర్మప్రధానస్య=ధర్మమే ప్రధానముగా కలవాడు, మహారథస్య=మహారథుడు, ఇక్ష్వాకువంశప్రభవస్య=ఇక్ష్వాకువంశమునందు పుట్టినవాడు, కృత్యేషు=కార్యములయందు, శక్తస్య=సమర్థుడు, తథావిధస్య=అట్టివాడు అయిన, రాజ్ఞః=రాజైన, అస్య=ఈ రామునియొక్క, పురః=ముందు, దేవాశ్చ=దేవతలు కూడ, మూఢాః=మూఢులు, భవన్తి=అగుదురు.

తా. ఇక్ష్వాకువంశమునందు జనించిన రాజైన రాముడు ధర్మమునే అనుసరించువాడు. కార్యములలో సమర్థుడు. అట్టి రాముని సమక్షమునందు దేవతలు కూడ ఏమీ చేయజాలక మూఢులై నిలిచెదరు. 12

మూ. తీక్ష్ణా న తావత్తవ కఙ్కపత్రా
దురాసదా రాఘవవిప్రముక్తాః,
భిత్త్వా శరీరం ప్రవిశన్తి బాణాః
ప్రహస్త తేనైవ వికత్థసే త్వమ్. 13

ప్ర. అ. ప్రహస్త=ప్రహస్తుడా ! తీక్ష్ణాః=తీక్ష్ణములు, కఙ్కపత్రాః=గ్రద్దల రెక్కలు గలవి, దురాసదాః=సమీపించ శక్యము కానివి, రాఘవవిప్రముక్తాః=రామునిచేత విడువబడునవి అయిన, బాణాః=బాణములు, తవ=నీయొక్క, శరీరమ్=శరీరమును, భిత్త్వా=భేదించి, న ప్రవిశన్తి తావత్=ప్రవేశించలేదు; తేనైవ=ఆ కారణముచేతనే, త్వమ్= నీవు, వికత్థసే=బడాయి చెప్పుచున్నావు.

తా. ప్రహస్తుడా ! గ్రద్దరెక్కలు కట్టిన, తీక్ష్ణములైన, ఎదిరింప శక్యము కాని రామబాణములు నీ శరీరము ఇంకా భేదించ లేదు; అందుచేతనే నీవు ఇట్లు బడాయి చెప్పుచున్నావు. 13

మూ. భిత్త్వా న తావత్ప్రవిశన్తి కాయం
ప్రాణాన్తకాస్తేఽశనితుల్యవేగాః,
శితాః శరా రాఘవవిప్రముక్తాః
ప్రహస్త తేనైవ వికత్థసే త్వమ్. 14

ప్ర. అ. ప్రహస్త=ప్రహస్తుడా ! రాఘవవిప్రముక్తాః=రామునిచేత ప్రయోగింపబడిన, ప్రాణాన్తకాః=ప్రాణములను తొలగించు, అశనితుల్యవేగాః=వజ్రముతో సమానమైన వేగము గల, శితాః=వాడి యైన, శరాః=బాణములు, తే=నీయొక్క, కాయమ్= శరీరమును, భిత్త్వా=భేదించి, న తావత్ ప్రవిశన్తి=ప్రవేశించుటలేదు; తేనైవ= ఆ కారణముచేతనే, త్వమ్=నీవు, వికత్థసే=బడాయిచెప్పుచున్నావు.

తా. ప్రహస్తుడా ! రాముడు విడిచిన, వజ్రముతో సమానమైన వేగము గల, వాడియైన, ప్రాణాంతకములైన బాణములు నీ శరీరమును భేదించి ప్రవేశించలేదు; అందుచేతనే నీ విట్లు బడాయి చెప్పుచున్నావు. 14

మూ. న రావణో నాతిబలస్త్రిశీర్షో
న కుమ్భకర్ణస్య సుతో నికుమ్భః,
న చేన్ద్రజిద్దాశరథిం ప్రసోఢుం
త్వం వా రణే శక్రసమం సమర్థః. 15

ప్ర. అ. శక్రసమమ్=దేవేంద్రునితో సమానుడైన, దాశరథిమ్=రాముణ్ణి, రణే=యుద్ధమునందు, సోఢుమ్=సహించుటకు, రావణః=రావణుడు, న సమర్థః=సమర్థుడుకాడు. అతిబలః=గొప్ప బలము గల, త్రిశీర్షః=త్రిశీర్షుడు, న=కాడు. కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, సుతః=కుమారుడైన, నికుమ్భః=నికుంభుడు, న=కాడు. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు కూడ, న=సమర్థుడుకాడు. త్వం వా=నీవైనను కావు.

తా. దేవేంద్రునితో సమానుడైన రాముణ్ణి యుద్ధములో ఎదిరించి నిలుచుటకు రావణుడు గాని, గొప్ప బలము గల త్రిశీర్షుడు గాని, కుంభకర్ణుని పుత్రుడైన నికుంభుడు గాని, ఇంద్రజిత్తు గాని, నీవు గాని సమర్థులు కారు.

మూ. దేవాన్తకో వాపి నరాన్తకో వా
తథాతికాయో౽తిరథో మహాత్మా,
అకమ్పనశ్చాద్రిసమానసారః
స్థాతుం న శక్తా యుధి రాఘవస్య. 16

ప్ర. అ. దేవాన్తకో వాపి=దేవాంతకుడైనా, నరాన్తకో వా=నరాంతకుడైనా, తథా= మరియు, అతిరథః=అతిరథుడు, మహాత్మా=మహాత్ముడు అయిన, అతికాయః= అతికాయుడైనా, అద్రిసమానసారః=పర్వతముతో సమానమైన సారము గల, అకమ్పనశ్చ= అకంపనుడైనా, రాఘవస్య=రామునియొక్క, యుధి=యుద్ధమునందు, స్థాతుమ్= నిలచుటకు, న శక్తాః=సమర్థులు కారు.

తా. దేవాంతకుడు గాని, నరాంతకుడు గాని, మహాత్ముడూ అతిరథుడూ అయిన అతికాయుడు గాని, పర్వతమువంటి సారము గల అకంపనుడు గాని యుద్ధములో రాముని ఎదుట నిలువలేరు. 16

మూ. అయం చ రాజా వ్యసనాభిభూతో
మిత్రైరమిత్రప్రతిమైర్భవద్భిః,
అన్వాస్యతే రాక్షసనాశనార్థే
తీక్ష్ణః ప్రకృత్యా హ్యసమీక్ష్యకారీ. 17

ప్ర. అ. వ్యసనాభిభూతః=దుర్వ్యసనములచేత తిరస్కరించబడినవాడు, ప్రకృత్యా= స్వభావముచేత, తీక్ష్ణః=తీక్ష్ణుడు, అసమీక్ష్యకారీ=ఆలోచించకుండగా పనులు చేసేవాడు అయిన, అయం రాజా=ఈ రాజు, అమిత్రప్రతిమైః=శత్రువులవంటివారైన, మిత్రైః=మిత్రులైన, భవద్భిః=మీచేత, రాక్షసనాశనార్థే=రాక్షసుల నాశనము కొరకే, అన్వాస్యతే= అనుసరించబడుచున్నాడు.

తా. ఈ రాజు వ్యసనాలకు లోనైనవాడు. తీక్ష్ణస్వభావము గలవాడు. ఆలోచించకుండా పనులు చేసే అలవాటు కలవాడు. అట్టి ఈ రాజు ఏమి చేసినా మీరందరూ మిత్రులే అయినా అమిత్రులవలె తలయూపుచున్నారు. ఇది రాక్షసవినాశానికే దారితీయుచున్నది. 17

మూ. అనన్తభోగేన సహస్రమూర్ధ్నా
నాగేన భీమేన మహాబలేన,

బలాత్పరిక్షిప్తమిమం భవన్తో
రాజానముత్క్షిప్య విమోచయన్తు. 18

ప్ర. అ. అనన్తభోగేన=అనంతమైన శరీరము కలది, సహస్రమూర్ధ్నా=వేయిశిరస్సులు కలది, మహాబలేన=గొప్ప బలము కలదీ అయిన, భీమేన=భయంకరమైన, నాగేన=సర్పముచేత, బలాత్=బలాత్కారముగా, పరిక్షిప్తమ్=చుట్టుకొనబడిన, ఇమం రాజానమ్=ఈ రాజును, భవన్తః=మీరు, ఉత్క్షిప్య=పైకిలేపి, విమోచయన్తు=విడిపించెదరుగాక.

తా. ఈ రాజును పెద్ద శరీరము, వేయిపడగలు గల గొప్ప బలము గల భయంకరమైన సర్పము బలవంతముగా పెనవేసికొని ఉన్నది. అట్టి ఈ రాజును మీరు పైకి లేవదీసి విడిపించండి. 18

మూ. యావద్ధి కేశగ్రహణాత్సుహృద్భిః
సమేత్య సర్వైః పరిపూర్ణకామైః,
నిగృహ్య రాజా పరిరక్షితవ్యో
భూతైర్యథా భీమబలైర్గృహీతః. 19

ప్ర. అ. పరిపూర్ణకామైః=పూర్ణమైన కోరికలు గల, సర్వైః=సమస్తమైన, సుహృద్భిః=స్నేహితులచేత, సమేత్య=కలిసి, రాజా=రాజు, భీమబలైః= భయంకరమైన బలము గల, భూతైః=భూతములచేత, గృహీతః యథా=గ్రహింపబడినవాడు వలె, కేశగ్రహణాత్ యావత్=జుట్టుపట్టుట వరకు కూడ చేసి, నిగృహ్య=నిగ్రహించి, పరిరక్షితవ్యః హి=రక్షింపదగినవాడు కదా.

తా. రాజువల్ల అన్ని కోరికలు పొందుచున్న స్నేహితులు అందరూ కలిసి, భయంకరమైన బలము గల భూతములచేత ఆవహించబడినవానిని రక్షించి నట్లు, రాజును జుట్టుపట్టియైనా బలాత్కారపూర్వకముగా నిగ్రహించి రక్షించవలెను. 19

మూ. సువారిణా రాఘవసాగరేణ
ప్రచ్ఛాద్యమానస్తరసా భవద్భిః,
యుక్తస్త్వయం తారయితుం సమేత్య
కాకుత్స్థపాతాలముఖే పతన్సః. 20

ప్ర. అ. సువారిణా=మంచి ఉదకము గల, రాఘవసాగరేణ=రాము

దనే సముద్రముచేత, తరసా=బలముచేత, ప్రవాహ్యమానః=కప్పబడుచున్న, పాకుత్స్య పాతాలముఖే= రాముడనే పాతాళముఖమునందు, పతన్=పడుచున్న, సః అయమ్= ఈ రావణుడు, భవద్భిః=మీచేత, సమేత్య=కలిసి, తారయితుమ్=దాటిం చుటకు, యుక్తః= తగినవాడు.

తా. మన రాజును అత్యధికమైన జలము గల రాము డనే సముద్రము బలవంతముగా కప్పివేయుచున్నది. ఇతడు రాముడనే పాతాళము ముఖములో పడిపోవుచున్నాడు. అట్టి ఈతనిని మీరందరూ కలిసి దాటించవలెను. 20

మూ. ఇదం పురస్యాస్య సరాక్షసస్య
రాజ్ఞశ్చ పథ్యం ససుహృజ్జనస్య,
సమ్యగ్ఘి వాక్యం స్వమతం బ్రవీమి
నరేన్ద్రపుత్రాయ దదాతు మైథిలీమ్. 21

ప్ర. అ. సరాక్షసస్య=రాక్షసులతో కూడిన, అస్య=ఈ, పురస్య=పురము నకు, ససుహృజ్జనస్య=మిత్రులతో కూడిన, రాజ్ఞశ్చ=రాజుకు, పథ్యమ్=హితమైన, స్వమతమ్=నాకు ఇష్టమైన, ఇదం వాక్యమ్= ఈ వాక్యమును, సమ్యక్=బాగుగా, బ్రవీమి హి=చెప్పుచున్నాను కదా. నరేన్ద్రపుత్రాయ=రామునకు, మైథిలీమ్=సీతను, దదాతు=ఇచ్చివేయుగాక.

తా. ఈ పట్టణమునకు, ఇందు నివసించు రాక్షసులకు, రాజుకు, అతని మిత్రులకు హితమైన, నాకు ఇష్టమైన ఈ వాక్యమును చెప్పుచున్నాను - రామునకు సీతను ఇచ్చివేయుగాక. 21

మూ. పరస్య వీర్యం స్వబలం చ బుద్ధ్వా
స్థానం క్షయం చైవ తథైవ వృద్ధిమ్,
తథా స్వపక్షే ప్యనుమృశ్య బుద్ధ్యా
వదేత్ క్షమం స్వామిహితం స మన్త్రీ. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుర్దశః సర్గః.

ప్ర. అ. పరస్య=శత్రువుయొక్క, వీర్యమ్=వీర్యమును, స్వబలం చ=తన బలమును, బుద్ధ్వా=తెలిసికొని, తథా=అట్లే, స్వపక్షే=తన పక్షమునందు, స్థానమ్= స్థితిని, క్షయం చైవ=క్షయమును, తథైవ=మరియు, వృద్ధిమ్=వృద్ధిని, బుద్ధ్యా= బుద్ధిచేత, అనుమృశ్య=ఆలోచించి, క్షమమ్=తగిన విధముగా, స్వామిహితమ్= ప్రభుహితమును, వదేత్=(ఎవడు) పలుకునో, సః=అతడే, మన్త్రీ=మంత్రి.

తా. శత్రువుల బలమును తన బలమును తెలిసికొని, తన పక్షమునందున్న స్థితిని, అభివృద్ధిని, నష్టమును బుద్ధిచేత పరిశీలించి యుక్తమైన విధముగా ప్రభువునకు హితమైన విషయమును ఉపదేశించువాడే ఉత్తముడైన మంత్రి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదునాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చదశః సర్గః

*[ఇంద్రజిత్తు విభీషణుని మాటలను అధిక్షేపించుట, విభీషణుడు అతనికి సమాధానము చెప్పుచూ రాముని అనుగ్రహము సంపాదించుటయే యుక్తమని బోధించుట.]*

మూ. బృహస్పతేస్తుల్యమతేర్వచస్త
న్నిశమ్య యత్నేన విభీషణస్య,
తతో మహాత్మా వచనం బభాషే
తత్రేన్ద్రజిన్నైరృతయూథముఖ్యః. 1

ప్ర. అ. బృహస్పతేః=బృహస్పతికి, తుల్యమతేః=సమానమైన బుద్ధి గల, విభీషణస్య= విభీషణునియొక్క, తత్=ఆ, వచః=వచనమును, యత్నేన=ప్రయత్నముతో, నిశమ్య=విని, తతః=అటు పిమ్మట, మహాత్మా=గొప్ప బుద్ధి గలవాడు, నైరృతయూథముఖ్యః= రాక్షససేనలో ప్రధానుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, తత్ర=అక్కడ, వచనమ్=వచనమును, బభాషే=పలికెను.

తా. బృహస్పతితో సమానమైన బుద్ధి గల విభీషణుడు పలికిన ఆ మాటలు శ్రద్ధగా విని, మహాబుద్ధిశాలి, రాక్షససైన్యములో ప్రధానుడూ అయిన ఇంద్రజిత్తు ఇట్లు పలికెను. 1

మూ. కిం నామ తే తాత కనిష్ఠ వాక్య
మనర్థకం వై బహుభీతవచ్చ,
అస్మిన్ కులే యోఽపి భవేన్న జాతః
సోఽపీదృశం నైవ వదేన్న కుర్యాత్. 2

ప్ర. అ. కనిష్ఠతాత=పినతండ్రీ! కిం నామ=ఇది ఏమిటి! తే=నీయొక్క, వాక్యమ్=వాక్యము, అనర్థకమ్=అర్థరహితమైనది. బహుభీతవచ్చ=చాల భయముతో కూడినట్లున్నది. యః=ఎవడు, అస్మిన్=ఈ, కులే=కులమునందు, జాతః= పుట్టినవాడు, న భవేత్=కాడో, సోఽపి=అతడు కూడ, ఈదృశమ్=ఇట్టి వాక్యమును, నైవ వదేత్=పలకడు. న కుర్యాత్=చేయడు.

తా. పినతండ్రీ! ఏమిది! నీవు అర్థరహితముగాను పిరికితనముతోను మాటలాడుచున్నావు! మన కులములో పుట్టనివాడు కూడ, సామాన్యకులములో పుట్టినవాడు కూడ ఇట్లు మాటలాడడు; ఇట్లు చేయడు. 2

మూ. సత్త్వేన వీర్యేణ పరాక్రమేణ
ధైర్యేణ శౌర్యేణ చ తేజసా చ,

ఏకః కులేఽస్మిన్ పురుషో విముక్తో
విభీషణస్తాతకనిష్ఠ ఏషః. 3

ప్ర. అ. అస్మిన్=ఈ, కులే=కులమునందు, ఏషః=ఈ, తాతక నిష్ఠః=మా తండ్రిగారి తమ్ముడైన, విభీషణః=విభీషణుడు, ఏకః=ఒక్కడే, సత్త్వేన=బలముచేతను, వీర్యేణ=వీర్యముచేతను, పరాక్రమేణ=పరాక్రమముచేతను, ధైర్యేణ=ధైర్యముచేతను, శౌర్యేణ=శౌర్యముచేతను, తేజసా చ=తేజస్సుచేతను, విముక్తః=విడువబడిన, పురుషః= పురుషుడు.

తా. మన కులములో బలము, వీర్యము, పరాక్రమము, ధైర్యము, శౌర్యము లేని వ్యక్తి మా తండ్రిగారి తమ్ముడైన ఈ విభీషణుడు ఒక్కడే. 3

మూ. కిం నామ తౌ మానుషరాజపుత్రౌ
అస్మాకమేకేన హి రాక్షసేన,
సుప్రాకృతేనాపి రణే నిహన్తుమేతౌ
శక్యౌ కుతో భీషయసే స్మ భీరో ! 4

ప్ర. అ. తౌ=ఆ, మానుషరాజపుత్రౌ=మనుష్యులైన రాజకుమారులు, కిం నామ= ఎంత? ఏతౌ=వీరు, అస్మాకమ్=మనలో, సుప్రాకృతేనాపి=చాల సామాన్యుడైనను, ఏకేన=ఒక, రాక్షసేన=రాక్షసునిచేత, నిహన్తుమ్=చంపుటకు, శక్యౌ=శక్యమైనవారు. భీరో=పిరికివాడా ! కుతః=ఎందుకు, భీషయసే=భయపెట్టుచున్నావు ?

తా. ఓ ! పిరికివాడా ! మనుష్యమాత్రులైన ఆ రాజపుత్రులు అనగా ఎంత? మనలో సామాన్యుడైన ఒక్క రాక్షసుడు కూడ వాళ్లను చంపివేయగలడు. ఎందుకు ఇట్లు భయపెట్టుచున్నావు? 4

మూ. త్రిలోకనాథో నను దేవరాజః
శక్రో మయా భూమితలే నివిష్టః,
భయార్పితాశ్చాపి దిశః ప్రపన్నాః
సర్వే తదా దేవగణాః సమగ్రాః. 5

ప్ర. అ. తదా=అప్పుడు (పూర్వము), త్రిలోకనాథః=మూడు లోకములకు ప్రభువైన, శక్రః=సమర్థుడైన, దేవరాజః=దేవేంద్రుడు, మయా=నాచేత, భూమి తలే=నేలమీద, నివిష్టః=పడవేయబడినాడు. సర్వే=సమస్తమైన, దేవగణాః=దేవగణములు, భయార్పితాశ్చాపి=భయమునకు సమర్పించబడినవారు(భయపెట్టబడినారు). సమగ్రాః=అందరూ, దిశః=దిక్కులను, ప్రపన్నాః=పొందినారు.

తా. మూడు లోకములకు ప్రభువు, సమర్థుడూ అయిన దేవేంద్రుని

నేను పూర్వము నేలపై పడవేసితిని. దేవతలందరు భయాక్రాంతులై దిక్కులు పట్టి పారిపోయిరి. 5

మూ. ఐరావతో విస్వరమున్నదన్ స
నిపాతితో భూమితలే మయా తు,
వికృష్య దన్తౌ తు మయా ప్రసహ్య
విత్రాసితా దేవగణాః సమగ్రాః. 6

ప్ర. అ. విస్వరమ్=వికృతస్వరము కలుగునట్లుగా, ఉన్నదన్=ధ్వనిచేయుచున్న, సః=ఆ, ఐరావతః=ఐరావతము, మయా=నాచేత, భూమితలే=నేలమీద, నిపాతితః=పడవేయబడినది. ప్రసహ్య=బలాత్కరించి, దన్తౌ=దంతములను, వికృష్య=ఊడబెరికి, మయా=నాచేత, సమగ్రాః=సమస్తమైన, దేవగణాః=దేవతాసముదాయములు, విత్రాసితాః=భయపెట్టబడినారు.

తా. నేను వికృతస్వరముతో అరచుచున్న ఐరావతమును నేలపై పడవేసి, బలాత్కారముగా దాని దంతములు ఊడబెరికి దేవతాగణముల నన్నింటిని భయపెట్టితిని. 6

మూ. సోఽహం సురాణామపి దర్పహన్తా
దైత్యోత్తమానామపి శోకకర్తా,
కథం నరేన్ద్రాత్మజయోర్న శక్తో
మనుష్యయోః ప్రాకృతయోః సువీర్యః. 7

ప్ర. అ. సురాణామపి=దేవతలయొక్క కూడా, దర్పహన్తా=గర్వమును తొలగించిన, దైత్యోత్తమానామపి=దైత్యులలో శ్రేష్ఠులైన వారికి కూడ, శోకకర్తా=శోకమును చేసిన, సువీర్యః=గొప్ప పరాక్రమము గల, సః అహమ్=అట్టి నేను, ప్రాకృతయోః=సామాన్యులైన, మనుష్యయోః=మనుష్యులైన, నరేన్ద్రాత్మజయోః=రాజకుమారుల విషయమున, కథమ్=ఎట్లు, న శక్తః=సమర్థుడను కాను?

తా. నేను దేవతల గర్వము కూడ అణచితిని. ఉత్తములైన దైత్యులకు కూడ శోకము కలిగించితిని. అట్టి మహాపరాక్రమవంతుడనైన నేను సామాన్యమానవులైన ఆ రాజకుమారులను ఓడించజాలనా? 7

మూ. అథేన్ద్రకల్పస్య దురాసదస్య
మహౌజసస్తద్వచనం నిశమ్య,
తతో మహార్థం వచనం బభాషే
విభీషణః శస్త్రభృతాం వరిష్ఠః. 8

ప్ర. అ. అథ=అటుపిమ్మట, శక్రోపమస్య=ఇంద్రునితో సమానుడు, దురాసదస్య= ఎదిరింప శక్యము కానివాడు, మహౌజసః=గొప్ప తేజస్సు కలవాడు అయిన ఆ ఇంద్రజిత్తుయొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, నిశమ్య=విని, శస్త్రభృతామ్=ఆయుధమును ధరించువారిలో, వరిష్ఠః=శ్రేష్ఠుడైన, విభీషణః=విభీషణుడు, తతః= పిమ్మట, మహార్థమ్=గొప్ప అర్థము గల, వచనమ్=వచనమును, బభాషే=పలికెను.

తా. శస్త్రధారులలో శ్రేష్ఠుడైన ఆ విభీషణుడు ఇంద్రునితో సమానుడు, ఎదిరింప శక్యము కానివాడు, గొప్ప తేజస్సు కలవాడు అయిన ఇంద్రజిత్తు మాటలు విని పిమ్మట గొప్ప అర్థము గల వచనమును పలికెను. 8

మూ. న తాత మన్త్రే తవ నిశ్చయోఽస్తి
బాలస్త్వమద్యాప్యవిపక్వబుద్ధిః,
తస్మాత్త్వయాప్యాత్మవినాశనాయ
వచోఽర్థహీనం బహు విప్రలప్తమ్. 9

ప్ర. అ. తాత=నాయనా ! తవ=నీకు, మన్త్రే=ఆలోచనయందు, నిశ్చయః= నిశ్చయము, నాస్తి=లేదు. బాలః=బాలుడవైన, త్వమ్=నీవు, అద్యాపి=ఇంకను, అవిపక్వబుద్ధిః=పక్వము కాని బుద్ధి కలవాడవు. తస్మాత్=ఆ కారణమువలననే, త్వయాపి= నీచేత కూడ, ఆత్మవినాశనాయ=ఆత్మనాశనముకొరకే, అర్థహీనమ్=అర్థములేని, బహు= అత్యధికమైన, వచః=వచనము, విప్రలప్తమ్=ప్రేలబడినది.

తా. నాయనా ! నీవింకా చిన్నవాడవు. బుద్ధిపరిపాకము లేనివాడవు. మంత్రణము విషయమున నీకు నిశ్చయము లేదు. అందుచేతనే నీవు ఆత్మవినాశమునకు హేతువైన అర్థములేని మాట లేవేవో ప్రేలినావు. 9

మూ. పుత్రప్రవాదేన తు రావణస్య
త్వమిన్ద్రజిన్మిత్రముఖోఽపి శత్రుః,
యస్యేదృశం రాఘవతో వినాశం
నిశమ్య మోహాదనుమన్యసే త్వమ్. 10

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఓ ! ఇంద్రజిత్తూ ! రాఘవతః=రాముని నుండి, యస్య=ఏ రావణునియొక్క, ఈదృశమ్=ఇట్టి, వినాశమ్=వినాశమును, నిశమ్య=విని, మోహాత్= అజ్ఞానమువలన, త్వమ్=నీవు, అనుమన్యసే=అంగీకరించుచున్నావో, రావణస్య=అట్టి రావణునియొక్క, పుత్రప్రవాదేన=పుత్రుడనే మిషచేత, మిత్రముఖః=మిత్రుడను ముఖముగల, శత్రుః=శత్రువు, అపి=అయి

ఉన్నావు.

తా. ఓ ! ఇంద్రజిత్తూ ! రామునినుండి రావణునకు కలుగనున్న వినాశమును గూర్చి విని కూడ నీవు దానికి అంగీకరించుచున్నావు. అందుచేత నీవు రావణుని కుమారుడను పేరుతో మిత్రుడుగా కనబడు శత్రువుడవు. 10

మూ. త్వమేవ వధ్యశ్చ సుదుర్మతిశ్చ
స చాపి వధ్యో య ఇహానయత్త్వామ్,
బాలం దృఢం సాహసికం చ యోఽద్య
ప్రావేశయన్మన్త్రకృతాం సమీపమ్. 11

ప్ర. అ. త్వమేవ=నీవే, వధ్యశ్చ=చంపదగినవాడవు. బాలమ్=బాలుడవు, దృఢమ్=మిక్కిలి, సుసాహసికమ్=సాహసముచేయువాడవు అయిన, త్వామ్=నిన్ను, యః=ఎవడు, ఇహ=ఇక్కడికి, ఆనయత్=తీసికొనివచ్చెనో, మన్త్రకృతామ్= ఆలోచనచేయువారియొక్క, సమీపమ్=సమీపమును, అద్య=ఇప్పుడు, ప్రావేశయత్= ప్రవేశాపెట్టెనో, సుదుర్మతిః=చాల దుష్టబుద్ధి గల, సః చ=అతడు కూడ, వధ్యః= చంపదగినవాడు.

తా. నీవు చంపదగినవాడవు. బాలుడవు, ఎక్కువ సాహసము చేయువాడవు అయిన నిన్ను ఇప్పుడు ఇక్కడికి తీసికొనివచ్చి మంత్రణము చేయువారి వద్ద కూర్చుండబెట్టిన దుష్టబుద్ధి కల అతడెవడో వాడు కూడ చంపదగినవాడు. 11

మూ. మూఢోఽప్రగల్భోఽవినయోపపన్న
స్తీక్ష్ణస్వభావోఽల్పమతిర్దురాత్మా,
మూర్ఖస్త్వమత్యన్తసుదుర్మతిశ్చ
త్వమిన్ద్రజిద్బాలతయా బ్రవీషి. 12

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తూ ! త్వమ్=నీవు, మూఢః=మూఢుడవు. అప్రగల్భః=తెలివితక్కువవాడవు. అవినయోపపన్నః=వినయము లేనివాడవు. తీక్ష్ణస్వభావః= తీక్ష్ణమైన స్వభావము కలవాడవు. అల్పమతిః=అల్పమైన బుద్ధి కలవాడవు. దురాత్మా= దుష్టబుద్ధికలవాడవు. మూర్ఖః=మూర్ఖుడవు. అత్యన్తసుదుర్మతిశ్చ=చాల చెడ్డబుద్ధి కలవాడవు. త్వమ్=నీవు, బాలతయా=బాలుడవగుటచేత, బ్రవీషి=ఇట్లు పలుకుచున్నావు.

తా. ఓ ! ఇంద్రజిత్తూ ! నీవు మూఢుడవు; తెలివితక్కువవాడవు; వినయము లేనివాడవు; నీ స్వభావము చాల తీక్ష్ణమైనది; అల్పమైన బుద్ధిగలవాడవు; దుష్టబుద్ధివి; మూర్ఖుడవు; చాల చెడ్డ బుద్ధి కలవాడవు;

తెలియకపోవుటచేత ఇట్లు మాట్లాడుచున్నావు. 12

మూ. కో బ్రహ్మదణ్డప్రతిమప్రకాశా
నర్చిష్మతః కాలనికాశరూపాన్,
సహేత బాణాన్యమదణ్డకల్పా
న్సమక్షముక్తాన్యుధి రాఘవేణ. 13

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, రాఘవేణ=రామునిచేత, సమక్షముక్తాన్=ఎదుట విడవబడినవి, బ్రహ్మదణ్డప్రతిమప్రకాశాన్=బ్రహ్మదండమువంటి కాంతి గలవి, అర్చిష్మతః= కిరణములు గలవి, కాలనికాశరూపాన్=యమునితో సమానమైన రూపము గలవి, యమదణ్డకల్పాన్= యమదండమువంటివి అయిన, బాణాన్=బాణములను, కః=ఎవడు, సహేత=సహించును ?

తా. రాముని బాణములు బ్రహ్మదండమువంటి ప్రకాశము గలవి. కిరణములతో ప్రకాశించునవి. మృత్యుదేవతతో సమానములు. యమదండములవంటివి. అట్టి బాణములను రాముడు యుద్ధములో ఎదుట నిలచి ప్రయోగించుచుండగా వాటిని ఎవడు సహించగలడు ? 13

మూ. ధనాని రత్నాని సుభూషణాని
వాసాంసి దివ్యాని మణీంశ్చ చిత్రాన్,
సీతాం చ రామాయ నివేద్య దేవీం
వసేమ రాజన్నిహ వీతశోకాః. 14

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్త్రింశః సర్గః.

ప్ర. అ. రాజన్=రాజా ! ధనాని=ధనములను, రత్నాని=రత్నములను, సుభూషణాని=మంచి భూషణములను, దివ్యాని=శ్రేష్ఠమైన, వాసాంసి=వస్త్రములను, చిత్రాన్=చిత్రములైన, మణీంశ్చ=మణులను, సీతాం దేవీం చ=సీతాదేవిని, రామాయ= రామునికి, నివేద్య=సమర్పించి, ఇహ=ఇక్కడ, వీతశోకాః=పోయిన శోకము గలవారమై, వసేమ=వసించుదము.

తా. రాజా ! ధనములను, రత్నములను, అలంకారములను, శ్రేష్ఠమైన వస్త్రములను, చిత్రములైన మణులను, సీతాదేవిని రామునకు సమర్పించి మనమందరము సుఖముగా నివసించెదము. 14

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదునెనవసర్గ సమాప్తము.

# షోడశః సర్గః

(రావణుడు విభీషణుని తిరస్కరించుట. విభీషణుడు అతని విడచి వెళ్ళిపోవుటకు బయలుదేరుట.)

మూ. సునివిష్టం హితం వాక్యముక్తవన్తం విభీషణమ్,
అబ్రవీత్పరుషం వాక్యం రావణః కాలచోదితః. 1

ప్ర. అ. సునివిష్టమ్=బాగా స్థిరముగా ఉన్నదియు, హితమ్=హితమైన, వాక్యమ్= వాక్యమును, ఉక్తవన్తమ్=పలికినవాడు అయిన, విభీషణమ్=విభీషణుని గూర్చి, రావణః= రావణుడు, కాలచోదితః=కాలముచేత ప్రేరితుడై, పరుషమ్=పరుషమైన, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. బాగా స్థిరమైన ఆలోచనతో హితమైన వాక్యము పలికిన ఆ విభీషణునితో, రావణుడు కాలముచేత ప్రేరేపింపబడినవాడై పరుషమైన వాక్యమును పలికెను. 1

మూ. వసేత్సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణ చ,
న తు మిత్రప్రవాదేన సంవసేచ్ఛత్రుణా సహ. 2

ప్ర. అ. సపత్నేన సహ=శత్రువుతో కూడ, వసేత్=నివసించవచ్చును. క్రుద్ధేన= కోపించిన, ఆశీవిషేణ చ=సర్పముతో కూడ, నివసించవచ్చును. మిత్రప్రవాదేన=మిత్రుడ నని చెప్పుకొను, శత్రుణా సహ తు=శత్రువుతో కూడ అయితే, న సంవసేత్=నివసింప శక్యము కాదు. 2

తా. శత్రువుతోను, కోపించిన సర్పముతోను కలిసి నివసించవచ్చునేమో కాని మిత్రుడ నని చెప్పుకొను శత్రువుతో మాత్రము నివసింప శక్యము కాదు. 2

మూ. జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస,
హృష్యన్తి వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయః సదా. 3

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! సర్వలోకేషు=సమస్తలోకములయందు, జ్ఞాతీనామ్= జ్ఞాతులయొక్క, శీలమ్=శీలమును, జానామి=ఎరుగుదును. ఏతే=ఈ, జ్ఞాతయః=జ్ఞాతులు, సదా=ఎల్లప్పుడూ, జ్ఞాతీనామ్=జ్ఞాతులయొక్క, వ్యసనేషు=ఆపదలయందు, హృష్యన్తి=సంతోషించుచుందురు.

తా. రాక్షసుడా ! అన్ని లోకాలలోను జ్ఞాతుల స్వభావ మెట్లుండునో నాకు తెలియును. ఈ జ్ఞాతులు ఎల్లప్పుడూ, తమ జ్ఞాతులకు ఆపదలు

## షోడశః సర్గః

(రావణుడు విభీషణుని తిరస్కరించుట. విభీషణుడు అతని విడచి వెళ్ళిపోవుటకు బయలుదేరుట.)

మూ. సునివిష్టం హితం వాక్యముక్తవన్తం విభీషణమ్,
అబ్రవీత్పరుషం వాక్యం రావణః కాలచోదితః. 1

ప్ర. అ. సునివిష్టమ్=బాగా స్థిరముగా ఉన్నవాడు, హితమ్=హితమైన, వాక్యమ్= వాక్యమును, ఉక్తవన్తమ్=పలికినవాడు అయిన, విభీషణమ్=విభీషణుని గూర్చి, రావణః= రావణుడు, కాలచోదితః=కాలముచేత ప్రేరితుడై, పరుషమ్=పరుషమైన, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. చాల స్థిరమైన ఆలోచనతో హితమైన వాక్యము పలికిన ఆ విభీషణునితో, రావణుడు కాలముచేత ప్రేరేపింపబడినవాడై పరుషమైన వాక్యమును పలికెను. 1

మూ. వసేత్సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణ చ,
న తు మిత్రప్రవాదేన సంవసేచ్ఛత్రుణా సహ. 2

ప్ర. అ. సపత్నేన సహ=శత్రువుతో కూడ, వసేత్=నివసింపవచ్చును. క్రుద్ధేన= కోపించిన, ఆశీవిషేణ చ=సర్పముతో కూడ, నివసింపవచ్చును. మిత్రప్రవాదేన=మిత్రుడ నని చెప్పుకొను, శత్రుణా సహ తు=శత్రువుతో కూడ అయితే, న సంవసేత్=నివసింప శక్యము కాదు. 2

తా. శత్రువుతోను, కోపించిన సర్పముతోను కలిసి నివసింపవచ్చు నేమో కాని మిత్రుడ నని చెప్పుకొను శత్రువుతో మాత్రము నివసింప శక్యము కాదు. 2

మూ. జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస,
హృష్యన్తి వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయః సదా. 3

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! సర్వలోకేషు=సమస్తలోకములయందు, జ్ఞాతీనామ్= జ్ఞాతులయొక్క, శీలమ్=శీలమును, జానామి=ఎరుగుదును. ఏతే=ఈ, జ్ఞాతయః=జ్ఞాతులు, సదా=ఎల్లప్పుడూ, జ్ఞాతీనామ్=జ్ఞాతులయొక్క, వ్యసనేషు=ఆపదలయందు, హృష్యన్తి=సంతోషించుచుందురు.

తా. రాక్షసుడా ! అన్ని లోకాలలోను జ్ఞాతుల స్వభావ మెట్లుండునో నాకు తెలియును. ఈ జ్ఞాతులు ఎల్లప్పుడూ, తమ జ్ఞాతులకు ఆపదలు

వచ్చినప్పుడు సంతోషించుచుందురు. 3

మూ. ప్రధానం సాధకం వైద్యం ధర్మశీలం చ రాక్షస,
జ్ఞాతయో హ్యవమన్యన్తే శూరం పరిభవన్తి చ. 4

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! జ్ఞాతయః=జ్ఞాతులు, ప్రధానమ్=ప్రధానుడు, సాధకమ్=కార్యసాధకుడు, వైద్యమ్=విద్యావంతుడు, ధర్మశీలం చ=ధర్మస్వభావము గలవాడు, శూరమ్=శూరుడూ అయిన జ్ఞాతిని, అవమన్యన్తే హి=అవమానింతురు గదా ! పరిభవన్తి చ=తిరస్కరింతురు కూడ.

తా. రాక్షసుడా ! జ్ఞాతులు ప్రధానుడు, కార్యసాధకుడు, విద్యావంతుడు, ధర్మస్వభావము కలవాడు, శూరుడు అయిన జ్ఞాతిని చిన్నగా చూచుచు తిరస్కరించుచుందురు. 4

మూ. నిత్యమన్యోన్యసంహృష్టా వ్యసనేష్వాతతాయినః,
ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః. 5

ప్ర. అ. వ్యసనేషు=ఆపదలలో, నిత్యమ్=ఎల్లప్పుడు, అన్యోన్యసంహృష్టాః=పరస్పరము (చెప్పుకొని) సంతోషించువారు, ఆతతాయినః=ద్రోహముచేయువారు, ప్రచ్ఛన్నహృదయాః=దాచబడిన హృదయములు కలవారు, ఘోరాః=క్రూరులు అయిన, జ్ఞాతయః=జ్ఞాతులు, భయావహాః=భయము కలిగించువారు.

తా. క్రూరులైన జ్ఞాతులు తమ హృదయములలోని భావములను దాచుకొని ద్రోహచింత కలవారై, భయంకరులై, తమ జ్ఞాతికి ఆపద వచ్చినప్పుడు ఒకరితో ఒకరు చెప్పుకొని నిత్యము సంతోషించుచుందురు. 5

మూ. శ్రూయన్తే హస్తిభిర్గీతాః శ్లోకాః పద్మవనే పురా,
పాశహస్తాన్నరాన్ దృష్ట్వా శృణుష్వ గదతో మమ. 6

ప్ర. అ. పురా=పూర్వము, పద్మవనే=పద్మవనమునందు, పాశహస్తాన్=పాశములు హస్తములందు గల, నరాన్=నరులను, దృష్ట్వా=చూచి, హస్తిభిః=ఏనుగులచేత, గీతాః=చెప్పబడిన, శ్లోకాః=శ్లోకములు, శ్రూయన్తే=వినబడుచున్నవి. గదతః=చెప్పుచున్న, మమ=నాకు, శృణుష్వ=వినుము.

తా. పూర్వము పద్మవనములో పాశములు చేతులలో ఉంచుకొని వచ్చిన మనుష్యులను చూచి ఏనుగులు పలికిన శ్లోకములు ప్రసిద్ధముగా వినవచ్చుచున్నవి చెప్పెదను; వినుము. 6

మూ. నాగ్నిర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః,
ఘోరాః స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః. 7

ప్ర. అ. నః=మనకు, అగ్నిః=అగ్ని, న=భయమును కలిగించునది కాదు. అన్యాని=ఖరతరములైన, శస్త్రాణి=ఆయుధములు, న=కావు. పాశాః=పాశములు, భయావహాః=భయము కలిగించునవి, న=కాదు. ఘోరాః=క్రూరులైన, స్వార్థ ప్రయుక్తాః=స్వార్థముచేత ప్రేరేపింపబడిన, జ్ఞాతయః=జ్ఞాతులు, నః=మనకు, భయావహాః=భయము కలిగించువారు.

తా. మనకు అగ్నివలన గాని, ఖరశస్త్రములవలన గాని, పాశములవలన గాని భయము లేదు. స్వార్థముతో ప్రవర్తించు క్రూరులైన జ్ఞాతులవల్లనే మనకు భయము. 7

మూ. ఉపాయమేతే వక్ష్యన్తి గ్రహణే నాత్ర సంశయః,
కృత్స్నాద్ భయాద్ జ్ఞాతిభయం సుకష్టం విదితం హి నః. 8

ప్ర. అ. ఏతే=ఈ జ్ఞాతులు, గ్రహణే=మనలను పట్టుకొనుట యందు, ఉపాయమ్=ఉపాయమును, వక్ష్యన్తి=చెప్పగలరు. అత్ర=దీనియందు, సంశయః=సంశయము, న=లేదు. కృత్స్నాత్=సమస్తమైన, భయాత్=భయము కంటె, జ్ఞాతిభయమ్=జ్ఞాతులవలన భయము, నః=మనకు, సుకష్టమ్=చాల కష్టమైనదిగా, విదితమ్=ప్రసిద్ధము.

తా. ఈ జ్ఞాతులు, మనలను ఎట్లు పట్టుకొనవలెనో ఉపాయమును చెప్పగలరు; సందేహము లేదు. మనకు అన్ని భయములకంటె ఈ జ్ఞాతిభయమే చాల గొప్పది. 8

మూ. విద్యతే గోషు సంపన్నం విద్యతే జ్ఞాతితో భయమ్,
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే బ్రాహ్మణే తపః. 9

ప్ర. అ. గోషు=గోవులయందు, సంపన్నమ్=సంపత్తి, విద్యతే=ఉన్నది. జ్ఞాతితః=జ్ఞాతివలన, భయమ్=భయము, విద్యతే=ఉన్నది. స్త్రీషు=స్త్రీలలో, చాపల్యమ్=చపలత్వము, విద్యతే=ఉన్నది. బ్రాహ్మణే=బ్రాహ్మణునియందు, తపః=తపస్సు, విద్యతే=ఉన్నది.

తా. గోవులలో సంపద ఉన్నది. జ్ఞాతులనుండి భయ మున్నది. స్త్రీలలో చాపల్యము ఉన్నది. బ్రాహ్మణునియందు తపస్సు ఉన్నది. 9

మూ. తతో నేష్టమిదం సౌమ్య యదహం లోకసత్కృతః,
ఐశ్వర్యమభిజాతశ్చ రిపూణాం మూర్ధ్ని చ స్థితః. 10

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! తతః=ఆ కారణమువలన, అహమ్=నేను, లోకసత్కృతః=లోకములయందు పూజింపబడినవాడను; ఐశ్వర్యమ్=అధికారమును,

అభిజాతః న=పొందినవాను; శత్రూణామ్=శత్రువులయొక్క, మూర్ధ్ని=శిరస్సునందు, స్థితః న=ఉన్నాను; ఇతి యత్=అనునది ఏది గలదో, ఇదమ్=ఇది, న ఇష్టమ్= (నీకు) ఇష్టము కాదు.

తా. సౌమ్యుడా ! అందుచేతనే నేను ఈ విధముగా లోకములలో గౌరవింపబడుటను, ఐశ్వర్యసంపన్నుడను అగుటను, శత్రువులను అణగద్రొక్కి ఉండుటను నీవు చూడలేకున్నావు. 10

మూ. యథా పుష్కరపత్రేషు పతితాస్తోయబిన్దవః,
న శ్లేషమభిగచ్ఛన్తి తథానార్యేషు సౌహృదమ్. 11

ప్ర. అ. పుష్కరపత్రేషు=తామరాకులయందు, పతితాః=పడిన, తోయబిన్దవః= జలబిందువులు, యథా=ఎట్లు, శ్లేషమ్=సంబంధమును, న అభిగచ్ఛన్తి=పొందవో, అనార్యేషు=అనార్యులయందు, సౌహృదమ్=స్నేహము, తథా=అట్లే.

తా. తామరాకుమీద పడిన జలబిందువులు ఏ విధముగా ఆకులతో దగ్గరగా కలియవో, పెద్దవారితో స్నేహము కూడ అట్లే. 11

మూ. యథా శరది మేఘానాం సిఞ్చతామపి గర్జతామ్,
న భవత్యమ్బుసంక్లేదస్తథానార్యేషు సౌహృదమ్. 12

ప్ర. అ. శరది=శరత్కాలమునందు, గర్జతామపి=గర్జించుచున్నను, సిఞ్చతామ్=వర్షించు, మేఘానామ్=మేఘములయొక్క, అమ్బుసంక్లేదః=నీటితో తడుపుట, యథా=ఎట్లు, న భవతి=కాదో, అనార్యేషు=పెద్దవారియందు, సౌహృదమ్=స్నేహము,తథా=అట్లే.

తా. శరత్కాలమునందు మేఘములు ఎంత గర్జించినను అవి వర్షించగా జలముతో తడుపుట (అనగా అవి వర్షించుట, జలముచేత భూమి తడియుట అనునవి) ఎట్లు జరుగదో పెద్దవారితో స్నేహము కూడ అట్టిదే.12

మూ. యథా మధుకరస్తర్షాద్రసం విన్దన్న తిష్ఠతి,
తథా త్వమపి తత్రైవ తథానార్యేషు సౌహృదమ్. 13

ప్ర. అ. యథా=ఎట్లు, రసమ్=రసమును, విన్దన్=పొందుచున్న, మధుకరః=తుమ్మెద, తర్షాత్=ఆసక్తి వలన, న తిష్ఠతి=ఉండదో, త్వమపి=నీవు కూడ, తథా= అట్లు, తత్రైవ=రామునియందే ఉన్నావు. అనార్యేషు=పెద్దవారియందు, సౌహృదమ్=స్నేహము, తథా=అట్లే.

తా. మకరందమును తీసికొనుచున్నను తుమ్మెద ఆ పుష్పమునందు

పిలవక, ఇంకను కావలె నను ఆసక్తివలన మరొక పుష్పము వద్దకు పోవును. నీవును అట్లే శత్రుపక్షము వహించుచున్నావు. అనార్యులతో స్నేహము ఇట్లే ఉండును. 13

మూ. యథా మధుకరస్తర్షాత్కాశపుష్పం పిబన్నపి,
రసమత్ర న విన్దేత తథానార్యేషు సౌహృదమ్. 14

ప్ర. అ. మధుకరః=తుమ్మెద, తర్షాత్=ఆసక్తివలన, కాశపుష్పమ్=రెల్లు పూవును, పిబన్నపి=త్రాగుచున్నను, అత్ర=దీనియందు, రసమ్=రసమును, యథా=ఎట్లు, న విన్దేత=పొందదో, అనార్యేషు=అనార్యులయందు, సౌహృదమ్=స్నేహము, తథా= అట్లే.

తా. తుమ్మెద అత్యాసక్తితో రెల్లుపూవుపై వాలి మకరందమును త్రాగ ప్రయత్నించినా దానికి రసమేమీ ఎట్లు లభించదో అనార్యులతో స్నేహము కూడ అట్లే ఉండును. 14

మూ. యథా పూర్వం గజః స్నాత్వా గృహ్య హస్తేన వై రజః,
దూషయత్యాత్మనో దేహం తథానార్యేషు సౌహృదమ్. 15

ప్ర.అ. గజః=ఏనుగు, పూర్వమ్=ముందు, స్నాత్వా=స్నానముచేసి, హస్తేన=తొండముతో, రజః=పరాగమును, గృహ్య=గ్రహించి, ఆత్మనః=తనయొక్క, దేహమ్=దేహమును, యథా=ఎట్లు, దూషయతి=దూషించునో, అనార్యేషు=చెడ్డ వారియందు, సౌహృదమ్=స్నేహము, తథా=అట్లే.

తా. ఏనుగు ముందు స్నానము చేసి పైకి వచ్చి తొండముతో బూడిద తీసికొని తన శరీరము మీద చల్లుకొనును. ఆ గజము చేసిన స్నానము ఎట్లు నిష్ఫలమో అనార్యులతో స్నేహము కూడ అట్లే నిష్ఫలము. 15

మూ. యోఽన్యస్త్వేవంవిధం బ్రూయాద్వాక్యమేతన్నిశాచర,
అస్మిన్ముహూర్తే న భవేత్త్వాం తు ధిక్కులపాంసన. 16

ప్ర. అ. నిశాచర=రాక్షసుడా! అన్యః=ఇతరుడైన, యః=ఎవడు, ఏవంవిధమ్=ఈ విధముగా, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, బ్రూయాత్=పలుకునో, వాడు, అస్మిన్=ఈ, ముహూర్తే=ముహూర్తమునందు, న భవేత్=ఉండెడివాడు కాదు. కులపాంసన=కులమును చెరచినవాడా! త్వాం తు=నిన్ను గూర్చి, ధిక్=నింద అగుగాక.

తా. ఓ! రాక్షసుడా! మరొకడెవ్వడైనా ఈ విధముగా మాటలాడి ఉన్నచో ఈ ముహూర్తమునందే వానిని లేకుండ చేసెడివాడను. ఛీ! కులమును చెరచినవాడా! 16

మూ. ఇత్యుక్తః పరుషం వాక్యం న్యాయవాదీ విభీషణః,
ఉత్పపాత గదాపాణిశ్చతుర్భిః సహ రాక్షసైః. 17

ప్ర.అ. ఇతి=ఇట్లు, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, ఉక్తః=పలుకబడిన, న్యాయవాదీ=న్యాయమును పలుకు, విభీషణః=విభీషణుడు, గదాపాణిః=గదహస్తమునందు కలవాడై, చతుర్భిః=నలుగురు, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, ఉత్పపాత=(ఆకాశములోనికి) ఎగిరెను.

తా. రావణుడు ఈ విధముగా పరుషవాక్యములు పలుకగా, న్యాయమునే పలుకు స్వభావము గల విభీషణుడు గద ధరించి ఆకాశములోనికి ఎగిరెను. అతనితో నలుగురు రాక్షసులు కూడ ఎగిరిరి. 17

మూ. అబ్రవీచ్చ తదా వాక్యం జాతక్రోధో విభీషణః,
అన్తరిక్షగతః శ్రీమాన్ భ్రాతరం రాక్షసాధిపమ్. 18

ప్ర. అ. జాతక్రోధః=పుట్టిన క్రోధము గల, శ్రీమాన్=శ్రీమంతుడైన, విభీషణః=విభీషణుడు, అన్తరిక్షగతః=ఆకాశమును పొందినవాడై, తదా=అప్పుడు, భ్రాతరమ్=సోదరుడైన, రాక్షసాధిపమ్=రాక్షసరాజును గూర్చి, అబ్రవీచ్చ=పలికెను కూడ.

తా. అప్పుడు కోపించిన శ్రీమంతుడైన విభీషణుడు ఆకాశములో నిలిచి సోదరుడైన రావణునితో ఇట్లు పలికెను. 18

మూ. స త్వం భ్రాతాసి మే రాజన్ బ్రూహి మాం యద్యదిచ్ఛసి,
జ్యేష్ఠో మాన్యః పితృసమో న చ ధర్మపథే స్థితః. 19
ఇదం హి పరుషం వాక్యం న క్షమామ్యగ్రజస్య తే.

ప్ర. అ. రాజన్=రాజా ! సః త్వమ్=అట్టి నీవు, మే=నాకు, భ్రాతా=సోదరుడవు, అసి=అయి ఉన్నావు. యద్యత్=ఏమేమి, ఇచ్ఛసి=కోరుచున్నావో, దానిని, మామ్=నన్ను గూర్చి, బ్రూహి=పలుకుము. జ్యేష్ఠః=అన్నగారు, పితృసమః=తండ్రితో సమానుడు. ధర్మపథే=ధర్మమార్గమునందు, న చ స్థితః=లేకపోయినను, మాన్యః=గౌరవించదగినవాడు. అగ్రజస్య=అన్నవే అయినను, తే=నీయొక్క, ఇదమ్=ఈ, పరుషమ్=పరుషమైన, వాక్యం తు=వాక్యమువైతే, న క్షమామి=సహించను.

తా. రాజా ! నీవు నా అన్నవు. నీ కిష్టము వచ్చినట్లు అనుము. అన్నగారు తండ్రివంటివాడు. ధర్మమార్గములో లేకున్నా గౌరవింపవలసినవాడే. కాని, నీవు అన్నవే అయినా, ఈ పరుషవాక్యములను సహించజాలను. 19

మూ. సువిహితం హితకామేన వాక్యముక్తం దశానన, 20
న గృహ్ణన్త్యకృతాత్మానః కాలస్య వశమాగతాః.

ప్ర.అ. దశానన=రావణా ! కాలస్య=కాలమునకు, వశమ్=వశమును, ఆగతాః=పొందిన, అకృతాత్మానః=శిక్షితముకాని మనస్సు కలవారు, హితకామేన=హితమునందు కోరిక గలవానిచేత, ఉక్తమ్=పలుకబడిన, సువిహితమ్=బాగుగా విశ్లేషింపబడిన, హితమ్=హితమైన, వాక్యమ్=వాక్యమును, న గృహ్ణన్తి=గ్రహించరు.

తా. రావణా ! మనస్సును అదుపులో ఉంచుకొననివాళ్లు కాలమునకు లొంగిపోయినవారై, హితమును కోరి, బాగా విశ్లేషించి చెప్పిన మాటలు వినరు.

మూ. సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః, 21
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః.

ప్ర. అ. రాజన్=రాజా ! సతతమ్=ఎల్లప్పుడూ, ప్రియవాదినః=ఇష్టమైన మాటలు పలుకు, పురుషాః=పురుషులు, సులభాః=సులభులు. అప్రియస్య=ప్రియము కాని, పథ్యస్య=హితమునకు(ను), వక్తా=చెప్పువాడు, శ్రోతా చ=వినేవాడు కూడ, దుర్లభః=దుర్లభుడు.

తా. రాజా ! ఎల్లప్పుడూ ఇష్టమైన మాటలే చెప్పే పురుషులు అనాయాసముగా లభింతురు. కాని, ప్రియము కాకపోయినను హితమైన (భవిష్యత్తులో సత్ఫలితమును ఇచ్చే) మాటలు చెప్పేవారు అరుదు. అట్టివారు ఉన్నను వినేవారు అరుదు. 21

మూ. బద్ధం కాలస్య పాశేన సర్వభూతాపహారిణః, 22
న నశ్యన్తముపేక్షే త్వాం ప్రదీప్తం శరణం యథా.

ప్ర. అ. సర్వభూతాపహారిణః=సకలప్రాణులను అపహరించు, కాలస్య=కాలుని యొక్క, పాశేన=పాశముచేత, బద్ధమ్=కట్టబడిన, నశ్యన్తమ్=నశించుచున్న, త్వామ్=నిన్ను, ప్రదీప్తమ్=మండిపోవుచున్న, శరణం యథా=గృహమును వలె, న ఉపేక్షే=ఉపేక్షించజాలను.

తా. సకలప్రాణులను సంహరించే కాలుని పాశముచే కట్టబడి నీవు నశించి పోవుచుండగా, మండిపోవుచున్న ఇంటిని ఎట్లు ఉపేక్షించజాలనో అట్లే ఉపేక్షించజాలను. 22

మూ. దీప్తపావకసంకాశైః శితైః కాఞ్చనభూషణైః, 23
న త్వామిచ్ఛామ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః.

ప్ర. అ. దీప్తపావకసంకాశైః=మండుచున్న అగ్నితో సమానములు,

కాఞ్చనభూషణైః=బంగారము అలంకారముగా గలవి అయిన, శితైః=వాడియైన, శరైః=బాణములచేత, రామేణ=రామునిచేత, నిహతమ్=చంపబడిన, త్వామ్=నిన్ను, ద్రష్టుమ్=చూచుటకు, న ఇచ్ఛామి=కోరను.

తా. రాముడు నిన్ను మండుచున్న అగ్నివలె ఉన్న, బంగారు అలంకారములు గల వాడియైన బాణములతో చంపుచుండగా చూడజాలను.23

మూ. శూరాశ్చ బలవన్తశ్చ కృతాస్త్రాశ్చ నరా రణే, 24
కాలాభిపన్నాః సీదన్తి యథా వాలుకసేతవః.

ప్ర. అ. శూరాః=శూరులు, బలవన్తశ్చ=బలవంతులు, కృతాస్త్రాశ్చ=నేర్వబడిన అస్త్రములు కలవారు అయిన, నరాః=నరులు, కాలాభిపన్నాః=కాలముచేత ఆక్రమింపబడినవారై, వాలుకసేతవః యథా=ఇసుకతో కట్టిన ఆనకట్టలు వలె, సీదన్తి=నశింతురు.

తా. శూరులు, బలవంతులు, అస్త్రనిపుణులు అయిన నరులు కూడ కాలము వచ్చినప్పుడు, ఇసుకతో కట్టిన ఆనకట్టలవలె, యుద్ధములో నశింతురు.24

మూ. తన్మర్షయతు యచ్చోక్తం గురుత్వాద్ధితమిచ్ఛతా, 25
ఆత్మానం సర్వథా రక్ష పురీం చేమాం సరాక్షసామ్,
స్వస్తి తేఽస్తు గమిష్యామి సుఖీ భవ మయా వినా. 26

ప్ర. అ. గురుత్వాత్=అన్న వగుటవలన, హితమ్=హితమును, ఇచ్ఛతా=కోరుచున్న నాచేత, యత్=ఏది, ఉక్తమ్=పలుకబడినదో, తత్=దానిని, మర్షయతు=సహించెదవుగాక. ఆత్మానమ్=తనను, సరాక్షసామ్=రాక్షసులతో కూడిన, ఇమామ్=ఈ, పురీం చ=పట్టణమును, సర్వథా=అన్ని విధములా, రక్ష=రక్షించుకొనుము. తే =నీకు, స్వస్తి=మంగళము, అస్తు=అగుగాక. గమిష్యామి=వెళ్లెదను. మయా వినా=నేను లేకుండగా, సుఖీ=సుఖవంతుడవు, భవ=అగుము.

తా. నీవు అన్నవగుటచే నీ హితమును కోరి నేను చెప్పిన మాటలు క్షమింపుము. నిన్ను, రాక్షసులను, ఈ నగరమును అన్ని విధాలా రక్షించుకొనుము. నీకు క్షేమమగుగాక. నేను వెళ్లిపోవుచున్నాను. నేను లేకుండా సుఖముగా ఉండుము. 25, 26

మూ. నివార్యమాణస్య మయా హితైషిణా
న రోచతే తే వచనం నిశాచర,
పరీతకాలే హి గతాయుషో నరా
హితం న గృహ్ణన్తి సుహృద్భిరీరితమ్. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాండే షోడశః సర్గః.

ప్ర. అ. నిశాచర=రాక్షసుడా ! హితైషిణా=హితమును కోరుచున్న, మయా=నాచేత, నివార్యమాణస్య=నివారింపబడుచున్న, తే=నీకు, వచనమ్=నా వచనము, న రోచతే=ఇష్టముగుటలేదు. పరీతకాలే=విపరీతకాలమునందు, గతాయుషః=పోయిన ఆయుర్దాయము గల, నరాః=నరులు, సుహృద్భిః=స్నేహితులచేత, ఉదితమ్=పలుకబడిన, హితమ్=హితమును, న గృహ్ణన్తి హి=గ్రహింపరు కదా !

తా. రావణా ! నీ హితమును కోరి నేను చెప్పిన మాటలు నీకు నచ్చుటలేదు. విపరీతకాలమునందు, ఆయువు మూడిన నరులు మిత్రులు చెప్పిన హితమును అంగీకరించరు. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదునారవసర్గ సమాప్తము.

# అథ సప్తదశః సర్గః

[విభీషణుడు రాముని ఆశ్రయించుటకు వెళ్ళుట; అతనికి ఆశ్రయము ఇచ్చు విషయమును గూర్చి రాముడు మన్త్రులతో ఆలోచించుట]

మూ. ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః,
ఆజగామ ముహూర్తేన యత్ర రామః సలక్ష్మణః. 1

ప్ర.అ. రావణానుజః=విభీషణుడు, రావణమ్=రావణుని గూర్చి, ఇతి=ఇట్లు, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, ఉక్త్వా=పలికి, సలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, రామః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, ముహూర్తేన=ముహూర్తకాలములో, ఆజగామ=వచ్చెను.

తా. విభీషణుడు రావణునితో ఇట్లు పరుషములైన మాటలు పలికి ముహూర్తకాలములో, లక్ష్మణసహితుడైన రాము డున్న చోటికి వచ్చెను. 1

మూ. తం మేరుశిఖరాకారం దీప్తామివ శతహ్రదామ్,
గగనస్థం మహీస్థాస్తే దదృశు ర్వానరాధిపాః. 2

ప్ర.అ. మహీస్థాః=భూమిపై ఉన్న, తే=ఆ, వానరాధిపాః=వానరనాయకులు, మేరుశిఖరాకారమ్=మేరుపర్వతశిఖరమువంటి ఆకారము గలవాడు, దీప్తామ్=ప్రజ్వలించుచున్న, శతహ్రదామ్ ఇవ=మెరుపువలె ఉన్నవాడు అయిన, గగనస్థమ్=ఆకాశమునందున్న, తమ్=అతనిని, దదృశుః=చూచిరి.

తా. మేరుశిఖరము వలె, ప్రకాశించుచున్న మెరుపువలె ఆకాశములో ఉన్న ఆ విభీషణుని నేలమీద ఉన్న వానరనాయకులు చూచిరి. 2

మూ. తే చాప్యనుచరాస్తస్య చత్వారో భీమవిక్రమాః,
తేఽపి వర్మాయుధోపేతా భూషణోత్తమభూషితాః. 3

ప్ర.అ. తస్య=అతనియొక్క, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, చత్వారః=నలుగురు, తే=ఆ, అనుచరాః అపి=అనుచరులు కూడ, ఉండిరి. తే అపి= వారుకూడ, వర్మాయుధోపేతాః=కవచములతోను ఆయుధములతోను కూడినవారు. భూషణోత్తమభూషితాః=శ్రేష్ఠములైన అలంకారములచేత అలంకరించబడినవారు.

తా. భయంకరమైన పరాక్రమము గల అతని నలుగురు అనుచరులు కూడ కవచములను ఆయుధములను ధరించి, ఉత్తమభూషణములను అలంకరించుకొని ఉండిరి. 3

మూ. స చ మేఘాచలప్రఖ్యో వజ్రాయుధసమప్రభః,
వరాయుధధరో వీరో దివ్యాభరణభూషితః. 4

ప్ర. అ. మేఘాచలప్రఖ్యః=మేఘము వలె పర్వతము వలె ఉన్న, వజ్రాయుధసమప్రభః= వజ్రాయుధముతో సమానమైన కాంతి గల, వీరః=వీరుడైన, స చ=అతడు కూడ, వరాయుధధరః=శ్రేష్ఠములైన ఆయుధములను ధరించినవాడై, దివ్యాభరణభూషితః=దివ్యములైన ఆభరణములచేత అలంకృతుడై ఉండెను.

తా. మేఘముతోను పర్వతముతోను సమానుడు, వజ్రాయుధము వంటి కాంతి గలవాడు అయిన, వీరుడైన ఆ విభీషణుడు కూడ శ్రేష్ఠములైన ఆయుధములు ధరించి దివ్యాభరణములచేత అలంకృతుడై ఉండెను. 4

మూ. తమాత్మపఞ్చమం దృష్ట్వా సుగ్రీవో వానరాధిపః,
వానరైః సహ దుర్ధర్షశ్చిన్తయామాస వీర్యవాన్. 5

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానివాడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు, వానరాధిపః=వానరప్రభువూ అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, ఆత్మపఞ్చమమ్=తాను ఐదవవాడుగా గల, తమ్=అతనిని, దృష్ట్వా=చూచి, వానరైః సహ=వానరులతో కూడ, చిన్తయామాస=ఆలోచించెను.

తా. ఎదిరింప శక్యము కానివాడు, వానరప్రభువు, పరాక్రమవంతుడు అయిన సుగ్రీవుడు, నలుగురు రాక్షసులతో కలిసి వచ్చుటచే తాను ఐదవవాడుగా ఉన్న ఆ విభీషణుని చూచి (విభీషణుణ్ణి ఆ నలుగురు రాక్షసులను చూచి)వానరులతో ఆలోచించెను. 5

మూ. చిన్తయిత్వా ముహూర్తం తు వానరాంస్తానువాచ హ,
హనుమత్ప్రముఖాన్ సర్వానిదం వచనముత్తమమ్. 6

ప్ర. అ. ముహూర్తమ్=ముహూర్తకాలమును, చిన్తయిత్వా=ఆలోచించి, హనుమత్ప్రముఖాన్=హనుమంతుడు మొదలైన, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, వానరాన్=వానరులను గూర్చి, ఉత్తమమ్=ఉత్తమమైన, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ఉవాచ హ=పలికెను.

తా. అతడు ముహూర్తకాలము ఆలోచించి, హనుమంతుడు మొదలైన ఆ వానరు లందరితో ఈ విధముగా ఉత్తమమైన వచనము పలికెను. 6

మూ. ఏష సర్వాయుధోపేతశ్చతుర్భిః సహ రాక్షసైః,
రాక్షసోఽభ్యేతి పశ్యధ్వమస్మాన్ హన్తుం న సంశయః. 7

ప్ర. అ. సర్వాయుధోపేతః=సమస్తమైన ఆయుధములతో కూడిన,

ఏషః రాక్షసః = ఈ రాక్షసుడు, చతుర్భిః రాక్షసైః సహ = నలుగురు రాక్షసులతో కూడ, అభ్యేతి = వచ్చుచున్నాడు; పశ్యత = చూడుడు. అస్మాన్ = మనలను, హన్తుమ్ = చంపుటకే వచ్చుచున్నాడు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఈ రాక్షసు డెవడో అస్త్ర ఆయుధములు ధరించి, నలుగురు రాక్షసులతో కూడ వచ్చుచున్నాడు; చూడుడు. మనలను చంపుటకే వచ్చుచున్నాడు. సందేహము లేదు. 7

మూ. సుగ్రీవస్య వచః శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః,
సాలానుద్యమ్య శైలాంశ్చ ఇదం వచనమబ్రువన్. 8

ప్ర. అ. సర్వే = సమస్తమైన, తే = ఆ, వానరోత్తమాః = వానరశ్రేష్ఠులు, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, సాలాన్ = సాల(మా)ను వృక్షములను, శైలాంశ్చ = పర్వతములను, ఉద్యమ్య = ఎత్తి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ వానరోత్తము లందరూ సుగ్రీవుని మాటలు విని, మద్దిచెట్లను, పర్వతములను ఎత్తి ఇట్లు పలికిరి. 8

మూ. శీఘ్రం వ్యాదిశ నో రాజన్ వధాయైషాం దురాత్మనామ్,
నిపతన్తి హతా యావద్ధరణ్యామల్పచేతసః. 9

ప్ర. అ. రాజన్ = రాజా ! దురాత్మనామ్ = దురాత్ములైన, ఏషామ్ = వీరి యొక్క, వధాయ = వధకొరకు, శీఘ్రమ్ = శీఘ్రముగా, వ్యాదిశ = ఆజ్ఞాపించుము. అల్పచేతసః = అల్పమైన బుద్ధి గల వీరు, హతాః = చంపబడినవారై, ధరణ్యామ్ = నేల మీద, నిపతన్తి యావత్ = పడగలరు.

తా. రాజా ! ఈ దురాత్ములను చంపుటకు వెంటనే మాకు ఆజ్ఞ ఇమ్ము. ఈ మందబుద్ధులు మాచే చంపబడినవారై నేలమీద పడగలరు. 9

మూ. తేషాం సంభాషమాణానామన్యోన్యం స విభీషణః,
ఉత్తరం తీరమాసాద్య ఖస్థ ఏవ వ్యతిష్ఠత. 10

ప్ర. అ. సః విభీషణః = ఆ విభీషణుడు, ఉత్తరమ్ = అవతలిదైన, తీరమ్ = తీరమును, ఆసాద్య = పొంది, తేషామ్ = ఆ వానరులు, అన్యోన్యమ్ = పరస్పరము, సంభాషమాణానామ్ = మాటలాడుకొనుచుండగా, ఖస్థః ఏవ = ఖస్థుడగుచునే, వ్యతిష్ఠత = ఉండెను.

తా. సముద్రము అవతలి ఒడ్డు చేరిన విభీషణుడు ఆ వానరులు పరస్పరము మాటలాడుకొనుచుండగా కంగారుపడకుండ ఆకాశమునందు నిలచి

ఉండెను. 10

మూ. స ఉవాచ మహాప్రాజ్ఞః స్వరేణ మహతా మహాన్,
సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య ఖస్థ ఏవ విభీషణః. 11

ప్ర. అ. మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధిమంతుడు, మహాన్=గొప్పవాడు అయిన, సః విభీషణః=ఆ విభీషణుడు, సుగ్రీవమ్=సుగ్రీవుని, తాంశ్చ=ఆ వానరులను, సంప్రేక్ష్య=చూచి, ఖస్థః ఏవ=ఆకాశమునందే ఉన్నవాడై, మహతా=గొప్పదైన, స్వరేణ=స్వరముతో, ఉవాచ=పలికెను.

తా. మహాబుద్ధిమంతుడు, గొప్పవాడు అయిన ఆ విభీషణుడు సుగ్రీవుణ్ణి, ఆ వానరులను చూచి, ఆకాశమునందే నిలచి, పెద్ద కంఠస్వరముతో ఇట్లనెను.

మూ. రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః,
తస్యాహమనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః. 12

ప్ర. అ. రావణో నామ=రావణుడు అను పేరు గల, దుర్వృత్తః=చెడ్డ నడవడిక గల, రాక్షసేశ్వరః=రాక్షసప్రభువైన, రాక్షసః=రాక్షసుడు ఉన్నాడు. అహమ్=నేను, తస్య=అతనియొక్క, అనుజః భ్రాతా=తమ్ముడను; విభీషణః ఇతి=విభీషణుడు అని, శ్రుతః=ప్రసిద్ధుడను.

తా. రాక్షసులకు ప్రభువు, చెడ్డ నడవడిక గలవాడు అయిన రావణు డను రాక్షసు డున్నాడు. విభీషణు డను పేరు గల నేను వాని తమ్ముడను. 12

మూ. తేన సీతా జనస్థానాద్ధృతా హత్వా జటాయుషమ్,
రుద్ధా చ వివశా దీనా రాక్షసీభిః సురక్షితా. 13

ప్ర. అ. తేన=వానిచేత, జటాయుషమ్=జటాయువును, హత్వా=చంపి, సీతా=సీత, జనస్థానాత్=జనస్థానమునుండి, హృతా=హరింపబడినది. రుద్ధా=బంధింపబడినదై, వివశా=వివశురాలై, (తన శరీరములో లేనిదై), దీనా=దీనురాలైన ఆమె, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, సురక్షితా=బాగుగా రక్షింపబడినది.

తా. అతడు జటాయువును చంపి సీతను జనస్థానమునుండి తీసికొనివచ్చి, వివశురాలై, దీనురాలై ఉన్న ఆమెను బంధించినాడు. ఆమెను రాక్షసస్త్రీలు రక్షించుచున్నారు. 13

మూ. తమహం హేతుభిర్వాక్యైర్వివిధైశ్చ న్యదర్శయమ్,
సాధు నిర్యాత్యతాం సీతా రామాయేతి పునః పునః. 14

ప్ర. అ. సీతా=సీత, సాధు=బాగుగా, రామాయ=రామునకు, నిర్యాత్యతామ్=తిరిగి ఇచ్చివేయబడుగాక, ఇతి=అని, పునః పునః=మాటిమాటికి, తమ్=ఆతనిని, అహమ్=నేను, హేతుభిః=యుక్తులచేతను, వివిధైః=అనేకవిధములైన, వాక్యైః=వాక్యములచేతను, పునః పునః=మాటిమాటికి, స్వదర్శయమ్=బోధించితిని.

తా. సీతను చక్కగా రామునకు ఇచ్చివేయుమని నేను యుక్తియుక్తములైన మాటలు అనేకవిధములం చెప్పి, మాటిమాటికి ఆతనికి బోధించితిని. 14

మూ. స చ న ప్రతిజగ్రాహ రావణః కాలచోదితః,
ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్. 15

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, కాలచోదితః=కాలముచేత ప్రేరేపింపబడినవాడై, ఉచ్యమానమ్=చెప్పబడుచున్న, హితమ్=హితమైన, వాక్యమ్=వాక్యమును, విపరీతః= విపరీతబుద్ధి కలవాడు, ఔషధమ్ ఇవ=ఔషధమును వలె, న ప్రతిజగ్రాహ=స్వీకరించలేదు.

తా. ఆ రావణుడు కాలముచేత ప్రేరేపింపబడుటచే, నేను చెప్పిన హితవాక్యమును, ఆయుస్సు మూడిన విపరీతబుద్ధి గలవాడు ఔషధమును వలె, అంగీకరించలేదు. 15

మూ. సోఽహం పరుషితస్తేన దాసవచ్చావమానితః,
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః. 16

ప్ర. అ. తేన=వానిచేత, పరుషితః=పరుషముగా మాటలాడబడినవాడనై, దాసవత్= దాసుడు వలె, అవమానితః=అవమానించబడిన, సః అహమ్=అట్టి నేను, పుత్రాంశ్చ= పుత్రులను, దారాంశ్చ=భార్యను, త్యక్త్వా=విడచి, రాఘవమ్=రాముణ్ణి, శరణం గతః=శరణు పొందినాను.

తా. ఆతడు పరుషవాక్యములు పలికి నన్ను దాసుని అవమానించి నట్లు అవమానించినాడు. అందుచేత నేను భార్యాపుత్రాదులను విడచి వచ్చి రాముణ్ణి శరణు పొందుచున్నాను. 16

మూ. విజ్ఞాపయత మాం క్షిప్రం రాఘవాయ మహాత్మనే,
సర్వలోకశరణ్యాయ విభీషణముపస్థితమ్. 17

ప్ర. అ. మహాత్మనే=మహాత్ముడు, సర్వలోకశరణ్యాయ=సకలలోకము లకు రక్షకుడు అయిన, రాఘవాయ=రామునకు, విభీషణమ్=విభీషణుడను పేరుగల, మామ్=నన్ను, ఉపస్థితమ్=వచ్చినవానినిగా, క్షిప్రమ్=శీఘ్రముగా, విజ్ఞాపయత=తెలుపుడు.

తా. విభీషణుడను పేరు గల నేను వచ్చినట్లుగా మహాత్ముడు, సకలలోకములను రక్షించువాడు అయిన రామునకు శీఘ్రముగా తెలుపుడు. 17

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవో లఘువిక్రమః,
లక్ష్మణస్యాగ్రతో రామం సంరబ్ధమిదమబ్రవీత్. 18

ప్ర. అ. లఘువిక్రమః=శీఘ్రమైన పరాక్రమము గల, సుగ్రీవః=సుగ్రీవుడు, ఏతత్=ఈ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, అగ్రతః=ఎదుట, రామమ్=రాముని గూర్చి, సంరబ్ధతరమ్=ఎక్కువ తొందరగా, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. శీఘ్రమైన పరాక్రమము గల సుగ్రీవుడు ఈ మాటలు విని, లక్ష్మణుని సమక్షమునందు రామునితో, చాల కంగారుగా ఇట్లు పలికెను. 18

మూ. ప్రవిష్టః శత్రుసైన్యం హి ప్రాప్తః శత్రురతర్కితః,
నిహన్యాదన్తరం లబ్ధ్వా ఉలూకో వాయసానివ. 19

ప్ర. అ. అతర్కితః=ఊహించబడనివాడై, ప్రాప్తః=వచ్చిన, శత్రుసైన్యమ్=శత్రుసైన్యమును, ప్రాప్తః=పొందిన, శత్రుః=శత్రువు, అన్తరమ్=అవకాశమును, లబ్ధ్వా=పొంది, ఉలూకః=గుడ్లగూబ, వాయసానివ=కాకులను వలె, నిహన్యాత్=చంపును.

తా. ఊహించకుండగా వచ్చి శత్రుసైన్యములో ప్రవేశించిన శత్రువు, అవకాశము దొరకగానే గుడ్లగూబ కాకులను చంపినట్లు చంపివేయును. 19

మూ. మన్త్రే వ్యూహే నయే చారే యుక్తో భవితుమర్హసి,
వానరాణాం చ భద్రం తే పరేషాం చ పరంతప. 20

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా ! వానరాణాం చ=వానరులయొక్క, పరేషాం చ= శత్రువులయొక్క, మంత్రే=ఆలోచనయందు, వ్యూహే=వ్యూహము నందు, నయే=నీతియందు, చారే=గూఢచారి(తుల)యందు, యుక్తః=సావధానచిత్తుడవుగా, భవితుమ్=అగుటకు, అర్హసి=తగి ఉన్నావు. తే=నీకు, భద్రమ్=మంగళమగుగాక.

తా. ఓ ! శత్రువినాశకా ! వానరులకు లాభకరమైన మంత్రమునందు, వ్యూహమునందు, నీతియందు, గూఢచారిప్రయోగమునందు సావధానచిత్తుడవై, పరులు ప్రయోగించు మంత్ర - వ్యూహ - నీతి - గూఢచారి ప్రయోగాదులయందు కూడ అప్రమత్తుడవై ఉండుము. నీకు భద్రము కలుగుగాక. 20

మూ. అన్తర్ధానగతా హ్యేతే రాక్షసాః కామరూపిణః,
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషాం జాతు న విశ్వసేత్. 21

ప్ర. అ. ఏతే రాక్షసాః=ఈ రాక్షసులు, కామరూపిణః=స్వేచ్ఛానుసారము రూపములు గలవారు. అన్తర్ధానగతాః=అంతర్ధానము పొందగలవారు, శూరాః=శూరులు, నికృతిజ్ఞాశ్చ=కపటోపాయములు తెలిసినవారు. తేషామ్=వారికి, జాతు=ఎన్నడును, న విశ్వసేత్=విశ్వసింపగూడదు.

తా. ఈ రాక్షసులు అంతర్ధానము పొందగలవారు. ఇష్టమైన రూపము ధరింప గలవారు. శూరులు. కపటోపాయములు తెలిసినవారు. వారిని ఎన్నడూ నమ్మకూడదు. 21

మూ. ప్రణిధీ రాక్షసేన్ద్రస్య రావణస్య భవేదయమ్,
అనుప్రవిశ్య సోఽస్మాసు భేదం కుర్యాన్న సంశయః. 22

ప్ర. అ. అయమ్=ఇతడు, రాక్షసేన్ద్రస్య=రాక్షసరాజైన, రావణస్య=రావణుని యొక్క, ప్రణిధిః=గూఢచారి, భవేత్=కావచ్చును. సః=అట్టి ఇతడు, అనుప్రవిశ్య=లోపల ప్రవేశించి, అస్మాసు=మనలో, భేదమ్=భేదమును, కుర్యాత్=చేయును; సంశయః=సంశయము న=లేదు.

తా. ఇతడు రాక్షసరాజైన రావణుని గూఢచారియై ఉండును. ఇతడు మన మధ్య ప్రవేశించి, మనలో భేదమును కలిగించును; సందేహము లేదు. 22

మూ. అథవా స్వయమేవైష ఛిద్రమాసాద్య బుద్ధిమాన్,
అనుప్రవిశ్య విశ్వస్తే కదాచిత్ప్రహరేదపి. 23

ప్ర. అ. అథవా=లేదా, బుద్ధిమాన్=బుద్ధిమంతుడైన, ఏషః=ఇతడు, స్వయమేవ=స్వయముగానే, ఛిద్రమ్=ఛిద్రమును, (ఏదైన లోపమును) ఆసాద్య=పొంది (తెలిసికొని), అనుప్రవిశ్య=లోనప్రవేశించి, విశ్వస్తే=విశ్వాసము చెందిన నీయందు, ప్రహరేదపి కదాచిత్= కొట్టవచ్చును కూడ.

తా. లేదా బుద్ధిమంతుడైన ఇతడే స్వయముగా మనలోని లోపములు తెలిసికొని, ప్రవేశించి, విశ్వాసముతో ఉన్న నీపైన దెబ్బ తీయవచ్చును. 23

మూ. మిత్రాటవీబలం చైవ మౌలభృత్యబలం తథా,
సర్వమేతద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్. 24

ప్ర. అ. మిత్రాటవీబలం చైవ=మిత్రుల సైన్యము, అడవులలో ఉండేవారి సైన్యము, తథా= మరియు, మౌలభృత్యబలమ్=మౌలమైన (అనగా వంశక్రమానుగతముగా వచ్చుచున్న) సైన్యము, తాత్కాలికముగా భృతి నిచ్చి ఏర్పాటు చేసుకొన్న సైన్యము, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తమైన, బలమ్=సైన్యము,

ద్విషద్బలమ్=శత్రుసైన్యమును, వర్జయిత్వా=విడచి, గ్రాహ్యమ్=గ్రహింపదగినది.

తా. శత్రువుల సైన్యము తప్ప, మిత్రుల సైన్యమును, అటవికుల సైన్యమును, పరంపరాగతమైన సైన్యమును, తాత్కాలికభృతి నిర్ణయించి కూర్చుకొన్న సైన్యమును, ఈ అన్ని విధముల సైన్యమును కూడ గ్రహింపవచ్చును. 24

మూ. ప్రకృత్యా రాక్షసో హ్యేష భ్రాతామిత్రస్య వై ప్రభో,
ఆగతశ్చ రిపోః సాక్షాత్కథమస్మిన్ విశ్వసేత్. 25

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! ఏషః=ఇతడు, ప్రకృత్యా=స్వభావముచేత, రాక్షసో హి=రాక్షసుడు కదా ! అమిత్రస్య=శత్రువుయొక్క, భ్రాతా=సోదరుడు. సాక్షాత్= సాక్షాత్తు, రిపోః=శత్రువునుండి, ఆగతః=వచ్చినాడు. అస్మిన్=ఇతనియందు, కథమ్= ఎట్లు, విశ్వసేత్=విశ్వసించవలెను.

తా. ఓ ! ప్రభూ ! ఇతడు సహజముగానే రాక్షసుడు. శత్రువునకు సోదరుడు. సాక్షాత్తూ శత్రువుదగ్గరనుండి వచ్చుచున్నాడు. ఇతనిని విశ్వసించుట ఎట్లు ? 25

మూ. రావణస్యానుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః,
చతుర్భిః సహ రక్షోభిర్భవన్తం శరణం గతః. 26

ప్ర. అ. విభీషణః ఇతి=విభీషణుడు అని, శ్రుతః=ప్రసిద్ధుడైన, రావణస్య=రావణునియొక్క, అనుజః భ్రాతా=తమ్ముడు, చతుర్భిః=నలుగురు, రక్షోభిః సహ=రాక్షసులతో కూడ, భవన్తమ్=నిన్ను, శరణమ్=శరణమును, గతః=పొందినాడు.

తా. విభీషణు డను పేరు గల రావణుని తమ్ముడు నలుగురు రాక్షసులతో కూడ వచ్చి నిన్ను శరణు పొందుచున్నాడు.

వి. కొందరు వ్యాఖ్యాతల ప్రకారము ఈ శ్లోకము "మన్త్రే వ్యూహే" ఇత్యాది శ్లోకము(20) తరువాత ఉన్నది. 26

మూ. రావణేన ప్రణిహితం తమవేహి విభీషణమ్,
తస్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర. 27

ప్ర. అ. క్షమవతామ్=ఓర్పు కలవారిలో, వర=శ్రేష్ఠుడా ! తమ్=ఆ, విభీషణమ్=విభీషణుని, రావణేన=రావణునిచేత, ప్రణిహితమ్=పంపబడినవానినిగా, అవేహి= తెలిసికొనుము. తస్య=వానియొక్క, నిగ్రహమ్=నిగ్రహించుటను(బంధనము) క్షమమ్=తగినదానినిగా, అహమ్=నేను, మన్యే=తలచుచున్నాను.

తా. ఓర్పు కలవారిలో శ్రేష్ఠుడైన రామా ! రావణుడే ఆ విభీషణుని పంపి ఉండునని తలచెదను. అతనిని నిగ్రహించుటయే యుక్త మని తలచెదను.

మూ. రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సందిష్టోఽయ మిహాగతః,
ప్రహర్తుం మాయయా ఛన్నో విశ్వస్తే త్వయి చానఘ. 28

ప్ర.అ. అనఘ=దోషము లేనివాడా ! అయమ్=ఈ, రాక్షసః=రాక్షసుడు, జిహ్మయా=కుటిలమైన, బుద్ధ్యా=బుద్ధిచేత, సందిష్టః=పంపబడినవాడై, మాయయా=మాయచేత, ఛన్నః=కప్పబడినవాడై, విశ్వస్తే=విశ్వసించిన, త్వయి=నీయందు, ప్రహర్తుమ్=కొట్టుటకు, ఇహ=ఇక్కడికి, ఆగతః=వచ్చినాడు.

తా. దోషరహితుడవైన రామా ! కుటిలమైన ఆలోచనతో (రావణుడు) పంపగా ఈ రాక్షసుడు, విశ్వాసము చెందిన నీయందు, మాయాబలము చేత రహస్యముగా దెబ్బతీయుటకై వచ్చినాడు. 28

మూ. వధ్యతామేష తీవ్రేణ దణ్డేన సచివైః సహ,
రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః. 29

ప్ర. అ. ఏషః=ఇతడు, సచివైః=సహ మంత్రులతోకూడ, తీవ్రేణ=తీవ్రమైన, దణ్డేన=దండనము చేత, వధ్యతామ్=చంపబడుగాక. ఏషః విభీషణః=ఈ విభీషణుడు, నృశంసస్య=క్రూరుడైన, రావణస్య=రావణునియొక్క, భ్రాతా హి=సోదరుడు కదా !

తా. ఈ విభీషణుడు క్రూరుడైన రావణుని సోదరుడు. అందుచే ఇతనిని, ఇతని మంత్రులను కూడ తీవ్రమైన దండన మిచ్చి చంపించివేయుము. 29

మూ. ఏవముక్త్వా తు తం రామం సంరబ్ధో వాహినీపతిః,
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌనముపాగమత్. 30

ప్ర. అ. వాహినీపతిః=సేనానాయకుడు, వాక్యజ్ఞః=వాక్యములను ఎరిగినవాడు అయిన సుగ్రీవుడు, సంరబ్ధః=తొందరపడుచున్నవాడై, వాక్యకుశలమ్=మాటలలో నేర్పరియైన, తం రామమ్=ఆ రాముని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటుపిమ్మట, మౌనమ్=మౌనమును, ఉపాగమత్=పొందెను.

తా. ఎట్లు మాటలాడవలెనో తెలిసిన, సేనానాయకుడైన సుగ్రీవుడు, మాటలలో నేర్పరియైన ఆ రామునితో, కంగారు పడుచు ఇట్లు పలికి మౌనము వహించెను. 30

మూ. సుగ్రీవస్య తు తద్వాక్యం శ్రుత్వా రామో మహాబలః,
సమీపస్థానువాచేదం హనుమత్ప్రముఖాన్ కపీన్. 31

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రామః=రాముడు, సుగ్రీవస్య=

సుగ్రీవునియొక్క, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, సమీపస్థాన్=సమీపమునందున్న, హనుమత్ప్రముఖాన్=హనుమంతుడు మొదలైన, కపీన్=కపులను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మహాబలశాలియైన రాముడు సుగ్రీవుడు పలికిన ఆ మాటలు విని, దగ్గర ఉన్న, హనుమంతుడు మొదలైన వానరులతో ఇట్లు పలికెను. 31

మూ. యదుక్తం కపిరాజేన రావణావరజం ప్రతి,
వాక్యం హేతుమదత్యర్థం భవద్భిరపి చ శ్రుతమ్. 32

ప్ర. అ. రావణావరజం ప్రతి=విభీషణుని గూర్చి, కపిరాజేన=సుగ్రీవునిచేత, అత్యర్థమ్=మిక్కిలి, హేతుమత్=హేతువులు కల, యత్=ఏ, వాక్యమ్=వాక్యము, ఉక్తమ్=పలుకబడినదో అది, భవద్భిరపి=మీచేత కూడ, శ్రుతమ్=వినబడినది.

తా. విభీషణుని విషయములో సుగ్రీవుడు పలికిన, మంచి యుక్తులతో కూడిన మాటలు మీరు కూడ విన్నారు కదా ? 32

మూ. సుహృదామర్థకృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సదా,
సమర్థేనోపసందేష్టుం శాశ్వతీం భూతిమిచ్ఛతా. 33

ప్ర. అ. శాశ్వతీమ్=శాశ్వతమైన, భూతిమ్=ఐశ్వర్యమును, ఇచ్ఛతా=కోరుచున్న, సమర్థేన=సమర్థుడైన, బుద్ధిమతా=బుద్ధిమంతునిచేత, సదా=ఎల్లప్పుడు, సుహృదామ్=స్నేహితులయొక్క, అర్థకృచ్ఛ్రేషు=కార్యములకు సంబంధించిన, కష్టములయందు, ఉపదేష్టుమ్=ఉపదేశించుటకు, యుక్తమ్=యుక్తము.

తా. శాశ్వతమైన అభివృద్ధిని కోరు సమర్థుడైన బుద్ధిమంతుడు, మిత్రులకు కార్యములలో కష్టము ఏర్పడినప్పుడు ఉపదేశించుట యుక్తము. అందుచేత మీ మీ అభిప్రాయములను చెప్పుడు. 33

మూ. ఇత్యేవం పరిపృష్టాస్తే స్వం స్వం మతమతన్ద్రితాః,
సోపచారం తదా రామమూచుః ప్రియచికీర్షవః. 34

ప్ర. అ. తదా=అప్పుడు, ఇత్యేవమ్=ఇట్లు, పరిపృష్టాః=అడుగబడిన, తే=వారు, అతన్ద్రితాః=అలసత్వము లేనివారై, ప్రియచికీర్షవః=ప్రియమును చేయగోరుచున్నవారై, సోపచారమ్=ఉపచారపూర్వకముగా, స్వం స్వమ్=తమ తమ, మతమ్=అభిప్రాయమును, రామమ్=రాముని గూర్చి, ఊచుః=పలికిరి.

తా. రామునిచేత ఈ విధముగా ప్రశ్నింపబడిన ఆ వానరులు అలసత్వము లేనివారై రామునకు ప్రియము చేయవలెనను కోరికతో తమ తమ అభిప్రాయములను ఆదరపూర్వకముగా ఇట్లు తెలిపిరి. 34

మూ. అజ్ఞాతం నాస్తి తే కించిత్త్రిషు లోకేషు రాఘవ,
ఆత్మానం పూజయన్ రామ పృచ్ఛస్యస్మాన్ సుహృత్తయా. 35

ప్ర. అ. రాఘవ=రామా ! త్రిషు=మూడు, లోకేషు=లోకములయందు, తే=నీకు, అజ్ఞాతమ్=తెలియబడనిది, కిం చిత్=ఏదీ, నాస్తి=లేదు. ఆత్మానమ్=తనను, పూజయన్=పూజించుకొనుచు, సుహృత్తయా=స్నేహభావముతో, అస్మాన్=మమ్ములను, పృచ్ఛసి=అడుగుచున్నావు.

తా. రామా ! ఈ మూడు లోకములలో నీకు తెలియనిది లేదు. అయినను మేము నీ స్నేహితులముగాన మమ్ములను అడుగుచున్నావు. ఆ విధముగా నీ గౌరవమును పెంపొందించుకొనుచున్నావు. 35

మూ. త్వం హి సత్యవ్రతః శూరో ధార్మికో దృఢవిక్రమః,
పరీక్ష్యకారీ స్మృతిమాన్నిసృష్టాత్మా సుహృత్సు చ. 36

ప్ర. అ. త్వమ్=నీవు, సత్యవ్రతః=సత్యమునందు నియమము కలవాడవు. శూరః=శూరుడవు. ధార్మికః=ధర్మాత్ముడవు. దృఢవిక్రమః=దృఢమైన పరాక్రమము కలవాడవు. పరీక్ష్యకారీ=పరీక్షించి పనులు చేయువాడవు. స్మృతిమాన్=స్మృతి కలవాడవు. సుహృత్సు=స్నేహితులయందు, నిసృష్టాత్మా చ=సమర్పించబడిన ఆత్మకలవాడవు.

తా. నీవు సత్యవ్రతుడవు. శూరుడవు. ధర్మాత్ముడవు. దృఢమైన పరాక్రమము కలవాడవు. పరీక్షించి పనులు చేయువాడవు. విషయములను బాగుగా స్మరించువాడవు. తనను రాముగా స్నేహితులకు అధీనము చేసికొన్నవాడవు.

మూ. తస్మాదేకైకశస్తావద్బ్రువన్తు సచివాస్తవ,
హేతుతో మతిసంపన్నాః సమర్థాశ్చ పునస్తథా. 37

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, మతిసంపన్నాః=బుద్ధిమంతులు, తథా=మరియు, సమర్థాశ్చ పునః=సమర్థులూ అయిన, తవ సచివాః=నీ మంత్రులు, ఏకైకశః=ఒక్కరొక్కరు, హేతుతః=హేతుపూర్వకముగా, బ్రువన్తు తావత్=చెప్పుదురు గాక.

తా. అందువలన బుద్ధిమంతులు, సమర్థులూ అయిన నీ మంత్రులు తగిన యుక్తులు చూపుచు ఒక్కరొక్కరుగా మాటలాడెదరు. 37

మూ. ఇత్యుక్తే రాఘవాయాథ మతిమానఙ్గదోఽగ్రతః,
విభీషణపరీక్షార్థముబాచ వచనం హరిః. 38

ప్ర. అ. ఇతి=ఇట్లు, ఉక్తే=చెప్పబడగా, అథ=అటుపిమ్మట, హరిః=వాన

రుడైన, మతిమాన్=బుద్ధిమంతుడైన, అఙ్గదః=అంగదుడు, రాఘవాయ=రామునకు, అగ్రతః=ముందుగా, విభీషణపరీక్షార్థమ్=విభీషణుని పరీక్ష కొరకు, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. ఆ వానరుడు అట్లు పలికిన పిమ్మట బుద్ధిమంతుడైన అంగదుడు ముందుగా "విభీషణుని పరీక్షించవలెను" అని రామునితో పలికెను. 38

మూ. శత్రోః సకాశాత్సంప్రాప్తః సర్వథా తర్క్య ఏవ హి,
విశ్వాసనీయః సహసా న కర్తవ్యో విభీషణః. 39

ప్ర. అ. శత్రోః=శత్రువుయొక్క, సకాశాత్=సమీపమునుండి, సంప్రాప్తః=వచ్చిన, విభీషణః=విభీషణుడు, సర్వథా=అన్ని విధములా, తర్క్యః ఏవ హి=సందేహించదగినవాడే కదా ? సహసా=వెంటనే, విశ్వాసనీయః=విశ్వసించదగినవాడుగా, న కర్తవ్యః=చేయదగినవాడు కాడు.

తా. విభీషణుడు శత్రువు దగ్గరనుండి వచ్చినవాడు. అన్ని విధాలా సందేహించదగినవాడే. అందుచేత తొందరపడి అతనిని విశ్వాసపాత్రునిగా చేయకూడదు. 39

మూ. ఛాదయిత్వాత్మభావం హి చరన్తి శఠబుద్ధయః,
ప్రహరన్తి చ రన్ధ్రేషు సోఽనర్థః సుమహాన్ భవేత్. 40

ప్ర. అ. శఠబుద్ధయః=కుటిలబుద్ధి గలవారు, ఆత్మభావమ్=తమ మనోభావమును, ఛాదయిత్వా=కప్పి, చరన్తి హి=సంచరించుచుందురు. రన్ధ్రేషు=రంధ్రములయందు, ప్రహరన్తి చ=కొట్టుచుందురు. సః=అది, సుమహాన్=గొప్ప, అనర్థః=అనర్థముగా, భవేత్=అగును.

తా. కుటిలమైన బుద్ధి గలవారు తమ మనస్సులోని భావములను పైకి తెలియనీయకుండా ప్రవర్తించుచు అవకాశము వచ్చినప్పుడు దెబ్బతీయుదురు. అది గొప్ప అనర్థమును కలిగించును. 40

మూ. అర్థానర్థౌ వినిశ్చిత్య వ్యవసాయం భజేత హ,
గుణతః సంగ్రహం కుర్యాద్దోషతస్తు విసర్జయేత్. 41

ప్ర. అ. అర్థానర్థౌ=అర్థమును అనర్థమును, వినిశ్చిత్య=నిశ్చయించి, వ్యవసాయమ్=ఉద్యమమును, భజేత=సేవించవలెను (చేయవలెను). గుణతః=గుణములవలన, సంగ్రహమ్=గ్రహణమును, కుర్యాత్=చేయవలెను. దోషతస్తు=దోషములవల్లనైతే, విసర్జయేత్=విడువవలెను.

తా. లాభనష్టములను నిశ్చయించుకొని ప్రయత్నమును ఆరంభించవలెను.

గుణములున్నచో స్వీకరించవలెను; దోషము లున్నచో విడువవలెను. 41

మూ. యది దోషో మహాంస్తస్మింస్త్యజ్యతామవిశఙ్కితమ్,
గుణాన్వాపి బహూన్ జ్ఞాత్వా సంగ్రహః క్రియతాం నృప. 42

ప్ర. అ. నృప=రాజా ! తస్మిన్=అతనియందు, మహాన్=గొప్ప, దోషః యది= దోషమున్నచో, అవిశఙ్కితమ్=నిస్సంశయముగా, త్యజ్యతామ్=విడువబడు గాక. బహూన్=అధికమైన, గుణాన్=గుణములను, జ్ఞాత్వా వాపి=తెలిసికొన్నచో, సంగ్రహః= స్వీకారము, క్రియతామ్=చేయబడుగాక.

తా. ఈ విభీషణునిలో అధికముగా దోషమున్నచో నిస్సంశయముగా ఇతనిని విడిచివేయవలెను. అట్లు కాక చాలా గుణములున్నచో స్వీకరించవలెను. 42

మూ. శరభస్త్వథ నిశ్చిత్య సార్థం వచన మబ్రవీత్,
క్షిప్రమస్మిన్నరవ్యాఘ్ర చారః ప్రతివిధీయతామ్. 43

ప్ర. అ. అథ=పిదప పిమ్మట, శరభస్తు=శరభుడైతే, నిశ్చిత్య=నిశ్చయించి, సార్థమ్=అర్థముతో కూడిన, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను. నర వ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుడా ! అస్మిన్=ఈతని విషయమై, క్షిప్రమ్=శీఘ్రముగా, చారః=గూఢచారి, ప్రతివిధీయతామ్=ఏర్పడువబడుగాక.

తా. శరభుడు బాగుగా ఆలోచించి అర్థయుక్తమైన వాక్యము పలికెను. నరులలో శ్రేష్ఠుడవైన రామా ! ఈతని పరీక్షించుటకై వెంటనే గూఢచారిని పంపవలెను. 43

మూ. ప్రణిధాయ హి చారేణ యథావత్ సూక్ష్మబుద్ధినా,
పరీక్ష్య చ తతః కార్యో యథాన్యాయం పరిగ్రహః. 44

ప్ర.అ. ప్రణిధాయ=గూఢచారిని పంపి, సూక్ష్మబుద్ధినా=సూక్ష్మమైన బుద్ధిగల, గూఢచారేణ=గూఢచారిచేత, యథావత్=తగువిధముగా, పరీక్ష్య చ=పరీక్షించి, తతః=అటుపిమ్మట, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, పరిగ్రహః= స్వీకారము, కార్యః= చేయదగినది.

తా. గూఢచారిని పంపి, సూక్ష్మబుద్ధి గల ఆ గూఢచారిచేత బాగా పరీక్షించి అటుపిమ్మట న్యాయానుసారము ఇతనిని స్వీకరించవచ్చును; లేదా విడువవచ్చును. 44

మూ. జాంబవాం స్త్వథ సంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యా విచక్షణః,
వాక్యం విజ్ఞాపయామాస గుణవద్దోషవర్జితమ్. 45

ప్ర.అ. అథ=అటుపిమ్మట, విచక్షణః=నేర్పరియైన, జాంబవాంస్తు=జాంబవంతుడైతే, శాస్త్రబుద్ధ్యా=శాస్త్రబుద్ధితో, సంప్రేక్ష్య=చూచి, గుణవత్=గుణములుగలది, దోషవర్జితమ్=దోషములతో శూన్యము అయిన, వాక్యమ్=వాక్యమును, విజ్ఞాపయామాస= తెలిపెను.

తా. పిమ్మట నేర్పరియైన జాంబవంతుడు ఆ విషయమును శాస్త్రీయ దృష్టితో పరిశీలించి, గుణములు గలది, దోషములు లేనిది అయిన వాక్యము పలికెను. 45

మూ. బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేన్ద్రాద్విభీషణః
అదేశకాలే సంప్రాప్తః సర్వథా శఙ్క్యతామయమ్. 46

ప్ర.అ. విభీషణః=విభీషణుడు, బద్ధవైరాత్=కట్టబడిన వైరము గలవాడు, పాపాత్= పాపాత్ముడూ అయిన, రాక్షసేన్ద్రాత్=రాక్షసరాజునుండి, అదేశకాలే=తగని దేశమునందూ కాలమునందూ, సంప్రాప్తః=వచ్చినాడు. అయమ్=ఇతడు, సర్వథా=అన్ని విధములా, శఙ్క్యతామ్=శంకింపబడుగాక.

తా. ఈ విభీషణుడు నీతో వైరము కట్టిన పాపాత్ముడైన రావణుని వద్దనుంచి దేశము కాని దేశమునకు, కాలము కాని కాలమునందు వచ్చినాడు. ఇతనిని గూర్చి అన్ని విధాలా శంకించవలసి ఉన్నది. 46

మూ. తతో మైన్దస్తు సంప్రేక్ష్య నయాపనయకోవిదః,
వాక్యం వచనసంపన్నో బభాషే హేతుమత్తరమ్. 47

ప్ర.అ. తతః=అటుపిమ్మట, నయాపనయకోవిదః=నీతిని నీతివిరుద్ధమైనదానిని ఎరిగినవాడు, వచనసంపన్నః=వచనములందు సమృద్ధుడు అయిన, మైన్దస్తు=మైందుడు, సంప్రేక్ష్య= ఆలోచించి, హేతుమత్తరమ్=అధికముగా హేతువులు గల, వాక్యమ్=వాక్యమును, బభాషే= పలికెను.

తా. పిమ్మట, ఏది నీతియో ఏది కాదో తెలిసినవాడు మంచి వచననైపుణ్యము గలవాడు అయిన మైందుడు ఆలోచించి, మంచి హేతువులను చూపించు వాక్యము పలికెను. 47

మూ. అనుజో నామ తస్యైష రావణస్య విభీషణః,
పృచ్ఛ్యతాం మధురేణాయం శనైర్నరపతీశ్వర. 48

ప్ర.అ. నరపతీశ్వర=రాజాధిరాజా !, ఏషః=ఈ, విభీషణః=విభీషణుడు, తస్య=ఆ, రావణస్య=రావణునియొక్క, అనుజో నామ=తమ్ముడు కదా. అయమ్=ఇతడు, మధురేణ=మధురమైన వాక్యముచేత, శనైః=మెల్లగా, పృచ్ఛ్యతామ్=అడగబడుగాక.

తా. ఓ ! రాజాధిరాజా ! ఈ విభీషణుడు ఆ రావణుని తమ్ముడు కదా. ఇతనిని మధురమైన మాటలతో మెల్లగా ప్రశ్నించుట మంచిది. 48

మూ. భావమస్య తు విజ్ఞాయ తత్త్వతస్త్వం కరిష్యసి,
యది దుష్టో న దుష్టో వా బుద్ధిపూర్వం నరర్షభ. 49

ప్ర.అ. నరర్షభ=నరులలో శ్రేష్ఠుడా ! అస్య=ఇతనియొక్క, భావమ్=భావమును, తత్త్వతః=యథార్థముగా, విజ్ఞాయ=తెలిసికొని, దుష్టో యది=దుష్టుడో, న దుష్టో వా=దుష్టుడు కాడో, బుద్ధిపూర్వమ్=జ్ఞానము పూర్వమునందు కలుగునట్లుగా, త్వమ్=నీవు, కరిష్యసి=చేయగలవు.

తా. నరులలో శ్రేష్ఠుడవైన ఓ ! రామా ! ఇతని అభిప్రాయ మేమో యథార్థముగా తెలిసికొని, ఇతడు దుష్టుడా, కాడా అను విషయము కూడ గ్రహించిన పిమ్మట నీవు తగు విధముగా చేయవచ్చును. 49

మూ. అథ సంస్కారసంపన్నో హనుమాన్ సచివోత్తమః,
ఉవాచ వచనం శ్లక్ష్ణమర్థవన్మధురం లఘు. 50

ప్ర.అ. అథ=అటుపిమ్మట, సంస్కారసంపన్నః=వివిధశాస్త్రములను అభ్యసించుటచేత కలిగిన సంస్కారముతో సంపన్నుడు, సచివోత్తమః=మంత్రులలో శ్రేష్ఠుడు అయిన, హనుమాన్= హనుమంతుడు, శ్లక్ష్ణమ్=మృదువు, అర్థవత్=అర్థము గలది, మధురమ్=మధురము, లఘు=అల్పమూ అయిన, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట వివిధశాస్త్రముల అభ్యాసముచేత కలిగిన సంస్కారము గలవాడు, మంత్రులలో ఉత్తముడు అయిన హనుమంతుడు మృదువు, మంచి అర్థము గలది, మధురము, లఘువు అయిన వచనమును పలికెను. 50

మూ. న భవన్తం మతిశ్రేష్ఠం సమర్థం వదతాం వరమ్,
అతిశాయయితుం శక్తో బృహస్పతిరపి బ్రువన్. 51

ప్ర.అ. బృహస్పతిరపి=బృహస్పతి కూడ, బ్రువన్=మాటలాడుచు, మతిశ్రేష్ఠమ్= బుద్ధిచేత శ్రేష్ఠుడవు, సమర్థమ్=సమర్థుడవు, వదతామ్=మాటలాడువారిలో, వరమ్= ఉత్తముడవూ అయిన, భవన్తమ్=నిన్ను, అతిశాయయితుమ్=అతిశయించుటకు, న శక్తః= సమర్థుడు కాడు.

తా. నీవు బుద్ధిచేత గొప్పవాడవు; సమర్థుడవు; మాటలాడువారిలో ఉత్తముడవు. అట్టి నిన్ను బృహస్పతి కూడ మాటలాడి అతిశయించజాలడు.51

మూ. న వాదాన్నాపి సంఘర్షాన్నాధిక్యాన్న చ కామతః,
వక్ష్యామి వచనం రాజన్యథార్థం రామ గౌరవాత్. 52

ప్ర.అ. రాజన్=రాజా ! రామ=రామా ! వాదాత్=వాదమువలన, వచనమ్= వచనమును, న(వక్ష్యామి)=చెప్పను. సంఘర్షాత్ అపి=పోటీవలన కూడ, న=చెప్పను. ఆధిక్యాత్=ఆధిక్యమువలన, న=చెప్పను. కామతః చ=కామమువలన కూడ, న= చెప్పను. గౌరవాత్=గౌరవమువలన, యథార్థమ్=యథార్థమైన వచనమును, వక్ష్యామి= చెప్పెదను.

తా. రాజా ! రామా ! నేను కేవలము వాదమునిమిత్తము గాని, ఇతరమంత్రులతో పోటీపడుటచేత గాని, వారికంటె అధికుడ నని గాని, నా ఇష్టానుసారముగా గాని చెప్పుట లేదు. కేవలము నాపై నీవుంచిన గౌరవమును పట్టి (లేదా నీపై నాకున్న గౌరవమును బట్టి) ఏది యథార్థమని నాకు తోచినదో అది చెప్పెదను.

52

మూ. అర్థానర్థనిమిత్తం హి యదుక్తం సచివైస్తవ,
అత్ర దోషం ప్రపశ్యామి క్రియా న హ్యుపపద్యతే. 53

ప్ర.అ. తవ=నీయొక్క, సచివైః=మంత్రులచేత, అర్థానర్థనిమిత్తమ్=అర్థానర్థముల నిర్ణయముల కొరకు, యత్=ఏది, ఉక్తమ్=చెప్పబడినదో, అత్ర=దానియందు, దోషమ్= దోషమును, ప్రపశ్యామి=చూచుచున్నాను. క్రియా=పరీక్షచేయుట, న ఉపపద్యతే హి= కుదరదు కదా.

తా. విభీషణునివలన కలుగు లాభనష్టములను పరీక్షించవలెనని నీ మంత్రులైన అంగదాదులు చెప్పినారు. కాని దానిలో నాకు దోషము కనబడుచున్నది. ఎందుచేత ననగా అట్లు చేయుటకు తగిన విధానము కుదరదు.
53

మూ. ఋతే నియోగాత్సామర్థ్యమవబోద్ధుం న శక్యతే,
సహసా వినియోగో హి దోషవాన్ప్రతిభాతి మే. 54

ప్ర.అ. నియోగాత్ ఋతే=ఏదైన కార్యమునందు నియమించకుండగా, సామర్థ్యమ్= సామర్థ్యము, అవబోద్ధుమ్=తెలిసికొనుటకు, న శక్యతే=శక్యము కాదు. సహసా= శీఘ్రముగా, వినియోగః=నియమించుట, దోషవాన్=దోషము కలదిగా, మే=నాకు, ప్రతిభాతి=తోచుచున్నది.

తా. విభీషణుని ఏదైన ఒక కార్యమునందు నియమించకుండగా అతని సామర్థ్యము తెలిసికొనుట శక్యము కాదు. క్రొత్తవానిని వెంటనే ఒక కార్యములో నియమించుట మంచిది కాదని నా అభిప్రాయము. 54

మూ. చారప్రణిహితం యుక్తం యదుక్తం సచివైస్తవ,
అర్థస్యాసంభవాత్తత్ర కారణం నోపపద్యతే. 55

ప్ర.అ. తవ=నీయొక్క, సచివైః=మంత్రులచేత, యత్=ఏ, చారప్రణిహితమ్=గూఢచారులను పంపుట, యుక్తమ్=యుక్తమైనదిగా, ఉక్తమ్=చెప్పబడినదో, తత్ర=ఆ విషయమున, అర్థస్య=కార్యముయొక్క, అపంథభావాత్=అపంథభావమువలన, కారణమ్=ఉపాయము, నోపపద్యతే=కుదరదు.

తా. గూఢచారులను పంపవలెనని నీ మంత్రులు కొందరు చెప్పినారు. ఎదుట నిలచి ఉన్నవాని రహస్యములను గూఢచారుల ద్వారా తెలిసికొనుట అనునది అసంభవము గాన ఆ ఉపాయము కూడ కుదరదు. 55

మూ. అదేశకాలే సంప్రాప్త ఇత్యయం యద్విభీషణః,
వివక్షా తత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి. 56

ప్ర.అ. అయం విభీషణః=ఈ విభీషణుడు, అదేశకాలే=దేశము కానిదాని యందు, కాలము కానిదానియందు, సంప్రాప్తః ఇతి యత్=వచ్చినాడు అనునది ఏది గలదో, తత్ర=ఆ విషయమునందు, మే=నాకు, యథామతి=బుద్ధ్యనుసారముగా, ఇయం వివక్షా=ఈ చెప్పవలెనను ఇచ్ఛ, అస్తి=ఉన్నది. తామ్=దానిని, నిబోధ=తెలిసికొనుము.

తా. విభీషణుడు దేశము కాని దేశమునందు, కాలము కాని కాలమునందు వచ్చినాడని చెప్పినారు కదా ? ఆ విషయమునందు నా బుద్ధి ననుసరించి నేను చెప్పవలెనని కోరుచున్నాను; వినుము. 56

మూ. ఏష దేశశ్చ కాలశ్చ భవతీహ యథా తథా,
పురుషాత్పురుషం ప్రాప్య తథా దోషగుణావపి. 57

ప్ర. అ.(ఈ శ్లోకానికి సమన్వయం సరిగా కుదురుట లేదు. దీని పూర్వార్ధాన్ని 56 శ్లోకంతోను, ఉత్తరార్ధాన్ని 58వ శ్లోకంతోను కలిపి పూర్వవ్యాఖ్యాతలు వ్యాఖ్యానించినారు గాని అది సంతృప్తికరంగా లేదు.) ఏషః=ఇది, ఇహ=ఇక్కడ, దేశశ్చ=దేశము, కాలశ్చ=కాలము, యథా=ఎట్లో, తథా=అట్లు, నా వివక్ష ఉన్నది అని వెనుకటి శ్లోకముతో అన్వయము. పురుషాత్=దుష్టపురుషుడైన రావణునుండి, పురుషమ్=ఉత్తమపురుషుడవైన నిన్ను, ప్రాప్య=పొంది (మనసా నిశ్చయించి), తథా=అట్లు, గుణదోషావపి=గుణదోషములను కూడ, ప్రాప్య=పొంది, "ఇతడు నిన్ను చేరుట యుక్తమే" అని ఉత్తరశ్లోకముతో అన్వయము. "పురుషాత్పురుషం ప్రాప్య" ఇత్యాదిశ్లోకార్ధానికి అర్థం సరిగా లేదు.

ప్రాచ్యపాఠంలో దీని ఉత్తరార్ధం - "పురుషం పురుషం ప్రాప్య గుణదోషా యథా తథా" అని ఉన్నది. దీని అర్థము ఇట్లు చెప్పవచ్చును. పురుషం పురుషమ్=వేరు వేరు పురుషుల్ని, ప్రాప్య=పొంది, గుణదోషా=గుణదోషములు,

యథా=ఎట్లో, తథా=అట్లే, ఇహ=ఇక్కడ, (ప్రస్తుతవిషయమునందు), ఏష=ఇది, దేశశ్చ=దేశముగాను, కాలశ్చ=కాలముగాను, యథా తథా=ఏదో విధముగా, భవతి=అగును.

తా. ఒకొక్క పురుషుని చేరి గుణము దోషము గాను దోషము గుణముగాను, అగును. అట్లే ఈ ప్రస్తుతవిషయమునందు ఇదే తగిన దేశము, కాలము అని ఏదో విధముగ, అనగా స్థితి పట్టి నిరూపించవచ్చును. 57

మూ. దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమం చ తథా త్వయి,
యుక్తమాగమనం హ్యత్ర సదృశం తస్య బుద్ధితః. 58

ప్ర.అ. రావణే=రావణునియందు, దౌరాత్మ్యమ్=దుష్టత్వమును, తథా=మరియు, త్వయి=నీయందు, విక్రమం చ=పరాక్రమమును, దృష్ట్వా=చూచి, అత్ర=ఈ కాలమునందు, ఈ ప్రదేశమునందు, ఆగమనమ్=వచ్చుట, యుక్తం హి=యుక్తము కదా ? తస్య=వానియొక్క, బుద్ధితః=బుద్ధికి, సదృశమ్=తగినది.

తా. రావణుని దుష్టత్వమునూ, నీ పరాక్రమమునూ చూచి, ఈ కాలమునందు, ఈ దేశమునందు అతడు వచ్చుట యుక్తమే కదా ? ఇది అతని బుద్ధికి తగినట్లున్నది. 58

మూ. అజ్ఞాతరూపైః పురుషైః స రాజన్ పృచ్ఛ్యతామితి,
యదుక్తమత్ర మే ప్రేక్షా కాచిదస్తి సమీక్షితా. 59

ప్ర.అ. రాజన్=ఓ ! రాజా ! అజ్ఞాతరూపైః=తెలియబడని రూపము గల, పురుషైః=పురుషులచేత, సః=అతడు, పృచ్ఛ్యతామ్ ఇతి=అడుగబడు గాక అని, యత్=ఏ వాక్యము, ఉక్తమ్=చెప్పబడినదో, అత్ర=ఈ విషయమునందు, సమీక్షితా=చూడబడిన, మే=నాయొక్క, కాచిత్=ఒకానొక, ప్రేక్షా=ఆలోచన, అస్తి=ఉన్నది.

తా. రాజా ! అతడు తెలియని వాని పురుషులను పంపి అతనిని ప్రశ్నించవలెనని కొందరు చెప్పినారు కదా ? ఆ విషయమున నేను పరీక్షించగా కలిగిన అభిప్రాయ మొకటి ఉన్నది. 59

మూ. పృచ్ఛ్యమానో విశఙ్కేత సహసా బుద్ధిమాన్వచః,
తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్యాపృష్టం సుఖాగతమ్. 60

ప్ర.అ. సహసా=శీఘ్రముగా, పృచ్ఛ్యమానః=అడుగబడుచున్న, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు, వచః=వచనమును, విశఙ్కేత=శంకించును. తత్ర=అట్టి సందర్భమునందు, సుఖాగతమ్=అనాయాసముగా లభించిన, మిత్రమ్=మిత్రుడు, మిథ్యాపృష్టమ్=కపటముతో ప్రశ్నించబడినవాడై, ప్రదుష్యేత=చెడిపోవును.

తా. ఒక బుద్ధిమంతుని దగ్గరకు హటాత్తుగా వెళ్లి ప్రశ్నించగానే అతడు ప్రశ్నించువాని మాటలను శంకించును. అట్టి సందర్భాలలో అప్రయత్నముగా లభించిన మిత్రుణ్ణి వంచనపూర్వకముగా ప్రశ్నించుటచే ఆ మిత్రుడు విముఖుడై పోవును. 60

మూ. అశక్యం సహసా రాజన్ భావో బోద్ధుం పరస్య వై
అన్తరేణ స్వరైర్భిన్నైర్నైపుణ్యం పశ్యతాం భృశమ్. 61

ప్ర.అ. రాజన్=రాజా ! భిన్నైః=వేరువేరైన, స్వరైః=స్వరములచేత, పశ్యతామ్= చూచువారియొక్క, భృశమ్=మిక్కిలి, నైపుణ్యం వినా=నైపుణ్యము లేకుండగా, పరస్య= ఇతరునియొక్క, భావః=భావము, సహసా=శీఘ్రముగా, బోద్ధుమ్=తెలిసికొనుటకు, అశక్యమ్=శక్యము కాదు.

తా. రాజా ! ఎదుటివాని మాటలలోని స్వరమును పట్టి తెలిసికొనగలిగినవారికి ఎంతో నేర్పు ఉంటే తప్ప ఎదుటివాని భావమును శీఘ్రముగా తెలిసికొనుట శక్యము కాదు. 61

మూ. న త్వస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్టభావతా,
ప్రసన్నం వదనం చాపి తస్మాన్మే నాస్తి సంశయః. 62

ప్ర.అ. బ్రువతః=మాటలాడుచున్న, అస్య=ఈతనియొక్క, దుష్టభావతా=దుష్టమైన భావము కలిగి ఉండుట, జాతు=ఎన్నడును (ఏ క్షణమునందును), న దృశ్యతే=చూడబడుటలేదు. వదనం చాపి=ముఖము కూడా, ప్రసన్నమ్=ప్రసన్నముగా ఉన్నది. తస్మాత్=ఆ కారణమువలన, మే=నాకు, సంశయః=సంశయము, నాస్తి=లేదు.

తా. ఈతడు మాటలాడుచున్నప్పుడు దుష్టమైన భావమేదీ ఉన్నట్లు ఒక్కమారు కూడ కనబడుటలేదు. ఇతని ముఖము కూడ ప్రసన్నముగా ఉన్నది. అందుచేత నాకు ఇతని విషయమునందు సంశయము లేదు. 62

మూ. అశఙ్కితమతిః స్వస్థో న శఠః పరిసర్పతి,
న చాస్య దుష్టా వాగస్తి తస్మాన్మే నాస్తి సంశయః. 63

ప్ర.అ. శఠః=కపటబుద్ధి గలవాడు, అశఙ్కితమతిః=శంకించని మతి గలవాడై, స్వస్థః= స్వస్థుడై, న పరిసర్పతి=సమీపించడు. అస్య=ఇతనియొక్క, వాక్ చ=వాక్కు కూడ, దుష్టా=దుష్టమైనదిగా, నాస్తి=లేదు. తస్మాత్=ఆ కారణమువలన, మే=నాకు, సంశయః=సంశయము, నాస్తి=లేదు.

తా. కపటబుద్ధి కలవాడు ఎట్టి శంకా లేక స్వస్థుడై దగ్గరకు రాడు. ఈతని మాటలలో దోషము కూడ లేదు. అందుచే నాకు సంశయము లేదు.63

మూ. ఆకారశ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్,
బలాద్ధి వివృణోత్యేవ భావమన్తర్గతం నృణామ్. 64

ప్ర.అ. ఆకారః=ఆకారము, ఛాద్యమానోఽపి=కప్పబడుచున్నదైనను, వినిగూహితుమ్= దాచుటకు, న శక్యః=శక్యము గాదు. అన్తర్గతమ్=లోపలనున్న, నృణామ్= మానవులయొక్క, భావమ్=భావమును, బలాత్=బలమువలన, వివృణోత్యేవ=తప్పక వివరించును.

తా. ఎంత కప్పికొన్నను ఆకారమును దాచుట శక్యము కాదు. అది మానవుల మనస్సులో ఉన్న భావమును బలాత్కారముగా ప్రకటించివేయును. 64

మూ. దేశకాలోపపన్నం చ కార్యం కార్యవిదాం వర,
సఫలం కురుతే క్షిప్రం ప్రయోగేణాభిసంహితమ్. 65

ప్ర.అ. కార్యవిదామ్=కార్యవేత్తలలో, వర=శ్రేష్ఠుడా ! దేశకాలోపపన్నం చ= దేశకాలములకు అనుగుణమైన, కార్యమ్=కార్యము, క్షిప్రమ్=శీఘ్రముగా, ప్రయోగేణ=ప్రయోగముతో, అభిసంహితమ్=కూర్చబడినదై, సఫలమ్=సఫలమునిగా, కురుతే=చేయును.

తా. కార్యములను ఎరిగిన వారిలో శ్రేష్ఠుడవైన రామా ! దేశమునకు కాలమునకు అనుగుణముగా ఉన్న, అనగా దేశము కాలము అనుకూలముగా ఉన్న, కార్యమును వెంటనే ప్రయోగముతో కూర్చినచో, అనగా వెంటనే ఆచరించినచో, అది కర్తకు ఫలమును ఇచ్చును. (దేశకాలములు అనుకూలముగా ఉన్నాయని తెలిసికొని ఇతడు వెంటనే కార్యాచరణమునకు ఉద్యుక్తుడైనాడని భావము.)65

మూ. ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణమ్,
వాలినం చ హతం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్, 66
రాజ్యం ప్రార్థయమానస్తు బుద్ధిపూర్వమిహాగతః,
ఏతావత్తు పురస్కృత్య విద్యతే తస్య సంగ్రహః. 67

ప్ర.అ. తవ=నీయొక్క, ఉద్యోగమ్=ప్రయత్నమును, సంప్రేక్ష్య=చూచి, రావణమ్= రావణుణ్ణి, మిథ్యావృత్తమ్=చెడ్డ ప్రవృత్తి గలవానినిగా చూచి, వాలినమ్=వాలిని, హతమ్= చంపబడినవానినిగాను, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, అభిషేచితమ్=అభిషేకించబడినవానినిగాను, శ్రుత్వా=విని, రాజ్యమ్=రాజ్యమును, ప్రార్థయమానస్తు=కోరుచున్నవాడై, బుద్ధిపూర్వమ్=బుద్ధిపూర్వకముగా, ఇహ=ఇక్కడికి, ఆగతః=వచ్చినాడు. ఏతావత్తు= ఇంతమాత్రమునే, పురస్కృత్య=పురస్కరించుకొని, తస్య=వానియొక్క, సంగ్రహః= స్వీకరణము, విద్యతే=ఉన్నది.

తా. నీవు ఉద్యమశీలుడవను విషయమును, రావణుని దుష్టప్రవృత్తిని

మాచి, వాలి చంపబడినట్లు, సుగ్రీవుడు రాజ్యాభిషిక్తుడైనట్లు విని, రాక్షసరాజ్యమును పొందవలెనను కోరికతో ఆలోచనాపూర్వకముగానే ఇతడు ఇక్కడికి వచ్చినాడు. ఈ ఒక్క విషయమును పట్టి కూడ ఇతనిని స్వీకరించుట యుక్తము. 66, 67

మూ. యథాశక్తి మయోక్తం తు రాక్షసస్యార్జవం ప్రతి,
ప్రమాణం త్వం హి శేషస్య శ్రుత్వా బుద్ధిమతాం వర. 68

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తదశః సర్గః.

ప్ర.అ. బుద్ధిమతామ్=బుద్ధిమంతులలో, వర=శ్రేష్ఠుడవైన ఓ! రామా!, రాక్షసస్య= ఈ రాక్షసునియొక్క, ఆర్జవం ప్రతి=ఋజుత్వమును గూర్చి, మయా=నాచేత, యథాశక్తి= శక్త్యనుసారముగా, ఉక్తమ్=చెప్పబడినది. శ్రుత్వా=విని, శేషస్య=మిగిలినదానికి, త్వమ్=నీవు, ప్రమాణం హి=ప్రమాణము కదా.

తా. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవైన ఓ! రామా! ఈ రాక్షసుడు ఋజుస్వభావము కలవాడే అను విషయమును గూర్చి యథాశక్తిగా చెప్పినాను. వినిన పిమ్మట మిగిలిన కార్యము ఎట్లు చేయవలెనో నిర్ణయించుటకు నీవే ప్రమాణము. 68

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదిహేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాదశః సర్గః

{విభీషణుని స్నేహమును అంగీకరించుటయే యుక్తమని రాముడు తన నిర్ణయమును తెలుపుట.}

మూ. అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య హ,
ప్రత్యభాషత దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితమ్. 1

ప్ర.అ. అథ=అటుపిమ్మట, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానివాడు, శ్రుతవాన్=శాస్త్రజ్ఞానము కలవాడు అయిన, రామః=రాముడు, వాయుసుతస్య=హనుమంతుని వాక్యమును, శ్రుత్వా=విని, ప్రసన్నాత్మా=ప్రసన్నమైన మనస్సు గలవాడై, ఆత్మని=తన మనస్సులో, స్థితమ్=ఉన్న విషయమును, ప్రత్యభాషత=పలికెను.

తా. పిమ్మట ఎదిరింప శక్యము కానివాడు, శాస్త్రాధ్యయనసంపన్నుడు అయిన రాముడు హనుమంతుని మాటలు విని సంతోషించి తన మనస్సులో ఉన్న అభిప్రాయమును చెప్పెను. 1

మూ. మమాపి చ వివక్షాస్తి కాచిత్ప్రతి విభీషణమ్,
శ్రోతుమిచ్ఛామి తత్సర్వం భవద్భిః శ్రేయసి స్థితైః. 2

ప్ర.అ. విభీషణం ప్రతి=విభీషణుని గూర్చి, మమాపి=నాకు కూడ, కాచిత్=ఒక, వివక్షా=చెప్పవలెనను కోరిక, అస్తి=ఉన్నది. శ్రేయసి=శ్రేయస్సునందు, స్థితైః=ఉన్న, భవద్భిః=మీచేత, తత్=దానిని, సర్వమ్=అంతయు, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. విభీషణుని గూర్చి నేను కూడ చెప్పవలెనని అనుకొనుచున్నాను. మన శ్రేయస్సును కోరు మీరందరు వినుడు. 2

మూ. మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన,
దోషో యద్యపి తస్య స్యాత్సతామేతదగర్హితమ్. 3

ప్ర.అ. మిత్రభావేన=స్నేహభావముతో, సంప్రాప్తమ్=వచ్చినవానిని, తస్య=వానియొక్క, దోషః=దోషము, స్యాత్ యద్యపి=ఉన్నను, కథంచన=ఏవిధముగానూ కూడ, న త్యజేయమ్=విడువను. ఏతత్=ఇది, సతామ్=సత్పురుషులకు, అగర్హితమ్= నిందింపబడనిది.

తా. నేను మిత్రుడనని చెప్పుకొనుచు వచ్చినవానిని, వానిలో దోషమున్నను నేను విడువను. ఇట్లు చేసినయెడలనే సత్పురుషులు నిందింప కుండా ఉందురు.

మూ. సుగ్రీవస్త్వథ తద్వాక్యమాభాష్య చ విమృశ్య చ,
తతః శుభతరం వాక్యమువాచ హరిపుఙ్గవః. 4

ప్ర.అ. అథ=అనంతరము, హరిపుఙ్గవః=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, తద్వాక్యమ్=ఆ రాముని వాక్యమును, ఆభాష్య చ =అనువదించి, విమృశ్య చ=విమర్శించి, తతః=అటుపిమ్మట, శుభతరమ్=మిక్కిలి శుభమైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. పిమ్మట వానరరాజైన సుగ్రీవుడు ఆ రాముని మాటలు అనువదించి, బాగుగా ఆలోచించి, మరల మిక్కిలి శుభకరమైన వాక్యమును పలికెను. 4

మూ. సుదుష్టో వాప్యదుష్టో వా కిమేష రజనీచరః,
ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్, 5
కో నామ స భవేత్తస్య యమేష న పరిత్యజేత్.

ప్ర.అ. ఏషః=ఈ, రజనీచరః=రాక్షసుడు, సుదుష్టో వా=చాల దుష్టుడైనా, అదుష్టో వా=దుష్టుడు కాకపోయినా, కిమ్=ఏమి ? యః=ఎవడు, ఈదృశమ్=ఇట్టి, వ్యసనమ్=ఆపదను, ప్రాప్తమ్=పొందిన, భ్రాతరమ్=సోదరుని, పరిత్యజేత్=విడచివేయునో, తస్య=అట్టివానికి, ఏషః=ఇతడు, యమ్=ఎవనిని, న పరిత్యజేత్=విడువడో, సః=అట్టివాడు, కో నామ=ఎవడు, భవేత్=ఉండును ?

తా. ఈ రాక్షసుడు దుష్టుడు అయినా, కాకపోయినా మనకెందుకు ? ఇట్టి ఆపదలో ఉన్న సోదరునే విడిచిపెట్టిన వానికి విడువదగని వాడంటూ ఎవడైనా ఉండునా ! 5

మూ. వానరాధిపతేర్వాక్యం శ్రుత్వా సర్వానుదీక్ష్య తు, 6
ఈషదుత్స్మయమానస్తు లక్ష్మణం పుణ్యలక్షణమ్,
ఇతి హోవాచ కాకుత్స్థో వాక్యం సత్యపరాక్రమః. 7

ప్ర.అ. సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గల, కాకుత్స్థః=రాముడు, వానరాధిపతేః=సుగ్రీవునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, సర్వాన్=అందరినీ, ఉదీక్ష్య తు=చూచి, ఈషత్=కొంచెము, ఉత్స్మయమానః=నవ్వుచు, పుణ్యలక్షణమ్=పుణ్యమైన లక్షణములు గల, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇతి=ఇట్లు, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. సత్యమైన పరాక్రమము గల రాముడు సుగ్రీవుని మాటలు విని, అందరినీ చూచుచు, చిరునవ్వు నవ్వుచూ పుణ్యమైన లక్షణములు గల లక్ష్మణునితో ఇట్లు పలికెను. 6, 7

కుడు. ప్రాయః=సాధారణముగా, నరేన్ద్రాణామ్=రాజులకు, శోధనః=ఉత్తముడైన, ఏషః=ఈ వ్యక్తి కూడ, శఙ్కనీయః=శంకింపదగినవాడే.

తా. ఆ కులమునకే చెందినవారైనను దుష్టులు కానివాళ్లు తమ హితులను గౌరవించుచుందురు. కాని రాజులు సాధారణముగా మంచివానిని కూడ శంకించుచుందురు. (ఇతడు మంచివాడే అయినను రావణుడు ఇతనిని శంకించినాడు.) 11

మూ. యస్తు దోషస్త్వయా ప్రోక్తో హ్యాదానేఽరిబలస్య చ,
అత్ర తే కీర్తయిష్యామి యథాశాస్త్రమిదం శృణు. 12

ప్ర.అ. అరిబలస్య=శత్రుసైన్యముయొక్క, ఆదానే=స్వీకరించుటయందు, యః=ఏ, దోషః=దోషము, త్వయా=నీచేత, ప్రోక్తః=చెప్పబడినదో, అత్ర= ఆ విషయమునందు, తే=నీకు, యథాశాస్త్రమ్=శాస్త్రానుసారముగా, కీర్తయిష్యామి= చెప్పెదను. ఇదమ్=దీనిని, శృణు=వినుము.

తా. శత్రువు దగ్గరనుండి వచ్చినవాళ్లను స్వీకరించుటలో ఏ దోష మున్నదని నీవు చెప్పినావో ఆ విషయమునందు యథాశాస్త్రముగా చెప్పెదను వినుము. 12

మూ. న వయం తత్కులీనాశ్చ రాజ్యకాంక్షీ చ రాక్షసః,
పణ్డితా హి భవిష్యన్తి తస్మాద్గ్రాహ్యో విభీషణః. 13

ప్ర.అ. వయమ్=మనము, తత్కులీనాః చ=ఆతని కులమునకు చెందినవారము, న= కాము. రాక్షసః=రాక్షసుడు, రాజ్యకాంక్షీ చ=రాజ్యమును కోరుచున్నాడు. (ఈ రాక్షసులు కూడ), పణ్డితాః=పండితులుగా, భవిష్యన్తి=అగుదురు కదా. తస్మాత్=ఆ కారణమువలన, విభీషణః=విభీషణుడు, గ్రాహ్యః=గ్రహింపదగినవాడు.

తా. మనము ఆతని కులమునకు చెందినవారము కాము. అందుచేత ఆతనికి మనతో సహజశత్రుత్వ మేదీ లేదు. ఈ విభీషణునికి రాజ్యమునందు కోరిక ఉన్నది. రాక్షసుడే కదా బుద్ధిహీనుడై ఉండును అని అనుటకు కూడ వీలులేదు; ఎందుచేత ననగా వాళ్లలో కూడ పండితులు (బుద్ధిమంతులు) ఉండవచ్చును. అందుచేత విభీషణుడు మిత్రుడుగా గ్రహింపదగినవాడే. 13

మూ. అవ్యగ్రాశ్చ ప్రహృష్టాశ్చ న భవిష్యన్తి సంగతాః,
ప్రణాదశ్చ మహానేష తతోఽస్య భయమాగతమ్, 14
ఇతి భేదం గమిష్యన్తి తస్మాద్గ్రాహ్యో విభీషణః.

ప్ర.అ. (జ్ఞాతులు) అభ్యగాత్=భయము లేనివారు గాను, ప్రహృష్టాత్=సంతోషించినవారుగాను, సంగతాః=కలిసి ఉన్నవారుగాను, న భవిష్యన్తి=కారు. ఇతి=ఈ కారణమువలన, భేదమ్=భేదమును, గమిష్యన్తి=పొందగలరు. అతః=కావుననే, అస్య=ఏనికి, భయమ్=భయము, ఆగతమ్=వచ్చినది. ఏషః=ఈ, ప్రణాదశ్చ=ధ్వని కూడ, మహాన్=గొప్పది. తస్మాత్=ఆ కారణమువలన, విభీషణః=విభీషణుడు, గ్రాహ్యః=గ్రహింపదగినవాడు.

తా. జ్ఞాతు లెప్పుడూ భయము లేక, సంతోషముతో కలిసి మెలిసి ఉండలేరు. అందువలననే వాళ్లు విడిపోవుచుందురు. ఇతనికి రావణునినుండి భయము వచ్చి ఉండును. అందువలననే ఈతని ధ్వని చాల అధికముగా ఉన్నది. 14

మూ. న సర్వే భ్రాతరస్తాత భవన్తి భరతోపమాః, 15
మద్విధా వా పితుః పుత్రాః సుహృదో వా భవద్విధాః.

ప్ర.అ. తాత=నాయనా ! సర్వే=సమస్తమైన, భ్రాతరః=సోదరులు, భరతోపమాః=భరతునితో సమానులుగా, న భవన్తి=ఉండరు. పితుః=తండ్రికి, మద్విధాః=నావంటి, పుత్రాః=పుత్రులు, (ఉండరు). భవద్విధాః=నీవంటి, సుహృదో వా=స్నేహితులు గాని (ఉండరు).

తా. నాయనా ! అందరు సోదరులూ భరతునివంటివారే ఉండరు. తండ్రుల కుమారులందరూ నావంటివాళ్లే ఉండరు. స్నేహితులందరూ నీవంటివారే ఉండరు.

15

మూ. ఏవముక్తస్తు రామేణ సుగ్రీవః సహలక్ష్మణః, 16
ఉత్థాయేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్యమబ్రవీత్.

ప్ర.అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధిమంతుడైన, సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, ఉత్థాయ=లేచి, ప్రణతః=నమస్కరించుచున్నవాడై, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాబుద్ధిశాలియైన లక్ష్మణసహితుడైన సుగ్రీవుడు రాముని మాటలు విని, లేచి, నమస్కరించుచు ఇట్లు పలికెను. 16

మూ. రావణేన ప్రణిహితం తమవేహి నిశాచరమ్, 17
తస్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర.

ప్ర.అ. క్షమవతాం వర=ఓర్పు కలవారిలో శ్రేష్ఠుడా ! తమ్=ఆ,

నిశాచరమ్= రాక్షసుని, రావణేన=రావణునిచేత, ప్రణిహితమ్=పంపబడినవాని నిగా, అవేహి= తెలుసుకొనుము. తస్య=వానియొక్క, నిగ్రహమ్=నిగ్రహమును, క్షమమ్=తగినదానినిగా, మన్యే=తలచుచున్నాను.

తా. ఓరిమి కలవారిలో శ్రేష్ఠుడైన రామా ! ఈ రాక్షసుణ్ణి రావణుడే గూఢచారిగా పంపి యుండును అను విషయమును గ్రహించుము. అందుచేత ఆతనిని నిగ్రహించుటయే యుక్తమని తలచెదను. 17

మూ. రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సందిష్టోఽయ మిహాగతః, 18
ప్రహర్తుం త్వయి విశ్వస్తే విశ్వస్తే మయి వానఘ,
లక్ష్మణే వా మహాబాహో స బధ్యః సచివైః సహ, 19
రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః.

ప్ర.అ. అనఘ=దోషములు లేనివాడా ! మహాబాహో=గొప్పబాహువులు గలవాడా ! అయం రాక్షసః=ఈ రాక్షసుడు, విశ్వస్తే=విశ్వాసము పొందిన, త్వయి=నీయందు గాని, విశ్వస్తే=విశ్వాసము చెందిన, మయి వా=నాయందు గాని, లక్ష్మణే వా=లక్ష్మణునియందు గాని, ప్రహర్తుమ్=కొట్టుటకు, సందిష్టః=పంపబడిన వాడై, జిహ్మయా=వక్రమైన, బుద్ధ్యా=బుద్ధితో, ఇహ=ఇక్కడికి, ఆగతః=వచ్చినాడు. సః=అతడు, సచివైః సహ=మంత్రులతో కూడ, బధ్యః=బంధింపతగినవాడు. విభీషణః= విభీషణుడు, నృశంసస్య=క్రూరుడైన, రావణస్య=రావణునియొక్క, భ్రాతా హి=సోదరుడు కదా ?

తా. దోషములు లేనివాడవు, గొప్పబాహువులు గలవాడవు అయిన ఓ ! రామా ! ఈ రాక్షసుడు రావణుడు పంపగా, విశ్వాసముతో కూడిన నిన్ను గాని, నన్ను గాని, లక్ష్మణుని గాని చంపుటకై వక్రబుద్ధితో ఇక్కడికి వచ్చినాడు. ఈ విభీషణుడు క్రూరుడైన రావణుని సోదరుడు కదా ? అందుచేత ఇతనిని, ఇతని మంత్రులను కూడ బంధింపవలెను. 18, 19

మూ. ఏవముక్త్వా రఘుశ్రేష్ఠం సుగ్రీవో వాహినీపతిః, 19
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌనముపాగమత్.

ప్ర.అ. వాక్యజ్ఞః=మాటలను ఎరిగిన, వాహినీపతిః=సేనాపతియైన, సుగ్రీవః= సుగ్రీవుడు, వాక్యకుశలమ్=మాటలలో నేర్పరియైన, రఘుశ్రేష్ఠమ్=రాముని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటు పిమ్మట, మౌనమ్=మౌనమును, ఉపాగమత్=పొందెను.

తా. ఎట్లు మాటలాడవలెనో తెలిసిన సేనానాయకుడైన సుగ్రీవుడు మాటలలో నేర్పరియైన రామునితో ఇట్లు పలికి మౌనము వహించెను. 19

మూ. స సుగ్రీవస్య తద్వాక్యం రామః శ్రుత్వా విమృశ్య చ, 20
తతః శుభతరం వాక్యమువాచ హరిపుఙ్గవమ్.

ప్ర.అ. సః రామః=ఆ రాముడు, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, తత్ వాక్యమ్= ఆ వాక్యమును, శ్రుత్వా=విని, విమృశ్య చ=ఆలోచించి, తతః=అటు పిమ్మట, హరిపుఙ్గవమ్=సుగ్రీవుని గూర్చి, శుభతరమ్=ఎక్కువ శుభమైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాముడు సుగ్రీవుని మాటలు విని బాగుగా ఆలోచించి అతనితో ఎక్కువ శుభమైన వాక్యమును పలికెను. 20

మూ. సుదుష్టో వా ప్యదుష్టో వా కిమేష రజనీచరః, 21
సూక్ష్మమప్యహితం కర్తుం మమాశక్తః కథంచన.

ప్ర.అ. ఏషః=ఈ, రజనీచరః=రాక్షసుడు, సుదుష్టో వా=చాలా దుష్టుడైనను, అదుష్టో వా=దుష్టుడు కాకపోయినను, కిమ్=ఏమి ? మమ=నాకు, కథంచన=ఏ విధముగాను కూడా, సూక్ష్మమ్=సూక్ష్మమైన, అహితము అపి=అహితమును కూడ, కర్తుమ్= చేయుటకు, అశక్తః=సమర్థుడు కాడు.

తా. ఈ రాక్షసుడు చాలా దుష్టుడైనా, కాకపోయినా ఏమీ భయములేదు. ఇతడు ఏ విధముగాను కూడ నాకు ఏ మాత్రము అపకారము చేయజాలడు. 21

మూ. పిశాచాన్దానవాన్యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, 22
అఙ్గుల్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర.

ప్ర. అ. హరిగణేశ్వర=వానరగణములకు రాజైన సుగ్రీవా! ఇచ్ఛన్=కోరిన నేను, పృథివ్యామ్=భూమిమీద ఉన్న, తాన్=ఆ, పిశాచాన్=పిశాచములను, దానవాన్= దానవులను, యక్షాన్=యక్షులను, రాక్షసాన్ చైవ=రాక్షసులను, అఙ్గుల్యగ్రేణ=వ్రేలి కొనచేత, హన్యామ్=సంహరింతును.

తా. సుగ్రీవా ! నేను తలచుకొన్నచో ఈ భూమిమీద ఉన్న పిశాచములను, దానవులను, యక్షులను, రాక్షసులను కూడ వ్రేలికొనతో చంపగలను. 22

మూ. శ్రూయతే హి కపోతేన శత్రుః శరణమాగతః, 23
అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసైర్నిమన్త్రితః.

ప్ర.అ. కపోతేన=పావురముచేత, శరణమ్=శరణమును, ఆగతః=పొందిన, శత్రుః=శత్రువు, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, అర్చితశ్చ=పూజింపబడినాడు, స్వైః=తన, మాంసైః=మాంసములచేత, నిమన్త్రితశ్చ=భోజనమునకై

పిలువబడినాడు అని, శ్రూయతే హి=వినబడుచున్నది గదా !

తా. పావురము శరణుజొచ్చిన శత్రువును న్యాయానుసారముగా పూజించి వానికి తన మాంసమును ఆహారముగా పెట్టిన దని వినుచున్నాము కదా ? 23

మూ. స హి తం ప్రతిజగ్రాహ భార్యాహర్తారమాగతమ్, 24
కపోతో వానరశ్రేష్ఠ కిం పునర్మద్విధో జనః.

ప్ర. అ. వానరశ్రేష్ఠ=వానరులలో శ్రేష్ఠుడా ! సః కపోతః=ఆ పావురము, ఆగతమ్=వచ్చిన, భార్యాహర్తారమ్=భార్యను చంపిన, తమ్=వానిని, ప్రతిజగ్రాహ హి=అతిథిగా అంగీకరించెను కదా ? మద్విధః=నావంటి, జనః=జనుడు, కిం పునః=చెప్పనేల.

తా. సుగ్రీవుడా ! తన భార్యను చంపిన ఆ శత్రువు ఇంటికి వచ్చినప్పుడు ఆ పావురము వానిని అతిథిగా స్వీకరించెను కదా ? అదే అట్లు చేసినప్పుడు నావంటి వాని మాట చెప్పవలెనా? 24

మూ. ఋషేః కణ్వస్య పుత్రేణ కణ్డునా పరమర్షిణా, 25
శృణు గాథా పురా గీతా ధర్మిష్ఠా సత్యవాదినా.

ప్ర. అ. పురా=పూర్వము, కణ్వస్య ఋషేః=కణ్వుడను ఋషియొక్క, పుత్రేణ=పుత్రుడు, సత్యవాదినా=సత్యము పలుకువాడు, పరమర్షిణా=గొప్ప ఋషి అయిన, కణ్డునా=కండువుచేత, ధర్మిష్ఠా=ధర్మముతో కూడిన, గాథా=గాథ (శ్లోకము), గీతా=గానము చేయబడినది. శృణు=వినుము.

తా. కణ్వమహర్షి పుత్రుడు, సత్యమును పలుకువాడు, అయిన కండువను మహర్షి పూర్వము ధర్మసమ్మతమైన గాథను గానము చేసినాడు (చెప్పినాడు). దానిని వినుము. 25

మూ. బద్ధాఞ్జలిపుటం దీనం యాచన్తం శరణాగతమ్, 26
న హన్యాదానృశంస్యార్థమపి శత్రుం పరంతప.

ప్ర. అ. పరంతప=శత్రువులను పీడించు రాజా ! బద్ధాఞ్జలిపుటమ్=కట్టబడిన దోసిలి కలవాడు, దీనమ్=దీనుడు, యాచన్తమ్=యాచించుచున్నవాడు, శరణాగతమ్=శరణుపొందినవాడు అయిన, శత్రుమ్ అపి=శత్రువును కూడ, ఆనృశంస్యార్థమ్=క్రూరత్వము లేకుండుటకై, న హన్యాత్=చంపకూడదు.

తా. శత్రుసంహారకుడవైన ఓ ! రాజా ! అంజలి ఘటించి, దీనుడై ప్రార్థించుచు శరణుజొచ్చిన శత్రువును కూడ, తనకు క్రూరుడను అపకీర్తి

రాకూడదు అనుకొనువాడు చంపకూడదు. 26

మూ. ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణం గతః, 27
అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా.

ప్ర. అ. కృతాత్మనా=సుశిక్షితమైన మనస్సు గలవానిచేత, పరేషామ్=ఇతరులయొక్క, శరణమ్=శరణమును, గతః=పొందిన, అరిః=శత్రువు, ఆర్తో వా=పీడితుడైనా, యది వా=లేక, దృప్తః=గర్వించినా, ప్రాణాన్=ప్రాణములను, పరిత్యజ్య=విడచి, రక్షితవ్యః=రక్షింపదగినవాడు.

తా. ఇతరులను శరణుకోరిన శత్రువు ఆర్తుడైనా, గర్వితుడైనా, వానిని, ఉత్తమమైన మనస్సు గలవాడు తన ప్రాణములనైనా ఇచ్చి రక్షింపవలెను. 27

మూ. స చేద్భయాద్వా మోహాద్వా కామాద్వాపి న రక్షతి, 28
స్వయా శక్త్యా యథాన్యాయం తత్పాపం లోకగర్హితమ్.

ప్ర. అ. సః=అతడు, భయాద్వా=భయమువలన గాని, మోహాద్వా=అజ్ఞానము వలనగాని, కామాద్వాపి=కోరికచేత గాని, స్వయా=తన సంబంధమైన, శక్త్యా=శక్తిచేత, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, న రక్షతి చేత్=రక్షింపకపోయినచో, తత్=అది, లోకగర్హితమ్=లోకమునందు నిందితమైన, పాపమ్=పాపము.

తా. శరణు పొందబడినవాడు శరణుకోరిన వానిని భయమువలన గాని, అజ్ఞానమువలన గాని, ఏదైన కోరికవలన గాని న్యాయానుసారముగా స్వశక్తి చేత రక్షింపకపోయినచో అతడు లోకమునందు నిందితమైన పాపము చేసిన వాడగును. 28

మూ. వినష్టః పశ్యతస్తస్య రక్షిణః శరణం గతః, 29
ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛేదరక్షితః.

ప్ర. అ. శరణమ్=శరణమును, గతః=పొందినవాడై, అరక్షితః=రక్షింపబడక, తస్య=ఆ, రక్షిణః=రక్షకుడు, పశ్యతః=చూచుచుండగా, వినష్టః=నశించినవాడు, తస్య=వానియొక్క, సర్వమ్=సమస్తమైన, సుకృతమ్=పుణ్యమును, ఆదాయ=గ్రహించి, గచ్ఛేత్=వెళ్లును.

తా. శరణుకోరినవాడు, రక్షింపబడకుండగా ఆ రక్షింపగలవాడు చూచుచుండగానే మరణించినచో అతడు వాని పుణ్యము నంతను తీసికొనిపోవును.

మూ. ఏవం దోషో మహానత్ర ప్రపన్నానామరక్షణే, 30
అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్యవినాశనమ్.

ప్ర. అ. ప్రపన్నానామ్=శరణుపొందినవారియొక్క, అత్ర=ఈ, అరక్షణే=

రక్షింపకపోవుటయందు, ఏవమ్=ఇట్లు, మహాన్=గొప్ప, దోషః=దోషమున్నది. అస్వర్గమ్=స్వర్గమును ఇవ్వనిది. అయశస్యం చ=యశస్సును ఇవ్వనిది. బలవీర్య వినాశనమ్= బలమును వీర్యమును నశింపచేయునది.

తా. శరణుపొందిన వారిని రక్షింపక పోవుటలో ఇట్టి గొప్ప దోషమున్నది. ఇది స్వర్గమును చెరచును; అపకీర్తి నిచ్చును. బలమును వీర్యమును నశింపచేయును.

మూ. కరిష్యామి యథార్థం తు కణ్డోర్వచనముత్తమమ్, 31
ధర్మిష్ఠం చ యశస్యం చ స్వర్గ్యం స్యాత్తు ఫలోదయమ్.

ప్ర. అ. కణ్డోః=కండువుయొక్క, ఉత్తమమ్=ఉత్తమమైన, వచనమ్=వచనమును, యథార్థమ్=యథార్థమైన దానినిగా, కరిష్యామి=చేయగలను. ధర్మిష్ఠమ్=ధర్మసమ్మతము, యశస్యమ్= కీర్తిని ఇచ్చునది, స్వర్గ్యమ్=స్వర్గము నిచ్చునది, ఫలోదయమ్=ఫలమును వృద్ధి పొందించునది, స్యాత్=అగును.

తా. కండువు చెప్పిన ఉత్తమమైన పై వచనమును యథార్థము చేసెదను. అట్లు చేయుట ధర్మసమ్మతము. కీర్తిని పెంచును. స్వర్గము నిచ్చును. సత్ఫలమును వృద్ధి చేయును. 31

మూ. సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, 32
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ.

ప్ర. అ. సకృదేవ=ఒక్కమాటే, ప్రపన్నాయ=శరణుజొచ్చినవాడై, తవ=నీవాడను, అస్మి=అయి ఉన్నాను, ఇతి=అని, యాచతే=ప్రార్థించుచున్నవానికి, సర్వభూతేభ్యః= సకలప్రాణులనుండి, అభయమ్=అభయమును, దదామి=ఇచ్చుచు న్నాను; ఏతత్=ఇది, మమ=నాయొక్క, వ్రతమ్=వ్రతము.

తా. ఎవ్వడైన వచ్చి నేను నీవాడను అని చెప్పుచు ఒక్క మాటు నన్ను శరణుపొందిన చాలును; వానికి సకలప్రాణులనుండి అభయము నిచ్చెదను. ఇది నా వ్రతము. 32

మూ. ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా, 33
విభీషణో వా సుగ్రీవ యది వా రావణః స్వయమ్.

ప్ర. అ. హరిశ్రేష్ఠ=వానరులలో శ్రేష్ఠుడైన, సుగ్రీవ=సుగ్రీవుడా ! విభీషణో వా= విభీషణుడైనా, యది వా=లేక, స్వయమ్=స్వయముగా, రావణః=రావణుడే అయినా, అస్య=వీనికి, మయా=నాచేత, అభయమ్=అభయము, దత్తమ్=ఇవ్వబడినది. ఏనమ్=ఇతనిని, ఆనయ=తీసికొని రమ్ము.

తా. వానరశ్రేష్ఠుడవైన సుగ్రీవా ! ఆ వచ్చినవాడు విభీషణుడైనా,

లేదా సాక్షాత్తు రావణుడే అయినా శరణని తీసికొని రమ్ము. నేను శరణికి అభయము ఇచ్చినాను. 33

మూ. రామస్య తు వచః శ్రుత్వా సుగ్రీవః ప్లవగేశ్వరః, 34
ప్రత్యభాషత కాకుత్స్థం సౌహార్దేనాభిపూరితః.

ప్ర. అ. ప్లవగేశ్వరః=వానరప్రభువైన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామస్య=రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, సౌహార్దేన=స్నేహముతో, అభిపూరితః=నింపబడినవాడై, కాకుత్స్థమ్=రామునిగూర్చి, ప్రత్యభాషత=తిరిగి పలికెను.

తా. వానరరాజైన సుగ్రీవుడు రాముని మాటలు విని, స్నేహభావముతో నిండిన మనస్సుతో రామునితో ఇట్లు పలికెను. 34

మూ. కిమత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథశిఖామణే, 35
యత్త్వమార్యం ప్రభాషేథాః సత్త్వవాన్ సత్పథే స్థితః.

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు ఎరిగిన వాడా ! లోకనాథశిఖామణే=లోకములకు ప్రభువులైన వారిలో శిరోమణి యైనవాడా ! సత్త్వవాన్=బలవంతుడవు, సత్పథే= ఉత్తమమార్గమునందు, స్థితః=ఉన్నవాడవు అయిన, త్వమ్=నీవు, ఆర్యమ్=పూజ్యమైన వాక్యమును, ప్రభాషేథాః ఇతి యత్=మాటలాడుదువు అనునది ఏది కలదో, అత్ర= దీనియందు, చిత్రమ్=ఆశ్చర్యమ్, కిమ్=ఏమి ?

తా. ధర్మములు తెలిసినవాడా ! లోకములను పరిపాలించువారిలో శిరోమణి యైనవాడా ! మహాబలశాలివి, ఉత్తమమార్గమునందు ప్రవర్తించువాడవు అయిన నీవు ఈ విధముగా పూజింపదగిన మాటలు మాటలాడుచున్నా వన్నచో దీనిలో ఆశ్చర్యము ఏ మున్నది ! 35

మూ. మమ చాప్యన్తరాత్మాయం శుద్ధం వేత్తి విభీషణమ్, 36
అనుమానాచ్చ భావాచ్చ సర్వతః సుపరీక్షితః.

ప్ర. అ. మమ=నాయొక్క, అయమ్=ఈ, అన్తరాత్మా చ=అంతరాత్మ కూడ, విభీషణమ్=విభీషణుని, శుద్ధమ్=పరిశుద్ధునిగా, వేత్తి=తెలిసికొనుచున్నది. అనుమానాత్ చ=ఊహవలనను, భావాత్=భావమువలనను, సర్వతః=అన్ని వైపులనుండి, సుపరీక్షితః= బాగా పరీక్షింపబడినాడు.

తా. ఈ విభీషణుడు మంచివాడే అని నా అంతరాత్మ కూడ చెప్పుచున్నది. ఊహను బట్టి, ఇంతవరకు కనబడు భావమును బట్టి అన్ని పక్షములనుండీ బాగుగా పరీక్షింపగా అట్లు కనబడుచున్నాడు. 36

మూ. తస్మాత్ క్షిప్రం సహాస్మాభిస్తుల్యో భవతు రాఘవ, 37
విభీషణో మహాప్రాజ్ఞః సఖిత్వం చాభ్యుపైతు నః.

ప్ర. అ. రాఘవ=రామా ! తస్మాత్=ఆ కారణమువలన, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గల, విభీషణః=విభీషణుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, అస్మాభిః సహ=మాతోకూడ, తుల్యః=సమానుడు, భవతు=అగుగాక. నః=మనకు, సఖిత్వం చ= మిత్రత్వమును కూడ, అభ్యుపైతు=పొందుగాక.

తా. రామా ! అందువలన గొప్ప బుద్ధిగల ఈ విభీషణుడు శీఘ్రముగా మాతో సమానుడై మనకు మిత్రు డగుగాక. 37

మూ. తతస్తు సుగ్రీవవచో నిశమ్య త
ద్ధరీశ్వరేణాభిహితం నరేశ్వరః,
విభీషణేనాశు జగామ సంగమం
పతత్త్రిరాజేన యథా పురందరః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టాదశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నరేశ్వరః=నరులం ప్రభువైన రాముడు, తత్=ఆ, సుగ్రీవవచః=సుగ్రీవుని వాక్యమును, నిశమ్య=విని, పురందరః=దేవేంద్రుడు, పతత్త్రిరాజేన యథా=గరుత్మంతునితో వలె, విభీషణేన=విభీషణునితో, ఆశు=శీఘ్రముగా, హరీశ్వరేణ=సుగ్రీవునిచేత, అభిహితమ్=చెప్పబడిన, సంగమమ్=సమాగమమును, జగామ=పొందెను.

తా. పిమ్మట రాజైన రాముడు సుగ్రీవుని మాటలు విని, అతడు చెప్పిన విధముగా, వెంటనే దేవేంద్రుడు గరుత్మంతునితో కలిసి నట్లు విభీషణునితో కలిసెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పదునెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనవింశః సర్గః

[ఆకాశమునుండి దిగివచ్చి విభీషణుడు రాముని పాదములను శరణు జొచ్చుట; రాముడు ప్రశ్నించగా అతడు రావణునకున్న బలమును గూర్చి చెప్పుట; రాముడు "నేను రావణుని చంపెదను" అని ప్రతిజ్ఞ చేసి విభీషణుని లంకారాజ్యమునందు అభిషిక్తుని చేయుట; విభీషణుని అభిప్రాయము ప్రకారము రాముడు సముద్రుని సాహాయ్యము కోరుచు దీక్షబూని సముద్రతటముపై కూర్చుండుట.]

మూ. రాఘవేణాభయే దత్తే సన్నతో రావణానుజః,
విభీషణో మహాప్రాజ్ఞో భూమిం సమవలోకయత్. 1

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, అభయే=అభయము, దత్తే=ఇవ్వబడినదగుచుండగా, రావణానుజః=రావణుని తమ్ముడైన, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గల, విభీషణః= విభీషణుడు, సన్నతః=వంగినవాడై, భూమిమ్=భూమిని, సమవలోకయత్=చూచెను.

తా. రాముడు అభయ మిచ్చిన పిమ్మట, రావణుని తమ్ముడు, మహాబుద్ధిమంతుడూ అయిన విభీషణుడు క్రిందికి వంగి భూమిని చూచెను. 1

మూ. ఖాత్పపాతావనిం హృష్టో భక్తైరనుచరైః సహ,
స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః. 2

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః=ఆ, విభీషణః= విభీషణుడు, హృష్టః=సంతోషించినవాడై, ఖాత్=ఆకాశమునుండి, భక్తైః=భక్తులైన, అనుచరైః సహ= అనుచరులతో కూడ, అవనిమ్=భూమిని గూర్చి, పపాత=దిగెను. రామస్య=రాముని సమీపమునందు, నిపపాత=పడెను (నేలను ముట్టెను).

తా. ధర్మాత్ముడైన విభీషణుడు సంతోషించుచు భక్తులైన అనుచరులతో కూడ ఆకాశమునుండి దిగి రాముని దగ్గర నేలను స్పృశించెను. 2

మూ. పాదయోర్నిపపాతాథ చతుర్భిః సహ రాక్షసైః,
అబ్రవీచ్చ తదా వాక్యం రామం ప్రతి విభీషణః. 3
ధర్మయుక్తం చ యుక్తం చ సాంప్రతం సంప్రహర్షణమ్.

ప్ర. అ. అథ =అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, చతుర్భిః=నలుగురు, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, పాదయోః=పాదములమీద, నిపపాత=పడెను. రామం ప్రతి= రాముణ్ణి గూర్చి, ధర్మయుక్తమ్=ధర్మముతో కూడినది, యుక్తం చ=యుక్తియుక్తము, సాంప్రతమ్=తగినది, సంప్రహర్షణమ్=ఆనందింపచేయునది అయిన, వాక్యమ్=వాక్యము, అబ్రవీచ్చ=పలికెను కూడ.

తా. విభీషణుడు ఆటుపిమ్మట నలుగురు రాక్షసులతో కలిసి రాముని పాదములపై పడి, ఆతనితో ధర్మసంమతము, యుక్తియుక్తము, తగినది, ఆనందకరము అయిన వాక్యమును పలికెను. 3

మూ. అనుజో రావణస్యాహం తేన చాస్మ్యవమానితః, 4
భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణం గతః.

ప్ర. అ. అహమ్=నేను, రావణస్య=రావణునియొక్క, అనుజః=తమ్ముడను. తేన=వానిచేత, అవమానితః=అవమానింపబడితిని. సర్వభూతానామ్=సకల భూతములకు, శరణ్యమ్=రక్షకుడవైన, భవన్తమ్=నిన్ను, శరణం గతః=శరణు పొందితిని.

తా. నేను రావణుని తమ్ముడను. ఆతనిచేత అవమానింపబడినాను. సకలప్రాణులకు రక్షకుడవైన నిన్ను శరణు పొందినాను. 4

మూ. పరిత్యక్తా మయా లఙ్కా మిత్రాణి చ ధనాని చ, 5
భవద్గతం హి మే రాజ్యం జీవితం చ సుఖాని చ.

ప్ర. అ. మయా=నాచేత, లఙ్కా=లంక, పరిత్యక్తా=విడువబడినది. మిత్రాణి చ=స్నేహితులు, ధనాని చ=ధనములు కూడ (విడువబడినవి). మే=నాయొక్క, రాజ్యమ్=రాజ్యము, భవద్గతం హి=నీపై ఆధారపడి ఉన్నది. జీవితమ్=నా జీవితము, సుఖాని చ= సుఖములు కూడ నీపై ఆధారపడి ఉన్నవి.

తా. నేను లంకను, మిత్రులను, ధనములను పరిత్యజించి వచ్చినాను. నా రాజ్యము, జీవితము, సుఖములు కూడ నీపై ఆధారపడి ఉన్నవి. 5

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రామో వచనమబ్రవీత్, 6
వచసా సాన్త్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ,
ఆఖ్యాహి మమ తత్త్వేన రాక్షసానాం బలాబలమ్. 7

ప్ర. అ. రామః=రాముడు, తస్య=వానియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, వచసా=వాక్కుచేత, ఏనమ్=వీనిని, సాన్త్వయిత్వా=ఓదార్చి, లోచనాభ్యామ్=నేత్రములతో, పిబన్నివ=త్రాగుచున్నవాడు వలె, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను. రాక్షసానామ్=రాక్షసులయొక్క, బలాబలమ్=బలాబలములను, మమ=నాకు, తత్త్వేన=యథార్థముగా, ఆఖ్యాహి=చెప్పుము.

తా. రాముడు ఆతని మాటలు విని నేత్రములతో త్రాగుచున్నాడా అన్నట్లు ప్రేమపూర్వకముగా చూచుచు, మాటలతో ఓదార్చి, ఇట్లు పలికెను.

"రాక్షసుల బలాబలములను గూర్చి నాకు యథార్థముగా చెప్పుము." 6, 7

మూ. ఏవముక్తం తదా రక్షో రామేణాక్లిష్టకర్మణా,
రావణస్య బలం సర్వమాఖ్యాతుముపచక్రమే. 8

ప్ర. అ. తదా=అప్పుడు, అక్లిష్టకర్మణా=క్లేశములేని కర్మలు గల, రామేణ= రాముని చేత, ఏవమ్=ఇట్లు, ఉక్తమ్=పలుకబడిన, రక్షః=రాక్షసుడు, రావణస్య= రావణుని యొక్క, సర్వమ్=సమస్తమైన, బలమ్=బలమును గూర్చి, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. శ్రమపడకుండగా కార్యములు సాధించు రాముడు ఇట్లు ప్రశ్నించగా ఆ విభీషణుడు అప్పుడు రావణుని కున్న బలమును గూర్చి పూర్తిగా చెప్పుటకు ఇట్లు ప్రారంభించెను. 8

మూ. అవధ్యః సర్వభూతానాం గన్ధర్వోరగపక్షిణామ్,
రాజపుత్ర దశగ్రీవో వరదానాత్స్వయంభువః. 9

ప్ర.అ. రాజపుత్ర=రాజకుమారా ! స్వయంభువః=బ్రహ్మయొక్క, వరదానాత్= వరదానమువలన, దశగ్రీవః=రావణుడు, గన్ధర్వోరగపక్షిణామ్=గంధర్వులకు, ఉరగులకు, పక్షులకు, సర్వభూతానామ్=సకలప్రాణులకు, అవధ్యః= చంప శక్యము కానివాడు.

తా. దశరథరాజపుత్రుడవైన, రామా ! బ్రహ్మ వరము ఇచ్చియుండుటచే, రావణుని గంధర్వులు గాని, ఉరగులు గాని, పక్షులు గాని, మరి ఏ ప్రాణులు గాని చంపజాలవు. 9

మూ. రావణానన్తరో భ్రాతా మమ జ్యేష్ఠశ్చ వీర్యవాన్,
కుమ్భకర్ణో మహాతేజాః శక్రప్రతిబలో యుధి. 10

ప్ర. అ. రావణానన్తరః=రావణునికి తరువాతివాడైన, భ్రాతా=సోదరుడు, మమ= నాకు, జ్యేష్ఠశ్చ=అన్నగారు, వీర్యవాన్=పరాక్రమవంతుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు అయిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, యుధి=యుద్ధమునందు, శక్రప్రతిబలః=దేవేంద్రుని ఎదిరించు బలము గలవాడు.

తా. రావణుని తరువాతి వాడైన సోదరుడు, నాకంటె పెద్దవాడు, గొప్ప పరాక్రమము, తేజస్సు గలవాడు అయిన కుంభకర్ణుడు యుద్ధములో దేవేంద్రుని ఎదిరించగలిగిన బలము కలవాడు. 10

మూ. రామ సేనాపతిస్తస్య ప్రహస్తో యది తే శ్రుతః,
కైలాసే యేన సమరే మణిభద్రః పరాజితః. 11

ప్ర.అ. రామ=రామా ! యేన=ఎవనిచేత, శైలే=కైలాసమునందు, సమరే=యుద్ధమునందు, మహేన్ద్రః=మహేంద్రుడు, పరాజితః=ఓడింపబడినాడో అట్టి, తస్య సేనాపతిః=అతని సేనాపతియైన, ప్రహస్తః=ప్రహస్తుడు, తే=నీకు, శ్రుతః యది=వినబడి ఉన్నాడా !

తా. రామా ! అతని సేనాపతియైన ప్రహస్తుని గూర్చి నీవు విని ఉందువు. అతడు కైలాసపర్వతముమీద జరిగిన యుద్ధములో మహేంద్రుణ్ణి ఓడించినాడు. 11

మూ. బద్ధగోధాఙ్గులిత్రాణ అవధ్యకవచో యుధి,
ధనురాదాయ యస్తిష్ఠన్నదృశ్యో భవతీన్ద్రజిత్. 12

ప్ర. అ. యః=ఏ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు ఉన్నాడో అతడు, బద్ధగోధాఙ్గులిత్రాణః=కట్టుకొనబడిన గోధ (వేలికి నారి దెబ్బ తగలకుండగా కట్టుకొనిన ఉడుము చర్మము), వ్రేళ్ల కవచములు గలవాడై, అవధ్యకవచః=భేదింప శక్యము కాని కవచము గలవాడై, ధనుః=ధనుస్సును, ఆదాయ=ధరించి, యుధి=యుద్ధమునందు, తిష్ఠన్=నిలుచుచు, అదృశ్యః=కనబడనివాడు, భవతి=అగును.

తా. ఇంద్రజిత్తు యుద్ధములో గోధను వ్రేళ్ల తొడుగులను కట్టుకొని, భేదింప శక్యము కాని కవచమును తొడిగికొని, ధనస్సు ధరించి యుద్ధములో నిలబడినచో అతడు ఇతరులకు కనబడడు. 12

మూ. సంగ్రామే సుమహద్వ్యూహే తర్పయిత్వా హుతాశనమ్,
అన్తర్ధానగతః శ్రీమానిన్ద్రజిద్ధన్తి రాఘవ. 13

ప్ర. అ. రాఘవ=రామా ! శ్రీమాన్=శ్రీమంతుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, హుతాశనమ్=అగ్నిని, తర్పయిత్వా=తృప్తిపొందించి, అన్తర్ధానగతః=అంతర్ధానము పొందినవాడై, సుమహద్వ్యూహే=చాల గొప్పదైన సేనావ్యూహము గల, సంగ్రామే=యుద్ధరంగమునందు, హన్తి=చంపును.

తా. రామా ! శ్రీమంతుడైన ఇంద్రజిత్తు అగ్నిని హోమముచేత తృప్తిపొందించి అంతర్ధానము చెంది, గొప్ప సేనావ్యూహములు గల యుద్ధములో శత్రువులను సంహరించును. 13

మూ. మహోదరమహాపార్శ్వౌ రాక్షసశ్చాప్యకమ్పనః,
అనీకస్థాస్తు తస్యైతే లోకపాలసమా యుధి. 14

ప్ర. అ. మహోదరమహాపార్శ్వౌ=మహోదరమహాపార్శ్వులు, అకమ్పనః=అకంపను డను, రాక్షసః=రాక్షసుడు, యుధి=యుద్ధమునందు, లోకపాలసమాః=లోకపాలురతో సమానులైన, ఏతే=వీరు, తస్య=రావణియొక్క,

అనీకపాః=సేనానాయకులు.

తా. లోకపాలురంతో సమానులైన మహోదరమహాపార్శ్వులు, అకంపనుడు అను ముగ్గురూ యుద్ధములో ఇతని సేనానాయకులు. 14

మూ. దశకోటిసహస్రాణి రక్షసాం కామరూపిణామ్,
మాంసశోణితభక్ష్యాణాం లఙ్కాపురనివాసినామ్. 15

ప్ర. అ. కామరూపిణామ్=స్వేచ్ఛారూపము గలవారు, మాంసశోణిత భక్ష్యాణామ్=మాంసము, రక్తము ఆహారముగా గలవారు, లఙ్కాపురనివాసినామ్=లంకాపురమునందు నివసించువారు అయిన, రక్షసామ్=రాక్షసులయొక్క, దశకోటి సహస్రాణి=పదివేల కోట్లు ఉన్నవి.

తా. లంకాపురములో స్వేచ్ఛగా రూపములను ధరింప గల, రక్త మాంసములు భుజించు పదివేల కోట్లమంది రాక్షసులు నివసించుచున్నారు. 15

మూ. స తైస్తు సహితో రాజా లోకపాలానయోధయత్
సహ దేవైస్తు తే భగ్నా రావణేన దురాత్మనా. 16

ప్ర. అ. సః=ఆ, రాజా=రాక్షసరాజు, తైః=ఆ రాక్షసులతో, సహితః=కూడినవాడై, లోకపాలాన్=లోకపాలురను, అయోధయత్=యుద్ధము చేయించెను. తే=ఆ లోకపాలకులు, దేవైః సహ=దేవతలతో కూడ, దురాత్మనా=దురాత్ముడైన, రావణేన=రావణునిచేత, భగ్నాః=ఓడించబడినారు.

తా. రావణుడు ఆ రాక్షసులతో వెళ్లి లోకపాలురతో యుద్ధము చేసెను. ఆ లోకపాలురు, ఇతరదేవతలయూ కూడ దురాత్ముడైన ఆ రావణుని చేతిలో ఓడిపోయిరి. 16

మూ. విభీషణస్య తు వచస్తచ్ఛ్రుత్వా రఘుసత్తమః,
అన్వీక్ష్య మనసా సర్వమిదం వచనమబ్రవీత్. 17

ప్ర. అ. రఘుసత్తమః=రాముడు, విభీషణస్య=విభీషణునియొక్క, తత్=ఆ, వచః=వచనమును, శ్రుత్వా=విని, సర్వమ్=సమస్తమును, మనసా=మనస్సుచేత, అన్వీక్ష్య=పరిశీలించి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు విభీషణుని మాటలు విని, ఆ విషయము నంతా మనసా పరిశీలించి ఇట్లు పలికెను. 17

మూ. యాని కర్మాపదానాని రావణస్య విభీషణ,
ఆఖ్యాతాని చ తత్త్వేన హ్యవగచ్ఛామి తాన్యహమ్. 18

ప్ర. అ. విభీషణ=విభీషణుడా ! రావణస్య=రావణునియొక్క, యాని=ఏ, కర్మాపదానాని=శౌర్యముతో చేసిన పనులు, ఆఖ్యాతాని=చెప్పబడినవో, తాని=వాటిని, తత్త్వేన=యథార్థముగా, అహమ్=నేను, అవగచ్ఛామి హి=తెలిసికొనుచున్నాను కదా.

తా. విభీషణా ! రావణుడు శౌర్యముతో పూర్వము చేసిన పనులను గూర్చి నీవు చెప్పితివి. వాటిని బాగుగా అర్థము చేసికొన్నాను. 18

మూ. అహం హత్వా దశగ్రీవం సప్రహస్తం సహాత్మజమ్,
రాజానం త్వాం కరిష్యామి సత్యమేతచ్ఛృణోతు మే. 19

ప్ర. అ. అహమ్=నేను, సప్రహస్తమ్=ప్రహస్తునితో కూడిన, సహాత్మజమ్=కుమారునితో కూడిన, దశగ్రీవమ్=రావణుని, హత్వా=చంపి, త్వామ్=నిన్ను, రాజానమ్=రాజునుగా, కరిష్యామి=చేసెదను. మే=నాయొక్క, ఏతత్=ఈ, సత్యమ్=సత్యమైన మాటను, శృణోతు=వినెదవుగాక.

తా. నేను రావణుని, ప్రహస్తుని, ఇంద్రజిత్తును చంపి నిన్ను రాజును చేసెదను. నేను నిజముగా చెప్పుచున్న మాట వినుము. 19

మూ. రసాతలం వా ప్రవిశేత్పాతాలం వాపి రావణః,
పితామహసకాశం వా న మే జీవన్విమోక్ష్యతే. 20

ప్ర. అ. రావణః=రావణుడు, రసాతలమ్=రసాతలమును గాని, పాతాలం వాపి=పాతాలమును గాని, ప్రవిశేత్=ప్రవేశించుగాక. పితామహసకాశం వా=బ్రహ్మదేవుని సమీపమును గాని (చేరుగాక). జీవన్=జీవించి, మే=నాకు (నానుండి) న విమోక్ష్యతే=విడువబడడు.

తా. రావణుడు రసాతలములో ప్రవేశించినా, పాతాళములో ప్రవేశించినా, బ్రహ్మదేవుని లోకమునకు వెళ్లినా నేను అతనిని ప్రాణాలతో విడువను. 20

మూ. అహత్వా రావణం సంఖ్యే సపుత్రజనబాన్ధవమ్,
అయోధ్యాం న ప్రవేక్ష్యామి త్రిభిస్తైర్భ్రాతృభిః శపే. 21

ప్ర. అ. సపుత్రజనబాన్ధవమ్=పుత్రులతోను, పరివారముతోను, బంధువులతోను కూడిన, రావణమ్=రావణుని, సంఖ్యే=యుద్ధమునందు, అహత్వా=చంపకుండగా, అయోధ్యామ్=అయోధ్యను, న ప్రవేక్ష్యామి=ప్రవేశించను. తైః=ఆ, త్రిభిః=ముగ్గురు, భ్రాతృభిః=సోదరులతో, శపే=ఒట్టుపెట్టుచున్నాను.

తా. యుద్ధములో రావణుణ్ణి వాని పుత్రపరివారబంధువులతో సహా

చంపకుండా అయోధ్యలో ప్రవేశించను. నా ముగ్గురు సోదరులమీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 21

మూ. శ్రుత్వా తు వచనం తస్య రామస్యాక్లిష్టకర్మణః,
శిరసా వన్ద్య ధర్మాత్మా వక్తుమేవ ప్రచక్రమే. 22

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన విభీషణుడు, అక్లిష్టకర్మణః=శ్రమ లేని పనులు గల, తస్య రామస్య=ఆ రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, శిరసా=శిరస్సుచేత, అవన్ద్య=నమస్కరించి, వక్తుమేవ=చెప్పుటకే, ప్రచక్రమే= ఉపక్రమించెను.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు శ్రమపడకుండగా పనులు సాధించు ఆ రాముని మాటలు విని, తల వంచి నమస్కరించి మాటలాడుటకు ఉపక్రమించెను.

మూ. రాక్షసానాం వధే సాహ్యం లఙ్కాయాశ్చ ప్రధర్షణే,
కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామి చ వాహినీమ్. 23

ప్ర.అ. లఙ్కాయాః=లంకయొక్క, ప్రధర్షణే=ఎదిరించుటయందు, రాక్షసానామ్= రాక్షసులయొక్క, వధే=వధయందు, సాహ్యమ్=సాహాయ్యమును, కరిష్యామి= చేయగలను. యథాప్రాణమ్=నా శక్తిని అనుసరించి, వాహినీమ్=సేనను, ప్రవేక్ష్యామి చ = ప్రవేశించెదను కూడ.

తా. లంకను ముట్టడించి రాక్షసులను చంపుటకు సహాయము చేసెదను. నా శక్తిని అనుసరించి, శత్రుసైన్యములో ప్రవేశించి యుద్ధము కూడ చేసెదను.

మూ. ఇతి బ్రువాణం రామస్తు పరిష్వజ్య విభీషణమ్,
అబ్రవీల్లక్ష్మణం ప్రీతః సముద్రాజ్జలమానయ. 24

ప్ర. అ. రామస్తు=రాముడైతే, ప్రీతః=సంతోషించినవాడై, ఇతి=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, విభీషణమ్=విభీషణుని, పరిష్వజ్య=కౌగిలించుకొని, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను. సముద్రాత్=సముద్రమునుండి, జలమ్= జలమును, ఆనయ=తీసికొనిరమ్ము.

తా. రాముడు సంతోషించి, ఈ విధముగా పలుకుచున్న విభీషణుని కౌగిలించుకొని లక్ష్మణునితో ఇట్లు పలికెను. "సముద్రమునుండి జలము తీసికొనిరమ్ము." 24

మూ. తేన చేమం మహాప్రాజ్ఞమభిషిఞ్చ విభీషణమ్,

రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద. 25

ప్ర. అ. మానద=గౌరవమును ఇచ్చువాడా ! మయి=నేను, ప్రసన్నే=ప్రసన్నుడ నగుచుండగా, మహాప్రాజ్ఞమ్=గొప్ప బుద్ధి గల, ఇమమ్=ఈ, విభీషణమ్=విభీషణుని, రక్షసామ్=రాక్షసులయొక్క, రాజానమ్=రాజునుగా, క్షిప్రమ్=శీఘ్రముగా, తేన=ఆ జలములో, అభిషిఞ్చ=అభిషేకింపుము.

తా. ఇతరుల గౌరవమును పెంచు ఓ ! లక్ష్మణా ! మహాబుద్ధిశాలియైన ఈ విభీషణుణ్ణి ఆ జలములో, రాక్షసరాజునుగా వెంటనే అభిషేకింపుము; నేను సంతోషింపెదను. 25

మూ. ఏవముక్తస్తు సౌమిత్రిరభ్యషిఞ్చద్విభీషణమ్,
మధ్యే వానరముఖ్యానాం రాజానం రాజశాసనాత్. 26

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, వానరముఖ్యానామ్=వానరనాయకులయొక్క, మధ్యే=మధ్యయందు, రాజశాసనాత్=రాజుయొక్క ఆజ్ఞ వలన, విభీషణమ్=విభీషణుణ్ణి, రాజానమ్=రాజునుగా, అభ్యషిఞ్చత్=అభిషేకించెను.

తా. లక్ష్మణుడు రాముని మాటలు విని, వానరనాయకుల మధ్య, రాముని ఆజ్ఞ ప్రకారము ఆ విభీషణుని రాక్షసరాజునుగా అభిషిక్తుని చేసెను. 26

మూ. తం ప్రసాదం తు రామస్య దృష్ట్వా సద్యః ప్లవఙ్గమాః,
ప్రచుక్రుశుర్మహాత్మానం సాధు సాధ్వితి చాబ్రువన్. 27

ప్ర. అ. ప్లవఙ్గమాః=వానరులు, రామస్య=రామునియొక్క, తమ్=ఆ, సద్యః=వెంటనే, ప్రసాదమ్=అనుగ్రహమును, దృష్ట్వా=చూచి, ప్రచుక్రుశుః=బిగ్గరగా అరచిరి. మహాత్మానమ్=మహాత్ముడైన రాముణ్ణి గూర్చి, సాధు సాధు=బాగు బాగు అని, అబ్రువన్ చ=పలికిరి కూడా.

తా. వానరులు రాముడు వెంటనే చూపిన అనుగ్రహమును చూచి సంతోషముతో ధ్వని చేయుచు "బాగు బాగు" అని ఆ మహాత్ముడైన రాముణ్ణి ప్రశంసించిరి. 27

మూ. అబ్రవీచ్చ హనూమాంశ్చ సుగ్రీవశ్చ విభీషణమ్,
కథం సాగరమక్షోభ్యం తరేమ వరుణాలయమ్. 28
సైన్యైః పరివృతాః సర్వే వానరాణాం మహౌజసామ్.

ప్ర. అ. హనూమాంశ్చ=హనుమంతుడు, విభీషణమ్=విభీషణుని గూర్చి,

అబ్రవీత్ = పలికెను. సుగ్రీవశ్చ=సుగ్రీవుడు కూడ పలికెను. సర్వే=మన మందరమూ, మహౌజసామ్= గొప్ప తేజస్సు గల, వానరాణామ్=వానరుల యొక్క, సైన్యైః=సైన్యములతో, పరివృతాః= కూడినవారమై, అక్షోభ్యమ్=క్షోభింప శక్యము కాని, వరుణాలయమ్=వరుణునకు నివాసమైన, సాగరమ్=సముద్రమును, కథమ్=ఎట్లు, తరేమ=దాటెదము ?

తా. హనుమంతుడు సుగ్రీవుడు - "గొప్ప తేజస్సు గల ఈ వానరులతో కలిసి మన మందరము, క్షోభింప శక్యము కాని, వరుణదేవనివాసస్థానమైన సముద్రమును దాటుట ఎట్లు ?" అని విభీషణుని అడిగిరి. 28

మూ. ఉపాయైరధిగచ్ఛామ యథా నదనదీపతిమ్, 29
తరేమ తరసా సర్వే ససైన్యా వరుణాలయమ్.

ప్ర. అ. నదనదీపతిమ్=నదములకు నదులకు భర్తయైన, వరుణాలయమ్=సముద్రమును, ససైన్యాః=సైన్యముతో కూడిన, సర్వే=అందరమూ, తరసా=బలము చేత, యథా= ఎట్లు, తరేమ=దాటుదుమో అట్లు, ఉపాయైః=ఉపాయములచేత, అధిగచ్ఛామ= చేరుదము.

తా. పశ్చిమాభిముఖముగా ప్రవహించే నదాలకు, పూర్వాభిముఖముగా ప్రవహించే నదులకు పతియైన ఈ సముద్రమును సైన్యసహితులమైన మన మందరము బలముతో దాటుటకై ఉపాయములతో సమీపించెదము. అట్టి ఉపాయములు చెప్పుము. 29

మూ. ఏవముక్తస్తు ధర్మాత్మా ప్రత్యువాచ విభీషణః, 30
సముద్రం రాఘవో రాజా శరణం గన్తుమర్హతి.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విభీషణః=విభీషణుడు, ప్రత్యువాచ=తిరిగి పలికెను. రాజా=రాజైన, రాఘవః= రాముడు, సముద్రమ్=సముద్రమును, శరణమ్=శరణమును, గన్తుమ్= పొందుటకు, అర్హతి=తగి ఉన్నాడు.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు వారి మాటలు విని ఇట్లు పలికెను. "రాజైన రాముడు సముద్రమును శరణుపొందుట మంచిది." 30

మూ. ఖానితః సగరేణాయమప్రమేయో మహోదధిః, 31
కర్తుమర్హతి రామస్య జ్ఞాతేః కార్యం మహోదధిః.

ప్ర. అ. అప్రమేయః=ఇంత అని కొలువ శక్యము కాని, అయమ్=ఈ, మహోదధిః= మహాసముద్రము, సగరేణ=సగరునిచేత, ఖానితః=త్రవ్వించబడినాడు. మహోదధిః=ఈ మహాసముద్రము, జ్ఞాతేః=బంధువైన, రామస్య=రామునియొక్క,

కార్యమ్= కార్యమును, కర్తుమ్=చేయుటకు, అర్హతి=తగి ఉన్నాడు.

తా. "తెలియ శక్యము కాని ప్రమాణము గల ఈ మహాసముద్రమును రాముని పూర్వికుడైన సగరుడు త్రవ్వించినాడు. అందుచేత జ్ఞాతి బంధువైన రాముని కార్యమును చేయగలదు." 31

మూ. ఏవం విభీషణేనోక్తో రాక్షసేన విపశ్చితా, 32
ఆజగామాథ సుగ్రీవో యత్ర రామః సలక్ష్మణః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, విపశ్చితా=విద్వాంసుడైన, రాక్షసేన=రాక్షసుడైన, విభీషణేన=విభీషణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, సలక్ష్మణః= లక్ష్మణునితో కూడిన, రామః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, ఆజగామ= వచ్చెను.

తా. పిమ్మట, సుగ్రీవుడు పండితుడైన విభీషణుని మాటలు విని రామలక్ష్మణులున్న చోటికి వచ్చెను. 32

మూ. తతస్త్వాఖ్యాతుమారేభే విభీషణవచః శుభమ్, 33
సుగ్రీవో విపులగ్రీవః సాగరస్యోపవేశనమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విపులగ్రీవః=విశాలమైన కంఠము గల, సుగ్రీవః= సుగ్రీవుడు, శుభమ్=శుభమైన, విభీషణవచః=విభీషణుని వచనమును, సాగరస్య= సముద్రముయొక్క, ఉపవేశనమ్=ఉపాసనమును, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, ఆరేభే= ప్రారంభించెను.

తా. పిదప విశాలమైన కంఠము గల సుగ్రీవుడు విభీషణుడు చెప్పిన శుభమైన వచనమును, రాముడు సాగరమును ఉపాసించవలెనను విషయమును చెప్పెను. 33

మూ. ప్రకృత్యా ధర్మశీలస్య రాఘవస్యాప్యరోచత. 34
స లక్ష్మణం మహాతేజాః సుగ్రీవం చ హరీశ్వరమ్,
సత్క్రియార్థం క్రియాదక్షః స్మితపూర్వమభాషత. 35

ప్ర. అ. ప్రకృత్యా=స్వభావముచేత, ధర్మశీలస్య=ధర్మశీలుడైన, అస్య రాఘవస్యాపి= ఈ రామునకు కూడ, అరోచత=ఇష్టమాయెను. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః= ఆ రాముడు, లక్ష్మణమ్=లక్ష్మణుని, క్రియాదక్షః=పనులలో నేర్పరియైన, హరీశ్వరమ్= వానరరాజైన, సుగ్రీవం చ=సుగ్రీవుని గూర్చి, సత్క్రియార్థమ్=విభీషణుని మాటను గౌరవించుటకు, స్మితపూర్వమ్=చిరునవ్వు పూర్వమునందు కలుగునట్లుగా, అభాషత=పలికెను.

తా. సహజముగా ధర్మస్వభావుడైన రామునకు కూడ అది నచ్చెను. మహాతేజశ్శాలియైన ఆ రాముడు విభీషణుని మాటలు ఆదరించుచు, లక్ష్మణునితోను, నయములో సమర్థుడు, వానరప్రభువూ అయిన సుగ్రీవునితోను, చిరునవ్వు నవ్వుచు ఇట్లనెను. 34, 35

మూ. విభీషణస్య మన్త్రోఽయం మమ లక్ష్మణ రోచతే,
సుగ్రీవః పణ్డితో నిత్యం భవాన్మన్త్రవిచక్షణః, 36
ఉభాభ్యాం సంప్రధార్యార్థం రోచతే యత్తదుచ్యతామ్.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! విభీషణస్య=విభీషణునియొక్క, అయం మన్త్రః=ఈ ఆలోచన, మమ=నాకు, రోచతే=ఇష్టమగుచున్నది. సుగ్రీవః=సుగ్రీవుడు, పణ్డితః=పండితుడు. భవాన్=నీవు, నిత్యమ్=ఎల్లప్పుడు, మన్త్రవిశారదః=ఆలోచనలో సమర్థుడవు. ఉభాభ్యామ్=మీ ఇద్దరిచేత, అర్థమ్=విషయమును, సంప్రధార్య=నిశ్చయించి, యత్=ఏది, రోచతే=ఇష్టమగుచున్నదో, తత్=అది, ఉచ్యతామ్=చెప్పబడుగాక.

తా. లక్ష్మణా ! విభీషణుని ఈ ఆలోచన నాకు నచ్చినది. సుగ్రీవుడు పండితుడు. నీవు ఎల్లప్పుడు ఆలోచనలో సమర్థుడవు. మీరిద్దరూ నిశ్చయించి, మీ కేది ఇష్టమో చెప్పుడు. 36

మూ. ఏవముక్తౌ తతో వీరావుభౌ సుగ్రీవలక్ష్మణౌ, 37
సముదాచారసంయుక్తమిదం వచనమూచతుః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఏవమ్=ఇట్లు, ఉక్తౌ=పలుకబడిన, వీరౌ=వీరులైన, సుగ్రీవలక్ష్మణౌ=సుగ్రీవలక్ష్మణులు, ఉభౌ=ఇద్దరూ, సముదాచారసంయుక్తమ్= ఆదరముతో కూడిన (ఎవరితో ఏ సమయమున ఎట్లు ప్రవర్తించవలెనో అట్లు ప్రవర్తించుట "సముదాచారము") ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ఊచతుః=పలికిరి.

తా. వీరులైన రామలక్ష్మణు లిద్దరూ రాముని మాటలు విని వినయపూర్వకముగా ఇట్లు పలికిరి. 37

మూ. కిమర్థం నో నరవ్యాఘ్ర న రోచిష్యతి రాఘవ, 38
విభీషణేన యత్తూక్తమస్మిన్ కాలే సుఖావహమ్.

ప్ర. అ. నరవ్యాఘ్ర=నరులలో శ్రేష్ఠుడవైన, రాఘవ=రామా ! అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, సుఖావహమ్=సుఖమును కలిగించు, యత్=ఏది, విభీషణేన= విభీషణుని చేత, ఉక్తమ్=పలుకబడినదో, అది, నః=మాకు, కిమర్థమ్=ఎందుకు, న రోచిష్యతి=ఇష్టము కాదు ?

తా. నరులలో శ్రేష్ఠుడవైన ఓ! రామా! ఈ సమయమునందు సుఖమును కలిగించు (ఇప్పుడు అనుకూలమైన) విభీషణుని వాక్యము మాకు మాత్రము ఇష్టము కాకుండునా? 38

మూ. అబద్ధ్వా సాగరే సేతుం ఘోరేఽస్మిన్ వరుణాలయే, 39
లఙ్కా నాసాదితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః.

ప్ర. అ. ఘోరే=భయంకరమైన, వరుణాలయే=వరుణుని నివాసమైన, అస్మిన్ సాగరే= ఈ సముద్రమునందు, సేతుమ్=సేతువును, అబద్ధ్వా=బంధించకుండగా, లఙ్కా=లంక, సేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సురాసురైరపి=సురులచేతను, అసురులచేతను కూడ, ఆసాదితుమ్=పొందుటకు, న శక్యా=శక్యము కాదు.

తా. వరుణదేవుని నివాసస్థానమైన ఈ భయంకరసముద్రము మీద సేతువును కట్టకుండగా ఇంద్రునితో కూడిన సురాసురులు కూడ లంకలో ప్రవేశింపజాలరు. 39

మూ. విభీషణస్య శూరస్య యథార్థం క్రియతాం వచః. 40
అలం కాలాత్యయం కృత్వా సాగరాయ నియుజ్యతామ్,
యథా సైన్యేన గచ్ఛామ పురీం రావణపాలితామ్. 41

ప్ర. అ. శూరస్య=శూరుడైన, విభీషణస్య=విభీషణునియొక్క, వచః=వచనము, యథార్థమ్=యథార్థముగా, క్రియతామ్=చేయబడుగాక. కాలాత్యయమ్=కాలము గడుపుటను, కృత్వా=చేసి, అలమ్=చాలును. రావణపాలితామ్=రావణుని చేత పాలింపబడిన, పురీమ్=లంకాపురిని గూర్చి, యథా=ఎట్లు, సైన్యేన=సైన్యముతో, గచ్ఛామ=వెళ్ళుదుమో అట్లు, సాగరాయ=సముద్రమునకు, నియుజ్యతామ్=ఆజ్ఞ ఇవ్వబడుగాక.

తా. శూరుడైన విభీషణుడు చెప్పినట్లు చేయుము. ఆలస్యము చేయవద్దు. సైన్యముతో లంకాపురిలో ప్రవేశించుటకు వీలు కల్పించుటకై సముద్రుని ఆదేశింపుము. 40, 41

మూ. ఏవముక్తః కుశాస్తీర్ణే తీరే నదనదీపతేః,
సంవివేశ తదా రామో వేద్యామివ హుతాశనః. 42

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాండే ఏకోనవింశః సర్గః

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, రామః=రాముడు, తదా= అప్పుడు, నదనదీపతేః=సముద్రముయొక్క, కుశాస్తీర్ణే=కుశలచేత పరచబడిన, తీరే= తీరమునందు, హుతాశనః=అగ్ని, వేద్యామివ=వేదియందు వలె,

సంవివేశ = శయనించెను.

తా. రాముడు వారి మాటలు విని సముద్రతీరమునందు కుశలు పరచుకొని వాటిపై వేదిలో అగ్నివలె శయనించెను. 42

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో పందొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ వింశః సర్గః

[శార్దూలుడు చెప్పగా రావణుడు శుకుణ్ణి సుగ్రీవునివద్దకు దూతగా పంపుట; వానరులు అతనిని పీడించుట; రాముని అనుగ్రహముచేత అతడు ఆ ఆపదనుండి బైటపడుట; సుగ్రీవుడు రావణునకు ప్రత్యుత్తరమును ఇచ్చుట; మరల వానరులు అతనిని బంధించి పీడించుచుండగా రాముడు వారించుట.]

మూ. తతో నివిష్టాం ధ్వజినీం సుగ్రీవేణాభిపాలితామ్,
దదర్శ రాక్షసో౽భ్యేత్య శార్దూలో నామ వీర్యవాన్. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, శార్దూలో నామ=శార్దూలు డనే, రాక్షసః=రాక్షసుడు, అభ్యేత్య=వచ్చి, నివిష్టామ్=వ్యూహము లుగా ఏర్పరచబడిన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, అభిపాలితామ్= పాలింపబడిన, ధ్వజినీమ్=సేనను, దదర్శ=చూచెను.

తా. పిమ్మట పరాక్రమవంతుడైన శార్దూలు డను రాక్షసుడు వచ్చి వ్యూహములుగా నిలుపబడి సుగ్రీవునిచేత పాలింపబడుచున్న వానరసైన్యమును చూచెను. 1

మూ. చారో రాక్షసరాజస్య రావణస్య దురాత్మనః,
తాం దృష్ట్వా సర్వతో౽వ్యగ్రం ప్రతిగమ్య స రాక్షసః, 2
ఆవిశ్య లఙ్కాం వేగేన రాజానమిదమబ్రవీత్.

ప్ర. అ. దురాత్మనః=దుర్బుద్ధియైన, రాక్షసరాజస్య=రాక్షసుల రాజైన, రావణస్య=రావణునియొక్క, చారః=గూఢచారియైన, సః రాక్షసః=ఆ రాక్షసుడు, అవ్యగ్రః=కంగారులేనివాడై, తామ్=ఆ సేనను, సర్వతః= అన్ని వైపులా, దృష్ట్వా=చూచి, ప్రతిగమ్య=తిరిగి వెళ్ళి, వేగేన=వేగముతో, లఙ్కామ్=లంకను, ఆవిశ్య=ప్రవేశించి, రాజానమ్=రాజును గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. దుర్మార్గుడు, రాక్షసరాజు అయిన రావణుని గూఢచారియైన ఆ రాక్షసుడు ఆ సేన నంతనూ జాగర్తగా చూచి వేగముగా లంకకు తిరిగి వెళ్ళి రావణునితో ఇట్లు పలికెను. 2

మూ. ఏష వై వానరర్క్షౌఘో లఙ్కాం సమభివర్తతే, 3
అగాధశ్చాప్రమేయశ్చ ద్వితీయ ఇవ సాగరః.

ప్ర. అ. ద్వితీయః=రెండవ, సాగరః ఇవ=సముద్రము వలె, అగాధశ్చ=చాల లోతైనది, అప్రమేయశ్చ=లెక్క కట్ట శక్యము కానిది అయిన, ఏషః=ఈ, వానరర్క్ష

ఘః=వానరులయొక్క, భల్లూకములయొక్క సముదాయము, లఙ్కామ్=లంకను, సమభివర్తతే=సమీపించి ఉన్నది.

తా. అగాధము, ఇంత అని నిర్ణయింప శక్యముకానిది అయిన ఈ వానరుల సేన, భల్లూకముల సేన రెండవ సముద్రము వలె లంకను సమీపించి ఉన్నది. 3

మూ. పుత్రౌ దశరథస్యేమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ, 4
ఉత్తమౌ రూపసంపన్నౌ సీతాయాః పదమాగతౌ,
సితౌ సాగరమాసాద్య సంనివిష్టౌ మహాద్యుతీ. 5

ప్ర. అ. దశరథస్య=దశరథునియొక్క, పుత్రౌ=పుత్రులు, ఉత్తమౌ=ఉత్తములు, రూపసంపన్నౌ=మంచి రూపముతో కూడినవారు, మహాద్యుతీ=గొప్ప కాంతి గలవారు, భ్రాతరౌ=సోదరులూ అయిన, ఇమౌ=ఈ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, సీతాయాః=సీతయొక్క, పదమ్=స్థానమును, ఆగతౌ=పొందినవారై, సాగరమ్= సముద్రమును, ఆసాద్య=సమీపించి, సంనివిష్టౌ=నిలిచి ఉన్నారు.

తా. ఉత్తములు, మంచి రూపము గలవారు, గొప్ప కాంతి గలవారు, దశరథకుమారులు, సోదరులూ అయిన ఈ రామలక్ష్మణులు సీత ఉన్న స్థానమును తెలిసికొని సముద్రసమీపమున నిలిచి ఉన్నారు. 4, 5

మూ. బలం చాకాశమావృత్య సర్వతో దశయోజనమ్,
తత్త్వభూతం మహారాజ క్షిప్రం వేదితుమర్హసి. 6

ప్ర. అ. మహారాజ=మహారాజా ! బలం చ=సైన్యము కూడ, సర్వతః=అన్ని వైపులా, దశయోజనమ్=పది యోజనములు, ఆయతమ్=పొడవైన, ఆకాశమ్=అవకాశమును, ఆవృత్య=ఆవరించి ఉన్నది. తత్త్వభూతమ్=యథార్థమైన ఈ విషయమును, క్షిప్రమ్=శీఘ్రముగా, వేదితుమ్=తెలిసికొనుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. వానరసైన్యము కూడ అన్ని ప్రక్కలా పది యోజనములు విశాలమైన అవకాశమును ఆక్రమించుకొని విడిసి ఉన్నది. మహారాజా ! నీ వీ సత్యమును వెంటనే గ్రహించవలెను. 6

మూ. తవ దూతా మహారాజ క్షిప్రమర్హన్తి వేదితుమ్,
ఉపప్రదానం సాన్త్వం వా భేదో వాత్ర ప్రయుజ్యతామ్. 7

ప్ర. అ. మహారాజ=మహారాజా ! తవ=నీయొక్క, దూతాః=దూతలు, క్షిప్రమ్=శీఘ్రముగా, వేదితుమ్= తెలిసికొనుటకొరకు, అర్హన్తి=తగి ఉన్నారు.

ఉపప్రదానమ్=దానముకాని, సాన్త్వం వా=సామోపాయము కాని, భేదో వా=భేదోపాయము గాని, అత్ర=ఈ విషయమున, ప్రయుజ్యతామ్=ప్రయోగించబడుగాక.

తా. మహారాజా ! నీ వరికొందరు దూతలు కూడ వెంటనే వెళ్ళి తెలిసికొనుట మంచిది. ఈ విషయమునందు దానోపాయమును గాని, సామోపాయమును గాని, భేదోపాయమును గాని ప్రయోగింపుము. (దండమునకు అవకాశమే లేదు). 7

మూ. శార్దూలస్య వచః శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
ఉవాచ సహసా వ్యగ్రః సంప్రధార్యార్థమాత్మనః, 8
శుకం నామ తదా రక్షో వాక్యమర్థవిదాం వరమ్.

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, శార్దూలస్య=శార్దూలునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, సహసా=వెంటనే, వ్యగ్రః=కంగారు పడుచున్నవాడై, ఆత్మనః=తనయొక్క, అర్థమ్= ప్రయోజనమును, సంప్రధార్య=నిశ్చయించుకొని, తదా=అప్పుడు, అర్థవిదామ్=కార్యవేత్తలలో, వరమ్= శ్రేష్ఠుడైన, శుకం నామ=శుకు డను పేరు గల, రక్షః=రాక్షసుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు శార్దూలుని మాట విని, కంగారుపడుచు, వెంటనే తన ప్రయోజనమును నిశ్చయించుకొని, విషయములను తెలిసికొనగలవారిలో శ్రేష్ఠుడైన శుకు డను రాక్షసునితో ఇట్లు పలికెను. 8

మూ. సుగ్రీవం బ్రూహి గత్వాశు రాజానం వచనాన్మమ, 9
యథాసందేశమక్లీబం శ్లక్ష్ణయా పరయా గిరా.

ప్ర. అ. రాజానమ్=రాజైన, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, ఆశు=శీఘ్రముగా, గత్వా=వెళ్ళి, మమ= నాయొక్క, వచనాత్=వచనమువలన, యథాసందేశమ్=నా సందేశమును అనుసరించి, పరయా=శ్రేష్ఠమైన, శ్లక్ష్ణయా=మృదువైన, గిరా=వాక్కుతో, అక్లీబమ్=నిర్భయముగా, బ్రూహి=చెప్పుము.

తా. నీవు వెంటనే వానరరాజైన సుగ్రీవుని వద్దకు వెళ్ళి నా సందేశము తూ. చా. తప్పకుండా మధురములు, ఉత్తమములు అయిన మాటలతో నిర్భయముగా నా మాటగా ఇట్లు చెప్పుము. 9

మూ. త్వం వై మహారాజ కులప్రసూతో
మహాబలశ్చర్క్షరజఃసుతశ్చ,
న కశ్చనార్థస్తవ నాస్త్యనర్థ
స్తథాపి మే భ్రాతృసమో హరీశ. 10

ప్ర. అ. మహారాజ=మహారాజా ! త్వమ్=నీవు, కులప్రసూతః=ఉత్తమకులమునందు పుట్టినవాడవు గదా. మహాబలః=గొప్ప బలముగలవాడవు. ఋక్షరజఃసుతః=ఋక్షరజస్సు కుమారుడవు. తవ=నీకు, అర్థః=ప్రయోజనము, కశ్చన=ఏదీ, నాస్తి=లేదు. అనర్థః=అనర్థము కూడ, న=లేదు. హరీశ=వానరరాజా! తథాపి=అట్లయినను, మే=నాకు, భ్రాతృసమః=సోదరునితో సమానుడవు.

తా. మహారాజా ! నీవు ఉత్తమకులములో పుట్టినావు. మహాబలవంతుడవు. ఋక్షరజస్సు కుమారుడవు. నీ కీ యుద్ధమువలన ఏ లాభము లేదు; నష్టమూ లేదు. కాని ఓ ! వానరరాజా ! నీవు నాకు సోదరుని వంటివాడవు. 10

మూ. అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య ధీమతః,
కిం తత్ర తవ సుగ్రీవ కిష్కిన్ధాం ప్రతి గమ్యతామ్. 11

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! ధీమతః=బుద్ధిమంతుడైన, రాజపుత్రస్య=రాజకుమారునియొక్క, భార్యామ్=భార్యను, అహమ్=నేను, అహరం యది=హరించినట్లయితే, తత్ర=దాని విషయమునందు, తవ=నీకు, కిమ్=ఏమి ? కిష్కిన్ధాం ప్రతి=కిష్కింధను గూర్చి, గమ్యతామ్=వెళ్ళెదవుగాక.

తా. సుగ్రీవా ! నేను ధీమంతుడైన రాముని భార్యను హరించినచో దానితో నీకేమి సంబంధము ? నీవు తిరిగి కిష్కింధకు పొమ్ము. 11

మూ. న హీయం హరిభిర్లఙ్కా ప్రాప్తుం శక్యా కథం చన,
దేవైరపి సగన్ధర్వైః కిం పునర్నరవానరైః. 12

ప్ర. అ. ఇయం లఙ్కా=ఈ లంక, హరిభిః=వానరులచేత, కథం చన=ఏ విధముగానూ కూడ, ప్రాప్తుమ్=పొందుటకు, న శక్యా హి=శక్యము కాదు గదా? సగన్ధర్వైః=గంధర్వులతో కూడిన, దేవైరపి=దేవతలచేత కూడ, శక్యముకాదు. నరవానరైః=నరులచేతను, వానరులచేతను, కిం పునః=చెప్పనేల ?

తా. వానరులు ఏ విధముగానూ కూడ లంకలో ప్రవేశింపజాలరు. దేవతలు, గంధర్వులూ కూడ ప్రవేశింపజాలని లంకలో నరులు, వానరులు ప్రవేశింపజాలరని వేరే చెప్పవలెనా ? 12

మూ. స తదా రాక్షసేన్ద్రేణ సన్దిష్టో రజనీచరః,
శుకో విహఙ్గమో భూత్వా తూర్ణమాప్లుత్య సాగరమ్. 13

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, సన్దిష్టః=పంపబడిన, సః=ఆ, రజనీచరః= రాక్షసుడైన, శుకః=శుకుడు, విహఙ్గమః=పక్షిగా,

భూత్వా=అయి, అమ్బరమ్=ఆకాశమును, తూర్ణమ్= శీఘ్రముగా, ఆప్లుత్య=ఎగిరి (వెళ్లెను).

తా. రావణుడు పంపిన ఆ రాక్షసుడైన శుకుడు అప్పుడు పక్షిరూపము ధరించి శీఘ్రముగా ఆకాశములోనికి ఎగిరి వెళ్ళెను. 13

మూ. స గత్వా దూరమధ్వానముపర్యుపరి సాగరమ్,
సంస్థితో హ్యమ్బరే వాక్యం సుగ్రీవ మిదమబ్రవీత్. 14

ప్ర. అ. సః=ఆ శుకుడు, ఉపర్యుపరి సాగరమ్=సముద్రానికి పైన పైన, దూరమ్=దూరమైన, అధ్వానమ్=మార్గమును, గత్వా=వెళ్ళి, అమ్బరే=ఆకాశమునందు, సంస్థితః=ఉన్నవాడై, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ శుకుడు సముద్రము పైపైననే చాల దూరము వెళ్ళి, ఆకాశమునందే నిలచి సుగ్రీవునితో ఇట్లు పలికెను. 14

మూ. సర్వముక్తం యథాదిష్టం రావణేన దురాత్మనా,
తత్ప్రాపయన్తం వచనం తూర్ణమాప్లుత్య వానరాః, 15
ప్రాపద్యన్త తదా క్షిప్రం లోప్తుం హన్తుం చ ముష్టిభిః.

ప్ర. అ. దురాత్మనా=దురాత్ముడైన, రావణేన=రావణునిచేత, యథా=ఎట్లు, ఆదిష్టమ్=ఆదేశింపబడినదో, అట్లు, సర్వమ్=సమస్తము, ఉక్తమ్=చెప్పబడినది. తత్=ఆ, వచనమ్=వచనమును, ప్రాపయన్తమ్=పొందించుచున్న వానిని, వానరాః=వానరులు, ఆప్లుత్య=పైకి ఎగిరి, తదా=అప్పుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, లోప్తుమ్=రెక్కలు ఊడదీయుటకు, ముష్టిభిః=పిడికిళ్లచేత, హన్తుం చ=కొట్టుటకు, ప్రాపద్యన్త=పొందిరి.

తా. శుకుడు దురాత్ముడైన రావణుడు చెప్పిన దంతా చెప్పెను. అతడు ఆ మాటలు చెప్పుచుండగా వానరులు పైకి ఎగిరి వెంటనే వాని రెక్కలు ఊడబెరుకుటకు, పిడికిళ్ళతో కొట్టుటకు వాని దగ్గరకు వెళ్లిరి. 15

మూ. సర్వైః ప్లవఙ్గైః ప్రసభం నిగృహీతో నిశాచరః, 16
గగనాద్భూతలే చాశు ప్రతిగృహ్యావతారితః.

ప్ర. అ. సర్వైః=సమస్తమైన, ప్లవఙ్గైః=వానరులచేత, ప్రసభమ్=బలాత్కారముగా, నిగృహీతః= నిగ్రహింపబడిన, నిశాచరః=రాక్షసుడు, ఆశు=వెంటనే, ప్రతిగృహ్య=పట్టుకొని, గగనాత్=ఆకాశమునుండి, భూతలే=నేలమీద, అవతారితః=దింపబడినాడు.

తా. ఆ వానరులందరూ బలాత్కారముగా ఆ రాక్షసుని నిగ్రహించి వెంటనే వానిని పట్టుకొని ఆకాశమునుండి భూమిమీదకు దింపిరి. 16

మూ. వానరైః పీడ్యమానస్తు శుకో వచనమబ్రవీత్, 17
న దూతాన్ ఘ్నన్తి కాకుత్స్థ వార్యన్తాం సాధు వానరాః.

ప్ర. అ. వానరైః=వానరులచేత, పీడ్యమానః=పీడింపబడుచున్న, శుకః=శుకుడు, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను. కాకుత్స్థ=రామా! దూతాన్=దూతలను, న ఘ్నన్తి=చంపరు. వానరాః=వానరులు, సాధు=బాగుగా, వార్యన్తామ్=నివారింపబడుదురుగాక.

తా. వానరులు అట్లు పీడించుచుండగా శుకు డిట్లు పలికెను. "రామా! ఎవ్వరూ దూతలను చంపరు. అందుచేత వానరులను నివారింపుము."

మూ. యస్తు హిత్వా మతం భర్తుః స్వమతం సంప్రభాషతే, 18
అనుక్తవాదీ దూతః సన్ స దూతో వధమర్హతి.

ప్ర. అ. యః=ఎవడు, భర్తుః=ప్రభువుయొక్క, మతమ్=అభిప్రాయమును, హిత్వా=విడచి, స్వమతమ్= తన మతమును, సంప్రభాషతే=మాటలాడునో, దూతః సన్=దూత అయి ఉండి, అనుక్తవాదీ=ప్రభువుచేత చెప్పబడనిదానిని చెప్పు, సః దూతః=ఆ దూత, వధమ్=వధను, అర్హతి=తగి ఉన్నాడు.

తా. "ఏ దూత ప్రభువు అభిప్రాయమును కాక తన అభిప్రాయమును చెప్పునో దూత అయి ఉండి తన ప్రభువు చెప్పనిదానిని చెప్పు ఆ దూత చంపదగినవాడు." 18

మూ. శుకస్య వచనం రామః శ్రుత్వా తు పరిదేవితమ్, 19
ఉవాచ మా వధిష్టేతి ఘ్నతః శాఖామృగర్షభాన్.

ప్ర. అ. రామః=రాముడు, శుకస్య=శుకునియొక్క, వచనమ్=వచనమును, పరిదేవితమ్=ఏడ్పును, శ్రుత్వా=విని, ఘ్నతః=కొట్టుచున్న, శాఖామృగర్షభాన్=వానర శ్రేష్ఠులను గూర్చి, మా వధిష్ట=చంపకండి, ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా. రాముడు శుకుని మాటలను, ఏడ్పును విని, అతనిని కొట్టుచున్న వానరశ్రేష్ఠులతో "వానిని చంపకుడు" అని పలికెను. 19

మూ. స చ పత్రలఘుర్భూత్వా హరిభిర్దర్శితేఽభయే, 20
అన్తరిక్షే స్థితో భూత్వా పునర్వచన మబ్రవీత్.

ప్ర. అ. సః చ=అతడు, హరిభిః=వానరులచేత, అభయే=అభయము,

దర్శితే=చూపబడినదగుచుండగా, పత్రలఘుః=తేలికైన రెక్కలు గలవాడు, భూత్వా=అయి, అన్తరిక్షే=ఆకాశమునందు, స్థితః=నిలచినవాడు, భూత్వా=అయి, పునః=మరల, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. వానరులనుండి భయము లేదని గ్రహించిన పిమ్మట అతడు తేలికయైన రెక్కలతో ఆకాశముపై నిలచి మరల ఇట్లు పలికెను. 20

మూ. సుగ్రీవ సత్త్వసంపన్న మహాబలపరాక్రమ, 21
కిం మయా ఖలు వక్తవ్యో రావణో లోకరావణః.

ప్ర. అ. సత్త్వసంపన్న=ధైర్యసంపన్నుడవు, మహాబలపరాక్రమ=గొప్ప బలపరాక్రమములు కలవాడవు అయిన, సుగ్రీవ=సుగ్రీవుడా ! లోకరావణః=లోకములను ఏడ్పించు, రావణః=రావణుడు, మయా=నాచేత, కిమ్=ఏమి, వక్తవ్యః=చెప్పదగినవాడు?

తా. ధైర్యశాలివి, మహాబలపరాక్రమములు గలవాడవూ అయిన ఓ ! సుగ్రీవా ! లోకములను పీడించి ఏడ్పించు రావణునితో నేనేమి సమాధానము చెప్పవలెను ? 21

మూ. స ఏవముక్తః ప్లవగాధిపస్తదా
ప్లవఙ్గమానామృషభో మహాబలః,
ఉవాచ వాక్యం రజనీచరస్య
చారం శుకం శుద్ధ మదీనసత్త్వః. 22

ప్ర. అ. తదా=అప్పుడు, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, మహాబలః=గొప్ప బలము గల, ప్లవగానామ్ అధిపః=వానరరాజైన, సః=ఆ సుగ్రీవుడు, అదీనసత్త్వః=దీనముకాని మనస్సుకలవాడై, రజనీచరస్య=రావణునియొక్క, చారమ్=గూఢచారి, శుద్ధమ్=పరిశుద్ధుడూ అయిన, శుకమ్=శుకుణ్ణి గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు మహాబలవంతుడు, వానరశ్రేష్ఠుడూ అయిన ఆ వానరరాజు ఆ మాటలు విని, రావణుని దూతయైన పరిశుద్ధుడైన శుకునితో నిర్భయముగా ఇట్లు పలికెను. 22

మూ. న మేఽసి మిత్రం న తథానుకమ్ప్యో
న చోపకర్తాఽసి న మే ప్రియోఽసి,
అరిశ్చ రామస్య సహానుబన్ధ
స్తతోఽసి వాలీవ వధార్హ వధ్యః. 23

ప్ర. అ. వధార్హ=వధకు తగినవాడా ! మే=నాయొక్క, మిత్రమ్=స్నేహితుడవు, న అసి=కావు. తథా=మరియు, అనుకమ్ప్యః=జాలిచూపవలసినవాడవు, న=కావు. ఉపకర్తా న=ఉపకారము చేసేవాడవు కూడ, న అసి=కావు. మే=నాకు, ప్రియః= ఇష్టుడవు, న అసి=కావు. రామస్య=రామునియొక్క, అరిః=శత్రువుగా ఉన్నావు. తతః=ఆ కారణమువలన, వాలీవ=వాలి వలె, సహాముఖ్యః=పరివారముతో కూడిన నీవు, వధ్యః=చంపదగినవాడవు, అసి=అయి ఉన్నావు.

తా. చంపుటకు తగిన ఓ ! రావణా ! నీవు నాకు మిత్రుడవు కావు. జాలి చూపదగినవాడవు కావు. నాకు ఉపకారము చేసినవాడవు కావు. నాకు ఇష్టుడవు కావు. రామునితో విరోధము పెట్టుకొన్నావు. అందుచేత వాలి వలె నీవు కూడ నీ పరివారముతో కూడ చంపదగినవాడవే. 23

మూ. నిహన్మ్యహం త్వాం ససుతం సబన్ధుం
సజ్ఞాతివర్గం రజనీచరేశ,
లఙ్కాం చ సర్వాం మహతా బలేన
సర్వైః కరిష్యామి సమేత్య భస్మ. 24

ప్ర. అ. రజనీచరేశ=రాక్షసరాజా ! ససుతమ్=కుమారులతో కూడిన, సబన్ధుమ్= బంధువులతో కూడిన, సజ్ఞాతివర్గమ్=జ్ఞాతివర్గముతో కూడిన, త్వామ్=నిన్ను, అహమ్=నేను, నిహన్మి=చంపుచున్నాను (చంపగలను). మహతా=గొప్ప, బలేన=సేనతో, సమేత్య=కలిసి, సర్వామ్=సమస్తమైన, లఙ్కామ్=లంకను, సర్వైః=అందరితోను, భస్మ=భస్మముగా, కరిష్యామి=చేయుగలను.

తా. రావణుడా ! నేను నిన్ను, నీ కుమారులను, బంధువులను, జ్ఞాతులను, చంపివేసెదను. గొప్ప సైన్యముతో కలిసి వచ్చి లంకనూ, లంకానివాసుల నందరిని కూడ భస్మము చేసెదను. 24

మూ. న మోక్ష్యసే రావణ రాఘవస్య
సర్వైః సహేన్ద్రైరపి మూఢ గుప్తః,
అన్తర్హితః సూర్యపథం గతోఽపి,
తథైవ పాతాలమనుప్రవిష్టః. 25
గిరీశపాదమ్బుజసంగతో వా
హతోఽసి రామేణ సహానుజస్త్వమ్. 26

ప్ర. అ. రావణ=రావణా ! మూఢ=ఓ ! మూఢుడా ! సహేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సర్వైః=అందరిచేతను, గుప్తః అపి=రక్షించబడిన

వాడవైనను, అన్తర్హితః=అంతర్ధానము చెందినను, సూర్యపథమ్=సూర్యమార్గమును, గతో వా=పొందినవాడవైనను, తథైవ=అట్లే, పాతాలమ్=పాతాళమును, అనుప్రవిష్టః=ప్రవేశించినవాడవైనను, గిరీశపాదాంబుజసంగతో వా=శివుని పాదపద్మముతో కలిసి ఉన్నవాడ వైనను, రాఘవస్య=రామునకు(చేత), న మోక్ష్యసే=విడువబడవు. సహోమయః=తమ్మునితో కూడిన, త్వమ్=నీవు, రామేణ=రాముని చేత, హతః=చంపబడినవాడవు, అసి=అయి ఉన్నావు(చంపబడగలవు).

తా. ఓ మూఢుడవైన రావణా! ఇంద్రుడు ఇతరదేవతలందరూ కలిసి నిన్ను రక్షించినా నీవు అంతర్ధానము పొందినా, సూర్యమండలములోనికి గాని, పాతాళమునకు గాని వెళ్లినా, ఈశ్వరుని పాదపద్మముల దగ్గరకు చేరినా రాముడు నిన్ను విడిచిపెట్టడు. నిన్ను, నీ తమ్మునీ కూడ రాముడు చంపివేసినట్లే. 25, 26

మూ. తస్య తే త్రిషు లోకేషు న పిశాచం న రాక్షసమ్,
త్రాతారమనుపశ్యామి న గన్ధర్వం న చాసురమ్. 27

ప్ర. అ. తస్య=అట్టి, తే=నీకు, త్రాతారమ్=రక్షకుని, త్రిషు లోకేషు=మూడులోకములయందు, న అనుపశ్యామి=చూడను. పిశాచమ్=పిశాచమును, న=చూడను. రాక్షసమ్=రాక్షసుణ్ణి, న=చూడను. గన్ధర్వమ్=గంధర్వుణ్ణి, న=చూడను, అసురం చ=అసురుణ్ణి కూడ, న=చూడను.

తా. అట్టి నిన్ను రక్షించేవాడు ఈ మూడు లోకములలో నా కెవ్వరూ కనబడుటలేదు. పిశాచము గాని, రాక్షసుడు గాని, గంధర్వుడు గాని, అసురుడు గాని నిన్ను రక్షించజాలడు. 27

మూ. అవధీస్త్వం జరావృద్ధం గృధ్రరాజం జటాయుషమ్,
కిం ను తే రామసాంనిధ్యే సకాశే లక్ష్మణస్య చ, 28
హృతా సీతా విశాలాక్షీ యాం త్వం గృహ్య న బుధ్యసే.

ప్ర. అ. త్వమ్=నీవు, జరావృద్ధమ్=ముసలితనముచేత వృద్ధుడైన, గృధ్రరాజమ్=గృధ్రరాజైన, జటాయుషమ్=జటాయువును, అవధీః=చంపితివి. త్వమ్=నీవు, యామ్=ఏ సీతను, గృహ్య=గ్రహించి, న బుధ్యసే=తెలిసికొనుటలేదో, అట్టి, విశాలాక్షీ=విశాలములైన నేత్రములు గల, సీతా=సీత, రామసాంనిధ్యే=రాముని సంనిధియందు, లక్ష్మణస్య చ=లక్ష్మణునియొక్క, సకాశే=సంనిధియందు, తే=నీకు(నీచేత), కిం ను=ఎందువలన, న హృతా=హరింపబడలేదు.

తా. నీవు ముసలివాడైన గృధ్రరాజు, జటాయువును చంపినావు. నీవు

ఏ సీతను అపహరించి నీ మహాపరాధమును తెలిసికొనజాలకున్నావో అట్టి విశాలాక్షియైన సీతను నీవు రాముడు, లక్ష్మణుడు దగ్గర ఉండగా ఎందుకు అపహరించలేదు ? 28

మూ. మహాబలం మహాత్మానం దురాధర్షం సురైరపి, 29
న బుధ్యసే రఘుశ్రేష్ఠం యస్తే ప్రాణాన్ హరిష్యతి.

ప్ర. అ. యః=ఏ రాముడు, తే=నీయొక్క, ప్రాణాన్=ప్రాణములను, హరిష్యతి=హరించగలడో, అట్టి, మహాబలమ్=గొప్ప బలము గలవాడు, మహాత్మానమ్= మహాత్ముడు, సురైరపి=దేవతలచేత కూడ, దురాధర్షమ్=ఎదిరింప శక్యము కానివాడు అయిన, రఘుశ్రేష్ఠమ్=రాముణ్ణి, న బుధ్యసే=తెలిసికొనకున్నావు. 29

తా. మహాబలశాలి, మహాత్ముడు, దేవతలచేత కూడ ఎదిరింప శక్యము కానివాడు అయిన రాము డనగా ఎట్టివాడో నీకు తెలియుటలేదు. అతడు నీ ప్రాణాలను హరించనున్నాడు. 29

మూ. తతోఽబ్రవీద్వాలిసుతోఽప్యఙ్గదో హరిసత్తమః, 30
నాయం దూతో మహాప్రాజ్ఞ చారకః ప్రతిభాతి మే.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, వాలిసుతః=వాలికుమారుడైన, హరిసత్తమః=వానరశ్రేష్ఠుడైన, అంగదః=అంగదుడు, అబ్రవీత్=పలికెను. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి కలవాడా ! అయమ్=ఇతడు, దూతః=దూత, న=కాదు. చారకః=గూఢచారిగా, మే=నాకు, ప్రతిభాతి=తోచుచున్నాడు.

తా. అప్పుడు వానరశ్రేష్ఠుడు, వాలిపుత్రుడూ అయిన అంగదుడు ఇట్లు పలికెను. "గొప్ప బుద్ధిగల వానరరాజా ! ఇతడు దూత కాదు; గూఢచారిగా నాకు తోచుచున్నాడు." 30

మూ. తులితం హి బలం సర్వమనేన తవ తిష్ఠతా, 31
గృహ్యతాం మాగమల్లఙ్కామేతద్ధి మమ రోచతే.

ప్ర. అ. తిష్ఠతా=నిలచి ఉన్న, అనేన=వీనిచేత, సర్వమ్=సమస్తమైన, బలమ్= సైన్యము, తులితమ్ హి=అంచనా వేయబడినది కదా ? గృహ్యతామ్=పట్టుకొనబడుగాక. లఙ్కామ్=లంకను గూర్చి, మా గమత్=వెళ్ళకపోవుగాక. ఏతత్=ఇదే, మమ=నాకు, రోచతే=ఇష్ట మగుచున్నది.

తా. "ఇత డిక్కడ నిలబడి నీ సైన్యము నంతనూ అంచనా వేసినాడు. ఇతనిని బంధించుట మంచిది. ఇతనిని లంకకు వెళ్ళనీయకూడదు. ఇది నా

అభిప్రాయము." 31

మూ. తతో రాజ్ఞా సమాదిష్టాః సముత్పత్య వలీముఖాః, 32
జగృహుశ్చ బబన్ధుశ్చ విలపన్తమనాథవత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజ్ఞా=రాజుచేత, సమాదిష్టాః=ఆజ్ఞాపింప బడిన, వలీముఖాః=వానరులు, సముత్పత్య=ఎగిరి, అనాథవత్=అనాథుడు వలె, విలపన్తమ్=విలపించుచున్న వానిని, జగృహుః=పట్టుకొనిరి. బబన్ధుశ్చ=బంధించిరి కూడ.

తా. అప్పుడు సుగ్రీవుడు ఆజ్ఞాపించగా వానరులు ఎగిరి రక్షకుడు లేక విలపించుచున్న అతనిని పట్టుకొని బంధించిరి. 32

మూ. శుకస్తు వానరైశ్చణ్డైస్తత్ర తైః సంప్రపీడితః, 33
వ్యాచుక్రోశ మహాత్మానం రామం దశరథాత్మజమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, చణ్డైః=తీవ్రస్వభావము గల, తైః వానరైః=ఆ వానరులచేత, సంప్రపీడితః=పీడింపబడిన, శుకస్తు=శుకుడైతే, మహాత్మానమ్=మహాత్ముడు, దశరథాత్మజమ్=దశరథకుమారుడు అయిన, రామమ్=రాముని గూర్చి, వ్యాచుక్రోశ=అరచెను.

తా. తీవ్రస్వభావము గల ఆ వానరులు పీడించగా ఆ శుకుడు దశరథపుత్రుడు మహాత్ముడు అయిన రాముని గూర్చి అరచెను. 33

మూ. లుప్యేతే మే బలాత్పక్షౌ భిద్యేతే మే తథాక్షిణీ. 34
యాం చ రాత్రిం మరిష్యామి జాయే రాత్రిం చ యామహమ్,
ఏతస్మిన్నన్తరే కాలే యన్మయా హ్యశుభం కృతమ్, 35
సర్వం తదుపపద్యేథా జహ్యాం చేద్యది జీవితమ్.

ప్ర. అ. మే=నాయొక్క, పక్షౌ=రెక్కలు, బలాత్=బలాత్కారముగా, లుప్యేతే=పీకివేయబడుచున్నవి. తథా=మరియు, మే అక్షిణీ=నేత్రములు, భిద్యేతే=బద్దలై పోవుచున్నవి. అహమ్=నేను, యాం చ=ఏ, రాత్రిమ్=రాత్రిని (రాత్రియందు), జాయే=పుట్టుదునో (పుట్టితినో), యాం చ రాత్రిమ్=ఏ రాత్రిని, మరిష్యామి=చచ్చెదనో, ఏతస్మిన్=ఈ, అన్తరే కాలే=మధ్యకాలమునందు, మయా=నాచేత, యత్=ఏ, అశుభమ్=పాపము, కృతమ్=చేయబడినదో, తత్ సర్వమ్=దాని నంతయూ, జీవితమ్=జీవితమును, జహ్యాం చేద్యది=విడచినట్లయితే, ఉపపద్యేథాః=పొందెదవు.

తా. నా రెక్కలు ఊడబెరికి వేయుచున్నారు. నా కళ్లు పేలిపోవుచున్నవి.

నేను మరణించినట్లయితే నేను పుట్టిన రాత్రి (నాడు)మొదలు చచ్చే రోజు వరకు చేసిన పాపము లన్నీ నీకే సంక్రమించును. 34, 35

మూ. నాఘాతయత్తదా రామః శ్రుత్వా తత్పరిదేవితమ్,
వానరానబ్రవీద్రామో ముచ్యతాం దూత ఆగతః. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే వింశః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, రామః=రాముడు, తత్=ఆ, పరిదేవితమ్=ఏడ్పును, శ్రుత్వా=విని, నాఘాతయత్=చంపించలేదు. రామః=రాముడు, దూతః=దూతగా, ఆగతః=వచ్చిన ఇతడు, ముచ్యతామ్=విడువబడుగాక అని, వానరాన్=వానరులను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు రాముడా ఏడ్పు విని "దూతగా వచ్చిన వానిని చంపకుడు" అని పలికి వానరు లతనిని చంపకుండునట్లు చేసెను. 36

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరువదవ సర్గ సమాప్తము.

## అథ ఏకవింశః సర్గః

[తాను ప్రార్థించినను సముద్రము మార్గ మివ్వకపోవుటచే రాముడు కోపించి బాణసంధానము చేయగా సముద్రము క్షోభ చెందుట.]

మూ. తతః సాగరవేలాయాం దర్భానాస్తీర్య రాఘవః,
అఞ్జలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః, 1
బాహుం భుజగభోగాభముపధాయారిసూదనః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అరిసూదనః=శత్రువినాశకుడైన, రాఘవః=రాముడు, సాగరవేలాయామ్=సముద్రతీరమునందు, దర్భాన్=దర్భలను, ఆస్తీర్య=పరచి, మహోదధేః=మహాసముద్రమునకు, అఞ్జలిమ్=దోసిలిని, కృత్వా=చేసి, ప్రాఙ్ముఖః=తూర్పువైపు ముఖము గలవాడై, భుజగభోగాభమ్=సర్పశరీరముతో సమానమైన, బాహుమ్=బాహువును, ఉపధాయ=తలగడగా ఉంచుకొని, ప్రతిశిశ్యే=శయనించెను.

తా. పిమ్మట శత్రువినాశకుడైన రాముడు సముద్రతీరమునందు దర్భలు పరచుకొని సముద్రమునకు నమస్కరించి, సర్పశరీరము వలె ఉన్న బాహువును తలగడగా ఉంచుకొని శయనించెను. 1

మూ. మణికాఞ్చనకేయూరముక్తాప్రవరభూషణైః, 2
భుజైః పరమనారీణామభిమృష్టమనేకధా. 3

ప్ర. అ. (ఇది మొదలు 9 వ శ్లోకం చివరివరకు ఒకే అన్వయము. ద్వితీయాంతము లన్నీ 'భుజమ్' అనుదానికి విశేషణములు). మణికాఞ్చనకేయూరముక్తాప్రవరభూషణైః=మణులు పొదిగిన బంగారు బాహుపురులు, శ్రేష్ఠములైన ముత్యములు అలంకారములుగా గల, పరమనారీణామ్= ఉత్తమస్త్రీలయొక్క, భుజైః=భుజములచేత, అనేకధా=అనేకవిధములుగా, అభిమృష్టమ్= స్పృశింపబడిన (బాహువును) తలగడగా చేసికొని శయనించెను.

తా. రాముని బాహువును పూర్వము మణులు పొదిగిన బంగారు దండకడియాలు, శ్రేష్ఠములైన ముత్యములు అలంకారముగా గల ఉత్తమస్త్రీల భుజములు అనేకవిధముల స్పృశించినవి.

వి. దీనిని బట్టి రామునకు సీత కాక మరికొందరు భార్యలున్నా రని చెప్పవలసిన పనిలేదు. కౌసల్య మొదలైన తల్లులు లేదా రాజపరిచారికలు స్పృశించిన భుజ మని అర్థము. ప్రాచ్యపాఠంలో "రాముడు దర్భలపై శయనించెను" అని మాత్రమే ఉన్నది. ఈ వర్ణనలు ఏవీ లేవు. 2,3

మూ. చన్దనాగురుభిశ్చైవ పురస్తాదభిసేవితమ్,
బాలసూర్యప్రకాశైశ్చ చన్దనైరుపశోభితమ్. 4

ప్ర. అ. పురస్తాత్=పూర్వము, చన్దనాగురుభిశ్చైవ=చందనముచేతను అగురువుచేతను, అభిసేవితమ్=సేవించబడినది, బాలసూర్యప్రకాశైః=బాలసూర్యుని వంటి కాంతి గల, చన్దనైః=ఎఱ్ఱని మంచి గంధముచేత, ఉపశోభితమ్=శోభింపబడిన (భుజమును ... ...)

తా. పూర్వము ఆ భుజమునకు తెల్లని చందనము, అగురువు బాలసూర్యుని వంటి కాంతి గల చందనము పూయబడుచుండెడిది. 4

మూ. శయనే చోత్తమాఙ్గేన సీతాయాః శోభితం పురా,
తక్షకస్యేవ సంభోగం గఙ్గాజలనిషేవితమ్. 5

ప్ర. అ. పురా=పూర్వము, శయనే=శయనమునందు, సీతాయాః=సీత యొక్క, ఉత్తమాఙ్గేన=శిరస్సుచేత, శోభితమ్=శోభింపచేయబడినది, గఙ్గాజలనిషేవితమ్=గంగాజలముచేత సేవించబడిన, తక్షకస్య=తక్షకునియొక్క, సంభోగమివ=శరీరము వలె ఉన్నది (అయిన భుజమును ... ...)

తా. పూర్వము శయ్యమీద సీత శిరస్సు ఈ భుజముమీద ఉండెడిది. అది గంగాజలములో మునిగిన తక్షకుని శరీరము వలె ఉండెను. 5

మూ. సంయుగే యుగసంకాశం శత్రూణాం శోకవర్ధనమ్,
సుహృదాం నన్దనం దీర్ఘం సాగరాన్తవ్యపాశ్రయమ్. 6

ప్ర. అ. దీర్ఘమ్=దీర్ఘము, యుగసంకాశమ్=కాడితో సమానము, సంయుగే=యుద్ధమునందు, శత్రూణామ్=శత్రువులయొక్క, శోకవర్ధనమ్=శోకమును వృద్ధిపొందించునది, సుహృదామ్=స్నేహితులకు, నన్దనమ్=ఆనందము కలిగించేది, సాగరాన్తవ్యపాశ్రయమ్=సాగరము అంతమునందు గల భూమండలమునకు ఆశ్రయము (అయిన భుజము ... ...)

తా. కాడి వలె దీర్ఘమైన ఆ భుజము యుద్ధములో శత్రువుల శోకమును వృద్ధిపొందించునది, మిత్రులకు ఆనందము కలిగించునది, భూమండలమున కంతకు ఆశ్రయ మైనది. 6

మూ. అస్యతా చ పునః సవ్యం జ్యాఘాతవిగతత్వచమ్,
దక్షిణో దక్షిణం బాహుం మహాపరిఘసంనిభమ్, 7
గోసహస్రప్రదాతారం ఉపధాయ భుజం మహత్,
అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా, 8

ఇతి రామో ధృతిం కృత్వా మహాబాహుర్మహోదధిమ్,
అధిశిశ్యే చ విధివత్ప్రయతోఽత్ర స్థితో మునిః. 9

ప్ర. అ. మహాబాహుః=గొప్పబాహువులుగల, దక్షః=సమర్థుడైన, రామః= రాముడు, అస్యతా=బాణములను విడుచుచున్న ధనస్సుచేత, జ్యాఘాతవిగతత్వచమ్=నారి దెబ్బలచేత పోయిన (కాయలు కాచిన) చర్మ గల, సవ్యమ్=ఎడమదైన, బాహుమ్=బాహువును, మహాపరిఘసంనిభమ్=గొప్ప పరిఘతో సమానమైన, గోసహస్రప్రదాతారమ్=గోవుల సహస్రములను ఇచ్చిన, మహాత్=గొప్పదైన, దక్షిణమ్=కుడిదైన, భుజమ్=భుజమును, ఉపధాయ=తలగడగా పెట్టుకొని, అద్య=ఇప్పుడు, మే=నాకు, సాగరస్య= సముద్రముయొక్క, తరణం వా=దాటుటయైనా, మరణం వా=మరణమైనా (జరగవలెను), ఇతి=అని, ధృతిమ్=ధైర్యమును (నిర్ణయమును), కృత్వా=చేసి, అత్ర=ఇక్కడ, విధివత్=యథాశాస్త్రముగా, ప్రయతః=నియమవంతుడై, మునిః=మునిగా, స్థితః= ఉన్నవాడై, మహోదధిమ్=మహాసముద్రమును, అధిశిశ్యే=అధిష్ఠించి శయనించెను.

తా. సమర్థుడు, మహాబాహువు అయిన రాముడు బాణములు విడుచుచున్న ధనస్సుచేత చర్మమీద కాయలు కాయునట్లు చేయబడిన ఎడమదైన బాహువును, మహాపరిఘతో(కోట గడియతో) సమానము, వేలకొలది గోవులు దానము చేసినది అయిన కుడిభుజమును తలగడగా పెట్టుకొని, "నేను సముద్రమును దాటనైనా దాటవలెను, లేదా మరణించవలెను" అని దృఢముగా సంకల్పించి, యథాశాస్త్రముగా నియమము పాటించుచు, మౌనియై, సముద్రము దగ్గర శయనించెను.

వి. ఈ శ్లోకాల సమన్వయము క్రమపడి కుదర్చ వలసి ఉన్నది. ఇవేవీ ప్రాచ్యపాఠములో లేవని పైన చెప్పినాము. సవ్యముగా బాణములు విడుచుటచే కుడిచేతి చర్మ కాయలు కాసిన దని కొందరు వ్యాఖ్యాతలు చెప్పగా ఒకమారు ఎడమ భుజము, మరొకమారు కుడి భుజము తలగడగా పెట్టుకొనె నని మరికొందరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. మొత్తము చెయ్యికి బాహువు అని పేరు. మోచేతి పైభాగము భుజము. అందుచేత "దక్షిణం బాహుం భుజమ్" అనగా కుడిబాహువుకు చెందిన భుజమును అని అర్థము అని కొందరు వ్యాఖ్యానించిరి. 'అస్యతా' అనుదానికి 'ధనుషా' అధ్యాహారము చేసి "బాణములను విడుచుచున్న ధనస్సుచేత" అని మేము అర్థము చెప్పినాము. ఎడమ చేతిలో ధనస్సు పట్టి ఎడమవైపు బాణములు వదలినప్పుడు నారి దెబ్బ ఎడమచేతికే తగులును గాని కుడిచేతికి తగలదుకదా అని ఇట్లు చెప్పబడినది. ఏమైనా ఉన్నదాని కేదో అర్థము చెప్పడమే ఇది. 7-9

మూ. తస్య రామస్య సుప్తస్య కుశాస్తీర్ణే మహీతలే,
నియమాదప్రమత్తస్య నిశాస్తిస్రోఽతివక్రముః. 10

ప్ర. అ. నియమాత్=నియమమునుండి, అప్రమత్తస్య=ఏమరుపాటు చెందని, తస్య=ఆ, రామస్య=రాముడు, కుశాస్తీర్ణే=దర్భలచేత పరవబడిన, మహీతలే=నేలమీద, సుప్తస్య=నిద్రపోవుచుండగా (శయనించి ఉండగా), తిస్రః=మూడు, నిశాః=రాత్రులు, అతివక్రముః=అతిక్రమించినవి.

తా. నియమమును పాటించుచు రాముడు దర్భలు పరచిన నేలమీద శయనించి ఉండగా మూడు రాత్రులు గడచిపోయినవి. 10

మూ. స త్రిరాత్రోషితస్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః,
ఉపాసత తదా రామః సాగరం సరితాం పతిమ్. 11

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అక్కడ, నయజ్ఞః=నీతిని ఎరిగినవాడు, ధర్మవత్సలః=ధర్మమునందు ఆసక్తి కలవాడు అయిన, రామః=రాముడు, త్రిరాత్రోషితః=మూడు దివసములు ఉన్నవాడై, సరితాం పతిమ్=నదుల భర్తయైన, సాగరమ్=సముద్రమును, ఉపాసత=ఉపాసించెను.

తా. నీతి తెలిసినవాడు, ధర్మమునందు ఆసక్తి కలవాడు అయిన రాముడు అక్కడ మూడు దివసములు శయనించి నదుల భర్తయైన సముద్రుని ఉపాసించెను. 11

మూ. న చ దర్శయతే రూపం మన్దో రామస్య సాగరః,
ప్రయతేనాపి రామేణ యథార్హమభిపూజితః. 12

ప్ర. అ. ప్రయతేన=నియమవంతుడైన, రామేణ=రామునిచేత, యథార్హమ్=యథావిధిగా, అభిపూజితః అపి=పూజింపబడినను, మన్దః=మూఢుడైన, సాగరః=సముద్రుడు, రామస్య=రామునకు, రూపమ్=రూపమును, న చ దర్శయతే=చూపలేదు.

తా. ఆ విధముగా రాముడు నియమవంతుడై యథావిధిగా పూజించినను మూఢుడైన సముద్రుడు అతనికి ప్రత్యక్షము కాలేదు. 12

మూ. సముద్రస్య తతః క్రుద్ధో రామో రక్తాన్తలోచనః,
సమీపస్థమువాచేదం లక్ష్మణం శుభలక్షణమ్. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సముద్రస్య=సముద్రమునకు, క్రుద్ధః=కోపించిన, రక్తాన్తలోచనః=ఎఱ్ఱని కొనలు గల నేత్రములు గల, రామః=రాముడు, సమీపస్థమ్=సమీపమునందున్న, శుభలక్షణమ్=శుభమైన లక్షణములు గల,

లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. సముద్రపు కొనలయందు ఎఱ్ఱగా ఉండు నేత్రములు గల రాముడు సముద్రము మీద కోపించి దగ్గరనే ఉన్న, శుభలక్షణములు గల లక్ష్మణునితో ఇట్లనెను. 13

మూ. అవలేపః సముద్రస్య న దర్శయతి యః స్వయమ్,
ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియవాదితా, 14
అసామర్థ్యఫలా హ్యేతే నిర్గుణేషు సతాం గుణాః.

ప్ర. అ. యః=ఏ సముద్రుడు, స్వయమ్=తాను (తనను), న దర్శయతి= చూపుటలేదో, సముద్రస్య=అట్టి ఈ సముద్రునకు, అవలేపః=ఎంత గర్వము! ప్రశమశ్చ= శాంతి, క్షమా చైవ=ఓర్పు, ఆర్జవమ్=ఋజుత్వము, ప్రియవాదితా=ప్రియముగా మాటలాడుట, ఏతే=ఈ, సతామ్=సత్పురుషులయొక్క, గుణాః=గుణములు, నిర్గుణేషు= గుణములు లేనివారియందు, అసామర్థ్యఫలాః హి=అసామర్థ్యమే ఫలము కలవి కదా ?

తా. ఈ సముద్రము ప్రత్యక్ష మగుట లేదు; ఎంత గర్వము ! సత్పురుషులలో ఉన్న శాంతి, ఓర్పు, ఋజుత్వము, ప్రియముగా మాటలాడుట అను ఈ గుణములను గుణములు లేనివారు సామర్థ్యము లేకపోవుటనుగా పరిగణించుచుందురు. 14

మూ. ఆత్మప్రశంసినం దుష్టం ధృష్టం విపరిధావకమ్, 15
సర్వత్రోత్సృష్టదణ్డం చ లోకః సత్కురుతే నరమ్.

ప్ర. అ. లోకః=లోకము, ఆత్మప్రశంసినమ్=ఆత్మస్తుతిచేసుకొనువాడు, దుష్టమ్= దుష్టుడు, ధృష్టమ్=ధార్ష్ట్యవంతుడు, విపరిధావినమ్=పరుగులెత్తేవాడు, సర్వత్ర= అంతటా, ఉత్సృష్టదణ్డం చ=విడవబడిన (విధించబడిన) దండము కలవాడు అయిన, నరమ్= మానవుణ్ణి, సత్కురుతే=సత్కరించును.

తా. ఈ లోకము, ఆత్మస్తుతి చేసికొనేవాడు, దుష్టుడు, ధార్ష్ట్యము కలవాడు, ఇటూ అటూ పరుగులెత్తేవాడు, అందరిపైన దండప్రయోగము చేసేవాడూ అయిన మానవుణ్ణే సత్కరించును. 15

మూ. న సామ్నా శక్యతే కీర్తిర్న సామ్నా శక్యతే యశః, 16
ప్రాప్తుం లక్ష్మణ లోకేఽస్మిన్ జయో వా రణమూర్ధని.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, సామ్నా= సామముచేత, కీర్తిః=కీర్తి, ప్రాప్తుమ్=పొందుటకు, న శక్యతే=శక్యము

కాదు. యశః=యశస్సు, న=శక్యము కాదు. రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, జయో వా=జయము గాని, న=శక్యము కాదు.

తా. లక్ష్మణా ! ఈ లోకములో సామముచేత కీర్తి గాని, యశస్సు గాని, యుద్ధభూమిలో విజయము గాని పొందక శక్యము కాదు.

వి. దేశాంతరములలో కూడ ఖ్యాతి కీర్తి. స్వదేశమునందు మాత్రమే ఖ్యాతి యశస్సు(తిలకవ్యాఖ్య). 16

మూ. అద్య మద్బాణనిర్భగ్నైర్మకరైర్మకరాలయమ్, 17
నిరుద్ధతోయం సౌమిత్రే ప్లవద్భిః పశ్య సర్వతః.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! అద్య=ఇప్పుడు, మద్బాణనిర్భగ్నైః=నా బాణములచేత బ్రద్దలుకొట్టబడిన, ప్లవద్భిః=తేలుచున్న, మకరైః=మొసళ్లచేత, సర్వతః=అంతటా, నిరుద్ధతోయమ్=అడ్డుకొనబడిన ఉదకము గల, మకరాలయమ్=సముద్రమును, పశ్య=చూడుము.

తా. లక్ష్మణా ! ఈ సముద్రజలమునందు అంతటా నా బాణములచేత ఛేదింపబడిన మొసళ్ళు తేలుచు నీటిని అడ్డుకొనేటట్లు చేసెదను; చూడుము.

మూ. భోగినాం పశ్య భోగాని మయా భిన్నాని లక్ష్మణ, 18
మహాభోగాని మత్స్యానాం కరిణాం చ కరానిహ.

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! మయా=నాచేత, భిన్నాని=బ్రద్దలుకొట్టబడిన, భోగినామ్=సర్పములయొక్క, భోగాని=శరీరములను, మత్స్యానామ్=మత్స్యములయొక్క, మహాభోగాని=గొప్ప శరీరములను, కరిణామ్=ఏనుగులయొక్క, కరాన్=తొండములను, ఇహ=ఇక్కడ, పశ్య=చూడుము.

తా. లక్ష్మణా ! ఈ సముద్రములోని సర్పముల శరీరములను, మత్స్యముల విశాలములైన దేహములను, నీటి ఏనుగుల తొండములను ఖండించివేసెదను; చూడుము. 18

మూ. సశఙ్ఖశుక్తికాజాలం సమీనమకరం తథా, 19
అద్య యుద్ధేన మహతా సముద్రం పరిశోషయే.

ప్ర. అ. సశఙ్ఖశుక్తికాజాలమ్=శంఖములతోను ముత్యపుచిప్పల సముదాయముతోను కూడిన, తథా=మరియు, సమీనమకరమ్=చేపలతోను మొసళ్ళతోను కూడిన, సముద్రమ్=సముద్రమును, అద్య=ఇప్పుడు, మహతా=గొప్పదైన, యుద్ధేన=యుద్ధముచేత, పరిశోషయే=ఎండించెదను.

తా. శంఖములతో, ముత్యపుచిప్పలతో, మీనములతో, మకరములతో

నిండిన ఈ సముద్రమును వీటి అన్నింటితో సహా, మహాయుద్ధములో ఎండింపచేసెదను. 19

మూ. క్షమయా హి సమాయుక్తం మామయం మకరాలయః, 20
అసమర్థం విజానాతి ధిక్ క్షమామీదృశే జనే.

ప్ర. అ. క్షమయా=ఓర్పుతో, సమాయుక్తమ్=కూడిన, మామ్=నన్ను, అయమ్=ఈ, మకరాలయః=సముద్రుడు, అసమర్థమ్=అసమర్థునిగా, విజానాతి=తెలుసుకొనుచున్నాడు. ఈదృశే=ఇట్టి, జనే=జనుని విషయమునందు, క్షమామ్=ఓర్పును గూర్చి, ధిక్=నింద అగుగాక.

తా. ఓర్పు గల నన్ను చూచి ఈ సముద్రుడు అసమర్థుడని అనుకొనుచున్నాడు. ఇట్టివాని విషయమునందు ఓర్పు చూపించుట ఎంత తప్పు! 20

మూ. న దర్శయతి సామ్నా మే సాగరో రూపమాత్మనః, 21
చాపమానయ సౌమిత్రే శరాంశ్చాశీవిషోపమాన్,
సముద్రం శోషయిష్యామి పద్భ్యాం యాన్తు ప్లవఙ్గమాః. 22

ప్ర. అ. సాగరః=సముద్రుడు, సామ్నా=సామోపాయముచేత, మే=నాకు, ఆత్మానమ్=తనను, న దర్శయతి=చూపుటలేదు. సౌమిత్రే=లక్ష్మణా! చాపమ్=ధనస్సును, ఆశీవిషోపమాన్=సర్పములవంటి, శరాంశ్చ=బాణములను, ఆనయ=తీసికొనిరమ్ము, సముద్రమ్=ఈ సముద్రుని, శోషయిష్యామి=ఎండింపచేసెదను. ప్లవఙ్గమాః=వానరులు, పద్భ్యామ్=పాదములచేత, యాన్తు=వెళ్లెదరు గాక.

తా. ఈ సముద్రుడు బ్రతిమాలుచున్న నాకు ప్రత్యక్ష మగుటలేదు. లక్ష్మణా! ధనస్సునూ, సర్పములవంటి బాణములనూ తీసికొనిరమ్ము. ఈ సముద్రమును ఎండింపచేసెదను. వానరులు నడచి దాటగలరు. 21, 22

మూ. అద్యాక్షోభ్యమపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరమ్,
వేలాసు కృతమర్యాదం సహస్రోర్మిసమాకులమ్. 23
నిర్మర్యాదం కరిష్యామి సాయకైర్వరుణాలయమ్,
మహార్ణవం క్షోభయిష్యే మహాదానవసంకులమ్. 24

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన నేను, అద్య=ఇప్పుడు, అక్షోభ్యమపి=క్షోభింప శక్యము కానిదైనను, సాగరమ్=సముద్రమును, క్షోభయిష్యామి=క్షోభింపచేసెదను. వేలాసు=తీరములయందు, కృతమర్యాదమ్=చేయబడిన కట్టుబాటుకలది, సహస్రోర్మి సమాకులమ్=వేలకొలది తరంగములచేత వ్యాకులము అయిన, వరుణాలయమ్=ఈ

సముద్రమును, నిర్మర్యాదమ్=సరిహద్దులు లేనిదానినిగా, సాయకైః=బాణముల చేత, కరిష్యామి=చేయుగలను. మహాదానవసంకులమ్=గొప్ప దానవులతో వ్యాప్తమైన, మహార్ణవమ్=మహాసముద్రమును, క్షోభయిష్యే=క్షోభపెట్టెదను.

తా. ఇపుడు కోపించిన నేను క్షోభింప శక్యముకానిదైనను ఈ సముద్రమును క్షోభింపచేసెదను. తీరములయందు కట్టుబాటును పాటించుచు తీరమును దాటకుండా ఉన్న, వేలకొలది తరంగములతో వ్యాకులమైన ఈ సముద్రమును బాణములచే తీరమును దాటునట్లు చేసెదను. మహాదానవులతో నిండిన ఈ మహార్ణవమును క్షోభింపచేసెదను. 23, 24

మూ. ఏవముక్త్వా ధనుష్పాణిః క్రోధవిస్ఫారితేక్షణః,
బభూవ రామో దుర్ధర్షో యుగాన్తాగ్నిరివ జ్వలన్. 25

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు గల, క్రోధవిస్ఫారితేక్షణః=క్రోధముచేత, పెద్దవిగా చేయబడిన నేత్రములు గల, రామః=రాముడు, జ్వలన్=ప్రజ్వలించుచున్న, యుగాన్తాగ్నిరివ=ప్రళయకాలాగ్ని వలె, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానివాడు, బభూవ=అయెను.

తా. రాముడు ఇట్లు పలికి, ధనస్సు చేతిలో ధరించి, క్రోధముచేత, కండ్లు పెద్దవి చేసి, ప్రజ్వలించుచున్న ప్రళయకాలాగ్ని వలె చూడ శక్యము కానివాడై ఉండెను. 25

మూ. సంపీడ్య చ ధనుర్ఘోరం కమ్పయిత్వా శరైర్జగత్,
ముమోచ విశిఖానుగ్రాన్వజ్రాణివ శతక్రతుః. 26

ప్ర. అ. ఘోరమ్=భయంకరమైన, ధనుః=ధనస్సును, సంపీడ్య చ=పీడించి, శరైః=బాణములచేత, జగత్=జగత్తును, కమ్పయిత్వా=కంపింపచేసి, శతక్రతుః=దేవేంద్రుడు, వజ్రాణివ=వజ్రములను వలె, ఉగ్రాన్=ఉగ్రములైన, విశిఖాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. భయంకరమైన ధనస్సును దృఢముగా పట్టుకొని, బాణములచేత జగత్తును కంపింపచేయుచు, దేవేంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించినట్లు ఉగ్రములైన బాణములను ప్రయోగించెను. 26

మూ. తే జ్వలన్తో మహావేగాస్తేజసా సాయకోత్తమాః,
ప్రవిశన్తి సముద్రస్య సలిలం త్రస్తపన్నగమ్. 27

ప్ర. అ. తేజసా=తేజస్సుచేత, జ్వలన్తః=ప్రజ్వలించుచున్న, మహావేగాః=గొప్ప వేగము గల, తే=ఆ, సాయకోత్తమాః=శ్రేష్ఠమైన బాణములు,

విత్రస్తపన్నగమ్=భయపడుచున్న సర్పములు కలుగునట్లుగా, సముద్రస్య=సముద్రముయొక్క, జలమ్=జలమును, ప్రవిశన్=ప్రవేశించుచున్నవి.

తా. తేజస్సుతో మండుచున్న, మహావేగము గల ఆ శ్రేష్ఠమైన బాణములు సర్పములు భయపడునట్లుగా సముద్రజలములోనికి ప్రవేశించినవి. 27

మూ. తోయవేగః సముద్రస్య సమీనమకరో మహాన్,
స బభూవ మహాఘోరః సమారుతరవస్తథా. 28

ప్ర. అ. సముద్రస్య=సముద్రముయొక్క, సమీనమకరః=మీనములతోను, మకరములతోను కూడిన, తథా=మరియు, సమారుతరవః=వాయుధ్వనితో కూడిన, మహాన్=గొప్పదైన, సః=ఆ, తోయవేగః=జలవేగము, మహాఘోరః=చాల ఘోరముగా, బభూవ=ఆయెను.

తా. అప్పుడు మీనముల ధ్వనితోను, మకరముల ధ్వనితోను, వాయుధ్వనితోను కూడి ఆ సముద్రజలవేగము చాల భయంకరముగా ఉండెను.

మూ. మహోర్మిజాలచలితః శఙ్ఖజాలసమావృతః,
సధూమః పరివృత్తోర్మిః సహసాసీన్మహోదధిః. 29

ప్ర. అ. సహసా=వెంటనే, మహోదధిః=మహాసముద్రము, మహోర్మిజాలచలితః=గొప్ప తరంగముల సముదాయముచేత చలించినదిగాను, శఙ్ఖజాలసమావృతః=శంఖముల సముదాయముచేత కప్పబడినదిగాను, సధూమః=ధూమముతో కూడినదిగాను, పరివృత్తోర్మిః=దొర్లుచున్న తరంగములు కలదిగాను, ఆసీత్=ఆయెను.

తా. వెంటనే ఆ సముద్రమునందు పెద్ద పెద్ద తరంగములు వెడలెను. సముద్రమంతా శంఖములు చెదరుచుండెను. తరంగములు దొరిగి పోవుచుండెను. ధూమము వెడలెను. 29

మూ. వ్యథితాః పన్నగాశ్చాసన్ దీప్తాస్యా దీప్తలోచనాః,
దానవాశ్చ మహావీర్యాః పాతాలతలవాసినః. 30

ప్ర. అ. దీప్తాస్యాః=ప్రజ్వలించుచున్న ముఖములు గలవి, దీప్తలోచనాః=ప్రజ్వలించుచున్న నేత్రములు కలవి అయిన, పన్నగాః=సర్పములు, పాతాలతలవాసినః=పాతాళమునందు నివసించు, మహావీర్యాః=గొప్ప పరాక్రమము గల, దానవాశ్చ=దానవులు, వ్యథితాః=వ్యథచెందినవి, ఆసన్=అయినవి.

తా. ప్రజ్వలించుచున్న ముఖములు, నేత్రములు గల సర్పములు,

గొప్ప పరాక్రమము గల పాతాళమునందు నివసించు దానవులు వ్యథ చెందెను.
30

మూ. ఊర్మయః సిన్ధురాజస్య సనక్రమకరాస్తథా,
విన్ధ్యమన్దరసంకాశాః సముత్పేతుః సహస్రశః. 31

ప్ర. అ. తథా=మరియు, సిన్ధురాజస్య=సముద్రముయొక్క, సనక్రమకరాః=చిన్న మొసళ్లతోను, పెద్ద మొసళ్లతోను కూడిన, విన్ధ్యమన్దరసంకాశాః=వింధ్య పర్వతముతోను, మందరపర్వతముతోను సమానములైన, ఊర్మయః=తరంగములు, సహస్రశః=వేలకొలది, సముత్పేతుః=ఎగిరినవి.

తా. వింధ్యపర్వతము వలె మందరపర్వతము వలె పెద్దవైన వేలకొలది తరంగములు నక్రములతోను, మకరములతోను, సముద్రమునుండి పైకి ఎగిరినవి.

మూ. ఆఘూర్ణితతరఙ్గౌఘః సంభ్రాన్తోరగరాక్షసః,
ఉద్వర్తితమహాగ్రాహః సఘోషో వరుణాలయః. 32

ప్ర. అ. ఆఘూర్ణితతరఙ్గౌఘః=త్రిప్పివేయబడిన తరంగసమురాయము కలది, సంభ్రాన్తోరగరాక్షసః=భయపడిన ఉరగులు, రాక్షసులు కలది, ఉద్వర్తితమహాగ్రాహః=త్రిప్పివేయబడిన గొప్ప మొసళ్లు గలది అయిన, వరుణాలయః=సముద్రము, సఘోషః=ఘోషముతో కూడినది అయ్యెను.

తా. మహాధ్వనితో నిండిన ఆ సముద్రములో తరంగసముదాయములు తిరిగి పోయెను. ఉరగులు, రాక్షసులు భయపడిరి. పెద్ద జలజంతువులు క్రిందికి మీదికి తిరిగిపోవుచుండెను. 32

మూ. తతస్తు తం రాఘవ ముగ్రవేగం
ప్రకర్షమాణం ధనురప్రమేయమ్,
సౌమిత్రిరుత్పత్య వినిఃశ్వసన్తం
మామేతి చోక్త్వా ధనురాలలమ్బే. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఉత్పత్య=ఎగిరి (శీఘ్రముగా వెళ్లి), ఉగ్రవేగమ్=ఉగ్రమైన వేగము గలవాడు, అప్రమేయమ్=సాటిలేని, ధనుః=ధనస్సును, ప్రకర్షమాణమ్=లాగుచున్నవాడు, వినిఃశ్వసన్తమ్=నిట్టూర్పుచున్న వాడు అయిన, రాఘవమ్=రాముని గూర్చి, మా మా ఇతి=వద్దు వద్దు అని, ఉక్త్వా=పలికి, ధనుః=ధనస్సును, ఆలలమ్బే=పట్టుకొనెను.

తా. అప్పుడు లక్ష్మణుడు శీఘ్రముగా వెళ్లి, ఉగ్రమైన వేగము గల కోపముతో నిట్టూర్పుచు సాటిలేని ధనస్సును లాగుచున్న రామునితో "వద్దు

"వద్దు" అని పలుకుచు ఆ ధనస్సును పట్టుకొనెను. 33

మూ. ఏతద్వినాపి హ్యుదధేస్తవార్య
సంపత్స్యతే వీరతమస్య కార్యమ్,
భవద్విధాః క్రోధవశం న యాన్తి
దీర్ఘం భవాన్పశ్యతు సాధువృత్తమ్. 34

ప్ర. అ. ఉదధేః=సముద్రముయొక్క, ఏతత్ వినా అపి=వినాశనము లేకపోయినను, ఆర్య=ఇప్పుడు, వీరతమస్య=మహావీరుడవైన, తవ=నీయొక్క, కార్యమ్=కార్యము, సంపత్స్యతే=సంపన్నముకాగలదు. భవద్విధాః= నీవంటివాళ్లు, క్రోధవశమ్=కోపవశమును, న యాన్తి=పొందరు. భవాన్=నీవు, దీర్ఘమ్=దీర్ఘమైన, సాధువృత్తమ్=సత్పురుషుల చరితమును, పశ్యతు=చూచెదవుగాక.

తా. ఈ విధముగా సముద్రమును నశింపచేయకపోయినను మహావీరుడవైన నీ కార్యము ఇప్పుడు సిద్ధింపచేసికొనవచ్చును. నీవంటివాళ్లు క్రోధముకు వశులు కారు కదా. అతిప్రాచీనకాలమునుంచీ వచ్చుచున్న సత్పురుషుల ప్రవృత్తిని నీవు దృష్టిలో ఉంచుకొనుము. 34

మూ. అన్తర్హితైశ్చాపి తథాన్తరిక్షే
బ్రహ్మర్షిభిశ్చైవ సురర్షిభిశ్చ,
శబ్దః కృతః కష్టమితి బ్రువద్భి
ర్మా మేతి చోక్త్వా మహతా స్వరేణ. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకవింశః సర్గః

ప్ర. అ. అన్తరిక్షే=ఆకాశమునందు, అన్తర్హితైః=అంతర్ధానము చెందిన, కష్టమ్ ఇతి=కష్టము అని, బ్రువద్భిః=పలుకుచున్న, బ్రహ్మర్షిభిశ్చైవ=బ్రహ్మర్షులచేతను, సురర్షిభిశ్చ=దేవర్షులచేతను, మహతా=గొప్ప, స్వరేణ=స్వరముచేత, మా మా ఇతి="వద్దు వద్దు" అని, ఉక్త్వా=పలికి, శబ్దః=శబ్దము, కృతః=చేయబడినది.

తా. బ్రహ్మర్షులు, దేవర్షులు ఆకాశములో అంతర్హితులై ఉండి, "వద్దు వద్దు"అని గట్టిగా అరచుచు, "ఎంత కష్టము" అని పలికిరి.

వి. గోవిందరాజవ్యాఖ్యానుసారము ఈ చివరి రెండు శ్లోకాలు ప్రక్షిప్తములు. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరవైయొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వావింశః సర్గః

[సముద్రుని అనుమతిచేత నీలుడు నూరుయోజనముల సేతువును నిర్మింపగా రాముడు సైన్యసహితుడై సముద్రము దాటి అక్కడ సేనను నిలుపుట.]

మూ. అథోవాచ రఘుశ్రేష్ఠః సాగరం దారుణం వచః,
అద్య త్వాం శోషయిష్యామి సపాతాలం మహార్ణవ. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రఘుశ్రేష్ఠః=రాముడు, సాగరమ్=సముద్రమును గూర్చి, దారుణమ్=దారుణమైన, వచః=వచనమును, ఉవాచ=పలికెను. మహార్ణవ=ఓ ! సముద్రమా ! అద్య=ఇప్పుడు, సపాతాలమ్=పాతాళముతో కూడిన, త్వామ్=నిన్ను, శోషయిష్యామి=ఎండింపచేసెదను.

తా. పిమ్మట రాముడు సముద్రముతో భయంకరమైన మాటను పలికెను. "సముద్రమా ! పాతాళముతో సహా నిన్ను ఇప్పుడు ఎండింపజేసెదను."

మూ. శరనిర్దగ్ధతోయస్య పరిశుష్కస్య సాగర,
మయా నిహతసత్త్వస్య పాంసురుత్పద్యతే మహాన్. 2

ప్ర. అ. సాగర=సముద్రమా ! మయా=నాచేత, శరనిర్దగ్ధతోయస్య=బాణము చేత కాల్చబడిన ఉదకము గల, పరిశుష్కస్య=ఎండిపోయిన, నిహతసత్త్వస్య=చంపబడిన జంతువులు గల నీయొక్క, మహాన్=గొప్పదైన, పాంసుః=పరాగము, ఉత్పద్యతే=పుట్టును.

తా. సముద్రమా ! నేను బాణములచేత నీ ఉదకమును కాల్చివేసి జంతువులను చంపివేసెదను. అప్పుడు నీనుండి గొప్ప పరాగము బయలుదేరును.

మూ. మత్కార్ముకవిసృష్టేన శరవర్షేణ సాగర,
పరం తీరం గమిష్యన్తి పద్భిరేవ ప్లవఙ్గమాః. 3

ప్ర. అ. సాగర=ఓ ! సముద్రుడా ! మత్కార్ముకవిసృష్టేన=నా ధనస్సుచేత విడువబడిన, శరవర్షేణ=బాణవర్షముచేత, ప్లవఙ్గమాః=వానరులు, పద్భిరేవ=పాదములచేతనే, పరం తీరమ్=అవతలి ఒడ్డును గూర్చి, గమిష్యన్తి=వెళ్లగలరు.

తా. సముద్రుడా ! నేను ధనస్సు నుండి బాణవర్షము కురిపించెదను. వానరులు దాని సాహాయ్యముతో కాలినడకనే అవతలి ఒడ్డుకు వెళ్లగలరు.

మూ. విచిన్వన్నాభిజానాసి పౌరుషం వాపి విక్రమమ్,
దానవాలయ సంతాపం మత్తో నామ గమిష్యసి. 4

ప్ర. అ. దానవాలయ=దానవులకు నివాసస్థానమైన ఓ ! సముద్రుడా ! విచిన్వన్=అన్వేషించుచున్నవాడనై, పౌరుషమ్=పౌరుషమును, నాభిజా నాసి=గుర్తించుటలేదు. విక్రమమపి=పరాక్రమమునుకూడ, న=గుర్తించుటలేదు. మత్తః=నావలన, సంతాపమ్=సంతాపమును, గమిష్యసి హాస=పొందగలవు.

తా. సముద్రుడా ! నీవు పరిశీలించి కూడ నా పౌరుషమును, పరాక్రమమును గుర్తింపజాలకున్నావు. నావలన ఇప్పుడు సంతాపము పొందగలవు.

మూ. బ్రాహ్మేణాస్త్రేణ సంయోజ్య బ్రహ్మదణ్డనిభం శరమ్,
సంయోజ్య ధనుషి శ్రేష్ఠే విచకర్ష మహాబలః. 5

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల రాముడు, బ్రహ్మదణ్డనిభమ్=బ్రహ్మదండముతో సమానమైన, శరమ్=బాణమును, బ్రాహ్మేణ అస్త్రేణ=బ్రహ్మాస్త్రముతో, సంయోజ్య=కూర్చి, శ్రేష్ఠే=శ్రేష్ఠమైన, ధనుషి=ధనస్సునందు, సంయోజ్య=చేర్చి, విచకర్ష=లాగెను.

తా. మహాబలశాలియైన రాముడు బ్రహ్మదండము వలె ఉన్న బాణముపై బ్రహ్మాస్త్రమును కూర్చి, దానిని శ్రేష్ఠమైన ధనస్సుమీద సంధించి లాగెను. 5

మూ. తస్మిన్వికృష్టే సహసా రాఘవేణ శరాసనే,
రోదసీ సంపఫాలేవ పర్వతాశ్చ చకమ్పిరే. 6

ప్ర. అ. తస్మిన్=ఆ, శరాసనే=ధనస్సు, రాఘవేణ=రామునిచేత, వికృష్టే=లాగబడిన దగుచుండగా, సహసా=వెంటనే, రోదసీ=భూమ్యాకాశములు, సంపఫాలేవ=బ్రద్దలైనట్లు అయ్యెను. పర్వతాశ్చ=పర్వతములు కూడ, చకమ్పిరే=కంపించినవి.

తా. రాము డా ధనస్సును లాగగానే వెంటనే భూమ్యాకాశములు బ్రద్దలైనట్లు ఆయెను. పర్వతములు కంపించెను. 6

మూ. తమశ్చ లోకమావవ్రే దిశశ్చ న చకాశిరే,
ప్రతిచుక్షుభిరే చాశు సరాంసి సరితస్తదా. 7

ప్ర. అ. తదా=అప్పుడు, తమశ్చ=చీకటి, లోకమ్=లోకమును, ఆవవ్రే=కప్పెను. దిశశ్చ=దిక్కులు, న చకాశిరే=ప్రకాశించలేదు. సరాంసి=సరస్సులు, సరితః=నదులు, ఆశు=వెంటనే, ప్రతిచుక్షుభిరే=క్షోభ చెందినవి.

తా. లోక మంతా చీకటి కమ్మెను. దిక్కులు ప్రకాశించలేదు. సరస్సులు, నదులు క్షోభించెను. 7

మూ. తిర్యక్ చ సహ నక్షత్రైః సంగతౌ చన్ద్రభాస్కరౌ,
భాస్కరాంశుభిరాదీప్తం తమసా చ సమావృతమ్. 8
ప్రచకాశే తదాకాశముల్కాశతవిదీపితమ్,
అన్తరిక్షాచ్చ నిర్ఘాతా నిర్జగ్మురతులస్వనాః. 9

ప్ర. అ. చన్ద్రభాస్కరౌ=చంద్రసూర్యులు, నక్షత్రైః సహ=నక్షత్రములతో కూడ, తిర్యక్=అడ్డముగా, సంగతౌ=కలిసిరి. భాస్కరాంశుభిః=సూర్యుని కిరణములచేత, ఆదీప్తమ్=కొంచెము ప్రకాశింపచేయబడిన, తమసా చ=చీకటిచేత కూడ, సమావృతమ్=కప్పబడిన, తత్=ఆ, ఆకాశమ్=ఆకాశము, ఉల్కాశత విదీపితమ్=వందలకొలది ఉల్కలచేత (తోకచుక్కలచేత)మండింపచేయబడినదై, ప్రచకాశే=ప్రకాశించెను. అన్తరిక్షాత్=ఆకాశమునుండి, అతులస్వనాః=సాటి లేని ధ్వని గల, నిర్ఘాతాః=వాయుసంఘర్షములు, నిర్జగ్ముః=బయలుదేరినవి.

తా. చంద్రసూర్యులు నక్షత్రములు గమనము తప్పి, అడ్డముగా నడచుచు కలిసెను. ఆకాశము సూర్యకిరణములచేత కొంచెమే ప్రకాశింపచేయబడినదై, అధికముగా తమస్సుచే ఆవరింపబడి, మండుచున్న వందలకొలది ఉల్కలతో ప్రకాశించెను. ఆకాశమునుండి పెద్ద ధ్వనితో వాయుసంఘర్షములు బయలుదేరెను.

వి. శిరస్సు దగ్గర పెద్దదిగా ఉండి క్రమక్రమంగా తోక వలె సన్నముగా ఏర్పడే అగ్నిపిండానికి 'ఉల్క' అని పేరు. గాలి గాలితో సంఘర్షము చెందగా ఏర్పడు తీవ్రమైన అధికమైన ధ్వని "నిర్ఘాతము." 8, 9

మూ. వవుః ప్రకర్షేణ వవుర్దివ్యమారుతపఙ్క్తయః,
బభఞ్జ చ తదా వృక్షాన్ జలదానుద్వహన్ ముహుః. 10

ప్ర. అ. దివ్యమారుతపఙ్క్తయః=దివ్యములైన (ఆకాశమునందున్న), వాయుపంక్తులు, వవుః ప్రకర్షేణ=శరీరాధిక్యముతో, వవుః=వీచినవి. తదా=అప్పుడు, (వాయువు) జలదాన్=మేఘములను, ఉద్వహన్=వహించుచు, ముహుః=మాటి మాటికి, వృక్షాన్=వృక్షములను, బభఞ్జ చ=విరచెను.

తా. అప్పుడు ఆకాశము పైభాగమునందు ఒకదానిపై ఒకటి చొప్పున ఉండే పరివాహము మొదలైన ఏడు వాయుస్కంధములు చాల వేగముతో వీచినవి. ఆ సమయమునందు వాయువు మేఘములను చిమ్మివేయుచు వృక్షములను విరుగగొట్టెను. 10

మూ. ఆరుజంశ్చైవ శైలాగ్రాన్ శిఖరాణి బభఞ్జ చ,
దివి చ స్మ మహావేగాః సంహతాః సమహాస్వనాః. 11
ముముచుర్వైద్యుతానగ్నీంస్తే మహాశనయస్తదా.

ప్ర. అ. (వాయువు) శైలాగ్రాన్=పర్వతాగ్రములను, అరుజన్ చ=పీడించుచు, శిఖరాణి=శిఖరములను, బభఞ్జ చ=విరచెను. మహావేగాః=మహావేగము గల వాయువులు, దివి=ఆకాశమునందు, సంహతాః=కలిసినవై, సమహాస్వనాః=గొప్ప ధ్వనితో కూడినవై, వైద్యుతాన్=విద్యుత్తుకు సంబంధించిన, అగ్నీన్=అగ్నులను, ముముచుః=విడచినవి. తదా=అప్పుడు, తే=ఆ వైద్యుతాగ్నులు, మహాశనయః=గొప్ప పిడుగులుగా అయినవి.

తా. వాయువు శైలాగ్రములను పీడించుచు శిఖరములను విరచెను. మహావేగము గల వాయువులు ఆకాశమునందు కలిసినవై గొప్ప ధ్వనితో కూడి విద్యుత్తుకు సంబంధించిన అగ్నులను విడచెను. ఆ అగ్నులు పిడుగులుగా మారెను. 11

మూ. యాని భూతాని దృశ్యాని చక్రుశుస్త్వాశనేః సమమ్, 12
అదృశ్యాని చ భూతాని ముముచుర్భైరవస్వనమ్,
శిశ్యిరే చాభిభూతాని సంత్రస్తాన్యుద్విజన్తి చ, 13
సంప్రవివ్యథిరే చాపి న చ పస్పన్దిరే భయాత్.

ప్ర. అ. దృశ్యాని=కనబడు, యాని=ఏ, భూతాని=ప్రాణులు గలవో అవి, అశనేః సమమ్=పిడుగుకు సమముగా, చుక్రుశుః=అరచినవి. అదృశ్యాని=కనబడని, భూతాని చ=భూతములు కూడ, భైరవస్వనమ్=భయంకరధ్వనిని, ముముచుః=విడచినవి. అభిభూతాని=తిరస్కరింపబడినవై, సంత్రస్తాని=భయపడినవై, ఉద్విజన్తి చ=దుఃఖించుచు, శిశ్యిరే చ=శయనించినవి. సంప్రవివ్యథిరే చాపి=ఎక్కువ వ్యథ నెందినవి. భయాత్=భయమువలన, న చ పస్పన్దిరే=కదలలేదు.

తా. కంటికి కనబడే ప్రాణులు పిడుగుంతో పాటు బిగ్గరగా అరచెను. కనబడని పిశాచాదులు కూడ భయంకరమైన ధ్వని చేసెను. (ప్రాణులు) పిడుగుంచేత పీడింపబడి భయముతో, ఉద్వేగముతో పండుకొనెను. చాల వ్యథ నెంది భయమువలన కదలకుండ పడి ఉండెను. 12, 13

మూ. సహభూతైః సతోయోర్మిః సనాగః సహరాక్షసః, 14
సహసాభూత్తతో వేగాద్భీమవేగో మహోదధిః,
యోజనం వ్యతిచక్రామ వేలామన్యత్ర సంప్లవాత్. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సతోయోర్మిః=ఉదకముతోను తరంగములతోను కూడిన, సహభూతైః=ప్రాణులతో కూడిన, సనాగః=నాగములతోకూడిన, సహరాక్షసః=రాక్షసులతో కూడిన, మహోదధిః=మహాసముద్రము, సహసా=శీఘ్రముగా, భీమవేగః=భయంకరమైన వేగము గలది, అభూత్=అయెను. వేగాత్=వేగమువలన,

సంప్లవాత్=జలమునిండుటవలన, అన్యత్ర=మరియొకవైపున, వేలామ్=(సముద్ర) తీరమును, యోజనమ్=యోజనదూరము, వ్యతిచక్రామ=దాటెను.

తా. అప్పుడు జలముతోను, తరంగములతోను నిండినది, ప్రాణులతోను, నాగములతోను, రాక్షసులతోను కూడినది అయిన మహాసముద్రము హఠాత్తుగా భయంకరవేగము గలదిగా అయి, ఆ వేగముచేత పిడు ముంచెత్తుకొని రాగా అవతలి వైపున ఉన్న తీరమును యోజనము దూరము దాటెను. రాముడు యున్న వైపునుండి ఒక యోజనము లోపలికి పోయెను. 14, 15

మూ. తం తథా సమతిక్రాన్తం నాతిచక్రామ రాఘవః,
సముద్ధతమమిత్రఘ్నో రామో నదనదీపతిమ్. 16

ప్ర. అ. రాఘవః=రఘువంశసంజాతుడైన, అమిత్రఘ్నః=శత్రుసంహారకుడైన, రామః=రాముడు, తథా=అట్లు, సమతిక్రాన్తమ్=దూరముగా వెళ్లిన, సముద్ధతమ్= ఉద్ధతుడైన, తమ్=ఆ, నదనదీపతిమ్=సముద్రమును, నాతిచక్రామ=అతిక్రమించలేదు. (పారిపోవుచున్న వానిపై బాణప్రయోగము చేయుట అను ధర్మాతిక్రమమును చేయలేదు.)

తా. రఘువంశసంజాతుడు, శత్రువినాశకుడు అయిన రాముడు ఆ విధముగా దూరమునకు తొలగిన ఆ దృప్తుడైన సముద్రుని విషయమున బాణప్రయోగము చేసి ధర్మాతిక్రమము చేయలేదు. 16

మూ. తతో మధ్యాత్సముద్రస్య సాగరః స్వయముత్థితః,
ఉదయం హి మహాశైలాన్మేరోరివ దివాకరః. 17

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహామేరోః=మహామేరుపర్వతము నుండి, ఉదయం= ఉదయమును గూర్చి, దివాకరః ఇవ=సూర్యుడు వలె, సాగరః=సముద్రుడు, సముద్రస్య= సముద్రముయొక్క, మధ్యాత్=మధ్యనుండి, స్వయమ్=స్వయముగా, ఉత్థితః=లేచినాడు.

తా. అప్పుడు సముద్రమునుండి సముద్రుడు, మేరుపర్వతము నుండి సూర్యుడు ఉదయించినట్లు స్వయముగా ఆవిర్భవించెను. 17

మూ. పన్నగైః సహ దీప్తాస్యైః సముద్రః ప్రత్యదృశ్యత,
స్నిగ్ధవైడూర్యసంకాశో జామ్బూనదవిభూషణః. 18

ప్ర. అ. స్నిగ్ధవైడూర్యసంకాశః=మన్నని వైడూర్యమాణిక్యముతో సమానుడు, జామ్బూనదవిభూషణః=బంగారు అలంకారములు కలవాడు అయిన, సముద్రః=సముద్రుడు, దీప్తాస్యైః=ప్రజ్వలించుచున్న ముఖములు గల, పన్నగైః

సహ=సర్పములతోకూడ, ప్రత్యదృశ్యత=కనబడెను.

తా. సన్నగా ఉన్న వైడూర్యమణి వలె ఉన్న ఆ సముద్రుడు బంగారు అలంకారములు ధరించి, మండుచున్న ముఖములు గల సర్పములతో కలిసి వచ్చి కనబడెను. 18

మూ. రత్నమాల్యాంబరధరః పద్మపత్రనిభేక్షణః,
సర్వపుష్పమయీం దివ్యాం శిరసా ధారయన్ స్రజమ్. 19
జాతరూపమయైశ్చైవ తపనీయవిభూషణైః,
ఆత్మజానాం చ రత్నానాం భూషితో భూషణోత్తమైః. 20
ధాతుభిర్మణ్డితః శైలో వివిధైర్హిమవానివ,
ఏకావలీమధ్యగతం తరలం పాణ్డరప్రభమ్ 21
విపులేనోరసా బిభ్రత్కౌస్తుభస్య సహోదరమ్,
ఆఘూర్ణితతరఙ్గౌఘః కాలికానిలసంకులః. 22
గఙ్గాసిన్ధుప్రధానాభిరాపగాభిః సమావృతః,
దేవతానాం సరూపాభిర్నానారూపాభిరీశ్వరః. 23
సాగరః సముపక్రమ్య పూర్వమామన్త్ర్య వీర్యవాన్,
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యం రాఘవం శరపాణినమ్. 24

ప్ర. అ. రత్న మాల్యాంబరధరః=రత్నమాలలను, రత్నములు పొదిగిన వస్త్రమును ధరించినవాడు, పద్మపత్రనిభేక్షణః=పద్మపత్రములతో సమానమైన నేత్రములు గలవాడు, శిరసా=శిరస్సుచేత, సర్వపుష్పమయీమ్=సమస్తపుష్పవికారమైన, దివ్యామ్=దివ్యమైన, స్రజమ్=మాలను, ధారయన్=ధరించుచున్నవాడు, జాతరూపమయైశ్చైవ=బంగారువికారములైన, తపనీయవిభూషణైః=బంగారుఅలంకారములచేతను, ఆత్మజానామ్=తననుండి పుట్టిన, రత్నానామ్=రత్నములయొక్క, భూషణోత్తమైః=శ్రేష్ఠమైన భూషణములచేతను, భూషితః=అలంకరింపబడినవాడు, వివిధైః=అనేకవిధములైన, ధాతుభిః=ధాతువులచేత, మణ్డితః=అలంకరింపబడిన, హిమవాన్ శైలః ఇవ=హిమత్పర్వతము వలె ఉన్నవాడు, ఏకావలీమధ్యగతమ్=ఒంటిపేటగొలుసు మధ్యయందున్న, పాణ్డరప్రభమ్=తెల్లని కాంతి గల, కౌస్తుభస్య సహోదరమ్=కౌస్తుభమునకు సహోదరుడైన, తరలమ్= మధ్యమణిని, విపులేన=విశాలమైన, ఉరసా=వక్షస్థలముచేత, బిభ్రత్=ధరించుచున్నవాడు, ఆఘూర్ణితతరఙ్గౌఘః=తిరుగునట్లు చేయబడిన తరంగసముదాయము గలవాడు, కాలికానిలసంకులః=మేఘవాయువుచేత వ్యాకులుడు, దేవతానామ్=దేవతలకు, సరూపాభిః=సమానరూపము గల, నానారూపాభిః=అనేకవిధములైన రూపములుగల, గఙ్గాసిన్ధుప్రధానాభిః=గంగ, సింధువది ప్రధానముగా గల, ఆపగాభిః=నదులతో,

సమావృతః=కూడినవాడు, ఈశ్వరః=నదుల ప్రభువు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, సాగరః=సముద్రుడు, సముపక్రమ్య=సమీపించి, పూర్వమ్=ముందుగా, ఆమన్త్ర్య=రామా! అని పిలిచి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, శరపాణినమ్=బాణము హస్తమునందు గల, రాఘవమ్=రాముని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పద్మము రేకుల వంటి నేత్రములు గల ఆ సముద్రుడు రత్నహారములు, రత్నములు పొదిగిన వస్త్రములు ధరించి శిరస్సుపై అన్ని పువ్వులు (లేదా పూర్తిగా పువ్వులతోనే) కుచ్చిన మాలను అలంకరించుకొనెను. బంగారముతో చేసిన అలంకారములు, మెరుగు బంగారము అమర్చిన అలంకారములు, తనలోనే పుట్టిన రత్నములతో కూడిన అలంకారములు ధరించి అనేకవిధములైన ధాతువులతో అలంకరింపబడిన హిమవత్పర్వతము వలె ఉండెను. ఏకావలిమధ్యము నందున్న కౌస్తుభమణికి జతయైన తెల్లని మణిని విశాలమైన వక్షస్థలముపై ధరించెను. సముద్రుడు లేచివచ్చునప్పుడు సముద్రము మేఘవాయువులచేత వ్యాకులమై ఉండెను. తరంగములు క్రిందికి మీదికి ఎగురుచుండెను. దేవతాస్త్రీలతో సమానమైన వివిధరూపములు ధరించి గంగాసింధునదులు మొదలైన నదులు అతని వెనుక వచ్చిరి. అట్టి సముద్రుడు అంజలి ఘటించి రామా! అని పిలుచుచు, ధనస్సు ధరించి ఉన్న రామునితో ఇట్లు పలికెను. 19-24

మూ. పృథివీ వాయురాకాశమాపో జ్యోతిశ్చ రాఘవ, 25
స్వభావే సౌమ్య తిష్ఠన్తి శాశ్వతం మార్గమాశ్రితాః.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడవైన, రాఘవ=రామా! పృథివీ=భూమి, వాయుః=వాయువు, ఆకాశమ్=ఆకాశము, ఆపః=జలము, జ్యోతిశ్చ=అగ్ని, శాశ్వతమ్=శాశ్వతమైన, మార్గమ్=మార్గమును, ఆశ్రితాః=ఆశ్రయించినవై, స్వభావే=స్వభావమునందు, తిష్ఠన్తి=ఉండును.

తా. సౌమ్యుడవైన రామా! భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని ఇవి శాశ్వతమైన మార్గమును అనుసరించి తమకు ఏది స్వభావమో దానిని దాటకుండా ఉండును. 25

మూ. తత్స్వభావో మమాప్యేష యదగాధోఽహమప్లవః,
వికారస్తు భవేద్గాధ ఏతత్తే ప్రవదామ్యహమ్. 26

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, అహమ్=నేను, అగాధః=చాల లోతైనవాడను, అప్లవః ఇతి యత్=దాట శక్యముకానివాడను అనునది ఏది గలదో, ఏషః=ఇది, మమాపి=నాయొక్క, స్వభావః=స్వభావము. గాధః తు=లోతులేనివాడనగుట యైతే, వికారః=వికారము, భవేత్=అగును. ఏతత్=దీనిని, తే=నీకు,

ప్రవదామి=చెప్పుచున్నాను.

తా. నేను లోతుగా దాటశక్యము కాకుండ ఉండుట అనేది నా స్వభావము. లోతు లేనివాడ నైనచో అది నా స్వభావమునకు విరుద్ధము. ఈ విషయమును నీకు చెప్పుచున్నాను; వినుము. 26

మూ. న కామాన్న చ లోభాద్వా న భయాత్పార్థివాత్మజ,
రాగాన్నక్రాకులజలం స్తమ్భయేయం కథంచన. 27

ప్ర. అ. పార్థివాత్మజ=రాజకుమారా ! నక్రాకులజలమ్=మొసళ్లతో వ్యాకులమైన జలమును, కామాత్=కామమువలన, కథంచన=ఏ విధముగాను, న స్తమ్భయేయమ్= స్తంభింపచేయను. లోభాద్వా=లోభమువలన గాని, స్తంభింప చేయను. భయాత్=భయమువలన, న=స్తంభింపచేయను. రాగాత్=ప్రేమవలన కూడ స్తంభింపచేయను.

తా. రాజకుమారా ! మొసళ్లతో వ్యాకులముగా ఉండు జలమును నేనెన్నడూ ఏదైన కోరికవలన గాని, లోభమువలన గాని, భయమువలన గాని, ప్రేమవలన గాని స్తంభింపచేయను. 27

ము. విధాస్యే యేన గన్తాసి విషహిష్యే హ్యహం తథా,
న గ్రాహా విధమిష్యన్తి యావత్సేనా తరిష్యతి, 28
హరీణాం తరణే రామ కరిష్యామి యథా స్థలమ్.

ప్ర. అ. రామ=రామా ! అహమ్=నేను, యేన=దేనిచేత, గన్తాసి=వెళ్లగలవో, తథా=అట్లు, విధాస్యే=చేసెదను. హరీణామ్=వానరులయొక్క, తరణే= దాటుటయందు, స్థలమ్=స్థలమును, యథా=ఎట్లు, కరిష్యామి=చేసెదనో, తథా= అట్లు, విషహిష్యే=సహించగలను. సేనా=సేన, యావత్=ఎంతవరకు, తరిష్యతి= దాటునో అంతవరకు, గ్రాహాః=మొసళ్లు, న విధమిష్యన్తి=కొట్టవు.

తా. రామా ! నీవు దాటుటకు వీలగునట్లుగా ఏర్పాటు చేసెదను. వానరులు దాటుటకు నేను స్థలమును ఏర్పరచి సహించి ఉందును. సేన దాటువరకు జలజంతువులు అపకారము చేయకుండునట్లు చేసెదను. 28

మూ. తమబ్రవీత్తదా రామః శృణు మే వరుణాలయ, 29
అమోఘోఽయం మహాబాణః కస్మిన్ దేశే నిపాత్యతామ్.

ప్ర. అ. తదా=అప్పుడు, రామః=రాముడు, తమ్=ఆ సముద్రుని గూర్చి, అబ్రవీత్=పలికెను. వరుణాలయ=సముద్రమా ! మే=నాకు, శృణు=వినుము. అమోఘః=వ్యర్థముకాని, అయమ్=ఈ, మహాబాణః=గొప్పబాణము, కస్మిన్= ఏ, దేశే=దేశమునందు, నిపాత్యతామ్=పడవేయబడుగాక.

తా. అప్పుడు రాముడు అతనితో ఇట్లు పలికెను. "సముద్రుడా ! నేను చెప్పు మాట వినుము. నా ఈ బాణము వ్యర్థ మగుటకు వీలులేదు. దీనిని ఎక్కడ ప్రయోగింతును ?". 29

మూ. రామస్య వచనం శ్రుత్వా తం చ దృష్ట్వా మహాశరమ్, 30
మహోదధిర్మహావేలా రాఘవం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. మహావేలః=గొప్ప వేలమ్ము గల, మహోదధిః=మహాసముద్రము, రామస్య= రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తమ్=ఆ, మహాశరమ్= గొప్పబాణమును, దృష్ట్వ చ=చూచి, రాఘవమ్=రాముని గూర్చి, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప వేలమ్ము గల ఆ సముద్రుడు రాముని మాటలు విని, ఆ గొప్పదైన బాణమును కూడ చూచి రామునితో ఇట్లు పలికెను. 30

మూ. ఉత్తరేణావకాశోఽస్తి కశ్చిత్పుణ్యతరో మమ, 31
ద్రుమకుల్య ఇతి ఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్.

ప్ర. అ. భవాన్=నీవు, యథా=ఎట్లు, లోకే=లోకమునందు, ఖ్యాతః= ప్రసిద్ధుడవో అట్లే, ద్రుమకుల్యః ఇతి=ద్రుమకుల్యము అని, ఖ్యాతః=ప్రసిద్ధమైన, పుణ్యతరః=మిక్కిలి పవిత్రమైన, కశ్చిత్=ఒక, అవకాశః=ప్రదేశము, మమ=నాకు, ఉత్తరేణ=ఉత్తరముగా, అస్తి=ఉన్నది.

తా. నాకు ఉత్తరముగా ఒక పవిత్రమైన స్థానమున్నది. నీవు లోకములో ప్రసిద్ధి పొందిన వట్లు అది "ద్రుమకుల్యము" అని ప్రసిద్ధము. 31

మూ. ఉగ్రదర్శనకర్మాణో బహవస్తత్ర దస్యవః,
ఆభీరప్రముఖాః పాపాః పిబన్తి సలిలం మమ. 32

ప్ర. అ. తత్ర=అక్కడ, ఉగ్రదర్శనకర్మాణః=ఉగ్రమైన దర్శనము కర్మలు గల, పాపాః=పాపాత్ములైన, ఆభీరప్రముఖాః=ఆభీరులు మొదలైన, బహవః=అనేకులు, దస్యవః= దస్యువులు, మమ=నాయొక్క, సలిలమ్=ఉదకమును, పిబన్తి త్రాగుచున్నారు.

తా. అక్కడ చూచుటకు భయంకరులు, ఉగ్రమైన పనులు చేయువారు, పాపాత్ములు అయిన ఆభీరులు మొదలైన దస్యువులు నా జలము త్రాగుచున్నారు.

మూ. తైర్న తత్స్పర్శనం పాపం సహేయం పాపకర్మభిః 33
అమోఘః క్రియతాం రామ తత్ర తేషు శరోత్తమః.

ప్ర. అ. రామ=రామా ! పాపకర్మభిః=పాపకర్మ గల, తైః=ఆ, పాపైః=

పాపాత్ములచేత, తత్=ఆ, స్పర్శనమ్=స్పర్శనమును, న సహేయమ్=సహింపను. శరోత్తమః=ఈ బాణశ్రేష్ఠము, తత్ర=అక్కడ, తేషు=వాళ్లయందు, అమోఘః=వ్యర్థము కానిదిగా, క్రియతామ్=చేయబడుగాక.

తా. రామా ! పాపాత్ములైన వాళ్లు చేసే ఆ పాపమైన స్పర్శను సహించలేకున్నాను. ఈ శ్రేష్ఠమైన బాణమును ఆ ప్రదేశమున, వాళ్ల మీద ప్రయోగించి అమోఘ మగునట్లు చేయుము. 33

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సాగరస్య మహాత్మనః, 34
ముమోచ తం శరం దీప్తం పరం సాగరదర్శనాత్.

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య సాగరస్య=ఆ సముద్రునియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, సాగరదర్శనాత్=సాగరముయొక్క చూపుటవలన, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, పరమ్=శ్రేష్ఠమైన, తం శరమ్=ఆ బాణమును, ముమోచ=విడచెను.

తా. రాముడు మహాత్ముడైన ఆ సముద్రుని మాటలు విని, ఆ సముద్రుడు వ్రేలితో చూపగా, ప్రజ్వలించుచున్న శ్రేష్ఠమైన ఆ బాణమును విడచెను. 34

మూ. తేన తన్మరుకాన్తారం పృథివ్యాం కిల విశ్రుతమ్, 35
నిపాతితః శరో యత్ర వజ్రాశనిసమప్రభః.

ప్ర. అ. తేన=ఆ రామునిచేత, వజ్రాశనిసమప్రభః=వజ్రముతోను, పిడుగుతోను సమానమైన కాంతి గల, శరః=బాణము, యత్ర=ఎచ్చట, నిపాతితః=పడవేయబడినదో, తత్=అది, పృథివ్యామ్=భూమియందు, మరుకాన్తారమ్=మరుకాంతారముగా, (ఎడారియైన అడవిగా) విశ్రుతం కిల=ప్రసిద్ధమైనది.

తా. రాముడు వజ్రముతోను, పిడుగుతోను సమానమైన కాంతి గల ఆ బాణమును ప్రయోగించిన స్థానము, భూమియందు (అంతకు పూర్వము) మరుకాంతార మను పేరుతో ప్రసిద్ధిచెందినది.. 35

మూ. ననాద చ తదా తత్ర వసుధా శల్యపీడితా, 36
తస్మాద్వ్రణముఖాత్తోయముత్పపాత రసాతలాత్.

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అక్కడ, శల్యపీడితా=బాణశల్యము చేత పీడించబడిన, వసుధా=భూమి, ననాద=ధ్వనిచేసెను. తస్మాత్=ఆ, బాణముఖాత్=బాణముయొక్క ముఖమునుండి, రసాతలాత్=పాతాళమునుండి, తోయమ్=జలము, ఉత్పపాత=పైకి ఎగిరెను.

తా. రాముడు ప్రయోగించిన బాణము అగ్రభాగముచేత పీడించబడిన

భూమినుండి గొప్ప ధ్వని బయలుదేరెను. బాణము ఛేదించిన ఆ ప్రదేశమునందు పాతాళమునుండి జలము పైకి ఎగిరి వచ్చెను. 36

మూ. స బభూవ తదా కూపో వ్రణ ఇత్యేవ విశ్రుతః, 37
సతతం చోత్థితం తోయం సముద్రస్యేవ దృశ్యతే.

ప్ర. అ. తదా=అప్పుడు, సః=ఆ, కూపః=కూపము, వ్రణ ఇత్యేవ=వ్రణము అని, విశ్రుతః=ప్రసిద్ధము, బభూవ=అయెను. సముద్రస్యేవ=సముద్రముయొక్క జలము వలె, తోయమ్=జలము, సతతమ్=ఎల్లప్పుడు, ఉత్థితమ్=పైకి లేచుచున్నట్లు, దృశ్యతే= చూడబడుచున్నది .

తా. అప్పుడు ఏర్పడిన ఆ కూపమునకు వ్రణము అని ప్రసిద్ధి కలిగెను. దానినుండి సముద్రమునుండి వలె, జలము అవిచ్ఛిన్నముగా వచ్చుచుండును.37

మూ. అవదారణశబ్దశ్చ దారుణః సమపద్యత, 38
తస్మాత్తద్బాణపాతేన అపః కుక్షిష్వశోషయత్.

ప్ర. అ. తస్మాత్=ఆ ప్రదేశమునుండి, దారుణః=భయంకరమైన, అవదారణశబ్దః= చీల్చుటవలన కలిగిన ధ్వని, సమపద్యత=పుట్టెను. (రాముడు) తద్బాణపాతేన=ఆ బాణమును ప్రయోగించుటవేళ, కుక్షిషు=జలస్థానములయందు, అపః=ఉదకమును, అశోషయత్=ఎండింపచేసెను.

తా. ఆ ప్రదేశమునందు బాణము పడి చీల్చుటవలన గొప్ప ధ్వని కలిగెను. రాముడు ఈ విధముగా బాణమును ప్రయోగించి అక్కడ ఆ దస్యులు ఉపయోగించిన కూపతటాకాదులలోని ఉదకము ఎండిపోవు నట్లు చేసెను. 38

మూ. విఖ్యాతం త్రిషు లోకేషు మరుకాన్తారమేవ చ, 39
శోషయిత్వా తు తం కుక్షిం రామో దశరథాత్మజః,
వరం తస్మై దదౌ విద్వాన్మరవేఽమరవిక్రమః. 40

ప్ర. అ. మరుకాన్తారమ్=మరుకాంతారము, త్రిషు=మూడు, లోకేషు= లోకములయందు, విఖ్యాతమ్=ప్రసిద్ధమైనది. దశరథాత్మజః=దశరథకుమారుడు, విద్వాన్= పండితుడు, అమరవిక్రమః=దేవతలవంటి పరాక్రమము కలవాడు అయిన, రామః=రాముడు, తమ్=ఆ, కుక్షిమ్=కుక్షిని, శోషయిత్వా=ఎండింపచేసి, తస్మై మరవే=ఆ మరుకాంతారమునకు, వరమ్=వరమును, దదౌ=ఇచ్చెను .

తా. ఆ మరుకాంతారము మూడు లోకములలో ప్రసిద్ధి చెందెను. దశరథకుమారుడు, విద్వాంసుడు, దేవతలవంటి పరాక్రమము గలవాడు అయిన

రాముడు అక్కడ ఉన్న కూపతటాకాదులను ఎండింపజేసి ఆ మరుకాంతారమునకు వర మిచ్చెను. 39,40

మూ. పశవ్యశ్చాల్పరోగశ్చ ఫలమూలరసాయుతః,
బహుస్నేహో బహుక్షీరః సుగన్ధిర్వివిధౌషధిః. 41
ఏవమేతైర్గుణైర్యుక్తో బహుభిః సంయుతో మరుః,
రామస్య వరదానాచ్చ శివః పన్థా బభూవ హ. 42

ప్ర. అ. మరుః=ఆ మరుకాంతారము, రామస్య=రామునియొక్క, వరదానాత్= వరదానమువలన, పశవ్యశ్చ=పశువులకు అనుకూలముగాను, అల్ప రోగశ్చ=అల్పమైన రోగములు గలదిగను, ఫలమూలరసాయుతః=ఫలములతోను, మూలములతోను, రసములతోను కూడినది గాను, బహుస్నేహః=అధికమైన నెయ్యి గలదిగాను, బహుక్షీరః=అధికమైన క్షీరము గలదిగాను, సుగన్ధిః= మంచి గంధముగల దిగాను, వివిధౌషధిః=అనేకవిధములైన ఓషధులు గలదిగాను (అయ్యెను). ఏవమ్= ఈ విధముగా, యుక్తః=తగినదై, ఏతైః=ఈ, గుణైః=గుణములతో, సంయుతః= కూడినదై, శివః=మంగళకరమైన, పన్థాః=మార్గముగా, బభూవ=ఆయెను.

తా. రాముడు వరము నిచ్చుటచేత ఆ మరుకాంతారము పశువులు నివసించుటకు యోగ్యము అయ్యెను. అక్కడ రోగములు నశించెను. ఫలములు, మూలములు, రసము (తేనె), నెయ్యి, పాలు సమృద్ధిగా లభించెను. ఆ ప్రదేశమంతా అనేకవిధములైన ఓషధులతో సువాసనలు నిండి ఉండెను. ఈ విధముగ అనేకములైన ఉత్తమలక్షణములతో ఆ మరుప్రదేశము మంగళకరమైన మార్గముగా ఏర్పడెను. 41,42

మూ. తస్మిన్ దగ్ధే తదా కుక్షౌ సముద్రః సరితాం పతిః,
రాఘవం సర్వశాస్త్రజ్ఞమిదం వచనమబ్రవీత్. 43

ప్ర. అ. తదా=అప్పుడు, తస్మిన్=ఆ, కుక్షౌ=కుక్షి, దగ్ధే= కాల్చ బడినదగుచుండగా, సరితాం పతిః=నదుల భర్తయైన, సముద్రః=సముద్రము, సర్వశాస్త్రజ్ఞమ్=సకల శాస్త్రములు తెలిసిన, రాఘవమ్=రాముని గూర్చి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు ఆ కుక్షి దగ్ధమైన పిమ్మట నదీపతియైన సముద్రుడు సర్వశాస్త్రములు తెలిసిన రామునితో ఇట్లు పలికెను. 43

మూ. అయం సౌమ్య నలో నామ తనయో విశ్వకర్మణః,
పిత్రా దత్తవరః శ్రీమాన్ ప్రతిమో విశ్వకర్మణః. 44

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! శ్రీమాన్=శ్రీమంతుడైన, నలో

నామ=నలుడను పేరు గల, అయమ్=ఇతడు, విశ్వకర్మణః=విశ్వకర్మయొక్క, తనయః=పుత్రుడు. పిత్రా= తండ్రిచేత, దత్తవరః=ఇవ్వబడిన వరము గలవాడు. విశ్వకర్మణః=విశ్వకర్మకు, ప్రతిమః= సమానుడు.

తా. ఓ ! సౌమ్యుడా ! ఈ నలుడు విశ్వకర్మ కుమారుడు. శ్రీమంతుడైన ఇతనికి తండ్రి వరములు ఇచ్చి ఉన్నాడు. ఇతడు విశ్వకర్మతో సమానుడు44

మూ. ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః,
తమహం ధారయిష్యామి యథా హ్యేష పితా తథా. 45

ప్ర. అ. మహోత్సాహః=గొప్ప ఉత్సాహము గల, ఏషః వానరః=ఈ వానరుడు, మయి=నాయందు, సేతుమ్=సేతువును, కరోతు=చేయుగాక. తమ్=దానిని, అహమ్=నేను, ధారయిష్యామి=ధరించెదను. పితా=తండ్రి, యథా=ఎట్లో, ఏషః=ఇతడు, తథా=అట్లే.

తా. మహోత్సాహవంతుడైన ఈ వానరుడు నామీద సేతువును నిర్మించుగాక. నేను దానిని ధరించెదను. నాకు ఇతని తండ్రి ఎంతో ఇతడు కూడ అంతే. 45

మూ. ఏవముక్త్వోదధిర్నష్టః సముత్థాయ నలస్తదా,
అబ్రవీద్వానరశ్రేష్ఠో వాక్యం రామం మహాబలమ్. 46

ప్ర. అ. ఉదధిః=సముద్రుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, నష్టః= అంతర్ధానము చెందెను. తదా=అప్పుడు, వానరశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన, నలః=నలుడు, సముత్థాయ= లేచి, మహాబలమ్=గొప్ప బలము గల, రామమ్=రాముని గూర్చి, వాక్యమ్= వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సముద్రుడు ఇట్లు పలికి అంతర్ధానము చెందెను. అప్పుడు వానరశ్రేష్ఠుడైన నలుడు లేచి మహాబలశాలియైన రామునితో ఇట్లు పలికెను.46

మూ. అహం సేతుం కరిష్యామి విస్తీర్ణే మకరాలయే,
పితుః సామర్థ్యమాస్థాయ తత్త్వమాహ మహోదధిః. 47

ప్ర. అ. అహమ్=నేను, పితుః=తండ్రియొక్క, సామర్థ్యమ్=సామర్థ్యమును, ఆస్థితః=అవలంబించినవాడనై, విస్తీర్ణే=విస్తీర్ణమైన, మకరాలయే=సముద్రమునందు, సేతుమ్=సేతువును, కరిష్యామి=చేయగలను. మహోదధిః=మహాసముద్రము, తత్త్వమ్=యథార్థమును, ఆహ=చెప్పెను.

తా. సముద్రుడు చెప్పినది నిజమే. నేను నా తండ్రి సామర్థ్యముచేత (ఆశీర్బలముచేత) విశాలమైన ఈ సముద్రముమీద సేతువును నిర్మించెదను.47

మూ. అసౌ తు సాగరో భీమః సేతుకర్మదిదృక్షయా,
దదౌ దణ్డభయాద్గాధం రాఘవాయ మహోదధిః. 48

ప్ర. అ. భీమః=భయంకరమైన, అసౌ=ఈ, సాగరః= సగరపుత్రులచేత వృద్ధిపొందింపబడిన, మహోదధిః=మహాసముద్రము, దణ్డభయాత్= దండభయమువలననే, సేతుకర్మదిదృక్షయా=సేతుకర్మను చూడవలెనను ఇచ్ఛచేత, రాఘవాయ=రామునకు, గాధమ్=మేరకను (లోతులేకపోవుటను) దదౌ=ఇచ్చెను.

తా. భయంకరమైన మహాసముద్రుడు, సగరపుత్రులచేత వృద్ధిపొందింపబడినను, కృతజ్ఞతాభావము లేక, దండమువలన భయముచేత సేతువును చూడదలచి రామునకు లోతు లేకపోవుటను చూపినాడు. 48

మూ. మమ మాతుర్వరో దత్తో మన్దరే విశ్వకర్మణా,
మయా తు సదృశః పుత్రస్తవ దేవి భవిష్యతి. 49

ప్ర. అ. మన్దరే=మందరపర్వతమునందు, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, దేవి=దేవీ! తవ=నీకు, మయా=నాతో, సదృశః=సమానుడైన, పుత్రః=పుత్రుడు, భవిష్యతి=పుట్టగలడు అని, మమ మాతుః=నా తల్లికి, వరః=వరము, దత్తః= ఇవ్వబడినది.

తా. విశ్వకర్మ పూర్వము మందరపర్వతముమీద నా తల్లికి - "ఓ ! దేవీ ! నీకు నాతో సమానుడైన పుత్రుడు పుట్టును" అని వరము ఇచ్చెను.49

మూ. ఔరసస్తస్య పుత్రోఽహం సదృశో విశ్వకర్మణా,
స్మారితోఽస్మ్యహమేతేన తత్త్వమాహ మహోదధిః, 50
న చాప్యహమనుక్తో వః ప్రబ్రూయామాత్మనో గుణాన్.

ప్ర. అ. అహమ్=నేను, తస్య=ఆ విశ్వకర్మయొక్క, ఔరసః పుత్రః=ఔరసపుత్రుడను. విశ్వకర్మణా=విశ్వకర్మతో, సదృశః=సమానుడను. ఏతేన=ఈ సముద్రునిచేత, స్మారితః అస్మి=గుర్తుచేయబడితిని. మహోదధిః=మహాసముద్రుడు, తత్త్వమ్= యథార్థమును, ఆహ=పలికెను. అనుక్తః=అడుగబడని వాడనై, అహమ్=నేను, ఆత్మనః=నాయొక్క, గుణాన్=గుణములను, వః=మీకు, న ప్రబ్రూయామ్=చెప్పను.

తా. నేను విశ్వకర్మ ఔరసపుత్రుడను. అతనితో సమానుడను. ఈ సముద్రుడు చెప్పగా స్మరణమునకు వచ్చినది. ఇతడు చెప్పినది యథార్థమే. మీరు అడుగకుండగా చెప్పుట మంచిది కాదని నా గుణములను గూర్చి చెప్పుకొనలేదు.

వి. "స్మారితో – మహోదధిః" అను పాదము గోవిందరాజుల పాఠములో లేదు. లేకపోవుటయే యుక్తము. 50

మూ. సమర్థశ్చాప్యహం సేతుం కర్తుం వై వరుణాలయే, 51
తస్మాదద్యైవ బధ్నన్తు సేతుం వానరపుఙ్గవాః.

ప్ర. అ. అహమ్=నేను, వరుణాలయే=సముద్రమునందు, సేతుమ్=సేతువును, కర్తుమ్=చేయుటకు, సమర్థశ్చాపి=సమర్థుడను. తస్మాత్=ఆ కారణమువలన, వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, అద్యైవ=ఇప్పుడే, సేతుమ్=సేతువును, బధ్నన్తు=కట్టెదరుగాక.

తా. సముద్రముమీద సేతువును కట్టు సామర్థ్యము నాకున్నది. అందుచేత వానరవీరు లందరు ఇప్పుడే సేతువును కట్టుటకు ప్రయత్నము ప్రారంభించెదరుగాక. 51

మూ. తతో విసృష్టా రామేణ సర్వతో హరిపుఙ్గవాః, 52
అభ్యుత్పేతుర్మహారణ్యం హృష్టాః శతసహస్రశః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రామేణ=రామునిచేత, విసృష్టాః=పంపబడిన, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, హృష్టాః=సంతోషించినవారై, శతసహస్రశః=వందల కొలది వేలకొలది, మహారణ్యమ్=మహారణ్యమును గూర్చి, సర్వతః=అన్ని వైపులా, అభ్యుత్పేతుః= ఎగిరిరి.

తా. అప్పుడు రాముడు పంపగా వందలకొలది వేలకొలది వానరవీరులు సంతోషించుచు అన్ని వైపులనుండి మహారణ్యమువైపు ఎగిరి వెళ్లిరి. 52

మూ. తే నగాన్నగసంకాశాః శాఖామృగగణర్షభాః, 53
బభఞ్జుః పాదపాంస్తత్ర ప్రచకర్షుశ్చ సాగరమ్.

ప్ర. అ. నగసంకాశాః=పర్వతములం వంటి, తే=ఆ, శాఖామృగగణర్షభాః=వానరసేనానాయకులు, తత్ర=అక్కడ, నగాన్=పర్వతములను, పాదపాన్=వృక్షములను, బభఞ్జుః=విరచిరి. సాగరమ్=సముద్రమును గూర్చి, ప్రచకర్షుశ్చ=లాగిరి.

తా. పర్వతములవంటి దేహములు గల ఆ వానరసేనానాయకులు పర్వతములను, వృక్షములను విరచి, వాటిని సముద్రము దగ్గరకు లాగికొనివచ్చిరి.

మూ. తే సాలైశ్చాశ్వకర్ణైశ్చ ధవైర్వంశైశ్చ వానరాః, 54
కుటజైరర్జునైస్తాలై స్తిలకైస్తినిశై రపి,
బిల్వకైః సప్తపర్ణైశ్చ కర్ణికారైశ్చ పుష్పితైః, 55
చూతైశ్చాశోకవృక్షైశ్చ సాగరం సమపూరయన్.

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, సాలైశ్చ=సాలవృక్షములచేతను, అశ్వకర్ణైశ్చ=మద్దిచెట్లచేతను, ధవైః=ధవవృక్షములచేతను, వంశైశ్చ=వెదుళ్ళచేతను, కుటజైః=కుటజవృక్షముల చేతను, అర్జునైః=అర్జునవృక్షములచేతను, తాలైః=తాటిచెట్లచేతను, తిలకైః=తిలకవృక్షములచేతను, తిమిశైరపి=తిమిశవృక్షములచేతను, బిల్వైః=మారేడు చెట్లచేతను, సప్తపర్ణైశ్చ=ఏడాకుల అరటిచెట్ల చేతను, పుష్పితైః=పుష్పించిన, కర్ణికారైః=కర్ణికారవృక్షములచేతను, చూతైశ్చ=మామిడిచెట్లచేతను, అశోకవృక్షైశ్చ=అశోకవృక్షముల చేతను, సాగరమ్=సముద్రమును, సమపూరయన్=నింపిరి.

తా. ఆ వానరులు సాల - అశ్వకర్ణ - ధవవృక్షములచేత, వెదుళ్లచేత, కుటజ - అర్జున - తాల - తిలక - తిమిశవృక్షములచేత, మారేడు చెట్లచేత, ఏడాకుల అరటిచెట్లచేత, పుష్పించిన కర్ణికారవృక్షములచేత, చూతవృక్షములచేత, అశోక వృక్షములచేత సముద్రమును నింపివేసిరి. 54, 55

మూ. సమూలాంశ్చ విమూలాంశ్చ పాదపాన్ హరిసత్తమాః,
ఇన్ద్రకేతూనివోద్యమ్య ప్రజహ్రుర్వానరాస్తరూన్. 56

ప్ర. అ. హరిసత్తమాః=వానరులలో శ్రేష్ఠులైన, వానరాః=వానరులు, సమూలాన్ చ=మొదళ్ళతో కూడినవి, విమూలాన్ చ=మొదళ్లు లేనివి అయిన, పాదపాన్=వృక్షములను, ఇన్ద్రకేతూనివ=ఇంద్రధ్వజములను వలె, ఉద్యమ్య=ఎత్తి, ప్రజహ్రుః=తీసికొనివెళ్ళిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు కొన్ని చెట్లను మొదళ్లతో సహాను, మరికొన్నింటిని మొదళ్లు లేకుండగాను, ఇంద్రధ్వజములను వలె పైకి ఎత్తి తీసికొనివెళ్లిరి. 56

మూ. తాలాన్ దాడిమగుల్మాంశ్చ నారికేలవిభీతకాన్, 57
కరీరాన్ బకులాన్నిమ్బాన్ సమాజహ్రురితస్తతః.

ప్ర. అ. తాలాన్=తాటిచెట్లను, దాడిమగుల్మాంశ్చ=దానిమ్మచెట్ల పొదలను, నారికేలవిభీతకాన్=కొబ్బరిచెట్లను, విభీతకవృక్షములను, కరీరాన్=కరీరవృక్షములను, బకులాన్=పొగడచెట్లను, నిమ్బాన్=వేపచెట్లను, ఇతస్తతః=ఇక్కడినుండి అక్కడినుండి, సమాజహ్రుః=తీసికొనివచ్చిరి.

తా. వాళ్లు ఆ యా ప్రాంతములనుండి తాటి చెట్లు, పొదలవలె ఉన్న దానిమ్మ చెట్లు, కొబ్బరి చెట్లు, విభీతకవృక్షములు, కరీర - వకుల - వేపవృక్షములు తీసికొనివచ్చిరి. 57

మూ. హస్తిమాత్రాన్ మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః, 58
పర్వతాంశ్చ సముత్పాట్య యన్త్రైః పరివహన్తి చ.

ప్ర. అ. మహాకాయాః=పెద్ద శరీరములు గలవారు, మహాబలాః=గొప్ప బలము గలవారు అయిన ఆ వానరులు, హస్తిమాత్రాన్=ఏనుగంత ప్రమాణము గల, పాషాణాన్=రాళ్లను, పర్వతాంశ్చ=పర్వతములను, సముత్పాట్య=పీకి, యన్త్రైః=యంత్రములచేత, పరివహన్తి చ=మోయుచున్నారు.

తా. పెద్ద శరీరములు, గొప్ప బలము గల ఆ వానరులు ఏనుగంత ప్రమాణము గల రాళ్లను, పర్వతములను పెకలించి, యంత్రములద్వారా తీసికొని వచ్చిరి. 58

మూ. ప్రక్షిప్యమాణైరచలైః సహసా జలముద్ధృతమ్, 59
సముత్పపాత చాకాశమపాసర్పత్తతః పునః.

ప్ర. అ. సహసా=హటాత్తుగా, ప్రక్షిప్యమాణైః=విసరబడుచున్న, అచలైః=పర్వతములచేత, ఉద్ధృతమ్=ఎగరగొట్టబడిన, జలమ్=జలము, ఆకాశమ్=ఆకాశమునుగూర్చి, సముత్పపాత=వ్యాపించెను. తతః=అక్కడినుండి, పునః=మరల, అపాసర్పత్=వ్యాపించెను.

తా. పర్వతములను హటాత్తుగా పడవేయుటచే లేచిన నీరు ఆకాశమునకు వ్యాపించి మరల అక్కడినుండి ఇటు అటు వ్యాపించెను. 59

మూ. సముద్రం క్షోభయామాసుర్నిపతన్తః సమన్తతః, 60
సూత్రాణ్యన్యే ప్రగృహ్ణన్తి హ్యాయతం శతయోజనమ్.

ప్ర. అ. సమన్తతః=అన్నివైపులా, నిపతన్తః=పడుచున్న పర్వతములు, సముద్రమ్=సముద్రమును, క్షోభయామాసుః=క్షోభపెట్టినవి. అన్యే=మరికొందరు, శతయోజనమ్=నూరు యోజనములు, ఆయతమ్=పొడవుగా, సూత్రాణి=దారములను, ప్రగృహ్ణన్తి=పట్టుచున్నారు.

తా. అన్ని వైపులా పడుచున్న ఆ పర్వతములు సముద్రమును క్షోభింపచేసినవి. కొందరు నూరు యోజనముల దూరము కూడ కొలత దారములను పట్టుకొనుచుండిరి. 60

మూ. నలశ్చక్రే మహాసేతుం మధ్యే నదనదీపతేః, 61
స తదా క్రియతే సేతుర్వానరైర్ఘోరకర్మభిః.

ప్ర. అ. నలః=నలుడు, నదనదీపతేః=నదములకు నదులకు భర్తయైన సముద్రముయొక్క, మధ్యే=మధ్యయందు, మహాసేతుమ్=గొప్ప సేతువును, చక్రే=చేసెను. తదా=అప్పుడు, ఘోరకర్మభిః=ఘోరమైన కర్మ గల, వానరైః=వానరులచేత, సేతుః=సేతువు, క్రియతే=చేయబడుచున్నది.

తా. నలుడు సముద్రమధ్యమునందు గొప్ప సేతువును కట్టెను. అప్పుడు భయంకరమైన కర్మలు చేయు వానరులు సేతువును నిర్మించిరి. 61

మూ. దణ్డానన్యే ప్రగృహ్ణన్తి విచిన్వన్తి తథాపరే, 62
వానరైః శతశస్తత్ర రామస్యాజ్ఞాపురఃసరైః,
మేఘాభైః పర్వతాభైశ్చ తృణైః కాష్ఠైర్బబన్ధిరే. 63

ప్ర. అ. అన్యే=కొందరు వానరులు, దణ్డాన్=దండములను, ప్రగృహ్ణన్తి=గ్రహించుచున్నారు. తథా=మరియు, అపరే=మరికొందరు, విచిన్వన్తి=శిలాదులను ప్రోగుచేయుచున్నారు. రామస్య=రామునియొక్క, ఆజ్ఞాపురఃసరైః=ఆజ్ఞ పురఃసరముగా గల, శతశః=వందలకొలది, మేఘాభైః=మేఘమువంటి కాంతి గల, పర్వతాభైశ్చ=పర్వతమువంటి కాంతి గల, వానరైః=వానరులచేత, తృణైః=తృణములచేత, కాష్ఠైశ్చ=కఱ్ఱలచేత, (సేతుభాగములు) బబన్ధిరే=కట్టబడినవి.

తా. కొందరు వానరులు సూత్రములు కట్టిన దండములను పట్టుకొనుచుండిరి. కొందరు రాళ్లు మొదలైనవాటిని ఏరుచుండిరి. మేఘముల వలె, పర్వతముల వలె ఉన్న వందలకొలది వానరులు రాముని ఆజ్ఞను అనుసరించుచు తృణములచేత, కఱ్ఱలచేత సేతువుకు సంబంధించిన కొన్ని భాగములను కట్టుచుండిరి. 62,63

మూ. పుష్పితాగ్రైశ్చ తరుభిః సేతుం బధ్నన్తి వానరాః,
పాషాణాంశ్చ గిరిప్రఖ్యాన్ గిరీణాం శిఖరాణి చ. 64
దృశ్యన్తే పరిధావన్తో గృహ్య దానవసంనిభాః.

ప్ర. అ. వానరాః=వానరులు, పుష్పితాగ్రైః=పుష్పించిన అగ్రభాగములు గల, తరుభిః=వృక్షములచేత, సేతుమ్=సేతువును, బధ్నన్తి=కట్టుచుండిరి. దానవసంనిభాః=దానవులతో సమానులైన కొందరు, గిరిప్రఖ్యాన్=పర్వతములవంటి, పాషాణాంశ్చ=రాళ్లను, గిరీణామ్=పర్వతములయొక్క, శిఖరాణి చ=శిఖరములను, గృహ్య=గ్రహించి, పరిధావన్తః=పరుగెత్తుచున్నవారై, దృశ్యన్తే=కనబడుచుండిరి.

తా. వానరులు, పుష్పించిన అగ్రభాగములు గల వృక్షములతో సేతువును కట్టుచుండిరి. దానవుల వంటి కొందరు వానరులు పర్వతములవంటి శిలలను, పర్వతశిఖరములను పట్టుకొని ఇటు అటు పరుగెత్తుచు కనబడుచుండిరి. 64

మూ. శిలానాం క్షిప్యమాణానాం శైలానాం తత్ర పాత్యతామ్, 65
బభూవ తుములః శబ్దస్తదా తస్మిన్ మహోదధౌ.

ప్ర. అ. తస్మిన్=ఆ, మహోదధౌ=మహాసముద్రమునందు, క్షిప్యమా

ణానామ్= విసరబడుచున్న, శిలానామ్=శిలలయొక్క, తత్ర=అక్కడ, పాత్య తామ్=పడవేయబడుచున్న, శైలానామ్=పర్వతములయొక్క, తుములః=వ్యాకుల మైన, శబ్దః=ధ్వని, తదా= అప్పుడు, బభూవ=ఆయెను.

తా. అప్పుడు ఆ మహోదధిలో శిలలను దూరమునుండి విసిరివేయుచుం డగా, పర్వతములను పడవేయుచుండగా చాల అధికమైన ధ్వని బయలుదేరెను. 65

మూ. కృతాని ప్రథమేనాహ్నా యోజనాని చతుర్దశ, 66
ప్రహృష్టైర్గజసంకాశైస్త్వరమాణైః ప్లవఙ్గమైః.

ప్ర. అ. ప్రహృష్టైః=సంతోషించిన, గజసంకాశైః=ఏనుగులతో సమాను లైన, త్వరమాణైః=తొందరపడుచున్న, ప్లవఙ్గమైః=వానరులచేత, ప్రథమేన=మొదటి, అహ్నా=దివసముచేత, చతుర్దశ=పదునాలుగు, యోజనాని=యోజనములు, కృతాని= చేయబడినవి.

తా. తొందరపడుచున్న ఉత్సాహవంతులైన, ఏనుగులతో సమానులైన వానరులు మొదటి దివసమునందు పదునాలుగు యోజనముల సేతువు నిర్మించిరి. 66

మూ. ద్వితీయేన తథైవాహ్నా యోజనాని తు వింశతిః, 67
కృతాని ప్లవగైస్తూర్ణం భీమకాయైర్మహాబలైః.

ప్ర. అ. తథైవ=అట్లే, భీమకాయైః=భయంకరమైన శరీరములు గల, మహాబలైః= గొప్ప బలము గల, ప్లవగైః=వానరులచేత, తూర్ణమ్=శీఘ్రముగా, ద్వితీయేన=రెండవ, అహ్నా=దివసముచేత, వింశతిః=ఇరువది, యోజనాని=యోజ నములు, కృతాని= చేయబడినవి.

తా. అదే విధముగా రెండవ రోజున భయంకరమైన దేహములు గల మహాబలవంతులైన వానరులు ఇరువది యోజనముల సేతువు నిర్మించిరి. 67

మూ. అహ్నా తృతీయేన తథా యోజనాని తు సాగరే, 68
త్వరమాణైర్మహాకాయైరేకవింశతిరేవ చ.

ప్ర. అ. తథా=అట్లే, త్వరమాణైః=తొందరపడుచున్న, మహాకాయైః=పెద్ద దేహములు గల వానరులచేత, తృతీయేన=మూడవ, అహ్నా=దివసముచేత, సాగరే= సముద్రమునందు, ఏకవింశతిరేవ చ=ఇరువదియొక్క, యోజనాని=యోజనములు, నిర్మించబడినవి.

తా. అట్లే మూడవ రోజున పెద్ద దేహములు గల ఆ వానరులు తొందరపడుచూ సముద్రములో ఇరువదియొక్క యోజనముల సేతువు నిర్మించిరి.

మూ. చతుర్థేన తథా చాహ్నా ద్వావింశతిరథాపి వా, 69
యోజనాని మహావేగైః కృతాని త్వరితైస్తతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహావేగైః=గొప్ప వేగము గల, త్వరితైః=తొందరపడుచున్న వానరులచేత, అథాపి వా=మరియు, చతుర్థేన=నాల్గవ, అహ్నా=దివసముచేత, ద్వావింశతిః=ఇరువదిరెండు, యోజనాని=యోజనములు, కృతాని=చేయబడినవి.

తా. పిమ్మట మహావేగవంతులైన ఆ వానరులు తొందరపడుచు నాల్గవ రోజున ఇంకను ఇరువదిరెండు యోజనముల సేతువు కట్టిరి. 69

మూ. పఞ్చమేన తథా చాహ్నా ప్లవగైః క్షిప్రకారిభిః, 70
యోజనాని త్రయోవింశత్సువేలమధికృత్య వై.

ప్ర. అ. తథా=అట్లే, పఞ్చమేన=ఐదవ, అహ్నా=దివసముచేత, క్షిప్రకారిభిః=శీఘ్రముగా చేయు, ప్లవగైః=వానరులచేత, సువేలమ్ అధికృత్య=(అవతలి) సముద్ర తీరమును గూర్చి, త్రయోవింశత్=ముప్పదిమూడు, యోజనాని=యోజనములు, నిర్మించబడినవి.

తా. అట్లే శీఘ్రముగా కార్యములు చేయు వానరులు ఐదవ రోజున సముద్రపు అవతలి ఒడ్డు చేరు నట్లు ఇరువదిమూడు యోజనముల సేతువు కట్టిరి. 70

మూ. స వానరవరః శ్రీమాన్ విశ్వకర్మాత్మజో బలీ, 71
బబన్ధ సాగరే సేతుం యథా చాస్య తథా పితా.

ప్ర. అ. వానరవరః=వానరులలో శ్రేష్ఠుడు, శ్రీమాన్=శోభగలవాడు, విశ్వకర్మాత్మజః=విశ్వకర్మ కుమారుడు, బలీ=బలవంతుడు అయిన, సః=ఆ నలుడు, అస్య=వానియొక్క, పితా=తండ్రి, యథా=ఎట్లో, తథా= అట్లే, సాగరే=సముద్రమునందు, సేతుమ్=సేతువును, బబన్ధ=కట్టెను.

తా. వానరులలో శ్రేష్ఠుడు, విశ్వకర్మ కుమారుడు, బలవంతుడు, శ్రీమంతుడు అయిన ఆ నలుడు తన తండ్రి ఎట్లు కట్టి యుండేవాడో అట్లే సముద్రము మీద సేతువు బంధించెను. 71

మూ. స నలేన కృతః సేతుః సాగరే మకరాలయే, 72
శుశుభే సుభగః శ్రీమాన్ స్వాతీపథ ఇవామ్బరే.

ప్ర. అ. మకరాలయే=మొసళ్ళకు నివాసస్థానమైన, సాగరే=సముద్రమునందు, నలేన=నలునిచేత, కృతః=నిర్మించబడిన, సుభగః=సుందరమైన, శ్రీమాన్=శోభాయుక్తమైన, సః సేతుః=ఆ సేతువు, అమ్బరే=ఆకాశమునందు,

స్వాతీపథ ఇవ=స్వాతిమార్గమువలె (ఆకాశమునందు ప్రకాశవంతముగా కనబడు నక్షత్రమార్గము వలె), శుశుభే=ప్రకాశించెను.

తా. మొసళ్లకు నివాసస్థానమైన ఆ సముద్రము మీద నలుడు నిర్మించిన అందమైన, శోభాయుక్తమైన ఆ సేతువు ఆకాశమునందు కనబడు నక్షత్రమార్గము వలె కనబడెను. 72

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః, 73
ఆగమ్య గగనే తస్థుర్ద్రష్టుకామాస్తదద్భుతమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, దేవాః=దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, తత్=ఆ, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన దానిని, ద్రష్టుకామాః=చూచుటకు కోరిక గలవారై, ఆగమ్య=వచ్చి, గగనే=ఆకాశమునందు, తస్థుః=నిలచిరి.

తా. అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఆ అద్భుతమైన సేతువును చూడవలె నను కోరికతో వచ్చి ఆకాశమునందు నిలచిరి. 73

మూ. దశయోజనవిస్తీర్ణం శతయోజన మాయతమ్, 74
దదృశుర్దేవగన్ధర్వా నలసేతుం సుదుష్కరమ్.

ప్ర. అ. దేవగన్ధర్వాః=దేవతలు, గంధర్వులు, దశయోజనవిస్తీర్ణమ్=పది యోజనములు వెడల్పు, శతయోజనమ్=నూరు యోజనములు, ఆయతమ్=పొడవు అయిన, సుదుష్కరమ్=నిర్మించుటకు చాల కష్టమైన, నలసేతుమ్=నలుని సేతువును, దదృశుః=చూచిరి.

తా. నలుడు నిర్మించిన ఆ సేతువు పది యోజనముల వెడల్పు, నూరు యోజనముల పొడవు ఉండెను. నిర్మించుటకు చాల కష్టమైన ఆ సేతువును దేవతలు, గంధర్వులు చూచిరి. 74

మూ. ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవంగమాః, 75
తదచిన్త్యమసహ్యం చ హ్యద్భుతం లోమహర్షణమ్,
దదృశుః సర్వభూతాని సాగరే సేతుబన్ధనమ్. 76

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, ఆప్లవన్తః=దూరముగా దుముకుచూ, ప్లవన్తశ్చ=దగ్గరగా దుముకుచు, గర్జన్తశ్చ=గర్జించుచు (సంతోషించిరి). సర్వభూతాని=సకల భూతములు, అచిన్త్యమ్=ఊహింప శక్యము కానిది, అసహ్యం చ=సహింప శక్యము కానిది, అద్భుతమ్=ఆశ్చర్యకరము, రోమహర్షణమ్=రోమాంచము కలిగించునది అయిన, సాగరే=సముద్రమునందు, తత్ సేతుబన్ధనమ్=ఆ సేతుబంధనమును, దదృశుః=చూచినవి.

తా. వానరులలో కొందరు సంతోషాతిశయముతో చాల ఎత్తుగా దుముకుచుండిరి. కొందరు తక్కువ ఎత్తు దుముకుచుండిరి. కొందరు గర్జించుచుండిరి. ఊహించుటకు శక్యము కానిది, ఇతరు లెవ్వరు ప్రయత్నించుటకు కూడ శక్యము కానిది, ఆశ్చర్యకరము, రోమాంచము కలిగించునది అయిన, సాగరమునందు నిర్మించిన ఆ సేతుబంధమును సకలభూతములు చూచినవి.

మూ. తాని కోటిసహస్రాణి వానరాణాం మహౌజసామ్,
బధ్నన్తః సాగరే సేతుం జగ్ముః పారం మహోదధేః. 77

ప్ర. అ. మహౌజసామ్=గొప్ప తేజస్సు గల, వానరాణామ్=వానరుల యొక్క, తాని=ఆ, కోటిసహస్రాణి=వెయ్యి కోట్లు, సాగరే=సముద్రమునందు, సేతుమ్=సేతువును, బధ్నన్తః=కట్టుచున్నవారై, మహోదధేః=మహాసముద్రముయొక్క, పారమ్=ఆవతలి ఒడ్డును, జగ్ముః=పొందినవి.

తా. గొప్ప తేజస్సు గల ఆ వెయ్యి కోట్ల వానరులు సముద్రముమీద సేతువును నిర్మించుచునే సముద్రము ఆవతలి ఒడ్డు చేరిరి. 77

మూ. విశాలః సుకృతః శ్రీమాన్ సుభూమిః సుసమాహితః,
అశోభత మహాన్ సేతుః సీమన్త ఇవ సాగరే. 78

ప్ర. అ. విశాలః=విశాలము, సుకృతః=బాగా నిర్మించబడినది, శ్రీమాన్=శోభాయుక్తము, సుభూమిః=మంచి భూమి గలది, సుసమాహితః=బాగా చదునుచేయబడినది అయిన, మహాన్=గొప్పదైన, సేతుః=సేతువు, సాగరే=సముద్రమునందు, సీమన్త ఇవ=పాపిడి వలె, అశోభత=ప్రకాశించెను.

తా. సముద్రముమీద విశాలముగా, అందముగా నిర్మించి, చక్కని భూమితో చదును చేసి ఉన్న ఆ సేతువు సముద్రములో పాపిడి వలె ఉండెను. 78

మూ. తతః పారే సముద్రస్య గదాపాణిర్విభీషణః,
పరేషామభియాతార్థ మతిష్ఠత్సచివైః సహ. 79

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, గదాపాణిః=గద హస్తమునందు కలవాడై, పరేషామ్=శత్రువులయొక్క, అభియాతార్థమ్=ముట్టడించుట కొరకు, సచివైః సహ=మంత్రులతో కూడ, సముద్రస్య=సముద్రముయొక్క, పారే=తీరమునందు, అతిష్ఠత్=నిలబడెను.

తా. పిమ్మట విభీషణుడు తన అనుచరులతో కూడ, గదాధారియై శత్రువులను ముట్టడించుటకై సముద్రము అవతలి ఒడ్డుపై నిలచెను. 79

మూ. సుగ్రీవస్తు తతః ప్రాహ రామం సత్యపరాక్రమమ్,
హనుమన్తం త్వమారోహ అఙ్గదం త్వథ లక్ష్మణః. 80
అయం హి విపులో వీర సాగరో మకరాలయః,
వైహాయసౌ యువామేతౌ వానరౌ ధారయిష్యతః. 81

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుగ్రీవస్తు=సుగ్రీవుడు, సత్యపరాక్రమమ్=సత్యమైన పరాక్రమముగల, రామమ్=రాముణ్ణి గూర్చి, ప్రాహ=పలికెను. వీర=వీరుడా! మకరాలయః=మకరములకు నివాసమైన, అయమ్= ఈ, సాగరః=సముద్రము, విపులః హి=విశాలమైనది కదా. త్వమ్=నీవు, హనూమన్తమ్=హనుమంతుని, ఆరోహ=ఎక్కుము. అథ=మరియు, లక్ష్మణః=లక్ష్మణుడు, అఙ్గదమ్=అంగదుని ఎక్కగాక. ఏతౌ=ఈ, వానరౌ=వానరులు, వైహాయసౌ=ఆకాశముపై ఎగురుచు, యువామ్=మిమ్ముం ఇద్దరినీ, ధారయిష్యతః=ధరింపగలరు.

తా. పిమ్మట సుగ్రీవుడు సత్యమైన పరాక్రమము గల రామునితో ఇట్లు పలికెను. ఓ ! వీరుడా ! మొసళ్లకు నివాసస్థానమైన ఈ సముద్రము చాల విశాలముగా ఉన్నది కదా. నీవు హనుమంతుని భుజముపైన ఎక్కుము. లక్ష్మణుడు అంగదుని భుజముపైన ఎక్కును. వీరిద్దరూ మిమ్ములను ఆకాశమార్గమున తీసికొనివెళ్లగలరు. 80, 81

మూ. అగ్రతస్తస్య సైన్యస్య శ్రీమాన్ రామః సలక్ష్మణః,
జగామ ధన్వీ ధర్మాత్మా సుగ్రీవేణ సమన్వితః. 82

ప్ర. అ. సలక్ష్మణః=లక్ష్మణసహితుడు, శ్రీమాన్=శ్రీమంతుడు, ధర్మాత్మా=ధర్మాత్ముడూ అయిన, రామః=రాముడు, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమన్వితః=కూడినవాడై, ధన్వీ=ధనుర్ధరుడై, తస్య సైన్యస్య=ఆ సైన్యముయొక్క, అగ్రతః=ఎదుట, జగామ=వెళ్లెను.

తా. శ్రీమంతుడు, ధర్మాత్ముడు అయిన రాముడు ధనస్సు చేత ధరించి, లక్ష్మణసుగ్రీవులతో కలిసి ఆ సైన్యము ముందు భాగమున వెళ్లెను.

మూ. అన్యే మధ్యేన గచ్ఛన్తి పార్శ్వతోఽన్యే ప్లవంగమాః,
సలిలం ప్రపతన్త్యన్యే మార్గమన్యే ప్రపేదిరే, 83
కేచిద్వైహాయసగతాః సుపర్ణా ఇవ పుప్లువుః.

ప్ర. అ. అన్యే=కొందరు, ప్లవంగమాః=వానరులు, మధ్యేన=సేతువు మధ్యమునుండి, గచ్ఛన్తి=వెళ్లిరి. అన్యే=మరికొందరు, పార్శ్వతః=ప్రక్కలయందు వెళ్లిరి. అన్యే=మరికొందరు, సలిలమ్=ఉదకమును, ప్రపతన్తి=పడుచుండిరి. అన్యే=కొందరు, మార్గమ్=మార్గమును, ప్రపేదిరే=పొందిరి. కేచిత్=కొందరు,

వైహాయసగతాః=ఆకాశమును పొందినవారై, సుపర్ణా ఇవ=గరుత్మంతుని వలె, పుప్లువుః=ఎగిరిరి.

తా. ఆ వానరులలో కొందరు సేతుమధ్యమునందు నడచి వెళ్లగా, కొందరు ప్రక్కలయందు నడచి వెళ్లిరి. కొందరు కావలె నని నీటిలో దుముకుచుండిరి. కొందరు నీటిలో పడి లేచి సరియైన మార్గమును వెదుకుచుండిరి. కొందరు ఆకాశమార్గమునందు గరుత్మంతుని వలె ఎగిరి వెళ్లిరి.

మూ. ఘోషేణ మహతా ఘోషం సాగరస్య సముచ్ఛ్రితమ్, 84
భీమమన్తర్దధే భీమా తరన్తీ హరివాహినీ.

ప్ర. అ. తరన్తీ=దాటుచున్న, భీమా=భయంకరమైన, హరివాహినీ=వానర సేన, మహతా=గొప్పదైన, ఘోషేణ=ఘోషముచేత, సముచ్ఛ్రితమ్=అత్యధికమైన, భీమమ్=భయంకరమైన, సాగరస్య=సముద్రముయొక్క, ఘోషమ్=ధ్వనిని, అన్తర్దధే=కప్పివేసెను.

తా. దాటుచున్న, భయంకరమైన ఆ వానరసైన్యము గొప్ప ధ్వనిచేత, అత్యధికము, భయంకరము అయిన సముద్రధ్వనిని కప్పివేసెను. 84

మూ. వానరాణాం హి సా తీర్ణా వాహినీ నలసేతునా, 85
తీరే నివివిశే రాజ్ఞా బహుమూలఫలోదకే.

ప్ర. అ. నలసేతునా=నలుని సేతువుచేత, తీర్ణా=దాటిన, వానరాణామ్=వానరులయొక్క, సా=ఆ, వాహినీ=సేన, రాజ్ఞా=సుగ్రీవునిచేత, బహుమూలఫలోదకే=అధికమైన మూలములు, ఫలములు ఉదకము గల, తీరే=తీరమునందు, నివివిశే=నివేశింపచేయబడెను.

తా. నలుడు నిర్మించిన సేతువు మీదుగా సముద్రమును దాటిన ఆ వానరసేనను రాజైన సుగ్రీవుడు అధికమైన మూలములు, ఫలములు, ఉదకము గల తీరమునందు నిలిపెను. 85

మూ. తదద్భుతం రాఘవకర్మ దుష్కరం
సమీక్ష్య దేవాః సహ సిద్ధచారణైః,
ఉపేత్య రామం సహసా మహర్షిభి
స్తమభ్యషిఞ్చన్ సుశుభైర్జలైః పృథక్. 86

ప్ర. అ. దేవాః=దేవతలు, సిద్ధచారణైః=సిద్ధులతోను చారణులతోను, మహర్షిభిః సహ=మహర్షులతోను, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, దుష్కరమ్=చేయ శక్యము కాని, తత్=ఆ, రాఘవకర్మ=రాముని పనిని, సమీక్ష్య=చూచి, సహసా=

వెంటనే, రామమ్=రామున్ని, ఉపేత్య=సమీపించి, సుశుభైః=చాల పవిత్రములైన, జలైః=జలములతో, పృథక్=వేరువేరుగా, తమ్=ఆ రామున్ని, అభ్యషిఞ్చన్=అభిషేకించిరి.

తా. ఆశ్చర్యకరము, ఇతరు లెవ్వరూ చేయజాలనిదీ అయిన రాముడు చేసిన ఆ పని చూచి దేవతలు, సిద్ధులు, చారణులు, మహర్షులు వచ్చి సంతోషసూచకముగా రామునిమీద, వేరువేరుగా పవిత్రమైన జలమును చల్లిరి.

మూ. జయస్వ శత్రూన్నరదేవ మేదినీం
ససాగరాం పాలయ శాశ్వతీః సమాః,
ఇతీవ రామం నరదేవసత్కృతం
శుభైర్వచోభిర్వివిధై రపూజయన్. 87

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్వావింశః సర్గః.

ప్ర. అ. నరదేవ=మహారాజా ! శత్రూన్=శత్రువులను, జయస్వ=జయించుము. ససాగరామ్=సాగరముతో కూడిన, మేదినీమ్=భూమిని, శాశ్వతీః=శాశ్వతమైన, సమాః=సంవత్సరములను, పాలయ=పాలించుము. ఇతీవ=ఇట్లు, నరదేవసత్కృతమ్=రాజులచేత సత్కరింపబడిన, రామమ్=రామున్ని, శుభైః=మంగళకరములైన, వివిధైః=అనేకవిధములైన, వచోభిః=వచనములచేత, అపూజయన్=పూజించిరి.

తా. "మహారాజా ! నీవు శత్రువులను జయించి అనేకసంవత్సరములు సముద్రముతో సహా భూమండలము నంతను పాలించుము" అని పలుకుచు ఆ దేవగంధర్వాదులు సకలరాజులచేత ఆదరింపబడిన ఆ రామున్ని పూజించిరి. 87

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో ఇరువది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయోవింశః సర్గః

[రాముడు లోకవినాశసూచకములైన శకునములు లక్ష్మణునకు చూపుట, లంకపై ఆక్రమణము చేయుట.]

మూ. నిమిత్తాని నిమిత్తజ్ఞో దృష్ట్వా లక్ష్మణపూర్వజః,
సౌమిత్రిం సంపరిష్వజ్య ఇదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. నిమిత్తజ్ఞః=నిమిత్తములను (శకునములను)ఎరిగిన, లక్ష్మణపూర్వజః=రాముడు, నిమిత్తాని=నిమిత్తములను, దృష్ట్వా=చూచి, సౌమిత్రిమ్=లక్ష్మణుని, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. శుభాశుభనిమిత్తముల ఫలములు తెలిసిన రాముడు నిమిత్తములను చూచి లక్ష్మణుని కౌగలించుకొని ఇట్లు పలికెను. 1

మూ. పరిగృహ్యోదకం శీతం వనాని ఫలవన్తి చ,
బలౌఘం సంవిభజ్యేమం వ్యూహ్య తిష్ఠేమ లక్ష్మణ. 2

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! శీతమ్=చల్లని, ఉదకమ్=ఉదకమును, ఫలవన్తి=ఫలములు గల, వనాని చ=వనములను, పరిగృహ్య=(నివాసముకొరకు) స్వీకరించి, ఇదమ్=ఈ, బలౌఘమ్=సేనాసమూహమును, సంవిభజ్య=విభజించి, వ్యూహ్య=వ్యూహములుగా చేసి, తిష్ఠేమ=నిలచెదము.

తా. లక్ష్మణా ! చల్లని జలము ఉన్న, ఫలములు గల వనములను నివాసముకొరకై స్వీకరించి, ఈ సేనాసమూహమును విభజించి వ్యూహములుగా చేసి నిలచెదము. 2

మూ. లోకక్షయకరం భీమం భయం పశ్యామ్యుపస్థితమ్,
ప్రబర్హణం ప్రవీరాణామృక్షవానరరక్షసామ్. 3

ప్ర. అ. లోకక్షయకరమ్=లోకక్షయము చేసేది, భీమమ్=భయంకరము, ప్రవీరాణామ్=వీరులైన, ఋక్షవానరరక్షసామ్=భల్లూకములకు వానరులకు రాక్షసులకు, ప్రబర్హణమ్=నాశకమూ అయిన, భయమ్=భయమును, ఉపస్థితమ్=వచ్చినదానినిగా, పశ్యామి=చూచుచున్నాను.

తా. లోకక్షయమునకూ వీరులైన భల్లూకములను, వానరులను, రాక్షసులను నశింపచేయుటకు కారణమైన భయంకరమైన ఆపద వచ్చినట్లు కనబడుచున్నది.

మూ. వాతాశ్చ కలుషా వాన్తి కమ్పతే చ వసున్ధరా,
పర్వతాగ్రాణి వేపన్తే పతన్తి చ మహీరుహాః. 4

ప్ర. అ. వాతాః=వాయువులు, కలుషాః=కలుషములై, వాన్తి=వీచుచున్నవి. వసుంధరా చ=భూమికూడ, కమ్పతే=కంపించుచున్నది. పర్వతాగ్రాణి=పర్వతముల అగ్రములు, వేపన్తే=వణకుచున్నవి. మహీరుహాః=వృక్షములు, పతన్తి చ=పడుచున్నవి.

తా. వాయువులు ధూళితో నిండి వీచుచున్నవి. భూమి కంపించుచున్నది. పర్వతముల శిఖరములు వణకుచున్నవి. చెట్లు పడిపోవుచున్నవి. 4

మూ. మేఘాః క్రవ్యాదసంకాశాః పరుషాః పరుషస్వనాః,
క్రూరాః క్రూరం ప్రవర్షన్తి మిశ్రం శోణితబిన్దుభిః. 5

ప్ర. అ. క్రవ్యాదసంకాశాః=రాక్షసులతో సమానములు, పరుషాః=పరుషములు, పరుషస్వనాః=పరుషమైన ధ్వని కలవి అయిన, క్రూరాః= క్రూరములైన, మేఘాః=మేఘములు, క్రూరమ్=క్రూరముగాను, శోణితబిన్దుభిః=రక్తబిందువులతో, మిశ్రమ్=మిశ్రముగాను, ప్రవర్షన్తి=వర్షించుచున్నవి.

తా. రాక్షసులవలె భయంకరములు, క్రూరములు అయిన మేఘములు పరుషమైన ధ్వనితో రక్తబిందువులతో కలిసిన ఉదకమును భయము కలుగునట్లు వర్షించుచున్నవి. 5

మూ. రక్తచన్దనసంకాశా సంధ్యా పరమదారుణా,
జ్వలతః ప్రపతత్యేతదాదిత్యాదగ్నిమణ్డలమ్. 6

ప్ర. అ. రక్తచన్దనసంకాశా=ఎఱ్ఱని చందనముతో సమానమైన, సంధ్యా= సంధ్య, పరమదారుణా=చాల భయంకరముగా ఉన్నది. జ్వలతః=ప్రజ్వలించుచున్న, ఆదిత్యాత్=సూర్యునినుండి, ఏతత్=ఈ, అగ్నిమణ్డలమ్=అగ్నిమండలము, ప్రపతతి=పడుచున్నది.

తా. సంధ్య ఎఱ్ఱని చందనము వలె ఎఱ్ఱగా చాల భయంకరముగా ఉన్నది. మండుచున్న సూర్యమండలమునుండి అగ్నిపిండములు రాలుచున్నవి.6

మూ. దీనా దీనస్వరాః క్రూరాః సర్వతో మృగపక్షిణః,
ప్రత్యాదిత్యం వినర్దన్తి జనయన్తో మహద్భయమ్. 7

ప్ర. అ. సర్వతః=అన్ని వైపులా, క్రూరాః మృగాః=క్రూరమృగములు, దీనాః=దీనములై, దీనస్వరాః=దీనస్వరము గలవై, మహత్=గొప్ప, భయమ్= భయమును, జనయన్తః=పుట్టించుచు, ప్రత్యాదిత్యమ్=సూర్యునకు ఎదురుగా, వినర్దన్తి=అరచుచున్నవి.

తా. చుట్టుపక్కల నున్న క్రూరమృగములు దీనములై చాల భయము కలుగునట్లుగా, సూర్యుని వైపు తిరిగి దీనస్వరముతో అరచుచున్నవి. 7

మూ. రజన్యామప్రకాశస్తు సంతాపయతి చన్ద్రమాః,
కృష్ణరక్తాంశుపర్యన్తో లోకక్షయ ఇవోదితః. 8

ప్ర. అ. లోకక్షయే=ప్రళయకాలమునందు, ఉదిత ఇవ=ఉదయించినవాడు వలె ఉన్న, కృష్ణరక్తాంశుపర్యన్తః=నల్లగాను, ఎఱ్ఱగాను ఉన్న ప్రాంతభాగములు గల, చన్ద్రమాః=చంద్రుడు, రజన్యామ్=రాత్రియందు, అప్రకాశః=ప్రకాశము లేనివాడై, సంతాపయతి=తాపమును కలిగించుచున్నాడు.

తా. ప్రళయకాలమునందు ఉదయించినవాడు వలె ఉన్న చంద్రుడు ప్రాంతమునందు నల్లగాను ఎఱ్ఱగాను ఉండి, రాత్రి ప్రకాశవిహీనుడై మనుష్యులకు భయము కలిగించుచున్నాడు. 8

మూ. హ్రస్వో రూక్షోఽప్రశస్తశ్చ పరివేషస్తు లోహితః,
ఆదిత్యే విమలే నీలం లక్ష్మ లక్ష్మణ దృశ్యతే. 9

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! విమలే=నిర్మలమైన, ఆదిత్యే=సూర్యునియందు, హ్రస్వః=చిన్నది, రూక్షః=క్రూరము, అప్రశస్తః=ప్రశస్తముగానిది, లోహితః=ఎఱ్ఱనిది అయిన, పరివేషః=గూడు, నీలమ్=నల్లని, లక్ష్మ=మచ్చ, దృశ్యతే కనబడుచున్నది.

తా. లక్ష్మణా ! నిర్మలమైన సూర్యమండలము చుట్టూ, చిన్నది, క్రూరము, అప్రశస్తమూ అయిన ఎఱ్ఱని గూడు, ఆ మండలము మధ్య నల్లని మచ్చ కనబడుచున్నవి. 9

మూ. రజసా మహతా చాపి నక్షత్రాణి హతాని చ,
యుగాన్తమివ లోకానాం పశ్య శంసన్తి లక్ష్మణ. 10

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! మహతా=గొప్ప, రజసా=పరాగముచేత, హతాని=కొట్టబడిన, నక్షత్రాణి=నక్షత్రములు, లోకానామ్=లోకములయొక్క, యుగాన్తమ్=ప్రళయమును, శంసన్తి ఇవ=చెప్పుచున్నట్లు ఉన్నవి. పశ్య=చూడుము.

తా. లక్ష్మణా ! నక్షత్రములు గొప్ప పరాగముచేత కప్పబడినవై లోకములకు ప్రళయము రానున్నదని చెప్పుచున్నవా అన్నట్లు ఉన్నవి, చూడుము.

మూ. కాకాః శ్యేనాస్తథా నీచా గృధ్రాః పరిపతన్తి చ,
శివాశ్చాప్యశుభాన్నాదాన్నదన్తి సుమహాభయాన్. 11

ప్ర. అ. కాకాః=కాకులు, శ్యేనాః=డేగలు, తథా=మరియు, గృధ్రాః=గ్ర

ద్దలు, సిధాః=క్రిందుగా ఉన్నవై, పరిపతన్తి=ఎగురుచున్నవి. శివాశ్చాపి=నక్కలు కూడ, మహాభయాన్=చాల భయంకరములైన, అశుభాన్=అమంగళకరములైన, నాదాన్=ధ్వనులను, నదన్తి=ధ్వనిచేయుచున్నవి.

తా. కాకులు, డేగలు, గ్రద్దలు క్రిందుగా ఎగురుచున్నవి. నక్కలు చాల భయము కలుగునట్లు అమంగళకరమైన కూతలు కూయుచున్నవి. 11

మూ. శైలైః శూలైశ్చ ఖడ్గైశ్చ విముక్తైః కపిరాక్షసైః,
భవిష్యత్యావృతా భూమిర్మాంసశోణితకర్దమా. 12

ప్ర. అ. కపిరాక్షసైః=వానరులచేత, రాక్షసులచేత, విముక్తైః=విడువబడిన, శైలైః=పర్వతములచేత, శూలైశ్చ=శూలములచేత, ఖడ్గైశ్చ=ఖడ్గములచేత, మాంసశోణితకర్దమా=మాంసము రక్తము బురదగా గల, భూమిః=భూమి, ఆవృతా=కప్పబడినదై, భవిష్యతి=కాగలదు.

తా. వానరులు రాక్షసులు విడచిన పర్వతములతోను, శూలములతోను, ఖడ్గములతోను వ్యాప్తమైన భూమి మాంసరక్తముల బురదతో నిండిపోగలదు.12

మూ. క్షిప్రమద్యైవ దుర్ధర్షాం పురీం రావణపాలితామ్,
అభియామ జవేనైవ సర్వైర్హరిభిరావృతాః. 13

ప్ర. అ. సర్వైః=సమస్తమైన, హరిభిః=వానరులతో, ఆవృతాః=కూడినవారమై, అద్యైవ=ఇప్పుడే, క్షిప్రమ్= శీఘ్రముగా, జవేనైవ=వేగముతో, రావణపాలితామ్=రావణునిచేత పాలింపబడిన, పురీమ్=పట్టణమును, అభియామ= ముట్టడించెదము.

తా. మనము ఇప్పుడే సమస్తమైన వానరులతో కలిసి శీఘ్రముగా, వేగముగా, రావణుడు పాలించుచున్న ఈ లంకను ముట్టడించెదము. 13

మూ. ఇత్యేవముక్త్వా ధన్వీ స రామః సంగ్రామధర్షణః,
ప్రతస్థే పురతో రామో లఙ్కామభిముఖో విభుః. 14

ప్ర. అ. రామః=మనోహరుడు, సంగ్రామధర్షణః=యుద్ధములయందు శత్రువులను ఎదిరించువాడు, విభుః=ప్రభువు అయిన, రామః=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, ధన్వీ=ధనుర్ధరుడై, పురతః=ఎదుట, లఙ్కామ్=లంకను గూర్చి, అభిముఖః=అభిముఖుడై, ప్రతస్థే=ప్రయాణ మాయెను.

తా. లోకాభిరాముడు, యుద్ధములో శత్రువులను ఎదిరించువాడు, ప్రభువు అయిన రాముడు ఇట్లు పలికి ధనస్సు ధరించి, లంకాభిముఖుడై, ముందుగా ప్రయాణ మాయెను. 14

మూ. సవిభీషణసుగ్రీవాః సర్వే తే వానరర్షభాః,
ప్రతస్థిరే వినర్దన్తో ధృతానాం ద్విషతాం వధే. 15

ప్ర. అ. సవిభీషణసుగ్రీవాః=విభీషణునితోను సుగ్రీవునితోను కూడిన, సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, వినర్దన్తః=ధ్వనిచేయుచు, ధృతానామ్=ధైర్యవంతులైన, ద్విషతామ్=శత్రువులయొక్క, వధే=వధకొరకు, ప్రతస్థిరే=ప్రయాణమైరి.

తా. విభీషణసుగ్రీవులతో కూడిన వానరులందరూ సింహనాదములు చేయుచు, ధైర్యవంతులైన శత్రువులను వధించుటకై బయలుదేరిరి. 15

మూ. రాఘవస్య ప్రియార్థం తు సుతరాం వీర్యశాలినామ్,
హరీణాం కర్మచేష్టాభి స్తుతోష రఘునన్దనః. 16

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రయోవింశః సర్గః

ప్ర. అ. సుతరామ్=మిక్కిలి, వీర్యశాలినామ్=పరాక్రమవంతులైన, హరీణామ్= వానరులయొక్క, రాఘవస్య=రామునియొక్క, ప్రియార్థమ్=ప్రియముకొరకు, కర్మచేష్టాభిః=పనులచేతను, చేష్టలచేతను, రఘునన్దనః=రాముడు, తుతోష=సంతోషించెను.

తా. గొప్ప పరాక్రమవంతులైన వానరులు తనకు సంతోషము కలిగించుటకై చేయు పనులు, చేష్టలు చూచి రాముడు సంతోషించెను. 16

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరువదిమూడవసర్గ సమాప్తము.

# అథ చతుర్వింశః సర్గః

*[రాముడు లంక శోభను వర్ణించుచు సేనను వ్యూహములుగా విభజింపుమని లక్ష్మణుని ఆదేశించుట; అంతవరకు బంధింపబడి ఉన్న శుకుడు విడువగా అతడు వెళ్లి రావణునకు రాముని సైన్యశక్తిని గూర్చి వర్ణించి చెప్పుట; రావణుడు తన బలమును పొగడుకొనుట.]*

మూ. సా వీరసమితీ రాజ్ఞా విరరాజ వ్యవస్థితా,
శశినా శుభనక్షత్రా పౌర్ణమాసీవ శారదీ. 1

ప్ర. అ. వ్యవస్థితా=వ్యూహములు చేసి నిలిపి ఉన్న, సా=ఆ, వీరసమితిః=వీరులైన వానరుల సముదాయము, రాజ్ఞా=రామునితో, శుభనక్షత్రా=అందమైన నక్షత్రములు గల, శారదీ=శరత్కాలసంబంధమైన, పౌర్ణమాసీ=పౌర్ణమి, శశినా ఇవ=చంద్రునితో వలె, విరరాజ=ప్రకాశించెను.

తా. వ్యూహములు తీర్చి నిలిచిన ఆ వానరసేన రాజైన రామునితో, సుందరములైన నక్షత్రములు గల శరత్కాలపూర్ణిమ చంద్రునితో వలె ప్రకాశించెను.

మూ. ప్రచచాల చ వేగేన త్రస్తా చైవ వసుంధరా,
పీడ్యమానా బలౌఘేన తేన సాగరవర్చసా. 2

ప్ర. అ. సాగరవర్చసా=సముద్రము వంటి తేజస్సు గల, తేన=ఆ, బలౌఘేన=సేనాసముదాయముచేత, పీడ్యమానా=పీడింపబడుచున్న, వసుంధరా=భూమి, వేగేన=ఆ సేనావేగముచేత, త్రస్తా=భయపడినదై, ప్రచచాల=చలించెను.

తా. సముద్రమువంటి ఆ సేనాప్రవాహముచేత పీడింపబడిన భూమి, ఆ వేగమునకు భయపడి చలించెను. 2

మూ. తతః శుశ్రువురాక్రుష్టం లంకాయాః కాననౌకసః,
భేరీమృదంగసంఘుష్టం తుములం రోమహర్షణమ్. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కాననౌకసః=వానరులు, లంకాయాః=లంక యొక్క, ఆక్రుష్టమ్=ధ్వనిని, తుములమ్=వ్యాకులము, రోమహర్షణమ్=రోమాంచమును కలిగించునది అయిన, భేరీమృదంగసంఘుష్టమ్=భేరుల యొక్క మృదంగముల యొక్క ధ్వనిని, శుశ్రువుః=వినిరి.

తా. పిమ్మట ఆ వానరులకు లంకనుండి వ్యాకులము రోమాంచమును కలిగించునది అయిన సైనికుల సింహనాదము, భేరీమృదంగముల ధ్వని

వినబడెను. 3

మూ. బభూవుస్తేన ఘోషేణ సంహృష్టా హరియూథపాః,
అమృష్యమాణాస్తం ఘోషం వినేదుర్ఘోషవత్తరమ్. 4

ప్ర. అ. హరియూథపాః=వానరసేనానాయకులు, తేన=ఆ, ఘోషేణ=ధ్వని చేత, సంహృష్టాః=సంతోషించినవారు, బభూవుః=ఐయిరి. తమ్=ఆ, ఘోషమ్=ధ్వనిని, అమృష్యమాణాః=సహించనివారై, ఘోషవత్తరమ్=ఇంకా అధికమైన ఘోష కలుగునట్లుగా, వినేదుః =ధ్వని చేసిరి.

తా. వానరనాయకులు ఆ ధ్వని విని చాలా సంతోషించిరి. ఆ ధ్వనిని సహించక అంతకంటె ఎక్కువగా ధ్వని చేసిరి. 4

మూ. రాక్షసాస్తం ప్లవఙ్గానాం శుశ్రువుస్తేఽపి గర్జితమ్,
నర్దతామివ దృప్తానాం మేఘానామమ్బరే స్వనమ్. 5

ప్ర. అ. తే=ఆ, రాక్షసాః అపి=రాక్షసులు కూడ, దృప్తానామ్=గర్వించిన, ప్లవఙ్గానామ్=వానరులయొక్క, అమ్బరే=ఆకాశమునందు, నర్దతామ్=ధ్వనిచేయుచున్న, మేఘానామ్=మేఘములయొక్క, స్వనమ్ ఇవ=ధ్వని వలె ఉన్న, గర్జితమ్=గర్జనమును, శుశ్రువుః=వినిరి.

తా. మదించిన ఆ వానరుల గర్జనము ఆకాశమునందు ఉరుముచున్న మేఘముల ధ్వనివలె ఉండెను. అట్టి గర్జనమును రాక్షసులు కూడ వినిరి. 5

మూ. దృష్ట్వా దాశరథిర్లఙ్కాం చిత్రధ్వజపతాకినీమ్,
జగామ మనసా సీతాం దూయమానేన చేతసా. 6

ప్ర. అ. దాశరథిః=రాముడు, చిత్రధ్వజపతాకినీమ్=చిత్రములైన ధ్వజములు పతాకలు గల, (చిహ్నము ఉన్నది ధ్వజము; వస్త్రము మాత్రమే ఉన్నది పతాక అని గోవిందరాజ వ్యాఖ్య), లఙ్కామ్=లంకను, దృష్ట్వా=చూచి, దూయమానేన=బాధపడుచున్న, చేతసా= చిత్తముతో, సీతామ్=సీతనుగూర్చి, మనసా=మనస్సుచేత, జగామ=వెళ్లెను.

తా. విచిత్రములైన ధ్వజములతోను, పతాకలతోను ప్రకాశించుచున్న ఆ లంకాపట్టణమును చూచి రాముడు దుఃఖించుచున్న మనస్సులో సీతను స్మరించెను. 6

మూ. అత్ర సా మృగశావాక్షీ రావణేనోపరుధ్యతే,
అభిభూతా గ్రహేణేవ లోహితాఙ్గేన రోహిణీ. 7

ప్ర. అ. మృగశాబాక్షీ=లేడిపిల్ల కండ్లవంటి కళ్ళు గల, సా=ఆ సీత, లోహితాఙ్గేన= ఎఱ్ఱని శరీరము గల, గ్రహేణ=గ్రహముచేత, అభిభూతా=ఆక్రమించబడిన, రోహిణీవ= రోహిణి వలె, రావణేన=రావణునిచేత, అత్ర=ఇక్కడ, ఉపరుద్ధ్యతే=బంధింపబడి ఉన్నది.

తా. అంగారకగ్రహముచేత ఆక్రమింపబడిన రోహిణి వలె, లేడి కళ్ళ వంటి కళ్ళు గల ఆ సీత రావణునిచేత ఈ నగరమునందే బంధింపబడి ఉన్నది కదా! 7

మూ. దీర్ఘముష్ణం చ నిఃశ్వస్య సముద్వీక్ష్య చ లక్ష్మణమ్,
ఉవాచ వచనం వీరస్తత్కాలహితమాత్మనః. 8

ప్ర. అ. వీరః=వీరుడైన రాముడు, దీర్ఘమ్=దీర్ఘముగాను, ఉష్ణం చ=వేడిగాను, నిఃశ్వస్య=నిట్టూర్చి, లక్ష్మణమ్=లక్ష్మణుని, సముద్వీక్ష్య చ=చూచి, ఆత్మనః=తనకు, తత్కాలహితమ్=ఆ సమయమునందు హితమైన, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. వీరుడైన రాముడు దీర్ఘముగా, వేడిగా నిట్టూర్చి, లక్ష్మణుని చూచి, తనకు ఆ సమయమునందు హితమైన వాక్యము పలికెను. 8

మూ. ఆలిఖన్తీమివాకాశముత్థితాం పశ్య లక్ష్మణ,
మనసేవ కృతాం లఙ్కాం నగాగ్రే విశ్వకర్మణా. 9

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నగాగ్రే=పర్వతాగ్రమునందు, మనసా=మనస్సుచేత, కృతామ్ ఇవ=నిర్మింపబడినదా అన్నట్లున్న, ఉత్థితామ్=పైకిలేచి ఉన్న, ఆకాశమ్=ఆకాశమును, ఆలిఖన్తీమ్=ఒరయుచున్న, లఙ్కామ్=లంకను, పశ్య= చూడుము.

తా. లక్ష్మణా! పర్వతాగ్రముమీద విశ్వకర్మ మనస్సుచేత నిర్మించినదా అన్నట్లు ఉన్నది ఈ ఎత్తైన లంకాపట్టణము. ఆకాశమును ఒరయుచున్నట్లున్నది. చూడుము. 9

మూ. విమానైర్బహుభిర్లఙ్కా సంకీర్ణా రచితా పురా,
విష్ణోః పదమివాకాశం ఛాదితం పాణ్డుభిర్ఘనైః. 10

ప్ర. అ. పురా=పూర్వము, రచితా=నిర్మింపబడిన, లఙ్కా=లంక, బహుభిః=అనేకములైన, విమానైః=ఏడంతస్థుల గృహములచేత, కీర్ణా=వ్యాప్తమైనది. విష్ణోః=విష్ణువుయొక్క, పదమ్=స్థానమైన, ఆకాశమ్=ఆకాశమును, పాణ్డుభిః=తెల్లని, ఘనైః=మేఘములచేత, ఛాదితమ్ ఇవ=కప్పబడినట్లున్నది.

తా. పూర్వము నిర్మింపబడిన ఈ లంకాపట్టణము అత్యున్నతములైన భవనములతో నిండియుండుటచేత ఆకాశమంతా తెల్లని మేఘాలతో కప్పబడినట్లు ఉన్నది. 10

మూ. పుష్పితైః శోభితా లఙ్కా వనైశ్చిత్రరథోపమైః,
నానాపతగసంఘుష్టఫలపుష్పోపగైః శుభైః. 11

ప్ర. అ. లఙ్కా=లంక, నానాపతగసంఘుష్టఫలపుష్పోపగైః=అనేకవిధములైన పక్షుల ధ్వనులతోను ఫలరూపములైన పుష్పములు గల మల్లిక మొదలైన వానితోను కూడిన, శుభైః=సుందరమైన, పుష్పితైః=పుష్పించిన, చిత్రరథోపమైః=చిత్రరథోద్యానముతో సమానమైన, వనైః= ఉద్యానవనములచేత, శోభితా=శోభింపచేయబడినది.

తా. ఈ లంక అనేకవిధములైన పక్షుల ధ్వనులతోను, పుష్పములే ఫలములుగా గల మల్లికాదిలతలతోను కూడిన, పుష్పించిన, సుందరములైన, చిత్రరథోద్యానముతో పోల్చదగిన ఉద్యానములతో ప్రకాశించుచున్నది. 11

మూ. పశ్య మత్తవిహఙ్గాని ప్రలీనభ్రమరాణి చ,
కోకిలాకులషణ్డాని దోధవీతి శివోఽనిలః. 12

ప్ర. అ. శివః=పవిత్రమైన, అనిలః=వాయువు, మత్తవిహఙ్గాని=మదించిన పక్షులు గలవి, ప్రలీనభ్రమరాణి చ=అణగి యున్న తుమ్మెదలు గలవి అయిన, కోకిలాకులషణ్డాని=కోకిలలతో వ్యాకులమైన వనఖండములను, దోధవీతి=కదల్చుచున్నది. పశ్య=చూడుము.

తా. ఈ ఉద్యానవనప్రాంతములలోని పక్షులు మదించి ఉన్నవి. తుమ్మెదలు పుష్పములలో అణగి ఉన్నవి. కోకిలధ్వనులు అంతటా వ్యాపించుచున్నవి. అట్టి ఈ ఉద్యానములను మంగళకరమైన మందవాయువు కదల్చుచున్నది. 12

మూ. ఇతి దాశరథీ రామో లక్ష్మణం సమభాషత,
బలం చ తత్ర విభజచ్ఛాస్త్రదృష్టేన కర్మణా. 13

ప్ర. అ. దాశరథిః=దశరథకుమారుడైన, రామః=రాముడు, ఇతి=ఇట్లు, లక్ష్మణమ్=లక్ష్మణునిగూర్చి, సమభాషత=పలికెను. తత్ర=అక్కడ, శాస్త్రదృష్టేన=శాస్త్రమునందు చూడబడిన, కర్మణా=విధానముచేత, బలం=సేనను, విభజచ్చ=వ్యూహముగా చేసి నిలిపెను కూడ.

తా. దశరథకుమారుడైన రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికి, శాస్త్రోక్త విధానమున (గరుడవ్యూహాకారమున) సేనానివేశము చేసెను. 13

మూ. శశాస కపిసేనాం తాం బలాదాదాయ వీర్యవాన్,
అఙ్గదః సహ నీలేన తిష్ఠేదురసి దుర్జయః. 14

ప్ర. అ. శశాస=ఈ విధముగా శాసించెను. వీర్యవాన్=వీర్యవంతుడు, దుర్జయః=జయింపశక్యము కానివాడు అయిన, అఙ్గదః=అంగదుడు, బలాత్=సైన్యమునుండి, తామ్=ఈ, కపిసేనామ్=తన వానరసేనను, ఆదాయ=తీసికొని, నీలేన సహ=నీలునితో కూడ, ఉరసి=వక్షస్థలభాగమునందు, తిష్ఠేత్=నిలచుగాక.

తా. రాము డీ విధముగా సేనానాయకులను శాసించెను. "పరాక్రమవంతుడు, జయింపశక్యము కానివాడు అయిన అంగదుడు ఈ సైన్యమునుండి తనకు చెందిన సేనాభాగమును తీసికొని నీలునితో గరుడాకారములో ఉన్న ఈ వ్యూహము వక్షస్థలమునందు నిలబడవలెను." 14

మూ. తిష్ఠేద్వానరవాహిన్యా వానరౌఘసమావృతః,
ఆశ్రితో దక్షిణం పార్శ్వమృషభో నామ వానరః. 15

ప్ర. అ. ఋషభో నామ=ఋషభుడను పేరు గల, వానరః=వానరుడు, వానరౌఘసమావృతః=వానరుల సముదాయముతో కూడినవాడై, వానరవాహిన్యాః=వానరసేనయొక్క, దక్షిణమ్=కుడి, పార్శ్వమ్=పార్శ్వమును, ఆశ్రితః=ఆశ్రయించినవాడై, తిష్ఠేత్= ఉండుగాక.

తా. ఋషభుడు వానరుల సముదాయముతో కూడి వానరసేన కుడి పార్శ్వమునందు ఉండుగాక. 15

మూ. గన్ధహస్తీవ దుర్ధర్షస్తరస్వీ గన్ధమాదనః,
తిష్ఠేద్వానరవాహిన్యాః సవ్యం పక్షమధిష్ఠితః. 16

ప్ర. అ. గన్ధహస్తీవ=మదగజము వలె, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, తరస్వీ= బలవంతుడైన, గన్ధమాదనః=గంధమాదనుడు, వానరవాహిన్యాః=వానరసేనయొక్క, సవ్యం పక్షమ్=ఎడమపార్శ్వమును, అధిష్ఠితః=అధిష్ఠించినవాడై, తిష్ఠేత్=ఉండుగాక.

తా. మదగజము వలె ఎదిరింప శక్యము కాని, బలశాలియైన గంధమాదనుడు వానరసేన ఎడమపార్శ్వమునందు నిలచుగాక. 16

మూ. మూర్ధ్ని స్థాస్యామ్యహం యత్తో లక్ష్మణేన సమన్వితః,
జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః, 17
ఋక్షముఖ్యా మహాత్మానః కుక్షిం రక్షన్తు తే త్రయః.

ప్ర. అ. అహమ్=నేను, లక్ష్మణేన=లక్ష్మణునితో, సమన్వితః=కూడినవాడనై, యత్తః=సన్నద్ధుడనై, మూర్ధ్ని=శిరోభాగమునందు, స్థాస్యామి=నిలిచెదను. జాంబవాంశ్చ=జాంబవంతుడు, సుషేణశ్చ=సుషేణుడు, వానరః=వానరుడైన, వేగదర్శీ చ=వేగదర్శి, మహాత్మానః=మహాత్ములైన, తే=ఆ, త్రయః=ముగ్గురు, ఋక్షముఖ్యాః=భల్లూకశ్రేష్ఠులు, కుక్షిమ్=కుక్షిప్రదేశమును, రక్షన్తు=రక్షించెదరుగాక.

తా. నేను లక్ష్మణునితో కలిసి యుద్ధసన్నద్ధుడనై శిరఃస్థానమునందు నిలిచెదను. జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి - మహాత్ములైన ఈ ముగ్గురు భల్లూకనాయకులు కుక్షిప్రదేశమును రక్షించెదరుగాక. 17

మూ. జఘనం కపిసేనాయాః కపిరాజో౽భిరక్షతు, 18
పశ్చార్ధమివ లోకస్య ప్రచేతాస్తేజసా వృతః.

ప్ర. అ. తేజసా=తేజస్సుతో, వృతః=కూడిన, ప్రచేతాః=వరుణుడు, లోకస్య=లోకముయొక్క, పశ్చార్ధమివ=పశ్చిమభాగమును వలె, కపిరాజః=సుగ్రీవుడు, కపిసేనాయాః=వానరసేనయొక్క, జఘనమ్=జఘన (పృచ్ఛ) భాగమును, అభిరక్షతు=రక్షించుగాక.

తా. తేజస్సుతో కూడిన వరుణుడు పశ్చిమదిక్కును రక్షించునట్లు సుగ్రీవుడు వానరసేన పృచ్ఛభాగమును రక్షించుగాక. 18

మూ. సువిభక్తమహావ్యూహా మహావానరరక్షితా, 19
అనీకినీ సా విబభౌ యథా ద్యౌః సాభ్రసంప్లవా.

ప్ర. అ. సువిభక్తమహావ్యూహా=బాగుగా విభజింపబడిన గొప్ప వ్యూహములు గలది, మహావానరరక్షితా=గొప్ప వానరులచేత రక్షింపబడినది అయిన, సా అనీకినీ=ఆ సేన, సాభ్రసంప్లవా=మేఘముల సంచారముతో కూడిన, ద్యౌః ఇవ=ఆకాశమువలె, విబభౌ=ప్రకాశించెను.

తా. వ్యూహరూపమున చక్కగా విభజించి మహావానరులు రక్షించుచున్న ఆ సేన మేఘములు సంచరించుచున్న ఆకాశము వలె ప్రకాశించెను. 19

మూ. ప్రగృహ్య గిరిశృఙ్గాణి మహతశ్చ మహీరుహాన్, 20
ఆసేదుర్వానరా లఙ్కాం విమర్దయిషవో రణే.

ప్ర. అ. వానరాః=వానరులు, గిరిశృఙ్గాణి=పర్వతశిఖరములను, మహతః=గొప్ప, మహీరుహాన్=వృక్షములను, ప్రగృహ్య=గ్రహించి, రణే=యుద్ధమునందు, విమర్దయిషవః=మర్దించ గోరుచున్నవారై, లఙ్కామ్=లంకను, ఆసేదుః=పొందిరి.

తా. వానరులు యుద్ధములో రాక్షసులను (లేదా లంకను) మర్దించవలెనను కోరికతో పర్వత శిఖరములను, పెద్ద వృక్షములను గ్రహించి లంకను చేరిరి. 20

మూ. శిఖరైర్వా శిలాభిర్వా లఙ్కాం ముష్టిభిరేవ వా, 21
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరిపుఙ్గవాః.

ప్ర. అ. ఏతామ్=ఈ, లఙ్కామ్=లంకను, శిఖరైః=శిఖరములచేత గాని, ముష్టిభిరేవ వా=పిడికిళ్ళచేత గాని, శిలాభిః=చిమ్మెరదము, ఇతి=అని, సర్వే=సమస్తమైన, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, మనాంసి=మనస్సులను, దధిరే స్మ=ధరించిరి.

తా. "ఈ లంకాపట్టణముపై పర్వతశిఖరములను విసిరెదము; లేదా పిడికిళ్ళతో గ్రుద్దులు కొట్టెదము" అని ఆ వానరవీరులు మనస్సులలో నిశ్చయించుకొనిరి. 21

మూ. తతో రామో మహాతేజాః సుగ్రీవ మిదమబ్రవీత్,
సువిభక్తాని సైన్యాని శుక ఏష విముచ్యతామ్. 22

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, సుగ్రీవమ్=సుగ్రీవునిగూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. సైన్యాని=సైన్యములు, సువిభక్తాని=బాగుగ విభజింపబడినవి. ఏషః=ఈ, శుకః=శుకుడు, విముచ్యతామ్=విడువబడుగాక.

తా. పిమ్మట మహాతేజశ్శాలియైన రాముడు సుగ్రీవునితో ఇట్లు పలికెను. "సైన్యములను వ్యూహరూపమున నిలుపుట పూర్తియైనది గాన శుకుని విడిపింపుము." 22

మూ. రామస్య తు వచః శ్రుత్వా వానరేన్ద్రో మహాబలః, 23
మోచయామాస తం దూతం శుకం రామస్య శాసనాత్.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, వానరేన్ద్రః=సుగ్రీవుడు, రామస్య=రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, రామస్య=రామునియొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, తం దూతమ్=ఆ దూతయైన, శుకమ్=శుకుని, మోచయామాస=విడిపించెను.

తా. గొప్ప బలము గల సుగ్రీవుడు రాముని మాట విని, ఆతని ఆజ్ఞానుసారము దూతయైన శుకుని విడిపించెను. 23

మూ. మోచితో రామవాక్యేన వానరైశ్చ విపీడితః,
శుకః పరమసంత్రస్తో రక్షోధిపముపాగమత్. 24

ప్ర. అ. వానరైః=వానరులచేత, విపీడితః=పీడింపబడినవాడు, రామవాక్యేన=రాముని వాక్యముచేత, మోచితః=విడిపింపబడినవాడు అయిన, శుకః=శుకుడు, పరమసంత్రస్తః=చాలా భయపడినవాడై, రక్షోధిపమ్=రావణుని, ఉపాగమత్=చేరెను.

తా. వానరులచేత పీడితుడై రామునిచేత విడిపింపబడిన ఆ శుకుడు చాల భయపడుచు రావణునివద్దకు వెళ్ళెను. 24

మూ. రావణః ప్రహసన్నేవ శుకం వాక్యమువాచ హ, 25
కిమిమౌ తే సితౌ పక్షౌ లూనపక్షశ్చ దృశ్యసే,
కచ్చిన్నానేకచిత్తానాం తేషాం త్వం వశమాగతః. 26

ప్ర. అ. రావణః=రావణుడు, ప్రహసన్నేవ=నవ్వుచు, శుకమ్=శుకుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను. తే=నీయొక్క, ఇమౌ=ఈ, పక్షౌ=రెక్కలు, సితౌ కిమ్=కట్టబడినవా? లూనపక్షశ్చ=పీకివేయబడిన, రెక్కలు గలవాడవుగ కూడ, దృశ్యసే=కనబడుచున్నావు. త్వమ్=నీవు, అనేకచిత్తానామ్=అనేకవిధములైన మనస్సులు గల, తేషామ్=వారియొక్క, వశమ్=వశమును, న ఆగతః కచ్చిత్=పొందలేదు గదా!

తా. ఆతని వికృతరూపము చూచి రావణుడు నవ్వుచు ఇట్లు పలికెను. "నీ రెక్కలను కట్టివేసినారా? నీ రెక్కలు ఊడిపోయినట్లు కూడ కనబడుచున్నవి. నీవు అనేకవిధములైన ఆలోచనలు చేయు శత్రువుల చేతిలో చిక్కలేదు కదా?" 25, 26

మూ. తతస్స భయసంవిగ్న స్తదా రాజ్ఞాభిచోదితః,
వచనం ప్రత్యువాచేదం రాక్షసాధిపముత్తమమ్. 27
సాగరస్యోత్తరే తీరేఽబ్రువం తే వచనం తథా,
యథాసందేశమక్లిష్టం సాన్త్వయన్ శ్లక్ష్ణయా గిరా. 28

ప్ర. అ. తతః=పిమ్మట, భయసంవిగ్నః=భయముచే భ్రాంతిని పొందిన, సః=ఆ శుకుడు, తదా=అప్పుడు, రాజ్ఞా=రాక్షసరాజగు రావణునిచే, అభిచోదితః=ప్రేరితుడై, రాక్షసాధిపమ్=రావణుని గూర్చి, ఉత్తమమ్=ఉత్తమమైన, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను. సాగరస్య=సముద్రముయొక్క, ఉత్తరే తీరే=ఆవతలి ఒడ్డునందు, శ్లక్ష్ణయా=మృదువైన,

గిరా=వాక్కుతో, సాన్త్వయన్=బ్రతిమాలుచు, యథాసందేశమ్=సందేశానుసారముగా, అక్లిష్టమ్=దోషములు లేకుండా, తే=నీయొక్క, వచనమ్=వచనమును, తథా=అట్లు, అబ్రవమ్=పలికితిని.

తా. అతడు రావణునకు చక్కగా ప్రత్యుత్తర మిచ్చెను -- "నేను సముద్రము అవతలి తీరము చేరి, నీ సందేశము ప్రకారము మృదువైన మాటలతో బ్రతిమాలుకొనుచు, దోషము లేని రీతి విధమున, నీ మాటలు యథాతథముగా చెప్పితిని." 27, 28

మూ. క్రుద్ధైస్తైరహముత్ప్లుత్య దృష్టమాత్రః ప్లవఙ్గమైః,
గృహీతోఽస్మ్యపి చారబ్ధో హన్తుం లోప్తుం చ ముష్టిభిః. 29

ప్ర. అ. దృష్టమాత్రః=చూడబడిన, అహమ్=నేను, క్రుద్ధైః=కోపించిన, తైః ప్లవఙ్గమైః=వానరులచేత, ఉత్ప్లుత్య=ఎగిరి, గృహీతః అస్మి=గ్రహింపబడితిని. అపి చ=మరియు, ముష్టిభిః=పిడికిళ్లచేత, హన్తుమ్=కొట్టుటకు, లోప్తుం చ=పీకివేయుటకు, ఆరబ్ధః=ప్రారంభింపబడితిని.

తా. నన్ను చూడగానే ఆ వానరులు కోపముతో పైకి ఎగిరి నన్ను పట్టుకొని పిడికిళ్ళతో కొట్టుట, నా రెక్కలు పీకుట ప్రారంభించిరి. 29

మూ. న తే సంభాషితుం శక్యాః సంప్రశ్నోఽత్ర న విద్యతే,
ప్రకృత్యా కోపనాస్తీక్ష్ణా వానరా రాక్షసాధిప. 30

ప్ర. అ. రాక్షసాధిప=రాక్షసరాజా! తే=ఆ వానరులు, సంభాషితుమ్=మాటలాడుటకు, న శక్యాః=శక్యమైనవారు కారు. అత్ర=వారి విషయమున, సంప్రశ్నః=ప్రశ్నించుట, న విద్యతే=లేదు. వానరాః=వానరులు, ప్రకృత్యా=స్వభావముచేత, కోపనాః=కోపము గలవారు; తీక్ష్ణాః=తీవ్రమైనవారు.

తా. మహారాజా! ఆ వానరులతో మాటలాడుట శక్యముకాదు. వారిని ప్రశ్నించే అవకాశమే లేదు. వాళ్ళు కోపస్వభావులు; తీక్ష్ణమైనవారు. 30

మూ. స చ హన్తా విరాధస్య కబన్ధస్య ఖరస్య చ,
సుగ్రీవసహితో రామః సీతాయాః పదమాగతః. 31

ప్ర. అ. విరాధస్య=విరాధునకు, కబన్ధస్య=కబంధునకు, ఖరస్య చ=ఖరునకు, హన్తా=సంహారకుడైన, సః రామః=ఆ రాముడు, సుగ్రీవసహితః=సుగ్రీవునితో కూడినవాడై, సీతాయాః=సీతయొక్క, పదమ్=స్థానమును, ఆగతః=పొందినాడు.

తా. విరాధుణ్ణి, కబంధుణ్ణి, ఖరుణ్ణి చంపిన ఆ రాముడు సుగ్రీవునితో కూడ సీత ఉన్న ప్రదేశమునకు వచ్చి ఉన్నాడు. 31

మూ. స కృత్వా సాగరే సేతుం తీర్త్వా చ లవణోదధిమ్,
ఏష రక్షాంసి నిర్ధూయ ధన్వీ తిష్ఠతి రాఘవః. 32

ప్ర. అ. ఏషః=అట్టి ఈ, రాఘవః=రాముడు, సాగరే=సాగరమునందు, సేతుమ్=సేతువును, కృత్వా=నిర్మించి, లవణోదధిమ్=లవణసముద్రమును, తీర్త్వా చ=దాటి, రక్షాంసి=రాక్షసులను, నిర్ధూయ=తృణీకరించి, ధన్వీ=ధనుర్ధరుడై, తిష్ఠతి=నిలచి ఉన్నాడు.

తా. అట్టి ఈ రాముడు సాగరముమీద సేతువు నిర్మించి, లవణసముద్రమును దాటి, రాక్షసులను ఎగురగొట్టి (తృణీకరించి) ధనస్సు చేత బూని నిలచి ఉన్నాడు! 32

మూ. ఋక్షవానరసంఘానామనీకాని సహస్రశః,
గిరిమేఘనికాశానాం ఛాదయన్తి వసున్ధరామ్. 33

ప్ర. అ. గిరిమేఘనికాశానామ్=పర్వతములతోను, మేఘములతోను సమానులైన, ఋక్షవానరసంఘానామ్=భల్లూకములయొక్క, వానరులయొక్క సంఘములయొక్క, సహస్రశః= వేలకొలది, అనీకాని=సేనలు, వసున్ధరామ్=భూమిని, ఛాదయన్తి=కప్పుచున్నవి.

తా. పర్వతములవలె, మేఘముల వలె ఉన్న భల్లూకముల, వానరుల సముదాయములతో ఏర్పడిన, వేలకొలది అనీకములు (సేనావిభాగములు) భూతలమును కప్పివేసి ఉన్నవి. 33

మూ. రాక్షసానాం బలౌఘస్య వానరేన్ద్రబలస్య చ,
నైతయోర్విద్యతే సంధిర్దేవదానవయోరివ. 34

ప్ర. అ. రాక్షసానాం=రాక్షసులయొక్క, బలౌఘస్య=సైన్యమునకు, వానరేన్ద్రబలస్య చ=వానరనాయకుల సైన్యమునకు, ఏతయోః=ఈ రెండింటికి, దేవదానవయోరివ=దేవదానవులకు వలె, సంధిః=సంధి, న విద్యతే=లేదు.

తా. రాక్షసుల సైన్యము, వానరుల సైన్యము, ఈ రెండు సైన్యములకు మధ్య దేవదానవుల మధ్యవలె సంధి అనేది ఉండదు. 34

మూ. పురా ప్రాకారమాయాన్తి క్షిప్రమేకతరం కురు,
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు యుద్ధం వాపి ప్రదీయతామ్. 35

ప్ర. అ. ప్రాకారమ్=ప్రాకారమును గూర్చి, పురా ఆయాన్తి=రాగలరు. క్షిప్రమ్=శీఘ్రముగా, ఏకతరమ్=ఒక పనిని, కురు=చేయుము. అస్మై=ఈ రామునకు, ఆశు=వెంటనే, సీతామ్=సీతను, ప్రయచ్ఛ వా=ఇవ్వనైనా ఇమ్ము,

యుద్ధం వా అపి=యుద్ధమైనా, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక !

తా. ఆ వానరులు ప్రాకారము దగ్గరికి రాగలరు. అందుచేత వెంటనే రామునకు సీతనైనా ఇచ్చివేయుము; లేదా యుద్ధమైనా ఇమ్ము (చేయుము). శీఘ్రముగా ఏదో ఒకటి చేయుము. 35

మూ. శుకస్య వచనం శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్,
రోషసంరక్తనయనో నిర్దహన్నివ చక్షుషా. 36

ప్ర. అ. రావణః=రావణుడు, శుకస్య=శుకునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, రోషసంరక్తనయనః=రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, చక్షుషా= నేత్రముచేత, నిర్దహన్నివ=కాల్చివేయుచున్నవాడు వలె, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. శుకుని మాటలు విని రావణుడు, రోషముచేత కండ్లు ఎఱ్ఱబడగా చూపుతో అతనిని కాల్చివేయుచున్నాడా అన్నట్లు చూచుచు వాక్యము పలికెను.

మూ. యది మాం ప్రతియుధ్యేరన్ దేవగన్ధర్వదానవాః,
నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయాదపి. 37

ప్ర. అ. దేవగన్ధర్వదానవాః=దేవతలు, గంధర్వులు, దానవులు, మామ్=నన్ను, ప్రతియుధ్యేరన్నపి=ఎదిరించి యుద్ధము చేసినను, సర్వలోకభయాదపి=సకలలోకములనుండి భయము కలిగినా గూడ, సీతామ్=సీతను, నైవ ప్రదాస్యామి=ఇవ్వను.

తా. నాకు సర్వలోకములనుండి భయము కలిగినను, దేవతలు, గంధర్వులు, దానవులు నాకు ఎదురుగా నిలచి యుద్ధము చేసినను సీతను ఇవ్వను. 37

మూ. కదా సమభిధావన్తి మామకా రాఘవం శరాః,
వసన్తే పుష్పితం మత్తా భ్రమరా ఇవ పాదపమ్. 38

ప్ర. అ. మామకాః=నాకు సంబంధించిన, శరాః=బాణములు, రాఘవమ్= రాముణ్ణి గూర్చి, వసన్తే=వసంతఋతువునందు, పుష్పితమ్=పుష్పించిన, పాదపమ్= వృక్షమునుగూర్చి, మత్తాః=మదించిన, భ్రమరాః ఇవ=తుమ్మెదలు వలె, కదా=ఎప్పుడు, సమభిధావన్తి=శీఘ్రముగా వెళ్లునో కదా ?

తా. వసంతఋతువులో మదించిన తుమ్మెదలు పుష్పించిన వృక్షము మీదికి శీఘ్రముగ వెళ్లినట్లు నా బాణములు రాముని మీదికి శీఘ్రముగా ఎప్పుడు వెళ్లి పడునో కదా! 38

మూ. కదా శోణితదిగ్ధాఙ్గం దీప్తైః కార్ముకవిచ్యుతైః,
శరైరాదీపయిష్యామి ఉల్కాభిరివ కుఞ్జరమ్. 39

ప్ర. అ. శోణితదిగ్ధాఙ్గమ్=రక్తముచేత పూయబడిన శరీరము గల ఆ రాముణ్ణి, కార్ముకవిచ్యుతైః=ధనస్సునుండి బయలుదేరిన, దీప్తైః=ప్రజ్వలించుచున్న, శరైః=బాణములచేత, కుఞ్జరమ్= ఏనుగును, ఉల్కాభిరివ=కొరవులచేత వలె, కదా=ఎప్పుడు, ఆదీపయిష్యామి=మండింపచేసెదనో !

తా. ఏనుగుల మీద కొరవులు విసిరి పీడించినట్లు ధనస్సునుండి బయల్వెడలిన ప్రజ్వలించుచున్న బాణములచేత, రక్తముతో తడిసిన దేహముగల ఆ రాముణ్ణి ఏనాడు పీడించెదనో కదా ! 39

మూ. తచ్చాస్య బలమాదాస్యే బలేన మహతా వృతః,
జ్యోతిషామివ సర్వేషాం ప్రభాముద్యన్దివాకరః. 40

ప్ర. అ. ఉద్యన్=ఉదయించుచున్న, దివాకరః=సూర్యుడు, సర్వేషామ్=సమస్తమైన, జ్యోతిషామ్= నక్షత్రములయొక్క, ప్రభామివ=కాంతిని వలె, మహతా=గొప్ప, బలేన=సేనతో, వృతః=కూడినవాడనై, అస్య= ఇతనియొక్క, తత్=ఆ, బలమ్=బలమును, ఆదాస్యే=గ్రహించగలను.

తా. ఉదయించుచున్న సూర్యుడు సమస్తనక్షత్రముల కాంతిని హరించి నట్లు, నేను గొప్ప సైన్యముతో కూడి ఆతని సైన్యమునంతను (లేదా బలమును) లాగివేసెదను. 40

మూ. సాగరస్యేవ మే వేగో మారుతస్యేవ మే బలమ్, 41
న చ దాశరథిర్వేద తేన మాం యోద్ధుమిచ్ఛతి.

ప్ర. అ. మే=నాయొక్క, వేగః=వేగము, సాగరస్యేవ=సముద్రముయొక్క వేగమువంటిది. మే=నాయొక్క, బలమ్=బలము, మారుతస్యేవ=వాయు వుయొక్క బలమువంటిది. దాశరథిః=రాముడు, న చ వేద=ఎరుగడు. తేన=ఆ కారణముచేతనే, మామ్=నన్ను, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు.

తా. నా వేగము సముద్రవేగము వంటిది. నా బలము వాయు బలమువంటిది. రామునకు ఈ విషయము తెలియదు. అందుచేతనే నాతో యుద్ధానికి వచ్చుచున్నాడు. 41

మూ. న మే తూణీశయాన్ బాణాన్ సవిషానివ పన్నగాన్,
రామః పశ్యతి సంగ్రామే తేన మాం యోద్ధుమిచ్ఛతి. 42

ప్ర. అ. సవిషాన్=విషముతో కూడిన, పన్నగానివ=సర్పములవంటి, తూణీశయాన్=అంబులపొదిలో ఉన్న, మే బాణాన్=నా బాణములను, రామః=రాముడు, సంగ్రామే=యుద్ధమునందు, న పశ్యతి=చూడలేదు. తేన=ఆ కారణముచేతనే, మామ్=నన్ను, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు.

తా. నా అంబులపొదిలోని, విషముతో కూడిన పాములవంటి బాణాలను రాము డెన్నడూ యుద్ధములో చూడలేదు; అందుచేతనే నాతో యుద్ధము చేయాలని కోరుచున్నాడు. 42

మూ. న జానాతి పురా వీర్యం మమ యుద్ధే స రాఘవః,
మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితామ్. 43
జ్యాశబ్దతుములాం ఘోరామార్తగీతమహాస్వనామ్,
నారాచతలసంనాదాం తాం మమాహితవాహినీమ్. 44
అవగాహ్య మహారఙ్గం వాదయిష్యామ్యహం రణే.

ప్ర. అ. సః రాఘవః=ఆ రాముడు, పురా=పూర్వము, యుద్ధే=యుద్ధమునందు, మమ=నాయొక్క, వీర్యమ్=పరాక్రమమును, న జానాతి=ఎరుగడు. అహమ్=నేను, రణే=యుద్ధమునందు, తామ్=ఆ, మమ= నాయొక్క, అహితవాహినీమ్=శత్రుసేన అనే, మహారఙ్గమ్=గొప్ప రంగస్థలమును, అవగాహ్య=ప్రవేశించి, శరకోణైః=శరము లను కోణములచేత (వీణకుల వ్రేలికి తొడుగుకొను లోహమయమైన తొడుగు), ప్రవాదితామ్=మ్రోగింపబడినది, జ్యాశబ్దతుములామ్=నారియొక్క శబ్దముచేత వ్యాకులము, ఘోరామ్=భయంకరము, ఆర్తగీతమహాస్వనామ్=పీడితుల ఏడ్పు అనే గొప్ప ధ్వని కలది, నారాచతలసంనాదామ్= నారాచబాణముల క్రింది భాగముల ధ్వని కలది అయిన, చాపమయీమ్=ధనస్సు అనే , మమ=నాయొక్క, వీణామ్=వీణను, వాదయిష్యామి=వాయించెదను.

తా. ఆ రాముడు పూర్వమెన్నడూ యుద్ధములో నా పరాక్రమమును చవి చూడలేదు. నేను యుద్ధమునందు శత్రుసేన అనే మహారంగములో ప్రవేశించి బాణము లనే కోణముచేత మ్రోగింపబడిన నారి చేయు ధ్వనులతో వ్యాకులము, భయంకరము, దీనాలాపముల ధ్వనులతో నిండినది, నారాచబాణముల మొదళ్ల ధ్వనులతో కూడినది అయిన నా ధనస్సు అనే వీణను వాయించెదను.43, 44

మూ. న వాసవేనాపి సహస్రచక్షుషా
యుద్ధేఽస్మి శక్యో వరుణేన వా స్వయమ్,
యమేన వా ధర్షయితుం శరాగ్నినా
మహాహవే వైశ్రవణేన వా స్వయమ్. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుర్వింశః సర్గః.

ప్ర. అ. సహస్రచక్షుషా=వెయ్యి నేత్రములు గల, వాసవేనాపి=దేవేంద్రునిచేత గాని, స్వయమ్=స్వయముగా, వరుణేనాపి=వరుణునిచేత గాని, యుద్ధే=యుద్ధమునందు, యమేన వా=యమునిచేత గాని, మహాహవే=గొప్ప యుద్ధమునందు, స్వయమ్=స్వయముగా, వైశ్రవణేన వా=కుబేరునిచేత గాని, శరాగ్నినా=బాణాగ్నిచేత, ధర్షయితుమ్=ఎదిరించుటకు, శక్యః=శక్యమైనవాడను, న=కాను.

తా. వేయి నేత్రము లున్న దేవేంద్రుడు గాని, సాక్షాత్తు వరుణుడు గాని, యముడు గాని, సాక్షాత్తు కుబేరుడు గాని నన్ను మహాయుద్ధములో బాణాగ్నితో ఎదుర్కొనజాలరు. 45

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరువదినాల్గవసర్గ సమాప్తము.

# అథ పఞ్చవింశః సర్గః

[రావణుడు శుకసారణులను గూఢచారులుగా వానరసేనలోనికి పంపుట; విభీషణుడు వాళ్ళను గుర్తించి పట్టుకొనుట; రాముని అనుగ్రహముచేత విడువబడి వాళ్లు రాముని సందేశముతో లంకకు వెళ్లి రావణునికి ఉపదేశించుట.]

మూ. సబలే సాగరం తీర్ణే రామే దశరథాత్మజే,
అమాత్యౌ రావణః శ్రీమానబ్రవీచ్ఛుకసారణౌ. 1

ప్ర. అ. సబలే=సైన్యముతో కూడిన, దశరథాత్మజే=దశరథపుత్రు డైన, రామే=రాముడు, సాగరమ్= సముద్రమును, తీర్ణే=దాటినవాడగుచుండగా, శ్రీమాన్=శ్రీమంతుడైన, రావణః=రావణుడు, అమాత్యౌ=మంత్రులైన, శుకసా రణౌ=శుకసారణులను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. దశరథకుమారుడైన రాముడు సైన్యముతో సముద్రము దాటిన పిమ్మట శ్రీమంతుడైన రావణుడు మంత్రులైన శుకసారణులతో ఇట్లు పలికెను.

వి. వెనుక చెప్పిన శుకుడు ఈ శుకుడు వేరని వ్యాఖ్యాతలు వ్రాసిరి. నిజానికి వెనుకటి సర్గలో ఉన్న శుకవృత్తాంతము ప్రక్షిప్త మని తోచును. రావణుడు ప్రత్యక్షముగా (రహస్యముగా గాక) సుగ్రీవునికి ఆ విధముగా సందేశము పంపడము, అతడు తిరిగి వచ్చిన పిమ్మట రావణుడు తన పరాక్రమమును వర్ణించుకొనుచు రామునితో యుద్ధము ఎప్పుడు చేయుదునా అన్నట్లు మాటలాడడము, ధనుస్సు అనే వీణ వాయిస్తూ యుద్ధరంగ మనే సంగీతరంగంలో తిరిగెదను అని చెప్పుచు రూపకప్రయోగము, ఇదంతా అసంగతముగానే ఉన్నది. ఆ శుకవృత్తాంతము ప్రాచ్యపాఠములో లేదు. 1

మూ. సమగ్రం సాగరం తీర్ణం దుస్తరం వానరం బలమ్,
అభూతపూర్వం రామేణ సాగరే సేతుబన్ధనమ్. 2

ప్ర. అ. సమగ్రమ్=సమస్తమైన, వానరమ్=వానరులకు సంబంధమైన, బలమ్=సేన, దుస్తరమ్=దాట శక్యము కాని, సాగరమ్=సముద్రమును, తీర్ణమ్=దా టినది. రామేణ=రామునిచేత, సాగరే=సముద్రమునందు, అభూతపూర్వమ్=పూర్వ మెన్నడూ లేని, సేతుబన్ధనమ్=సేతుబంధనము (చేయబడినది).

తా. వానరసైన్య మంతా దాట శక్యము కాని సాగరమును దాటినది. రాముడు సాగరము మీద పూర్వ మెన్నడూ ఎవ్వరూ చేయని సేతునిర్మాణము చేసినాడు. 2

మూ. సాగరే సేతుబన్ధం తం న శ్రద్దధ్యాం కథంచన,
అవశ్యం చాపి సంఖ్యేయం తన్మయా వానరం బలమ్. 3

ప్ర. అ. సాగరే=సముద్రముమీద, తమ్=ఆ, సేతుబన్ధమ్=సేతుబంధ మును, కథంచన=ఏ విధముగానూ కూడ, న శ్రద్దధ్యామ్=నమ్మను. తత్=ఆ, వానరం బలమ్=వానరసేన, మయా=నాచేత, అవశ్యమ్=తప్పకుండగా, సంఖ్యేయం చ=లెక్కపెట్టదగినది కూడ.

తా. రాముడు సముద్రము మీద సేతుబంధము చేసినా డను విషయమును నేను ఏ విధముగానూ నమ్మలేకున్నాను. ఆ వానరసైన్య మెంత ఉన్నదో లెక్కపెట్టవలసి కూడ ఉన్నది. 3

మూ. భవన్తౌ వానరం సైన్యం ప్రవిశ్యానుపలక్షితౌ,
పరిమాణం చ వీర్యం చ యే చ ముఖ్యాః ప్లవంగమాః. 4
మన్త్రిణో యే చ రామస్య సుగ్రీవస్య చ సంగతాః,
యే పూర్వ మభివర్తన్తే యే చ శూరాః ప్లవఙ్గమాః. 5
స చ సేతుర్యథా బద్ధః సాగరే సలిలార్ణవే,
నివేశం చ యథా తేషాం వానరాణాం మహాత్మనామ్. 6
రామస్య వ్యవసాయం చ వీర్యం ప్రహరణాని చ,
లక్ష్మణస్య చ వీరస్య తత్త్వతో జ్ఞాతుమర్హథః. 7

ప్ర. అ. భవన్తౌ=మీరిద్దరూ, అనుపలక్షితౌ=చూడబడనివారై, వానరమ్=వానరుల సంబంధమైన, సైన్యమ్=సైన్యమును, ప్రవిశ్య=ప్రవేశించి, పరిమాణం చ=సేనాపరిమాణమును, వీర్యం చ=పరాక్రమమును, యే=ఏ, ప్లవఙ్గమాః=వాన రులు, ముఖ్యాః=ముఖ్యులో, రామస్య=రామునియొక్క, సుగ్రీవస్య చ=సుగ్రీవుని యొక్క, యే=ఏ, మన్త్రిణః=మంత్రులు, సంగతాః=కలిసి వచ్చినారో, యే=ఏ వరు, పూర్వమ్=ముందుగా, అభివర్తన్తే=ఉన్నారో, యే=ఏ, ప్లవఙ్గమాః=వానరులు, శూరాః=శూరులో, సలిలార్ణవే=జలపూర్ణమైన, సాగరే=సాగరముమీద, సః=ఆ, సేతుః=సేతువు, యథా=ఎట్లు, బద్ధః=కట్టబడినదో, మహాత్మనామ్=మహాత్ములైన, తేషాం వానరాణామ్=ఆ వానరులయొక్క, నివేశమ్=నివేశమును, యథా=ఎట్లు చేసెనో, రామస్య=రామునియొక్క, వ్యవసాయం చ=ఉద్యమమును, వీర్యమ్=ప రాక్రమమును, ప్రహరణాని చ=ఆయుధములను, వీరస్య=వీరుడైన, లక్ష్మణస్య చ=లక్ష్మణుని ఉద్యమమును ఆయుధములను, తత్త్వతః=యథార్థముగా, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, అర్హథః=తగి ఉన్నారు.

తా. మీరిద్దరూ ఎవరికీ తెలియకుండగా వానరసైన్యములో ప్రవేశించి ఆ సైన్యము ఎంత ఉన్నదో, దాని బలము ఎట్టిదో, దానిలో ముఖ్యులైన వానరులు ఎవరో, సముద్రముమీద ఆ సేతువును ఎట్లు నిర్మించినారో, మహాత్ములైన ఆ వానరులను ఎట్లు నిలిపినారో, రామసుగ్రీవులతో కలిసి పని చేయుచున్న

మంత్రులు ఎవరో, శూరులైన ఏ వానరులు సైన్యానికి ముందు ఉన్నారో, రామలక్ష్మణుల ఉద్యమము ఎట్లు ఉన్నదో, వారివద్ద ఏ ఆయుధములు ఉన్నవో యథార్థముగా తెలిసికొని రండు. 4 - 7

మూ. కశ్చ సేనాపతిస్తేషాం వానరాణాం మహాత్మనామ్,
తచ్చ జ్ఞాత్వా యథాతత్త్వం శీఘ్రమాగన్తుమర్హథః. 8

ప్ర. అ. మహాత్మనామ్=మహాత్ములైన, తేషామ్=ఆ, వానరాణామ్=వానరులయొక్క, సేనాపతిః=సేనాపతి, కః=ఎవరు. తచ్చ=దానిని కూడ, యథాతత్త్వమ్=యథార్థముగా, జ్ఞాత్వా=తెలిసికొని, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆగన్తుమ్=వచ్చుటకు, అర్హథః=తగి ఉన్నారు.

తా. మహాత్ములైన ఆ వానరుల సేనాపతి ఎవరు ? ఆ విషయము కూడ తెలిసికొని శీఘ్రముగా రండు. 8

మూ. ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ,
హరిరూపధరౌ వీరౌ ప్రవిష్టౌ వానరం బలమ్. 9

ప్ర. అ. ఇతి=ఇట్లు, ప్రతిసమాదిష్టౌ=ఆజ్ఞాపించబడిన, వీరౌ=వీరులైన, శుకసారణౌ=శుకసారణులు అను, రాక్షసౌ=రాక్షసులు, హరిరూపధరౌ=వానరరూపము ధరించినవారై, వానరమ్=వానరుల సంబంధమైన, బలమ్=సేనను, ప్రవిష్టౌ=ప్రవేశించిరి.

తా. రావణుడు ఈ విధముగా ఆజ్ఞాపించగా, వీరులైన శుకసారణులు అను రాక్షసులు వానరరూపము ధరించి వానరసైన్యములో ప్రవేశించిరి. 9

మూ. తతస్తద్వానరం సైన్యమచిన్త్యం లోమహర్షణమ్,
సంఖ్యాతుం నాధ్యగచ్ఛేతాం తదా తౌ శుకసారణౌ. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తౌ=ఆ, శుకసారణౌ=శుకసారణులు, అచిన్త్యమ్=ఊహించ శక్యము కాని, లోమహర్షణమ్=రోమాంచమును కలిగించు, తత్=ఆ, వానరమ్=వానరుల సంబంధమైన, సైన్యమ్=సైన్యమును, సంఖ్యాతుమ్=లెక్క పెట్టుటకు, తదా=అప్పుడు, నాధ్యగచ్ఛేతామ్=పొందలేదు (సమర్థులు కాలేదు).

తా. అప్పుడు ఆ శుకసారణులు ఊహింప శక్యము కాని, రోమాంచ జనకమైన ఆ వానరసైన్యమును లెక్కింపజాలకపోయిరి. 10

మూ. తత్స్థితం పర్వతాగ్రేషు నిర్ఝరేషు గుహాసు చ,
సముద్రస్య చ తీరేషు వనేషూపవనేషు చ. 11

తరమాణం చ తీర్ణం చ తర్తుకామం చ సర్వశః,
నివిష్టం నివిశచ్చైవ భీమనాదం మహాబలమ్, 12
తద్బలార్ణవమక్షోభ్యం దదృశాతే నిశాచరౌ.

ప్ర. అ. పర్వతాగ్రేషు=పర్వతశిఖరములయందు, శైలేషు=పెంటయేళ్లయందు, గుహాసు చ=గుహలలోను, సముద్రస్య=సముద్రముయొక్క, తీరేషు=తీరప్రదేశములయందు, వనేషు=వనములయందు, ఉపవనేషు చ= ఉద్యానములయందు, స్థితమ్=ఉన్నది, తరమాణమ్=దాటుచున్నది, తీర్ణం చ=దాటినది, తర్తుకామం చ=దాట గోరుచున్నది, సర్వశః=అన్ని వైపులా, నివిష్టమ్=నిలుపబడినది, నివిశచ్చైవ=నిలచుచున్నది, భీమనాదమ్=భయంకరమైన ధ్వని గలది, మహాబలమ్=గొప్ప బలము గలది, అక్షోభ్యమ్=క్షోభింప శక్యము కానిది అయిన, తద్బలార్ణవమ్=ఆ సేనాసముద్రమును, నిశాచరౌ=రాక్షసులు, దదృశాతే=చూచిరి.

తా. ఆ సైన్యము పర్వతశిఖరములమీదా, కొండకాలువలలోను, గుహలలోను, సముద్రతీరప్రదేశములలోను, వనములలోను, ఉద్యానములలోను ఉండెను. కొంత సేన దాటగా మరికొంత సేన దాటుచుండెను. మరికొంత సేన దాటుటకు ప్రయత్నించుచుండెను. భయంకరమైన ధ్వని చేయుచున్న, గొప్ప బలము గల ఆ సేనలో కొంత భాగము ఒక పద్ధతి ప్రకారము నిలుపబడి ఉండెను. ఒక భాగము నిలుపబడుచుండెను. క్షోభింప శక్యము కాని అట్టి సేనాసముద్రమును ఆ రాక్షసు లిద్దరూ చూచిరి. 11, 12

మూ. తౌ దదర్శ మహాతేజాః ప్రతిచ్ఛన్నౌ విభీషణః, 13
ఆచచక్షే స రామాయ గృహీత్వా శుకసారణౌ.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, విభీషణః=విభీషణుడు, ప్రతిచ్ఛన్నౌ=మరొక రూపముచేత కప్పబడిన, తౌ=వారిద్దరిని, దదర్శ=చూచెను. సః=అతడు, శుకసారణౌ=శుకసారణులను, గృహీత్వా=గ్రహించి, రామాయ=రామునకు, ఆచచక్షే=చెప్పెను.

తా. గొప్ప తేజస్సు గల విభీషణుడు రూపాంతరములో ఉన్న శుకసారణులను ఇద్దరినీ చూచి, పట్టుకొని రామునకు చెప్పెను. 13

మూ. తస్యేమౌ రాక్షసేన్ద్రస్య మన్త్రిణౌ శుకసారణౌ, 14
లఙ్కాయాః సమనుప్రాప్తౌ చారౌ పరపురంజయ.

ప్ర. అ. పరపురంజయ=శత్రుపురములను జయించువాడా ! తస్య=ఆ, రాక్షసేన్ద్రస్య=రాక్షసరాజుయొక్క, మన్త్రిణౌ=మంత్రులైన, ఏతౌ=ఈ, శుకసారణౌ=శుకసారణులు, చారౌ=గూఢచారులుగా, లఙ్కాయాః=లంకనుండి, సమను

ప్రాప్తౌ=వచ్చినారు.

తా. శత్రుపురములను వశింపచేయు రామా ! వీరిద్దరూ రావణుని మంత్రులైన శుకసారణులు. లంకనుండి గూఢచారులుగా వచ్చినారు. 14

మూ. తౌ దృష్ట్వా వ్యథితౌ రామం నిరాశౌ జీవితే తథా, 15
కృతాఞ్జలిపుటౌ భీతౌ వచనం చేదమూచతుః.

ప్ర. అ. తౌ=వారిద్దరూ, రామమ్=రామున్ని, దృష్ట్వా=చూచి, వ్యథితౌ=వ్యథచెందినవారై, తథా=మరియు, జీవితే=జీవితమునందు, నిరాశౌ=ఆశ లేనివారై, భీతౌ=భయపడినవారై, కృతాఞ్జలిపుటౌ=చేయబడిన దోసిళ్లు కలవారై, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ఊచతుః=పలికిరి.

తా. ఆ రాక్షసులిద్దరూ రామున్ని చూచి భయపడి బాధపడుచున్నవారై జీవితముపై నిరాశ చెంది చేతులు జోడించి ఇట్లు పలికిరి. 15

మూ. ఆవామిహాగతౌ సౌమ్య రావణప్రహితావుభౌ, 16
పరిజ్ఞాతుం బలం సర్వం తదిదం రఘునన్దన.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! రఘునన్దన=రామా ! ఆవామ్=మేమిద్దరమూ, రావణప్రహితౌ=రావణునిచేత పంపబడినవారమై, తత్=ఆ, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, బలమ్=సైన్యమును, పరిజ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇహ=ఇక్కడికి, ఆగతౌ=వచ్చినాము.

తా. సౌమ్యుడవైన రామా ! మేము, రావణుడు పంపగా ఈ సైన్యము నంతయూ పరీక్షించి తెలిసికొనుటకు వచ్చినాము. 16

మూ. తయోస్తద్వచనం శ్రుత్వా రామో దశరథాత్మజః, 17
అబ్రవీత్ప్రహసన్వాక్యం సర్వభూతహితే రతః.

ప్ర. అ. దశరథాత్మజః=దశరథుని కుమారుడు, సర్వభూతహితే=సమస్తభూతముల హితమునందు, రతః=ఆసక్తుడు అయిన, రామః=రాముడు, తయోః=వారిద్దరియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, ప్రహసన్=నవ్వుచు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సకలప్రాణుల హితమునందు ఆసక్తి గల దశరథకుమారుడైన రాముడు ఆ ఇద్దరి మాటలు విని నవ్వుచు ఇట్లు పలికెను. 17

మూ. యది దృష్టం బలం సర్వం వయం వా సుసమీక్షితాః, 18
యథోక్తం వా కృతం కార్యం ఛన్దతః ప్రతిగమ్యతామ్.

ప్ర. అ. సర్వమ్=సమస్తమైన, బలమ్=సేన, దృష్టం యది=చూడబడినదా? వయమ్=మేము, సుసమీక్షితాః వా=బాగుగా చూడబడినామా ? యథోక్తమ్=చెప్పబడిన విధముగా, కార్యమ్=కార్యము, కృతం వా=చేయబడినదా? ఛన్దతః=స్వేచ్ఛగా, ప్రతిగమ్యతామ్=తిరిగి వెళ్లబడుగాక.

తా. మీరు సైన్యమునంతటిని చూచినారా ? మమ్ములను కూడ బాగుగా చూచినారా? మీ ప్రభువు ఆదేశించినట్లు పని పూర్తిచేసుకున్నారా? మీ పనులు పూర్తి అయినచో ఇంక స్వేచ్ఛగా తిరిగి వెళ్లవచ్చును. 18

మూ. అథ కించిదదృష్టం వా భూయస్తద్ద్రష్టుమర్హథః, 19
విభీషణో వా కార్త్స్న్యేన పునః సందర్శయిష్యతి.

ప్ర. అ. అథ=లేదా, కించిత్=ఏదైనా, అదృష్టం వా=చూడబడకపోయినా, తత్=దానిని, భూయః=మరల, ద్రష్టుమ్=చూచుటకు, అర్హథః=తగి ఉన్నారు. వా=లేదా, విభీషణః=విభీషణుడు, కార్త్స్న్యేన=పూర్తిగా, పునః=మరల, సందర్శయిష్యతి=చూపగలడు.

తా. ఇంకా ఏమైనా చూడకుండా మిగిలిపోయినచో దానిని మరల చూడవచ్చును. కావలసినచో విభీషణుడు అంతా మీకు పూర్తిగా మరల చూపించగలడు. 19

మూ. న చేదం గ్రహణం ప్రాప్య భేతవ్యం జీవితం ప్రతి, 20
న్యస్తశస్త్రౌ గృహీతౌ చ న దూతౌ వధమర్హతః.

ప్ర. అ. ఇదమ్=ఈ, గ్రహణమ్=గ్రహణమును, ప్రాప్య=పొంది, జీవితం ప్రతి=జీవితమును గూర్చి, న భేతవ్యమ్=భయపడవలసిన పని లేదు. న్యస్తశస్త్రౌ=విడువబడిన ఆయుధములు గల, గృహీతౌ=పట్టుకొనబడిన, దూతౌ=దూతలు, వధమ్=వధము, న అర్హతః=తగరు.

తా. ఈ విధముగా పట్టుబడినందుకు జీవితమును గూర్చి భయపడవలసిన పని లేదు. ఆయుధములు లేని పట్టుబడ్డ దూతలను చంపగూడదు గదా ?

మూ. ప్రచ్ఛన్నౌ చ విముచ్యేతాం చారౌ రాత్రించరావుభౌ, 21
శత్రుపక్షస్య సతతం విభీషణ వికర్షిణౌ.

ప్ర. అ. విభీషణ=విభీషణా ! సతతం=ఎల్లప్పుడు, శత్రుపక్షస్య=శత్రు పక్షమునకు, వికర్షిణౌ=లాగేవారైన (బాధించు), ప్రచ్ఛన్నౌ=మారువేషముచేత కప్పబడిన, చారౌ=గూఢచారులైన, ఉభౌ=ఇద్దరు, రాత్రించరౌ=రాక్షసులను, విముచ్యా=విడువుము.

తా. విభీషణా ! ఎల్లప్పుడు శత్రుపక్షమువారిని పీడించుటకై ప్రయత్నించు, ప్రచ్ఛన్నరూపములో గూఢచారులుగా వచ్చిన ఈ రాక్షసుల నిద్దరినీ విడిచి పెట్టుము. 21

మూ. ప్రవిశ్య నగరీం లఙ్కాం భవద్భ్యాం ధనదానుజః, 22
వక్తవ్యో రక్షసాం రాజా యథోక్తం వచనం మమ.

ప్ర. అ. లఙ్కాం నగరీమ్=లంకానగరమును, ప్రవిశ్య=ప్రవేశించి, రక్షసామ్=రాక్షసులయొక్క, రాజా=రాజైన, ధనదానుజః=కుబేరుని తమ్ముడైన రావణుడు, భవద్భ్యామ్=మీచేత, మమ వచనమ్=నా వచనము, యథోక్తమ్=చెప్పినట్లు, వక్తవ్యః=చెప్పదగినవాడు.

తా. మీరిద్దరు లంకకు వెళ్లి రాక్షసరాజైన రావణునితో నా మాటలు చెప్పినవి చెప్పినట్లుగా చెప్పుడు. 22

మూ. యద్బలం చ సమాశ్రిత్య సీతాం మే హృతవానసి, 23
తద్దర్శయ యథాకామం ససైన్యః సహబాన్ధవః.

ప్ర. అ. యత్=ఏ, బలమ్=బలమును, సమాశ్రిత్య=ఆశ్రయించి, మే=నాయొక్క, సీతామ్=సీతను, హృతవాన్ అసి=హరించినావో, తత్=ఆ బలమును, ససైన్యః=సైన్యసహితుడవై, సహబాన్ధవః=బంధుసహితుడవై, యథాకామమ్=నీ ఇష్టము వచ్చినట్లు, దర్శయ=చూపుము.

తా. నీవు ఏ బలమును చూచుకొని నా సీతను అపహరించినావో ఆ బలమును నీ సైన్యముతోను, బంధువులతోను కలిసి వచ్చి, నీ ఇష్టము వచ్చినట్లు చూపుము. 23

మూ. శ్వః కాలే నగరీం లఙ్కాం సప్రాకారాం సతోరణామ్, 24
రక్షసాం చ బలం పశ్య శరైర్విధ్వంసితం మయా.

ప్ర. అ. శ్వః=రేపు, కాలే=ప్రాతఃకాలమునందు, మయా=నాచేత, శరైః=బాణములచేత, విధ్వంసితమ్=నశింపచేయబడిన, రక్షసామ్=రాక్షసులయొక్క, బలమ్= సైన్యమును, సప్రాకారామ్=ప్రాకారములతో కూడిన, సతోరణామ్=ముఖద్వారములతో కూడిన, లఙ్కాం నగరీమ్=లంకానగరమును, పశ్య=చూడుము.

తా. రేపు ప్రాతఃకాలమునందే ప్రాకారములతోను, ముఖద్వారములతోను కూడిన నీ లంకానగరమును, రాక్షససైన్యమును బాణములచేత

వశింపచేయుచున్నాము; చూచుకొనుము. 24

మూ. క్రోధం భీమమహం మోక్ష్యే ససైన్యే త్వయి రావణ, 25
శ్వః కాల్యే వజ్రవాన్వజ్రం దానవేష్వివ వాసవః.

ప్ర. అ. రావణ=రావణా ! శ్వః=రేపు, కాల్యే=ప్రాతఃకాలమునందు, వజ్రవాన్=వజ్రాయుధము గల, వాసవః=దేవేంద్రుడు, దానవేషు=దానవుల యందు, వజ్రమ్ ఇవ=వజ్రమును వలె, ససైన్యే=సైన్యముతో కూడిన, త్వయి=నీపై, భీమమ్=భయంకరమైన, క్రోధమ్=క్రోధమును, అహమ్=నేను, మోక్ష్యామి=విడచెదను.

తా. రావణా ! నేను రేపు ప్రాతఃకాలమునందే వజ్రమును ధరించిన దేవేంద్రుడు దానవులంపై వజ్రమును విడచినట్లు సైన్యసహితుడవైన నీపై నా భయంకరమైన క్రోధమును విడచెదను. 25

మూ. ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ, 26
జయేతి ప్రతినన్ద్యైనం రాఘవం ధర్మవత్సలమ్,
ఆగమ్య నగరీం లఙ్కామబ్రూతాం రాక్షసాధిపమ్. 27

ప్ర. అ. ఇతి=ఇట్లు, ప్రతిసమాదిష్టౌ=ఆజ్ఞాపించబడిన, రాక్షసౌ=రాక్షసులైన, శుకసారణౌ=శుకసారణులు, ధర్మవత్సలమ్=ధర్మమునందు ఆసక్తి గల, ఏనమ్=ఈ, రాఘవమ్=రాముని, జయ=జయింపుము, ఇతి=అని, ప్రతినన్ద్య=అభినందించి, లఙ్కాం నగరీమ్=లంకాపట్టణమును, ఆగమ్య=పొంది, రాక్షసాధిపమ్=రావణుని గూర్చి, అబ్రూతామ్=పలికిరి.

తా. రామునిచేత ఈ విధముగా ఆజ్ఞాపించబడిన శుకసారణులు ధర్మమునందు ప్రేమ గల రామునకు "జయ విజయీ భవ" అని అభినందించి, లంక చేరి రావణునితో ఇట్లు పలికిరి. 26,27

మూ. విభీషణగృహీతౌ తు వధార్థం రాక్షసేశ్వర,
దృష్ట్వా ధర్మాత్మనా ముక్తౌ రామేణామితతేజసా. 28

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! వధార్థమ్=వధనిమిత్తమై, విభీషణగృహీతౌ=విభీషణునిచేత గ్రహించబడిన మేము, ధర్మాత్మనా=ధర్మాత్ముడు, అమితతేజసా=గొప్ప తేజస్సు గలవాడు అయిన, రామేణ=రామునిచేత, దృష్ట్వా=చూచి, ముక్తౌ=విడువబడినాము.

తా. రాక్షసరాజా ! విభీషణుడు మమ్ములను పట్టుకొని చంపబోగా ధర్మాత్ముడు, గొప్ప తేజస్సు గలవాడు అయిన రాముడు చూచి విడిపించినాడు.

మూ. ఏకస్థానగతా యత్ర చత్వారః పురుషర్షభాః,
లోకపాలసమాః శూరాః కృతాస్త్రా దృఢవిక్రమాః. 29
రామో దాశరథిః శ్రీమాన్ లక్ష్మణశ్చ విభీషణః,
సుగ్రీవశ్చ మహాతేజా మహేన్ద్రసమవిక్రమః. 30
ఏతే శక్తాః పురీం లఙ్కాం సప్రాకారాం సతోరణామ్,
ఉత్పాట్య సంక్రామయితుం సర్వే తిష్ఠన్తు వానరాః. 31

ప్ర. అ. లోకపాలసమాః=లోకపాలురతో సమానులు, శూరాః=శూరులు, కృతాస్త్రాః=వేయబడిన (నేర్వబడిన) అస్త్రములు గలవారు, దృఢవిక్రమాః=దృఢమైన పరాక్రమము గలవారు అయిన, దాశరథిః=దశరథకుమారుడైన, రామః=రాముడు, శ్రీమాన్=శ్రీమంతుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, విభీషణః=విభీషణుడు, మహాతేజాః=గొప్పతేజస్సు గల, మహేన్ద్రసమవిక్రమః=మహేంద్రునితో సమానమైన పరాక్రమము గల, సుగ్రీవశ్చ=సుగ్రీవుడు, చత్వారః=నలుగురు, పురుషర్షభాః=పురుషశ్రేష్ఠులు, యత్ర=ఎక్కడ, ఏకస్థానగతాః=ఒకే స్థానమునందు ఉన్నారో, ఏతే=వీరు, సప్రాకారామ్=ప్రాకారములతో కూడిన, సతోరణామ్=ముఖద్వారములతో కూడిన, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, ఉత్పాట్య=పెల్లగించి, సంక్రామయితుమ్=మరొక చోట చేర్చుటకు, శక్తాః=సమర్థులు. సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, తిష్ఠన్తు=ఉండుదురుగాక.

తా. దశరథకుమారుడైన రాముడు, శ్రీమంతుడైన లక్ష్మణుడు, విభీషణుడు, మహాతేజశ్శాలి, మహేంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడు అయిన సుగ్రీవుడు, లోకపాలురతో సమానులు, శూరులు, అస్త్రములందు నిపుణులు, దృఢమైన పరాక్రమము గలవారు అయిన ఈ నలుగురు పురుషశ్రేష్ఠులు కలిసినచో ఈ లంకాపట్టణమును ప్రాకారముఖద్వారాదులతో సహా పెకిలించి మరొక చోటకు తీసికొనిపోవుటకు సమర్థులు. మిగిలిన వానరుల మాట అటుండనిమ్ము. 29 - 31

మూ. యాదృశం తద్ధి రామస్య రూపం ప్రహరణాని చ,
వధిష్యతి పురీం లఙ్కామేకస్తిష్ఠన్తు తే త్రయః. 32

ప్ర. అ. రామస్య=రామునియొక్క, తత్=ఆ, రూపమ్=రూపము, యాదృశమ్=ఎట్టిదో, ప్రహరణాని చ=ఆయుధములు ఎట్టివో, (వాటిని పట్టి చూడగా), ఏకః=ఒకడొక్కడే, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, వధిష్యతి=సంహరించగలడు. తే త్రయః=వారు ముగ్గురూ, తిష్ఠన్తు=ఉందురుగాక.

తా. మిగిలిన ముగ్గురితో కూడ పని లేదు. రాముని ఆ ఆకారము, ఆ యుద్ధము చూచినచో ఆతడొక్కడే లంకాపట్టణమును నశింపచేయగలడు.

మూ. రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ,
బభూవ దుర్ధర్షతరా సర్వైరపి సురాసురైః. 33

ప్ర. అ. రామలక్ష్మణగుప్తా=రామలక్ష్మణులచేత రక్షింపబడినది, సుగ్రీవేణ చ=సుగ్రీవునిచేత కూడ రక్షింపబడినది అయిన, సా వాహినీ=ఆ సేన, సర్వైః=సమస్తమైన, సురాసురైః అపి=దేవతలచేతను అసురులచేతను కూడ, దుర్ధర్షతరా=ఏమాత్రము ఎదిరింప శక్యము కానిదిగా, బభూవ=ఉండెను (ఉన్నది).

తా. రామలక్ష్మణులచేతను, సుగ్రీవునిచేతను రక్షింపబడుచున్న ఆ సేనను సమస్తమైన సురాసురులు కలిసి వచ్చినను ఎదిరింపజాలరు. 33

మూ. ప్రహృష్టయోధా ధ్వజినీ మహాత్మనాం
వనౌకసాం సంప్రతి యోద్ధుమిచ్ఛతామ్,
అలం విరోధేన శమో విధీయతాం
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్త్రింశః సర్గః.

ప్ర. అ. సంప్రతి=ఇప్పుడు, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, ఇచ్ఛతామ్=కోరుచున్న, మహాత్మనామ్=మహాత్ములైన, వనౌకసామ్=వానరులయొక్క, ధ్వజినీ=సేన, ప్రహృష్టయోధా=సంతోషించుచున్న యోధులు గలది. విరోధేన=విరోధముచేత, అలమ్=చాలును. శమః=శాంతి, విధీయతామ్=చేయబడుగాక. మైథిలీ=సీత, దాశరథాయ=రామునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. ఇప్పుడే యుద్ధము చేయుటకు సిద్ధముగా ఉన్న మహాత్ములైన వానరుల సేనలోని యోధులందరూ ఉత్సాహముతో ఉన్నారు. విరోధమును విడిచి సంధి చేసికొనుము. సీతను రామునకు తిరిగి ఇచ్చివేయుము. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరువదియారవ సర్గ సమాప్తము.

# అథ షడ్వింశః సర్గః

[సారణుని మాటలు విని రావణుడు వానరసైన్యమును చూచుటకై ప్రాసాదముపైకి ఎక్కుట; సారణుడు ఆ యా వానరులను చూపుచు వారి బలపరాక్రమాదులను వర్ణించి చెప్పుట]

మూ. తద్వచః తథ్యమక్లీబం సారణేనాభిభాషితమ్,
నిశమ్య రావణో రాజా ప్రత్యభాషత సారణమ్. 1

ప్ర. అ. సారణేన=సారణునిచేత, అభిభాషితమ్=పలుకబడిన, తథ్యమ్=స త్యము, అక్లీబమ్=పిరికితనము లేని, తత్=ఆ, వచః=వచనమును, నిశమ్య=విని, రాజా=రాజైన, రావణః=రావణుడు, సారణమ్=సారణుని గూర్చి, ప్రత్యభాషత= పలికెను.

తా. సారణుడు పలికిన యథార్థములైన, పిరికితనములేని ఆ మాటలు విని రాజైన రావణుడు సారణునితో ఇట్లు పలికెను. 1

మూ. యది మామభియుఞ్జీరన్ దేవగన్ధర్వదానవాః,
నైవ సీతామహం దద్యాం సర్వలోకభయాదపి. 2

ప్ర. అ. దేవగన్ధర్వదానవాః=దేవతలు, గంధర్వులు, దానవులు, మామ్=నన్ను, అభియుఞ్జీరన్ యది= ఎదుర్కొన్నను, సర్వలోకభయాదపి=సమస్తలోకములనుండి భయము వచ్చినను, అహమ్=నేను, సీతామ్=సీతను, నైవ దాస్యామి=ఇవ్వను.

తా. దేవతలు, గంధర్వులు, దానవులు నన్ను ఎదిరించినను, సమస్తలోకములనుండి భయము వచ్చినను నేను సీతను ఇవ్వను. 2

మూ. త్వం తు సౌమ్య పరిత్రస్తో హరిభిః పీడితో భృశమ్,
ప్రతిప్రదానమద్యైవ సీతాయాః సాధు మన్యసే. 3

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! హరిభిః=వానరులచేత, భృశమ్=మి క్కిలి, పీడితః=పీడింపబడినవాడవై, పరిత్రస్తః=భయపడి ఉన్న, త్వం తు=నీవైతే, అద్యైవ=ఇప్పుడే, సీతాయాః=సీతయొక్క, ప్రతిప్రదానమ్=తిరిగి ఇచ్చివేయుటను, సాధు=మంచిదానినిగా, మన్యసే=తలచుచున్నావు.

తా. సౌమ్యుడా ! నిన్ను వానరులు బాగా పీడించుటచేత భయపడి నీవు ఇప్పుడే సీతను ఇచ్చివేయుట మంచి దని తలచుచున్నావు. 3

మూ. కో హి నామ సపత్నో మాం సమరే జేతుమర్హతి,
ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణో రాక్షసాధిపః. 4
ఆరురోహ తతః శ్రీమాన్ ప్రాసాదం హిమపాణ్డురమ్,
బహుతాలసముత్సేధం రావణోఽథ దిదృక్షయా. 5

ప్ర. అ. మామ్=నన్ను, సమరే=యుద్ధమునందు, కః=ఏ, సపత్నః=శత్రువు, జేతుమ్=జయించుటకు, అర్హతి=తగి ఉన్నాడు ? రాక్షసాధిపః=రాక్షసుల ప్రభువు, రావణః=(లోకములను) ఏడ్పించువాడు అయిన, శ్రీమాన్=శ్రీమంతుడైన, రావణః=రావణుడు, ఇతి=ఇట్లు, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, ఉక్త్వా=పలికి, తతః=అక్కడినుండి (లేచి), అథ=అటుపిమ్మట, దిదృక్షయా=చూడవలె నను ఇచ్ఛచేత, హిమపాణ్డురమ్=మంచువలె తెల్లగా నున్న, బహుతాలసముత్సేధమ్=ఎన్నో తాటిచెట్ల ఎత్తు గల, ప్రాసాదమ్=ప్రాసాదమును, ఆరురోహ=ఎక్కెను.

తా. "నన్ను యుద్ధములో ఏ శత్రువు ఓడించగలడు ?" రాక్షసుల ప్రభువు, లోకములను ఏడిపించినవాడు, శ్రీమంతుడు అయిన రావణుడు ఈ విధముగా పరుషమైన వాక్యము పలికి పిమ్మట వానరసైన్యమును చూడవలె నను అభిలాషతో మంచు వలె తెల్లగా ఉన్న ఎన్నో తాటిచెట్లు ఎత్తు గల ప్రాసాదమును ఎక్కెను. 4, 5

మూ. తాభ్యాం చరాభ్యాం సహితో రావణః క్రోధమూర్ఛితః,
పశ్యమానః సముద్రం తం పర్వతాంశ్చ వనాని చ, 6
దదర్శ పృథివీదేశం సుసంపూర్ణం ప్లవఙ్గమైః.

ప్ర. అ. తాభ్యామ్=ఆ, చరాభ్యామ్=గూఢచారులతో, సహితః=కూడినవాడై, రావణః=రావణుడు, క్రోధమూర్ఛితః=క్రోధముతో నిండినవాడై, తమ్ సముద్రమ్=ఆ సముద్రమును, పర్వతాంశ్చ=పర్వతములను, వనాని చ=వనములను, పశ్యమానః=చూచుచు, ప్లవఙ్గమైః=వానరులతో, సుసంపూర్ణమ్=పూర్తిగా నిండి ఉన్న, పృథివీదేశమ్=భూమిని, దదర్శ=చూచెను.

తా. క్రోధముతో నిండిన ఆ రావణుడు ఆ గూఢచారు లిద్దరితో కలిసి సముద్రమును, పర్వతములను, వనములను చూచుచు, ఆ భూమి అంతా వానరులతో నిండి ఉన్నట్లు గమనించెను. 6

మూ. తదపారమసహ్యం చ వానరాణాం మహాబలమ్, 7
ఆలోక్య రావణో రాజా పరిపప్రచ్ఛ సారణమ్.

ప్ర. అ. రాజా=రాజైన, రావణః=రావణుడు, వానరాణామ్=వానరుల యొక్క, అపారమ్=అంతము లేని, అసహ్యం చ=సహించ శక్యము కాని,

తత్=ఆ, మహాబలమ్=గొప్ప సేనను, ఆలోక్య=చూచి, సారణమ్=సారణుని, పరిపప్రచ్ఛ=అడిగెను.

తా. రాక్షస రావణుడు అనంతము, సహింప శక్యము కానిది అయిన ఆ వానరసేనను చూచి సారణుణ్ణి ప్రశ్నించెను. 7

మూ. ఏషాం కే వానరా ముఖ్యాః కే శూరాః కే మహాబలాః, 8
కే పూర్వమభివర్తన్తే మహోత్సాహాః సమన్తతః.

ప్ర. అ. ఏషామ్=వీళ్లలో, కే=ఏ, వానరాః=వానరులు, ముఖ్యాః=ముఖ్యులు? కే=ఎవరు, శూరాః=శూరులు ? కే=ఎవరు, మహాబలాః=గొప్ప బలము గలవారు? మహోత్సాహాః=గొప్ప ఉత్సాహము గల, కే=ఎవరు, సమన్తతః=అంతటా, పూర్వమ్=ముందు, అభివర్తన్తే=ఉందురు?

తా. ఈ వానరులలో ముఖ్యులు ఎవరు ? శూరులు ఎవరు ? మహాబలవంతులు ఎవరు ? గొప్ప ఉత్సాహముతో యుద్ధములో అన్ని చోట్లా ముందుకు వచ్చువాళ్లు ఎవరు ? 8

మూ. కేషాం శృణోతి సుగ్రీవః కే వా యూథపయూథపాః, 9
సారణాచక్ష్వ మే సర్వం కింప్రభావాః ప్లవంగమాః.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, కేషామ్=ఎవరికి, శృణోతి=వినును? యూథపయూథపాః=యూథనాయకుల నాయకులు (కొందరు సైనికుల సముదాయమునకు 'యూథము' అని పేరు), కే వా=ఎవరు ? ప్లవంగమాః=వానరులు, కింప్రభావాః=ఏమి ప్రభావము గలవారు ? సారణ=సారణుడా ! సర్వమ్=సమస్తమును, మే=నాకు, ఆచక్ష్వ=చెప్పుము.

తా. సుగ్రీవుడు ఎవరి మాట వినును ? యూథనాయకుల నాయకులు ఎవరు ? ఈ వానరుల ప్రభావ మెట్టిది ? సారణుడా ! ఈ విషయము నంతా నాకు చెప్పుము. 9

మూ. సారణో రాక్షసేన్ద్రస్య వచనం పరిపృచ్ఛతః, 10
ఆబభాషేఽథ ముఖ్యజ్ఞో ముఖ్యాంస్తత్ర వనౌకసః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ముఖ్యజ్ఞః=వానరముఖ్యులను గూర్చి ఎరిగిన, సారణః=సారణుడు, పరిపృచ్ఛతః=అడుగుచున్న, రాక్షసేన్ద్రస్య=రావణునకు, తత్ర=వాళ్లలో, ముఖ్యాన్=ముఖ్యులైన, వనౌకసః=వానరులను గూర్చి, వచనమ్=వచనమును, ఆబభాషే=పలికెను.

తా. రావణుడు ఇట్లు ప్రశ్నించగా, వానరులలో ఉన్న ముఖ్యులను

గూర్చి తెలిపిన - సారణుడు ఆ వానరముఖ్యులను గూర్చి ఇట్లు చెప్పెను. 10

మూ. ఏష యోఽభిముఖో లఙ్కాం నర్దంస్తిష్ఠతి వానరః, 11
యూథపానాం సహస్రేణ శతేన పరివారితః,
యస్య ఘోషేణ మహతా సప్రాకారా సతోరణా, 12
లఙ్కా ప్రతిహతా సర్వా సశైలవనకాననా,
సర్వశాఖామృగేన్ద్రస్య సుగ్రీవస్య మహాత్మనః, 13
బలాగ్రే తిష్ఠతే వీరో నీలో నామైష యూథపః.

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, మహతా=గొప్పదైన, ఘోషేణ=ఘోషము చేత, సప్రాకారా=ప్రాకారముతో కూడిన, సతోరణా=ముఖద్వారములతో కూడిన, సశైలవనకాననా=పర్వతములతోను, చిన్న అడవులతోను, పెద్ద అడవులతోను కూడిన, సర్వా=సమస్తమైన, లఙ్కా=లంక, ప్రతిహతా=కొట్టబడినదో, యూథపానామ్=యూథనాయకులయొక్క, సహస్రేణ=సహస్రముతోను, శతేన=శతముతోను, పరివారితః=చుట్టబడిన, యః=ఏ, ఏషః=ఈ, వానరః=వానరుడు, లఙ్కామ్ అభిముఖః=లంకకు అభిముఖుడై, నర్దన్=ధ్వనిచేయుచు, తిష్ఠతి=ఉన్నాడో, ఏషః=ఇతడు, నీలో నామ=నీలు డను, వీరః=వీరుడైన, యూథపః=సేనానాయకుడు. సర్వశాఖామృగేన్ద్రస్య=సమస్తవానరులకు ప్రభువైన, మహాత్మనః=మహాత్ముడైన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, బలాగ్రే=సేనాగ్రమునందు, తిష్ఠతే=నిలచి ఉన్నాడు.

తా. ఏ వానరుడు లక్షమంది వానరనాయకులు చుట్టూ ఉండగా, లంకాభిముఖుడై అరచుచున్నాడో, ఎవని గొప్ప ధ్వనిచేత ప్రాకారములతోను, ముఖద్వారములతోను, శైలములతోను, వనములతోను, అరణ్యములతోను కూడిన లంక ప్రతిధ్వనించుచున్నదో అతడు నీలు డను పేరు గల వీరుడైన వానరసేనానాయకుడు. అతడు సమస్తమైన వానరులకు ప్రభువైన మహాత్ముడైన సుగ్రీవుని సైన్యము ముందు నిలచి ఉన్నాడు. 11 - 13

మూ. బాహూ ప్రగృహ్య యః పద్భ్యాం మహీం గచ్ఛతి వీర్యవాన్, 14
లఙ్కామభిముఖః కోపాదభీక్ష్ణం చ విజృమ్భతే,
గిరిశృఙ్గప్రతీకాశః పద్మకిఞ్జల్కసన్నిభః, 15
స్ఫోటయత్యతిసంరబ్ధో లాఙ్గూలం చ పునః పునః,
యస్య లాఙ్గూలశబ్దేన స్వనన్తి ప్రదిశో దశ, 16
ఏష వానరరాజేన సుగ్రీవేణాభిషేచితః,
యువరాజోఽఙ్గదో నామ త్వామాహ్వయతి సంయుగే. 17

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, యః=ఎవడు, బాహూ=బాహు

పుంను, ప్రగృహ్య=పట్టుకొని (పైకి ఎత్తి లేదా చేతులు కట్టుకొని నిలచి), పద్భ్యామ్=పాదములచేత, మహీమ్=భూమిని, గచ్ఛతి=పొందుచున్నాడో, లఙ్కామ్ అభిముఖః=లంకకు అభిముఖుడై, కోపాత్=కోపమువలన, అభీక్ష్ణమ్=మిక్కిలి, విజృమ్భతే=విజృంభించుచున్నాడో, గిరిశృఙ్గప్రతీకాశః=పర్వతశిఖరముతో సమానుడు, పద్మకింజల్కసన్నిభః= పద్మముల కింజల్కములతో సమానుడైన ఎవడు, అభిసంరబ్ధః=మిక్కిలి కోపించినవాడై, పునః పునః=మాటిమాటికి, లాఙ్గూలమ్=తోకను, స్ఫోటయతి=కదల్చి చప్పుడు చేయుచున్నాడో, యస్య=ఎవనియొక్క, లాఙ్గూలశబ్దేన=తోకయొక్క శబ్దముచేత, దశ=పది, ప్రదిశః=దిక్కులు, స్వనన్తి=ధ్వని చేయుచున్నవో, ఏషః=ఇతడు, వానరరాజేన=వానరరాజైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, అభిషేచితః=అభిషేకించబడిన, అఙ్గదో నామ=అంగదుడను పేరు గల, యువరాజః=యువరాజు. త్వామ్=నిన్ను, సంయుగే=యుద్ధమునందు, ఆహ్వయతి=పిలుచుచున్నాడు.

తా. పద్మము కింజల్కముల వంటి శరీరచ్ఛాయ గల ఆ పర్వతశిఖరము వలె ఉన్న పరాక్రమవంతుడైన వానరుడు చేతులు పైకి ఎత్తి పాదాలతో నేలపై నడచుచు లంక వైపు తిరిగి కోపముతో మిక్కిలి విజృంభించుచున్నాడు. వాని కోపముతో మాటిమాటికి తోకను విదల్చుచు ధ్వని చేయుచున్నాడు. అతడు తోక కదల్చి చేసిన శబ్దము పది దిక్కులందు వ్యాపించుచున్నది. అతడు సుగ్రీవునిచే యౌవరాజ్యమునందు అభిషిక్తుడైన యువరాజు, అంగదుడు. అతడు నిన్ను యుద్ధానికి పిలుచుచున్నాడు. 14 - 17

మూ. వాలినః సదృశః పుత్రః సుగ్రీవస్య సదా ప్రియః,
రాఘవార్థే పరాక్రాన్తః శక్రార్థే వరుణో యథా. 18

ప్ర. అ. వాలినః=వాలికి, సదృశః=తగిన, పుత్రః=పుత్రుడు, సదా=ఎల్లప్పుడు, సుగ్రీవస్య=సుగ్రీవునకు, ప్రియః=ఇష్టుడూ అయిన ఈ అంగదుడు, శక్రార్థే=దేవేంద్రుని నిమిత్తము, వరుణో యథా=వరుణుడు వలె, రాఘవార్థే=రాముని నిమిత్తమై, పరాక్రాన్తః=పరాక్రమించినాడు.

తా. ఈ అంగదుడు వాలికి తగిన పుత్రుడు. ఎల్లప్పుడు సుగ్రీవునకు ప్రేమపాత్రుడు. దేవేంద్రునికోసమై వరుణుడు పరాక్రమించి నట్లు రామునికోసమై పరాక్రమించుచున్నాడు. 18

మూ. ఏతస్య సా మతిః సర్వా యద్దృష్టా జనకాత్మజా,
హనూమతా వేగవతా రాఘవస్య హితైషిణా. 19

ప్ర. అ. రాఘవస్య=రామునియొక్క, హితైషిణా=హితమును కోరువాడైన, వేగవతా=వేగవంతుడైన, హనూమతా=హనుమంతునిచేత, జనకాత్మజా=సీత, దృష్టా ఇతి యత్=చూడబడినది అను మాట ఏది కలదో, సా సర్వా= అది అంతా,

ఏతస్య=వీనియొక్క, మతిః=బుద్ధి.

తా. రాముని హితమును కోరు వేగవంతుడైన హనుమంతుడు సీతను చూచినాడనగా ఇది అంతా ఈతని బుద్ధిబలముచేతనే. 19

మూ. బహూని వానరేన్ద్రాణామేష యూథాని వీర్యవాన్,
పరిగృహ్యాభియాతి త్వాం స్వేనానీకేన మర్దితుమ్. 20

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, ఏషః=ఈ అంగదుడు, వానరేన్ద్రాణామ్=వానరశ్రేష్ఠులయొక్క, బహూని=అనేకమైన, యూథాని=సముదాయములను, పరిగృహ్య=తీసికొని, త్వామ్=నిన్ను, స్వేన=తనసంబంధమైన, అనీకేన=సేనచేత, మర్దితుమ్=మర్దించుటకు, అభియాతి=నీకు ఎదురుగా వచ్చుచున్నాడు.

తా. పరాక్రమవంతుడైన ఈ అంగదుడు వానరనాయకుల అనేక సముదాయములను తన వెంట తీసికొని, నిన్ను తన సేనచేత మర్దించుటకై వచ్చుచున్నాడు. 20

మూ. అనువాలిసుతస్యాపి బలేన మహతా వృతః,
వీరస్తిష్ఠతి సంగ్రామే సేతుహేతురయం నలః. 21

ప్ర. అ. అనువాలిసుతస్య=వాలికుమారుణ్ణి అనుసరించి, మహతా=గొప్ప, బలేన=సేనతో, వృతః=కూడిన, సంగ్రామే=యుద్ధమునందు, వీరః=వీరుడైన, సేతుహేతుః=సేతువుకు కారణమైన, అయమ్=ఈ, నలః=నలుడు, తిష్ఠతి=నిలచి ఉన్నాడు.

తా. యుద్ధములో మహావీరుడైన ఈ నలుడు అంగదుని వెనుకనే గొప్ప సైన్యముతో నిలిచి ఉన్నాడు. సేతువును నిర్మించినది ఇతడే. 21

మూ. యే తు విష్టభ్య గాత్రాణి క్ష్వేడయన్తి నదన్తి చ,
ఉత్థాయ చ విజృమ్భన్తే క్రోధేన హరిపుఙ్గవాః. 22
ఏతే దుష్ప్రసహా ఘోరాశ్చణ్డాశ్చణ్డపరాక్రమాః,
అష్టౌ శతసహస్రాణి దశకోటిశతాని చ. 23
య ఏనమనుగచ్ఛన్తి వీరాశ్చన్దనవాసినః,
ఏషైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. 24

ప్ర. అ. యే=ఏ, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, గాత్రాణి=దేహములను, విష్టభ్య=బిగింపచేసి, క్ష్వేడయన్తి=సింహనాదముచేయుచున్నారో, నదన్తి చ=ధ్వని చేయుచున్నారో, క్రోధేన=కోపముతో, ఉత్థాయ=లేచి, విజృమ్భన్తే=విజృంభించుచున్నారో, చన్దనవాసినః=చందనవనమునందు నివసించుచున్న, అష్టౌ=ఎనిమిది,

శతసహస్రాణి=లక్షలు, దశకోటిశతాని నూరుపది వందల కోట్లు, యే=ఏ, వీరాః=వీరులు, ఏనమ్=ఇతనిని, అనుగచ్ఛన్తి= అనుసరించుచున్నారో, ఏతే=వీరు, దుష్ప్రసహాః= సహింప శక్యము కానివారు, ఘోరాః=భయంకరులు, చణ్డాః=తీవ్రమైనవారు, చణ్డపరాక్రమాః=తీవ్రమైన పరాక్రమము గలవారు. ఏష్వైవ=ఇతడే, స్వేన=తన సంబంధమైన, అనీకేన=సేనచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

భా. చందనవనములో నివసించే వెయ్యి కోట్ల ఎనిమిదిలక్షల ఆ వానరశ్రేష్ఠులు శరీరములు బిగబట్టి, సింహనాదము చేయుచు, గర్జించుచున్నారు. కోపముతో లేచి విజృంభించుచున్నారు. ఈ నలుడ్ని అనుసరించి ఉన్న ఈ వానరవీరులందరూ సహింప శక్యము కానివారు; భయంకరులు; తీవ్రమైన పరాక్రమము గలవారు; ఈ సైన్యము సహాయముతో ఈ నలుడే లంకను మర్దించుటకు అభిలషించుచున్నాడు. 22 - 24

మూ. శ్వేతో రజతసంకాశశ్చపలో భీమవిక్రమః,
బుద్ధిమాన్వానరః శూరస్త్రిషు లోకేషు విశ్రుతః. 25
తూర్ణం సుగ్రీవమాగత్య పునర్గచ్ఛతి సత్వరః,
విభజన్వానరీం సేనామనీకాని ప్రహర్షయన్. 26

ప్ర. అ. రజతసంకాశః=వెండితో సమానమైనవాడు, చపలః=చపలస్వభావుడు, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గలవాడు, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు, శూరః=శూరుడు, త్రిషు లోకేషు=మూడు లోకములయందు, విశ్రుతః=ప్రసిద్ధుడు అయిన, శ్వేతః=శ్వేతు డను, వానరః=వానరుడు, తూర్ణమ్= శీఘ్రముగా, సుగ్రీవమ్= సుగ్రీవుడ్ని గూర్చి, ఆగత్య=వచ్చి, వానరీమ్=వానరసంబంధమైన, సేనామ్=సేనను, విభజన్=విభజించుచు, అనీకాని=సైన్యములను, ప్రహర్షయన్=సంతోషపెట్టుచు, సత్వరః=తొందరతో కూడినవాడై, పునః=మరల, గచ్ఛతి=వెళ్లుచున్నాడు.

భా. వెండివంటి తెల్లని శరీరచ్ఛాయ గలవాడు, చపలుడు, భయంకరమైన పరాక్రమము గలవాడు, బుద్ధిమంతుడు, శూరుడు, మూడు లోకములలో ప్రసిద్ధుడు అయిన శ్వేతు డను వానరుడు తొందరగా సుగ్రీవుని వద్దకు వెళ్లి, మధ్యనుండి వెళ్లుటచేత వానరసేనలను రెండుగా చీల్చివేయుచు, సైనికులకు సంతోషము కలిగించుచు మరల తన స్థానమునకు వెళ్లుచున్నాడు. 25, 26

మూ. యః పురా గోమతీతీరే రమ్యం పర్యేతి పర్వతమ్,
నామ్నా సంరోచనో నామ నానానగయుతో గిరిః. 27

తత్ర రాజ్యం ప్రశాస్త్యేష కుముదో నామ యూథపః,
యో౽సౌ శతసహస్రాణి సహర్షం పరికర్షతి. 28

యస్య వాలా బహువ్యామా దీర్ఘలాఙ్గూలమాశ్రితాః,
తామ్రాః పీతాః సితాః శ్వేతాః ప్రకీర్ణా ఘోరదర్శనాః. 29

అదీనో వానరశ్చణ్డః సంగ్రామమభికాఙ్క్షతి,
ఏషైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. 30

ప్ర. అ. యః=ఎవడు, పురా=పూర్వము, గోమతీతీరే=గోమతీతీరము నందు, నామ్నా=పేరుచేత, సంరోచనో నామ=సంరోచన మను ప్రసిద్ధి గల, నానానగయుతః=అనేక విధములైన వృక్షములతో కూడిన, గిరిః=పర్వతమున్నది. అట్టి, రమ్యమ్=రమ్య మను నామాంతరము గల, పర్వతమ్=పర్వతమును, పర్యేతి=పొందియుండెడివాడో, ఏషః=ఈ, కుముదో నామ=కుముదుడు అను పేరు గల, యూథపః=సేనానాయకుడు, తత్ర=అక్కడ, రాజ్యమ్=రాజ్యమును, ప్రశాస్తి=పాలించుచున్నాడు. యః=ఎవ్వడు, శతసహస్రాణి=లక్షలను, సహర్షమ్=సంతోషపూర్వకముగా, పరికర్షతి=లాగుచున్నాడో (తనవెనుక తీసికొని వచ్చుచున్నాడో), యస్య=ఎవనియొక్క, దీర్ఘలాఙ్గూలమ్=దీర్ఘమైన తోకను, ఆశ్రితాః=ఆశ్రయించి యున్న, వాలాః=వెండ్రుకలు, బహువ్యామాః=చాల బారల పొడవైనవో, తామ్రాః=ఎఱ్ఱగాను, పీతాః=పచ్చగాను, సితాః=తెల్లగాను, శ్వేతాః=చాల తెల్లగాను ఉన్న, ప్రకీర్ణాః=వ్యాపించిన రోమములు, ఘోరదర్శనాః=ఘోరమైన దర్శనము గలవో అట్టి, అదీనః=దీనుడు కానివాడు, చణ్డః=తీవ్రమైనవాడు అయిన, వానరః=వానరుడు, సఙ్గ్రామమ్=యుద్ధమును, అభికాఙ్క్షతి కోరుచున్నాడు. ఏషైవ=ఇతడే, స్వేన=తన సంబంధమైన, అనీకేన సేనచేత, లఙ్కామ్ లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

తా. గోమతీతీరమునందు రమ్య మను పర్వత మున్నది. అనేకవిధములైన వృక్షములతో నిండిన ఆ పర్వతమునకు సంరోచన మని కూడ పేరు. కుముదుడు అను ఈ సేనానాయకుడు పూర్వము ఆ పర్వతప్రాంతమునందు సంచరించెడివాడు. అక్కడ రాజ్యము చేసెడివాడు. ఇతడు లక్షలకొలది వానరుల నాయకుడుగా ఉన్నాడు. చాల పొడవైన అతని తోకమీద ఉన్న రోమములు ఎఱ్ఱగా, పచ్చగా, తెల్లగా, చాల తెల్లగా, ఉండి ఎగురుచు, ఎన్నో బారల పొడవు గలవై చూచుటకు భయంకరముగా ఉన్నవి. దైన్యము లేనివాడు, తీవ్రస్వభావము గలవాడు అయిన ఈ వానరుడు యుద్ధమును కోరుచున్నాడు. ఇతడే తన సేనతో లంకను మర్దించవలె నని అభిలషించుచున్నాడు. 27 - 30

మూ. యస్త్వేష సింహసంకాశః కపిలో దీర్ఘకేసరః,
నిభృతః ప్రేక్షతే లఙ్కాం దిధక్షన్నివ చక్షుషా, 31
విన్ధ్యం కృష్ణగిరిం సహ్యం పర్వతం చ సుదర్శనమ్,
రాజన్సతతమధ్యాస్తే స రమ్భో నామ యూథపః. 32
శతం శతసహస్రాణాం త్రింశచ్చ హరిపుఙ్గవాః,
యం యాన్తం వానరా ఘోరాశ్చణ్డాశ్చణ్డపరాక్రమాః, 33
పరివార్యానుగచ్ఛన్తి లఙ్కాం మర్దితుమోజసా.

ప్ర. అ. రాజన్=రాజా ! సింహసంకాశః=సింహముతో సమానుడు, కపిలః=కపిలవర్ణము గలవాడు, దీర్ఘకేసరః=దీర్ఘమైన జూలు కలవాడు అయిన, యః=ఎవ్వడు, నిభృతః=ఏకాగ్రచిత్తుడై, చక్షుషా=నేత్రముచేత, దిధక్షన్నివ=కాల్చుదలచుకొన్నవానివలె, లఙ్కామ్=లంకను, ప్రేక్షతే=చూచుచున్నాడో, శతసహస్రాణామ్=లక్షలయొక్క, శతమ్=శతము, త్రింశచ్చ=ముప్పదీ, హరిపుఙ్గవాః=వానరులలో శ్రేష్ఠులు, ఘోరాః=భయంకరులు, చణ్డపరాక్రమాః=తీవ్రమైన పరాక్రమము గలవారు అయిన, వానరాః=వానరులు, యాన్తమ్=వెళ్లుచున్న, యమ్=ఎవనిని, పరివార్య=చుట్టి, ఓజసా=తేజస్సుచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, అనుగచ్ఛన్తి=అనుసరించి వెళ్లుచున్నారో, సః=అతడు, రమ్భో నామ=రంభుడను పేరు గల, యూథపః=సేనానాయకుడు. విన్ధ్యమ్=వింధ్యపర్వతమును, కృష్ణగిరిమ్=కృష్ణగిరిని, సహ్యం పర్వతమ్=సహ్యపర్వతమును, సుదర్శనమ్=సుదర్శనపర్వతమును, సతతమ్=ఎల్లప్పుడూ, అధ్యాస్తే=అధిష్ఠించి ఉండును.

తా. రాజా ! కపిలవర్ణము (చామని చాయ) పొడవైన జూలు కలిగి సింహము వలె ఉన్న ఇతడు రంభుడను సేనానాయకుడు. అక్కడ నిశ్చలముగా నిలబడి చూపుతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు లంక వైపే చూచుచున్నాడు. ఇతడు ఎల్లప్పుడు వింధ్య - కృష్ణగిరి - సహ్య - సుదర్శన పర్వతములపై నివసించుచుండును. వానరులలో శ్రేష్ఠులు, భయంకరులు, తీవ్రమైన పరాక్రమము గలవారు అయిన నూటముప్పది లక్షల వానరులు ఇతని వెంట, లంకను తమ తేజస్సుచేత నశింపచేయుటకు వచ్చుచున్నారు. 31-33

మూ. యస్తు కర్ణౌ వివృణుతే జృమ్భతే చ పునః పునః, 34
న చ సంవిజతే మృత్యోర్న చ యుద్ధాత్ ప్రధావతి,
ప్రకమ్పతే చ రోషేణ తిర్యక్చ పునరీక్షతే, 35
పశ్యన్ లాఙ్గూలమపి చ క్ష్వేడత్యేష మహాబలః,

మహౌజసో వీతభయో రమ్యం సాల్వేయపర్వతమ్. 36
రాజన్సతతమధ్యాస్తే శరభో నామ యూథపః.

ప్ర. అ. రాజన్=రాజా! యః తు=ఎవడు, కర్ణౌ=చెవులను, వివృణుతే=కదుపుచున్నాడో, పునః పునః=మాటిమాటికి, జృమ్భతే చ=ఆవులించుచున్నాడో, మృత్యోః=మృత్యువునుండి, న తు సంవిజతే=భయపడుటలేదో, యుద్ధాత్=యుద్ధమునుండి, న చ ప్రధావతి=పరుగెత్తుటలేదో, రోషేణ=కోపముచేత, ప్రకమ్పతే చ=కదులుచున్నాడో, పునః=మరల, తిర్యక్=అడ్డముగా, ఈక్షతే=చూచుచున్నాడో, లాఙ్గూలమ్=తోకను, పశ్యన్=చూచుచు, క్ష్వేలతే=సింహనాదము చేయుచున్నాడో, మహాబలః=గొప్ప బలము గల, ఏషః=ఇతడు, శరభో నామ=శరభుడను పేరు గల, యూథపః=సేనానాయకుడు. మహౌజసః=గొప్ప తేజస్సుతో, వీతభయః=పోయిన భయము కలవాడై, సతతమ్=ఎల్లప్పుడు, రమ్యమ్=రమ్యమైన, సాల్వేయం పర్వతమ్=సాల్వేయపర్వతమును, అధ్యాస్తే=అధిష్ఠించి ఉన్నాడు.

తా. మహారాజా! అక్కడ ఒక సేనానాయకుడు చెవులు కదుపుచు మాటిమాటికి ఆవులించుచున్నాడు. మృత్యువునుండి భయపడుటలేదు. యుద్ధభూమినుండి పారిపోడు. కోపముతో వణికిపోవుచు మరల అడ్డముగా చూచుచున్నాడు. తోక చూచుకొనుచు సింహనాదము చేయుచున్నాడు. మహాబలశాలియైన ఇతడు శరభుడు. తేజస్సుచేత, ఏ మాత్రము భయము లేనివాడై, ఎల్లప్పుడు రమ్యమైన సాల్వేయపర్వతముమీద నివసించుచున్నాడు. 34-36

మూ. ఏతస్య బలినః సర్వే విహారా నామ యూథపాః,
రాజన్ శతసహస్రాణి చత్వారింశత్తథైవ చ. 37

ప్ర. అ. రాజన్=రాజా! ఏతస్య=ఇతనియొక్క, శతసహస్రాణి=నూరువేలు, తథైవ చ=మరియు, చత్వారింశత్=నలుబది వేలు, సర్వే=సమస్తమైన, విహారాః నామ=విహారు లను పేరు గల, యూథపాః=సేనానాయకులు, బలినః=బలవంతులు.

తా. రాజా! ఇతని విహారు లను పేరు గల ఒక లక్ష నలుబదివేలమంది సేనానాయకులు అందరు చాల బలము గలవారు. 37

మూ. యస్తు మేఘ ఇవాకాశం మహానావృత్య తిష్ఠతి, 38
మధ్యే వానరవీరాణాం సురాణామివ వాసవః,
భేరీణామివ సంనాదో యస్యైవ శ్రూయతే మహాన్, 39
ఘోషః శాఖామృగేన్ద్రాణాం సఙ్గ్రామమభికాఙ్క్షతామ్,

ఏష పర్వతమధ్యాస్తే పారియాత్రమనుత్తమమ్, 40
యుద్ధే దుష్ప్రసహో నిత్యం పనసో నామ యూథపః.

ప్ర. అ. యః=ఎవడు, మహాన్=గొప్ప, మేఘ ఇవ=మేఘము వలె, ఆకాశమ్=ఆకాశమును, ఆవృత్య=కప్పి, సురాణామ్=దేవతలమధ్య, వాసవః ఇవ=దేవేంద్రుడు వలె, వానరవీరాణామ్=వానరవీరులయొక్క, మధ్యే=మధ్యయందు, తిష్ఠతి=ఉన్నాడో, సఙ్గ్రామమ్=యుద్ధమును, అభికాఙ్క్షతామ్=కోరుచున్న, యస్యైవ=ఎవనియొక్క, శాఖామృగేన్ద్రాణామ్=వానరులయొక్క, మహాన్=గొప్పదైన, ఘోషః=ధ్వని, భేరీణామ్=భేరీలయొక్క, సంనాదః ఇవ=ధ్వని వలె, శ్రూయతే=వినబడుచున్నదో, ఏషః=ఇతడు, నిత్యమ్=ఎల్లప్పుడు, యుద్ధే=యుద్ధమునందు, దుష్ప్రసహః=సహింప శక్యము కాని, పనసో నామ=పనసు డను, యూథపః=సేనానాయకుడు. అనుత్తమమ్=శ్రేష్ఠమైన, పారియాత్రమ్=పారియాత్రపర్వతమును, అధ్యాస్తే=అధిష్ఠించి ఉన్నాడు.

తా. దేవతలమధ్య మున్న దేవేంద్రుడు వలె వానరుల మధ్య ఉన్న ఎవడు పెద్ద మేఘము ఆకాశమును ఆవరించి నట్లు ఆవరించినాడో, యుద్ధమును కోరుచున్న ఎవని సైనికులైన వానరుల ధ్వని భేరీధ్వని వలె వినబడుచున్నదో, ఆతడు నిత్యము యుద్ధమునందు సహింప శక్యము కాని పనసు డను సేనానాయకుడు. ఆతడు పారియాత్ర మను ఉత్తమమైన పర్వతముమీద నివసించుచున్నాడు. 38-40

మూ. ఏనం శతసహస్రాణాం శతార్ధం పర్యుపాసతే, 41
యూథపా యూథపశ్రేష్ఠం యేషాం యూథాని భాగశః.

ప్ర. అ. యేషామ్=ఎవరియొక్క, యూథాని=యూథములు, భాగశః=భాగములుగా ఉన్నవో అట్టి, శతసహస్రాణామ్=వందవేలయొక్క, శతార్ధమ్=అర్ధశతము, యూథపశ్రేష్ఠమ్=సేనానాయకులలో శ్రేష్ఠుడైన, ఏనమ్=వీనిని, పర్యుపాసతే=సేవించుచున్నారు.

తా. వేరు వేరు యూథములుగా ఏర్పరుపబడిన ఏభైలక్షల సేనానాయకులు సేనానాయకులలో శ్రేష్ఠుడైన ఇతనిని సేవించుచున్నారు. 41

మూ. యస్తు భీమాం ప్రవల్గన్తీం చమూం తిష్ఠతి శోభయన్, 42
స్థితాం తీరే సముద్రస్య ద్వితీయ ఇవ సాగరః,
ఏష దర్దురసంకాశో వినతో నామ యూథపః, 43
పిబంశ్చరతి యో వేణాం నదీనాముత్తమాం నదీమ్,
షష్టిః శతసహస్రాణి బలమస్య ప్లవంగమాః. 44

ప్ర. అ. యః=ఎవడు, సముద్రస్య=సముద్రముయొక్క, తీరే=తీరము నందు, ద్వితీయః=రెండవ, సాగరః ఇవ=సాగరము వలె, స్థితామ్=ఉన్న, భీమామ్=భయంకరమైన, ప్రవల్గన్తీమ్=కదులుచున్న, చమూమ్=సేనను, శోభయన్=ప్రకాశింపచేయుచు, తిష్ఠతి=ఉన్నాడో, ఏషః=ఇతడు, దర్దురసంకాశః=దర్దురపర్వతముతో సమానుడైన, వినతో నామ=వినతు డను, యూథపః=సేనానాయకుడు. యః=ఎవడు, నదీనామ్=నదులలో, ఉత్తమామ్=ఉత్తమమైన, వేణామ్=వేణా అను, నదీమ్=నదిని, పిబన్=త్రాగుచు, చరతి=సంచరించుచున్నాడో, షష్టిః=అరువది, శతసహస్రాణి=లక్షలు, ప్లవంగమాః=వానరులు, అస్య=వీనియొక్క, బలమ్=సేన.

తా. సముద్రతీరమునందు రెండవ సముద్రము వలె ఉన్న భయంకరమైన, కదలుచున్న సేనను ప్రకాశింపచేయుచు దర్దురపర్వతము వలె ఉన్న ఇతడు వినతు డను సేనానాయకుడు. ఇతడు నదులలో ఉత్తమమైన కృష్ణవేణానది జలమును త్రాగుచు సంచరించుచున్నాడు. ఇతని సైన్యములో అరువది లక్షల మంది వానరులు ఉన్నారు.

వి. "వేణామ్"కు బదులు గోవిందరాజు "పర్ణాసామ్" అను పాఠము ఇచ్చినాడు. ఆ నది ఎక్కడమున్నదో తెలియదు. వేణానది మన కృష్ణానది కా[illegible]న్నము. కృష్ణానదికి "కృష్ణవేణ్ణా" "కృష్ణవేణా" అను పేర్లు ప్రాచీనగ్రంథాలలో ఉన్నవి. 42 - 44

మూ. త్వామాహ్వయతి యుద్ధాయ క్రథనో నామ వానరః,
విక్రాన్తా బలవన్తశ్చ యథా యూథాని భాగశః. 45

ప్ర. అ. విక్రాన్తాః=పరాక్రమవంతులు, బలవన్తశ్చ=బలవంతులు అయిన వానరులు, యూథాని=వానరుల యూథములు, యథా=ఎట్లు, భాగశః=వేరు వేరు భాగములుగా ఉన్నారో (వేరు భాగములుగా ఉండునట్లు చేసి), క్రథనో నామ=క్రథను డను పేరు గల, వానరః=వానరుడు, త్వామ్=నిన్ను, యుద్ధాయ=యుద్ధము కొరకు, ఆహ్వయతి=పిలచుచున్నాడు.

తా. క్రథను డను వానరుడు విక్రమవంతులు బలవంతులు అయిన వానరులను, వానరయూథములను వేరువేరుగా ఎవరు ఉండవలసిన చోట వారిని ఉంచి నిన్ను యుద్ధము కొరకు పిలచుచున్నాడు. 45

మూ. యస్తు గైరికవర్ణాభం వపుః పుష్యతి వానరః,
అవమత్య సదా సర్వాన్వానరాన్ బలదర్పితః, 46
గవయో నామ తేజస్వీ త్వాం క్రోధాదభివర్తతే.

ప్ర. అ. యః=ఏ, వానరః=వానరుడు, గైరికవర్ణాభమ్=గైరికధాతువు రంగువంటి కాంతి గల, వపుః=శరీరమును, పుష్యతి=పోషించుచున్నాడో,

సదా=ఎల్లప్పుడు, బలదర్పితః=బలము చేత దర్పితుడైన, తేజస్వీ=తేజఃశాలియైన, గవయో నామ=గవయుడు అను ఆ వానరుడు, సర్వాన్=సమస్తమైన, వానరాన్=వానరులను, అవమత్య=అవమానించి, క్రోధాత్=కోపమువలన, త్వామ్ అభివర్తతే=ఎదిరించుటకై వచ్చుచున్నాడు.

తా. గైరికధాతువువర్ణము వంటి శరీరచ్ఛాయతో ప్రకాశించుచున్న ఆ వానరుడు తేజఃశాలియైన గవయుడు. ఎల్లప్పుడు బలముచేత గర్వితుడైన ఇతడు వానరుల నందరినీ కాదని తానే నిన్ను ఎదిరించుటకు వచ్చుచున్నాడు. 46

మూ. ఏవం శతసహస్రాణి సప్తతిః పర్యుపాసతే,
ఏష్వైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. 47

ప్ర. అ. ఏవమ్=ఇతనిని, సప్తతిః=డెబ్బది, శతసహస్రాణి=లక్షలు, పర్యుపాసతే=సేవించుచున్నారు. ఏష్వైవ=ఇతడే, స్వేన=తన సంబంధమైన, అనీకేన=సేనచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

తా. ఈ గవయుణ్ణి డెబ్బదిలక్షల మంది వానరులు సేవించుచున్నారు. ఇతడే తన సైన్యముతో లంకను మర్దించుటకు కోరుచున్నాడు. 47

మూ. ఏతే దుష్ప్రసహా వీరా యేషాం సంఖ్యా న విద్యతే,
యూథపా యూథపశ్రేష్ఠాస్తేషాం యూథాని భాగశః. 48

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షడ్వింశః సర్గః.

ప్ర.అ. యేషామ్=ఎవరికి, సంఖ్యా=సంఖ్య, న విద్యతే=లేదో, ఏతే=ఈ, వీరాః=వీరులైన, యూథపాః=యూథనాయకులు, యూథపశ్రేష్ఠాః=యూథనాయకులలో శ్రేష్ఠులు, దుష్ప్రసహాః=సహింప శక్యముకానివారు. తేషామ్=వారియొక్క, యూథాని=యూథములు, భాగశః=వేరు వేరుగా ఉన్నవి.

తా. వీరులైన ఈ యూథనాయకులు, యూథనాయకులలో శ్రేష్ఠులైన వానరులు ఎదిరింప శక్యముకానివారు. వీరిని లెక్కపెట్టుట కష్టము. వీరు వేరు వేరుగా యూథములుగా విభజింపబడి ఉన్నారు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో ఇరువదియారవ సర్గ సమాప్తము.

## అథ సప్తవింశః సర్గః

[సారణుడు ఆ యా వానరవీరుల పేర్లు చెప్పుచు వారి పరాక్రమమును వర్ణించుట.]

మూ. తాంస్తు తే సంప్రవక్ష్యామి ప్రేక్షమాణస్య యూథపాన్,
రాఘవార్థే పరాక్రాన్తా యే న రక్షన్తి జీవితమ్. 1

ప్ర. అ. రాఘవార్థే=రామునినిమిత్తమై, పరాక్రాన్తాః=పరాక్రమించిన, యే=ఎవరు, జీవితమ్=తమ జీవితమును, న రక్షన్తి=రక్షించుకొనరో, తాన్=ఆ, యూథపాన్=యూథనాయకులను గూర్చి, ప్రేక్షమాణస్య=చూచుచున్న, తే=నీకు, ప్రవక్ష్యామి=చెప్పెదను.

తా. రాముని నిమిత్తమై పరాక్రమము చూపుచు తమ జీవితమును గూర్చి కూడ లక్ష్యము లేని ఆ యూథనాయకులను గూర్చి నీకు చెప్పెదను; వారిని చూడుము. 1

మూ. స్నిగ్ధా యస్య బహువ్యామా బాలా లాఙ్గూలమాశ్రితాః,
తామ్రాః పీతాః సితాః శ్వేతాః ప్రకీర్ణా ఘోరకర్మణః, 2
ప్రగృహీతాః ప్రకాశన్తే సూర్యస్యేవ మరీచయః,
పృథివ్యాం చానుకృష్యన్తే హరో నామైష వానరః. 3

ప్ర. అ. ఘోరకర్మణః=భయంకరమైన పనులు గల, యస్య=ఎవనియొక్క, లాఙ్గూలమ్=తోకను, ఆశ్రితాః=ఆశ్రయించిన, బహువ్యామాః=చాల బారల పొడవైన, స్నిగ్ధాః=మెత్తని, తామ్రాః=ఎఱ్ఱని, పీతాః=పచ్చని, సితాః=తెల్లని, శ్వేతాః=బాగా తెల్లని, ప్రకీర్ణాః=పలచగా ఉన్న, బాలాః=రోమములు, సూర్యస్య=సూర్యుని యొక్క, ప్రగృహీతాః=పట్టుకొనబడిన (ప్రోగుచేయబడిన), మరీచయః ఇవ=కిరణములు వలె, ప్రకాశన్తే=ప్రకాశించుచున్నవో, పృథివ్యామ్=నేలమీద, అనుకృష్యన్తే చ=లాగబడుచున్నవో, ఏషః=ఇతడు, హరో నామ=హరుడను పేరు గల, వానరః=వానరుడు.

తా. భయంకరములైన పనులు చేయు ఎవని తోకమీద మన్నగాను, ఎఱ్ఱగాను, పచ్చగాను, తెల్లగాను, బాగా తెల్లగాను ఉన్న బారెడేసి పల్చని రోమములు ప్రోగుచేసిన సూర్యకిరణముల వలె ఉన్నవో, నేలమీద కూడ ఈడ్చుకొని పోవుచున్నవో అతడు హరుడు అను వానరుడు. 2, 3

మూ. యం పృష్ఠతోఽనుగచ్ఛన్తి శతశోఽథ సహస్రశః,
వృక్షానుద్యమ్య సహసా లఙ్కారోహణతత్పరాః, 4
యూథపా హరిరాజస్య కింకరాః సముపస్థితాః.

అ. ప్ర. సముపస్థితాః=సమీపించి ఉన్న, హరిరాజస్య=సుగ్రీవునియొక్క, కింకరాః=కింకరులైన, శతశః= వందలకొలది, అథ=మరియు, సహస్రశః=వేలకొలది, యూథపాః=సేనానాయకులు, వృక్షాన్=వృక్షములను, ఉద్యమ్య=ఎత్తి, సహసా=వెంటనే, లఙ్కారోహణతత్పరాః=లంకను ఎక్కుట యందు ఆసక్తి గలవారై, యమ్= ఎవనిని, పృష్ఠతః=వెనుక, అనుగచ్ఛన్తి=అనుసరించుచున్నారో.

తా. సుగ్రీవుని కింకరులై, అతని ఆజ్ఞప్రకారము వచ్చిన వందలకొలది, వేలకొలది యూథనాయకులు లంకను ఆక్రమించవలె నను ఉత్సాహముతో వృక్షములను ఎత్తి ఈతని వెనుకనే వచ్చుచున్నారు. 4

మూ. నీలానివ మహామేఘాంస్తిష్ఠతో యాంస్తు పశ్యసి, 5
అసితాఞ్జనసంకాశాన్ యుద్ధే సత్యపరాక్రమాన్,
అసంఖ్యేయాననిర్దేశ్యాన్పరం పారమివోదధేః. 6
పర్వతేషు చ యే కేచిద్విషయేషు నదీషు చ,
ఏతే త్వామభివర్తన్తే రాజన్నృక్షాః సుదారుణాః. 7

అ. ప్ర. రాజన్=రాజా! నీలాన్=నల్లని, మహామేఘానివ=గొప్ప మేఘముల వలె, తిష్ఠతః=ఉన్నవారు, అసితాఞ్జనసంకాశాన్=నల్లని కాటుకతో సమానులు, యుద్ధే=యుద్ధమునందు, సత్యపరాక్రమాన్=సత్యమైన పరాక్రమము గలవారు, అసంఖ్యేయాన్=లెక్కింప శక్యముకాని వారు, ఉదధేః=సముద్రముయొక్క, పరమ్ పారమ్=మరియొక, పారమివ=తీరమువలె, అనిర్దేశ్యాన్=స్పష్టముగా చూపశక్యము కాని వారు అయిన, యాన్ తు= ఎవరిని, పశ్యసి=చూచుచున్నావో, యే కేచన్=ఏ కొందరు, పర్వతేషు=పర్వతములయందు, విషయేషు=దేశములయందు, నదీషు చ=నదులయందు నివసించుచుందురో, ఏతే=ఈ, సుదారుణాః=చాలా భయంకరులైన, ఋక్షాః=భల్లూకములు, త్వామ్=నిన్ను గూర్చి, అభివర్తన్తే=ఎదురుగా వచ్చుచున్నారు.

తా. రాజా! నల్లని పెద్ద మేఘముల వలె, నల్లని కాటుకవలె కనబడుచున్న వాళ్లు భల్లూకములు. వీళ్లు యుద్ధమునందు సత్యమైన పరాక్రమముగలవారు. లెక్కింపశక్యము కానివారు. మరియొక సముద్రతీరము వలె వీరందరు అని చూప శక్యము కానివారు. వీరిలో కొందరు పర్వతములమీదా, కొందరు సమతలపు దేశాలలోను, మరికొందరు నదులలోను నివసించుచుందురు. చాల భయంకరులు. వీళ్లందరూ నిన్ను ఎదిరించుటకై వచ్చుచున్నారు. 5 - 7

మూ. ఏషాం మధ్యే స్థితో రాజన్ భీమాక్షో భీమదర్శనః,
పర్జన్య ఇవ జీమూతైః సమన్తాత్పరివారితః. 8
ఋక్షవన్తం గిరిశ్రేష్ఠమధ్యాస్తే నర్మదాం పిబన్,
సర్వర్క్షాణామధిపతిర్ధూమ్రో నామైష యూథపః. 9

ప్ర. అ. రాజన్=రాజా ! ఏషామ్=వీరియొక్క, మధ్యే=మధ్యయందు, స్థితః=ఉన్నవాడు, భీమాక్షః=భయంకరములైన నేత్రములు గలవాడు, భీమదర్శనః=భయంకరమైన దర్శనము గలవాడు, జీమూతైః=మేఘములచేత, పర్జన్యః ఇవ=పర్జన్యుడు (వర్షాధిష్ఠానదేవత) వలె, సమన్తాత్=అంతటా, పరివారితః=చుట్టబడినవాడు అయిన, ఏషః=ఇతడు, సర్వర్క్షాణామ్=సకలభల్లూకములకు, అధిపతిః=ప్రభువైన, ధూమ్రః నామ=ధూమ్రుడు అను పేరు గల, యూథపః=సేనానాయకుడు, నర్మదామ్=నర్మదను, పిబన్=త్రాగుచు, గిరిశ్రేష్ఠమ్=పర్వతశ్రేష్ఠమైన, ఋక్షవన్తమ్=ఋక్షవత్పర్వతమును, అధ్యాస్తే=అధిష్ఠించి ఉండును.

తా. మహారాజా ! వీరిమధ్యలో భయంకరమైన నేత్రములతో, చూచువారికి భయము కలిగించుచు చుట్టూ నల్లని మేఘము లున్న పర్జన్యుడు వలె ఉన్నవాడు, ధూమ్రుడు అను పేరు గల సకలభల్లూకములకు ప్రభువైన సేనానాయకుడు. ఇతడు నర్మదాజలమును త్రాగుచు పర్వతశ్రేష్ఠమైన ఋక్షవంతముమీద ఉండును. 8,9

మూ. యవీయానస్య తు భ్రాతా పశ్యైనం పర్వతోపమమ్,
భ్రాత్రా సమానో రూపేణ విశిష్టశ్చ పరాక్రమే. 10
స ఏష జామ్బవాన్నామ మహాయూథపయూథపః,
ప్రక్రాన్తో గురువర్తీ చ సంప్రహారేష్వమర్షణః. 11

ప్ర. అ. పర్వతోపమమ్=పర్వతముతో సమానుడైన, ఏనమ్=వీనిని, పశ్య=చూడుము; ఇతడు, అస్య=వీనియొక్క, యవీయాన్=చిన్నవాడైన, భ్రాతా=సోదరుడు, రూపేణ=రూపముచేత, భ్రాత్రా=సోదరునితో, సమానః=సమానుడు. పరాక్రమే=పరాక్రమమునందు, విశిష్టః=అధికుడు, స ఏషః=అట్టి ఇతడు, మహాయూథపయూథపః=మహాయూథనాయకుల యూథమునకు నాయకుడు; జామ్బవాన్నామ=జాంబవంతు అను పేరు గలవాడు. ప్రక్రాన్తః=పరాక్రమించువాడు. గురువర్తీ చ=పెద్దలను అనుసరించువాడు, సంప్రహారేషు=యుద్ధములయందు, అమర్షణః=శత్రువులను సహించనివాడు.

తా. పర్వతముతో సమానుడైన అతనిని చూడుము. అతడు ధూమ్రుని తమ్ముడు. రూపమునందు సోదరునితో సమానుడు. కాని పరాక్రమమునందు అతని కంటె గొప్పవాడు. ఎన్నో భల్లూకయూథముల నాయకులకు నాయకుడైన

ఇతని పేరు జాంబవంతుడు. ఇతడు పరాక్రమవంతుడు. పెద్దల విషయమున వినయము గలవాడు. యుద్ధములో ఎదుటివారిని సహించడు. 10, 11

మూ. ఏతేన సాహ్యం తు మహత్ కృతం శక్రస్య ధీమతా,
దేవాసురే జామ్బవతా లబ్ధాశ్చ బహవో వరాః. 12

ప్ర. అ. ధీమతా=బుద్ధిమంతుడైన, ఏతేన=ఈ, జామ్బవతా=జాంబవంతుని చేత, దేవాసురే=దేవాసుర యుద్ధమునందు, శక్రస్య=దేవేంద్రునకు, మహత్=గొప్ప, సాహ్యమ్=సాహాయ్యము, కృతమ్=చేయబడినది. బహవః=అనేకమైన, వరాశ్చ=వరములు కూడ, లబ్ధాః=పొందబడినవి.

తా. ధీమంతుడైన ఈ జాంబవంతుడు దేవాసురయుద్ధమునందు దేవేంద్రునకు గొప్ప సాహాయ్యము చేసి అనేకవరములు కూడ పొందినాడు.12

మూ. ఆరుహ్య పర్వతాగ్రేభ్యో మహాభ్రవిపులాః శిలాః,
ముఞ్చన్తి విపులాకారా న మృత్యోరుద్విజన్తి చ. 13
రాక్షసానాం చ సదృశాః పిశాచానాం చ రోమశాః,
ఏతస్య సైన్యా బహవో విచరన్త్యమితౌజసః. 14

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులకు, పిశాచానాం చ=పిశాచములకు, సదృశాః=సమానమైన, రోమశాః=రోమములతో నిండిన, అమితౌజసః=అనంతమైన తేజస్సు గల, బహవః=అనేకులైన, ఏతస్య=ఇతనియొక్క, విపులాకారాః=పెద్ద ఆకారములు గల, సైన్యాః=సైన్యమునకు సంబంధించిన యోధులు, ఆరుహ్య=ఎక్కి, పర్వతాగ్రేభ్యః=పర్వతముల పైభాగములనుండి, మహాభ్రవిపులాః=పెద్దమేఘముల వలె విశాలములైన, శిలాః=శిలలను, ముఞ్చన్తి=విడచుచుందురు. మృత్యోః=మృత్యువునుండి, న ఉద్విజన్తి=భయపడరు. విచరన్తి=సంచరించుచుందురు.

తా. పెద్ద శరీరములు గలవారు, రాక్షసులతోను, పిశాచములతోను సమానులు, రోమములతో నిండినవారు, గొప్ప తేజస్సు గలవారు అయిన ఈతని సైనికులు సంచరించుచు పర్వతములపైకి ఎక్కి అక్కడినుండి పెద్ద మేఘములవంటి శిలలను క్రిందికి త్రోయుచుందురు. మృత్యువుకు భయపడరు.

మూ. యమేనమభిసంరబ్ధం ప్లవమానమివ స్థితమ్,
ప్రేక్షన్తే వానరాః సర్వే స్థితం యూథపయూథపమ్. 15
ఏష రాజన్ సహస్రాక్షం పర్యుపాస్తే హరీశ్వరః,
బలేన బలసంయుక్తో దమ్భో నామైష యూథపః. 16

ప్ర. అ. రాజన్=రాజా ! సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, అభిసంరబ్ధమ్=కోపముతో తొందరగా ఉన్నవాడు, ప్లవమానమివ=ఎగురుచున్నవాడు

వశే, స్థితమ్=ఉన్నవాడు, యూథపయూథపమ్=యూథనాయకుల యూథమునకు నాయకుడుగా, స్థితమ్=ఉన్నవాడు అయిన, యమ్=ఏ, ఏనమ్=వీనిని, ప్రేక్షసే=చూచుచున్నారో, బలసంయుక్తః=సేనతో కూడిన, ఏషః=ఈ, హరీశ్వరః=వానరనాయకుడు, బలేన=బలముచేత, సహస్రాక్షమ్=ఇంద్రుని, పర్యుపాస్తే=సేవించుచుండును. ఏషః=ఇతడు, దమ్భో నామ=దంభుడను, యూథపః=సేనానాయకుడు.

తా. మహారాజా ! అక్కడ ఎక్కువ కోపముతోను తొందరతోను ఎగురుచున్నట్లుగా ఆ వానరనాయకుణ్ణి వానరులందరూ చూచుచున్నారు. ఆతడు యూథనాయకుల యూథమునకు నాయకుడైన దంభు డను సేనానాయకుడు. సైన్యముతో కూడిన ఇతడు బలముచేత దేవేంద్రునికి కూడ సాహాయ్యము చేయుచుండును. 15, 16

మూ. యః స్థితం యోజనే శైలం గచ్ఛన్ పార్శ్వేన సేవతే,
ఊర్ధ్వం తథైవ కాయేన గతః ప్రాప్నోతి యోజనమ్. 17
యస్మాత్తు పరమం రూపం చతుష్పాత్సు న విద్యతే,
శ్రుతః సంనాదనో నామ వానరాణాం పితామహః. 18
యేన యుద్ధం పురా దత్తం రణే శక్రస్య ధీమతా,
పరాజయశ్చ న ప్రాప్తః సోఽయం యూథపయూథపః. 19

ప్ర. అ. యః=ఎవడు, యోజనే=యోజనము దూరమునందు, స్థితమ్=ఉన్న, శైలమ్=పర్వతమును, పార్శ్వేన=పార్శ్వముచేత, సేవతే=సేవించుచున్నాడో, తథైవ=మరియు, కాయేన=దేహముచేత, ఊర్ధ్వమ్=పైవైపు, గతః=వెళ్లినవాడై, యోజనమ్=యోజనమును, ప్రాప్నోతి=పొందుచున్నాడో, యస్మాత్=ఎవనికంటె, పరమమ్=పెద్దదైన, రూపమ్=రూపము, చతుష్పాత్సు=నాలుగుకాళ్ల జంతువులయందు, న విద్యతే=లేదో, ధీమతా=బుద్ధిమంతుడైన, యేన=ఎవనిచేత, పురా=పూర్వము, రణే=యుద్ధరంగమునందు, శక్రస్య=దేవేంద్రునకు, యుద్ధమ్=యుద్ధము, దత్తమ్=ఇవ్వబడినదో, పరాజయః=పరాజయము, న ప్రాప్తః=పొందబడలేదో, సః=అట్టి, అయమ్=ఇతడు, యూథపః=యూథనాయకుల యూథమునకు నాయకుడు, వానరాణామ్=వానరులయొక్క, పితామహః=పితామహుడు అయిన, సంనాదనో నామ=సంనాదనుడు అను పేరు గల, శ్రుతః=ప్రసిద్ధుడైన వానరుడు.

తా. యోజనము దూరములో ఉన్న ఆ పర్వతమునకు పార్శ్వభాగముచేత ఆనుకొని యోజనము ఎత్తైన దేహముతో ఉన్నవాడు వానరుల పితామహుడైన సంనాదను డను యూథనాయకుల యూథమునకు నాయకుడు. చతుష్పాదజంతువులలో ఇతని దేహమునకు మించిన దేహము దేనికీ ఉండదు. ధీమంతుడైన ఇతడు పూర్వము రణరంగములో దేవేంద్రునితో కూడ యుద్ధము

చేసి పరాజయమును పొందలేదు. 17 - 19

మూ. యస్య విక్రమమాణస్య శక్రస్యేవ పరాక్రమః,
ఏష గన్ధర్వకన్యాయాముత్పన్నః కృష్ణవర్త్మనా, 20
తత్ర దేవాసురే యుద్ధే సాహ్యార్థం త్రిదివౌకసామ్.

ప్ర. అ. విక్రమమాణస్య=పరాక్రమించుచున్న, యస్య=ఎవనియొక్క, పరాక్రమః=పరాక్రమము, శక్రస్యేవ=ఇంద్రుని పరాక్రమము వంటిదో, ఏషః=ఈ సంనాదుడు, గన్ధర్వకన్యాయామ్=గంధర్వకన్యయందు, కృష్ణవర్త్మనా=అగ్నిచేత, తదా=అప్పుడు, దేవాసురే యుద్ధే=దేవాసురయుద్ధమునందు, త్రిదివౌకసామ్=దేవతలయొక్క, సాహ్యార్థమ్=సాహాయ్యము కొరకు, ఉత్పన్నః=పుట్టినాడు.

తా. పరాక్రమించుచున్న ఇతని పరాక్రమము దేవేంద్రుని పరాక్రమమువంటిది. ఇతడు గంధర్వకన్యయందు అగ్నివలన పుట్టినాడు.

మూ. యత్ర వైశ్రవణో రాజా జమ్బూముపనిషేవతే, 21
యో రాజా పర్వతేన్ద్రాణాం బహుకింనరసేవితామ్,
విహారసుఖదో నిత్యం భ్రాతుస్తే రాక్షసాధిప. 22
తత్రైష రమతే శ్రీమాన్ బలవాన్వానరోత్తమః,
యుద్ధేష్వకత్థనో నిత్యం క్రథనో నామ యూథపః. 23

ప్ర. అ. రాక్షసాధిప=రాక్షసరాజా ! వైశ్రవణః=విశ్రవసుని కుమారుడైన, రాజా=కుబేరుడు, యత్ర=ఏ పర్వతమునందు, జమ్బూమ్=జంబూవృక్షమును, ఉపనిషేవతే=సేవించునో, యః=ఏ పర్వతము, బహుకింనరసేవితామ్=అనేకులైన కింనరులను సేవించు, పర్వతేన్ద్రాణామ్=పర్వతశ్రేష్ఠములయొక్క, రాజా=రాజో, తే భ్రాతుః=నీ సోదరునకు, నిత్యమ్=ఎల్లప్పుడూ, విహారసుఖదః=విహరించు సుఖమును ఇచ్చునదో, తత్ర=ఆ పర్వతముమీద, శ్రీమాన్=శ్రీమంతుడు, బలవాన్=బలవంతుడు, వానరోత్తమః=వానరశ్రేష్ఠుడు, యుద్ధేషు=యుద్ధములయందు, అకత్థనః=బడాయి చెప్పుకొనని వాడు అయిన, ఏషః=ఈ, క్రథనో నామ=క్రథను డను పేరు గల, యూథపః=యూథనాయకుడు, నిత్యమ్=నిత్యము, రమతే=క్రీడించును.

తా. రాక్షసరాజా ! శ్రీమంతుడు, బలవంతుడు, యుద్ధములలో బడాయిని చెప్పుకొననివాడు, వానరశ్రేష్ఠుడు అయిన క్రథను డను పేరు గల ఈ యూథనాయకుడు, ఏ పర్వతముమీద కుబేరుడు జంబూవృక్షమును చేరి విహరించుచుండునో, ఏది అనేక కింనరులకు నివాసస్థానములైన పర్వతరాజులకు రాజో, ఏది నీ సోదరుడైన కుబేరునకు విహారసుఖము నిచ్చునో ఆ కైలాసపర్వతముమీద నిత్యము విహరించుచుండును. 21-23

మూ. వృతః కోటిసహస్రేణ హరీణాం సమవస్థితః,
ఏషైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. 24

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, కోటిసహస్రేణ=వేయి కోట్లచేత, వృతః=కూడినవాడై, స్థితః=ఉన్న, ఏషైవ= ఇతడే, స్వేన=తనసంబంధమైన, అనీకేన=సేనచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

తా. వెయ్యి కోట్ల వానరులతో కూడి నిలచి ఉన్న ఈతడే తన సైన్యముచేత లంకను మర్దించవలె నని కోరుచున్నాడు. 24

మూ. యో గఙ్గామనుపర్యేతి త్రాసయన్ గజయూథపాన్,
హస్తినాం వానరాణాం చ పూర్వవైరమనుస్మరన్. 25
ఏష యూథపతిర్నేతా గర్జన్ గిరిగుహాశయః,
గజాన్ రోధయతే వన్యానారుజంశ్చ మహీరుహాన్. 26

ప్ర. అ. హస్తినామ్=ఏనుగులయొక్క, వానరాణాం చ=వానరులయొక్క, పూర్వవైరమ్=వెనుకటి వైరమును, అనుస్మరన్=స్మరించుచు, యః=ఎవడు, గజయూథపాన్=గజయూథనాయకులను, త్రాసయన్=భయపెట్టుచు, గఙ్గామ్=గంగను, అనుపర్యేతి=అనుసరించి సంచరించుచుండునో, యూథపతిః=యూథములకు ప్రభువు, నేతా= నాయకుడు, గర్జన్=గర్జించుచున్నవాడు అయిన, ఏషః=ఈ ప్రమాథి, గిరిగుహాశయః=పర్వతగుహయందున్నవాడై, మహీరుహాన్=వృక్షములను, ఆరుజంశ్చ=పీడించుచు, వన్యాన్=వనమునకు సంబంధించిన, గజాన్=ఏనుగులను, రోధయతే=అడ్డుకొనుచుండెను.

తా. వానరయూథములకు ప్రభువు, నాయకుడూ, అయిన గర్జించుచున్న ఈ ప్రమాథి ఏనుగులకు వానరులకు మధ్య ఉన్న పూర్వవైరమును స్మరించుచు గజయూథనాయకులను భయపెట్టుచు గంగాప్రాంతమునందు నివసించుచుండెను. పర్వతగుహలలో నివసించుచు, వృక్షములను పీడించుచు వనగజములను అడ్డుకొనుచుండెను. 25, 26

మూ. హరీణాం వాహినీముఖ్యో నదీం హైమవతీమను,
ఉశీరబీజమాశ్రిత్య మన్దరం పర్వతోత్తమమ్, 27
రమతే వానరశ్రేష్ఠో దివి శక్ర ఇవ స్వయమ్.

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, వాహినీముఖ్యః=సేనకు ముఖ్యుడైన, వానరశ్రేష్ఠః=ఈ వానరశ్రేష్ఠుడు, హైమవతీమ్=హిమవత్పర్వతమునకు సంబంధిం

నది, నదీమ్ అను=గంగానదిని అనుసరించి, ఉశీరబీజమ్= ఉశీరబీజపర్వతమును, పర్వతోత్తమమ్=పర్వతములలో ఉత్తమమైన, మన్దరమ్=మందరమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, దివి=స్వర్గమునందు, స్వయమ్=స్వయముగా, శక్రః ఇవ=దేవేంద్రుడు వలె, రమతే=ఆనందించుచుండును.

తా. వానరసేనానాయకుడైన ఈ వానరశ్రేష్ఠుడు గంగానదీప్రాంతమునందు ఉశీరబీజపర్వతమును, పర్వతశ్రేష్ఠమైన మందరపర్వతమును ఆశ్రయించి సాక్షాత్తు స్వర్గములో దేవేంద్రుడు వలె ఆనందముతో నివసించుచుండును.27

మూ. ఏవం శతసహస్రాణాం సహస్రమభివర్తతే, 28
వీర్యవిక్రమదృప్తానాం నర్దతాం బాహుశాలినామ్.

ప్ర. అ. వీర్యవిక్రమదృప్తానామ్=బలముచేత, పరాక్రమముచేత గర్వించిన, నర్దతామ్=గర్జించుచున్న, బాహుశాలినామ్=బాహువులతో ప్రకాశించుచున్న, శతసహస్రాణామ్=లక్షమంది వానరులయొక్క, సహస్రమ్=సహస్రము, ఏనమ్=వీనిని, అభివర్తతే=అనుసరించి ఉన్నది.

తా. శక్తిచేత పరాక్రమముచేత గర్వించినవారు, బాహుబలము గలవారు, గర్జించుచున్నవారు అయిన వేయిలక్షలమంది వానరులు ఈతని వెంట ఉన్నారు.

మూ. స ఏష నేతా చైతేషాం వానరాణాం మహౌజసామ్, 29
స ఏష దుర్ధరో రాజన్ ప్రమాథీ నామ యూథపః.

ప్ర. అ. సః ఏషః=అట్టి ఇతడు, ఏతేషామ్=ఈ, మహౌజసామ్=మహౌజస్సులైన, వానరాణామ్=వానరులయొక్క, నేతా=నాయకుడు. రాజన్=రాజా, సః ఏషః=అట్టి ఇతడు, దుర్ధరః=ఎదిరింప శక్యము కాని, ప్రమాథీ నామ= ప్రమాథి అను పేరు గల, యూథపః=యూథనాయకుడు.

తా. మహారాజా ! ఇతడు మహౌజస్సులైన వానరులకు నాయకుడు, ఎదిరింప శక్యము కానివాడు అయిన ప్రమాథి అను యూథనాయకుడు. 29

మూ. వాతేనేవోద్ధతం మేఘం యమేనమనుపశ్యసి, 30
అనీకమపి సంరబ్ధం వానరాణాం తరస్వినామ్,

ఉద్ధూతమరుణాభాసం పవనేన సమన్తతః. 31
వివర్తమానం బహుశో యత్ర తద్బహులం రజః.

ప్ర. అ. వాతేన=గాలిచేత, ఉద్ధతమ్=ఎగురగొట్టబడిన, మేఘమివ=మేఘమును వలె, యమ్=ఏ, ఏనమ్=వీనిని, సమనుపశ్యసి=చూచుచున్నావో

(అతడే ప్రమాథి). యత్ర=ఎక్కడ, పవనేన=వాయువుచేత, సమన్తతః=అంతటా, ఉద్ధూతమ్=ఎగురగొట్టబడిన, అరుణాభాసమ్=ఎఱ్ఱని కాంతి గల, బహుధా=అనేకవిధములు, వివర్తమానమ్= తిరుగుచున్న, బహులమ్=అధికమైన, రజః=పరాగమున్నదో, (అక్కడ) తరస్వినామ్=వేగవంతులైన, వానరాణామ్= వానరులయొక్క, సంరబ్ధమ్=తొందరగల, అనీకమపి=సైన్యము కూడ ఉన్నది. (అది ఈ ప్రమాథి సైన్యమే).

తా. గాలికి ఎగురుచున్న మేఘము వలె కనబడుచున్న అతడే ప్రమాథి. ఆ ప్రాంతమునందు గాలిచేత ఎగురగొట్టబడి అంతటా వ్యాపించిన ఎఱ్ఱని అధికమైన పరాగము అనేకవిధములుగా తిరుగుచున్నది. అక్కడ ఉన్న బలశాలులైన వానరుల విజృంభించుచున్న సైన్యము ఈ ప్రమాథిసైన్యమే.30, 31

మూ. ఏతే౽సితముఖా ఘోరా గోలాఙ్గూలా మహాబలాః, 32
శతం శతసహస్రాణి దృష్ట్వా వై సేతుబన్ధనమ్,
గోలాఙ్గూలం మహారాజ గవాక్షం నామ యూథపమ్, 33
పరివార్యాభివర్తన్తే లఙ్కాం మర్దితుమోజసా.

ప్ర. అ. మహారాజ=మహారాజా ! అసితముఖాః=నల్లని ముఖములు గల, ఘోరాః=భయంకరులైన, మహాబలాః=గొప్ప బలము గల, శతమ్=నూరు, శతసహస్రాణి=లక్షల, గోలాఙ్గూలాః=గోలాంగూలములు (కొండముచ్చులు), సేతుబన్ధనమ్=సేతుబంధనమును, దృష్ట్వా=చూచి (సేతువును దాటవచ్చి), యూథపమ్=యూథనాయకుడైన, గవాక్షం నామ=గవాక్షుడు అను పేరు గల, గోలాఙ్గూలమ్=గోలాంగూలుని, పరివార్య=చుట్టుకొని, ఓజసా=తేజస్సుచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, అభివర్తన్తే=ధ్వనిచేయుచున్నారు.

తా. మహారాజా ! నల్లని ముఖములు గల భయంకరులైన వందలక్షలమంది గోలాంగూలురు సేతువును దాటి వచ్చి తమ యూథమునకు నాయకుడైన గవాక్షుడను గోలాంగూలుని చుట్టూ నిలచి, బలముతో లంకను మర్దించుటకై సింహనాదము చేయుచున్నారు. 32, 33

మూ. భ్రమరాచరితా యత్ర సర్వకాలఫలద్రుమాః, 34
యం సూర్యస్తుల్యవర్ణాభమనుపర్యేతి పర్వతమ్,
యస్య భాసా సదా భాన్తి తద్వర్ణా మృగపక్షిణః. 35
యస్య ప్రస్థం మహాత్మానో న త్యజన్తి మహర్షయః,
సర్వకామఫలా వృక్షాః సర్వే ఫలసమన్వితాః. 36
మధూని చ మహార్హాణి యస్మిన్ పర్వతసత్తమే,

తత్రైష రమతే రాజన్ రమ్యే కాఞ్చనపర్వతే, 37
ముఖ్యో వానరముఖ్యానాం కేసరీ నామ యూథపః.

ప్ర. అ. రాజన్=మహారాజా ! యత్ర=దేనియందు, సర్వకాలఫలద్రుమాః=సర్వకాలములయందు ఫలముల నిచ్చు వృక్షములు, భ్రమరాచరితాః=తుమ్మెదలచేత వ్యాప్తములైనవో, తుల్యవర్ణాభమ్=తనతో సమానమైన వర్ణమూ కాంతి గల, యమ్=దేనిని, సూర్యః=సూర్యుడు, అనుపర్యేతి=ప్రదక్షిణము చేయునో, యస్య=దేనియొక్క, భాసా=కాంతిచేత, మృగపక్షిణః=మృగములు పక్షులు, సదా=ఎల్లప్పుడు, తద్వర్ణాః=దాని వర్ణము గలవై, భాన్తి=ప్రకాశించుచున్నవో, మహాత్మానః=మహాత్ములైన, మహర్షయః=మహర్షులు, యస్య=దేనియొక్క, ప్రస్థమ్=చరియను, న త్యజన్తి=విడువరో, సర్వే=సమస్తమైన, సర్వకామఫలాః=సమస్తకామములను ఇచ్చు, వృక్షాః=వృక్షములు, ఫలసమన్వితాః=ఫలములతో కూడి ఉండునో, యస్మిన్=ఏ, పర్వతసత్తమే=పర్వతశ్రేష్ఠమునందు, మధూని=మధువులు, మహార్హాణి=చాల శ్రేష్ఠమైనవో, తత్ర=అట్టి, రమ్యే=రమ్యమైన, కాఞ్చనపర్వతే=మేరుపర్వతమునందు, వానరముఖ్యానామ్=వానరనాయకులలో, ముఖ్యః=ముఖ్యుడైన, ఏషః=ఈ, కేసరీ నామ=కేసరి అను పేరు గల, యూథపః=సేనానాయకుడు, రమతే=విహరించుచుండును.

తా. మహారాజా! వానరనాయకులలో ముఖ్యుడైన, కేసరి అను ఈ వానరసేనానాయకుడు, ఏ పర్వతము మీద ఉన్న, అన్ని కాలములయందు ఫలముల నిచ్చే వృక్షములు తుమ్మెదలతో నిండి ఉండునో, సూర్యుడు తన వంటి వర్ణమూ, కాంతి గల దేనికి ప్రదక్షిణము చేయుచుండునో, దేని కాంతిచేత అక్కడ నున్న మృగములు పక్షులు ఎల్లప్పుడు బంగారు కాంతితో ప్రకాశించుచుండునో, మహాత్ములైన మహర్షులు దేని చరియలను విడువరో, దేని మీద అన్ని కోరికలను తీర్చు వృక్షములన్నీ ఫలములతో నిండి ఉండునో, ఏ పర్వతశ్రేష్ఠమునందు మధువులు చాల శ్రేష్ఠమైనవో, అట్టి రమ్యమైన మేరుపర్వతము మీద నివసించును. 34 - 37

మూ. షష్టిర్గిరిసహస్రాణి రమ్యాః కాఞ్చనపర్వతాః. 38
తేషాం మధ్యే గిరివరస్త్వమివానఘ రక్షసామ్,
తత్రైతే కపిలాః శ్వేతాస్తామ్రాస్యా మధుపిఙ్గలాః. 39
నివసన్త్యుత్తమగిరౌ తీక్ష్ణదంష్ట్రా నఖాయుధాః,
సింహా ఇవ చతుర్దంష్ట్రా వ్యాఘ్రా ఇవ దురాసదాః. 40
సర్వే వైశ్వానరసమా జ్వలితాశీవిషోపమాః,
సుదీర్ఘాఞ్చితలాఙ్గూలా మత్తమాతఙ్గసన్నిభాః. 41
మహాపర్వతసంకాశా మహాజీమూతనిస్వనాః,

వృత్తపిఙ్గలనేత్రా హి మహాభీమగతిస్వనాః, 42
మర్దయన్తీవ తే సర్వే తస్థుర్లఙ్కాం సమీక్ష్య తే.

ప్ర.అ. అనఘ=దోషములు లేని మహారాజా ! రమ్యాః=రమ్యములైన, కాఞ్చనపర్వతాః=బంగారు పర్వతములైన, షష్టిః=అరువది, గిరిసహస్రాణి=వెయ్యి గిరులు ఉన్నవి. రక్షసామ్=రాక్షసుల మధ్యయందు, త్వమివ=నీవు వలె, తేషామ్=ఆ పర్వతముల, మధ్యే=మధ్యయందు, గిరివరః=పర్వతశ్రేష్ఠ మున్నది. తత్ర=దాని యందు, తత్ర=అక్కడ, అస్తమగిరౌ=చివరి పర్వతమునందు, కపిలాః=కపిలవర్ణము గలవారు, శ్వేతాః= తెల్లనివాళ్లు, తామ్రాస్యాః=ఎఱ్ఱని ముఖములు గలవాళ్లు, మధుపిఙ్గలాః=తేనె వలె పింగళవర్ణము గలవారు, తీక్ష్ణదంష్ట్రాః=తీక్ష్ణమైన కోరలు గలవారు, నఖాయుధాః=గోళ్లు ఆయుధములుగా గలవారు, సింహా ఇవ=సింహముల వలె, చతుర్దంష్ట్రాః=నాలుగు కోరలు గలవారు, వ్యాఘ్రా ఇవ=పెద్దపులుల వలె, దురాసదాః=సమీపింప శక్యము కానివారు, సర్వే=అందరూ, వైశ్వానర సమాః=అగ్నితో సమానులు, జ్వలదాశీవిషోపమాః=ప్రజ్వలించుచున్న సర్పములతో సమానులు, సుదీర్ఘాఞ్చితలాఙ్గూలాః=బాగా పొడవైన అందమైన తోకలు గలవారు, మత్తమాతఙ్గసన్నిభాః=మదించిన ఏనుగులతో సమానులు, మహాపర్వతసంకాశాః=మహాపర్వతములతో సమానులు, మహాజీమూతనిఃస్వనాః=గొప్ప మేఘములవంటి ధ్వని గలవారు, వృత్తపిఙ్గలనేత్రాః=గుండ్రని, పచ్చని నేత్రములు గలవారు, మహాభీమగతిస్వనాః=చాల భయంకరమైన గమనము, ధ్వని గలవారు అయిన, ఏతే=ఈ వానరులు, నివసన్తి=నివసించుచున్నారు. సర్వే=అందరు, తస్థుః=ఇక్కడ నిలబడి ఉన్నారు. తే=వారు, తే=నీయొక్క, లఙ్కామ్= లంకను, సమీక్ష్య=చూచి, మర్దయన్తీవ=మర్దించుచున్నట్లు ఉన్నారు.

తా. ఆ మేరుపర్వతప్రాంతమునందు అరువదివేల బంగారుపర్వతము లున్నవి. దోషరహితుడవైన ఓ ! మహారాజా ! వాటిమధ్య, రాక్షసులమధ్య నీవు వలె, ఒక పర్వతశ్రేష్ఠ మున్నది. చివరి పర్వతముమీద ఈ వానరులు నివసించుచుందురు. వీరిలో కొందరు నల్లగాను, కొందరు తెల్లగాను, ఎఱ్ఱని ముఖములతోను, తేనె రంగుతోను ఉందురు. వీళ్లు తీక్ష్ణములైన కోరలు గలవారు; గోళ్లే వీళ్లకు ఆయుధములు. సింహముల వలె నాలుగేసి దంతములు గల వీళ్లు వ్యాఘ్రముల వలె సమీపింప శక్యము కానివారు. అందరు కూడ అగ్నితో సమానులు; ప్రజ్వలించుచున్న సర్పములతో సమానులు. మదించిన ఏనుగులతో సమానులైన వీరి తోకలు చాల దీర్ఘముగా, అందముగా ఉండును. పెద్ద పర్వతముల వంటి ఆకారములు గల ఈ వానరులు పెద్ద మేఘముల వలె గర్జించుచుందురు. వీళ్ల నేత్రములు గుండ్రముగా, పచ్చగా ఉండును. వీరి గమనము ధ్వని కూడ చాల భయంకరము. వీళ్లు లంకాసమీపమునందు నిలచి

మూపులతో ఏ లంకాపట్టణమును మర్దింపదలచున్నారో అన్నట్లు ఉన్నారు. 38-42

మూ. ఏష చైషామధిపతిర్మధ్యే తిష్ఠతి వీర్యవాన్, 43
జయార్థీ నిత్యమాదిత్యముపతిష్ఠతి బుద్ధిమాన్,
నామ్నా పృథివ్యాం విఖ్యాతో రాజన్ శతబలీతి యః, 44
ఏషైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్.

ప్ర.అ. రాజన్=రాజా ! యః=ఎవడు, నామ్నా=పేరుచేత, శతబలిః=శతబలి అని, పృథివ్యామ్=భూమియందు, విఖ్యాతః=ప్రసిద్ధుడో, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, ఏషామ్=ఈ వానరులయొక్క, అధిపతిః=అధిపతి యైన, ఏషః=ఇతడు, మధ్యే=మధ్యయందు, తిష్ఠతి=ఉన్నాడు. బుద్ధిమాన్=బుద్ధిమంతుడైన ఇతడు, జయార్థీ=జయమును కోరుచు, నిత్యమ్=ఎల్లప్పుడు, ఆదిత్యమ్=సూర్యుణ్ణి, ఉపతిష్ఠతే=సేవించుచుండును. ఏషైవ=ఇతడే, స్వేన=తన సంబంధమైన, అనీకేన=సేనచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

తా. మహారాజా ! శతబలి అను పేరుతో భూమియందు ప్రసిద్ధుడు, వానరుల నాయకుడు, అయిన ఇతడు వీరి మధ్య నిలబడి ఉన్నాడు. ఇతడు జయమును సంపాదింప గోరుచు నిత్యము సూర్యుని పూజించుచుండును. ఈతడొక్కడే తన సైన్యముతో కలిసి వచ్చి లంకను మర్దింపవలె నని అభిలషించుచున్నాడు. 43, 44

మూ. విక్రాన్తో బలవాన్ శూరః పౌరుషే స్వే వ్యవస్థితః, 45
రామప్రియార్థం ప్రాణానాం దయాం న కురుతే హరిః.

ప్ర. అ. విక్రాన్తః=పరాక్రమవంతుడు, బలవాన్=బలవంతుడు, శూరః=శూరుడు, స్వే=తన సంబంధమైన, పౌరుషే=పౌరుషమునందు, వ్యవస్థితః=నిలచినవాడు అయిన, హరిః=ఈ వానరుడు, రామప్రియార్థమ్=రామునకు ప్రియము చేయుటకు, ప్రాణానామ్=ప్రాణములయొక్క, దయామ్=దయను, న కురుతే=చేయడు.

తా. పరాక్రమవంతుడు, బలవంతుడు, శూరుడు, తన పురుషకారము నందే నమ్మకము గలవాడు అయిన ఈ శతబలి రామునకు ప్రియమును చేయుటకై తన ప్రాణములను కూడ లెక్కచేయడు. 45

మూ. గజో గవాక్షో గవయో నలో నీలశ్చ వానరః, 46
ఏకైకమేవ యూథానాం కోటిభిర్దశభిర్వృతః.

ప్ర.అ. గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, గవయః=గవయుడు, నలః=

నలుడు, నీలః వానరశ్చ=నీలు డను వానరుడు, ఏకైకమేవ=ఒక్కొక్కరివొప్పున, యోధానామ్=యోధులయొక్క, కోటిభిః=కోటులతో, వృతః=కూడినవాడు.

తా. గజుడు, గవాక్షుడు, గవయుడు, నలుడు, నీలుడు, ఒక్కొక్కడు కోట్లకొలది యోధులతో కూడి ఉన్నాడు. 46

మూ. తథాన్యే వానరశ్రేష్ఠా విన్ధ్యపర్వతవాసినః,
న శక్యన్తే బహుత్వాత్తు సంఖ్యాతుం లఘువిక్రమాః. 47

ప్ర.అ. తథా=మరియు, విన్ధ్యపర్వతవాసినః=వింధ్యపర్వతమునందు నివసించు, అన్యే= ఇతరులైన, లఘువిక్రమాః=శీఘ్రమైన విక్రమము గల, వానరశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, బహుత్వాత్=అధికసంఖ్య గలుటచేత, సంఖ్యాతుమ్=లెక్క పెట్టుటకు, న శక్యన్తే= శక్యమైనవారు కారు.

తా. శీఘ్రముగా పరాక్రమమును చూపగలిగిన వింధ్యపర్వతవాసులైన వానరులు ఇంకా ఎందరో ఉన్నారు. వాళ్లు చాలమంది ఉండుటచేత లెక్కపెట్టుటకు శక్యముకాదు. 47

మూ. సర్వే మహారాజ మహాప్రభావాః
సర్వే మహాశైలనికాశకాయాః,
సర్వే సమర్థాః పృథివీం క్షణేన
కర్తుం ప్రవిధ్వస్తవికీర్ణశైలామ్. 48

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తవింశః సర్గః.

ప్ర.అ. మహారాజ=ఓ! మహారాజా! సర్వే=అందరూ, మహాప్రభావాః=గొప్ప ప్రభావము కలవారు. సర్వే=అందరు, మహాశైలనికాశకాయాః=మహాపర్వతములతో సమానమైన దేహము గలవారు. సర్వే=అందరూ, క్షణేన=క్షణకాలముచేత, పృథివీమ్=భూమిని, ప్రవిధ్వస్తవికీర్ణశైలామ్=ధ్వంసము చేయబడిన ఇటు నటూ విసిరివేయబడిన పర్వతములు కలదానినిగా, కర్తుమ్=చేయుటకు, సమర్థాః=సమర్థులు.

తా. మహారాజా ! ఈ వానరులలో అందరూ గొప్ప ప్రభావముగలవారే. అందరూ పెద్ద పర్వతములతో సమానమైన దేహములు గలవారే. క్షణకాలములో ఈ భూమిపై ఉన్న పర్వతముల నన్నింటిని ధ్వంసము చేసి చెల్లాచెదరు చేయుటకు అందరూ సమర్థులే. 48

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఇరువదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశః సర్గః

[సంగ్రహము - మంత్రులు, మైందద్వివిదులు, హనుమంతుడు, రామలక్ష్మణులు, విభీషణుడు, సుగ్రీవుడు - వీరందరిని గూర్చి చెప్పి శుకుడు వానరసైన్యము సంఖ్యను చెప్పుట.]

మూ. సారణస్య వచః శ్రుత్వా రావణం రాక్షసాధిపమ్,
బలమాదిశ్య తత్సర్వం శుకో వాక్యమథాబ్రవీత్. 1

ప్ర. అ. అథ=అటు పిమ్మట, శుకః=శుకుడు, సారణస్య=సారణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, తత్=ఆ, సర్వమ్=సమస్తమైన, బలమ్=సేనను, ఆదిశ్య=చూపి, రాక్షసాధిపమ్=రాక్షసుల ప్రభువైన, రావణమ్=రావణుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సారణుడు తన మాటలు పూర్తి చేసిన పిమ్మట శుకుడు ఆ సమస్తసైన్యమును చూపుచు రాక్షసరాజైన రావణునితో ఇట్లు పలికెను. 1

మూ. స్థితాన్పశ్యసి యానేతాన్ మత్తానివ మహాద్విపాన్,
న్యగ్రోధానివ గాఙ్గేయాన్ సాలాన్ హైమవతానివ. 2
ఏతే దుష్ప్రసహా రాజన్ బలినః కామరూపిణః,
దైత్యదానవసంకాశా యుద్ధే దేవపరాక్రమాః. 3

ప్ర.అ. రాజన్=రాజా ! మత్తాన్=మదించిన, మహాద్విపానివ=గొప్ప ఏనుగులను వలె, గాఙ్గేయాన్=గంగకు సంబంధించిన, న్యగ్రోధానివ=మఱ్ఱిచెట్లను వలె, హైమవతాన్=హిమవత్పర్వతమునకు సంబంధించిన, సాలానివ=సాలవృక్షములను వలె, స్థితాన్=నిలచి ఉన్న, యాన్=ఏ, ఏతాన్=వీరిని, పశ్యసి=చూచుచున్నావో, ఏతే=వీరు, దుష్ప్రసహాః=సహించ శక్యము కానివారు, బలినః=బలవంతులు, కామరూపిణః=కామరూపము గలవారు, దైత్యదానవసంకాశాః=దైత్యులతోను దానవులతోను సమానులు. యుద్ధే=యుద్ధమునందు, దేవపరాక్రమాః= దేవతలవంటి పరాక్రమము కలవారు.

తా. మహారాజా ! మదించిన మహాగజముల వలె, గంగాతీరమునందున్న మఱ్ఱిచెట్ల వలె, హిమవత్పర్వతముమీద ఉన్న మద్దిచెట్ల వలె నిలచి మనకు కనబడుచున్న ఈ వానరు లందరూ ఎదిరింప శక్యము కానివారు. బలవంతులు. స్వేచ్ఛానుసారము రూపములు ధరించగలవారు. దైత్యులతోను, దానవులతోను సమానులు. యుద్ధములో దేవతలవంటి పరాక్రమము గలవారు. 2, 3

మూ. ఏషాం కోటిసహస్రాణి నవ పఞ్చ చ సప్త చ,
తథా శఙ్ఖసహస్రాణి తథా వృన్దశతాని చ. 4

ప్ర. అ. ఏషామ్=వీళ్ళయొక్క, నవ=తొమ్మిది, పఞ్చ చ=ఐదు, సప్త చ=ఏడు (ఇరువదియొక్క), కోటిసహస్రాణి=కోట్ల సహస్రములు, తథా=మరియు, శఙ్కుసహస్రాణి=శంకువుల సహస్రములు, తథా=మరియు, వృన్దశతాని చ=వృందముల శతములు ఉన్నవి.

తా. ఇరువైయొక్క కోట్ల మంది వానరులు, వెయ్యి శంకువుల వానరులు, నూరు వృందముల వానరులు ఉన్నారు. 4

మూ. ఏతే సుగ్రీవసచివాః కిష్కిన్ధానిలయాః సదా,
హరయో దేవగన్ధర్వైరుత్పన్నాః కామరూపిణః. 5

ప్ర. అ. దేవగన్ధర్వైః=దేవతలచేతను, గంధర్వుల చేతను, ఉత్పన్నాః=పుట్టిన, కామరూపిణః= కామరూపము గల, సుగ్రీవసచివాః=సుగ్రీవునకు సచివులైన, ఏతే=ఈ వానరులు, సదా=ఎల్లప్పుడూ, కిష్కిన్ధానిలయాః=కిష్కింధ నివాసముగా గలవారు.

తా. దేవతలకు గంధర్వులకూ పుట్టిన, స్వేచ్ఛానుసారముగా రూపములు ధరించగలిగిన, సుగ్రీవసచివులైన ఈ వానరులు ఎల్లప్పుడు కిష్కింధలో నివసించుచుందురు. 5

మూ. యౌ తౌ పశ్యసి తిష్ఠన్తౌ సమానౌ దేవరూపిణౌ,
మైన్దశ్చ ద్వివిదశ్చైవ తాభ్యాం నాస్తి సమో యుధి. 6

ప్ర. అ. తిష్ఠన్తౌ=నిలచి ఉన్న, దేవరూపిణౌ=దేవతలవంటి రూపము గల, సమానౌ=సమానులైన, యౌ=ఎవరిని, పశ్యసి=చూచుచున్నావో, తౌ=వారు, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చైవ=ద్వివిదుడు. యుధి=యుద్ధమునందు, తాభ్యామ్=వారిద్దరితో, సమః=సమానమైనవాడు, నాస్తి=లేడు.

తా. దేవతలవంటి ఆకారము గల, ఒకరితో ఒకరికి చాలా పోలికలు ఉన్న ఇద్దరు అక్కడ నిలబడి యున్నారు కదా, వాళ్లు - మైందద్వివిదులు. యుద్ధములో వాళ్లతో సమానుడు లేడు. 6

మూ. బ్రహ్మణా సమనుజ్ఞాతావమృతప్రాశినావుభౌ,
ఆశంసేతే యథా లఙ్కామేతౌ మర్దితుమోజసా. 7

ప్ర. అ. బ్రహ్మణా=బ్రహ్మదేవుని చేత, సమనుజ్ఞాతౌ=అనుజ్ఞ ఇవ్వబడిన వారై, అమృతప్రాశినౌ=అమృతమును భుజించిన, ఏతౌ=ఈ, ఉభౌ=ఇద్దరు, ఓజసా=వేగముచేత, లఙ్కామ్=లంకను, మర్దితుమ్=మర్దించుటకు, ఆశంసేతే యథా=కోరుచున్నట్లున్నారు.

తా. బ్రహ్మదేవుని అనుమతిచేత అమృతమును త్రాగిన ఆ ఇద్దరూ తమ తేజస్సుచేత లంకను మర్దించుటకు ఉద్యుక్తులైనట్లు కనబడుచున్నారు. 7

మూ. యం తు పశ్యసి తిష్ఠన్తం ప్రభిన్నమివ కుఞ్జరమ్,
యో బలాత్ క్షోభయేత్ క్రుద్ధః సముద్రమపి వానరః. 8
ఏషోఽభిగన్తా లఙ్కాయా వైదేహ్యాస్తవ చ ప్రభో,
ఏనం పశ్య పురా దృష్టం వానరం పునరాగతమ్. 9

ప్ర. అ. ప్రభో=మహారాజా ! ప్రభిన్నమ్=మదము కారుచున్న, కుఞ్జరమ్ ఇవ=ఏనుగు వలె, తిష్ఠన్తమ్=నిలచి ఉన్న, యమ్=ఎవనిని, పశ్యసి=చూచుచున్నావో, క్రుద్ధః=కోపించిన, యః=ఏ, వానరః=వానరుడు, సముద్రమపి=సముద్రమును కూడ, క్షోభయేత్=క్షోభపెట్టునో, ఏషః=ఇతడు, లఙ్కాయాః=లంకకు, వైదేహ్యాః=సీతకు, తవ చ=నీకు, అభిగన్తా=సమీపమును పొందినవాడు. పురా=పూర్వము, దృష్టమ్=చూడబడిన, పునః=మరల, ఆగతమ్=వచ్చిన, ఏనమ్=వీనిని, పశ్య=చూడుము.

తా. మహారాజా ! మదోదకము స్రవించుచున్న ఏనుగు వలె ఏ వానరుడు అక్కడ నిలచి యున్నాడో, ఎవడు కోపించినచో సముద్రమును కూడ క్షోభింపచేయుగలడో అతడు లంకకు వచ్చి, సీతను నిన్నూ కూడ చూచిన వానరుడు. పూర్వము చూచిన ఈ వానరుడే మరల వచ్చినాడు. 8, 9

మూ. జ్యేష్ఠః కేసరిణః పుత్రో వాతాత్మజ ఇతి శ్రుతః,
హనూమానితి విఖ్యాతో లఙ్ఘితో యేన సాగరః. 10

ప్ర. అ. యేన=ఎవనిచేత, సాగరః=సముద్రము, లఙ్ఘితః=దాటబడినదో, అట్టి ఇతడు, కేసరిణః=కేసరియొక్క, జ్యేష్ఠః=పెద్దవాడైన, పుత్రః=పుత్రుడు. వాతాత్మజ ఇతి=వాయుకుమారుడు అని, శ్రుతః=ప్రసిద్ధుడు. హనూమానితి=హనుమంతుడు అని, విఖ్యాతః=ప్రసిద్ధుడు.

తా. సముద్రమును లంఘించిన, హనుమంతుడను పేరు గల ఇతడు కేసరికి జ్యేష్ఠపుత్రుడు. వాయుపుత్రుడని ప్రసిద్ధి చెందినవాడు. 10

మూ. కామరూపో హరిశ్రేష్ఠో బలరూపసమన్వితః,
అనివార్యగతిశ్చైవ యథా సతతగః ప్రభుః. 11

ప్ర. అ. హరిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన ఇతడు, కామరూపః=కామరూపము గలవాడు. బలరూపసమన్వితః=గొప్పబలముతోను మంచి ఆకారముతోను, కూడిన వాడు. సతతగః=ఎల్లప్పుడు నడిచే, ప్రభుః యథా=దేవుడు వలె, (వాయుదేవుడు వలె), అనివార్యగతిశ్చైవ=నివారింప శక్యము కాని గమనము కలవాడు.

తా. కోరిన రూపము ధరించ గలిగిన ఈ వానరశ్రేష్ఠుడు గొప్ప బలము, ఆకారమూ గలవాడు. వాయువు వలె అద్భుతమైన గమనము గలవాడు.11

మూ. ఉద్యన్తం భాస్కరం దృష్ట్వా బాలః కిల బుభుక్షితః,
త్రియోజనసహస్రం తు అధ్వానమవతీర్య హి. 12
ఆదిత్యమాహరిష్యామి న మే క్షుత్ప్రతియాస్యతి,
ఇతి నిశ్చిత్య మనసా పుప్లువే బలదర్పితః. 13

ప్ర.అ. బాలః=బాలుడుగా ఉన్న ఈ హనుమంతుడు, బుభుక్షితః=ఆకలి కొన్నవాడై, ఉద్యన్తమ్=ఉదయించుచున్న, భాస్కరమ్=సూర్యుణ్ణి, దృష్ట్వా=చూచి, త్రియోజనసహస్రమ్=మూడు వేల యోజనముల, అధ్వానమ్=మార్గమును, అవతీర్య=దిగి (ఆకాశముపై ఎగిరి), మే=నాయొక్క, క్షుత్=ఆకలి, న ప్రతియాస్యతి=(ఫలాదులచేత) తగ్గదు. ఆదిత్యమ్=సూర్యుణ్ణి, ఆహరిష్యామి=గ్రహించెదను, ఇతి=అని, మనసా=మనస్సుచేత, నిశ్చిత్య=నిశ్చయించి, బలదర్పితః=బలముచేత గర్వించినవాడై, పుప్లువే కిల=ఎగిరెనట.

తా. బాలుడుగా ఉన్న ఈ హనుమంతుడు ఆకలిగొని "ఫలాదులచేత నా ఆకలి శాంతించదు, ఆహారముగా సూర్యుణ్ణి గ్రహించెదను" అని మనస్సులో నిశ్చయించుకొని ఆకాశముపైన మూడువేల యోజనములు ఎగిరి, బలముచేత దర్పితుడై సూర్యుని వైపు వెళ్లెనట. 12, 13

మూ. అనాధృష్యతమం దేవమపి దేవర్షిరాక్షసైః,
అనాసాద్యైవ పతితో భాస్కరోదయనే గిరౌ. 14

ప్ర. అ. దేవర్షిరాక్షసైరపి=దేవతలచేతను, ఋషులచేతను, రాక్షసులచేతను కూడ, అనాధృష్యతమమ్=మిక్కిలి ఎదిరింప శక్యముకాని, దేవమ్=సూర్యుణ్ణి, అనాసాద్యైవ=చేరకుండగానే, భాస్కరోదయనే=సూర్యుడు ఉదయించు, గిరౌ=పర్వతమునందు, పతితః=పడినాడు.

తా. దేవతలు, ఋషులు, రాక్షసులూ కూడ ఏ మాత్రము ఎదిరించలేని ఆ సూర్యుని దగ్గరకు చేరకుండగానే సూర్యోదయపర్వతముపై పడిపోయెను.14

మూ. పతితస్య కపేరస్య హనురేకా శిలాతలే,
కించిద్భగ్నా దృఢహనుర్హనూమానేష తేన వై. 15

ప్ర. అ. శిలాతలే=రాతిమీద, పతితస్య=పడిపోయిన, అస్య=ఈ, కపేః=వానరునియొక్క, ఏకా=ఒక, హనుః=గడ్డము, కించిత్=కొంచెము, భగ్నా=విరిగినది. తేన=ఆకారణముచేత, దృఢహనుః=దృఢమైన గడ్డముగల, ఏషః=ఇతడు, హనూమాన్="హనుమంతుడు" అని చెప్పబడుచున్నాడు.

తా. ఇతడు ఒక రాతిమీద పడిపోగా ఇతని గడ్డమునకు ఒక ప్రక్క కొంచెము దెబ్బ తగిలెను. అందువేత, దృఢమైన గడ్డముగల ఈతనికి హనుమంతు డను పేరు వచ్చినది. 15

మూ. సత్యమాగమయోగేన మమైష విదితో హరిః,
నాస్య శక్యం బలం రూపం ప్రభావో వానుభాషితమ్. 16

ప్ర. అ. ఏషః=ఈ, హరిః=వానరుడు, మమ=నాకు, సత్యమ్=సత్యముగా, ఆగమయోగేన=ఆప్తుల వాక్యముయొక్క సంబంధముచేత, విదితః=తెలియబడి నాడు. అస్య=వీనియొక్క, బలమ్=బలము గాని, రూపమ్=రూపము గాని, ప్రభావో వా=ప్రభావము గాని, అనుభాషితమ్=వర్ణించి చెప్పుటకు, న శక్యమ్=శక్యము కాదు.

తా. ఈ వానరుని గూర్చిన యథార్థవృత్తాంతము నాకు ఆప్తుల మాటల ద్వారా తెలిసినది. ఇతని బలము గాని, రూపము గాని, ప్రభావము గాని, పూర్తిగా వర్ణించి చెప్పుటకు శక్యము కాదు. 16

మూ. ఏష ఆశంసతే లఙ్కామేకో మథితుమోజసా,
యేన జాజ్వల్యతేఽసౌ వై ధూమకేతుస్తవాద్య వై 17
లఙ్కాయాం నిహితశ్చాపి కథం విస్మరసే కపిమ్.

ప్ర. అ. ఏషః=ఇతడు, ఏకః=ఒక్కడే, ఓజసా=తేజస్సుచేత, లఙ్కామ్=లంకను, మథితుమ్=మథించుటకు, ఆశంసతే=కోరుచున్నాడు. తవ=నీయొక్క, లఙ్కాయామ్=లంకయందు, యేన=ఎవనిచేత, నిహితః=ఉంచబడిన, అసౌ=ఈ, ధూమకేతుః=అగ్ని, అద్య వై=ఇప్పటికి కూడా, జాజ్వల్యతే=మండుచున్నదో, కపిమ్=అట్టి వానరుణ్ణి, కథమ్=ఎట్లు, విస్మరసే=మరచుచున్నావు.

తా. ఈత డొక్కడే తన తేజస్సుతో, లంకను మథించుటకు కోరుచున్నాడు. నీ లంకాపట్టణములో ఈతడు అంటించిన అగ్ని ఇంకా మండుచునే ఉన్నది. అట్టి ఈ వానరుని ఎట్లు మరచిపోయినావు? 17

మూ. యశ్చైషోఽనన్తరః శూరః శ్యామః పద్మనిభేక్షణః, 18
ఇక్ష్వాకూణామతిరథో లోకే విఖ్యాతపౌరుషః,
యస్మిన్న చలతే ధర్మో యో ధర్మం నాతివర్తతే. 19
యో బ్రాహ్మమస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాం వరః,
యో భిన్ద్యాద్గగనం బాణైర్మేదినీం చాపి దారయేత్. 20
యస్య మృత్యోరివ క్రోధః శక్రస్యేవ పరాక్రమః,

యస్య భార్యా జనస్థానాత్సీతా చాపి హృతా త్వయా. 21
స ఏష రామస్త్వాం రాజన్ యోద్ధుం సమభివర్తతే.

ప్ర.అ. రాజన్=రాజా ! శ్యామః=నీలవర్ణమువాడు, పద్మనిభేక్షణః=పద్మములతో సమానమైన నేత్రములు గలవాడు అయిన, యః ఏషః=ఏ ఇతడు, అవష్టభ్య=హనుమంతుని ప్రక్కనే ఉన్నాడో, యస్మిన్=ఎవనియందు, ధర్మః=ధర్మము, న చలతే=చలించదో, యః=ఎవడు, ధర్మమ్=ధర్మమును, నాతివర్తతే=అతిక్రమించడో, వేదవిదామ్=వేదవేత్తలలో, వరః=శ్రేష్ఠుడైన, యః=ఎవడు, బ్రాహ్మమ్ అస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, వేదాంశ్చ=వేదములను, వేద=ఎరుగునో, యః=ఎవడు, బాణైః=బాణములచేత, గగనమ్= ఆకాశమును, భింద్యాత్=భేదించునో, మేదినీం చాపి=భూమిని కూడ, దారయేత్=చీల్చునో, యస్య=ఎవనియొక్క, క్రోధః=క్రోధము, మృత్యోరివ=మృత్యువుయొక్క క్రోధమువంటిదో, పరాక్రమః=పరాక్రమము, శక్రస్యేవ=ఇంద్రుని పరాక్రమము వంటిదో, యస్య=ఎవనియొక్క, భార్యా=భార్యయైన, సీతా=సీత, త్వయా=నీచేత, జనస్థానాత్=జనస్థానమునుండి, హృతా=హరించబడినదో, ఇక్ష్వాకూణామ్= ఇక్ష్వాకువంశీయులలో, అతిరథః=అతిరథుడు, లోకే=లోకమునందు, ప్రథితపౌరుషః= ప్రసిద్ధమైన పౌరుషము గలవాడు అయిన, సః=అట్టి, ఏషః=ఈ, రామః=రాముడు, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, త్వామ్=నిన్ను, అభివర్తతే=సమీపించి ఉన్నాడు.

తా. మహారాజా ! హనుమంతునకు దగ్గరగా ఉన్న నీలదేహచ్ఛాయ గలవాడు, పద్మముతో సమానమైన నేత్రములు గలవాడు అయిన శూరుడు రాముడు. ఇతడు ఇక్ష్వాకువంశీయులలో అతిరథుడు. లోకములో ప్రసిద్ధమైన పౌరుషము గలవాడు. అతని నుండి ధర్మమెన్నడు చలించదు. అతడు ధర్మమునుండి చలించడు. వేదవేత్తలలో శ్రేష్ఠుడైన అతడు బ్రహ్మాస్త్రమును వేదములను ఎరిగినవాడు. బాణములచేత ఆకాశమును బద్దలు కొట్టగలడు. భూమిని చీల్చివేయుగలడు. అతని క్రోధము మృత్యువు క్రోధమువంటిది. అతని పరాక్రమము ఇంద్రుని పరాక్రమము వంటిది. అతని భార్యయైన సీతనే నీవు జనస్థానమునుండి హరించి తీసికొని వచ్చినావు. అట్టి ఈ రాముడు నీతో యుద్ధము చేయుటకు ఎదురుచూచుచున్నాడు. 18-21

మూ. యస్యైష దక్షిణే పార్శ్వే శుద్ధజామ్బూనదప్రభః, 22
విశాలవక్షాస్తామ్రాక్షో నీలకుఞ్చితమూర్ధజః,
ఏషో హి లక్ష్మణో నామ భ్రాతుః ప్రియహితే రతః, 23
నయే యుద్ధే చ కుశలః సర్వశస్త్రభృతాం వరః.

ప్ర.అ. యస్య=ఏ రామునియొక్క, దక్షిణే పార్శ్వే=కుడిప్రక్కన,

ఏష=ఈ, శుద్ధజామ్బూనదప్రభః=శుద్ధమైన బంగారమువంటి కాంతి గలవాడు, విశాలవక్షాః=విశాలమైన వక్షఃస్థలము గలవాడు, తామ్రాక్షః=ఎఱ్ఱని నేత్రములు గలవాడు, నీలకుఞ్చితమూర్ధజః=నల్లని వంగిన కేశములు గలవాడు ఉన్నాడో, ఏషః=ఇతడు, లక్ష్మణో నామ=లక్ష్మణుడను పేరు గలవాడు. భ్రాతుః=సోదరునియొక్క, ప్రియహితే=ప్రియమునందు హితమునందు, రతః=ఆసక్తిగలవాడు. నయే=నీతియందు, యుద్ధే చ=యుద్ధమునందు, కుశలః=నేర్పరి. సర్వశస్త్రభృతామ్=సమస్తమైన ఆయుధధారులలో, వరః=శ్రేష్ఠుడు.

తా. పరిశుద్ధమైన బంగారము వంటి వర్ణము, విశాలమైన వక్షఃస్థలము, ఎఱ్ఱని నేత్రములు, నల్లని వంకరజుట్టు కలిగి, ఆ రాముని ప్రక్కనే ఉన్నవాడు లక్ష్మణుడు. ఇతడు తన సోదరునకు ప్రియమును, హితమును చేయుటకు ఆసక్తి గలవాడు. సకల ఆయుధధారులలో శ్రేష్ఠుడైన ఇతడు నీతియందు, యుద్ధమునందూ కూడ సమర్థుడు. 22, 23

మూ. అమర్షీ దుర్జయో జేతా విక్రాన్తో బుద్ధిమాన్ బలీ, 24
రామస్య దక్షిణో బాహుర్నిత్యం ప్రాణో బహిశ్చరః.

ప్ర.అ. అమర్షీ=కోపము గలవాడు, దుర్జయః=జయింప శక్యము కానివాడు, జేతా=జయించువాడు, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు, బలీ=గొప్పబలము గలవాడు, నిత్యమ్=ఎల్లప్పుడు, రామస్య=రామునియొక్క, దక్షిణః బాహుః=కుడి చెయ్యి, బహిశ్చరః=బైట సంచరించు, ప్రాణః=(రాముని) ప్రాణము.

తా. ఈ లక్ష్మణుడు కోపస్వభావము గలవాడు, జయింప శక్యము కానివాడు, జయము సంపాదించువాడు, బుద్ధిమంతుడు, బలవంతుడు, నిత్యము రామునకు కుడిచేయి వంటి వాడు, బైట సంచరించు ప్రాణమువంటి వాడు.

మూ. న హ్యేష రాఘవస్యార్థే జీవితం పరిరక్షతి, 25
ఏషైవాశంసతే యుద్ధే నిహన్తుం సర్వరాక్షసాన్.

ప్ర. అ. ఏషః=ఇతడు, రాఘవస్యార్థే=రాముని నిమిత్తము, జీవితమ్=జీవితమును, న పరిరక్షతి హి=రక్షించడు కదా ! ఏషైవ=ఇతడే, యుద్ధే=యుద్ధమునందు, సర్వరాక్షసాన్=అందరు రాక్షసులను, నిహన్తుమ్=చంపుటకు, ఆశంసతే=కోరుచున్నాడు.

తా. రామునకు సహాయము చేయవలసి వచ్చినప్పుడు ఇతడు తన ప్రాణములను కూడ రక్షించుకొనడు. ఇతడే యుద్ధములో రాక్షసుల నందరిని చంపుటకు ఉత్సాహము చూపుచున్నాడు. 25

మూ. యస్తు సవ్యమసౌ పక్షం రామస్యాశ్రిత్య తిష్ఠతి, 26
రక్షోగణపరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః.

ప్ర. అ. అసౌ=ఈ, యః తు=ఎవ్వడు, రామస్య=రాముని యొక్క, సవ్యమ్=ఎడమదైన, పక్షమ్=పార్శ్వమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, తిష్ఠతి=ఉన్నాడో, రక్షోగణపరిక్షిప్తః=రాక్షసుల గణముచేత చుట్టువారుకొనబడిన, ఏషః=ఇతడు, రాజా=రాజైన, విభీషణః=విభీషణుడు.

తా. రాముని ఎడమప్రక్క నలుగురు రాక్షసుల మధ్య ఉన్నవాడు రాజైన విభీషణుడు. 26

మూ. శ్రీమతా రాజరాజేన లఙ్కాయామభిషేచితః, 27
త్వామేవ ప్రతిసంరబ్ధో యుద్ధాయైషోఽభివర్తతే.

ప్ర. అ. శ్రీమతా=శ్రీమంతుడైన, రాజరాజేన=రాజులకు రాజైన రామునిచేత, లఙ్కాయామ్=లంకయందు, అభిషేచితః=అభిషేకము చేయబడిన, ఏషః=ఇతడు, త్వామేవ=నిన్ను గూర్చియే, ప్రతిసంరబ్ధః= కోపముతో కూడినవాడై, యుద్ధాయ=యుద్ధముకొరకు, అభివర్తతే=ఎదురుగా ఉన్నాడు.

తా. రాజాధిరాజైన శ్రీమంతుడైన రామునిచేత లంకారాజ్యమునకు రాజుగా అభిషిక్తుడైన ఇతడు నిన్నుగూర్చి చాల కోపము చూపుచు యుద్ధము చేయుటకై నిలచినాడు. 27

మూ. యం తు పశ్యసి తిష్ఠన్తం మధ్యే గిరిమివాచలమ్, 28
సర్వశాఖామృగేన్ద్రాణాం భర్తారమమితౌజసమ్,
తేజసా యశసా బుద్ధ్యా బలేనాభిజనేన చ. 29
యః కపీనతిబభ్రాజ హిమవానివ పర్వతః,
కిష్కిన్ధాం యః సమధ్యాస్తే గుహాం సగహనద్రుమామ్. 30
దుర్గాం పర్వతదుర్గస్థాం ప్రధానైః సహ యూథపైః,
యస్యైషా కాఞ్చనీ మాలా శోభతే శతపుష్కరా. 31
కాన్తా దేవమనుష్యాణాం యస్యాం లక్ష్మీః ప్రతిష్ఠితా,
ఏతాం మాలాం చ తారాం చ కపిరాజ్యం చ శాశ్వతమ్, 32
సుగ్రీవో వాలినం హత్వా రామేణ ప్రతిపాదితః.

ప్ర. అ. సర్వశాఖామృగేన్ద్రాణామ్=సమస్తమైన వానరనాయకులకు, భర్తారమ్=ప్రభువు, అమితౌజసమ్=అనంతమైన తేజస్సు కలవాడు, మధ్యే=వానరుల మధ్యయందు, తిష్ఠన్తమ్=నిలచి యున్నవాడు అయిన, యమ్=ఎవనిని, అచలమ్=చలించని, గిరిమివ=పర్వతమును వలె, పశ్యసి=చూచుచున్నావో, యః=ఎవడు, హిమవాన్ పర్వతః ఇవ=హిమవత్పర్వతము వలె, తేజసా=తేజస్సుచేతను, యశసా=కీర్తిచేతను, బుద్ధ్యా=బుద్ధిచేతను, బలేన=బలముచేతను,

అభిజనేన=సద్వంశముచేతను, కపీన్=ఇతరవానరులను, అతిభ్రాజన్=అతిశయించి ప్రకాశించునో (ప్రకాశించుచున్నాడో), యః=ఎవడు, సగహనద్రుమామ్=అడవులతోను వృక్షములతోను కూడిన, దుర్గామ్=ప్రవేశింప శక్యము కాని, పర్వతదుర్గస్థామ్=పర్వతములచేత ప్రవేశింప శక్యము కాని, గుహామ్=గుహయైన, కిష్కింధామ్=కిష్కింధను, ప్రధానైః=ప్రధానులైన, యూథపైః సహ=సేనానాయకులతో కూడ, సమధ్యాస్తే=అధిష్ఠించి ఉన్నాడో, యస్యామ్=దేనియందు, దేవమనుష్యాణామ్=దేవతలయొక్క, మనుష్యులయొక్క, లక్ష్మీః=లక్ష్మి, ప్రతిష్ఠితా=ఉంచబడినదో అట్టి, కాన్తా=మనోహరమైన, శతపుష్కరా=నూరు పద్మములు గల, కాఞ్చనీ=బంగారము వికారమైన, ఏషా=ఈ, యస్య=ఎవనియొక్క, మాలా=మాల, శోభతే=ప్రకాశించుచున్నదో, సుగ్రీవః=అట్టి సుగ్రీవుడు, రామేణ=రామునిచేత, వాలినమ్=వాలిని, హత్వా=చంపి, ఏతామ్=ఈ, మాలామ్=మాలను, తారాం చ=తారను, శాశ్వతమ్=స్థిరమైన, కపిరాజ్యం చ=వానరరాజ్యమును, ప్రతిపాదితః=పొందింపబడినాడు.

తా. ఆ వానరుల మధ్య కదల్చుటకు శక్యము కాని పర్వతము వలె నిలబడి ఉన్నవాడు సకలవానరనాయకులకు ప్రభువు, గొప్ప తేజస్సు కలవాడు అయిన సుగ్రీవుడు. హిమవత్పర్వతము, ఇతరపర్వతములను అతిశయించినట్లు ఇతడు తేజస్సుచేత, యశస్సుచేత, బుద్ధిచేత, బలముచేత, వంశముచేత ఇతరవానరులను అతిశయించి ఉన్నాడు. ఇతడు ప్రధానులైన సేనానాయకులతో కలిసి అరణ్యములతోను, వృక్షములతోను నిండినది, పర్వతములపై ఉండుటచేత ప్రవేశించుటకు శక్యముకానిది, ప్రాకారాదిదుర్గములు గలది అయిన కిష్కింధ అను గుహలో నివసించుచున్నాడు. వంద పద్మములు గల మనోహరమైన ఏ బంగారు మాలయందు దేవతల లక్ష్మి, మనుష్యుల లక్ష్మి నిక్షిప్తమై ఉన్నదో అట్టి మాలను ధరించి ఉన్నాడు. రాముడు వాలిని చంపి ఇతనికి ఈ మాలను, తారను, శాశ్వతమైన వానరరాజ్యమును ఇచ్చినాడు. 28-32

మూ. శతం శతసహస్రాణాం కోటిమాహుర్మనీషిణః, 33
శతం కోటిసహస్రాణాం శఙ్కురిత్యభిధీయతే.

ప్ర. అ. మనీషిణః=బుద్ధిమంతులు, శతసహస్రాణామ్=వందవేల (లక్షల) యొక్క, శతమ్=శతమును, కోటిమ్=కోటిగా, ఆహుః=చెప్పుచున్నారు. కోటిసహస్రాణామ్=వెయ్యి కోట్లయొక్క, శతమ్=శతము, శఙ్కుః ఇతి=శంకువు అని, అభిధీయతే=చెప్పబడుచున్నది.

తా. వందలక్షలు ఒక కోటి అని పండితులు చెప్పుదురు. లక్ష కోట్లు ఒక శంకువు. 33

మూ. శతం శఙ్కుసహస్రాణాం మహాశఙ్కురితి స్మృతః, 34
మహాశఙ్కుసహస్రాణాం శతం వృన్దమిహోచ్యతే,
శతం వృన్దసహస్రాణాం మహావృన్దమితి స్మృతమ్. 35
మహావృన్దసహస్రాణాం శతం పద్మమిహోచ్యతే,
శతం పద్మసహస్రాణాం మహాపద్మమితి స్మృతమ్. 36
మహాపద్మసహస్రాణాం శతం ఖర్వమిహోచ్యతే,
శతం ఖర్వసహస్రాణాం మహాఖర్వమితి స్మృతమ్. 37
మహాఖర్వసహస్రాణాం సముద్రమభిధీయతే,
శతం సముద్రసాహస్రమోఘ ఇత్యభిధీయతే. 38
శతమోఘసహస్రాణాం మహౌఘ ఇతి విశ్రుతః.

ప్ర. అ. శఙ్కుసహస్రాణామ్=వేయి శంకువులయొక్క, శతమ్=శతము, మహాశఙ్కుః ఇతి=మహాశంకువు అని, స్మృతః=చెప్పబడినది. మహాశఙ్కుసహస్రాణామ్=వేయి మహాశంకువుల, శతమ్=శతము, వృన్దమ్=వృందము అని, ఇహ=ఇక్కడ, ఉచ్యతే=చెప్పబడుచున్నది. వృన్దసహస్రాణామ్=వేయి వృందముల, శతమ్=శతము, మహావృన్దమ్ ఇతి=మహావృందము అని, స్మృతమ్=చెప్పబడినది. మహావృన్దసహస్రాణామ్=వెయ్యి మహావృందముల, శతమ్=శతము, పద్మమ్=పద్మముగా, ఇహ=ఇక్కడ, ఉచ్యతే=చెప్పబడుచున్నది. పద్మసహస్రాణామ్=వెయ్యి పద్మముల, శతమ్=శతము, మహాపద్మమితి=మహాపద్మము అని, స్మృతమ్=చెప్పబడినది. మహాపద్మసహస్రాణామ్=వెయ్యి మహాపద్మముల, శతమ్=శతము, ఖర్వమ్=ఖర్వముగా, ఇహ=ఇక్కడ, ఉచ్యతే=చెప్పబడుచున్నది. ఖర్వసహస్రాణామ్=వెయ్యి ఖర్వముల, శతమ్=శతము, మహాఖర్వమ్ ఇతి=మహాఖర్వము అని, స్మృతమ్=చెప్పబడినది. మహాఖర్వసహస్రాణామ్=వెయ్యి మహాఖర్వముల శతము, సముద్రమ్=సముద్రముగా, అభిధీయతే=చెప్పబడుచున్నది. శతమ్=నూరు, సముద్రసాహస్రమ్=సహస్ర సముద్రముల సముదాయము, ఓఘః ఇతి=ఓఘము అని, అభిధీయతే=చెప్పబడుచున్నది. ఓఘసహస్రాణామ్=వెయ్యి ఓఘముల, శతమ్=శతము, మహౌఘః ఇతి=మహౌఘము అని, విశ్రుతః=ప్రసిద్ధము.

తా. వెయ్యి శంకువులు మహాశంకువు. వెయ్యి మహాశంకువులు వృందము. వెయ్యి వృందములు మహావృందము. వెయ్యి మహావృందములు పద్మము. వెయ్యి పద్మములు మహాపద్మము. వెయ్యి మహాపద్మములు ఖర్వము. వెయ్యి ఖర్వములు మహాఖర్వము. వెయ్యి మహాఖర్వములు సముద్రము. వెయ్యి సముద్రములు ఓఘము. వెయ్యి ఓఘములు మహౌఘము. 34 - 38

మూ. ఏవం కోటిసహస్రేణ శఙ్కూనాం చ శతేన చ, 39
మహాశఙ్కుసహస్రేణ తథా వృన్దశతేన చ,
మహావృన్దసహస్రేణ తథా పద్మశతేన చ. 40
మహాపద్మసహస్రేణ తథా ఖర్వశతేన చ,
సముద్రేణ చ తేనైవ మహౌఘేన తథైవ చ. 41
ఏష కోటిమహౌఘేన సముద్రసదృశేన చ,
విభీషణేన వీరేణ సచివైః పరివారితః. 42
సుగ్రీవో వానరేన్ద్రస్త్వాం యుద్ధార్థమనువర్తతే,
మహాబలవృతో నిత్యం మహాబలపరాక్రమః. 43

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, కోటిసహస్రేణ=వెయ్యి కోట్లతోను, శఙ్కూనామ్=శంకువులయొక్క, శతేన చ= శతములతోను, మహాశఙ్కుసహస్రేణ=వెయ్యి మహాశంకువులతోను, తథా=మరియు, వృన్దశతేన చ=నూరు వృందములతోను, మహావృన్దసహస్రేణ=వెయ్యి మహావృందములతోను, తథా=మరియు, పద్మశతేన చ=నూరు పద్మములతోను, మహాపద్మసహస్రేణ=వెయ్యి మహాపద్మములతోను, తథా=మరియు, ఖర్వశతేన=నూరు ఖర్వములతోను, తేనైవ=అదే సంఖ్య గల, అనగా నూరు, సముద్రేణ=సముద్రముతోను, తథైవ చ=మరియు, మహౌఘేన=మహౌఘముతోను, కోటిమహౌఘేన=కోటి మహౌఘములతోను, సముద్రసదృశేన చ=సముద్రముతో సమానమైన వానరసైన్యముతోను, వీరేణ=వీరుడైన, విభీషణేన=విభీషణునితోను, సచివైః=మంత్రులతోను, పరివారితః= కూడిన, మహాబలపరాక్రమః=గొప్ప బలపరాక్రమములు గల, నిత్యమ్=ఎల్లప్పుడు, మహాబలవృతః=గొప్ప సైన్యముతో కూడిన, వానరేన్ద్రః=వానరరాజైన, ఏషః సుగ్రీవః=ఈ సుగ్రీవుడు, త్వామ్=నిన్ను, యుద్ధార్థమ్= యుద్ధము కొరకు, అనువర్తతే=సమీపించి ఉన్నాడు.

తా. గొప్ప బలపరాక్రమములు కలవాడు, నిత్యమూ గొప్ప సైన్యముతో కూడినవాడు, వానరరాజు అయిన సుగ్రీవుడు వీరుడైన విభీషణునితోను, మంత్రులతోను కూడి యుద్ధము నిమిత్తము నీ మీదకు వచ్చుచున్నాడు. ఇతని వెంట వెయ్యి కోట్లు, నూరు శంకువులు, వెయ్యి మహాశంకువులు, నూరు వృందములు, వెయ్యి మహావృందములు, నూరు పద్మములు, వెయ్యి పద్మములు, నూరు ఖర్వములు, నూరు సముద్రములు, మహౌఘము, కోటి మహౌఘములు సంఖ్య గల సముద్రముతో సమానమైన వానరసైన్యము ఉన్నది.

మూ. ఇమాం మహారాజ సమీక్ష్య వాహినీ
ముపస్థితాం ప్రజ్వలితగ్రహోపమామ్,

తతః ప్రయుక్తః పరమో విధియుతాం
యథా జయః స్యాన్మ సదైః పరాభవః. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టావింశః సర్గః.

ప్ర. అ.మహారాజ=మహారాజా ! ప్రజ్వలిత గ్రహోపమామ్=ప్రజ్వలించుచున్న గ్రహముంతో సమానమైన, ఉపస్థితామ్=వచ్చి ఉన్న, ఇమామ్=ఈ, వాహినీమ్=సేనను, సమీక్ష్య=చూచి, తతః=అటుపిమ్మట, జయః=జయము, యథా=ఎట్లు, స్యాత్=కలుగునో, పరైః=పరులంచేత, పరాభవః=పరాభవము, న=కలుగదో, అట్లు, పరమః=గొప్పదైన, ప్రయుక్తః=ప్రయుక్తము, విధీయతామ్=చేయబడుగాక.

తా. మహారాజా ! ప్రజ్వలించుచున్న గ్రహముంతో సమానమైన, వచ్చి ఉన్న ఈ వానరసేనను చూచి, మనకు జయము కలుగునట్లు పరులనుండి పరాభవము కలుగకుండునట్లు చేయుము. 44

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఇరువదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనత్రింశః సర్గః

*[రావణుడు శుకసారణులను నిందించి వాళ్లను సభనుండి పంపివేయుట; అతడు గూఢచారులను పంపగా రాముని అనుగ్రహముచేత వాళ్లు వానరుల బాధనుండి బైటపడి లంకకు తిరిగి వచ్చుట.]*

మూ. శుకేన తు సమాదిష్టాన్ దృష్ట్వా స హరియూథపాన్,
లక్ష్మణం చ మహావీర్యం భుజం రామస్య దక్షిణమ్. 1
సమీపస్థం చ రామస్య భ్రాతరం చ విభీషణమ్,
సర్వవానరరాజం చ సుగ్రీవం భీమవిక్రమమ్. 2
అఙ్గదం చాపి బలినం వజ్రహస్తాత్మజాత్మజమ్,
హనూమన్తం చ విక్రాన్తం జామ్బవన్తం చ దుర్జయమ్. 3
సుషేణం కుముదం నీలం నలం చ ప్లవగర్షభమ్,
గజం గవాక్షం శరభం మైన్దం చ ద్వివిదం తథా. 4
కించిదావిగ్నహృదయో జాతక్రోధశ్చ రావణః,
భర్త్సయామాస తౌ వీరౌ కథాన్తే శుకసారణౌ. 5

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, శుకేన=శుకునిచేత, సమాదిష్టాన్=చూపబడిన, హరియూథపాన్=వానరసేనా నాయకులను, రామస్య=రామునియొక్క, దక్షిణం భుజమ్=కుడి భుజమైన, మహావీర్యమ్=గొప్ప పరాక్రమము గల, లక్ష్మణం చ=లక్ష్మణుణ్ణి, రామస్య= రామునియొక్క, సమీపస్థమ్=సమీపమునందున్న, భ్రాతరమ్=తన సోదరుడైన, విభీషణమ్=విభీషణుణ్ణి, సర్వవానరరాజమ్=సమస్తమైన వానరులకు ప్రభువైన, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గల, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి, బలినమ్=బలవంతుడు, వజ్రహస్తాత్మజాత్మజమ్=ఇంద్రుని కుమారుని కుమారుడు అయిన, అఙ్గదం చాపి=అంగదుణ్ణి, విక్రాన్తమ్= పరాక్రమించిన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, దుర్జయమ్=జయింప శక్యము కాని, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, సుషేణమ్=సుషేణుణ్ణి, కుముదమ్=కుముదుణ్ణి, నీలమ్=నీలుణ్ణి, ప్లవగర్షభమ్=వానరశ్రేష్ఠుడైన, నలం చ=నలుణ్ణి, గజమ్=గజుణ్ణి, గవాక్షమ్=గవాక్షుణ్ణి, శరభమ్=శరభుణ్ణి, మైన్దమ్=మైందుణ్ణి, తథా=మరియు, ద్వివిదమ్=ద్వివిదుణ్ణి, దృష్ట్వా=చూచి, కించిత్=కొంచెము, ఆవిగ్నహృదయః=దిగులు చెందిన హృదయము గలవాడై, జాతక్రోధశ్చ=పుట్టిన కోపము కూడ కలవాడై, కథాన్తే=మాటలు పూర్తియైన పిమ్మట, వీరౌ=వీరులైన, తౌ=ఆ, శుకసారణౌ=శుకసారణులను, భర్త్సయామాస=భయపెట్టెను(నిందించెను).

తా. రావణుడు శుకునిచేత చూపబడిన రాముని కుడిభుజము

వంటివాడు, మహాపరాక్రమశాలీ అయిన లక్ష్మణుణ్ణీ, రాముని దగ్గరనే ఉన్న తన సోదరుడైన విభీషణుణ్ణీ, సమస్తవానరులకు రాజైన భయంకరమైన పరాక్రమము గల సుగ్రీవుణ్ణీ, బలవంతుడు, వాలికుమారుడూ అయిన అంగదుణ్ణీ, పరాక్రమశాలియైన హనుమంతుణ్ణీ, జయింప శక్యము కాని జాంబవంతుణ్ణీ, సుషేణ-కుముద-నీల-నల-గజ-గవాక్ష-శరభ-మైంద-ద్వివిదులను చూచి కొంచెము మనస్సులో దిగులు చెంది, కోపముతో మాటల చివర పీడులైన ఆ శుకసారణులను భయపెట్టెను. 1 - 5

మూ. అధోముఖౌ తౌ ప్రణతావబ్రవీచ్ఛుకసారణౌ,
రోషగద్గదయా వాచా సంరబ్ధం పరుషం తథా. 6

ప్ర. అ. అధోముఖౌ=క్రిందికి ముఖములు గల, ప్రణతౌ=నమస్కరించిన, తౌ=ఆ, శుకసారణౌ=శుకసారణులను గూర్చి, రోషగద్గదయా=కోపముచేత గద్గదమైన, వాచా=వాక్కుతో, సంరబ్ధమ్=కోపముగాను, తథా=మరియు, పరుషమ్=పరుషముగాను, అబ్రవీత్=పలికెను.

తా. నమస్కరించి తలలు క్రిందికి వంచి నిలచిన ఆ శుకసారణులతో రోషముచేత గద్గదమైన వాక్కుతో, తొందరగా పరుషముగా ఇట్లు పలికెను. 6

మూ. న తావత్సదృశం నామ సచివైరుపజీవిభిః,
విప్రియం నృపతేర్వక్తుం నిగ్రహే ప్రగ్రహే ప్రభోః. 7

ప్ర. అ. ఉపజీవిభిః=ఆశ్రయించి జీవించే, సచివైః=సచివులచేత, నిగ్రహే=నిగ్రహించుటయందు, ప్రగ్రహే=అనుగ్రహించుటయందు, ప్రభోః=సమర్థుడైన, నృపతేః=రాజునకు, విప్రియమ్=ప్రియము కానిదానిని, వక్తుమ్=చెప్పుటకు, సదృశమ్=తగినది, న తావత్ నామ=కాదు.

తా. ప్రభువును ఆశ్రయించి జీవించే అనుచరులు నిగ్రహానుగ్రహ సమర్థుడైన రాజు ఎదుట అతనికి అప్రియమైన మాటలు చెప్పుట యుక్తము కాదు. 7

మూ. రిపూణాం ప్రతికూలానాం యుద్ధార్థమభివర్తతామ్,
ఉభాభ్యాం సదృశం నామ వక్తుమప్రస్తవే స్తవమ్. 8

ప్ర. అ. అప్రస్తవే=ప్రసంగము లేనప్పుడు, ఉభాభ్యామ్=మీ ఇద్దరిచేత, ప్రతికూలానామ్=ప్రతికూలులు, యుద్ధార్థమ్=యుద్ధముకొరకు, అభివర్తతామ్=వచ్చుచున్నవారు అయిన, రిపూణామ్=శత్రువులయొక్క, స్తవమ్=ప్రశంసను, వక్తుమ్=చెప్పుటకు, సదృశం నామ=తగినదేనా ?

తా. మీరిద్దరూ ఈ విధముగా, ఏ సందర్భము లేకపోయినను,

యుద్ధమునకై వచ్చిన ప్రతికూలురైన శత్రువులను స్తుతించుచు మాటలాడుట యుక్తమా ? 8

మూ. ఆచార్యా గురవో వృద్ధా వృథా వాం పర్యుపాసితాః,
సారం యద్రాజశాస్త్రాణామనుజీవ్యం న గృహ్యతే. 9

ప్ర. అ. యత్=ఏ కారణమువలన, రాజశాస్త్రాణామ్=రాజశాస్త్రముల యొక్క, అనుజీవ్యమ్=అనుసరింపదగిన, సారమ్=సారము, న గృహ్యతే=గ్రహింపబడుటలేదో అందువలన, వామ్=మీ ఇద్దరిచే, ఆచార్యాః=ఆచార్యులు, గురవః=గురువులు, వృద్ధాః=పెద్దవాళ్లు, వృథా=వ్యర్థముగా, పర్యుపాసితాః=సేవింపబడినారు.

తా. మీరిద్దరూ చేసిన ఆచార్యుల, గురువుల, వృద్ధుల సేవ వ్యర్థము; ఎందుచేతననగా మీరు గ్రహింపవలసిన రాజనీతిశాస్త్రముల సారమును గ్రహించలేదు. 9

మూ. గృహీతో వా న విజ్ఞాతో భారోఽజ్ఞానస్య వాహ్యతే,
ఈదృశైః సచివైర్యుక్తో మూర్ఖైర్దిష్ట్యా ధరామ్యహమ్. 10

ప్ర. అ. గృహీతః=గ్రహింపబడినను, న విజ్ఞాతో వా=తెలియబడలేదా ? అజ్ఞానస్య=అజ్ఞానముయొక్క, భారః=భారము, వాహ్యతే వా=ధరింపబడుచున్నదా? మూర్ఖైః=మూర్ఖులైన, ఈదృశైః=ఇట్టి, సచివైః=సచివులతో, యుక్తః=కూడిన, అహమ్=నేను, దిష్ట్యా=దైవవశముచేత, ధరామి=జీవించి ఉన్నాను.

తా. లేదా శాస్త్రములను గ్రహించి కూడ మీరు అర్థముచేసికొనలేదా ! లేదా అజ్ఞానభారమును మోయుచున్నారా ? మూర్ఖులైన ఇలాంటి సచివులతో నేను జీవించి ఉన్నా ననగా అది కేవలము అదృష్టమే. 10

మూ. కిం ను మృత్యోర్భయం నాస్తి మాం వక్తుం పరుషం వచః,
యస్య మే శాసతో జిహ్వా ప్రయచ్ఛతి శుభాశుభమ్. 11

ప్ర. అ. శాసతః=శాసించుచున్న, యస్య మే=ఏ నాయొక్క, జిహ్వా=జిహ్వయే, శుభాశుభమ్=శుభాశుభములను, ప్రయచ్ఛతి=ఇచ్చునో, మామ్=అట్టి నన్నుగూర్చి, పరుషమ్=పరుషమైన, వచః=వచనమును, వక్తుమ్=పలుకుటకు, మృత్యోః=మృత్యువునుండి, భయమ్=భయము, నాస్తి కిం ను=లేదా ?

తా. నాలుక కదిపినంతమాత్రముచేతనే (మాటమాత్రము చేతనే) శుభాశుభములను ఇవ్వగలిగిన శాసకుడనైన నా ఎదుట ఇట్టి పరుషవాక్యమును పలుకుటకు మీకు మృత్యువునుండి భయము కలుగలేదా ? 11

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తౌ=పలుకబడిన, తౌ శుకసారణౌ=ఆ శుకసారణులు, సవ్రీడౌ=సిగ్గుతో కూడినవారై, రావణమ్=రావణుని, దృష్ట్వా=చూచి, జయశబ్దేన=జయశబ్దమువేత, ప్రతినన్ద్య=అభినందించి, నిఃసృతౌ=వెళ్ళిపోయినారు.

తా. రావణునిచేత ఈ విధముగా నిందింపబడిన శుకసారణులు సిగ్గుపడుచు రావణుని చూచి జయశబ్దము పలికి వెళ్ళిపోయిరి. 15

మూ. అబ్రవీచ్చ దశగ్రీవః సమీపస్థం మహోదరమ్, 16
ఉపస్థాపయ మే శీఘ్రం చారానితి నిశాచరః.

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడైన, దశగ్రీవః=రావణుడు, శీఘ్రమ్=శీఘ్రముగా, చారాన్=గూఢచారులను, మే=నాకు, ఉపస్థాపయ=తీసికొనిరమ్ము అని, సమీపస్థమ్=సమీపమునందున్న, మహోదరమ్=మహోదరుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. రావణుడు దగ్గరనే ఉన్న మహోదరునితో - "గూఢచారులను వెంటనే నావద్దకు తీసికొని రమ్ము" అని పలికెను. 16

మూ. మహోదరస్తథోక్తస్తు శీఘ్రమాజ్ఞాపయచ్చరాన్. 17
తతశ్చారాః సంత్వరితాః ప్రాప్తాః పార్థివశాసనాత్,
ఉపస్థితాః ప్రాఞ్జలయో వర్ధయిత్వా జయాశిషః. 18

ప్ర. అ. తథా=అట్లు, ఉక్తః=పలుకబడిన, మహోదరః=మహోదరుడు, శీఘ్రమ్=శీఘ్రముగా, చరాన్=గూఢచారులను, ఆజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను. తతః=అటుపిమ్మట, పార్థివశాసనాత్=రాజాజ్ఞవలన, సంత్వరితాః=తొందరపడుచున్నవారై, ప్రాప్తాః=వచ్చిన, చారాః=గూఢచారులు, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్లు గలవారై, జయాశిషః=జయాశీర్వాదములను, వర్ధయిత్వా=వృద్ధిపొందించి, ఉపస్థితాః=సమీపించిరి.

తా. మహోదరుడు వెంటనే గూఢచారులను ఆజ్ఞాపించెను. పిమ్మట గూఢచారులు రాజాజ్ఞచేత తొందరగా వచ్చి, అంజలి ఘటించి, "జయ విజయీభవ" అను ఆశీర్వాదవాక్యము పలుకుచు సమీపించిరి. 17-18

మూ. తానబ్రవీత్తతో వాక్యం రావణో రాక్షసాధిపః, 19
చరాన్ ప్రాత్యయికాన్ శూరాన్ధీరాన్విగతసాధ్వసాన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, ప్రాత్యయికాన్=విశ్వాసపాత్రులు, శూరాన్=శూరులు, ధీరాన్=ధీరులు, విగతసాధ్వసాన్=పోయిన భయము గలవారు అయిన, తాన్ చరాన్=ఆ గూఢచారులను గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఏమ్మట రాక్షసరాజైన రావణుడు విశ్వాసపాత్రులు, శూరులు, ధీరులు, భయము లేని వారు అయిన ఆ గూఢచారులతో ఇట్లు పలికెను.19

మూ. ఇతో గచ్ఛత రామస్య వ్యవసాయం పరీక్షితుమ్, 20
మన్త్రిష్వభ్యన్తరా యేఽస్య ప్రీత్యా తేన సమాగతాః.

ప్ర. అ. రామస్య=రామునియొక్క, వ్యవసాయమ్=ప్రయత్నమును, అస్య=అతనికి, యే=ఎవరు, మన్త్రిషు=ఆలోచనలయందు, అభ్యన్తరాః=అంతరంగికులో, ప్రీత్యా=ప్రేమతో, తేన=వానితో, సమాగతాః=కలిసినారో, పరీక్షితుమ్=పరీక్షించుటకు, ఇతః=ఇక్కడినుండి, గచ్ఛత=వెళ్లండి.

తా. రాముడు ఎట్టి ప్రయత్నములు చేయుచున్నాడో, అతనికి ఆలోచనలలో ఎవరు అంతరంగికులో, ప్రేమచేత ఎవరు అతని పక్షమునందు ఉన్నారో పరీక్షించుటకై ఇక్కడినుండి బయలుదేరి వెళ్లుడు. 20

మూ. కథం స్వపితి జాగర్తి కిమద్య చ కరిష్యతి, 21
విజ్ఞాయ నిపుణం సర్వమాగన్తవ్యమశేషతః.

ప్ర. అ. కథమ్=ఎట్లు, స్వపితి=నిద్రపోవుచున్నాడు ? జాగర్తి=మేలుకొనుచున్నాడు ? అద్య=ఇప్పుడు, కిమ్=ఏమి, కరిష్యతి=చేయగలడు ? సర్వమ్=సమస్తములను, అశేషతః=పూర్తిగా, నిపుణమ్=నేర్పుగా, విజ్ఞాయ=తెలిసికొని, ఆగన్తవ్యమ్=రావలసి ఉన్నది.

తా. రాముడు ఎట్లు నిద్రపోవుచున్నాడో, ఎట్లు మేలుకొనుచున్నాడో, ఇప్పుడు ఏమి చేయుచున్నాడో అన్ని విషయములు పూర్తిగా నేర్పుతో తెలిసికొని రావలెను. 21

మూ. చారేణ విదితః శత్రుః పణ్డితైర్వసుధాధిపైః, 22
యుద్ధే స్వల్పేన యత్నేన సమాసాద్య నిరస్యతే.

ప్ర. అ. పణ్డితైః=బుద్ధిమంతులైన, వసుధాధిపైః=రాజులచేత, చారేణ=గూఢచారి ద్వారా, విదితః=తెలియుకొనబడిన, శత్రుః=శత్రువు, యుద్ధే=యుద్ధమునందు, సమాసాద్య=పొంది, స్వల్పేన=స్వల్పమైన, యత్నేన=ప్రయత్నముచేత, నిరస్యతే=ఓడింపబడును.

తా. బుద్ధిమంతులైన రాజులు చారుల ద్వారా శత్రువును గూర్చి తెలిసికొన్నచో అతనిని యుద్ధములో స్వల్పప్రయత్నముచేతనే ఓడించవచ్చును.

మూ. చారాస్తు తే తథేత్యుక్త్వా ప్రహృష్టా రాక్షసేశ్వరమ్, 23
శార్దూలమగ్రతః కృత్వా తతశ్చక్రుః ప్రదక్షిణమ్.

ప్ర. అ. తే=ఆ, చారాస్తు=గూఢచారులైతే, ప్రహృష్టాః=సంతోషించిన వారై, తథేతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, శార్దూలమ్=శార్దూలుని, అగ్రతః=ఎదుట, కృత్వా=ఉంచుకొని, రాక్షసేశ్వరమ్=రావణుని, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము, చక్రుః=చేసిరి.

తా. ఆ గూఢచారులు సంతోషించుచు అట్లే చేసెదము అని పలికి శార్దూలుణ్ణి ముందు ఉంచుకొని ఆ రాక్షసరాజుకు ప్రదక్షిణము చేసిరి. 23

మూ. తతస్తం తు మహాత్మానం చారా రాక్షససత్తమమ్, 24
కృత్వా ప్రదక్షిణం జగ్ముర్యత్ర రామః సలక్ష్మణః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, చారాః=గూఢచారులు, మహాత్మానమ్=మహాత్ముడైన, తమ్=ఆ, రాక్షససత్తమమ్=రాక్షసశ్రేష్ఠుని, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, సలక్ష్మణః=లక్ష్మణసహితుడైన, రామః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, జగ్ముః=వెళ్లిరి.

తా. పిమ్మట ఆ గూఢచారులు మహాత్ముడైన ఆ రాక్షసాధిపతికి ప్రదక్షిణ నమస్కారములు చేసి లక్ష్మణసహితుడైన రాముడున్న ప్రదేశమునకు వెళ్లిరి. 24

మూ. తే సువేలస్య శైలస్య సమీపే రామలక్ష్మణౌ, 25
ప్రచ్ఛన్నా దదృశుర్గత్వా ససుగ్రీవవిభీషణౌ.

ప్ర. అ. తే=వాళ్లు, గత్వా=వెళ్లి, ప్రచ్ఛన్నాః=దాగిఉన్నవారై, సువేలస్య శైలస్య=సువేలపర్వతముయొక్క, సమీపే=సమీపమునందు, ససుగ్రీవవిభీషణౌ=సుగ్రీవవిభీషణులతో కూడిన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, దదృశుః=చూచిరి.

తా. వాళ్లు రహస్యముగా వెళ్లి సువేలపర్వతముదగ్గర సుగ్రీవవిభీషణులతో కలిసి ఉన్న రామలక్ష్మణులను చూచిరి. 25

మూ. ప్రేక్షమాణాశ్చమూం తాం చ బభూవుర్భయవిహ్వలాః, 26
తే తు ధర్మాత్మనా దృష్టా రాక్షసేన్ద్రేణ రాక్షసాః.

ప్ర. అ. తే రాక్షసాః=ఆ రాక్షసులు, తాం చమూమ్=ఆ సేనను, ప్రేక్షమాణాః=చూచుచున్నవారై, భయవిహ్వలాః=భయముచేత వ్యాకులులు, బభూవుః=అయిరి. ధర్మాత్మనా=ధర్మాత్ముడైన, రాక్షసేన్ద్రేణ=రాక్షసప్రభువైన విభీషణునిచేత, దృష్టాః=చూడబడిరి.

తా. ఆ రాక్షసులు ఆ సైన్యమును చూడగానే భయముచేత వ్యాకులులైరి. ఇంతలో ధర్మాత్ముడైన విభీషణుడు వాళ్లను చూచెను. 26

మూ. విభీషణేన తత్రస్థా నిగృహీతా యదృచ్ఛయా, 27
శార్దూలో గ్రాహితస్త్వేకః పాపోఽయమితి రాక్షసః.

ప్ర. అ. యదృచ్ఛయా=దైవవశముచేత, తత్రస్థాః=అక్కడ ఉన్న రాక్షసులు, విభీషణేన=విభీషణునిచేత, నిగృహీతాః=నిగ్రహింపబడిరి (భయపెట్టబడిరి). అయమ్=ఈ, రాక్షసః=రాక్షసుడు, పాపః=పాపాత్ముడు, ఇతి=అని, ఏకః=ఒక్క, శార్దూలః తు=శార్దూలుడైతే, గ్రాహితః=పట్టింపబడెను.

తా. దైవవశముచేత విభీషణుని దగ్గరకు వెళ్లిన వాళ్లను విభీషణుడు భయపెట్టి "ఈ రాక్షసుడు పాపాత్ముడు" అని చెప్పి శార్దూలుణ్ణి బంధింపచేసెను.

మూ. మోక్షితః సోఽపి రామేణ వధ్యమానః ప్లవఙ్గమైః, 28
ఆనృశంస్యేన రామేణ మోక్షితా రాక్షసాః పరే.

ప్ర. అ. ప్లవఙ్గమైః=వానరులచేత, వధ్యమానః=చంపబడుచున్న, సః అపి=ఆ శార్దూలుడు కూడ, రామేణ=రామునిచేత, మోచితః=విడిపింపబడినాడు. పరే=ఇతరులైన, రాక్షసాః=రాక్షసులు, ఆనృశంస్యేన=క్రూరుడు కాని, రామేణ=రామునిచేత, మోక్షితాః=విడిపింపబడిరి.

తా. శార్దూలుణ్ణి వానరులు చంపుచుండగా రాముడు విడిపించెను. క్రూరస్వభావము లేని ఆ రాముడు ఇతర రాక్షసులను కూడ విడిపించెను. 28

మూ. వానరైరర్దితాస్తే తు విక్రాన్తైర్లఘువిక్రమైః, 29
పునర్లఙ్కామనుప్రాప్తాః శ్వసన్తో నష్టచేతసః.

ప్ర. అ. విక్రాన్తైః=పరాక్రమించిన, లఘువిక్రమైః=శీఘ్రవిక్రమము గల, వానరైః= వానరులచేత, అర్దితాః=పీడింపబడిన, తే=ఆ రాక్షసులు, నష్టచేతసః=నష్టమైన చిత్తము గలవారై, శ్వసన్తః=నిట్టూర్పుచున్నవారై, పునః=మరల, లఙ్కామ్=లంకను, అనుప్రాప్తాః=చేరిరి.

రా. తేలికగా పనులుచేయు ఆ వానరులు పరాక్రమించి ఆ రాక్షసులను పీడింపగా వాళ్లు నష్టమైన మనస్సులతో (స్పృహ కోల్పోయి) నిట్టూర్చుచు మరల లంక చేరిరి. 29

మూ. తతో దశగ్రీవముపస్థితాస్తే
చారా బహిర్నిత్యచరా నిశాచరాః,
గిరేః సువేలస్య సమీపవాసినం
న్యవేదయన్రామబలం మహాబలాః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకోనత్రింశః సర్గః

ప్ర. అ. చారాః=గూఢచారులు, బహిః=వెలుపల, నిత్యచరాః=నిత్యము సంచరించువారు, మహాబలాః=గొప్ప బలము కలవారు అయిన, తే=ఆ, నిశాచరాః=రాక్షసులు, తతః=అటు పిమ్మట, దశగ్రీవమ్=రావణుని, ఉపస్థితాః=సమీపించినవారై, రామబలమ్=రాముని సైన్యమును, సువేలస్య=సువేలపర్వతముయొక్క, సమీపవాసినమ్=సమీపమునందున్నదానినిగా, న్యవేదయన్=తెలిపిరి.

తా. గూఢచారులుగా ఎల్లప్పుడూ బైట తిరుగుచుండు మహాబలవంతులైన ఆ రాక్షసులు రావణుని వద్దకు వెళ్ళి రాముని సైన్యము సువేలపర్వతము దగ్గర ఉన్నది అని తెలిపిరి. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ త్రింశః సర్గః

[శార్దూలుడు వానరసైన్యములో ఉన్న ప్రముఖవీరులను గూర్చి రావణునకు చెప్పుట.]

మూ. తతస్తమక్షోభ్యబలం లంకాధిపతయే చరాః,
సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, చరాః=గూఢచారులు, అక్షోభ్యబలమ్=క్షోభింప శక్యము కాని సైన్యము గల, తమ్=ఆ, రాఘవమ్=రాముణ్ణి, సువేలే శైలే=సువేల పర్వతమునందు, నివిష్టమ్=విడిసి ఉన్న వానినిగా, లంకాధిపతయే=రావణునకు, ప్రత్యవేదయన్=తెలిపిరి.

తా. పిమ్మట ఆ గూఢచారులు "క్షోభింప శక్యము కాని సైన్యముతో రాముడు సువేలపర్వతముమీద విడిసి ఉన్నాడు" అని రావణునకు తెలిపిరి.1

మూ. చారాణాం రావణః శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్,
జాతోద్వేగోఽభవత్కించిచ్ఛార్దూలం వాక్యమబ్రవీత్. 2

ప్ర. అ. రావణః=రావణుడు, మహాబలమ్=గొప్ప బలము గల, రామమ్=రాముణ్ణి, ప్రాప్తమ్=వచ్చినవానినిగా, చారాణామ్=చారులకు, శ్రుత్వా=విని, కించిత్=కొంచెము, జాతోద్వేగః=పుట్టిన దిగులుకలవాడు, అభవత్=అయెను. శార్దూలమ్=శార్దూలుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాబలశాలియైన రాముడు వచ్చి ఉన్నాడని గూఢచారులనుండి వినగానే రావణునకు కొంచెము దిగులు పుట్టెను. అతడు శార్దూలునితో ఇట్లు పలికెను. 2

మూ. అయథావచ్చ తే వర్ణో దీనశ్చాసి నిశాచర,
నాసి కచ్చిదమిత్రాణాం క్రుద్ధానాం వశమాగతః. 3

ప్ర. అ. నిశాచర=ఓ ! రాక్షసుడా ! తే=నీయొక్క, వర్ణః=రంగు, అయథావత్ చ=ఉండవలసినట్లు కాకుండ ఉన్నది. దీనశ్చ=దీనుడవుగా కూడ, అసి=అయి ఉన్నావు. క్రుద్ధానామ్=కోపించిన, అమిత్రాణామ్=శత్రువులకు, వశమ్=వశమును, న ఆగతః కచ్చిత్=పొందలేదు గదా !

తా. శార్దూలా ! నీ శరీరచ్ఛాయ మామూలుగా లేదు. దీనుడవుగా కూడ కనబడుచున్నావు. కోపించిన శత్రువులకు నీవు పట్టుబడలేదు కదా !3

మూ. ఇతి తేనానుశిష్టస్తు వాచం మన్దముదీరయత్,
తదా రాక్షసశార్దూలం శార్దూలో భయవిహ్వలః. 4

ప్ర. అ. ఇతి=ఇట్లు, తేన=అతనిచేత, అనుశిష్టః=అడగబడిన, భయ విహ్వలః=భయముచేత వ్యాకులుడైన, శార్దూలః=శార్దూలుడు, తదా=అప్పుడు, రాక్షసశార్దూలమ్=ఆ రాక్షసశ్రేష్ఠునిగూర్చి, మన్దమ్=మందముగా, వాచమ్=వాక్యమును, ఉదీరయత్=పలికెను.

తా. రావణుడు ఈ విధముగా ప్రశ్నింపగా భయముచేత వ్యాకులుడై ఉన్న ఆ శార్దూలుడు మెల్లగా అతనితో ఇట్లనెను. 4

మూ. న తే చారయితుం శక్యా రాజన్వానరపుఙ్గవాః,
విక్రాన్తా బలవన్తశ్చ రాఘవేణ చ రక్షితాః. 5

ప్ర. అ. రాజన్=రాజా! విక్రాన్తాః=విక్రమించినవారు, బలవన్తశ్చ=బలవంతులు, రాఘవేణ=రామునిచేత, రక్షితాః చ=రక్షింపబడినవారూ అయిన, తే=ఆ, వానరపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, చారయితుమ్=గూఢచారుల ద్వారా పరీక్షించుటకు, న శక్యాః=శక్యమైనవారు కారు.

తా. రాజా! విక్రమవంతులు, బలవంతులు, రాముని రక్షణలో కూడ ఉన్నవారూ అయిన ఆ వానరశ్రేష్ఠులను గూఢచారులద్వారా పరీక్షించుట శక్యము కాదు. 5

మూ. నాపి సంభాషితుం శక్యాః సంప్రశ్నోఽత్ర న విద్యతే,
సర్వతో రక్ష్యతే పన్థా వానరైః పర్వతోపమైః. 6

ప్ర. అ. సంభాషితుమపి=మాటలాడుటకు కూడ, న శక్యాః=శక్యమైనవారు కారు. అత్ర=వీళ్ల విషయమునందు, సంప్రశ్నః=ప్రశ్నించుట, న విద్యతే=లేదు. పన్థాః=మార్గము, సర్వతః=అంతటా, పర్వతోపమైః=పర్వతములతో సమానులైన, వానరైః=వానరులచేత, రక్ష్యతే=రక్షింపబడుచున్నది.

తా. వాళ్లతో మాటలాడుటకు కూడ శక్యము కాదు. వాళ్లను ప్రశ్నించే అవకాశమే లేదు. పర్వతములవంటి వానరులు మార్గమునంతను అన్ని వైపులా రక్షించుచున్నారు. 6

మూ. ప్రవిష్టమాత్రే జ్ఞాతోఽహం బలే తస్మిన్నచారితే,
బలాద్గృహీతో రక్షోభిర్బహుధాస్మి విచాలితః. 7

ప్ర. అ. తస్మిన్=ఆ, బలే=సేన, ప్రవిష్టమాత్రే=ప్రవేశించబడగానే, అచారితే=పరీక్షింపబడకుండగానే, అహమ్=నేను, జ్ఞాతః=తెలియబడితిని. రక్షోభిః=రాక్ష

మఱి చేత, బలాత్=బలాత్కారముగా, గృహీతః=గ్రహించబడితిని. బహుధా=అనేక విధములం, విచారితః=విచారింపబడినవాడను, అస్మి=అయితిని.

తా. నేను సైన్యములో ప్రవేశించగానే, ఇంకను సైన్యమును పరీక్షించ కుండగానే, నన్ను వాళ్లు గుర్తించిరి. విభీషణుని అమాత్యులైన రాక్షసులు నన్ను బలాత్కారముగా పట్టుకొనిరి. నన్ను వాళ్లు అనేక విధముల పరీక్షించిరి. 7

మూ. జానుభిర్ముష్టిభిర్దన్తై స్తలైశ్చాభిహతో భృశమ్,
పరిణీతోఽస్మి హరిభిర్బలమధ్యే అమర్షణైః. 8

ప్ర. అ. జానుభిః=మోకాళ్లచేతను, ముష్టిభిః=పిడికిళ్లచేతను, దన్తైః=దంత ములచేతను, తలైః=అరచేతులచేతను, భృశమ్=మిక్కిలి, అభిహతః=కొట్టబడిన వాడనై, అమర్షణైః=కోపము గల, హరిభిః=వానరులచేత, బలమధ్యే=సైన్యమధ్య మునందు, పరిణీతః=త్రిప్పబడినవాడను, అస్మి=అయితిని.

తా. కోపముతో ఆ వానరులు నన్ను మోకాళ్లతోను, పిడికిళ్లతోను, దంతములతోను, అరచేతులతోను మిక్కిలి పీడించి సైన్యము మధ్య ఊరేగించిరి.

మూ. పరిణీయ చ సర్వత్ర నీతోఽహం రామసంసది,
రుధిరాదిగ్ధసర్వాఙ్గో విహ్వలశ్చలితేన్ద్రియః. 9

ప్ర. అ. రుధిరాదిగ్ధసర్వాఙ్గః=రక్తముచేత పూయబడిన సమస్తశరీరము గల, విహ్వలః=వ్యాకులుడనైన, చలితేన్ద్రియః=చలించిన ఇంద్రియములు గల, అహమ్=నేను, సర్వత్ర=అంతటా, పరిణీయ=త్రిప్పి, రామసంసది=రాముని సభలో, నీతః=తీసికొని వెళ్లబడితిని.

తా. వాళ్లు ఆ విధముగా నన్ను ఊరేగించి రాముని దగ్గరకు తీసికొనివెళ్లిరి. నా శరీరమంతా రక్తముతో పూయబడి ఉండెను. వ్యాకులుడనైన నా ఇంద్రియములు చలించిపోయెను. 9

మూ. హరిభిర్వధ్యమానశ్చ యాచమానః కృతాఞ్జలిః,
రాఘవేణ పరిత్రాతో జీవామి చ యదృచ్ఛయా. 10

ప్ర. అ. హరిభిః=వానరులచేత, వధ్యమానః=చంపబడుచు, కృతా ఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడనై, యాచమానః=యాచించుచున్న నేను, రాఘవేణ=రామునిచేత, పరిత్రాతః=రక్షించబడితిని. యదృచ్ఛయా=దైవవశము చేత, జీవామి చ=జీవించి ఉన్నాను.

తా. వానరులు ఆ విధముగా నన్ను పీడించుచుండగా నేను అంజలి ఘటించి రాముణ్ణి ప్రార్థించితిని. రాముడు నన్ను రక్షించుటచేత ఎటులనో

శోధించి ఉన్నాను. 10

మూ. ఏష శైలైః శిలాభిశ్చ పూరయిత్వా మహార్ణవమ్,
ద్వారమాశ్రిత్య లఙ్కాయా రామస్తిష్ఠతి సాయుధః. 11

ప్ర. అ. ఏషః=ఈ, రామః=రాముడు, శైలైః=పర్వతములచేతను, శిలాభిశ్చ=శిలలచేతను, మహార్ణవమ్=మహాసముద్రమును, పూరయిత్వా=నింపి, సాయుధః=ఆయుధములతో కూడినవాడై, లఙ్కాయాః=లంకయొక్క, ద్వారమ్=ద్వారమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, తిష్ఠతి=ఉన్నాడు.

తా. ఈ రాముడు శిలలచేత, పర్వతములచేత సముద్రమును నింపి ఆయుధములను ధరించి లంకా ద్వారమువద్ద ఉన్నాడు. 11

మూ. గరుడవ్యూహ మాస్థాయ సర్వతో హరిభిర్వృతః,
మాం విసృజ్య మహాతేజా లఙ్కామేవాభివర్తతే. 12

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల రాముడు, మామ్=నన్ను, విసృజ్య=విడచి, హరిభిః=వానరులచేత, గరుడవ్యూహమ్=గరుడవ్యూహమును, ఆస్థాయ=అవలంబించి, సర్వతః=అన్ని వైపులా, వృతః=కూడినవాడై, లఙ్కామేవ=లంకను గూర్చియే, అభివర్తతే=వచ్చుచున్నాడు.

తా. రాముడు నన్ను విడచిపెట్టివేసి, గరుడవ్యూహముగా ఏర్పడిన వానరులు నలువైపులా కూడా అనుసరించుచుండగా లంకవైపే వచ్చుచున్నాడు.

మూ. పురా ప్రాకారమాయాతి క్షిప్రమేకతరం కురు,
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు యుద్ధం వాపి ప్రదీయతామ్. 13

ప్ర. అ. ప్రాకారమ్=ప్రాకారమును గూర్చి, పురా ఆయాతి=రాగలడు. క్షిప్రమ్=శీఘ్రముగా, ఏకతరమ్=ఏదో ఒక కార్యమును, కురు=చేయుము. ఆశు=శీఘ్రముగా, సీతాం వా=సీతనైనా, ప్రయచ్ఛ=ఇమ్ము. యుద్ధం వాపి=యుద్ధమైనా, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. రాముడు ప్రాకారము వరకూ వచ్చేలోగా ఏదో ఒకటి చేయుము. వెంటనే సీతనైనా ఇచ్చివేయుము, లేదా యుద్ధము చేయుము. 13

మూ. మనసా తత్తదా ప్రేక్ష్య తచ్ఛ్రుత్వా రాక్షసాధిపః,
శార్దూలం సుమహద్వాక్యమథోవాచ స రావణః. 14

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసరాజైన, సః=ఆ, రావణః=రావణుడు, తదా=అప్పుడు, తత్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, మనసా=మనస్సుచేత,

తత్=దానిని, ప్రేక్ష్య=చూచి, అథ=అటుపిమ్మట, శార్దూలమ్=శార్దూలుని గూర్చి, సుమహత్=చాల గొప్పదైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాక్షసాధిపుడైన ఆ రావణుడు ఆ వాక్యమును విని, మనస్సునందే ఆ పరిస్థితిని ఊహించుకొని శార్దూలునితో ఇట్లు పలికెను. 14

మూ. యది మాం ప్రతియుధ్యన్తే దేవగన్ధర్వదానవాః,
నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయాదపి. 15

ప్ర. అ.24 వ సర్గ 36వ శ్లోకము చూడుడు.

మూ. ఏవముక్త్వా మహాతేజా రావణః పునరబ్రవీత్,
చరితా భవతా సేనా కేఽత్ర శూరాః ప్లవఙ్గమాః. 16

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణః=రావణుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పునః=మరల, అబ్రవీత్=పలికెను. భవతా=నీచేత, సేనా=సేన, చరితా=సంచరించబడినది కదా ? అత్ర=దీనియందు, శూరాః=శూరులైన, ప్లవఙ్గమాః=వానరులు, కే=ఎవరు ?

తా. మహాతేజశ్శాలియైన రావణుడు ఇట్లు పలికి మరల ఇట్లనెను- "నీవు వానరసైన్యమును పరీక్షించితివికదా ? ఈ సైన్యములో శూరులైన వానరులు ఎవరు ?" 16

మూ. కింప్రభాః కీదృశాః సౌమ్య వానరా యే దురాసదాః,
కస్య పుత్రాశ్చ పౌత్రాశ్చ తత్త్వమాఖ్యాహి సువ్రత. 17

ప్ర. అ. సువ్రత=మంచి నియమములు కలవాడా ! సౌమ్య=సౌమ్యుడా! దురాసదాః=ఎదిరింప శక్యము కాని, యే=ఏ, వానరాః=వానరులు గలరో వారు, కింప్రభాః=ఎట్టి కాంతి గలవారు ? కీదృశాః=ఎట్టివారు ? కస్య=ఎవనియొక్క, పుత్రాః=పుత్రులు ? పౌత్రాశ్చ=పౌత్రులు?, తత్=దానిని, త్వమ్=నీవు, ఆఖ్యాహి=చెప్పుము.

తా. "సద్గుణవంతుడవైన ఓ ! సౌమ్యుడా ! ఎదిరింప శక్యము కాని ఏ వానరులున్నారో వాళ్లు ఎట్టి కాంతి గలవారు ? ఎట్టివారు ? ఎవరి పుత్రులు ? ఎవరి పౌత్రులు ? ఏ ఏ విషయము చెప్పుము." 17

మూ. తథాత్ర ప్రతిపత్స్యామి జ్ఞాత్వా తేషాం బలాబలమ్,
అవశ్యం బలసంఖ్యానం కర్తవ్యం యుద్ధమిచ్ఛతామ్. 18

ప్ర. అ. తేషామ్=వారియొక్క, బలాబలమ్=బలాబలమును, జ్ఞాత్వా=తెలిసికొని, అత్ర=ఈ విషయమునందు, తథా=అట్లు, ప్రతిపత్స్యామి=ఆలోచించెదను.

యుద్ధమ్=యుద్ధమును, ఇచ్ఛతామ్=కోరుచున్నవారియొక్క, సంఖ్యానమ్= శిక్ష పెట్టుట, అవశ్యమ్=తప్పకుండగా, కర్తవ్యం ఖలు=చేయదగినది కదా ?

తా. "వారి బలాబలములను తెలిసికొని ఏమి చేయవలెనో నిర్ణయింతెదను. యుద్ధమునకై వచ్చినవారిని తప్పక శిక్ష పెట్టవలెను కదా ?" 18

మూ. అథైనముక్తః శార్దూలో రావణేనోత్తమశ్చరః,
ఇదం వచనమారేభే వక్తుం రావణసంనిధౌ. 19

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణేన=రావణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, ఉత్తమః చరః=ఉత్తమగూఢచారియైన, శార్దూలః=శార్దూలుడు, రావణసంనిధౌ=రావణుని సమీపమునందు, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, వక్తుమ్=చెప్పుటకు, ఆరేభే=ప్రారంభించెను.

తా. ఉత్తమగూఢచారియైన శార్దూలుడు రావణుని మాటలు విని, అతని సమక్షమున ఇట్లు పలుకుటకు ఉపక్రమించెను. 19

మూ. అథర్క్షరజసః పుత్రో యుధి రాజా దురాసదః,
గద్గదస్యాథ పుత్రోఽత్ర జాంబవానితి విశ్రుతః. 20

ప్ర. అ. అథ=ప్రత్యుత్తరము ప్రారంభింపబడుచున్నది. (అతడు) ఋక్షరజసః =ఋక్షరజస్సుయొక్క, పుత్రః=పుత్రుడు, యుధి=యుద్ధమునందు, దురాసదః= ఎదిరింప శక్యము కానివాడు అయిన, రాజా=వానరరాజు, అత్ర=ఇక్కడ, గద్గదస్య= గద్గదునియొక్క, పుత్రః=పుత్రుడైన, జాంబవాన్ ఇతి=జాంబవంతుడు అని, విశ్రుతః= ప్రసిద్ధుడైన వీరుడు ఉన్నాడు.

తా. ఇతడు ఋక్షరజస్సు పుత్రుడు, యుద్ధములో జయింప శక్యము కానివాడు అయిన సుగ్రీవుడు. గద్గదుని పుత్రుడు ప్రసిద్ధుడు అయిన జాంబవంతుడు ఇక్కడ ఉన్నాడు. 20

మూ. గద్గదస్యైవ పుత్రోఽన్యో గురుపుత్రః శతక్రతోః,
కదనం యస్య పుత్రేణ కృతమేకేన రక్షసామ్. 21

ప్ర. అ. అన్యః=ఈ మరియొకడు, గద్గదస్యైవ=గద్గదునియొక్కయే, పుత్రః=పుత్రుడైన ధూమ్రుడు. (ఇతడు) శతక్రతోః=ఇంద్రునియొక్క, గురుపుత్రః=గురువైన బృహస్పతియొక్క కుమారుడైన కేసరి. యస్య=ఎవనియొక్క పుత్రేణ=పుత్రుడైన హనుమంతునిచేత, ఏకేన=ఒక్కనిచేతనే, రక్షసామ్=రాక్షసుల యొక్క, కదనమ్=నాశనము, కృతమ్=చేయబడినదో.

తా. ఇతడు గద్గదుని మరియొక కుమారుడైన ధూమ్రుడు. ఇతడు

బృహస్పతి పుత్రుడైన కేసరి. ఈ కేసరి పుత్రుడైన హనుమంతుడే ఒంటరిగా రాక్షసులను సంహరించినాడు. 21

మూ. సుషేణశ్చాత్ర ధర్మాత్మా పుత్రో ధర్మస్య వీర్యవాన్,
సౌమ్యః సోమాత్మజశ్చాత్ర రాజన్ దధిముఖః కపిః. 22

ప్ర. అ. రాజన్=రాజా ! ధర్మస్య=యమునియొక్క, పుత్రః=పుత్రుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు, ధర్మాత్మా=ధర్మాత్ముడు అయిన, సుషేణశ్చ=సుషేణుడు కూడ, అత్ర=ఇక్కడ ఉన్నాడు. సోమాత్మజః=చంద్రుని కుమారుడు, సౌమ్యః=సౌమ్యుడు అయిన, దధిముఖః కపిః=దధిముఖుడను వానరుడు, అత్ర=ఇక్కడ ఉన్నాడు.

తా. రాజా ! యమధర్మరాజ కుమారుడు, ధర్మాత్ముడు, పరాక్రమవంతుడు అయిన సుషేణుడు, చంద్రుని కుమారుడు, సౌమ్యుడు అయిన దధిముఖుడు ఇక్కడ ఉన్నారు. 22

మూ. సుముఖో దుర్ముఖశ్చైవ వేగదర్శీ చ వానరః,
మృత్యుర్వానరరూపేణ నూనం సృష్టః స్వయంభువా. 23

ప్ర. అ. సుముఖః=సుముఖుడు, దుర్ముఖశ్చైవ=దుర్ముఖుడు, వేగదర్శీ చ=వేగదర్శి అను, వానరః=వానరుడు, నూనమ్=నిశ్చయముగా, స్వయంభువా=బ్రహ్మదేవునిచేత, వానరరూపేణ=వానరరూపముచేత, సృష్టః=సృష్టించబడిన, మృత్యుః=మృత్యువు.

తా. సుముఖుడు, దుర్ముఖుడు, వేగదర్శి అను ఈ వానరులు బ్రహ్మదేవుడు వానరరూపములో సృజించిన మృత్యువే. (లేదా మృత్యుదేవత కుమారులు). 23

మూ. పుత్రో హుతవహస్యాత్ర నీలః సేనాపతిః స్వయమ్,
అనిలస్య తు పుత్రోఽత్ర హనూమానితి విశ్రుతః. 24

ప్ర. అ. హుతవహస్య=అగ్నియొక్క, పుత్రః=పుత్రుడు, స్వయమ్=స్వయముగా, సేనాపతిః=సేనాపతియైన, నీలః=నీలుడు, అత్ర=ఇక్కడ ఉన్నాడు. హనూమానితి=హనుమంతుడు అని, విశ్రుతః=ప్రసిద్ధుడైన, అనిలస్య పుత్రః=వాయుపుత్రుడు, అత్ర=ఇక్కడ ఉన్నాడు.

తా. స్వయముగా సేనాధిపతిగా ఉన్న అగ్నిపుత్రుడైన నీలుడు,

హనుమంతుడని ప్రసిద్ధి చెందిన వాయుకుమారుడు ఇక్కడ ఉన్నారు. 24

మూ. నప్తా శక్రస్య దుర్ధర్షో బలవానఙ్గదో యువా,
మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ బలినావశ్విసంభవౌ. 25
పుత్రా వైవస్వతస్యాత్ర పఞ్చ కాలాన్తకోపమాః,
గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః. 26
దశ వానరకోట్యశ్చ శూరాణాం యుద్ధకాఙ్క్షిణామ్,
శ్రీమతాం దేవపుత్రాణాం శేషం నాఖ్యాతుముత్సహే. 27

ప్ర. అ. శక్రస్య=దేవేంద్రునియొక్క, నప్తా=మనుమడు, దుర్ధర్షః=ఎదిరింప శక్యముకాని, బలవాన్=బలవంతుడు, యువా=యువకుడు అయిన, అఙ్గదః=అంగదుడు, అశ్విసంభవౌ=అశ్వినీదేవతలవలన పుట్టిన, బలినౌ=బలవంతులైన, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చ=ద్వివిదుడు అను, ఉభౌ=ఇద్దరు, అత్ర=మరియు, వైవస్వతస్య=యమునియొక్క, పుత్రాః=పుత్రులైన, కాలాన్తకోపమాః=ప్రళయకాలమునందలి యమునితో సమానులైన, గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, గవయః=గవయుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గంధమాదనుడు అను, పఞ్చ=ఐదుగురు, శూరాణామ్=శూరులు, యుద్ధకాఙ్క్షిణామ్=యుద్ధమును కోరుచున్నవారు అయిన, వానరకోట్యశ్చ=వానరుల కోటులు, దశ=పది, (ఇక్కడ ఉన్నారు.) శ్రీమతామ్=శ్రీమంతులైన, దేవపుత్రాణామ్=దేవతల పుత్రులయొక్క, శేషమ్=శేషమును, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, న ఉత్సహే=సమర్థుడను కాను.

తా. దేవేంద్రుని పౌత్రుడు, ఎదిరింప శక్యము కానివాడు, బలవంతుడు, యువకుడు అయిన అంగదుడు, అశ్వినీదేవతల కుమారులైన మైందద్వివిదులు, గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు అను ప్రళయకాలమృత్యుదేవతతో సమానులైన యముని పుత్రులు ఐదుగురు, యుద్ధముచేయుటకై ఉత్సాహపడుచున్న శూరులైన కోట్లకొలది వానరులు ఇక్కడ ఉన్నారు. ఇంక మిగిలిన శ్రీమంతులైన దేవపుత్రులను గూర్చి నేను చెప్పలేను. 25-27

మూ. పుత్రో దశరథస్యైష సింహసంహననో యువా,
దూషణో నిహతో యేన ఖరశ్చ త్రిశిరాస్తథా. 28

ప్ర. అ. సింహసంహననః=సింహమువంటి అవయవసంనివేశము గల, ఏషః=ఈ, యువా=యువకుడు, దశరథస్య=దశరథునియొక్క, పుత్రః=పుత్రుడు; యేన=ఎవనిచేత, దూషణః=దూషణుడు, నిహతః=చంపబడినాడో, ఖరశ్చ=ఖరుడు, తథా=మరియు, త్రిశిరాః=త్రిశిరస్కుడు(చంపబడిరో).

తా. సింహము అవయవనిర్మాణము వంటి అవయవనిర్మాణము గల

ఈ యువకుడు, దూషణుణ్ణి, ఖరుణ్ణి, త్రిశిరస్సుణ్ణి చంపిన, దశరథకుమారుడైన రాముడు. 28

మూ. నాస్తి రామస్య సదృశో విక్రమే భువి కశ్చన,
విరాధో నిహతో యేన కబన్ధశ్చాన్తకోపమః. 29

ప్ర. అ. యేన=ఎవనిచేత, విరాధః=విరాధుడు, నిహతః=చంపబడినాడో, అన్తకోపమః=యమునితో సమానుడైన, కబన్ధశ్చ=కబంధుడు కూడ(చంపబడినాడో) అట్టి, రామస్య=రామునకు, విక్రమే=పరాక్రమమునందు, సదృశః=సమానుడు, కశ్చన= ఎవ్వడూ, భువి=భూమియందు, నాస్తి=లేడు.

తా. విరాధుణ్ణీ, యమునివంటి కబంధుణ్ణీ చంపిన రామునివంటి పరాక్రమము గలవాడు ఎవడూ ఈ లోకములో లేడు. 29

మూ. వక్తుం న శక్తో రామస్య గుణాన్ కశ్చిన్నరః క్షితౌ,
జనస్థానగతా యేన తావన్తో రాక్షసా హతాః. 30

ప్ర. అ. యేన=ఎవనిచేత, జనస్థానగతాః=జనస్థానములో ఉన్న, తావన్తః=అంతమంది, రాక్షసాః=రాక్షసులు, హతాః=చంపబడినారో, రామస్య=అట్టి రామునియొక్క, గుణాన్=గుణములను, వక్తుమ్=చెప్పుటకు, నరః=మనుష్యుడు, కశ్చిత్=ఎవ్వడూ, క్షితౌ=భూమియందు, న శక్తః=సమర్థుడు కాడు.

తా. జనస్థానములో ఉన్న అందరు రాక్షసులను చంపిన రాముని గుణములను చెప్పగలిగినవా డెవ్వడూ ఈ లోకములో లేడు. 30

మూ. లక్ష్మణశ్చాత్ర ధర్మాత్మా మాతఙ్గానామివర్షభః,
యస్య బాణపథం ప్రాప్య న జీవేదపి వాసవః. 31

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, బాణపథమ్=బాణమార్గమును, ప్రాప్య=పొంది, వాసవః అపి=దేవేంద్రుడు కూడ, న జీవేత్=జీవించడో అట్టి, ధర్మాత్మా=ధర్మాత్ముడు, మాతఙ్గానామ్=ఏనుగులలో, ఋషభః ఇవ=శ్రేష్ఠమైన ఏనుగ వంటి, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు కూడ, అత్ర=ఇక్కడ ఉన్నాడు.

తా. ఎవని బాణముం దారిలోనికి వచ్చినచో దేవేంద్రుడు కూడ జీవించజాలడో, అట్టి ధర్మాత్ముడైన శ్రేష్ఠమైన గజము వలె ఉన్న లక్ష్మణుడు కూడ ఇక్కడ ఉన్నాడు. 31

మూ. శ్వేతో జ్యోతిర్ముఖశ్చాత్ర భాస్కరస్యాత్మసంభవౌ,
వరుణస్య చ పుత్రోఽన్యో హేమకూటః ప్లవఙ్గమః. 32
విశ్వకర్మసుతో వీరో నలః ప్లవగసత్తమః,
విక్రాన్తో వేగవానత్ర వసుపుత్రః సుదుర్ధరః. 33

ప్ర. అ. భాస్కరస్య=సూర్యునియొక్క, ఆత్మసంభవౌ=కుమారులైన, శ్వేతః=శ్వేతుడు, జ్యోతిర్ముఖః=జ్యోతిర్ముఖుడు, వరుణస్య=వరుణునియొక్క, అన్యః పుత్రః=మరియొక కుమారుడైన, హేమకూటః=హేమకూటు డను, ప్లవఙ్గమః=వానరుడు, విశ్వకర్మసుతః= విశ్వకర్మ కుమారుడు, వీరః=వీరుడు, ప్లవగసత్తమః=వానరశ్రేష్ఠుడూ అయిన, నలః= నలుడు, విక్రాన్తః=పరాక్రమముగలవాడు, వేగవాన్=వేగవంతుడు, వసుపుత్రః=వసువుల పుత్రుడైన, సః=ఆ, దుర్ధరః=దుర్ధరుడు, అత్ర=ఇక్కడ ఉన్నారు.

తా. సూర్యుని కుమారులైన శ్వేత-జ్యోతిర్ముఖులు, వరుణుని కుమారుడైన హేమకూటుడు, విశ్వకర్మ కుమారుడు, వీరుడూ అయిన నలు డను వానరశ్రేష్ఠుడు, వసువుల కుమారుడు, విక్రమము కలవాడు, వేగవంతుడు అయిన దుర్ధరుడు ఇక్కడ ఉన్నారు. 32, 33

మూ. రాక్షసానాం వరిష్ఠశ్చ తవ భ్రాతా విభీషణః,
ప్రతిగృహ్య పురీం లఙ్కాం రాఘవస్య హితే రతః. 34

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులలో, వరిష్ఠః=శ్రేష్ఠుడు, తవ=నీయొక్క, భ్రాతా=సోదరుడూ అయిన, విభీషణః=విభీషణుడు, రాఘవస్య=రామునియొక్క, హితే= హితమునందు, రతః=ఆసక్తుడై, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, ప్రతిగృహ్య= ముట్టడించి (ఉన్నాడు).

తా. రాక్షసులలో శ్రేష్ఠుడు, నీ సోదరుడూ అయిన విభీషణుడు రాముని హితమును కోరుచు లంకను ముట్టడించి నిలచి ఉన్నాడు. 34

మూ. ఇతి సర్వం సమాఖ్యాతం తవేదం వానరం బలమ్,
సువేలేఽధిష్ఠితం శైలే శేషకార్యే భవాన్ గతిః. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రింశః సర్గః

ప్ర. అ. ఇతి=ఈవిధముగా, సువేలే శైలే=సువేలపర్వతమునందు, అధిష్ఠితమ్=నిలచి ఉన్న, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, వానరం బలమ్=వానరసైన్యము, తవ= నీకు, సమాఖ్యాతమ్=వర్ణించి చెప్పబడినది. శేషకార్యే=మిగిలిన కార్యమునందు, భవాన్=నీవే, గతిః=గతి.

తా. సువేలపర్వతమునందున్న వానరసైన్యము నంతయూ గూర్చి నీకు వర్ణించి చెప్పినాము. ఇటుపైన ఏమి చేయవలెనో నీవే నిర్ణయించవలెను. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదవ సర్గ సమాప్తము.

# అథ ఏకత్రింశః సర్గః

[రావణుడు రాముని మాయాశిరస్సు ఛేదించి తీసికొనివచ్చి సీతకు చూపి ఆమెకు దుఃఖము కలిగించుట.]

మూ. తతస్తమక్షోభ్యబలం లఙ్కాయాం నృపతేశ్చరాః,
సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నృపతేః=రాజుయొక్క, చరాః=గూఢచారులు, అక్షోభ్యబలమ్=క్షోభింప శక్యముకాని సేనగల, తం రాఘవమ్=ఆ రామున్ని, లఙ్కాయామ్= లంకయందు, సువేలే శైలే=సువేలపర్వతమునందు, నివిష్టమ్=నిలిచి ఉన్నవానినిగా, ప్రత్యవేదయన్=తెలిపిరి.

తా. పిమ్మట, క్షోభింప శక్యముకాని సైన్యము గల రాముడు లంకలో, సువేలపర్వతముపైన నిలిచి ఉన్నట్లు రావణుని గూఢచారులు అతనికి తెలిపిరి.

మూ. చారాణాం రావణః శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్,
జాతోద్వేగోఽభవత్కించిత్సచివానిదమబ్రవీత్. 2

ప్ర. అ. రావణః=రావణుడు, మహాబలమ్=గొప్ప సైన్యము గల, రామమ్=రామున్ని, ప్రాప్తమ్=వచ్చినవానినిగా, చారాణామ్=గూఢచారులనుండి, శ్రుత్వా=విని, కించిత్=కొంచెము, జాతోద్వేగః=పుట్టిన బెదురు కలవాడై, సచివాన్=అనుచరులను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు గొప్ప సైన్యముతో వచ్చి ఉన్నా డని రావణుడు గూఢచారుల ద్వారా తెలిసికొని, కొంచెము దిగులుచెంది అనుచరులతో ఇట్లనెను.

మూ. మన్త్రిణః శీఘ్రమాయాన్తు సర్వే వై సుసమాహితాః,
అయం నో మన్త్రకాలో హి సంప్రాప్త ఇతి రాక్షసాః. 3

ప్ర. అ. నః=మాకు, అయమ్=ఈ, మన్త్రకాలః=ఆలోచించు సమయము, సంప్రాప్తః ఇతి=వచ్చినది గాన, మన్త్రిణః=మంత్రులైన, రాక్షసాః=రాక్షసులు, సర్వే=అందరూ, సుసమాహితాః=బాగా సావధానచిత్తులై, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆయాన్తు= వచ్చెదరు గాక.

తా. మాకు ఆలోచన చేయు సమయము వచ్చినది. అందుచేత మంత్రులైన రాక్షసు లందరు సావధానచిత్తులై వెంటనే వచ్చెదరుగాక. 3

మూ. తస్య తచ్ఛాసనం శ్రుత్వా మన్త్రిణోఽభ్యాగమన్ ద్రుతమ్,
తతః స మన్త్రయామాస రాక్షసైః సచివైః సహ. 4

ప్ర. అ. తస్య=ఆరావణునియొక్క, తత్=ఆ, శాసనమ్=శాసనమును, శ్రుత్వా=విని, మన్త్రిణః=మంత్రులు, ద్రుతమ్=శీఘ్రముగా, అభ్యాగమన్=వచ్చిరి. తతః= అటుపిమ్మట, సః=అతడు, రాక్షసైః=రాక్షసులైన, సచివైః సహ=మంత్రులతో కూడ, మన్త్రయామాస=ఆలోచించెను.

తా. అతని ఆజ్ఞ ప్రకారము మంత్రులు శీఘ్రముగా వచ్చిరి. పిమ్మట అతడు సచివులైన రాక్షసులతో ఆలోచన చేసెను. 4

మూ. మన్త్రయిత్వా తు దుర్ధర్షః క్షమం యత్తదనన్తరమ్,
విసర్జయిత్వా సచివాన్ ప్రవివేశ స్వమాలయమ్. 5.

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యముకాని అతడు, అనన్తరమ్=అనంతరము, యత్= ఏది, క్షమమ్=తగినదో, తత్=దానిని, మన్త్రయిత్వా=ఆలోచించి, సచివాన్= మంత్రులను, విసర్జయిత్వా=పంపివేసి, స్వమ్=తన, ఆలయమ్=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఎదిరింప శక్యముకాని ఆ రావణుడు, తరువాత చేయవలసినదానిని గూర్చి ఆలోచించి, ఆ మంత్రులను పంపివేసి, తన ఇంటిలో ప్రవేశించెను.

మూ. తతో రాక్షసమాదాయ విద్యుజ్జిహ్వం మహాబలమ్,
మాయావిదం మహామాయః ప్రావిశద్యత్ర మైథిలీ. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహామాయః=గొప్ప మాయ గల ఆ రావణుడు, మహాబలమ్=గొప్ప బలము గల, మాయావిదమ్=మాయలు ఎరిగిన, విద్యుజ్జిహ్వమ్= విద్యుజ్జిహ్వుని, ఆదాయ=తీసికొని, మైథిలీ=సీత, యత్ర=ఎక్కడ ఉన్నదో ఆ ప్రదేశమును, ప్రావిశత్=ప్రవేశించెను.

తా. పిమ్మట, గొప్ప మాయలు గల ఆ రావణుడు మాయలు తెలిసిన, మహాబలవంతుడైన విద్యుజ్జిహ్వుని వెంటబెట్టుకొని సీత ఉన్న చోటుకు వెళ్లెను.

మూ. విద్యుజ్జిహ్వం చ మాయాజ్ఞమబ్రవీద్రాక్షసాధిపః,
మోహయిష్యావహే సీతాం మాయయా జనకాత్మజామ్. 7

ప్ర. అ.రాక్షసాధిపః=రావణుడు, మాయాజ్ఞమ్=మాయలు ఎరిగిన, విద్యుజ్జిహ్వమ్=విద్యుజ్జిహ్వుని గూర్చి, అబ్రవీత్ చ=పలికెను కూడ. జనకాత్మజామ్=జనకుని కుమార్తెయైన, సీతామ్=సీతను, మాయయా=మాయచేత, మోహయిష్యావహే=మోహింపచేసెదము.

తా. రావణుడు మాయలు తెలిసిన ఆ విద్యుజ్జిహ్వునితో ఇట్లు పలికెను. "జనకుని కూతురైన సీతను మాయచేత మోహింపచేసెదము." 7

మూ. శిరో మాయామయం గృహ్య రాఘవస్య నిశాచర,
మాం త్వం సముపతిష్ఠస్వ మహచ్చ సశరం ధనుః. 8

ప్ర. అ. నిశాచర=ఓ ! రాక్షసుడా ! రాఘవస్య=రాముని యొక్క, మాయామయమ్= మాయావికారమైన, శిరః=శిరస్సును, సశరమ్=బాణముతో కూడిన, మహత్=గొప్పదైన, ధనుః చ=ధనస్సును, గృహ్య=గ్రహించి, మామ్=నన్ను, త్వమ్=నీవు, సముపతిష్ఠస్వ=సమీపించుము.

తా. "ఓ ! రాక్షసుడా ! రాముని శిరస్సును, అతని ధనుర్బాణములను మాయచేత నిర్మించి, నావద్దకు తీసికొని రమ్ము." 8

మూ. ఏవముక్తస్తథేత్యాహ విద్యుజ్జిహ్వో నిశాచరః,
దర్శయామాస తాం మాయాం సుప్రయుక్తాం స రావణే, 9
తస్య తుష్టోఽభవద్రాజా ప్రదదౌ చ విభూషణమ్.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, నిశాచరః=రాక్షసుడైన, విద్యుజ్జిహ్వః=విద్యుజ్జిహ్వుడు, తథేతి="అట్లే" అని, ఆహ=పలికెను. సుప్రయుక్తామ్=బాగా ప్రయోగించబడిన, తాం మాయామ్=ఆ మాయను, సః=అతడు, రావణే=రావణుని యందు, దర్శయామాస=చూపెను. రాజా=రాజు, తస్య=వానికి, తుష్టః=సంతోషించినవాడు, అభవత్=ఆయెను. విభూషణమ్= అలంకారమును, ప్రదదౌ చ=ఇచ్చెను కూడ.

తా. రావణుని మాటలు విని విద్యుజ్జిహ్వుడు "అట్లే చేసెదను" అని పలికి తాను బాగుగా చేసిన ఆ మాయను రావణునకు చూపెను. రావణుడు సంతోషించి అతనికి ఒక ఆభరణమును బహూకరించెను. 9

మూ. అశోకవనికాయాం చ సీతాదర్శనలాలసః, 10
నైరృతానామధిపతిః సంవివేశ మహాబలః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, నైరృతానామ్ అధిపతిః=రాక్షసరాజు, సీతాదర్శనలాలసః=సీతను చూచుటయందు ఆసక్తి కలవాడై, అశోకవనికాయామ్=అశోకవనమునందు, సంవివేశ=ప్రవేశించెను.

తా. గొప్ప బలము గల ఆ రావణుడు సీతను చూడవలెనను కోరికతో అశోకవనములో ప్రవేశించెను. 10

మూ. తతో దీనామదైన్యార్హాం దదర్శ ధనదానుజః, 11
అధోముఖీం శోకపరాముపవిష్టాం మహీతలే,
భర్తారమేవ ధ్యాయన్తీమశోకవనికాం గతామ్. 12

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధనదానుజః=కుబేరుని తమ్ముడైన రావణుడు, దీనామ్= దీనురాలు, అదైన్యార్హామ్=దైన్యమునకు తగనిది, అధోముఖీమ్=క్రిందికి ముఖము గలది, శోకపరామ్=శోకమునకు వశురాలు, అశోకవనికామ్=అశోకవనమును, గతామ్= పొందినది, మహీతలే=నేలమీద, ఉపవిష్టామ్=కూర్చున్నది, భర్తారమేవ=భర్తనే, ధ్యాయన్తీమ్=ధ్యానించుచున్నది అయిన, సీతను, దదర్శ=చూచెను.

తా. పిమ్మట ఆ రావణుడు అశోకవనములో నేలపై కూర్చొని ఉన్న దీనురాలైన సీతను చూచెను. దైన్యమునకు తగని ఆమె శోకాక్రాంతురాలై, ముఖము క్రిందికి వ్రాల్చి కూర్చుండి భర్తను మాత్రమే ధ్యానించుచుండెను.

మూ. ఉపాస్యమానాం ఘోరాభీ రాక్షసీభిరదూరతః,
ఉపసృత్య తతః సీతాం ప్రహర్షం నామ కీర్తయన్, 13
ఇదం చ వచనం ధృష్టమువాచ జనకాత్మజామ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అదూరతః=సమీపమునందు, ఘోరాభిః=భయంకరలైన, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, ఉపాస్యమానామ్=దగ్గర కూర్చొని రక్షింపబడుచున్న, సీతామ్= సీతను, ఉపసృత్య=సమీపించి, ప్రహర్షం నామ=ఏదో ఆనందకరమైన విషయ మున్నట్లు, కీర్తయన్=చెప్పుచు, జనకాత్మజామ్=సీతను గూర్చి, ధృష్టమ్=ధార్ష్ట్యముతో కూడిన, ఇదం వచనమ్=ఈ వచనమును, ఉవాచ=పలికెను.

తా. భయంకరముగా ఉన్న రాక్షసస్త్రీలు సీత సమీపమునందే కుర్చుండి ఆమెను రక్షించుచుండిరి. అట్టి సీతను సమీపించి రావణుడు సంతోషవార్త చెప్పుచున్నట్లు మాటలాడుచు ధార్ష్ట్యముతో కూడిన మాటలు పలికెను. 13

మూ. సాన్త్వ్యమానా మయా భద్రే యముపాశ్రిత్య విమన్యసే,
ఖరహన్తా స తే భర్తా రాఘవః సమరే హతః. 14

ప్ర. అ. భద్రే=మంగళప్రదురాలా ! మయా=నాచేత, సాన్త్వ్యమానా= బ్రతిమాలుకొనబడుచున్న నీవు, యమ్=ఎవనిని, ఆశ్రిత్య=ఆశ్రయించి, విమన్యసే= అనాదరము చేయుచున్నావో, సః=ఆ, తే భర్తా=నీ భర్తయైన, ఖరహన్తా=ఖరుణ్ణి సంహరించిన, రాఘవః=రాముడు, సమరే=యుద్ధమునందు, హతః= చంపబడినాడు.

తా. ఓ ! సీతా ! నేను ఎంత బ్రతిమాలినను ఎవని అండ చూచుకొని నీవు నన్ను అనాదరము చేసినావో, ఆ ఖరసంహారకుడైన, నీ భర్త, రాముడు రణములో చంపివేయబడినాడు. 14

మూ. ఛిన్నం తే సర్వథా మూలం దర్పశ్చ విహతో మయా,
వ్యసనేనాత్మనః సీతే మమ భార్యా భవిష్యసి. 15

ప్ర. అ. సీతే=సీతా! సర్వథా=అన్నివిధములా, మయా=నాచేత, తే మూలమ్=నీ మొదలు, ఛిన్నమ్=ఛేదింపబడినది. దర్పశ్చ=దర్పము కూడ, విహతః=కొట్టబడినది. ఆత్మనః=నీయొక్క, వ్యసనేన=దుఃఖముచేత, మమ=నాయొక్క, భార్యా=భార్యవుగా, భవిష్యసి=కాగలవు.

తా. సీతా! అన్ని విధాలా నీ మూలమును ఛేదించి నీ గర్వమును అణచివేసినాను. ఈ విధముగా వ్యసనములో చిక్కుకున్న నీవు నా భార్యవు అగుదువు. 15

మూ. విసృజైతాం మతిం మూఢే కిం మృతేన కరిష్యసి,
భవస్వ భద్రే భార్యాణాం సర్వాసామీశ్వరీ మమ. 16

ప్ర. అ. మూఢే=మూఢురాలా! ఏతామ్=ఈ, మతిమ్=బుద్ధిని, విసృజ=విడువుము. మృతేన=చచ్చినవానితో, కిం కరిష్యసి=ఏమి చేసెదవు? భద్రే=మంగళప్రదురాలా! మమ=నాయొక్క, సర్వాసామ్=సమస్తమైన, భార్యాణామ్=భార్యల యొక్క, ఈశ్వరీ=అధిపతివి, భవ=అగుము.

తా. మూఢురాలా! ఇంక తెలివి తక్కువ ఆలోచనలు వదిలిపెట్టుము. చచ్చినవానితో ఏమి చేసెదవు? ఓ! మంగళప్రదురాలా! నా అందరి భార్యలమీదా ఆధిపత్యము పొందుము. 16

మూ. అల్పపుణ్యే నివృత్తార్థే మూఢే పణ్డితమానిని,
శృణు భర్తృవధం సీతే ఘోరం వృత్రవధం యథా. 17

ప్ర. అ. అల్పపుణ్యే=అల్పమైన పుణ్యము గలదానా! నివృత్తార్థే=విఫలమైన ప్రయోజనము గలదానా! మూఢే=మూఢురాలా! పణ్డితమానిని=పండితురాల నని భావించేదానా! సీతే=సీతా! వృత్రవధం యథా=వృత్రాసురవధ వలె, ఘోరమ్=భయంకరమైన, భర్తృవధమ్=భర్తయొక్క వధను గూర్చి, శృణు=వినుము.

తా. అల్పపుణ్యము గలదానా! విఫలమైన కోరిక గలదానా! మూఢురాలా! పండితురాల ననే అభిమానము గలదానా! సీతా! భయంకరమైన వృత్రాసురవధవంటి నీ భర్త వధను గూర్చి వినుము. 17

మూ. సమాయాతః సముద్రాన్తం హన్తుం మాం కిల రాఘవః,
వానరేన్ద్రప్రణీతేన బలేన మహతా వృతః. 18

ప్ర. అ. రాఘవః=రాముడు, వానరేన్ద్రప్రణీతేన=సుగ్రీవునిచేత నడుపబడిన, మహతా=గొప్ప, బలేన=సైన్యముతో, వృతః=కూడినవాడై, మామ్=నన్ను, హన్తుమ్=చంపుటకు, సముద్రాన్తమ్=సముద్రసమీపమునుగూర్చి, సమాయాతః కిల= వచ్చినాడట.

తా. రాముడు సుగ్రీవునిచేత నడుపబడిన గొప్ప సైన్యముతో కూడి నన్ను చంపుటకై సముద్రము దాకా వచ్చినాడట. 18

మూ. సంనివిష్టః సముద్రస్య పీడ్య తీరమథోత్తరమ్, 19
బలేన మహతా రామో వ్రజత్యస్తం దివాకరే.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, దివాకరే=సూర్యుడు, అస్తమ్=అస్త్రాద్రిని, వ్రజతి సతి=పొందుచుండగా, రామః=రాముడు, మహతా=గొప్పదైన, బలేన=సేనతో, సముద్రస్య=సముద్రముయొక్క, ఉత్తరమ్=ఉత్తరమైన, తీరమ్=తీరమును, పీడ్య=పీడించి, సంనివిష్టః=విడిసినాడు.

తా. పిమ్మట రాముడు సూర్యాస్తమయసమయమునందు గొప్పసైన్యముతో సముద్రతీరమును పీడించి విడిదిచేసి ఉండెను. 19

మూ. అథాధ్వని పరిశ్రాన్తమర్ధరాత్రే స్థితం బలమ్, 20
సుఖసుప్తం సమాసాద్య చరితం ప్రథమం చరైః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, అధ్వని=మార్గమునందు, పరిశ్రాన్తమ్=అలసిన, అర్ధరాత్రే=అర్ధరాత్రి సమయమునందు, సుఖసుప్తమ్=సుఖముగా నిద్రించుచు, స్థితమ్=ఉన్న, బలమ్=సైన్యము, ప్రథమమ్=ముందుగా, సమాసాద్య=సమీపించి, చరైః=గూఢచారుల చేత, చరితమ్=పరీక్షింపబడినది.

తా. మార్గమునందు బాగా అలసి అర్ధరాత్రియందు నిద్రించి ఉన్న ఆ సైన్యమును ముందుగా నా గూఢచారులు బాగుగా పరీక్షించిరి. 20

మూ. తత్ప్రహస్తప్రణీతేన బలేన మహతా మమ, 21
బలమస్య హతం రాత్రౌ యత్ర రామః సలక్ష్మణః.

ప్ర. అ. సలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, రామః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడ, ప్రహస్తప్రణీతేన=ప్రహస్తునిచేత తీసికొని వెళ్లబడిన, మహతా=గొప్పదైన, మమ బలేన=నా సేనచేత, అస్య=ఈ రామునియొక్క, బలమ్=సేన, రాత్రౌ=రాత్రియందు, హతమ్=చంపబడినది.

తా. ప్రహస్తునిచేత నడిపింపబడిన నా గొప్ప సైన్యము రామలక్ష్మణులు ఉన్న ప్రదేశమునందే, రాత్రియందు రాముని గొప్ప సైన్యమును చంపివేసెను. 21

మూ. పట్టిశాన్ పరిఘాంశ్చక్రానృష్టీర్దణ్డాన్మహాయుధాన్, 22
బాణజాలాని శూలాని భాస్వరాన్ కూటముద్గరాన్.
యష్టీశ్చ తోమరాన్ ప్రాసాంశ్చక్రాణి ముసలాని చ, 23
ఉద్యమ్యోద్యమ్య రక్షోభిర్వానరేషు నిపాతితాః.

ప్ర. అ. పట్టిశాన్=పట్టిశములను, పరిఘాన్=పరిఘలను, చక్రాన్=చిన్న చక్రములను, ఋష్టీః=ఋష్టులను, దణ్డాన్=దండములను, మహాయుధాన్=గొప్ప ఆయుధములను, బాణజాలాని=బాణముల సముదాయములను, శూలాని=శూలములను, భాస్వరాన్= ప్రకాశించుచున్న, కూటముద్గరాన్=మేకు లున్న గదలను, యష్టీశ్చ=కర్రలను, తోమరాన్=తోమరములను, ప్రాసాన్=ప్రాసలను, చక్రాణి=పెద్ద చక్రములను, ముసలాని చ= ముసలములను, ఉద్యమ్య ఉద్యమ్య=ఎత్తి ఎత్తి, రక్షోభిః=రాక్షసులచేత, వానరేషు= వానరుల మీద, నిపాతితాః=పడవేయబడినవి.

తా. రాక్షసులు పట్టిశములు, పరిఘలు, చిన్న చక్రములు, పెద్ద చక్రములు, ఋష్టులు, దండములు, గొప్ప ఇతర ఆయుధములు, బాణములు, శూలములు, మెరయుచున్న ముద్గరములు, యష్టులు, తోమరములు, ప్రాసలు, ముసలములు ఎత్తి ఎత్తి వానరులమీద పడవేసి వాళ్లను సంహరించిరి.22, 23

మూ. అథ సుప్తస్య రామస్య ప్రహస్తేన ప్రమాథినా, 24
అసక్తం కృతహస్తేన శిరశ్ఛిన్నం మహాసినా.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ప్రమాథినా=హింసించేవాడైన, కృతహస్తేన=చేయబడిన హస్తము గల (మంచి నేర్పు గల), ప్రహస్తేన=ప్రహస్తునిచేత, మహాసినా=గొప్ప ఖడ్గముచేత, సుప్తస్య=నిద్రపోవుచున్న, రామస్య=రామునియొక్క, శిరః=శిరస్సు, అసక్తమ్= అడ్డము లేకుండగా, ఛిన్నమ్=ఛేదింపబడినది.

తా. పిమ్మట, హింసించే స్వభావము గలవాడు, మంచి నేర్పరి అయిన ప్రహస్తుడు నిద్రపోవుచున్న రాముని శిరస్సును గొప్ప ఖడ్గముచేత, ఎట్టి అడ్డంకులు లేకుండగా, నరికివేసెను. 24

మూ. విభీషణః సముత్పత్య నిగృహీతో యదృచ్ఛయా, 25
దిశం ప్రవ్రాజితః సైన్యైర్లక్ష్మణః ప్లవగైః సహ.

ప్ర. అ. యదృచ్ఛయా=దైవవశముచేత, విభీషణః=విభీషణుడు, సముత్పత్య=పైకి ఎగిరి, నిగృహీతః=నిగ్రహింపబడినాడు. లక్ష్మణః=లక్ష్మణుడు, ప్లవగైః సహ=వానరులతో కూడ, దిశమ్=దిక్కులను గూర్చి, ప్రవ్రాజితః=పారిపోవునట్లు చేయబడినాడు.

తా. దైవవశముచేత రాక్షసులు ఎగిరి ఆక్రమించి విభీషణుని కూడ పట్టుకొనిరి. లక్ష్మణుడు ఇతరవానరులతో కూడ దిక్కులు పట్టి పారిపోయినాడు.

మూ. సుగ్రీవో గ్రీవయా సీతే భగ్నయా ప్లవగాధిపః, 26
నిరస్తహనుకః శేతే హనుమాన్ రాక్షసై ర్హతః.

ప్ర. అ. సీతే=సీతా ! ప్లవగాధిపః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, భగ్నయా=విరిగిన, గ్రీవయా=కంఠముతో, హనుమాన్=హనుమంతుడు, రాక్షసైః=రాక్షసులచేత, నిరస్తహనుకః=తొలగింపబడిన గడ్డముకలవాడై, హతః=చంపబడి, శేతే=శయనించినాడు.

తా. సీతా ! వానరరాజైన సుగ్రీవుని కంఠమును రాక్షసులు విరచివేసిరి. హనుమంతుని గడ్డమును పగులగొట్టి చంపిరి. 26

మూ. జామ్బవానథ జానుభ్యాముత్పతన్నిహతో యుధి, 27
పట్టిశైర్బహుభిశ్ఛిన్నో నికృత్తః పాదపో యథా.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, జానుభ్యామ్=మోకాళ్ళతో, ఉత్పతన్=పైకి ఎగురుచున్న, జామ్బవాన్=జాంబవంతుడు, యుధి=యుద్ధమునందు, నిహతః=చంపబడినాడు. బహుభిః=అనేకమైన, పట్టిశైః=పట్టిశములచేత, ఛిన్నః=ఛేదింపబడినవాడై, పాదపో యథా=వృక్షము వలె, ఛిన్నః=ఛేదించబడినాడు.

తా. యుద్ధములో మోకాళ్ళమీద పైకి లేచిన జాంబవంతుడు చంపబడినాడు. అనేకమైన పట్టిశములచేత ఛేదింపబడి వృక్షము వలె క్రింద పడగొట్టబడినాడు. 27

మూ. మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ తౌ వానరవరర్షభౌ, 28
నిశ్శ్వసన్తౌ రుదన్తౌ చ రుధిరేణ పరిప్లుతౌ,
అసినా వ్యాయతౌ ఛిన్నౌ మధ్యే హ్యరినిషూదనౌ. 29

ప్ర. అ. వ్యాయతౌ=పొడవైనవారు, అరినిషూదనౌ=శత్రువులను నశింపచేసేవారు అయిన, మైన్దశ్చ=మైందుడు, ద్వివిదశ్చ=ద్వివిదుడు అను, ఉభౌ=ఇద్దరు, వానరర్షభౌ=వానరశ్రేష్ఠులు, నిశ్శ్వసన్తౌ=నిట్టూర్చుచు, రుదన్తౌ=ఏడ్చుచు, రుధిరేణ=రక్తముచేత, పరిప్లుతౌ=కూడినవారై, అసినా=ఖడ్గముచేత, మధ్యే=నడుము నందు, ఛిన్నౌ=ఛేదింపబడిరి.

తా. ఎత్తైన శరీరములు గలవారు, శత్రువినాశకులు అయిన మైందద్వివిదు లను వానరశ్రేష్ఠులు, నిట్టూర్చుచు, రక్తముతో తడిసి, ఏడ్చుచుండగా నడుముం దగ్గరకు నరకబడిరి. 28, 29

మూ. అనుష్వపితి మేదిన్యాం పనసః పనసో యథా, 30
నారాచైర్బహుభిశ్ఛిన్నః శేతే దర్యాం దరీముఖః.
కుముదస్తు మహాతేజా నిష్కూజన్ సాయకైర్హతః. 31

ప్ర. అ. పనసో యథా=పనసమందు వలె, పనసః=పనసుడు, మేదిన్యామ్=నేలమీద, అనుష్వపితి=అరచుచున్నాడు. దరీముఖః=దరీముఖుడు, బహుభిః=అనేకమైన, నారాచైః=నారాచబాణములచేత, ఛిన్నః=ఛేదింపబడినవాడై, దర్యామ్=గుహలో, శేతే= శయనించుచున్నాడు. నిష్కూజన్=అరచుచున్న, మహా తేజాః=గొప్ప తేజస్సు గల, కుముదస్తు=కుముదుడైతే, సాయకైః=బాణములచేత, హతః=చంపబడినాడు.

తా. పనసుడు కోసిన పనసచెట్టు వలె నేలపై బడి ఏడ్చుచున్నాడు. దరీముఖుడు అనేక నారాచబాణములచేత ఛేదింపబడి గుహలో పడి ఉన్నాడు. గొప్ప తేజస్సు గల కుముదుడు అరచుచుండగా బాణములచేత చంపబడినాడు.

మూ. అఙ్గదో బహుభిశ్ఛిన్నః శరైరాసాద్య రాక్షసైః,
పరితో రుధిరోద్గారీ క్షితౌ నిపతితాఙ్గదః. 32

ప్ర. అ. పరితః=అంతటా, రుధిరోద్గారీ=రక్తమును స్రవించుచున్న, క్షితౌ=నేలమీద, నిపతితాఙ్గదః=పడిన బాహుపురులు గల, అఙ్గదః=అంగదుడు, రాక్షసైః=రాక్షసులచేత, ఆసాద్య=సమీపించి, బహుభిః=అనేకమైన, శరైః=శరము లచేత, ఛిన్నః=ఛేదింపబడినాడు.

తా. రాక్షసులు చేరి అనేకబాణములచేత ఛేదించగా అంగదుడు, తన అంగదములు నేలమీద పడిపోగా, రక్తమును స్రవించుచు పడి ఉన్నాడు. 32

మూ. హరయో మథితా నాగైః రథజాలైస్తథాపరే,
శయానా మృదితాస్తత్ర వాయువేగైరివామ్బుదాః. 33

ప్ర. అ. తత్ర=అక్కడ, శయానాః=శయనించి ఉన్న, అపరే=ఇతరులైన, హరయః=వానరులు, నాగైః=ఏనుగులచేతను, తథా=మరియు, రథజాలైః=రథసము దాయములచేతను, వాయువేగైః=వాయువేగములచేత, అమ్బుదాః ఇవ=మేఘములు వలె, మృదితాః= మర్దింపబడినారు.

తా. అక్కడ నిద్రపోవుచున్న ఇతరవానరులను ఏనుగులు, రథములు, మేఘములను వాయువేగములు వలె మర్దించినవి. 33

మూ. ప్రసృతాశ్చ పరే త్రస్తాః హన్యమానా జఘన్యతః,
అనుద్రుతాస్తు రక్షోభిః సింహైరివ మహాద్విపాః. 34

ప్ర. అ. పరే=ఇతరులు, అపృష్ఠతః=వెనుకనుండి, హన్యమానాః= చంపబడుచున్నవారై, సింహైః=సింహములచేత, మహాద్విపాః ఇవ=గొప్ప ఏనుగులవలె, రక్షోభిః=రాక్షసులచేత, అనుద్రుతాః=తరుమబడుచున్నవారై, త్రస్తాః=భయపడినవారై, ప్రద్రుతాః=పారిపోయిరి.

తా. మరికొందరు వానరులు, ఏనుగులను సింహములు వలె రాక్షసులు వెనుకనుండి తరుముతూ వచ్చి కొట్టుచుండగా భయపడి పారిపోయిరి. 34

మూ. సాగరే పతితాః కేచిత్కేచిద్గగనమాశ్రితాః,
ఋక్షా వృక్షానుపారూఢా వానరైర్వ్యతిమిశ్రితాః. 35

ప్ర. అ. కేచిత్=కొందరు, సాగరే=సముద్రమునందు, పతితాః=పడిపోయిరి. కేచిత్=కొందరు, గగనమ్=ఆకాశమును, ఆశ్రితాః=ఆశ్రయించినారు. ఋక్షాః= భల్లూకములు, వానరైః=వానరులతో, వ్యతిమిశ్రితాః=కలిసినవారై, వృక్షాన్= వృక్షములను, ఉపారూఢాః=ఎక్కినవి.

తా. కొందరు వానరులు సముద్రములో పడిపోగా మరి కొందరు ఆకాశముమీదికి ఎగిరిపోయిరి. కొందరు వానరులు, భల్లూకములు చెట్లపైకి ఎక్కినవి. 35

మూ. సాగరస్య చ తీరేషు శైలేషు చ వనేషు చ,
పిఙ్గలాస్తే విరూపాక్షై రాక్షసైర్బహవో హతాః. 36

ప్ర. అ. తే=ఆ, బహవః=అనేకమైన, పిఙ్గలాః=వానరులు, సాగరస్య= సముద్రముయొక్క, తీరేషు=తీరములయందు, శైలేషు చ=శైలములయందు, వనేషు చ= వనములయందు, విరూపాక్షైః=వికృతములైన నేత్రములు గల, రాక్షసైః=రాక్షసుల చేత, హతాః=చంపబడినారు.

తా. చాలమంది వానరులను వికృతములైన నేత్రములు గల రాక్షసులు సముద్రతీరప్రదేశములయందు, పర్వతములయందు, వనములందు చంపివేసిరి.36

మూ. ఏవం తవ హతో భర్తా ససైన్యో మమ సేనయా,
క్షతజార్ద్రం రజోధ్వస్తమిదం చాస్యాహృతం శిరః. 37

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, ససైన్యః=సైన్యముతో కూడిన, తవ=నీయొక్క, భర్తా=భర్త, మమ సేనయా=నా సేనచేత, హతః=చంపబడినాడు. అస్య=వీనియొక్క, క్షతజార్ద్రమ్=రక్తముచేత తడిగా ఉన్న, రజోధ్వస్తమ్=పరాగముచేత మాసిన, ఇదమ్=ఈ, శిరః=శిరస్సు, ఆహృతమ్=తీసికొనిరాబడినది.

తా. ఈ విధముగా నా సైన్యము నీ భర్తను, అతని సేనను

చంపివేసితిని. రక్తముతో తడిసిన అతని శిరస్సు తీసికొనివచ్చితిని. 37

మూ. తతః పరమదుర్ధర్షో రావణో రాక్షసేశ్వరః,
సీతాయాముపశృణ్వన్త్యాం రాక్షసీమిద మబ్రవీత్. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరమదుర్ధర్షః=మిక్కిలి ఎదిరింప శక్యముకాని, రాక్షసేశ్వరః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, సీతాయామ్=సీత, ఉపశృణ్వన్త్యామ్=వినుచుండగా, రాక్షసీమ్=రాక్షసస్త్రీని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. పిమ్మట ఎదిరింప శక్యముకాని, రాక్షసప్రభువైన రావణుడు సీత వినుచుండగా ఒక రాక్షసితో ఇట్లు పలికెను. 38

మూ. రాక్షసం క్రూరకర్మాణం విద్యుజ్జిహ్వం సమానయ,
యేన తద్రాఘవశిరః సఙ్గ్రామాత్స్వయమాహృతమ్. 39

ప్ర. అ. యేన=ఎవనిచేత, తత్=ఆ, రాఘవశిరః=రాముని శిరస్సు, సఙ్గ్రామాత్=యుద్ధమునుండి, స్వయమ్=స్వయముగా, ఆహృతమ్=తీసికొనిరాబడెనో అట్టి, క్రూరకర్మాణమ్=క్రూరమైన కర్మ గల, రాక్షసమ్=రాక్షసుడైన, విద్యుజ్జిహ్వమ్= విద్యుజ్జిహ్వుని, సమానయ=తీసికొనిరమ్ము.

తా. క్రూరకర్మ లాచరించు రాక్షసుడైన ఏ విద్యుజ్జిహ్వుడు రాముని శిరస్సును యుద్ధరంగమునుండి స్వయముగా తీసికొని వచ్చినాడో అతనిని ఇక్కడకి తీసికొనిరమ్ము. 39

మూ. విద్యుజ్జిహ్వ స్తదా గృహ్య శిరస్తత్సశరాసనమ్,
ప్రణామం శిరసా కృత్వా రావణస్యాగ్రతః స్థితః. 40

ప్ర. అ. తదా=అప్పుడు, విద్యుజ్జిహ్వః=విద్యుజ్జిహ్వుడు, సశరాసనమ్=ధనస్సుతో కూడిన, తత్ శిరః=ఆ శిరస్సును, గృహ్య=గ్రహించి, శిరసా=శిరస్సుచేత, ప్రణామమ్=నమస్కారమును, కృత్వా=చేసి, రావణస్య=రావణునియొక్క, అగ్రతః=ఎదుట, స్థితః=నిలిచెను.

తా. అప్పుడు విద్యుజ్జిహ్వుడు ఆ శిరస్సును, ధనస్సును తీసికొనివచ్చి, తల వంచి నమస్కరించి రావణుని ఎదుట నిలిచెను. 40

మూ. తమబ్రవీత్తతో రాజా రావణో రాక్షసం స్థితమ్,
విద్యుజ్జిహ్వం మహాజిహ్వం సమీపపరివర్తినమ్. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజా=రాజైన, రావణః=రావణుడు, మహాజిహ్వమ్=పెద్ద నాలుక గలవాడు, సమీపపరివర్తినమ్=సమీపమునం దుండు

వాడు అయిన, స్థితమ్=నిలచిన, రాక్షసమ్=రాక్షసుడైన, తం విద్యుజ్జిహ్వమ్=ఆ విద్యుజ్జిహ్వుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట రాజైన రావణుడు తన దగ్గర సంచరించువాడు (అంతరంగిక సేవకుడు), పెద్ద నాలుక గలవాడు, రాక్షసుడూ అయిన అక్కడ నిలచి ఉన్న విద్యుజ్జిహ్వునితో ఇట్లు పలికెను. 41

మూ. అగ్రతః కురు సీతాయాః శీఘ్రం దాశరథేః శిరః,
అవస్థాం పశ్చిమాం భర్తుః కృపణా సాధు పశ్యతు. 42

ప్ర. అ. దాశరథేః=రామునియొక్క, శిరః=శిరస్సును, శీఘ్రమ్=శీఘ్రముగా, సీతాయాః=సీతయొక్క, అగ్రతః=ఎదుట, కురు=ఉంచుము. కృపణా=దీనురాలైన ఈమె, భర్తుః=భర్తయొక్క, పశ్చిమామ్=చివరిదైన, అవస్థామ్=అవస్థను, సాధు=బాగుగా, పశ్యతు=చూచుగాక.

తా. రాముని శిరస్సును శీఘ్రముగా సీత ఎదుట ఉంచుము. దీనురాలైన ఈమె భర్తకు కలిగిన అంత్యావస్థను బాగా చూచుగాక. 42

మూ. ఏవముక్తం తు తద్రక్షః శిరస్తత్ప్రియదర్శనమ్,
ఉపనిక్షిప్య సీతాయాః క్షిప్రమన్తరధీయత. 43

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తమ్=పలుకబడిన, తత్ రక్షః=ఆ రాక్షసుడు, ప్రియదర్శనమ్=ప్రియమైన దర్శనము గల, తత్=ఆ, శిరః=శిరస్సును, సీతాయాః= సీతయొక్క, ఉపనిక్షిప్య=సమీపమునందు ఉంచి, క్షిప్రమ్=శీఘ్రముగా, అన్తరధీయత= అంతర్ధానము చెందెను.

తా. రావణుని మాటలు విని ఆ రాక్షసుడు చూచుటకు అందముగా ఉన్న ఆ శిరస్సును సీత దగ్గర ఉంచి, వెంటనే అంతర్ధానము చెందెను. 43

మూ. రావణశ్చాపి చిక్షేప భాస్వరం కార్ముకం మహత్,
త్రిషు లోకేషు విఖ్యాతం రామస్యైతదితి బ్రువన్. 44

ప్ర. అ. రావణశ్చాపి=రావణుడు, ఏతత్=ఇది, రామస్య=రాముని యొక్క, త్రిషు లోకేషు=మూడు లోకములయందు, విఖ్యాతమ్=ప్రసిద్ధమైన ధనస్సు, ఇతి= అని, బ్రువన్=పలుకుచు, భాస్వరమ్=ప్రకాశించుచున్న, మహత్=గొప్పదైన, కార్ముకమ్=ధనస్సును, చిక్షేప= (సీత ముందు) విసిరెను.

తా. "ఇది మూడు లోకములలో ప్రసిద్ధమైన రాముని ధనస్సు" అని పలుకుచు రావణుడు ప్రకాశించుచున్న ఆ ధనస్సును సీత ఎదుటకు పడవేసెను. 44

మూ. ఇదం తత్తవ రామస్య కార్ముకం జ్యాసమావృతమ్,
ఇహ ప్రహస్తేనానీతం తం హత్వా నిశి మానుషమ్. 45

ప్ర. అ. ఇదమ్=ఇది, తవ రామస్య=నీ రామునియొక్క, జ్యాసమావృతమ్=నారితో కూడిన, తత్=ఆ, కార్ముకమ్=ధనస్సు, నిశి=రాత్రియందు, తమ్=ఆ, మానుషమ్=మనుష్యుణ్ణి, హత్వా=చంపి, ఇహ=ఇక్కడికి, ప్రహస్తేన=ప్రహస్తుని చేత, ఆనీతమ్=తీసికొని రాబడినది.

తా. నారి కట్టిన నీ రాముని ధనస్సు ఇదే. రాత్రి ఆ మానవుణ్ణి చంపివేసి ప్రహస్తుడు ఇక్కడికి తీసికొని వచ్చినాడు. 45

మూ. స విద్యుజ్జిహ్వేన సహైవ తచ్ఛిరో
ధనుశ్చ భూమౌ వినికీర్య రావణః,
విదేహరాజస్య సుతాం యశస్వినీం
తతో௨బ్రవీత్తాం భవ మే వశానుగా. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకత్రింశః సర్గః.

ప్ర. అ. విద్యుజ్జిహ్వేన సహైవ=విద్యుజ్జిహ్వునితో కూడిన, సః రావణః=ఆ రావణుడు, తత్=ఆ, శిరః=శిరస్సును, ధనుశ్చ=ధనస్సును, భూమౌ=నేలమీద, వినికీర్య=పడవేసి, తతః=అటుపిమ్మట, విదేహరాజస్య=జనకమహారాజుయొక్క, సుతామ్=కుమార్తెయైన, యశస్వినీమ్=కీర్తిగల, తామ్=సీతను గూర్చి, మే=నాయొక్క, వశానుగా=వశమును చెందినదానవు, భవ=అగుము అని, అబ్రవీత్=పలికెను.

తా. విద్యుజ్జిహ్వునితో కూడిన ఆ రావణుడు రాముని శిరస్సును, ధనస్సును జనకరాజపుత్రి, కీర్తిమంతురాలు అయిన సీత ఎదుట పడవేసి "నీవు నాకు వశురాలవు అగుము" అని ఆమెతో పలికెను. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వాత్రింశః సర్గః

*[రాముని శిరస్సును ధనుస్సును చూచి సీత విలపించుట; ఇంతలో ఎవరో దూత వచ్చి ఏమో చెప్పగా రావణుడు అక్కడినుండి వెళ్ళిపోవుట.]*

మూ. సా సీతా తచ్ఛిరో దృష్ట్వా తచ్చ కార్ముకముత్తమమ్,
సుగ్రీవప్రతిసంసర్గమాఖ్యాతం చ హనూమతా. 1
నయనే ముఖవర్ణం చ భర్తుస్తత్సదృశం ముఖమ్,
కేశాన్ కేశాన్తదేశం చ తం చ చూడామణిం శుభమ్. 2
ఏతైః సర్వైరభిజ్ఞానైరభిజ్ఞాయ సుదుఃఖితా,
విజగర్హే చ కైకేయీం క్రోశన్తీ కురరీ యథా. 3

ప్ర. అ. సా సీతా=ఆ సీత, తత్=ఆ, శిరః=శిరస్సును, ఉత్తమమ్=ఉత్తమమైన, తత్=ఆ, కార్ముకం చ=ధనస్సును, హనూమతా=హనుమంతునిచేత, ఆఖ్యాతమ్=చెప్పబడిన, సుగ్రీవప్రతిసంసర్గమ్=సుగ్రీవునితో సంబంధమును, నయనే=నేత్రములను, ముఖవర్ణం చ=ముఖముయొక్క వర్ణమును, భర్తుః=భర్తయొక్క, సదృశమ్=సమానమైన, తత్=ఆ, ముఖమ్=ముఖమును, కేశాన్=కేశములను, కేశాన్తదేశం చ=లలాటమును, తమ్=ఆ, శుభమ్=సుందరమైన, చూడామణిం చ=చూడామణిని, దృష్ట్వా=చూచి, ఏతైః=ఈ, సర్వైః=సమస్తమైన, అభిజ్ఞానైః=గుర్తులచేత, అభిజ్ఞాయ=గుర్తించి, సుదుఃఖితా=చాలా దుఃఖించినదై, కురరీ యథా=గోరింక వలె, క్రోశన్తీ=అరచుచున్నదై, కైకేయీమ్=కైకేయిని, విజగర్హే చ=నిందించెను.

తా. సీత ఆ శిరస్సును, ఉత్తమమైన ఆ ధనస్సును చూచెను. పూర్వము హనుమంతుడు చెప్పిన రామసుగ్రీవుల సఖ్యమును స్మరించి ఆ సుగ్రీవాదుల విషయమే ఈ రావణుడు చెప్పుచుండుట గమనించెను. భర్త నేత్రములు, ముఖము, ముఖవర్ణము, కేశములు, లలాటప్రదేశము, సుందరమైన చూడామణి మొదలైన గుర్తులచేత ఆ శిరస్సు రామునిదే అని గుర్తించి దుఃఖాక్రాంతురాలై గోరింక వలె ఏడ్చుచు ఈ ఆపదకు కారణమైన కైకేయిని నిందించెను. 1-3

మూ. సకామా భవ కైకేయి హతో౽యం కులనన్దనః,
కులముత్సాదితం సర్వం త్వయా కలహశీలయా. 4

ప్ర. అ. కైకేయి=కైకేయీ! సకామా=తీరిన కోరికగలదానవు, భవ=అగుము. కులనన్దనః=కులమునకు ఆనందము కలిగించు,

అయమ్=ఈ రాముడు, హతః=చంపబడినాడు. కలహశీలయా=కలహస్వభావము గల, త్వయా=నీచేత, సర్వమ్=సమస్తమైన, కులమ్=కులము, ఉత్సాదితమ్=నాశన చేయబడినది.

తా. కైకేయీ ! నీ కోరిక తీరినది. వంశమును ఆనందింపచేయు ఈ రాముడు చంపబడినాడు. కలహశీలురాలైన నీవు కులము వంశము నశింపచేసినావు.

మూ. ఆర్యేణ కిం ను కైకేయ్యాః కృతం రామేణ విప్రియమ్,
యన్మయా చీరవసనం దత్త్వా ప్రవ్రాజితో వనమ్. 5

ప్ర. అ. ఆర్యేణ=పూజ్యుడైన, రామేణ=రామునిచేత, కైకేయ్యాః=కైకేయికి, కిమ్=ఏమి, విప్రియమ్=అపకారము, కృతం ను=చేయబడినది ? యత్=ఎందువలన, చీరవసనమ్=నారచీరను, దత్త్వా=ఇచ్చి, మయా=నాతో కూడ, వనమ్=వనమునుగూర్చి, ప్రవ్రాజితః=పంపివేయబడినాడు.

తా. పూజ్యుడైన ఈ రామునకు నారచీరలు ఇచ్చి నాతో కూడ అరణ్యమునకు పంపివేసినావు కదా, ఈతడు నీ కేమి అపకారము చేసినాడు ?

మూ. ఏవముక్త్వా తు వైదేహీ వేపమానా తపస్వినీ,
జగామ జగతీం బాలా ఛిన్నా తు కదలీ యథా. 6

ప్ర. అ. తపస్వినీ=దీనురాలు, బాలా=చిన్న వయస్సులో ఉన్నది అయిన, వైదేహీ=సీత, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, వేపమానా=వణకుచు, ఛిన్నా=ఛేదించబడిన, కదలీ యథా=అరటిచెట్టు వలె, జగతీమ్=భూమిని, జగామ=పొందెను.

తా. బాల, దీనురాలు అయిన ఆ సీత ఇట్లు పలుకుచు, వణకిపోవుచు, తెగగొట్టిన అరటిచెట్టు వలె నేలమీద పడిపోయెను. 6

మూ. సా ముహూర్తాత్సమాశ్వస్య పరిలభ్య చ చేతనామ్,
తచ్ఛిరః సముపాఘ్రాయ విలలాపాయతేక్షణా. 7

ప్ర. అ. ఆయతేక్షణా=దీర్ఘమైన నేత్రములు గల, సా=ఆమె, అథ=అటు పిమ్మట, ముహూర్తాత్=ముహూర్తకాలమున, సమాశ్వస్య=తేరుకొని, చేతనామ్=చేతనము, పరిలభ్య=పొంది, తత్=ఆ, శిరః=శిరస్సును, సముపాఘ్రాయ=సమీపించి, విలలాప=విలపించెను.

తా. విశాలమైన నేత్రములు గల ఆ సీత ముహూర్తకాలంలో తేరుకొని, స్పృహ చెంది, ఆ శిరస్సు దగ్గరకు చేరి విలపించెను. 7

మూ. హా హతాస్మి మహాబాహో వీరవ్రత మనువ్రతమ్,
ఇమాం తే పశ్చిమావస్థాం గతాస్మి విధవా కృతా. 8

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! వీరవ్రతమ్=వీరుల వ్రతమును, అనువ్రత=అనుసరించి ఉన్నవాడా ! హా=అయ్యో! హతాస్మి=చంప బడితిని. తే=నీయొక్క, ఇమామ్=ఈ, పశ్చిమావస్థామ్=చివరి అవస్థను, గతా అస్మి=చూచినదానను అయితిని. విధవా=విధవనుగా, కృతా=చేయబడితిని.

తా. అయ్యో గొప్ప బాహువులు గలవాడా ! వీరుల వ్రతమును పరిపాలించువాడా ! నేను చచ్చితిని ! నీ చివరి అవస్థను చూడవలసివచ్చినది! విధవను అయితిని ! 8

మూ. ప్రథమం మరణం నార్యా భర్తుర్వైగుణ్యముచ్యతే,
సువృత్తః సాధువృత్తాయాః సంవృత్తస్త్వం మమాగ్రతః. 9

ప్ర. అ. ప్రథమమ్=ముందుగా, భర్తుః=భర్తయొక్క, మరణమ్=మరణము, నార్యాః=స్త్రీయొక్క, వైగుణ్యమ్=దోషముగా, ఉచ్యతే=చెప్పబడుచున్నది. సువృత్తః=మంచి వృత్తము గల, త్వమ్=నీవు, సాధువృత్తాయాః=చక్కగా జీవించి ఉన్న, మమ=నాకు, అగ్రతః=ముందు, సంవృత్తః=మరణించినావు.

తా. భార్య దోషమువలననే భర్త ముందు మరణించును అని చెప్పుదురు. మంచి నడవడిక గల నీవు నేనింకా జీవించి ఉండగానే, నాకంటె ముందు మరణించినావు. 9

మూ. మహద్దుఃఖం ప్రపన్నాయా మగ్నాయాః శోకసాగరే,
యో హి మాముద్యతస్త్రాతుం సోఽపి త్వం వినిపాతితః. 10

ప్ర. అ. మహత్=గొప్ప, దుఃఖమ్=దుఃఖమును, ప్రపన్నాయాః=పొందిన నేను, శోకసాగరే=శోకసముద్రమునందు, మగ్నాయాః=మునిగి యుండగా, యః=ఏ, త్వమ్=నీవు, త్రాతుం=రక్షించుటకొరకు, ఉద్యతః=ఉద్యమించినావో, సోఽపి=అట్టి నీవు కూడ, వినిపాతితః=పడగొట్టబడినావు!

తా. గొప్ప దుఃఖమును పొంది శోకసాగరములో మునిగి ఉన్న నన్ను రక్షించుటకై ప్రయత్నించిన నీవు చంపబడితివి కదా! 10

మూ. సా శ్వశ్రూర్మమ కౌసల్యా త్వయా పుత్రేణ రాఘవ,
వత్సేవ యథా ధేనుర్వివత్సా వత్సలా కృతా. 11

ప్ర. అ. రాఘవ=రామా ! మమ=నాయొక్క, శ్వశ్రూః=అత్తయైన, సా కౌసల్యా=ఆ కౌసల్య, వత్సలా=ప్రేమగల, ధేనుః యథా=ఆవు వలె, పుత్రేణ=పుత్రుడవైన, త్వయా=నీచేత, వత్సేవ=లేగదూడచేత వలె, వివత్సా=పుత్రహీనురాలుగా, కృతా=చేయబడినది.

తా. రామా ! తన లేగదూడమీద చాల ప్రేమ గల ఆవువంటిదైన

నా అత్త కౌసల్యను, ఆ ఆవును లేగదూడ  లేకుండ చేసినట్లు, పుత్రుడవైన నీవు లేకుండ చేసినాడు. 11

మూ. ఉద్దిష్టం దీర్ఘమాయుస్తే దైవజ్ఞైరపి రాఘవ,
అనృతం వచనం తేషామల్పాయురసి రాఘవ. 12

ప్ర. అ. రాఘవ=రామా ! దైవజ్ఞైరపి=జ్యోతిష్కులచేత కూడా, తే=నీ యొక్క, ఆయుః=ఆయుర్దాయము, దీర్ఘమ్=దీర్ఘమైనదిగా, ఉద్దిష్టమ్=చెప్పబడినది. రాఘవ=రామా ! తేషామ్=వారియొక్క, వచనమ్=వచనము, అనృతమ్=అసత్యము. అల్పాయుః=అల్పాయుర్దాయవంతుడవు, అసి=అయితివి.

తా. రామా ! నీవు దీర్ఘాయుర్దాయము కలవాడ వని జ్యోతిష్కులు కూడ చెప్పినారు. కాని వాళ్ల  మాట అసత్యమైనది. నీవు అల్పాయుర్దాయవంతుడవు అయినావు. 12

మూ. అథవా నశ్యతి ప్రజ్ఞా ప్రాజ్ఞస్యాపి సతస్తవ,
పచత్యేవం యథా కాలో భూతానాం ప్రభవో హ్యయమ్. 13

ప్ర. అ. అథవా=లేదా, ప్రాజ్ఞస్యాపి సతః=బుద్ధిమంతుడవైనను, తవ=నీయొక్క, ప్రజ్ఞా=బుద్ధి, నశ్యతి=నశించినది. యథా=ఎట్లు, భూతానామ్=భూతములకు, ప్రభవః=కారణమైన, అయమ్=ఈ, కాలః=కాలము, ఏవమ్=ఈ నిన్ను, పచతి=పక్వమగునట్లు చేయునో (చేసినదో).

తా. లేదా చాల బుద్ధిమంతుడవే అయినను నీ బుద్ధి నశించి ఉండును; అందుచేతనే నీవు నిరాయుధుడవై  మృతిచెందితివి. సకలభూతములకు కారణమైన కాలము నిన్ను కూడ కర్మవిపాకము పొందించినది! 13

మూ. అదృష్టం మృత్యుమాపన్నః కస్మాత్త్వం నయశాస్త్రవిత్,
వ్యసనానాముపాయజ్ఞః కుశలో హ్యసి వర్జనే. 14

ప్ర. అ. నయశాస్త్రవిత్=నీతిశాస్త్రమును ఎరిగిన, త్వమ్=నీవు, కస్మాత్=ఎందువలన, అదృష్టమ్=చూడబడని (తెలియబడని), మృత్యుమ్=మృత్యువును, ఆపన్నః= పొందినావు ? ఉపాయజ్ఞః=ఉపాయములను ఎరిగిన నీవు, వ్యసనానామ్=వ్యసనములయొక్క, వర్జనే=విడచుటయందు, కుశలః=నేర్పరివి, అసి=అయి ఉన్నావు కదా ?

తా. నీతిశాస్త్రము బాగా తెలిసిన నీవు తెలియకుండా (నిద్రలో) ఎట్లు మృత్యువు పొందినావు ! ఉపాయములు ఎరిగిన నీవు కష్టములను దాటుటకు సమర్థుడవు కదా ? 14

మూ. తథా త్వం సంపరిష్వజ్య రౌద్రయాతినృశంసయా,
కాలరాత్ర్యా మయాచ్ఛిద్య హృతః కమలలోచన. 15

ప్ర. అ. కమలలోచన=పద్మములవంటి నేత్రములు కలవాడా! అతినృశంసయా=చాలా క్రూరురాలు, రౌద్రయా=భయంకరురాలు అయిన, కాలరాత్ర్యా=కాలరాత్రిచేత, తథా=ఆ విధముగా, సంపరిష్వజ్య=కౌగలించుకొని, మయా=నానుండి, ఆచ్ఛిద్య=లాగికొని, హృతః=హరించబడినావు!

తా. పద్మములవంటి నేత్రములు గల ఓ రామా! భయంకరురాలు, చాల క్రూరురాలూ అయిన కాలరాత్రి (మృత్యుదేవత) నిన్ను ఆ విధముగా కౌగలించుకొని నానుండి లాగికొనిపోయినది! 15

మూ. ఇహ శేషే మహాబాహో మాం విహాయ తపస్వినీమ్,
ప్రియామివ సమాశ్లిష్య పృథివీం పురుషర్షభ. 16

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! పురుషర్షభ=పురుషశ్రేష్ఠుడా! తపస్వినీమ్=దీనురాలనైన, మామ్=నన్ను, విహాయ=విడచి, పృథివీమ్=భూమిని, ప్రియామివ=ప్రియురాలిని వలె, సమాశ్లిష్య=కౌగలించుకొని, ఇహ=ఇక్కడ, శేషే=శయనించి ఉన్నావు.

తా. గొప్ప బాహువులు గల ఓ! పురుషశ్రేష్ఠుడా! నన్ను విడచి, భూమిని ప్రియురాలినివలె కౌగలించుకొని ఇక్కడ శయనించి ఉన్నావు. 16

మూ. అర్చితం సతతం యత్నాద్గన్ధమాల్యైర్మయా తవ,
ఇదం తే మత్ప్రియం వీర ధనుః కాఞ్చనభూషితమ్. 17

ప్ర. అ. వీర=వీరుడా! ఇదమ్=ఇది, మయా=నాతో కూడ, తవ=నీకు (నీచేత), సతతమ్=ఎల్లప్పుడు, యత్నాత్=ప్రయత్నమువలన, గన్ధమాల్యైః=గంధములతోను, మాలలతోను, అర్చితమ్=పూజింపబడిన, మత్ప్రియమ్=నాకిష్టమైన, కాఞ్చనభూషితమ్=బంగారముచేత అలంకరింపబడిన, తే=నీయొక్క, ధనుః=ధనస్సు.

తా. వీరుడా! ఇది బంగారము చేత అలంకరింపబడినది, నాకు ఇష్టమూ అయిన నీ ధనస్సు. దానిని నీవు నాతో కలిసి ఎల్లప్పుడు గంధములతోను, పుష్పమాలలతోనూ పూజించుచుండెడివాడవు. 17

మూ. పిత్రా దశరథేన త్వం శ్వశురేణ మమానఘ,
సర్వైశ్చ పితృభిః సార్ధం నూనం స్వర్గే సమాగతః. 18

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! త్వమ్=నీవు, మమ=నాయొక్క, శ్వశురేణ=మామగారైన, పిత్రా=నీ తండ్రియైన, దశరథేన=దశరథునితోను, సర్వైః=

సమస్తమైన, పితృభిః సార్థమ్=పితృదేవతలతోను, సాధమ్=పితృయముగా, స్వర్గే=స్వర్గమునందు, సమాగతః=కలిసినావు.

తా. దోషములు లేని రామా ! నీవు స్వర్గమునందు నా మామగారు నీ తండ్రి అయిన దశరథునితోను, అందరు పితృదేవతలతోను కలిసికొని ఉందువు.

మూ. దివి నక్షత్రభూతం చ మహత్కర్మ కృతం తథా,
పుణ్యం రాజర్షివంశం త్వమాత్మనః సముపేక్షసే. 19

ప్ర. అ. దివి=స్వర్గమునందు, నక్షత్రభూతమ్=నక్షత్రమైన, తథా=మరియు, మహత్=గొప్పదైన, కర్మ=కర్మ, కృతమ్=చేయబడినది. త్వమ్=నీవు, ఆత్మనః=తన యొక్క, పుణ్యమ్=పుణ్యమైన, రాజర్షివంశమ్=రాజర్షివంశమును, సముపేక్షసే=ఉపేక్షించుచున్నావు.

తా. నీవు స్వర్గలోకము నందను నక్షత్రమువలె ప్రకాశింపజేయు గొప్ప కర్మ చేసినావు. నీవు పుణ్యమైన నీ రాజర్షివంశమును ఉపేక్షించి వెళ్లిపోయినావు.

మూ. కిం మాం న ప్రేక్షసే రాజన్ కిం వా న ప్రతిభాషసే,
బాలాం బాలేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్. 20

ప్ర. అ. రాజన్=రాజా ! బాలేన=బాలుడవైన నీచేత, బాలామ్=బాలంగా, సంప్రాప్తామ్=పొందబడిన, సహచారిణీమ్=నీతో కూడా ఉండు, భార్యామ్=భార్యవైన, మామ్=నన్ను, కిమ్=ఎందువలన, న ప్రేక్షసే=చూచుటలేదు ? మామ్=నన్ను గూర్చి, కిం వా=ఎందువలన, న ప్రతిభాషసే=బదులుచెప్పుట లేదు ?

తా. రాజా ! బాలుడుగా ఉన్న నీవు బాలురాలనై ఉండగా నన్ను భార్యగా స్వీకరించితివి. నీతో కూడ ఉండే నన్ను ఎందుకు చూచుటలేదు ? ఎందువలన బదులు చెప్పుట లేదు ? 20

మూ. సంశ్రుతం గృహ్ణతా పాణిం చరిష్యామీతి యత్త్వయా,
స్మర తన్మామ కాకుత్స్థ నయ మామపి దుఃఖితామ్. 21

ప్ర. అ. కాకుత్స్థ=రామా ! పాణిమ్=హస్తమును, గృహ్ణతా=గ్రహించుచున్న, త్వయా=నీచేత, చరిష్యామి ఇతి=నీతో ధర్మాచరణము చేయుదును అని, యత్=ఏది, సంశ్రుతమ్=ప్రతిజ్ఞ చేయబడినదో, తత్=దానిని, స్మర నామ=స్మరించుము. దుఃఖితామ్=దుఃఖితురాలనైన, మామపి=నన్ను కూడ, నయ=తీసికొని వెళ్లుము.

తా. రామా ! వివాహసమయమునందు నీవు చేసిన 'నీతో కలిసియే సంచరించెదను. ధర్మాచరణాదికము చేసెదను' అను ప్రతిజ్ఞను స్మరించుము.

దుఃఖితురాలనైన నన్ను కూడా తీసికొని వెళ్లుము. 21

మూ. కస్మాన్మామపహాయ త్వం గతో గతిమతాం వర,
అస్మాల్లోకాదముం లోకం త్యక్త్వా మామపి దుఃఖితామ్. 22

ప్ర. అ. గతిమతామ్=ప్రాణులలో, వర=శ్రేష్ఠుడా ! త్వమ్=నీవు, మామ్=నన్ను, అపహాయ=విడచి, కస్మాత్=ఏ కారణమువలన, గతః=వెళ్లిపోయి నావు ? దుఃఖితామ్=దుఃఖితురాలనైన, మామపి=నన్ను కూడ, త్యక్త్వా=విడచి, అస్మాత్=ఈ, లోకాత్=లోకమునుండి, అముమ్=ఆ, లోకమ్=లోకమును గూర్చి వెళ్లినావు ?

తా. సకలజీవులలో శ్రేష్ఠుడవైన రామా ! నన్ను విడచి నీవు ఎందుకు వెళ్లిపోయినావు ? దుఃఖించుచున్నను నన్ను విడచి ఈ లోకమునుండి పరలోకమునకు ఎందుకు వెళ్లిపోయినావు ? 22

మూ. కల్యాణై రుచిరం గాత్రం పరిష్వక్తం మయైవ తు,
క్రవ్యాదైస్తచ్ఛరీరం తు నూనం విపరికృష్యతే. 23

ప్ర. అ. కల్యాణైః=మంగళకరములైన అలంకారాదులచేత, రుచిరమ్=సుందరమైన, గాత్రమ్=శరీరము, మయైవ=నాచేతనే, పరిష్వక్తమ్=కౌగిలించుకొనబడినది. తత్=ఆ, శరీరమ్=శరీరము, నూనమ్=నిశ్చయముగా, క్రవ్యాదైః=క్రూరమృగములచేత, విపరికృష్యతే=లాగబడుచున్నది.

తా. మంగళప్రదములైన అలంకారాదులచేత అలంకరింపబడిన ఏ శరీరమును నేను కౌగిలించుకొనుచుండేదానినో ఆ శరీరమునే మాంసభక్షకములైన మృగములు భక్షించుచున్నవి కదా ! 23

మూ. అగ్నిష్టోమాదిభిర్యజ్ఞైరిష్టవానాప్తదక్షిణైః,
అగ్నిహోత్రేణ సంస్కారం కేన త్వం న తు లప్స్యసే. 24

ప్ర. అ. ఆప్తదక్షిణైః=పరిపూర్ణమైన దక్షిణలు గల, అగ్నిష్టోమాదిభిః=అగ్నిష్టోమము మొదలైన, యజ్ఞైః=యజ్ఞములచేత, ఇష్టవాన్=యాగముచేసినవాడవై, త్వమ్=నీవు, అగ్నిహోత్రేణ=యజ్ఞియాగ్నిచేత, సంస్కారమ్=సంస్కారమును, కేన=ఏ కారణముచేత, న తు లప్స్యసే=పొందవు ?

తా. ముందు ముందు పరిపూర్ణదక్షిణలు ఇచ్చిన అగ్నిష్టోమాదియాగములు చేసి యజ్ఞియాగ్ని చేత సంస్కారము పొందవలసిన నీవు అట్టి సంస్కారమును పొందకుండా మరణించినావేమి ? 24

మూ. ప్రవ్రజ్యాముపపన్నానాం త్రయాణామేకమాగతమ్,
పరిప్రేక్ష్యతి కౌసల్యా లక్ష్మణం శోకలాలసా. 25

ప్ర. అ. శోకలాలసా=శోకముచేత వ్యాకులురాలైన, కౌసల్యా=కౌసల్య, ప్రవత్స్యామ్=ప్రవాసమును, ఉపపన్నానామ్=పొందిన, త్రయాణామ్=ముగ్గురిలో, ఆగతమ్=తిరిగి వచ్చిన, ఏకమ్=ఒక్క, లక్ష్మణమ్=లక్ష్మణుని, పరిప్రేక్ష్యతి=చూడగలదు.

తా. దుఃఖాక్రాంతురాలైన కౌసల్య ప్రవాసమునకు వెళ్ళిన ముగ్గురిలో తిరిగి వచ్చిన ఒక్క లక్ష్మణుని మాత్రమే చూడగలదు. 25

మూ. స తస్యాః పరిపృచ్ఛన్త్యా వధం మిత్రబలస్య తే,
తవ చాఖ్యాస్యతే నూనం నిశాయాం రాక్షసైర్వధమ్. 26

ప్ర. అ. సః=అతడు, పరిపృచ్ఛన్త్యాః=ప్రశ్నించుచున్న, తస్యాః=ఆమెకు, నిశాయామ్=రాత్రియందు, రాక్షసైః=రాక్షసులచేత, తే మిత్రబలస్య=నీ మిత్రసేనయొక్క, వధమ్=వధను, తవ=నీయొక్క, వధం చ=వధను, నూనమ్=తప్పక, ఆఖ్యాస్యతే=చెప్పగలడు.

తా. అతడు కౌసల్య అడుగగా రాత్రియందు రాక్షసులు నీ మిత్రసైన్యమును, నిన్ను వధించినా రని తప్పక చెప్పును. 26

మూ. సా త్వాం సుప్తం హతం శ్రుత్వా మాం చ రక్షోగృహం గతామ్,
హృదయేనావదీర్ణేన న భవిష్యతి రాఘవ. 27

ప్ర. అ. రాఘవ=రామా ! సా=ఆమె, త్వామ్=నిన్ను, సుప్తమ్=నిద్రించి ఉండగా, హతమ్=చంపబడినవానినిగాను, మామ్=నన్ను, రక్షోగృహమ్=రాక్షసగృహమును, గతామ్=పొందిన దానినిగాను, శ్రుత్వా=విని, అవదీర్ణేన=బ్రద్దలైపోయిన, హృదయేన=హృదయముతో, న భవిష్యతి=ఉండదు.

తా. రామా ! నీవు నిద్రించుచుండగా చంపబడినట్లు, నేను రాక్షసగృహములో ఉన్నట్లు వినగానే గుండె బ్రద్దలైపోయి ఆమె జీవించదు.27

మూ. మమ హేతోరనార్యాయా అనఘః పార్థివాత్మజః,
రామః సాగరముత్తీర్య వీర్యవాన్ గోష్పదే హతః. 28

ప్ర. అ. అనఘః=దోషములు లేనివాడు, పార్థివాత్మజః=రాజకుమారుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, రామః=రాముడు, అనార్యయా=చెడ్డదానవైన, మమ=నాయొక్క, హేతోః=హేతువువలన, సాగరమ్=సముద్రమును, ఉత్తీర్య=దాటి, గోష్పదే=ఆవుకాలిగుంటలో, హతః=చంపబడినాడు.

తా. దోషములు లేనివాడు, రాజకుమారుడు, పరాక్రమవంతుడు అయిన రాముడు చెడ్డదానవైన నా నిమిత్తమై సముద్రమును దాటి గోష్పదములో

మరణించినాడు. 28

మూ. అహం దాశరథేనోఢా మోహాత్స్వకులపాంసనీ,
ఆర్యపుత్రస్య రామస్య భార్యా మృత్యురజాయత. 29

ప్ర. అ. స్వకులపాంసనీ=నా కులమును అపవిత్రము చేసిన, అహమ్=నేను, దాశరథేన=రామునిచేత, మోహాత్=అజ్ఞానమువలన, ఊఢా=వివాహముచేసికొనబడితిని. ఆర్యపుత్రస్య=ఆర్యపుత్రుడైన, రామస్య=రామునకు, భార్యా=భార్యయే, మృత్యుః=మృత్యువుగా, అజాయత=అయినది.

తా. దశరథకుమారుడైన రాముడు నా కులమునే అపవిత్రము చేసిన నన్ను వివాహమాడినాడు ! ఆర్యపుత్రుడైన రామునకు భార్యయే మృత్యుదేవత అయినది.

మూ. నానమన్యాం మయా జాతిం వారితం దానముత్తమమ్,
యాహమద్యేహ శోచామి భార్యా సర్వాతిథేరపి. 30

ప్ర. అ. సర్వాతిథేః=అందరూ అతిథులుగా గల రామునియొక్క, భార్యాపి=భార్యనైనను, యా=ఏ, అహమ్=నేను, ఇహ=ఇక్కడ, అద్య=ఇప్పుడు, శోచామి=దుఃఖించుచున్నానో, మయా=అట్టి నాచేత, అన్యామ్=మరియొక్క, జాతిమ్=జన్మను (యందు), ఉత్తమమ్=ఉత్తమమైన, దానమ్=దానము, వారితమ్=నివారింపబడినది. నూనమ్=నిశ్చయము.

తా. అతిథుల నందరినీ సత్కరించు రాముని భార్యనై ఉండి కూడ నేను ఇక్కడ, ఇప్పుడు ఈ విధముగా దుఃఖించుచున్నా ననగా నేను నిజముగా, పూర్వజన్మలో, ఎవరో చేయుచున్న ఉత్తమమైన కన్యాదానమునకు అడ్డుతగిలి ఉందును. 30

మూ. సాధు ఘాతయ మాం క్షిప్రం రామస్యోపరి రావణ,
సమానయ పతిం పత్న్యా కురు కల్యాణముత్తమమ్. 31

ప్ర. అ. రావణ=రావణుడా ! క్షిప్రమ్=శీఘ్రముగా, మామ్=నన్ను, రామస్య=రామునియొక్క, ఉపరి=పైన, సాధు=బాగుగా, ఘాతయ=వధింపుము. పతిమ్=భర్తను, పత్న్యా=భార్యతో, సమానయ=కలుపుము. ఉత్తమమ్=ఉత్తమమైన, కల్యాణమ్=మంగళప్రదమైన కార్యమును, కురు=చేయుము.

తా. రావణుడా ! నన్ను కూడా వెంటనే రామునిపై పడవేయించి వధింపుము. భర్తను భార్యతో కలిపి ఉత్తమమైన పుణ్యకార్యము చేయుము.

మూ. శిరసా మే శిరశ్చాస్య కాయం కాయేన యోజయ,
రావణానుగమిష్యామి గతిం భర్తుర్మహాత్మనః. 32

ప్ర. అ.రావణ=రావణా ! మే శిరసా=నా శిరస్సుతో, అస్య=ఈ

ఉందుము)" అని అభివాదనము చేసి, అనుగ్రహింపచేసికొని సేనాపతియైన ప్రహస్తుడు వచ్చినట్లు తెలిపెను. 35

మూ. అమాత్యైః సహితః సర్వైః ప్రహస్తస్త్వాముపస్థితః,
తేన దర్శనకామేన అహం ప్రస్థాపితః ప్రభో. 36

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! సర్వైః=సమస్తమైన, అమాత్యైః=మంత్రులతో, సహితః=కూడినవాడై, ప్రహస్తః=ప్రహస్తుడు, త్వామ్=నిన్ను, ఉపస్థితః=సమీపించినాడు. దర్శనకామేన=దర్శనమునందు కోరిక గల, తేన=వానిచేత, అహమ్=నేను, ప్రస్థాపితః=పంపబడితిని.

తా. మహారాజా ! మంత్రులందరితో కలిసి ప్రహస్తుడు వచ్చినాడు. నీ దర్శనము కోరుచు అతడు నన్ను పంపినాడు. 36

మూ. నూనమస్తి మహారాజ రాజభావాత్ క్షమాన్విత,
కించిదాత్యయికం కార్యం తేషాం త్వం దర్శనం కురు. 37

ప్ర. అ. మహారాజ=మహారాజా ! క్షమాన్విత=ఓర్పుతో కూడినవాడా! రాజభావాత్= రాజత్వమువలన, కించిత్=ఒకానొక, ఆత్యయికమ్=తొందరగల, కార్యమ్=కార్యము, అస్తి=ఉన్నది. నూనమ్=నిశ్చయము. త్వమ్=నీవు, తేషామ్=వారియొక్క, దర్శనమ్=దర్శనమును, కురు=చేయుము.

తా. ఓర్పు గల ఓ ! మహారాజా ! రాజ్యమునకు సంబంధించిన ఏదో ఒక తొందరగా చూడదగిన కార్యము ఉన్నది. అందుచేత నీవు వారి దర్శనము చేయుము. 37

మూ. ఏతచ్ఛ్రుత్వా దశగ్రీవో రాక్షసప్రతివేదితమ్,
అశోకవనికాం త్యక్త్వా మన్త్రిణాం దర్శనం యయౌ. 38

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, ఏతత్=ఈ, రాక్షసప్రతివేదితమ్=రాక్షసుని వచనమును, శ్రుత్వా=విని, అశోకవనికామ్=అశోకవనమును, త్యక్త్వా=విడచి, మన్త్రిణామ్= మంత్రులయొక్క, దర్శనమ్=దర్శనమును, యయౌ=పొందెను.

తా. రావణుడు ఆ రాక్షసుడు చెప్పిన మాటలు విని అశోకవనమును విడచి మంత్రులను చూచుటకై వెళ్ళెను. 38

మూ. స తు సర్వం సమర్థ్యైవ మన్త్రిభిః కృత్యమాత్మనః,
సభాం ప్రవిశ్య విదధే విదిత్వా రామవిక్రమమ్. 39

ప్ర. అ. సః=అతడు, మన్త్రిభిః=మంత్రులతో, ఆత్మనః=తనయొక్క,

సర్వమ్= సమస్తమైన, కృత్యమ్=చేయదగిన పనిని, సమర్థ్యచ=నిర్ణయించి, సభామ్=సభను, ప్రవిశ్య=ప్రవేశించి, రామవిక్రమమ్=రాముని పరాక్రమమును, విదిత్వా=తెలిసికొని, విదధే=చేయదగిన కార్యము చేసెను.

తా. అతడు మంత్రులతో ఆలోచించి తాను చేయవలసిన కృత్యమును నిర్ణయించి, సభలో ప్రవేశించి రాముని పరాక్రమమును గూర్చి తెలిసికొని, అప్పుడు చేయదగిన కార్యములు చేసెను. 39

మూ. అన్తర్ధానం తు తచ్ఛీర్షం తచ్చ కార్ముకముత్తమమ్,
జగామ రావణస్యైవ నిర్యాణసమనన్తరమ్. 40

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, నిర్యాణసమనన్తరమేవ=వెళ్ళిన వెంటనే, తత్ శీర్షమ్= ఆ శిరస్సు, ఉత్తమమ్=ఉత్తమమైన, తత్ కార్ముకం చ=ఆ ధనస్సు, అన్తర్ధానమ్= అంతర్ధానమును, జగామ=పొందెను.

తా. రావణుడు వెళ్ళిపోయిన వెంటనే ఆ శిరస్సు, ఉత్తమమైన ఆ ధనస్సు అంతర్ధానమును పొందెను. 40

మూ. రాక్షసేన్ద్రస్తు తైః సార్ధం మన్త్రిభిర్భీమవిక్రమైః,
సమర్థయామాస తదా రామకార్యవినిశ్చయమ్. 41

ప్ర. అ. రాక్షసేన్ద్రస్తు=రావణుడు, భీమవిక్రమైః=భయంకరమైన పరాక్రమము గల, మన్త్రిభిః=మంత్రులతో కూడ, తదా=అప్పుడు, రామకార్యవినిశ్చయమ్=రాముని కార్యముయొక్క నిశ్చయమును, సమర్థయామాస=నిర్ణయించెను.

తా. అప్పుడు రావణుడు, భయంకరమైన పరాక్రమము గల మంత్రులతో కూడ రామునితో యుద్ధమునకు సంబంధించిన కార్యముల విషయమున నిర్ణయములు చేసెను. 41

మూ. అవిదూరస్థితాన్సర్వాన్ బలాధ్యక్షాన్ హితైషిణః,
అబ్రవీత్కాలసదృశో రావణో రాక్షసాధిపః 42

ప్ర. అ. కాలసదృశః=యమునితో సమానుడు, రాక్షసాధిపః=రాక్షసరాజు అయిన, రావణః=రావణుడు, అవిదూరస్థితాన్=సమీపమునందున్న, హితైషిణః=తన హితమును కోరు, సర్వాన్=సమస్తమైన, బలాధ్యక్షాన్=సేనాధ్యక్షులను, అబ్రవీత్=పలికెను.

తా. యమునితో సమానుడైన రాక్షసరాజైన రావణుడు దగ్గరనే ఉన్న, తన హితమును కోరు సైన్యాధిపతులందరితో ఇట్లు పలికెను. 42

మూ. శీఘ్రం భేరీనినాదేన స్ఫుటం కోణాహతేన మే,
సమానయధ్వం సైన్యాని వక్తవ్యం చ న కారణమ్. 43

ప్ర. అ. స్ఫుటమ్=స్ఫుటముగా, కోణాహతేన=దండముచేత కొట్టబడిన, భేరీనినాదేన= భేరీధ్వనిచేత, మే=నాయొక్క, సైన్యాని=సైన్యములను, సమానయధ్వమ్=తీసికొనిరండి. కారణమ్=కారణము, న చ వక్తవ్యమ్=చెప్పదగినది కాదు.

తా. దండముతో గట్టిగా భేరీలు మ్రోగించి నా సైన్యములను అన్నింటిని తీసికొని రండి. వారికి ఎందుకు పిలుచుచున్నామో చెప్పవద్దు. 43

మూ. తతస్తథేతి ప్రతిగృహ్య తద్వచ
స్తదైవ దూతాః సహసా మహద్బలమ్,
సమానయంశ్చైవ సమాగతం చ
న్యవేదయన్ భర్తరి యుద్ధకాఙ్క్షిణి. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్వాత్రింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దూతాః=దూతలు, తద్వచః=ఆతని వచనమును, తథా ఇతి=అటులనే అని, ప్రతిగృహ్య=స్వీకరించి, సహసా=వెంటనే, తదైవ=అప్పుడే, మహత్=గొప్పదైన, బలమ్=సైన్యమును, సమానయన్=తీసికొని వచ్చిరి. సమాగతమ్=వచ్చినదానినిగా, యుద్ధకాఙ్క్షిణి=యుద్ధమును కోరుచున్న, భర్తరి=ప్రభువునందు, న్యవేదయన్=తెలిపిరి.

తా. పిమ్మట ఆ దూతలు రావణుని ఆజ్ఞప్రకారము అప్పుడే, శీఘ్రముగా గొప్ప సైన్యమును తీసికొని వచ్చి, సైన్యము వచ్చిన దని యుద్ధము కోరుచున్న ఆ రావణునకు తెలిపిరి. 44

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయస్త్రింశః సర్గః

["ఇది రాముని శిరస్సు కాదు, రావణుడు మాయచేత కల్పించినది" అని చెప్పి సరమ సీతను ఓదార్చుట. "రాముడు సముద్రము దాటి వచ్చినాడు. అతడు జయించుట తథ్యము" అని కూడ ఆమె చెప్పుట.]

మూ. సీతాం తు మోహితాం దృష్ట్వా సరమా నామ రాక్షసీ,
ఆససాదాథ వైదేహీం ప్రియాం ప్రణయినీ సఖీ. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ప్రణయినీ=ప్రేమగల, సఖీ=సఖురాలైన, సరమా=సరమ అను, రాక్షసీ=రాక్షసస్త్రీ, మోహితామ్=మోహితురాలైన, సీతామ్=సీతను, దృష్ట్వా=చూచి, ప్రియామ్=ఇష్టురాలైన, వైదేహీమ్=సీతను, ఆససాద=సమీపించెను.

తా. అప్పుడు సీతకు ప్రియసఖురాలైన సరమ సీత మోహితురాలై ఉండుట చూచి, ఇష్టురాలైన ఆమె దగ్గరకు వెళ్ళెను. 1

మూ. మోహితాం రాక్షసేన్ద్రేణ సీతాం పరమదుఃఖితామ్,
ఆశ్వాసయామాస తదా సరమా మృదుభాషిణీ. 2

ప్ర. అ. తదా=అప్పుడు, మృదుభాషిణీ=మృదువుగా మాటలాడు, సరమా=సరమ, రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, మోహితామ్=మోహపెట్టబడిన, పరమదుఃఖితామ్=మిక్కిలి దుఃఖించుచున్న, సీతామ్=సీతను, ఆశ్వాసయామాస=ఓదార్చెను.

తా. మృదువుగా మాటలాడు సరమ సీతను సమీపించి, రావణుడు మాయచేత మోసముచేయగా మిక్కిలి దుఃఖించుచున్న ఆమెను ఓదార్చెను.2

మూ. సా హి తత్ర కృతా మిత్రం సీతయా రక్ష్యమాణయా,
రక్షన్తీ రావణాదిష్టా సానుక్రోశా దృఢవ్రతా. 3

ప్ర. అ. రావణాదిష్టా=రావణునిచేత ఆజ్ఞాపింపబడినదై, రక్షన్తీ=(సీతను) రక్షించుచున్నది, సానుక్రోశా=జాలిగలది, దృఢవ్రతా=దృఢమైన నియమములు కలది అయిన, సా=ఆమె, తత్ర=అక్కడ, రక్ష్యమాణయా=రక్షింపబడుచున్న, సీతయా=సీతచేత, మిత్రమ్=మిత్రురాలుగా, కృతా హి=చేసికొనబడినది కదా.

తా. రావణునిచే సీతను రక్షించుటకై నియమింపబడిన, జాలిగుండె గల మంచి నియమవంతురాలైన ఆ సరమను ఆమె రక్షణలో ఉన్న సీత తన స్నేహితురాలిగా చేసికొని ఉండెను. 3

మూ. సా దదర్శ సఖీ సీతాం సరమా నష్టచేతనామ్,
ఉపావృత్యోత్థితాం ధ్వస్తాం బడబామివ పాంసుషు. 4

ప్ర. అ. సఖీ=సఖురాలైన, సా=ఆ, సరమా=సరమ, నష్టచేతనామ్=నశించిన జ్ఞానము కలది, పాంసుషు=పరాగములయందు, ఉపావృత్య=దొర్లి, ఉత్థితామ్=లేచిన, ధ్వస్తామ్=పరాగముచేత కప్పబడిన, బడబామివ=ఆడగుఱ్ఱమువలె ఉన్న, సీతామ్=సీతను, దదర్శ=చూచెను.

తా. సఖురాలైన సరమ స్పృహ తప్పి పడి ఉన్న సీతను చూచెను. ఆమె పరాగములో దొర్లి లేచిన, పరాగముచేత కప్పబడిన ఆడగుఱ్ఱమువలె ఉండెను. 4

మూ. తాం సమాశ్వాసయామాస సఖీ స్నేహేన సువ్రతామ్,
సమాశ్వసిహి వైదేహి మా భూత్తే మనసో వ్యథా. 5

ప్ర. అ. సఖీ=సఖురాలైన సరమ, సువ్రతామ్=ఉత్తమమైన నియమములు గల, తామ్=ఆ సీతను, స్నేహేన=ప్రేమతో, సమాశ్వాసయామాస=ఓదార్చెను. వైదేహి=సీతా! సమాశ్వసిహి=ఊరడిల్లుము. తే=నీయొక్క, మనసః=మనస్సునకు, వ్యథా=వ్యథ, మా భూత్=కలుగకపోవుగాక.

తా. సఖురాలైన ఆ సరమ ఉత్తమవ్రతము గల సీతను ప్రేమతో ఓదార్చెను. "ఓ! సీతా! ఊరడిల్లుము. మనస్సులో వ్యథ చెందకుము." 5

మూ. ఉక్తా యద్రావణేన త్వం ప్రత్యుక్తశ్చ స్వయం త్వయా,
సఖీస్నేహేన తద్భీరు మయా సర్వం ప్రతిశ్రుతమ్. 6
లీనయా గగనే శూన్యే భయముత్సృజ్య రావణాత్,
తవ హేతోర్విశాలాక్షి న హి మే రావణాద్భయమ్. 7

ప్ర. అ. భీరు=భయస్వభావము కలదానా! త్వమ్=నీవు, రావణేన=రావణుని చేత, యత్=ఏది, ఉక్తా=పలుకబడితివో, త్వయా=నీచేత, స్వయమ్=స్వయముగా, ప్రత్యుక్తః=తిరిగి పలుకబడినాడో, తత్ సర్వమ్=అది అంతా, శూన్యే=శూన్యమైన, గగనే=ఆకాశమునందు, లీనయా=దాగి ఉన్న, మయా=నాచేత, సఖీస్నేహేన=సఖియైన నీమీద నున్న స్నేహముచేత, రావణాత్=రావణునుండి, భయమ్=భయమును, ఉత్సృజ్య=విడచి, ప్రతిశ్రుతమ్=వినబడినది. విశాలాక్షి=విశాలములైన నేత్రములు గలదానా! తవ హేతోః=నీ నిమిత్తమై, మే=నాకు, రావణాత్=రావణునివలన, భయమ్=భయము, న హి=లేదుకదా?

తా. భయస్వభావము కలదానా! రావణుని మాటలు, నీవు తిరిగి

పలికిన మాటలు విని అప్పి నేను నీపై ఉన్న స్నేహముచేత రావణుని నుండి భయపడక, శూన్యమైన ఆకాశప్రదేశములో దాగి ఉండి విన్నాను. విశాలమైన నేత్రములు గల ఓ ! సీతా ! నీయందున్న స్నేహభావముచే నేను రావణునకు ఏ మాత్రము భయపడుట లేదు. 6, 7

మూ. స సంభ్రాన్తశ్చ నిష్క్రాన్తో యత్కృతే రాక్షసేశ్వరః,
తత్ర మే విదితం సర్వమభినిష్క్రమ్య మైథిలి. 8

ప్ర. అ. మైథిలి=సీతా ! సః రాక్షసేశ్వరః=ఆ రావణుడు, యత్కృతే=దేనినిమిత్తమై, సంభ్రాన్తః=తొందర పడుచున్నవాడై, నిష్క్రాన్తః=వెళ్లి పోయినాడో, తత్ర=దానివిషయమునందు, సర్వమ్=అంతా, అభినిష్క్రమ్య=బైటకు వెళ్లి, మే=నాకు, విదితమ్=తెలిసినది.

తా. సీతా ! రావణుడు తొందరగా ఎందుకు వెళ్లిపోయినాడో ఆ విషయము నంతా నేను బైటకు వెళ్లి తెలిసికొంటిని. 8

మూ. న శక్యం సౌప్తికం కర్తుం రామస్య విదితాత్మనః,
వధశ్చ పురుషవ్యాఘ్రే తస్మిన్నైవోపపద్యతే. 9

ప్ర. అ. విదితాత్మనః=ప్రసిద్ధమైన బుద్ధి గల, రామస్య=రాముని విషయమున, సౌప్తికమ్=నిద్రలో ఆక్రమణము, కర్తుమ్=చేయుటకు, న శక్యమ్=శక్యము కాదు. పురుషవ్యాఘ్రే=పురుషశ్రేష్ఠుడైన, తస్మిన్=అతని విషయమునందు, వధశ్చ=వధ కూడ, నైవ ఉపపద్యతే=ఉపపన్నము (కుదిరేది) కాదు.

తా. ప్రసిద్ధమైన బుద్ధి గల రాముని విషయమున ఎవరూ నిద్రలో ఆక్రమణము చేయజాలరు. పురుషశ్రేష్ఠుడైన అతనిని చంపుట అనునది అసంభావ్యము. 9

మూ. న చైవం వానరా హన్తుం శక్యాః పాదపయోధినః,
సురా దేవర్షభేణేవ రామేణ హి సురక్షితాః. 10

ప్ర. అ. దేవర్షభేణ=దేవతలలో శ్రేష్ఠుడైన ఇంద్రునిచేత, సురాః ఇవ=దేవతలు వలె, రామేణ=రామునిచేత, సురక్షితాః=బాగుగా రక్షింపబడిన, పాదపయోధినః=వృక్షములతో యుద్ధము చేయు, వానరాః=వానరులు, ఏవమ్=ఈ విధముగా, హన్తుమ్=చంపుటకు, న శక్యాః=శక్యమైన వారు కాదు.

తా. దేవేంద్రునిచేత దేవతల వలె రామునిచేత రక్షింపబడుచున్న వృక్షములతో యుద్ధము చేయు వానరులను కూడ ఈ విధముగా చంపుట శక్యము కాదు. 10

మూ. దీర్ఘవృత్తభుజః శ్రీమాన్మహోరస్కః ప్రతాపవాన్,
ధన్వీ సంహననోపేతో ధర్మాత్మా భువి విశ్రుతః. 11
విక్రాన్తో రక్షితా నిత్య మాత్మనశ్చ పరస్య చ,
లక్ష్మణేన సహ భ్రాత్రా కులీనో నయశాస్త్రవిత్. 12
హన్తా పరబలౌఘానామచిన్త్యబలపౌరుషః,
న హతో రాఘవః శ్రీమాన్ సీతే శత్రునిబర్హణః. 13

ప్ర. అ. సీతే=సీతా ! దీర్ఘవృత్తభుజః=పొడవైన గుండ్రనైన భుజములు కలవాడు, శ్రీమాన్=శోభకలవాడు, మహోరస్కః=గొప్ప వక్షస్థలము గలవాడు, ప్రతాపవాన్=ప్రతాపము కలవాడు, ధన్వీ=ధనస్సు కలవాడు, సంహననోపేతః=చక్కని అవయవనిర్మాణము (స్థితి) కలవాడు, ధర్మాత్మా=ధర్మాత్ముడు, భువి=భూమియందు, విశ్రుతః=ప్రసిద్ధుడు, విక్రాన్తః=పరాక్రమము చూపువాడు, నిత్యమ్=ఎల్లప్పుడు, ఆత్మనశ్చ=తనకు, పరస్య చ=ఇతరునకు కూడ, రక్షితా=రక్షకుడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన=లక్ష్మణునితో కూడి ఉన్నవాడు, కులీనః=మంచి కులమునందు పుట్టినవాడు, నయశాస్త్రవిత్=నీతి శాస్త్రమును ఎరిగినవాడు, పరబలౌఘానామ్=శత్రుసైన్యసముదాయములకు, హన్తా=చంపువాడు, అచిన్త్యబలపౌరుషః=ఊహింప శక్యము కాని బలము పౌరుషము కలవాడు, శ్రీమాన్=శ్రీమంతుడు, శత్రునిబర్హణః=శత్రువులను చంపువాడు అయిన, రాఘవః=రాముడు, న హతః= చంపబడలేదు.

తా. సీతా ! పొడవుగా, గుండ్రగా ఉన్న భుజములు, విశాలమైన వక్షస్థలము గల గొప్ప శోభ గల రాముడు ప్రతాపవంతుడు, ధనుర్ధరుడు, అందమైన అవయవముల కూర్పుగలవాడు, ధర్మాత్ముడు, భూమియందు ప్రసిద్ధుడు, పరాక్రమవంతుడు, నిత్యము తనను ఇతరులను కూడా రక్షించువాడు, సోదరుడైన లక్ష్మణునితో కలిసి ఉండేవాడు, మంచి కులమునందు పుట్టినవాడు, నీతి శాస్త్రపారంగతుడు, శత్రువుల సేనా సముదాయములను సంహరించువాడు, ఊహింపశక్యము కాని బలము పౌరుషము గలవాడు, శత్రుసంహారకుడు, అట్టి రాముడు చంపబడలేదు. జీవించియే ఉన్నాడు. 11-13

మూ. అయుక్తబుద్ధికృత్యేన సర్వభూతవిరోధినా,
ఇహ ప్రయుక్తా రౌద్రేణ మాయా మాయావిదా త్వయి. 14

ప్ర. అ. అయుక్తబుద్ధికృత్యేన=అయుక్తమైన బుద్ధి, పనులు గలవాడు, సర్వభూతవిరోధినా= సమస్తప్రాణులకు, శత్రువు, రౌద్రేణ=భయంకరుడు, మాయావిదా=మాయాస్వభావము గలవాడు అయిన రావణునిచేత, ఇహ=ఇక్కడ, త్వయి=నీవిషయమునందు, మాయా= మాయ, ప్రయుక్తా=ప్రయోగింపబడినది.

తా. పెద్ద ఆలోచనతో పెద్ద పనులు చేయుచు సమస్తప్రాణులను ద్వేషించు మాయావి యైన, భయంకరుడైన రావణుడు ఏ విషయమున ఇక్కడ మాయ ప్రయోగించినాడు. 14

మూ. శోకస్తే విగతః సర్వకల్యాణం త్వాముపస్థితమ్,
ధ్రువం త్వాం భజతే లక్ష్మీః ప్రియం తే భవతి శృణు. 15

ప్ర. అ. తే=నీయొక్క, శోకః=దుఃఖము, విగతః=తొలగిపోయినది. సర్వకల్యాణమ్=సమస్తమైన కల్యాణము, త్వామ్=నిన్ను, ఉపస్థితమ్=చేరినది. లక్ష్మీః=లక్ష్మి, ధ్రువమ్=నిశ్చయముగా, త్వామ్=నన్ను, భజతే=సేవించుచున్నది. తే=నీకు, ప్రియమ్=ప్రియము, భవతి=అగుచున్నది. శృణు=వినుము.

తా. నీ దుఃఖ మంతా తొలగిపోయినది. నీకు మంగళము లభించ నున్నది. నిశ్చయముగా నిన్ను లక్ష్మి పొందును. నీకు ప్రియము జరుగును. వినుము. 15

మూ. ఉత్తీర్య సాగరం రామః సహ వానరసేనయా,
సంనివిష్టః సముద్రస్య తీరమాసాద్య దక్షిణమ్. 16

ప్ర. అ. రామః=రాముడు, వానరసేనయా సహ=వానరసేనతో కూడ, సాగరమ్=సాగరమును, ఉత్తీర్య=దాటి, సముద్రస్య=సముద్రముయొక్క, దక్షిణం తీరమ్=దక్షిణతీరమును, ఆసాద్య=చేరి, సంనివిష్టః=విడిసి ఉన్నాడు.

తా. రాముడు వానరసైన్యముతో సముద్రమును దాటి సముద్రము దక్షిణతీరము చేరి విడిసి ఉన్నాడు. 16

మూ. దృష్టో మే పరిపూర్ణార్థః కాకుత్స్థః సహ లక్ష్మణః,
సహితైః సాగరాన్తస్థైర్బలైస్తిష్ఠతి రక్షితః. 17

ప్ర. అ. పరిపూర్ణార్థః=సిద్ధించిన ప్రయోజనము గల, సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, కాకుత్స్థః=రాముడు, మే=నాకు, దృష్టః=చూడబడినాడు. సాగరాన్తస్థైః=సముద్రము సమీపమునందున్న, సహితైః=కలిసి ఉన్న, బలైః=సేనచేత, రక్షితః=రక్షింపబడినవాడై, తిష్ఠతి=ఉన్నాడు.

తా. సిద్ధించిన ప్రయత్నము గల లక్ష్మణసహితుడైన రాముణ్ణి నేను చూచినాను. ఒక్కచోట కలిసి సముద్రసమీపమునందున్న సైన్యముచేత రక్షింపబడుచు అక్కడ ఉన్నాడు. 17

మూ. అనేన ప్రేషితా యే చ రాక్షసా లఘువిక్రమాః,
రాఘవస్తద్ధత ఇత్యేవం ప్రవృత్తిస్తైరిహాహృతా. 18

ప్ర. అ. అనేన=ఈనివేళ, యే=ఏ, లఘువిక్రమాః=శీఘ్రగమనము గల, రాక్షసాః=రాక్షసులు, ప్రేషితాః=పంపబడినారో, తైః=వారిచేత, రాఘవః= రాముడు, తీర్ణః ఇత్యేవమ్=దాటినాడు అని, ప్రవృత్తిః=వార్త, ఇహ=ఇక్కడికి, ఆహృతా=తీసికొనిరాబడినది.

తా. రావణుడు శీఘ్రముగా వెళ్లగల రాక్షసులను పంపినాడు. వాళ్ళందరూ రాముడు సముద్రమును దాటినా డని వార్త తీసికొనివచ్చినారు.

మూ. స తాం శ్రుత్వా విశాలాక్షి ప్రవృత్తిం రాక్షసాధిపః,
ఏష మన్త్రయతే సర్వైః సచివైః సహ రావణః. 19

ప్ర. అ. విశాలాక్షి=విశాలమైన నేత్రములు గలదానా ! రాక్షసాధిపః=రాక్షసరాజైన, సః ఏషః=అట్టి ఈ, రావణః=రావణుడు, తామ్=ఆ, ప్రవృత్తిమ్=వార్తను, శ్రుత్వా=విని, సచివైః సహ=మంత్రులతో కూడ, మన్త్రయతే=ఆలోచించుచున్నాడు.

తా. విశాలనేత్రములుగల ఓ ! సీతా ! రాక్షసరాజైన ఈ రావణుడు ఆ వార్త విని మంత్రులతో కూడ మంతనములు చేయుచున్నాడు. 19

మూ. ఇతి బ్రువాణా సరమా రాక్షసీ సీతయా సహ,
సర్వోద్యోగేన సైన్యానాం శబ్దం శుశ్రావ భైరవమ్. 20

ప్ర. అ. ఇతి=ఇట్లు, సీతయా సహ=సీతతో కూడ, బ్రువాణా=పలుకుచున్న, రాక్షసీ=రాక్షసియైన, సరమా=సరమ, సైన్యానామ్ =సైన్యములయొక్క, సర్వోద్యోగేన=ఒక్కుమ్మడి ఉద్యమముచేత, భైరవమ్=భయంకరమైన, శబ్దమ్=శబ్దమును, శుశ్రావ=వినెను.

తా. సీతతో కూడ సరమ ఇట్లు మాటలాడుచుండగా, సైనికు లందరు ఒక్కుమ్మడి సన్నద్ధు లగుటచేత ఏర్పడిన భయంకరమైన శబ్దము వినబడెను.20

మూ. దణ్డనిర్ఘాతవాదిన్యాః శ్రుత్వా భేర్యా మహాస్వనమ్,
ఉవాచ సరమా సీతామిదం మధురభాషిణీ. 21

ప్ర. అ. మధురభాషిణీ=మధురముగా మాటలాడు, సరమా=సరమ, దణ్డనిర్ఘాతవాదిన్యాః=దండముయొక్క ప్రహారముచేత ధ్వని చేయుచున్న, భేర్యాః=భేరి యొక్క, మహాస్వనమ్=మహాధ్వనిని, శ్రుత్వా=విని, సీతామ్ =సీతనుగూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మధురముగా మాటలాడు సరమ దండముతో గట్టిగా కొట్టుటచేత ధ్వని చేయుచున్న రణభేరి ధ్వని విని సీతతో ఇట్లు పలికెను. 21

మూ. సన్నాహజననీ హ్యేషా భైరవా భీరు భేరికా,
భేరీనాదం చ గమ్భీరం శృణు తోయదనిస్వనమ్. 22

ప్ర. అ. భీరు=భయస్వభావము కలదానా ! భైరవా=భయంకరమైన, ఏషా=ఈ, భేరికా =భేరీ, సన్నాహజననీ హి=సన్నాహమును (సిద్ధమగుటను) కలిగించునది కదా. తోయదనిస్వనమ్=మేఘధ్వనివంటి ధ్వని గల, గమ్భీరమ్=గంభీరమైన, భేరీనాదం చ=భేరీధ్వని కూడ, శృణు=వినుము.

తా. భయస్వభావము గల సీతా ! భయంకరమైన ఈ భేరీధ్వని యోధులు యుద్ధమునకు సిద్ధ మగుటకై చేయునది. మేఘధ్వని వంటి ధ్వని గల, గంభీరమైన ఈ భేరీనాదమును వినుము. 22

మూ. కల్ప్యన్తే మత్తమాతఙ్గా యుజ్యన్తే రథవాజినః,
దృశ్యన్తే తురగారూఢాః ప్రాసహస్తాః సహస్రశః. 23

ప్ర. అ. మత్తమాతఙ్గాః=మదించిన ఏనుగులు, కల్ప్యన్తే=ఏర్పరుపబడుచున్నవి. రథవాజినః=రథముల గుఱ్ఱములు, యుజ్యన్తే=కట్టబడుచున్నవి. సహస్రశః=వేలకొలది, ప్రాసహస్తాః=ప్రాసలు హస్తములందు గల, తురగారూఢాః=గుఱ్ఱములను ఎక్కినవాళ్లు, దృశ్యన్తే=కనబడుచున్నారు.

తా. మదించిన ఏనుగులను సిద్ధము చేయుచున్నారు. రథములకు గుఱ్ఱములు కట్టబడుచున్నవి. ప్రాసలు ధరించిన వేలకొలది భటులు అశ్వములను ఎక్కి కనబడుచున్నారు. 23

మూ. తత్ర తత్ర చ సన్నద్ధాః సంపతన్తి సహస్రశః,
ఆపూర్యన్తే రాజమార్గాః సైన్యైరద్భుతదర్శనైః, 24
వేగవద్భిర్నదద్భిశ్చ తోయౌఘైరివ సాగరః.

ప్ర. అ. సహస్రశః=వేలకొలది, సంనద్ధాః=యుద్ధమునకు సిద్ధముగా ఉన్న (గుఱ్ఱములు ఎక్కిన) యోధులు, తత్ర తత్ర చ=అక్కడక్కడ, సంపతన్తి=శీఘ్రముగా వచ్చుచున్నారు. అద్భుతదర్శనైః=ఆశ్చర్యకరమైన దర్శనము గల, సైన్యైః=సైన్యములచేత, వేగవద్భిః=వేగము గల, నదద్భిః చ=ధ్వని చేయుచున్న, తోయౌఘైః=జలప్రవాహములచేత, సాగరః ఇవ=సముద్రము వలె, రాజమార్గాః=రాజమార్గములు, ఆపూర్యన్తే=నింపబడుచున్నవి.

తా. వేలకొలది అశ్వయోధులు యుద్ధసంనద్ధులై ఆ యా ప్రదేశములలో శీఘ్రముగా వచ్చి చేరుచున్నారు. వేగము గల, ధ్వని చేయుచున్న జలప్రవాహములచేత సముద్రము వలె చూచుటకు ఆశ్చర్యము కలిగించు సైన్యములచేత రాజమార్గములు నింపబడుచున్నవి. 24

మూ. శస్త్రాణాం చ ప్రసన్నానాం చర్మణాం వర్మణాం తథా, 25
రథవాజిగజానాం చ రాక్షసేన్ద్రానుయాయినామ్,
సంభ్రమో రక్షసామేష హృషితానాం తరస్వినామ్. 26
ప్రభాం విసృజతాం పశ్య నానావర్ణసముత్థితామ్,
వనం నిర్దహతో ఘర్మే యథా రూపం విభావసోః. 27

ప్ర. అ. ఘర్మే=గ్రీష్మమునందు, వనమ్=వనమును, నిర్దహతః=కాల్చు చున్న, విభావసోః=అగ్నియొక్క, రూపం యథా=రూపము వలె ఉన్న, నానావర్ణసముత్థితామ్=అనేకవిధములైన రంగుల చేత ఏర్పడిన, ప్రభామ్=కాంతిని, విసృజతామ్=ప్రసరింపచేయుచున్న, ప్రసన్నానామ్=నిర్మలముగా ఉన్న, శస్త్రాణామ్=ఆయుధములయొక్క, చర్మణామ్=చర్మలయొక్క, తథా=మరియు, వర్మణామ్=కవచములయొక్క, రాక్షసేన్ద్రానుయాయినామ్=రావణుని అనుసరించు, రథవాజిగజానాం చ=రథ అశ్వ గజములయొక్క, హృషితానామ్=ఉత్సాహవంతులైన, తరస్వినామ్=బలముగల, రక్షసామ్=రాక్షసులయొక్క, ఏషః=ఇది, సంభ్రమః=తొందర, పశ్య=చూడుము.

తా. నిర్మలముగా ఉన్న ఆయుధములు, డాలులు, కవచములు, రావణుని అనుసరించు రథములు, అశ్వములు, గజములు, ఉత్సాహముతో కూడిన బలవంతులైన రాక్షసులు అనేకవిధములైన రంగులతో కూడిన కాంతిని ప్రసరింపచేయుచు తొందరలో ఉన్నారు. ఈ కాంతి గ్రీష్మఋతువునందు వనమును కాల్చుచున్న అగ్నిరూపము వలె ఉన్నది. చూడుము. 25 - 27

మూ. ఘణ్టానాం శృణు నిర్ఘోషం రథానాం శృణు నిఃస్వనమ్,
హయానాం హ్రేషమాణానాం శృణు తూర్యధ్వనిం యథా. 28
ఉద్యతాయుధహస్తానాం రాక్షసేన్ద్రానుయాయినామ్,
సంభ్రమో రక్షసామేష తుములో రోమహర్షణః. 29

ప్ర. అ. ఘణ్టానామ్=(ఏనుగుల) గంటలయొక్క, నిర్ఘోషమ్=ధ్వనిని, శృణు=వినుము. రథానామ్=రథములయొక్క, నిఃస్వనమ్=ధ్వనిని, శృణు=వినుము. హ్రేషమాణానామ్=సకిలించుచున్న, హయానామ్ =గుఱ్ఱములయొక్క (ధ్వనిని), తూర్యధ్వనిం యథా=తూర్యధ్వని వలె, శృణు=వినుము. ఏషః=ఇది, ఉద్యతాయుధహస్తానామ్=ఎత్తబడిన ఆయుధములు హస్తములందు గల, రాక్షసేన్ద్రానుయాయినామ్=రావణుని అనుసరించు, రక్షసామ్=రాక్షసులయొక్క, తుములః=వ్యాకులము, రోమహర్షణః=రోమాంచమును కలిగించునదీ అయిన, సంభ్రమః=తొందర.

తా. ఏనుగుల గంటల ధ్వని, రథముల ధ్వని, సకిలించుచున్న గుఱ్ఱముల

ధ్వని, వాద్యముల ధ్వని వినవచ్చుచున్నది. వినుము. రావణుని అనుసరించు రాక్షసులు ఆయుధములు ధరించి చేయుచున్న ఈ వ్యాకులముగా నున్న సంభ్రమము రోమాంచము కలిగించేదిగా ఉన్నది. 28, 29

మూ. శ్రీస్త్వాం భజతి శోకఘ్నీ రక్షసాం భయమాగతమ్,
రామః కమలపత్రాక్షో౽దైత్యానామివ వాసవః. 30
అవజిత్య జితక్రోధ స్తమచిన్త్యపరాక్రమః,
రావణం సమరే హత్వా భర్తా త్వాధిగమిష్యతి. 31

ప్ర. అ. శోకఘ్నీ=శోకమును నశింపచేయు, శ్రీః=లక్ష్మి, త్వామ్=నిన్ను, భజతి=సేవించుచున్నది. రక్షసామ్=రాక్షసులకు, భయమ్=భయము, ఆగ తమ్=వచ్చినది. అదైత్యానామ్=దేవతలలో, వాసవః ఇవ=దేవేంద్రుని వంటి, కమలపత్రాక్షః=కమలపత్రముల వంటి నేత్రములు గల, భర్తా=నీ భర్తయైన, జితక్రోధః=జయింపబడిన క్రోధము గల, అచిన్త్యపరాక్రమః=ఊహింప శక్యము కాని పరాక్రమముగల, రామః=రాముడు, తం రావణమ్=ఆ రావణుని, సమరే=యుద్ధమునందు, హత్వా=చంపి, త్వా=నిన్ను, అధిగమిష్యతి=పొందగలడు.

తా. శోకమును నశింపచేయు సంపద నిన్ను చేరగలదు. రాక్షసులకు ముప్పు వచ్చినది. దేవతలలో దేవేంద్రునివంటివాడు, కమలపత్రములవంటి నేత్రములు కలవాడు, జయింపబడిన క్రోధము కలవాడు, ఊహింపశక్యము కాని పరాక్రమము గలవాడు, నీ భర్త అయిన, రాముడు ఆ రావణుల్ని యుద్ధములో జయించి నిన్ను పొందగలడు. 30, 31

మూ. విక్రమిష్యతి రక్షస్సు భర్తా తే సహలక్ష్మణః,
యథా శత్రుషు శత్రుఘ్నో విష్ణునా సహ వాసవః. 32

ప్ర. అ. సహ లక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, తే భర్తా=నీ భర్త, శత్రుఘ్నః=శత్రువులను సంహరించు, విష్ణునా సహ=విష్ణువుతో కూడిన, వాసవః=దేవేంద్రుడు, శత్రుషు యథా=శత్రువులయందు వలె, రక్షస్సు=రాక్షసులం యందు, విక్రమిష్యతి=పరాక్రమించగలడు.

తా. విష్ణుసహితుడైన శత్రుసంహారకుడైన దేవేంద్రుడు శత్రువులయందు వలె, లక్ష్మణసహితుడైన నీ భర్త రాక్షసులయందు పరాక్రమము చూపగలడు.

మూ. ఆగతస్య హి రామస్య క్షిప్రమఙ్కగతాం సతీమ్,
అహం ద్రక్ష్యామి సిద్ధార్థాం త్వాం శత్రౌ వినిపాతితే. 33

ప్ర. అ. శత్రౌ=శత్రువు, వినిపాతితే=పడగొట్టబడినవాడగుచుండగా,

సిద్ధార్థామ్=సిద్ధించిన ప్రయోజనము గల, త్వామ్=నిన్ను, ఆగతస్య=వచ్చిన, రామస్య=రామునియొక్క, అఙ్కాగతాం సతీమ్=అంకమును చేరి యుండగా, క్షిప్రమ్=శీఘ్రముగా, అహమ్=నేను, ద్రక్ష్యామి=చూడగలను.

తా. శత్రువు చంపబడిన పిమ్మట కోరిక తీరినదానవై నీవు నీ వద్దకు వచ్చిన రాముని సమీపమునం దుండగా శీఘ్రముగా చూడగలను. 33

మూ. అశ్రూణ్యానన్దజాని త్వం వర్తయిష్యసి జానకి,
సమాగమ్య పరిష్వక్తా తస్యోరసి మహోరసః. 34

ప్ర. అ. జానకి=జానకీ ! సమాగమ్య=(రాముణ్ణి)చేరి, పరిష్వక్తా=కౌగలించుకొనబడినదానవై, మహోరసః=గొప్ప వక్షఃస్థలము గల, తస్య=ఆ రామునియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, ఆనన్దజాని =ఆనందమువలన కలిగిన, అశ్రూణి=కన్నీళ్లను, వర్తయిష్యసి=ప్రవర్తింపచేయగలవు.

తా. ఓ ! సీతా ! నీవు భర్తను చేరి విశాలమైన వక్షఃస్థలము గల ఆ రాముని వక్షఃస్థలముమీద ఆనందాశ్రువులను రాల్చగలవు. 34

మూ. అచిరాన్మోక్ష్యతే సీతే దేవి తే జఘనం గతామ్,
ధృతామేకాం బహూన్మాసాన్వేణీం రామో మహాబలః. 35

ప్ర. అ. సీతే=సీతా ! దేవి=ఓ ! దేవీ ! మహాబలః=గొప్ప బలము గల, రామః=రాముడు, బహూన్=అనేకమైన, మాసాన్=మాసములను, ధృతామ్=ధరింపబడిన, తే=నీయొక్క, జఘనమ్=జఘనమును, గతామ్=పొందిన, ఏకాం వేణీమ్=ఒంటి జడను, అచిరాత్=అచిరకాలములో, మోక్ష్యతే=విప్పగలడు.

తా. ఓ సీతాదేవీ ! మహాబలశాలియైన రాముడు, నీవు చాలా మాసముల నుండి ధరించుచున్న, నీ కటిప్రదేశమువరకు వ్రేలాడుచున్న ఒంటిజడను కొద్ది దివసములో విప్పగలడు. 35

మూ. తస్య దృష్ట్వా ముఖం దేవి పూర్ణచన్ద్రమివోదితమ్,
మోక్ష్యసే శోకజం వారి నిర్మోకమివ పన్నగీ. 36

ప్ర. అ. దేవి=దేవీ ! తస్య=ఆ రామునియొక్క, ఉదితమ్=ఉదయించిన, పూర్ణచన్ద్రమ్ ఇవ=పూర్ణచంద్రుడు వలె ఉన్న, ముఖమ్=ముఖమును, దృష్ట్వా=చూచి, పన్నగీ=ఆడసర్పము, నిర్మోకమివ=కుబుసమును వలె, శోకజమ్=శోకమువలన కలిగిన, వారి=ఉదకమును, మోక్ష్యసే=విడువగలవు.

తా. ఓ ! దేవీ ! ఆ రాముని ఉదయించిన పూర్ణచంద్రునివంటి ముఖమును చూచి, ఆడసర్పము కుబుసమును విడచినట్లు దుఃఖమువలన

కలిగిన కష్టములను విడువగలవు. 36

మూ. రావణం సమరే హత్వా న చిరాదేవ మైథిలి,
త్వయా సమగ్రః ప్రియయా సుఖార్హో లప్స్యతే సుఖమ్. 37

ప్ర. అ. మైథిలి=సీతా, సుఖార్హః=సుఖమునకు తగిన రాముడు, న చిరాదేవ=కొంచెము కాలములోనే, సమరే=యుద్ధమునందు, రావణమ్=రావణుని, హత్వా=చంపి, ప్రియయా=ప్రియురాలైన, త్వయా=నీతో, సమగ్రః=కూడినవాడై, సుఖమ్=సుఖమును, లప్స్యతే=పొందగలడు.

తా. సుఖములకు తగిన రాముడు కొంచెము కాలములోనే యుద్ధములో రావణుణ్ణి సంహరించి, ప్రియురాలైన నీతో కూడినవాడై, సుఖము పొందగలడు.

మూ. సభాజితా త్వం రామేణ మోదిష్యసి మహాత్మనా,
సువర్షేణ సమాయుక్తా యథా సస్యేన మేదినీ. 38

ప్ర. అ. త్వమ్ =నీవు, సువర్షేణ = మంచి వర్షముతో, సమాయుక్తా = కూడిన, మేదినీ =భూమి, సస్యేన యథా =సస్యముచేత వలె, మహాత్మనా = మహాత్ముడైన, రామేణ =రామునిచేత, సభాజితా =ఆదరించబడినదానవై, మోదిష్యసి = ఆనందించగలవు.

తా. మంచి వర్షములు పడగా సస్యముతో కూడిన భూమి వలె నీవు మహాత్ముడైన రామునితో కూడినదానవై సంతోషించగలవు. 38

మూ. గిరివరమభితో వివర్తమానో
హయ ఇవ మణ్డలమాశు యః కరోతి,
తమిహ శరణమభ్యుపైహి దేవి
దివసకరం ప్రభవో హ్యయం ప్రజానామ్. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. దేవి=ఓ ! దేవీ ! యః=ఏ సూర్యుడు, గిరివరమ్ అభితః=పర్వతశ్రేష్ఠమైన మేరువు చుట్టూ, వివర్తమానః=తిరుగుచు, హయః ఇవ=గుఱ్ఱమువలె, ఆశు=శీఘ్రముగా, మణ్డలమ్=మండలముగా తిరుగుటను, కరోతి=చేయుచుండునో, తమ్=అట్టి, దివసకరమ్=సూర్యుణ్ణి, ఇహ=ఇప్పుడు, శరణమ్=శరణును, అభ్యుపైహి=పొందుము. అయమ్=ఇతడు, ప్రజానామ్=ప్రజలకు, ప్రభవః హి=కారణము కదా.

తా. ఓ ! సీతాదేవీ ! గుఱ్ఱము మండలాకారముగా తిరిగినట్లు ఏ సూర్యుడు మేరుపర్వతము చుట్టూ అతిశీఘ్రముగా తిరుగుచుండునో ఆ

సూర్యుని వలన తరణము పొందుము. ఈ సూర్యుడే ప్రజలకు కారణము కదా? 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుస్త్రింశః సర్గః

[సీత కోరగా సరమ రావణుడు ఏమి చేయుచున్నాడో తెలిసికొని వచ్చి సీతకు చెప్పుట.]

మూ. అథ తాం జాతసంతాపాం తేన వాక్యేన మోదితామ్,
సరమా హ్లాదయామాస మహీం దగ్ధామివామ్భసా. 1

ప్ర. అ. అథ=అటు పిమ్మట, జాతసంతాపామ్=పుట్టిన దుఃఖము కలది, తేన వాక్యేన=ఆ మాటచేత, మోదితామ్=సంతోషపెట్టబడినది అయిన, తామ్=ఆ సీతను, సరమా=సరమ, దగ్ధామ్=కాల్చబడిన, మహీమ్=భూమిని, అమ్భసా ఇవ=నీటిచేత వలె, సమాహ్లాదయామాస=సంతోషపెట్టెను.

తా. చాలా దుఃఖితురాలై ఆ మాటలచేత సంతోషించిన సీతను సరమ, ఎండకు బాగా కాలి ఉన్న భూమిని నీటితో తడిపినట్లు ఇట్లు పలికి ఆనందింపచేసెను. 1

మూ. తతస్తస్యా హితం సఖ్యాశ్చికీర్షన్తీ సఖీ వచః,
ఉవాచ కాలే కాలజ్ఞా స్మితపూర్వాభిభాషిణీ. 2

ప్ర. అ. తతః=అటు పిమ్మట, కాలజ్ఞా=కాలమును ఎరిగినది, స్మితపూర్వాభిభాషిణీ=చిరునవ్వు పూర్వమునందు కలుగునట్లుగా మాటలాడునది, సఖీ=సఖురాలు అయిన ఆ సరమ, సఖ్యాః=సఖురాలైన, తస్యాః=ఆ సీతకు, హితమ్=హితమును, చికీర్షన్తీ=చేయదలచినదై, కాలే=ఆ సమయమునందు, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట ఎప్పుడు ఏమి చేయవలెనో ఎరిగిన, చిరునవ్వుతో మాటలాడు ఆ సరమ సఖురాలైన ఆ సీతకు హితమును చేయవలెనను కోరికతో ఆ సమయమునందు ఇట్లు పలికెను. 2

మూ. ఉత్సహేయమహం గత్వా త్వద్వాక్యమసితేక్షణే,
నివేద్య కుశలం రామే ప్రతిచ్ఛన్నా నివర్తితుమ్. 3

ప్ర. అ. అసితేక్షణే=నల్లని నేత్రములు గలదానా! అహమ్=నేను, ప్రతిచ్ఛన్నా=కప్పబడినదానినై, గత్వా=వెళ్లి, త్వద్వాక్యమ్=నీ వాక్యమును, కుశలమ్=నీ క్షేమమును, రామే=రామునియందు, నివేద్య=తెలిపి, నివర్తితుమ్=తిరిగి వచ్చుటకు, ఉత్సహేయమ్=సమర్థురాలను అయి ఉన్నాను.

తా. నల్లని నేత్రములు గలదానా! సీతా! ఎవరికీ కనబడకుండా వెళ్లి,

నీ వార్తను, క్షేమమును రామునకు తెలిపి తిరిగి రాగలను. 3

మూ. న హి మే క్రమమాణాయా నిరాలమ్బే విహాయసి,
సమర్థో గతిమన్వేతుం పవనో గరుడోఽపి వా. 4

ప్ర. అ. నిరాలమ్బే=ఆధారము లేని, విహాయసి=ఆకాశమునందు, క్రమమాణాయాః=సంచరించుచున్న, మే=నాయొక్క, గతిమ్=గమనమును, అన్వేతుమ్=అనుసరించుటకు, పవనః=వాయువు గాని, గరుడోఽపి వా=గరుత్మంతుడు గాని, న సమర్థః=సమర్థుడు కాదు.

తా. ఏ ఆధారమూ లేని ఆకాశములో ప్రయాణము చేయుచున్న నన్ను వాయువు గాని, గరుత్మంతుడు గాని అనుసరింపలేదు. 4

మూ. ఏవం బ్రువాణం తం సీతా వానరమిద మబ్రవీత్,
మధురం శ్లక్ష్ణయా వాచా పూర్వశోకాభిపన్నయా. 5

ప్ర. అ. సీతా=సీత, ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, తం వానరమ్=ఆ వానరమును గూర్చి, పూర్వశోకాభిపన్నయా=మొదట శోకముతో కూడిన, శ్లక్ష్ణయా=మృదువైన, వాచా=వాక్కుతో, మధురమ్=మధురముగా, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సీత ఈ విధముగా పలుకుచున్న వానరముతో వెనుకటి శోకముతో కలిసి ఉన్న, మృదువైన వాక్కుతో మధురముగా ఇట్లు పలికెను. 5

మూ. సమర్థో గగనం గన్తుమపి చ త్వం రసాతలమ్,
అవగచ్ఛామ్యకర్తవ్యం కర్తవ్యం తే మదన్తరే. 6

ప్ర. అ. త్వమ్=నీవు, గగనమ్=ఆకాశమును గూర్చి, అపిచ=మరియు, రసాతలమ్=పాతాళమును గూర్చి, గన్తుమ్=వెళ్ళుటకు, సమర్థః=సమర్థుడవు. అకర్తవ్యమ్=చేయ శక్యము కానిది కూడ, మదన్తరే=నా నిమిత్తమై, తే=నీకు, కర్తవ్యమ్=చేయదగినదే అని, అవగచ్ఛామి=ఎరుగుదును.

తా. నీవు ఆకాశములోనికి పాతాళమునకు వెళ్లగలవు. ఎంతో కష్టమైన కార్యమును కూడ నా నిమిత్తమై చేసెద వని నాకు తెలియును. 6

మూ. మత్ప్రియం యది కర్తవ్యం యది బుద్ధిః స్థిరా తవ,
జ్ఞాయమిచ్ఛామి తం గత్వా కిం కరోతీతి రావణః. 7

ప్ర. అ. మత్ప్రియమ్=నాకు ప్రియము, కర్తవ్యం యది= చేయదగినట్లయితే, తవ=నీ యొక్క, బుద్ధిః=బుద్ధి, స్థిరా యది=స్థిరమైనట్లయితే, రావణః=

రావణుడు, కిం కరోతి=ఏమి చేయుచున్నాడు అని, తత్=దానిని గూర్చి, గత్వా=వెళ్లి, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. నాకు ప్రియమైన పని చేయవలె నని నీకు స్థిరమైన నిశ్చయము ఉన్నచో నీవు వెళ్లి రావణుడు ఏమి చేయుచున్నాడో తెలిసికొని రావలె నని కోరుచున్నాను. 7

మూ. స హి మాయాబలః క్రూరో రావణః శత్రురావణః,
మాం మోహయతి దుష్టాత్మా పీతమాత్రేవ వారుణీ. 8

ప్ర. అ. మాయాబలః=మాయాబలము గల, శత్రురావణః=శత్రువులను ఏడ్పించు, క్రూరః=క్రూరుడైన, దుష్టాత్మా=దుష్టబుద్ధియైన, సః రావణః=ఆ రావణుడు, పీతమాత్రా=త్రాగబడిన, వారుణీవ=మద్యము వలె, మామ్=నన్ను, మోహయతి=మోహింపచేయుచున్నాడు.

తా. మాయాబలము కలవాడు, క్రూరుడు, శత్రువులను ఏడిపించువాడు, దుష్టబుద్ధి అయిన రావణుడు త్రాగిన వెంటనే మద్యము మోహింపచేసి నట్లు నన్ను మోహింప చేయుచున్నాడు. 8

మూ. తర్జాపయతి మాం నిత్యం భర్త్సాపయతి చాసకృత్,
రాక్షసీభిః సుఘోరాభిర్యా మాం రక్షన్తి నిత్యశః. 9

ప్ర. అ. యాః=ఏ రాక్షసస్త్రీలు, మామ్=నన్ను, నిత్యశః=ఎల్లప్పుడు, రక్షన్తి=రక్షించుచున్నారో, అట్టి, సుఘోరాభిః=చాలా భయంకరలైన, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, మామ్=నన్ను, అసకృత్=మాటిమాటికి, నిత్యమ్=నిత్యమూ, తర్జాపయతి=చేష్టలచేత భయపెట్టించుచున్నాడు. భర్త్సాపయతి=మాటలచేత భయపెట్టించుచున్నాడు.

తా. నిత్యమూ, నాకు కాపలా కాయుచున్న చాల భయంకరలైన రాక్షసస్త్రీలచేత, ఇతడు నన్ను నిత్యమూ, మాటి మాటికీ చేష్టలచేతను మాటలచేతను భయపెట్టించుచున్నాడు. 9

మూ. ఉద్విగ్నా శఙ్కితా చాస్మి న స్వస్థం చ మనో మమ,
తద్భయాచ్చాహముద్విగ్నా అశోకవనికాం గతా. 10

ప్ర. అ. అహమ్=నేను, ఉద్విగ్నా=దిగులు చెందినదానను, శఙ్కితా చ=శంకించినదానను, అస్మి=అయి ఉన్నాను. మమ=నాయొక్క, మనః=మనస్సు, న స్వస్థమ్=స్వస్థముగా లేదు. అహమ్=నేను, అశోకవనికామ్=అశోకవనమును, గతా=పొందినదాననై, తద్భయాత్=వానివలన భయమువలన, ఉద్విగ్నా=దిగులు

చెంది ఉన్నాను.

తా. నేను దిగులు చెంది శంకితురాలనై ఉన్నాను. నా మనస్సు కూడ స్వస్థముగా లేదు. అశోకవనములో ఉన్న నేను ఆతనికి భయపడుచు దిగులుచెంది ఉన్నాను. 10

మూ. యది నామ కథా తస్య నిశ్చితం వాపి యద్భవేత్,
నివేదయేథాః సర్వం తత్పరో మే స్యాదనుగ్రహః. 11

ప్ర. అ. తస్య=వానియొక్క, కథా=వృత్తాంతము, యది నామ= ఉన్నచో, యత్=ఏది, నిశ్చితం వాపి=నిశ్చితమైనది, భవేత్=అగునో, తత్ సర్వమ్=దాని అంతను, నివేదయేథాః=నీవు తెలిపినచో, తత్=అది, మే=నాయొక్క, పరః= గొప్పదైన, అనుగ్రహః=అనుగ్రహము, స్యాత్=అగును.

తా. ఆతనికి సంబంధించిన వృత్తాంతము ఏదైన ఉన్నచో, నిశ్చితమైన విషయ మేదైన ఉన్నచో దానినంతను నీవు తెలిపినచో నా విషయమున గొప్ప అనుగ్రహము చూపినదానవు అగుదువు. 11

మూ. సా హ్యేవం బ్రువతీం సీతాం సరమా మృదుభాషిణీ,
ఉవాచ వదనం తస్యాః స్పృశన్తీ బాష్పవిక్లవమ్. 12

ప్ర. అ. మృదుభాషిణీ=మృదువుగా మాటలాడు, సా=ఆ, సరమాపి= సరమ కూడ, ఏవమ్=ఇట్లు, బ్రువతీమ్=పలుకుచున్న, సీతామ్=సీతను గూర్చి, తస్యాః=ఆమెయొక్క, బాష్పవిక్లవమ్=కన్నీటచేత వ్యాకులమైన, వదనమ్=ముఖ మును, స్పృశన్తీ=స్పృశించుచున్నదై, ఉవాచ=పలికెను.

తా. మృదువుగా మాటలాడు ఆ సరమ కూడ కన్నీటితో వ్యాకులమైన ఆ సీత ముఖమును తుడుచుచు, ఆ విధముగా పలుకుచున్న ఆమెతో ఇట్లనెను. 12

మూ. ఏష తే యద్యభిప్రాయస్తస్మాద్గచ్ఛామి జానకి,
గృహ్య శత్రోరభిప్రాయముపావర్తామి మైథిలి. 13

ప్ర. అ. జానకి=ఓ ! సీతా ! ఏషః=ఇది, తే=నీయొక్క, అభిప్రాయః యది =అభిప్రాయ మైనచో, తస్మాత్=ఆ కారణమువలన, గచ్ఛామి=వెళ్లుచున్నాను. మైథిలి= సీతా ! శత్రోః=శత్రువుయొక్క, అభిప్రాయమ్=అభిప్రాయమును, గృహ్య= గ్రహించి, ఉపావర్తామి=తిరిగి వచ్చెదను.

తా. ఓ ! జానకీ ! నీ అభిప్రాయ మిట్లు ఉన్నచో నేను వెళ్లెదను. ఓ ! మైథిలీ ! శత్రువు అభిప్రాయమును తెలిసికొని వచ్చెదను. 13

మూ. ఏవముక్త్వా తతో గత్వా సమీపం తస్య రక్షసః,
శుశ్రావ కథితం తస్య రావణస్య సమన్త్రిణః. 14

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటుపిమ్మట, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, సమీపమ్= సమీపమును గూర్చి, గత్వా=వెళ్ళి, సమన్త్రిణః=మంత్రులతో కూడిన, తస్య=ఆ, రావణస్య=రావణునియొక్క, కథితమ్ = సంభాషణమును, శుశ్రావ=వినెను.

తా. ఆమె అట్లు పలికి, ఆ రాక్షసుని సమీపమునకు వెళ్ళి మంత్రులతో కూడిన ఆ రావణుని సంభాషణమును వినెను. 14

మూ. సా శ్రుత్వా నిశ్చయం తస్య నిశ్చయజ్ఞా దురాత్మనః,
పునరేవాగమత్ క్షిప్రమశోకవనికాం శుభామ్. 15

ప్ర. అ. నిశ్చయజ్ఞా=నిశ్చయమును ఎరిగిన, సా=ఆమె, దురాత్మనః= దురాత్ముడైన, తస్య=ఆ రావణునియొక్క, నిశ్చయమ్=నిశ్చయమును, శ్రుత్వా= విని, క్షిప్రమ్=శీఘ్రముగా, పునరేవ=మరల, శుభామ్=సుందరమైన, అశోకవనికామ్ =అశోకవనమునుగూర్చి, ఆగమత్=వచ్చెను.

తా. కార్యనిశ్చయములను తెలిసికొన సమర్థురాలైన ఆ సరమ దురాత్ముడైన ఆ రావణుని నిశ్చయమును గూర్చి విని, శీఘ్రముగా అశోకవనమునకు తిరిగి వచ్చెను. 15

మూ. సా ప్రవిష్టా తతస్తత్ర దదర్శ జనకాత్మజామ్,
ప్రతీక్షమాణాం స్వామేవ భ్రష్టపద్మామివ శ్రియమ్. 16

ప్ర. అ. ప్రవిష్టా=ప్రవేశించిన, సా=ఆమె, తత్ర=అక్కడ, స్వామేవ= తననే, ప్రతీక్షమాణామ్=నిరీక్షించుచున్నది, భ్రష్టపద్మామ్ =జారిపోయిన పద్మములు గల, శ్రియమ్ ఇవ =లక్ష్మి వలె ఉన్న, జనకాత్మజామ్=సీతను, దదర్శ=చూచెను.

తా. ఆమె అశోకవనములో ప్రవేశించి పద్మములు లేని లక్ష్మి వలె ఉన్న సీతను చూచెను. ఆమె సరమకొరకే నిరీక్షించుచుండెను. 16

మూ. తాం తు సీతా పునః ప్రాప్తాం సరమాం ప్రియభాషిణీమ్,
పరిష్వజ్య చ సుస్నిగ్ధం దదౌ చ స్వయమాసనమ్. 17

ప్ర. అ. సీతా=సీత, పునః=మరల, ప్రాప్తామ్=వచ్చిన, ప్రియభాషిణీమ్= ప్రియముగా మాటలాడు, సరమామ్=సరమను, సుస్నిగ్ధమ్=స్నేహపూర్వకముగా, పరిష్వజ్య=కౌగిలించుకొని, స్వయమ్=స్వయముగా, ఆసనమ్=ఆసనమును, దదౌ =ఇచ్చెను.

తా. తిరిగి వచ్చిన, మృదుభాషిణి యైన ఆ సరమను సీత స్నేహపూర్వకముగా కౌగిలించుకొని స్వయముగా ఆసన మిచ్చెను. 17

మూ. ఇహాసీనా సుఖం సర్వమాఖ్యాహి మమ తత్త్వతః,
క్రూరస్య నిశ్చయం తస్య రావణస్య దురాత్మనః. 18

ప్ర. అ. ఇహ=ఇక్కడ, సుఖమ్=సుఖముగా, ఆసీనా=కూర్చున్నదానవై, క్రూరస్య=క్రూరుడైన, దురాత్మనః=దుష్టబుద్ధి గల, తస్య రావణస్య=ఆ రావణునియొక్క, నిశ్చయమ్=నిశ్చయమును, సర్వమ్=సర్వమును, మమ=నాకు, తత్త్వతః=యథార్థముగా, ఆఖ్యాహి=చెప్పుము.

తా. నీవు ఈ ఆసనముమీద సుఖముగా కూర్చుండి క్రూరుడు, దురాత్ముడూ అయిన ఆ రావణుని నిశ్చయము నంతను యథార్థముగా చెప్పుము. 18

మూ. ఏవముక్తా తు సరమా సీతయా వేపమానయా,
కథితం సర్వమాచష్ట రావణస్య సమన్త్రిణః. 19

ప్ర. అ. వేపమానయా=వణకిపోవుచున్న, సీతయా=సీతచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలుకబడిన, సరమా=సరమ, సమన్త్రిణః=మంత్రులతో కూడిన, రావణస్య=రావణునియొక్క, సర్వమ్=సమస్తమైన, కథితమ్=సంభాషణమును, ఆచష్ట=చెప్పెను.

తా. భయముతో వణకిపోవుచున్న సీత ఈ విధముగా ప్రశ్నింపగా, సరమ మంత్రిసహితుడైన రావణుని సంభాషణము నంతను చెప్పెను. 19

మూ. జనన్యా రాక్షసేన్ద్రో వై త్వన్మోక్షార్థం బృహద్వచః,
అవిద్ధేన చ వైదేహి మన్త్రివృద్ధేన చోదితః. 20

ప్ర. అ. వైదేహి=సీతా ! త్వన్మోక్షార్థమ్=నిన్ను విడచుట కొరకు, రాక్షసేన్ద్రః=రావణుడు, జనన్యా=తల్లి చేతను, మన్త్రివృద్ధేన=మంత్రులలో వృద్ధుడైన, అవిద్ధేన=అవిద్ధునిచేతను, బృహత్=గొప్పదైన, వచః=వచనమును, చోదితః=పలుకబడినాడు.

తా. సీతా ! నిన్ను విడువవలసిన దని రావణునితో అతని తల్లియైన కైకసి, మంత్రులలో వృద్ధుడైన అవిద్ధుడు ఉత్తమమైన మాటలు పలికిరి. 20

మూ. దీయతామభిసత్కృత్య మనుజేన్ద్రాయ మైథిలీ,
నిదర్శనం తే పర్యాప్తం జనస్థానే యదద్భుతమ్. 21

ప్ర. అ. మనుజేన్ద్రాయ=మానవుల ప్రభువైన రామునికొరకు, అభిసత్కృత్య= సత్కరించి, మైథిలీ =సీత, దీయతామ్=ఇవ్వబడుగాక, జన స్థానే=జనస్థానమునందు, యత్=ఏ, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన విషయము జరిగినదో అది, తే=నీకు, పర్యాప్తమ్=సరిపోవునంత, నిదర్శనమ్=నిదర్శనము.

తా. మానవుల ప్రభువైన రామునకు సత్కారపూర్వకముగా సీతను ఇచ్చివేయుము. జనస్థానములో జరిగిన ఆశ్చర్యకరమైన విషయము రాముడెంతటి వాడో తెలుపుటకు సరిపడిన నిదర్శనము కదా ? 21

మూ. లఙ్ఘనం చ సముద్రస్య దర్శనం చ హనూమతః,
వధం చ రక్షసాం యుద్ధే కః కుర్యాన్మానుషో భువి. 22

ప్ర. అ. హనూమతః=హనుమంతునియొక్క, సముద్రస్య=సముద్రము యొక్క, లఙ్ఘనమ్=దాటుట, దర్శనం చ=సీతను చూచుట కూడ, (తగు నిదర్శనము). మానుషః=మనుష్యుడు, కః=ఎవడు, భువి=ఈ భూలోక ములో, యుద్ధే=యుద్ధమునందు, రక్షసామ్=రాక్షసులయొక్క, వధం చ=వధను, కుర్యాత్=చేయును?

తా. హనుమంతుడు సముద్రమును లంఘించుట, సీతను చూచుట కూడ గొప్ప నిదర్శనములే. ఈ భూలోకములో ఏ మానవుడు యుద్ధములో రాక్షసులను చంపగలడు ? 22

మూ. ఏవం స మన్త్రివృద్ధైశ్చ మాత్రా చ బహు బోధితః,
న త్వాముత్సహతే మోక్తుమర్థమర్థపరో యథా. 23

ప్ర. అ. మన్త్రివృద్ధైః=వృద్ధులైన మంత్రులచేతను, మాత్రా చ=తల్లి చేతను, ఏవమ్=ఇట్లు, బహు=అధికముగా, బోధితః=ప్రేరేపింపబడిన, సః=అతడు, అర్థపరః=ధనమునందు ఆసక్తికలవాడు, అర్థమివ=ధనమును వలె, త్వామ్= నిన్ను, మోక్తుమ్=విడుచుటకు, న ఉత్సహతే=ఇచ్ఛయించుట లేదు.

తా. వృద్ధులైన మంత్రులు, తల్లి ఈ విధముగా ఎంత బోధించినను ఆ రావణుడు ధనమునందు ఆసక్తి గల లోభి ధనమును ఎట్లు విడువజాలడో అట్లే నిన్ను విడువజాలకున్నాడు. 23

మూ. నోత్సహత్యమృతో మోక్తుం యుద్ధే త్వామితి మైథిలి,
సామాత్యస్య నృశంసస్య నిశ్చయో హ్యేష వర్తతే. 24

ప్ర. అ. మైథిలి=సీతా ! యుద్ధే=యుద్ధమునందు, అమృతః=చావనివాడై, త్వామ్=నిన్ను, మోక్తుమ్=విడుచుటకు, నోత్సహతి=ఇచ్ఛయించుట లేదు. ఇతి

=ఈ విధముగా ఏషః=ఇది, సామాత్యస్య=మంత్రులతో కూడిన, నృశంసస్య=క్రూరుడైన ఆ రావణునియొక్క, నిశ్చయః=నిశ్చయము, వర్తతే=ఉన్నది.

తా. సీతా ! అతడు యుద్ధములో మరణించకుండగా నిన్ను విడచుటకు ఇష్టపడుటలేదు. ఇది మంత్రిసహితుడైన ఆ క్రూరుని నిశ్చయము. 24

మూ. తదేషా సుస్థిరా బుద్ధిర్మృత్యులోభాదుపస్థితా,
భయాన్న శక్తస్త్వాం మోక్తు మనిరస్తః స సంయుగే, 25
రాక్షసానాం చ సర్వేషా మాత్మనశ్చ వధేన హి.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, మృత్యులోభాత్=మృత్యువునందు ఆసక్తి వలన, ఏషా=ఈ, సుస్థిరా=చాల స్థిరమైన, బుద్ధిః=బుద్ధి, ఉపస్థితా=వచ్చినది. సః=అతడు, సంయుగే=యుద్ధమునందు, సర్వేషామ్=సమస్తమైన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, ఆత్మనశ్చ=తనయొక్క, వధేన=వధచేత, అనిరస్తః=ఓడింపబడనివాడై, భయాత్=భయమువలన, త్వామ్= నిన్ను, మోక్తుమ్=విడచుటకు, న శక్తః=సమర్థుడు కాడు.

తా. ఈ విధముగా అతనికి ఈ స్థిరమైన, ఆలోచన మృత్యువుకొరకే కలిగినది. అతడు యుద్ధములో సమస్తమైన రాక్షసులతో కలిసి మరణించిన తరువాత నిన్ను విడుచును గాని భయపడి విడచుటకు సిద్ధముగా లేడు. 25

మూ. నిహత్య రావణం సంఖ్యే సర్వథా నిశితైః శరైః, 26
ప్రతినేష్యతి రామస్త్వామయోధ్యామసితేక్షణే.

ప్ర. అ. అసితేక్షణే=నల్లని నేత్రములు గల సీతా ! రామః=రాముడు, సంఖ్యే= యుద్ధమునందు, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, రావణమ్=రావణుని, నిహత్య=చంపి, త్వామ్=నిన్ను, సర్వథా=అన్ని విధములా, అయోధ్యామ్= అయోధ్యను గూర్చి, ప్రతినేష్యతి=తిరిగి తీసికొని వెళ్లగలడు.

తా. నల్లని నేత్రములుగల ఓ ! సీతా ! రాముడు వాడియైన బాణములచేత రావణుణ్ణి యుద్ధములో చంపి తప్పక నిన్ను అయోధ్యకు తిరిగి తీసుకుని వెళ్లగలడు. 26

మూ. ఏతస్మిన్నన్తరే శబ్దో భేరీశఙ్ఖసమాకులః, 27
శ్రుతో వై సర్వసైన్యానాం కమ్పయన్ ధరణీతలమ్.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఈ మధ్యలో, సర్వసైన్యానామ్=సమస్తమైన సైన్యములయొక్క, భేరీశఙ్ఖసమాకులః=భేరీశంఖములచేత వ్యాకులమైన, ధరణీతలమ్=భూమిని, కమ్పయన్= కంపింపచేయుచున్న, శబ్దః=శబ్దము, శ్రుతో

నై=వినబడినది.

తా. ఇంతలో భూమిని కంపింపచేయుచు, సమస్తసైన్యముల ధ్వని భేరీధ్వనితో కలిసి వినవచ్చెను. 27

మూ. శ్రుత్వా తు తం వానరసైన్యనాదం
లఙ్కాగతా రాక్షసరాజభృత్యాః,
హతౌజసో దైన్యపరీతచేష్టాః
శ్రేయో న పశ్యన్తి నృపస్య దోషాత్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుస్త్రింశః సర్గః

ప్ర. అ. తమ్=ఆ, వానరసైన్యనాదమ్=వానరసైన్యముయొక్క ధ్వనిని, శ్రుత్వా=విని, లఙ్కాగతాః=లంకలో ఉన్న, రాక్షసరాజభృత్యాః=రావణుని భృత్యులు, హతౌజసః= నశింపచేయబడిన తేజస్సు కలవారై, దైన్యపరీతచేష్టాః=దైన్యముతో నిండిన చేష్టలవారై, నృపస్య= రాజుయొక్క, దోషాత్=దోషమువలన, శ్రేయః=శ్రేయస్సును, న పశ్యన్తి=చూడలేరు.

తా. ఆ వానరసేనాశబ్దమును వినగానే లంకలో ఉన్న, రావణుని పరిపాలనలో ఉన్న ప్రజల తేజస్సు నశించెను. దైన్యముచేత వాళ్ల చేష్టలన్నీ కుంటుపడెను. ఈ విధముగా రాజు చేసిన అపరాధమునకు ఫలితముగా వాళ్లు శ్రేయస్సును కోల్పోయిరి. 28

"బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదినాల్గవసర్గ సమాప్తము.

# అథ పఞ్చత్రింశః సర్గః

[మాల్యవంతుడు లంకలో కనబడుచున్న దుశ్శకునములను గూర్చి వర్ణించి చెప్పి రామునితో సంధి చేసికొనుమని రావణునకు బోధించుట.]

మూ. తేన శఙ్ఖవిమిశ్రేణ భేరీశబ్దేన నాదినా,
ఉపయాతి మహాబాహూ రామః పరపురంజయః. 1

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, పరపురంజయః=శత్రుపురములను జయించు, రామః=రాముడు, శఙ్ఖవిమిశ్రేణ=శంఖధ్వనితో కూడిన, నాదినా=గొప్ప నాదముగల, భేరీశబ్దేన=భేరీ శబ్దముతో, ఉపయాతి=వచ్చుచున్నాడు.

తా. శంఖధ్వనితో కూడిన గొప్ప నాదము గల భేరీధ్వనితో శత్రుపురములను జయించువాడు, మహాబాహువు అయిన రాముడు వచ్చెను. 1

మూ. తం నినాదం నిశమ్యాథ రావణో రాక్షసేశ్వరః,
ముహూర్తం ధ్యానమాస్థాయ సచివానభ్యుదైక్షత. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రాక్షసేశ్వరః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, తమ్=ఆ, నినాదమ్=ధ్వనిని, నిశమ్య=విని, ముహూర్తమ్=ముహూర్తకాలము, ధ్యానమ్=ధ్యానమును, ఆస్థాయ=అవలంబించి, సచివాన్=మంత్రులను, అభ్యుదైక్షత= చూచెను.

తా. రాక్షసరాజైన రావణుడు అప్పుడు ఆ ధ్వని విని, ముహూర్తకాలము ఏదో ఆలోచించి, మంత్రుల వైపు చూచెను. 2

మూ. అథ తాన్సచివాంస్తత్ర సర్వానాభాష్య రావణః,
సభాం సంనాదయన్ సర్వామిత్యువాచ మహాబలః, 3
జగత్సంతాపనః క్రూరో గర్హయన్ రాక్షసేశ్వరః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాబలః=గొప్ప బలముగల, జగత్సంతాపనః= జగత్తును పీడించువాడు, క్రూరః=క్రూరుడు, రాక్షసేశ్వరః=రాక్షసరాజు అయిన, రావణః= రావణుడు, తత్ర=అక్కడ, సర్వాన్=సమస్తమైన, సచివాన్=మంత్రులను, ఆభాష్య= పలకరించి, సర్వామ్=సమస్తమైన, సభామ్=సభను, సంనాదయన్=ధ్వనింపచేయుచు, గర్హయన్=నిందించుచు, ఇతి=ఇట్లు, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట మహాబలశాలి, జగత్తును పీడించువాడు, క్రూరుడు, రాక్షసరాజు అయిన రావణుడు అక్కడ ఉన్న మంత్రులందరిని పలకరించి, నిందించుచు సభ అంతా మారుమ్రోగునట్లు ఇట్లు పలికెను. 3

మూ. తరణం సాగరస్యాస్య విక్రమం బలపౌరుషమ్, 4
యదుక్తవన్తో రామస్య భవన్తస్తన్మయా శ్రుతమ్.

ప్ర. అ. భవన్తః=మీరు, రామస్య=రామునియొక్క, యత్=ఏ, అస్య సాగరస్య=ఈ సముద్రముయొక్క, తరణమ్=దాటుటను, విక్రమమ్= పరాక్రమమును, బలపౌరుషమ్=బలమును, పౌరుషమును, ఉక్తవన్తః=చెప్పినారో, తత్=అది, మయా=నాచేత, శ్రుతమ్=వినబడినది.

తా. రాముడు సముద్రమును దాటిన విషయమును, అతని పరాక్రమము, బలము, పౌరుషము — వీటి విషయమును మీరు చెప్పగా వింటిని. 4

మూ. భవతశ్చాప్యహం వేద్మి యుద్ధే సత్యపరాక్రమాన్, 5
తూష్ణీకానీక్షతోఽన్యోన్యం విదిత్వా రామవిక్రమమ్.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, సత్యపరాక్రమాన్=సత్యమైన పరాక్రమముగలవారు, రామవిక్రమమ్=రాముని పరాక్రమమును, విదిత్వా=తెలిసికొని, తూష్ణీకాన్=ఊరికే ఉన్న, అన్యోన్యమ్=పరస్పరము, ఈక్షతః=చూచుచున్న, భవతశ్చాపి=మిమ్ములను కూడ, అహమ్=నేను, వేద్మి=ఎరుగుదును.

తా. యుద్ధమునందు సత్యమైన పరాక్రమము గల మీరు రాముని పరాక్రమము తెలిసికొని, ఏమీ చేయకుండా, ఒకరి మొగము ఒకరు చూచుకొనుచు కూర్చొని ఉన్నారను విషయము కూడ నాకు తెలియును. 5

మూ. తతస్తు సుమహాప్రాజ్ఞో మాల్యవాన్నామ రాక్షసః, 6
రావణస్య వచః శ్రుత్వా ఇతి మాతామహోఽబ్రవీత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుమహాప్రాజ్ఞః=చాల బుద్ధిమంతుడు, మాతామహః=మాతామహుడు అయిన, మాల్యవాన్ నామ=మాల్యవంతుడను, రాక్షసః= రాక్షసుడు, రావణస్య=రావణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, ఇతి= ఇట్లు, అబ్రవీత్=పలికెను.

తా. రావణుని మాటలు విని, గొప్ప బుద్ధి గలవాడు, అతని మాతామహుడూ అయిన మాల్యవంతుడను రాక్షసుడు ఇట్లు పలికెను. 6

మూ. విద్యాస్వభివినీతో యో రాజా రాజన్నయానుగః, 7
స శాస్తి చిరమైశ్వర్యమరీంశ్చ కురుతే వశే.

ప్ర. అ. రాజన్=రాజా ! యః=ఏ, రాజా=రాజు, విద్యాసు=విద్యలయందు, అభివినీతః=బాగుగా శిక్షణము ఇవ్వబడినాడో, నయానుగః=నీతిని అనుసరించువాడో, సః= అతడు, చిరమ్=చిరకాలము, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, శాస్తి=పాలించును.

అరీంశ్చ=శత్రువులను కూడ, వశే=వశమునందు, కురుతే=చేసికొనును.

తా. రాజా! విద్యలు బాగుగా అభ్యసించి నీతిమార్గమును అనుసరించు రాజు చిరకాలము ఐశ్వర్యమును పాలించును. శత్రువులను వశములో ఉంచుకొనగలుగును. 7

మూ. సంధధానో హి కాలేన విగృహ్ణంశ్చారిభిః సహ, 8
స్వపక్షే వర్ధనం కుర్వన్మహదైశ్వర్యమశ్నుతే.

ప్ర. అ. కాలేన=కాలముచేత, అరిభిః=శత్రువులతో కూడ, సంధ ధానః=సంధి చేసికొనువాడు, విగృహ్ణన్ చ=విరోధము చేయువాడు అయిన రాజు, స్వపక్షే=తన పక్షమునందు, వర్ధనమ్=వృద్ధిని, కుర్వన్=చేయుచు, మహత్=గొప్ప, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, అశ్నుతే=పొందును.

తా. సమయానుసారముగా శత్రువులతో సంధి చేసుకొనువాడు, వారితో విరోధము పెట్టుకొనువాడు అయిన రాజు తన పక్షమునకు అభివృద్ధి చేకూర్చుకొనుచు గొప్ప ఐశ్వర్యమును పొందును. 8

మూ. హీయమానేన కర్తవ్యో రాజ్ఞా సంధిః సమేన చ, 9
న శత్రుమవమన్యేత జ్యాయాన్ కుర్వీత విగ్రహమ్.

ప్ర. అ. హీయమానేన=తగ్గిపోయినవాడు గాని, సమేన చ=సమముగా ఉన్నవాడు గాని అయిన, రాజ్ఞా=రాజుచేత, సంధిః=సంధి, కర్తవ్యః=చేయదగినది. శత్రుమ్=శత్రువును, న అవమన్యేత=అవమానించకూడదు. జ్యాయాన్=గొప్ప వాడు, విగ్రహమ్=విరోధమును, కుర్వీత=చేయవలెను.

తా. రాజు, తాను శత్రువుకంటె దుర్బలుడుగా గాని, సమబలము కలవాడుగా గాని ఉన్నప్పుడు అతనితో సంధి చేసికొనవలెను. శత్రువుకంటె ఎక్కువ బలముగా ఉన్నప్పుడు విరోధము కొనసాగించవలెను. 9

మూ. తన్మహ్యం రోచతే సంధిః సహ రామేణ రావణ, 10
యదర్థమభియుక్తోఽసి సీతా తస్మై ప్రదీయతామ్.

ప్ర. అ. రావణ=ఓ ! రావణా ! తత్=ఆ కారణమువలన, రామేణ సహ=రామునితో కూడ, సంధిః=సంధి, మహ్యమ్=నాకు, రోచతే=ఇష్టమగుచున్నది. యదర్థమ్=ఏ సీత నిమిత్తము, అభియుక్తః అసి=ఎదిరింపబడుచున్నావో, సీతా=ఆ సీత, తస్మై=వానికి, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. రావణా ! అందువలన నీవు రామునితో సంధి చేసికొనుట నాకు ఇష్టము. ఏ సీత కొరకై రాముడు నీ మీద దండెత్తి వచ్చినాడో ఆ సీతను

అతనికి ఇచ్చివేయుము. 10

మూ. తస్య దేవర్షయః సర్వే గన్ధర్వాశ్చ జయైషిణః, 11
విరోధం మా గమస్తేన సంధిస్తే తేన రోచతామ్.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, దేవర్షయః=దేవతలు, ఋషులు, గన్ధర్వాశ్చ=గంధర్వులు, తస్య=ఆ రామునియొక్క, జయైషిణః=జయమును కోరువారు. తేన= వానితో, విరోధమ్=విరోధమును, మా గమః=పొందకుము. తే=నీకు, తేన= వానితో, సంధిః=సంధి, రోచతామ్=ఇష్టముగుగాక.

తా. దేవతలు, ఋషులు, గంధర్వులు, వీరందరూ ఆ రామునకే జయము కలుగవలెనని కోరుచున్నారు. ఆ రామునితో విరోధము చేయకుము. అతనితో సంధి చేసికొనుటకు నీవు ఇష్టపడుము. 11

మూ. అసృజద్భగవాన్పక్షౌ ద్వావేవ హి పితామహః, 12
సురాణా మసురాణాం చ ధర్మాధర్మౌ తదాశ్రయౌ.

ప్ర. అ. భగవాన్=భగవంతుడైన, పితామహః=బ్రహ్మదేవుడు, సురాణాం చ= దేవతలయొక్క, అసురాణాం చ=అసురులయొక్క, ద్వౌ= రెండు, పక్షౌ ఏవ=పక్షములనే, అసృజత్=సృష్టించెను. ధర్మాధర్మౌ=ధర్మాధర్మములు, తదాశ్రయౌ=ఆ రెండు పక్షములకే ఆశ్రయములుగా గలవి.

తా. భగవంతుడైన బ్రహ్మదేవుడు సురుల పక్షము, అసురుల పక్షము అని రెండు పక్షములనే సృజించెను. సురులు ధర్మమును, అసురులు అధర్మమును ఆశ్రయించి ఉందురు. 12

మూ. ధర్మో హి శ్రూయతే పక్ష అమరాణాం మహాత్మనామ్, 13
అధర్మో రక్షసాం పక్షో హ్యసురాణాం చ రాక్షస.

ప్ర. అ. రాక్షస=రావణా! ధర్మః=ధర్మము, మహాత్మనామ్=మహాత్ములైన, అమరాణామ్=దేవతలయొక్క, పక్షః=పక్షముగా, శ్రూయతే=వినబడుచున్నది. అధర్మః= అధర్మము, రక్షసామ్=రాక్షసులయొక్క, అసురాణాం చ=అసురులయొక్క, పక్షః హి= పక్షము కదా.

తా. రావణా! ధర్మము మహాత్ములైన దేవతల పక్ష మని, అధర్మము రాక్షసుల, అసురుల పక్షము అని వినబడుచున్నది. 13

మూ. ధర్మో వై గ్రసతేఽధర్మం యదా కృత మభూద్యుగమ్, 14
అధర్మో గ్రసతే ధర్మం తదా తిష్యః ప్రవర్తతే.

ప్ర. అ. ధర్మః=ధర్మము, యదా=ఎప్పుడు, అధర్మమ్=అధర్మ

మును, గ్రసతే=మ్రింగి వేయునో అప్పుడు, కృతం యుగమ్=కృతయుగము, అభూత్=ఆయెను. అధర్మః=అధర్మము, ధర్మమ్=ధర్మమును, గ్రసతే=ఎప్పుడు మ్రింగివేయునో, తదా=అప్పుడు, తిష్యః=కలియుగము, ప్రవర్తతే=ప్రవర్తించును.

తా. ధర్మము అధర్మమును ఆగ్రసించినప్పుడు కృతయుగము ఆవిర్భవించును. అధర్మము ధర్మమును ఆక్రమించినప్పుడు కలియుగము ప్రవర్తించును. 14

మూ. తత్త్వయా చరతా లోకాన్ ధర్మోఽపి విహతో మహాన్, 15
అధర్మః ప్రగృహీతశ్చ తేనాస్మద్బలినః పరే.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, లోకాన్=లోకములను, చరతా=సంచరించుచున్న, త్వయా=నీచేత, మహాన్=గొప్పదైన, ధర్మోఽపి=ధర్మము కూడ, విహతః= పీడింపబడినది. అధర్మః=అధర్మము, ప్రగృహీతశ్చ=గ్రహింపబడినది కూడ. తేన=ఆ కారణముచేతనే, పరే=శత్రువులు, అస్మత్=మనకంటె, బలినః=బలవంతులు.

తా. నీవు లోకములలో సంచరించుచు గొప్ప ధర్మమును నాశనమొనర్చితివి. అధర్మమును కూడ స్వీకరించితివి. అందుచేతనే శత్రువులు మనకంటె బలముగా ఉన్నారు. 15

మూ. స ప్రమాదాద్వివృద్ధస్తేఽధర్మో హి గ్రసతే హి నః 16
వివర్ధయతి పక్షం చ సురాణాం సురభావనః.

ప్ర. అ. తే=నీయొక్క, ప్రమాదాత్=పొరబాటువలన, ప్రవృద్ధః=వృద్ధిచెందిన, సః=ఆ, అధర్మః=అధర్మము, నః=మనలను, గ్రసతే హి=మ్రింగివేయుచున్నది గదా. సురభావనః=సురులకు అనుకూలమై, సురాణామ్=సురులయొక్క, పక్షమ్=పక్షమును, వివర్ధయతి చ=వృద్ధి పొందించుచున్నది.

తా. నీవు చేసిన పొరబాటువలన వృద్ధి పొందిన ఆ అధర్మము మనలను మ్రింగివేయుచున్నది. సురులకు అనుకూలమై వారి పక్షమును వృద్ధిపొందించుచున్నది. 16

మూ. విషయేషు ప్రసక్తేన యత్కించిత్కారిణా త్వయా, 17
ఋషీణామగ్నికల్పానాముద్వేగో జనితో మహాన్.

ప్ర. అ. విషయేషు=భోగములయందు, ప్రసక్తేన=ఆసక్తుడవైన, యత్కించిత్కారిణా=ఏమేమో చేయుచున్న, త్వయా=నీచేత, అగ్నికల్పానామ్=అగ్నితో సమానులైన, ఋషీణామ్=ఋషులకు, మహాన్=గొప్ప, ఉద్వేగః=భయము, జనితః=పుట్టింపబ

డినది.

తా. భోగములయందు ఆసక్తుడవై ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించిన నీవు అగ్నితో సమానులైన ఋషులకు గొప్ప భయము కలిగించితివి. 17

మూ. తేషాం ప్రభావో దుర్ధర్షః ప్రదీప్త ఇవ పావకః. 18
తపసా భావితాత్మానో ధర్మస్యానుగ్రహే రతాః,
ముఖ్యైర్యజ్ఞైర్యజన్త్యేతే నిత్యైస్తైస్తైర్ద్విజాతయః. 19
జుహ్వత్యగ్నీంశ్చ విధివద్వేదాంశ్చోచ్చైరధీయతే,
అభిభూయ చ రక్షాంసి బ్రహ్మఘోషానుదైరయన్, 20
దిశో విప్రద్రుతాః సర్వే స్తనయిత్నురివోష్ణగే.

ప్ర. అ. తేషామ్=ఆ ఋషులయొక్క, ప్రభావః=ప్రభావము, ప్రదీప్తః=మండుచున్న, పావకః ఇవ=అగ్ని వలె, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానిది. తపసా=తపస్సుచేత, భావితాత్మానః=పరిశుద్ధము చేయబడిన మనస్సులు గల, ధర్మస్య=ధర్మముయొక్క, అనుగ్రహే=అనుగ్రహమునందు, రతాః=ఆసక్తులైన, ఏతే=అట్టి ఈ, ద్విజాతయః=ద్విజులు, తైః తైః=ఆ యా, ముఖ్యైః=ముఖ్యములైన, యజ్ఞైః=యజ్ఞములచేత, యజ్=ఏకారణమువలన, యజన్తి=దేవతలను పూజించుచుండురో, అగ్నీంశ్చ= అగ్నులను, జుహ్వతి=హోమము చేయుచుందురో, విధివత్=యథాశాస్త్రముగా, వేదాన్=వేదములను, ఉచ్చైః=బిగ్గరగా, అధీయతే=చదువుచుందురో, రక్షాంసి= రాక్షసులను, అభిభూయ=తిరస్కరించి, బ్రహ్మఘోషాన్=బ్రహ్మఘోషములను, ఉదైరయన్= ఉచ్చరించిరో, అందువలన, సర్వే=రాక్షసు లందరూ, ఉష్ణగే=గ్రీష్మమునందు, స్తనయిత్నుః ఇవ=మేఘమువలె, దిశః=దిక్కులను గూర్చి, విప్రద్రుతాః=పారిపోయిరి.

తా. ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఋషీశ్వరుల ప్రభావము ఎదిరింప శక్యము కానిది. ఈ ఋషుల మనస్సులు తపస్సుచేత పవిత్రమైనవి. వీరు ధర్మమును అభివృద్ధిచెందించుటయందు ఆసక్తి కలవారు. ఈ ద్విజులు ముఖ్యములైన యజ్ఞములు చేయుచు, అగ్నులలో హోమము చేయుచు, యథావిధిగా వేదములను బిగ్గరగా పఠించుచు, రాక్షసులను తిరస్కరించి వేదఘోషములను చేయుగా, ఆ రాక్షసులందరూ, గ్రీష్మమునందు మేఘములు వలె పారిపోవుచుందురు. 18-20

మూ. ఋషీణామగ్నికల్పానామగ్నిహోత్రసముత్థితః, 21
ఆదత్తే రక్షసాం తేజో ధూమో వ్యాప్య దిశో దశ.

ప్ర. అ. అగ్నికల్పానామ్=అగ్నితో సమానులైన, ఋషీణామ్=ఋషులయొక్క, అగ్నిహోత్రసముత్థితః=అగ్నిహోత్రములనుండి పైకి లేచిన, ధూమః=ధూమము,

దిశః=పది, దిశః=దిక్కులను, వ్యాప్య=వ్యాపించి, రక్షసామ్=రాక్షసులయొక్క, తేజః=తేజస్సును, అరత్=గ్రహించును.

తా. అగ్నితో సమానులైన ఋషీశ్వరుల అగ్నిహోత్రములనుండి లేచిన ధూమము పదిదిక్కులయందు వ్యాపించి, రాక్షసుల తేజస్సును హరించును.

మూ. తేషు తేషు చ దేశేషు పుణ్యేష్వేవధృతవ్రతైః, 22
చర్యమాణం తపస్తీవ్రం సంతాపయతి రాక్షసాన్.

ప్ర. అ. పుణ్యేష్వేవధృతవ్రతైః=పుణ్యమైన యజ్ఞములయందు ధరింపబడిన నియమములు గల ఋషుల చేత, తేషు తేషు=ఆ యా, దేశేషు=దేశముల యందు, చర్యమాణమ్= ఆచరింపబడుచున్న, తీవ్రమ్=తీవ్రమైన, తపః=తపస్సు, రాక్షసాన్=రాక్షసులను, సంతాపయతి=తపింపచేయును.

తా. పవిత్రములైన యజ్ఞములు చేయుటకై నియమము అవలంబించి, ఆ యా దేశములలో ఈ ఋషులు చేయు తీవ్రమైన తపస్సు రాక్షసులను తపింపచేయును. 22

మూ. దేవదానవయక్షేభ్యో గృహీతశ్చ వరస్త్వయా, 23
మనుష్యా వానరా ఋక్షా గోలాఙ్గూలా మహాబలాః,
బలవన్త ఇహాగమ్య గర్జన్తి దృఢవిక్రమాః. 24

ప్ర. అ. త్వయా=నీచేత, దేవదానవయక్షేభ్యః=దేవతలవలన, దానవులవలన, యక్షులవలన, వరః=వరము, గృహీతః=గ్రహింపబడినది. బలవన్తః=బలము గల, దృఢవిక్రమాః= దృఢమైన పరాక్రమము గల, మహాబలాః=గొప్ప బలము గల, మనుష్యాః=మనుష్యులు, వానరాః=వానరులు, ఋక్షాః=భల్లూకములు, గోలాఙ్గూలాః=గోలాంగూలములు, ఇహ=ఇచటికి, ఆగమ్య=వచ్చి, గర్జన్తి=గర్జించు చున్నారు.

తా. దేవ - దానవ - యక్షులనుండి భయము లేకుండునట్లు నీవు వరము తీసికొంటివి. కాని ఇప్పుడు గొప్ప బలము, దృఢమైన పరాక్రమము గల మనుష్యులు, వానరులు, భల్లూకములు, గోలాంగూలములు వచ్చి గర్జించుచున్నారు. 23, 24

మూ. ఉత్పాతాన్ వివిధాన్ దృష్ట్వా ఘోరాన్బహువిధాంస్తథా,
వినాశమనుపశ్యామి సర్వేషాం రక్షసామహమ్. 25

ప్ర. అ. వివిధాన్=అనేకవిధములైన, ఉత్పాతాన్=ఉత్పాతములను (చెడుశకునములను), తథా=మరియు, బహువిధాన్=అనేకవిధములైన, ఘోరాన్=ఘోర

ములను, దృష్ట్వా=చూచి, అహమ్=నేను, సర్వేషామ్=సమస్తమైన, రక్షసామ్=రాక్ష సులయొక్క, వినాశమ్=వినాశమును, అనుపశ్యామి=ఊహించుచున్నాను.

తా. నాకు అనేకవిధములైన ఉత్పాతములు, బహువిధములైన ఘోరవిష యములు కనబడుచున్నవి. అందుచే రాక్షసు లందరికీ వినాశము రానున్న దని భావించుచున్నాను. 25

మూ. ఖరాభిస్తనితా ఘోరా మేఘాః ప్రతిభయంకరాః,
శోణితేనాభివర్షన్తి లఙ్కాముష్ణేన సర్వతః. 26

ప్ర. అ. ఖరాభిస్తనితాః=పరుషమైన గర్జనము గల, ఘోరాః=వికృ తరూపములు గల, ప్రతిభయంకరాః=భయంకరములైన, మేఘాః=మేఘములు, లఙ్కామ్=లంకను, సర్వతః=అంతటా, ఉష్ణేన=వెచ్చని, శోణితేన=రక్తముచేత, అభివర్షన్తి= వర్షించుచున్నవి.

తా. వికృతములైన ఆకారములతో పరుషముగా గర్జించుచున్న భయంక రములైన మేఘములు లంకయందు అంతటా వెచ్చని రక్తము వర్షించుచున్నవి.

మూ. రుదతాం వాహనానాం చ ప్రపతన్త్యస్రబిన్దవః,
రజోధ్వస్తా వివర్ణాశ్చ న ప్రభాన్తి యథాపురమ్. 27

ప్ర. అ. రుదతామ్=ఏడ్చుచున్న, వాహనానామ్=గజాశ్వాదులయొక్క, అస్రబిన్దవః=కన్నీటి బిందువులు, ప్రపతన్తి=పడుచున్నవి. (దిక్కులు లేదా అశ్వాదులు) రజోధ్వస్తాః= పరాగము చేత పాడుపడినవై, వివర్ణాః=వికృతవర్ణములు గలవై, యథాపురమ్=పూర్వమునందు వలె, న ప్రభాన్తి=ప్రకాశించుట లేదు.

తా. గజాశ్వాదివాహనములు ఏడ్చుచు కన్నీటి బిందువులు కార్చుచున్నవి. ఆ గజాశ్వాదులు దుమ్ము కొట్టుకొని చెడిన వర్ణము గలవై పూర్వము వలె ప్రకాశించుట లేదు. 27

మూ. వ్యాలా గోమాయవో గృధ్రా వాశ్యన్తి చ సుభైరవమ్,
ప్రవిశ్య లఙ్కామారామే సమవాయాంశ్చ కుర్వతే. 28

ప్ర. అ. వ్యాలాః=మాంసమును భక్షించు క్రూరమృగములు, గోమా యవః=నక్కలు, గృధ్రాః=గ్రద్దలు, సుభైరవమ్=చాల భయంకరముగా, వాశ్యన్తి=ధ్వని చేయుచున్నవి. లఙ్కామ్=లంకను, ప్రవిశ్య=ప్రవేశించి, ఆరామే=ఉద్యానమునందు, సమవాయాన్ చ=సంఘములను కూడ, కుర్వతే=చేయుచున్నవి.

తా. మాంసము తినే క్రూరమృగములు, నక్కలు, గ్రద్దలు చాల భయంకరముగా అరచుచున్నవి. అవి లంకలో ప్రవేశించి, ఉద్యానములో

గుంపులుగా ఏర్పడుచున్నవి. 28

మూ. కాలికాః పాణ్డురైర్దన్తైః ప్రహసన్త్యగ్రతః స్థితాః,
స్త్రియః స్వప్నేషు ముష్ణన్త్యో గృహాణి ప్రతిభాష్య చ. 29

ప్ర. అ. కాలికాః=నల్లని, స్త్రియః=స్త్రీలు, స్వప్నేషు=స్వప్నములయందు, ప్రతిభాష్య=ప్రతికూలముగా మాటలాడుచు, గృహాణి=గృహములను, ముష్ణన్త్యః= దొంగిలించుచు, అగ్రతః=ఎదుట, స్థితాః=నిలబడినవారై, పాణ్డురైః=తెల్లని, దన్తైః=దంతములతో, ప్రహసన్తి=నవ్వుచున్నారు.

తా. నల్లని ఆకారము గల స్త్రీలు ప్రతికూలముగా మాటలాడుచు, ఇళ్లను దోచుకొనుచు, ఎదురుగా నిలబడి తెల్లని పళ్లు కనబడేటట్లు నవ్వుచున్నట్లుగా స్వప్నములలో కనబడుచున్నారు. 29

మూ. గృహాణాం బలికర్మాణి శ్వానః పర్యుపభుఞ్జతే,
ఖరా గోషు ప్రజాయన్తే మూషకా నకులేషు చ. 30

ప్ర. అ. గృహాణామ్=గృహములయొక్క, బలికర్మాణి=దేవతాబలులుగా వేసిన అన్నాదులను, శ్వానః=కుక్కలు, పర్యుపభుఞ్జతే=తినుచున్నవి. గోషు=ఆవులలో, ఖరాః= గాడిదలు, ప్రజాయన్తే=పుట్టుచున్నవి. నకులేషు=ముంగిసలయందు, మూషకాః చ= ఎలుకలు పుట్టుచున్నవి.

తా. దేవతలకొరకు వేసిన కాకులు మొదలైనవి తినవలసిన బలులను కుక్కలు తినుచున్నవి. ఆవులకు గాడిదలు, ముంగిసలకు ఎలుకలు పుట్టుచున్నవి.

మూ. మార్జారా ద్వీపిభిః సార్ధం సూకరాః శునకైః సహ,
కింనరా రాక్షసైశ్చాపి సమేయుర్మానుషైః సహ. 31

ప్ర. అ. మార్జారాః=పిల్లులు, ద్వీపిభిః సార్ధమ్=పులులతోను, సూకరాః= పందులు, శునకైః సహ=కుక్కలతోను, కింనరాః=కింనరులు, రాక్షసైశ్చాపి= రాక్షసులతోను, (రాక్షసులు) మానుషైః సహ=మనుష్యులతోను, సమేయుః=కలిసినారు.

తా. పిల్లులు పులులతోను, పందులు కుక్కలతోను, కింనరులు రాక్షసులతోను, రాక్షసులు మనుష్యులతోను కలియుచున్నట్లు కనబడుచున్నారు.31

మూ. పాణ్డురా రక్తపాదాశ్చ విహగాః కాలచోదితాః,
రాక్షసానాం వినాశాయ కపోతా విచరన్తి చ. 32

ప్ర. అ. పాణ్డురాః=తెల్లనివి, రక్తపాదాశ్చ=ఎఱ్ఱని పాదములు గలవి

అయిన, కపోతాః=పావురము లను, విహగాః=పక్షులు, కాలచోదితాః=కాలముచేత ప్రేరేపింపబడినవై, రాక్షసానామ్=రాక్షసులయొక్క, వినాశాయ=వినాశముకొరకు, విచరన్తి= సంచరించుచున్నవి.

తా. ఎఱ్ఱని పాదములు గల తెల్లని పావురములు, కాలముచేత ప్రేరేపింపబడినవై, రాక్షసుల వినాశమును సూచించుచు సంచరించుచున్నవి.32

మూ. చీచీకూచీతి వాశన్త్యః శారికా వేశ్మసు స్థితాః,
పతన్తి గ్రథితాశ్చాపి నిర్జితాః కలహైషిభిః. 33

ప్ర. అ. వేశ్మసు=ఇళ్లలో, స్థితాః=ఉన్న, శారికాః=గోరింకలు, కలహైషిభిః= కలహమును కోరుచున్న పక్షులచేత, నిర్జితాః=జయింపబడినవై, చీచీకూచీతి=చీచీ కూచీ అని, వాశన్త్యః=అరచుచు, గ్రథితాశ్చాపి=సముదాయముగా ఏర్పడినవై, పతన్తి=పడుచున్నవి.

తా. ఇళ్లల్లో ఉన్న గోరింకలు కలహించే ఇతరపక్షులచేత జయింపబడి, కిచకిచలాడుచు, చుట్టబెట్టుకొని నేలమీద పడుచున్నవి. 33

మూ. పక్షిణశ్చ మృగాః సర్వే ప్రత్యాదిత్యం రుదన్తి తే,
కరాలో వికటో ముణ్డః పరుషః కృష్ణపిఙ్గలః. 34
కాలో గృహాణి సర్వేషాం కాలే కాలేన్వవేక్షతే,
ఏతాన్యన్యాని దుష్టాని నిమిత్తాన్యుత్పతన్తి చ. 35

ప్ర. అ. పక్షిణః=పక్షులు, తేః=ఆ, సర్వే=సమస్తమైన, మృగాః= మృగములు, ప్రత్యాదిత్యమ్=సూర్యునకు ఎదురుగా, రుదన్తి=ఏడ్చుచున్నవి. కరాలః= భయంకరుడు, వికటః=వికృతమైన ఆకారము కలవాడు, ముణ్డః=బట్టతలవాడు, పరుషః=క్రూరుడు, కృష్ణపిఙ్గలః=నల్లగా ధూమ్రవర్ణముతో ఉన్నవాడు అయిన, కాలః=మృత్యువు, కాలే కాలే=సాయంప్రాతఃకాలములయందు, సర్వేషామ్=అందరియొక్క, గృహాణి=గృహములను, అన్వవేక్షతే=చూచుచున్నాడు. ఏతాని=ఇవి, అన్యాని= ఇతరములైన, దుష్టాని నిమిత్తాని చ=దుష్టశకునములు, ఉత్పతన్తి=బయలుదేరుచున్నవి.

తా. అన్ని పక్షులు, మృగములు సూర్యుని వైపు తిరిగి ఏడ్చుచున్నవి. భయంకరుడు వికృతమైన ఆకారము గలవాడు, బోడితలవాడు, క్రూరుడు, నల్లగా ధూమ్రవర్ణముతో ఉన్నవాడు అయిన కాలుడు (మృత్యుదేవత) ప్రాతస్సాయంకాల సంధ్యాసమయములయందు అందరి ఇళ్లలోనికి చూచుచున్నాడు. ఇవే కాక ఇంకా

మరికొన్ని దుశ్శకునములు కూడ కనబడుచున్నవి. 34, 35

మూ. విష్ణుం మన్యామహే రామం మానుషం రూపమాస్థితమ్,
న హి మానుషమాత్రోఽసౌ రాఘవో దృఢవిక్రమః. 36
యేన బద్ధః సముద్రే చ సేతుః స పరమాద్భుతః,
కురుష్వ నరరాజేన సన్ధిం రామేణ రావణ. 37
జ్ఞాత్వావధార్య కర్మాణి క్రియతామాయతిక్షమమ్.

ప్ర. అ. రామమ్=రామునిన్, మానుషమ్=మనుష్యసంబంధమైన, రూపమ్=రూపమును, ఆస్థితమ్=ధరించిన, విష్ణుమ్=విష్ణువుగా, మన్యామహే=తలచుచున్నాము. దృఢవిక్రమః=దృఢమైన పరాక్రమము గల, అసౌ=ఈ, రాఘవః=రాముడు, మానుషమాత్రః=మనుష్యమాత్రుడు, న హి=కాడు గదా? యేన=ఏ రాముని చేత, సముద్రే=సముద్రమునందు, పరమాద్భుతః=మిక్కిలి ఆశ్చర్యకరమైన, సః=ఆ, సేతుః=సేతువు, బద్ధః=కట్టబడెనో. రావణ=రావణా! నరరాజేన=నరులరాజైన, రామేణ=రామునితో, సన్ధిమ్=సంధిని, కురుష్వ=చేయుము. కర్మాణి=పనులను, జ్ఞాత్వా=తెలిసికొని, అవధార్య=నిశ్చయించి, ఆయతిక్షమమ్=భవిష్యత్తుకు తగినది, క్రియతామ్=చేయబడుగాక.

తా. రాముడు మనుష్యరూపము ధరించిన విష్ణువే అని తలచుచున్నాము. సముద్రముమీద చాల అద్భుతమైన సేతువును నిర్మించిన, దృఢపరాక్రమవంతుడైన ఈ రాముడు మనుష్యమాత్రుడు కాడు. రావణా! నరుల రాజైన రామునితో సంధి చేసికొనుము. చేయవలసిన పనులు తెలిసికొని, నిర్ణయించుకొని, భవిష్యత్తులో శ్రేయస్కరమైన పని చేయుము.

36,37 శ్లోకాలు ప్రక్షిప్తాలు; గోవిందరాజాదులు వ్యాఖ్యానించలేదు. 36, 37

మూ. ఇదం వచస్తస్య నిగద్య మాల్యవాన్
పరీక్ష్య రక్షోధిపతేర్మనః పునః,
అనుత్తమేషూత్తమపౌరుషో బలీ
బభూవ తూష్ణీం సమవేక్ష్య రావణమ్. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చత్రింశః సర్గః

ప్ర. అ. అనుత్తమేషు=శ్రేష్ఠులైన మంత్రులలో, ఉత్తమపౌరుషః=ఉత్తమమైన పౌరుషము గల, బలీ=బలవంతుడైన, మాల్యవాన్=మాల్యవంతుడు, తస్య=వానికి, ఇదం వచః=ఈ వచనమును, నిగద్య=పలికి, పునః=మరల, రక్షోధిపతేః=రావణునియొక్క, మనః=మనస్సును, పరీక్ష్య=పరీక్షించి, రావణమ్=రావణుని,

సమవేక్ష్య=చూచి, తూష్ణీం అభూత్=మౌనముగా ఉండెను.

తా. శ్రేష్ఠులైనవారిలో ఉత్తముడైన రావణుడు, బలము గల మాల్యవంతుడు వానితో ఇట్లు పలికి, అతని ముఖవర్ణముచే అతని భావము కనిపెట్టి, అతని వైపు మరల ఒక మారు చూచి మౌనముగా కూర్చుండెను. 38

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్త్రింశః సర్గః

[రావణుడు మాల్యవంతుని ఉపదేశము తిరస్కరించి, నగరద్వారరక్షణము నకై మంత్రులను నియోగించి గృహములోనికి వెళ్లుట.]

మూ. తత్తు మాల్యవతో వాక్యం హితముక్తం దశాననః,
న మర్షయతి దుష్టాత్మా కాలస్య వశమాగతః. 1

ప్ర. అ. దుష్టాత్మా=దుష్టబుద్ధి గల, దశాననః=రావణుడు, కాలస్య=కాలముయొక్క, వశమ్=వశమును, ఆగతః=పొందినవాడై, మాల్యవతః=మాల్యవంతునియొక్క, ఉక్తమ్=చెప్పబడిన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, న మర్షయతి=సహించలేదు.

తా. దుర్బుద్ధియైన రావణుడు కాలమునకు వశుడై, మాల్యవంతుడు పలికిన ఆ హితవచనమును సహించలేదు. 1

మూ. స బద్ధ్వా భ్రుకుటిం వక్త్రే క్రోధస్య వశమాగతః,
అమర్షాత్పరివృత్తాక్షో మాల్యవన్త మథాబ్రవీత్. 2

ప్ర. అ. సః=అతడు, క్రోధస్య=క్రోధమునకు, వశమ్=వశమును, ఆగతః=పొందినవాడై, వక్త్రే=ముఖమునందు, భ్రుకుటిమ్=భ్రుకుటిని, బద్ధ్వా=కట్టి, అమర్షాత్=కోపమువలన, పరివృత్తాక్షః=తిరిగిపోయిన కన్నులు కలవాడై, అథ=అటు పిమ్మట, మాల్యవన్తమ్=మాల్యవంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆ రావణుడు కోపమునకు వశుడై, కనుబొమ్మలు విరిచి, కోపము చేత తిరిగిపోవుచున్న నేత్రములతో మాల్యవంతునితో ఇట్లు పలికెను. 2

మూ. హితబుద్ధ్యా యదహితం వచః పరుషముచ్యతే,
పరపక్షం ప్రవిశ్యైవ నైతచ్ఛ్రోత్రగతం మమ. 3

ప్ర. అ. పరపక్షమ్=శత్రుపక్షమును, ప్రవిశ్యైవ=ప్రవేశించి, హితబుద్ధ్యా=హిత మను బుద్ధిచేత, యత్=ఏ, పరుషమ్=పరుషమైన, అహితమ్=హితము కాని, వచః=వచనము, ఉచ్యతే=చెప్పబడుచున్నదో, ఏతత్=ఇది, మమ=నాకు, శ్రోత్రగతమ్=చెవికి ఎక్కినది, న=కాదు.

తా. శత్రువుల పక్షములో చేరి, హిత మని చెప్పుచు, పరుషముగా పలికిన అహితవచనము నా చెవికి ఎక్కదు. 3

మూ. మానుషం కృపణం రామమేకం శాఖామృగాశ్రయమ్,
సమర్థం మన్యసే కేన త్యక్తం పిత్రా వనాలయమ్. 4

ప్ర. అ. మానుషమ్=మనుష్యుడు, కృపణమ్=దీనుడు, ఏకమ్=ఒంటరి వాడు, శాఖామృగాశ్రయమ్=వానరులు ఆశ్రయముగా గలవాడు, పిత్రా =తండ్రిచేత, త్యక్తమ్=విడువబడినవాడు, వనాశ్రయమ్=వనము ఆశ్రయముగా గలవాడు అయిన, రామమ్=రాముణ్ణి, సమర్థమ్=సమర్థుణ్ణిగా, కేన=ఏ కారణముచేత, మన్యసే=తలం చుచున్నావు ?

తా. రాముడు మానవమాత్రుడు; దీనుడు; ఒంటరివాడు; వానరులను ఆశ్రయించినవాడు; తండ్రి విడిచివేయగా అడవులలో తిరుగుచున్నవాడు. అట్టి రాముడు సమర్థు డని ఎట్లు అనుకొనుచున్నావు? 4

మూ. రక్షసామీశ్వరం మాం చ దేవానాం చ భయంకరమ్,
హీనం మాం మన్యసే కేన అహీనం సర్వవిక్రమైః. 5

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులకు, ఈశ్వరమ్=ప్రభువును, దేవానాం చ=దేవతలకు, భయంకరమ్=భయము కలిగించువాడను అయిన, మామ్= నన్ను, సర్వవిక్రమైః=సమస్తపరాక్రమములతో, అహీనమ్=పరిపూర్ణుడనైన, మామ్=నన్ను, హీనమ్=తక్కువవానినిగా, కేన=ఏ కారణముచేత, మన్యసే=తలంచుచున్నావు ?

తా. రాక్షసులకు ప్రభువును, దేవతలకు కూడ భయంకరుడను అయిన నన్ను, అన్నివిధముల పరాక్రమములతో పరిపూర్ణుడనైన నన్ను, తక్కువవానినిగా ఎందుకు అనుకొనుచున్నావు ? 5

మూ. వీరద్వేషేణ వా శఙ్కే పక్షపాతేన వా రిపోః,
త్వయాహం పరుషాణ్యుక్తో మమ ప్రోత్సాహనేన వా. 6

ప్ర. అ. వీరద్వేషేణ=వీరునియందు ద్వేషముచేత గాని, రిపోః=శత్రువు యొక్క, పక్షపాతేన వా=పక్షపాతముచేత గాని, మమ=నాయొక్క, ప్రోత్సాహనేన వా=ప్రోత్సహించుటచేత గాని, అహమ్=నేను, త్వయా =నీచేత, పరుషాణి=పరు షవాక్యములను, ఉక్తః=పలకబడితిని అని, శఙ్కే =ఊహించుచున్నాను.

తా. సజాతీయుడైన వీరుని విషయములో అసూయచేతనో, శత్రువుమీద పక్షపాతముచేతనో, నేను ఏమీ అనకుండా ఉండుటచేతనో నీవు ఈ విధముగా నాతో పరుషముగా మాటలాడితి వని అనుకొనుచున్నాను. 6

మూ. ప్రభవన్తం పదస్థం హి పరుషం కోఽభిభాషతే,
పణ్డితః శాస్త్రతత్త్వజ్ఞో వినా ప్రోత్సాహనేన వా. 7

ప్ర. అ. శాస్త్రతత్త్వజ్ఞః=శాస్త్రతత్త్వము తెలిసిన, పండితః =పండితుడు, కః=ఎవడు, వినా ప్రోత్సాహనేన వా=ప్రోత్సహించుట లేకుండగా, ప్రభవన్తమ్=సమ

ర్థుడైన, పదస్థమ్=అధికారములో ఉన్నవానిని గూర్చి, పరుషమ్=పరుషమును, అభిభాషతే=పలుకును ?

తా. ఎవరో వెనుక ఉండి ప్రోత్సహించకపోయినచో, శాస్త్రతత్త్వము తెలిసిన పండితుడు ఎవడైనా సమర్థుడైన అధికారములో ఉన్నవానితో ఈ విధముగా పరుషముగా మాటలాడునా ? 7

మూ. ఆనీయ చ వనాత్సీతాం పద్మహీనామివ శ్రియమ్,
కిమర్థం ప్రతిదాస్యామి రాఘవస్య భయాదహమ్. 8

ప్ర. అ. పద్మహీనామ్=పద్మములు లేని, శ్రియమ్ ఇవ=లక్ష్మివలె ఉన్న, సీతామ్=సీతను, వనాత్=వనమునుండి, ఆనీయ=తీసికొనివచ్చి, అహమ్=నేను, రాఘవస్య=రామునియొక్క, భయాత్=భయమువలన, కిమర్థమ్=ఎందుకు, ప్రతిదాస్యామి=ఇచ్చెదను ?

తా. చేతిలో పద్మములు లేని లక్ష్మి వంటి సీతను వనమునుండి తీసికొని వచ్చి నేను రామునికి భయపడి ఎందుకు తిరిగి ఇచ్చివేయవలెను ? 8

మూ. వృతం వానరకోటీభిః ససుగ్రీవం సలక్ష్మణమ్,
పశ్య కైశ్చిదహోభిస్త్వం రాఘవం నిహతం మయా. 9

ప్ర. అ. కైశ్చిత్=కొన్ని, అహోభిః=దినములచేత (లో), మయా=నాచేత, నిహతమ్=చంపబడిన, వానరకోటీభిః=వానరకోట్లతో, వృతమ్=కూడిన, ససుగ్రీవమ్=సుగ్రీవునితో కూడిన, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రాఘవమ్=రాముణ్ణి, పశ్య=చూడుము.

తా. కొన్ని రోజులలో నేను కోట్లకొలది వానరులతోను, సుగ్రీవునితోను, లక్ష్మణునితోను కూడిన రాముణ్ణి చంపివేసెదను; చూడుము. 9

మూ. ద్వంద్వే యస్య న తిష్ఠంతి దైవతాన్యపి సంయుగే,
స కస్మాద్రావణో యుద్ధే భయమాహారయిష్యతి. 10

ప్ర. అ. దైవతాన్యపి=దేవతలు కూడ, సంయుగే=యుద్ధమునందు, యస్య=ఎవనికి, ద్వంద్వే=ద్వంద్వయుద్ధమునందు, న తిష్ఠంతి=నిలబడరో, సః=ఆ, రావణః=రావణుడు, యుద్ధే=యుద్ధమునందు, కస్మాత్=ఎందువలన, భయమ్=భయమును, ఆహారయిష్యతి=తెచ్చుకొనగలడు ?

తా. యుద్ధములో దేవతలు కూడ ఎవనితో ద్వంద్వయుద్ధమునకు

నిలువలేకుండా అట్టి రావణుడు యుద్ధములో ఎట్లు భయపడును ? 10

మూ. ద్విధా భజ్యేయమప్యేవం న నమేయం తు కస్యచిత్,
ఏష మే సహజో దోషః స్వభావో దురతిక్రమః. 11

ప్ర. అ. ద్విధా=రెండుగా, భజ్యేయమపి=విరిగిపోయైన విరిగిపోవుదును. ఏవమ్=ఈ విధముగా, కస్య చిత్=ఎవనికీ, న నమేయమ్=వంగను. ఏషః=ఇది, మే=నాయొక్క, సహజః=సహజమైన, దోషః=దోషము. స్వభావః=స్వభావము, దురతిక్రమః=దాట శక్యము కానిది.

తా. నేను రెండు ముక్కలుగా విరిగిపోయైనా విరిగిపోవుదునుగాని ఎవ్వరికీ వంగను. ఇది నాలోని సహజమైన దోషము. స్వభావము దాట శక్యము కానిది. 11

మూ. యది తావత్సముద్రే తు సేతుర్బద్ధో యదృచ్ఛయా,
రామేణ విస్మయః కోఽత్ర యేన మే భయమాగతమ్. 12

ప్ర. అ. రామేణ=రామునిచేత, యదృచ్ఛయా=దైవవశముచేత, సముద్రే=సముద్రమునందు, సేతుః=సేతువు, బద్ధః యది తావత్=కట్టబడిన దైనను, అత్ర=దీనియందు, యేన=దేనిచేత, మే=నాకు, భయమ్=భయము, ఆగతమ్=వచ్చునదో, అట్టి, విస్మయః=ఆశ్చర్యము, కః=ఏమి ?

తా. దైవవశముచేత రాముడు సముద్రముమీద సేతువును కట్టినంతమాత్రాన నేను భయపడవలసి నంత ఆశ్చర్య మేమి ఉన్నది ? 12

మూ. స తు తీర్త్వార్ణవం రామః సహ వానరసేనయా,
ప్రతిజానామి తే సత్యం న జీవన్ ప్రతియాస్యతి. 13

ప్ర. అ. సః రాఘవః=ఆ రాముడు, వానరసేనయా సహ=వానరసేనతో కూడ, అర్ణవమ్=సముద్రమును, తీర్త్వా=దాటి, జీవన్=జీవించినవాడై, న ప్రతియాస్యతి=తిరిగి వెళ్లడు; తే=నీకు, సత్యమ్=సత్యముగా, ప్రతిజానామి=ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తా. వానరసేనతో సముద్రము దాటి వచ్చిన రాముడు ప్రాణాలతో తిరిగి వెళ్ళడు; నీకు ప్రతిజ్ఞ చేసి సత్యమును చెప్పుచున్నాను. 13

మూ. ఇతి బ్రువాణం సంరబ్ధం రుష్టం విజ్ఞాయ రావణమ్,
వ్రీడితో మాల్యవాన్వాక్యం నోత్తరం ప్రత్యపద్యత. 14

ప్ర. అ. ఇతి=ఇట్లు, సంరబ్ధమ్=తొందరతో కూడుకొన్నట్లుగా,

బ్రువాణమ్=పలుకుచున్న, రావణమ్=రావణుని, రుష్టమ్=కోపించినవానిగా, విజ్ఞాయ=తెలిసికొని, మాల్యవాన్=మాల్యవంతుడు, వ్రీడితః=సిగ్గుపడినవాడై, ఉత్తరమ్=ఉత్తరరూపమైన, వాక్యమ్=వాక్యమును, న ప్రత్యపద్యత=పొందలేదు.

తా. ఈ విధముగా తొందరపాటుతో మాటలాడుచున్న రావణుడు కోపించి ఉన్నాడని తెలిసికొని, మాల్యవంతుడు సిగ్గుపడి, ప్రత్యుత్తరమేమీ చెప్పలేదు. 14

మూ. జయాశిషా తు రాజానం వర్ధయిత్వా యథోచితమ్,
మాల్యవానభ్యనుజ్ఞాతో జగామ స్వం నివేశనమ్. 15

ప్ర. అ. మాల్యవాన్=మాల్యవంతుడు, రాజానమ్=రాజును, జయాశిషా="జయ విజయీ భవ" అను ఆశీస్సుచేత, యథోచితమ్=తగు విధముగా, వర్ధయిత్వా=వృద్ధి పొందించి, అభ్యనుజ్ఞాతః=అనుజ్ఞ ఇవ్వబడినవాడై, స్వమ్=తన సంబంధమైన, నివేశనమ్=గృహమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. మాల్యవంతుడు జయాశీర్వాదములను ప్రయోగించి రాజును అభినందించి అతని అనుజ్ఞ తీసికొని తన గృహమునకు వెళ్లిపోయెను. 15

మూ. రావణస్తు సహామాత్యో మన్త్రయిత్వా విమృశ్య చ,
లఙ్కాయాస్తు తదా గుప్తిం కారయామాస రాక్షసః. 16

ప్ర. అ. రాక్షసః=రాక్షసుడైన, రావణస్తు=రావణుడైతే, సహామాత్యః=మంత్రులతో కూడినవాడై, మన్త్రయిత్వా=ఆలోచించి, విమృశ్య=విచారించి, తదా=అప్పుడు, లఙ్కాయాః=లంకయొక్క, గుప్తిమ్=రక్షణము, కారయామాస=చేయించెను.

తా. అప్పుడు రావణుడు మంత్రులతో ఆలోచించి, కర్తవ్యమును నిర్ణయించి, లంకకు రక్షణము ఏర్పరచెను. 16

మూ. వ్యాదిదేశ చ పూర్వస్యాం ప్రహస్తం ద్వారి రాక్షసమ్,
దక్షిణస్యాం మహావీర్యౌ మహాపార్శ్వమహోదరౌ. 17
పశ్చిమాయామథ ద్వారి పుత్రమిన్ద్రజితం తదా,
వ్యాదిదేశ మహామాయం రాక్షసైర్బహుభిర్వృతమ్. 18

ప్ర. అ. పూర్వస్యాం ద్వారి=తూర్పుద్వారమునందు, ప్రహస్తమ్=ప్రహస్తుడను, రాక్షసమ్=రాక్షసుని, వ్యాదిదేశ=నియమించెను. దక్షిణస్యామ్=దక్షిణద్వారమునందు, మహావీర్యౌ=గొప్ప పరాక్రమము గల, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులను, వ్యాదిదేశ=నియమించెను. అథ=అటుపిమ్మట, తదా=అప్పుడు, పశ్చిమాయాం ద్వారి=పశ్చిమద్వారమునందు,

మహామాయమ్ =గొప్ప మాయలు గల, బహుభిః=అనేకులైన, రాక్షసైః =రాక్షసులతో, వృతమ్=కూడిన, పుత్రమ్=పుత్రుడైన, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, వ్యాదిదేశ =నియమించెను.

తా. తూర్పుద్వారమునందు ప్రహస్తుణ్ణి, దక్షిణద్వారమునందు గొప్ప బలముగల మహోదరమహాపార్శ్వులను, పశ్చిమద్వారమునందు గొప్ప మాయలు తెలిసిన చాలామంది రాక్షసులతో కూడిన తన పుత్రుడైన ఇంద్రజిత్తును నిలిపెను. 17, 18

మూ. ఉత్తరస్యాం పురద్వారి వ్యాదిశ్య శుకసారణౌ,
స్వయం తత్ర గమిష్యామి మన్త్రిణస్తానువాచ హ. 19

ప్ర. అ. ఉత్తరస్యామ్=ఉత్తరపుదైన, పురద్వారి=నగరద్వారమునందు, శుకసారణౌ=శుకసారణులను, వ్యాదిశ్య=నియమించి, స్వయమ్=స్వయముగా, తత్ర=అక్కడికి, గమిష్యామి=వెళ్లెదను అని, తాన్=ఆ, మన్త్రిణః=మంత్రులను గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. ఉత్తరద్వారమునందు, శుకసారణులను నియమించి, "నేను కూడ అక్కడికి వెళ్ళెదను" అని ఆ మంత్రులతో చెప్పెను. 19

మూ. రాక్షసం తు విరూపాక్షం మహావీర్యపరాక్రమమ్,
మధ్యమేఽస్థాపయద్గుల్మే బహుభిః సహ రాక్షసైః. 20

ప్ర. అ. మహావీర్యపరాక్రమమ్=గొప్ప వీర్యము పరాక్రమము గల, విరూపాక్షమ్=విరూపాక్షుడను, రాక్షసమ్=రాక్షసుణ్ణి, బహుభిః=చాలామంది, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, మధ్యమే=మధ్యయందున్న, గుల్మే=సేనానివేశమునందు, అస్థాపయత్=నిలిపెను.

తా. గొప్ప వీర్యపరాక్రమములు గల విరూపాక్షుడను రాక్షసుని, అనేకులైన ఇతరరాక్షసులతో కూడ సేనామధ్యభాగమునందు నిలిపెను. 20

మూ. ఏవం విధానం లఙ్కాయాం కృత్వా రాక్షసపుఙ్గవః,
కృతకృత్య మివాత్మానం మన్యతే కాలచోదితః. 21

ప్ర. అ. రాక్షసపుఙ్గవః=ఆ రాక్షసశ్రేష్ఠుడు, లఙ్కాయామ్=లంకయందు, ఏవమ్=ఇట్లు, విధానమ్=ఏర్పాటును, కృత్వా=చేసి, కాలచోదితః=కాలముచేత ప్రేరితుడై, ఆత్మానమ్=తనను, కృతకృత్యమివ=కృతకృత్యుని వలె, మన్యతే=తలచుచున్నాడు.

తా. రావణుడు లంకలో ఈ విధముగా ఏర్పాట్లు చేసి, వినాశకాలము

దాపురించుటచే కృతకృత్యు డైనట్లు భావించుచుండెను. 21

మూ. విసర్జయామాస తతః స మన్త్రిణో
విధానమాజ్ఞాప్య పురస్య పుష్కలమ్,
జయాశిషా మన్త్రిగణేన పూజితో
వివేశ సోఽన్తఃపురమృద్ధిమన్మహత్. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్త్రింశః సర్గః

ప్ర. అ. సః=అతడు, పురస్య=పట్టణముయొక్క, పుష్కలమ్=సరిపూర్ణమైన, విధానమ్=ఏర్పాటును, ఆజ్ఞాప్య=ఆజ్ఞాపించి, తతః=అటు పిమ్మట, మన్త్రిణః=మంత్రులను, విసర్జయామాస=విడిచిపెట్టెను. మన్త్రిగణేన=మంత్రుల గుంపుచేత, జయాశిషా=జయాశీర్వాదము చేత, పూజితః=పూజింపబడినవాడై, సః=అతడు, ఋద్ధిమత్=సమృద్ధి గల, మహత్=గొప్పదైన, అన్తఃపురమ్=అంతఃపురమును, వివేశ=ప్రవేశించెను.

తా. రావణుడు ఈ విధముగా నగరరక్షణమునకు పూర్తిగా ఏర్పాట్లు చేసి, మంత్రులు వెళ్లుటకు అనుమతి ఇచ్చి, ఆ మంత్రులందరు జయాశీర్వాదము చేసి వెళ్లిపోయిన పిమ్మట ఐశ్వర్యసమృద్ధమైన అంతఃపురములో ప్రవేశించెను.22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తత్రింశః సర్గః

[లంకారక్షణమునకై రావణుడు చేసిన ఏర్పాట్లను గూర్చి విభీషణుడు రామునకు చెప్పుట. లంకాద్వారములను ఆక్రమింపుడని రాముడు వానరసేనానాయకులను ఆదేశించుట.]

మూ. నరవానరరాజౌ స చ వాయుసుతః కపిః,
జామ్బవానృక్షరాజశ్చ రాక్షసశ్చ విభీషణః. 1
అఙ్గదో వాలిపుత్రశ్చ సౌమిత్రిః శరభః కపిః,
సుషేణః సహదాయాదో మైన్దో ద్వివిద ఏవ చ. 2
గజో గవాక్షః కుముదో నలోఽథ పనసస్తథా,
అమిత్రవిషయం ప్రాప్తాః సమవేతాః సమర్థయన్. 3

ప్ర. అ. నరవానరరాజౌ=నరులం రాజైన రాముడు, వానరరాజైన సుగ్రీవుడు, వాయుసుతః=వాయుకుమారుడైన, సః కపిః=ఆ హనుమంతుడు, ఋక్షరాజః=భల్లూకములం రాజైన, జామ్బవాన్=జాంబవంతుడు, రాక్షసః=రాక్షసుడైన, విభీషణః=విభీషణుడు, వాలిపుత్రః=వాలిపుత్రుడైన, అఙ్గదః=అంగదుడు, సౌమిత్రిః=లక్ష్మణుడు, శరభః కపిః=శరభు డను వానరుడు, సహదాయాదః=బంధువులతో కూడిన, సుషేణః=సుషేణుడు, మైన్దః=మైందుడు, ద్వివిద ఏవ చ=ద్వివిదుడు, గజః=గజుడు, అథ=మరియు, గవాక్షః=గవాక్షుడు, కుముదః=కుముదుడు, తథా=మరియు, నలః=నలుడు, అథ=మరియు, పనసః=పనసుడు, అమిత్రవిషయమ్=శత్రుదేశమును, ప్రాప్తాః=పొందినవారై, సమవేతాః=ఒక చోట చేరినవారై, సమర్థయన్=ఆలోచించిరి.

తా. శత్రుదేశములో ప్రవేశించిన రామసుగ్రీవులు, హనుమంతుడు, ఋక్షములం రాజైన జాంబవంతుడు, విభీషణుడు, వాలి పుత్రుడైన అంగదుడు, లక్ష్మణుడు, శరభుడు, పరివారసహితుడైన సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు, గజుడు, గవాక్షుడు, కుముదుడు, నలుడు, పనసుడు - వీరందరు కలిసి ఆలోచించిరి. 1 - 3

మూ. ఇయం సా లక్ష్యతే లఙ్కా పురీ రావణపాలితా,
సాసురోరగగన్ధర్వైరమరైరపి దుర్జయా. 4

ప్ర. అ. రావణపాలితా=రావణునిచేత పాలింపబడిన, సాసురోరగగన్ధర్వైః=అసురులతోను, ఉరగులతోను, గంధర్వులతోను కూడిన, అమరైరపి=దేవతలచేత కూడ, దుర్జయా=జయింపశక్యము కాని, సా=ఆ, ఇయమ్=ఈ, లఙ్కాపురీ=లంకాపట్టణము, లక్ష్యతే=చూడబడుచున్నది.

తా. రావణునిచేత పాలింపబడును అసురులచేత గాని, ఉరగుల చేత గాని, గంధర్వులచేత గాని, దేవతలచేత గాని జయింప శక్యము గాని ఈ లంకాపట్టణము ఇదే; ఎదుట కనబడుచున్నది. 4

మూ. కార్యసిద్ధిం పురస్కృత్య మన్త్రయధ్వం వినిర్ణయే,
నిత్యం సంనిహితో హ్యత్ర రావణో రాక్షసాధిపః. 5

ప్ర. అ. కార్యసిద్ధిమ్=కార్యసిద్ధిని, పురస్కృత్య=పురస్కరించుకొని, వినిర్ణయే=నిర్ణయము విషయమునందు, మన్త్రయధ్వమ్=ఆలోచించుడు. అత్ర=ఇక్కడ, రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, నిత్యమ్=నిత్యము, సంనిహితః హి=ఉండును గదా.

తా. రాక్షసుల ప్రభువైన రావణుడు నిత్యము ఈ నగరమునందే ఉండును. అందుచేత మనము తలపెట్టిన కార్యము ఎట్లు సిద్ధించునో నిర్ణయించుటకు ఆలోచన చేయుడు. 5

మూ. అథ తేషు బ్రువాణేషు రావణావరజోఽబ్రవీత్,
వాక్యమగ్రామ్యపదవత్పుష్కలార్థం విభీషణః. 6

ప్ర. అ. అథ=అటు పిమ్మట, తేషు=వాళ్లు, బ్రువాణేషు=ఇట్లు మాట్లాడుచుండగా, రావణావరజః=రావణుని తమ్ముడైన, విభీషణః=విభీషణుడు, అగ్రామ్యపదవత్=గ్రామ్యపదములు లేని, పుష్కలార్థమ్=పూర్ణమైన అర్థము గల, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. వాళ్లందరు ఇట్లు అనుకొనుచుండగా రావణుని తమ్ముడైన విభీషణుడు గ్రామ్యములైన పదములు లేని, పరిపూర్ణార్థము గల వాక్యము పలికెను. 6

మూ. అనలః పనసశ్చైవ సంపాతిః ప్రమతిస్తథా,
గత్వా లఙ్కాం మమామాత్యాః పురీం పునరిహాగతాః. 7

ప్ర. అ. మమ=నాయొక్క, అమాత్యాః=మంత్రులైన, అనలః=అనలుడు, పనసశ్చైవ=పనసుడు, సంపాతిః=సంపాతి, తథా=మరియు, ప్రమతిః= ప్రమతి అనువారు, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును గూర్చి, గత్వా=వెళ్లి, పునః=మరల, ఇహ=ఇక్కడికి, ఆగతాః=వచ్చినారు.

తా. నా మంత్రులైన అనలుడు, పనసుడు, సంపాతి, ప్రమతి లంకకు వెళ్లి మరల వచ్చినారు. 7

మూ. భూత్వా శకునయః సర్వే ప్రవిష్టాః రిపోర్బలమ్,
విధానం విహితం యచ్చ తద్దృష్ట్వా సముపస్థితాః. 8

ప్ర. అ. సర్వే=వాళ్ళందరూ, శకునయః=పక్షులుగా, భూత్వా=అయి, రిపోః=శత్రువుయొక్క, బలమ్=సైన్యమును, ప్రవిష్టాః=ప్రవేశించినారు. యత్=ఏ, విధానమ్=ఏర్పాటు, విహితమ్=చేయబడినదో, తత్=దానిని, దృష్ట్వా=చూచి, సముపస్థితాః=వచ్చినారు.

తా. వాళ్ళందరూ పక్షిరూపములు ధరించి శత్రుసైన్యములో ప్రవేశించి, శత్రువులు చేసికొనిన ఏర్పాటు లన్నీ చూచి వచ్చినారు. 8

మూ. సంవిధానం యథాహుస్తే రావణస్య దురాత్మనః,
రామ తద్బ్రువతః సర్వం యాథాతథ్యేన మే శృణు. 9

ప్ర. అ. రామ=రామా ! తే =వాళ్ళు, దురాత్మనః=దుష్టబుద్ధి యైన, రావణస్య=రావణునియొక్క, సంవిధానమ్=ఏర్పాటును, యథా=ఎట్లు, ఆహుః=చెప్పుచున్నారో, సర్వమ్=దానినంతనూ, యాథాతథ్యేన=యథార్థముగా, బ్రువతః=చెప్పుచున్న, మే=నానుండి, శృణు=వినుము.

తా. రామా ! దురాత్ముడైన రావణుడు చేసిన ఏర్పాట్లను గూర్చి వాళ్లు చెప్పిన విషయము నంతా నేను ఉన్నదున్నట్లు చెప్పుచున్నాను; వినుము. 9

మూ. పూర్వం ప్రహస్తః ప్రబలో ద్వారమాసాద్య తిష్ఠతి,
దక్షిణం చ మహావీర్యౌ మహాపార్శ్వమహోదరౌ. 10

ప్ర. అ. ప్రబలః=గొప్ప బలము గల, ప్రహస్తః=ప్రహస్తుడు, పూర్వం ద్వారమ్=తూర్పు ద్వారమును, ఆసాద్య=పొంది, తిష్ఠతి=ఉన్నాడు. మహావీర్యౌ=గొప్ప పరాక్రమము గల, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులు, దక్షిణం చ=దక్షిణద్వారమును (పొంది ఉన్నారు).

తా. గొప్ప పరాక్రమము గల ప్రహస్తుడు తూర్పుద్వారము వద్ద, మహాపరాక్రమవంతులైన మహాపార్శ్వమహోదరులు దక్షిణద్వారమువద్ద ఉన్నారు.

మూ. ఇన్ద్రజిత్పశ్చిమం ద్వారం రాక్షసైర్బహుభిర్వృతః,
పట్టిశాసిధనుష్మద్భిః శూలముద్గరపాణిభిః, 11
నానాప్రహరణైః శూరైరావృతో రావణాత్మజః.

ప్ర. అ. రావణాత్మజః=రావణుని కుమారుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, పట్టిశాసిధనుష్మద్భిః=పట్టిశములు, ఖడ్గములు, ధనస్సులు గల, శూలముద్గరపాణిభిః=శూలములు ముద్గరములు హస్తములయందు గల, బహుభిః=అనేకులైన,

రాక్షసైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, నానాప్రహరణైః=అనేకవిధములైన ఆయుధములు గల, శూరైః=శూరులతో, ఆవృతః=కూడినవాడై, పశ్చిమం ద్వారమ్=పశ్చిమద్వారమును (చేరి ఉన్నాడు).

తా. రావణకుమారుడైన ఇంద్రజిత్తు పట్టిశములు, ఖడ్గములు, ధనస్సులు, శూలములు, ముద్గరములు ధరించిన చాలమంది రాక్షసులతోను, అనేకవిధములైన ఆయుధములు ధరించిన శూరులతోను కూడి పశ్చిమద్వారమునం దున్నాడు. 11

మూ. రాక్షసానాం సహస్రైస్తు బహుభిః శస్త్రపాణిభిః, 12
యుక్తః పరమసంవిగ్నో రాక్షసైః సహ మన్త్రవిత్,
ఉత్తరం నగరద్వారం రావణః స్వయమాస్థితః. 13

ప్ర. అ. మన్త్రవిత్=ఆలోచనలు ఎరిగిన, రావణః=రావణుడు, శస్త్రపాణిభిః= శస్త్రములు హస్తములయందు గల, రాక్షసానామ్=రాక్షసుల యొక్క, బహుభిః=అనేకమైన, సహస్రైః=సహస్రములతో, యుక్తః=కూడినవాడై, రాక్షసైః=రాక్షసులతో కూడ, పరమసంవిగ్నః=మిక్కిలి దిగులు చెందినవాడై, ఉత్తరమ్=ఉత్తరమైన, నగరద్వారమ్= నగరద్వారమును, స్వయమ్=స్వయముగా, ఆస్థితః=అధిష్ఠించి ఉన్నాడు.

తా. ఆలోచనలో నేర్పరియైన రావణుడు ఆయుధములు ధరించిన వేలకొలది రాక్షసులతో కూడి స్వయముగా ఉత్తరద్వారమువద్ద ఉన్నాడు. అతడు రాక్షసులూ కూడ దిగులుచెంది ఉన్నారు. 12, 13

మూ. విరూపాక్షస్తు మహతా శూలఖడ్గధనుష్మతా,
బలేన రాక్షసైః సార్థం మధ్యమం గుల్మమాశ్రితః. 14

ప్ర. అ. విరూపాక్షస్తు=విరూపాక్షుడు, శూలఖడ్గధనుష్మతా=శూలములు, ఖడ్గములు, ధనస్సులు గల, మహతా=గొప్పదైన, బలేన=సేనతో, రాక్షసైః సార్థమ్=రాక్షసులతో కూడ, మధ్యమం గుల్మమ్=మధ్యయందున్న సేనానివేశ మును, ఆశ్రితః=ఆశ్రయించి ఉన్నాడు.

తా. విరూపాక్షుడు శూలములు, ఖడ్గములు, ధనస్సులు ధరించిన గొప్ప సైన్యముతో, చాలమంది రాక్షసులతో సేనామధ్యమునందు ఉన్నాడు. 14

మూ. ఏతానేవంవిధాన్ గుల్మాన్ లఙ్కాయాం సముదీక్ష్య తే,
మామకా మన్త్రిణః సర్వే శీఘ్రం పునరిహాగతాః. 15

ప్ర. అ. మామకాః=నా సంబంధమైన, సర్వే=సమస్తమైన, తే మన్త్రిణః=ఆ మంత్రులు, ఏవంవిధాన్=ఈ విధములైన, ఏతాన్=ఈ, గుల్మాన్=సేనానివేశ ములను, లఙ్కాయామ్=లంకయందు, సముదీక్ష్య=చూచి, శీఘ్రమ్=శీఘ్రముగా,

పునః= మరల, ఇహ=ఇక్కడికి, ఆగతాః=వచ్చినారు.

తా. నా మంత్రులందరు లంకకు వెళ్లి అక్కడ ఉన్న ఈ సేనావిశేషమును చూచి మరల వచ్చినారు. 15

మూ. గజానాం దశసాహస్రం రథానామయుతం తథా,
హయానామయుతే ద్వే చ సాగ్రా కోటిశ్చ రక్షసామ్. 16
విక్రాన్తా బలవన్తశ్చ సంయుగేష్వాతతాయినః,
ఇష్టా రాక్షసరాజస్య నిత్యమేతే నిశాచరాః. 17

ప్ర. అ. గజానామ్=గజములయొక్క, దశసాహస్రమ్=పదివేలు, తథా=మరియు, రథానామ్=రథములయొక్క, అయుతమ్=అయుతము, హయానామ్=అశ్వములయొక్క, ద్వే=రెండు, అయుతే=అయుతములు, రక్షసామ్=రాక్షసులయొక్క, సాగ్రా= కొంచెము అధికమైన, కోటిశ్చ=కోటియు, సంయుగేషు=యుద్ధములయందు, విక్రాన్తాః= పరాక్రమముగలవారు, బలవన్తశ్చ=బలముగలవారు, ఆతతాయినః=క్రూరులు, ఏతే=ఈ, నిశాచరాః=రాక్షసులు, నిత్యమ్=ఎల్లప్పుడు, రాక్షసరాజస్య=రావణునకు, ఇష్టాః= ఇష్టులు.

తా. యుద్ధములలో పరాక్రమము చూపువారు, బలవంతులు, క్రూరులు అయిన పదివేలమంది గజములను అధిష్ఠించు యోధులు, పదివేలమంది రథికులు, రెండువేలమంది అశ్వికులు, కోటికి మించిన పదాతులైన రాక్షసులు వీరందరూ రావణునకు ఇష్టులైన వారు. 16, 17

మూ. ఏకైకస్యాత్ర యుద్ధార్థే రాక్షసస్య విశాంపతే,
పరివారః సహస్రాణాం సహస్రముపతిష్ఠతే. 18

ప్ర. అ. విశాంపతే=రాజా ! అత్ర=ఈ రాక్షసులలో, ఏకస్య=ఒక్క, రాక్షసస్య= రాక్షసునకు, యుద్ధార్థే=యుద్ధమునిమిత్తము, సహస్రాణామ్=వేలయొక్క, సహస్రమ్= సహస్రము, పరివారః=పరివారము, ఉపతిష్ఠతే=చేరి ఉండును.

తా. రామా ! యుద్ధమునందు ఈ రాక్షసులలో ఒక్కొక్కనికి పది లక్షలమంది పరివారముగా వచ్చి ఉందురు. 18

మూ. ఏతాం ప్రవృత్తిం లఙ్కాయాం మన్త్రిప్రోక్తాం విభీషణః,
ఏవముక్త్వా మహాబాహూ రాక్షసాంస్తానదర్శయత్. 19

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, విభీషణః=విభీషణుడు, మన్త్రిప్రోక్తామ్=మంత్రులచేత చెప్పబడిన, లఙ్కాయామ్=లంకయందు, ఏతామ్=ఈ, ప్రవృత్తిమ్=వార్తను, ఏవమ్=ఈ విధముగా, ఉక్త్వా=పలికి, తాన్=ఆ,

రాక్షసాన్=రాక్షసులను, అదర్శయత్=చూపెను.

తా. మహాబాహువైన విభీషణుడు తన మంత్రులు తీసికొనివచ్చిన లంకకు సంబంధించిన ఈ వార్తను ఈ విధముగా చెప్పి ఆ రాక్షసులను (మంత్రులను) చూపెను. 19

మూ. లఙ్కాయాం సచివైః సర్వం రామాయ ప్రత్యవేదయత్,
రామం కమలపత్రాక్షమిదముత్తరమబ్రవీత్, 20
రావణావరజః శ్రీమాన్ రామప్రియచికీర్షయా.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, రావణావరజః=విభీషణుడు, లఙ్కాయామ్= లంకయందు, సర్వమ్=వృత్తాంతమును అంతను, సచివైః=మంత్రులచేత, రామాయ= రామునికొరకు, ప్రత్యవేదయత్=తెలియపరచెను. కమలపత్రాక్షమ్=కమలపత్రములవంటి నేత్రములు గల, రామమ్=రామునిగూర్చి, రామప్రియచికీర్షయా=రామునికి ప్రియము చేయవలెనను కోరికతో, ఇదమ్=ఈ, ఉత్తరమ్=తరువాతి వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. శ్రీమంతుడైన విభీషణుడు రామునకు లంకలోని వార్తలను తన మంత్రులచేత కూడ చెప్పించి కమలపత్రాక్షుడైన ఆ రామునితో అతనికి ప్రియము చేయవలెనను కోరికతో, మరల ఇట్లనెను. 20

మూ. కుబేరం తు యదా రామ రావణః ప్రత్యయుధ్యత, 21
షష్టిః శతసహస్రాణి తదా నిర్యాన్తి రక్షసామ్,
పరాక్రమేణ వీర్యేణ తేజసా సత్త్వగౌరవాత్, 22
సదృశా హ్యత్ర దర్పేణ రావణస్య మహాత్మనః.

ప్ర. అ. రామ=రామా! రావణః=రావణుడు, యదా=ఎప్పుడు, కుబేరమ్=కుబేరుణ్ణి, ప్రత్యయుధ్యత=ఎదిరించి యుద్ధము చేసెనో, తదా=అప్పుడు, రక్షసామ్=రాక్షసులయొక్క, షష్టిః=అరువది, శతసహస్రాణి=లక్షలు, నిర్యాన్తి=బయలుదేరినవి. పరాక్రమేణ=పరాక్రమముచేత, వీర్యేణ=వీర్యముచేత, తేజసా=తేజస్సుచేత, సత్త్వగౌరవాత్=బలాతిశయమువలన, దర్పేణ=గర్వముచేత, అత్ర=యుద్ధమునందు, దురాత్మనః=దురాత్ముడైన, రావణస్య=రావణునకు, సదృశాః=తగినవారు.

తా. రామా! రావణుడు కుబేరునితో యుద్ధమునకై వెళ్లినప్పుడు అతనితో అరవైలక్షలమంది రాక్షసులు వెళ్లిరి. వాళ్లందరూ కూడ పరాక్రమముచేత, వీర్యముచేత, తేజస్సుచేత, బలాధిక్యముచేత, గర్వముచేత దురాత్ముడైన రావణునకు

తగినవారు. 21, 22

మూ. అత్ర మన్యుర్న కర్తవ్యో రోషయే త్వాం న భీషయే, 23
సమర్థో హ్యపి వీర్యేణ సురాణామపి నిగ్రహే.

ప్ర. అ. అత్ర=ఈ విషయమునందు, మన్యుః=కోపము, న కర్తవ్యః=చేయ దగినది కాదు. త్వామ్=నిన్ను, రోషయే=కోపము కలవానిని చేయుచున్నాను. న భీషయే=భయపెట్టుట లేదు. వీర్యేణ=పరాక్రమముచేత, సురాణామ్=దేవతలయొక్క, నిగ్రహేఽపి=నిగ్రహమునందు కూడ, సమర్థః=సమర్థుడవు, అపి హి=అయి ఉన్నావు కదా.

తా. నేను శత్రుబలమును వర్ణించుచున్నందుకు కోపించకుము. నీకు శత్రువులపై కోపము తెప్పించుటకు ఇది చెప్పినాను కాని భయపెట్టుటకు కాదు. నీవు పరాక్రమముచేత దేవతలను కూడ జయించుటకు సమర్థుడవు కదా. 23

మూ. తద్భవాంశ్చతురఙ్గేణ బలేన మహతా వృతమ్, 24
వ్యూహ్యేదం వానరానీకం నిర్మథిష్యతి రావణమ్.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, భవాన్=నీవు, ఇదమ్=ఈ, వానరానీకమ్=వానరసైన్యమును, వ్యూహ్య=వ్యూహముగా నిలిపి, చతురఙ్గేణ బలేన=చతురంగసైన్యముతో, వృతమ్=కూడిన, రావణమ్=రావణుని, నిర్మథిష్యతి=మథించగలవు.

తా. అందుచేత నీవు ఈ వానరసేనను వ్యూహముగా నిలిపి చతురంగసైన్యముతో కూడిన రావణుని మథించగలవు. 24

మూ. రావణావరజే వాక్యమేవం బ్రువతి రాఘవః, 25
శత్రూణాం ప్రతిఘాతార్థమిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. రావణావరజే=విభీషణుడు, ఇతి=ఇట్లు, వాక్యమ్=వాక్యమును, బ్రువతి సతి=పలుకుచుండగా, రాఘవః=రాముడు, శత్రూణామ్=శత్రువులయొక్క, ప్రతిఘాతార్థమ్=కొట్టుటకొరకు, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. విభీషణుడిట్లు చెప్పుచుండగా విని రాముడు శత్రువులను ఎదుర్కొనుటకొరకు ఇట్లు పలికెను. 25

మూ. పూర్వద్వారే తు లఙ్కాయా నీలో వానరపుఙ్గవః, 26
ప్రహస్తప్రతియోద్ధా స్యాద్వానరైర్బహుభిర్వృతః.

ప్ర. అ. అస్యాః=ఈ లంకయొక్క, పూర్వద్వారే=తూర్పుద్వారమునందు, వానరపుఙ్గవః=వానరశ్రేష్ఠుడైన, నీలః=నీలుడు, బహుభిః=చాలమంది, వానరైః=వానరులతో, వృతః=కూడినవాడై, ప్రహస్తప్రతియోద్ధా=ప్రహస్తుని ఎదిరించి యుద్ధము చేయువాడు, స్యాత్=అగుగాక.

తా. వానరశ్రేష్ఠుడైన నీలుడు చాలమంది వానరులతో కలిసి లంక తూర్పుద్వారమునందు ప్రహస్తుని ఎదుర్కొనవలెను. 26

మూ. అఙ్గదో వాలిపుత్రస్తు బలేన మహతా వృతః, 27
దక్షిణే బాధతాం ద్వారే మహాపార్శ్వమహోదరౌ.

ప్ర. అ. వాలిపుత్రః=వాలిపుత్రుడైన, అఙ్గదః=అంగదుడు, మహతా=గొప్పదైన, బలేన=సేనతో, వృతః=కూడినవాడై, దక్షిణే ద్వారే=దక్షిణద్వారమునందు, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులను, బాధతామ్=బాధించుగాక.

తా. వాలిపుత్రుడైన అంగదుడు గొప్ప సైన్యముతో కూడి దక్షిణద్వారమునందు మహాపార్శ్వమహోదరులను బాధించవలెను. 27

మూ. హనుమాన్పశ్చిమద్వారం నిష్పీడ్య పవనాత్మజః, 28
ప్రవిశత్వప్రమేయాత్మా బహుభిః కపిభిర్వృతః.

ప్ర. అ. పవనాత్మజః=వాయుపుత్రుడు, అప్రమేయాత్మా=ఇంత అని చెప్ప శక్యము కాని బుద్ధిగలవాడు అయిన, హనుమాన్=హనుమంతుడు, బహుభిః=అనేకులైన, కపిభిః=వానరులతో, వృతః=కూడినవాడై, పశ్చిమద్వారమ్=పశ్చిమద్వారమును, నిష్పీడ్య=పీడించి, ప్రవిశతు=ప్రవేశించుగాక.

తా. వాయుపుత్రుడు, అప్రమేయమైన బుద్ధిబలము గలవాడు అయిన హనుమంతుడు చాలమంది వానరులతో కూడి పశ్చిమద్వారమును పీడించి లంకలో ప్రవేశించుగాక. 28

మూ. దైత్యదానవసఙ్ఘానామృషీణాం చ మహాత్మనామ్, 29
విప్రకారప్రియః క్షుద్రో వరదానబలాన్వితః.
పరిక్రామతి యః సర్వాఁల్లోకాన్సన్తాపయన్ ప్రజాః, 30
తస్యాహం రాక్షసేన్ద్రస్య స్వయమేవ వధే ధృతః.
ఉత్తరం నగరద్వారమహం సౌమిత్రిణా సహ, 31
నిపీడ్యాభిప్రవేక్ష్యామి సబలో యత్ర రావణః.

ప్ర. అ. దైత్యదానవసఙ్ఘానామ్=దైత్యదానవుల సముదాయములకు, మహాత్మనామ్=మహాత్ములైన, ఋషీణాం చ=ఋషులకు, విప్రకారప్రియః=హానిచే

యుట ఇష్టముగా గలవాడు, క్షుద్రః=నీచుడు, వరదానబలాన్వితః=వరదానబలముతో కూడినవాడు అయిన, యః= ఎవడు, ప్రజాః=ప్రజలను, సంతాపయన్=పీడించుచూ, సర్వాన్=సమస్తమైన, లోకాన్=లోకములను, పరిక్రామతి=సంచరించుచుండునో, తస్య=అట్టి, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, వధే=వధయందు, అహమ్=నేను, స్వయమేవ= స్వయముగానే, ధృతః=నిశ్చయము కలవాడనై ఉన్నాను. అహమ్=నేను, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడ, సబలః=సైన్యముతో కూడిన, రావణః=రావణుడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో, ఉత్తరం నగరద్వారమ్=ఉత్తరనగరద్వారమును, నిపీడ్య=పీడించి, అభిప్రవేక్ష్యామి= ప్రవేశించెదను.

తా. దైత్యులను, దానవులను, మహాత్ములైన ఋషులను పీడించుట యందు ఆనందము కలవాడు, వరదానము వలన కలిగిన బలము కలవాడు, నీచుడు, సర్వలోకములలో సంచరించుచు అక్కడి ప్రజలను పీడించువాడు అయిన రావణుని నేనే స్వయముగా చంపవలె నని దృఢనిశ్చయము చేసితిని. అందుచే నేను లక్ష్మణసమేతుడనై సైన్యముతో కూడిన రావణుడు ఉన్న ఉత్తరద్వారమును పీడించి లంకలో ప్రవేశించెదను. 29-31

మూ. వానరేన్ద్రశ్చ బలవానృక్షరాజశ్చ వీర్యవాన్, 32
రాక్షసేన్ద్రానుజశ్చైవ గుల్మే భవతు మధ్యమే.

ప్ర. అ. బలవాన్=బలవంతుడైన, వానరేన్ద్రశ్చ=సుగ్రీవుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, ఋక్షరాజశ్చ=జాంబవంతుడు, రాక్షసేన్ద్రానుజశ్చైవ=విభీషణుడు, మధ్యమే=మధ్యమమైన, గుల్మే=సైన్యమునందు, భవతు=ఉందురుగాక.

తా. బలవంతుడైన సుగ్రీవుడు, వీర్యవంతుడైన జాంబవంతుడు, విభీషణుడు మధ్యయందున్న సైన్యములో ఉందురుగాక. 32

మూ. న చైవ మానుషం రూపం కార్యం హరిభిరాహవే, 33
ఏషా భవతు నః సంజ్ఞా యుద్ధేఽస్మిన్ వానరే బలే.

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, హరిభిః=వానరులచేత, మానుషం=మనుజసంబంధమైన, రూపమ్=రూపము, న చైవ కార్యమ్=చేయదగినది కాదు. అస్మిన్=ఈ, యుద్ధే=యుద్ధమునందు, వానరే=వానరసంబంధమైన, బలే=సైన్యమునందు, ఏషా= ఇది, నః=మనకు, సంజ్ఞా=గుర్తు, భవతు=అగుగాక.

తా. యుద్ధములో వానరు లెవ్వరూ మనుష్యరూపము ధరించకూడదు. ఈ యుద్ధములో వానరసైన్యమునందు మనకు ఇదే గుర్తు. 33

మూ. వానరా ఏవ నశ్చిహ్నం స్వజనేఽస్మిన్ భవిష్యతి, 34
వయం తు మానుషేణైవ సప్త యోత్స్యామహే పరాన్.
అహమేష సహ భ్రాత్రా లక్ష్మణేన మహౌజసా, 35
ఆత్మనా పఞ్చమశ్చాయం సఖా మమ విభీషణః.

ప్ర. అ. అస్మిన్=ఈ, స్వజనే=స్వజనమునందు, వానరా ఏవ=వానరులే, నః=మనకు, చిహ్నమ్=చిహ్నముగా, భవిష్యతి=కాగలరు. మహౌజసా=గొప్ప తేజస్సు గల, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన=లక్ష్మణునితో కూడిన, ఏషః=ఈ, అహమ్=నేను, ఆత్మనా=తనచేత, పఞ్చమః=ఐదవవాడైన, మమ సఖా=నా మిత్రుడైన, అయమ్=ఈ, విభీషణః=విభీషణుడు, వయమ్=మేము, సప్త=ఏడుగురము, మానుషేణైవ= మనుష్యరూపముతోనే, పరాన్=శత్రువులను, యోత్స్యామహే=యుద్ధముచేసెదము.

తా. మనవారిలో అందరూ వానరులుగా ఉండుటయే గుర్తు కాగలదు. గొప్పతేజస్సు గల నా సోదరుడైన లక్ష్మణుడు, నేను, విభీషణుడు, అతని నలుగురు మంత్రులు మేము ఏడుగురమూ మనుష్యరూపముతోనే శత్రువులతో యుద్ధము చేసెదము.

వి. ఇక్కడ చెప్పిన దానిని బట్టి రాక్షసుల ఆకారము కూడ మనుష్యుల ఆకారమువలెనే ఉండునని తెలియుచున్నది అని తిలకవ్యాఖ్యానకారుడు చెప్పె కతకవ్యాఖ్యానకారుడు మాత్రం రాక్షసుల రూపములు వేరుగానే ఉన్నను విభీషణాదులు యుద్ధములో మనుష్యరూపము ధరించవలెనని రాముని అభిప్రాయము అని వ్రాసినా డని చెప్పినాడు. కాని ఇతరస్థలములలో ఉన్న వర్ణనలు, మానవులైన రామసీతాదులను చూచి శూర్పణఖాదశకంఠాదులు కామవశంవదులగుట, గజతురగాదిచతురంగబలోపయోగము మొదలైన వాటిని బట్టి తిలకవ్యాఖ్యానకారుడు చెప్పినదే యుక్త మని తోచుచున్నది. రాక్షసులకు ఇతరరూపములను ధరించుశక్తి ఉండవచ్చును. వానరులకు కూడ అట్టి శక్తి ఉన్నట్లు అనేకస్థలములలో వర్ణింపబడినది. 35

మూ. స రామః కృత్యసిద్ధ్యర్థ మేవముక్త్వా విభీషణమ్, 36
సువేలారోహణే బుద్ధిం చకార మతిమాన్ ప్రభుః,
రమణీయతరం దృష్ట్వా సువేలస్య గిరేస్తటమ్. 37

ప్ర. అ. మతిమాన్=బుద్ధిమంతుడు, ప్రభుః=ప్రభువు అయిన, సః రామః=ఆ రాముడు, విభీషణమ్=విభీషణుని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, సువేలస్య గిరేః=సువేలపర్వతముయొక్క, రమణీయతరమ్=మిక్కిలి సుందరమైన, తటమ్=చరియను, దృష్ట్వా=చూచి, కృత్యసిద్ధ్యర్థమ్=కృత్యముయొక్క సిద్ధికొ

దకు, సువేలారోహణే=సువేలపర్వతమును ఎక్కుటయందు, బుద్ధిమ్=బుద్ధిని, చకార=చేసెను.

తా. బుద్ధిమంతుడు, ప్రభువూ అయిన రాముడు విభీషణునితో ఇట్లు పలికి, అందమైన సువేలపర్వతము చరియను చూచి కార్యసిద్ధికొరకై, అనగా లంకను బాగుగా పరిశీలించి చూచుటకై, సువేలపర్వతమును ఎక్కవలెనని అనుకొనెను. 36, 37

మూ. తతస్తు రామో మహతా బలేన
ప్రచ్ఛాద్య సర్వాం పృథివీం మహాత్మా,
ప్రహృష్టరూపోఽభిజగామ లఙ్కాం
కృత్వా మతిం సోఽరివధే మహాత్మా. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మా=గొప్ప బుద్ధి గల, మహాత్మా=గొప్ప ధైర్యము గల, రామః=రాముడు, మహతా=గొప్పదైన, బలేన=సేనచేత, సర్వామ్=సమస్తమైన, పృథివీమ్=భూమిని, ప్రచ్ఛాద్య=కప్పి, ప్రహృష్టరూపః=మిక్కిలి సంతోషించినవాడై, అరివధే=శత్రువధయందు, మతిమ్=బుద్ధిని, కృత్వా=చేసి, లఙ్కామ్=లంకను గూర్చి, అభిజగామ=వెళ్లెను.

తా. గొప్ప బుద్ధి, ధైర్యము గల రాముడు గొప్ప సైన్యముచేత భూమి నంతను కప్పివేసి చాల సంతోషించుచు, శత్రువధ చేయ సంకల్పించి లంకవైపు వెళ్లెను.

వి. ఈ శ్లోకములో రాబోయే విషయాన్ని సంగ్రహించడం గాని, చెప్పిన విషయాన్ని అనువదించడం గాని, ఒక ప్రకరణసమాప్తి కాని లేదు. అందుచే కొంతమంది భ్రాంతిచేత ఈ శ్లోకం ప్రక్షిప్తం చేసి సర్గసమాప్తి చేసినారు అని కతకవ్యాఖ్యానంలో చెప్పబడినట్లు తిలకవ్యాఖ్యానము చెప్పుచున్నది. అది యుక్తమే. మహాత్మా అను పదాన్ని రెండు మార్లు ప్రయోగించి చేసిన పద్యరచనయే రచయిత రచనాకౌశలాన్ని సూచిస్తున్నది. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాత్రింశః సర్గః

[రామలక్ష్మణులు వానరముఖ్యులతో కలసి సువేలపర్వతము నధిరోహించుట.]

మూ. స తు కృత్వా సువేలస్య మతిమారోహణం ప్రతి,
లక్ష్మణానుగతో రామః సుగ్రీవమిద మబ్రవీత్. 1
విభీషణం చ ధర్మజ్ఞమనురక్తం నిశాచరమ్,
మన్త్రజ్ఞం చ విధిజ్ఞం చ శ్లక్ష్ణయా పరయా గిరా. 2

ప్ర. అ. లక్ష్మణానుగతః=లక్ష్మణునిచేత అనుసరింపబడిన, సః రామః=ఆ రాముడు, సువేలస్య=సువేలాద్రియొక్క, ఆరోహణం ప్రతి=ఎక్కుటను గూర్చి, మతిమ్=బుద్ధిని, కృత్వా=చేసి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ధర్మజ్ఞమ్=ధర్మము నెరిగిన, అనురక్తమ్=అనురక్తుడైన, నిశాచరమ్=రాక్షసుడైన, మన్త్రజ్ఞమ్=ఆలోచనలను తెలిసిన, విధిజ్ఞమ్=శాస్త్రవిధి నెరిగిన, విభీషణం చ=విభీషణుణ్ణి గూర్చి, శ్లక్ష్ణయా=మృదువైన, పరయా=గొప్పదైన, గిరా=వాక్కుతో, ఇదమ్=దీనిని, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణునితో కూడిన రాముడు సువేలపర్వతము నెక్కుటకు నిశ్చయించి, సుగ్రీవునితోను, తనయందు అనురక్తుడు, ధర్మములు, ఆలోచన, శాస్త్రమూ తెలిసినవాడూ అయిన విభీషణునితోను మృదు వాక్కుతో ఇట్లు పలికెను. 1,2

మూ. సువేలం సాధు శైలేన్ద్రమిమం ధాతుశతైశ్చితమ్,
అధ్యారోహామహే సర్వే వత్స్యామోఽత్ర నిశామిమామ్. 3

ప్ర. అ. ధాతుశతైః=వందలకొలది ధాతువులతో, చితమ్=వ్యాప్తమైన, ఇమమ్=ఈ, సువేలం శైలేన్ద్రమ్=సువేల మను పర్వతశ్రేష్ఠమును, సాధు=బాగుగా, అధ్యారోహామహే=ఎక్కెదము. సర్వే=మనమందరము, ఇమామ్=ఈ, నిశామ్=రాత్రిని, అత్ర=దీనిపైన, వత్స్యామహే=నివసించెదము.

తా. వందలకొలది ధాతువులతో వ్యాప్తమైన ఈ శ్రేష్ఠపర్వతమైన సువేలమును ఎక్కెదము. ఈ రాత్రి దీనిపై నివసించెదము. 3

మూ. లఙ్కాం చాలోకయిష్యామో నిలయం తస్య రక్షసః,
యేన మే మరణాన్తాయ హృతా భార్యా దురాత్మనా. 4
యేన ధర్మో న విజ్ఞాతో న వృత్తం న కులం తథా,
రాక్షస్యా నీచయా బుద్ధ్యా యేన తద్గర్హితం కృతమ్. 5

ప్ర. అ. దురాత్మనా=దుష్టబుద్ధిగల, యేన=ఎవనిచేత, మరణాన్తాయ=మరణ

జనువే ఫలముకొరకు, మే భార్యా=నా భార్య, హృతా=హరింపబడినదో, యేన=ఎవనిచేత, ధర్మః= ధర్మము, న విజ్ఞాతః=తెలియబడలేదో, వృత్తమ్=సచ్చరిత్రము, న=తెలియబడలేదో, తథా=మరియు, కులమ్=కులము, న=తెలియబడలేదో, యేన=ఎవనిచేత, నీచయా=నీచమైన, రాక్షస్యా బుద్ధ్యా=రాక్షసబుద్ధిచేత, గర్హితమ్=నిందితమైన, తత్= ఆ కార్యము, కృతమ్=చేయబడినదో, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, వినయమ్= స్థావమైన, లఙ్కామ్=లంకను, ఆలోకయిష్యామి న=చూచెదను కూడ.

తా. దురాత్ముడైన ఏ రావణుడు తన చావు కొరకే నా భార్యను అపహరించినాడో, ఎవడు ధర్మమును సచ్చరితమును కులమును చూడకుండగా నీచమైన రాక్షసబుద్ధితో ఇట్టి నీచకార్యము చేసినాడో ఆ రావణుని నివాసమైన లంకను చూచెదను. 4, 5

మూ. తస్మిన్ మే వర్ధతే రోషః కీర్తితే రాక్షసాధమే,
యస్యాపరాధాన్నీచస్య వధం ద్రక్ష్యామి రక్షసామ్. 6

ప్ర. అ. నీచస్య=నీచుడైన, యస్య=ఎవనియొక్క, అపరాధాత్=అపరాధమువలన, రక్షసామ్=రాక్షసులయొక్క, వధమ్=వధను, ద్రక్ష్యామి=చూచెదనో, తస్మిన్=అట్టి, రాక్షసాధమే=రాక్షసాధముడు, కీర్తితే సతి=చెప్పబడగానే, మే=నాయొక్క, రోషః= కోపము, వర్ధతే=వృద్ధిపొందుచున్నది.

తా. ఆ రాక్షసాధముని పేరు వినగానే నాకు కోపము కలుగుచున్నది. ఆ నీచుని అపరాధమునకు ఫలితముగా సకల రాక్షసులను చంపగలను.

వి. ఈ శ్లోకము, దీని తరువాతి శ్లోకము కూడ కొన్ని ప్రతులలో లేవు. ఇవి రాముడు పలకదగిన మాటలు వలె కూడ లేవు. 6

మూ. ఏకో హి కురుతే పాపం కాలపాశవశం గతః,
నీచేనాత్మాపచారేణ కులం తేన వినశ్యతి. 7

ప్ర. అ. ఏకః=ఒకడు, కాలపాశవశమ్=కాలపాశమునకు వశమును, గతః= పొందినవాడై, పాపమ్=పాపమును, కురుతే హి=చేయును గదా ? నీచేన=నీచుడైన, తేన=వానిచేత, ఆత్మాపచారేణ=తన అపచారముచేత, కులమ్=కులము, వినశ్యతి= నశించును.

తా. ఒక నీచుడు కాలపాశమునకు వశుడై పాపము చేయుగా అతడు చేసిన అపచారమునకు ఫలితముగా కులము నశించును. 7

మూ. ఏవం సంమన్త్రయన్నేవ సక్రోధో రావణం ప్రతి,
రామః సువేలమాసాద్య చిత్రసానుముపారుహత్. 8

ప్ర. అ. రావణం ప్రతి=రావణుని గూర్చి, సక్రోధః=కోపముతో కూడిన, రామః=రాముడు, ఏవమ్=ఇట్లు, సంమన్త్రయన్నేవ=ఆలోచించుచునే, చిత్రసానుమ్=చిత్రమైన శిఖరములు గల, సువేలమ్=సువేలపర్వతమును, ఆసాద్య=సమీపించి, ఉపారుహత్=ఎక్కెను.

తా. రావణునియందు కోపము గల రాముడు ఈ విధముగా మాట్లాడుచునే చిత్రమైన శిఖరములు గల సువేలపర్వతమును సమీపించి దానిపైకి ఎక్కెను. 8

మూ. పృష్ఠతో లక్ష్మణశ్చైన మన్వగచ్ఛత్సమాహితః,
సశరం చాపముద్యమ్య సుమహద్విక్రమే రతః, 9
తమన్వారోహత్సుగ్రీవః సామాత్యః సవిభీషణః.

ప్ర. అ. విక్రమే=పరాక్రమమునందు, రతః=ఆసక్తుడైన, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు కూడ, సమాహితః=సావధానచిత్తుడై, సశరమ్=బాణముతో కూడిన, సుమహత్=చాల గొప్పదైన, చాపమ్=ధనస్సును, ఉద్యమ్య=ఎత్తి, ఏనమ్=ఈ రాముణ్ణి, పృష్ఠతః=వెనుక, అన్వగచ్ఛత్=అనుసరించి వెళ్లెను. సామాత్యః=మంత్రులతో కూడిన, సవిభీషణః=విభీషణునితో కూడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, తమ్=ఆతనిని, అన్వారోహత్=అనుసరించి ఎక్కెను.

తా. పరాక్రమవంతుడైన లక్ష్మణుడు బాణముతో కూడిన గొప్ప ధనస్సును సిద్ధముగా ఉంచుకొని, సావధానచిత్తుడై, రాముని వెనుక వెళ్లెను. ఆతని వెనుక సుగ్రీవుడు, ఆతని మంత్రులు, విభీషణుడు వెళ్లిరి. 9

మూ. హనుమానఙ్గదో నీలో మైన్దో ద్వివిద ఏవ చ, 10
గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః,
పనసః కుముదశ్చైవ హరో రమ్భశ్చ యూథపః. 11
జామ్బవాంశ్చ సుషేణశ్చ ఋషభశ్చ మహామతిః,
దుర్ముఖశ్చ మహాతేజాస్తథా శతబలిః కపిః. 12
ఏతే చాన్యే చ బహవో వానరాః శీఘ్రగామినః,
తే వాయువేగప్రవణాస్తం గిరిం గిరిచారిణః 13
అధ్యారోహన్త శతశః సువేలం యత్ర రాఘవః.

(కొందరు వ్యాఖ్యాతల ప్రకారం 10, 11, 12 శ్లోకాలు, తరువాత శ్లోకార్ధం ప్రక్షిప్తాలు)

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, అఙ్గదః=అంగదుడు, నీలః=నీలుడు, మైన్దః=మైందుడు, ద్వివిద ఏవ చ=ద్వివిదుడు, గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు,

గవయః=గవయుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, పనసః=పనసుడు, కుముదశ్చైవ=కుముదుడు, హరః=హరుడు, యూథపః=సేనానాయకు డైన, రమ్భశ్చ=రంభుడు, జామ్బవాంశ్చ=జాంబవంతుడు, సుషేణశ్చ=సుషేణుడు, మహామతిః=గొప్ప బుద్ధిగల, ఋషభశ్చ=ఋషభుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, దుర్ముఖశ్చ=దుర్ముఖుడు, కపిః=వానరుడైన, శతబలిః=శతబలి, ఏతే చ=వీళ్లు, శీఘ్రగామినః=శీఘ్రముగా వెళ్ళే, గిరిచారిణః=పర్వతములమీద సంచరించు, వాయు వేగప్రవణాః=వాయువేగమువంటి వేగము గల, తే=ఆ, వానరాః=వానరులు, శతశః=వందలకొలది, రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడ నున్నాడో, తమ్=ఆ, సువేలం గిరిమ్= సువేలపర్వతమును, అధ్యారోహన్త=ఎక్కిరి.

తా. హనుమంతుడు, అంగదుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు, గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, పనసుడు, కుముదుడు, హరుడు, రంభుడు, జాంబవంతుడు, సుషేణుడు, ఋషభుడు, దుర్ముఖుడు, శతబలి మొదలైన ఇంకా ఎందరో వాయువేగము వంటి వేగము గల, పర్వతసంచారులైన వందలకొలది వానరులు రాముడు ఎక్కిన ఆ సువేలపర్వతముపైకి ఎక్కిరి.10-13

మూ. తే త్వదీర్ఘేణ కాలేన గిరిమారుహ్య సర్వతః, 14
దదృశుః శిఖరే తస్య విషక్తామివ ఖే పురీమ్.

ప్ర. అ. తే తు=వాళ్లు, అదీర్ఘేణ=దీర్ఘము కాని, కాలేన=కాలముచేత, సర్వతః=నలువైపుల, గిరిమ్=పర్వతమును, ఆరుహ్య=ఎక్కి, తస్య=దానియొక్క, శిఖరే= శిఖరమునందు, ఖే=ఆకాశమునందు, విషక్తామివ=వ్రేలాడుచున్నదా అన్న ట్లున్న, పురీమ్= పట్టణమును, దదృశుః= చూచిరి.

తా. వారంతరూ శీఘ్రముగా నలు వైపులనుండి ఆ పర్వతమునెక్కి దాని శిఖరముమీద ఆకాశములో వ్రేలాడుచున్నదా అన్నట్లు ఉన్న లంకాపట్టణమును చూచిరి. 14

మూ. తాం శుభాం ప్రవరద్వారాం ప్రాకారవరశోభితామ్, 15
లఙ్కాం రాక్షససంపూర్ణాం దదృశుర్హరియూథపాః.

ప్ర. అ. హరియూథపాః=వానరసేనానాయకులు, ప్రవరద్వారామ్=శ్రేష్ఠమైన ద్వారములు కలది, ప్రాకారవరశోభితామ్=శ్రేష్ఠమైన ప్రాకారముచేత ప్రకాశింపచేయ బడినది, రాక్షససంపూర్ణామ్= రాక్షసులతో నిండినదీ అయిన, శుభామ్=సుందరమైన, తాం లఙ్కామ్=ఆ లంకను, దదృశుః= చూచిరి.

తా. ఆ వానరనాయకులు శ్రేష్ఠమైన ద్వారములతోనూ, ఉత్తమమైన ప్రాకారములతోను ప్రకాశించుచున్న, రాక్షసులతో నిండిన ఆ సుందరమైన లంకాపట్టణమును చూచిరి. 15

మూ. ప్రాకారవరసంస్థైశ్చ తథా నీలైశ్చ రాక్షసైః, 16
దదృశుస్తే హరిశ్రేష్ఠాః ప్రాకారమపరం కృతమ్.

ప్ర. అ. ప్రాకారవరసంస్థైః=శ్రేష్ఠమైన ప్రాకారముపై ఉన్న, తథా=మరియు, నీలైశ్చ= నల్లగా ఉన్న, రాక్షసైః=రాక్షసులచేత, కృతమ్=చేయబడిన, అపరమ్=మరియొక, ప్రాకారమ్=ప్రాకారమును, తే=ఆ, హరిశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, దదృశుః= చూచిరి.

తా. నల్లని దేహచ్ఛాయ గల రాక్షసులు ప్రాకారముమీద ఎక్కి వరుసగా నిలబడి ఉండుటచే మరొక ప్రాకారము నిర్మించబడినదా అన్నట్లుండుటను ఆ వానరశ్రేష్ఠులు చూచిరి. 16

మూ. తే దృష్ట్వా వానరాః సర్వే రాక్షసాన్ యుద్ధకాంక్షిణః, 17
ముముచుర్వివిధాన్నాదాంస్తస్య రామస్య పశ్యతః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే వానరాః=ఆ వానరులు, యుద్ధకాంక్షిణః= యుద్ధమును కోరుచున్న, రాక్షసాన్=రాక్షసులను, దృష్ట్వా=చూచి, తస్య=ఆ, రామస్య=రాముడు, పశ్యతః=చూచుచుండగా, వివిధాన్=అనేకవిధములైన, నాదాన్= ధ్వనులను, ముముచుః=విడిచిరి.

తా. ఆ వానరులు యుద్ధమును కోరుచున్న ఆ రాక్షసులను చూచి రాముడు చూచుచుండగా అనేకవిధములైన ధ్వనులు చేసిరి. 17

మూ. తతోఽస్తమగమత్సూర్యః సంధ్యయా ప్రతిరఞ్జితః 18
పూర్ణచన్ద్రప్రదీప్తా చ క్షపా సమభివర్తత.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సూర్యః=సూర్యుడు, సంధ్యయా=సంధ్యవేళ, ప్రతిరఞ్జితః=ఎఱ్ఱబడినవాడై, అస్తమ్ అగమత్=అస్తమించెను. పూర్ణచన్ద్రప్రదీప్తా= పూర్ణచంద్రునిచేత ప్రకాశింపచేయబడిన, క్షపా చ=రాత్రి కూడ, సమభివర్తత=వచ్చెను.

తా. అప్పుడు సంధ్యవేళ ఎఱ్ఱనైన సూర్యుడు అస్తమించెను. పూర్ణచంద్రునిచేత ప్రకాశింప చేయబడిన రాత్రి వచ్చెను. 18

మూ. తతః స రామో హరివాహినీపతి
ర్విభీషణేన ప్రతినన్ద్య సత్కృతః,
సలక్ష్మణో యూథపయూథసంవృతః
సువేలపృష్ఠే న్యవసద్యథాసుఖమ్. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టాత్రింశః సర్గః

ప్ర. . అ. తతః=అటుపిమ్మట, సలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, సః=ఆ, రామః=రాముడు, యూథపయూథసంయుతః=సేనానాయకుల సముదాయముతో కూడిన, హరివాహినీపతిః=వానరసేనానాయకుడైన సుగ్రీవుడు, విభీషణేన=విభీషణుని చేత, ప్రతినన్ద్య= అభినందించి, సత్కృతః=సత్కరింపబడినవాడై, సువేలపృష్ఠే=సువేల పర్వతముపైన, యథాసుఖమ్=సుఖముగా, న్యవసత్=నివసించెను.

తా. పిమ్మట ఆ రాముడు, లక్ష్మణుడు, సేనానాయకుల సముదాయముతో కూడిన వానరసేనాధిపతియైన సుగ్రీవుడు విభీషణునిచేత అభినందించి సత్కరింపబడినవారై ఆ సువేలపర్వతము పైభాగమున సుఖముగా ఉండిరి. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనచత్వారింశః సర్గః

(రాముడు, వానరులు సువేలపర్వతము శిఖరమునుండి లంకను చూచుట.)

మూ. తాం రాత్రిముషితాస్తత్ర సువేలే హరియూథపాః,
లఙ్కాయాం దదృశుర్వీరా వనాన్యుపవనాని చ. 1

ప్ర. అ. వీరాః=వీరులైన, హరియూథపాః=వానరసేనానాయకులు, తత్ర=ఆ, సువేలే=సువేలపర్వతమునందు, తామ్=ఆ, రాత్రిమ్=రాత్రిని, ఉషితాః=ఉన్నవారై, లఙ్కాయామ్=లంకయందు, వనాని=వనములను, ఉపవనాని చ=ఉద్యానములను, దదృశుః=చూచిరి.

తా. వీరులైన వానరసేనానాయకులు ఆ రాత్రి ఆ సువేలపర్వతముమీద ఉండి, లంకలోని వనములను, ఉద్యానములను చూచిరి. 1

మూ. సమసౌమ్యాని రమ్యాణి విశాలాన్యాయతాని చ,
దృష్టిరమ్యాణి తే దృష్ట్వా బభూవుర్జాతవిస్మయాః. 2

ప్ర. అ. తే=వారు, సమసౌమ్యాని=సమములుగాను అందముగాను ఉన్నవి, రమ్యాణి=రమ్యములు, విశాలాని=విశాలములు, ఆయతాని చ=దీర్ఘములు, దృష్టిరమ్యాణి= దృష్టికి సుందరములు అయిన ఆ వనోద్యానములను, దృష్ట్వా=చూచి, జాతవిస్మయాః=పుట్టిన ఆశ్చర్యము కలవారు, బభూవుః=అయిరి.

తా. ఆ వనములు, ఉద్యానములు కూడ సమముగా హెచ్చు తగ్గులు లేని విధమున పెరిగి విశాలముగాను, దీర్ఘముగాను, అందముగాను ఉండెను. చూచుటకు రమ్యమైన వాటిని చూచి ఆ వానరులు ఆశ్చర్యపడిరి. 2

మూ. చమ్పకాశోకవకుళసాలతాలసమాకులా,
తమాలవనసఞ్ఛన్నా నాగమాలాసమావృతా. 3
హిన్తాలైరర్జునైర్నీపైః సప్తపర్ణైః సుపుష్పితైః,
తిలకైః కర్ణికారైశ్చ పాటలైశ్చ సమన్తతః. 4
శుశుభే పుష్పితాగ్రైశ్చ లతాపరిగతైర్ద్రుమైః,
లఙ్కా బహువిధైర్దివ్యైర్యథేన్ద్రస్యామరావతీ, 5
విచిత్రకుసుమోపేతై రక్తకోమలపల్లవైః,
శాద్వలైశ్చ తథా నీలైశ్చిత్రాభిర్వనరాజిభిః. 6

ప్ర. అ. చమ్పకాశోకవకుళ సాలతాలసమాకులా=చంపక-అశోకవృక్షముల తోను, పొగడచెట్లతోను, తాటిచెట్లతోను వ్యాకులము, తమాలవనసఞ్ఛన్నా=తమాల-

పనస వృక్షములచేత కప్పబడినది, నాగమాలాసమావృతా=నాగవృక్షముల పంక్తిచేత కప్పబడినది. అయిన, లఙ్కా=లంక, సమన్తతః=అంతటా, హిన్తాలైః=హింతాలవృక్షములతో, అర్జునైః=అర్జునవృక్షములతో, నీపైః=నీపవృక్షములతో, సుపుష్పితైః=బాగుగా పుష్పించిన, సప్తపర్ణైః=ఏడాకుల అరటిచెట్లతో, తిలకైః=తిలకవృక్షములతో, కర్ణికారైశ్చ=కర్ణికారములతో, పాటలైః=పాటలవృక్షములతో, పుష్పితాగ్రైః=పుష్పించిన అగ్రభాగములు గల, లతాపరిగతైర్ద్రుమైః=లతలతో కూడిన వృక్షములతోను, విచిత్రకుసుమోపేతైః=విచిత్రములైన పుష్పములతో కూడిన, రక్తకోమలపల్లవైః=ఎఱ్ఱని మృదువైన చిగుళ్ళు గల, దివ్యైః=దివ్యములైన, బహువిధైః=అనేకవిధములైన ఇతర వృక్షములతోను, తథా=మరియు, నీలైః=నల్లని, శాద్వలైః=పచ్చికబయళ్ళతోను, చిత్రాభిః= చిత్రములైన, వనరాజిభిః=వనపంక్తులతోను, ఇన్ద్రస్య=ఇంద్రునియొక్క, అమరావతీ ఇవ= అమరావతి వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. ఆ లంక చంపక - అశోక - వకుళ - తాళ - సాల - తమాల - పనస - నాగవృక్షముల చేత కప్పబడి ఉండెను. అంతటా కూడ హింతాల-అర్జున-నీపవృక్షములతోను, బాగా పుష్పించిన ఏడాకుల అరటిచెట్లతోను, విచిత్రములైన పుష్పములు, ఎఱ్ఱని మృదువైన చిగుళ్ళు గల అనేక ఇతర వృక్షములతోను, అగ్రభాగములయందు పుష్పములతో నిండిన, లతలచేత చుట్టబడిన వృక్షములతోను ఇంద్రుని అమరావతి వలె ప్రకాశించుచుండెను. 3 - 6

మూ. గన్ధాఢ్యాన్యతిరమ్యాణి పుష్పాణి చ ఫలాని చ,
ధారయన్త్యగమాస్తత్ర భూషణానీవ మానవాః. 7

ప్ర. అ. తత్ర=అక్కడ, అగమాః=వృక్షములు, గన్ధాఢ్యాని=సుగంధముతో నిండిన, అతిరమ్యాణి=చాల రమ్యమైన, పుష్పాణి చ=పుష్పములను, ఫలాని చ=ఫలములను, మానవాః=మానవులు, భూషణానీవ=భూషణములను వలె, ధారయన్తి=ధరించుచున్నవి.

తా. అక్కడ ఉన్న వృక్షములు సువాసనతో కూడిన, చాల రమ్యములైన పుష్పములను, ఫలములను మానవులు అలంకారములు ధరించినట్లు ధరించెను.7

మూ. తచ్చైత్రరథసంకాశం మనోజ్ఞం నన్దనోపమమ్,
వనం సర్వర్తుకం రమ్యం శుశుభే షట్పదాయుతమ్. 8

ప్ర. అ. చైత్రరథసంకాశమ్=చైత్రరథముతో సమానము, మనోజ్ఞమ్=మనోహరము, నన్దనోపమమ్=నందనవనముతో సమానము, సర్వర్తుకమ్=అన్ని ఋతువులు కలది, షట్పదాయుతమ్=తుమ్మెదలతో కూడినది అయిన, తత్=ఆ, వనమ్=వనము, శుశుభే= ప్రకాశించెను.

తా. అన్ని ఋతువులకు సంబంధించి పుష్పఫలాదులతో నిండినదై, తుమ్మెదలతో కూడిన ఆ వనము చైత్రరథము వలె, నందనవనము వలె మనోహరముగా ఉండెను. 8

మూ. దాత్యూహకోయష్టిభకైర్నృత్యమానైశ్చ బర్హిభిః,
రుతం పరభృతానాం చ శుశ్రువే వననిర్ఝరే. 9

ప్ర. అ. వననిర్ఝరే=వనమునందలి జలప్రవాహమునందు, దాత్యూహకోయష్టిభకైః= దాత్యూహములు, కోయష్టిభకములు అను జలపక్షులచేత చేయబడిన ధ్వని, నృత్యమానైః=నాట్యము చేయుచున్న, బర్హిభిః=నెమళ్లచేత చేయబడు ధ్వని, పరభృతానామ్=కోకిలలయొక్క, రుతమ్ చ=ధ్వని, శుశ్రువే=వినబడెను.

తా. వనమునందలి జలప్రవాహమునందు దాత్యూహములు, కోయష్టిభకములు అను పక్షుల ధ్వని, నృత్యము చేయుచున్న నెమళ్ల ధ్వని, కోకిలల ధ్వని వినబడెను. 9

మూ. నిత్యమత్తవిహంగాని భ్రమరాచరితాని చ,
కోకిలాకులషణ్డాని విహంగాభిరుతాని చ. 10
భృఙ్గరాజాభిగీతాని కురరస్వనితాని చ,
కోణాలకవిఘుష్టాని సారసాభిరుతాని చ. 11
వివిశుస్తే తతస్తాని వనాన్యుపవనాని చ,
హృష్టాః ప్రముదితా వీరా హరయః కామరూపిణః. 12

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తే=ఆ, హృష్టాః=సంతోషించి, ప్రముదితాః=ఆనందించిన, వీరాః=వీరులైన, కామరూపిణః=కామరూపముగల, హరయః=వానరులు, నిత్యమత్తవిహంగాని=నిత్యమూ మదించిన పక్షులు కలవి, భ్రమరాచరితాని చ=తుమ్మెదలచేత సంచరించబడినవి, కోకిలాకులషణ్డాని=కోకిలలచేత వ్యాకులములైన వృక్షముల సముదాయములు గలవి, విహంగాభిరుతాని చ=పక్షుల ధ్వనులు కలవి, భృఙ్గరాజాభిగీతాని=తుమ్మెదల గీతములు కలవి, కురరస్వనితాని చ=గోరింకల ధ్వనులు గలవి, కోణాలకవిఘుష్టాని=ఖంజనపక్షుల ధ్వనులు గలవి, సారసాభిరుతాని=సారసధ్వనులు గలవి అయిన, తాని=ఆ, వనాని=వనములను, ఉపవనాని చ=ఉద్యానములను, వివిశుః=ప్రవేశించిరి.

తా. ఆ వనములలోను, ఉద్యానములలోను ఉన్న పక్షులు నిత్యము మదించి ఉండెను. అంతటా తుమ్మెదలు ఎగురుచుండెను. వృక్షసముదాయములు కోకిలలతో వ్యాకులములై ఉండెను. పక్షుల ధ్వనులు, తుమ్మెదల గీతములు, గోరింకల కూతలు, ఖంజనపక్షుల ధ్వనులు, సారసపక్షుల నాదములు అంతటా

వ్యాపించి ఉండెను. సంతోషానందములతో కూడిన వీరులైన ఆ కామరూపము గల వానరులు ఆ వనములలోను, ఉద్యానములలోను ప్రవేశించిరి.10 - 12

మూ. తేషాం ప్రవిశతాం తత్ర వానరాణాం మహౌజసామ్,
పుష్పసంసర్గసురభిర్వవౌ ఘ్రాణసుఖోఽనిలః. 13

ప్ర. అ. మహౌజసామ్=గొప్ప తేజస్సు గల, తేషామ్=ఆ, వానరాణామ్=వానరులు, తత్ర=అక్కడ, ప్రవిశతామ్=ప్రవేశించుచుండగా, పుష్పసంసర్గసురభిః=పుష్పముల సంబంధముచేత పరిమళముతో కూడిన, ఘ్రాణసుఖః=ముక్కుకు సుఖకరమైన, అనిలః= వాయువు, వవౌ=వీచెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ వానరులు ప్రవేశించుచుండగా, పుష్పముల సంపర్కముచేత పరిమళించుచున్న, ఘ్రాణేంద్రియమునకు సుఖకరమైన వాయువు వీచెను. 13

మూ. అన్యే తు హరివీరాణాం యూథాన్నిష్క్రమ్య యూథపాః,
సుగ్రీవేణాభ్యనుజ్ఞాతా లఙ్కాం జగ్ముః పతాకినీమ్. 14

ప్ర. అ. అన్యే=మరికొందరు, యూథపాః తు=సేనానాయకులైతే, హరివీరాణామ్= వానరవీరులయొక్క, యూథాత్=గుంపునుండి, నిష్క్రమ్య=బైటకు వచ్చి, సుగ్రీవేణ= సుగ్రీవునిచేత, అభ్యనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడినవారై, పతాకినీమ్=పతాకలు గల, లఙ్కామ్=లంకను గూర్చి, జగ్ముః=వెళ్లిరి.

తా. కొందరు వానరులు వానరసైన్యమునుండి బైటకు వచ్చి సుగ్రీవుని అనుజ్ఞతో పతాకలతో శోభించుచున్న లంకకు వెళ్లిరి. 14

మూ. విత్రాసయన్తో విహగాన్ గ్లాపయన్తో మృగద్విపాన్,
కమ్పయన్తశ్చ తాం లఙ్కాం స్వైర్నాదైర్నదతాం వరాః. 15

ప్ర. అ. నదతామ్=ధ్వనిచేయువారిలో, వరాః=శ్రేష్ఠులైన ఆ వానరులు, విహగాన్= పక్షులను, విత్రాసయన్తః=భయపడునట్లు చేయుచు, మృగద్విపాన్=మృగములను ఏనుగులను, గ్లాపయన్తః=దీనములగునట్లు చేయుచు, స్వైః=తమ సంబంధమైన, నాదైః=ధ్వనులచేత, తామ్=ఆ, లఙ్కామ్=లంకను, కమ్పయన్తశ్చ=కంపింపచేయుచు (వెళ్లిరి).

తా. ధ్వని చేయువారిలో గొప్పవారైన ఈ వానరులు పక్షులను భయపెట్టుచు, మృగములకు, ఏనుగులకు భయము పుట్టించుచు, తమ ధ్వనులచేత ఆ లంకను కంపింపచేయుచు వెళ్లిరి. 15

మూ. కుర్వన్తస్తే మహావేగా మహీం చరణపీడితామ్,
రజశ్చ సహసైవోర్ధ్వం జగామ చరణోత్థితమ్. 16

ప్ర. అ. మహావేగాః=గొప్పవేగము గల, తే=ఆ వానరులు, మహీమ్=భూమిని, చరణపీడితామ్=పాదములచేత పీడింపబడినదానినిగా, కుర్వన్తః=చేయుచు (వెళ్లిరి). చరణోద్ధుతమ్=పాదములచేత లేచిన, రజః=పరాగము, సహసైవ=శీఘ్రముగా, ఊర్ధ్వమ్=పైకి, జగామ=వెళ్లెను.

తా. గొప్ప వేగము గల ఆ వానరులు భూమిని తమ పాదములచేత పీడించుచు వెళ్లిరి. వాళ్ల పాదాలచేత పైకి లేచిన పరాగము వెంటనే ఎత్తుగా ఎగిరెను. 16

మూ. ఋక్షాః సింహాశ్చ మహిషా వారణాశ్చ మృగాః ఖగాః,
తేన శబ్దేన విత్రస్తా జగ్ముర్భీతా దిశో దశ. 17

ప్ర. అ. తేన=ఆ, శబ్దేన=శబ్దముచేత, విత్రస్తాః=భయపడిన, ఋక్షాః=భల్లూకములు, సింహాశ్చ=సింహములు, మహిషాః=దున్నపోతులు, వారణాశ్చ=ఏనుగులు, మృగాః=లేళ్లు, ఖగాః=పక్షులు, విత్రస్తాః=బెదిరిపడినవై, భీతాః=భయపడినవై, దశ=పది, దిశః=దిక్కులను గూర్చి, జగ్ముః=వెళ్లినవి.

తా. ఆ శబ్దమునకు బెదిరిపడి భయపడిన ఎలుగుబంట్లు, సింహములు, మహిషములు, ఏనుగులు, మృగములు, పక్షులు పది దిక్కులకు పారిపోయినవి. 17

మూ. శిఖరం తు త్రికూటస్య ప్రాంశు చైకం దివిస్పృశమ్,
సమన్తాత్పుష్పసంఛన్నం మహారజతసంనిభమ్. 18
శతయోజనవిస్తీర్ణం విమలం చారుదర్శనమ్,
శ్లక్ష్ణం శ్రీమన్మహచ్చైవ దుష్ప్రాపం శకునైరపి, 19
మనసాపి దురారోహం కిం పునః కర్మణా జనైః.

ప్ర. అ. సమన్తాత్=అంతటా, పుష్పసంఛన్నమ్=పుష్పములచేత కప్పబడినది, మహారజతసంనిభమ్=బంగారముతో సమానము, శతయోజనవిస్తీర్ణమ్=నూరు యోజనముల విస్తారము కలది, విమలమ్=నిర్మలము, చారుదర్శనమ్=అందమైన దర్శనము గలది, శ్లక్ష్ణమ్=సుందరము, శ్రీమత్=శోభాయుక్తము, మహచ్చైవ=గొప్పది, శకునైరపి=పక్షులచేత గూడ, దుష్ప్రాపమ్=పొంద శక్యము కానిది, జనైః=జనములచేత, మనసాపి=మనస్సుచేత కూడ, దురారోహమ్=ఎక్కుటకు శక్యము కానిది, కర్మణా=పనిచేత (నడకచేత), కిం పునః=చెప్పనేల ? అట్టి, ప్రాంశు=ఉన్నతము, దివిస్పృశమ్=ఆకాశమును స్పృశించునది, ఏకమ్=ఒక, త్రికూటస్య శిఖరమ్=త్రికూటపర్వతముయొక్క శిఖరము, ఉన్నది.

తా. ఆకాశమును స్పృశించు అత్యున్నతమైన త్రికూటపర్వతశిఖరమొకటి

ఉన్నది. బంగారము వంటి ఆ శిఖరము నలుప్రక్కల పుష్పవృక్షములచేత కప్పబడి, నూరుయోజనముల విస్తారముతో నిర్మలముగా, చూచుటకు అందముగా ఉన్నది. శోభాయుక్తము, సుందరము అయిన ఈ మహాశిఖరమును పక్షులు కూడ ఎక్కుట చాల కష్టము. అసలు దీనిని మనస్సుచేత కూడ ఎక్కజాలరు. ఇంక నడిచి ఎక్కజాలరని వేరే చెప్పవలెనా ? 18, 19

మూ. నివిష్టా తత్ర శిఖరే లఙ్కా రావణపాలితా, 20
దశయోజనవిస్తీర్ణా వింశద్యోజనమాయతా.

ప్ర. అ. తత్ర=ఆ, శిఖరే=శిఖరమునందు, రావణపాలితా=రావణుని చేత పాలింపబడిన, దశయోజనవిస్తీర్ణా=పది యోజనముల వైశాల్యముగల, వింశద్యోజనమ్=ఇరువది యోజనములు, ఆయతా=దీర్ఘమైన, లఙ్కా=లంక, నివిష్టా=ఏర్పరుపబడి ఉన్నది.

తా. పది యోజనముల విస్తారము, ఇరవై యోజనముల పొడవు గల రావణపాలితమైన లంక ఆ శిఖరముమీద ఉన్నది. 20

మూ. సా పురీ గోపురైరుచ్చైః పాణ్డురామ్బుదసంనిభైః,
కాఞ్చనేన చ సాలేన రాజతేన చ శోభతే. 21

ప్ర. అ. సా=ఆ, పురీ=లంక, ఉచ్చైః=ఉన్నతములైన, పాణ్డురామ్బుదసంనిభైః=తెల్లని మేఘములతో సమానములైన, గోపురైః=గోపురములతోను, కాఞ్చనేన=బంగారమువికారమైన, రాజతేన చ=వెండివికారమైన, సాలేన=ప్రాకారముతోను, శోభతే=ప్రకాశించుచున్నది.

తా. ఆ లంక తెల్లని మేఘముల వంటి ఉన్నతములైన గోపురములతోను, బంగారు ప్రాకారముతోను, వెండి ప్రాకారముతోను శోభించుచుండెను. 21

మూ. ప్రాసాదైశ్చ విమానైశ్చ లఙ్కా పరమభూషితా,
ఘనైరివాతపాపాయే మధ్యమం వైష్ణవం పదమ్. 22

ప్ర. అ. ప్రాసాదైశ్చ=ధనికుల గృహములచేతను, విమానైశ్చ=విమానములచేతను, పరమభూషితా=బాగుగా అలంకరింపబడిన, లఙ్కా=లంక, ఆతపాపాయే=వర్షర్తువునందు, ఘనైః=మేఘములతో, మధ్యమమ్=మధ్యమునందున్న, వైష్ణవం పదమ్ ఇవ=విష్ణుస్థానము వలె, త్రివిక్రమావతారములో రెండవపాదన్యాసమును విష్ణువు ఆకాశమునం దుంచుటచే మధ్యమవైష్ణవపద మనగా ఆకాశమని అర్థము (ఉండెను).

తా. పెద్ద భవనములచేత, విమానములచేత (అందమైన గృహములచేత) అలంకృతమైన ఆ లంక వర్షాకాలమునందు మేఘావృతమైన ఆకాశము వలె

ఉండెను. 22

మూ. తస్యాం స్తమ్భసహస్రేణ ప్రాసాదః సమలంకృతః,
కైలాసశిఖరాకారో దృశ్యతే ఖమివోల్లిఖన్. 23
చైత్యః స రాక్షసేన్ద్రస్య బభూవ పురభూషణమ్,
శతేన రక్షసాం నిత్యం యః సమగ్రేణ రక్ష్యతే. 24

ప్ర. అ. యస్యామ్=ఏ లంకాపురియందు, యః=ఏది, నిత్యమ్=ఎల్లప్పుడు, రక్షసామ్=రాక్షసులయొక్క, సమగ్రేణ=సంపూర్ణమైన, శతేన=సైన్యము చేత, రక్ష్యతే= రక్షింపబడుచున్నదో, స్తమ్భసహస్రేణ=వెయ్యి స్తంభములచేత, సమలంకృతః=అలంకరింపబడిన, కైలాసశిఖరాకారః=కైలాసపర్వతశిఖరముయొక్క ఆకారము వంటి ఆకారము గల, చైత్యప్రాసాదః= చైత్యప్రాసాదము, ఖమ్=ఆకాశమును, ఉల్లిఖన్నివ=వ్రాయుచున్నది వలె, దృశ్యతే= చూడబడుచున్నదో, సః=అది, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, పురభూషణమ్= పట్టణమునకు అలంకారముగా, బభూవ=ఉండెను.

తా. అక్కడ వెయ్యి స్తంభములచేత అలంకరింపబడిన చైత్యప్రాసాదము రావణుని నగరమునకు అలంకారముగా ఉండెను. అది కైలాసశిఖరము వలె ఆకాశమును వ్రాయుచుండెను. దానిని నిత్యము పూర్తి రాక్షససేన రక్షించుచుండెను. 23, 24

మూ. మనోజ్ఞాం కాఞ్చనవతీం పర్వతైరుపశోభితామ్,
నానాధాతువిచిత్రైశ్చ ఉద్యానైరుపశోభితామ్. 25
నానావిహగసంఘుష్టాం నానామృగనిషేవితామ్,
నానాకుసుమసంపన్నాం నానారాక్షససేవితామ్. 26
తాం సమృద్ధాం సమృద్ధార్థాం లక్ష్మీవాన్లక్ష్మణాగ్రజః,
రావణస్య పురీం రామో దదర్శ సహ వానరైః. 27

ప్ర. అ. లక్ష్మీవాన్=శోభగలవాడు, లక్ష్మణాగ్రజః=లక్ష్మణుని అన్నగారు అయిన, రామః=రాముడు, మనోజ్ఞామ్=మనోహరము, కాఞ్చనవతీమ్=బంగారము కలది, నానాధాతువిచిత్రైః=అనేకవిధములైన ధాతువులతో విచిత్రములైన, పర్వతైః=పర్వతములచేత, ఉపశోభితామ్=ప్రకాశింపచేయబడినది, ఉద్యానైః=ఉద్యానములచేత, ఉపశోభితామ్=ప్రకాశింపచేయబడినది, నానావిహగసంఘుష్టామ్=అనేకవిధములైన పక్షులచేత ధ్వనింపచేయబడినది, నానామృగనిషేవితామ్=అనేకవిధములైన మృగములచేత సేవింపబడినది, నానాకుసుమసంపన్నామ్=అనేకవిధములైన పుష్పములతో కూడినది, నానారాక్షససేవితామ్=అనేకులైన రాక్షసులచేత సేవింపబడినది,

సమృద్ధామ్=ఐశ్వర్యసంపన్నము, సమృద్ధార్థామ్=సమృద్ధమైన ధనము కలది అయిన, తామ్=ఆ, రావణస్య పురీమ్=రావణుని పట్టణమైన లంకను, వానరైః సహ=వానరులతో కూడినవాడై, దదర్శ=చూచెను.

తా. మనోహరమైన ఆ లంక బంగారముతో నిండి యుండెను. అనేకవిధములైన ధాతువులతో విచిత్రవర్ణము గల పర్వతములలోను, ఉద్యానవనములలోను ప్రకాశించుచుండెను. అనేకవిధములైన పక్షుల ధ్వనులతో నిండిన ఆ నగరములో అనేకవిధములైన మృగములు నివసించుచుండెను. అనేకవిధములైన పుష్పములతో నిండిన ఆ నగరములో అనేకవిధముల రాక్షసులు నివసించుచుండిరి. ఐశ్వర్యసమృద్ధమై, సమృద్ధమైన ధనము గల ఆ నగరము శోభాసంపన్నమైన రాముడు వానరుల చూచిరి. 25, 27

మూ. తాం మహాగృహసంబాధాం దృష్ట్వా లక్ష్మణపూర్వజః,
నగరీం త్రిదివప్రఖ్యాం విస్మయం ప్రాప వీర్యవాన్. 28

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, లక్ష్మణపూర్వజః=రాముడు, మహాగృహసంబాధామ్=గొప్ప గృహములచేత ఇరుకుగా ఉన్న, త్రిదివప్రఖ్యామ్=స్వర్గమువలె ఉన్న, తామ్=ఆ, నగరీమ్=పట్టణమును, దృష్ట్వా=చూచి, విస్మయమ్=ఆశ్చర్యమును, ప్రాప=పొందెను.

తా. పరాక్రమవంతుడైన రాముడు గొప్ప భవనములతో ఇరుకుగా ఉన్న, స్వర్గతుల్యమైన ఆ నగరమును చూచి ఆశ్చర్యము పొందెను. 28

మూ. తాం రత్నపూర్ణాం బహుసంవిధానాం
ప్రాసాదమాలాభిరలంకృతాం చ,
పురీం మహాయన్త్రకవాటముఖ్యాం
దదర్శ రామో మహతా బలేన. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. మహతా=గొప్ప, బలేన=సైన్యముతో కూడిన, రామః=రాముడు, రత్నపూర్ణామ్=రత్నములతో నిండినది, బహుసంవిధానామ్=అనేకమైన ఏర్పాట్లు గలది, ప్రాసాదమాలాభిః=ప్రాసాదముల పంక్తులచేత, అలంకృతాం చ=అలంకరింపబడినది, మహాయన్త్రకవాటముఖ్యామ్=గొప్ప యంత్రములతో కూడిన శ్రేష్ఠమైన తలుపులు గలది, మహతా=గొప్ప, బలేన=సేనతో కూడినది అయిన, తామ్=ఆ, పురీమ్=పట్టణమును, దదర్శ=చూచెను.

తా. అనేకములైన శ్రేష్ఠవస్తువులతో నిండిన ఆ నగరములో అనేకవిధములైన ఏర్పాట్లు చేయబడెను. ప్రాసాదముల పంక్తులచే అలంకరింపబడిన ఆ

మహానగరమునందలి తలుపులకు పెద్ద పెద్ద యంత్రములు అమర్చబడి ఉండెను. అంతటా సైన్యము ఆ నగరమును రక్షించుచుండెను. అట్టి లంకానగరమును రాముడు చూచెను. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ముప్పైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ చత్వారింశః సర్గః

[సుగ్రీవరావణుల మల్లయుద్ధము.]

మూ. తతో రామః సువేలాగ్రం యోజనద్వయమణ్డలమ్,
ఆరురోహ ససుగ్రీవో హరియూథైః సమన్వితః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ససుగ్రీవః=సుగ్రీవునితో కూడిన, హరియూథపైః=వానరసేనానాయకులతో, సమన్వితః=కూడిన, రామః=రాముడు, యోజనద్వయమణ్డలమ్=రెండు యోజనముల విస్తారము గల, సువేలాగ్రమ్=సువేలపర్వతాగ్రమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట రాముడు సుగ్రీవునితోను, వానరసేనానాయకులతోను కలసి వెళ్లి రెండు యోజనముల మండలాకారమైన విశాలప్రదేశము గల సువేలపర్వతమును ఎక్కెను. 1

మూ. స్థిత్వా ముహూర్తం తత్రైవ దిశో దశ విలోకయన్,
త్రికూటశిఖరే రమ్యే నిర్మితాం విశ్వకర్మణా, 2
దదర్శ లఙ్కాం సున్యస్తాం రమ్యకాననశోభితామ్.

ప్ర. అ. ముహూర్తమ్=ముహూర్తకాలము, తత్రైవ=అక్కడనే, స్థిత్వా=ఉండి, దశ=పది, దిశః=దిక్కులను, విలోకయన్=చూచుచు, రమ్యే=రమ్యమైన, త్రికూటశిఖరే=త్రికూటపర్వతముశిఖరముపైన, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నిర్మితామ్=నిర్మింపబడిన, సున్యస్తామ్=బాగుగా ఏర్పరుపబడిన, రమ్యకాననశోభితామ్=సుందరములైన వనములతో శోభించుచున్న, లఙ్కామ్=లంకను, దదర్శ=చూచెను.

తా. రాముడు అక్కడ ముహూర్తకాలము ఉండి పది దిక్కులను చూచుచు, రమ్యమైన త్రికూటపర్వతశిఖరముపైన విశ్వకర్మ మంచి ఏర్పాటులతో నిర్మించిన, అందమైన వనములతో ప్రకాశించుచున్న లంకను చూచెను. 2

మూ. తస్యాం గోపురశృఙ్గస్థం రాక్షసేన్ద్రం దురాసదమ్, 3
శ్వేతచామరపర్యన్తం విజయచ్ఛత్రశోభితమ్,
రక్తచన్దనసంలిప్తం రక్తాభరణభూషితమ్, 4
నీలజీమూతసంకాశం హేమసంఛాదితామ్బరమ్,
ఐరావతవిషాణాగ్రైరుత్కృష్టకిణవక్షసమ్. 5
శశలోహితరాగేణ సంవీతం రక్తవాససా,
సన్ధ్యాతపేన సంఛన్నం మేఘరాశిమివామ్బరే. 6

ప్ర. అ. తస్యామ్=ఆ లంకయందు, గోపురశృఙ్గస్థమ్=గోపురాగ్రమునందు ఉన్నవాడు, దురాసదమ్=ఎదిరింప శక్యము కానివాడు, శ్వేతచామరపర్యన్తమ్=తెల్లని వింజామరలు పార్శ్వములందు గలవాడు, విజయచ్ఛత్రశోభితమ్=విజయసూచకమైన ఛత్రముచేత శోభింపచేయబడినవాడు, రక్తచన్దనసంలిప్తమ్=ఎఱ్ఱని మంచి గంధముచేత పూయబడినవాడు, రక్తాభరణభూషితమ్=ఎఱ్ఱని అలంకారములచే అలంకరింపబడినవాడు, నీలజీమూతసంకాశమ్=నల్లని మేఘముతో సమానుడు, హేమసంఛాదితామ్బరమ్=బంగారముచేత కప్పబడిన వస్త్రము గలవాడు, ఐరావతవిషాణాగ్రైః=ఐరావతముయొక్క దంతముల అగ్రభాగములచేత, ఉత్కృష్టకిణవక్షసమ్=గీయుటచేత గట్టిగా అయిన గాయము వక్షస్థలమునందు గలవాడు, శశలోహితరాగేణ=చెవులపిల్లి రక్తము వంటి ఎరుపు గల, రక్తవాససా=ఎఱ్ఱని వస్త్రముచేత, సంవీతమ్=చుట్టబడి ఉన్నవాడు, సన్ధ్యాతపేన=సంధ్యాకాలమునందలి ఎండచేత, సంఛన్నమ్=కప్పబడిన, అమ్బరే=ఆకాశమునందున్న, మేఘరాశిమ్ ఇవ=మేఘరాశి వలె ఉన్నవాడు అయిన, రాక్షసేన్ద్రమ్=రాక్షసరాజైన రావణుని (చూచెను).

తా. జయింప శక్యము కానివాడైన, రాక్షసరాజు రావణుడు ఆ నగరమునందు గోపురాగ్రమునందు కూర్చొని యుండగా రాము డాతనిని చూచెను. ఆ రావణుని రెండు పార్శ్వములందు తెల్లని వింజామరలు, తలపై విజయచ్ఛత్రము శోభించుచుండెను. నల్లని మేఘము వలె ఉన్న ఆతడు ఎఱ్ఱని చందనము పూసికొని ఎఱ్ఱని అలంకారములు ధరించెను. ఆతని వస్త్రముమీద బంగారు రచనలు ఉండెను. ఐరావతము దంతము దెబ్బలు తగిలి ఆతని వక్షస్థలముమీద కాయలు కాచెను. చెవులపిల్లి రక్తము వంటి ఎఱ్ఱని వస్త్రము ధరించి ఉండుటచేత ఆతడు సాయంకాలపు ఎండ వ్యాపించిన మేఘరాశి వలె కనబడుచుండెను. 3 - 6

మూ. పశ్యతాం వానరేన్ద్రాణాం రాఘవస్యాపి పశ్యతః,
దర్శనాద్రాక్షసేన్ద్రస్య సుగ్రీవః సహసోత్థితః. 7

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, దర్శనాత్=చూచుటవలన, వానరేన్ద్రాణామ్=వానరనాయకులు, పశ్యతామ్=చూచుచుండగా, రాఘవస్యాపి=రాముడు కూడ, పశ్యతః=చూచుచుండగా, సహసా=వెంటనే, ఉత్థితః=లేచినాడు.

తా. రావణుణ్ణి చూడగానే సుగ్రీవుడు, వానరనాయకు లందరూ చూచుచుండగా, రాముడు కూడా చూచుచుండగా హఠాత్తుగా పైకి లేచెను.

మూ. క్రోధవేగేన సంయుక్తః సత్త్వేన చ బలేన చ,
అచలాగ్రాదథోత్థాయ పుప్లువే గోపురస్థలే. 8

ప్ర. అ. క్రోధవేగేన=కోపవేగముతోను, సత్త్వేన చ=ధైర్యముతోను, బలేన చ=బలముతోను, సంయుక్తః=కూడిన అతడు, అథ=అటుపిమ్మట, అచలాగ్రాత్=పర్వతాగ్రమునుండి, ఉత్థాయ=లేచి, గోపురస్థలే=గోపురము ప్రదేశమునందు, పుప్లువే=ఎగిరెను.

తా. ధైర్యబలసంపన్నుడైన ఆ సుగ్రీవుడు క్రోధావేశముతో పర్వతాగ్రమునుండి పైకి ఎగిరి గోపురముపైపు దుమికెను. 8

మూ. స్థిత్వా ముహూర్తం సంప్రేక్ష్య నిర్భయేనాన్తరాత్మనా,
తృణీకృత్య చ తద్రక్షః సోఽబ్రవీత్పరుషం వచః. 9

ప్ర. అ. సః=అతడు, ముహూర్తమ్=క్షణకాలము, స్థిత్వా=నిలచి, సంప్రేక్ష్య=చూచి, నిర్భయేన=భయములేని, అన్తరాత్మనా=మనస్సుతో, తత్=ఆ, రక్షః=రాక్షసుని, తృణీకృత్య=తృణముగా పరిగణించి, పరుషమ్=పరుషమైన, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. అతడు క్షణకాలము నిలచి పరిశీలించి చూచి నిర్భయమైన మనస్సుతో ఆ రాక్షసుణ్ణి గడ్డిపరక వలె చూచుచు పరుషమైన వచనమును పలికెను. 9

మూ. లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రాక్షస,
న మయా మోక్ష్యసేఽద్య త్వం పార్థివేన్ద్రస్య తేజసా. 10

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! లోకనాథస్య=లోకముల నాథుడైన, రామస్య=రామునియొక్క, సఖా=స్నేహితుడను, దాసః=దాసుడను, అస్మి=అయి ఉన్నాను. త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, పార్థివేన్ద్రస్య=రామునియొక్క, తేజసా=తేజస్సుచేత, మయా=నాచేత, న మోక్ష్యసే=విడువబడవు.

తా. రాక్షసుడా ! నేను సమస్తలోకముల ప్రభువైన రాముని మిత్రుడను; అతని దాసుడను. ఇప్పుడు ఆ రాముని తేజస్సుచేత నేను నిన్ను విడువను. 10

మూ. ఇత్యుక్త్వా సహసోత్పత్య పుప్లువే తస్య చోపరి,
ఆకృష్య ముకుటం చిత్రం పాతయామాస తద్భువి. 11

ప్ర. అ. ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, సహసా=శీఘ్రముగా, ఉత్పత్య=ఎగిరి, తస్య=వానియొక్క, ఉపరి=పైన, పుప్లువే=దుమికెను. చిత్రమ్=చిత్రమైన, ముకుటమ్=కిరీటమును, ఆకృష్య=లాగి, తత్=దానిని, భువి=నేలమీద, పాతయామాస=పడవేసెను.

తా. ఇట్లు పలికి శీఘ్రముగా వానిపైకి దుమికి అతని విచిత్రవర్ణములు

గల కిరీటమును లాగి క్రింద పడవేసెను. 11

మూ. సమీక్ష్య తూర్ణమాయాన్తం బభాషే తం నిశాచరః,
సుగ్రీవస్త్వం పరోక్షే మే హీనగ్రీవో భవిష్యసి. 12

ప్ర. అ. నిశాచరః=రావణుడు, తూర్ణమ్=శీఘ్రముగా, ఆయాన్తమ్=వచ్చుచున్న, తమ్=అతనిని, సమీక్ష్య=చూచి, బభాషే=పలికెను. త్వమ్=నీవు, మే=నాయొక్క, పరోక్షే=పరోక్షమునందు, సుగ్రీవః=సుగ్రీవుడవు (మంచి కంఠము గలవాడవు). హీనగ్రీవః=పోయిన కంఠము కలవాడవుగా, భవిష్యసి=కాగలవు.

తా. శీఘ్రముగా వచ్చుచున్న ఆ సుగ్రీవుని చూచి రావణు డిట్లు పలికెను. "నీవు నా ఎదుటికి రానంతవరకు సుగ్రీవుడవే కాని ఇప్పుడు హీనగ్రీవుడవు కాగలవు." 12

మూ. ఇత్యుక్త్వోత్థాయ తం క్షిప్రం బాహుభ్యామాక్షిపత్తలే,
కన్దువత్స సముత్థాయ బాహుభ్యామాక్షిపద్ధరిః. 13

ప్ర. అ. ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, ఉత్థాయ=లేచి, బాహుభ్యామ్=బాహువులతో, తమ్=వానిని, క్షిప్రమ్=శీఘ్రముగా, తలే=నేలమీద, ఆక్షిపత్=పడద్రోసెను. సః=ఆ, హరిః=వానరుడు, కన్దువత్=బంతి వలె, సముత్థాయ=లేచి, బాహుభ్యామ్=బాహువులతో, ఆక్షిపత్=క్రిందికి పడవేసెను.

తా. ఇట్లు పలికి రావణుడు సుగ్రీవుని బాహువులతో పట్టి క్రింద పడవేసెను. సుగ్రీవుడు బంతి వలె లేచి చేతులతో రావణుని క్రిందికి పడవేసెను. 13

మూ. పరస్పరం స్వేదవిదిగ్ధగాత్రౌ
పరస్పరం శోణితరక్తదేహౌ,
పరస్పరం శ్లిష్టనిరుద్ధచేష్టౌ
పరస్పరం శాల్మలికింశుకావివ. 14

ముష్టిప్రహారైశ్చ తలప్రహారై
రరత్నిఘాతైశ్చ కరాగ్రఘాతైః,
తౌ చక్రతుర్యుద్ధమసహ్యరూపం
మహాబలౌ రాక్షసవానరేన్ద్రౌ. 15

ప్ర. అ. పరస్పరమ్=పరస్పరము, స్వేదవిదిగ్ధగాత్రౌ=చెమటచేత పూయబడిన దేహము కలవారు, పరస్పరమ్=పరస్పరము, శోణితరక్తదేహౌ=రక్తముచేత ఎఱ్ఱనైన దేహములు కలవారు, పరస్పరమ్=పరస్పరము, శ్లిష్టనిరుద్ధచేష్టౌ=

ఆశ్లేషముచేత విరోధింపబడిన చేష్టలు గలవారు, పరస్పరమ్=పరస్పరము, శాల్మలి కింశుకావివ=పుష్పించిన శాల్మలి - కింశుక వృక్షముల వలె ఉన్న, మహాబలౌ=గొప్ప బలము గల, తౌ=ఆ, రాక్షసవానరేన్ద్రౌ=రావణసుగ్రీవులు, ముష్టిప్రహారైః=పిడికిళ్ల దెబ్బలతోను, తలప్రహారైః=అరచేతుల దెబ్బలతోను, అరత్నిఘాతైః చ=అరత్నుల దెబ్బలతోను, కరాగ్రఘాతైః=హస్తాగ్రముల దెబ్బలతోను, అసహ్యరూపమ్=సహింప శక్యముకాని, యుద్ధమ్=యుద్ధమును, చక్రతుః=చేసిరి.

తా. మహాబలవంతులైన ఆ రావణసుగ్రీవు లిద్దరూ పరస్పరము చెమట కారుచున్న దేహములు కలవారై, పరస్పరము రక్తముచేత ఎఱ్ఱనైన దేహములు కలవారై, పరస్పరము గట్టిగా అదిమి పట్టుకొనుటచేత విరోధింపబడిన చేష్టలు కలవారై, పరస్పరము పుష్పించిన శాల్మలీవృక్షము కింశుకవృక్షమూ వలె ఉన్నవారై, పిడికిళ్ళతోను, అరచేతులతోను, అరత్నులతోను, హస్తాగ్రములతోను కొట్టుకొనుచు సహింప శక్యము కాని యుద్ధము చేసిరి.

వి. 'అరత్ని' అనగా మోచేయి మొదట చిటికెన వ్రేలు ముడవకుండా పట్టిన పిడికిలి చివరివరకు ఉన్న పొడవు అని అర్థము. అది కొలతలకు ఉపయోగించును గాని ఇలా కొట్టుకోవడానికి ఎలా ఉపయోగపడుతుందో తెలియదు. "ప్రకోష్ఠే విస్తృతకరే హస్తః, ముష్ట్యా తు బద్ధయా, సరత్నిః స్యాదరత్నిస్తు నిష్కనిష్ఠేన ముష్టినా" అని అమరము. అరచేయి చాపగా మోచేతినుండి నడుమవ్రేలు చివరివరకు ఉన్న పొడవు "హస్తము" మూర. పిడికిలి బిగించగా దాని చివరవరకు ఉన్న పొడవు "రత్ని". పిడికిలి బిగించి చిటికెన వ్రేలు చాపగా ఉన్న పొడవు "అరత్ని" అని దీని అర్థము. ఇంక "ముష్టి" 'తలము' 'అరత్ని' అన్నీ అయిపోయిన తరువాత "కరాగ్రఘాతము" అనగా ఏమో తెలియుటలేదు. అట్లే 'పరస్పర' శబ్దప్రయోగము కూడ సరిగా లేదు. "పరస్పరము కొట్టుకొనుట" ఇత్యాదిప్రయోగము ఉండునుగాని, "పరస్పరము చెమటపట్టుట" అని అనుట ఉండదు. "పరస్పరమ్" అనే ద్వితీయాంతశబ్దము కర్మవాచకముగానే ఉపయోగింపబడుతుంది.

రావణుడు ఆ యా ప్రాకారద్వారములను రక్షించుటకై మంచి ఏర్పాట్లు చేసినట్లు, రాముడు ఆ యా ద్వారములను ముట్టడించుటకై వానరులను నియోగించినట్లు వెనుక చెప్పబడినది. సువేలపర్వతముమీద నుంచి రావణుడు అంత దగ్గరగా సుగ్రీవునకు కనబడుటగాని, అతడు రాజధర్మమును విస్మరించి ఒక్కమారుగా అతనిమీదికి దుమికి యుద్ధము చేయుటగాని, వీరిద్దరూ ఇలా మల్లయుద్ధం చేస్తూండగా రావణుని రక్షకభటులు చూస్తూ ఉండడం గాని ఇవన్నీ అసంభావ్యమైన విషయాలు. సుగ్రీవునికి ఆవేశం కలిగినదో లేదో గాని ఎవరో ఒక బుద్ధిశాలికి రచనావేశం కలిగి ఈ సర్గ ఇక్కడ చేర్చి ఉంటారు. శ్లోకాల తీరు చూచినా కూడ ఇది ప్రక్షిప్తసర్గ అని చెప్పడానికి సందేహించవలసిన

పనిలేదు. అందుచేతనే ఈ సర్గ ప్రాచ్యపాఠంలో లేదు.

వానరసైనికులు లంకాద్వారములను భేదించుకొని లంకలో ప్రవేశించునంతవరకు ఉండగా రాముడితో పాటు సువేలపర్వతం ఎక్కిన కొందరు వానరులు సుగ్రీవుని అనుమతితో లంకలో ప్రవేశించి నట్లు వెనుకటి సర్గలో చెప్పినది కూడ అసంగతమే. 15

మూ. కృత్వా నియుద్ధం భృశముగ్రవేగౌ
కాలం చిరం గోపురవేదిమధ్యే,
ఉత్క్షిప్య చోత్క్షిప్య వినమ్య దేహౌ
పాదక్రమాద్గోపురవేదిలగ్నౌ. 16

ప్ర. అ. భృశమ్=మిక్కిలి, ఉగ్రవేగౌ=ఉగ్రమైన వేగము గల వాళ్లిద్దరూ, చిరం కాలమ్=చిరకాలము, గోపురవేదిమధ్యే=గోపురము వేది మధ్యయందు, నియుద్ధమ్=బాహుయుద్ధమును, కృత్వా=చేసి, దేహౌ=దేహములను, ఉత్క్షిప్య ఉత్క్షిప్య=ఎత్తి ఎత్తి, వినమ్య=వంచి, పాదక్రమాత్=పాదముల క్రమమువలన, గోపురవేదిలగ్నౌ=గోపురము వేదియందు నిలచిరి.

తా. చాల తీవ్రమైన వేగము గల ఆ రావణసుగ్రీవులు గోపురము వేది మధ్యయందు చాల సేపు బాహుయుద్ధము చేసి శరీరములను ఎత్తి ఎత్తి వంచి, పాదక్రమముచేత (క్రమముగా నడచుకొనుచు) గోపురవేదియందు నిలచిరి. 16

మూ. అన్యోన్యమాపీడ్య విలగ్నదేహౌ
తౌ పేతతుః సాలనిఖాతమధ్యే,
ఉత్పేతతుర్భూమితలం స్పృశన్తౌ
స్థిత్వా ముహూర్తం త్వతినిఃశ్వసన్తౌ. 17

ప్ర. అ. తౌ=వాళ్లిద్దరూ, అన్యోన్యమ్=పరస్పరమును, ఆపీడ్య=పీడించి, విలగ్నదేహౌ=దగ్గరగా కలిసిన దేహములు కలవారై, సాలనిఖాతమధ్యే=ప్రాకారము నకు పరిఖకు మధ్యయందు, నిపేతతుః=పడిరి. ముహూర్తమ్=ముహూర్తకాలము, అతినిఃశ్వసన్తౌ=నిట్టూర్పుచు, స్థిత్వా=ఉండి, స్పృశన్తౌ=స్పృశించుచున్నవారై, భూమి తలమ్=భూమిని గూర్చి, ఉత్పేతతుః=ఎగిరిరి.

తా. వాళ్ళు ఒకరి నొకరు గట్టిగా అదిమి పట్టి, దగ్గరగా ఉన్న దేహములు కలవారై ప్రాకారమునకు, పరిఖకు మధ్యయందు పడిరి. ముహూర్తకాలము నిట్టూర్పుచు నిలబడి, మళ్ళీ ఒకరినొకరు పట్టుకొని నేలమీదికి పైకి దుమికిరి.

మూ. ఆలిఙ్గ్య చాలిఙ్గ్య చ బాహుయోక్త్రైః
సంయోజయామాసతురాహవే తౌ,

సంరమ్భశిక్షాబలసంప్రయుక్తౌ
సుచేరతుః సంప్రతి యుద్ధమార్గే. 18

ప్ర. అ. తౌ=వాళ్లిద్దరూ, బాహుయోక్త్రైః=బాహువులను త్రాళ్లతో, ఆలిఙ్గ్య చ ఆలిఙ్గ్య చ=కౌగిలించుకొని, ఆహవే=యుద్ధమునందు, సంయోజయామాసతుః=దగ్గరగా చేర్చిరి. సంరమ్భశిక్షాబలసంప్రయుక్తౌ=తొందరతోను, అభ్యాసముతోను, బలముతోను కూడినవారై, సంప్రతి=ఇప్పుడు, యుద్ధమార్గే=యుద్ధమునందు, సుచేరతుః=బాగుగా సంచరించిరి.

తా. వాళ్లిద్దరూ యుద్ధమునందు కౌగిలించుకొని బాహుపాశముతో ఒకరి నొకరు కట్టివేసిరి. తొందరతోను, అభ్యాసమువలన ఏర్పడిన నేర్పుతోను, బలముతోను కూడిన వాళ్లిద్దరూ అప్పుడు యుద్ధమార్గమునందు సంచరించిరి. 18

మూ. శార్దూలసింహావివ జాతదంష్ట్రౌ
గజేన్ద్రపోతావివ సంప్రయుక్తౌ,
సంహత్య సంవేష్ట్య చ తౌ కరాభ్యాం
తౌ పేతతుర్వై యుగపద్ధరాయామ్.

ప్ర. అ. తౌ=వాళ్లిద్దరూ, జాతదంష్ట్రౌ=పుట్టిన కోరలు గల, శార్దూలసింహావివ=పెద్దపులి సింహమూ వలె, సంప్రయుక్తౌ=కలిసిన, గజేన్ద్రపోతావివ=ఏనుగు పిల్లలవలె, కరాభ్యామ్=హస్తములచేత, సంహత్య=కలిసి, సంవేష్ట్య చ=బలము తెలిసికొని, యుగపత్=ఒక్కమారుగా, ధరాయామ్=నేలమీద, పేతతుః వై=పడిరి.

తా. కోరలు వచ్చిన పెద్దపులి, సింహమూ వలె, కలిసిన ఏనుగుపిల్లలవలె, వాళ్లు కలిసి చేతులతో ఒండొరుల బలమును తెలిసికొని, ఒక్కమారుగా నేలమీద పడిరి. 19

మూ. ఉద్యమ్య చాన్యోన్యమధిక్షిపన్తౌ
సంచక్రమాతే బహు యుద్ధమార్గే,
వ్యాయామశిక్షాబలసంప్రయుక్తౌ
క్లమం న తౌ జగ్మతురాశు వీరౌ. 20

ప్ర. అ. అన్యోన్యమ్=పరస్పరము, ఉద్యమ్య=ఎత్తి, అధిక్షిపన్తౌ=క్రిందికి పడవేయుచు, యుద్ధమార్గే=యుద్ధమార్గమునందు, బహు=అధికముగా, సంచక్రమాతే=నడచిరి. వ్యాయామశిక్షాబలసంప్రయుక్తౌ=వ్యాయామమువల్ల శిక్షవల్ల కలిగిన బలముతో కూడిన, తౌ=ఆ, వీరౌ=వీరులు, ఆశు=శీఘ్రముగా, క్లమమ్=అలసటను, న జగ్మతుః=పొందలేదు.

తా. వాళ్లు ఒకరి నొకరు పైకెత్తి క్రింద పడవేయుచు యుద్ధమార్గమునందు అనేకవిధముల సంచరించిరి. వ్యాయామమువలన, అభ్యాసమువలన కలిగిన బలము గల ఆ వీరులిద్దరూ వెంటనే అలసటను పొందలేదు. 20

మూ. బాహూత్తమైర్వారణవారణాభై
ర్నివారయన్తౌ పరవారణాభౌ,
చిరేణ కాలేన భృశం ప్రయుద్ధౌ
సంచేరతుర్మణ్డలమార్గమాశు. 21

ప్ర. అ. వరవారణాభౌ=ఉత్తమములైన ఏనుగుల వంటి కాంతి గల వారిద్దరూ, వారణవారణాభైః=ఏనుగు తొండమువంటి కాంతిగల, బాహూత్తమైః=శ్రేష్ఠములైన బాహువులచేత, నివారయన్తౌ=నివారించుచు, చిరేణ కాలేన=చాలకాలముచేత, భృశమ్=మిక్కిలి, ప్రయుద్ధౌ=యుద్ధము చేయుచున్నవారై, ఆశు=శీఘ్రముగా, మణ్డలమార్గమ్=మండలములతిరిగి, సంచేరతుః=సంచరించిరి.

తా. ఉత్తమములైన ఏనుగుల వలె ఉన్న వాళ్లిద్దరూ, ఏనుగ తొండములవంటి ఉత్తమములైన బాహువులతో ఒకరి నొకరు నివారించుచు, చాలసేపు యుద్ధము చేసి శీఘ్రముగా గుండ్రముగా తిరిగిరి. 21

మూ. తౌ పరస్పర మాసాద్య యత్తావన్యోన్యసూదనే,
మార్జారావివ భక్షార్థేఽవతస్థాతే ముహుర్ముహుః. 22

ప్ర. అ. అన్యోన్యసూదనే=పరస్పరమును వధింపచేయుటయందు, యత్తౌ=ప్రయత్నము చేయుచున్న, తౌ=వారిద్దరూ, పరస్పరమ్=పరస్పరమును, ఆసాద్య=చేరి, భక్షార్థే=భక్ష్యముకొరకు, మార్జారావివ=రెండు పిల్లుల వలె, ముహుర్ముహుః=మాటిమాటికి, అవతస్థాతే=నిలచిరి.

తా. ఒకరి నొకరు చంపుటకు ప్రయత్నించుచున్న వాళ్లిద్దరూ ఒక భక్ష్యముకొరకు పోట్లాడుచున్న పిల్లులవలె మాటిమాటికీ ఒకరి నొకరు ఆక్రమించుచుండిరి. 22

మణ్డలాని విచిత్రాణి స్థానాని వివిధాని చ,
గోమూత్రకాణి చిత్రాణి గతప్రత్యాగతాని చ. 23
తిరశ్చీనగతాన్యేవ తథా వక్రగతాని చ,
పరిమోక్షం ప్రహారాణాం వర్జనం పరిధావనమ్. 24
అభిద్రవణమాప్లావమవస్థానం సవిగ్రహమ్,

పరావృత్తమపావృత్తమపద్రుతమవప్లుతమ్. 25
ఉపన్యస్తమపన్యస్తం యుద్ధమార్గవిశారదౌ,
తౌ విచేరతురన్యోన్యం వానరేన్ద్రశ్చ రావణః. 26

ప్ర. అ. యుద్ధమార్గవిశారదౌ=యుద్ధమార్గమునందు నేర్పు గల, తౌ=ఆ, వానరేన్ద్రశ్చ=సుగ్రీవుడు, రావణః=రావణుడు, విచిత్రాణి=విచిత్రములైన, మణ్డలాని=కొన్ని విధములైన తిరుగుటలను, వివిధాని=అనేకవిధములైన, స్థానాని=వ్యాఘ్రసింహాదుల వలె నిలబడుటలను, చిత్రాణి=చిత్రములైన, గోమూత్రకాణి=గోమూత్రకములను (ఎద్దు నడచుచు మూత్రము విడచినచో అది నేలపై వంకరటింకరగా ఎట్లు పడునో అట్లు సంచారములను), గతప్రత్యాగతాని చ=దూరముగ వెళ్ళుటలను తిరిగి వచ్చుటలను, తిర్యగ్గతాని=అడ్డముగా తిరుగుటలను, తథా=మరియు, వక్రగతాని చ=వంకరగా నడచుటలను, ప్రహారాణామ్=దెబ్బల యొక్క, పరిమోక్షమ్=తప్పించుకొనుటను, వర్జనమ్=ఎదురుదెబ్బ కొట్టి దెబ్బను పరిహరించుటను, పరిధావనమ్=చుట్టూ పరుగెత్తుటను, అభిద్రవణమ్=ఎదురుగా పరిగెత్తుటను, ఆప్లవమ్=ఎగురుటను, సవిగ్రహమ్=విరోధముతో కూడునట్లుగా, అవస్థానమ్=నిలుచుటను, పరావృత్తమ్=ముఖము వెనుకకు త్రిప్పి వెళ్ళుటను, అపావృత్తమ్=ముఖము త్రిప్పకుండగానే వెనుకకు కొన్ని అడుగులు వేయుటను, అపద్రుతమ్=పట్టుకొనుటకై శరీరము వంచి నడచుటను, అవప్లుతమ్=తప్పుటకై తలవంచి గంతు వేయుటను, ఉపన్యస్తమ్=ఎదుటివాని చేయి పట్టుకొనుటకై తన చేయి చాపుటను, అపన్యస్తమ్=ఎదుటివానికి దొరకకుండా తన బాహువులు వెనుకకు తీసికొనుటను, విచేరతుః=సంచరించిరి.

తా. యుద్ధమార్గమునందు నేర్పు గల ఆ రావణసుగ్రీవులు మల్ల యుద్ధములో మల్లురు తిరుగు అనేక మండలములు తిరుగుచు, అనేకవిధములైన స్థితులను వేయుచు విచిత్రములైన గోమూత్రికలను, చిత్రములైన గతప్రత్యాగతములను, తిర్యగ్గమన-వక్రగమనములను, ప్రహారముల పరిమోక్షమును, వర్జనమును, పరిధావనమును, అభిద్రవణమును, ఆప్లవమును, అవస్థానమును, పరావృత్త - అపావృత్త - అపద్రుత - అవప్లుతములను, ఉపన్యస్త - అపన్యస్తములను చరించిరి. 23-26

మూ. ఏతస్మిన్నన్తరే రక్షో మాయాబలమథాత్మనః,
ఆరబ్ధుముపసంపేదే జ్ఞాత్వా తం వానరాధిపః. 27
ఉత్పపాత తదాకాశం జితకాశీ జితక్లమః,
రావణః స్థిత ఏవాత్ర హరిరాజేన వఞ్చితః. 28

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యసమయము

నందు, రక్షః=రాక్షసుడు, ఆత్మనః=తనయొక్క, మాయాబలమ్=మాయాబలమును, ఆరబ్ధుమ్=ఆరంభించుటకు, ఉపసంపేదే=నిశ్చయించెను. వానరాధిపః=సుగ్రీవుడు, తమ్=దానిని, జ్ఞాత్వా=తెలిసికొని, జితకాశీ=జయముచేత ప్రకాశించుచున్నవాడై, జితక్లమః=జయించబడిన అలసట కలవాడై, తదా=అప్పుడు, ఆకాశమ్=ఆకాశమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను. హరిరాజేన=సుగ్రీవునిచేత, వఞ్చితః=వంచింపబడిన వాడై, రావణః=రావణుడు, అత్రైవ=ఇక్కడనే, స్థితః=ఉండిపోయినాడు.

తా. ఇంతలో రావణుడు తన మాయాబలమును చూపుటకు ప్రారంభించెను. సుగ్రీవుడు ఆ విషయము కనిపెట్టి జయముతో ప్రకాశించుచు, ఏ మాత్రము అలసట లేనివాడై ఆకాశముమీదికి ఎగిరిపోయెను. రావణుడు ఈ విధముగ సుగ్రీవునిచేత మోసగింపబడి అక్కడనే ఉండిపోయెను. 27, 28

మూ. అథ హరివరనాథః ప్రాప్తసంగ్రామకీర్తి
ర్నిశిచరపతిమాజౌ యోజయిత్వా శ్రమేణ,
గగనమతివిశాలం లఙ్ఘయిత్వార్కసూను
ర్హరిగణబలమధ్యే రామపార్శ్వం జగామ. 29

ప్ర. అ. అథ=అటుపిమ్మట, హరివరనాథః=వానరరాజైన, అర్కసూనుః=సూర్యపుత్రుడు, ప్రాప్తసంగ్రామకీర్తిః=పొందబడిన యుద్ధమునందు కీర్తిగలవాడై, ఆజౌ=యుద్ధమునందు, నిశిచరపతిమ్=రావణుని, శ్రమేణ=శ్రమతో, యోజయిత్వా=చేర్చి, అతివిశాలమ్=చాల విశాలమైన, గగనమ్=ఆకాశమును, లఙ్ఘయిత్వా=లంఘించి, హరిగణబలమధ్యే=వానరసమూహముల సేనామధ్యమునందు, రామపార్శ్వమ్=రాముని పార్శ్వమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట వానరప్రభువైన సుగ్రీవుడు యుద్ధములో కీర్తి పొంది, రావణునకు యుద్ధమునందు శ్రమ కలిగించి, అతివిశాలమైన ఆకాశమును దాటి వానరసేనామధ్యమునందున్న రాముని పార్శ్వము చేరెను. 29

మూ. స ఇతి సవితృసూనుస్తత్ర తత్కర్మ కృత్వా
పవనగతిరనీకం ప్రావిశత్సంప్రహృష్టః,
రఘువరనృపసూనోర్వర్ధయన్ యుద్ధహర్షం
తరుమృగగణముఖ్యైః పూజ్యమానో హరీన్ద్రః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చత్వారింశః సర్గః.

ప్ర. అ. సవితృసూనుః=సూర్యపుత్రుడైన, సః=ఆ సుగ్రీవుడు, తత్ర=అక్కడ, తత్ కర్మ=ఆ పని, కృత్వా=చేసి, రఘువరనృపసూనోః=రఘువంశమునందు శ్రేష్ఠుడైన రాజకుమారునియొక్క, యుద్ధహర్షమ్=యుద్ధమునందు

హర్షమును, వర్ధయన్=వృద్ధిపొందించుచు, హరిమృగగణముఖ్యైః=వానరగణముల నాయకులచేత, పూజ్యమానః=పూజింపబడుచు, సంప్రహృష్టః=సంతోషించినవాడై, పవనగతిః=వాయుగమనము గలవాడై, అనీకమ్=సైన్యమును, ప్రావిశత్=ప్రవేశించెను.

తా. సూర్యపుత్రుడైన ఆ సుగ్రీవుడు అక్కడ ఆ విధముగా చేసి, రాముని యుద్ధోత్సాహమును వృద్ధి పొందించుచు, సంతోషించుచు, వానరనాయకులచే పూజింపబడుచు, వాయువేగముతో సైన్యములోనికి వచ్చి చేరెను. 30

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకచత్వారింశః సర్గః

[ఇట్టి దుస్సాహసము చేయగూడదని రాముడు సుగ్రీవునకు చెప్పి, లంక నాలుగు ద్వారములందర్ధ వానరులను నియమించి, అంగదుని రావణునివద్దకు దూతగా పంపుట; అంగదుడు రావణుని సభలో తన పరాక్రమము చూపుట; వానరులు ఆక్రమించుటచే రాక్షసులు భయము చెందుట.]

మూ. అథ తస్మిన్నిమిత్తాని దృష్ట్వా లక్ష్మణపూర్వజః,
సుగ్రీవం సంపరిష్వజ్య రామో వచనమబ్రవీత్. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, లక్ష్మణపూర్వజః=లక్ష్మణుని అన్నగారైన, రామః= రాముడు, తస్మిన్=దానియందు, నిమిత్తాని=శకునములను, దృష్ట్వా=చూచి, సుగ్రీవమ్=సుగ్రీవుని, సంపరిష్వజ్య=కౌగలించుకొని, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట రాముడు ఆ ప్రదేశమునందు కనబడుచున్న శకునములను చూచి, సుగ్రీవుని కౌగలించుకొని ఇట్లు పలికెను.

మూ. అసంమన్త్ర్య మయా సార్ధం తదిదం సాహసం కృతమ్,
ఏవం సాహసయుక్తాని న కుర్వన్తి జనేశ్వరాః. 2

ప్ర. అ. మయా సార్ధమ్=నాతో కూడ, అసంమన్త్ర్య=ఆలోచించకుండగా, తత్=అట్టి, ఇదమ్=ఈ, సాహసమ్=సాహసము, కృతమ్=చేయబడినది. జనేశ్వరాః=రాజులు, ఏవమ్=ఈ విధముగా, సాహసయుక్తాని=సాహసముతో కూడిన పనులను, న కుర్వన్తి=చేయరు.

తా. నీవు నాతో ఆలోచించకుండగా ఇట్టి సాహసము చేసినావు! ప్రభువులైనవాళ్లు ఇట్టి సాహసకృత్యములు చేయరు.

మూ. సంశయే స్థాప్య మాం చేదం బలం చేమం విభీషణమ్,
కష్టం కృతమిదం వీర సాహసం సాహసప్రియ. 3

ప్ర. అ. సాహసప్రియ=ప్రియమైన సాహసము గల, వీర=వీరుడా! మాం చ=నన్ను, ఇదమ్=ఈ, బలం చ=సైన్యమును, ఇమమ్=ఈ, విభీషణం చ=విభీషణుని, సంశయే= సంశయమునందు, స్థాప్య=ఉంచి, కష్టమ్=కష్టమైన, ఇదమ్=ఈ, సాహసమ్=సాహసము, కృతమ్=చేయబడినది.

తా. సాహసప్రియుడైన ఓ! వీరుడా! నీవు ఇట్టి కష్టమైన సాహసకృత్యము చేసి నన్ను, ఈ సైన్యమును, ఈ విభీషణుని కూడ సంశయస్థితిలో ఉంచినావు. 3

మూ. ఇదానీం మా కృథా వీర ఏవంవిధమరిందమ,
త్వయి కించిత్సమాపన్నే కిం కార్యం సీతయా మమ. 4
భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా,
శత్రుఘ్నేన చ శత్రుఘ్న స్వశరీరేణ వా పునః. 5

ప్ర. అ. అరిందమ=శత్రువినాశకుడా ! వీర=వీరుడా ! ఇదానీమ్=ఇప్పుడు, ఏవంవిధమ్=ఇట్టి పనిని, మా కృథాః=చేయకుము. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! శత్రుఘ్న=శత్రువులను సంహరించువాడా ! త్వయి=నీవు, కించిత్=కొంచెము, సమాపన్నే=ఆపద చెందినవాడ వగుచుండగా, మమ=నాకు, సీతయా=సీతతోను, భరతేన= భరతునితోను, యవీయసా=చిన్నవాడైన, లక్ష్మణేన=లక్ష్మణునితోను, శత్రుఘ్నేన= శత్రుఘ్నునితోను, స్వశరీరేణ వా పునః=నా శరీరముతోను, కిం కార్యమ్=ఏమి ప్రయోజనము ?

తా. శత్రువినాశకుడవైన ఓ ! వీరుడా ! ఇటువైన ఇట్టి కార్యము ఎన్నడూ చేయకుము. నీకు ఏ మాత్రము ఆపద కలిగినా నాకు సీతతో కాని, భరతునితో గాని, తమ్ముడైన లక్ష్మణునితో గాని, శత్రుఘ్నునితో గాని, నా శరీరముతో గాని ఏమి ప్రయోజనము ? 4, 5

మూ. త్వయి చానాగతే పూర్వమితి మే నిశ్చితా మతిః,
జానతశ్చాపి తే వీర్యం మహేన్ద్రవరుణోపమ. 6
హత్వాహం రావణం యుద్ధే సపుత్రబలవాహనమ్,
అభిషిచ్య చ లఙ్కాయాం విభీషణ మథాపి చ, 7
భరతే రాజ్యమారోప్య త్యక్ష్యే దేహం మహాబల.

ప్ర. అ. మహేన్ద్రవరుణోపమ=మహేంద్రునితోను వరుణునితోను సమానుడా ! మహాబల=గొప్ప బలము కలవాడా ! త్వయి=నీవు, అనాగతే=రానివాడగు చుండగా, తే=నీయొక్క, వీర్యమ్=బలమును, జానతశ్చాపి=ఎరిగియున్నవాడ నైనను, మే=నాయొక్క, మతిః= బుద్ధి, పూర్వమ్=పూర్వము, నిశ్చితా=నిశ్చితమైనది. అహమ్=నేను, యుద్ధే= యుద్ధమునందు, సపుత్రబలవాహనమ్=పుత్రులతోను, సైన్యముతోను, వాహనములతోను కూడిన, రావణమ్=రావణుని, హత్వా=చంపి, విభీషణమ్=విభీషణుని, లఙ్కాయామ్=లంకయందు, అభిషిచ్య=అభిషేకించి, అథాపి చ=మరియు, భరతే=భరతునియందు, రాజ్యమ్=రాజ్యమును, ఆరోప్య=ఉంచి, దేహమ్=దేహమును, త్యక్ష్యే=విడువగలను.

తా. మహేంద్రునితోను, వరుణునితోను సమానుడవైన ఓ ! మహాబలశాలివైన సుగ్రీవుడా ! నీవు మరల తిరిగి రానిచో, "రావణుణ్ణి, అతని పుత్ర - సైన్య

వాహనములను యుద్ధమునందు సంహరించి, విభీషణుణ్ణి లంకలో అభిషిక్తుని చేసి, పిదప భరతునకు రాజ్యము ఇచ్చివేసి ప్రాణత్యాగము చేయుదమను" అని, నీ పరాక్రమము తెలిసినవాడనే అయినను, నేను నిశ్చయించుకొంటిని. 6 7

మూ. తమేవంవాదినం రామం సుగ్రీవః ప్రత్యభాషత. 8
తవ భార్యాపహర్తారం దృష్ట్వా రాఘవ రావణమ్,
మర్షయామి కథం వీర జానన్విక్రమమాత్మనః. 9

ప్ర. అ. ఏవంవాదినమ్=ఇట్లు పలుకుచున్న, తమ్=ఆ, రామమ్=రాముణ్ణి గూర్చి, సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రత్యభాషత=తిరిగి పలికెను. వీర=వీరుడా ! రాఘవ=రామా ! తవ=నీయొక్క, భార్యాపహర్తారమ్=భార్యను అపహరించిన, రావణమ్=రావణుని, దృష్ట్వా=చూచి, ఆత్మనః=తనయొక్క, బలమ్=బలమును, జానన్=ఎరిగిన నేను, కథమ్=ఎట్లు, మర్షయామి=సహింతును ?

తా. రాముని మాటలు విని సుగ్రీవు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను- "వీరుడవైన రామా ! నీ భార్యను అపహరించిన రావణుడు నా కంటబడిన తరువాత, నా కున్న బలము తెలిసిన నేను, ఎట్లు ఊరకుండగలను ?"

మూ. ఇత్యేవంవాదినం వీరమభినన్ద్య చ రాఘవః,
లక్ష్మణం లక్ష్మిసంపన్నమిదం వచనమబ్రవీత్. 10

ప్ర. అ. రాఘవః=రాముడు, ఇత్యేవంవాదినమ్=ఇట్లు పలుకుచున్న, వీరమ్=వీరుడైన సుగ్రీవుణ్ణి, అభినన్ద్య=అభినందించి, లక్ష్మిసంపన్నమ్=శోభతో కూడిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రాము డిట్లు పలుకుచున్న ఆ సుగ్రీవుణ్ణి అభినందించి, శోభాసంపన్నుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 10

వి. సుగ్రీవుడు రావణునితో హటాత్తుగా మల్లయుద్ధము చేసినట్లు వర్ణించిన వెనుకటి సర్గ ప్రక్షిప్తము; ప్రాచ్యసరణిలో లేదు అని చూచి ఉన్నాము. ఈ పది శ్లోకాలు కూడ ప్రక్షిప్తములే.

మూ. పరిగృహ్యోదకం శీతం వనాని ఫలవన్తి చ,
బలౌఘం సంవిభజ్యేమం వ్యూహ్య తిష్ఠామ లక్ష్మణ. 11

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! శీతమ్=చల్లని, ఉదకమ్=ఉదకమును, ఫలవన్తి=ఫలములు గల, వనాని చ=వనములను, పరిగృహ్య=గ్రహించి, ఇమమ్=ఈ, బలౌఘమ్=సేనాసముదాయమును, సంవిభజ్య=విభజించి, వ్యూహ్య=వ్యూహము లుగా ఏర్పడి, తిష్ఠామ=ఉందము.

తా. లక్ష్మణా ! చల్లని నీరు, ఫలములతో నిండిన వనము ఉన్న చోటు చూచుకొని, ఈ సైన్యమును వ్యూహములుగా ఏర్పరచి నిలిపెదము. 11

మూ. లోకక్షయకరం భీమం భయం పశ్యామ్యుపస్థితమ్,
నిబర్హణం ప్రవీరాణామృక్షవానరరక్షసామ్. 12

ప్ర. అ. లోకక్షయకరమ్=లోకముల క్షయమును చేసేది, భీమమ్=భయంకరము, ప్రవీరాణామ్=వీరులైన, ఋక్షవానరరక్షసామ్=భల్లూకములకు, వానరులకు, రాక్షసులకు, నిబర్హణమ్=నాశకరము అయిన, భయమ్=భయమును, ఉపస్థితమ్=వచ్చినదానినిగా, పశ్యామి=చూచుచున్నాను.

తా. లోకక్షయమునకు హేతువు, వీరులైన భల్లూకములు, వానరులు, రాక్షసులు నశించేటట్లు చేసేది అయిన భయంకరమైన భయనిమిత్తము వచ్చినట్లు చూచుచున్నాను. 12

మూ. వాతా హి పరుషం వాన్తి కమ్పతే చ వసున్ధరా,
పర్వతాగ్రాణి వేపన్తే నదన్తి ధరణీధరాః. 13

ప్ర. అ. వాతాః=వాయువులు, పరుషమ్=పరుషముగా, వాన్తి=వీచుచున్నవి. వసున్ధరా చ=భూమి కూడ, కమ్పతే=వణకుచున్నది. పర్వతాగ్రాణి=పర్వతాగ్రములు, వేపన్తే=కదలుచున్నవి. ధరణీధరాః=పర్వతములు, నదన్తి=ధ్వనిచేయుచున్నవి.

తా. గాలులు తీవ్రముగా వీచుచున్నవి. భూమి అదురుచున్నది. పర్వతశిఖరములు కదలిపోవుచున్నవి. పర్వతములు ధ్వని చేయుచున్నవి. 13

మూ. మేఘాః క్రవ్యాదసంకాశాః పరుషాః పరుషస్వరాః,
క్రూరాః క్రూరం ప్రవర్షన్తి మిశ్రం శోణితబిన్దుభిః. 14

ప్ర. అ. క్రవ్యాదసంకాశాః=మాంసమును తిను మృగములతో సమానములు, పరుషాః=పరుషములు, పరుషస్వనాః=పరుషమైన ధ్వని గలవి, క్రూరాః= క్రూరములు అయిన, మేఘాః=మేఘములు, క్రూరమ్=భయంకరముగా, శోణితబిన్దుభిః= రక్తబిందువులతో, మిశ్రమ్=కలిసిన జలమును, ప్రవర్షన్తి=వర్షించుచున్నవి.

తా. క్రూరమృగముల వలె భయంకరములై పరుషముగా ధ్వనిచేయుచున్న క్రూరములైన మేఘములు, భయము కలుగునట్లుగా, రక్తబిందువులతో కూడిన జలమును వర్షించుచున్నవి. 14

మూ. రక్తచన్దనసంకాశా సన్ధ్యా పరమదారుణా,
జ్వలచ్చ నిపతత్యేతదాదిత్యాదగ్నిమణ్డలమ్. 15

ప్ర. అ. రక్తచన్దనసంకాశా=ఎఱ్ఱని చందనముతో సమానమైన,

సన్ధ్యా=సంధ్య, పరమదారుణా=చాల భయంకరమైనది. ఆదిత్యాత్=సూర్యు నినుండి, జ్వలత్=మండుచున్న, ఏతత్=ఈ, అగ్నిమణ్డలమ్=అగ్నిమండలము, నిపతతి=పడుచున్నది.

తా. ఎఱ్ఱని చందనమువంటి రంగుతో సంధ్య చాల భయంకరముగా ఉన్నది. సూర్యునినుండి ఒక అగ్నిమండలము మండుచూ క్రింద పడుచున్నది.

మూ. ఆదిత్యమభివాశ్యన్తి జనయన్తో మహద్భయమ్,
ధీవా దీప్తస్వరాః క్రూరా అప్రశస్తా మృగద్విజాః. 16

ప్ర. అ. దీప్తా=దీపములు, దీప్తస్వరాః=దీప్తమైన స్వరము గలవి, క్రూరాః=క్రూరములు, అప్రశస్తాః=ప్రశస్తములు కానివి అయిన, మృగద్విజాః=మృగములు, పక్షులు, మహత్=గొప్ప, భయమ్=భయమును, జనయన్తః=పుట్టించుచు, ఆదిత్యమ్= సూర్యుని, అభివాశ్యన్తి=అభిముఖముగా అరచుచున్నవి.

తా. క్రూరములు అమంగళకరములు అయిన మృగములు, పక్షులు దీప్తములై, దీప్తమైన స్వరముతో సూర్యునకు ఎదురుగా నిలచి అరచుచు గొప్ప భయమును పుట్టించుచున్నవి. 16

మూ. రజన్యామప్రశస్తశ్చ సంతాపయతి చన్ద్రమాః,
కృష్ణరక్తాంశుపర్యన్తో యథా లోకస్య సంక్షయే. 17

ప్ర. అ. లోకస్య=లోకముయొక్క, సంక్షయే యథా=క్షయకాలమునందు వలె, కృష్ణరక్తాంశుపర్యన్తః=నల్లని ఎఱ్ఱని కిరణములు అంతములందు గల, అప్రశస్తః= ప్రశస్తుడు కాని, చన్ద్రమాః=చంద్రుడు, రజన్యామ్=రాత్రియందు, సంతాపయతి=సంతాపమును కలిగించుచున్నాడు.

తా. ప్రళయకాలమునందు వలె పర్యంతభాగములందు నల్లగాను ఎఱ్ఱగాను ఉన్న కిరణములు గలిగి అప్రశస్తుడుగా ఉన్న చంద్రుడు రాత్రులయందు సంతాపమును (మనస్సుకు భయమును) కలిగించుచున్నాడు. 17

మూ. హ్రస్వో రూక్షోఽప్రశస్తశ్చ పరివేషః సులోహితః,
ఆదిత్యమణ్డలే నీలం లక్ష్మ లక్ష్మణ దృశ్యతే. 18

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! ఆదిత్యమణ్డలే=సూర్యమండలమునందు, హ్రస్వః=చిన్నది, రూక్షః=భయంకరము, అప్రశస్తః=అప్రశస్తము, సులోహితః=బాగా ఎఱ్ఱనది అయిన, పరివేషః=పరివేషము (చుట్టూ ఏర్పడిన వలయము), నీలమ్=నీలమైన, లక్ష్మ=గుర్తు, దృశ్యతే=చూడబడుచున్నది.

తా. లక్ష్మణా ! సూర్యమండలమునందు నల్లని కళంకము, చిన్నది,

భయంకరము,- చాల ఎఱ్ఱనిది, అప్రశస్తము అయిన పరివేషము కనబడుచున్నది.

మూ. దృశ్యన్తే న యథావచ్చ నక్షత్రాణ్యభివర్తతే,
యుగాన్తమివ లోకస్య పశ్య లక్ష్మణ శంసతి. 19

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! నక్షత్రాణి=నక్షత్రములు, యథావత్=ఉండవలసినట్లు, న దృశ్యన్తే=చూడబడుటలేదు. లోకస్య=లోకముయొక్క, యుగాన్తమ్=ప్రళయమును, శంసతీవ=చెప్పుచున్నట్లున్నది. అభివర్తతే=(దుశ్శకున జాలము) వచ్చుచున్నది , పశ్య= చూడుము.

తా. లక్ష్మణా ! నక్షత్రములు పూర్వము ఉన్న విధముగా కనబడుటలేదు. ఈ విధముగ కనబడుచున్న దుశ్శకునసముదాయము లోకమునకు ప్రళయము రానున్నట్లు చెప్పుచున్నదా అన్నట్లు ఉన్నది. చూడుము. 19

మూ. కాకాః శ్యేనాస్తథా గృధ్రా నీచైః పరిపతన్తి చ,
శివాశ్చాప్యశుభా వాచః ప్రవదన్తి మహాస్వనాః. 20

ప్ర. అ. కాకాః=కాకులు, శ్యేనాః=డేగలు, తథా=మరియు, గృధ్రాః=గ్రద్దలు, నీచైః=క్రిందుగా, పరిపతన్తి చ=ఎగురుచున్నవి. మహాస్వనాః=గొప్ప ధ్వని గల, శివాశ్చ=నక్కలు కూడ, అశుభాః=అమంగళకరమైన, వాచః=వాక్యములను (ధ్వనులను), ప్రవదన్తి=పలుకుచున్నవి (కూయుచున్నవి).

తా. కాకులు, డేగలు, గ్రద్దలు క్రింది భాగమునందు ఎగురుచున్నవి. గొప్ప ధ్వని గల నక్కలు కూడ అమంగళకరమైన కూతలు కూయుచున్నవి. 20

మూ. శైలైః శూలైశ్చ ఖడ్గైశ్చ విముక్తైః కపిరాక్షసైః,
భవిష్యత్యావృతా భూమిర్మాంసశోణితకర్దమా. 21

ప్ర. అ. కపిరాక్షసైః=వానరులచేతను, రాక్షసులచేతను, విముక్తైః=విడువబడిన, శైలైః=పర్వతములచేత, శూలైశ్చ=శూలములచేత, ఖడ్గైశ్చ=ఖడ్గములచేత, భూమిః=భూమి, ఆవృతా=ఆవరింపబడినదై, మాంసశోణితకర్దమా=మాంసము యొక్క రక్తముయొక్క బురదకలదిగా, భవిష్యతి=కాగలదు.

తా. వానరులు, రాక్షసులు ప్రయోగించిన పర్వత - శూల - ఖడ్గములచేత కప్పబడిన భూమి మాంసము రక్తము అను బురదతో నిండగలదు. 21

మూ. క్షిప్రమద్య దురాధర్షాం పురీం రావణపాలితామ్,
అభియామ జవేనైవ సర్వతో హరిభిర్వృతాః. 22

ప్ర. అ. హరిభిః=వానరులతో, వృతాః=కూడినవారమై, అద్య= ఇప్పుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, దురాధర్షామ్=ఎదిరింప శక్యము కాని, రావణపాలితామ్=రావ

ణునిచేత పాలింపబడిన, పురీమ్=పట్టణమును గూర్చి, సర్వతః=అన్ని వైపులనుండి ఆవేగైః=వేగముతో, అభియామ=ఎదురుగా వెళ్లెదము.

తా. మన మిప్పుడు వెంటనే వానరులతో కూడి ఎదిరింప శక్యము కాని, రావణరక్షితమైన లంకానగరమును వేగముగా అన్ని వైపులనుండి ముట్టడించెదము. 22

మూ. ఇత్యేవం తు వదన్వీరో లక్ష్మణం లక్ష్మణాగ్రజః,
తస్మాదవాతరచ్ఛీఘ్రం పర్వతాగ్రాన్మహాబలః. 23

ప్ర. అ. వీరః=వీరుడు, మహాబలః=గొప్ప బలము గలవాడు అయిన, లక్ష్మణాగ్రజః=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, వదన్=పలుకుచు, తస్మాత్=ఆ, పర్వతాగ్రాత్=పర్వతాగ్రమునుండి, శీఘ్రమ్=శీఘ్రముగా, అవాతరత్=దిగెను.

తా. మహాబలశాలి, వీరుడు అయిన రాముడు లక్ష్మణునితో ఇట్లు పలుకుచు ఆ పర్వతాగ్రమునుండి శీఘ్రముగా దిగెను. 23

మూ. అవతీర్య తు ధర్మాత్మా తస్మాచ్ఛైలాత్స రాఘవః,
పరైః పరమదుర్ధర్షం దదర్శ బలమాత్మనః. 24

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః రాఘవః=ఆ రాముడు, తస్మాత్ శైలాత్=ఆ పర్వతమునుండి, అవతీర్య=దిగి, పరైః=శత్రువులచేత, పరమదుర్ధర్షమ్=మిక్కిలి ఎదిరింప శక్యము కాని, ఆత్మనః బలమ్=తన సైన్యమును, దదర్శ=చూచెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఆ పర్వతమునుండి దిగి, శత్రువులచేత ఎదిరింప శక్యము కాని తన సైన్యమును చూచెను. 24

మూ. సంనహ్య తు ససుగ్రీవః కపిరాజబలం మహత్,
కాలజ్ఞో రాఘవః కాలే సంయుగాయాభ్యచోదయత్. 25

ప్ర. అ. ససుగ్రీవః=సుగ్రీవునితో కూడిన, కాలజ్ఞః=కాలము నెరిగిన, రాఘవః=రాముడు, మహత్=గొప్పదైన, కపిరాజబలమ్=సుగ్రీవుని సైన్యమును, సంనహ్య=సిద్ధముగా ఉండునట్లు చేసి, కాలే=తగు సమయమునందు, సంయుగాయ=యుద్ధముకొరకు, అభ్యచోదయత్=ప్రేరేపించెను.

తా. ఏ సమయమునందు ఏమి చేయవలెనో తెలిసిన సుగ్రీవసహాయుడైన రాముడు విశాలమైన ఆ వానరసైన్యమును సిద్ధముగా ఉండునట్లు చేసి, తగు సమయమునందు యుద్ధమునకై ప్రేరేపించెను. 25

మూ. తతః కాలే మహాబాహుర్బలేన మహతా వృతః,
ప్రస్థితః పురతో ధన్వీ లఙ్కామభిముఖః పురీమ్. 26

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబాహుః=గొప్ప బాహువులు గల రాముడు, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, వృతః=కూడినవాడై, పురతః=ముందు, ధన్వీ=ధనుర్ధరుడై, కాలే=తగు సమయమునందు, లఙ్కాం పురీం=లంకానగరమును, అభిముఖః=అభిముఖుడై, ప్రస్థితః=ప్రయాణమాయెను.

తా. పిమ్మట మహాబాహువైన రాముడు పెద్ద సైన్యముతో కూడి, తగిన ముహూర్తమునందు ధనుర్ధరుడై ముందు నడచుచు లంకాపురమువైపు బయలుదేరెను. 26

మూ. తం విభీషణసుగ్రీవౌ హనుమాఞ్జామ్బవాన్నలః,
ఋక్షరాజస్తథా నీలో లక్ష్మణశ్చాన్వయుస్తదా. 27

ప్ర. అ. తదా=అప్పుడు, విభీషణసుగ్రీవౌ=విభీషణసుగ్రీవులు, హనుమాన్=హనుమంతుడు, ఋక్షరాజః=భల్లూకముల రాజైన, జామ్బవాన్=జాంబవంతుడు, నలః=నలుడు, తథా=మరియు, నీలః=నీలుడు, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, తమ్=ఆ రాముణ్ణి అన్వయుః= అనుసరించి వెళ్లిరి.

తా. అప్పుడు విభీషణసుగ్రీవులు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు, నీలుడు, లక్ష్మణుడు శ్రీరాముని వెంట వెళ్లిరి. 27

మూ. తతః పశ్చాత్సుమహతీ పృతనర్క్షవనౌకసామ్,
ప్రచ్ఛాద్య మహతీం భూమిమనుయాతి స్మ రాఘవమ్. 28

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఋక్షవనౌకసామ్=భల్లూకములయొక్క, వానరులయొక్క, మహతీ=గొప్పదైన, పృతనా=సేన, మహతీమ్=విశాలమైన, భూమిమ్=భూమిని, ప్రచ్ఛాద్య=కప్పి, పశ్చాత్=వాళ్ల వెనుక, రాఘవమ్=రాముణ్ణి, అనుయాతి స్మ= అనుసరించి వెళ్లెను.

తా. పిమ్మట, వాళ్ల వెనుకనే గొప్పదైన వానరభల్లూకసేన విశాలమైన భూమిని కప్పివేయుచు రాముణ్ణి అనుసరించి వెళ్లెను. 28

మూ. శైలశృఙ్గాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్,
జగృహుః కుఞ్జరప్రఖ్యా వానరాః పరవారణాః. 29

ప్ర. అ. పరవారణాః=శత్రువులను జయించు, కుఞ్జరప్రఖ్యాః=ఏనుగులతో సమానమైన, వానరాః=వానరులు, శైలశృఙ్గాణి=పర్వతశిఖరములను, ప్రవృద్ధాన్=బాగా పెరిగిన, శతశః=వందలకొలది, మహీరుహాన్=వృక్షములను,

జగృహుః=గ్రహించిరి.

తా. శత్రువినాశకులు, ఏనుగులతో సమానులు అయిన వానరులు పర్వతశిఖరములను, వందలకొలది మహావృక్షములను గ్రహించి వెళ్లిరి. 29

మూ. తౌ త్వదీర్ఘేణ కాలేన భ్రాతరౌ రామలక్ష్మణౌ,
రావణస్య పురీం లఙ్కామాసేదతురరిందమౌ. 30

ప్ర. అ. అరిందమౌ=శత్రుసంహారకులైన, భ్రాతరౌ=సోదరులైన, తౌ రామలక్ష్మణౌ= ఆ రామలక్ష్మణులు, అదీర్ఘేణ=దీర్ఘము కాని, కాలేన=కాలముచేత, రావణస్య=రావణునియొక్క, పురీమ్=పట్టణమైన, లఙ్కామ్=లంకను, ఆసేదతుః=సమీపించిరి.

తా. శత్రుసంహారకులు, సోదరులు అయిన ఆ రామలక్ష్మణులు స్వల్పకాలములోనే రావణపాలితమైన ఆ లంకానగరమును సమీపించిరి. 30

మూ. పతాకామాలినీం రమ్యాముద్యానవనశోభితామ్,
చిత్రవప్రాం సుదుష్ప్రాపాముచ్చైఃప్రాకారతోరణామ్. 31
తాం సురైరపి దుర్ధర్షాం రామవాక్యప్రచోదితాః,
యథానిదేశం సంపీడ్య న్యవిశన్త వనౌకసః. 32

ప్ర. అ. రామవాక్యప్రచోదితాః=రాముని మాటలచేత ప్రేరేపింపబడిన, వనౌకసః=వానరులు, పతాకామాలినీమ్=పతాకల పంక్తులు కలది, రమ్యామ్=సుందరమూ, ఉద్యానవనశోభితామ్= ఉద్యానవనములచేత శోభింపచేయబడినది, చిత్రవప్రామ్=చిత్రమైన ప్రాకారము కలది, సుదుష్ప్రాపామ్= పొందుటకు చాల కష్టమూ, ఉచ్చైః ప్రాకారతోరణామ్=ఉన్నతమైన ప్రాకారము ముఖద్వారములు కలది, సురైరపి=దేవతలచేత కూడ, దుర్ధర్షామ్=ఎదిరింప శక్యము కానిది అయిన, తామ్=ఆ లంకను, యథానిదేశమ్=ఆజ్ఞానుసారముగా, సంపీడ్య=పీడించి, న్యవిశన్త=నిలచి ఉండిరి.

తా. పతాకల పంక్తులతో కూడిన ఆ లంకానగరము ఉద్యానవనములతో ప్రకాశించుచుండెను. దాని ప్రాకారము చిత్రముగాను ఉన్నతముగాను ఉండెను. ముఖద్వారములు చాల ఎత్తుగా ఉండెను. రామునిచేత ప్రేరేపింపబడిన ఆ వానరులు దేవతలచేత ఎదిరింప శక్యము కాని సుందరమైన లంకను రామాజ్ఞానుసారము పీడించుచు దాని చుట్టూ ముట్టడించుటకు సిద్ధముగా నిలచిరి. 31, 32

మూ. లఙ్కాయాస్తూత్తరం ద్వారం శైలశృఙ్గమివోన్నతమ్,
రామః సహానుజో ధన్వీ జుగోప చ రురోధ చ. 33

ప్ర. అ. సహానుజః=తమ్మునితో కూడిన, రామః=రాముడు, ధన్వీ=ధనుర్ధరుడై, లఙ్కాయాః=లంకయొక్క, శైలశృఙ్గమివ=పర్వతశిఖరమువలె, ఉన్నతమ్=ఎత్తైన, ఉత్తరద్వారమ్=ఉత్తరద్వారమును, జుగోప=రక్షించెను, రురోధ చ=నిరోధించెను.

తా. లక్ష్మణసహితుడైన రాముడు ధనస్సు ధరించి, పర్వతశిఖరము వలె ఎత్తైన లంకానగరోత్తరద్వారమును రక్షించుచు లోపలివారెవరూ బైటకు రాకుండునట్లు నిరోధించెను. 33

మూ. లఙ్కాముపనివిష్టస్తు రామో దశరథాత్మజః,
లక్ష్మణానుచరో వీరః పురీం రావణపాలితామ్. 34
ఉత్తరద్వార మాసాద్య యత్ర తిష్ఠతి రావణః,
నాన్యో రామాద్ధి తద్ద్వారం సమర్థః పరిరక్షితుమ్. 35
రావణాధిష్ఠితం భీమం వరుణేనేవ సాగరమ్,
సాయుధై రాక్షసైర్భీమైరభిగుప్తం సమన్తతః. 36
లఘూనాం త్రాసజననం పాతాలమివ దానవైః.

ప్ర. అ. దశరథాత్మజః=దశరథపుత్రుడు, లక్ష్మణానుచరః=లక్ష్మణుడు అనుచరుడుగా కలవాడు, వీరః=వీరుడు అయిన, రామః=రాముడు, రావణః=రావణుడు, యత్ర=ఎక్కడ, తిష్ఠతి=ఉన్నాడో, అట్టి, ఉత్తరద్వారమ్=ఉత్తరద్వారమును, ఆసాద్య=పొంది, రావణపాలితామ్=రావణునిచేత పాలింపబడిన, లఙ్కాం పురీమ్=లంకాపురిని, ఉపనివిష్టః=సమీపించి నిలచినాడు. రావణాధిష్ఠితమ్=రావణునిచేత అధిష్ఠింపబడినది, వరుణేన=వరుణునిచేత అధిష్ఠింపబడిన, సాగరమ్ ఇవ=సముద్రము వలె, భీమమ్=భయంకరము, సాయుధైః=ఆయుధములతో కూడిన, భీమైః=భయంకరులైన, రాక్షసైః=రాక్షసులచేత, సమన్తతః=అంతటా, అభిగుప్తమ్=రక్షింపబడినది, దానవైః=దానవులచేత, పాతాలమివ=పాతాళము వలె, లఘూనామ్=సామాన్యజనములకు, త్రాసజననమ్=భయము కలిగించేది అయిన, తత్ ద్వారమ్=ఆ ద్వారమును, పరిరక్షితుమ్=రక్షించుటకు, రామాత్=రాముని కంటె, అన్యః=ఇతరుడు, న సమర్థః హి=సమర్థుడు కాదు కదా ?

తా. దశరథపుత్రుడైన వీరుడైన రాముడు లక్ష్మణసమేతుడై రావణునిచే రక్షింపబడుచున్న లంక చేరి, దేని దగ్గర రావణుడు ఉండెనో అట్టి ఉత్తరద్వారము దగ్గర నిలచెను. రావణునిచేత అధిష్ఠింపబడిన ఆ ద్వారము వరుణుడు అధిష్ఠించి ఉన్న సాగరము వలె చాల భయంకరమైనది. ఆయుధములు

ధరించిన భయంకరులైన రాక్షసులు దానిని అన్నివైపులనుండి రక్షించుచుండిరి. దానవులతో కూడిన పాతాళము వలె ఆ ద్వారము సామాన్యులకు భయము కలిగించును. అట్టి ఆ ద్వారమును రక్షించుటకు (ముట్టడించుటకు) రాముడు తప్ప మరెవ్వరూ సమర్థులు కారు కదా ? 34-36

మూ. విన్యస్తాని చ యోధానాం బహూని వివిధాని చ,
దదర్శాయుధజాలాని తత్రైవ కవచాని చ. 37

ప్ర. అ. యోధానామ్=యోధులయొక్క, విన్యస్తాని=అక్కడ ఉంచబడిన, బహూని=అనేకములైన, వివిధాని చ=అనేకవిధములైన, ఆయుధజాలాని=ఆయుధముల సముదాయములను, తత్రైవ=మరియు, కవచాని చ=కవచములను, దదర్శ=చూచెను.

తా. అక్కడ ఉన్న యోధులకు చెందిన అనేకవిధములైన ఎన్నో ఆయుధములను, కవచములను చూచెను. 37

మూ. పూర్వం తు ద్వారమాసాద్య నీలో హరిచమూపతిః,
అతిష్ఠత్సహ మైన్దేన ద్వివిదేన చ వీర్యవాన్. 38

ప్ర. అ. హరిచమూపతిః=వానరసేనానాయకుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, నీలః=నీలుడు, మైన్దేన సహ=మైందునితోను, ద్వివిదేన చ సహ=ద్వివిదునితోను, పూర్వం ద్వారమ్=తూర్పు ద్వారమును, ఆసాద్య=పొంది, అతిష్ఠత్=నిలచెను.

తా. వానరసేనాధిపతి, పరాక్రమవంతుడు అయిన నీలుడు మైందునితోను, ద్వివిదునితోను కలిసి తూర్పు ద్వారము వద్ద నిలచెను. 38

మూ. అఙ్గదో దక్షిణద్వారం జగ్రాహ సుమహాబలః,
ఋషభేణ గవాక్షేణ గజేన గవయేన చ. 39

ప్ర. అ. సుమహాబలః=చాల గొప్ప బలము గల, అఙ్గదః=అంగదుడు, ఋషభేణ=ఋషభునితోను, గవాక్షేణ=గవాక్షునితోను, గజేన=గజునితోను, గవయేన చ=గవయునితోను, దక్షిణద్వారమ్=దక్షిణద్వారమును, జగ్రాహ=గ్రహించెను.

తా. చాల గొప్ప బలము గల అంగదుడు ఋషభ - గవాక్ష - గజ - గవయులతో కలిసి దక్షిణద్వారము వద్ద నిలచెను. 39

మూ. హనుమాన్ పశ్చిమద్వారం రరక్ష బలవాన్ కపిః,
ప్రజఙ్ఘతరసాభ్యాం చ వీరైరన్యైశ్చ సంగతః. 40

ప్ర. అ. బలవాన్=బలవంతుడైన, కపిః=వానరుడైన, హనుమాన్=హను

మంతుడు, ప్రజంఘతరసాభ్యాం=ప్రజంఘునితోను తరసునితోను, అన్యైః=ఇతరులైన, వీరైశ్చ=వీరులతోను, సంగతః=కూడినవాడై, పశ్చిమద్వారమ్=పశ్చిమద్వారమును, రరక్ష=రక్షించెను.

తా. బలశాలియైన హనుమంతుడు ప్రజంఘతరసులతోను, ఇతరులైన వీరులతోను కూడినవాడై పశ్చిమద్వారమును రక్షించెను. 40

మూ. మధ్యమే చ స్వయం గుల్మే సుగ్రీవః సమతిష్ఠత,
సహ సర్వైర్హరిశ్రేష్ఠైః సుపర్ణశ్వసనోపమైః. 41

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, సర్వైః=సమస్తమైన, సుపర్ణశ్వసనోపమైః=గరుత్మంతునితోను వాయువుతోను సమానులైన, హరిశ్రేష్ఠైః=వానరశ్రేష్ఠులతో కూడ, స్వయమ్=స్వయముగా, మధ్యమే=మధ్యమమైన, గుల్మే=గుల్మమునందు, సమతిష్ఠత=నిలచెను.

తా. సుగ్రీవుడు గరుత్మంతునితోను, వాయువుతోను సమానులైన సమస్తవానరశ్రేష్ఠులతో కూడి స్వయముగా మధ్యమగుల్మమునందు (సేనామధ్యమునందు) నిలచెను. 41

మూ. వానరాణాం తు షట్త్రింశత్కోట్యః ప్రఖ్యాతయూథపాః, 42
నిపీడ్యోపనివిష్టాశ్చ సుగ్రీవో యత్ర వానరః.

ప్ర. అ. ప్రఖ్యాతయూథపాః=ప్రసిద్ధసేనానాయకులైన, వానరాణామ్=వానరులయొక్క, షట్త్రింశత్కోట్యః=ముప్పై ఆరు కోట్లు, వానరః=వానరుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడ, నిపీడ్య=రాక్షసులను పీడించి, (రాక్షసులను ఎదిరించుటకై) ఉపనివిష్టాః=చేరి ఉండిరి.

తా. సుగ్రీవుడు ఉన్న చోటనే ప్రసిద్ధసేనానాయకులైన ముప్పదియారుకోట్ల మంది వానరులు రాక్షసులను ఎదిరించుటకై నిలిచి ఉండిరి. 42

మూ. శాసనేన తు రామస్య లక్ష్మణః సవిభీషణః, 43
ద్వారే ద్వారే హరీణాం తు కోటిం కోటిం న్యవేశయత్.

ప్ర. అ. సవిభీషణః=విభీషణునితో కూడిన, లక్ష్మణః=లక్ష్మణుడు, రామస్య=రామునియొక్క, శాసనేన=శాసనముచేత, ద్వారే ద్వారే=ప్రతిద్వారమునందు, హరీణామ్=వానరులయొక్క, కోటిం కోటిమ్=ఒక్కొక్క కోటిని, న్యవేశయత్=నిలిపెను.

తా. లక్ష్మణవిభీషణులు రాముని ఆజ్ఞ ప్రకారము ప్రతిద్వారమువద్ద ఒక్కొక్క కోటి వానరులను నిలిపిరి. 43

మూ. పశ్చిమేన తు రామస్య సుషేణః సహజామ్బవాన్, 44
అదూరాన్మధ్యమే గుల్మే తస్థౌ బహుబలానుగః.

ప్ర. అ. సుషేణః=సుషేణుడు, సహజామ్బవాన్=జాంబవంతునితో కూడినవాడై, బహుబలానుగః=అధికమైన సైన్యము అనుసరించుచున్నదిగా కల వాడై, రామస్య=రామునకు, పశ్చిమేన=పశ్చిమముగా, అదూరాత్=సమీపమునందు, మధ్యమే గుల్మే= మధ్యమగుల్మమునందు, తస్థౌ=నిలచెను.

తా. సుషేణుడు, జాంబవంతుడు, అధికమైన సైన్యములో మధ్యమగు ల్మమునందు, రామునకు పశ్చిమముగా, సమీపమునందు నిలచిరి.

మూ. తే తు వానరశార్దూలాః శార్దూలా ఇవ దంష్ట్రిణః, 45
గృహీత్వా ద్రుమశైలాగ్రాన్ హృష్టా యుద్ధాయ తస్థిరే.

ప్ర. అ. శార్దూలాః ఇవ=పెద్దపులుల వలె, దంష్ట్రిణః=కోరలు గల, తే=ఆ, వానరశార్దూలాః=వానరశ్రేష్ఠులు, హృష్టాః=సంతోషించినవారై, ద్రుమశైలాగ్రాన్= వృక్షములను, పర్వత శిఖరములను, గృహీత్వా=గ్రహించి, యుద్ధాయ=యుద్ధము కొరకు, తస్థిరే=నిలచిరి.

తా. పెద్దపులులవలె కోరలు గల ఆ వానరశ్రేష్ఠులు వృక్షములను, పర్వతశిఖరములను గ్రహించి, ఉత్సాహముతో యుద్ధమునకై బయలుదేరిరి. 45

మూ. సర్వే వికృతలాఙ్గూలాః సర్వే దంష్ట్రానఖాయుధాః, 46
సర్వే వికృతచిత్రాఙ్గాః సర్వే చ వికృతాననాః.

ప్ర. అ. సర్వే=అందరూ, వికృతలాఙ్గూలాః=వికృతమైన (పైకి ఎత్తబ డిన) తోకలు కలవారు. సర్వే=అందరు, దంష్ట్రానఖాయుధాః=కోరలు, గోళ్లు ఆయుధములుగా కలవారు. సర్వే= అందరు, వికృతచిత్రాఙ్గాః=కోపముచేత వికారముగా నున్న విచిత్రమైన శరీరములు కలవారు. సర్వే చ=అందరు, వికృతాననాః=వికృతమైన ముఖములు గలవారు.

తా. కోరలు, గోళ్లు ఆయుధములుగా ఉపయోగించు ఆ వానరులందరు తోకలను పైకి ఎత్తి ఉండిరి. కోపోద్రేకముచేత వాళ్ల ముఖములు, శరీరము వికారముచెంది విచిత్రముగా ఉండెను. 46

మూ. దశనాగబలాః కేచిత్కేచిద్దశగుణోత్తరాః, 47
కేచిన్నాగసహస్రస్య బభూవుస్తుల్యవిక్రమాః.

ప్ర. అ. కేచిత్=కొందరు, దశనాగబలాః=పది ఏనుగుల బలము గలవారు. కేచిత్= కొందరు, దశగుణోత్తరాః=దానికి పదిరెట్లు అధికమైన బలము గలవారు.

కేచిత్=కొందరు, నాగసహస్రస్య=వేయి ఏనుగులకు, తుల్యవిక్రమాః=తుల్యమైన పరాక్రమము గలవారుగా, బభూవుః=ఉండిరి.

తా. ఆ వానరులలో కొందరు పది ఏనుగుల బలము గలవారు, కొందరు నూరు ఏనుగుల బలము గలవారు, కొందరు వేయి ఏనుగుల బలము గలవారు ఉండిరి. 47

మూ. సన్తి చౌఘబలాః కేచిత్కేచిద్దశగుణోత్తరాః, 48
అప్రమేయబలాశ్చాన్యే తత్రాసన్ హరియూథపాః.

ప్ర. అ. కేచిత్=కొందరు, ఓఘబలాః=ఓఘము ఏనుగుల బలము గలవారు, కేచిత్= కొందరు, దశగుణోత్తరాః= పదిఓఘముల ఏనుగుల బలము గలవారు, సన్తి=ఉన్నారు. తత్ర=అక్కడ, అన్యే=మరికొందరు, హరియూథపాః=వానరసేనానాయకులు, అప్రమేయబలాశ్చ=ఇంత అని చెప్ప శక్యము కాని బలము కలవారు, ఆసన్=ఉండిరి. (ఓఘము అను సంఖ్య 28వ సర్గలో చెప్పబడినది).

తా. కొందరు ఓఘసంఖ్యలో ఉన్న ఏనుగుల బలము గలవారు. కొందరు పది ఓఘముల ఏనుగుల బలము గలవారు. కొందరు వానరనాయకుల బలము ఇంత అని చెప్ప శక్యము కాదు. 48

మూ. అద్భుతశ్చ విచిత్రశ్చ తేషామాసీత్సమాగమః, 49
తత్ర వానరసైన్యానాం శలభానామివోద్గమః.

ప్ర. అ. తత్ర=అక్కడ, శలభానామ్=మిడతలయొక్క, ఉద్గమః ఇవ=ఎగురుట వలె, తేషామ్=ఆ, వానరసైన్యానామ్=వానరసైన్యములయొక్క, సమాగమః=సమాగమమును, అద్భుతశ్చ=ఆశ్చర్యకరముగాను, విచిత్రశ్చ=విచిత్రము గాను, ఆసీత్=ఉండెను.

తా. అక్కడ గుమిగూడిన వానరసైన్యములు మిడతలదండు వలె ఆశ్చర్యకరముగాను, విచిత్రముగాను ఉండెను. 49

మూ. ప్రతిపూర్ణ మివాకాశం సంపూర్ణేవ చ మేదినీ, 50
లఙ్కాముపనివిష్టైశ్చ సంపతద్భిశ్చ వానరైః.

ప్ర. అ. లఙ్కామ్=లంకను, ఉపనివిష్టైః=చేరిన, వానరైః=వానరులచేతను, సంపతద్భిశ్చ=చేరుచున్న వానరులచేతను, ఆకాశమ్=ఆకాశము, ప్రతిపూర్ణమివ= నిండిపోయినట్లుండెను. మేదినీ చ=భూమి కూడ, సంపూర్ణేవ=నిండిపోయినట్లుం డెను.

తా. కొందరు వానరులు లంక చేరిరి. కొందరు చేరుచుండిరి. అట్టి వానరులతో భూమ్యాకాశములు పూర్తిగా నిండిపోయినట్లుండెను. 50

మూ. శతం శతసహస్రాణాం పృథగృక్షవనౌకసామ్, 51
లంకాద్వారాణ్యుపాజగ్మురన్యే యోద్ధుం సమన్తతః.

ప్ర. అ. ఋక్షవనౌకసామ్=భల్లూకములయొక్క, వానరులయొక్క, శతసహస్రాణామ్ =లక్షలయొక్క, శతమ్=శతము, పృథక్=వేరు వేరుగను, అన్యే=ఇతరులు, సమన్తతః =అంతటా, లంకాద్వారాణి =లంకాద్వారములను, యోద్ధుమ్ =యుద్ధము చేయుటకు, ఉపాజగ్ముః=చేరిరి.

తా. కోటి భల్లూకములు, కోటి మంది వానరులు, వేరు వేరుగను, మరికొందరు వానరులును, యుద్ధము చేయుటకై అన్ని వైపులనుండి లంకానగరద్వారములను చేరిరి. 51

మూ. ఆవృతః స గిరిః సర్వైస్తైః సమన్తాత్ ప్లవఙ్గమైః, 52
అయుతానాం సహస్రం చ పురీం తామభ్యవర్తత.

ప్ర. అ. సః గిరిః= ఆ పర్వతము, సమన్తాత్ =అంతటను, తైః =ఆ, ప్లవఙ్గమైః =వానరులచేత, ఆవృతః =కప్పబడినది. అయుతానామ్ =అయుతములయొక్క, సహస్రమ్=సహస్రము, తామ్=ఆ, పురీమ్=పట్టణమును, అభ్యవర్తత=సమీపించెను.

తా. ఆ పర్వతము అన్ని ప్రాంతములందూ వానరులచేత కప్పబడి ఉండెను. వెయ్యి అయుతముల వానరులు ఆ పట్టణము చుట్టూ చేరిరి. 52

మూ. వానరైర్బలవద్భిశ్చ బభూవ ద్రుమపాణిభిః, 53
సర్వతః సంవృతా లఙ్కా దుష్ప్రవేశాపి వాయునా.

ప్ర. అ. ద్రుమపాణిభిః=వృక్షములు హస్తములయందు గల, బలవద్భిః=బలవంతులైన, వానరైః=వానరులచేత, సర్వతః=అన్ని వైపులా, సంవృతా=చుట్టబడిన, లఙ్కా=లంక, వాయునాపి=వాయువుచేత కూడ, దుష్ప్రవేశా=ప్రవేశింప శక్యము కానిది, బభూవ=అయెను.

తా. వృక్షములు ధరించిన బలవంతులైన వానరులచేత అన్ని వైపులా చుట్టుముట్టబడిన ఆ లంకలోనికి గాలి కూడ ప్రవేశించుటకు శక్యము కాకుండ ఉండెను. 53

మూ. రాక్షసా విస్మయం జగ్ముః సహసాభినిపీడితాః, 54
వానరైర్మేఘసంకాశైః శక్రతుల్యపరాక్రమైః.

ప్ర. అ. మేఘసంకాశైః=మేఘములతో సమానులు, శక్రతుల్యపరాక్రమైః=దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవారు అయిన, వానరైః=వానరులచేత, సహసా=హటాత్తుగా, అభిపీడితాః=ముట్టడించబడిన, రాక్షసాః=రాక్షసులు, విస్మయమ్=ఆశ్చర్యమును, జగ్ముః=పొందిరి.

తా. దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల మేఘముల వలె ఉన్న వానరులు హటాత్తుగా వచ్చి లంకను ముట్టడించగానే రాక్షసు లందరు ఆశ్చర్యపడిరి. 54

మూ. మహాన్ శబ్దోఽభవత్తత్ర బలౌఘస్యాభివర్తతః, 55
సాగరస్యేవ భిన్నస్య యథా స్యాత్ సలిలస్వనః.

ప్ర. అ. తత్ర=అక్కడ, భిన్నస్య=భేదించబడిన, సాగరస్య ఇవ=సముద్రమువలె, బలౌఘస్య=సేనాసమూహము, అభివర్తతః=సమీపించుచుండగా, సలిలస్వనః=ఉదకధ్వని, యథా=ఎట్లు, స్యాత్=అగునో అట్లు, మహాన్=గొప్పదైన, శబ్దః=శబ్దము, అభవత్=ఆయెను.

తా. ఒడ్డు బద్దలు కొట్టి (తెంచుకొని) వచ్చుచున్న సముద్రము వలె అక్కడ వానరసైన్యము వచ్చి చేరుచుండగా, సముద్ర జలధ్వనివంటి గొప్ప ధ్వని కలిగెను. 55

మూ. తేన శబ్దేన మహతా సప్రాకారా సతోరణా, 56
లఙ్కా ప్రచలితా సర్వా సశైలవనకాననా.

ప్ర. అ. మహతా=గొప్పదైన, తేన శబ్దేన=ఆ శబ్దముచేత, సప్రాకారా=ప్రాకారములతో కూడిన, సతోరణా=తోరణములతో కూడిన , సశైలవనకాననా=వనములతోను అరణ్యములతోను కూడిన, సర్వా=సమస్తమైన, లఙ్కా=లంక, ప్రచలితా=కదలిపోయినది.

తా. చాలా గొప్పదైన ఆ శబ్దానికి ప్రాకారములతో, ముఖద్వారములతో, ఉద్యానములతో, అరణ్యములతో సహా ఆ లంక అంతా అదిరిపోయెను. 56

మూ. రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ, 57
బభూవ దుర్ధర్షతరా సర్వైరపి సురాసురైః.

ప్ర. అ. రామలక్ష్మణగుప్తా=రామలక్ష్మణులచేత రక్షింపబడినది, సుగ్రీవేణ చ=సుగ్రీవునిచేత కూడ రక్షించబడినది అయిన, సా=ఆ, హరివాహినీ=వానర సేన, సర్వైః=సమస్తమైన, సురాసురైరపి=దేవతలచేతను, అసురులచేతను కూడ, దుర్ధర్షతరా=ఎదిరింప శక్యము కానిదిగా, బభూవ=ఉండెను.

తా. రామలక్ష్మణసుగ్రీవులంచేత రక్షింపబడుచున్న ఆ వానరసేన మహాసముద్రం అందరూ వచ్చినను అయినను శక్యము కానిదిగా ఉండెను. 57

మూ. రాఘవః సంనివేశ్యైవం స్వసైన్యం రక్షసాం వధే, 58
సమ్మన్త్ర్య మన్త్రిభిః సార్ధం నిశ్చిత్య చ పునః పునః,
ఆనన్తర్యమభిప్రేప్సుః క్రమయోగార్థతత్త్వవిత్. 59
విభీషణస్యానుమతే రాజధర్మమనుస్మరన్,
అఙ్గదం వాలితనయం సమాహూయేదమబ్రవీత్. 60

ప్ర. అ. క్రమయోగార్థతత్త్వవిత్=క్రమసంబంధమును అర్థతత్త్వమును ఎరిగిన, రాఘవః=రాముడు, స్వమ్=తన సంబంధమైన, సైన్యమ్=సైన్యమును, రక్షసామ్=రాక్షసులయొక్క, వధే=వధయందు, ఏవమ్=ఈ విధముగా, సంనివేశ్య=నిలిపి, మన్త్రిభిః సార్ధమ్=మంత్రులతో కూడ, పునః పునః=మాటిమాటికి, సమ్మన్త్ర్య=ఆలోచించి, నిశ్చిత్య=నిశ్చయించి, ఆనన్తర్యమ్=ఆ తరువాత చేయదగినదానిని, అభిప్రేప్సుః=పొందదలచినవాడై, రాజధర్మమ్=రాజధర్మమును, అనుస్మరన్=స్మరించుచు, విభీషణస్య=విభీషణునియొక్క, అనుమతే=అంగీకారమునందు, (సలహాప్రకారము) వాలితనయమ్=వాలికుమారుడైన, అఙ్గదమ్=అంగదుని, సమాహూయ=పిలిచి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. దేని తరవాత ఏది చేయవలెను అను విషయమునూ, కార్యతత్త్వమూ బాగుగా తెలిసిన రాముడు తన సైన్యమును రాక్షసుల సంహారము నిమిత్తమై ఈ విధముగా నిలిపి, మంత్రులతో మాటిమాటికి ఆలోచించి, నిశ్చయించి, తరువాత చేయదగిన దానిని చేయవలె నను కోరికతో రాజధర్మమును పాటించుచు, విభీషణుని సలహాప్రకారము వాలి పుత్రుడైన అంగదుని పిలిచి ఇట్లు పలికెను.

మూ. గత్వా సౌమ్య దశగ్రీవం బ్రూహి మద్వచనాత్కపే,
లఙ్ఘయిత్వా పురీం లఙ్కాం భయం త్యక్త్వా గతవ్యథః. 61
భ్రష్టశ్రీకం గతైశ్వర్యం ముమూర్షో నష్టచేతసమ్.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా! కపే=అంగదుడా! లఙ్కాం పురీమ్=లంకాపురమును, లఙ్ఘయిత్వా=దాటి, భయమ్= భయమును, త్యక్త్వా=విడచి, గతవ్యథః=పోయిన వ్యథ కలవాడవై, భ్రష్టశ్రీకమ్=భ్రష్టమైన సంపదగలవాడు, గతైశ్వర్యమ్=పోయిన ఐశ్వర్యము కలవాడు, ముమూర్షోనష్టచేతసమ్=మరణేచ్ఛచేత నష్టమైన చిత్తము కలవాడు, (అయిన) దశగ్రీవమ్=దశగ్రీవుణ్ణిగూర్చి, గత్వా=వెళ్ళి, మద్వచనాత్=నా మాటవలన, బ్రూహి=చెప్పుము.

తా. సౌమ్యుడవైన ఓ! అంగదుడా! నీవు నిశ్చయముగా ఏ దిగులూ

లేకుండా, లంకాపురము ప్రాకారము దాటి, మరణించవలెననే కోరికచేత చెడిపోయిన మనస్సు గల ఐశ్వర్యభ్రష్టుడైన రావణునివద్దకు వెళ్ళి, నా మాటగా ఆతనితో ఇట్లు చెప్పుము. 61

మూ. ఋషీణాం దేవతానాం చ గన్ధర్వాప్సరసాం తథా, 62
నాగానామథ యక్షాణాం రాజ్ఞాం చ రజనీచర,
యచ్చ పాపం కృతం మోహాదవలిప్తేన రాక్షస, 63
నూనం తే విగతో దర్పః స్వయంభూవరదానజః,
తస్య పాపస్య సంప్రాప్తా వ్యుష్టిరద్య దురాసదా. 64

ప్ర. అ. రజనీచర= రాక్షసుడా! ఋషీణామ్=ఋషులకు, దేవతానామ్=దేవతలకు, తథా=మరియు, గన్ధర్వాప్సరసామ్=గంధర్వులకు అప్సరసలకు, నాగానామ్=నాగులకు, అథ=మరియు, యక్షాణామ్=యక్షులకు, రాజ్ఞాం చ=రాజులకు, మోహాత్=అజ్ఞానమువలన, అవలిప్తేన=గర్వితుడవైన నీచేత, యత్=ఏ, పాపమ్=పాపము, కృతమ్=చేయబడినదో, తస్య=ఆ, పాపస్య=పాపముయొక్క, దురాసదా=పొందశక్యము కాని (భరింపశక్యము కాని), వ్యుష్టిః=ఫలానుభవము, అద్య=ఇప్పుడు, సంప్రాప్తా=వచ్చినది. నూనమ్=నిశ్చయముగా, తే=నీయొక్క, స్వయంభూవరదానజః=బ్రహ్మయొక్క వరదానమువలన కలిగిన, దర్పః=గర్వము, విగతః=పోయినది (పోనున్నది).

తా. "ఓ! రావణా! ఋషులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, యక్షులు, రాజులు వీరి విషయమున నీవు మదాంధుడవై చేసిన పాపమునకు భరింపరాని ఫలము ఇప్పుడు ప్రాప్తించనున్నది. బ్రహ్మదేవు డిచ్చిన వరములవలన కలిగిన నీ గర్వమంతా నశించే సమయము ఆసన్నమైనది."

మూ. తస్య దణ్డధరస్తేఽహం దారాహరణకర్శితః,
దణ్డం ధారయమాణస్తు లఙ్కాద్వారే వ్యవస్థితః. 65

ప్ర. అ. దారాహరణకర్శితః=భార్యను అపహరించుటచేత పీడింపబడిన, అహమ్=నేను, తస్య=అట్టి, తే=నీకు, దణ్డధరః=దండమును విధించువాడను. దణ్డమ్=దండమును, ధారయమాణః=ధరించుచు, లఙ్కాద్వారే=లంకాద్వారము నందు, వ్యవస్థితః=నిలిచి ఉన్నాను.

తా. "భార్యను హరించుటద్వారా పీడ కలిగింపబడిన నేను అట్టి నీకు దండమును విధించువాడను. నీకు దండమును విధించుటకై లంకాద్వారమునందు నిలిచి ఉన్నాను." 65

మూ. పదవీం దేవతానాం చ మహర్షీణాం చ రాక్షస,
రాజర్షీణాం చ సర్వేషాం గమిష్యసి మయా హతః. 66

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా! మయా=నాచేత, హతః=చంపబడిన వాడవై, దేవతానాం చ=దేవతలయొక్క, మహర్షీణాం చ=మహర్షులయొక్క, సర్వేషామ్=సమస్తమైన, రాజర్షీణాం చ=రాజర్షులయొక్క, పదవీమ్=మార్గమును, గమిష్యసి=పొందగలవు.

తా. "ఓ! రాక్షసుడా! నాచేత చంపబడి నీవు దేవతలు, మహర్షులు, రాజర్షులు ఏ మూలమున ఏ మార్గమును(మరణమును) పొందిరో ఆ మార్గమున పోయెదవు." 66

మూ. బలేన యేన వై సీతాం మాయయా రాక్షసాధమ,
మామతిక్రామయిత్వా త్వం హృతవాంస్తద్విదర్శయ. 67

ప్ర. అ. రాక్షసాధమ=రాక్షసాధముడా! త్వమ్=నీవు, యేన=ఏ, బలేన=బలముచేత, మాయయా=మాయచేత, మామ్=నన్ను, అతిక్రామయిత్వా=దూరముచేసి, సీతామ్=సీతను, హృతవాన్=హరించినావో, తత్=దానిని, విదర్శయ=చూపుము.

తా. "ఓ! రాక్షసాధమా! నీవు ఏ బలమును చూపుకొని మాయచేత నన్ను దూరము చేసి సీతను హరించినావో ఆ బలమును చూపుము." 67

మూ. అరాక్షసమిమం లోకం కర్తాస్మి నిశితైః శరైః,
న చేచ్ఛరణమభ్యేషి తామాదాయ తు మైథిలీమ్. 68

ప్ర. అ. తామ్=ఆ, మైథిలీమ్=సీతను, ఆదాయ=గ్రహించి (తీసికొని వచ్చి), శరణమ్=శరణమును, న అభ్యేషి యది=పొందక పోయినచో, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, ఇమమ్=ఈ, లోకమ్=లోకమును, అరాక్షసమ్=రాక్షసులు లేని దానినిగా, కర్తాస్మి=చేయగలను.

తా. "నీవు సీతను అప్పగించి శరణు వేడకపోయినచో వాడియైన బాణములచేత ఈ లోకములో ఎక్కడా రాక్షసులు లేకుండా చేసెదను". 68

మూ. ధర్మాత్మా రాక్షసశ్రేష్ఠః సంప్రాప్తోఽయం విభీషణః,
లఙ్కైశ్వర్యమిదం శ్రీమాన్ ధ్రువం ప్రాప్నోత్యకణ్టకమ్. 69

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడు, రాక్షసశ్రేష్ఠః=రాక్షసశ్రేష్ఠుడు అయిన, అయం విభీషణః=ఈ విభీషణుడు, సంప్రాప్తః=నన్ను చేరినాడు. శ్రీమాన్=శ్రీమంతుడైన, ఇతడు, ధ్రువమ్=నిశ్చయముగా, అకణ్టకమ్=ఏ శత్రుబాధయును లేని, ఇదమ్=ఈ, లఙ్కైశ్వర్యమ్=లంకారాజ్యమును, ప్రాప్నోతి=పొందును.

తా. "ధర్మాత్ముడు, రాక్షసశ్రేష్ఠుడు అయిన విభీషణుడు నన్ను చేరినాడు. శ్రీమంతుడైన ఇతడు ఏ శత్రుబాధాదికములు లేని లంకాధిపత్యమును పొందగలడు." 69

మూ. న హి రాజ్యమధర్మేణ భోక్తుం క్షణమపి త్వయా,
శక్యం మూర్ఖసహాయేన పాపేనావిదితాత్మనా. 70

ప్ర. అ. మూర్ఖసహాయేన=మూర్ఖులైన అనుచరులు గలవాడవు, పాపేన=పాపాత్ముడవు, అవిదితాత్మనా=వశములో లేని మనస్సు కలవాడవు అయిన, త్వయా=నీచేత, క్షణమపి=క్షణకాలమైనను, రాజ్యమ్=రాజ్యము, అధర్మేణ=అధర్మముచేత, భోక్తుమ్=అనుభవించుటకు, న శక్యం హి=శక్యము కాదు కదా ?

తా. "మూర్ఖులైన మంత్రులు మొదలైన సహాయులు గల, పాపాత్ముడవు, ఆత్మనిగ్రహము లేనివాడవు అయిన నీవు ఇంక క్షణకాలము కూడ అధర్మమార్గమునందు ఈ రాజ్యమును అనుభవించజాలవు." 70

మూ. యుధ్యస్వ వా ధృతిం కృత్వా శౌర్యమాలమ్బ్య రాక్షస,
మచ్ఛరైస్త్వం రణే శాన్తస్తతః శాన్తో భవిష్యసి. 71

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! వా=లేదా, ధృతిమ్=ధైర్యమును, కృత్వా=చేసి, శౌర్యమ్=శౌర్యమును, ఆలమ్బ్య=అవలంబించి, యుధ్యస్వ=యుద్ధముచేయుము. త్వమ్=నీవు, రణే=యుద్ధమునందు, మచ్ఛరైః=నా బాణములచేత, శాన్తః=మరణించినవాడవై, తతః=అటుపిమ్మట, శాన్తః=శాంతుడవు, భవిష్యసి=కాగలవు.

తా. "ఓ ! రాక్షసుడా ! లేదా నీవు ధైర్యముతో శౌర్యమును అవలంబించి యుద్ధము చేయుము. యుద్ధములో నా బాణములచేత చంపబడి శాంతి పొందెదవు". 71

మూ. యద్యావిశసి లోకాంస్త్రీన్ పక్షీ భూత్వా నిశాచర,
మమ చక్షుఃపథం ప్రాప్య న జీవన్ ప్రతియాస్యసి. 72

ప్ర. అ. నిశాచర=రాక్షసుడా ! మమ=నాయొక్క, చక్షుఃపథమ్=నేత్ర మార్గమును, ప్రాప్య=పొంది, పక్షీ=పక్షివిగా, భూత్వా=అయి, త్రీన్=మూడు, లోకాన్=లోకములను, ఆవిశసి=ప్రవేశించినను, జీవన్=జీవించి, న ప్రతియాస్యసి=తిరిగి వెళ్లవు.

తా. "ఓ ! రాక్షసుడా ! పక్షిరూపము ధరించి మూడు లోకములలో ప్రవేశించినను నీవు నా కంట బడిన పిమ్మట తిరిగి వెళ్లజాలవు." 72

మూ. బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతామౌర్ధ్వదైహికమ్,
సుదృష్టా క్రియతాం లఙ్కా జీవితం తే మయి స్థితమ్. 73

ప్ర. అ. త్వామ్=నిన్నుగూర్చి, హితమ్=హితమైన, వాక్యమ్=వాక్యమును, బ్రవీమి=చెప్పుచున్నాను. ఔర్ధ్వదైహికమ్=పరలోకమునకు సంబంధించిన కర్మ, క్రియతామ్=చేయబడుగాక. లఙ్కా=లంక, సుదృష్టా=బాగుగా చూడబడినదిగా, క్రియతామ్=చేయబడుగాక. తే జీవితమ్=నీ జీవితము, మయి=నాయందు, స్థితమ్=ఉన్నది.

తా. "నీకు హితమైన వాక్యము చెప్పుచున్నాను - పరలోకమునకు ఉపకరించు శ్రాద్ధాదికమును చేసికొనుము. లంకను చివరిసారిగా బాగా చూచుకొనుము. నీ ప్రాణములు నా చేతిలో ఉన్నవి." 73

మూ. ఇత్యుక్తః స తు తారేయో రామేణాక్లిష్టకర్మణా,
జగామాకాశమావిశ్య మూర్తిమానివ హవ్యవాట్. 74

ప్ర. అ. అక్లిష్టకర్మణా=శ్రమపడకుండగా పనులు చేయు, రామేణ=రాముని చేత, ఇతి=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, తారేయః=అంగదుడు, మూర్తిమాన్=శరీరము గల, హవ్యవాట్ ఇవ=అగ్నిదేవుడు వలె, ఆకాశమ్=ఆకాశమును, ఆవిశ్య=ప్రవేశించి, జగామ=వెళ్లెను.

తా. శ్రమపడకుండగా పనులు చేయు సమర్థుడైన రాముడు చెప్పిన మాటలు విని తారాకుమారుడైన అంగదుడు శరీరము ధరించిన అగ్నిదేవుడు వలె ఆకాశములో ప్రవేశించి వెళ్లెను. 74

మూ. సోఽతిపత్య ముహూర్తేన శ్రీమాన్ రావణమన్దిరమ్,
దదర్శాసీనమవ్యగ్రం రావణం సచివైః సహ. 75

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, సః=ఆ అంగదుడు, ముహూర్తేన=ముహూర్తకాలములో, రావణమన్దిరమ్=రావణుని గృహమును, అతిపత్య=చేరి, సచివైః సహ=మంత్రులతో కూడ, ఆసీనమ్=కూర్చొని ఉన్న, రావణమ్=రావణుని, అవ్యగ్రమ్=భయము లేకుండగా, దదర్శ=చూచెను.

తా. శ్రీమంతుడైన అంగదుడు క్షణకాలములో రావణుని భవనమును చేరి మంత్రులతో కూడి కూర్చొని ఉన్న రావణుణ్ణి ఏమాత్రము భయము లేనివాడై చూచెను. 75

మూ. తతస్తస్యావిదూరేణ నిపత్య హరిపుఙ్గవః,
దీప్తాగ్నిసదృశస్తస్థావఙ్గదః కనకాఙ్గదః. 76

ప్ర. అ. తతః=అటు పిమ్మట, హరిపుఙ్గవః=వానరశ్రేష్ఠుడు, దీప్తాగ్ని సదృశః=మండుచున్న అగ్నితో సమానుడు, కనకాఙ్గదః=బంగారు బాహుపురులు కలవాడు అయిన, అఙ్గదః =అంగదుడు, తస్య = వానికి, అవిదూరేణ = సమీపమున, నిపత్య =దిగి, తస్థౌ =నిలబడెను.

తా. పిమ్మట మండుచున్న అగ్ని వలె ఉన్న, బంగారు బాహుపురులు గల వానరశ్రేష్ఠుడైన అంగదుడు ఆ రావణునికి దగ్గరగా దిగి నిలబడెను. 76

మూ. తద్రామవచనం సర్వమన్యూనాధికముత్తమమ్,
సామాత్యం శ్రావయామాస నివేద్యాత్మానమాత్మనా. 77

ప్ర. అ. ఆత్మానమ్=తనను, ఆత్మనా =తనచేత, నివేద్య=తెలిపి, తత్ =ఆ, ఉత్తమమ్ = ఉత్తమమైన, సర్వమ్ =సమస్తమైన, రామవచనమ్ =రాముని వచనమును, అన్యూనాధికమ్ =తక్కువ కాకుండగా, అధికము కాకుండగా, సామాత్యమ్= మంత్రులతో కూడిన ఆ రావణుని, శ్రావయామాస =వినిపించెను.

తా. అతడు తనను గూర్చి తానే వారికి తెలిపి, ఉత్తమమైన ఆ రామసందేశమును అంతయూ ఉన్నదున్నట్లుగా, ఎక్కువ గాని, తక్కువ గాని కాకుండా మంత్రిసమేతుడైన ఆ రావణునకు తెలిపెను. 77

మూ. దూతోఽహం కోశలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః,
వాలిపుత్రోఽఙ్గదో నామ యది తే శ్రోత్రమాగతః. 78

ప్ర. అ. వాలిపుత్రః=వాలిపుత్రుడైన, అఙ్గదో నామ=అంగదుడను పేరు గల, అహమ్=నేను, కోశలేన్ద్రస్య=కోశలదేశరాజు, అక్లిష్టకర్మణః=శ్రమపడకుండగా పనులు చేయువాడు అయిన, రామస్య=రామునియొక్క, దూతః=దూతను. తే=నీయొక్క, శ్రోత్రమ్=చెవిని, ఆగతః యది=పొందితివా?

తా. నేను వాలిపుత్రుడనైన అంగదుడను. శ్రమపడకుండా పనులు చేయు కోశలాధిపతియైన రాముని దూతను. నీవు విని యుండవచ్చును. 78

మూ. ఆహ త్వాం రాఘవో రామః కౌసల్యానన్దవర్ధనః,
నిష్పత్య ప్రతియుధ్యస్వ నృశంస పురుషో భవ. 79

ప్ర. అ. రాఘవః=రఘువంశసంజాతుడు, కౌసల్యానన్దవర్ధనః= కౌసల్య యొక్క ఆనందమును వృద్ధి పొందించువాడూ అయిన, రామః=రాముడు, త్వామ్=నిన్నుగూర్చి, ఆహ=చెప్పుచున్నాడు. నృశంస=క్రూరుడా ! నిష్పత్య=బైటకు వచ్చి, యుధ్యస్వ=యుద్ధము చేయుము. పురుషః=పురుషుడవు, భవ=అగుము.

తా. రఘువంశసంభూతుడు, కౌసల్యకు ఆనందమును వృద్ధి పొందించువాడు అయిన రాముడు నీతో ఇట్లు చెప్పుచున్నాడు - "ఓ! క్రూరుడా ! నీవు బైటకు వచ్చి యుద్ధము చేయుము. పౌరుషమును చూపుము."

మూ. హత్వాఽస్మి త్వాం సహామాత్యం సపుత్రజ్ఞాతిబాన్ధవమ్,
నిరుద్విగ్నాస్త్రయో లోకా భవిష్యన్తి హతే త్వయి. 80

ప్ర. అ. సహామాత్యమ్=అమాత్యులతో కూడిన వాడవు, సపుత్రజ్ఞాతిబాన్ధవమ్=పుత్రాదులతోను, జ్ఞాతులతోను, బంధువులతోను కూడిన వాడవు అయిన, త్వామ్ =నిన్ను, హత్వాఽస్మి=చంపగలను. త్వయి=నీవు, హతే=చంపబడినవాడ వగుచుండగా, త్రయః=మూడు, లోకాః=లోకములు, నిరుద్విగ్నాః=భయపడనివి, భవిష్యన్తి=కాగలవు.

తా. "నిన్ను, నీ అమాత్యులను, పుత్రులను, జ్ఞాతులను, బంధువులను చంపివేసెదను. నీవు మరణించిన పిదప మూడు లోకములు భయము లేకుండ ఉండగలవు." 80

మూ. దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్,
శత్రుమద్యోద్ధరిష్యామి త్వామృషీణాం చ కణ్టకమ్. 81

ప్ర. అ. దేవదానవయక్షాణామ్=దేవతలకు, దానవులకు, యక్షులకు, గన్ధర్వోరగరక్షసామ్=గంధర్వులకు, ఉరగులకు, రాక్షసులకు, శత్రుమ్= శత్రువూ, ఋషీణామ్=ఋషులకు, కణ్టకం చ=ముల్లువంటి వాడవు అయిన, త్వామ్=నిన్ను, అద్య=ఇప్పుడు, ఉద్ధరిష్యామి=పెరికివేయుగలను.

తా. "దేవ - దానవ - యక్ష - గంధర్వ - ఉరగ - రాక్షసులకు శత్రువు, ఋషులకు బాధ కలిగించువాడవు అయిన నిన్ను ఇప్పుడు నశింపచేసెదను." 81

మూ. విభీషణస్య చైశ్వర్యం భవిష్యతి హతే త్వయి,
న చేత్సత్కృత్య వైదేహీం ప్రణిపత్య ప్రదాస్యసి. 82

ప్ర. అ. ప్రణిపత్య=నమస్కరించి, వైదేహీమ్=సీతను, సత్కృత్య=సత్కరించి, న ప్రదాస్యసి చేత్=(నీవు) ఇవ్వకపోయినట్లయితే, త్వయి=నీవు, హతే=చంపబడినవాడవగుచుండగా, ఐశ్వర్యమ్=ఐశ్వర్యము, విభీషణస్య=విభీషణు నిదిగా, భవిష్యతి=కాగలదు.

తా. "నీవు నమస్కరించి సత్కారపూర్వకముగా సీతను అప్పగించ

కపోయినచో నీవు చంపబడగలవు. అప్పుడు నీ ఐశ్వర్యము విభీషణునికి చెందగలదు."

మూ. ఇత్యేవం పరుషం వాక్యం బ్రువాణే హరిపుఙ్గవే,
అమర్షవశమాపన్నో నిశాచరగణేశ్వరః. 83

ప్ర. అ. హరిపుఙ్గవే=ఆ వానరశ్రేష్ఠుడు, ఇత్యేవమ్=ఇట్లు, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, బ్రువాణే=పలుకుచుండగా, నిశాచరగణేశ్వరః=రాక్షసగణమునకు ప్రభువైన ఆ రావణుడు, అమర్షవశమ్=కోపవశమును, ఆపన్నః=పొందినవాడు.

తా. వానరశ్రేష్ఠుడైన అంగదు డిట్లు పరుషముగా మాటలాడుచుండగా అది విని రావణుడు కోపమునకు వశుడయ్యెను. 83

మూ. తతః స రోషమాపన్నః శశాస సచివాంస్తదా,
గృహ్యతామితి దుర్మేధా వధ్యతామితి చాసకృత్. 84

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రోషమ్=కోపమును, ఆపన్నః=పొందిన, సః=ఆతడు, తదా =అప్పుడు, సచివాన్ =మంత్రులను, అసకృత్ =మాటిమాటికి, శశాస =శాసించెను, దుర్మేధాః =చెడ్డబుద్ధి గల ఇతడు, గృహ్యతామ్ = గ్రహించబడుగాక, వధ్యతామ్ =చంపబడుగాక; ఇతి =ఇట్లు.

తా. పిమ్మట రోషావిష్టుడైన రావణుడు "ఈ దుర్బుద్ధిని పట్టుకొనండి, చంపండి" అని మాటిమాటికి మంత్రులను ఆజ్ఞాపించెను. 84

మూ. రావణస్య వచః శ్రుత్వా దీప్తాగ్నిమివ తేజసా,
జగృహుస్తం తతో ఘోరాశ్చత్వారో రజనీచరాః. 85

ప్ర. అ. తతః =అటు పిమ్మట, ఘోరాః =భయంకరులైన, చత్వారః = నలుగురు, రజనీచరాః = రాక్షసులు, రావణస్య =రావణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా =విని, తేజసా =తేజస్సుచేత, దీప్తాగ్నిమివ =ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న, తమ్ =ఆతనిని, జగృహుః =పట్టుకొనిరి.

తా. అప్పుడు రావణుని మాటలు విని భయంకరులైన నలుగురు రాక్షసులు మండుచున్న అగ్ని వలె ఉన్న ఆ అంగదుని పట్టుకొనిరి. 85

మూ. గ్రాహయామాస తారేయః స్వయమాత్మానమాత్మవాన్,
బలం దర్శయితుం వీరో యాతుధానగణే తదా. 86

ప్ర. అ. తదా =అప్పుడు, ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, వీరః =వీరుడైన, తారేయః =తారాపుత్రుడు, యాతుధానగణే = రాక్షసుల గణమునందు,

బలమ్ = తన బలమును, దర్శయితుమ్ = చూపించుటకొరకు, స్వయమ్ = స్వయముగానే, ఆత్మానమ్ = తనను, గ్రాహయామాస = గ్రహింపచేసెను.

తా. అప్పుడు బుద్ధిమంతుడు, వీరుడూ అయిన అంగదుడు ఆ రాక్షసుల సముదాయమునందు తన బలమును చూపుటకు తనంతట తానే పట్టుబడెను. 86

మూ. స తాన్ బాహుద్వయాసక్తానాదాయ పతగానివ,
ప్రాసాదం శైలసంకాశముత్పపాతాఙ్గదస్తదా. 87

ప్ర. అ. తదా = అప్పుడు, సః అఙ్గదః = ఆ అంగదుడు, బాహుద్వయాసక్తాన్ = రెండు చేతులకు తగుల్కొని ఉన్న, తాన్ = వాళ్లను, పతగానివ = పక్షులను వలె, ఆదాయ = గ్రహించి, శైలసంకాశమ్ = పర్వతముతో సమానమైన, ప్రాసాదమ్ = ప్రాసాదమును గూర్చి, ఉత్పపాత = ఎగిరెను.

తా. అప్పుడా అంగదుడు తన బాహువులమీదనుండి, వ్రేలాడుచున్న ఆ రాక్షసులను పక్షులను వలె గ్రహించి పర్వతము వలె ఉన్న ప్రాసాదముమీదికి ఎగిరెను. 87

మూ. తస్యోత్పతనవేగేన నిర్ధూతాస్తత్ర రాక్షసాః,
భూమౌ నిపతితాః సర్వే రాక్షసేన్ద్రస్య పశ్యతః. 88

ప్ర. అ. సర్వే = సమస్తమైన, రాక్షసాః = రాక్షసులు, రాక్షసేన్ద్రస్య = రావణుడు, పశ్యతః = చూచుచుండగానే, తస్య = అతనియొక్క, ఉత్పతనవేగేన = ఎగురుటయొక్క వేగము చేత, నిర్ధూతాః = దులిపివేయబడినవారై, తత్ర = అక్కడ, భూమౌ = నేలమీద, నిపతితాః = పడిరి.

తా. అంగదుడు పైకి ఎగిరే వేగముచేత దులిపివేయబడినవారై ఆ రాక్షసులు నలుగురూ రావణుడు చూచుచుండగానే అక్కడ నేలమీద పడిపోయిరి. 88

మూ. తతః ప్రాసాదశిఖరం శైలశృఙ్గమివోన్నతమ్,
చక్రామ రాక్షసేన్ద్రస్య వాలిపుత్రః ప్రతాపవాన్. 89

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, వాలిపుత్రః = అంగదుడు, రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, శైలశృఙ్గమివ = పర్వతశిఖరము వలె, ఉన్నతమ్ = ఉన్నతమైన, ప్రాసాదశిఖరమ్ = ప్రాసాదము అగ్రభాగమును, చక్రామ = ఎక్కెను.

తా. పిమ్మట ప్రతాపవంతుడైన అంగదుడు రావణుని పర్వతశిఖరము వలె ఉన్నతమైన ప్రాసాదము అగ్రభాగముమీదికి ఎక్కెను. 89

మూ. పఫాల చ తదాక్రాన్తం దశగ్రీవస్య పశ్యతః,
పురా హిమవతః శృఙ్గం వజ్రేణేవ విదారితమ్. 90

ప్ర. అ. తదాక్రాన్తమ్ =అంగదునిచేత ఆక్రమించబడిన ఆ ప్రాసాద శిఖరము, పురా = పూర్వము, వజ్రేణ =వజ్రముచేత, విదారితమ్ =బ్రద్దలు కొట్టబడిన, హిమవతః శృఙ్గమివ =హిమవత్పర్వతశిఖరము వలె, దశగ్రీవస్య =రావణుడు, పశ్యతః =చూచుచుండగానే, పఫాల చ = బ్రద్దలైపోయెను.

తా. అంగదుడు ఎక్కగానే ఆ ప్రాసాదశిఖరము, పూర్వము వజ్రాయుధము చేత బ్రద్దలుకొట్టబడిన హిమవత్పర్వతశిఖరము వలె, రావణుడు చూచుచుండగానే, బ్రద్దలైపోయెను. 90

మూ. భఙ్క్త్వా ప్రాసాదశిఖరం నామ విశ్రావ్య చాత్మనః,
వినద్య సుమహానాదముత్పపాత విహాయసా. 91

ప్ర. అ. ప్రాసాదశిఖరమ్=ప్రాసాదముయొక్క శిఖరమును, భఙ్క్త్వా =విరచి, ఆత్మనః =తనయొక్క, నామ =పేరును, విశ్రావ్య =వినిపించి, సుమహానాదమ్ = చాల గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినద్య =ధ్వనిచేసి, విహాయసా =ఆకాశముచేత, ఉత్పపాత =ఎగిరెను.

తా. అంగదుడు ప్రాసాదశిఖరమును విరుగగొట్టి, తన పేరును చాటి, ఎక్కువ ధ్వని కలుగునట్లుగా అరచి, ఆకాశమార్గమున ఎగిరివెళ్లెను. 91

మూ. వ్యథయన్ రాక్షసాన్ సర్వాన్ హర్షయంశ్చాపి వానరాన్,
స వానరాణాం మధ్యే తు రామపార్శ్వముపాగతః. 92

ప్ర. అ. సః =అతడు, సర్వాన్ =సమస్తమైన, రాక్షసాన్ =రాక్షసులను, వ్యథయన్ =బాధకలిగించుచు, వానరాన్ =వానరులను, హర్షయం శ్చాపి =సంతోషపెట్టుచు, వానరాణామ్ =వానరులయొక్క, మధ్యే =మధ్యయందు, రామపార్శ్వమ్ =రాముని పార్శ్వమును, ఉపాగతః =పొందినాడు.

తా. అంగదుడు రాక్షసు లందరికీ బాధ కలిగించుచు, వానరులకు ఆనందము కలిగించుచు, వానరుల మధ్యలో ఉన్న రాముని సమీపమునకు వెళ్లెను. 92

మూ. రావణస్తు పరం చక్రే క్రోధం ప్రాసాదధర్షణాత్,
వినాశం చాత్మనః పశ్యన్నిఃశ్వాసపరమోఽభవత్. 93

ప్ర. అ. రావణస్తు =రావణుడైతే, ప్రాసాదధర్షణాత్ =ప్రాసాదమును చెడగొట్టుటవలన, పరమ్ =అధికమైన, క్రోధమ్ = క్రోధమును, చక్రే

=చేసెను. ఆత్మనః = తనయొక్క, వినాశమ్ =వినాశమును, పశ్యన్ =చూచుచు, నిశ్వాసపరమః = నిట్టూర్పులు అధికముగా కలవాడు, అభవత్ =అయ్యెను.

తా. తన ప్రాసాదమును ఆ విధముగా ఆక్రమించుట వలన రావణునకు చాల కోపము వచ్చెను. అతడు తన వినాశము ఆసన్నమైన దని ఊహించుకొని ఎక్కువ నిట్టూర్పులు విడచెను. 93

మూ. రామస్తు బహుభిర్హృష్టైర్వినదద్భిః ప్లవఙ్గమైః,
వృతో రిపువధాకాఙ్క్షీ యుద్ధాయైవాభివర్తత. 94

ప్ర. అ. రామస్తు =రాముడైతే, హృష్టైః =సంతోషించిన, వినదద్భిః = అరచుచున్న, బహుభిః =అనేకులైన, ప్లవఙ్గమైః =వానరులతో, వృతః =కూడిన వాడై, రిపువధాకాఙ్క్షీ=శత్రువధమును కోరుచు, యుద్ధాయైవ=యుద్ధముకొరకే, అభివర్తత = అభిముఖుడై ఉండెను.

తా. సంతోషముతో ధ్వనిచేయుచున్న అనేకవానరులతో కూడిన రాముడు శత్రువును చంపవలె నని కోరుచు యుద్ధమునకే సన్నద్ధుడై ఉండెను.

మూ. సుషేణస్తు మహావీర్యో గిరికూటోపమో హరిః,
బహుభిః సంవృతస్తత్ర వానరైః కామరూపిభిః. 95

ప్ర. అ. మహావీర్యః =గొప్పపరాక్రమము గల, గిరికూటోపమః = పర్వతశిఖరమువంటి, హరిః =వానరుడైన, సుషేణస్తు =సుషేణుడైతే, తత్ర =అక్కడ, కామరూపిభిః = కామరూపము గల, బహుభిః = అనేకులైన, వానరైః = వానరులతో, సంవృతః = కూడినవాడై ఉండెను.

తా. గొప్ప పరాక్రమము గలవాడు, పర్వతశిఖరమువంటి ఆకారము గలవాడు అయిన సుషేణుడు స్వేచ్ఛానుసారము రూపము ధరించ గల చాలమంది వానరులతో కూడి అక్కడ ఉండెను. 95

మూ. స తు ద్వారాణి సంయమ్య సుగ్రీవవచనాత్కపిః,
పర్యక్రామత దుర్ధర్షో నక్షత్రాణీవ చన్ద్రమాః. 96

ప్ర. అ. దుర్ధర్షః = ఎదిరింప శక్యము కాని, సః కపిః = ఆ వానరుడు, సుగ్రీవవచనాత్ =సుగ్రీవుని వచనమువలన, ద్వారాణి =ద్వారములను, సంయమ్య =అడ్డగించి, చన్ద్రమాః =చంద్రుడు, నక్షత్రాణీవ =నక్షత్రములను వలె, పర్యక్రామత =సంచరించెను.

తా. ఎదిరింప శక్యము కాని ఆ సుషేణుడు సుగ్రీవుని వచనము ప్రకారము ద్వారముల నన్నింటిని అడ్డగించి, చంద్రుడు ఆ యా రాశులలో

సంచరించినట్లు సంచరించుచుండెను. 96

మూ. తేషామక్షౌహిణీశతం సమవేక్ష్య వనౌకసామ్,
లఙ్కాముపనివిష్టానాం సాగరం చాభివర్తతామ్. 97
రాక్షసా విస్మయం జగ్ముస్త్రాసం జగ్ముస్తథా పరే,
అపరే సమరే హర్షా ద్ధర్షమేవోపపేదిరే. 98

ప్ర. అ. లఙ్కామ్ ఉపనివిష్టానామ్ = లంక దగ్గర నిలచి ఉన్నవారు, సాగరం చ = సముద్రమును, అభివర్తతామ్=సమీపించి ఉన్నవారు అయిన, తేషామ్ = ఆ, వనౌకసామ్ = వానరులయొక్క, అక్షౌహిణీశతమ్ =అక్షౌహిణుల శతమును, సమవేక్ష్య =చూచి, రాక్షసాః = రాక్షసులు, విస్మయమ్ =ఆశ్చర్యమును, జగ్ముః =పొందిరి. తథా =మరియు, అపరే =మరికొందరు, త్రాసమ్ =భయమును, జగ్ముః = పొందిరి. అపరే =మరి కొందరు, సమరే =యుద్ధమునందు, హర్షాత్ =ఉత్సాహమువలన, హర్షమేవ = సంతోషమునే, ఉపపేదిరే =పొందిరి.

తా. లంక సమీపమున విడిసి ఉన్న, సముద్రము వైపున ఉన్న వానరుల అనేక అక్షౌహిణులను చూచి కొందరు రాక్షసులు ఆశ్చర్యపడిరి. కొందరు భయపడిరి. కొందరు యుద్ధమునందు ఉత్సాహము కలవారగుటచేత సంతోషించిరి. 97, 98

మూ. కృత్స్నం హి కపిభిర్వ్యాప్తం ప్రాకారపరిఖాన్తరమ్,
దదృశూ రాక్షసా దీనాః ప్రాకారం వానరీకృతమ్, 99
హాహాకారమకుర్వన్త రాక్షసా భయమాగతాః.

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, దీనాః=దీనులై, కపిభిః=వానరులచేత, వ్యాప్తమ్=వ్యాపింపబడిన, కృత్స్నమ్= సమస్తమైన, ప్రాకారపరిఖాన్తరమ్= ప్రాకారపరిఖల మధ్యభాగమును, వానరీకృతమ్=వానరులుగా చేయబడిన, ప్రాకారమ్=ప్రాకారమునుగా, దదృశుః=చూచిరి. రాక్షసాః=రాక్షసులు, భయమ్=భయమును, ఆగతాః=పొందినవారై, హాహాకారమ్=హాహాకారమును, అకుర్వన్త=చేసిరి.

తా. దీనులైన రాక్షసులు ప్రాకారమునకు అగడ్తకు మధ్య నున్న ప్రదేశమంతా వానరులచే ఆక్రమింపబడి వానరు లనే ప్రాకారము కట్టబడినట్లు ఉండుట చూచిరి. రాక్షసులు భయముతో హాహాకారము చేసిరి. 99

మూ. తస్మిన్ మహాభీషణకే ప్రవృత్తే
కోలాహలే రాక్షసరాజధాన్యామ్,

ప్రగృహ్య రక్షాంసి మహాయుధాని
యుగాన్తవాతా ఇవ సంచేరుః. 100

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకనవత్యధికశతతమః సర్గః

ప్ర. అ. మహాభీషణకే=చాల భయంకరమైన, తస్మిన్=ఆ, కోలాహలే=కోలాహలము, ప్రవృత్తే=ప్రారంభించిన దగుచుండగా, రాక్షసరాజధాన్యామ్=రాక్షసుల రాజధానియందు, రక్షాంసి= రాక్షసులు, మహాయుధాని=గొప్ప ఆయుధములను, ప్రగృహ్య=గ్రహించి, యుగాన్తవాతాః ఇవ=ప్రళయకాలవాయువులు వలె, సంచేరుః=సంచరించిరి.

తా. చాల భయంకరమైన ఆ కోలాహలము ప్రారంభము అయిన వెంటనే లంకలో, రాక్షసులు గొప్ప ఆయుధములు ధరించి ప్రళయకాలఝంఝామారుతముల వలె సంచరించిరి. 100

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

[వానరులు లంకను ఆక్రమించుట, రాక్షసులతో యుద్ధము చేయుట.]

మూ. తతస్తే రాక్షసాస్తత్ర గత్వా రావణమన్దిరమ్,
న్యవేదయన్ పురీం రుద్ధాం రామేణ సహ వానరైః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడనున్న, రాక్షసాః=రాక్షసులు, రావణమన్దిరమ్=రావణుని గృహమును గూర్చి, గత్వా=వెళ్లి, వానరైః సహ=వానరులతో కూడిన, రామేణ=రామునిచేత, పురీమ్=పట్టణమును, రుద్ధామ్=ముట్టడింపబడినదానినిగా, న్యవేదయన్=తెలిపిరి.

తా. పిమ్మట అక్కడ నున్న రాక్షసులు రావణుని ఇంటికి వెళ్లి వానరులతో కూడిన రాముడు లంకను ముట్టడించినాడు అని చెప్పిరి. 1

మూ. రుద్ధాం తు నగరీం శ్రుత్వా జాతక్రోధో నిశాచరః,
విధానం ద్విగుణం కృత్వా ప్రాసాదం చాప్యరోహత. 2

ప్ర. అ. నిశాచరః=రావణుడు, నగరీమ్=పట్టణమును, రుద్ధామ్=ముట్టడింపబడినదానినిగా, శ్రుత్వా=విని, జాతక్రోధః=పుట్టిన కోపముగలవాడై, ద్విగుణమ్=రెండు రెట్లు, విధానమ్=ఏర్పాటును, కృత్వా=చేసి, ప్రాసాదమ్=ప్రాసాదమును, ఆరోహత చ=ఎక్కెను కూడ.

తా. నగరము ముట్టడింపబడిన దని విని రావణుడు రెట్టింపు ఏర్పాట్లు చేసి ప్రాసాదము పైకి ఎక్కెను. 2

మూ. స దదర్శ వృతాం లఙ్కాం సశైలవనకాననామ్,
అసంఖ్యేయైర్హరిగణైః సర్వతో యుద్ధకాఙ్క్షిభిః. 3

ప్ర. అ. సః=అతడు, యుద్ధకాఙ్క్షిభిః=యుద్ధమును కోరుచున్న, అసంఖ్యేయైః=లెక్కింప శక్యము కాని, హరిగణైః=వానరగణములచేత, సర్వతః=అన్నివైపులా, వృతామ్=కప్పబడిన, సశైలవనకాననామ్=శైలములతోను, వనములతోను, అడవులతోను కూడిన, లఙ్కామ్=లంకను, దదర్శ=చూచెను.

తా. ఆ రావణుడు లెక్కింప శక్యము కాని, యుద్ధమును కోరుచున్న వానరసముదాయములచేత అన్నివైపులా చుట్టుముట్టబడిన, శైల-వన-అరణ్యసహితమైన లంకను చూచెను. 3

మూ. స దృష్ట్వా వానరైః సర్వైర్వసుధాం కపిలీకృతామ్,
కథం క్షపయితవ్యాః స్యురితి చిన్తాపరోఽభవత్. 4

ప్ర. అ. సః=అతడు, సర్వైః=సమస్తమైన, వానరైః=వానరులచేత, కపిలీకృతామ్=కపిలవర్ణము కలదిగా చేయబడిన, వసుధామ్=భూమిని, దృష్ట్వా=చూచి, కథమ్=ఎట్లు, క్షపయితవ్యాః=నశింపచేయదగినవాళ్లు, స్యుః=అగుదురు, ఇతి=అని, చిన్తాపరః= చింతయందు తగుల్కొన్నవాడు, అభవత్=అయెను.

తా. రావణుడు ఆ వానరులందరు కప్పివేయుటచేత కపిలవర్ణముతో (పసుపుపచ్చగా) ఉన్న భూమిని చూచి, వీళ్లని నశింప వేయుట ఎట్లా అని ఆలోచనలో మునిగెను. 4

మూ. స చిన్తయిత్వా సుచిరం ధైర్యమాలమ్బ్య రావణః,
రాఘవం హరియూథాంశ్చ దదర్శాయతలోచనః. 5

ప్ర. అ. సః=ఆ రావణుడు, సుచిరమ్=చాలకాలము, చిన్తయిత్వా=ఆలోచించి, ధైర్యమ్=ధైర్యమును, ఆలమ్బ్య=అవలంబించి, ఆయతలోచనః=(ఆశ్చర్యముచేత) విశాలములైన నేత్రములు కలవాడై, రాఘవమ్=రాముణ్ణి, హరియూథాంశ్చ=వానరసైన్యములను, దదర్శ= చూచెను.

తా. ఆ రావణుడు చాల సేపు ఆలోచించి, ధైర్యము అవలంబించి, ఆశ్చర్యముచేత వికసించిన నేత్రములతో రాముణ్ణి, వానరసైన్యములను చూచెను.

మూ. రాఘవః సహ సైన్యేన ముదితో నామ పుప్లువే,
లఙ్కాం దదర్శ గుప్తాం వై సర్వతో రాక్షసైర్వృతామ్. 6

ప్ర. అ. రాఘవః=రాముడు, సహ సైన్యేన=సైన్యముతో కూడ, ముదితః=సంతోషించినవాడై, పుప్లువే నామ=ఎగిరెను (పూర్వమున్న స్థానమునుండి ముందుకు శీఘ్రముగా వెళ్లెను). సర్వతః=అన్నివైపులా, రాక్షసైః=రాక్షసులచేత, వృతామ్=ఆవరించబడిన, గుప్తామ్=రక్షింపబడిన, లఙ్కామ్=లంకను, దదర్శ=చూచెను.

తా. రాముడు సంతోషించుచు సైన్యముతో కూడ కొంచెము ముందుకు శీఘ్రముగా వెళ్లెను. అంతటా నిండి ఉన్న రాక్షసులచేత రక్షింపబడుచున్న లంకను చూచెను. 6

మూ. దృష్ట్వా దాశరథిర్లఙ్కాం చిత్రధ్వజపతాకినీమ్,
జగామ మనసా సీతాం దూయమానేన చేతసా. 7

ప్ర. అ. దాశరథిః=రాముడు, చిత్రధ్వజపతాకినీమ్=చిత్రములైన ధ్వజములు పతాకలు గల (రాజచిహ్నములున్న జెండాలు ధ్వజములు; చిహ్నములేవీ లేని అలంకారార్థమై కట్టే జండాలు పతాకలు), లఙ్కామ్=లంకను, దృష్ట్వా=చూచి, దూయమానేన=దుఃఖించుచున్న, చేతసా= చిత్తముతో, మనసా=మనస్సుచేత,

సీతామ్=సీతను; జగామ=పొందెను.

తా. విచిత్రములైన ధ్వజములు, పతాకలు గల లంకను చూచి రాముడు దుఃఖించుచున్న మనస్సుతో సీతను స్మరించెను. 7

మూ. అత్ర హా మృగశాబాక్షీ మత్కృతే జనకాత్మజా,
పీడ్యతే శోకసంతప్తా కృశా స్థణ్డిలశాయినీ. 8

ప్ర. అ. మృగశాబాక్షీ=లేడిపిల్ల కన్నుల వంటి కన్నులు గల, హా జనకాత్మజా=ఆ సీత, మత్కృతే=నా నిమిత్తమై, శోకసంతప్తా=శోకముచేత తపింప చేయబడినదై, స్థణ్డిలశాయినీ= నేలమీద శయనించుచున్నదై, కృశా=కృశించినదై, అత్ర=ఇక్కడ, పీడ్యతే=పీడింపబడుచున్నది.

తా. లేడిపిల్ల కండ్లవంటి కండ్లు గల ఆ సీత శోకముతో బాధపడుచు, కృశించి, నేలమీద శయనించుచు నా కొరకే పీడింపబడుచున్నది కదా! 8

మూ. నిపీడ్యమానాం ధర్మాత్మా వైదేహీమనుచిన్తయన్,
క్షిప్రమాజ్ఞాపయద్రామో వానరాన్ ద్విషతాం వధే. 9

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, నిపీడ్యమానామ్=బాధింపబడుచున్న, వైదేహీమ్=సీతను గూర్చి, అనుచిన్తయన్=ఆలోచించుచు, క్షిప్రమ్= శీఘ్రముగా, ద్విషతామ్=శత్రువులయొక్క, వధే=వధయందు, వాన రాన్=వానరులను, అజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను.

తా. ధర్మాత్ముడైన రాముడు బాధింపబడుచున్న సీతనుగూర్చి స్మరించుచు శత్రువులను సంహరించుటకై వానరులను వెంటనే ఆజ్ఞాపించెను. 9

మూ. ఏవముక్తే తు వచసి రామేణాక్లిష్టకర్మణా,
సంఘర్షమాణాః ప్లవగాః సింహనాదై రపూరయన్. 10

ప్ర. అ. అక్లిష్టకర్మణా=శ్రమపడకుండగా పనులు చేయు, రామేణ=రాముని చేత, ఏవమ్=ఇట్లు, వచసి=వచనము, ఉక్తే సతి=పలుకబడినదగుచుండగా, ప్లవగాః=వానరులు, సంఘర్షమాణాః=పోటీపడుచున్నవారై, సింహనాదైః=సింహనా దములచేత, అపూరయన్=నింపిరి.

తా. శ్రమపడకుండా కార్యములను సాధించు రాముని మాటలు విని వానరులు ఒకరితో ఒకరు పోటీపడుచు దిక్కులను సింహనాదములతో నింపిరి.

మూ. శిఖరైర్వికిరామైనాం లజ్కాం ముష్టిభిరేవ వా,
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరియూథపాః. 11

ప్ర. అ. ఏతాం లఙ్కామ్=ఈ లంకను, శిఖరైః=శిఖరములచేత గాని, ముష్టిభిరేవ వా=పిడికిళ్లచేతగాని, వికరామః=చిమ్మివేసెదము; ఇతి=అని, సర్వే=సమస్తమైన, హరియూథపాః=వానరసేనానాయకులు, మనాంసి=మనస్సులను, దధిరే=ధరించిరి.

తా. "ఈ లంకపై పర్వతశిఖరములను వర్షించెదము; లేదా పిడికిళ్లతో బ్రద్దలు కొట్టెదము" అని ఆ వానరనాయకులు మనస్సులలో తలచిరి. 11

మూ. ఉద్యమ్య గిరిశృఙ్గాణి మహాన్తి శిఖరాణి చ,
తరూంశ్చోత్పాట్య వివిధాంస్తిష్ఠన్తి హరియూథపాః. 12

ప్ర. అ. హరియూథపాః=వానరసేనానాయకులు, గిరిశృఙ్గాణి=పర్వతశిఖరములను, ఉద్యమ్య=ఎత్తి, మహాన్తి=గొప్పవైన, శిఖరాణి చ=శిఖరములను, వివిధాన్=అనేకవిధములైన, తరూంశ్చ=వృక్షములను, ఉత్పాట్య=పెకలించి, తిష్ఠన్తి=నిలచిరి.

తా. వానరసేనానాయకులు పర్వతశిఖరములను ఎత్తి, పెద్ద శిఖరములను, అనేకవిధములైన వృక్షములను పెకలించి యుద్ధసన్నద్ధులై నిలచి ఉండిరి. 12

మూ. ప్రేక్షతో రాక్షసేన్ద్రస్య తాన్యనీకాని భాగశః,
రాఘవప్రియకామార్థం లఙ్కామారురుహుస్తదా. 13

ప్ర. అ. తదా=అప్పుడు, తాని అనీకాని=ఆ సైన్యములు, భాగశః=గుంపులు గుంపులుగా ఏర్పడి, రాక్షసేన్ద్రస్య=రావణుడు, ప్రేక్షతః=చూచుచుండగానే, రాఘవప్రియకామార్థమ్=రామునకు ప్రియమును చేయు కోరికతో, లఙ్కామ్=లంకను, ఆరురుహుః=ఎక్కినవి.

తా. ఆ వానరసైన్యములు గుంపులు గుంపులుగా ఏర్పడి, రావణుడు చూచుచుండగానే, రామునకు సంతోషము కలిగింపవలె నను కోరికతో లంకను ఎక్కినవి. 13

మూ. తే తామ్రవక్త్రా హేమాభా రామార్థే త్యక్తజీవితాః,
లఙ్కామేవాభ్యవర్తన్త సాలభూధరయోధినః. 14

ప్ర. అ. తామ్రవక్త్రాః=ఎఱ్ఱని ముఖములు గలవారు, హేమాభాః=బంగారము వంటి కాంతి గలవారు, సాలభూధరయోధినః=వృక్షములతోను పర్వతములతోను యుద్ధము చేయువారు అయిన, తే=ఆ వానరులు, రామార్థే=రామునినిమిత్తమై, త్యక్తజీవితాః=విడువబడిన జీవితము గలవారై, లఙ్కామేవ=లంకను గూర్చియే, అభ్యవర్తన్త=వెళ్లిరి.

తా. ఎఱ్ఱని ముఖములు, బంగారు శరీరచ్ఛాయ గల ఆ వానరులు

రాముని కొరకై జీవితములను విడచుటకు ఉద్యుక్తులై వృక్షములను పర్వతములను ఆయుధములనుగా తీసికొని లంకవైపు వెళ్లిరి. 14

మూ. తే ద్రుమైః పర్వతాగ్రైశ్చ ముష్టిభిశ్చ ప్లవంగమాః,
ప్రాకారాగ్రాణ్యసంఖ్యాని మమన్థుస్తోరణాని చ. 15

ప్ర. అ. తే ప్లవంగమాః=ఆ వానరులు, ద్రుమైః=వృక్షములచేత, పర్వతాగ్రైః=పర్వతశిఖరములచేత, ముష్టిభిశ్చ=పిడికిళ్లచేత, అసంఖ్యాని=లెక్కలేనన్ని, ప్రాకారాగ్రాణి=ప్రాకారాగ్రములను, తోరణాని చ=ముఖద్వారములను, మమన్థుః=మథించిరి.

తా. ఆ వానరులు వృక్షములచేత, పర్వతశిఖరములచేత, పిడికిళ్ల చేత అనేకములైన ప్రాకారశిఖరములను, ముఖద్వారములను పడగొట్టిరి. 15

మూ. పరిఘాః పూరయన్తి స్మ ప్రసన్నసలిలాయుతాః,
పాంసుభిః పర్వతాగ్రైశ్చ తృణైః కాష్ఠైశ్చ వానరాః. 16

ప్ర. అ. వానరాః=వానరులు, ప్రసన్నసలిలాయుతాః=నిర్మలమైన ఉదకముతో కూడిన, పరిఘాః=పరిఖలను, పాంసుభిః=పరాగములచేత, పర్వతాగ్రైః చ=పర్వతశిఖరములచేత, తృణైః=తృణములచేత, కాష్ఠైశ్చ=కట్టెలచేత, పూరయన్తి స్మ=నింపిరి.

తా. వానరులు నిర్మలమైన ఉదకముతో నిండిన పరిఖలను, మట్టి, పర్వతశిఖరములు, గడ్డి, కట్టెలు వేసి నింపివేసిరి. 16

మూ. తతః సహస్రయూథాశ్చ కోటియూథాశ్చ యూథపాః,
కోటియూథశతాశ్చాన్యే లఙ్కామారురుహుస్తదా. 17

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సహస్రయూథాశ్చ=వేయి యూథములు గలవారు (కొంతమంది సైనికుల సమూహమునకు యూథ మని పేరు), కోటియూథాశ్చ=కోటి యూథములు కలవారు, కోటియూథశతాశ్చ=కోటి యూథముల శతములు గలవారు అయిన, యూథపాః=యూథనాయకులు, అన్యే చ=ఇతరులు, లఙ్కామ్=లంకను, ఆరురుహుః=ఎక్కిరి.

మూ. అప్పుడు వేయి యూథములు గల యూథనాయకులు, కోటి యూథములు గలవారు, వందకోట్ల యూథములు కలవారు, లంకమీదకు దండెత్తిరి. 17

మూ. కాఞ్చనాని ప్రమర్దన్తస్తోరణాని ప్లవంగమాః,
కైలాసశిఖరాభాణి గోపురాణి ప్రమథ్య చ. 18

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, కాఞ్చనాని=బంగారము వికారమైన, తోరణాని= ముఖద్వారములను, ప్రమర్దన్తః=విరుగగొట్టుచు, శైలాపశిఖరాభాణి=శైలా పశిఖరము వంటి కాంతి గల, గోపురాణి= గోపురములను, ప్రమథ్య చ =పడగొట్టి (లంకను ఆక్రమించిరి).

తా. వానరులు బంగారు ముఖద్వారములను విరుగగొట్టుచు, శైలాప శిఖరముల వంటి గోపురములను పడగొట్టుచు లంకను ఆక్రమించిరి. 18

మూ. ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవంగమాః,
లఙ్కాం తామభిధావన్తి మహావారణసంనిభాః. 19

ప్ర. అ. మహావారణసంనిభాః=మహాగజములతో సమానులైన, ప్లవం గమాః=వానరులు, ఆప్లవన్తః=ఎగురుచు, ప్లవన్తశ్చ=దుముకుచు, గర్జన్తశ్చ=గర్జిం చుచు, తామ్= ఆ, లఙ్కామ్=లంకను గూర్చి, అభిధావన్తి=పరుగెత్తిరి.

తా. మహాగజములవంటి ఆ వానరులు ఎగురుచు, దుముకుచు, గర్జించుచు ఆ లంక వైపు పరుగెత్తిరి. 19

మూ. జయత్యురుబలో రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. 20
ఇత్యేవం ఘోషయన్తశ్చ గర్జన్తశ్చ ప్లవంగమాః,
అభ్యధావన్త లఙ్కాయాః ప్రాకారం కామరూపిణః. 21

ప్ర. అ. కామరూపిణః=స్వేచ్ఛారూపము గల, ప్లవంగమాః=వానరులు, ఉరుబలః= గొప్ప బలము గల, రామః=రాముడు, జయతి=సర్వోత్కర్షగా ఉన్నాడు. మహాబలః= గొప్పబలము గల, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు కూడ, సర్వోత్కర్షగా ఉన్నాడు. రాఘవేణ=రామునిచేత, అభిపాలితః=పాలింపబడిన, రాజా=రాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, జయతి= సర్వోత్కర్షగా ఉన్నాడు. ఇత్యేవమ్=ఇట్లు, ఘోష యన్తశ్చ=ఘోషించుచు, గర్జన్తశ్చ= గర్జించుచు, లఙ్కాయాః=లంకయొక్క, ప్రాకా రమ్=ప్రాకారమును గూర్చి, అభ్యధావన్త=పరుగెత్తిరి.

తా. కోరిన రూపములు ధరించగలిగిన ఆ వానరులు "గొప్ప బలము గల రాముడు సర్వోత్కర్షగా ఉన్నాడు; మహాబలశాలియైన లక్ష్మణుడు, రామునిచేత రక్షింపబడుచున్న రాజైన సుగ్రీవుడు సర్వోత్కర్షగా ఉన్నారు" అని ఘోషించుచు, గర్జించుచు లంకాప్రాకారమువైపు పరుగెత్తిరి. 20, 21

మూ. వీరబాహుః సుబాహుశ్చ నలశ్చ పనసస్తథా,
నిపీడ్యోపనివిష్టాస్తే ప్రాకారం హరియూథపాః. 22
ఏతస్మిన్నన్తరే చక్రుః స్కన్ధావారనివేశనమ్.

ప్ర. అ. వీరబాహుః=వీరబాహువు, సుబాహుశ్చ=సుబాహువు, నలశ్చ=నలుడు, తథా=మరియు, పనసః=పనసుడు, తే=ఆ, హరియూథపాః=వానరసేనానాయకులు, ప్రాకారమ్=ప్రాకారమును, నిపీడ్య=పీడించి, ఉపనివిష్టాః=సమీపమునందు నిలిచి ఉండిరి. ఏతస్మిన్ అన్తరే=ఇంతలో, స్కన్ధావారనివేశనమ్=సైన్యము మోహరింపును, చక్రుః=చేసిరి.

తా. వీరబాహువు, సుబాహువు, నలుడు, పనసుడు అను వానరనాయకులు లంకాప్రాకారమును ఆక్రమించి ఉండిరి. ఇంతలో సైన్యమును మోహరించిరి.22

మూ. పూర్వద్వారం తు కుముదః కోటిభిర్దశభిర్వృతః, 23
ఆవృత్య బలవాంస్తస్థౌ హరిభిర్జితకాశిభిః.

ప్ర. అ. బలవాన్=బలవంతుడైన, కుముదః=కుముదుడు, జితకాశిభిః=జయముతో ప్రకాశించు, కోటిభిః=కోటిమంది, హరిభిః=వానరులతో, వృతః=కూడినవాడై, పూర్వద్వారమ్=తూర్పుద్వారమును (ఆగ్నేయభాగమును), ఆవృత్య=ఆవరించి, తస్థౌ=నిలచెను. (వీరాదులు తూర్పుద్వారము మొదలైనవాటి వద్ద నిలచినట్లు వెనుక చెప్పబడినది గాన ఈ శ్లోకాలలో తూర్పు మొదలైనవాటికి ఆగ్నేయాదులని అర్థము అని వ్యాఖ్యాతలు వ్రాసినారు).

తా. బలవంతుడైన కుముదుడు, జయశీలురైన కోటిమంది వానరులతో కూడి తూర్పుద్వారమును (ఆగ్నేయభాగమును) అడ్డగించుచు నిలచెను. 23

మూ. సహాయార్థే తు తస్యైవ నివిష్టః ప్రసభో హరిః, 24
పనసశ్చ మహాబాహుర్వానరై రభిసంవృతః.

ప్ర. అ. ప్రసభః హరిః=ప్రసభుడను వానరుడు, వానరైః=వానరులతో, అభిసంవృతః= కూడిన, మహాబాహుః=గొప్పబాహువులు గల, పనసశ్చ=పనసుడు, తస్యైవ= అతనియొక్కయే, సహాయార్థే=సాహాయ్యము కొరకు, నివిష్టః=నిలచి ఉండెను.

తా. ఆ కుముదునకు సాహాయ్యము చేయుటకై ప్రసభుడు, మహాబాహువైన పనసుడు వానరులతో కలిసి నిలిచి ఉండిరి. 24

మూ. దక్షిణద్వారమాసాద్య వీరః శతబలిః కపిః, 25
ఆవృత్య బలవాంస్తస్థౌ వింశత్యా కోటిభిర్వృతః.

ప్ర. అ. వీరః=వీరుడైన, బలవాన్=బలవంతుడైన, శతబలిః కపిః=శతబలి అను వానరుడు, వింశత్యా=ఇరవై, కోటిభిః=కోట్లతో, వృతః=కూడినవాడై, దక్షిణద్వారమ్=దక్షిణద్వారమును నైరృతిభాగమును, ఆసాద్య=సమీపించి, ఆవృత్య=దానిని ఆవరించి, తస్థౌ=నిలచెను.

తా. వీరుడు బలవంతుడూ అయిన శతబలి ఇరవైకోట్ల మంది వానరులతో కలిసి దక్షిణద్వారమును నైరృతిభాగమును అడ్డుకొని నిలబడెను.25

మూ. సుషేణః పశ్చిమద్వారం గత్వా తారాపితా హరిః, 26
ఆవృత్య బలవాంస్తస్థౌ కోటికోటిభిరావృతః.

ప్ర. అ. తారాపితా=తారతండ్రి, బలవాన్=బలవంతుడైన, సుషేణః=సుషేణుడను, హరిః=వానరుడు, పశ్చిమద్వారమ్=పశ్చిమద్వారమును గూర్చి, గత్వా=వెళ్లి, కోటికోటిభిః=కోటికోట్లతో, ఆవృతః=కూడినవాడై, ఆవృత్య=ఆవరించి, తస్థౌ=ఉండెను.

తా. బలవంతుడు, తారతండ్రీ అయిన సుషేణుడు నైరృతిద్వారమును కోటికోట్ల వానరులతో కూడి వెళ్లి ఆక్రమించెను. 26

మూ. ఉత్తరద్వారమాగమ్య రామః సౌమిత్రిణా సహ, 27
ఆవృత్య బలవాంస్తస్థౌ సుగ్రీవశ్చ హరీశ్వరః.

ప్ర. అ. సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడిన, రామః=రాముడు, బలవాన్= బలవంతుడు, హరీశ్వరః=వానరప్రభువు అయిన, సుగ్రీవశ్చ=సుగ్రీవుడు, ఉత్తరద్వారమ్= ఉత్తరద్వారమును, ఆగమ్య=పొంది, ఆవృత్య=అడ్డగించి, తస్థౌ=నిలచెను.

తా. లక్ష్మణసహితుడైన రాముడు, వానరనాయకుడైన సుగ్రీవుడు ఉత్తరద్వారము చేరి, దానిని అడ్డగించి నిలచిరి. 27

మూ. ఋక్షాణాం భీమకోపానాం ధూమ్రః శత్రునిబర్హణః, 28
వృతః కోట్యా మహావీర్యస్తస్థౌ రామస్య పార్శ్వతః.

ప్ర. అ. శత్రునిబర్హణః=శత్రుసంహారకుడైన, మహావీర్యః=గొప్పపరాక్రమము గల, ధూమ్రః=ధూమ్రుడు, భీమకోపానామ్=భయంకరమైన కోపము గల, ఋక్షాణామ్= భల్లూకములయొక్క, కోట్యా=కోటితో, వృతః=కూడినవాడై, రామస్య=రామునియొక్క, పార్శ్వతః=పార్శ్వమునందు, తస్థౌ=నిలచెను.

తా. శత్రుసంహారకుడు, మహాపరాక్రమవంతుడు అయిన ధూమ్రుడు భయంకరమైన కోపముగల కోటి భల్లూకములతో రాముని ప్రక్కనే నిలచెను.28

మూ. సంనద్ధస్తు మహావీర్యో గదాపాణిర్విభీషణః, 29
వృతో యత్తైస్తు సచివైస్తస్థౌ యత్ర మహాబలః.

ప్ర. అ. మహావీర్యః=గొప్పపరాక్రమము గల, విభీషణః=విభీషణుడు, గదాపాణిః= గద హస్తమునందు గలవాడై, సంనద్ధః=సంసిద్ధుడై, యత్తైః=సంసి

ద్యుతిన, సచివైః=మంత్రులతో, వృతః=కూడినవాడై, మహాబలః=గొప్పబలము గల రాముడు, యత్ర=ఎక్కడ ఉండెనో అక్కడ, తస్థౌ=నిలిచెను.

తా. గొప్ప పరాక్రమము గల విభీషణుడు, గద హస్తమునందు ధరించి, యుద్ధసంనద్ధుడై, యుద్ధమునకు సంసిద్ధులుగా ఉన్న మంత్రులతో కూడి, మహాబలశాలియైన రాముడు ఉన్న ప్రదేశమునందే నిలిచెను. 29

మూ. గజో గవాక్షో గవయః శరభో గన్ధమాదనః, 30
సమన్తాత్ పరిధావన్తో రరక్షుర్హరివాహినీమ్.

ప్ర. అ. గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, గవయః=గవయుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, సమన్తాత్=అన్ని వైపులా, పరిధావన్తః=పరుగెత్తుచు, హరివాహినీమ్=వానరసేనను, రరక్షుః=రక్షించిరి.

తా. గజ - గవాక్ష - గవయ - శరభ - గంధమాదనులు అన్ని వైపులా తిరుగుచు వానరసైన్యమును రక్షించిరి. 30

మూ. తతః కోపపరీతాత్మా రావణో రాక్షసేశ్వరః, 31
నిర్యాణం సర్వసైన్యానాం ద్రుతమాజ్ఞాపయత్తదా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, కోపపరీతాత్మా=కోపముతో నిండిన మనస్సు కలవాడై, తదా=అప్పుడు, ద్రుతమ్=శీఘ్రముగా, సర్వసైన్యానామ్=సకలసైన్యములయొక్క, నిర్యాణమ్=బయల్వెడలుటను, ఆజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను.

తా. పిమ్మట రాక్షసరాజైన రావణుడు కోపముతో నిండిన మనస్సుతో అప్పుడు వెంటనే సర్వసైన్యములు యుద్ధమునకై బయల్వెడలవలెనని ఆజ్ఞాపించెను.

మూ. ఏతచ్ఛ్రుత్వా తదా వాక్యం రావణస్య ముఖేరితమ్, 32
సహసా భీమనిర్ఘోషముద్ఘుష్టం రజనీచరైః.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, ముఖేరితమ్=ముఖముచేత ఉచ్చరించబడిన, ఏతత్ వాక్యమ్=ఈ వాక్యమును, శ్రుత్వా=విని, తదా=అప్పుడు, రజనీచరైః=రాక్షసులచేత, సహసా=వెంటనే, భీమనిర్ఘోషమ్=భయంకరమైన ధ్వని కలుగునట్లుగా, ఉద్ఘుష్టమ్=ధ్వని చేయుట.

తా. రావణుని ముఖమునుండి ఆ మాటలు వెలువడగానే అప్పుడు రాక్షసులు వెంటనే భయంకరములైన ధ్వనులు కలుగునట్లు సింహనాదములు చేసిరి. 32

మూ. తతః ప్రబోధితా భేర్యశ్చన్ద్రపాణ్డురపుష్కరాః, 33
హేమకోణైరభిహతా రాక్షసానాం సమన్తతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సమన్తతః=అన్నివైపులా, రాక్షసానామ్=రాక్షసులయొక్క (చేత), హేమకోణైః=బంగారు దండముల అగ్రములచేత, అభిహతాః=కొట్టబడిన, చన్ద్రపాణ్డురపుష్కరాః=చంద్రుడు వలె తెల్లనైన పుష్కరములు గల (మృదంగము మొదలైన వాద్యముల ముఖమునకు పుష్కర మని పేరు), భేర్యః=భేరులు, ప్రబోధితాః=మేల్కొలుపబడినవి.

తా. పిమ్మట అన్నివైపులనుండి రాక్షసులు బంగారుదండముల అగ్రములచేత కొట్టుచు చంద్రుడు వలె తెల్లనైన పుష్కరములు గల భేరులను ప్రయోగించిరి. 33

మూ. వినేదుశ్చ మహాఘోషాః శఙ్ఖాః శతసహస్రశః, 34
రాక్షసానాం సుఘోరాణాం ముఖమారుతపూరితాః.

ప్ర. అ. సుఘోరాణామ్=చాలభయంకరులైన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, ముఖమారుతపూరితాః=ముఖవాయువుచేత నింపబడిన, మహాఘోషాః=గొప్ప ధ్వని గల, శతసహస్రశః=వందలకొలది వేలకొలది, శఙ్ఖాః=శంఖములు, వినేదుశ్చ=ధ్వని చేసినవి.

తా. భయంకరులైన రాక్షసుల ముఖవాయువులచేత నింపబడినవై, వందలకొలది, వేలకొలది శంఖములు గొప్ప ఘోషముతో ధ్వని చేసినవి. 34

మూ. తే బభుః శుభనీలాఙ్గాః సశఙ్ఖా రజనీచరాః, 35
విద్యున్మణ్డలసంనద్ధాః సబలాకా ఇవామ్బుదాః.

ప్ర. అ. శుభనీలాఙ్గాః=సుందరమైన నల్లని శరీరములు గల, సశఙ్ఖాః=శంఖములతో కూడిన, రజనీచరాః=రాక్షసులు, విద్యున్మణ్డలసంనద్ధాః=మెరుపుల మండలములతో చుట్టబడిన, సబలాకాః=కొంగలతో కూడిన, అమ్బుదాః ఇవ=మేఘముల వలె, బభుః=ప్రకాశించిరి.

తా. శంఖములు చేతులలో ధరించి ఉన్న, అందమైన నల్లని శరీరములు గల రాక్షసులు, మెరుపుల మండలముచే చుట్టబడిన, కొంగలతో కూడిన మేఘముల వలె ఉండిరి. 35

మూ. నిష్పతన్తి తతః సైన్యా హృష్టా రావణచోదితాః, 36
సమయే పూర్యమాణస్య వేగా ఇవ మహోదధేః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణచోదితాః=రావణునిచేత ప్రేరేపింపబడిన, సైన్యాః=సైనికులు, హృష్టాః=సంతోషించినవారై, సమయే=ప్రళయ సమయమునందు, పూర్యమాణస్య=నింపబడుచున్న, మహోదధేః=మహాసముద్రము యొక్క, పూర్యమాణస్య=పూరింపబడుచుండగా, వేగాః ఇవ=జలవేగములు వలె,

విసృతమై=బైటకువచ్చుచున్నారు(వచ్చిరి).

తా. అప్పుడు రావణునిచేత ప్రేరేపింపబడిన సైనికులు సంతోషించుచు ప్రళయకాలములో నిండిపోవుచున్న సముద్రపు జలప్రవాహముల వలె బయలుదేరిరి.

మూ. తతో వానరసైన్యేన ముక్తో నాదః సమన్తతః, 37
మలయః పూరితో యేన ససానుప్రస్థకన్దరః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, యేన=దేనిచేత, ససానుప్రస్థకన్దరః=చరియలతోను, బాళ్లతోను, గుహలతోను కూడిన, మలయః=మలయపర్వతము, పూరితః=నింపబడినదో, అట్టి, నాదః=ధ్వని, సమన్తతః=అంతటా, వానరసైన్యేన=వానరుల సైన్యముచేత, ముక్తః=విడువబడినది.

తా. పిమ్మట వానరసైన్యము అన్నిప్రదేశములందు వేసిన ధ్వని చరియలతోను, విశాలశిలలతోను, గుహలతోను కూడిన మలయపర్వతమును నింపివేసినది. 37

మూ. శఙ్ఖదున్దుభినిర్ఘోషః సింహనాదస్తరస్వినామ్, 38
పృథివీం చాన్తరిక్షం చ సాగరం చాభ్యనాదయత్.

ప్ర. అ. తరస్వినామ్=బలవంతులైన ఆ రాక్షసులయొక్క, శఙ్ఖదున్దుభినిర్ఘోషః=శంఖములయొక్క దుందుభులయొక్క ధ్వని, సింహనాదః=(వానరుల) సింహనాదము, పృథివీమ్=భూమిని, అన్తరిక్షం చ=ఆకాశమును, సాగరం చ=సాగరమును, అభ్యనాదయత్=ధ్వనింపచేసెను.

తా. బలవంతులైన ఆ రాక్షసుల శంఖధ్వని, దుందుభిధ్వని, వానరుల సింహనాదము భూమ్యాకాశసముద్రములను ధ్వనింపచేసెను. 38

మూ. గజానాం బృంహితైః సార్ధం హయానాం హేషితైరపి, 39
రథానాం నేమినిర్ఘోషై రక్షసాం పదనిఃస్వనైః.

ప్ర. అ. గజానామ్=ఏనుగులయొక్క, బృంహితైః సార్ధమ్=ఘీంకారములతోను, హయానామ్=అశ్వములయొక్క, హేషితైరపి=సకిలింపులతోను, రథానామ్=రథములయొక్క, నేమినిర్ఘోషైః=చక్రాంతముల ధ్వనులతోను, రక్షసామ్=రాక్షసులయొక్క, పదనిఃస్వనైః=పాదధ్వనులతోను (శంఖాదిధ్వని భూమ్యాదులందు వ్యాపించెను).

తా. గజముల ఘీంకారములతోను, గుఱ్ఱముల సకిలింపులతోను, రథచక్రధ్వనులతోను, రాక్షసుల పాదధ్వనులతోను కలిసి శంఖాదిధ్వని భూమ్యాకాశాదులందు వ్యాపించెను. 39

మూ. ఏతస్మిన్నన్తరే ఘోరః సంగ్రామః సమపద్యత, 40
రక్షసాం వానరాణాం చ యథా దేవాసురే పురా.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఇంతలో, రక్షసామ్=రాక్షసులకు, వానరాణాం చ= వానరులకు, పురా=పూర్వము, దేవాసురే యథా=దేవాసురయుద్ధమునందువలె, ఘోరః= ఘోరమైన, సంగ్రామః=యుద్ధము, సమపద్యత=జరిగెను.

తా. ఇంతలో, పూర్వము దేవాసురుల మధ్య జరిగినట్లు, రాక్షసుల వానరుల మధ్య ఘోరమైన యుద్ధము జరిగెను. 40

మూ. తే గదాభిః ప్రదీప్తాభిః శక్తిశూలపరశ్వధైః 41
నిజఘ్నుర్వానరాన్ సర్వాన్ కథయన్తః స్వవిక్రమాన్.

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, స్వవిక్రమాన్=తమపరాక్రమములను, కథయన్తః=చెప్పుచు, ప్రదీప్తాభిః= ప్రకాశించుచున్న, గదాభిః=గదలచేత, శక్తిశూలపరశ్వధైః=శక్తులచేత, శూలములచేత, గొడ్డళ్ళచేత, సర్వాన్= సమస్తమైన, వానరాన్=వానరులను, నిజఘ్నుః=కొట్టిరి.

తా. ఆ రాక్షసులు తమ పరాక్రమమును గూర్చి చెప్పుచు వానరులను ప్రకాశించుచున్న గదలతోను, శక్తులతోను, శూలములతోను, గండ్రగొడ్డళ్ళతోను కొట్టిరి. 41

మూ. తతో వృక్షైర్మహాకాయాః పర్వతాగ్రైశ్చ వానరాః, 42
నిజఘ్నుస్తాని రక్షాంసి నఖైర్దన్తైశ్చ వేగినః,
రాజా జయతి సుగ్రీవ ఇతి శబ్దో మహానభూత్. 43

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాకాయాః=పెద్ద శరీరములు గల, వానరాః= వానరులు, వేగినః=వేగము గలవారై, వృక్షైః=వృక్షములతోను, పర్వతాగ్రైశ్చ= పర్వతశిఖరములతోను, నఖైః=గోళ్ళతోను, దన్తైశ్చ=దంతములతోను, తాని రక్షాంసి=ఆ రాక్షసులను, నిజఘ్నుః=కొట్టిరి. రాజా=రాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, జయతి= సర్వోత్కృష్టుగా ఉన్నాడు, ఇతి=అని, మహాన్=గొప్ప, శబ్దః=శబ్దము, అభూత్= అయెను.

తా. పిమ్మట పెద్ద శరీరములు గల వానరులు వేగముగా ఆ రాక్షసులను వృక్షములతోను, పర్వతశిఖరములతోను కొట్టిరి. "రాజైన సుగ్రీవుడు సర్వోత్కృష్టుగా ఉన్నాడు" అను గొప్ప ధ్వని కూడ అక్కడ వ్యాపించెను. 42 - 43

మూ. రాజన్ జయ జయేత్యుక్త్వా స్వస్వనామకథాం తతః,
రాక్షసాస్త్వపరే భీమాః ప్రాకారస్థా మహీం గతాన్, 44
వానరాన్ భిన్దిపాలైశ్చ శూలైశ్చైవ వ్యదారయన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భీమాః=భయంకరులైన, అపరే=మరికొందరు, రాక్షసాస్తు=రాక్షసులైతే, రాజన్=రాజా! జయ జయ=జయింతువు జయింతువు, ఇతి=అని, ఉక్త్వా=పలికి, స్వస్వనామకథామ్=తమ తమ పేరును చెప్పటను చేయుచు, ప్రాకారస్థాః=ప్రాకారముమీద ఉన్నవారై, మహీమ్=భూమిని, గతాన్=పొందిన, వానరాన్=వానరులను, భిన్దిపాలైశ్చ=భిందిపాలములచేత, శూలైశ్చైవ=శూలములచేత, వ్యదారయన్=చీల్చిరి.

తా. భయంకరులైన మరి కొందరు రాక్షసులు ప్రాకారముపైన ఉండి "రాజా! నీకు జయము కలుగుగాక, జయము కలుగుగాక" అని పలుకుచు, తమ తమ పేర్లు చెప్పుచు, నేలమీద ఉన్న వానరులను భిందిపాలములతోను, శూలములతోను చీల్చిరి. 44

మూ. వానరాశ్చాపి సంక్రుద్ధాః ప్రాకారస్థాన్ మహీం గతాః, 45
రాక్షసాన్ పాతయామాసుః ఖమాప్లుత్య స్వబాహుభిః.

ప్ర. అ. మహీం గతాః=భూమిని పొందిన, వానరాశ్చాపి=వానరులు కూడ, సంక్రుద్ధాః=కోపించినవారై, ఖమ్=ఆకాశమును గూర్చి, ఆప్లుత్య=ఎగిరి, స్వబాహుభిః=తమ బాహువులచేత, ప్రాకారస్థాన్=ప్రాకారముపై నున్న, రాక్షసాన్=రాక్షసులను, పాతయామాసుః=పడద్రోసిరి.

తా. నేలమీద ఉన్న వానరులు కోపించి, ఆకాశములోనికి ఎగిరి, ప్రాకారముమీద ఉన్న రాక్షసులను తమ బాహువులతో లాగి క్రింద పడద్రోసిరి.

మూ. స సంప్రహారస్తుములో మాంసశోణితకర్దమః, 46
రక్షసాం వానరాణాం చ సంబభూవాద్భుతోపమః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులయొక్క, వానరాణాం చ=వానరుల యొక్క, సః=ఆ, మాంసశోణితకర్దమః=రక్తమాంసము లను బురద గల, తుములః=వ్యాకులమైన, సంప్రహారః=యుద్ధము, అద్భుతోపమః=ఆశ్చర్యకరము, సంబభూవ=అయెను.

తా. ఆ రాక్షసవానరుల మధ్య జరిగిన, మాంసరక్తము లను బురదతో నిండిన ఆ వ్యాకులమైన యుద్ధము ఆశ్చర్యకరముగా ఉండెను. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిచత్వారింశః సర్గః

(ద్వంద్వయుద్ధములో వానరులు రాక్షసులను ఓడించుట.)

మూ. యుధ్యతాం తు తతస్తేషాం వానరాణాం మహాత్మనామ్,
రక్షసాం సమ్బభూవాథ బలరోషః సుదారుణః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మనామ్=గొప్పబుద్ధిగల, తేషాం వానరాణామ్=ఆ వానరులు, రక్షసాం చ=రాక్షసులు, యుధ్యతామ్=యుద్ధము చేయుచుండగా, అథ=అటుపిమ్మట, సుదారుణః=చాల భయంకరమైన, బలరోషః=సైన్యమునందు రోషము, సంబభూవ=కలిగెను.

తా. పిమ్మట ఆ మహాత్ములైన వానరులు రాక్షసులు యుద్ధము చేయుచుండగా సైన్యమునందు, చాలా భయంకరమైన రోషావేశము కలిగెను.

మూ. తే హయైః కాఞ్చనాపీడైర్గజైశ్చాగ్నిశిఖోపమైః,
రథైశ్చాదిత్యసంకాశైః కవచైశ్చ మనోరమైః. 2
నిర్యయూ రాక్షసవ్యాఘ్రా నాదయన్తో దిశో దశ,
రాక్షసా భీమకర్మాణో రావణస్య జయైషిణః. 3

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, జయైషిణః=జయమును కోరుచున్న, రాక్షసవ్యాఘ్రాః=రాక్షసశ్రేష్ఠులైన, భీమకర్మాణః=భయంకరమైన కర్మ గల, తే రాక్షసాః=ఆ రాక్షసులు, కాఞ్చనాపీడైః=బంగారు శిరోభూషణములు గల, హయైః=గుఱ్ఱములతోను, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలల వంటి, గజైశ్చ=గజములతోను, ఆదిత్యసంకాశైః=సూర్యునితో సమానములైన, రథైః=రథములతోను, మనోరమైః=మనోహరములైన, కవచైశ్చ=కవచములతోను, దశ=పది, దిశః=దిక్కులను, నాదయన్తః=ధ్వనింపచేయుచు, నిర్యయుః=బయల్వెడలిరి.

తా. భయంకరమైన పనులు చేయు రాక్షసశ్రేష్ఠులైన ఆ రాక్షసులు, రావణునకు జయము కలుగవలెనని కోరుచు, పది దిక్కులను ధ్వనింపచేయుచు, బంగారు శిరోభూషణములు గల గుఱ్ఱములతోను, అగ్నిజ్వాలలవంటి ఏనుగులతోను, సూర్యునివంటి రథములతోను, మనోహరములైన కవచములతోను బయల్వెడలిరి.

మూ. వానరాణామపి చమూర్బృహతీ జయమిచ్ఛతామ్,
అభ్యధావత తాం సేనాం రక్షసాం ఘోరకర్మణామ్. 4

ప్ర. అ. జయమ్=జయమును, ఇచ్ఛతామ్=కోరుచున్న, వానరాణామ్=వానరులయొక్క, బృహతీ=గొప్పదైన, చమూః అపి=సేన కూడ,

ఘోరకర్మణామ్=ఘోరమైన కర్మ గల, రక్షసామ్=రాక్షసులయొక్క, తాం సేనామ్=ఆ సేనను గూర్చి, అభ్యధావత=పరుగెత్తెను.

తా. జయమును కోరుచున్న వానరుల గొప్ప సేన కూడ ఘోరములైన పనులు చేయు ఆ రాక్షసుల సైన్యమునకు ఎదురుగా పరుగెత్తెను. 4

మూ. ఏతస్మిన్నన్తరే తేషామన్యోన్యమభిధావతామ్,
రక్షసాం వానరాణాం చ ద్వన్ద్వయుద్ధమవర్తత. 5

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఇంతలో, అన్యోన్యమ్=పరస్పరము, అభిధావ తామ్=ఎదురుగా పరుగెత్తుచున్న, తేషామ్=ఆ, రక్షసామ్=రాక్షసులకు, వానరాణాం చ=వానరులకు, ద్వన్ద్వయుద్ధమ్=ద్వంద్వయుద్ధము, అవర్తత=జరిగెను.

తా. ఇంతలో ఒకరికొకరు ఎదురుగా పరుగెత్తుచున్న ఆ రాక్షసులకు, వానరులకు మధ్య ద్వంద్వయుద్ధము జరిగెను. 5

మూ. అఙ్గదేనేన్ద్రజిత్సార్ధం వాలిపుత్రేణ రాక్షసః,
అయుధ్యత మహాతేజాస్త్ర్యమ్బకేణ యథాన్ధకః. 6

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాక్షసః=రాక్షసుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, వాలిపుత్రేణ=వాలిపుత్రుడైన, అఙ్గదేన సార్ధమ్=అంగదు నితో కూడ, అన్ధకః=అంధకాసురుడు, త్ర్యమ్బకేణ యథా=శివునితో వలె, అయుధ్యత=యుద్ధము చేసెను.

తా. గొప్ప తేజస్సు గల ఇంద్రజిత్తు వాలిపుత్రుడైన అంగదునితో, అంధకాసురుడు శివునితో యుద్ధము చేసినట్లు యుద్ధము చేసెను. 6

మూ. ప్రజఙ్ఘేన చ సంపాతిర్నిత్యం దుర్ధర్షణో రణే,
జమ్బుమాలినమారబ్ధో హనుమానపి వానరః. 7

ప్ర. అ. రణే=యుద్ధమునందు, నిత్యమ్=ఎల్లప్పుడు, దుర్ధర్షణః=ఎదిరింప శక్యముకాని, సంపాతిః=సంపాతి అను వానరుడు, ప్రజఙ్ఘేన=ప్రజంఘునితో యుద్ధము చేసెను. వానరః=వానరుడైన, హనుమానపి=హనుమంతుడు, జమ్బుమాలినమ్=జంబుమాలిని, ఆరబ్ధః=(చంపుటకు) ప్రారంభించెను.

తా. ఎల్లప్పుడు యుద్ధములో ఎదిరింప శక్యము కాని సంపాతి అను వానరుడు ప్రజంఘునితోను, హనుమంతుడు జంబుమాలితోను యుద్ధము చేసెను.

మూ. సంగతస్తు మహాక్రోధో రాక్షసో రావణానుజః,
సమరే తీక్ష్ణవేగేన శత్రుఘ్నేన విభీషణః. 8

ప్ర. అ. మహాక్రోధః=గొప్ప కోపము గల, రావణానుజః=రావణుని తమ్ముడైన, రాక్షసః=రాక్షసుడైన, విభీషణః=విభీషణుడు, సమరే=యుద్ధమునందు, తీక్ష్ణవేగేన=తీక్ష్ణమైన వేగము గల, శత్రుఘ్నేన=శత్రుఘ్నునితో, సంగతః=కలిసెను.

తా. రావణుని తమ్ముడైన విభీషణుడు తీవ్రమైన వేగము గల శత్రుఘ్నునితో చాల కోపముతో యుద్ధము చేసెను. 8

మూ. తపనేన గజః సార్ధం రాక్షసేన మహాబలః,
నికుమ్భేన మహాతేజా నీలోఽపి సమయుధ్యత. 9

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, గజః=గజుడు, తపనేన=తపను డను, రాక్షసేన సార్ధమ్=రాక్షసునితోను, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, నీలోఽపి=నీలుడు కూడ, నికుమ్భేన=నికుంభునితోను, సమయుధ్యత=యుద్ధముచేసెను.

తా. గొప్ప బలము గల గజుడు తపను డను రాక్షసునితోను, గొప్ప తేజస్సు గల నీలుడు నికుంభునితోను యుద్ధము చేసెను. 9

మూ. వానరేన్ద్రస్తు సుగ్రీవః ప్రఘసేన సుసంగతః,
సంగతః సమరే శ్రీమాన్విరూపాక్షేణ లక్ష్మణః. 10

ప్ర. అ. వానరేన్ద్రః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, ప్రఘసేన=ప్రఘసునితో, సుసంగతః=తలబడెను. శ్రీమాన్=శ్రీమంతుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, విరూపాక్షేణ=విరూపాక్షునితో, సమరే=యుద్ధమునందు, సంగతః=కలిసినాడు.

తా. వానరరాజైన సుగ్రీవుడు ప్రఘసునితోను, శ్రీమంతుడైన లక్ష్మణుడు విరూపాక్షునితోను యుద్ధమునకై తలబడిరి. 10

మూ. అగ్నికేతుః సుదుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః,
మిత్రఘ్నో యజ్ఞకోపశ్చ రామేణ సహ సంగతాః. 11

ప్ర. అ. సుదుర్ధర్షః=జయించుటకు చాల కష్టమైన, అగ్నికేతుః=అగ్నికేతువు, రాక్షసః=రాక్షసుడైన, రశ్మికేతుశ్చ=రశ్మికేతువు, మిత్రఘ్నః=మిత్రఘ్నుడు, యజ్ఞకోపశ్చ=యజ్ఞకోపుడు, రామేణ సహ=రామునితో కూడ, సంగతాః=తలబడిరి.

తా. ఎదిరింప శక్యము కాని అగ్నికేతువు, రశ్మికేతువు, మిత్రఘ్నుడు, యజ్ఞకోపుడు రామునితో యుద్ధానికి తలబడిరి. 11

మూ. వజ్రముష్టిస్తు మైన్దేన ద్వివిదేనాశనిప్రభః,
రాక్షసాభ్యాం సుఘోరాభ్యాం కపిముఖ్యౌ సమాగతౌ. 12

ప్ర. అ. వజ్రముష్టిః=వజ్రముష్టి, మైన్దేన=మైందునితోను, అశనిప్రభః=అశ

విప్రభుడు, ద్వివిదేన=ద్వివిదునితోను తలబడెను. కపిముఖ్యౌ=వానరులలో ముఖ్యులైన మైందద్వివిదులు, సుఘోరాభ్యామ్=చాల భయంకరులైన, రాక్షసాభ్యామ్=రాక్షసులతో, సమాగతౌ=కలిసిరి.

తా. వజ్రముష్టి మైందునితోను, అశనిప్రభుడు ద్వివిదునితోను తలబడిరి. ఆ వానరముఖ్యు లిద్దరూ భయంకరులైన ఆ రాక్షసులతో తలబడిరి. 12

మూ. వీరః ప్రతపనో ఘోరో రాక్షసో రణదుర్ధరః,
సమరే తీక్ష్ణవేగేన నలేన సమయుధ్యత. 13

ప్ర. అ. వీరః=వీరుడు, ఘోరః=భయంకరుడు, రణదుర్ధరః=యుద్ధమునందు సహింప శక్యము కానివాడు అయిన, ప్రతపనః=ప్రతపనుడు, సమరే=యుద్ధమునందు, తీక్ష్ణవేగేన=తీక్ష్ణమైన వేగము గల, నలేన=నలునితో, సమయుధ్యత=యుద్ధము చేసెను.

తా. వీరుడు, యుద్ధములో ఎదిరింప శక్యము కానివాడు, భయంకరుడు అయిన ప్రతపనుడు అను రాక్షసుడు, యుద్ధములో తీవ్రమైన వేగము గల నలునితో యుద్ధము చేసెను. 13

మూ. ధర్మస్య పుత్రో బలవాన్సుషేణ ఇతి విశ్రుతః,
స విద్యున్మాలినా సార్ధమయుధ్యత మహాకపిః. 14

ప్ర. అ. ధర్మస్య=యమునియొక్క, పుత్రః=పుత్రుడు, బలవాన్=బలవంతుడు, సుషేణః ఇతి=సుషేణుడు అని, విశ్రుతః=ప్రసిద్ధుడు అయిన, సః మహాకపిః=ఆ గొప్ప వానరుడు, విద్యున్మాలినా సార్ధమ్=విద్యున్మాలితో కూడ, అయుధ్యత=యుద్ధము చేసెను.

తా. యముని పుత్రుడు, బలవంతుడు, వానరశ్రేష్ఠుడు అయిన సుషేణుడు విద్యున్మాలితో యుద్ధము చేసెను. 14

మూ. వానరాశ్చాపరే ఘోరా రాక్షసైరపరైః సహ,
ద్వన్ద్వం సమీయుః సహసా యుద్ధ్వా చ బహుభిః సహ. 15

ప్ర. అ. ఘోరాః=భయంకరులైన, అపరే=మరికొందరు, వానరాశ్చ=వానరులుకూడ, బహుభిః సహ=చాలమందితో, యుద్ధ్వా చ=యుద్ధము చేసి, అపరైః=ఇతరులైన, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, ద్వన్ద్వం సమీయుః=ద్వంద్వమును పొందిరి.

తా. భయంకరులైన ఇతరవానరులు కూడ ముందుగా చాలమందితో యుద్ధము చేసి, పిమ్మట ఇతరరాక్షసులతో ద్వంద్వయుద్ధమునకు దిగిరి. 15

మూ. తత్రాసీత్సుమహద్యుద్ధం తుములం లోమహర్షణమ్,
రక్షసాం వానరాణాం చ వీరాణాం జయమిచ్ఛతామ్. 16

ప్ర. అ. తత్ర=అక్కడ, జయమ్=జయమును, ఇచ్ఛతామ్=కోరుచున్న, వీరాణామ్=వీరులైన, రక్షసామ్=రాక్షసులకు, వానరాణాం చ=వానరులకు, లోమహర్షణమ్=రోమాంచమును కలిగించేది, తుములమ్=వ్యాకులము అయిన, సుమహత్=చాల గొప్పదైన, యుద్ధమ్=యుద్ధము, ఆసీత్=ఆయెను.

తా. అక్కడ జయమును కోరుచున్న వీరులైన రాక్షసవానరుల మధ్య రోమాంచమును కలిగించే వ్యాకులమైన గొప్ప యుద్ధము జరిగెను. 16

మూ. హరిరాక్షసదేహేభ్యః ప్రసృతాః కేశశాద్వలాః,
శరీరసంఘాటవహాః ప్రసుస్రుః శోణితాపగాః. 17

ప్ర. అ. హరిరాక్షసదేహేభ్యః=వానరులయొక్క, రాక్షసులయొక్క దేహములనుండి, ప్రసృతాః=ప్రసరించినవి, కేశశాద్వలాః=కేశము లను గడ్డి గలవి, శరీరసంఘాటవహాః=శరీరము లను కట్టెమోపులను మోయునవి అయిన, శోణితాపగాః=రక్తనదులు, ప్రసుస్రుః=ప్రవహించినవి.

తా. అప్పుడు వానరరాక్షసుల శరీరములనుండి ప్రవించిన రక్తనదులు ప్రవహించెను. ఆ ప్రవాహములలో కేశములు గడ్డికుప్పల వలె, శరీరములు కట్టెల వలె కొట్టుకొని పోవుచుండెను. 17

మూ. అజఘానేన్ద్రజిత్క్రుద్ధో వజ్రేణేవ శతక్రతుః,
అఙ్గదం గదయా వీరం శత్రుసైన్యవిదారణమ్. 18

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, శతక్రతుః=దేవేంద్రుడు, వజ్రేణేవ=వజ్రముచేత వలె, గదయా=గదచేత, శత్రుసైన్యవిదారణమ్=శత్రుసైన్యమును చీల్చివేయుచున్న, వీరమ్=వీరుడైన, అఙ్గదమ్=అంగదుని, అజఘాన=కొట్టెను.

తా. ఇంద్రజిత్తు కోపించినవాడై, శత్రుసైన్యమును చీల్చివేయుచున్న వీరుడైన అంగదుణ్ణి, దేవేంద్రుడు వజ్రాయుధముతో కొట్టినట్లు గదతో కొట్టెను.

మూ. తస్య కాఞ్చనచిత్రాఙ్గం రథం సాశ్వం ససారథిమ్,
జఘాన సమరే శ్రీమానఙ్గదో వేగవాన్ హరిః. 19

ప్ర. అ. హరిః=వానరుడైన, అఙ్గదః=అంగదుడు, వేగవాన్=వేగము గలవాడై, సమరే=యుద్ధమునందు, తస్య=వానియొక్క, కాఞ్చనచిత్రాఙ్గమ్=బంగారుముచేత చిత్రమైన అవయవములు గల, సాశ్వమ్=గుర్రములతో గూడిన, ససారథిమ్=సారథితో కూడిన, రథమ్=రథమును, జఘాన=కొట్టెను.

తా.: అంగదుడు వేగముగ మూపుచు ఆ ఇంద్రజిత్తు ఎక్కిన బంగారముచేత చిత్రములైన చక్రాద్యవయవములు గల రథమును విరుగగొట్టి గుఱ్ఱములను, సారథిని చంపివేసెను. 19

మూ. సంపాతిస్తు ప్రజఙ్ఘేన త్రిభిర్బాణైః సమాహతః,
నిజఘానాశ్వకర్ణేన ప్రజఙ్ఘం రణమూర్ధని. 20

ప్ర. అ. ప్రజఙ్ఘేన=ప్రజంఘునిచేత, త్రిభిః=మూడు, బాణైః=బాణములతో, సమాహతః=కొట్టబడిన, సంపాతిస్తు=సంపాతియైతే, రణమూర్ధని= యుద్ధాగ్రభాగమునందు, అశ్వకర్ణేన=మర్రిచెట్టుతో, ప్రజఙ్ఘమ్=ప్రజంఘుణ్ణి, నిజఘాన= చంపెను.

తా. ప్రజంఘుడు మూడు బాణములు ప్రయోగించి కొట్టగా సంపాతి రణాగ్రమునందు ఆ ప్రజంఘుని మర్రిచెట్టుతో చంపివేసెను. 20

మూ. జమ్బుమాలీ రథస్థస్తు రథశక్త్యా మహాబలః,
బిభేద సమరే క్రుద్ధో హనూమన్తం స్తనాన్తరే. 21

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రథస్థః=రథముమీద నున్న, జమ్బుమాలీ=జమ్బుమాలి, క్రుద్ధః=కోపించినవాడై, సమరే=యుద్ధమునందు, హనూమన్తమ్=హనుమంతుని, రథశక్త్యా=రథమునందున్న శక్తితో, స్తనాన్తరే=వక్షఃస్థలమునందు, బిభేద= భేదించెను.

తా. మహాబలుడైన జంబుమాలి రథస్థుడై, చాల కోపించి, యుద్ధమునందు హనుమంతుని వక్షస్థలమునందు శక్తి అను ఆయుధముతో, వక్షస్థలము బ్రద్దలగునట్లు కొట్టెను. 21

మూ. తస్య తం రథమాస్థాయ హనూమాన్ మారుతాత్మజః,
ప్రమమాథ తలేనాశు సహ తేనైవ రక్షసా. 22

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, తస్య= వానియొక్క, తం రథమ్=ఆ రథమును, ఆస్థాయ=ఎక్కి, ఆశు=శీఘ్రముగా, తేన రక్షసా సహైవ=ఆ రాక్షసునితో, తలేన=అరచేతిచేత, ప్రమమాథ=నశింపచేసెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు శీఘ్రముగా వాని రథము నెక్కి అరచేతి దెబ్బలతో ఆ రాక్షసుణ్ణి, రథమునూ కూడ నశింపచేసెను. 22

మూ. నదన్ ప్రతపనో ఘోరో నలం సోఽభ్యనుధావత,
నలః ప్రతపనస్యాశు పాతయామాస చక్షుషీ. 23

ప్ర. అ. ఘోరః=భయంకరుడైన, సః ప్రతపనః=ఆ ప్రతపనుడు, నదన్=ధ్వని

వేయుచు, నలమ్=నలునిగూర్చి, అభ్యధావత=పరుగెత్తెను. నలః=నలుడు, ఆశు=వెంటనే, ప్రతపనస్య=ప్రతపనునియొక్క, చక్షుషీ=నేత్రములను, పాతయామాస=పడగొట్టెను.

తా. భయంకరుడైన ఆ ప్రతపనుడు గర్జించుచు నలునిమీదికి పరుగెత్తగా వెంటనే నలుడు వాని నేత్రములను పడగొట్టెను. 23

మూ. భిన్నగాత్రః శరైస్తీక్ష్ణైః క్షిప్రహస్తేన రక్షసా,
గ్రసన్తమివ సైన్యాని ప్రఘసం వానరాధిపః, 24
సుగ్రీవః సప్తపర్ణేన నిజఘాన జవేన చ.

ప్ర. అ. క్షిప్రహస్తేన=శీఘ్రమైన హస్తము గల, రక్షసా=రాక్షసునిచేత, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, భిన్నగాత్రః=భేదింపబడిన అవయవములు గల, వానరాధిపః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, సైన్యాని=సైన్యములను, గ్రసన్తమివ=మ్రింగివేయుచున్నవాడు వలె ఉన్న, ప్రఘసమ్=ప్రఘసుణ్ణి, సప్తపర్ణేన=సప్తపర్ణవృక్షముతో, జవేన=వేగముచేత, నిజఘాన=చంపెను.

తా. హస్తలాఘవము గల ప్రఘసుడు వాడియైన బాణములచేత శరీరము నంతమూ భేదించగా, వానరరాజైన సుగ్రీవుడు, వేగము చూపుచు, సైన్యమును మ్రింగివేయుచున్నాడా అన్నట్లున్న ఆ రాక్షసుణ్ణి సప్తపర్ణవృక్షముచేత చంపివేసెను. 24

మూ. ప్రపీడ్య శరవర్షేణ రాక్షసం భీమదర్శనమ్, 25
నిజఘాన విరూపాక్షం శరేణైకేన లక్ష్మణః.

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, భీమదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, రాక్షసమ్=రాక్షసుడైన, విరూపాక్షమ్=విరూపాక్షుణ్ణి, శరవర్షేణ=బాణవర్షముచేత, నిపీడ్య=పీడించి, ఏకేన=ఒక, శరేణ=బాణముచేత, నిజఘాన=చంపెను.

తా. లక్ష్మణుడు చూచుటకు భయంకరుడైన విరూపాక్షుణ్ణి బాణవర్షముచేత పీడించి, ఒక్క బాణముతో చంపివేసెను. 25

మూ. అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః, 26
మిత్రఘ్నో యజ్ఞకోపశ్చ రామం నిర్బిభిదుః శరైః.

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, అగ్నికేతుశ్చ=అగ్నికేతువు, రాక్షసః=రాక్షసుడైన, రశ్మికేతుశ్చ=రశ్మికేతువు, మిత్రఘ్నః=మిత్రఘ్నుడు, యజ్ఞకోపశ్చ=యజ్ఞకోపుడు, రామమ్=రాముణ్ణి, శరైః=బాణములచేత, నిర్బిభిదుః=భేదించిరి.

తా. ఎదిరింప శక్యము కాని అగ్నికేతువు, రశ్మికేతువు, మిత్రఘ్నుడు,

యజ్ఞకోపుడు రాముణ్ణి బాణాలతో భేదించిరి (గాయపరిచిరి). 26

మూ. తేషాం చతుర్ణాం రామస్తు శిరాంసి సమరే శరైః,
క్రుద్ధశ్చతుర్భిశ్చిచ్ఛేద ఘోరైరగ్నిశిఖోపమైః. 27

ప్ర. అ. రామస్తు=రాముడైతే, క్రుద్ధః=కోపించినవాడై, సమరే=యుద్ధమునందు, ఘోరైః=భయంకరములైన, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలతో సమానములైన, చతుర్భిః= నాలుగు, శరైః=బాణములచేత, తేషామ్=ఆ, చతుర్ణామ్=నలుగురి యొక్క, శిరాంసి= శిరస్సులను, చిచ్ఛేద=ఛేదించెను.

తా. రాముడు కోపించి అగ్నిజ్వాలలవంటి నాలుగు భయంకరములైన బాణములతో యుద్ధమునందు ఆ నలుగురి శిరస్సులను ఛేదించెను. 27

మూ. వజ్రముష్టిస్తు మైన్దేన ముష్టినా నిహతో రణే,
పపాత సరథః సాశ్వః పురాట్ట ఇవ భూతలే. 28

ప్ర. అ. వజ్రముష్టిస్తు=వజ్రముష్టియైతే, రణే=యుద్ధమునందు, మైన్దేన= మైందునిచేత, ముష్టినా=పిడికిలిచేత, నిహతః=కొట్టబడినవాడై, సరథః=రథముతో కూడినవాడై, సాశ్వః=గుఱ్ఱములతో కూడినవాడై, పురాట్టః ఇవ=పట్టణప్రాకార శిఖరమువలె, భూతలే=నేలమీద, పపాత=పడెను.

తా. యుద్ధరంగమునందు మైందుడు పిడికిలితో కొట్టగా, వజ్రముష్టి రథముతోను అశ్వములతోను పహో పట్టణప్రాకారశిఖరమువలె నేలమీద పడిపోయెను.

మూ. నికుమ్భస్తు రణే నీలం నీలాఞ్జనచయప్రభమ్,
నిర్బిభేద శరైస్తీక్ష్ణైః కరైర్మేఘమివాంశుమాన్. 29

ప్ర. అ. నికుమ్భస్తు=నికుంభుడైతే, రణే=యుద్ధమునందు, నీలాఞ్జనచయప్రభమ్= నల్లని కాటుక రాశి వంటి కాంతి గల, నీలమ్=నీలుణ్ణి, అంశుమాన్=సూర్యుడు, కరైః= కిరణములచేత, మేఘమివ=మేఘమును వలె, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, నిర్బిభేద=భేదించెను.

తా. యుద్ధమునందు నికుంభుడు నల్లని కాటుకప్రోగు వంటి కాంతి గల నీలుణ్ణి, సూర్యుడు కిరణములచేత మేఘమును కొట్టినట్లు, వాడియైన బాణములతో కొట్టెను. 29

మూ. పునః శరశతేనాథ క్షిప్రహస్తో నిశాచరః,
బిభేద సమరే నీలం నికుమ్భః ప్రజహాస చ. 30

ప్ర. అ. క్షిప్రహస్తః=శీఘ్రమైన హస్తము గల, నిశాచరః=రాక్షసుడైన,

నికుమ్భః= నికుంభుడు, అథ=అటుపిమ్మట, శరశతేన=నూరు బాణములచేత, సమరే=యుద్ధమునందు, నీలమ్=నీలుణ్ణి, పునః=మరల, బిభేద=భేదించెను, ప్రజహాస చ=గట్టిగా నవ్వెను కూడ.

తా. పిమ్మట హస్తలాఘవము గల ఆ నిశాచరుడైన నికుంభుడు మరల నూరు బాణములు ప్రయోగించి యుద్ధరంగమునందు ఆ నీలుణ్ణి గాయపరచి అట్టహాసము చేసెను. 30

మూ. తస్యైవ రథచక్రేణ నీలో విష్ణురివాహవే,
శిరశ్చిచ్ఛేద సమరే నికుమ్భస్య చ సారథేః. 31

ప్ర. అ. నీలః=నీలుడు, ఆహవే=యుద్ధమునందు, విష్ణురివ=విష్ణువు వలె, తస్యైవ=వానియొక్కయే, రథచక్రేణ=రథచక్రముచేత, సమరే=యుద్ధమునందు, నికుమ్భస్య=నికుంభునియొక్క, సారథేః=సారథియొక్క, శిరః=శిరస్సును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. యుద్ధరంగమునందు నీలుడు, ఆ నికుంభుని రథచక్రముతోనే, రణమునందు మహావిష్ణువు వలె, అతని శిరస్సును, సారథిశిరస్సును ఛేదించెను.

మూ. వజ్రాశనిసమస్పర్శో ద్వివిదోఽప్యశనిప్రభమ్,
జఘాన గిరిశృఙ్గేణ మిషతాం సర్వరక్షసామ్. 32

ప్ర. అ. వజ్రాశనిసమస్పర్శః=వజ్రాయుధముతోను పిడుగుతోను సమానమైన స్పర్శగల, ద్వివిదోఽపి=ద్వివిదుడు కూడ, సర్వరక్షసామ్=సమస్తరాక్షసులు, మిషతామ్= చూచుచుండగా, గిరిశృఙ్గేణ=పర్వతశిఖరముతో, అశనిప్రభమ్=అశని ప్రభుణ్ణి, జఘాన= కొట్టెను.

తా. వజ్రముతోను, పిడుగులతోను సమానమైన స్పర్శగల ద్వివిదుడు, రాక్షసులందరూ చూచుచుండగా అశనిప్రభుణ్ణి పర్వతశిఖరముతో కొట్టెను.32

మూ. ద్వివిదం వానరేన్ద్రం తం ద్రుమయోధినమాహవే,
శరైరశనిసంకాశైః స వివ్యాధాశనిప్రభః. 33

ప్ర. అ. సః అశనిప్రభః=ఆ అశనిప్రభుడు, ఆహవే=యుద్ధమునందు, ద్రుమయోధినమ్= వృక్షములతో యుద్ధముచేయు, వానరేన్ద్రామ్=వానరనాయకుడైన, తం ద్వివిదమ్=ఆ ద్వివిదుణ్ణి, అశనిసంకాశైః=వజ్రముతో సమానములైన, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. యుద్ధరంగమునందు వృక్షములతో యుద్ధముచేయుచున్న ఆ వానరనాయకుడైన ద్వివిదుని అశనిప్రభుడు వజ్రాయుధమువంటి బాణములతో

కొట్టెను. 33

మూ. స శరైరభివిద్ధాఙ్గో ద్వివిదః క్రోధమూర్ఛితః,
సాలేన సరథం సాశ్వం నిజఘానాశనిప్రభమ్. 34

ప్ర. అ. శరైః=బాణములచేత, అభివిద్ధాఙ్గః=కొట్టబడిన శరీరము గల, సః ద్వివిదః= ఆ ద్వివిదుడు, క్రోధమూర్ఛితః=క్రోధముతో నిండినవాడై, సాలేన=సాల వృక్షముచేత, సరథమ్= రథముతో కూడిన, సాశ్వమ్=అశ్వములతో కూడిన, అశనిప్రభమ్=అశనిప్రభుని, నిజఘాన= కొట్టెను.

తా. ఆ ద్వివిదుడు బాణములచేత కొట్టబడిన శరీరము గలవాడై, క్రోధముతో నిండినవాడై, ఒక సాలవృక్షముచేత అశ్వములతోను రథముతోను సహా అశనిప్రభుణ్ణి చంపెను. 34

మూ. విద్యున్మాలీ రథస్థస్తు శరైః కాఞ్చనభూషణైః,
సుషేణం తాడయామాస ననాద చ ముహుర్ముహుః. 35

ప్ర. అ. రథస్థః=రథమునందున్న, విద్యున్మాలీ=విద్యున్మాలి, కాఞ్చనభూషణైః= బంగారము అలంకారముగా గల, శరైః=బాణములచేత, ముహుర్ముహుః=మాటిమాటికి, సుషేణమ్=సుషేణుణ్ణి, తాడయామాస=కొట్టెను. ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. రథము నెక్కి ఉన్న విద్యున్మాలి బంగారముచేత అలంకరించిన బాణములతో సుషేణుణ్ణి అనేకపర్యాయములు కొట్టి సింహనాదము చేసెను.

మూ. తం రథస్థమథో దృష్ట్వా సుషేణో వానరోత్తమః,
గిరిశృఙ్గేణ మహతా రథమాశు న్యపాతయత్. 36

ప్ర. అ. అథో=అటుపిమ్మట, వానరోత్తమః=వానరోత్తముడైన, సుషేణః=సుషేణుడు, రథస్థమ్=రథమునందున్న, తమ్=వానిని, దృష్ట్వా=చూచి, మహతా=గొప్పదైన, గిరిశృఙ్గేణ=పర్వతశిఖరముచేత, ఆశు=శీఘ్రముగా, రథమ్=రథమును, న్యపాతయత్= పడగొట్టెను.

తా. అప్పుడు వానరోత్తముడైన సుషేణుడు రథమునందున్న ఆ రాక్షసుని చూచి వెంటనే, పెద్ద పర్వతశిఖరముచేత ఆ రథమును విరుగగొట్టెను.

మూ. లాఘవేన తు సంయుక్తో విద్యున్మాలీ నిశాచరః,
అపక్రమ్య రథాత్తూర్ణం గదాపాణిః క్షితౌ స్థితః. 37

ప్ర. అ. లాఘవేన=నేర్పుతో, సంయుక్తః=కూడిన, నిశాచరః=రాక్షసుడైన, విద్యున్మాలీ=విద్యున్మాలి, రథాత్=రథమునుండి, తూర్ణమ్=శీఘ్రముగా,

అపక్రమ్య=తొలగి, గదాపాణిః=గద హస్తమునందు కలవాడై, క్షితౌ=నేలమీద, స్థితః=నిలచెను.

తా. మంచి నేర్పు గల విద్యున్మాలి ఆ రథమును విడచి, చేతిలో గద ధరించి నేలమీద నిలచెను. 37

మూ. తతః క్రోధసమావిష్టః సుషేణో హరిపుఙ్గవః,
శిలాం సుమహతీం గృహ్య నిశాచరమభిద్రవత్. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రోధసమావిష్టః=క్రోధముతో కూడిన, హరిపుఙ్గవః=వానరశ్రేష్ఠుడైన, సుషేణః=సుషేణుడు, మహతీమ్=పెద్దదైన, శిలామ్=శిలను, గృహ్య=గ్రహించి, నిశాచరమ్=రాక్షసుణ్ణి గూర్చి, అభ్యద్రవత్=పరుగెత్తెను.

తా. అప్పుడు వానరశ్రేష్ఠుడైన సుషేణుడు కోపముతో చాల పెద్ద శిలను తీసికొని ఆ రాక్షసుని మీదికి వెళ్లెను. 38

మూ. తమాపతన్తం గదయా విద్యున్మాలీ నిశాచరః,
వక్షస్యభిజఘానాశు సుషేణం హరిపుఙ్గవమ్. 39

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడైన, విద్యున్మాలీ=విద్యున్మాలి, ఆపతన్తమ్=వచ్చుచున్న, తమ్=ఆ, హరిపుఙ్గవమ్=వానరశ్రేష్ఠుడైన, సుషేణమ్=సుషేణుణ్ణి, ఆశు=వెంటనే, గదయా=గదచేత, వక్షసి=వక్షఃస్థలమునందు, అభిజఘాన=కొట్టెను.

తా. నిశాచరుడైన ఆ విద్యున్మాలి మీదికి వచ్చుచున్న ఆ వానర శ్రేష్ఠుడైన సుషేణుణ్ణి, వెంటనే, గదతో వక్షఃస్థలముమీద కొట్టెను. 39

మూ. గదాప్రహారం తం ఘోరమచిన్త్య ప్లవగోత్తమః,
తాం తూష్ణీం పాతయామాస తస్యోరసి మహామృధే. 40

ప్ర. అ. మహామృధే=మహాయుద్ధమునందు, ప్లవగోత్తమః=ఆ వానర శ్రేష్ఠుడు, ఘోరమ్=ఘోరమైన, తం గదాప్రహారమ్=ఆ గదాప్రహారమును, అచిన్త్య=ఆలోచించక (లెక్కచేయక), తూష్ణీమ్=మౌనముగా, తామ్= ఆ శిలను, తస్య=వానియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, పాతయామాస=పడవేసెను.

తా. ఆ మహాయుద్ధములో సుషేణుడు ఆ ఘోరమైన గద దెబ్బను లక్ష్యపెట్టక ఆ శిలను మాటలాడకుండగా అతని వక్షఃస్థలముమీద పడవేసెను.

మూ. శిలాప్రహారాభిహతో విద్యున్మాలీ నిశాచరః,
నిష్పిష్టహృదయో భూమౌ గతాసుర్నిపపాత హ. 41

ప్ర. అ. శిలాప్రహారాభిహతః=శిల దెబ్బచేత కొట్టబడిన, నిశాచరః=నిశాచరుడైన, విద్యున్మాలిః=విద్యున్మాలి, నిష్పిష్టహృదయః=నలగగొట్టబడిన హృదయము గలవాడై, గతాసుః=పోయిన ప్రాణములు గలవాడై, భూమౌ=నేలమీద, నిపపాత హ=పడెను.

తా. శిలచేత కొట్టబడిన ఆ విద్యున్మాలి హృదయము నలిగిపోగా, ప్రాణములు విడిచి నేలమీద పడెను. 41

మూ. ఏవం తైర్వానరైః శూరైః శూరాస్తే రజనీచరాః,
ద్వన్ద్వే విమథితాస్తత్ర దైత్యా ఇవ దివౌకసైః. 42

ప్ర. అ. శూరాః=శూరులైన, తే రజనీచరాః=ఆ రాక్షసులు, శూరైః=శూరులైన, తైః వానరైః=ఆ వానరులచేత, ఏవమ్=ఇట్లు, తత్ర=అక్కడ, ద్వన్ద్వే=యుద్ధమునందు, దివౌకసైః=దేవతలచేత, దైత్యా ఇవ=దైత్యులు వలె, విమథితాః=మథింపబడిరి.

తా. శూరులైన ఆ రాక్షసులు ఈ విధముగా ఆ ద్వంద్వయుద్ధమునందు శూరులైన ఆ వానరులచేత దేవతలచేత దైత్యులు వలె నశింపచేయబడిరి. 42

మూ. భల్లైశ్చాన్యైర్గదాభిశ్చ శక్తితోమరపట్టిశైః,
అపవిద్ధైశ్చాపి రథైస్తథా సాంగ్రామికైర్హయైః. 43
నిహతైః కుఞ్జరైర్మత్తైస్తథా వానరరాక్షసైః,
చక్రాక్షయుగదణ్డైశ్చ భగ్నైర్ధరణిసంశ్రితైః. 44
బభూవాయోధనం ఘోరం గోమాయుగణసేవితమ్.

ప్ర. అ. గోమాయుగణసేవితమ్=నక్కలయొక్క సముదాయముచేత సేవింపబడిన, ఆయోధనమ్=యుద్ధస్థానము, భల్లైః=భల్లబాణములచేతను, అన్యైః=ఇతరబాణములచేతను, గదాభిశ్చ=గదలచేతను, శక్తితోమరపట్టిశైః=శక్తులచేతను, తోమరములచేతను, పట్టిశములచేతను, అపవిద్ధైః=పడగొట్టబడిన, రథైశ్చాపి=రథములచేతను, తథా=మరియు, సాంగ్రామికైః=యుద్ధమునకు సంబంధించిన, హయైః=గుఱ్ఱములచేతను, నిహతైః=చంపబడిన, మత్తైః=మదించిన, కుఞ్జరైః=ఏనుగులచేతను, తథా=మరియు, వానరరాక్షసైః=వానరులచేతను, రాక్షసులచేతను, భగ్నైః=విరిగిపోయిన, ధరణిసంశ్రితైః=భూమిని ఆశ్రయించిన, చక్రాక్షయుగదణ్డైశ్చ=రథచక్రములచేతను, ఇరుసులచేతను, కాడికఱ్ఱలచేతను, ఘోరమ్=భయంకరముగా, బభూవ=ఆయెను.

తా. మృతదేహములను తినుటకై వచ్చిన నక్కలతో నిండిన ఆ రణభూమి భల్లబాణాదులతోను, గదా - శక్తి - తోమర - పట్టిశములతోను, విరిగి పడియున్న

రథములలోను, మరణించిన యుద్ధాశ్వములలోను, చంపబడిన మదగజములలోను, వానరరాక్షసులలోను, విరిగి నేలమీద పడి యున్న రథచక్రములలోను, ఇరుసులలోను, వాడికఱ్ఱలలోను, వ్యాకులమై భయంకరముగా ఉండెను. 43, 44

మూ. కబన్ధాని సముత్పేతుర్దిక్షు వానరరక్షసామ్, 45
విమర్దే తుములే తస్మిన్ దేవాసురరణోపమే.

ప్ర. అ. దేవాసురరణోపమే=దేవాసురుల యుద్ధముతో సమానమైన, తస్మిన్=ఆ, తుములే=వ్యాకులమైన, విమర్దే=యుద్ధమునందు, వానరరక్షసామ్=వానరులయొక్క, రాక్షసులయొక్క, కబన్ధాని=తలలేని మొండెములు, దిక్షు=దిక్కులయందు, సముత్పేతుః=ఎగిరినవి.

తా. దేవాసురయుద్ధము వంటి ఆ వ్యాకులమైన యుద్ధమునందు వానరుల మొండెములు, రాక్షసుల మొండెములు దిక్కులయందు ఎగిరినవి.

మూ. విహన్యమానా హరిపుఙ్గవైస్తదా
నిశాచరాః శోణితదిగ్ధగాత్రాః,
పునః సుయుద్ధం తరసా సమాశ్రితా
దివాకరస్యాస్తమయాభికాఙ్క్షిణః. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, హరిపుఙ్గవైః=వానరశ్రేష్ఠులచేత, విహన్యమానాః=కొట్టబడుచున్న, శోణితదిగ్ధగాత్రాః=రక్తముచేత పూయబడిన శరీరములు గల, నిశాచరాః=రాక్షసులు, దివాకరస్య=సూర్యునియొక్క, అస్తమయాభికాఙ్క్షిణః=అస్తమయమును కోరుచున్నవారై, (రాత్రి రాక్షసుల బలము హెచ్చును), తరసా=బలముతో, పునః=మరల, సుయుద్ధమ్ =గొప్ప యుద్ధమును, సమాశ్రితాః=ఆశ్రయించినారు.

తా. అప్పుడు వానరులచేత కొట్టబడుచు రక్తముతో నిండిన శరీరములు గల రాక్షసులు, సూర్యాస్తమయమునకై ఎదురుచూచుచు, బలమును ప్రదర్శించి మరల యుద్ధమునకు ఉద్యుక్తులైరి. 46

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుశ్చత్వారింశః సర్గః

{రాత్రి వానరరాక్షసుల మధ్య ఘోరయుద్ధము జరుగుట; అంగదుడు ఇంద్రజిత్తును ఓడించుట; ఇంద్రజిత్తు మాయాబలముచేత అదృశ్యుడై రామలక్ష్మణులను నాగపాశములతో బంధించుట.}

మూ. యుధ్యతామేవ తేషాం తు తదా వానరరక్షసామ్,
రవిరస్తంగతో రాత్రిః ప్రవృత్తా ప్రాణహారిణీ. 1

ప్ర. అ. తేషామ్=ఆ, వానరరక్షసామ్=వానరులు రాక్షసులు, యుధ్యతామేవ=యుద్ధము చేయుచుండగానే, తదా=అప్పుడు, రవిః=సూర్యుడు, అస్తమ్=అస్తాద్రిని, గతః=పొందినాడు. ప్రాణహారిణీ=ప్రాణములను హరించు, రాత్రిః=రాత్రి, ప్రవృత్తా=ప్రారంభమైనది.

తా. ఆ వానరులు రాక్షసులు యుద్ధము చేయుచుండగానే, అప్పుడు సూర్యుడు అస్తమించెను. ప్రాణములను హరించు రాత్రి వచ్చెను. 1

మూ. అన్యోన్యం బద్ధవైరాణాం ఘోరాణాం జయమిచ్ఛతామ్,
సంప్రవృత్తం నిశాయుద్ధం తదా వానరరక్షసామ్. 2

ప్ర. అ. తదా=అప్పుడు, అన్యోన్యమ్=పరస్పరము, బద్ధవైరాణామ్=కట్టబడిన వైరము గలవారు, ఘోరాణామ్=భయంకరులు, జయమ్=జయమును, ఇచ్ఛతామ్=కోరుచున్నవారు అయిన, వానరరక్షసామ్=వానరులకు రాక్షసులకు, నిశాయుద్ధమ్=రాత్రియుద్ధము, సంప్రవృత్తమ్=జరిగినది.

తా. అప్పుడు పరస్పరము వైరము వహించి, జయమును కోరుచున్న భయంకరులైన ఆ వానరులకు రాక్షసులకు రాత్రియుద్ధము ప్రారంభ మైనది.2

మూ. రాక్షసోఽసీతి హరయో వానరోఽసీతి రాక్షసాః,
అన్యోన్యం సమరే జఘ్నుస్తస్మింస్తమసి దారుణే. 3

ప్ర. అ. దారుణే=భయంకరమైన, తస్మిన్=ఆ, తమసి=చీకటియందు, రాక్షసః అసి=రాక్షసుడవుగా ఉన్నావు, ఇతి=అని, హరయః=వానరులు, వానరః=వానరుడవు, అసి=అయి ఉన్నావు, ఇతి=అని, రాక్షసాః=రాక్షసులు, సమరే=యుద్ధమునందు, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నుః=చంపుకొనిరి.

తా. ఆ ఘోరమైన అంధకారములో "నీవు రాక్షసుడవు" అని పలుకుచు వానరులు, "నీవు వానరుడవు" అని పలుకుచు రాక్షసులు, యుద్ధములో తమలో తామే చంపుకొనిరి. (రాక్షసులను రాక్షసులు, వానరులను వానరులు

చంపిరి.) 3

మూ. జహి దారయ చైహీతి కథం విద్రవసీతి చ,
ఏవం సుతుములః శబ్దస్తస్మిన్సైన్యే తు శుశ్రువే. 4

ప్ర. అ. తస్మిన్=ఆ, సైన్యే=సైన్యమునందు, జహి=చంపుము, దారయ=చీల్చుము, ఏహి=రమ్ము, ఇతి=అని, కథమ్=ఎందుకు, విద్రవసీతి చ=పారిపోవుచున్నావు అని, ఏవమ్=ఇట్లు, సుతుములః=చాల వ్యాకులమైన, శబ్దః=శబ్దము, శుశ్రువే=వినబడెను.

తా. ఆ సైన్యములో — "చంపుము; చీల్చుము; రమ్ము; పారిపోవుచున్నావేమి ?" అని వ్యాకులములైన అరపులు వినబడెను. 4

మూ. కాలాః కాఞ్చనసంనాహాస్తస్మింస్తమసి రాక్షసాః,
సంప్రదృశ్యన్త శైలేన్ద్రా దీప్తౌషధివనా ఇవ. 5

ప్ర. అ. తస్మిన్ తమసి=ఆ చీకట్లో, కాలాః=నల్లనివాళ్లు, కాఞ్చనసంనాహాః=బంగారు కవచములు కలవారు అయిన, రాక్షసాః=రాక్షసులు, దీప్తౌషధివనాః=ప్రజ్వలించుచున్న ఓషధివనములు గల, శైలేన్ద్రాః ఇవ=పర్వతములు వలె, సంప్రదృశ్యన్త=చూడబడిరి. (గొప్ప ఓషధులు రాత్రులందు దీపమువలె ప్రకాశించు నని చెప్పుదురు).

తా. నల్లని దేహములతో బంగారు కవచములు ధరించిన రాక్షసులు ఆ చీకటిలో ప్రకాశించుచున్న ఓషధులు గల పర్వతముల వలె కనబడిరి. 5

మూ. తస్మింస్తమసి దుష్పారే రాక్షసాః క్రోధమూర్ఛితాః,
పరిపేతుర్మహావేగా భక్షయన్తః ప్లవఙ్గమాన్. 6

ప్ర. అ. దుష్పారే=దాట శక్యము కాని, తస్మిన్=ఆ, తమసి=చీకటియందు, క్రోధమూర్ఛితాః=క్రోధముతో నిండినవారైన, రాక్షసాః=రాక్షసులు, ప్లవఙ్గమాన్=వానరులను, భక్షయన్తః=భక్షించుచు, మహావేగాః=గొప్ప వేగము గలవారై, పరిపేతుః= వచ్చి పడిరి.

తా. దాట శక్యము కాని ఆ చీకటియందు రాక్షసులు క్రోధముతో నిండినవారై వానరులను భక్షించుచు, మహావేగముతో వచ్చిపడిరి. 6

మూ. తే హయాన్ కాఞ్చనాపీడాన్ ధ్వజాంశ్చాశీవిషోపమాన్,
ఆప్లుత్య దశనైస్తీక్ష్ణైర్భీమకోపా వ్యదారయన్. 7
వానరా బలినో యుద్ధేఽక్షోభయన్ రాక్షసీం చమూమ్.

ప్ర. అ. భీమకోపాః=భయంకరమైన కోపము గల, బలినః=బలము గల, తే వానరాః=ఆ వానరులు, ఆప్లుత్య=ఎగిరి, తీక్ష్ణైః=వాడియైన, దశనైః=దంతము లచేత, కాఞ్చనాపీడాన్=బంగారు శిరోలంకారములు గల, హయాన్=గుఱ్ఱములను, ఆశీవిషోపమాన్=సర్పములతో సమానమైన, ధ్వజాంశ్చ=ధ్వజములను, వ్యదారయన్=చీల్చివేసిరి. యుద్ధే=యుద్ధమునందు, రాక్షసీమ్=రాక్షససంబంధమైన, చమూమ్=సేనను, అక్షోభయన్=క్షోభింపచేసిరి.

తా. భయంకరమైన కోపము, గొప్ప బలము గల ఆ వానరులు యుద్ధమునందు పైకి దుమికి శిరస్సులపై బంగారు అలంకారములు గల గుఱ్ఱములను, సర్పముల వంటి ధ్వజములను చీల్చివేసిరి. రాక్షససైన్యమును క్షోభింపచేసిరి. 7

మూ. కుఞ్జరాన్ కుఞ్జరారోహాన్ పతాకాధ్వజినో రథాన్, 8
చకర్షుశ్చ దదంశుశ్చ దశనైః క్రోధమూర్ఛితాః.

ప్ర. అ. క్రోధమూర్ఛితాః=క్రోధముచేత వ్యాప్తులై, కుఞ్జరాన్=ఏనుగులను, కుఞ్జరారోహాన్=ఏనుగులమీద ఎక్కినవారిని, పతాకాధ్వజినః=పతాకలు ధ్వజములు గల, రథాన్=రథములను, చకర్షుః=లాగిరి. దశనైః=దంతములచేత, దదంశుశ్చ=కరచిరి కూడ.

తా. క్రోధముతో నిండిన ఆ వానరులు ఏనుగులను, ఏనుగులపై ఉన్నవాళ్లను పతాకలతోను ధ్వజములతోను కూడిన రథములను క్రిందికి లాగి దంతములతో కరచిరి. 8

మూ. లక్ష్మణశ్చాపి రామశ్చ శరైరాశీవిషోపమైః, 9
దృశ్యాదృశ్యాని రక్షాంసి ప్రవరాణి నిజఘ్నతుః.

ప్ర. అ. రామశ్చ=రాముడు, లక్ష్మణశ్చాపి=లక్ష్మణుడు, ఆశీవిషోపమైః=సర్పములతో సమానములైన, శరైః=బాణములతో, దృశ్యాదృశ్యాని=కనబడీ కనబడకుండా ఉన్న, ప్రవరాణి=శ్రేష్ఠులైన, రక్షాంసి=రాక్షసులను, నిజఘ్నతుః=వధించిరి.

తా. రామలక్ష్మణులు సర్పములవంటి బాణములతో, కనబడీ కనబడకుండా ఉన్న రాక్షసవీరులను చంపిరి. 9

మూ. తురఙ్గఖురవిధ్వస్తం రథనేమిసముత్థితమ్, 10
రురోధ కర్ణనేత్రాణి యుధ్యతాం ధరణీరజః.

ప్ర. అ. తురఙ్గఖురవిధ్వస్తమ్=గుఱ్ఱముల డెక్కలచేత నలగకొట్టబడిన,

రథనేమిసముత్థితమ్=రథచక్రాంతములనుండి లేచిన, ధరణీరజః=భూపరాగము, యుధ్యతామ్=యుద్ధముచేయుచున్న వారియొక్క, కర్ణనేత్రాణి=కర్ణములను నేత్రములను, రురోధ=అడ్డగించెను.

తా. గుఱ్ఱముల డెక్కలచేత నలిగిన నేలపైనున్న పరాగము రథచక్రాంతములచేత పైకి లేపబడినదై యుద్ధము చేయుచున్నవారి చెవులు, కండ్లు నింపివేసెను. 10

మూ. వర్తమానే తథా ఘోరే సఙ్గ్రామే లోమహర్షణే, 11
రుధిరౌఘా మహాఘోరా నద్యస్తత్ర విసుస్రువుః.

ప్ర. అ. తథా=ఆ విధముగా, ఘోరే=భయంకరము, లోమహర్షణే=రోమాంచమును కలిగించేది అయిన, సఙ్గ్రామే=యుద్ధము, వర్తమానే=ప్రవర్తించుచుండగా, రుధిరౌఘాః=రక్తప్రవాహములు గల, మహాఘోరాః=చాల భయంకరములైన, నద్యః=నదులు, తత్ర=అక్కడ, విసుస్రువుః=ప్రవహించినవి.

తా. రోమాంచమును కలిగించు ఘోరమైన యుద్ధము ఆ విధముగా జరుగుచుండగా అక్కడ రక్తప్రవాహములతో కూడిన చాల భయంకరములైన నదులు ప్రవహించినవి. 11

మూ. తతో భేరీమృదఙ్గానాం పణవానాం చ నిఃస్వనః, 12
శఙ్ఖనేమిస్వనోన్మిశ్రః సంబభూవాద్భుతోపమః.

ప్ర. అ. తతః=ఆటుపిమ్మట, భేరీమృదఙ్గానామ్=భేరీలయొక్క మృదంగములయొక్క, పణవానాం చ=పణవములయొక్క, శఙ్ఖనేమిస్వనోన్మిశ్రః=శంఖములయొక్క రథచక్రాంతములయొక్క ధ్వనితో కలిసిన, అద్భుతోపమః=ఆశ్చర్యకరమైన, నిఃస్వనః=ధ్వని, సంబభూవ=పుట్టెను.

తా. అంతలో శంఖధ్వనులతోను, చక్రధ్వనులతోను కలిసిన, ఆశ్చర్యకరమైన భేరీ - మృదంగ - పణవముల ధ్వని బయలుదేరెను. 12

మూ. హయానాం స్తనమానానాం రాక్షసానాం చ నిఃస్వనః, 13
శస్తానాం వానరాణాం చ సంబభూవాత్ర దారుణః.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, స్తనమానానామ్=ధ్వనిచేయుచున్న, హయానామ్=గుఱ్ఱములయొక్క, రాక్షసానాం చ=రాక్షసులయొక్క, శస్తానామ్=చంపబడిన, వానరాణాం చ=వానరులయొక్క, దారుణః=భయంకరమైన, నిఃస్వనః=ధ్వని, సంబభూవ=పుట్టెను.

తా. అక్కడ సకిలించుచున్న గుఱ్ఱముల ధ్వని, చంపబడుచున్న

రాక్షసవానరుల అరపుల ధ్వని భయమును కలిగించునట్లు వెడలెను. 13

మూ. హతైర్వానరముఖ్యైశ్చ శక్తిశూలపరశ్వధైః, 14
నిహతైః పర్వతాకారై రాక్షసైః కామరూపిభిః,
శస్త్రపుష్పోపహారా చ తత్రాసీద్యుద్ధమేదినీ, 15
దుర్జ్ఞేయా దుర్నివేశా చ శోణితాస్రావకర్దమా.

ప్ర. అ. తత్ర=అక్కడ, శస్త్రపుష్పోపహారా=ఆయుధము లనే పుష్పముల చల్లిక గల, యుద్ధమేదినీ=యుద్ధభూమి, హతైః=చంపబడిన, వానరముఖ్యైశ్చ= వానరముఖ్యులతోను, శక్తిశూలపరశ్వధైః=శక్తులతోను, శూలములతోను, గొడ్డళ్లతోను, నిహతైః=చంపబడిన, కామరూపిభిః= కామరూపములుగల, పర్వతాకారైః=పర్వత ముల వంటి ఆకారములు గల, రాక్షసైః=రాక్షసులతోను, శోణితాస్రావకర్దమా= రక్తపు బురదగా గలదై, దుర్జ్ఞేయా=తెలియ శక్యము కానిది, దుర్నివేశా చ=ప్రవేశింప శక్యము కానిదీ, ఆసీత్=ఆయెను.

తా. ఆ యుద్ధభూమియందు రక్తమను బురద వ్యాపించి ఉండెను. చచ్చిన వానరవీరులు, కామరూపవంతులైన పర్వతాకారముగల రాక్షసులు పడి యుండిరి. శక్తులు, శూలములు, గండ్రగొడ్డళ్లు పడి ఉండెను. ఆయుధము లనే పుష్పములు అలంకారార్థమై చల్లి నట్లుండెను. అట్టి ఆ భూమి గుర్తించుటకు గాని, ప్రవేశించుటకు గాని శక్యము కాకుండ ఉండెను. 14, 15

మూ. సా బభూవ నిశా ఘోరా హరిరాక్షసహారిణీ, 16
కాలరాత్రీవ సర్వేషాం భూతానాం దురతిక్రమా.

ప్ర. అ. సర్వేషామ్=సమస్తమైన, భూతానామ్=భూతములకు, దుర తిక్రమా=అతిక్రమింప శక్యము కాని, కాలరాత్రీవ=ప్రళయకాలరాత్రి వలె, సా నిశా=ఆ రాత్రి, ఘోరా=ఘోరముగాను, హరిరాక్షసనాశినీ=వానరులను రాక్షసులను నశింపచేయునది గాను, బభూవ=ఆయెను.

తా. ఏ భూతములకూ, ప్రాణులకూ కూడ అతిక్రమింప శక్యము కాని ప్రళయకాలరాత్రి వలె భయంకరమైన ఆ రాత్రి వానరులకు రాక్షసులకు నాశహేతు వయ్యెను. 16

మూ. తతస్తే రాక్షసాస్తత్ర తస్మింస్తమసి దారుణే, 17
రామమేవాభ్యవర్తన్త సంహృష్టాః శరవృష్టిభిః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడ, పరమదారుణే=చాల భయంకరమైన, తస్మిన్ తమసి=ఆ అంధకారమునందు, తే రాక్షసాః=ఆ రాక్ష

ములు, సంహృష్టాః=సంతోషించినవారై, శరవృష్టిభిః=బాణవర్షములతో, రామమేవ=రాముని గూర్చియే, అభ్యవర్తన్త=ఎదురుగా వెళ్లిరి.

తా. అక్కడ చాల భయంకరముగా ఉన్న ఆ చీకటిలో రాక్షసులు ఉత్సాహముతో బాణములను వర్షించుచు రాముని ఎదిరించిరి. 17

మూ. తేషామాపతతాం శబ్దః క్రుద్ధానామపి గర్జతామ్, 18
ఉద్వర్త ఇవ సత్త్వానాం సముద్రాణామభూత్స్వనః.

ప్ర. అ. క్రుద్ధానామ్=కోపించిన, గర్జతామ్=గర్జించుచున్న, ఆపతతామ్=వచ్చి మీదపడుచున్న, తేషామ్=ఆ రాక్షసులయొక్క, శబ్దః=శబ్దము, సత్త్వానామ్=ప్రాణులయొక్క, ఉద్వర్తే=ప్రళయమునందు, సముద్రాణామ్=సముద్రములయొక్క, స్వనః ఇవ=ధ్వనివలె, అభూత్=ఆయెను.

తా. ఆ రాక్షసులు కోపముతో గర్జించుచు వచ్చి పడుచుండగా ఆ ధ్వని ప్రళయకాలమునందు సముద్రముల ధ్వని వలె ఉండెను. 18

మూ. తేషాం రామః శరైః షడ్భిః షడ్ జఘాన నిశాచరాన్, 19
నిమేషాన్తరమాత్రేణ శితైరగ్నిశిఖోపమైః.

ప్ర. అ. రామః=రాముడు, నిమేషాన్తరమాత్రేణ=కనురెప్పపాటు కాలములో, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలవంటి, శితైః=వాడియైన, షడ్భిః=ఆరు, శరైః=బాణములచేత, తేషామ్=ఆ రాక్షసులలో, షట్=ఆరుగురు, నిశాచరాన్=రాక్షసులను, జఘాన=కొట్టెను.

తా. రాముడు రెప్పపాటు కాలములో అగ్నిజ్వాలలవంటి ఆరు వాడియైన బాణములు ప్రయోగించి, ఆ రాక్షసులలో ఆరుగురిని కొట్టెను. 19

మూ. యజ్ఞశత్రుశ్చ దుర్ధర్షో మహాపార్శ్వమహోదరౌ, 20
వజ్రదంష్ట్రో మహాకాయస్తౌ చోభౌ శుకసారణౌ,
తే తు రామేణ బాణౌఘైః సర్వమర్మసు తాడితాః, 21
యుద్ధాదపసృతాస్తత్ర సావశేషాయుషోఽభవన్.

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, యజ్ఞశత్రుశ్చ=యజ్ఞశత్రువు, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులు, మహాకాయః=గొప్పదేహము గల, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, తౌ=ఆ, ఉభౌ=ఇద్దరు, శుకసారణౌ=శుకసారణులు, తే=ఆ ఆరుగురు, రామేణ=రామునిచేత, బాణౌఘైః=బాణసమూహములచేత, సర్వమర్మసు=అన్ని మర్మస్థానములందు, తాడితాః=కొట్టబడినవారై, తత్ర=అక్కడ, యుద్ధాత్=యుద్ధమునుండి, అపసృతాః=పారిపోయినవారై, సావశేషాయుషః=మిగి

లిన ఆయుర్దాయము కలవారుగా, అభవన్=అయిరి.

తా. ఎదిరింప శక్యము కాని యజ్ఞశత్రువు, మహాపార్శ్వమహోదరులు, పెద్ద శరీరము గల వజ్రదంష్ట్రుడు, ఆ శుకసారణు లిద్దరు - ఆ ఆరుగురూ రామునిచేత బాణసముదాయములతో అన్ని మర్మస్థానములందు కొట్టబడి, అక్కడినుండి పారిపోవుటచే వారి ఆయుర్దాయము ఇంకను శేషించెను. 20, 21

మూ. నిమేషాన్తరమాత్రేణ ఘోరైరగ్నిశిఖోపమైః, 22
దిశశ్చకార విమలాః ప్రదిశశ్చ మహారథః.

ప్ర. అ. మహారథః=మహారథుడైన రాముడు, నిమేషాన్తరమాత్రేణ =రెప్పపాటు కాలముచేత, ఘోరైః=భయంకరములైన, అగ్నిశిఖోపమైః= అగ్నిజ్వాలలతో సమానములైన బాణములచేత, దిశశ్చ=దిక్కులను, ప్రదిశశ్చ =విదిక్కులను, విమలాః=నిర్మలములైనవాటినిగా, చకార=చేసెను.

తా. మహారథుడైన రాముడు అగ్నిజ్వాలవంటి బాణములతో రెప్పపాటు కాలములో దిక్కులను విదిక్కులను నిర్మలము అగునట్లు అనగా రాక్షసులు లేకుండునట్లు చేసెను. 22

మూ. యే త్వన్యే రాక్షసా వీరా రామస్యాభిముఖే స్థితాః, 23
తేఽపి నష్టాః సమాసాద్య పతఙ్గా ఇవ పావకమ్.

ప్ర. అ. రామస్య=రామునకు, అభిముఖే=అభిముఖమునందు, స్థితాః= నిలచిన, అన్యే=ఇతరులైన, యే=ఏ, వీరాః=వీరులైన, రాక్షసాః=రాక్షసులుండిరో, తేఽపి=వాళ్లు కూడ, పావకమ్=అగ్నిని, ఆసాద్య= పొంది, పతఙ్గాః ఇవ=మిడతల వలె, నష్టాః=నశించినారు.

తా. రామునకు ఎదురుగా నిలచిన ఇతరరాక్షసులు కూడ అగ్నిని సమీపించిన మిడతలం వలె నశించిరి. 23

మూ. సువర్ణపుఙ్ఖైర్విశిఖైః సంపతద్భిః సమన్తతః, 24
బభూవ రజనీ చిత్రా ఖద్యోతైరివ శారదీ.

ప్ర. అ. సమన్తతః=అన్ని వైపులా, సంపతద్భిః=పడుచున్న, సువర్ణపుఙ్ఖైః= బంగారుపొన్నులు గల, విశిఖైః=బాణములచేత, రజనీ=రాత్రి, ఖద్యోతైః=మినుగుడు పురుగులచేత, శారదీవ=శరత్కాలరాత్రి వలె, చిత్రా=చిత్రవర్ణము గలది, బభూవ=ఆయెను.

తా. అన్ని వైపులా పడుచున్న బంగారు పొన్నులు గల ఆ రామ బాణములతో వ్యాప్తమై, ఆ రాత్రి, మినుగుడు పురుగులు ఎగురుచున్న శరత్కాల

రాత్రి వలె చిత్రవర్ణము కలదై ప్రకాశించెను. 24

మూ. రాక్షసానాం చ నినదైర్భేరీణాం చైవ నిఃస్వనైః, 25
సా బభూవ నిశా ఘోరా భూయో ఘోరతరా తదా.

ప్ర. అ. ఘోరా=భయంకరమైన, సా నిశా =ఆ రాత్రి, తదా =అప్పుడు, రాక్షసానామ్=రాక్షసులయొక్క, నినదైః=ధ్వనులచేతను, భేరీణామ్ =భేరీలయొక్క, నిఃస్వనైః చ=ధ్వనులచేతను, భూయః=మరల, ఘోరతరా =చాల భయంకరము, బభూవ=అయెను.

తా. భయంకరమైన ఆ రాత్రి ఆ నాడు, రాక్షసుల ధ్వనులచేత, భేరీనాదములచేత ఇంకను చాల భయంకరముగా ఉండెను. 25

మూ. తేన శబ్దేన మహతా ప్రవృద్ధేన సమన్తతః, 26
త్రికూటః కన్దరాకీర్ణః ప్రవ్యాహరదివాచలః.

ప్ర. అ. సమన్తతః=అంతటా, ప్రవృద్ధేన=వృద్ధి చెందిన, మహతా= గొప్పదైన, తేన=ఆ, శబ్దేన=శబ్దముచేత, కన్దరాకీర్ణః=గుహలయందు వ్యాప్తమైన, త్రికూటః అచలః=త్రికూటపర్వతము, ప్రవ్యాహరదివ=మాటలాడినట్లుండెను.

తా. అంతటా వృద్ధి పొందిన ఆ గొప్ప ధ్వని గుహలలో వ్యాపించగా త్రికూటపర్వతము మాటలాడుచున్న ట్లుండెను. 26

మూ. గోలాఙ్గూలా మహాకాయాస్తమసా తుల్యవర్చసః, 27
సంపరిష్వజ్య బాహుభ్యాం భక్షయన్ రజనీచరాన్.

ప్ర. అ. మహాకాయాః=పెద్ద శరీరములు గలవారు, తమసా=చీకటితో, తుల్యవర్చసః=సమానమైన శరీరకాంతి గలవారు అయిన, గోలాఙ్గూలాః= కొండముచ్చులు, బాహుభ్యామ్=బాహువులతో, సంపరిష్వజ్య= కౌగలించుకొని, రజనీచరాన్=రాక్షసులను, భక్షయన్=భక్షించిరి.

తా. చీకటివంటి శరీరచ్ఛాయ, పెద్ద దేహములు గల గోలాంగూలములు రాక్షసులను బాహువులతో కౌగలించుకొని భక్షించివేసెను. 27

మూ. అఙ్గదస్తు రణే శత్రూన్నిహన్తుం సముపస్థితః, 28
రావణిం నిజఘానాశు సారథిం చ హయానపి.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, శత్రూన్=శత్రువులను, నిహన్తుమ్= చంపుటకు, సముపస్థితః=వచ్చిన, అఙ్గదస్తు=అంగదుడైతే, ఆశు= శీఘ్రముగా, రావణిమ్=ఇంద్రజిత్తును, సారథిం చ=సారథిని, హయానపి=గుఱ్ఱములను, నిజఘాన=కొట్టెను.

తా. శత్రువులను చంపుటకై యుద్ధరంగమునందున్న అంగదుడు ఇంద్రజిత్తును, సారథిని, గుఱ్ఱములను కూడ ఒకే పర్యాయము కొట్టెను. 28

మూ. వర్తమానే తదా ఘోరే సంగ్రామే భృశదారుణే, 29
ఇన్ద్రజిత్తు రథం త్యక్త్వా హతాశ్వో హతసారథిః,
అఙ్గదేన మహామాయస్తత్రైవాన్తరధీయత. 30

ప్ర. అ. తదా=అప్పుడు, ఘోరే=భయంకరము, భృశదారుణే=చాల క్రూరమూ అయిన, సంగ్రామే=యుద్ధము, వర్తమానే=జరుగుచుండగా, అఙ్గదేన=అంగదునిచేత, హతాశ్వః=చంపబడిన అశ్వములు గలవాడు, హతసారథిః=చంపబడిన సారథి కలవాడు అయిన, మహామాయః=గొప్ప మాయలు గల, ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తైతే, తత్రైవ=అక్కడనే, అన్తరధీయత=అంతర్థానము చెందెను.

తా. అప్పుడు చాల దారుణము, భయంకరము అయిన యుద్ధము జరుగుచుండగా అంగదుడు అశ్వములను, సారథిని చంపగానే మహామాయావి అయిన ఇంద్రజిత్తు రథమును విడిచి అక్కడనే అంతర్థానము చెందెను.29, 30

మూ. తత్కర్మ వాలిపుత్రస్య సర్వే దేవాః సహర్షిభిః,
తుష్టువుః పూజనార్హస్య తౌ చోభౌ రామలక్ష్మణౌ. 31

ప్ర. అ. పూజనార్హస్య=పూజించుటకు తగిన, వాలిపుత్రస్య=అంగదునియొక్క, తత్ కర్మ=ఆ పనిని, సహర్షిభిః=ఋషులతో కూడిన, సర్వే=సమస్తమైన, దేవాః=దేవతలు, ఉభౌ=ఇద్దరు, రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు, తుష్టువుః=స్తుతించిరి.

తా. పూజింపదగిన అంగదుడు చేసిన ఆ పనిని మహర్షులు, దేవతలు, రామలక్ష్మణులు ఇద్దరూ కూడ స్తుతించిరి. 31

మూ. ప్రభావం సర్వభూతాని విదురిన్ద్రజితో యుధి,
తతస్తేన మహాత్మానం దృష్ట్వా తుష్టాః ప్రధర్షితమ్. 32

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, ప్రభావమ్=ప్రభావమును, సర్వభూతాని=సమస్తప్రాణులు, విదుః=ఎరిగియుండిరి. తతః=ఆ కారణమువలన, మహాత్మానమ్=మహాత్ముడైన అతనిని, తేన=అతనిచేత, ప్రధర్షితమ్=ఓడింపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, తుష్టాః=సంతోషించిరి.

తా. యుద్ధములో ఇంద్రజిత్తు కున్న ప్రభావ మెంతటిదో అందరికీ తెలిసి ఉండుటచే వాళ్లందరూ అంగదుని చేతిలో ఆ మహాత్ముడు ఓడిపోవుట చూచి సంతోషించిరి. 32

మూ. తతః ప్రహృష్టాః కపయః ససుగ్రీవవిభీషణాః,
సాధు సాధ్వితి నేదుశ్చ దృష్ట్వా శత్రుం పరాజితమ్. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ససుగ్రీవవిభీషణాః=సుగ్రీవునితోను విభీషణుని తోను కూడిన, కపయః=వానరులు, శత్రుమ్=శత్రువును, పరాజితమ్=ఓడింపబడిన వానినిగా, దృష్ట్వా=చూచి, ప్రహృష్టాః=సంతోషించినవారై, సాధు సాధ్వితి=బాగు బాగు అని, నేదుశ్చ=ధ్వనిచేసిరి.

తా. అప్పుడు సుగ్రీవవిభీషణులతో సహా వానరులందరూ శత్రువు ఓడింపబడుటను చూచి సంతోషించుచు "బాగు బాగు" అని పలికిరి. 33

మూ. ఇన్ద్రజిత్తు తదానేన నిర్జితో భీమకర్మణా,
సంయుగే వాలిపుత్రేణ క్రోధం చక్రే సుదారుణమ్. 34

ప్ర. అ. తదా=అప్పుడు, భీమకర్మణా=భయంకరమైన కర్మగల, అనేన వాలి పుత్రేణ=ఈ వాలిపుత్రునిచేత, సంయుగే=యుద్ధమునందు, నిర్జితః=జయింపబడిన, ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తైతే, సుదారుణమ్=చాల భయంకరమైన, క్రోధమ్=క్రోధమును, చక్రే=చేసెను.

తా. అప్పుడు భయంకరమైన కర్మ గల అంగదుడు యుద్ధములో ఓడింపగా ఇంద్రజిత్తునకు అతి తీవ్రమైన కోపము కలిగెను. 34

మూ. సోఽన్తర్ధానగతః పాపో రావణీ రణకర్కశః,
అదృశ్యో నిశితాన్ బాణాన్ ముమోచాశనివర్చసః. 35

ప్ర. అ. పాపః=పాపాత్ముడు, రణకర్కశః=యుద్ధమునందు క్రూరుడు అయిన, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, అదృశ్యః=కనబడనివాడై, అశనివ ర్చసః=వజ్రమువంటి కాంతి గల, నిశితాన్=వాడియైన, బాణాన్=బాణములను, ముమోచ=విడిచెను.

తా. పాపాత్ముడు, యుద్ధమునందు క్రూరుడూ అయిన ఆ రావణకు మారుడైన ఇంద్రజిత్తు అంతర్ధానము చెంది వజ్రాయుధము వంటి వాడియైన బాణములను విడిచెను. 35

మూ. రామం చ లక్ష్మణం చైవ ఘోరైర్నాగమయైః శరైః,
బిభేద సమరే క్రుద్ధః సర్వగాత్రేషు రాఘవౌ. 36

ప్ర. అ. క్రుద్ధః=కోపించినవాడై, సమరే=యుద్ధమునందు, ఘోరైః=భ యంకరములైన, నాగమయైః=సర్పరూపములైన, శరైః=బాణములచేత, రాఘవౌ=రఘువంశమందుపుట్టిన, రామం చ=రాముణ్ణి, లక్ష్మణం చైవ=లక్ష్మణుణ్ణి,

సర్వగాత్రేషు=అన్ని అవయవములయందు, బిభేద=భేదించెను.

తా. అతడు కోపించి ఆ యుద్ధములో భయంకరములైన సర్పరూపములైన బాణములతో, రామలక్ష్మణుల అవయవములను అన్నింటిని చీల్చివేసెను. 36

మూ. మాయయా సంవృతస్తత్ర మోహయన్ రాఘవౌ యుధి,
అదృశ్యః సర్వభూతానాం కూటయోధీ నిశాచరః, 37
బబన్ధ శరబన్ధేన భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. కూటయోధీ=కపటముతో యుద్ధము చేయు, నిశాచరః=ఆ రాక్షసుడు, తత్ర=అక్కడ, యుధి=యుద్ధమునందు, మయయా=మాయచేత, సంవృతః=కప్పబడినవాడై, రాఘవౌ=రామలక్ష్మణులను, మోహయన్=మోహింపచేయుచు, సర్వభూతానామ్=సమస్తభూతములకు, అదృశ్యః=కనబడనివాడై, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, శరబన్ధేన=బాణబంధముచేత, బబన్ధ=బంధించెను.

తా. కపటయుద్ధము చేయు ఆ రాక్షసుడు మాయచేత కప్పబడినవాడై ఏ భూతములకు కనబడనివాడుగా ఉండి, యుద్ధమునందు రామలక్ష్మణులను మోహగించుచు, ఆ సోదరు లిద్దరినీ శరబంధముచేత బంధించెను. 37

మూ. తేన తౌ పురుషవ్యాఘ్రౌ క్రుద్ధేనాశీవిషైః శరైః, 38
సహసాభిహతౌ వీరౌ తదా ప్రైక్షన్త వానరాః.

ప్ర. అ. తదా=అప్పుడు, వానరాః=వానరులు, క్రుద్ధేన=కోపించిన, తేన=వానిచేత, ఆశీవిషైః=సర్పములైన, శరైః=బాణములచేత, సహసా=శీఘ్రముగా, అభిహతౌ=కొట్టబడిన, వీరౌ=వీరులైన, పురుషవ్యాఘ్రౌ=పురుషులలో శ్రేష్ఠులైన, తౌ= ఆ రామలక్ష్మణులను, ప్రైక్షన్త=చూచిరి.

తా. కోపించిన ఆ ఇంద్రజిత్తు వెంటనే సర్పబాణములను ప్రయోగించి పురుషశ్రేష్ఠులైన ఆ వీరులైన రామలక్ష్మణులను బంధించుటను వానరులు చూచిరి. 38

మూ. ప్రకాశరూపస్తు తదా న శక్త
స్తౌ బాధితుం రాక్షసరాజపుత్రః,
మాయాం ప్రయోక్తుం సముపాజగామ
బబన్ధ తౌ రాజసుతౌ దురాత్మా. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షసరాజపుత్రః=ఇంద్రజిత్తు, ప్రకాశరూపః=క

వలదురూపము గలవాడై, తౌ=ఆ రామలక్ష్మణులను, బాధితుమ్=బాధించుటకు, న శక్తః=అసమర్థుడై, మాయామ్=మాయను, ప్రయోక్తుమ్=ప్రయోగించుటకు, సముపాజగామ=వచ్చెను. దురాత్మా=దుర్బుద్ధి గల ఆతడు, తౌ=ఆ, రాజసుతౌ=రాజకుమారులను, బబన్ధ=బంధించెను.

తా. ఆ దురాత్ముడైన ఇంద్రజిత్తు ఎదురుగా నిలబడి ఆ రామలక్ష్మణులను బాధింపజాలక, మాయను ప్రయోగించుచు ఆ రాజకుమారు లిద్దరినీ బంధించెను.

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో నలుబదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చచత్వారింశః సర్గః

[ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణములచేత రామలక్ష్మణులు సంజ్ఞ కోల్పోవుట; వానరులు శోకించుట.]

మూ. స తస్య గతిమన్విచ్ఛన్ రాజపుత్రః ప్రతాపవాన్,
దిదేశాతిబలో రామో దశ వానరయూథపాన్. 1

ప్ర. అ. రాజపుత్రః=దశరథపుత్రుడు, ప్రతాపవాన్=ప్రతాపవంతుడు, అతిబలః= గొప్ప బలము గలవాడు అయిన, సః రామః=ఆ రాముడు, తస్య=వానియొక్క, గతిమ్= మార్గమును, అన్విచ్ఛన్=వెదకుచు, దశ=పదిమంది, వానరయూథపాన్= వానర సేనానాయకులను, దిదేశ=ఆజ్ఞాపించెను.

తా. ప్రతాపవంతుడు, మహాబలశాలి అయిన ఆ దశరథపుత్రుడైన రాముడు ఆ రాక్షసుని మార్గమును తెలిసికొనుటకై పదిమంది వానరసేనానాయకులను ఆజ్ఞాపించెను. 1

మూ. ద్వౌ సుషేణస్య దాయాదౌ నీలం చ ప్లవగాధిపమ్,
అఙ్గదం వాలిపుత్రం చ శరభం చ తరస్వినమ్. 2
ద్వివిదం చ హనూమన్తం సానుప్రస్థం మహాబలమ్,
ఋషభం చర్షభస్కన్ధమాదిదేశ పరన్తపః. 3

ప్ర. అ. పరన్తపః=శత్రువులను పీడించు ఆ రాముడు, సుషేణస్య=సుషేణునియొక్క, ద్వౌ=ఇద్దరు, దాయాదౌ=పుత్రులను, ప్లవగాధిపమ్=వానరనాయకుడైన, నీలం చ= నీలుణ్ణి, వాలిపుత్రమ్=వాలిపుత్రుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, తరస్వినమ్=బలము గల, శరభం చ=శరభుణ్ణి, ద్వివిదం చ=ద్వివిదుణ్ణి, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, మహాబలమ్=గొప్ప బలము గల, సానుప్రస్థమ్=సానుప్రస్థుణ్ణి, ఋషభం చ=ఋషభుణ్ణి, ఋషభస్కన్ధమ్=ఋషభస్కంధుణ్ణి, ఆదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు సుషేణుని కుమారులను ఇద్దరిని వానరనాయకుడైన నీలుణ్ణి, వాలిపుత్రుడైన అంగదుణ్ణి, బలము గల శరభుణ్ణి, ద్వివిదుణ్ణి, హనుమంతుణ్ణి, గొప్ప బలము గల సానుప్రస్థుణ్ణి, ఋషభుణ్ణి, ఋషభస్కంధుణ్ణి ఆజ్ఞాపించెను. 2, 3

మూ. తే సంప్రహృష్టా హరయో భీమానుద్యమ్య పాదపాన్,
ఆకాశం వివిశుః సర్వే మార్గమాణా దిశో దశ. 4

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే హరయః=ఆ వానరులు, సంప్రహృష్టాః= ఉత్సాహముకలవారై, భీమాన్=భయంకరములైన, పాదపాన్=వృక్షములను, ఉద్యమ్య=ఎత్తి, దశ=పది, దిశః=దిక్కులను, మార్గమాణాః=వెదకుచున్నవారై, ఆకాశమ్=ఆకాశమును, వివిశుః=ప్రవేశించిరి.

తా. ఆ వానరులందరు ఉత్సాహముతో భయంకరములైన వృక్షములను ధరించి పది దిక్కులను వెదకుచు ఆకాశములో ప్రవేశించిరి. 4

మూ. తేషాం వేగవతాం వేగమిషుభిర్వేగవత్తరైః,
అస్త్రవిత్పరమాస్త్రైస్తు వారయామాస రావణిః. 5

ప్ర. అ. అస్త్రవిత్=అస్త్రములను ఎరిగిన, రావణిః=రావణ కుమారుడు, పరమాస్త్రైః=గొప్ప అస్త్రములు గల, వేగవత్తరైః=అధికమైన వేగము గల, ఇషుభిః= బాణములచేత, వేగవతామ్=వేగవంతులైన, తేషామ్=వారియొక్క, వేగమ్=వేగమును, వారయామాస=నివారించెను.

తా. అస్త్రములు ఎరిగిన ఆ ఇంద్రజిత్తు అస్త్రములతో సంధించిన, మంచి వేగము గల బాణములచేత వేగవంతులైన ఆ వానరుల వేగమును శమింపచేసెను. 5

మూ. తం భీమవేగా హరయో నారాచైః క్షతవిగ్రహాః,
అన్ధకారే న దదృశుర్మేఘైః సూర్యమివావృతమ్. 6

ప్ర. అ. నారాచైః=నారాచబాణములచేత, క్షతవిగ్రహాః=కొట్టబడిన శరీరములు గల, భీమవేగాః=భయంకరమైన వేగము గల, హరయః=వానరులు, అన్ధకారే=చీకటియందు, తమ్=వానిని, మేఘైః=మేఘములచేత, ఆవృతమ్=కప్పబడిన, సూర్యమివ=సూర్యునివలె, న దదృశుః=చూడలేదు.

తా. నారాచబాణములచేత గాయపరుపబడిన శరీరములు గల, భయంకరమైన వేగము గల వానరులు, ఆ ఇంద్రజిత్తును, మేఘములచేత కప్పబడిన సూర్యుని వలె, అంధకారములో చూడలేకపోయిరి. 6

మూ. రామలక్ష్మణయోరేవ సర్వదేహభిదః శరాన్,
భృశమావేశయామాస రావణిః సమితింజయః.

ప్ర. అ. సమితింజయః=యుద్ధమును జయించు, రావణిః=రావణ కుమారుడు, సర్వదేహభిదః=సమస్తదేహమును భేదించు, శరాన్=బాణములను, భృశమ్=అధికముగా, రామలక్ష్మణయోరేవ=రామలక్ష్మణులయందే, ఆవేశయామాస=ప్రవేశపెట్టెను.

తా. యుద్ధమునందు జయించు ఆ ఇంద్రజిత్తు సమస్తదేహమును ఛేదించివేయునట్లు బాణములను రామలక్ష్మణుల శరీరములందే గ్రుచ్చుకొనునట్లుగా మాటి మాటికి ప్రయోగించెను. 7

మూ. నిరన్తరశరీరౌ తు తావుభౌ రామలక్ష్మణౌ,
క్రుద్ధేనేన్ద్రజితా వీరౌ పన్నగైః శరతాం గతైః. 8

ప్ర. అ. వీరౌ=వీరులైన, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ఉభౌ=ఇద్దరూ, క్రుద్ధేన=కోపించిన, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, శరతామ్=బాణత్వమును, గతైః=పొందిన, పన్నగైః=సర్పములచేత, నిరన్తరశరీరౌ=అవకాశము లేని శరీరములు కలవారుగా చేయుబడిరి.

తా. కోపించిన ఇంద్రజిత్తు బాణములుగా అయిన సర్పములతో వీరులైన ఆ రామలక్ష్మణుల శరీరముల మీద ఎక్కడా చోటు మిగలకుండా కొట్టెను. 8

మూ. తయోః క్షతజమార్గేణ సుస్రావ రుధిరం బహు,
తావుభౌ చ ప్రకాశేతే పుష్పితావివ కింశుకౌ. 9

ప్ర. అ. తయోః=వారిద్దరియొక్క, క్షతజమార్గేణ=రక్తమార్గమునుండి, బహు=అధికమైన, రుధిరమ్=రక్తము, సుస్రావ=స్రవించెను. తౌ=ఆ, ఉభౌ=ఇద్దరూ, పుష్పితౌ=పుష్పించిన, కింశుకౌ ఇవ=మోదుగచెట్ల వలె, ప్రకాశేతే=ప్రకాశించిరి.

తా. ఆ ఇద్దరి శరీరమునుండి అత్యధికముగా రక్తము స్రవించెను. ఆ రామలక్ష్మణులు అప్పుడు పుష్పించిన మోదుగ చెట్ల వలె ప్రకాశించిరి. 9

మూ. తతః పర్యన్తరక్తాక్షో భిన్నాఞ్జనచయోపమః,
రావణిర్భ్రాతరౌ వాక్యమన్తర్ధానగతోఽబ్రవీత్. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పర్యన్తరక్తాక్షః=చివర్లయందు ఎఱ్ఱనైన నేత్రములు కలవాడు, భిన్నాఞ్జనచయోపమః=పెడగొట్టిన కాటుక కుప్పతో సమానుడు అయిన, రావణిః=ఇంద్రజిత్తు, అన్తర్ధానగతః=అంతర్ధానము పొందినవాడై, భ్రాతరౌ=ఆ సోదరులనుగూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట, కొనలయందు ఎఱ్ఱగా ఉన్న నేత్రములు గలవాడు, పెడగొట్టిన కాటుక కుప్పతో సమానుడు అయిన ఇంద్రజిత్తు అంతర్హితుడుగానే ఉండి రామలక్ష్మణులతో ఇట్లు పలికెను. 10

మూ. యుధ్యమానమనాలక్ష్యం శక్రోఽపి త్రిదశేశ్వరః,
ద్రష్టుమాసాదితుం వాపి న శక్తః కిం పునర్యువామ్. 11

ప్ర. అ. అనాలక్ష్యమ్=కనబడని, యుధ్యమానమ్=యుద్ధము చేయు

మన్న నన్ను, త్రిదశేశ్వరః=దేవతల ప్రభువైన, శక్రోఽపి=దేవేంద్రుడు కూడ, ద్రష్టుమ్=చూచుటకు గాని, ఆసాదితుం వాఽపి=పొందుటకు గాని, న శక్తః=సమర్థుడు కాడు. యువామ్=మీరిద్దరూ, కిం పునః=చెప్పనేల?

తా. నేను అంతర్ధానము చెంది యుద్ధము చేయుచున్నప్పుడు దేవతల ప్రభువైన ఇంద్రుడు కూడ చూడజాలడు; సమీపించజాలడు. ఇంక మీ మాట చెప్పవలెనా! 11

మూ. ప్రావృతావిషుజాలేన రాఘవౌ కఙ్కపత్రిణా,
ఏష రోషపరీతాత్మా నయామి యమసాదనమ్. 12

ప్ర. అ. రాఘవౌ=రామలక్ష్మణులారా! కఙ్కపత్రిణా=గ్రద్దల రెక్కలు గల, శరజాలేన= బాణసమూహముచేత, ప్రావృతౌ=కప్పబడిన మిమ్ములను, రోషపరీతాత్మా=రోషముతో కూడిన మనస్సు గల, ఏషః=ఈ నేను, యమసాదనమ్=యముని గృహమును, నయామి= పొందించెదను.

తా. ఓ రామలక్ష్మణులారా! కోపముతో నిండిన మనస్సు గల ఈ నేను గ్రద్ద రెక్కలు కట్టిన బాణముల సమూహముచేత మీ ఇద్దరినీ కప్పివేసి యమలోకమునకు పంపెదను. 12

మూ. ఏవముక్త్వా తు ధర్మజ్ఞౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
నిర్బిభేద శితైర్బాణైః ప్రజహర్ష ననాద చ. 13

ప్ర. అ. ధర్మజ్ఞౌ=ధర్మము నెరిగిన, భ్రాతరౌ=సోదరులైన, రామల క్ష్మణౌ= రామలక్ష్మణులను గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, శితైః=వాడియైన, బాణైః= బాణములచేత, నిర్బిభేద=భేదించెను; ప్రజహర్ష=సంతోషించెను; ననాద చ=ధ్వని చేసెను కూడ.

తా. ధర్మవేత్తలైన ఆ సోదరులైన రామలక్ష్మణులతో ఇట్లు పలికి, అతడు వాడియైన బాణాలతో భేదించెను. ఆనందములో సింహనాదము చేసెను.

మూ. భిన్నాఞ్జనచయశ్యామో విస్ఫార్య విపులం ధనుః,
భూయ ఏవ శరాన్ ఘోరాన్ విససర్జ మహామృధే. 14

ప్ర. అ. భిన్నాఞ్జనచయశ్యామః=పిడగొట్టబడిన కాటుక ముద్ద వలె నల్లనైన ఆ ఇంద్రజిత్తు, విపులమ్=పెద్దదైన, ధనుః=ధనస్సును, విస్ఫార్య=వంచి, మహా మృధే= మహాయుద్ధమునందు, భూయ ఏవ=మరల, ఘోరాన్=భయంకరములైన, శరాన్= బాణములను, విససర్జ=విడచెను.

తా. కాటుకకొండవంటి నల్లని శరీరము గల ఇంద్రజిత్తు పెద్దదైన

ధనస్సును వంచుచు ఆ మహాయుద్ధమునందు మరల భయంకరములైన బాణములను ప్రయోగించెను. 14

మూ. తతో మర్మసు మర్మజ్ఞో మజ్జయన్నిశితాన్ శరాన్,
రామలక్ష్మణయోర్వీరో ననాద చ ముహుర్ముహుః. 15

ప్ర. అ. మర్మజ్ఞః=మర్మస్థానములను ఎఱిగిన, వీరః=వీరుడైన ఇంద్రజిత్తు, తతః= అటుపిమ్మట, రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, మర్మసు=మర్మస్థానములయందు, నిశితాన్=వాడియైన, శరాన్=బాణములను, మజ్జయన్=దింపుచు, ముహుర్ముహుః= మాటిమాటికి, ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. మర్మస్థానములు తెలిసిన ఆ వీరుడైన ఇంద్రజిత్తు రామలక్ష్మణుల మర్మస్థానములయందు మాటిమాటికి బాణములు దిగగొట్టుచు ధ్వని చేసెను.

మూ. బద్ధౌ తు శరబన్ధేన తావుభౌ రణమూర్ధని,
నిమేషాన్తరమాత్రేణ న శేకతురవేక్షితుమ్. 16

ప్ర. అ. రణమూర్ధని=రణరంగాగ్రభాగమునందు, నిమేషాన్తరమాత్రేణ=రెప్పపాటు కాలముచేత, బద్ధౌ=కట్టబడిన, తౌ ఉభౌ=వారిద్దరూ, అవేక్షితుమ్=చూచుటకు, న శేకతుః=సమర్థులు కాలేదు.

తా. యుద్ధరంగమునందు నిమేషకాలములో ఈ శరబంధముచేత కట్టబడిన ఆ రామలక్ష్మణులు చూడలేకపోయిరి. 16

మూ. తతో విభిన్నసర్వాఙ్గౌ శరశల్యాచితౌ కృతౌ,
ధ్వజావివ మహేన్ద్రస్య రజ్జుముక్తౌ ప్రకమ్పితౌ. 17
తౌ సమ్ప్రచలితౌ వీరౌ మర్మభేదేన కర్శితౌ,
నిపేతతుర్మహేష్వాసౌ జగత్యాం జగతీపతీ. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విభిన్నసర్వాఙ్గౌ=భేదింపబడిన సమస్త శరీరములు కలవారు, శరశల్యాచితౌ=శరముల ములికిచేత వ్యాప్తమైనవారుగా, కృతౌ=చేయబడినవారు, రజ్జుముక్తౌ=త్రాడులచేత విడువబడిన, ప్రకమ్పితౌ=కదలుచున్న, మహేన్ద్రస్య ధ్వజావివ= ఇంద్రధ్వజములవలె, సంప్రచలితౌ=కదలిపోయినవారు, వీరౌ=వీరులు, మర్మభేదేన= మర్మస్థానములను భేదించుటచేత, కర్శితౌ=కృశింపచేయబడినవారు, మహేష్వాసౌ=గొప్ప ధనస్సులు గలవారు అయిన, జగతీపతీ=భూమికి ప్రభువులైన, తౌ=ఆ రామలక్ష్మణులు, జగత్యామ్=నేలమీద, నిపేతతుః=పడిరి.

తా. మహాధనుర్ధరులైన ఆ రాజకుమారులైన రామలక్ష్మణుల శరీరములు పూర్తిగా తూట్లుపడి బాణముల ములికిలతో నిండి యుండెను. మర్మస్థానములను చీల్చి వేయుటచే పీడితులైన ఆ వీరులు త్రాళ్లు విప్పివేసిన ఇంద్రధ్వజముల వలె కదలిపోవుచు నేలపై ఒరిగిరి. 17, 18

మూ. తౌ వీరశయనే వీరౌ శయానౌ రుధిరోక్షితౌ,
శరవేష్టితసర్వాఙ్గావార్తౌ పరమపీడితౌ. 19

ప్ర. అ. వీరశయనే=వీరశయనమునందు, శయానౌ=శయనించుచున్నవారు, రుధిరోక్షితౌ=రక్తముచేత తడుపబడినవారు, శరవేష్టితసర్వాఙ్గౌ=శరములచేత కప్పివేయబడిన సకలశరీరము గలవారు, పరమపీడితౌ=మిక్కిలి పీడితులైన, తౌ వీరౌ=ఆ వీరులు, ఆర్తౌ=దుఃఖితులైరి.

తా. వీరులైన ఆ రామలక్ష్మణుల శరీరములు పూర్తిగా బాణములచేత కప్పబడి యుండెను. మిక్కిలి పీడింపబడి దుఃఖితులైన వారిద్దరు వీరశయనము మీద శయనించిరి. (మహావీరుడు నేలపై పడిపోవుటను వీరశయనముమీద శయనించుట అని కవులు వర్ణింతురు.) 19

మూ. న హ్యవిద్ధం తయోర్గాత్రే బభూవాఙ్గులమన్తరమ్,
నానిర్భిన్నం న చాస్తబ్ధమాకరాగ్రాదజిహ్మగైః. 20

ప్ర. అ. తయోః=వారియొక్క, గాత్రే=శరీరమునందు, అవిద్ధమ్=కొట్టబడని, అఙ్గులమాత్రమ్=అంగుళప్రమాణము గల, అన్తరమ్=చోటు కూడ, న బభూవ=లేకుండెను. అజిహ్మగైః=బాణములచేత, ఆకరాగ్రాత్=వేలి చివరిభాగము మొదలు, అనిర్భిన్నమ్=భేదింపబడనిది, న=లేకుండెను. అస్తబ్ధమ్=కదలకుండచేయబడనిది, న=లేకుండెను.

తా. వారి శరీరములయందు అంగుళము మాత్రము చోటు కూడ దెబ్బలు తగలనిది లేదు. వేలి చివరి భాగమువరకు బాణములచేత తూట్లు పడునట్లు చేయబడని భాగముగాని, కదలకుండునట్లు చేయబడని భాగము గాని లేకుండెను. 20

మూ. తౌ తు క్రూరేణ నిహతౌ రక్షసా కామరూపిణా,
అసృక్ సుస్రువతుస్తీవ్రం జలం ప్రస్రవణావివ. 21

ప్ర. అ. క్రూరేణ=క్రూరుడు, కామరూపిణా=కామరూపము గలవాడు అయిన, రక్షసా=రాక్షసునిచేత, నిహతౌ=కొట్టబడిన, తౌ=ఆ రామలక్ష్మణులు, ప్రస్రవణౌ=ప్రస్రవణపర్వతములు, జలమ్ ఇవ=జలమును వలె, తీవ్రమ్=తీవ్రమైన, అసృక్=రక్తమును, సుస్రువతుః=స్రవించిరి.

తా. క్రూరుడు, స్వేచ్ఛానుసారము రూపములు ధరించ సమర్థుడు అయిన ఆ రాక్షసునిచే కొట్టబడి ఆ రామలక్ష్మణులు ప్రస్రవణపర్వతములు జలమును స్రవించినట్లు అధికమైన రక్తమును స్రవించిరి. 21

మూ. పపాత ప్రథమం రామో విద్ధో మర్మసు మార్గణైః,
క్రోధాదిన్ద్రజితా యేన పురా శక్రో వినిర్జితః. 22

ప్ర. అ. యేన=ఎవనిచేత, పురా=పూర్వము, శక్రః=దేవేంద్రుడు, వినిర్జితః=జయింపబడినాడో అట్టి, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, క్రోధాత్=కోపమువలన, మార్గణైః= బాణములచేత, మర్మసు=మర్మస్థానములందు, విద్ధః=కొట్టబడిన, రామః=రాముడు, ప్రథమమ్=ముందుగా, పపాత=పడెను.

తా. పూర్వము ఇంద్రుణ్ణి జయించిన ఆ ఇంద్రజిత్తు కోపముతో బాణములచేత మర్మస్థానములందు కొట్టుటచే ముందుగా రాముడు నేలపై పడిపోయెను. 22

మూ. రుక్మపుఙ్ఖైః ప్రసన్నాగ్రైరధోగతిభిరాశుగైః,
నారాచైరర్ధనారాచైర్భల్లైరఞ్జలికైరపి, 23
వివ్యాధ వత్సదన్తైశ్చ సింహదంష్ట్రైః క్షురైస్తథా.

ప్ర. అ. రుక్మపుఙ్ఖైః=బంగారు పొన్నులు గలవి, ప్రసన్నాగ్రైః=నిర్మలమైన (వాడియైన) కొనలు గలవి, అధోగతిభిః=క్రిందికి పడునవి, ఆశుగైః=శీఘ్రముగా వెళ్లునవి అయిన, నారాచైః=నారాచములచేతను, అర్ధనారాచైః=మధ్యయందు రెండుగా చీలిన నారాచములచేతను, భల్లైః=వెడల్పైన అగ్రముగల భల్లబాణములచేతను, అఞ్జలికైరపి=దోసిళ్లవంటి అగ్రభాగములు గల బాణములచేతను, వత్సదన్తైశ్చ=లేగదూడల పండ్లవంటి అగ్రభాగములు గల బాణములచేతనూ, సింహదంష్ట్రైః=సింహము కోరల వంటి అగ్రములు గల బాణములచేతను, తథా=మరియు, క్షురైః=మంగలి కత్తుల వంటి అగ్రములు గల బాణములచేతను, వివ్యాధ=కొట్టెను.

తా. నాగపాశములచేత బంధించిన పిమ్మట కూడ ఆ ఇంద్రజిత్తు బంగారు పొన్నులు, వాడియైన కొనలు గల పైనుండి క్రిందికి శీఘ్రముగా పడుచున్న నారాచ - అర్ధనారాచ - భల్ల - అంజలిక - వత్సదంత - సింహదంష్ట్ర - క్షుర బాణములతో రాముణ్ణి కొట్టెను. 23

మూ. స వీరశయనే శిశ్యే విజ్యమావిధ్య కార్ముకమ్, 24
భిన్నముష్టిపరీణాహం త్రినతం రుక్మభూషితమ్.

ప్ర. అ. సః=ఆ రాముడు, విజ్యమ్=ఊడిపోయిన నారి గలది, భిన్నముష్టి

పరీణాహమ్=విడిపోయిన పిడికిలి పట్టు గలది, త్రినతమ్=మూడు భాగములయందు వంగినది, రుక్మభూషితమ్=బంగారముచేత అలంకరింపబడినదీ అయిన, కార్ముకమ్=ధనస్సును, అవిధ్య=దూరముగా పడవేసి, వీరశయనే=వీరశయనమునందు, శిశ్యే=శయనించెను.

తా. బంగారముచేత అలంకరింపబడి, మూడు ప్రదేశములలో వంపులు గల ధనస్సు నారి ఊడిపోయి, పిడికిలి పట్టు జారిపోవుటచే రాముని చేతినుండి దూరముగా పడిపోయెను. ఆ విధముగా ధనస్సును దూరముగా పడవేసి రాముడు వీరశయనముమీద శయనించెను. 24

మూ. బాణపాతాన్తరే రామం పతితం పురుషర్షభమ్, 25
స తత్ర లక్ష్మణో దృష్ట్వా నిరాశో జీవితేఽభవత్.

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, తత్ర=అక్కడ, బాణపాతాన్తరే=బాణము పడు దూరమునందు, పతితమ్=పడిపోయిన, పురుషర్షభమ్=పురుషశ్రేష్ఠుడైన రాముణ్ణి, దృష్ట్వా=చూచి, జీవితే=జీవితమునందు, నిరాశః=ఆశ లేనివాడు, అభవత్=అయెను.

తా. ధనస్సునుండి విడచిన బాణము పడునంత దూరములో పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడు పడిపోవుట చూచి లక్ష్మణుడు జీవితమునందు ఆశను వదలుకొనెను. 25

మూ. రామం కమలపత్రాక్షం శరబన్ధపరిక్షతమ్, 26
శుశోచ భ్రాతరం దృష్ట్వా పతితం ధరణీతలే.

ప్ర. అ. కమలపత్రాక్షమ్=పద్మపత్రములవంటి నేత్రములు గల, భ్రాతరమ్=సోదరుడైన, రామమ్=రాముణ్ణి, శరబన్ధపరిక్షతమ్=శరబంధముచేత కొట్టబడినవాణ్ణి, ధరణీతలే=నేలమీద, పతితమ్=పడిపోయినవానినిగా, దృష్ట్వా=చూచి, శుశోచ=దుఃఖించెను.

తా. కమలపత్రములవంటి నేత్రములు గల సోదరుడైన రాముడు శరబంధముచేత గాయపడి నేలపై పడిపోవుట చూచి అతడు దుఃఖించెను. 26

మూ. హరయశ్చాపి తం దృష్ట్వా సన్తాపం పరమం గతాః, 27
శోకార్తాశ్చుక్రుశుర్ఘోరమశ్రుపూరితలోచనాః.

ప్ర. అ. హరయశ్చాపి=వానరులు కూడ, తమ్=ఆ రాముణ్ణి, దృష్ట్వా=చూచి, పరమమ్=గొప్ప, సన్తాపమ్=సంతాపమును, గతాః=పొందినవారై, శోకార్తాః=శోకముచేత పీడితులై, అశ్రుపూరితలోచనాః=కన్నీళ్లచేత నింపబడిన నేత్రములు గలవారై, ఘోరమ్=ఘోరముగా, చుక్రుశుః=ఏడ్చిరి.

తా. వానరులు రాముణ్ణి చూచి చాల దుఃఖము చెంది, శోకముచేత పీడింపబడినవారై కన్నీళ్లు కార్చుచు గొప్ప ధ్వని కలుగునట్లు ఏడ్చిరి. 27

మూ. బద్ధౌ తు తౌ వీరశయే శయానౌ
తే వానరాః సంపరివార్య తస్థుః,
సమాగతా వాయుసుతప్రముఖ్యా
విషాదమార్తాః పరమం చ జగ్ముః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చచత్వారింశః సర్గః.

ప్ర. అ. వాయుసుతప్రముఖ్యాః=హనుమంతుడు మొదలైన, తే వానరాః=ఆ వానరులు, సమాగతాః=ఒక్కచోట చేరినవారై, బద్ధౌ=బద్ధులైన, వీరశయే=వీరశయనమునందు, శయానౌ=శయనించి ఉన్న, తౌ=ఆ రామలక్ష్మణులను, సంపరివార్య=చుట్టి, తస్థుః=నిలచిరి. ఆర్తాః=పీడితులై, పరమమ్=గొప్ప, విషాదమ్=దుఃఖమును, జగ్ముః చ=పొందిరి.

తా. హనుమంతుడు మొదలైన వానరులు చేరి బద్ధులై వీరశయనముమీద శయనించి ఉన్న ఆ రామలక్ష్మణులను చుట్టూ నిలబడి దుఃఖపీడితులై ఉండిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్చత్వారింశః సర్గః

[మూర్ఛితులైన రామలక్ష్మణులను చూచి వానరులు దుఃఖించుట; ఇంద్రజిత్తు ఆనందముతో బిగ్గరగా చెప్పుకొనుట; విభీషణుడు సుగ్రీవునకు ధైర్యము చెప్పుట; ఇంద్రజిత్తు లంకలో ప్రవేశించి తండ్రికి శత్రువధవృత్తాంతమును చెప్పుట; రావణుడు సంతోషించి పుత్రుని అభినందించుట.]

మూ. తతో ద్యాం పృథివీం చైవ వీక్షమాణా వనౌకసః,
దదృశుః సంతతౌ బాణైర్భ్రాతరౌ రామలక్ష్మణౌ. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ద్యామ్=ఆకాశమును, పృథివీం చైవ=భూమిని, వీక్షమాణాః=చూచుచున్నవారై, వనౌకసః=వానరులు, బాణైః=బాణములతో, సంతతౌ=నిండి యున్న, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, దదృశుః=చూచిరి.

తా. పిమ్మట వానరులు ఆకాశము వైపు భూమి వైపు చూచుచు, పూర్తిగా బాణములతో కప్పబడి ఉన్న సోదరులైన రామలక్ష్మణులను చూచిరి. 1

మూ. వృష్ట్వేవోపరతే దేవే కృతకర్మణి రాక్షసే,
అజగామాథ తం దేశం ససుగ్రీవో విభీషణః. 2

ప్ర. అ. దేవే=పర్జన్యుడు, వృష్ట్వేవ=వర్షించినవలె, రాక్షసే=రాక్షసుడు, కృతకర్మణి=చేయబడిన కర్మగలవాడై, ఉపరతే=శమించినవా డగుచుండగా, అథ=అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, ససుగ్రీవః=సుగ్రీవునితో కూడినవాడై, తం దేశమ్=ఆ ప్రదేశమునుగూర్చి, అజగామ=వచ్చెను.

తా. దేవుడైన పర్జన్యుడు వర్షించి శమించినట్లు ఇంద్రజిత్తు తన పని ముగించుకొని విరమించగా సుగ్రీవునితో కూడ విభీషణుడు ఆ ప్రదేశమునకు వచ్చెను. 2

మూ. నీలద్వివిదమైన్దాశ్చ సుషేణః కుముదోఽఙ్గదః,
తూర్ణం హనుమతా సార్థమన్వశోచన్త రాఘవౌ. 3

ప్ర. అ. నీలశ్చ=నీలుడు, ద్వివిదః=ద్వివిదుడు, మైన్దః=మైందుడు, సుషేణః=సుషేణుడు, కుముదః=కుముదుడు, అఙ్గదః=అంగదుడు, హనుమతా సార్థమ్=హనుమంతునితో కూడ, తూర్ణమ్=శీఘ్రముగా, రాఘవౌ=రామలక్ష్మణులను గూర్చి, అన్వశోచన్త=దుఃఖించిరి.

తా. నీలుడు, ద్వివిదుడు, మైందుడు, సుషేణుడు, కుముదుడు, అంగదుడు హనుమంతునితో కలిసి రామలక్ష్మణులను గూర్చి దుఃఖించిరి. 3

మూ. అవేష్టౌ మన్దనిఃశ్వాసౌ శోణితేన పరిప్లుతౌ,
శరజాలాచితౌ స్తబ్ధౌ శయానౌ శరతల్పగౌ. 4

నిఃశ్వసన్తౌ యథా సర్పౌ నిశ్చేష్టౌ మన్దవిక్రమౌ,
రుధిరస్రావదిగ్ధాఙ్గౌ తాపనీయావివ ధ్వజౌ. 5

తౌ వీరశయనే వీరౌ శయానౌ మన్దచేష్టితౌ,
యూథపైః స్వైః పరివృతౌ బాష్పవ్యాకులలోచనైః. 6

రాఘవౌ పతితౌ దృష్ట్వా శరజాలసమన్వితౌ,
బభూవుర్వ్యథితాః సర్వే వానరాః సవిభీషణాః. 7

ప్ర. అ. అవేష్టౌ=చేష్టలేనివారు, మన్దనిఃశ్వాసౌ=మందమైన శ్వాస గలవారు, శోణితేన=రక్తముచేత, పరిప్లుతౌ=నింపబడినవారు, శరజాలాచితౌ=బాణసముదాయముతో నిండినవారు, స్తబ్ధౌ=కదలనివారు, శయానౌ=శయనించి ఉన్నవారు, శరతల్పగౌ=శరతల్పముమీద ఉన్నవారు, సర్పౌ యథా=సర్పముల వలె, నిఃశ్వసన్తౌ=నిట్టూర్పుచున్నవారు, నిశ్చేష్టౌ=నిశ్చేష్టులు, మన్దవిక్రమౌ=మందమైన పరాక్రమము గలవారు, రుధిరస్రావదిగ్ధాఙ్గౌ=రక్తప్రవాహముచేత పూయబడిన శరీరములు గలవారు, తాపనీయౌ=బంగారము వికారమైన, ధ్వజౌ ఇవ=ధ్వజముల వలె ఉన్నవారు, వీరశయనే=వీరశయనమునందు, శయానౌ=శయనించినవారు, వీరౌ=వీరులు, మన్దచేష్టితౌ=మందమైన చేష్టలు గలవారు, బాష్పవ్యాకులలోచనైః=కన్నీళ్లతో వ్యాకులమైన నేత్రములు గల, స్వైః=తమ సంబంధమైన, యూథపైః=సేనానాయకులచేత, పరివృతౌ=చుట్టబడి ఉన్నవారు, శరజాలసమన్వితౌ=బాణసముదాయములతో కూడినవారు అయిన, తౌ రాఘవౌ=ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా=చూచి, సవిభీషణాః=విభీషణునితో కూడిన, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, వ్యథితాః=వ్యథచెందినవారుగా, బభూవుః=అయిరి.

తా. రక్తముచేత తడిసి చేష్టలు ఉడిగిన ఆ రామలక్ష్మణులు మందముగా ఊపిరి పీల్చుచుండిరి. కదలజాలక, బాణములతో నిండి, శరతల్పము మీద శయనించి ఉండిరి. నిశ్చేష్టులై, పరాక్రమము మందగించగా సర్పముల వలె నిట్టూర్చుచుండిరి. రక్తప్రవాహముచేత తడిసిన శరీరములతో బంగారు ధ్వజముల వలె ఉన్న ఆ వీరులు మందమైన చేష్టలు కలవారై వీరశయనము నందు శయనించి ఉండగా, బాణముల సముదాయము శరీరములందు గ్రుచ్చుకొని ఉన్న ఆ సోదరుల చుట్టూ నిలిచి కన్నీళ్లు కార్చుచు సేనానాయకులందరు చూచుచుండిరి. అట్టి రామలక్ష్మణులను చూచి వానరులు, విభీషణుడు చాల దుఃఖించిరి. 4, 7

మూ. అన్తరిక్షం నిరీక్షన్తో దిశః సర్వాశ్చ వానరాః,
న చైనం మాయయా ఛన్నం దదృశూ రావణిం రణే. 8

ప్ర. అ. అన్తరిక్షమ్=ఆకాశమును, సర్వాః=సమస్తమైన, దిశశ్చ=దిక్కులను, నిరీక్షన్తః=చూచుచున్న, వానరాః=వానరులు, రణే=యుద్ధమునందు, మాయయా=మాయచేత, ఛన్నమ్=కప్పబడిన, ఏనమ్=ఈ, రావణిమ్=రావణపుత్రుని, న దదృశుః=చూడలేదు.

తా. వానరులు ఆకాశములోని అన్ని దిక్కులలోనికి ఎంత పరికించి చూచినను యుద్ధములో మాయచేత దాగి ఉన్న ఆ ఇంద్రజిత్తు వాళ్లకు కనబడలేదు. 8

మూ. తం తు మాయాప్రతిచ్ఛన్నం మాయయైవ విభీషణః,
వీక్షమాణో దదర్శాగ్రే భ్రాతుః పుత్రముపస్థితమ్. 9

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, మాయయైవ=మాయచేతనే, వీక్షమాణః=చూచుచు, మాయాప్రతిచ్ఛన్నమ్=మాయచేత కప్పబడిన, అగ్రే=ఎదుట, ఉపస్థితమ్=నిలచితున్న, తమ్=ఆ, భ్రాతుః పుత్రమ్=సోదరుని కుమారుని, దదర్శ=చూచెను.

తా. విభీషణుడు మాయ సాహాయ్యముతోనే చూడగా అతనికి మాయచేత కప్పబడి ఎదుట నిలచి ఉన్న ఆ ఇంద్రజిత్తు కనబడెను. 9

మూ. తమప్రతిమకర్మాణమప్రతిద్వన్ద్వమాహవే,
దదర్శాన్తర్హితం వీరం వరదానాద్విభీషణః, 10
తేజసా యశసా చైవ విక్రమేణ చ సంయుతః.

ప్ర. అ. తేజసా=తేజస్సుతోను, యశసా చైవ=కీర్తితోను, విక్రమేణ చ= పరాక్రమముతోను, సంయుతః=కూడిన, విభీషణః=విభీషణుడు, అప్రతిమకర్మాణమ్=సాటి లేని పని కలవాడు, ఆహవే=యుద్ధమునందు, అప్రతిద్వన్ద్వమ్=ఎదిరించువాడు లేనివాడు, వరదానాత్= వరదానమువలన, అన్తర్హితమ్=అంతర్ధానము పొంది ఉన్నవాడు అయిన, తమ్=ఆ, వీరమ్=వీరుణ్ణి, దదర్శ=చూచెను.

తా. తేజస్సు, యశస్సు, పరాక్రమము గల ఆ విభీషణుడు సాటి లేని పనులు చేయువాడు, యుద్ధములో ఎదురు లేనివాడు అయిన, బ్రహ్మనుండి వరమును పొందుటచేత అంతర్ధానము చెంది ఉన్న వీరుడైన ఆ ఇంద్రజిత్తును చూచెను. 10

మూ. ఇన్ద్రజితస్త్వాత్మనః కర్మ తౌ శయానౌ సమీక్ష్య చ, 11
ఉవాచ పరమప్రీతో హర్షయన్ సర్వరాక్షసాన్.

ప్ర. అ. ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తైతే, ఆత్మనః=తనయొక్క, కర్మ=కార్యమును, శయానౌ=శయనించి ఉన్న, తౌ చ=ఆ రామలక్ష్మణులను, సమీక్ష్య=చూచి, పరమప్రీతః= చాలా సంతోషించినవాడై, సర్వరాక్షసాన్=సమస్తరాక్షసులను, హర్ష యన్=సంతోషపెట్టుచు, ఉవాచ=పలికెను.

తా. ఇంద్రజిత్తు తాను చేసిన పనిని, నేలపై పడియున్న రామలక్ష్మణులను చూచి చాల సంతోషించి, సమస్తరాక్షసులకు సంతోషము కలిగించుచు ఇట్లు పలికెను. 11

మూ. దూషణస్య చ హన్తారౌ ఖరస్య చ మహాబలౌ, 12
సాదితౌ మామకైర్బాణైర్భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. దూషణస్య చ=దూషణునకు, ఖరస్య చ=ఖరునకు, హన్తారౌ=మారకులు, మహాబలౌ=గొప్పబలము గలవారు, భ్రాతరౌ=సోదరులు అయిన, రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు, మామకైః=నా సంబంధమైన, బాణైః=బాణములచేత, సాదితౌ= చంపబడినారు.

తా. ఖరదూషణులను సంహరించిన మహాబలశాలులైన సోదరులైన రామలక్ష్మణులు నా బాణములచేత చంపబడినారు. 12

మూ. నేమౌ మోక్షయితుం శక్యావేతస్మాదిషుబన్ధనాత్,
సర్వైరపి సమాగమ్య సర్షిసంఘైః సురాసురైః. 13

ప్ర. అ. సర్వైః=సమస్తమైన, సర్షిసంఘైః=ఋషిసంఘములతో కూడిన, సురాసురైః=సురాసురులచేత, సమాగమ్య=కలిసి, ఇమౌ=వీరిద్దరూ, ఏతస్మాత్=ఈ, ఇషుబన్ధనాత్=బాణబంధనమునుండి, మోక్షయితుమ్=విడిపించుటకు, న శక్యౌ=శక్యమైనవారు కారు.

తా. సురులు, అసురులు, ఋషిసంఘములు - అందరూ కలిసి వచ్చినా కూడ ఈ రామలక్ష్మణులను బాణబంధమునుండి విడిపించలేరు. 13

మూ. యత్కృతే చిన్తయానస్య శోకార్తస్య పితుర్మమ, 14
అస్పృష్ట్వా శయనం గాత్రైస్త్రియామా యాతి శర్వరీ.
కృత్స్నేయం యత్కృతే లఙ్కా నదీ వర్షాస్వివాకులా, 15
సోఽయం మూలహరోఽనర్థః సర్వేషాం శమితో మయా.

ప్ర. అ. యత్కృతే=దేనినిమిత్తమై, చిన్తయానస్య=చింతించుచున్న, శోకార్తస్య=శోకపీడితుడైన, మమ పితుః=నా తండ్రికి, గాత్రైః=అవయవములచేత, శయనమ్= శయనమును, అస్పృష్ట్వా=స్పృశించకుండగా, త్రియామా=మూడుజాములు

గల, శర్వరీ=రాత్రి, యాతి=గడచిపోవుచున్నదో, యత్కృతే=దేనినిమిత్తమై, కృత్స్నా=సమస్తమైన, ఇయం లఙ్కా=ఈ లంక, వర్షాసు=వర్షాకాలమునందు, నదీ ఇవ=నది వలె, ఆకులా=వ్యాకులమైనదో, సః=అట్టి, అయమ్=ఈ, సర్వేషామ్=అందరియొక్క, మూలహరః=మూలమును హరించు, అనర్థః=అనర్థము, మయా=నాచేత, శమితః=శాంతింపచేయబడినది.

తా. ఈ రామలక్ష్మణులు మన కందరికీ మూలమునే త్రుంచివేయు అనర్థముగా ఏర్పడినారు. ఈ అనర్థమును గూర్చి చింతించుచుండుటచే నా తండ్రి ప్రక్కపై శయనించకుండగా రాత్రులను గడపవలసివచ్చినది. దీని కారణమున లంకానగర మంతా వర్షాకాలమునందు నది వలె వ్యాకులమైనది. అట్టి ఈ అనర్థమును నేనిప్పుడు తొలగించినాను. 14, 15

మూ. రామస్య లక్ష్మణస్యైవ సర్వేషాం చ వనౌకసామ్,
విక్రమా విఫలాః సర్వే యథా శరది తోయదాః. 16

ప్ర. అ. రామస్య=రామునియొక్క, లక్ష్మణస్యైవ=లక్ష్మణునియొక్క, సర్వేషామ్= సమస్తమైన, వనౌకసామ్=వానరులయొక్క, సర్వే=సమస్తమైన, విక్రమాః= పరాక్రమములు, శరది=శరత్కాలమునందు, తోయదాః ఇవ=మేఘములు వలె, విఫలాః=వ్యర్థమైనవి.

తా. రామలక్ష్మణుల పరాక్రమములు, అందరి వానరుల పరాక్రమములు, శరత్కాలమునందు మేఘముల వలె వ్యర్థమైనవి. 16

మూ. ఏవముక్త్వా తు తాన్ సర్వాన్ రాక్షసాన్ పరిపశ్యతః, 17
యూథపానపి తాన్సర్వాం స్తాడయత్స చ రావణిః.

ప్ర. అ. సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పరిపశ్యతః=చూచుచున్న, సర్వాన్=సమస్తమైన, యూథపానపి=వానరసేనానాయకులను కూడ, తాడయత్=కొట్టెను.

తా. ఇంద్రజిత్తు ఆ రాక్షసు లందరితో ఇట్లు పలికి, అక్కడ నిలచి చూచుచున్న వానరసేనానాయకులను కూడ బాణములతో కొట్టెను. 17

మూ. నీలం నవభిరాహత్య మైన్దం ద్వివిదం తథా,
త్రిభిస్త్రిభిరమిత్రఘ్నస్తతాప పరమేషుభిః. 18

ప్ర. అ. అమిత్రఘ్నః=శత్రుసంహారకుడైన, సః=అతడు, నీలమ్=నీలుని, నవభిః=తొమ్మిదింటితో, ఆహత్య=కొట్టి, మైన్దమ్=మైందుని, తథా=మరియు, ద్వివిదమ్=ద్వివిదుని, త్రిభిః త్రిభిః=మూడేసి మూడేసి, పరమేషుభిః=శ్రేష్ఠములైన

బాణములచేత, తతాప=పీడించెను.

తా. శత్రుసంహారకుడైన ఆ ఇంద్రజిత్తు నీలుణ్ణి తొమ్మిది బాణములచేత కొట్టి, మైందద్వివిదులను మూడేసి మూడేసి బాణాలచేత పీడించెను. 18

మూ. జామ్బవన్తం మహేష్వాసో విద్ధ్వా బాణేన వక్షసి, 19
హనూమతో వేగవతో విససర్జ శరాన్దశ.

ప్ర. అ. మహేష్వాసః=గొప్ప ధనస్సు గల అతడు, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, వక్షసి=వక్షఃస్థలమునందు, బాణేన=బాణముచేత, విద్ధ్వా=కొట్టి, వేగవతః=వేగము గల, హనూమతః=హనుమంతునియొక్క వక్షఃస్థలమునందు, దశ=పది, శరాన్=బాణములను, విససర్జ=విడచెను.

తా. గొప్ప ధనస్సు గల ఆ ఇంద్రజిత్తు జాంబవంతుణ్ణి ఒక్కబాణముతో వక్షఃస్థలముమీద కొట్టి వేగవంతుడైన హనుమంతుని వక్షఃస్థలమునందు పది బాణములను ప్రయోగించెను. 19

మూ. గవాక్షం శరభం చైవ తావప్యమితవిక్రమౌ, 20
ద్వాభ్యాం ద్వాభ్యాం మహావేగో వివ్యాధ యుధి రావణిః.

ప్ర. అ. మహావేగః=గొప్ప వేగము గల, రావణిః=ఇంద్రజిత్తు, యుధి=యుద్ధమునందు, అమితవిక్రమౌ=అత్యధికమైన పరాక్రమము గల, తౌ=ఆ, గవాక్షమ్=గవాక్షుణ్ణి, శరభం చైవ=శరభుణ్ణి, ద్వాభ్యాం ద్వాభ్యామ్=రెండు రెండు బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. మహావేగము గల ఇంద్రజిత్తు అమితపరాక్రమము గల ఆ గవాక్షశరభులను, యుద్ధమునందు, రెండేసి బాణములతో కొట్టెను. 20

మూ. గోలాఙ్గూలేశ్వరం చైవ వాలిపుత్రమథాఙ్గదమ్,
వివ్యాధ బహుభిర్బాణైస్త్వరమాణోఽథ రావణిః. 21

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణిః=ఇంద్రజిత్తు, త్వరమాణః=తొందరపడుచున్నవాడై, గోలాఙ్గూలేశ్వరమ్=కొండముచ్చుల నాయకుణ్ణి, అథ=పిమ్మట, వాలిపుత్రమ్=వాలిపుత్రుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, బహుభిః=అనేకమైన, బాణైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. పిమ్మట తొందరపడుచున్న ఇంద్రజిత్తు కొండముచ్చుల నాయకుణ్ణి, వాలిపుత్రుడైన అంగదుణ్ణి అనేకబాణములచేత కొట్టెను. 21

మూ. తాన్వానరవరాన్ భిత్త్వా శరైరగ్నిశిఖోపమైః, 22
ననాద బలవాంస్తత్ర మహాసత్త్వః స రావణిః.

ప్ర. అ. బలవాన్=బలవంతుడైన, మహాసత్త్వః=గొప్పధైర్యము గల, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, తత్ర=అక్కడ, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలతో సమానములైన, శరైః= బాణములచేత, తాన్=ఆ, వానరవరాన్=వానరశ్రేష్ఠులను, భిత్త్వా=భేదించి, ననాద=ధ్వనిచేసెను.

తా. బలవంతుడు, మహాధైర్యశాలి అయిన ఆ ఇంద్రజిత్తు అక్కడ, అగ్నిజ్వాలలవంటి బాణములచేత ఆ వానరశ్రేష్ఠుల శరీరములు బద్దలగునట్లు కొట్టి సింహనాదము చేసెను. 22

మూ. తానర్దయిత్వా బాణౌఘైః త్రాసయిత్వా చ వానరాన్, 23
ప్రజహాస మహాబాహుర్వచనం చేద మబ్రవీత్.

ప్ర. అ. తాన్=వాళ్లను, బాణౌఘైః=బాణసముదాయములచేత, అర్ద యిత్వా=పీడించి, వానరాన్=వానరులను, త్రాసయిత్వా చ=భయపెట్టి, మహా బాహుః=గొప్ప బాహువులు గల ఇంద్రజిత్తు, ప్రజహాస=నవ్వెను. ఇదమ్=ఈ, వచనం చ=వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. మహాబాహువైన ఆ ఇంద్రజిత్తు బాణసముదాయములచేత వాళ్లను పీడించి, వానరులను భయపెట్టి, గట్టిగా నవ్వి ఇట్లు పలికెను. 23

మూ. శరబన్ధేన ఘోరేణ మయా బద్ధౌ చమూముఖే, 24
సహితౌ భ్రాతరావేతౌ నిశామయత రాక్షసాః.

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులారా ! ఘోరేణ=భయంకరమైన, శరబన్ధేన= శర బంధముచేత, చమూముఖే=సేనాగ్రమునందు, మయా=నాచేత, బద్ధౌ=కట్టబడిన, సహితౌ=కలిసి పడియున్న, ఏతౌ భ్రాతరౌ=ఈ సోదరులను, నిశామయత=చూడండి.

తా. రాక్షసులారా ! సేనాగ్రమునందు ఈ సోదరులైన రామలక్ష్మణులను భయంకరమైన శరబంధముచేత కట్టివేసినాను; చూడుడు. 24

మూ. ఏవముక్తాస్తు తే సర్వే రాక్షసాః కూటయోధినః, 25
పరం విస్మయమాపన్నాః కర్మణా తేన హర్షితాః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలుకబడిన, కూటయోధినః=కపటయుద్ధము చేయు, తే=ఆ, సర్వే రాక్షసాః=అందరు రాక్షసులు, తేన కర్మణా=ఆ పనిచేత, పరమ్=గొప్ప, విస్మయమ్=ఆశ్చర్యమును, ఆపన్నాః=పొందిరి; హర్షితాః=సంతో షించిరి.

తా. కపటయుద్ధము చేయు ఆ రాక్షసు లందరూ ఆ మాటలు విని, ఆతడు చేసిన పనికి చాల ఆశ్చర్యపడుచు సంతోషించిరి. 25

మూ. వినేదుశ్చ మహానాదాన్ సర్వే తే జలదోపమాః, 26
హతో రామ ఇతి జ్ఞాత్వా రావణిం సమపూజయన్.

ప్ర. అ. జలదోపమాః=మేఘములతో సమానులైన, తే సర్వే=వాళ్లందరూ, మహానాదాన్=గొప్ప ధ్వనులను, వినేదుః=ధ్వని చేసిరి (చేసిరి). రామః=రాముడు, హతః ఇతి=చంపబడినాడు అని, జ్ఞాత్వా=తెలిసికొని, రావణిమ్=ఇంద్రజిత్తును, సమపూజయన్=పూజించిరి.

తా. మేఘములవలె నున్న ఆ రాక్షసు లందరూ గొప్ప ధ్వనులు చేసిరి. రాముడు చంపబడినాడని తెలిసికొని ఇంద్రజిత్తును పూజించిరి. 26

మూ. నిష్పన్దౌ తు తదా దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ, 27
వసుధాయాం నిరుచ్ఛ్వాసౌ హతావిత్యన్వమన్యత.

ప్ర. అ. తదా=అప్పుడు, నిష్పన్దౌ=కదలకుండా ఉన్న, నిరుచ్ఛ్వాసౌ=శ్వాసలేని, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, వసుధాయామ్=నేలమీద, దృష్ట్వా=చూచి, హతావితి=చంపబడినారు అని, అన్వమన్యత=తలచెను.

తా. అప్పుడు నిశ్చలముగా, శ్వాస లేకుండగా నేలమీద పడి యున్న సోదరులైన రామలక్ష్మణులను చూచి ఇంద్రజిత్తు, వారు మరణించినా రని తలంచెను. 27

మూ. హర్షేణ తు సమావిష్ట ఇన్ద్రజిత్సమితింజయః, 28
ప్రవివేశ పురీం లఙ్కాం హర్షయన్ సర్వనైరృతాన్.

ప్ర. అ. సమితింజయః=యుద్ధమునందు జయించు, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, హర్షేణ=సంతోషముతో, సమావిష్టః=కూడినవాడై, సర్వనైరృతాన్=సమస్త రాక్షసులను, హర్షయన్=సంతోషపెట్టుచు, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును ప్రవివేశ=ప్రవేశించెను.

తా. యుద్ధములో జయించు ఇంద్రజిత్తు సంతోషించుచు, సకలరాక్షసులను సంతోషపెట్టుచు, లంకాపురమును ప్రవేశించెను. 28

మూ. రామలక్ష్మణయోర్దృష్ట్వా శరీరే సాయకైశ్చితే, 29
సర్వాణి చాఙ్గోపాఙ్గాని సుగ్రీవం భయమావిశత్.

ప్ర. అ. రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, సాయకైః=బాణము లచేత, చితే=వ్యాప్తమైన, శరీరే=శరీరములను, సర్వాణి=సమస్తమైన, అఙ్గోపాఙ్గాని=పెద్ద అవయవములను చిన్నఅవయవములను, దృష్ట్వా=చూచి, సుగ్రీవమ్=సుగ్రీవుని, భయమ్=భయము, ఆవిశత్=ప్రవేశించెను.

తా. బాణములచేత వ్యాప్తములైన రామలక్ష్మణుల శరీరములను, హస్త పాదాద్యంగములను, వ్రేళ్లు మొదలైన ఉపాంగములను చూడగానే సుగ్రీవునిలో భయము ఆవహించెను. 29

మూ. తమువాచ పరిత్రస్తం వానరేన్ద్రం విభీషణః, 30
సబాష్పవదనం దీనం శోకవ్యాకులలోచనమ్.

ప్ర. అ. పరిత్రస్తమ్=భయపడినవాడు, సబాష్పవదనమ్=కన్నీటితో కూడిన ముఖము గలవాడు, దీనమ్=దీనుడు, శోకవ్యాకులలోచనమ్=శోకముచేత వ్యాకులములైన నేత్రములు కలవాడు అయిన, తమ్=ఆ, వానరేన్ద్రమ్=సుగ్రీవుని గూర్చి, విభీషణః=విభీషణుడు, ఉవాచ=పలికెను.

తా. వానరరాజైన ఆ సుగ్రీవుడు భయపడి, కన్నీళ్లతో నిండిన ముఖముతో, శోకముచేత వ్యాకులములైన నేత్రములతో దీనుడై ఉండెను. అట్టి సుగ్రీవునితో విభీషణు డిట్లు పలికెను. 30

మూ. అలం త్రాసేన సుగ్రీవ బాష్పవేగో నిగృహ్యతామ్, 31
ఏవంప్రాయాణి యుద్ధాని విజయో నాస్తి నైష్ఠికః.

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా! త్రాసేన=భయముచేత, అలమ్=చాలును. బాష్పవేగః=కన్నీటి వేగము, నిగృహ్యతామ్=నిగ్రహించుకొనబడుగాక. యుద్ధాని=యుద్ధములు, ఏవంప్రాయాణి=ఈ విధముగానే ఉండును. విజయః=విజయము, నైష్ఠికః=నిశ్చితము, నాస్తి=కాదు.

తా. సుగ్రీవా! భయపడకుము. కన్నీటి వేగమును నిగ్రహించుకొనుము. యుద్ధములు ఈ విధముగానే ఉండును. విజయము నిశ్చితము కాదు. 31

మూ. సశేషభాగ్యతాస్మాకం యది వీర భవిష్యతి, 32
మోహమేతౌ ప్రహాస్యేతే మహాత్మానౌ మహాబలౌ.

ప్ర. అ. వీర=వీరుడా! అస్మాకమ్=మనకు, సశేషభాగ్యతా=భాగ్యశేషముతో కూడియుండుట, భవిష్యతి యది=అయినట్లయితే, మహాత్మానౌ=మహాత్ములు, మహాబలౌ=గొప్ప బలము గలవారు అయిన, ఏతౌ=ఈ రామలక్ష్మణులు, మోహమ్=మోహమును, ప్రహాస్యేతే=విడువగలరు.

తా. ఓ! వీరుడా! మన అదృష్ట మేమైనా మిగిలి ఉన్నట్లయితే, మహాత్ములు, మహాబలులు అయిన ఈ రామలక్ష్మణులు మోహమును విడువగలరు. 32

మూ. పర్యవస్థాపయాత్మానమనాథం మాం చ వానర, 33
సత్యధర్మాభిరక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్.

ప్ర. అ. వానర=సుగ్రీవుడా ! ఆత్మానమ్=తనను, అనాథమ్=అనాథుడనైన, మాం చ=నన్ను, పర్యవస్థాపయ=ధైర్యముగా ఉండునట్లు చేయుము. సత్యధర్మాభిరక్తానామ్=సత్యమునందు, ధర్మమునందు ఆసక్తి గలవారికి, మృత్యుకృతమ్=మృత్యువుచేత చేయబడిన, భయమ్ =భయము, నాస్తి=లేదు.

తా. నీవు ధైర్యముగా ఉండి రక్షకుడు లేని నాకు కూడ ధైర్యము కలిగించుము. సత్యమునందు ధర్మమునందు ఆసక్తి కలవారికి మృత్యువువలన భయము లేదు. 33

మూ. ఏవముక్త్వా తతస్తస్య జలక్లిన్నేన పాణినా, 34
సుగ్రీవస్య శుభే నేత్రే ప్రమమార్జ విభీషణః.

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటుపిమ్మట, జలక్లిన్నేన=నీటితో తడుపబడిన, పాణినా=చేతితో, తస్య సుగ్రీవస్య=ఆ సుగ్రీవునియొక్క, శుభే=సుందరములైన, నేత్రే=నేత్రములను, ప్రమమార్జ=తుడిచెను.

తా. విభీషణుడు ఇట్లు పలికి నీటితో తడిపిన చేతితో సుగ్రీవుని అందమైన నేత్రములు తుడిచెను. 34

మూ. తతః సలిలమాదాయ విద్యయా పరిజప్య చ, 35
సుగ్రీవనేత్రే ధర్మాత్మా ప్రమమార్జ విభీషణః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విభీషణః=విభీషణుడు, సలిలమ్=ఉదకమును, ఆదాయ=గ్రహించి, విద్యయా=మంత్రముచేత, పరిజప్య చ= అభిమంత్రించి, సుగ్రీవనేత్రే=సుగ్రీవుని నేత్రములను, ప్రమమార్జ=తుడిచెను.

తా. పిమ్మట ధర్మాత్ముడైన విభీషణుడు నీరు తీసికొని రాక్షసమాయను తెలిసికొనగలిగిన మంత్రముచేత అభిమంత్రించి, సుగ్రీవుని నేత్రములు తుడిచెను.

మూ. విమృజ్య వదనం తస్య కపిరాజస్య ధీమతః, 36
అబ్రవీత్కాలసంప్రాప్తమసంభ్రాన్తమిదం వచః.

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య కపిరాజస్య=ఆ వానరరాజుయొక్క, వదనమ్=ముఖమును, విమృజ్య=తుడిచి, కాలసంప్రాప్తమ్=కాలముచేత వచ్చిన, అసంభ్రాన్తమ్=తొందర లేని, ఇదం వచః=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. బుద్ధిమంతుడైన ఆ సుగ్రీవుని ముఖము తుడిచి సమయానుగుణమైన

వచనమును ఎట్టి తొందరపాటూ లేకుండగా ఇట్లు పలికెను. 36

మూ. న కాలః కపిరాజేన్ద్ర వైక్లబ్యమవలమ్బితుమ్, 37
అతిస్నేహో౽పి కాలే౽స్మిన్ మరణాయోపకల్పతే.

ప్ర. అ. కపిరాజేన్ద్ర=వానరరాజా ! వైక్లబ్యమ్=వ్యాకులత్వమును, అవలమ్బితుమ్=అవలంబించుటకు, కాలః=సమయము, న=కాదు. అస్మిన్=ఈ, కాలే=సమయమునందు, అతిస్నేహో౽పి=అతిస్నేహము కూడ, మరణాయ=మరణమునకు, ఉపకల్పతే=కారణ మగును.

తా. సుగ్రీవుడా ! ఇది దుఃఖించవలసిన సమయము కాదు. ఈ సమయమునందు అతిస్నేహము కూడ మరణమునకు దారి తీయును. 37

మూ. తస్మాదుత్సృజ్య వైక్లబ్యం సర్వకార్యవినాశనమ్, 38
హితం రామపురోగాణాం సైన్యానాముపచిన్తయ.

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, సర్వకార్యవినాశనమ్=సర్వకార్యములను నశింపచేయు, వైక్లబ్యమ్=మనోవ్యాకులత్వమును, ఉత్సృజ్య=విడచి, రామపురోగాణామ్=రాముడు ముందు నడచువాడుగా గల, సైన్యానామ్=సైన్యముల యొక్క, హితమ్=హితమును, ఉపచిన్తయ=ఆలోచించుము.

తా. అందువలన అన్ని కార్యములను భగ్నము చేయు మానసవ్యాకులత్వమును విడచి రాముడు రక్షకుడుగా గల సైన్యములకు ఇప్పుడు ఏది హితమో ఆలోచించుము. 38

మూ. అథవా రక్ష్యతాం రామో యావత్సంజ్ఞావిపర్యయః, 39
లబ్ధసంజ్ఞౌ హి కాకుత్స్థౌ భయం నౌ వ్యపనేష్యతః.

ప్ర. అ. అథవా=లేదా, యావత్సంజ్ఞావిపర్యయః=తిరిగి సంజ్ఞ వచ్చువరకు, రామః=రాముడు, రక్ష్యతామ్=రక్షింపబడుగాక. లబ్ధసంజ్ఞౌ=పొందబడిన సంజ్ఞ గల, కాకుత్స్థౌ=రామలక్ష్మణులు, నౌ=మనఇద్దరియొక్క, భయమ్=భయమును, వ్యపనేష్యతః హి=తొలగింపగలరు కదా.

తా. లేదా తిరిగి సంజ్ఞ పొందేవరకు రాముణ్ణే రక్షింతెదము. సంజ్ఞ పొందిన పిమ్మట రామలక్ష్మణులు మనల నిద్దరినీ రక్షింపగలరు. 39

మూ. నైతత్కిఞ్చన రామస్య న చ రామో ముమూర్షతి, 40
న హ్యేనం హాస్యతే లక్ష్మీర్దుర్లభా యా గతాయుషామ్.

ప్ర. అ. ఏతత్=ఇది, రామస్య=రామునకు, కించన=ఏమ్మాత్రమూ, న=కాదు. రామః=రాముడు, న ముమూర్షతి=మరణించ నిచ్ఛయించుట లేదు.

యా=ఏది, గతాయుషామ్=పోయిన ఆయుర్దాయము గలవారికి, దుర్లభా=దుర్లభమైనదో అట్టి, లక్ష్మీః=శోభ, ఏనమ్=ఈ రాముణ్ణి, న హాస్యతే హి=విడువదు కదా.

తా. ఇది రామునకు ఒక పెద్ద విషయము కాదు. రాముడు మరణించబోడు. ఈతనిని కాంతి విడువదు (విడువలేదు). ఆయుర్దాయము వెళ్లినవారికి ఇట్టి కాంతి ఉండదు. 40

మూ. తస్మాదాశ్వాసయాత్మానం బలం చాశ్వాసయ స్వకమ్, 41
యావత్ సైన్యాని సర్వాణి పునః సంస్థాపయామ్యహమ్.

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, ఆత్మానమ్=తనను, ఆశ్వాసయ=ఓదార్చుకొనుము. స్వకమ్=నీ సంబంధమైన, బలమ్=సేనను, ఆశ్వాసయ=ఓదార్చుము. అహమ్=నేను, సర్వాణి=సమస్తమైన, సైన్యాని=సైన్యములను, పునః=మరల, యావత్ సంస్థాపయామి=నిలిపెదను.

తా. అందువలన నీవు నీ మనస్సును కుదుటపరచుకొని నీ సైన్యమును ఓదార్చుము. నేను ఇంతలో సైన్యములను అన్నింటినీ ధైర్యము చెప్పి నిలిపెదను.

మూ. ఏతే హి ఫుల్లనయనాస్త్రాసాదాగతసాధ్వసాః, 42
కర్ణే కర్ణే ప్రకథితా హరయో హరిసత్తమ.

ప్ర. అ. హరిసత్తమ=వానరశ్రేష్ఠుడా ! ఏతే=ఈ, హరయః=వానరులు, ఫుల్లనయనాః=వికసించిన నేత్రములు గలవారై, త్రాసాత్=భయమువలన, ఆగతసాధ్వసాః=పొందబడిన కంగారు గలవారై, కర్ణే కర్ణే=ప్రతిచెవియందు, ప్రకథితాః=చెప్పుకొనుచున్నారు.

తా. వానరశ్రేష్ఠుడా ! ఆ వానరులు కళ్లు పెద్దవిచేసి భయముతో తొందరపడుచు ఒకరి చెవిలో ఒకరు ఏమేమో చెప్పుకొనుచున్నారు. 42

మూ. మాం తు దృష్ట్వా ప్రధావన్తమనీకం సంప్రహర్షితుమ్, 43
త్యజన్తు హరయస్త్రాసం భుక్తపూర్వామివ స్రజమ్.

ప్ర. అ. అనీకమ్=సైన్యమును, సంప్రహర్షితుమ్=ఉత్సాహపరచుటకు, ప్రధావన్తమ్=పరుగెత్తుచున్న, మామ్=నన్ను, దృష్ట్వా=చూచి, హరయః=వానరులు, త్రాసమ్=భయమును, భుక్తపూర్వామ్=పూర్వము అనుభవించబడిన, స్రజమ్ ఇవ=మాలికను వలె, త్యజన్తు=విడచెదరుగాక.

తా. సైన్యమును ఉత్సాహపరచుటకై నేను శీఘ్రముగా ఇటు అటు వెళ్లుచుండగా నన్ను జూచి, ఈ వానరులు ఇంద్రజిత్తు అను భ్రమచేత

భయపడుచున్నారు. వారు అట్టి భయమును, ఉపయోగించిన పుష్పమాలను పరిత్యజించినట్లు పరిత్యజించేటట్లుగా చేయుము. 43

మూ. సమాశ్వాస్య తు సుగ్రీవం రాక్షసేన్ద్రో విభీషణః, 44
విద్రుతం వానరానీకం తత్సమాశ్వాసయత్పునః.

ప్ర. అ. రాక్షసేన్ద్రః=రాక్షసశ్రేష్ఠుడైన, విభీషణః=విభీషణుడు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, సమాశ్వాస్య=ఓదార్చి, విద్రుతమ్=పారిపోవుచున్న, తత్ వానరానీకమ్=ఆ వానరసైన్యమును, పునః=మరల, సమాశ్వాసయత్=ఓదార్చెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన విభీషణుడు ఈ విధముగా సుగ్రీవునకు ధైర్యము చెప్పి పారిపోవుచున్న ఆ వానరసైన్యమును మరల ఓదార్చెను. 44

మూ. ఇన్ద్రజిత్తు మహామాయః సర్వసైన్యసమావృతః, 45
వివేశ నగరీం లఙ్కాం పితరం చాభ్యుపాగమత్.

ప్ర. అ. మహామాయః=గొప్ప మాయ గల, ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తు అయితే, సర్వసైన్యసమావృతః=సకలసైన్యముతో కూడినవాడై, లఙ్కాం నగరీమ్=లంకానగరమును, వివేశ=ప్రవేశించెను. పితరమ్=తండ్రిని, అభ్యుపాగమత్ చ=సమీపించెను కూడ.

తా. గొప్ప మాయగల ఇంద్రజిత్తు సమస్తసైన్యముతో లంకానగరములో ప్రవేశించి, తండ్రి దగ్గరకు వెళ్లెను. 45

మూ. తత్ర రావణమాసాద్య అభివాద్య కృతాఞ్జలిః, 46
ఆచచక్షే ప్రియం పిత్రే నిహతౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. తత్ర=అక్కడ, రావణమ్=రావణుని, ఆసాద్య=సమీపించి, అభివాద్య=నమస్కరించి, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలికలవాడై, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, నిహతౌ=చంపబడినారు అని, పిత్రే=తండ్రికి, ప్రియమ్=ప్రియమైన, వచనమును, ఆచచక్షే=చెప్పెను.

తా. అతడు అక్కడ రావణుని సమీపించి, అంజలి ఘటించి నమస్కరించి "రామలక్ష్మణులను చంపివేసితిని" అని అతనికి ప్రియమైన వచనమును చెప్పెను. 46

మూ. ఉత్పపాత తతో హృష్టః పుత్రం చ పరిషస్వజే, 47
రావణో రక్షసాం మధ్యే శ్రుత్వా శత్రూ నిపాతితౌ.

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, రావణః=రావణుడు, శత్రూ=శత్రువుల నిద్దరినీ, నిపాతితౌ=పడగొట్టబడినవారినిగా,

శ్రుత్వా=విని, తతః=అటుపిమ్మట, హృష్టః=సంతోషించినవాడై, ఉత్పపాత=ఎగిరి
లేచెను. పుత్రమ్=పుత్రుణ్ణి, పరిష్వజే చ=కౌగలించుకొనెను కూడ.

తా. రావణుడు శత్రువులు చంపబడినా రను వార్తను రాక్షసుల మధ్య
విని సంతోషముతో ఎగిరి గంతు వేసి లేచి పుత్రుణ్ణి కౌగలించుకొనెను. 47

మూ. ఉపాఘ్రాయ చ తం మూర్ధ్ని పప్రచ్ఛ ప్రీతమానసః, 48
పృచ్ఛతే చ యథావృత్తం పిత్రే తస్మై న్యవేదయత్,
యథా తౌ శరబన్ధేన నిశ్చేష్టౌ నిష్ప్రభౌ కృతౌ. 49

ప్ర. అ. ప్రీతమానసః=సంతోషించిన మనస్సు గలవాడై, తమ్=వానిని,
మూర్ధ్ని=శిరస్సునందు, ఉపాఘ్రాయ=వాసన చూచి, పప్రచ్ఛ=అడిగెను. పృచ్ఛతే=అడు
గుచున్న, పిత్రే=తండ్రికి, తౌ=వారిద్దరూ, శరబన్ధేన=శరబంధనముచేత, నిశ్చేష్టౌ=చేష్ట
లేనివారుగాను, నిష్ప్రభౌ=కాంతి లేనివారు గాను, యథా=ఎట్లు, కృతౌ=చేయబడిరో,
అట్లు, యథావృత్తమ్=జరిగినవిధముగా, న్యవేదయత్=తెలిపెను.

తా. అతడు సంతోషించిన మనస్సుతో ఇంద్రజిత్తును శిరస్సు మీద
వాసన చూచి (ముద్దుపెట్టుకొని) "ఎట్లు చంపితివి ?" అని ప్రశ్నించెను.
ఇంద్రజిత్తు ఆ విధముగా ప్రశ్నించుచున్న తండ్రికి తాను ఆ సోదరులిద్దరినీ
శరబంధముచేత ఎట్లు బంధించెనో, ఎట్లు కాంతివిహీనులనుగా చేసెనో ఆ
విషయము నంతా జరిగినది జరిగినట్లు చెప్పెను. 48, 49

మూ. సహర్షవేగానుగతాన్తరాత్మా
శ్రుత్వా గిరం తస్య మహారథస్య,
జహౌ జ్వరం దాశరథేః సముత్థం
ప్రహృష్టవాచాభినన్ద పుత్రమ్. 50

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. మహారథస్య=మహారథుడైన, తస్య=వానియొక్క, గిరమ్=వాక్కును,
శ్రుత్వా=విని, హర్షవేగానుగతాన్తరాత్మా=ఆనందవేగముతో కూడిన మనస్సు గల,
సః=అతడు, దాశరథేః=రామునివలన, సముత్థమ్=కలిగిన, జ్వరమ్=జ్వరమును,
జహౌ=విడచెను. ప్రహృష్టవాచా=సంతోషించిన వాక్కుతో, పుత్రమ్=పుత్రుణ్ణి
అభినన్ద=అభినందించెను.

తా. ఆ రావణుడు మహారథుడైన ఇంద్రజిత్తు మాటలు విని,
ఆనందాతిరేకముతో నిండిన మనస్సు గలవాడై, రామునివలన కలిగిన మనస్తాపమును
విడచెను. ఆనందముతో కూడిన మాటలతో పుత్రుణ్ణి అభినందించెను. 50

# అథసప్తచత్వారింశః సర్గః

[వానరులు రామలక్ష్మణులను రక్షించుచు వారి చుట్టూ నిలిచి ఉండుట. రావణుని ఆజ్ఞచేత రాక్షసస్త్రీలు సీతను యుద్ధభూమికి తీసికొనివెళ్లి ఆమెకు రామలక్ష్మణులను చూపుట. వారిని చూచి సీత దుఃఖించుట.]

మూ. తస్మిన్ ప్రవిష్టే లఙ్కాయాం కృతార్థే రావణాత్మజే,
రాఘవం పరివార్యాథ రరక్షుర్వానరర్షభాః. 1

ప్ర. అ. తస్మిన్=ఆ, రావణాత్మజే=ఇంద్రజిత్తు, కృతార్థే=కృతార్థుడై, లఙ్కాయామ్=లంకయందు, ప్రవిష్టే=ప్రవేశించినవాడగుచుండగా, అథ=అటు పిమ్మట, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, రాఘవమ్=రాముణ్ణి, పరివార్య=చుట్టి, రరక్షుః= రక్షించిరి.

తా. ఇంద్రజిత్తు తాను చేయదలచిన పని పూర్తిచేసికొని లంకలో ప్రవేశించిన పిమ్మట వానరశ్రేష్ఠులు, రాముని చుట్టూ నిలిచి అతనిని రక్షించిరి.1

మూ. హనుమానఙ్గదో నీలః సుషేణః కుముదో నలః,
గజో గవాక్షః పనసః సానుప్రస్థో మహాహరిః. 2
జామ్బవానృషభః సున్దో రమ్భః శతబలిః పృథుః,
వ్యూఢానీకాశ్చ యత్తాశ్చ ద్రుమానాదాయ సర్వతః. 3
వీక్షమాణా దిశః సర్వాస్తిర్యగూర్ధ్వం చ వానరాః,
తృణేష్వపి చ చేష్టత్సు రాక్షసా ఇతి మేనిరే. 4

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, అఙ్గదః=అంగదుడు, నీలః=నీలుడు, సుషేణః=సుషేణుడు, కుముదః=కుముదుడు, నలః=నలుడు, గజః=గజుడు, గవాక్షః=గవాక్షుడు, పనసః=పనసుడు, మహాహరిః=గొప్ప వానరుడైన, సానుప్రస్థః=సానుప్రస్థుడు, జామ్బవాన్=జాంబవంతుడు, ఋషభః=ఋషభుడు, సున్దః=సుందుడు, రమ్భః=రంభుడు, శతబలిః=శతబలి, పృథుః=పృథువు, వానరాః=ఈ వానరులు, సర్వతః=అన్ని వైపులా, వ్యూఢానీకాః=నిలుపబడిన సేనలు గలవారై, యత్తాశ్చ=సన్నద్ధులై, ద్రుమాన్=వృక్షములను, ఆదాయ=గ్రహించి, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను, తిర్యక్=అడ్డముగాను, ఊర్ధ్వం చ=పైకి, వీక్షమాణాః=చూచుచున్నవారై, తృణేష్వపి=గడ్డిపరకలు కూడ, చేష్టత్సు=కదలగా, రాక్షసాః ఇతి=రాక్షసులు అని, మేనిరే= తలచిరి.

తా. హనుమంతుడు, అంగదుడు, నీల - సుషేణులు, కుముదుడు, నలుడు, గజ - గవాక్షులు, పనసుడు, సానుప్రస్థుడు, జాంబవంతుడు,

ఋషభ-సుందరులు, రంభ - శరభ - ప్రభృతులు - ఈ వానరు లందరు వృక్షములు ధరించి, అన్ని వైపుల సేనలు నిలిపి, యుద్ధసన్నద్ధులై నిలచిరి. అన్ని దిక్కులు, అడ్డముగాను, పైకి చూచుచు గడ్డిపరక కదలినను రాక్షసు లని అనుకొనుచుండిరి. 2 - 4

మూ. రావణశ్చాపి సంహృష్టో విసృజ్యేన్ద్రజితం సుతమ్,
ఆజుహావ తతః సీతారక్షణీ రాక్షసీస్తదా. 5

ప్ర. అ. రావణశ్చాపి=రావణుడు కూడ, సంహృష్టః=సంతోషించిన వాడై, సుతమ్= కుమారుడైన, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, విసృజ్య=పంపివేసి, తతః=అటుపిమ్మట, సీతారక్షణీః= సీతను రక్షించుచున్న, రాక్షసీః=రాక్షసస్త్రీలను, తదా=అప్పుడు, ఆజుహావ= పిలిచెను.

తా. రావణుడు సంతోషించి, కుమారుడైన ఇంద్రజిత్తును పంపివేసి, పిమ్మట సీతను రక్షించుచున్న రాక్షసస్త్రీలను పిలిపించెను. 5

మూ. రాక్షస్యస్త్రిజటా చాపి శాసనాత్తముపస్థితాః,
తా ఉవాచ తతో హృష్టో రాక్షసీ రాక్షసాధిపః. 6

ప్ర. అ. రాక్షస్యః=రాక్షసస్త్రీలు, త్రిజటా చాపి=త్రిజట, శాసనాత్=ఆజ్ఞ వలన, తమ్=ఆ రావణుని, ఉపస్థితాః=సమీపించిరి. తతః=అటుపిమ్మట, హృష్టః= సంతోషించిన, రాక్షసాధిపః=రావణుడు, తాః రాక్షసీః=ఆ రాక్షసస్త్రీలను గూర్చి, ఉవాచ= పలికెను.

తా. ఆ రావణుని ఆజ్ఞ ప్రకారము రాక్షసస్త్రీలు, త్రిజట అతనిదగ్గరకు వచ్చిరి. పిమ్మట సంతోషించిన రావణుడు ఆ రాక్షసస్త్రీలతో ఇట్లు పలికెను. 6

మూ. హతావిన్ద్రజితాఖ్యాత వైదేహ్యా రామలక్ష్మణౌ,
పుష్పకం తత్సమారోప్య దర్శయధ్వం రణే హతౌ. 7

ప్ర. అ. రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, హతౌ= చంపబడినవారినిగా, వైదేహ్యాః=సీతకు, ఆఖ్యాత=చెప్పుడు. తత్=ఆ, పుష్ప కమ్= పుష్పకమును, సమారోప్య=ఎక్కించి, రణే=యుద్ధమునందు, హతౌ=చంప బడిన ఆ రామలక్ష్మణులను, దర్శయధ్వమ్=చూపుడు.

తా. ఇంద్రజిత్తుచేత రామలక్ష్మణులు చంపబడిరని సీతకు చెప్పుడు. ఆమెను పుష్పకము నెక్కించి తీసుకొనివెళ్ళి యుద్ధములో చంపబడిన రామలక్ష్మణులను చూపుడు. 7

మూ. యదాశ్రయాదవష్టబ్ధా నేయం మాముపతిష్ఠతే,
సోఽస్యా భర్తా సహ భ్రాత్రా నిహతో రణమూర్ధని. 8

ప్ర. అ. ఇయమ్=ఈమె, యదాశ్రయాత్=ఎవని ఆశ్రయమువలన, అవష్టబ్ధా= గర్వితురాలై, మామ్=నన్ను, న ఉపతిష్ఠతే=చేరుటలేదో, సః=ఆ, అస్యాః భర్తా= ఈమె భర్త, రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, నిహతః=చంపబడినాడు.

తా. ఈమె ఎవని ఆశ్రయము చూచుకొని గర్వితురాలై నన్ను చేరుటలేదో అట్టి ఈమె భర్త అతని సోదరుడూ కూడ యుద్ధరంగమునందు చంపబడినాడు.

మూ. నిర్విశఙ్కా నిరుద్విగ్నా నిరపేక్షా చ మైథిలీ,
మాముపస్థాస్యతే సీతా సర్వాభరణభూషితా. 9

ప్ర. అ. మైథిలీ=మిథిలారాజకుమారియైన, సీతా=సీత, నిర్విశఙ్కా=రాముని శంకలేనిదై, నిరుద్విగ్నా=భయపడనిదై, నిరపేక్షా=రామునిమీద ఆశ లేనిదై, సర్వాభరణభూషితా=సమస్తములైన అలంకారములచేత అలంకరించబడినదై, మామ్=నన్ను, ఉపస్థాస్యతే=చేరగలదు.

తా. మిథిలారాజకుమారియైన సీత సకలాలంకారములు అలంకరించుకొని రాముడు వచ్చు ననే శంక గాని, భయము గాని, ఆశ గాని లేనిదై నన్ను చేరగలదు. 9

మూ. అద్య కాలవశం ప్రాప్తం రణే రామం సలక్ష్మణమ్,
అవేక్ష్య వినివృత్తా సా చాన్యాం గతిమపశ్యతీ. 10
అనపేక్షా విశాలాక్షీ మాముపస్థాస్యతే స్వయమ్.

ప్ర. అ. విశాలాక్షీ=విశాలమైన నేత్రములు గల, సా=ఆమె, అద్య=ఇప్పుడు, రణే=యుద్ధమునందు, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రామమ్=రాముణ్ణి, కాల వశమ్=కాలవశమును, గతమ్=పొందినవానినిగా, అవేక్ష్య=చూచి, వినివృత్తా= తిరిగి వచ్చినదై, అన్యామ్=మరియొక, గతిమ్=గతిని, అపశ్యతీ=చూడనిదై, అనపేక్షా= రామాపేక్ష లేనిదై, స్వయమ్=స్వయముగా, మామ్=నన్ను, ఉపస్థాస్యతే=చేరగలదు.

తా. విశాలాక్షియైన ఆ సీత ఈనాడు యుద్ధములో మరణించిన రామలక్ష్మణులను చూచి తిరిగి వచ్చి, మరొక గతి ఏదీ లేకపోవుటచే రాముణ్ణి ఆపేక్షించక స్వయముగా నాదగ్గరకు రాగలదు. 10

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రావణస్య దురాత్మనః 11
రాక్షస్యస్తాస్తథేత్యుక్త్వా జగ్ముర్వై యత్ర పుష్పకమ్.

ప్ర. అ. తాః రాక్షస్యః=ఆ రాక్షసస్త్రీలు, దురాత్మనః=దురాత్ముడైన,

తస్య రావణస్య=రావణునియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, తథా ఇతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, పుష్పకమ్=పుష్పకము, యత్ర=ఎక్కడ ఉన్నదో అక్కడికి, జగ్ముః వై= వెళ్ళిరి.

తా. ఆ రాక్షసస్త్రీలు దురాత్ముడైన ఆ రావణుని మాటలు విని, "అట్లే చేసెదము" అని పలికి పుష్పకవిమాన మున్న చోటికి వెళ్లిరి. 11

మూ. తతః పుష్పకమాదాయ రాక్షస్యో రావణాజ్ఞయా, 12
అశోకవనికాస్థాం తాం మైథిలీం సముపానయన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, రావణాజ్ఞయా=రావణుని ఆజ్ఞచేత, పుష్పకమ్=పుష్పకమును, ఆదాయ=తీసికొనివచ్చి, అశోకవనికాసంస్థామ్= అశోకవనములో ఉన్న, తామ్=ఆ, మైథిలీమ్=సీతను, సముపానయన్=పొందించిరి.

తా. పిమ్మట, ఆ రాక్షసస్త్రీలు రావణాజ్ఞచే పుష్పకవిమానమును అశోకవనములో ఉన్న సీతదగ్గరకు తీసికొనివెళ్లిరి. 12

మూ. తామాదాయ తు రాక్షస్యో భర్తృశోకపరాజితామ్. 13
సీతామారోపయామాసుర్విమానం పుష్పకం తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, భర్తృశోకపరాజితామ్=భర్తను గూర్చిన శోకముచేత పీడింపబడిన, తాం సీతామ్=ఆ సీతను, ఆదాయ=తీసికొని, పుష్పకం విమానమ్=పుష్పకవిమానమును, ఆరోపయామాసుః=ఎక్కించిరి.

తా. పిమ్మట ఆ రాక్షసస్త్రీలు భర్తను గూర్చిన శోకముచే పీడింపబడిన ఆ సీతను తీసికొనివచ్చి ఆ పుష్పకవిమానము మీద ఎక్కించిరి. 13

మూ. తతః పుష్పకమారోప్య సీతాం త్రిజటయా సహ, 14
జగ్ముర్దర్శయితుం తస్యై రాక్షస్యో రామలక్ష్మణౌ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, త్రిజటయా సహ=త్రిజటతో కూడ, సీతామ్=సీతను, పుష్పకమ్=పుష్పకమును, ఆరోప్య=ఎక్కించి, తస్యై= ఆమెకు, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, దర్శయితుమ్=చూపుటకు, జగ్ముః=వెళ్లిరి.

తా. పిమ్మట ఆ రాక్షసస్త్రీలు త్రిజటతో కూడ సీతను పుష్పకము ఎక్కించి, ఆమెకు రామలక్ష్మణులను చూపుటకు తీసికొని వెళ్లిరి. 14

మూ. రావణోఽకారయల్లఙ్కాం పతాకాధ్వజమాలినీమ్, 15
ప్రాఘోషయత హృష్టశ్చ లఙ్కాయాం రాక్షసేశ్వరః,
రాఘవో లక్ష్మణశ్చైవ హతావిన్ద్రజితా రణే. 16

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, హృష్టః=సంతోషించినవాడై, లఙ్కామ్=లంకను, పతాకాధ్వజమాలినీమ్=పతాకంయొక్క ధ్వజముల యొక్క పంక్తులు గలదానినిగా, కారయామాస=చేయించెను. రాఘవః=రాముడు, లక్ష్మణశ్చైవ=లక్ష్మణుడు, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, రణే=యుద్ధమునందు, హతౌ=చంపబడినారు అని, ప్రాఘోషయత=చాటించెను.

తా. రాక్షసరాజైన రావణుడు సంతోషముతో లంకాపట్టణమును పతాకలతోను, ధ్వజములతోను అలంకరింపచేసి "యుద్ధములో ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపివేసినాడు" అని చాటింపు వేయించెను. 16

మూ. విమానేనాపి గత్వా తు సీతా త్రిజటయా సహ,
దదర్శ వానరాణాం తు సర్వం సైన్యం నిపాతితమ్. 17

ప్ర. అ. సీతా=సీత, త్రిజటయా సహ=త్రిజటతో కూడ, విమానేన=విమానముచేత, గత్వా=వెళ్లి, నిపాతితమ్=పడగొట్టబడిన, సర్వమ్=సమస్తమైన, వానరాణాం సైన్యమ్= వానరుల సైన్యమును, దదర్శ=చూచెను.

తా. సీత త్రిజటతో కూడ విమానము ఎక్కి వెళ్లి అక్కడ చంపి పడవేయబడిన వానరసైన్యము నంతను చూచెను. 17

మూ. ప్రహృష్టమనసశ్చాపి దదర్శ పిశితాశనాన్,
వానరాంశ్చాతిదుఃఖార్తాన్రామలక్ష్మణపార్శ్వతః. 18

ప్ర. అ. ప్రహృష్టమనసః=సంతోషించిన మనస్సులు గల, పిశితాశనాన్=రాక్షసులను, రామలక్ష్మణ పార్శ్వతః=రామలక్ష్మణుల ప్రక్కన, అతిదుఃఖార్తాన్=మిక్కిలి దుఃఖపీడితులైన, వానరాంశ్చ=వానరులను, దదర్శ=చూచెను.

తా. సీత అక్కడ చాల సంతోషముతో ఉన్న రాక్షసులను, రాముని ప్రక్క చాల దుఃఖముతో బాధపడుచున్న వానరులను చూచెను. 18

మూ. తతః సీతా దదర్శోభౌ శయానౌ శరతల్పగౌ,
లక్ష్మణం చైవ రామం చ విసంజ్ఞౌ శరపీడితౌ. 19
విధ్వస్తకవచౌ వీరౌ విప్రవిద్ధశరాసనౌ,
సాయకైశ్ఛిన్నసర్వాఙ్గౌ శరస్తమ్భమయౌ క్షితౌ. 20

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సీతా=సీత, శయానౌ=శయనించి ఉన్నవారూ, శరతల్పగౌ=శరతల్పమునందు ఉన్నవారూ, విసంజ్ఞౌ=సంజ్ఞ లేనివారూ, శరపీడితౌ=బాణములచేత పీడించబడినవారూ, విధ్వస్తకవచౌ=విరిగిపోయిన కవచములు గలవారూ, వీరౌ=వీరులూ, విప్రవిద్ధశరాసనౌ=దూరముగా విసిరివేయబడిన ధనస్సులు గలవారూ, సాయకైః=బాణములచేత, భిన్నసర్వాఙ్గౌ=భేదించబడిన సకలశరీరము కలవారూ, క్షితౌ=నేలమీద, శరస్తమ్బమయౌ=బాణము లనే గడ్డి (స్తంబతృణము)తో వ్యాప్తమైనవారు, ఉభౌ=ఇద్దరినీ, లక్ష్మణం చైవ=లక్ష్మణునీ, రామం చ=రామున్నీ, దదర్శ=చూచెను.

తా. పిమ్మట సీత బాణములచేత పీడింపబడి శరతల్పముమీద సంజ్ఞ లేకుండా శయనించి ఉన్న రామలక్ష్మణులను ఇద్దరినీ చూచెను. ఆ వీరుల కవచములు విరిగిపోయెను. వారి ధనస్సులు దూరముగా పడి యుండెను. వారి శరీరములు పూర్తిగా బాణములచేత భేదింపబడి ఉండెను. నేలమీద బాణము లనే గడ్డితో నిండి ఉండిరి. 19, 20

మూ. తౌ దృష్ట్వా భ్రాతరౌ తత్ర ప్రవీరౌ పురుషర్షభౌ,
శయానౌ పుణ్డరీకాక్షౌ కుమారావివ పావకీ. 21
శరతల్పగతౌ వీరౌ తథాభూతౌ నరర్షభౌ,
దుఃఖార్తా కరుణం సీతా సుభృశం విలలాప హ. 22

ప్ర. అ. ప్రవీరౌ=ఉత్తమవీరులు, పురుషర్షభౌ=పురుషశ్రేష్ఠులు, పుణ్డరీకాక్షౌ= పద్మములవంటి నేత్రములు గలవారు, పావకీ=అగ్నిపుత్రులైన, వీరౌ=వీరులైన, కుమారావివ= స్కందవిశాఖుల వలె ఉన్నవారు, శరతల్పగతౌ=శరతల్పమునందున్న వారు, తత్ర=అక్కడ, శయానౌ=శయనించినవారు, తథాభూతౌ=ఆ విధముగా ఉన్నవారు, నరర్షభౌ=మానవులలో శ్రేష్ఠులు అయిన, తౌ భ్రాతరౌ=ఆ సోదరులను, దృష్ట్వా=చూచి, సీతా=సీత, దుఃఖార్తా=దుఃఖపీడితురాలై, కరుణమ్=దీనముగా, సుభృశమ్=అత్యధికముగా, విలలాప హ=విలపించెను.

తా. మహావీరులు, పురుషశ్రేష్ఠులు, శరతల్పముమీద శయనించి ఉన్నవారు, అగ్నిపుత్రులైన, వీరులైన, స్కందవిశాఖుల వలె ఉన్నవారు, పద్మములవంటి నేత్రములు గలవారు అయిన ఆ సోదరులు అట్టి స్థితిలో ఉండుట చూచి సీత దుఃఖపీడితురాలై దీనముగా మిక్కిలి విలపించెను. 21, 22

మూ. భర్తారమనవద్యాఙ్గీ లక్ష్మణం చాసితేక్షణా,
ప్రేక్ష్య పాంసుషు చేష్టన్తౌ రురోద జనకాత్మజా. 23

ప్ర. అ. అనవద్యాఙ్గీ=దోషములు లేని శరీరము గల, అసితే

క్షణా=నల్లని నేత్రములు గల, జనకాత్మజా=సీత, పాంసుషు=పరాగములయందు, వేష్టన్తౌ=దొరలుచున్న, (పడియున్న), భర్తారమ్=భర్తను, లక్ష్మణం చ=లక్ష్మణునీ, ప్రేక్ష్య=చూచి, రురోద=ఏడ్చెను.

తా. దోషములు లేని అవయవములు గలది, నల్లని నేత్రములు కలది అయిన సీత, పరాగములో పడి యున్న భర్తను, లక్ష్మణుని చూచి ఏడ్చెను. 23

మూ. సబాష్పశోకాభిహతా సమీక్ష్య
తౌ భ్రాతరౌ దేవసుతప్రభావౌ,
వితర్కయన్తీ నిధనం తయోః సా
దుఃఖాన్వితా వాక్యమిదం జగాద. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. సబాష్పశోకాభిహతా=కన్నీటితో కూడినది శోకముచేత పీడింపబడినది అయిన, సా=ఆ సీత, దేవసుతప్రభావౌ=దేవపుత్రుల వంటి ప్రభావము గల, తౌ భ్రాతరౌ=ఆ సోదరులను, సమీక్ష్య=చూచి, తయోః=వారియొక్క, నిధనమ్=మరణమును, వితర్కయన్తీ=ఊహించుచున్నదై, దుఃఖాన్వితా=దుఃఖముతో కూడినదై, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, జగాద=పలికెను.

తా. దేవతాపుత్రులవంటి ప్రభావము గల ఆ సోదరులను చూడగానే సీత కన్నీరు కార్చుచు, శోకపీడితురాలై, వారు మరణించినారని తలచి దుఃఖముతో ఇట్లు పలికెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టచత్వారింశః సర్గః

*[సీత విలపించుట. త్రిజట ఆమెను ఓదార్చుచు రామలక్ష్మణులు జీవించియే ఉన్నా రని ఆమెకు నమ్మకము కలిగించి తిరిగి లంకలోనికి తీసికొనిపోవుట.]*

మూ. భర్తారం నిహతం దృష్ట్వా లక్ష్మణం చ మహాబలమ్,
విలలాప భృశం సీతా కరుణం శోకకర్శితా. 1

ప్ర. అ. సీతా=సీత, నిహతమ్=చంపబడిన, భర్తారమ్=భర్తను, మహాబలమ్= గొప్ప బలము గల, లక్ష్మణం చ=లక్ష్మణుని, దృష్ట్వా=చూచి, భృశమ్=మిక్కిలి, శోకకర్శితా=శోకముచేత కృశింపచేయుబడినదై, కరుణమ్=దీన ముగా, విలలాప=విలపించెను.

తా. సీత చంపబడిన భర్తను, మహాబలుడైన లక్ష్మణుని చూచి మిక్కిలి శోకముచేత కృశించినదై దీనముగా ఏడ్చెను. 1

మూ. ఊచుర్లాక్షణికా యే మాం పుత్రిణ్యవిధవేతి చ,
తే౽ద్య సర్వే హతే రామే జ్ఞానినో౽నృతవాదినః. 2

ప్ర. అ. యే=ఏ, లాక్షణికాః=సాముద్రికలక్షణములు తెలిసినవారు, మామ్=నన్ను, పుత్రిణీ=పుత్రవంతురాలు అని, అవిధవేతి చ=వైధవ్యము లేనిది అని, ఊచుః=చెప్పిరో, తే=ఆ, జ్ఞానినః=జ్ఞానవంతులు, అద్య=ఇప్పుడు, రామే=రాముడు, హతే=చంపబడినవా డగుచుండగా, అనృతవాదినః=అసత్యము పలికినవారు.

తా. నన్ను చూచి పూర్వము సాముద్రికశాస్త్రజ్ఞులు ఈమె పుత్రవంతురాలు అగు నని, వైధవ్యము లేనిదని చెప్పి ఉన్నారు. కాని ఇప్పుడు రాముడు మరణించుటచే ఆ పండితులందరు అసత్యము చెప్పినట్లయినది. 2

మూ. యజ్వనో మహిషీం యే మామూచుః పత్నీం చ సత్త్రిణః,
తే౽ద్య సర్వే హతే రామే జ్ఞానినో౽నృతవాదినః. 3

ప్ర. అ. యే=ఎవరు, మామ్=నన్ను, యజ్వనః=యాగముచేయు వాని, మహిషీమ్=పట్టమహిషినిగాను, సత్త్రిణః=యాగములుచేసినవానియొక్క, పత్నీమ్= పత్నినిగాను, ఊచుః=చెప్పిరో, సర్వే=సమస్తమైన, తే జ్ఞానినః=ఆ పండితులు, అద్య=ఇప్పుడు, రామే=రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, అనృతవాదినః= అసత్యము పలికినవా రైనారు.

తా. పూర్వము ఏ పండితు లందరూ నన్ను గూర్చి ఈమె యజ్ఞములు చేసినవాని పట్టమహిషి అగునని, యాగములు చేసినవాని ధర్మపత్ని అగునని చెప్పినారో వారు ఇప్పుడు రాముడు మరణించుటచే అసత్యము చెప్పిన ట్లాయినది.

మూ. వీరపార్థివపత్నీనాం యే విదుర్భర్తృపూజితామ్,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. 4

ప్ర. అ. వీరపార్థివపత్నీనామ్=వీరులైన రాజభార్యలలో భర్తృపూజితామ్=భర్తచేత గౌరవింపబడినదానినిగా, యే=ఎవరు, విదుః=తెలిసికొనినారో (చెప్పినారో), తే=ఆ, సర్వే=సమస్తమైన, జ్ఞానినః=పండితులు, అద్య=ఇప్పుడు, రామే=రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, అనృతవాదినః=అసత్యము పలికినవారు.

తా. వీరులైన రాజుల భార్య లందరిలోను నేను భర్త గౌరవమునకు పాత్రురాల నగుదు నని చెప్పిన పండితులు, ఇప్పుడు రాముడు మరణించుటచేత, అసత్యము పలికినవా రైనారు. 4

మూ. ఊచుః సంశ్రవణే యే మాం ద్విజాః కార్తాన్తికాః శుభామ్,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. 5

ప్ర. అ. కార్తాన్తికాః=దైవజ్ఞులైన, యే=ఏ, ద్విజాః=బ్రాహ్మణులు, సంశ్రవణే=నాకు వినబడు దూరములో, మామ్=నన్ను, శుభామ్=సౌభాగ్యవతినిగా, ఊచుః=పలికిరో, తే=ఆ, సర్వే=అందరు, జ్ఞానినః=పండితులు, అద్య= ఇప్పుడు, రామే=రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, అనృతవాదినః=అసత్యము పలికినవా రైనారు.

తా. దైవజ్ఞులైన ఏ ద్విజులు, నేను వినుచుండగా, "ఈమె సౌభాగ్యవతి అగును" అని చెప్పినారో ఆ పండితులందరూ ఇప్పుడు రాముడు చనిపోవుటచేత అసత్యము పలికిన ట్లాయినది. 5

మూ. ఇమాని ఖలు పద్మాని పాదయోర్యైః కులస్త్రియః,
అధిరాజ్యేఽభిషిచ్యన్తే నరేన్ద్రైః పతిభిః సహ. 6

ప్ర. అ. పాదయోః=నా పాదములయందు, ఇమాని=ఇవి, పద్మాని ఖలు=అట్టి పద్మములుకదా, యైః=వేటిచేత, కులస్త్రియః=కులస్త్రీలు, నరేన్ద్రైః=రాజులైన, పతిభిః సహ=భర్తలతోకూడ, అధిరాజ్యే=చక్రవర్తిత్వమునందు, అభిషిచ్యన్తే=అభిషేకింపబడుదురో

తా. నా పాదములలోని పద్మములు ఉన్న స్త్రీలు రాజులైన భర్తలతో

కూడ చక్రవర్తిత్వమునందు అభిషేకింపబడుదురు కదా? 6

మూ. వైధవ్యం యాన్తి యైర్నార్యోఽలక్షణైర్భాగ్యదుర్లభాః,
నాత్మనస్తాని పశ్యామి పశ్యన్తీ హతలక్షణా. 7

ప్ర. అ. హతలక్షణా=వ్యర్థమైన లక్షణములు గల నేను, పశ్యన్తీ=పరీక్షించి చూచుచున్నదాననై, భాగ్యదుర్లభాః=దుర్లభమైన భాగ్యము గల, నార్యః=స్త్రీలు, యైః=ఏ, అలక్షణైః= చెడ్డ లక్షణములచేత, వైధవ్యమ్=వైధవ్యమును, యాన్తి=పొందుదురో, తాని=అట్టి అవలక్షణములను, ఆత్మనః=నాకు, న పశ్యామి=చూడను.

తా. నాయందున్న మంచి లక్షణము లన్నీ వ్యర్థమై పోయినవి. ఏ అవలక్షణములున్న స్త్రీలు దౌర్భాగ్యవతులై వైధవ్యమును పొందుదురో అట్టి అవలక్షణములేవీ వెదకి చూచినను నాయందు కనబడుట లేదు. 7

మూ. సత్యనామాని పద్మాని స్త్రీణాముక్తాని లక్షణైః,
తాన్యద్య నిహతే రామే వితథాని భవన్తి మే. 8

ప్ర. అ. లక్షణైః=ధ్వజాదులైన ఇతరలక్షణములతో, పద్మాని=ఏ పద్మములు, స్త్రీణామ్= స్త్రీలకు, సత్యనామాని=సత్యమైన శుభనామములు కల విగా, ఉక్తాని=చెప్పబడినవో, మే= నాయొక్క, తాని=అవి, అద్య=ఇప్పుడు, రామే=రాముడు, నిహతే=చంపబడినవా డగుచుండగా, వితథాని=వ్యర్థములు, భవన్తి=అగుచున్నవి.

తా. స్త్రీల కున్న ఏ ధ్వజములు పద్మములు మొదలైన లక్షణములు తప్పక మంచి ఫలము నిచ్చునవిగా చెప్పబడినవో నా శరీరమునందు ఉన్న ఆ లక్షణము లన్నీ, ఇప్పుడు రాముడు మరణించుటచే వ్యర్థము లైపోయినవి. 8

మూ. కేశాః సూక్ష్మాః సమా నీలా భ్రువౌ చాసంహతే మమ,
వృత్తే చారోమకే జఙ్ఘే దన్తాశ్చావిరలా మమ. 9

ప్ర. అ. మమ=నాయొక్క, కేశాః=కేశములు, సూక్ష్మాః=సన్ననివి, నీలాః= నల్లనివి, సమాః=సమమైనవి. భ్రువౌ చ=కనుబొమ్మలుకూడ, అసంహతే=కలవ నివి. మమ=నాయొక్క, జఙ్ఘే=పిక్కలు, వృత్తే=వర్తులాకారమైనవి, అరోమకే= రోమములు లేనివి, దన్తాశ్చ=దంతములు కూడ, అవిరలాః=ఎడము లేనివి.

తా. నా కేశములు (జుట్టు) సన్నగా సమముగా నల్లగా ఉన్నవి. కనుబొమ్మలు కలవకుండా ఉన్నవి. పిక్కలు గుండ్రముగా రోమములు లేనివై ఉన్నవి. దంతములకు ఎడము లేదు. 9

మూ. శఙ్ఖే నేత్రే కరౌ పాదౌ గుల్ఫావూరూ సమౌ చితౌ,
అనువృత్తనఖాః స్నిగ్ధాః సమాశ్చాఙ్గులయో మమ. 10

ప్ర. అ. మమ=నాయొక్క, శఙ్ఖే=నేత్రముల పక్క నున్న లలాటపార్శ్వ భాగములు, నేత్రే=నేత్రములు, కరౌ=చేతులు, పాదౌ=పాదములు, గుల్ఫౌ=చీలమండలు, ఊరూ=తొడలు, సమౌ=సమముగా నున్నవి. చితౌ=పుష్టిగా ఉన్నవి. అఙ్గులయః=వ్రేళ్లు, అనువృత్తనఖాః=గుండ్రని గోళ్లు గలవి (చివర వెడల్పుగా క్రమముగా కొంచెము సన్నపడుచు ఉన్న గోళ్లు గలవి); స్నిగ్ధాః=మెరుపుగలవి, సమాశ్చ=సమములు (ఉండవలసిన పొడవుగలవి).

తా. నా శంఖములు, నేత్రములు, చేతులు, పాదములు, మడమలు, తొడలు సమములై పుష్టిగా ఉన్నవి. నా వ్రేళ్లు అనువృత్తములైన గోళ్లతో నున్నగా సమముగా ఉన్నవి. 10

మూ. స్తనౌ చావిరలౌ పీనౌ మామకౌ మగ్నచూచుకౌ,
మగ్నా చోత్సేధినీ నాభిః పార్శ్వోరస్కం చ మే చితమ్. 11

ప్ర. అ. మామకౌ=నా సంబంధమైన, స్తనౌ=స్తనములు, అవిరలౌ=దగ్గరగా ఉన్నవి, పీనౌ=బలిసినవి. మగ్నచూచుకౌ=అణగిన చివరి భాగములు గలవి. ఉత్సేధినీ=ఉన్నతప్రదేశము గల, నాభిః=నాభి, మగ్నా=లోతైనది. మే=నాయొక్క, పార్శ్వోరస్కం చ=పార్శ్వములు వక్షఃస్థలమూ గూడ, చితమ్=పుష్టిగా ఉన్నది.

తా. నా స్తనములు బలిసి దగ్గరగా ఉన్నవి. వీటి అగ్రభాగములు లోనికి అణగి ఉన్నవి. ఉన్నతప్రదేశము గల నాభి లోతుగా ఉన్నది. నా పార్శ్వభాగములు, వక్షఃస్థలమూ గూడ పుష్టిగా ఉన్నవి. 11

మూ. మమ వర్ణో మణినిభో మృదూన్యఙ్గరుహాణి చ,
ప్రతిష్ఠితాం ద్వాదశభిర్మామూచుః శుభలక్షణామ్. 12

ప్ర. అ. మమ=నాయొక్క, వర్ణః=రంగు, మణినిభః=మణితో సమానమైనది. అఙ్గరుహాణి చ=రోమములు కూడ, మృదూని=మృదువైనవి. ద్వాదశభిః=పన్నెండింటిచేత, ప్రతిష్ఠితామ్=నేలమీద నిలుచుదానవైన (నేలమీద నిలబడినప్పుడు పాదాల పదివ్రేళ్లు, అరికాళ్లు నేలపై తగులునది) మామ్=నన్ను, శుభలక్షణామ్=శుభమైన లక్షణములు కలదానినిగా, ఊచుః=చెప్పిరి.

తా. నా శరీరవర్ణము మాణిక్యవర్ణము వంటిది. రోమములు మెత్తనివి. నేలమీద నిలచినపుడు పదివ్రేళ్లు అరికాళ్లు అన్నీ నిలబడు నేను శుభలక్షణములు గలదాన నని చెప్పిరి. 12

మూ. సమగ్రయవమచ్ఛిద్రపాణిపాదం చ వర్ణవత్,
మన్దస్మితేత్యేవ చ మాం కన్యాలాక్షణికా విదుః. 13

ప్ర. అ. పాణిపాదం చ=చేతులు పాదములు, సమగ్రయవమ్=పూర్తిగా ఉన్న యవల గుర్తులు కలవి, అచ్ఛిద్రమ్=వ్రేళ్లు దగ్గరగా చేర్చినపుడు రంధ్రములు లేనివి, వర్ణవత్=మంచి రంగు గలవి, మన్దస్మితా=మందమైన నవ్వుగలది, ఇతి=అని, మామ్=నన్నుగూర్చి, కన్యాలాక్షణికాః=కన్యయొక్క లక్షణములు తెలిసినవారు, విదుః=ఎరిగిరి (చెప్పిరి).

తా. నా చేతుల వ్రేళ్లమీద పాదాల వ్రేళ్లమీద ఉన్న యవలు (యవల ఆకారములో ఉండు గుర్తులు) పూర్తిగా ఉన్నవి. వ్రేళ్లు దగ్గర చేర్చినప్పుడు రంధ్రములు లేవు. చేతులు పాదములు కూడ మంచి వర్ణము గలవి. నేను చిరునవ్వు గలదానను అని కన్యాలక్షణము తెలిసిన పండితులు చెప్పిరి. 13

మూ. అధిరాజ్యేఽభిషేక్తో మే బ్రాహ్మణైః పతినా సహ,
కృతాన్తకుశలైరుక్తం తత్సర్వం వితథీకృతమ్. 14

ప్ర. అ. పతినా సహ=భర్తతో కూడ, మే=నాకు, అధిరాజ్యాభిషేకః=అధిరాజ్యమునందు అభిషేకము జరుగును అని, కృతాన్తకుశలైః=దైవజ్ఞులైన, బ్రాహ్మణైః= బ్రాహ్మణులచేత, ఉక్తమ్=చెప్పబడిన, తత్ సర్వమ్=అది అంతా, వితథీకృతమ్=వ్యర్థము చేయబడినది.

తా. నేను భర్తతో కలిసి చక్రవర్తిత్వమునందు అభిషిక్తురాలను కాగలను అని దైవజ్ఞులైన బ్రాహ్మణులు చెప్పిన దంతా వ్యర్థమై పోయినది. 14

మూ. శోధయిత్వా జనస్థానం ప్రవృత్తిముపలభ్య చ,
తీర్త్వా సాగరమక్షోభ్యం భ్రాతరౌ గోష్పదే హతౌ. 15

ప్ర. అ. జనస్థానమ్=జనస్థానమును, శోధయిత్వా=వెదకి, ప్రవృత్తిమ్=నా వృత్తాంతమును, ఉపలభ్య చ=పొంది, అక్షోభ్యమ్=క్షోభింప శక్యము కాని, సాగరమ్= సముద్రమును, తీర్త్వా=దాటి, భ్రాతరౌ=ఈ సోదరులు, గోష్పదే=ఆవు డెక్క గుంటయందు, హతౌ=చంపబడినారు.

తా. జనస్థానము నంతా వెదకి, నా వృత్తాంతము తెలిసికొని క్షోభింప శక్యముకాని సముద్రమును దాటి వచ్చిన ఈ రామలక్ష్మణులు చివరికి ఆవుకాలి డెక్కగుంటలో పడి మరణించినారు. 15

మూ. నను వారుణమాగ్నేయమైన్ద్రం వాయవ్యమేవ చ,
అస్త్రం బ్రహ్మశిరశ్చైవ రాఘవౌ ప్రత్యపద్యతామ్. 16

ప్ర. అ. రాఘవౌ=రామలక్ష్మణులు, వారుణమ్=వారుణాస్త్రమును, ఆగ్నేయమ్= ఆగ్నేయాస్త్రమును, ఐన్ద్రమ్=ఐంద్రాస్త్రమును, వాయవ్యమేవ చ=వాయవ్యాస్త్రమును, బ్రహ్మశిరః అస్త్రం చ=బ్రహ్మశిర మను అస్త్రమును, ప్రత్యపద్యతాం వను=పొంది ఉన్నారు కదా.

తా. రామలక్ష్మణులవద్ద వారుణ-ఆగ్నేయ-ఐన్ద్ర-వాయవ్యాస్త్రములు, బ్రహ్మశిరోనామకాస్త్రము ఉన్నవి కదా! 16

మూ. అదృశ్యమానేన రణే మాయయా వాసవోపమౌ,
మమ నాథావనాథాయా నిహతౌ రామలక్ష్మణౌ. 17

ప్ర. అ. అనాథాయాః=అనాథురాలనైన, మమ=నాయొక్క, నాథౌ=రక్షకులు, వాసవోపమౌ=దేవేంద్రునితో సమానులు అయిన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, రణే= యుద్ధమునందు, మాయయా=మాయచేత, అదృశ్యమానేన=కనబడని రాక్షసునిచేత, నిహతౌ= చంపబడిరి.

తా. అనాథురాలనైన నాకు రక్షకులైన, దేవేంద్రునితో సమానులైన ఈ రామలక్ష్మణులను ఆ రాక్షసుడు మాయచేత కనబడకుండా ఉండి యుద్ధములో చంపినాడు! 17

మూ. న హి దృష్టిపథం ప్రాప్య రాఘవస్య రణే రిపుః,
జీవన్ప్రతినివర్తేత యద్యపి స్యాన్మనోజవః. 18

ప్ర. అ. రిపుః=శత్రువు, మనోజవః=మనోవేగముకలవాడు, స్యాద్యద్యపి= అయినను, రణే=యుద్ధమునందు, రాఘవస్య=రామునియొక్క, దృష్టిపథమ్= దృష్టిమార్గమును, ప్రాప్య=పొంది, జీవన్=జీవించినవాడై, న ప్రతినివర్తేత హి=తిరిగి వెళ్ళడు కదా.

తా. యుద్ధములో రాముని కంటబడిన శత్రువు మనోవేగమువంటి వేగము కలవాడైనా ప్రాణాలతో తిరిగి వెళ్ళడు కదా! 18

మూ. న కాలస్యాతిభారోఽస్తి కృతాన్తశ్చ సుదుర్జయః,
యత్ర రామః సహ భ్రాత్రా శేతే యుధి నిపాతితః. 19

ప్ర. అ. యత్ర=ఎందువలన, రామః=రాముడు, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, యుధి=యుద్ధమునందు, నిపాతితః=పడగొట్టబడినవాడై, శేతే=శయనించి ఉన్నాడో, అందువలన, కాలస్య=కాలమునకు, అతిభారః=ఎక్కువ భారము, నాస్తి=లేదు. కృతాన్తశ్చ=దైవము, సుదుర్జయః=మిక్కిలి జయింప శక్యము కానిది.

తా. రాముడు కూడా సోదరునితో పాటు యుద్ధములో చంపబడి పడి

ఉన్నా ననగా కాలము చేయవలెనని పని లేదు. దైవమును జయించుట చాల కష్టము. 19

మూ. న శోచామి తథా రామం లక్ష్మణం చ మహారథమ్,
నాత్మానం జననీం చాపి యథా శ్వశ్రూం తపస్వినీమ్. 20

ప్ర. అ. తపస్వినీమ్=దీనురాలైన, శ్వశ్రూమ్=అత్తగారిని గూర్చి, యథా=ఎట్లో, తథా=అట్లు, రామమ్=రాముణ్ణి గూర్చి, న శోచామి=దుఃఖించను. మహారథమ్= మహారథుడైన, లక్ష్మణం చ=లక్ష్మణుని గూర్చి, దుఃఖించను. ఆత్మానమ్=తనను గూర్చి, న=దుఃఖించను. జననీం చాపి=నా తల్లిని గూర్చి, న=దుఃఖించను.

తా. దీనురాలైన నా అత్తగారిని గూర్చి దుఃఖించి నట్లుగా రాముణ్ణి గూర్చి గాని, మహారథుడైన లక్ష్మణుని గూర్చి గాని, నన్ను గూర్చి గాని, నా తల్లిని గూర్చి గాని దుఃఖించను. 20

మూ. సా తు చిన్తయతే నిత్యం సమాప్తవ్రతమాగతమ్,
కదా ద్రక్ష్యామి సీతాం చ లక్ష్మణం చ సరాఘవమ్. 21

ప్ర. అ. సా తు=అత్తగారైతే, సమాప్తవ్రతమ్=సమాప్తమైన వ్రతము గల, ఆగతమ్=తిరిగి వచ్చిన, సరాఘవమ్=రామునితో కూడిన, లక్ష్మణం చ=లక్ష్మణుని, సీతామ్ చ=సీతను, కదా=ఎప్పుడు, ద్రక్ష్యామి=చూడగలను అని, నిత్యమ్=ఎల్లప్పుడు, చిన్తయతే=ఆలోచించుచున్నది.

తా. అరణ్యవాసమును పూర్తిచేసికొని తిరిగి వచ్చిన రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, సీతను ఎప్పుడు చూచెదనా అని కౌసల్య ఎల్లప్పుడూ ఆలోచించుచుండెను.21

మూ. పరిదేవయమానాం తాం రాక్షసీ త్రిజటాబ్రవీత్,
మా విషాదం కృథా దేవి భర్తాయం తవ జీవతి. 22

ప్ర. అ. పరిదేవయమానామ్=విలపించుచున్న, తామ్=ఆ సీతను గూర్చి, రాక్షసీ=రాక్షసియైన, త్రిజటా=త్రిజట, అబ్రవీత్=పలికెను. దేవి=ఓ ! దేవీ ! విషాదమ్= దుఃఖమును, మా కృథాః=చేయకుము. తవ=నీయొక్క, భర్తా=భర్త యైన, అయమ్=ఈ రాముడు, జీవతి=జీవించి ఉన్నాడు.

తా. ఇట్లు విలపించుచున్న సీతతో త్రిజట ఇట్లు పలికెను. ఓ ! దేవీ! దుఃఖించకుము. నీ భర్తయైన రాముడు జీవించియే ఉన్నాడు. 22

మూ. కారణాని చ వక్ష్యామి మహాన్తి సదృశాని చ,
యథేమౌ జీవతో దేవి భ్రాతరౌ రామలక్ష్మణౌ. 23

ప్ర. అ. దేవి=ఓ ! దేవీ ! భ్రాతరౌ=సోదరులైన, ఇమౌ=ఈ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, యథా=ఎట్లు, జీవతః=జీవించి ఉన్నారో, మహాన్తి=గొప్ప, సదృశాని=తగిన, కారణాని చ=కారణములను కూడ, వక్ష్యామి=చెప్పెదను.

తా. దేవీ ! సోదరులైన ఈ రామలక్ష్మణులు జీవించియే ఉన్నారనుటకు తగిన మంచి కారణములను కూడ చెప్పెదను. 23

మూ. న హి కోపపరీతాని హర్షపర్యుత్సుకాని చ,
భవన్తి యుధి యోధానాం ముఖాని నిహతే పతౌ. 24

ప్ర. అ. పతౌ=ప్రభువు, యుధి=యుద్ధమునందు, నిహతే=చంప బడినవాడగుచుండగా, యోధానామ్=యోధులయొక్క, ముఖాని=ముఖములు, కోపపరీతాని=కోపముతో నిండినవి, హర్షపర్యుత్సుకాని చ=సంతోషముతో కూడినవి, న భవన్తి హి=అయి ఉండవు కదా ?

తా. ప్రభువు మరణించినట్లయితే యోధుల ముఖములు కోపముతో నిండినవై గాని, సంతోషముతో కూడినవి గాని అయి వుండవు కదా ? 24

మూ. ఇదం విమానం వైదేహి పుష్పకం నామ నామతః,
దివ్యం త్వాం ధారయేన్నైవం యద్యేతౌ గతజీవితౌ. 25

ప్ర. అ. వైదేహి=సీతా ! నామతః=పేరుచేత, పుష్పకం నామ=పుష్పకమని ప్రసిద్ధమైన, దివ్యమ్=దివ్యమైన, ఇదం విమానమ్=ఈ విమానము, ఏతౌ=ఈ రామలక్ష్మణులు, గతజీవితౌ యది=పోయిన ప్రాణములు కలవారైనచో, త్వామ్=నిన్ను, న ధారయేత్=మోయదు.

తా. ఓ ! సీతా ! రామలక్ష్మణులు మరణించినచో పుష్పక మను ప్రసిద్ధనామము గల ఈ దివ్యమైన విమానము నిన్ను మోయదు. 25

మూ. హతవీరప్రధానా హి గతోత్సాహా నిరుద్యమా,
సేనా భ్రమతి సంఖ్యేషు హతకర్ణేవ నౌర్జలే. 26

ప్ర. అ. సంఖ్యేషు=యుద్ధములయందు, హతవీరప్రధానా=చంపబడిన ప్రధానవీరుడు గల, సేనా=సేన, గతోత్సాహా=పోయిన ఉత్సాహము కలదై, నిరుద్యమా=ప్రయత్నము లేనిదై, జలే=జలమునందు, హతకర్ణా=విరిగిపోయిన చుక్కాని గల, నౌః ఇవ= నావ వలె, భ్రమతి=తిరుగుచుండును.

తా. యుద్ధములో ప్రధానవీరుడు మరణించినప్పుడు సేన ఉత్సాహము లేనిదై, ప్రయత్నహీనమై చుక్కాని విరిగిన ఓడ నీటిలో తిరిగినట్లు తిరుగుచుండును. 26

మూ. ఇయం పునరసంభ్రాన్తా నిరుద్విగ్నా తపస్విని,
సేనా రక్షతి కాకుత్స్థౌ మయా ప్రీత్యా నివేదితా. 27

ప్ర. అ. తపస్విని=దీనురాలవైన ఓ ! సీతా ! ఇయమ్=ఈ, సేనా పునః=సేన అయితే, అసంభ్రాన్తా=భయపడనిదై, నిరుద్విగ్నా=దిగులు లేనిదై, మయా=నాచేత, ప్రీత్యా=నీయందున్న ప్రేమచేత, నివేదితా=జీవించి ఉన్నట్లు తెలుపబడిన, కాకుత్స్థౌ=రామలక్ష్మణులను, రక్షతి=రక్షించుచున్నది.

తా. దీనురాలవైన ఓ ! సీతా ! ఈ సేన ఐతే భయపడక, దిగులు లేనిదై, జీవించి ఉన్నట్లుగా నేను నీకు ప్రేమతో తెలిపిన ఈ రామలక్ష్మణులను రక్షించుచున్నది. 27

మూ. సా త్వం భవ సువిస్రబ్ధా అనుమానైః సుఖోదయైః,
అహతౌ పశ్య కాకుత్స్థౌ స్నేహాదేతద్ బ్రవీమి తే. 28

ప్ర. అ. సా త్వమ్=అట్టి నీవు, సుఖోదయైః=సుఖమైన ఫలము గల, అనుమానైః= అనుమానములచేత (ఊహలచేత), సువిస్రబ్ధా=బాగా నమ్మకము కలదానవు, భవ=అగుము. అహతౌ=చంపబడని, కాకుత్స్థౌ=రామలక్ష్మణులను, పశ్య=చూడుము. స్నేహాత్=స్నేహమువలన, ఏతత్=దీనిని, తే=నీకు, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. ఈ ఊహల ఫలము సుఖకరమైనది. అందుచేత నీవు పూర్తి విశ్వాసముతో ఉండుము. ఈ రామలక్ష్మణులు మరణించలేదు. చూడుము. నేను నీపై ఉన్న స్నేహముచేత చెప్పుచున్నాను. 28

మూ. అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యామి మైథిలి,
చారిత్రసుఖశీలత్వాత్ప్రవిష్టాసి మనో మమ. 29

ప్ర. అ. మైథిలి=సీతా ! అనృతమ్=అసత్యము, మే=నాకు, న ఉక్తపూర్వమ్=పూర్వము పలకబడలేదు. న చ వక్ష్యామి=పలకను కూడ. చారిత్ర సుఖశీలత్వాత్=ఉత్తమచరిత్ర అనే ప్రియమైన శీలము కలదాన వగుటచేత, మమ=నాయొక్క, మనః=మనస్సును, ప్రవిష్టా అసి=ప్రవేశించితివి.

తా. సీతా ! నేనెన్నడు పూర్వము అసత్యము పలకలేదు. ఇటుపైన కూడ పలకను. నీవు పాతివ్రత్యమనే మంచి శీలము గలదాన వగుటచేత, నా మనస్సును ఆకర్షించినావు. 29

మూ. నేమౌ శక్యౌ రణే జేతుం సేన్ద్రైరపి సురాసురైః,
తాదృశం దర్శనం దృష్ట్వా మయా చావేదితం తవ. 30

ప్ర. అ. ఇమౌ=వీరిద్దరూ, సేన్ద్రైః=ఇంద్రునితో కూడిన, సురాసురైరపి=సురాసురులచేత కూడ, రణే=యుద్ధమునందు, జేతుమ్=జయించుటకు, న శక్యౌ=శక్యమైనవారు కారు. తాదృశమ్=అట్టి, దర్శనమ్=దృశ్యమును, దృష్ట్వా=చూచి, మయా=నాచేత, తవ=నీకు, ఆవేదితమ్=తెలుపబడినది.

తా. ఇంద్రునితో కూడిన సురాసురు లందరూ వచ్చినా యుద్ధములో వీరిద్దరినీ జయింపజాలరు. వీరు జీవించి ఉన్నట్లు సూచించు అట్టి దృశ్యములను చూచి నేను నీకు చెప్పినాను. 30

మూ. ఇదం చ సుమహచ్చిత్రం శరైః పశ్యస్వ మైథిలి,
విసంజ్ఞౌ పతితావేతౌ నైవ లక్ష్మీర్వియుజ్యతి. 31

ప్ర. అ. మైథిలి=సీతా ! శరైః=బాణములచేత, విసంజ్ఞౌ=సంజ్ఞ లేనివారుగా, పతితౌ=పడి ఉన్న, ఏతౌ=వీరిని, లక్ష్మీః=శోభ, నైవ ముఞ్చతి=విడచుటలేదు. ఇదమ్=ఈ, సుమహత్=చాల గొప్పదైన, చిత్రమ్=ఆశ్చర్యమును, పశ్యస్వ=చూడుము.

తా. సీతా! బాణములచే కొట్టబడి సంజ్ఞ లేకుండా పడిపోయినా కూడ ఈ రామలక్ష్మణులను కాంతి విడచుటలేదు. గొప్ప ఆశ్చర్యకరమైన ఈ విషయమును చూడుము. 31

మూ. ప్రాయేణ గతసత్త్వానాం పురుషాణాం గతాయుషామ్,
దృశ్యమానేషు వక్త్రేషు పరం భవతి వైకృతమ్. 32

ప్ర. అ. ప్రాయేణ=తరచుగా, గతాయుషామ్=పోయిన ఆయుర్దాయము గల, గతసత్త్వానామ్=పోయిన ప్రాణములు గల, పురుషాణామ్=పురుషులయొక్క, దృశ్యమానేషు=చూడబడుచున్న, వక్త్రేషు=ముఖములయందు, పరమ్=అధికమైన, వైకృతమ్=వికారము, భవతి=అగును.

తా. ఆయుర్దాయము చెల్లి ప్రాణములు విడచిన వారి ముఖములు సాధారణముగా చాల వికృతములుగా ఉండును. 32

మూ. త్యజ శోకం చ దుఃఖం చ మోహం చ జనకాత్మజే,
రామలక్ష్మణయోరర్థే నాద్య శక్యమజీవితుమ్. 33

ప్ర. అ. జనకాత్మజే=ఓ ! సీతా ! రామలక్ష్మణయోః అర్థే=రామలక్ష్మణుల నిమిత్తమై, శోకమ్=శోకమును, దుఃఖం చ=దుఃఖమును, మోహం చ=మోహమును, త్యజ=విడువుము. అద్య=ఇప్పుడు, అజీవితుమ్=జీవించకుండా ఉండుటకు, న శక్యమ్=శక్యము కాదు.

తా. సీతా ! రామలక్ష్మణుల నిమిత్తమై శోకమువలన కలిగిన ముఖవికారాదికమును, దుఃఖమును, మనోవ్యాకులత్వమును విడువుము. ఇట్టి ముఖశోభాదులు కల - రామలక్ష్మణులు మరణించుట కుదరదు. 33

మూ. శ్రుత్వా తు వచనం తస్యాః సీతా సురసుతోపమా,
కృతాఞ్జలిరువాచేమామేవమస్త్వితి మైథిలీ. 34

ప్ర. అ. సురసుతోపమా=దేవకన్యతో సమానురాలు, మైథిలీ=మిథిలారాజకుమారియైన, సీతా=సీత, తస్యాః=ఆమెయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలికలదై, ఏవమ్=ఇట్లే, అస్తు=అగుగాక, ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా. దేవకన్య వంటి మిథిలారాజకుమారియైన సీత ఆమె మాటలు విని, అంజలి ఘటించి "నీ మాట సత్య మగుగాక" అని పలికెను. 34

మూ. విమానం పుష్పకం తత్తు సంనివర్త్య మనోజవమ్,
దీనా త్రిజటయా సీతా లఙ్కామేవ ప్రవేశితా. 35

ప్ర. అ. దీనా=దీనురాలైన, సీతా=సీత, త్రిజటయా=త్రిజటచేత, మనోజవమ్=మనోవేగము గల, తత్=ఆ, పుష్పకం విమానమ్=పుష్పక విమానమును, సంనివర్త్య=వెనుకకు మరల్చి, లఙ్కామేవ=లంకకే, ప్రవేశితా=ప్రవేశపెట్టబడినది.

తా. త్రిజట మనోవేగము గల ఆ పుష్పకవిమానమును వెనుకకు మరల్చి సీతను లంకలోనికి తీసికొని వెళ్లెను. 35

మూ. తతస్త్రిజటయా సార్ధం పుష్పకాదవరుహ్య సా,
అశోకవనికామేవ రాక్షసీభిః ప్రవేశితా. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సా=ఆమె, త్రిజటయా సార్ధమ్=త్రిజటతో కూడ, పుష్పకాత్=పుష్పకమునుండి, అవరుహ్య=దిగి, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, అశోకవనికామేవ=అశోకవనమునే, ప్రవేశితా=ప్రవేశపెట్టబడెను.

తా. పిమ్మట త్రిజటతో కూడ పుష్పకమునుండి దిగిన ఆ సీతను రాక్షసస్త్రీలు అశోకవనములో ప్రవేశపెట్టిరి. 36

మూ. ప్రవిశ్య సీతా బహువృక్షషణ్డాం
తాం రాక్షసేన్ద్రస్య విహారభూమిమ్,
సంప్రేక్ష్య సంచిన్త్య చ రాజపుత్రీ
పరం విషాదం సముపాజగామ. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టచత్వారింశః సర్గః.

ప్ర. అ. సీతా=సీత, బహువృక్షషణ్డామ్=అనేకములైన వృక్షసముదాయములుగల, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, విహారభూమిమ్=విహారస్థానమైన, తామ్=ఆ అశోకవనికను, ప్రవిశ్య=ప్రవేశించి, రాజపుత్రౌ=రాజపుత్రులను, సంప్రేక్ష్య=చూచి, సంచిన్త్య చ=ఆలోచించి, పరమ్=గొప్ప, విషాదమ్=దుఃఖమును, ఉపాజగామ=పొందెను.

రా. సీత అనేకవృక్షసముదాయములు గలది, రావణుని విహారస్థానము అయిన అశోకవనిలో ప్రవేశించి, మనసా రామలక్ష్మణులనే చూచుచు వారిని గూర్చి ఆలోచించుచు, చాల దుఃఖార్తురా లయ్యెను. 37

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలభైయెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనపఞ్చాశః సర్గః

*[తిరిగి స్పృహ వచ్చిన రాముడు లక్ష్మణునికొరకు విలపించుట; ప్రాణములను విడువవలె నని నిశ్చయించుకొని "మీరందరు స్వగృహములకు వెళ్లుడు" అని వానరులను ఆజ్ఞాపించుట.]*

మూ. ఘోరేణ శరబన్ధేన బద్ధౌ దశరథాత్మజౌ,
నిశ్వసన్తౌ యథా నాగౌ శయానౌ రుధిరోక్షితౌ. 1
సర్వే తే వానరశ్రేష్ఠాః ససుగ్రీవా మహాబలాః,
పరివార్య మహాత్మానౌ తస్థుః శోకపరిప్లుతాః. 2

ప్ర. అ. ససుగ్రీవాః=సుగ్రీవునితో కూడిన, మహాబలాః=గొప్ప బలము గల, సర్వే=సమస్తమైన, తే వానరశ్రేష్ఠాః=ఆ వానరశ్రేష్ఠులు, ఘోరేణ=భయంకరమైన, శరబన్ధేన=శరబంధముచేత, బద్ధౌ=కట్టబడినవారు, నాగౌ యథా=సర్పములవలె, నిశ్వసన్తౌ=నిట్టూర్పుచున్నవారు, రుధిరోక్షితౌ=రక్తముచేత తడపబడినవారు అయిన, శయానౌ=శయనించిన, మహాత్మానౌ=మహాత్ములైన, దశరథాత్మజౌ=దశరథకుమారులను, పరివార్య=చుట్టి, శోకపరిప్లుతాః=శోకముతో నిండినవారై, తస్థుః=నిలచిరి.

తా. సుగ్రీవుడు మొదలైన మహాబలవంతులైన ఆ వానరశ్రేష్ఠు లందరూ, భయంకరమైన శరబంధముచేత బంధింపబడి సర్పముల వలె నిట్టూర్పుచు, రక్తముచేత తడిసిన మహాత్ములైన ఆ రామలక్ష్మణుల చుట్టూ శోకముతో నిండినవారై నిలచిరి. 1, 2

మూ. ఏతస్మిన్నన్తరే రామః ప్రత్యబుధ్యత వీర్యవాన్,
స్థిరత్వాత్సత్త్వయోగాచ్చ శరైః సందానితోఽపి సన్. 3

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఇంతలో, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామః=రాముడు, శరైః=బాణములచేత, సందానితోఽపి=కట్టబడినవాడైనను, స్థిరత్వాత్=స్థిరుడగుటవలనను, సత్త్వయోగాత్ చ=బలముయొక్క సంబంధమువలనను, ప్రత్యబుధ్యత=మేల్కొనెను.

తా. ఇంతలో పరాక్రమవంతుడైన రాముడు శరములచేత బంధింపబడినను, మానసికస్థైర్యము ఉన్నవాడగుటవలనను, బలము గలవాడగుటవలనను స్పృహలోకి వచ్చెను. 3

మూ. తతో దృష్ట్వా సరుధిరం విషణ్ణం గాఢమర్పితమ్,
భ్రాతరం దీనవదనం పర్యదేవయదాతురః. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సరుధిరమ్=రక్తముతో కూడినవాడు,

విషణ్ణమ్=క్షీణించినవాడు, గాఢమ్=గాఢముగా, అర్పితమ్=నేలమీద పడవేయబడిన వాడు, దీనవదనమ్=దీనమైన ముఖము గలవాడు అయిన, భ్రాతరమ్=సోదరుని, దృష్ట్వా=చూచి, ఆతురః=దుఃఖితుడై, పర్యదేవయత్=విలపించెను.

తా. పిమ్మట రాముడు రక్తములో తడిసిన వాడు, క్షీణించినవాడు, గాఢముగా నేలమీద పడవేయబడినవాడు, దీనమైన ముఖము గలవాడు అయిన సోదరుని చూచి దుఃఖార్తుడై విలపించెను. 4

మూ. కిం ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా,
శయానం యోఽద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్. 5

ప్ర. అ. యః=ఏ నేను, అద్య=ఇప్పుడు, యుధి=యుద్ధమునందు, నిర్జితమ్=జయింపబడిన, శయానమ్=శయనించి ఉన్న, భ్రాతరమ్=సోదరుణ్ణి, పశ్యామి=చూచుచున్నానో, మే=అట్టి నాకు, సీతయా=సీతచేత, కిం ను కార్యమ్=ఏమి ప్రయోజనము ? జీవితేన వా =జీవితము చేతనైనా, కిం కార్యమ్=ఏమి ప్రయోజనము ?

తా. యుద్ధములో జయింపబడి పడి ఉన్న సోదరుని చూడవలసి వచ్చిన నాకు సీతతో కాని, జీవితముతో కాని ఏమి ప్రయోజనము ? 5

మూ. శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా,
న లక్ష్మణసమో భ్రాతా సచివః సాంపరాయికః. 6

ప్ర. అ. మర్త్యలోకే=మనుష్యలోకమునందు, విచిన్వతా=అన్వేషించుచున్న నాచేత, సీతాసమా=సీతతో సమానురాలైన, నారీ=స్త్రీ, శక్యా=పొంద శక్యమైనది. సచివః=సహాయుడు, సాంపరాయికః=యుద్ధములో ఉపయోగించువాడు అయిన, లక్ష్మణసమః=లక్ష్మణునితో సమానుడైన, భ్రాతా=సోదరుడు, న=పొంద శక్యమైనవాడు కాడు.

తా. అన్వేషించగా ఈ భూలోకములో సీతవంటి స్త్రీ దొరకవచ్చును. కాని సాహాయ్యము చేసేవాడు, యుద్ధమునందు సమర్థుడు అయిన లక్ష్మణుని వంటి సోదరుడు లభించడు. 6

మూ. పరిత్యక్ష్యామ్యహం ప్రాణాన్ వానరాణాం తు పశ్యతామ్,
యది పఞ్చత్వమాపన్నః సుమిత్రానన్దవర్ధనః. 7

ప్ర. అ. సుమిత్రానన్దవర్ధనః=సుమిత్రయొక్క ఆనందమును వృద్ధిపొందించు లక్ష్మణుడు, పఞ్చత్వమ్=మరణమును, ఆపన్నః యది=పొందినట్లయితే, అహమ్=నేను, వానరాణామ్=వానరులు, పశ్యతామ్=చూచుచుండగా, ప్రాణాన్=ప్రాణములను, పరిత్యక్ష్యామి=విడచెదను.

తా. లక్ష్మణుడు మరణించినట్లయితే నేను కూడ వానరులు చూచుచుండగా ప్రాణాలు విడచెదను. 7

మూ. కిం ను వక్ష్యామి కౌసల్యాం మాతరం కిం ను కైకయీమ్,
కథమమ్బాం సుమిత్రాం చ పుత్రదర్శనలాలసామ్. 8

ప్ర. అ. మాతరమ్=తల్లియైన, కౌసల్యామ్=కౌసల్యను (కు), కిం ను వక్ష్యామి=ఏమి చెప్పెదను ? కైకయీమ్=కైకేయికి, కిం ను=ఏమి చెప్పెదను ? పుత్రదర్శనలాలసామ్=పుత్రుని చూచుటయందు ఆసక్తి గల, అమ్బామ్=తల్లియైన, సుమిత్రామ్=సుమిత్రను గూర్చి, కథమ్=ఎట్లు మాట్లాడెదను ?

తా. తల్లియైన కౌసల్యకు, కైకేయికి, పుత్రుని చూడవలె నని ఆసక్తితో ఎదురుచూచుచున్న తల్లియైన సుమిత్రకు ఏమి చెప్పెదను ? 8

మూ. వివత్సాం వేపమానాం చ క్రోశన్తీం కురరీమివ,
కథమాశ్వాసయిష్యామి యది యాస్యామి తం వినా. 9

ప్ర. అ. తం వినా=ఆ లక్ష్మణుడు లేకుండా, యాస్యామి యది=నేను వెళ్లినట్లయితే, వివత్సామ్=పుత్రుడు లేనిది, వేపమానాం చ=వణకిపోవుచున్నది, కురరీమివ=గోరింకపక్షి వలె, క్రోశన్తీమ్=అరచుచున్నది అయిన సుమిత్రను, కథమ్=ఎట్లు, ఆశ్వాసయిష్యామి=ఓదార్చెదను.

తా. లక్ష్మణుడు లేకుండగా తిరిగి వెళ్లిన నేను తల్లియైన సుమిత్ర పుత్రుడు లేక వణకిపోవుచు గోరింక వలె ఏడ్చుచుండగా నే నామెను ఎట్లు ఓదార్పగలను ? 9

మూ. కథం వక్ష్యామి శత్రుఘ్నం భరతం చ యశస్వినమ్,
మయా సహ వనం యాతో వినా తేనాహమాగతః. 10

ప్ర. అ. మయా సహ=నాతో కూడ, వనమ్=వనమును గూర్చి, యాతః=ఏ లక్ష్మణుడు వెళ్ళినాడో, తేన వినా=ఆ లక్ష్మణుడు లేకుండగా, అహమ్=నేను, ఆగతః=వచ్చినాను అని, శత్రుఘ్నమ్=శత్రుఘ్నుని గూర్చి, యశస్వినమ్=కీర్తి గల, భరతమ్=భరతుని గూర్చి, కథమ్=ఎట్లు, వక్ష్యామి=చెప్పగలను.

తా. "ఏ లక్ష్మణుడు నాతో వనమునకు వచ్చినాడో, ఆతడు లేకుండా నేను తిరిగి వచ్చినాను" అని శత్రుఘ్నునితోను, యశశ్శాలియైన భరతునితోను ఎట్లు చెప్పగలను ? 10

మూ. ఉపాలమ్భం న శక్ష్యామి సోఢుం బత సుమిత్రయా,
ఇహైవ దేహం త్యక్ష్యామి న హి జీవితుముత్సహే. 11

ప్ర. అ. బత=ఎంత కష్టము ! సుమిత్రయా=సుమిత్రచేత, ఉపాలమ్భమ్=నిందను, సోఢుమ్=సహించుటకు, న శక్ష్యామి=సమర్థుడను కాజాలను. ఇహైవ=ఇక్కడనే, దేహమ్=దేహమును, త్యక్ష్యామి=విడచెదను. జీవితుమ్=జీవించుటకు, న ఉత్సహే=ఇచ్ఛయించను.

తా. సుమిత్ర చేయు నిందను సహించజాలను. అందుచేత ఇక్కడనే దేహమును విడచెదను. జీవించుటకు ఇచ్ఛగించను. 11

మూ. ధిఙ్మాం దుష్కృతకర్మాణమనార్యం మత్కృతే హ్యసౌ,
లక్ష్మణః పతితః శేతే శరతల్పే గతాసువత్. 12

ప్ర. అ. దుష్కృత కర్మాణమ్=చెడ్డ కర్మకలవాడను, అనార్యమ్=అనార్యుడను అయిన, మామ్=నన్ను గూర్చి, ధిక్=నింద అగుగాక. మత్కృతే=నానిమిత్తమై, అసౌ=ఈ, లక్ష్మణః=లక్ష్మణుడు, పతితః=పడగొట్టబడినవాడై, గతాసువత్=మరణించినవాడు వలె, శరతల్పే=శరతల్పమునందు, శేతే హి=శయనించి ఉన్నాడు కదా !

తా. ఛీ ! నేనెంత పాపాత్ముడను ! ఎంత చెడ్డవాడను ! ఈ లక్ష్మణుడు నానిమిత్తమై పడగొట్టబడినవాడై మరణించి నట్లు శరతల్పము మీద శయనించి ఉన్నాడు. 12

మూ. త్వం నిత్యం సువిషణ్ణం మామాశ్వాసయసి లక్ష్మణ,
గతాసుర్నాద్య శక్తోఽసి మామార్తమభిభాషితుమ్. 13

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! త్వమ్=నీవు, నిత్యమ్=ఎల్లప్పుడూ, సువిషణ్ణమ్=బాగా దుఃఖితుడనైన, మామ్=నన్ను, ఆశ్వాసయసి=ఓదార్చుచున్నావు. అద్య=ఇప్పుడు, గతాసుః=పోయిన ప్రాణములు గల నీవు, ఆర్తమ్=దుఃఖితుడనైన, మామ్=నన్ను, అభిభాషితుమ్=పలకరించుటకు, శక్తః=సమర్థుడవుగా, నాసి=లేవు.

తా. లక్ష్మణా ! నేను దుఃఖాక్రాంతుడనైనప్పుడల్లా నీవు నన్ను ఓదార్చుచుండేవాడవు. ఇప్పుడు నీవు మరణించుటచే దుఃఖితుడనైన నాతో మాటలాడుట లేదు. 13

మూ. యేనాద్య బహవో యుద్ధే నిహతా రాక్షసాః క్షితౌ,
తస్యామేవాద్య శూరస్త్వం శేషే నిహతః శరైః. 14

ప్ర. అ. యేన=ఏ నీచేత, అద్య=నేడు, యుద్ధే=యుద్ధమునందు, బహవః=చాలమంది, రాక్షసాః=రాక్షసులు, క్షితౌ=భూమియందు, నిహతాః=చంపబడినారో, శూరః=శూరుడవైన, త్వమ్=అట్టి నీవు, అద్య=ఇప్పుడు, శరైః=బాణములచేత, నిహతః=చంపబడినవాడవై, తస్యామేవ=ఆ నేలమీదనే, శేషే=శయనించి ఉన్నావు.

తా. ఈనాడు ఏ నీవు యుద్ధములో అనేకులు రాక్షసులను చంపి నేలమీద పడవేసినావో ఆ నీవు ఇప్పుడు బాణాలచేత చంపబడినవాడవై, ఆ నేలమీదనే శయనించి ఉన్నావు. 14

మూ. శయానః శరతల్పేఽస్మిన్ స శోణితపరిప్లుతః,
శరజాలైశ్చితో భాసి భాస్కరోఽస్తమివ వ్రజన్. 15

ప్ర. అ. శరజాలైః=బాణముల సముదాయముచేత, చితః=వ్యాపింపచేయ బడిన వాడవు, శోణితపరిప్లుతః=రక్తముచేత పూయబడినవాడవు, అస్మిన్=ఈ, శరతల్పే=శరతల్పమునందు, శయానః=శయనించుచున్నవాడవు అయిన, సః=అట్టి నీవు, అస్తమ్=అస్తాద్రిని గూర్చి, వ్రజన్=వెళ్లుచున్న, భాస్కరః ఇవ=సూర్యుడు వలె, భాసి=ప్రకాశించుచున్నావు.

తా. బాణముల సముదాయముతో నిండిన వాడవై, రక్తముచేత తడిసి ఈ శరతల్పముమీద శయనించి ఉన్న నీవు అస్తాద్రి చేరుచున్న సూర్యుడు వలె ఉన్నావు. 15

మూ. బాణాభిహతమర్మత్వాన్న శక్నోత్యభిభాషితుమ్,
రుజా నాబ్రువతోఽప్యస్య దృష్టిరాగేణ సూచ్యతే. 16

ప్ర. అ. బాణాభిహతమర్మత్వాత్=బాణములచేత కొట్టబడిన మర్మ ప్రదేశములు కలవాడగుటవలన, అభిభాషితుమ్=పలుకుటకు, న శక్నోతి=సమర్థుడ గుట లేదు. అబ్రువతోఽపి=మాటలాడకున్నను, అస్య=వీనియొక్క, రుజా=బాధ, దృష్టిరాగేణ=దృష్టియొక్క రాగముచేత, సూచ్యతే=సూచింపబడుచున్నది.

తా. మర్మస్థానములు బాణములచేత కొట్టబడుటచేత మాటలాడ లేకున్నాడు. మాటలాడకపోయినను, చూపులోని ఎరుపువలన ఈతని బాధ వ్యక్త మగుచున్నది. 16

మూ. యథైవ మాం వనం యాన్తమనుయాతో మహాద్యుతిః,
అహమప్యనుయాస్యామి తథైవైనం యమక్షయమ్. 17

ప్ర. అ. మహాద్యుతిః=గొప్ప కాంతి గల ఇతడు, వనమ్=వనమును గూర్చి, యాన్తమ్=వెళ్లుచున్న, మామ్=నన్ను, యథైవ=ఎట్లు, అనుయాతః=అనుసరించినాడో, తథైవ=అట్లే, అహమపి=నేను కూడ, ఏనమ్=ఇతనిని, యమక్షయమ్=యమలోకమును గూర్చి, అనుయాస్యామి=అనుసరించి వెళ్లెదను.

తా. గొప్ప కాంతి గల ఇతడు వనమునకు వెళ్లుచున్నప్పుడు నన్ను ఎట్లు అనుసరించినాడో అట్లే నేను కూడ యమలోకమునకు ఈతని వెనుక వెళ్లెదను. 17

మూ. ఇష్టబన్ధుజనో నిత్యం మాం చ నిత్యమనువ్రతః,
ఇమామద్య గతోఽవస్థాం మమానార్యస్య దుర్నయైః. 18

ప్ర. అ. నిత్యమ్=ఎల్లప్పుడూ, ఇష్టబన్ధుజనః=ఇష్టమైన బంధుజనములుగల వాడు, నిత్యమ్=ఎల్లప్పుడూ, మామ్=నన్ను, అనువ్రతః=అనుసరించినవాడు అయిన ఇతడు, అనార్యస్య=చెడ్డవాడనైన, మమ=నాయొక్క, దుర్నయైః=చెడ్డపనులచేత, అద్య=ఇప్పుడు, ఇమామ్=ఈ, అవస్థామ్=అవస్థను, గతః=పొందినాడు.

తా. ఎల్లప్పుడు బంధువులయందు ప్రేమ గలవాడు, నిత్యమూ నన్ను అనుసరించువాడూ అయిన ఇతడు అనార్యుడనైన నా చెడ్డపనులచేత ఇట్టి అవస్థ పొందినాడు. 18

మూ. మరుష్టేనాపి వీరేణ లక్ష్మణేన న సంస్మరే,
పరుషం విప్రియం చాపి శ్రావితం న కదాచన. 19

ప్ర. అ. మరుష్టేనాపి=బాగా కోపించినవాడైనను, వీరేణ=వీరుడైన, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, కదాచన=ఎన్నడూ, పరుషమ్=పరుషము, విప్రియమ్=అప్రియము అయిన మాటను, శ్రావితమ్=వినిపింపచేయబడినదానినిగా, న సంస్మరే=స్మరించను.

తా. వీరుడైన లక్ష్మణుడు ఎంత కోపము వచ్చినను, ఎన్నడూ కూడ పరుషము, అప్రియము అయిన మాట పలికినట్లు నాకు గుర్తు లేదు. 19

మూ. విససర్జైకవేగేన పఞ్చ బాణశతాని యః,
ఇష్వస్త్రేష్వధికస్తస్మాత్కార్తవీర్యాచ్చ లక్ష్మణః. 20

ప్ర. అ. యః=ఏ కార్తవీర్యుడు, ఏకవేగేన=ఒక్క ప్రయత్నము చేత, పఞ్చ=ఐదు, బాణశతాని=బాణముల శతములను, విససర్జ=విడచెనో, తస్మాత్=అట్టి, కార్తవీర్యాత్ చ=కార్తవీర్యునికంటె కూడ, లక్ష్మణః=లక్ష్మణుడు, ఇష్వస్త్రేషు=బాణముల ప్రయోగములయందు, అధికః=గొప్పవాడు.

తా. వెయ్యి భుజములు గల ఏ కార్తవీర్యార్జునుడు ఒక్క ప్రయత్నముచేత, ఐదు వందల బాణములు ప్రయోగించేవాడో, ఆతని కంటె కూడ లక్ష్మణుడు బాణప్రయోగములో అధికుడు. 20

మూ. అస్త్రైరస్త్రాణి యో హన్యాచ్ఛక్రస్యాపి మహాత్మనః,
సోఽయముర్వ్యాం హతః శేతే మహార్హశయనోచితః. 21

ప్ర. అ. యః=ఏ లక్ష్మణుడు, మహాత్మనః=మహాత్ముడైన, శక్రస్య=దేవేంద్రునియొక్క, అస్త్రాణ్యపి=అస్త్రములను కూడ, అస్త్రైః=అస్త్రముల చేత,

హన్యాత్=కొట్టి వేయునో, మహార్హశయనోచితః=అమూల్యమైన శయనమునకు తగిన, సః అయమ్=అట్టి ఈ లక్ష్మణుడు, హతః=చంపబడినవాడై, ఉర్వ్యామ్=భూమియందు, శేతే=శయనించి ఉన్నాడు.

తా. ఏ లక్ష్మణుడు మహాత్ముడైన దేవేంద్రుని అస్త్రములను కూడ అస్త్రముల చేత కొట్టివేయగలడో, ఉత్తమమైన శయనముపై పరుండుటకు తగిన అట్టి లక్ష్మణుడు చంపబడి నేలపై శయనించి ఉన్నాడు. 21

మూ. తత్తు మిథ్యాప్రలప్తం మాం ప్రధక్ష్యతి న సంశయః,
యన్మయా న కృతో రాజా రాక్షసానాం విభీషణః. 22

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, మయా=నా చేత, యత్=ఏ కారణమువలన, రాక్షసానామ్=రాక్షసులకు, రాజా=రాజుగా, న కృతః=చేయబడలేదో, తత్=ఆ కారణమువలన, మిథ్యాప్రలప్తమ్=అసత్యమైన ప్రలాపము, మామ్=నన్ను, ప్రధక్ష్యతి=కాల్చివేయుగలదు; సంశయః=సంశయము, న=లేదు.

తా. విభీషణుణ్ణి రాక్షసరాజుగా చేయలేకపోయితిని. అందుచే "నిన్ను రాజును చేసెదను" అని నేను విభీషణునితో పలికిన అసత్యప్రలాపము నన్ను కాల్చివేయును; సందేహము లేదు. 22

మూ. అస్మిన్ ముహూర్తే సుగ్రీవ ప్రతియాతుమితోఽర్హసి,
మత్వా హీనం మయా రాజన్ రావణోఽభిభవిష్యతి. 23

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! అస్మిన్=ఈ, ముహూర్తే=ముహూర్తమునందే, ఇతః=ఇక్కడినుండి, ప్రతియాతుమ్=తిరిగి వెళ్లుటకు, అర్హసి=తగి ఉన్నావు. రాజన్=రాజా! రావణః=రావణుడు, మయా=నాతో, హీనమ్=శూన్యునిగా, మత్వా=తెలిసికొని, అభిభవిష్యతి=తిరస్కరించగలడు.

తా. వానరరాజా ! సుగ్రీవా ! నీ ఈ ముహూర్తమునందే బయలుదేరి ఇక్కడినుండి వెళ్లిపొమ్ము. నేను నీతో లేనని తెలిసి రావణుడు నిన్ను తిరస్కరించును. 23

మూ. అఙ్గదం తు పురస్కృత్య ససైన్యం ససరిచ్ఛదమ్,
సాగరం తర సుగ్రీవ నీలేన చ నలేన చ. 24

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! ససైన్యమ్=సైన్యముతో కూడినవాడు, ససరిచ్ఛదమ్=పరివారముతో కూడినవాడు అయిన, అఙ్గదమ్=అంగదుణ్ణి, పురస్కృత్య=ఎదుట ఉంచుకొని, నీలేన చ=నీలునితోను, నలేన చ=నలునితోను, సముద్రమ్=సముద్రమును, తర=దాటుము.

తా. - సుగ్రీవా ! నువ్వు సైన్యముతోను, పరివారముతోను, అంగద - వీర వరులతోను సముద్రమును దాటి వెళ్లినాము. 24

మూ. కృతం హి సుమహత్కర్మ యుదన్యైర్దుష్కరం రణే,
ఋక్షరాజేన తుష్యామి గోలాఙ్గూలాధిపేన చ. 25

ప్ర. అ. ఋక్షరాజేన=భల్లూకరాజైన జాంబవంతునిచేతను, గోలాఙ్గూలాధిపేన=గోలాంగూలముల రాజుచేతను, రణే=యుద్ధమునందు, యత్=ఏది, అన్యైః=ఇతరులచేత, దుష్కరమ్=చేయ శక్యము కానిదో అట్టి, సుమహత్=చాలగొప్పదైన, కర్మ=పని, కృతం హి=చేయబడినది కదా ! తుష్యామి=సంతోషించుచున్నాను.

తా. యుద్ధములో మరెవ్వరూ చేయజాలని పనులు జాంబవంతుడు, గోలాంగూలముల ప్రభువు చేసినందుకు సంతోషించుచున్నాను. 25

మూ. అఙ్గదేన కృతం కర్మ మైన్దేన ద్వివిదేన చ,
యుద్ధం కేసరిణా సంఖ్యే ఘోరం సంపాతినా కృతమ్. 26

ప్ర. అ. అఙ్గదేన=అంగదునిచేతను, మైన్దేన=మైందునిచేతను, ద్వివిదేన చ=ద్వివిదునిచేతను, కర్మ=గొప్ప పని, కృతమ్=చేయబడినది. సంఖ్యే=యుద్ధమునందు, కేసరిణా=కేసరిచేత, సంపాతినా=సంపాతిచేత, ఘోరమ్=ఘోరమైన, యుద్ధమ్=యుద్ధము, కృతమ్=చేయబడినది.

తా. అంగదుడు, మైందుడు, ద్వివిదుడు గొప్పపనులు చేసినారు. యుద్ధరంగములో కేసరి, సంపాతి ఘోరమైన యుద్ధము చేసినారు. 26

మూ. గవయేన గవాక్షేణ శరభేణ గజేన చ,
అన్యైశ్చ హరిభిర్యుద్ధం మదర్థే త్యక్తజీవితైః. 27

ప్ర. అ. గవయేన=గవయునిచేత, గవాక్షేణ=గవాక్షునిచేత, శరభేణ=శరభునిచేత, గజేన=గజునిచేత, మదర్థే=నా నిమిత్తమై, త్యక్తజీవితైః=విడువబడిన జీవితము గల, అన్యైః=ఇతరులైన, హరిభిశ్చ=వానరుల చేత, యుద్ధమ్=యుద్ధముచేయబడినది.

తా. గవయుడు, గవాక్షుడు, శరభుడు, గజుడు, నానిమిత్తమై ప్రాణములను త్యజించుటకు సిద్ధమైన ఇతరవానరులు గొప్ప యుద్ధము చేసిరి.

మూ. న చాతిక్రమితుం శక్యం దైవం సుగ్రీవ మానుషైః,
యత్తు శక్యం వయస్యేన సుహృదా చ పరంతప. 28
కృతం సుగ్రీవ తత్సర్వం భవతా ధర్మభీరుణా.

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! మానుషైః=మనుష్యులచేత, దైవమ్=దైవము,

అతిక్రమితుమ్=అతిక్రమించుటకు, న చ శక్యమ్=శక్యము కాదు. పరంతప=శత్రువులను పీడించువాడా ! సుగ్రీవ=సుగ్రీవా ! సుహృదా=మంచి హృదయము గల, వయస్యేన=మిత్రునిచేత, యత్తు=ఏది, శక్యమ్=శక్యమైనదో, తత్=అది, సర్వమ్=అంతా, ధర్మభీరుణా=ధర్మమునుండి భయము గల, త్వయా=నీచేత, కృతమ్=చేయబడినది.

తా. సుగ్రీవా ! మానవులు దైవమును అతిక్రమింపజాలరు. ఓ ! శత్రుసంహారకుడా ! మంచి హృదయము గల మిత్రుడు చేయగలిగిన దంతా ధర్మభీతి గల నీవు చేసినావు. 28

మూ. మిత్రకార్యం కృతమిదం భవద్భిర్వానరర్షభాః, 29
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం గన్తుమర్హథ.

ప్ర. అ. వానరర్షభాః=వానరశ్రేష్ఠులారా ! భవద్భిః=మీచేత, ఇదమ్=ఈ, మిత్రకార్యమ్=మిత్రకార్యము, కృతమ్=చేయబడినది. సర్వే=మీరందరూ, మయా=నాచేత, అనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడినారు. యథేష్టమ్=ఇష్టము వచ్చినట్లుగా, గన్తుమ్=వెళ్లుటకు, అర్హథ=తగియున్నారు.

తా. ఓ ! వానరశ్రేష్ఠులారా ! మీరు మిత్రులు చేయవలసిన కార్యము చేసినారు. మీ అందరికీ అనుజ్ఞ ఇచ్చుచున్నాను; మీ కిష్టమైన ప్రదేశములకు వెళ్లుడు. 29

మూ. శుశ్రువుస్తస్య యే సర్వే వానరాః పరిదేవితమ్, 30
వర్తయాంచక్రిరేఽశ్రూణి నేత్రైః కృష్ణేతరేక్షణాః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, యే=ఏ, వానరాః=వానరులు, తస్య=ఆ రాముని యొక్క, పరిదేవితమ్=విలాపమును, శుశ్రువుః=వినిరో, కృష్ణేతరేక్షణాః=నల్లని కళ్లు గల ఆ వానరులు, నేత్రైః=నేత్రములచేత, అశ్రూణి=కన్నీళ్లను, వర్తయాంచక్రిరే=ప్రవర్తింపచేసిరి.

తా. రాముని విలాపమును విన్న వానరు లందరూ నేత్రములనుండి కన్నీళ్లు కార్చిరి. 30

మూ. తతః సర్వాణ్యనీకాని స్థాపయిత్వా విభీషణః, 31
ఆజగామ గదాపాణిస్త్వరితం యత్ర రాఘవః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, సర్వాణి=సమస్తమైన, అనీకాని=సేనలను, స్థాపయిత్వా=నిలిపి, గదాపాణిః=గద హస్తమునందు గలవాడై, రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, త్వరితమ్=శీఘ్రముగా, ఆజగామ=వచ్చెను.

తా. ఇంతలో విభీషణుడు సైన్యమును నిల్పి వారికి ధైర్యము చెప్పి నిలిపి, గద హస్తమునందు ధరించి రాముడున్న చోటికి శీఘ్రముగా వచ్చెను.31

మూ. తం దృష్ట్వా త్వరితం యాన్తం నీలాఞ్జనచయోపమమ్, 32
వానరా దుద్రువుః సర్వే మన్యమానాస్తు రావణిమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకోనపఞ్చాశః సర్గః

ప్ర. అ. త్వరితమ్=శీఘ్రముగా, యాన్తమ్=వెళ్లుచున్న, నీలాఞ్జనచయోపమమ్=నల్లని కాటుక రాసితో సమానుడైన, తమ్=అతనిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, రావణిమ్=ఇంద్రజిత్తునుగా, మన్యమానాః=తలచుచు, దుద్రువుః=పారిపోయిరి.

తా. నల్లని కాటుక రాసి వలె ఉన్న ఆ విభీషణుడు శీఘ్రముగా వెళ్లుట చూచి వానరులందరూ ఇంద్రజిత్తు అని అనుకొని పారిపోయిరి. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నలుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాశః సర్గః

(విభీషణుని చూచి ఇంద్రజిత్తనుకొని వానరులు పారిపోవుట; సుగ్రీవుని ఆజ్ఞచేత జాంబవంతుడు వెళ్లి వాళ్లకు ధైర్యము చెప్పుట; విభీషణుడు విలపించుట; సుగ్రీవుడు అతనిని ఓదార్చుట, గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను నాగపాశమునుండి విముక్తులను చేసి వెళ్లుట. వానరులు సంతోషించుట.)

మూ. అథోవాచ మహాతేజా హరిరాజో మహాబలః,
కిమియం వ్యథితా సేనా మూఢవాతేవ నౌర్జలే. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహాబలః=గొప్ప బలము గల, హరిరాజః=సుగ్రీవుడు, ఉవాచ=పలికెను. ఇయం సేనా=ఈ సేన, జలే=జలమునందు, మూఢవాతేవ=మూఢమైన (మరొక ఎదురుగాలిచే కొట్టబడి మూర్ఛచెందిన) వాయువు గల, నౌః ఇవ = ఓడ వలె, కిమ్=ఎందుకు, వ్యథితా=వ్యథచెందినది ?

తా. అప్పుడు గొప్ప తేజస్సు, బలము గల సుగ్రీవుడు పలికెను- "మూఢమైన వాయువుచేత ఓడ నీటిలో వ్యాకులమైనట్లు ఈ సైన్యము వ్యథ చెందిన దేమి ?"

మూ. సుగ్రీవస్య వచః శ్రుత్వా వాలిపుత్రో౽ఙ్గదో౽బ్రవీత్,
న త్వం పశ్యసి రామం చ లక్ష్మణం చ మహారథమ్, 2
శరజాలచితౌ వీరావుభౌ దశరథాత్మజౌ,
శరతల్పే మహాత్మానౌ శయానౌ రుధిరోక్షితౌ. 3

ప్ర. అ. సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, వాలిపుత్రః=వాలికుమారుడైన, అఙ్గదః=అంగదుడు, అబ్రవీత్=పలికెను. శరజాలచితౌ=బాణముల సముదాయముచేత వ్యాప్తమైనవారు, రుధిరోక్షితౌ=రక్తముచేత తడపబడినవారు, శరతల్పే=శరతల్పమునందు, శయానౌ=శయనించి ఉన్నవారు, మహాత్మానౌ=మహాత్ములు, దశరథాత్మజౌ=దశరథుని కుమారులు అయిన, రామమ్=రాముణ్ణి, మహారథమ్= మహారథుడైన, లక్ష్మణం చ=లక్ష్మణునీ, త్వమ్=నీవు, న పశ్యసి=చూచుట లేదా ?

తా. సుగ్రీవుని మాటలు విని వాలిపుత్రుడైన అంగదుడు ఇట్లనెను - "మహాత్ములైన దశరథకుమారులు రాముడు, మహారథుడైన లక్ష్మణుడు బాణముల సముదాయముచేత కప్పబడి, రక్తముచేత తడిసి, శరతల్పముమీద శయనించి ఉన్నారుకదా ! నీవు ఆ వీరులను చూడలేదా ?" 3

మూ. అథాబ్రవీద్వానరేన్ద్రః సుగ్రీవః పుత్రమఙ్గదమ్,
నానిమిత్తమిదం మన్యే భవితవ్యం భయేన తు. 4

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వానరేన్ద్రః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, పుత్రమ్=పుత్రుడైన, అఙ్గదమ్=అంగదుని గూర్చి, అబ్రవీత్=పలికెను. ఇదమ్=దీనిని, అనిమిత్తమ్=నిమిత్తము లేనిదానినిగా, న మన్యే=తలపను. భయేన=భయకారణముచేత, భవితవ్యమ్=ఉండి ఉండవలెను.

తా. పిమ్మట వానరరాజైన సుగ్రీవుడు పుత్రుడైన అంగదునితో ఇట్లు పలికెను "ఇది కారణము లేకుండా జరుగుచున్న దని అనుకోను ; ఏదో భయకారణము ఉండి ఉండవలెను." 4

మూ. విషణ్ణవదనా హ్యేతే త్యక్తప్రహరణా దిశః,
పలాయన్తేఽత్ర హరయస్త్రాసాదుత్ఫుల్లలోచనాః. 5

ప్ర. అ. అత్ర=ఇక్కడ, ఏతే=ఈ, హరయః=వానరులు, త్రాసాత్=భయమువలన, ఉత్ఫుల్లలోచనాః=వికసించిన నేత్రములు గలవారై, త్యక్తప్రహరణాః=విడువబడిన ఆయుధములు గలవారై, విషణ్ణవదనాః=దిగులు చెందిన ముఖములు కలవారై, దిశః=దిక్కులను గూర్చి, పలాయన్తే=పారిపోవుచున్నారు.

తా. ఇక్కడ ఈ వానరులు దిగులు చెందిన ముఖములతో, భయముచేత విప్పారిన కళ్ళతో, ఆయుధములు విడచి నాల్గు దిక్కులకు పారిపోవుచున్నారు.

మూ. అన్యోన్యస్య న లజ్జన్తే న నిరీక్షన్తి పృష్ఠతః,
విప్రకర్షన్తి చాన్యోన్యం పతితం లఙ్ఘయన్తి చ. 6

ప్ర. అ. అన్యోన్యస్య=పరస్పరమునకు, న లజ్జన్తే=సిగ్గుపడుటలేదు. పృష్ఠతః=వెనుకకు, న నిరీక్షన్తి=చూచుటలేదు. అన్యోన్యమ్=పరస్పరము విప్రకర్షన్తి=లాగుచున్నారు. పతితమ్=పడిపోయినవానిని, లఙ్ఘయన్తి చ=దాటివేయుచున్నారు.

తా. ఈ వానరులు ఒకరిని చూచి ఒకరు సిగ్గు పడుటలేదు. వెనుకకు తిరిగి చూచుట లేదు. ఒకరినొకరు లాగుచున్నారు. పడిపోయినవానిని దాటి వెళ్లిపోవుచున్నారు. 6

మూ. ఏతస్మిన్నన్తరే వీరో గదాపాణిర్విభీషణః,
సుగ్రీవం వర్ధయామాస రాఘవం చ జయాశిషా. 7

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యయందు, గదాపాణిః=గద హస్తమునందు గల, వీరః=వీరుడైన, విభీషణః=విభీషణుడు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి,

రాఘవం చ=రాముణ్ణి, జయాశీషా=జయ జయ అను ఆశీర్వాదముచేత, వర్ధయామాస=వృద్ధిపొందించెను.

తా. ఇంతలో వేలిలో గద ధరించిన వీరుడైన విభీషణుడు వచ్చి జయశబ్దమును ఉచ్చరించుచు సుగ్రీవునకు, రామునకు అభివాదనము చేసెను. 7

మూ. విభీషణం చ సుగ్రీవో దృష్ట్వా వానరభీషణమ్,
ఋక్షరాజం మహాత్మానం సమీపస్థమువాచ హ. 8

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, విభీషణమ్=విభీషణుని, వానరభీషణమ్=వానరులకు భయంకరునిగా, దృష్ట్వా=చూచి, సమీపస్థమ్=సమీపము నందున్న, మహాత్మానమ్=మహాత్ముడైన, ఋక్షరాజమ్=జాంబవంతుణ్ణి గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. వానరులు భయపడుటకు కారణము విభీషణుడే అని గ్రహించి సుగ్రీవుడు సమీపమునందున్న మహాత్ముడైన జాంబవంతునితో ఇట్లు పలికెను.

మూ. విభీషణోఽయం సంప్రాప్తో యం దృష్ట్వా వానరర్షభాః,
ద్రవన్త్యాయతసంత్రాసా రావణాత్మజశఙ్కయా. 9

ప్ర. అ. అయమ్=ఈ, విభీషణః=విభీషణుడు, సంప్రాప్తః=వచ్చినాడు. యమ్= ఎవనిని, దృష్ట్వా=చూచి, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, రావణాత్మజశఙ్కయా= ఇంద్రజిత్తు అనే శంకచేత, ఆయతసంత్రాసాః=అధికమైన భయము కలవారై, ద్రవన్తి= పారిపోవుచున్నారో.

తా. ఈ విభీషణుడు వచ్చినాడు. ఈతనినే చూచి వానరశ్రేష్ఠులు ఇంద్రజిత్తు అనే శంకచేత భయపడి పారిపోవుచున్నారు. 9

మూ. శీఘ్రమేతాన్ సుసంత్రస్తాన్బహుధా విప్రధావితాన్,
పర్యవస్థాపయాఖ్యాహి విభీషణముపస్థితమ్. 10

ప్ర. అ. సుసంత్రస్తాన్=బాగా భయపడిన, బహుధా=అనేకవిధములుగా, విప్రధావితాన్= పారిపోవుచున్న, ఏతాన్=ఈ వానరులను, శీఘ్రమ్=శీఘ్రముగా, పర్యవస్థాపయ=ధైర్యముగలవారిని చేయుము. ఉపస్థితమ్=వచ్చినవానిని, విభీషణమ్=విభీషణునిగా, ఆఖ్యాహి=చెప్పుము.

తా. భయపడి అన్ని వైపులకు పారిపోవుచున్న వీళ్లకు శీఘ్రముగా వెళ్లి ధైర్యము చెప్పుము. వచ్చినవాడు విభీషణు డని వాళ్లకు చెప్పుము. 10

మూ. సుగ్రీవేణైవముక్తస్తు జామ్బవానృక్షపార్థివః,
వానరాన్ సాన్త్వయామాస సంనివర్త్య ప్రధావతః. 11

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, ఋక్షపార్థివః=భల్లూకరాజైన, జామ్బవాన్=జాంబవంతుడు, ప్రధావతః=పారిపోవుచున్న, వానరాన్=వానరులను, నివర్త్య=మళ్లించి, సాన్త్వయామాస=ఓదార్చెను.

తా. భల్లూకముల రాజైన జాంబవంతుడు సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారము వెళ్లి పారిపోవుచున్న వానరులను వెనుకకు మరల్చి వారికి ధైర్యము చెప్పెను. 11

మూ. తే నివృత్తాః పునః సర్వే వానరాస్త్యక్తసాధ్వసాః,
ఋక్షరాజవచః శ్రుత్వా తం చ దృష్ట్వా విభీషణమ్. 12

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే వానరాః=ఆ వానరులు, ఋక్షరాజవచః=జాంబవంతుని వచనమును, శ్రుత్వా=విని, తమ్=ఆ, విభీషణమ్=విభీషణుని, దృష్ట్వా=చూచి, త్యక్తసాధ్వసాః=విడువబడిన భయము గలవారై, పునః=మరల, నివృత్తాః=మరలిరి.

తా. ఆ వానరు లందరు జాంబవంతుని మాటలు విని, ఆ విభీషణుని చూచి, భయము విడచి మరల తిరిగి వచ్చిరి. 12

మూ. విభీషణస్తు రామస్య దృష్ట్వా గాత్రం శరైశ్చితమ్,
లక్ష్మణస్య చ ధర్మాత్మా బభూవ వ్యథితస్తదా. 13

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విభీషణస్తు=విభీషణుడైతే, శరైః=బాణములచేత, చితమ్=వ్యాప్తమైన, రామస్య=రామునియొక్క, గాత్రమ్=శరీరమును, లక్ష్మణస్య చ=లక్ష్మణుని శరీరమును, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, వ్యథితః=వ్యథచెందినవాడు, బభూవ=ఆయెను.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు బాణములచేత అంతటా గ్రుచ్చబడిన రామలక్ష్మణుల శరీరములు చూచి అప్పుడు చాల వ్యథ చెందెను. 13

మూ. జలక్లిన్నేన హస్తేన తయోర్నేత్రే విమృజ్య చ,
శోకసంపీడితమనా రురోద విలలాప చ. 14

ప్ర. అ. జలక్లిన్నేన=జలముచేత తడిసిన, హస్తేన=చేతితో, తయోః=వారిద్దరి యొక్క, నేత్రే=నేత్రములను, విమృజ్య చ=తుడిచి, శోకసంపీడితమనాః=శోకముచేత పీడింపబడిన మనస్సు గలవాడై, రురోద=ఏడ్చెను. విలలాప చ=విలపించెను కూడ.

తా. ఆతడు నీళ్లతో తడిసిన చేతితో వాళ్ల కళ్లు తుడిచి, శోకముచేత పీడింపబడిన మనస్సు గలవాడై ఏడ్చుచు విలపించెను. 14

మూ. ఇమౌ తౌ సత్త్వసంపన్నౌ విక్రాన్తౌ ప్రియసంయుగౌ,
ఇమామవస్థాం గమితౌ రాక్షసైః కూటయోధిభిః. 15

ప్ర. అ. సత్త్వసంపన్నౌ=బలముతో కూడినవారు, విక్రాన్తౌ=పరాక్రమవంతులు, ప్రియసంయుగౌ=ఇష్టమైన యుద్ధము గలవారు అయిన, తౌ=అట్టి ఇమౌ=వీరిద్దరూ, కూటయోధిభిః=కపటయుద్ధము చేయు, రాక్షసైః=రాక్షసులచేత, ఇమామ్=ఈ, అవస్థామ్=అవస్థను, గమితౌ=పొందించబడినారు.

తా. అధికబలము గలవారు, పరాక్రమవంతులు, యుద్ధమునందు ఆసక్తి గలవారు అయిన అట్టి ఈ రామలక్ష్మణులను కపటయుద్ధము చేయు రాక్షసులు ఇట్టి స్థితి పొందించినారు ! 15

మూ. భ్రాతృపుత్రేణ చైతేన దుష్పుత్రేణ దురాత్మనా,
రాక్షస్యా జిహ్మయా బుద్ధ్యా వఞ్చితావృజువిక్రమౌ. 16

ప్ర. అ. ఋజువిక్రమౌ=కుటిలత్వములేని పరాక్రమము గల వీరు, దుష్పుత్రేణ=చెడ్డ పుత్రుడు, దురాత్మనా=చెడ్డ బుద్ధి గలవాడు అయిన, ఏతేన=ఈ, భ్రాతృపుత్రేణ=నా సోదరుని కుమారునిచేత, రాక్షస్యా=రాక్షససంబంధమైన, జిహ్మయా=వక్రమైన, బుద్ధ్యా=బుద్ధిచేత, వఞ్చితౌ=వంచింపబడినారు.

తా. కపటము ఎరుగని పరాక్రమము గల వీరిద్దరినీ దుష్టపుత్రుడు, చెడ్డ బుద్ధి కలవాడు అయిన నా సోదరుని కుమారుడు రాక్షససహజమైన కుటిల బుద్ధితో వంచించినాడు. 16

మూ. శరైరిమావలం విద్ధౌ రుధిరేణ సముక్షితౌ,
వసుధాయామిమౌ సుప్తౌ దృశ్యేతే శల్యకావివ. 17

ప్ర. అ. శరైః=బాణములచేత, అలమ్=అధికముగా, విద్ధౌ=కొట్టబడినవారు, రుధిరేణ=రక్తముచేత, సముక్షితౌ=తడుపబడినవారు, వసుధాయామ్=నేలమీద, సుప్తౌ=నిద్రించుచున్నవారు అయిన, ఇమౌ=వీరిద్దరూ, శల్యకావివ=శల్యకమృగముల (శరీర మంతా ముళ్లు ఉండు మృగవిశేషముల) వలె, దృశ్యేతే=కనబడుచున్నారు.

తా. బాణములచేత అధికముగా కొట్టబడి, రక్తముతో తడిసి నేలమీద పడి ఉన్న ఈ రామలక్ష్మణులు శల్యకమృగముల వలె కనబడుచున్నారు. 17

మూ. యయోర్వీర్యముపాశ్రిత్య ప్రతిష్ఠా కాఙ్క్షితా మయా,
తావిమౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ 18

ప్ర. అ. మయా=నాచేత, యయోః=ఎవరియొక్క, వీర్యమ్=పరాక్రమమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, ప్రతిష్ఠా=ప్రతిష్ఠ, కాఙ్క్షితా=కోరబడినదో, తౌ=అట్టి,

ఇమౌ=ఈ, పురుషర్షభౌ=పురుషశ్రేష్ఠులు, దేహనాశాయ=దేహముయొక్క నాశముకొరకు, ప్రసుప్తౌ=నిద్రించుచున్నారు.

తా. ఏ రామలక్ష్మణుల పరాక్రమమును ఆశ్రయించి నేను రాజ్యము పొందవలెనని కోరుకొంటినో అట్టి ఈ మానవశ్రేష్ఠులు ప్రాణములను విడుచుటకై పడియున్నారు. 18

మూ. జీవన్నద్య విపన్నో౽స్మి నష్టరాజ్యమనోరథః,
ప్రాప్తప్రతిజ్ఞశ్చ రిపుః సకామో రావణః కృతః. 19

ప్ర. అ. నష్టరాజ్యమనోరథః=నష్టమైన రాజ్యవాంఛ గల నేను, జీవన్నపి=జీవించి ఉన్నను, అద్య=ఇప్పుడు, విపన్నః=విపత్తు చెందినవాడను, అస్మి=అయినాను. రిపుః=శత్రువైన, రావణః=రావణుడు, ప్రాప్తప్రతిజ్ఞః=పొందబడిన (సీతను విడువను అనే) ప్రతిజ్ఞ కలవాడు, సకామశ్చ=కోరిక తీరినవాడు, కృతః=చేయబడినాడు.

తా. నా రాజ్యలాభాశ నశించుటచేత నేను ఇప్పుడు జీవించి ఉన్నా ఆపదలలో ఉన్నాను. శత్రువైన రావణుని ప్రతిజ్ఞ నెరవేరి వాని కోరిక తీరినది.

మూ. ఏవం విలపమానం తం పరిష్వజ్య విభీషణమ్,
సుగ్రీవః సత్త్వసంపన్నో హరిరాజో౽బ్రవీదిదమ్. 20

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, విలపమానమ్=విలపించుచున్న, తం విభీషణమ్=ఆ విభీషణుని, పరిష్వజ్య=కౌగలించుకొని, సత్త్వసంపన్నః=బలముతో కూడినవాడు, హరిరాజః=వానరరాజు అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. బలశాలి, వానరరాజు అయిన సుగ్రీవుడు ఈ విధముగా విలపించుచున్న విభీషణుని కౌగలించుకొని ఇట్లు పలికెను. 20

మూ. రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ లఙ్కాయాం నాత్ర సంశయః,
రావణః సహ పుత్రేణ స్వకామం నేహ లప్స్యతే. 21

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మము తెలిసినవాడా ! లఙ్కాయామ్=లంకయందు, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్స్యసి=పొందగలవు. అత్ర=ఈవిషయమునందు, సంశయః=సంశయము, న=లేదు. రావణః=రావణుడు, సహపుత్రేణ=పుత్రునితో కూడ, స్వకామమ్=తన కోరికను, ఇహ=ఇప్పుడు, న లప్స్యతే=పొందడు.

తా. ధర్మము తెలిసిన ఓ ! విభీషణా ! నీవు లంకారాజ్యము పొందగలవు; సందేహము లేదు. రావణుడు, అతని కుమారుడు అనుకొన్నట్లు

వారి కోరిక సఫలము కాదు. 21

మూ. న రుజా పీడితావేతావుభౌ రాఘవలక్ష్మణౌ
త్యక్త్వా మోహం వధిష్యేతే సగణం రావణం రణే. 22

ప్ర. అ. ఏతౌ=ఈ, ఉభౌ=ఇద్దరు, రాఘవలక్ష్మణౌ=రామలక్ష్మణులు, రుజా=బాధచేత, పీడితౌ=పీడింపబడినవారు, న=కారు. మోహమ్=మోహమును, త్యక్త్వా=విడచి, రణే=యుద్ధమునందు, సగణమ్=గణములతోకూడిన, రావణమ్=రావణుని, వధిష్యేతే=వధింపగలరు.

తా. ఈ రామలక్ష్మణులు ఇద్దరూ మరణమును కలిగించు బాధచేత పీడింపబడుటలేదు. కేవలము మోహము చెంది ఉన్నారు. మోహమును విడచి యుద్ధములో పరివారసహితుడైన రావణుని చంపగలరు. 22

మూ. తమేవం సాన్త్వయిత్వా తు సమాశ్వాస్య చ రాక్షసమ్,
సుషేణం శ్వశురం పార్శ్వే సుగ్రీవస్తమువాచ హ. 23

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, తం రాక్షసమ్=ఆ విభీషణుని, ఏవమ్=ఇట్లు, సాన్త్వయిత్వా=ఓదార్చి, సమాశ్వాస్య=విశ్వాసము కలిగించి, పార్శ్వే=పార్శ్వము నందున్న, శ్వశురమ్=మామగారైన, తం సుషేణమ్=ఆ సుషేణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. సుగ్రీవుడు విభీషణుని ఈ విధముగా ఓదార్చి, విశ్వాసము కలిగించి, ప్రక్కనే ఉన్న మామగారైన సుషేణునితో ఇట్లు పలికెను. 23

మూ. సహ శూరైర్హరిగణైర్లబ్ధసంజ్ఞావరిందమౌ,
గచ్ఛ త్వం భ్రాతరౌ గృహ్య కిష్కింధాం రామలక్ష్మణౌ. 24

ప్ర. అ. శూరైః=శూరులైన, హరిగణైః=వానరుల గణములతో కూడినవాడవై, త్వమ్=నీవు, లబ్ధసంజ్ఞౌ=పొందబడిన సంజ్ఞ గల, అరిందమౌ=శత్రుసంహారకులైన, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, గృహ్య=గ్రహించి, కిష్కింధామ్=కిష్కింధను గూర్చి, గచ్ఛ=వెళ్లుము.

తా. నీవు శూరులైన వానరులతో కలిసి, సంజ్ఞ వచ్చిన శత్రుసంహారకులైన ఈ సోదరులను, రామలక్ష్మణులను తీసికొని కిష్కింధకు వెళ్లుము. 24

మూ. అహం తు రావణం హత్వా సపుత్రం సహ బాన్ధవమ్,
మైథిలీమానయిష్యామి శక్రో నష్టామివ శ్రియమ్. 25

ప్ర. అ. అహం తు=నేనైతే, సపుత్రమ్=పుత్రులతో కూడిన, సహ బాన్ధవమ్=బంధువులతో కూడిన, రావణమ్=రావణుని, హత్వా=చంపి, శక్రః=దేవేం

ద్రుడు, నష్టామ్=నశించిన, శ్రియమివ=రాజ్యలక్ష్మిని వలె, మైథిలీమ్=సీతను, ఆనయిష్యామి= తీసికొనిరాగలను.

తా. నేను రావణుని, వాని పుత్రులను, బంధువులను సంహరించి, దేవేంద్రుడు నష్టమైన రాజ్యలక్ష్మిని తిరిగి తీసికొనివచ్చి నట్లు సీతను తీసికొని వచ్చెదను. 25

మూ. శ్రుత్వైతద్వానరేన్ద్రస్య సుషేణో వాక్యమబ్రవీత్,
దైవాసురం మహద్యుద్ధమనుభూతం సుదారుణమ్. 26

ప్ర. అ. వానరేన్ద్రస్య=సుగ్రీవునియొక్క, ఏతత్ వాక్యమ్=ఈ వాక్యమును, శ్రుత్వా=విని, సుషేణః=సుషేణుడు, అబ్రవీత్=పలికెను. దైవాసురమ్=దేవతలకు అసురులకు సంబంధించిన, సుదారుణమ్=చాల భయంకరమైన, మహత్=గొప్ప, యుద్ధమ్= యుద్ధము, అనుభూతమ్=నాచేత తెలియబడినది.

తా. సుగ్రీవుని వాక్యమును విని సుషేణుడు ఇట్లు పలికెను. "దేవాసురుల మధ్య జరిగిన చాల భయంకరమైన యుద్ధమును గూర్చి నాకు తెలియును".26

మూ. తదా స్మ దానవా దేవాన్ శరసంస్పర్శకోవిదాః,
నిజఘ్నుః శస్త్రవిదుషశ్ఛాదయన్తో ముహుర్ముహుః. 27

ప్ర. అ. తదా=అప్పుడు, శరసంస్పర్శకోవిదాః=బాణప్రయోగమునందు నేర్పరులైన, దానవాః=దానవులు, శస్త్రవిదుషః=శస్త్రములయందు పండితులైన, దేవాన్=దేవతలను, ముహుర్ముహుః=మాటిమాటికి, ఛాదయన్తః=తమను తాము కప్పుకొనుచున్నవారై, నిజఘ్నుః=కొట్టిరి.

తా. "అప్పుడు బాణప్రయోగమునందు నేర్పు గల దానవులు మాటి మాటికి అంతర్ధానము చెందుచు, అస్త్రములయందు సమర్థులైన దేవతలను కొట్టిరి". 27

మూ. తానార్తాన్నష్టసంజ్ఞాంశ్చ గతాసూంశ్చ బృహస్పతిః,
విద్యాభిర్మన్త్రయుక్తాభిరోషధీభిశ్చికిత్సతి. 28

ప్ర. అ. బృహస్పతిః=బృహస్పతి, ఆర్తాన్=పీడితులు, నష్టసంజ్ఞాన్=నష్టమైన సంజ్ఞగలవారు, గతాసూంశ్చ=పోయిన ప్రాణములు గలవారు అయిన, తాన్=ఆ దేవతలను, మన్త్రయుక్తాభిః=మంత్రములతో కూడిన, విద్యాభిః=విద్యలచేతను, ఓషధీభిః=ఓషధులచేతను, చికిత్సతి=చికిత్స చేసెను.

తా. "ఆ దేవతలలో కొందరు పీడితులైరి. కొందరు మూర్ఛ చెందిరి. కొందరు మరణించిరి. వాళ్లందరికి బృహస్పతి మంత్రములతో కూడిన విద్యచేత,

ఓషధులచేత చికిత్స చేసెను." 28

మూ. తాన్యౌషధాన్యానయితుం క్షీరోదం యాన్తు సాగరమ్
జవేన వానరాః శీఘ్రం సంపాతిపనసాదయః. 29

ప్ర. అ. తాని=ఆ, ఔషధాని=ఔషధములను, ఆనయితుమ్=తీసికొనివచ్చుటకు, సంపాతిపనసాదయః=సంపాతి, పనసుడు మొదలైన, వానరాః=వానరులు, జవేన=వేగముతో, శీఘ్రమ్=శీఘ్రముగా, క్షీరోదమ్=క్షీరము ఉదకముగా గల, సాగరమ్=సముద్రమును గూర్చి, యాన్తు=వెళ్లెదరుగాక.

తా. "సంపాతి, పనసుడు మొదలైన వానరులు ఆ ఔషధములను తీసికొని వచ్చుటకై వెంటనే, క్షీరసముద్రమునకు వేగముగా వెళ్లెదరుగాక." 29

మూ. హరయస్తు విజానన్తి పార్వతీస్తా మహౌషధీః,
సంజీవకరణీం దివ్యాం విశల్యాం దేవనిర్మితామ్. 30

ప్ర. అ. హరయః=వానరులు, పార్వతీః=పర్వతములకు సంబంధించిన, తాః=ఆ మహౌషధీః=ఆ మహౌషధులను, దివ్యామ్=దివ్యమైన, సంజీవకరణీమ్=(బ్రతికించు) సంజీవకరణిని, దేవనిర్మితామ్=దేవతలచేత నిర్మింపబడిన, విశల్యామ్=(శల్యములను తొలగించు) విశల్య అను ఓషధిని, విజానన్తి=ఎరుగుదురు.

తా. "దివ్యమైన సంజీవకరణిని, దేవతలు సృజించిన విశల్యకరణిని, ఇతరములైన పర్వతములందు లభించే ఓషధులను ఆ వానరులు ఎరుగుదురు." 30

మూ. చన్ద్రశ్చ నామ ద్రోణశ్చ క్షీరోదే సాగరోత్తమే,
అమృతం యత్ర మథితం తత్ర తే పరమౌషధీ. 31

ప్ర. అ. యత్ర=దేనియందు, అమృతమ్=అమృతము, మథితమ్=మథింపబడినదో, అట్టి, సాగరోత్తమే=సాగరములలో ఉత్తమమైన, క్షీరోదే=క్షీరసముద్రమునందు, చన్ద్రశ్చ=చంద్రము, ద్రోణశ్చ=ద్రోణము అను, పర్వతము లున్నవి. తే=ఆ, పరమౌషధీ=శ్రేష్ఠములైన రెండు ఓషధులు, తత్ర=అక్కడ ఉన్నవి.

తా. అమృతము మథించిన సముద్రశ్రేష్ఠమైన క్షీరసముద్రములో చంద్రము, ద్రోణము అను పర్వతము లున్నవి. సంజీవకరణి, విశల్యకరణి అను పరమౌషధులు ఆ పర్వతముల మీద ఉన్నవి. 31

మూ. తే తత్ర విహితే దేవైః పర్వతే తే మహోదధౌ,
అయం వాయుసుతో రాజన్ హనూమాంస్తత్ర గచ్ఛతు. 32

ప్ర. అ. తే=ప్రసిద్ధములైన, తే పర్వతే=ఆ పర్వతములు, తత్ర=ఆ,

మహోదధౌ=మహాసముద్రమునందు, దేవైః=దేవతలచేత, విహితౌ=నిర్మించబడినవి. రాజన్=రాజా ! వాయుసుతః=వాయుపుత్రుడైన, అయమ్=ఈ, హనుమాన్=హనుమంతుడు, తత్ర=అక్కడికి, గచ్ఛతు=వెళ్లుగాక.

తా. "ఆ రెండు పర్వతములను దేవతలు ఆ క్షీరసముద్రమునందు ఉంచినారు. రాజా ! వాయుపుత్రుడైన ఈ హనుమంతుని అక్కడికి పంపుము." 32

మూ. ఏతస్మిన్నన్తరే వాయుర్మేఘాంశ్చాపి సవిద్యుతః,
పర్యస్యన్ సాగరే తోయం కమ్పయన్నివ పర్వతాన్. 33

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యకాలములో, సవిద్యుతః=మెరుపులతో కూడిన, మేఘాంశ్చాపి=మేఘములను, సాగరే=సముద్రమునందు, తోయమ్=ఉదకమును, పర్యస్యన్=చిమ్మివేయుచు, వాయుః=వాయువు, పర్వతాన్=పర్వతములను, కమ్పయన్నివ=కంపింపచేయుచున్నది వలె, బయలుదేరెను.

తా. ఇంతలో మెరుపులతో కూడిన మేఘములను, సముద్రములోని జలమును చిమ్మివేయుచు, పర్వతములను కూడ కంపింపచేయుచున్నదా అన్నట్లు తీవ్రమైన వాయువు వీచెను. 33

మూ. మహతా పక్షవాతేన సర్వద్వీపమహాద్రుమాః,
నిపేతుర్భగ్నవిటపాః సలిలే లవణామ్భసి. 34

ప్ర. అ. సర్వద్వీపమహాద్రుమాః=అన్ని ద్వీపములందు ఉన్న మహావృక్షములు, మహతా=గొప్పదైన, పక్షవాతేన=రెక్కల గాలిచేత, భగ్నవిటపాః=విరగగొట్టబడిన కొమ్మలు గలవై, లవణామ్భసి=లవణసముద్రమునందు, సలిలే=ఉదకమునందు, నిపేతుః=పడినవి.

తా. అన్ని ద్వీపములందు ఉన్న మహావృక్షములు రెక్కలనుండి పుట్టిన పెద్దగాలికి కొమ్మలు విరిగిపోగా లవణసముద్రజలములో పడిపోయినవి. 34

మూ. అభవన్ పన్నగాస్త్రస్తా భోగినస్తత్ర వాసినః,
శీఘ్రం సర్వాణి యాదాంసి జగ్ముశ్చ లవణార్ణవమ్. 35

ప్ర. అ. పన్నగాః=సర్పములు, త్రస్తాః=భయపడినవి, అభవన్=అయినవి. తత్ర=అక్కడ, వాసినః=నివసించుచున్న, భోగినః=సర్పములు, సర్వాణి=సమస్తమైన, యాదాంసి=జలజంతువులు, శీఘ్రమ్=శీఘ్రముగా, లవణార్ణవమ్=లవణసముద్రమును గూర్చి, జగ్ముః=వెళ్లినవి.

తా. సర్పము లన్నీ భయపడెను. అక్కడ నివసించు సర్పములు,

సమస్తమైన జలజంతువులు శీఘ్రముగా లవణసముద్రములో ప్రవేశించెను. 35

మూ. తతో ముహూర్తాద్గరుడం వైనతేయం మహాబలమ్,
వానరా దదృశుః సర్వే జ్వలన్తమివ పావకమ్. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, ముహూర్తాత్=ముహూర్తకాలములో, జ్వలన్తమ్=మండుచున్న, పావకమ్ ఇవ=అగ్ని వలె ఉన్న, వైనతేయమ్=వినతాపుత్రుడైన, మహాబలమ్=గొప్ప బలము గల, గరుడమ్= గరుత్మంతుణ్ణి, దదృశుః=చూచిరి.

తా. పిమ్మట మరుక్షణమునందే, మండుచున్న అగ్ని వలె ఉన్న వినతా కుమారుడు, మహాబలశాలీ అయిన గరుత్మంతుడు వానరులకు కనబడెను.36

మూ. తమాగతమభిప్రేక్ష్య నాగాస్తే సంప్రదుద్రువుః,
యైస్తు తౌ పురుషౌ బద్ధౌ శరభూతైర్మహాబలైః. 37

ప్ర. అ. శరభూతైః=బాణములుగా అయిన, మహాబలైః=గొప్ప బలము గల, యైః= వేటిచేత, తౌ=ఆ, పురుషౌ=రామలక్ష్మణులు, బద్ధౌ=కట్టబడిరో, తే=ఆ, నాగాః=నాగములు, ఆగతమ్=వచ్చిన, తమ్=ఆ గరుత్మంతుని, ప్రేక్ష్య=చూచి, సంప్రదుద్రువుః=పారిపోయినవి.

తా. బాణములుగా అయి ఆ రామలక్ష్మణులను బంధించి ఉన్న మహాబలము గల నాగము లన్నీ గరుత్మంతుడు వచ్చుట చూచి పారిపోయినవి.

మూ. తతః సుపర్ణః కాకుత్స్థౌ స్పృష్ట్వా ప్రత్యభినన్ద్య చ,
విమమర్శ చ పాణిభ్యాం ముఖే చన్ద్రసమప్రభే. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుపర్ణః=గరుత్మంతుడు, కాకుత్స్థౌ= రామలక్ష్మణులను, స్పృష్ట్వా=స్పృశించి, ప్రత్యభినన్ద్య చ=(జయాశీస్సువేల) అభినందించి, పాణిభ్యామ్=హస్తములచేత, చన్ద్రసమప్రభే=చంద్రునితో సమానమైన కాంతి గల, ముఖే= ముఖములను, విమమర్శ చ=నిమిరెను.

తా. పిమ్మట గరుత్మంతుడు ఆ రామలక్ష్మణులను స్పృశించి, అభినందించి, చంద్రునివంటి వారి ముఖములను చేతులతో నిమిరెను. 38

మూ. వైనతేయేన సంస్పృష్టాస్తయోః సంరురుహుర్వ్రణాః,
సువర్ణే చ తనూ స్నిగ్ధే తయోరాశు బభూవతుః. 39

ప్ర. అ. వైనతేయేన=గరుత్మంతునిచేత, సంస్పృష్టాః=స్పృశింపబడిన, తయోః= వారియొక్క, వ్రణాః=గాయములు, సంరురుహుః= మొలచినవి (మానిపోయినవి). ఆశు= వెంటనే, తయోః=వారిద్దరియొక్క, తనూ=శరీరములు, సువర్ణే

వ=మంచి రంగు గలవి, స్నిగ్ధే=మన్ననివిగాను, బభూవతుః=అయినవి.

తా. గరుత్మంతుడు స్పృశించగానే రామలక్ష్మణుల గాయములు మానిపోయెను. వెంటనే వారి శరీరములు గూడ మంచి రంగుతో మన్నుగా అయినవి. 39

మూ. తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణాః,
ప్రదర్శనం చ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణం తయోః. 40

ప్ర. అ. తయోః=వారిద్దరియొక్క, తేజః=తేజస్సు, వీర్యమ్=పరాక్రమము, ఉత్సాహశ్చ=ఉత్సాహము, మహాగుణాః=ఇతరములైన గొప్ప గుణములు, ప్రదర్శనమ్= సూక్ష్మవిషయజ్ఞానము, బుద్ధిశ్చ=బుద్ధి, స్మృతిశ్చ=స్మృతి, ద్విగుణమ్=రెండురెట్లుగా అయినవి.

తా. ఆ రామలక్ష్మణుల తేజస్సు, వీర్యము, బలము, ఉత్సాహము, ఇతరమహాగుణములు, సూక్ష్మవిషయజ్ఞానము, బుద్ధి, స్మృతి రెట్టింపు అయినవి.

మూ. తావుత్థాప్య మహాతేజా గరుడో వాసవోపమౌ,
ఉభౌ చ సస్వజే హృష్టో రామశ్చైనమువాచ హ. 41

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, గరుడః=గరుత్మంతుడు, వాసవోపమౌ= ఇంద్రునితో సమానులైన, తౌ=వారిద్దరిని, ఉత్థాప్య=లేవదీసి, ఉభౌ=ఇద్దరిని, సస్వజే=కౌగలించుకొనెను. రామశ్చ=రాముడు కూడ, హృష్టః=సంతోషించినవాడై, ఏనమ్=ఈతనిని గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. మహాతేజశ్శాలియైన గరుత్మంతుడు ఇంద్రునితో సమానులైన ఆ రామలక్ష్మణులను లేవదీసి వారిద్దరిని కౌగలించుకొనెను. రాముడు సంతోషించి అతనితో ఇట్లనెను. 41

మూ. భవత్ప్రసాదాద్వ్యసనం రావణిప్రభవం మహత్,
ఆవామిహ వ్యతిక్రాన్తౌ పూర్వవద్ బలినౌ కృతౌ. 42

ప్ర. అ. భవత్ప్రసాదాత్=నీ అనుగ్రహమువలన, ఆవామ్=మేమిద్దరము, రావణిప్రభవమ్=ఇంద్రజిత్తువలన కలిగిన, మహత్=గొప్ప, వ్యసనమ్=ఆపదను, ఇహ=ఇప్పుడు వ్యతిక్రాన్తౌ=దాటినాము. పూర్వవత్=పూర్వమునందు వలె, బలినౌ=బలము కలవారముగా, కృతౌ=చేయబడినాము.

తా. నీ అనుగ్రహముచేత మేమిద్దరమూ ఇప్పుడు ఇంద్రజిత్తువలన కలిగిన గొప్ప ఆపదను దాటితిమి. పూర్వమువలె బలముకలవారమైతిమి. 42

మూ. యథా తాతం దశరథం యథాజం చ పితామహమ్,
తథా భవన్తమాసాద్య హృదయం మే ప్రసీదతి. 43

ప్ర. అ. భవన్తమ్=నిన్ను, ఆసాద్య=పొంది, తాతమ్=తండ్రియైన, దశరథమ్=దశరథునిపొంది, యథా=ఎట్లో, పితామహమ్=పితామహుడైన, అజమ్=అజుని పొంది, యథా=ఎట్లో, తథా=అట్లే, మే=నాయొక్క, హృదయమ్=హృదయము, ప్రసీదతి=ప్రసన్న మగుచున్నది.

తా. నిన్ను చూచుటచే నా మనస్సు నా తండ్రియైన దశరథమహారాజును చూచినట్లు, పితామహుడైన అజమహారాజును చూచినట్లు ప్రసన్నమగుచున్నది.

మూ. కో భవాన్రూపసంపన్నో దివ్యస్రగనులేపనః,
వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః 44

ప్ర. అ. రూపసంపన్నః=మంచి రూపముతో కూడినవాడవు, దివ్యస్రగనులేపనః=దివ్యములైన పుష్పమాలలు, చందనాదులు గలవాడవు, విరజే=పరాగము లేని, వస్త్రే=వస్త్రములను, వసానః=ధరించినవాడవు, దివ్యాభరణభూషితః=దివ్యములైన ఆభరణములచేత అలంకరింపబడినవాడవు అయిన, భవాన్=నీవు, కః=ఎవడవు ?

తా. నీ రూపము చాల అందముగా ఉన్నది. దివ్యములైన పుష్పమాలలను, చందనాద్యనులేపనములను శరీరమునకు పూసికొను సుగంధ ద్రవ్యములను, మాయని వస్త్రములను ధరించినావు. దివ్యములైన అలంకారములు అలంకరించుకొన్నావు. నీవు ఎవరవు ? 44

మూ. తమువాచ మహాతేజా వైనతేయో మహాబలః,
పతత్త్రిరాజః ప్రీతాత్మా హర్షపర్యాకులేక్షణః. 45

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు, మహాబలః=గొప్ప బలము గలవాడు, పతత్త్రిరాజః=పక్షిరాజు అయిన, వైనతేయః=గరుత్మంతుడు, ప్రీతాత్మా=సంతోషించిన మనస్సు గలవాడై, హర్షపర్యాకులేక్షణః=సంతోషముచేత వ్యాకులమైన నేత్రములు గలవాడై, తమ్=ఆ రామునిగూర్చి, ఉవాచ=పలికెను.

తా. గొప్ప తేజోబలములు గల, పక్షిరాజైన ఆ గరుత్మంతుడు సంతోషించిన మనస్సు గలవాడై, ఆనందముచేత వ్యాకులమైన నేత్రములతో రామునితో ఇట్లనెను. 45

మూ. అహం సఖా తే కాకుత్స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః,
గరుత్మానిహ సంప్రాప్తో యువయోః సాహ్యకారణాత్. 46

ప్ర. అ. కాకుత్స్థ=రామా ! అహమ్=నేను, తే=నీకు, ప్రియః=ఇష్టుడైన, సఖా=స్నేహితుడు, బహిశ్చరః=బైట సంచరించు, ప్రాణః=ప్రాణము అయిన, గరుత్మాన్=గరుత్మంతుడను. యువయోః=మీ ఇద్దరియొక్క, సాహ్యకార

సాహాయ్యాత్=సాహాయ్యము నిమిత్తమై, ఇహ=ఇక్కడికి, సంప్రాప్తః=వచ్చినాను.

తా. రామా! నేను నీ ప్రియమిత్రుడను. బైట సంచరించు ప్రాణమువంటివాడను. నా పేరు గరుత్మంతుడు. మీ ఇద్దరికి సాహాయ్యము చేయుటకై ఇక్కడికి వచ్చినాను. 46

మూ. అసురా వా మహావీర్యా దానవా వా మహాబలాః,
సురాశ్చాపి సగన్ధర్వాః పురస్కృత్య శతక్రతుమ్, 47
నేమం మోక్షయితుం శక్తాః శరబన్ధం సుదారుణమ్,
మాయాబలాదిన్ద్రజితా నిర్మితం క్రూరకర్మణా. 48

ప్ర. అ. క్రూరకర్మణా=క్రూరమైన కర్మ గల, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, మాయాబలాత్=మాయాబలమువలన, నిర్మితమ్=నిర్మింపబడిన, సుదారుణమ్=చాల భయంకరమైన, ఇమమ్=ఈ, శరబన్ధమ్=శరబంధమును, మోక్షయితుమ్=విడిపించుటకు, మహావీర్యాః=గొప్ప పరాక్రమముగల, అసురాః వా=అసురులుగాని, మహాబలాః=గొప్ప బలము గల, దానవాః వా=దానవులు గాని, శతక్రతుమ్=దేవేంద్రుని, పురస్కృత్య=ముందు ఉంచుకొని వచ్చిన, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, సురాశ్చాపి=దేవతలుగాని, న శక్తాః=సమర్థులు కారు.

తా. క్రూరకర్మ గల ఇంద్రజిత్తు మాయాబలముచేత చేసిన చాల భయంకరమైన ఈ శరబంధమును గొప్ప పరాక్రమము గల అసురులు గాని, మహాబలవంతులైన దానవులుగాని, దేవేంద్రునితో సహా సురులుగాని, గంధర్వులుగాని విడిపింపజాలరు. 47, 48

మూ. ఏతే నాగాః కాద్రవేయా స్తీక్ష్ణదంష్ట్రా విషోల్బణాః,
రక్షోమాయాప్రభావేణ శరా భూత్వా త్వదాశ్రితాః. 49

ప్ర. అ. తీక్ష్ణదంష్ట్రాః=తీక్ష్ణమైన కోరలు గలవి, విషోల్బణాః=విషముచేత తీవ్రములు అయిన, కాద్రవేయాః=కద్రుపుత్రులైన, ఏతే నాగాః=ఈ నాగులు, రక్షోమాయాప్రభావేణ=రాక్షసుని మాయాప్రభావముచేత, శరాః=బాణములుగా, భూత్వా=అయి, త్వదాశ్రితాః=నిన్ను ఆశ్రయించినవి.

తా. తీక్ష్ణమైన కోరలుగలవి, విషముచేత తీవ్రములు, కద్రుపుత్రులు అయిన ఈ నాగములు రాక్షసుని మాయాప్రభావము చేత బాణములై నిన్ను ఆక్రమించినవి. 49

మూ. సభాగ్యశ్చాపి ధర్మజ్ఞ రామ సత్యపరాక్రమ,
లక్ష్మణేన సహ భ్రాత్రా సమరే రిపుఘాతినా. 50

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మము తెలిసినవాడా! సత్యపరాక్రమ = సత్యమైన పరాక్రమము కలవాడా! రామ = రామా! సమరే = యుద్ధమునందు, శత్రుఘాతినా = శత్రువులను చంపువాడైన, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో కూడ, సభాగ్యః = భాగ్యము కలవాడవు, అసి = అయి ఉన్నావు.

తా. ధర్మము తెలిసినవాడా! సత్యమైన పరాక్రమము గలవాడా! రామా! యుద్ధములో శత్రుసంహారకుడైన నీ సోదరుడైన లక్ష్మణుడు, నీవు కూడ భాగ్యవంతులు. 50

మూ. ఇమం శ్రుత్వా తు వృత్తాన్తం త్వరమాణోఽహమాగతః,
సహసైవావయోః స్నేహాత్సఖిత్వమనుపాలయన్. 51

ప్ర. అ. అహమ్ = నేను, ఇమమ్ = ఈ, వృత్తాన్తమ్ = వృత్తాంతమును, శ్రుత్వా = విని, ఆవయోః = మనయొక్క, స్నేహాత్ = స్నేహమువలన, సఖిత్వమ్ = మిత్రత్వమును, అనుపాలయన్ = పాలించుచు, సహసైవ = వెంటనే, త్వరమాణః = తొందరపడుచు, ఆగతః = వచ్చినాను.

తా. నేను ఈ వృత్తాంతమును విని మన ఇద్దరి మధ్య స్నేహమువలన ఆ స్నేహమును పాలించుచు, తొందరపడుచు వెంటనే వచ్చినాను. 51

మూ. మోక్షితౌ చ మహాఘోరాదస్మాత్సాయకబన్ధనాత్,
అప్రమాదశ్చ కర్తవ్యో యువాభ్యాం నిత్యమేవ చ. 52

ప్ర. అ. మహాఘోరాత్ = చాల భయంకరమైన, అస్మాత్ = ఈ, సాయకబన్ధనాత్ = బాణముల బంధనమునుండి, మోక్షితౌ చ = విడిపింపబడినారు. యువాభ్యామ్ = మీ ఇద్దరి చేత, నిత్యమేవ చ = ఎల్లప్పుడు, అప్రమాదః = ఏమరిపాటు లేకుండుట, కర్తవ్యః = చేయదగినది.

తా. మీరు చాల భయంకరమైన ఈ బాణబంధమునుండి విడిపింపబడినారు. ఎల్లప్పుడు మీరు ఏమరిపాటు లేకుండా ఉండవలెను. 52

మూ. ప్రకృత్యా రాక్షసాః సర్వే సఙ్గ్రామే కూటయోధినః,
శూరాణాం శుద్ధభావానాం భవతామార్జవం బలమ్. 53

ప్ర. అ. ప్రకృత్యా = స్వభావముచేత, సర్వే = సమస్తమైన, రాక్షసాః = రాక్షసులు, సఙ్గ్రామే = యుద్ధమునందు, కూటయోధినః = కపటముగా యుద్ధముచేయువారు. శూరాణామ్ = శూరులు, శుద్ధభావానామ్ = పరిశుద్ధమైన భావము కలవారు అయిన, భవతామ్ = మీకు, ఆర్జవమ్ = ఋజుత్వము, బలమ్ = బలము.

తా. . యుద్ధములో కపటముగా యుద్ధము చేయుట రాక్షసుల స్వభావము. శూరులు, పరిశుద్ధమైన మనోభావము గలవారు అయిన మీకు ఋజుత్వము (వక్రబుద్ధి లేకపోవుట) బలము. 53

మూ. తస్మాన్న విశ్వసనీయం వో రాక్షసానాం రణాజిరే,
ఏతేనైవోపమానేన నిత్యం జిహ్మా హి రాక్షసాః. 54

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, రణాజిరే = యుద్ధభూమియందు, వః = మీకు, రాక్షసానామ్ = రాక్షసుల విషయమున, న విశ్వసనీయమ్ = విశ్వసింపదగినది కాదు. ఏతేన = ఈ, ఉపమానేనైవ = దృష్టాంతముచేతనే, రాక్షసాః = రాక్షసులు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, జిహ్మాః హి = వక్రమైనవారు కదా.

తా. రాక్షసులు ఎల్లప్పుడు వక్రస్వభావము గలవారు అనుటకు ఇంద్రజిత్తు చేసినదే దృష్టాంతము. అందుచే యుద్ధభూమిలో మీరు రాక్షసులను విశ్వసించకూడదు. 54

మూ. ఏవముక్త్వా తదా రామం సుపర్ణః స మహాబలః,
పరిష్వజ్య చ సుస్నిగ్ధమాప్రష్టుముపచక్రమే. 55

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, సః సుపర్ణః = ఆ గరుత్మంతుడు, తదా = అప్పుడు, రామమ్ = రాముని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సుస్నిగ్ధమ్ = చాల స్నేహపూర్వకముగా, పరిష్వజ్య చ = కౌగలించుకొని, ఆప్రష్టుమ్ = అడుగుటకు (అనుజ్ఞ తీసికొనుటకు) ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. గొప్ప బలము గల ఆ గరుత్మంతుడు రామునితో ఇట్లు పలికి, స్నేహపూర్వకముగా కౌగలించుకొని వెళ్లుటకు అనుజ్ఞ వేడుటకు ప్రారంభించెను.

మూ. సఖే రాఘవ ధర్మజ్ఞ రిపూణామపి వత్సల,
అభ్యనుజ్ఞాతుమిచ్ఛామి గమిష్యామి యథాసుఖమ్. 56

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మము నెరిగినవాడా! రిపూణామపి = శత్రువుల విషయమున గూడ, వత్సల = ప్రేమగలవాడా! సఖే = మిత్రుడవైన, రామ = రామా! అభ్యనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. యథాసుఖమ్ = సుఖముగా, గమిష్యామి = వెళ్లెదను.

తా. ధర్మము తెలిసినవాడా! శత్రువులను కూడ ప్రేమించువాడా! మిత్రుడవైన రామా! నేను సుఖముగా వెళ్లెదను; అనుజ్ఞ ఇవ్వవలె నని కోరుచున్నాను. 56

మూ. న చ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి కాఙ్క్షిణా,
కృతకర్మా రణే వీర సఖిత్వం ప్రతివేత్స్యసి. 57

ప్ర. అ. వీర = వీరుడా! కాఙ్క్షిణా = తెలుసుకొనవలెనని కోరుచున్న నీచేత, సఖిత్వమ్ ప్రతి = స్నేహమును గూర్చి, కౌతూహలమ్ = ఆసక్తి, న కార్యమ్ = చేయదగినది కాదు. రణే = యుద్ధమునందు, కృతకర్మా = చేయుబడిన కర్మ గలవాడవై, సఖిత్వమ్ = స్నేహమును, ప్రతివేత్స్యసి = తెలిసికొనగలవు.

తా. నీవు మన కిద్దరికి స్నేహము ఎట్లు ఏర్పడినది అని తెలిసికొనుటకు అభిలాషను చూపవద్దు. యుద్ధమునందు శత్రుసంహారము పూర్తిచేసిన పిదప నీకు తెలియుగలదు. 57

మూ. బాలవృద్ధావశేషాం తు కృత్వా లఙ్కాం శరోర్మిభిః,
రావణం తు రిపుం హత్వా సీతాం త్వం ప్రతిపత్స్యసే. 58

ప్ర. అ. లఙ్కామ్ = లంకను, శరోర్మిభిః = బాణతరంగములచేత, బాలవృద్ధావశేషామ్ = బాలురు, వృద్ధులు మిగిలిన దానినిగా, కృత్వా = చేసి, రిపుమ్ = శత్రువైన, రావణమ్ = రావణుని, హత్వా = చంపి, త్వమ్ = నీవు, సీతామ్ = సీతను, ప్రతిపత్స్యసే = పొందగలవు.

తా. నీవు బాణతరంగములచేత లంకలో బాలురు, వృద్ధులు మాత్రమే మిగులునట్లు చేసి, శత్రువైన రావణుని సంహరించి సీతను పొందగలవు. 58

మూ. ఇత్యేవముక్త్వా వచనం సుపర్ణః శీఘ్రవిక్రమః,
రామం చ విరుజం కృత్వా మధ్యే తేషాం వనౌకసామ్. 59
ప్రదక్షిణం తతః కృత్వా పరిష్వజ్య చ వీర్యవాన్,
జగామాకాశమావిశ్య సుపర్ణః పవనో యథా. 60

ప్ర. అ. సుపర్ణః = మంచి రెక్కలుగలవాడు, శీఘ్రవిక్రమః = శీఘ్రమైన గమనము గలవాడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు అయిన, సుపర్ణః = గరుత్మంతుడు, తేషామ్ = ఆ, వనౌకసామ్ = వానరులయొక్క, మధ్యే = మధ్యయందు, ఇత్యేవమ్ = ఇట్లు, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి, రామమ్ = రాముణ్ణి, విరుజమ్ = బాధలేనివానినిగా, కృత్వా = చేసి, తతః = అటు పిమ్మట, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణముచేసి, పరిష్వజ్య చ = కౌగలించుకొని, పవనో యథా = వాయువువలె, ఆకాశమ్ = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, జగామ = వెళ్లెను.

తా. మంచి రెక్కలుగలవాడు, శీఘ్రగమనము గలవాడు, పరాక్రమవం

రుడు అయిన గరుత్మంతుడు రామునితో ఇట్లు పలికి, ఆ వానరుల మధ్య రాముని బాధను తొలగించి, ప్రదక్షిణము చేసి, కౌగలించుకొని, వాయువు వలె, ఆకాశములో ప్రవేశించి వెళ్లిపోయెను. 60

మూ. నీరుజౌ రాఘవౌ దృష్ట్వా తతో వానరయూథపాః,
సింహనాదాంస్తదా నేదుర్లాఙ్గూలం దుధువుశ్చ తే. 61

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వానరయూథపాః = వానరసేనా నాయకులు, రాఘవౌ = రామలక్ష్మణులను, నీరుజౌ = బాధ లేనివారినిగా, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, సింహనాదాన్ = సింహనాదములను, నేదుః = ధ్వని చేసిరి. (చేసిరి) తే = వాళ్లు, లాఙ్గూలమ్ = తోకను, దుధువుశ్చ = దులిపిరి.

తా. పిమ్మట వానరసేనానాయకులు రామలక్ష్మణులు పీడావిముక్తులైనట్లు చూచి, సింహనాదములు చేయుచు, తోకలు ఝాడించిరి. 61

మూ. తతో భేరీః సమాజఘ్నుర్మృదఙ్గాంశ్చాప్యవాదయన్,
దధ్ముః శఙ్ఖాన్ సంప్రహృష్టాః క్ష్వేలన్త్యపి యథాపురమ్. 62

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భేరీః = భేరులను, సమాజఘ్నుః = కొట్టిరి. మృదఙ్గాంశ్చాపి = మృదంగములను కూడ, అవాదయన్ = వాయించిరి. శఙ్ఖాన్ = శంఖములను, దధ్ముః = పూరించిరి. యథాపురమ్ = పూర్వమునందు వలె, క్ష్వేలన్త్యపి = అరచిరి.

తా. పిమ్మట ఆ వానరులు పూర్వము వలె అరచుచు ఆనందముతో భేరీలను మ్రోగించిరి. మృదంగములను వాయించిరి. శంఖములను పూరించిరి.62

మూ. అపరే స్ఫోట్య విక్రాన్తా వానరా నగయోధినః,
ద్రుమానుత్పాట్య వివిధాంస్తస్థుః శతసహస్రశః. 63

ప్ర. అ. నగయోధినః = పర్వతములతో యుద్ధము చేయు, విక్రాన్తాః = పరాక్రమవంతులైన, అపరే = మరికొందరు, వానరాః = వానరులు, స్ఫోట్య = భుజములు చరచి, శతసహస్రశః = వందలకొలది వేలకొలది, వివిధాన్ = అనేక విధములైన, ద్రుమాన్ = వృక్షములను, ఉత్పాట్య = పెకలించి, తస్థుః = నిలచిరి.

తా. పర్వతములతో యుద్ధము చేయు మరికొందరు పరాక్రమవంతులైన వానరులు భుజములు చరచుచు, వందలకొలది వేలకొలది అనేకవిధములైన వృక్షములను పెకలించి, నిలచిరి. 63

మూ. విసృజన్తో మహానాదాంస్త్రాసయన్తో నిశాచరాన్,
లఙ్కాద్వారాణ్యుపాజగ్ముర్యుద్ధకామాః ప్లవఙ్గమాః. 64

ప్ర. అ. ప్లవఙ్గమాః = వానరులు, మహానాదాన్ = గొప్పధ్వనులను, విసృజన్తః = విడచుచు, నిశాచరాన్ = రాక్షసులను, త్రాసయన్తః = భయపెట్టుచు, యుద్ధకామాః = యుద్ధమునందు కోరికగలవారై, లఙ్కాద్వారాణి = లంకాద్వారములను, ఉపాజగ్ముః = చేరిరి.

తా. వానరులు గొప్ప ధ్వని చేయుచు, రాక్షసులకు భయము కలిగించుచు, యుద్ధము చేయుటకై లంకాద్వారములవద్దకు వెళ్లిరి. 64

మూ. తేషాం సుభీమస్తుములో నినాదో
బభూవ శాఖామృగయూథపానామ్,
క్షయే నిదాఘస్య యథా ఘనానాం
నాదః సుభీమో నదతాం నిశీథే. 65

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చాశః సర్గః

ప్ర. అ. నిదాఘస్య = గ్రీష్మర్తువుయొక్క, క్షయే = అంతమునందు, నిశీథే = అర్థరాత్రియందు, నదతామ్ = ధ్వనిచేయుచున్న, ఘనానామ్ = మేఘములయొక్క, సుభీమః = చాల భయంకరమైన, నాదః యథా = ధ్వని వలె, తేషామ్ = ఆ, శాఖామృగయూథపానామ్ = వానరసేనానాయకుల యొక్క, సుభీమః = చాల భయంకరము, తుములః = వ్యాకులము అయిన, నాదః = ధ్వని, బభూవ = ఆయెను.

తా. ఆ వానరసేనానాయకుల భయంకరము, వ్యాకులము అయిన ధ్వని గ్రీష్మర్తువు గడచినప్పుడు అర్థరాత్రియందు ధ్వని చేయుచున్న మేఘముల భయంకర ధ్వని వలె ఉండెను. 65

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకపఞ్చాశః సర్గః

[రాముడు శరబంధమునుండి విముక్తుడైనట్లు తెలిసి రావణుడు చింతాక్రాంతుడై ధూమ్రాక్షుని యుద్ధమునకు పంపుట; అతడు సేనాపతితో కలిసి నగరమునుండి బైటకు వచ్చుట.]

మూ. తేషాం తు తుములం శబ్దం వానరాణాం మహౌజసామ్,
నర్దతాం రాక్షసైః సార్ధం తదా శుశ్రావ రావణః. 1

ప్ర. అ. తదా=అప్పుడు, మహౌజసామ్=గొప్ప తేజస్సు గల, నర్దతామ్=ధ్వని చేయుచున్న, తేషాం వానరాణామ్=ఆ వానరులయొక్క, తుములమ్=వ్యాకులమైన, శబ్దమ్=శబ్దమును, రావణః=రావణుడు, రాక్షసైః సార్ధమ్= రాక్షసులతో కూడ, శుశ్రావ=వినెను.

తా. అప్పుడు గొప్ప తేజస్సు గల గర్జించుచున్న ఆ వానరులు చేయు వ్యాకులమైన ధ్వనిని రావణుడు, రాక్షసులూ కూడ వినిరి. 1

మూ. స్నిగ్ధగమ్భీరనిర్ఘోషం శ్రుత్వా స నినదం భృశమ్,
సచివానాం తతస్తేషాం మధ్యే వచనమబ్రవీత్. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః=ఆ రావణుడు, స్నిగ్ధగమ్భీరనిర్ఘోషమ్= మధురము గంభీరము అయిన ధ్వని గల, నినదమ్=శబ్దమును, భృశమ్=మిక్కిలి, శ్రుత్వా=విని, తేషామ్=ఆ, సచివానామ్=మంత్రులయొక్క, మధ్యే=మధ్యయందు, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రావణుడు మధురముగా గంభీరముగా ఉన్న ధ్వని గల ఆ వానరులు చేయు శబ్దమును విని మంత్రుల మధ్య ఇట్లు పలికెను. 2

మూ. యథాసౌ సంప్రహృష్టానాం వానరాణాం సముత్థితః,
బహూనాం సుమహాన్నాదో మేఘానామివ గర్జతామ్. 3
సువ్యక్తం మహతీ ప్రీతిరేతేషాం నాత్ర సంశయః,
తథా హి విపులైర్నాదైశ్చుక్షుభే లవణార్ణవః. 4

ప్ర. అ. సంప్రహృష్టానామ్=సంతోషించిన, బహూనామ్=అనేకులైన, వానరాణామ్=వానరులయొక్క, సుమహాన్=చాల గొప్పదైన, అసౌ=ఈ, నాదః= ధ్వని, గర్జతామ్=గర్జించుచున్న, మేఘానామివ=మేఘములయొక్క ధ్వని వలె, యథా=ఎట్లు, శ్రూయతే=వినబడుచున్నదో, సువ్యక్తమ్=స్పష్టముగా (నిశ్చయముగా), ఏతేషామ్=వీరియొక్క, ప్రీతిః=సంతోషము, మహతీ=గొప్పది. అత్ర=దీనియందు,

సంశయః=సంశయము, న=లేదు. తథాహి=అది యుక్తమే కదా ! విపులైః=అధికములైన, నాదైః=ధ్వనులచేత, లవణార్ణవః=లవణసముద్రము, చుక్షుభే=క్షోభించినది.

తా. వానరు లందరూ సంతోషించుచు, గర్జించుచున్న మేఘముల వలె చేయుచున్న ఈ మహాధ్వని బయలుదేరుటను బట్టి వీళ్లకు గొప్ప సంతోషము కలిగిన ట్లున్నది. ఈ విషయము స్పష్టము. సందేహము లేదు. అధికమైన ధ్వనుల చేత లవణసముద్రము కూడ క్షోభించుచున్నది కదా ? 3,4

మూ. తౌ తు బద్ధౌ శరైస్తీక్ష్ణైర్భ్రాతరౌ రామలక్ష్మణౌ,
అయం చ సుమహాన్నాదః శఙ్కాం జనయతీవ మే. 5

ప్ర. అ. భ్రాతరౌ=సోదరులైన, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులు, తీక్ష్ణైః=వాడియైన, శరైః=బాణములచేత, బద్ధౌ=కట్టుబడినారు. సుమహాన్=చాల గొప్పదైన, అయం నాదః=ఈ ధ్వని, మే=నాకు, శఙ్కామ్=శంకను, జనయతీవ=కలిగించుచున్నట్లు ఉన్నది.

తా. సోదరులైన ఆ రామలక్ష్మణులు వాడియైన బాణములచేత కట్టబడినారు కదా ? ఇప్పుడు బయలుదేరిన ఈ గొప్ప ధ్వని నాకు శంకను కలిగించుచున్నది. 5

మూ. ఏవం చ వచనం చోక్త్వా మన్త్రిణో రాక్షసేశ్వరః,
ఉవాచ నైరృతాంస్తత్ర సమీపపరివర్తినః. 6

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజు, మన్త్రిణః=మంత్రులను గూర్చి, ఏవమ్=ఇట్లు, వచనమ్=వచనమును, ఉక్త్వా=పలికి, తత్ర=అక్కడ, సమీపపరివర్తినః=సమీపమునందు సంచరించుచున్న, నైరృతాన్=రాక్షసులను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. రావణుడు మంత్రులతో ఇట్లు పలికి సమీపమునందు సంచరించుచున్న రాక్షసులతో ఇట్లనెను. 6

మూ. జ్ఞాయతాం తూర్ణమేతేషాం సర్వేషాం చ వనౌకసామ్,
శోకకాలే సముత్పన్నే హర్షకారణముత్థితమ్. 7

ప్ర. అ. ఏతేషామ్=ఈ, సర్వేషామ్=సమస్తమైన, వనౌకసామ్=వానరులకు, శోకకాలే=దుఃఖమునకు కాలము, సముత్పన్నే=పుట్టినదగుచుండగా, ఉత్థితమ్=బయలుదేరిన, హర్షకారణమ్=సంతోషమునకు కారణము, తూర్ణమ్=శీఘ్రముగా, జ్ఞాయతామ్=తెలియబడుగాక.

తా. ఈ వానరులందరికీ దుఃఖించవలసిన సమయములో సంతోషించుటకు

ఏ కారణము వచ్చినదో వెంటనే తెలిసికొనుడు. 7

మూ. తథోక్తాస్తే సుసంభ్రాన్తాః ప్రాకారమధిరుహ్య చ,
దదృశుః పాలితాం సేనాం సుగ్రీవేణ మహాత్మనా. 8
తౌ చ ముక్తౌ సుఘోరేణ శరబన్ధేన రాఘవౌ,
సముత్థితౌ మహాభాగౌ విషేదుః సర్వరాక్షసాః. 9

ప్ర. అ. తథా=అట్లు, ఉక్తాః=పలుకబడిన, తే=వాళ్లు, సుసంభ్రాన్తాః=చాల తొందరపడుచు, ప్రాకారమ్=ప్రాకారమును, అధిరుహ్య=ఎక్కి, మహాత్మనా=మహాత్ముడైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, పాలితామ్=పాలింపబడిన, సేనామ్=సేనను, సుఘోరేణ=చాల భయంకరమైన, శరబన్ధేన=శరబంధముచేత, ముక్తౌ=విడువబడిన, సముత్థితౌ=లేచిన, మహాభాగౌ=మహాభాగ్యవంతులైన, తౌ రాఘవౌ=ఆ రామలక్ష్మణులను, దదృశుః=చూచిరి. సర్వరాక్షసాః=సమస్త రాక్షసులు, విషేదుః=దుఃఖించిరి.

తా. రావణుని ఆజ్ఞచే వాళ్లు తొందరపడుచు ప్రాకారము పైకి ఎక్కి మహాత్ముడైన సుగ్రీవునిచేత పాలింపబడిన వానరసేనను, చాల భయంకరమైన ఆ శరబంధమునుండి విముక్తులై లేచిన మహాభాగ్యవంతులైన రామలక్ష్మణులను చూచిరి. అప్పుడా రాక్షసు లందరూ దిగులు చెందిరి. 8, 9

మూ. సంత్రస్తహృదయాః సర్వే ప్రాకారాదవరుహ్య తే,
వివర్ణా రాక్షసా ఘోరా రాక్షసేన్ద్రముపస్థితాః. 10

ప్ర. అ. ఘోరాః=భయంకరులైన, సర్వే=సమస్తమైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, సంత్రస్తహృదయాః=భయపడిన హృదయములు గలవారై, వివర్ణాః=మారి పోయిన ముఖచ్ఛాయలు గలవారై, ప్రాకారాత్=ప్రాకారమునుండి, అవరుహ్య=దిగి, రాక్షసేన్ద్రమ్=రావణుని, ఉపస్థితాః=చేరినారు.

తా. ఆ భయంకరులైన రాక్షసులందరూ హృదయములలో దిగులుచెంది, ప్రాకారము దిగి, మారిపోయిన ముఖవర్ణములతో రావణుని వద్దకు వచ్చిరి. 10

మూ. తదప్రియం దీనముఖా రావణస్య చ రాక్షసాః,
కృత్స్నం నివేదయామాసుర్యథావద్వాక్యకోవిదాః. 11

ప్ర. అ. వాక్యకోవిదాః=మాటలను ఎరిగిన, రాక్షసాః=రాక్షసులు, దీనముఖాః=దీనములైన ముఖములు గలవారై, అప్రియమ్=అప్రియమైన, తత్=దానిని, కృత్స్నమ్=అంతయూ, యథావత్=ఉన్నదున్నట్లుగా, రావణస్య=రావణునకు, న్యవేదయన్=తెలిపిరి.

తా. మాటలలో నేర్పరులైన ఆ రాక్షసులు దీనములైన ముఖములతో ఆ అప్రియమైన విషయము సంతమూ ఉన్నదున్నట్లు రావణునకు తెలిపిరి. 11

మూ. యౌ తావిన్ద్రజితా యుద్ధే భ్రాతరౌ రామలక్ష్మణౌ,
విబద్ధౌ శరబన్ధేన నిష్ప్రకమ్పభుజౌ కృతౌ. 12
విముక్తౌ శరబన్ధేన దృశ్యేతే తౌ రణాజిరే,
పాశానివ గజౌ ఛిత్త్వా గజేన్ద్రసమవిక్రమౌ. 13

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, భ్రాతరౌ=సోదరులైన, యౌ=ఏ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, శరబన్ధేన=బాణముల బంధముచేత, విబద్ధౌ=కట్టబడినవారై, నిష్ప్రకమ్పభుజౌ=కదలని భుజములు కల వారుగా, కృతౌ=చేయబడినారో, గజేన్ద్రసమవిక్రమౌ=గజరాజులతో సమానమైన పరాక్రమము గల, తౌ=వారిద్దరు, పాశాన్=పాశములను, ఛిత్త్వా=ఛేదించి, గజౌ ఇవ=ఏనుగులు వలె, రణాజిరే= యుద్ధభూమియందు, దృశ్యేతే=చూడబడుచున్నారు.

తా. ఇంద్రజిత్తు యుద్ధములో సోదరులైన ఏ రామలక్ష్మణులను శరబంధముచేత బంధించి భుజములు కలదల్చజాలనివారినిగా చేసినాడో గజేంద్రముల వంటి ఆ రామలక్ష్మణులు శరబంధమునుండి విముక్తులై యుద్ధరంగమునందు పాశములు ఛేదించుకొన్న ఏనుగుల వలె కనబడుచున్నారు.

మూ. తచ్ఛ్రుత్వా వచనం తేషాం రాక్షసేన్ద్రో మహాబలః,
చిన్తాశోకసమాక్రాన్తో వివర్ణవదనోఽభవత్. 14

ప్ర. అ. మహాబలః=గొప్ప బలముగల, రాక్షసేన్ద్రః=రావణుడు, తేషామ్=వాళ్ళయొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, చిన్తాశోకసమాక్రాన్తః= చింతచేతను, శోకముచేతను ఆక్రమింపబడినవాడై వివర్ణవదనః=వివర్ణమైన ముఖము గలవాడు, అభవత్=ఆయెను.

తా. మహాబలవంతుడైన రావణుడు వాళ్ళు చెప్పిన మాటలు విని, చింతతోను శోకములోను నిండిన వాడయ్యెను. అతని ముఖము రంగు మారిపోయెను. 14

మూ. ఘోరైర్దత్తవరైర్బద్ధౌ శరైరాశీవిషోపమైః,
అమోఘైః సూర్యసంకాశైః ప్రమథ్యేన్ద్రజితా యుధి. 15
తదస్త్రబన్ధమాసాద్య యది ముక్తౌ రిపూ మమ,
సంశయస్థమిదం సర్వమనుపశ్యామ్యహం బలమ్. 16

ప్ర. అ. ఘోరైః=భయంకరములు, దత్తవరైః=ఇవ్వబడిన వరములుగలవి, ఆశీవిషోపమైః=సర్పములతో సమానములు, అమోఘైః=వ్యర్థము కానివి, సూర్యసంకాశైః=సూర్యునితో సమానములు అయిన, శరైః=బాణములచేత, యుధి=యుద్ధమునందు, ప్రమథ్య=మథించి, ఇన్ద్రజితా=ఇన్ద్రజిత్తుచేత, బద్ధౌ=కట్టబడిన, మమ రిపూ=నా శత్రువులు, తత్=ఆ, అస్త్రబన్ధమ్=అస్త్రబంధమును, ఆసాద్య=పొంది, ముక్తౌ యది=విడబడినట్లయితే, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, బలమ్=బలమును, సంశయస్థమ్=సంశయమునందు ఉన్నదానినిగా, అహమ్=నేను, అనుపశ్యామి=ఊహించుచున్నాను.

తా. యుద్ధములో ఇన్ద్రజిత్తు బాగా పీడించి, భయంకరములు, వరములు పొందినవి, సర్పములతో సమానములు, వ్యర్థము కానివి, సూర్యతుల్యములు అయిన బాణములతో కట్టివేసిన నా శత్రువులైన రామలక్ష్మణులు ఆ అస్త్రబంధములో చిక్కుకొని కూడ దానినుండి విముక్తులగుట చూడగా మన ఈ బలమంతా సంశయస్థితిలో పడిన దని ఊహించుచున్నాను. 15, 16

మూ. నిష్ఫలాః ఖలు సంవృత్తాః శరాః పావకతేజసః,
ఆదత్తం యైస్తు సఙ్గ్రామే రిపూణాం జీవితం మమ. 17

ప్ర. అ. యైః=ఏటిచేత, సఙ్గ్రామే=యుద్ధమునందు, మమ=నాయొక్క, రిపూణామ్=శత్రువులయొక్క, జీవితమ్=ప్రాణము, ఆదత్తమ్=గ్రహింపబడినదో, పావకతేజసః=అగ్నివంటి తేజస్సు గల, శరాః=ఆ బాణములు, నిష్ఫలాః=ఫలములేనివి, సంవృత్తాః ఖలు=అయినవి కదా?

తా. పూర్వము ఏ బాణములు యుద్ధములలో నా శత్రువుల జీవితములను అపహరించినవో అగ్నివంటి ఆ బాణములే ఇప్పుడు వ్యర్థమైపోయినవి కదా ! 17

మూ. ఏవముక్త్వా తు సంక్రుద్ధో నిఃశ్వసన్నురగో యథా,
అబ్రవీద్రక్షసాం మధ్యే ధూమ్రాక్షం నామ రాక్షసమ్. 18

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, సంక్రుద్ధః=కోపించినవాడై, ఉరగో యథా=సర్పము వలె, నిఃశ్వసన్=నిట్టూర్చుచు, రక్షసామ్=రాక్షసుల యొక్క, మధ్యే=మధ్యయందు, ధూమ్రాక్షం నామ=ధూమ్రాక్షు డను పేరు గల, రాక్షసమ్=రాక్షసుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. రావణు డిట్లు పలికి, చాల కోపముతో పాము వలె బుసలు కొట్టుచు, రాక్షసుల మధ్య ధూమ్రాక్షు డను రాక్షసునితో ఇట్లనెను. 18

మూ. బలేన మహతా యుక్తో రాక్షసైర్భీమవిక్రమః,
త్వం వధాయాభినిర్యాహి రామస్య సహ రాక్షసైః. 19

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, త్వమ్=నీవు, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతోను, రాక్షసైః=రాక్షసులతోను, యుక్తః=కూడిన వాడవై, వానరైః సహ=వానరులతో కూడ, రామస్య=రామునియొక్క, వధాయ=వధకొరకు, ఆశు=శీఘ్రముగా, నిర్యాహి=బయలుదేరుము.

తా. భయంకరమైన పరాక్రమము గల నీవు పెద్ద సైన్యముతోను, రాక్షసులతోను కూడినవాడవై, రాముణ్ణి, వానరులనూ చంపుటకు వెంటనే బయలుదేరుము. 19

మూ. ఏవముక్తస్తు ధూమ్రాక్షో రాక్షసేన్ద్రేణ ధీమతా,
పరిక్రమ్య తతః శీఘ్రం నిర్జగామ నృపాలయాత్ 20

ప్ర. అ. ధీమతా=బుద్ధిమంతుడైన, రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, తతః=అక్కడినుండి, పరిక్రమ్య=నడచి, నృపాలయాత్=రాజగృహమునుండి, శీఘ్రమ్=శీఘ్రముగా, నిర్జగామ=బైలుదేరెను.

తా. బుద్ధిమంతుడైన రావణుని ఆజ్ఞ ప్రకారము ధూమ్రాక్షుడు అక్కడినుండి బయలుదేరి వెంటనే రాజప్రాసాదమునుండి వెడలెను. 20

మూ. అభినిష్క్రమ్య తద్ద్వారం బలాధ్యక్షమువాచ హ,
త్వరయస్వ బలం శీఘ్రం కిం చిరేణ యుయుత్సతః. 21

ప్ర. అ. తద్=ఆ, ద్వారమ్=ద్వారమును, అభినిష్క్రమ్య=దాటి, బలాధ్యక్షమ్=సేనాధ్యక్షుణ్ణి గూర్చి, ఉవాచ హ=పలికెను. శీఘ్రమ్=శీఘ్రముగా, బలమ్=సైన్యమును, యుయుత్సతః=యుద్ధము చేయ గోరుచున్న నా నిమిత్తము, త్వరయస్వ=తొందరచేయుము. చిరేణ=చిరకాలముచేత, కిమ్=ఏమి ప్రయోజనము.

తా. ఆతడు ఆ ద్వారమును దాటి వెళ్లి సేనాధ్యక్షునితో ఇట్లనెను. "యుద్ధమునకై వెళ్లదలచుచున్నాను. వెంటనే సైన్యము సిద్ధము చేయుము. ఆలస్యము చేయకుము" 21

మూ. ధూమ్రాక్షవచనం శ్రుత్వా బలాధ్యక్షో బలానుగః,
బలముద్యోజయామాస రావణస్యాజ్ఞయా ద్రుతమ్. 22

ప్ర. అ. బలానుగః=సైన్యము అనుసరించేదిగా గల, బలాధ్యక్షః=సేనాధ్యక్షుడు, ధూమ్రాక్షవచనమ్=ధూమ్రాక్షుని వచనమును, శ్రుత్వా=విని, రావణస్య=రావణునియొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, ద్రుతమ్=శీఘ్రముగా, బలమ్=సేనను, ఉద్యోజయామాస=సిద్ధము చేసెను.

తా. వెనుకనే సైన్యము గల సేనాధ్యక్షుడు అతని మాటలు విని, రావణుని ఆజ్ఞ ప్రకారము వెంటనే సైన్యమును ఆయత్తము చేసెను. 22

మూ. తే బద్ధఘణ్టా బలినో ఘోరరూపా నిశాచరాః,
వినర్దమానాః సంహృష్టా ధూమ్రాక్షం పర్యవారయన్. 23

ప్ర. అ. బద్ధఘణ్టాః=కట్టబడిన ఘంటలు గల, బలినః=బలవంతులైన, ఘోర రూపాః=భయంకరమైన రూపములు గల, తే నిశాచరాః=ఆ రాక్షసులు, వినర్ద మానాః=ధ్వని చేయుచున్నవారై, సంహృష్టాః=సంతోషించినవారై, ధూమ్రాక్షమ్= ధూమ్రాక్షుని, పర్యవారయన్=చుట్టిరి.

తా. ఘంటలు కట్టుకొని ధ్వని చేయుచున్న భయంకరమైన రూపము గల బలవంతులైన ఆ రాక్షసులు సంతోషముతో ధూమ్రాక్షుని చుట్టూ చేరిరి.

మూ. వివిధాయుధహస్తాశ్చ శూలముద్గరపాణయః,
గదాభిః పట్టిశైర్దణ్డైరాయసైర్ముసలైరపి. 24
పరిఘైర్భిన్దిపాలైశ్చ భల్లైః పాశైః పరశ్వధైః,
నిర్యయూ రాక్షసా ఘోరా నర్దన్తో జలదా యథా. 25

ప్ర. అ. జలదా యథా=మేఘముల వలె ఉన్న, నర్దన్తః=ధ్వని చేయుచున్న, ఘోరాః= భయంకరులైన, రాక్షసాః=రాక్షసులు, వివిధాయుధహ స్తాశ్చ=అనేకవిధములైన ఆయుధములు హస్తములందు గలవారై, శూలముద్గరపా ణయః=శూలములు ముద్గరములు హస్తములందు గలవారై, గదాభిః=గదలతోను, పట్టిశైః=పట్టిశములతోను, దణ్డైః=దండములతోను, ఆయసైః= ఇనుముపికారమైన, ముసలైరపి=రోకళ్లతోను, పరిఘైః=పరిఘలతోను, భిన్దిపాలైశ్చ= భిందిపాలముల తోను, భల్లైః=భల్లములతోను, పాశైః=పాశములతోను, పరశ్వధైః= గండ్రగొడ్డళ్లతోను, నిర్యయుః=బయలుదేరిరి.

తా. నల్లని మేఘముల వలె ఉన్న భయంకరులైన రాక్షసులు, గర్జించుచు, అనేక విధములైన ఆయుధములు ధరించి, శూలములు, ముద్గరములు హస్తములందు ధరించి, గదలు, పట్టిశములు, దండములు, ఇనుప రోకళ్లు, పరిఘలు, భిందిపాలములు, బల్లెములు, పాశములు, గొడ్డళ్లు మొదలైనవాటితో బయలుదేరిరి. 24, 25

మూ. రథైః కవచినస్త్వన్యే ధ్వజైశ్చ సమలంకృతైః,
సువర్ణజాలవిహితైః ఖరైశ్చ వివిధాననైః, 26
హయైః పరమశీఘ్రైశ్చ గజైశ్చైవ మదోత్కటైః,
నిర్యయుస్తైర్భృతవ్యాఘ్రా వ్యాఘ్రా ఇవ దురాసదాః. 27

ప్ర. అ. అన్యే=మరికొందరు, కవచినః=కవచములు గలవారై, ధ్వజైః=ధ్వజములచేత, సమలంకృతైః=అలంకరించబడినవి, సువర్ణజాలవిహితైః=బంగారు జాలీలచేత అలంకరింపబడినవి, వివిధాననైః=అనేకవిధములైన ముఖములు గల, ఖరైః=గాడిదలచేత (లాగబడినవి) అయిన, రథైః=రథములతోను, పరమశీఘ్రైః=చాల వేగముగా పోవు, హయైశ్చ=గుఱ్ఱములతోను, మదోత్కటైః=మదముచేత తీవ్రములైన, గజైశ్చైవ=గజములతోను, వ్యాఘ్రాః ఇవ=పెద్ద పులుల వలె, దురాసదాః=ఎదిరింప శక్యము కాని, నైర్ఋతవ్యాఘ్రాః=శ్రేష్ఠులైన రాక్షసులు, నిర్యయుః=బయలుదేరిరి.

తా. కవచములు ధరించిన మరి కొందరు రాక్షసులు ధ్వజములచేత, బంగారు జాలీలచేత అలంకరింపబడిన, అనేకవిధములైన ముఖములు గల గాడిదలు లాగుచున్న రథములు ఎక్కి వెళ్ళిరి. పెద్దపులుల వలె ఎదిరింపశక్యముకాని మరి కొందరు రాక్షసశ్రేష్ఠులు వేగము గల గుఱ్ఱములను, మదముచేత తీవ్రముగా ఉన్న ఏనుగులను ఎక్కి బయలుదేరిరి. 26, 27

మూ. మృగసింహముఖైర్యుక్తం ఖరైః కనకభూషితైః,
అరురోహ రథం దివ్యం ధూమ్రాక్షః ఖరనిస్స్వనః. 28

ప్ర. అ. ఖరనిస్స్వనః=గాడిద వంటి అరపు గల, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, మృగసింహముఖైః=లేళ్ళయొక్క, సింహములయొక్క ముఖముల వంటి ముఖములు గల, కనకభూషితైః=బంగారముచేత అలంకరింపబడిన, ఖరైః=గాడిదలతో, యుక్తమ్=కట్టబడిన, దివ్యమ్=దివ్యమైన, రథమ్=రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. గాడిదవంటి అరపు గల ధూమ్రాక్షుడు లేళ్ళ ముఖములు, సింహముఖములూ గలవి, బంగారముచేత అలంకరింపబడినవి అయిన గాడిదలు కట్టిన దివ్యమైన రథము నెక్కెను. 28

మూ. స నిర్యాతో మహావీర్యో ధూమ్రాక్షో రాక్షసైర్వృతః,
హసన్వై పశ్చిమద్వారాద్ధనుమాన్యత్ర యూథపః. 29

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, సః ధూమ్రాక్షః=ఆ ధూమ్రాక్షుడు, రాక్షసైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, హసన్=నవ్వుచు, యత్ర=ఎక్కడ, హనుమాన్=హనుమంతుడు, యూథపః=సేనానాయకుడో అట్టి, పశ్చిమద్వారాత్=పశ్చిమద్వారమునుండి, నిర్యాతః=బయలువెడలినాడు.

తా. మహాపరాక్రమము గల ఆ ధూమ్రాక్షుడు రాక్షసులతో కూడి, నవ్వుచు, హనుమంతుడు ఏ ద్వారము దగ్గర సేనాపతిగా ఉండెనో ఆ పశ్చిమద్వారమునుండి వెలువడెను.

మూ. రథప్రవరమాస్థాయ ఖరయుక్తం ఖరస్వనమ్,
ప్రయాన్తం తు మహాఘోరం రాక్షసం భీమదర్శనమ్, 30
అన్తరిక్షగతాః క్రూరాః శకునాః ప్రత్యషేధయన్.

ప్ర. అ. ఖరయుక్తమ్=గాడిదలు కట్టిన, ఖరస్వనమ్=కటువైన ధ్వని గల, రథప్రవరమ్=రథశ్రేష్ఠమును, ఆస్థాయ=ఎక్కి, ప్రయాన్తమ్=వెళ్ళుచున్న, మహాఘోరమ్=చాల భయంకరుడైన, భీమదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, రాక్షసమ్=ఆ రాక్షసుణ్ణి, అన్తరిక్షగతాః=ఆకాశమునందున్న, క్రూరాః=క్రూరములైన, శకునాః=శకునములు, ప్రత్యషేధయన్=నిషేధించినవి.

తా. గాడిదలు కట్టిన, క్రూరమైన ధ్వని గల రథశ్రేష్ఠమును ఎక్కి వెళ్ళుచున్న చాల క్రూరుడైన, మాటకు భయంకరుడుగా ఉన్న ఆ రాక్షసుణ్ణి చూచి ఆకాశములో ఉన్న క్రూరములైన శకునములు అడ్డగించినవి. 30

మూ. రథశీర్షే మహాభీమో గృధ్రశ్చ నిపపాత హ, 31
ధ్వజాగ్రే గ్రథితాశ్చైవ నిపేతుః కుణపాశనాః.

ప్ర. అ. మహాభీమః=చాల భయంకరమైన, గృధ్రశ్చ=గ్రద్ద, రథశీర్షే=రథ శిఖరముపై, నిపపాత హ=వ్రాలెను. కుణపాశనాః=శవములను తిను రాబందులు, గ్రథితాః= చుట్టబెట్టుకొని, ధ్వజాగ్రే=ధ్వజాగ్రమునందు, నిపేతుః=పడినవి.

తా. చాల భయంకరమైన గ్రద్ద రథము శిఖరముపై వ్రాలెను. రాబందులు కొన్ని చుట్టబెట్టుకొని ధ్వజాగ్రమునందు పడెను. 31

మూ. రుధిరార్ద్రో మహాన్ శ్వేతః కబన్ధః పతితో భువి, 32
విస్వరం చోత్సృజన్నాదం ధూమ్రాక్షస్య సమీపతః,
వవర్ష రుధిరం దేవః సంచచాల చ మేదినీ. 33

ప్ర. అ. రుధిరార్ద్రః=రక్తముచేత తడిసిన, శ్వేతః=తెల్లని, మహాన్=పెద్దదైన, కబన్ధః=మొండెము, విస్వరమ్=వికృతస్వరము కలుగునట్లుగా, నాదమ్=ధ్వనిని, ఉత్సృజన్=విడచుచు, ధూమ్రాక్షస్య=ధూమ్రాక్షునియొక్క, సమీపతః=సమీపమునందు, భువి=నేలమీద, పతితః=పడినది. దేవః=దేవుడు, రుధిరమ్=రక్తమును, వవర్ష=వర్షించెను. మేదినీ=భూమి, సంచచాల=చలించెను.

తా. రక్తముతో తడిసిన తెల్లని పెద్ద మొండెము వికృతమైన ధ్వని చేయుచు ధూమ్రాక్షునికి దగ్గరగా నేలమీద పడెను. రక్తవర్షము కురిసెను. భూమి కంపించెను. 32, 33

మూ. ప్రతిలోమం వవౌ వాయుర్నిర్ఘాతసమనిస్వనః,
తిమిరౌఘావృతాస్తత్ర దిశశ్చ న చకాశిరే. 34

ప్ర. అ. నిర్ఘాతసమనిస్వనః=పిడుగుతో సమానమైన ధ్వని గల, వాయుః=వాయువు, ప్రతిలోమమ్=ఎదురుగా, వవౌ=వీచెను. తత్ర=అప్పుడు, దిశః=దిక్కులు, తిమిరౌఘావృతాః=చీకటి సమూహముచేత కప్పబడినవై, న చకాశిరే=ప్రకాశించలేదు.

తా. పిడుగు వంటి ధ్వనితో వాయువు ప్రతికూలముగా వీచెను. దిక్కులు చీకటి ఆవరించుటచే ప్రకాశహీనముగా ఉండెను. 34

మూ. స తూత్పాతాంస్తదా దృష్ట్వా రాక్షసానాం భయావహాన్,
ప్రాదుర్భూతాన్సుఘోరాంశ్చ ధూమ్రాక్షో వ్యథితోఽభవత్. 35
ముముహూ రాక్షసాః సర్వే ధూమ్రాక్షస్య పురఃసరాః.

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులకు, భయావహాన్=భయము కలిగించు, తదా=అప్పుడు ప్రాదుర్భూతాన్=పుట్టిన, ఘోరాన్=ఘోరములైన, ఉత్పాతాన్=దుశ్శకునములను, దృష్ట్వా=చూచి, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, వ్యథితః=వ్యథ చెందినవాడు, అభవత్=అయెను. ధూమ్రాక్షస్య=ధూమ్రాక్షునకు, పురఃసరాః=ముందు నడచు, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, ముముహుః=మోహము చెందిరి.

తా. ఆ సమయమునందు కనబడిన, ఘోరములైన, రాక్షసులకు భయంకరములైన ఆ దుశ్శకునములను చూచి ధూమ్రాక్షుడు వ్యథ చెందెను. అతని ముందు నడచుచున్న రాక్షసులందరూ మోహము చెందిరి. 35

మూ. తతః సుభీమో బహుభిర్నిశాచరైః
వృతోఽభినిష్క్రమ్య రణోత్సుకో బలీ,
దదర్శ తాం రాఘవబాహుపాలితాం
మహౌఘకల్పాం బహువానరీం చమూమ్. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుభీమః=చాల భయంకరుడు, బలీ=బలము గలవాడు అయిన ధూమ్రాక్షుడు, బహుభిః=అనేకులైన, నిశాచరైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, రణోత్సుకః=యుద్ధమునందు వేడుక గలవాడై, అభినిష్క్రమ్య=బయలుదెడలి, రాఘవబాహుపాలితామ్=రాముని బాహువులచేత పాలింపబడినది, మహౌఘకల్పామ్=సముద్రముతో సమానము, బహువానరీమ్=చాలమంది వానరులు గలదీ అయిన, తాం చమూమ్=ఆ సేనను, దదర్శ=చూచెను.

తా.- చాల భయంకరుడు, బలశాలి అయిన ఆ ధూమ్రాక్షుడు చాలమంది రాక్షసులతో కూడినవాడై యుద్ధోత్సాహముతో బైలుదేరి వచ్చి, సముద్రము వలె ఉన్న, రాముని బాహువుల చేత రక్షింపబడుచున్న ఆ వానర సైన్యమును చూచెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదిఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

[హనుమంతుడు ధూమ్రాక్షుని వధించుట.]

మూ. ధూమ్రాక్షం ప్రేక్ష్య నిర్యాన్తం రాక్షసం భీమవిక్రమమ్,
వినేదుర్వానరాః సర్వే ప్రహృష్టా యుద్ధకాంక్షిణః. 1

ప్ర. అ. నిర్యాన్తమ్=బయలు వెడలుచున్న, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గల, రాక్షసమ్=రాక్షసుడైన, ధూమ్రాక్షమ్=ధూమ్రాక్షుణ్ణి, ప్రేక్ష్య=చూచి, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, యుద్ధకాంక్షిణః=యుద్ధమును కోరుచు, ప్రహృష్టాః=సంతోషించినవారై, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల ధూమ్రాక్షుడు బయలుదేరి వచ్చుచుండుట చూచి, యుద్ధానికై వేచి ఉన్న వానరులంతరూ సంతోషించి ధ్వని చేసిరి. 1

మూ. తేషాం సుతుములం యుద్ధం సంజజ్ఞే కపిరక్షసామ్,
అన్యోన్యం పాదపైర్ఘోరైర్నిఘ్నతాం శూలముద్గరైః. 2

ప్ర. అ. ఘోరైః=భయంకరములైన, పాదపైః=వృక్షములచేతను, శూలముద్గరైః=శూలములచేతను ముద్గరములచేతను, అన్యోన్యమ్=పరస్పరము, నిఘ్నతామ్=కొట్టుకొనుచున్న, తేషామ్=ఆ, కపిరక్షసామ్=వానరులకు రాక్షసులకు, సుతుములమ్=చాల వ్యాకులమైన, యుద్ధమ్=యుద్ధము, సంజజ్ఞే=కలిగెను (జరిగెను).

తా. భయంకరములైన వృక్షములచేత, శూలములచేత, ముద్గరముల చేత పరస్పరము కొట్టుకొనుచున్న ఆ వానరరాక్షసుల మధ్య చాల వ్యాకులమైన యుద్ధము జరిగెను. 2

మూ. రాక్షసైర్వానరా ఘోరా వికృత్తాః సమన్తతః,
వానరై రాక్షసాశ్చాపి ద్రుమైర్భూమిసమీకృతాః. 3

ప్ర. అ. సమన్తతః=అంతటా, రాక్షసైః=రాక్షసులచేత, ఘోరాః=భయంకరులైన, వానరాః=వానరులు, వికృత్తాః=ఛేదించబడిరి. రాక్షసాశ్చాపి=రాక్షసులు కూడా, వానరైః=వానరులచేత, ద్రుమైః=వృక్షములచేత, భూమిసమీకృతాః=భూమితో సమముగా చేయబడినారు.

తా. భయంకరులైన వానరులను రాక్షసులు అంతటా ఛేదించివేయగా వానరులు రాక్షసులను వృక్షములచేత భూమితో సమముగా చేసివేసిరి. 3

మూ. రాక్షసాస్త్వభిసంక్రుద్ధా వానరాన్నిశితైః శరైః,
వివ్యధుర్ఘోరసంకాశైః కఙ్కపత్రైరజిహ్మగైః. 4

ప్ర. అ. రాక్షసాస్తు=రాక్షసులైతే, అభిసంక్రుద్ధాః=కోపించినవారై, నిశితైః=వాడియైన, ఘోరసంకాశైః=ఘోరమైన వాటితో సమానములైన, కఙ్కపత్రైః=గ్రద్దల రెక్కలు గల, అజిహ్మగైః=వంకరలేకుండా వెళ్ళు, శరైః=బాణములచేత, వానరాన్=వానరులను, వివ్యధుః=కొట్టిరి.

తా. రాక్షసులు కోపించినవారై, భయంకరములైన కాలాగ్న్యాదుల వంటి గ్రద్ద రెక్కలు కట్టిన, వంకరలేకుండా పోవు, వాడియైన బాణములచే వానరులను కొట్టిరి. 4

మూ. తే గదాభిశ్చ భీమాభిః పట్టిశైః కూటముద్గరైః,
ఘోరైశ్చ పరిఘైశ్చిత్రైస్త్రిశూలైశ్చాపి సంశితైః. 5
విదీర్యమాణా రక్షోభిర్వానరాస్తే మహాబలాః,
అమర్షజనితోద్ధర్షాశ్చక్రుః కర్మాణ్యభీతవత్. 6

ప్ర. అ. భీమాభిః=భయంకరములైన, గదాభిః=గదలచేతను, పట్టిశైః= పట్టిశములచేతను, కూటముద్గరైః=కూటములచేతను, ముద్గరములచేతను, ఘోరైః= భయంకరములైన, పరిఘైశ్చ=పరిఘలచేతను, చిత్రైః=చిత్రములైన, సంశితైః=గ్రహింపబడిన, త్రిశూలైశ్చ=త్రిశూలములచేతను, రక్షోభిః=రాక్షసులచేత, విదీర్యమాణాః=చీల్చివేయబడుచున్న, మహాబలాః=గొప్ప బలము గల, తే వానరాః=ఆ వానరులు, అమర్షజనితోద్ధర్షాః=కోపముచేత పుట్టిన, అధికోత్సాహముగలవారై, అభీతవత్=భయపడకుండగా, కర్మాణి=పనులను, చక్రుః=చేసిరి.

తా. గొప్ప బలము గల వానరులు, తమను రాక్షసులు భయంకరములైన గదలచేత, పట్టిశములచేత, కూటములచేత, ముద్గరములచేత, భయంకరములైన పరిఘలచేత, చిత్రములైన త్రిశూలములచేత చీల్చివేయుచుండగా కోపముచేత పెరిగిన ఉత్సాహముతో, ఏ మాత్రము భయపడక గొప్ప పనులు చేసిరి. 5, 6

మూ. శరనిర్భిన్నగాత్రాస్తే శూలనిర్భిన్నదేహినః,
జగృహుస్తే ద్రుమాంస్తత్ర శిలాశ్చ హరియూథపాః. 7

ప్ర. అ. శరనిర్భిన్నగాత్రాః=బాణములచేత బ్రద్దలుకొట్టబడిన శరీరములు గలవారు, శూలనిర్భిన్నదేహినః=శూలములచేత భేదింపబడిన దేహములు కలవారు అయిన, తే=ఆ, హరియూథపాః=వానరసేనానాయకులు, తత్ర=అక్కడ, ద్రుమాన్=వృక్షములను, శిలాశ్చ=శిలలను, జగృహుః=గ్రహించిరి.

తా. శరములచేత, శూలములచేత శరీరములు భేదింపబడుచుండగా

ఆ వానరసేనానాయకులు వృక్షములను, శిలలను గ్రహించిరి. 7

మూ. తే భీమవేగా హరయో నర్దమానాస్తతస్తతః,
మమన్థూ రాక్షసాన్వీరాన్ నామాని చ బభాషిరే. 8

ప్ర. అ. భీమవేగాః=భయంకరమైన వేగముగల, తే హరయః=ఆ వానరులు, నర్దమానాః =గర్జించుచున్నవారై, తతస్తతః=అన్ని ప్రదేశములయందూ, వీరాన్=వీరులైన, రాక్షసాన్=రాక్షసులను, మమన్థుః=మథించిరి. నామాని చ=తమ పేర్లను కూడ, బభాషిరే=చెప్పిరి.

తా. భయంకరమైన వేగము గల ఆ వానరులు గర్జించుచు అన్ని ప్రదేశములందు, వీరులైన రాక్షసులను తమ పేర్లు చెప్పుకొనుచు, మథించివేసిరి.

మూ. తద్బభూవాద్భుతం ఘోరం యుద్ధం వానరరక్షసామ్,
శిలాభిర్వివిధాభిశ్చ బహుశాఖైశ్చ పాదపైః. 9

ప్ర. అ. వివిధాభిః=అనేకవిధములైన, శిలాభిః=శిలలతోను, బహుశాఖైః =అనేకమైన కొమ్మలు గల, పాదపైః=వృక్షములతోను, తత్=ఆ, వానరరక్షసామ్=వానరులయొక్క, రాక్షసులయొక్క, ఘోరమ్=ఘోరమైన, యుద్ధమ్=యుద్ధము, అద్భుతమ్=ఆశ్చర్యకరముగా, బభూవ=ఆయెను.

తా. వానరులకు రాక్షసులకు మధ్య అనేక విధములైన శిలలతోను, చాల కొమ్మలు గల వృక్షములతోను, భయంకరమైన ఆ యుద్ధము ఆశ్చర్యకరముగా ఉండెను. 9

మూ. రాక్షసా మథితాః కేచిద్వానరైర్జితకాశిభిః,
ప్రవేముః రుధిరం కే చిన్ముఖై రుధిరభోజనాః. 10

ప్ర. అ. జితకాశిభిః=జయించబడినశ్వాసగల, వానరైః=వానరులచేత, కేచిత్=కొందరు, రాక్షసాః=రాక్షసులు, మథితాః=మథించబడిరి. కేచిత్=కొందరు, రుధిరభోజనాః=రక్తము భుజించు రాక్షసులు, ముఖైః=ముఖములచేత, రుధిరమ్=రక్తమును, ప్రవేముః=కక్కిరి.

తా. శ్వాసలు బిగించిన వానరులు కొందరు రాక్షసులను మథించిరి. రక్తము భుజించు కొందరు రాక్షసులు నోటినుండి రక్తము కక్కిరి. 10

మూ. పార్శ్వేషు దారితాః కేచిత్ కేచిద్రాశీకృతా ద్రుమైః,
శిలాభిశ్చూర్ణితాః కేచిత్కేచిద్దన్తైర్విదారితాః. 11

ప్ర. అ. కేచిత్=కొందరు, పార్శ్వేషు=పార్శ్వములయందు, దారితాః=చీల్చ

వేయబడిరి. కేచిత్=కొందరు, ద్రుమైః=వృక్షములచేత, రాశీకృతాః=రాశులుగా చేయబడిరి కేచిత్= కొందరు, శిలాభిః=శిలలచేత, చూర్ణితాః=చూర్ణము చేయబడిరి. కేచిత్=కొందరు, దన్తైః=దంతములచేత, విదారితాః=చీల్చివేయబడిరి.

తా. వానరులు కొందరు రాక్షసులను పార్శ్వములందు చీల్చివేసిరి. కొందరిని వృక్షములతో కొట్టి గుట్టలుగా పడవేసిరి. కొందరిని శిలలతో చూర్ణము చేసిరి. కొందరిని దంతములతో చూర్ణము చేసిరి. 11

మూ. ధ్వజైర్విమథితైర్భగ్నైః ఖడ్గైశ్చ వినిపాతితైః,
రథైర్విధ్వంసితైః కేచిద్వ్యథితా రజనీచరాః. 12

ప్ర. అ. కేచిత్=కొందరు, రజనీచరాః=రాక్షసులు, విమథితైః=కొట్టబడి, భగ్నైః=భగ్నములైన, ధ్వజైః=ధ్వజములతోను, వినిపాతితైః=పడగొట్టబడిన, ఖడ్గైశ్చ=ఖడ్గములతోను, విధ్వంసితైః=ధ్వంసము చేయబడిన, రథైః=రథములతోను, వ్యథితాః=వ్యథచెందిరి.

తా. వానరులు ధ్వజములను ఊడబెరికి విరిచివేసిరి. ఖడ్గములు నేలమీద పడగొట్టిరి. రథములను ధ్వంసముచేసిరి. ఇదంతా చూచి కొందరు రాక్షసులు వ్యథ చెందిరి. 12

మూ. గజేన్ద్రైః పర్వతాకారైః పర్వతాగ్రైర్వనౌకసామ్,
మథితైర్వాజిభిః కీర్ణం సారోహైర్వసుధాతలమ్. 13

ప్ర. అ. వనౌకసామ్=వానరులయొక్క, పర్వతాగ్రైః=పర్వతశిఖరములచేత, మథితైః=మథింపబడిన, పర్వతాకారైః=పర్వతమువంటి ఆకారము గల, గజేన్ద్రైః=ఏనుగులతోను, సారోహైః=రౌతులతో కూడిన, వాజిభిః=గుఱ్ఱములతోను, వసుధాతలమ్=నేల, కీర్ణమ్=వ్యాప్తమైనది.

తా. వానరులు పర్వతశిఖరములను ప్రయోగించగా నలిగిపోయిన పర్వతములవంటి ఏనుగులతోను, గుఱ్ఱములతోను, గుఱ్ఱపురౌతులతోను నేల అంతా చిందరవందరగా ఉండెను. 13

మూ. వానరైర్భీమవిక్రాన్తైరాప్లుత్యోత్ప్లుత్య వేగితైః,
రాక్షసాః కరజైస్తీక్ష్ణైర్ముఖేషు వినిదారితాః. 14

ప్ర. అ. భీమవిక్రాన్తైః=భయంకరమైన పరాక్రమము గల, వేగితైః=వేగమును పొందిన, వానరైః=వానరులచేత, ఆప్లుత్య=అడ్డముగా ఎగిరి, ఉత్ప్లుత్య=పైకెగిరి, రాక్షసాః=రాక్షసులు, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, కరజైః=గోళ్లతో ముఖేషు=ముఖములయందు, వినిదారితాః=చీల్చబడిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల వానరులు వేగముగాను, అడ్డముగాను, పైకి ఎగిరి వాడియైన గోళ్లతో రాక్షసుల ముఖములను చీల్చివేసిరి.

మూ. విషణ్ణవదనా భూయో విప్రకీర్ణశిరోరుహాః,
మూఢాః శోణితగన్ధేన నిపేతుర్ధరణీతలే. 15

ప్ర. అ. భూయః=అధికముగా, విషణ్ణవదనాః=దిగులు చెందిన ముఖములు గలవారై, విప్రకీర్ణశిరోరుహాః=విరబోయబడిన జుట్టు కలవారై, శోణితగన్ధేన=రక్తము వాసనచేత, మూఢాః=మూఢులై, ధరణీతలే=నేలమీద, నిపేతుః=పడిరి.

తా. ఆ రాక్షసులు మిక్కిలి దిగులు చెందిన ముఖములతో, జుట్లు విరబోసికొని, రక్తగంధముచేత మూఢులై నేలమీద పడిరి.

మూ. అన్యే తు పరమక్రుద్ధా రాక్షసా భీమవిక్రమాః,
తలైరేవాభిధావన్తి వజ్రస్పర్శసమైర్హరీన్. 16

ప్ర. అ. భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, అన్యే=ఇతరులైన, రాక్షసాః=రాక్షసులు, పరమక్రుద్ధాః=మిక్కిలి కోపించినవారై, వజ్రస్పర్శసమైః=వజ్రముయొక్క స్పర్శతో సమానములైన, తలైరేవ=అరచేతులతో, హరీన్=వానరులను గూర్చి, అభిధావన్తి= ఎదురుగా పరుగెత్తిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల కొందరు రాక్షసులు చాలా కోపించి వానరులను, వజ్రాయుధస్పర్శవంటి స్పర్శగల అరచేతులతో కొట్టుటకై వెళ్ళిరి. 16

మూ. వానరైరాపతన్తస్తే వేగితా వేగవత్తరైః,
ముష్టిభిశ్చరణైర్దన్తైః పాదపైశ్చావపోథితాః. 17

ప్ర. అ. వేగితాః=వేగవంతులై, ఆపతన్తః=శీఘ్రముగా వచ్చుచున్న, తే=ఆ రాక్షసులు, వేగవత్తరైః=అధికవేగముగల, వానరైః=వానరులచేత, ముష్టిభిః=పిడికిళ్ళచేత, చరణైః=పాదములచేత, దన్తైః=దంతములచేత, పాదపైశ్చ=వృక్షములచేత, అవపోథితాః=మర్దించబడిరి.

తా. వేగముగా మీదికి వచ్చుచున్న ఆ రాక్షసులను అంతకంటె అధికమైన వేగము గల వానరులు పిడికిళ్ళచేత, పాదములచేత, దంతములచేత, వృక్షములచేత మర్దించిరి. 17

మూ. సైన్యం తు విద్రుతం దృష్ట్వా ధూమ్రాక్షో రాక్షసర్షభః,
రోషేణ కదనం చక్రే వానరాణాం యుయుత్సతామ్. 18

ప్ర. అ. రాక్షసర్షభః=రాక్షసశ్రేష్ఠుడైన, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, విద్రుతమ్= పారిపోయిన, సైన్యమ్=సైన్యమును, దృష్ట్వా=చూచి, రోషేణ=కోపముతో, యుయుత్సతామ్=యుద్ధముచేయదలచిన, వానరాణామ్=వానరులయొక్క, కదనమ్=హింసను, చక్రే=చేసెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన ధూమ్రాక్షుడు సైన్యము పారిపోవుట చూచి, కోపించి, యుద్ధము చేయవచ్చిన వానరులను సంహరించెను. 18

మూ. ప్రాసైః ప్రమథితాః కేచిద్వానరాః శోణితస్రవాః,
మృద్గరైరాహతాః కేచిత్పాతితా ధరణీతలే. 19

ప్ర. అ. కేచిత్=కొందరు, వానరాః=వానరులు, ప్రాసైః=ప్రాసలచేత, ప్రమథితాః=మథింపబడినవారై, శోణితస్రవాః=రక్తమును స్రవించువారుగా (ఉండిరి). కేచిత్=కొందరు, ముద్గరైః=ముద్గరములచేత, ఆహతాః=కొట్టబడినవారై, ధరణీతలే=నేలమీద, పాతితాః=పడగొట్టబడిరి.

తా. కొందరు వానరులు ప్రాసలచేత కొట్టబడినవారై రక్తము స్రవించుచు మరణించిరి. మరికొందరు ముద్గరముల దెబ్బలకు నేలపై పడిరి.

మూ. పరిఘైర్మథితాః కేచిద్భిన్దిపాలైశ్చ దారితాః,
పట్టిశైర్మథితాః కేచిద్విహ్వలన్తో గతాసవః. 20

ప్ర. అ. కేచిత్=కొందరు, పరిఘైః=పరిఘములచేత, మథితాః=మథింపబడిరి. (కొందరు) భిన్దిపాలైశ్చ=భిందిపాలములచేత, దారితాః=చీల్చబడిరి. కేచిత్=కొందరు, పట్టిశైః=పట్టిశములచేత, మథితాః=మథింపబడినవారై, విహ్వలన్తః=వ్యాకులులై, గతాసవః= పోయిన ప్రాణములు గలవారైరి.

తా. కొందరు పరిఘలచేత మర్దింపబడిరి. కొందరు భిందిపాలములచేత చీల్చివేయబడిరి. కొందరు పట్టిశములచేత మథింపబడి వ్యాకులులై మరణించిరి.

మూ. కేచిద్వినిహతా భూమౌ రుధిరార్ద్రా వనౌకసః,
కేచిద్విద్రావితా నష్టాః సంక్రుద్ధైరాక్షసైర్యుధి. 21

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, కేచిత్=కొందరు, వనౌకసః=వానరులు, సంక్రుద్ధైః=కోపించిన, రాక్షసైః=రాక్షసులచేత, వినిహతాః=చంపబడినవారై, రుధిరార్ద్రాః=రక్తముచేత తడిసినవారై, భూమౌ=నేలమీద (పడిరి). కేచిత్=కొందరు, విద్రావితాః=తరమబడినవారై, నష్టాః=కనబడకుండా పోయిరి.

తా. కొందరు వానరులు యుద్ధమునందు కోపించిన రాక్షసులచేత చంపబడినవారై రక్తముచేత తడిసిన శరీరములతో నేలమీద పడిపోయిరి.

కొందరు తరుమబడి పారిపోయిరి. 21

మూ. విభిన్నహృదయాః కేచిదేకపార్శ్వేన శాయితాః,
విదారితాస్త్రిశూలైశ్చ కేచిదాన్త్రై ర్వినిఃసృతాః. 22

ప్ర. అ. కేచిత్=కొందరు, విభిన్నహృదయాః=బ్రద్దలుకొట్టబడిన హృదయములు గలవారై, ఏకపార్శ్వేన=ఒక ప్రక్కచేత, శాయితాః=శయనింపచేయబడినారు. కేచిత్=కొందరు, త్రిశూలైః=త్రిశూలములచేత, విదారితాః=చీల్చబడినవారై, ఆన్త్రైః=ప్రేగులతో, వినిఃసృతాః=బైటకు వచ్చిరి.

తా. కొందరు వానరులు ఖండింపబడిన హృదయములతో ఒక ప్రక్కకు ఒరిగి పడిపోయిరి. కొందరు త్రిశూలములచేత చీల్చివేయబడగా వాళ్ళ ప్రేగులు పైకి వచ్చి వేసినవి. 22

మూ. తత్సుభీమం మహద్యుద్ధం హరిరాక్షససంకులమ్,
ప్రబభౌ శస్త్రబహులం శిలాపాదపసంకులమ్. 23

ప్ర. అ. సుభీమమ్=చాల భయంకరము, హరిరాక్షససంకులమ్=వానరులతోను, రాక్షసులతోను వ్యాకులము, శిలాపాదపసంకులమ్=శిలలతోను వృక్షాలతోను వ్యాకులము, శస్త్రబహులమ్=అధికమైన శస్త్రములు గలది అయిన, మహత్=గొప్ప, తత్ యుద్ధమ్=ఆ యుద్ధము, ప్రబభౌ=ప్రకాశించెను.

తా. చాల భయంకరము, వానరులతోను రాక్షసులతోను సంకులము అయిన ఆ మహాయుద్ధము ఆయుధములచేతను, శిలలచేతను, వృక్షములచేతను వ్యాకులమై ప్రకాశించెను. 23

మూ. ధనుర్జ్యాతన్త్రిమధురం హిక్కాతాలసమన్వితమ్,
మన్దస్తనితగీతం తద్యుద్ధగాన్ధర్వమాబభౌ. 24

ప్ర. అ. ధనుర్జ్యాతన్త్రిమధురమ్=ధనస్సుల నారులనే తీగలచేత (తీగల ధ్వనులచేత) మధురము, హిక్కాతాలసమన్వితమ్=ఎక్కిళ్ళు అనే తాళములతో కూడినది, మన్దస్తనితగీతమ్=మందమైన సంభాషణ మనే గీతము గలది అయిన, తత్=ఆ, యుద్ధగాన్ధర్వమ్=యుద్ధమనే సంగీతము (నృత్త-గీత-వాద్యములకు సంగీతమని పేరు) ఆబభౌ=ప్రకాశించెను.

తా. ఆ యుద్ధ మనే సంగీతము (నృత్త-గీత-వాద్యరూపమైన సంగీతము) చాల అందముగా ఉండెను. ధనస్సుల నారుల ధ్వని అనే తీగల ధ్వనులు దానియందు మధురముగా ఉండెను. ఎక్కిళ్ళు తాళములుగాను, అలసిపోవుటచేత మందముగా వచ్చు మాటలు గీతముగాను ఉండెను. 24

మూ. ధూమ్రాక్షస్తు ధనుష్పాణిర్వానరాన్ రణమూర్ధని,
హసన్విద్రావయామాస దిశస్తాఞ్ఛరవృష్టిభిః. 25

ప్ర. అ. ధూమ్రాక్షస్తు=ధూమ్రాక్షుడైతే, రణమూర్ధని=యుద్ధరంగము యొక్క అగ్రభాగమునందు, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు గలవాడై, హసన్=నవ్వుచు, శరవృష్టిభిః=బాణములచేత, తాన్ వానరాన్=ఆ వానరులను, దిశః=దిక్కులను గూర్చి, విద్రావయామాస=పరుగెత్తించెను.

తా. యుద్ధభూమి అగ్రభాగమునందు ధూమ్రాక్షుడు ధనస్సు చేతిలో ధరించి, నవ్వుచు, బాణవర్షము కురిపించుచు ఆ వానరులు దిక్కులు పట్టి పారిపోవునట్లు చేసెను. 25

మూ. ధూమ్రాక్షేణార్దితం సైన్యం వ్యథితం ప్రేక్ష్య మారుతిః,
అభ్యవర్తత సంక్రుద్ధః ప్రగృహ్య విపులాం శిలామ్. 26

ప్ర. అ. మారుతిః=హనుమంతుడు, ధూమ్రాక్షేణ=ధూమ్రాక్షునిచేత అర్దితమ్=పీడించబడిన, వ్యథితమ్=వ్యథచెందిన, సైన్యమ్=సైన్యమును, ప్రేక్ష్య=చూచి, సంక్రుద్ధః=కోపించినవాడై, విపులామ్=పెద్దదైన, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, అభ్యవర్తత=ఎదురుగా వెళ్ళెను.

తా. ధూమ్రాక్షుడు బాధించుటచే వ్యథ చెంది ఉన్న సైన్యమును చూచి, హనుమంతుడు కోపించి, పెద్ద శిలను గ్రహించి అతని వైపు వెళ్ళెను.

మూ. క్రోధాద్ద్విగుణతామ్రాక్షః పితుస్తుల్యపరాక్రమః,
శిలాం తాం పాతయామాస ధూమ్రాక్షస్య రథం ప్రతి. 27

ప్ర. అ. పితుః=తండ్రికి, తుల్యపరాక్రమః=సమానమైన పరాక్రమము గల ఆ హనుమంతుడు, క్రోధాత్=క్రోధమువలన, ద్విగుణతామ్రాక్షః=రెండు రెట్లు ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, ధూమ్రాక్షస్య=ధూమ్రాక్షునియొక్క, రథం ప్రతి=రథమునుగూర్చి, తాం శిలామ్=ఆ శిలను, పాతయామాస=పడవేసెను.

తా. తండ్రితో సమానమైన పరాక్రమము గల హనుమంతుడు, కోపముచేత రెట్టింపు ఎఱ్ఱనైన నేత్రములుగలవాడై, ఆ శిలను ధూమ్రాక్షుని రథముమీద పడవేసెను. 27

మూ. ఆపతన్తీం శిలాం దృష్ట్వా గదాముద్యమ్య సంభ్రమాత్,
రథాదాప్లుత్య వేగేన వసుధాయాం వ్యతిష్ఠత. 28

ప్ర. అ. ఆపతన్తీమ్=వచ్చిపడుచున్న, శిలామ్=శిలను, దృష్ట్వా=చూచి, సంభ్రమాత్=తొందరవలన, గదామ్=గదను, ఉద్యమ్య=ఎత్తి, వేగేన=వేగముతో,

రథాత్=రథమునుండి, అప్లుత్య=దుమికి, వసుధాయామ్=భూమిమీద, వ్యతిష్ఠత=నిలచెను.

తా. ధూమ్రాక్షుడు వచ్చి మీదపడుచున్న శిలను చూచి, తొందరగా గదను గ్రహించి, వేగముగా రథమునుండి దుమికి నేలపై నిలబడెను. 28

మూ. సా ప్రమథ్య రథం తస్య నిపపాత శిలా భువి,
సచక్రకూబరముఖం సధ్వజం సశరాసనమ్. 29

ప్ర. అ. సా శిలా=ఆ శిల, తస్య=వానియొక్క, సచక్రకూబరముఖమ్=చక్రములతోను కాడిదూలములతోను ముఖముతోను కూడిన, సధ్వజమ్=ధ్వజముతో కూడిన, సశరాసనమ్=ధనస్సులతో కూడిన, రథమ్=రథమును, ప్రమథ్య=విరుగగొట్టి, భువి=నేలమీద, నిపపాత=పడెను.

తా. ఆ శిల చక్రములతోను, కాడిదూలములతోను, అగ్రభాగములతోను, ధ్వజములతోను, ధనస్సులతోను సహా అతని రథమును ముక్కలు చేసి నేలమీద పడెను. 29

మూ. స భఙ్క్త్వా తు రథం తస్య హనుమాన్ మారుతాత్మజః,
రక్షసాం కదనం చక్రే సస్కన్ధవిటపైర్ద్రుమైః. 30

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, తస్య=వానియొక్క, రథమ్=రథమును, భఙ్క్త్వా=విరుగగొట్టి, సస్కన్ధవిటపైః=మానులతోను కొమ్మలతోను కూడిన, ద్రుమైః=వృక్షములచేత, రక్షసామ్=రాక్షసులయొక్క, కదనమ్=నాశమును, చక్రే=చేసెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు అతని రథమును విరుగగొట్టి మానులతోను కొమ్మలతోను కూడిన వృక్షములచేత రాక్షసులను సంహరించెను.

మూ. విభిన్నశిరసో భూత్వా రాక్షసా రుధిరోక్షితాః,
ద్రుమైః ప్రమథితాశ్చాన్యే నిపేతుర్ధరణీతలే. 31

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, విభిన్నశిరసః=విరుగగొట్టబడిన శిరస్సులు గలవారు, భూత్వా=అయి, రుధిరోక్షితాః=రక్తముచేత తడపబడినవారైరి. అన్యే=మరికొందరు, ద్రుమైః=వృక్షములచేత, ప్రమథితాః=మథింపబడినవారై, ధరణీతలే=నేలమీద, నిపేతుః= పడిరి.

తా. కొందరు రాక్షసుల తలలు బ్రద్దలైపోవుటచేత రక్తముతో తడిసిపోయిరి. మరికొందరు వృక్షములచేత కొట్టబడినవారై నేలపై పడిపోయిరి.

మూ. విద్రావ్య రాక్షసం సైన్యం హనుమాన్ మారుతాత్మజః,
గిరేః శిఖరమాదాయ ధూమ్రాక్ష మభిదుద్రువే. 32

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, రాక్షసమ్=రాక్షసుల సంబంధమైన, సైన్యమ్=సైన్యమును, విద్రావ్య=తరిమివేసి, గిరేః=పర్వతముయొక్క, శిఖరమ్=శిఖరమును, ఆదాయ=గ్రహించి, ధూమ్రాక్షమ్=ధూమ్రాక్షుని గూర్చి, అభిదుద్రువే=ఎదురుగా పరుగెత్తెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు రాక్షససైన్యమును తరిమివేసి, పర్వతశిఖర మొకటి తీసికొని ధూమ్రాక్షునిమీదికి పరుగెత్తెను. 32

మూ. తమాపతన్తం ధూమ్రాక్షో గదాముద్యమ్య వీర్యవాన్,
వినర్దమానః సహసా హనూమన్తమభిద్రవత్. 33

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, గదామ్=గదను, ఉద్యమ్య=ఎత్తి, వినర్దమానః=గర్జించుచు, సహసా=శీఘ్రముగా, ఆపతన్తమ్= మీదికి వచ్చుచున్న, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని గూర్చి, అభ్యద్రవత్=పరుగెత్తెను.

తా. పరాక్రమవంతుడైన ధూమ్రాక్షుడు గదను ఎత్తి గర్జించుచు, తనమీదికి వచ్చుచున్న ఆ హనుమంతుని వైపు శీఘ్రముగా వెళ్లెను. 33

మూ. తస్య క్రుద్ధస్య రోషేణ గదాం తాం బహుకణ్టకామ్,
పాతయామాస ధూమ్రాక్షో మస్తకేఽథ హనూమతః. 34

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, బహుకణ్టకామ్=అనేకమైన ముళ్లు గల, తాం గదామ్=ఆ గదను, క్రుద్ధస్య=కోపించిన, తస్య హనూమతః=ఆ హనుమంతునియొక్క, మస్తకే=శిరస్సుమీద, రోషేణ=కోపముతో, పాతయామాస=పడవేసెను.

తా. పిమ్మట ధూమ్రాక్షుడు చాల ముండ్లతో నిండిన ఆ గదను కోపించిన ఆ హనుమంతుని శిరస్సుపైకి కోపముతో విసిరెను. 34

మూ. తాడితః స తయా తత్ర గదయా భీమవేగయా,
స కపిర్మారుతబలస్తం ప్రహారమచిన్తయన్, 35
ధూమ్రాక్షస్య శిరోమధ్యే గిరిశృఙ్గమపాతయత్.

ప్ర. అ. తత్ర=అక్కడ, భీమవేగయా=భయంకరమైన వేగము గల, తయా=ఆ, గదయా=గదచేత, తాడితః=కొట్టబడిన, సః=ప్రసిద్ధుడైన, మారుతబలః=వాయువు వంటి బలము గల, సః కపిః=ఆ హనుమంతుడు, తమ్=ఆ,

ప్రహారమ్=దెబ్బను, అచిన్తయన్=ఆలోచింపనివాడై, ధూమ్రాక్షస్య=ధూమ్రాక్షుని యొక్క, శిరోమధ్యే=శిరస్సు మధ్యయందు, గిరిశృఙ్గమ్=పర్వతశిఖరమును, అపాతయత్=పడవేసెను.

తా. భయంకరమైన వేగము గల ఆ గదచేత కొట్టబడినను, వాయువు బలము వంటి బలము గల ఆ హనుమంతుడు ఆ దెబ్బను లక్ష్యపెట్టక ఆ పర్వతశిఖరమును ధూమ్రాక్షుని నడినెత్తిపై పడవేసెను. 35

మూ. స విస్ఫారితసర్వాఙ్గో గిరిశృఙ్గేణ తాడితః, 36
పపాత సహసా భూమౌ వికీర్ణ ఇవ పర్వతః.

ప్ర. అ. గిరిశృఙ్గేణ=పర్వతశిఖరముచేత, తాడితః=కొట్టబడిన, సః=ఆ ధూమ్రాక్షుడు, విస్ఫారితసర్వాఙ్గః=చాచబడిన సకల అవయవములు కలవాడై, సహసా=వెంటనే, వికీర్ణః=విసిరివేయబడిన, పర్వతః ఇవ=పర్వతము వలె, భూమౌ=నేలమీద, పపాత=పడెను.

తా. పర్వతశిఖరముచేత కొట్టబడిన ఆ ధూమ్రాక్షుడు అవయవములను అన్నింటిని చాచుకొని, దూరముగా విసిరివేయబడిన పర్వతము వలె, వెంటనే నేలమీద పడిపోయెను. 36

మూ. ధూమ్రాక్షం నిహతం దృష్ట్వా హతశేషా నిశాచరాః, 37
త్రస్తాః ప్రవివిశుర్లఙ్కాం వధ్యమానాః ప్లవఙ్గమైః.

ప్ర. అ. హతశేషాః=చంపగా మిగిలిన, నిశాచరాః=రాక్షసులు, ధూమ్రాక్షమ్=ధూమ్రాక్షుని, నిహతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, త్రస్తాః=భయపడినవారై, ప్లవఙ్గమైః=వానరులచేత, వధ్యమానాః=చంపబడుచున్న వారై, లఙ్కామ్=లంకను, ప్రవివిశుః=ప్రవేశించిరి.

తా. ధూమ్రాక్షుడు మరణించుట చూచి, చావగా మిగిలిన రాక్షసులు భయపడి, ఒక ప్రక్క వానరులు చంపుచుండగా పారిపోయి లంకలో ప్రవేశించిరి.

మూ. స తు పవనసుతో నిహత్య శత్రూన్
క్షతజవహాః సరితశ్చ సంవికీర్య,
రిపువధజనితశ్రమో మహాత్మా
ముదమగమత్కపిభిః సుపూజ్యమానః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ, పవనసుతః=హనుమంతుడు, శత్రూన్=శత్రువులను, నిహత్య=చంపి, క్షతజవహాః=రక్తమును ప్రవహించు, సరి

తత్ప్ర=నదులను, సంవికీర్య=ప్రవహింపచేసి, రిపువధజనితశ్రమః=శత్రువధచేత కలిగిన శ్రమ కలవాడై, కపిభిః=వానరులచేత, సుపూజ్యమానః=బాగుగా పూజింపబడు చున్నవాడై, ముదమ్=సంతోషమును, అగమత్=పొందెను.

తా. మహాత్ముడైన హనుమంతుడు శత్రువులను సంహరించి, రక్తము ప్రవహించు నదులను ప్రవహింపచేసి, వానరులచేత పూజింపబడుచు, శత్రువులను చంపుటచేత కొంచెము శ్రమ చెంది, ఆనందించెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఏబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిపఞ్చాశః సర్గః

[రావణుడు వజ్రదంష్ట్రుడను రాక్షసుణ్ణి యుద్ధమునకు పంపుట. అతడు వానరులతో ఘోరయుద్ధము చేయుట.]

మూ. ధూమ్రాక్షం నిహతం దృష్ట్వా రావణో రాక్షసేశ్వరః,
క్రోధేన మహతావిష్టో నిఃశ్వసన్నురగో యథా. 1
దీర్ఘముష్ణం వినిఃశ్వస్య క్రోధేన కలుషీకృతః,
అబ్రవీద్రాక్షసం క్రూరం వజ్రదంష్ట్రం మహాబలమ్. 2

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, ధూమ్రాక్షమ్=ధూమ్రాక్షుని, నిహతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, మహతా=గొప్పదైన, క్రోధేన=క్రోధముచేత, ఆవిష్టః=ఆవేశించబడినవాడై, ఉరగో యథా=సర్పము వలె, నిఃశ్వసన్=నిట్టూర్చుచు, దీర్ఘమ్=దీర్ఘముగాను, ఉష్ణమ్=వేడిగాను, వినిఃశ్వస్య=నిట్టూర్చి, క్రోధేన=కోపముచేత, కలుషీకృతః=కలుషము చేయబడినవాడై, క్రూరమ్=క్రూరుడు, మహాబలమ్=గొప్ప బలము గలవాడు అయిన, వజ్రదంష్ట్రమ్=వజ్రదంష్ట్రుడను, రాక్షసమ్=రాక్షసుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు ధూమ్రాక్షుడు చంపబడినట్లు విని, చాల కోపావేశముతో సర్పము వలె బుసలు కొట్టుచు, దీర్ఘముగాను వేడిగాను నిట్టూర్చి, క్రోధముచేత కలుషము చేయబడినవాడై, క్రూరుడు, మహాబలశాలి అయిన వజ్రదంష్ట్రుడను రాక్షసునితో ఇట్లు పలికెను. 1, 2

మూ. గచ్ఛ త్వం వీర నిర్యాహి రాక్షసైః పరివారితః,
జహి దాశరథిం రామం సుగ్రీవం వానరైః సహ. 3

ప్ర. అ. వీర=వీరుడా ! త్వమ్=నీవు, గచ్ఛ=వెళ్ళుము. రాక్షసైః=రాక్షసుల చేత, పరివారితః=చుట్టబడినవాడవై, నిర్యాహి=బయలుదేరుము. దాశరథిమ్=దశరథ కుమారుడైన, రామమ్=రాముణ్ణి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, వానరైః సహ=వానరులతో కూడ, జహి=చంపుము.

తా. వీరుడా ! నీవు వెళ్ళుము. రాక్షసులతో కలిసి బయలుదేరుము. దశరథకుమారుడైన రాముణ్ణి, సుగ్రీవుణ్ణి, వానరులను సంహరించుము. 3

మూ. తథేత్యుక్త్వా ద్రుతతరం మాయావీ రాక్షసేశ్వరః,
నిర్జగామ బలైః సార్ధం బహుభిః పరివారితః. 4
నాగైరశ్వైః ఖరైరుష్ట్రైః సంయుక్తః సుసమాహితః,
పతాకాధ్వజచిత్రైశ్చ రథైశ్చ సమలంకృతః. 5

ప్ర. అ. మాయావీ=మాయలుగల, రాక్షసేశ్వరః=ఆ రాక్షసనాయకుడు, తథా ఇతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, బలైః సార్ధమ్=సేనలతో కూడ, బహుభిః=అనేక రాక్షసులతో, పరివారితః=కూడినవాడై, నాగైః=ఏనుగులతోను, అశ్వైః=గుఱ్ఱములతోను, ఖరైః=గాడిదలతోను, ఉష్ట్రైః=ఒంటెలతోను, పతాకాధ్వజచిత్రైః=పతాకలచేత, ధ్వజములచేత చిత్రములైన, రథైః=రథములతోను, సంయుక్తః=కూడినవాడై, సుసమాహితః=చాల సావధానచిత్తుడై, సమలంకృతః=అలంకరింపబడినవాడై, ద్రుతతరమ్=అతి శీఘ్రముగా, నిర్జగామ=బయలుదేరెను.

తా. మాయావియైన ఆ రాక్షసనాయకుడు అనేకరాక్షసవీరులు వెంట రాగా సైన్యములతో కూడ, ఏనుగులతోను, అశ్వములతోను, గాడిదలతోను, ఒంటెలతోను, పతాకాధ్వజములచేత చిత్రములైన రథములతోను కూడినవాడై, చక్కగా అలంకరించుకొని, సావధానచిత్తముతో జాగరూకుడై అతిశీఘ్రముగా బయలుదేరెను. 4, 5

మూ. తతో విచిత్రకేయూరముకుటేన విభూషితః,
తనుత్రం చ సమావృత్య సధనుర్నిర్యయౌ ద్రుతమ్. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విచిత్రకేయూరముకుటేన=విచిత్రములైన బాహుపురులచేత కిరీటముచేత, విభూషితః=అలంకరింపబడినవాడై, తనుత్రం చ=కవచమును, సమావృత్య=కప్పుకొని, సధనుః=ధనుస్సుతో కూడినవాడై, ద్రుతమ్=శీఘ్రముగా, నిర్యయౌ=బయలుదేరెను.

తా. పిమ్మట అతడు విచిత్రములైన బాహుపురులు, కిరీటము అలంకరించుకొని, కవచమును ధరించి, ధనస్సును చేత బూని బయల్వెడలెను.

మూ. పతాకాలంకృతం దీప్తం తప్తకాఞ్చనభూషితమ్,
రథం ప్రదక్షిణం కృత్వా సమారోహచ్చమూపతిః. 7

ప్ర. అ. చమూపతిః=ఆ సేనానాయకుడు, పతాకాలంకృతమ్=పతాకల చేత అలంకరింపబడిన, దీప్తమ్=ప్రకాశించుచున్న, తప్తకాఞ్చనభూషితమ్=శుద్ధమైన బంగారముచేత అలంకరించబడిన, రథమ్=రథమును, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, సమారోహత్=ఎక్కెను.

తా. సేనానాయకుడైన ఆ వజ్రదంష్ట్రుడు పతాకలు అలంకరించిన, పరిశుద్ధమైన బంగారముచేత అలంకరింపబడిన ప్రకాశించుచున్న రథమునకు ప్రదక్షిణము చేసి ఎక్కెను. 7

మూ. యష్టిభిస్తోమరైశ్చిత్రైః శ్లక్ష్ణైశ్చ ముసలైరపి,
భిన్దిపాలైశ్చ చాపైశ్చ శక్తిభిః పట్టిశైరపి. 8

ఖడ్గైశ్చక్రైర్గదాభిశ్చ నిశితైశ్చ పరశ్వధైః,
పదాతయశ్చ నిర్యాన్తి వివిధాః శస్త్రపాణయః. 9

ప్ర. అ. శస్త్రపాణయః=ఆయుధములు హస్తములందు గల, వివిధాః=అనేక విధములైన, పదాతయశ్చ=కాలిబంటులు, యష్టిభిః=దండములతోను, చిత్రైః=చిత్రములైన, తోమరైః=తోమరములతోను, శ్లక్ష్ణైః=నున్నగా ఉన్న, ముసలైరపి=రోకళ్ళతోను, భిన్దిపాలైశ్చ=భిందిపాలములతోను, చాపైశ్చ=ధనస్సులతోను, శక్తిభిః=శక్తులతోను, పట్టిశైరపి=పట్టిశములతోను, ఖడ్గైః=ఖడ్గములతోను, చక్రైః=చక్రములతోను, గదాభిశ్చ=గదలతోను, నిశితైః=వాడియైన, పరశ్వధైః=గండ్రగొడ్డళ్ళతోను, నిర్యాన్తి=బయలుదేరుచున్నారు.

తా. చాలమంది కాలిబంటులు కూడ కత్తులు, చిత్రములైన తోమరములు, నున్నగా నున్న రోకళ్ళు, భిందిపాలములు, ధనస్సులు, శక్తులు, పట్టిశములు, ఖడ్గములు, చక్రములు, గదలు, వాడియైన గండ్రగొడ్డళ్ళు, ఇతర ఆయుధములు ధరించి బయలుదేరిరి. 8, 9

మూ. విచిత్రవాససః సర్వే దీప్తా రాక్షసపుఙ్గవాః,
గజా మదోత్కటాః శూరాశ్చలన్త ఇవ పర్వతాః. 10

ప్ర. అ. విచిత్రవాససః=విచిత్రములైన వస్త్రములు గల, సర్వే=సమస్తమైన, దీప్తాః=ప్రకాశించుచున్న, రాక్షసపుఙ్గవాః=రాక్షసశ్రేష్ఠులు, శూరాః=శౌర్యము గల, చలన్తః=కదలుచున్న, పర్వతాః ఇవ=పర్వతముల వలె ఉన్న, మదోత్కటాః=మదముచే తీవ్రముగా ఉన్న, గజాః=ఏనుగులు, (బయలుదేరినవి.)

తా. విచిత్రములైన వస్త్రములు ధరించి ప్రకాశించుచున్న రాక్షసవీరులు, అత్యధికమైన మదము కలవై కదలుచున్న పర్వతములా అన్నట్లు శౌర్యము గల ఏనుగులను బయలుదేరినవి. 10

మూ. తే యుద్ధకుశలా రూఢాస్తోమరాఙ్కుశపాణిభిః,
అన్యే లక్షణసంయుక్తాః శూరారూఢా మహాబలాః. 11

ప్ర. అ. తోమరాఙ్కుశపాణిభిః=తోమరములు అంకుశములు హస్తములందు గల యోధులచేత, రూఢాః=ఎక్కబడిన, తేః=ఆ ఏనుగులు, యుద్ధకుశలాః=యుద్ధమునందు నేర్పుగలవి, శూరారూఢాః=శూరులచేత ఎక్కబడిన, లక్షణసంయుక్తాః=మంచిలక్షణములతోకూడిన, అన్యే=మరి కొన్ని ఏనుగులు, మహాబలాః=గొప్పబలముగలవి.

తా. తోమరములు, అంకుశములు ధరించిన యోధులు ఎక్కిన ఆ గజములు యుద్ధమునందు నేర్పుగలవి. శూరులైన రాక్షసులు ఎక్కిన ఉత్తమ

లక్షణయుక్తములైన మరి కొన్ని గజములు చాల గొప్ప బలము గలవి. 11

మూ. తద్రాక్షసబలం సర్వం విప్రస్థితమశోభత,
ప్రావృట్కాలే యథా మేఘా వర్ధమానాః సవిద్యుతః, 12
నిఃసృతా దక్షిణద్వారాదఙ్గదో యత్ర యూథపః.

ప్ర. అ. విప్రస్థితమ్=ప్రయాణమైన, తత్=ఆ, సర్వమ్=సమస్తమైన, రాక్షస బలమ్=రాక్షససేన, ప్రావృట్కాలే=వర్షాకాలమువందు, వర్ధమానాః=ధ్వనిచేయుచున్న, సవిద్యుతః=మెరుపులతో కూడిన, మేఘాః యథా=మేఘముల వలె, అశోభత=ప్రకాశించెను. యత్ర=ఎక్కడ, అఙ్గదః=అంగదుడు, యూథపః=సేనానాయకుడుగా ఉన్నాడో అట్టి, దక్షిణద్వారాత్=దక్షిణద్వారమునుండి, నిఃసృతాః=బయలుదేరిరి.

తా. ప్రయాణమై వెళ్ళుచున్న ఆ రాక్షససైన్యము వర్షాకాలమునందు గర్జించుచున్న మెరపులతో కూడిన మేఘముల వలె ప్రకాశించెను. ఆ రాక్షసులు వానరసేనానాయకుడైన అంగదుడున్న దక్షిణద్వారమునుండి బైటకు వచ్చెను. 12

మూ. తేషాం నిష్క్రమమాణానామశుభం సమజాయత, 13
ఆకాశాద్విఘనాత్తీవ్రాదుల్కాః హ్యపతంస్తదా,
వమన్త్యః పావకజ్వాలాః శివా ఘోరా వవాశిరే. 14

ప్ర. అ. తేషామ్=వారు, నిష్క్రమమాణానామ్=బయలుదేరుచుండగా, అశుభమ్=అమంగళము, అజాయత=కలిగెను. విఘనాత్=మేఘములు లేని, తీవ్రాత్=తీవ్రమైన, ఆకాశాత్=ఆకాశమునుండి, తదా=అప్పుడు, ఉల్కాని=కొరవులు, అపతన్=పడినవి. ఘోరాః=భయంకరములైన, శివాః=నక్కలు, పావకజ్వాలాః=అగ్నిజ్వాలలను, వమన్త్యః=కక్కుచున్నవై, వవాశిరే=అరచినవి.

తా. ఆ రాక్షసులు బయలుదేరుచున్నపుడు దుశ్శకునములు కనబడెను. మేఘములు లేకుండగానే తీవ్రమైన ఆకాశమునుండి కొరవులు పడినవి. భయంకరములైన నక్కలు అగ్నిజ్వాలలను కక్కుచు అరచినవి. 13, 14

మూ. వ్యాహరన్త మృగా ఘోరా రక్షసాం నిధనం తదా,
సమాపతన్తో యోధాస్తు ప్రాస్ఖలంస్తత్ర దారుణమ్. 15

ప్ర. అ. తదా=అప్పుడు, ఘోరాః=భయంకరములైన, మృగాః=మృగములు, రక్షసామ్=రాక్షసులయొక్క, నిధనమ్=మరణమును, వ్యాహరన్త=పలికినవి. సమాపతన్తః=శీఘ్రముగా వచ్చుచున్న, యోధాస్తు=యోధులైతే, తత్ర=అక్కడ, దారుణమ్=దారుణముగా, ప్రాస్ఖలన్=తొట్రుపడిరి.

తా. అప్పుడు భయంకరములైన మృగములు రాక్షసుల వినాశమును సూచించుచు అరచినవి. శీఘ్రముగా వచ్చుచున్న యోధులు అక్కడ తొట్రుపడిరి.

మూ. ఏతానౌత్పాతికాన్ దృష్ట్వా వజ్రదంష్ట్రో మహాబలః,
ధైర్యమాలమ్బ్య తేజస్వీ నిర్జగామ రణోత్సుకః. 16

ప్ర. అ. మహాబలః=గొప్ప బలముగలవాడు, తేజస్వీ=తేజఃశాలి అయిన, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, ఏతాన్=ఈ, ఔత్పాతికాన్=ఉత్పాతమునకు సంబంధించినవాటిని, దృష్ట్వా=చూచి, ధైర్యమ్=ధైర్యమును, ఆలమ్బ్య=అవలంబించి, రణోత్సుకః=రణమునందు వేడుక కలవాడై, నిర్జగామ=బయలుదేరెను.

తా. గొప్ప బలము, తేజస్సు గల వజ్రదంష్ట్రుడు ఈ అపశకునములను చూచినను, ధైర్యము వహించి, యుద్ధము చేయుటకై బయలుదేరెను. 16

మూ. తాంస్తు విస్ఫ్రుమతో దృష్ట్వా వానరా జితకాశినః,
ప్రణేదుః సుమహానాదాన్ పూరయంశ్చ దిశో దశ. 17

ప్ర. అ. జితకాశినః=జయించబడిన శ్రమ గల, వానరాః=వానరులు, విస్ఫ్రుమతః=బయల్వెడలుచున్న, తాన్=వాళ్ళను, దృష్ట్వా=చూచి, సుమహానాదాన్=చాల గొప్ప ధ్వనులను, ప్రణేదుః=ధ్వనిచేసిరి. దశ=పది, దిశః=దిక్కులను, పూరయంశ్చ=పూరించిరి.

తా. శ్రమను జయించిన వానరులు బయల్వెడలి వచ్చుచున్న ఆ రాక్షసులను చూచి చాల పెద్ద ధ్వనులు చేయుచు, ఆ ధ్వనులచే పది దిక్కులు నింపివేసిరి. 17

మూ. తతః ప్రవృత్తం తుములం హరీణాం రాక్షసైః సహ,
ఘోరాణాం భీమరూపాణామన్యోన్యవధకాఙ్క్షిణామ్. 18

ప్ర. అ. ('రాక్షసైః సహ'కు బదులు 'రక్షసాం తథా' అను పాఠమున్న బాగుండును. 'అన్యోన్యవధకాఙ్క్షిణామ్' అనేది 'హరీణామ్' అనుదానికి మాత్రమే విశేషణ మయే పక్షంలో దీని అర్థం సరిగా కుదరదు.) తతః=ఆటుపిమ్మట, ఘోరాణామ్=క్రూరులు, భీమరూపాణామ్=భయంకరమైన రూపము గలవారు, అన్యోన్యవధకాఙ్క్షిణామ్=పరస్పరముయొక్క వధను కోరుచున్నవారు అయిన, హరీణామ్=వానరులయొక్క, తథా=మరియు, రక్షసామ్=రాక్షసులయొక్క, తుములమ్=సంకులయుద్ధము, ప్రవృత్తమ్=జరిగినది.

తా. పిమ్మట క్రూరులు, భయంకరమైన రూపము గలవారు, పరస్పరము చంపగోరుచున్నవారు అయిన ఆ వానరరాక్షసుల మధ్య తుములయుద్ధము జరిగెను. 18

మూ. విష్ఫతన్తో మహోత్సాహా భిన్నదేహశిరోధరాః,
రుధిరోక్షితసర్వాఙ్గా వ్యపతన్ధరణీతలే. 19

ప్ర. అ. విష్ఫతన్తః=యుద్ధమునకై వచ్చుచున్న, మహోత్సాహాః=గొప్ప ఉత్సాహము గల ఆ వానరరాక్షసులు, భిన్నదేహశిరోధరాః=విరగగొట్టబడిన దేహములు కంఠములు కలవారై, రుధిరోక్షితసర్వాఙ్గాః=రక్తముచేత తడపబడిన సమస్తదేహము గలవారై, ధరణీతలే=నేలమీద, వ్యపతన్=పడిరి.

తా. మహోత్సాహముతో యుద్ధమునకు వచ్చిన ఆ వానరులు రాక్షసులు కూడ విరిగిపోయిన దేహములతోను, కంఠములతోను, సమస్తదేహములు రక్తముచేత తడియుగా నేలపై పడిరి. 19

మూ. కేచిదన్యోన్యమాసాద్య శూరాః పరిఘపాణయః,
చిక్షిపుర్వివిధాన్ శస్త్రాన్సమరేష్వనివర్తినః. 20

ప్ర. అ. పరిఘపాణయః=పరిఘలు హస్తములందు గల, శూరాః=శూరులైన, సమరేషు=యుద్ధములందు, అనివర్తినః=వెనుకకు మరలని, కేచిత్=కొందరు, అన్యోన్యమ్=పరస్పరము, ఆసాద్య=సమీపించి, వివిధాన్=అనేకవిధములైన, శస్త్రాన్=ఆయుధములను, చిక్షిపుః=విసిరిరి.

తా. యుద్ధములో వెనుకకు మరలని కొందరు శూరులు, చేతులలో పరిఘలు ధరించి, ఒకరినొకరు సమీపించి అనేకవిధములైన ఆయుధములను ప్రయోగించిరి. 20

మూ. ద్రుమాణాం చ శిలానాం చ శస్త్రాణాం చాపి నిఃస్వనః, 21
శ్రూయతే సుమహాంస్తత్ర ఘోరో హృదయభేదనః.

ప్ర. అ. తత్ర=అక్కడ, ద్రుమాణాం చ=వృక్షములయొక్క, శిలానాం చ=శిలలయొక్క, శస్త్రాణాం చ=ఆయుధములయొక్క, ఘోరః=భయంకరము, హృదయభేదనః=హృదయమును భేదించునది, సుమహాన్=చాల గొప్పది అయిన, నిఃస్వనః=ధ్వని, శ్రూయతే=వినబడుచున్నది.

తా. అక్కడ వృక్షములను, శిలలను, ఆయుధములను ప్రయోగించుటచే భయంకరమైన, గుండెలను బద్దలగొట్టే గొప్ప ధ్వని వినవచ్చెను. 21

మూ. రథనేమి స్వనస్తత్ర ధనుషశ్చాపి ఘోరవత్, 22
శఙ్ఖభేరీమృదఙ్గానాం బభూవ తుములః స్వనః.

ప్ర. అ. తత్ర=అక్కడ, ఘోరవత్=భయంకరమైన, రథనేమి స్వనః=రథముల చక్రాంతముల ధ్వని, ధనుషశ్చాపి=ధనస్సుయొక్క ధ్వని,

శఙ్ఖభేరీమృదఙ్గానామ్=శంఖములయొక్క, భేరీలయొక్క, మృదంగములయొక్క, తుములః=వ్యాకులమైన, స్వనః=ధ్వని, బభూవ=అయెను.

తా. అక్కడ భయంకరమైన రథచక్రాంతముల ధ్వని ధనస్సుల ధ్వని, శంఖ - భేరీ - మృదంగముల వ్యాకులమైన ధ్వని బయల్వెడలెను. 22

మూ. కేచిదస్త్రాణి సంత్యజ్య బాహుయుద్ధమకుర్వత,
తలైశ్చ చరణైశ్చాపి ముష్టిభిశ్చ ద్రుమైరపి, 23
జానుభిశ్చ హతాః కేచిద్భగ్నదేహాశ్చ రాక్షసాః,
శిలాభిశ్చూర్ణితాః కేచిద్వానరైర్యుద్ధదుర్మదైః. 24

ప్ర. అ. కేచిత్=కొందరు, అస్త్రాణి=అస్త్రములను, సంత్యజ్య=విడచి, బాహుయుద్ధమ్=బాహువులతో యుద్ధమును, అకుర్వత=చేసిరి. తలైశ్చ=అరచేతులచేతను, చరణైశ్చాపి=పాదాలచేతను, ముష్టిభిశ్చ=పిడికిళ్ళచేతను, ద్రుమైరపి=వృక్షములచేతను, జానుభిశ్చ=మోకాళ్ళచేతను, యుద్ధదుర్మదైః=యుద్ధమునందు మదించిన, వానరైః=వానరులచేత, హతాః=కొట్టబడిన, రాక్షసాః=రాక్షసులు, భగ్నదేహాః=విరగగొట్టబడిన దేహములు కలవారైరి. కేచిత్=కొందరు, శిలాభిః=శిలలచేత, చూర్ణితాః=చూర్ణము చేయబడిరి.

తా. కొందరు రాక్షసులు అస్త్రములను విడచి బాహుయుద్ధము చేసిరి. యుద్ధమునందు మదించి ఉన్న వానరులు కొందరు రాక్షసుల శరీరములను అరచేతులచేత, పాదాలచేత, పిడికిళ్ళచేత, వృక్షములచేత కొట్టి విరుగగొట్టిరి. మరి కొందరిని శిలలచేత చూర్ణము చేసిరి. 23, 24

మూ. వజ్రదంష్ట్రో భృశం బాణై రణే విత్రాసయన్ హరీన్,
చచార లోకసంహారే పాశహస్త ఇవాన్తకః. 25

ప్ర. అ. వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, రణే=యుద్ధమునందు, బాణైః=బాణములచేత, హరీన్=వానరులను, భృశమ్=మిక్కిలి, విత్రాసయన్=భయపెట్టుచు, లోకసంహారే=లోకములను సంహరించు సమయమునందు, పాశహస్తః=పాశము హస్తమునందు గల, అన్తకః ఇవ=యముడు వలె, చచార=సంచరించెను.

తా. వజ్రదంష్ట్రుడు బాణములచేత వానరులకు మిక్కిలి భయము కలిగించుచు ప్రళయకాలమునందు యముడు పాశమును హస్తమునందు ధరించి సంచరించినట్లు యుద్ధభూమిలో సంచరించెను. 25

మూ. బలవన్తోఽస్త్రవిదుషో నానాప్రహరణా రణే,
జఘ్నుర్వానరసైన్యాని రాక్షసాః క్రోధమూర్ఛితాః, 26

ప్ర. అ. బలవన్తః=బలముగలవారు, అస్త్రవిదుషః=అస్త్రములను ఎరిగినవారు, నానాప్రహరణాః=అనేకవిధములైన ఆయుధములు కలవారు అయిన, రాక్షసాః=రాక్షసులు, క్రోధమూర్ఛితాః=క్రోధముచేత వ్యాప్తులై, రణే=యుద్ధమునందు, వానరసైన్యాని=వానరసైన్యములను, జఘ్నుః=చంపిరి.

తా. బలవంతులు, అస్త్రము లెరిగినవారు, అనేకవిధములైన ఆయుధములు కలవారు అయిన రాక్షసులు అధికమైన కోపముతో యుద్ధమునందు వానరసైన్యములను చంపిరి. 26

మూ. జఘ్నే తాన్ రాక్షసాన్ సర్వాన్ ధృష్టో వాలిసుతో రణే,
క్రోధేన ద్విగుణావిష్టః సంవర్తక ఇవానలః. 27

ప్ర. అ. ధృష్టః=ధైర్యవంతుడైన, వాలిసుతః=అంగదుడు, క్రోధేన=కోపముచేత, ద్విగుణావిష్టః=రెండురెట్లు ఆవహించబడినవాడై, సంవర్తకే=ప్రళయమునందు, అనలః ఇవ=అగ్నివలె, రణే=యుద్ధమునందు, సర్వాన్=సమస్తమైన, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, జఘ్నే=చంపెను.

తా. ధైర్యవంతుడైన అంగదుడు రెండు రెట్ల కోపముతో ప్రళయకాలాగ్నివలె ఆ రాక్షసుల నందరినీ చంపెను. 27

మూ. తాన్ రాక్షసగణాన్ సర్వాన్ వృక్షముద్యమ్య వీర్యవాన్,
అఙ్గదః క్రోధతామ్రాక్షః సింహః క్షుద్రమృగానివ, 28
చకార కదనం ఘోరం శక్రతుల్యపరాక్రమః. 29

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, అఙ్గదః=అంగదుడు, క్రోధతామ్రాక్షః=కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, వృక్షమ్=వృక్షమును, ఉద్యమ్య=ఎత్తి, సింహః=సింహము, క్షుద్రమృగానివ=చిన్న మృగములను వలె, సర్వాన్=సమస్తమైన, తాన్=ఆ, రాక్షసగణాన్=రాక్షససముదాయములను, (జఘాన=చంపెను). శక్రతుల్యపరాక్రమః=దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల అతడు, ఘోరమ్=భయంకరమైన, కదనమ్=శత్రువినాశమును, చకార=చేసెను.

తా. పరాక్రమవంతుడైన అంగదుడు క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, సింహము నీచమృగములను చంపినట్లు, ఆ రాక్షసగణములన్నింటిని చంపెను. దేవేంద్రుని వంటి పరాక్రమము గల అతడు భయంకరముగా శత్రువినాశము చేసెను. 28, 29

మూ. అఙ్గదాభిహతాస్తత్ర రాక్షసా భీమవిక్రమాః,
విభిన్నశిరసః పేతుర్నికృత్తా ఇవ పాదపాః. 30

అ. ప్ర. తత్ర=అప్పుడు, అఙ్గదాభిహతాః=అంగదునిచేత కొట్టబడిన, భీమ విక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, రాక్షసాః=రాక్షసులు, విభిన్న శిరసః=బ్రద్దలు కొట్టబడిన శిరస్సులు కలవారై, నికృత్తాః=భేదించబడిన, పాదపాః ఇవ=వృక్షములు వలె , పేతుః=పడిపోయిరి.

తా. అంగదుని చేత కొట్టబడిన, భయంకరపరాక్రమవంతులైన రాక్షసులు శిరస్సులు బ్రద్దలగుటచే నరికిన చెట్లవలె నేలమీద కూలిరి. 30

మూ. రథైశ్చిత్రైర్ధ్వజైరశ్వైః శరీరైర్హరిరక్షసామ్,
రుధిరౌఘేణ సంఛన్నా భూమిర్భయకరా తదా. 31

అ. ప్ర. తదా=అప్పుడు, రథైః=రథములచేతను, చిత్రైః=చిత్రములైన, ధ్వజైః=ధ్వజములచేతను, అశ్వైః=గుఱ్ఱములచేతను, హరిరక్షసామ్=వానరులయొక్క రాక్షసములయొక్క, శరీరైః=శరీరములచేతను, రుధిరౌఘేణ=రక్తప్రవాహముచేతను, సంఛన్నా=కప్పబడిన, భూమిః=భూమి, భయకరా=భయంకరముగా ఉండెను.

తా. అప్పుడు రథములచేత, చిత్రములైన ధ్వజములచేత, గుఱ్ఱముల చేత, వానరరాక్షసుల శరీరములచేత, రక్తప్రవాహముచేత కప్పబడినదై భూమి భయంకరముగా ఉండెను. 31

మూ. హారకేయూరవస్త్రైశ్చ ఛత్రైశ్చ సమలంకృతా,
భూమిర్భాతి రణే తత్ర శారదీవ యథా నిశా. 32

అ. ప్ర. హారకేయూర వస్త్రైశ్చ=హారములచేతను, కేయూరములచేతను, వస్త్రములచేతను, ఛత్రైశ్చ=ఛత్రములచేతను, తత్ర=ఆ, రణే=యుద్ధమునందు, సమలంకృతా=అలంకరింపబడిన, భూమిః=భూమి, శారదీ=శరత్కాలసంబంధమైన, నిశేవ యథా=రాత్రి వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. ఆ యుద్ధమునందు హారములచేత బాహుపురులచేత వస్త్రములచేత ఛత్రములచేత అలంకరించబడిన భూమి శరత్కాలరాత్రి వలె ప్రకాశించెను. 31

మూ. అఙ్గదస్య చ వేగేన తద్రాక్షసబలం మహత్,
ప్రాకమ్పత తదా తత్ర పవనేనామ్బుదో యథా. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధ కాణ్డే త్రిపఞ్చాశః సర్గః.

అ. ప్ర. తదా=అప్పుడు, తత్ర=ఆ యుద్ధమునందు, మహత్=గొప్పదైన, తత్=ఆ, రాక్షసబలమ్=రాక్షససైన్యము, అఙ్గదస్య=అంగదునియొక్క, వేగేన=వేగముచేత, పవనేన=వాయువుచేత, అమ్బుదో యథా=మేఘము వలె, ప్రాకమ్పత=కంపించెను.

తా. అప్పుడా యుద్ధమునందు గొప్పదైన ఆ రాక్షససైన్య మంతా అంగదుని వేగముచేత గాలికి మేఘములు కంపించినట్లు కంపించిపోయెను.32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఏబది మూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపఞ్చాశః సర్గః

[అంగదుడు వజ్రదంష్ట్రుణ్ణి సంహరించుట]

మూ. స్వబలస్య చ ఘాతేన అఙ్గదస్య బలేన చ,
రాక్షసః క్రోధమావిష్టో వజ్రదంష్ట్రో మహాబలః. 1

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రాక్షసః=రాక్షసుడైన, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, స్వబలస్య=తన సేనయొక్క, ఘాతేన=వినాశముచేతను, అఙ్గదస్య=అంగదునియొక్క, బలేన చ=బలముచేతను, క్రోధమ్=కోపమును, ఆవిష్టః=పొందినాడు.

తా. తన బలము నశించుటను, అంగదుని బలమును మాచి బలశాలియైన వజ్రదంష్ట్రుడు క్రోధావిష్టుడయ్యెను. 1

మూ. విస్ఫార్య చ ధనుర్ఘోరం శక్రాశనిసమప్రభమ్,
వానరాణామనీకాని ప్రాకిరచ్ఛరవృష్టిభిః. 2

ప్ర. అ. శక్రాశనిసమప్రభమ్ = దేవేంద్రుని వజ్రాయుధముతో సమానమైన కాంతి గల, ఘోరమ్ = భయంకరమైన, ధనుః = ధనస్సును, విస్ఫార్య = ఎక్కుపెట్టి, వానరాణామ్ = వానరులయొక్క, అనీకాని = సైన్యములను, శరవృష్టిభిః = బాణవర్షములచేత, ప్రాకిరత్ = చిమ్మెను.

తా. ఇంద్రుని వజ్రాయుధమువంటి భయంకరమైన ధనస్సును ఎక్కుపెట్టి వానరసైన్యముల పై బాణవర్షములు కురిపించెను. 2

మూ. రాక్షసాశ్చాపి ముఖ్యాస్తే రథైశ్చ సమవస్థితాః,
నానాప్రహరణాః శూరాః ప్రాయుధ్యన్త తదా రణే. 3

ప్ర. అ. రథైః=రథములచేత, సమవస్థితాః=వచ్చి ఉన్న, ముఖ్యాః=ముఖ్యులైన, తే=ఆ, శూరాః=శూరులైన, రాక్షసాశ్చాపి=రాక్షసులు కూడ, నానాప్రహరణాః=అనేకవిధములైన ఆయుధములు కలవారై, తదా=అప్పుడు, రణే=యుద్ధమునందు, ప్రాయుధ్యన్త=యుద్ధముచేసిరి.

తా. అప్పుడు యుద్ధరంగములో రథములపైన వచ్చిన శూరులైన రాక్షసనాయకులు కూడ అనేకవిధములైన ఆయుధములతో యుద్ధము చేసిరి.3

మూ. వానరాణాం చ శూరాస్తు తే సర్వే ప్లవగర్షభాః,
అయుధ్యన్త శిలాహస్తాః సమవేతాః సమన్తతః. 4

ప్ర. అ. వానరాణామ్=వానరులలో, శూరాః=శూరులైన, సర్వే=సమస్తమైన,

తే ప్లవగోత్తమాః=ఆ వానరశ్రేష్ఠులు, సమన్తాత్=అన్ని వైపులా, సమవేతాః=కూడిన వారై, శిలాహస్తాః=శిలలు హస్తమునందు గలవారై, అయుధ్యన్త=యుద్ధముచేసిరి.

తా. వానరులలో శూరులైన వానరశ్రేష్ఠులందరు అన్ని వైపులా చేరి, హస్తములలో శిలలు ధరించి యుద్ధము చేసిరి. 4

మూ. తత్రాయుధసహస్రాణి తస్మిన్నాయోధనే భృశమ్,
రాక్షసాః కపిముఖ్యేషు పాతయాంచక్రిరే తదా. 5

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అక్కడ, తస్మిన్=ఆ, ఆయోధనే=యుద్ధమునందు, రాక్షసాః=రాక్షసులు, కపిముఖ్యేషు=వానరనాయకులపై, ఆయుధసహస్రాణి=వేలకొలది ఆయుధములను, భృశమ్=మిక్కిలి, పాతయాంచక్రిరే=పడవేసిరి.

తా. అప్పుడు ఆ యుద్ధములో రాక్షసులు వేలకొలది ఆయుధములను వానరనాయకులమీద ప్రయోగించిరి. 5

మూ. వానరాశ్చైవ రక్షస్సు గిరివృక్షాన్ మహాశిలాః,
ప్రవీరాః పాతయామాసుర్మత్తవారణసంనిభాః. 6

ప్ర. అ. ప్రవీరాః=గొప్ప వీరులు, మత్తవారణసంనిభాః=మదించిన ఏనుగులతో సమానులు అయిన, వానరాశ్చైవ=వానరులు కూడ, రక్షస్సు=రాక్షసులమీద, గిరివృక్షాన్=పర్వతవృక్షములను, మహాశిలాః=గొప్ప శిలలను, పాతయామాసుః=పడవేసిరి.

తా. గొప్పవీరులైన, మదించిన ఏనుగుల వలె ఉన్న వానరులు కూడ పర్వత వృక్షములను, పెద్ద శిలలను రాక్షసులపై పడవేసిరి. 6

మూ. శూరాణాం యుధ్యమానానాం సమరేష్వనివర్తినామ్,
తద్రాక్షసగణానాం చ సుయుద్ధం సమవర్తత. 7

ప్ర. అ. శూరాణామ్=శూరులు, యుధ్యమానానామ్=యుద్ధముచేయుచున్న వారు, సమరేషు=యుద్ధములయందు, అనివర్తినామ్=వెనుకకు తిరగని వారు అయిన, రాక్షసగణానామ్=రాక్షసగణములయొక్క, తత్=ఆ, సుయుద్ధమ్=మంచియుద్ధము, సమవర్తత=జరిగెను.

తా. శూరులు, యుద్ధములు చేయుచున్నవారు, యుద్ధములలో వెనుకకు మరలనివారు అయిన రాక్షసులు కూడ గొప్ప యుద్ధము చేసిరి. 7

మూ. ప్రభగ్నశిరసః కేచిచ్ఛిన్నైః పాదైశ్చ బాహుభిః,
శస్త్రైరర్దితదేహాస్తు రుధిరేణ సముక్షితాః. 8
హరయో రాక్షసాశ్చైవ శేరతే గాం సమాశ్రితాః,
కఙ్కగృధ్రబలాఢ్యాశ్చ గోమాయుకులసంకులాః. 9

ప్ర. అ. కేచిత్=కొందరు, హరయః=వానరులు, రాక్షసాశ్చైవ=రాక్షసులు, ప్రభగ్నశిరసః=విరగగొట్టబడిన శిరస్సులు కలవారై, ఛిన్నైః=ఛేదించబడిన, పాదైః=పాదములతోను, బాహుభిః=బాహువులతోను కూడినవారై, శస్త్రైః ఆయుధములచేత, అర్దితదేహాః=పీడించబడిన దేహములు గలవారై, రుధిరేణ=రక్తముచేత, సముక్షితాః=తడపబడినవారై, కఙ్కగృధ్రబలాఢ్యాశ్చ=రాబందులయొక్క గ్రద్దలయొక్క సముదాయములతో కూడినవారై, గోమాయుకులసంకులాః=నక్కల సముదాయములతో వ్యాకులులై, గామ్=భూమిని, సమాశ్రితాః=ఆశ్రయించినవారై, శేరతే=శయనించి ఉండిరి.

తా. ఆ వానరరాక్షసులలో కొందరి శిరస్సులు విరిగిపోయెను. కొందరి కాళ్ళు చేతులు తెగిపోయెను. కొందరి దేహములు బాణములచేత పీడింపబడుటచే రక్తముతో నిండియుండెను. ఈ విధముగా నేల మీదపడి ఉన్న వాళ్ళ చుట్టూ రాబందులు, గ్రద్దలు, నక్కలు చేరుచుండెను. 8, 9

మూ. కబన్ధాని సముత్పేతుర్భీరూణాం భీషణాని వై,
భుజపాణిశిరశ్ఛిన్నాశ్ఛిన్నకాయాశ్చ భూతలే. 10
వానరా రాక్షసాశ్చాపి నిపేతుస్తత్ర భూతలే.

ప్ర. అ. భీరూణామ్=పిరికివారికి, భీషణాని=భయంకరములైన, కబన్ధాని=మొండెములు, భూతలే=నేలమీద, సముత్పేతుః=ఎగిరినవి, భుజపాణి శిరశ్ఛిన్నాః=ఛేదించబడిన భుజములు, హస్తములు, శిరస్సులు గల , ఛిన్నకాయాశ్చ=ఛేదించబడిన శరీరములు గల, వానరాః=వానరులు, రాక్షసాశ్చాపి=రాక్షసులు, తత్ర=అక్కడ, భూతలే=నేలమీద, నిపేతుః=పడిరి.

తా. పిరికివారికి భయము కలిగించు మొండెములు నేలమీద ఎగిరినవి. వానరులు రాక్షసులు కూడా తెగగొట్టబడిన భుజములతో, హస్తములతో శరీరములతో అక్కడ నేలమీద పడి ఉండిరి. 10

మూ. తతో వానరసైన్యేన హన్యమానం నిశాచరమ్, 11
ప్రాభజ్యత బలం సర్వం వజ్రదంష్ట్రస్య పశ్యతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నిశాచరమ్=రాక్షససంబంధమైన, సర్వం బలమ్=సమస్త సైన్యము, వానరసైన్యేన=వానరుల సేనచేత, హన్యమానమ్=చంపబ

దుచున్నట్టి, వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రుడు, పశ్యతః=చూచుచుండగానే, ప్రాభజ్యత=భగ్నమాయెను.

తా. అప్పుడు వజ్రదంష్ట్రుడు చూచుచుండగానే ఆ రాక్షససైన్య మంతా వానర సైన్యముచేత చంపబడి భగ్నమయ్యెను. 11

మూ. రాక్షసాన్ భయవిత్రస్తాన్ హన్యమానాన్ ప్లవఙ్గమైః 12
దృష్ట్వా స రోషతామ్రాక్షో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్,
ప్రవివేశ ధనుష్పాణి స్త్రాసయన్ హరివాహినీమ్. 13

ప్ర. అ. ప్లవంగమైః=వానరులచేత, హన్యమానాన్=చంపబడుచున్న, భయవిత్రస్తాన్=భయకారణమును చూచి భయపడిన, రాక్షసాన్=రాక్షసులను, దృష్ట్వా=చూచి, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, సః=ఆ, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, రోషతామ్రాక్షః=రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు గలవాడై, హరివాహినీమ్=వానరసేనను, త్రాసయన్=భయపెట్టుచు, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ప్రతాపవంతుడైన ఆ వజ్రదంష్ట్రుడు వానరుల దెబ్బలకు భయపడిపోయిన రాక్షసులను చూచి, రోషముచేత నేత్రములు ఎఱ్ఱబడగా ధనస్సు చేత ధరించి, వానరసేనను భయపెట్టుచు ప్రవేశించెను. 12, 13

మూ. శరైర్విదారయామాస కఙ్కపత్రైరజిహ్మగైః,
బిభేద వానరాంస్తత్ర సప్తాష్టౌ నవ పఞ్చ చ. 14
వివ్యాధ పరమక్రుద్ధో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్.

ప్ర. అ. ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, కఙ్కపత్రైః=గ్రద్ద రెక్కలు గల, అజిహ్మగైః=వంకర లేకుండా వెళ్ళు, శరైః=బాణములచేత, తత్ర=అక్కడ, సప్త=ఏడుగురు, అష్టౌ=ఎనమండుగురు, నవ=తొమ్మండుగురు, పఞ్చ చ=ఐదుగురు, వానరాన్=వానరులను, వివ్యాధ=కొట్టెను; విదారయామాస=చీల్చెను.

తా. ప్రతాపవంతుడైన వజ్రదంష్ట్రుడు చాల కోపించి, గ్రద్ద రెక్కలు కట్టిన ఋజువుగా వెళ్ళే బాణాలతో అక్కడ ఏడుగురు, ఎనమండుగురు, తొమ్మండుగురు, ఐదుగురు చొప్పున వానరులను కొట్టి చీల్చివేసెను. 14

మూ. త్రస్తాః సర్వే హరిగణాః శరైః సఙ్కృత్తదేహినః, 15
అఙ్గదం సమ్ప్రధావన్తి ప్రజాపతిమివ ప్రజాః.

ప్ర. అ. శరైః=బాణములచేత, సఙ్కృత్తదేహినః=ఛేదింపబడిన దేహములు గల, సర్వే=సమస్తమైన, హరిగణాః=వానరగణములు, త్రస్తాః=భయపడినవై,

ప్రజాః=ప్రజలు, ప్రజాపతిమివ=బ్రహ్మను వలె, అఙ్గదమ్=అంగదుని గూర్చి, సంప్రధావన్తి=పరుగెత్తినవి.

తా. బాణములచేత భేదింపబడిన శరీరములు గల వానరు లందరు భయపడి, ప్రజలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లినట్లు అంగదుని దగ్గరకు పరుగెత్తిరి.

మూ. తతో హరిగణాన్ భగ్నాన్ దృష్ట్వా వాలిసుతస్తదా. 16
క్రోధేన వజ్రదంష్ట్రం త ముదీక్షన్తముదైక్షత.

ప్ర. అ. తదా=అప్పుడు, వాలిసుతః=అంగదుడు, భగ్నాన్=పరాజితులైన, హరిగణాన్=వానరగణములను, దృష్ట్వా=చూచి, తతః=అటుపిమ్మట, ఉదీక్షన్తమ్=చూచుచున్న, వజ్రదంష్ట్రమ్=వజ్రదంష్ట్రుని, క్రోధేన=కోపముతో ఉదైక్షత=చూచెను.

తా. అప్పుడు అంగదుడు ఓడింపబడిన వానరగణములను చూచి ఆ వజ్రదంష్ట్రుని వైపు కోపముతో చూచెను. 16

మూ. వజ్రదంష్ట్రోఽఙ్గదశ్చోభౌ యోయుధ్యేతే పరస్పరమ్, 17
చేరతుః పరమక్రుద్ధౌ హరిమత్తగజావివ.

ప్ర. అ. వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుడు, అఙ్గదశ్చ=అంగదుడు, ఉభౌ=ఇద్దరూ, పరస్పరమ్=పరస్పరము, యోయుధ్యేతే=యుద్ధము చేసిరి. హరిమత్తగజావివ=సింహము మదగజము వలె, పరమక్రుద్ధౌ=చాల కోపించినవారై, చేరతుః=సంచరించిరి.

తా. అంగదవజ్రదంష్ట్రు లిద్దరూ పరస్పరము యుద్ధము చేయుచు సింహము, మదించిన గజమూ వలె చాల కోపముతో సంచరించిరి. 17

మూ. తతః శతసహస్రేణ హరిపుత్రం మహాబలమ్. 18
జఘాన మర్మదేశేషు శరైరగ్నిశిఖోపమైః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలమ్=గొప్ప బలము గల, హరిపుత్రమ్=అంగదుని, శతసహస్రేణ=లక్ష, అగ్నిశిఖోపమైః=అగ్నిశిఖలతో సమానములైన, శరైః=బాణములచేత, మర్మదేశేషు=మర్మ ప్రదేశములయందు, జఘాన=కొట్టెను.

తా. పిమ్మట ఆ వజ్రదంష్ట్రుడు మహాబలశాలియైన అంగదుని మర్మప్రదేశములయందు అగ్ని జ్వాలలవంటి లక్షబాణములతో కొట్టెను. 18

మూ. రుధిరోక్షితసర్వాఙ్గో వాలిసూనుర్మహాబలః. 19
చిక్షేప వజ్రదంష్ట్రాయ వృక్షం భీమపరాక్రమః.

ప్ర. అ. రుధిరోక్షితసర్వాఙ్గః=రక్తముచేత తడపబడిన సకలశరీరము గల, మహాబలః=మహాబలశాలియైన, భీమపరాక్రమః=భయంకరమైన పరాక్రమము

గల, వాలిసూనుః=అంగదుడు, వజ్రదంష్ట్రాయ=వజ్రదంష్ట్రునకు, వృక్షమ్=వృక్షమును, విక్షేప=విసిరెను.

తా. గొప్పబలము, భయంకరమైన పరాక్రమము గల అంగదుడు శరీరమంతా రక్తముచే తడిసిపోగా, వజ్రదంష్ట్రునిమీదికి ఒక వృక్షమును విసిరెను. 19

మూ. దృష్ట్వాపతన్తం తం వృక్షమసంభ్రాన్తశ్చ రాక్షసః. 20
చిచ్ఛేద బహుధా సోఽపి మథితః ప్రాపతద్భువి.

ప్ర. అ. రాక్షసః=రాక్షసుడు, అపతన్తమ్=వచ్చి పడుచున్న, తం వృక్షమ్=ఆ వృక్షమును, దృష్ట్వా=చూచి, అసంభ్రాన్తః=కలత చెందనివాడై, బహుధా=అనేకవిధములుగా, చిచ్ఛేద=ఛేదించెను. సోఽపి=అది కూడ, మథితః=ఛేదించబడినదై, భువి=నేలమీద, ప్రాపతత్=పడెను.

తా. ఆ రాక్షసుడు వచ్చి పడుచున్న ఆ వృక్షమును చూచి ఏ మాత్రము కంగారుపడకుండగా దానిని ఛేదించెను. ఆ విధముగా ఛేదింపబడి ఆ వృక్షము క్రింద పడిపోయెను. 20

మూ. తం దృష్ట్వా వజ్రదంష్ట్రస్య విక్రమం ప్లవగర్షభః. 21
ప్రగృహ్య విపులం శైలం చిక్షేప చ ననాద చ.

ప్ర. అ. ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడు, వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రునియొక్క, తం విక్రమమ్=ఆ పరాక్రమమును, దృష్ట్వా=చూచి, విపులమ్=విశాలమైన, శైలమ్=పర్వతమును, ప్రగృహ్య=గ్రహించి, చిక్షేప చ=విసరెను. ననాద చ=ధ్వనిచేసెను.

తా. అంగదుడు వజ్రదంష్ట్రుని పరాక్రమము చూచి, ఒక పెద్ద పర్వతమును గ్రహించి వానిపై విసరి గట్టిగా ధ్వనిచేసెను. 21

మూ. తమాపతన్తం దృష్ట్వా స రథాదాప్లుత్య వీర్యవాన్. 22
గదాపాణిరసంభ్రాన్తః పృథివ్యాం సమతిష్ఠత.

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=అతడు, ఆపతన్తమ్=వచ్చి మీదపడుచున్న, తమ్=దానిని, దృష్ట్వా=చూచి, అసంభ్రాన్తః=కంగారుపడనివాడై, గదాపాణిః=గద హస్తమునందు కలవాడై, రథాత్=రథమునుండి, ఆప్లుత్య=క్రిందికి దుమికి, పృథివ్యామ్=నేలమీద, సమతిష్ఠత=నిలచెను.

తా. వజ్రదంష్ట్రుడు వచ్చి మీదపడుచున్న ఆ పర్వతమును చూచి, కంగారు పడనివాడై, గద చేతిలో ధరించి రథమునుండి క్రిందికి దుమికి నేలమీద నిలచెను. 22

మూ. అఙ్గదేన శిలా క్షిప్తా గత్వా తు రణమూర్ధని. 23
సచక్రకూబరం సాశ్వం ప్రమమాథ రథం తదా.

ప్ర. అ. అఙ్గదేన=అంగదునిచేత, క్షిప్తా=విసరబడిన, శిలా=శిల, గత్వా=వెళ్లి, రణమూర్ధని=రణాగ్రమునందు, తదా=అప్పుడు, సచక్రకూబరమ్=చక్రములతోను కూబరము (మధ్య నుండు కఱ్ఱ)తోను కూడిన, సాశ్వమ్=అశ్వములతో కూడిన, రథమ్=రథమును, ప్రమమాథ=నలగగొట్టెను.

తా. రణాగ్రమునందు అంగదుడు విసరిన ఆ శిల వెళ్లి చక్రములతో, కూబరముతో అశ్వములతో సహా ఆ రథమును చూర్ణము చేసెను. 23

మూ. తతోఽన్యచ్ఛిఖరం గృహ్య విపులం ద్రుమభూషితమ్. 24
వజ్రదంష్ట్రస్య శిరసి పాతయామాస వానరః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరః=వానరుడు, ద్రుమభూషితమ్=వృక్షములచేత అలంకరింపబడిన, విపులమ్=విశాలమైన, అన్యత్=మరియొక, శిఖరమ్=శిఖరమును, గృహ్య=గ్రహించి, వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రునియొక్క, శిరసి=శిరస్సుమీద, పాతయామాస=పడవేసెను.

తా. పిమ్మట అంగదుడు వృక్షములతో నిండిన మరొక విశాలమైన పర్వతశిఖరము తీసికొని వజ్రదంష్ట్రుని శిరస్సుపై పడవేసెను. 24

మూ. అభవచ్ఛోణితోద్గారీ వజ్రదంష్ట్రః స మూర్ఛితః. 25
ముహూర్తమభవన్మూఢో గదామాలిఙ్గ్య నిఃశ్వసన్.

ప్ర. అ. సః వజ్రదంష్ట్రః=ఆ వజ్రదంష్ట్రుడు, శోణితోద్గారీ=రక్తమును కక్కుచు, మూర్ఛితః=మూర్ఛచెందినవాడు, అభవత్=ఆయెను. గదామ్=గదను, ఆలిఙ్గ్య=కౌగలించుకొని, నిఃశ్వసన్=నిట్టూర్చుచు, ముహూర్తమ్=ముహూర్తకాలము, మూఢః=స్పృహ తప్పినవాడుగా, అభవత్=ఆయెను.

తా. వజ్రదంష్ట్రుడు రక్తము కక్కుచు, నిట్టూర్చుచు, స్పృహ తప్పి, కొంచెము సేపు గదను ఆనుకొని నిలబడెను. 25

మూ. సంలబ్ధసంజ్ఞో గదయా వాలిపుత్రమవస్థితమ్. 26
జఘాన పరమక్రుద్ధో వక్షోదేశే నిశాచరః

ప్ర. అ. సంలబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞ గల, నిశాచరః=ఆ రాక్షసుడు, పరమక్రుద్ధః=చాలకోపించినవాడై, అవస్థితమ్=నిలిచి ఉన్న, వాలిపుత్రమ్=అంగదుని, వక్షోదేశే=వక్షః స్థలమునందు, గదయా=గదచేత, జఘాన=కొట్టెను.

తా. వజ్రదంష్ట్రుడు మరల సంజ్ఞ పొంది చాల కోపించినవాడై తన

ఎదుట ఉన్న అంగదుణ్ణి, గదతో వక్షః స్థలముమీద కొట్టెను. 26

మూ. గదాం త్యక్త్వా తతస్తత్ర ముష్టియుద్ధమకుర్వత.  27
అన్యోన్యం జఘ్నుతుస్తత్ర తావుభౌ హరిరాక్షసౌ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, గదామ్=గదను, త్యక్త్వా=విడిచి, తత్ర=అక్కడ, ముష్టియుద్ధమ్=పిడికిళ్లతో యుద్ధమును, అకుర్వత=చేసిరి, తౌ=ఆ, హరిరాక్షసౌ=వానరరాక్షసులు, ఉభౌ=ఇద్దరూ, తత్ర=అక్కడ, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నతుః=కొట్టుకొనిరి.

తా. పిమ్మట గదను అక్కడ విడిచి పిడికిళ్లతో యుద్ధము చేసిరి. ఆ వానర రాక్షసు లిద్దరూ అక్కడ ఒకరి నొకరు కొట్టుకొనిరి. 27

మూ. రుధిరోద్గారిణౌ తౌ తు ప్రహారైర్జనితశ్రమౌ.  28
బభూవతుః సువిక్రాన్తావఙ్గారక బుధావివ.

ప్ర. అ. ప్రహారైః=దెబ్బలచేత, జనితశ్రమౌ=పుట్టించబడిన శ్రమ గల, రుధిరోద్గారిణౌ=రక్తము కారుచున్న, తౌ=వారిద్దరూ, సువిక్రాన్తౌ=మంచి పరాక్రమము గల, అఙ్గారక బుధావివ=అంగారక బుధగ్రహముల వలె, బభూవతుః=ఉండిరి.

తా. దెబ్బలచేత శ్రమ చెంది రక్తము కారుచున్న వారిద్దరూ, మంచి పరాక్రమము చూపుచు యుద్ధము చేయుచున్న బుధాంగారక గ్రహముల వలె ఉండిరి. 28

మూ. తతః పరమతేజస్వీ అఙ్గదః ప్లవగర్షభః.  29
ఉత్పాట్య వృక్షం స్థితవాన్ బహుపుష్ప ఫలాచితమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరమతేజస్వీ=గొప్ప తేజస్సు గల, ప్లవగర్షభః=వానర శ్రేష్ఠుడైన, అఙ్గదః=అంగదుడు, బహుపుష్ప ఫలాచితమ్=అనేక పుష్ప ఫలములతో నిండిన, వృక్షమ్=వృక్షమును, ఉత్పాట్య=పెకలించి, స్థితవాన్=నిలచినాడు.

తా. అప్పుడు మహాతేజశ్శాలి అయిన, వానరశ్రేష్ఠుడైన అంగదుడు అనేకపుష్పఫలములతో నిండిన వృక్షమును పెకలించి నిలబడెను. 29

మూ. జగ్రాహ చార్షభం చర్మ ఖడ్గం చ విపులం శుభమ్  30
కిఙ్కిణీజాలసంఛన్నం చర్మణా చ పరిష్కృతమ్.

ప్ర. అ. విపులమ్=విశాలమైన, శుభమ్=సుందరమైన, కిఙ్కిణీ జాల సంఛన్నమ్=చిరుగంటల సముదాయముచేత కప్పబడిన, ఆర్షభం చర్మ=వృషభ చర్మను, చర్మణా=చర్మచేత, పరిష్కృతమ్=అలంకరింపబడిన, ఖడ్గం చ=ఖడ్గమును,

ఖడ్గాహ=గ్రహించెను.

తా. చిరుగంటలు కట్టిన విశాలమైన అంతమైన, ఎద్దుచర్మతో చేయబడిన డాలును ఒరలో ఉంచి సంరక్షించిన ఖడ్గమును గ్రహించెను.

వి. పై శ్లోకములో అంగదుడు వృక్షమును గ్రహించినట్లు చెప్పబడినది గాన ఈ శ్లోకములో "రాక్షసః" అనుపదమును అధ్యాహారముచేసికొని "రాక్షసుడు ఖడ్గ చర్మలను గ్రహించినాడు" అని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసినారు. మరికొందరు వ్యాఖ్యాతలు "అంగదరాక్షసు లిద్దరూ మొదట వృక్షములు, పిమ్మట ఖడ్గచర్మలు గ్రహించినారు" అని వ్రాసినారు. "అంగదుడు ఖడ్గముచేత ఆ రాక్షసుని శిరస్సు ఖండించినాడు" అని 34వ శ్లోకములో చెప్పుటచేత ఇట్లు చెప్పవలసి వచ్చినది. మొదటి వ్యాఖ్యాతలు "అంగదుడు తన వృక్షము వ్యర్థమైపోగా ఆ రాక్షసుని చేతిలోని ఖడ్గము లాగికొని దానితో వానిని చంపినాడు" అని భావము అని వ్రాసినారు. వానరులు ఎవరూ ఖడ్గాదులు ఉపయోగించినట్లు మరెక్కడా వర్ణించలేదు. అందుచేత ఖడ్గముతో రాక్షసుని చంపినట్లుగా వ్రాసినది ప్రక్షిప్తము కావచ్చును. అయితే ఈ 33, 34 సర్గలలో వర్ణించిన మహాదంష్ట్ర అంగద యుద్ధవృత్తాంతం ప్రాచ్యప్రతిలో లేదు. 30

మూ. చిత్రాంశ్చ రుచిరాన్మార్గాంశ్చేరతుః కపిరాక్షసౌ. 31
జఘ్నతుశ్చ తదాన్యోన్యం నర్దన్తౌ జయకాఙ్క్షిణౌ.

ప్ర. అ. తదా=అప్పుడు, జయకాఙ్క్షిణౌ=జయమును కోరుచున్న, కపిరాక్షసౌ=ఆ వానరరాక్షసులు, నర్దన్తౌ=గర్జించుచున్న వారై, చిత్రాన్=చిత్రము లైన, మార్గాన్=మార్గములను, చేరతుః=సంచరించిరి. అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నతుశ్చ=కొట్టుకొనిరి.

తా. ఆ వానరరాక్షసు లిద్దరూ జయించవలె నను కోరికతో గర్జించుచు, చిత్రముమైన నడకలు నడచుచు ఒకరినొకరు కొట్టుకొనిరి. 31

మూ. వ్రణైః సముత్థైః శోభేతాం పుష్పితావివ కింశుకౌ 32
యుధ్యమానౌ పరిశ్రాన్తౌ జానుభ్యామవనీం గతౌ

ప్ర. అ. సముత్థైః=బయలుదేరిన, వ్రణైః=గాయములచేత, పుష్పితౌ=పుష్పించిన, కింశుకావివ=మోదుగ చెట్ల వలె, శోభేతామ్=ప్రకాశించిరి. యుధ్యమానౌ=యుద్ధముచేయుచు, పరిశ్రాన్తౌ=అలసిపోయిన వారిద్దరూ, జానుభ్యామ్=మోకాళ్లతో, అవనీమ్=భూమిని, గతౌ=పొందిరి.

తా. శరీరముల మీద అంతటా గాయములు ఏర్పడుటచేత పుష్పించిన మోదుగ చెట్ల వలె ఉన్న వారిద్దరూ యుద్ధము చేయుచూ, అలసి, మోకాళ్లపై

నేలమీద పడెను. 32

మూ. నిమేషాన్తరమాత్రేణ అఙ్గదః కపికుఞ్జరః 33
ఉదతిష్ఠత దీప్తాక్షో దణ్డాహత ఇవోరగః

ప్ర. అ. కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడైన, అఙ్గదః=అంగదుడు, నిమేషాన్తర మాత్రేణ=ఒక్క నిమేషముమాత్రము వ్యవధానముచేత, దీప్తాక్షః=ప్రజ్వలించుచున్న నేత్రములు కలవాడై, దణ్డాహతః=కఱ్ఱచేత కొట్టబడిన, ఉరగః ఇవ=సర్పము వలె, ఉదతిష్ఠత=లేచెను.

తా. వానర శ్రేష్ఠుడైన అంగదుడు కఱ్ఱతో కొట్టిన పాము వలె ప్రజ్వలించుచున్న నేత్రములతో ఒక్క క్షణములో పైకి లేచెను. 33

మూ. నిర్మలేన సుధౌతేన ఖడ్గేనాస్య మహచ్ఛిరః 34
జఘాన వజ్రదంష్ట్రస్య వాలిసూనుర్మహాబలః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, వాలిసూనుః=అంగదుడు, సుధౌతేన=బాగుగా శుభ్రము చేయబడిన, నిర్మలేన=నిర్మలమైన, ఖడ్గేన=ఖడ్గముచేత, అస్య వజ్రదంష్ట్రస్య=ఈ వజ్రదంష్ట్రునియొక్క, మహత్=గొప్పదైన, శిరః=శిరస్సును, జఘాన=కొట్టెను.

తా. గొప్ప బలము గల అంగదుడు శుభ్రము చేయుటచే మెరయుచున్న ఖడ్గముచేత ఆ వజ్రదంష్ట్రుని పెద్ద శిరస్సును ఛేదించెను. 34

మూ. రుధిరోక్షితగాత్రస్య బభూవ పతితం ద్విధా 35
తత్తు తస్య పరీతాక్షం శుభం ఖడ్గహతం శిరః

ప్ర. అ. రుధిరోక్షితగాత్రస్య=రక్తముచేత తడుపబడిన శరీరము గల, తస్య=వానియొక్క, తత్=ఆ, శుభమ్=సుందరమైన, శిరః=శిరస్సు, ఖడ్గహతమ్=ఖడ్గముచేత కొట్టబడినదై, పరీతాక్షమ్=కదలిపోవుచున్న నేత్రములు గలదై, ద్విధా=రెండుగా, పతితమ్=పడినదై, బభూవ=ఆయెను.

తా. శరీర మంతా రక్తము చేత తడిసిన ఆ వజ్రదంష్ట్రుని అందమైన శిరస్సు ఖడ్గముచేత ఛేదింపబడి, కండ్లు తిరిగిపోవుచుండగా, రెండు ముక్కలై పడిపోయెను. 35

మూ. వజ్రదంష్ట్రం హతం దృష్ట్వా రాక్షసా భయమోహితాః 36
త్రస్తాహ్యభ్యద్రవన్ లఙ్కాం వధ్యమానాః ప్లవఙ్గమైః
విషణ్ణవదనా దీనా హ్రియా కించిదవాఙ్ముఖాః 37

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, వజ్రదంష్ట్రమ్=వజ్రదంష్ట్రుణ్ణి, హతమ్=

చంపబడినవానిగా, దృష్ట్వా=చూచి, భయమోహితాః=భయముచేత మోహితులై, ప్లవఙ్గమైః=వానరులచేత, వధ్యమానాః=చంపబడుచున్న వారై, విషణ్ణవదనాః=దిగులుచెందిన ముఖములు కలవారై, హ్రియా=సిగ్గుచేత, కించిత్=కొంచెము, అవాఙ్ముఖాః=క్రిందికిముఖములు కలవారై, లఙ్కామ్=లంకను గూర్చి, అభ్యద్రవన్=పారిపోయిరి.

తా. వజ్రదంష్ట్రుడు మరణించుట చూచి రాక్షసులు భయమోహితులై, వానరులు చంపుచుండగా భయపడినవారై, సిగ్గుతో తలలు వంచి లంకవైపు పరుగెత్తిరి 36, 37

మూ. విహత్య తం వజ్రధరప్రతాపః
స వాలిసూనుః కపిసైన్యమధ్యే,
జగామ హర్షం మహితో మహాబలః
సహస్రనేత్రస్త్రిదశైరివావృతః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుఃపఞ్చాశః సర్గః

ప్ర. అ. వజ్రధరప్రతాపవాన్=దేవేంద్రుని వంటి ప్రతాపము గల, మహాబలః = గొప్ప బలము గల, సః వాలిసూనుః = ఆ అంగదుడు, తమ్ = వానిని, విహత్య = చంపి, కపిసైన్యమధ్యే = వానరసైన్యమధ్యమునందు, మహితః=పూజింపబడినవాడై, త్రిదశైః=దేవతలచేత, ఆవృతః=చుట్టువారికొనబడిన, సహస్రనేత్రః ఇవ = ఇంద్రుడు వలె హర్షమ్=సంతోషమును, జగామ=పొందెను.

తా. ఇంద్రుని వంటి ప్రతాపము, గొప్ప బలము గల అంగదుడు ఆ రాక్షసుని చంపి, వానరసైనమధ్యమునందు పూజింపబడినవాడై, దేవతల మధ్య ఉన్న ఇంద్రుడు వలె సంతోషించెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదినాల్గవ సర్గ సమాప్తము

# అథ షట్పఞ్చాశః సర్గః

*[రావణుని ఆజ్ఞచే అకంపనుడు యుద్ధమునకు బయల్వెడలుట. దుశ్శకునములను చూచి అతడు ఖిన్నుడగుట. వానరరాక్షసుల మధ్య ఘోరయుద్ధము జరుగుట]*

మూ. వజ్రదంష్ట్రం హతం శ్రుత్వా వాలిపుత్రేణ రావణః,
బలాధ్యక్షమువాచేదం కృతాఞ్జలిముపస్థితమ్. 1

ప్ర. అ. రావణః = రావణుడు, వజ్రదంష్ట్రమ్=వజ్రదంష్ట్రుని, వాలిపుత్రేణ=అంగదుని చేత, హతమ్= చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, ఉపస్థితమ్=సమీపమునందున్న, కృతాఞ్జలిమ్=చేయబడిన దోసిలి గల, బలాధ్యక్షమ్=సేనానాయకుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వాలి కుమారుడైన అంగదునిచే వజ్రదంష్ట్రుడు చంపబడినా డని తెలిసిన రావణుడు తన దగ్గరనే దోసిలి కట్టి నిలచి ఉన్న సేనానాయకునితో ఇట్లు పలికెను. 1

మూ. శీఘ్రం నిర్యాన్తు దుర్ధర్షా రాక్షసా భీమవిక్రమాః,
అకమ్పనం పురస్కృత్య సర్వశస్త్రాస్త్రకోవిదమ్. 2

ప్ర. అ. భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, దుర్ధర్షాః=ఎదిరింప శక్యము కాని, రాక్షసాః=రాక్షసులు, సర్వశస్త్రాస్త్రకోవిదమ్=సమస్తమైన శస్త్రములను అస్త్రములను ఎరిగిన, అకమ్పనమ్=అకంపనుని, పురస్కృత్య=ముందు ఉంచుకొని, శీఘ్రమ్= శీఘ్రముగా, నిర్యాన్తు=బయలుదేరెదరుగాక.

తా. భయంకరమైన పరాక్రమము గల రాక్షసులు, సమస్తమైన శస్త్రములను అస్త్రములను ప్రయోగించుటలో నేర్పు గల అకంపనుని ముందు ఉంచుకొని వెంటనే బయలుదేరెదరు గాక. 2

మూ. ఏష శాస్తా చ గోప్తా చ నేతా చ యుధి సత్తమః,
భూతికామశ్చ మే నిత్యం నిత్యం చ సమరప్రియః. 3

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, శాస్తా=శిక్షకుడు, గోప్తా చ=రక్షకుడు, నేతా చ=నాయకుడు అయిన, ఏషః=ఈ, సత్తమః=శ్రేష్ఠుడైన అకంపనుడు, నిత్యమ్= ఎల్లప్పుడు, మే=నాయొక్క, భూతికామశ్చ=ఐశ్వర్యమునందు కోరిక గలవాడు; నిత్యమ్= ఎల్లప్పుడు, సమరప్రియః=యుద్ధము ప్రియముగా కలవాడు.

తా. చాల ఉత్తముడైన ఈతడు యుద్ధములో సైనికులందరికీ శిక్షకుడు;

రక్షకుడు; నాయకుడు; ఎల్లప్పుడూ నా అభివృద్ధిని కోరువాడు; నిత్యము యుద్ధమును కోరువాడు. 3

మూ. ఏష జేష్యతి కాకుత్స్థౌ సుగ్రీవం చ మహాబలమ్,
వానరాంశ్చాపరాన్ ఘోరాన్ హనిష్యతి న సంశయః. 4

ప్ర. అ. ఏషః=ఇతడు, కాకుత్స్థౌ=రామలక్ష్మణులను, మహాబలమ్=గొప్ప బలము గల, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఘోరాన్=భయంకరమైన, అపరాన్=ఇతరులైన, వానరాన్=వానరులను, హనిష్యతి=చంపగలడు, సంశయః=సంశయము, న=లేదు.

తా. ఇతడు రామలక్ష్మణులను, మహాబలశాలియైన సుగ్రీవుని, భయంకరులైన ఇతర వానరులను తప్పక చంపగలడు. 4

మూ. పరిగృహ్య స తామాజ్ఞాం రావణస్య మహాబలః,
బలం సంప్రేరయామాస తదా లఘుపరాక్రమః. 5

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గలవాడు, లఘుపరాక్రమః=శీఘ్రమైన పరాక్రమము గలవాడు అయిన, సః=అతడు, రావణస్య=రావణునియొక్క, తామ్=ఆ, ఆజ్ఞామ్=ఆజ్ఞను, పరిగృహ్య=స్వీకరించి, తదా=అప్పుడు, బలమ్=సైన్యమును, సంప్రేరయామాస=ప్రేరేపించెను.

తా. మహాబలవంతుడు, శీఘ్రపరాక్రమము గలవాడు అయిన ఆ అకంపనుడు రావణుని ఆజ్ఞను అనుసరించి సైన్యమును ప్రేరేపించెను. 5

మూ. తతో నానాప్రహరణా భీమాక్షా భీమదర్శనాః,
నిష్పేతూ రాక్షసా ముఖ్యా బలాధ్యక్షప్రచోదితాః. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నానాప్రహరణాః=అనేకవిధములైన ఆయుధములు కలవారు, భీమాక్షాః=భయంకరమైన నేత్రములు కలవారు, భీమదర్శనాః=భయంకరమైన దర్శనము గలవారు అయిన, ముఖ్యాః రాక్షసాః=ముఖ్యులైన రాక్షసులు, బలాధ్యక్షప్రచోదితాః=సేనాధ్యక్షునిచేత ప్రేరేపించబడినవారై, నిష్పేతుః=బయలుదేరిరి.

తా. పిమ్మట భయంకరమైన నేత్రములు గల, చూచువారికి భయము కలిగించు, ముఖ్యులైన రాక్షసులు అనేకవిధములైన ఆయుధములు ధరించి సేనాధ్యక్షుని ఆజ్ఞ ప్రకారము బయలుదేరిరి. 6

మూ. రథమాస్థాయ విపులం తప్తకాంచనభూషణమ్,
మేఘాభో మేఘవర్ణశ్చ మేఘస్వనమహాస్వనః. 7

రాక్షసైః సంవృతో ఘోరై స్తదా నిర్యాత్యకమ్పనః.

ప్ర. అ. తదా=అప్పుడు, మేఘాభః=మేఘమువంటి కాంతి గలవాడు, మేఘవర్ణశ్చ= మేఘమువంటి వర్ణము గలవాడు, మేఘస్వనమహాస్వనః=మేఘధ్వని వంటి గొప్ప ధ్వని కలవాడు అయిన, అకమ్పనః=అకంపనుడు, తప్తకాఞ్చన భూషణమ్=పరిశుద్ధమైన బంగారు అలంకారములు గల, విపులమ్=విశాలమైన, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, ఘోరైః= భయంకరులైన, రాక్షసైః=రాక్షసులతో, సంవృతః=కూడినవాడై, నిర్యాతి=బయలుదేరెను.

తా. అప్పుడు, మేఘము వంటి కాంతి, రంగు, గొప్ప ధ్వని గల అకంపనుడు పరిశుద్ధమైన బంగారముచేత అలంకరింపబడిన విశాలమైన రథమును అధిష్ఠించి, భయంకరులైన రాక్షసులతో కూడి బయలుదేరెను. 7

మూ. న హి కమ్పయితుం శక్యః సురైరపి మహామృధే, 8
అకమ్పనస్తతస్తేషామాదిత్య ఇవ తేజసా.

ప్ర. అ. అకమ్పనః=అకంపనుడు, మహామృధే=గొప్ప యుద్ధమునందు, సురైరపి= దేవతలచేత కూడ, కమ్పయితుమ్=కంపింపచేయుటకు, న శక్యః హి=శక్యుడు కాడు కదా? తతః=అందువలన, తేషామ్=ఆ రాక్షసులలో, తేజసా=తేజస్సు చేత, ఆదిత్యః ఇవ= సూర్యుడు వలె ఉండెను.

తా. మహాయుద్ధములో దేవతలు కూడ ఆ అకంపనుణ్ణి కదల్ప జాలరు. అందుచే అతడు ఆ రాక్షసుల మధ్య తేజస్సుతో సూర్యుడు వలె ప్రకాశించుచుండెను. 8

మూ. తస్య నిర్ధావమానస్య సంరబ్ధస్య యుయుత్సయా, 9
అకస్మాద్దైన్యమాగచ్ఛద్ధయానాం రథవాహినామ్.

ప్ర. అ. తస్య=అతడు, యుయుత్సయా=యుద్ధమునందు కోరికచేత, సంరబ్ధస్య= తొందరపడుచు, నిర్ధావమానస్య=పరుగెత్తుచుండగా, అకస్మాత్=హఠాత్తుగా, రథవాహినామ్=రథమును లాగుచున్న, హయానామ్=గుఱ్ఱములకు, దైన్యమ్= దైన్యము, ఆగచ్ఛత్=వచ్చెను.

తా. అకంపనుడు యుద్ధము చేయవలెనను ఉత్సాహముతో తొందరపడుచు పరుగెత్తుచుండగా రథమును లాగుచున్న గుఱ్ఱములు హఠాత్తుగా దైన్యమును పొందెను. 9

మూ. వ్యస్ఫురన్నయనం చాస్య సవ్యం యుద్ధాభినన్దినః, 10
వివర్ణో ముఖవర్ణశ్చ గద్గదశ్చాభవత్స్వనః

ప్ర. అ. యుద్ధాభినన్దినః=యుద్ధమును అభినందించుచున్న, అస్య=వీని యొక్క, సవ్యమ్=ఎడమదైన, నయనమ్=నేత్రము, విస్ఫురత్=అదరెను. ముఖ వర్ణశ్చ=ముఖవర్ణము, వివర్ణః=మారిపోయిన రంగు కలదిగాను, స్వనః=ధ్వని, గద్గదః=గద్గదముగాను, అభవత్=అయెను.

తా. యుద్ధమును కోరి వెళ్లుచున్న అతని ఎడమకన్ను అదరెను. ముఖవర్ణము మారిపోయెను. కంఠధ్వని గద్గద మాయెను. 10

మూ. అభవత్సుదినే కాలే దుర్దినం రూక్షమారుతమ్, 11
ఊచుః ఖగమృగాః సర్వే వాచః క్రూరా భయావహాః.

ప్ర. అ. సుదినే=సుదినమైన, కాలే=కాలమునందు, రూక్షమారుతమ్=తీవ్రమైన గాలి గల, దుర్దినమ్=దుర్దినము, అభవత్=అయెను. సర్వే=సమస్తమైన, ఖగమృగాః=పక్షులు మృగములు, క్రూరాః=క్రూరములైన, భయావహాః=భయమును కలిగించు, వాచః=వాక్కులను, ఊచుః=పలికినవి.

తా. సుదినమునందు తీవ్రమైన గాలితో కూడిన దుర్దినము (పూర్తిగా మేఘములచేత కప్పివేయబడిన దినము దుర్దినము) ఏర్పడెను. సమస్తమైన పక్షులు, మృగములు క్రూరములు భయంకరములూ అయిన కూతలు కూసెను.

మూ. స సింహోపచితస్కన్ధః శార్దూలసమవిక్రమః, 12
తానుత్పాతానచిన్త్యైవ నిర్జగామ రణాజిరమ్.

ప్ర. అ. సింహోపచితస్కన్ధః=సింహము మూపురము వలె బలిసిన మూపురము గల, శార్దూలసమవిక్రమః=పెద్ద పులితో సమానమైన పరాక్రమము గల, సః=అతడు, తాన్=ఆ, ఉత్పాతాన్=దుఃశకునములను, అచిన్త్యైవ=లెక్క చేయకుండగానే, రణాజిరమ్=యుద్ధభూమిని గూర్చి, నిర్జగామ=బయలుదేరెను.

తా. సింహము మూపురము వంటి బలిసిన మూపురము, పెద్దపులితో సమానమైన పరాక్రమము గల ఆ అకంపనుడు ఆ దుఃశకునములను లెక్కచేయక యుద్ధభూమికి వెళ్లెను. 12

మూ. తథా నిర్గచ్ఛతస్తస్య రక్షసః సహ రాక్షసైః, 13
బభూవ సుమహాన్నాదః క్షోభయన్నివ సాగరమ్.

ప్ర. అ. తస్య రక్షసః=ఆ రాక్షసుడు, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, తథా=అట్లు, నిర్గచ్ఛతః=బయలుదేరి వెళ్లుచుండగా, సాగరమ్=సముద్రమును, క్షోభయన్నివ=క్షోభింపచేయుచున్నది వలె, సుమహాన్ నాదః=చాల గొప్పధ్వని, బభూవ=అయెను.

తా. ఆ రాక్షసుడు ఇతర రాక్షసులతో కలిసి వచ్చుచుండగా సముద్రమును క్షోభింపచేయుచున్నదా అన్నట్లు గొప్ప ధ్వని బయలుదేరెను. 13

మూ. తేన శబ్దేన విత్రస్తా వానరాణాం మహాచమూః, 14
ద్రుమశైలప్రహరాణాం యోద్ధుం సముపతిష్ఠతామ్.

ప్ర. అ. ద్రుమశైలప్రహరాణామ్=వృక్షములు పర్వతములు ఆయుధములుగా గల, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూః=గొప్పసేన, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, సముపతిష్ఠతామ్=వచ్చుచున్న ఆ రాక్షసుల యొక్క, తేన శబ్దేన=ఆ శబ్దముచేత, విత్రస్తా=భయపడినది.

తా. యుద్ధమునకై వచ్చుచున్న ఆ రాక్షసుల శబ్దము విని వృక్షములను పర్వతములను ఆయుధములుగా గ్రహించి ఉన్న వానరుల సైన్యము భయపడెను.

మూ. తేషాం యుద్ధం మహారౌద్రం సంజజ్ఞే కపిరక్షసామ్, 15
రామరావణయోరర్థే సమభిత్యక్తజీవినామ్.

ప్ర. అ. రామరావణయోః అర్థే=రామరావణుల కొరకై, సమభిత్యక్త జీవినామ్=విడువబడిన ప్రాణములు గల, తేషామ్=ఆ, కపిరాక్షసామ్=వానరులకు రాక్షసులకు, మహారౌద్రమ్=చాల భయంకరమైన, యుద్ధమ్=యుద్ధము, సంజజ్ఞే=జరిగెను.

తా. రామరావణుల కొరకై ప్రాణాలను విడచుటకు సిద్ధముగా ఉన్న ఆ వానరరాక్షసుల మధ్య చాల భయంకరమైన యుద్ధము జరిగెను. 15

మూ. సర్వే హ్యతిబలాః శూరాః సర్వే పర్వతసంనిభాః, 16
హరయో రాక్షసాశ్చైవ పరస్పరజిఘాంసవః.

ప్ర. అ. పరస్పరజిఘాంసవః=పరస్పరము చంపుకొనుటకు ఇచ్ఛయించుచున్న, సర్వే=సమస్తమైన, హరయః=వానరులు, రాక్షసాశ్చైవ=రాక్షసులు, అతిబలాః=గొప్ప బలము కలవారే, శూరాః=శూరులే; సర్వే=అందరూ, పర్వతసంనిభాః=పర్వతములతో సమానులే.

తా. పరస్పరము చంపుటకు ప్రయత్నించుచున్న ఆ వానరులు, రాక్షసులు అందరూ కూడ గొప్ప బలము కలవారే, శూరులే, అందరూ పర్వతముల వంటివారే. 16

మూ. తేషాం వినర్దతాం శబ్దః సంయుగేఽతితరస్వినామ్, 17
శుశ్రువే సుమహాన్ కోపాదన్యోన్యమభిగర్జతామ్.

ప్ర. అ. వినర్దతామ్=ధ్వనిచేయుచున్నవారు, తరస్వినామ్=బలము

గలవారు, కోపాత్= కోపమువలన, అన్యోన్యమ్=పరస్పరము, అభిగర్జతామ్=గర్జించుచున్నవారు అయిన, తేషామ్=వారియొక్క, సుమహాన్=చాల గొప్పదైన, శబ్దః=శబ్దము, సంయుగే= యుద్ధమునందు, శుశ్రువే=వినబడెను.

తా. ధ్వనిచేయుచు, కోపముతో పరస్పరము గర్జించుచున్న మహాబలవంతులైన ఆ వానరరాక్షసుల ధ్వని యుద్ధరంగమునందు వినవచ్చెను.

మూ. రజశ్చారుణవర్ణాభం సుభీమమభవద్ భృశమ్, 18
ఉద్ధుతం హరిరక్షోభిః సంరురోధ దిశో దశ.

ప్ర. అ. భృశమ్=మిక్కిలి, అరుణవర్ణాభమ్=అరుణుని రంగు వంటి కాంతి గల, సుభీమమ్=చాల భయంకరమైన, రజః=పరాగము కూడ, అభవత్=ఆయెను. హరిరక్షోభిః=వానరులచేతను రాక్షసులచేతను, ఉద్ధతమ్=ఎగురగొట్టబడిన ఆ పరాగము, దశ= పది, దిశః=దిక్కులను, సంరురోధ=అడ్డుకొనెను.

తా. అరుణుని వంటి రంగు గల భయంకరమైన పరాగము అధికముగా బయలుదేరెను. వానరులచేతను, రాక్షసులచేతను ఎగురగొట్టబడిన ఆ పరాగము పది దిక్కులను కప్పివేసెను. 18

మూ. అన్యోన్యం రజసా తేన కౌశేయోద్ధూతపాణ్డునా। 19
సంవృతాని చ భూతాని దదృశుర్న రణాజిరే.

ప్ర. అ. కౌశేయోద్ధూతపాణ్డునా=పైకి ఎగరవేయబడిన పట్టుబట్ట వలె తెల్లగా ఉన్న, తేన రజసా=ఆ పరాగముచేత, సంవృతాని=కప్పబడిన, భూతాని=ప్రాణులు, రణాజిరే=యుద్ధభూమియందు, అన్యోన్యమ్=పరస్పరము, న దదృశుః=చూడలేదు.

తా. ఎగురవేసిన పట్టుబట్ట వలె తెల్లగా ఉన్న ఆ పరాగముచేత కప్పబడి ఆ యుద్ధభూమిలోని వారికి ఒకరికొకరు కనబడుటలేదు. 19

మూ. న ధ్వజో న పతాకా వా చర్మ వా తురగోఽపి వా, 20
ఆయుధం స్యన్దనో వాపి దదృశే తేన రేణునా.

ప్ర. అ. తేన=ఆ, రేణునా=పరాగముచేత, ధ్వజః=ధ్వజము, న దదృశే= చూడబడలేదు; పతాకా వా=పతాక కాని, న=చూడబడలేదు; చర్మ వా=డాలు గాని, తురగోఽపి వా=గుఱ్ఱము గాని, ఆయుధమ్=ఆయుధము గాని, స్యన్దనో వాపి= రథము గాని (చూడబడలేదు).

తా. ఆ పరాగము కప్పివేయుటచేత ధ్వజములు గాని, పతాకలు గాని, డాలులు గాని, గుఱ్ఱములు గాని, ఆయుధములు గాని, రథములు గాని కనబడలేదు. 20

మూ. శబ్దశ్చ సుమహాంస్తేషాం వర్తతామభిధావతామ్, 21
శ్రూయతే తుములే యుద్ధే న రూపాణి చకాశిరే.

ప్ర. అ. వర్తతామ్=ధ్వనిచేయుచున్న, అభిధావతామ్=ఎదురుగా పరుగెత్తు చున్న, తేషామ్=వారియొక్క, సుమహాన్=చాల గొప్పదైన, తుములః=వ్యాకుల మైన, శబ్దశ్చ=శబ్దము, యుద్ధే=యుద్ధమునందు, శ్రూయతే=వినబడుచుండెను. రూపాణి= రూపములు, న చకాశిరే=ప్రకాశించలేదు.

తా. యుద్ధములో గర్జించుచు ఎదురెదురుగా పరుగెత్తుచున్న ఆ వీరుల వ్యాకులమైన, చాల పెద్దదైన శబ్దము మాత్రమే వినబడుచుండెను; వాళ్ల రూపములు కనబడకుండెను. 21

మూ. హరీనేవ సుసంరుష్టా హరయో జఘ్నురాహవే, 22
రాక్షసా రాక్షసాంశ్చాపి నిజఘ్నుస్తిమిరే తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, తిమిరే=చీకటియందు, ఆహవే=యుద్ధము నందు, సుసంరుష్టాః=బాగా కోపించిన, హరయః=వానరులు, హరీనేవ=వాన రులనే, జఘ్నుః=చంపిరి. రాక్షసాః=రాక్షసులు, రాక్షసాంశ్చాపి=రాక్షసులనే, నిజఘ్నుః=చంపిరి.

తా. పరాగముచేత చీకటి కమ్మిన ఆ యుద్ధములో మిక్కిలి కోపించిన వానరులు వానరులనే చంపిరి. రాక్షసులు రాక్షసులనే చంపిరి. 22

మూ. తే పరాంశ్చ నిఘ్నన్తః స్వాంశ్చ వానరరాక్షసాః, 23
రుధిరార్ద్రాం తదా చక్రుర్మహీం పఙ్కానులేపనామ్.

ప్ర. అ. పరాంశ్చ=పరులను, స్వాంశ్చ=తమవాళ్లను, నిఘ్నన్తః=చంపుచున్న, తే=ఆ, వానరరాక్షసాః=వానరులు రాక్షసులు, తదా=అప్పుడు, మహీమ్=భూమిని, రుధిరార్ద్రామ్=రక్తముచేత ఆర్ద్రమైన దానినిగాను, పఙ్కానులేపనామ్=బురద అనులేపనము (మైపూత)గా కలదానినిగాను, చక్రుః=చేసిరి.

తా. తమవాళ్లను పరులను కూడ చంపుచున్న ఆ వానరులు, రాక్షసులు అప్పుడు భూమిని రక్తముచేత తడియునట్లు, బురదతో నిండునట్లు చేసిరి. 23

మూ. తతస్తు రుధిరౌఘేణ సిక్తం వ్యపగతం రజః, 24
శరీరశవసంకీర్ణా బభూవ చ వసుంధరా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట రుధిరౌఘేణ=రక్తప్రవాహముచేత, సిక్తమ్=తడపబడినదై, రజః=పరాగము, అపగతమ్=తొలగిపోయినది. వసుం

ధరా=భూమి, శరీరశవసంకీర్ణా= శరీరములతోను శవములతోను వ్యాప్తము, బభూవ=అయెను.

తా. అప్పుడు రక్తప్రవాహముచేత కప్పబడి పరాగము అణగిపోయెను. భూమి శరీరములతోను, శవములతోను నిండిపోయెను. 24

మూ. ద్రుమశక్తిగదాప్రాసైః శిలాపరిఘతోమరైః, 25
రాక్షసా హరయస్తూర్ణం జఘ్నురన్యోన్యమోజసా.

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, హరయః=వానరులు, తూర్ణమ్=శీఘ్రముగా, అన్యోన్యమ్=పరస్పరము, ద్రుమశక్తిగదాప్రాసైః=వృక్షములచేత, శక్తులచేత, గదల చేత, ప్రాసలచేత, శిలాపరిఘతోమరైః=శిలలచేత, పరిఘలచేత, తోమరములచేత, ఓజసా=తేజస్సుతో, జఘ్నుః=కొట్టుకొనిరి.

తా. రాక్షసులు, వానరులుకూడ పరాక్రమముతో శీఘ్రముగా ఒకరినొకరు వృక్షములు, శక్తులు, గదలు, ప్రాసములు, శిలలు, పరిఘలు తోమరములు ప్రయోగించి కొట్టుకొనిరి. 25

మూ. బాహుభిః పరిఘాకారైర్యుధ్యన్తః పర్వతోపమాః, 26
హరయో భీమకర్మాణో రాక్షసాన్ జఘ్నురాహవే.

ప్ర. అ. భీమకర్మాణః=భయంకరమైన కర్మగల, పర్వతోపమాః=పర్వతము లతో సమానమైన, హరయః=వానరులు, పరిఘాకారైః=పరిఘలవంటి ఆకారము గల, బాహుభిః= బాహువులతో, యుధ్యన్తః=యుద్ధము చేయుచున్నవారై, ఆహవే=యుద్ధ మునందు, రాక్షసాన్=రాక్షసులను, జఘ్నుః=చంపిరి.

తా. పర్వతములవంటి ఆకారములు గల, భయంకరములైన కర్మలు చేయు వానరులు పరిఘలవంటి బాహువులతో పోరాడుచు, యుద్ధములో రాక్షసులను చంపిరి. 26

మూ. రాక్షసాస్త్వభిసంక్రుద్ధాః ప్రాసతోమరపాణయః, 27
కపీన్నిజఘ్నిరే తత్ర శస్త్రైః పరమదారుణైః.

ప్ర. అ. తత్ర=అక్కడ, అభిసంక్రుద్ధాః=కోపించిన, రాక్షసాస్తు=రాక్షసులు, ప్రాసతోమరపాణయః=ప్రాసలు తోమరములు హస్తములందు కలవారై, పరమదా రుణైః=చాల భయంకరములైన, శస్త్రైః=ఆయుధములచేత, కపీన్=వానరులను, నిజఘ్నిరే=కొట్టిరి.

తా. ప్రాసలు తోమరములు హస్తములలో ధరించి యున్న రాక్షసులు చాల కోపముతో మిక్కిలి తీవ్రములైన ఆయుధములచేత వానరులను కొట్టిరి.

మూ. అకమ్పనః సుసంక్రుద్ధో రాక్షసానాం చమూపతిః, 28
సంహర్షయతి తాన్సర్వాన్రాక్షసాన్ భీమవిక్రమాన్.

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులయొక్క, చమూపతిః=సేనానాయకుడైన, సుసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన, అకమ్పనః=అకంపనుడు, భీమవిక్రమాన్=భయంకరమైన పరాక్రమము గల, సర్వాన్=సమస్తమైన, తాన్ రాక్షసాన్=ఆ రాక్షసులను, సంహర్షయతి= సంతోషింపచేయుచున్నాడు.

తా. రాక్షససేనానాయకుడైన అకంపనుడు చాలా కోపించి, తన పరాక్రమము చూపుట ద్వారా, భయంకరమైన పరాక్రమము గల ఆ రాక్షసులందరినీ సంతోషపెట్టుచుండెను. 28

మూ. హరయస్త్వపి రక్షాంసి మహాద్రుమమహాశ్మభిః, 29
విదారయన్త్యభిక్రమ్య శస్త్రాణ్యాచ్ఛిద్య వీర్యతః.

ప్ర. అ. హరయస్తు అపి=వానరులు కూడా, వీర్యతః=పరాక్రమమువలన, శస్త్రాణి= ఆయుధములను, ఆచ్ఛిద్య=లాగికొని, అభిక్రమ్య=ఆక్రమించి, మహాద్రుమమహాశ్మభిః= మహావృక్షములచేత, పెద్ద శిలల చేత, రక్షాంసి=రాక్షసులను, విదారయన్తి=చీల్చివేయుచున్నారు.

తా. వానరులు కూడ పరాక్రమముతో రాక్షసులను ఆక్రమించి, పెద్ద వృక్షములతోను, మహాశిలలతోను రాక్షసులను చీల్చి వేయుచుండిరి. 29

మూ. ఏతస్మిన్నన్తరే వీరా హరయః కుముదో నలః, 30
మైన్దశ్చ పరమక్రుద్ధాశ్చక్రుర్వేగమనుత్తమమ్.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఈ మధ్యలో, కుముదః=కుముదుడు, నలః=నలుడు, మైన్దశ్చ=మైందుడు అను, వీరాః=వీరులైన, హరయః=వానరులు, పరమక్రుద్ధాః= మిక్కిలి కోపించినవారై, అనుత్తమమ్=చాల అధికమైన, వేగమ్=వేగమును, చక్రుః=చేసిరి.

తా. ఇంతలో వానరవీరులైన కుముదుడు, నలుడు, మైందుడు చాల కోపించి గొప్ప వేగమును చూపిరి. 30

మూ. తే తు వృక్షైర్మహావీరా రాక్షసానాం చమూముఖే, 31
కదనం సుమహచ్చక్రుర్లీలయా హరిపుఙ్గవాః,
మమన్థూ రాక్షసాన్ సర్వే నానాప్రహరణైర్భృశమ్. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర. అ. మహావీరాః=గొప్ప వీరులైన, తే=ఆ, హరిపుఙ్గవాః=వానరశ్రేష్ఠులు, చమూముఖే=సేనాగ్రభాగమునందు, లీలయా=విలాసతో, వృక్షైః=వృక్షములచేత, రాక్షసానామ్=రాక్షసులయొక్క, సుమహత్=చాల గొప్పదైన, కదనమ్=సంహారమును, చక్రుః=చేసిరి. సర్వే=వారందరు, నానాప్రహరణైః=అనేక విధములైన ఆయుధములతో, భృశమ్=మిక్కిలి, రాక్షసాన్=రాక్షసులను, మమన్థుః=మథించిరి.

తా. మహావీరులైన ఆ ముగ్గురు వానరశ్రేష్ఠులు సేనాగ్రభాగమునందు వృక్షములతో రాక్షసులను ఎందరినో సంహరించిరి. అనేక విధములైన ఆయుధములతో రాక్షసులను మిక్కిలి మథించివేసిరి. 31, 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్పఞ్చాశః సర్గః

[హనుమంతుడు అకంపనుని చంపుట]

మూ. తద్దృష్ట్వా సుమహత్కర్మ కృతం వానరసత్తమైః,
క్రోధమాహారయామాస యుధి తీవ్రమకమ్పనః. 1

ప్ర. అ. అకమ్పనః=అకంపనుడు, యుధి=యుద్ధమునందు, వానరసత్తమైః=వానరశ్రేష్ఠులచేత, కృతమ్=చేయబడిన, తత్=ఆ, సుమహత్=చాల గొప్పదైన, కర్మ=పనిని, దృష్ట్వా=చూచి, తీవ్రమ్=తీవ్రమైన, క్రోధమ్=కోపమును, ఆహారయామాస=తెప్పించుకొనెను.

తా. ఆ వానరవీరులు యుద్ధములో చేసిన ఆ గొప్ప కార్యమును చూచి, అకంపనుడు తీవ్రమైన కోపమును ప్రదర్శించెను. 1

మూ. క్రోధమూర్ఛితరూపస్తు ధున్వన్ పరమకార్ముకమ్,
దృష్ట్వా తు కర్మ శత్రూణాం సారథిం వాక్యమబ్రవీత్. 2

ప్ర. అ. శత్రూణామ్=శత్రువులయొక్క, కర్మ=పనిని, దృష్ట్వా=చూచి, క్రోధమూర్ఛితరూపః=అధికముగా కోపముతో నిండినవాడై, పరమకార్ముకమ్=గొప్ప ధనస్సును, ధున్వన్=కదల్చుచు, సారథిమ్=సారథిని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అతడు శత్రువులు చేసిన పని చూచి చాల కోపముతో నిండినవాడై, ధనస్సును కదల్చుచు సారథితో ఇట్లనెను. 2

మూ. తత్రైవ తావత్త్వరితో రథం ప్రాపయ సారథే,
ఏతే చ బలినో ఘ్నన్తి సుబహూన్రాక్షసాన్రణే. 3

ప్ర. అ. సారథే=సారథీ, బలినః=బలవంతులైన, ఏతే=ఈ వానరులు, రణే=యుద్ధమునందు, సుబహూన్=చాల అధికసంఖ్య గల, రాక్షసాన్=రాక్షసులను, ఘ్నన్తి=చంపుచున్నారు. త్వరితః=తొందర పడుచున్నవాడవై, తత్రైవ=అక్కడికే, రథమ్=రథమును, ప్రాపయ=పొందింపుము.

తా. సారథీ! బలవంతులైన ఈ వానరులు యుద్ధములో చాలమంది రాక్షసులను చంపివేయుచున్నారు. అందుచే రథమును శీఘ్రముగా అక్కడికే తీసికొని వెళ్ళుము. 3

మూ. ఏతేఽత్ర బలవన్తో హి భీమకోపాశ్చ వానరాః,
ద్రుమశైలప్రహరణాస్తిష్ఠన్తి ప్రముఖే మమ. 4

ప్ర. అ. బలవన్తః=బలము కలవారు, భీమకోపాశ్చ=భయంకరమైన కోపముకలవారు అయిన, ఏతే=ఈ, వానరాః=వానరులు, ద్రుమశైల ప్రహరణాః=వృక్షములు, పర్వతములు ఆయుధములుగా కలవారై, అత్ర=ఇక్కడ, మమ=నాయొక్క, ప్రముఖే=ఎదుట, తిష్ఠన్తి హి=ఉన్నారు కదా.

తా. బలవంతులు, భయంకరమైన కోపము కలవారు అయిన ఈ వానరులు ఇక్కడ నా ఎదుట, వృక్షములు, పర్వతములు ఆయుధములుగా ధరించి నిలచి ఉన్నారు. 4

మూ. ఏతాన్నిహన్తుమిచ్ఛామి సమరశ్లాఘినో హ్యహమ్,
ఏతైః ప్రమథితం సర్వం రక్షసాం దృశ్యతే బలమ్. 5

ప్ర. అ. అహమ్=నేను, సమరశ్లాఘినః=యుద్ధమునందు శ్లాఘచేసికొనుచున్న, ఏతాన్=ఈ వానరులను, నిహన్తుమ్=చంపుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. రక్షసామ్=రాక్షసులయొక్క, సర్వమ్=సమస్తమైన, బలమ్=సేన, ఏతైః=వీళ్లచేత, ప్రమథితమ్=మథింపబడినదిగా, దృశ్యతే=కనబడుచున్నది.

తా. యుద్ధములో శ్లాఘించుకొనుచున్న ఈ వానరులను చంపవలెనని కోరుచున్నాను. ఎందుచేతననగా వీళ్లు మన సైన్యము నంతను నశింపచేయుచున్నారు. 5

మూ. తతః ప్రచలితాశ్వేన రథేన రథినాం వరః,
హరీనభ్యపతద్దూరాచ్ఛరజాలైరకమ్పనః. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రథినామ్=రథవంతులలో, వరః=శ్రేష్ఠుడైన, అకమ్పనః=అకంపనుడు, ప్రచలితాశ్వేన=నడచుచున్న గుఱ్ఱములు గల, రథేన=రథముచేత, శరజాలైః=బాణసమూహములతో, దూరాత్=దూరమునుండి, హరీన్=వానరులను గూర్చి, అభ్యపతత్=శీఘ్రముగా వచ్చెను.

తా. పిమ్మట రథికులలో శ్రేష్ఠుడైన అకంపనుడు రథమునకు కట్టిన గుఱ్ఱములను అటువైపు తోలించి, దూరమునుండియే బాణసమూహములు ప్రయోగించుచు వానరులను ఎదుర్కొనెను. 6

మూ. న స్థాతుం వానరాః శేకుః కిం పునర్యోద్ధు మాహవే,
అకమ్పనశరైర్భగ్నాః సర్వ ఏవాభిదుద్రువుః. 7

ప్ర. అ. వానరాః=వానరులు, ఆహవే=యుద్ధమునందు, స్థాతుమ్=నిలచుటకు గూడ, న శేకుః=సమర్థులు కాలేదు. యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, కిం పునః=చెప్పనేల ? సర్వే ఏవ=అందరూ, అకమ్పనశరైః=అకంపనుని బాణములచేత,

భగ్నాః=ఓడింపబడినవారై, అభిదుద్రువుః=పారిపోయిరి.

తా. వానరులు యుద్ధములో నిలబడుటకు కూడ సమర్థులు కాలేదు. యుద్ధము చేయుట మాట చెప్పవలెనా ! వాళ్లందరూ అకంపనుని బాణాంచేత పలాయితులై పారిపోయిరి. 7

మూ. తాన్ మృత్యువశమాపన్నానకమ్పనశరానుగాన్,
సమీక్ష్య హనుమాన్ జ్ఞాతీనుపతస్థే మహాబలః. 8

ప్ర. అ. అకమ్పనశరానుగాన్=అకంపనుని బాణములను అనుసరించినవారు, మృత్యువశమ్=మృత్యువశమును, ఆపన్నాన్=పొందినవారు అయిన, తాన్=ఆ, జ్ఞాతీన్=జ్ఞాతులను, సమీక్ష్య=చూచి, మహాబలః=గొప్ప బలము గల, హనుమాన్=హనుమంతుడు, ఉపతస్థే=వారిని సమీపించెను.

తా. తన వాళ్లందరూ అకంపనుని బాణాలకు గురియై మృత్యువు వాత పడుచుండుట చూచి మహాబలశాలియైన హనుమంతుడు అక్కడికి వెళ్లెను. 8

మూ. తం మహాప్లవగం దృష్ట్వా సర్వే తే ప్లవగర్షభాః,
సమేత్య సమరే వీరాః సహితాః పర్యవారయన్. 9

ప్ర. అ. వీరాః=వీరులైన, తే=ఆ, సర్వే=సమస్తమైన, ప్లవగర్షభాః=వానర శ్రేష్ఠులు, మహాప్లవగమ్=గొప్ప వానరుడైన (వానరనాయకుడైన), తమ్=అతనిని, దృష్ట్వా=చూచి, సమేత్య=సమీపించి, సహితాః=కలిసినవారై, పర్యవారయన్=చుట్టి నిలబడిరి.

తా. వీరులైన ఆ వానర శ్రేష్ఠు లందరు వానరులలో మహావీరుడైన ఆ హనుమంతుని చూచి, అందరూ కలిసి వచ్చి అతని చుట్టూ చేరిరి. 9

మూ. వ్యవస్థితం హనూమన్తం తే దృష్ట్వా ప్లవగర్షభాః,
బభూవుర్బలవన్తో హి బలవన్తముపాశ్రితాః. 10

ప్ర. అ. తే=ఆ, ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, వ్యవస్థితమ్=నిలచియున్న, హనూమన్తమ్=హనుమంతుని, దృష్ట్వా=చూచి, బలవన్తమ్=బలవంతుడైన, అతనిని, ఉపాశ్రితాః=ఆశ్రయించినవారై, బలవన్తః=బలవంతులు, బభూవుః=అయిరి.

తా. ఆ వానరశ్రేష్ఠు లందరూ అక్కడ యుద్ధసన్నద్ధుడై నిలచి యున్న హనుమంతుని చూచి, మహాబలశాలి యైన అతని అండ దొరకుటచేత తాము కూడ బలవంతులైరి. 10

మూ. అకమ్పనస్తు శైలాభం హనూమన్తమవస్థితమ్,
మహేన్ద్ర ఇవ ధారాభిః శరైరభివవర్ష హ. 11

ప్ర. అ. అకమ్పనస్తు=అకంపనుడు, అవస్థితమ్=నిలచి ఉన్న, శైలాభమ్=పర్వతము వంటి, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, ధారాభిః=వర్షధారలచేత, మహేన్ద్రః ఇవ=మహేంద్రుడు వలె, శరైః=బాణములచేత, అభివవర్ష హ=వర్షించెను.

తా. అకంపనుడు పర్వతము వలె నిలచి ఉన్న హనుమంతునిపై దేవేంద్రుడు వర్షధారలు కురిపించినట్లు బాణములు కురిపించెను. 11

మూ. అచిన్తయిత్వా బాణౌఘాన్ శరీరే పతితాన్ కపిః,
అకమ్పనవధార్థాయ మనో దధ్రే మహాబలః. 12

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, కపిః=హనుమంతుడు, శరీరే=శరీరమునందు, పతితాన్=పడిన, బాణౌఘాన్=బాణసముదాయములను, అచిన్తయిత్వా=లెక్కచేయక, అకమ్పనవధార్థాయ=అకంపనుని వధ కొరకు, మనః=మనస్సును, దధ్రే=ధరించెను.

తా. మహాబలశాలియైన హనుమంతుడు తన శరీరముమీద పడుచున్న బాణాలను లెక్కచేయక అకంపనుని చంపుటకై మనస్సులో నిశ్చయము చేసికొనెను. 12

మూ. స ప్రహస్య మహాతేజా హనుమాన్ మారుతాత్మజః,
అభిదుద్రావ తద్రక్షః కమ్పయన్నివ మేదినీమ్. 13

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, సః=ఆ, హనుమాన్=హనుమంతుడు, ప్రహస్య=నవ్వి, మేదినీమ్=భూమిని, కమ్పయన్నివ=కంపింపచేయుచున్నవాడు వలె, తత్ రక్షః=ఆ రాక్షసుని గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. మహాతేజశ్శాలి, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు నవ్వి, భూమిని కంపింపచేయుచున్నట్లు ఆ రాక్షసునిమీదికి వెళ్లెను. 13

మూ. తస్యాథ నర్దమానస్య దీప్యమానస్య తేజసా,
బభూవ రూపం దుర్ధర్షం దీప్తస్యేవ విభావసోః. 14

ప్ర. అ. అథ=అటుపిమ్మట, నర్దమానస్య=గర్జించుచున్నవాడు, తేజసా=తేజస్సుతో, దీప్యమానస్య=మండుచున్నవాడు అయిన, తస్య=ఆ హనుమంతునియొక్క, రూపమ్=రూపము, దీప్తస్య=ప్రజ్వలించుచున్న, విభావసోః ఇవ=అగ్నియొక్క రూపము వలె, దుర్ధర్షమ్=ఎదిరింప శక్యము కానిది, బభూవ=ఆయెను.

తా. అప్పుడు గర్జించుచు తేజస్సుతో ప్రకాశించుచున్న హనుమంతుని రూపము మండుచున్న అగ్ని రూపము వలె ఎదిరింప శక్యము కాకుండెను. 14

మూ. ఆత్మానం త్వప్రహరణం జ్ఞాత్వా క్రోధసమన్వితః,
శైలముత్పాటయామాస వేగేన హరిపుఙ్గవః. 15

ప్ర. అ. హరిపుఙ్గవః=వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, ఆత్మానమ్=తనను, అప్రహరణమ్=ఆయుధము లేనివానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, క్రోధసమన్వితః=కోపముతో కూడినవాడై, వేగేన=వేగముతో, శైలమ్=పర్వతమును, ఉత్పాటయామాస=పెకలించెను.

తా. హనుమంతుడు తన చేతిలో ఆయుధమేదీ లేదను విషయము గుర్తించి కోపావిష్టుడై,వేగముగా ఒక పర్వతమును పెకలించెను. 15

మూ. గృహీత్వా సుమహాశైలం పాణినైకేన మారుతిః
స వినద్య మహానాదం భ్రామయామాస వీర్యవాన్ 16

ప్ర. అ. సః=ఆ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, మారుతిః=హనుమంతుడు, ఏకేన=ఒక, పాణినా=హస్తముతో, సుమహాశైలమ్=చాల గొప్పదైన పర్వతమును, గృహీత్వా=గ్రహించి, మహానాదమ్=గొప్ప నాదమును, వినద్య=అరచి(చేసి), భ్రామయామాస=త్రిప్పెను.

తా. పరాక్రమవంతుడైన ఆ హనుమంతుడు ఒక హస్తముతో గొప్ప పర్వతము గ్రహించి, బిగ్గరగా సింహనాదము చేయుచూ దానిని త్రిప్పెను.16

మూ. తతస్తమభిదుద్రావ రాక్షసేన్ద్రమకమ్పనమ్
పురా హి నముచిం సంఖ్యే వజ్రేణేవ పురన్దరః. 17

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పురా=పూర్వము, పురన్దరః=దేవేంద్రుడు, సంఖ్యే=యుద్ధమునందు, వజ్రేణ=వజ్రముతో, నముచిమివ=నముచినివలె, రాక్షసేన్ద్రమ్=రాక్షసశ్రేష్ఠుడైన, తమ్=ఆ, అకమ్పనమ్=అకంపనుని గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. పూర్వము ఇంద్రుడు వజ్రము ధరించి యుద్ధములో నముచి మీదికి వెళ్లినట్లు రాక్షసనాయకుడైన ఆ అకంపనుని మీదికి శీఘ్రముగా వెళ్లెను. 17

మూ. అకమ్పనస్తు తద్దృష్ట్వా గిరిశృఙ్గం సముద్యతమ్
దూరాదేవ మహాబాణైరర్ధచన్ద్రైర్వ్యదారయత్. 18

ప్ర. అ. అకమ్పనస్తు=అకంపనుడైతే, సముద్యతమ్=ఎత్తబడిన, తత్=ఆ, గిరిశృఙ్గమ్=పర్వతశిఖరమును, దృష్ట్వా=చూచి, దూరాదేవ=దూరమునుండియే, అర్ధచన్ద్రైః=అర్ధచంద్రాకారములైన, మహాబాణైః=గొప్ప బాణములచేత, వ్యదారయత్=చీల్చివేసెను.

తా. అకంపనుడు పైకి ఎత్తబడిన ఆ పర్వతశిఖరమును చూచి దూరమునుండియే అర్ధచంద్రాకారములైన పెద్ద బాణములతో దానిని చీల్చివేసెను.

మూ. తం పర్వతాగ్రమాకాశే రక్షోబాణవిదారితమ్
వికీర్ణం పతితం దృష్ట్వా హనుమాన్ క్రోధమూర్ఛితః 19

ప్ర. అ. ఆకాశే=ఆకాశమునందు, రక్షోబాణవిదారితమ్=రాక్షసుని బాణములచేత చీల్చబడిన, వికీర్ణమ్=చిమ్మబడిన, పతితమ్=పడిపోయిన, తమ్=ఆ, పర్వతాగ్రమ్=పర్వతశిఖరమును, దృష్ట్వా=చూచి, హనుమాన్=హనుమంతుడు, క్రోధమూర్ఛితః=క్రోధముచేత వ్యాపించబడినవాడు అయ్యెను.

తా. ఆకాశమునందే రాక్షసుని బాణములచేత చీల్చబడి, చిమ్మబడినట్లు క్రింద పడిపోయిన ఆ పర్వతశిఖరమును చూచి హనుమంతుడు మిక్కిలి కోపించెను. 19

మూ. సోఽశ్వకర్ణం సమాసాద్య రోషదర్పాన్వితో హరిః
తూర్ణముత్పాటయామాస మహాగిరిమివోచ్ఛ్రితమ్. 20

ప్ర. అ. సః=ఆ, హరిః=హనుమంతుడు, రోషదర్పాన్వితః=కోపముతోను దర్పముతోను కూడినవాడై, మహాగిరిమివ=మహాపర్వతము వలె, ఉచ్ఛ్రితమ్=ఉన్నతమైన, అశ్వకర్ణమ్=మద్దిచెట్టును, సమాసాద్య=పొంది, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్పాటయామాస=పెకలించెను.

తా. రోషదర్పములతో నిండిన ఆ హనుమంతుడు ఉన్నతమైన మహాపర్వతము వలె ఉన్న మద్దిచెట్టును సమీపించి శీఘ్రముగా దానిని పెకలించెను. 20

మూ. తం గృహీత్వా మహాస్కంధం సోఽశ్వకర్ణం మహాద్యుతిః
ప్రగృహ్య పరయా ప్రీత్యా భ్రామయామాస భూతలే. 21

ప్ర. అ. మహాద్యుతిః=గొప్ప కాంతి గల, సః=అతడు, మహాస్కంధమ్=పెద్దమాను గల, తమ్ అశ్వకర్ణమ్=ఆ మద్దిచెట్టును గృహీత్వా=గ్రహించి, పరయా=గొప్ప, ప్రీత్యా=సంతోషముతో, ప్రగృహ్య=గట్టిగా పట్టుకొని, భూతలే=నేల మీద, భ్రామయామాస=త్రిప్పెను.

తా. గొప్ప తేజస్సుగల హనుమంతుడు పెద్ద మాను గల ఆ మద్దిచెట్టును పెకలించి, దానిని ఉత్సాహముతో గట్టిగా పట్టుకొని, నేలమీద నిలబడి త్రిప్పెను.

మూ. ప్రధావన్నురువేగేన బభంజ తరసా ద్రుమాన్,
హనూమాన్ పరమక్రుద్ధశ్చరణైర్దారయన్ మహీమ్. 22

ప్ర. అ. పరమక్రుద్ధః=మిక్కిలి కోపించిన, హనుమాన్=హనుమంతుడు, ప్రధావన్=పరుగెత్తుచు, ఉరువేగేన=గొప్పవేగము చేత, చరణైః=పాదములచేత, తరసా=బలముచేత, ద్రుమాన్=వృక్షములను, బభఞ్జ=విరచెను.

తా. చాల కోపించిన హనుమంతుడు పాదన్యాసములచేత భూమిని బ్రద్దలు కొట్టుచు, మహావేగముతో పరుగెత్తుచు, బలము చేత వృక్షములను విరుగగొట్టెను. 22

మూ. గజాంశ్చ సగజారోహాన్సరథాన్రథినస్తథా,
జఘాన హనుమాన్ ధీమాన్ రాక్షసాంశ్చ పదాతిగాన్. 23

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, సగజారోహాన్=మావటి వాళ్లతో కూడిన, గజాంశ్చ=గజములను, తథా=మరియు, సరథాన్=రథములతో కూడిన, రథినః=రథికులను, ధీమాన్=భయంకరులైన, పదాతిగాన్=కాలిబంటులైన, రాక్షసాన్ చ=రాక్షసులను, జఘాన=చంపెను.

తా. హనుమంతుడు మావటి వాళ్లతో సహ ఏనుగులను, రథములతో కూడిన రథికులను, భయంకరులైన కాలిబంటులుగా ఉన్న రాక్షసులను చంపెను.

మూ. తమన్తకమివ క్రుద్ధం సద్రుమం ప్రాణహారిణమ్,
హనూమన్తమభిప్రేక్ష్య రాక్షసా విప్రదుద్రువుః. 24

ప్ర. అ. క్రుద్ధమ్=కోపించిన, అన్తకమివ=యముడువలె ఉన్న, సద్రుమమ్=వృక్షముతో కూడిన, ప్రాణహారిణమ్=ప్రాణములు తీయుచున్న, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని, అభిప్రేక్ష్య=చూచి, రాక్షసాః=రాక్షసులు, విప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. వృక్షము గ్రహించి ప్రాణములు తీయుచు, కోపించిన యముడు వలె ఉన్న ఆ హనుమంతుని చూచి రాక్షసులు పారిపోయిరి. 24

మూ. తమాపతన్తం సంక్రుద్ధం రాక్షసానాం భయావహమ్,
దదర్శాకమ్పనో వీరశ్చుక్షోభ చ ననాద చ. 25

ప్ర. అ. ఆపతన్తమ్=వచ్చి మీదపడుచున్నవాడు, రాక్షసానామ్=రాక్షసులకు, భయావహమ్=భయము కలిగించువాడు, సంక్రుద్ధమ్=కోపించిన వాడు అయిన, తమ్=ఆ హనుమంతుని, వీరః=వీరుడైన, అకమ్పనః=అకంపనుడు, దదర్శ=చూచెను. చుక్షోభ చ=క్షోభించెను; ననాద చ=ధ్వని చేసెను కూడ.

తా. కోపముతో వచ్చి మీదపడుచు రాక్షసులకు భయము కలిగించుచున్న ఆ హనుమంతుణ్ణి వీరుడైన అకంపనుడు చూచి, క్షోభించిన వాడై బిగ్గరగా అరచెను. 25

మూ. స చతుర్దశభిర్బాణైర్నిశితైర్దేహదారణైః,
నిర్బిభేద మహావీర్యం హనూమన్తమకమ్పనః. 26

ప్ర. అ. సః అకమ్పనః=ఆ అకంపనుడు, నిశితైః=వాడియైన, దేహదారణైః=దేహమును చీల్చివేయు, దశభిః=పది, బాణైః=బాణములచేత, మహావీర్యమ్=గొప్ప వీర్యము గల, హనూమన్తమ్=హనుమంతుని, నిర్బిభేద=భేదించెను.

తా. ఆ అకంపనుడు దేహమును చీల్చి వేయు పదునాలుగు బాణములచేత మహాపరాక్రమవంతుడైన హనుమంతుణ్ణి చీల్చివేసెను. 26

మూ. స తథా విప్రకీర్ణస్తు నారాచైః శితశక్తిభిః,
హనూమాన్ దదృశే వీరః ప్రరూఢ ఇవ సానుమాన్. 27

ప్ర. అ. శితశక్తిభిః=వాడియైన శక్తి గల, నారాచైః=నారాచబాణముల చేత, తథా=ఆ విధముగా, విప్రకీర్ణః=చిమ్మబడిన, వీరః=వీరుడైన, సః హనూమాన్=ఆ హనుమంతుడు, ప్రరూఢః=అధికముగా వృక్షములు మొలచిన, సానుమానివ=పర్వతము వలె, దదృశే=చూడబడెను.

తా. వాడియైన శక్తి గల నారాచబాణములు ఆ విధముగా శరీరముపై అంతటా గ్రుచ్చుకొనగా వీరుడైన హనుమంతుడు చెట్లు మొలచిన పర్వతము వలె కనబడెను. 27

మూ. విరరాజ మహావీర్యో మహాకాయో మహాబలః,
పుష్పితాశోకసంకాశో విధూమ ఇవ పావకః. 28

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గలవాడు, మహాకాయః=గొప్ప శరీరము గలవాడు, మహాబలః=గొప్ప బలము గలవాడు అయిన హనుమంతుడు, పుష్పితాశోకసంకాశః=పుష్పించిన అశోకముతో సమానుడై, విధూమః=ధూమములేని, పావకః ఇవ=అగ్నివలె, విరరాజ=ప్రకాశించెను.

తా. గొప్ప పరాక్రమము, బలము గొప్ప శరీరము గల హనుమంతుడు అప్పుడు పుష్పించిన అశోకవృక్షము వలె, ధూమము లేని అగ్ని వలె ప్రకాశించెను.

మూ. తతోఽన్యం వృక్షముత్పాట్య కృత్వా వేగమనుత్తమమ్,
శిరస్యభిజఘానాశు రాక్షసేన్ద్రమకమ్పనమ్. 29

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అనుత్తమమ్=చాల గొప్పదైన, వేగమ్=వేగమును, కృత్వా=చేసి, అన్యమ్=మరియొక, వృక్షమ్=వృక్షమును, ఉత్పాట్య=పెకలించి, ఆశు=శీఘ్రముగా, రాక్షసేన్ద్రమ్=రాక్షస నాయకుడైన, అకమ్పనమ్=అకంపనుని, శిరసి=తలమీద, జఘాన=కొట్టెను.

తా. పిమ్మట గొప్ప వేగమును చూపి, మరియొక వృక్షమును పెకలించి, రాక్షసనాయకుడైన అకంపనుని వెంటనే శిరస్సుమీద కొట్టెను. 29

మూ. స వృక్షేణ హతస్తేన సక్రోధేన మహాత్మనా,
రాక్షసో వానరేన్ద్రేణ పపాత చ మమార చ. 30

ప్ర. అ.సక్రోధేన=కోపముతో కూడిన, మహాత్మనా=మహాత్ముడైన, తేన వానరేన్ద్రేణ=ఆ హనుమంతునిచేత, వృక్షేణ=వృక్షముచేత, హతః=కొట్టబడిన, సః=ఆ, రాక్షసః=రాక్షసుడు, పపాత=పడిపోయెను; మమార చ=మరణించెను కూడ.

తా. కోపముతో కూడిన మహాత్ముడైన ఆ హనుమంతుడు వృక్షముతో కొట్టగా ఆ రాక్షసుడు మరణించి నేలపై కూలెను. 30

మూ. తం దృష్ట్వా నిహతం భూమౌ రాక్షసేన్ద్రమకమ్పనమ్,
వ్యథితా రాక్షసాః సర్వే క్షితికమ్ప ఇవ ద్రుమాః. 31

ప్ర. అ.నిహతమ్=చంపబడిన, రాక్షసేన్ద్రమ్=రాక్షసనాయకుడైన, తమ్ అకమ్పనమ్=ఆ అకంపనుణ్ణి, భూమౌ=నేలమీద, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, క్షితికమ్పే=భూకంపమునందు, ద్రుమాః ఇవ=వృక్షముల వలె, వ్యథితాః=వ్యథచెందినారు.

తా. చచ్చి నేలపై పడియున్న రాక్షసనాయకుడైన ఆ అకంపనుని చూచి రాక్షసులందరూ, భూమి కంపించినప్పుడు వృక్షముల వలె వ్యథ చెందిరి.

మూ. త్యక్తప్రహరణాః సర్వే రాక్షసాస్తే పరాజితాః,
లఙ్కామభియయు స్త్రాసాద్వానరై స్తైరభిద్రుతాః. 32

ప్ర. అ. పరాజితాః=ఓడింపబడిన, తే=ఆ, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, త్యక్తప్రహరణాః=విడువబడిన ఆయుధములు గలవారై, తైః=ఆ, వానరైః=వానరులచేత, అభిద్రుతాః=తరుమబడినవారై, త్రాసాత్=భయమువలన, లఙ్కామ్=లంకను గూర్చి, అభియయుః=వెళ్లిరి.

తా. ఓడిపోయిన రాక్షసు లందరూ ఆయుధములు విడచి భయముతో లంకవైపు పరుగెత్తుచుండగా వానరులు వారిని తరిమివేసిరి. 32

మూ. తే ముక్తకేశాః సంభ్రాన్తా భగ్నమానాః పరాజితాః,
స్రవచ్ఛ్రమజలైరఙ్గైః శ్వసన్తో విప్రదుద్రువుః. 33

ప్ర. అ. సంభ్రాన్తాః=తొందరపడుచున్నవారు, భగ్నమానాః=భగ్నమైన అహంకారము గలవారు, పరాజితాః=ఓడింపబడినవారు, ముక్తకేశాః=విడిపోయిన

జుట్టులు గలవారు అయిన, తే=ఆ రాక్షసులు, ప్రవచ్ఛ్రమజలైః=స్రవించుచున్న చెమట గల, అఙ్గైః=దేహములతో, శ్వసన్తః=శ్వాసలు విడచుచు, విప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. ఓడిపోయి, అహంకారము నశించి, తొందరపడుచు, జుట్టులు ఊడిపోయిన, ఆ రాక్షసులు చెమట కారుచున్న శరీరములతో ఒగర్చుచు పరుగెత్తిరి. 33

మూ. అన్యోన్యం తే ప్రమథ్నన్తో వివిశుర్నగరం భయాత్,
పృష్ఠతస్తే తు సంమూఢాః ప్రేక్షమాణా ముహుర్ముహుః. 34

ప్ర. అ. తే=వాళ్లు, భయాత్=భయమువలన, పృష్ఠతః=వెనుకకు, ముహుర్ముహుః=మాటిమాటికి, ప్రేక్షమాణాః=చూచుచున్నవారై, సంమూఢాః=సంమూఢులై, అన్యోన్యమ్=పరస్పరము, ప్రమథ్నన్తః=మథించుచున్నవారై, (త్రోసికొనుచున్నవారై,), నగరమ్=లంకానగరమును, వివిశుః=ప్రవేశించిరి.

తా. ఆ రాక్షసులు, ఏమి చేయవలెనో తోచక, భయముతో మాటి మాటికి వెనుకకు తిరిగి చూచుచు, ఒకరినొకరు త్రోసికొనుచు లంకలో ప్రవేశించిరి.34

మూ. తేషు లఙ్కాం ప్రవిష్టేషు రాక్షసేషు మహాబలాః,
సమేత్య హరయః సర్వే హనూమన్తమపూజయన్. 35

ప్ర. అ. తేషు రాక్షసేషు=ఆ రాక్షసులు, లఙ్కామ్=లంకను, ప్రవిష్టేషు=ప్రవేశించినవా రగుచుండగా, సర్వే=సమస్తమైన, మహాబలాః=గొప్ప బలము గల, హరయః=వానరులు, సమేత్య=చేరి, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, అపూజయన్=పూజించిరి.

తా. ఆ రాక్షసులు లంకలో ప్రవేశించిన పిమ్మట గొప్ప బలము గల ఆ వానరు లందరూ చేరి హనుమంతుణ్ణి పూజించిరి. 35

మూ. సోఽపి ప్రహృష్టస్తాన్ సర్వాన్ హరీన్ సంప్రత్యపూజయత్,
హనుమాన్ సత్త్వసంపన్నో యథార్హమనుకూలతః. 36

ప్ర. అ. సత్త్వసంపన్నః=బలముతో కూడిన, సః=ఆ, హనుమానపి=హనుమంతుడు కూడ , అనుకూలతః=అనుకూలముగా, యథార్హమ్=తగు విధముగా, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, హరీన్=వానరులను, సంప్రత్యపూజయత్=పూజించెను.

తా. మహాబలశాలియైన ఆ హనుమంతుడు కూడ ఆ వానరు లందరినీ తగు విధముగా, అనుకూలముగా ఉండురీతిలో గౌరవించెను. 36

మూ. వినేదుశ్చ యథాప్రాణం హరయో జితకాశినః,

చక్రుశుశ్చ పునస్తత్ర సప్రాణానేవ రాక్షసాన్. 37

ప్ర. అ. జితకాశినః=జయించబడిన శత్రువుల ప్రకాశము గల, హరయః=వానరులు, యథాప్రాణమ్=ప్రాణబలమును అనుసరించి, వినేదుః=ధ్వని చేసిరి. తత్ర=అక్కడ, సప్రాణానేవ=ప్రాణములతో ఉండగానే, రాక్షసాన్=రాక్షసులను, పునః=మరల, చక్రుశుశ్చ=ఈడ్చిరి.

తా. శత్రువుల ప్రకాశమును అణగ ద్రొక్కిన వానరులు బిగ్గరగా ధ్వని చేయుచు ప్రాణాంతో ఉండగానే ఆ రాక్షసులను నేలమీద ఈడ్చిరి. 37

మూ. స వీరశోభామభజన్మహాకపిః
సమేత్య రక్షాంసి నిహత్య మారుతిః,
మహాసురం భీమమమిత్రనాశనః
విష్ణుర్యథైవోరుబలం చమూముఖే. 38

ప్ర. అ. మహాకపిః=గొప్ప వానరుడైన, సః మారుతిః=ఆ హనుమంతుడు, చమూముఖే=సేనాగ్రమునందు, రక్షాంసి=రాక్షసులను, సమేత్య=పొంది, నిహత్య=చంపి, భీమమ్=భయంకరుడు, అమిత్రనాశనమ్=శత్రువులను నశింపచేయువాడు, ఉరుబలమ్=గొప్ప బలము గలవాడు అయిన, మహాసురమ్=గొప్ప రాక్షసుల్ని (చంపి), విష్ణుర్యథా=విష్ణువు వలె, వీరశోభామ్=వీరుని శోభను, అభజత్=పొందెను.

తా. వానరశ్రేష్ఠుడైన, హనుమంతుడు సేనాగ్రమునందు రాక్షసులను చేరి వారినందరినీ సంహరించి, భయంకరుడు, శత్రు సంహారకుడు, గొప్ప బలము కలవాడు అయిన మహాసురుల్ని (మధుకైటభాదులను) చంపిన విష్ణువు వలె వీరశోభతో ప్రకాశించెను. 38

మూ. అపూజయన్ దేవగణాస్తదా కపిం
స్వయం చ రామోఽతిబలశ్చ లక్ష్మణః,
తథైవ సుగ్రీవముఖాః ప్లవంగమా
విభీషణశ్చైవ మహాబలస్తథా. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్పఞ్చాశః సర్గః

ప్ర. అ. తదా=అప్పుడు, దేవగణాః=దేవతలగణములు, స్వయమ్=స్వయముగా, రామః=రాముడు, అతిబలః=గొప్ప బలము గల, లక్ష్మణః చ=లక్ష్మణుడు, తథైవ=మరియు, సుగ్రీవముఖాః=సుగ్రీవుడు మొదలైన, ప్లవంగమాః=వానరులు, తథా=మరియు, మహాబలః=గొప్ప బలము గల, విభీషణశ్చైవ=విభీషణుడు, కపిమ్=హనుమంతుని, అపూజయన్=పూజించిరి.

తా. అప్పుడు దేవతాగణములు, స్వయముగా రాముడు, గొప్ప బలము గల లక్ష్మణుడు, సుగ్రీవుడు మొదలైన వానరులు, గొప్ప బలము గల విభీషణుడు హనుమంతుణ్ణి పూజించిరి. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో
ఏబది ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తపఞ్చాశః సర్గః

[రావణుడు సేనాపతియైన ప్రహస్తుని యుద్ధమునకు పంపుట.]

మూ. అకమ్పనవధం శ్రుత్వా క్రుద్ధో వై రాక్షసేశ్వరః,
కించిద్దీనముఖశ్చాపి సచివాంస్తానుదైక్షత. 1

ప్ర. అ. రాక్షసేశ్వరః=రావణుడు, అకమ్పనవధమ్=అకంపనుని వధను, శ్రుత్వా=విని, క్రుద్ధః=కోపించినవాడై, కించిత్=కొంచెము, దీనముఖః చ అపి=దీనమైన ముఖము కలవాడు కూడ అయి, తాన్=ఆ, సచివాన్=మంత్రులను, ఉదైక్షత=చూచెను.

తా. రావణుడు అకంపనుని వధను గూర్చి విని, కోపించి, కొంచెము దైన్యముతో కూడిన ముఖముతో ఆ మంత్రుల వైపు చూచెను. 1

మూ. స తు ధ్యాత్వా ముహూర్తం తు మన్త్రిభిః సంవిచార్య చ,
తతస్తు రావణః పూర్వదివసే రాక్షసాధిపః, 2
పురీం పరియయౌ లఙ్కాం సర్వగుల్మానవేక్షితుమ్.

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసరాజైన, సః రావణః=ఆ రావణుడు, ముహూర్తమ్=ముహూర్తకాలమును, ధ్యాత్వా=మనస్సులో ఆలోచించి, మన్త్రిభిః=మంత్రులతో, సంవిచార్య చ=ఆలోచించి, తతః=అటుపిమ్మట, పూర్వదివసే=పూర్వాహ్ణమునందు, సర్వగుల్మాన్=సమస్త సేనావ్యూహములను, అవేక్షితుమ్=చూచుటకు, లఙ్కాం పురీమ్=లంకాపురమును గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. రాక్షసరాజైన ఆ రావణుడు కొంచెము సేపు ఆలోచించి, మంత్రులతో కూడ మంతనము చేసి పిదప పూర్వాహ్ణమునందు సేనావ్యూహములను పర్యవేక్షించుటకై లంకానగరములోనికి వెళ్లెను. 2

మూ. తాం రాక్షసగణైర్గుప్తాం గుల్మైర్బహుభిరావృతామ్, 3
దదర్శ నగరీం రాజా పతాకాధ్వజమాలినీమ్.

ప్ర. అ. రాజా=రాజు, రాక్షసగణైః=రాక్షసగణములచేత, గుప్తామ్=రక్షింపబడినది, బహుభిః=అనేకమైన, గుల్మైః=సేనావ్యూహములచేత, ఆవృతామ్=ఆవరించబడినది, పతాకాధ్వజమాలినీమ్=పతాకలయొక్క ధ్వజములయొక్క పంక్తులు గలది అయిన, తాం నగరీమ్=ఆ నగరమును, దదర్శ=చూచెను.

తా. రాక్షసరాజు రాక్షసుల గణములచేత రక్షింపబడుచున్నది, అనేక సేనావ్యూహములతో నిండినది, పతాకల ధ్వజముల పంక్తులతో కూడినది అయిన లంకానగరమును చూచెను. 3

మూ. రుద్ధాం తు నగరీం దృష్ట్వా రావణో రాక్షసేశ్వరః, 4
ఉవాచాత్మహితం కాలే ప్రహస్తం యుద్ధకోవిదమ్.

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, రుద్ధామ్=(శత్రువులచేత) ముట్టడించబడిన, నగరీమ్=పట్టణమును, దృష్ట్వా=చూచి, కాలే=ఆ సమయమునందు, యుద్ధకోవిదమ్=యుద్ధమునందు సమర్థుడైన, ప్రహస్తమ్=ప్రహస్తుని గూర్చి, ఆత్మహితమ్=తనకు హితమైన వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు వానరులచే ముట్టడించబడిన లంకను చూచి, యుద్ధమునందు నిపుణుడైన ప్రహస్తునితో ఆ సమయమునందు తనకు హితమైన వాక్యము పలికెను. 4

మూ. పురస్యోపనివిష్టస్య సహసా పీడితస్య హ, 5
నాన్యం యుద్ధాత్ప్రపశ్యామి మోక్షం యుద్ధవిశారద.

ప్ర. అ. యుద్ధవిశారద=యుద్ధమునందు సమర్థుడా! ఉపనివిష్టస్య= ముట్టడించబడినది, సహసా=హఠాత్తుగా, పీడితస్య=పీడింపబడినదీ అయిన, పురస్య= పురమునకు, యుద్ధాత్=యుద్ధముకంటె, అన్యమ్=మరియొక, మోక్షమ్= మోక్షోపాయమును, న ప్రపశ్యామి=చూడను.

తా. యుద్ధమునందు నేర్పు గల ప్రహస్తుడా! మన పట్టణమును శత్రువులు హఠాత్తుగా ముట్టడించి పీడించుచున్నారు. ఇప్పుడు యుద్ధము తప్ప దీనిని విడిపించు ఉపాయము మరేదీ కనబడుట లేదు. 5

మూ. అహం వా కుమ్భకర్ణో వా త్వం వా సేనాపతిర్మమ, 6
ఇన్ద్రజిద్వా నికుమ్భో వా వహేయుర్భారమీదృశమ్.

ప్ర. అ. అహం వా=నేను గాని, కుమ్భకర్ణో వా=కుంభకర్ణుడు గాని, మమ= నాయొక్క, సేనాపతిః=సేనాపతివైన, త్వం వా=నీవు గాని, ఇన్ద్రజిద్వా=ఇంద్రజిత్తు గాని, నికుమ్భో వా=నికుంభుడు గాని, ఈదృశమ్=ఇట్టి, భారమ్=భారమును, వహేయుః=వహించగలరు.

తా. ఈ భారమును వహించు సామర్థ్యము నాకు, కుంభకర్ణునకు, నా సేనాపతివైన నీకు, ఇంద్రజిత్తునకు, లేదా నికుంభునకు మాత్రమే ఉన్నది.6

మూ. స త్వం బలమతః శీఘ్రమాదాయ పరిగృహ్య చ, 7
విజయాయాభినిర్యాహి యత్ర సర్వే వనౌకసః.

ప్ర. అ. సః త్వమ్=అట్టి నీవు, అతః=ఆ కారణమువలన, శీఘ్రమ్=శీఘ్రముగా, బలమ్=సేనను, ఆదాయ=తీసికొని, పరిగృహ్య చ=నీ అధీనములో

ఉంచుకొని, వనౌకసః=వానరులు, సర్వే=అందరూ, యత్ర=ఎక్కడ ఉన్నారో అక్కడికి, విజయాయ=విజయముకొరకు, అభినిర్యాహి=బయలుదేరుము.

తా. అందువలన నీవు శీఘ్రముగా సైన్యమును తీసికొని, దానికి నాయకుడవై వానరులందరు ఉన్న యుద్ధభూమికి వెళ్లి విజయము సాధించుము.

మూ. విర్ణయాదేవ తూర్ణం చ చలితా హరివాహినీ, 8
నర్దతాం రాక్షసేన్ద్రాణాం శ్రుత్వా నాదం ద్రవిష్యతి.

ప్ర. అ. విర్ణయాదేవ=నీ నిర్ణయమువలననే, తూర్ణమ్=శీఘ్రముగా, చలితా=కదలిపోయిన, హరివాహినీ=వానరసేన, నర్దతామ్=ధ్వనిచేయుచున్న, రాక్షసేన్ద్రాణామ్=రాక్షసనాయకులయొక్క, నాదమ్=ధ్వనిని, శ్రుత్వా=విని, ద్రవిష్యతి=పారిపోగలదు.

తా. నీవు యుద్ధమునకు వెళ్లవలె నని నిర్ణయించినట్లు తెలియగానే భయపడిపోయిన వానరసేన రాక్షసనాయకులు చేయు ధ్వని విని పారిపోగలదు.

మూ. చపలా హ్యవినీతాశ్చ చలచిత్తాశ్చ వానరాః, 9
న సహిష్యన్తి తే నాదం సింహనాదమివ ద్విపాః.

ప్ర. అ. చపలాః=చపలులు, అవినీతాశ్చ=వినయము (శిక్షణము) లేనివారు, చలచిత్తాశ్చ=చంచలమైన చిత్తము గలవారు అయిన, వానరాః=వానరులు, ద్విపాః=ఏనుగులు, సింహనాదమివ=సింహధ్వని వలె, తే=నీయొక్క, నాదమ్=ధ్వనిని, న సహిష్యన్తి=సహించరు.

తా. వానరులు చపలులు; సరియైన యుద్ధశిక్షణ లేనివారు; చంచలచిత్తులు. వాళ్లు, సింహగర్జనమును ఏనుగులు సహింపజాలనట్లు నీ ధ్వని సహించజాలరు. 9

మూ. విద్రుతే చ బలే తస్మిన్ రామః సౌమిత్రిణా సహ, 10
అవశస్తే నిరాలమ్బః ప్రహస్త వశమేష్యతి.

ప్ర. అ. ప్రహస్త=ప్రహస్తుడా ! తస్మిన్ బలే=ఆ సైన్యము, విద్రుతే=పారిపోయినదగుచుండగా, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడ, రామః=రాముడు, అవశః=వశము తప్పినవాడై, నిరాలమ్బః=ఆధారము లేనివాడై, వశమ్=వశమును, ఏష్యతి=పొందగలడు.

తా. ప్రహస్తుడా ! ఆ సైన్యము పారిపోగానే రామలక్ష్మణులు సహాయరహితులై, వశము తప్పి నీకు వశమైపోగలరు. 10

మూ. ఆపత్సంశయితా శ్రేయో నాత్ర నిఃసంశయీకృతా, 11
ప్రతిలోమానులోమం వా యత్తు నో మన్యసే హితమ్.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, సంశయితా=సంశయాస్పదమైన, ఆపత్=ఆపద, శ్రేయః=శ్రేయస్కరము. నిఃసంశయీకృతా=నిఃసంశయముగా చేయబడిన ఆపద, న=శ్రేయస్కరముకాదు. తు=కాని, యత్=దేనిని, నః=మనకు, ప్రతిలోమానులోమం వా=ప్రతికూలమని గాని అనుకూలమని గాని, హితమ్=హితమని గాని, మన్యసే=తలచుచున్నావో (దానిని చెప్పుము).

తా. ఇప్పుడు నీవు యుద్ధానికి వెళ్లిన పక్షాన నీకు విజయము లభించవచ్చును, లభించకపోవచ్చును. యుద్ధానికి వెళ్లకపోయినచో మనకు పరాజయము (ఆపద) నిశ్చితము. అందుచేత తప్పకుండగా కలుగు ఆపదకంటె సంశయాస్పదమైన ఆపద మంచిది. అయితే ఈ విషయమున నీ అభిప్రాయము ప్రకారము ఏది అనుకూలమో, ఏది ప్రతికూలమో, ఏది మనకు హితకరమో ఆలోచించి చెప్పుము. 11

మూ. రావణేనైవముక్తస్తు ప్రహస్తో వాహినీపతిః, 12
రాక్షసేన్ద్రమువాచేద మసురేన్ద్రమివోశనా.

ప్ర. అ. రావణేన=రావణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, వాహినీపతిః=సేనాపతియైన, ప్రహస్తః=ప్రహస్తుడు, ఉశనా=శుక్రుడు, అసురేన్ద్రమివ=అసురుల ప్రభువైన బలిచక్రవర్తిని గూర్చి వలె, రాక్షసేన్ద్రమ్=రావణుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. సేనానాయకుడైన ప్రహస్తుడు రావణుని మాటలు విని శుక్రుడు బలిచక్రవర్తితో పలికినట్లు, ఆతనితో ఇట్లనెను. 12

మూ. రాజన్మన్త్రితపూర్వం నః కుశలైః సహ మన్త్రిభిః, 13
వివాదశ్చాపి నో వృత్తః సమవేక్ష్య పరస్పరమ్.

ప్ర. అ. రాజన్=రాజా! కుశలైః=నేర్పరులైన, మన్త్రిభిః సహ=మంత్రులతో కూడ, నః=మనకు, (మనచేత) మన్త్రితపూర్వమ్=పూర్వము ఆలోచన చేయబడినది. పరస్పరమ్=పరస్పరము, సమవేక్ష్య=చూచి, నః=మనకు, వివాదశ్చ=వివాదము కూడ, వృత్తః=జరిగినది.

తా. రాజా! పూర్వము, నేర్పరులైన మంత్రులతో మనము ఆలోచన చేసి ఉన్నాము. ఆలోచించిన పిదప మన మధ్య పరస్పరము వివాదము కూడ జరిగినది. 13

మూ. ప్రదానేన తు సీతాయాః శ్రేయో వ్యవసితం మయా, 14
అప్రదానే పునర్యుద్ధం దృష్టమేవ తథైవ నః.

ప్ర. అ. సీతాయాః=సీతయొక్క, ప్రదానేన=తిరిగి ఇచ్చివేయుట చేత, మయా= నాచేత, శ్రేయః=శ్రేయస్సు, వ్యవసితమ్=నిశ్చయింపబడినది. అప్రదానే పునః=ఇవ్వకపోయినట్లయితే, నః=మనకు, యుద్ధమ్=యుద్ధము, దృష్టమేవ=చూడబడినది.

తా. ఆ నాడు ఆలోచన చేసినప్పుడు సీతను ఇచ్చివేయుట శ్రేయస్కర మని నా నిశ్చయమును తెలిపితిని. సీతను ఇవ్వకపోయినచో మనకు యుద్ధము తప్ప దను విషయమును కూడ చూచినాము. 14

మూ. సోఽహం దానైశ్చ మానైశ్చ సతతం పూజితస్త్వయా, 15
సాన్త్వైశ్చ వివిధైః కాలే కిం న కుర్యాం హితం తవ.

ప్ర. అ. కాలే=ఆ యా కాలమునందు, దానైశ్చ=దానములచేతను, మానైశ్చ= సత్కారములచేతను, వివిధైః=అనేకవిధములైన,సాన్త్వైశ్చ=మంచి మాట లచేతను, సతతమ్=ఎల్లప్పుడూ, త్వయా=నీచేత, పూజితః=పూజింపబడిన, సః అహమ్=అట్టి నేను, తవ=నీకు, కిమ్=ఏమి, న కుర్యామ్=చేయను ?

తా. ఆ యా సమయములలో దానములచేత, సత్కారములచేత, మంచి మాటలచేత ఎల్లప్పుడు అనేకవిధముల నీచేత ఆదరింపబడిన నేను నీకు హితము చేయకుందునా ? 15

మూ. న హి మే జీవితం రక్ష్యం పుత్రదారధనాని చ, 16
త్వం పశ్య మాం జుహూషన్తం త్వదర్థే జీవితం యుధి.

ప్ర. అ. మే=నాకు, జీవితమ్=జీవితము, రక్ష్యమ్=రక్షించుకొనవల సినది, న హి=కాదు. పుత్రదారధనాని చ=పుత్రులు, భార్యలు, ధనములు కూడ రక్షింపదగినవి కావు. త్వదర్థే=నీ నిమిత్తమై, యుధి=యుద్ధమునందు, జీవితమ్=జీవితమును, జుహూషన్తమ్=హోమము చేయదలచిన, మామ్=నన్ను, త్వమ్=నీవు, పశ్య=చూడుము.

తా. నా పుత్రులనుగాని, భార్యలను గాని, ధనమును గాని, నా ప్రాణములను గాని రక్షించుకొనవలె నను కోరిక నాకు లేదు. నీ నిమిత్తము యుద్ధములో నన్ను నేను హోమము చేయదలచుకున్నాను. చూడుము. 16

మూ. ఏవముక్త్వా తు భర్తారం రావణం వాహినీపతిః, 17
ఉవాచేదం బలాధ్యక్షాన్ ప్రహస్తః పురతః స్థితాన్.

ప్ర. అ. వాహినీపతిః=సేనాపతియైన, ప్రహస్తః=ప్రహస్తుడు, భర్తారమ్=ప్రభువైన, రావణమ్= రావణుని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పురతః=ఎదుట, స్థితాన్=ఉన్న, బలాధ్యక్షాన్=సేనాధ్యక్షులను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. సేనాపతియైన ప్రహస్తుడు ప్రభువైన రావణునితో ఇట్లు పలికి, ఎదుట నున్న సేనాధ్యక్షులతో ఇట్లనెను. 17

మూ. సమానయత మే శీఘ్రం రాక్షసానాం మహాబలమ్, 18
మద్బాణానాం తు వేగేన హతానాం తు రణాజిరే,
అద్య తృప్యన్తు మాంసాదాః పక్షిణః కాననౌకసః. 19

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులయొక్క, మహాబలమ్=గొప్ప సైన్యమును, మే=నాకు, సమానయత=తీసికొనిరండి. కాననౌకసః=అడవులు నివాసముగా గల, పక్షిణః=పక్షులు, మద్బాణానామ్=నా బాణములయొక్క, వేగేన=వేగముచేత, రణాజిరే=యుద్ధభూమియందు, హతానామ్=చంపబడినవారియొక్క, మాంసాదాః=మాంసమును తినునవై, అద్య=ఈనాడు, తృప్యన్తు=తృప్తిచెందుగాక.

తా. రాక్షసుల పెద్ద సైన్యమును నా వద్దకు తీసికొని రండి. ఈ రోజున నా బాణముల గొప్ప వేగముచేత చంపబడిన వానరుల మాంసమును తిని అడవులలో నివసించు పక్షులు తృప్తి చెందుగాక. 18, 19

మూ. తస్య తద్వచనం శ్రుత్వా బలాధ్యక్షా మహాబలాః,
బలముద్యోజయామాసుస్తస్మిన్ రాక్షసమన్దిరే. 20

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల, బలాధ్యక్షాః=సేనాధ్యక్షులు, తస్య=వానియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తస్మిన్=ఆ, రాక్షసమన్దిరే=రాక్షసుని గృహమునందు, బలమ్=సైన్యమును, ఉద్యోజయామాసుః=సన్నద్ధము చేసిరి.

తా. గొప్ప బలము గల సేనాధ్యక్షులు అతని మాటలు విని రావణుని గృహము వద్ద గొప్ప సైన్యమును సిద్ధము చేసిరి. 20

మూ. సా బభూవ ముహూర్తేన తీక్ష్ణైర్నానావిధాయుధైః,
లఙ్కా రాక్షసవీరైస్తై ర్గజైరివ సమాకులా. 21

ప్ర. అ. ముహూర్తేన=ముహూర్తముచేత, సా లఙ్కా=ఆ లంక, గజైః ఇవ=ఏనుగుల వలె, తీక్ష్ణైః=భయంకరులైన, నానావిధాయుధైః=అనేకవిధములైన ఆయుధములు గల, తైః= ఆ, రాక్షసవీరైః=రాక్షసవీరులతో, సమాకులా=వ్యాకులము, బభూవ=అయ్యెను.

తా. అత్యల్పమైన కాలములో ఆ లంక ఏనుగులవంటి భయంకరులైన, అనేక ఆయుధములు ధరించిన రాక్షసవీరులతో నిండిపోయెను. 21

మూ. హుతాశనం తర్పయతాం బ్రాహ్మణాంశ్చ నమస్యతామ్,
ఆజ్యగన్ధప్రతివహః సురభిర్మారుతో వవౌ. 22

ప్ర. అ. (కొందరు రాక్షసులు) హుతాశనమ్=అగ్నిని, తర్పయతామ్=తృప్తి పొందించుచుండగా, బ్రాహ్మణాంశ్చ=బ్రాహ్మణులను, నమస్యతామ్=నమస్కరించుచుండగా, ఆజ్యగన్ధప్రతివహః=నేతి సువాసనను వహించుచున్న, సురభిః=పరిమళించుచున్న, మారుతః=వాయువు, వవౌ=వీచెను.

తా. కొందరు రాక్షసులు అగ్నిలో హోమములు చేయుచు బ్రాహ్మణులకు నమస్కరించుచుండిరి. అపుడు నేతివాసనను మోసికొనుచు పరిమళముతో కూడిన వాయువు వీచెను. 22

మూ. స్రజశ్చ వివిధాకారా జగృహుస్త్వభిమన్త్రితాః,
సంగ్రామసజ్జాః సంహృష్టా ధారయన్ రాక్షసాస్తదా. 23

ప్ర. అ. తదా=అప్పుడు, సంగ్రామసజ్జాః=యుద్ధమునకు సన్నద్ధులైన, రాక్షసాః=రాక్షసులు, వివిధాకారాః=అనేకవిధములైన ఆకారములు గల, అభిమన్త్రితాః=అభిమంత్రించబడిన, స్రజశ్చ=మాలికలను కూడ, జగృహుః=గ్రహించిరి. సంహృష్టాః=సంతోషించినవారై, ధారయన్=ధరించిరి.

తా. యుద్ధానికి సిద్ధమైన రాక్షసులు, అప్పుడు, అభిమంత్రించిన అనేక విధములైన మాలలు గ్రహించి సంతోషించుచు ధరించిరి. 23

మూ. సధనుష్కాః కవచినో వేగా దాప్లుత్య రాక్షసాః,
రావణం ప్రేక్ష్య రాజానం ప్రహస్తం పర్యవారయన్. 24

ప్ర. అ. సధనుష్కాః=ధనస్సులతో కూడినవారు, కవచినః=కవచములు గలవారు, అయిన, రాక్షసాః=రాక్షసులు, రాజానమ్=రాజైన, రావణమ్=రావణుని, ప్రేక్ష్య=చూచి, వేగాత్=వేగమువలన, ఆప్లుత్య=ఎగిరి లేచి, ప్రహస్తమ్=ప్రహస్తుని, పర్యవారయన్=చుట్టి నిలచిరి.

తా. రాక్షసులు ధనస్సులను, కవచములను ధరించి, రాజైన రావణుని చూచి, వేగముగా ఎగిరి లేచి ప్రహస్తుని చుట్టూ నిలచిరి. 24

మూ. అథామన్త్ర్య తు రాజానం భేరీమాహత్య భైరవామ్,
ఆరురోహ రథం యుక్తః ప్రహస్తః సజ్జకల్పితమ్. 25
హయైర్మహాజవైర్యుక్తం సమ్యక్సూతసుసంయతమ్,

మహాజలదనిర్ఘోషం సాక్షాచ్చంద్రార్కభాస్వరమ్. 26
ఉరగధ్వజదుర్ధర్షం సువరూథం స్వపస్కరమ్,
సువర్ణజాలసంయుక్తం ప్రహసన్తమివ శ్రియా. 27

ప్ర. అ. అథ=అటుపిమ్మట, యుక్తః=ఆయుధాదులు ధరించి సిద్ధమైన, ప్రహస్తః=ప్రహస్తుడు, రాజానమ్=రాజును, ఆమన్త్ర్య=ఆమంత్రించి, (సెలవు తీసికొని), భైరవామ్=భయంకరమైన, భేరీమ్=భేరిని, ఆహత్య=మ్రోగించి, సజ్జకల్పితమ్= సిద్ధముగా ఏర్పరుపబడినది, మహాజవైః=గొప్ప వేగము గల, హయైః=గుఱ్ఱములతో, యుక్తమ్=కట్టబడినది, సమ్యక్=బాగుగా, సూతసుసంయతమ్=సారథిచేత అదుపులో ఉంచబడినది, మహాజలదనిర్ఘోషమ్=గొప్ప మేఘమువంటి ధ్వని గలది, సాక్షాత్=సాక్షాత్తు, చన్ద్రార్కభాస్వరమ్=చంద్రసూర్యు లవలె ప్రకాశించునది, ఉరగధ్వజదుర్ధర్షమ్=సర్పధ్వజముతో ఎదిరింప శక్యముకానిది, సువరూథమ్=మంచి రథగుప్తి గలది, స్వపస్కరమ్=మంచి చక్రములు గలది, సువర్ణజాలసంయుక్తమ్=బంగారు జాలముతో (కిటికీ లేదా అలంకారార్థమైన వల) ప్రకాశించుచున్నది అయిన, శ్రియా=శోభతో, ప్రహసన్తమివ=నవ్వుచున్నది వలె ఉన్న, రథమ్=రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిదప ప్రహస్తుడు రావణుని అనుజ్ఞ పొంది, భయంకరమైన భేరీ మ్రోగించి, ఆయుధములు ధరించి, తనకొరకై సిద్ధము చేయబడిన రథము నెక్కెను. మంచి వేగము గల గుఱ్ఱములు కట్టిన ఆ రథమును సారథి బాగుగా అదుపులో ఉంచుకొనెను. సూర్యచంద్రుల వంటి కాంతి గల ఆ రథము ధ్వని మేఘముల ఉరుములు వలె ఉండెను. చక్కగా రక్షింపబడిన మధ్యభాగము, మంచి చక్రములు గల ఆ రథముపై కట్టిన సర్పచిహ్నాంకితమైన ధ్వజము చూచుటకు భయంకరముగా ఉండెను. బంగారు జాలము కట్టి అలంకరించిన ఆ రథము శోభతో నవ్వుచున్నదా అన్నట్లు ఉండెను. 25-27

మూ. తతస్తం రథమాస్థాయ రావణార్పితశాసనః,
లఙ్కాయా నిర్యయౌ తూర్ణం బలేన మహతా వృతః. 28

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణార్పితశాసనః=రావణునిచేత అర్పింపబడిన (ఇవ్వబడిన) శాసనము గల అతడు, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, వృతః=కూడిన వాడై, తూర్ణమ్=శీఘ్రముగా, లఙ్కాయాః=లంకనుండి, నిర్యయౌ=బయలుదేరెను.

తా. రావణుని చేత ఆజ్ఞాపింపబడిన ఆ ప్రహస్తుడు రథము నెక్కి, పెద్ద సైన్యము వెంట రాగా లంకనుండి బయలుదేరెను. 28

మూ. తతో దున్దుభినిర్ఘోషః పర్జన్యనినదోపమః,

వాదిత్రాణాం చ నినదః పూరయన్నివ మేదినీమ్, 29
శుశ్రువే శఙ్ఖశబ్దశ్చ ప్రయాతే వాహినీపతౌ.

ప్ర. అ. వాహినీపతౌ=సేనాపతి, ప్రయాతే=బయలుదేరినవాడగుచుండగా, తతః=అటుపిమ్మట, పర్జన్యనినదోపమః=మేఘధ్వనితో సమానమైన, దున్దుభినిర్ఘోషః=దుందుభిధ్వని, వాదిత్రాణామ్=వాద్యములయొక్క, నినదః చ=ధ్వని, శఙ్ఖశబ్దశ్చ=శంఖముల ధ్వని, మేదినీమ్=భూమిని, పూరయన్నివ=నింపుచున్నది వలె, శుశ్రువే=వినబడెను.

తా. సేనాపతియైన ప్రహస్తుడు బయలుదేరగానే మేఘధ్వని వంటి భేరీల ధ్వని, వాద్యముల ధ్వని, శంఖముల ధ్వని, భూమిని నింపివేయుచున్నట్లు వినబడెను. 29

మూ. నినదన్తః స్వరాన్ ఘోరాన్ రాక్షసా జగ్మురగ్రతః, 30
భీమరూపా మహాకాయాః ప్రహస్తస్య పురఃసరాః.

ప్ర. అ. భీమరూపాః=భయంకరములైన రూపములు గలవారు, మహాకాయాః =పెద్ద దేహములు గలవారు అయిన, రాక్షసాః=రాక్షసులు, ఘోరాన్=భయంకరములైన, స్వరాన్=స్వరములను, నినదన్తః=ధ్వనిచేయుచు, ప్రహస్తస్య=ప్రహస్తునికి, పురఃసరాః=ముందు నడచు యోధులుగా, అగ్రతః=ఎదుట, జగ్ముః=వెళ్ళిరి.

తా. భయంకరములైన రూపములు, పెద్ద శరీరములు గల రాక్షసులు ఘోరములైన శబ్దములు చేయుచు ప్రహస్తుని ముందు వెళ్ళిరి. 30

మూ. నరాన్తకః కుమ్భహనుర్మహానాదః సమున్నతః, 31
ప్రహస్తసచివా హ్యేతే నిర్యయుః పరివార్య తమ్.

ప్ర. అ. నరాన్తకః=నరాంతకుడు, కుమ్భహనుః=కుంభహనువు, మహానాదః=మహానాదుడు, సమున్నతః=సమున్నతుడు, ప్రహస్తసచివాః=ప్రహస్తుని మంత్రులైన (సహాయులైన) ఏతే=వీరు, తమ్=అతనిని, పరివార్య=చుట్టి, నిర్యయుః=బయలుదేరిరి.

తా. నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు అను ప్రహస్తుని సచివులైన రాక్షసులు అతని నలువైపులా నడచుచు వెళ్ళిరి. 31

మూ. వ్యూహేనైవ సుఘోరేణ పూర్వద్వారాత్తు నిర్యయౌ, 32
గజయూథనికాశేన బలేన మహతా వృతః.

ప్ర. అ. సః=అతడు, వ్యూహేనైవ=వ్యూహముగా ఏర్పరుపబడినది

వలె, మహోరేణ=చాల భయంకరమైన గజయూథనికాశేన=ఏనుగుల గుంపుతో సమానమైన, మహతా=గొప్పదైన, బలేన=సేనతో, వృతః=కూడినవాడై, పూర్వ ద్వారాత్=తూర్పు ద్వారమునుండి, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. వ్యూహముగా ఏర్పరుపబడినది వలె చాల భయంకరమైన, ఏనుగుల గుంపువలె ఉన్న గొప్ప సేనతో కూడినవాడై అతడు తూర్పుద్వారమునుండి బయలుదేరెను. 32

మూ. సాగరప్రతిమౌఘేన వృతస్తేన బలేన సః, 33
ప్రహస్తో నిర్యయౌ క్రుద్ధః కాలాన్తకయమోపమః.

ప్ర. అ. కాలాన్తకయమోపమః=ప్రళయకాలమునందు వినాశకారియైన యమునితో సమానుడైన, క్రుద్ధః=కోపించిన, సః ప్రహస్తః=ఆ ప్రహస్తుడు, సాగరప్రతిమౌఘేన=సాగరముతో సమానమైన రాక్షససమురాయము గల, తేన=ఆ, బలేన=సేనతో, వృతః=కూడినవాడై, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. ప్రళయకాలమునందు ప్రాణులను నశింపచేయు యమునితో సమానుడైన, కోపించిన ఆ ప్రహస్తుడు సముద్రములో సమానమైన సమూహము గల ఆ సైన్యముతో కూడినవాడై బయల్వెడలెను. 33

మూ. తస్య నిర్యాణఘోషేణ రాక్షసానాం చ నర్దతామ్, 34
లఙ్కాయాం సర్వభూతాని వినేదుర్వికృతైః స్వరైః.

ప్ర. అ. తస్య=అతనియొక్క, నిర్యాణఘోషేణ=బయలుదేరినపుడు చేయబడిన వాద్యాదుల ధ్వనిచేతను, నర్దతామ్=ధ్వనిచేయుచున్న, రాక్షసానాం చ=రాక్షసుల ధ్వనిచేతను, లఙ్కాయామ్=లంకయందు, సర్వభూతాని=అన్ని భూతములు, వికృతైః=వికృతములైన, స్వరైః=స్వరములతో, వినేదుః=ధ్వనిచేసినవి.

తా. అతడు ప్రయాణమైనప్పుడు వెడలిన వాద్యాదుల ధ్వనిచేతను, గర్జించుచున్న రాక్షసుల ధ్వని చేతను లంకలోని ప్రాణు లన్నీ వికృతస్వరములలో అరచినవి. 34

మూ. వ్యభ్రమాకాశమావిశ్య మాంసశోణితభోజనాః, 35
మణ్డలాన్యపసవ్యాని ఖగాశ్చక్రూ రథం ప్రతి.

ప్ర. అ. మాంసశోణితభోజనాః=మాంసరక్తములు భోజనముగా గల, ఖగాః=పక్షులు, వ్యభ్రమ్=మేఘములు లేని, ఆకాశమ్=ఆకాశమును, ఆవిశ్య=ప్రవేశించి, రథం ప్రతి=రథమును గూర్చి, అపసవ్యాని=అపసవ్యములైన, మణ్డలాని=మండలాకారమున తిరుగుటను, చక్రుః=చేసినవి.

తా. మాంసరక్తములను తిను పక్షులు మేఘములు లేని ఆకాశములో

ప్రవేశించి, రథము వైపు అపసవ్యముగా పైన తిరిగెను. 35

మూ. వమన్త్యః పావకజ్వాలాః శివా ఘోరా వవాశిరే, 36
అన్తరిక్షాత్పపాతోల్కా వాయుశ్చ పరుషం వవౌ.

ప్ర. అ. ఘోరాః=భయంకరములైన, శివాః=ఆడనక్కలు, పావకజ్వాలాః=అగ్నిజ్వాలలను, వమన్త్యః=కక్కుచున్నవై, వవాశిరే=కూసినవి. అన్తరిక్షాత్=ఆకాశమునుండి, ఉల్కా=ఉల్క, పపాత=పడెను. వాయుశ్చ=వాయువు కూడ, పరుషమ్=పరుషముగా, వవౌ=వీచెను.

తా. భయంకరములైన ఆడనక్కలు అగ్నిజ్వాలలను కక్కుచు కూసినవి. అంతరిక్షమునుండి ఉల్క పడెను. వాయువు పరుషముగా వీచెను.

మూ. అన్యోన్యమభిసంరబ్ధా గ్రహాశ్చ న చకాశిరే, 37
మేఘాశ్చ ఖరనిర్ఘోషా రథస్యోపరి రక్షసః,
వవర్షూ రుధిరం చాస్య సిషిచుశ్చ పురఃసరాన్. 38

ప్ర. అ. గ్రహాశ్చ=గ్రహములు, అన్యోన్యమ్=పరస్పరము, అభిసంరబ్ధాః=యుద్ధము చేయుచున్నవై, న చకాశిరే=ప్రకాశించలేదు. రక్షసః=రాక్షసునియొక్క, రథస్య=రథముయొక్క, ఉపరి=పైన, మేఘాశ్చ=మేఘములు, ఖరనిర్ఘోషాః=పరుషమైన ధ్వని గలవై, రుధిరమ్=రక్తమును, వవర్షుః=వర్షించినవి. పురఃసరాన్=ముందునడచువారిని, సిషిచుశ్చ=తడిపివేసినవి.

తా. గ్రహములు పరస్పరము యుద్ధము చేసి ప్రకాశవిహీనము లయ్యెను. ప్రహస్తుని రథముపైన మేఘములు పరుషమైన ధ్వనులు చేయుచు ఆ రాక్షసుని రథముమీద రక్తమును వర్షించినవి. ముందు నడచుచున్నవాళ్లను తడిపివేసినవి.

కేతోర్మూర్ధని గృధ్రస్తు విలీనో దక్షిణాముఖః,
నదన్నుభయతః పార్శ్వం సమగ్రామహరచ్ఛ్రియమ్. 39

ప్ర. అ. దక్షిణాముఖః=దక్షిణాభిముఖమై, కేతోః=ధ్వజముయొక్క, మూర్ధని=అగ్రభాగమునందు, విలీనః=కూర్చున్న, గృధ్రః=గ్రద్ద, ఉభయతః పార్శ్వమ్=రెండు వైపుల, నదన్=కూయుచు, సమగ్రామ్=సంపూర్ణమైన, శ్రియమ్=శోభను, అహరత్=హరించెను.

తా. గ్రద్ద ధ్వజశిఖరముమీద దక్షిణాభిముఖముగా కూర్చొని, దాని రెండు ప్రక్కలకు తిరిగి కూయుచు, శోభ నంతను పోగొట్టెను. 39

సారథేర్బహుశశ్చాత్ర సంగ్రామమవగాహతః,
ప్రతోదో న్యపతద్ధస్తాత్సూతస్య హయసాదినః. 40

ప్ర. అ. సంగ్రామమ్=యుద్ధమును, అవగాహతః=ప్రవేశించుచున్న, సూతస్య=సూతవంశమునందు పుట్టిన, హయసాదినః=గుఱ్ఱములను తోలుచున్న, సారథేః=సారథియొక్క, హస్తాత్=హస్తమునుండి, ప్రతోదః=కొరడా, అత్ర=ఈ, సమయమునందు, బహుశః=అనేకపర్యాయములు, న్యపతత్=పడెను.

తా. సూతవంశములో పుట్టిన గుఱ్ఱములను తోలే సారథి యుద్ధరంగములో ప్రవేశించుచుండగా అతని చేతిలో నుండి జారి కొరడా అనేకపర్యాయములు క్రిందపడెను. **40**

నిర్యాణశ్రీశ్చ యా చ స్యాద్భాస్వరా చ సుదుర్లభా,
సా ననాశ ముహూర్తేన సమే చ స్ఖలితా హయాః. **41**

ప్ర. అ. భాస్వరా=ప్రకాశించునది, సుదుర్లభా=మిక్కిలి దుర్లభము అయిన, యా=ఏ, నిర్యాణశ్రీః=బయలుదేరునపుడు ఉండే శోభగలదో, సా=అది, ముహూర్తేన=క్షణకాలములో, ననాశ=నశించెను. హయాశ్చ=గుఱ్ఱములు, సమే=సమప్రదేశములో, స్ఖలితాః=తొట్రుపడినవి.

తా. ప్రయాణసమయములో ప్రకాశించే, చాల దుర్లభమైన ఏ శోభ ఉండునో అది ముహూర్తకాలములో నశించినది. సమప్రదేశములో గుఱ్ఱములు తొట్రుపడినవి. **41**

మూ. ప్రహస్తం తం హి నిర్యాన్తం ప్రఖ్యాతగుణపౌరుషమ్,
యుధి నానాప్రహరణా కపిసేనాభ్యవర్తత. **42**

ప్ర. అ. ప్రఖ్యాతగుణపౌరుషమ్=ప్రసిద్ధమైన గుణములు పౌరుషము గల, నిర్యాన్తమ్=బయలుదేరి వచ్చుచున్న, తం ప్రహస్తమ్=ఆ ప్రహస్తుణ్ణి గూర్చి, నానాప్రహరణా=అనేకవిధములైన ఆయుధములు గల, కపిసేనా=వానరసేన, యుధి=యుద్ధమునందు, అభ్యవర్తత=ఎదురుగా వెళ్లెను.

తా. గుణములచేత, పౌరుషముచేత ప్రసిద్ధుడైన ఆ ప్రహస్తుడు బయలుదేరి వచ్చుచుండగా, వానరసేన అనేకవిధములైన ఆయుధములతో యుద్ధరంగములో ఎదుర్కొనెను. **42**

మూ. అథ ఘోషః సుతుములో హరీణాం సముదాయత,
వృక్షానారుజతాం చైవ గుర్వీర్గృహ్ణతాం శిలాః. **43**

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వృక్షాన్=వృక్షములను, ఆరుజతాం చైవ=పీడించుచున్నవారు, గుర్వీః=పెద్ద, శిలాః=శిలలను, గృహ్ణతామ్=గ్రహించుచున్నవారు అయిన, హరీణామ్=వానరులయొక్క, సుతుములః=చాల వ్యాకులమైన, ఘోషః=ధ్వని, సముదాయత=కలిగెను.

తా. అప్పుడు వానరులు వృక్షములను పీకుచుండగా, పెద్ద శిలలను ఎత్తుచుండగా చాల వ్యాకులమైన ధ్వని ఏర్పడెను. 43

మూ. నదతాం రాక్షసానాం చ వానరాణాం చ గర్జతామ్,
ఉభే ప్రముదితే సైన్యే రక్షోగణవనౌకసామ్, 44
వేగితానాం సమర్థానామన్యోన్యవధకాంక్షిణామ్,
పరస్పరం చాహ్వయతాం నినాదః శ్రూయతే మహాన్. 45

ప్ర. అ. నదతామ్=గర్జించుచున్న, రాక్షసానాం చ=రాక్షసులయొక్క, గర్జతామ్=గర్జించుచున్న, వానరాణాం చ=వానరులయొక్క, ఉభే=రెండు, సైన్యే=సైన్యములు, ప్రముదితే=సంతోషించినవి. వేగితానామ్=వేగవంతులు, సమర్థానామ్=సమర్థులు, అన్యోన్యవధకాంక్షిణామ్=పరస్పరముయొక్క వధను కోరుచున్నవారు, పరస్పరమ్=పరస్పరమును, ఆహ్వయతామ్=యుద్ధానికి పిలుచుకొనుచున్నవారు అయిన, రక్షోగణవనౌకసామ్=రాక్షసగణములయొక్క, వానరులయొక్క, మహాన్=గొప్ప, నినాదః=ధ్వని, శ్రూయతే=వినబడుచున్నది.

తా. ధ్వనిచేయుచున్న రాక్షసుల సైన్యము, గర్జించుచున్న వానరుల సైన్యము - రెండు సైన్యములు ఉత్సాహముతో ఉండెను. వేగవంతులు, సమర్థులు, ఒకరి నొకరు చంపవలె నని కోరుచున్న ఒకరి నొకరు పిలుచుకొనుచున్న, రాక్షసవానరులు చేయు గొప్ప ధ్వని వినవచ్చెను. 44, 45

మూ. తతః ప్రహస్తః కపిరాజవాహినీ
మభిప్రతస్థే విజయాయ దుర్మతిః,
వివృద్ధవేగశ్చ వివేశ తాం చమూం
యథా ముమూర్షుః శలభో విభావసుమ్. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దుర్మతిః=దుర్బుద్ధియైన, ప్రహస్తః=ప్రహస్తుడు, కపిరాజవాహినీమ్=సుగ్రీవుని సైన్యమును గూర్చి, విజయాయ=విజయముకొరకు, ప్రతస్థే=ప్రయాణమాయెను. వివృద్ధవేగః చ=వృద్ధి పొందిన వేగము గలవాడై, ముమూర్షుః=మరణింప (నున్న) నిచ్చగలవాడై, శలభః=మిడుత, విభావసుం యథా=అగ్నివలె, తాం చమూమ్=ఆ సైన్యమును, వివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట ఆ దుర్మతియైన ప్రహస్తుడు విజయముకొరకై సుగ్రీవుని సేనవైపు బయలుదేరి వెళ్ళి, మరణింపనున్న వాడై, మిడత అగ్నిలో ప్రవేశించినట్లు ఆ సైన్యములో అధికమైన వేగముతో ప్రవేశించెను. 46

"బాలనందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టపఞ్చాశః సర్గః

[నీలుడు ప్రహస్తుని చంపుట.]

మూ. తతః ప్రహస్తం నిర్యాన్తం దృష్ట్వా రణకృతోద్యమమ్,
ఉవాచ సస్మితం రామో విభీషణమరిందమః. 1

ప్ర. అ. తతః=అటు పిమ్మట, అరిందమః=శత్రుసంహారకుడైన, రామః=రాముడు, నిర్యాన్తమ్=బయలు వెడలుచున్న, రణకృతోద్యమమ్=యుద్ధము కొరకు చేయబడిన ఉద్యమము గల, ప్రహస్తమ్=ప్రహస్తుని, దృష్ట్వా=చూచి, విభీషణమ్=విభీషణుని గూర్చి, సస్మితమ్=చిరునవ్వుతో కూడినట్లుగా, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు శత్రుసంహారకుడైన రాముడు యుద్ధమునకై వెడలిన చ్చుచున్న ఆ ప్రహస్తుణ్ణి చూచి, చిరునవ్వు నవ్వుచు, విభీషణునితో ఇట్లనెను.

మూ. క ఏష సుమహాకాయో బలేన మహతా వృతః,
ఆగచ్ఛతి మహావేగః కింరూపబలపౌరుషః, 2
ఆచక్ష్వ మే మహాబాహో వీర్యవన్తం నిశాచరమ్.

ప్ర. అ. సుమహాకాయః=చాల పెద్ద దేహము గలవాడు, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, వృతః=కూడినవాడు, మహావేగః=గొప్ప వేగము గలవాడు అయిన, ఏషః=ఇతడు, ఆగచ్ఛతి=వచ్చుచున్నాడు, కః=ఎవరు ? కింరూపబలపౌరుషః=ఎట్టి బలపౌరుషములు కలవాడు ? మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! వీర్యవన్తమ్= పరాక్రమవంతుడైన, నిశాచరమ్=ఈ రాక్షసుణ్ణి గూర్చి, మే=నాకు, ఆచక్ష్వ=చెప్పుము.

తా. పెద్ద దేహము గల ఇతడెవడో పెద్ద సైన్యముతో మహావేగముగా వచ్చుచున్నాడు. ఇతడు ఎవడు ? వీని బలపౌరుషములు ఎట్టివి ? ఓ ! మహాబాహువైన విభీషణా ! పరాక్రమవంతుడైన ఈ రాక్షసుని గూర్చి నాకు చెప్పుము. 2

మూ. రాఘవస్య వచః శ్రుత్వా ప్రత్యువాచ విభీషణః, 3
ఏష సేనాపతిస్తస్య ప్రహస్తో నామ రాక్షసః,
లఙ్కాయాం రాక్షసేన్ద్రస్య త్రిభాగబలసంవృతః, 4
వీర్యవానస్త్రవిచ్ఛూరః సుప్రఖ్యాతపరాక్రమః.

ప్ర. అ. రాఘవస్య=రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని,

విభీషణః=విభీషణుడు, ప్రత్యువాచ=తిరిగిపలికెను. ఏషః=ఇతడు, లఙ్కాయామ్=లంకయందు, త్రిభాగబలసంవృతః=మూడువంతుల సైన్యముతో కూడినవాడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు, అస్త్రవిత్=అస్త్రములు తెలిసినవాడు, శూరః=శూరుడు, సుప్రఖ్యాతపరాక్రమః=బాగా ప్రసిద్ధమైన పరాక్రమము గలవాడు. తస్య రాక్షసేన్ద్రస్య=ఆ రావణునియొక్క, సేనాపతిః=సేనాపతి అయిన, ప్రహస్తో నామ=ప్రహస్తుడను, రాక్షసః=రాక్షసుడు.

తా. రాముని మాటలు విని విభీషణుడు పలికెను. ఇతడు ఆ రావణుని సేనాపతియైన ప్రహస్తుడను రాక్షసుడు. లంకలోని మూడు వంతుల సైన్యమునకు నాయకుడు. పరాక్రమవంతుడు, శూరుడు, అస్త్రములు తెలిసినవాడు, బాగా ప్రసిద్ధమైన పరాక్రమము గలవాడు. 3, 4

మూ. తతః ప్రహస్తం నిర్యాన్తం భీమం భీమపరాక్రమమ్, 5
గర్జన్తం సుమహాకాయం రాక్షసైరభిసంవృతమ్,
దదర్శ మహతీ సేనా వానరాణాం బలీయసామ్,
అభిసఞ్జాతరోషాణాం ప్రహస్తమభిగర్జతామ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బలీయసామ్=బలవంతులు, అభిసఞ్జాతరోషాణామ్=పుట్టిన రోషము గలవారు, ప్రహస్తమ్=ప్రహస్తుని గూర్చి, అభిగర్జతామ్=గర్జించుచున్నవారు అయిన, వానరాణామ్=వానరులయొక్క, మహతీ=గొప్పదైన, సేనా=సేన, నిర్యాన్తమ్=బయలుదేరుచున్న, భీమమ్=భయంకరుడు, భీమపరాక్రమమ్=భయంకరమైన పరాక్రమము గలవాడు, రాక్షసైః=రాక్షసులతో, అభిసంవృతమ్=కూడినవాడు అయిన, ప్రహస్తమ్=ప్రహస్తుని, దదర్శ=చూచెను.

తా. పిమ్మట భయంకరుడు, భయంకరమైన పరాక్రమము, పెద్ద దేహముగల, గర్జించుచు రాక్షససేనతో కూడి బయలుదేరి వచ్చుచున్న ఆ ప్రహస్తుణ్ణి బలవంతులైన వానరుల ఆ గొప్ప సేన చూచి చాల కోపముతో అతనిని ఎదిరించుచు గర్జించెను. 6

మూ. ఖడ్గశక్త్యృష్టిబాణాశ్చ శూలాని ముసలాని చ, 7
గదాశ్చ పరిఘాః ప్రాసా వివిధాశ్చ పరశ్వధాః,
ధనూంషి చ విచిత్రాణి రాక్షసానాం జయైషిణామ్, 8
ప్రగృహీతాన్యరాజన్త వానరానభిధావతామ్.

ప్ర. అ. జయైషిణామ్=జయమును కోరుచున్నవాళ్ళు, వానరాన్=వానరులను గూర్చి, అభిధావతామ్=ఎదురుగా పరుగెత్తుచున్నవాళ్ళు అయిన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, ప్రగృహీతాని=గ్రహించబడిన, ఖడ్గశక్త్య

ష్టిబాణాశ్చ=ఖడ్గములు, శక్తులు, ఋష్టులు, బాణములు, శూలాని=శూలములు, ముసలాని చ=ముసలములు, గదాశ్చ=గదలు, పరిఘాః= పరిఘలు, ప్రాసాః=ప్రాసలు, వివిధాః=అనేకవిధములైన, పరశ్వధాశ్చ=పరశ్వధములు, ప్రగృహీతాని=గ్రహించబడినవై, అరాజన్త=ప్రకాశించినవి.

తా. జయమును కోరుచు వానరుల వైపు పరుగెత్తి వెళ్ళుచున్న రాక్షసులు ధరించిన ఖడ్గములు, శక్తులు, ఋష్టులు, బాణములు, శూలములు, ముసలములు, గదలు, పరిఘలు, ప్రాసలు, అనేక విధములైన పరశ్వధములు ప్రకాశించుచుండెను. 7, 8

మూ. జగృహుః పాదపాంశ్చాపి పుష్పితాంస్తు గిరీంస్తథా, 9
శిలాశ్చ విపులా దీర్ఘా యోద్ధుకామాః ప్లవంగమాః.

ప్ర. అ. యోద్ధుకామాః=యుద్ధముచేయుటకు కోరిక గల, ప్లవంగమాః=వానరులు, పుష్పితాన్=పుష్పించిన, పాదపాంశ్చాపి=వృక్షములను, తథా=మరియు, గిరీన్= పర్వతములను, విపులాః= పెద్దవైన, దీర్ఘాః=పొడవైన, శిలాః చ=శిలలను, జగృహుః=గ్రహించిరి.

తా. యుద్ధమునకు సన్నద్ధులైన వానరులు పుష్పించిన వృక్షములను, పర్వతములను, పొడుగైన పెద్ద శిలలను గ్రహించిరి. 9

మూ. తేషామన్యోన్యమాసాద్య సంగ్రామః సుమహానభూత్, 10
బహూనామశ్మవృష్టిం చ శరవర్షం చ వర్షతామ్.

ప్ర. అ. అన్యోన్యమ్=పరస్పరము, ఆసాద్య=సమీపించి, అశ్మవృష్టిమ్= శిలావర్షమును, శరవర్షం చ=బాణముల వర్షమును, వర్షతామ్=వర్షించుచున్న, బహూనామ్=అనేకులైన, తేషామ్=వాళ్ళకు, సుమహాన్=చాల గొప్పదైన, సంగ్రామః= యుద్ధము, అభూత్=జరిగెను.

తా. ఒకరినొకరు సమీపించి శిలావర్షమును, బాణవర్షమును కురిపించుచున్న అనేకులైన ఆ వానరరాక్షసుల మధ్య గొప్ప యుద్ధము జరిగెను. 10

మూ. బహవో రాక్షసా యుద్ధే బహూన్వానరపుంగవాన్, 11
వానరా రాక్షసాంశ్చాపి నిజఘ్నుర్బహవో బహూన్.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, బహవః=అనేకులైన, రాక్షసాః=రాక్షసులు, బహూన్=అనేకులైన, వానరపుంగవాన్=వానరశ్రేష్ఠులను, బహవః=అనేకులైన, వానరాః=వానరులు, బహూన్=అనేకులైన, రాక్షసాంశ్చాపి=రాక్షసులను, నిజఘ్నుః=చంపిరి.

తా. ఆ యుద్ధమునందు చాలమంది రాక్షసులు చాలమంది వానరులను, చాలమంది వానరులు చాలమంది రాక్షసులను చంపివేసిరి. 11

మూ. శూలైః ప్రమథితాః కేచిత్కేచిత్తు పరమాయుధైః, 12
పరిఘైరాహతాః కేచిత్కేచిచ్ఛిన్నాః పరశ్వధైః.

ప్ర. అ. కేచిత్=కొందరు వానరులు, శూలైః=శూలములచేత, ప్రమథితాః=మథింపబడిరి. కేచిత్తు=మరికొందరు, పరమాయుధైః=గొప్ప ఆయుధముల చేత (చంపబడిరి.) కేచిత్=కొందరు, పరిఘైః=పరిఘలచేత, ఆహతాః=కొట్టబడిరి. కేచిత్=కొందరు, పరశ్వధైః=గొడ్డళ్ళచేత, ఛిన్నాః=చెగగొట్టబడిరి.

తా. కొందరు వానరులు శూలములచేత పొడవబడిరి. కొందరు గొప్ప ఇతర ఆయుధములచేతను, మరికొందరు పరిఘలచేతను కొట్టబడిరి. కొందరు గొడ్డళ్ళతో నరకబడిరి. 12

మూ. నిరుచ్ఛ్వాసాః పునః కేచిత్పతితా జగతీతలే, 13
విభిన్నహృదయాః కేచిదిషుసంధానసాదితాః.

ప్ర. అ. కేచిత్ పునః=కొందరు, నిరుచ్ఛ్వాసాః=శ్వాసలేనివారై, జగతీతలే=నేలమీద, పతితాః=పడిరి. కేచిత్=కొందరు, ఇషుసంధానసాదితాః=బాణములను సంధించుటచేత పీడింపబడినవారై, విభిన్నహృదయాః=భేదింపబడిన హృదయములు గలవారు అయిరి.

తా. కొందరు ప్రాణములు పోయి నేలమీద పడిపోయిరి. మరికొందరు బాణములను సంధించి ప్రయోగించుటచేత పీడింపబడి, హృదయములు బ్రద్దలై పడిపోయిరి. 13

మూ. కేచిద్ద్విధాకృతాః ఖడ్గైః స్ఫురన్తః పతితా భువి, 14
వానరా రాక్షసైః శూరైః పార్శ్వతశ్చ విదారితాః.

ప్ర. అ. కేచిత్=కొందరు, వానరాః=వానరులు, శూరైః=శూరులైన, రాక్షసైః=రాక్షసులచేత, ఖడ్గైః=ఖడ్గములచేత, ద్విధా=రెండు ముక్కలుగా, కృతాః=చేయబడినవారై, పార్శ్వతః=ప్రక్కలయందు, విదారితాః=చీల్చబడినవారై, స్ఫురన్తః=కొట్టుకొనుచు (కదలుచు) భువి=నేలమీద, పతితాః=పడిరి.

తా. శూరులైన రాక్షసులు ఖడ్గములతో రెండు ముక్కలుగా చేయుగా, ప్రక్కలయందు చీల్చివేయుగా, కొందరు వానరులు కొట్టుకొనుచు, నేలమీద పడిపోయిరి. 14

మూ. వానరైశ్చాపి సంక్రుద్ధై రాక్షసౌఘాః సమన్తతః, 15
పాదపైర్గిరిశృఙ్గైశ్చ సంపిష్టా వసుధాతలే.

ప్ర. అ. రాక్షసౌఘాః చాపి=రాక్షసుల సముదాయములు కూడ, సంక్రుద్ధైః=కోపించిన, వానరైః=వానరులచేత, సమన్తతః=అంతటను, పాదపైః=వృక్షములచేతను, గిరిశృఙ్గైశ్చ=పర్వతశిఖరములచేతను, వసుధాతలే=నేల మీద, సంపిష్టాః=నలగగొట్టబడిరి.

తా. కోపించిన వానరులు వృక్షములతోను, పర్వతశిఖరములతోను అన్ని ప్రదేశములందు రాక్షసులను నేలమీద నలగగొట్టిరి. 15

మూ. వజ్రస్పర్శతలైర్హస్తైర్ముష్టిభిశ్చ హతా భృశమ్, 16
వమన్ శోణితమాస్యేభ్యో విదీర్ణవదనేక్షణాః.

ప్ర. అ. వజ్రస్పర్శతలైః=వజ్రమువంటి స్పర్శ గల అరచేతులు గల, హస్తైః=హస్తములచేతను, ముష్టిభిః=పిడికిళ్ళ చేతను, హతాః=కొట్టబడినవారై, విదీర్ణవదనేక్షణాః=చీల్చబడిన ముఖములు, నేత్రములు గలవారై, ఆస్యేభ్యః=నోళ్లనుండి, భృశమ్= మిక్కిలి, శోణితమ్=రక్తమును, వమన్=కక్కిరి.

తా. వజ్రాయుధస్పర్శవంటి స్పర్శ గల అరచేతులతోను, పిడికిళ్లతోను కొట్టబడినవారై రాక్షసులు ముఖములు, నేత్రములు చీలిపోగా, నోళ్లనుండి అధికముగా రక్తమును కక్కిరి. 16

మూ. ఆర్తస్వనం చ స్వనతాం సింహనాదం చ నర్దతామ్, 17
బభూవ తుములః శబ్దో హరీణాం రక్షసామపి.

ప్ర. అ. ఆర్తస్వనమ్=దీనధ్వని కలుగునట్లుగా, స్వనతామ్=ధ్వనిచేయుచున్నవారు, సింహనాదమ్=సింహనాదమును, నర్దతామ్=నర్దించుచున్నవారు అయిన, హరీణామ్=వానరులయొక్క, రక్షసామపి=రాక్షసులయొక్క, తుములః=వ్యాకులమైన, శబ్దః=ధ్వని, బభూవ=ఆయెను.

తా. కొందరు వానరులు కొందరు రాక్షసులు దీనముగా అరచుచుండగా, కొందరు సింహనాదములు చేయుచుండగా వ్యాకులమైన ధ్వని కలిగెను. 17

మూ. వానరా రాక్షసాః క్రుద్ధా వీరమార్గమనువ్రతాః, 18
వివృత్తనయనాః క్రూరాశ్చక్రుః కర్మాణ్యభీతవత్.

ప్ర. అ. క్రుద్ధాః=కోపించిన, వీరమార్గమ్=వీరుల మార్గమును, అనువ్రతాః= అనుసరించిన నియమము గల, క్రూరాః=క్రూరులైన, వివృత్తనయనాః=త్రిప్పబడిన నేత్రములు గల, వానరాః=వానరులు, రాక్షసాః=రాక్షసులు,

అభీతవత్=భయపడక, కర్మాణి= పనులను, చక్రుః=చేసిరి.

తా. వీరమార్గమును పొందుటకై నిశ్చయించుకొనిన, క్రూరులైన వానరులు, రాక్షసులు కూడ, నేత్రములు త్రిప్పుచు నిర్భయముగా యుద్ధము చేసిరి. 18

మూ. నరాన్తకః కుమ్భహనుర్మహానాదః సమున్నతః, 19
ఏతే ప్రహస్తసచివాః సర్వే జఘ్నుర్వనౌకసః.

ప్ర. అ. నరాన్తకః=నరాంతకుడు, కుమ్భహనుః=కుంభహనువు, మహానాదః= మహానాదుడు, సమున్నతః=సమున్నతుడు అను, ప్రహస్తసచివాః=ప్రహస్తుని మంత్రులైన, ఏతే సర్వే=వీరందరూ, వనౌకసః=వానరులను, జఘ్నుః=చంపిరి.

తా. ప్రహస్తుని మంత్రులైన నరాంతకుడు, కుంభహనువు, మహానాదుడు, సమున్నతుడు, వీరందరూ వానరులను చంపివేసిరి. 19

మూ. తేషాం నిపతతాం శీఘ్రం నిఘ్నతాం చాపి వానరాన్, 20
ద్వివిదో గిరిశృఙ్గేణ జఘానైకం నరాన్తకమ్.

ప్ర. అ. శీఘ్రమ్=శీఘ్రముగా, నిపతతామ్=వచ్చుచున్న, వానరాన్=వానరులను, నిఘ్నతాం చాపి=చంపుచున్న, తేషామ్=వారిలో, ఏకమ్=ఒకడైన, నరాన్తకమ్= నరాంతకుణ్ణి, ద్వివిదః=ద్వివిదుడు, గిరిశృఙ్గేణ=పర్వతశిఖరముచేత, జఘాన=చంపెను.

తా. శీఘ్రముగా వచ్చి వానరులను చంపుచున్న వాళ్లలో ఒకడైన నరాంతకుణ్ణి ద్వివిదుడు పర్వతశిఖరముతో చంపివేసెను. 20

మూ. దుర్ముఖః పునరుత్థాయ కపిః సవిపులద్రుమమ్, 21
రాక్షసం క్షిప్రహస్తం తు సమున్నతమపోథయత్.

ప్ర. అ. కపిః=వానరుడైన, దుర్ముఖః పునః=దుర్ముఖుడైతే, సవిపులద్రుమమ్= చాల పెద్దదైన వృక్షమును, ఉత్థాయ=పెకలించి, క్షిప్రహస్తమ్=శీఘ్రమైన హస్తము గల, రాక్షసమ్=రాక్షసుడైన, సమున్నతమ్=సమున్నతుని, అపోథయత్=నల గగొట్టెను.

తా. దుర్ముఖుడు చాల పెద్దదైన వృక్షమును పెకలించి, హస్తలాఘవము గల సమున్నతుడను రాక్షసుని చంపివేసెను. 21

మూ. జామ్బవాంస్తు సుసంక్రుద్ధః ప్రగృహ్య మహతీం శిలామ్, 22
పాతయామాస తేజస్వీ మహానాదస్య వక్షసి.

ప్ర. అ. తేజస్వీ=తేజఃశాలియైన, జామ్బవాంస్తు=జాంబవంతుడు, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, మహతీమ్=గొప్పదైన, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, మహానాదస్య=మహానాదునియొక్క, వక్షసి=వక్షఃస్థలమునందు, పాతయామాస=పడవేసెను.

తా. మహాతేజశ్శాలియైన జాంబవంతుడు చాల కోపించి, పెద్దశిలను గ్రహించి మహానాదుని వక్షఃస్థలముమీద పడవేసెను. 22

మూ. అథ కుమ్భహనుస్తత్ర తారేణాసాద్య వీర్యవాన్, 23
వృక్షేణ మహతా సద్యః ప్రాణాన్సంత్యాజయద్రణే.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, తత్ర=అక్కడ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, కుమ్భహనుః=కుంభహనువు, తారేణ=తారునిచేత, రణే=యుద్ధమునందు, ఆసాద్య=సమీపించి, మహతా=గొప్ప, వృక్షేణ=వృక్షముచేత, సద్యః=వెంటనే, ప్రాణాన్=ప్రాణములను, సంత్యాజయత్=విడిపింపచేయబడెను.

తా. పిమ్మట వీర్యవంతుడైన తారుడు యుద్ధమునందు కుంభహనువును సమీపించి పెద్ద వృక్షముచేత అతడు ప్రాణములు విడచునట్లు చేసెను. 23

మూ. అమృష్యమాణస్తత్కర్మ ప్రహస్తో రథమాశ్రితః, 24
చకార కదనం ఘోరం ధనుష్పాణిర్వనౌకసామ్.

ప్ర. అ. ప్రహస్తః=ప్రహస్తుడు, తత్=ఆ, కర్మ=పనిని, అమృష్యమాణః=సహించనివాడై, రథమ్=రథమును, ఆశ్రితః=ఆశ్రయించినవాడై, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు కలవాడై, వనౌకసామ్=వానరులయొక్క, ఘోరమ్=భయంకరమైన, కదనమ్=నాశమును, చకార=చేసెను.

తా. ప్రహస్తుడు ఆ కార్యమును సహించక రథము నెక్కి, ధనస్సు ధరించి భయంకరముగా వానరుల సంహారమును చేసెను. 24

మూ. ఆవర్త ఇవ సంజజ్ఞే సేనయోరుభయోస్తదా, 25
క్షుభితస్యాప్రమేయస్య సాగరస్యేవ నిఃస్వనః.

ప్ర. అ. తదా=అప్పుడు, ఆవర్తే=ప్రళయకాలమునందు, క్షుభితస్య=క్షోభింపచేయబడిన, అప్రమేయస్య=ఇంత అని తెలియ శక్యము కాని (ఊహింప శక్యము కాని ప్రమాణము గల), క్షుభితస్య=క్షోభపెట్టబడిన, సాగరస్య ఇవ=సముద్రముయొక్క ధ్వనివలె, ఉభయోః=రెండు, సేనయోః=సేనలయొక్క, నిఃస్వనః=ధ్వని, సంజజ్ఞే=కలిగెను.

తా. అప్పుడు ఆ రెండు సేనల ధ్వని ప్రళయకాలమునందు క్షోభింపచేయబడిన, అపారమైన సముద్రము ధ్వని వలె ఉండెను. 25

మూ. మహతా హి శరౌఘేణ రాక్షసో రణదుర్జయః, 26
అర్దయామాస సంక్రుద్ధో వానరాన్ పరమాహవే.

ప్ర. అ. పరమాహవే=గొప్ప యుద్ధమునందు, రణదుర్జయః= యుద్ధమునందు అణచుటకు శక్యము కాని, రాక్షసః=ప్రహస్తుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, మహతా=గొప్పదైన, శరౌఘేణ=బాణముల సముదాయముచేత, వానరాన్=వానరులను, అర్దయామాస=పీడించెను.

తా. యుద్ధమునందు ఓడింప శక్యము కాని ఆ ప్రహస్తుడు ఆ మహాయుద్ధమునందు, చాల కోపించి, గొప్ప బాణసముదాయముచేత వానరులను పీడించెను. 26

మూ. వానరాణాం శరీరైస్తు రాక్షసానాం చ మేదినీ, 27
బభూవాతిచితా ఘోరైః పర్వతైరివ సంవృతా.

ప్ర. అ. వానరాణామ్=వానరులయొక్క, రాక్షసానాం చ=రాక్షసులయొక్క, ఘోరైః=భయంకరమైన, శరీరైః=శరీరములచేత, అతిచితా=మిక్కిలి వ్యాప్తమైన, మేదినీ=భూమి, పర్వతైః=పర్వతములచేత, సంవృతా ఇవ=కప్పబడినది వలె, బభూవ=ఆయెను.

తా. భయంకరములైన వానరశరీరములచేతను, రాక్షసశరీరముల చేతను కప్పబడిన భూమి పర్వతములు పరచినట్లు ఉండెను. 27

మూ. సా మహీ రుధిరౌఘేణ ప్రచ్ఛన్నా సంప్రకాశతే, 28
సంఛన్నా మాధవే మాసి పలాశైరివ పుష్పితైః.

ప్ర. అ. రుధిరౌఘేణ=రక్తప్రవాహముచేత, ప్రచ్ఛన్నా=కప్పబడిన, సా మహీ=ఆ భూమి, మాధవే మాసి=వైశాఖమాసమునందు, పుష్పితైః= పుష్పించిన, పలాశైః=పలాశవృక్షములచేత, సంఛన్నా ఇవ=కప్పబడిన భూమి వలె, సంప్రకాశతే=ప్రకాశించుచున్నది.

తా. రక్తప్రవాహముతో నిండిన ఆ భూమి వైశాఖమాసమునందు మోదుగపూవులు పరచిన భూమి వలె ప్రకాశించెను. 28

మూ. హరివీరౌఘవప్రాం తు భగ్నాయుధమహాద్రుమామ్, 29
శోణితౌఘమహాతోయాం యమసాగరగామినీమ్,
యకృత్ప్లీహమహాపఙ్కాం వినికీర్ణాన్త్రశైవలామ్, 30
భిన్నకాయశిరోమీనామఙ్గావయవశాద్వలామ్,
గృధ్రహంసవరాకీర్ణాం కఙ్కసారససేవితామ్. 31

మేదఃఫేనసమాకీర్ణా మావర్తస్వననిఃస్వనామ్,
తాం కాపురుషదుస్తారాం యుద్ధభూమిమయీం నదీమ్, 32
నదీమివ ఘనాపాయే హంససారససేవితామ్,
రాక్షసాః కపిముఖ్యాస్తే తేరుస్తాం దుస్తరాం నదీమ్. 33
యథా పద్మరజోధ్వస్తాం నలినీం గజయూథపాః.

ప్ర. అ. హతవీరౌఘవప్రామ్=పడగొట్టబడిన వీరసముదాయ మను తీరములు గలది, భగ్నాయుధమహాద్రుమామ్=భగ్నమైన ఆయుధము లను మహా వృక్షములు గలది, శోణితౌఘ మహాతోయామ్=రక్తప్రవాహ మను గొప్ప ఉదకము గలది, యమసాగరగామినీమ్=యము డను సముద్రమును చేరునది, యకృత్ ప్లీహమహాపఙ్కామ్=గుండెకు కుడిప్రక్క ఎడమప్రక్క ఉండు యకృత్తు ప్లీహము అను మాంసము ముద్ద అను గొప్ప బురద గలది, వివికీర్ణాన్త్రశైవలామ్=ఇటు అటు చిమ్మబడి ఉన్న ప్రేగు అను నాచు గలది, భిన్నకాయశిరోమీనామ్=బద్దలుకొట్టబడిన శరీరము అను చేపలు గలది, అఙ్గావయవశాద్వలామ్=శరీరావయవము అను గడ్డి గలది, గృధ్రహంసవరాకీర్ణామ్=గ్రద్ద అను శ్రేష్ఠములైన హంసలచేత వ్యాప్తము, కఙ్కసారససేవితామ్=తెల్లని డేగ అను సారసపక్షులచేత సేవింపబడినది, మేదః ఫేనసమాకీర్ణామ్=కొవ్వు అను నురుగుతో వ్యాప్తము, ఆవర్తస్వననిస్వనామ్=సుడుల ధ్వని వంటి ధ్వనిగలది, కాపురుషదుస్తారామ్=పిరికిపురుషులచేత దాట శక్యము కానిది, ఘనాపాయే=శరదృతువునందు, హంససారససేవితామ్=హంస లచేత సారసపక్షులచేత సేవింపబడిన, నదీమివ=నది వలె ఉన్నది అయిన, తామ్=ఆ, యుద్ధభూమిమయీమ్=యుద్ధభూమి అను, నదీమ్=నదిని, తే రాక్షసాః= ఆ రాక్షసులు, పద్మరజోధ్వస్తామ్=పద్మపరాగముచేత నశించిన (మారు రూపము పొందిన), నలినీమ్=పద్మసరస్సును, గజయూథపాః యథా=ఏనుగుల యూథమును పాలించువారు వలె, తేరుః=దాటిరి. దుస్తరామ్=దాట శక్యము కాని, తాం నదీమ్=ఆ నదిని, కపిముఖ్యాః=వానరశ్రేష్ఠులు, తేరుః=దాటిరి.

తా. ఆ యుద్ధరంగ మనే దాట శక్యము కాని నదిని ఆ వానరులు, రాక్షసులు కూడ, గజయూథమును నడిపించువాళ్లు పద్మపరాగముచేత కప్పబడిన పద్మసరస్సును దాటినట్లు దాటిరి. ఆ రణభూమినదికి సంబంధించిన వీరసముదాయ మనే తీరములు తెగిపోయెను. ఆయుధము అనే మహావృక్షములు విరిగిపోయెను. అది రక్తప్రవాహ మనే జలప్రవాహముతో యము డను సముద్రము వైపు ప్రవహించుచుండెను. యకృత్తులు, ప్లీహములు అను బురదతోను, ఇటు నటు చిమ్మివేయబడిన ప్రేగులనే నాచుతోను, తెగపడిన శరీరము లనే చేపలతోను, శరీరావయవము లను పచ్చిక బీళ్లతోను నిండియుండెను. గ్రద్ద లనే హంసలు, తెల్ల డేగ లను సారసపక్షులు దానిని ఆశ్రయించి ఉండెను. కొవ్వు అనే నురుగుతో

నిండిన ఆ నది నుండి మదుం చప్పళ్ల వంటి చప్పళ్ళు బయలుదేరుచుండెను. శరదృతువు నందు హంసలతోను, సారసపక్షులతోను నిండిన నది వలె ఉన్న ఆ రణభూమిని పిరికివాళ్లెవ్వరూ దాటజాలరు. 29-33.

మూ. తతః సృజన్తం బాణౌఘాన్ ప్రహస్తం స్యన్దనే స్థితమ్, 34
దదర్శ తరసా నీలో విధమన్తం ప్లవఙ్గమాన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నీలః=నీలుడు, బాణౌఘాన్=బాణసముదాయములను, సృజన్తమ్=ప్రయోగించుచున్న, స్యన్దనే=రథమునందు, స్థితమ్=ఉన్న, తరసా=వేగముచేత, ప్లవఙ్గమాన్=వానరులను, విధమన్తమ్=నశింపచేయుచున్న, ప్రహస్తమ్=ప్రహస్తుని, దదర్శ=చూచెను.

తా. ప్రహస్తుడు రథమునెక్కి, బాణసముదాయములను ప్రయోగించుచు బలముచేత వానరులను చెండాడుచుండగా వానిని నీలుడు చూచెను. 34

మూ. ఉద్ధూత ఇవ వాయుః ఖే మహదభ్రబలం బలాత్, 35
సమీక్ష్యాభిద్రుతం యుద్ధే ప్రహస్తో వాహినీపతిః,
రథేనాదిత్యవర్ణేన నీలమేవాభిదుద్రువే. 36

ప్ర. అ. ఖే=ఆకాశమునందు, బలాత్=బలమువలన, ఉద్ధూతః=ఎగురుచున్న, వాయుః=వాయువు, మహత్=గొప్పదైన, అభ్రబలమ్=మేఘసముదాయమును వలె, యుద్ధే=యుద్ధమునందు, అభిద్రుతమ్=ఎదురుగా పరుగెత్తి వచ్చుచున్న ఆ నీలుని, సమీక్ష్య=చూచి, ఆదిత్యవర్ణేన=సూర్యుని వంటి వర్ణము గల, రథేన=రథముతో, వాహినీపతిః=సేనానాయకుడైన, ప్రహస్తః=ప్రహస్తుడు, నీలమేవ=ఆ నీలుణ్ణే గూర్చియే, అభిదుద్రువే=ఎదురుగా వెళ్లెను.

తా. ఆకాశమునందు విజృంభించిన వాయువు బలముగా ఉన్న మేఘసముదాయము వైపు వెళ్లినట్లు, యుద్ధమునందు శీఘ్రముగా వచ్చిన నీలుని చూచి సేనానాయకుడైన ప్రహస్తుడు సూర్యునివంటి వర్ణము గల రథముతో అతనిమీదికే వెళ్లెను. 35-36

మూ. స ధనుర్ధన్వినాం శ్రేష్ఠో వికృష్య పరమాహవే, 37
నీలాయ వ్యసృజద్బాణాన్ ప్రహస్తో వాహినీపతిః.

ప్ర. అ. ధన్వినామ్=ధనుర్ధరులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడైన, వాహినీపతిః=సేనానాయకుడైన, సః ప్రహస్తః=ఆ ప్రహస్తుడు, పరమాహవే=గొప్ప యుద్ధమునందు, ధనుః=ధనస్సును, వికృష్య=లాగి, నీలాయ=నీలునకు, బాణాన్=బాణములను వ్యసృజత్=ప్రయోగించెను.

తా. ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన సేనాపతియైన ప్రహస్తుడు ఆ మహాయుద్ధమునందు ధనస్సును లాగి నీలునిపై బాణములను ప్రయోగించెను.

మూ. తే ప్రేష్య విశిఖా నీలం వినిర్భిద్య సమాహితాః, 38
మహీం జగ్ముర్మహావేగా రోషితా ఇవ పన్నగాః.

ప్ర. అ. సమాహితాః=ప్రయోగింపబడిన, రోషితాః=కోపించిన, పన్నగా ఇవ=సర్పములవలె ఉన్న, మహావేగాః=గొప్ప వేగము గల, తే విశిఖాః=ఆ బాణములు, నీలమ్=నీలుణ్ణి, ప్రేష్య=సమీపించి, వినిర్భిద్య=భేదించి, మహీమ్=భూమిని గూర్చి, జగ్ముః=వెళ్లినవి.

తా. కోపించిన సర్పములవలె ఉన్న మహావేగము గల ఆ బాణములు ప్రహస్తుడు ప్రయోగించగా నీలుని చేరి అతని శరీరమును భేదించి నేలమీద పడినవి. 38

మూ. నీలః శరైరభిహతో నిశితైర్జ్వలనోపమైః, 39
స తం పరమదుర్ధర్షమాపతన్తం మహాకపిః,
ప్రహస్తం తాడయామాస వృక్షముత్పాట్య వీర్యవాన్. 40

ప్ర. అ. మహాకపిః=గొప్ప వానరుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడు అయిన, సః=ఆ, నీలః=నీలుడు, నిశితైః=వాడియైన, జ్వలనోపమైః= అగ్నితో సమానములైన, శరైః=బాణములచేత, అభిహతః=కొట్టబడినవాడై, వృక్షమ్=వృక్షమును, ఉత్పాట్య=పెకలించి, పరమదుర్ధర్షమ్=మిక్కిలి ఎదిరింప శక్యము కాని, ఆపతన్తమ్=మీదికి వచ్చుచున్న, తం ప్రహస్తమ్=ఆ ప్రహస్తుని, తాడయామాస=కొట్టెను.

తా. అగ్నితో సమానమైన వాడియైన బాణములచేత కొట్టబడిన పరాక్రమశాలి, వానరవీరుడు అయిన నీలుడు ఒక వృక్షమును పెకలించి, ఎదిరించుటకు ఏ మాత్రము శక్యము కాని, మీదికి వచ్చి పడుచున్న ఆ ప్రహస్తుణ్ణి కొట్టెను.

39-40

మూ. స తేనాభిహతః క్రుద్ధో నదన్ రాక్షసపుంగవః,
వవర్ష శరవర్షాణి ప్లవంగానాం చమూపతౌ. 41

ప్ర. అ. తేన=వానిచేత, అభిహతః=కొట్టబడిన, సః రాక్షసపుంగవః=ఆ రాక్షసశ్రేష్ఠుడు, క్రుద్ధః=కోపించినవాడై, నదన్=ధ్వనిచేయుచు, ప్లవంగానామ్=వానరులయొక్క, చమూపతౌ=సేనానాయకుడైన ఆ నీలుని మీద, శరవర్షాణి=బాణవర్షములను, వవర్ష=వర్షించెను.

తా. ఆ నీలునిచేత కొట్టబడిన రాక్షసశ్రేష్ఠుడైన ప్రహస్తుడు కోపించి, దగ్గరగా అరచుచు వానరసేనానాయకుడైన అతనిపై బాణవర్షములు కురిపించెను.

మూ. తస్య బాణగణానేవ రాక్షసస్య దురాత్మనః,
అపారయన్వారయితుం ప్రత్యగృహ్ణాన్నిమీలితః. 41

ప్ర. అ. దురాత్మనః=దుష్టబుద్ధి గల, తస్య=ఆ, రాక్షసస్య= రాక్షసుని యొక్క, బాణగణానేవ=బాణసముదాయములను, వారయితుమ్= నివారించుటకు, అపారయన్=అసమర్థుడై, నిమీలితః=కళ్లు మూసుకొన్నవాడై, ప్రత్యగృహ్ణాత్=స్వీకరించెను.

తా. నీలుడు దురాత్ముడైన ఆ రాక్షసుని బాణసముదాయమును నివారింపజాలక, కండ్లు మూసికొని దానిని స్వీకరించెను. 41

మూ. యథైవ గోవృషో వర్షం శారదం శీఘ్రమాగతమ్,
ఏవమేవ ప్రహస్తస్య శరవర్షాన్ దురాసదాన్, 42
నిమీలితాక్షః సహసా నీలః సేహే దురాసదాన్.

ప్ర. అ. శీఘ్రమ్=శీఘ్రముగా, ఆగతమ్=వచ్చిన, శారదమ్= శరత్కాలసంబంధమైన, వర్షమ్=వర్షమును, గోవృషః=ఆబోతు, యథైవ= ఎట్లో, ఏవమేవ=అట్లే, నీలః=నీలుడు, ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క, దురాసదాన్=ఎదిరింప శక్యముకాని, సహసా=శీఘ్రముగా పడుచున్న, శరవర్షాన్=బాణవర్షములను, నిమీలితాక్షః=మూసికొనబడిన నేత్రములు కలవాడై, సేహే=సహించెను.

తా. శరత్కాలమునందు శీఘ్రముగా వచ్చిన వర్షమును ఆబోతు కళ్లుమూసికొని సహించినట్లు, నీలుడు, ప్రహస్తుడు ప్రయోగించిన, సహింప శక్యము కాని బాణవర్షములను కళ్లు మూసికొని సహించెను. 42

మూ. రోషితః శరవర్షేణ సాలేన మహతా మహాన్,
ప్రజఘాన హయాన్నీలః ప్రహస్తస్య మహాబలః. 43

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, మహాన్=గొప్పవాడైన, నీలః=నీలుడు, శరవర్షేణ=బాణవర్షముచేత, రోషితః= కోపింపచేయబడినవాడై, మహతా=గొప్పదైన, సాలేన=సాలవృక్షముచేత, ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క, హయాన్=గుఱ్ఱములను, ప్రజఘాన= చంపెను.

తా. మహాబలముగలవాడు, మహావానరనాయకుడు అయిన నీలుడు ఆ బాణవర్షమునకు కోపించి పెద్ద సాలవృక్షములో గుఱ్ఱములను చంపెను.43

మూ. తతో రోషపరీతాత్మా ధనుస్తస్య దురాత్మనః,
బభఞ్జ తరసా నీలో ననాద చ పునః పునః. 44

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నీలః=నీలుడు, రోషపరీతాత్మా= రోష ముతో నిండిన మనస్సు కలవాడై, దురాత్మనః=దురాత్ముడైన, తస్య=వానియొక్క, ధనుః=ధనస్సును, తరసా=వేగముతో, బభఞ్జ=విరచెను. పునః పునః=మాటిమాటికి, ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. పిమ్మట రోషావేశముతో కూడిన ఆ నీలుడు దురాత్ముడైన ఆ ప్రహస్తుని విల్లును బలముతో విరచి మాటిమాటికి అరచెను. 44

మూ. విధనుః స కృతస్తేన ప్రహస్తో వాహినీపతిః,
ప్రగృహ్య ముసలం ఘోరం స్యన్దనాదవపుప్లువే. 45

ప్ర. అ. తేన=వానిచేత, విధనుః=ధనస్సు లేనివాడుగా, కృతః= చేయబడిన, వాహినీపతిః=సేనానాయకుడైన, సః ప్రహస్తః=ఆ ప్రహస్తుడు, ఘోరమ్=భయంక రమైన, ముసలమ్=ముసలమును, ప్రగృహ్య=గ్రహించి, స్యన్దనాత్=రథమునుండి, అవపుప్లువే=దుమికెను.

తా. నీలుడు ఆ విధముగ ధనస్సు లేకుండా చేయగా సేనాపతియైన ప్రహస్తుడు భయంకరమైన ముసలమును ధరించి రథమునుండి క్రిందికి దుమికెను. 45

మూ. తావుభౌ వాహినీముఖ్యౌ జాతవైరౌ తరస్వినౌ,
స్థితౌ క్షతజసిక్తాఙ్గౌ ప్రభిన్నావివ కుఞ్జరౌ. 46

ప్ర. అ. జాతవైరౌ=కలిగిన వైరము గల, తరస్వినౌ=వేగవంతులైన, తౌ=ఆ, ఉభౌ=ఇద్దరు, వాహినీముఖ్యౌ=సేనానాయకులు, క్షతజసిక్తాఙ్గౌ=రక్తము చేత తడపబడిన శరీరములు కలవారై, ప్రభిన్నౌ= మదమును స్రవించు, కుఞ్జరౌ ఇవ=ఏనుగులు వలె, స్థితౌ=ఉండిరి.

తా. వైరము పూని యుద్ధముచేయుచున్న ఆ సేనాపతు లిద్దరూ, రక్తముతో తడిసిన శరీరములతో మదము కారుచున్న ఏనుగులవలె ఉండిరి. 46

మూ. ఉల్లిఖన్తౌ సుతీక్ష్ణాభిర్దంష్ట్రాభి రితరేతరమ్,
సింహశార్దూలసదృశౌ సింహశార్దూలచేష్టితౌ, 47
విక్రాన్తవిజయౌ వీరౌ సమరేష్వనివర్తినౌ,
కాఙ్క్షమాణౌ యశః ప్రాప్తుం వృత్రవాసవయోరివ. 48

ప్ర. అ. సుతీక్ష్ణాభిః=చాల తీక్ష్ణములైన, దంష్ట్రాభిః=కోరలచేత, ఇతరేతర

తమ్=పరస్పరము, ఉల్లిఖన్తౌ=గాయుచున్నవారు, సింహశార్దూలసదృశౌ=సింహము తోను పెద్దపులితోను సమానులు, సింహశార్దూలచేష్టితౌ=సింహము పెద్దపులివంటి చేష్టలు కలవారు, విక్రాన్తవిజయౌ=అంతటా పొందబడిన విజయములుగలవారు, సమరేషు=యుద్ధములయందు, అనివర్తినౌ=మరలనివారు అయిన, వీరౌ=ఆ వీరులిద్దరూ, వృత్రవాసవయోః=వృత్రాసురదేవేంద్రులయొక్క, యశః=కీర్తిని, ప్రాప్తుమ్=పొందుటకు, కాంక్షమాణావివ=కోరుచున్నవారు వలె ఉండిరి.

భా. సింహముతోను, పెద్దపులితోను సమానులైన ఆ వీరు లిద్దరూ తాం వాడియైన కోరలతో ఒకరినొకరు పొడుచుకొనుచు సింహము పెద్దపులి వలె ప్రవర్తించుచుండిరి. పూర్వము అనేకయుద్ధములలో విజయమును పొందిన వారిద్దరూ యుద్ధరంగమునుండి ఎన్నడూ వెనుకకు మరలనివారే. అట్టి వీరులు వృత్రాసురదేవేంద్రుల కీర్తివంటి కీర్తిని పొందుటకు కోరుచున్నారా అన్నట్లు యుద్ధము చేసిరి. 47,48

మూ. ఆజఘాన తదా నీలం లలాటే ముసలేన సః,
ప్రహస్తః పరమాయత్త స్తతః సుస్రావ శోణితమ్. 49

ప్ర. అ. తదా=అప్పుడు, సః ప్రహస్తః=ఆ ప్రహస్తుడు, పరమాయత్తః=మిక్కిలి ప్రయత్నము చేయుచున్నవాడై, ముసలేన=ముసలముచేత, నీలమ్=నీలుణ్ణి, లలాటే=లలాటమునందు, ఆజఘాన=కొట్టెను. తతః=ఆ లలాటమునుండి, శోణితమ్=రక్తము, సుస్రావ=స్రవించెను.

భా. అప్పుడు ఆ ప్రహస్తుడు ప్రయత్నపూర్వకముగా నీలుని లలాటముమీద ముసలముతో కొట్టెను. అతని లలాటమునుండి రక్తము స్రవించెను. 49

మూ. తతః శోణితదిగ్ధాఙ్గః ప్రగృహ్య చ మహాతరుమ్,
ప్రహస్తస్యోరసి క్రుద్ధో విససర్జ మహాకపిః. 50

ప్ర. అ. తతః=ఆటు పిమ్మట, మహాకపిః=వానరులలో గొప్పవాడైన నీలుడు, శోణితదిగ్ధాఙ్గః=రక్తముచేత పూయబడిన శరీరము కలవాడై, క్రుద్ధః=కోపించినవాడై, మహాతరుమ్=గొప్ప వృక్షమును, ప్రగృహ్య చ=గ్రహించి, ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, విససర్జ=విడచెను.

భా. పిమ్మట వానరులలో గొప్పవాడైన నీలుడు రక్తముచేత తడిసిన దేహము గలవాడై కోపించి, ఒక పెద్ద వృక్షమును గ్రహించి, ప్రహస్తుని వక్షః స్థలముమీద కొట్టెను. 50

మూ. తమచిన్త్య ప్రహారం స ప్రగృహ్య ముసలం మహత్,
అభిదుద్రావ బలినం బలాన్నీలం ప్లవంగమమ్. 51

ప్ర. అ. సః=అతడు, తమ్=ఆ, ప్రహారమ్=దెబ్బను, అచిన్త్య=లెక్కవేయక, మహత్=గొప్పదైన, ముసలమ్=ముసలమును, ప్రగృహ్య=గ్రహించి, బలినమ్=బలవంతుడైన, ప్లవంగమమ్=వానరుడైన, నీలమ్=నీలుణ్ణి గూర్చి, బలాత్=బలమువలన, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. ప్రహస్తుడు ఆ దెబ్బకు లెక్కచేయక పెద్ద ముసలము తీసుకొని తన బలమును చూపుచు బలశాలియైన నీలుని మీదకి పరుగెత్తెను. 51

మూ. తముగ్రవేగం సంరబ్ధమాపతన్తం మహాకపిః,
తతః సంప్రేక్ష్య జగ్రాహ మహావేగో మహాశిలామ్. 52

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాకపిః=వానరశ్రేష్ఠుడు, ఉగ్రవేగమ్=ఉగ్రమైన వేగము గలవాడు, సంరబ్ధమ్=తొందరగా, ఆపతన్తమ్= వచ్చిపడుచున్నవాడు అయిన, తమ్=వానిని, సంప్రేక్ష్య=చూచి, మహావేగః= గొప్ప వేగము గలవాడై, మహాశిలామ్=గొప్ప శిలను, జగ్రాహ=గ్రహించెను.

తా. వానరనాయకుడైన నీలుడు భయంకరమైన వేగము గల ఆ ప్రహస్తుడు తొందరగా తన మీదికి వచ్చుచుండుటను చూచి గొప్ప వేగముతో ఒక పెద్ద శిలను గ్రహించెను. 52

మూ. తస్య యుద్ధాభికామస్య మృధే ముసలయోధినః,
ప్రహస్తస్య శిలాం నీలో మూర్ధ్ని తూర్ణమపాతయత్. 53

ప్ర. అ. నీలః=నీలుడు, శిలామ్=ఆ శిలను, యుద్ధాభికామస్య= యుద్ధమును కోరుచున్న, మృధే=యుద్ధమునందు, ముసలయోధినః= ముసలముతో యుద్ధము చేయుచున్న, తస్య ప్రహస్తస్య=ఆ ప్రహస్తునియొక్క, మూర్ధ్ని=శిరస్సుపై, తూర్ణమ్=శీఘ్రముగా, అపాతయత్=పడవేసెను.

తా. నీలుడు వెంటనే ఆ శిలను యుద్ధము కోరుచు, యుద్ధరంగములో ముసలముతో యుద్ధము చేయుచున్న ప్రహస్తుని తలపై పడవేసెను. 53

మూ. నీలేన కపిముఖ్యేన విముక్తా మహతీ శిలా,
బిభేద బహుధా ఘోరా ప్రహస్తస్య శిరస్తదా. 54

ప్ర. అ. తదా=అప్పుడు, కపిముఖ్యేన=వానరనాయకుడైన, నీలేన= నీలునిచేత, విముక్తా=విడువబడిన, మహతీ=పెద్దదైన, ఘోరా= భయంకరమైన, శిలా=శిల, ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క, శిరః= శిరస్సును, బహుధా=అనేక విధములుగా, బిభేద=బద్దలుకొట్టెను.

తా. వానరనాయకుడైన నీలుడు ప్రయోగించిన ఆ భయంకరమైన

పెద్ద శిల ప్రహస్తుని శిరస్సును ముక్కు ముక్కలు చేసెను. 54

మూ. స గతాసుర్గతశ్రీకో గతసత్త్వో గతేన్ద్రియః,
పపాత సహసా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః. 55

ప్ర. అ. గతాసుః=పోయిన ప్రాణములు గలవాడు, గతశ్రీకః=పోయిన శోభ కలవాడు, గతసత్త్వః=పోయిన బలము గలవాడు, గతేన్ద్రియః=పోయిన ఇంద్రియములు గలవాడు అయిన, సః=ఆ ప్రహస్తుడు, ఛిన్నమూలః= తెగగొట్టబడిన మొదలు గల, ద్రుమః ఇవ=వృక్షము వలె, సహసా= వెంటనే, భూమౌ=నేలమీద, పపాత=పడెను.

తా. వెంటనే ఆ ప్రహస్తుడు శోభను, బలమును, ఇంద్రియాలను ప్రాణములను విడచి మొదలు నరకిన చెట్టు వలె నేలమీద కూలెను. 55

మూ. విభిన్నశిరసస్తస్య బహు సుస్రావ శోణితమ్,
శరీరాదపి సుస్రావ గిరేః ప్రస్రవణం యథా. 56

ప్ర. అ. తస్య=అతనియొక్క, విభిన్నశిరసః=బద్దలుకొట్టబడిన శిరస్సు నుండి, బహు=అధికమైన, శోణితమ్=రక్తము, సుస్రావ= స్రవించెను. శరీరాదపి=శరీరమునుండి కూడ, గిరేః=పర్వతమునుండి, ప్రస్రవణం యథా=సెలయేరువలె, సుస్రావ=స్రవించెను.

తా. బద్దలైన ఆ ప్రహస్తుని శిరస్సునుండి చాల రక్తము స్రవించెను. అతని శరీరమునుండి కూడ, పర్వతమునుండి సెలయేరు ప్రవహించిన నట్లు రక్తము స్రవించెను. 56

మూ. హతే ప్రహస్తే నీలేన తదకమ్ప్యం మహాబలమ్,
రాక్షసానా మహృష్టానాం లఙ్కామభిజగామ హ. 57

ప్ర. అ. నీలేన=నీలునిచేత, ప్రహస్తే=ప్రహస్తుడు, హతే= చంపబడిన వాడగుచుండగా, అహృష్టానామ్=దుఃఖించుచున్న, రాక్షసానామ్= రాక్షసులయొక్క, అకమ్ప్యమ్=కదల్ప శక్యముకాని, తత్ బలమ్=ఆ సైన్యము, లఙ్కామ్=లంకను గూర్చి, అభిజగామ హ=వెళ్లెను.

తా. నీలుడు ప్రహస్తుణ్ణి చంపిన వెంటనే దుఃఖితులైన రాక్షసుల ఆ జయింప శక్యము కాని సైన్యము లంక వైపు వెళ్లిపోయెను. 57

మూ. న శేకుః సమవస్థాతుం నిహతే వాహినీపతౌ,
సేతుబన్ధం సమాసాద్య విశీర్ణం సలిలం యథా. 58

ప్ర. అ. వాహినీపతౌ=సేనానాయకుడు, నిహతే=చంపబడిన వాడగుచుం

దగా, విశీర్ణమ్=విరిగిపోయిన, సేతుబన్ధమ్=సేతుబంధమును, సమాసాద్య=పొంది, సలిలం యథా=నీరు వలె, సమవస్థాతుమ్=నిలచుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. సేనానాయకుడు చంపబడుటచే ఆ రాక్షసులు, విరిగిపోయిన సేతుబంధము దగ్గర ఉన్న నీరు నిలవజాల నట్లు నిలువలేకపోయిరి. 58

మూ. హతే తస్మింశ్చమూముఖ్యే రాక్షసాస్తే నిరుద్యమాః,
రక్షఃపతిగృహం గత్వా ధ్యానమూకత్వమాగతాః, 59
ప్రాప్తాః శోకార్ణవం తీవ్రం నిసంజ్ఞా ఇవ తేఽభవన్.

ప్ర. అ. చమూముఖ్యే=సేనాపతియైన, తస్మిన్=ఆ ప్రహస్తుడు, హతే=చంపబడినవాడగుచుండగా, తే రాక్షసాః=ఆ రాక్షసులు, నిరుద్యమాః=ప్రయత్నములేనివారై, రక్షఃపతిగృహమ్=రావణుని గృహమును గూర్చి, గత్వా=వెళ్లి, ధ్యానమూకత్వమ్=ధ్యానముచేత మాటలేకపోవుటను, ఆగతాః=పొందినారు. తే=వాళ్లు, నిసంజ్ఞాః ఇవ=స్పృహ తప్పిన వాళ్లు వలె, అభవన్=అయిరి.

తా. సేనానాయకుడైన అతడు మరణించగానే రాక్షసులు ఏమీ చేయజాలక రావణుని ఇంటికి వెళ్లి అక్కడ ఏమేమో ఆలోచించుచు మాటలాడజాలకపోయిరి. తీవ్రమైన శోకసముద్రములో పడిన ఆ రాక్షసులు స్పృహ తప్పిపోయినట్లు అయిరి. 59

మూ. తతస్తు నీలో విజయీ మహాబలః
ప్రశస్యమానః సుకృతేన కర్మణా,
సమేత్య రామేణ సలక్ష్మణేన
ప్రహృష్టరూపస్తు బభూవ యూథపః. 60

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, యూథపః=సేనానాయకుడైన, నీలః=నీలుడు, విజయీ=విజయవంతుడై, సుకృతేన=బాగుగా చేయబడిన, కర్మణా=పనిచేత, ప్రశస్యమానః=ప్రశంసింపబడుచున్నవాడై, సలక్ష్మణేన=లక్ష్మణునితో కూడిన, రామేణ=రామునితో, సమేత్య=కలిసి, ప్రహృష్టరూపః=చాల సంతోషించినవాడు, బభూవ=అయెను.

తా. మహాబలశాలి, సేనానాయకుడూ అయిన నీలుడు విజయవంతుడై, బాగుగా చేసిన పనికి ప్రశంసింపబడుచు రామలక్ష్మణుల దగ్గరకు వెళ్లి చాల సంతోషముతో ఉండెను. ౬౦

"బాలనందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఏబదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనషష్టితమః సర్గః

[ప్రహస్తుడు మరణించుటచే దుఃఖితుడైన రావణుడు యుద్ధమునకు బయలుదేరుట. అతనితో వచ్చిన వీరులను గూర్చి విభీషణుడు రామునకు చెప్పుట. రావణుడు సుగ్రీవుని మూర్ఛపోవునట్లు చేయుట. లక్ష్మణుడు యుద్ధానికి వచ్చుట. రావణహనుమంతులు ఒకరినొకరు అరచేతితో కొట్టుకొనుట. రావణుడు నీలుని మూర్ఛచెందించుట. రావణుడు శక్తిని ప్రయోగింపగా లక్ష్మణుడు మూర్ఛ చెంది మరల లేచుట. రాముని చేతిలో పరాజితుడై రావణుడు లంకలో ప్రవేశించుట.]

మూ. తస్మిన్ హతే రాక్షససైన్యపాలే
ప్లవంగమానామృషభేణ యుద్ధే,
భీమాయుధం సాగరవేగతుల్యం
విదుద్రువే రాక్షసరాజసైన్యమ్. 1

ప్ర. అ. రాక్షససైన్యపాలే=రాక్షససైన్యమునకు రక్షకుడైన, తస్మిన్=ఆ ప్రహస్తుడు, యుద్ధే=యుద్ధమునందు, ప్లవంగమానామ్ ఋషభేణ=వానరులలో శ్రేష్ఠుడైన నీలునిచేత, విహతే=చంపబడినవాడగుచుండగా, భీమాయుధమ్= భయంకరములైన ఆయుధములు గలది, సాగరవేగతుల్యమ్=సముద్రవేగముతో సమానము అయిన, రాక్షసరాజసైన్యమ్=రావణుని సైన్యము, విదుద్రువే= పారిపోయెను.

తా. రాక్షససేనానాయకుడైన ప్రహస్తుణ్ణి వానరశ్రేష్ఠుడైన నీలుడు చంపివేయగా భయంకరములైన ఆయుధములు సముద్రముతో సమానమైన వేగమూ గల రావణసైన్యము పారిపోయెను. 1

మూ. గత్వా తు రక్షోధిపతేః శశంసుః
సేనాపతిం పావకసూనుశస్తమ్,
తచ్చాపి తేషాం వచనం నిశమ్య
రక్షోధిపః క్రోధవశం జగామ. 2

ప్ర. అ. గత్వా=వెళ్లి, సేనాపతిమ్=సేనాపతిని, పావకసూనుశస్తమ్= అగ్నిపుత్రుడైన నీలునిచేత చంపబడినవానినిగా, రక్షోధిపతేః=రావణునకు, శశంసుః=చెప్పిరి. రక్షోధిపః=రావణుడు, తేషామ్=వాళ్లయొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, నిశమ్య=విని, క్రోధవశమ్= క్రోధమునకు వశమును, జగామ=పొందెను.

తా. ఆ సైనికులు వెళ్లి సేనాపతిని నీలుడు చంపివేసినట్లుగా రావణునకు తెలుపగా అతడు ఆ మాటలు విని చాల కోపించెను. 2

మూ. సంఖ్యే ప్రహస్తం నిహతం నిశమ్య
క్రోధార్దితః శోకపరీతచేతాః,
ఉవాచ తాన్ రాక్షసయూథముఖ్యా
నిన్ద్రో యథా నిర్జరయూథముఖ్యాన్. 3

ప్ర. అ. సంఖ్యే=యుద్ధమునందు, ప్రహస్తమ్=ప్రహస్తుని, నిహతమ్=చంపబడినవానినిగా, నిశమ్య=విని, క్రోధార్దితః=క్రోధముచేత పీడింపబడినవాడై, శోకపరీతచేతాః=శోకముతో నిండిన చిత్తము గలవాడై, ఇన్ద్రః=ఇంద్రుడు, నిర్జరయూథముఖ్యాన్=దేవతల సేనానాయకులను గూర్చి వలె, తాన్=ఆ, రాక్షసయూథముఖ్యాన్=రాక్షససేనానాయకులను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. రావణుడు, యుద్ధములో ప్రహస్తుడు చంపబడినట్లు విని, కోపముతో బాధపడుచు, మనస్సు శోకముతో నిండగా రాక్షససేనానాయకులతో, దేవేంద్రుడు దేవసేనానాయకులతో పలికినట్లు ఇట్లు పలికెను. 3

మూ. నావజ్ఞా రిపవే కార్యా యైరిన్ద్రబలసూదనః,
సూదితః సైన్యపాలో మే సానుయాత్రః సకుఞ్జరః.

ప్ర. అ. ఇన్ద్రబలసూదనః=ఇంద్రుని సైన్యమును నశింపచేసిన, సానుయాత్రః= అనుచరులతో కూడిన, సకుఞ్జరః=ఏనుగులతో కూడిన, మే సైన్యపాలః=నా సేనానాయకుడు, యైః=ఎవరిచేత, సూదితః=చంపబడినాడో, రిపవే=అట్టి శత్రువునకు, అవజ్ఞా=అనాదరము, న కార్యా=చేయదగినది కాదు.

తా. ఇంద్రుని సైన్యమును కూడ నశింపచేసిన నా సేనాపతిని పరివారముతోను, ఏనుగులతోను సహా చంపివేసిన శత్రువుల విషయమున అనాదరము చూపగూడదు. 4

మూ. సోఽహం రిపువినాశాయ విజయాయావిచారయన్,
స్వయమేవ గమిష్యామి రణశీర్షం తదద్భుతమ్. 5

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, అవిచారయన్=ఆలోచించకుండగా, రిపువినాశాయ=శత్రువుల వినాశముకొరకు, విజయాయ=విజయముకొరకు, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, తత్=ఆ, రణశీర్షమ్=యుద్ధరంగముయొక్క అగ్రభాగమును గూర్చి, స్వయమేవ=స్వయముగా, గమిష్యామి=వెళ్లగలను.

తా. అందుచేత నేనింక ఏమీ ఆలోచించకుండగా శత్రువులను చంపి విజయము సాధించుటకై స్వయముగా ఆశ్చర్యకరమైన యుద్ధరంగాగ్రభాగమునకు వెళ్లెదను.

మూ. అద్య తద్వానరానీకం రామం చ సహలక్ష్మణమ్,
నిర్దహిష్యామి బాణౌఘైర్వనం దీప్తైరివాగ్నిభిః, 6
అద్య సంతర్పయిష్యామి పృథివీం కపిశోణితైః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, తత్=ఆ, వానరానీకమ్=వానరసైన్యమును, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రామం చ=రాముణ్ణి, దీప్తైః=ప్రజ్వరిలుచున్న, అగ్నిభిః=అగ్నులచేత, వనమివ=వనమునువలె, బాణౌఘైః=బాణసముదాయముల చేత, నిర్దహిష్యామి=కాల్చివేయగలను. అద్య=ఇప్పుడు, కపిశోణితైః=వానరుల రక్తములచేత, పృథివీమ్=భూమిని, సంతర్పయిష్యామి=తృప్తిపొందించెదను.

తా. మండుచున్న అగ్నులచేత వనమును కాల్చివేసి నట్లు, ఇప్పుడు, బాణసముదాయములచేత ఆ వానరసైన్యమును, రామలక్ష్మణులను కాల్చివేసెదను. ఇప్పుడు వానరుల రక్తములచేత భూమికి సంతృప్తి కలిగించెదను. 6

మూ. స ఏవముక్త్వా జ్వలనప్రకాశం
రథం తురంగోత్తమరాజియుక్తమ్,
ప్రకాశమానం వపుషా జ్వలన్తం
సమారురోహామరరాజశత్రుః. 7

ప్ర. అ. అమరరాజశత్రుః=దేవేంద్రుని శత్రువైన, సః=ఆ రావణుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, జ్వలనప్రకాశమ్=అగ్నివంటి ప్రకాశముగల, తురంగోత్తమరాజియుక్తమ్=శ్రేష్ఠములైన గుఱ్ఱముల పంక్తితో కూర్చబడిన, ప్రకాశమానమ్=ప్రకాశించుచున్న, వపుషా=దేహముతో, జ్వలన్తమ్=మండుచున్న, రథమ్=రథమును, సమారురోహ=ఎక్కెను.

తా. దేవేంద్రుని శత్రువైన ఆ రావణుడు ఇట్లు పలికి అగ్నివంటి ప్రకాశము గల రథము నెక్కెను. దానికి శ్రేష్ఠములైన చాల గుర్రములను కట్టిరి. అది మండుచున్నట్లు ప్రకాశించుచుండెను. 7

మూ. స శఙ్ఖభేరీపణవప్రణాదై
రాస్ఫోటితక్ష్వేడితసింహనాదైః,
పుణ్యైః స్తవైశ్చాపి సుపూజ్యమాన
స్తదా యయౌ రాక్షసరాజముఖ్యః. 8

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షసరాజముఖ్యః=రాక్షసరాజులలో శ్రేష్ఠుడైన, సః=అతడు, శఙ్ఖభేరీపణవప్రణాదైః=శంఖములయొక్క భేరీలయొక్క పణవము లయొక్క ధ్వనులతోను, ఆస్ఫోటితక్ష్వేడితసింహనాదైః=జబ్బలు చరచుటతోను, అరచుటలతోను, సింహనాదములతోను, పుణ్యైః=ఉత్తమములైన, స్తవైశ్చాపి=

స్తోత్రములతోను, సుపూజ్యమానః=బాగా పూజింపబడుచు, యయౌ=వెళ్లెను.

తా. రాక్షసులందరూ శంఖభేరీ పణవములను ప్రయోగించుచు, బొబ్బలు చరచుచు, అరచుచు, సింహనాదములు చేయుచు, ఉత్తమములైన స్తోత్రములు చేయుచుండగా రావణుడు బయలుదేరెను. 8

మూ. స నీలజీమూతనికాశరూపైః
మాంసాశనైః పావకదీప్తనేత్రైః,
బభౌ వృతో రాక్షసరాజముఖ్యో
భూతైర్వృతో రుద్ర ఇవామరేశః. 9

ప్ర. అ. నీలజీమూతనికాశరూపైః=నల్లని మేఘములతో సమానములైన రూపములు గల, పావకదీప్తనేత్రైః=అగ్నివలె మండుచున్న నేత్రములుగల, మాంసాశనైః= మాంసమును భుజించు రాక్షసులతో, సః=ఆ, రాక్షసరాజముఖ్యః=రావణుడు, భూతైః=భూతములతో, వృతః=కూడిన, అమరేశః=దేవతల ప్రభువైన, రుద్రః ఇవ=రుద్రుడు వలె, బభౌ=ప్రకాశించెను.

తా. నల్లని మేఘములవంటి రూపములు గలవారు, అగ్నివలె ప్రకాశించుచున్న నేత్రములు కలవారు అయిన ఆ రాక్షసులతో కూడిన రావణుడు భూతములతో కూడిన దేవతాప్రభువైన రుద్రుడు వలె ప్రకాశించెను. 9

మూ. తతో నగర్యాః సహసా మహౌజా
నిష్క్రమ్య తద్వానరసైన్యముగ్రమ్,
మహార్ణవాభ్రస్తనితం దదర్శ
సముద్యతం పాదపశైలహస్తమ్. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహౌజాః=గొప్ప వేగము గల రావణుడు, సహసా=వెంటనే, నగర్యాః=నగరమునుండి, నిష్క్రమ్య=బయలు వెడలి, ఉగ్రమ్=భయంకరము, మహార్ణవాభ్రస్తనితమ్=మహాసముద్రము వంటి, మేఘమువంటి ధ్వని గలది, సముద్యతమ్=సన్నద్ధమైనది, పాదపశైలహస్తమ్= వృక్షములు పర్వతములు హస్తములందు కలది అయిన, తత్ వానరసైన్యమ్=ఆ వానరసైన్యమును, దదర్శ=చూచెను.

తా. పిమ్మట, గొప్ప తేజస్సుగల రావణుడు వెంటనే లంకనుండి బయల్వెడలి మహాసముద్రమేఘముల వలె గర్జించుచు, వృక్షములు పర్వతములు హస్తములందు ధరించి యుద్ధానికి సిద్ధముగా ఉన్న, భయంకరమైన ఆ వానరసైన్యమును చూచెను. 10

మూ. తద్రాక్షసానీకమతిప్రచణ్డ
మాలోక్య రామో భుజగేన్ద్రబాహుః,
విభీషణం శస్త్రభృతాం వరిష్ఠ
మువాచ సేనానుగతః పృథుశ్రీః. 11

ప్ర. అ. భుజగేన్ద్రబాహుః=సర్పరాజువంటి బాహువులు కలవాడు, సేనానుగతః=సేనచేత అనుసరింపబడినవాడు, పృథుశ్రీః=గొప్ప ఐశ్వర్యము గలవాడు అయిన, రామః=రాముడు, అతిప్రచణ్డమ్=చాల తీవ్రమైన, తత్=ఆ, రాక్షసానీకమ్=రాక్షససైన్యమును, ఆలోక్య=చూచి, శస్త్రభృతామ్=ఆయుధము లను ధరించువారిలో, వరిష్ఠమ్=శ్రేష్ఠుడైన, విభీషణమ్=విభీషణుని గూర్చి ఉవాచ=పలికెను.

తా. సర్పరాజు వలె పొడవైన బలిష్ఠమైన బాహువులు గలవాడు, సేనచేత అనుసరింపబడినవాడు, గొప్ప తేజస్సుతో కూడినవాడు అయిన రాముడు చాల భయంకరమైన ఆ సైన్యమును చూచి శస్త్రధారులలో శ్రేష్ఠుడైన విభీషణునితో ఇట్లు పలికెను. 11

మూ. నానాపతాకధ్వజఛత్రజుష్టం
ప్రాసాసిశూలాయుధశస్త్రజుష్టమ్,
కస్యేదమక్షోభ్యమభీరుజుష్టం
సైన్యం మహేన్ద్రోపమనాగజుష్టమ్. 12

ప్ర. అ. నానాపతాకధ్వజఛత్రజుష్టమ్=అనేకవిధములైన పతాకలతో, ధ్వజములతో, ఛత్రములతో కూడినది, ప్రాసాసిశూలాయుధశస్త్రజుష్టమ్=ప్రాసలతో, ఖడ్గములతో, శూలాయుధములతో, ఇతరశస్త్రములతో కూడినది, అభీరుజుష్టమ్=ధైర్యవంతులతో కూడినది, మహేన్ద్రోపమనాగజుష్టమ్=మహేంద్రపర్వతమువంటి ఏనుగులతో కూడినది అయిన, అక్షోభ్యమ్=క్షోభింప శక్యము కానిది అయిన, ఇదమ్=ఈ, సైన్యమ్=సైన్యము, కస్య=ఎవరిది?

తా. క్షోభింప శక్యము కాని ఈ సైన్యము ఎవరిది? అనేకవిధములైన పతాకలు, ధ్వజములు, ఛత్రములు ఉన్న ఈ సైన్యములో ప్రాసలు, ఖడ్గములు, శూలములు మొదలైన ఆయుధములు ధరించిన ధైర్యవంతులైన యోధులు కనబడుచున్నారు. దీనిలోని ఏనుగులు మహేంద్రపర్వతము వలె ఉన్నవి. 12

మూ. తతస్తు రామస్య నిశమ్య వాక్యం
విభీషణః శక్రసమానవీర్యః,

శశంస రామస్య బలప్రవేకం
మహాత్మనాం రాక్షసపుంగవానామ్. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శక్రసమానవీర్యః=దేవేంద్రునితో సమానమైన పరాక్రమముగల, విభీషణః=విభీషణుడు, రామస్య=రామునియొక్క, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, మహాత్మనామ్=గొప్ప బుద్ధిబలము గల, రాక్షసపుఙ్గవానామ్=రాక్షసశ్రేష్ఠులయొక్క, బలప్రవేకమ్=ఉత్తమమైన సైన్యమును గూర్చి, రామస్య=రామునకు, శశంస=చెప్పెను.

తా. అప్పుడు దేవేంద్రుని పరాక్రమము వంటి పరాక్రమము గల విభీషణుడు రాముని మాటలు విని గొప్ప బుద్ధిబలము గల రాక్షసశ్రేష్ఠుల ఆ ఉత్తమసైన్యమును గూర్చి చెప్పెను. 13

మూ. యో ఽ సౌ గజస్కన్ధగతో మహాత్మా
నవోదితార్కోపమతామ్రవక్త్రః,
సంకమ్పయన్నాగశిరో ఽ భ్యుపైతి
హ్యకమ్పనం త్వేవ మవేహి రాజన్. 14

ప్ర. అ. రాజన్=రాజా ! గజస్కన్ధగతః=ఏనుగు మూపురమును పొందినవాడై, నవోదితార్కోపమతామ్రవక్త్రః=క్రొత్తగా ఉదయించిన సూర్యునితో సమానమైన ఎఱ్ఱని ముఖముగల, మహాత్మా=మహాత్ముడైన, యః అసౌ=ఏ ఇతడు, నాగశిరః=ఏనుగు శిరస్సును, సంకమ్పయన్=కంపింపచేయుచు, అభ్యుపైతి=వచ్చుచున్నాడో, ఏనమ్=వీనిని, అకమ్పనమ్=అకంపనునిగా, అవేహి=తెలుసుకొనుము.

తా. రాజా ! ఏనుగపై ఎక్కి, దాని శిరస్సును(తన శరీరభారము చేత)కదల్చుచు, వచ్చుచున్న, అప్పుడే ఉదయించిన సూర్యునివలె ఎఱ్ఱనైన ముఖము గల ఈ మహాత్ముడు అకంపనుడు. ( హనుమంతుని చేతిలో చచ్చిన అకంపనుడు(56 వ సర్గ) వేరు, ఇతడు వేరు అని వ్యాఖ్యాతలు. ప్రాచ్యపాఠంలో వీని పేరు "ప్రవీరబాహువు")

మూ. యో ఽ సౌ రథస్థో మృగరాజకేతు
ర్ధున్వన్ధనుః శక్రధనుఃప్రకాశమ్,
కరీవ భాత్యుగ్రవివృత్తదంష్ట్రః
స ఇన్ద్రజిన్నామ వరప్రధానః. 15

ప్ర. అ. రథస్థః=రథమునందున్నవాడు, మృగరాజకేతుః=సింహాము ధ్వజమునందు గలవాడు, శక్రధనుఃప్రకాశమ్=ఇంద్రధనస్సు వంటి ప్రకాశము గల, ధనుః=ధనస్సును, ధున్వన్=కదల్చుచున్నవాడు అయిన, యః అసౌ=ఏ

ఆతడు, ఉగ్రవివృత్తదంష్ట్రః=భయంకరములైన, వంకర తిరిగిన కోరలు గలవాడై, కరీవ=గజము వలె, భాతి=ప్రకాశించుచున్నాడో, సః=ఆతడు, వరప్రధానః=వరములు ప్రధానములుగా గల, ఇన్ద్రజిత్ నామ=ఇంద్రజిత్తు అనువాడు.

తా. సింహము ధ్వజమునందున్న రథమెక్కి ఇంద్రధనస్సు వలె ప్రకాశించుచున్న ధనస్సును కదల్చుచు, భయంకరములైన, వంకర తిరిగిన కోరలతో ఏనుగ వలె ఉన్న ఇతడు ఇంద్రజిత్తు. వరములచే లభించిన గొప్ప పరాక్రమాదులు ఉన్నవాడు. 15

మూ. యశ్చైష విన్ధ్యాస్తమహేన్ద్రకల్పో
ధన్వీ రథస్థోఽతిరథోఽతివీరః,
విస్ఫారయంశ్చాపమతుల్యమానం
నామ్నాతికాయోఽతివివృద్ధకాయః. 16

ప్ర. అ. విన్ధ్యాస్తమహేన్ద్రకల్పః=వింధ్య-అస్తాద్రి-మహేంద్రాదుల వలె ఉన్నవాడు, ధన్వీ=ధనుర్ధరుడు, రథస్థః=రథమునందున్నవాడు, అతిరథః=అతిరథుడు, అతివీరః=చాల గొప్పవీరుడు, అతుల్యమానమ్=సాటిలేని ప్రమాణము గల, చాపమ్=ధనస్సును, విస్ఫారయన్=చరచుచున్నవాడు అయిన, అతివివృద్ధకాయః=చాల వృద్ధి చెందిన శరీరము గల, యః ఏషః=ఏ ఇతడు వచ్చుచున్నాడో, అయమ్=ఇతడు, నామ్నా=పేరుచేత, అతికాయః= అతికాయుడు.

తా. వింధ్యపర్వతములతోను, అస్తాద్రితోను, మహేంద్రపర్వతముతోను సమానుడు, ధనుర్ధరుడు, రథమునందున్నవాడు, అతిరథుడు, మహావీరుడు, చాల పెద్దదైన ధనస్సును చరచుచున్నవాడు, చాల పెద్దగా పెరిగిన దేహము కలవాడు అయిన ఇతడు అతికాయుడు. 16

మూ. యోఽసౌ నవార్కోదితతామ్రచక్షు
రారుహ్య ఘణ్టానినదప్రణాదమ్,
గజం ఖరం గర్జతి వై మహాత్మా
మహోదరో నామ స ఏష వీరః. 17

ప్ర. అ. నవార్కోదితతామ్రచక్షుః=నూతనముగా ఉదయించిన సూర్యుడు వలె ఎఱ్ఱనైన నేత్రములు గల, యః అసౌ=ఏ ఇతడు, ఘణ్టానినదప్రణాదమ్=ఘంటాధ్వనిచేత ధ్వనించుచున్న, గజమ్=గజమును, ఆరుహ్య=ఎక్కి, ఖరమ్=కటువుగా, గర్జతి=గర్జించుచున్నాడో, మహాత్మా=మహాత్ముడైన, సః ఏషః వీరః=అట్టి ఈ వీరుడు, మహోదరో నామ=మహోదరుడను పేరు గలవాడు.

తా. అప్పుడే ఉదయించిన సూర్యుడు వలె ఎఱ్ఱగా ఉన్నకళ్లతో,

ఘంటానాదములతో ఎక్కువ శబ్దము చేయుచున్న ఏనుగను ఎక్కి ప్రకారముగా అరచుచున్న ఈ మహాత్ముడైన వీరుడు మహోదరుడు. 17

మూ. యోఽసౌ హయం కాఞ్చనచిత్రభాణ్డ
మారుహ్య సన్ధ్యాభ్రగిరిప్రకాశః,
ప్రాసం సముద్యమ్య మరీచినద్ధం
పిశాచ ఏషోఽశనితుల్యవేగః. 18

ప్ర. అ. సంధ్యాభ్రగిరిప్రకాశః=సంధ్యాకాలమునందలి మేఘము, పర్వతము వంటి ప్రకాశ గల, యః=ఏ, అసౌ=ఇతడు, కాఞ్చనచిత్రభాణ్డమ్=చిత్రములైన బంగారు అలంకారములు గల, హయమ్=గుఱ్ఱమును, ఆరుహ్య=ఎక్కి, మరీచిన ద్ధమ్=కిరణములచేత కట్టబడిన(చుట్టబడిన), ప్రాసమ్=ప్రాసను, సముద్యమ్య=ఎత్తి వచ్చుచున్నాడో, ఏషః=ఇతడు, అశనితుల్యవేగః=పిడుగులో సమానమైన వేగము గల, పిశాచః=పిశాచుడు.

తా. విచిత్రమైన బంగారు అలంకారములచేత అలంకరించిన గుఱ్ఱమును ఎక్కి, కిరణములను ప్రసరింపచేయుచున్న ప్రాసమును ధరించి వచ్చుచున్న, సంధ్యాకాలమునందలి మేఘముతోను పర్వతముతోను సమానమైన కాంతి గల ఇతడు పిడుగుతో సమానమైన వేగము గల పిశాచుడు. 18

మూ. యశ్చైష శూలం నిశితం ప్రగృహ్య
విద్యుత్ప్రభం కింకరవజ్రవేగమ్,
వృషేన్ద్రమాస్థాయ శశిప్రకాశ
మాయాతి సోఽసౌ త్రిశిరా యశస్వీ. 19

ప్ర. అ. యః ఏషః=ఏ యితడు, నిశితమ్=వాడియైన, విద్యుత్ప్రభమ్=మెరుపు వంటి కాంతి గల, కింకరవజ్రవేగమ్=కింకరుడైన వజ్రవేగము గల, శూలమ్=శూలమును, ప్రగృహ్య=గ్రహించి, శశిప్రకాశమ్=చంద్రునివంటి కాంతి గల, వృషేన్ద్రమ్=శ్రేష్ఠమైన వృషభమును, ఆరుహ్య=ఎక్కి, ఆయాతి=వచ్చుచున్నాడో, సః అసౌ=అట్టి ఇతడు, యశస్వీ=కీర్తిగల, త్రిశిరాః=త్రిశిరస్కు.

తా. మెరపు వంటి ప్రకాశ గల, వజ్రవేగము కింకరుడుగా గల వాడియైన శూలమును ధరించి, చంద్రుడు వలె తెల్లగా ఉన్న వృషభమును ఎక్కి వచ్చుచున్నవాడు కీర్తిమంతుడైన త్రిశిరస్కుడు. 19

మూ. అసౌ చ జీమూతనికాశరూపః
కుమ్భః పృథువ్యూఢసుజాతవక్షాః,

సమాహితః పన్నగరాజకేతు
ర్విస్ఫారయన్యాతి ధనుర్విధూన్వన్. 20

ప్ర. అ. జీమూతనికాశరూపః=మేఘముతో సమానమైన రూపము గలవాడు, పృథువ్యూఢసుజాతవక్షాః=బలిసిన విశాలమైన అందమైన వక్షఃస్థలము కలవాడు, సమాహితః=ఏకాగ్రచిత్తము కలవాడు, పన్నగరాజకేతుః=సర్పరాజు కేతువునందు కలవాడు అయిన, అసౌ=ఈ, కుమ్భః=కుంభుడు, ధనుః=ధనస్సును, విధూన్వన్=కదల్చుచు, విస్ఫారయన్=చరచుచు, యాతి=వెళ్లుచున్నాడు.

తా. మేఘమువంటి రూపము, బలిసి విశాలముగా అందముగా ఉన్న వక్షఃస్థలము గల ఈ కుంభుడు యుద్ధమునందు ఏకాగ్రమైన చిత్తముతో ధనస్సును కదల్చుచు, చరచుచు వచ్చుచున్నాడు. ఇతని కేతువు మీద సర్పరాజచిహ్నము ఉన్నది. 20

మూ. యశ్చైష జామ్బూనదవజ్రజుష్టం
దీప్తం సధూమం పరిఘం ప్రగృహ్య,
ఆయాతి రక్షోబలకేతుభూతః
సోఽసౌ నికుమ్భోఽద్భుతవీరకర్మా. 21

ప్ర. అ. యః ఏషః=ఏ ఇతడు, జామ్బూనదవజ్రజుష్టమ్=బంగారముచేత వజ్రముచేత పొందబడిన, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, సధూమమ్=ధూమముతో కూడిన, పరిఘమ్=పరిఘను, ప్రగృహ్య=గ్రహించి, ఆయాతి=వచ్చుచున్నాడో, సః అసౌ=అట్టి ఇతడు, రక్షోబలకేతుభూతః=రాక్షససేనకు ధ్వజము వంటివాడైన, అద్భుతవీరకర్మా=ఆశ్చర్యకరమైన వీరకృత్యములు గల, నికుమ్భః=నికుంభుడు.

తా. బంగారముతోను, వజ్రాలతోను కూడిన ప్రజ్వలించుచున్న పొగలు వచ్చుచున్న పరిఘను గ్రహించి వచ్చుచున్నవాడు రాక్షససైన్యమునకు ధ్వజమువంటి, ఆశ్చర్యకరములైన వీరకృత్యములు చేయు నికుంభుడు. 21

మూ. యశ్చైష చాపాసిశరౌఘజుష్టం
పతాకినం పావకదీప్తరూపమ్,
రథం సమాస్థాయ విభాత్యుదగ్రో
నరాన్తకోఽసౌ నగశృఙ్గయోధీ. 22

ప్ర. అ. చాపాసిశరౌఘజుష్టమ్=ధనస్సులతోను, ఖడ్గములతోను, బాణసముదాయముతోను కూడిన, పతాకినమ్=పతాకలు గల, పావకదీప్తరూపమ్=అగ్నివలె ప్రకాశించుచున్న రూపము గల, రథమ్=రథమును, సమాస్థాయ=అధిష్ఠించి, యః ఏషః=ఏ ఇతడు, విభాతి=ప్రకాశించుచున్నాడో, ఉదగ్రః=తీవ్రస్వభావవంతుడైన,

అసౌ=ఇతడు, నగశృఙ్గయోధీ=పర్వతశిఖరములతో ఢీకొని యుద్ధముచేయు, నరాన్తకః=నరాంతకుడు.

భా. ధనస్సులు, ఖడ్గములు, బాణసముదాయము ఉంచిన, పతాకంచే అలంకరించిన, అగ్నివలె ప్రజ్వలించుచున్న రూపముగల రథమునెక్కి ప్రకాశించుచున్న ఈ తీవ్రమైన స్వభావము గలవాడు నరాంతకుడు. ఎదిరించి నిలబడువాళ్లు లేకపోవుటచే ఇతడు పర్వతశిఖరములతో యుద్ధము చేయుచుండును. 22

మూ. యస్త్వేష నానావిధఘోరరూపై
ర్వ్యాఘ్రోష్ట్రనాగేన్ద్రమృగాశ్వవక్త్రైః,
భూతైర్వృతో భాతి వివృత్తనేత్రై
ర్యో౽సౌ సురాణామపిదర్పహన్తా. 23
యత్రైతదిన్దుప్రతిమం విభాతి
ఛత్రం సితం సూక్ష్మశలాకమగ్ర్యమ్,
అత్రైష రక్షోధిపతిర్మహాత్మా
భూతైర్వృతో రుద్ర ఇవావభాతి. 24

ప్ర. అ. యః ఏషః=ఏ ఇతడు, నానావిధఘోరరూపైః=అనేకవిధములైన ఘోరములైన రూపములు గల, వ్యాఘ్రోష్ట్రనాగేన్ద్రమృగాశ్వవక్త్రైః=పెద్దపులుల, ఒంటెల, ఏనుగుల, లేళ్ల, గుఱ్ఱముల ముఖములు గల, వివృత్తనేత్రైః=తిరిగిన నేత్రములు గల, భూతైః=భూతములతో, వృతః=కూడినవాడై, భాతి=ప్రకాశించుచున్నాడో, యః అసౌ=ఏ ఇతడు, సురాణామపి=దేవతలయొక్క కూడ, దర్పహన్తా=దర్పమును తొలగించువాడో, ఏషః=ఇతడు, మహాత్మా=మహాత్ముడైన, రక్షోధిపతిః=రాక్షసరాజు. ఇన్దుప్రతిమమ్=చంద్రునితో సమానము, సూక్ష్మశలాకమ్=సూక్ష్మములైన ఊచలు గలది, అగ్ర్యమ్=శ్రేష్ఠము అయిన, సితమ్=తెల్లని, ఛత్రమ్=ఛత్రము, యత్ర=ఎక్కడ, విభాతి=ప్రకాశించుచున్నదో, అత్ర=ఇక్కడ, భూతైః=భూతములతో, వృతః=కూడిన, రుద్రః ఇవ=రుద్రుడు వలె, విభాతి=ప్రకాశించుచున్నాడు.

భా. అనేకవిధములైన భయంకరరూపములు గల, పెద్దపులులు, ఒంటెలు, ఏనుగులు, లేళ్లు, గుఱ్ఱములు - వీటి ముఖములవంటి ముఖములు గల, తిరిగిపోవుచున్న నేత్రములు గల భూతములతో కూడినవాడు దేవతల దర్పమును కూడ తొలగించిన రావణుడు. సన్నని ఊచలు గల, చంద్రుడు వలె తెల్లగా ఉన్న శ్రేష్ఠమైన ఛత్రము దగ్గర ఇతడు భూతములతో కూడిన రుద్రుడు వలె ప్రకాశించుచున్నాడు. 23, 24

మూ. అసౌ కిరీటీ చలకుణ్డలాస్యో
నగేన్ద్రవిన్ధ్యోపమభీమకాయః,
మహేన్ద్రవైవస్వతదర్పహన్తా
రక్షోధిపః సూర్య ఇవావభాతి. 25

ప్ర. అ. కిరీటీ=కిరీటము గలవాడు, చలకుణ్డలాస్యః=కదలుచున్న కుండలములు గల ముఖము గలవాడు, నగేన్ద్రవిన్ధ్యోపమభీమకాయః=పర్వతశ్రేష్ఠమైన వింధ్యపర్వతముతో సమానమైన భయంకరమైన దేహము గలవాడు, మహేన్ద్రవైవస్వతదర్పహన్తా=మహేంద్రయములు దర్పమును పోగొట్టినవాడు అయిన, రక్షోధిపః=రావణుడు, సూర్యః ఇవ=సూర్యుడు వలె, అవభాతి= ప్రకాశించుచున్నాడు.

తా. యమదేవేంద్రుల దర్పమును పోగొట్టిన ఈ రావణుడు సూర్యుడు వలె ప్రకాశించుచున్నాడు. వింధ్యపర్వతము వంటి భయంకరమైన శరీరము గల ఇతడు కిరీటమును ధరించి ఉన్నాడు. ఇతని ముఖమునందున్న కుండలములు కదలుచున్నవి. 25

మూ. ప్రత్యువాచ తతో రామో విభీషణమరిందమః,
అహో దీప్తమహాతేజా రావణో రాక్షసేశ్వరః. 26

ప్ర. అ. తతః=అటు పిమ్మట, అరిందమః=శత్రుసంహారకుడైన, రామః= రాముడు, విభీషణమ్=విభీషణుని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. అహో=ఏమి ఆశ్చర్యము! రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, దీప్తమహాతేజాః=ప్రకాశించుచున్న గొప్ప తేజస్సు గలవాడు !

తా. పిమ్మట శత్రుసంహారకుడైన రాముడు విభీషణునితో ఇట్లు పలికెను. "అహో ! రాక్షసరాజైన రావణుడు తేజస్సుతో ఎంత గొప్పగా ప్రకాశించుచున్నాడు !" 26

మూ. ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యో రశ్మిభిర్భాతి రావణః,
న వ్యక్తం లక్ష్యతే హ్యస్య రూపం తేజఃసమావృతమ్. 27

ప్ర. అ. రావణః=రావణుడు, రశ్మిభిః=కిరణములచేత, ఆదిత్యః ఇవ= సూర్యుడు వలె, దుష్ప్రేక్ష్యః=చూడ శక్యముకానివాడై, భాతి= ప్రకాశించుచున్నాడు. అస్య=ఈతనియొక్క, తేజఃసమావృతమ్=తేజస్సుచేత కప్పబడిన, రూపమ్=రూపము, వ్యక్తమ్=స్పష్టముగా, న లక్ష్యతే హి=చూడబడుటలేదు.

తా. కిరణములు వ్యాపించి ఉండుటచేత సూర్యుడు వలె ఈ రావణుడు చూచుటకు శక్యము కాకుండా ఉన్నాడు. మరియు తేజస్సుతో నిండిన ఈతని రూపము స్పష్టముగా కనబడుటలేదు. 27

మూ. దేవదానవవీరాణాం వపుర్నైవంవిధం భవేత్,
యాదృశం రాక్షసేన్ద్రస్య వపురేతద్విరాజతే. 28

ప్ర. అ. దేవదానవవీరాణామ్=దేవతలలో వీరులయొక్క, దానవులలో వీరులయొక్క, వపుః=శరీరము, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, ఏతత్=ఈ, వపుః= శరీరము, యాదృశమ్=ఎట్టిదిగా, విరాజతే=ప్రకాశించుచున్నదో, ఏవం విధమ్=ఇట్టిదిగా, న భవేత్=ఉండదు.

తా. దేవదానవవీరుల శరీరము కూడ ఈ రావణుని శరీరము ఎట్లు ప్రకాశించుచున్నదో అట్లు ప్రకాశించదు. 28

మూ. సర్వే పర్వతసంకాశాః సర్వే పర్వతయోధినః,
సర్వే దీప్తాయుధధరా యోధాశ్చాస్య మహాత్మనః. 29

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, అస్య=ఇతనియొక్క, యోధాః= యోధులు, సర్వే=అందరూ, పర్వతసంకాశాః=పర్వతములతో సమానులు. సర్వే=అందరూ, పర్వతయోధినః=పర్వతములతో యుద్ధము చేయువారు, సర్వే=అందరూ, దీప్తాయుధధరాః=ప్రజ్వలించుచున్న ఆయుధములు ధరించినవారు.

తా. మహాత్ముడైన ఇతని యోధు లందరూ పర్వతముల వలె ఉన్నారు. అందరూ పర్వతాలతో యుద్ధము చేయగలిగినవారే. అందరూ ప్రకాశించుచున్న ఆయుధాలు ధరించుచున్నవారే. 29

మూ. విభాతి రక్షోరాజోఽసౌ ప్రదీప్తైర్భీమదర్శనైః,
భూతైః పరివృతస్తీక్ష్ణైర్దేహవద్భిరివాన్తకః. 30

ప్ర. అ. ప్రదీప్తైః=ప్రజ్వలించుచున్న, భీమదర్శనైః=భయంకరమైన దర్శనము గల, తీక్ష్ణైః=క్రూరులైన, దేహవద్భిః=పెద్ద దేహము గల, పరివృతైః=చుట్టూ ఉన్న, భూతైః=భూతములతో, అసౌ=ఈ, రక్షోరాజః=రాక్షసరాజు, అన్తకః ఇవ= యముడు వలె, భాతి=ప్రకాశించుచున్నాడు.

తా. ప్రకాశించుచున్నవారు, చూచుటకు భయమును కలిగించువారు, క్రూరులు, పెద్ద దేహములు గలవారు అయిన చుట్టూ ఉన్న భూతములతో ఈ రాక్షసరాజు యముడు వలె ప్రకాశించుచున్నాడు. 30

మూ. దిష్ట్యాయమద్య పాపాత్మా మమ దృష్టిపథం గతః,
అద్య క్రోధం విమోక్ష్యామి సీతాహరణసంభవమ్. 31

ప్ర. అ. దిష్ట్యా=దైవవశముచేత, పాపాత్మా=పాపాత్ముడైన,

అయమ్=ఇతడు, మమ=నాయొక్క, దృష్టిపథమ్=దృష్టిమార్గమును, గతః=పొంది నాడు, అద్య=ఇప్పుడు, సీతాహరణసంభవమ్=సీతను హరించుటవలన కలిగిన, క్రోధమ్=క్రోధమును, విమోక్ష్యామి=విడువగలను.

తా. దైవవశముచేత ఈ పాపాత్ముడు ఇప్పుడు నా కంట బడినాడు. ఇపుడు సీతను హరించుట వలన కలిగిన క్రోధమును వీనిమీద విడచెదను.31

మూ. ఏవముక్త్వా తతో రామో ధనురాదాయ వీర్యవాన్,
లక్ష్మణానుచరస్తస్థౌ సముద్ధృత్య శరోత్తమమ్. 32

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామః=రాముడు, ఏవమ్= ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటుపిమ్మట, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి, శరోత్తమమ్=ఉత్తమమైన శరమును, సముద్ధృత్య= ఎత్తి, లక్ష్మణానుచరః=లక్ష్మణుడు అనుచరుడుగా గలవాడై, తస్థౌ=నిలచెను.

తా. పరాక్రమవంతుడైన రాము డిట్లు పలికి, పిమ్మట ధనస్సు గ్రహించి, ఉత్తమమైన బాణమును తీసికొని, నిలబడెను. లక్ష్మణుడు రాముని వెనుకనే నిలచెను. 32

మూ. తతః స రక్షోధిపతిర్మహాత్మా
రక్షాంసి తాన్యాహ మహాబలాని,
ద్వారేషు చర్యాగృహగోపురేషు
సునిర్వృతాస్తిష్ఠత నిర్విశఙ్కాః. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ, రక్షోధిపతిః=రావణుడు, మహాబలాని=గొప్ప బలము గల, తాని=ఆ, రక్షాంసి=రాక్షసులను గూర్చి, ఆహ=పలికెను. ద్వారేషు= ద్వారములయందు, చర్యాగృహగోపురేషు=మహామార్గములలో ఉన్న గృహముల గోపురములయందు, సునిర్వృతాః=బాగా సుఖము గలవారై, నిర్విశఙ్కాః= భయము లేనివారై, తిష్ఠత=ఉండుడు.

తా. పిమ్మట మహాత్ముడైన ఆ రాక్షసరాజు బలవంతులైన ఆ రాక్షసులతో ఇట్లనెను-- "మీరు ద్వారములవద్దను, మహామార్గములలో ఉన్న గృహముల గోపురములందు ఏ భయము లేక సుఖముగా ఉండుడు". 33

మూ. ఇహాగతం మాం సహితం భవద్భి
ర్వనౌకసశ్ఛిద్రమిదం విదిత్వా,
శూన్యాం పురీం దుష్ప్రసహాం ప్రమథ్య
ప్రధర్షయేయుః సహసా సమేతాః 34

ప్ర. అ. భవద్భిః=మీతో, సహితమ్=కూడిన, మామ్=నన్ను, ఇహ=ఇక్క

డికి, ఆగతమ్=వచ్చినవానివిగా, ఇదమ్=ఈ, ఛిద్రమ్= అవకాశమును, విదిత్వా=తెలిసికొని, వనౌకసః=వానరులు, సమేతాః= కలసినవారై, దుష్ప్రసహామ్=ఎదిరింప శక్యము కాని, శూన్యామ్=శూన్యమైన, పురీమ్=పట్టణమును, ప్రమథ్య=మథించి, సహసా=హటాత్తుగా, ప్రధర్షయేయుః=ధర్షించెదరు.

తా. నేను మీ అందరితో కలిసి ఇక్కడికి వచ్చినట్లుగా వానరులు తెలిసికొని, ఈ అవకాశము దొరకుటచే అందరూ కలిసి, ఎదిరింప శక్యము కాని శూన్యమైన లంకాపురిని క్షోభచెందు నట్లు చేసి హటాత్తుగా పీడించెదరు.

మూ. విసర్జయిత్వా సచివాంస్తతస్తాన్
గతేషు రక్షఃసు యథానియోగమ్,
వ్యదారయద్వానరసాగరౌఘం
మహోర్మిషః పూర్ణమివార్ణవౌఘమ్. 35

ప్ర. అ. తాన్=ఆ, సచివాన్=సచివులను, విసర్జయిత్వా=పంపివేసి, తతః=అటుపిమ్మట, రక్షఃసు=రాక్షసులు, యథానియోగమ్= ఆజ్ఞానుసారముగా, గతేషు=వెళ్లినవారగుచుండగా, వానరసాగరౌఘమ్= వానరసముద్రముయొక్క ప్రవాహమును, మహోర్మిషః=గొప్ప చేప, పూర్ణమ్=నిండిన, అర్ణవౌఘమ్ ఇవ=సముద్రజలసమురాయమును వలె, వ్యదారయత్=చీల్చివేసెను.

తా. ఆ మంత్రులను పంపివేసి, ఆ రాక్షసు లందరు ఆజ్ఞానుసారము వెళ్లిన పిమ్మట, గొప్ప చేప సముద్రజలసమురాయమును చీల్చినట్లు వానరసముద్ర ప్రవాహము చీల్చివేసెను. 35

మూ. తమాపతన్తం సహసా సమీక్ష్య
దీప్తేషుచాపం యుధి రాక్షసేన్ద్రమ్,
మహత్సముత్పాట్య మహీధరాగ్రం
దుద్రావ రక్షోధిపతిం హరీశః. 36

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, సహసా=శీఘ్రముగా, ఆపతన్తమ్=వచ్చిపడుచున్న, దీప్తేషుచాపమ్=ప్రకాశించుచున్న బాణములు ధనస్సు గల, రాక్షసేన్ద్రమ్=రావణుని, సమీక్ష్య=చూచి, హరీశః=సుగ్రీవుడు, మహత్=గొప్ప, మహీధరాగ్రమ్=పర్వతశిఖరమును, సముత్పాట్య= పెకలించి, రక్షోధిపతిమ్=ఆ రాక్షసరాజును గూర్చి, దుద్రావ=పరుగెత్తెను.

తా. ప్రకాశించు ధనుర్బాణములతో యుద్ధములో హటాత్తుగా వచ్చి మీద పడుచున్న, ఆ రావణుని చూచి, సుగ్రీవుడు పెద్ద పర్వతశిఖరమును పెకలించి, అతనిమీదికి పరుగెత్తెను. 36

మూ. తచ్ఛైలశృఙ్గం బహువృక్షసానుం
ప్రగృహ్య చిక్షేప నిశాచరాయ,
తమాపతన్తం సహసా సమీక్ష్య
చిచ్ఛేద బాణైస్తపనీయపుఙ్ఖైః. 37

ప్ర. అ. బహువృక్షసానుమ్=అనేకములైన వృక్షములు, చరియలు గల, తత్=ఆ, శైలశృఙ్గమ్=పర్వతశిఖరమును, ప్రగృహ్య=గ్రహించి, నిశాచరాయ=రాక్షసునకు, చిక్షేప=విసరెను. ఆపతన్తమ్=వచ్చుచున్న, తమ్=ఆ శిఖరమును, సమీక్ష్య=చూచి, సహసా=వెంటనే, తపనీయపుఙ్ఖైః=బంగారు పొన్నులు గల, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. అనేకవృక్షములు, చరియలు గల ఆ పర్వతశిఖరమును సుగ్రీవుడు రావణుని మీదకి విసరగా అతడు వెంటనే దానిని బంగారు పొన్నులు గల బాణములతో ఛేదించెను. 37

మూ. తస్మిన్ ప్రవృద్ధోత్తమసానువృక్షే
శృఙ్గే విదీర్ణే పతితే పృథివ్యామ్,
మహాహికల్పం శరమన్తకాభం
సమాదదే రాక్షసలోకనాథః. 38

ప్ర. అ. తస్మిన్=ఆ, ప్రవృద్ధోత్తమసానువృక్షే=వృద్ధిపొందిన ఉత్తమములైన చరియలు, చెట్లు గల, శృఙ్గే=శిఖరము, విదీర్ణే=చీల్చబడినదై, పృథివ్యామ్=నేలమీద, పతితే=పడినదగుచుండగా, రాక్షసలోకనాథః=రావణుడు, మహాహికల్పమ్=మహాసర్పమువంటి, అన్తకాభమ్=యమునితో సమానమైన, శరమ్=శరమును, సమాదదే=సంధించెను.

తా. బాగా పెరిగిన ఉత్తమములైన వృక్షములతోను, చరియలతోను నిండిన ఆ శిఖరము చీల్చబడి నేలమీద పడిపోయిన పిమ్మట రావణుడు యమునితో సమానమైన మహాసర్పము వంటి బాణమును సంధించెను. 38

మూ. స తం గృహీత్వాఽశనితుల్యవేగం
సవిస్ఫులిఙ్గజ్వలనప్రకాశమ్,
బాణం మహేన్ద్రాశనితుల్యవేగం
చిక్షేప సుగ్రీవవధాయ రుష్టః. 39

ప్ర. అ. రుష్టః=కోపించిన, సః=ఆ రావణుడు, అశనితుల్యవేగమ్=పిడుగుతో సమానమైన వేగము గల, సవిస్ఫులిఙ్గజ్వలనప్రకాశమ్=అగ్నికణాలతో కూడిన అగ్నితో సమానమైన ప్రకాశము గల, మహేన్ద్రాశనితుల్యవేగమ్=మహేంద్రుని

వజ్రాయుధముతో సమానమైన వేగము గల, తం బాణమ్=ఆ బాణమును, గృహీత్వా= గ్రహించి, సుగ్రీవవధాయ=సుగ్రీవుని వధకొరకు, చిక్షేప=విసిరెను.

తా. ఆ రావణుడు కోపించినవాడై పిడుగుతోను, ఇంద్రుని వజ్రాయుధముతోను సమానమైన వేగము గలది కణములతో కూడిన అగ్ని వంటి ప్రకాశము గలది అయిన ఆ బాణమును గ్రహించి, సుగ్రీవుని చంపుటకై ప్రయోగించెను. 39

మూ. స సాయకో రావణబాహుముక్తః
శక్రాశనిప్రఖ్యవపుఃప్రకాశమ్,
సుగ్రీవమాసాద్య బిభేద వేగా
ద్గుహేరితా క్రౌఞ్చమివోగ్రశక్తిః. 40

ప్ర. అ. రావణబాహుముక్తః=రావణుని బాహువుచేత విడవబడిన, సః సాయకః=ఆ బాణము, శక్రాశనిప్రఖ్యవపుఃప్రకాశమ్=ఇంద్రుని వజ్రాయుధముతో సమానమైన శరీరప్రకాశము గల, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఆసాద్య=పొంది, గుహేరితా=గుహునిచేత ప్రయోగింపబడిన, ఉగ్రశక్తిః=ఉగ్రమైన శక్తి, క్రౌఞ్చమివ=క్రౌంచపర్వతమును వలె, వేగాత్=వేగమువలన, బిభేద= భేదించెను.

తా. రావణుని బాహువులచేత విడవబడిన ఆ బాణము ఇంద్రుని వజ్రాయుధముతో సమానమైన శరీరముతో ప్రకాశించుచున్న సుగ్రీవుని పొంది కుమారస్వామి ప్రయోగించిన ఉగ్రమైన శక్తి క్రౌంచపర్వతమును వలె వేగముతో అతని శరీరమును భేదించెను. 40

మూ. స సాయకార్తో విపరీతచేతాః
కూజన్ పృథివ్యాం నిపపాత వీరః,
తం వీక్ష్య భూమౌ పతితం విసంజ్ఞం
నేదుః ప్రహృష్టా యుధి యాతుధానాః. 41

ప్ర. అ. సః వీరః=ఆ వీరుడు, సాయకార్తః=బాణముచేత పీడితుడై, విపరీతచేతాః=తిరిగిపోయిన చిత్తముగలవాడై, కూజన్=అరచుచు, పృథివ్యామ్=నేల మీద, నిపపాత=పడెను. యుధి=యుద్ధమునందు, విసంజ్ఞమ్=సంజ్ఞపోయిన, భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, తమ్=అతనిని, వీక్ష్య=చూచి, యాతుధానాః=రాక్షసులు, ప్రహృష్టాః=సంతోషించినవారై, నేదుః=ధ్వనిచేసిరి.

తా. వీరుడైన ఆ సుగ్రీవుడు బాణముచేత పీడితుడై, చిత్తము వికారము చెందగా అరచుచు నేలమీద పడిపోయెను. యుద్ధములో స్పృహ తప్పి నేలమీద పడిపోయిన అతనిని చూచి రాక్షసులు సంతోషించుచు ధ్వనిచేసిరి. 41

మూ. తతో గవాక్షో గవయః సుషేణ
స్త్వథర్షభో జ్యోతిముఖో నలశ్చ,
శైలాన్ సముత్పాట్య వివృద్ధకాయాః
ప్రదుద్రువుస్తం ప్రతి రాక్షసేన్ద్రమ్. 42

ప్ర. అ. తతః=అటుపిమ్మట, గవాక్షః=గవాక్షుడు, గవయః= గవయుడు, సుషేణః=సుషేణుడు, అథ=మరియు, ఋషభః=ఋషభుడు, జ్యోతిముఖః=జ్యోతిర్ముఖుడు, నలశ్చ=నలుడు, శైలాన్=పర్వతములను, సముత్పాట్య=పెకలించి, వివృద్ధకాయాః=వృద్ధిపొందిన శరీరములు గలవారై, తమ్=ఆ, రాక్షసేన్ద్రం ప్రతి=రావణుని గూర్చి, ప్రదుద్రువుః=పరుగెత్తిరి.

తా. పిమ్మట గవాక్షుడు, గవయుడు, సుషేణుడు, ఋషభుడు, జ్యోతిర్ముఖుడు, నలుడు పర్వతములను పెకలించి, పెంచబడిన శరీరములతో ఆ రావణునిమీదికి పరుగెత్తి వెళ్లిరి. 42

మూ. తేషాం ప్రహారాన్ స చకార మోఘాన్
రక్షోధిపో బాణశతైః శితాగ్రైః,
తాన్వానరేన్ద్రానపి బాణజాలై
ర్బిభేద జామ్బూనదచిత్రపుఙ్ఖైః. 43

ప్ర. అ. సః రక్షోధిపః=ఆ రాక్షసరాజు, శితాగ్రైః=వాడియైన అగ్రభాగములు గల, బాణశతైః=వందలకొలది బాణములచేత, తేషామ్=వాళ్ల యొక్క, ప్రహారాన్=దెబ్బలను, మోఘాన్=వ్యర్థమైనవాటినిగా, చకార=చేసెను. జామ్బూనదచిత్రపుఙ్ఖైః=బంగారముచేత చిత్రమైన పొన్నులు గల, బాణజాలైః=బాణసముదాయములచేత, తాన్=ఆ, వానరేన్ద్రానపి=వానరనాయకులను కూడ, బిభేద=భేదించెను.

తా. ఆ రాక్షసరాజు వాడియైన అగ్రభాగములు గల బాణములతో ఆ వానరుల ఆయుధములను వ్యర్థమయ్యే ట్లు చేసి బంగారముచేత చిత్రమైన పొన్నులు గల బాణములతో వారి శరీరములు కూడ భేదించెను. 43

మూ. తే వానరేన్ద్రాస్త్రిదశారిబాణై
ర్భిన్నా నిపేతుర్భువి భీమకాయాః,
తతస్తు తద్వానరసైన్యముగ్రం
ప్రచ్ఛాదయామాస స బాణజాలైః. 44

ప్ర. అ. భీమకాయాః=భయంకరమైన శరీరములు గల, తే వానరేన్ద్రాః=ఆ వానరనాయకులు, త్రిదశారిబాణైః=రావణుని బాణములచేత,

భిన్నాః=భేదింపబడినవారై, భువి=నేలమీద, నిపేతుః=పడిరి. తతః=అటుపిమ్మట, సః=ఆతడు, బాణజాలైః=బాణముల సముదాయములతో, ఉగ్రమ్=భయంకరమైన, తత్ వానరసైన్యమ్=ఆ వానరసైన్యమును, ప్రచ్ఛాదయామాస=కప్పెను.

తా. భయంకరములైన శరీరములు గల ఆ వానరనాయకులు రావణుని బాణముల దెబ్బలకు బ్రద్దలైన శరీరములతో మూర్ఛచెంది నేలమీద పడిరి. పిమ్మట ఆ రావణుడు భయంకరమైన ఆ వానరసైన్యమును బాణసముదాయములతో కప్పివేసెను. 44

మూ. తే వధ్యమానాః పతితాశ్చ వీరా
నానద్యమానా భయశల్యవిద్ధాః,
శాఖామృగా రావణసాయకార్తా
జగ్ముః శరణ్యం శరణం స్మ రామమ్. 45

ప్ర. అ. వధ్యమానాః=కొట్టబడుచున్నవారు, పతితాః=పడిపోయినవారు, నానద్యమానాః=ఎక్కువగా ధ్వని చేయుచున్నవారు, భయశల్యవిద్ధాః=భయ మనే శల్యముచేత కొట్టబడినవారు, వీరాః=వీరులు అయిన, తే శాఖామృగాః=ఆ వానరులు, రావణసాయకార్తాః=రావణుని బాణములచేత పీడితులై, శరణ్యమ్=శరణాగతరక్షకుడైన, రామమ్=రాముణ్ణి, శరణం జగ్ముః స్మ=శరణుపొందిరి.

తా. రావణుడు బాణములతో కొట్టగా నేలపై పడిపోవుచు, భయ మను శల్యముచేత కొట్టబడి బిగ్గరగా అరచుచున్న ఆ వానరవీరులు రావణుని బాణములచేత పీడితులై సర్వలోకరక్షకుడైన రాముని శరణుజొచ్చిరి. 45

మూ. తతో మహాత్మా స ధనుర్ధనుష్మా
నాదాయ రామః సహసా జగామ,
తం లక్ష్మణః ప్రాఞ్జలిరభ్యుపేత్య
ఉవాచ వాక్యం పరమార్థయుక్తమ్. 46

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడు, ధనుష్మాన్=ధనుర్ధరుడు అయిన, సః రామః=ఆ రాముడు, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి, సహసా=వెంటనే, జగామ=వెళ్లెను. లక్ష్మణః=లక్ష్మణుడు, తమ్=రాముణ్ణి, అభ్యుపేత్య=సమీపించి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, పరమార్థయుక్తమ్=ఉత్తమమైన అర్థముతో కూడిన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు ఉత్తమధనుర్ధారియైన మహాత్ముడైన రాముడు ధనస్సు ధరించి వెంటనే ముందుకు వచ్చెను. లక్ష్మణుడు రాముని దగ్గరకు వెళ్లి, అంజలి ఘటించి గొప్ప అర్థము గల వాక్యము పలికెను. 46

మూ. కామమార్యః సుపర్యాప్తో వధాయాస్య దురాత్మనః,
విధమిష్యామ్యహం హ్యేతమనుజానీహి మాం విభో. 47

ప్ర. అ. దురాత్మనః=దురాత్ముడైన, అస్య=ఈ రావణునియొక్క, వధాయ=వధకొఱకు, ఆర్యః=పూజ్యుడవైన నీవు, సుపర్యాప్తః కామమ్= చాలినవాడవే. విభో=ఓ! ప్రభూ! అహమ్=నేను, ఏతమ్=వీనిని, విధమిష్యామి=చంపెదను. మామ్=నన్ను, అనుజానీహి=అనుమతించుము.

తా. ప్రభూ! ఈ దురాత్ముణ్ణి చంపుటకు నీవు సమర్థుడవనుటలో సందేహము లేదు. ఈతనిని నేను చంపెదను, నాకు అనుజ్ఞ ఇమ్ము. 47

మూ. తమబ్రవీన్మహాతేజా రామః సత్యపరాక్రమః,
గచ్ఛ యత్నపరశ్చాపి భవ లక్ష్మణ సంయుగే. 48

ప్ర. అ. సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గల, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, తమ్=ఆ లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్= పలికెను. లక్ష్మణ=లక్ష్మణా! గచ్ఛ=వెళ్లుము. సంయుగే=యుద్ధమునందు, యత్నపరశ్చాపి=ప్రయత్నమునందు ఆసక్తికలవాడవుగా కూడ, భవ=అగుము.

తా. మహాతేజశ్శాలి, సత్యమైన పరాక్రమము గలవాడు అయిన రాముడు అతనితో ఇట్లనెను — "లక్ష్మణా! వెళ్లుము. యుద్ధములో జాగరూకతతో యత్నము చేయుము." 48

మూ. రావణో హి మహావీర్యో రణేఽద్భుతపరాక్రమః,
త్రైలోక్యేనాపి సంక్రుద్ధో దుష్ప్రసహ్యో న సంశయః. 49

ప్ర. అ. రావణః=రావణుడు, మహావీర్యః=గొప్ప వీర్యము గలవాడు, రణే=యుద్ధమునందు, అద్భుతపరాక్రమః=ఆశ్చర్యకరమైన పరాక్రమము గలవాడు. సంక్రుద్ధః=కోపించిన ఇతడు, త్రైలోక్యేనాపి=మూడు లోకములచేతను కూడ, దుష్ప్రసహ్యః=సహింప శక్యము కానివాడు. సంశయః= సంశయము, న=లేదు.

తా. "రావణుడు గొప్ప శక్తి కలవాడు. యుద్ధమునందు ఆశ్చర్యకరమైన పరాక్రమమును చూపగలవాడు. ఇతడు కోపించినచో మూడు లోకములూ కూడ ఇతని ముందు నిలువజాలవు. సందేహము లేదు." 49

మూ. తస్య చ్ఛిద్రాణి మార్గస్వ స్వచ్ఛిద్రాణి చ లక్షయ,
చక్షుషా ధనుషాత్మానం గోపాయస్వ సమాహితః. 50

ప్ర. అ. తస్య=వానియొక్క, ఛిద్రాణి=లోపములను, మార్గస్వ= వెదకుము. స్వచ్ఛిద్రాణి చ=తన(నీ)లోపములను గూడ, లక్షయ=చూచుకొనుము.

సమాహితః=సావధానచిత్తుడవై, చక్షుషా=నేత్రముతోను, ధనుషా= ధనస్సుతోను, ఆత్మానమ్=తనను, గోపాయస్వ=రక్షించుకొనుము.

తా. "ఆతనిలో ఉన్న లోపములను వెదకి తెలిసికొనుము; నీలో ఉన్న లోపములను గూడ గ్రహించుము. నేత్రములతోను, ధనస్సుతోను కూడ నిన్ను నువ్వు రక్షించుకొనుము." 50

మూ. రాఘవస్య వచః శ్రుత్వా సంపరిష్వజ్య పూజ్య చ,
అభివాద్య చ రామాయ యయౌ సౌమిత్రిరాహవమ్. 51

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, రాఘవస్య=రామునియొక్క, వచః= వచనమును, శ్రుత్వా=విని, సంపరిష్వజ్య=కౌగలించుకొని, పూజ్య చ= పూజించి, రామాయ=రామునకు, అభివాద్య చ=నమస్కరించి, ఆహవమ్= యుద్ధమును గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. లక్ష్మణుడు రాముని మాటలు విని, రాముని కౌగలించుకొని, పూజించి, అభివాదనము చేసి యుద్ధమునకు వెళ్లెను. 51

మూ. స రావణం వారణహస్తబాహుం
దదర్శ భీమోద్యతదీప్తచాపమ్,
ప్రచ్ఛాదయన్తం శరవృష్టిజాలై
స్తాన్వానరాన్ భిన్నవికీర్ణదేహాన్. 52

ప్ర. అ. సః=లక్ష్మణుడు, వారణహస్తబాహుమ్=ఏనుగతొండమువంటి బాహువులు గలవాడు, భీమోద్యతదీప్తచాపమ్=ఎత్తబడిన భయంకరమైన ప్రకాశించుచున్న ధనస్సు కలవాడు, భిన్నవికీర్ణదేహాన్=బద్దలుకొట్టబడిన, ఇటునటు చిమ్మివేయబడిన దేహములు గల, తాన్=ఆ, వానరాన్=వానరులను, శరవృష్టి జాలైః=బాణవర్షసముదాయములచేత, ప్రచ్ఛాదయన్తమ్= కప్పుచున్నవాడు అయిన, రావణమ్=రావణుని, దదర్శ=చూచెను.

తా. ఏనుగతొండము వంటి బాహువులు గల రావణుడు అప్పుడు భయంకరమైన ప్రకాశించుచున్న ధనస్సును ఎత్తి బాణవర్షసముదాయములచేత వానరులను కప్పివేయుచుండెను. వాళ్ల దేహములు బద్దలైపోయి చెల్లాచెదరుగ పడుచుండెను. అట్టి రావణుని లక్ష్మణుడు చూచెను. 52

మూ. తమాలోక్య మహాతేజా హనూమాన్మారుతాత్మజః,
నివార్య శరజాలాని విదుద్రావ స రావణమ్. 53

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, సః=ఆ, హనూమాన్=హనుమంతుడు, తమ్=ఆ రావణుని, ఆలోక్య=

చూచి, శరజాలాని=బాణసముదాయములను, విహార్య=విహరించి, రావణమ్=రావణుని గూర్చి, విదుద్రావ=పరుగెత్తెను.

తా. గొప్ప తేజస్సు గల, వాయుపుత్రుడైన హనుమంతుడు రావణుని చూచి, అతడు ప్రయోగించుచున్న బాణసముదాయములను అడ్డుకొనుచు అతనిమీదికి శీఘ్రముగా వెళ్లెను. 53

మూ. రథం తస్య సమాసాద్య బాహుముద్యమ్య దక్షిణమ్,
త్రాసయన్ రావణం ధీమాన్ హనూమాన్వాక్యమబ్రవీత్. 54

ప్ర. అ. ధీమాన్=బుద్ధిమంతుడైన, హనుమాన్=హనుమంతుడు, తస్య=వానియొక్క, రథమ్=రథమును, సమాసాద్య=సమీపించి, దక్షిణమ్=కుడిదైన, బాహుమ్=బాహువును, ఉద్యమ్య=ఎత్తి, త్రాసయన్=భయపెట్టుచు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. బుద్ధిమంతుడైన హనుమంతుడు రావణుని రథము దగ్గరకు వెళ్లి, కుడిచెయ్యి ఎత్తి, అతనిని భయపెట్టుచు ఇట్లనెను. 54

మూ. దేవదానవగన్ధర్వైర్యక్షైశ్చ సహరాక్షసైః,
అవధ్యత్వం త్వయా ప్రాప్తం వానరేభ్యస్తు తే భయమ్. 55

ప్ర. అ. దేవదానవగన్ధర్వైః=దేవతలచేత, దానవులచేత, గంధర్వులచేత, సహరాక్షసైః=రాక్షసులతో కూడిన, యక్షైశ్చ=యక్షులచేత, అవధ్యత్వమ్=చంపశక్యముకాకపోవుట, త్వయా=నీచేత, ప్రాప్తమ్=పొందబడినది. తే=నీకు, వానరేభ్యస్తు=వానరులనుండైతే, భయమ్=భయము.

తా. నీవు దేవ - దానవ - గంధర్వ - యక్ష - రాక్షసులు చంపుటకు శక్యముకాకుండు నట్లు వరము సంపాదించినావు. కాని వానరులనుండి నీకు భయ ముండనే ఉన్నది. 55

మూ. ఏష మే దక్షిణో బాహుః పఞ్చశాఖః సముద్యతః,
విధమిష్యతి తే దేహే భూతాత్మానం చిరోషితమ్. 56

ప్ర. అ. మే=నాయొక్క, పఞ్చశాఖః=ఐదు వ్రేళ్లు గల, ఏషః=ఈ, సముద్యతః=ఎత్తబడిన, దక్షిణః బాహుః=కుడిచెయ్యి, తే=నీయొక్క, దేహే=దేహమునందు, చిరోషితమ్=చిరకాలము పాటు ఉన్న, భూతాత్మానమ్=జీవాత్మను, విధమిష్యతి=ధ్వంసముచేయుగలదు.

తా. పైకి ఎత్తబడిన ఐదు వ్రేళ్లు గల కుడి చెయ్యి చిరకాలమునుండి నీ శరీరములో ఉన్న జీవాత్మను తొలగించగలదు. 56

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం రావణో భీమవిక్రమః,
సంరక్తనయనః క్రోధాదిదం వచనమబ్రవీత్. 57

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, రావణః=రావణుడు, హనుమతః=హనుమంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, క్రోధాత్=కోపమువలన, సంరక్తనయనః=ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. భయంకరమైన పరాక్రమము గల రావణుడు హనుమంతుని మాటలు విని కోపముచేత కళ్లు ఎఱ్ఱబడగా, ఇట్లు పలికెను. 57

మూ. క్షిప్రం ప్రహర నిఃశఙ్కం స్థిరాం కీర్తిమవాప్నుహి,
తతస్త్వాం జ్ఞాతవిక్రాన్తం నాశయిష్యామి వానర. 58

ప్ర. అ. వానర=వానరుడా ! నిఃశఙ్కమ్=సందేహము లేకుండగా, క్షిప్రమ్=శీఘ్రముగా, ప్రహర=కొట్టుము, స్థిరామ్=స్థిరమైన, కీర్తిమ్=కీర్తిని, అవాప్నుహి=పొందుము. తతః=అటుపిమ్మట, జ్ఞాతవిక్రాన్తమ్=తెలియబడిన పరాక్రమము గల, త్వామ్=నిన్ను, నాశయిష్యామి=నశింపచేసెదను.

తా. వానరుడా ! నిస్సందేహముగా వెంటనే కొట్టుము. స్థిరమైన కీర్తిని పొందుము. నీ పరాక్రమ మెంతటిదో తెలిసికొనిన పిమ్మట నిన్ను చంపివేసెదను. 58

మూ. రావణస్య వచః శ్రుత్వా వాయుసూనుర్వచోఽబ్రవీత్,
ప్రహతం హి మయా పూర్వమక్షం తవ సుతం స్మర. 59

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, వాయుసూనుః=హనుమంతుడు, వచః=వచనమును, అబ్రవీత్= పలికెను. మయా=నీచేత, పూర్వమ్=పూర్వము, ప్రహతమ్=కొట్టబడిన(చంపబడిన), తవ సుతమ్=నీకుమారుడైన, అక్షమ్=అక్షుణ్ణి, స్మర=స్మరింపుము.

తా. రావణుని మాటలు విని హనుమంతు డిట్లు పలికెను. "పూర్వము నేను నీ కుమారుడైన అక్షుణ్ణి చంపినాను. ఆ విషయమును గుర్తుకు తెచ్చుకొనుము". 59

మూ. ఏవముక్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః,
ఆజఘానానిలసుతం తలేనోరసి వీర్యవాన్. 60

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావ

ణుడు, అనిలసుతమ్=హనుమంతుని, తలేన=అరచేయితో, ఉరసి=వక్షస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. మహాతేజఃశాలి, పరాక్రమవంతుడు, రాక్షసరాజు అయిన రావణుడు హనుమంతుని మాటలు విని అతనిని అరచేతితో వక్షఃస్థలముపైన కొట్టెను. 60

మూ. స తలాభిహతస్తేన చచాల చ ముహుర్ముహుః,
స్థితో ముహూర్తం తేజస్వీ స్థైర్యం కృత్వా మహామతిః, 61
ఆజఘాన చ సంక్రుద్ధస్తలేనైవామరద్విషమ్.

ప్ర. అ. తేన=రావణునిచేత, తలాభిహతః=అరచేతితో కొట్టబడిన, సః=అతడు, ముహుర్ముహుః=మాటిమాటికి, చచాల చ=చలించెను. తేజస్వీ=తేజస్సు కలవాడు, మహామతిః=గొప్ప బుద్ధి గలవాడు అయిన హనుమంతుడు, ముహూర్తమ్=ముహూర్తకాలము, స్థితః=నిలచినవాడై, స్థైర్యమ్=స్థిరత్వమును, కృత్వా=చేసి, సంక్రుద్ధః=కోపించినవాడై, తలేనైవ=అరచేతితోనే, అమరద్విషమ్=దేవతల శత్రువైన రావణుని, ఆజఘాన=కొట్టెను.

తా. ఆ రావణుని అరచేతి దెబ్బ తగలగానే హనుమంతుడు చాలసార్లు తూలిపోయెను. తేజఃశాలి, గొప్ప బుద్ధిగలవాడు అయిన హనుమంతుడు ముహూర్తకాలము నిలబడి, నిలదొక్కుకొని ఆ రావణుని అరచేతితోనే కొట్టెను.

మూ. తతః స తేనాభిహతో వానరేణ మహాత్మనా, 62
దశగ్రీవః సమాధూతో యథా భూమిచలేఽచలః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మనా=మహాత్ముడైన, తేన వానరేణ=ఆ వానరునిచేత, అభిహతః=కొట్టబడిన, దశగ్రీవః=రావణుడు, భూమిచలే=భూమి కంపించినప్పుడు, అచలః యథా=పర్వతము వలె, సమాధూతః=కదల్చబడెను.

తా. మహాత్ముడైన హనుమంతునిచేత కొట్టబడిన ఆ దశకంఠుడు భూమి కంపించినపుడు పర్వతము కంపించినట్లు కంపించెను. 62

మూ. సంగ్రామే తం తథా దృష్ట్వా రావణం తలతాడితమ్, 63
ఋషయో వానరాః సిద్ధా నేదుర్దేవాః సహాసురైః.

ప్ర. అ. సంగ్రామే=యుద్ధమునందు, తథా=అట్లు, తలతాడితమ్=అరచేతితో కొట్టబడిన, తం రావణమ్=ఆ రావణుని, దృష్ట్వా=చూచి, ఋషయః=ఋషులు, వానరాః=వానరులు, సిద్ధాః=సిద్ధులు, అసురైః సహ=అసురులతో కూడ, దేవాః=దేవతలు, నేదుః=ధ్వనిచేసిరి.

తా. యుద్ధములో అరచేతితో కొట్టబడిన ఆ రావణుని చూచి, ఋషులు, వానరులు, సిద్ధులు, దేవతలు, అసురులు ఆశ్చర్యముతో ధ్వనిచేసిరి.63

మూ. అథాశ్వస్య మహాతేజా రావణో వాక్యమబ్రవీత్, 64
సాధు వానర వీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణః=రావణుడు, ఆశ్వస్య=ఊరడిల్లి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. వానర=వానరుడా ! సాధు=బాగు ! బాగు ! వీర్యేణ=పరాక్రమముచేత, శ్లాఘనీయః=శ్లాఘింపతగిన, మే రిపుః=నా శత్రువుగా, అసి=అయివున్నావు.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల రావణుడు స్పృహ తెచ్చుకొని ఇట్లు పలికెను. "ఓ ! వానరుడా ! బాగు ! బాగు ! పరాక్రమముచేత నీవు నాకు తగిన శ్లాఘనీయుడవైన శత్రువుగా ఉన్నావు." 64

మూ. రావణేనైవముక్తస్తు మారుతిర్వాక్యమబ్రవీత్, 65
ధిగస్తు మమ వీర్యస్య యత్త్వం జీవసి రావణ.

ప్ర. అ. రావణేన=రావణునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మారుతిః=హనుమంతుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. రావణ=రావణా ! మమ=నాయొక్క, వీర్యస్య=వీర్యమునకు, ధిక్ అస్తు=నింద అగుగాక, యత్=ఎందువలన, త్వమ్=నీవు, జీవసి= జీవించి ఉన్నావో.

తా. రావణుని మాటలు విని హనుమంతు డిట్లు పలికెను. "రావణా ! ఛీ ! నా బలము ఏమి బలము ! నీవింకా జీవించియే ఉన్నావు !" 65

మూ. సకృత్తు ప్రహరేదానీం దుర్బుద్ధే కిం వికత్థసే, 66
తతస్త్వాం మామకో ముష్టిర్నయిష్యతి యమక్షయమ్.

ప్ర. అ. దుర్బుద్ధే=చెడ్డబుద్ధికలవాడా ! కిం వికత్థసే=ఎందుకు బడాయి చెప్పకొనుచున్నావు ? ఇదానీమ్=ఇప్పుడు, సకృత్=ఒక పర్యాయము, ప్రహర=కొట్టుము. తతః=అటుపిమ్మట, మామకః=నా సంబంధమైన, ముష్టిః=పిడికిలి, త్వామ్=నిన్ను, యమక్షయమ్=యమలోకమును, నయిష్యతి=పొందించగలదు.

తా. "ఓ ! దుర్బుద్ధీ ! బడాయి ఎందుకు చెప్పకొనెదవు ! ఇప్పుడు నన్నొక పర్యాయము కొట్టుము. అటు పిమ్మట నా పిడికిలి నిన్ను యమలోకమునకు పంపివేయుగలదు." 66

మూ. తతో మారుతివాక్యేన కోపస్తస్య తదాజ్వలత్, 67
సంరక్తనయనో యత్నాన్ముష్టిముద్యమ్య దక్షిణమ్,

పాతయామాస వేగేన వానరోరసి వీర్యవాన్. 68

ప్ర. అ. తతః=పిమ్మట, మారుతివాక్యేన=హనుమంతుని మాటంచేత, తదా=అప్పుడు, తస్య=రావణునియొక్క, కోపః=కోపము, అజ్వలత్=ప్రజ్వలించెను. సంరక్తనయనః=ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, యత్నాత్=ప్రయత్నమువలన, దక్షిణమ్=కుడిదైన, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, వీర్యవాన్=పరాక్రమవంతుడైన రావణుడు, వేగేన= వేగముతో, వానరోరసి=హనుమంతుని వక్షస్థలముమీద, పాతయామాస= పడవేసెను.

తా. హనుమంతుని మాటలు వినగానే రావణుని కోపము ఎక్కువయ్యెను. పరాక్రమవంతుడైన అతడు బాగా ఎఱ్ఱబడిన నేత్రములతో చూచుచు, ప్రయత్నపూర్వకముగా కుడిపిడికిలి ఎత్తి వేగముగా హనుమంతుని వక్షస్థలముమీద పడవేసెను. 67, 68

మూ. హనూమాన్ వక్షసి వ్యూఢే సంచచాల పునః పునః,
విహ్వలం తం తదా దృష్ట్వా హనూమన్తం మహాబలమ్, 69
రథేనాతిరథః శీఘ్రం నీలం ప్రతి సమభ్యగాత్.

ప్ర. అ. వ్యూఢే=విశాలమైన, వక్షసి=వక్షస్థలమునందు కొట్టబడిన, హనూమాన్=హనుమంతుడు, పునః పునః=మాటిమాటికి, సంచచాల= చలించెను. విహ్వలమ్=వ్యాకులుడైన, మహాబలమ్=గొప్ప బలము గల, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని, దృష్ట్వా=చూచి, అతిరథః=అతిరథుడైన రావణుడు, రథేన=రథముచేత, శీఘ్రమ్=శీఘ్రముగా, నీలం ప్రతి=నీలుని గూర్చి, సమభ్యగాత్=వెళ్లెను.

తా. విశాలమైన వక్షస్థలముమీద కొట్టబడిన హనుమంతుడు ఎక్కువగా తూలిపోయెను. మహాబలవంతుడైన హనుమంతుడు ఆ విధముగా వ్యాకులుడై ఉండుట చూచి అతిరథుడైన రావణుడు రథముచేత నీలునిమీదకు వెళ్ళెను.

మూ. రాక్షసానామధిపతిర్దశగ్రీవః ప్రతాపవాన్, 70
పన్నగప్రతిమైర్భీమైః పరమర్మాభిభేదనైః,
శరైరాదీపయామాస నీలం హరిచమూపతిమ్. 71

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులయొక్క, అధిపతిః=అధిపతి, ప్రతాపవాన్=ప్రతాపవంతుడూ అయిన, దశగ్రీవః=రావణుడు, పన్నగప్రతిమైః=సర్పములతో సమానములైన, భీమైః=భయంకరములైన, పరమర్మాభిభేదనైః=పరుల మర్మస్థానములను భేదించు, శరైః=బాణములచేత, హరిచమూపతిమ్=వానరసేనానాయకుడైన, నీలమ్=నీలుని, ఆదీపయామాస= ప్రజ్వలింపచేసెను.

రా. రాక్షసప్రభువు, ప్రతాపవంతుడు అయిన దశగ్రీవుడు సర్పములతో సమానములు, భయంకరములు, శత్రువుల మర్మస్థానములను భేదించేవీ అయిన బాణాలచేత, వానరసేనానాయకుడైన నీలుణ్ణి మండిపోవుచున్నట్లు చేసెను.

మూ. స శరౌఘసమాయస్తో నీలో హరిచమూపతిః,
కరేణైకేన శైలాగ్రం రక్షోధిపతయేఽసృజత్. 72

ప్ర. అ. శరౌఘసమాయస్తః=బాణముల సముదాయముచేత పీడింపబడిన, హరిచమూపతిః=వానరసేనానాయకుడైన, సః నీలః=ఆ నీలుడు, ఏకేన=ఒక, కరేణ=హస్తముచేత, శైలాగ్రమ్=పర్వతశిఖరమును, రక్షోధిపతయే=రావణునకు, అసృజత్=విడచెను.

రా. బాణసముదాయముచేత పీడింపబడిన వానరసేనాపతియైన నీలుడు ఒక చేతితో పర్వతశిఖరమును రావణునిమీదికి విసరెను. 72

మూ. హనూమానపి తేజస్వీ సమాశ్వస్తో మహామనాః,
విప్రేక్షమాణో యుద్ధేప్సుః సరోషమిదమబ్రవీత్. 73
నీలేన సహ సంయుక్తం రావణం రాక్షసేశ్వరమ్,
అన్యేన యుధ్యమానస్య న యుక్తమభిధావనమ్. 74

ప్ర. అ. తేజస్వీ=తేజస్సుగలవాడు, మహామనాః=గొప్ప మనస్సు గలవాడు అయిన, హనూమానపి=హనుమంతుడు కూడ, సమాశ్వస్తః=తెప్పరిల్లినవాడై, యుద్ధేప్సుః=యుద్ధమును పొందదలచుచున్నవాడై, విప్రేక్షమాణః=చూచుచు, నీలేన సహ=నీలునితోకూడ, సంసక్తమ్=యుద్ధములో కలిసి ఉన్న, రాక్షసేశ్వరమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణునిగూర్చి, సరోషమ్=కోపములో కూడునట్లుగా, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. అన్యేన=మరొకనితో, యుధ్యమానస్య=యుద్ధముచేయుచున్నవానియొక్క, అభిధావనమ్=ఎదురుగా వెళ్ళుట, న యుక్తమ్=యుక్తముకాదు.

రా. గొప్ప తేజస్సు, గొప్ప మనస్సు గల హనుమంతుడు మూర్ఛనుండి తేరుకొని యుద్ధము చేయగోరుచు ఇటునటు చూచి నీలునితో యుద్ధముచేయుచున్న రాక్షసరాజైన రావణునితో, కోపముతో, ఇట్లు పలికెను. ఇతరునితో యుద్ధము చేయుచున్నవానిమీదకు యుద్ధమునకై వెళ్లుట యుక్తముకాదు.

మూ. రావణోఽథమహాతేజా స్తం శృఙ్గం సప్తభిః శరైః,
ఆజఘాన సుతీక్ష్ణాగ్రైస్తద్వికీర్ణం పపాత హ. 75

ప్ర. అ. అథ=పిమ్మట, మహాతేజాః=గొప్పతేజస్సు గల, రావణః=

రావణుడు, తం శృఙ్గమ్=ఆ శిఖరమును, సుతీక్ష్ణాగ్రైః=చాల వాడియైన అగ్రభాగములు గల, సప్తభిః=ఏడు, శరైః=బాణములతో, అజఘాన=కొట్టెను. తత్=అది, విశీర్ణం=విరిగిపోయినదై, పపాత హ=పడిపోయెను.

తా. మహాతేజశ్శాలియైన రావణుడు నీలుడు విసిరిన శిఖరమును చాల వాడియైన అగ్రభాగములు గల ఏడు బాణాలతో కొట్టెను. ఆ శిఖరము ముక్కలై పడిపోయెను. 75

మూ. తద్విశీర్ణం గిరేః శృఙ్గం దృష్ట్వా హరిచమూపతిః,
కాలాగ్నిరివ జజ్వాల కోపేన పరవీరహా. 76

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను చంపిన, చమూపతిః=సేనాపతియైన నీలుడు, విశీర్ణమ్=బ్రద్దలైన, తత్=ఆ, గిరేః శృఙ్గమ్=పర్వతశిఖరమును, దృష్ట్వా=చూచి, కోపేన=కోపముతో, కాలాగ్నిరివ=ప్రళయకాలాగ్ని వలె, జజ్వాల=మండిపడెను.

తా. ఆ పర్వతశిఖరము బ్రద్దలైపోవుట చూచి శత్రువీరులను చంపు సేనాపతియైన నీలుడు, కోపముతో ప్రళయకాలాగ్ని వలె మండిపడెను. 76

మూ. సోఽశ్వకర్ణద్రుమాన్ శాలాంశ్చూతాంశ్చాపి సుపుష్పితాన్,
అన్యాంశ్చ వివిధాన్ వృక్షాన్నీలశ్చిక్షేప సంయుగే. 77

ప్ర. అ. సః నీలః=ఆ నీలుడు, సంయుగే=యుద్ధమునందు, అశ్వకర్ణద్రుమాన్=మద్దిచెట్లను, శాలాన్=శాలవృక్షములను, సుపుష్పితాన్=బాగుగా పుష్పించిన, చూతానపి=చూతవృక్షములను, అన్యాన్=ఇతరములైన, వివిధాన్=అనేకవిధములైన, వృక్షాన్=వృక్షములను, చిక్షేప=విసరెను.

తా. యుద్ధమునందు ఆ నీలుడు మద్దిచెట్లను, శాలవృక్షములను, బాగా పుష్పించిన మామిడిచెట్లను, అనేకవిధములైన ఇతరవృక్షములను విసరెను. 77

మూ. స తాన్ వృక్షాన్ సమాసాద్య ప్రతిచిచ్ఛేద రావణః,
అభ్యవర్షచ్చ ఘోరేణ శరవర్షేణ పావకిమ్. 78

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, తాన్=ఆ, వృక్షాన్=వృక్షములను, ప్రతిసమాసాద్య=ఎదురుగా పొంది, చిచ్ఛేద=ఛేదించెను. ఘోరేణ=భయంకరమైన, శరవర్షేణ=బాణవర్షముచేత, పావకిమ్=అగ్నిపుత్రుడైన నీలుని, అభ్యవర్షచ్చ=వర్షించెను.

తా. రావణుడు ఆ వృక్షములను ఎదుర్కొని ఛేదించివేసెను. భయంకరమైన బాణవర్షమును నీలునిమీద కురిపించెను. 78

మూ. అభివృష్టః శరౌఘేణ మేఘేనేవ మహాబలః,
హ్రస్వం కృత్వా తతో రూపం ధ్వజాగ్రే నిపపాత హ. 79

ప్ర. అ. శరౌఘేణ=బాణసమూహముచేత, మేఘేనేవ=మేఘము చేత వర్షింపబడినట్లు, అభివృష్టః=వర్షించబడిన, మహాబలః=గొప్ప బలము గల నీలుడు, తతః=అటుపిమ్మట, రూపమ్=రూపమును, హ్రస్వమ్=హ్రస్వమైనదానినిగా, కృత్వా=చేసి, ధ్వజాగ్రే=ధ్వజము అగ్రభాగమునందు, నిపపాత హ=పడెను.

తా. మేఘము వర్షించినట్లు రావణుడు తన మీదికి శరవర్షము కురిపించగా నీలుడు శరీరమును చిన్నది చేసి అతని ధ్వజము చివర వ్రాలెను.

మూ. పావకాత్మజమాలోక్య ధ్వజాగ్రే సమవస్థితమ్,
జజ్వాల రావణః క్రోధాత్తతో నీలో ననాద చ. 80

ప్ర. అ. ధ్వజాగ్రే=ధ్వజాగ్రమునందు, సమవస్థితమ్=ఉన్న, పావకాత్మజమ్=నీలుణ్ణి, ఆలోక్య=చూచి, రావణః=రావణుడు, క్రోధాత్=కోపమువలన, జజ్వాల=మండిపడెను. తతః=అటుపిమ్మట, నీలః=నీలుడు, ననాద చ=ధ్వనిచేసెను.

తా. ధ్వజాగ్రముమీద కూర్చున్న నీలుని చూచి రావణుడు కోపముతో మండిపడెను. నీలుడు బిగ్గరగా అరచెను. 80

మూ. ధ్వజాగ్రే ధనుషశ్చాగ్రే కిరీటాగ్రే చ తం హరిమ్,
లక్ష్మణోఽథ హనూమాంశ్చ దృష్ట్వా రామశ్చ విస్మితాః. 81

ప్ర. అ. ధ్వజాగ్రే=ధ్వజము చివర, ధనుషః=ధనస్సుయొక్క, అగ్రే=అగ్రమునందు, కిరీటాగ్రే చ=కిరీటము అగ్రభాగమునందు, తం హరిమ్=ఆ వానరుణ్ణి, దృష్ట్వా=చూచి, లక్ష్మణః=లక్ష్మణుడు, అథ=మరియు, హనుమాంశ్చ=హనుమంతుడు, రామశ్చ=రాముడు, విస్మితాః=ఆశ్చర్యపడిరి.

తా. నీలుడు రావణుని ధ్వజము చివర, ధనస్సు చివర, కిరీటముపైన వాలుచుండుట చూచి లక్ష్మణుడు, హనుమంతుడు, రాముడు ఆశ్చర్యపడిరి.

మూ. రావణోఽథ మహాతేజాః కపిలాఘవవిస్మితః,
అస్త్రమాహారయామాస దీప్తమాగ్నేయమద్భుతమ్. 82

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, రావణః=రావణుడు, కపిలాఘవవిస్మితః=ఆ వానరునియొక్క చురుకుదనముచేత ఆశ్చర్యపడినవాడై, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, ఆగ్నేయమ్ అస్త్రమ్=ఆగ్నేయాస్త్రమును, ఆహారయామాస=గ్రహించెను.

తా. అప్పుడు మహాతేజశ్శాలియైన రావణుడు నీలుని చురుకుదనమును చూచి ఆశ్చర్యపడుచు, ప్రజ్వలించుచున్న, ఆశ్చర్యకరమైన ఆగ్నేయాస్త్రమును గ్రహించెను. 82

మూ. తతస్తే చుక్రుశుర్హృష్టా లబ్ధలక్షాః ప్లవఙ్గమాః,
నీలలాఘవసంభ్రాన్తం దృష్ట్వా రావణమాహవే. 83

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఆహవే=యుద్ధమునందు, నీలలాఘవసంభ్రాన్తమ్=నీలుని లాఘవముచేత కంగారుపడుచున్న, రావణమ్=రావణుని, దృష్ట్వా=చూచి, లబ్ధలక్షాః=పొందబడిన సంతోషహేతువు గల, తే ప్లవఙ్గమాః=ఆ వానరులు, హృష్టాః=సంతోషించినవారై, చుక్రుశుః=అరచిరి.

తా. యుద్ధములో నీలుని లాఘవముచే కంగారుపడుచున్న రావణుని చూచి సంతోషించుటకు తగిన అవకాశము లభించిన ఆ వానరులు సంతోషించుచు అరచిరి. 83

మూ. వానరాణాం చ నాదేన సంరబ్ధో రావణస్తదా,
సంభ్రమావిష్టహృదయో న కించిత్ ప్రత్యపద్యత. 84

ప్ర. అ. తదా=అప్పుడు, వానరాణామ్=వానరులయొక్క, నాదేన=ధ్వనిచేత, సంరబ్ధః=తొందరపడుచున్న, రావణః=రావణుడు, సంభ్రమావిష్టహృదయః=కంగారుతో నిండిన హృదయము గలవాడై, కించిత్=ఏమీ, న ప్రత్యపద్యత=ఆలోచించజాలకపోయెను.

తా. అప్పుడు వానరుల ధ్వనిచేత తొందరపడుచు కంగారుగా ఉన్న హృదయము గల రావణునకు ఏమి చేయవలెనో తోచలేదు. 84

మూ. ఆగ్నేయేనాపి సంయుక్తం గృహీత్వా రావణః శరమ్,
ధ్వజశీర్షస్థితం నీలముదైక్షత నిశాచరః. 85

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడైన, రావణః=రావణుడు, ఆగ్నేయేన=ఆగ్నేయాస్త్రముతో, సంయుక్తమ్=కూడిన, శరమ్=బాణమును, గృహీత్వా=గ్రహించి, ధ్వజశీర్షస్థితమ్=ధ్వజాగ్రముపైన ఉన్న, నీలమ్=నీలుణ్ణి, ఉదైక్షత=పైకి కళ్లు ఎత్తి చూచెను.

తా. నిశాచరుడైన రావణుడు ఆగ్నేయాస్త్రముతో కూడిన బాణమును సంధించి ధ్వజాగ్రముపైన నీలుణ్ణి చూచెను. 85

మూ. తతోఽబ్రవీన్మహాతేజా రావణో రాక్షసేశ్వరః,
కపే లాఘవయుక్తోఽసి మాయయా పరయా సహ. 86

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాక్షసే శ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, అబ్రవీత్=పలికెను. కపే=వానరుడా ! పరయా=గొప్పదైన, మాయయా సహ=మాయతో కూడ, లాఘవయుక్తః=లాఘవ ముతో కూడినవాడవు, అసి=అయి ఉన్నావు.

తా. పిమ్మట మహాతేజశ్శాలి, రాక్షసప్రభువు అయిన రావణుడు పలికెను - "ఓ ! వానరుడా ! నీవు గొప్ప మాయను, చురుకుదనమును చూపుచున్నావు !" 86

మూ. జీవితం ఖలు రక్షస్వ యది శక్తోఽసి వానర,
తాని తాన్యాత్మరూపాణి సృజసి త్వమనేకశః. 87

ప్ర. అ. వానర=వానరుడా ! త్వమ్=నీవు, అనేకశః= అనేకవిధములుగా, తాని తాని=ఆ యా, ఆత్మరూపాణి=నీ రూపములను, సృజసి=సృజించుచున్నావు. శక్తః=సమర్థుడవు, అసి యది=అయి ఉన్నట్లయితే, జీవితమ్=జీవితమును, రక్షస్వ ఖలు=రక్షించుకొనుము.

తా. "నీవు అనేకవిధములుగా ఆ యా రూపములలో కనబడుచున్నావు! సామర్థ్య మున్నచో ప్రాణాలను రక్షించుకొనుము". 87

మూ. తథాపి త్వాం మయా ముక్తః సాయకోఽస్త్రప్రయోజితః,
జీవితం పరిరక్షన్తం జీవితాద్భ్రంశయిష్యతి. 88

ప్ర. అ. తథాపి=అట్లయినను, మయా=నాచేత, ముక్తః= విడువబడిన, అస్త్రయోజితః=అస్త్రముతో కూర్చబడిన, సాయకః=బాణము, జీవితమ్=జీవిత మును, పరిరక్షన్తమ్=రక్షించుకొనుచున్న, త్వామ్=నిన్ను, జీవితాత్=జీవితమునుండి, భ్రంశయిష్యతి=తొలగించగలదు.

తా. "నీవు ఎన్ని రూపములు ధరించినా నేను ప్రయోగించిన అస్త్రముతో కూడిన బాణము ప్రాణాలను రక్షించుకొనుచున్న నీ ప్రాణాలను తీసివేయగలదు."

మూ. ఏవముక్త్వా మహాబాహూ రావణో రాక్షసేశ్వరః,
సంధాయ బాణమస్త్రేణ చమూపతిమతాడయత్. 89

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, రాక్షసేశ్వరః=రాక్షసరా జైన, రావణః=రావణుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, బాణమ్=బాణమును, అస్త్రేణ=ఆగ్నేయాస్త్రముతో, సంధాయ=సంధించి, చమూపతిమ్=సేనాపతియైన నీలుణ్ణి, అతాడయత్=కొట్టెను.

తా. గొప్ప బాహువులు గల రాక్షసరాజైన రావణుడు ఇట్లు పలికి,

బాణమును అగ్నేయాస్త్రముతో సంధించి నీలునిపై ప్రయోగించెను. 89

మూ. సోఽస్త్రయుక్తేన బాణేన నీలో వక్షసి తాడితః,
నిర్దహ్యమానః సహసా సపపాత మహీతలే. 90

ప్ర. అ. సః నీలః=ఆ నీలుడు, అస్త్రయుక్తేన=అస్త్రముతో కూడిన, బాణేన=బాణముచేత, వక్షసి=వక్షఃస్థలమునందు, తాడితః= కొట్టబడినవాడై, నిర్దహ్యమానః=కాల్చబడుచున్నవాడై, సహసా=వెంటనే, మహీతలే=నేలమీద, సపపాత=పడెను.

తా. అస్త్రము సంధించిన బాణముచేత వక్షఃస్థలమునందు కొట్టబడిన నీలుడు అది కాల్చివేయుచుండగా వెంటనే నేలమీద పడిపోయెను. 90

మూ. పితృమాహాత్మ్యసంయోగాదాత్మనశ్చాపి తేజసా,
జానుభ్యామపతద్భూమౌ న తు ప్రాణైర్వ్యయుజ్యత. 91

ప్ర. అ. పితృమాహాత్మ్యసంయోగాత్=తండ్రియొక్క మాహాత్మ్యము యొక్క సంబంధమువలన, ఆత్మనః=తనయొక్క, తేజసా చాపి=తేజస్సుచేత, జానుభ్యామ్=మోకాళ్ళతో, భూమౌ=భూమియందు, న్యపతత్=పడెను. తు=కాని, ప్రాణైః=ప్రాణములచేత, న వ్యయుజ్యత=విడువబడలేదు.

తా. తండ్రియైన అగ్నిదేవుని ప్రభావము తనకుకూడ కొంత ఉండుట వలనా, తన సహజమైన తేజస్సుచేతా నీలుడు నేలమీద మోకాళ్ళపైన పడెను గాని ప్రాణములు విడువలేదు. 91

మూ. విసంజ్ఞం వానరం దృష్ట్వా దశగ్రీవో రణోత్సుకః,
రథేనామ్బుదనాదేన సౌమిత్రిమభిదుద్రువే. 92

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, వానరమ్=నీలుణ్ణి, విసంజ్ఞమ్= సంజ్ఞ లేనివానినిగా, దృష్ట్వా=చూచి, రణోత్సుకః=రణమునందు ఆసక్తి కలవాడై, అమ్బుదనాదేన=మేఘమువంటి ధ్వని గల, రథేన=రథముచేత, సౌమిత్రిమ్= లక్ష్మణుని గూర్చి, అభిదుద్రువే=పరుగెత్తెను.

తా. నీలుడు మూర్ఛ చెందుట చూచి రావణుడు యుద్ధమునందు ఆసక్తితో, మేఘధ్వని వంటి ధ్వని గల రథముచేత, లక్ష్మణు డున్న వైపునకు శీఘ్రముగా వెళ్ళెను. 92

మూ. ఆసాద్య రణమధ్యే తం వారయిత్వా స్థితో జ్వలన్,
ధనుర్విస్ఫారయామాస రాక్షసేన్ద్రః ప్రతాపవాన్. 93

ప్ర. అ. ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, రాక్షసేన్ద్రః=రాక్షసరాజు,

తమ్=ఆ లక్ష్మణుని, రణమధ్యే=యుద్ధమధ్యమునందు, ఆసాద్య=సమీపించి, వారయిత్వా=ముందుకు వెళ్లకుండునట్లు నివారించి, స్థితః=నిలచినవాడై, జ్వలన్=ప్రజ్వలించుచు, ధనుః=ధనస్సును, విస్ఫారయామాస=వంచెను.

తా. ప్రతాపవంతుడైన రావణుడు యుద్ధరంగము మధ్య లక్ష్మణుణ్ణి సమీపించి, అతడు ముందుకు వెళ్లకుండునట్లు, వారించి, ప్రజ్వలించుచు నిలచినవాడై, ధనస్సును వంచెను. 93

మూ. తమాహ సౌమిత్రిరదీనసత్త్వో
విస్ఫారయన్తం ధనురప్రమేయమ్,
అభ్యేహి మామద్య నిశాచరేన్ద్ర
న వానరాంస్త్వం ప్రతియోద్ధుమర్హసి. 94

ప్ర. అ. అదీనసత్త్వః=దీనము కాని బుద్ధి కల, సౌమిత్రిః=లక్ష్మణుడు, అప్రమేయమ్=ఇట్టిదని చెప్పశక్యము కాని, ధనుః=ధనస్సును, విస్ఫారయన్తమ్=వంచుచున్న, తమ్=అతనిని గూర్చి, ఆహ=పలికెను. నిశాచరేన్ద్ర=రాక్షసరాజా ! మామ్=నన్ను గూర్చి, అభ్యేహి=రమ్ము. త్వమ్=నీవు, వానరాన్=వానరులను, ప్రతియోద్ధుమ్=ఎదిరించి యుద్ధము చేయుటకు, నార్హసి=తగవు.

తా. దైన్య మెరుగని బుద్ధి గల లక్ష్మణుడు గొప్ప ధనస్సును వంచుచున్న అతనితో ఇట్లనెను — "రాక్షసరాజా ! నీవు ఈ వానరులతో యుద్ధముచేయుట కాదు; నాతో యుద్ధము చేయుటకు రమ్ము". 94

మూ. స తస్య వాక్యం ప్రతిపూర్ణఘోషమ్
జ్యాశబ్దముగ్రం చ నిశమ్య రాజా,
ఆసాద్య సౌమిత్రిముపస్థితం తం
రోషాన్వితం వాచమువాచ రక్షః. 95

ప్ర. అ. రాజా=రాక్షసరాజైన, సః రక్షః=ఆ రావణుడు, తస్య=వానియొక్క, వాక్యమ్=వాక్యమును, ప్రతిపూర్ణఘోషమ్=నిండిన ధ్వని గల, ఉగ్రమ్=భయంకరమైన, జ్యాశబ్దమ్=నారి ధ్వనిని, నిశమ్య=విని, ఉపస్థితమ్=సమీపించిన, తం సౌమిత్రిమ్=ఆ లక్ష్మణుని, ఆసాద్య=చేరి, రోషాన్వితమ్=రోషముతో కూడినట్లుగా, వాచమ్=వాక్యమును, ఉవాచ= పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు లక్ష్మణుని మాటలను, అత్యధికమైన ధ్వని గల భయంకరమైన ధనుష్టంకారమును విని, దగ్గరగా ఉన్న లక్ష్మణుని సమీపించి, కోపముతో ఇట్లు పలికెను. 95

మూ. దిష్ట్యాసి మే రాఘవ దృష్టిమార్గం
ప్రాప్తోఽన్తగామీ విపరీతబుద్ధిః,
అస్మిన్ క్షణే యాస్యసి మృత్యులోకం
సంసాద్యమానో మమ బాణజాలైః. 96

ప్ర. అ. రాఘవ=లక్ష్మణా! విపరీతబుద్ధిః=విపరీతమైన బుద్ధి గలవాడవు, అన్తగామీ=అంతమును పొందనున్నవాడవూ అయిన నీవు, దిష్ట్యా=దైవవశము చేత, మే=నాయొక్క, దృష్టిమార్గమ్=దృష్టియొక్క మార్గమును, ప్రాప్తః=పొందితివి. మమ=నాయొక్క, బాణజాలైః=బాణముల సముదాయములచేత, సంసాద్యమానః=శిక్షింపచేయబడుచున్నవాడవై, అస్మిన్=ఈ, క్షణే=క్షణమునందు, మృత్యులోకమ్=యమలోకమును గూర్చి, యాస్యసి=వెళ్లగలవు.

తా. లక్ష్మణా! విపరీతబుద్ధి గల నీవు మరణించనున్నావు. దైవవశముచేత నా కంట బడినావు. నా బాణముల ప్రహారములకు ఈ క్షణమునందే యమలోకమును పొందగలవు. 96

మూ. తమాహ సౌమిత్రిరవిస్మయానో
గర్జన్తముద్వృత్తసితాగ్రదంష్ట్రమ్,
రాజన్న గర్జన్తి మహాప్రభావా
వికత్థసే పాపకృతాం వరిష్ఠ. 97

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, అవిస్మయానః=ఆశ్చర్యము చెందనివాడై, ఉద్వృత్తసితాగ్రదంష్ట్రమ్=ఎత్తైన తెల్లని దంతాగ్రములు గల, గర్జన్తమ్=గర్జించుచున్న, తమ్=అతనిని గూర్చి, ఆహ=పలికెను. పాపకృతామ్=పాపము చేసినవారిలో, వరిష్ఠ=గొప్పవాడా! రాజన్=ఓ! రాక్షసరాజా! వికత్థసే=బడాయి చెప్పుకొనుచున్నావు, మహాప్రభావాః=గొప్ప ప్రభావము కలవారు, న గర్జన్తి=గర్జించరు.

తా. లక్ష్మణుడు, ఎత్తైన తెల్లని దంతాగ్రములు గల, గర్జించుచున్న ఆ రావణుని విషయమున ఏ మాత్రము ఆశ్చర్యము చెందనివాడై ఇట్లు పలికెను—"పాపాత్ములలో గొప్పవాడవైన రావణా! వ్యర్థముగా బడాయి చెప్పుకొనుచున్నావు. గొప్ప ప్రభావము గలవారు ఈ విధముగా గర్జించరు." 97

మూ. జానామి వీర్యం తవ రాక్షసేన్ద్ర
బలం ప్రతాపం చ పరాక్రమం చ,
అవస్థితోఽహం శరచాపపాణి
రాగచ్ఛ కిం మోఘవికత్థనేన. 98

ప్ర. అ. రాక్షసేన్ద్ర=రాక్షసరాజా ! తవ=నీయొక్క, వీర్యమ్=వీర్యమును, బలమ్=బలమును, ప్రతాపం చ=ప్రతాపమును, పరాక్రమం చ=పరాక్రమమును, జానామి=ఎఱుగుదును. అహమ్=నేను, శరచాపపాణిః=బాణములు ధనస్సు హస్తమునందు కలవాడనై, అవస్థితః=నిలచినాను. ఆగచ్ఛ=రమ్ము. మోఘవికత్థనేన=వ్యర్థముగా బడాయి చెప్పుకొనుటచేత, కిమ్=ప్రయోజనమేమి ?

తా. రావణా ! నీ వీర్యము, బలము, పరాక్రమము, ప్రతాపము ఎంతటివో నాకు తెలియును. ధనుర్బాణములు ధరించి నేను నిలచి ఉన్నాను; రమ్ము; వ్యర్థముగా బడాయి చెప్పుకొని ఏమి ప్రయోజనము ? 98

మూ. స ఏవముక్తః కుపితః ససర్జ
రక్షోధిపః సప్త శరాన్ సుపుఙ్ఖాన్,
తాన్ లక్ష్మణః కాఞ్చనచిత్రపుఙ్ఖై
శ్చిచ్ఛేద బాణైర్నిశితాగ్రధారైః. 99

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సః రక్షోధిపః=ఆ రాక్షసరాజు, కుపితః=కోపించినవాడై, సుపుఙ్ఖాన్=మంచి పొన్నులు గల, సప్త=ఏడు, శరాన్=బాణములను, ససర్జ=విడచెను. లక్ష్మణః=లక్ష్మణుడు, కాఞ్చనచిత్రపుఙ్ఖైః=అందమైన బంగారు పొన్నులు గల, నిశితాగ్రధారైః=వాడియైన కొనలు అంచులు గల, బాణైః=బాణములచేత, తాన్=వాటిని, చిచ్ఛేద=ఛేదించెను.

తా. లక్ష్మణుని మాటలకు కోపించిన రావణుడు మంచి పొన్నులు గల ఏడు బాణములను ప్రయోగించెను. వాటిని లక్ష్మణుడు చిత్రమైన బంగారు పొన్నులు, వాడియైన అగ్రభాగములు అంచులు గల బాణములచేత ఛేదించెను.

మూ. తాన్ ప్రేక్షమాణః సహసా నికృత్తా
న్నికృత్తభోగానివ పన్నగేన్ద్రాన్,
లఙ్కేశ్వరః క్రోధవశం జగామ
ససర్జ చాన్యాన్నిశితాన్ పృషత్కాన్. 100

ప్ర. అ. సహసా=శీఘ్రముగా, నికృత్తాన్=ఛేదింపబడిన, నికృత్తభోగాన్=ఛేదింపబడిన పడగలు గల, పన్నగేన్ద్రానివ=శ్రేష్ఠములైన సర్పములు వలె ఉన్న, తాన్=వాటిని, ప్రేక్షమాణః=చూచుచు, లఙ్కేశ్వరః=రావణుడు, క్రోధవశమ్=క్రోధమునకు వశమును, జగామ=పొందెను. అన్యాన్=ఇతరములైన, నిశితాన్=వాడియైన, పృషత్కాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. ఆ విధముగా లక్ష్మణుడు వెంటనే ఛేదించివేసిన, పడగలు తెగగొట్టిన సర్పముల వలె ఉన్న బాణములను చూడగానే రావణునికి క్రోధము

అధిక మాయెను. మరికొన్ని వాడియైన బాణములను ప్రయోగించెను. 100

మూ. స బాణవర్షం తు వవర్ష తీవ్రం
రామానుజః కార్ముకసంప్రయుక్తమ్,
క్షురార్ధచన్ద్రోత్తమకర్ణిభల్లైః
శరాంశ్చ చిచ్ఛేద న చుక్షుభే చ. 101

ప్ర. అ. సః రామానుజః=ఆ లక్ష్మణుడు, కార్ముకసంప్రయుక్తమ్= ధనస్సుచేత ప్రయోగించబడిన, తీవ్రమ్=తీవ్రమైన, బాణవర్షమ్=బాణముల వర్షమును, వవర్ష=వర్షించెను. క్షురార్ధచన్ద్రోత్తమకర్ణిభల్లైః=క్షురములు, అర్ధచంద్రాకారములు, ఉత్తమములైన కర్ణులు, భల్లములు అను బాణములచేత, శరాన్ చ=(రావణుని)బాణములను, చిచ్ఛేద=ఛేదించెను. న చుక్షుభే చ= క్షోభించలేదు కూడ.

తా. లక్ష్మణుడు ధనస్సుచేత ప్రయోగించబడిన తీవ్రమైన బాణవర్షమును వర్షించెను. క్షుర - అర్ధచంద్ర - కర్ణి - భల్లబాణములచేత రావణుని బాణములను ఛేదించెను. ఏ మాత్రము కలత చెందలేదు. 101

మూ. స బాణజాలాన్యపి తాని తాని
మోఘాని పశ్యంస్త్రిదశారిరాజః,
విసిస్మియే లక్ష్మణలాఘవేన
పునశ్చ బాణాన్నిశితాన్ముమోచ. 102

ప్ర. అ. సః=ఆ, త్రిదశారిరాజః=రాక్షసుల రాజు, మోఘాని=వ్యర్థమైన, తాని తాని=ఆ యా, బాణజాలాని=బాణసముదాయములను, పశ్యన్=చూచుచు, లక్ష్మణలాఘవేన=లక్ష్మణుని చురుకుదనముచేత, విసిస్మియే=ఆశ్చర్యపడెను. పునః చ=మరల, నిశితాన్=వాడియైన, బాణాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. ఆ రావణుడు తన బాణసముదాయములు వ్యర్థమైపోవుట చూచి లక్ష్మణుని హస్తలాఘవమునకు ఆశ్చర్యపడెను. మరల వాడియైన బాణములు ప్రయోగించెను. 102

మూ. స లక్ష్మణశ్చాపి శరాన్ శితాగ్రా
న్మహేన్ద్రతుల్యోఽశనిభీమవేగాన్,
సంధాయ చాపే జ్వలనప్రకాశాన్
ససర్జ రక్షోధిపతేర్వధాయ. 103

ప్ర. అ. మహేన్ద్రతుల్యః=మహేంద్రునితో సమానుడైన, సః=ఆ, లక్ష్మణశ్చాపి=లక్ష్మణుడు కూడ, శితాగ్రాన్=వాడియైన అగ్రభాగములు గలవి, అశ

విభీమవేగాన్=పిడుగువంటి భయంకరమైన వేగము గలవి, జ్వలనప్రకాశాన్=అగ్ని వంటి ప్రకాశము గలవి అయిన, శరాన్=బాణములను, చాపే=ధనస్సు మీద, సంధాయ=సంధించి, రక్షోధిపతేః=రావణునియొక్క, వధాయ=వధకొరకు, ససర్జ=విడచెను.

తా. మహేంద్రునితో సమానుడైన లక్ష్మణుడు కూడ వాడియైన అగ్రభాగములు గలవి, పిడుగు వలె భయంకరమైన వేగము గలవి, అగ్నివంటి ప్రకాశము గలవి అయిన బాణములను ధనస్సుపై సంధించి, రావణుని సంహరించుటకై విడచెను. 103

మూ. స తాన్ ప్రచిచ్ఛేద హి రాక్షసేన్ద్రః<br>
శితాన్ శరాన్ లక్ష్మణమాజఘాన,<br>
శరేణ కాలాగ్నిసమప్రభేణ<br>
స్వయంభుదత్తేన లలాటదేశే. 104

ప్ర. అ. సః=ఆ, రాక్షసేన్ద్రః=రావణుడు, శితాన్=వాడియైన, తాన్=ఆ, శరాన్=బాణములను, ప్రచిచ్ఛేద హి=ఛేదించెను. కాలాగ్నిసమప్రభేణ=ప్రళయ కాలాగ్నితో సమానమైన కాంతి గల, స్వయంభుదత్తేన=బ్రహ్మచేత ఇవ్వబడిన, శరేణ=బాణముచేత, లక్ష్మణమ్=లక్ష్మణుని, లలాటదేశే=లలాటప్రదేశమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. ఆ రాక్షసరాజు ఆ వాడియైన బాణములను ఛేదించి, బ్రహ్మదేవు డిచ్చిన, ప్రళయకాలాగ్నితో సమానమైన బాణముచేత లక్ష్మణుని లలాటముమీద కొట్టెను. 104

మూ. స లక్ష్మణో రావణసాయకార్తః<br>
చచాల చాపం శిథిలం ప్రగృహ్య,<br>
పునశ్చ సంజ్ఞాం ప్రతిలభ్య కృచ్ఛ్రాత్<br>
చిచ్ఛేద చాపం త్రిదశేన్ద్రశత్రోః. 105

ప్ర. అ. సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, రావణసాయకార్తః=రావణుని బాణముచేత పీడించబడినవాడై, చాపమ్=ధనస్సును, శిథిలమ్=వదులుగా, ప్రగృహ్య=గ్రహించి, చచాల=చలించెను. పునః చ=మరల, కృచ్ఛ్రాత్=కష్టము వలన, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రతిలభ్య=పొంది, త్రిదశేన్ద్రశత్రోః=రావణునియొక్క, చాపమ్=ధనస్సును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. లక్ష్మణుడు రావణుని బాణముచేత పీడింపబడినవాడై ధనస్సును వదులుగా పట్టుకొని కదలిపోయెను. మరల కష్టముమీద సంజ్ఞను పొంది,

రావణుని ధనస్సును ఖండించెను. 105

మూ. వికృత్తచాపం త్రిభిరాజఘాన
బాణైస్తదా దాశరథిః శితాగ్రైః,
స సాయకార్తో విచచాల రాజా
కృచ్ఛ్రాచ్చ సంజ్ఞాం పునరాససాద. 106

ప్ర. అ. దాశరథిః=లక్ష్మణుడు, తదా=అప్పుడు, వికృత్తచాపమ్= ఖండింపబడిన ధనస్సు గల అతనిని, శితాగ్రైః=వాడియైన అగ్రములు గల, త్రిభిః=మూడు, బాణైః=బాణములచేత, ఆజఘాన=కొట్టెను. సః రాజా=ఆ రాక్షసరాజు, సాయకార్తః=బాణముచేత పీడితుడై, పునః=మరల, కృచ్ఛ్రాత్=కష్టమువలన, సంజ్ఞామ్=సంజ్ఞను, ఆససాద=పొందెను.

తా. రావణుని ధనస్సును ఖండించిన పిమ్మట లక్ష్మణుడు వాడియైన అగ్రభాగములు గల మూడు బాణములచేత అతనిని కొట్టెను. బాణములచేత పీడితుడై రావణుడు చలించిపోయెను. మరల కష్టముమీద స్పృహ పొందెను.

మూ. స కృత్తచాపః శరతాడితశ్చ
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః,
జగ్రాహ శక్తిం స్వయముగ్రశక్తిః
స్వయంభుదత్తాం యుధి దేవశత్రుః. 107

ప్ర. అ. కృత్తచాపః=ఖండింపబడిన ధనస్సు గలవాడు, శరతాడితశ్చ=బాణములచేత కొట్టబడినవాడు, మేదార్ద్రగాత్రః=వసచేత తడిసిన శరీరము గలవాడు, రుధిరావసిక్తః=రక్తముచేత తడిసినవాడు, స్వయమ్=స్వయముగా, ఉగ్రశక్తిః=భయంకరమైన శక్తి గలవాడు అయిన, సః=ఆ, దేవశత్రుః= దేవతల శత్రువైన రావణుడు, యుధి=యుద్ధమునందు, స్వయంభుదత్తామ్= బ్రహ్మచేత ఇవ్వబడిన, శక్తిమ్=శక్తిని, జగ్రాహ=గ్రహించెను.

తా. ధనస్సు ఖండింపబడిన పిమ్మట బాణములచేత కొట్టబడిన ఆ రావణుని శరీరము కొవ్వుతో పూయబడి రక్తమునకు తడిసెను. సహజముగా ఉగ్రమైన శక్తి గల ఆ రావణుడు బ్రహ్మదేవు డిచ్చిన శక్తిని యుద్ధమునందు, చేతితో గ్రహించెను. 107

మూ. స తాం సధూమానలసన్నికాశాం
విత్రాసనీం సంయతి వానరాణామ్,
చిక్షేప శక్తిం తరసా జ్వలన్తీం
సౌమిత్రయే రాక్షసరాష్ట్రనాథః. 108

ప్ర. అ. రాక్షసరాష్ట్రనాథః=రాక్షసుల రాష్ట్రమునకు ప్రభువైన, సః=ఆ రావణుడు, సధూమానలసంనికాశామ్=ధూమముతో కూడిన అగ్నితో సమానమును, సంయుతి=యుద్ధమునందు, వానరాణామ్=వానరులకు, విత్రాసనీమ్= భయపెట్టునది అయిన, జ్వలన్తీమ్=మండుచున్న, తాం శక్తిమ్=ఆ శక్తిని, తరసా=బలముచేత, సౌమిత్రయే=లక్ష్మణునకు, చిక్షేప=విసరెను.

తా. ఆ శక్తి పొగతో కూడిన నిప్పు వలె ఉండెను. యుద్ధమునందు వానరులకు భయము కలిగించుచుండెను. మండుచున్న అట్టి శక్తిని రావణుడు లక్ష్మణునిమీద ప్రయోగించెను. 108

మూ. తామాపతన్తీం భరతానుజోఽస్త్రై-
ర్జఘాన బాణైశ్చ హుతాగ్నికల్పైః,
తథాపి సా తస్య వివేశ శక్తి-
ర్భుజాన్తరం దాశరథేర్విశాలమ్. 109

ప్ర. అ. భరతానుజః=లక్ష్మణుడు, ఆపతన్తీమ్=వచ్చుచున్న, తామ్=దానిని, అస్త్రైః=అస్త్రములచేతను, హుతాగ్నికల్పైః=హోమముచేయబడిన అగ్నితో సమానములైన, బాణైశ్చ=బాణములచేతను, జఘాన=కొట్టెను. తథాపి=అట్లైనను, సా శక్తిః=ఆ శక్తి, దాశరథేః=లక్ష్మణునియొక్క, విశాలమ్=విశాలమైన, భుజాన్తరమ్=వక్షస్థలమును, వివేశ=ప్రవేశించెను.

తా. లక్ష్మణుడు మీదికి వచ్చిపడుచున్న ఆ శక్తిని అస్త్రాలతోను, హోమముచేసిన అగ్నివలె ఉన్న బాణాలతోను కొట్టెను. అయినను ఆ శక్తి లక్ష్మణుని విశాలమైన వక్షఃస్థలములో ప్రవేశించెను. 109

మూ. స శక్తిమాన్ శక్తిసమాహతః సన్
జజ్వాల భూమౌ స రఘుప్రవీరః,
తం విహ్వలన్తం సహసాభ్యుపేత్య
జగ్రాహ రాజా తరసా భుజాభ్యామ్. 110

ప్ర. అ. శక్తిసమాహతః సన్=శక్తిచేత కొట్టబడినవాడై, శక్తిమాన్=శక్తిమంతుడైన, సః=ఆ, రఘుప్రవీరః=లక్ష్మణుడు, భూమౌ= భూమియందు, జజ్వాల=ప్రజ్వలించెను. రాజా=రావణుడు, సహసా=శీఘ్రముగా, అభ్యుపేత్య=సమీపించి, విహ్వలన్తమ్=వ్యాకులుడగుచున్న, తమ్=అతనిని, తరసా=బలముతో, భుజాభ్యామ్=భుజములచేత, జగ్రాహ=పట్టుకొనెను.

తా. శక్తిశాలియైన ఆ లక్ష్మణుడు శక్తిచేత కొట్టబడినవాడై నేలమీద పడి ప్రజ్వలించెను. రావణుడు శీఘ్రముగా వచ్చి వ్యాకులుడై ఉన్న ఆ లక్ష్మణుణ్ణి,

తన బలము నుపయోగించి భుజములతో పట్టుకొనెను. 110

మూ. హిమవాన్ మన్దరో మేరుస్త్రైలోక్యం వా సహామరైః,
శక్యం భుజాభ్యాముద్ధర్తుం న శక్యో భరతానుజః. 111

ప్ర. అ. హిమవాన్ = హిమవత్పర్వతము, మన్దరః = మందరపర్వతము, మేరుః = మేరుపర్వతము, సహామరైః = దేవతలతో సహా, త్రైలోక్యం వా = మూడు లోకములు, భుజాభ్యామ్ = భుజములచేత, ఉద్ధర్తుమ్ = ఎత్తుటకు, శక్యమ్ = శక్య మగును. భరతానుజః = లక్ష్మణుడు, న శక్యః = శక్యమైనవాడు కాడు.

తా. హిమవత్పర్వతమును, మందరపర్వతమును, మేరుపర్వతమును, దేవతలతో సహా మూడు లోకములను రావణుడు భుజములతో ఎత్తవచ్చునేమో గాని లక్ష్మణుని మాత్రము ఎత్తలేకపోయెను. 111

మూ. శక్త్యా బ్రాహ్మ్యా తు సౌమిత్రిస్తాడితోఽపి స్తనాన్తరే,
విష్ణోరమీమాంస్యభాగమాత్మానం ప్రత్యనుస్మరత్. 112

ప్ర. అ. సౌమిత్రిః = లక్ష్మణుడు, బ్రాహ్మ్యా = బ్రహ్మసంబంధమైన, శక్త్యా = శక్తిచేత, స్తనాన్తరే = వక్షఃస్థలమునందు, తాడితోఽపి = కొట్టబడినవాడైనను, విష్ణోః = విష్ణువుయొక్క, అమీమాంస్యభాగమ్ = ఊహింప (తెలియ) శక్యముకాని భాగమైన, ఆత్మానమ్ = తనను, అనుస్మరత్ = స్మరించెను.

తా. బ్రహ్మ ఇచ్చిన శక్తిచేత వక్షఃస్థలమునందు కొట్టబడినా కూడ లక్ష్మణుడు తాను ఊహించుటకు కూడ శక్యము కాని విష్ణుభాగ మను విషయమును స్మరించుటచే ఆపాయము లేనివాడై ఉండెను. 112

మూ. తతో దానవదర్పఘ్నం సౌమిత్రిం దేవకణ్టకః,
తం పీడయిత్వా బాహుభ్యాం న ప్రభుర్లఙ్ఘనేఽభవత్. 113

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దేవకణ్టకః = దేవతలకు బాధాకరుడైన రావణుడు, తమ్ = ఆ, దానవదర్పఘ్నమ్ = దానవుల దర్పమును తొలగించిన, సౌమిత్రిమ్ = లక్ష్మణుని, బాహుభ్యామ్ = బాహువులచేత, పీడయిత్వా = పీడించి, లఙ్ఘనే = దాటుటయందు (కదల్చుటయందు), ప్రభుః = సమర్థుడు, నాభవత్ = కాలేదు.

తా. పిమ్మట రావణుడు రాక్షససంహారకుడైన లక్ష్మణుని బాహువులతో గట్టిగా పట్టుకొని ఆతనిని కదల్చుటకు సమర్థుడు కాలేదు. 113

మూ. తతః క్రుద్ధో వాయుసుతో రావణం సమభిద్రవత్,
ఆజఘానోరసి క్రుద్ధో వజ్రకల్పేన ముష్టినా. 114

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రుద్ధః=కోపించిన, వాయుసుతః= హనుమంతుడు, రావణమ్=రావణుని గూర్చి, సమభిద్రవత్=పరుగెత్తెను. క్రుద్ధః=కోపించినవాడై, వజ్రకల్పేన=వజ్రముతో సమానమైన, ముష్టినా=పిడికిలితో, ఉరసి=వక్షఃస్థలమునందు, అజఘాన=కొట్టెను.

తా. అప్పుడు హనుమంతుడు రావణుని మీదికి దుమికి, కోపావిష్టుడై, వజ్రము వంటి పిడికిలితో అతనిని వక్షఃస్థలముమీద కొట్టెను. 114

మూ. తేన ముష్టిప్రహారేణ రావణో రాక్షసేశ్వరః,
జానుభ్యామగమద్భూమౌ చచాల చ పపాత చ. 115

ప్ర. అ. తేన=ఆ, ముష్టిప్రహారేణ=పిడికిలి దెబ్బచేత, రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, చచాల=చలించెను. జానుభ్యామ్=మోకాళ్లతో, భూమౌ=నేలమీద, అపతత్ చ=పడిపోయెను కూడ.

తా. రాక్షసరాజైన రావణుడు ఆ పిడికిలి దెబ్బకు చలించిపోయి నేలపై మోకాళ్లమీద పడిపోయెను. 115

మూ. ఆస్యాచ్చ నేత్రైః శ్రవణైః పపాత రుధిరం బహు,
విఘూర్ణమానో నిశ్చేష్టో రథోపస్థ ఉపావిశత్. 116

ప్ర. అ. ఆస్యాత్ చ=ముఖమునుండియును, నేత్రైః=నేత్రములచేతను, శ్రవణైః=చెవులచేతను, బహు=అధికమైన, రుధిరమ్=రక్తము, పపాత=పడెను. విఘూర్ణమానః=తిరిగిపోవుచున్నవాడై, నిశ్చేష్టః=నిశ్చేష్టుడై, రథోపస్థే=రథమధ్యమునందు, ఉపావిశత్=కూర్చుండెను.

తా. అతని ముఖమునుండి, నేత్రములనుండి, చెవులనుండి అధికముగా రక్తము కారెను. అతడు తిరిగిపోయి, నిశ్చేష్టుడై రథమధ్యమునందు కూర్చుండిపోయెను. 116

మూ. విసంజ్ఞో మూర్ఛితశ్చాసీన్న చ స్థానం సమాలభత్,
విసంజ్ఞం రావణం దృష్ట్వా సమరే భీమవిక్రమమ్, 117
ఋషయో వానరాశ్చైవ నేదుర్దేవాశ్చ సాసురాః.

ప్ర. అ. విసంజ్ఞః=సంజ్ఞ లేనివాడై, మూర్ఛితశ్చ=మూర్ఛ చెందినవాడు కూడ, ఆసీత్=అయెను. స్థానమ్=నిలకడను, న చ సమాలభత్= పొందలేదు. సమరే=యుద్ధమునందు, విసంజ్ఞమ్=సంజ్ఞ తప్పిన, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గల, రావణమ్=రావణుని, దృష్ట్వా=చూచి, ఋషయః=ఋషులు, వానరాశ్చైవ=వానరులు, సాసురాః=అసురులతో కూడిన, దేవాశ్చైవ=దేవతలు,

నేదుః=ధ్వనిచేసిరి.

తా. స్పృహ తప్పి మూర్ఛ చెందెను. నిలబడలేకపోయెను. ఆ విధముగా యుద్ధరంగమునందు భయంకరపరాక్రమము గల రావణుడు స్పృహ కోల్పోవుట చూచి ఋషులు, వానరులు, దేవతలు, అసురులు, ఆనందముతో ధ్వనిచేసిరి. 117

మూ. హనూమానథ తేజస్వీ లక్ష్మణం రావణార్దితమ్, 118
ఆనయద్రాఘవాభ్యాశం బాహుభ్యాం పరిగృహ్య తమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, తేజస్వీ=తేజఃశాలియైన, హనూమాన్=హనుమంతుడు, రావణార్దితమ్=రావణునిచేత పీడింపబడిన, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుని, బాహుభ్యామ్=బాహువులచేత, పరిగృహ్య=గ్రహించి, రాఘవాభ్యాశమ్=రాముని సమీపమును, ఆనయత్=తీసికొనివచ్చెను.

తా. పిమ్మట, తేజఃశాలియైన హనుమంతుడు రావణునిచేత పీడింపబడిన ఆ లక్ష్మణుణ్ణి భుజాలతో ఎత్తి రాముని దగ్గరకు తీసికొని వచ్చెను. 118

మూ. వాయుసూనోః సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః, 119
శత్రూణామప్రకమ్ప్యోఽపి లఘుత్వమగమత్కపేః.

ప్ర. అ. సః=ఆ లక్ష్మణుడు, శత్రూణామ్=శత్రువులకు, అప్రకమ్ప్యోఽపి=కదల్ప శక్యముకానివాడైనను, వాయుసూనోః=హనుమంతునియొక్క, సుహృత్త్వేన=మిత్రుడగుటచేతను, పరమయా=గొప్ప, భక్త్యా చ= భక్తిచేతను, కపేః=హనుమంతునకు, లఘుత్వమ్=తేలికయగుటను, అగమత్=పొందెను.

తా. లక్ష్మణుణ్ణి శత్రువు లెవ్వరూ కదల్పజాలరు. అయినను, హనుమంతుడు మిత్రు డగుటచేతా, భక్తి ఉన్నవాడగుటచేతా అతనికి తేలిక అయ్యెను. 119

మూ. తం సముత్సృజ్య సా శక్తిః సౌమిత్రిం యుధి నిర్జితమ్, 120
రావణస్య రథే తస్మిన్ స్థానం పునరుపాగమత్.

ప్ర. అ. సా శక్తిః=ఆ శక్తి, యుధి=యుద్ధమునందు, నిర్జితమ్=జయింపబడిన, సౌమిత్రిమ్=లక్ష్మణుని, సముత్సృజ్య=విడచి, రావణస్య= రావణునియొక్క, తస్మిన్ రథే=ఆ రథమునందు, పునః=మరల, స్థానమ్=స్థానమును, ఉపాగమత్=పొందెను.

తా. ఆ శక్తి యుద్ధములో జయింపబడిన లక్ష్మణుని విడిచి రావణుని రథమునందు తన స్థానమును చేరెను. 120

మూ. రావణోఽపి మహాతేజాః ప్రాప్య సంజ్ఞాం మహాహవే, 121
ఆదదే నిశితాన్ బాణాన్ జగ్రాహ చ మహద్ధనుః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణోఽపి=రావణుడు కూడ, మహాహవే=మహాయుద్ధమునందు, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రాప్య= పొంది, నిశితాన్=వాడియైన, బాణాన్=బాణములను, ఆదదే=గ్రహించెను. మహత్=గొప్ప, ధనుః చ=ధనస్సును కూడ, ఆదదే=గ్రహించెను.

తా. గొప్ప తేజస్సు గల రావణుడు కూడ మరల సంజ్ఞ పొంది, గొప్ప ధనస్సును పట్టి వాడియైన బాణములను గ్రహించెను. 121

మూ. ఆశ్వస్తశ్చ విశల్యశ్చ లక్ష్మణః శత్రుసూదనః, 122
విష్ణోర్భాగమమీమాంస్యమాత్మానం ప్రత్యనుస్మరన్.

ప్ర. అ. శత్రుసూదనః=శత్రుసంహారకుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, అమీమాంస్యమ్= ఊహింప శక్యము కాని, విష్ణోః భాగమ్=విష్ణుభాగమైన, ఆత్మానమ్=తనను గూర్చి, ప్రత్యనుస్మరన్=స్మరించుచు, ఆశ్వస్తః చ=తేరుకొని, విశల్యః చ=శల్యములు తొలగిపోయిన వాడయ్యెను.

తా. శత్రువినాశకుడైన లక్ష్మణుడు ఊహింప శక్యము కాని విష్ణువు అంశమైన తన సహజస్వరూపమును గూర్చి స్మరించుచు తేరుకొనెను. అతని శరీరము నందలి శల్యములన్నీ తొలగిపోయెను. 122

మూ. నిపాతితమహావీరాం వానరాణాం మహాచమూమ్, 123
రాఘవస్తు రణే దృష్ట్వా రావణం సమభిద్రవత్.

ప్ర. అ. రాఘవస్తు=రాముడైతే, రణే=యుద్ధమునందు, నిపాతిత మహావీరామ్=పడగొట్టబడిన మహావీరులు గల, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూమ్=గొప్ప సేనను, దృష్ట్వా=చూచి, రావణమ్=రావణుని గూర్చి, సమభిద్రవత్=శీఘ్రముగా వెళ్లెను.

తా. యుద్ధములో వానరసైన్యమునందలి మహావీరు లందరూ పడిపోవుట చూచి రాముడు రావణుని వైపు శీఘ్రముగా వెళ్లెను. 123

మూ. అథైనముపసంగమ్య హనూమాన్వాక్యమబ్రవీత్, 124
మమ పృష్ఠం సమారుహ్య రాక్షసం శాస్తుమర్హసి,
విష్ణుర్యథా గరుత్మన్తమారుహ్యామరవైరిణామ్. 125

ప్ర. అ. అథ=అటు పిమ్మట, హనూమాన్=హనుమంతుడు, ఏనమ్=ఈ రాముణ్ణి, ఉపసంగమ్య=సమీపించి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

విష్ణుః= విష్ణువు, గరుత్మన్తమ్=గరుత్మంతుణ్ణి, ఆరుహ్య=ఎక్కి, అమరవైరిణం యథా=దేవతల శత్రువైన రాక్షసుని వలె, మమ=నాయొక్క, పృష్ఠమ్=వీపును, సమారుహ్య=ఎక్కి, రాక్షసమ్=రాక్షసుణ్ణి, శాస్తుమ్=శిక్షించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. అంతలో హనుమంతుడు రాముని వద్దకు వెళ్లి -- "విష్ణువు గరుత్మంతుణ్ణి ఎక్కి దేవతల శత్రువును సంహరించి నట్లు, నీవు నా వీపుమీద ఎక్కి ఈ రాక్షసుని సంహరింపుము" అని పలికెను. 124, 125

మూ. తచ్ఛ్రుత్వా రాఘవో వాక్యం వాయుపుత్రేణ భాషితమ్,
అథారురోహ సహసా హనూమన్తం మహాకపిమ్. 126
రథస్థం రావణం సంఖ్యే దదర్శ మనుజాధిపః.

ప్ర. అ. రాఘవః=రాముడు, వాయుపుత్రేణ=హనుమంతునిచేత, భాషితమ్= పలుకబడిన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, అథ=ఆటుపిమ్మట, సహసా=వెంటనే, మహాకపిమ్=గొప్ప వానరుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, ఆరురోహ=ఎక్కెను. మనుజాధిపః=రాజైన రాముడు, సంఖ్యే=యుద్ధమునందు, రథస్థమ్=రథమునందున్న, రావణమ్=రావణుని, దదర్శ=చూచెను.

తా. రాముడు హనుమంతుడు పలికిన ఆ వాక్యమును విని పిమ్మట వానరశ్రేష్ఠుడైన హనుమంతుని వీపుపై శీఘ్రముగా ఎక్కెను. పిమ్మట రాముడు యుద్ధములో రథమునందున్న ఆ రావణుణ్ణి చూచెను. 126

మూ. తమాలోక్య మహాతేజాః ప్రదుద్రావ స రావణమ్, 127
వైరోచనమివ క్రుద్ధో విష్ణురభ్యుద్యతాయుధః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః=రాముడు, తమ్=వానిని, ఆలోక్య=చూచి, క్రుద్ధః=కోపించినవాడై, అభ్యుద్యతాయుధః=ఎత్తబడిన ఆయుధము గలవాడై, విష్ణుః=విష్ణువు, వైరోచనమివ=బలిచక్రవర్తిని వలె, రావణమ్=రావణుని గూర్చి, ప్రదుద్రావ=శీఘ్రముగా వెళ్లెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు ఆ రావణుని చూచి, కోపముతో ఆయుధమును ఎత్తి, విష్ణువు బలిచక్రవర్తి మీదికి వెళ్లినట్లు అతని మీదికి శీఘ్రముగా వెళ్లెను. 127

మూ. జ్యాశబ్దమకరోత్తీవ్రం వజ్రనిష్పేషనిష్ఠురమ్, 128
గిరా గమ్భీరయా రామో రాక్షసేన్ద్రమువాచ హ.

ప్ర. అ. రామః=రాముడు, వజ్రనిష్పేషనిష్ఠురమ్=వజ్రమును వంగ

కొట్టిన ధ్వనివలె విస్ఫురమైన, తీవ్రమ్=తీవ్రమైన, జ్యాశబ్దమ్=టంకారధ్వనిని, అకరోత్=చేసెను. గమ్భీరయా=గంభీరమైన, గిరా=వాక్కుతో, రాక్షసేన్ద్రమ్=రావ ణుని గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. రాముడు వజ్రమును నలగగొట్టినపుడు కలుగు ధ్వని వలె విస్ఫురమైన, తీవ్రమైన టంకారధ్వని చేసి, గంభీరమైన వాక్కుతో రావణుని గూర్చి ఇట్లు పలికెను. 128

మూ. తిష్ఠ తిష్ఠ మమ త్వం హి కృత్వా విప్రియమీదృశమ్, 129
క్వ ను రాక్షసశార్దూల గత్వా మోక్షమవాప్స్యసి.

ప్ర. అ. రాక్షసశార్దూల=ఓ ! రాక్షసశ్రేష్ఠుడా ! తిష్ఠ తిష్ఠ=నిలువుము, నిలువుము. త్వమ్=నీవు, మమ=నాకు, ఈదృశమ్=ఇట్టి, విప్రియమ్=అపకార మును, కృత్వా=చేసి, క్వ ను=ఎక్కడికి, గత్వా=వెళ్లి, మోక్షమ్=విడుదలను, అవాప్స్యసి=పొందగలవు ?

తా. రావణుడా ! నిలువుము, నిలువుము. నాకిట్టి అపకారమును చేసి నీవు ఎక్కడికి వెళ్లి విడుదలను పొందగలవు ? 129

మూ. యదీన్ద్రవైవస్వతభాస్కరాన్వా
స్వయమ్భువైశ్వానరశంకరాన్వా,
గమిష్యసి త్వం దశధా దిశో వా
తథాపి మే నాద్య గతో విమోక్ష్యసే. 130

ప్ర. అ. ఇన్ద్రవైవస్వతభాస్కరాన్ వా=ఇంద్ర-యమ-సూర్యులను గాని, స్వయమ్భువైశ్వానరశంకరాన్వా=బ్రహ్మ-అగ్ని-శివులను గాని, దశధా=పది విధము లుగా, దిశో వా=దిక్కులను గాని, త్వమ్=నీవు, గమిష్యసి యది=వెళ్లినట్లయితే, తథాపి=అట్లయినను, అద్య=ఇప్పుడు, మే=నా సమీపమును, గతః=పొందినవాడవై, న విమోక్ష్యసే=విడువబడవు.

తా. ఇప్పుడు నా ఎదుటకు వచ్చిన నీవు, ఇంద్ర - యమ - సూర్యుల దగ్గరికి గాని, బ్రహ్మ - అగ్ని - శివులదగ్గరికి గాని, పది దిక్కులకు గాని వెళ్లినను విడువబడవు. 130

మూ. యశ్చైష శక్త్యా నిహతస్త్వయాద్య
గచ్ఛన్విషాదం సహసాభ్యుపేత్య,
స ఏష రక్షోగణరాజ మృత్యుః
సపుత్రపౌత్రస్య తవాద్య యుద్ధే. 130

ప్ర. అ. రక్షోగణరాజ=రావణుడా ! అద్య=ఇప్పుడు, యః ఏషః=ఏ ఈ లక్ష్మణుడు, త్వయా=నీచేత, శక్త్యా=శక్తిచేత, విహతః=కొట్టబడినాడో, విషాదమ్=దుఃఖమును, గచ్ఛన్=పొందుచున్న, సః ఏషః=అట్టి ఈ లక్ష్మణుడు, సహసా=శీఘ్రముగా, అభ్యుపేత్య=వచ్చి, అద్య=ఇప్పుడు, యుద్ధే=యుద్ధమునందు, సపుత్రపౌత్రస్య=పుత్రపౌత్రులతో కూడిన, తవ=నీకు, మృత్యుః=మృత్యుదేవత కాగలడు.

రా. ఓ ! రావణా ! ఏ లక్ష్మణుని నీవిప్పుడు శక్తిచేత కొట్టినావో మూర్ఛ పొందిన ఆ లక్ష్మణుడే వెంటనే వచ్చి ఇప్పుడు, ఈ యుద్ధమునందు, పుత్రపౌత్రసహితుడవైన నీ పాలిట మృత్యుదేవత కానున్నాడు. 130

మూ. ఏతేన చాత్యద్భుతదర్శనాని
శరైర్జనస్థానకృతాలయాని,
చతుర్దశాన్యాత్తవరాయుధాని
రక్షఃసహస్రాణి నిషూదితాని. 132

ప్ర. అ. ఏతేన=ఈ నాచేత, అద్భుతదర్శనాని=ఆశ్చర్యకరమైన దర్శనము గలవి, జనస్థానకృతాలయాని=జనస్థానమునందు చేయబడిన నివాసముగలవి, ఆత్తవరాయుధాని=గ్రహింపబడిన శ్రేష్ఠములైన ఆయుధములు గలవి అయిన, చతుర్దశాని=పదునాలుగు, రక్షఃసహస్రాణి=రాక్షసుల సహస్రములు, శరైః=బాణములచేత, నిషూదితాని=నశింపచేయబడినవి.

రా. చూచుటకు చాల ఆశ్చర్యకరులుగా ఉండువారు, శ్రేష్ఠములైన ఆయుధములను ధరించినవారు అయిన జనస్థానములో నివసించు పదునాలుగు వేల మంది రాక్షసులను నేను బాణములతో నశింపచేసితిని.

వి. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. రాముడు తన నీవిధంగా పొగడుకొన్నాడనుట కంటే ఈ శ్లోకం లేకపోవడమే మంచిది. వాస్తవంలో సమన్వయం సరిగా కుదరని పెద్ద వృత్తాం శ్లోకాలతో నిండి ఉన్న ఈ సర్గలోని చాలా శ్లోకాలు ప్రక్షిప్తాల వలె ఉన్నాయి. 132

మూ. రాఘవస్య వచః శ్రుత్వా రాక్షసేన్ద్రో మహాబలః,
వాయుపుత్రం మహావేగం వహన్తం రాఘవం రణే, 133
రోషేణ మహతావిష్టః పూర్వవైరమనుస్మరన్,
ఆజఘాన శరైర్దీప్తైః కాలానలశిఖోపమైః. 134

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, రాక్షసేన్ద్రః=రావణుడు, రాఘవస్య=రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, మహతా=గొప్ప,

రోషేణ=రోషముచేత, ఆవిష్టః=నిండినవాడై, పూర్వవైరమ్=వెనుకటి వైరమును, అనుస్మరన్=స్మరించుచు, రణే=యుద్ధమునందు, రాఘవమ్=రాముణ్ణి, వహన్తమ్=మోయుచున్న, మహావేగమ్=గొప్పవేగము గల, వాయుపుత్రమ్=హనుమంతుణ్ణి, కాలానలశిఖోపమైః=ప్రలయకాలాగ్నిజ్వాలలతో సమానములైన, దీప్తైః=ప్రకాశించుచున్న, శరైః=బాణములచేత, ఆజఘాన=కొట్టెను.

తా. గొప్ప బలము గల రావణుడు రాముని మాటలు విని, కోపముతో మండిపడుచు, వెనుకటి వైరమును స్మరించుచు, యుద్ధములో రాముని మోయుచున్న హనుమంతుణ్ణి ప్రలయకాలాగ్నిజ్వాలలతో సమానములైన, ప్రకాశించుచున్న బాణములతో కొట్టెను. 133, 134

మూ. రాక్షసేనాహవే తస్య తాడితస్యాపి సాయకైః,
స్వభావతేజోయుక్తస్య భూయస్తేజోఽభ్యవర్ధత. 135

ప్ర. అ. రాక్షసేన=రావణునిచేత, ఆహవే=యుద్ధమునందు, సాయకైః=బాణములచేత, తాడితస్యాపి=కొట్టబడినను, స్వభావతేజోయుక్తస్య=సహజమైన తేజస్సుతో కూడిన, తస్య=ఆ హనుమంతునియొక్క, తేజః=తేజస్సు, భూయః=ఇంకను, అభ్యవర్ధత=వృద్ధిపొందెను.

తా. యుద్ధములో రావణుడు బాణములచేత ఆ విధముగా కొట్టినను సహజముగా తేజోవంతుడైన హనుమంతుని తేజస్సు ఇంకా అధిక మయ్యెను.

మూ. తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్,
దృష్ట్వా ప్లవగశార్దూలం క్రోధస్య వశమేయివాన్. 136

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, రావణేన=రావణునిచేత, కృతవ్రణమ్=చేయబడిన వ్రణముగల, ప్లవగశార్దూలమ్= వానరశ్రేష్ఠుడైన హనుమంతుని, దృష్ట్వా=చూచి, క్రోధస్య=క్రోధముయొక్క, వశమ్= వశమును, ఏయివాన్=పొందినాడు.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల రాముడు రావణుని చేత గాయపరచబడిన హనుమంతుని చూడగానే చాల కోపము చెందెను. 136

మూ. తస్యాభిసంక్రమ్య రథం సచక్రం
సాశ్వధ్వజచ్ఛత్రమహాపతాకమ్,
ససారథిం సాశనిశూలఖడ్గం
రామః ప్రచిచ్ఛేద శితైః శరాగ్రైః. 137

ప్ర. అ. రామః=రాముడు, అభిసంక్రమ్య=ముందుకు వెళ్లి, తస్య=వాని

ఉపేత్య, సచక్రమ్=చక్రములతో కూడినది, సాశ్వధ్వజచ్ఛత్రమహాపతాకమ్=గుఱ్ఱ
ములతోను, ధ్వజములతోను, ఛత్రములతోను, పెద్ద పతాకలతోను కూడినది,
ససారథిమ్=సారథితో కూడినది, సాశనిశూలఖడ్గమ్=వజ్రములతోను, శూలముల
తోను, ఖడ్గములతోను కూడినది అయిన, రథమ్=రథమును, శితైః=వాడియైన,
శరాగ్రైః=బాణాగ్రముల చేత, ప్రచిచ్ఛేద=ఛేదించెను.

తా. రాముడు రావణునికి దగ్గరగా వెళ్లి, చక్రములతోను, గుఱ్ఱములతోను,
ధ్వజములతోను, ఛత్రములతోను, పెద్ద పతాకలతోను, సారథితోను, అశని - శూల -
ఖడ్గములతోను, కూడిన రావణుని రథమును వాడియైన బాణాలతో ఛేదించెను.

మూ. అథేన్ద్రశత్రుం తరసా జఘాన
బాణేన వజ్రాశనిసంనిభేన,
భుజాన్తరే వ్యూఢసుజాతరూపే
వజ్రేణ మేరుం భగవానివేన్ద్రః. 138

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వజ్రాశనిసంనిభేన=వజ్రాయుధముతోను
పిడుగుతోను సమానమైన, బాణేన=బాణముచేత, ఇన్ద్రశత్రుమ్=ఇంద్రుని
శత్రువైన ఆ రావణుని, తరసా=బలముతో, వ్యూఢసుజాతరూపే=విశాలము చాల
సుందరము అయిన, భుజాన్తరే=వక్షఃస్థలమునందు, భగవాన్=భగవంతుడైన,
ఇన్ద్రః=ఇంద్రుడు, వజ్రేణ=వజ్రముచేత, మేరుమ్ ఇవ=మేరుపర్వతమును వలె,
జఘాన=కొట్టెను.

తా. రాముడు ఆ రావణుని విశాలము, సుందరమూ అయిన వక్షస్థల
మును బలపూర్వకముగా, వజ్రములతోను, పిడుగులతోను సమానమైన బాణముచేత,
భగవంతుడైన ఇంద్రుడు వజ్రముచేత మేరుపర్వతమును కొట్టినట్లు కొట్టెను.

మూ. యో వజ్రపాతాశనిసంనిపాతా
న్న చుక్షుభే నాపి చచాల రాజా,
స రామబాణాభిహతో భృశార్త
శ్చచాల చాపం చ ముమోచ వీరః. 139

ప్ర. అ. యః=ఏ, రాజా=రాక్షసరాజు, వజ్రపాతాశనిసంనిపాతాత్=వజ్రము
పడుటవలన, పిడుగు పడుటవలన, న చుక్షుభే=క్షోభించలేదో, నాపి చచాల=చలిం
చనూ కూడ లేదో, సః=అట్టి, వీరః=వీరుడు, రామబాణాభిహతః=రాముని
బాణముచేత కొట్టబడినవాడై, భృశార్తః=మిక్కిలి పీడితుడై, చచాల=చలించెను.
చాపం చ=ధనస్సును కూడ, ముమోచ=విడచెను.

తా. ఏ రావణుడు వజ్రాయుధము దెబ్బ తగిలినా, పిడుగులు పడినా

కూడ క్షోభ చెందలేదో, చలించను కూడ లేదో అట్టి వీరుడైన రావణుడు రాముని బాణముచేత కొట్టబడినవాడై, మిక్కిలి దుఃఖితుడై, చలించిపోయెను. ధనస్సును కూడ జార విడచెను. 139

మూ. తం విహ్వలన్తం ప్రసమీక్ష్య రామః
సమాదదే దీప్తమథార్ధచన్ద్రమ్,
తేనార్కవర్ణం సహసా కిరీటం
చిచ్ఛేద రక్షోధిపతేర్మహాత్మా. 140

ప్ర. అ. రామః=రాముడు, విహ్వలన్తమ్=వ్యాకులత చెందుచున్న, తమ్=వానిని, ప్రసమీక్ష్య=చూచి, అథ=అటుపిమ్మట, దీప్తమ్=ప్రజ్వలించు చున్న, అర్ధచన్ద్రమ్=అర్ధచంద్రబాణమును, సమాదదే=గ్రహించెను. తేన=దానిచేత, మహాత్మా=మహాత్ముడైన రాముడు, సహసా=వెంటనే, అర్కవర్ణమ్=సూర్యునివంటి వర్ణముగల, కిరీటమ్=కిరీటమును, చిచ్ఛేద=ఛేదించెను.

భా. మహాత్ముడైన రాముడు వ్యాకులత చెందుచున్న ఆ రావణుని చూచి అర్ధచంద్రబాణము గ్రహించి, వెంటనే దానిచేత వాని సూర్యునివంటి ప్రకాశము గల కిరీటమును ఛేదించెను. 140

మూ. తం నిర్విషాశీవిషసంనికాశం
శాన్తార్చిషం సూర్యమివాప్రకాశమ్,
గతశ్రియం కృత్తకిరీటకూట
ముువాచ రామో యుధి రాక్షసేన్ద్రమ్. 141

ప్ర. అ. రామః=రాముడు, యుధి=యుద్ధమునందు, నిర్విషాశీవిష సంనికాశమ్=విషము లేని సర్పముతో సమానుడు, శాన్తార్చిషమ్=శాంతించిన కిరణములు గల, సూర్యమివ=సూర్యునివలె ఉన్నవాడు, అప్రకాశమ్=ప్రకాశ లేనివాడు, గతశ్రియమ్=తొలగిన శోభ గలవాడు, కృత్తకిరీటకూటమ్=ఛేదింపబడిన కిరీటసముదాయము కలవాడు అయిన, తం రాక్షసేన్ద్రమ్=ఆ రాక్షసరాజును గూర్చి, ఉవాచ=పలికెను.

భా. యుద్ధరంగములో ఆ రావణుడప్పుడు విషములేని సర్పమువలె, కిరణములు శాంతించిన సూర్యుడు వలె ఉండెను. ప్రకాశవిహీనుడై, కిరీట సముదాయము ఖండింపబడుటచేత శోభ కోల్పోయి ఉండెను. అట్టి రావణునితో రాము డిట్లనెను. 141

మూ. కృతం త్వయా కర్మ మహత్సుభీమం
హతప్రవీరశ్చ కృతస్త్వయాహమ్,

తస్మాత్పరిశ్రాన్త ఇతి వ్యవస్య
న త్వాం శరైర్మృత్యువశం నయామి. 142

ప్ర. అ. త్వయా=నీచేత, సుభీమమ్=చాల భయంకరమైన, మహత్=గొప్పదైన, కర్మ=కర్మ, కృతమ్=చేయబడినది. త్వయా=నీచేత, అహమ్=నేను, హతప్రవీరః= చంపబడిన ఉత్తమవీరులు కలవాడుగా, కృతః చ=చేయబడితిని కూడ. తస్మాత్=ఆ కారణమువలన, పరిశ్రాన్తః ఇతి=అలసితివి అని, వ్యవస్య=నిశ్చయించుకొని, త్వామ్=నిన్ను, మృత్యువశమ్=మృత్యువునకు వశమును, న నయామి=పొందించను.

తా. నీవు భయంకరమైన గొప్ప కర్మ చేసినావు. నా మహావీరుల నందరిని పడగొట్టినావు. అందుచే నీవు అలసి ఉన్నావని నిర్ణయించుకొని నేను నిన్ను బాణముంచేత యమలోకమునకు పంపుటలేదు. 142

మూ. ప్రయాహి జానామి రణార్దితస్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ లఙ్కామ్,
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ప్రేక్ష్యసి మే రథస్థః.

ప్ర. అ. రాత్రించరరాజ= ఓ ! రాక్షసరాజా ! జానామి= నేను ఎరుగుదును. త్వమ్=నీవు, రణార్దితః=రణమునందు పీడింపబడితివి. ప్రయాహి=వెళ్ళుము. లఙ్కామ్=లంకను, ప్రవిశ్య=ప్రవేశించి, ఆశ్వాస్య=తెప్పరిల్లి, రథీ=రథము గలవాడవై, ధన్వీ చ=ధనస్సు గలవాడవై, నిర్యాహి=బయలు వెడలి రమ్ము. తదా=అప్పుడు, రథస్థః=రథమునందున్నవాడవై, మే=నాయొక్క, బలమ్=బలమును, ప్రేక్ష్యసి=చూడగలవు.

తా. నీవు యుద్ధములో అలసిపోయినావు; నాకు తెలియును. వెళ్ళుము; లంకలో ప్రవేశించి, శ్రమ తీర్చుకొని రథమును, ధనస్సును గ్రహించి, బయలుదేరి రమ్ము. అప్పుడు రథమునందున్నవాడవై నా బల మెంతటిదో చూడగలవు. 143

మూ. స ఏవముక్తో హతదర్పహర్షో
నికృత్తచాపః స హతాశ్వసూతః,
శరార్దితో భగ్నమహాకిరీటో
వివేశ లఙ్కాం సహసా స్మ రాజా. 144

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడినవాడై, సః=ప్రసిద్ధుడైన, హతదర్ప హర్షః=తొలగింపబడిన గర్వము, సంతోషము గలవాడు, నికృత్తచాపః=ఖండించబడిన

ధనస్సు కలవాడు, హతాశ్వసూతః=చంపబడిన గుఱ్ఱములు, సారథి గలవాడు, శరార్దితః= బాణముచేత పీడింపబడినవాడు, భగ్నమహాకిరీటః=ఖండించబడిన గొప్ప కిరీటములుగలవాడు అయిన, సః రాజా=ఆ రాక్షసరాజు, సహసా=వెంటనే, లఙ్కామ్=లంకను, వివేశ= ప్రవేశించెను.

తా. రావణుని దర్పము, సంతోషము కూడ అణగిపోయెను. ధనస్సు భేదింపబడెను. గుఱ్ఱములు, సారథి కూడ చంపబడెను. కిరీటములు ఖండింపబడెను. ఇట్టి స్థితిలో రాముని బాణముచేత పీడితుడైన ఆ రాక్షస రాజు రాముని మాటలు విని వెంటనే లంకలో ప్రవేశించెను. 144

మూ. తస్మిన్ ప్రవిష్టే రజనీచరేన్ద్రే
మహాబలే దానవదేవశత్రౌ,
హరీన్ విశల్యాన్ సహ లక్ష్మణేన
చకార రామః పరమాహవాగ్రే.

ప్ర. అ. మహాబలే=గొప్ప బలము గల, దానవదేవశత్రౌ=దానవులకు దేవతలకు శత్రువైన, తస్మిన్=ఆ, రజనీచరేన్ద్రే=రావణుడు, ప్రవిష్టే=లంకలో ప్రవేశించినవాడగుచుండగా, రామః=రాముడు, పరమాహవాగ్రే=ఆ మహాయుద్ధమునందు, లక్ష్మణేనసహ=లక్ష్మణునితోకూడ, హరీన్=వానరులను, విశల్యాన్=ములుకులు లేనివారినిగా, చకార=చేసెను.

తా. గొప్ప బలము గల, దేవదానవశత్రువైన రావణుడు లంకలో ప్రవేశించిన పిమ్మట రాముడు రణరంగములో పడి యున్న వానరుల దేహములనుండి, లక్ష్మణుని దేహమునుండి ములుకులను తొలగింపచేసెను. 145

మూ. తస్మిన్ ప్రభగ్నే త్రిదశేన్ద్రశత్రౌ
సురాసురా భూతగణా దిశశ్చ,
ససాగరాః సర్వమహోరగాశ్చ
తథైవ భూమ్యమ్బుచరాః ప్రహృష్టాః. 146

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ. త్రిదశేన్ద్రశత్రౌ=దేవేంద్రుని శత్రువైన, తస్మిన్=ఆ రావణుడు, ప్రభగ్నే= ఓడిపోయినవాడగుచుండగా, సురాసురాః=సురులు, అసురులు, భూతగణాః=భూతముల సముదాయములు, దిశశ్చ=దిక్కులు, ససాగరాః=సముద్రములతోకూడిన, సర్వమహోరగాః చ=సమస్తమైన ఉరగులు, తథైవ=మరియు, భూమ్యమ్బుచరాః=భూమిమీద జలములోను సంచరించు ప్రాణులు, ప్రహృష్టాః=మిక్కిలి సంతోషించిరి.

టీ. ఇంద్రుని శత్రువైన ఆ రావణుడు ఓడిపోవుట చూచి సురులు, అసురులు, భూతములు, దిక్కులు, సముద్రము, సమస్తమైన ఉరగులు, భూమియందు జలమునందు నివసించు ప్రాణులు సంతోషించినవి. 146

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో ఏబది తొమ్మిదవసర్గ సమాప్తము.

# అథ షష్టితమః సర్గః

[రాముని చేతిలో పరాజయము పొంది దుఃఖితుడైన రావణుని ఆజ్ఞచేత కుంభకర్ణుడు నిద్రనుండి లేపబడుట; అతనిని చూచి వానరులు భయపడుట.]

మూ. స ప్రవిశ్య పురీం లఙ్కాం రామబాణభయార్దితః,
భగ్నదర్పస్తదా రాజా బభూవ వ్యథితేన్ద్రియః. 1

ప్ర. అ. తదా=అప్పుడు, సః=ఆ, రాజా=రాక్షసరాజు, లఙ్కాం పురీమ్= లంకాపట్టణమును, ప్రవిశ్య=ప్రవేశించి, రామబాణభయార్దితః=రాముని బాణమువలన కలిగిన భయముచేత పీడితుడై, భగ్నదర్పః=భగ్నమైన దర్పము గలవాడై, వ్యథితేన్ద్రియః=వ్యథ చెందిన ఇంద్రియములు కలవాడు, బభూవ=ఆయెను.

తా. అప్పుడా రాక్షసరాజు లంకాపురములో ప్రవేశించిన పిమ్మట కూడ రామబాణముచేత పీడితుడై, గర్వము తొలగి, వ్యథ చెందిన ఇంద్రియములు గలవాడయ్యెను. 1

మూ. మాతఙ్గ ఇవ సింహేన గరుడేనేవ పన్నగః,
అభిభూతోఽభవద్రాజా రాఘవేణ మహాత్మనా. 2

ప్ర. అ. రాజా=రావణుడు, సింహేన=సింహముచేత, మాతఙ్గః ఇవ=ఏనుగు వలె, గరుడేన=గరుత్మంతునిచేత, పన్నగః ఇవ=సర్పము వలె, మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, అభిభూతః=తిరస్కరించబడినవాడు, అభవత్=ఆయెను.

తా. ఆ రావణుడు సింహముచేత ఏనుగు వలె, గరుత్మంతునిచేత సర్పము వలె మహాత్ముడైన రామునిచేత తిరస్కరింపబడెను. 2

మూ. బ్రహ్మదణ్డప్రతీకాశానాం విద్యుచ్చలితవర్చసామ్,
స్మరన్ రాఘవబాణానాం వివ్యథే రాక్షసేశ్వరః. 3

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజు, బ్రహ్మదణ్డప్రతీకాశానామ్=బ్రహ్మదండముతో సమానములు, విద్యుచ్చలితవర్చసామ్=మెరపులవలె చలించుచున్న కాంతి గలవి అయిన, రాఘవబాణానామ్=రాముని బాణములకు(ను), స్మరన్=స్మరించుచు, వివ్యథే=వ్యథ చెందెను.

తా. ఆ రాక్షసరాజు బ్రహ్మదండమువంటి, మెరపుల వలె చలించుచున్న కాంతి గల రాముని బాణాలను స్మరించుచు వ్యథ చెందెను. 3

మూ. స కాఞ్చనమయం దివ్యమాశ్రిత్య పరమాసనమ్,
విప్రేక్షమాణో రక్షాంసి రావణో వాక్యమబ్రవీత్. 4

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, కాఞ్చనమయమ్=బంగారమయ వికారమైన, దివ్యమ్=దివ్యమైన, పరమాసనమ్=ఉత్తమమైన ఆసనమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, రక్షాంసి=రాక్షసులను, విప్రేక్షమాణః=చూచుచున్నవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. రావణుడు దివ్యమైన బంగారు ఆసనముమీద కూర్చుండి రాక్షసులను చూచుచు ఇట్లు పలికెను. 4

మూ. సర్వం తత్ఖలు మే మోఘం యత్తప్తం పరమం తపః,
యత్సమానో మహేన్ద్రేణ మానుషేణ వినిర్జితః. 5

ప్ర. అ. పరమమ్=గొప్పదైన, యత్=ఏ, తపః=తపస్సు, తప్తమ్= చేయబడినదో, మే=నాయొక్క, తత్ సర్వమ్=అది అంతా, మోఘం ఖలు=వ్యర్థమైనది కదా! యత్=ఏ కారణమువలన, మహేన్ద్రేణ=మహేంద్రునితో, సమానః=సమానుడనైన నేను, మానుషేణ=మనుష్యునిచేత, వినిర్జితః=జయింపబడితినో.

తా. మహేంద్రునితో సమానుడనైన నన్ను మానవుడు జయించినాడు. నేను చేసిన ఆ గొప్ప తపస్సు అంతా వ్యర్థమై పోయినది కదా ! 5

మూ. ఇదం తద్బ్రహ్మణో ఘోరం వాక్యం మామభ్యుపస్థితమ్,
మానుషేభ్యో విజానీహి భయం త్వమితి తత్తథా. 6

ప్ర. అ. త్వమ్=నీవు, మానుషేభ్యః=మనుష్యులనుండి, భయమ్=భయమును, విజానీహి=తెలిసికొనుము, ఇతి=అని, బ్రహ్మణః=బ్రహ్మయొక్క, ఇదమ్=ఈ, ఘోరమ్=ఘోరమైన, వాక్యమ్=వాక్యము, మామ్=నన్ను, ఉపస్థితమ్=చేరినది. తత్=అది, తథా=అట్లే అగును.

తా. "నీకు మానవులవలననే భయము కలుగును" అని బ్రహ్మ పలికిన ఆ వాక్యము ఇపుడు నాకు వచ్చిపడినది. అది అట్లే జరుగుచున్నది. 6

మూ. దేవదానవగన్ధర్వైర్యక్షరాక్షసపన్నగైః,
అవధ్యత్వం మయా ప్రాప్తం మానుషేభ్యో న యాచితమ్. 7

ప్ర. అ. దేవదానవగన్ధర్వైః=దేవతలచేతను, దానవులచేతను, గంధర్వులచేతను, యక్షరాక్షసపన్నగైః=యక్షులచేతను, రాక్షసులచేతను, పన్నగులచేతను, అవధ్యత్వమ్=చంపబడకుండుట, మయా=నాచేత, ప్రాప్తమ్=పొందబడినది. మానుషేభ్యః=మనుష్యులవలన, న యాచితమ్=కోరబడలేదు.

తా. నేను దేవదానవగంధర్వయక్షరాక్షసపన్నగులనుండి మరణము కలుగకుండునట్లు వరము పొందితిని. కాని మనుష్యులనుండి మరణము కలుగ కుండు నట్లు కోరలేదు. 7

మూ. విదితం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్,
ఇక్ష్వాకుకులజాతేన అనరణ్యేన యత్ పురా. 8
ఉత్పత్స్యతి హి మద్వంశే పురుషో రాక్షసాధమ,
యస్త్వాం సపుత్రం సామాత్యం సబలం సాశ్వసారథిమ్, 9
నిహనిష్యతి సంగ్రామే త్వాం కులాధమ దుర్మతే.

ప్ర. అ. రాక్షసాధమ=రాక్షసులలో అధముడా! కులాధమ=కులముచేత అధముడా! దుర్మతే=దుష్టబుద్ధి గలవాడా! యః=ఎవడు, సపుత్రమ్=పుత్రులతో కూడిన, సామాత్యమ్=మంత్రులతో కూడిన, సబలమ్=సైన్యముతో కూడిన, సాశ్వసారథిమ్=అశ్వములతోను, సారథితోను కూడిన, త్వామ్=నిన్ను, సంగ్రామే=యుద్ధమునందు, నిహనిష్యతి=చంపగలడో అట్టి, పురుషః=పురుషుడు, మద్వంశే=నా వంశమునందు, ఉత్పత్స్యతి హి=పుట్టగలడు అని, పురా=పూర్వము, ఇక్ష్వాకుకులజాతేన=ఇక్ష్వాకువంశమునందు పుట్టిన, అనరణ్యేన=అనరణ్యునిచేత, యత్=ఎందువలన, విదితమ్=ప్రతిజ్ఞ చేయబడినదో, అందువలన, దశరథాత్మజమ్=దశరథుని కుమారుడైన, రామమ్=రాముణ్ణి, మానుషమ్=మనుష్యునిగా, మన్యే=తలచుచున్నాను.

తా. "దుష్టకులమునందు పుట్టిన, దుర్బుద్ధివైన ఓ! రాక్షసాధముడా! నిన్ను, నీ పుత్రులను, అమాత్యులను, సైన్యమును, అశ్వములను, సారథిని యుద్ధములో చంప నున్న పురుషుడు నా వంశములో పుట్టగలడు" అని పూర్వము ఇక్ష్వాకువంశమునందు పుట్టిన అనరణ్యుడు చెప్పి ఉన్నాడు. అందుచే దశరథాత్మజుడైన రాముడు ఆ మానవుడే అని తలంచెదను. 8, 9

మూ. శప్తోఽహం వేదవత్యా చ యదా సా ధర్షితా పురా, 10
సేయం సీతా మహాభాగా జాతా జనకనన్దినీ.

ప్ర. అ. యదా=ఎప్పుడు, పురా=పూర్వము, సా=ఆమె, ధర్షితా=అవమానించబడినదో, అప్పుడు, వేదవత్యా=వేదవతిచేత, అహమ్=నేను, శప్తః=శపించబడితిని. సా=అట్టి, ఇయమ్=ఈ వేదవతి, మహాభాగా=మహాభాగ్యవంతురాలైన, జనకనన్దినీ=జనకుని కుమార్తెయైన, సీతా=సీతగా, జాతా=పుట్టినది.

తా. పూర్వము నేను అవమానించిన వేదవతి నన్ను శపించినది. ఆమెయే మహాభాగ్యవంతురాలైన, జనకుని కుమార్తె యైన సీతగా పుట్టినది. 10

మూ. ఉమా నన్దీశ్వరశ్చాపి రమ్భా వరుణకన్యకా, 11
యథోక్తాస్తన్మయా ప్రాప్తం న మిథ్యా ఋషిభాషితమ్.

ప్ర. అ. ఉమా=పార్వతి, నన్దీశ్వరశ్చాపి=నందీశ్వరుడు, రమ్భా=రంభ, వరుణకన్యకా=వరుణుని కూతురు, యథా=ఎట్లు, ఉక్తాః=చెప్పినారో, తత్=అది, మయా=నాచేత, ప్రాప్తమ్=పొందబడినది. ఋషిభాషితమ్=ఋషుల వాక్కు, మిథ్యా=అసత్యము, న=కాదు.

తా. పార్వతి, నందీశ్వరుడు, రంభ, వరుణుని పుత్రిక ఎట్లు శపించినారో ఆ విధముగానే ప్రాప్తించినది. ఋషుల మాటలు అసత్యములు కావుకదా ? 11

మూ. ఏతదేవాభ్యుపాగమ్య యత్నం కర్తుమిహార్హథ, 12
రాక్షసాశ్చాపి తిష్ఠన్తు చర్యాగోపురమూర్ధసు.

ప్ర. అ. ఏతత్ ఏవ=ఈ శాపస్వరూపమును, అభ్యుపాగమ్య=అంగీకరించి, ఇహ=ఈ విషయమునందు, యత్నమ్=ప్రయత్నమును, కర్తుమ్=చేయుటకు, అర్హథ=తగి ఉన్నారు. రాక్షసాశ్చాపి=రాక్షసులు కూడ, చర్యాగోపురమూర్ధసు=రాజమార్గములయందు గోపురముల శిఖరములయందు, తిష్ఠన్తు=నిలచెదరు గాక.

తా. ఈ శాపములను దృష్టిలో ఉంచుకొని మీరు ప్రయత్నము చేయవలెను. రాక్షసులు కూడ రాజవీథులలోను, గోపురముల శిఖరములయందు నిలచి ఉండవలెను. 12

మూ. స చాప్రతిమగామ్భీర్యో దేవదానవదర్పహా, 13
బ్రహ్మశాపాభిభూతస్తు కుమ్భకర్ణో విబోధ్యతామ్.

ప్ర. అ. అప్రతిమగామ్భీర్యః=సాటిలేని గాంభీర్యము గలవాడు, దేవదానవదర్పహా=దేవదానవుల దర్పమును తొలగించినవాడు, బ్రహ్మశాపాభిభూతః=బ్రహ్మదేవుని శాపముచేత తిరస్కరింపబడినవాడు అయిన, సః=ఆ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, విబోధ్యతామ్=లేపబడుగాక.

తా. సాటిలేని గాంభీర్యము గలవాడు, దేవదానవుల దర్పమును అణచినవాడు, బ్రహ్మశాపగ్రస్తుడు అయిన కుంభకర్ణుణ్ణి మేల్కొలుపుడు. 13

మూ. సమరే జితమాత్మానం ప్రహస్తం చ నిషూదితమ్, 14
జ్ఞాత్వా రక్షోబలం భీమమాదిదేశ మహాబలః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=అతడు, సమరే=యుద్ధము నందు, ఆత్మానమ్=తనను, జితమ్=జయింపబడినవానినిగాను, ప్రహస్తమ్=ప్రహ

హస్తం, నిషూదితమ్=చంపబడినవానినిగాను, జ్ఞాత్వా=తెలిసికొని, భీమమ్=భయంకరమైన, బలమ్=సైన్యమును, ఆదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. యుద్ధములో ప్రహస్తుడు చంపబడుటచేతను, తాను ఓడిపోవుట చేతను, మహాబలశాలియైన ఆ రావణుడు భయంకరమైన రాక్షససైన్యమును ఆజ్ఞాపించెను. 14

మూ. ద్వారేషు యత్నః క్రియతాం ప్రాకారశ్చాధిరుహ్యతామ్, 15
నిద్రావశసమావిష్టః కుమ్భకర్ణో విబోధ్యతామ్.

ప్ర. అ. ద్వారేషు=ద్వారములయందు, యత్నః=ప్రయత్నము, క్రియతామ్=చేయబడుగాక. ప్రాకారశ్చ=ప్రాకారము కూడ, అధిరుహ్యతామ్=ఎక్కబడుగాక. నిద్రావశసమావిష్టః=నిద్రావశుడై నిద్రచేత ఆవహించబడిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, విబోధ్యతామ్=లేపబడుగాక.

తా. ద్వారముల రక్షణము విషయమున యత్నముతో ఉండవలెను. ప్రాకారము నెక్కి శత్రువులను కనిపెట్టి ఉండవలెను. నిద్రచేత ఆవహించ బడిన కుంభకర్ణుని మేల్కొల్పవలెను. 15

మూ. సుఖం స్వపితి నిశ్చిన్తః కాలోపహతచేతనః, 16
నవ సప్త దశాష్టౌ చ మాసాన్ స్వపితి రాక్షసః.

ప్ర. అ. రాక్షసః=కుంభకర్ణుడు, కాలోపహతచేతనః=కాలముచేత నశింపచేయబడిన చైతన్యము కలవాడై, నిశ్చిన్తః=చింత లేనివాడై, నవ=తొమ్మిది, సప్త=ఏడు, దశ=పది, అష్టౌ చ=ఎనిమిది, మాసాన్=మాసములను, సుఖమ్=సుఖముగా, స్వపితి=నిద్రించుచున్నాడు.

తా. ఈ కుంభకర్ణుడు కాలవశముచేత స్పృహ కోల్పోయి, శయనించినచో తొమ్మిది, ఏడు, పది, ఎనిమిది మాసములు నిశ్చింతగా, సుఖముగా నిద్రించుచుండును. 16

మూ. మన్త్రం కృత్వా ప్రసుప్తోఽయమితస్తు నవమేఽహని, 17
తం తు బోధయత క్షిప్రం కుమ్భకర్ణం మహాబలమ్.

ప్ర. అ. మన్త్రమ్=ఆలోచనను, కృత్వా=చేసి, అయమ్=ఇతడు, ఇతః=ఇప్పటినుండి, నవమే=తొమ్మిదవ, అహని=దివసమునందు, ప్రసుప్తః=నిద్రపోయినాడు. మహాబలమ్=గొప్ప బలము గల, తం కుమ్భకర్ణమ్=ఆ కుంభకర్ణుని, క్షిప్రమ్=శీఘ్రముగా, బోధయత=మేల్కొల్పండి.

తా. అతడు మన మందరము మంత్రణము చేసిన పిమ్మట తొమ్మిది

రోజుల క్రితము నిద్రపోయినవాడు. గొప్ప బలము గల ఆ కుంభకర్ణుణ్ణి శీఘ్రముగా మేల్కొల్పుడు. 17

మూ. స హి సంఖ్యే మహాబాహుః కకుదం సర్వరక్షసామ్, 18
వానరాన్ రాజపుత్రౌ చ క్షిప్రమేవ హనిష్యతి.

ప్ర. అ. సర్వరక్షసామ్=సమస్తరాక్షసులలో, కకుదమ్=శ్రేష్ఠుడు, మహాబాహుః=గొప్ప బాహువులు గలవాడు అయిన, సః=అతడు, సంఖ్యే=యుద్ధమునందు, వానరాన్=వానరులను, రాజపుత్రౌ చ=రాజకుమారులను, క్షిప్రమేవ=శీఘ్రముగా, హనిష్యతి=చంపగలడు.

తా. సమస్తరాక్షసులలో శ్రేష్ఠుడైన గొప్ప బాహువులు గల ఆ కుంభకర్ణుడు యుద్ధమునందు వానరులను, రామలక్ష్మణులను శీఘ్రముగా చంపగలడు. 18

మూ. ఏష కేతుః పరం సంఖ్యే ముఖ్యో వై సర్వరక్షసామ్, 19
కుమ్భకర్ణః సదా శేతే మూఢో గ్రామ్యసుఖే రతః.

ప్ర. అ. సర్వరక్షసామ్=సమస్తరాక్షసులలో, ముఖ్యః=ముఖ్యుడు, సంఖ్యే=యుద్ధమునందు, పరమ్=గొప్ప, కేతుః=ధ్వజమూ అయిన, ఏషః కుమ్భకర్ణః=ఈ కుంభకర్ణుడు, మూఢః=మూఢుడై, గ్రామ్యసుఖే=నీచమైన (నిద్రా) సుఖమునందు, రతః=ఆసక్తుడై, సదా=ఎల్లప్పుడూ, శేతే=శయనించుచున్నాడు.

తా. సమస్తరాక్షసులలో ముఖ్యుడు, యుద్ధములో ధ్వజమువంటివాడు అయిన ఈ కుంభకర్ణుడు నీచమైన నిద్రాసుఖమునందు ఆసక్తుడై, ఎల్లప్పుడూ ఒడలు తెలియకుండా నిద్రపోవుచున్నాడు. 19

మూ. రామేణాభినిరస్తస్య సంగ్రామేఽస్మిన్ సుదారుణే, 20
భవిష్యతి న మే శోకః కుమ్భకర్ణే విబోధితే.

ప్ర. అ. కుమ్భకర్ణే=కుంభకర్ణుడు, విబోధితే=లేపబడినవాడగుచుండగా, సుదారుణే=చాలభయంకరమైన, అస్మిన్=ఈ, సంగ్రామే=యుద్ధమునందు, రామేణ=రామునిచేత, అభినిరస్తస్య=ఓడింపబడిన, మే=నాకు, శోకః=దుఃఖము, న భవిష్యతి=కలుగదు.

తా. కుంభకర్ణుణ్ణి నిద్రనుండి లేపినచో, ఈ భయంకరమైన యుద్ధములో రాముని చేతిలో ఓడిపోయిన నా దుఃఖము తొలగిపోను. 20

మూ. కిం కరిష్యామ్యహం తేన శక్రతుల్యబలేన హి, 21
ఈదృశే వ్యసనే ఘోరే యో న సాహ్యాయ కల్పతే.

ప్ర. అ. యః=ఏ కుంభకర్ణుడు, ఈదృశే=ఇట్టి, ఘోరే=భయంకరమైన, వ్యసనే=ఆపదయందు, సాహాయ్యాయ=సాహాయ్యముచేయుటకు, న కల్పతే=సమర్థుడు కాడో, శక్రతుల్యబలేన=దేవేంద్రునితో సమానమైన బలము గల, తేన=అట్టివానితో, అహమ్=నేను, కిమ్=ఏమి, కరిష్యామి=చేయుదును ?

తా. దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల ఆ కుంభకర్ణుడు ఇట్టి భయంకరమైన ఆపదలో నాకు సాహాయ్యము చేయనప్పుడు వానివలన నాకేమి ప్రయోజనము ? 21

మూ. తే తు తద్వచనం శ్రుత్వా రాక్షసేన్ద్రస్య రాక్షసాః, 22
జగ్ముః పరమసంభ్రాన్తాః కుమ్భకర్ణనివేశనమ్.

ప్ర. అ. తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, పరమసంభ్రాన్తాః=మిక్కిలి తొందరపడుచున్నవారై, కుమ్భకర్ణనివేశనమ్=కుంభకర్ణుని గృహమును గూర్చి, జగ్ముః=వెళ్లిరి.

తా. ఆ రాక్షసులు రావణుని మాటలు విని చాల తొందరపడుచు కుంభకర్ణుని గృహమునకు వెళ్లిరి. 22

మూ. తాం ప్రవిశ్య మహాద్వారాం సర్వతో యోజనాయతామ్, 23
కుమ్భకర్ణగుహాం రమ్యాం పుష్పగన్ధప్రవాహినీమ్.
కుమ్భకర్ణస్య నిఃశ్వాసాదవధూతా మహాబలాః, 24
ప్రతిష్ఠమానాః కృచ్ఛ్రేణ యత్నాత్ప్రవివిశుర్గుహామ్.

ప్ర. అ. మహాద్వారామ్=పెద్ద ద్వారము గల, సర్వతః=అన్ని వైపులా, యోజనాయతామ్=యోజనము వైశాల్యము గల, పుష్పగన్ధప్రవాహినీమ్=పుష్పముల గంధమును వీచుచున్న, రమ్యామ్=సుందరమైన, కుమ్భకర్ణగుహామ్=కుంభకర్ణుని గుహను, ప్రవిశ్య=ప్రవేశించి, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, నిఃశ్వాసాత్=నిఃశ్వాసమువలన, అవధూతాః=కదల్పబడినవారై, మహాబలాః=గొప్ప బలము గల ఆ రాక్షసులు, కృచ్ఛ్రేణ=కష్టముతేత, ప్రతిష్ఠమానాః=నిలదొక్కుకొనుచు, యత్నాత్=ప్రయత్నమువలన, గుహామ్=గుహను, ప్రవివిశుః=ప్రవేశించిరి.

తా. గొప్ప బలము గల ఆ రాక్షసులు పెద్ద ద్వారము గలది, అన్ని వైపులా యోజనము వైశాల్యము గలది, పుష్పముల గంధమును వ్యాపింపచేయుచున్నది అయిన సుందరమైన కుంభకర్ణుని నివాసగుహ దగ్గరకు వెళ్లి కుంభకర్ణుని నిఃశ్వాసములు కదల్చివేయుచుండగా అతికష్టముమీద నిలద్రొక్కుకొని ఆ గుహలోనికి ప్రవేశించిరి. 23, 24

మూ. తాం ప్రవిశ్య గుహాం రమ్యాం రత్నకాఞ్చనకుట్టిమామ్, 25
దదృశుర్నైరృతవ్యాఘ్రాః శయానం భీమవిక్రమమ్.

ప్ర. అ. నైరృతవ్యాఘ్రాః=ఆ రాక్షసశ్రేష్ఠులు, రత్నకాఞ్చనకుట్టిమామ్=రత్నములతోను బంగారముతోను నిర్మించిన చపటా గల, రమ్యామ్=రమ్యమైన, తాం గుహామ్=ఆ గుహను, ప్రవిశ్య=ప్రవేశించి, శయానమ్=శయనించి యున్న, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గల అతనిని, దదృశుః=చూచిరి.

తా. ఆ రాక్షసవీరులు రత్నములతోను బంగారముతోను నిర్మించిన చపటాతో రమ్యమైన ఆ గుహలో ప్రవేశించి, అక్కడ నిద్రించుచున్న భయంకరమైన పరాక్రమము గల కుంభకర్ణుణ్ణి చూచిరి. 25

మూ. తే తు తం వికృతం సుప్తం వికీర్ణమివ పర్వతమ్, 26
కుమ్భకర్ణం మహానిద్రం సమేతాః ప్రత్యబోధయన్.

ప్ర. అ. తే=వాళ్ళు, సమేతాః=కలిసినవారై, వికృతమ్=వికారముగా, సుప్తమ్=నిద్రించుచున్నవాడు, వికీర్ణమ్=పడద్రోయబడిన, పర్వతమ్ ఇవ=పర్వతము వలె ఉన్నవాడు, మహానిద్రమ్=గొప్ప నిద్ర కలవాడు అయిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, ప్రత్యబోధయన్=మేల్కొలిపిరి.

తా. కుంభకర్ణుడు చూచే వారికి వికారముగా కనబడునట్లు నిద్రపోవుచుండెను. పడవేయబడిన పర్వతము వలె ఉండెను. ఈ విధముగా మహానిద్రలో ఉన్న కుంభకర్ణుణ్ణి ఆ రాక్షసులందరూ కలిసి ఒక్కుమ్మడిగా మేల్కొలుపుటకు ప్రయత్నించిరి. 26

మూ. ఊర్ధ్వలోమాఞ్చితతనుం శ్వసన్తమివ పన్నగమ్, 27
భ్రామయన్తం వినిఃశ్వాసైః శయానం భీమవిక్రమమ్,
భీమనాసాపుటం తం తు పాతాలవిపులాననమ్, 28
శయనే న్యస్తసర్వాఙ్గం మేదోరుధిరగన్ధినమ్,
కాఞ్చనాఙ్గదనద్ధాఙ్గం కిరీటేనార్కవర్చసమ్, 29
దదృశుర్నైరృతవ్యాఘ్రం కుమ్భకర్ణమరిన్దమమ్.

ప్ర. అ. ఊర్ధ్వలోమాఞ్చితతనుమ్=పైకి నిలబడిన రోమములతో కూడిన శరీరముకలవాడు, పన్నగమివ=సర్పము వలె, శ్వసన్తమ్=శ్వాస పీల్చుచున్నవాడు, వినిఃశ్వాసైః=శ్వాసలచేత, భ్రామయన్తమ్=(తమను) తిప్పి వేయుచున్నవాడు, శయానమ్=శయనించి ఉన్నవాడు, భీమవిక్రమమ్=భయంకరమైన పరాక్రమము గలవాడు, భీమనాసాపుటమ్=భయంకరములైన ముక్కురంధ్రములు గలవాడు, పాతాలవిపులాననమ్=పాతాళమువలె విశాలమైన ముఖముగలవాడు, శయనే=శ

భువమునందు, న్యస్తసర్వాఙ్గమ్=ఉంచబడిన సమస్తమైన అవయవములు గలవాడు, మేదోరుధిరగన్ధినమ్=కొవ్వుయొక్క, వసయొక్క వాసన కలవాడు, కాఞ్చనాఙ్గదనద్ధాఙ్గమ్=బంగారు బాహుపురులచే కట్టబడిన శరీరము కలవాడు, కిరీటేన=కిరీటముచేత, అర్కవర్చసమ్=సూర్యుని వంటి కాంతి గలవాడు, నైరృతవ్యాఘ్రమ్=రాక్షసశ్రేష్ఠుడు, అరిమర్దనమ్=శత్రుసంహారకుడు అయిన, తం కుమ్భకర్ణమ్=ఆ కుంభకర్ణుణ్ణి, దదృశుః=చూచిరి.

తా. కుంభకర్ణుని శరీరముపై ఉన్న రోమాలు పైకి నిలబడి ఉండెను. ఆతడు సర్పము వలె బుసలుకొట్టుచుండెను. శయనించి ఉన్న, భయంకరమైన పరాక్రమము గల ఆతడు విడచు శ్వాసల వేగమునకు ఆ రాక్షసులు ఎగిరి తిరిగి పోవుచుండిరి. భయంకరములైన ముక్కురంధ్రములతో, పాతాళమువంటి విశాలమైన నోటితో ఆతడు అన్ని అవయవాలు శయ్యమీద పడవేసి నిద్రించుచుండెను. ఆతని శరీరమునుండి కొవ్వు వాసన రక్తము వాసన వచ్చుచుండెను. బంగారు బాహుపురులు ఆతని శరీరముపై కట్టబడి ఉండెను. కిరీటముచేత సూర్యునివలె ప్రకాశించుచుండెను. అట్టి, రాక్షసశ్రేష్ఠుడు, శత్రుసంహారకుడూ అయిన కుంభకర్ణుణ్ణి చూచిరి. 27-29

మూ. తతశ్చక్రుర్మహాత్మానః కుమ్భకర్ణస్య చాగ్రతః, 30
భూతానాం మేరుసంకాశం రాశిం పరమతర్పణమ్.

ప్ర. అ. తతః=ఆటుపిమ్మట, మహాత్మానః=మహాత్ములైన ఆ రాక్షసులు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, అగ్రతః=ఎదుట, భూతానామ్=ప్రాణులయొక్క, మేరుసంకాశమ్=మేరుపర్వతముతో సమానమైన, పరమతర్పణమ్=మిక్కిలి తృప్తిని కలిగించు, రాశిమ్=రాశిని, చక్రుః=చేసిరి.

తా. పిమ్మట ఆ రాక్షసులు చాలా తృప్తిని కలిగించు మేరుపర్వతము వంటి (చంపిన) ప్రాణుల రాశిని కుంభకర్ణుని ఎదుట ఉంచిరి. 30

మూ. మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ సంచయాన్, 31
చక్రుర్నైరృతశార్దూలా రాశిమన్నస్య చాద్భుతమ్.

ప్ర. అ. నైరృతశార్దూలాః=రాక్షసశ్రేష్ఠులు, మృగాణామ్=మృగములయొక్క, మహిషాణాం చ=దున్నపోతులయొక్క, వరాహాణాం చ=వరాహములయొక్క, సంచయాన్=పోగులను, అన్నస్య=అన్నముయొక్క, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, రాశిం చ=రాశిని, చక్రుః=చేసిరి.

తా. ఆ రాక్షసశ్రేష్ఠులు లేళ్ళు, దున్నపోతులు, వరాహములు - వీటి ప్రోగులను, విచిత్రమైన అన్నరాశిని అక్కడ ఉంచిరి. 31

మూ. తతః శోణితకుమ్భాంశ్చ మాంసాని వివిధాని చ, 32
పురస్తాత్కుమ్భకర్ణస్య చక్రుస్త్రిదశశత్రవః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, త్రిదశశత్రవః=రాక్షసులు, శోణితకుమ్భాంశ్చ=రక్తపు కుండలను, వివిధాని=అనేకవిధములైన, మాంసాని=మాంసములను, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, పురస్తాత్=ఎదుట, చక్రుః=చేసిరి.

తా. ఆ రాక్షసులు రక్తము నింపిన కుంభములను, అనేకవిధములైన మాంసములను కుంభకర్ణుని ఎదుట ఉంచిరి. 32

మూ. లిలిపుశ్చ పరార్ధ్యేన చన్దనేన పరంతపమ్, 33
దివ్యైరాశ్వాసయామాసుర్మాల్యైర్గన్ధైశ్చ గన్ధిభిః.

ప్ర. అ. పరార్ధ్యేన=శ్రేష్ఠమైన, చన్దనేన=చందనముచేత, పరంతపమ్=శత్రువులను పీడించు ఆ కుంభకర్ణుణ్ణి, లిలిపుః=పూసిరి. దివ్యైః=శ్రేష్ఠములైన, గన్ధిభిః=ఉత్తమమైన సువాసన గల, మాల్యైః= పుష్పమాలలచేతను, గన్ధైః చ=సుగంధ ద్రవ్యములచేతను, ఆశ్వాసయామాసుః=వాసనచూపిరి.

తా. చాల శ్రేష్ఠమైన చందనము అతని శరీరమునకు పూసి శ్రేష్ఠములైన పుష్పమాలలు, మంచి సువాసన గల సుగంధద్రవ్యములు వాసన చూపిరి. 33

మూ. ధూపగన్ధాంశ్చ ససృజుస్తుష్టువుశ్చ పరంతపమ్, 34
జలదా ఇవ చానేదుర్యాతుధానాస్తతస్తతః.

ప్ర. అ. యాతుధానాః=రాక్షసులు, ధూపగన్ధాన్ చ=ధూపముల సువాసనలను కూడ, ససృజుః=సృష్టించిరి. పరంతపమ్=శత్రువులకు బాధ కలిగించు అతనిని, తుష్టువుశ్చ=స్తుతించిరి. తతస్తతః=మాటి మాటికి, జలదాః ఇవ=మేఘములు వలె, అనేదుః చ=ధ్వని చేసిరి.

తా. ఆ రాక్షసులు ధూపగంధములను ప్రసరింపజేసిరి. అతనిని స్తుతించిరి. మాటి మాటికి మేఘముల వలె గర్జించిరి. 34

మూ. శఙ్ఖాంశ్చ పూరయామాసుః శశాఙ్కసదృశప్రభాన్, 35
తుములం యుగపచ్చాపి వినేదుశ్చాప్యమర్షితాః.

ప్ర. అ. శశాఙ్కసదృశప్రభాన్=చంద్రునితో సమానమైన కాంతిగల, శఙ్ఖాన్ చ=శంఖములను కూడ, పూరయామాసుః=పూరించిరి. అమర్షితాః=కోపించినవారై, యుగపత్=ఒక్కమాటుగా, తుములమ్=వ్యాకులముగా, వినేదుః చాపి=ధ్వనిచేసిరి కూడ.

రా. 'చంద్రునివంటి కాంతి గల శంఖములను పూరించిరి. విసుగు చెంది ఒక్కమాటుగా బిగ్గరగా అరచిరి. 35

మూ. నేదురాస్ఫోటయామాసుశ్చిక్షిపుస్తే నిశాచరాః, 36
కుమ్భకర్ణవిబోధార్థం చక్రుస్తే విపులం స్వనమ్.

ప్ర. అ. తే నిశాచరాః=ఆ రాక్షసులు, నేదుః=ధ్వనిచేసిరి. ఆస్ఫోటయామాసుః=చేతులు మొదలైన వాటిమీద చరచిరి. చిక్షిపుః=అతని అవయవములను ఎత్తి పడవేసిరి. కుమ్భకర్ణవిబోధార్థమ్=కుంభకర్ణుణ్ణి లేపుటకై, విపులమ్=అధికమైన, స్వనమ్=ధ్వనిని, చక్రుః=చేసిరి.

రా. కుంభకర్ణుణ్ణి లేపుటకై ఆ రాక్షసులు అరచిరి. అతని శరీరముమీద చరచిరి. చేతులు మొదలైన అవయవాలు ఎత్తి పడవేసిరి. అత్యధికమైన ధ్వని చేసిరి. 36

మూ. సశఙ్ఖభేరీపణవప్రణాద
మాస్ఫోటితక్ష్వేలితసింహనాదమ్,
దిశో ద్రవన్తస్త్రిదివం కిరన్తః
శ్రుత్వా విహంగాః సహసా నిపేతుః. 37

ప్ర. అ. విహంగాః=పక్షులు, సశఙ్ఖభేరీపణవప్రణాదమ్=శంఖ-భేరీ పణవముల ధ్వనితో కూడిన, ఆస్ఫోటితక్ష్వేలితసింహనాదమ్=జబ్బలు చరిచిన ధ్వనిని, గర్జనమును, సింహనాదమును, శ్రుత్వా=విని, దిశః=దిక్కులను గూర్చి, ద్రవన్తః=పరుగెత్తుచున్నవై, త్రిదివమ్=ఆకాశమును, కిరన్తః=ప్రవేశించుచున్నవై, సహసా=వెంటనే, నిపేతుః=క్రింద పడిపోయినవి.

రా. పక్షులు శంఖ - భేరీ పణవముల ధ్వనిని, జబ్బలు చరచుట, గర్జించుట, సింహనాదము చేయుట - వీటి ధ్వని విని, పది దిక్కులకు పారిపోయి, ఆకాశములోనికి ఎగిరి, వెంటనే నేలమీద పడిపోయినవి. 37

మూ. యదా భృశం తైర్నినదైర్మహాత్మా
న కుమ్భకర్ణో బుబుధే ప్రసుప్తః,
తతో భుశుణ్డీముసలాని సర్వే
రక్షోగణాస్తం జగృహుర్గదాశ్చ. 38

ప్ర. అ. ప్రసుప్తః=నిద్రించుచున్న, మహాత్మా=మహాత్ముడైన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, భృశమ్=అధికముగా చేయబడిన, తైః=ఆ, నినదైః=ధ్వనులచేత, యదా=ఎప్పుడు, న బుబుధే=మేల్కొనలేదో, తతః=అటు పిమ్మట, సర్వే=సమస్త

మైన, రక్షోగణాః=రాక్షసగణములు, తమ్=అతనినిగూర్చి, ముద్గరాన్=ముద్గరములను, ముసలాని=ముసలములను, గదాశ్చ=గదలను, అగృహ్ణన్=గ్రహించిరి.

తా. నిద్రించుచున్న మహాత్ముడైన ఆ కుంభకర్ణుడు ఇంత అధికమైన ధ్వని చేసినను నిద్రనుండి లేవకపోవుటచే ఆ రాక్షసులందరు అతనిని కొట్టుటకై ముద్గరములను, ముసలములను, గదలను గ్రహించిరి. 38

మూ. తం శైలశృఙ్గైర్ముసలైర్గదాభి
ర్వక్షఃస్థలే ముద్గరముష్టిభిశ్చ,
సుఖప్రసుప్తం భువి కుమ్భకర్ణం
రక్షాంస్యుదగ్రాణి తదా నిజఘ్నుః. 39

ప్ర. అ. తదా=అప్పుడు, ఉదగ్రాణి=క్రూరులైన, రక్షాంసి=రాక్షసులు, భువి=నేలమీద, సుఖప్రసుప్తమ్=నిద్రించుచున్న, తం కుమ్భకర్ణమ్=ఆ కుంభకర్ణుని, శైలశృఙ్గైః=పర్వతశిఖరములచేతను, ముసలైః=ముసలములచేతను, గదాభిః=గదలచేతను, ముద్గరముష్టిభిః చ=ముద్గరములచేతను పిడికిళ్ళచేతను, నిజఘ్నుః=కొట్టిరి.

తా. అప్పుడు క్రూరులైన రాక్షసులు నేలమీద నిద్రించుచున్న ఆ కుంభకర్ణుని పర్వతశిఖరములతోను, ముసలములతోను, గదలతోను, ముద్గరములతోను, పిడికిళ్ళతోను వక్షఃస్థలముమీద కొట్టిరి. 39

మూ. తస్య నిఃశ్వాసవాతేన కుమ్భకర్ణస్య రక్షసః,
రాక్షసా బలవన్తోఽపి స్థాతుం శేకుర్న చాగ్రతః. 40

ప్ర. అ. రక్షసః=రాక్షసుడైన, తస్య కుమ్భకర్ణస్య=ఆ కుంభకర్ణునియొక్క, నిఃశ్వాసవాతేన=శ్వాసవాయువులచేత, బలవన్తోఽపి=బలముకలవారైనను, రాక్షసాః=రాక్షసులు, అగ్రతః=ఎదుట, స్థాతుమ్=నిలచుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. బలవంతులైనను ఆ రాక్షసులు కుంభకర్ణుని శ్వాసపు గాలికి వాని ఎదుట నిలబడజాలకపోయిరి. 40

మూ. తతః పరిహితా గాఢం రాక్షసా భీమవిక్రమాః,
మృదఙ్గపణవాన్ భేరీః శఙ్ఖకుమ్భగణాంస్తథా. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమముగల, రాక్షసాః=రాక్షసులు, గాఢమ్=గట్టిగా, పరిహితాః=నిలద్రొక్కుకొన్నవారై, మృదఙ్గపణవాన్=మృదంగములను పణవములను, భేరీః=భేరీలను, తథా=మరియు, శఙ్ఖకుమ్భగణాన్=శంఖములయొక్క కుంభములయొక్క సముదాయములను, (ప్రయోగించిరి).

తా. భయంకరమైన పరాక్రమము గల రాక్షసులు గట్టిగా నిట్టూర్చి మృదంగములను, పణవములను, భేరీలను, శంఖములను, కుంభములను ప్రయోగించిరి. 41

మూ. దశ రాక్షససాహస్రం యుగపత్పర్యవారయత్,
నీలాఞ్జనచయాకారం తే తు తం ప్రత్యబోధయన్, 42
అభిఘ్నన్తో నదన్తశ్చ న చ సంబుబుధే తదా.

ప్ర. అ. దశరాక్షససాహస్రమ్=రాక్షసుల పదివేలు, యుగపత్=ఒక్కమారుగా, పర్యవారయత్=చుట్టెను. తే తు=వారైతే, నీలాఞ్జనచయాకారమ్=నల్లని అంజనము వంటి ఆకారము గల, తమ్=అతనిని, అభిఘ్నన్తః=కొట్టుచు, నదన్తః చ=ధ్వనిచేయుచు, తమ్=అతనిని, ప్రత్యబోధయన్=మేల్కొలిపిరి. తదా=అప్పుడు, న చ సంబుబుధే=మేల్కొనలేదు.

తా. నల్లని కాటుక ప్రోగువంటి ఆకారము గల అతనిని పదివేలమంది రాక్షసులు ఒక్క మారుగా చుట్టుముట్టి మేల్కొలుపుటకై యత్నించిరి. కాని అతడు మేల్కొనలేదు. 42

మూ. యదా చైనం న శేకుస్తే ప్రతిబోధయితుం తదా, 43
తతో గురుతరం యత్నం దారుణం సముపాక్రమన్.

ప్ర. అ. తే=వారు, యదా=ఎప్పుడు, ఏనమ్=ఇతనిని, ప్రతిబోధయితుమ్= మేల్కొలుపుటకు, న శేకుః=సమర్థులు కాలేదో, తదా=అప్పుడు, తతః=అంతకంటె, గురుతరమ్=మిక్కిలి గొప్పదైన, దారుణమ్=భయంకరమైన, యత్నమ్=ప్రయత్నమును, సముపాక్రమన్=ప్రారంభించిరి.

తా. ఇంతచేసినా అతని మేల్కొలుపజాలకపోవుటచేత వాళ్ళు అంతకంటె అధికము, భయంకరము అయిన ప్రయత్నమును ప్రారంభించిరి. 43

మూ. అశ్వానుష్ట్రాన్ ఖరాన్నాగాన్ జఘ్నుర్దణ్డకశాఙ్కుశైః, 44
భేరీశఙ్ఖమృదఙ్గాంశ్చ సర్వప్రాణైరవాదయన్.

ప్ర. అ. అశ్వాన్=గుఱ్ఱములను, ఉష్ట్రాన్=ఒంటెలను, ఖరాన్=గాడిదలను, నాగాన్=ఏనుగులను, దణ్డకశాఙ్కుశైః=దండములచేత కొరడాలచేత అంకుశములచేత, అజఘ్నుః=కొట్టిరి. భేరీశఙ్ఖమృదఙ్గాన్ చ=భేరీలను, శంఖములను, మృదంగములను, సర్వప్రాణైః=సమస్తప్రాణములచేత, అవాదయన్=మ్రోగించిరి.

తా. గుఱ్ఱములను, ఒంటెలను, గాడిదలను, ఏనుగులను కఱ్ఱలతోను, కొరడాలతోను, అంకుశములతోను కొట్టి అతని శరీరముమీద నడిపించిరి. తమ ప్రాణబలము నంతా ఉపయోగించి భేరీశంఖమృదంగములను మ్రోగించిరి. 44

మూ. విజఘ్నుశ్చాస్య గాత్రాణి మహాకాష్ఠకటంకరైః, 45
ముద్గరైర్ముసలైశ్చాపి సర్వప్రాణసముద్యతైః.

ప్ర. అ. అస్య=ఇతనియొక్క, గాత్రాణి=అవయవములను, మహాకాష్ఠకటంకరైః=పెద్ద కఱ్ఱలతోను, స్తంభములతోను, సర్వప్రాణసముద్యతైః=సమస్తప్రాణబలముచేత ఎత్తబడిన, ముసలైశ్చాపి=ముసలములచేతను, విజఘ్నుః=కొట్టిరి.

తా. పెద్ద కఱ్ఱలతోను, స్తంభాలతోను, బలము నంతా ఉపయోగించి ఎత్తబడిన ముద్గరములతోను, ముసలములతోను ఇతని అన్ని అవయవముల మీదా కొట్టిరి. 45

మూ. తేన నాదేన మహతా లఙ్కా సమభిపూరితా, 46
సపర్వతవనా సర్వా సోఽపి నైవ ప్రబుధ్యతే.

ప్ర. అ. మహతా=గొప్పదైన, తేన నాదేన=ఆ ధ్వనిచేత, సపర్వతవనా=పర్వతములతోను, వనములతోను కూడిన, సర్వా=సమస్తమైన, లఙ్కా=లంక, సమభిపూరితా=నింపబడినది. సః అపి=అతడు మాత్రము, నైవ ప్రబుధ్యతే=మేల్కొనలేదు.

తా. పర్వతములతోను, వనములతోను కూడిన లంకాపట్టణమంతా ఆ ధ్వనితో మార్మ్రోగుచుండెను. కాని ఆతడు మాత్రము మేల్కొనలేదు. 46

మూ. తతః సహస్రం భేరీణాం యుగపత్సమహన్యత, 47
మృష్టకాఞ్చనకోణానా మాసక్తానాం సమన్తతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మృష్టకాఞ్చనకోణానామ్=పరిశుద్ధమైన బంగారు దండములు గల, సమన్తతః=అంతటా, ఆసక్తానామ్=నింపబడిన, భేరీణామ్=భేరీలయొక్క, సహస్రమ్=సహస్రము, సమహన్యత=కొట్టబడెను.

తా. పిమ్మట అన్ని వైపులా వేయి భేరీలను అమర్చి, పరిశుద్ధమైన బంగారు దండములతో ఒక్కమారు వాటిని మ్రోగించిరి. 47

మూ. ఏవమప్యతినిద్రస్తు యదా నైవ ప్రబుధ్యత, 48
శాపస్య వశమాపన్నస్తతః క్రుద్ధా నిశాచరాః.

ప్ర. అ. ఏవమపి=ఇట్లైనను, శాపస్య=శాపముయొక్క, వశమ్=వశమును, ఆపన్నః=పొందిన, అతినిద్రః=అధికమైన నిద్రగల అతడు, యదా=ఎప్పుడు, నైవ ప్రబుధ్యత=లేవలేదో, తతః=అటుపిమ్మట, నిశాచరాః=రాక్షసులు, క్రుద్ధాః=కోపించిరి.

తా. ఇంత చేసినా కూడ శాపమునకు వశుడై మహానిద్రలో ఉన్న ఆ

కుంభకర్ణుడు మేల్కొనకపోవుటచేత ఆ రాక్షసులకు కోపము కలిగెను. 48

మూ. మహాక్రోధసమావిష్టాః సర్వే భీమపరాక్రమాః, 49
తద్రక్షో బోధయిష్యన్తశ్చక్రురన్యే పరాక్రమమ్.

ప్ర. అ. భీమపరాక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, సర్వే=ఆ రాక్షసు లందరూ, మహాక్రోధసమావిష్టాః=గొప్ప క్రోధముతో నిండినవారు అయిరి. అన్యే=కొందరు, తత్=ఆ, రక్షః=రాక్షసుణ్ణి, బోధయిష్యన్తః=మేల్కొల్పనున్నవారై, పరాక్రమమ్=పరాక్రమమును, చక్రుః=చేసిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల ఆ రాక్షసు లందరికీ చాల క్రోధము కలిగెను. కొందరు ఆ కుంభకర్ణుని మేల్కొలుపుటకై తమ బలము నంతా చూపిరి. 49

మూ. అన్యే భేరీః సమాజఘ్నురన్యే చక్రుర్మహాస్వనమ్, 50
కేశానన్యే ప్రలులుపుః కర్ణావన్యే దశన్తి చ.

ప్ర. అ. అన్యే=మరికొందరు, భేరీః=భేరీలను, సమాజఘ్నుః=మ్రోగించిరి. అన్యే=మరికొందరు, మహాస్వనమ్=గొప్పధ్వనిని, చక్రుః=చేసిరి. అన్యే=కొందరు, కేశాన్=కేశములను, ప్రలులుపుః=పీకిరి. అన్యే=కొందరు, కర్ణౌ=చెవులను, దశన్తి చ=కొరికిరి.

తా. కొందరు భేరీలు మ్రోగించిరి. కొందరు అధికముగా ధ్వని చేసిరి. కొందరు అతని జుట్టు పీకిరి. మరికొందరు చెవులు కొరికిరి. 50

మూ. ఉదకుమ్భశతాన్యన్యే సమసిఞ్చన్త కర్ణయోః, 51
న కుమ్భకర్ణః పస్పన్దే మహానిద్రావశం గతః.

ప్ర. అ. అన్యే=మరికొందరు, ఉదకుమ్భశతాని=నీటితో నిండిన వందలకొలది కుంభములను, కర్ణయోః=చెవులలో, సమసిఞ్చన్త=నింపిరి. మహానిద్రావశంగతః=గొప్ప నిద్రకు వశుడైన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, న పస్పన్దే=కదలలేదు.

తా. కొందరు వందలకొలది నీళ్ల కుండలను అతని చెవులలో వంచిరి. మహానిద్రకు వశుడై యున్న కుంభకర్ణుడు కొంచెము కూడ కదలలేదు. 51

మూ. అన్యే చ బలినస్తస్య కూటముద్గరపాణయః, 52
మూర్ధ్ని వక్షసి గాత్రేషు పాతయన్ కూటముద్గరాన్.

ప్ర. అ. కూటముద్గరపాణయః=కూటములు, ముద్గరములు హస్తము లందు గల, అన్యే=మరికొందరు, బలినః=బలవంతులు, తస్య=వానియొక్క,

మూర్ధ్ని=శిరస్సునందు, వక్షసి=వక్షస్థలముమీద, గాత్రేషు=అవయవములయందు కూటముద్గరాన్=కూటములను ముద్గరములను, పాతయన్=పడవేసిరి.

తా. కూటములు, ముద్గరములు చేతులలో ధరించిన ఉన్న మరికొందరు బలశాలులైన రాక్షసులు అతని శిరస్సుపైన, వక్షస్థలముమీద, అవయవములమీద కూటములను ముద్గరములను పడవేసిరి. 52

మూ. రజ్జుబన్ధనబద్ధాభిః శతఘ్నీభిశ్చ సర్వశః, 53
వధ్యమానో మహాకాయో న ప్రాబుధ్యత రాక్షసః.

ప్ర. అ. రజ్జుబన్ధనబద్ధాభిః=త్రాళ్లయొక్క బంధనములచేత కట్టబడిన, శతఘ్నీభిః=శతఘ్నులచేత, సర్వశః=అంతటా, వధ్యమానః=కొట్టబడుచున్న, మహాకాయః=గొప్పదేహము గల, రాక్షసః=రాక్షసుడు, న ప్రాబుధ్యత=మేల్కొనలేదు.

తా. త్రాళ్లచేత కట్టబడిన శతఘ్నులతో అన్ని వైపులా కొట్టినా కూడ ఆ కుంభకర్ణునకు మెలకువ రాలేదు. 53

మూ. వారణానాం సహస్రం చ శరీరేఽస్య ప్రధావితమ్, 54
కుమ్భకర్ణస్తదా బుద్ధ్వా స్పర్శం పరమబుధ్యత.

ప్ర. అ. వారణానామ్=ఏనుగులయొక్క, సహస్రమ్=సహస్రము, అస్య=ఈ నియొక్క, శరీరే=శరీరముమీద, ప్రధావితమ్=పరుగెత్తించబడినది. తదా=అప్పుడు, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, బుద్ధ్వా=మేల్కొని, స్పర్శం పరమ్=స్పర్శను మాత్రమే, అబుధ్యత=తెలిసికొనెను.

తా. అతని శరీరము మీద వేయి ఏనుగులను పరుగెత్తించిరి. అప్పుడు కుంభకర్ణునకు కొంచెము మెలకువ వచ్చి స్పర్శమాత్రమే తెలిసెను. 54

మూ. స పాత్యమానైర్గిరిశృఙ్గవృక్షై
రచిన్తయంస్తాన్విపులాన్ ప్రహారాన్,
నిద్రాక్షయాత్ క్షుద్భయపీడితశ్చ
విజృమ్భమాణః సహసోత్పపాత. 55

ప్ర. అ. సః=అతడు, పాత్యమానైః=పడవేయబడుచున్న, గిరిశృఙ్గవృక్షైః=పర్వతశిఖరములచేతను వృక్షములచేతను, తాన్=ఆ, విపులాన్=అధికమైన, ప్రహారాన్=దెబ్బలను, అచిన్తయన్=లెక్కచేయనివాడై, నిద్రాక్షయాత్=నిద్ర క్షీణించుటవలన, క్షుద్భయపీడితశ్చ=ఆకలిచేతను భయముచేతను పీడితుడై, విజృమ్భమాణః=ఆవలించుచు, సహసా=వెంటనే, ఉత్పపాత=లేచెను.

తా. ఆ కుంభకర్ణుడు తన మీద పర్వతశిఖరములను, వృక్షములను పడవేయుటవలన తగిలిన ఆ పెద్ద దెబ్బలకు లెక్కచేయక, ఆకలిచేతను, అకాలములో లేపినందుకు భయముచేతను పీడితుడై ఆవులించుచు వెంటనే లేచెను. 55

మూ. స నాగభోగాచలశృఙ్గకల్పౌ
విక్షిప్య బాహూ జితవజ్రసారౌ,
వివృత్య వక్త్రం వడవాముఖాభం
నిశాచరోఽసౌ వికృతం జజృమ్భే. 56

ప్ర. అ. సః=అట్టి, అసౌ=ఈ, నిశాచరః=రాక్షసుడు, నాగభోగాచలశృఙ్గకల్పౌ=సర్పశరీరములతోను పర్వతశిఖరములతోను సమానములైన, జితవజ్రసారౌ=జయింపబడిన వజ్రాయుధసారము గల, బాహూ=బాహువులను, విక్షిప్య=పైకి ఎత్తి, వడవాముఖాభమ్=(సముద్రమధ్యమునందుండు అగ్నిజ్వాలలు చిమ్ము) ఆడ గుఱ్ఱము ముఖము వంటి, వక్త్రమ్=ముఖమును, వికృతమ్=వికారముగా, జజృమ్భే=ఆవులించెను.

తా. కుంభకర్ణుడు సర్పదేహముతోను, పర్వతశిఖరములతోను సమానములైన వజ్రాయుధసారమును జయించిన రెండు బాహువులను ఎత్తి, బడబాముఖము వంటి నోరు తెరచి, వికృతముగా ఆవులించెను. 56

మూ. తస్య జాజృమ్భమాణస్య వక్త్రం పాతాలసంనిభమ్,
దదృశే మేరుశృఙ్గాగ్రే దివాకర ఇవోదితః. 57

ప్ర. అ. జాజృమ్భమాణస్య=పెద్దగా ఆవులించుచున్న, తస్య=అతనియొక్క, పాతాలసంనిభమ్=పాతాలముతో సమానమైన, వక్త్రమ్=ముఖము, మేరుశృఙ్గాగ్రే=మేరుపర్వతశిఖరాగ్రమునందు, ఉదితః=ఉదయించిన, దివాకరః ఇవ=సూర్యునివలె, దదృశే=చూడబడెను.

తా. పెద్దగా ఆవులించుచున్న అతని పాతాలమువంటి ముఖము మేరుపర్వతశిఖరాగ్రమునందు ఉదయించిన సూర్యుడు వలె కనబడెను. 57

మూ. స జృమ్భమాణోఽతిబలః ప్రబుద్ధస్తు నిశాచరః,
నిఃశ్వాసశ్చాస్య సంజజ్ఞే పర్వతాదివ మారుతః. 58

ప్ర. అ. అతిబలః=గొప్ప బలము గల, సః నిశాచరః=ఆ రాక్షసుడు, జృమ్భమాణః=ఆవులించుచు, ప్రబుద్ధః=లేచినాడు. పర్వతాత్=పర్వతమునుండి, మారుతః ఇవ=గాలి వలె, అస్య=ఈతనియొక్క, నిశ్వాసః=శ్వాస, సంజజ్ఞే=పుట్టెను.

తా. గొప్ప బలము గల ఆ రాక్షసుడు ఆవులించుచు లేచెను. ఆ

సమయమున ఆతని శ్వాస కొండగాలి వలె వ్యాపించెను. 58

మూ. రూపముత్తిష్ఠతస్తస్య కుమ్భకర్ణస్య తద్ బభౌ,
యుగాన్తే సర్వభూతాని కాలస్యేవ దిధక్షతః. 59

ప్ర. అ. ఉత్తిష్ఠతః=లేచుచున్న, తస్య=ఆ, కుమ్భకర్ణస్య=కుంభకర్ణుని యొక్క, తత్ రూపమ్=ఆ ఆకారము, యుగాన్తే=ప్రలయకాలాంతమునందు, సర్వభూతాని=సకలభూతములను, దిధక్షతః=కాల్చదలచుచున్న, కాలస్యేవ=యముని ఆకారము వలె, బభౌ=ప్రకాశించెను.

తా. పైకి లేచుచున్న ఆ కుంభకర్ణుని ఆకారము ప్రలయకాలమునందు సకల భూతాంను కాల్చదలచుచున్న యముని ఆకారమువలె తుండెను. 59

మూ. తస్యాగ్నిదీప్తిసదృశే విద్యుత్సదృశవర్చసీ,
దదృశాతే మహానేత్రే దీప్తావివ మహాగ్రహౌ. 60

ప్ర. అ. అగ్నిదీప్తిసదృశే=అగ్నికాంతి (జ్వాల)తో సమానములైన, విద్యుత్స దృశవర్చసీ=మెరుపుతో సమానమైన కాంతి గల, తస్య మహానేత్రే=ఆతని పెద్ద నేత్రములు, దీప్తౌ=ప్రజ్వరించుచున్న, మహాగ్రహౌ ఇవ=పెద్ద గ్రహములు వలె, దదృశాతే=చూడబడినవి.

తా. అగ్నిజ్వాలవలె ఉన్న, మెరుపువంటి కాంతి గల ఆతని పెద్ద నేత్రములు ప్రజ్వరించుచున్న మహాగ్రహముల వలె కనబడుచుండెను. 60

మూ. తతస్త్వదర్శయన్ సర్వాన్ భక్ష్యాంశ్చ వివిధాన్ బహూన్,
వరాహాన్ మహిషాంశ్చైవ బభక్ష స మహాబలః. 61

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వివిధాన్=అనేకవిధములైన, బహూన్=అనేక ములైన, సర్వాన్=సమస్తమైన, భక్ష్యాన్ చ=భక్ష్యములను, వరాహాన్=వరాహములను, మహిషాంశ్చైవ=అడవిదున్నలను, అదర్శయన్=చూపిరి. మహాబలః=గొప్ప బలము గల, సః=ఆతడు, బభక్ష=భక్షించెను.

తా. పిమ్మట అనేకవిధములైన చాలా భక్ష్యపదార్థములను, వరాహములను, దున్నపోతులను చూపగా ఆతడు వాటిని భక్షించెను. 61

మూ. అదద్బుభుక్షితో మాంసం శోణితం తృషితోఽపిబత్,
మేదఃకుమ్భాంశ్చ మద్యాంశ్చ పపౌ శక్రరిపుస్తదా. 62

ప్ర. అ. తదా=అప్పుడు, బుభుక్షితః=ఆకలిగొన్న, శక్రరిపుః=ఇంద్రుని శత్రువైన కుంభకర్ణుడు, మాంసమ్=మాంసమును, అదత్=తినెను. తృషితః=దప్పిగొన్నవాడై, శోణితమ్=రక్తమును, అపిబత్=త్రాగెను. మేదఃకుమ్భాంశ్చ=కొవ్వుయొక్క

కుంభములను, మద్యాంశ్చ=మద్యములను, పపౌ=త్రాగెను.

తా. అప్పుడు కుంభకర్ణుడు ఆకలిదప్పికలతో ఉండుటచే మాంసమును తినెను. రక్తమును, కొవ్వుకుండలను, మద్యములను త్రాగెను. 62

మూ. తతస్తృప్త ఇతి జ్ఞాత్వా సముత్పేతుర్నిశాచరాః,
శిరోభిశ్చ ప్రణమ్యైనం సర్వతః పర్యవారయన్. 63

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నిశాచరాః=రాక్షసులు, తృప్తః ఇతి=తృప్తి చెందినాడు అని, జ్ఞాత్వా= తెలుసుకొని, సముత్పేతుః=శీఘ్రముగా దుమికి వచ్చిరి. ఏనమ్=ఈతనిని, శిరోభిః=శిరస్సులచేత, ప్రణమ్య=నమస్కరించి, సర్వతః=అన్ని వైపులా, పర్యవారయన్=చుట్టిరి.

తా. ఇతడు తృప్తి చెందినాడు అని తెలిసికొనిన వెంటనే రాక్షసులు శీఘ్రముగా వచ్చి, తలలు వంచి నమస్కారము చేసి, అతని చుట్టూ నిలిచిరి.

మూ. నిద్రావిశదనేత్రస్తు కలుషీకృతలోచనః,
చారయన్ సర్వతో దృష్టిం తానువాచ నిశాచరాన్. 64

ప్ర. అ. నిద్రావిశదనేత్రః=నిద్రచేత పూర్తిగా తెరవబడని నేత్రములుగలవాడై, కలుషీకృతలోచనః=కలుషములుగా చేయబడిన నేత్రములు గల కుంభకర్ణుడు, సర్వతః=అన్నివైపులా, దృష్టిమ్=దృష్టిని, చారయన్=ప్రసరింపచేయుచు, తాన్=ఆ, నిశాచరాన్=రాక్షసులను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. నిద్రచేత కుంభకర్ణుని కండ్లు మూతలు పడుచుండెను. కలుషములై ఉండెను. అట్టి కుంభకర్ణుడు నలువైపులా దృష్టిని ప్రసరింపచేసి చూచుచు రాక్షసులతో ఇట్లనెను. 64

మూ. స సర్వాన్ సాన్త్వయామాస నైరృతాన్ నైరృతర్షభః,
బోధనాద్విస్మితశ్చాపి రాక్షసానిదమబ్రవీత్. 65

ప్ర. అ. సః=ఆ, నైరృతర్షభః=రాక్షసశ్రేష్ఠుడు, సర్వాన్=సమస్తమైన, నైరృతాన్=రాక్షసులను, సాన్త్వయామాస=ఓదార్చెను. బోధనాత్=లేపుటవలన, విస్మితశ్చాపి=ఆశ్చర్యపడుచు, రాక్షసాన్=ఆ రాక్షసులను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. రాక్షసులలో శ్రేష్ఠుడైన కుంభకర్ణుడు ఆ రాక్షసులకు అందరికీ ధైర్యము చెప్పుచు, తనను లేపినందుకు ఆశ్చర్యపడుచు వారితో ఇట్లనెను. 65

మూ. కిమర్థమహమాదృత్య భవద్భిః ప్రతిబోధితః,
కచ్చిత్సుకుశలం రాజ్ఞో భయం వా నేహ కించన. 66

ప్ర. అ. అహమ్=నేను, భవద్భిః=మీచేత, ఆదృత్య=ఆదరించి, కిమర్థమ్=ఎందుకు, ప్రతిబోధితః=లేపబడితిని ? రాజ్ఞః=రాజునకు, సుకుశలం కచ్చిత్=క్షేమమే కదా ! ఇహ=ఇక్కడ, కించన=ఏదీ, భయమ్=భయము, న=లేదు కదా !

తా. నన్ను మీరు ప్రయత్నపూర్వకముగా ఎందుకు మేల్కొలిపినారు ? రాజు క్షేమముగా ఉన్నాడు కదా ! ఇపుడు భయ మేమీ లేదు కదా ! 66

మూ. అథవా ధ్రువమన్యేభ్యో భయం పరముపస్థితమ్,
యదర్థమేవ త్వరితైర్భవద్భిః ప్రతిబోధితః. 67

ప్ర. అ. అథవా=లేదా, అన్యేభ్యః=ఇతరులవలన, పరమ్=అధికమైన, భయమ్=భయము, ఉపస్థితమ్=వచ్చినది; ధ్రువమ్=నిశ్చయము. యదర్థమేవ=ఎందునిమిత్తమే, త్వరితైః=తొందరపడుచున్న, భవద్భిః=మీచేత, ప్రతిబోధితః=లేపబడితినో.

తా. లేదా శత్రువులవల్ల ఏదో గొప్ప భయము వచ్చి ఉండును ? నిశ్చయము. అందుచేతనే మీరు తొందరపడుచు నన్ను నిద్రనుండి లేపినారు.

మూ. అద్య రాక్షసరాజస్య భయముత్పాటయామ్యహమ్,
దారయిష్యే మహేన్ద్రం వా శీతయిష్యే తథానలమ్. 68

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అహమ్=నేను, రాక్షసరాజస్య=రాక్షసరాజుయొక్క, భయమ్=భయమును, ఉత్పాటయామి=పెకిలించివేసెదను. మహేన్ద్రమ్=మహేంద్రుణ్ణి, దారయిష్యే=చీల్చివేయుదునా, తథా=మరియు, అనలమ్=అగ్నిని, శీతయిష్యే=చల్లగా చేయుదునా ?

తా. ఇపుడు రాక్షసరాజైన రావణునికి కలిగిన భయమును తొలగించెదను. మహేంద్రుణ్ణి చీల్చివేయవలెనా లేదా అగ్ని చల్లగా ఉండునట్లు చేయవలెనా ?

మూ. న హ్యల్పకారణే సుప్తం బోధయిష్యతి మాదృశమ్,
తదాఖ్యాతార్థతత్త్వేన మత్ప్రబోధనకారణమ్. 69

ప్ర. అ. సుప్తమ్=నిద్రించిన, మాదృశమ్=నావంటివానిని, అల్పకారణే=అల్పమైన కారణమునందు, న బోధయిష్యతి హి=మేల్కొల్పరు కదా ? తత్=ఆ కారణమువలన, మత్ప్రబోధనకారణమ్=నన్ను లేపుటకు కారణమును, అర్థతత్త్వేన=కార్యముయొక్క సత్యమైన స్థితిచేత, ఆఖ్యాత=చెప్పండి.

తా. ఎంతో పెద్ద కారణ మున్ననే కాని నావంటివానిని నిద్రనుండి లేపరు. అందుచేత నన్ను లేపుటకు కారణ మేమో యథార్థముగా చెప్పుడు. 69

మూ. ఏవం బ్రువాణం సంరబ్ధం కుమ్భకర్ణమరిందమమ్,
యూపాక్షః సచివో రాజ్ఞః కృతాఞ్జలిరభాషత. 70

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, సంరబ్ధమ్=తొందర పడుచున్న, అరిందమమ్=శత్రుసంహారకుడైన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణునిగూర్చి, రాజ్ఞః=రాజుయొక్క, సచివః=మంత్రియైన, యూపాక్షః=యూపాక్షుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, అభాషత=పలికెను.

తా. చాల ఆతురతతో ఈ విధముగా మాటలాడుచున్న శత్రుసంహారకుడైన కుంభకర్ణునితో రావణుని మంత్రియైన యూపాక్షుడు, అంజలి ఘటించి నమస్కరించుచు ఇట్లు పలికెను. 70

మూ. న నో దేవకృతం కించిద్భయమస్తి కదాచన,
మానుషాన్నో భయం రాజంస్తుములం సంప్రబాధతే. 71

ప్ర. అ. రాజన్=రాజా ! నః=మాకు, కదాచన=ఎన్నడూ, దేవకృతమ్=దేవతలచేత చేయబడిన, భయమ్=భయము, కిం చిత్=ఏమీ, నాస్తి=లేదు. మానుషాత్=మనుష్యునినుండి, తుములమ్=వ్యాకులమైన (వ్యాకులత్వమును కలిగించు), భయమ్=భయము, సంప్రబాధతే=బాధించుచున్నది.

తా. రాజా ! మా కెన్నడూ దేవతలవలన భయ మేమాత్రమూ లేదు. మనుష్యునివలన కలిగిన గొప్ప భయము మమ్ములను బాధించుచున్నది. 71

మూ. న దైత్యదానవేభ్యో వా భయమస్తి హి తాదృశమ్,
యాదృశం మానుషం రాజన్ భయమస్మానుపస్థితమ్. 72

ప్ర. అ. రాజన్=రాజా ! మానుషమ్=మనుష్యసంబంధమైన, యాదృశమ్=ఎట్టి, భయమ్=భయము, అస్మాన్=మమ్ములను, ఉపస్థితమ్=వచ్చి చేరినదో, తాదృశమ్=అట్టి, భయమ్=భయము, దైత్యదానవేభ్యో వా=దైత్యులనుండి గాని దానవులనుండి గాని, నాస్తి హి=లేదు కదా ?

తా. మాకు మనుష్యునివలన ఎంత భయము వచ్చిపడినదో అంత భయము దైత్యులనుండి గాని, దానవులనుండి గాని లేదు. 72

మూ. వానరైః పర్వతాకారైర్లఙ్కేయం పరివారితా,
సీతాహరణసంతప్తాద్రామాన్నస్తుములం భయమ్. 73

ప్ర. అ. ఇయం లఙ్కా=ఈ లంక, పర్వతాకారైః=పర్వతములవంటి ఆకారములు గల, వానరైః=వానరులచేత, పరివారితా=చుట్టుముట్టబడినది. సీతాహరణసంతప్తాత్=సీతయొక్క హరణమువలన దుఃఖించుచున్న, రామాత్

రామునినుండి, నః=మాకు, తుములమ్=అధికమైన, భయమ్=భయము ఏర్పడినది.

తా. పర్వతములవంటి ఆకారములు గల వానరులు ఈ లంకను చుట్టుముట్టి ఉన్నారు. సీతను హరించుటవలన దుఃఖితుడైన రామునినుండి మాకు గొప్ప భయము వచ్చినది. 73

మూ. ఏకేన వానరేణేయం పూర్వం దగ్ధా మహాపురీ,
కుమారో నిహతశ్చాక్షః సానుయాత్రః సకుఞ్జరః. 74

ప్ర. అ. ఏకేన=ఒక్క, వానరేణ=వానరునిచేత, పూర్వమ్=పూర్వము, ఇయమ్=ఈ, మహాపురీ=గొప్ప నగరము, దగ్ధా=కాల్చబడినది. సానుయాత్రః= అనుచరులతో కూడిన, సకుఞ్జరః=ఏనుగులతో కూడిన, కుమారః అక్షః చ= అక్షకుమారుడు కూడ, నిహతః=చంపబడినాడు.

తా. పూర్వము ఒక్క వానరుడు వచ్చి లంకామహానగరమును కాల్చివేసి పరివారముతోను, ఏనుగులతోను సహా అక్షకుమారుణ్ణి చంపివేసినాడు. 74

మూ. స్వయం రక్షోఽధిపశ్చాపి పౌలస్త్యో దేవకణ్టకః,
వ్రజేతి సంయుగే ముక్తో రామేణాదిత్యవర్చసా. 75

ప్ర. అ. రక్షోఽధిపః=రాక్షసాధిపతియైన, దేవకణ్టకః=దేవతలకు ముల్లువంటి వాడైన, స్వయమ్=స్వయముగా, పౌలస్త్యః అపి=రావణుడు కూడ, సంయుగే= యుద్ధమునందు, ఆదిత్యవర్చసా=సూర్యునివంటి కాంతి గల, రామేణ=రామునిచేత, వ్రజ ఇతి=వెళ్లుము అని పలికి, ముక్తః=విడవబడినాడు.

తా. దేవతలకు కంటకమువంటివాడు, రాక్షసరాజు అయిన సాక్షాత్తు రావణుణ్ణి కూడ సూర్యునివంటి తేజస్సు గల రాముడు యుద్ధములో ఓడించి "వెళ్లుము" అని పలికి విడచినాడు. 75

మూ. యన్న దేవైః కృతో రాజా నాపి దైత్యైర్న దానవైః,
కృతః స ఇహ రామేణ విముక్తః ప్రాణసంశయాత్. 76

ప్ర. అ. సః రాజా=ఆ రాజు, దేవైః=దేవతలచేత, యత్=ఏది, న కృతః= చేయబడలేదో, దైత్యైః=దైత్యులచేత, న=చేయబడలేదో, దానవైః=దానవులచేత, న = చేయబడలేదో, దానిని, ఇహ=ఇక్కడ, రామేణ=రామునిచేత, కృతః=చే యబడినవాడై (పొందింపబడినవాడై), ప్రాణసంశయాత్=ప్రాణసంశయమునుండి, విముక్తః=విడువబడినాడు.

తా. మన రాజునకు దేవతలు గాని, దైత్యులు గాని, దానవులు గాని ఎట్టి స్థితిని కలిగింప లేకపోయినారో అట్టి స్థితిని కల్పించి రాముడు ఆతనిని

ప్రాణసంశయస్థితి నుండి విడచినాడు. 76

మూ. స యూపాక్షవచః శ్రుత్వా భ్రాతుర్యుధి పరాభవమ్,
కుమ్భకర్ణో వివృత్తాక్షో యూపాక్షమిదమబ్రవీత్. 77

ప్ర. అ. సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, యూపాక్షవచః=యూపాక్షుని వచనమును, యుధి=యుద్ధమునందు, భ్రాతుః=సోదరునియొక్క, పరాభవమ్=పరాభవమును, శ్రుత్వా=విని, వివృత్తాక్షః=త్రిప్పబడిన నేత్రములు కలవాడై, యూపాక్షమ్=యూపాక్షుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ కుంభకర్ణుడు యూపాక్షుని మాటల ద్వారా యుద్ధములో సోదరునికి జరిగిన పరాభవమును గూర్చి విని కోపముతో కళ్లు త్రిప్పుచు యూపాక్షునితో ఇట్లనెను. 77

మూ. సర్వమద్యైవ యూపాక్ష హరిసైన్యం సలక్ష్మణమ్,
రాఘవం చ రణే జిత్వా తతో ద్రక్ష్యామి రావణమ్. 78

ప్ర. అ. యూపాక్ష=యూపాక్షుడా! అద్యైవ=ఇప్పుడే, సర్వమ్=సమస్తమైన, హరిసైన్యమ్=వానరసైన్యమును, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రాఘవం చ=రాముణ్ణి, రణే=యుద్ధమునందు, జిత్వా=జయించి, తతః=అటుపిమ్మట, రావణమ్=రావణుణ్ణి, ద్రక్ష్యామి=చూడగలను.

తా. యూపాక్షుడా! ఇప్పుడే నేను వానరసైన్యము నంతనూ, రామలక్ష్మణులనూ యుద్ధములో జయించి పిమ్మట రావణుని చూచెదను.

మూ. రాక్షసాంస్తర్పయిష్యామి హరీణాం మాంసశోణితైః,
రామలక్ష్మణయోశ్చాపి స్వయం పాస్యామి శోణితమ్. 79

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, మాంసశోణితైః=మాంసముచేతా రక్తముచేత, రాక్షసాన్=రాక్షసులను, తర్పయిష్యామి=తృప్తి చెందించెదను. రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, శోణితమ్=రక్తమును, స్వయమ్=స్వయముగా, పాస్యామి=త్రాగెదను.

తా. వానరుల రక్తమాంసములచేత రాక్షసులకు తృప్తి కలిగించి రామలక్ష్మణుల రక్తమును నేనే త్రాగెదను. 79

మూ. తత్తస్య వాక్యం బ్రువతో నిశమ్య
సగర్జితం రోషవివృద్ధదోషమ్,
మహోదరో నైరృతయోధముఖ్యః
కృతాఞ్జలిర్వాక్యమిదం బభాషే. 80

ప్ర. అ. బ్రువతః=ఇట్లు పలుకుచున్న, తస్య=అతనియొక్క, గర్వితమ్=గర్వముతో కూడినది, రోషవివృద్ధరోషమ్=రోషముచేత వృద్ధి చెందిన రోషము కలది అయిన, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, నిశమ్య=విని, నైర్ఋతయోధముఖ్యః=రాక్షసయోధులలో ముఖ్యుడైన, సః=ఆ, మహోదరః=మహోదరుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలవాడై, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, బభాషే=పలికెను.

తా. గర్వముతో కూడినది, రోషముచేత అధికమైన రోషము కలది అయిన ఆ కుంభకర్ణుని వాక్యమును విని రాక్షసయోధులలో ముఖ్యుడైన మహోదరుడు చేతులు జోడించి నమస్కరించుచు ఇట్లు పలికెను. 80

మూ. రావణస్య వచః శ్రుత్వా గుణదోషౌ విమృశ్య చ,
పశ్చాదపి మహాబాహో శత్రూన్యుధి విజేష్యసి. 81

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! రావణస్య=రావణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, గుణదోషౌ=గుణదోషములను, విమృశ్య చ=విమర్శించి, పశ్చాత్ అపి=తరువాతనైనా, యుధి=యుద్ధమునందు, శత్రూన్=శత్రువులను, విజేష్యసి=జయింపగలవు.

తా. గొప్ప బాహువులు గలవాడా ! రావణుడు ఏమి చెప్పునో విని, గుణదోషముల విమర్శ చేసి, పిమ్మట యుద్ధములో శత్రువులను జయింపుము.

మూ. మహోదరవచః శ్రుత్వా రాక్షసైః పరివారితః,
కుమ్భకర్ణో మహాతేజాః సంప్రతస్థే మహాబలః. 82

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, మహోదరవచః=మహోదరుని వచనమును, శ్రుత్వా=విని, రాక్షసైః=రాక్షసులచేత, పరివారితః=చుట్టబడినవాడై, సంప్రతస్థే=బయులుదేరెను.

తా. గొప్ప తేజస్సూ, బలమూ గల కుంభకర్ణుడు మహోదరుని మాటలు విని రాక్షసులతో కలసి బయులుదేరెను. 82

మూ. సుప్తముత్థాప్య భీమాక్షం భీమరూపపరాక్రమమ్,
రాక్షసాస్త్వరితా జగ్ముర్దశగ్రీవనివేశనమ్ . 83

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, భీమాక్షమ్=భయంకరములైన నేత్రములు గలవాడు, భీమరూపపరాక్రమమ్= భయంకరములైన రూపపరాక్రమములు గలవాడు అయిన, సుప్తమ్=నిద్రించిన కుంభకర్ణుని, ఉత్థాప్య=లేపి, త్వరితాః=తొందరపడుచున్నవారై, దశగ్రీవనివేశనమ్=రావణుని గృహమును గూర్చి, జగ్ముః=వెళ్లిరి.

తా. రాక్షసులు భయంకరములైన నేత్రములు, రూపము, పరాక్రమము గల నిద్రించుచున్న ఆ కుంభకర్ణుణ్ణి లేపి శీఘ్రముగా రావణుని ఇంటికి వెళ్లిరి.

మూ. తేఽభిగమ్య దశగ్రీవమాసీనం పరమాసనే,
ఊచుర్బద్ధాఞ్జలిపుటాః సర్వ ఏవ నిశాచరాః. 84

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే నిశాచరాః=ఆ రాక్షసులు, పరమాసనే=శ్రేష్ఠమైన ఆసనము మీద, ఆసీనమ్=కూర్చున్న, దశగ్రీవమ్=రావణుణ్ణి, అభిగమ్య=చేరి, బద్ధాఞ్జలిపుటాః=కట్టబడిన దోసిళ్లు కలవారై, ఊచుః=పలికిరి.

తా. ఆ రాక్షసు లందరూ ఉత్తమమైన ఆసనముపై కూర్చొని ఉన్న రావణుని దగ్గరకు వెళ్లి, చేతులు జోడించి నమస్కరించుచు ఇట్లు పలికిరి. 84

మూ. కుమ్భకర్ణః ప్రబుద్ధోఽసౌ భ్రాతా తే రాక్షసేశ్వర,
కథం తత్రైవ నిర్యాతు ద్రక్ష్యసే తమిహాగతమ్. 85

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! తే భ్రాతా=నీ సోదరుడైన, అసౌ కుమ్భకర్ణః=ఈ కుంభకర్ణుడు, ప్రబుద్ధః=మేల్కొన్నాడు. తత్రైవ=అక్కడనే, నిర్యాతు కథమ్=యుద్ధమునకై బయలుదేరి వెళ్లవలెనా, ఇహ=ఇక్కడికి, ఆగతమ్=వచ్చిన, తమ్=అతనిని, ద్రక్ష్యసే=చూచెదవా ?

తా. రాక్షసరాజా ! నీ సోదరుడైన ఈ కుంభకర్ణుడు నిద్రనుండి లేచినాడు. అతడు అక్కడినుండియే యుద్ధమునకు వెళ్లవలెనా లేక నిన్ను చూచుటకై ఇక్కడికి రావలెనా ? 85

మూ. రావణస్త్వబ్రవీద్ధృష్టో రాక్షసాంస్తానుపస్థితాన్,
ద్రష్టుమేనమిహేచ్ఛామి యథాన్యాయం చ పూజ్యతామ్. 86

ప్ర. అ. రావణస్తు=రావణుడైతే, హృష్టః=సంతోషించినవాడై, ఉపస్థితాన్=వచ్చిన, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, అబ్రవీత్=పలికెను. ఏనమ్=ఇతనిని, ఇహ=ఇక్కడ, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. యథాన్యాయమ్=న్యాయానుసారముగా, పూజ్యతామ్=పూజింపబడుగాక.

తా. రావణుడు సంతోషించి ఆ రాక్షసులతో ఇట్లనెను - "కుంభకర్ణుణ్ణి ఇక్కడనే చూడవలె నని కోరుచున్నాను. న్యాయానుసారముగా అతనిని సత్కరించి తీసికొని రండు". 86

మూ. తథేత్యుక్త్వా తు తే సర్వే పునరాగమ్య రాక్షసాః,
కుమ్భకర్ణమిదం వాక్యమూచూ రావణచోదితాః. 87

ప. అ. రావణచోదితాః=రావణునిచేత ప్రేరేపించబడిన, తే=ఆ, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, తథేతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, పునః=తిరిగి, ఆగమ్య=వచ్చి, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి గూర్చి, ఇదమ్= ఈ, వాక్యమ్=వాక్యమును, ఊచుః=పలికిరి.

తా. ఆ రాక్షసులందరూ అట్లే చేసెదము అని పలికి, రావణుని ఆజ్ఞ ప్రకారము తిరిగి వచ్చి కుంభకర్ణునితో ఇట్లు పలికిరి. 87

మూ. ద్రష్టుం త్వాం కాంక్షతే రాజా సర్వరాక్షసపుంగవః,
గమనే క్రియతాం బుద్ధిర్భ్రాతరం సంప్రహర్షయ. 88

ప. అ. సర్వరాక్షసపుంగవః=సమస్తరాక్షసులలో శ్రేష్ఠుడైన, రాజా=రాజు, త్వామ్=నిన్ను, ద్రష్టుమ్= చూచుటకు, కాంక్షతే =కోరుచున్నాడు. గమనే=వెళ్ళుటయందు, బుద్ధిః=బుద్ధి, క్రియతామ్=చేయబడుగాక. భ్రాతరమ్=సోదరుణ్ణి, సంప్రహర్షయ=సంతోషపెట్టుము.

తా. "సమస్తరాక్షసులలో శ్రేష్ఠుడైన రాజు నిన్ను చూడవలెనని అనుకొనుచున్నాడు. అందుచేత అచటికి వెళ్ళి నీ సోదరునకు సంతోషము కలిగించుము." 88

కుమ్భకర్ణస్తు దుర్ధర్షో భ్రాతురాజ్ఞాయ శాసనమ్,
తథేత్యుక్త్వా మహావీర్యః శయనాదుత్పపాత హ. 89

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానివాడు, మహావీర్యః=గొప్ప పరాక్రమము గలవాడు అయిన, కుమ్భకర్ణస్తు=కుంభకర్ణుడైతే, భ్రాతుః=సోదరునియొక్క, శాసనమ్=ఆజ్ఞను, ఆజ్ఞాయ=తెలిసికొని, తథా ఇతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, శయనాత్=శయనమునుండి, ఉత్పపాత హ=లేచెను.

తా. ఎదిరింప శక్యము కాని మహాపరాక్రమవంతుడైన కుంభకర్ణుడు అన్నగారి ఆజ్ఞను తెలిసికొని, "అట్లే చేసెదను" అని పలికి శయనమునుండి లేచెను. 89

మూ. ప్రక్షాల్య వదనం హృష్టః స్నాతః పరమభూషితః,
పిపాసుస్త్వరయామాస పానం బలసమీరణమ్. 90

ప్ర. అ. హృష్టః=సంతోషించినవాడై, వదనమ్=ముఖమును, ప్రక్షాల్య=కడిగి, స్నాతః=స్నానముచేసినవాడై, పరమభూషితః=మిక్కిలి అలంకరించుకొని, పిపాసుః=దప్పికొన్నవాడై, బలసమీరణమ్=బలమును వృద్ధి పొందించు, పానమ్=పానమును, త్వరయామాస=తొందరపడజేసెను.

తా. కుంభకర్ణుడు సంతోషముతో ముఖప్రక్షాళనము చేసికొని, స్నానము చేసి, బాగా అలంకరించుకొని, దప్పికొన్నవాడై, బలమును వృద్ధి పొందించు పానమును తీసికొనిరమ్మని తొందరచేసెను. 90

మూ. తతస్తే త్వరితాస్తత్ర రాక్షసా రావణాజ్ఞయా,
మద్యం భక్ష్యాంశ్చ వివిధాన్ క్షిప్రమేవోపహారయన్. 91

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణాజ్ఞయా=రావణుని ఆజ్ఞచేత, త్వరితాః=తొందరపడుచున్న, తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, తత్ర=అక్కడ, మద్యమ్=మద్యమును, వివిధాన్=అనేకవిధములైన, భక్ష్యాంశ్చ=భక్ష్యములను, క్షిప్రమేవ=శీఘ్రముగా, ఉపహారయన్=తీసికొనివచ్చిరి.

తా. అప్పుడు రావణాజ్ఞచేత కుంభకర్ణుని తీసికొనివెళ్లుటకై తొందరపడుచున్న రాక్షసులు మద్యమును, అనేకవిధములైన భక్ష్యములను ఆచటికి తీసికొనివచ్చిరి. 91

మూ. పీత్వా ఘటసహస్రే ద్వే గమనాయోపచక్రమే,
ఈషత్సముత్కటో మత్తస్తేజోబలసమన్వితః. 92

ప్ర. అ. ద్వే=రెండు, ఘటసహస్రే=ఘటముల సహస్రములను, పీత్వా=త్రాగి, ఈషత్=కొంచెము, సముత్కటః=తీవ్రముగాఉన్నవాడై, మత్తః=మదించిన ఆతడు, తేజోబలసమన్వితః=తేజస్సుతోను బలముతోను కూడినవాడై, గమనాయ=వెళ్లుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. సహజముగా మత్తుడైన ఆతడు రెండువేల ఘటముల మద్యము త్రాగి, ఇంకా కొంచెము మత్తెక్కి, తేజోబలములతో కూడినవాడై బయలుదేరెను.

మూ. కుమ్భకర్ణో బభౌ రుష్టః కాలాన్తకయమోపమః,
భ్రాతుః స భవనం గచ్ఛన్ రక్షోబలసమన్వితః, 93
కుమ్భకర్ణః పదన్యాసైరకమ్పయత మేదినీమ్.

ప్ర. అ. రక్షోబలసమన్వితః=రాక్షససైన్యముతో కూడినవాడై, భ్రాతుః=సోదరునియొక్క, భవనమ్=గృహమును గూర్చి, గచ్ఛన్=వెళ్లుచున్న, రుష్టః=కోపించిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, కాలాన్తకయమోపమః=కాలమునందు నాశమును చేయు యమునితో సమానుడై, బభౌ=ప్రకాశించెను. కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, పదన్యాసైః=పాదన్యాసములచేత, మేదినీమ్=భూమిని, అకమ్పయత=కదల్చెను.

తా. రాక్షససైన్యముతో కలిసి సోదరుని ఇంటికి వెళ్లుచున్న, కోపించిన ఆ కుంభకర్ణుడు ప్రళయకాలమునందు లోకసంహారము చేయుచున్న యముడు

వలె ఉండెను. అతడు పాదన్యాసములచేత భూమిని కంపింపచేసెను.

మూ. స రాజమార్గం వపుషా ప్రకాశయన్
సహస్రరశ్మిర్ధరణీమివాంశుభిః,
జగామ తత్రాఞ్జలిమాలయా వృతః
శతక్రతుర్గేహమివ స్వయంభువః. 94

ప్ర. అ. సహస్రరశ్మిః=సూర్యుడు, అంశుభిః=కిరణములచేత, ధరణీమివ=భూమినివలె, సః=అతడు, రాజమార్గమ్=రాజమార్గమును, వపుషా=తన శరీరముచేత, ప్రకాశయన్=ప్రకాశింపచేయుచు, తత్ర=అక్కడ, అఞ్జలిమాలయా=దోసిళ్ల పంక్తిచేత, వృతః=చుట్టబడినవాడై, స్వయంభువః=బ్రహ్మదేవునియొక్క, గేహమ్=గృహమును గూర్చి, శతక్రతుః ఇవ=దేవేంద్రుడు వలె, జగామ=వెళ్లెను.

తా. ఆ కుంభకర్ణుడు తన దేహముచేత రాజమార్గమును, సూర్యుడు కిరణములచేత భూమిని ప్రకాశింపచేయుచున్నట్లు ప్రకాశింపచేయుచు, చుట్టూ దోసిళ్ల పంక్తులతో కూడినవాడై, దేవేంద్రుడు బ్రహ్మదేవుని గృహమునకు వెళ్లినట్లు రావణుని గృహమునకు వెళ్లెను. 94

మూ. తం రాజమార్గస్థమమిత్రఘాతినం
వనౌకసస్తే సహసా బహిఃస్థితాః,
దృష్ట్వాఽప్రమేయం గిరిశృఙ్గకల్పం
వితత్రసుస్తే సహ యూథపాలైః. 95

ప్ర. అ. అమిత్రఘాతినమ్=శత్రువులను నశింపచేయువాడు, అప్రమేయమ్=ఇంతటివాడని ఊహింప శక్యము కానివాడు, గిరిశృఙ్గకల్పమ్=పర్వతశిఖరముతో సమానుడు అయిన, రాజమార్గస్థమ్=రాజమార్గమునందున్న, తమ్=అతనిని, బహిఃస్థితాః=వెలుపలనున్న, తే వనౌకసః=ఆ వానరులు, సహసా=హఠాత్తుగా, దృష్ట్వా=చూచి, యూథపాలైః సహ=సేనానాయకులతో కూడ, వితత్రసుః=భయపడిరి.

తా. శత్రువులను నశింపచేయువాడైన, పర్వతశిఖరము వలె ఉన్న, ఊహింపశక్యము కాని ఆ కుంభకర్ణుణ్ణి రాజమార్గములో ఉండగా హఠాత్తుగా చూచి, లంకకు వెలుపల ఉన్న ఆ వానరులు, వానరనాయకులూ కూడ భయపడిరి.

మూ. కేచిచ్ఛరణ్యం శరణం స్మ రామం
వ్రజన్తి కేచిద్వ్యథితాః పతన్తి,
కేచిద్దిశశ్చ వ్యథితాః పదన్తి
కేచిద్భయార్తా భువి శేరతే స్మ. 96

ప్ర. అ. కేచిత్=కొందరు, శరణ్యమ్=రక్షకుడైన, రామమ్=రాముణ్ణి, శరణం వ్రజన్తి స్మ=శరణుపొందెను. కేచిత్=కొందరు, వ్యథితాః=బాధపడుచున్నవారై, పతన్తి స్మ=క్రింద పడిపోయిరి. కేచిత్=కొందరు, వ్యథితాః=బాధపడుచున్న వారై, దిశః=దిక్కులను గూర్చి, పలన్తి స్మ=పారిపోయిరి. కేచిత్=కొందరు, భయార్తాః=భయపీడితులై, భువి=నేలమీద, శేరతే స్మ=శయనించిరి.

తా. కొందరు శరణాగతరక్షకుడైన రాముణ్ణి శరణు జొచ్చిరి. కొందరు వ్యథచెంది పడిపోయిరి. మరికొందరు వ్యథచెంది దిక్కులు పట్టి పారిపోయిరి. కొందరు భయపీడితులై నేలమీద పండుకొనిరి. 96

మూ. తమద్రిశృఙ్గప్రతిమం కిరీటినం
స్పృశన్తమాదిత్యమివాత్మతేజసా,
వనౌకసః ప్రేక్ష్య వివృద్ధమద్భుతం
భయార్దితా దుద్రువిరే యతస్తతః. 97

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాండే షష్టితమః సర్గః.

ప్ర. అ. అద్రిశృఙ్గప్రతిమమ్=పర్వతశిఖరముతో సమానుడు, కిరీటినమ్=కిరీటము గలవాడు, ఆత్మతేజసా=తన తేజస్సుచేత, ఆదిత్యమ్=సూర్యుణ్ణి, స్పృశన్తమివ=స్పృశించుచున్నాడా అన్నట్లు ఉన్నవాడు అయిన, అద్భుతమ్=ఆశ్చర్యకరముగా, వివృద్ధమ్=పెరిగిన, తమ్=ఆతనిని, వనౌకసః=వానరులు, ప్రేక్ష్య=చూచి, భయార్దితాః=భయపీడితులై, యతస్తతః=అటు ఇటు, దుద్రువిరే=పారిపోయిరి.

తా. కిరీటమును ధరించి పర్వతశిఖరము వలె ఉన్న ఆ కుంభకర్ణుడు తన తేజస్సుచేత సూర్యుణ్ణి స్పృశించుచున్నాడా అన్నట్లు ఉండెను. ఆశ్చర్యకరముగా పెరిగిపోయిన దేహము గల ఆతని చూడగానే వానరులు భయకంపితులై ఇటు అటు పారిపోయిరి. 97

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదవసర్గ సమాప్తము.

# అథ ఏకషష్టితమః సర్గః

(విభీషణుడు కుంభకర్ణుని గూర్చి రామునకు చెప్పుట. రాముని ఆజ్ఞచే వానరులు లంకాద్వారముల వద్ద నిలచుట.)

మూ. తతో రామో మహాతేజా ధనురాదాయ వీర్యవాన్,
కిరీటినం మహాకాయం కుమ్భకర్ణం దదర్శ హ. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వీర్యవాన్=పరాక్రమము గల, రామః=రాముడు, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి, కిరీటినమ్=కిరీటము కలవాడు, మహాకాయమ్=గొప్ప శరీరము కలవాడు అయిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, దదర్శ=చూచెను.

తా. పిమ్మట, గొప్ప తేజస్సు, పరాక్రమము గల రాముడు ధనస్సును గ్రహించి, పెద్ద దేహము గల కిరీటము ధరించిన ఆ కుంభకర్ణుణ్ణి చూచెను. 1

మూ. తం దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం పర్వతాకారదర్శనమ్,
క్రమమాణమివాకాశం పురా నారాయణం ప్రభుమ్. 2

ప్ర. అ. పర్వతాకారదర్శనమ్=పర్వతాకారదర్శనము వంటి దర్శనము కల, పురా=పూర్వము, ఆకాశమ్=ఆకాశమును, క్రమమాణమ్=ఆక్రమించుచున్న, ప్రభుమ్=ప్రభువైన, నారాయణం యథా=నారాయణుడు వలె ఉన్న, తం రాక్షసశ్రేష్ఠమ్=ఆ రాక్షసశ్రేష్ఠుని, దృష్ట్వా=చూచి (రాముడు సన్నద్ధుడయ్యెను.)

తా. పూర్వము ఆకాశమును ఆక్రమించుచున్న సర్వలోకప్రభువైన నారాయణుడు వలె ఉన్న, పర్వతమువంటి ఆకారములో కనబడుచున్న రాక్షస శ్రేష్ఠుడైన అతనిని చూచి రాముడు సన్నద్ధుడాయెను. 2

మూ. సతోయామ్బుదసంకాశం కాఞ్చనాఙ్గదభూషణమ్,
దృష్ట్వా పునః ప్రదుద్రావ వానరాణాం మహాచమూః. 3

ప్ర. అ. సతోయామ్బుదసంకాశమ్=జలముతో కూడిన మేఘముతో సమానుడు, కాఞ్చనాఙ్గదభూషణమ్=బంగారు బాహుపురులు భూషణముగా కలవాడు అయిన అతనిని, దృష్ట్వా=చూచి, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూః=గొప్ప సేన, పునః=మరల, ప్రదుద్రావ=పారిపోయెను.

తా. నీటితో నిండిన మేఘము వలె ఉన్న ఆ కుంభకర్ణుడు బంగారు బాహుపురులను అలంకారములుగా ధరించెను. అతనిని మరల చూచి గొప్పదైన ఆ వానరసేన పారిపోయెను. 3

మూ. విద్రుతాం వాహినీం దృష్ట్వా వర్ధమానం చ రాక్షసమ్,
సవిస్మితమిదం రామో విభీషణమువాచ హ. 4

ప్ర. అ. రామః=రాముడు, విద్రుతామ్=పారిపోయిన, వాహినీమ్=సేననూ, వర్ధమానమ్=పెరుగుచున్న, రాక్షసం చ=రాక్షసుణ్ణీ, దృష్ట్వా=చూచి, సవిస్మితమ్=ఆశ్చర్యముతో కూడుకొన్నట్లుగా, విభీషణమ్=విభీషణుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. పారిపోవుచున్న సైన్యమును, శరీరము పెంచుచున్న రాక్షసుణ్ణీ చూచి రాముడు ఆశ్చర్యపూర్వకముగా విభీషణునితో ఇట్లు అనెను. 4

మూ. కోఽసౌ పర్వతసంకాశః కిరీటీ హరిలోచనః,
లఙ్కాయాం దృశ్యతే వీరః సవిద్యుదివ తోయదః. 5

ప్ర. అ. పర్వతసంకాశః=పర్వతముతో సమానుడు, కిరీటీ=కిరీటము ధరించినవాడు, హరిలోచనః=పచ్చని నేత్రములు కలవాడు, సవిద్యుత్=మెరుపుతో కూడిన, తోయదః ఇవ=మేఘము వలె ఉన్నవాడు అయిన, వీరః=వీరుడు, లఙ్కాయామ్=లంకలో, దృశ్యతే=చూడబడుచున్నాడు. అసౌ=ఇతడు, కః=ఎవడు?

తా. కిరీటము ధరించిన, పచ్చని కళ్లు గల, పర్వతమువంటి ఈ వీరుడు లంకలో మెరుపుతో కూడిన మేఘమువలె కనబడుచున్నాడు. ఇతడు ఎవడు? 5

మూ. పృథివ్యాం కేతుభూతోఽసౌ మహానేకోఽత్ర దృశ్యతే,
యం దృష్ట్వా వానరాః సర్వే విద్రవన్తి యతస్తతః. 6

ప్ర. అ. మహాన్=గొప్పవాడైన, అసౌ=ఇతడు, ఏకః=ఒక్కడే, అత్ర=ఇక్కడ, పృథివ్యామ్=భూమియందు, కేతుభూతః=కేతువు అయినవాడుగా, దృశ్యతే=కనబడుచున్నాడు. యమ్=ఎవనిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, యతస్తతః=ఇటు అటు, విద్రవన్తి=పారిపోవుచున్నారో.

తా. ఇక్కడ పెద్ద దేహము కల యితడొక్కడే ఈ భూమియందు ధ్వజము వలె కనబడుచున్నాడు. ఇతనిని చూచి వానరు లందరూ ఇటూ అటూ పారిపోవుచున్నారు. 6

మూ. ఆచక్ష్వ సుమహాన్ కోఽసౌ రక్షో వా యది వాసురః,
న మయైవంవిధం భూతం దృష్టపూర్వం కదాచన. 7

ప్ర. అ. సుమహాన్=చాల పెద్దవాడైన, అసౌ=యితడు, కః=ఎవడు? రక్షః వా=రాక్షసుడా, యది వా=లేక, అసురః=అసురుడా, ఆచక్ష్వ=చెప్పుము.

మయా=నాచేత, ఏవంవిధమ్=ఇట్టి, భూతమ్=ప్రాణి, కదాచన=ఎన్నడూ, న దృష్టపూర్వమ్=పూర్వము చూడబడలేదు.

తా. పెద్ద దేహము గల ఇతడెవరు ? రాక్షసుడా, అసురుడా? చెప్పుము. నేను యిట్టి భూతమును (ప్రాణిని) పూర్వ మెన్నడూ చూచి ఉండలేదు. 7

మూ. సంపృష్టో రాజపుత్రేణ రామేణాక్లిష్టకర్మణా,
విభీషణో మహాప్రాజ్ఞః కాకుత్స్థమిదమబ్రవీత్. 8

ప్ర. అ. రాజపుత్రేణ=రాజపుత్రుడైన, అక్లిష్టకర్మణా=శ్రమపడకుండగా పనులు చేయు, రామేణ=రామునిచేత, సంపృష్టః=ప్రశ్నించబడిన, మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధికల, విభీషణః=విభీషణుడు, కాకుత్స్థమ్= రాముణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. శ్రమపడకుండగా పనులు సాధించు రాజపుత్రుడైన రాముడు ఇట్లు ప్రశ్నించగా మహాబుద్ధిశాలియైన విభీషణుడు ఆతనితో యిట్లనెను. 8

మూ. యేన వైవస్వతో యుద్ధే వాసవశ్చ పరాజితః,
సైష విశ్రవసః పుత్రః కుంభకర్ణః ప్రతాపవాన్, 9
అస్య ప్రమాణసదృశో రాక్షసోఽన్యో న విద్యతే.

ప్ర. అ. యేన=ఎవనిచేత, యుద్ధే=యుద్ధమునందు, వైవస్వతః=యముడూ, వాసవశ్చ=దేవేంద్రుడూ, పరాజితః=ఓడింపబడినాడో, సః= అట్టి, ఏషః=ఇతడు, విశ్రవసః=విశ్రవసునియొక్క, పుత్రః=పుత్రుడైన, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు. అస్య=ఇతనియొక్క, ప్రమాణసదృశః=ప్రమాణముచేత సమానమైన, అన్యః రాక్షసః=మరియొక రాక్షసుడు, న విద్యతే=లేదు.

తా. ఇతడు విశ్రవసుని కుమారుడైన ప్రతాపవంతుడైన కుంభకర్ణుడు. ఇతడు యుద్ధములో యముణ్ణీ, ఇంద్రుణ్ణీ ఓడించినాడు. ఇతని దేహ ప్రమాణముతో సమానమైన ప్రమాణము కల మరియొక రాక్షసు డెవడూ లేడు. 9

మూ. ఏతేన దేవా యుధి దానవాశ్చ
యక్షా భుజంగాః పిశితాశనాశ్చ,
గంధర్వవిద్యాధరపన్నగాశ్చ
సహస్రశో రాఘవ సంప్రభగ్నాః. 10

ప్ర. అ. రాఘవ=రామా ! ఏతేన=ఇతనిచేత, యుధి=యుద్ధమునందు,

దేవాః=దేవతలు; దానవాశ్చ=దానవులూ, యక్షాః=యక్షులూ, భుజంగాః=నాగులూ, పిశితాశనాశ్చ=రాక్షసులూ, గంధర్వ విద్యాధర పన్నగాశ్చ=గంధర్వులూ, విద్యాధరులూ, పన్నగులూ, సహస్రశః=వేలకొలది, సంప్రభగ్నాః=ఓడింపబడిరి.

తా. రామా! ఇతడు యుద్ధములో దేవదానవులనూ, యక్ష, నాగ, రాక్షసులనూ, గంధర్వ విద్యాధర పన్నగులనూ వేలకొలది ఓడించినాడు. 10

మూ. శూలపాణిం విరూపాక్షం కుంభకర్ణం మహాబలమ్,
హన్తుం న శేకుస్త్రిదశాః కాలోఽయమితి మోహితాః. 11

ప్ర. అ. శూలపాణిమ్=శూలము హస్తమునందు కలవాడూ, విరూపాక్షమ్=వికృతములైన నేత్రములు కలవాడూ, మహాబలమ్=గొప్ప బలము కలవాడూ అయిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, త్రిదశాః=దేవతలు, అయమ్=ఇతడు, కాలః ఇతి=యముడు అని, మోహితాః=మోహితులై, హన్తుమ్=చంపుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. వికృతములైన నేత్రములతో శూలము చేత ధరించిన మహాబలవంతుడైన కుంభకర్ణుణ్ణి చూచి, దేవతలు ఇతడు మృత్యుదేవత యని భ్రాంతిపడి చంపజాలకపోయిరి. 11

మూ. ప్రకృత్యా హ్యేష తేజస్వీ కుమ్భకర్ణో మహాబలః,
అన్యేషాం రాక్షసేన్ద్రాణాం వరదానకృతం బలమ్. 12

ప్ర. అ. ఏషః=ఈ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ప్రకృత్యా=స్వభావముచేత, తేజస్వీ=తేజస్సు కలవాడు. మహాబలః=గొప్ప బలము కలవాడు. అన్యేషామ్=ఇతరులైన, రాక్షసేన్ద్రాణామ్=రాక్షసులయొక్క, బలమ్=బలము, వరదానకృతమ్=వరదానముచేత చేయబడినది.

తా. ఈ కుంభకర్ణునకు సహజముగానే గొప్ప తేజస్సూ, బలమూ, ఉన్నవి. ఇతర రాక్షసుల కైతే బలము వరదానముచేత లభించినది. 12

మూ. ఏతేన జాతమాత్రేణ క్షుధార్తేన మహాత్మనా,
భక్షితాని సహస్రాణి సత్త్వానాం సుబహూన్యపి. 13

ప్ర. అ. జాతమాత్రేణ=పుట్టీపుట్టగానే, క్షుధార్తేన=ఆకలిచేత పీడితుడైన, ఏతేన=ఈ, మహాత్మనా=మహాత్మునిచేత, సత్త్వానామ్=ప్రాణులయొక్క, సుబహూని అపి=అనేకమైన, సహస్రాణి=సహస్రములు, భక్షితాని=భక్షింపబడినవి.

తా. ఈ కుంభకర్ణుడు పుట్టీపుట్టగానే ఆకలితో బాధపడుతూ, ఎన్నో వేల ప్రాణులను భక్షించెను. 13

మూ. తేషు సంభక్ష్యమాణేషు ప్రజా భయనిపీడితాః,
యాన్తి స్మ శరణం శక్రం తమప్యర్థం న్యవేదయన్. 14

ప్ర. అ. తేషు=అవి, సమ్భక్ష్యమాణేషు=భక్షింపబడుచుండగా, ప్రజాః=ప్రజలు, భయనిపీడితాః=భయముచేత పీడింపబడినవారై, శక్రమ్=దేవేంద్రుణ్ణి, శరణం యాన్తి స్మ=శరణుజొచ్చిరి. తమ్=ఆతనిని గూర్చి, అర్థమ్ అపి=విషయమును కూడా, న్యవేదయన్=తెలిపిరి.

తా. ఆ ప్రాణులను కుంభకర్ణుడు భక్షించుచుండగా ప్రజలు భయపీడితులై ఇంద్రుని శరణుజొచ్చి, ఆతనికి ఆ విషయమును తెలిపిరి. 14

మూ. స కుమ్భకర్ణం కుపితో మహేన్ద్రో
జఘాన వజ్రేణ శితేన వజ్రీ,
స శక్రవజ్రాభిహతో మహాత్మా
చచాల కోపాచ్చ భృశం ననాద. 15

ప్ర. అ. వజ్రీ=వజ్రము గల, సః=ఆ, మహేన్ద్రః=మహేంద్రుడు, కుపితః=కోపించినవాడై, కుమ్భకర్ణమ్=కుమ్భకర్ణుణ్ణి, వజ్రేణ=వజ్రముచేత, జఘాన=కొట్టెను. శక్రవజ్రాభిహతః=ఇంద్రునిచే వజ్రముచేత కొట్టబడిన, మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ కుంభకర్ణుడు, చచాల=చలించెను. కోపాత్=కోపమువలన, భృశమ్=మిక్కిలి, ననాద చ=ధ్వనిచేసెను.

తా. వజ్రధారియైన ఇంద్రుడు కోపించి కుంభకర్ణుణ్ణి వజ్రముతో కొట్టెను. ఆ విధముగ ఇంద్రుడు వజ్రముతో కొట్టగా మహాత్ముడైన కుంభకర్ణుడు చలించి కోపముతో బిగ్గరగా అరచెను. 15

మూ. తస్య నానద్యమానస్య కుమ్భకర్ణస్య రక్షసః,
శ్రుత్వా నినాదం విత్రస్తాః ప్రజా భూయో వితత్రసుః. 16

ప్ర. అ. విత్రస్తాః=భయపడి ఉన్న, ప్రజాః=ప్రజలు, నానద్యమానస్య=అధికముగా ధ్వనిచేయుచున్న, రక్షసః=రాక్షసుడైన, తస్య కుమ్భకర్ణస్య=ఆ కుంభకర్ణునియొక్క, నినాదమ్=ధ్వనిని, శ్రుత్వా=విని, భూయః=మరల, వితత్రసుః=భయపడిరి.

తా. ముందుగానే భయపడుచున్న ప్రజలు బిగ్గరగా అరచుచున్న ఆ కుంభకర్ణుని అరపులు విని ఇంకనూ భయపడిరి. 16

మూ. తతః క్రుద్ధో మహేన్ద్రస్య కుమ్భకర్ణో మహాబలః,
నిష్కృష్యైరావతాద్దన్తం జఘానోరసి వాసవమ్. 17

ప్ర. అ: తతః=అటుపిమ్మట, మహేన్ద్రస్య=మహేంద్రునకు, క్రుద్ధః=కోపించిన, మహాబలః=గొప్ప బలము కల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఐరావతాత్=ఐరావతమునుండి, దన్తమ్=దంతమును, నిష్కృష్య=లాగి, వాసవమ్=ఇంద్రుణ్ణి, ఉరసి=వక్షస్థలమునందు, జఘాన=కొట్టెను.

తా. అప్పుడు మహేంద్రునిపై కోపముతో గొప్ప బలము కల కుంభకర్ణుడు ఐరావతము దంతమును ఊడబెరికి అతని వక్షస్థలము మీద కొట్టెను. 17

మూ. కుమ్భకర్ణప్రహారార్తో విజజ్వాల స వాసవః,
తతో విషేదుః సహసా దేవా బ్రహ్మర్షిదానవాః, 18
ప్రజాభిః సహ శక్రశ్చ యయౌ స్థానం స్వయంభువః.

ప్ర. అ. సః వాసవః=ఆ దేవేంద్రుడు, కుమ్భకర్ణప్రహారార్తః=కుంభకర్ణుని దెబ్బచేత పీడింపబడి, విజజ్వాల=తాపముచెందెను. తతః=అటుపిమ్మట, దేవాః=దేవతలు, బ్రహ్మర్షిదానవాః=బ్రహ్మర్షులూ దానవులూ, సహసా=వెంటనే, విషేదుః=విషాదము చెందిరి. శక్రశ్చ=దేవేంద్రుడుకూడ, ప్రజాభిః సహ=ప్రజలతో కూడ, స్వయంభువః=బ్రహ్మదేవునియొక్క, స్థానమ్=స్థానమును గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. కుంభకర్ణుడు కొట్టుటచే పీడితుడైన దేవేంద్రుడు సంతాపము చెందెను. అది చూడగానే దేవతలూ, బ్రహ్మర్షులూ, దానవులూ దిగులు చెందిరి. దేవేంద్రుడు ప్రజలతో కలసి బ్రహ్మలోకమునకు వెళ్లెను. 18

మూ. కుమ్భకర్ణస్య దౌరాత్మ్యం శశంసుస్తే ప్రజాపతేః, 19
ప్రజానాం భక్షణం చాపి ధర్షణం చ దివౌకసామ్,
ఆశ్రమధ్వంసనం చాపి పరస్త్రీహరణం తథా. 20

ప్ర. అ. తే=వారు, ప్రజాపతేః=బ్రహ్మదేవునకు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, దౌరాత్మ్యమ్=దుష్టబుద్ధిని, ప్రజానామ్=ప్రజలయొక్క, భక్షణం చాపి=భక్షణమునూ, దివౌకసామ్=దేవతలయొక్క, ధర్షణం చ=ఎదిరించుటనూ, ఆశ్రమధ్వంసనం చాపి=ఆశ్రమములయొక్క నశింపచేయుటనూ, తథా=మరియు, పరస్త్రీహరణమ్=పరస్త్రీలహరణమునూ, శశంసుః=చెప్పిరి.

తా. కుంభకర్ణుడు ప్రజలను భక్షించుచున్నాడనీ, దేవతలను ఎదిరించుచున్నాడనీ, ఆశ్రమములను నశింపచేయుచున్నాడనీ, పరస్త్రీలను హరించుచున్నాడనీ వారు బ్రహ్మదేవునకు కుంభకర్ణుని దుష్టబుద్ధిని గూర్చి తెలిపిరి. 19, 20

మూ. ఏవం ప్రజా యది త్వేష భక్షయిష్యతి నిత్యశః,
అచిరేణైవ కాలేన శూన్యో లోకో భవిష్యతి. 21

ప్ర. అ. ఏషః=ఇతడు, ఏవమ్=ఈ విధముగా, నిత్యశః=నిత్యము, ప్రజాః=ప్రజలను, భక్షయిష్యతి యది=భక్షించినచో, అచిరేణ=అల్పమైన (చిరము కాని), కాలేనైవ=కాలముచేతనే, లోకః=లోకము, శూన్యః=శూన్యము, భవిష్యతి=కాగలదు.

తా. ఇతడు ప్రతిదినము ఈ విధముగా ప్రజలను భక్షించినచో కొంచెము కాలములోనే ఈ లోకము ప్రాణశూన్యము ఐపోవును. 21

మూ. వాసవస్య వచః శ్రుత్వా సర్వలోకపితామహః,
రక్షాంస్యావాహయామాస కుమ్భకర్ణం దదర్శ హ. 22

ప్ర. అ. సర్వలోకపితామహః=సమస్తలోకమునకు పితామహుడైన బ్రహ్మదేవుడు, వాసవస్య=దేవేంద్రునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, రక్షాంసి=రాక్షసులను, ఆవాహయామాస=తన దగ్గరకు రప్పించుకొనెను. కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, దదర్శ హ=చూచెను.

తా. ఇంద్రుని మాటలు విని బ్రహ్మదేవుడు రాక్షసులను తన దగ్గరకు రప్పించుకొని కుంభకర్ణుని చూచెను. 22

మూ. కుమ్భకర్ణం సమీక్ష్యైవ వితత్రాస ప్రజాపతిః,
కుమ్భకర్ణమథాశ్వస్తః స్వయమ్భూరిదమబ్రవీత్. 23

ప్ర. అ. కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, సమీక్ష్యైవ=చూడగానే, ప్రజాపతిః=బ్రహ్మదేవుడు, వితత్రాస=భయపడెను. అథ=అటుపిమ్మట, ఆశ్వస్తః=ఊరడిల్లినవాడై, స్వయమ్భూః=బ్రహ్మదేవుడు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణునిగూర్చి, ఇదం=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. కుంభకర్ణుని చూడగానే బ్రహ్మదేవుడు కూడ భయపడెను. కొంత సేపటికి తెప్పరిల్లి అతడు కుంభకర్ణునితో ఇట్లనెను. 23

మూ. ధ్రువం లోకవినాశాయ పౌలస్త్యేనాసి నిర్మితః,
తస్మాత్త్వమద్యప్రభృతి మృతకల్పః శయిష్యసే. 24

ప్ర. అ. లోకవినాశాయ=లోకనాశముకొరకే, పౌలస్త్యేన=విశ్రవసునిచేత, నిర్మితః అసి=నిర్మితుడవబడితివి. ధ్రువమ్=నిశ్చయము. తస్మాత్=ఆ కారణమువలన, త్వమ్=నీవు, అద్య ప్రభృతి=నేడుమొదలు, మృతకల్పః=చచ్చినవానితో సమానుడవై, శయిష్యసే=శయనించగలవు.

తా. విశ్రవసుడు నిన్ను నిశ్చయముగా లోకనాశముకొరకే సృష్టించినాడు. అందుచే నీవు నేటినుండి చచ్చినవాడవు వలె పడి ఉందువు. 24

మూ. బ్రహ్మశాపాభిభూతోఽథ నిపపాతాగ్రతః ప్రభోః,
తతః పరమసంభ్రాన్తో రావణో వాక్యమబ్రవీత్. 25

ప్ర. అ. అథ=అటుపిమ్మట, బ్రహ్మశాపాభిభూతః=బ్రహ్మశాపము చేత తిరస్కరింపబడినవాడై, ప్రభోః=బ్రహ్మదేవునియొక్క, అగ్రతః=ఎదుట, నిపపాత=పడెను. తతః=అటుపిమ్మట, పరమసంభ్రాన్తః=మిక్కిలి క్షోభ పెందిన, రావణః=రావణుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు అతడు బ్రహ్మదేవుని శాపము తగిలి ఆయన సమక్షమునందే క్రింద పడిపోయెను. అది చూచి చాల క్షోభ చెందిన మనసుతో రావణుడు ఇట్లు పలికెను. 25

మూ. ప్రవృద్ధః కాఞ్చనో వృక్షః ఫలకాలే నికృత్యతే,
న నప్తారం స్వకం న్యాయ్యం శప్తుమేవం ప్రజాపతే. 26

ప్ర. అ. ప్రజాపతే=ఓ ! బ్రహ్మదేవుడా ! ప్రవృద్ధః=పెరిగిన, కాఞ్చనః వృక్షః=బంగారు చెట్టు, ఫలకాలే=ఫలము నిచ్చు సమయమునందు, నికృత్యతే=నరికివేయబడుచున్నది. స్వకమ్=తనసంబంధమైన, నప్తారమ్=మునిమనుమణ్ణి, ఏవమ్=ఇట్లు, శప్తుమ్=శపించుటకు, న న్యాయమ్=న్యాయసమ్మతము కాదు.

తా. ఓ ! బ్రహ్మదేవుడా ! పెరిగిన బంగారు వృక్షమును ఫలము లిచ్చే కాలము నందు నరికివేయుచున్నావు. నీ మునిమనుమడైన వీనిని ఇట్లు శపించుట న్యాయము కాదు. 26

మూ. న మిథ్యావచనశ్చ త్వం స్వప్స్యత్యేవ న సంశయః,
కాలస్తు క్రియతామస్య శయనే జాగరే తథా. 27

ప్ర. అ, త్వమ్=నీవు, మిథ్యావచనః=అసత్యమైన వచనము కలవాడవు, న చ=కావు కూడ. సంశయః న=సంశయము లేదు. స్వప్స్యత్యేవ=తప్పక నిద్రపోవును. అస్య=వీనియొక్క, శయనే=నిద్రించుటయందు, తథా=మరియు, జాగరే=మేల్కొనుటయందు, కాలః=కాలము, క్రియతామ్=చేయబడుగాక.

తా. నీ మాట వ్యర్థ మగుటకు కూడ వీలులేదు. ఇతడు తప్పక నిద్రింపవలసినదే. సందేహము లేదు. కాని ఇతడు నిద్రించుటకూ, మేల్కొనుటకూ కాలమును నిర్ణయించి చెప్పుము. 27

మూ. రావణస్య వచః శ్రుత్వా స్వయంభూరిదమబ్రవీత్,
శయితా హ్యేష షణ్మాసానేకాహం జాగరిష్యతి. 28

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, స్వయంభూః=బ్రహ్మదేవుడు, ఇదమ్=ఈ వాక్యము, అబ్రవీత్=పలికెను. ఏషః=ఇతడు, షట్=ఆరు, మాసాన్=మాసములను, శయితా హి=శయనించగలడు. ఏకాహమ్=ఒక రోజున, జాగరిష్యతి=మేల్కొనగలడు.

తా. రావణుని మాటలు విని బ్రహ్మదేవు డిట్లు పలికెను. ఇతడు ఆరు మాసములు నిద్రించగలడు. ఒక రోజున మేల్కొనగలడు. 28

మూ. ఏకేనాహ్నా త్వసౌ వీరశ్చరన్ భూమిం బుభుక్షితః,
వ్యాత్తాస్యో భక్షయేల్లోకాన్ సంవృద్ధ ఇవ పావకః. 29

ప్ర. అ. అసౌ వీరః=ఈ వీరుడు, ఏకేన=ఒక, అహ్నా=దివసము చేత, బుభుక్షితః=ఆకలిగొన్నవాడై, భూమిమ్=భూమిని, చరన్=సంచరించుచు, వ్యాత్తాస్యః=తెరవబడిన నోరు గలవాడై, సంవృద్ధః=వృద్ధిపొందిన, పావకః ఇవ=అగ్నివలె, లోకాన్=లోకములను, భక్షయేత్=భక్షించును.

తా. ఆ ఒక్క రోజున ఈ వీరుడు ఆకలిగొని నోరు తెరచుకొని భూమి మీద తిరుగుచు విజృంభించిన అగ్నివలె లోకములను భక్షించగలడు.29

మూ. సోఽసౌ వ్యసనమాపన్నః కుమ్భకర్ణమబోధయత్,
త్వత్పరాక్రమభీతశ్చ రాజా సంప్రతి రావణః. 30

ప్ర. అ. వ్యసనమ్=ఆపదను, ఆపన్నః=పొందిన, రాజా=రాజైన, సః=అట్టి, అసౌ=ఈ, రావణః=రావణుడు, త్వత్పరాక్రమభీతః చ=నీ పరాక్రమము వలన భయపడినవాడై, సంప్రతి=ఇప్పుడు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, అబోధయత్=మేల్కొలిపించెను.

తా. ఇప్పుడు కష్టములలో చిక్కుకొని నీ పరాక్రమమునకు భయపడిన రాక్షసరాజైన రావణుడు కుంభకర్ణుని నిద్రనుండి లేపించినాడు. 30

మూ. స ఏష నిర్గతో వీరః శిబిరాద్భీమవిక్రమః,
వానరాన్ భృశసంక్రుద్ధో భక్షయన్ పరిధావతి. 31

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, సః=అట్టి, ఏషః=ఈ, వీరః=వీరుడు, శిబిరాత్=సేనాశిబిరమునుండి, నిర్గతః=బయలుదేరినాడు. భృశసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన ఇతడు, వానరాన్=వానరులను, భక్షయన్=భక్షించుచు, పరిధావతి=పరుగెత్తుచున్నాడు.

తా. భయంకరమైన పరాక్రమముగల అట్టి ఈ వీరుడైన కుంభకర్ణుడు శిబిరమునుండి బయలుదేరినాడు. మిక్కిలి కోపించి ఇతడు వానరులను భక్షింపను పరుగెత్తి వచ్చుచున్నాడు (రానున్నాడు). 31

మూ. కుమ్భకర్ణం ప్రతీక్ష్యైవ హరయో౽ద్య ప్రదుద్రువుః,
కథమేనం రణే క్రుద్ధం వారయిష్యన్తి వానరాః. 32

ప్ర. అ. అద్య=ఇప్పుడు, హరయః=వానరులు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణునే, ప్రతీక్ష్యైవ=చూచియే, ప్రదుద్రువుః=పారిపోయినారు. రణే=యుద్ధమునందు, క్రుద్ధమ్=కోపించిన, ఏనమ్=వీనిని, వానరాః=వానరులు, కథమ్=ఎట్లు, వారయిష్యన్తి=నివారించగలరు ?

తా. ఈ వానరులు కుంభకర్ణుని చూడగానే పారిపోవుచున్నారు. యుద్ధములో క్రోధావిష్టుడైన ఇతనిని ఎట్లు నివారించగలరు ? 32

మూ. ఉచ్యన్తాం వానరాః సర్వే యన్త్రమేతత్సముచ్ఛ్రితమ్,
ఇతి విజ్ఞాయ హరయో భవిష్యన్తీహ నిర్భయాః. 33

ప్ర. అ. ఏతత్=ఇది, సముచ్ఛ్రితమ్=పైకి లేపబడిన, యన్త్రమ్=యంత్రము అని, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, ఉచ్యన్తామ్=చెప్పబడుదురు గాక. హరయః=వానరులు, ఇతి=ఇట్లు, విజ్ఞాయ=తెలిసికొని, నిర్భయాః=భయము లేనివారుగా, ఇహ=ఇప్పుడు, భవిష్యన్తి=కాగలరు.

తా. ఇది పైకి లేవదీయబడిన ఒక యంత్రము అని వానరులకు చెప్పుట మంచిది. అప్పుడు వానరుల భయము తొలగిపోవును. 33

మూ. విభీషణవచః శ్రుత్వా హేతుమత్సుముఖోద్గతమ్,
ఉవాచ రాఘవో వాక్యం నీలం సేనాపతిం తదా. 34

ప్ర. అ. సుముఖోద్గతమ్=వానరుల సుముఖత్వముకొరకై బయలుదేరిన (చెప్పబడిన), హేతుమత్=యుక్తియుక్తమైన, విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, రాఘవః=రాముడు, తదా=అప్పుడు, సేనాపతిమ్=సేనాపతియైన, నీలమ్=నీలుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వానరులు యుద్ధమునకు సుముఖులు అగుటకై విభీషణుడు యుక్తియుక్తముగా పలికిన మాటలు విని, అప్పుడు, రాముడు సేనాపతియైన నీలునితో ఇట్లనెను. 34

మూ. గచ్ఛ సైన్యాని సర్వాణి వ్యూహ్య తిష్ఠస్వ పావకే,
ద్వారాణ్యాదాయ లఙ్కాయాశ్చర్యాశ్చాప్యథ సఙ్క్రమాన్. 35

ప్ర. అ. పావకే=ఓ ! అగ్నికుమారా ! గచ్ఛ=వెళ్లుము; సర్వాణి=సమస్తమైన, సైన్యాని=సైన్యములను, వ్యూహ్య=మోహరించి, లఙ్కాయాః=లంకయొక్క, ద్వారాణి=ద్వారములను, చర్యాశ్చాపి=వీథులను, అథ=మరియు, సఙ్క్రమాన్=వంతెనలను, ఆదాయ=గ్రహించి, తిష్ఠ=ఉండుము.

తా. ఓ ! నీలుడా ! వెళ్లుము; సైన్యము లన్నింటినీ మోహరించి లంకాద్వారములను వీథులను, (రోడ్లను), వంతెనలను ఆక్రమించి ఉండుము.

మూ. శైలశృఙ్గాణి వృక్షాంశ్చ శిలాశ్చాప్యుపసంహర,
తిష్ఠన్తు సాయుధాః సర్వే వానరాః శైలపాణయః. 36

ప్ర. అ. శైలశృఙ్గాణి=పర్వతశిఖరములను, వృక్షాంశ్చ=వృక్షములను, శిలాశ్చాపి=శిలలను, ఉపసంహర=ప్రోగుచేయుము. సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, సాయుధాః=ఆయుధములతో కూడినవారై, శైలపాణయః= పర్వతములు హస్తములందు గలవారై, తిష్ఠన్తు=ఉందురుగాక.

తా. పర్వతశిఖరములను, వృక్షములను శిలలను ఒకచోట చేర్చుము. వానరులందరూ ఆయుధములు ధరించి, పర్వతములను చేతులలో గ్రహించి నిలచెదరుగాక. 36

మూ. రాఘవేణ సమాదిష్టో నీలో హరిచమూపతిః,
శశాస వానరానీకం యథావత్కపికుఞ్జరః. 37

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, సమాదిష్టః=ఆజ్ఞాపించబడిన, హరిచమూపతిః=వానరసేనానాయకుడైన, కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడైన, నీలః=నీలుడు, వానరానీకమ్=వానరసేనను, యథావత్=తగురీతిగా, శశాస=శాసించెను.

తా. వానరశ్రేష్ఠుడు, వానరసేనానాయకుడూ అయిన నీలుడు రాముని ఆజ్ఞ ప్రకారము వానరసేన తగు రీతిగా ఆ యా స్థానములందుండునట్లు నియమించెను. 37

మూ. తతో గవాక్షః శరభో హనూమానఙ్గదస్తథా,
శైలశృఙ్గాణి శైలాభా గృహీత్వా ద్వారమభ్యయుః. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శైలాభాః=పర్వతముల వంటి వారైన, గవాక్షః=గవాక్షుడు, శరభః=శరభుడు, హనూమాన్=హనుమంతుడు, తథా=మరియు, అఙ్గదః=అంగదుడు, శైలశృఙ్గాణి=పర్వతశిఖరములను, గృహీత్వా=గ్రహించి, ద్వారమ్=ద్వారమును, అభ్యయుః=చేరిరి.

తా. పిమ్మట పర్వతములవంటి శరీరములు గల గవాక్షుడు, శరభుడు,

హనుమంతుడు, అంగదుడు పర్వతశిఖరములు ధరించి ద్వారమువద్దకు వెళ్లిరి.

మూ. రామవాక్యముపశ్రుత్య హరయో జితకాశినః,
పాదపైరర్దయన్వీరా వానరాః పరవాహినీమ్. 39

ప్ర. అ. జితకాశినః=జయింపబడిన భయము గల, హరయః=వానరులు, రామవాక్యమ్=రాముని వాక్యమును, ఉపశ్రుత్య=విని (బయలుదేరిరి). వీరాః=వీరులైన, వానరాః=వానరులు, పాదపైః=వృక్షములచేత, పరవాహినీమ్=శత్రుసేనను, అర్దయన్=పీడించిరి.

తా. రాముని వాక్యమును విని భయము లేని ఆ వానరవీరులు వృక్షములచేత శత్రుసైన్యమును పీడించిరి. 39

మూ. తత్ హరీణాం తదనీకముగ్రం
రరాజ శైలోద్యతవృక్షహస్తమ్,
గిరేః సమీపానుగతం యథైవ
మహన్మహామ్భోధరజాలముగ్రమ్. 40

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శైలోద్యతవృక్షహస్తమ్=శైలములూ, ఎత్తబడిన వృక్షములూ హస్తములందు గల, హరీణామ్=వానరులయొక్క, ఉగ్రమ్=భయంకరమైన, తత్=ఆ సైన్యము, గిరేః=పర్వతముయొక్క, సమీపానుగతమ్=సమీపమును అనుసరించి ఉన్న, ఉగ్రమ్=భయంకరమైన, మహత్=పెద్దదైన, మహామ్భోధరజాలం యథైవ=మహామేఘముల సముదాయము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. చేతులలో వృక్షములు, పర్వతములు ఎత్తి నిలచిన ఆ భయంకరమైన వానరసైన్యము, పర్వతమునకు ప్రక్కగా చేరిన పెద్ద మేఘసముదాయము వలె ప్రకాశించెను. 40

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో అరువదిఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విషష్టితమః సర్గః

[కుంభకర్ణుడు రావణుని భవనమునకు వెళ్లుట. రాముని వలన ఏర్పడిన భయమును గూర్చి చెప్పి రావణుడు అతనిని శత్రుసేనావినాశము చేయుమని కోరుట.]

మూ. స తు రాక్షసశార్దూలో నిద్రామదసమాకులః,
రాజమార్గం శ్రియా జుష్టం యయౌ విపులవిక్రమః. 1

ప్ర. అ. విపులవిక్రమః=అధికమైన పరాక్రమము గల, సః=ఆ, రాక్షస శార్దూలః=రాక్షసశ్రేష్ఠుడు, నిద్రామదసమాకులః=నిద్రవలన కలిగిన మత్తుతో వ్యాకులుడై, శ్రియా=శోభతో, జుష్టమ్=కూడిన, రాజమార్గమ్=రాజమార్గమును, యయౌ=పొందెను.

తా. నిద్రమత్తులో ఉన్న అధికపరాక్రమశాలియైన రాక్షసశ్రేష్ఠుడైన ఆ కుంభకర్ణుడు శోభాయుక్తమైన రాజమార్గములో ప్రవేశించెను. 1

మూ. రాక్షసానాం సహస్రైశ్చ వృతః పరమదుర్జయః,
గృహేభ్యః పుష్పవర్షేణ కీర్యమాణస్తదా యయౌ. 2

ప్ర. అ. తదా=అప్పుడు, పరమదుర్జయః=మిక్కిలి జయింప శక్యము కాని ఆ కుంభకర్ణుడు, రాక్షసానామ్=రాక్షసులయొక్క, సహస్రైః=సహస్రములతో, వృతః=కూడినవాడై, గృహేభ్యః=గృహములనుండి, పుష్పవర్షేణ=పుష్పవర్షముచేత, కీర్యమాణః=చిమ్మబడుచున్నవాడై, యయౌ=వెళ్లెను.

తా. ఏ మాత్రమూ జయింప శక్యము కాని ఆ కుంభకర్ణుడు వేలకొలది రాక్షసులు వెంట రాగా, గృహములనుండి పుష్పవర్షము కురియుచుండగా వెళ్లెను. 2

మూ. స హేమజాలవితతం భానుభాస్వరదర్శనమ్,
దదర్శ విపులం రమ్యం రాక్షసేన్ద్రనివేశనమ్. 3

ప్ర. అ. సః=అతడు, హేమజాలవితతమ్=బంగారు కిటికీలతో వ్యాప్తమూ, భానుభాస్వరదర్శనమ్=సూర్యుడు వలె ప్రకాశించుచున్న దర్శనము కలదీ, విపులమ్=విశాలమూ, రమ్యమ్=సుందరమూ అయిన, రాక్షసేన్ద్రనివేశనమ్=రావణుని గృహమును, దదర్శ=చూచెను.

తా. అతడు విశాలమూ, రమ్యమూ అయిన రావణుని గృహమును చూచెను. బంగారు కిటికీలతో నిండిన ఆ గృహము సూర్యుడు వలె

ప్రకాశించుచుండెను. 3

మూ. స తత్తదా సూర్య ఇవాభ్రజాలం
ప్రవిశ్య రక్షోధిపతేర్నివేశనమ్,
దదర్శ దూరేఽగ్రజమాసనస్థం
స్వయంభువం శక్ర ఇవాసనస్థమ్. 4

ప్ర. అ. సః=ఆతడు, తదా=అప్పుడు, సూర్యః=సూర్యుడు, అభ్రజాలమ్ ఇవ=మేఘసముదాయమును వలె, రక్షోధిపతేః=రావణునియొక్క, నివేశనమ్=గృహమును, ప్రవిశ్య=ప్రవేశించి, దూరే=దూరమునందు, ఆసనస్థమ్=ఆసనమునందున్న, అగ్రజమ్=అన్నను, శక్రః=దేవేంద్రుడు, ఆసనస్థమ్=ఆసనమునందున్న, స్వయంభువమ్ ఇవ=బ్రహ్మదేవుని వలె, దదర్శ=చూచెను.

తా. అప్పుడు ఆతడు, సూర్యుడు మేఘసముదాయములో ప్రవేశించినట్లు రావణుని గృహములో ప్రవేశించి, ఆసనముపై కూర్చొని ఉన్న అన్నగారిని, దేవేంద్రుడు ఆసనముపై కూర్చున్న బ్రహ్మదేవుణ్ణి చూచినట్లు దూరమునుండి చూచెను. 4

మూ. భ్రాతుః స భవనం గచ్ఛన్ రక్షోగణసమన్వితః,
కుమ్భకర్ణః పదన్యాసైరకమ్పయత మేదినీమ్. 5

ప్ర. అ. రక్షోగణసమన్వితః=రాక్షసుల గణముతో కూడిన, సః కుమ్భకర్ణః=ఆకుంభకర్ణుడు, భ్రాతుః=సోదరునియొక్క, భవనమ్=గృహమునుగూర్చి, గచ్ఛన్=వెళ్లుచు, పదన్యాసైః=పాదన్యాసములచేత, మేదినీమ్=భూమిని, అకమ్పయత=కంపింపచేసెను.

తా. ఆ కుంభకర్ణుడు రాక్షసుల సముదాయముతో కలిసి సోదరుని గృహమునకు వెళ్లుచు పాదన్యాసములచేత భూమిని చలింపచేసెను. 5

మూ. సోఽభిగమ్య గృహం భ్రాతుః కక్ష్యామభివిగాహ్య చ,
దదర్శోద్విగ్నమాసీనం విమానే పుష్పకే గురుమ్. 6

ప్ర. అ. సః=ఆతడు, భ్రాతుః=సోదరునియొక్క, గృహమ్= గృహమును, అభిగమ్య=చేరి, కక్ష్యామ్=వాకిలిని, అభివిగాహ్య చ= ప్రవేశించి, పుష్పకే విమానే=పుష్పకవిమానమునందు, ఆసీనమ్=కూర్చొని ఉన్న, ఉద్విగ్నమ్=దిగులు చెందిన, గురుమ్=అన్నను, దదర్శ=చూచెను.

తా. ఆతడు సోదరుని ఇల్లు చేరి, వాకిలిలోనికి ప్రవేశించి, పుష్పకవిమానములో కూర్చొని ఉన్న, దిగులుచెందిన అన్నగారిని చూచెను. 6

మూ. అథ దృష్ట్వా దశగ్రీవః కుమ్భకర్ణముపస్థితమ్,
తూర్ణముత్థాయ సంహృష్టః సంనికర్షముపానయత్. 7

ప్ర. అ. అథ=అటుపిమ్మట, దశగ్రీవః=రావణుడు, ఉపస్థితమ్= వచ్చిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, దృష్ట్వా=చూచి, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్థాయ=లేచి, సంహృష్టః=సంతోషించినవాడై, సంనికర్షమ్= సమీపమును, ఉపానయత్=పొందించెను.

తా. పిమ్మట రావణుడు వచ్చిన కుంభకర్ణుని చూచి, వెంటనే సంతోషముతో లేచి తన దగ్గరకు రప్పించుకొనెను. 7

మూ. అథాసీనస్య పర్యఙ్కే కుమ్భకర్ణో మహాబలః,
భ్రాతుర్వవన్దే చరణౌ కిం కృత్యమితి చాబ్రవీత్. 8

ప్ర. అ. అథ=పిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః= కుంభకర్ణుడు, పర్యఙ్కే=పరుపు (సోఫా) మీద, ఆసీనస్య=కూర్చున్న, భ్రాతుః=సోదరునియొక్క, చరణౌ=పాదములను, వవన్దే=నమస్కరించెను. కిమ్=ఏమి, కృత్యమ్=పని, ఇతి చ=అని కూడ, అబ్రవీత్=పలికెను.

తా. పిదప మహాబలశాలియైన కుంభకర్ణుడు సోఫామీద కూర్చున్న అన్నగారికి పాదాభివందనము చేసి, "ఏమి చేయవలెను ?" అని ప్రశ్నించెను. 8

మూ. ఉత్పత్య చైనం ముదితో రావణః పరిషస్వజే,
స భ్రాత్రా సంపరిష్వక్తో యథావచ్చాభినన్దితః, 9
కుమ్భకర్ణః శుభం దివ్యం ప్రతిపేదే వరాసనమ్.

ప్ర. అ. రావణః=రావణుడు, ఉత్పత్య=ఎగిరి లేచి, ఏనమ్=ఇతనిని, పరిషస్వజే=కౌగలించుకొనెను. భ్రాత్రా=సోదరునిచేత, పరిష్వక్తః= కౌగలించుకొనబడిన, యథావత్=తగు విధముగా, అభినన్దితః= అభినందింపబడిన, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, శుభమ్=మంగళకరమైన, దివ్యమ్=ఉత్తమమైన, వరాసనమ్=శ్రేష్ఠమైన ఆసనమును, ప్రతిపేదే= పొందెను.

తా. రావణుడు శీఘ్రముగా లేచి అతనిని కౌగలించుకొనెను. సోదరుని చేత కౌగలించుకొనబడి తగు విధముగా అభినందింపబడిన ఆ కుంభకర్ణుడు మంగళప్రదము, ఉత్తమము, శ్రేష్ఠము అయిన ఆసనమును స్వీకరించెను. 9

మూ. స తదాసనమాశ్రిత్య కుమ్భకర్ణో మహాబలః, 10
సంరక్తనయనః క్రోధాద్రావణం వాక్యమబ్రవీత్

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు,

తత్=ఆ, ఆసనమ్=ఆసనమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, క్రోధాత్= కోపమువలన, సంరక్తనయనః=ఎఱ్ఱబడిన నేత్రములు కలవాడై, రావణమ్=రావణుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు ఆసనముపై కూర్చుండి, కోపముచేత కళ్లు ఎఱ్ఱబడగా రావణునితో ఇట్లు పలికెను. 10

మూ. కిమర్థమహమాదృత్య త్వయా రాజన్ ప్రబోధితః, 11
కంస కస్మాద్భయం తేఽత్ర కో వా ప్రేతో భవిష్యతి.

ప్ర. అ. రాజన్=రాజా! అహమ్=నేను, ఆదృత్య=ఆదరించి, త్వయా=నీచే, కిమర్థమ్=ఎందునిమిత్తము, ప్రబోధితః=మేల్కొలుపబడితిని? అత్ర=ఇక్కడ, తే=నీకు, కస్మాత్=ఎవనినుండి, భయమ్=భయము? శంస=చెప్పుము; కః వా=ఎవడు, ప్రేతః=మరణించినవాడు, భవిష్యతి=కాగలడు?

తా. రాజా! నీవు నన్ను ప్రయత్నపూర్వకముగా ఎందుకు మేల్కొలిపితివి? నీకు ఎవనివలన భయము వచ్చినదో, ఎవనిని చంపవలెనో చెప్పుము. 11

మూ. భ్రాతరం రావణః క్రుద్ధం కుమ్భకర్ణమవస్థితమ్, 12
రోషేణ పరివృత్తాభ్యాం నేత్రాభ్యాం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. రావణః=రావణుడు, క్రుద్ధమ్=కోపించిన, అవస్థితమ్= అక్కడ నున్న, భ్రాతరమ్=సోదరుడైన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని గూర్చి, రోషేణ=కోపము చేత, పరివృత్తాభ్యామ్=తిరిగిన, నేత్రాభ్యామ్=నేత్రములతో, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అక్కడనున్న క్రోధావిష్టుడైన సోదరుడైన కుంభకర్ణునితో రావణుడు కోపముచేత తిరుగుచున్న నేత్రములతో ఇట్లు పలికెను. 12

మూ. అయం తే సుమహాన్ కాలః శయానస్య మహాబల, 13
సుషుప్తస్త్వం న జానీషే మమ రామకృతం భయమ్.

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా ! శయానస్య=శయనించిన, తే=నీకు, అయమ్=ఇది, సుమహాన్=చాల అధికమైన, కాలః= కాలము. సుషుప్తః=నిద్రించిన, త్వమ్=నీవు, మమ=నాకు, రామకృతమ్=రామునిచేత చేయబడిన, భయమ్=భయమును గూర్చి, న జానీషే=ఎరుగవు.

తా. ఓ ! మహాబలవంతుడా ! నీవు చాల కాలము క్రితమే నిద్రించితివి. నిద్రించిన నీకు రామునివలన నాకు కలిగిన భయమును గూర్చి తెలియదు.13

మూ. ఏష దాశరథీ రామః సుగ్రీవసహితో బలీ, 14
సముద్రం లఙ్ఘయిత్వా తు కులం నః పరిక్షస్యతి.

ప్ర. అ. దాశరథిః=దశరథకుమారుడు, బలీ=బలవంతుడూ అయిన, ఏషః రామః=ఈ రాముడు, సుగ్రీవసహితః=సుగ్రీవసమేతుడై, సముద్రమ్=సముద్రమును, లఙ్ఘయిత్వా=దాటి, నః=మనయొక్క, కులమ్= కులమును, పరిక్షస్యతి=ఛేదించుచున్నాడు.

తా. దశరథకుమారుడైన బలశాలియైన ఈ రాముడు సుగ్రీవసహితుడై సముద్రమును దాటి వచ్చి మన కులమును ఛేదించుచున్నాడు. 14

మూ. హన్త పశ్యస్వ లఙ్కాయా వనాన్యుపవనాని చ, 15
సేతునా సుఖమాగత్య వానరైకార్ణవం కృతమ్.

ప్ర. అ. హన్త=అయ్యో ! పశ్యస్వ=చూడుము. లఙ్కాయాః= లంకయొక్క, వనాని=వనములు, ఉపవనాని చ=ఉద్యానములు, సేతునా= సేతువుచేత, సుఖమ్=సుఖముగా, ఆగత్య=వచ్చి, వానరైకార్ణవమ్= వానరు లనే ఏకసముద్రముగా, కృతమ్=చేయబడినది.

తా. వానరులు సేతువుచేత సుఖముగా వచ్చి లంకలోని వనములను, ఉద్యానములను వానరసముద్రమయముగా చేసినారు ; అయ్యో ! చూడుము !

మూ. యే రాక్షసా ముఖ్యతమా హతాస్తే వానరైర్యుధి, 16
వానరాణాం క్షయం యుద్ధే న పశ్యామి కథంచన,
న చాపి వానరా యుద్ధే జితపూర్వాః కదాచన. 17

ప్ర. అ. ముఖ్యతమాః=చాలా ముఖ్యులైన, యే రాక్షసాః=ఏ రాక్షసులు గలరో, తే=వారు, యుధి=యుద్ధమునందు, వానరైః=వానరులచేత, హతాః=చంపబడినారు. యుద్ధే=యుద్ధమునందు, వానరాణామ్= వానరులయొక్క, క్షయమ్=క్షయమును, కథంచన=ఏ విధముగానూ కూడ, న పశ్యామి=చూడను. వానరాః=వానరులు, యుద్ధే=యుద్ధమునందు, కదాచన=ఎన్నడూ, జితపూర్వాః=పూర్వము జయించబడినవారు, న చాపి= కారు.

తా. వానరులు యుద్ధములో ప్రధానులైన రాక్షసులను చంపివేసినారు. యుద్ధములో వానరు లెవ్వరూ ఏ విధముగానూ కూడా నశించుచున్నట్లు కనబడుటలేదు. వానరులు పూర్వము ఎన్నడూ యుద్ధములో ఓడిపోయినట్లు లేరు. 16, 17

మూ. తదేతద్భయముత్పన్నం త్రాయస్వేహ మహాబల,
నాశయ త్వమిమానద్య తదర్థం బోధితో భవాన్. 18

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా ! తత్=అట్టి, ఏతత్=ఈ, భయమ్=భయము, ఉత్పన్నమ్=పుట్టినది. ఇహ=ఇప్పుడు, త్రాయస్వ=రక్షించుము. త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, ఇమాన్=వీరిని, నాశయ=నశింపచేయుము. తదర్థమ్=దాని నిమిత్తమే, భవాన్=నీవు, బోధితః=లేపబడితివి.

తా. గొప్ప బలము కలవాడా ! ఇట్టి భయము ప్రాప్తించినది. నీవు ఈ విషయమున రక్షించుము. ఇప్పుడు వీళ్లనందరినీ నశింపచేయుము. అందుకొరకే నిన్ను మేల్కొలిపితిని. 18

మూ. సర్వక్షపితకోశం చ స త్వమభ్యుపపద్య మామ్,
త్రాయస్వేమాం పురీం లఙ్కాం బాలవృద్ధావశేషితామ్. 19

ప్ర. అ. సః త్వమ్=అట్టి నీవు, సర్వక్షపితకోశమ్=శూన్యముగా చేయబడిన సమస్తమైన ధనాగారము గల, మామ్=నన్ను, అభ్యుపపద్య=ఆదుకొని, బాలవృద్ధావశేషితామ్=బాలలూ వృద్ధులూ మాత్రమే మిగల్చబడిన, ఇమామ్=ఈ, లఙ్కాం పురీమ్=లంకాపురమును, త్రాయస్వ=రక్షించుము.

తా. అట్టి నీవు ధనాగార మంతా పూర్తిగా శూన్యమైపోయిన నన్ను ఆదుకొనుము. బాలురూ, వృద్ధులూ మాత్రమే మిగిలిన ఈ లంకాపురమును రక్షించుము. 19

మూ. భ్రాతురర్థే మహాబాహో కురు కర్మ సుదుష్కరమ్,
మయైవం నోక్తపూర్వో హి కశ్చిద్భ్రాతః పరన్తప. 20

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! భ్రాతుః అర్థే=సోదరుని నిమిత్తమై, సుదుష్కరమ్=చేయుటకు శక్యము కాని, కర్మ=పనిని, కురు=చేయుము. పరంతప=శత్రుసంహారకుడవైన, భ్రాతః=సోదరుడా ! మయా=నాచేత, కశ్చిత్=ఎవ్వడూ, ఏవమ్=ఇట్లు, న ఉక్తపూర్వః హి=పూర్వము చెప్పబడలేదు కదా ?

తా. గొప్ప బాహువులు గలవాడా ! చేయ శక్యము కాని ఈ గొప్ప పనిని నీవు నీ సోదరునికొరకై చేయవలెను. శత్రుసంహారకుడవైన ఓ ! సోదరా ! పూర్వము నే నెవ్వరినీ, ఎన్నడూ ఈ విధముగా కోరియుండలేదు. 20

మూ. త్వయ్యస్తి మమ చ స్నేహః పరా సంభావనా చ మే,
దైవాసురేషు యుద్ధేషు బహుశో రాక్షసర్షభ, 21
త్వయా దేవాః ప్రతివ్యూహ్య నిర్జితాశ్చాసురా యుధి.

ప్ర. అ. మమ=నాకు, త్వయి=నీయందు, స్నేహః=స్నేహము,

అస్తి=ఉన్నది. మే=నాకు, పరా=అధికమైన, సంభావనా చ= గౌరవము కూడ ఉన్నది. రాక్షసర్షభ=రాక్షసశ్రేష్ఠుడా ! దైవాసురేషు=దేవాసురు లకు సంబంధించిన, యుద్ధేషు=యుద్ధములయందు, ప్రతివ్యూహ్య=ఎదిరించి, త్వయా=నీచేత, దేవాః=దేవతలు, అసురాః=అసురులు, యుధి=యుద్ధమునందు, బహుశః=అనేకపర్యాయములు, నిర్జితాః=జయింపబడిరి.

తా. నాకు నీవిషయమున చాలా స్నేహము, గౌరవభావము కూడ ఉన్నవి. ఓ ! రాక్షసశ్రేష్ఠుడా ! నీవు అనేక పర్యాయములు దేవాసురయుద్ధములయందు వాళ్లను ఎదిరించి దేవతలను, అసురులను జయించితివి. 21

మూ. తదేతత్సర్వమాతిష్ఠ వీర్యం భీమపరాక్రమ, 22
న హి తే సర్వభూతేషు దృశ్యతే సదృశో బలీ.

ప్ర. అ. భీమపరాక్రమ=భయంకరమైన పరాక్రమము గలవాడా ! తత్=అ కారణమువలన, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తమైన, వీర్యమ్=పరాక్రమ మును, ఆతిష్ఠ=అవలంబించుము. సర్వభూతేషు=అన్ని ప్రాణులయందు, తే=నీకు, సదృశః=సమానుడైన, బలీ=బలవంతుడు, న దృశ్యతే హి= చూడబడుటలేదు కదా ?

తా. భయంకరమైన పరాక్రమముగలవాడా! అందువలన, నీ పరాక్ర మమును అంతనూ చూపుము. నీవంటి బలముగలవాడు ఏ ప్రాణులలోను లేడుకదా? 22

మూ. కురుష్వ మే ప్రియహితమేతదుత్తమం
యథాప్రియం ప్రియరణ బాన్ధవప్రియ,
స్వతేజసా విధమ సపత్నవాహినీం
శరద్ఘనం పవన ఇవోద్యతో మహాన్. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. ప్రియరణ=ప్రియమైన యుద్ధము గలవాడా ! బాన్ధవప్రియ= బంధువులు ప్రియులుగా కలవాడా ! మే=నాకు, ప్రియహితమ్=ప్రియమూ హితమూ అయిన, ఏతత్=ఈ కార్యమును, యథాప్రియమ్=ప్రియముగా ఉండు విధమున, కురుష్వ=చేయుము. స్వతేజసా=నీ తేజస్సుచేత, సపత్నవాహినీమ్= శత్రు సైన్యమును, ఉద్యతః=విజృంభించిన, మహాన్=గొప్ప, పవనః= వాయువు, శరద్ఘనమ్ ఇవ=శరత్కాలమేఘమును వలె, విధమ=ఎగురగొట్టుము.

తా. యుద్ధమునందు ఆసక్తి కలవాడవు, బంధువులయందు ప్రేమ ఉన్నవాడవు అయిన ఓ ! సోదరా ! నాకు ప్రియము, హితము అయిన ఈ

కార్యమును, నీకు ఎట్లు ప్రియ మగునో ఆ విధముగా చేయుము. విజృంభించిన గొప్ప వాయువు శరత్కాలమేఘమును ఎగురగొట్టినట్లు, నీ తేజస్సుచేత శత్రుసేనను ఎగురగొట్టివేయుము. 23

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిషష్టితమః సర్గః

[కుంభకర్ణుడు రావణుడు చేసిన పెడపనములకు ఇలవని మొదట నిందించుట, చివరకు తన యుద్ధోత్సాహమును ప్రకటించుట.]

మూ. తస్య రాక్షసరాజస్య నిశమ్య పరిదేవితమ్,
కుమ్భకర్ణో బభాషేదం వచనం ప్రజహాస చ. 1

ప్ర. అ. తస్య=ఆ, రాక్షసరాజస్య=రావణునియొక్క, పరిదేవితమ్=ఏడ్పును, నిశమ్య=విని, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఇదం వచనమ్=ఈ వాక్యమును, బభాషే=పలికెను. ప్రజహాస చ=బిగ్గరగా నవ్వెను కూడ.

తా. ఆ రావణుడు దుఃఖములో పలికిన దీనవాక్యములను విని కుంభకర్ణుడు బిగ్గరగా నవ్వి ఇట్లు పలికెను. 1

మూ. దృష్టో దోషో హి యోఽస్మాభిః పురా మన్త్రవినిర్ణయే,
హితేష్వనభియుక్తేన సోఽయమాసాదితస్త్వయా. 2

ప్ర. అ. పురా=పూర్వము, మన్త్రవినిర్ణయే=మంత్రవినిర్ణయసమయము నందు, అస్మాభిః=మనచేత, యః=ఏ, దోషః=దోషము, దృష్టః=చూడబడినదో, సః అయమ్=అట్టి ఈ దోషము, హితేషు=హితులయందు, అనభియుక్తేన=శ్రద్ధ లేని, త్వయా=నీచేత, ఆసాదితః=పొందబడినది.

తా. పూర్వము మంత్రణముచేసి నప్పుడు మనము ఏ దోషమును (ఆపదను) ఊహించితిమో అదే ఈనాడు, హితుల మాటలను లక్ష్యముచేయని నీకు సంప్రాప్తించినది. 2

మూ. శీఘ్రం ఖల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః,
నిరయేష్వేవ పతనం యథా దుష్కృతకర్మణః. 3

ప్ర. అ. దుష్కృతకర్మణః=పాపాత్మునకు, నిరయేషు=నరకములయందు, పతనమేవ=పడుటయే, యథా=ఎట్లో, అట్లే, పాపస్య=పాపమైన, కర్మణః=కర్మ యొక్క, ఫలమ్=ఫలము, త్వామ్=నిన్ను, శీఘ్రమ్=శీఘ్రముగా, ఉపేతం ఖలు=చేరినది కదా.

తా. పాపాత్మునకు నరకములో పడుట ఎట్లు సంప్రాప్తించునో అట్లే నీకు పాపకర్మఫలము సంప్రాప్తించినది. 3

మూ. ప్రథమం వై మహారాజ కృత్యమేతదచిన్తితమ్,
కేవలం వీర్యదర్పేణ నానుబన్ధో విచిన్తితః. 4

ప్ర. అ. మహారాజ=మహారాజా ! ఏతత్=ఈ, కృత్యమ్=కృత్యము, ప్రథమమ్=ముందుగా, అచిన్తితమ్=ఆలోచింపబడలేదు. కేవలమ్=కేవలము, వీర్య దర్పేణ=వీర్యగర్వముచేత, అనుబన్ధః=ఆ కార్యమును అనుసరించి వచ్చు ఫలము, న విచిన్తితః=ఆలోచింపబడలేదు.

తా. మహారాజా ! ఈ కార్యమును గూర్చి ముందుగా ఆలోచన చేయలేదు. పరాక్రమగర్వముచేత కలుగబోవు ఫలితమును గూర్చి ఆలోచించలేదు.

మూ. యః పశ్చాత్పూర్వకార్యాణి కుర్యాదైశ్వర్యమాస్థితః,
పూర్వం చోత్తరకార్యాణి న స వేద నయానయౌ. 5

ప్ర. అ. యః=ఎవడు, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, ఆస్థితః= అవలంబించినవాడై, పూర్వకార్యాణి=ముందు చేయవలసిన పనులను, పశ్చాత్=తరువాత, కుర్యాత్=చేయునో, ఉత్తరకార్యాణి=తరువాత చేయవలసిన పనులను, పూర్వం చ=పూర్వము చేయునో, సః=అతడు, నయానయౌ=నీతిని, దుర్నీతిని, న వేద=ఎరుగడు.

తా. బల మున్నది కదా అని ముందు చేయవలసిన పనులు తరవాత, తరవాత చేయవలసిన పనులు ముందూ చేయువాడు ఏది నీతియో ఏది కాదో తెలిసికొనజాలడు. 5

మూ. దేశకాలవిహీనాని కర్మాణి విపరీతవత్,
క్రియమాణాని దుష్యన్తి హవీంష్యప్రయతేష్వివ. 6

ప్ర. అ. దేశకాలవిహీనాని=దేశకాలములు లేని, విపరీతవత్=విపరీతముగా, క్రియమాణాని=చేయబడుచున్న, కర్మాణి=కర్మలు, అప్రయతేషు= అపవిత్రులయందు, హవీంషి ఇవ=హవిస్సులు వలె, దుష్యన్తి=చెడిపోవును.

తా. దేశకాలములు అనుకూలముగా ఉన్నవా లేదా అని చూచుకొనకుండా, విపరీతముగా చేయు పనులు అపవిత్రుల చేతిలోని హవిస్సులు వలె చెడిపోవును.

మూ. త్రయాణాం పఞ్చధా యోగం కర్మణాం యః ప్రపద్యతే,
సచివైః సమయం కృత్వా స సమ్యగ్వర్తతే. 7

ప్ర. అ. యః=ఎవడు, సచివైః=మంత్రులతో, సమయమ్= నిశ్చయరూపమైన సిద్ధాంతమును (విచారమును), కృత్వా=చేసి, త్రయాణామ్=క్షయము, వృద్ధి, స్థానము (ఉన్నదానిని ఉన్నట్లుగా చూచుకొనుట) అని మూడు విధములైన

ఫలితములు గల, లేదా ఉత్తమము, మధ్యమము, అధమము అని మూడు విధములైన, కర్మణామ్=కర్మలయొక్క, పఞ్చధా=అయిదువిధములతో, యోగమ్= ప్రయోగమును, ప్రపద్యతే=పొందునో (చేయునో), సః=అతడు, సమ్యక్= బాగుగా, పథి=మార్గమునందు, వర్తతే=ఉంటున్నాడు.

తా. ఎవడు మంత్రులతో బాగా ఆలోచించి, మూడు విధములైన కర్మలను ఐదువిధాలైన సాధనాలతో సాధించుకొనునో అతడే మంచి నీతిమార్గమునం దున్నవాడు.

వి. తనకు అభివృద్ధి, శత్రువునకు క్షయము కలుగు సమయమునందు చేయబడు దండోపయుక్తమైన యానము (శత్రువుమీదికి దాడి చేయుట) ఉత్తమకర్మ. తన బలము శత్రుబలము సమముగా ఉన్నప్పుడు చేయబడు సంధి మధ్యమకర్మ. పరునకు అభివృద్ధి తనకు క్షయము కలుగునపుడు దానపూర్వకముగా సామము నాశ్రయించుట అధమకర్మ. కర్మలను ఆరంభించు ఉపాయము, పురుషద్రవ్యసంపద, దేశకాలములను సరిగా గుర్తించుట, ఆపదలకు ప్రతిక్రియ చేసికొనుట, కార్యసిద్ధి అనునవి అయిదు. 7

మూ. యథాగమం చ యో రాజా సమయం చ చికీర్షతి,
బుధ్యతే సచివైర్బుద్ధ్యా సుహృదశ్చానుపశ్యతి. 8

ప్ర. అ. యః=ఏ, రాజా=రాజు, యథాగమం చ=శాస్త్రానుసారముగా, సమయం చ=నిర్ణయమును, చికీర్షతి=చేయదలచునో, బుద్ధ్యా= బుద్ధిచేతను, సచివైః=మంత్రులతోను, బుధ్యతే=తెలుసుకుంటాడో, సుహృదశ్చ=స్నేహితులను కూడ, అనుపశ్యతి=చూచునో (అతడు మంచిమార్గమునం దున్నాడు).

తా. మంచి నీతిమార్గమునం దున్న రాజు శాస్త్రానుసారము నిర్ణయమును చేయును. తన బుద్ధితో ఆలోచించి, మంత్రులతోను, మిత్రులతోను కూడ ఆలోచన చేయును. 8

మూ. ధర్మమర్థం చ కామం చ సర్వాన్వా రక్షసాం పతే,
భజతే పురుషః కాలే త్రీణి ద్వన్ద్వాని వా పునః. 9

ప్ర. అ. రక్షసాం పతే=రాక్షసరాజా ! పురుషః=పురుషుడు, ధర్మమ్= ధర్మమును, అర్థం చ=అర్థమును, కామం చ=కామమును, సర్వాన్వా= అన్నిం టిని గాని, త్రీణి=మూడు, ద్వన్ద్వాని వా=ద్వంద్వములను గాని, కాలే=తగిన కాలమునందు, భజతే=సేవించును.

తా. రాక్షసరాజా ! బుద్ధిమంతుడైన పురుషుడు ధర్మార్థకామములను వేరువేరుగా గాని, అన్నింటినీ గాని, ధర్మార్థములు, ధర్మకామములు, అర్థకామములు అను మూడు ద్వంద్వములను గాని కాలానుసారముగా సేవించవలెను. 9

మూ. త్రిషు చైతేషు యచ్ఛ్రేష్ఠం శ్రుత్వా తన్నావబుధ్యతే,
రాజా వా రాజమాత్రో వా వ్యర్థం తస్య బహు శ్రుతమ్. 10

ప్ర. అ. రాజా వా=ఏ రాజు గాని, రాజమాత్రో వా=రాజువంటివాడు గాని, ఏతేషు=ఈ, త్రిషు=మూడింటియందు, యత్=ఏది, శ్రేష్ఠమ్= శ్రేష్ఠమైనదో, శ్రుత్వా=విని, తత్=దానిని, నావబుధ్యతే=తెలిసికొనడో, తస్య=వానియొక్క, బహు=అధికమైన, శ్రుతమ్=శాస్త్రజ్ఞానము, వ్యర్థమ్=వ్యర్థమైనది.

తా. ధర్మార్థకామములలో ఏది ఏ సమయమునందు శ్రేష్ఠమైనదో తెలిసికొనని రాజు గాని, రాజసదృశుడుగాని చేసిన శాస్త్రాభ్యాసము వ్యర్థము.10

మూ. ఉపప్రదానం సాన్త్వం చ భేదం కాలే చ విక్రమమ్,
యోగం చ రక్షసాం శ్రేష్ఠ తావుభౌ చ నయానయౌ. 11
కాలే ధర్మార్థకామాన్యః సంమన్త్ర్య సచివైః సహ,
నిషేవేతాత్మవాన్ లోకే న స వ్యసనమాప్నుయాత్. 12

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులలో, శ్రేష్ఠ=శ్రేష్ఠుడా ! యః=ఎవడు, ఉపప్రదానమ్=దానమును, సాన్త్వం చ=సామమును, భేదం చ=భేదమును, కాలే=తగు కాలమునందు, విక్రమం చ=పరాక్రమమును, యోగం చ= ఐదు విధములైన కర్మారంభోపాయము మొదలైన ప్రయోగసాధనముల సంపాదనమును, ఉభౌ=రెండు, తౌ=ఆ, నయానయౌ=నీతిని అనయమును, కాలే=తగు సమయమునందు, ధర్మార్థకామాన్=ధర్మార్థకామములను, సచివైః సహ=మంత్రులతో కూడ, సంమన్త్ర్య=ఆలోచించి, నిషేవేత=సేవించునో, ఆత్మవాన్=బుద్ధిమంతుడైన, సః=అతడు, వ్యసనమ్=వ్యసనమును, నాప్నుయాత్=పొందడు.

తా. మంత్రులతో కూడ ఆలోచించి దానమును, సామమును, భేదమును, తగు సమయమునందు పరాక్రమమును, కర్మారంభోపాయము మొదలైన పంచవిధసాధనముల యోగమును, కాలానుగుణముగా ధర్మార్థకామములను సేవించు బుద్ధిమంతుడు లోకములో ఆపదలు పొందడు. 11, 12

మూ. హితానుబన్ధమాలోక్య కుర్యాత్కార్యమిహాత్మనః,
రాజా సహార్థతత్త్వజ్ఞైః సచివైర్బుద్ధిజీవిభిః. 13

ప్ర. అ. రాజా=రాజు, అర్థతత్త్వజ్ఞైః=కార్యముల యథార్థస్వరూపమును ఎరిగిన, బుద్ధిజీవిభిః=బుద్ధిబలముచేత జీవించు, సచివైః సహ=మంత్రులతో కూడ, ఆత్మనః=తనయొక్క, హితానుబన్ధమ్=హితముయొక్క సంబంధమును, ఆలోక్య=చూచి, ఇహ=ఇక్కడ, కార్యమ్=కార్యమును, కుర్యాత్=చేయవలెను.

తా. రాజు కార్యముల యథార్థస్వరూపము తెలిసిన బుద్ధిజీవులైన

మంత్రులతో కలిసి ఎట్లు చేసిన తనకు హితము కలుగునో ఆలోచించుకొని కార్యములు చేయవలెను. 13

మూ. అనభిజ్ఞాయ శాస్త్రార్థాన్ పురుషాః పశుబుద్ధయః,
ప్రాగల్భ్యాద్వక్తుమిచ్ఛన్తి మన్త్రేష్వభ్యన్తరీకృతాః. 14

ప్ర. అ. మన్త్రేషు=ఆలోచనలయందు, అభ్యన్తరీకృతాః= ప్రవేశముకలవారుగా చేయబడిన, పశుబుద్ధయః=పశువులవంటి బుద్ధులు గల, పురుషాః=పురుషులు, శాస్త్రార్థాన్=శాస్త్రవిషయములను, అనభిజ్ఞాయ=తెలిసికొనకుండగా, ప్రాగల్భ్యాత్=ప్రాగల్భ్యమువలన, వక్తుమ్=చెప్పుటకు, ఇచ్ఛన్తి=కోరుచుందురు.

తా. పశువులవంటి బుద్ధి గల వారికి ఆలోచనలు చేయునప్పుడు అవకాశమిచ్చినచో వాళ్లు శాస్త్రవిషయములు తెలిసికొనకుండగా ప్రాగల్భ్యమువలన ఏమేమో చెప్పుచుందురు. 14

మూ. అశాస్త్రవిదుషాం తేషాం కార్యం నాభిహితం వచః,
అర్థశాస్త్రానభిజ్ఞానాం విపులాం శ్రియమిచ్ఛతామ్. 15

ప్ర. అ. అశాస్త్రవిదుషామ్=శాస్త్రములను ఎరుగనివారు, అర్థశాస్త్రానభిజ్ఞానామ్=అర్థశాస్త్రము తెలియనివారూ, విపులామ్= అధికమైన, శ్రియమ్=ఐశ్వర్యమును, ఇచ్ఛతామ్=కోరుచున్నవారూ అయిన, తేషామ్=వారియొక్క, అభిహితమ్=చెప్పబడిన, వచః=వచనము, న కార్యమ్=చేయదగినది కాదు.

తా. శాస్త్రజ్ఞానము లేక, అర్థశాస్త్రము ఎరుగక అధికమైన ఐశ్వర్యమును మాత్రము కోరుచుండు అట్టివాళ్లు చెప్పిన విధముగా చేయకూడదు. 15

మూ. అహితం చ హితాకారం ధార్ష్ట్యాజ్జల్పన్తి యే నరాః,
అవశ్యం మన్త్రిబాహ్యాస్తే కర్తవ్యాః కృత్యదూషకాః. 16

ప్ర. అ. యే=ఏ, నరాః=మనుష్యులు, హితాకారమ్=హితమువంటి ఆకారము గల, అహితమ్=అహితమును, ధార్ష్ట్యాత్=ధార్ష్ట్యమువల (మొండితనమువలన), జల్పన్తి=చెప్పుదురో, కృత్యదూషకాః=పనులను దూషించు, తే=వాళ్లు, అవశ్యమ్=తప్పక, మన్త్రిబాహ్యాః=మంత్రములకు దూరముగా, కర్తవ్యాః=చేయదగినవారు.

తా. ఏ మానవులు హితమువలె కనబడు అహితమును ధార్ష్ట్యమువలన ఉపదేశించుచుందురో వారిని కార్యాలోచనలనుండి దూరముగా ఉంచవలెను. అట్టివాళ్లు కార్యములను పాడుచేయుదురు. 16

మూ. వినాశయన్తో భర్తారం సహితాః శత్రుభిర్బుధైః,
విపరీతాని కృత్యాని కారయన్తీహ మన్త్రిణః. 17

ప్ర. అ. ఇహ=ఇక్కడ, మన్త్రిణః=మంత్రులు, భర్తారమ్=ప్రభువును, వినాశయన్తః=నశింపచేయుచు, బుధైః=పండితులైన, శత్రుభిః=శత్రువులతో, సహితాః=కూడినవారై, విపరీతాని=విపరీతములైన, కృత్యాని=కృత్యములను, కారయన్తి=చేయించుచుందురు.

తా. కొందరు మంత్రులు పండితులైన శత్రువులతో కలిసి తమ ప్రభువునకు అపకారము చేయుచు అతనిచేత చెడ్డపనులు చేయించుచుందురు.

మూ. తాన్ భర్తా మిత్రసంకాశానమిత్రాన్ మన్త్రనిర్ణయే,
వ్యవహారేణ జానీయాత్సచివానుపసంహితాన్. 18

ప్ర. అ. భర్తా=ప్రభువు, ఉపసంహితాన్=లంచము మొదలైనవాటిచేత మార్పుచేయబడినవారు, మిత్రసంకాశాన్=మిత్రులతో సమానులు, అమిత్రాన్=అమిత్రులు అయిన, తాన్=అట్టి, సచివాన్=మంత్రులను, మన్త్రనిర్ణయే=మంత్రమును నిర్ణయించునపుడు, వ్యవహారేణ=వ్యవహారముచేత, జానీయాత్=తెలిసికొనవలెను.

తా. శత్రువులనుండి లంచము మొదలైనవి తీసికొని మారిపోయిన, పైకి - మిత్రులువలె కనబడు అమిత్రులైన మంత్రులను రాజు మంత్రమును నిర్ణయించు సమయమునందు, వారి వ్యవహారమును బట్టి గుర్తించవలెను. 18

మూ. చపలస్యేహ కృత్యాని సహసానుప్రధావతః,
ఛిద్రమన్యే ప్రపద్యన్తే క్రౌఞ్చస్య ఖమివ ద్విజాః. 19

ప్ర. అ. చపలస్య=చపలుడు, కృత్యాని=కృత్యములను, సహసా=శీఘ్రముగా, అనుప్రధావతః=అనుసరించి పరుగెత్తువాడు అయిన వానియొక్క, ఛిద్రమ్=ఛిద్రమును, క్రౌఞ్చస్య=క్రౌంచపర్వతముయొక్క, ఖమ్=ఆకాశమును (రంధ్రమును), ద్విజాః ఇవ=పక్షులు వలె, అన్యే=ఇతరులు, ప్రపద్యన్తే=పొందెదరు.

తా. చపలచిత్తుడై తొందరపడి పనులుచేయువానిలో ఉండు లోపాలను, (కుమారస్వామి బాణము ప్రయోగించి చేసిన) క్రౌంచపర్వతరంధ్రములో పక్షులు ప్రవేశించినట్లు, శత్రువులు తమకు అనుకూలముగా ఉండునట్లు చేసికొనుచుందురు. 19

మూ. యో హి శత్రుమవజ్ఞాయ నాత్మానమభిరక్షతి,
అవాప్నోతి హి సోఽనర్థాన్ స్థానాచ్చ వ్యవరోప్యతే. 20

ప్ర. అ. యః=ఎవడు, శత్రుమ్=శత్రువును, అవజ్ఞాయ= అనాదరముచేసి, ఆత్మానమ్=తనను, నాభిరక్షతి=రక్షించుకొనడో, సః= అతడు, అనర్థాన్=అనర్థములను, అవాప్నోతి హి=పొందును కదా. స్థానాత్=స్థానమునుండి, వ్యవరోప్యతే చ=దింపివేయబడును కూడ.

తా. శత్రువు విషయమున అనాదరము చూపుచు తనను రక్షించుకొననివాడు అనర్థములను పొందును. తన స్థానమునుండి దింపివేయబడును.

మూ. యదుక్తమిహ తే పూర్వం క్రియతామనుజేన చ,
తదేవ నో హితం వాక్యం యదిచ్ఛసి చ తత్కురు. 21

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, తే=నీకు, అనుజేన=తమ్ముడైన విభీషణునిచేత, యత్=ఏది, ఉక్తమ్=చెప్పబడినదో అది, క్రియతామ్=చేయబడుగాక. నః=మనకు, తత్=ఆ, వాక్యమేవ=వాక్యమే, హితమ్=హితమైనది. యత్=దేనిని, ఇచ్ఛసి=కోరుచున్నావో, తత్=దానిని, కురు=చేయుము.

తా. నీకు పూర్వము విభీషణుడు చెప్పినట్లు చేయుము. మనకు అదే హితమైనది. అట్లు కానిచో నీకు ఏది ఇష్టమో అది చేయుము. 21

మూ. తత్తు శ్రుత్వా దశగ్రీవః కుమ్భకర్ణస్య భాషితమ్,
భ్రుకుటిం చైవ సంచక్రే క్రుద్ధశ్చైనమభాషత. 22

ప్ర. అ. దశగ్రీవః తు=రావణుడైతే, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, తత్=ఆ, భాషితమ్=మాటను, శ్రుత్వా=విని, భ్రుకుటిమ్= భ్రుకుటిని (కనుబొమ్మల విరుపును), సంచక్రే=చేసెను. క్రుద్ధః= కోపించినవాడై, ఏనమ్=వీనినిగూర్చి, అభాషత=పలికెను.

తా. కుంభకర్ణుని మాటలు విని రావణుడు కోపముతో కనుబొమ్మలు విరచి ఇట్లనెను. 22

మూ. మాన్యో గురురివాచార్యః కిం మాం త్వమనుశాససే,
కిమేవం వాక్శ్రమం కృత్వా కాలే యుక్తం విధీయతామ్. 23

ప్ర. అ. మాన్యః=గౌరవింపదగిన, గురుః=పెద్దవాడైన, ఆచార్యః ఇవ= ఆచార్యునివలె, త్వమ్=నీవు, మామ్=నన్ను, కిమ్=ఎందువలన, అనుశాససే=ఉపదేశించుచున్నావు. ఏవమ్=ఇట్లు, వాక్శ్రమమ్= వాగింద్రియమునకు శ్రమను, కృత్వా=చేసి, కిమ్=ఏమి ప్రయోజనము ? కాలే=కాలమునందు, యుక్తమ్=యుక్తమైనపని, విధీయతామ్=చేయబడుగాక.

తా. గౌరవింపదగిన పెద్ద ఆచార్యుడు వలె నాకు ఉపదేశించుచున్నా

వేమిటి ! అనవసరముగా మాటలాడి ఎందుకు శ్రమపడెదవు ? ఈ సమయమున ఏది చేయుట యుక్తమో అది చేయుము. 23

మూ. విభ్రమాచ్చిత్తమోహాద్వా బలవీర్యాశ్రయేణ వా,
నాభిపన్నమిదానీం యద్వ్యర్థా తస్య పునః కథా. 24

ప్ర. అ. విభ్రమాత్=భ్రాంతివలననో, చిత్తమోహాద్వా=చిత్తముయొక్క మోహమువలననో, బలవీర్యాశ్రయేణ వా=బలముయొక్క, పరాక్రమముయొక్క ఆశ్రయమువలననో, యత్=ఏది, నాభిపన్నమ్=తెలియబడలేదో, తస్య=దానియొక్క, ఇదానీమ్=ఇప్పుడు, పునః కథా=మరల చెప్పుట, వ్యర్థా=వ్యర్థమైనది.

తా. భ్రాంతివలననో, చిత్తమోహమువలననో, బలపరాక్రమములు చూచుకొని పూర్వము తెలియక చేసినదానిని గూర్చి ఇప్పుడు చర్చించుట అనావశ్యకము. 24

మూ. అస్మిన్ కాలే తు యద్యుక్తం తదిదానీం విచిన్త్యతామ్,
గతం తు నానుశోచన్తి గతం తు గతమేవ హి. 25

ప్ర. అ. అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, యత్=ఏది, యుక్తమ్=యుక్తమో, తత్=అది, ఇదానీమ్=ఇప్పుడు, విచిన్త్యతామ్=ఆలోచింపబడుగాక. గతమ్=గడచిపోయినదానిని గూర్చి, న అనుశోచన్తి=విచారింపరు. గతమ్=గడచిపోయినది, గతమేవ హి=గడచిపోయినదే కదా ?

తా. ఈ సమయమునందు ఏది యుక్తమో దానిని గూర్చి ఆలోచింపుము. బుద్ధిమంతులు అయిపోయినదానిని గూర్చి ఆలోచింపరు. గడచిపోయినది గడచిపోయినదే. 25

మూ. మమాపనయజం దుఃఖం విక్రమేణ సమీకురు,
యది ఖల్వస్తి మే స్నేహో విక్రమం వాధిగచ్ఛసి, 26
యది కార్యం మమైతత్తే హృది కార్యతమం మతమ్.

ప్ర. అ. మే=నాయొక్క, స్నేహః=స్నేహము, అస్తి ఖలు యది=ఉన్నట్లయితే, విక్రమమ్=పరాక్రమమును, అధిగచ్ఛసి వా=పొందినట్లయితే, మమ=నాయొక్క, ఏతత్=ఈ, కార్యమ్=కార్యము, తే హృది=నీ హృదయమునందు, కార్యతమమ్=తప్పక చేయదగినదిగా, మతం యది=ఇష్టమైనట్లయితే, మమ=నాయొక్క, అపనయజమ్=దుర్నీతివలన కలిగిన, దుఃఖమ్=దుఃఖమును, విక్రమేణ=పరాక్రమముచేత, సమీకురు=సమమైనదానినిగా చేయుము.

తా. నీకు నాయందు స్నేహమున్నచో, నీ కెంతటి పరాక్రమ మున్నదో తెలిసికొన్నచో, ఈ నా కార్యము తప్పక చేయదగినది అని నీ మనస్సు

అంగీకరించినచో, నా పొరబాటువలన కలిగిన దుఃఖమును నీ పరాక్రమముచేత సరిచేయుము. 26

మూ. స సుహృద్యో విపన్నార్థం దీనమభ్యవపద్యతే, 27
స బన్ధుర్యోఽపనీతేషు సాహాయ్యాయోపకల్పతే.

ప్ర. అ. యః=ఎవడు, విపన్నార్థమ్=చెడిపోయిన పని గల, దీనమ్=దీనుణ్ణి, అభ్యవపద్యతే=ఆదుకొనునో, సః=అతడే, సుహృత్=స్నేహితుడు. యః=ఎవడు, అపనీతేషు=నీతితప్పిన వారివిషయమున, సాహాయ్యాయ=సాహాయ్యముకొరకు, ఉపకల్పతే=ఉపయోగించునో, సః= అతడే, బన్ధుః=బంధువు.

తా. పని చెడిపోయిన దీనుణ్ణి ఆదుకొనువాడే స్నేహితుడు. నీతి తప్పిన వానికి సాహాయ్యము చేయుటకు ముందుకు వచ్చువాడే బంధువు.27

మూ. తమథైవం బ్రువాణం స వచనం ధీరదారుణమ్, 28
రుష్టోఽయమితి విజ్ఞాయ శనైః శ్లక్ష్ణమువాచ హ.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ఏవమ్=ఈ విధముగా, ధీరదారుణమ్=ధైర్యములో కూడిన భయంకరమైన, వచనమ్=వచనమును, బ్రువాణమ్= పలుకుచున్న, తమ్=ఆ రావణుణ్ణి, అయమ్=ఇతడు, రుష్టః= కోపించినాడు, ఇతి=అని, విజ్ఞాయ=తెలిసికొని, సః=అతడు, శనైః=మెల్లగా, శ్లక్ష్ణమ్=మృదువుగా, ఉవాచ హ=పలికెను.

తా. పిమ్మట కుంభకర్ణుడు ఈ విధముగా ధీరము, భయంకరము అయిన మాటలు పలుకుచున్న రావణుని మాటలు విని, అతడు కోపించినాడు అని తెలిసికొని మెల్లగా, మృదువుగా మాటలాడెను. 28

మూ. అతీవ హి సమాలక్ష్య భ్రాతరం క్షుభితేన్ద్రియమ్, 29
కుమ్భకర్ణః శనైర్వాక్యం బభాషే పరిసాన్త్వయన్.

ప్ర. అ. భ్రాతరమ్=సోదరుణ్ణి, అతీవ=మిక్కిలి, క్షుభితేన్ద్రియమ్= క్షోభచెందిన ఇంద్రియములు కలవానినిగా, సమాలక్ష్య=చూచి, కుమ్భకర్ణః= కుంభకర్ణుడు, పరిసాన్త్వయన్=ఓదార్చుచు, శనైః=మెల్లగా, వాక్యమ్= వాక్యమును, బభాషే=పలికెను.

తా. తన సోదరుడు మనస్సులో చాల క్షోభ చెందుచున్నట్లు గ్రహించి, కుంభకర్ణుడు అతనికి ధైర్యము చెప్పుచు మెల్లగా ఇట్లు పలికెను. 29

మూ. శృణు రాజన్నవహితో మమ వాక్యమరిందమ, 30
అలం రాక్షసరాజేన్ద్ర సన్తాపముపపద్య తే,

రోషం చ సంపరిత్యజ్య స్వస్థో భవితుమర్హసి. 31

ప్ర. అ. అరిందమ=శత్రుసంహారకుడా ! రాజన్=రాజా ! అవహితః=సావధానచిత్తుడవై, మమ=నాయొక్క, వాక్యమ్=వాక్యమును, శృణు= వినుము. రాక్షసరాజేన్ద్ర=రాక్షసరాజా ! తే=నీకు, సంతాపమ్=దుఃఖమును, ఉపపద్య=పొంది, అలమ్=చాలును. రోషం చ=రోషమును, సంపరిత్యజ్య=విడచి, స్వస్థః=స్వస్థుడవు, భవితుమ్=అగుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. శత్రుసంహారకుడవైన రాజా ! సావధానచిత్తుడవై నా మాట వినుము. రాక్షసరాజా ! నీవు మనస్సులో బాధపడకుము. రోషమును విడచి స్వస్థుడవు అగుము. 30, 31

మూ. నైతన్మనసి కర్తవ్యం మయి జీవతి పార్థివ,
తమహం నాశయిష్యామి యత్కృతే పరితప్యసే. 32

ప్ర. అ. పార్థివ=రాజా ! మయి=నేను, జీవతి=జీవించి ఉండగా, ఏతత్=ఇది, మనసి=మనస్సునందు, న కర్తవ్యమ్=చేయదగినది కాదు. యత్కృతే=ఎవనినిమిత్తమై, పరితప్యసే=తాపము నొందబడుచున్నావో, తమ్= వానిని, అహమ్=నేను, నాశయిష్యామి=నశింపచేసెదను.

తా. రాజా ! నేను జీవించి ఉండగా నీవు మనస్సులో ఇట్లు ఆలోచించకూడదు. ఎవనిమూలమున నీవు దుఃఖించుచున్నావో అతనిని నేను నశింపచేసెదను. 32

మూ. అవశ్యం చ హితం వాచ్యం సర్వావస్థాం గతం మయా,
బన్ధుభావాదభిహితం భ్రాతృస్నేహాచ్చ పార్థివ. 33

ప్ర. అ. పార్థివ=రాజా ! సర్వావస్థాం గతమ్=సమస్తమైన అవస్థలను పొందిన నిన్ను గూర్చి, మయా=నాచేత, అవశ్యమ్=తప్పక, హితమ్=హితము, వాచ్యమ్=చెప్పదగినది. బన్ధుభావాత్=బంధుత్వమువలనను, భ్రాతృస్నేహాచ్చ=సోదరస్నేహము వలనను, అభిహితమ్=చెప్పబడినది.

తా. నీవు ఎట్టి పరిస్థితులలో ఉన్నను నేను నీకు హితమును తప్పక చెప్పవలెను. అందుచేత బంధుత్వమువలన, సోదరప్రేమవలనా నీకు ఇట్లు హితము చెప్పినాను. 33

మూ. సదృశం యచ్చ కాలేఽస్మిన్ కర్తుం స్నేహేన బన్ధునా,
శత్రూణాం కదనం పశ్య క్రియమాణం మయా రణే. 34

ప్ర. అ. అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, బన్ధునా=బంధువుచేత,

స్నేహేన=స్నేహముచేత, యత్=ఏది, కర్తుమ్=చేయుటకు, శక్యమ్=తగినదో, రణే=యుద్ధమునందు, మయా=నాచేత, క్రియమాణమ్=చేయబడుచున్న, శత్రూణామ్=శత్రువులయొక్క, కదనమ్=అట్టి వినాశనమును, పశ్య=చూడుము.

తా. ఇట్టి సమయమునందు స్నేహవంతుడైన బంధువు యుద్ధములో ఏ విధమైన శత్రుసంహారమును చేయవలెనో ఆ విధమైన శత్రుసంహారమును నేను చేసెదను; చూడుము. 34

మూ. అద్య పశ్య మహాబాహో మయా సమరమూర్ధని,
హతే రామే సహభ్రాత్రా ద్రవన్తీం హరివాహినీమ్. 35

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! మయా=నాచేత, అద్య=నేడు, రణమూర్ధని=యుద్ధరంగముయొక్క అగ్రభాగమునందు, రామే=రాముడు, భ్రాత్రా సహ=సోదరునితోకూడ, హతే=చంపబడినవాడగుచుండగా, ద్రవన్తీమ్=పారిపోవుచున్న, హరివాహినీమ్=వానరసైన్యమును, పశ్య=చూడుము.

తా. ఓ! మహాబాహూ! నేడు యుద్ధమునందు నేను రామలక్ష్మణులను చంపివేయగా వానరసేన అంతా పారిపోవును; చూడుము. 35

మూ. అద్య రామస్య తద్దృష్ట్వా మయానీతం రణాచ్ఛిరః,
సుఖీ భవ మహాబాహో సీతా భవతు దుఃఖితా. 36

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా! అద్య=నేడు, రణాత్=యుద్ధమునుండి, ఆనీతమ్=తీసికొనిరాబడిన, రామస్య=రామునియొక్క, తత్=ఆ, శిరః=శిరస్సును, దృష్ట్వా=చూచి, సుఖీ=సుఖవంతుడవు, భవ=అగుము. సీతా=సీత, దుఃఖితా=దుఃఖించునది, భవతు=అగుగాక.

తా. ఓ! మహాబాహూ! నేడు నేను యుద్ధమునుండి తీసికొని రాబోవు రాముని శిరస్సును చూచి సంతోషింపుము; సీత దుఃఖింపుగాక.36

మూ. అద్య రామస్య పశ్యన్తు నిధనం సుమహత్ప్రియమ్,
లఙ్కాయాం రాక్షసాః సర్వే యే తే నిహతబాన్ధవాః. 37

ప్ర. అ. లఙ్కాయామ్=లంకలో, యే=ఏ, రాక్షసాః=రాక్షసులు, నిహతబాన్ధవాః=చంపబడిన బంధువులు కలవారో, తే సర్వే=వాళ్లు అందరూ, అద్య=నేడు, రామస్య=రామునియొక్క, సుమహత్ ప్రియమ్=చాల ప్రియమైన, నిధనమ్=మరణమును, పశ్యన్తు=చూచెదరుగాక.

తా. బంధువులు మరణించిన లంకలోని రాక్షసు లందరూ ఈనాడు

వారి ప్రియమైన రాముని మరణమును చూచెదరుగాక. 37

మూ. అద్య శోకపరీతానాం స్వబన్ధువధశోచినామ్,
శత్రోర్యుధి వినాశేన కరోమ్యశ్రుప్రమార్జనమ్. 38

ప్ర. అ. అద్య=నేడు, యుధి=యుద్ధమునందు, శత్రోః= శత్రువు యొక్క, వినాశేన=నాశముచేత, స్వబన్ధువధశోచినామ్=తమ బంధువుల వధచేత దుఃఖించుచున్న, శోకపరీతానామ్=శోకముతో నిండిన రాక్షసులయొక్క, అశ్రుప్రమార్జనమ్=కన్నీళ్లయొక్క తుడుచుటను, కరోమి= చేయుదును.

తా. ఈనాడు యుద్ధమునందు శత్రువును సంహరించి, తమ బంధువులు మరణించుటచేత దుఃఖాక్రాంతులైన రాక్షసుల కన్నీళ్లు తుడిచెదను. 38

మూ. అద్య పర్వతసంకాశం ససూర్యమివ తోయదమ్,
వికీర్ణం పశ్య సమరే సుగ్రీవం ప్లవగేశ్వరమ్. 39

ప్ర. అ. అద్య=నేడు, సమరే=యుద్ధమునందు, ప్రకీర్ణమ్=క్రిందపడవేయబడిన, పర్వతసంకాశమ్=పర్వతముతో సమానుడైన, ససూర్యమ్=సూర్యునితో కూడిన, తోయదమ్ ఇవ=మేఘము వలె ఉన్న, ప్లవగేశ్వరమ్=వానరరాజైన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, పశ్య=చూడుము.

తా. సూర్యునితో కూడిన మేఘము వలె ఉన్న, పర్వతసదృశుడైన వానరరాజైన సుగ్రీవుణ్ణి నేడు యుద్ధములో క్రింద పడవేసెదను, చూడుము.39

మూ. కథం చ రాక్షసైరేభిర్మయా చ పరిసాన్త్వితః,
జిఘాంసుభిర్దాశరథిం వ్యథసే త్వమిహానఘ. 40

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా ! దాశరథిమ్=రాముణ్ణి, జిఘాంసుభిః=చంపదలచుచున్న, ఏభిః రాక్షసైః=ఈ రాక్షసులచేతను, మయా చ=నాచేతను, పరిసాన్త్వితః=ధైర్యము చెప్పబడిన, త్వమ్=నీవు, ఇహ=ఇప్పుడు, కథం చ=ఎట్లు, వ్యథసే=వ్యథచెందుచున్నావు ?

తా. ఓ ! దోషరహితుడా ! రాముణ్ణి చంపవలె నని నిర్ణయించిన ఈ రాక్షసులూ, నేనూ, ధైర్యము చెప్పుచుండగా ఎందుకు బాధపడుచున్నావు ?40

మూ. మాం నిహత్య కిల త్వాం హి నిహనిష్యతి రాఘవః,
నాహమాత్మని సంతాపం గచ్ఛేయం రాక్షసాధిప. 41

ప్ర. అ. రాక్షసాధిప=రాక్షసరాజా ! రాఘవః=రాముడు, మామ్=నన్ను, నిహత్య=చంపి, త్వామ్=నిన్ను, నిహనిష్యతి కిల హి=చంపునుకదా ? అహమ్=నేను,

ఆత్మని=నా విషయమునందు, సంతాపమ్=దుఃఖమును, న గచ్ఛేయమ్=పొందను.

తా. రాక్షసరాజా ! రాముడు నన్ను చంపిన ఏమ్మట కదా నిన్ను చంపేది ? నాకు నా విషయమున ఏమాత్రము దుఃఖము లేదు. 41

మూ. కామం త్విదానీమపి మాం వ్యాదిశ త్వం పరంతప,
న పరః ప్రేక్షణీయస్తే యుద్ధాయాతులవిక్రమ. 42

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా ! అతులవిక్రమ=సాటిలేని పరాక్రమము గలవాడా ! ఇదానీమపి=ఇప్పుడు కూడ, కామమ్=నీ ఇష్టము వచ్చిన విధముగ, మామ్=నన్ను, వ్యాదిశ=ఆజ్ఞాపించుము. యుద్ధాయ=యుద్ధముకొరకు, పరః=ఇతరుడు, న ప్రేక్షణీయః=చూడదగినవాడుకాడు.

తా. సాటిలేని పరాక్రమము గల శత్రుసంహారకుడా ! నీ ఇష్టానుసారము ఇప్పుడు కూడా నన్ను ఆజ్ఞాపించవచ్చును. యుద్ధమునకు పంపుటకై మరొకని కోసము వెదక వలసిన పని లేదు. 42

మూ. అహముత్సాదయిష్యామి శత్రూంస్తవ మహాబలాన్,
యది శక్రో యది యమో యది పావకమారుతౌ, 43
తానహం యోధయిష్యామి కుబేరవరుణావపి.

ప్ర. అ. అహమ్=నేను, మహాబలాన్=గొప్ప బలము గల, తవ శత్రూన్=నీ శత్రువులను, ఉత్సాదయిష్యామి=నశింపచేసెదను. శక్రః యది=దేవేంద్రుడైనను, యమః యది=యముడైనను, పావకమారుతౌ యది=అగ్ని, వాయువూ అయినను, కుబేరవరుణావపి=కుబేరుడూ వరుణుడూ అయినను, తాన్=వారిని, అహమ్=నేను, యోధయిష్యామి=యుద్ధము చేయించెదను.

తా. నేను గొప్ప బలము గల నీ శత్రువులను నశింపచేసెదను. ఇంద్రయములైనా, అగ్నివాయువులైనా, కుబేరవరుణులైనా అందరితోను యుద్ధము చేయుగలను. 43

మూ. గిరిమాత్రశరీరస్య శితశూలధరస్య మే, 44
నర్దతస్తీక్ష్ణదంష్ట్రస్య బిభీయాచ్చ పురందరః.

ప్ర. అ. గిరిమాత్రశరీరస్య=పర్వతప్రమాణము గల శరీరము గలవాడను, శితశూలధరస్య=వాడియైన శూలమును ధరించినవాడను, తీక్ష్ణదంష్ట్రస్య=తీక్ష్ణములైన కోరలు గలవాడను, నర్దతః=అరచుచున్నవాడను అయిన, మే=నాకు, పురందరః=దేవేంద్రుడు, బిభీయాత్ చ=భయపడును.

తా. పర్వతమువంటి శరీరము, వాడియైన కోరలు గల నేను వాడియైన

శూలమును ధరించి గర్జించుచుండగా దేవేంద్రుడు కూడ భయపడును. 44

మూ. అథవా త్యక్తశస్త్రస్య మృద్నతస్తరసా రిపూన్, 45
న మే ప్రతిముఖః కశ్చిత్ స్థాతుం శక్తో జిజీవిషుః.

ప్ర. అ. అథవా=లేక, త్యక్తశస్త్రస్య=విడవబడిన ఆయుధము గల వాడనై, తరసా=బలముచేత, రిపూన్=శత్రువులను, మృద్నతః=మర్దించుచున్న, మే=నాకు, జిజీవిషుః=జీవింపదలచిన, కశ్చిత్=ఎవ్వడూ, ప్రతిముఖః= అభిముఖుడై, స్థాతుమ్=నిలచుటకు, న శక్తః=సమర్థుడు కాడు.

తా. లేదా ఆయుధమును విడచి కూడ బలముచేత నేను శత్రువులను మర్దించుచుండగా, జీవించ దలచిన వా డెవడూ నా ఎదుట నిలువజాలడు.45

మూ నైవ శక్త్యా న గదయా నాసినా నిశితైః శరైః, 46
హస్తాభ్యామేవ సంరబ్ధో హనిష్యామ్యపి వజ్రిణమ్.

ప్ర. అ. శక్త్యా=శక్తిచేత, నైవ=కాదు. గదయా=గదచేత, న=కాదు; అసినా=ఖడ్గముచేత, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, నైవ=కాదు. సంరబ్ధః=కోపించిన నేను, హస్తాభ్యామేవ=చేతులచేతనే, వజ్రిణమపి=దేవేంద్రుణ్ణి కూడ, హనిష్యామి=చంపగలను.

తా. కోపించిన నేను శక్తి కాని, గద కాని, ఖడ్గము కాని, వాడియైన బాణములుకాని ఉపయోగించకుండగా చేతులతోనే దేవేంద్రుణ్ణి కూడ చంపగలను.

మూ. యది మే ముష్టివేగం స రాఘవోఽద్య సహిష్యతి, 47
తతః పాస్యన్తి బాణౌఘా రుధిరం రాఘవస్య మే.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, రాఘవః=రాముడు, మే=నాయొక్క, ముష్టివేగమ్=పిడికిలియొక్క వేగమును, సహిష్యతి యది=సహించినట్లయితే, తతః=అటు పిమ్మట, మే=నాయొక్క, బాణౌఘాః=బాణసమూహములు, రాఘవస్య=రాముని యొక్క, రుధిరమ్=రక్తమును, పాస్యన్తి=త్రాగగలవు.

తా. ఈనాడు రాముడు నా పిడికిలి దెబ్బ తిని కూడ జీవించినట్లయితే అప్పుడు నా బాణములు అతని రక్తమును త్రాగగలవు. 47

మూ. చిన్తయా తప్యసే రాజన్ కిమర్థం మయి తిష్ఠతి, 48
సోఽహం శత్రువినాశాయ తవ నిర్యాతుముద్యతః.

ప్ర. అ. రాజన్=రాజా ! మయి=నేను, తిష్ఠతి=ఉండగా, కిమర్థమ్=ఎందుకు, చిన్తయా=చింతతో, తప్యసే=బాధపడుచున్నావు ? సః

అహమ్=అట్టి నేను, తవ=నీయొక్క, శత్రువినాశాయ=శత్రువుల నాశముకొరకు, నిర్యాతుమ్=బయలుదేరుటకు, ఉద్యతః=సిద్ధముగా ఉన్నాను.

తా. రాజా ! నేను ఉండగా చింతతో బాధపడుచున్నా వెందుకు ? నేను నీ శత్రువులను నశింపచేయుటకై బయలుదేరుటకు సిద్ధముగా ఉన్నాను.

మూ. ముక్త్వా రామాద్భయం ఘోరం నిహనిష్యామి సంయుగే, 49
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చ మహాబలమ్,
హనూమన్తం చ రక్షోఘ్నం యేన లఙ్కా ప్రదీపితా. 50

ప్ర. అ. రామాత్=రామునినుండి, ఘోరమ్=ఘోరమైన, భయమ్=భయమును, ముక్త్వా=విడువుము. సంయుగే=యుద్ధమునందు, రాఘవమ్=రాముణ్ణి,లక్ష్మణం చైవ=లక్ష్మణుణ్ణీ, మహాబలమ్=గొప్ప బలము గల, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణీ, యేన=ఎవనిచేత, లఙ్కా=లంక, ప్రదీపితా=కాల్పబడినదో అట్టి, రక్షోఘ్నమ్=రాక్షసులను చంపిన, హనూమన్తం చ=హనుమంతుణ్ణీ, నిహనిష్యామి=చంపగలను.

తా. రాముని వలన ఏర్పడిన ఘోరమైన భయమును విడిచిపెట్టుము. రామలక్ష్మణులను, మహాబలవంతుడైన సుగ్రీవుణ్ణీ, రాక్షసులను చంపి లంక కాల్చిన హనుమంతుణ్ణీ యుద్ధములో చంపెదను. 49, 50

మూ. హరీంశ్చ భక్షయిష్యామి సంయుగే సముపస్థితే,
అసాధారణమిచ్ఛామి తవ దాతుం మహద్యశః. 51

ప్ర. అ. సముపస్థితే=వచ్చిన, సంయుగే=యుద్ధమునందు, హరీన్ చ=వానరులను, భక్షయిష్యామి=భక్షించెదను. తవ=నీకు, అసాధారణమ్=సాధారణము కాని, మహత్=గొప్పదైన, యశః=కీర్తిని, దాతుమ్=ఇచ్చుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. మనకు వచ్చిన ఈ యుద్ధములో వానరులను భక్షించెదను. నీకు గొప్ప కీర్తిని సంపాదించి పెట్టెదను. 51

మూ. యదిచేన్ద్రాద్భయం రాజన్యది చాపి స్వయంభువః,
తతోఽహం నాశయిష్యామి నైశం తమ ఇవాంశుమాన్, 52
అపి దేవాః శయిష్యన్తే మయి క్రుద్ధే మహీతలే.

ప్ర. అ. రాజన్=రాజా ! ఇన్ద్రాత్=ఇంద్రునివలన, భయం యది=భయము ఐన, స్వయంభువః చాపి=బ్రహ్మవలన అయినా, తతః=అప్పుడు, అహమ్=నేను, నైశమ్=రాత్రిసంబంధమైన, తమః=చీకటిని, అంశుమానివ=సూర్యునివలె, నాశ

యిష్యామి=నశింపచేసెదను. మయి=నేను, క్రుద్ధే=కోపించినవాడ నగుచుండగా, దేవాః అపి=దేవతలు కూడ, మహీతలే=నేలమీద, శయిష్యన్తే=శయనించగలరు.

తా. రాజా ! నీకు ఇంద్రునివలన భయము కలిగినా, సాక్షాత్తు బ్రహ్మదేవునివలన కలిగినా దానిని నేను సూర్యుడు రాత్రికి సంబంధించిన చీకటిని తొలగించినట్లు తొలగించెదను. నేను కోపించినచో దేవతలు కూడ నేలమీద శయనించెదరు. 52

మూ. యమం చ శమయిష్యామి భక్షయిష్యామి పావకమ్, 53
ఆదిత్యం పాతయిష్యామి సనక్షత్రం మహీతలే.

ప్ర. అ. యమం చ=యముణ్ణి కూడ, శమయిష్యామి=శాంతింపచేసెదను. పావకమ్=అగ్నిని, భక్షయిష్యామి=భక్షించెదను. సనక్షత్రమ్= నక్షత్రములతో కూడిన, ఆదిత్యమ్=సూర్యుణ్ణి, మహీతలే=నేలమీద, పాతయిష్యామి=పడచేసెదను.

తా. యముణ్ణి శాంతింపచేసెదను, అగ్నిని భక్షించెదను. నక్షత్రాలతో సహా సూర్యుణ్ణి నేలమీద పడగొట్టెదను. 53

మూ. శతక్రతుం వధిష్యామి పాస్యామి వరుణాలయమ్, 54
పర్వతాంశ్చూర్ణయిష్యామి దారయిష్యామి మేదినీమ్.

ప్ర. అ. శతక్రతుమ్=దేవేంద్రుణ్ణి, వధిష్యామి=చంపెదను. వరుణాలయమ్=సముద్రమును, పాస్యామి=త్రాగెదను. పర్వతాన్=పర్వతములను, చూర్ణయిష్యామి=చూర్ణము చేసెదను. మేదినీమ్=భూమిని, దారయిష్యామి=చీల్చెదను.

తా. ఇంద్రుణ్ణి చంపెదను. సముద్రమును త్రాగివేసెదను. పర్వతములను చూర్ణము చేసెదను. భూమిని చీల్చెదను. 54

మూ. దీర్ఘకాలం ప్రసుప్తస్య కుమ్భకర్ణస్య విక్రమమ్, 55
అద్య పశ్యన్తు భూతాని భక్ష్యమాణాని సర్వశః,
నన్విదం త్రిదివం సర్వమాహారస్య న పూర్యతే. 56

ప్ర. అ. అద్య=నేడు, సర్వశః=అన్నివైపులా, భక్ష్యమాణాని= భక్షించబడు చున్న, భూతాని=భూతములు, దీర్ఘకాలమ్=చాలకాలము, ప్రసుప్తస్య=నిద్రించిన, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, విక్రమమ్=పరాక్రమమును, పశ్యన్తు=చూచుగాక. ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన, త్రిదివమ్=స్వర్గము, ఆహారస్య=ఆహారమునకు, న పూర్యతే నను= సరిపడదుకదా.

తా. అన్ని వైపులా భక్షింపబడుచున్న భూతములు నేడు చాలకాలము

న్నదించిన కుంభకర్ణుని పరాక్రమమును చూచుగాక. నా కీ స్వర్గలోకమంతా కూడ ఆహారమునకు సరిపోదు కదా. 55, 56

మూ. వధేన తే దాశరథేః సుఖావహం
సుఖం సమాహర్తుమహం వ్రజామి,
నిహత్య రామం సహ లక్ష్మణేన
ఖాదామి సర్వాన్ హరియూథముఖ్యాన్. 57

ప్ర. అ. దాశరథేః=రామునియొక్క, వధేన=వధచేత, తే=నీకు, సుఖావహమ్=ఉత్తరోత్తరము సుఖము కలిగించు, సుఖమ్=సుఖమును, ఆహర్తుమ్=సంపాదించుటకు, అహమ్=నేను, వ్రజామి=వెళ్లుచున్నాను. లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, రామమ్=రాముణ్ణి, నిహత్య=చంపి, సర్వాన్=సమస్తమైన, హరియూథముఖ్యాన్=వానరసైన్యములోని ప్రధానవ్యక్తులను, ఖాదామి=తినెదను.

తా. రాముణ్ణి చంపి నీకు ఉత్తరోత్తరవృద్ధి గల సుఖమును సంపాదించుటకొరకు వెళ్లుచున్నాను. రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, చంపి వానరసైన్యములోని ముఖ్యులను అందరినీ తినివేసెదను. 57

మూ. రమస్వ రాజన్ పిబ చాద్య వారుణీం
కురుష్వ కృత్యాని వినీయ దుఃఖమ్,
మయాద్య రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి. 58

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. రాజన్=రాజా ! రమస్వ=క్రీడించుము; అద్య=ఇప్పుడు, వారుణీమ్=మద్యమును, పిబ చ=త్రాగుము. దుఃఖమ్=దుఃఖమును, వినీయ=తొలగించుకొని, కృత్యాని=పనులను, కురుష్వ=చేయుము. అద్య=ఇప్పుడు, మయా=నాచేత, రామే=రాముడు, యమక్షయమ్=యమలోకమును, గమితే=పొందింపబడినవాడగుచుండగా, చిరాయ=చిరకాలమునకు, సీతా=సీత, వశగా=వశమును పొందునది, భవిష్యతి=కాగలదు.

తా. రాజా ! నీవు ఇప్పుడు క్రీడించుము. మద్యమును సేవించుము. దుఃఖమును విడచి చేయవలసిన పనులు చేసికొనుము. ఈనాడు రాముణ్ణి నేను యమలోకమునకు పంపివేసిన పిమ్మట, సీత చాలకాలానికి నీకు వశురాలు అగును. 58

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃషష్టితమః సర్గః

[మహోదరుడు కుంభకర్ణుని మాట కాదని యుద్ధము చేయకుండగనే ఇష్టమైన విషయమును పొందుటకు ఉపాయము చెప్పుట.]

మూ. తదుక్తమతికాయస్య బలినో బాహుశాలినః,
కుమ్భకర్ణస్య వచనం శ్రుత్వోవాచ మహోదరః. 1

ప్ర. అ. అతికాయస్య=పెద్ద శరీరము గల, బలినః=బలవంతుడైన, బాహుశాలినః=గొప్ప బాహువులతో ప్రకాశించుచున్న, కుమ్భకర్ణస్య=కుంభకర్ణుని యొక్క, ఉక్తమ్=పలకబడిన, తత్=ఆ, వచనమ్=వచనమును, ఆకర్ణ్య=విని, మహోదరః=మహోదరుడు, ఉవాచ=పలికెను.

తా. పెద్ద దేహము, అధికమైన బలము, దృఢమైన బాహువులు గల కుంభకర్ణుడు పలికిన ఆ మాటలు విని మహోదరుడు ఇట్లు పలికెను. 1

మూ. కుమ్భకర్ణ కులే జాతో ధృష్టః ప్రాకృతదర్శనః,
అవలిప్తో న శక్నోషి కృత్యం సర్వత్ర వేదితుమ్. 2

ప్ర. అ. కుమ్భకర్ణ=కుంభకర్ణుడా ! కులే=సత్కులమునందు, జాతః=పుట్టినవాడ వైనను, ధృష్టః=ధార్ష్ట్యముతో కూడినవాడవు, ప్రాకృతదర్శనః=సాధారణమైన దృష్టి కలవాడవు, అవలిప్తః=గర్వించినవాడవు అయిన నీవు, సర్వత్ర=అంతటా, కృత్యమ్=కృత్యమును, వేదితుమ్=తెలిసికొనుటకు, న శక్నోషి=సమర్థుడవు కావు.

తా. కుంభకర్ణుడా ! నీవు సత్కులములో పుట్టినవాడవే అయినను ధార్ష్ట్యముతో సామాన్యజనుల వలెనే ఆలోచించుచున్నావు. గర్వముతో నిండిన నీవు ఎక్కడ ఏమి చేయవలెనో తెలియజాలక ఉన్నావు. 2

మూ. న హి రాజా న జానీతే కుమ్భకర్ణ నయానయౌ,
త్వం తు కైశోరకాద్ధృష్టః కేవలం వక్తుమిచ్ఛసి. 3

ప్ర. అ. కుమ్భకర్ణ=కుంభకర్ణుడా ! రాజా=రాజు, నయానయౌ=నీతిని, నీతికానిదానిని, న జానీతే ఇతి న=ఎరుగడు అనే మాట లేదు. త్వం తు=నీవైతే, కైశోరకాత్=బాల్యమువలన, ధృష్టః=ధృష్టుడవై, కేవలమ్=కేవలము, వక్తుమ్=మాటలాడుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. కుంభకర్ణుడా ! ఏది నీతియో, ఏది కాదో రాజుకు తెలియకపోలేదు. కాని నీవు బాల్యముచేత (మూర్ఖత్వము చేత) ధార్ష్ట్యము వహించి ఏదో మాటలాడవలెను కదా అని మాటలాడుచున్నావు. 3

మూ. స్థానం వృద్ధిం చ హానిం చ దేశకాలవిభాగవిత్,
ఆత్మనశ్చ పరేషాం చ బుధ్యతే రాక్షసర్షభః. 4

ప్ర. అ. దేశకాలవిభాగవిత్=దేశకాలముల విభాగమును ఎరిగిన, రాక్షసర్షభః= రాక్షసశ్రేష్ఠుడు, ఆత్మనః చ=తనయొక్క, పరేషాం చ=పరులయొక్క, స్థానమ్=స్థానమును, వృద్ధిం చ=వృద్ధినీ, హానిం చ=హానినీ, బుధ్యతే=తెలుసుకొనుచున్నాడు.

తా. దేశకాలముల విభాగము తెలిసిన రాక్షసరాజు తన స్థానమును, ఇతరుల స్థానమునూ, వృద్ధినీ, హానినీ బాగుగా ఎరిగి ఉన్నాడు. 4

మూ. యత్త్వశక్యం బలవతా కర్తుం ప్రాకృతబుద్ధినా,
అనుపాసితవృద్ధేన కః కుర్యాత్తాదృశం నరః. 5

ప్ర. అ. బలవతా=బలవంతుడైనను, ప్రాకృతబుద్ధినా=ప్రాకృతమైన బుద్ధి గల, అనుపాసితవృద్ధేన=ఉపాసించబడని వృద్ధులు గలవానిచేత, యత్=ఏది, అశక్యమ్=శక్యము కాదో, తాదృశమ్=అట్టి పనిని, కః=ఏ, నరః=బుద్ధిమంతుడైన మనుష్యుడు, కుర్యాత్=చేయును ?

తా. వృద్ధుల సేవ చేయని సామాన్య బుద్ధిగలవాడు ఎంత బలవంతుడైనను ఏ పని ఉపక్రమించి కూడ చేయజాలడో అట్టి పనిని బుద్ధిమంతుడైన ఏ మానవుడు చేయుటకు ప్రయత్నించును ? 5

మూ. యాంస్తు ధర్మార్థకామాంస్త్వం బ్రవీషి పృథగాశ్రయాన్,
అవబోద్ధుం స్వభావేన న హి లక్షణమస్తి తాన్. 6

ప్ర. అ. త్వమ్=నీవు, యాన్=ఏ, ధర్మార్థకామాన్= ధర్మార్థకామములను, పృథగాశ్రయాన్=వేరు వేరు ఆశ్రయములు కలవాటినిగా, బ్రవీషి=చెప్పుచున్నావో, తాన్=వాటిని, స్వభావేన=స్వరూపముచేత, అవబోద్ధుమ్=తెలిసికొనుటకు, లక్షణమ్=లక్షణము, నాస్తి హి=లేదు కదా ?

తా. ధర్మార్థకామములకు వేరు వేరు ఆశ్రయములున్నట్లుగా మాటలాడుచున్నావు. కాని వాటి స్వరూపమును స్పష్టముగా తెలిసికొనుటకు తగిన లక్షణము లేదు కదా ? 6

మూ. కర్మ చైవ హి సర్వేషాం కారణానాం ప్రయోజకమ్,
శ్రేయః పాపీయసాం చాత్ర ఫలం భవతి కర్మణామ్. 7

ప్ర. అ. సర్వేషామ్=సమస్తమైన, కారణానామ్=సుఖదుఃఖాదిరూపఫలము లకు, కర్మచైవ=కర్మయే, ప్రయోజకం హి=సాధకము కదా. అత్ర=ఇక్కడ,

పాపీయసామ్=పాపములైన, కర్మణాం చ=కర్మలకు కూడ, శ్రేయః=శ్రేయస్సు, ఫలమ్=ఫలముగా, భవతి=అగును.

తా. సుఖదుఃఖాదిరూపములైన ఫలము లన్నింటికీ కర్మయే సాధనము. అయితే పాపకర్మలు కూడ శ్రేయస్సును (మంచి ఫలమును) ఇచ్చుచుండును.

మూ. నిఃశ్రేయసఫలావేవ ధర్మార్థావితరావపి,
అధర్మానర్థయోః ప్రాప్తం ఫలం చ ప్రత్యవాయికమ్. 8

ప్ర. అ. ధర్మార్థౌ=ధర్మార్థసాధనములైన కర్మలు, ఇతరౌ అపి=అధర్మ అనర్థములకు సాధనములైన కర్మలు, నిఃశ్రేయసఫలౌ ఏవ=శ్రేయస్సే ఫలముగా కలవి. అధర్మానర్థయోః=అధర్మ అనర్థములకు సాధనములైన కర్మలకు, ప్రత్యవాయికమ్=ప్రత్యవాయమును కలిగించు, ఫలం చ=ఫలము కూడ, ప్రాప్తమ్=ప్రాప్తించినది (ప్రాప్తించును).

తా. ధర్మార్థములకొరకై చేసే కర్మలు, అధర్మ అనర్థములకు సాధనములైన కర్మలు కూడ శ్రేయస్సునే కలిగించును. కాని అధర్మానర్థముల సాధనములైన కర్మలు ప్రత్యవాయమును కూడ కలిగించును. 8

మూ. ఐహలౌకికపారక్యం కర్మ పుమ్భిర్నిషేవ్యతే,
కర్మాణ్యపి తు కల్యాణి లభతే కామమాస్థితః. 9

ప్ర. అ. పుమ్భిః=పురుషులచేత, ఐహలౌకికపారక్యమ్=ఇహలోకమునకు పరలోకమునకు సంబంధించిన, కర్మ=కామ్యకర్మ, నిషేవ్యతే=సేవించబడుచున్నది. కామమ్=కామమును, ఆస్థితః=అవలంబించినవాడు, కల్యాణి=కల్యాణము నిచ్చు, కర్మాణ్యపి తు=కర్మఫలములను కూడ, లభతే=పొందును.

తా. పురుషులు కామముతో ఇహలోకమునకు పరలోకమునకు ఉపయోగించు కర్మలను చేయుచుందురు. కామమును అవలంబించినవాడు కల్యాణములైన కర్మఫలములను కూడ పొందును. (విహితకర్మవలననే శుభము కలుగును; నిషిద్ధకర్మవలన అశుభము కలుగును అను నియమము కాదని మహోదరుని అభిప్రాయము) 9

మూ. తత్ర క్లుప్తమిదం రాజ్ఞా హృది కార్యం మతం చ నః,
శత్రౌ హి సాహసం యత్స్యాత్కిమివాత్రాపనీయతే. 10

ప్ర. అ. తత్ర=అట్టి స్థితిలో, రాజ్ఞా=(కామమును మాత్రమే సేవించువాడు కూడ సుఖములను పొందును అను నిశ్చయము గల) రాజుచేత, హృది=హృదయమునందు, ఇదమ్=ఈ, కార్యమ్=కార్యము, క్లుప్తమ్=చేయబడినది. నః చ=మనకు కూడ, మతమ్=అభిమతమైనది, శత్రౌ=శత్రువు విషయమునందు, యత్=ఏ,

సాహసమ్=సాహసము చెప్పబడినదో, తత్=అది (దానిచేత), అత్ర=ఇక్కడ, కిమ్ అపనీయతే=ఏమి తొలగింపబడును.

తా. ధర్మమునకు శ్రేయస్సే ఫలము, అధర్మమునకు దుఃఖమే ఫలము, కామము దుఃఖహేతువు అను నియమ మేమీ లేదు గాన రాజు తన మనస్సులో నిర్ణయించుకొని ఈ పని చేసినాడు. మనము కూడ సమ్మతించినాము. ఇప్పుడు శత్రువు విషయమున సాహసము చేసి ఏ లోపమును తీర్పవలెను ? 10

మూ. ఏకస్యైవాభియానే తు హేతుర్యః ప్రాహృతస్త్వయా,
తత్రాప్యనుపపన్నం తే వక్ష్యామి యదసాధు చ. 11

ప్ర. అ. ఏకస్యైవ=నీ ఒకనియొక్కయే, అభియానే=యుద్ధమునకై వెళ్లుటయందు, త్వయా=నీచేత, యః=ఏ, హేతుః=హేతువు, ప్రాహృతః=చెప్పబడినదో, తత్రాపి=దానియందు కూడ, యత్=ఏది, అనుపపన్నమ్=ఉపపన్నముకాదో, అసాధు చ=చెడ్డదో దానిని గూర్చి, తే=నీకు, వక్ష్యామి=చెప్పెదను.

తా. నీ వొక్కడవే శత్రువు మీదికి దండెత్తి వెళ్ల విషయమున నీవు ఏ హేతువును చెప్పినావో దానిలో కూడ యుక్తము కానిది, చెడ్డదీ అయిన అంశమును నీకు చెప్పెదను. 11

మూ. యేన పూర్వం జనస్థానే బహవోఽతిబలా హతాః,
రాక్షసా రాఘవం తం త్వం కథమేకో జయిష్యసి. 12

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, జనస్థానే=జనస్థానమునందు, యేన=ఏ రాముని చేత, అతిబలాః=గొప్ప బలము గల, బహవః=చాలమంది, రాక్షసాః=రాక్షసులు, హతాః=చంపబడినారో, తమ్=అట్టి, రాఘవమ్=రాముణ్ణి, త్వమ్=నీవు, ఏకః=ఒక్కడవు, కథమ్=ఎట్లు, జయిష్యసి=జయించగలవు ?

తా. పూర్వము జనస్థానమునందు చాలమంది మహాబలవంతులైన రాక్షసులను చంపిన రాముణ్ణి నీవు ఒక్కడవు ఎట్లు జయించగలవు. 12

మూ. యే పురా నిర్జితాస్తేన జనస్థానే మహౌజసః,
రాక్షసాంస్తాన్పురే సర్వాన్ భీతానద్య న పశ్యసి. 13

ప్ర. అ. పురా=పూర్వము, జనస్థానే=జనస్థానమునందు, మహౌజసః=గొప్ప తేజస్సు గల, యే=ఏ రాక్షసులు, నిర్జితాః=జయింపబడిరో, భీతాన్=భయపడిన, సర్వాన్=సమస్తమైన, తాన్ రాక్షసాన్=ఆ రాక్షసులను, అద్య=ఇప్పుడు, పురే=పట్టణమునందు, న పశ్యసి=చూచుటలేదా ?

తా. జనస్థానములో రాముని చేత ఓడింపబడిన మహాతేజశ్శాలులైన

రాక్షసు లందరూ ఇప్పుడు భయభ్రాంతులై లంకలో నివసించుచున్నారు. వాళ్లను నీవు చూచుటలేదా ! 13

మూ. తం సింహమివ సంక్రుద్ధం రామం దశరథాత్మజమ్,
సర్పం సుప్తమహో బుద్ధ్వా ప్రబోధయితుమిచ్ఛసి. 14

ప్ర. అ. సంక్రుద్ధమ్=కోపించిన, సింహమివ=సింహము వలె ఉన్న వాడు, దశరథాత్మజమ్=దశరథుని కుమారుడు అయిన, తం రామమ్=ఆ రాముణ్ణి, సుప్తమ్=నిద్రించుచున్న, సర్పమ్=సర్పమునుగా, బుద్ధ్వా=తెలిసి ఉండి కూడ, ప్రబోధయితుమ్=మేల్కొలుపుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. కోపించిన సింహమువంటి ఆ రాముడు నిద్రపోవుచున్న సర్పమువంటివాడు అని తెలిసి ఉండి కూడ నీవు ఆతనిని మేల్కొలుపుటకు కోరుచున్నావు ! 14

మూ. జ్వలన్తం తేజసా నిత్యం క్రోధేన చ దురాసదమ్,
కస్తం మృత్యుమివాసహ్యమాసాదయితు మర్హతి. 15

ప్ర. అ. తేజసా=తేజస్సుతో, నిత్యమ్=నిత్యమూ, జ్వలన్తమ్=ప్రజ్వలించుచున్నవాడు, క్రోధేన=క్రోధముచేత, దురాసదమ్=ఎదిరింప శక్యము కాని వాడూ, మృత్యుమివ=మృత్యువు వలె, అసహ్యమ్=సహింప శక్యము కానివాడు అయిన, తమ్=ఆ రాముణ్ణి, కః=ఎవడు, ఆసాదయితుమ్=సమీపించుటకు, అర్హతి=తగిఉన్నాడు ?

తా. రాముడు తేజస్సుతో నిత్యమూ ప్రజ్వలించుచున్నట్లుండును. కోపము వచ్చినపుడు ఎవ్వరిచేతను ఎదిరింప శక్యము కానివాడు. మృత్యుదేవతవలె సహింప శక్యము కానివాడు. అట్టి రాముణ్ణి ఎవడు సమీపించగలడు ? 15

మూ. సంశయస్థ మిదం సర్వం శత్రోః ప్రతిసమాసనే,
ఏకస్య గమనం తత్ర న హి మే రోచతే భృశమ్. 16

ప్ర. అ. శత్రోః=శత్రువుయొక్క, ప్రతిసమాసనే=ఎదిరించుటయందు, ఇదం సర్వమ్=ఇది అంతా, సంశయస్థమ్=సంశయమునందున్నది. ఏకస్య=ఒక్కనియొక్క, తత్ర=అక్కడికి, గమనమ్=వెళ్లుట, మే=నాకు, భృశమ్=మిక్కిలి, న రోచతే హి=ఇష్టముకాదు.

తా. శత్రువును ఎదిరించినచో అంతా సంశయాస్పద మైపోవును.

నీవు ఒంటరిగా యుద్ధమునకు వెళ్లుట నాకు ఏ మాత్రము ఇష్టము కాదు. 16

మూ. హీనార్థస్తు సమృద్ధార్థం కో రిపుం ప్రాకృతం యథా,
నిశ్చిత్య జీవితత్యాగే వశమానేతుమిచ్ఛతి. 17

ప్ర. అ. హీనార్థః=క్షీణించిన బలము గల, కః=ఎవడు, జీవితత్యాగే= జీవితమును విడచుటయందు, నిశ్చిత్య=నిశ్చయించి, సమృద్ధార్థమ్= సమృద్ధమైన బలము గల, రిపుమ్=శత్రువును, ప్రాకృతం యథా=సామాన్యుణ్ణి వలె, వశమ్ ఆనేతుమ్=వశము పొందించుకొనుటకు, ఇచ్ఛతి=కోరును.

తా. క్షీణించిన బలము గలవాడు ఎవడైనా ప్రాణాలకు తెగించి, సమృద్ధమైన బలము గల శత్రువును, సామాన్యుణ్ణి వలె వశము చేసికొనుటకు ప్రయత్నించునా ? 17

మూ. యస్య నాస్తి మనుష్యేషు సదృశో రాక్షసోత్తమ,
కథమాశంససే యోద్ధుం తుల్యేనేన్ద్రవివస్వతోః. 18

ప్ర. అ. రాక్షసోత్తమ=రాక్షసులలో ఉత్తముడవైన కుంభకర్ణుడా ! యస్య= ఎవనికి, సదృశః=సమానమైనవాడు, మనుష్యేషు=మనుష్యులలో, నాస్తి=లేడో, ఇన్ద్రవివస్వతోః=ఇంద్రునికి సూర్యునికి, తుల్యేన=సమానుడైన అట్టి రామునితో, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, కథమ్=ఎట్లు, ఆశంససే=కోరుచున్నావు ?

తా. కుంభకర్ణుడా ! ఏ రామునితో సమానుడైనవాడు మనుష్యులలో లేడో, ఇంద్రసూర్యులతో సమానుడైన అట్టి రామునితో యుద్ధము చేయవలె నని ఎట్లు అనుకొనుచున్నావు ? 18

మూ. ఏవముక్త్వా తు సంరబ్ధం కుమ్భకర్ణం మహోదరః,
ఉవాచ రక్షసాం మధ్యే రావణం లోకరావణమ్. 19

ప్ర. అ. మహోదరః=మహోదరుడు, రక్షసామ్=రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, సంరబ్ధమ్=తొందరగా, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, లోకరావణమ్=లోకములను ఏడిపించిన, రావణమ్=రావణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. రాక్షసుల మధ్య మహోదరుడు కుంభకర్ణునితో, చాల తొందరపాటుతో, ఇట్లు పలికి, లోకములను ఏడ్పించిన రావణునితో ఇట్లనెను. 19

మూ. లబ్ధ్వా పురస్తాద్వైదేహీం కిమర్థం త్వం విలమ్బసే,
యదీచ్ఛసి తదా సీతా వశగా తే భవిష్యతి. 20

ప్ర. అ. పురస్తాత్=నీ ఎదురుగ, వైదేహీమ్=సీతను, లబ్ధ్వా=పొంది (ఉంచుకొని), త్వమ్=నీవు, కిమ్=ఎందుకు, విలమ్బసే=ఆలస్యము చేయుచున్నావు? ఇచ్ఛసి యది=నీవు ఇచ్ఛయించినట్లయితే, తదా=అప్పుడు, సీతా=సీత, తే=నీకు, వశగా=వశమును పొందునది, భవిష్యతి=కాగలదు.

తా. నీ ఎదురుగా సీతను ఉంచుకొని ఎందుకు ఆలస్యము చేయుచున్నావు ? నీవు అనుకున్నచో సీత నీకు తప్పక లొంగిపోగలదు. 20

మూ. దృష్టః కశ్చిదుపాయో మే సీతోపస్థానకారకః,
రుచిత శ్చేత్త్వయా బుద్ధ్యా రాక్షసేశ్వర తతః శృణు. 21

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! సీతోపస్థానకారకః=సీత వచ్చునట్లుచేయు, కశ్చిత్=ఒకానొక, ఉపాయః=ఉపాయము, మే=నాకు, దృష్టః=చూడబడినది. త్వయా=నీ సంబంధమైన, బుద్ధ్యా=బుద్ధిచేత, రుచితః చేత్=ఇష్టమైనట్లయితే, తతః=పిమ్మట, శృణు=వినుము.

తా. సీత నీ దగ్గరకు వచ్చు ఉపాయ మొకటి నాకు తోచినది. అది నీ బుద్ధికి కూడ ఇష్టమైనచో వినుము. 21

మూ. అహం ద్విజిహ్వః సంహ్రాదీ కుమ్భకర్ణో వితర్దనః,
పఞ్చ రామవధాయైతే నిర్యాన్తీత్యవఘోషయ. 22

ప్ర. అ. అహమ్=నేను, ద్విజిహ్వః=ద్విజిహ్వుడు, సంహ్రాదీ=సంహ్రాది, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, వితర్దనః=వితర్దనుడు, ఏతే=ఈ, పఞ్చ=ఐదుగురూ, రామవధాయ=రాముని చంపుటకు, నిర్యాన్తి=బయలుదేరి వెళ్లుచున్నారు, ఇతి=అని, అవఘోషయ=చాటింపు వేయింపుము.

తా. మహోదరుడు, ద్విజిహ్వుడు, సంహ్రాది, కుంభకర్ణుడు, వితర్దనుడు, ఈ ఐదుగురూ రాముణ్ణి చంపుటకై బయలుదేరి వెళ్లుచున్నారు అను చాటింపు వేయింపుము. 22

మూ. తతో గత్వా వయం యుద్ధం దాస్యామస్తస్య యత్నతః,
జేష్యామో యది తే శత్రూన్ నోపాయైః కార్యమస్తి నః. 23

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వయమ్=మేము, గత్వా=వెళ్లి, యత్నతః=ప్రయత్నపూర్వకముగా, తస్య=వానికి, యుద్ధమ్=యుద్ధమును, దాస్యామః=ఇచ్చెదము. తే=నీయొక్క, శత్రూన్=శత్రువులను, జేష్యామః యది=జయించినట్లయితే, నః=మనకు, ఉపాయైః=ఉపాయములచేత, కార్యమ్=పని, నాస్తి=లేదు.

తా. పిమ్మట మేము వెళ్లి ప్రయత్నపూర్వకముగా ఆతనితో యుద్ధము చేసెదము. మేము ఏ శత్రువులను జయింపగల్గినచో మన కింక ఉపాయములతో పని లేదు. 23

మూ. అథ జీవతి నః శత్రుర్యయం చ కృతసంయుగాః,
తతః సమధిగచ్ఛామో మనసా యత్సమీక్షితమ్. 24

ప్ర. అ. అథ=లేక, నః=మనయొక్క, శత్రుః=శత్రువు, జీవతి= జీవించి ఉన్నట్లయితే, కృతసంయుగాః=చేయబడిన యుద్ధము గల, వయం చ=మేము, తతః=ఆటుపిమ్మట, మనసా=మనస్సుచేత, యత్=ఏది, సమీక్షితమ్=చూడబడినదో దానిని, సమధిగచ్ఛామః=పొందగలము.

తా. అట్లు కాక శత్రువు జీవించియే ఉన్నచో యుద్ధము చేసిన మేము మనస్సులో ఆలోచించినట్లు చేసెదము. 24

మూ. వయం యుద్ధా దిహైష్యామో రుధిరేణ సముక్షితాః,
విదార్య స్వతనుం బాణై రామనామాఙ్కితైః శరైః. 25

ప్ర. అ. వయమ్=మేము, రామనామాఙ్కితైః=రాముని పేరుచేత చిహ్నితములైన, బాణైః=బాణములచేతను, శరైః=శరములచేతను, స్వతనుమ్= తమ శరీరమును, విదార్య=చీల్చి, రుధిరేణ=రక్తముచేత, సముక్షితాః= పూయబడిన వారమై, యుద్ధాత్=యుద్ధమునుండి, ఇహ=ఇక్కడికి, ఏష్యామః=వచ్చెదము.

తా. మేము రామనామముచేత చిహ్నితములైన బాణములచేత ఇతర బాణములచేత మా శరీరములు చీల్చుకొని, రక్తముచేత తడిసి యుద్ధమునుండి ఇక్కడికి వచ్చెదము. 25

మూ. భక్షితో రాఘవోఽస్మాభిర్లక్ష్మణశ్చేతి వాదినః,
తవ పాదౌ గ్రహీష్యామస్త్వం నః కామం ప్రపూరయ. 26

ప్ర. అ. అస్మాభిః=మాచేత, రాఘవః=రాముడు, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, భక్షితః=భక్షింపబడినాడు, ఇతి=అని, వాదినః=పలుకుచు, తవ=నీయొక్క, పాదౌ=పాదములను, గ్రహీష్యామః=గ్రహించెదము. త్వమ్=నీవు, నః=మాయొక్క, కామమ్=కోరికను, ప్రపూరయ=నింపుము.

తా. "మేము రామలక్ష్మణులను భక్షించివేసినాము" అని పలుకుచు నీ పాదములకు నమస్కారము చేసెదము. అప్పుడు నీవు పారితోషికాదులు ఇచ్చి మా కోరికలను పూరింపుము. 26

మూ. తతోఽవఘోషయ పురే గజస్కన్ధేన పార్థివ,
హతో రామః సహ భ్రాత్రా ససైన్య ఇతి సర్వతః. 27

ప్ర. అ. పార్థివ=రాజా ! తతః=అటుపిమ్మట, ససైన్యః=సైన్యముతో కూడిన, రామః=రాముడు, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, హతః=చంపబడినాడు, ఇతి=అని, పురే=పట్టణమునందు, సర్వతః=అంతటా, గజస్కన్ధే=ఏనుగ మూపునందు, అవఘోషయ=చాటింపువేయుంచుము.

తా. రాజా ! పిమ్మట "రాముడు, అతని సోదరుడు, సైన్యము నశింపచేయబడినారు" అని ఏనుగ వీపుపై ఎక్కిన మనిషిచేత పట్టణములో అంతటా చాటింపు వేయుంచుము. 27

మూ. ప్రీతో నామ తతో భూత్వా భృత్యానాం త్వమరిందమ,
భోగాంశ్చ పరివారాంశ్చ కామాన్వసు చ దాపయ. 28

ప్ర. అ. అరిందమ=శత్రువినాశకుడా ! త్వమ్=నీవు, ప్రీతో నామ=సంతోషించి నట్లు, భూత్వా=అయి, తతః=అటుపిమ్మట, భృత్యానామ్=భృత్యులకు, భోగాన్ చ=భోగములను, పరివారాంశ్చ=పరివారములను, కామాన్=కోరిన వస్తువులను, వసు చ=ధనమును, దాపయ=ఇప్పించుము.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! పిమ్మట నీవు సంతోషించుచున్నట్లు అభినయించుచు నీ భృత్యులందరికీ భోగములను, పరివారములను, కామములను, ధనమును ఇప్పించుము. 28

మూ. తతో మాల్యాని వాసాంసి వీరాణామనులేపనమ్,
దేయం చ బహు యోధేభ్యః స్వయం చ ముదితః పిబ. 29

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మాల్యాని=మాలలు, వాసాంసి=వస్త్రములు, వీరాణామ్=వీరులయొక్క, అనులేపనమ్=దేహమునకు పూసుకొనే సుగంధ ద్రవ్యము, బహు=అధికముగా, యోధేభ్యః=యోధులకొరకు, దేయమ్=ఇవ్వదగినది, స్వయమ్=స్వయముగా, ముదితః=సంతోషించినవాడవై, పిబ=త్రాగుము.

తా. పిమ్మట యోధులకు పుష్పమాలలు, వస్త్రములు, వీరులు దేహమునకు పూసుకొను అనులేపనమూ అధికముగా ఇచ్చి, ఆనందముతో నీవు కూడ మద్యపానము చేయుము. 29

మూ. తతోఽస్మిన్ బహులీభూతే కౌలీనే సర్వతోగతే,
భక్షితః ససుహృద్రామో రాక్షసైరితి విశ్రుతే, 30

ప్రవిశ్యాశ్వాస్య చాపి త్వం సీతాం రహసి సాన్త్వయ,
ధనధాన్యైశ్చ కామైశ్చ రత్నైశ్చైనాం ప్రలోభయ. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ససుహృత్=స్నేహితులతో కూడిన, రామః=రాముడు, రాక్షసైః=రాక్షసులచేత, భక్షితః=భక్షింపబడినాడు, ఇతి=అని, అస్మిన్=ఈ, బహురీభూతే=వ్యాప్తమైన, కాలీనే=ప్రవాదము, సర్వతోగతే=అంతటా వ్యాపించినదై, విశ్రుతే=ప్రసిద్ధమైన దగుచుండగా, త్వమ్=నీవు, ప్రవిశ్య=ప్రవేశించి, సీతామ్=సీతను, ఆశ్వాస్య=ఓదార్చి, రహసి=రహస్యమునందు, సాన్త్వయ=బ్రతిమాలుము. ఏనామ్=ఈమెను, ధనధాన్యైశ్చ=ధనధాన్యములచేతను, కామైశ్చ=కాములచేతను, రత్నైశ్చ= శ్రేష్ఠములైన వస్తువులచేతను, ప్రలోభయ=లోభపెట్టుము.

తా. "మిత్రసమేతుడైన రాముడు రాక్షసులచేత భక్షింపబడినాడు" అను ఈ ప్రవాదము అంతటా వ్యాపించి ప్రసిద్ధమైన పిమ్మట నీవు లోపల ప్రవేశించి సీతను ఓదార్చి రహస్యమునందు బ్రతిమాలుకొనుము. ధనధాన్యములు, రత్నములు చూపి లోభపెట్టుము. 31

మూ. అనయోపధయా రాజన్ భయశోకానుబన్ధయా,
అకామా త్వద్వశం సీతా నష్టనాథా గమిష్యతి. 32

ప్ర. అ. రాజన్=రాజా ! భయశోకానుబన్ధయా=భయశోకముల అనుబంధము గల, అనయా=ఈ, ఉపధయా=కపటోపాయముచేత, నష్టనాథా=నశించినవాథుడు గల, సీతా=సీత, అకామా=కోరిక లేనిదైనను, త్వద్వశమ్=నీ వశమును, గమిష్యతి=పొందగలదు.

తా. రాజా ! భయమునూ శోకమునూ కూడ కలిగించు ఈ కపటోపాయముచేత, నాథుడు నశించిన సీత ఇష్టము లేకున్నను నీకు వశమగును. 32

మూ. రమణీయం హి భర్తారం వినష్టమధిగమ్య సా,
నైరాశ్యాత్ స్త్రీలఘుత్వాచ్చ త్వద్వశం ప్రతిపత్స్యతే. 33

ప్ర. అ. సా=ఆమె, రమణీయమ్=సుందరుడైన, భర్తారమ్=భర్తను, వినష్టమ్=నశించినవానినిగా, అధిగమ్య=తెలిసికొని, నైరాశ్యాత్=నిరాశాభావముచలన, స్త్రీలఘుత్వాచ్చ=స్త్రీయొక్క లఘుత్వమువలన, త్వద్వశమ్=నీ వశమును, ప్రతిపత్స్యతే=పొందగలదు.

తా. సుందరుడైన భర్త మరణించినట్లు తెలిసికొనిన ఆ సీత నిరాశురాలై స్త్రీ సహజమైన తేలికబుద్ధిచేత నీకు వశురాలు కాగలదు. 33

మూ. సా పురా సుఖసంవృద్ధా సుఖార్హా దుఃఖకర్శితా,
త్వయ్యధీనం సుఖం జ్ఞాత్వా సర్వథోపగమిష్యతి. 34

ప్ర. అ. పురా=పూర్వము, సుఖసంవృద్ధా=సుఖముతో పెరిగినది, సుఖార్హా=సుఖమునకు తగినది, దుఃఖకర్శితా=దుఃఖముచేత కృశించినది అయిన, సా=ఆమె, సుఖమ్=సుఖమును, త్వయి=నీయందు, అధీనమ్= అధీనమైనదానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, సర్వథా=అన్ని విధములా, ఉపగమిష్యతి=చేరగలదు.

తా. ఆ సీత పూర్వము సుఖాలతో పెరిగినది. సుఖపడుటకు తగినది. కాని దుఃఖాలతో కృశించిపోయినది. అట్టి ఆమె తన సుఖ మంతా నీమీదనే ఆధారపడి ఉన్న దని గ్రహించి నిన్ను చేరగలదు. 34

మూ. ఏతత్సునీతం మమ దర్శనేన
రామం హి దృష్ట్వైవ భవేదనర్థః,
ఇహైవ తే సేత్స్యతి మోత్సుకో భూ
ర్మహానయుద్ధేన సుఖస్య లాభః. 35

ప్ర. అ. ఏతత్=ఇది, మమ=నాయొక్క, దర్శనేన=ఆలోచనచేత, సునీతమ్=బాగా నిశ్చయింపబడినది. రామమ్=రాముణ్ణి, దృష్ట్వైవ=చూడగానే, అనర్థః=అనర్థము, భవేత్ హి=అగును కదా ! తే=నీకు, అయుద్ధేన=యుద్ధము చేయకుండగనే, సుఖస్య=సుఖముయొక్క, మహాన్=గొప్ప, లాభః=లాభము, ఇహైవ=ఇక్కడనే, సేత్స్యతి=సిద్ధించగలదు. ఉత్సుకః=ఔత్సుక్యము చెందినవాడవు, మా భూః=అవకుము.

తా. నేను బాగా ఆలోచించి ఇట్లు నిర్ణయించినాను. రాముణ్ణే చూడగానే అనర్థము కలుగును. నీవు ఇక్కడ ఉండగానే యుద్ధము చేయకుండగనే గొప్ప సుఖము లభించును. విచారించకుము. 35

మూ. అనష్టసైన్యో హ్యనవాప్తసంశయో
రిపూనయుద్ధేన జయన్ జనాధిప,
యశశ్చ పుణ్యం చ మహన్మహీపతిః
శ్రియం చ కీర్తిం చ చిరం సమశ్నుతే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే చతుఃషష్టితమః సర్గః.

ప్ర. అ. జనాధిప=రాజా ! అనష్టసైన్యః=నశించని సైన్యము కలవాడై, అనవాప్తసంశయః=పొందబడని సంశయము కలవాడై, అయుద్ధేన=యుద్ధము లేకుండగానే, రిపూన్=శత్రువులను, జయన్=జయించుచున్న, మహీపతిః=

రాజు, మహత్=గొప్పదైన, యశః=యశస్సును, పుణ్యం చ=పుణ్యమును, శ్రియం చ=ఐశ్వర్యమును, కీర్తిం చ=ప్రసన్నత్వమును, చిరమ్=చిరకాలము, అశ్నుతే=పొందును.

తా. రాజా ! సైన్యము నశించకుండగా, సంశయమునకు అవకాశము లేకుండగా, యుద్ధము చేయకుండగానే శత్రువులను జయించు రాజునకు చిరకాలము గొప్ప యశస్సు, పుణ్యము, ఐశ్వర్యము, మనస్సుకు ప్రసాదమూ లభించును. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చషష్టితమః సర్గః

[కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరుట.]

మూ. స తథోక్తస్తు నిర్భర్త్స్య కుమ్భకర్ణో మహోదరమ్,
అబ్రవీద్రాక్షసశ్రేష్ఠం భ్రాతరం రావణం తతః. 1

ప్ర. అ. తథా=అట్లు, ఉక్తః=పలకబడిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, మహోదరమ్=మహోదరుణ్ణి, నిర్భర్త్స్య=బెదిరించి, తతః=అటుపిమ్మట, రాక్షసశ్రేష్ఠమ్=రాక్షసులలో శ్రేష్ఠుడైన, రావణమ్=రావణుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. కుంభకర్ణుడు మహోదరుని మాటలు విన్న పిమ్మట అతనిని బెదిరించి, రాక్షసశ్రేష్ఠుడైన రావణునితో ఇట్లు పలికెను. 1

మూ. సోఽహం తవ భయం ఘోరం వధాత్తస్య దురాత్మనః,
రామస్యాద్య ప్రమార్జామి నిర్వైరో హి సుఖీ భవ. 2

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, దురాత్మనః=దురాత్ముడైన, తస్య రామస్య=ఆ రామునియొక్క, వధాత్=వధవలన, తవ=నీయొక్క, ఘోరమ్=ఘోరమైన, భయమ్=భయమును, అద్య=నేడు, ప్రమార్జామి=తుడిచివేసెదను. నిర్వైరః=వైరము లేనివాడవై, సుఖీ=సుఖవంతుడవు, భవ=అగుము.

తా. నేను దురాత్ముడైన ఆ రాముణ్ణి చంపి ఘోరమైన నీ భయమును తొలగించెదను. వైరము పోయి సుఖముగా ఉందువు. 2

మూ. గర్జన్తి న వృథా శూరా నిర్జలా ఇవ తోయదాః,
పశ్య సంపద్యమానం తు గర్జితం యుధి కర్మణా. 3

ప్ర. అ. శూరాః=శూరులు, నిర్జలాః=జలము లేని, తోయదాః ఇవ=మేఘములు వలె, వృథా=వ్యర్థముగా, న గర్జన్తి=గర్జించరు. యుధి=యుద్ధమునందు, కర్మణా=పనిచేత, సంపద్యమానమ్=ఏర్పడుచున్న, గర్జితమ్=గర్జితమును, పశ్య=చూడుము.

తా. శూరులు నీళ్లు లేని మేఘముల వలె వ్యర్థముగా గర్జించరు. యుద్ధములో పని చేసిన పిమ్మట గర్జనమును చేయుచున్నాను; చూడుము. 3

మూ. న మర్షయన్తి చాత్మానం సంభావయితుమాత్మనా,
అదర్శయిత్వా శూరాస్తు కర్మ కుర్వన్తి దుష్కరమ్. 4

ప్ర. అ. శూరాః=శూరులు, ఆత్మానమ్=తమను, ఆత్మనా=తమచేత, సంభావయితుమ్=గౌరవించుకొనుటకు, న మర్షయన్తి=సహించరు. అదర్శ

యత్నా=చూపకుండగా, దుష్కరమ్=చేయ శక్యము కాని, కర్మ=కర్మను, కుర్వన్తి=చేయుదురు.

తా. శూరులు తమను తాము పొగడుకొనుటకు ఇచ్ఛగింపరు. పైకి చెప్పకుండగానే చేయ శక్యము కాని కర్మను చేయుదురు. 4

మూ. విక్లబానాం హ్యబుద్ధీనాం రాజ్ఞాం పణ్డితమానినామ్,
రోచతే త్వద్వచో నిత్యం కథ్యమానం మహోదర. 5

ప్ర. అ. మహోదర=మహోదరుడా! విక్లబానామ్=వ్యాకులులు, పణ్డితమానినామ్=పండితుల మను అభిమానము కలవారు, అబుద్ధీనామ్=బుద్ధి లేనివారూ అయిన, రాజ్ఞామ్=రాజులకు, కథ్యమానమ్=చెప్పబడుచున్న, త్వద్వచః=నీ వచనము, నిత్యమ్=ఎల్లప్పుడూ, రోచతే=ఇష్టమగును.

తా. మహోదరుడా ! నీ మాటలు వ్యాకులమైన మనస్సు గల బుద్ధి లేని, పండితుల మనే అభిమానము గల రాజులకు ఇష్ట మగును. 5

మూ. యుద్ధే కాపురుషైర్నిత్యం భవద్భిః ప్రియవాదిభిః,
రాజానమనుగచ్ఛద్భిః సర్వం కృత్యం వినాశితమ్. 6

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, కాపురుషైః=నీచపురుషులు, నిత్యమ్=ఎల్లప్పుడూ, ప్రియవాదిభిః=ప్రియమును పలుకువారు, రాజానమ్=రాజును, అనుగచ్ఛద్భిః=అనుసరించుచున్నవారూ అయిన, భవద్భిః=మీచేత, సర్వమ్=సమస్తమైన, కృత్యమ్=కృత్యము, వినాశితమ్=నశింపచేయబడినది.

తా. మీరందరూ యుద్ధములో పిరికిపందలు. ఎల్లప్పుడూ ప్రియముగా మాటలాడుచు రాజును అనుసరించుచుందురు. అట్టి మీరందరూ కార్యమును చెడగొట్టినారు. 6

మూ. రాజశేషా కృతా లఙ్కా క్షీణః కోశో బలం హతమ్,
రాజానమిమమాసాద్య సుహృచ్చిహ్నమమిత్రకమ్. 7

ప్ర. అ. సుహృచ్చిహ్నమ్=స్నేహితుల చిహ్నము మాత్రమే గల, అమిత్రకమ్=మిత్రులులేని, ఇమమ్=ఈ, రాజానమ్=రాజును, ఆసాద్య=పొంది, కోశః=ధనాగారము, క్షీణః=క్షీణించినది; బలమ్=సేన, హతమ్=చంపబడినది. లఙ్కా=లంక, రాజశేషా=రాజు మాత్రమే శేషము కలదిగా, కృతా=చేయబడినది.

తా. పేరుకు మాత్రమే స్నేహితు లున్న, వాస్తవమున స్నేహితులు ఎవరూ లేని ఈతడు రాజుగా మాత్రమే మిగిలి నట్లు అయినది. 7

మూ. ఏష నిర్యామ్యహం యుద్ధముద్యతః శత్రునిర్జయే,
దుర్నయం భవతామద్య సమీకర్తుం మహాహవే. 8

ప్ర. అ. ఏషః అహమ్=ఈ నేను, శత్రునిర్జయే=శత్రువులను జయించుటయందు, ఉద్యతః=ఉద్యుక్తుడనై, ఆహవే=యుద్ధమునందు, అద్య=నేడు, భవతామ్=మీయొక్క, దుర్నయమ్=దుష్టనీతిని, సమీకర్తుమ్=సమము చేయుటకు, యుద్ధమ్=యుద్ధమును గూర్చి, నిర్యామి=బయలుదేరి వెళ్లుచున్నాను.

తా. నే నిప్పుడు శత్రువులను జయించుటకు ఉద్యుక్తుడనై మీ దుష్టనీతిని సరిదిద్దుటకై యుద్ధమునకు బయలుదేరుచున్నాను.

మూ. ఏవముక్తవతో వాక్యం కుమ్భకర్ణస్య ధీమతః,
ప్రత్యువాచ తతో వాక్యం ప్రహసన్రాక్షసాధిపః. 9

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తవతః=పలికిన, ధీమతః=బుద్ధిమంతుడైన, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, వాక్యమ్=వాక్యమును, (విని), తతః=ఆటు పిమ్మట, రాక్షసాధిపః=రాక్షసరాజు, ప్రహసన్=నవ్వుచు, వాక్యమ్=వాక్యమును, ప్రత్యువాచ=తిరిగిపలికెను.

తా. బుద్ధిమంతుడైన కుంభకర్ణుని మాటలు విని రాక్షసరాజు నవ్వుచు ఇట్లనెను. 9

మూ. మహోదరోఽయం రామాత్తు పరిత్రస్తో న సంశయః,
న హి రోచయతే తాత యుద్ధం యుద్ధవిశారద. 10

ప్ర. అ. యుద్ధవిశారద=యుద్ధములో నేర్పు గలవాడా ! తాత=తండ్రీ ! అయమ్=ఈ, మహోదరః=మహోదరుడు, రామాత్=రామునివలన, పరిత్రస్తః=భయపడినవాడు; సంశయః=సంశయము, న=లేదు. యుద్ధమ్=యుద్ధమును, న రోచయతే హి=ఇష్టపడుటలేదు కదా!

తా. యుద్ధములో సమర్థుడవైన ఓ ! తమ్ముడా ! ఈ మహోదరుడు రామునికి భయపడుచున్నాడు; సందేహము లేదు. అందుచేతనే యుద్ధానికి ఇష్టపడుటలేదు. 10

మూ. కశ్చిన్మే త్వత్సమో నాస్తి సౌహృదేన బలేన చ,
గచ్ఛ శత్రువధాయ త్వం కుమ్భకర్ణ జయాయ చ. 11

ప్ర. అ. కుమ్భకర్ణ=కుంభకర్ణుడా ! సౌహృదేన=స్నేహముచేతను, బలేన చ=బలముచేతను, త్వత్సమః=నీతో సమానుడు, కశ్చిత్=ఎవ్వడూ, మే=నాకు, నాస్తి=లేడు. త్వమ్=నీవు, శత్రువధాయ=శత్రువులను చంపుటకొరకు, జయాయ

చ=జయముకొరకు, గచ్ఛ=వెళ్లుము.

తా. కుంభకర్ణుడా ! స్నేహముచేతను, బలముచేతను నీతో సమానుడు ఎవ్వడూ నాకు లేడు. శత్రువులను సంహరించి జయము సంపాదించుటకు వెళ్లుము. 11

మూ. శయానః శత్రునాశార్థం భవాన్ సంబోధితో మయా,
అయం హి కాలః సుమహాన్ రాక్షసానామరిందమ. 12

ప్ర. అ. అరిందమ=శత్రునాశకుడా ! శయానః=నిద్రించుచున్న, భవాన్=నీవు, శత్రునాశార్థమ్=శత్రువుల నాశముకొరకై, మయా=నాచేత, సంబోధితః=లేపబడితివి. అయమ్=ఇది, రాక్షసానామ్=రాక్షసులకు, సుమహాన్=చాల గొప్పదైన, కాలః హి=కాలము కదా ?

తా. నిద్రించుచున్న నిన్ను నేను శత్రుసంహారము చేయుటకై లేపితిని. ఓ ! శత్రుసంహారకా ! ఇది రాక్షసులకు చాల ప్రధానమైన సమయము. 12

మూ. తద్గచ్ఛ శూలమాదాయ పాశహస్త ఇవాన్తకః,
వానరాన్ రాజపుత్రౌ చ భక్షయాదిత్యతేజసౌ. 13

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, శూలమ్=శూలమును, ఆదాయ=గ్రహించి, పాశహస్తః=పాశము హస్తమునందు గల, అన్తకః ఇవ=యముడు వలె, గచ్ఛ=వెళ్లుము. వానరాన్=వానరులను, ఆదిత్యతేజసౌ=సూర్యునివంటి తేజస్సు గల, రాజపుత్రౌ చ=రాజపుత్రులను, భక్షయ=భక్షించుము.

తా. అందుచేత శూలము ధరించి పాశము చేతిలో ఉన్న యముడు వలె వెళ్లుము. వానరులను, సూర్యునివంటి తేజస్సు గల ఆ రాజపుత్రులను భక్షించివేయుము. 13

మూ. సమాలోక్య తు తే రూపం విద్రవిష్యన్తి వానరాః,
రామలక్ష్మణయోశ్చాపి హృదయే ప్రస్ఫుటిష్యతః. 14

ప్ర. అ. తే=నీయొక్క, రూపమ్=రూపమును, సమాలోక్య=చూచి, వానరాః=వానరులు, విద్రవిష్యన్తి=పారిపోగలరు. రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, హృదయే చాపి=గుండెలు కూడ, ప్రస్ఫుటిష్యతః=బ్రద్దలైపోవును.

తా. నీ రూపమును చూడగానే వానరులు పారిపోయెదరు. రామలక్ష్మణుల గుండెలు పగిలిపోవును. 14

మూ. ఏవముక్త్వా మహాతేజాః కుమ్భకర్ణం మహాబలమ్,
పునర్జాతమివాత్మానం మేనే రాక్షసపుంగవః. 15

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడు, మహాబలమ్=గొప్ప బలము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, ఆత్మానమ్=తనను, పునః=మరల, జాతమ్ ఇవ=పుట్టినవానిని వలె, మేనే=తలచెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ రావణుడు మహాబలశాలియైన కుంభకర్ణునితో ఇట్లు పలికి తాను మరల పుట్టినట్లు తలచెను. 15

మూ. కుమ్భకర్ణబలాభిజ్ఞో జానంస్తస్య పరాక్రమమ్,
బభూవ ముదితో రాజా శశాఙ్క ఇవ నిర్మలః. 16

ప్ర. అ. కుమ్భకర్ణబలాభిజ్ఞః=కుంభకర్ణుని బలమును ఎరిగినవాడు, తస్య=వాని యొక్క, పరాక్రమమ్=పరాక్రమమును, జానన్=తెలిసికొన్నవాడు అయిన, రాజా=రాజు, ముదితః=సంతోషించినవాడై, శశాఙ్కః ఇవ=చంద్రుడు వలె, నిర్మలః=నిర్మలుడుగా, బభూవ=అయెను.

తా. కుంభకర్ణుని బలపరాక్రమములు తెలిసిన ఆ రావణుడు సంతోషించుచు చంద్రుడు వలె ప్రసన్నుడై ఉండెను. 16

మూ. ఇత్యేవముక్తః సంహృష్టో నిర్జగామ మహాబలః,
రాజ్ఞస్తు వచనం శ్రుత్వా యోద్ధుముద్యుక్తవాంస్తదా. 17

ప్ర. అ. ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, మహాబలః=గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు, సంహృష్టః=సంతోషించినవాడై, నిర్జగామ=బయలుదేరెను. రాజ్ఞః=రాజుయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తదా=అప్పుడు, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, ఉద్యుక్తవాన్=ఉద్యమించెను.

తా. మహాబలశాలియైన కుంభకర్ణుడు తన అన్న ఈ విధముగా పలుకగా సంతోషించి బయలుదేరెను. రాజు మాటలు విని అప్పుడు యుద్ధము చేయుటకు ఉద్యుక్తుడయ్యెను. 17

మూ. ఆదదే నిశితం శూలం వేగాచ్ఛత్రునిబర్హణః,
సర్వకాలాయసం దీప్తం తప్తకాఞ్చనభూషణమ్. 18

ప్ర. అ. శత్రునిబర్హణః=శత్రుసంహారకుడైన కుంభకర్ణుడు, సర్వకాలాయసమ్=పూర్తిగా ఇనుముతో చేయబడిన, దీప్తమ్=ప్రకాశించుచున్న, తప్తకాఞ్చనభూషణామ్=పరిశుద్ధమైన బంగారము అలంకారము గల, నిశితమ్=వాడియైన, శూలమ్=శూలమును, వేగాత్=వేగమువలన, ఆదదే=గ్రహించెను.

తా. శత్రువినాశకుడైన ఆ కుంభకర్ణుడు పూర్తిగా ఇనుముతో

తయారుచేయబడిన, ప్రజ్వలించుచున్న, శుద్ధమైన బంగారు అలంకారములు గల వాడియైన శూలమును వేగముగా గ్రహించెను. 18

మూ. ఇన్ద్రాశనిసమప్రఖ్యం వజ్రప్రతిమగౌరవమ్,
దేవదానవగన్ధర్వయక్షపన్నగసూదనమ్. 19
రక్తమాల్యమహాధామ స్వతశ్చోద్గతపావకమ్,
ఆదాయ విపులం శూలం శత్రుశోణితరఞ్జితమ్. 20
కుమ్భకర్ణో మహాతేజా రావణం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఇన్ద్రాశనిసమప్రఖ్యమ్=ఇంద్రుని వజ్రాయుధముతో సమానమైన కాంతి గల, వజ్రప్రతిమగౌరవమ్=వజ్రముతో సమానమైన బరువు గల, దేవదానవగన్ధర్వయక్షపన్నగసూదనమ్=దేవతలను, దానవులను, గంధర్వులను, యక్షులను, పన్నగులను పీడించిన, రక్తమాల్యమహాధామ=ఎఱ్ఱని మాలికలు గొప్ప తేజస్సు గల, స్వతః=స్వతఃసిద్ధముగా, ఉద్గతపావకమ్=బయలుదేరుచున్న అగ్ని గల, శత్రుశోణితరఞ్జితమ్=శత్రువుల రక్తముచేత రంజింపచేయబడిన, విపులమ్=పెద్దదైన, శూలమ్=శూలమును, ఆదాయ=గ్రహించి, రావణమ్=రావణునిగూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప తేజస్సు గల కుంభకర్ణుడు చాల పెద్దదైన శూలమును గ్రహించి రావణునితో ఇట్లనెను. ఆ శూలము కాంతి, బరువూ ఇంద్రుని వజ్రము కాంతితోను, బరువుతోను సమముగా ఉండెను. అది అనేకపర్యాయములు దేవ - దానవ - గంధర్వ - యక్ష - పన్నగులను నశింపచేసెను. ఎఱ్ఱని మాలికలతో అలంకరించిన, గొప్ప తేజస్సు గల ఆ శూలమునుండి సహజముగానే మంటలు వెలరేగుచుండెను. అది శత్రువుల రక్తముచేత రంజింపబడి ఉండెను. 19, 20

మూ. గమిష్యామ్యహమేకాకీ తిష్ఠత్విహ బలం మహత్, 21
అద్య తాన్ క్షుధితః క్రుద్ధో భక్షయిష్యామి వానరాన్.

ప్ర. అ. అహమ్=నేను, ఏకాకీ=ఒంటరిగా, గమిష్యామి=వెళ్లెదను. మహత్=గొప్పదైన, బలమ్=సైన్యము, ఇహ=ఇక్కడనే, తిష్ఠతు=ఉండునుగాక. క్షుధితః=ఆకలిగొన్న, క్రుద్ధః=కోపించిన నేను, అద్య=ఇప్పుడు, తాన్=ఆ, వానరాన్=వానరులను, భక్షయిష్యామి=భక్షించెదను.

తా. ఈ సైన్యమంతా ఇక్కడనే ఉండుగాక. నే నొక్కడనే వెళ్లెదను. కోపించి ఆకలిగొని యున్న నేను ఇప్పుడు ఆ వానరులను భక్షించెదను. 21

మూ. కుమ్భకర్ణవచః శ్రుత్వా రావణో వాక్యమబ్రవీత్, 22
సైన్యైః పరివృతో గచ్ఛ శూలముద్గరపాణిభిః.

ప్ర. అ. కుమ్భకర్ణవచః=కుంభకర్ణుని వచనమును, శ్రుత్వా=విని, రావణః=రావణుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. శూలముద్గరపాణిభిః=శూలములు ముద్గరములు హస్తములందు గల, సైన్యైః=సైన్యములతో, పరివృతః=కూడినవాడవై, గచ్ఛ=వెళ్లుము.

తా. కుంభకర్ణుని మాటలు విని రావణుడు ఇట్లు పలికెను- "శూలములు, ముద్గరములు ధరించిన సైనికులతో కలిసి వెళ్లుము". 22

మూ. వానరా హి మహాత్మానః శూరాః సువ్యవసాయినః, 23
ఏకాకినం ప్రమత్తం వా నయేయుర్దశనైః క్షయమ్.

ప్ర. అ. మహాత్మానః=పెద్ద శరీరము గల, శూరాః=శూరులైన, సువ్యవసాయినః=మంచి నిర్ణయము గల, వానరాః=వానరులు, ఏకాకినమ్=ఒంటరిగా ఉన్నా, ప్రమత్తం వా=ఏమరిపాటుతో ఉన్నా, దశనైః=దంతములచేత, క్షయమ్=నాశమును, నయన్తి=పొందింపేరరు.

తా. "పెద్ద దేహములు గలవారును, శూరులు, మంచి ప్రయత్నము చేయువారు అయిన వానరులు ఒంటరిగా ఉన్నవానినైనా, ఏమరిపాటుతో ఉన్నవానినైనా దంతాలచేత కొరికి చంపివేయుదురు." 23

మూ. తస్మాత్పరమదుర్ధర్షః సైన్యైః పరివృతో వ్రజ, 24
రక్షసామహితం సర్వం శత్రుపక్షం నిషూదయ.

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, సైన్యైః=సైన్యములతో, పరివృతః=కూడినవాడవై, పరమదుర్ధర్షః=మిక్కిలి ఎదిరింప శక్యము కానివాడవై, వ్రజ=వెళ్లుము. రక్షసామ్=రాక్షసులకు, అహితమ్=హితము కాని, సర్వమ్=సమస్తమైన, శత్రుపక్షమ్=శత్రుపక్షమును, నిషూదయ=నశింపచేయుము.

తా. "అందువలన సైన్యములతో కలిసి మిక్కిలి జయింప శక్యము కానివాడవై వెళ్లి రాక్షసులకు అపకారము చేయుచున్న శత్రుపక్షము నంతను నశింపచేయుము." 24

మూ. అథాసనాత్సముత్పత్య స్రజం మణికృతాన్తరామ్, 25
ఆబబన్ధ మహాతేజాః కుమ్భకర్ణస్య రావణః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణః=రావణుడు, ఆసనాత్=ఆసనముమండి, సముత్పత్య=తొందరగా లేచి, మణికృతాన్త

దామ్=మాణిక్యములచేత చేయబడిన మధ్యభాగములు గల, స్రజమ్=మాలను, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునకు, ఆబబన్ధ=కట్టెను.

తా. పిమ్మట మహాతేజశ్శాలియైన రావణుడు ఆసనమునుండి లేచి మధ్య మధ్య మణులు కట్టిన మాలను కుంభకర్ణునకు కట్టెను. 25

మూ. అఙ్గదాన్యఙ్గులీవేష్టాన్వరాణ్యాభరణాని చ, 26
హారం చ శశిసంకాశమాబబన్ధ మహాత్మనః.

ప్ర. అ. అఙ్గదాని=బాహుపురులను, అఙ్గులీవేష్టాన్=ఉంగరములను, వరాణి=శ్రేష్ఠములైన, ఆభరణాని చ=ఆభరణములను, శశిసంకాశమ్=చంద్రుని తో సమానమైన, హారం చ=హారమును, మహాత్మనః=ఆ మహాత్మునకు, ఆబబన్ధ=కట్టెను.

తా. మహాత్ముడైన కుంభకర్ణునకు బాహుపురులను, ఉంగరములను, శ్రేష్ఠములైన అలంకారములను, చంద్రుని వంటి హారమును కట్టెను. 26

మూ. దివ్యాని చ సుగన్ధీని మాల్యదామాని రావణః, 27
గాత్రేషు సజ్జయామాస శ్రోత్రయోశ్చాస్య కుణ్డలే.

ప్ర. అ. రావణః=రావణుడు, అస్య=వీనియొక్క, గాత్రేషు=అవయవములయందు, దివ్యాని=శ్రేష్ఠములైన, సుగన్ధీని=మంచి సువాసన గల, మాల్య దామాని=మాలలను, శ్రోత్రయోః=చెవులయందు, కుణ్డలే చ=కుండలములను, సజ్జయామాస=కూర్చెను.

తా. రావణుడు అతని అవయవములయందు దివ్యములు, మంచి సువాసన గలిగి అయిన పుష్పమాలలను, చెవులకు కుండలములను కట్టించెను.

మూ. కాఞ్చనాఙ్గదకేయూరనిష్కాభరణభూషితః, 28
కుమ్భకర్ణో బృహత్కర్ణః సుహుతోఽగ్నిరివాబభౌ.

ప్ర. అ. కాఞ్చనాఙ్గదకేయూరనిష్కాభరణభూషితః=బంగారు అంగదములచేత, కేయూరములచేత, వక్షఃస్థలాభరణముచేత ఇతరాలంకారములచేత అలంకరింపబడిన, బృహత్కర్ణః=పెద్ద చెవులు గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, సుహుతః= బాగా హోమము చేయబడిన, అగ్నిరివ=అగ్ని వలె, ఆబభౌ=ప్రకాశించెను.

తా. బంగారు అంగదములు, కేయూరములు, వక్షఃస్థలాలంకారము మొదలైన అలంకారములచేత అలంకరించబడి, పెద్ద చెవులు గల ఆ కుంభకర్ణుడు బాగుగా హోమముచేసిన అగ్నివలె ప్రకాశించెను. 28

మూ. శ్రోణీసూత్రేణ మహతా మేచకేన విరాజతా, 29
అమృతోత్పాదనే నద్ధో భుజఙ్గేనేవ మన్దరః.

ప్ర. అ. మహతా=పెద్దదైన, మేచకేన=నల్లని, విరాజతా=ప్రకాశించుచున్న, శ్రోణీసూత్రేణ=నడుమునకు కట్టిన త్రాడుతో, అమృతోత్పాదనే=అమృతమును పుట్టించు సమయమునందు, భుజంగేన=సర్పముచేత, నద్ధః=కట్టబడిన, మన్దరః ఇవ=మందరపర్వతము వలె ఉండెను.

తా. ప్రకాశించుచున్న నల్లని పెద్ద నడుము త్రాడుతో అతడు అమృతమును పుట్టించు సమయమునందు వాసుకిచేత కట్టబడిన మందరపర్వతము వలె ఉండెను. 29

మూ. స కాఞ్చనం భారసహం నివాతం
విద్యుత్ప్రభం దీప్తమివాత్మభాసా,
ఆబధ్యమానః కవచం రరాజ
సంధ్యాభ్రసంవీత ఇవాద్రిరాజః. 30

ప్ర. అ. కాఞ్చనమ్=బంగారమువికారమైన, భారసహమ్=భారమును సహించు, నివాతమ్=శస్త్రములచేత భేదింప శక్యము కాని, విద్యుత్ప్రభమ్=మెరుపు వంటి కాంతి గల, ఆత్మతేజసా=తన తేజస్సుచేత, దీప్తమివ=ప్రజ్వలించుచున్నది వలె ఉన్న, కవచమ్=కవచమును, ఆబధ్యమానః=కట్టుకొనుచున్న, సః=అతడు, సంధ్యాభ్రసంవీతః=సంధ్యాకాలమేఘములచేత ఆవరింపబడిన, అద్రిరాజః ఇవ=పర్వతరాజు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. అతడు బంగారు కవచమును ధరించెను. అది శస్త్రప్రహారముల భారమును సహించేదిగాను, శస్త్రములకు అభేద్యముగాను ఉండెను. మెరుపుల వంటి కాంతితో తన తేజస్సుచేత మండుచున్నదా అన్నట్లు ఉండెను. అట్టి కవచమును ధరించుటచే అతడు చుట్టూ సంధ్యాకాలమేఘములు అలముకొన్న పర్వతరాజువలె ప్రకాశించెను. 30

మూ. సర్వాభరణసర్వాఙ్గః శూలపాణిః స రాక్షసః,
త్రివిక్రమకృతోత్సాహో నారాయణ ఇవాబభౌ. 31

ప్ర. అ. సర్వాభరణసర్వాఙ్గః=సమస్తఅలంకారములు సకల అవయవములయందూ గల, శూలపాణిః=శూలము హస్తమునందు గల, సః=ఆ, రాక్షసః=రాక్షసుడు, త్రివిక్రమకృతోత్సాహః=మూడు పాదన్యాసములకై చేయబడిన ఉత్సాహము గల, నారాయణః ఇవ=నారాయణుడు వలె, ఆబభౌ=ప్రకాశించెను.

తా. అన్ని అవయవములకు అన్ని అలంకారములతో అలంకరించుకొని

శూలమును హస్తమునందు ధరించిన ఆ కుంభకర్ణుడు మూడు అడుగులు వేయుటకు ఉత్సాహము చూపుచున్న నారాయణుడు వలె ప్రకాశించెను. 31

మూ. భ్రాతరం సంపరిష్వజ్య కృత్వా చాపి ప్రదక్షిణమ్,
ప్రణమ్య శిరసా తస్మై ప్రతస్థే స మహాబలః. 32

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=అతడు, భ్రాతరమ్=సోదరుణ్ణి, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము, కృత్వా చాపి=చేసి, తస్మై=అతనికి, శిరసా=శిరస్సుతో, ప్రణమ్య=నమస్కరించి, ప్రతస్థే=ప్రయాణమాయెను.

తా. గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు సోదరుని కౌగలించుకొని, ప్రదక్షిణము చేసి, శిరస్సు వంచి నమస్కరించి బయలుదేరెను. 32

మూ. నిష్పతన్తం మహాకాయం మహానాదం మహాబలమ్,
తమాశీర్భిః ప్రశస్తాభిః ప్రేషయామాస రావణః. 33

ప్ర. అ. నిష్పతన్తమ్=బయలుదేరుచున్న, మహానాదమ్=గొప్ప ధ్వని గల, మహాకాయమ్=గొప్ప శరీరము గల, మహాబలమ్=గొప్ప బలము గల, తమ్=అతనిని, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ప్రశస్తాభిః=ప్రశస్తములైన, ఆశీర్భిః=ఆశీర్వాదములతో, ప్రేషయామాస=పంపెను.

తా. గొప్ప ధ్వని చేయుచు బయలుదేరి వెళ్లుచున్న, మహాబలశాలియైన, పెద్ద శరీరము గల కుంభకర్ణుణ్ణి రావణుడు ఆశీర్వదించి పంపెను.

మూ. శఙ్ఖదున్దుభినిర్ఘోషైః సైన్యైశ్చాపి వరాయుధైః,
తం గజైశ్చ తురంగైశ్చ స్యన్దనైశ్చామ్బుదస్వనైః, 34
అనుజగ్ముర్మహాత్మానో రథినో రథినాం వరమ్.

ప్ర. అ. మహాత్మానః=గొప్ప బుద్ధి గల, రథినః=రథికులు, రథినామ్=రథికులలో, వరమ్=శ్రేష్ఠుడైన, తమ్=అతనిని, శఙ్ఖదున్దుభినిర్ఘోషైః=శంఖములయొక్క దుందుభులయొక్క ధ్వనులచేతను, వరాయుధైః=శ్రేష్ఠమైన ఆయుధములు గల, సైన్యైః చ=సైన్యములతోను, గజైశ్చ=ఏనుగులతోను, తురఙ్గైశ్చ=గుఱ్ఱములతోను, అమ్బుదస్వనైః=మేఘములవంటి ధ్వని గల, స్యన్దనైశ్చ=రథములతోను, అనుజగ్ముః=అనుసరించి వెళ్లిరి.

తా. గొప్ప బుద్ధి గల రథికులు రథికులలో శ్రేష్ఠుడైన ఆ కుంభకర్ణుణ్ణి శంఖముల దుందుభుల ధ్వనులతోను, శ్రేష్ఠమైన ఆయుధములు గల సైన్యములతోను, ఏనుగులతోను, గుఱ్ఱములతోను, మేఘములవంటి ధ్వనిగల రథములతోను అనుసరించి వెళ్లిరి. 34

మూ. సర్పైరుష్ట్రైః ఖరైశ్చైవ సింహద్విపమృగద్విజైః,
అనుజగ్ముశ్చ తం ఘోరం కుమ్భకర్ణం మహాబలమ్. 35

ప్ర. అ. ఘోరమ్=భయంకరుడు, మహాబలమ్=గొప్ప బలము కల వాడూ అయిన, తమ్=ఆ, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, సర్పైః=సర్పములచేతను, ఉష్ట్రైః=ఒంటెల చేతను, ఖరైశ్చైవ=గాడిదలచేతను, సింహద్విపమృగద్విజైః=సింహములచేతను ఏనుగులచేతను మృగములచేతను పక్షులచేతను, అనుజగ్ముః=అనుసరించి వెళ్లిరి.

తా. ఆ రాక్షసులు మహాబలశాలియైన భయంకరుడైన ఆ కుంభకర్ణుణ్ణి అనుసరించి, సర్పములు, ఒంటెలు, గాడిదలు, సింహములు, ఏనుగులు, లేళ్లు, పక్షులు ఎక్కి వెళ్లిరి. 35

మూ. స పుష్పవర్షైరవకీర్యమాణో
ధృతాతపత్రః శితశూలపాణిః,
మదోత్కటః శోణితగన్ధమత్తో
వినిర్యయౌ దానవదేవశత్రుః. 36

ప్ర. అ. ధృతాతపత్రః=ధరించబడిన ఛత్రము కలవాడు, శితశూలపాణిః=వాడియైన శూలము హస్తమునందు కలవాడు, మదోత్కటః=మదముచేత తీవ్రముగా ఉన్నవాడు, శోణితగన్ధమత్తః=రక్తపు వాసనచేత మదించినవాడు, దానవదేవశత్రుః=దానవులకు దేవతలకు శత్రువూ అయిన, సః=ఆ కుంభకర్ణుడు, పుష్పవర్షైః=పుష్పవర్షములచేత, అవకీర్యమాణః=చల్లబడుచు, వినిర్యయౌ=బయలుదేరెను.

తా. దానవులకు దేవతలకు శత్రువైన ఆ కుంభకర్ణుడు వాడియైన శూలమును హస్తమునందు ధరించి వెళ్లుచుండగా అతని శిరస్సుపై ఛత్రము పట్టిరి. పుష్పవర్షము కురిపించుచుండిరి. మదముచేత సహజముగానే తీవ్రముగా ఉండు అతడు రక్తగంధముచే మదించి ఉండెను. 36

మూ. పదాతయశ్చ బహవో మహాసారా మహాబలాః,
అన్వయూ రాక్షసా భీమా భీమాక్షాః శస్త్రపాణయః. 37

ప్ర. అ. మహాసారాః=గొప్ప సారము గలవారు, మహాబలాః=గొప్ప బలము గలవారు, భీమాః=భయంకరులు, భీమాక్షాః=భయంకరములైన నేత్రములు గలవారు, శస్త్రపాణయః=ఆయుధములు హస్తములందు గలవారు అయిన, బహవః=చాలమంది, రాక్షసాః=రాక్షసులు, పదాతయః=కాలిబంటులై, అన్వయుః=అనుసరించి వెళ్లిరి.

తా. గొప్ప సారమూ బలమూ గల భయంకరులైన, భయమును

కల్గింపు నేత్రములు గల వాలమంది రాక్షసులు ఆయుధములు ధరించి కాలినడకతో అతనిని అనుసరించి వెళ్లిరి. 37

మూ. రక్తాక్షాః సుమహాకాయా నీలాఞ్జనచయోపమాః,
శూలానుద్యమ్య ఖడ్గాంశ్చ నిశితాంశ్చ పరశ్వధాన్. 38
భిన్దిపాలాంశ్చ పరిఘాన్ గదాశ్చ ముసలాని చ,
తాలస్కన్ధాంశ్చ విపులాన్ క్షేపణీయాన్ దురాసదాన్. 39

ప్ర. అ. రక్తాక్షాః=ఎఱ్ఱని కళ్లు గలవారు, సుమహాకాయాః=చాలి పెద్ద శరీరములు కలవారు, నీలాఞ్జనచయోపమాః=నల్లని కాటుకరాసుల వంటి వారు అయిన రాక్షసులు, శూలాన్=శూలములను, ఖడ్గాంశ్చ=ఖడ్గములను, నిశితాన్=వాడియైన, పరశ్వధాన్=గండ్రగొడ్డళ్లను, భిన్దిపాలాంశ్చ=భిందిపాలములను, పరిఘాన్=పరిఘలను, గదాశ్చ=గదలను, ముసలాని చ=రోకళ్లను, క్షేపణీయాన్=విసరబడసిన, దురాసదాన్=ఎదిరింప శక్యము కాని, విపులాన్=విశాలములైన, తాలస్కన్ధాంశ్చ=తాటిచెట్ల మానులను,ఉద్యమ్య=ఎత్తి, (అతనిని అనుసరించి వెళ్లిరి).

తా. ఎఱ్ఱని కళ్లు, చాల పెద్దవైన దేహములు గల, నల్లని కాటుక గుట్టల వంటి ఆకారములు గల రాక్షసులు శూలములు, ఖడ్గములు, వాడియైన గండ్రగొడ్డళ్లు, భిందిపాలములు, పరిఘలు, గదలు, రోకళ్లు, దూరమునుండి విసరదగిన ఎదిరింప శక్యము కాని పెద్ద తాటిచెట్ల మానులు గ్రహించి అతనిని అనుసరించి వెళ్లిరి. 38, 39

మూ. అథాన్యద్వపురాదాయ దారుణం ఘోరదర్శనమ్,
నిష్పపాత మహాతేజాః కుమ్భకర్ణో మహాబలః. 40
ధనుఃశతపరీణాహః స షట్ఛతసముచ్ఛ్రితః,
రౌద్రః శకటచక్రాక్షో మహాపర్వతసంనిభః. 41

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మహాబలః=గొప్ప బలము గల, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, దారుణమ్=దారుణమైన, ఘోరదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, అన్యత్=మరియొక, వపుః=శరీరమును, ఆదాయ=గ్రహించి, ధనుఃశతపరీణాహః=నూరు ధనస్సుల చుట్టుకొలతకలవాడై, షట్ఛతసముచ్ఛ్రితః=ఆరు వందల ధనస్సులు ఎత్తైనవాడై, శకటచక్రాక్షః=బండి చక్రముల వంటి నేత్రములు గలవాడై, మహాపర్వతసంనిభః=మహా పర్వతముతో సమానుడై, రౌద్రః=భయంకరుడై, నిష్పపాత=బయలుదేరెను.

తా. గొప్ప తేజస్సు గల మహాబలశాలియైన ఆ కుంభకర్ణుడు చూచుటకు భయంకరము, దారుణమూ అయిన మరొక శరీరము ధరించి

బయలుదేరెను. అతని శరీరము చుట్టుకొలత మూడు ధనస్సులు (రెండు వందల గజములు), ఎత్తు ఆరు వందల ధనస్సులు ఉండెను. బండిచక్రమువంటి నేత్రములతో భయంకరుడైన అతడు మహాపర్వతము వలె ఉండెను. 40, 41

మూ. సంనిపత్య చ రక్షాంసి దగ్ధశైలోపమో మహాన్,
కుమ్భకర్ణో మహావక్త్రః ప్రహసన్నిదమబ్రవీత్. 42

ప్ర. అ. దగ్ధశైలోపమః=కాల్చబడిన పర్వతముతో సమానుడు, మహాన్=చాల పెద్ద శరీరము గలవాడు, మహావక్త్రః=గొప్ప నోరు గలవాడు అయిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, రక్షాంసి=రాక్షసులను, సంనిపత్య=సమీపించి, ప్రహసన్=నవ్వుచు, అబ్రవీత్=పలికెను.

తా. పెద్ద దేహము, విశాలమైన ముఖము గలిగి కాల్చినపర్వతము వలె ఉన్న కుంభకర్ణుడు రాక్షసులను సమీపించి, నవ్వుచు ఇట్లు పలికెను.

మూ. అద్య వానరముఖ్యానాం తాని యూథాని భాగశః,
నిర్దహిష్యామి సంక్రుద్ధః పతఙ్గానివ పావకః. 43

ప్ర. అ. అద్య=ఇప్పుడు, సంక్రుద్ధః=కోపించిన నేను, వానరముఖ్యానామ్=వానరశ్రేష్ఠులయొక్క, తాని=ఆ, యూథాని=గుంపులను, భాగశః=భాగముల ప్రకారము, పావకః=అగ్ని, పతఙ్గానివ=మిడతలను వలె, నిర్దహిష్యామి=కాల్చెదను.

తా. కోపించిన నేను ఇప్పుడు, అగ్ని మిడతలను వలె, వానరశ్రేష్ఠుల గుంపులను భాగములుగా చేసి కాల్చివేసెదను. 43

మూ. నాపరాధ్యన్తి మే కామం వానరా వనచారిణః,
జాతిరస్మద్విధానాం సా పురోద్యానవిభూషణమ్. 44

ప్ర. అ. వనచారిణః=వనమునందు సంచరించు, వానరాః=వానరులు, మే=నాకు, నాపరాధ్యన్తి కామమ్=ఏ మాత్రము అపరాధము చేయుటలేదు. సా జాతిః=ఆ వానరజాతి, అస్మద్విధానామ్=మనవంటివారియొక్క పురోద్యానవిభూషణమ్=పురమునందలి ఉద్యానములకు అలంకారము.

తా. వనములో సంచరించే వానరులు నిజానికి నాకేమీ అపరాధము చేయలేదు. ఆ వానరజాతి మనవంటి వాళ్ల పురములోని ఉద్యానములకు అలంకారము. 44

మూ. పురరోధస్య మూలం తు రాఘవః సహలక్ష్మణః,
హతే తస్మిన్ హతం సర్వం తం వధిష్యామి సంయుగే. 45

ప్ర. అ. సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, రాఘవః=రాముడు,

పురరోధస్య=పట్టణమును ముట్టడించుటకు, మూలమ్=కారణము. తస్మిన్=ఆ రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, సర్వమ్=అంతా, హతమ్=చంపబడినది. సంయుగే=యుద్ధమునందు, తమ్=ఆ రాముణ్ణి, వధిష్యామి=చంపగలను.

తా. ఈ పట్టణమును ముట్టడించుటకు లక్ష్మణసహాయుడైన రాముడే మూలకారణము. ఆతనిని చంపినచో అందరినీ చంపినట్లే. అందుచేత ఆతనిని చంపెదను. 45

మూ. ఏవం తస్య బ్రువాణస్య కుమ్భకర్ణస్య రాక్షసాః,
నాదం చక్రుర్మహాఘోరం కమ్పయన్త ఇవార్ణవమ్. 46

ప్ర. అ. తస్య కుమ్భకర్ణస్య=ఆ కుంభకర్ణుడు, ఏవమ్=ఇట్లు, బ్రువాణస్య=పలుకుచుండగా, రాక్షసాః=రాక్షసులు, అర్ణవమ్=సముద్రమును, కమ్పయన్తః ఇవ=కంపింపచేయుచున్నవారు వలె, ఘోరమ్=భయంకరమైన, నాదమ్=ధ్వనిని, చక్రుః=చేసిరి.

తా. ఆ కుంభకర్ణు డిట్లు పలుకుచుండగా రాక్షసులు సముద్రమును కంపింపచేయుచున్నారా అన్నట్లు భయంకరమైన ధ్వని చేసిరి. 46

మూ. తస్య విస్ఫురతస్తూర్ణం కుమ్భకర్ణస్య ధీమతః,
బభూవుర్ఘోరరూపాణి నిమిత్తాని సమన్తతః. 47

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య కుమ్భకర్ణస్య=ఆ కుంభకర్ణుడు, తూర్ణమ్=శీఘ్రముగా, విస్ఫురతః=బయలుదేరుచుండగా, సమన్తతః=అంతటా, ఘోరరూపాణి=మిక్కిలి ఘోరమైన, నిమిత్తాని=శకునములు, బభూవుః=అయినవి.

తా. బుద్ధిమంతుడైన కుంభకర్ణుడు బయలుదేరుచున్నప్పుడు చాల భయంకరములైన దుఃశకునములు కనబడినవి. 47

మూ. ఉల్కాశనియుతా మేఘా బభూవుర్గర్దభారుణాః,
ససాగరవనా చైవ వసుధా సమకమ్పత. 48

ప్ర. అ. ఉల్కాశనియుతాః=కొరవులతోను పిడుగులతోను కూడిన, గర్దభారుణాః=గాడిదవలె బూడిద రంగు గల, మేఘాః=మేఘములు, బభూవుః=ఏర్పడినవి. ససాగరవనా=సముద్రముతోను అడవులతోను కూడిన, వసుధా చ=భూమి కూడ, సమకమ్పత=కంపించెను.

తా. ఉల్కలతోను, పిడుగులతోను కూడిన గాడిద రంగు మేఘములు ఏర్పడినవి. సముద్రముతోను, అరణ్యములతోను సహా భూమి కంపించినది.

మూ. ఘోరరూపాః శివా నేదుః సజ్వాలకబలైర్ముఖైః,
మణ్డలాన్యపసవ్యాని బబన్ధుశ్చ విహంగమాః. 49

ప్ర. అ. ఘోరరూపాః=ఘోరమైన రూపము గల, శివాః=నక్కలు, సజ్వాలకబలైః=జ్వాలా పిండములతో కూడిన, ముఖైః=ముఖములతో, నేదుః=అరచినవి. విహంగమాః=పక్షులు, అపసవ్యాని=అపసవ్యములైన, మండలాని=మండలములను, బబన్ధుః=కట్టినవి.

తా. భయంకరములైన రూపములు గల నక్కలు నిప్పు ముద్దలతో కూడిన నోళ్లతో అరచినవి. పక్షులు అపసవ్యముగా మండలాకారమున తిరిగినవి.

మూ. నిష్పపాత చ గృధ్రోఽస్య శూలే వై పథి గచ్ఛతః,
ప్రాస్ఫురన్నయనం చాస్య సవ్యో బాహురకమ్పత. 50

ప్ర. అ. పథి=మార్గమునందు, గచ్ఛతః=వెళ్లుచున్న, అస్య=ఈ కుంభకర్ణునియొక్క, శూలే=శూలమునందు, గృధ్రః=గ్రద్ద, నిష్పపాత=వ్రాలెను. అస్య=వీనియొక్క, నయనమ్=నేత్రము, ప్రాస్ఫురత్=అదిరెను. సవ్యః=ఎడమదైన, బాహుః=బాహువు, అకమ్పత=కంపించెను.

తా. మార్గమునందు నడచి వెళ్లుచున్న ఆతని శూలముమీద గ్రద్ద వ్రాలెను. ఆతని ఎడమకన్ను, చెయ్యి అదరెను. 50

మూ. నిష్పపాత తదా చోల్కా జ్వలన్తీ భీమనిఃస్వనా,
ఆదిత్యో నిష్ప్రభశ్చాసీన్న వాతి చ సుఖోఽనిలః. 51

ప్ర. అ. తదా=అప్పుడు, జ్వలన్తీ=మండుచున్న, భీమనిఃస్వనా=భయంకరమైన ధ్వని గల, ఉల్కా=ఉల్క(అగ్నిపిండము), నిష్పపాత=పడెను. ఆదిత్యః చ=సూర్యుడు కూడ, నిష్ప్రభః=కాంతివిహీనుడు, ఆసీత్=అయెను. అనిలః=వాయువు, సుఖః=సుఖకరముగా, న వాతి చ=వీచుటలేదు.

తా. అప్పుడు భయంకరమైన ధ్వనితో మండుచున్న ఉల్క పడెను. సూర్యుడు కాంతివిహీను డయ్యెను. వాయువు సుఖముగా వీచుటలేదు. 51

మూ. అచిన్తయన్ మహోత్పాతానుదితాన్ రోమహర్షణాన్,
నిర్యయౌ కుమ్భకర్ణస్తు కృతాన్తబలచోదితః. 52

ప్ర. అ. కుమ్భకర్ణః తు=కుంభకర్ణుడైతే, ఉదితాన్=పుట్టిన, రోమహర్షణాన్=రోమాంచము కలిగించు, మహోత్పాతాన్=గొప్ప ఉత్పాతములను (దుశ్శకునములను), అచిన్తయన్=లెక్క చేయనివాడై, కృతాన్తబలచోదితః=దైవబలముచేత ప్రేరేపింపబడినవాడై, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. కుంభకర్ణుడుమాత్రము రోమాంచజనకములైన కనబడుచున్న ఆ దుఃశకునములను లెక్కచేయక దైవబలముచేత ప్రేరేపింపబడినవాడై బయలుదేరెను. 52

మూ. స లఙ్ఘయిత్వా ప్రాకారం పద్భ్యాం పర్వతసంనిభః,
దదర్శాభ్రఘనప్రఖ్యం వానరానీకమద్భుతమ్. 53

ప్ర. అ. పర్వతసంనిభః=పర్వతముతో సమానుడైన, సః=అతడు, పద్భ్యామ్=పాదములచేత, ప్రాకారమ్=ప్రాకారమును, లఙ్ఘయిత్వా=దాటి, అభ్రఘనప్రఖ్యమ్=మేఘముల గుంపుతో సమానమైన, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, వానరానీకమ్=వానరసేనను, దదర్శ=చూచెను.

తా. పర్వతముతో సమానుడైన ఆ కుంభకర్ణుడు పాదాలచేతనే ప్రాకారమును దాటి మేఘముల గుంపు వలె ఉన్న ఆశ్చర్యకరమైన వానరసేనను చూచెను. 53

మూ. తే దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం వానరాః పర్వతోపమమ్,
వాయునున్నా ఇవ ఘనా యయుః సర్వా దిశస్తదా. 54

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, పర్వతోపమమ్=పర్వతముతో సమానమైన, రాక్షసశ్రేష్ఠమ్=రాక్షసులలో శ్రేష్ఠుడైన కుంభకర్ణుని, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, వాయునున్నాః=వాయువుచేత ఎగురగొట్టబడిన, ఘనాః ఇవ=మేఘములు వలె, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను గూర్చి, యయుః=వెళ్లిరి.

తా. పర్వతమువలె ఉన్న ఆ కుంభకర్ణుని చూడగానే ఆ వానరులు గాలిచేత ఎగరగొట్టబడిన మేఘముల వలె అన్ని దిక్కులకు పారిపోయిరి. 54

మూ. తద్వానరానీకమతిప్రచణ్డం
దిశో ద్రవద్భిన్నమివాభ్రజాలమ్,
స కుమ్భకర్ణః సమవేక్ష్య హర్షా
న్ననాద భూయో ఘనవద్ఘనాభః. 55

ప్ర. అ. భిన్నమ్=చెదరగొట్టబడిన, అభ్రజాలమ్ ఇవ=మేఘసముదాయము వలె, దిశః=దిక్కులను గూర్చి, ద్రవత్=పరుగెత్తుచున్న, అతిప్రచణ్డమ్=చాల తీవ్రమైన, తత్ వానరానీకమ్=ఆ వానరసైన్యమును, సమవేక్ష్య=చూచి, ఘనాభః=మేఘమువంటి కాంతి గల, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, హర్షాత్=సంతోషమువలన, ఘనవత్=మేఘమువలె, భూయః=మాటిమాటికి, ననాద=ధ్వనిచేసెను.

తా. మేఘము వలె నల్లని ఆకారముగల ఆ కుంభకర్ణుడు చెదరగొట్టబడిన మేఘసముదాయము వలె దిక్కులకు పారిపోవుచున్న, చాల

భయంకరమైన ఆ వానరసైన్యమును చూచి, మేఘము వలె బిగ్గరగా గర్జించెను.

మూ. తే తస్య ఘోరం నినదం నిశమ్య
యథా నినాదం దివి వారిదస్య,
పేతుర్ధరణ్యాం బహవః ప్లవంగా
నికృత్తమూలా ఇవ శాలవృక్షాః. 56

ప్ర. ఆ. దివి=ఆకాశమునందు, వారిదస్య=మేఘముయొక్క, నినాదం యథా=ధ్వనివలె ఉన్న, తస్య=వానియొక్క, ఘోరమ్=భయంకరమైన, నినదమ్=ధ్వనిని, నిశమ్య=విని, తే=ఆ, బహవః=చాలమంది, ప్లవంగాః=వానరులు, నికృత్తమూలాః=భేదింపబడిన మొదళ్లు గల, శాలవృక్షాః ఇవ=శాలవృక్షములు వలె, ధరణ్యామ్=నేలమీద, పేతుః=పడిరి.

తా. ఆకాశమునందున్న మేఘముల ధ్వని వలె ఉన్న భయంకరమైన అతని ధ్వనిని విని చాలమంది వానరులు మొదళ్లు నరికిన మద్దిచెట్ల వలె నేలమీద కూలిరి. 56

మూ. విపులపరిఘవాన్ స కుమ్భకర్ణో
రిపువిధనాయ వినిఃసృతో మహాత్మా,
కపిగణభయమాదదత్సుభీమం
ప్రభురివ కింకరదణ్డవాన్ యుగాన్తే. 57

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. ఆ. విపులపరిఘవాన్=పెద్ద పరిఘ గల, రిపువిధనాయ=శత్రు సంహారముకొరకు, వినిఃసృతః=బయలుదేరిన, మహాత్మా=మహాత్ముడైన, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, యుగాన్తే=ప్రలయకాలమునందు, కింకరదణ్డవాన్=కింకరుడైన దండము గల, ప్రభురివ=యముడు వలె, సుభీమమ్=చాల భయంకరమైన, కపిగణభయమ్=కపిసమురాయమునకు భయమును, ఆదదత్=ఇచ్చెను.

తా. పెద్ద పరిఘ ధరించి శత్రువినాశము చేయుటకై బయలుదేరిన మహాత్ముడైన ఆ కుంభకర్ణుడు ప్రళయకాలమునందు దండమును కింకరునిగా చేసికొని వచ్చిన యముడు వలె కపిసైన్యమునకు భయంకరమైన భయమును కలిగించెను.

వి. శూలము ధరించి వచ్చినట్లు ఇంతవరకూ చెప్పి ఇక్కడ పరిఘ ధరించినా డని చెప్పబడినది. "కింకరదణ్డవాన్" "భయంకరమైన భయము" ఇత్యాదులు సరిగా లేవు. చివరి శ్లోకములు మూడూ ప్రాచ్యప్రతిలో లేవు.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదివదవ సర్గ సమాప్తము.

# అథ షట్షష్టితమః సర్గః

[కుంభకర్ణుణ్ణి చూచి పారిపోవుచున్న వానరులకు ధైర్యము చెప్పి అంగదుడు యుద్ధమునకై ప్రోత్సహించుట, కుంభకర్ణుడు వానరులను సంహరించుట; మరల అంగదుడు వాళ్లను వెనుకకు మరల్చుట.]

మూ. స లఙ్ఘయిత్వా ప్రాకారం గిరికూటోపమో మహాన్,
నిర్యయౌ నగరాత్తూర్ణం కుమ్భకర్ణో మహాబలః. 1

ప్ర. అ. గిరికూటోపమః=పర్వతశిఖరముతో సమానుడు, మహాన్=పెద్ద శరీరప్రమాణము కలవాడు, మహాబలః=గొప్ప బలము కలవాడు అయిన, సః కుమ్భకర్ణః= ఆ కుంభకర్ణుడు, ప్రాకారమ్=ప్రాకారమును, లఙ్ఘయిత్వా=దాటి, తూర్ణమ్= శీఘ్రముగా, నగరాత్=నగరమునుండి, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. పర్వతశిఖరము వలె పెద్దదైన శరీరము గల మహాబలవంతుడైన ఆ కుంభకర్ణుడు ప్రాకారమును లంఘించి శీఘ్రముగా నగరమునుండి బయలుదేరెను.

మూ. ననాద చ మహానాదం సముద్రమభినాదయన్,
జనయన్నివ నిర్ఘాతాన్విధమన్నివ పర్వతాన్. 2

ప్ర. అ. నిర్ఘాతాన్=పిడుగులను, జనయన్నివ=జయించుచున్నవాడు వలె, పర్వతాన్=పర్వతములను, విధమన్ ఇవ=ఎగరగొట్టుచున్నవాడు వలె, మహానాదమ్=గొప్ప ధ్వని గల, సముద్రమ్=సముద్రమును, అభినాదయన్= ధ్వనింపచేయుచు, ననాద=ధ్వని చేసెను.

తా. పిడుగులను జయించుచున్నాడా అన్నట్లు, పర్వతములను ఎగరగొట్టుచున్నాడా అన్నట్లు, గొప్ప ధ్వని గల సముద్రము ప్రతిధ్వనించేటట్లు గర్జించెను. 2

మూ. తమవధ్యం మఘవతా యమేన వరుణేన వా,
ప్రేక్ష్య భీమాక్షమాయాన్తం వానరా విప్రదుద్రువుః. 3

ప్ర. అ. మఘవతా=దేవేంద్రునిచేత గాని, యమేన=యమునిచేత గాని, వరుణేన వా=వరుణునిచేత గాని, అవధ్యమ్=చంప శక్యము కాని, భీమాక్షమ్= భయంకరములైన నేత్రములు గల, తమ్=ఆతనిని, ప్రేక్ష్య=చూచి, వానరాః= వానరులు, విప్రదుద్రువుః=పరుగెత్తిరి.

తా. దేవేంద్రునిచేత గాని, యమునిచేత గాని, వరుణునిచేత గాని, చంప శక్యము కాని భయంకరములైన నేత్రములు గల ఆతనిని చూచి వానరులు

పరుగెత్తిరి.

మూ. తాంస్తు విప్రద్రుతాన్ దృష్ట్వా రాజపుత్రోఽఙ్గదోఽబ్రవీత్,
నలం నీలం గవాక్షం చ కుముదం చ మహాబలమ్. 4

ప్ర. అ. విప్రద్రుతాన్=పారిపోవుచున్న, తాన్=వారిని, నలమ్=నలుణ్ణి నీలమ్=నీలుణ్ణి, గవాక్షం చ=గవాక్షుణ్ణి, మహాబలమ్=గొప్ప బలము గల, కుముదమ్=కుముదుణ్ణి, దృష్ట్వా=చూచి, రాజపుత్రః=రాజపుత్రుడైన, అఙ్గదః=అంగదుడు, అబ్రవీత్=పలికెను.

తా. పారిపోవుచున్న నలుడు, నీలుడు, గవాక్షుడు, గొప్ప బలము గల కుముదుడు మొదలైన ఆ వానరులను చూచి రాజపుత్రుడైన అంగదు డిట్లు పలికెను. 4

మూ. ఆత్మనస్తాని విస్మృత్య వీర్యాణ్యభిజనాని చ,
క్వ గచ్ఛత భయత్రస్తాః ప్రాకృతా హరయో యథా. 5

ప్ర. అ. ఆత్మనః=తమయొక్క, తాని=ఆ, వీర్యాణి=పరాక్రమములను, అభిజనాని చ =ఉత్తమవంశాదులను, విస్మృత్య=మరచి, ప్రాకృతాః= సామాన్యులైన, హరయః యథా=వానరులు వలె, భయత్రస్తాః=భయకారణముచేత భయపడినవారై, క్వ=ఎక్కడికి, గచ్ఛత=వెళ్లెదరు ?

తా. మీరు మీ పరాక్రమములను, వంశోన్నత్యాదులను మరచి, సామాన్యవానరుల వలె భయపడి ఎక్కడికి వెళ్లెదరు ? 5

మూ. సాధు సౌమ్యా నివర్తధ్వం కిం ప్రాణాన్ పరిరక్షథ,
నాలం యుద్ధాయ వై రక్షో మహతీయం విభీషికా. 6

ప్ర. అ. సౌమ్యాః=సౌమ్యులారా ! సాధు=బాగుగా, నివర్తధ్వమ్= మరలండి. ప్రాణాన్=ప్రాణములను, కిమ్=ఎందుకు, పరిరక్షథ=రక్షించెదరు ? రక్షః=ఈ రాక్షసుడు, యుద్ధాయ=యుద్ధముకొరకు, నాలమ్=సమర్థుడు కాడు. ఇయమ్=ఇది, మహతీ=గొప్ప, విభీషికా=భయమును కలిగించు బొమ్మ.

తా. ఓ ! సౌమ్యులారా ! బాగుగా వెనుకకు మరలండి. ప్రాణాలు ఎందుకు రక్షించు కొనెదరు ? ఈ రాక్షసుడు యుద్ధము చేయజాలడు. ఇది భయపెట్టుటకై సృష్టించిన పెద్ద బొమ్మ. 6

మూ. మహతీముత్థితామేనాం రాక్షసానాం విభీషికామ్,
విక్రమాద్విధమిష్యామో నివర్తధ్వం ప్లవంగమాః. 7

ప్ర. అ. ప్లవంగమాః=వానరులారా ! రాక్షసానామ్=రాక్షసులయొక్క,

ఉత్థితామ్=లేచిన, మహతీమ్=పెద్దదైన, ఏనాం విభీషికామ్=ఈ విభీషికను, విక్రమాత్=పరాక్రమమువలన, విధమిష్యామః=నశింపచేసెదము; నివర్తధ్వమ్=మరలండి.

తా. వానరులారా ! రాక్షసుడు లేవదీసిన ఈ పెద్ద విభీషికను పరాక్రమముచేత నశింపచేసెదము; మరలండి. 7

మూ. కృచ్ఛ్రేణ తు సమాశ్వస్య సంగమ్య చ తతస్తతః,
వృక్షాన్ గృహీత్వా హరయః సంప్రతస్థూ రణాజిరమ్. 8

ప్ర. అ. హరయః=వానరులు, కృచ్ఛ్రేణ=కష్టముచేత, సమాశ్వస్య=ధైర్యముతెచ్చుకొని, తతస్తతః=ఆ యా వైపులనుండి, సంగమ్య=ఒక్క చోట కలిసి, వృక్షాన్=వృక్షములను, గృహీత్వా=గ్రహించి, రణాజిరమ్=యుద్ధభూమిని గూర్చి, సంప్రతస్థుః=ప్రయాణమయిరి.

తా. ఆ వానరులు అతికష్టముమీద ధైర్యము తెచ్చుకొని, నాలుగు వైపులనుండి వచ్చి ఒక చోట గుమిగూడి, వృక్షములను గ్రహించి యుద్ధరంగమునకు వెళ్లిరి. 8

మూ. తే నివృత్య తు సంరబ్ధాః కుమ్భకర్ణం వనౌకసః,
నిర్జఘ్నుః పరమక్రుద్ధాః సమదా ఇవ కుఞ్జరాః. 9

ప్ర. అ. తే=ఆ, వనౌకసః=వానరులు, నివృత్య=మరలి వచ్చి, సంరబ్ధాః=తొందరపడుచున్నవారై, పరమక్రుద్ధాః=మిక్కిలి కోపించినవారై, సమదాః=మదముతో కూడిన, కుఞ్జరాః ఇవ=ఏనుగులు వలె, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, నిర్జఘ్నుః=కొట్టిరి.

తా. మదించిన ఏనుగులు వలె ఉన్న ఆ వానరులు తిరిగి వచ్చి తొందరపడుచు, చాల కోపించి ఆ కుంభకర్ణుణ్ణి కొట్టిరి. 9

మూ. ప్రాంశుభిర్గిరి శృఙ్గైశ్చ శిలాభిశ్చ మహాబలః,
పాదపైః పుష్పితాగ్రైశ్చ హన్యమానో న కమ్పతే. 10

ప్ర. అ. ప్రాంశుభిః=ఎత్తైన, గిరిశృఙ్గైశ్చ=పర్వతశిఖరములచేతను, శిలాభిశ్చ=శిలలచేతను, పుష్పితాగ్రైః=పుష్పించిన అగ్రభాగము గల, పాదపైః=వృక్షములచేతను, హన్యమానః=కొట్టబడుచున్న, మహాబలః=గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు, న కమ్పతే=కంపించలేదు.

తా. ఎత్తైన పర్వతశిఖరములతోను, శిలలతోను, పుష్పించిన అగ్రభాగములు గల వృక్షములతోను కొట్టినా కూడ మహాబలశాలియైన ఆ

కుంభకర్ణుడు కదలలేదు. 10

మూ. తస్య గాత్రేషు పతితా భిద్యన్తే బహవః శిలాః,
పాదపాః పుష్పితాగ్రాశ్చ భగ్నాః పేతుర్మహీతలే. 11

ప్ర. అ. తస్య=వానియొక్క, గాత్రేషు=అవయవములమీద, పతితాః=పడిన, బహవః=అనేకమైన, శిలాః=శిలలు, భిద్యన్తే=బ్రద్దలైపోయినవి. పుష్పితాగ్రాః=పుష్పించిన అగ్రభాగములు గల, పాదపాః=వృక్షములు, భగ్నాః=విరిగినవై, మహీతలే=నేలమీద, పేతుః=పడినవి.

తా. అతని అవయవములమీద పడి అనేకమైన శిలలు ముక్కలైపోయెను. పుష్పించిన అగ్రభాగములు గల వృక్షములు విరిగి నేలమీద పడిపోయెను. 11

మూ. సోఽపి సైన్యాని సంక్రుద్ధో వానరాణాం మహౌజసామ్,
మమన్థ పరమాయత్తో వనాన్యగ్నిరివోత్థితః. 12

ప్ర. అ. సః అపి=అతడు కూడ, సంక్రుద్ధః=కోపించినవాడై, పరమాయత్తః=మిక్కిలి ప్రయత్నము చేయుచున్నవాడై, ఉత్థితః=లేచిన, అగ్నిః=అగ్ని, వనానీవ=వనములను వలె, మహౌజసామ్=గొప్ప తేజస్సు గల, వానరాణామ్=వానరులయొక్క, సైన్యాని=సైన్యములను, మమన్థ= మథించెను.

తా. కుంభకర్ణుడు కూడ చాల కోపించి, వానరసైన్యములను, విజృంభించిన అగ్ని వనములను వలె, ప్రయత్నపూర్వకముగా నశింపచేసెను.

మూ. లోహితార్ద్రాస్తు బహవః శేరతే వానరర్షభాః,
నిరస్తాః పతితా భూమౌ తామ్రపుష్పా ఇవ ద్రుమాః. 13

ప్ర. అ. బహవః=చాలమంది, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, లోహితార్ద్రాః=రక్తముచేత తడిసినవారై, నిరస్తాః=పడవేయబడినవారై, భూమౌ=భూమియందు, పతితాః=పడిన, తామ్రపుష్పాః=ఎఱ్ఱని పుష్పములు గల, ద్రుమాః యథా=వృక్షముల వలె, శేరతే=నేలమీద శయనించిరి.

తా. చాలమంది వానరశ్రేష్ఠులు క్రింద పడవేయబడినవారై, రక్తముచేత తడిసి, నేలమీద పడిన ఎఱ్ఱని పుష్పములు గల వృక్షముల వలె పడియుండిరి.

మూ. లఙ్ఘయన్తః ప్రధావన్తో వానరా నావలోకయన్,
కేచిత్సముద్రే పతితాః కేచిద్గగనమాస్థితాః. 14

ప్ర. అ. వానరాః=వానరులు, లఙ్ఘయన్తః=దాటుచు, ప్రధావన్తః=పరుగెత్తుచు, నావలోకయన్=వెనుకకు చూడలేదు. కేచిత్=కొందరు, సముద్రే=సముద్ర

ములో, పతితాః=పడిరి. కేచిత్=కొందరు, గగనమ్=ఆకాశమును, ఆస్థితాః=ఆశ్రయించిరి.

తా. కొందరు వానరులు దుమికి పారిపోవుచు వెనుకకు చూడలేదు. కొందరు సముద్రములో పడిపోయిరి. కొందరు ఆకాశములోనికి ఎగిరిపోయిరి.

మూ. వధ్యమానాస్తు తే వీరా రాక్షసేన చ లీలయా,
సాగరం యేన తే తీర్ణాః పథా తేనైవ దుద్రువుః. 15

ప్ర. అ. రాక్షసేన=రాక్షసునిచేత, లీలయా=అనాయాసముగా, వధ్యమానాః=చంపబడుచున్న, తే వీరాః=ఆ వీరులు, యేన పథా=ఏ మార్గముచేత, సాగరమ్=సముద్రమును, తీర్ణాః=దాటినారో, తేనైవ=ఆ మార్గముచేతనే, దుద్రువుః=పారిపోయిరి.

తా. ఆ రాక్షసుడు అనాయాసముగా చంపివేయుచుండగా కొందరు వానరులు ఏ మార్గమున సముద్రము దాటిరో ఆ మార్గముననే పారిపోయిరి.15

మూ. తే స్థలాని తదా నిమ్నం విషణ్ణవదనా భయాత్,
ఋక్షా వృక్షాన్ సమారూఢాః కేచిత్పర్వత మాశ్రితాః. 16

ప్ర. అ. తదా=అప్పుడు, భయాత్=భయమువలన, విషణ్ణవదనాః=రంగు మారిన ముఖములు గల, తే=ఆ వానరులు, స్థలాని=ఎత్తు ప్రదేశములను, నిమ్నమ్=పల్లమును (ఆశ్రయించిరి). ఋక్షాః=ఎలుగుబంట్లు, వృక్షాన్=వృక్షములను, సమారూఢాః=ఎక్కినవి. కేచిత్=కొన్ని, పర్వతమ్=పర్వతమును, ఆశ్రితాః=ఆశ్రయించినవి.

తా. భయమువలన రంగు మారిన ముఖములు గల కొందరు వానరులు ఎత్తు ప్రదేశములను, కొందరు పల్లములను ఆశ్రయించగా, కొన్ని భల్లూకములు చెట్లమీదికి ఎక్కెను. కొన్ని పర్వతముమీదికి పారిపోయెను. 16

మూ. మమజ్జురర్ణవే కేచిద్గుహాః కేచిత్సమాశ్రితాః,
నిపేతుః కేచిదపరే కేచిన్నైవావతస్థిరే, 17
కేచిద్భూమౌ నిపతితాః కేచిత్సుప్తా మృతా ఇవ.

ప్ర. అ. కేచిత్=కొందరు, అర్ణవే=సముద్రమునందు, మమజ్జుః=మునిగిరి. కేచిత్=కొందరు, గుహాః=గుహలను, సమాశ్రితాః=ఆశ్రయించిరి. అపరే కేచిత్=మరికొందరు, నిపేతుః=పారిపోయిరి. కేచిత్=కొందరు, నైవ అవతస్థిరే=నిలవజాలకపోయిరి. కేచిత్=కొందరు, భూమౌ=నేలమీద, నిపతితాః=పడిరి. కేచిత్=కొందరు, మృతాః ఇవ=మరణించిన వారు వలె, సుప్తాః=పండుకొనిరి.

తా. కొందరు సముద్రములో మునిగిరి. కొందరు గుహలను ఆశ్రయించిరి. కొందరు నేలమీద పడిపోయిరి. కొందరు నిలబడలేకపోయిరి. కొందరు మరణించినట్లు పండుకొనిరి. 17

మూ. తాన్సమీక్ష్యాఙ్గదో భగ్నాన్వానరానిదమబ్రవీత్, 18
అవతిష్ఠత యుధ్యామో నివర్తధ్వం ప్లవంగమాః.

ప్ర. అ. అఙ్గదః=అంగదుడు, భగ్నాన్=ఓడిపోయిన, తాన్=ఆ, వానరాన్=వానరులను, సమీక్ష్య=చూచి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. ప్లవంగమాః=వానరులారా ! అవతిష్ఠత=నిలబడండి. నివర్తధ్వమ్=తిరిగి రండి. యుధ్యామః=యుద్ధముచేసెదము.

తా. భయపడి పారిపోవుచున్న ఆ వానరులను చూచి అంగదుడు ఇట్లు పలికెను. "ఓ ! వానరులారా ! నిలబడండి; వెనుకకు రండి; యుద్ధము చేసెదము." 18

మూ. భగ్నానాం వో న పశ్యామి పరిక్రమ్య మహీమిమామ్, 19
స్థానం సర్వే నివర్తధ్వం కిం ప్రాణాన్ పరిరక్షథ.

ప్ర. అ. ఇమామ్=ఈ, మహీమ్=భూమిని, పరిక్రమ్య=తిరిగి కూడ, భగ్నానామ్=ఓడిపోయిన, వః=మీకు, స్థానమ్=స్థానమును, న పశ్యామి=చూడను. సర్వే=అందరూ, నివర్తధ్వమ్=మరలండి. ప్రాణాన్=ప్రాణములను, కిమ్=ఎందుకు, పరిరక్షథ=రక్షించెదరు ?

తా. మీరు భయపడి ఓడిపోయి ఈ భూమి అంతా తిరిగినా కూడ మీకు స్థానము దొరకదు. వెనుకకు మరలండి; ప్రాణాలను ఎందుకు రక్షించుకొనెదరు ? 19

మూ. నిరాయుధానాం ద్రవతామసఙ్గగతిపౌరుషాః, 20
దారా హ్యుపహసిష్యన్తి స వై ఘాతః సుజీవతామ్.

ప్ర. అ. అసంగగతిపౌరుషాః=అడ్డులేని గమనము, పౌరుషము కల వారలారా ! నిరాయుధానామ్=ఆయుధములులేని, ద్రవతామ్=పారిపోవుచున్న మీయొక్క, దారాః=భార్యలు, ఉపహసిష్యన్తి=పరిహసించగలరు. సుజీవతామ్=బాగా జీవించినవారికి, సః=అది, ఘాతః వై=మరణము కదా.

తా. అడ్డులేని గమనము పౌరుషము గల వానరులారా ! ఆయుధములు విడచి పారిపోయిన మిమ్ములను చూచి మీ భార్యలు పరిహసించెదరు. బాగా జీవించినవారికి అది మరణమే కదా ? 20

మూ. కులేషు జాతాః సర్వే స్మ విస్తీర్ణేషు మహత్సు చ, 21
క్వ గచ్ఛత భయత్రస్తాః ప్రాకృతా హరయో యథా,
అనార్యాః ఖలు యద్భీతాస్త్యక్త్వా వీర్యం ప్రధావత. 22

ప్ర. అ. సర్వే=మనమందరమూ, విస్తీర్ణేషు=సుదీర్ఘమైన పరంపర గల, మహత్సు చ=గొప్పవైన, కులేషు=కులములయందు, జాతాః స్మ= పుట్టితిమి. ప్రాకృతాః=సామాన్యులైన, హరయః యథా=వానరులు వలె, భయ త్రస్తాః=భయహేతువువలన భయపడినవారై, క్వ=ఎక్కడికి, గచ్ఛత=వెళ్ళెదరు ? వీర్యమ్=పరాక్రమమును, త్యక్త్వా=విడచి, భీతాః=భయపడినవారై, యత్=ఎందు వలన, ప్రధావత=పారిపోవుచున్నారో, అందువలన, అనార్యాః ఖలు=అపూజ్యులు కదా !

తా. మనమందరము అతిప్రాచీనములై సుదీర్ఘపరంపర గల ఉత్తమకులాలలో పుట్టినాము. సామాన్యవానరులు వలె భయపడి ఎక్కడికి పారిపోయెదరు ? మీ పరాక్రమమును విడచి భయముతో పారిపోవుచున్న మీరు గౌరవానర్హులు కదా ? 21, 22

మూ. వికత్థనాని వో యాని తదా వై జనసంసది,
తాని వః క్వ ను యాతాని సోదగ్రాణి మహాన్తి చ. 23

ప్ర. అ. తదా=అప్పుడు, జనసంసది=జనుల సభలయందు, వః=మీయొక్క, సోదగ్రాణి=తీవ్రత్వముతో కూడిన, మహాన్తి చ=గొప్పవైన, యాని=ఏ, వికత్థ నాని=బడాయి చెప్పుకొనుటలు కలవో, వః=మీయొక్క, తాని=అవి, క్వ=ఎక్కడికి, గతాని=వెళ్ళినవి ?

తా. యుద్ధానికి వచ్చేటప్పుడు జనాల సమక్షములో మీ తీవ్రత్వమును చూపుచు మీరు చెప్పిన పెద్ద పెద్ద మాట లన్నీ ఎక్కడికి పోయినవి ?23

మూ. ధిగ్లోకః ప్రవాదాః శ్రూయన్తే యస్తు జీవతి ధిక్కృతః,
మార్గః సత్పురుషైర్జుష్టః సేవ్యతాం త్యజ్యతాం భయమ్. 24

ప్ర. అ. యః=ఎవడు, ధిక్కృతః=నిందింపబడినవాడై కూడ, జీవతి= జీవిం చునో అట్టి, భీరోః=పిరికివానియొక్క, ప్రవాదాః=లోకాపవాదలు, శ్రూయన్తే=వినబ డుచున్నవి. సత్పురుషైః=సత్పురుషులచేత, జుష్టః=సేవింపబడిన, మార్గః=మార్గము, సేవ్యతామ్=సేవింపబడుగాక; భయమ్=భయము, త్యజ్యతామ్=విడువబడుగాక.

తా. 'ఛీ' అనిపించుకొని జీవించి ఉండు పిరికిపంద లోకుల నిందలనే వినవలసి ఉండును. అందుచేత సత్పురుషులు అనుసరించిన మార్గమును అనుసరించండి. భయమును విడిచిపెట్టండి. 24

మూ. శయామహే వా నిహతాః పృథివ్యామల్పజీవితాః,
ప్రాప్నుయామో బ్రహ్మలోకం దుష్ప్రాపం చ కుయోధిభిః. 25

ప్ర. అ. అల్పజీవితాః=అల్పమైన ఆయుర్దాయము గల మనము, నిహతాః=చంపబడినవారమై, పృథివ్యామ్=నేలమీద, శయామహే వా=శయనించెదము; కుయోధిభిః=నీచయోధులచేత, దుష్ప్రాపమ్=పొందశక్యము కాని, బ్రహ్మలోకమ్=బ్రహ్మలోకమును, ప్రాప్నుయామః చ=పొందెదము.

తా. మన ఆయుర్దాయము అల్పమైనచో శత్రువుల చేతిలో చచ్చి నేలమీద పండుకొనెదము; నీచయోధులకు లభించని బ్రహ్మలోకమును చేరుకొనెదము.25

మూ. అవాప్నుయామః కీర్తిం వా నిహత్వా శత్రుమాహవే,
నిహతా వీరలోకస్య భోక్ష్యామో వసు వానరాః. 26

ప్ర. అ. వానరాః=వానరులారా!, ఆహవే=యుద్ధమునందు, శత్రుమ్=శత్రువును, నిహత్వా=చంపి, కీర్తిమ్=కీర్తిని, అవాప్నుయామః=పొందెదము; వా=లేదా, నిహతాః=చంపబడినవారమై, వీరలోకస్య=వీరులకు లభించు లోకముయొక్క, వసు=ధనమును, భోక్ష్యామః=అనుభవించెదము.

తా. వానరులారా! యుద్ధములో శత్రువును చంపి కీర్తినైనా పొందెదము. మనమే మరణించినచో వీరస్వర్గమునందు ఐశ్వర్యమును అనుభవించెదము. 26

మూ. న కుమ్భకర్ణః కాకుత్స్థం దృష్ట్వా జీవన్ గమిష్యతి,
దీప్యమానమివాసాద్య పతఙ్గో జ్వలనం యథా. 27

ప్ర. అ. పతఙ్గః=మిడుత, దీప్యమానమ్=మండుచున్న, జ్వలనమ్=అగ్నిని, ఆసాద్య ఇవ యథా=పొందిన వలె, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, కాకుత్స్థమ్=రాముణ్ణి, దృష్ట్వా=చూచి, జీవన్=జీవించుచున్నవాడై, న గచ్ఛతి=వెళ్లడు.

తా. మండుచున్న అగ్నిని చేరిన మిడుత వలె కుంభకర్ణుడు రాముణ్ణి చూచిన పిదప ప్రాణాలతో తిరిగి వెళ్లడు. 27

మూ. పలాయనేన చోద్దిష్టాః ప్రాణాన్ రక్షామహే వయమ్,
ఏకేన బహవో భగ్నా యశో నాశం గమిష్యతి. 28

ప్ర. అ. ఏకేన=ఒకనిచేత, భగ్నాః=ఓడింపబడిన, బహవః=చాలమంది మైన, ఉద్దిష్టాః=యుద్ధమునకై ఉద్దేశింపబడిన, వయమ్=మనము, పలాయనేన=పారిపోవుటచేత, ప్రాణాన్=ప్రాణములను, రక్షామహే=రక్షించినట్లయితే, యశః=కీర్తి, నాశమ్= నాశమును, గమిష్యతి=పొందగలదు.

తా. యుద్ధము చేయుటకై ఉద్దేశింపబడిన మనము చాలమంది ఒక్కని

వేరితో ఓడిపోయి, పారిపోయి ప్రాణాలను రక్షించుకొన్నట్లయితే మన కీర్తి నాశమును పొందును. 29

మూ. ఏవం బ్రువాణం తం శూరమఙ్గదం కనకాఙ్గదమ్,
ద్రవమాణాస్తతో వాక్యమూచుః శూరవిగర్హితమ్. 30

ప్ర. అ. ద్రవమాణాః=పారిపోవుచున్న ఆ వానరులు, ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్= పలుకుచున్న, కనకాఙ్గదమ్=బంగారు బాహుపురులు గల, శూరమ్=శూరుడైన, తమ్=ఆ, అఙ్గదమ్=అంగదుని గూర్చి, తతః=అటుపిమ్మట, శూరవిగర్హితమ్=శూరులచేత నింద్యమైన, వాక్యమ్=వాక్యమును, ఊచుః=పలికిరి.

తా. అప్పుడు పారిపోవుచున్న ఆ వానరులు, బంగారు బాహుపురులు గల, శూరుడైన ఆ అంగదునితో శూరులు నిందించు మాట పలికిరి. 30

మూ. కృతం నః కదనం ఘోరం కుమ్భకర్ణేన రక్షసా,
న స్థానకాలో గచ్ఛామో దయితం జీవితం హి నః. 31

ప్ర. అ. నః=మాకు, రక్షసా=రాక్షసుడైన, కుమ్భకర్ణేన=కుంభకర్ణునితో, ఘోరమ్=భయంకరమైన, కదనమ్=యుద్ధము, కృతమ్=చాలును. స్థానకాలః=నిలచుటకు సమయము, న=కాదు; నః=మాకు, జీవితమ్=ప్రాణము, దయితం హి= ఇష్టమైనది కదా !

తా. కుంభకర్ణునితో ఘోరమైన యుద్ధము చేసి చాలును; ఇది నిలచుటకు తగిన సమయము కాదు. మాకు ప్రాణాలే చాల ప్రియమైనవి. 31

మూ. ఏతావదుక్త్వా వచనం సర్వే తే భేజిరే దిశః,
భీమం భీమాక్షమాయాన్తం దృష్ట్వా వానరయూథపాః. 32

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరయూథపాః=వానరసేనానాయకులు, భీమాక్షమ్=భయంకరములైన నేత్రములు గల, భీమమ్=భయంకరుడైన, ఆయాన్తమ్=వచ్చుచున్న కుంభకర్ణుని, దృష్ట్వా=చూచి, ఏతావత్=ఇంతమాత్రము, వచనమ్=వచనమును, ఉక్త్వా=పలికి, దిశః=దిక్కులను, భేజిరే=పొందిరి.

తా. ఆ వానరసేనానాయకు లందరూ భయమును కలిగించు నేత్రములు గల, భయంకరుడైన, వచ్చుచున్న కుంభకర్ణుని చూచి, అంగదునితో ఇంతమాత్రమే పలికి దిక్కులు పట్టి పారిపోయిరి. 32

మూ. ద్రవమాణాస్తు తే వీరా అఙ్గదేన వలీముఖాః,
సాన్త్వైశ్చానునయైశ్చ తతః సర్వే నివర్తితాః. 33

ప్ర. అ. ద్రవమాణాః=పారిపోవుచున్న, వీరాః=వీరులైన, తే=ఆ, వలీ

ముఖాః=వానరులు, సర్వే=అందరూ, తతః=అటుపిమ్మట, అఙ్గదేన=అంగదునిచేత, సాన్త్వనైః=ప్రతిమాలుకొనుటచేత, అనుమానైః=యుక్తులచేత, వివర్తితాః=మరల్పబడిరి.

తా. పారిపోవుచున్న ఆ వీరులైన వానరుల నందరినీ అంగదుడు ప్రతిమాలుకొని ధైర్యము చెప్పి, రాముని మహాపరాక్రమమును వర్ణించుట మొదలైన యుక్తులను చూపి మరల్చెను. 33

మూ. ప్రహర్షముపనీతాశ్చ వాలిపుత్రేణ ధీమతా,
ఆజ్ఞాప్రతీక్షాస్తస్థుశ్చ సర్వే వానరయూథపాః. 34

ప్ర. అ. సర్వే=సమస్తమైన, వానరయూథపాః=వానరసేనానాయకులు, ధీమతా=బుద్ధిమంతుడైన, వాలిపుత్రేణ=అంగదునిచేత, ప్రహర్షమ్=సంతోషమును, ఉపనీతాః చ=పొందింపబడినవారై, ఆజ్ఞాప్రతీక్షాః=ఆజ్ఞను ఎదురుచూచుచున్నవారై, తస్థుః చ=ఉండిరి.

తా. బుద్ధిమంతుడైన అంగదునిచేత ప్రోత్సాహితులైన ఆ వానరసేనానాయకు లందరూ అతని ఆజ్ఞకై ఎదురుచూచుచు నిలిచిరి. 34

మూ. ఋషభశరభమైన్దధూమ్రనీలాః
కుముదసుషేణగవాక్షరమ్భతారాః,
ద్వివిదపనసవాయుపుత్రముఖ్యా
స్త్వరితతరాభిముఖం రణం ప్రయాతాః. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే షట్షష్టితమః సర్గః.

ప్ర. అ. ఋషభశరభమైన్దధూమ్రనీలాః=ఋషభ - శరభ - మైంద - ధూమ్ర - నీలులు, కుముదసుషేణగవాక్షరమ్భతారాః=కుముద - సుషేణ - గవాక్ష - రంభ - తారులు, ద్వివిదపనసవాయుపుత్రముఖ్యాః=ద్వివిద - పనస - హనుమంతులు మొదలైనవారు, త్వరితతరాభిముఖమ్=చాల తొందరగాను, అభిముఖముగాను, రణమ్=యుద్ధమును గూర్చి, ప్రయాతాః=వెళ్లిరి.

తా. ఋషభ - శరభ - మైంద - ధూమ్ర - నీల - కుముద - సుషేణ - గవాక్ష - రంభ - తార - ద్వివిద - పనస - హనుమంతుడు మొదలైన వానరులు తొందరగా కుంభకర్ణాభిముఖులై యుద్ధానికి వెళ్లిరి.

వి. “హనుమంతుడు పారిపోయి వెనుకకు రాలేదు; ఋషభాదులతో కలిసి కుంభకర్ణునితో యుద్ధము చేయుటకై వచ్చినాడు” అని గోవిందరాజులు వ్రాసినారు. ఇతరవ్యాఖ్యానాల ప్రకారము, ప్రాచ్యప్రతిలోను ఈ శ్లోకం లేదు. లేకపోవుటయే యుక్తము. 35.

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తషష్టితమః సర్గః

[కుంభకర్ణుడు ఘోరయుద్ధము చేసి రామునిచే సంహరింపబడుట.]

మూ. తే నివృత్తా మహాకాయాః శ్రుత్వాఙ్గదవచస్తదా,
నైష్ఠికం బుద్ధిమాస్థాయ సర్వే సంగ్రామకాంక్షిణః. 1

ప్ర. ఆ. తదా=అప్పుడు, అఙ్గదవచః=అంగదుని వచనమును, శ్రుత్వా=విని, నివృత్తాః=మరలిన, మహాకాయాః=పెద్ద శరీరములు గల, సర్వే=సమస్తమైన, తే= ఆ వానరులు, నైష్ఠికమ్=స్థిరత్వముతో కూడిన, బుద్ధిమ్=బుద్ధిని, ఆస్థాయ= అవలంబించి, సంగ్రామకాంక్షిణః=యుద్ధమును కోరుచున్నవారుగా (ఉండిరి).

తా. అప్పుడు అంగదుని మాటలు విని వెనుకకు మరలిన పెద్ద దేహములు గల ఆ వానరులందరూ స్థిరమైన బుద్ధితో యుద్ధమునకై వేచి యుండిరి. 1

మూ. సముదీరితవీర్యాస్తే సమారోపితవిక్రమాః,
పర్యవస్థాపితా వాక్యైరఙ్గదేన బలీయసా, 2
ప్రయాతాశ్చ గతా హర్షం మరణే కృతనిశ్చయాః,
చక్రుః సుతుములం యుద్ధం వానరాస్త్యక్తజీవితాః. 3

ప్ర. ఆ. సముదీరితవీర్యాః=వృద్ధిపొందింపబడిన పరాక్రమము గలవారు, సమారోపితవిక్రమాః=అవలంబించబడిన పరాక్రమము గలవారు, బలీయసా=బలవంతుడైన, అఙ్గదేన=అంగదునిచేత, వాక్యైః=మాటలచేత, పర్యవస్థాపితాః=ధైర్యముతో నిలబెట్టబడినవారు అయిన, తే వానరాః=ఆ వానరులు, హర్షమ్=ఉత్సాహమును, గతాః=పొందినవారై, మరణే=మరణమునందు, కృతనిశ్చయాః=చేయబడిన నిశ్చయముకలవారై, ప్రయాతాః=వెళ్లినారు. త్యక్తజీవితాః=విడువబడిన జీవితము గలవారై, సుతుములమ్=చాల తీవ్రమైన, యుద్ధమ్= యుద్ధమును, చక్రుః=చేసిరి.

తా. అత్యధికమైన పరాక్రమము గల ఆ వానరులు బలశాలియైన అంగదునిచేత నిలుపబడిన పరాక్రమము గలవారై, విక్రమమును అవలంబించి, ఉత్సాహము పొంది, మరణించుటకు నిశ్చయించుకొని, వెళ్లిరి. ప్రాణములకు లెక్కచేయక చాల వ్యాకులమైన యుద్ధము చేసిరి. 2, 3

మూ. అథ వృక్షాన్ మహాకాయాః సానూని సుమహాన్తి చ,
వానరాస్తూర్ణముద్యమ్య కుమ్భకర్ణమభిద్రవన్. 4

ప్ర. ఆ. అథ=ఆటుపిమ్మట, మహాకాయాః=పెద్ద శరీరములు గల, వానరాః= వానరులు, వృక్షాన్=వృక్షములను, సుమహాన్తి=చాలపెద్దవైన, సానూని=చరియ

లను, ఉద్యమ్య=ఎత్తి, తూర్ణమ్=శీఘ్రముగా, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని గూర్చి, అభిద్రవన్=పరుగెత్తిరి.

తా. పిమ్మట పెద్ద శరీరములు గల ఆ వానరులు వృక్షములను, చాల పెద్దవైన పర్వతశిలలను ఎత్తి శీఘ్రముగా కుంభకర్ణునిమీదికి పరుగెత్తిరి. 4

మూ. కుమ్భకర్ణః సుసంక్రుద్ధో గదాముద్యమ్య వీర్యవాన్,
అర్దయన్ స మహాకాయః సమన్తాద్వ్యక్షిపద్రిపూన్. 5

ప్ర. అ. మహాకాయః=పెద్ద శరీరము గల, వీర్యవాన్=పరాక్రమముగల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, గదామ్=గదను, ఉద్యమ్య=ఎత్తి, అర్దయన్=భయపెట్టుచు, రిపూన్=శత్రువులను, సమన్తాత్=అన్ని వైపులా, వ్యక్షిపత్=చిమ్మివేసెను.

తా. పెద్ద శరీరము గల పరాక్రమవంతుడైన కుంభకర్ణుడు చాల కోపించి, గదను ఎత్తి శత్రువులను భయపెట్టుచు అన్ని వైపులా వాళ్లను విసరివేసెను. 5

మూ. శతాని సప్త చాష్టౌ చ సహస్రాణి చ వానరాః,
ప్రకీర్ణాః శేరతే భూమౌ కుమ్భకర్ణేన తాడితాః. 6

ప్ర. అ. సప్త=ఏడు, అష్టౌ చ=ఎనిమిది, శతాని=వందలు, సహస్రాణి చ= వేలు, వానరాః=వానరులు, కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, తాడితాః=కొట్టబడినవారై, ప్రకీర్ణాః=చిమ్మబడినవారై, భూమౌ=నేలమీద, శేరతే=శయనించిరి.

తా. కుంభకర్ణునిచేత కొట్టబడినవారై వానరులు, ఏడు వందలు, ఎనిమిది వందలు, వెయ్యి చొప్పున నేలమీద విసరివేయబడి పడిపోయిరి. 6

మూ. షోడశాష్టౌ చ దశ చ వింశత్త్రింశత్తథైవ చ,
పరిక్షిప్య చ బాహుభ్యాం ఖాదన్స పరిధావతి. 7
భక్షయన్ భృశసంక్రుద్ధో గరుడః పన్నగానివ.

ప్ర. అ. సః=ఆ కుంభకర్ణుడు, భృశసంక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, షోడశ=పదహారుగురిని, అష్టౌ చ=ఎనమండుగురిని, దశ చ=పదిమందిని, తథైవ=అట్లే, వింశత్=ఇరవైమందిని, త్రింశత్=ముప్పైమందిని, బాహుభ్యామ్=బాహువులచేత, పరిక్షిప్య=(నోటిలో) వేసికొని, ఖాదన్=నములుచు, పన్నగాన్=సర్పములను, భక్షయన్=భక్షించుచున్న, గరుడః ఇవ=గరుత్మంతుడు వలె, పరిధావతి=పరుగెత్తుచుండెను.

తా. ఆ కుంభకర్ణుడు చాల కోపించి, పదహారుగురు, ఎనమండుగురు,

పదిమంది, ఇరవైమంది, ముప్పైమంది చొప్పున వానరులను బాహువులతో పట్టి నోటిలో వేసికొని నములుచు, సర్పములను భక్షించుచున్న గరుత్మంతుడు వలె, యుద్ధరంగములో వేగముగా తిరుగుచుండెను. 7

మూ. కృచ్ఛ్రేణ చ సమాశ్వస్తాః సంగమ్య చ తతస్తతః, 8
వృక్షాద్రిహస్తా హరయస్తస్థుః సంగ్రామమూర్ధని.

ప్ర. అ. హరయః=వానరులు, కృచ్ఛ్రేణ=కష్టముచేత, సమాశ్వస్తాః=ఊరడిల్లినవారై, తతస్తతః=ఆ యా వైపులనుండి, సంగమ్య చ=వచ్చి కలిసి, వృక్షాద్రిహస్తాః=వృక్షములు పర్వతములు హస్తములందు కలవారై, సంగ్రామమూర్ధని=యుద్ధాగ్రప్రదేశమునందు, తస్థుః=నిలిచిరి.

తా. వానరులు అతికష్టము మీద ధైర్యము తెచ్చుకొని, ఆ యా వైపులనుండి వచ్చి చేరి, వృక్షములు పర్వతములు చేతులలో ధరించి నిలిచిరి.

మూ. తతః పర్వతముత్పాట్య ద్వివిదః ప్లవగర్షభః, 9
దుద్రావ గిరిశృఙ్గాభం విలమ్బ ఇవ తోయదః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడైన, ద్వివిదః=ద్వివిదుడు, పర్వతమ్=పర్వతమును, ఉత్పాట్య=పెకలించి, విలమ్బః=వ్రేలాడుచున్న, తోయదః ఇవ=మేఘము వలె, గిరిశృఙ్గాభమ్=పర్వతశిఖరమువంటి కాంతి గల ఆ కుంభకర్ణుని గూర్చి, దుద్రావ=పరుగెత్తెను.

తా. పిమ్మట వానరశ్రేష్ఠుడైన ద్వివిదుడు పర్వతము పెకలించి, ఆకాశమునుండి వ్రేలాడుచున్న మేఘమువలె, పర్వతశిఖరము వంటి కాంతి గల ఆ కుంభకర్ణుణ్ణి గూర్చి పరుగెత్తెను. 9

మూ. తం సముత్పత్య చిక్షేప కుమ్భకర్ణాయ వానరః, 10
తమప్రాప్య మహాకాయం తస్య సైన్యేఽపతత్తతః.

ప్ర. అ. వానరః=ఆ వానరుడు, సముత్పత్య=పైకి ఎగిరి, తమ్=దానిని, కుమ్భకర్ణాయ=కుంభకర్ణునకు, చిక్షేప=విసిరెను. మహాకాయమ్=పెద్ద దేహము గల, తమ్=అతనిని, అప్రాప్య=చేరకుండానే, తతః=అటుపిమ్మట, తస్య=అతనియొక్క, సైన్యే=సైన్యమునందు, అపతత్=పడెను.

తా. ద్వివిదుడు పైకి ఎగిరి ఆ పర్వతమును కుంభకర్ణుని మీదికి విసిరెను. అతి గొప్ప దేహము గల అతనిని చేరకుండగానే అతని

సైన్యముపైఁ బడెను.

మూ. మమర్దాశ్వాన్ గజాంశ్చాపి రథాంశ్చాపి నగోత్తమః, 11
తాని చాన్యాని రక్షాంసి ఏవం చాన్యద్గిరేః శిరః.

ప్ర. అ. నగోత్తమః=ఆ శ్రేష్ఠమైన పర్వతము, అశ్వాన్=గుఱ్ఱములను, గజాంశ్చాపి=ఏనుగులను, రథాంశ్చాపి=రథములను, మమర్ద=మర్దించెను. అన్యత్=మఱియొక, గిరేః శిరః=పర్వతశిఖరము, తాని=ఆ, అన్యాని=ఇతరులైన, రక్షాంసి=రాక్షసులను, (మమర్ద=మర్దించెను)

తా. ఆ పర్వతము అశ్వములను, గజములను, రథములను మర్దించెను. మఱొక పర్వతశిఖరమును ప్రయోగింపగా అది ఇతరరాక్షసులను మర్దించెను.

మూ. తచ్ఛైలవేగాభిహతం హతాశ్వం హతసారథి, 12
రక్షసాం రుధిరక్లిన్నం బభూవాయోధనం మహత్.

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులయొక్క, మహత్=గొప్పదైన, ఆయోధనమ్=యుద్ధము, తచ్ఛైలవేగాభిహతమ్=ఆ శైలముయొక్క వేగముచేత కొట్టబడినదై, హతాశ్వమ్=చంపబడిన అశ్వములుగలది, హతసారథి=చంపబడిన సారథులు గలది, రుధిరక్లిన్నమ్=రక్తముచేత తడిసినది, బభూవ=అయ్యెను.

తా. రాక్షసుల ఆ యుద్ధము పర్వతవేగముచేత కొట్టబడినదై, అశ్వములు, సారథులు మరణింపగా రక్తముచేత తడిసిపోయెను. 12

మూ. రథినో వానరేన్ద్రాణాం శరైః కాలాన్తకోపమైః, 13
శిరాంసి నర్దతాం జహ్రుః సహసా భీమనిఃస్వనాః.

ప్ర. అ. భీమనిఃస్వనాః=భయంకరమైన ధ్వని గల, రథినః=రథికులు, కాలాన్తకోపమైః=ప్రళయకాలమందలి మృత్యుదేవతతో సమానములైన, శరైః=బాణములచేత, సహసా=వెంటనే, నర్దతామ్=ధ్వనిచేయుచున్న, వానరేన్ద్రాణామ్=వానరశ్రేష్ఠులయొక్క, శిరాంసి=శిరస్సులను, జహ్రుః=హరించిరి.

తా. భయంకరమైన ధ్వని గల రథికులు ప్రళయకాలమృత్యుదేవతతో సమానములైన బాణములతో గర్జించుచున్న వానరశ్రేష్ఠుల శిరస్సులను, శీఘ్రముగా ఖండించిరి. 13

మూ. వానరాశ్చ మహాత్మానః సముత్పాట్య మహాద్రుమాన్, 14
రథానశ్వాన్ గజానుష్ట్రాన్రాక్షసానభ్యసూదయన్.

ప్ర. అ. మహాత్మానః=మహాత్ములైన, వానరాశ్చ=వానరులు కూడ,

మహాద్రుమాన్=మహావృక్షములను, సముత్పాట్య=పెల్లగించి, రథాన్=రథములను, అశ్వాన్=గుఱ్ఱములను, ఉష్ట్రాన్=ఒంటెలను, రాక్షసాన్=రాక్షసులను, అభ్యమారయన్=నశింపచేసిరి.

తా. మహాత్ములైన వానరులు కూడ పెద్ద వృక్షములను పెకలించి రథములను, అశ్వములను, ఏనుగులను, ఒంటెలను, రాక్షసులను నశింపచేసిరి.

మూ. హనుమాన్ శైలశృఙ్గాణి శిలాశ్చ వివిధాన్ ద్రుమాన్, 15
వవర్ష కుమ్భకర్ణస్య శిరస్యమ్బరమాస్థితః.

ప్ర. అ. హనూమాన్=హనుమంతుడు, అమ్బరమ్=ఆకాశమును, ఆస్థితః=ఆశ్రయించినవాడై, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, శిరసి=శిరస్సుమీద, శైలశృఙ్గాణి=పర్వతశిఖరములను, శిలాశ్చ=రాళ్ళను, వివిధాన్=అనేకవిధములైన, ద్రుమాన్=వృక్షములను, వవర్ష=వర్షించెను.

తా. హనుమంతుడు ఆకాశములో ఉండి పర్వతశిఖరములను, శిలలను, అనేక విధములైన వృక్షములను, కుంభకర్ణుని శిరస్సుపై వర్షించెను.15

మూ. తాని పర్వతశృఙ్గాణి శూలేన స బిభేద హ, 16
బభఞ్జ వృక్షవర్షం చ కుమ్భకర్ణో మహాబలః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, శూలేన=శూలముచేత, తాని=ఆ, పర్వతశృఙ్గాణి=పర్వతశిఖరములను, బిభేద హ=భేదించెను. వృక్షవర్షం చ=వృక్షవర్షమును కూడ, బభఞ్జ=భగ్నము చేసెను.

తా. గొప్ప బలము గల కుంభకర్ణుడు శూలముతో ఆ పర్వత శిఖరములను బ్రద్దలు కొట్టెను. వృక్షవర్షమును భగ్నము చేసెను. 16

మూ. తతో హరీణాం తదనీకముగ్రం
దుద్రావ శూలం నిశితం ప్రగృహ్య,
తస్థౌ స తస్యాపతతః పురస్తా
న్మహీధరాగ్రం హనుమాన్ ప్రగృహ్య. 17

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ఉగ్రమ్=భయంకరమైన, శూలమ్=శూలమును, ప్రగృహ్య=గ్రహించి, హరీణామ్=వానరులయొక్క, ఉగ్రమ్=భయంకరమైన, తత్=ఆ, అనీకమ్=సైన్యమును గూర్చి, దుద్రావ=పరుగెత్తి వెళ్ళెను. హనుమాన్=హనుమంతుడు, మహీధరాగ్రమ్=పర్వతశిఖరమును, ప్రగృహ్య=గ్రహించి, ఆపతతః=వచ్చి మీద పడుచున్న, తస్య=వానియొక్క, పురస్తాత్=ఎదుట, తస్థౌ=నిలచెను.

తా. పిమ్మట కుంభకర్ణుడు వాడియైన శూలమును గ్రహించి భయంకరమైన ఆ వానరసైన్యముమీదికి శీఘ్రముగా వెళ్లెను. హనుమంతుడు పర్వతశిఖరమును గ్రహించి, వానరసైన్యము మీదికి వచ్చుచున్న అతని ఎదుట నిలచెను. 17

మూ. స కుమ్భకర్ణం కుపితో జఘాన
వేగేన శైలోత్తమభీమకాయమ్,
స చుక్షుభే తేన తదాభిభూతో
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః. 18

ప్ర. అ. కుపితః=కోపించిన, సః=ఆ హనుమంతుడు, శైలోత్తమభీమకాయమ్=ఉత్తమమైన శైలము వలె భయంకరమైన శరీరము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, వేగేన=వేగముతో, జఘాన=కొట్టెను. తదా=అప్పుడు, తేన=వానిచేత, అభిభూతః=తిరస్కరించబడిన, సః=ఆ కుంభకర్ణుడు, మేదార్ద్రగాత్రః=కొవ్వుచేత తడిసిన శరీరము గలవాడై, రుధిరావసిక్తః=రక్తముచేత తడిసినవాడై, చుక్షుభే=క్షోభ చెందెను.

తా. హనుమంతుడు కోపించి, ఉత్తమమైన పర్వతము వలె భయంకరమైన దేహముగల ఆ కుంభకర్ణుని వేగముగా కొట్టగా అతడు కొవ్వుచేత, రక్తముచేత తడిసిన దేహముతో క్షోభ చెందెను. 18

మూ. స శూలమావిధ్య తడిత్ప్రకాశం
గిరిర్యథా ప్రజ్వలితాగ్రశృఙ్గమ్,
బాహ్వన్తరే మారుతి మాజఘాన
గుహోఽచలం క్రౌఞ్చమివోగ్రశక్త్యా. 19

ప్ర. అ. సః=ఆ కుంభకర్ణుడు, గిరిః=పర్వతము, ప్రజ్వలితాగ్రశృఙ్గం యథా=మండుచున్న శిఖరాగ్రమును వలె, తడిత్ప్రకాశమ్=మెరుపువంటి ప్రకాశ గల, శూలమ్=శూలమును, ఆవిధ్య=గట్టిగా పట్టి, గుహః=కుమారస్వామి, ఉగ్రశక్త్యా=ఉగ్రమైన శక్తిచేత, క్రౌఞ్చమ్ అచలమివ=క్రౌంచపర్వతమును వలె, మారుతిమ్=హనుమంతుని, బాహ్వన్తరే=బాహువుల మధ్య, ఆజఘాన=కొట్టెను.

తా. కుంభకర్ణుడు మెరుపు వంటి ప్రకాశ గల శూలమును, మండుచున్న శిఖరాగ్రము గల పర్వతమువలె గట్టిగా పట్టి, కుమారస్వామి శక్తిచేత క్రౌంచపర్వతమును కొట్టినట్లు హనుమంతుని వక్షస్థలముమీద కొట్టెను. 19

మూ. స శూలనిర్భిన్నమహాభుజాన్తరః
ప్రవిహ్వలః శోణితముద్వమన్ ముఖాత్,

సనాద భీమం హనుమాన్ మహాహవే
యుగాన్తమేఘస్తనితస్వనోపమమ్. 20

ప్ర. అ. మహాహవే=ఆ మహాయుద్ధమునందు, శూలనిర్భిన్న మహాభుజాన్తరః= శూలముచేత బ్రద్దలు కొట్టబడిన విశాలమైన వక్షఃస్థలము గల, సః హనుమాన్=ఆ హనుమంతుడు, ప్రవిహ్వలః=చాల వ్యాకులుడై, ముఖాత్=ముఖమునుండి, శోణితమ్=రక్తమును, ఉద్వమన్=కక్కుచు, యుగాన్త మేఘస్తనితస్వనోపమమ్=ప్రలయకాలమేఘముల ఉరుముల ధ్వనితో సమానముగా, భీమమ్=భయంకరముగా, ననాద=ధ్వనిచేసెను.

తా. ఆ మహాయుద్ధమునందు శూలముచేత విశాలమైన వక్షఃస్థలము నందు కొట్టబడినవాడై హనుమంతుడు వ్యాకులత చెంది, ముఖమునుండి రక్తము కక్కుచు ప్రళయకాలమేఘము ఉరుముతో సమానముగా భయంకరమైన ధ్వని చేసెను. 20

మూ. తతో వినేదుః సహసా ప్రహృష్టా
రక్షోగణాస్తం వ్యథితం సమీక్ష్య,
ప్లవంగమాస్తు వ్యథితా భయార్తాః
ప్రదుద్రువుః సంయతి కుమ్భకర్ణాత్. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రక్షోగణాః=రాక్షసగణములు, వ్యథితమ్=వ్యథచెందిన, తమ్=హనుమంతుని, సమీక్ష్య=చూచి, ప్రహృష్టాః=సంతోషించినవారై, సహసా=వెంటనే, వినేదుః=అరచిరి. ప్లవంగమాస్తు=వానరులైతే, వ్యథితాః=వ్యథచెందినవారై, భయార్తాః=భయపీడితులై, సంయతి=యుద్ధమునందు, కుమ్భకర్ణాత్= కుంభకర్ణునినుండి, ప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. రాక్షసులందరు వ్యథ చెందిన ఆ హనుమంతుని చూడగానే సంతోషముతో కేకలు వేసిరి. వానరులు మాత్రము వ్యథచెంది, భయపీడితులై, యుద్ధరంగములో ఆ కుంభకర్ణుని దగ్గరనుండి పారిపోయిరి. 21

మూ. తతస్తు నీలో బలవాన్ పర్యవస్థాపయన్ బలమ్,
ప్రవిచిక్షేప శైలాగ్రం కుమ్భకర్ణాయ ధీమతే. 22

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బలవాన్=బలవంతుడైన, నీలః=నీలుడు, బలమ్=సైన్యమును, పర్యవస్థాపయన్=నిలుపుచు, ధీమతే=బుద్ధిమంతుడైన, కుమ్భకర్ణాయ=కుంభకర్ణునకు, శైలాగ్రమ్=పర్వతశిఖరమును, ప్రవిచిక్షేప=విసరెను.

తా. బలశాలియైన నీలుడు సైన్యమును ధైర్యము చెప్పి నిలబెట్టుచు, బుద్ధిమంతుడైన కుంభకర్ణునిమీదికి పర్వతశిఖరమును విసరెను. 22

మూ. తదాపతన్తం సంప్రేక్ష్య ముష్టినాభిజఘాన హ,
ముష్టిప్రహారాభిహతం తచ్ఛైలాగ్రం వ్యశీర్యత. 23
సవిస్ఫులింగం సజ్వాలం నిపపాత మహీతలే.

ప్ర. అ. తదా=అప్పుడు, ఉపతన్తమ్=వచ్చిపడుచున్న శైలాగ్రమును, సంప్రేక్ష్య=చూచి, ముష్టినా=పిడికిలితో, అభిజఘాన హ=కొట్టెను. ముష్టిప్రహారాభిహతమ్=పిడికిలి దెబ్బచేత కొట్టబడిన, తత్=ఆ, శైలాగ్రమ్=పర్వతాగ్రము, వ్యశీర్యత=బ్రద్దలైపోయెను. సవిస్ఫులింగమ్=అగ్నికణములతో కూడినదై, సజ్వాలమ్=జ్వాలలతో కూడినదై, మహీతలే=నేలమీద, నిపపాత=పడెను.

తా. అప్పుడు కుంభకర్ణుడు మీద పడుచున్న ఆ పర్వత శిఖరమును చూచి దానిని పిడికిలితో కొట్టెను. అది పిడికిలి దెబ్బకు బ్రద్దలైపోయి, అగ్నికణములతో, అగ్నిజ్వాలలతో నేలమీద పడిపోయెను. 23

మూ. ఋషభః శరభో నీలో గవాక్షో గన్ధమాదనః, 24
పఞ్చ వానర శార్దూలాః కుమ్భకర్ణముపాద్రవన్.

ప్ర. అ. ఋషభః=ఋషభుడు, శరభః=శరభుడు, నీలః=నీలుడు, గవాక్షః=గవాక్షుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, పఞ్చ=ఐదుగురు, వానర శార్దూలాః=వానరశ్రేష్ఠులు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణునే గూర్చి, ఉపాద్రవన్=పరుగెత్తిరి.

తా. వానరశ్రేష్ఠులైన ఋషభ - శరభ - నీల - గవాక్ష - గంధమాదనులు ఐదుగురూ కుంభకర్ణుని మీదికి వేగముగా వెళ్ళిరి. 24

మూ. శైలైర్వృక్షైస్తలైః పాదైర్ముష్టిభిశ్చ మహాబలాః, 25
కుమ్భకర్ణం మహాకాయం నిజఘ్నుః సర్వతో యుధి.

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల ఆ వానరులు, శైలైః=పర్వతములచేత, వృక్షైః=వృక్షములచేత, తలైః=అరచేతులచేత, పాదైః=పాదములచేత, ముష్టిభిః చ= పిడికిళ్ళచేత, మహాకాయమ్=పెద్ద దేహము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణునే, సర్వతః=అంతటా, యుధి=యుద్ధమునందు, నిజఘ్నుః=కొట్టిరి.

తా. మహాబలవంతులైన ఆ ఐదుగురు వానరులు, పెద్ద దేహము గల ఆ కుంభకర్ణునే, యుద్ధమునందు, పర్వతములచేత, వృక్షములచేత, అరచేతులచేత, పాదములచేత, పిడికిళ్ళచేత అన్ని వైపులనుండీ కొట్టిరి. 25

మూ. స్పర్శానివ ప్రహారాంస్తాన్వేదయానో న వివ్యథే, 26
ఋషభం తు మహావేగం బాహుభ్యాం పరిషస్వజే.

ప్ర. అ. తాన్=ఆ, ప్రహారాన్=దెబ్బలను, స్పర్శానివ=స్పృశించుటను వలె, వేదయానః=తెలిసికొనుచు, న వివ్యథే=వ్యథ చెందలేదు. మహావేగమ్=గొప్ప వేగము గల, ఋషభమ్=ఋషభుణ్ణి, బాహుభ్యామ్=బాహువులతో, పరిష్వజే=కౌగలించుకొనెను.

తా. ఆ దెబ్బలన్నీ కుంభకర్ణునకు స్పర్శమాత్రములుగా అనిపించెను. అతడు ఏమాత్రము వ్యథ చెందలేదు. గొప్ప వేగము గల ఋషభుణ్ణి బాహువులతో కౌగలించుకొనెను. 26

మూ. కుమ్భకర్ణభుజాభ్యాం తు పీడితో వానరర్షభః, 27
నిపపాతర్షభో భీమః ప్రముఖాగతశోణితః.

ప్ర. అ. కుమ్భకర్ణభుజాభ్యాం=కుంభకర్ణుని భుజములచేత, పీడితః=పీడించబడిన, వానరర్షభః=వానరశ్రేష్ఠుడైన, భీమః=భయంకరుడైన, ఋషభః=ఋషభుడు, ప్రముఖాగతశోణితః=ముఖమునుండి వచ్చిన రక్తము కలవాడై, నిపపాత=క్రింద పడిపోయెను.

తా. భయంకరుడు, వానరశ్రేష్ఠుడు అయిన ఋషభుడు కుంభకర్ణునిచే బాహువులచేత పీడింపబడి ముఖమునుండి రక్తము కార్చుచు నేలమీద పడిపోయెను.

మూ. ముష్టినా శరభం హత్వా జానునా నీలమాహవే, 28
ఆజఘాన గవాక్షం తు తలేనేన్ద్రరిపుస్తదా,
పాదేనాభ్యహనత్క్రుద్ధ స్తరసా గన్ధమాదనమ్. 29

ప్ర. అ. తదా=అప్పుడు, క్రుద్ధః=కోపించిన, ఇన్ద్రరిపుః=ఇంద్రుని శత్రువైన కుంభకర్ణుడు, ఆహవే=యుద్ధమునందు, శరభమ్=శరభుణ్ణి, ముష్టినా=పిడికిలిచేతా, నీలమ్=నీలుణ్ణి, జానునా=మోకాలిచేత, హత్వా=కొట్టి, గవాక్షమ్=గవాక్షుణ్ణి, తలేన=అరచేత, ఆజఘాన=కొట్టెను. గన్ధమాదనమ్=గంధమాదనుణ్ణి, తరసా బలముతో, పాదేన=పాదముచేత, అభ్యహనత్=కొట్టెను.

తా. అప్పుడా యుద్ధమునందు కోపించిన కుంభకర్ణుడు శరభుణ్ణి పిడికిలిచేతను, నీలుణ్ణి మోకాలిచేతను, గవాక్షుణ్ణి అరచేతిచేతను, గంధమాదనుణ్ణి పాదముచేతను బలముతో కొట్టెను. 28, 29

మూ. దత్తప్రహారవ్యథితా ముముహుః శోణితోక్షితాః,
నిపేతుస్తే తు మేదిన్యాం నికృత్తా ఇవ కింశుకాః. 30

ప్ర. అ. తే=ఆ వానరులు, దత్తప్రహారవ్యథితాః=ఇవ్వబడిన దెబ్బలచేత వ్యథ చెందినవారై, శోణితోక్షితాః=రక్తముచేత తడపబడినవారై, ముముహుః=మోహము

చెందిరి. నికృత్తాః=తెగగొట్టబడిన, కింశుకాః ఇవ=కింశుకవృక్షములు వలె, మేదిన్యామ్=భూమిమీద, నిపేతుః=పడిరి.

తా. ఆ వానరులు కుంభకర్ణుడు కొట్టిన దెబ్బలకు వ్యథ పొందినవారై మోహము చెంది, ఖండించిన కింశుకవృక్షముల వలె నేలపై పడిరి. 30

మూ. తేషు వానరముఖ్యేషు పాతితేషు మహాత్మసు,
వానరాణాం సహస్రాణి కుమ్భకర్ణం ప్రదుద్రువుః. 31

ప్ర. అ. మహాత్మసు=మహాత్ములైన, తేషు=ఆ, వానరముఖ్యేషు=వానరనాయకులు, పాతితేషు=పడగొట్టబడినవా రగుచుండగా, వానరాణామ్=వానరులయొక్క, సహస్రాణి=సహస్రములు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని గూర్చి, ప్రదుద్రువుః=పరుగెత్తిరి.

తా. మహాత్ములైన ఆ వానరనాయకులు నేలపై పడిపోవుట చూచి వేలకొలది వానరులు కుంభకర్ణునిమీదికి పరుగెత్తిరి. 31

మూ. తం శైలమివ శైలాభాః సర్వే తు ప్లవగర్షభాః,
సమారుహ్య సముత్పత్య దదంశుర్మహాబలాః. 32

ప్ర. అ. శైలాభాః=పర్వతములవంటి, మహాబలాః=గొప్ప బలము గల, సర్వే=సమస్తమైన, తే=ఆ, ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, శైలమివ=పర్వతమువలె ఉన్న, తమ్=అతనిని, సమారుహ్య=ఎక్కి, సముత్పత్య=ఎగిరి, దదంశుః=కరిచిరి.

తా. బలశాలులైన ఆ పర్వతముల వలె ఉన్న వానరులు అందరూ పర్వతమువంటి అతని మీదికి ఎక్కి, ఎగిరి అతనిని కరిచిరి. 32

మూ. తం నఖైర్దశనైశ్చాపి ముష్టిభిర్బాహుభిస్తథా,
కుమ్భకర్ణం మహాబాహుం నిజఘ్నుః ప్లవగర్షభాః. 33

ప్ర. అ. ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, మహాబాహుమ్=గొప్ప బాహువులు గల, తం కుమ్భకర్ణమ్=ఆ కుంభకర్ణుని, నఖైః=గోళ్లచేత, దశనైశ్చాపి=దంతాలచేత, ముష్టిభిః=పిడికిళ్లచేత, తథా=మరియు, బాహుభిః= బాహువులచేత, నిజఘ్నుః=కొట్టిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు గొప్ప బాహువులు గల ఆ కుంభకర్ణుని గోళ్లచేత, దంతాలచేత, పిడికిళ్లచేత, బాహువులచేత పీడించిరి. 33

మూ. స వానరసహస్రైస్తు విచితః పర్వతోపమః,
రరాజ రాక్షసవ్యాఘ్రో గిరిరాత్మరుహైరివ. 34

ప్ర. అ. వానరసహస్రైః=వానరుల వేలచేత, విచితః=వ్యాప్తుడైన, పర్వతోపమః=పర్వతముతో సమానుడైన, సః=ఆ, రాక్షసవ్యాఘ్రః=రాక్షసశ్రేష్ఠుడు, ఆత్మరుహైః=తనపై మొలచిన చెట్లచేత, గిరిః ఇవ=పర్వతము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. వేలకొలది వానరులు తనపై ఎక్కగా పర్వతమువంటి ఆ రాక్షసశ్రేష్ఠుడు చెట్లతో నిండిన పర్వతము వలె ప్రకాశించెను. 34

మూ. బాహుభ్యాం వానరాన్ సర్వాన్ ప్రగృహ్య స మహాబలః,
భక్షయామాస సంక్రుద్ధో గరుడః పన్నగానివ. 35

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=ఆతడు, సర్వాన్=సమస్తమైన, వానరాన్=వానరులను, బాహుభ్యామ్=చేతులతో, ప్రగృహ్య=గ్రహించి, సంక్రుద్ధః=కోపించిన, గరుడః=గరుత్మంతుడు, పన్నగానివ=సర్పములను వలె, భక్షయామాస=భక్షించెను.

తా. మహాబలవంతుడైన ఆ కుంభకర్ణుడు చేతులతో ఆ వానరుల నందరినీ పట్టుకొని, కోపించిన గరుత్మంతుడు సర్పములను భక్షించినట్లు భక్షించెను. 35

మూ. ప్రక్షిప్తాః కుమ్భకర్ణేన వక్త్రే పాతాలసన్నిభే,
నాసాపుటాభ్యాం నిర్జగ్ముః కర్ణాభ్యాం చైవ వానరాః. 36

ప్ర. అ. కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, పాతాలసన్నిభే=పాతాళముతో సమానమైన, వక్త్రే=ముఖమునందు, ప్రక్షిప్తాః=పడవేయబడిన, వానరాః=వానరులు, నాసాపుటాభ్యామ్=ముక్కు రంధ్రము నుండి, కర్ణాభ్యాం చైవ=చెవులనుండీ, నిర్జగ్ముః =బైటకు వచ్చిరి.

తా. కుంభకర్ణునిచేత పాతాళమువంటి తన ముఖములో పడవేయబడిన వానరులు ముక్కు రంధ్రములనుండీ, చెవులనుండీ బైటకు వచ్చివేసిరి. 36

మూ. భక్షయన్ భృశసంక్రుద్ధో హరీన్ పర్వతసన్నిభః,
బభఞ్జ వానరాన్ సర్వాన్ సంక్రుద్ధో రాక్షసోత్తమః. 37

ప్ర. అ. భృశసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన, పర్వతసన్నిభః=పర్వతముతో సమానుడైన, రాక్షసోత్తమః=రాక్షసులలో ఉత్తముడైన కుంభకర్ణుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, హరీన్=వానరులను, భక్షయన్=భక్షించుచు, వానరాన్=వానరులను, బభఞ్జ=విరచి ముక్కలు చేసెను.

తా. పర్వతముతో సమానుడైన, మిక్కిలి కోపించిన ఆ కుంభకర్ణుడు

ఆ వానరులను భక్షించుటకై, వాళ్ళను విరిచివేసెను.

వి. ఈ శ్లోకంలోని "హరీన్, వానరాన్", "భృశసంక్రుద్ధః, సంక్రుద్ధః" అనేవి పునరుక్తాలుగా ఉన్నవి. ఈ శ్లోకం ప్రాచ్యపాఠంలో లేదు. 37

మూ. మాంసశోణితసంక్లేదాం కుర్వన్ భూమిం స రాక్షసః,
చచార హరిసైన్యేషు కాలాగ్నిరివ మూర్ఛితః. 38

ప్ర. అ. సః రాక్షసః=ఆ రాక్షసుడు, భూమిమ్=భూమిని, మాంసశోణితసంక్లేదామ్=మాంసముచేత రక్తముచేత తడిసిన దానినిగా, కుర్వన్=చేయుచు, మూర్ఛితః=విజృంభించిన, కాలాగ్నిరివ=ప్రలయకాలాగ్ని వలె, హరిసైన్యేషు=వానరసైన్యములయందు, చచార=సంచరించెను.

తా. ఆ కుంభకర్ణుడు నేలను మాంసముచేత, రక్తముచేత తడుపుచు, విజృంభించిన, ప్రలయకాలాగ్ని వలె వానరసైన్యములలో సంచరించెను.

మూ. వజ్రహస్తో యథా శక్రః పాశహస్త ఇవాన్తకః,
శూలహస్తో బభౌ యుద్ధే కుమ్భకర్ణో మహాబలః. 39

ప్ర. అ. శూలహస్తః=శూలము హస్తమునందు గల, మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, యుద్ధే=యుద్ధమునందు, వజ్రహస్తః=వజ్రము హస్తమునందు గల, శక్రః యథా=దేవేంద్రుడు వలె, పాశహస్తః=పాశము హస్తమునందు గల, అన్తకః ఇవ=యముడు వలె, బభౌ=ప్రకాశించెను.

తా. యుద్ధమునందు శూలము హస్తమునందు ధరించిన మహాబలశాలియైన కుంభకర్ణుడు వజ్రము చేతిలో ధరించిన ఇంద్రుడు వలె, పాశము హస్తమునందు ధరించిన యముడు వలె ప్రకాశించెను. 39

మూ. యథా శుష్కాణ్యరణ్యాని గ్రీష్మే దహతి పావకః,
తథా వానరసైన్యాని కుమ్భకర్ణో దదాహ సః. 40

ప్ర. అ. గ్రీష్మే=గ్రీష్మమునందు, శుష్కాణి=ఎండిన, అరణ్యాని=అరణ్యములను, పావకః=అగ్ని, యథా=ఎట్లు, దహతి=కాల్చునో, తథా=అట్లు, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, వానరసైన్యాని=వానరసైన్యములను, దదాహ=కాల్చివేసెను.

తా. గ్రీష్మమునందు అగ్ని ఎండిపోయిన అరణ్యములను కాల్చివేసినట్లు కుంభకర్ణుడు ఆ వానరసైన్యములను కాల్చివేసెను. 40

మూ. తతస్తే వధ్యమానాస్తు హతయూథా వినాయకాః,
వానరా భయసంవిగ్నా వినేదుర్విస్వరైః స్వరైః. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హతయూథాః=చంపబడిన గుంపులు గల, వినాయకాః=నాయకులు లేని, తే వానరాః=ఆ వానరులు, వధ్యమానాః=చంపబడుచున్నవారై, భయసంవిగ్నాః=భయముచేత దిగులుచెందినవారై, విస్వరైః=వికృతములైన, స్వరైః=స్వరములతో, వినేదుః=అరచిరి.

తా. గుంపు లన్నీ చంపబడగా, నాయకులు లేని ఆ వానరులు కుంభకర్ణునిచేత చంపబడుచు భయాక్రాంతులై వికృతస్వరములతో అరచిరి. 41

మూ. అనేకశో వధ్యమానాః కుమ్భకర్ణేన వానరాః,
రాఘవం శరణం జగ్ముర్వ్యథితాః ఖిన్నచేతసః. 42

ప్ర. అ. కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, అనేకశః=అనేకవిధముల, వధ్యమానాః=చంపబడుచున్న, వానరాః=వానరులు, వ్యథితాః=వ్యథ చెందినవారై, ఖిన్నచేతసః=ఖేదముతో కూడిన మనస్సులు కలవారై, రాఘవమ్=రాముణ్ణి, శరణం జగ్ముః=శరణుపొందిరి.

తా. కుంభకర్ణుడు అనేకవిధముల చంపుచుండగా వ్యథ చెందిన వానరులు దుఃఖాక్రాంతములైన మనస్సులతో రాముణ్ణే శరణు జొచ్చిరి. 42

మూ. ప్రభగ్నాన్ వానరాన్ దృష్ట్వా వజ్రహస్తాత్మజాత్మజః,
అభ్యధావత వేగేన కుమ్భకర్ణం మహాహవే. 43

ప్ర. అ. మహాహవే=మహాయుద్ధమునందు, ప్రభగ్నాన్=ఓడిపోయిన, వానరాన్=వానరులను, దృష్ట్వా=చూచి, వజ్రహస్తాత్మజాత్మజః=ఇంద్రుని కుమారుని కుమారుడు, వేగేన=వేగముతో, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి గూర్చి, అభ్యధావత=పరుగెత్తెను.

తా. ఆ మహాయుద్ధములో వానరులు భగ్నులైపోవుట చూచి అంగదుడు శీఘ్రముగా కుంభకర్ణునిమీదికి పరుగెత్తెను. 43

మూ. శైలశృఙ్గం మహద్గృహ్య వినదన్ స ముహుర్ముహుః,
త్రాసయన్ రాక్షసాన్ సర్వాన్ కుమ్భకర్ణపదానుగాన్, 44
చిక్షేప శైలశిఖరం కుమ్భకర్ణస్య మూర్ధని.

ప్ర. అ. సః=అతడు, మహత్=పెద్దదైన, శైలశృఙ్గమ్=పర్వతశిఖరమును, గృహ్య=గ్రహించి, ముహుర్ముహుః=మాటిమాటికి, వినదన్=ధ్వనిచేయుచు, కుమ్భకర్ణపదానుగాన్=కుంభకర్ణుని మార్గమును అనుసరించి వచ్చిన, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను, త్రాసయన్=భయపెట్టుచు, శైలశిఖరమ్=పర్వతశిఖరమును, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, మూర్ధని=శిరస్సుమీద, చిక్షేప=పడవేసెను.

తా. ఆ అంగదుడు పెద్ద పర్వతశిఖరమును గ్రహించి, మాటిమాటికి గర్జించుచు, కుంభకర్ణుని వెనుక వచ్చిన రాక్షసుల నందరినీ భయపెట్టుచు, ఆ పర్వతశిఖరమును కుంభకర్ణుని శిరస్సుమీద పడవేసెను. 44

మూ. స తేనాభిహతో మూర్ధ్ని శైలేనేన్ద్రరిపుస్తదా, 45
కుమ్భకర్ణః ప్రజజ్వాల క్రోధేన మహతా తదా,
సోఽభ్యధావత వేగేన వాలిపుత్రమమర్షణమ్. 46

ప్ర. అ. తదా=అప్పుడు, తేన=ఆ, శైలేన=పర్వతముచేత, మూర్ధ్ని=శిరస్సు మీద, అభిహతః=కొట్టబడిన, ఇన్ద్రరిపుః=ఇంద్రుని శత్రువైన, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, మహతా=గొప్ప, క్రోధేన=క్రోధముతో, ప్రజజ్వాల=మండిపడెను. తదా=అప్పుడు, అమర్షణమ్=క్రోధముగల, వాలిపుత్రమ్=అంగదుణ్ణి గూర్చి, వేగేన=వేగముతో, అభ్యధావత=పరుగెత్తెను.

తా. అప్పుడు ఆ పర్వతముచేత శిరస్సుమీద కొట్టబడిన ఇంద్రశత్రువైన ఆ కుంభకర్ణుడు గొప్ప కోపముతో మండిపడుచు వేగముగా, క్రోధావిష్టుడైన అంగదుని వైపు పరుగెత్తెను. 45, 46

మూ. కుమ్భకర్ణో మహానాదస్త్రాసయన్ సర్వవానరాన్,
శూలం ససర్జ వై రోషాదఙ్గదే తు మహాబలః. 47

ప్ర. అ. మహానాదః=గొప్పధ్వని గల, మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, సర్వవానరాన్=సమస్తవానరులను, త్రాసయన్=భయపెట్టుచు, అఙ్గదే=అంగదునియందు, రోషాత్=కోపమువలన, శూలమ్=శూలమును ససర్జ=విడచెను.

తా. గొప్ప బలము గల కుంభకర్ణుడు బిగ్గరగా గర్జించుచు, వానరుల నందరినీ భయపెట్టుచు, కోపముతో శూలమును అంగదునిమీదకు విసరెను.

మూ. త మాపతన్తం బుద్ధ్వా తు యుద్ధమార్గవిశారదః,
లాఘవాన్మోచయామాస బలవాన్ వానరర్షభః. 48

ప్ర. అ. యుద్ధమార్గవిశారదః=యుద్ధమార్గమునందు సమర్థుడైన, బల వాన్=బలవంతుడైన, వానరర్షభః=వానరశ్రేష్ఠుడు, ఆపతన్తమ్=వచ్చి మీదపడుచున్న, తమ్=ఆ శూలమును, బుద్ధ్వా=తెలిసికొని, లాఘవాత్=చురుకుదనమువలన, మోచయామాస=విడిపించుకొనెను.

తా. యుద్ధమార్గమునందు నేర్పరియైన బలశాలియైన అంగదుడు మీద పడుచున్న ఆ శూలమును చూచి, నేర్పుగా, అది మీద పడకుండ తప్పించుకొనెను. 48

మూ. ఉత్పత్య చైనం తరసా తలేనోరస్యతాడయత్,
స తేనాభిహతః కోపాత్ప్రముమోహాచలోపమః. 49

ప్ర. అ. ఉత్పత్య=పైకి ఎగిరి, ఏనమ్=వీనిని, తరసా=బలముతో, తలేన=అరచేతిచేత, ఉరసి=వక్షఃస్థలమునందు, అతాడయత్=కొట్టెను. తేన=వానిచేత, కోపాత్=కోపమువలన, అభిహతః=కొట్టబడిన, అచలోపమః=పర్వతముతో సమానుడైన, సః=అతడు, ప్రముమోహ=మోహము చెందెను.

తా. అంగదుడు పైకి ఎగిరి అరచేతితో అతని వక్షఃస్థలముమీద బలముగా కొట్టెను. అంగదుడు కోపముతో ఇట్లు కొట్టగా పర్వతమువంటి ఆ కుంభకర్ణుడు మోహము చెందెను. 49

మూ. స లబ్ధసంజ్ఞోఽతిబలో ముష్టిం సంగృహ్య రాక్షసః,
అపహాసేన చిక్షేప విసంజ్ఞః స పపాత హ. 50

ప్ర. అ. అతిబలః=గొప్ప బలము గల, సః=ఆ, రాక్షసః=రాక్షసుడు, లబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞ కలవాడై, ముష్టిమ్=పిడికిలిని, సంగృహ్య=పట్టి, అపహాసేన=పరిహాసపూర్వకముగా, చిక్షేప=అంగదునిపై పడవేసెను. సః=అతడు, విసంజ్ఞః=సంజ్ఞలేనివాడై, పపాత హ=పడిపోయెను.

తా. గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు స్పృహ చెంది, పిడికిలి బిగించి అనాయాసముగా అంగదునిమీద పడవేసెను. అతడు స్పృహ కోల్పోయి పడిపోయెను. 50

మూ. తస్మిన్ ప్లవగశార్దూలే విసంజ్ఞే పతితే భువి,
తచ్ఛూలం సముపాదాయ సుగ్రీవమభిదుద్రువే. 51

ప్ర. అ. ప్లవగశార్దూలే=వానరశ్రేష్ఠుడైన, తస్మిన్=ఆ అంగదుడు, విసంజ్ఞే=సంజ్ఞ కోల్పోయినవాడై, భువి=నేలమీద, పతితే=పడినవాడగుచుండగా, తచ్ఛూలమ్=ఆ శూలమును, సముపాదాయ=గ్రహించి, సుగ్రీవమ్=సుగ్రీవుని గూర్చి, సమభిదుద్రువే=పరుగెత్తి వెళ్లెను.

తా. వానరశ్రేష్ఠుడైన అంగదుడు స్పృహ తప్పి నేలమీద పడిపోయిన పిమ్మట కుంభకర్ణుడు ఆ శూలమును గ్రహించి సుగ్రీవు డున్న వైపు పరుగెత్తెను. 51

మూ. తమాపతన్తం సంప్రేక్ష్య కుమ్భకర్ణం మహాబలమ్,
ఉత్పపాత తదా వీరః సుగ్రీవో వానరాధిపః. 52

ప్ర. అ. తదా=అప్పుడు, వీరః=వీరుడైన, వానరాధిపః=వానరరాజైన,

సుగ్రీవః=సుగ్రీవుడు, ఆపతన్తమ్=శీఘ్రముగా వచ్చుచున్న, మహాబలమ్=గొప్ప బలము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, సంప్రేక్ష్య=చూచి, ఉత్పపాత=పైకి ఎగిరెను.

తా. అప్పుడు మహాబలవంతుడైన కుంభకర్ణుడు తనమీదికి వచ్చుచున్నట్లు చూచి వీరుడు, వానరరాజు అయిన సుగ్రీవుడు పైకి ఎగిరెను. 52

మూ. స పర్వతాగ్రముత్క్షిప్య సమావిధ్య మహాబలః,
అభిదుద్రావ వేగేన కుమ్భకర్ణం మహాబలమ్. 52

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=ఆ సుగ్రీవుడు, పర్వతాగ్రమ్=పర్వతశిఖరమును, ఉత్క్షిప్య=ఎత్తి, సమావిధ్య=గట్టిగా పట్టి, మహాబలమ్=గొప్ప బలము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని గూర్చి, వేగేన=వేగముతో, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. గొప్ప బలము గల సుగ్రీవుడు పర్వతశిఖరమును పైకి ఎత్తి గట్టిగా పట్టుకొని, గొప్ప బలము గల కుంభకర్ణునివైపు శీఘ్రముగా వెళ్లెను.53

మూ. తమాపతన్తం సంప్రేక్ష్య కుమ్భకర్ణః ప్లవంగమమ్,
తస్థౌ వివృతసర్వాఙ్గో వానరేన్ద్రస్య సంముఖః. 54

ప్ర. అ. కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఆపతన్తమ్=వచ్చి మీదపడుచున్న, తమ్=ఆ, ప్లవఙ్గమమ్=సుగ్రీవుణ్ణి, సంప్రేక్ష్య=చూచి, వివృతసర్వాఙ్గః=తెరవబడిన సకలావయవములు కలవాడై, వానరేన్ద్రస్య=వానరరాజుకు, సంముఖః=ఎదురైనవాడై, తస్థౌ=నిలచెను.

తా. కుంభకర్ణుడు వచ్చి మీద పడుచున్న సుగ్రీవుని చూచి సమస్తావయవములు స్పష్టముగా కనబడునట్లు (రొమ్ము విరచి) అతని ఎదుట నిలచెను. 54

మూ. కపిశోణితదిగ్ధాఙ్గం భక్షయన్తం ప్లవంగమాన్,
కుమ్భకర్ణం స్థితం దృష్ట్వా సుగ్రీవో వాక్యమబ్రవీత్. 55

ప్ర. అ. కపిశోణితదిగ్ధాఙ్గమ్=వానరుల రక్తముచేత పూయబడిన శరీరము గల, ప్లవఙ్గమాన్=వానరులను, భక్షయన్తమ్=భక్షించుచున్న, స్థితమ్=నిలచి ఉన్న, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, దృష్ట్వా=చూచి, సుగ్రీవః=సుగ్రీవుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. కుంభకర్ణుడు వానరులను భక్షించుటచే వారి రక్తముచేత అతని శరీరమంతా తడిసి ఉండెను. తన ఎదుట నిలచిన అట్టి కుంభకర్ణుణ్ణి చూచి

సుగ్రీవు డిట్లు పలికెను. 56

మూ. పాతితాశ్చ త్వయా వీరాః కృతం కర్మ సుదుష్కరమ్,
భక్షితాని చ సైన్యాని ప్రాప్తం తే పరమం యశః. 56

ప్ర. అ. త్వయా=నీచేత, వీరాః=వీరులు, పాతితాః=పడగొట్టబడిరి. సుదుష్కరమ్=చేయుటకు చాల కష్టమైన, కర్మ=పని, కృతమ్=చేయబడినది. సైన్యాని=సైన్యములు, భక్షితాని చ=భక్షింపబడినవి. తే=నీకు, పరమమ్=గొప్ప, యశః=కీర్తి, ప్రాప్తమ్=పొందబడినది.

తా. నీవు వీరులను పడగొట్టినావు. చేయ శక్యము కాని పని చేసినావు. సైన్యములను కూడా భక్షించినావు. గొప్ప కీర్తిని ఆర్జించినావు.56

మూ. త్యజ తద్వానరానీకం ప్రాకృతైః కిం కరిష్యసి,
సహస్వైకం నిపాతం మే పర్వతస్యాస్య రాక్షస. 57

ప్ర. అ. తత్=ఆ, వానరానీకమ్=వానరసైన్యమును, త్యజ=విడిచిపెట్టుము. ప్రాకృతైః=సామాన్యులతో, కిం కరిష్యసి=ఏమి చేసెదవు ? రాక్షస=ఓ ! రాక్షసుడా ! మే=నాయొక్క, అస్య పర్వతస్య=ఈ పర్వతముయొక్క, ఏకమ్ నిపాతమ్=పడుటను, సహస్వ=సహించుము.

తా. కుంభకర్ణుడా ! ఆ వానరసైన్యమును విడిచిపెట్టుము. సామాన్యులతో ఏమి చేసెదవు ? నేను పడవేయు ఈ పర్వతము (పడుటను) ఒకదానిని (ఈ ఒక్క పర్వతము దెబ్బను) సహించుము. 57

మూ. తద్వాక్యం హరిరాజస్య సత్త్వధైర్యసమన్వితమ్,
శ్రుత్వా రాక్షసశార్దూలః కుమ్భకర్ణోఽబ్రవీద్వచః. 58

ప్ర. అ. హరిరాజస్య=సుగ్రీవునియొక్క, సత్త్వధైర్యసమన్వితమ్=బలముతోను ధైర్యముతోను కూడిన, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, రాక్షసశార్దూలః=రాక్షసశ్రేష్ఠుడైన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు పలికిన బలధైర్యములతో కూడిన మాటలు విని రాక్షసశ్రేష్ఠుడైన కుంభకర్ణు డిట్లు పలికెను. 58

మూ. ప్రజాపతేస్తు పౌత్రస్త్వం తథైవర్క్షరజఃసుతః,
ధృతిపౌరుషసంపన్నః కస్మాద్గర్జసి వానర. 59

ప్ర. అ. వానర=వానరుడా ! త్వమ్=నీవు, ప్రజాపతేః=బ్రహ్మదే

వునియొక్క, పౌత్రః=పౌత్రుడవు; తథైవ=మరియు, ఋక్షరజఃసుతః=ఋక్షరజ స్సుయొక్క పుత్రుడవు, ధృతిపౌరుషసంపన్నః=ధైర్యముతోను పౌరుషముతోను కూడినవాడవు. కస్మాత్=ఏ కారణమువలన, గర్జసి=గర్జించుచున్నావు ?

తా. సుగ్రీవుడా ! నీవు బ్రహ్మదేవుని పౌత్రుడవు; ఋక్షరజస్సు పుత్రుడవు. ధైర్యపౌరుషసంపన్నుడవు. ఎందుకు గర్జించెదవు ? 59

మూ. స కుమ్భకర్ణస్య వచో నిశమ్య
వ్యావిధ్య శైలం సహసా ముమోచ,
తేనాజఘానోరసి కుమ్భకర్ణం
శైలేన వజ్రాశనిసంనిభేన. 60

ప్ర. అ. సః=అతడు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, వచః=వచనమును, నిశమ్య=విని, శైలమ్=పర్వతమును, వ్యావిధ్య=గట్టిగా పట్టి, సహసా=వెంటనే, ముమోచ=విడచెను. వజ్రాశనిసంనిభేన=వజ్రముతోను, పిడుగుతోను సమా నమైన, తేన=దానిచేత, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, ఉరసి=వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. సుగ్రీవుడు కుంభకర్ణుని మాటలు విని, ఆ పర్వతమును గట్టిగా పట్టి, వెంటనే విడచెను. వజ్రాయుధముతోను, పిడుగుతోను సమానమైన ఆ పర్వతముతో కుంభకర్ణుని వక్షస్థలమును కొట్టెను. 60

మూ. తచ్ఛైలశృఙ్గం సహసా విభిన్నం
భుజాన్తరే తస్య తదా విశాలే,
తతో విషేదుః సహసా ప్లవంగా
రక్షోగణాశ్చాపి ముదా వినేదుః. 61

ప్ర. అ. తదా=అప్పుడు, తస్య=అతనియొక్క, విశాలే=విశాల మైన, భుజాన్తరే=భుజముల మధ్యయందు, తత్=ఆ, శైలశృఙ్గమ్=పర్వతశి ఖరము, సహసా=వెంటనే, విభిన్నమ్=బ్రద్దలైపోయినది. తతః=అటుపిమ్మట, ప్లవంగాః=వానరులు, సహసా= వెంటనే, విషణ్ణాః=దిగులు చెందిరి. రక్షోగణా శ్చాపి=రాక్షసగణములు, ముదా= సంతోషముతో, వినేదుః=ధ్వనిచేసినవి.

తా. విశాలమైన అతని వక్షఃస్థలము మీద పడి వెంటనే ఆ పర్వత శిఖరము ముక్కలై పోయెను. అప్పుడు వానరులు దిగులుచెందిరి. రాక్షసులు సంతోషముతో కేకలు వేసిరి. 61

మూ. స శైలశృఙ్గాభిహతశ్చుకోప
ననాద రోషాచ్చ వివృత్య వక్త్రమ్,
వ్యావిధ్య శూలం చ తటిత్ప్రకాశం
చిక్షేప హర్యృక్షపతేర్వధాయ. 62

ప్ర. అ. సః=అతడు, శైలశృఙ్గాభిహతః=పర్వతశిఖరముచేత కొట్టబడినవాడై, చుకోప=కోపించెను. రోషాత్=కోపమువలన, వక్త్రమ్=ముఖమును, వివృత్య=తెరచి, ననాద=ధ్వనిచేసెను. తటిత్ప్రకాశమ్=మెరుపువంటి ప్రకాశము గల, శూలమ్=శూలమును, వ్యావిధ్య=గట్టిగా పట్టుకొని, హర్యృక్షపతేః=వానరుల యొక్క భల్లూకములయొక్క ప్రభువైన సుగ్రీవునియొక్క, వధాయ=వధకొరకు, చిక్షేప=విసరెను.

తా. పర్వతశిఖరముచేత కొట్టబడినవాడై కుంభకర్ణుడు కోపముతో ముఖము తెరచి గర్జించెను. మెరపువంటి శూలమును గట్టిగా పట్టి సుగ్రీవుని చంపుటకై దానిని విసిరెను. 62

మూ. తత్కుమ్భకర్ణస్య భుజప్రణున్నం
శూలం శితం కాఞ్చనదామజుష్టమ్,
క్షిప్రం సముత్పత్య నిగృహ్య దోర్భ్యాం
బభఞ్జ వేగేన సుతోఽనిలస్య. 63

ప్ర. అ. అనిలస్య సుతః=హనుమంతుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, సముత్పత్య=ఎగిరి, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, భుజప్రణున్నమ్=భుజములచేత విసరబడిన, శితమ్=వాడియైన, కాఞ్చనదామజుష్టమ్=బంగారు మాలికలతో కూడిన, తత్=ఆ, శూలమ్=శూలమును, దోర్భ్యామ్=బాహువులచేత, నిగృహ్య=గ్రహించి, వేగేన=వేగముతో, బభఞ్జ=విరిచివేసెను.

తా. కుంభకర్ణుడు భుజములతో విసరిన బంగారు మాలలచే అలంకరించిన వాడియైన ఆ శూలమును హనుమంతుడు శీఘ్రముగా పైకి ఎగిరి, చేతులతో పట్టి వెంటనే విరిచివేసెను. 63

మూ. కృతం భారసహస్రస్య శూలం కాలాయసం మహత్,
బభఞ్జ జానుమారోప్య తదా హృష్టః ప్లవంగమః. 64

ప్ర. అ. తదా=అప్పుడు, హృష్టః=సంతోషించిన, ప్లవంగమః=హనుమంతుడు, భారసహస్రస్య=వేయి పుట్ల యొక్క(తో), కృతమ్=నిర్మింపబడిన, మహత్=గొప్పదైన, కాలాయసమ్=ఇనుపవికారమైన, శూలమ్=శూలమును, జానుమ్=మోకాలును, ఆరోప్య=ఎక్కించి, బభఞ్జ=విరచెను.

తా. అప్పుడు ఉత్సాహవంతుడైన హనుమంతుడు వేయి పుట్ల ఇనుముతో తయారుచేయబడిన ఆ పెద్ద శూలమును మోకాలుకు ఆన్చి విరచివేసెను. 64

మూ. శూలం భగ్నం హనుమతా దృష్ట్వా వానరవాహినీ,
హృష్టా ననాద బహుశః సర్వతశ్చాపి దుద్రువే. 65

ప్ర. అ. వానరవాహినీ=వానరసేన, హనుమతా=హనుమంతునిచేత, భగ్నమ్=విరగగొట్టబడిన, శూలమ్=శూలమును, దృష్ట్వా=చూచి, హృష్టా=సంతోషించినదై, బహుశః=అనేక పర్యాయములు, ననాద=ధ్వనిచేసెను. సర్వతః చ=అన్ని వైపులనుండి, దుద్రువే అపి=పరుగెత్తి వచ్చెను.

తా. వానరసేన హనుమంతుడు శూలమును విరచుట చూచి సంతోషించుచు, అనేక పర్యాయములు అరచి అన్ని వైపులనుండి శీఘ్రముగా అక్కడికి వచ్చెను.

వి. ప్రాచ్యపాఠము ప్రకారము ఆ శూలమును సుగ్రీవుడే విరచెను. హనుమంతుడు కాదు. అదే యుక్తము. ఇద్దరు మహావీరులు, అందులోను తమ ప్రభువు యుద్ధము చేయుచున్నప్పుడు, తాను కలగచేసికొనుట అయుక్తమని భావించువాడు. 65

మూ. బభూవాథ పరిత్రస్తో రాక్షసో విముఖోఽభవత్,
సింహనాదం చ తే చక్రుః ప్రహృష్టా వనగోచరాః, 66
మారుతిం పూజయాంచక్రుర్దృష్ట్వా శూలం తథాగతమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రాక్షసః=రాక్షసుడు, పరిత్రస్తః=భయపడినవాడై, విముఖః=విముఖుడు, అభవత్=అయెను. తే=ఆ, వనగోచరాః=వానరులు, ప్రహృష్టాః=సంతోషించినవారై, సింహనాదమ్=సింహనాదమును, చక్రుః=చేసిరి. తథాగతమ్=ఆ విధముగా అయిన, శూలమ్=శూలమును, దృష్ట్వా=చూచి, మారుతిమ్=హనుమంతుని, పూజయాంచక్రుః=పూజించిరి.

తా. అప్పుడు కుంభకర్ణుడు భయపడి యుద్ధవిముఖుడయ్యెను. వానరులు సంతోషించుచు సింహనాదము చేసిరి. శూలము ఆ విధముగా అగుటను చూచి హనుమంతుని పూజించిరి.

వి. “బభూవాథ” ఇత్యాదిశ్లోకార్థము చాలా ప్రతులలో లేదు. ఈ ఒకటిన్నర శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. 66

మూ. స తత్తథా భగ్నమవేక్ష్య శూలం
చుకోప రక్షోధిపతిర్మహాత్మా,

ఉత్పాట్య లఙ్కామలయాత్తు శృఙ్గం
జఘాన సుగ్రీవముపేత్య తేన. 67

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ, రక్షోధిపతిః=రాక్షసనాయకుడు, తత్= ఆ, శూలమ్=శూలమును, తథా=ఆ విధముగా, భగ్నమ్=భగ్నమైన దానినిగా, అవేక్ష్య=చూచి, చుకోప=కోపించెను. లఙ్కామలయాత్=లంకదగ్గర నున్న మలయపర్వతమునుండి, శృఙ్గమ్=శిఖరమును, ఉత్పాట్య=పెకలించి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఉపేత్య=సమీపించి, తేన=దానితో, జఘాన=కొట్టెను.

తా. మహాత్ముడైన ఆ కుంభకర్ణుడు శూలము ఆ విధముగా విరవబడుటను చూచి, లంకదగ్గర నున్న మలయపర్వతమునుండి శిఖరమును పెకలించి, సుగ్రీవుని సమీపించి దానితో అతనిని కొట్టెను.

వి. త్రికూటపర్వతశిఖరముమీద నున్న లంక ద్వారమువద్ద యుద్ధము చేయుచున్న కుంభకర్ణుడు దక్షిణభారతంలో ఉన్న మలయపర్వతశిఖరాన్ని పెకలించడం ఎట్లు అని ఆశంకించుకొని కొందరు వ్యాఖ్యాతలు అతని శరీరము అంత పెద్దదగుటచేత అది సంభావ్యమే అని సమాధానము చెప్పి, తేరా "లంకామలయ" శబ్దానికి లక్షణచేత త్రికూట మని అర్థము అని మరొక సమాధానము చెప్పిరి. రెండూ అసంగతాలే. ప్రాచ్యప్రతిలో ఈ మాట లేదు. ఒక పర్వతశిఖరాన్ని పీకినట్లు మాత్రమే ఉన్నది. 67

మూ. స శైలశృఙ్గాభిహతో విసంజ్ఞః
పపాత భూమౌ యుధి వానరేన్ద్రః,
తం వీక్ష్య భూమౌ పతితం విసంజ్ఞం
నేదుః ప్రహృష్టా యుధి యాతుధానాః. 68

ప్ర. అ. సః=ఆ, వానరేన్ద్రః=సుగ్రీవుడు, యుధి=యుద్ధమునందు, శైలశృఙ్గాభిహతః=పర్వతశిఖరముచేత కొట్టబడినవాడై, విసంజ్ఞః=సంజ్ఞలేనివాడై, భూమౌ=భూమియందు, పపాత=పడెను. యుధి=యుద్ధమునందు, భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, విసంజ్ఞమ్=సంజ్ఞ లేని, తమ్=అతనిని, వీక్ష్య=చూచి, యాతుధానాః=రాక్షసులు, ప్రహృష్టాః=సంతోషించినవారై, నేదుః=ధ్వనిచేసిరి.

తా. యుద్ధములో పర్వతశిఖరముచేత కొట్టబడినవాడై సుగ్రీవుడు మూర్ఛితుడై నేలమీద పడిపోయెను. స్పృహ తప్పి నేలమీద పడిపోయిన అతనిని చూచి రాక్షసులు సంతోషించుచు అరచిరి. 68

మూ. తమభ్యుపేత్యాద్భుతఘోరవీర్యం
స కుమ్భకర్ణో యుధి వానరేన్ద్రమ్,

జహార సుగ్రీవమభిప్రగృహ్య
యథాఽనిలో మేఘమతిప్రచణ్డః. 69

ప్ర.అ. సః=ఆ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, యుధి=యుద్ధమునందు, అద్భుతఘోరవీర్యమ్=ఆశ్చర్యకరమైన ఘోరమైన పరాక్రమము గల, వానరేన్ద్రమ్=వానరరాజైన, తం సుగ్రీవమ్=ఆ సుగ్రీవుణ్ణి, అభిప్రగృహ్య=గ్రహించి, అతిప్రచణ్డః=చాల తీవ్రమైన, అనిలః=వాయువు, మేఘం యథా=మేఘమును వలె, జహార=తీసికొని వెళ్ళెను.

తా. ఆ కుంభకర్ణుడు ఆశ్చర్యకరమైన ఘోరమైన పరాక్రమము గల వానరరాజైన సుగ్రీవుణ్ణి ఆ యుద్ధరంగమునందు గ్రహించి, చాల తీవ్రమైన గాలి మేఘమును హరించినట్లు హరించెను. 69

మూ. స తం మహామేఘనికాశరూప
ముత్పాట్య గచ్ఛన్యుధి కుమ్భకర్ణః,
రరాజ మేరుప్రతిమానరూపో
మేరుర్యథాఽభ్యుచ్ఛ్రితఘోరశృఙ్గః. 70

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, మహామేఘనికాశరూపమ్=పెద్ద మేఘముతో సమానమైన రూపము గల, తమ్=అతనిని, ఉత్పాట్య=లేవదీసి, గచ్ఛన్=వెళ్ళుచున్న, మేరుప్రతిమానరూపః=మేరువుతో సమమైన రూపము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, అభ్యుచ్ఛ్రితఘోరశృఙ్గః=ఎత్తైన భయంకరమైన శిఖరము గల, మేరుర్యథా=మేరుపర్వతము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. మహామేఘమువంటి రూపము గల సుగ్రీవుణ్ణి ఎత్తికొని యుద్ధరంగము నుండి వెళ్ళుచున్న, మేరుపర్వతతుల్యమైన రూపము గల కుంభకర్ణుడు ఎత్తైన భయంకరమైన శిఖరము గల మేరుపర్వతము వలె ప్రకాశించెను. 70

మూ. తతస్సమాదాయ జగామ వీరః
సంస్తూయమానో యుధి రాక్షసేన్ద్రైః,
శృణ్వన్నినాదం త్రిదివాలయానాం
ప్లవఙ్గరాజగ్రహవిస్మితానామ్. 71

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరః=వీరుడైన, రాక్షసేన్ద్రైః=రాక్షసనాయకులు, తమ్=అతనిని, ఆదాయ=గ్రహించి, యుధి=యుద్ధమునందు, సంస్తూయమానః=స్తుతింపబడుచున్నవాడై, ప్లవఙ్గరాజగ్రహవిస్మితానామ్=సుగ్రీవుణ్ణి పట్టుకొనుటవేళ ఆశ్చర్యపడుచున్న, త్రిదివాలయానామ్=దేవతలయొక్క, నినాదమ్=ధ్వనిని, శృణ్వన్=వినుచు, జగామ=వెళ్లెను.

తా. ఓ పిమ్మట వీరుడైన ఆ కుంభకర్ణుడు యుద్ధరంగమునందు రాక్షసులంచేత స్తుతింపబడుచు, సుగ్రీవుణ్ణి పట్టుకొనుట చూచి, ఆశ్చర్యపడుచున్న దేవతలు చేయుచున్న ధ్వనిని వినుచు, ఆ సుగ్రీవుణ్ణి తీసికొని వెళ్లెను. 71

మూ. తతస్తమాదాయ తదా స మేనే
హరీన్ద్రమిన్ద్రోపమమిన్ద్రవీర్యః,
అస్మిన్ హృతే సర్వమిదం హృతం స్యా
త్సరాఘవం సైన్యమితీన్ద్రశత్రుః. 72

ప్ర. అ. ఇన్ద్రవీర్యః=ఇంద్రుని వంటి పరాక్రమము గల, ఇన్ద్రశత్రుః=ఇంద్రుని శత్రువైన, సః=ఆ కుంభకర్ణుడు, తతః=అటు పిమ్మట, ఇన్ద్రోపమమ్=ఇంద్రునితో సమానుడైన, తమ్=ఆ, హరీన్ద్రమ్=సుగ్రీవుణ్ణి, ఆదాయ=గ్రహించి, తదా=అప్పుడు, అస్మిన్=ఇతడు, హృతే=చంపబడిన వాడగుచుండగా, సరాఘవమ్=రామునితో కూడిన, సర్వమ్=సమస్తమైన, ఇదమ్=ఈ, సైన్యమ్=సైన్యము, హృతమ్=చంపబడినది, స్యాత్=అగును, ఇతి=అని, మేనే=తలచెను.

తా. అప్పుడు ఇంద్రుని వంటి పరాక్రమము గల ఆ కుంభకర్ణుడు ఇంద్రునితో సమానుడైన ఆ సుగ్రీవుని తీసుకొని పోవుచు "ఇతనిని చంపివేసినచో రామునితో సహా సైన్యమంతా నశించును" అని భావించెను. 72

మూ. విద్రుతాం వాహినీం దృష్ట్వా వానరాణామితస్తతః,
కుమ్భకర్ణేన సుగ్రీవం గృహీతం చాపి వానరమ్, 73
హనుమాంశ్చిన్తయామాస మతిమాన్ మారుతాత్మజః.

ప్ర. అ. మతిమాన్=బుద్ధిమంతుడు, మారుతాత్మజః=వాయుపుత్రుడూ అయిన, హనుమాన్=హనుమంతుడు, ఇతస్తతః=ఇటు నటు, విద్రుతామ్=పారిపోయిన, వానరాణామ్=వానరులయొక్క, వాహినీమ్=సేనను, దృష్ట్వా=చూచి, వానరమ్=వానరుడైన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, గృహీతం చాపి=గ్రహించబడినవానినిగా కూడ, చూచి, చిన్తయామాస=ఆలోచించెను.

తా. వానరసైన్యము ఇటు అటూ పారిపోవుచున్నదనీ, సుగ్రీవుణ్ణి కుంభకర్ణుడు తీసికొనిపోవుచున్నాడనీ చూచిన బుద్ధిమంతుడైన వాయుపుత్రుడైన హనుమంతు డిట్లు ఆలోచించెను. 73

మూ. ఏవం గృహీతే సుగ్రీవే కిం కర్తవ్యం మయా భవేత్, 74
యద్ధి న్యాయ్యం మయా కర్తుం తత్కరిష్యామ్యసంశయమ్,
భూత్వా పర్వతసంకాశో నాశయిష్యామి రాక్షసమ్. 75

ప్ర. అ. సుగ్రీవే=సుగ్రీవుడు, ఏవమ్=ఈ విధముగా, గృహీతే=గ్రహించబడినవాడగుచుండగా, మయా=నాచేత, కిమ్=ఏమి, కర్తవ్యమ్=చేయదగినది, భవేత్=అగును? మయా=నాచేత, యత్=ఏది, కర్మమ్=చేయుటకు, న్యాయ్యమ్=న్యాయసమ్మతమో, తత్=దానిని, అసంశయమ్=సంశయము లేకుండా, కరిష్యామి=చేయగలను. పర్వతసంకాశః=పర్వతముతో సమానుడను, భూత్వా=అయి, రాక్షసమ్=రాక్షసుణ్ణి, నాశయిష్యామి=నశింపచేసెదను.

తా. సుగ్రీవుడు ఈ విధముగా పట్టుబడినాడు కదా, ఇప్పుడు నేనేమి చేయవలెను ? నేను ఏమి చేసిన న్యాయసమ్మతముగా ఉండునో దానినే నిసంశయముగా చేసెదను. పర్వత మంత రూపము ధరించి ఈ కుంభకర్ణుణ్ణి నశింపచేసెదను. 74, 75

మూ. మయా హతే సంయతి కుమ్భకర్ణే
మహాబలే ముష్టివిశీర్ణదేహే,
విమోచితే వానరపార్థివే చ
భవన్తు హృష్టాః ప్లవగాః సమగ్రాః. 76

ప్ర. అ. మహాబలే=గొప్ప బలము గల, కుమ్భకర్ణే=కుమ్భకర్ణుడు, ముష్టివిశీర్ణదేహే=పిడికిళ్లచేత బ్రద్దలుకొట్టబడిన దేహము గలవాడై, సంయతి=యుద్ధమునందు, మయా=నాచేత, హతే=చంపబడినవాడగు చుండగా, వానరపార్థివే=వానరరాజు, విమోచితే=విడిపించబడినవా డగుచుండగా, సమగ్రాః=సమస్తమైన, ప్లవగాః=వానరులు, హృష్టాః=సంతోషించిన వాళ్లు, భవన్తు=అగుదురు గాక.

తా. గొప్ప బలము గల కుంభకర్ణుణ్ణి నేను పిడికిళ్లచేత అతని దేహము బ్రద్దలు కొట్టి చంపి సుగ్రీవుణ్ణి విడిపించగా వానరులందరూ సంతోషించెదరుగాక.

మూ. అథవా స్వయమప్యేష మోక్షం ప్రాప్స్యతి వానరః,
గృహీతోఽయం యది భవేత్త్రిదశైః సాసురోరగైః. 77

ప్ర. అ. అథవా=లేదా, అయమ్ ఏషః=ఈ, వానరః=సుగ్రీవుడు, సాసురోరగైః=అసురులతోను, ఉరగులతోను కూడిన, త్రిదశైః=దేవతలచేత, గృహీతః=గ్రహింపబడినవాడు, భవేద్యది=అయినను, స్వయమ్=స్వయముగా, మోక్షమ్=విడుదలను, ప్రాప్స్యతి=పొందగలడు.

తా. లేదా, దేవతలు, అసురులు, ఉరగులు కలిసి ఈ సుగ్రీవుణ్ణి పట్టుకొన్నను ఇతడు స్వయముగానే విడిపించుకొనగలడు. 77

మూ. మన్యే న తావదాత్మానం బుధ్యతే వానరాధిపః
శైలప్రహారాభిహతః కుమ్భకర్ణేన సంయుగే. 78

ప్ర. అ. సంయుగే=యుద్ధమునందు, కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, శైలప్రహారాభిహతః=పర్వతము దెబ్బచేత కొట్టబడిన, వానరాధిపః=సుగ్రీవుడు, ఆత్మానమ్=తనను, న బుధ్యతే తావత్=తెలిసికొనుటలేదు అని, మన్యే=తలచుచున్నాను.

తా. యుద్ధమునందు కుంభకర్ణుడు పర్వతముతో దెబ్బకొట్టుటచేత సుగ్రీవునకు స్పృహ లేదని అనుకొనుచున్నాను. 78

మూ. అయం ముహూర్తాత్సుగ్రీవో లబ్ధసంజ్ఞో మహాహవే,
ఆత్మనో వానరాణాం చ యత్పథ్యం తత్కరిష్యతి. 79

ప్ర. అ. అయమ్=ఈ, సుగ్రీవః=సుగ్రీవుడు, మహాహవే=ఈ మహాయుద్ధమునందు, ముహూర్తాత్=ముహూర్తకాలములో, లబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞగలవాడై, ఆత్మనః=తనకూ, వానరాణాం చ=వానరులకు, యత్=ఏది, పథ్యమ్=పథ్యమో, తత్=దానిని, కరిష్యతి=చేయుగలడు.

తా. సుగ్రీవుడు ఈ మహాయుద్ధమునందు ముహూర్తకాలములో సంజ్ఞను పొంది తనకూ వానరులకూ కూడ ఏది హితమో అది చేయుగలడు. 79

మూ. మయా తు మోక్షితస్యాస్య సుగ్రీవస్య మహాత్మనః,
అప్రీతిశ్చ భవేత్కష్టా కీర్తినాశశ్చ శాశ్వతః. 80

ప్ర. అ. మయా=నాచేత, మోక్షితస్య=విడిపించబడిన, మహాత్మనః=మహాత్ముడైన, అస్య=ఈ, సుగ్రీవస్య=సుగ్రీవునకు, కష్టా=కష్టమైన, అప్రీతిశ్చ=అప్రీతి (ఇష్టము కాకపోవుట) శాశ్వతః=శాశ్వతమైన, కీర్తినాశశ్చ=కీర్తియొక్క నాశము, భవేత్=అగును.

తా. మహాత్ముడైన ఈ సుగ్రీవుణ్ణి నేను విడిపించినట్లయితే అప్పుడది అతనికి ఏ మాత్రము ప్రీతికరము కాకపోవచ్చును. శాశ్వతమైన అపకీర్తి కూడ కలుగును. 80

మూ. తస్మాన్ముహూర్తం కాంక్షిష్యే విక్రమం పార్థివస్య తు,
భిన్నం చ వానరానీకం తావదాశ్వాసయామ్యహమ్. 81

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, ముహూర్తమ్=ముహూర్తకాలము, పార్థివస్య=రాజుయొక్క, విక్రమమ్=పరాక్రమమును, కాంక్షిష్యే=కోరెదను. తావత్=అంతలో, భిన్నమ్=చెదిరిపోయిన, వానరానీకమ్=వానరసైన్యమును,

అహమ్=నేను, ఆశ్వాసయామి=ఓదార్చెదను.

తా. అందువలన ముహూర్తకాలము పాటు రాజు పరాక్రమము చూపుటకై వేచి ఉండెదను. ఈ లోగా చెదిరిపోయిన వానరసైన్యమునకు ధైర్యము చెప్పెదను. 81

మూ. ఇత్యేవం చిన్తయిత్వాథ హనుమాన్మారుతాత్మజః,
భూయః సంస్తమ్భయామాస వానరాణాం మహాచమూమ్. 82

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, ఇత్యేవమ్=ఈ విధముగా, చిన్తయిత్వా=ఆలోచించి, అథ=అటుపిమ్మట, భూయః= మరల, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూమ్=గొప్ప సేనను, సంస్తమ్భయామాస=నిలిపెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు ఇట్లు ఆలోచించి వానరుల మహాసైన్యమును మరల ధైర్యము చెప్పి నిలబెట్టెను. 82

మూ. స కుమ్భకర్ణోఽథ వివేశ లఙ్కాం
స్ఫురన్తమాదాయ మహాహరిం తమ్,
విమానచర్యాగృహగోపురస్థైః
పుష్పాగ్ర్యవర్షైరభిపూజ్యమానః 83

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, స్ఫురన్తమ్=కదలుచున్న, తమ్=ఆ, మహాకపిమ్=సుగ్రీవుని, ఆదాయ=గ్రహించి, విమానచర్యాగృహగోపురస్థైః=విమానములలోను వీధులలోని ఇండ్లలోను, గోపురములయందు ఉన్నవారిచేత, పుష్పాగ్ర్యవర్షైః=శ్రేష్ఠములైన పుష్పముల వర్షములచేత, అభిపూజ్యమానః= పూజింపబడుచున్నవాడై, లఙ్కామ్=లంకను, వివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట ఆ కుంభకర్ణుడు కదలుచున్న ఆ సుగ్రీవుని తీసికొని లంకలో ప్రవేశించెను. అప్పుడు విమానములలోను, వీధులలోని ఇండ్లలోను గోపురములలోను ఉన్న జనులు శ్రేష్ఠమైన పుష్పములు అతనిపై వర్షించిరి.

మూ. లాజగన్ధోదవర్షైస్తు సేవ్యమానః శనైః శనైః,
రాజవీథ్యాస్తు శీతత్వాత్సంజ్ఞాం ప్రాప మహాబలః. 84

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల సుగ్రీవుడు, లాజగన్ధోదవర్షైః తు=పేలాలయొక్క, గంధోదకము యొక్క వర్షములచేత, సేవ్యమానః=సేవింపబడుచున్నవాడై, రాజవీథ్యాః=రాజవీథియొక్క, శీతత్వాత్=చల్లదనమువలన, శనైః శనైః=మెల్లమెల్లగా, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రాప=పొందెను.

తా. లాజలవర్షము, సుగంధములు కలిపిన ఉదకము వర్షము మీద పడుటచేతను, రాజవీధి చల్లగా ఉండుటవలనను, మహాబలుడైన ఆ సుగ్రీవునకు మెల్లమెల్లగా స్పృహ వచ్చెను. 84

మూ. తతః స సంజ్ఞాముపలభ్య కృచ్ఛ్రాద్
బలీయసస్తస్య భుజాన్తరస్థః,
అవేక్షమాణః పురరాజమార్గం
విచిన్తయామాస ముహుర్మహాత్మా. 85

ప్ర. అ. బలీయసః=బలవంతుడైన, తస్య=ఆ కుంభకర్ణునియొక్క, భుజాన్తరస్థః=భుజముల మధ్యనున్న, మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ సుగ్రీవుడు, కృచ్ఛ్రాత్=కష్టమువలన, సంజ్ఞామ్=సంజ్ఞను, ఉపలభ్య=పొంది, పురరాజమార్గమ్=పట్టణమునందలి రాజమార్గమును, అవేక్షమాణః=చూచుచు, ముహుః=మాటిమాటికి, విచిన్తయామాస=ఆలోచించెను.

తా. బలవంతుడైన ఆ కుంభకర్ణుని భుజముల మధ్య నున్న మహాత్ముడైన ఆ సుగ్రీవుడు అతికష్టముమీద సంజ్ఞను పొంది, లంకలోని రాజవీధిని చూచుచు, ఇట్లు తలచెను. 85

మూ. ఏవం గృహీతేన కథం ను నామ
శక్యం మయా సంప్రతి కర్తుమద్య,
తథా కరిష్యామి యథా హరీణాం
భవిష్యతీష్టం చ హితం చ కార్యమ్. 86

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, గృహీతేన=గ్రహింపబడిన, మయా=నాచేత, సంప్రతి=ఇప్పుడు, కథమ్=ఎట్లు, కర్తుమ్=చేయుటకు, శక్యమ్=శక్యమైనది ? హరీణామ్=వానరులకు, ఇష్టమ్=ఇష్టము, హితం చ=హితము అయిన, కార్యమ్=కార్యము, యథా=ఎట్లు, భవిష్యతి=కాగలదో, తథా=అట్లు, అద్య=ఇప్పుడు, కరిష్యామి=చేసెదను.

తా. ఈ విధముగా పట్టుబడిన నేనిప్పుడు ఏమి చేయువలెను ? ఎట్లు చేసిన వానరులకు ఇష్టమగునో, హితముగా ఉండునో అట్లు చేసెదను. 86

మూ. తతః కరాగ్రైః సహసా సమేత్య
రాజా హరీణా మమరేన్ద్రశత్రోః,
నఖైశ్చ కర్ణౌ దశనైశ్చ నాసాం
దదంశ పాదైర్విదదార పార్శ్వే. 87

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, రాజా=రాజు, సమేత్య=ఈ విధముగా ఆలోచించి, తతః=అటుపిమ్మట, శితైః=వాడియైన, కరాగ్రైః=గోళ్లచేత, అమరేన్ద్రశత్రోః=కుంభకర్ణునియొక్క, కర్ణౌ=చెవులనూ, దశనైః=దంతములచేత, నాసామ్=ముక్కునూ, పాదైః=పాదములచేత, పార్శ్వే=పార్శ్వభాగములను, విదదార=చీల్చెను.

తా. సుగ్రీవుడు ఈ విధముగా ఆలోచించి వాడియైన గోళ్లచేత కుంభకర్ణుని చెవులను, దంతాలచేత ముక్కును, పాదాలచేత పార్శ్వభాగములను చీల్చివేసెను.

మూ. స కుమ్భకర్ణో హృతకర్ణనాసో
విదారితస్తేన రదైర్నఖైశ్చ,
రోషాభిభూతః క్షతజార్ద్రగాత్రః
సుగ్రీవమావిధ్య పిపేష భూమౌ. 88

ప్ర. అ. తేన=అతనిచేత, రదైః=దంతములచేత, నఖైశ్చ=గోళ్లచేత, విదారితః=చీల్చబడిన, హృతకర్ణనాసః=హరించబడిన చెవులూ ముక్కూ గల, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, రోషాభిభూతః=రోషముచేత తిరస్కరింపబడినవాడై, క్షతజార్ద్రగాత్రః=రక్తముచేత తడిసిన శరీరముగలవాడై, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, భూమౌ=భూమియందు, ఆవిధ్య=పడవేసి, పిపేష=నలిపెను.

తా. సుగ్రీవుడు ఆ విధముగా దంతాలతోను గోళ్లతోను చీల్చి చెవులు ముక్కు కొరికివేయగా ఆ కుంభకర్ణుడు రక్తముచేత తడిసిన శరీరముతో, కోపావిష్టుడై ఆ సుగ్రీవుణ్ణి నేలమీదకు విసిరికొట్టి నలిపివేసెను. 88

మూ. స భూతలే భీమబలాభిపిష్టః
సురారిభిస్తైరభిహన్యమానః,
జగామ ఖం కన్దుకవజ్జవేన
పునశ్చ రామేణ సమాజగామ. 89

ప్ర. అ. భూతలే=నేలమీద, భీమబలాభిపిష్టః=భయంకరమైన ఆ కుంభకర్ణునిచేత నలిపివేయబడిన, తైః=ఆ, సురారిభిః=రాక్షసులచేత, అభిహన్యమానః=కొట్టబడుచున్న, సః=అతడు, కన్దుకవత్=బంతివలె, జవేన=వేగముతో, ఖమ్=ఆకాశమును గూర్చి, జగామ=వెళ్ళెను. పునశ్చ=మరల, రామేణ=రామునితో, సమాజగామ=కలిసెను.

తా. భయంకరమైన బలము గల కుంభకర్ణుడు నేలమీద పడవేసి నలిపివేయగా, రాక్షసులు కొట్టుచుండగా ఆ సుగ్రీవుడు బంతి వలె

ఆకాశములోనికి ఎగిరి మరల రామునివద్ద వ్రాలెను. 89

మూ. కర్ణనాసావిహీనస్తు కుమ్భకర్ణో మహాబలః,
రరాజ శోణితైః సిక్తో గిరిః ప్రస్రవణైరివ. 90

ప్ర. అ. కర్ణనాసావిహీనః=చెవులతోను ముక్కుతోను శూన్యుడైన, మహాబలః=గొప్ప బలము గల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, శోణితైః=రక్తములచేత, సిక్తః=తడుపబడినవాడై, ప్రస్రవణైః=సెలయేళ్లతో, గిరిః ఇవ=పర్వతము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. చెవులు, ముక్కు, పోయిన మహాబలవంతుడైన కుంభకర్ణుడు రక్తప్రవాహములచేత తడిసి, సెలయేళ్లు ప్రవహించుచున్న పర్వతము వలె ప్రకాశించెను. 90

మూ. శోణితార్ద్రో మహాకాయో రాక్షసో భీమదర్శనః,
అమర్షాచ్ఛోణితోద్గారీ శుశుభే రావణానుజః, 91
నీలాఞ్జనచయప్రఖ్యః ససన్ధ్య ఇవ తోయదః,
యుద్ధాయాభిముఖో భీమో మనశ్చక్రే నిశాచరః. 92

ప్ర. అ. శోణితార్ద్రః=రక్తముచేత తడిసిన, మహాకాయః=పెద్ద శరీరము గల, భీమదర్శనః=భయంకరమైన దర్శనము గల, అమర్షాత్=కోపమువలన, శోణితోద్గారీ=రక్తమును కక్కుచున్న, నీలాఞ్జనచయప్రఖ్యః=నల్లనికాటుకగుట్టవంటి, రావణానుజః=రావణుని తమ్ముడైన, రాక్షసః=కుంభకర్ణుడు, ససన్ధ్యః=సంధ్యతో కూడిన, తోయదః ఇవ=మేఘము వలె, శుశుభే=ప్రకాశించెను. భీమః=భయంకరుడైన, నిశాచరః=ఆ రాక్షసుడు, అభిముఖః=అభిముఖుడుగా, భూత్వా=అయి, యుద్ధాయ=యుద్ధముకొరకు, మనః=మనస్సును, చక్రే=చేసెను.

తా. పెద్ద శరీరము గల ఆ కుంభకర్ణుడు చూచుటకు భయము కలుగునట్లు రక్తముతో తడిసి ఉండెను. కోపముతో రక్తమును కక్కుచుండెను. నల్లని కాటుకగుట్ట వంటి ఆ రాక్షసుడు సంధ్యతో కూడిన మేఘము వలె ప్రకాశించుచుండెను. అతడు యుద్ధరంగాభిముఖుడై యుద్ధముచేయుటకు సిద్ధమయించుకొనెను. 91, 92

మూ. గతే చ తస్మిన్ సురరాజశత్రుః
క్రోధాత్ప్రదుద్రావ రణాయ భూయః,
అనాయుధోఽస్మీతి విచిన్త్య రౌద్రో
ఘోరం తదా ముద్గరమాససాద. 93

ప్ర. అ. తస్మిన్=ఆతడు, గతే=వెళ్ళిపోయినవాడగుచుండగా, సురరాజశత్రుః=కుంభకర్ణుడు, క్రోధాత్=క్రోధమువలన, భూయః=మరల, రణాయ=యుద్ధముకొరకు, ప్రదుద్రావ=శీఘ్రముగా వెళ్లెను. రౌద్రః=భయంకరుడైన ఆతడు, అనాయుధః=ఆయుధము లేనివాడను, అస్మి=అయి ఉన్నాను. ఇతి=అని, విచిన్త్య=ఆలోచించి, తదా=అప్పుడు, ముద్గరమ్=ముద్గరమును, ఆససాద=పొందెను.

తా. ఆ సుగ్రీవుడు వెళ్ళిపోయిన పిమ్మట కుంభకర్ణుడు క్రోధావిష్టుడై మరల యుద్ధమునకై శీఘ్రముగా వెళ్ళెను. భయంకరుడైన ఆతడు ఆయుధము లేదు కదా అని ఆలోచించి అప్పుడు ఒక ముద్గరమును గ్రహించెను. 93

మూ. తతః స పుర్యాః సహసా మహాత్మా
నిష్క్రమ్య తద్వానరసైన్యముగ్రమ్,
బభక్ష రక్షో యుధి కుమ్భకర్ణః
ప్రజా యుగాన్తాగ్నిరివ ప్రవృద్ధః. 94

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, రక్షః=రాక్షసుడైన, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, తతః=ఆటుపిమ్మట, పుర్యాః=పట్టణమునుండి, సహసా=శీఘ్రముగా, నిష్క్రమ్య=బయలు వెడలి, ప్రవృద్ధః=వృద్ధిపొందిన, యుగాన్తాగ్నిః=ప్రళయకాలాగ్ని, ప్రజాః ఇవ=ప్రజలను వలె, యుధి=యుద్ధమునందు, ఉగ్రమ్=భయంకరమైన, తత్ వానరసైన్యమ్=ఆ వానరసైన్యమును, బభక్ష=భక్షించెను.

తా. పిమ్మట మహాత్ముడైన ఆ కుంభకర్ణుడు శీఘ్రముగా పట్టణమునుండి బయల్వెడలి, వృద్ధిచెందిన ప్రళయకాలాగ్ని ప్రజలను వలె, యుద్ధమునందు, భయంకరమైన, ఆ వానరసైన్యమును భక్షించెను. 94

మూ. బుభుక్షితః శోణితమాంసగృధ్నుః
ప్రవిశ్య తద్వానరసైన్యముగ్రమ్,
చఖాద రక్షాంసి హరీన్ పిశాచాన్
ఋక్షాంశ్చ మోహాద్యుధి కుమ్భకర్ణః,
యథైవ మృత్యుర్హరతే యుగాన్తే
స భక్షయామాస హరీంశ్చ ముఖ్యాన్. 95

ప్ర. అ. బుభుక్షితః=ఆకలిగొన్నవాడై, శోణితమాంసగృధ్నుః=రక్తమాంసములయందు ఆసక్తిగల, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఉగ్రమ్=భయంకరమైన, తత్ వానరసైన్యమ్=ఆ వానరసైన్యమును, ప్రవిశ్య=ప్రవేశించి, యుధి=యుద్ధమునందు, మోహాత్=మోహమువలన, రక్షాంసి=రాక్షసులను, హరీన్=వానరులను, పిశాచాన్=పిశాచములను, ఋక్షాన్ చ=భల్లూకములను, చఖాద=తినెను.

యుగాన్తే=ప్రళయకాలమునందు, మృత్యుః=మృత్యుదేవత, యథైవ=ఎట్లు, హరతే=హరించునో అట్లే, సః=అతడు, ముఖ్యాన్=ముఖ్యులైన, హరీన్=వానరులను, భక్షయామాస=భక్షించెను.

తా. ఆకలితో రక్తమాంసములను కోరుచున్న ఆ కుంభకర్ణుడు, భయంకరమైన వానరసైన్యములో ప్రవేశించి యుద్ధరంగమునందు ఎవరెవరో తెలియక రాక్షసులను, వానరులను, పిశాచములను, ఎలుగుబంట్లను కూడ తినివేసెను. ప్రళయకాలమునందు మృత్యువు ప్రజలను హరించినట్లు ప్రధానులైన వానరులను భక్షించెను. 95

మూ. ఏకం ద్వౌ త్రీన్ బహూన్ క్రుద్ధో వానరాన్ సహ రాక్షసైః,
సమాదాయైకహస్తేన ప్రచిక్షేప త్వరన్ ముఖే. 96

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన అతడు, త్వరన్=తొందరపడుచు, ఏకహస్తేన=ఒకహస్తముచేత, సమాదాయ=గ్రహించి, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, వానరాన్=వానరులను, ఏకమ్=ఒకనిని, ద్వౌ=ఇద్దరిని, త్రీన్=ముగ్గురిని, బహూన్=చాలమందిని, ముఖే=ముఖమునందు, ప్రచిక్షేప=పడవేసికొనెను.

తా. కోపించిన ఆ కుంభకర్ణుడు రాక్షసులతో సహా వానరులను ఒకరు, ఇద్దరు, ముగ్గురు, చొప్పునను, ఇంకా చాలమందిని ఒక చేతితో పట్టుకొని నోట్లో వేసుకొనుచుండెను. 96

మూ. సంప్రస్రవంస్తదా మేదః శోణితే చ మహాబలః,
వధ్యమానో నగేన్ద్రాగ్రైర్భక్షయామాస వానరాన్. 97

ప్ర. అ. తదా=అప్పుడు, మహాబలః=గొప్ప బలము గల కుంభకర్ణుడు, నగేన్ద్రాగ్రైః=పర్వతశిఖరములచేత, వధ్యమానః=కొట్టబడుచున్నవాడై, మేదః శోణితే=కొవ్వును రక్తమును, సంప్రస్రవన్=కార్చుచు, వానరాన్=వానరులను, భక్షయామాస=భక్షించెను.

తా. పర్వతశిఖరములతో వానరులు కొట్టుచుండగా అప్పుడు కొవ్వు, రక్తము కార్చుచు మహాబలుడైన ఆ కుంభకర్ణుడు వానరులను భక్షించెను.

మూ. తే భక్ష్యమాణా హరయో రామం జగ్ముస్తదా గతిమ్,
కుమ్భకర్ణో భృశం క్రుద్ధః కపీన్ ఖాదన్ ప్రధావతి. 98

ప్ర. అ. తదా=అప్పుడు, భక్ష్యమాణాః=భక్షింపబడుచున్న, తే హరయః=ఆ వానరులు, రామమ్=రాముని, గతిమ్=శరణముగా, జగ్ముః=పొందిరి. భృశమ్=మిక్కిలి, క్రుద్ధః=కోపించిన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, కపీన్=వానరు

లను, ఖాదన్=తినుచు, ప్రధావతి=పరుగెత్తుచుండెను.

తా. ఆ విధముగా భక్షింపబడుచున్న వానరులు రామునికి శరణుజొచ్చిరి. మిక్కిలి కోపించిన కుంభకర్ణుడు మాత్రము వానరులను భక్షించుచు సంచరించుచుండెను. 98

మూ. శతాని సప్త చాష్టౌ చ వింశత్త్రింశత్తథైవ చ,
సంపరిష్వజ్య బాహుభ్యాం ఖాదన్విపరిధావతి. 99

ప్ర. అ. శతాని=వందమందిని, సప్త చ=ఏడుగురుని, అష్టౌ చ=ఎనమండుగురుని, వింశత్=ఇరవైమందిని, తథైవ చ=మరియు, త్రింశత్=ముప్పైమందిని, బాహుభ్యామ్=బాహువులచేత, సంపరిష్వజ్య=కౌగలించుకొని, ఖాదన్=తినుచు, విపరిధావతి=పరుగెత్తుచుండెను.

తా. వందమందిని, ఏడుగురుని, ఎనమండుగురుని, ఇరవైమందిని, ముప్పైమందిని బాహువులతో గట్టిగా పట్టుకొని తినుచు సంచరించుచుండెను.

మూ. మేదోవసాశోణితదిగ్ధగాత్రః
కర్ణావసక్తగ్రథితాన్త్రమాలః,
వవర్ష శూలాని సుతీక్ష్ణదంష్ట్రః
కాలో యుగాన్తస్థ ఇవ ప్రవృద్ధః. 100

ప్ర. అ. మేదోవసాశోణితదిగ్ధగాత్రః=కొవ్వుచేత, వసచేత, రక్తముచేత, పూయబడిన శరీరము గలవాడై, కర్ణావసక్తగ్రథితాన్త్రమాలః=చెవులకు తగిలి ముడులు పడిన ప్రేగుల మాలలు గలవాడై, సుతీక్ష్ణదంష్ట్రః=చాల తీక్ష్ణములైన కోరలు గల, యుగాన్తస్థః=ప్రళయకాలమునందున్న, ప్రవృద్ధః=విజృంభించిన, కాలః ఇవ=యముడు వలె ఉన్న అతడు, శూలాని=శూలములను, వవర్ష=వర్షించెను.

తా. కుంభకర్ణుని శరీర మంతా కొవ్వుతోను, వసతోను, రక్తముతోను కప్పబడి యుండెను. ప్రేగుల మాలలు అతని చెవులకు తగిలి ముడిపడి యుండెను. చాల వాడియైన కోరలతో కూడినవాడై ప్రళయకాలమునందు విజృంభించిన యముడు వలె ఉన్న అతడు శూలములను వర్షించెను. 100

మూ. తస్మిన్ కాలే సుమిత్రాయాః పుత్రః పరబలార్దనః,
చకార లక్ష్మణః క్రుద్ధో యుద్ధం పరపురంజయః. 101

ప్ర. అ. తస్మిన్=ఆ, కాలే=సమయమునందు, సుమిత్రాయాః=సుమిత్ర యొక్క, పుత్రః=పుత్రుడు, పరబలార్దనః=శత్రుబలమును పీడించువాడు, పరపురంజయః=శత్రువుల పురములను జయించినవాడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, క్రుద్ధః=కోపించినవాడై, యుద్ధమ్=యుద్ధమును, చకార=చేసెను.

తా. ఆ సమయమునందు సుమిత్రాపుత్రుడు, శత్రుసైన్యపీడకుడు, శత్రువుల నగరములను జయించినవాడు అయిన లక్ష్మణుడు కోపించి యుద్ధము చేసెను.

మూ. స కుమ్భకర్ణస్య శరాన్ శరీరే సప్త వీర్యవాన్,
నిచఖానాదదే చాన్యాన్ విససర్జ చ లక్ష్మణః. 102

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమముగల, లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, శరీరే=శరీరమునందు, సప్త=ఏడు, శరాన్=బాణములను, నిచఖాన=పాతెను. అన్యాన్=మరికొన్ని బాణములను, ఆదదే=గ్రహించెను. విససర్జ చ=విడచెను కూడ.

తా. పరాక్రమవంతుడైన ఆ లక్ష్మణుడు కుంభకర్ణుని శరీరమునందు ఏడు బాణములు లోతుగా దిగునట్లు పాతెను. మరికొన్ని బాణములు గ్రహించి వాటిని కూడ ప్రయోగించెను. 102

మూ. పీడ్యమానస్తదస్త్రం తు విశేషం తత్స రాక్షసః,
తతశ్చుకోప బలవాన్ సుమిత్రానందవర్ధనః. 103

ప్ర. అ. సః రాక్షసః=ఆ రాక్షసుడు, పీడ్యమానః=పీడింపబడుచున్నవాడై, తత్=ఆ, తదస్త్రమ్=అతని అస్త్రమును, విశేషమ్=శేషము లేని దానినిగా చేసెను. తతః=అటుపిమ్మట, బలవాన్=బలము గల, సుమిత్రానన్దవర్ధనః=లక్ష్మణుడు, చుకోప=కోపించెను.

తా. ఆ రాక్షసుడు ఆ అస్త్రము చేత పీడింపబడి దానిని నిఃశేషము చేసెను. పిమ్మట బలవంతుడైన లక్ష్మణుడు కోపించెను. 103

మూ. అథాస్య కవచం శుభ్రం జామ్బూనదమయం శుభమ్,
ప్రచ్ఛాదయామాస శరైః సంధ్యాభ్రమివ మారుతః. 104

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మారుతః=వాయువు, సంధ్యాభ్రమివ=సంధ్యాకాలమేఘమును వలె, అస్య=వీనియొక్క, శుభ్రమ్=శుభ్రమైన, జామ్బూనదమయమ్=బంగారము వికారమైన, శుభమ్=సుందరమైన, కవచమ్=కవచమును, శరైః=బాణములచేత, ప్రచ్ఛాదయామాస=కప్పెను.

తా. పిమ్మట ఈతని పరిశుభ్రము, సుందరము అయిన బంగారపు కవచమును, వాయువు సంధ్యాకాలమేఘమును కప్పినట్లు శరములచేత కప్పివేసెను.

మూ. నీలాఞ్జనచయప్రఖ్యః శరైః కాఞ్చనభూషణైః,
ఆపీడ్యమానః శుశుభే మేఘైః సూర్య ఇవాంశుమాన్. 105

ప్ర. అ. కాఞ్చనభూషణైః=బంగారు అలంకారములు గల, శరైః=బాణముల చేత, ఆపీడ్యమానః=పీడింపబడుచున్న, నీలాఞ్జనచయప్రఖ్యః=నల్లటి కాటుకరాశితో సమానుడైన కుంభకర్ణుడు, మేఘైః=మేఘములతో కూడిన, అంశుమాన్=కిరణములు గల, సూర్యః ఇవ=సూర్యుడు వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. బంగారు అలంకారములు గల బాణములచేత పీడించబడుచున్న, నల్లని కాటుక రాశివలె ఉన్న ఆ కుంభకర్ణుడు కిరణములు గల సూర్యుడు మేఘములతో ప్రకాశించినట్లు ప్రకాశించెను. 105

మూ. తతః స రాక్షసో భీమః సుమిత్రానన్దవర్ధనమ్,
సావజ్ఞమేవ ప్రోవాచ వాక్యం మేఘౌఘనిఃస్వనః. 106

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భీమః=భయంకరుడైన, సః రాక్షసః=ఆ రాక్షసుడు, మేఘౌఘనిఃస్వనః=మేఘసముదాయము వంటి ధ్వని గలవాడై, సావజ్ఞమేవ=అనాదరపూర్వకముగా, సుమిత్రానన్దవర్ధనమ్=లక్ష్మణుని గూర్చి, వాక్యమ్=వాక్యమును, ప్రోవాచ=పలికెను.

తా. పిమ్మట భయంకరుడైన ఆ రాక్షసుడు మేఘధ్వనివంటి ధ్వనితో అనాదరపూర్వకముగా లక్ష్మణునితో ఇట్లు పలికెను. 106

మూ. అన్తకస్యాప్యకష్టేన యుధి జేతారమాహవే,
యుధ్యతా మామభీతేన ఖ్యాపితా వీరతా త్వయా. 107

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, అకష్టేన=కష్టము లేకుండగా, అన్తకస్యాపి= యమునకు కూడ, జేతారమ్=జయించువాడనైన, మామ్=నన్ను, ఆహవే=యుద్ధమునందు, యుధ్యతా=యుద్ధముచేయుచున్న, అభీతేన=భయపడని, త్వయా=నీచేత, వీరతా= వీరత్వము, ఖ్యాపితా=చాటబడినది.

తా. యుద్ధములో అనాయాసముగా యముణ్ణి కూడ జయించు నన్ను నిర్భయముగా ఎదుర్కొని నీవు నీ వీరత్వమును ప్రదర్శించినావు. 107

మూ. ప్రగృహీతాయుధస్యేహ మృత్యోరివ మహామృధే,
తిష్ఠన్నప్యగ్రతః పూజ్యః కిము యుద్ధప్రదాయకః. 108

ప్ర. అ. ఇహ=ఇక్కడ, మహామృధే=మహాయుద్ధమునందు, ప్రగృహీతాయుధస్య=గ్రహించబడిన ఆయుధము గల, మృత్యోరివ=మృత్యుదేవతవంటి నాయొక్క, అగ్రతః=ఎదుట, తిష్ఠన్నపి=నిలచినవాడు కూడ, పూజ్యః=పూజించదగినవాడు.

యుద్ధప్రదాయకః=యుద్ధము ఇచ్చువాడు, కిము=చెప్పనేల?

తా. మహాయుద్ధములో ఆయుధము ధరించి మృత్యుదేవత వలె ఉన్న నా ఎదుట నిలచినవాడు కూడ గౌరవింపదగినవాడు ; యుద్ధము చేసిన వానిమాట చెప్పవలెనా ? 108

మూ. ఐరావతం సమారూఢో వృతః సర్వామరైః ప్రభుః,
నైవ శక్రోఽపి సమరే స్థితపూర్వః కదాచన. 109

ప్ర. అ. ఐరావతమ్=ఐరావతమును, సమారూఢః=ఎక్కినవాడు, సర్వామరైః=సమస్తమైన దేవతలతో, వృతః=కూడినవాడు, ప్రభుః=సమర్థుడు అయిన, శక్రోఽపి=దేవేంద్రుడు కూడ, కదాచన=ఎన్నడూ, సమరే=యుద్ధమునందు, స్థితపూర్వః=పూర్వము నిలచినవాడు, నైవ=కాడు.

తా. సమస్తదేవతలతో కలిసి, ఐరావతము నెక్కి వచ్చిన సమర్థుడైన దేవేంద్రుడు కూడ పూర్వమెన్నడూ నా ఎదుట నిలబడలేదు. 109

మూ. అద్య త్వయాహం సౌమిత్రే బలేనాపి పరాక్రమైః,
తోషితో గన్తు మిచ్ఛామి త్వామనుజ్ఞాప్య రాఘవమ్. 110

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! అద్య=నేడు, అహమ్=నేను, త్వయా=నీచేత, బలేనాపి=బలముచేత, పరాక్రమైః=పరాక్రమములచేతా, తోషితః=సంతోషపెట్టబడితిని. త్వామ్=నిన్ను, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. లక్ష్మణా ! నీవు ఇప్పుడు బలముచేతను, పరాక్రమముచేతను నాకు సంతోషము కలిగించినావు. నీ అనుమతి తీసికొని రాముని వద్దకు వెళ్లవలెనని కోరుచున్నాను. 110

మూ. యత్తు వీర్యబలోత్సాహైస్తోషితోఽహం రణే త్వయా,
రామమేవైకమిచ్ఛామి హన్తుం యస్మిన్ హతే హతమ్. 111

ప్ర. అ. వీర్యబలోత్సాహైః=పరాక్రమముచేత, బలముచేత, ఉత్సాహముచేత, త్వయా=నీచేత, అహమ్=నేను, యత్=ఏ కారణమువలన, రణే=యుద్ధమునందు, తోషితః=సంతోషపెట్టబడితినో, అందువలన, యస్మిన్=ఏ రాముడు, హతే=చంపబడినవాడగుచుండగా, హతమ్=సైన్యమంతా చంపబడినది అగునో, అట్టి, రామమేవ=రాముణ్ణే, హన్తుమ్=చంపుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. నీవు యుద్ధములో పరాక్రమము, బలము, ఉత్సాహము చూపి నన్ను సంతోషపెట్టినావు. అందుచే రాముణ్ణే మాత్రమే చంపవలెనని

కోరుచున్నాను. అతనిని చంపినచో అందరినీ చంపినట్లే అగును. 111

మూ. రామే మయాత్ర నిహతే యేఽన్యే స్థాస్యన్తి సంయుగే,
తానహం యోధయిష్యామి స్వబలేన ప్రమాథినా. 112

ప్ర. అ. అత్ర=ఇక్కడ, మయా=నాచేత, రామే=రాముడు, నిహతే=చంపబడినవా డగుచుండగా, సంయుగే=యుద్ధమునందు, అన్యే=ఇతరులైన, యే=ఎవరు, స్థాస్యన్తి=ఉండగలరో, తాన్=వాళ్లను, ప్రమాథినా=నశింపచేయు, స్వబలేన=నా సైన్యముచేత, అహమ్=నేను, యోధయిష్యామి=యుద్ధము చేయించెదను.

తా. నేను రాముణ్ణి చంపిన పిమ్మట యుద్ధములో మిగిలిన వాళ్లతో శత్రువులను నశింపచేయు నా సైన్యము యుద్ధముచేయు నట్లు చేసెదను.

మూ. ఇత్యుక్తవాక్యం తద్రక్షః ప్రోవాచ స్తుతిసంహితమ్,
మృధే ఘోరతరం వాక్యం సౌమిత్రిః ప్రహసన్నివ. 113

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, మృధే=యుద్ధమునందు, ఇతి=ఇట్లు, స్తుతిసంహితమ్=స్తుతితో కూడినట్లుగా, ఉక్తవాక్యమ్=పలకబడిన వాక్యము గల, తత్=ఆ, రక్షః=రాక్షసుని గూర్చి, ప్రహసన్నివ=నవ్వుచు, ఘోరతరమ్=మిక్కిలి ఘోరమైన, వాక్యమ్=వాక్యమును, ప్రోవాచ=పలికెను.

తా. ఈ విధముగా ఆ రాక్షసుడు ఆత్మస్తుతిపూర్వకముగా పలికిన మాటలు విని, లక్ష్మణుడు నవ్వుచు మిక్కిలి ఘోరమైన వాక్యమును పలికెను.

మూ. యస్త్వం శక్రాదిభిర్వీరైరసహ్యః ప్రాప్య పౌరుషమ్,
తత్సర్వం నాన్యథా వీర దృష్టస్తేఽద్య పరాక్రమః, 114
ఏష దాశరథీ రామస్తిష్ఠత్యద్రిరివాచలః.

ప్ర. అ. వీర=వీరుడా ! యః త్వమ్=ఏ నీవు, పౌరుషమ్=పౌరుషమును, ప్రాప్య=పొంది, శక్రాదిభిః=ఇంద్రుడు మొదలైన, వీరైః=వీరులచేత, అసహ్యః=సహింప శక్యము కానివాడ నని చెప్పుచున్నావో, తత్=అది, సర్వమ్=సమస్తమూ, అన్యథా=మరియొక విధముగా, న=కాదు. సత్యమ్=సత్యమే. అద్య=ఇప్పుడు, తే=నీయొక్క, పరాక్రమః=పరాక్రమము, దృష్టః=చూడబడినది. దాశరథిః=దశరథకుమారుడైన, ఏషః రామః=ఈ రాముడు, అచలః=చలించని, అద్రిః ఇవ=పర్వతము వలె, తిష్ఠతి=నిలచి ఉన్నాడు.

తా. ఓ ! వీరుడా ! పౌరుషమును చూపించు సమయమునందు ఇంద్రాదివీరులు కూడ నిన్ను సహింపజాల రని నీవు చెప్పుచున్నావు; అది సత్యమే. నీ పరాక్రమమును ఇప్పుడు చూచినాము. కాని దశరథకుమారుడైన

రాము ఓడుగో చలించని పర్వతము వలె నిలచి ఉన్నాడు. 114

మూ. ఇతి శ్రుత్వా హ్యనాదృత్య లక్ష్మణం స నిశాచరః, 115
అతిక్రమ్య చ సౌమిత్రిం కుమ్భకర్ణో మహాబలః,
రామమేవాభిదుద్రావ కమ్పయన్నివ మేదినీమ్. 116

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడు, మహాబలః=గొప్ప బలము గలవాడు అయిన, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, ఇతి=ఇట్లు, శ్రుత్వా=విని, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, అనాదృత్య=లెక్కచేయక, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, అతిక్రమ్య చ =దాటివేసి, మేదినీమ్=భూమిని, కమ్పయన్నివ=కంపింపచేయుచున్నవాడు వలె, రామమేవ=రాముణ్ణే గూర్చియే, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. గొప్ప బలము గల ఆ నిశాచరుడైన కుంభకర్ణుడు ఈ మాటలు విని, లక్ష్మణుణ్ణి లెక్క చేయక అతనిని దాటి, భూమిని కంపింపచేయుచున్నాడా అన్నట్లు రాముని మీదికే వెళ్లెను.

వి."పీడ్యమానస్తదస్త్రం తు..." ఇత్యాది శ్లోకము (103) మొదలు "ఏష దాశరథీ రామః..." ఇత్యాది శ్లోకము (115) వరకు ఉన్న పదమూడు శ్లోకాలు ప్రక్షిప్తములై ఉండును. వీటికి గోవిందరాజుల వ్యాఖ్య లేదు. 115, 116

మూ. అథ దాశరథీ రామో రౌద్రమస్త్రం ప్రయోజయన్,
కుమ్భకర్ణస్య హృదయే ససర్జ నిశితాన్ శరాన్. 117

ప్ర. అ. అథ=అటు పిమ్మట, దాశరథిః=దశరథకుమారుడైన, రామః=రాముడు, రౌద్రమ్=రౌద్రమను, అస్త్రమ్=అస్త్రమును, ప్రయోజయన్=ప్రయోగించుచు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, హృదయే=హృదయమునందు, నిశితాన్=వాడియైన, శరాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. పిమ్మట దశరథకుమారుడైన రాముడు రౌద్రాస్త్రమును ప్రయోగించి కుంభకర్ణుని వక్షస్థలమునందు, వాడియైన బాణములను విడచెను. 117

మూ. తస్య రామేణ విద్ధస్య సహసాభిప్రధావతః,
అఙ్గారమిశ్రాః క్రుద్ధస్య ముఖాన్నిశ్చేరురర్చిషః. 118

ప్ర. అ. రామేణ=రామునిచేత, విద్ధస్య=కొట్టబడిన, సహసా=శీఘ్రముగా, అభిప్రధావతః=ఎదురుగా పరుగెత్తుచున్న, క్రుద్ధస్య=కోపించిన, తస్య=వానియొక్క, ముఖాత్=ముఖమునుండి, అఙ్గారమిశ్రాః=(బొగ్గులతో) అగ్నిపిండములతో కలిసిన, అర్చిషః=అగ్నిజ్వాలలు, నిశ్చేరుః=బయలుదేరినవి.

తా. రాముడు కొట్టగా కోపముతో ఆ రామునకు ఎదురుగా పరుగెత్తి

వస్తున్న ఆ కుంభకర్ణుని ముఖమునుండి అగ్నిపిండములు, అగ్నిజ్వాలలు బయలుదేరినవి. 118

మూ. రామాస్త్రవిద్ధో ఘోరం వై నదన్ రాక్షసపుంగవః,
అభ్యధావత తం క్రుద్ధో హరీన్ విద్రావయన్ రణే. 119

ప్ర. అ. రామాస్త్రవిద్ధః=రాముని అస్త్రముచేత కొట్టబడిన, రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడు, ఘోరమ్=భయంకరముగా, నదన్=ధ్వనిచేయుచు, హరీన్=వానరులను, రణే=యుద్ధమునందు, విద్రావయన్=పరుగెత్తించుచు, క్రుద్ధః=కోపించినవాడై, తమ్=ఆ రామునిగూర్చి, అభ్యధావత=పరుగెత్తెను.

తా. రాముని అస్త్రముచేత కొట్టబడిన ఆ రాక్షసశ్రేష్ఠుడు క్రోధావిష్టుడై భయంకరముగా అరచుచు, వానరులను తరిమివేయుచు రాముని వైపు పరుగెత్తెను.

మూ. తస్యోరసి నిమగ్నాశ్చ శరా బర్హిణవాససః,
హస్తాచ్చాస్య పరిభ్రష్టా గదా చోర్వ్యాం పపాత హ. 120

ప్ర. అ. బర్హిణవాససః=నెమలి పింఛములు వస్త్రములుగా గల, తే శరాః=ఆ బాణములు, తస్య=అతనియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, నిమగ్నాః=మునిగినవి. అస్య=వీనియొక్క, హస్తాత్=హస్తమునుండి, పరిభ్రష్టా=జారినదై, గదా=గద, ఉర్వ్యామ్=భూమిమీద, పపాత హ=పడెను.

తా. నెమలి ఈకలు కట్టిన ఆ బాణములు ఆ కుంభకర్ణుని వక్షఃస్థలములోనికి దిగిపోయినవి. గద అతని చేతినుండి జారిపోయి నేల మీద పడెను. 120

మూ. ఆయుధాని చ సర్వాణి సమకీర్యన్త భూతలే,
స నిరాయుధమాత్మానం యదా మేనే మహాబలః, 121
ముష్టిభ్యాం చ కరాభ్యాం చ చకార కదనం మహత్.

ప్ర. అ. సర్వాణి=సమస్తమైన, ఆయుధాని=ఆయుధములు, భూతలే=నేల మీద, సమకీర్యన్త=చిమ్మబడిపోయినవి. మహాబలః=గొప్పబలము గల, సః=అతడు, యదా=ఎప్పుడు, ఆత్మానమ్=తనను, నిరాయుధమ్=ఆయుధములు లేనివానిగా, మేనే=గ్రహించెనో, అప్పుడు, ముష్టిభ్యాం చ=పిడికిళ్లచేతను, కరాభ్యాం చ=హస్తములచేతను, మహత్=గొప్ప, కదనమ్=యుద్ధమును, చకార=చేసెను.

తా. అతని ఆయుధము లన్నీ నేలమీద చెల్లాచెదరై పడిపోయెను. గొప్ప బలము గల అతడు తన ఆయుధము లన్నీ పోయిన వని గ్రహించి, పిడికిళ్లతోను, చేతులతోను, గొప్ప యుద్ధము చేసెను. 121

మూ. స బాణైరతివిద్ధాఙ్గః క్షతజేన సముక్షితః, 122
రుధిరం పరిసుస్రావ గిరిః ప్రస్రవణం యథా.

ప్ర. అ. బాణైః=బాణములచేత, అతివిద్ధాఙ్గః=మిక్కిలి కొట్టబడిన శరీరము గల, క్షతజేన=రక్తముచేత, సముక్షితః=తడుపబడిన, సః=అతడు, గిరిః=పర్వతము, ప్రస్రవణం యథా=సెలయేరును వలె, రుధిరమ్=రక్తమును, పరిసుస్రావ=కార్చెను.

తా. బాణములచేత ఎక్కువగా కొట్టబడిన శరీరము గల, రక్తముచేత తడిసిన ఆ కుంభకర్ణుడు, పర్వతము సెలయేరును వలె, రక్తమును స్రవించెను.

మూ. స తీవ్రేణ చ కోపేన రుధిరేణ చ మూర్ఛితః, 123
వానరాన్రాక్షసానృక్షాన్ ఖాదన్ స పరిధావతి.

ప్ర. అ. సః=అతడు, తీవ్రేణ=తీవ్రమైన, కోపేన=కోపముచేత, రుధిరేణ చ=రక్తముచేత, మూర్ఛితః=వ్యాప్తుడయ్యెను. సః=అతడు, వానరాన్=వానరులను, రాక్షసాన్=రాక్షసులను, ఋక్షాన్=భల్లూకములను, ఖాదన్=తినుచు, పరిధావతి=పరుగెత్తెను.

తా. తీవ్రమైన కోపముతో ఒళ్లు తెలియని అతడు రక్తము కార్చుచు వానరులను, రాక్షసులను, భల్లూకములను తినుచు తిరుగుచుండెను. 123

మూ. అథ శృఙ్గం సమావిధ్య భీమం భీమపరాక్రమః,
చిక్షేప రామముద్దిశ్య బలవానన్తకోపమః. 124

ప్ర. అ. అథ=అటుపిమ్మట, భీమపరాక్రమః=భయంకరమైన పరాక్రమము గల, బలవాన్=బలవంతుడైన, అన్తకోపమః=యమునితో సమానుడైన కుంభకర్ణుడు, భీమమ్=భయంకరమైన, శృఙ్గమ్=శిఖరమును, సమావిధ్య=గట్టిగా పట్టి, రామమ్ ఉద్దిశ్య=రాముణ్ణి గూర్చి, చిక్షేప=విసరెను.

తా. భయంకరములైన బలపరాక్రమములు గల యమతుల్యుడైన ఆ కుంభకర్ణుడు ఒక పర్వతశిఖరమును పెగిలించి పట్టి రాముని మీదకు విసరెను. 124

మూ. అప్రాప్తమన్తరా రామః సప్తభిస్తమజిహ్మగైః,
చిచ్ఛేద గిరిశృఙ్గం తం పునః సన్ధాయ కార్ముకమ్. 125

ప్ర. అ. రామః=రాముడు, పునః=మరల, కార్ముకమ్=ధనస్సును, సన్ధాయ=సంధించి, తం గిరిశృఙ్గమ్=ఆ పర్వతశిఖరమును, అప్రాప్తమ్=రాకుండగానే, సప్తభిః=ఏడు, అజిహ్మగైః=బాణములచేత, అన్తరా=మధ్యయందు, చిచ్ఛేద=ఛేదించెను.

తా. రాముడు ధనస్సు ఎక్కుపెట్టి ఆ పర్వతశిఖరము తనమీదికి రాకుండగనే దానిని ఏడు బాణములతో మధ్యలో ఖండించెను. 125

మూ. తతస్తు రామో ధర్మాత్మా తస్య శృఙ్గం మహత్తదా, 126
శరైః కాఞ్చనచిత్రాఙ్గై శ్చిచ్ఛేద భరతాగ్రజః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడు, భరతాగ్రజః=భరతుని అన్నగారు అయిన, రామః=రాముడు, తదా=అప్పుడు, తస్య=దానియొక్క, మహత్=గొప్పదైన, శృఙ్గమ్=శిఖరమును, కాఞ్చనచిత్రాఙ్గైః=బంగారముచేత చిత్రమైన శరీరము గల, శరైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. పిమ్మట ధర్మాత్ముడు, భరతుని అన్నగారు అయిన రాముడు బంగారము చేత చిత్రవర్ణము గల బాణములతో అతడు విసిరిన శిఖరమును ఖండించెను. 126

మూ. తన్మేరుశిఖరాకారం ద్యోతమానమివ శ్రియా, 127
ద్వే శతే వానరాణాం చ పతమానమపాతయత్.

ప్ర. అ. శ్రియా=శోభతో, ద్యోతమానమివ=ప్రకాశించుచున్నది వలె ఉన్న, మేరుశిఖరాకారమ్=మేరుశిఖరము వంటి ఆకారము గల, తత్=ఆ శిఖరము, పతమానమ్=పడుచు, వానరాణామ్=వానరులయొక్క, ద్వే శతే=రెండు శతములను, అపాతయత్=పడగొట్టెను.

తా. మేరుశిఖరము వంటి ఆకారము గలిగి కాంతితో ప్రకాశించుచున్నట్లు ఉన్న ఆ శిఖరము క్రింద పడుచు రెండువందల మంది వానరులను పడగొట్టెను.

మూ. తస్మిన్ కాలే స ధర్మాత్మా లక్ష్మణో రామమబ్రవీత్, 128
కుమ్భకర్ణవధే యుక్తో యోగాన్ పరిమృశన్ బహూన్.

ప్ర. అ. తస్మిన్=ఆ, కాలే=సమయమునందు, ధర్మాత్మా=ధర్మాత్ముడు, కుమ్భకర్ణవధే=కుంభకర్ణుని వధయందు, యుక్తః=ఆసక్తుడైన, బహూన్=అనేకమైన, యోగాన్=ఉపాయములను, పరిమృశన్=ఆలోచించుచున్న, లక్ష్మణః=లక్ష్మణుడు, రామమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆ సమయమునందు కుంభకర్ణుణ్ణి చంపవలె నను నిశ్చయముతో తగిన అనేకములైన ఉపాయములు ఆలోచించుచున్న ధర్మాత్ముడైన లక్ష్మణుడు రామునితో ఇట్లనెను. 128

మూ. నైషాయం వానరాన్రాజన్న విజానాతి రాక్షసాన్, 129
మత్తః శోణితగన్ధేన స్వాన్ పరాంశ్చైవ ఖాదతి.

ప్ర. అ. రాజన్=రాజా ! అయమ్=ఇతడు, వానరాన్=వానరులను, నైవ విజానాతి=తెలుసుకొనుటలేదు, రాక్షసాన్=రాక్షసులను, న=తెలుసుకొనుట లేదు, శోణితగన్ధేన=రక్తగంధముచేత; మత్తః=మదించినవాడై, స్వాన్=తనవాళ్లను, పరాంశ్చైవ=ఇతరులనూ కూడ, ఖాదతే=తినుచున్నాడు.

తా. రాజా ! ఇతనికి వానరు లెవరో, రాక్షసు లెవరో తెలియుటలేదు. ఇతడు రక్తగంధముచేత మత్తెక్కి తనవాళ్లను ఇతరులను కూడ తినివేయుచున్నాడు.

మూ. సాధ్వేనమధిరోహన్తు సర్వతో వానరర్షభాః, 130
యూథపాశ్చ యథాముఖ్యాస్తిష్ఠన్త్వస్య సమన్తతః.

ప్ర. అ. వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, ఏనమ్=వీనిని, సాధు=బాగుగా, సర్వతః=అన్ని వైపులా, అధిరోహన్తు=ఎక్కెదరుగాక. యథాముఖ్యాః=ముఖ్యులను అనుసరించినవారై, యూథపాశ్చ=సేనానాయకులు కూడ, అస్య=ఇతనికి, సమన్తతః=అన్నివైపులా, తిష్ఠన్తు=నిలచెదరుగాక.

తా. వానరశ్రేష్ఠు లందరూ అన్నివైపులనుండి ఈతని దేహము మీదకు ఎక్కెదరుగాక. సేనానాయకులు తమ తమ ప్రధానులను అనుసరించి ఈతని చుట్టూ నిలచి ఉందురుగాక. 130

మూ. అప్యయం దుర్మతిః కాలే గురుభారప్రపీడితః, 131
ప్రచరన్ రాక్షసో భూమౌ నాన్యాన్హన్యాత్ప్లవంగమాన్.

ప్ర. అ. అద్య కాలే=ఆ సమయమునందు, గురుభారప్రపీడితః=గొప్ప భారముచేత పీడింపబడినవాడై, దుర్మతిః=దుర్మతియైన, అయం రాక్షసః=ఈ రాక్షసుడు, భూమౌ=నేలమీద, ప్రచరన్=సంచరించుచు, అన్యాన్=ఇతరులైన, ప్లవంగమాన్=వానరులను, న హన్యాత్=చంపడు.

తా. అట్లు చేసినచో ఈ దుర్మతియైన రాక్షసుడు పెద్ద బరువుచేత పీడితుడై నేలమీద ప్రాకుచు ఇతరవానరులను చంపజాలడు. 131

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః, 132
తే సమారురుహుర్హృష్టాః కుమ్భకర్ణం ప్లవంగమాః.

ప్ర. అ. ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య రాజపుత్రస్య=ఆ రాజకుమారుని యొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తే ప్లవంగమాః=ఆ

వానరులు, హృష్టాః=సంతోషించినవారై, కుమ్భకర్ణమ్=కుమ్భకర్ణుణ్ణి, సమారురుహుః=ఎక్కిరి.

తా. బుద్ధిమంతుడైన లక్ష్మణుని మాటలు విని ఆ వానరులు సంతోషించి కుంభకర్ణుని శరీరముపై ఎక్కిరి. 132

మూ. కుమ్భకర్ణస్తు సంక్రుద్ధః సమారూఢః ప్లవంగమైః, 133
వ్యధూనయత్తాన్వేగేన దుష్టహస్తీవ హస్తిపాన్.

ప్ర. అ. ప్లవంగమైః=వానరులచేత, సమారూఢః=ఎక్కబడిన, కుమ్భకర్ణస్తు=కుంభకర్ణుడైతే, సంక్రుద్ధః=కోపించినవాడై, దుష్టహస్తీ=పొగరుపోతు ఏనుగు, హస్తిపాన్ ఇవ=మావటివాళ్లను వలె, తాన్=వాళ్లను, వేగేన=వేగముచేత, వ్యధూనయత్=దులిపివేసెను.

తా. ఆ వానరులు ఎక్కుటచేత కోపించిన కుంభకర్ణుడు పొగరెక్కిన ఏనుగు మావటి వాళ్ళను వలె ఆ వానరులను వేగముగా దులిపివేసెను.133

మూ. తాన్ దృష్ట్వా విధుతాన్ రామో రుష్టోఽయమితి రాక్షసమ్,134
సముత్పపాత వేగేన ధనురుత్తమమాదదే.

ప్ర. అ. రామః=రాముడు, విధుతాన్=క్రిందికి దులిపివేయబడిన, తాన్=ఆ వానరులను, దృష్ట్వా=చూచి, అయమ్=ఇతడు, రుష్టః ఇతి=కోపించినవాడు అని గ్రహించి, రాక్షసమ్=ఆ రాక్షసుణ్ణి గూర్చి, వేగేన=వేగముతో, సముత్పపాత=దుమికి వచ్చెను. ఉత్తమమ్=ఉత్తమమైన, ధనుః=ధనస్సును, ఆదదే=గ్రహించెను.

తా. ఆ వానరు లందరినీ ఆ విధముగ దులిపివేయుట చూచి రాముడు "ఈతడు కోపావేశముతో ఉన్నాడు" అని గ్రహించి, వేగముగా అతనివైపు వెళ్లెను; మరొక ఉత్తమమైన ధనస్సును తీసికొనెను. 134

మూ. క్రోధరక్తేక్షణో వీరో నిర్దహన్నివ చక్షుషా, 135
రాఘవో రాక్షసం రోషాదభిదుద్రావ వేగితః,
యూథపాన్ హర్షయన్ సర్వాన్ కుమ్భకర్ణభయార్దితాన్. 136

ప్ర. అ. క్రోధరక్తేక్షణః=క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల, వీరః=వీరుడైన, రాఘవః=రాముడు, చక్షుషా=నేత్రముచేత, నిర్దహన్నివ=కాల్చివేయుచున్నవాడు వలె, రోషాత్=రోషమువలన, వేగితః=వేగముగలవాడై, కుమ్భకర్ణభయార్దితాన్=కుంభకర్ణునివలన భయముచేత పీడితులైన, సర్వాన్=సమస్తమైన, యూథపాన్=సేనానాయకులను, హర్షయన్=సంతోషపెట్టుచు, రాక్షసమ్=రాక్షసుణ్ణి గూర్చి, అభిదుద్రావ=శీఘ్రముగా వెళ్లెను.

తా. క్రోధముచే ఎఱ్ఱనైన నేత్రములు గల వీరుడైన రాముడు నేత్రముతో (చూపుతో) కాల్చివేయుచున్నాడా అన్నట్లు వేగముగా నడచుచు కుంభకర్ణుని వలన కలిగిన భయముచేత పీడితులైన వానరనాయకుల నందరిని సంతోషపెట్టుచు ఆ రాక్షసుని ఎదుర్కొనెను. 135, 136

మూ. స చాపమాదాయ భుజఙ్గకల్పం
దృఢజ్యముగ్రం తపనీయచిత్రమ్,
హరీన్ సమాశ్వాస్య సముత్పపాత
రామో నిబద్ధోత్తమతూణబాణః. 137

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, భుజఙ్గకల్పమ్=సర్పముతో సమానమైన, దృఢజ్యమ్=దృఢమైన నారి గల, ఉగ్రమ్=భయంకరమైన, తపనీయ చిత్రమ్=బంగారముచేత చిత్రవర్ణమైన, చాపమ్=ధనస్సును, ఆదాయ=గ్రహించి, హరీన్=వానరులను, సమాశ్వాస్య=ఓదార్చి, నిబద్ధోత్తమతూణబాణః=కట్టబడిన ఉత్తమములైన అంబులపొదులు బాణములు గలవాడై, సముత్పపాత=శీఘ్రముగా వచ్చెను.

తా. ఆ రాముడు సర్పము వలె ఉన్న, దృఢమైన నారి గల, బంగారముచేత చిత్రవర్ణముగా ఉన్న భయంకరమైన ధనస్సును గ్రహించి ఉత్తమములైన అంబుల పొదులను బాణములను కట్టుకొని, వానరులకు ధైర్యము చెప్పి శీఘ్రముగా బయలుదేరెను. 137

మూ. స వానరగణైస్తైస్తు వృతః పరమదుర్జయః,
లక్ష్మణానుచరో వీరః సంప్రతస్థే మహాబలః. 138

ప్ర. అ. పరమదుర్జయః=మిక్కిలి జయింప శక్యము కానివాడు, లక్ష్మణానుచరః=లక్ష్మణుడు అనుచరుడుగా గలవాడు, వీరః=వీరుడు, మహాబలః=గొప్ప బలము గలవాడు అయిన, సః=ఆ రాముడు, తైః=ఆ, వానరగణైః=వానరుల గుంపులతో, వృతః=కూడినవాడై, సంప్రతస్థే=ప్రయాణమాయెను.

తా. ఏ మాత్రము జయింప శక్యము కాని వీరుడైన, మహాబలశాలియైన ఆ రాముడు, లక్ష్మణుడు వెంట రాగా, ఆ వానరగణములతో కలిసి బయలుదేరెను. 138

మూ. స దదర్శ మహాత్మానం కిరీటినమరిందమమ్,
శోణితావృతరక్తాక్షం కుమ్భకర్ణం మహాబలః. 139

ప్ర. అ. మహాబలః=గొప్పబలము గల, సః=ఆ రాముడు, మహాత్మానమ్=మహాత్ముడు, కిరీటినమ్=కిరీటముగలవాడు, అరిందమమ్=శత్రుపీడకుడు,

శోణితావృతరక్తాక్షమ్=రక్తముచేత కప్పబడిన ఎఱ్ఱని నేత్రములు గలవాడు అయిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, దదర్శ=చూచెను.

తా. గొప్ప బలము గల ఆ రాముడు కిరీటమును ధరించినవాడు మహోన్నతుడు అయిన కుంభకర్ణుణ్ణి చూచెను. శత్రువినాశకుడైన అతని కండ్లు రక్తము కప్పి ఎఱ్ఱగా ఉండెను. 139

మూ. సర్వాన్ సమభిధావన్తం యథా రుష్టం దిశాగజమ్,
మార్గమాణం హరీన్ క్రుద్ధం రాక్షసైః పరివారితమ్. 140

ప్ర. అ. రుష్టమ్=కోపించిన, దిశాగజం యథా=దిగ్గజమువలె ఉన్న వాడు, సర్వాన్=అందరినీ గూర్చి, సమభిధావన్తమ్=పరుగెత్తుచున్నవాడు, హరీన్=వానరులను, మార్గమాణమ్=వెదకుచున్నవాడు, క్రుద్ధమ్=కోపించినవాడు, రాక్షసైః=రాక్షసులచేత, పరివారితమ్=చుట్టబడి ఉన్న వాడు అయిన (కుంభకర్ణుణ్ణి చూచెను).

తా. ఆ కుంభకర్ణుడు కోపించిన దిగ్గజము వలె అందరినీ తరుముచుండెను. కోపముతో వానరులకై వెదకుచుండెను. అతని చుట్టూ రాక్షసులు ఉండిరి.

మూ. విన్ధ్యమన్దరసంకాశం కాఞ్చనాఙ్గదభూషణమ్,
స్రవన్తం రుధిరం వక్త్రాద్వర్షామేఘమివోత్థితమ్. 141

ప్ర. అ. విన్ధ్యమన్దరసంకాశమ్=వింధ్యమందరపర్వతములతో సమానుడు, కాఞ్చనాఙ్గదభూషణమ్=బంగారు బాహుపురులు అలంకారములు కలవాడు, వక్త్రాత్=ముఖమునుండి, రుధిరమ్=రక్తమును, స్రవన్తమ్=స్రవించుచున్నవాడు, ఉత్థితమ్=పైకిలేచిన, వర్షామేఘమివ=వర్షాకాలమేఘము వలె ఉన్నవాడు అయిన (కుంభకర్ణుణ్ణి చూచెను).

తా. వింధ్యమందరపర్వతముల వలె ఉన్న ఆ కుంభకర్ణుడు బంగారు బాహుపురులను, అలంకారములను అలంకరించుకొనెను. ముఖమునుండి రక్తము కార్చుచుండెను. పైకి లేచిన వర్షాకాలమేఘమువలె ఉండెను. 141

మూ. జిహ్వయా పరిలిహ్యన్తం సృక్కిణీ శోణితోక్షితే,
మృద్నన్తం వానరానీకం కాలాన్తకయమోపమమ్. 142

ప్ర. అ. శోణితోక్షితే=రక్తముచేత తడపబడిన, సృక్కిణీ=పెలువులను, జిహ్వయా=నాలుకతో, పరిలిహ్యన్తమ్=నాకుచున్నవాడు, వానరానీకమ్=వానరసేనను, మృద్నన్తమ్=మర్దించుచున్నవాడు, కాలాన్తకయమోపమమ్=ప్రళయకాలమందు సంహారముచేయు యమునితో సమానుడు అయిన (కుంభకర్ణుణ్ణి చూచెను).

తా. అతడు రక్తముతో తడిసిన పెదవులను నాలుకతో నాకుచుండెను. వానరసైన్యమును మర్దించుచుండెను. ప్రళయకాలమునందు జగత్సంహారము చేయుచున్న యముడు వలె ఉండెను. 142

మూ. తం దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం ప్రదీప్తానలవర్చసమ్,
విస్ఫారయామాస తదా కార్ముకం పురుషర్షభః. 143

ప్ర. అ. పురుషర్షభః=పురుషశ్రేష్ఠుడైన రాముడు, ప్రదీప్తానలతేజసమ్=ప్రజ్వలించుచున్న అగ్నివంటి తేజస్సుగల, తమ్=ఆ, రాక్షసశ్రేష్ఠమ్=రాక్షసశ్రేష్ఠుణ్ణి, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, కార్ముకమ్=ధనస్సును, విస్ఫారయామాస=చరచెను.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు ప్రజ్వలించుచున్న అగ్నివంటి కాంతి గల రాక్షసశ్రేష్ఠుడైన ఆ కుంభకర్ణుణ్ణి చూచి ధనస్సును చరచెను. 143

మూ. స తస్య చాపనిర్ఘోషాత్కుపితో రాక్షసర్షభః,
అమృష్యమాణస్తం ఘోషమభిదుద్రావ రాఘవమ్. 144

ప్ర. అ. తస్య=రామునియొక్క, చాపనిర్ఘోషాత్=ధనస్సుయొక్క ధ్వనివలన, కుపితః=కోపించిన, సః=ఆ, రాక్షసర్షభః=రాక్షసశ్రేష్ఠుడు, తం ఘోషమ్=ఆ ధ్వనిని, అమృష్యమాణః=సహించనివాడై, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. రాముని ధనుష్టంకారధ్వనిని వినగానే కోపించిన రాక్షసశ్రేష్ఠుడైన కుంభకర్ణుడు ఆ ఘోషమును సహించక రాముని మీదికి శీఘ్రముగా వెళ్లెను.

మూ. తతస్తు వాతోద్ధతమేఘకల్పం
భుజంగరాజోత్తమభోగబాహుమ్,
తమాపతన్తం ధరణీధరాభ
మువాచ రామో యుధి కుమ్భకర్ణమ్. 145

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, వాతోద్ధతమేఘకల్పమ్=వాయువుచేత ఎగురగొట్టబడిన మేఘముతో సమానుడు, భుజంగరాజోత్తమభోగబాహుమ్=ఆదిశేషుని ఉత్తమమైన శరీరమువంటి బాహువులు కలవాడు, ధరణీధరాభమ్=పర్వతమువంటి కాంతి గలవాడు అయిన, యుధి=యుద్ధమునందు, ఆపతన్తమ్=వచ్చిమీద పడుచున్న, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి గూర్చి, ఉవాచ=పలికెను.

తా. అప్పుడు వచ్చుచున్న ఆ కుంభకర్ణుడు గాలిచే ఎగురగొట్టబడిన

మేఘమువలె ఉండెను. అతని బాహువులు ఆదిశేషుని ఉత్తమమైన దేహము వలె ఉండెను. పర్వతము వలె ఉన్న అతనితో యుద్ధరంగమునందు రాము డిట్లనెను.

మూ. ఆగచ్ఛ రక్షోధిప మా విషాద
మవస్థితో ఽహం ప్రగృహీతచాపః,
అవేహి మాం రాక్షసవంశనాశనం
యస్త్వం ముహూర్తాద్భవితా విచేతాః. 146

ప్ర. అ. రక్షోధిప=రాక్షసనాయకా ! ఆగచ్ఛ=రమ్ము. విషాదమ్=విషాదమును, మా=పొందకుము. అహమ్=నేను, ప్రగృహీతచాపః=గ్రహింపబడిన ధనస్సు కలవాడనై, అవస్థితః=నిలచినాను. యః త్వమ్=ఏ నీవు, ముహూర్తాత్=క్షణకాలములో, విచేతాః=చైతన్యము లేనివాడవు, భవితా=కాగలవో అట్టి నీవు, మామ్=నన్ను, రాక్షసవంశనాశనమ్=రాక్షసవంశమును నశింపచేసేవానినిగా, అవేహి=తెలిసికొనుము.

తా. రాక్షసనాయకా ! రమ్ము. మరణించనున్నాను అని విషాదము పొందకుము. నేను ధనస్సు ధరించి నిలచినాను. నేను రాక్షసవంశమును నశింపచేయువాడ నని తెలిసికొనుము. ముహూర్తకాలములో నీవు ప్రాణములు విడువగలవు. 146

మూ. రామో ఽయమితి విజ్ఞాయ జహాస వికృతస్వనమ్,
అభ్యధావత సంక్రుద్ధో హరీన్విద్రావయన్ రణే. 147

ప్ర. అ. అయమ్=ఇతడు, రామః ఇతి=రాముడు అని, విజ్ఞాయ=తెలుసుకొని, వికృతస్వనమ్=వికృతమైన ధ్వని కలుగునట్లుగా, జహాస=నవ్వెను. క్రుద్ధః=కోపించినవాడై, రణే=యుద్ధమునందు, హరీన్=వానరులను, విద్రావయన్=భయపెట్టుచు, అభ్యధావత=ఎదురుగా పరుగెత్తెను.

తా. ఇతడు రాముడు అని తెలిసికొని ఆ కుంభకర్ణుడు వికృతధ్వనితో నవ్వి, కోపించినవాడై, యుద్ధమునందు వానరులను తరిమివేయుచు రామునకు ఎదురుగా వెళ్లెను. 147

మూ. దారయన్నివ సర్వేషాం హృదయాని వనౌకసామ్,
ప్రహస్య వికృతం భీమం స మేఘస్తనితోపమమ్, 148
కుమ్భకర్ణో మహాతేజా రాఘవం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు,

సర్వేషామ్=సమస్తమైన, వనౌకసామ్=వానరులయొక్క, హృదయాని=హృదయ
ములను, దారయన్నివ=చీల్చివేయుచున్నవాడు వలె, వికృతమ్=వికారముగాను,
భీమమ్=భయంకరముగాను, మేఘస్తనితోపమమ్=మేఘముయొక్క ఉరుముతో
సమానముగాను, ప్రహస్య=నవ్వి, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, వాక్యమ్=వాక్యమును,
అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ కుంభకర్ణుడు అందరు వానరుల గుండెలు
బ్రద్దలుకొట్టుచున్నాడా అన్నట్లు వికృతముగా, భయంకరముగా, మేఘధ్వనితో
సమానముగా అట్టహాసము చేసి రామునితో ఇట్లనెను. 148

మూ. నాహం విరాధో విజ్ఞేయో న కబన్ధః ఖరో న చ,
న వాలీ న చ మారీచః కుమ్భకర్ణః సమాగతః. 149

ప్ర. అ. అహమ్=నేను, విరాధః=విరాధుడనుగా, న విజ్ఞేయః=తెలి
యదగినవాడను కాను. కబన్ధః=కబంధుడుగా, న=తెలియదగినవాడనుగాను.
ఖరః=ఖరుడనుగా, న చ=తెలియదగినవాడనుగాను. వాలీ=వాలిగా, న=తెలియదగి
నవాడను కాను. మారీచః చ=మారీచుడుగా కూడ, న=తెలియదగినవాడను,
కాను. కుమ్భకర్ణః=కుంభకర్ణుడను, సమాగతః=వచ్చినాను.

తా. నేను విరాధుడ నని కాని, కబంధుడ నని గాని, ఖరుడ నని
కాని, వాలి యని కాని, మారీచుడ నని కాని అనుకొనకుము. వచ్చినవాడను
నేను కుంభకర్ణుడను. 149

మూ. పశ్య మే ముద్గరం భీమం సర్వకాలాయసం మహత్,
అనేన నిర్జితా దేవా దానవాశ్చ పురా మయా. 150

ప్ర. అ. మే=నాయొక్క, సర్వకాలాయసమ్=పూర్తిగా ఇనుముతో
చేసిన, భీమమ్=భయంకరమైన, మహత్=గొప్పదైన, ముద్గరమ్=ముద్గరమును,
పశ్య=చూడుము. అనేన=దీనిచేత, పురా=పూర్వము, దేవాః=దేవతలు,
దానవాశ్చ=దానవులు, నిర్జితాః=జయింపబడినారు.

తా. పూర్తిగా ఇనుముతో చేసిన భయంకరమైన పెద్దదైన నా
ముద్గరమును చూడుము. దీనితో పూర్వము నేను దేవతలను దానవులను
జయించితిని.

మూ. వికర్ణనాస ఇతి మాం నావజ్ఞాతుం త్వమర్హసి,
స్వల్పాపి హి న మే పీడా కర్ణనాసావినాశనాత్. 151

ప్ర. అ. వికర్ణనాసః ఇతి=పోయిన చెవులు ముక్కు కలవాడని, మామ్=నన్ను,

త్వమ్=నీవు, అవజ్ఞాతుమ్=అవమానించుటకు, న అర్హసి=తగవు. కర్ణనాసావినాశనాత్=చెవులూ ముక్కూ పోవుటవలన, మే=నాకు, స్వల్పాపి=స్వల్పమైనను, పీడా=పీడ, న హి=లేదుకదా !

తా. "ఇతనికి చెవులు ముక్కూ లేవు కదా" అని చిన్న చూపు చూడకుము. చెవులు ముక్కూ పోవుటవేత నాకు ఏ మాత్రము బాధ లేదు. 151

మూ. దర్శయేక్ష్వాకుశార్దూల వీర్యం గాత్రేషు మేఽనఘ,
తతస్త్వాం భక్షయిష్యామి దృష్టపౌరుషవిక్రమమ్. 152

ప్ర. అ. అనఘ=దోషములు లేని, ఇక్ష్వాకుశార్దూల=ఇక్ష్వాకువంశీయులలో శ్రేష్ఠుడా ! మే=నాయొక్క, గాత్రేషు=గాత్రములయందు, వీర్యమ్=నీ పరాక్రమమును, దర్శయ=చూపుము. తతః=అటు పిమ్మట, దృష్టపౌరుషవిక్రమమ్=చూడబడిన పౌరుషము పరాక్రమము గల, త్వామ్=నిన్ను, భక్షయిష్యామి=భక్షించెదను.

తా. దోషరహితుడవైన ఇక్ష్వాకువంశశ్రేష్ఠుడా ! నా అవయవములమీద నీ పరాక్రమమును చూపుము. నీ పౌరుషపరాక్రమములను చూచిన పిమ్మట నిన్ను భక్షించెదను. 152

మూ. స కుమ్భకర్ణస్య వచో నిశమ్య
రామః సుపుఙ్ఖాన్ విససర్జ బాణాన్,
తైరాహతో వజ్రసమప్రవేగై
ర్న చుక్షుభే న వ్యథతే సురారిః. 153

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, వచః=వచనమును, నిశమ్య=విని, సుపుఙ్ఖాన్=పొన్నులతో కూడిన, బాణాన్=బాణములను, విససర్జ=విడచెను. వజ్రసమప్రవేగైః=వజ్రముతో సమానమైన వేగము గల, తైః=వాటిచేత, ఆహతః=కొట్టబడిన, సురారిః=ఆ రాక్షసుడు, న చుక్షుభే=క్షోభ చెందలేదు. న వ్యథతే=వ్యథచెందలేదు.

తా. కుంభకర్ణుని మాటలు విని రాముడు పొన్నులు గల బాణములను ప్రయోగించెను. వజ్రాయుధముతో సమానమైన వేగము గల ఆ బాణములతో కొట్టినా కూడ ఆ రాక్షసుడు క్షోభ చెందలేదు. వ్యథ చెందలేదు. 153

మూ. యైః సాయకైః సాలవరా నికృత్తా
వాలీ హతో వానరపుఙ్గవశ్చ,

తే కుమ్భకర్ణస్య తదా శరీరం
వజ్రోపమం న వ్యథయాంప్రచక్రుః. 154

ప్ర. అ. యైః=ఏ, సాయకైః=బాణములచేత, సాలవరాః=శ్రేష్ఠములైన సాలవృక్షములు, నికృత్తాః=ఖండింపబడినవో, వానరపుంగవః=వానరశ్రేష్ఠుడైన, వాలీ చ=వాలి కూడ, హతః=చంపబడెనో, తే=ఆ బాణములు, తదా=అప్పుడు, వజ్రోపమమ్=వజ్రముతో సమానమైన, కుమ్భకర్ణస్య శరీరమ్=కుంభకర్ణుని శరీరమును, న వ్యథయాంప్రచక్రుః=బాధింపలేదు.

తా. ఏ బాణములు సాలవృక్షములను ఛేదించెనో, ఏ బాణములు వానరశ్రేష్ఠుడైన వాలిని చంపెనో ఆ బాణములు అప్పుడు వజ్రమువంటి కుంభకర్ణుని శరీరమునకు బాధ కల్గింపజాలకపోయెను. 154

మూ. స వారిధారా ఇవ సాయకాంస్తాన్
పిబన్ శరీరేణ మహేన్ద్రశత్రుః,
జఘాన రామస్య శరప్రవేగం
వ్యావిధ్య తం ముద్గరముగ్రవేగమ్. 155

ప్ర. అ. తాన్=ఆ, సాయకాన్=బాణములను, వారిధారాః ఇవ=జలధారలను వలె, శరీరేణ=శరీరముచేత, పిబన్=త్రాగివేయుచున్న, సః=ఆ, మహేన్ద్రశత్రుః=కుంభకర్ణుడు, ఉగ్రవేగమ్=ఉగ్రమైన వేగము గల, తమ్=ఆ, ముద్గరమ్=ముద్గరమును, వ్యావిధ్య=త్రిప్పి, రామస్య=రామునియొక్క, శరప్రవేగమ్=బాణముల వేగమును, జఘాన=కొట్టెను.

తా. కుంభకర్ణుడు ఆ బాణములను జలధారలను వలె దేహములో త్రాగుచు, భయంకరమైన వేగము గల ఆ ముద్గరమును త్రిప్పి రాముని బాణముల వేగమును అడ్డగించెను. 155

మూ. తతస్తు రక్షః క్షతజావలిప్తం
విత్రాసనం దేవమహాచమూనామ్,
వ్యావిధ్య తం ముద్గరముగ్రవేగం
విద్రావయామాస చమూం హరీణామ్. 156

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రక్షః=ఆ రాక్షసుడు, క్షతజావలిప్తమ్=రక్తముచేత పూయబడినది, దేవమహాచమూనామ్=దేవతలమహాసేనలను, విత్రాసనమ్=భయపెట్టునది, ఉగ్రవేగమ్=భయంకరమైన వేగము గలదీ అయిన, తం ముద్గరమ్=ఆ ముద్గరమును, వ్యావిధ్య=కొట్టి (త్రిప్పి), హరీణామ్=వానరులయొక్క, చమూమ్=సేనను, విద్రావయామాస=తరిమివేసెను.

తా. పిమ్మట ఆ కుంభకర్ణుడు రక్తముచేత పూయబడిన, దేవతల గొప్ప సైన్యములకు భయము కలిగించు, భయంకరమైన వేగము గల ముద్గరమును త్రిప్పుచు వానరుల సైన్యమును తరిమివేసెను. 156

మూ. వాయవ్యమాదాయ తతో మహాస్త్రం
రామః ప్రచిక్షేప నిశాచరాయ,
సముద్గరం తేన జహార బాహుం
స కృత్తబాహుస్తుములం ననాద. 157

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రామః=రాముడు, వాయవ్యమ్=వాయవ్యమను, మహాస్త్రమ్=గొప్ప అస్త్రమును, ఆదాయ=గ్రహించి, నిశాచరాయ=రాక్షసునికొరకు, ప్రచిక్షేప=విసిరెను. తేన=దానిచేత, సముద్గరమ్=ముద్గరముతో కూడిన, బాహుమ్=బాహువును, జహార=హరించెను. కృత్తబాహుః=ఛేదింపబడిన బాహువు గల, సః=అతడు, తుములమ్=వ్యాకులముగా, ననాద=ధ్వని చేసెను.

తా. పిమ్మట రాముడు వాయవ్యమను మహాస్త్రమును సంధించి ఆ రాక్షసునిపై ప్రయోగించెను. దానిచేత ముద్గరముతో కూడిన అతని హస్తమును ఖండించెను. బాహువు ఛేదింపబడగానే ఆ కుంభకర్ణుడు వ్యాకులముగా అరచెను.

మూ. స తస్య బాహుర్గిరిశృఙ్గకల్పః
సముద్గరో రాఘవబాణకృత్తః,
పపాత తస్మిన్ హరిరాజసైన్యే
జఘాన తాం వానరవాహినీం చ. 158

ప్ర. అ. గిరిశృఙ్గకల్పః=పర్వతశిఖరముతో సమానమైన, సముద్గరః=ముద్గరముతో కూడిన, రాఘవబాణకృత్తః=రాముని బాణముచేత ఖండింపబడిన, సః=ఆ, తస్య బాహుః=వాని బాహువు, తస్మిన్=ఆ, హరిరాజసైన్యే=వానరరాజసైన్యమునందు, పపాత=పడెను. తామ్=ఆ, హరివాహినీం చ=వానరసైన్యమును, జఘాన=చంపెను.

తా. పర్వతశిఖరముతో సమానమైన అతని బాహువు రాముని బాణముచేత ఛేదింపబడినదై ముద్గరముతో సహా ఆ సుగ్రీవుని సైన్యము మీద పడి ఆ వానరసైన్యమును చంపెను. 158

మూ. తే వానరా భగ్నహతావశేషాః
పర్యన్తమాశ్రిత్య తదా విషణ్ణాః,
ప్రపీడితాఙ్గా దదృశుః సుఘోరం
నరేన్ద్రరక్షోధిపసంనిపాతమ్. 159

ప్ర. అ. తదా=అప్పుడు, భగ్నహతావశేషాః=విరగగొట్టబడిన వారి కంటె చంపబడినవారి కంటె మిగిలిన, తే వానరాః=ఆ వానరులు, ప్రపీడితాఙ్గాః=పీడింపబడిన శరీరములు గలవారై, విషణ్ణాః=దిగులుచెందినవారై, పర్శ్వస్థమ్=ప్రాంతభాగమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, సుఘోరమ్=చాల భయంకరమైన, నరేన్ద్రరక్షోధిపసంనిపాతమ్=రాముని యొక్క కుంభకర్ణుని యొక్క యుద్ధమును, దదృశుః=చూచిరి.

తా. దేహములు విరిగిపోగా, చావగా మిగిలిన ఆ వానరులు, పీడింపబడిన శరీరములతో దిగులుచెంది ప్రక్కలయందు నిలబడి రామకుంభకర్ణుల ఆ భయంకరమైన యుద్ధమును చూచిరి. 159

మూ. స కుమ్భకర్ణో ఽస్త్రనికృత్తబాహు
ర్మహాసినికృత్తాగ్ర ఇవాచలేన్ద్రః,
ఉత్పాటయామాస కరేణ వృక్షం
తతో ఽభిదుద్రావ రణే నరేన్ద్రమ్. 160

ప్ర. అ. అస్త్రనికృత్తబాహుః=అస్త్రముచేత ఖండింపబడిన బాహువు గల, మహాసినా=పెద్ద కత్తిచేత, కృత్తాగ్రః=ఛేదింపబడిన శిఖరము గల, అచలేన్ద్రః ఇవ=మహాపర్వతము వలె ఉన్న, సః కుమ్భకర్ణః=ఆ కుంభకర్ణుడు, కరేణ=చేతితో, వృక్షమ్=వృక్షమును, ఉత్పాటయామాస=పెకలించెను. తతః=అటుపిమ్మట, రణే=యుద్ధమునందు, నరేన్ద్రమ్=నరుల ప్రభువైన రాముణ్ణి గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. అస్త్రముచే బాహువు ఖండింపబడగా, మహాఖడ్గముచేత శరీరమును ఖండించి వేసిన మహాపర్వతము వలె ఉన్న ఆ కుంభకర్ణుడు చేతితో వృక్షమును పెకలించి రాముని మీదికి పరుగెత్తెను. 160

మూ. స తస్య బాహుం సహ తాలవృక్షం
సముద్యతం పన్నగభోగకల్పమ్,
ఐన్ద్రాస్త్రయుక్తేన జఘాన రామో
బాణేన జామ్బూనదచిత్రితేన. 161

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, ఐన్ద్రాస్త్రయుక్తేన=ఐంద్రాస్త్రముతో కూడిన, జామ్బూనదచిత్రితేన=బంగారముచేత చిత్రింపబడిన, బాణేన=బాణముచేత, తస్య=వానియొక్క, పన్నగభోగకల్పమ్=సర్పశరీరముతో సమానమైన, సముద్యతమ్=ఎత్తబడిన, సతాలవృక్షమ్=తాలవృక్షముతో కూడిన, బాహుమ్=బాహువును, జఘాన=కొట్టెను.

తా. రాముడు బంగారముచేత చిత్రవర్ణమైన బాణముపై ఐంద్రాస్త్రమును సంధించి అతడు పైకి ఎత్తిన, సర్పశరీరమువలె ఉన్న బాహువును తాళవృక్షముతో సహా ఖండించెను. 161

మూ. స కుమ్భకర్ణస్య భుజో నికృత్తః
పపాత భూమౌ గిరిసంనికాశః,
విచేష్టమానో నిజఘాన వృక్షాన్
శైలాన్ శిలా వానరరాక్షసాంశ్చ. 162

ప్ర. అ. కుమ్భకర్ణస్య=కుంభకర్ణునియొక్క, గిరిసంనికాశః=పర్వతముతో సమానమైన, సః భుజః=ఆ భుజము, నికృత్తః=ఖండింపబడినదై, భూమౌ=నేలమీద, పపాత=పడెను. విచేష్టమానః=ఇటూ అటూ కొట్టుకొనుచు, వృక్షాన్=వృక్షములను, శైలాన్=పర్వతములను, శిలావానరరాక్షసాంశ్చ=శిలలను వానరులను రాక్షసులను, నిజఘాన=కొట్టెను.

తా. కుంభకర్ణుని ఆ పర్వతము వంటి భుజము ఖండింపబడి నేలపై పడెను. ఇటు అటు కొట్టుకొనుచు పర్వతములతోను, వృక్షములతోను, వానరులతోను, రాక్షసులతోను ఢీకొనెను. 162

మూ. తం ఛిన్నబాహుం సమవేక్ష్య రామః
సమాపతన్తం సహసా నదన్తమ్,
ద్వావర్ధచన్ద్రౌ నిశితౌ ప్రగృహ్య
చిచ్ఛేద పాదౌ యుధి రాక్షసస్య. 163

ప్ర. అ. రామః=రాముడు, ఛిన్నబాహుమ్=ఛేదింపబడిన బాహువులు గల, సహసా=శీఘ్రముగా, సమాపతన్తమ్=వచ్చి మీద పడుచున్న, తమ్=వానిని, సమవేక్ష్య=చూచి, యుధి=యుద్ధమునందు, ద్వౌ=రెండు, నిశితౌ=వాడియైన, అర్ధచన్ద్రౌ=అర్ధచంద్రబాణములను, ప్రగృహ్య=గ్రహించి, రాక్షసస్య=ఆ రాక్షసుని యొక్క, పాదౌ=పాదాలను, చిచ్ఛేద=ఛేదించెను.

తా. బాహువులు తెగిపోయిన పిమ్మట శీఘ్రముగా మీదికి వచ్చి పడుచున్న ఆ కుంభకర్ణుణ్ణి చూచి రాముడు వాడియైన రెండు అర్ధచంద్రబాణములతో అతని పాదములను ఛేదించెను. 163

మూ. తౌ తస్య పాదౌ ప్రదిశో దిశశ్చ
గిరేర్గుహాశ్చైవ మహార్ణవం చ,
లఙ్కాం చ సేనాం కపిరాక్షసానాం
వినాదయన్తౌ వినిపేతతుశ్చ. 164

ప్ర. అ. తస్య=వానియొక్క, తౌ=ఆ, పాదౌ=పాదములు, ప్రదిశః=విదిక్కులను, దిశశ్చ=దిక్కులను, గిరేః=పర్వతముయొక్క, గుహాశ్చైవ=గుహలను, మహార్ణవం చ=మహాసముద్రమును, లఙ్కాం చ=లంకను, కపిరాక్షసానామ్=వానరులయొక్క రాక్షసులయొక్క, సేనామ్=సేనను, వినాదయన్తౌ=ప్రతిధ్వనింప చేయుచు, వినిపేతతుశ్చ=పడినవి.

తా. ఆ కుంభకర్ణుని పాదములు దిక్కులను, విదిక్కులను, పర్వతగుహలను, సముద్రమును, లంకను, వానర-రాక్షస సైన్యములను ప్రతిధ్వనింపచేయుచు క్రింద పడినవి. 164

మూ. నికృత్తబాహుర్వినికృత్తపాదో
విదార్య వక్త్రం వడబాముఖాభమ్,
దుద్రావ రామం సహసాభిగర్జన్
రాహుర్యథా చన్ద్రమివాన్తరిక్షే. 165

ప్ర. అ. నికృత్తబాహుః=తెగగొట్టబడిన బాహువులు గలవాడు, వినికృత్తపాదః=తెగగొట్టబడిన పాదములు గలవాడు అయిన ఆ కుంభకర్ణుడు, వడబాముఖాభమ్=వడబాగ్ని ముఖము వంటి కాంతి గల, వక్త్రమ్=ముఖమును, విదార్య=చాపి, అభిగర్జన్=గర్జించుచు, అన్తరిక్షే=ఆకాశమునందు, రాహుః యథా=రాహువు, చన్ద్రమివ=చంద్రుణ్ణి వలె, సహసా=శీఘ్రముగా, రామమ్=రాముణ్ణి గూర్చి, దుద్రావ=పరుగెత్తెను.

తా. బాహువులు, పాదములు తెగిపోయిన ఆ కుంభకర్ణుడు వడబాగ్ని ముఖము వంటి ముఖమును తెరచి రాహువు ఆకాశమునందు చంద్రుని మీదికి వెళ్లినట్లు (తొడల సహాయముతో) రామునిమీదికి శీఘ్రముగా వెళ్లెను. 165

మూ. అపూరయత్తస్య ముఖం శితాగ్రై
రామః శరైర్హేమపినద్ధపుఙ్ఖైః,
స పూర్ణవక్త్రో న శశాక వక్తుం
చుకూజ కృచ్ఛ్రేణ ముమూర్ఛ చాపి. 166

ప్ర. అ. రామః=రాముడు, శితాగ్రైః=వాడియైన అగ్రభాగములు గల, హేమపినద్ధపుఙ్ఖైః=బంగారముతో కట్టబడిన పొన్నులు గల, శరైః=బాణములతో, తస్య=వానియొక్క, ముఖమ్=ముఖమును, అపూరయత్=నింపెను. సః=ఆతడు, పూర్ణవక్త్రః=బాణములతో నిండిన ముఖము గలవాడై, వక్తుమ్=మాటలాడుటకు, న శశాక=సమర్థుడు కాలేదు. కృచ్ఛ్రేణ=కష్టముచేత, చుకూజ=అరచెను. ముమూర్ఛ చాపి=మూర్ఛ కూడ పొందెను.

తా. రాముడు వాడియైన కొనలు గల బాణాలతో ఆతని ముఖమును ఛింపెను. ఆతడు ఛింపబడిన ముఖము కలవాడై మాటలాడలేకపోయెను. అతిక్షమముమీద అరచెను, మూర్ఛ చెందెను. 166

మూ. అథాదదే సూర్యమరీచికల్పం
స బ్రహ్మదణ్డాన్తకకాలకల్పమ్,
అరిష్టమైన్ద్రం నిశితం సుపుఙ్ఖం
రామః శరం మారుతతుల్యవేగమ్. 167

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సః రామః=ఆ రాముడు, సూర్యమరీచికల్పమ్=సూర్యుని కిరణములతో సమానము, బ్రహ్మదణ్డాన్తకకాలకల్పమ్=బ్రహ్మదండము తోను, మృత్యుదేవతతోను, యమునితోను సమానము, అరిష్టమ్=శత్రువులకు అశుభప్రదము, నిశితమ్=వాడియైనది, సుపుఙ్ఖమ్=మంచి పొన్ను గలది, మారుత తుల్యవేగమ్=గాలితో సమానమైన వేగము గలది, అయిన, ఐన్ద్రం శరమ్=ఇంద్రుని సంబంధమైన బాణమును, ఆదదే=గ్రహించెను.

తా. పిమ్మట రాముడు ఇంద్రునికి సంబంధించిన వాడియైన బాణమును గ్రహించెను. అది సూర్యకిరణము వలె ప్రకాశించుచుండెను. బ్రహ్మదండము వలె, మృత్యుదేవత వలె, యముడు వలె, భయంకరముగ ఉండెను. శత్రువులకు అమంగళకరమైన ఆ శరము వేగముచేత వాయువుతో సమానమై ఉండెను.167

మూ. తం వజ్రజామ్బూనదచారుపుఙ్ఖం
ప్రదీప్తసూర్యజ్వలనప్రకాశమ్,
మహేన్ద్రవజ్రాశనితుల్యవేగం
రామః ప్రచిక్షేప నిశాచరాయ. 168

ప్ర. అ. వజ్రజామ్బూనదచారుపుఙ్ఖమ్=వజ్రములచేతను, బంగారముచేతను అందమైన పొన్ను గలది, ప్రదీప్తసూర్యజ్వలనప్రకాశమ్=ప్రజ్వలించుచున్న సూర్యుని వంటి అగ్ని వంటి ప్రకాశము గలది, మహేన్ద్రవజ్రాశనితుల్యవేగమ్=మహేంద్రుని వజ్రముతోను పిడుగుతోను సమానమైన వేగము గలది అయిన, తమ్=ఆ బాణమును, రామః=రాముడు, నిశాచరాయ=రాక్షసునికొరకు, ప్రచిక్షేప=విసిరెను.

తా. వజ్రముతోను బంగారముతోను అందముగా ఉన్న పొన్ను గల ఆ బాణము ప్రజ్వలించుచున్న సూర్యునితోను అగ్నితోను సమానమైన ప్రకాశముతో మహేంద్రుని వజ్రమువంటి, పిడుగువంటి వేగము కలదై ఉండెను. అట్టి బాణమును రాముడు ఆ రాక్షసునిపై ప్రయోగించెను. 168

మూ. స సాయకో రాఘవబాహుచోదితో
దిశః స్వభాసా దశ సంప్రకాశయన్,
విధూమవైశ్వానరభీమదర్శనో
జగామ శక్రాశనిభీమవిక్రమః. 169

ప్ర. అ. రాఘవబాహుచోదితః=రాముని బాణముచేత ప్రేరేపింపబడిన, విధూమవైశ్వానరభీమదర్శనః=ధూమములేని అగ్ని వలె భయంకరమైన దర్శనము గల, శక్రాశనిభీమవిక్రమః=ఇంద్రుని వజ్రమువంటి భయంకరమైన శక్తి గల, సః సాయకః=ఆ బాణము, స్వభాసా=తన తేజస్సుచేత, దశ=పది, దిశః=దిక్కులను, సంప్రకాశయన్=ప్రకాశింపచేయుచు, జగామ=వెళ్లెను.

తా. ధూమము లేని అగ్ని వలె చూచుటకు భయంకరముగా ఉన్న, ఇంద్రుని వజ్రాయుధము వంటి భయంకరమైన శక్తి గల ఆ బాణము రాముని బాహువులచేత విడువబడినదై, తన కాంతిచేత పదిదిక్కులను ప్రకాశింపచేయుచు వెళ్లెను. 169

మూ. స తన్మహాపర్వతకూటసంనిభం
సువృత్తదంష్ట్రం చలచారుకుణ్డలమ్,
చకర్త రక్షోధిపతేః శిరస్తదా
యథైవ వృత్రస్య పురా పురందరః. 170

ప్ర. అ. సః=ఆ రాముడు, మహాపర్వతకూటసంనిభమ్=మహాపర్వత శిఖరముతో సమానము, సువృత్తదంష్ట్రమ్=బాగా గుండ్రముగా తిరిగిన కోరలు గలది, చలచారుకుణ్డలమ్=కదలుచున్న అందమైన కుండలములు కలది అయిన, రక్షోధిపతేః=కుంభకర్ణునియొక్క, శిరః=శిరస్సును, తదా=అప్పుడు, పురా=పూర్వము, పురందరః=దేవేంద్రుడు, వృత్రస్య=వృత్రునియొక్క శిరస్సును, యథైవ=ఎట్లో అట్లు, చకర్త=ఖండించెను.

తా. పూర్వము దేవేంద్రుడు వృత్రుని శిరస్సును ఖండించి నట్లు రాముడు ఆ రాక్షసనాయకుడైన కుంభకర్ణుని పర్వతశిఖరమువంటిది, బాగా గుండ్రముగా తిరిగిన కోరలు గలది, కదలుచున్న అందమైన కుండలములు గలదీ అయిన శిరస్సును ఖండించెను. 170

మూ. కుమ్భకర్ణశిరో భాతి కుణ్డలాలంకృతం మహత్,
ఆదిత్యేఽభ్యుదితే రాత్రౌ మధ్యస్థ ఇవ చన్ద్రమాః. 171

ప్ర. అ. కుణ్డలాలంకృతమ్=కుండలములచేత అలంకరింపబడిన, మహత్=గొప్పదైన, కుమ్భకర్ణశిరః=కుంభకర్ణుని శిరస్సు, రాత్రౌ=రాత్రియందు,

అదిత్యై=అదితిదేవతగా గల నక్షత్రద్వయాత్మకమైన పునర్వసునక్షత్రము, ఉదితే=ఉదయించిన దగుచుండగా, మధ్యస్థః=మధ్యయందున్న, చన్ద్రమాః ఇవ=చంద్రుడు వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. కుండలములచేత అలంకరింపబడిన పెద్దదైన ఆ కుంభకర్ణుని శిరస్సు రాత్రి ఉదయించిన పునర్వసునక్షత్రము ("పునర్వసు"లో రెండు నక్షత్రములుండును) మధ్య నున్న చంద్రుడు వలె ప్రకాశించుచుండెను. 171

మూ. తద్రామబాణాభిహతం పపాత
రక్షఃశిరః పర్వతసన్నికాశమ్,
బభఞ్జ చర్యాగృహగోపురాణి
ప్రాకారముచ్చం తమపాతయచ్చ. 172

ప్ర. అ. రామబాణాభిహతమ్=రాముని బాణముచేత కొట్టబడిన, తత్=ఆ, పర్వతసంనికాశమ్=పర్వతముతో సమానమైన, రక్షఃశిరః=రాక్షసుని శిరస్సు, పపాత=పడెను. చర్యాగృహగోపురాణి=మార్గమునందలి గోపురములను, బభఞ్జ=విరచెను. ఉచ్చమ్=ఉన్నతమైన, తమ్=ఆ, ప్రాకారమ్=ప్రాకారమును, అపాతయచ్చ=పడగొట్టెను కూడ.

తా. పర్వతమువంటి ఆ కుంభకర్ణుని శిరస్సు రాముని బాణముచేత కొట్టబడినదై, క్రిందపడెను. మార్గమునందలి గృహములు గోపురములను విరుగగొట్టెను. ఉన్నతమైన ఆ ప్రాకారమును కూడ పడగొట్టెను. 172

మూ. తచ్చాతికాయం హి మహత్ప్రకాశం
రక్షస్తదా తోయనిధౌ పపాత,
గ్రాహాన్ పరాన్ మీనవరాన్ భుజంగాన్
మమర్ద భూమిం చ తథా వివేశ. 173

ప్ర. అ. తదా=అప్పుడు, అతికాయమ్=పెద్ద దేహము గల, మహత్ప్రకాశమ్=గొప్ప ప్రకాశము గల, తత్=ఆ, రక్షః=రాక్షసుడు, తోయనిధౌ=సముద్రమునందు, పపాత=పడెను. పరాన్=పెద్దవైన, గ్రాహాన్=మొసళ్లను, మీనవరాన్=శ్రేష్ఠములైన మీనములను, భుజంగమాన్=సర్పములను, మమర్ద=మర్దించెను. తథా=మరియు, భూమిమ్=భూమిని, వివేశ=ప్రవేశించెను.

తా. అప్పుడు పెద్ద దేహము, గొప్ప ప్రకాశము గల రాక్షసుడు సముద్రములో పడి, పెద్దవైన మొసళ్లను, శ్రేష్ఠములైన చేపలను, సర్పములను మర్దించుచు క్రిందికి భూమిలోనికి దిగిపోయెను. 173

మూ. తస్మిన్ హతే బ్రాహ్మణదేవశత్రౌ
మహాబలే సంయతి కుమ్భకర్ణే,
చచాల భూర్భూమిధరాశ్చ సర్వే
హర్షాచ్చ దేవాస్తుములం వినేదుః. 174

ప్ర. అ. బ్రాహ్మణదేవశత్రౌ=బ్రాహ్మణులకు దేవతలకు శత్రువైన, మహాబలే=గొప్ప బలము గల, తస్మిన్=ఆ, కుమ్భకర్ణే=కుంభకర్ణుడు, సంయతి=యుద్ధమునందు, హతే=చంపబడినవాడగుచుండగా, భూః=భూమి, చచాల=చలించెను. సర్వే=సమస్తమైన, భూమిధరాశ్చ=పర్వతములు కూడ చలించినవి. దేవాః చ=దేవతలు కూడ, హర్షాత్=సంతోషమువలన, తుములమ్=వ్యాకులముగా, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. బ్రాహ్మణులకు, దేవతలకు శత్రువైన, గొప్ప బలము గల ఆ కుంభకర్ణుడు యుద్ధమునందు చంపబడగా, భూమి, అన్ని పర్వతములూ కూడ చలించినవి. దేవతలు ఆనందముతో అధికముగా ధ్వని చేసిరి. 174

మూ. తతస్తు దేవర్షిమహర్షిపన్నగాః
సురాశ్చ భూతాని సుపర్ణగుహ్యకాః,
సయక్షగన్ధర్వగణా నభోగతాః
ప్రహర్షితా రామపరాక్రమేణ. 175

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దేవర్షిమహర్షిపన్నగాః=దేవర్షులు, మహర్షులు పన్నగులు, సురాశ్చ=దేవతలు, భూతాని=భూతములు, సుపర్ణగుహ్యకాః=సుపర్ణులు గుహ్యకులు, సయక్షగన్ధర్వగణాః=యక్షగంధర్వగణములతో కూడినవారై, నభోగతాః=ఆకాశమును పొందినవారై, రామపరాక్రమేణ=రాముని పరాక్రమముచేత, సంతోషితాః=సంతోషింప చేయబడిరి.

తా. అప్పుడు దేవర్షులు, మహర్షులు, పన్నగులు, దేవతలు, ఇతర భూతములు, సుపర్ణులు, గుహ్యకులు, యక్షులు, గంధర్వులు ఆకాశముమీద చేరి రాముని పరాక్రమముచేత మిక్కిలి సంతోషించిరి. 175

మూ. తతస్తు తే తస్య వధేన భూరిణా
మనస్వినో నైరృతరాజబాన్ధవాః,
వినేదురుచ్చైర్వ్యథితా రఘూత్తమం
హరిం సమీక్ష్యైవ యథా మతఙ్గజాః. 176

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నైరృతరాజబాన్ధవాః=రావణుని బంధువులు,

ధూరిణా=గొప్పదైన, మనస్వినః=ఉత్తమమైన మనస్సుగల, తస్య వధేన=వాని యొక్క వధ చేత, వ్యథితాః=వ్యథ చెందినవారై, హరిమ్=సింహమును, సమీక్ష్యైవ=చూడగానే, మత్తగజాః యథా=ఏనుగుల వలె, రఘూత్తమమ్=రాముణ్ణి చూచి, ఉచ్చైః=బిగ్గరగా, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. ఉత్తమమైన మనస్సుగల ఆ కుంభకర్ణుని ఆశ్చర్యకరమైన సంహారము చేత, రావణుని బంధువులు దుఃఖితులై, సింహమును చూచి ఏనుగులు అరచినట్లు రాముణ్ణి చూచి బిగ్గరగా అరచిరి. 176

మూ. స దేవలోకస్య తమో నిహత్య
సూర్యో యథా రాహుముఖాద్విముక్తః,
తథా వ్యభాసీద్ధరిసైన్యమధ్యే
నిహత్య రామో యుధి కుమ్భకర్ణమ్. 177

ప్ర. అ. సః రామః=ఆ రాముడు, యుధి=యుద్ధమునందు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, నిహత్య=చంపి, రాహుముఖాత్=రాహువుయొక్క ముఖము నుండి, విముక్తః=విడువబడిన, సూర్యః=సూర్యుడు, తమః=చీకటిని, నిహత్య=తొలగించి, దేవలోకస్య=దేవలోకముయొక్క మధ్యయందు, యథా=ఎట్లో, తథా=అట్లు, హరిసైన్యమధ్యే=వానరసైన్యమధ్యయందు, వ్యభాసీత్=ప్రకాశించెను.

తా. రాముడు కుంభకర్ణుని సంహరించి, రాహుముఖమునుండి విముక్తుడైన సూర్యుడు చీకటిని తొలగించి ఆకాశమధ్యయందు ప్రకాశించినట్లు వానరసైన్యము మధ్య ప్రకాశించెను. 177

మూ. ప్రహర్షమీయుర్బహవస్తు వానరాః
ప్రబుద్ధపద్మప్రతిమైరివాననైః,
అపూజయన్ రాఘవమిష్టభాగినం
హతే రిపౌ భీమబలే దురాసదమ్. 178

ప్ర. అ. బహవః=అనేకులైన, వానరాః=వానరులు, ప్రబుద్ధపద్మప్రతిమైః ఇవ=వికసించిన పద్మములతో సమానములైన, ఆననైః=ముఖములతో, ప్రహర్షమ్=అధికమైన సంతోషమును, ఈయుః=పొందిరి. భీమబలే=భయంకరమైన బలము గల, రిపౌ=శత్రువు, హతే=చంపబడిన వాడగుచుండగా, ఇష్టభాగినమ్=ఇష్టమును పొందిన, దురాసదమ్=ఎదిరింప శక్యము కాని, రాఘవమ్=రాముణ్ణి, అపూజయన్=పూజించిరి.

తా. వానరు లందరు వికసించిన పద్మములతో సమానములైన ముఖములతో సంతోషము పొందిరి. భయంకరమైన బలము గల శత్రువును

చంపిన, ఎదిరింప శక్యము కాని ఆ రాముణ్ణి పూజించిరి. 178

మూ. స కుమ్భకర్ణం సురసైన్యమర్దనమ్
మహత్సు యుద్ధేషు కదాచనాజితమ్,
ననన్ద హత్వా భరతాగ్రజో రణే
మహాసురం వృత్రమివామరాధిపః. 179

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. సః=ఆ, భరతాగ్రజః=రాముడు, సురసైన్యమర్దనమ్=దేవతాసైన్యమును పీడించినవాడు, మహత్సు=గొప్పవైన, యుద్ధేషు=యుద్ధములయందు, కదాచన=ఎన్నడూ, అజితమ్=జయించబడనివాడు అయిన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, అమరాధిపః=దేవేంద్రుడు, మహాసురమ్=గొప్ప అసురుడైన, వృత్రమ్ ఇవ=వృత్రుణ్ణి వలె, రణే=యుద్ధమునందు, హత్వా=చంపి, ననన్ద=సంతోషించెను.

తా. సురసైన్యములను పీడించినవాడు, మహాయుద్ధములలో కూడ ఎన్నడూ జయింపబడనివాడు అయిన కుంభకర్ణుణ్ణి యుద్ధమునందు చంపి, రాముడు, మహాసురుడైన వృత్రుణ్ణి చంపిన దేవేంద్రుడు వలె సంతోషించెను. (లేదా దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి చంపినట్లు కుంభకర్ణుణ్ణి చంపి రాముడు సంతోషించెను). 179

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరవైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టషష్టితమః సర్గః

*[కుంభకర్ణవధ విని రావణుడు విలపించుట.]*

మూ. కుమ్భకర్ణం హతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా,
రాక్షసా రాక్షసేన్ద్రాయ రావణాయ న్యవేదయన్. 1

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుని, హతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, రాక్షసాః=రాక్షసులు, రాక్షసేన్ద్రాయ=రాక్షసరాజైన, రావణాయ=రావణునకు, న్యవేదయన్=తెలిపిరి.

తా. మహాత్ముడైన రాముడు కుంభకర్ణుని చంపివేసి నట్లు చూచి రాక్షసులు ఆ విషయమును రాక్షసరాజైన రావణునకు తెలిపిరి. 1

మూ. రాజన్ స కాలసంకాశః సంయుక్తః కాలకర్మణా,
విద్రావ్య వానరీం సేనాం భక్షయిత్వా చ వానరాన్. 2

ప్ర. అ. రాజన్=రాజా ! కాలసంకాశః=యమునితో సమానుడైన, సః=ఆ కుంభకర్ణుడు, వానరీమ్=వానరుల సంబంధమైన, సేనామ్=సేనను, విద్రావ్య=తరిమివేసి, వానరాన్=వానరులను, భక్షయిత్వా=భక్షించి, కాలకర్మణా=కాలమునకు పరిపక్వమైన కర్మతో, సంయుక్తః=కూడినాడు.

తా. రాజా ! యమునితో సమానుడైన కుంభకర్ణుడు వానరసేనను తరిమివేసి, కొందరు వానరులను భక్షించి, కాలమునకు కర్మ పరిపక్వ మగుటచేత మరణించినాడు. 2

మూ. ప్రతపిత్వా ముహూర్తం తు ప్రశాన్తో రామతేజసా,
కాయేనార్ధప్రవిష్టేన సముద్రం భీమదర్శనమ్. 3
నికృత్తనాసాకర్ణేన విక్షరద్రుధిరేణ చ,
రుద్ధ్వా ద్వారం శరీరేణ లఙ్కాయాః పర్వతోపమః. 4
కుమ్భకర్ణస్తవ భ్రాతా కాకుత్స్థశరపీడితః,
అగణ్డభూతో వికృతో దావదగ్ధ ఇవ ద్రుమః. 5

ప్ర. అ. తవ=నీయొక్క, భ్రాతా=సోదరుడైన, కుమ్భకర్ణః=కుమ్భకర్ణుడు, ముహూర్తమ్=ముహూర్తకాలము, ప్రతపిత్వా=పరాక్రమము చూపి, రామతేజసా=రాముని తేజస్సుచేత, ప్రశాన్తః=శాంతించినాడు. పర్వతోపమః=పర్వతముతో సమానుడైన కుంభకర్ణుడు, కాకుత్స్థశరపీడితః=రాముని శరములచేత

పీడింపబడినవాడై, అర్ధప్రవిష్టేన=సగము ప్రవేశించిన, కాయేన=దేహముచేత, భీమదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, సముద్రమ్=సముద్రమును, వికృత్త నాసాకర్ణేన=ఛేదింపబడిన ముక్కు, చెవులు గల, విక్షరద్రుధిరేణ చ=స్రవించుచున్న రక్తము గల, శరీరేణ=శరీరముచేత (తలచేత), లఙ్కాయాః=లంకయొక్క, ద్వారమ్=ద్వారమును, రుద్ధ్వా=అడ్డుకొని, దావదగ్ధః=దావాగ్నిచేత కాల్చబడిన, ద్రుమః ఇవ=వృక్షము వలె, వికృతః=వికారముగా నున్నవాడై, అగణ్డభూతః=ముద్దగా అయిపోయినవాడు.

తా. ఏ సోదరుడైన కుంభకర్ణుడు ముహూర్తకాలము ప్రతాపము చూపించి, రాముని తేజస్సుచేత శాంతించినాడు. రాముని బాణాలచేత పీడింపబడి చూచుటకు భయంకరముగా ఉండు సముద్రమును సగము ప్రవేశించిన మొండెముచేతను, లంకాద్వారమును ముక్కు చెవులు ఖండించుటచే రక్తము స్రవించుచున్న తలచేతను నిరోధించుచు దావాగ్నికి కాలిన చెట్టువలె వికృతమైన ఆకారముతో ఒక ముద్ద వలె అయినాడు.

వి. ఈ నాలుగు శ్లోకాల (2-5) సమన్వయం సరిగా కుదురుట లేదు. ఇవి ప్రాచ్యపాఠంలో లేవు. 3,4,5

మూ. శ్రుత్వా వినిహతం సంఖ్యే కుమ్భకర్ణం మహాబలమ్,
రావణః శోకసంతప్తో ముమోహ చ పపాత చ. 6

ప్ర. అ. రావణః=రావణుడు, సంఖ్యే=యుద్ధమునందు, మహాబలమ్=గొప్పబలము గల, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, వినిహతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, శోకసంతప్తః=శోకముచేత తపింపచేయబడినవాడై, ముమోహ చ=మోహము చెందెను; పపాత చ=పడిపోయెను కూడ.

తా. గొప్ప బలము గల కుంభకర్ణుడు యుద్ధమునందు చంపబడినాడని విని రావణుడు దుఃఖసంతప్తుడై మూర్ఛ చెంది నేలపై పడిపోయెను. 6

మూ. పితృవ్యం నిహతం శ్రుత్వా దేవాన్తకనరాన్తకౌ,
త్రిశిరాశ్చాతికాయశ్చ రురుదుః శోకపీడితాః. 7

ప్ర. అ. పితృవ్యమ్=పినతండ్రిని, నిహతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, దేవాన్తకనరాన్తకౌ=దేవాంతకనరాంతకులు, త్రిశిరాః=త్రిశిరస్సు, అతికాయశ్చ=అతికాయుడు, శోకపీడితాః=శోకముచేత పీడింపబడినవారై, రురుదుః=ఏడ్చిరి.

తా. పినతండ్రి మరణించినట్లు విని దేవాంతకనరాంతకులు, త్రిశిరస్సు, అతికాయుడు దుఃఖముచేత పీడితులై ఏడ్చిరి. 7

మూ. భ్రాతరం నిహతం శ్రుత్వా రామేణాక్లిష్టకర్మణా,
మహోదరమహాపార్శ్వౌ శోకాక్రాన్తౌ బభూవతుః. 8

ప్ర. అ. అక్లిష్టకర్మణా=శ్రమలేని పనులు గల, రామేణ=రామునిచేత, భ్రాతరమ్=సోదరుణ్ణి, నిహతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, మహోదర మహాపార్శ్వౌ= మహోదరమహాపార్శ్వులు, శోకాక్రాన్తౌ=దుఃఖాక్రాంతులు, బభూవతుః=అయిరి.

తా. శ్రమపడకుండా కార్యములు సాధించు రామునిచేత సోదరుడైన కుంభకర్ణుడు చంపబడి నట్లు విని అతని సవతితల్లి పుత్రులైన మహోదరమహాపార్శ్వులు దుఃఖాక్రాంతులైరి. 8

మూ. తతః కృచ్ఛ్రాత్సమాసాద్య సంజ్ఞాం రాక్షసపుంగవః,
కుమ్భకర్ణవధాద్దీనో విలలాపాకులేన్ద్రియః. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడు, కృచ్ఛ్రాత్=కష్టమువలన, సంజ్ఞామ్=సంజ్ఞను, సమాసాద్య=పొంది, కుమ్భకర్ణ వధాత్=కుంభకర్ణుని వధ వలన, దీనః=దీనుడై, ఆకులేన్ద్రియః=వ్యాకులమైన ఇంద్రియములు గలవాడై, విలలాప=విలపించెను.

తా. పిమ్మట, రావణుడు అతికష్టము మీద సంజ్ఞ పొంది, కుంభకర్ణుని వధవలన దీనుడై, వ్యాకులమైన ఇంద్రియములు కలవాడై విలపించెను. 9

మూ. హా వీర రిపుదర్పఘ్న కుమ్భకర్ణ మహాబల,
త్వం మాం విహాయ వై దైవాద్యాతోఽసి యమసాదనమ్. 10

ప్ర. అ. హా=అయ్యో! వీర=వీరుడా! రిపుదర్పఘ్న=శత్రువుల దర్పమును పోగొట్టినవాడా! మహాబల=గొప్ప బలము గలవాడా! కుమ్భకర్ణ=కుంభకర్ణుడా! త్వమ్=నీవు, మామ్=నన్ను, విహాయ=విడచి, దైవాత్=దైవమువలన, యమసాదనమ్=యమలోకమును గూర్చి, యాతః అసి=వెళ్లినావు.

తా. అయ్యో! వీరుడా! శత్రువుల గర్వమును అణచేవాడా! గొప్ప బలము గలవాడా! కుంభకర్ణా! నీవు నన్ను విడచి, దైవయోగముచేత, యమలోకమునకు వెళ్లిపోతివి! 10

మూ. మమ శల్యమనుద్ధృత్య బాన్ధవానాం మహాబల,
శత్రుసైన్యం ప్రతాప్యైకః త్వ మాం సంత్యజ్య గచ్ఛసి. 11

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా! మమ=నాయొక్క, బాన్ధవానామ్=బంధువులయొక్క, శల్యమ్=శోకశల్యమును, అనుద్ధృత్య=పెకిలించక

కుండగా, శత్రుసైన్యమ్=శత్రుసైన్యమును, ప్రబాధ్య=పీడించి, ఏకః=ఒక్కడవే, మామ్=నన్ను, సంత్యజ్య=విడచి, క్వ=ఎక్కడికి, గచ్ఛసి=వెళ్లుచున్నావు ?

తా. గొప్ప బలము గలవాడా ! నీవు నా మనస్సులోను బంధువుల మనస్సులోను ఉన్న దుఃఖశల్యమును తొలగించకుండగానే శత్రుసైన్యమును పీడించి, నన్ను విడచి ఒంటరిగా ఎక్కడికి పోవుచున్నావు ? 11

మూ. ఇదానీం ఖల్వహం నాస్మి యస్య మే దక్షిణో భుజః,
పతితో యం సమాశ్రిత్య న బిభేమి సురాసురాన్. 12

ప్ర. అ. యస్య మే=ఏ నాయొక్క, దక్షిణః భుజః=కుడి భుజము, పతితః=పడి పోయినదో, యమ్=దేనిని, సమాశ్రిత్య=ఆశ్రయించి, సురాసురాన్=సురాసురుల నుండి, న బిభేమి=భయపడనో, అహమ్=అట్టి నేను, ఇదానీమ్=ఇప్పుడు, నాస్మి ఖలు=లేను కదా !

తా. నేను దేనిని ఆశ్రయించుకొని సురాసురులనుండి భయపడుటలేదో అట్టి నా కుడి భుజము పడిపోయినది. అందుచేత నేను కూడా లేనట్లే. 12

మూ. కథమేవంవిధో వీరో దేవదానవదర్పహా,
కాలాగ్నిప్రతిమో హ్యద్య రాఘవేణ రణే హతః. 13

ప్ర. అ. దేవదానవదర్పహా=దేవదానవుల దర్పమును తొలగించినవాడు, కాలాగ్నిప్రతిమః=ప్రళయకాలాగ్నితో సమానుడూ అయిన, ఏవం విధః=ఇట్టి, వీరః=వీరుడు, అద్య=నేడు, రణే=యుద్ధమునందు, రాఘవేణ=రామునిచేత, కథమ్=ఎట్లు, హతః=చంపబడినాడు ?

తా. దేవదానవుల గర్వమును హరించినవాడు, ప్రళయకాలాగ్ని వంటివాడు అయిన ఇట్టి వీరుణ్ణి ఈనాడు యుద్ధములో రాముడు ఎట్లు చంపగలిగినాడో కదా ! 13

మూ. యస్య తే వజ్రనిష్పేషో న కుర్యాద్వ్యసనం సదా,
స కథం రామబాణార్తః ప్రసుప్తోఽసి మహీతలే. 14

ప్ర. అ. యస్య=ఏ, తే=నీకు, వజ్రనిష్పేషః=వజ్రముచేత నలగకొట్టుట, సదా=ఎల్లప్పుడూ (ఎన్నడూ), వ్యసనమ్=వ్యసనమును, న కుర్యాత్=చేయదో, సః=అట్టి నీవు, రామబాణార్తః=రాముని బాణములచేత పీడితుడవై, మహీతలే=నేలమీద, కథమ్=ఎట్లు, ప్రసుప్తః అసి=నిద్రించితివి.

తా. వజ్రప్రహారము కూడ ఎన్నడూ నీకు దుఃఖము కలిగించేదికాదు కదా; అట్టి నీవు రాముని బాణాలచేత పీడితుడవై నేలమీద ఎట్లు శయనించినావు? 14

మూ. ఏతే దేవగణాః సార్ధమృషిభిర్గగనే స్థితాః,
నిహతం త్వాం రణే దృష్ట్వా నినదన్తి ప్రహర్షితాః. 15

ప్ర. అ. ఏతే=ఈ, దేవగణాః=దేవగణములు, ఋషిభిః సార్ధమ్=ఋషులతో కూడ, గగనే=ఆకాశమునందు, స్థితాః=ఉన్నవారై, రణే=యుద్ధమునందు, నిహతమ్=చంపబడిన, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, ప్రహర్షితాః=సంతోషించుచున్నవారై, నినదన్తి=ధ్వనిచేయుచున్నారు.

తా. ఈ దేవతలు, ఋషులు ఆకాశమునందు నిలచి, యుద్ధములో చంపబడిన నిన్ను చూచి చాల సంతోషించుచు ధ్వని చేయుచున్నారు. 15

మూ. ధ్రువమద్యైవ సంహృష్టా లబ్ధలక్షాః ప్లవంగమాః,
ఆరోక్ష్యన్తీహ దుర్గాణి లఙ్కాద్వారాణి సర్వశః. 16

ప్ర. అ. లబ్ధలక్షాః=పొందబడిన లక్ష్యము గల, ప్లవంగమాః=వానరులు, సంహృష్టాః=సంతోషించినవారై, అద్యైవ=ఇప్పుడే, సర్వశః=నలువైపులనుండి, ఇహ=ఇక్కడ, దుర్గాణి=ప్రవేశింప శక్యము కాని, లఙ్కాద్వారాణి=లంకాద్వారములను, ఆరోక్ష్యన్తి=ఎక్కగలరు; ధ్రువమ్=నిశ్చయము.

తా. వానరులు తమ లక్ష్యమును సాధించుటచే సంతోషించుచు ఇప్పుడే, ప్రవేశింప శక్యము కాని లంకాద్వారములమీదికి, అన్ని వైపులనుండి ఎక్కగలరు.

మూ. రాజ్యేన నాస్తి మే కార్యం కిం కరిష్యామి సీతయా,
కుమ్భకర్ణవిహీనస్య జీవితే నాస్తి మే మతిః. 17

ప్ర. అ. మే=నాకు, రాజ్యేన=రాజ్యముచేత, కార్యమ్=పని, నాస్తి=లేదు. సీతయా=సీతతో, కిం కరిష్యామి=ఏమి చేయుదును ? కుమ్భకర్ణవిహీనస్య=కుంభకర్ణునితో లేనివాడనైన, మే=నాకు, జీవితే=జీవితమునందు, మతిః=బుద్ధి, నాస్తి=లేదు.

తా. నాకు రాజ్యములో పనిలేదు. సీతవలన ఏమి ప్రయోజనము ? కుంభకర్ణుడు లేని నాకు జీవితమునందు కూడ ఆసక్తి లేదు. 17

మూ. యద్యహం భ్రాతృహన్తారం న హన్మి యుధి రాఘవమ్,
నను మే మరణం శ్రేయో న చేదం వ్యర్థజీవితమ్. 18

ప్ర. అ. అహమ్=నేను, భ్రాతృహన్తారమ్=నా సోదరుని చంపిన, రాఘవమ్=రాముణ్ణి, యుధి=యుద్ధమునందు, న హన్మి యది=చంపకపోయినట్లయితే, మే=నాకు, మరణమ్=మరణము, శ్రేయః నను=శ్రేయస్కరము కదా ? ఇదమ్=ఈ, వ్యర్థజీవితమ్=వ్యర్థమైన జీవితము, న=శ్రేయస్కరము కాదు.

తా. ఆ సోదరుణ్ణి చంపిన రాముణ్ణి నేను యుద్ధములో చంపకపోయినచో నాకు మరణమే మంచిది కాని వ్యర్థముగా జీవించి ఉండుట మంచిది కాదు.

మూ. అద్యైవ తం గమిష్యామి దేశం యత్రానుజో మమ,
న హి భ్రాతౄన్ సముత్సృజ్య క్షణం జీవితుముత్సహే. 19

ప్ర. అ. మమ=నాయొక్క, అనుజః=తమ్ముడు, యత్ర=ఎక్కడున్నాడో, తం దేశమ్=ఆ దేశమును గూర్చి, అద్యైవ=ఇప్పుడే, గమిష్యామి=వెళ్లెదను. భ్రాతౄన్= సోదరులను, సముత్సృజ్య=విడిచి, క్షణమ్=క్షణకాలమైనా, జీవితుమ్=జీవించుటకు, న ఉత్సహే=ఇచ్ఛయించను.

తా. నా తమ్ముడున్న ప్రదేశమునకు ఇప్పుడే వెళ్ళెదను. సోదరులను విడచి క్షణకాలమైనా జీవించుటకు కోరను. 19

మూ. దేవా హి మాం హసిష్యన్తి దృష్ట్వా పూర్వాపకారిణమ్,
కథమిన్ద్రం జయిష్యామి కుమ్భకర్ణ హతే త్వయి. 20

ప్ర. అ. పూర్వాపకారిణమ్=పూర్వము అపకారము చేసిన, మామ్=నన్ను, దృష్ట్వా=చూచి, దేవాః=దేవతలు, హసిష్యన్తి హి=నవ్వగలరు కదా! కుమ్భకర్ణ=కుంభకర్ణా ! త్వయి=నీవు, హతే=చంపబడినవాడ వగుచుండగా, ఇన్ద్రమ్=ఇంద్రుణ్ణి, కథమ్=ఎట్లు, జయిష్యామి=జయించగలను ?

తా. పూర్వము అపకారము చేసి ఉన్న నన్ను చూచి దేవతలందరూ నవ్వగలరు. కుంభకర్ణుడా ! నీవు మరణించిన తరవాత నేను ఇంద్రుణ్ణి ఎట్లు జయించగలను ? 20

మూ. తదిదం మామనుప్రాప్తం విభీషణవచః శుభమ్,
యదజ్ఞానాన్మయా తస్య న గృహీతం మహాత్మనః. 21

ప్ర. అ. అజ్ఞానాత్=అజ్ఞానమువలన, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ విభీషణునియొక్క, యత్=ఏ వచనము, మయా=నాచేత, న గృహీతమ్=గ్రహింపబడలేదో, తత్=అట్టి, ఇదమ్=ఈ, శుభమ్=శుభమైన, విభీషణవచః=విభీషణుని వాక్యము, మామ్=నన్ను, అనుప్రాప్తమ్=చేరినది.

తా. మహాత్ముడైన విభీషణుడు చెప్పిన ఏ మాటలు నేను అజ్ఞానమువలన ఆనాడు వినలేదో అట్టి శుభమైన విభీషణుని మాటలే ఇపుడు నాకు సంప్రాప్తించినవి. 21

మూ. విభీషణవచో యావత్కుమ్భకర్ణప్రహస్తయోః,
వినాశోఽయం సముత్పన్నో మాం వ్రీడయతి దారుణః. 22

ప్ర. అ. కుమ్భకర్ణప్రహస్తయోః=కుంభకర్ణప్రహస్తులయొక్క, దారుణః=దారుణమైన, అయమ్=ఈ, వినాశః=వినాశము, యావత్=ఎప్పటినుండి (ఎప్పుడు), సముత్పన్నః=కలిగినదో, అప్పటినుండి, విభీషణవచః=విభీషణుని వచనము, మామ్=నన్ను, వ్రీడయతి=సిగ్గుకలవానినిగా చేయుచున్నది.

తా. కుంభకర్ణప్రహస్తులు దారుణముగా నశించినప్పటినుండి, విభీషణుడు పలికిన మాటలు నాకు సిగ్గు కలిగించుచున్నవి. 22

మూ. తస్యాయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః,
యన్మయా ధార్మికః శ్రీమాన్ స నిరస్తో విభీషణః. 23

ప్ర. అ. ధార్మికః=ధార్మికుడు, శ్రీమాన్=శోభాయుక్తుడు అయిన, సః=ఆ, విభీషణః=విభీషణుడు, యత్=ఏ కారణమువలన, మయా=నాచేత, నిరస్తః=అవమానించబడినాడో, తస్య కర్మణః=ఆ కర్మయొక్క, శోకదః=దుఃఖమును కలిగించు, అయమ్=ఈ, విపాకః=విపాకము, మమ=నాకు, ప్రాప్తః=వచ్చినది.

తా. ధార్మికుడు శ్రీమంతుడు అయిన విభీషణుణ్ణి నేను అవమానించుటచే ఆ కర్మకు ఫలముగా నాకు ఈ శోకము సంప్రాప్తించినది. 23

మూ. ఇతి బహువిధమాకులాన్తరాత్మా
కృపణమతీవ విలప్య కుమ్భకర్ణమ్,
న్యపతదపి దశాననో భృశార్త
స్తమనుజమిన్ద్రరిపుం హతం విదిత్వా. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే అష్టషష్టితమః సర్గః.

ప్ర. అ. దశాననః=రావణుడు, ఇన్ద్రరిపుమ్=ఇంద్రుని శత్రువైన, తమ్=ఆ, అనుజమ్=తమ్ముడైన, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, హతమ్=చంపబడినవానినిగా, విదిత్వా=తెలిసికొని, ఆకులాన్తరాత్మా=వ్యాకులమైన మనస్సు కలవాడై, ఇతి=ఈ విధముగా, అతీవ=మిక్కిలి, కృపణమ్=దీనముగా, బహువిధమ్=అనేకవిధములుగా, విలప్య=విలపించి, భృశార్తః=చాల పీడితుడై, న్యపతత్ అపి=పడిపోయెను కూడ.

తా. ఇంద్రుని శత్రువైన తన తమ్ముడు కుంభకర్ణుడు చంపబడి నట్లు విని రావణుడు వ్యాకులమైన చిత్తముతో అనేక విధములుగా చాల దీనముగా ఇట్లు విలపించి, చాల దుఃఖార్తుడై మూర్ఛిల్లి నేలపై పడెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో అరువదిఎనిమిదవ సర్గ సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీత

శ్రీమద్రామాయణము

# యుద్ధకాండము

## రెండవ సంపుటము

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన
బాలానందినీ వ్యాఖ్యతో కూడినది.

ప్రచురణ :

ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

1995

# అభివందనం

లోకకళ్యాణంకోసం ఆర్ష విజ్ఞాన ట్రస్టు ప్రారంభించిన శ్రీమద్రామాయణ ప్రచురణ మహాయజ్ఞం పూర్తయింది. యుద్ధకాండ రెండవభాగం ఇప్పుడు మీచేతుల్లో ఉంది. శ్రీరామపట్టాభిషేకంతో యుద్ధకాండ సమాప్తం. ఈ మహాగ్రంథం మొత్తం ఎనిమిది సంపుటాలుగా వెలువడింది. అయోధ్య, యుద్ధకాండలను విస్తృతివల్ల రెండేసి సంపుటాలుగా వెలువరించవలసి వచ్చింది. బాల, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు ఒక్కొకటి ఒక్కొక సంపుటి.

రామాయణ ప్రచురణ పూర్తయింది గనుక ఇక ఉత్తర రామాయణ ముద్రణ కూడా చేపట్టాలని ఆర్షవిజ్ఞాన ట్రస్టు సంకల్పించింది. దైవానుగ్రహంవల్ల ఈ కార్యక్రమంకూడా త్వరలోనే విజయవంత మవుతుందని విశ్వాసం.

రామాయణం అంటే నిజానికి వాల్మీకికృతమైన రామాయణమే ఐనా లోకంలో లెక్కలేనన్ని రామాయణాలు ఉన్నాయి. పరంపరానుగతంగా మనకు రామాయణాలు అందడంలో అనేకానేకపాఠాంతరాలు వెలసాయి. పండితులు ఉద్దేశపూర్వకంగా చేసిన మార్పులు, చేర్పులు కొన్నికాగా, లేఖకులు చేసిన పొరపాట్లు మరికొన్ని. మూలగ్రంథంలో ఉండటానికి అవకాశం లేని శ్లోకాలు ఇప్పుడు చాలా పాఠాలలో కనిపిస్తున్నాయి. ఉదాహరణకు రామాయణంలో "బౌద్ధ" ప్రస్తావనకు ఆస్కారం లేదు. ఐనా కొన్ని రామాయణాలలో అలాంటివి ఉన్నాయి. కథను రసవత్తరం చేయడానికో, పామరజనులను రంజింపజేయడానికో ప్రక్షిప్తం చేసిన కొన్ని ఘటనలు జనాదరణ పొంది స్థిరపడ్డాయి. ఉదాహరణకు "ఉడతాభక్తి" కథ. ఇది మూలంలో లేదు. "లక్ష్మణరేఖ"ను ఎవరు ఎప్పుడు సృష్టించారో గాని అది జనసామాన్యంలో దృఢంగా నాటుకుపోయింది. ఒకానొక రామాయణంలో రావణుడు దశకంఠుడు కాదు, సహస్రకంఠుడు ! అలా ఎన్నో పాఠాంతరాలు ఏర్పడ్డాయి. ఇకముందు మరెన్ని రామాయణాలు వస్తాయో ఊహించలేము. ఎన్ని రామాయణాలు వస్తేనేమి, దేని ప్రత్యేకత దానిది. దేని ఘనత దానిది. మూలంలో బలం ఏనాటికీ తగ్గేది కాదు.

ఇప్పటివరకు వెలువడిన రామాయణవివరాలను సేకరించి ఈ గ్రంథం చివర అనుబంధంగా ప్రచురించాము. ఈ జాబితా సమగ్రం కాదు. మా దృష్టికి రాని మరెన్నో పాఠాలు వివిధభాషలలో ఉండవచ్చు.

ఆర్ష విజ్ఞాన ట్రస్టు ప్రచురించిన రామాయణం ప్రత్యేకత అర్థతాత్పర్యాలతో ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు సమకూర్చిన బాలానందినీ వ్యాఖ్య. పుల్లెలవారు మహాపండితుడు, కవీకూడా. ఈ సంపుటిలో ఆయన రచించిన శ్లోకాలు అనుబంధంగా ఉన్నాయి.

ఈ యుద్ధకాండం రెండవ సంపుటిలో శ్రీరామపట్టాభిషేకం చిత్రపటం ఒక ఆకర్షణ. మద్రాసు లాజర్నల్ ప్రెస్సువారి సౌజన్యంతో ఈ పటాన్ని ముద్రించాము.

ఇంతకుముందు వెలువడిన సంపుటాలలో గ్రంథప్రచురణకు సాయపడిన వదాన్యుల పేర్లను ప్రచురించాము. ఇప్పుడీ యుద్ధకాండ ద్వితీయ భాగం ముద్రణకు ఈ ట్రస్టు సభ్యులూ, సనాతనధర్మ ప్రచారానికి శక్తికొలదీ కృషిచేస్తున్న పారిశ్రామిక ప్రముఖులూ అయిన శ్రీపల్లెంపాటి వెంకటేశ్వర్లుగారు వనరులు అందించారు. శ్రీమద్రామాయణ ప్రచురణ మహాక్రతువు విజయవంతం కావడానికి తోడ్పడిన అందరికీ కృతజ్ఞతాపూర్వక వందనాలు.

పాతూరి వెంకటేశ్వరరావు.

శ్రీః

# ప్రమోదం

ఊహించడానికి కూడా శక్యంకాని అత్యద్భుతమైన ప్రభావం గల ఒక మహాశక్తి ఉంది దానికే 'మాయ' అని పేరు. ఆ మాయను తన చెప్పుచేతలలో ఉంచుకొని జగత్సృష్టి - స్థితి - సంహారాదులను నడుపుతున్నవాడు పరమేశ్వరుడు. పరమాత్మ, పరబ్రహ్మ, విష్ణువు, శివుడు, ఇంద్రుడు, వరుణుడు, వాయువు మొదలైన ఎన్ని పేర్లు పెట్టినా అవన్నీ ఈ పరమేశ్వరునికే. ఆ మాయాశక్తికి పూర్తిగా లొంగిపోయి ఈ జగత్తులోని ఒక పరమాణువు వలె అయిపోయినవాడు జీవుడు. మాయను పూర్తిగా తన వశంలో ఉంచుకున్న శ్రీమహావిష్ణువు కూడా, అప్పుడప్పుడు, తాను కూడా మాయకు లొంగిపోయినట్లు నటిస్తూ, సామాన్యమానవుడుగా ప్రవర్తిస్తూ, మానవులతో కలసి మెలసి తిరుగుతుంటాడు. అలాంటి మాయామానుషావతారమే శ్రీరామావతారం. ప్రతి మనిషీ కూడ నియమబద్ధమైన జీవితాన్ని గడుపుతూ ధర్మమార్గములో సంచరిస్తూంటే కొంతకాలానికి, కొన్ని జన్మల తరవాతనైనా, అతనిలో గూఢంగా ఉన్న అలౌకికశక్తులు ఆవిష్కృతము తౌతాయనీ, అతడు మాయాతీతు డవుతాడనీ ఆచరణపూర్వకంగా బోధించడమే ఈ అవతారాల ప్రధానోద్దేశ్యం.

మాయామానుషవిగ్రహుడైన శ్రీరాముని చరిత్రను వర్ణించే అతిపవిత్రమైన, మహాకావ్యం అతిసుందరమైన, ఉత్తమగ్రంథం వాల్మీకివిరచిత శ్రీమద్రామాయణం. ఇలాంటి పవిత్రగ్రంథాలను సరిగా అర్థం చేసుకొంటూ శ్రద్ధాభక్తులతో ఆమూలాగ్రంగా చదివేవారిలో, వారికి తెలియకుండగానే, మంచి మానసిక పరివృత్తి కలిగి ధార్మికప్రవృత్తి అలవడుతుంది అనడంలో సందేహం లేదు. శ్రీమద్రామాయణం అంతా అతిసులభమైన భాషలో, మనోహరమైన శైలిలో రచింపబడింది. అయితే సంస్కృతభాషతో అంతగా పరిచయం లేని తెలుగువారు కూడా దీనిలో ఉన్న సౌందర్యాన్ని ఆస్వాదించాలంటే తెలుగులో టీకాతాత్పర్యాలు అవసరం అవుతాయనే అభిప్రాయంతో ఈ "బాలానందిని" రచింపబడింది. టీకాతాత్పర్యాలు మనస్సులో చదువుకున్నా శ్లోకాలు మాత్రం పైకి చదువుతూ ఈ గ్రంథం ఒకసారి పూర్తిచేసినవారికి రెండవ పర్యాయం చదివేటప్పుడు వ్యాఖ్యానాపేక్ష ఉండదు.

మా నాన్నగారు, శ్రీ పుల్లెల సత్యనారాయణశాస్త్రిగారు, అద్వైత తత్త్వం మీద అచంచలవిశ్వాసం గల గొప్ప రామభక్తులు. బ్రాహ్మముహూర్తంలో

మేల్కొని అజపాజపానికి ముందు తదంగంగా తాము రచించిన-

"వైదేహీవివృతం దివ్యం సచ్చిత్సుఖరసం చ యత్,
వైదేహీవిచితం ధ్యేయం తాపత్రయం హరం చ యత్,
వైదేహీసంయుతం ధర్మం ధర్మ్యసంసిద్ధిదం చ యత్,
జ్ఞానధ్యానాధ్వరాప్యం తద్రామాఖ్యం మన్మహే మహః,
ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయం చ ప్రమేతి హ,
యదేకం భాతి తత్సర్వం రామాఖ్యం మన్మహే మహః"
"శరీరోపహితో హంససమాత్మా రామ ఏవ యత్,
అతో హంసో హంస ఇతి శ్వాససాధ్యో జపః స్మృతః".

ఆ వేదానినీ, శ్రీమద్భాగవతంలోని వేదస్తుతి మొదలైనవీ మననం చేసుకొంటుండేవారు. వారి శ్లోకపఠనం నిద్రపోతున్నవారికి మేల్కొలుపుగా ఉండేది. వారిది శ్రీరామాద్వైతం. కనీసం వందసార్లైనా సుందరకాండ సంపూర్ణరామాయణాల పారాయణం, 50-60 పర్యాయాలైనా రామాయణప్రవచనం చేసి ఉంటారు. వారు ప్రవచనంలో ప్రతి శ్లోకమూ చదివి దాని అర్థం చెప్తూ ఉండేవారు. గంటల కొలది ఏవో మూడు నాలుగు శ్లోకాలు తీసికొని ఏవేవో అర్థాలు అల్లుకుపోతూ చేసే ప్రవచనం కాదు వారిది. పద్నాలుగు సంవత్సరాల వయస్సు నిండడానికి ముందే నేను రామాయణప్రవచనాలు మూడు నాలుగుసార్లు విన్నాను, దానితో మూలమూలలలోని కథాంశాలు కూడా మనస్సుకు బాగా పట్టివేశాయి. ఈ విధంగా చిన్నవాటినుంచీ రామాయణం మీద అభిరుచి పెరగడం చేత దీనికి వ్యాఖ్య వ్రాసి ప్రచారం చేయ్యాలనే కోరిక ఉంటూండేది. అయితే అది చాలా కాలం వరకు కార్యోన్ముఖం కాలేదు. విస్మృతప్రాయం కూడా అయిపోయింది.

ఆంధ్రప్రదేశ ఉన్నతన్యాయాలయంలో న్యాయమూర్తులుగా ఉండి, పదవీవిరమణానంతరం, ప్రస్తుతం, నిరంతరశ్రీరామస్మరణతో, వివిధ ధార్మిక కార్యనిర్వాహణాలతో, ఆధ్యాత్మికచింతనముతో పవిత్రజీవితం గడుపుతూన్న శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారికి 1985-86 ప్రాంతంలో, రామాయణానికి తెలుగులో వ్యాఖ్య వ్రాయించి ప్రచురించాలి అనే సత్సంకల్పం కలిగింది. వీరి పూర్వికులు భద్రాచలరాముని కైంకర్యంకోసం వందలకొలది యకరాల భూమిని సమర్పించి "అంబాసత్రం" అనే సత్రం స్థాపించారు. శ్రీ కోదండరామయ్యగారి నిరంతరప్రయత్నాల ఫలితంగా అది నేటికి కూడా చక్కగా నడుస్తూన్నది. ఈ విధంగా అణువణువునా శ్రీరామనామసంస్పర్శ పావితశరీరులైన వీరికి ఇలాంటి సత్సంకల్పం కలగడంలో ఆశ్చర్యం లేదు. దీనికి తోడు వీరి అభిలాషకి శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య గారి ప్రోత్సాహనం లభించింది. శ్రీ వెంకటశేషయ్యగారు గొప్ప రామభక్తులు. అనేకవిధాల ప్రయత్నించి, ధనం సేకరించి, కొన్ని

సంవత్సరాలపాటు భద్రాచలంలోనే ఉండి భద్రాచలదేవాలయోద్ధరణతో పాటు కల్యాణమంటప, ధ్యానమంటపాది నిర్మాణకార్యకాలాపాలు కూడా చేపట్టి ఆ కార్యాలన్నీ విజయవంతంగా సాధించిన పుణ్యాత్ములు. కార్యాగారవాసమే కాని కారాగారవాసం చేయని అపర "రామదాసు". బహుశా శ్రీ దివాకర్ల వెంకటావధాని గారి సలహామీద అయి ఉంటుంది - శ్రీ కోదండరామయ్యగారు వ్యాఖ్యానం వ్రాసే పని నాకు అప్పచెప్పారు. రామాయణం ఏడు కాండలకూ నిర్విఘ్నంగా వ్యాఖ్యానం వ్రాయకలగడం, ఇది శ్రీ కోదండరామయ్యగారు స్థాపించిన ఆర్షవిజ్ఞానట్రస్టు ద్వారా ముద్రితమై నిపుణవిద్వన్మణియైన శ్రీచలమచర్ల శేషాచార్యులుగారి పర్యవేక్షణలో పది సంపుటాలలో చక్కగా రూపుదిద్దు కోవడం నా కీనాడు ఎంతో ప్రమోదం కలిగిస్తున్నాయి. దీనికి మా నాన్నగారి ఆశీర్వాదబలం శ్రీకోదండరామయ్యగారి సత్సంకల్పబలం ఈ రెండే ప్రధానకారణాలని నా దృఢవిశ్వాసం.

రామాయణానికి తెలుగులో ప్రతిపదార్థతాత్పర్యాలు వ్రాయడం అనేది పాండిత్యానికి "పరాకాష్ఠ" ఏమీ కాదు. మొత్తం గ్రంథమే సులభమైన భాషలో రచించబడింది. ఎక్కడైనా సందేహం కలుగుతే సంప్రదించడానికి ప్రాచీనవ్యాఖ్యానా లున్నాయి. నిఘంటువు లున్నాయి. వ్యాకరణం ఉంది. ప్రాచీన వ్యాఖ్యాతలు వ్రాసిన వాటిలోను, ఆధునిక వ్యాఖ్యా విమర్శాదులలోనూ కూడా ఏది యుక్తమో, ఏది అకాండతాండవమో, ఏది ఆకాశముష్టిప్రహరణమో, తెలుసుకోవడానికి తగిన, భగవంతుడిచ్చిన, వివేచనాశక్తి ఉంది. మరేమనగా చాలాకాలం పట్టే పని నిర్విఘ్నంగా కొనసాగిపోయింది కదా అని మాత్రమే మా ప్రమోదం. ఈ వ్యాఖ్యానం రామాయణరసాన్ని ఆస్వాదించడానికి ఏ కొద్దిమందికి సహాయపడినా మా ప్రమోదం శతగుణం, సహస్రగుణం అవుతుంది. ఏమైనా అంతా శ్రీరామసంకల్పాధీనం. "తేన వినా తృణమపి న చలతి".

"బలం విష్ణోః ప్రవర్ధతామ్"

యువకార్తిక నాగ చతుర్థీ.
27.10.1995

పుల్లెల శ్రీరామచంద్రుడు

# విషయసూచిక

ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథిర్యది,
పౌరుషే చాప్రతిద్వన్ద్వః శరైనం జహి రావణిమ్.

సర్గ. 90 ;శ్లో. 71; పుట. 369

శ్రీః

ఓం స్వస్తి శ్రీ గణేశాయ నమః

# అథ యుద్ధకాణ్డే ఏకోనసప్తతితమః సర్గః

*[రావణుని పుత్రులు బంధువులు యుద్ధానికై వెడలుట. అంగదుడు నరాంతకుని చంపుట.]*

మూ. ఏవం విలపమానస్య రావణస్య దురాత్మనః,
శ్రుత్వా శోకాభిభూతస్య త్రిశిరా వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, విలపమానస్య=విలపించుచున్న, దురాత్మనః=దుర్బుద్ధియైన, శోకాభిభూతస్య= శోకముచేత తిరస్కరింపబడిన, రావణస్య=రావణునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, త్రిశిరాః= త్రిశిరస్సు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఈ విధముగా దుఃఖావేశముతో విలపించుచున్న దురాత్ముడైన రావణుని మాటలు విని త్రిశిరస్సు ఇట్లు పలికెను. 1

మూ. ఏవమేవ మహావీర్యో హతో నస్తాతమధ్యమః,
న తు సత్పురుషా రాజన్ విలపన్తి యథా భవాన్. 2

ప్ర. అ. నః=మాయొక్క, తాతమధ్యమః=తండ్రుల (అన్నదమ్ముల)లో మధ్యముడైన, మహావీర్యః=గొప్ప పరాక్రమము గల కుంభకర్ణుడు, హతః=చంపబడినాడు. ఏవమేవ=ఇది నిజమే. తు=కాని, రాజన్=రాజా !భవాన్ యథా=నీవంటి, సత్పురుషాః=సత్పురుషులు, న విలపన్తి=విలపించరు.

తా. రాజా ! గొప్ప పరాక్రమము గల మా తండ్రుల అన్నదమ్ములలో మధ్యముడైన కుంభకర్ణుడు చంపబడినా డను మాట నిజమే. కాని, నీవంటి సత్పురుషులు విలపించరు. 2

మూ. నూనం త్రిభువనస్యాపి పర్యాప్తస్త్వమసి ప్రభో,
స కస్మాత్ప్రాకృత ఇవ శోచస్యాత్మానమీదృశమ్. 3

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! త్వమ్=నీవు, త్రిభువనస్యాపి=మూడు లోకములకు కూడ, పర్యాప్తః=సరిపడినవాడవు, అసి=అయి ఉన్నావు. సః=అట్టి

నీవు, ఈదృశమ్=ఇట్టి, ఆత్మానమ్=తనను గూర్చి, ప్రాకృతః ఇవ=సామాన్యుడు వలె, కస్మాత్=ఎందువలన, శోచసి=దుఃఖించుచున్నావు ?

తా. ప్రభూ ! నీవు మూడు లోకాలూ కూడ జయించుటకు సరిపోయినవాడవు. అట్టి నీవు, నిన్ను గూర్చి సామాన్యుడు వలె ఎందుకు దుఃఖించుచున్నావు ? 3

మూ. బ్రహ్మదత్తాస్తి తే శక్తిః కవచం సాయకో ధనుః,
సహస్రఖరసంయుక్తో రథో మేఘసమస్వనః. 4

ప్ర. అ. తే=నీకు, బ్రహ్మదత్తా=బ్రహ్మచేత ఇవ్వబడిన, శక్తిః=శక్తి, అస్తి=ఉన్నది. కవచమ్=కవచమూ, సాయకః=బాణమూ, ధనుః=ధనస్సూ, సహస్రఖర సంయుక్తః=వేయి గాడిదలచేత కట్టబడిన, మేఘసమస్వనః=మేఘముతో సమానమైన ధ్వని గల, రథః=రథము, ఉన్నవి.

తా. నీకు బ్రహ్మ ఇచ్చిన శక్తి కవచము, బాణము, ధనస్సు, వేయి గాడిదలు కట్టిన, మేఘధ్వనివంటి ధ్వని గల రథము ఉన్నవి. 4

మూ. త్వయాసకృద్ధి శస్త్రేణ విశస్తా దేవదానవాః,
స సర్వాయుధసంపన్నో రాఘవం శాస్తుమర్హసి. 5

ప్ర. అ. త్వయా=నీచేత, అసకృత్=అనేక పర్యాయములు, శస్త్రేణ=ఆయుధముచేత, దేవదానవాః=దేవతలు, దానవులు, విశస్తాః హి=నశింపచేయబడినారు కదా ! సః=అట్టి నీవు, సర్వాయుధసంపన్నః=సర్వాయుధములతో కూడినవాడవై, రాఘవమ్=రాముణ్ణి, శాస్తుమ్=శిక్షించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. నీవు అనేక పర్యాయములు ఆయుధముచేత దేవదానవులను ఓడించినావు కదా ? నీవు ఇప్పుడు కూడ సర్వాయుధములు ధరించి రాముణ్ణి శిక్షించుము. 5

మూ. కామం తిష్ఠ మహారాజ నిర్గమిష్యామ్యహం రణే,
ఉద్ధరిష్యామి తే శత్రూన్ గరుడః పన్నగానివ. 6

ప్ర. అ. మహారాజ=మహారాజా ! తిష్ఠ కామమ్=నీవు అట్లే ఉండుము. అహమ్=నేను, నిర్గమిష్యామి=బయలుదేరెదను. గరుడః=గరుత్మంతుడు, పన్నగానివ=సర్పములను వలె, రణే=యుద్ధమునందు, తే శత్రూన్=నీ శత్రువులను, ఉద్ధరిష్యామి=పెకలించివేసెదను.

తా. మహారాజా ! నీవు అట్లే ఉండుము. నేను బయలుదేరి వెళ్ళి, గరుత్మంతుడు సర్పములను వలె, నీ శత్రువులను, యుద్ధమునందు

పెకలించివేసెదను. 6

మూ. శమ్బరో దేవరాజేన నరకో విష్ణునా యథా,
తథాద్య శయితా రామో మయా యుధి నిపాతితః. 7

ప్ర. అ. శమ్బరః=శంబరుడు, దేవరాజేన=దేవేంద్రునిచేత, నరకః=నరకుడు, విష్ణునా=విష్ణువుచేత, యథా=ఎట్లో, తథా=అట్లే, మయా=నాచేత, అద్య=నేడు, యుధి=యుద్ధమునందు, నిపాతితః=పడగొట్టబడినవాడై, రామః=రాముడు, శయితా=శయనించగలడు.

తా. దేవేంద్రునిచేత శంబరాసురుడు వలె, విష్ణువుచేత నరకుడు వలె, నాచేత నేడు యుద్ధమునందు పడగొట్టబడినవాడై రాముడు శయనించగలడు.

వి. ఈ నరకుడు కృష్ణునిచేత చంపబడిన భూదేవి కుమారుడైన నరకాసురుడు కాడు. సింహికయందు విప్రచిత్తివలన జనించిన వాతాపి మొదలైన అన్నదమ్ములలో ఒకడు అని గోవిందరాజులు. 7

మూ. శ్రుత్వా త్రిశిరసో వాక్యం రావణో రాక్షసాధిపః,
పునర్జాతమివాత్మానం మన్యతే కాలచోదితః. 8

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, త్రిశిరసః=త్రిశిరస్సుయొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, కాలచోదితః=కాలముచేత ప్రేరేపింపబడినవాడై, ఆత్మానమ్=తనను, పునః=మరల, జాతమ్ ఇవ=పుట్టినవానినిగా, మన్యతే=తలచెను.

తా. రాక్షసరాజైన రావణునకు త్రిశిరస్సు మాటలు వినగానే కాల ప్రభావముచే తాను మళ్ళీ పుట్టినాడన్నంత ధైర్యము వచ్చెను. 8

మూ. శ్రుత్వా త్రిశిరసో వాక్యం దేవాన్తకనరాన్తకౌ,
అతికాయశ్చ తేజస్వీ బభూవుర్యుద్ధహర్షితాః. 9

ప్ర. అ. త్రిశిరసః=త్రిశిరస్సుయొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, దేవాన్తకనరాన్తకౌ=దేవాంతక నరాంతకులు, తేజస్వీ=తేజఃశాలియైన, అతికాయశ్చ=అతికాయుడు, యుద్ధహర్షితాః= యుద్ధముకొరకై ఉత్సాహము కలవారు; బభూవుః=అయిరి.

తా. త్రిశిరస్సు మాటలు వినగానే దేవాంతకనరాంతకులకు, తేజశ్శాలియైన అతికాయునకు యుద్ధమునకై ఉత్సాహము కలిగెను. 9

మూ. తతోఽహమహమిత్యేవ గర్జన్తో నైరృతర్షభాః,
రావణస్య సుతా వీరాః శక్రతుల్యపరాక్రమాః. 10

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రావణస్య=రావణునియొక్క, సుతాః=కుమారులు, వీరాః=వీరులు, శక్రతుల్యపరాక్రమాః=దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవారు అయిన, నైర్ఋతర్షభాః=రాక్షసశ్రేష్ఠులు, అహమ్ అహమ్ ఇత్యేవ=నేను నేను అని, గర్జన్తః=గర్జించుచున్నవారై (యుద్ధోత్సాహము కలవారైరి.)

తా. అటు పిమ్మట దేవేంద్రునితో సమానమైన పరాక్రమముగల రావణుని కుమారులు, వీరు లగు రాక్షసశ్రేష్ఠులు నేను నేనని గర్జించుచు యుద్ధోత్సాహము కలవారైరి. 10

మూ. అన్తరిక్షగతాః సర్వే సర్వే మాయావిశారదాః,
సర్వే త్రిదశదర్పఘ్నాః సర్వే సమరదుర్మదాః. 11

ప్ర. అ. సర్వే=అందరూ, అన్తరిక్షగతాః=ఆకాశమునందు నిలవగలవారు, సర్వే=అందరూ, మాయావిశారదాః=మాయలలో నేర్పరులు. సర్వే=అందరూ, త్రిదశదర్పఘ్నాః=దేవతల గర్వము తొలగించినవారు, సర్వే=అందరూ, సమరదుర్మదాః=యుద్ధమునందు చెడ్డ మదము గలవారు.

తా. ఆ రాక్షసు లందరూ ఆకాశములో సంచరించగలవారు. అందరూ మాయలో నేర్పు గలవారు. అందరూ దేవతల గర్వము అడచినవారు. అందరూ యుద్ధములో చెడ్డ మదము గలవారు. 11

మూ. సర్వే సుబలసంపన్నాః సర్వే విస్తీర్ణకీర్తయః,
సర్వే సమరమాసాద్య న శ్రూయన్తే స్మ నిర్జితాః, 12
దేవైరపి సగన్ధర్వైః సకింనరమహోరగైః.

ప్ర. అ. సర్వే=అందరూ, సుబలసంపన్నాః=మంచి బలముతో కూడినవారు, సర్వే=అందరూ, విస్తీర్ణకీర్తయః=విస్తృతమైన కీర్తి గలవారు, సర్వే=అందరూ, సమరమ్=యుద్ధమును, ఆసాద్య=పొంది, సగన్ధర్వైః=గంధర్వులతో కూడిన, సకింనరమహోరగైః=కింనరులతోను, మహోరగులతోనుకూడిన, దేవైరపి=దేవతలచేత కూడ, నిర్జితాః=జయించబడినవారుగా, న శ్రూయన్తే స్మ=వినబడనివారే.

తా. వాళ్లు అందరూ గొప్ప బలము కలవారు. అందరూ విస్తృతమైన కీర్తి గలవారు. అందరూ యుద్ధములోనికి వెళ్లి దేవ-గంధర్వ-కింనర-మహోరగులచేతకూడ ఓడింపబడినట్లు ఎన్నడూ చెప్పబడనివారే. 12

మూ. సర్వేఽస్త్రవిదుషో వీరాః సర్వే యుద్ధవిశారదాః, 13
సర్వే ప్రవరవిజ్ఞానాః సర్వే లబ్ధవరాస్తథా.

ప్ర. అ. సర్వే=అందరూ, అస్త్రవిదుషః=అస్త్రములు ఎరిగిన, వీరాః= వీరులు; సర్వే=అందరూ, యుద్ధవిశారదాః=యుద్ధమునందు నేర్పు గలవారు; సర్వే=అందరూ, ప్రవరవిజ్ఞానాః=గొప్ప విజ్ఞానము గలవారు; తథా=మరియు, సర్వే=అందరూ, లబ్ధవరాః=పొందబడిన వరములు గలవారు.

తా. ఆ రాక్షసులందరూ అస్త్రములు తెలిసిన వీరులే. అందరూ యుద్ధములో నేర్పు గలవారే. అందరూ శ్రేష్ఠమైన విజ్ఞానము గలవారే. అందరూ వరములు పొందినవారే. 13

మూ. స తైస్తథా భాస్కరతుల్యదర్శనైః
సుతైర్వృతః శత్రుబలశ్రియార్దనైః,
రరాజ రాజా మఘవాన్యథామరై
ర్వృతో మహాదానవదర్పనాశనైః. 14

ప్ర. అ. భాస్కరతుల్యదర్శనైః=సూర్యునితో సమానమైన దర్శనము గల, శత్రుబలశ్రియార్దనైః=శత్రువుల బలమును, ఐశ్వర్యమును పీడించు, తైః=ఆ, సుతైః=కుమారులతో, తథా=ఆ విధముగా, వృతః=కూడుకొనియున్న, సః రాజా=ఆ రాజు, మహాదానవదర్పనాశనైః=గొప్ప దానవుల దర్పమును నశింపచేయు, అమరైః=దేవతలతో, వృతః=కూడిన, మఘవా యథా=దేవేంద్రుడు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. సూర్యునివలె కనిపించుచున్న, శత్రుబలైశ్వర్యవినాశకులైన ఆ కుమారులతో ఆ విధముగా కూడి యున్న రావణుడు మహాదానవుల దర్పమును నశింపచేయు దేవతలతో కూడిన దేవేంద్రుడు వలె ప్రకాశించెను. 14

మూ. స పుత్రాన్ సంపరిష్వజ్య భూషయిత్వా చ భూషణైః,
ఆశీర్భిశ్చ ప్రశస్తాభిః ప్రేషయామాస వై రణే. 15

ప్ర. అ. సః=అతడు, పుత్రాన్=పుత్రులను, సంపరిష్వజ్య=కౌగలించుకొని, భూషణైః=అలంకారములచేత, భూషయిత్వా చ=అలంకరించి, ప్రశస్తాభిః=ప్రశస్తములైన, ఆశీర్భిః=ఆశీర్వాదములతో, రణే=యుద్ధమునందు, ప్రేషయామాస= పంపెను.

తా. రావణుడు పుత్రులను కౌగలించుకొని, అలంకారములతో అలంకరించి, ప్రశస్తములైన ఆశీర్వాదములు చేసి యుద్ధమునకు పంపెను. 15

మూ. యుద్ధోన్మత్తం చ మత్తం చ భ్రాతరౌ చాపి రావణః,
రక్షణార్థం కుమారాణాం ప్రేషయామాస సంయుగే. 16

ప్ర. అ. రావణః=రావణుడు, కుమారాణామ్=కుమారులయొక్క, రక్షణా

ర్థమ్=రక్షణముకొరకు, భ్రాతరౌ=సోదరులైన, యుద్ధోన్మత్తం చ=యుద్ధోన్మత్తుని, మత్తం చ అపి=మత్తునీకూడ (మహోదర- మహాపార్శ్వ లను నామాంతరములు గల వీరిద్దరు రావణుని సోదరులు), సంయుగే=యుద్ధమునందు, ప్రేషయామాస=పంపెను.

తా. రావణుడు కుమారుల రక్షణముకొరకు తన సోదరులైన యుద్ధోన్మత్త-మత్తులను కూడ యుద్ధానికి పంపెను. 16

మూ. తేఽభివాద్య మహాత్మానం రావణం లోకరావణమ్,
కృత్వా ప్రదక్షిణం చైవ మహాకాయాః ప్రతస్థిరే. 17

ప్ర. అ. మహాకాయాః=పెద్ద శరీరములు గల, తే=వారు, మహాత్మానమ్=మహాత్ముడైన, లోకరావణమ్=లోకములను ఏడ్పించిన, రావణమ్=రావణుని, అభివాద్య=నమస్కరించి, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము, కృత్వా చైవ=చేసి,ప్రతస్థిరే=ప్రయాణమైరి.

తా. పెద్ద దేహములు గల ఆ రాక్షసులు మహాత్ముడైన, లోకములను ఏడ్పించిన రావణునకు ప్రదక్షిణనమస్కారములు చేసి బయలుదేరిరి. 17

మూ. సర్వౌషధీభిర్గన్ధైశ్చ సమాలభ్య మహాబలాః,
నిర్జగ్ముర్నైరృతశ్రేష్ఠా షడేతే యుద్ధకాంక్షిణః. 18

ప్ర. అ. ఏతే=ఈ, మహాబలాః=గొప్ప బలము గల, షట్=ఆరుగురు, నైరృతశ్రేష్ఠాః=రాక్షసశ్రేష్ఠులు, సర్వౌషధీభిః=సమస్తమైన ఓషధులచేత, గన్ధైః చ=సుగంధద్రవ్యములచేత, సమాలభ్య=శరీరములు పూసికొని, యుద్ధకాంక్షిణః=యుద్ధమును కోరుచున్నవారై, నిర్జగ్ముః=బయల్వెడలిరి.

తా. గొప్ప బలము గల ఆ ఆరుగురు రాక్షసశ్రేష్ఠులు శరీరములకు సమస్త ఓషధులను, సుగంధద్రవ్యములను పూసికొని, యుద్ధానికి బయలుదేరిరి.

మూ. త్రిశిరాశ్చాతికాయశ్చ దేవాన్తకనరాన్తకౌ,
మహోదరమహాపార్శ్వౌ నిర్జగ్ముః కాలచోదితాః. 19

ప్ర. అ. త్రిశిరాశ్చ=త్రిశిరస్సు, అతికాయశ్చ=అతికాయుడు, దేవాన్తక నరాన్తకౌ=దేవాంతకనరాంతకులు, మహోదరమహాపార్శ్వౌ=మహోదరమహా పార్శ్వులు, కాలచోదితాః=కాలముచేత ప్రేరేపింపబడినవారై, నిర్జగ్ముః=బయలుదేరిరి.

తా. త్రిశిరస్సు, అతికాయుడు, దేవాంతకనరాంతకులు, మహోదరమహాపార్శ్వులు కాలముచేత ప్రేరేపింపబడినవారై బయలుదేరిరి. 19

మూ. తతః సుదర్శనం నాగం నీలజీమూతసంనిభమ్,
ఐరావతకులే జాతమారురోహ మహోదరః. 20

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మహోదరః=మహోదరుడు, నీలజీమూతసంనిభమ్=నల్లని మేఘముతో సమానమైన, ఐరావతకులే జాతమ్=ఐరావతవంశమునందు పుట్టిన, సుదర్శనమ్=సుదర్శన మను, నాగమ్=ఏనుగును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట మహోదరుడు ఐరావతకులమునందు పుట్టిన, నల్లని మేఘము వలె ఉన్న సుదర్శన మను ఏనుగును ఎక్కెను. 20

మూ. సర్వాయుధసమాయుక్తస్తూణీభిశ్చాప్యలంకృతః,
రరాజ గజమాస్థాయ సవితేవాస్తమూర్ధని. 21

ప్ర. అ. సర్వాయుధసమాయుక్తః=సమస్తములైన ఆయుధములతో కూడిన, తూణీభిశ్చాపి=అంబులపొదులతో కూడ, అలంకృతః=అలంకరించబడిన ఆ మహోదరుడు, గజమ్=ఏనుగును, ఆస్థాయ=అధిష్ఠించి, అస్తమూర్ధని=అస్త్రాద్రిశిఖరమునందు, సవితేవ=సూర్యుడు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. అన్ని ఆయుధములను ధరించి, అంబుల పొదులచేత అలంకరించబడిన ఆ మహోదరుడు ఆ ఏనుగును ఎక్కి అస్త్రాద్రిశిఖరమునందు సూర్యుడు వలె ప్రకాశించెను. 21

మూ. హయోత్తమసమాయుక్తం సర్వాయుధసమాకులమ్,
ఆరురోహ రథశ్రేష్ఠం త్రిశిరా రావణాత్మజః. 22

ప్ర. అ. రావణాత్మజః=రావణుని కుమారుడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, హయోత్తమసమాయుక్తమ్=ఉత్తమములైన గుఱ్ఱములచేత కట్టబడిన, సర్వాయుధసమాకులమ్=అన్ని ఆయుధములతో వ్యాకులమైన, రథశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. రావణుని కుమారుడైన త్రిశిరస్సు మంచి గుఱ్ఱములు కట్టిన అన్ని ఆయుధములతో నిండిన శ్రేష్ఠమైన రథమును అధిష్ఠించెను. 22

మూ. త్రిశిరా రథమాస్థాయ విరరాజ ధనుర్ధరః,
సవిద్యుదుల్కః సజ్వాలః సేన్ద్రచాప ఇవామ్బుదః. 23

ప్ర. అ. ధనుర్ధరః=ధనస్సును ధరించిన, త్రిశిరాః=త్రిశిరస్సు, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, సవిద్యుదుల్కః=మెరుపులతోను అగ్నిపిండములతోను కూడిన, సజ్వాలః=జ్వాలలతో కూడిన, సేన్ద్రచాపః= ఇంద్రధనస్సుతో కూడిన, అమ్బుదః ఇవ=మేఘము వలె, విరరాజ=ప్రకాశించెను.

తా. ధనుర్ధరుడై రథమును ఎక్కి ఉన్న త్రిశిరస్సు, మెరుపులతోను, అగ్నిగుండములతోను, జ్వాలలతోను, ఇంద్రధనస్సుతోను కూడిన మేఘమువలె ప్రకాశించెను. 23

మూ. త్రిభిః కిరీటైస్త్రిశిరాః శుశుభే స రథోత్తమే,
హిమవానివ శైలేన్ద్రస్త్రిభిః కాఞ్చనపర్వతైః. 24

ప్ర. అ. సః=ఆ, త్రిశిరాః=త్రిశిరస్సు, రథోత్తమే=ఆ శ్రేష్ఠమైన రథమునందు, త్రిభిః=మూడు, కిరీటైః=కిరీటములతో, త్రిభిః=మూడు, కాఞ్చనపర్వతైః=బంగారు పర్వతములచేత, శైలేంద్రః=పర్వతరాజైన, హిమవానివ=హిమవంతుడు వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. ఆ శ్రేష్ఠమైన రథమునందు త్రిశిరస్సు మూడు కిరీటములతో, మూడు బంగారుపర్వతములతో హిమవత్పర్వతము వలె ప్రకాశించెను. 24

మూ. అతికాయోఽతితేజస్వీ రాక్షసేన్ద్రసుతస్తదా,
ఆరురోహ రథశ్రేష్ఠం శ్రేష్ఠః సర్వధనుష్మతామ్. 25

ప్ర. అ. తదా=అప్పుడు, అతితేజస్వీ=గొప్ప తేజస్సు కలవాడు, రాక్షసేన్ద్రసుతః=రావణుని కుమారుడు, సర్వధనుష్మతామ్=అందరు ధనుర్ధారులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడూ అయిన, అతికాయః=అతికాయుడు, రథశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. అప్పుడు తేజశ్శాలి, రావణుని పుత్రుడు, ధనుర్ధారులందరిలోను శ్రేష్ఠుడూ అయిన అతికాయుడు శ్రేష్ఠమైన రథమును ఎక్కెను. 25

మూ. సుచక్రాక్షం సుసంయుక్తం స్వనుకర్షం సుకూబరమ్,
తూణీబాణాసనైర్దీప్తం ప్రాసాసిపరిఘాకులమ్. 26

ప్ర. అ. సుచక్రాక్షమ్=మంచి చక్రములు, ఇరుసూ కలది, సుసంయుక్తమ్=బాగుగా కట్టబడినది, స్వనుకర్షమ్=మంచి అనుకర్షము (ఇరుసుపై ఉన్న కట్టు) గలది, సుకూబరమ్=మంచికాడి కట్టే కట్టు కలది, తూణీబాణాసనైః=అంబులపాదులతోను, ధనుస్సులతోను, దీప్తమ్=ప్రకాశించుచున్నది, ప్రాసాసిపరిఘాకులమ్=ప్రాసలతోను, ఖడ్గములతోను, పరిఘలతోను కూడినదీ (అయిన రథము నెక్కెను.)

తా. అతికాయు డెక్కిన రథము చక్రములు, ఇరుసు, ఇరుసుపైన ఉండు కట్టు, కాడి కట్టే పాదుగు కట్టు చక్కగా ఉండెను. మంచి గుఱ్ఱములు కట్టబడెను. అది అంబులపాదులతోను, ధనుస్సులతోను, ప్రాసలతోను, ఖడ్గములతోను, పరిఘలతోను నిండి ఉండెను. 26

మూ. స కాఞ్చనవిచిత్రేణ కిరీటేన విరాజతా,
భూషణైశ్చ బభౌ మేరుః ప్రభాభిరివ భాసయన్. 27

ప్ర. అ. సః=అతడు, కాఞ్చనవిచిత్రేణ=బంగారముచేత విచిత్రమైన, విరాజతా=ప్రకాశించుచున్న, కిరీటేన=కిరీటముతోను, భూషణైశ్చ=అలంకారముల తోను, ప్రభాభిః=కాంతులచేత, భాసయన్=ప్రకాశింపచేయుచున్న, మేరుః ఇవ=మేరు పర్వతము వలె, బభౌ=ప్రకాశించెను.

తా. అతడు బంగారముచేత విచిత్రవర్ణము గల, ప్రకాశించు చున్న కిరీటముతోను, అలంకారములతోను, కాంతులచేత ప్రకాశింపచేయుచున్న మేరుపర్వతము వలె ప్రకాశించెను. 27

మూ. స రరాజ రథే తస్మిన్ రాజసూనుర్మహాబలః,
వృతో నైర్ఋతశార్దూలైర్వజ్రపాణిరివామరైః. 28

ప్ర. అ. నైర్ఋతశార్దూలైః=రాక్షసశ్రేష్ఠులతో, వృతః=కూడిన, మహాబలః= గొప్ప బలము గల, సః రాజసూనుః=ఆ రాజకుమారుడు, తస్మిన్ రథే=ఆ రథమునందు, అమరైః=దేవతలతో కూడిన, వజ్రపాణిః ఇవ=దేవేంద్రుడు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. రాక్షసశ్రేష్ఠులతో కూడిన మహాబలశాలియైన ఆ రాజకుమారుడు ఆ రథమునందు, దేవతలతో కూడిన దేవేంద్రుడు వలె ప్రకాశించెను. 28

మూ. హయముచ్చైఃశ్రవఃప్రఖ్యం శ్వేతం కనకభూషణమ్,
మనోజవం మహాకాయమారురోహ నరాన్తకః. 29

ప్ర. అ. నరాన్తకః=నరాంతకుడు, ఉచ్చైఃశ్రవఃప్రఖ్యమ్=ఉచ్చైఃశ్రవస్సుతో సమానము, శ్వేతమ్=తెల్లనిది, కనకభూషణమ్=బంగారు అలంకారములు గలది, మనోజవమ్=మనస్సువంటి వేగము గలది, మహాకాయమ్=గొప్ప దేహము కలది అయిన, హయమ్=గుఱ్ఱమును, ఆరురోహ=ఎక్కెను.

తా. నరాంతకుడు బంగారు అలంకారములు గల మనస్సువంటి వేగము గల, ఉన్నతమైన, ఉచ్చైఃశ్రవము వంటి శ్వేతాశ్వమును ఎక్కెను. 29

మూ. గృహీత్వా ప్రాసముల్కాభం విరరాజ నరాన్తకః,
శక్తిమాదాయ తేజస్వీ గుహః శిఖిగతో యథా. 30

ప్ర. అ. నరాన్తకః=నరాంతకుడు, ఉల్కాభమ్=ఉల్క (ఆకాశము నుండి అప్పుడప్పుడు నేలమీద రాలే అగ్నిపిండము) వంటి కాంతి గల, ప్రాసమ్=ప్రాసను, గృహీత్వా=గ్రహించి, తేజస్వీ=తేజస్సుగల, శిఖిగతః=నెమలిమీద

మన్న, గుహః=కుమారస్వామి, శక్తిమ్=శక్తిని, ఆదాయ యథా=గ్రహించి వలె, విరరాజ=ప్రకాశించెను.

తా. ఉల్కవంటి ప్రాసను ధరించి ఉన్న నరాంతకుడు శక్తిని గ్రహించి నెమలిపై కూర్చున్న తేజఃశాలియైన కుమారస్వామి వలె ప్రకాశించెను. 30

మూ. దేవాన్తకః సమాదాయ పరిఘం హేమభూషితమ్,
పరిగృహ్య గిరిం దోర్భ్యాం వపుర్విష్ణోర్విడమ్బయన్. 31

ప్ర. అ. దేవాన్తకః=దేవాంతకుడు, హేమభూషితమ్=బంగారముచేత అలంకరించబడిన, పరిఘమ్=పరిఘను, సమాదాయ=గ్రహించి, దోర్భ్యామ్=బాహువులచేత, గిరిమ్=మందరపర్వతమును, పరిగృహ్య=గ్రహించి ఉన్న, విష్ణోః=విష్ణువు యొక్క, వపుః=శరీరమును, విడమ్బయన్=అనుకరించుచు (వెళ్లెను.)

తా. దేవాంతకుడు బంగారముచేత అలంకరించబడిన పరిఘను గ్రహించి, సముద్రమథనసమయమునందు బాహువులచేత మందరపర్వతమును ధరించిన విష్ణువు శరీరమును అనుకరించుచు బయలుదేరి వెళ్లెను. 31

మూ. మహాపార్శ్వో మహాతేజా గదామాదాయ వీర్యవాన్,
విరరాజ గదాపాణిః కుబేర ఇవ సంయుగే. 32

ప్ర. అ. మహాతేజాః=మహాతేజస్వీ, వీర్యవాన్=పరాక్రమవంతుడూ, గదాపాణిః=గదాధారియు అయిన, మహాపార్శ్వః=మహాపార్శ్వుడు, గదామ్ ఆదాయ=గదను పట్టుకొని, సంయుగే=యుద్ధమున, కుబేరః ఇవ= కుబేరుడు వలె, విరరాజ=ప్రకాశించెను.

తా. మహాతేజశ్శాలీ, పరాక్రమవంతుడు, గదాధరుడూ అయిన మహాపార్శ్వుడు గద చేత ధరించి యుద్ధంలో కుబేరుని వలె ప్రకాశించెను.

మూ. తే ప్రతస్థుర్మహాత్మానో౽మరావత్యాః సురా ఇవ,
తాన్ గజైశ్చ తురఙ్గైశ్చ రథైశ్చామ్బుదనిఃస్వనైః, 33
అనుజగ్ముర్మహాత్మానో రాక్షసాః ప్రవరాయుధాః.

ప్ర. అ. మహాత్మానః=మహాత్ములైన, తే=వారు, అమరావత్యాః=అమరావతినుండి, సురాః ఇవ=దేవతలు వలె, ప్రతస్థుః=ప్రయాణమైరి. మహాత్మానః=మహాత్ములైన, ప్రవరాయుధాః=శ్రేష్ఠమైన ఆయుధములు గల, రాక్షసాః=రాక్షసులు, గజైశ్చ=ఏనుగులతోను, తురఙ్గైశ్చ=గుఱ్ఱములతోను, అమ్బుదనిఃస్వనైః=మేఘమువంటి ధ్వని గల, రథైశ్చ=రథములతోను, తాన్=వారిని, అనుజగ్ముః=అనుసరించి శీఘ్రముగా వెళ్ళిరి.

తా. ఆ మహాత్ములు, అమరావతినుండి దేవతల వలె బయలుదేరి వెళ్లిరి. మహాత్ములైన రాక్షసులు ఏనుగులను, గుఱ్ఱములను, మేఘమువంటి ధ్వని గల రథములను ఎక్కి వారి వెనుక శీఘ్రముగా వెళ్ళిరి. 33

మూ. తే విరేజుర్మహాత్మానః కుమారాః సూర్యవర్చసః, 34
కిరీటినః శ్రియా జుష్టా గ్రహా దీప్తా ఇవామ్బరే.

ప్ర. అ. సూర్యవర్చసః=సూర్యునివంటి కాంతి గలవారు, కిరీటినః=కిరీటములు గలవారు, శ్రియా=శోభతో, జుష్టాః=కూడినవారూ అయిన, మహాత్మానః=మహాత్ములైన, తే=ఆ, కుమారాః=కుమారులు, అమ్బరే=ఆకాశమునందు, దీప్తాః=ప్రజ్వలించుచున్న, గ్రహాః ఇవ=గ్రహములు వలె, విరేజుః=ప్రకాశించిరి.

తా. సూర్యుని వంటి కాంతి గల, కిరీటధారులు, శోభాసంపన్నులు, మహాత్ములు అయిన ఆ రాజకుమారులు ఆకాశమునందు ప్రకాశించుచున్న గ్రహముల వలె ప్రకాశించిరి. 34

మూ. ప్రగృహీతా బభౌ తేషాం వస్త్రాణామావలిః శివా, 35
శరదభ్రప్రతీకాశా హంసావలిరివామ్బరే.

ప్ర. అ. తేషామ్=వారియొక్క, వస్త్రాణామ్=వస్త్రములయొక్క, ప్రగృహీతా=ధరింపబడిన, శివా=మంగళకరమైన, శరదభ్రప్రతీకాశా=శరత్కాలమేఘములతో సమానమైన, ఆవలిః=పంక్తి, అమ్బరే=ఆకాశమునందు, హంసావలిః ఇవ=హంసల పంక్తి వలె, బభౌ=ప్రకాశించెను.

తా. వారు ధరించిన, శరత్కాలమేఘములతో సమానమైన, మంగలప్రదమైన వస్త్రపంక్తి ఆకాశమునందు హంసల పంక్తివలె ప్రకాశించెను. 35

మూ. మరణం వాపి నిశ్చిత్య శత్రూణాం వా పరాజయమ్, 36
ఇతి కృత్వా మతిం వీరా నిర్జగ్ముః సంయుగార్థినః.

ప్ర. అ. మరణం వాపి=మరణమును గాని, శత్రూణామ్=శత్రువులయొక్క, పరాజయం వాపి=పరాజయమును గాని, నిశ్చిత్య=నిశ్చయించి (వెళ్ళిరి.) వీరాః=ఆ వీరులు, ఇతి=ఇట్లు, మతిమ్=బుద్ధిని, కృత్వా=చేసి, సంయుగార్థినః=యుద్ధమును కోరుచున్నవారై, నిర్జగ్ముః=బయలుదేరిరి.

తా. మనము మరణించనైనా మరణించవలె లేదా శత్రువులను జయించనైనా జయించవలె అని నిశ్చయించుకుని ఆ వీరులు యుద్ధమును కోరుచు బయలుదేరిరి. 36

మూ. జగర్జుశ్చ ప్రణేదుశ్చ చిక్షిపుశ్చాపి సాయకాన్, 37
జగృహుశ్చ మహాత్మానో నిర్యాతా యుద్ధదుర్మదాః.

ప్ర. అ. నిర్యాతాః=బయల్వెడలిన, మహాత్మానః=మహాత్ములైన ఆ రాక్షసులు యుద్ధదుర్మదాః=యుద్ధమునిమిత్తమై దుష్టమదము కలవారై, జగర్జుశ్చ=గర్జించిరి ప్రణేదుశ్చ=ధ్వని చేసిరి. సాయకాన్=బాణములను, చిక్షిపుశ్చ=ప్రయోగించిరి జగృహుః చ=గ్రహించిరి.

తా. బయల్వెడలిన ఆ మహాత్ములైన రాక్షసులు యుద్ధము నిమిత్తము చెడ్డ మదము గలవారై గర్జించిరి. ధ్వని చేసిరి. బాణాలను గ్రహించిరి, వాటిని ప్రయోగించిరి. 37

మూ. క్ష్వేడితాస్ఫోటితానాం వై సంచచాలేవ మేదినీ, 38
రక్షసాం సింహనాదైశ్చ సంస్ఫోటితమివామ్బరమ్.

ప్ర. అ. క్ష్వేడితాస్ఫోటితానామ్= వివిధనాదములయొక్క, జబ్బలు చరచుటయొక్క (ధ్వనిచేత), మేదినీ=భూమి, సంచచాలేవ=చలించినట్లుండెను. రక్షసామ్=రాక్షసులయొక్క, సింహనాదైః=సింహనాదములచేత, అమ్బరమ్=ఆకాశము, సంస్ఫోటితమ్ ఇవ=బ్రద్దలైనట్లు అయినది.

తా. ఆ రాక్షసుల అరపులచేతను, జబ్బలు చరుచుటచేతను భూమి అదరిపోయినట్లు అయినది. వాళ్ళ సింహనాదములచేత ఆకాశము బ్రద్దలైనట్లు అయిపోయినది. 38

మూ. తేఽభినిష్క్రమ్య ముదితా రాక్షసేన్ద్రా మహాబలాః, 39
దదృశుర్వానరానీకం సముద్యతశిలాయుధమ్.

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గల, తే=ఆ, రాక్షసేన్ద్రాః=రాక్షసనాయకులు, అభినిష్క్రమ్య=బయల్వెడలి, సముద్యతశిలాయుధమ్=ఎత్తబడిన శిలలను ఆయుధములు గల, వానరానీకమ్=వానరసైన్యమును, దదృశుః=చూచిరి.

తా. గొప్ప బలము గల ఆ రాక్షసనాయకులు బయల్వెడలి వచ్చి శిలలను ఆయుధముల నెత్తి యుద్ధమునకు సిద్ధముగా ఉన్న వానరసైన్యమును చూచిరి. 39

మూ. హరయోఽపి మహాత్మానో దదృశూ రాక్షసం బలమ్, 40
హస్త్యశ్వరథసంబాధం కిఙ్కిణీశతనాదితమ్,
నీలజీమూతసంకాశం సముద్యతమహాయుధమ్. 41
దీప్తానలరవిప్రఖ్యైర్నైరృతైః సర్వతో వృతమ్,

ప్ర. అ. మహాత్మానః=మహాత్ములైన, హరయోఽపి=వానరులుకూడ, హస్త్యశ్వరథసంబాధమ్=ఏనుగులతోను, గుఱ్ఱములతోను, రథములతోను ఇరుకుగా ఉన్న, కిఙ్కిణీశతనాదితమ్=వందలకొలది మువ్వలచేత ధ్వనింపచేయబడిన, నీలజీమూతసంకాశమ్=నల్లని మేఘముతో సమానమైన, సముద్యతమహాయుధమ్=ఎత్తబడిన గొప్ప ఆయుధములు గల, సర్వతః=అంతటా, దీప్తానలరవిప్రఖ్యైః=ప్రజ్వలించే అగ్నిసూర్యులవలె ఉన్న, నైర్‌ఋతైః=రాక్షసులతో, వృతమ్=చుట్టువారుకొన్న, రాక్షసమ్=రాక్షససంబంధమైన, బలమ్=సైన్యమును, దదృశుః=చూచిరి.

తా. మహాత్ములైన వానరులు కూడ నల్లమేఘముల వలె ఉన్న ఆ రాక్షససైన్యమును చూచిరి. ఆ సైన్యము ఏనుగులతోను, గుఱ్ఱములతోను, రథములతోను కిక్కిరిసి ఉండెను. వందలకొలది గజ్జెలు మ్రోగుచుండెను. గొప్ప ఆయుధములు ఎత్తి వచ్చుచుండెను. 40, 41

మూ. తద్దృష్ట్వా బలమాయాతం లబ్ధలక్షాః ప్లవంగమాః, 42
సముద్యతమహాశైలాః సంప్రణేదుర్ముహుర్ముహుః,
అమృష్యమాణా రక్షాంసి ప్రతినర్దన్త వానరాః. 43

ప్ర. అ. ఆయాతమ్=వచ్చిన, తత్=ఆ, బలమ్=సైన్యమును, దృష్ట్వా=చూచి, ప్లవంగమాః=వానరులు, లబ్ధలక్షాః=పొందబడిన లక్ష్యము గలవారై, సముద్యతమహాశైలాః=ఎత్తబడిన మహాపర్వతములు కలవారై, ముహుర్ముహుః=మాటిమాటికి, సంప్రణేదుః=ధ్వని చేసిరి. వానరాః=వానరులు, రక్షాంసి=రాక్షసులను, అమృష్యమాణాః=సహించనివారై, ప్రతినర్దన్త=వారికి ఎదురుగా అరచిరి.

తా. వానరులు, వచ్చిన ఆ సైన్యమును చూచి, తాము యుద్ధము చేయుటకు లక్ష్యముగా రాక్షసులు లభించుటచేత పర్వతములను ఎత్తి మాటిమాటికి అరచిరి. ఆ రాక్షసులను చూడగానే కోపముతో ఈ విధముగా వారికి ఎదురుగా నిలచి అరచిరి. 42, 43

మూ. తతః సముత్కృష్టరవం నిశమ్య
రక్షోగణా వానరయూథపానామ్,
అమృష్యమాణాః పరహర్షముగ్ర
మహాబలాః భీమతరం వినేదుః. 44

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ఉగ్రమహాబలాః=భయంకరమైన గొప్ప బలము గల, రక్షోగణాః=రాక్షసగణములు, వానరయూథపానామ్=వానరసేనానాయకుల యొక్క, సముత్కృష్టరవమ్=అధికమైనధ్వనిని, నిశమ్య=విని, పరహర్షమ్=గొప్ప సంతోషమును, అమృష్యమాణాః=సహించనివారై, భీమతరమ్=ఎక్కువభయంకరముగా, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. పిమ్మట, భయంకరమైన మహాబలము గల రాక్షసులు వానర నాయకుల అధికమైన ధ్వనిని విని, శత్రువుల ఆ సంతోషమును సహించనివారై ఎక్కువ భయంకరముగా అరచిరి. 44

మూ. తే రాక్షసబలం ఘోరం ప్రవిశ్య హరియూథపాః,
విచేరురుద్యతైః శైలైర్నగాః శిఖరిణో యథా. 45

ప్ర. అ. తే=ఆ, హరియూథపాః=వానరసేనానాయకులు, ఘోరమ్=భయంకరమైన, రాక్షసబలమ్=రాక్షససైన్యమును, ప్రవిశ్య=ప్రవేశించి, ఉద్యతైః=ఎత్తబడిన, శైలైః=పర్వతములతో, శిఖరిణః=శిఖరములు గల, నగాః యథా=పర్వతములు వలె, విచేరుః=సంచరించిరి.

తా. ఆ వానరసేనానాయకులు భయంకరమైన రాక్షససేనలో ప్రవేశించి, పైకి ఎత్తబడిన పర్వతములతో, శిఖరములతో కూడిన పర్వతముల వలె సంచరించిరి. 45

మూ. కేచిదాకాశమావిశ్య కేచిదుర్వ్యాం ప్లవంగమాః,
రక్షఃసైన్యేషు సంక్రుద్ధాః చేరుర్ద్రుమశిలాయుధాః. 46

ప్ర. అ. కేచిత్=కొందరు, ప్లవంగమాః=వానరులు, ఆకాశమ్=ఆకాశమును, ఆవిశ్య=ప్రవేశించి, కేచిత్=కొందరు, ఉర్వ్యామ్=భూమియందు, సంక్రుద్ధాః=కోపించినవారై, ద్రుమశిలాయుధాః=వృక్షములు శిలలు ఆయుధములుగా కలవారై, రక్షఃసైన్యేషు=రాక్షససైన్యములయందు, చేరుః=సంచరించిరి.

తా. కోపించిన వానరులలో కొందరు ఆకాశములో ప్రవేశించి, కొందరు భూమిమీదనే ఉండి, వృక్షములను, శిలలను ఆయుధములుగా గ్రహించి రాక్షససైన్యములలో సంచరించిరి. 46

మూ. ద్రుమాంశ్చ విపులస్కన్ధాన్ గృహ్య వానరపుంగవాః,
తద్యుద్ధమభవద్ఘోరం రక్షోవానరసంకులమ్. 47

ప్ర. అ. వానరపుంగవాః=వానరశ్రేష్ఠులు, విపులస్కన్ధాన్=విశాలమైన మ్రానులు గల, ద్రుమాన్ చ=వృక్షములను, గృహ్య=గ్రహించి (సంచరించిరి). తత్=ఆ, రక్షోవానరసంకులమ్=రాక్షసులతోను వానరులతోను సంకులమైన, యుద్ధమ్=యుద్ధము, ఘోరమ్=భయంకరముగా, అభవత్=ఉండెను.

తా. వానరశ్రేష్ఠులు విశాలములైన మ్రానులు గల వృక్షములతో యుద్ధము చేసిరి. రాక్షసులతోను వానరులతోను వ్యాకులమైన ఆ యుద్ధము చాల భయంకరముగా ఉండెను. 47

మూ. తే పాదపశిలాశైలైశ్చక్రుర్వృష్టిమనూపమామ్,
బాణౌఘైర్వార్యమాణాశ్చ హరయో భీమవిక్రమాః. 48

ప్ర. అ. బాణౌఘైః=బాణసముదాయములచేత, వార్యమాణాః=నివారించబడుచున్న, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, తే=ఆ, హరయః=వానరులు, పాదపశిలాశైలైః=వృక్షములతోను, శిలలతోను, పర్వతములతోను, అనూపమామ్=సాటిలేని, వృష్టిమ్=వర్షమును, చక్రుః=చేసిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల ఆ వానరులు బాణసముదాయములచేత నివారింపబడుచున్నను సాటిలేని వృక్షశిలాశైలవర్షము కురిపించిరి. 48

మూ. సింహనాదాన్వినేదుశ్చ రణే రాక్షసవానరాః,
శిలాభిశ్చూర్ణయామాసుర్యాతుధానాన్ ప్లవంగమాః. 49

ప్ర. అ. రణే=యుద్ధమునందు, రాక్షసవానరాః=రాక్షసులు వానరులు, సింహనాదాన్=సింహగర్జనలను, వినేదుః=ధ్వనిచేసిరి. ప్లవంగమాః=వానరులు, యాతుధానాన్=రాక్షసులను, శిలాభిః=శిలలచేత, చూర్ణయామాసుః=చూర్ణముచేసిరి.

తా. ఆ యుద్ధమునందు వానరులు రాక్షసులు కూడ సింహనాదములు చేసిరి. వానరులు శిలలతో రాక్షసులను చూర్ణము చేసిరి. 49

మూ. నిజఘ్నుః సంయుగే క్రుద్ధాః కవచాభరణావృతాన్,
కేచిద్రథగతాన్వీరాన్ గజవాజిగతానపి. 50

ప్ర. అ. క్రుద్ధాః=కోపించిన వానరులు, సంయుగే=యుద్ధమునందు, కవచాభరణావృతాన్=కవచములతోను, ఆభరణములతోను కూడిన రాక్షసులను, నిజఘ్నుః=చంపిరి. కేచిత్=కొందరు, రథగతాన్=రథములయందున్న, వీరాన్=వీరులను, గజవాజిగతానపి=ఏనుగులమీద, గుఱ్ఱములమీద ఉన్నవారినీ కూడ (చంపిరి).

తా. కోపించిన వానరులు యుద్ధములో కవచములను, ఆభరణములను ధరించిన రాక్షసులను చంపిరి. కొందరు రథాలలో ఉన్నవారిని, గజములమీద ఉన్నవారిని, గుఱ్ఱములమీద ఉన్నవారిని చంపిరి. 50

మూ. నిర్జఘ్నుః సహసా వీరాన్యాతుధానాన్ ప్లవంగమాః,
శైలశృఙ్గాన్వితాఙ్గాస్తే ముష్టిభిర్వాన్తలోచనాః, 51
చేలుః పేతుశ్చ నేదుశ్చ తత్ర రాక్షసపుంగవాః.

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, వీరాన్=వీరులైన, యాతుధానాన్=రాక్షసులను, సహసా=శీఘ్రముగా, నిర్జఘ్నుః=కొట్టిరి. తత్ర=అక్కడ, తే=ఆ, రాక్షసపుంగవాః=రాక్షసశ్రేష్ఠులు, శైలశృఙ్గాన్వితాఙ్గాః=పర్వతశిఖరములతో కూడిన దేహములు కలవారై, ముష్టిభిః=గుద్దులచేత, వాన్తలోచనాః=పైకి తెప్పించబడిన కళ్ళుగలవారై, చేలుః=కదలిపోయిరి. పేతుశ్చ=పడిపోయిరి. నేదుశ్చ=అరచిరి.

తా. వానరులు శీఘ్రముగా వీరులైన రాక్షసులను కొట్టిరి. ఆ రాక్షసవీరులు పర్వతశిఖరములు మీదపడుటచేతను, వానరుల పిడికిళ్ళదెబ్బలకు కళ్లు పైకి వచ్చివేయుటచేతను, కంపించిపోయిరి. క్రింద పడిపోయిరి. అరచిరి.

మూ. రాక్షసాశ్చ శరైస్తీక్ష్ణైర్బిభిదుః కపికుఞ్జరాన్, 52
శూలముద్గరఖడ్గైశ్చ జఘ్నుః ప్రాసైశ్చ శక్తిభిః.

ప్ర. అ. రాక్షసాశ్చ=రాక్షసులు కూడ, తీక్ష్ణైః=వాడియైన, శరైః=బాణములచేత, కపికుఞ్జరాన్=వానరశ్రేష్ఠులను, బిభిదుః=భేదించిరి. శూలముద్గరఖడ్గైశ్చ=శూల-ముద్గర-ఖడ్గములచేతను, శక్తిభిః=శక్తులచేతను, ప్రాసైశ్చ=ప్రాసలచేతను, జఘ్నుః=కొట్టిరి.

తా. రాక్షసులు కూడ వాడియైన బాణాలతో వానరుల దేహములు చీల్చివేసిరి. శూలములతోను, ముద్గరములతోను, ఖడ్గములతోను, ప్రాసలతోను, శక్తులతోను కొట్టిరి. 52

మూ. అన్యోన్యం పాతయామాసుః పరస్పరజయైషిణః, 53
రిపుశోణితదిగ్ధాఙ్గాస్తత్ర వానరరాక్షసాః.

ప్ర. అ. తత్ర=అక్కడ, రిపుశోణితదిగ్ధాఙ్గాః=శత్రువుల రక్తముచేత పూయబడిన శరీరములు గల, వానరరాక్షసాః=వానరులు రాక్షసులు, పరస్పర జయైషిణః=పరస్పరముయొక్క జయమును కోరుచున్నవారై, అన్యోన్యమ్=పరస్పరము, పాతయామాసుః=పడద్రోసికొనిరి.

తా. అక్కడ శత్రువుల రక్తముచేత పూయబడిన శరీరములు గల వానర - రాక్షసులు పరస్పరము జయము కోరుచు ఒకరినొకరు క్రింద పడద్రోసికొనిరి. 53

మూ. తతః శైలైశ్చ ఖడ్గైశ్చ విసృష్టైర్హరిరాక్షసైః, 54
ముహూర్తేనావృతా భూమిరభవచ్ఛోణితోక్షితా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరిరాక్షసైః=వానరులచేత రాక్షసుల చేత, విసృష్టైః=విడవబడిన, శైలైశ్చ=పర్వతములచేతను, ఖడ్గైశ్చ=ఖడ్గములచేతను,

ముహూర్తేన=ముహూర్తకాలములో, ఆవృతా=కప్పబడిన, భూమిః=భూమి, శోణి తోక్షితా=రక్తముచేత తడపబడినది, అభవత్=ఆయెను.

తా. పిమ్మట ముహూర్తకాలములో ఆ రణభూమి వానరులు రాక్షసులు ప్రయోగించిన శైలములచేత ఖడ్గములచేత వ్యాప్తమైన రక్తముచేత తడపబడెను. 54

మూ. వికీర్ణైః పర్వతాకారై రక్షోభిరభిమర్దితైః, 55
ఆసీద్వసుమతీ పూర్ణా తదా యుద్ధమదాన్వితైః.

ప్ర. అ. తదా=అప్పుడు, వసుమతీ=భూమి, వికీర్ణైః=చిమ్మివేయబడిన, పర్వతాకారైః=పర్వతములవంటి ఆకారములు గల, అభిమర్దితైః=మర్దించబడిన, యుద్ధ మదాన్వితైః=యుద్ధమదముతో కూడిన, రక్షోభిః=రాక్షసులతో, పూర్ణా=నిండినది, ఆసీత్=ఆయెను.

తా. అప్పుడు భూమి అంతా ఇటూ అటూ పడవేయబడిన, పర్వతమువంటి ఆకారములు గల, యుద్ధమదము గల, మరణించిన రాక్షసులతో నిండి ఉండెను. 55

మూ. ఆక్షిప్తాః క్షిప్యమాణాశ్చ భగ్నశూలాశ్చ వానరైః, 56
పునరఙ్గైస్తదా చక్రురాసన్నా యుద్ధమద్భుతమ్.

ప్ర. అ. వానరైః=వానరులచేత, భగ్నశూలాః=విరగగొట్టబడిన శూలములు కలవారై, ఆక్షిప్తాః=క్రిందికి పడద్రోయబడినవారు, క్షిప్యమాణాశ్చ=పడద్రోయ బడుచున్నవారు అయిన రాక్షసులు, తదా=అప్పుడు, ఆసన్నాః=సమీపించిన వారై, తదా=అప్పుడు, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, యుద్ధమ్=యుద్ధమును, అఙ్గైః=అవయవములతో, చక్రుః=చేసిరి.

తా. అప్పుడు వానరులచే శూలములు విరుగగొట్టి క్రిందికి పడగొట్టబడిన, పడగొట్టబడుచున్న రాక్షసులు వాళ్ళను సమీపించి కరచరణాద్యవయవములతో మరల అద్భుతమైన యుద్ధము చేసిరి. 56

మూ. వానరాన్వానరైరేవ జఘ్నుస్తే నైరృతర్షభాః, 57
రాక్షసాన్రాక్షసైరేవ జఘ్నుస్తే వానరా అపి.

ప్ర. అ. తే=ఆ, నైరృతర్షభాః=రాక్షసశ్రేష్ఠులు, వానరాన్=వానరులను, వానరైరేవ=వానరులచేతనే, జఘ్నుః=కొట్టిరి. వానరాః అపి=వానరులు కూడ, రాక్షసాన్=రాక్షసులను, రాక్షసైరేవ=రాక్షసులచేతనే, జఘ్నుః=కొట్టిరి.

తా. ఆ రాక్షసశ్రేష్ఠులు వానరులను వానరులతో డీకొట్టించి చంపిరి. వానరుళు కూడ రాక్షసులను రాక్షసులచేత డీకొట్టించి చంపిరి. 57

మూ. ఆక్షిప్య చ శిలాః శైలాన్ జఘ్నుస్తే రాక్షసాస్తదా, 58
తేషాం చాచ్ఛిద్య శస్త్రాణి జఘ్నూ రక్షాంసి వానరాః.

ప్ర. అ. తదా=అప్పుడు, తే రాక్షసాః=ఆ రాక్షసులు, శిలాః=శిలలను, శైలాన్=పర్వతములను, ఆక్షిప్య=లాగికొని, జఘ్నుః=కొట్టిరి. వానరాః చ=వానరులు కూడ, తేషామ్=వాళ్ళయొక్క, శస్త్రాణి=ఆయుధములను, ఆచ్ఛిద్య=లాగికొని, రక్షాంసి=రాక్షసులను, జఘ్నుః=కొట్టిరి.

తా. అప్పుడు రాక్షసులు వానరులనుండి శిలలను, శైలములను లాగికొని వాళ్ళను చంపిరి. వానరులు కూడ రాక్షసుల ఆయుధములను లాగికొని వాళ్ళను కొట్టిరి. 58

మూ. నిర్జఘ్నుః శైలశృఙ్గైశ్చ బిభిదుశ్చ పరస్పరమ్, 59
సింహనాదాన్వినేదుశ్చ రణే రాక్షసవానరాః.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, వానరరాక్షసాః=వానరులు రాక్షసులు, శైలశృఙ్గైః=పర్వతశిఖరములచేత, పరస్పరమ్=పరస్పరము, బిభిదుః=భేదించుకొనిరి. సింహనాదైః=సింహనాదములతో, వినేదుశ్చ=ధ్వనిచేసిరి.

తా. ఆ వానరులు, రాక్షసులు యుద్ధమునందు పర్వతశిఖరములతో ఒకరి దేహములను ఒకరు బ్రద్దలు కొట్టుకొనిరి. సింహనాదములు చేసిరి. 59

మూ. ఛిన్నవర్మతనుత్రాణా రాక్షసా వానరైర్హతాః, 60
రుధిరం ప్రస్రుతాస్తత్ర రససారమివ ద్రుమాః.

ప్ర. అ. వానరైః=వానరులచేత, హతాః=కొట్టబడిన, రాక్షసాః=రాక్షసులు, ఛిన్నవర్మతనుత్రాణాః= ఛేదించబడిన కవచములు కలవారై, ద్రుమాః=వృక్షములు, రససారమ్=జిగురును వలె, తత్ర=ఆ ప్రదేశమునందు, రుధిరమ్=రక్తమును, ప్రస్రుతాః=స్రవించిరి.

తా. వానరులచేత కొట్టబడిన రాక్షసుల కవచములు బ్రద్దలైపోవుటచే వాళ్ళ శరీరములనుండి, చెట్లనుండి జిగురు కారినట్లు రక్తము కారెను. 60

మూ. రథేన చ రథం చాపి వారణేనాపి వారణమ్, 61
హయేన చ హయం కేచిన్నిర్జఘ్నుర్వానరా రణే.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, కేచిత్=కొందరు, వానరాః=వానరులు, రథేన=రథముచేత, రథమ్=రథమును, వారణేనాపి=ఏనుగుచేత, వారణమ్=ఏనుగును, హయేన=గుఱ్ఱముచేత, హయమ్=గుఱ్ఱమును, నిర్జఘ్నుః=కొట్టిరి.

తా. ఆ యుద్ధములో కొందరు వానరులు రథముచేత రథమునూ, ఏనుగుచేత ఏనుగును, గుఱ్ఱముచేత గుఱ్ఱమును ఢీకొట్టించి చంపిరి. 61

మూ. క్షురప్రైరర్ధచన్ద్రైశ్చ భల్లైశ్చ నిశితైః శరైః, 62
రాక్షసా వానరేన్ద్రాణాం బిభిదుః పాదపాన్ శిలాః.

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, క్షురప్రైః=క్షురప్రబాణములచేతను, అర్ధచన్ద్రైః చ=అర్ధచంద్రబాణములచేతను, భల్లైశ్చ=భల్లబాణములచేతను, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేతను, వానరేన్ద్రాణామ్=వానరనాయకులయొక్క, పాదపాన్=వృక్షములను, శిలాః=శిలలను, బిభిదుః=బ్రద్దలుకొట్టిరి.

తా. రాక్షసులు క్షురప్ర - అర్ధచంద్ర - భల్లబాణములచేత, వాడియైన ఇతరబాణములచేత వానరులు ప్రయోగించిన వృక్షములను, శిలలను ఖండించిరి. 62

మూ. వికీర్ణా పర్వతైస్తైశ్చ ద్రుమైశ్ఛిన్నైశ్చ సంయుగే, 63
హతైశ్చ కపిరక్షోభిర్దుర్గమా వసుధాభవత్.

ప్ర. అ. సంయుగే=యుద్ధమునందు, తైః=ఆ, పర్వతైః=పర్వతములతోను, ఛిన్నైః=ఛేదించబడిన, ద్రుమైః=వృక్షములతోను, హతైః=చంపబడిన, కపిరక్షోభిః చ=వానర - రాక్షసులతోను, వికీర్ణా=వ్యాప్తమై, వసుధా=భూమి, దుర్గమా=నడవ శక్యము కానిది, అభవత్=ఆయెను.

తా. యుద్ధమునందు ఆ పర్వతములతోను, ఛేదించబడిన వృక్షములతోను, చంపబడిన వానర - రాక్షసులతోను వ్యాప్తమైన భూమి నడచుటకు శక్యము కాకుండ ఉండెను. 63

మూ. తే వానరా గర్వితహృష్టచేష్టాః
సంగ్రామమాసాద్య భయం విముచ్య,
యుద్ధం స్మ సర్వే సహ రాక్షసైస్తై
ర్నానాయుధైశ్చక్రురదీనసత్త్వాః. 64

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, సంగ్రామమ్=యుద్ధమును, ఆసాద్య=పొంది, గర్వితహృష్టచేష్టాః=గర్వించిన, సంతోషముతో కూడిన చేష్టలు కలవారై, భయమ్=భయమును, విముచ్య=విడచి, సర్వే=అందరూ, అదీనసత్త్వాః=దీనములు కాని మనస్సులు కలవారై, నానాయుధైః=అనేకవిధములైన ఆయుధములు గల, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, యుద్ధమ్=యుద్ధమును, చక్రుః స్మ=చేసిరి.

తా. ఆ వానరులందరూ దైన్యము లేని మనస్సులతో గర్వించి, సంతోషములో కూడిన చేష్టలు చేయుచు యుద్ధరంగములో భయమును విడచి, అనేకవిదములైన ఆయుధములు గల రాక్షసులతో యుద్ధము చేసిరి. 64

మూ. తస్మిన్ ప్రవృత్తే తుములే విమర్దే
ప్రహృష్యమాణేషు వలీముఖేషు,
నిపాత్యమానేషు చ రాక్షసేషు
మహర్షయో దేవగణా వినేదుః. 65

ప్ర. అ. ప్రవృత్తే=ప్రారంభమైన, తస్మిన్=ఆ, తుములే=వ్యాకులమైన, విమర్దే=యుద్ధమునందు, వలీముఖేషు=వానరులు, ప్రహృష్యమాణేషు=సంతోషించుచుండగా, రాక్షసేషు=రాక్షసులు, నిపాత్యమానేషు=పడగొట్టబడుచుండగా, మహర్షయః=మహర్షులు, దేవగణాః=దేవతాగణములు, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. ఆ వ్యాకులమైన యుద్ధమునందు వానరులు సంతోషించుచుండుటను, రాక్షసులు నేలపై కూలుటను చూచి మహర్షులు, దేవతాగణములు సంతోషములో ధ్వనులు చేసిరి. 65

మూ. తతో హయం మారుతతుల్యవేగ
మారుహ్య శక్తిం నిశితాం ప్రగృహ్య,
నరాన్తకో వానరసైన్యముగ్రం
మహార్ణవం మీన ఇవావివేశ. 66

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నరాన్తకః=నరాంతకుడు, మారుతతుల్యవేగమ్=వాయువుతో సమానమైన వేగము గల, హయమ్=గుఱ్ఱమును, ఆరుహ్య=ఎక్కి, నిశితామ్=వాడియైన, శక్తిమ్=శక్తిని, ప్రగృహ్య=గ్రహించి, మీనః=మీనము, మహార్ణవమ్ ఇవ=మహాసముద్రమును వలె, ఉగ్రమ్=భయంకరమైన, వానరసైన్యమ్=వానరసైన్యమును, ఆవివేశ=ప్రవేశించెను.

తా. ఇంతలో నరాంతకుడు వాయువుతో సమానమైన వేగము గల గుఱ్ఱము నెక్కి వాడియైన శక్తిని గ్రహించి, భయంకరమైన ఆ వానరసైన్యములో, మీనము సముద్రములో ప్రవేశించినట్లు ప్రవేశించెను. 66

మూ. స వానరాన్ సప్తశతాని వీరః
ప్రాసేవ దీప్తేన వినిర్బిభేద,
ఏకః క్షణేనేన్ద్రరిపుర్మహాత్మా
జఘాన సైన్యం హరిపుఙ్గవానామ్. 67

ప్ర. అ. వీరః=వీరుడు, మహాత్మా=మహాత్ముడూ అయిన, సః=ఆ నరాంతకుడు, ఏకః=ఒక్కడే, దీప్తేన-ప్రకాశించుచున్న, ప్రాసేన-ప్రాసతో, క్షణేన=ఒక్క క్షణముచేత, సప్తశతాని-ఏడు వందల, వానరాన్=వానరులను, నిర్బిభేద=భేదించెను. ఇన్ద్రరిపుః=ఇంద్రశత్రువైన అతడు, హరిపుఙ్గవానామ్=వానరశ్రేష్ఠులయొక్క, సైన్యమ్=సైన్యమును, జఘాన=చంపెను.

తా. వీరుడు, మహాత్ముడు, ఇంద్రుని శత్రువూ అయిన ఆ నరాంతకుడు ఒక్కడే క్షణకాలములో, ప్రకాశించుచున్న ప్రాసతో ఏడువందలమంది వానరులను పొడిచి చంపి, వానరశ్రేష్ఠుల సైన్యమును సంహరించెను. 67

మూ. దదృశుశ్చ మహాత్మానం హయపృష్ఠప్రతిష్ఠితమ్,
చరన్తం హరిసైన్యేషు విద్యాధరమహర్షయః. 68

ప్ర. అ. విద్యాధరమహర్షయః=విద్యాధరులు మహర్షులు, హయపృష్ఠప్రతిష్ఠితమ్=గుఱ్ఱము వీపుమీద కూర్చున్న, హరిసైన్యేషు=వానరసైన్యములయందు, చరన్తమ్=సంచరించుచున్న, మహాత్మానమ్=మహాత్ముడైన నరాంతకుణ్ణి, దదృశుః=చూచిరి.

తా. మహాత్ముడైన ఆ నరాంతకుడు గుఱ్ఱముమీద కూర్చుండి వానరసైన్యములలో తిరుగుచుండగా విద్యాధరులు, మహర్షులు చూచిరి. 68

మూ. స తస్య దదృశే మార్గో మాంసశోణితకర్దమః,
పతితైః పర్వతాకారైర్వానరైరభిసంవృతః. 69

ప్ర. అ. మాంసశోణితకర్దమః=మాంసము, రక్తము అను బురద గల, పతితైః=పడి ఉన్న, పర్వతాకారైః=పర్వతమువంటి ఆకారము గల, వానరైః=వానరులచేత, అభిసంవృతః=కప్పబడిన, తస్య=వానియొక్క, సః మార్గః=ఆ మార్గము, దదృశే=చూడబడెను.

తా. అతడు సంచరించిన మార్గము మాంసము రక్తము అను బురదతోను, నేలపై పడిన పర్వతము వంటి ఆకారము గల వానరులతోను నిండి ఉండెను. 69

మూ. యావద్విక్రమితుం బుద్ధిం చక్రుః ప్లవగపుంగవాః,
తావదేతానతిక్రమ్య నిర్బిభేద నరాన్తకః. 70

ప్ర. అ. ప్లవగపుంగవాః=వానరశ్రేష్ఠులు, విక్రమితుమ్=పరాక్రమించుటకు, యావత్=ఎంతలో, బుద్ధిమ్=బుద్ధిని, చక్రుః=చేసిరో, తావదేవ=అంతలోనే, ఏతాన్=వీళ్ళను, అతిక్రమ్య=అతిక్రమించి, నరాన్తకః=నరాంతకుడు, నిర్బిభేద=భేదించెను.

తా. తమ పరాక్రమము చూపవలె నని వానరులు అనుకొనే లోపుగానే నరాంతకుడు వాళ్ళను అతిక్రమించి చీల్చివేయుచుండెను. 70

మూ. దదాహ హరిసైన్యాని వనానీవ విభావసుః,
యావదుత్పాటయామాసుర్వృక్షాన్ శైలాన్వనౌకసః, 71
తావత్ప్రాసహతాః పేతుర్వజ్రకృత్తా ఇవాచలాః.

ప్ర. అ. విభావసుః=అగ్ని, వనానీవ=వనములను వలె, హరిసైన్యాని=వానర సైన్యములను, దదాహ=కాల్చివేసెను. వనౌకసః=వానరులు, వృక్షాన్=వృక్షములను, శైలాన్=పర్వతములను, యావత్=ఎంతలో, ఉత్పాటయామాసుః=పెకలించిరో, తావత్=అంతలోనే, ప్రాసహతాః=ప్రాసచేత కొట్టబడినవారై, వజ్రకృత్తాః= వజ్రముచేత ఛేదించబడిన, అచలాః ఇవ=పర్వతములు వలె, పేతుః=పడిరి.

తా. అతడు, అగ్ని వనములను కాల్చినట్లు వానరసైన్యములను ధ్వంసము చేసెను. వానరులు వృక్షాలను, పర్వతాలను పెకలించే లోపుగానే ప్రాసచేత కొట్టబడినవారై, వజ్రముచేత ఛేదించబడిన పర్వతముల వలె పడిపోయిరి.

మూ. జ్వలన్తం ప్రాసముద్యమ్య సంగ్రామాన్తే నరాన్తకః, 72
దిక్షు సర్వాసు బలవాన్ విచచార నరాన్తకః,
ప్రమృద్నన్ సర్వతో యుద్ధే ప్రావృట్కాలే యథానిలః. 73

ప్ర. అ. నరాన్తకః=నరులను నశింపచేయు, బలవాన్=బలవంతుడైన, నరాన్తకః=నరాంతకుడు, సంగ్రామాన్తే=యుద్ధమధ్యమునందు, జ్వలన్తమ్=ప్రజ్వలించుచున్న, ప్రాసమ్=ప్రాసను, ఉద్యమ్య=ఎత్తి, యుద్ధే=యుద్ధరంగమునందు, అనిలః=వాయువు, ప్రావృట్కాలే ఇవ=వర్షకాలమునందు వలె, సర్వతః=అంతటా, ప్రమృద్నన్=మర్దించుచు, సర్వాసు=సమస్తమైన, దిక్షు=దిక్కులయందు, విచచార=సంచరించెను.

తా. నరులను సంహరించువాడు, బలవంతుడు అయిన నరాంతకుడు, ఆ యుద్ధరంగమునందు ప్రాసను ఎత్తి వర్షాకాలవాయువువలె అన్ని వైపులా మర్దించుచు అన్ని దిక్కులయందు సంచరించెను. 72, 73

మూ. న శేకుర్భాషితుం వీరా న స్థాతుం స్పన్దితుం కుతః,
ఉత్పతన్తం స్థితం యాన్తం సర్వాన్వివ్యాధ వీర్యవాన్. 74

ప్ర. అ. వీరాః=వీరులైన వానరులు, భాషితుమ్=మాటలాడుటకు, న శేకుః=సమర్థులు కాలేదు. స్థాతుమ్=నిలబడుటకు, న=సమర్థులు కాలేదు; స్పన్దితుమ్=కదలుటకు, కుతః=ఎట్లు? వీర్యవాన్=పరాక్రమవంతుడైన ఆ నరాంతకుడు, ఉత్పతన్తమ్=ఎగురుచున్నవానిని, స్థితమ్=నిలచినవానిని,

యాన్తమ్=నడుచుచున్నవానిని, సర్వాన్=అందరినీ, వివ్యాధ=కొట్టెను.

తా. వీరులైన వానరులు మాటలాడుటకు కాని, నిలచుటకు కాని సమర్థులు కాలేదు. కదలుట మాట చెప్పవలెనా? పరాక్రమవంతుడైన ఆ నరాంతకుడు ఎగురుచున్నవానిని, నిలచినవానిని, వెళ్ళుచున్నవానినీ అందరినీ కూడ కొట్టెను. 74

మూ. ఏకేనానన్తకల్పేన ప్రాసేనాదిత్యతేజసా,
భగ్నాని హరిసైన్యాని నిపేతుర్ధరణీతలే. 75

ప్ర. అ. అనన్తకల్పేన=అసంఖ్యాకులతో సమానుడైన, ఏకేన=ఒక్క నరాంతకునిచేత, ఆదిత్యతేజసా=సూర్యునివంటి తేజస్సుగల, ప్రాసేన=ప్రాసచేత, హరిసైన్యాని=వానరసైన్యములు, భగ్నాని=కొట్టబడినవై, ధరణీతలే=నేలమీద, నిపేతుః=పడినవి.

తా. ఒక్క నరాంతకుడే ఎంతోమంది రాక్షసుల వలె సూర్యుని వంటి తేజస్సు గల ప్రాసతో చంపివేయగా వానరసైన్యములు నేలమీద పడిపోయినవి. 75

మూ. వజ్రనిష్పేషసదృశం ప్రాసస్యాభినిపాతనమ్,
న శేకుర్వానరాః సోఢుం తే వినేదుర్మహాస్వనమ్. 76

ప్ర. అ. తే=ఆ, వానరాః=వానరులు, వజ్రనిష్పేషసదృశమ్=వజ్రముచేత నలిపివేయుటతో సమానమైన, ప్రాసస్య=ప్రాసయొక్క, అభినిపాతనమ్=పడుటను, సోఢుమ్=సహించుటకు, న శేకుః=సమర్థులు కాలేదు. మహాస్వనమ్=గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినేదుః=అరచిరి.

తా. ఆ వానరులు వజ్రాయుధము దెబ్బ వంటి ఆ ప్రాస ప్రహారమును సహించజాలక బిగ్గరగా అరచిరి. 76

మూ. పతతాం హరివీరాణాం రూపాణి ప్రచకాశిరే,
వజ్రభిన్నాగ్రకూటానాం శైలానాం పతతామివ. 77

ప్ర. అ. పతతామ్=పడుచున్న, హరివీరాణామ్=వానరులయొక్క, రూపాణి=రూపములు, వజ్రభిన్నాగ్రకూటానామ్=వజ్రముచేత భేదించబడిన శిఖరాగ్రములు గల, పతతామ్=పడుచున్న, శైలానామ్ ఇవ= పర్వతముల రూపములు వలె, ప్రచకాశిరే=ప్రకాశించినవి.

తా. క్రింద పడిపోవుచున్న వానరుల రూపములు వజ్రాయుధముచేత శిఖరాగ్రములను భేదించగా పడిపోవుచున్న పర్వతముల వలె ప్రకాశించినవి. 77

మూ. యే తు పూర్వం మహాత్మానః కుమ్భకర్ణేన పాతితాః,
తే స్వస్థా వానరశ్రేష్ఠాః సుగ్రీవముపతస్థిరే. 78

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, యే=ఏ, మహాత్మానః=మహాత్ములైన వానరులు, కుమ్భకర్ణేన=కుంభకర్ణునిచేత, పాతితాః=పడగొట్టబడిరో, తే=ఆ, వానరశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, స్వస్థాః=స్వస్థులై, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఉపతస్థిరే=చేరిరి.

తా. పూర్వము కుంభకర్ణునిచేత పడగొట్టబడిన మహాత్ములైన వానరశ్రేష్ఠులు కోల్కొని రక్షణార్థమై సుగ్రీవుని దగ్గరకు వెళ్ళిరి. 78

మూ. ప్రేక్షమాణః స సుగ్రీవో దదృశే హరివాహినీమ్,
నరాన్తకభయత్రస్తాం విద్రవన్తీమితస్తతః. 79

ప్ర. అ. ప్రేక్షమాణః=చూచుచున్న, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, నరాన్తకభయత్రస్తామ్=నరాంతకునివలన భయముచేత పీడింపబడిన, ఇతస్తతః=ఇటునటు, విద్రవన్తీమ్=భయపడుచున్న, హరివాహినీమ్=వానరసేనను, దదృశే=చూచెను.

తా. పరిశీలించి చూచిన సుగ్రీవునకు నరాంతకునినుండి భయముచే ఇటు నటు పారిపోవుచున్న వానరసైన్యము కనబడెను. 79

మూ. విద్రుతాం వాహినీం దృష్ట్వా స దదర్శ నరాన్తకమ్,
గృహీతప్రాసమాయాన్తం హయపృష్ఠప్రతిష్ఠితమ్. 80

ప్ర. అ. సః=అతడు, విద్రుతామ్=పరిగెత్తిపోవుచున్న, వాహినీమ్=సేనను, దృష్ట్వా=చూచి, గృహీతప్రాసమ్=గ్రహించబడిన ప్రాస గల, హయపృష్ఠప్రతిష్ఠితమ్=గుఱ్ఱము వీపుమీద కూర్చున్న, ఆయాన్తమ్=వచ్చుచున్న, నరాన్తకమ్=నరాంతకుణ్ణి, దదర్శ=చూచెను.

తా. పారిపోవుచున్న సైన్యమును చూచుచున్న ఆ సుగ్రీవునకు ప్రాస ధరించి గుఱ్ఱమునెక్కి వచ్చుచున్న నరాంతకుడు కనబడెను. 80

మూ. దృష్ట్వోవాచ మహాతేజాః సుగ్రీవో వానరాధిపః,
కుమారమఙ్గదం వీరం శక్రతుల్యపరాక్రమమ్. 81

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వానరాధిపః=వానరప్రభువైన, సుగ్రీవః=సుగ్రీవుడు, దృష్ట్వా=చూచి, వీరమ్=వీరుడు, శక్రతుల్యపరాక్రమమ్=దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడు అయిన, కుమారమ్=కుమారుడైన, అఙ్గదమ్=అంగదుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. గొప్ప తేజస్సు గల వానరరాజైన సుగ్రీవుడు మాచి, దేవేంద్రునివంటి పరాక్రమము గల వీరుడైన అంగదునితో ఇట్లు పలికెను. 81

మూ. గచ్ఛైనం రాక్షసం వీరం యోఽసౌ తురగమాస్థితః,
భక్షయన్తం పరబలం క్షిప్రం ప్రాణైర్వియోజయ. 82

ప్ర. అ. గచ్ఛ=వెళ్ళుము; యః అసౌ=ఏ ఇతడు, తురగమ్=గుఱ్ఱమును, ఆస్థితః=అధిష్ఠించి ఉన్నాడో, పరబలమ్=శత్రుసైన్యమును, భక్షయన్తమ్=భక్షించుచున్న, ఏనమ్=ఈ, వీరమ్=వీరుడైన, రాక్షసమ్=రాక్షసుణ్ణి, క్షిప్రమ్=శీఘ్రముగా, ప్రాణైః=ప్రాణములతో, వియోజయ=విముక్తుణ్ణి చేయుము.

తా. నీవు వెళ్ళుము; గుఱ్ఱము నెక్కి శత్రుసైన్యమును నశింపచేయుచున్న వీరుడైన ఈ రాక్షసుని వెంటనే చంపివేయుము. 82

మూ. స భర్తుర్వచనం శ్రుత్వా నిష్పపాతాఙ్గదస్తదా,
అనీకాన్మేఘసంకాశాదంశుమానివ వీర్యవాన్. 83

ప్ర. అ. తదా=అప్పుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః అఙ్గదః=ఆ అంగదుడు, భర్తుః=ప్రభువుయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, మేఘసంకాశాత్=మేఘమువంటి, అనీకాత్=సైన్యమునుండి, అంశుమానివ=సూర్యుడు వలె, నిష్పపాత=శీఘ్రముగా ఎగిరి వచ్చెను.

తా. పరాక్రమవంతుడైన అంగదుడు ప్రభువైన సుగ్రీవుని మాటలు విని మేఘమువంటి సైన్యమునుండి సూర్యుడు వలె శీఘ్రముగా ఎగిరి వచ్చెను.

మూ. శైలసంఘాతసంకాశో హరీణాముత్తమోఽఙ్గదః,
రరాజాఙ్గదసంనద్ధః సధాతురివ పర్వతః. 84

ప్ర. అ. శైలసంఘాతసంకాశః=శిలల సముదాయముతో సమానుడు, హరీణామ్=వానరులలో, ఉత్తమః=ఉత్తముడు, అఙ్గదసంనద్ధః=కట్టబడిన బాహుపురులుగలవాడు అయిన, అఙ్గదః=అంగదుడు, సధాతుః=ధాతువులతోకూడిన, పర్వతః ఇవ=పర్వతము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. శిలల సముదాయము వలె ఉన్న వానరశ్రేష్ఠుడైన అంగదుడు బాహుపురులను ధరించి, ధాతువులతో కూడిన పర్వతము వలె ఉండెను. 84

మూ. నిరాయుధో మహాతేజాః కేవలం నఖదంష్ట్రవాన్,
నరాన్తకమభిక్రమ్య వాలిపుత్రోఽబ్రవీద్వచః. 85

ప్ర. అ. నిరాయుధః=ఆయుధములు లేనివాడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు, కేవలమ్=కేవలము, నఖదంష్ట్రవాన్=గోళ్ళూ, కోరలూ మాత్రమే కలవాడు అయిన, వాలిపుత్రః=అంగదుడు, నరాన్తకమ్=నరాంతకుని, అభిక్రమ్య=సమీపించి, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఏ ఆయుధములూ లేక కేవలము గోళ్ళూ, కోరలూ మాత్రమే ఆయుధములుగా ఉన్న గొప్ప తేజస్సు గల అంగదుడు నరాంతకుని వద్దకు వెళ్ళి ఇట్లు పలికెను. 85

మూ. తిష్ఠ కిం ప్రాకృతైరేభిర్హరిభిస్త్వం కరిష్యసి,
అస్మిన్ వజ్రసమస్పర్శం ప్రాసం క్షిప మమోరసి. 86

ప్ర. అ. తిష్ఠ=నిలువుము. ఏభిః=ఈ, ప్రాకృతైః=సామాన్యులైన, హరిభిః=వానరులతో, త్వమ్=నీవు, కిమ్=ఏమి, కరిష్యసి=చేయగలవు? మమ=నాయొక్క, అస్మిన్=ఈ, ఉరసి=వక్షఃస్థలముమీద, వజ్రసమస్పర్శమ్=వజ్రముతో సమానమైన స్పర్శ గల, ప్రాసమ్=ప్రాసను, క్షిప=విసురుము.

తా. ఆగుము. సామాన్యులైన ఈ వానరులతో నీమేమి చేసెదవు? వజ్రమువంటి స్పర్శ గల నీ ప్రాసను ఈ నా వక్షస్థలము మీదకు విసరుము.

మూ. అఙ్గదస్య వచః శ్రుత్వా ప్రచుక్రోధ నరాన్తకః,
సందశ్య దశనైరోష్ఠం నిఃశ్వస్య చ భుజఙ్గవత్, 87
అభిగమ్యాఙ్గదం క్రుద్ధో వాలిపుత్రం నరాన్తకః.

స ప్రాసమావిధ్య తదాఙ్గదాయ
సముజ్జ్వలన్తం సహసోత్ససర్జ,
స వాలిపుత్రోరసి వజ్రకల్పే
బభూవ భగ్నో న్యపతచ్చ భూమౌ. 88

ప్ర. అ. నరాన్తకః=నరాంతకుడు, అఙ్గదస్య=అంగదునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, ప్రచుక్రోధ=కోపించెను. సః నరాన్తకః=ఆ నరాంతకుడు, క్రుద్ధః=కోపించినవాడై, దశనైః=దంతములచేత, ఓష్ఠమ్=పెదవిని, సందశ్య=కరచి, భుజఙ్గవత్=సర్పము వలె, నిఃశ్వస్య చ=నిట్టూర్చి, వాలిపుత్రమ్=వాలిపుత్రుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, అభిగమ్య=సమీపించి, సముజ్జ్వలన్తమ్=ప్రకాశించుచున్న, ప్రాసమ్=ప్రాసను, సమావిధ్య= గట్టిగా పట్టి, తదా=అప్పుడు, అఙ్గదాయ=అంగదునకు, సహసా=శీఘ్రముగా, ఉత్ససర్జ=విడచెను. సః=ఆ ప్రాసము, వజ్రకల్పే=వజ్రముతో సమానమైన, వాలిపుత్రోరసి=అంగదుని వక్షఃస్థలము మీద, భగ్నః బభూవ=విరిగిపోయినది; భూమౌ=నేలమీద, న్యపతచ్చ=పడిపోయెను.

తా. అంగదుని మాటలు వినగానే నరాంతకునకు చాల కోపము వచ్చెను. ఆ నరాంతకుడు కోపించి పెదవులు కరచి, సర్పము వలె నిట్టూర్చుచు అంగదుని సమీపించి, ప్రకాశించుచున్న ఆ ప్రాసను గట్టిగా పట్టి, దానిని అంగదుని మీదికి విసరెను. అది వజ్రమువంటి అంగదుని వక్షఃస్థలముమీద

పడి ముక్కలై, నేలమీద పడిపోయెను. 87, 88

మూ. తం ప్రాసమాలోక్య తదా విభగ్నం
సుపర్ణకృత్తోరగవీర్యకల్పమ్,
తలం సముద్యమ్య స వాలిపుత్ర
స్తురంగమస్యాభిజఘాన మూర్ధ్ని. 89

ప్ర. అ. సః వాలిపుత్రః=ఆ అంగదుడు, తదా=అప్పుడు, విభగ్నమ్=భగ్నమైన, సుపర్ణకృత్తోరగవీర్యకల్పమ్=గరుత్మంతునిచేత ఛేదించబడిన సర్పముయొక్క పరాక్రమమువంటి పరాక్రమము గల, ప్రాసమ్=ఆ ప్రాసను, ఆలోక్య=చూచి, తలమ్=అరచేతిని, ఉద్యమ్య=ఎత్తి, తురంగమస్య=గుఱ్ఱముయొక్క, మూర్ధ్ని=శిరస్సుపై, అభిజఘాన=కొట్టెను.

తా. అంగదుడు అప్పుడు గరుత్మంతునిచేత ఛేదించబడిన సర్పము వలె పరాక్రమము (బలము) నిష్ఫలముకాగా విరిగిపోయిన ప్రాసను చూచి, అరచేయి బాగా చాచి, గుఱ్ఱము తలమీద కొట్టెను. 89

మూ. నిభగ్నపాదః స్ఫుటితాక్షితారో
నిష్క్రాన్తజిహ్వోఽ చలసంనికాశః,
స తస్య వాజీ నిపపాత భూమౌ
తలప్రహారేణ విశీర్ణమూర్ధా. 90

ప్ర. అ. తస్య=ఆతనియొక్క, అచలసంనికాశః=పర్వతమువంటి, సః వాజీ=ఆ గుఱ్ఱము, తలప్రహారేణ=అరచేతిదెబ్బచేత, విశీర్ణమూర్ధా=బద్దలైన శిరస్సు గలదై, నిభగ్నపాదః=విరిగిన పాదములుగలదై, స్ఫుటితాక్షితారః=పేలిపోయిన కళ్ళు నల్లగుడ్లు కలదై, నిష్క్రాన్తజిహ్వః=పైకి వచ్చిన నాలుకగలదై, భూమౌ=నేలమీద, నిపపాత=పడెను.

తా. నరాంతకుని ఆ పర్వతము వంటి గుఱ్ఱము అరచేతిదెబ్బచేత తల పగిలి, పాదములు విరిగి, కళ్ళు, కంటి గ్రుడ్లు బద్దలై, నాలుక పైకి వచ్చి క్రింద పడిపోయెను. 90

మూ. నరాన్తకః క్రోధవశం జగామ
హతం తురంగం పతితం సమీక్ష్య,
స ముష్టిముద్యమ్య మహాప్రభావో
జఘాన శీర్షే యుధి వాలిపుత్రమ్. 91

ప్ర. అ. హతమ్=చంపబడిన, పతితమ్=పడిపోయిన, తురగమ్=

గుఱ్ఱమును, సమీక్ష్య=చూచి, నరాన్తకః=నరాంతకుడు, క్రోధవశమ్=క్రోధమునకు వశమును, జగామ=పొందెను. మహాప్రభావః=గొప్ప ప్రభావము గల, సః=అతడు, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, యుధి=యుద్ధములో, వాలిపుత్రమ్=అంగదుణ్ణి, శీర్షే=శిరస్సుపై, జఘాన=కొట్టెను.

తా. గుఱ్ఱము చచ్చి నేలమీద పడిపోవుట చూచి నరాంతకుడు క్రోధావిష్టుడయ్యెను. గొప్ప ప్రభావము గల అతడు పిడికిలి ఎత్తి యుద్ధములో ఆ అంగదుని తలమీద కొట్టెను. 91

మూ. అథాఙ్గదో ముష్టివిశీర్ణమూర్ధా
సుస్రావ తీవ్రం రుధిరం భృశోష్ణమ్,
ముహుర్విజజ్వాల ముమోహ చాపి
సంజ్ఞాం సమాసాద్య విసిస్మియే చ. 92

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ముష్టివిశీర్ణమూర్ధా=పిడికిలిచేత బ్రద్దలు కొట్టబడిన శిరస్సు కలవాడై, అఙ్గదః=అంగదుడు, భృశోష్ణమ్=చాల వేడియైన, రుధిరమ్=రక్తమును, తీవ్రమ్=అధికముగా, సుస్రావ=స్రవించెను. ముహుః=మాటిమాటికి, విజజ్వాల=ప్రజ్వలించెను. ముమోహ చాపి=మోహము చెందెను. సంజ్ఞామ్=సంజ్ఞను, సమాసాద్య=పొంది, విసిస్మియే చ=ఆశ్చర్యపడెను.

తా. పిడికిలి దెబ్బకు బ్రద్దలైన శిరస్సు గలవాడై అంగదుడు చాల వేడియైన రక్తమును అధికముగా స్రవించెను. మాటిమాటికి మండిపడెను. మోహము చెంది, మరల స్పృహ వచ్చిన పిమ్మట ఆశ్చర్యపడెను. 92

మూ. అథాఙ్గదో మృత్యుసమానవేగం
సంవర్త్య ముష్టిం గిరిశృఙ్గకల్పమ్,
నిపాతయామాస తదా మహాత్మా
నరాన్తకస్యోపరి వాలిపుత్రః. 93

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడైన, వాలిపుత్రః=వాలి కుమారుడైన, అఙ్గదః=అంగదుడు, తదా=అప్పుడు, మృత్యుసమానవేగమ్=మృత్యువుతో సమానమైన వేగము గల, గిరిశృఙ్గకల్పమ్=పర్వతశిఖరముతో సమానమైన, ముష్టిమ్=పిడికిలిని, సంవర్త్య=త్రిప్పి, నరాన్తకస్య=నరాంతకునియొక్క, ఉపరి=పైన, నిపాతయామాస=పడవేసెను.

తా. పిమ్మట, మహాత్ముడు, వాలిపుత్రుడు అయిన అంగదుడు మృత్యువుతో సమానమైన వేగము గల, పర్వతశిఖరమువంటి పిడికిలిని బిగించి నరాంతకుని వక్షఃస్థలముమీద పడవేసెను.

మూ. స ముష్టినిర్భిన్ననిమగ్నవక్షా
జ్వాలా వమన్ శోణితదిగ్ధగాత్రః,
నరాన్తకో భూమితలే పపాత
యథాఽచలో వజ్రనిపాతభగ్నః. 94

ప్ర. అ. సః నరాన్తకః=ఆ నరాంతకుడు, ముష్టినిర్భిన్ననిమగ్న వక్షాః=పిడికిలిచేత అణగిపోయిన వక్షఃస్థలము గలవాడై, జ్వాలాః=జ్వాలలను, వమన్=కక్కుచు, శోణితదిగ్ధగాత్రః=రక్తముచేత పూయబడిన శరీరము గలవాడై, వజ్రనిపాతభగ్నః=వజ్రము పడుటచేత విరిగిన, అచలః యథా=పర్వతము వలె, పపాత=పడెను.

తా. ఆ నరాంతకుడు పిడికిలి దెబ్బకు బ్రద్దలై అణగిపోయిన వక్షఃస్థలము కలవాడై, జ్వాలలను కక్కుచు, రక్తముచేత పూయబడిన శరీరముతో, వజ్రపాతముచేత విరిగిన పర్వతము వలె నేలమీద పడెను. 94

మూ. తదాన్తరిక్షే త్రిదశోత్తమానాం
వనౌకసాం చైవ మహాన్ ప్రణాదః,
బభూవ తస్మిన్నిహతేఽగ్రవీర్యే
నరాన్తకే వాలిసుతేన సంఖ్యే. 95

ప్ర. అ. అగ్రవీర్యే=శ్రేష్ఠమైన పరాక్రమము గల, తస్మిన్=ఆ, నరాన్తకే=నరాంతకుడు, సంఖ్యే=యుద్ధమునందు, వాలిసుతేన=అంగదునిచేత, నిహతే=చంపబడినవాడగుచుండగా, తదా=అప్పుడు, అన్తరిక్షే=ఆకాశమునందు, త్రిదశోత్తమానామ్=దేవతాశ్రేష్ఠులయొక్క, వనౌకసాం చైవ=వానరులయొక్క, మహాన్=గొప్ప, ప్రణాదః=ధ్వని, బభూవ=ఆయెను.

తా. శ్రేష్ఠమైన పరాక్రమము గల నరాంతకుణ్ణి యుద్ధములో అంగదుడు చంపివేయగానే ఆకాశమునందు దేవతాముఖ్యులు, వానరులూ కూడ గొప్ప ధ్వని చేసిరి. 95

మూ. అథాఙ్గదో రామమనఃప్రహర్షణం
సుదుష్కరం తం కృతవాన్హి విక్రమమ్,
విసిష్మియే సోఽప్యథ భీమకర్మా
పునశ్చ యుద్ధే స బభూవ హర్షితః. 96

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాండే ఏకోనసప్తతితమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రామమనఃప్రహర్షణమ్=రాముని మనస్సుకు

ఆనందము కలిగించు, సుదుష్కరమ్=మిక్కిలి చేయ శక్యముకాని, తమ్=ఆ, విక్రమమ్=పరాక్రమమును, కృతవాన్=చేసెను. సః=ఆ, అఙ్గదః=అంగదుడు, విసిష్మియే=ఆశ్చర్యపడెను. అథ=అటుపిమ్మట, భీమకర్మా=భయంకరమైన పని గల, సః అపి=అతడు కూడ, పునశ్చ=మరల, యుద్ధే=యుద్ధమునందు, హర్షితః=ఉత్సాహవంతుడు, బభూవ=ఆయెను.

తా. రామునకు సంతోషము కలిగించు, చేయుటకు చాల కష్టమైన అట్టి పరాక్రమమును చూపిన అంగదుడు తన పనికి తానే ఆశ్చర్యపడెను. భయంకరమైన కర్మలు చేయు ఆతడు మరల యుద్ధమునందు ఉత్సాహమును చూపెను. 96

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో అరవైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ సప్తతితమః సర్గః

[హనుమంతుడు దేవాంతకత్రిశిరస్సులను, నీలుడు మహోదరుణ్ణి, ఋష భుడు మహాపార్శ్వుణ్ణి చంపుట.]

మూ. నరాన్తకం హతం దృష్ట్వా చుక్రుశుర్నైరృతర్షభాః,
దేవాన్తకస్త్రిమూర్ధా చ పౌలస్త్యశ్చ మహోదరః. 1

ప్ర. అ. నరాన్తకమ్=నరాంతకుణ్ణి, హతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా= చూచి, నైరృతర్షభాః=రాక్షసశ్రేష్ఠులైన, దేవాన్తకః=దేవాంతకుడు, త్రిమూర్ధా చ=త్రి శిరస్సు, పౌలస్త్యః=పులస్త్యుని కుమారుడైన, మహోదరః చ=మహోదరుడు, చుక్రుశుః=ఏడ్చిరి.

తా. నరాంతకుడు మరణించుట చూచి రాక్షసశ్రేష్ఠులైన దేవాంతకుడు, త్రిశిరస్సు, పులస్త్యుని కుమారుడైన మహోదరుడు ఏడ్చిరి. 1

మూ. ఆరూఢో మేఘసంకాశం వారణేన్ద్రం మహోదరః,
వాలిపుత్రం మహావీర్యమభిదుద్రావ వేగవాన్. 2

ప్ర. అ. మహోదరః=మహోదరుడు, మేఘసంకాశమ్=మేఘముతో సమానమైన, వారణేన్ద్రమ్=గజేంద్రమును, ఆరూఢః=ఎక్కినవాడై, వేగవాన్=వేగ వంతుడై, మహావీర్యమ్=గొప్ప వీర్యము గల, వాలిపుత్రమ్=అంగదుని గూర్చి, అభిదుద్రావ=ఎదురుగా పరుగెత్తెను.

తా. మహోధరుడు మేఘము వలె ఉన్న పెద్ద ఏనుగును ఎక్కి, మహావేగముతో గొప్ప పరాక్రమము గల అంగదుని మీదికి వెళ్లెను. 2

మూ. భ్రాతృవ్యసనసంతప్తస్తదా దేవాన్తకో బలీ,
ఆదాయ పరిఘం ఘోరమఙ్గదం సమభిద్రవత్. 3

ప్ర. అ. తదా=అప్పుడు, భ్రాతృవ్యసనసంతప్తః=సోదరుని గూర్చిన దుఃఖముచేత తపింపచేయబడిన, బలీ=బలవంతుడైన, దేవాన్తకః=దేవాంతకుడు, ఘోరమ్=భయంకరమైన, పరిఘమ్=పరిఘను, ఆదాయ=గ్రహించి, అఙ్గదమ్=అం గదుని గూర్చి, సమభిద్రవత్=పరుగెత్తెను.

తా. అపుడు సోదరుని మరణమువలన దుఃఖించుచున్న బలవంతుడైన దేవాంతకుడు భయంకరమైన పరిఘతో అంగదునిమీదికి వెళ్లెను. 3

మూ. రథమాదిత్యసంకాశం యుక్తం పరమవాజిభిః,
ఆస్థాయ త్రిశిరా వీరో వాలిపుత్రమథాభ్యగాత్. 4

ప్ర. అ. అథ=అటు పిమ్మట, వీరః=వీరుడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, పరమవాజిభిః=శ్రేష్ఠమైన గుఱ్ఱములతో, యుక్తమ్=కూర్చబడిన, ఆదిత్యసంకాశమ్=సూర్యునితో సమానమైన, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, వాలిపుత్రమ్=అంగదుని గూర్చి, అభ్యగాత్=ఎదురుగా వెళ్లెను.

తా. పిమ్మట వీరుడైన త్రిశిరస్సు ఉత్తమములైన గుఱ్ఱములు కట్టిన, సూర్యునితో సమానమైన రథము నెక్కి అంగదునిమీదకు వెళ్ళెను. 4

మూ. స త్రిభిర్దేవదర్పఘ్నైః రాక్షసేన్ద్రైరభిద్రుతః,
వృక్షముత్పాటయామాస మహావిటపమఙ్గదః. 5

ప్ర. అ. దేవదర్పఘ్నైః=దేవతల దర్పమును నశింపచేసిన, త్రిభిః=ముగ్గురు, రాక్షసేన్ద్రైః=రాక్షసనాయకులచేత, అభిద్రుతః=పరుగెత్తి వచ్చి ఎదిరింపబడిన, సః=ఆ, అఙ్గదః=అంగదుడు, మహావిటపమ్=పెద్ద కొమ్మలు గల, వృక్షమ్=వృక్షమును, ఉత్పాటయామాస=పెకలించెను.

తా. దేవతల దర్పమును అణచిన ఆ ముగ్గురు రాక్షసనాయకులు తన మీదకి వచ్చుచుండుట చూచి అంగదుడు పెద్ద కొమ్మలున్న ఒక వృక్షమును పెకలించెను. 5

మూ. దేవాన్తకాయ తం వీరశ్చిక్షేప సహసాఙ్గదః,
మహావృక్షం మహాశాఖం శక్రో దీప్తామివాశనిమ్. 6

ప్ర. అ. వీరః=వీరుడైన, అఙ్గదః=అంగదుడు, మహాశాఖమ్=గొప్ప కొమ్మలు గల, తమ్=ఆ, మహావృక్షమ్=గొప్ప వృక్షమును, శక్రః=దేవేంద్రుడు, దీప్తామ్=ప్రజ్వలించుచున్న, అశనిమ్ ఇవ=పిడుగును వలె, సహసా=వెంటనే, దేవాన్తకాయ=దేవాంతకునకు, చిక్షేప=విసిరెను.

తా. వీరుడైన అంగదుడు, వెంటనే పెద్ద కొమ్మ లున్న మహావృక్షమును, దేవేంద్రుడు మండుచున్న పిడుగును విసిరినట్లు, ఆ దేవాంతకునిమీదికి పడవేసెను. 6

మూ. త్రిశిరాస్తం ప్రచిచ్ఛేద శరైరాశీవిషోపమైః,
స వృక్షం కృత్తమాలోక్య ఉత్పపాత తదాఙ్గదః. 7

ప్ర. అ. త్రిశిరాః=త్రిశిరస్సు, ఆశీవిషోపమైః=సర్పముల వంటి, శరైః=బాణములచేత, తమ్=ఆ వృక్షమును, ప్రచిచ్ఛేద=ఛేదించెను. తదా=అప్పుడు, కృత్తమ్=ఛేదించబడిన, వృక్షమ్=వృక్షమును, ఆలోక్య=చూచి, సః అఙ్గదః=ఆ అంగదుడు, ఉత్పపాత=పైకి ఎగిరెను.

తా. త్రిశిరస్సు సర్పములవంటి బాణాలతో ఆ వృక్షమును ఛేదించెను. అప్పుడు ఆ అంగదుడు వృక్షము ఛేదింపబడి నట్లు చూచి పైకి ఎగిరెను. 7

మూ. స వవర్ష తతో వృక్షాన్ శిలాశ్చ కపికుఞ్జరః,
తాన్ ప్రచిచ్ఛేద సంక్రుద్ధస్త్రిశిరా నిశితైః శరైః. 8

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః=ఆ, కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడు, వృక్షాన్=వృక్షములను, శిలాశ్చ=శిలలను, వవర్ష=వర్షించెను. సంక్రుద్ధః=కోపించిన, త్రిశిరాః=త్రిశిరస్సు, నిశితైః=వాడియైన, శరైః=బాణములతో, తాన్=వాటిని, ప్రచిచ్ఛేద=ఛేదించెను.

తా. పిమ్మట ఆ అంగదుడు వృక్షములను, శిలలను వర్షించెను. త్రిశిరస్సు కోపముతో వాడియైన బాణాలచేత వాటిని ఖండించెను. 8

మూ. పరిఘాగ్రేణ తాన్ వృక్షాన్ బభఞ్జ స మహోదరః,
త్రిశిరాశ్చాఙ్గదం వీరమభిదుద్రావ సాయకైః. 9

ప్ర. అ. సః మహోదరః=ఆ మహోదరుడు, పరిఘాగ్రేణ=పరిఘాగ్రముచేత, తాన్=ఆ, వృక్షాన్=వృక్షములను, బభఞ్జ=విరిచివేసెను. త్రిశిరాః చ=త్రిశిరస్సుకూడ, సాయకైః=బాణములతో, వీరమ్=వీరుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, అభిదుద్రావ=ఎదిరించుచు శీఘ్రముగా వెళ్ళెను.

తా. ఆ వృక్షములను మహోదరుడు పరిఘచేత విరగగొట్టెను. త్రిశిరస్సు బాణాలు ప్రయోగించుచు శీఘ్రముగా ఆ వీరుడైన అంగదుని మీదకు వెళ్ళెను. 9

మూ. గజేన సమభిద్రుత్య వాలిపుత్రం మహోదరః,
జఘానోరసి సంక్రుద్ధస్తోమరైర్వజ్రసంనిభైః. 10

ప్ర. అ. మహోదరః=మహోదరుడు, గజేన=ఏనుగుతో, వాలిపుత్రమ్=అంగదుని గూర్చి, సమభిద్రుత్య=శీఘ్రముగా వెళ్ళి, సంక్రుద్ధః=కోపించినవాడై, వజ్రసంనిభైః=వజ్రముతో సమానములైన, తోమరైః=తోమరములతో, ఉరసి=వక్షఃస్థలమునందు, జఘాన=కొట్టెను.

తా. మహోదరుడు ఏనుగునెక్కి అంగదుని మీదికి వెళ్ళి కోపముతో

వజ్రమువంటి తోమరములతో ఆతని వక్షఃస్థలముమీద కొట్టెను. 10

మూ. దేవాన్తకశ్చ సంక్రుద్ధః పరిఘేణ తదాఙ్గదమ్,
ఉపగమ్యాభిహత్యాశు వ్యపచక్రామ వేగవాన్. 11

ప్ర. అ. తదా=అప్పుడు, వేగవాన్=వేగము గల, దేవాన్తకః చ=దేవాంతకుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, అఙ్గదమ్=అంగదుణ్ణి, ఉపగమ్య=సమీపించి ఆశు=శీఘ్రముగా, పరిఘేణ=పరిఘచేత, అభిహత్య=కొట్టి, వ్యపచక్రామ=దూరముగా వెళ్లెను.

తా. అప్పుడు వేగవంతుడైన దేవాంతకుడు కోపించి, అంగదుని దగ్గరకు వచ్చి, వానిని వెంటనే పరిఘతో కొట్టి దూరముగా వెళ్లెను. 11

మూ. స త్రిభిర్నైరృతశ్రేష్ఠైర్యుగపత్సమభిద్రుతః,
న వివ్యథే మహాతేజా వాలిపుత్రః ప్రతాపవాన్. 12

ప్ర. అ. త్రిభిః=ముగ్గురు, నైరృతశ్రేష్ఠైః=రాక్షసశ్రేష్ఠులచేత, యుగపత్=ఒక్కమారుగా, అభిద్రుతః=ఎదుర్కొనబడిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, సః=ఆ, వాలిపుత్రః=వాలికుమారుడు, న వివ్యథే=వ్యథ చెందలేదు.

తా. ముగ్గురు రాక్షసవీరులు ఒక్కమారు ఎదిరించినను మహాతేజఃశాలి, ప్రతాపవంతుడు అయిన అంగదుడు ఏ మాత్రము జంకలేదు. 12

మూ. స వేగవాన్ మహావేగం కృత్వా పరమదుర్జయః,
తలేన సమభిద్రుత్య జఘానాస్య మహాగజమ్. 13

ప్ర. అ. వేగవాన్=వేగము గల, పరమదుర్జయః=మిక్కిలి జయింప శక్యము కాని, సః=అతడు, మహావేగమ్=గొప్ప వేగమును, కృత్వా=చేసి, సమభిద్రుత్య=శీఘ్రముగా ఎదురుగా వెళ్లి, అస్య=వీనియొక్క, మహాగజమ్=మహాగజమును, తలేన=అరచేతితో, జఘాన=కొట్టెను.

తా. వేగవంతుడు, జయింప శక్యముకానివాడు అయిన అంగదుడు మహావేగముతో ఎదురుగా వెళ్లి దేవాంతకుని ఏనుగను అరచేతితో కొట్టెను.

మూ. తస్య తేన ప్రహారేణ నాగరాజస్య సంయుగే,
పేతతుర్నయనే తస్య విననాశ స కుఞ్జరః. 14

ప్ర. అ. తస్య=అతనియొక్క, తేన=ఆ, ప్రహారేణ=దెబ్బచేత, సంయుగే=యుద్ధమునందు, తస్య నాగరాజస్య=ఆ గజరాజుయొక్క, నయనే=నేత్రములు,

పేతతుః=పడిపోయినవి. సః=ఆ, కుఞ్జరః=ఏనుగ, విననాశ=మరణించెను.

తా. యుద్ధమునందు ఆతని దెబ్బచేత ఆ గజరాజు నేత్రములు పడిపోయి మరణించెను. 14

మూ. విషాణం చాస్య నిష్కృష్య వాలిపుత్రో మహాబలః,
దేవాన్తకమభిద్రుత్య తాడయామాస సంయుగే. 15

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, వాలిపుత్రః=అంగదుడు, సంయుగే=యుద్ధమునందు, అస్య=ఈ ఏనుగుయొక్క, విషాణమ్=దంతమును, నిష్కృష్య=లాగి, దేవాన్తకమ్=దేవాంతకుని గూర్చి, అభిద్రుత్య=శీఘ్రముగా పరుగెత్తి వెళ్లి, తాడయామాస=కొట్టెను.

తా. గొప్ప బలము గల అంగదుడు, యుద్ధములో, ఆ ఏనుగదంతమును ఊడబెరికి, శీఘ్రముగా ఆ దేవాంతకుని మీదికి వెళ్లి ఆతనిని కొట్టెను. 15

మూ. స విహ్వలస్తు తేజస్వీ వాతోద్ధూత ఇవ ద్రుమః,
లాక్షారససవర్ణం చ సుస్రావ రుధిరం మహత్. 16

ప్ర. అ. తేజస్వీ=తేజస్సు గల, సః=ఆ దేవాంతకుడు, వాతోద్ధూతః=గాలిచేత కదల్చబడిన, ద్రుమః ఇవ=వృక్షము వలె, విహ్వలః=వ్యాకులుడై, లాక్షారససవర్ణమ్=లత్తుకతో సమానమైన రంగు గల, మహత్=గొప్ప, రుధిరమ్=రక్తమును, సుస్రావ=స్రవించెను.

తా. తేజఃశాలియైన ఆ దేవాంతకుడు గాలికి కదల్చబడిన వృక్షము వలె వ్యాకులుడై లత్తుకరసముతో సమానమైన రంగు గల అధికమైన రక్తమును కార్చెను. 16

మూ. అథాశ్వస్య మహాతేజాః కృచ్ఛ్రాద్దేవాన్తకో బలీ,
ఆవిధ్య పరిఘం వేగాదాజఘాన తదాఙ్గదమ్. 17

ప్ర. అ. అథ=అటు పిమ్మట, బలీ=బలవంతుడైన, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, దేవాన్తకః=దేవాంతకుడు, కృచ్ఛ్రాత్=కష్టమువలన, ఆశ్వస్య=తెప్పిరిల్లి, తదా=అప్పుడు, వేగాత్=వేగమువలన, పరిఘమ్=పరిఘను, ఆవిధ్య=గట్టిగా పట్టి, అఙ్గదమ్=అంగదుణ్ణి, ఆజఘాన=కొట్టెను.

తా. పిమ్మట మహాతేజఃశాలి, బలవంతుడూ అయిన దేవాంతకుడు అతికష్టముమీద తెప్పిరిల్లి, పరిఘను గట్టిగా పట్టి అంగదుణ్ణి వేగముగా కొట్టెను. 17

మూ. పరిఘాభిహతశ్చాపి వానరేన్ద్రాత్మజస్తదా,
జానుభ్యాం పతితో భూమౌ పునరేవోత్పపాత హ. 18

ప్ర. అ. తదా=అప్పుడు, పరిఘాభిహతః=పరిఘచేత కొట్టబడిన, వానరేన్ద్రాత్మజః=వాలిపుత్రుడు, భూమౌ=నేలమీద, జానుభ్యామ్=మోకాళ్లతో, పతితః=పడినవాడై, పునరేవ=మరల, ఉత్పపాత హ=పైకి ఎగిరెను.

తా. అప్పుడు పరిఘ దెబ్బ తిన్న అంగదుడు మోకాళ్ల మీద, నేలపై బోర్లపడి మరల పైకి లేచెను. 18

మూ. తముత్పతన్తం త్రిశిరాస్త్రిభిర్బాణైరజిహ్మగైః,
ఘోరైర్హరిపతేః పుత్రం లలాటేఽభిజఘాన హ. 19

ప్ర. అ. త్రిశిరాః=త్రిశిరస్సు, ఉత్పతన్తమ్=పైకి లేచుచున్న, హరిపతేః పుత్రమ్=వాలికుమారుడైన, తమ్=ఆ అంగదుని, ఘోరైః=భయంకరములైన, అజహ్మగైః=ఋజువుగా వెళ్ళు, బాణైః=బాణములచేత, లలాటే=లలాటమునందు, అభిజఘాన హ=కొట్టెను.

తా. అంగదుడు పైకి ఎగురుచుండగా త్రిశిరస్సు వంకర లేకుండా వెళ్ళు, భయంకరములైన మూడు బాణములతో ఆతని లలాటముమీద కొట్టెను.

మూ. తతోఽఙ్గదం పరిక్షిప్తం త్రిభిర్నైర్ఋతపుఙ్గవైః,
హనూమానథ విజ్ఞాయ నీలశ్చాపి ప్రతస్థతుః. 20

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హనూమాన్=హనుమంతుడు, నీలశ్చాపి=నీలుడు, త్రిభిః=ముగ్గురు, నైర్ఋతపుఙ్గవైః=రాక్షసశ్రేష్ఠులచేత, అఙ్గదమ్=అంగదుణ్ణి, పరిక్షిప్తమ్=చుట్టబడినవానినిగా, విజ్ఞాయ=తెలిసికొని, అథ=అటుపిమ్మట, ప్రతస్థతుః=బయలుదేరిరి.

తా. ముగ్గురు రాక్షసవీరులు అంగదుణ్ణి చుట్టుముట్టుట చూచి, హనుమంతుడు, నీలుడు అక్కడికి వెళ్ళిరి. 20

మూ. తతశ్చిక్షేప శైలాగ్రం నీలస్త్రిశిరసే తదా,
తద్రావణసుతో ధీమాన్బిభేద నిశితైః శరైః. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నీలః=నీలుడు, తదా=అప్పుడు, త్రిశిరసే=త్రిశిరస్సునకు, శైలాగ్రమ్=పర్వతశిఖరమును, చిక్షేప=విసరెను. ధీమాన్=బుద్ధిమంతుడైన, రావణసుతః=రావణుని కుమారుడైన త్రిశిరస్సు, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, తత్=దానిని, బిభేద=బ్రద్దలుకొట్టెను.

తా. అప్పుడు నీలుడు పర్వతశిఖరమును త్రిశిరస్సుపై విసిరివేయగా

ఆతడు దానిని బాణాలతో బ్రద్దలు కొట్టెను. 21

మూ. తద్బాణశతనిర్భిన్నం విదారితశిలాతలమ్,
సవిస్ఫులింగం సజ్వాలం నిపపాత గిరేః శిరః. 22

ప్ర. అ. బాణశతనిర్భిన్నమ్=అనేకబాణములచేత బ్రద్దలు కొట్టబడిన, తత్=ఆ, గిరేః శిరః=పర్వతముయొక్క శిఖరము, విదారితశిలాతలమ్=చీల్చివే యబడిన రాళ్ళుకలదై, సవిస్ఫులిఙ్గమ్=అగ్నికణములతో కూడినదై, సజ్వాలమ్=జ్వాలలతో కూడినదై, నిపపాత=పడెను.

తా. అనేక బాణములచేత బ్రద్దలు కొట్టబడిన ఆ పర్వతశిఖరము, శిలలన్నియు ముక్కలైపోగా, అగ్నికణములతోను, అగ్నిజ్వాలలతోను కూడినదై క్రింద పడెను. 22

మూ. స విజృమ్భితమాలోక్య హర్షాద్దేవాన్తకో బలీ,
పరిఘేణాభిదుద్రావ మారుతాత్మజమాహవే. 23

ప్ర. అ. బలీ=బలవంతుడైన, సః=ఆ, దేవాన్తకః=దేవాంతకుడు, ఆహవే=యుద్ధమునందు, హర్షాత్=సంతోషమువలన, విజృమ్భితమ్=విజృంభిం చిన, మారుతాత్మజమ్=హనుమంతుని, ఆలోక్య=చూచి, పరిఘేణ=పరిఘతో, అభిదుద్రావ=ఎదురుగా పరుగెత్తెను.

తా. బలవంతుడైన దేవాంతకుడు యుద్ధమునందు ఉత్సాహముతో విజృంభించిన హనుమంతుణ్ణి చూచి, పరిఘ చేత ధరించి ఆతనిమీదికి వేగముగా పరుగెత్తెను. 23

మూ. తమాపతన్తముత్పత్య హనుమాన్ కపికుఞ్జరః,
ఆజఘాన తదా మూర్ధ్ని వజ్రకల్పేన ముష్టినా. 23

ప్ర. అ. తదా=అప్పుడు, కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడైన, హనుమాన్=హ నుమంతుడు, ఉత్పత్య=ఎగిరి, ఆపతన్తమ్=తన మీదికి వచ్చుచున్న, తమ్=వానిని, వజ్రకల్పేన=వజ్రముతో సమానమైన, ముష్టినా=పిడికిలితో, మూర్ధ్ని=శిరస్సుమీద, ఆజఘాన=కొట్టెను.

తా. అప్పుడు వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు పైకి ఎగిరి, తనమీదకు శీఘ్రముగా వచ్చుచున్న ఆ దేవాంతకుణ్ణి, వజ్రమువంటి పిడికిలితో నెత్తిమీద కొట్టెను. 24

మూ. శిరసి ప్రహరద్వీరస్తదా వాయుసుతో బలీ,
నాదేనాకమ్పయచ్చైవ రాక్షసాన్ స మహాకపిః. 25

ప్ర. అ. తదా=అప్పుడు, వీరః=వీరుడు, బలీ=బలవంతుడు అయిన, వాయుసుతః=హనుమంతుడు, శిరసి= శిరస్సునందు, ప్రాహరత్=కొట్టెను. సః=ఆ, మహాకపిః=మహావానరుడు, నాదేన=ధ్వనిచేత, రాక్షసాన్=రాక్షసులను, అకమ్పయచ్చైవ=కంపింపచేసెను.

తా. అప్పుడు వానరులలో గొప్పవాడు, వీరుడు, బలశాలీ అయిన ఆ హనుమంతుడు వానిని తలమీద కొట్టి, ధ్వనిచేత రాక్షసులను కంపింప, చేసెను.

మూ. స ముష్టినిష్పిష్టవిభిన్నమూర్ధా
నిర్వాన్తదన్తాక్షివిలమ్బిజిహ్వః,
దేవాన్తకో రాక్షసరాజసూను
ర్గతాసురుర్వ్యాం సహసా పపాత. 26

ప్ర. అ. ముష్టినిష్పిష్టవిభిన్నమూర్ధా=పిడికిలిచేత నలగగొట్టబడిన బ్రద్దలైపోయిన శిరస్సు గల, నిర్వాన్తదన్తాక్షివిలమ్బిజిహ్వః=పైకి కక్కబడిన దంతములు గలవాడు, వ్రేలాడుచున్న నాలుక గలవాడు అయిన, రాక్షసరాజసూనుః=రావణుని కుమారుడైన, సః=ఆ, దేవాన్తకః=దేవాంతకుడు, గతాసుః=పోయిన ప్రాణములు గలవాడై, సహసా=వెంటనే, ఉర్వ్యామ్=నేలమీద, పపాత=పడిపోయెను.

తా. రాక్షసరాజైన రావణుని కుమారుడైన ఆ దేవాంతకుని తల హనుమంతుని పిడికిలి దెబ్బకు నలిగి ముక్కలైపోయెను. దంతాలు, కళ్లు బయటపడిపోయెను. నాలుక వ్రేలాడుచుండెను. ఈ విధముగా ఆతడు ప్రాణాలు విడచి వెంటనే నేలమీద పడెను. 26

మూ. తస్మిన్ హతే రాక్షసయోధముఖ్యే
మహాబలే సంయతి దేవశత్రౌ,
క్రుద్ధస్త్రిమూర్ధా నిశితాగ్రముగ్రం
వవర్ష నీలోరసి బాణవర్షమ్. 27

ప్ర. అ. రాక్షసయోధముఖ్యే=రాక్షసయోధులలో ముఖ్యుడు, దేవశత్రౌ=దేవతల శత్రువు, మహాబలే=గొప్ప బలము గలవాడు అయిన, తస్మిన్=ఆతడు, సంయతి=యుద్ధమునందు, హతే=చంపబడినవాడగుచుండగా, క్రుద్ధః=కోపించిన, త్రిమూర్ధా=త్రిశిరస్సు, నీలోరసి=నీలుని వక్షఃస్థలమునందు, ఉగ్రమ్=భయంకరమైన, బాణవర్షమ్=బాణవర్షమును, వవర్ష=వర్షించెను.

తా. రాక్షసయోధులలో ప్రధానుడు, గొప్ప బలము గలవాడు, దేవతల శత్రువూ అయిన ఆ దేవాంతకుడు యుద్ధమునందు మరణించిన పిమ్మట

త్రిశిరస్సు నీలుని వక్షఃస్థలముమీద వాడియైన అగ్రభాగము గల, భయంకరమైన బాణవర్షము కురిపించెను. 27

మూ. మహోదరస్తు సంక్రుద్ధః కుఞ్జరం పర్వతోపమమ్,
భూయః సమధిరుహ్యాశు మన్దరం రశ్మిమానివ. 28
తతో బాణమయం వర్షం నీలస్యోపర్యపాతయత్,
గిరౌ వర్షం తడిచ్చక్రం స గర్జన్నివ తోయదః. 29

ప్ర. అ. సః=ఆ, మహోదరస్తు=మహోదరుడైతే, సంక్రుద్ధః=కోపించినవాడై, రశ్మిమాన్=సూర్యుడు, మన్దరమ్ ఇవ=మందరపర్వతమును వలె, పర్వతోపమమ్=పర్వతముతో సమానమైన, కుఞ్జరమ్=ఏనుగును, భూయః=మరల, సమధిరుహ్య=ఎక్కి, ఆశు=శీఘ్రముగా, తతః=అటుపిమ్మట, నీలస్య=నీలునియొక్క, ఉపరి=పైన, గర్జన్=గర్జించుచున్న, తోయదః=మేఘము, తడిచ్చక్రమ్=మెరుపుల చక్రముతో కూడిన, వర్షమ్=వర్షమును, గిరౌ ఇవ=పర్వతముమీద వలె, బాణమయమ్=బాణవికారమైన, వర్షమ్=వర్షమును, అపాతయత్=పడవేసెను.

తా. పిమ్మట, కోపించిన మహోదరుడు, సూర్యుడు మందరపర్వతమును ఎక్కినట్లు, పర్వతము వంటి ఏనుగును మరల ఎక్కి, గర్జించుచున్న మేఘము మెరుపులతో కూడిన వర్షమును పర్వతముమీద కురిపించినట్లు బాణముల వర్షమును నీలుని మీద వర్షించెను. 28, 29

మూ. తతః శరౌఘైరభివృష్యమాణో
విభిన్నగాత్రః కపిసైన్యపాలః,
నీలో బభూవాథ విసృష్టగాత్రో
విష్టమ్భితస్తేన మహాబలేన. 30

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శరౌఘైః=బాణసముదాయములచేత, అభివృష్యమాణః=వర్షించబడుచున్న, కపిసైన్యపాలః=వానరసేనాపతియైన, నీలః=నీలుడు, విభిన్నగాత్రః=బ్రద్దలుకొట్టబడిన శరీరము గలవాడు, బభూవ=ఆయెను. అథ=అటుపిమ్మట, విసృష్టగాత్రః=శిథిలములైన అవయవములు గలవాడై, మహాబలేన=గొప్ప బలము గల, తేన=ఆతనిచేత, విష్టమ్భితః=స్తంభింపచేయుబడెను.

తా. అప్పుడు బాణసముదాయముల వర్షముచేత వానరసేనాపతియైన నీలుని శరీరము బ్రద్దలైపోయి ఆతని అవయవములు శిథిలములయ్యెను. ఈ విధముగా ఆతనిని, మహాబలవంతుడైన మహోదరుడు కదలకుండా చేసెను.

మూ. తతస్తు నీలః ప్రతిలబ్ధసంజ్ఞః
శైలం సముత్పాట్య సవృక్షఖణ్డమ్,

తతః సముత్పత్య మహోగ్రవేగో
మహోదరం తేన జఘాన మూర్ధ్ని. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నీలః తు=నీలుడు, ప్రతిలబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞకలవాడై, సవృక్షఖణ్డమ్=వృక్షముల సముదాయముతో కూడిన, శైలమ్=పర్వతమును, సముత్పాట్య=పెకలించి, తతః=అటుపిమ్మట, మహోగ్రవేగః=చాల ఉగ్రమైన వేగముగలవాడై, సముత్పత్య=పైకి ఎగిరి, తేన=దానిచేత, మహోదరమ్=మహోదరుణ్ణి, మూర్ధ్ని=శిరస్సుమీద, జఘాన=కొట్టెను.

తా. పిమ్మట నీలుడు సంజ్ఞ పొంది, వృక్షసముదాయముతో కూడిన పర్వతమును పెకలించి, చాల ఉగ్రమైన వేగముతో పైకి ఎగిరి, ఆ పర్వతముతో మహోదరుని తల మీద కొట్టెను. 31

మూ. తతః స శైలాభినిపాతభగ్నో
మహోదరస్తేన మహద్విపేన,
విపోథితో భూమితలే గతాసుః
పపాత వజ్రాభిహతో యథాద్రిః. 32

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శైలనిపాతభగ్నః=పర్వతము పడుటచేత విరగగొట్టబడిన, సః మహోదరః=ఆ మహోదరుడు, తేన=ఆ, మహద్విపేన=గొప్ప ఏనుగచేతకూడ, విపోథితః=నలగకొట్టబడినవాడై, గతాసుః=పోయిన ప్రాణములు కలవాడై, వజ్రాభిహతః=వజ్రముచేత కొట్టబడిన, అద్రిః యథా=పర్వతము వలె, భూమితలే=నేలమీద, పపాత=పడెను.

తా. పర్వతము మీద పడుటచేత విరిగిపోయిన ఆ మహోదరుడు ఆ మహాగజముచేతకూడ నలిగిపోయి, ప్రాణములు విడచి, వజ్రముచేత కొట్టబడిన పర్వతమువలె నేలమీద పడిపోయెను. 32

మూ. పితృవ్యం నిహతం దృష్ట్వా త్రిశిరాశ్చాపమాదదే,
హనూమన్తం చ సంక్రుద్ధో వివ్యాధ నిశితైః శరైః. 33

ప్ర. అ. త్రిశిరాః=త్రిశిరస్సు, పితృవ్యమ్=పినతండ్రిని, నిహతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, సంక్రుద్ధః=కోపించినవాడై, చాపమ్=ధనస్సును, ఆదదే=గ్రహించెను. హనూమన్తమ్=హనుమంతుని, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. త్రిశిరస్సు తన పినతండ్రియైన మహోదరుడు మరణించుట చూచి, చాల కోపించి, ధనస్సు ధరించి, హనుమంతుణ్ణి వాడియైన బాణాలతో కొట్టెను. 33

మూ. స వాయుసూనుః కుపితశ్చిక్షేప శిఖరం గిరేః,
త్రిశిరాస్తచ్ఛరైస్తీక్ష్ణైర్విభేద బహుధా బలీ. 34

ప్ర. అ. సః=ఆ, వాయుసూనుః=హనుమంతుడు, కుపితః=కోపించినవాడై గిరేః=పర్వతముయొక్క, శిఖరమ్=శిఖరమును, చిక్షేప=విసరెను. బలీ=బలవంతుడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, బహుధా=అనేకవిధములుగా, బిభేద=బద్దలు కొట్టెను.

తా. హనుమంతుడు కోపించి పర్వతశిఖరమును మీద పడవేయగా బలవంతుడైన త్రిశిరస్సు దానిని వాడియైన బాణాలతో ముక్కలు చేసెను. 34

మూ. తద్వ్యర్థం శిఖరం దృష్ట్వా ద్రుమవర్షం తదా కపిః,
విససర్జ రణే తస్మిన్ రావణస్య సుతం ప్రతి. 35

ప్ర. అ. తదా=అప్పుడు, కపిః=హనుమంతుడు, తత్=ఆ, శిఖరమ్=శిఖరమును, వ్యర్థమ్=వ్యర్థమైనదానినిగా, దృష్ట్వా=చూచి, తస్మిన్ రణే=ఆ యుద్ధమునందు, రావణస్య=రావణునియొక్క, సుతం ప్రతి=కుమారుని గూర్చి, ద్రుమవర్షమ్=వృక్షముల వర్షమును, విససర్జ=విడచెను.

తా. అప్పుడు ఆ హనుమంతుడు ఆ శిఖరము వ్యర్థమైపోవుట చూచి, ఆ యుద్ధరంగమునందు త్రిశిరస్సుపై వృక్షవర్షమును కురిపించెను. 35

మూ. తమాపతన్తమాకాశే ద్రుమవర్షం ప్రతాపవాన్,
త్రిశిరా నిశితైర్బాణైశ్చిచ్ఛేద చ ననాద చ. 36

ప్ర. అ. ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, ఆపతన్తమ్=వచ్చిపడుచున్న, తమ్=ఆ, ద్రుమవర్షమ్=వృక్షముల వర్షమును, నిశితైః=వాడియైన, బాణైః=బాణములచేత, ఆకాశే=ఆకాశమునందు, చిచ్ఛేద=ఛేదించెను. ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. ప్రతాపవంతుడైన త్రిశిరస్సు వచ్చి పడుచున్న ఆ వృక్షముల వర్షమును వాడియైన బాణాలతో ఆకాశమునందే ఖండించి బిగ్గరగా అరచెను.

మూ. హనూమాంస్తు సముత్పత్య హయం త్రిశిరసస్తదా,
విదదార నఖైః క్రుద్ధో నాగేన్ద్రం మృగరాడివ. 37

ప్ర. అ. తదా=అప్పుడు, హనూమాన్ తు=హనుమంతుడైతే, క్రుద్ధః=కోపించినవాడై, సముత్పత్య=పైకి ఎగిరి, త్రిశిరసః=త్రిశిరస్సుయొక్క, హయమ్=గుఱ్ఱమును, మృగరాట్=సింహము, నాగేన్ద్రమ్ ఇవ=గజేంద్రమును వలె, నఖైః=గోళ్ళచేత, విదదార=చీల్చివేసెను.

తా. అప్పుడు హనుమంతుడు కోపించి త్రిశిరస్సు గుఱ్ఱమును, సింహము ఏనుగును చీల్చివేసినట్లు గోళ్ళతో చీల్చివేసెను. 37

మూ. అథ శక్తిం సమాసాద్య కాలరాత్రిమివాన్తకః,
చిక్షేపానిలపుత్రాయ త్రిశిరా రావణాత్మజః. 38

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణాత్మజః=రావణుని కుమారుడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, అన్తకః=యముడు, కాలరాత్రిమ్ ఇవ=కాలరాత్రిని వలె, శక్తిమ్=శక్తిని, సమాసాద్య=గ్రహించి, అనిలపుత్రాయ=హనుమంతునకు, చిక్షేప=విసిరెను.

తా. పిమ్మట రావణుని పుత్రుడైన త్రిశిరస్సు, యముడు కాళరాత్రిని స్వీకరించినట్లు శక్తిని గ్రహించి దానిని హనుమంతునిమీద ప్రయోగించెను. 38

మూ. దివః క్షిప్తామివోల్కాం తాం శక్తిం క్షిప్తామసంగతామ్,
గృహీత్వా హరిశార్దూలో బభఞ్జ చ ననాద చ. 39

ప్ర. అ. హరిశ్రేష్ఠః=ఆ వానరశ్రేష్ఠుడు, దివః=ఆకాశమునుండి, క్షిప్తామ్=విసరబడిన, ఉల్కామివ=ఉల్కవలె ఉన్న, తాం శక్తిమ్=ఆ శక్తిని, అసంగతామ్=తగలకుండగానే, గృహీత్వా=గ్రహించి, బభఞ్జ చ=విరిచివేసెను. ననాద చ=ధ్వని చేసెను కూడ.

తా. హనుమంతుడు ఆకాశమునుండి విసిరినట్లు వచ్చి పడుచున్న అగ్నిపిండము వలె ఉన్న ఆ శక్తి తనమీద పడకుండగానే పట్టుకుని విరిచివేసి గర్జించెను. 39

మూ. తాం దృష్ట్వా ఘోరసంకాశాం శక్తిం భగ్నాం హనూమతా,
ప్రహృష్టా వానరగణా వినేదుర్జలదా యథా. 40

ప్ర. అ. ఘోరసంకాశామ్=భయంకరమైన రూపము గల, తాం శక్తిమ్=ఆ శక్తిని, హనూమతా=హనుమంతునిచేత, భగ్నామ్=విరవబడినదానినిగా, దృష్ట్వా=చూచి, ప్రహృష్టాః=సంతోషించినవై, వానరగణాః=వానరుల గణములు, జలదాః యథా=మేఘములు వలె, వినేదుః=ధ్వనిచేసినవి.

తా. భయంకరమైన ఆ శక్తిని హనుమంతుడు విరిచివేయుట చూచి వానరులు సంతోషించి మేఘముల వలె గర్జించిరి. 40

మూ. తతః ఖడ్గం సముద్యమ్య త్రిశిరా రాక్షసోత్తమః,
విచఖాన తదా ఖడ్గం వానరేన్ద్రస్య వక్షసి. 41

ప్ర. అ. రాక్షసోత్తమః=రాక్షసులలో ఉత్తముడైన, త్రిశిరాః=త్రిశిరస్సు, తతః=అటు పిమ్మట, ఖడ్గమ్=ఖడ్గమును, సముద్యమ్య=ఎత్తి, తదా=అప్పుడు, ఖడ్గమ్=ఆ ఖడ్గమును, వానరేన్ద్రస్య=హనుమంతునియొక్క, వక్షసి=వక్షఃస్థలము నందు, నిచఖాన=పాతెను.

తా. పిమ్మట రాక్షసశ్రేష్ఠుడైన త్రిశిరస్సు ఖడ్గమును ఎత్తి దానిని హనుమంతుని వక్షఃస్థలముమీద లోతుగా గ్రుచ్చెను. 41

మూ. ఖడ్గప్రహారాభిహతో హనుమాన్ మారుతాత్మజః,
ఆజఘాన త్రిమూర్ధానం తలేనోరసి వీర్యవాన్. 42

ప్ర. అ. ఖడ్గప్రహారాభిహతః=ఖడ్గముయొక్క ప్రహారముచేత కొట్టబడిన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, తలేన=అరచేతితో, త్రిమూర్ధానమ్=త్రిశిరస్సును, ఉరసి=వక్షఃస్థల ముమీద, ఆజఘాన=కొట్టెను.

తా. ఖడ్గప్రహారమును తిన్న పరాక్రమశాలి, వాయుపుత్రుడు అయిన హనుమంతుడు ఆ త్రిశిరస్సు వక్షఃస్థలముమీద అరచేతితో కొట్టెను. 42

మూ. స తలాభిహతస్తేన స్రస్తహస్తాయుధో భువి,
నిపపాత మహాతేజాస్త్రిశిరాస్త్యక్తచేతనః. 43

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః త్రిశిరాః=ఆ త్రిశిరస్సు, తేన=హనుమంతునిచేత, తలాభిహతః=అరచేతితో కొట్టబడినవాడై, స్రస్తహస్తా యుధః=జారిపోయిన హస్తమునందలి ఆయుధము గలవాడై, త్యక్తచేతనః= ఎడవబడిన సంజ్ఞ కలవాడై, భువి=నేలమీద, నిపపాత=పడెను.

తా. గొప్ప తేజస్సు గల త్రిశిరస్సు హనుమంతుని అరచేతి దెబ్బ తగులుటచేత స్పృహ తప్పి, చేతిలోని ఆయుధమును జారవిడచి నేలమీద పడిపోయెను. 43

మూ. స తస్య పతతః ఖడ్గం తమాచ్ఛిద్య మహాకపిః,
ననాద గిరిసంకాశస్త్రాసయన్ సర్వరాక్షసాన్. 44

ప్ర. అ. గిరిసంకాశః=పర్వతముతో సమానుడైన, సః=ఆ, మహాకపిః=వాన రశ్రేష్ఠుడు, పతతః=పడుచున్న, తస్య=వానియొక్క, తం ఖడ్గమ్= ఆ ఖడ్గమును, ఆచ్ఛిద్య=లాగికొని, సర్వరాక్షసాన్=అందరు రాక్షసులను, త్రాసయన్=భయపెట్టుచు, ననాద=ధ్వనిచేసెను.

తా. పర్వతమువంటి వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు క్రింద

పడిపోవుచున్న ఆతని ఖడ్గమును తీసికొని ఆ రాక్షసుల నందరిని భయపెట్టుచు గర్జించెను. 44

మూ. అమృష్యమాణస్తం ఘోషముత్పపాత నిశాచరః,
ఉత్పత్య చ హనూమన్తం తాడయామాస ముష్టినా. 45

ప్ర. అ. నిశాచరః=ఆ రాక్షసుడు, తం ఘోషమ్=ఆ ధ్వనిని, అమృష్యమాణః=సహించనివాడై, ఉత్పపాత=పైకి ఎగిరెను. ఉత్పత్య=ఎగిరి, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, ముష్టినా=పిడికిలిచేత, తాడయామాస=కొట్టెను.

తా. ఆ రాక్షసుడు ఆ ధ్వనిని సహించక పై కెగిరి, హనుమంతుణ్ణి పిడికిలిచే కొట్టెను. 45

మూ. తేన ముష్టిప్రహారేణ సంచుకోప మహాకపిః,
కుపితశ్చ నిజగ్రాహ కిరీటే రాక్షసర్షభమ్. 46

ప్ర. అ. మహాకపిః=గొప్ప వానరుడైన హనుమంతుడు, తేన=ఆ, ముష్టిప్రహారేణ=పిడికిలి దెబ్బచేత, సంచుకోప=కోపించెను. కుపితః చ=కోపించినవాడై, రాక్షసర్షభమ్=ఆ రాక్షసశ్రేష్ఠుణ్ణి, కిరీటే=కిరీటమునందు, నిజగ్రాహ=పట్టుకొనెను.

తా. వానరులలో గొప్పవాడైన హనుమంతుడు ఆ పిడికిలి దెబ్బకు చాల కోపించి రాక్షసశ్రేష్ఠుడైన త్రిశిరస్సును, కిరీటమునందు గ్రహించెను. 46

మూ. స తస్య శీర్షాణ్యసినా శితేన
కిరీటజుష్టాని సకుణ్డలాని,
క్రుద్ధః ప్రచిచ్ఛేద సుతోఽనిలస్య
త్వష్టుః సుతస్యేవ శిరాంసి శక్రః. 47

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన, సః=ఆ, అనిలస్య సుతః=వాయుపుత్రుడు, తస్య=వానియొక్క, కిరీటజుష్టాని=కిరీటములతో కూడిన, సకుణ్డలాని=కుండలములతో కూడిన, శీర్షాణి=శిరస్సులను, శక్రః=దేవేంద్రుడు, త్వష్టుః=త్వష్టయొక్క, సుతస్య=కుమారుడైన విశ్వరూపునియొక్క, శిరాంసి ఇవ=శిరస్సులను వలె, శితేన=వాడియైన, అసినా=కత్తిచేత, ప్రచిచ్ఛేద=ఛేదించెను.

తా. హనుమంతుడు కోపించి కిరీటములతోను, కుండలములతోను కూడిన ఆతని శిరస్సులను, దేవేంద్రుడు త్వష్ట కుమారుడైన విశ్వరూపుని శిరస్సులను ఖండించినట్లు వాడియైన కత్తితో ఖండించెను. 47

మూ. తాన్యాయతాక్షాణ్యగసంనిభాని
ప్రదీప్తవైశ్వానరలోచనాని,
పేతుః శిరాంసీన్ద్రరిపోః పృథివ్యాం
జ్యోతీంషి ముక్తాని యథార్కమార్గాత్. 48

ప్ర. అ. ఆయతాక్షాణి=దీర్ఘములైన ఇంద్రియములు కలవి, అగ సంనిభాని=పర్వతములతో సమానములు, ప్రదీప్తవైశ్వానరలోచనాని=మండుచున్న అగ్నివంటి నేత్రములు గలవి అయిన, ఇన్ద్రరిపోః=ఇంద్రశత్రువైన త్రిశిరస్సు యొక్క, తాని శిరాంసి=ఆ శిరస్సులు, అర్కమార్గాత్=సూర్యుని మార్గమునుండి, ముక్తాని=విడువబడిన, జ్యోతీంషి యథా=నక్షత్రముల వలె, పృథివ్యామ్=నేలమీద, పేతుః=పడినవి.

తా. విశాలములైన ఇంద్రియములు, ప్రజ్వలించుచున్న అగ్నులవంటి నేత్రములు గల, పర్వతములతో సమానములైన ఆ త్రిశిరస్సు తలలు, ఆకాశమార్గమునుండి జారవిడచిన నక్షత్రముల వలె నేలమీద పడినవి. 48

మూ. తస్మిన్ హతే దేవరిపౌ త్రిశీర్షే
హనూమతా శక్రపరాక్రమేణ,
నేదుః ప్లవంగాః ప్రచచాల భూమీ
రక్షాంస్యథో దుద్రువిరే సమన్తాత్. 49

ప్ర. అ. దేవరిపౌ=దేవతల శత్రువైన, తస్మిన్=ఆ, త్రిశీర్షే=త్రిశిరస్సు, శక్రపరాక్రమేణ=ఇంద్రునివంటి పరాక్రమము గల, హనూమతా=హనుమంతుని చేత, హతే=చంపబడినవాడగుచుండగా, ప్లవంగాః=వానరులు, నేదుః=ధ్వనిచేసిరి. భూమీః=భూమి, ప్రచచాల=చలించెను. అథో=అటుపిమ్మట, రక్షాంసి=రాక్షసులు, సమన్తాత్=అంతటను, దుద్రువిరే=పారిపోయిరి.

తా. దేవేంద్రుని వంటి పరాక్రమము గల హనుమంతుడు దేవతాశత్రువైన ఆ త్రిశిరస్సును చంపగానే వానరులు ఆనందముతో ధ్వనిచేసిరి. భూమి చలించెను. రాక్షసులు నాలుగు మూలలకూ పారిపోయిరి. 49

మూ. హతం త్రిశిరసం దృష్ట్వా మహోదరమథాపి చ,
హతౌ ప్రేక్ష్య దురాధర్షౌ దేవాన్తకనరాన్తకౌ, 50
చుకోప పరమామర్షీ మత్తో రాక్షసపుంగవః.

ప్ర. అ. త్రిశిరసమ్=త్రిశిరస్సును, హతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, అథాపి చ=మరియు, మహోదరమ్=మహోదరుణ్ణి చంపబడినవానినిగా చూచి, దురాధర్షౌ=ఎదిరింప శక్యముకాని, దేవాన్తకనరాన్తకౌ=దేవాంతకనరాంతకు

లను, హతౌ=చంపబడినవారినిగా, ప్రేక్ష్య=చూచి, పరమామర్షీ=అధికమైన కోపము గల, రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడైన, మత్తః=మత్తుడు, చుకోప=కోపించెను.

తా. త్రిశిరస్సును, మహోదరునీ, ఎదిరింప శక్యముకాని దేవాంతక నరాంతకులనూ వానరవీరు లట్లు చంపివేయుట చూచి, అధికమైన కోపముగల రాక్షసశ్రేష్ఠుడైన మత్తుడు (మహాపార్శ్వుడు) కోపావిష్టు డయ్యెను. 50

మూ. జగ్రాహార్చిష్మతీం చాపి గదాం సర్వాయసీం తదా, 51
హేమపట్టపరిక్షిప్తాం మాంసశోణితఫేనిలామ్,
విరాజమానాం విపులాం శత్రుశోణితతర్పితామ్. 52
తేజసా సంప్రదీప్తాగ్రాం రక్తమాల్యవిభూషితామ్,
ఐరావతమహాపద్మసార్వభౌమభయావహామ్. 53

ప్ర. అ. తదా=అప్పుడు, అర్చిష్మతీమ్=జ్వాలలు కలది, సర్వాయసీమ్=పూర్తిగా ఇనుముచేత నిర్మించబడినది, హేమపరిక్షిప్తామ్=బంగారు పట్టీలచేత చుట్టబడినది, మాంసశోణితఫేనిలామ్=మాంసరక్తముల నురుగుతో నిండినది, విరాజమానామ్=ప్రకాశించుచున్నది, విపులామ్=పెద్దది, శత్రుశోణితతర్పితామ్=శత్రువుల రక్తముచేత తృప్తి చెందింపబడినది, తేజసా=తేజస్సుతో, సంప్రదీప్తాగ్రామ్=ప్రజ్వలించుచున్న అగ్రభాగము గలది, రక్తమాల్యవిభూషితామ్=ఎఱ్ఱని మాలికలచేత అలంకరింపబడినది, ఐరావతమహాపద్మసార్వభౌమభయావహామ్=ఐరావత - మహాపద్మ - సార్వభౌమము అను దిగ్గజములకు భయము కలిగించినది అయిన, గదామ్=గదను, జగ్రాహ=గ్రహించెను.

తా. అప్పు డతడు పూర్తిగా ఇనుముతో చేసిన, బంగారు పట్టీలు వేసిన గదను ధరించెను. ఆ గద మీద మాంసరక్తముల నురుగు కప్పి ఉండెను. ప్రకాశించుచున్న చాల పెద్దదైన దానికి శత్రువుల రక్తముచేత అనేకపర్యాయములు తృప్తి కలిగింపబడెను. దాని అగ్రభాగము తేజస్సుతో మండుచుండెను. ఎఱ్ఱని పుష్పమాలలచేత అలంకరించబడెను. అది పూర్వము ఐరావతము, మహాపద్మము, (పుండరీకము) సార్వభౌమము అను దిగ్గజములకు కూడ దిగులు కలిగించెను. 51-53

మూ. గదామాదాయ సంక్రుద్ధో మత్తో రాక్షసపుంగవః,
హరీన్ సమభిదుద్రావ యుగాన్తాగ్నిరివ జ్వలన్. 54

ప్ర. అ. సంక్రుద్ధః=కోపించిన, రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడైన, మత్తః=మత్తుడు, గదామ్=గదను, ఆదాయ=గ్రహించి, జ్వలన్=మండుచున్న, యుగాన్తాగ్నిరివ=ప్రళయకాలాగ్ని వలె, హరీన్=వానరులను గూర్చి, సమభిదుద్రావ=పరుగెత్తెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన ఆ మత్తుడు కోపించి, గదను ధరించి, ప్రజ్వలించుచున్న ప్రలయకాలాగ్నివలె వానరులమీదికి వేగముగా వెళ్లెను. 54

మూ. అథర్షభః సముత్పత్య వానరో రావణానుజమ్,
మత్తానీకముపాగమ్య తస్థౌ తస్యాగ్రతో బలీ. 55

ప్ర. అ. అథ=అటుపిమ్మట, బలీ=బలవంతుడైన, ఋషభః=ఋషభుడు అను, వానరః=వానరుడు, ఉత్పత్య=పైకి ఎగిరి, రావణానుజమ్=రావణుని తమ్ముడైన, మత్తానీకమ్=మత్తానీకుణ్ణి, ఉపాగమ్య=సమీపించి, తస్య=వానియొక్క, అగ్రతః=ఎదుట, తస్థౌ=నిలచెను.

తా. అప్పుడు, ఋషభు డను వానరనాయకుడు ఎగిరి వచ్చి రావణుని తమ్ముడైన ఆ మత్తానీకుని (మహాపార్శ్వుని) ఎదుట నిలచెను. 55

మూ. తం పురస్తాత్ స్థితం దృష్ట్వా వానరం పర్వతోపమమ్,
ఆజఘానోరసి క్రుద్ధో గదయా వజ్రకల్పయా. 56

ప్ర. అ. పురస్తాత్=ఎదుట, స్థితమ్=నిలచిన, పర్వతోపమమ్=పర్వతముతో సమానుడైన, వానరమ్=ఋషభుణ్ణి, దృష్ట్వా=చూచి, క్రుద్ధః=కోపించినవాడై, వజ్రకల్పయా=వజ్రముతో సమానమైన, గదయా=గదచేత, ఉరసి=వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. అతడు తన ఎదుట నిలచిన పర్వతము వంటి ఆ ఋషభుణ్ణి చూచి, కోపించి, వజ్రముతో సమానమైన గదతో ఆతని వక్షఃస్థలముమీద కొట్టెను. 56

మూ. స తయాభిహతస్తేన గదయా వానరర్షభః,
భిన్నవక్షాః సమాధూతః సుస్రావ రుధిరం బహు. 57

ప్ర. అ. తేన=వానిచేత, తయా=ఆ, గదయా=గదచేత, అభిహతః=కొట్టబడిన, సః=ఆ, వానరర్షభః=వానరశ్రేష్ఠుడు, భిన్నవక్షాః=బ్రద్దలుకొట్టబడిన వక్షఃస్థలము గలవాడై, సమాధూతః=చలింపచేయబడినవాడై, బహు=అధికముగా, రుధిరమ్=రక్తమును, సుస్రావ=స్రవించెను.

తా. ఆతడు ఆ గదతో కొట్టగా వానరశ్రేష్ఠుడైన ఋషభుని వక్షఃస్థలము బ్రద్దలయ్యెను. అపు డాతడు చలించిపోయి అధికముగా రక్తమును స్రవించెను.

మూ. స సంప్రాప్య చిరాత్సంజ్ఞామృషభో వానరేశ్వరః,
క్రుద్ధో విస్ఫురమాణౌష్ఠో మహాపార్శ్వముదైక్షత. 58

ప్ర. అ. వానరేశ్వరః=వానరనాయకుడైన, సః ఋషభః=ఆ ఋషభుడు, చిరాత్=చాలసమయమునకు, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రాప్య=పొంది, క్రుద్ధః=కోపించినవాడై, విస్ఫురమాణౌష్ఠః=అదరుచున్న పెదవులు గలవాడై, మహాపార్శ్వమ్=మహాపార్శ్వుణ్ణి, ఉదైక్షత=చూచెను.

తా. వానరనాయకుడైన ఆ ఋషభుడు చాల సేపటికి స్పృహ పొంది, కోపముతో పెదవులు అదరగా, మహాపార్శ్వుణ్ణి చూచెను. 58

మూ. స వేగవాన్ వేగవదభ్యుపేత్య
తం రాక్షసం వానరవీరముఖ్యః,
సంవర్త్య ముష్టిం సహసా జఘాన
బాహ్వన్తరే శైలనికాశరూపః. 59

ప్ర. అ. వేగవాన్=వేగముగలవాడు, శైలనికాశరూపః=శైలముతో సమానమైన రూపము గలవాడు అయిన, సః=ఆ, వానరవీరముఖ్యః=వానరవీరులలో ముఖ్యుడైన ఋషభుడు, వేగవత్=వేగముగా, అభ్యుపేత్య=సమీపించి, ముష్టిమ్=పిడికిలిని, సంవర్త్య=బిగించి, తం రాక్షసమ్=ఆ రాక్షసుణ్ణి, బాహ్వన్తరే=బాహువుల మధ్యయందు, సహసా=వెంటనే, జఘాన=కొట్టెను.

తా. పర్వతము వంటి ఆకారము గల, వానరవీరులలో ముఖ్యుడైన, ఆ వేగవంతుడైన ఋషభుడు వేగముతో ఆ రాక్షసుని సమీపించి, పిడికిలి బిగించి, వాని వక్షఃస్థలముమీద కొట్టెను. 59

మూ. స కృత్తమూలః సహసేవ వృక్షః
క్షితౌ పపాత క్షతజోక్షితాఙ్గః,
తాం చాస్య ఘోరాం యమదణ్డకల్పాం
గదాం ప్రగృహ్యాశు తదా ననాద. 60

ప్ర. అ. సః=అతడు, కృత్తమూలః=ఛేదించబడిన మొదలు గల, వృక్షః ఇవ=వృక్షము వలె, క్షతజోక్షితాఙ్గః=రక్తముచేత తడపబడిన శరీరము గలవాడై, సహసా=వెంటనే, క్షితౌ=నేలమీద, పపాత=పడెను. తదా=అప్పుడు, అస్య=వీనియొక్క, ఘోరామ్=భయంకరమైన, యమదణ్డకల్పామ్=యమదండముతో సమానమైన, తాం గదామ్=ఆ గదను, ఆశు=శీఘ్రముగా, ప్రగృహ్య=గ్రహించి, ననాద=ధ్వనిచేసెను.

తా. మహాపార్శ్వుడు రక్తముతో తడిసిన దేహము గలవాడై, మొదలు నరికిన చెట్టు వలె వెంటనే నేలమీద పడి మూర్ఛిల్లెను. ఋషభుడు యమదండమువంటి భయంకరమైన ఆ గదను వెంటనే తీసికొని

గర్జించెను.

మూ. ముహూర్తమాసీత్స గతాసుకల్పః
ప్రత్యాగతాత్మా సహసా సురారిః,
ఉత్పత్య సంధ్యాభ్రసమానవర్ణ
స్తం వారిరాజాత్మజమాజఘాన. 61

ప్ర. అ. సః=అతడు, ముహూర్తమ్=ముహూర్తకాలము, గతాసుకల్పః=మరణించినవాడు వలె, ఆసీత్=అయెను. సహసా=వెంటనే, సంధ్యాభ్రసమానవర్ణః=సంధ్యాకాలమేఘముతో సమానమైన వర్ణము గల, సురారిః=ఆ రాక్షసుడు, ప్రత్యాగతాత్మా=తిరిగి వచ్చిన సంజ్ఞ కలవాడై, ఉత్పత్య=పైకి లేచి, తమ్=ఆ, వారిరాజాత్మజమ్=వరుణుని కుమారుడైన ఋషభుణ్ణి, ఆజఘాన=కొట్టెను.

తా. ఆ ఋషభుడు ముహూర్తకాలము మరణించి నట్లు పడి ఉండెను. దేవతాశత్రువు, సంధ్యాకాలమునందలి మేఘముతో సమానమైన వర్ణము గలవాడు అయిన ఆతడు వెంటనే స్పృహ రాగా లేచి ఆ ఋషభుణ్ణి కొట్టెను. 61

మూ. స మూర్ఛితో భూమితలే పపాత
ముహూర్తముత్పత్య పునః ససంజ్ఞః,
తామేవ తస్యాద్రివరాద్రికల్పాం
గదాం సమావిధ్య జఘాన సంఖ్యే. 62

ప్ర. అ. సః=ఆ ఋషభుడు, మూర్ఛితః=మూర్ఛచెందినవాడై, ముహూర్తమ్=ముహూర్తకాలము, భూమితలే=నేలమీద, పపాత=పడెను. ససంజ్ఞః=సంజ్ఞతో కూడినవాడై, పునః=మరల, ఉత్పత్య=పైకి ఎగిరి, తస్య=వానియొక్క, అద్రివరాద్రికల్పామ్–మహాపర్వతశిఖరమువలె ఉన్న, తామ్=ఆ, గదామేవ=గదనే, సమావిధ్య=గట్టిగా పట్టి, సంఖ్యే=యుద్ధమునందు, జఘాన=కొట్టెను.

తా. ఋషభుడు మూర్ఛ చెంది క్షణకాలము పాటు నేలమీద పడెను. మరల సంజ్ఞ వచ్చిన పిమ్మట పైకి లేచి మహాపర్వతశిఖరమువంటి ఆ గదనే గ్రహించి ఆతనిని యుద్ధమునందు కొట్టెను. 62

మూ. సా తస్య రౌద్రా సముపేత్య దేహం
రౌద్రస్య దేవాధ్వరవిప్రశత్రోః,
బిభేద వక్షః క్షతజం చ భూరి
సుస్రావ ధాత్వమ్భ ఇవాద్రిరాజః. 63

ప్ర. అ. రౌద్రా=భయంకరమైన, సా=ఆ గద, రౌద్రస్య=భయంకరుడు, దేవాధ్వరవిప్రశత్రోః=దేవతల, యజ్ఞముల, బ్రాహ్మణుల శత్రువూ అయిన, తస్య=ఆ

మహాపార్శ్వునియొక్క, దేహమ్=దేహమును, సముపేత్య=చేరి, వక్షః=వక్షస్థ మును, బిభేద=భేదించెను. అద్రిరాజః=పర్వతరాజు, ధాత్వమ్బు=గైరికాదిధాతువులతో కూడిన జలమును వలె (ఆ రాక్షసుడు), భూరి=అధికమైన, క్షతజమ్=రక్తమును సుస్రావ=స్రవించెను.

తా. భయంకరమైన ఆ గద, భయంకరుడు దేవ-యజ్ఞ-బ్రాహ్మణ శత్రువూ అయిన ఆ మహాపార్శ్వుని దేహమును సమీపించి అతని వక్షఃస్థలమును బ్రద్దలు కొట్టెను. అప్పుడు అతడు పర్వతము గైరికాదిధాతువు ద్రవమును కార్చినట్లు, అధికముగా, రక్తమును కార్చెను. 63

మూ. అభిదుద్రావ వేగేన గదాం తస్య మహాత్మనః,
తాం గృహీత్వా గదాం భీమామావిధ్య చ పునః పునః, 64
మత్తానీకం మహాత్మా స జఘాన రణమూర్ధని.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః=ఋషభుడు, మహాత్మనః= మహాత్ముడైన, తస్య=ఆ మహాపార్శ్వునియొక్క, గదామ్=గదనుగూర్చి, అభి దుద్రావ=శీఘ్రముగా వెళ్లెను. భీమామ్=భయంకరమైన, తాం గదామ్=ఆ గదను, గృహీత్వా=గ్రహించి, పునః పునః=మాటిమాటికి, ఆవిధ్య=నేలపైకొట్టి, రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, మత్తానీకమ్=మత్తానీకుని (మహాపార్శ్వుని) జఘాన=కొట్టెను.

తా. మహాత్ముడైన ఆ ఋషభుడు అతని గద పడిన వైపు శీఘ్రముగా పరుగెత్తి వెళ్లి, భయంకరమైన ఆ గదను గ్రహించి, మాటిమాటికి దాని నేలపై కొట్టి ఊపుచు, దానితో ఆ మహాపార్శ్వుణ్ణి కొట్టెను. 64

మూ. స స్వయా గదయా భగ్నో విదీర్ణదశనేక్షణః, 65
నిపపాత తదా మత్తో వజ్రాహత ఇవాచలః.

ప్ర. అ. స్వయా=తన సంబంధమైన, గదయా=గదచేత, భగ్నః=కొట్టబడిన, సః=ఆ, మత్తః=మత్తుడు (మహాపార్శ్వుడు), విశీర్ణదశనేక్షణః=బ్రద్దలైన దంతములు నేత్రములు కలవాడై, తదా=అప్పుడు, వజ్రాహతః=వజ్రముచేత కొట్టబడిన, అచలః ఇవ=పర్వతము వలె, నిపపాత=పడెను.

తా. తన గదచేతనే కొట్టబడి బ్రద్దలైన దంతములు, నేత్రములు గల ఆ మహాపార్శ్వుడు వజ్రముచేత కొట్టబడిన పర్వతము వలె పడిపోయెను. 65

మూ. విదీర్ణనయనే భూమౌ గతసత్త్వే గతాయుషి, 66
పతితే రాక్షసే తస్మిన్ విద్రుతం రాక్షసం బలమ్.

ప్ర. అ. గతసత్త్వే=పోయిన బలము గల, గతాయుషి=పోయిన ఆయుర్దాయము గల, విదీర్ణనయనే=బ్రద్దలైన నేత్రములు గల, తస్మిన్ రాక్షసే=ఆ రాక్షసుడు, భూమౌ=భూమియందు, పతితే=పడినవా డగుచుండగా, రాక్షసమ్=రాక్షసుల సంబంధమైన, బలమ్=సేన, విద్రుతమ్=పారిపోయినది.

తా. ఆ రాక్షసుడు నేత్రములు బ్రద్దలైపోయి, బలము ఉడిగి ఆయుర్దాయము చెల్లి నేలమీద పడిపోయినవెంటనే ఆ రాక్షససైన్యము పారిపోయెను. 66

మూ. తస్మిన్ హతే భ్రాతరి రావణస్య
తన్నైరృతానాం బలమర్ణవాభమ్,
త్యక్తాయుధం కేవలజీవితార్థం
దుద్రావ భిన్నార్ణవసంనికాశమ్. 67

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తతితమః సర్గః.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, భ్రాతరి=సోదరుడైన, తస్మిన్=అతడు, హతే=చంపబడినవాడగుచుండగా, నైరృతానామ్=రాక్షసులయొక్క, అర్ణవాభమ్=సముద్రముతో సమానమైన, తత్ బలమ్=ఆ సేన, త్యక్తాయుధమ్=విడువబడిన ఆయుధములు గలదై, భిన్నార్ణవసంనికాశమ్=గట్టు తెగిన సముద్రము వలె, కేవలజీవితార్థమ్=కేవలమూ ప్రాణాలకొరకు, దుద్రావ=పరుగెత్తెను.

తా. రావణుని సోదరుడైన మహాపార్శ్వుడు మరణించగానే సముద్రము వలె విశాలమైన ఆ రాక్షససైన్యము, ఆయుధములను విడచి, కేవలము ప్రాణాలను రక్షించుకొనుటకై, గట్టు తెగిన సముద్రము వలె పారిపోయెను. 67

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బదవ సర్గ సమాప్తము.

# అథ ఏకసప్తతితమః సర్గః

[అతికాయుడు ఘోరయుద్ధము చేయుట; లక్ష్మణుడు వానిని సంహరించుట.]

మూ. స్వబలం వ్యథితం దృష్ట్వా తుములం రోమహర్షణమ్,
భ్రాతౄంశ్చ నిహతాన్ దృష్ట్వా శక్రతుల్యపరాక్రమాన్. 1
పితృవ్యౌ చాపి సందృశ్య సమరే సంనిపాతితౌ,
యుద్ధోన్మత్తం చ మత్తం చ భ్రాతరౌ రాక్షసోత్తమౌ. 2
చుకోప చ మహాతేజా బ్రహ్మదత్తవరో యుధి,
అతికాయోఽద్రిసంకాశో దేవదానవదర్పహా. 3

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడు, బ్రహ్మదత్తవరః=బ్రహ్మచేత ఇవ్వబడిన వరములు కలవాడు, అద్రిసంకాశః=పర్వతముతో సమానుడు, యుధి=యుద్ధమునందు, దేవదానవదర్పహా=దేవతలయొక్క దానవులయొక్క దర్పమును తొలగించినవాడు అయిన, అతికాయః=అతికాయుడు, తుములమ్=వ్యాకులధ్వని చేయునది, రోమహర్షణమ్=రోమాంచమును కలిగించునది అయిన, స్వబలమ్=తన సైన్యమును, వ్యథితమ్=బాధింపబడినదానినిగా, దృష్ట్వా=చూచి, శక్రతుల్యపరాక్రమాన్=ఇంద్రునితో సమానమైన పరాక్రమము గల, భ్రాతౄన్ చ=సోదరులను కూడ, నిహతాన్=చంపబడినవారినిగా, దృష్ట్వా=చూచి, పితృవ్యౌ=తన పినతండ్రులు, రాక్షసోత్తమౌ=రాక్షసశ్రేష్ఠులు, భ్రాతరౌ=సోదరులూ అయిన, యుద్ధోన్మత్తం చ=యుద్ధోన్మత్తుణ్ణీ, మత్తం చ=మత్తుణ్ణీ, సమరే=యుద్ధమునందు, సంనిపాతితౌ=పడగొట్టబడినవారినిగా, సందృశ్య=చూచి, చుకోప చ=కోపించెను.

తా. గొప్ప తేజస్సు కలవాడు, బ్రహ్మనుండి వరములను పొందినవాడు, పర్వతమువంటి దేహము గలవాడు, యుద్ధములో దేవదానవుల దర్పమును తొలగించినవాడు అయిన అతికాయుడు, తుముల (వ్యాకులమైన) ధ్వని చేయుచు రోమాంచమును కలిగించు తన సైన్యము వ్యథ చెందుటను, ఇంద్రుని వంటి పరాక్రమము గల తన సోదరులు మరణించుటను చూచి, తన పినతండ్రులు, రాక్షసశ్రేష్ఠులు, సోదరులు అయిన యుద్ధోన్మత్త-మత్తులు (మహోదర మహాపార్శ్వులు)కూడ మరణించి నట్లు చూచి చాల కోపించెను. 1-3

మూ. స భాస్కరసహస్రస్య సంఘాతమివ భాస్వరమ్,
రథమారుహ్య శక్రారిరభిదుద్రావ వానరాన్. 4

ప్ర. అ. శక్రారిః=ఇంద్రుని శత్రువైన, సః=ఆ అతికాయుడు, భాస్కరసహస్రస్య=వేయి సూర్యులయొక్క, సంఘాతమివ=సముదాయము వలె, భాస్వరమ్=ప్రకాశించుచున్న, రథమ్=రథమును, ఆరుహ్య=ఎక్కి, వానరాన్=వానరులను గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. ఇంద్రుని శత్రువైన ఆ అతికాయుడు వేయిమంది సూర్యుల సముదాయము వలె ప్రకాశించుచున్న రథమును ఎక్కి వానరులమీదికి శీఘ్రముగా వెళ్లెను. 4

మూ. స విస్ఫార్య తదా చాపం కిరీటీ మృష్టకుణ్డలః,
నామ సంశ్రావయామాస ననాద చ మహాస్వనమ్. 5

ప్ర. అ. కిరీటీ=కిరీటము గలవాడు, మృష్టకుణ్డలః=బాగా తుడవబడిన కుండలములు గలవాడు అయిన, సః=అతడు, తదా=అప్పుడు, చాపమ్=ధనస్సును, విస్ఫార్య=చరచి, నామ=తన పేరును, సంశ్రావయామాస=వినిపించెను, మహాస్వనమ్=గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. కిరీటమును, మెరయుచున్న కుండలములను ధరించి ఉన్న అతడు ధనస్సును చరచి, తన పేరు వినిపించి, బిగ్గరగా అరచెను. 5

మూ. తేన సింహప్రణాదేన నామవిశ్రావణేన చ,
జ్యాశబ్దేన చ భీమేన త్రాసయామాస వానరాన్. 6

ప్ర. అ. తేన=ఆ, సింహప్రణాదేన=సింహనాదముచేతను, నామవిశ్రావణేన చ=పేరు వినిపించుటచేతను, భీమేన= భయంకరమైన, జ్యాశబ్దేన చ=నారిధ్వనిచేతను, వానరాన్=వానరులను, త్రాసయామాస=భయపెట్టెను.

తా. అతడు సింహనాదముచేత, తన పేరు వినిపించుటచేత, భయంకరమైన టంకారధ్వనిచేత వానరులకు భయము కలిగించెను. 6

మూ. తే దృష్ట్వా దేహమాహాత్మ్యం కుమ్భకర్ణోఽయముత్థితః,
భయార్తా వానరాః సర్వే సంశ్రయన్తే పరస్పరమ్. 7

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే వానరాః=ఆ వానరులు, దేహమాహాత్మ్యమ్=దేహముయొక్క పెద్దతనమును, దృష్ట్వా=చూచి, అయమ్=ఈ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, ఉత్థితః=లేచినాడు (అని తలచి), భయార్తాః=భయముచేత పీడితులై, పరస్పరమ్=పరస్పరము, సంశ్రయన్తే=ఆశ్రయించుచుండిరి.

తా. ఆ వానరు లందరు ఆతని పెద్ద దేహమును చూడగానే కుంభకర్ణుడు మరల లేచినా డని తలచి, భయాక్రాంతులై ఒకరి నొకరు ఆశ్రయించిరి. 7

మూ. తే తస్య రూపమాలోక్య యథా విష్ణోస్త్రివిక్రమే,
భయాద్వానరయోధాస్తే విద్రవన్తి తతస్తతః. 8

ప్ర. అ. తే=ఆ, తే=ప్రసిద్ధులైన, వానరయోధాః=వానరయోధులు, త్రివిక్రమే=త్రివిక్రమావతారమునందు, విష్ణోః యథా=విష్ణువుయొక్క వలె, తస్య=వానియొక్క, రూపమ్=రూపమును, ఆలోక్య=చూచి, భయాత్=భయమువలన, తతస్తతః=ఆ యా దిక్కులవైపు, విద్రవన్తి=పారిపోయిరి.

తా. త్రివిక్రమావతారసమయమునందు విష్ణువు రూపము వలె ఉన్న ఆతని రూపము చూచి ఆ వానరయోధులు భయపడి ఆ యా దిక్కులకు పరుగెత్తిరి. 8

మూ. తేఽతికాయం సమాసాద్య వానరా మూఢచేతసః,
శరణ్యం శరణం జగ్ముర్లక్ష్మణాగ్రజమాహవే. 9

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, అతికాయమ్=అతికాయుణ్ణి, సమాసాద్య=పొంది, మూఢచేతసః= మూఢమైన మనస్సులు కలవారై, ఆహవే=యుద్ధమునందు, శరణ్యమ్=రక్షకుడైన, లక్ష్మణాగ్రజమ్=రాముణ్ణి, శరణం జగ్ముః=శరణు పొందిరి.

తా. అతికాయుడు దగ్గరకు రాగానే ఆ వానరులు ఏమి చేయవలెనో తోచక, యుద్ధములో, శరణాగతరక్షకుడైన రాముణ్ణి శరణు జొచ్చిరి. 9

మూ. తతోఽతికాయం కాకుత్స్థో రథస్థం పర్వతోపమమ్,
దదర్శ ధన్వినం దూరాద్గర్జన్తం కాలమేఘవత్. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కాకుత్స్థః=రాముడు, రథస్థమ్=రథమునందున్నవాడు, పర్వతోపమమ్= పర్వతముతో సమానుడు, ధన్వినమ్=ధనుర్ధరుడు, కాలమేఘవత్=నల్లని మేఘమువలె, గర్జన్తమ్= గర్జించుచున్నవాడు అయిన అతికాయమ్=అతికాయుణ్ణి, దూరాత్=దూరమునుండి, దదర్శ=చూచెను.

తా. అప్పుడు, ధనుర్ధరుడై రథముమీద ఉన్న పర్వతము వంటి దేహము గల, కాలమేఘము వలె గర్జించుచున్న ఆ అతికాయుణ్ణి రాముడు దూరమునుండి చూచెను. 10

మూ. స తం దృష్ట్వా మహాకాయం రాఘవస్తు సువిస్మితః,
వానరాన్ సాన్త్వయిత్వా చ విభీషణమువాచ హ. 11

ప్ర. అ. సః=ఆ, రాఘవస్తు=రాముడైతే, మహాకాయమ్=పెద్ద శరీరము గల, తమ్=ఆ అతికాయుణ్ణి, దృష్ట్వా=చూచి, సువిస్మితః=బాగా ఆశ్చర్యపడినవాడై, వానరాన్=వానరులను, సాన్త్వయిత్వా చ=ఓదార్చి, విభీషణమ్= విభీషణుణ్ణి గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. రాముడు పెద్ద దేహము గల ఆ అతికాయుణ్ణి చూచి, చాల ఆశ్చర్యపడుచు, వానరులకు ధైర్యము చెప్పి, విభీషణునితో ఇట్లు పలికెను. 11

మూ. కోఽసౌ పర్వతసంకాశో ధనుష్మాన్ హరిలోచనః,
యుక్తే హయసహస్రేణ విశాలే స్యన్దనే స్థితః. 12

ప్ర. అ. పర్వతసంకాశః=పర్వతముతో సమానమైనవాడూ, ధనుష్మాన్=ధనుస్సు కలవాడూ, హరిలోచనః=పచ్చని నేత్రములు కలవాడూ, హయసహస్రేణ=గుఱ్ఱములయొక్క సహస్రములచేత, యుక్తే=కట్టబడిన, విశాలే= విశాలమైన, స్యన్దనే=రథమునందు, స్థితః=ఉన్నవాడూ ఐన, అసౌ=ఇతడు, కః=ఎవడు?

తా. ధనుస్సు ధరించి, వెయ్యి గుఱ్ఱములు కట్టిన విశాలమైన రథమునందు ఉన్న, పచ్చని కళ్లు, పర్వతము వంటి దేహము గల ఇతడు ఎవడు? 12

మూ. య ఏష నిశితైః శూలైః సుతీక్ష్ణైః ప్రాసతోమరైః,
అర్చిష్మద్భిర్వృతో భాతి భూతైరివ మహేశ్వరః. 13

ప్ర. అ.యః=ఏ, ఏషః=ఇతడు, అర్చిష్మద్భిః=కాంతి గల, నిశితైః=వాడియైన, శూలైః=శూలములతోనూ, సుతీక్ష్ణైః=చాల తీక్ష్ణములైన, ప్రాసతోమరైః=ప్రాసలతోనూ, తోమరములతోనూ, వృతః=కూడినవాడై, భూతైః= భూతములతో కూడిన, మహేశ్వరః ఇవ=మహేశ్వరుడు వలె, భాతి=ప్రకాశించుచున్నాడు.

తా. ఇతడు తన చుట్టూ ఉన్న కాంతిగల వాడియైన శూలములతోనూ, చాల వాడియైన ప్రాసలతోనూ, తోమరములతోనూ, చుట్టూ భూతములు ఉన్న మహేశ్వరుని వలె ప్రకాశించుచున్నాడు. 13

మూ. కాలజిహ్వాప్రకాశాభిర్య ఏషోఽభివిరాజతే,
ఆవృతో రథశక్తీభిర్విద్యుద్భిరివ తోయదః. 14

ప్ర. అ. యః=ఏ, ఏషః=ఇతడు, కాలజిహ్వాప్రకాశాభిః=మృత్యుదేవత

జిహ్వావంటి ప్రకాశ గల, రథశక్తిభిః= రథమునందలి శక్తులతో, ఆవృతః=కూడినవాడై, విద్యుద్భిః=మెరుపులతో కూడిన, తోయదః ఇవ=మేఘము వలె, అభివిరాజతే=ప్రకాశించుచున్నాడో.

తా. రథమునందు మృత్యుదేవత జిహ్వల వంటి ప్రకాశ గల శక్తులు ఇతని చుట్టూ ఉండుటచే ఇతడు చుట్టూ మెరుపులు ఉన్న మేఘము వలె ప్రకాశించుచున్నాడు. 14

మూ. ధనూంషి చాస్య సజ్జాని హేమపృష్ఠాని సర్వశః,
శోభయన్తి రథశ్రేష్ఠం శక్రచాపమివామ్బరమ్. 15

ప్ర. అ.సజ్జాని=సిద్ధము చేయబడిన, హేమపృష్ఠాని=బంగారు పైభాగములు గల, ధనూంషి చ=ధనుస్సులు కూడ, అస్య=వీనియొక్క, రథశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన రథమును, శక్రచాపమ్=ఇంద్రధనుస్సు, అమ్బరమ్ ఇవ=ఆకాశమును వలె, సర్వశః=అన్ని వైపులా, శోభయన్తి=ప్రకాశింపజేయుచున్నవి.

తా. సిద్ధముగా ఉంచబడిన, బంగారము పూసిన పై భాగములు గల ధనుస్సులు ఇతని శ్రేష్ఠమైన రథమును, ఇంద్రధనుస్సు ఆకాశమును వలె అన్ని వైపుల ప్రకాశింపజేయుచున్నవి. 15

మూ. య ఏష రక్షశ్శార్దూలో రణభూమిం విరాజయన్,
అభ్యేతి రథినాం శ్రేష్ఠో రథేనాదిత్యవర్చసా. 16
ధ్వజశృఙ్గప్రతిష్ఠేన రాహుణాభివిరాజతే
సూర్యరశ్మిప్రభైర్బాణైర్దిశో దశ విరాజయన్. 17

ప్ర. అ. యః=ఏ, రక్షశ్శార్దూలః=రాక్షసశ్రేష్ఠుడూ, రథినామ్=రథికులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడూ ఐన, ఏషః=ఇతడు, రణభూమిమ్=యుద్ధభూమిని, విరాజయన్=ప్రకాశింపచేయుచూ, ఆదిత్యవర్చసా=సూర్యునివంటి కాంతి గల, రథేన=రథముతో, అభ్యేతి=వచ్చుచున్నాడో, సూర్యరశ్మిప్రభైః=సూర్యుని కిరణముల వంటి కాంతులు గల, బాణైః=బాణములచేత, దశ=పది, దిశః=దిక్కులను, విరాజయన్=ప్రకాశింపచేయుచూ, ధ్వజశృఙ్గప్రతిష్ఠేన=ధ్వజాగ్రమునందు ఉంచబడిన, రాహుణా=రాహువుచేత, అభివిరాజతే=ప్రకాశించుచున్నాడో.

తా. రథికులలో శ్రేష్ఠుడైన ఈ రాక్షసవీరుడు యుద్ధభూమిని ప్రకాశింపచేయుచూ, సూర్యునివంటి కాంతి గల రథముపై వచ్చుచున్నాడు. రాహుచిహ్నమును ధ్వజాగ్రమునందు నిలిపిన ఇతడు సూర్యకిరణములవంటి కాంతులు గల బాణములతో పది దిక్కులను ప్రకాశింపచేయుచున్నాడు. 17

మూ. త్రినతం మేఘసంనాదం హేమపృష్ఠమలంకృతమ్,
శతక్రతుధనుఃప్రఖ్యం ధనుశ్చాస్య విరాజతే. 18

ప్ర. అ. అస్య=వీనియొక్క, త్రినతమ్=మూడు వంపులు గలదీ, మేఘసంనాదమ్=మేఘమువంటి ధ్వని గలదీ, హేమపృష్ఠమ్=బంగారు పైభాగము కలదీ, అలంకృతమ్=అలంకరింపబడినదీ ఐన, ధనుః=ధనుస్సు, శతక్రతుధనుః ప్రఖ్యమ్=ఇంద్రుని ధనుస్సుతో సమానమై, విరాజతే=ప్రకాశించుచున్నది.

తా. ఈతని బంగారు పైభాగము గల అలంకరింపబడిన, మేఘము వలె ధ్వని చేయుచున్న, మూడు వంపులున్న ధనుస్సు ఇంద్రధనుస్సు వలె ప్రకాశించుచున్నది. 18

మూ. సధ్వజః సపతాకశ్చ సానుకర్షో మహారథః,
చతుస్సాదిసమాయుక్తో మేఘస్తనితనిఃస్వనః. 19

ప్ర. అ. సధ్వజః=ధ్వజముతో కూడినదీ, సపతాకశ్చ=పతాకలతో కూడినదీ, సానుకర్షః=క్రింది దూలముతో కూడినదీ, మేఘస్తనితనిఃస్వనః= మేఘముల ఉరుమువంటి ధ్వని గలదీ ఐన, మహారథః=గొప్ప రథము, చతుస్సాదిసమాయుక్తః=నలుగురు సారథులతో కూడినది.

తా. ధ్వజముతోనూ, పతాకలతోనూ అలంకరింపబడి, మంచి క్రింది దూలము గల, ఉరుముల వంటి ధ్వని గల ఈతని పెద్ద రథమునందు నలుగురు సారథు లున్నారు. 19

మూ. వింశతిర్దశ చాష్టౌ చ తూణ్యోఽస్య రథమాస్థితాః,
కార్ముకాణి చ భీమాని జ్యాశ్చ కాంచనపింగళాః. 20

ప్ర. అ. వింశతిః=ఇరవై, దశ చ=పది, అష్టౌ చ=ఎనిమిది, తూణ్యః=అంబులపొదులు, భీమాని=భయంకరమైన, కార్ముకాణి చ=ధనుస్సులూ, కాఞ్చనపిఙ్గళాః=బంగారము వలె పచ్చగా నున్న, జ్యాశ్చ=నారులు, అస్య= ఇతనియొక్క, రథమ్=రథమును, ఆస్థితాః=అధిష్ఠించి ఉన్నవి.

తా. ఈతని రథమునందు ఇరవై, పది, ఎనిమిది అంబులపొదులూ, భయంకరములైన ధనుస్సులూ, బంగారు రంగు గల నారులూ ఉన్నవి. 20

మూ. ద్వౌ చ ఖడ్గౌ రథగతౌ ప్రదీప్తౌ పార్శ్వశోభితౌ,
చతుర్హస్తత్సరుచితౌ వ్యక్తహస్తదశాయతౌ. 21

ప్ర. అ. ప్రదీప్తౌ=ప్రకాశించుచున్నవీ, పార్శ్వశోభితౌ=పార్శ్వములందు శోభించుచున్నవీ, చతుర్హస్తత్సరుచితౌ=నాలుగు హస్తముల పొడవైన పిడితో

బిగించబడినవీ, వ్యక్తహస్తదశాయతౌ=స్పష్టముగా పది హస్తముల పొడవు గలవీ ఐన, ద్వౌ=రెండు, ఖడ్గౌ చ=ఖడ్గములు కూడా, రథగతౌ=రథమునందున్నవి.

తా. ఈతని రథముమీద పార్శ్వములందు ప్రకాశించుచున్న రెండు ఖడ్గములు తళతళలాడుచున్నవి. పూర్తిగా పది హస్తముల పొడవు గల ఈ ఖడ్గములు నాలుగు హస్తముల పొడవున్న పిడులచేత బిగించబడినవి. 21

మూ. రక్తకణ్ఠగుణో ధీరో మహాపర్వతసన్నిభః,
కాలః కాలమహావక్త్రో మేఘస్థ ఇవ భాస్కరః. 22

ప్ర. అ. రక్తకణ్ఠగుణః=ఎఱ్ఱని కంఠమునందలి త్రాడు గలవాడూ, ధీరః=ధీరుడు, మహాపర్వతసన్నిభః=పెద్ద పర్వతముతో సమానుడూ, కాలః=నల్లని వాడూ, కాలమహావక్త్రః=యమునివంటి పెద్దముఖము కలవాడూ ఐన ఇతడు, మేఘస్థః=మేఘముపై నున్న, భాస్కరః ఇవ=సూర్యుడు వలె ఉన్నాడు.

తా. మెడలో ఎఱ్ఱని త్రాడు ధరించి, పెద్ద పర్వతము వలె ఉన్న నల్లని దేహము గల యముని వంటి విశాలమైన ముఖము గల ఈ ధీరుడు మేఘము మీద నున్న సూర్యుడు వలె ఉన్నాడు. 22

మూ. కాఞ్చనాఙ్గదనద్ధాభ్యాం భుజాభ్యామేష శోభతే,
శృఙ్గాభ్యామివ తుఙ్గాభ్యాం హిమవాన్ పర్వతోత్తమః. 23

ప్ర. అ. కాఞ్చనాఙ్గదనద్ధాభ్యామ్=బంగారు బాహుపురులచేత కట్టబడిన, భుజాభ్యామ్=భుజములతో, ఏషః=ఇతడు, తుఙ్గాభ్యామ్=ఎత్తైన, శృఙ్గాభ్యామ్=శిఖరములతో, పర్వతోత్తమః=పర్వతములలో ఉత్తమమయిన, హిమవాన్ ఇవ=హిమవత్పర్వతము వలె, శోభతే=ప్రకాశించుచున్నాడు.

తా. బంగారు బాహుపురులు కట్టిన భుజములతో ఇతడు పర్వతరాజైన హిమవంతుడు ఉన్నతమైన శిఖరములతో శోభించుచున్నట్లు శోభించుచున్నాడు.

మూ. కుణ్డలాభ్యాముభాభ్యాం చ భాతి వక్త్రం సుభీషణమ్,
పునర్వస్వన్తరగతః పరిపూర్ణో నిశాకరః. 24

ప్ర. అ. సుభీషణమ్=చాల భయంకరమైన, వక్త్రమ్=ముఖము, ఉభాభ్యామ్=రెండు, కుణ్డలాభ్యామ్= కుండలములతో, పునర్వస్వన్తరగతః=పునర్వసునక్షత్రముల మధ్య నున్న, పరిపూర్ణః=పరిపూర్ణుడైన, నిశాకరః= చంద్రుడు వలె, భాతి=ప్రకాశించుచున్నది.

తా. ఈతని భయంకరమైన ముఖము రెండు కుండలములతో పునర్వసు నక్షత్రముల మధ్య నున్న పూర్ణచంద్రబింబమువలె ప్రకాశించుచున్నది. 24

మూ. ఆచక్ష్వ మే మహాబాహో త్వమేనం రాక్షసోత్తమమ్,
యం దృష్ట్వా వానరాస్సర్వే భయార్తా విద్రుతా దిశః. 25

ప్ర. అ. మహాబాహో!=గొప్ప బాహువులు కలవాడా!, యమ్=ఎవనిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, భయార్తాః=భయముచేత పీడితులై, దిశః=దిక్కులను గూర్చి, విద్రుతాః=పారిపోయినారో, ఏనమ్=ఈ, రాక్షసోత్తమమ్=రాక్షసశ్రేష్ఠుని గూర్చి, త్వమ్=నీవు, మే=నాకు, ఆచక్ష్వ=చెప్పుము.

తా. గొప్ప బాహువులు కలవాడా! ఈ రాక్షసోత్తముడు ఎవడో నాకు చెప్పుము. ఇతన్ని చూచి వానరులందరూ భయపీడితులై దిక్కులు పట్టి పారిపోవుచున్నారు. 25

మూ. స పృష్టో రాజపుత్రేణ రామేణామితతేజసా,
ఆచచక్షే మహాతేజా రాఘవాయ విభీషణః. 26

ప్ర. అ. రాజపుత్రేణ=రాజపుత్రుడైన, అమితతేజసా=అపరిమితమైన తేజస్సు కల, రామేణ=రామునిచేత, పృష్టః= అడగబడిన, సః=ఆ, మహాతేజాః=గొప్ప తేజస్సు కల, విభీషణః=విభీషణుడు, రాఘవాయ=రామునకు, ఆచచక్షే=చెప్పెను.

తా. అపరిమితమైన తేజస్సు కల రాజకుమారుడైన రాముడు ఇట్లు ప్రశ్నించగా, గొప్ప తేజస్సు గల ఆ విభీషణుడు ఆతనికి ఇట్లు చెప్పెను. 26

మూ. దశగ్రీవో మహాతేజా రాజా వైశ్రవణానుజః,
భీమకర్మా మహోత్సాహః రావణో రాక్షసేశ్వరః. 27

ప్ర. అ. దశగ్రీవః=పది కంఠములు కలవాడూ, మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడూ, రాజా=రాజూ, వైశ్రవణానుజః=కుబేరుని తమ్ముడూ, భీమకర్మా=భయంకరమైన పనులు కలవాడూ, మహోత్సాహః=గొప్ప ఉత్సాహము కలవాడూ ఐన, రావణః=రావణుడు, రాక్షసేశ్వరః=రాక్షసులకు ప్రభువు.

తా. పది కంఠములూ, గొప్ప తేజస్సూ గల రాజైన రావణుడు కుబేరుని తమ్ముడు. మహోత్సాహము గల అతడు చేయు పనులు భయంకరముగా ఉండును. అతడు రాక్షసుల ప్రభువు కదా! 27

మూ. తస్యాసీద్వీర్యవాన్ పుత్రో రావణప్రతిమో రణే,
వృద్ధసేవీ శ్రుతిధరః సర్వాస్త్రవిదుషాం వరః. 28

ప్ర. అ. తస్య=అతనికి, వీర్యవాన్=పరాక్రమవంతుడూ, రణే=యుద్ధమునందు, రావణప్రతిమః=రావణునితో సమానుడూ, వృద్ధసేవీ=పెద్దలను

సేవించేవాడూ, శ్రుతిధరః=శ్రుతిని ధరించినవాడూ, సర్వాస్త్రవిదుషామ్=అన్ని అస్త్రములనూ ఎరిగిన వారిలో, వరః=శ్రేష్ఠుడూ ఐన, పుత్రః=పుత్రుడు, ఆసీత్=ఉండెను.

తా. ఆ రావణునకు పరాక్రమవంతుడైన ఒక కుమారుడున్నాడు. ఆతడు యుద్ధములో రావణునితో సమానుడు. పెద్దలను సేవించువాడు. వినిన విషయములను (లేదా వేదములను) ధరించువాడు. అస్త్రవేత్త. లందరిలోనూ శ్రేష్ఠుడు. 28

మూ. అశ్వపృష్ఠే నాగపృష్ఠే ఖడ్గే ధనుషి కర్షణే,
భేదే సాన్త్వే చ దానే చ నయే మన్త్రే చ సమ్మతః. 29

ప్ర. అ. అశ్వపృష్ఠే=గుఱ్ఱముపైనా, నాగపృష్ఠే=ఏనుగుపైనా, ఖడ్గే=ఖడ్గమునందూ, సాన్త్వే చ= సామమునందూ, దానే చ=దానమునందూ, నయే=నీతియందూ, మన్త్రే చ=ఆలోచనయందూ, సమ్మతః= గౌరవించబడినవాడు.

తా. అతడు గుఱ్ఱములను, ఏనుగులను ఎక్కుటయందూ, ఖడ్గమును, ధనుస్సును ఉపయోగించుటయందూ, సైన్యమును నడుపుటయందూ, సామ, దాన, భేదోపాయములందూ, నీతియందూ, ఆలోచనయందూ, సమర్థుడుగా గౌరవింపబడినవాడు. 29

మూ. యస్య బాహుం సమాశ్రిత్య లఙ్కా భవతి నిర్భయా,
తనయం ధాన్యమాలిన్యా అతికాయమిమం విదుః. 30

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, బాహుమ్=బాహువును, సమాశ్రిత్య= ఆశ్రయించి, లఙ్కా=లంక, నిర్భయా= భయములేనిది, భవతి=అగుచున్నదో, ఇమమ్=వీనిని, ధాన్యమాలిన్యాః=ధాన్యమాలినియొక్క, తనయమ్=కుమారుడైన, అతికాయమ్=అతికాయుణ్ణిగా, విదుః=తెలుసుకొనుచున్నారు.

తా. ఇతడు ధాన్యమాలిని పుత్రుడైన అతికాయుడు. ఈతని బాహువును ఆశ్రయించుకొని లంక నిర్భయముగా నున్నది. 30

మూ. ఏతేనారాధితో బ్రహ్మా తపసా భావితాత్మనా,
అస్త్రాణి చాప్యవాప్తాని రిపవశ్చ పరాజితాః. 31

ప్ర. అ. తపసా=తపస్సుచేత, భావితాత్మనా=పవిత్రముచేయబడిన మనస్సు కల, ఏతేన=ఈతనిచేత, బ్రహ్మా=బ్రహ్మ, ఆరాధితః=పూజింపబడినాడు. అస్త్రాణి చ=అస్త్రములు కూడా, అవాప్తాని=పొందబడినవి. రిపవశ్చ= శత్రువులు కూడా, పరాజితాః=ఓడింపబడిరి.

తా. తపస్సుచేత మనస్సును పవిత్రము చేసికొనిన ఇతడు బ్రహ్మను సంతోషింపజేసి అస్త్రములను పొంది, శత్రువులను ఓడించినాడు. 31

మూ. సురాసురైరవధ్యత్వం దత్తమస్మై స్వయంభువా,
ఏతచ్చ కవచం దివ్యం రథశ్చ రవిభాస్వరః. 32

ప్ర. అ. స్వయంభువా=బ్రహ్మదేవునిచేత, అస్మై=ఇతనికి, సురాసురైః=సురులచేత, అసురులచేత, అవధ్యత్వమ్= చంపబడకపోవుట, దత్తమ్=ఇవ్వబడినది. ఏతత్=ఈ, దివ్యమ్=దివ్యమైన, కవచం చ=కవచమూ, రవిభాస్వరః=సూర్యుడు వలె ప్రకాశించుచున్న, రథశ్చ=రథమూ (ఇవ్వబడినది).

తా. బ్రహ్మదేవుడు ఇతనికి సురాసురుల చేతులలో చావు లేకపోవుటనూ, దివ్యమైన ఈ కవచమునూ, సూర్యుడు వలె ప్రకాశించుచున్న ఈ రథమునూ ఇచ్చెను. 32

మూ. ఏతేన శతశో దేవా దానవాశ్చ పరాజితాః,
రక్షితాని చ రక్షాంసి యక్షాశ్చాపి నిషూదితాః. 33

ప్ర. అ. ఏతేన=ఇతనిచేత, శతశః=వందలకొలది పర్యాయములు, దేవాః=దేవతలూ, దానవాశ్చ=దానవులూ, పరాజితాః=ఓడింపబడిరి. యక్షాశ్చాపి=యక్షులు కూడా, నిషూదితాః=నశింపజేయబడినారు. రక్షాంసి=రాక్షసులు, రక్షితాని=రక్షింపబడినారు.

తా. ఇతడు అనేకపర్యాయములు దేవతలనూ, దానవులనూ ఓడించి, యక్షులను నశింపజేసి రాక్షసులను రక్షించినాడు. 33

మూ. వజ్రం విష్టంభితం యేన బాణైరిన్ద్రస్య ధీమతః,
పాశః సలిలరాజస్య యుద్ధే ప్రతిహతస్తథా.
ఏషోఽతికాయో బలవాన్ రాక్షసానామథర్షభః,
స రావణసుతో ధీమాన్ దేవదానవదర్పహా. 34, 35

ప్ర. అ. యేన=ఎవనిచేత, యుద్ధే=యుద్ధమునందు, బాణైః=బాణములచేత, ధీమతః=బుద్ధిమంతుడైన, ఇన్ద్రస్య= ఇంద్రునియొక్క, వజ్రమ్=వజ్రాయుధము, విష్టంభితమ్=స్తంభింపజేయబడినదో, తథా=మరియు, సలిలరాజస్య= వరుణునియొక్క, పాశః=పాశము, ప్రతిహతః=కొట్టివేయబడినదో, ఏషః=అట్టి ఇతడు, అతికాయః=అతికాయుడూ, బలవాన్=బలవంతుడూ, అథ=మరియు, రాక్షసానామ్=రాక్షసులలో, ఋషభః=శ్రేష్ఠుడూ ఐన, సః=అట్టి, ధీమాన్= బుద్ధిమంతుడైన, రావణసుతః=రావణకుమారుడు, దేవదానవదర్పహా=దేవతలయొక్క, దానవులయొక్క గర్వమును తొలగించినవాడు.

తా. యుద్ధములో బాణములచేత బుద్ధిమంతుడైన ఇంద్రుని వజ్రాయుధమును కదలకుండ చేసిన ఇతడు అతికాయుడు. వరుణుని పాశమును కూడా వ్యర్థమగునట్లు చేసినాడు. బలవంతుడూ, రాక్షసులలో శ్రేష్ఠుడూ, బుద్ధిమంతుడూ ఐన ఈ రావణపుత్రుడు దేవదానవుల దర్పమును అణచినాడు. 34, 35

మూ. తదస్మిన్ క్రియతాం యత్నః క్షిప్రం పురుషపుంగవ,
పురా వానరసైన్యాని క్షయం నయతి సాయకైః. 36

ప్ర. అ. పురుషపుంగవ=పురుషశ్రేష్ఠుడవైన ఓ రామా! తత్=అ కారణమువలన, అస్మిన్=వీని విషయమై, క్షిప్రమ్=శీఘ్రముగా, యత్నః=ప్రయత్నము, క్రియతామ్=చేయబడుగాక. వానరసైన్యాని=వానరసైన్యములను, సాయకైః=బాణములచేత, క్షయం=క్షయమును, పురా నయతి=పొందించగలడు.

తా. పురుషోత్తముడవైన రామా! అందువలన ఈతని విషయమున శీఘ్రముగా ప్రయత్నమును చేయుము. అట్లు కాకపోయినచో ఇతడు బాణములచేత వానరసైన్యములను నశింపచేయగలడు. 36

మూ. తతోఽతికాయో బలవాన్ ప్రవిశ్య హరివాహినీమ్,
విస్ఫారయామాస ధనుర్ననాద చ పునః పునః. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బలవాన్=బలముగల, అతికాయః=అతికాయుడు, హరివాహినీమ్=వానరసేనను, ప్రవిశ్య=ప్రవేశించి, ధనుః=ధనస్సును, విస్ఫారయామాస=చరచెను. పునః పునః=మాటిమాటికి, ననాద చ=ధ్వనిచేసెను కూడ.

తా. పిమ్మట బలశాలియైన అతికాయుడు వానరసైన్యములో ప్రవేశించి ధనస్సు చరచుచు మాటిమాటికి అరచెను. 37

మూ. తం భీమవపుషం దృష్ట్వా రథస్థం రథినాం వరమ్,
అభిపేతుర్మహాత్మానః ప్రధానా యే వనౌకసః. 38

ప్ర. అ. రథస్థమ్=రథమునందున్న, రథినామ్=రథికులలో, వరమ్=శ్రేష్ఠుడైన, భీమవపుషమ్=భయంకరమైన శరీరము గల, తమ్=ఆతనిని, దృష్ట్వా=చూచి, ప్రధానాః=ప్రధానులైన, మహాత్మానః=మహాత్ములైన, యే=ఏ, వనౌకసః=వానరులు గలరో వారు, అభిపేతుః=ఎదురుగా వెళ్లిరి.

తా. భయంకరమైన దేహము గల, రథము నధిష్ఠించి ఉన్న, రథికులలో శ్రేష్ఠుడైన ఆతనిని చూచి ప్రధానులైన మహాత్ములైన వానరులు ఎదిరించిరి. 38

మూ. కుముదో ద్వివిదో మైన్దో నీలః శరభ ఏవ చ,
పాదపైర్గిరిశృఙ్గైశ్చ యుగపత్సమభిద్రవన్. 39

ప్ర. అ. కుముదః=కుముదుడు, ద్వివిదః=ద్వివిదుడు, మైన్దః=మైందుడు, నీలః=నీలుడు, శరభః ఏవ చ= శరభుడు, పాదపైః=వృక్షములతోను, గిరిశృఙ్గైః చ=పర్వతశిఖరములతోను, యుగపత్=ఒక్కమాటుగా, సమభిద్రవన్= పరుగెత్తి వెళ్లిరి.

తా. కుముదుడు, ద్వివిదుడు, మైందుడు, నీలుడు, శరభుడు వృక్షములను, పర్వతశిఖరములను గ్రహించి ఒక్క మారుగా ఆతనిని ఎదిరించుటకై శీఘ్రముగా వెళ్లిరి. 39

మూ. తేషాం వృక్షాంశ్చ శైలాంశ్చ శరైః కనకభూషణైః,
అతికాయో మహాతేజాశ్చిచ్ఛేదాస్త్రవిదాం వరః. 40

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, అస్త్రవిదామ్=అస్త్రవేత్త లలో, వరః=శ్రేష్ఠుడైన, అతికాయః= అతికాయుడు, కనకభూషణైః=బంగారము అలంకారముగా గల, శరైః=బాణములచేత, తేషామ్=వాళ్లయొక్క, వృక్షాన్ చ=వృక్షములను, శైలాన్ చ=పర్వతములను, చిచ్ఛేద=ఛేదించెను.

తా. గొప్ప తేజస్సు కలవాడు, అస్త్రములు తెలిసినవారిలో శ్రేష్ఠుడూ అయిన అతికాయుడు వాళ్లు ప్రయోగించిన వృక్షములను, పర్వతశిఖరములను బంగారముచేత అలంకరించబడిన బాణాలతో నరికివేసెను. 40

మూ. తాంశ్చైవ సర్వాన్ స హరీన్ శరైః సర్వాయసైర్బలీ,
వివ్యాధాభిముఖాన్ సంఖ్యే భీమకాయో విశారదః. 41

ప్ర. అ. బలీ=బలవంతుడైన, భీమకాయః=భయంకరమైన శరీరముగల, విశారదః=నేర్పుగల, సః=అతడు, సంఖ్యే= యుద్ధమునందు, అభిముఖాన్=తనకు ఎదురుగా ఉన్న, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, హరీన్=వానరులను, సర్వాయసైః=పూర్తిగా ఇనుముతో చేయబడిన, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. బలవంతుడు, పెద్ద దేహము గలవాడు, నేర్పుగలవాడు అయిన ఆ అతికాయుడు యుద్ధమునందు తన ఎదుట ఉన్న ఆ వానరులను అందరినీ పూర్తిగా ఇనుముతో చేసిన బాణాలతో కొట్టెను. 41

మూ. తేఽర్దితా బాణవర్షేణ భిన్నగాత్రాః పరాజితాః,
న శేకురతికాయస్య ప్రతికర్తుం మహాహవే. 42

ప్ర. అ. మహాహవే=మహాయుద్ధమునందు, అతికాయస్య=అతికాయు

నియొక్క, బాణవర్షేణ=బాణవర్షముచేత, అర్దితాః=పీడించబడిన, భిన్నగాత్రాః= బ్రద్దలుకొట్టబడిన శరీరములు గల, తే=వాళ్లు, పరాజితాః=ఓడింపబడినవారై, ప్రతికర్తుమ్=ప్రతిక్రియ చేయుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. ఆ మహాయుద్ధమునందు అతికాయుని బాణవర్షముచేత పీడితులై, శరీరములు బ్రద్దలైపోగా ఓడిపోయిన ఆ వానరులు ఏమీ చేయజాలక పోయిరి.

మూ. తత్సైన్యం హరివీరాణాం త్రాసయామాస రాక్షసః,
మృగయూథమివ క్రుద్ధో హరిర్యౌవనదర్పితః. 43

ప్ర. అ. యౌవనదర్పితః=యౌవనముచేత గర్వించిన, రాక్షసః=రాక్షసుడు, క్రుద్ధః=కోపించిన, హరిః=సింహము, మృగయూథమివ=లేళ్ల గుంపును వలె, హరివీరాణామ్=వానరవీరులయొక్క, తత్=ఆ, సైన్యమ్=సైన్యమును, త్రాసయామాస=భయపెట్టెను.

తా. యౌవనముచేత గర్వించి ఉన్న ఆ రాక్షసుడు, కోపించిన సింహము లేళ్ల గుంపును వలె ఆ వానరవీరులయొక్క సైన్యమును భయపెట్టెను. 43

మూ. స రాక్షసేన్ద్రో హరియూథమధ్యే
నాయుధ్యమానం నిజఘాన కంచిత్,
ఉత్పత్య రామం సధనుఃకలాపీ
స గర్వితం వాక్యమిదం బభాషే. 44

ప్ర. అ. సః=ఆ, రాక్షసేన్ద్రః=రాక్షసనాయకుడు, హరియూథమధ్యే=వానరుల యూథము మధ్యయందు, అయుధ్యమానమ్=యుద్ధముచేయనివానిని, కంచిత్=ఎవనినీ, న నిజఘాన=కొట్టలేదు. సధనుఃకలాపీ=ధనస్సుతోను అంబుల పొదితోను కూడిన, సః=అతడు, ఉత్పత్య=శీఘ్రముగా వెళ్లి, రామమ్=రాముణ్ణి గూర్చి, గర్వితమ్= గర్వముతో కూడిన, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, బభాషే=పలికెను.

తా. ఆ రాక్షసవీరుడు వానరసైన్యములో యుద్ధము చేయని వానిని ఎవ్వనిని కొట్టలేదు. ధనస్సు, అంబులపొది ధరించి ఉన్న అతడు శీఘ్రముగా రాముని సమీపమునకు వెళ్లి గర్వమును ప్రకటించు మాటలు ఇట్లు పలికెను.

మూ. రథే స్థితోఽహం శరచాపపాణి
ర్న ప్రాకృతం కంచన యోధయామి,
యస్యాస్తి శక్తిర్వ్యవసాయయుక్తో
దదాతు మే శీఘ్రమిహాద్య యుద్ధమ్. 45

ప్ర. అ. అహమ్=నేను, శరచాపపాణిః=బాణములు ధనస్సు హస్తము నందు కలవాడనై, రథే=రథమునందు, స్థితః=ఉన్నాను. ప్రాకృతమ్=సామాన్యుణ్ణి, కంచన=ఎవణ్ణీ, న యోధయామి=యుద్ధము చేయించను. యస్య= ఎవనికి, శక్తిః=శక్తి, అస్తి=ఉన్నదో, వ్యవసాయయుక్తః=ప్రయత్నముతో కూడిన అట్టి వాడు, అద్య=ఇప్పుడు, ఇహ= ఇక్కడ, శీఘ్రమ్=శీఘ్రముగా, మే=నాకు, యుద్ధమ్=యుద్ధమును, దదాతు=ఇచ్చుగాక.

తా. "నేను ధనుర్బాణములను ధరించి ఈ రథముమీద ఉన్నాను. సామాన్యునితో ఎవ్వనితోనూ యుద్ధము చేయను ఎవనికైన శక్తీ, ఉత్సాహమూ ఉన్నచో అతడు శీఘ్రముగా ఇప్పుడే ఇక్కడికి వచ్చి నాతో యుద్ధము చేయవచ్చును."

మూ. తత్తస్య వాక్యం బ్రువతో నిశమ్య
చుకోప సౌమిత్రిరమిత్రహన్తా,
అమృష్యమాణశ్చ సముత్పపాత
జగ్రాహ చాపం చ తతః స్మయిత్వా. 46

ప్ర. అ. బ్రువతః=అట్లు పలుకుచున్న, తస్య=వానియొక్క, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, నిశమ్య=విని, అమిత్రహన్తా=శత్రువులకు సంహారకుడైన, సౌమిత్రిః=లక్ష్మణుడు, చుకోప=కోపించెను. తతః=అటుపిమ్మట, స్మయిత్వా=చిరునవ్వు నవ్వి, అమృష్యమాణః=సహించనివాడై, సముత్పపాత=శీఘ్రముగా లేచెను. చాపమ్=ధనస్సును, జగ్రాహ=గ్రహించెను.

తా. శత్రుసంహారకుడైన లక్ష్మణునకు ఆతని మాటలు వినగానే కోపము కలిగెను. ఆతడు ఆ మాటలు సహించక శీఘ్రముగా ముందుకు వచ్చి, చిరునవ్వు నవ్వి ధనస్సును గ్రహించెను. 46

మూ. క్రుద్ధః సౌమిత్రిరుత్పత్య తూణాదాక్షిప్య సాయకమ్,
పురస్తాదతికాయస్య విచకర్ష మహద్ధనుః. 47

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఉత్పత్య=శీఘ్రముగా వచ్చి, తూణాత్=అంబులపొదినుండి, సాయకమ్=బాణమును, ఆక్షిప్య=లాగి, అతికాయస్య=అతికాయునియొక్క, పురస్తాత్=ఎదుట, మహత్=గొప్ప, ధనుః=ధనస్సును, చకర్ష=లాగెను. 47

తా. కోపించిన ఆ లక్ష్మణుడు శీఘ్రముగా ముందుకు వచ్చి, అంబుల పొదినుండి బాణమును పైకి తీసి, అతికాయుని ఎదుట తన గొప్ప ధనస్సును చరచెను. 47

మూ. పూరయన్ స మహీం సర్వామాకాశం సాగరం దిశః,
జ్యాశబ్దో లక్ష్మణస్యోగ్రస్త్రాసయన్ రజనీచరాన్. 48

ప్ర. అ. లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, సః=ఆ, జ్యాశబ్దః=టంకారధ్వని, సర్వామ్=సమస్తమైన, మహీమ్= భూమిని, ఆకాశమ్=ఆకాశమును, సాగరమ్=సముద్రమును, దిశః=దిక్కులను, పూరయన్=నింపుచు, రజనీచరాన్= రాక్షసులను, త్రాసయన్=భయపెట్టుచు, ఉగ్రః=ఉగ్రముగా (ఉండెను).

తా. లక్ష్మణుడు చేసిన ఆ టంకారధ్వని భూమినంతను, ఆకాశమును, సముద్రమును, దిక్కులను నింపుచు, భయంకరమై రాక్షసులకు భయము కలిగించెను. 48

మూ. సౌమిత్రేశ్చాపనిర్ఘోషం శ్రుత్వా ప్రతిభయం తదా,
విసిష్మియే మహాతేజా రాక్షసేన్ద్రాత్మజో బలీ. 49

ప్ర. అ. తదా=అప్పుడు, బలీ=బలవంతుడైన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాక్షసేన్ద్రాత్మజః=అతికాయుడు, ప్రతిభయమ్=భయంకరమైన, సౌమిత్రేః=లక్ష్మణునియొక్క, చాపనిర్ఘోషమ్=ధనస్సుయొక్క ధ్వనిని, శ్రుత్వా=విని, విసిష్మియే=ఆశ్చర్యపడెను.

తా. గొప్ప తేజస్సూ, బలమూ గల అతికాయుడు లక్ష్మణుడు చేసిన భయంకరమైన ధనుష్టంకారమును విని ఆశ్చర్యము చెందెను. 49

మూ. తదాతికాయః కుపితో దృష్ట్వా లక్ష్మణముత్థితమ్,
ఆదాయ నిశితం బాణమిదం వచనమబ్రవీత్. 50

ప్ర. అ. తదా=అప్పుడు, ఉత్థితమ్=లేచిన (యుద్ధానికై నిలచిన), లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, దృష్ట్వా=చూచి, అతికాయః=అతికాయుడు, కుపితః=కోపించినవాడై, నిశితమ్=వాడియైన, బాణమ్=బాణమును, ఆదాయ=గ్రహించి, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. యుద్ధానికై తన ఎదుట నిలచిన లక్ష్మణుని చూచి, అతికాయుడు కోపించి వాడియైన బాణమును తీసి ఇట్లు పలికెను. 50

మూ. బాలస్త్వమసి సౌమిత్రే విక్రమేష్వవిచక్షణః,
గచ్ఛ కిం కాలసంకాశం మాం యోధయతుమిచ్ఛసి. 51

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! త్వమ్=నీవు, విక్రమేషు=పరాక్రమములయందు, అవిచక్షణః=నేర్పు లేనివాడవు, అపి=అయి ఉన్నావు. బాలః=చిన్నవాడవు. గచ్ఛ=వెళ్లుము. కాలసంకాశమ్=యమునితో సమానుడనైన,

మామ్= నన్ను, యోధయితుమ్=యుద్ధముచేయించుటకు, కిమ్=ఎందువలన, ఇచ్ఛసి=కోరుచున్నావు?

తా. లక్ష్మణా! నీవు చిన్నవాడవు; పరాక్రమములయందు నేర్పు లేనివాడవు; యమునివంటి నాతో యుద్ధము ఎందుకు చేసెదవు? వెళ్లుము.

మూ. న హి మద్బాహుసృష్టానాం బాణానాం హిమవానపి,
పోఢుముత్సహతే వేగమన్తరిక్షమథో మహీ. 52

ప్ర. అ. మద్బాహుసృష్టానామ్=నా బాహువులచేత విడవబడిన, బాణానామ్=బాణములయొక్క, వేగమ్= వేగమును, హిమవానపి=హిమవత్పర్వతము కూడ, సోఢుమ్=సహించుటకు, న ఉత్సహతే హి=సమర్థము కాదు కదా. అన్తరిక్షమ్=ఆకాశము, అథో=మరియు, మహీ=భూమీ (సమర్థములు కావు).

తా. నా చేతులతో విడచిన బాణముల వేగమును హిమవత్పర్వతము గాని, ఆకాశము గాని, భూమి గాని సహింపజాలవు కదా? 52

మూ. సుఖప్రసుప్తం కాలాగ్నిం విబోధయితుమిచ్ఛసి,
న్యస్య చాపం నివర్తస్వ మా ప్రాణాన్ జహి మద్గతః. 53

ప్ర. అ. సుఖప్రసుప్తమ్=సుఖముగా నిద్రించుచున్న, కాలాగ్నిమ్=ప్రళయకాలాగ్నిని, విబోధయితుమ్= లేపుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు. చాపమ్=ధనస్సును, న్యస్య=ఉంచి, నివర్తస్వ=వెనుకకు మరలుము. మద్గతః= నన్ను చేరినవాడవై, ప్రాణాన్=ప్రాణములను, మా జహి=చంపకుము.

తా. సుఖముగా అణగి ఉన్న ప్రలయకాలాగ్నిని రగుల్కొలుపవలె నని కోరుచున్నావు. ధనస్సును అక్కడ విడచి వెనుకకు వెళ్లుము. నన్ను ఎదిరించి ప్రాణాలు కోల్పోకుము. 53

మూ. అథవా త్వం ప్రతిస్తబ్ధో న నివర్తితుమిచ్ఛసి,
తిష్ఠ ప్రాణాన్ పరిత్యజ్య గమిష్యసి యమక్షయమ్ . 54

ప్ర. అ. అథవా=అట్లు కాక, త్వమ్=నీవు, ప్రతిస్తబ్ధః=మొండి పట్టు కలవాడవై, నివర్తితుమ్=మరలుటకు, న ఇచ్ఛసి=ఇచ్ఛయించకపోయినచో, తిష్ఠ=నిలువుము. ప్రాణాన్=ప్రాణములను, పరిత్యజ్య=విడచి, యమక్షయమ్= యముని గృహమును గూర్చి, గమిష్యసి=వెళ్లగలవు.

తా. అట్లు కాక మొండితనము వహించి వెనుకకు వెళ్లుటకు ఇష్టపడనిచో నిలబడుము. ప్రాణాలు విడచి యమలోకమునకు వెళ్లగలవు. 54

మూ. పశ్య మే నిశితాన్ బాణాన్ రిపుదర్పనిషూదనాన్,
ఈశ్వరాయుధసంకాశాంస్తప్తకాఞ్చనభూషణాన్. 55

ప్ర. అ. మే=నాయొక్క, రిపుదర్పనిషూదనాన్=శత్రువుల గర్వమును తొలగించు, ఈశ్వరాయుధసంకాశాన్=ఈశ్వరుని ఆయుధములతో సమానములైన, తప్తకాఞ్చనభూషణాన్=పరిశుద్ధమైన బంగారము అలంకారముగా గల, నిశితాన్=వాడియైన, బాణాన్=బాణములను, పశ్య=చూడుము.

తా. శత్రువుల గర్వమును అణచేవీ, పరమేశ్వరుని ఆయుధములతో సమానములూ, శుద్ధమైన బంగారముచేత అలంకరింపబడినవీ అయిన వాడియైన నా బాణములను చూడుము. 55

మూ. ఏష తే సర్పసంకాశో బాణః పాస్యతి శోణితమ్,
మృగరాజ ఇవ క్రుద్ధో నాగరాజస్య శోణితమ్, 56
ఇత్యేవముక్త్వా సంక్రుద్ధః శరం ధనుషి సందధే.

ప్ర. అ. సర్పసంకాశః=సర్పముతో సమానమైన, ఏషః బాణః=ఈ బాణము, క్రుద్ధః=కోపించిన, మృగరాజః=సింహము, నాగరాజస్య=గజరాజముయొక్క, శోణితమ్=ఇవ=రక్తమును వలె, తే=నీయొక్క, శోణితమ్= రక్తమును, పాస్యతి=త్రాగగలదు. ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, సంక్రుద్ధః=కోపించినవాడై, శరమ్=బాణమును, ధనుషి=ధనస్సునందు, సందధే=సంధించెను.

తా. సర్పమువంటి ఈ బాణము, కోపించిన సింహము ఏనుగు రక్తమును త్రాగి నట్లు నీ రక్తమును త్రాగగలదు. ఇట్లు పలికి కోపావిష్టుడై ధనస్సుపై బాణము సంధించెను. 56

మూ. శ్రుత్వాతికాయస్య వచః సరోషం
సగర్వితం సంయతి రాజపుత్రః,
స సంచుకోపాతిబలో మనస్వీ
ఉవాచ వాక్యం చ తతో బృహచ్ఛ్రీః. 57

ప్ర. అ.రాజపుత్రః=లక్ష్మణుడు, సంయతి=యుద్ధమునందు, అతికాయస్య=అతికాయునియొక్క, సరోషమ్=రోషముతో కూడిన, సగర్వితమ్=గర్వముతో కూడిన, వచః=వాక్యమును, శ్రుత్వా=విని, సంచుకోప=కోపించెను. అతిబలః=గొప్ప బలము గలవాడు, మనస్వీ=ఉత్తమమైన మనస్సు కలవాడు, బృహచ్ఛ్రీః=గొప్ప శోభ కలవాడూ అయిన, సః=ఆ లక్ష్మణుడు, తతః=అటు పిమ్మట, వాక్యమ్=వాక్యమును, ఉవాచ చ=పలికెను కూడ.

తా. యుద్ధరంగములో రోషముతోను, గర్వముతోను నిండిన అతికాయుని

మాటలు విని లక్ష్మణుడు కోపించెను. గొప్ప బలము, ఉత్తమమైన మనస్సు, అధికమైన శోభా గల ఆ లక్ష్మణుడు ఇట్లు పలికెను. 57

మూ. న వాక్యమాత్రేణ భవాన్ ప్రధానో
న కత్థనాత్సత్పురుషా భవన్తి,
మయి స్థితే ధన్విని బాణపాణౌ
నిదర్శయస్వాత్మబలం దురాత్మన్. 58

ప్ర. అ. దురాత్మన్=ఓ! దురాత్ముడా! భవాన్=నీవు, వాక్యమాత్రేణ=కేవలము మాటలచేత, ప్రధానః= ప్రధానుడవు, న=కావు. కత్థనాత్=బడాయి చెప్పుకొనుట వలన, సత్పురుషాః=సత్పురుషులు, న భవన్తి=కారు. ధన్విని=ధనుర్ధరుడనైన, బాణపాణౌ=బాణము హస్తమునందు గల, స్థితే=నిలచి ఉన్న, మయి=నాయందు, ఆత్మబలమ్= నీ బలమును, నిదర్శయస్వ=చూపుము.

తా. ఓ! దురాత్ముడా! మాటలు చెప్పినంతమాత్రమున నీవు గొప్పవాడవు కాజాలవు. బడాయి చెప్పుకొనినంతమాత్రాన ఎవరూ ఉత్తమపురుషులు కారు. ఇదిగో ధనుర్బాణములు ధరించి నిలచి ఉన్నాను; నామీద నీ బలము చూపుము.

మూ. కర్మణా సూచయాత్మానం న వికత్థితుమర్హసి,
పౌరుషేణ తు యో యుక్తః స తు శూర ఇతి స్మృతః. 59

ప్ర. అ. కర్మణా=పనిచేత, ఆత్మానమ్=తనను, సూచయ=తెలుపుము. వికత్థితుమ్=బడాయి చెప్పుటకు, న అర్హసి= తగవు. యః=ఎవడు, పౌరుషేణ=పౌరుషముతో, యుక్తః=కూడినవాడో, సః=అతడే, శూరః ఇతి=శూరుడు అని, స్మృతః=చెప్పబడినాడు.

తా. పని చేసి నీ గొప్పతనమును చూపించుము. బడాయి చెప్పుకొనకుము. పౌరుష మున్నవానినే శూరు డని అందురు. 59

మూ. సర్వాయుధసమాయుక్తో ధన్వీ త్వం రథమాస్థితః,
శరైర్వా యది వాప్యస్త్రైర్దర్శయస్వ పరాక్రమమ్. 60

ప్ర. అ. త్వమ్=నీవు, ధన్వీ=ధనస్సు కలవాడవై, సర్వాయుధసమాయుక్తః=సమస్తమైన ఆయుధములతో కూడినవాడవై, రథమ్=రథమును, ఆస్థితః=అధిష్ఠించి ఉన్నావు. శరైః వా=బాణములచేత గాని, యది వాపి=లేక, అస్త్రైః=అస్త్రములచేత గాని, పరాక్రమమ్=పరాక్రమమును, దర్శయస్వ=చూపుము.

తా. నీవు ధనుర్ధరుడవై అన్ని ఆయుధములతో రథముమీద ఉన్నావు. బాణాల చేత గాని, అస్త్రాలచేత గాని పరాక్రమమును చూపుము. 60

మూ. తతః శిరస్తే నిశితైః పాతయిష్యామ్యహం శరైః,
మారుతః కాలసంపక్వం వృన్తాత్తాలఫలం యథా. 61

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అహమ్=నేను, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, తే శిరః=నీ శిరస్సును, మారుతః=గాలి, కాలసంపక్వమ్=కాలముచేత పక్వమైన, తాలఫలమ్=తాటిపండును, వృన్తాత్ యథా=తొడిమినుండి వలె, పాతయిష్యామి=పడగొట్టెదను.

తా. అటుపిమ్మట నేను, వాడియైన బాణాలతో, గాలి తగిన కాలమునందు పక్వమైన తాటిపండును తొడిమినుండి పడ గొట్టినట్లు నీ తల పడగొట్టెదను. 61

మూ. అద్య తే మామకా బాణాస్తప్తకాఞ్చనభూషణాః,
పాస్యన్తి రుధిరం గాత్రాద్బాణశల్యాన్తరోత్థితమ్. 62

ప్ర. అ. అద్య=ఇప్పుడు, తప్తకాఞ్చనభూషణాః=పరిశుద్ధమైన బంగారము అలంకారముగా గల, మామకాః= నా సంబంధమైన, బాణాః=బాణములు, తే గాత్రాత్=నీ శరీరమునుండి, బాణశల్యాన్తరోత్థితమ్=బాణముల ములుకుల మధ్యనుండి బయల్వెడలిన, రుధిరమ్=రక్తమును, పాస్యన్తి=త్రాగగలవు.

తా. ఇప్పుడు, శుద్ధమైన బంగారము అలంకారముగా గల నా బాణములు నీ శరీరమునుండి, బాణముల ములుకుల మధ్యనుండి పైకి వచ్చుచున్న రక్తమును త్రాగగలవు. 62

మూ. బాలోఽయమితి విజ్ఞాయ న చావజ్ఞాతుమర్హసి,
బాలో వా యది వా వృద్ధో మృత్యుం జానీహి సంయుగే. 63
బాలేన విష్ణునా లోకాస్త్రయః క్రాన్తాస్త్రివిక్రమైః.

ప్ర. అ. అయమ్=ఇతడు, బాలః=బాలుడు, ఇతి=అని, విజ్ఞాయ=తలచి, అవజ్ఞాతుమ్=అనాదరము చేయుటకు, న చ అర్హసి=తగవు. బాలో వా=బాలుడనైనా, వృద్ధో వా=వృద్ధుడనైనా, సంయుగే=యుద్ధమునందు, మృత్యుమ్=మృత్యువునుగా, జానీహి=తెలిసికొనుము. బాలేన=బాలుడైన, విష్ణునా=విష్ణువుచేత, త్రివిక్రమైః= మూడు అడుగులచేత, త్రయః=మూడు, లోకాః=లోకములు, క్రాన్తాః=ఆక్రమించబడినవి.

తా. ఇతడు చిన్నవాడే కదా అని నన్ను తేలికగా చూడకుము. నేను బాలుడనైనా, వృద్ధుడనైనా యుద్ధములో నీ పాలిటి మృత్యుదేవతను. బాలుడైనా విష్ణువు మూడు అడుగులచేత మూడులోకాలను ఆక్రమించినాడు కదా. 63

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా హేతుమత్పరమార్థవత్, 64
అతికాయః ప్రచుక్రోధ బాణం చోత్తమమాదదే.

ప్ర. అ. లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, హేతుమత్=హేతువులు కలది, పరమార్థవత్=ఉత్తమమైన అర్థము కలది అయిన, వచః=వచనమును, శ్రుత్వా=విని, అతికాయః=అతికాయుడు, ప్రచుక్రోధ=చాల కోపించెను. ఉత్తమమ్= ఉత్తమమైన, బాణమ్=బాణమును, ఆదదే చ=గ్రహించెను.

తా. హేతుబద్ధమూ, ఉత్తమమైన అర్థము కలదీ అయిన లక్ష్మణుని మాట విని అతికాయుడు చాల కోపించి ఉత్తమమైన బాణమును గ్రహించెను.

మూ. తతో విద్యాధరా భూతా దేవా దైత్యా మహర్షయః, 65
గుహ్యకాశ్చ మహాత్మానస్తద్యుద్ధం దదృశుస్తదా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విద్యాధరాః=విద్యాధరులు, భూతాః= భూతములు, దేవాః=దేవతలు, దైత్యాః=దైత్యులు, మహర్షయః=మహర్షులు, మహాత్మానః=మహాత్ములైన, గుహ్యకాః చ=యక్షులు, తదా=అప్పుడు, తత్= ఆ, యుద్ధమ్=యుద్ధమును, దదృశుః=చూచిరి.

తా. అప్పుడు మహాత్ములైన విద్యాధరులు, భూతములు, దేవతలు, దైత్యులు, మహర్షులు, యక్షులు వచ్చి ఆ యుద్ధమును చూచిరి. 65

మూ. తతోఽతికాయః కుపితశ్చాపమారోప్య సాయకమ్, 66
లక్ష్మణాయ ప్రచిక్షేప సంక్షిపన్నివ చామ్బరమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అతికాయః=అతికాయుడు, కుపితః=కోపించినవాడై, సాయకమ్=బాణమును, చాపమ్=ధనస్సును, ఆరోప్య=ఆరోపింపచేసి, అమ్బరమ్=ఆకాశమును, సంక్షిపన్ ఇవ=కుదించుచున్నాడా అన్నట్లు (శీఘ్రముగా), లక్ష్మణాయ=లక్ష్మణునకు, ప్రచిక్షేప=విసిరెను.

తా. పిమ్మట అతికాయుడు కోపముతో బాణమును ధనస్సుమీద సంధించి, ఆకాశమును (దూరమును) కుదించుచున్నాడా అన్నట్లు (వేగముగా) దానిని లక్ష్మణుని మీదికి ప్రయోగించెను. 66

మూ. తమాపతన్తం నిశితం శరమాశీవిషోపమమ్, 67
అర్ధచన్ద్రేణ చిచ్ఛేద లక్ష్మణః పరవీరహా.

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించు, లక్ష్మణః=లక్ష్మణుడు, ఆపతన్తమ్=వచ్చి మీద పడుచున్న, ఆశీవిషోపమమ్=సర్పముతో సమానమైన, నిశి

తమ్=వాడియైన, తం శరమ్=ఆ బాణమును, అర్ధచన్ద్రేణ= అర్ధచన్ద్రబాణముచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు వచ్చి మీద పడుచున్న, సర్పము వలె ఉన్న, ఆ వాడియైన బాణమును అర్ధచంద్రబాణముచేత ఛేదించెను. 67

మూ. తం నికృత్తం శరం దృష్ట్వా కృత్తభోగమివోరగమ్, 68
అతికాయో భృశం క్రుద్ధః పఞ్చ బాణాన్ సమాదధే.

ప్ర. అ. అతికాయః=అతికాయుడు, కృత్తభోగమ్=ఛేదించబడిన శరీరము గల, ఉరగమ్ ఇవ=సర్పమువలె ఉన్న, నికృత్తమ్=ఛేదించబడిన, తం శరమ్=ఆ బాణమును, దృష్ట్వా=చూచి, భృశమ్=మిక్కిలి, క్రుద్ధః= కోపించినవాడై, పఞ్చ=ఐదు, బాణాన్=బాణములను, సమాదధే=సంధించెను.

తా. ఆ విధముగా ఖండింపబడిన, దేహము తెగిన సర్పము వలె పడిపోయిన ఆ బాణమును చూచి అతికాయుడు చాల కోపించి ఐదు బాణములు సంధించెను. 68

మూ. తాన్ శరాన్ సంప్రచిక్షేప లక్ష్మణాయ నిశాచరః, 69
తానప్రాప్తాన్ శితైర్బాణైశ్చిచ్ఛేద భరతానుజః.

ప్ర. అ. నిశాచరః=ఆ రాక్షసుడు, తాన్ శరాన్=ఆ బాణములను, లక్ష్మణాయ=లక్ష్మణునికొఱకు, సంప్రచిక్షేప=విసిరెను. భరతానుజః=లక్ష్మణుడు, తాన్=వాటిని, అప్రాప్తాన్=తనను చేరనివాటినే, శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. ఆ రాక్షసుడు ఆ బాణములను లక్ష్మణుని మీద ప్రయోగించెను. లక్ష్మణుడు ఆ బాణములు తనమీదకు రాక పూర్వమే వాటిని వాడియైన బాణాలచేత భేదించెను. 69

మూ. స తాన్ ఛిత్త్వా శితై ర్బాణై ర్లక్ష్మణః పరవీరహా, 70
ఆదదే నిశితం బాణం జ్వలన్తమివ తేజసా.

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించిన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, తాన్=ఆ బాణములను, శితైః= వాడియైన, బాణైః=బాణములచేత, ఛిత్త్వా=ఛేదించి, తేజసా=తేజస్సుతో, జ్వలన్తమివ=మండుచున్నదా అన్నట్లున్న, నిశితమ్=వాడియైన, బాణమ్=బాణమును, ఆదదే=గ్రహించెను.

తా. శత్రువీరులను సంహరించు లక్ష్మణుడు వాడియైన బాణాలచేత ఆ బాణాలను ఛేదించి, తేజస్సుతో మండుచున్నదా అన్నట్లున్న వాడియైన

బాణమును గ్రహించెను. 70

మూ. తమాదాయ ధనుఃశ్రేష్ఠే యోజయామాస లక్ష్మణః, 71
విచకర్ష చ వేగేన విససర్జ చ సాయకమ్.

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, తం సాయకమ్=ఆ బాణమును, ఆదాయ=గ్రహించి, ధనుఃశ్రేష్ఠే=శ్రేష్ఠమైన ధనస్సునందు, యోజయామాస=కూర్చెను. వేగేన=వేగముతో, విచకర్ష చ=లాగెను. విససర్జ చ=విడచెను.

తా. లక్ష్మణుడు ఆ బాణమును గ్రహించి, శ్రేష్ఠమైన ధనస్సుమీద సంధించి, వేగముగా లాగి, విడచెను. 71

మూ. పూర్ణాయతవిసృష్టేన శరేణ నతపర్వణా, 72
లలాటే రాక్షసశ్రేష్ఠమాజఘాన స వీర్యవాన్.

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=లక్ష్మణుడు, పూర్ణాయతవిసృష్టేన=పూర్తిగా లాగి విడువబడిన, నతపర్వణా=వంగిన కణుపులు గల, శరేణ=బాణముచేత, రాక్షసశ్రేష్ఠమ్=ఆ రాక్షసశ్రేష్ఠుణ్ణి, లలాటే= లలాటమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. పరాక్రమవంతుడైన ఆ లక్ష్మణుడు పూర్తిగా లాగిన, వంగిన కణుపులు గల బాణముతో ఆ రాక్షసశ్రేష్ఠుని లలాటముమీద కొట్టెను. 72

మూ. స లలాటే శరో మగ్నస్తస్య భీమస్య రక్షసః, 73
దదృశే శోణితేనాక్తః పన్నగేన్ద్ర ఇవాచలే.

ప్ర. అ. భీమస్య=భయంకరుడైన, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, లలాటే=లలాటమునందు, మగ్నః=దిగిన, శోణితేన=రక్తముచేత, అక్తః=తడపబడిన, సః=ఆ, శరః=బాణము, అచలే=పర్వతమునందు, పన్నగేన్ద్రః ఇవ=మహాసర్పము వలె, దదృశే=చూడబడెను.

తా. భయంకరుడైన ఆ రాక్షసుని లలాటముమీద లోతుగా దిగిపోయిన బాణము రక్తముతో తడిసి, పర్వతముమీద ఉన్న సర్పరాజు వలె కనబడెను. 73

మూ. రాక్షసః ప్రచకమ్పేఽథ లక్ష్మణేషుప్రపీడితః, 74
రుద్రబాణహతం ఘోరం యథా త్రిపురగోపురమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, లక్ష్మణేషుప్రపీడితః=లక్ష్మణుని బాణముచేత పీడింపబడిన, రాక్షసః=రాక్షసుడు, రుద్రబాణహతమ్=రుద్రుని బాణముచేత కొట్టబడిన, ఘోరమ్=భయంకరమైన, త్రిపురగోపురం యథా=త్రిపురాసురుని

పట్టణముయొక్క గోపురము వలె, ప్రచకమ్పే=కంపించెను.

తా. అప్పుడు లక్ష్మణుని బాణముచేత పీడింపబడిన రాక్షసుడు రుద్రుని బాణముచేత కొట్టబడిన త్రిపురనగరగోపురము వలె కంపించెను. 74

మూ. చిన్తయామాస చాశ్వస్య విమృశ్య చ మహాబలః, 75
సాధు బాణనిపాతేన శ్లాఘనీయోఽసి మే రిపుః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల అతడు, ఆశ్వస్య=నిలద్రొక్కుకొని, విమృశ్య=విమర్శించి, చిన్తయామాస=ఆలోచించెను. సాధు=బాగు! బాణనిపాతేన=బాణము పడుటచేత, మే=నాకు, శ్లాఘనీయః=శ్లాఘించబడిన, రిపుః=శత్రువుగా, అసి=అయి ఉన్నావు.

తా. మహాబలశాలియైన ఆ రాక్షసుడు నిలద్రొక్కుకొని, తానేమి చేయవలెనో విమర్శించుకొని ఇట్లు ఆలోచించి పలికెను. బాగు బాగు! బాణమును ఇట్లు ప్రయోగించిన నీవు నాకు శ్లాఘించదగిన శత్రువుగా ఉన్నావు.

మూ. విధాయైవం విదార్యాస్యం వినమ్య చ మహాభుజౌ, 76
స రథోపస్థమాస్థాయ రథేన ప్రచచార హ.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, విధాయ=పలికి, ఆస్యమ్=ముఖమును, విదార్య=తెరచి, మహాభుజౌ=గొప్పవైన భుజములను, వినమ్య చ=వంచి, సః=అతడు, రథోపస్థమ్=రథముయొక్క పై భాగమును, ఆస్థాయ=అధిష్ఠించి, రథేన=రథముచేత, ప్రచచార హ=సంచరించెను.

తా. అతికాయుడు ఇట్లు పలికి, ముఖము తెరచి, బాహువులు వంచి, రథము పైభాగమును పట్టుకొని నిలచి, రథముచేత ఇటు అటు సంచరించెను.

మూ. ఏకం త్రీన్ పఞ్చ సప్తేతి సాయకాన్ రాక్షసర్షభః, 77
ఆదదే సందధే చాపి విచకర్షోత్ససర్జ చ.

ప్ర. అ. రాక్షసర్షభః=రాక్షసశ్రేష్ఠుడు, ఏకమ్=ఒకదానిని, త్రీన్=మూడింటిని, పఞ్చ=ఐదింటిని, సప్తేతి= ఏడింటిని, అని, సాయకాన్=బాణములను, ఆదదే=గ్రహించెను. సందధే చాపి=సంధించెను. విచకర్ష=లాగెను. ఉత్ససర్జ చ=విడచెను.

తా. ఆ రాక్షసశ్రేష్ఠుడు ఒకటి, మూడు, ఐదు, ఏడు ఈ విధముగా బాణములను పైకి తీసి, సంధించి, లాగి, విడచెను. 77

మూ. తే బాణాః కాలసంకాశా రాక్షసేన్ద్రధనుశ్చ్యుతాః, 78
హేమపుఙ్ఖా రవిప్రఖ్యాశ్చక్రుర్దీప్తమివామ్బరమ్.

ప్ర. అ. రాక్షసేన్ద్రధనుశ్చ్యుతాః=ఆ రాక్షసనాయకుని ధనస్సునుండి బయులుదేరిన, కాలసంకాశాః= మృత్యుదేవతతో సమానములు, హేమపుఙ్ఖాః=బంగారు పొన్నులు గల, రవిప్రఖ్యాః=సూర్యుని వంటి కాంతి గలవి అయిన, తే=ఆ బాణములు, అమ్బరమ్=ఆకాశమును, దీప్తమ్ ఇవ=మండుచున్నదానిని వలె, చక్రుః=చేసినవి.

తా. ఆ రాక్షసవీరుని ధనస్సునుండి బయల్వెడలిన, బంగారు పొన్నులు గల, మృత్యుదేవతతో సమానములైన, సూర్యునివంటి కాంతి గల ఆ బాణములు ఆకాశమును మండుచున్నట్లు చేసినవి. 78

మూ. తతస్తాన్ రాక్షసోత్సృష్టాన్ శరౌఘాన్ రాఘవానుజః, 79
అసంభ్రాన్తం ప్రచిచ్ఛేద నిశితైర్బహుభిః శరైః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవానుజః=లక్ష్మణుడు, రాక్షసోత్సృష్టాన్=రాక్షసునిచేత విడువబడిన, తాన్= ఆ, శరౌఘాన్=బాణముల సముదాయములను, అసంభ్రాన్తః=కంగారుపడనివాడై, నిశితైః=వాడియైన, బహుభిః=అనేకమైన, శరైః=బాణములచేత, ప్రచిచ్ఛేద=ఛేదించెను.

తా. ఆ రాక్షసుడు ప్రయోగించిన బాణసముదాయములను లక్ష్మణుడు ఏ మాత్రము కంగారుపడక అనేకబాణములచేత ఛేదించెను. 79

మూ. తాన్ శరాన్ యుధి సంప్రేక్ష్య నికృత్తాన్ రావణాత్మజః, 80
చుకోప త్రిదశేంద్రారిర్జగ్రాహ నిశితం శరమ్.

ప్ర. అ. త్రిదశేన్ద్రారిః=ఇంద్రుని శత్రువైన, రావణాత్మజః=అతికాయుడు, యుధి=యుద్ధమునందు, నికృత్తాన్=ఛేదించబడిన, తాన్ శరాన్=ఆ బాణములను, సంప్రేక్ష్య=చూచి, చుపోప=కోపించెను. నిశితమ్=వాడియైన, శరమ్=బాణమును, జగ్రాహ=గ్రహించెను.

తా. ఇంద్రుని శత్రువైన అతికాయుడు ఆ బాణములన్నీ యుద్ధములో ఛేదించబడుట చూచి, కోపించి, ఒక వాడియైన బాణము తీసెను. 80

మూ. స సంధాయ మహాతేజాస్తం బాణం సహసోత్సృజత్, 81
తేన సౌమిత్రిమాయాన్తమాజఘాన స్తనాన్తరే.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః=అతడు, తమ్=ఆ, బాణమ్=బాణమును, సంధాయ=సంధించి, సహసా=వెంటనే, ఉత్సృజత్=విడ

చెను. తేన=దానిచేత, ఆయాన్తమ్=వచ్చుచున్న, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, స్తనాన్తరే= వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. గొప్ప తేజస్సు గల అతడు ఆ బాణమును సంధించి, వెంటనే ప్రయోగించి, తన ఎదుటనున్న లక్ష్మణుని వక్షఃస్థలము మీద కొట్టెను. 81

మూ. అతికాయేన సౌమిత్రిస్తాడితో యుధి వక్షసి, 82
సుస్రావ రుధిరం తీవ్రం మదం మత్త ఇవ ద్విపః.

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, అతికాయేన=అతికాయునిచేత, వక్షసి=వక్షఃస్థలమునందు, తాడితః= కొట్టబడిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, మత్తః= మదించిన, ద్విపః=ఏనుగు, మదమ్ ఇవ=మదమును వలె, తీవ్రమ్= తీవ్రముగా, రుధిరమ్=రక్తమును, సుస్రావ=స్రవించెను.

తా. యుద్ధమునందు అతికాయుడు తన వక్షస్థలముమీద బాణముచేత కొట్టగా లక్ష్మణుని శరీరమునుండి, మదించిన గజమునుండి మదోదకమువలె, అధికముగా రక్తము స్రవించెను. 82

మూ. స చకార తదాత్మానం విశల్యం సహసా విభుః, 83
జగ్రాహ చ శరం తీక్ష్ణమస్త్రేణాపి సమాదధే.

ప్ర. అ. విభుః=ప్రభువైన, సః=ఆ లక్ష్మణుడు, తదా=అప్పుడు, ఆత్మానమ్=తనను, సహసా=వెంటనే, విశల్యమ్= శల్యము లేనివానినిగా, చకార=చేసెను. తీక్ష్ణమ్=తీక్ష్ణమైన, శరమ్=బాణమును, జగ్రాహ=గ్రహించెను. అస్త్రేణ=అస్త్రముతో, సందధే చ=సంధించెను కూడ.

తా. అప్పుడు సమర్థుడైన ఆ లక్ష్మణుడు వెంటనే తన శరీరమునుండి ఆ బాణమును తొలగించుకొని, వాడియైన బాణము తీసి దానిపై అస్త్రము సంధించెను. 83

మూ. ఆగ్నేయేన తదాస్త్రేణ యోజయామాస సాయకమ్, 84
స జజ్వాల తదా బాణో ధనుశ్చాస్య మహాత్మనః.

ప్ర. అ. తదా=అప్పుడు, ఆగ్నేయేన అస్త్రేణ=ఆగ్నేయాస్త్రముతో, సాయకమ్=బాణమును, యోజయామాస=కూర్చెను. మహాత్మనః=మహాత్ముడైన, అస్య=ఈ లక్ష్మణునియొక్క, బాణః=బాణము, ధనుశ్చ=ధనుస్సుకూడ ప్రజ్వలించెను.

తా. అప్పుడు ఆగ్నేయాస్త్రమును బాణముమీద సంధించగా మహాత్ముడైన లక్ష్మణుని ఆ బాణము, ధనస్సు కూడ ప్రజ్వలించెను. 84

మూ. అతికాయోఽతితేజస్వీ సౌరమస్త్రం సమాదదే, 85
తేన బాణం భుజంగాభం హేమపుఙ్ఖమయోజయత్.

ప్ర. అ. అతితేజస్వీ=గొప్ప తేజస్సుగల, అతికాయః=అతికాయుడు, సౌరమ్ అస్త్రమ్=సౌరాస్త్రమును, సమాదదే=గ్రహించెను. భుజంగాభమ్=సర్పమువంటి కాంతి గల, హేమపుఙ్ఖమ్=బంగారు పొన్నుగల, తం బాణమ్=ఆ బాణమును, తేన=ఆ అస్త్రముతో,. అయోజయత్=కూర్చెను.

తా. గొప్ప తేజస్సు గల అతికాయుడు సౌరాస్త్రమును గ్రహించి, దానిని సర్పమువలె ఉన్న, బంగారు పొన్ను గల బాణముమీద సంధించెను. 85

మూ. తదస్త్రం జ్వలితం ఘోరం లక్ష్మణః శరమాహితమ్, 86
అతికాయాయ చిక్షేప కాలదణ్డమివాన్తకః.

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, జ్వలితమ్=ప్రజ్వలించుచున్న, ఘోరమ్=ఘోరమైన, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, ఆహితమ్=సంధించబడిన, శరమ్=బాణమును, అన్తకః=యముడు, కాలదణ్డమివ=యమదండమును వలె, అతికాయాయ=అతికాయునకు, చిక్షేప=విసిరెను.

తా. లక్ష్మణుడు ప్రజ్వలించుచున్న భయంకరమైన ఆ అస్త్రమును సంధించిన ఆ బాణమును, యముడు యమదండమును ప్రయోగించినట్లు అతికాయునిమీద ప్రయోగించెను. 86

మూ. ఆగ్నేయాస్త్రాభిసంయుక్తం దృష్ట్వా బాణం నిశాచరః, 87
ఉత్ససర్జ తదా బాణం రౌద్రం సూర్యాస్త్రయోజితమ్.

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడు, ఆగ్నేయాస్త్రాభిసంయుక్తమ్=ఆగ్నేయాస్త్రముతో కూడిన, బాణమ్= బాణమును, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, సూర్యాస్త్రయోజితమ్=సూర్యాస్త్రముతో కూర్చబడిన, రౌద్రమ్= భయంకరమైన, బాణమ్=బాణమును, ఉత్ససర్జ=విడచెను.

తా. ఆగ్నేయాస్త్రముతో కూడిన ఆ బాణమును చూచి అతికాయుడు సూర్యాస్త్రముతో కూర్చబడిన భయంకరమైన బాణమును ప్రయోగించెను. 87

మూ. తావుభావమ్బరే బాణావన్యోన్యమభిజఘ్నతుః, 88
తేజసా సంప్రదీప్తాగ్రౌ క్రుద్ధావివ భుజంగమౌ.

ప్ర. అ. తేజసా=తేజస్సుచేత, సంప్రదీప్తాగ్రౌ=ప్రజ్వలించుచున్న అగ్రభాగములు గల, తౌ=ఆ, ఉభౌ=రెండు, బాణౌ=బాణములు, క్రుద్ధౌ=కోపించిన,

భుజంగమౌ ఇవ=సర్పములు వలె, అన్యోన్యమ్=పరస్పరమును, అమ్బరే=ఆకాశము నందు, అభిజఘ్నతుః=కొట్టుకొనినవి.

తా. తేజస్సుతో ప్రజ్వలించుచున్న అగ్రభాగములు గల ఆ రెండు బాణములు, కోపించిన సర్పములు వలె ఆకాశమునందు ఒకదాని నొకటి కొట్టుకొనినవి. 88

మూ. తావన్యోన్యం వినిర్దహ్య పేతతుః పృథివీతలే, 89
నిరర్చిషౌ భస్మకృతౌ న భ్రాజేతే శరోత్తమౌ,
తావుభౌ దీప్యమానౌ స్మ న భ్రాజేతే మహీతలే. 90

ప్ర. అ. తౌ=అవి, అన్యోన్యమ్=పరస్పరము, వినిర్దహ్య=కాల్చివేసి, పృథివీతలే=నేలమీద, పేతతుః=పడిపోయినవి. నిరర్చిషౌ=జ్వాల లేనివి, భస్మకృతౌ=భస్మము చేయబడినవి అయిన, శరోత్తమౌ=ఆ ఉత్తమములైన బాణములు, న భ్రాజేతే= ప్రకాశించలేదు. దీప్యమానౌ=మండిపోవుచున్న, తౌ=ఆ, ఉభౌ=రెండు బాణములు, మహీతలే=నేలమీద, న భ్రాజేతే= ప్రకాశించలేదు.

తా. ఆ బాణములు ఒకదాని నొకటి కాల్చివేసి నేలమీద పడిపోయినవి. భస్మమై, కాంతివిహీనములై పోయిన ఆ శ్రేష్ఠములైన బాణములు ప్రకాశహీనములు అయ్యెను. మండిపోవుచున్న ఆ బాణములు రెండూ నేలమీద పడి ప్రకాశము లేకుండా అయినవి. 89, 90

మూ. తతోఽతికాయః సంక్రుద్ధస్త్వాష్ట్రమైషీకముత్సృజత్,
తతశ్చిచ్ఛేద సౌమిత్రిరస్త్రమైన్ద్రేణ వీర్యవాన్. 91

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అతికాయః=అతికాయుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, త్వాష్ట్రమ్=త్వష్ట దేవతగా గల, ఐషీకమ్=ఐషీకబాణమును, ఉత్సృజత్=విడచెను. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఐన్ద్రేణ=ఐంద్రాస్త్రముచేత, అస్త్రమ్=ఆ అస్త్రమును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. పిమ్మట అతికాయుడు కోపించి త్వాష్ట్రాస్త్రము సంధించిన ఒక ఐషీకబాణమును ప్రయోగించగా, పరాక్రమవంతుడైన లక్ష్మణుడు ఐంద్రాస్త్రములో ఆ త్వాష్ట్రాస్త్రమును ఛేదించెను. 91

మూ. ఐషీకం విహతం దృష్ట్వా కుమారో రావణాత్మజః,
యామ్యేనాస్త్రేణ సంక్రుద్ధో యోజయామాస సాయకమ్. 92

ప్ర. అ. కుమారః=కుమారుడైన, రావణాత్మజః=అతికాయుడు, ఐషీకమ్=

ఐషీకమును, నిహతమ్=కొట్టబడిన దానినిగా, దృష్ట్వా=చూచి, సంక్రుద్ధః=కోపించినవాడై, సాయకమ్=బాణమును, యామ్యేన=యమదేవతాకమైన, అస్త్రేణ=అస్త్రముతో, యోజయామాస=కూర్చెను.

తా. ఆ ఐషీకాస్త్రము భగ్నమగుట చూచి, యువకుడైన ఆ అతికాయుడు చాల కోపించి బాణమునందు యామ్యాస్త్రమును కూర్చెను.92

మూ. తతస్తదస్త్రం చిక్షేప లక్ష్మణాయ నిశాచరః,
వాయవ్యేన తదస్త్రేణ నిజఘాన స లక్ష్మణః. 93

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నిశాచరః=రాక్షసుడు, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, లక్ష్మణాయ=లక్ష్మణునకు, చిక్షేప=విసిరెను. సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, తత్ =దానిని, వాయవ్యేన అస్త్రేణ=వాయవ్యాస్త్రముచేత, నిజఘాన=కొట్టెను.

తా. పిమ్మట అతికాయుడు ఆ అస్త్రమును లక్ష్మణునిమీద ప్రయోగించెను. లక్ష్మణుడు దానిని వాయవ్యాస్త్రముతో కొట్టివేసెను. 93

మూ. అథైనం శరధారాభిర్ధారాభిరివ తోయదః,
అభ్యవర్షత సంక్రుద్ధో లక్ష్మణో రావణాత్మజమ్. 94

ప్ర. అ. అథ=అటుపిమ్మట, లక్ష్మణః=లక్ష్మణుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, ఏనమ్=ఈ, రావణాత్మజమ్= అతికాయుణ్ణి, తోయదః=మేఘము, ధారాభిః ఇవ=జలధారలచేత వలె, శరధారాభిః=బాణధారలచేత, అభ్యవర్షత=వర్షించెను.

తా. పిమ్మట కోపించిన లక్ష్మణుడు ఆ అతికాయుని మీద మేఘము జలధారలు కురిపించినట్లు బాణధారలు కురిపించెను. 94

మూ. తేఽతికాయం సమాసాద్య కవచే వజ్రభూషితే,
భగ్నాగ్రశల్యాః సహసా పేతుర్బాణా మహీతలే. 95

ప్ర. అ. తే బాణాః=ఆ బాణములు, అతికాయమ్=అతికాయుణ్ణి, సమాసాద్య=పొంది, వజ్రభూషితే=వజ్రములచేత అలంకరించబడిన, కవచే=కవచమునందు, భగ్నాగ్రశల్యాః=విరిగిపోయిన చివరి ములుకులు గలవై, సహసా=వెంటనే, మహీతలే=నేలమీద, పేతుః=పడిపోయినవి.

తా. ఆ బాణములు అతికాయుణ్ణి సమీపించి ఆతని వజ్రాలంకృతమైన కవచముమీద పడి, చివరనున్న ములుకులు విరిగిపోగా నేలమీద పడిపోయినవి.

మూ. తాన్ మోఘానభిసంప్రేక్ష్య లక్ష్మణః పరవీరహా,
అభ్యవర్షత బాణానాం సహస్రేణ మహాయశాః. 96

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించువాడు, మహాయశాః=గొప్ప కీర్తిగలవాడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, తాన్=వాటిని, మోఘాన్=వ్యర్థమైన వాటినిగా, అభిసంప్రేక్ష్య=చూచి, బాణానామ్=బాణములయొక్క, సహస్రేణ=సహస్రముచేత, అభ్యవర్షత=వర్షించెను.

తా. శత్రువీరసంహారకుడు, మహాకీర్తిశాలీ అయిన లక్ష్మణుడు ఆ బాణములు వ్యర్థమైపోవుట చూచి మరల వెయ్యి బాణములు వర్షించెను. 96

మూ. స వృష్యమాణో బాణౌఘైరతికాయో మహాబలః,
అవధ్యకవచః సంఖ్యే రాక్షసో నైవ వివ్యథే. 97

ప్ర. అ. బాణౌఘైః=బాణసముదాయములచేత, వృష్యమాణః=వర్షింపబడుచున్న, మహాబలః=గొప్ప బలము గల, అవధ్యకవచః=ఛేదింప శక్యముకాని కవచముగల, సః=ఆ, రాక్షసః=రాక్షసుడైన, అతికాయః=అతికాయుడు, సంఖ్యే=యుద్ధమునందు, న వివ్యథే=వ్యథ చెందలేదు.

తా. మహాబలశాలియైన ఆ రాక్షసుడైన అతికాయుడు బాణముల సముదాయము తన మీద వర్షముగా పడుచున్నను ఆతని కవచము ఛేదించశక్యముకాని దగుటచే వ్యథ చెందలేదు. 97

మూ. శరం చాశీవిషాకారం లక్ష్మణాయ వ్యపాసృజత్,
స తేన విద్ధః సౌమిత్రిర్మర్మదేశే శరేణ హ, 98
ముహూర్తమాత్రం నిఃసంజ్ఞో హ్యభవ చ్ఛత్రుతాపనః.

ప్ర. అ. ఆశీవిషాకారమ్=సర్పమువంటి ఆకారము గల, శరమ్=బాణమును, లక్ష్మణాయ=లక్ష్మణునకు, వ్యపాసృజత్=విడచెను. మర్మదేశే=మర్మప్రదేశమునందు, తేన శరేణ=ఆ బాణముచేత, విద్ధః=కొట్టబడిన, శత్రుతాపనః=శత్రువులను పీడించు, సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, ముహూర్తమాత్రమ్=ముహూర్తకాలము మాత్రము, నిఃసంజ్ఞః=సంజ్ఞ లేనివాడు, అభవత్=ఆయెను.

తా. అతడు లక్ష్మణునిపై సర్పము వంటి ఒక బాణమును ప్రయోగించెను. శత్రుపీడకుడైన లక్ష్మణుడు ఆ బాణము మర్మప్రదేశమునందు తగులుటచేత ముహూర్తకాలము పాటు సంజ్ఞ కోల్పోయెను. 98

మూ. తతః సంజ్ఞాముపాలభ్య చతుర్భిః సాయకోత్తమైః, 99
నిజఘాన హయాన్ సంఖ్యే సారథిం చ మహాబలః,
ధ్వజస్యోన్మథనం కృత్వా శరవర్షై రరిందమః. 100

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మహాబలః=గొప్పబలముగల, అరిం

దమః=శత్రుసంహారకుడైన లక్ష్మణుడు, సంజ్ఞామ్=సంజ్ఞను, ఉపాలభ్య=పొంది, శరవర్షైః=శరవర్షములచేత, ధ్వజస్య=ధ్వజముయొక్క, ఉన్మథనమ్= ఛేదనమును, కృత్వా=చేసి, చతుర్భిః=నాలుగు, సాయకోత్తమైః=శ్రేష్ఠములైన బాణములచేత, సంఖ్యే=యుద్ధమునందు, సారథిమ్=సారథిని, హయాన్=గుఱ్ఱములను, నిజఘాన= చంపెను.

తా. మహాబలశాలీ, శత్రుసంహారకుడూ అయిన ఆ లక్ష్మణుడు కొంతసేపటికి సంజ్ఞ పొంది, బాణములు వర్షించి, ధ్వజమును పడగొట్టి, నాలుగు బాణములచేత గుఱ్ఱములను, సారథిని చంపివేసెను. 99, 100

మూ. అసంభ్రాన్తః స సౌమిత్రిస్తాన్ శరానభిలక్షితాన్,
ముమోచ లక్ష్మణో బాణాన్ వధార్థం తస్య రక్షసః. 101

ప్ర. అ. సౌమిత్రిః=సుమిత్రాపుత్రుడైన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, అసంభ్రాన్తః=కంగారుపడనివాడై, అభిలక్షితాన్=సరిగా గుర్తు చూడబడిన, తాన్ శరాన్=ఆ బాణములను, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, వధార్థమ్=వధకొరకు, ముమోచ=విడచెను.

తా. సుమిత్రాపుత్రుడైన ఆ లక్ష్మణుడు ఏ మాత్రము కంగారుపడక, సరిగా గుర్తు చూచి, ఆ బాణములను ఆ రాక్షసుని చంపుటకై ప్రయోగించెను. (96-99 శ్లోకాలు కొన్ని ప్రతులలో లేవు.) 101

మూ. న శశాక రుజం కర్తుం యుధి తస్య నరోత్తమః,
అథైనమభ్యుపాగమ్య వాయుర్వాక్యమువాచ హ. 102

ప్ర. అ. నరోత్తమః=నరులలో ఉత్తముడైన లక్ష్మణుడు, యుధి=యుద్ధమునందు, తస్య వానికి, రుజమ్=బాధను, కర్తుమ్=చేయుటకు, న శశాక=సమర్థుడు కాలేదు. అథ=అటుపిమ్మట, వాయుః=వాయువు, ఏనమ్=ఇతనిని, ఉపాగమ్య=సమీపించి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. లక్ష్మణుడు యుద్ధమునందు ఆ అతికాయునకు ఏమాత్రము బాధ కలిగించజాలకపోయెను. అప్పుడు వాయుదేవుడు ఆతని వద్దకు వచ్చి ఇట్లు చెప్పెను. 102

మూ. బ్రహ్మదత్తవరో హ్యేష అవధ్యకవచావృతః,
బ్రాహ్మేణాస్త్రేణ భిన్ధ్యేన మేష వధ్యో హి నాన్యథా, 103
అవధ్య ఏష హ్యన్యేషామస్త్రాణాం కవచీ బలీ.

ప్ర. అ. బ్రహ్మదత్తవరః=బ్రహ్మచేత ఇవ్వబడిన వరముగల, ఏషః=ఇతడు,

అవధ్యకవచావృతః= ఛేదింపశక్యము కాని కవచముచేత కప్పబడినవాడు. ఏనమ్= వీనిని, బ్రాహ్మేణ అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచేత, భిన్ధి=భేదించుము. ఏషః=ఇతడు, అన్యథా=మరియొక విధముగా, వధ్యః=చంప శక్యమైనవాడు, న=కాడు. కవచీ=కవచముగల, బలీ=బలవంతుడైన, ఏషః=ఇతడు, అన్యేషామ్=ఇతరములైన, అస్త్రాణామ్=అస్త్రములకు, అవధ్యః=చంపశక్యము కానివాడు.

తా. ఇతడు బ్రహ్మవలన వరములు పొందినవాడు. ఛేదింప శక్యము కాని కవచముచేత కప్పబడి ఉన్నాడు. వీనిని బ్రహ్మాస్త్రముచేత ఛేదించుము. మరొక విధముగా ఇతనిని చంపుటకు శక్యము కాదు. కవచమును ధరించిన బలశాలియైన ఇతనిని ఇతరఅస్త్రములచే చంప శక్యము కాదు. 103

మూ. తతస్తు వాయోర్వచనం నిశమ్య
సౌమిత్రిరిన్ద్రప్రతిమానవీర్యః,
సమాదధే బాణమథోగ్రవేగం
తద్బ్రాహ్మమస్త్రం సహసా నియుజ్య. 104

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఇన్ద్రప్రతిమానవీర్యః=ఇంద్రునితో సమానమైన పరాక్రమము గల, సౌమిత్రిః=లక్ష్మణుడు, వాయోః=వాయువుయొక్క, వచనమ్=వచనమును, నిశమ్య=విని, అథ=పిమ్మట, తత్=ఆ, బ్రాహ్మమ్ అస్త్రమ్= బ్రహ్మాస్త్రమును, సహసా=శీఘ్రముగా, నియుజ్య=కూర్చి, ఉగ్రవేగమ్=ఉగ్రమైన వేగము గల, బాణమ్=బాణమును, సమాదధే=సంధించెను.

తా. పిమ్మట ఇంద్రుని వంటి పరాక్రమము గల లక్ష్మణుడు వాయువు మాటలు విని, వెంటనే ఆ బ్రహ్మాస్త్రమును కూర్చి భయంకరమైన వేగము గల బాణమును సంధించెను. 104

మూ. తస్మిన్ వరాస్త్రే తు నియుజ్యమానే
సౌమిత్రిణా బాణవరే శితాగ్రే,
దిశశ్చ చన్ద్రార్కమహాగ్రహాశ్చ
నభశ్చ తత్రాస రరాస చోర్వీ. 105

ప్ర. అ. సౌమిత్రిణా=లక్ష్మణునిచేత, శితాగ్రే=వాడియైన అగ్రభాగము గల, బాణవరే=శ్రేష్ఠమైన బాణమునందు, తస్మిన్= ఆ, వరాస్త్రే=శ్రేష్ఠమైన అస్త్రము, నియుజ్యమానే=కూర్చబడుచుండగా, దిశః చ =దిక్కులు, చన్ద్రార్కమహాగ్రహాశ్చ=చంద్రసూర్యగ్రహములు, నభశ్చ=ఆకాశము, తత్రాస=భయపడెను. ఉర్వీ చ=భూమి కూడ, రరాస=ధ్వనిచేసెను.

తా. లక్ష్మణుడు వాడియైన అగ్రభాగము గల ఆ శ్రేష్ఠమైన

బాణముమీద శ్రేష్ఠమైన ఆ బ్రహ్మాస్త్రమును కూర్చుచున్నప్పుడు దిక్కులు, చంద్రుడు, సూర్యుడు, మహాగ్రహములు, ఆకాశము భయపడినవి. భూమి ధ్వని చేసినది. 105

మూ. తం బ్రహ్మణోఽస్త్రేణ నియుజ్య చాపే
శరం సపుఙ్ఖం యమదూతకల్పమ్,
సౌమిత్రిరిన్ద్రారిసుతస్య తస్య
ససర్జ బాణం యుధి వజ్రకల్పమ్. 106

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, సపుఙ్ఖమ్=పొన్నుతో కూడిన, యమదూతకల్పమ్=యమదూతతో సమానమైన, తం శరమ్=ఆ బాణమును, చాపే=ధనస్సునందు, బ్రహ్మణః అస్త్రేణ=బ్రహ్మాస్త్రముతో, నియుజ్య=కూర్చి, వజ్రకల్పమ్=వజ్రాయుధము వంటి, బాణమ్=బాణమును, తస్య=ఆ, ఇన్ద్రారిసుతస్య=రావణుని కుమారునకు, ససర్జ=విడచెను.

తా. లక్ష్మణుడు గట్టి పొన్ను గల, యమదూతవంటి ఆ బాణమును బ్రహ్మాస్త్రముతో ధనస్సుపై కూర్చి, వజ్రాయుధమువంటి ఆ బాణమును అతికాయునిపై ప్రయోగించెను. 106

మూ. తం లక్ష్మణోత్సృష్టవివృద్ధవేగం
సమాపతన్తం శ్వసనోగ్రవేగమ్,
సుపర్ణవజ్రోత్తమచిత్రపుఙ్ఖం
తదాతికాయః సమరే దదర్శ. 107

ప్ర. అ. తదా=అప్పుడు, లక్ష్మణోత్సృష్టవివృద్ధవేగమ్=లక్ష్మణునిచేత ప్రయోగింపబడినది, వృద్ధిపొందిన వేగము గలది అయిన, శ్వసనోగ్రవేగమ్=వాయువు వలె ఉగ్రమైన వేగము గల, సుపర్ణవజ్రోత్తమచిత్రపుఙ్ఖమ్=మంచి రెక్కలు గలది, ఉత్తమమైన వజ్రములచేత విచిత్రమైన పొన్నుగలది అయిన, సమాపతన్తమ్=వచ్చుచున్న, తమ్= ఆ బాణమును, అతికాయః=అతికాయుడు, సమరే=యుద్ధమునందు, దదర్శ=చూచెను.

తా. లక్ష్మణుడు ప్రయోగించిన ఆ బాణము వృద్ధి పొందిన వేగముతో, వాయువేగముతో వచ్చుచుండెను. దాని పొన్నుకు మంచి రెక్కలు కట్టబడియుండెను. ఆ (పొన్ను) ఉత్తమమైన వజ్రములచేత చిత్రవర్ణమై ఉండెను. అట్టి బాణమును అతికాయుడు చూచెను. 107

మూ. తం ప్రేక్షమాణః సహసాతికాయో
జఘాన బాణైర్నిశితైరనేకైః,

స సాయకస్తస్య సుపర్ణవేగ
స్తథాతివేగేన జగామ పార్శ్వమ్. 108

ప్ర. అ. అతికాయః=అతికాయుడు, తమ్=ఆ బాణమును, ప్రేక్షమాణః=చూచుచు, సహసా=వెంటనే, అనేకైః= అనేకములైన, నిశితైః=వాడియైన, బాణైః=బాణములచేత, జఘాన=కొట్టెను. సుపర్ణవేగః=గరుత్మంతునివంటి వేగము గల, తస్య=లక్ష్మణునియొక్క, సః సాయకః=ఆ బాణము, తథా=అట్లు, అతివేగేన=చాల వేగముతో, పార్శ్వమ్=అతని సమీపమును, జగామ=పొందెను.

తా. అతికాయుడు ఆ బాణమును చూచి అనేకములైన వాడియైన బాణములతో వెంటనే దానిని కొట్టెను. గరుత్మంతునివంటి వేగముగల ఆ బాణము గొప్ప వేగముతో అతని దగ్గరకు వెళ్లెను. 108

మూ. తమాగతం ప్రేక్ష్య తదాతికాయో బాణం ప్రదీప్తాన్తలకాలకల్పమ్,
జఘావశక్త్యృష్టిగదాకుఠారైః శూలైః శరైశ్చాప్యవిపన్నచేష్టః. 109

ప్ర. అ. తదా=అప్పుడు, అతికాయః=అతికాయుడు, ప్రదీప్తాన్తకకాలకల్పమ్=ప్రజ్వలించుచున్న, యమునితోను మృత్యుదేవతతోను సమానమైన, ఆగతమ్=వచ్చిన, తం బాణమ్=ఆ బాణమును, ప్రేక్ష్య=చూచి, అవిపన్నచేష్టః=చెడని చేష్టలు కల వాడై, శక్త్యృష్టిగదాకుఠారైః=శక్తితోను, ఋష్టితోను, గదతోను, గొడ్డలితోను, శూలైః=శూలములతోను, శరైశ్చాపి=బాణములతోను, జఘాన=కొట్టెను.

తా. అతికాయుడు తనమీదకు వచ్చిన, ప్రజ్వలించుచున్న, యమునితోను, మృత్యుదేవతతోను సమానమైన ఆ బాణమును చూచి, చేష్టలలో ఏమాత్రము కంగారు లేనివాడై, దానిని శక్తితోను, ఋష్టితోను, గదతోను, కుఠారముతోను, శూలములతోను, బాణాలతోను కొట్టెను. 109

మూ. తాన్యాయుధాన్యద్భుతవిగ్రహాణి
మోఘాని కృత్వా స శరోఽగ్నిదీప్తః,
ప్రగృహ్య తస్యైవ కిరీటజుష్టం
తదాతికాయస్య శిరో జహార. 110

ప్ర. అ. తదా=అప్పుడు, అగ్నిదీప్తః=అగ్నివలె మండుచున్న, సః శరః=ఆ బాణము, అద్భుతవిగ్రహాణి= అద్భుతమైన ఆకారము గల, తాని=ఆ, ఆయుధాని=ఆయుధములను, మోఘాని=వ్యర్థమైనవాటినిగా, కృత్వా= చేసి, తస్య=ఆ, అతికాయస్య=అతికాయునియొక్క, కిరీటజుష్టమ్=కిరీటముతో కూడిన, శిరః=శిరస్సును, ప్రగృహ్య= గ్రహించి, జహార=హరించెను.

తా. అగ్నివలె మండుచున్న ఆ బాణము ఆశ్చర్యకరమైన రూపము

గల ఆ ఆయుధముల నన్నింటినీ వ్యర్థములుగా చేసి ఆ అతికాయుని కిరీటాలంకృతమైన శిరస్సును గ్రహించి హరించెను. 110

మూ. తచ్ఛిరః సశిరస్త్రాణం లక్ష్మణేషుప్రమర్దితమ్,
పపాత సహసా భూమౌ శృఙ్గం హిమవతో యథా. 111

ప్ర. అ. లక్ష్మణేషుప్రమర్దితమ్=లక్ష్మణుని బాణముచేత మర్దింపబడిన, సశిరస్త్రాణమ్=కిరీటముతో కూడిన, తత్=ఆ, శిరః=శిరస్సు, హిమవతః=హిమవత్పర్వతముయొక్క, శృఙ్గం యథా=శిఖరమువలె, సహసా=వెంటనే, భూమౌ=నేలమీద, పపాత=పడెను.

తా. కిరీటముతో, శిరస్సును రక్షించు కవచముతో, కూడిన ఆ శిరస్సు లక్ష్మణుని బాణముచేత ఛేదింపబడినదై హిమవత్పర్వతశిఖరమువలె వెంటనే నేలమీద పడిపోయెను. 111

మూ. తం భూమౌ పతితం దృష్ట్వా విక్షిప్తామ్బరభూషణమ్,
బభూవుర్వ్యథితాః సర్వే హతశేషా నిశాచరాః. 112

ప్ర. అ. హతశేషాః=చంపబడగా మిగిలిన, సర్వే=సమస్తమైన, నిశాచరాః=రాక్షసులు, భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, విక్షిప్తామ్బరభూషణమ్=విసిరివేయబడిన వస్త్రములు అలంకారములు గల, తమ్=ఆతనిని, దృష్ట్వా=చూచి, వ్యథితాః=వ్యథచెందినవారు, బభూవుః=అయిరి.

తా. వస్త్రములు, అలంకారములు దూరదూరముగా పడిపోగా నేలమీద వ్రాలిన ఆ అతికాయుణ్ణి చూచి చావగా మిగిలిన రాక్షసులందరూ వ్యథ చెందిరి.

మూ. తే విషణ్ణముఖా దీనాః ప్రహారజనితశ్రమాః,
వినేదురుచ్చైర్బహవః సహసా విస్వరైః స్వరైః. 113

ప్ర. అ. ప్రహారజనితశ్రమాః=యుద్ధముచేత పుట్టింపబడిన శ్రమ గల, విషణ్ణముఖాః=దిగులుచెందిన ముఖములు గల, దీనాః=దీనులైన, బహవః=అనేకులైన, తే=వాళ్ళు, సహసా=వెంటనే, విస్వరైః=విపరీతమైన స్వరములు గల, స్వరైః=స్వరములతో, ఉచ్చైః=గట్టిగా, వినేదుః=ధ్వని చేసిరి.

తా. యుద్ధమునందు అలిసిపోయి దిగులు చెందిన ముఖములతో దీనులైన ఆ రాక్షసులు చాలమంది వెంటనే విపరీతస్వరముతో కూడిన ధ్వనులు చేసిరి. 113

మూ. తతస్తత్వరితో యాతా నిరపేక్షా నిశాచరాః,
పురీమభిముఖా భీతా ద్రవన్తో నాయకే హతే. 114

ప్ర. అ. నాయకే=నాయకుడు, హతే=చంపబడివాడగుచుండగా, తతః=అటుపిమ్మట, నిశాచరాః=రాక్షసులు, భీతాః=భయపడినవారై, నిరపేక్షాః=యుద్ధమునందు ఆసక్తి లేనివారై, పురీమ్=పట్టణమును గూర్చి, అభిముఖాః=అభిముఖులై, ద్రవన్తః=పారిపోవుచున్నవారై, తత్పరితః=ఆ నగరము నలువైపులా, యాతాః=వెళ్ళిరి.

తా. తమ నాయకుడు మరణించగానే ఆ రాక్షసులు భయపడి, యుద్ధమునందు కోరిక లేనివారై, నగరమునకు అభిముఖముగా ఆ నగరము నలువైపులా పరుగెత్తుచు వెళ్ళిరి. 114

మూ. ప్రహర్షయుక్తా బహవస్తు వానరాః
ప్రఫుల్లపద్మప్రతిమాననాస్తదా,
అపూజయన్ లక్ష్మణ మిష్టభాగినం
హతే రిపౌ భీమబలే దురాసదే. 115

ప్ర. అ. భీమబలే=భయంకరమైన బలము గల, దురాసదే=ఎదిరింప శక్యము కాని, రిపౌ=శత్రువు, హతే= చంపబడినవాడగుచుండగా, తదా=అప్పుడు, బహవః=అనేకులైన, వానరాః=వానరులు, ప్రహర్షయుక్తాః= సంతోషముతో కూడినవారై, ప్రఫుల్లపద్మప్రతిమాననాః=వికసించిన పద్మములతో సమానములైన ముఖములు గలవారై, ఇష్టభాగినమ్=ఇష్టమును పొందిన, లక్ష్మణమ్=లక్ష్మణుని, అపూజయన్=పూజించిరి.

తా. భయంకరమైన బలము గల, ఎదిరింప శక్యముకాని శత్రువును చంపిన పిమ్మట వానరులందరు సంతోషించుచు, వికసించిన పద్మములవంటి ముఖములతో, కోరిన జయమును సంపాదించిన లక్ష్మణుణ్ణి పూజించిరి. 115

మూ. అతిబల మతికాయమభ్రకల్పం
యుధి వినిపాత్య స లక్ష్మణః ప్రహృష్టః,
త్వరితమథ తదా స రామపార్శ్వం
కపినివహైశ్చ సుపూజితో జగామ. 116

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ఏకసప్తతితమః సర్గః.

ప్ర. అ. సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, తదా=అప్పుడు, అతిబలమ్=గొప్ప బలము గల, అభ్రకల్పమ్=మేఘముతో సమానుడైన, అతికాయమ్=అతికాయుణ్ణి, యుధి=యుద్ధమునందు, వినిపాత్య=పడగొట్టి, ప్రహృష్టః=సంతోషించినవాడై, కపినివహైః=వానరసముదాయములచేత, సుపూజితః=పూజింపబడినవాడై, అథ=అటుపిమ్మట, త్వరితమ్=శీఘ్రముగా, రామపార్శ్వమ్=రాముని సమీపమును, జగామ=పొందెను.

తా. అప్పుడు లక్ష్మణుడు గొప్ప బలము గల, మేఘము వంటి అతికాయుణ్ణి యుద్ధములో సంహరించి, సంతోషించుచు, వానరులందరు పూజించుచుండగా, శీఘ్రంగా రామునివద్దకు వెళ్లెను. 116

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విసప్తతితమః సర్గః

[ రావణుడు చింతాక్రాంతుడై, "సావధానచిత్తులై నగరమును రక్షింపుడు" అని రాక్షసులను ఆదేశించుట.]

మూ. అతికాయం హతం శ్రుత్వా లక్ష్మణేన మహాత్మనా,
ఉద్వేగమగమద్రాజా వచనం చేదమబ్రవీత్. 1

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, అతికాయమ్=అతికాయుణ్ణి, హతమ్= చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, రాజా=రాజు, ఉద్వేగమ్=భయమును, అగమత్=పొందెను. ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్ చ=ప పలికెను కూడ.

తా. మహాత్ముడైన లక్ష్మణుని చేతిలో అతికాయుడు మరణించినట్లు విని రావణుడు భయము చెంది ఇట్లు పలికెను. 1

మూ. ధూమ్రాక్షః పరమామర్షీ సర్వశస్త్రభృతాం వరః,
అకమ్పనః ప్రహస్తశ్చ కుమ్భకర్ణస్తథైవ చ. 2
ఏతే మహాబలా వీరా రాక్షసా యుద్ధకాఙ్క్షిణః,
జేతారః పరసైన్యానాం పరైర్నిత్యాపరాజితాః. 3
ససైన్యాస్తే హతా వీరా రామేణాక్లిష్టకర్మణా,
రాక్షసాః సుమహాకాయా నానాశస్త్రవిశారదాః. 4
అన్యే చ బహవః శూరా మహాత్మానో నిపాతితాః.

ప్ర. అ. అక్లిష్టకర్మణా=శ్రమలేని పని గల, రామేణ=రామునిచేత, ధూమ్రాక్షః=ధూమ్రాక్షుడు, పరమామర్షీ=గొప్ప కోపము గల, సర్వశస్త్రభృతామ్= అందరు శస్త్రధారులలోను, వరః=శ్రేష్ఠుడైన, అకమ్పనః=అకంపనుడు, ప్రహస్తశ్చ= ప్రహస్తుడు, తథైవ చ=మరియు, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, మహాబలాః=గొప్ప బలము గల, వీరాః=వీరులైన, రాక్షసాః=రాక్షసులు, యుద్ధకాంక్షిణః=యుద్ధమును కోరువారు, పరసైన్యానామ్=శత్రుసైన్యములకు, జేతారః=జయించువారు, పరైః=పరులచేత, నిత్యాపరాజితాః= ఎన్నడూ పరాజయింపబడని, ససైన్యాః=సైన్యములతో కూడిన, తే వీరాః=ఆ వీరులు, హతాః=చంపబడినారు. సుమహాకాయాః=చాల పెద్ద శరీరములు గల, నానాశస్త్రవిశారదాః =అనేకవిధములైన, ఆయుధముల యందు

నేర్పుగల, మహాత్మానః=మహాత్ములైన, అన్యే=ఇతరులైన, బహవః=చాలమంది, శూరాః=శూరులు, వినిపాతితాః=పడగొట్టబడినారు.

తా. శ్రమపడకుండా కార్యములు చేయు రామునిచేత ధూమ్రాక్షుడు, చాల కోపము గలవాడు, ఆయుధధారులందరిలోను శ్రేష్ఠుడు అయిన అకంపనుడు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు చంపబడినారు. వీళ్ళందరూ మహాబలవంతులైన వీరులైన రాక్షసులు; యుద్ధమునందు ఆసక్తిగలవారు; పరసైన్యమును జయించినవారు; ఎన్నడూ పరులచేత జయింపబడనివారు; వీళ్ళు సైన్యములతో సహా చంపబడినారు. పెద్ద శరీరములు కలవారు, అనేకవిధములైన ఆయుధములయందు ప్రవీణులు, శూరులు అయిన మహాత్ములైన ఇతరరాక్షసులు కూడ చంపబడినారు. 2-4

మూ. ప్రఖ్యాతబలవీర్యేణ పుత్రేణేన్ద్రజితా మమ, 5
తౌ భ్రాతరౌ తదా బద్ధౌ ఘోరైర్దత్తవరైః శరైః.

ప్ర. అ. ప్రఖ్యాతబలవీర్యేణ=ప్రసిద్ధమైన బలపరాక్రమములు గల, మమ పుత్రేణ=నా పుత్రుడైన, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, తదా=ఆనాడు, ఘోరైః=భయంకరములైన, దత్తవరైః=ఇవ్వబడిన వరములు గల, శరైః=బాణములచేత, తౌ=ఆ, భ్రాతరౌ=సోదరులు, బద్ధౌ=కట్టబడిరి.

తా. ప్రసిద్ధమైన బలపరాక్రమములు గల నా కుమారుడైన ఇంద్రజిత్తు, ఆనాడు, సోదరులైన ఆ రామలక్ష్మణులను వరముచేత పొందబడిన భయంకరములైన బాణాలతో బంధించినాడు. 5

మూ. యన్న శక్యం సురైః సర్వైరసురైర్వా మహాబలైః. 6
మోక్తుం తద్ బన్ధనం ఘోరం యక్షగన్ధర్వపన్నగైః,
తన్న జానే ప్రభావైర్వా మాయయా మోహనేన వా. 7
శరబన్ధాద్విముక్తౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ.

ప్ర. అ. యత్=ఏది, సర్వైః=సమస్తమైన, సురైః=సురులచేతగాని, మహాబలైః=గొప్ప బలముగల, అసురైర్వా=అసురులచేత కాని, యక్షగన్ధర్వపన్నగైః=యక్షులచేతను, గంధర్వులచేతను, పన్నగులచేతను గాని, మోక్తుమ్=విడిపించుటకు, న శక్యమ్=శక్యము కాదో, తత్=ఆ, బన్ధనమ్=బంధనము, ఘోరమ్=భయంకరమైనది. శరబన్ధాత్=అట్టి శరబంధమునుండి, భ్రాతరౌ=సోదరులైన, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ప్రభావైః వా=ప్రభావములచేతనో, మాయయా=మాయచేతనో, మోహనేన వా=మోహింపచేయుటచేతనో, విముక్తౌ=విడిపింపబడినారు. తత్=దానిని, న జానే=ఎరుగను.

తా. భయంకరమైన ఆ శరబంధమును అందరు దేవతలు గాని, గొప్ప బలము గల అసురులు గాని, యక్షగంధర్వపన్నగులు గాని విడిపింపజాలరు. అట్టి ఆ శరబంధమునుండి సోదరులైన రామలక్ష్మణులు ప్రభావముచేత విడిపించు కొన్నారో, మాయచేత విడిపించుకొన్నారో, మోహింపచేసి విడిపించుకున్నారో నాకు తెలియుటలేదు. 6, 7

మూ. యే యోధా నిర్గతాః శూరా రాక్షసా మమ శాసనాత్, 8
తే సర్వే విహతా యుద్ధే వానరైః సుమహాబలైః.

ప్ర. అ. మమ=నాయొక్క, శాసనాత్=ఆజ్ఞవలన, యే=ఏ, శూరాః=శూరులైన, యోధాః=యోధులైన, రాక్షసాః=రాక్షసులు, నిర్గతాః=బయలుదేరి వెళ్ళినారో, తే సర్వే=వాళ్ళందరూ, యుద్ధే=యుద్ధమునందు, సుమహాబలైః=చాల గొప్ప బలము గల, వానరైః=వానరులచేత, విహతాః=చంపబడినారు.

తా. నా ఆజ్ఞ ప్రకారము యుద్ధానికి వెళ్లిన శూరులైన రాక్షసయోధు లందరినీ గొప్ప బలము గల వానరులు చంపివేసినారు. 8

మూ. తం న పశ్యామ్యహం యుద్ధే యోఽద్య రామం సలక్ష్మణమ్, 9
నాశయేత్సబలం వీరం ససుగ్రీవవిభీషణమ్.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, యః=ఎవడు, యుద్ధే=యుద్ధమునందు, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, సబలమ్=సైన్యముతో కూడిన, ససుగ్రీవ విభీషణమ్=సుగ్రీవవిభీషణులతో కూడిన, వీరమ్=వీరుడైన, రామమ్=రాముణ్ణి, నాశయేత్=నశింపచేయునో, తమ్=అట్టివానిని, అహమ్=నేను, న పశ్యామి=చూడను.

తా. ఇప్పుడు యుద్ధములో రామలక్ష్మణులను, వారి సైన్యమును, సుగ్రీవవిభీషణులను చంపగలిగినవాడు ఎవ్వడూ నాకు కనబడుటలేదు. 9

మూ. అహో సుబలవాన్ రామో మహదస్త్రబలం చ వై, 10
యస్య విక్రమమాసాద్య రాక్షసా నిధనం గతాః.

ప్ర. అ. యస్య=ఏ రామునియొక్క, విక్రమమ్=పరాక్రమమును, ఆసాద్య=పొంది, రాక్షసాః= రాక్షసులు, నిధనమ్=మరణమును, గతాః=పొందినారో, రామః=అట్టి రాముడు, సుబలవాన్=గొప్ప బలముగలవాడు. అస్త్రబలం చ =ఆతని అస్త్రబలము కూడ, మహత్ వై=గొప్పది కదా. అహో=ఎంత ఆశ్చర్యము!

తా రాముని పరాక్రమముచేత రాక్షసులు నశించినారు. అహో! రాముడు ఎంత బలశాలి ! ఆతని అస్త్రబలము ఎంత గొప్పది ! 10

మూ. అప్రమత్తైశ్చ సర్వత్ర గుల్మై రక్ష్యా పురీ త్వియమ్, 11
అశోకవనికా చైవ యత్ర సీతాభిరక్ష్యతే.

ప్ర. అ. ఇయమ్=ఈ, పురీ=పట్టణము, యత్ర=ఎక్కడ, సీతా=సీత, అభిరక్ష్యతే=రక్షింపబడుచున్నదో, అట్టి, అశోకవనికా చైవ=అశోకవనము, గుల్మైః=సైన్యములచేత (ఒకప్రదేశమునందున్న కొంతమంది సైనికుల సముదాయము గుల్మము) అప్రమత్తైః=ఏమరిపాటు లేనివారుగా ఉండి, సర్వత్ర=అంతటను, రక్ష్యా తు= రక్షించదగినది.

తా. గుల్మములలోని సైనికులందరు ఈ లంకానగరమును, సీత రక్షింపబడుచున్న అశోకవనమును అంతటా కూడ ఏమరిపాటు లేకుండ రక్షించుచుండవలెను. 11

మూ. నిష్క్రమో వా ప్రవేశో వా జ్ఞాతవ్యః సర్వదైవ నః, 12
యత్ర యత్ర భవేద్గుల్మస్తత్ర తత్ర పునః పునః.

ప్ర. అ. యత్ర యత్ర=ఎక్కడెక్కడ, గుల్మః=గుల్మము, భవేత్=ఉండునో, తత్ర తత్ర=అక్కడక్కడ, పునః పునః=మాటిమాటికి, సర్వదైవ=ఎల్లపుడూ, నిష్క్రమో వా=జనులు బైటకు వెళ్ళుట గాని, ప్రవేశో వా=లోనికి ప్రవేశించుట గాని, నః=మనకు, జ్ఞాతవ్యః=తెలియదగినది.

తా. గుల్మములు ఎక్కడెక్కడ ఉన్నవో అక్కడ ఎవరు పురమునుండి బైటకు వెళ్ళుచున్నారో, లోనికి ప్రవేశించుచున్నారో మనకు అన్నివేళలా పూర్తిగా తెలియవలెను. 12

మూ. సర్వతశ్చాపి తిష్ఠధ్వం స్వైః స్వైః పరివృతా బలైః, 13
ద్రష్టవ్యం చ పదం తేషాం వానరాణాం నిశాచరాః.

ప్ర. అ. నిశాచరాః=రాక్షసులారా, స్వైః స్వైః=తమ తమ, బలైః=సైన్యములతో, పరివృతాః=కూడినవారై, సర్వతః=అన్ని వైపులా, తిష్ఠధ్వమ్=ఉండండి. తేషామ్=ఆ, వానరాణామ్=వానరులయొక్క, పదమ్=సంచారము (సంకల్పము), ద్రష్టవ్యం చ=చూడదగినది.

తా. ఓ ! రాక్షసులారా ! మీరు మీ సైన్యములతో అన్నివైపులా నిలచి ఉండి వానరుల సంచారమును ఆలోచనను కనిపెట్టుచు ఉండవలెను. 13

మూ. ప్రదోషే వార్ధరాత్రే వా ప్రత్యూషే వాపి సర్వశః, 14
నావజ్ఞా తత్ర కర్తవ్యా వానరేషు కదాచన,
ద్విషతాం బలముద్యుక్తమాపతత్కిం స్థితం తథా. 15

ప్ర. అ. ప్రదోషే వా=సాయంకాలమునందు గాని, అర్ధరాత్రే వా=అర్ధరాత్రమునందు గాని, ప్రత్యూషే వా=ప్రాతఃకాలమునందు గాని, సర్వశః=అన్నివేళలా, కదాచన=ఎన్నడూ, తత్ర వానరేషు=ఆ వానరుల విషయమున, అవజ్ఞా=అనాదరము, న కర్తవ్యా=చేయదగినదికాదు. ద్విషతామ్=శత్రువులయొక్క, బలమ్=సైన్యము, ఉద్యుక్తమ్=ఉద్యమించుచున్నదా, ఆపతత్=వచ్చుచున్నదా, తథా=మరియు, స్థితమ్=నిలచి ఉన్నదా (చూచుచుండవలెను.)

తా. సాయంకాలమునందుగాని, అర్ధరాత్రమునందు గాని, ప్రాతఃకాలమునందు గాని అన్నివేళలా అప్రమత్తులై ఉండవలెను. వానరుల విషయమున ఎన్నడూ అనాదరము చూపకూడదు. శత్రువుల సైన్యము యుద్ధానికి ఉద్యమించుచున్నదో, దండెత్తి వచ్చుచున్నదో, నిలచి ఉన్నదో చూచుచుండవలెను.

మూ. తతస్తే రాక్షసాః సర్వే శ్రుత్వా లఙ్కాధిపస్య తత్,
వచనం సర్వమాతిష్ఠన్ యథావత్తు మహాబలాః. 16

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలాః=గొప్ప బలము గల, సర్వే=సమస్తమైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, లఙ్కాధిపస్య=రావణునియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, సర్వమ్=దాని నంతను, ఆతిష్ఠన్=చేసిరి.

తా. మహాబలశాలులైన ఆ రాక్షసులందరూ రావణుని మాటలు విని ఆతని ఆజ్ఞ ప్రకారము చేసిరి. 16

మూ. స తాన్ సర్వాన్ హి సందిశ్య రావణో రాక్షసాధిపః,
మన్యుశల్యం వహన్ దీనః ప్రవివేశ స్వమాలయమ్. 17

ప్ర. అ. సః=ఆ, రాక్షసాధిపః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, తాన్=వాళ్ళను, సర్వాన్=అందరినీ, సందిశ్య=ఆజ్ఞాపించి, మన్యుశల్యమ్=దుఃఖశల్యమును, వహన్=ధరించుచు, దీనః=దీనుడై, స్వమ్=తనదైన, ఆలయమ్=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. రాక్షసరాజైన రావణుడు ఆ రాక్షసులను ఆ విధముగా ఆజ్ఞాపించి, దుఃఖమనే శల్యముతో బాధపడుచు, దీనుడై తన గృహములో ప్రవేశించెను. 17

మూ. తతః స సందీపితకోపవహ్ని
ర్నిశాచరాణామధిపో మహాబలః,
తదేవ పుత్రవ్యసనం విచిన్తయన్
ముహుర్ముహుశ్చైవ తదా వ్యనిఃశ్వసత్. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్విసప్తతితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, నిశాచరాణామ్=రాక్షసులయొక్క, అధిపః=ప్రభువు, సందీపితకోపవహ్నిః=ప్రజ్వాలింపచేయబడిన, కోపాగ్ని కలవాడై, తత్=ఆ, పుత్రవ్యసనమ్ ఏవ= పుత్రవ్యసనమునే, విచిన్తయన్=ఆలోచించుచు, తదా=అప్పుడు, ముహుః ముహుః=మాటిమాటికి, వ్యనిఃశ్వసత్=నిట్టూర్చెను.

తా. అప్పుడు మహాబలశాలియైన రావణుడు కోపాగ్నితో మండిపడుచు, ఆ పుత్రవ్యసనమును గూర్చియే ఆలోచించుచు మాటిమాటికి నిట్టూర్చెను. 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిసప్తతితమః సర్గః

[ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రామలక్ష్మణులను వానరసైన్యమును మూర్ఛ చెందించుట.]

మూ. తతో హతాన్ రాక్షసపుఙ్గవాంస్తాన్
దేవాన్తకాదిత్రిశిరోతికాయాన్,
రక్షోగణాస్తత్ర హతావశిష్టా
స్తే రావణాయ త్వరితాః శశంసుః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తత్ర=అక్కడ, హతావశిష్టాః=చంపబడగా మిగిలిన, తే=ఆ, రక్షోగణాః= రాక్షసగణములు, త్వరితాః=తొందరపడుచున్నవై, రాక్షసపుంగవాన్=రాక్షసశ్రేష్ఠులైన, తాన్=ఆ, దేవాన్తకాదిత్రిశిరోతికాయాన్=దేవాంతకుడు మొదలైనవారిని, త్రిశిరస్సును, అతికాయుణ్ణి, హతాన్=చంపబడిన వారినిగా, రావణాయ=రావణునకు, శశంసుః=చెప్పినవి.

తా. అప్పుడు చావగా మిగిలిన రాక్షసు లందరూ తొందరగా వెళ్లి దేవాంతకుడు, త్రిశిరస్సు, అతికాయుడు మొదలైన రాక్షసవీరు లందరూ మరణించినట్లుగా రావణునకు తెలిపిరి. 1

మూ. తతో హతాంస్తాన్ సహసా నిశమ్య
రాజా మహాబాష్పపరిప్లుతాక్షః,
పుత్రక్షయం భ్రాతృవధం చ ఘోరం
విచిన్త్య రాజా విపులం ప్రదధ్యౌ. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజా=ఐశ్వర్యాదులతో ప్రకాశించుచున్న, రాజా=రాక్షసరాజు, తాన్=వాళ్లను, హతాన్=చంపబడినవాళ్లనుగా, సహసా=హఠాత్తుగా, నిశమ్య=విని, మహాబాష్పపరిప్లుతాక్షః=అధికమైన కన్నీటితో నిండిన నేత్రములు గలవాడై, ఘోరమ్=ఘోరమైన, పుత్రక్షయమ్=పుత్రుల క్షయమును, భ్రాతృవధం చ=సోదరుల వధను, విచిన్త్య=ఆలోచించి, విపులమ్=అధికముగా, ప్రదధ్యౌ=ధ్యానము చేసెను.

తా. ఐశ్వర్యాదులతో ప్రకాశించుచున్న రావణుడు వాళ్ల మరణమును గూర్చి విని, అధికముగా కన్నీరు కార్చుచు, ఘోరమైన ఆ పుత్రవినాశమును, సోదరుల

మరణమును గూర్చి ఆలోచించుచు చాలసేపు మౌనముగా ఉండిపోయెను.

మూ. తతస్తు రాజానముదీక్ష్య దీనం
శోకార్ణవే సంపరిపుప్లువానమ్,
రథర్షభో రాక్షసరాజసూను
స్తమిన్ద్రజిద్వాక్యమిదం బభాషే. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దీనమ్=దీనుడు, శోకార్ణవే=శోకసముద్రమునందు, సంపరిపుప్లువానమ్= తేలుచున్నవాడు అయిన, రాజానమ్=రాజును, ఉదీక్ష్య=చూచి, రథర్షభః=రథికులలో శ్రేష్ఠుడు, రాక్షసరాజసూనుః= రాక్షసరాజు పుత్రుడు అయిన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, తమ్=ఆతనిని గూర్చి, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, బభాషే= పలికెను.

తా. దీనుడై శోకసముద్రములో తేలుచున్న రావణుని జూచి, రథికులలో శ్రేష్ఠుడు, ఆతని కుమారుడు అయిన ఇంద్రజిత్తు ఇట్లు పలికెను. 3

మూ. న తాత మోహం పరిగన్తుమర్హసే
యత్రేన్ద్రజిజ్జీవతి నైరృతేశ,
నేన్ద్రారిబాణాభిహతో హి కశ్చిత్
ప్రాణాన్ సమర్థః సమరేఽభిపాతుమ్. 4

ప్ర. అ. నైరృతేశ=రాక్షసరాజువైన, తాత=తండ్రీ! యత్ర=ఏ సమయమునందు, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, జీవతి=జీవించి ఉన్నాడో, అప్పుడు, మోహమ్=మోహమును, పరిగన్తుమ్=పొందుటకు, న అర్హసే=తగవు. సమరే= యుద్ధమునందు, ఇన్ద్రారిబాణాభిహతః=ఇంద్రజిత్తు బాణములచేత కొట్టబడిన, కశ్చిత్=ఎవ్వడూ, ప్రాణాన్=ప్రాణములను, అభిపాతుమ్=రక్షించుకొనుటకు, న సమర్థః హి=సమర్థుడు కాడు కదా?

తా. రాక్షసప్రభువైన ఓ! తండ్రీ! ఈ ఇంద్రజిత్తు జీవించి ఉండగా నీవు ఇట్లు దుఃఖించుట తగదు. యుద్ధములో ఇంద్రజిత్తు బాణముల దెబ్బ తిన్నవాడెవ్వడూ ప్రాణాలను రక్షించుకొనజాలడు. 4

మూ. పశ్యాద్య రామం సహ లక్ష్మణేన
మద్బాణనిర్భిన్నవికీర్ణదేహమ్,
గతాయుషం భూమితలే శయానం
శితైః శరైరాచితసర్వగాత్రమ్. 5

ప్ర. అ. అద్య=ఈనాడు, మద్బాణనిర్భిన్నవికీర్ణదేహమ్=నా బాణములచేత

బ్రద్దలుకొట్టబడిన శిథిలమైన దేహము గల, గతాయుషమ్=పోయిన ఆయుర్దాయము గల, భూమితలే=నేలమీద, శయానమ్=శయనించుచున్న, శితైః= వాడియైన, శరైః=బాణములచేత, ఆచితసర్వగాత్రమ్=వ్యాప్తమైన సమస్తావయవములు గల, లక్ష్మణేన సహ= లక్ష్మణునితో కూడిన, రామమ్=రాముణ్ణి, పశ్య=చూడుము.

తా. ఈనాడు రామలక్ష్మణుల శరీరములను బాణములచేత భేదించి ఇటు అటు పడవేసెదను. వాళ్ల అవయవము లన్నీ వాడియైన బాణములచే గ్రుచ్చబడి ఉండును. ఈ విధముగా వాళ్లిద్దరూ ఆయుస్సు కోల్పోయి నేలమీద శయనించి ఉండగా చూడగలవు. 5

మూ. ఇమాం ప్రతిజ్ఞాం శృణు శక్రశత్రోః
సునిశ్చితాం పౌరుషదైవయుక్తామ్,
అద్యైవ రామం సహ లక్ష్మణేన
సంతర్పయిష్యామి శరైరమోఘైః. 6

ప్ర. అ. శక్రశత్రోః=ఇంద్రజిత్తుయొక్క, సునిశ్చితామ్=బాగా నిశ్చితమైన, పౌరుషదైవయుక్తామ్=పౌరుషముతోను, దైవబలముతోను కూడిన, ఇమామ్=ఈ, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, శృణు=వినుము. అద్యైవ=ఇప్పుడే, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, రామమ్=రాముణ్ణి, అమోఘైః=వ్యర్థములు కాని, శరౌఘైః= బాణసముదాయములచేత, సంతర్పయిష్యామి=నింపెదను.

తా. ఇంద్రజిత్తు చేయు సునిశ్చితము, పౌరుషదైవబలములతో కూడినది అయిన ఈ ప్రతిజ్ఞను వినుము. ఇప్పుడే రామలక్ష్మణులను వ్యర్థములు కాని బాణాలతో నింపెదను. 6

మూ. అద్యేన్ద్రవైవస్వతవిష్ణురుద్ర
సాధ్యాశ్చ వైశ్వానరచన్ద్రసూర్యాః,
ద్రక్ష్యన్తి మే విక్రమమప్రమేయం
విష్ణోరివోగ్రం బలియజ్ఞవాటే. 7

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఇన్ద్రవైవస్వతవిష్ణురుద్రసాధ్యాః చ=ఇంద్రుడు, యముడు, విష్ణువు, రుద్రుడు, సాధ్యులు, వైశ్వానరసూర్యచంద్రాః=అగ్నిసూర్య చంద్రులు, అప్రమేయమ్=అనంతమైన, మే విక్రమమ్=నా పరాక్రమమును, బలియజ్ఞవాటే=బలియొక్క యజ్ఞశాలయందు, విష్ణోః=విష్ణువుయొక్క, ఉగ్రమ్ ఇవ= భయంకరమైన పరాక్రమమును వలె, ద్రక్ష్యన్తి=చూడగలరు.

తా. ఇంద్ర-యమ-విష్ణు-రుద్ర-సాధ్యులు, అగ్ని-సూర్య-చంద్రులు ఇంత అని చెప్ప శక్యముకాని నా పరాక్రమమును, బలిచక్రవర్తియజ్ఞశాలలో భయంకరమైన

విష్ణుపరాక్రమమును చూచినట్లు ఇప్పుడే చూడగలరు. 7

మూ. స ఏవముక్త్వా త్రిదశేన్ద్రశత్రు
రాపృచ్ఛ్య రాజానమదీనసత్త్వః,
సమారురోహానిలతుల్యవేగం
రథం ఖరశ్రేష్ఠసమాధియుక్తమ్. 8

ప్ర. అ. సః ఆ, త్రిదశేన్ద్రశత్రుః=ఇంద్రజిత్తు, అదీనసత్త్వః=దీనము కాని మనస్సు కలవాడై, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రాజానమ్=రాజును, ఆపృచ్ఛ్య=అడిగి, అనిలతుల్యవేగమ్=అగ్నితో సమానమైన వేగము గల, ఖరశ్రేష్ఠసమాధియుక్తమ్=శ్రేష్ఠములైన ఖరములచేత కట్టబడిన, రథమ్=రథమును, సమారురోహ=ఎక్కెను.

తా. ఆ ఇంద్రజిత్తు ఇట్లు పలికి, ఉత్సాహముతో కూడిన మనస్సుకలవాడై, రాక్షసరాజు అనుమతి గ్రహించి వాయువుతో సమానమైన వేగము గల, శ్రేష్ఠములైన గాడిదలు కట్టిన రథమును ఎక్కెను. 8

మూ. సమాస్థాయ మహాతేజా రథం హరిరథోపమమ్,
జగామ సహసా తత్ర యత్ర యుద్ధమరిందమః. 9

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, అరిందమః=శత్రుపీడకుడైన ఆ ఇంద్రజిత్తు, హరిరథోపమమ్= సూర్యుని రథముతో సమానమైన, రథమ్=రథమును, సమాస్థాయ=అధిష్ఠించి, యత్ర=ఎక్కడ, యుద్ధమ్= యుద్ధము జరుగుచుండెనో, తత్ర=అక్కడికి, సహసా=వెంటనే, జగామ=వెళ్లెను.

తా. గొప్ప తేజస్సు కలవాడు, శత్రుసంహారకుడు అయిన ఆ ఇంద్రజిత్తు సూర్యరథమువంటి రథము నెక్కి వెంటనే యుద్ధము జరుగుచున్న ప్రదేశమునకు వెళ్లెను. 9

మూ. తం ప్రస్థితం మహాత్మానమనుజగ్ముర్మహాబలాః,
సంహర్షమాణా బహవో ధనుఃప్రవరపాణయః. 10
గజస్కన్ధగతాః కేచిత్కేచిత్పరమవాజిభిః,
వ్యాఘ్రవృశ్చికమార్జారఖరోష్ట్రైశ్చ భుజంగమైః, 11
వరాహైః శ్వాపదైః సింహైర్జమ్బుకైః పర్వతోపమైః,
కాకహంసమయూరైశ్చ రాక్షసా భీమవిక్రమాః. 12
ప్రాసముద్గరనిస్త్రింశపరశ్వథగదాధరాః,
భుశుణ్డిముద్గరాయష్టిశతఘ్నీపరిఘాయుధాః. 13

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలము గలవారు, భీమవిక్రమాః=భయంకర మైన పరాక్రమము గలవారు అయిన, బహవః=చాలమంది, రాక్షసాః=రాక్షసులు, సంహర్షమాణాః=సంతోషించుచు, ధనుఃప్రవరపాణయః=శ్రేష్ఠములైన ధనస్సులు హస్తములందు కలవారై, ప్రాసముద్గరనిస్త్రింశపరశ్వథగదాధరాః=ప్రాసలను, ముద్గ రములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్లను, గదలను ధరించినవారై, భుశుణ్డీముద్గరా యష్టిశతఘ్నీపరిఘాయుధాః=భుశుండులు, ముద్గరములు, యష్టులు, శతఘ్నులు, పరిఘలు ఆయుధములుగా గలవారై, ప్రస్థితమ్=ప్రయాణమైన, మహాత్మానమ్= మహాత్ముడైన, తమ్=ఆతనిని, అనుజగ్ముః=అనుసరించిరి. కేచిత్=కొందరు, గజస్కన్ధగతాః=ఏనుగుల మూపులను ఎక్కినవారై, కేచిత్=కొందరు, పరమవా జిభిః=శ్రేష్ఠములైన అశ్వములతోను పర్వతోపమైః=పర్వతములతో సమానములైన, వ్యాఘ్రవృశ్చికమార్జారఖరోష్ట్రైః=పెద్ద పులులతోను, లేళ్లతోను, పిల్లులతోను, గాడిద లతోను, ఒంటెలతోను, భుజంగమైః=సర్పములతోను, సింహైః=సింహములతోను, జమ్బుకైః=నక్కలతోను, వెళ్లిరి.

తా యుద్ధమునకై ప్రయాణమై వెళ్లుచున్న ఆ ఇంద్రజిత్తు వెనుక మహాబలశాలులు, భయంకరమైన పరాక్రమము గలవారు అయిన అనేకరాక్షసులు ఉత్సాహముతో వెళ్లిరి. వారు శ్రేష్ఠములైన ధనస్సులను, ప్రాస- ముద్గర-ఖడ్గములను, గండ్రగొడ్డళ్లను, గదలను, భుశుండి-ముద్గర-యష్టి-శతఘ్ని-పరిఘలను ధరించిరి. వారిలో కొందరు ఏనుగులపై ఎక్కి, కొందరు గుఱ్ఱముల నెక్కి వెళ్లిరి. కొందరు వ్యాఘ్రములను, పర్వతాకారములైన లేళ్లను, పిల్లులను, గాడిదలను, ఒంటెలను, సర్పములను, అడవిపందులను, క్రూరమృగములను, సింహములను, నక్కలను ఎక్కి వెళ్లిరి. 10-13

మూ. స శఙ్ఖనినదైః పూర్ణైర్భేరీణాం చాపి నిఃస్వనైః,
జగామ త్రిదశేన్ద్రారిరాజిం వేగేన వీర్యవాన్. 14

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=ఆ, త్రిదశేన్ద్రారిః=ఇంద్ర జిత్తు, పూర్ణైః=పూర్ణములైన, శఙ్ఖనినదైః=శంఖధ్వనులతోను, భేరీణామ్=భేరీలయొక్క, నిఃస్వనైః=ధ్వనులతోను, ఆజిమ్=యుద్ధమును గూర్చి, వేగేన=వేగముతో, జగామ= వెళ్లెను.

తా. పరాక్రమవంతుడైన ఆ ఇంద్రజిత్తు గంభీరమైన శంఖధ్వనులతోను, భేరీలధ్వనులతోను వేగముగా యుద్ధమునకు వెళ్లెను. 14

మూ. స శఙ్ఖశశివర్ణేన ఛత్రేణ రిపుసూదనః,
రరాజ ప్రతిపూర్ణేన నభశ్చన్ద్రమసా యథా. 15

ప్ర. అ. రిపుసూదనః=శత్రువులను పీడించు, సః=అతడు, శఙ్ఖశశివర్ణేన=శంఖమువంటి చంద్రునివంటి కాంతి గల, ఛత్రేణ=ఛత్రముతో, ప్రతిపూర్ణేన=పూర్ణుడైన, చన్ద్రమసా=చంద్రునితో, నభః యథా=ఆకాశము వలె, రరాజ= ప్రకాశించెను.

తా. శత్రుసంహారకు డైన ఆతడు శంఖము వలె చంద్రుడువలె ఉన్న ఛత్రముతో, పూర్ణచంద్రునితో ఆకాశమువలె ప్రకాశించెను. 15

మూ. అవీజ్యత తతో వీరో హైమైర్హేమవిభూషణః,
చారుచామరముఖ్యైశ్చ ముఖ్యః సర్వధనుష్మతామ్. 16

ప్ర. అ. తతః=అటు పిమ్మట, హేమవిభూషణః=బంగారుఅలంకారములు గల, సర్వధనుష్మతామ్= సకలధనుర్ధారులలో, ముఖ్యః=ముఖ్యుడైన, వీరః=వీరుడైన ఇంద్రజిత్తు, హైమైః=బంగారువికారమైన, చారుచామరముఖ్యైః=సుందరమైన శ్రేష్ఠమైన చామరములచేత, అవీజ్యత=వీచబడెను.

తా. అప్పుడు సకలధనుర్ధారులలో శ్రేష్ఠుడైన బంగారు అలంకారములు ధరించిన ఆ వీరుడైన ఇంద్రజిత్తును అందమైన బంగారపు చామరములతో వీచిరి.

మూ. స తు దృష్ట్వా వినిర్యాన్తం బలేన మహతా వృతమ్,
రాక్షసాధిపతిః శ్రీమాన్ రావణః పుత్రమబ్రవీత్. 17

ప్ర. అ. రాక్షసాధిపతిః=రాక్షసుల ప్రభువు, శ్రీమాన్=శ్రీమంతుడు అయిన, సః=ఆ, రావణః=రావణుడు, మహతా=గొప్పదైన, బలేన=సేనతో, వృతమ్=కూడిన, వినిర్యాన్తమ్=బయలుదేరుచున్న, తం పుత్రమ్=ఆ పుత్రుణ్ణి, దృష్ట్వా=చూచి, అబ్రవీత్=పలికెను.

తా. రాక్షసరాజైన శ్రీమంతుడైన ఆ రావణుడు గొప్ప సైన్యముతో బయలుదేరుచున్న ఆ కుమారుణ్ణి చూచి ఇట్లు పలికెను. 17

మూ. త్వమప్రతిరథః పుత్ర త్వయా వై వాసవో జితః,
కింపునర్మానుషం ధృష్యం నిహనిష్యసి రాఘవమ్. 18
తథోక్తో రాక్షసేన్ద్రేణ ప్రత్యగృహ్ణాన్మహాశిషః.

ప్ర. అ. పుత్ర=పుత్రుడా! త్వమ్=నీవు, అప్రతిరథః=ప్రతిరథుడు (ఎదిరించు రథికుడు) లేనివాడవు. త్వయా=నీచేత, వాసవః=దేవేంద్రుడు, జితః= జయింపబడినాడు. మానుషమ్=మనుష్యుడు, ధృష్యమ్=ఎదిరింపశక్యమైనవాడూ అయిన, రాఘవమ్=రాముణ్ణి, నిహనిష్యసి=చంపగలవు; కిం పునః=ఈ విషయము చెప్పవలెనా? రాక్షసేన్ద్రేణ=రాక్షసరాజుచేత, తథా=అట్లు, ఉక్తః=పలకబడిన అతడు,

మహాశిషః=గొప్ప ఆశీర్వాదములను, ప్రత్యగృహ్ణాత్=స్వీకరించెను.

తా. "కుమారా! నిన్ను ఎదిరించగల రథికుడు లేడు; నీవు దేవేంద్రుణ్ణి జయించినవాడవు. మానవుడు, ఎదిరింప శక్యమైనవాడూ అయిన రాముణ్ణి జయించగల వని వేరే చెప్పవలెనా!" ఇంద్రజిత్తు ఇట్లనుచున్న రాక్షసరాజు మాటలు విని ఆతని గొప్ప ఆశీర్వాదములను గ్రహించెను. 18

మూ. తతస్త్విన్ద్రజితా లఙ్కా సూర్యప్రతిమతేజసా, 19
రరాజాప్రతివీర్యేణ ద్యౌరివార్కేణ భాస్వతా.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సూర్యప్రతిమతేజసా=సూర్యునితో సమానమైన తేజస్సు గల, అప్రతివీర్యేణ=ఎదిరించగల పరాక్రమము లేని, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుతో, లఙ్కా=లంక, భాస్వతా=ప్రకాశించుచున్న, అర్కేణ=సూర్యునితో, ద్యౌః ఇవ=ఆకాశము వలె, రరాజ=ప్రకాశించెను.

తా. అప్పుడు సూర్యుని వంటి తేజస్సు గల, ఎదిరించగల పరాక్రమవంతులు లేని ఆ ఇంద్రజిత్తుతో లంకాపట్టణము, ప్రకాశించుచున్న సూర్యునితో ఆకాశము వలె ప్రకాశించెను. 19

మూ. స సంప్రాప్య మహాతేజా యుద్ధభూమిమరిందమః, 20
స్థాపయామాస రక్షాంసి రథం ప్రతి సమన్తతః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, అరిందమః=శత్రువినాశకుడైన, సః=అతడు, యుద్ధభూమిమ్= యుద్ధభూమిని, సంప్రాప్య=పొంది, రక్షాంసి=రాక్షసులను, రథం ప్రతి సమన్తతః=రథముచుట్టూ, స్థాపయామాస= నిలిపెను.

తా. గొప్ప తేజస్సు గలవాడు, శత్రువినాశకుడు అయిన ఆతడు యుద్ధభూమిని చేరి రాక్షసులను తన రథము చుట్టూ నిలబెట్టెను.

వి. "యుద్ధభూమిమ్ "అనుదానికి" యుద్ధములో జయము సంపాదించుటకై హోమము చేయు భూమిని అనగా నికుంభిల అను ప్రదేశమును అని వ్యాఖ్యాతలు అర్థము వ్రాసినారు. కాని "యుద్ధభూమిమ్" కి బదులు "యజ్ఞభూమిమ్" అనే పాఠం ఉన్నచో బాగుండును. ప్రాచ్యప్రతిలో-

"రథేనాశ్వయుజా వీరః శీఘ్రం గత్వా నికుమ్భిలామ్,
స సంప్రాప్య మహాతేజా యజ్ఞభూమిమరిందమః"
అని స్పష్టార్థమైన పాఠం ఉన్నది. 20

మూ. తతస్తు హుతభోక్తారం హుతభుక్సదృశప్రభః, 21
జుహువే రాక్షసశ్రేష్ఠో విధివన్మన్త్రసత్తమైః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, హుతభుక్సదృశప్రభః=అగ్నితో సమానమైన కాంతి గల, రాక్షసశ్రేష్ఠః=ఆ రాక్షసశ్రేష్ఠుడు, మన్త్రసత్తమైః=శ్రేష్ఠములైన మంత్రములతో, హుతభోక్తారమ్=అగ్నిని, విధివత్=యథాశాస్త్రముగా, జుహువే=హోమము చేసెను.

తా. పిమ్మట అగ్నితో సమానమైన కాంతి గల ఆ రాక్షసశ్రేష్ఠుడు శ్రేష్ఠములైన మంత్రములు పఠించుచు అగ్నిలో యథాశాస్త్రముగా హోమము చేసెను. 21

మూ. స హవిర్లాజసంస్కారై ర్మాల్యగన్ధపురస్కృతైః, 22
జుహువే పావకం తత్ర రాక్షసేన్ద్రః ప్రతాపవాన్.

ప్ర. అ. ప్రతాపవాన్=ప్రతాపము గల, సః=ఆ, రాక్షసేన్ద్రః=రాక్షసనాయకుడు, మాల్యగన్ధపురస్కృతైః=పుష్పమాలలతోను, సుగంధద్రవ్యములతోను కూడిన, హవిర్లాజసంస్కారైః=పంస్కరింపబడిన హవిస్సులతోను లాజలతోను, తత్ర=అక్కడ, పావకమ్=అగ్నిని, జుహువే=హోమము చేసెను.

తా. ప్రతాపవంతుడైన ఆ రాక్షసనాయకుడు సంస్కరించిన హవిస్సును, పేలాలను, పుష్పమాలలను, సుగంధద్రవ్యములను అగ్నిలో హోమము చేసెను.

మూ. శస్త్రాణి శరపత్రాణి సమిధోఽథ విభీతకాః, 23
లోహితాని చ వాసాంసి స్రువం కార్ష్ణాయసం తథా.

ప్ర. అ. శస్త్రాణి=ఆయుధములు, శరపత్రాణి=రెల్లుగడ్డిపోచలు (బర్హిస్సుగా ఉపయోగించెను.) అథ=పిమ్మట, విభీతకాః=విభీతకవృక్షసంబంధమైన,సమిధః=సమిధలను, లోహితాని=ఎఱ్ఱనైన, వాసాంసి చ=వస్త్రములను, తథా=మరియు, కార్ష్ణాయసమ్=ఇనుము వికారమైన, స్రువమ్=స్రువమును ఉపయోగించెను.

తా. (అప్పుడు అతడు అభిచారక్రియలో విధింపబడిన సామగ్రిని ఉపయోగించెను.) ఆయుధములను, రెల్లుగడ్డిని బర్హిస్సుగాను, విభీతకవృక్షము కట్టెలను సమిధలను, ఇనుప స్రువమును ఉపయోగించెను. ఎఱ్ఱని వస్త్రములు ధరించెను. 23

మూ. స తత్రాగ్నిం సమాస్తీర్య శరపత్రైః సతోమరైః, 24
ఛాగస్య కృష్ణవర్ణస్య గలం జగ్రాహ జీవతః.

ప్ర. అ. సః=అతడు, తత్ర=అక్కడ, సతోమరైః=తోమరములతో

కూడిన, శరపత్త్రైః=రెల్లుగడ్డిపరకలచేత, అగ్నిమ్=అగ్నిని (అగ్నిచుట్టూ), సమాస్తీర్య= పరిచి, కృష్ణవర్ణస్య=నల్లటి రంగుగల, జీవతః=జీవించియున్న, ఛాగస్య=మేకయొక్క, గలమ్=కంఠమును, జగ్రాహ=గ్రహించెను.

తా. అతడు అక్కడ అగ్నిచుట్టూ రెల్లుగడ్డీ, తోమరములూ పరిచి జీవించియున్న నల్లని మేక కంఠమును గ్రహించెను. 24

మూ. సకృదేవ సమిద్ధస్య విధూమస్య మహార్చిషః, 25
బభూవుస్తాని లిఙ్గాని విజయం యాన్యదర్శయన్.

ప్ర. అ. సకృదేవ=ఒక్కమారుగా, సమిద్ధస్య=ప్రజ్వలించిన, విధూమస్య= ధూమములేని, మహార్చిషః=పెద్ద జ్వాల గల అగ్నియొక్క, యాని=ఏవి, విజయమ్=విజయమును, అదర్శయన్=చూపినవో, తాని=ఆ, లిఙ్గాని=చిహ్నములు, బభూవుః=ఏర్పడినవి.

తా. ఒకే మారు భగ్గుమని మండిన ధూమము లేని పెద్ద జ్వాల గల అగ్నియందు విజయసూచకములైన చిహ్నములు కనపడినవి. 25

మూ. ప్రదక్షిణావర్తశిఖస్తప్తకాఞ్చనసన్నిభః,
హవిస్తత్ ప్రతిజగ్రాహ పావకః స్వయముత్థితః. 26

ప్ర. అ. తప్తకాఞ్చనసన్నిభః=కరిగించిన బంగారముతో సమానమైన, పావకః=అగ్ని, స్వయమ్=స్వయముగా, ఉత్థితః=పైకి లేచినదై, ప్రదక్షిణావర్తశిఖః= ప్రదక్షిణముగా తిరుగుచున్న జ్వాలలు కలదై, తత్=ఆ, హవిః=హవిస్సును, ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

తా. కరిగించిన బంగారము వంటి కాంతి గల అగ్ని స్వయముగా పైకి లేచి ప్రదక్షిణముగా తిరుగుచున్న జ్వాలలు కలదై ఆ హవిస్సును స్వీకరించెను.

మూ. సోఽస్త్రమాహారయామాస బ్రాహ్మమస్త్రవిశారదః, 27
ధనుశ్చాత్మరథం చైవ సర్వం తత్రాభ్యమన్త్రియత్.

ప్ర. అ. అస్త్రవిశారదః=అస్త్రములయందు నేర్పు కల, సః=అతడు, బ్రాహ్మమ్ అస్త్రమ్= బ్రహ్మాస్త్రమును, ఆహారయామాస=రప్పించెను. తత్ర=అ క్కడ, ధనుశ్చ=ధనుస్సును, ఆత్మరథం చైవ=తన రథమును, సర్వమ్=అంతనూ, అభ్యమన్త్రియత్=అభిమంత్రించెను.

తా. అస్త్రములయందు నేర్పుగల అతడు బ్రహ్మాస్త్రము ఆవాహనము చేసి అక్కడ ధనుస్సునూ, తన రథమునూ అన్నింటినీ కూడ దానితో అభిమంత్రించెను. 27

మూ. తస్మిన్నాహూయమానేఽస్త్రే హూయమానే చ పావకే,
సార్కగ్రహేన్దునక్షత్రం వితత్రాస నభస్తలమ్. 28

ప్ర. అ. తస్మిన్=ఆ, అస్త్రే=అస్త్రము, ఆహూయమానే=ఆహ్వానింపబడుచుండగా, పావకే=అగ్ని, హూయమానే చ=హోమము చేయబడుచుండగా, సార్కగ్రహేన్దునక్షత్రమ్=సూర్య-గ్రహ-చంద్ర-నక్షత్రములతో కూడిన, నభస్తలమ్= ఆకాశము, వితత్రాస=చలించెను.

తా. అతడు అగ్నిలో హోమము చేసి బ్రహ్మాస్త్రమును ఆహ్వానించుచున్నప్పుడు సూర్య-గ్రహ-చంద్ర- నక్షత్రములతో కూడిన ఆకాశము చలించెను. 28

మూ. స పావకం పావకదీప్తతేజా
హుత్వా మహేన్ద్రప్రతిమప్రభావః,
స చాపబాణాసిరథాశ్వసూతః
ఖేఽన్తర్దధేత్మాన మచిన్త్యవీర్యః. 29

ప్ర. అ. పావకదీప్తతేజాః=అగ్నివలె ప్రకాశించుచున్న తేజస్సు కలవాడూ, మహేన్ద్రప్రతిమప్రభావః=మహేంద్రునితో సమానమైన ప్రభావంకలవాడూ, అచిన్త్యవీర్యః=ఊహింప శక్యము కాని పరాక్రమము కలవాడూ ఐన, సః=అతడు, సచాపబాణాసిరథాశ్వసూతః=ధనుస్సూ, బాణములూ, ఖడ్గములూ, రథమూ, అశ్వములూ, సారథీ వీటితో కూడినవాడై, ఖే=ఆకాశమునందు, ఆత్మానమ్=తనను, అన్తర్దధే=అంతర్ధానము చేసెను.

తా. అగ్నివలె ప్రకాశించుచున్న తేజస్సూ, మహేంద్రునితో సమానమైన ప్రభావమూ, ఊహించ శక్యము కాని పరాక్రమమూ కల ఆ ఇంద్రజిత్తు అగ్నిలో హోమము చేసి ధనుర్బాణ-ఖడ్గ-రథ-అశ్వ-సారథులతో సహా ఆకాశములో అంతర్ధానము చెందెను. 29

మూ. తతో హయరథాకీర్ణం పతాకాధ్వజశోభితమ్,
నిర్యయౌ రాక్షసబలం నర్దమానం యుయుత్సయా. 30

ప్ర. అ. తతః=అటు పిమ్మట, హయరథాకీర్ణమ్=గుఱ్ఱములతోనూ, రథములతోనూ వ్యాప్తమైన, పతాకాధ్వజశోభితమ్=పతాకలచేత, ధ్వజములచేత శోభింపచేయబడిన, రాక్షసబలమ్=రాక్షససేన, యుయుత్సయా= యుద్ధము చేయుటకు కోరికతో, నర్దమానమ్=ధ్వనిచేయుచూ, నిర్యయౌ=బయలుదేరెను.

తా. పిమ్మట గుఱ్ఱములతోనూ, రథములతోనూ నిండి, పతాకలచేత, ధ్వజములచేత శోభింపచేయబడిన రాక్షససైన్యము యుద్ధము చేయవలె నను

కోరికతో గర్జించుచూ బయలుదేరెను. 30

మూ. తే శరైర్బహుభిశ్చిత్రైస్తీక్ష్ణవేగైరలఙ్కృతైః,
తోమరైరఙ్కుశైశ్చాపి వానరాన్ జఘ్నురాహవే. 31

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, ఆహవే=యుద్ధమునందు, చిత్రైః=చిత్రములూ, తీక్ష్ణవేగైః=తీక్ష్ణమైన వేగము కలవీ, అలంకృతైః=అలంకరించబడినవీ అయిన, బహుభిః=అనేకములైన, శరైః=బాణములచేత, తోమరైః=తోమరములచేత, అఙ్కుశైశ్చాపి=అంకుశములచేత, వానరాన్=వానరులను, జఘ్నుః=చంపిరి.

తా. యుద్ధములో ఆ రాక్షసులు వివిధ ఆకారములూ తీవ్రమైన వేగమూ కల అలంకరింపబడిన అనేకమైన బాణములతోనూ, తోమరములతోనూ, అంకుశములతోనూ వానరులను చంపిరి. 31

మూ. రావణిస్తు సుసంక్రుద్ధస్తాన్నిరీక్ష్య నిశాచరాన్,
హృష్టా భవన్తో యుధ్యన్తు వానరాణాం జిఘాంసయా. 32

ప్ర. అ. సుసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన, రావణిః తు=ఆ రావణకుమారుడైతే, తాన్=ఆ, నిశాచరాన్=రాక్షసులను, నిరీక్ష్య=చూచి, భవన్తః=మీరు, హృష్టాః=సంతోషించుచున్నవారై, వానరాణామ్=వానరులయొక్క, జిఘాంసయా=చంపుటయందు కోరికతో, యుధ్యన్తు=యుద్ధము చేయుదురుగాక. (అని పలికెను.)

తా. చాలా కోపముతో నున్న ఇంద్రజిత్తు ఆ రాక్షసులను చూచి, "మీరందరూ వానరులను చంపుటకై ఉత్సాహవంతులై యుద్ధము చేయుడు" అని పలికెను. 32

మూ. తతస్తే రాక్షసాః సర్వే గర్జన్తో జయకాఙ్క్షిణః,
అభ్యవర్షంస్తతో ఘోరం వానరాన్ శరవృష్టిభిః. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, గర్జన్తః =గర్జించుచూ, జయకాఙ్క్షిణః=జయమును కోరుతూ, తతః=అటుపిమ్మట, శరవృష్టిభిః=బాణముల వర్షములచేత, ఘోరమ్=ఘోరముగా, వానరాన్=వానరులను, అభ్యవర్షన్=వర్షించిరి.

తా. పిమ్మట ఆ రాక్షసు లందరూ జయమును కోరుచూ, గర్జించుచూ ఆ వానరులమీద భయంకరముగా బాణవర్షములు వర్షించిరి. 33

మూ. స తు నాలీకనారాచైర్గదాభిర్ముసలైరపి,
రక్షోభిః సంవృతః సంఖ్యే వానరాన్ విచకర్త హ. 34

ప్ర. అ. స తు=ఆ ఇంద్రజిత్తైతే, సంఖ్యే=యుద్ధమునందు, రక్షోభిః=రాక్షసులతో, సంవృతః=కూడినవాడై, నాలీకనారాచైః=నాలీక-నారాచబాణములచేతనూ, గదాభిః=గదలచేతనూ, ముసలైరపి=రోకళ్ళచేతనూ, వానరాన్= వానరులను, విచకర్త హ=ఖండించెను.

తా. ఆ యుద్ధములో రాక్షసులతో కూడిన ఇంద్రజిత్తు నాలీక-నారాచ బాణములచేతనూ, గదలచేతనూ, ముసలములచేతనూ వానరులను ఖండించెను.

మూ. తే వధ్యమానాః సమరే వానరాః పాదపాయుధాః,
అభ్యవర్షన్త సహసా రావణిం శైలపాదపైః. 35

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, వధ్యమానాః=చంపబడుచున్న, పాదపాయుధాః=వృక్షములు ఆయుధములుగా గల, తే=ఆ, వానరాః=వానరులు, సహసా=శీఘ్రముగా, శైలపాదపైః=పర్వతములచేత, వృక్షములచేత, రావణిమ్=ఇంద్రజిత్తును, అభ్యవర్షన్త=వర్షించిరి.

తా. వృక్షములు ఆయుధములుగా ధరించిన వానరులు యుద్ధములో ఆ విధముగా కొట్టబడుచూ వెంటనే ఇంద్రజిత్తుపై పర్వతములనూ వృక్షములనూ వర్షించిరి. 35

మూ. ఇన్ద్రజిత్తు తదా క్రుద్ధో మహాతేజా మహాబలః,
వానరాణాం శరీరాణి వ్యధమద్రావణాత్మజః. 36

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడూ, మహాబలః=గొప్ప బలము కలవాడూ, రావణాత్మజః=రావణుని పుత్రుడూ ఐన, ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తైతే, తదా=అప్పుడు, క్రుద్ధః=కోపించినవాడై, వానరాణామ్=వానరులయొక్క, శరీరాణి=శరీరములను, వ్యధమత్=విరగగొట్టివేసెను.

తా. అప్పుడు గొప్ప తేజస్సూ, గొప్ప బలమూ కల రావణకుమారుడైన ఇంద్రజిత్తు కోపించి, వానరుల శరీరములను నశింపజేసెను. 36

మూ. శరేణైకేన చ హరీన్నవ పఞ్చ చ సప్త చ,
బిభేద సమరే క్రుద్ధో రాక్షసాన్ సంప్రహర్షయన్. 37

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన అతడు, సమరే=యుద్ధమునందు, రాక్షసాన్=రాక్షసులను, సంప్రహర్షయన్=సంతోషపెట్టుచూ, ఏకేన=ఒక్క, శరేణ=బాణముచేత, నవ=తొమ్మండుగురు, పఞ్చ=ఐదుగురూ, సప్త చ=ఏడుగురూ, హరీన్=వానరులను, బిభేద=భేదించెను.

తా. కోపించిన ఆ ఇంద్రజిత్తు యుద్ధములో రాక్షసులకు సంతోషము

కల్గించుచూ ఒక్కొక్క బాణముచేత తొమ్మండుగురూ, ఐదుగురూ, ఏడుగురూ చొప్పున వానరులను బ్రద్దలు కొట్టెను. 37

మూ. స శరైః సూర్యసంకాశైః శాతకుమ్భవిభూషణైః,
వానరాన్ సమరే వీరః ప్రమమాథ సుదుర్జయః. 38

ప్ర. అ. సుదుర్జయః=మిక్కిలి జయించుటకు శక్యము కాని, సః వీరః=ఆ వీరుడు, సమరే= యుద్ధమునందు, సూర్యసంకాశైః=సూర్యునితో సమానమైన, శాతకుమ్భవిభూషణైః=బంగారు అలంకారములు గల, శరైః=బాణములచేత, వానరాన్=వానరులను, ప్రమమాథ=మథించెను.

తా. జయింప శక్యము కాని ఆ వీరుడు బంగారముచేత అలంకరింపబడిన సూర్యునితో సమానమైన బాణములచేత యుద్ధమునందు వానరులను మథించెను. 38

మూ. తే భిన్నగాత్రాః సమరే వానరాః శరపీడితాః,
పేతుర్మథితసంకల్పాః సురైరివ మహాసురాః. 39

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, శరపీడితాః=బాణములచేత పీడింపబడిన, తే వానరాః=ఆ వానరులు, భిన్నగాత్రాః=భేదింపబడిన శరీరములు కలవారై, సురైః= దేవతలచేత, మహాసురాః ఇవ=గొప్ప అసురులు వలె, మథితసంకల్పాః=మథింపబడిన సంకల్పము కలవారై, పేతుః=పడిపోయిరి.

తా. యుద్ధమునందు శరములచేత పీడింపబడి బ్రద్దలైన శరీరములు గల ఆ వానరులు దేవతలచేత అసురులు వలె చెడగొట్టబడిన సంకల్పము కలవారై పడిపోయిరి. 39

మూ. తే తపన్తమివాదిత్యం ఘోరై ర్బాణగభస్తిభిః,
అభ్యధావన్త సంక్రుద్ధాః సంయుగే వానరర్షభాః. 40

ప్ర. అ. తే=ఆ, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, సంయుగే=యుద్ధమునందు, ఘోరైః=ఘోరములైన, బాణగభస్తిభిః=బాణములనే కిరణములతో, తపన్తమ్=తపింపచేయుచున్న, ఆదిత్యమ్ ఇవ=సూర్యుడువలె ఉన్న ఆతనిని గూర్చి, సంక్రుద్ధాః=కోపించినవారై, అభ్యధావన్త=పరుగెత్తిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు యుద్ధములో బాణము లనే కిరణములతో సూర్యుడు వలె తపింపచేయుచున్న ఆ ఇంద్రజిత్తుమీదికి కోపముతో శీఘ్రముగా వెళ్ళిరి. 40

మూ. తతస్తు వానరాః సర్వే భిన్నదేహా విచేతసః,
వ్యథితా విద్రవన్తి స్మ రుధిరేణ సముక్షితాః. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, భిన్నదేహాః=బ్రద్దలు కొట్టబడిన దేహములు కలవారై, విచేతసః=సంజ్ఞ లేనివారై, వ్యథితాః=వ్యథ చెందినవారై, రుధిరేణ=రక్తముచేత, సముక్షితాః=తడపబడినవారై, విద్రవన్తి స్మ=పారిపోయిరి.

తా. అప్పుడు వానరులందరూ బ్రద్దలు కొట్టబడిన దేహాలతో స్పృహతప్పి, వ్యథ చెంది, రక్తముతో తడిసినవారై పారిపోయిరి. 41

మూ. రామస్యార్థే పరాక్రమ్య వానరాస్త్యక్తజీవితాః,
నర్దన్తస్తేఽనివృత్తాస్తు సమరే సశిలాయుధాః. 42

ప్ర. అ. తే వానరాః=ఆ వానరులు, సమరే=యుద్ధమునందు, సశిలాయుధాః=శిలలు ఆయుధములుగా కలవారై, నర్దన్తః=ధ్వనిచేయుచు, అనివృత్తాః=వెనుకకు మరలనివారై, రామస్య అర్థే=రాముని నిమిత్తమై, పరాక్రమ్య=పరాక్రమించి, త్యక్తజీవితాః=విడువబడిన జీవితము కలవారైరి.

తా. కొందరు వానరులు, శిలలు ఆయుధములుగా ధరించి, యుద్ధములో గర్జించుచు, వెనుకకు మరలక రామునికొరకై పరాక్రమమును చూపి ప్రాణములు విడచిరి. 42

మూ. తే ద్రుమైః పర్వతాగ్రైశ్చ శిలాభిశ్చ ప్లవంగమాః,
అభ్యవర్షన్త సమరే రావణిం సమవస్థితాః. 43

ప్ర. అ. తే ప్లవంగమాః=ఆ వానరులు, సమరే=యుద్ధమునందు, సమవస్థితాః=నిలచినవారై, రావణిమ్=ఇంద్రజిత్తును, ద్రుమైః=వృక్షములచేత, పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరములచేత, శిలాభిశ్చ=శిలలచేత, అభ్యవర్షన్త=వర్షించిరి.

తా. ఆ వానరులు యుద్ధములో నిలచి ఇంద్రజిత్తుమీద వృక్షములు, పర్వతశిఖరములు, శిలలు కురిపించిరి. 43

మూ. తం ద్రుమాణాం శిలానాం చ వర్షం ప్రాణహరం మహత్,
వ్యపోహత మహాతేజా రావణిః సమితింజయః. 44

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సమితింజయః=యుద్ధములను జయించు, రావణిః=ఇంద్రజిత్తు, ద్రుమాణామ్==వృక్షములయొక్క, శిలానాం చ=శిలలయొక్క, ప్రాణహరమ్=ప్రాణములను హరించు, మహత్= గొప్పదైన,

తం వర్షమ్=ఆ వర్షమును, వ్యపోహత=తొలగించెను.

తా. గొప్ప తేజస్సు గలవాడు, యుద్ధములో జయించువాడు అయిన ఇంద్రజిత్తు ప్రాణములను హరించు గొప్పదైన ఆ వృక్షముల శిలల వర్షమును తొలగించెను. 44

మూ. తతః పావకసంకాశైః శరైరాశీవిషోపమైః,
వానరాణామనీకాని బిభేద సమరే ప్రభుః. 45

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రభుః=సమర్థుడైన ఆ ఇంద్రజిత్తు, సమరే=యుద్ధమునందు, పావకసంకాశైః =అగ్నితో సమానములైన, ఆశీవిషోపమైః= సర్పములతో సమానములైన, శరైః=బాణములచేత, వానరాణామ్= వానరులయొక్క, అనీకాని=సైన్యములను, బిభేద=భేదించెను.

తా. పిమ్మట సమర్థుడైన ఆ ఇంద్రజిత్తు సర్పములతో సమానములైన, అగ్నివంటి బాణములచేత, యుద్ధములో వానరుల సైన్యములను భేదించెను. 45

మూ. అష్టాదశశరైస్తీక్ష్ణైః స విద్ధ్వా గన్ధమాదనమ్,
వివ్యాధ నవభిశ్చైవ నలం దూరాదవస్థితమ్. 46

ప్ర. అ. సః=అతడు, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, అష్టాదశశరైః=పద్దెనిమిది బాణములచేత, గన్ధమాదనమ్=గంధమాదనుని, విద్ధ్వా=కొట్టి, దూరాత్=దూరముగా, అవస్థితమ్=ఉన్న, నలమ్=నలుణ్ణి, నవభిః=తొమ్మిది బాణములతో, వివ్యాధ=కొట్టెను.

తా. అతడు వాడియైన పద్దెనిమిది బాణములచేత గంధమాదనుణ్ణి కొట్టి, దూరముగా ఉన్న నలుణ్ణి తొమ్మిది బాణాలతో కొట్టెను. 46

మూ. సప్తభిస్తు మహావీర్యో మైన్దం మర్మవిదారణైః,
పఞ్చభిర్విశిఖైశ్చైవ గజం వివ్యాధ సంయుగే. 47

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల అతడు, మర్మవిదారణైః= మర్మస్థానములను చీల్చివేయు, సప్తభిః=ఏడు బాణములచేత, మైన్దమ్=మైందుణ్ణి, పఞ్చభిః=ఐదు, విశిఖైః=బాణములచేత, గజం చైవ=గజుణ్ణి, సంయుగే=యుద్ధమునందు, వివ్యాధ=కొట్టెను.

తా. మహాపరాక్రమశాలియైన ఆ ఇంద్రజిత్తు, యుద్ధములో మర్మస్థానములను చీల్చివేయు ఏడు బాణాలచేత మైందుణ్ణి, ఐదు బాణాలచేత గజుణ్ణి కొట్టెను. 47

మూ. జామ్బవన్తం తు దశభిర్నీలం త్రింశద్భిరేవ చ,
సుగ్రీవమృషభం చైవ సోఽఙ్గదం ద్వివిదం తథా, 48
ఘోరైర్దత్తవరైస్తీక్ష్ణైర్నిష్ప్రాణానకరోత్తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, సః=అతడు, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, దశభిః=పదింటిచేతను, నీలమ్=నీలుణ్ణి, త్రింశద్భిరేవ చ=ముప్పై బాణాలచేతను, కొట్టెను. సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఋషభం చైవ=ఋషభుణ్ణీ, అఙ్గదమ్=అంగదుణ్ణీ, తథా=మరియు, ద్వివిదమ్=ద్వివిదుణ్ణీ, దత్తవరైః=ఇవ్వబడిన వరములుగల, ఘోరైః=భయంకరములైన, తీక్ష్ణైః=తీక్ష్ణములైన బాణములచేత, నిష్ప్రాణాన్=ప్రాణములు లేనివారినిగా, అకరోత్=చేసెను.

తా. అప్పుడు ఇంద్రజిత్తు జాంబవంతుణ్ణి పది బాణాలచేత, నీలుణ్ణి ముప్పై బాణాలచేత కొట్టెను. భయంకరములు, తీక్ష్ణములు అయిన, వరముచే పొందబడిన బాణాలచేత సుగ్రీవుణ్ణి, ఋషభుణ్ణి, అంగదుణ్ణి ప్రాణసంచారము లేనివారినిగా చేసెను. 48

మూ. అన్యానపి తదా ముఖ్యాన్వానరాన్ బహుభిః శరైః, 49
అర్దయామాస సంక్రుద్ధః కాలాగ్నిరివ మూర్ఛితః.

ప్ర. అ.సంక్రుద్ధః= కోపించిన ఆ ఇంద్రజిత్తు, మూర్ఛితః= విజృంభించిన, కాలాగ్నిరివ=ప్రలయకాలాగ్ని వలె, బహుభిః=అనేకమైన, శరైః= బాణములచేత, తదా= అప్పుడు, ముఖ్యాన్=ప్రధానులైన, అన్యాన్=ఇతరులైన, వానరానపి=వానరులను కూడ, అర్దయామాస=పీడించెను.

తా. ఆ ఇంద్రజిత్తు కోపించి, విజృంభించిన ప్రళయాగ్నివలె అనేక బాణములచేత ఇతరులైన వానరముఖ్యులను కూడ పీడించెను. 49

మూ. స శరైః సూర్యసంకాశైః సుముక్తైః శీఘ్రగామిభిః, 50
వానరాణామనీకాని నిర్మమన్థ మహారణే.

ప్ర. అ.సః= అతడు, సూర్యసంకాశైః=సూర్యునితో సమానములైన, సుముక్తైః=బాగా విడవబడిన, శీఘ్రగామిభిః=శీఘ్రముగా వెళ్లు, శరైః=బాణములచేత, మహారణే=ఆ మహాయుద్ధమునందు, వానరాణామ్=వానరులయొక్క, అనీకాని=సైన్యములను, నిర్మమన్థ=మథించెను.

తా. అతడు బాగుగా ప్రయోగింపబడి శీఘ్రముగా వెళ్లు, సూర్యునివంటి బాణాలతో, ఆ మహాయుద్ధమునందు, వానరసైన్యములను మథించివేసెను.50

మూ. ఆకులాం వానరీం సేనాం శరజాలేన పీడితామ్, 51
హృష్టః స పరయా ప్రీత్యా దదర్శ క్షతజోక్షితామ్.

ప్ర. అ.హృష్టః= సంతోషించిన, సః= అతడు, శరజాలేన=బాణస ముదాయముచేత, పీడితామ్=పీడింపబడిన, క్షతజోక్షితామ్=రక్తముచేత తడపబ డిన, ఆకులామ్=వ్యాకులమైన, వానరీమ్=వానరులసంబంధమైన, సేనాన్=సేనను, పరయా=గొప్ప, ప్రీత్యా=సంతోషముతో, దదర్శ=చూచెను.

తా. బాణసముదాయముచేత పీడింపబడి, రక్తముతో తడిసిన వ్యాకులమైన ఆ వానరసేనను ఉత్సాహవంతుడైన ఆ ఇంద్రజిత్తు గొప్ప సంతోషముతో చూచెను. 51

మూ. పునరేవ మహాతేజా రాక్షసేన్ద్రాత్మజో బలీ, 52
సంసృజ్య బాణవర్షం చ శస్త్రవర్షం చ దారుణమ్,
మమర్ద వానరానీకం పరితస్త్వివ్ద్రజిద్బలీ. 53

ప్ర. అ.మహాతేజాః=గొప్ప తేజస్సుగల, బలీ=బలవంతుడైన, రాక్షసే న్ద్రాత్మజః=రావణుని కుమారుడు, పునరేవ=మరల, దారుణమ్=భయంకరమైన, బాణవర్షం చ= బాణవర్షమును, శస్త్రవర్షం చ=ఆయుధముల వర్షమును, సంసృజ్య=సృష్టించి (పీడించెను). బలీ=బలవంతుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, పరితః=అన్నివైపులా, వానరానీకమ్=వానరసైన్యమును, మమర్ద=మర్దించెను.

తా. గొప్ప తేజస్సు, బలము గల రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు, మరల, భయంకరమైన బాణవర్షము, ఆయుధముల వర్షమును వర్షించి అన్నివైపులా ఆ వానరసైన్యమును మర్దించెను. 52,53

మూ. స్వసైన్యముత్సృజ్య సమేత్య తూర్ణం
మహాహవే వానరవాహినీషు,
అదృశ్యమానః శరజాలముగ్రం
వవర్ష నీలామ్బుధరో యథామ్బు. 54

ప్ర. అ.స్వసైన్యమ్=తనసైన్యమును, ఉత్సృజ్య=విడచి, తూర్ణమ్=శీఘ్ర ముగా, మహాహవే=ఆ మహాయుద్ధమునందు, సమేత్య=వానరులను సమీపించి, అదృ శ్యమానః=చూడబడనివాడై, వానరవాహినీషు=వానరసైన్యములయందు, ఉగ్రమ్=ఉ గ్రమైన, శరజాలమ్=బాణసముదాయమును, నీలామ్బుధరః=నల్లనిమేఘము, అమ్బు యథా=ఉదకమును వలె, వవర్ష=వర్షించెను.

తా. అతడు తన సైన్యమును విడచి వెళ్లి, ఆ మహాయుద్ధము నందు, ఇతరుల కెవ్వరికీ కనబడనివాడై, వానరసైన్యముల మీద భయంకరమైన బాణసముదాయమును, నల్లని మేఘము ఉదకమును వర్షించినట్లు వర్షించెను.

మూ. తే శక్రజిద్బాణవిశీర్ణదేహా
మాయాహతా విస్వరమున్నదన్తః,
రణే నిపేతుర్హరయోఽద్రికల్పా
యథేన్ద్రవజ్రాభిహతా నగేన్ద్రాః. 55

ప్ర. అ.రణే=యుద్ధమునందు, శక్రజిద్బాణవిశీర్ణదేహాః=ఇంద్రజిత్తు బాణములచేత శిథిలము చేయబడిన దేహములు గల, మాయాహతాః=మాయచేత కొట్టబడిన, అద్రికల్పాః=పర్వతములతో సమానులైన, తే=ఆ, హరయః=వానరులు, విస్వరమ్=వికృతస్వరములు కలుగునట్లుగా, ఉన్నదన్తః=అరచుచు, ఇన్ద్రవజ్రాభిహతాః= ఇంద్రుని వజ్రాయుధముచేత కొట్టబడిన, నగేన్ద్రాః యథా=పర్వతములు వలె, నిపేతుః=పడిరి.

తా. ఆ యుద్ధములో పర్వతములవంటి వానరులు మాయాప్రయోగముచేత ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణములచేత శిథిలమైన దేహములతో వికృతముగా అరచుచు, ఇంద్రుని వజ్రాయుధముచేత కొట్టబడిన పర్వతము వలె నేలపై పడిపోయిరి. 55

మూ. తే కేవలం సందదృశుః సితాగ్రాన్
బాణాన్ రణే వానరవాహినీషు,
మాయావిగూఢం చ సురేన్ద్రశత్రుం
న చాత్ర తం రాక్షసమప్యపశ్యన్. 56

ప్ర. అ. రణే=యుద్ధమునందు, తే=వారు, వానరవాహినీషు=వానరుల సైన్యములయందు, కేవలమ్=కేవలము, సితాగ్రాన్=వాడియైన అగ్రభాగములు గల, బాణాన్=బాణములను, సందదృశుః=చూచిరి. అత్ర=ఇక్కడ, మాయావిగూఢమ్= మాయచేత అంతర్హితుడైన, సురేన్ద్రశత్రుమ్=ఇంద్రుని శత్రువైన, తం రాక్షసమ్ అపి=ఆ రాక్షసుణ్ణి మాత్రము, న అపశ్యన్=చూడలేదు.

తా. ఆ యుద్ధములో ఆ వానరులకు తమ సైన్యముమీద పడుచున్న వాడియైన అగ్రభాగములు గల బాణములు మాత్రమే కనబడెను. మాయాప్రభావముచేత దాగి ఉన్న ఆ ఇంద్రజిత్తు మాత్రము కనబడలేదు. 56

మూ. తతః స రక్షోధిపతిర్మహాత్మా
సర్వా దిశో బాణశతైః శితాగ్రైః,
ప్రచ్ఛాదయామాస రవిప్రకాశై
ర్విదారయామాస చ వానరేన్ద్రాన్. 57

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రక్షోధిపతిః=రాక్షసనాయకుడైన, మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ ఇంద్రజిత్తు, శితాగ్రైః=వాడియైన అగ్రభాగములు గల, రవిప్రకాశైః=సూర్యునివంటి ప్రకాశగల, బాణశతైః=బాణముల శతములచేత, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను, ప్రచ్ఛాదయామాస=కప్పివేసెను. వానరేన్ద్రాన్=వానరనాయకులను, విదారయామాస చ=చీల్చివేసెను కూడ.

తా. పిమ్మట మహాత్ముడైన ఆ ఇంద్రజిత్తు వాడియైన అగ్రభాగములు గల సూర్యునివంటి కాంతి గల వందలకొలది బాణములచేత అన్ని దిక్కులను కప్పివేసి వానరులను చీల్చివేసెను. 57

మూ. స శూలనిస్త్రింశపరశ్వధాని
వ్యావిద్ధదీప్తానలసప్రభాణి,
సవిస్ఫులిఙ్గోజ్జ్వలపావకాని
వవర్ష తీవ్రం ప్లవగేన్ద్రసైన్యే. 58

ప్ర. అ. సః=అతడు, వ్యావిద్ధదీప్తానిలసప్రభాణి=వృద్ధి పొందిన ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన కాంతి గల, సవిస్ఫులిఙ్గోజ్జ్వలపావకాని=అగ్నికణములతో కూడిన ప్రకాశించుచున్న అగ్ని గల, శూలనిస్త్రింశపరశ్వధాని= శూలములను, ఖడ్గములను గండ్రగొడ్డళ్ళను, తీవ్రమ్=తీవ్రముగా, ప్లవగేన్ద్రసైన్యే=వానరసైన్యమునందు, వవర్ష=వర్షించెను.

తా. ఇంద్రజిత్తు వృద్ధి చెంది మండుచున్న అగ్నితో సమానమైన కాంతి గల, అగ్నికణములతో కూడిన ప్రకాశించుచున్న అగ్ని గల శూలములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్ళను ఆ వానరసైన్యముమీద తీవ్రముగా వర్షించెను. 58

మూ. తతో జ్వలనసంకాశైః శరైర్వానరయూథపాః,
తాడితాః శక్రజిద్బాణైః ప్రఫుల్లా ఇవ కింశుకాః. 59

ప్ర. అ. తతః=అటుపిమ్మట, జ్వలనసంకాశైః=అగ్నితో సమానములైన, శరైః=వాడియైన, శక్రజిద్బాణైః= ఇంద్రజిత్తుయొక్క బాణములచేత, తాడితాః=కొట్టబడిన, వానరయూథపాః=వానరసేనానాయకులు, ప్రఫుల్లాః= వికసించిన, కింశుకాః ఇవ=కింశుకవృక్షముల వలె ఉండిరి.

తా. అగ్నితో సమానములైన వాడియైన ఇంద్రజిత్తు బాణములచేత కొట్టబడిన ఆ వానరనాయకులు రక్తము స్రవించుటచే వికసించిన మోదుగచెట్లు వలె ఉండిరి. 59

మూ. తేఽన్యోన్యమభిసర్పన్తో నినదన్తశ్చ విస్వరమ్,
రాక్షసేన్ద్రాస్త్రనిర్భిన్నా నిపేతుర్వానరర్షభాః. 60

ప్ర. అ. రాక్షసేన్ద్రాభినిర్భిన్నాః=ఆ రాక్షసనాయకునిచేత చీల్చివేయబడిన, తే=ఆ, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, అన్యోన్యమ్=పరస్పరము, అభిసర్పన్తః=సమీపించుచు, విస్వరమ్=వికృతస్వరము కలుగునట్లుగా, నినదన్తశ్చ= ధ్వనిచేయుచు, నిపేతుః=పడిపోయిరి.

తా. ఇంద్రజిత్తు అస్త్రములచేత చీల్చివేయబడిన ఆ వానరవీరులు ఒకరి దగ్గరకు ఒకరు చేరుచు, వికృతస్వరములతో అరచుచు, నేలపై ఒరిగిరి. 60

మూ. ఉదీక్షమాణా గగనం కేచిన్నేత్రేషు తాడితాః,
శరైర్వివిశురన్యోన్యం పేతుశ్చ ధరణీతలే. 61

ప్ర. అ. గగనమ్=ఆకాశమును, ఉదీక్షమాణాః=పైకిచూచుచున్న, కేచిత్=కొందరు, శరైః=బాణములచేత, నేత్రేషు=నేత్రములయందు, తాడితాః=కొట్టబడినవారై, అన్యోన్యమ్=పరస్పరము, వివిశుః=ప్రవేశించిరి. (సమీపించిరి.) జగతీతలే=నేలమీద, పేతుశ్చ=పడిపోయిరి.

తా. పైకి ఆకాశమువైపు చూచిన కొందరు వానరులు బాణములచేత నేత్రములమీద కొట్టబడి, ఒకరి నొకరు కౌగలించుకొని నేలపై పడిపోయిరి. 61

మూ. హనూమన్తం చ సుగ్రీవమఙ్గదం గన్ధమాదనమ్,
జామ్బవన్తం సుషేణం చ వేగదర్శినమేవ చ. 62
మైన్దం చ ద్వివిదం నీలం గవాక్షం గవయం తథా,
కేసరిం హరిలోమానం విద్యుద్దంష్ట్రం చ వానరమ్. 63
సూర్యాననం జ్యోతిముఖం తథా దధిముఖం హరిమ్,
పావకాక్షం నలం చైవ కుముదం చైవ వానరమ్. 64
ప్రాసైః శూలైః శితైర్బాణైరిన్ద్రజిన్మన్త్రసంహితైః,
వివ్యాధ హరిశార్దూలాన్ సర్వాంస్తాన్రాక్షసోత్తమః. 65

ప్ర. అ. రాక్షసోత్తమః=రాక్షసశ్రేష్ఠుడైన, ఇంద్రజిత్=ఇంద్రజిత్తు, హనూమన్తం చ=హనుమంతుణ్ణి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, అఙ్గదమ్=అంగదుణ్ణి, గన్ధమాద

నమ్=గంధమాదనుణ్ణి, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, సుషేణం చ=సుషేణుణ్ణి, వేగదర్శినమేవ చ=వేగదర్శిని, మైన్దం చ=మైందుణ్ణి, ద్వివిదమ్=ద్వివిదుణ్ణి, నీలమ్=నీలుణ్ణి, గవాక్షమ్=గవాక్షుణ్ణి, విద్యుద్దంష్ట్రమ్=విద్యుద్దంష్ట్రు డను, వానరం చ=వానరుణ్ణి, సూర్యాననమ్= సూర్యాననుణ్ణి, జ్యోతిముఖమ్=జ్యోతిముఖుణ్ణి, తథా=మరియు, దధిముఖమ్=దధిముఖు డను, హరిమ్=వానరుణ్ణి, పావకాక్షమ్=పావకాక్షుణ్ణి, నలం చైవ=నలుణ్ణి, కుముదమ్=కుముదు డను, వానరం చైవ=వానరుణ్ణి, సర్వాన్= సమస్తమైన, తాన్=ఆ, హరిశార్దూలాన్=వానరశ్రేష్ఠులను, మన్త్రసంహితైః=మంత్రముతో కూర్చబడిన, ప్రాసైః=ప్రాసలచేత, శూలైః=శూలములచేత, శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. రాక్షసులలో ఉత్తముడైన ఆ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము అభిమంత్రించిన ప్రాసలచేత, శూలములచేత, వాడియైన బాణాలచేత హనుమత్-సుగ్రీవ-అంగద-గంధమాదనులను, జాంబవంతుని, సుషేణ-వేగదర్శులను, మైంద- ద్వివిద-నీల-గవాక్ష-గవయ-కేసరి-హరిలోమ-విద్యుద్దంష్ట్రులను, సూర్యానన-జ్యోతిముఖ-దధిముఖులను, పావకాక్ష-నల-కుముదు లను ఆ వానరనాయకు లందరినీ కొట్టెను. 62-65

మూ. స వై గదాభిర్హరియూథముఖ్యా
న్నిర్భిద్య బాణైస్తపనీయవర్ణైః,
వవర్ష రామం శరవృష్టిజాలైః
సలక్ష్మణం భాస్కరరశ్మికల్పైః. 66

ప్ర. అ. సః=అతడు, గదాభిః=గదలచేతను, తపనీయవర్ణైః=బంగారువర్ణము గల, బాణైః=బాణములచేతను, హరియూథముఖ్యాన్=వానరసైన్యప్రముఖులను, నిర్భిద్య=భేదించి, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, రామమ్=రాముణ్ణి, భాస్కరరశ్మికల్పైః=సూర్యకిరణములతో సమానములైన, శరవృష్టిజాలైః=బాణవర్షసముదాయములచేత, వవర్ష=వర్షించెను.

తా. ఆ ఇంద్రజిత్తు వానరసేనాప్రముఖులను గదలచేత, బంగారువర్ణము గల బాణములచేత భేదించి, రామలక్ష్మణులపై సూర్యకిరణములతో సమానములైన బాణవర్షములను వర్షించెను. 66

మూ. స బాణవర్షైరభివృష్యమాణో
ధారానిపాతావివ తావచిన్త్య,

సమీక్షమాణః పరమాద్భుతశ్రీ
రామస్తతో లక్ష్మణమిత్యువాచ. 67

ప్ర. అ. పరమాద్భుతశ్రీః=చాల ఆశ్చర్యకరమైన శోభ గల, సః రామః=ఆ రాముడు, బాణవర్షైః=బాణవర్షములచేత, అభివృష్యమాణః=వర్షింపబడుచు, తాన్=వాటిని, ధారానిపాతానివ=జలధారాపాతములను వలె, అచిన్త్య=లెక్కచేయక, సమీక్షమాణః=అంతటా చూచుచు, తతః=అటుపిమ్మట, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇతి=ఇట్లు, ఉవాచ=పలికెను.

తా. చాల ఆశ్చర్యకరమైన శోభగల ఆ రాముడు బాణవర్షము వర్షింపబడుచున్నను దానిని జలధారావర్షమును వలె లెక్కచేయక, నలుమూలలా చూచుచు లక్ష్మణునితో ఇట్లు పలికెను. 67

మూ. అసౌ పునర్లక్ష్మణ రాక్షసేన్ద్రో
మహాస్త్రమాపాద్య సురేన్ద్రశత్రుః,
నిపాతయిత్వా హరిసైన్యమస్మాన్
శితైః శరైరర్దయతి ప్రసక్తమ్. 68

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! రాక్షసేన్ద్రః=రాక్షసనాయకుడైన, అసౌ=ఈ, సురేన్ద్రశత్రుః=ఇంద్రజిత్తు, మహాస్త్రమ్=గొప్ప అస్త్రమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, హరిసైన్యమ్=శత్రుసైన్యమును, నిపాతయిత్వా=పడగొట్టి, అస్మాన్=మనలను, శితైః=వాడియైన, శరైః=బాణములచేత, ప్రసక్తమ్=ఎడతెరిపి లేకుండగా, అర్దయతి=పీడించుచున్నాడు.

తా. లక్ష్మణా ! రాక్షసనాయకుడైన ఈ ఇంద్రజిత్తు మహాస్త్రబలముచేత వానరసైన్యమును పడగొట్టి వాడియైన బాణాలతో, ఎడతెరిపి లేకుండా, మనలను బాధించుచున్నాడు. 68

మూ. స్వయంభువా దత్తవరో మహాత్మా
సమాహితోఽన్తర్హితభీమకాయః,
కథం ను శక్యో యుధి నష్టదేహో
నిహన్తుమద్యేన్ద్రజిదుద్యతాస్త్రః. 69

ప్ర. అ. స్వయంభువా=బ్రహ్మదేవునిచేత, దత్తవరః=ఇవ్వబడిన వరము గలవాడు, మహాత్మా=మహాత్ముడు, సమాహితః=సావధానచిత్తుడు, అన్తర్హితభీమకాయః=దాగి యున్న భయంకరమైన శరీరము గలవాడు, యుధి=యుద్ధమునందు, నష్టదేహః=కనబడని దేహము గలవాడు, ఉద్యతాస్త్రః=ఎత్తబడిన అస్త్రములు

గలవాడు అయిన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, అద్య=ఇప్పుడు, నిహన్తుమ్=చంపుటకు, కథమ్=ఎట్లు, శక్యః=శక్యమైనవాడో కదా !

తా. మహాత్ముడైన ఈ ఇంద్రజిత్తు బ్రహ్మనుండి వరమును పొంది యున్నాడు. సావధానచిత్తుడై తన భయంకరమైన శరీరమును కనబడకుండ చేసికొని ఉన్నాడు. యుద్ధములో కనబడకుండా ఉండి అస్త్రములను ప్రయోగించుచున్న ఇతనిని ఇప్పుడు ఎట్లు చంపవలెనో కదా ! 69

మూ. మన్యే స్వయంభూర్భగవానచిన్త్యో
యస్యైతదస్త్రం ప్రభవశ్చ యోఽస్య,
బాణావపాతం త్వమిహాద్య ధీమ
న్మయా సహావ్యగ్రమనాః సహస్వ. 70

ప్ర. అ. ఏతత్=ఈ, అస్త్రమ్=అస్త్రము, యస్య=ఎవనిదో, యః=ఎవడు, అస్య=దీనికి, ప్రభవః= మూలకారణమో, అట్టి, భగవాన్=పూజ్యుడైన, స్వయంభూః=బ్రహ్మదేవుడు, అచిన్త్యః=ఊహింప శక్యముకానివాడు అని, మన్యే=తలంచుచున్నాను. ధీమన్=ఓ ! బుద్ధిమంతుడా ! త్వమ్=నీవు, ఇహ=ఇక్కడ, అద్య=ఇప్పుడు, అవ్యగ్రమనాః=కలత చెదని మనస్సు కలవాడవై, బాణావపాతమ్=బాణముల పాతమును, మయా సహ=నాతో కూడ, సహస్వ=సహించుము.

తా. ఈ అస్త్రమునకు అధిదేవత, ఈ అస్త్రమునకు మూలకారణమూ అయిన పూజ్యుడైన బ్రహ్మదేవుని ప్రభావము ఊహింప శక్యముకానిది అని అనుకొనుచున్నాను. ఓ ! ధీమంతుడా ! నాతోపాటు నీవుకూడ ఇప్పుడు ఇక్కడ ఈ బాణపాతమును కలత చెందని మనస్సుతో సహించుము. 70

మూ. ప్రచ్ఛాదయత్యేష హి రాక్షసేన్ద్రః
సర్వాధికః సాయకవృష్టిజాలైః,
ఏతచ్చ సర్వం పతితాగ్ర్యశూరం
న భ్రాజతే వానరరాజసైన్యమ్. 71

ప్ర. అ. సర్వాధికః=అందరికంటె అధికుడుగా ఉన్న, ఏషః=ఈ, రాక్షసేన్ద్రః=రాక్షసనాయకుడు, సాయకవృష్టి జాలైః=బాణవర్షసముదాయముల చేత, ప్రచ్ఛాదయతు=కప్పివేయుగాక. పతితాగ్ర్యశూరమ్=పడిపోయిన ప్రధానశూరులు గల, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తమైన, వానరరాజసైన్యమ్=వానరరాజసేన, న భ్రాజతే=ప్రకాశించుటలేదు.

తా. ప్రస్తుతము అందరికంటె అధికుడుగా ఉన్న ఈ రాక్షసనాయకుడు

బాణవర్షసముదాయములచేత కప్పివేయుగాక. ప్రధానులైన శూరులందరూ పడిపోవుటచేత ఈ వానరసైన్యమంతా శోభావిహీనముగా ఉన్నది. 71

మూ. ఆవాం తు దృష్ట్వా పతితౌ విసంజ్ఞౌ
నివృత్తయుద్ధౌ గతహర్షరోషౌ,
ధ్రువం ప్రవేక్ష్యత్యమరారివాస
మసౌ సమాసాద్య రణాగ్ర్యలక్ష్మీమ్. 72

ప్ర. అ. అసౌ=ఇతడు, నివృత్తయుద్ధౌ=నివర్తించిన యుద్ధము గల, గతహర్షరోషౌ=పోయిన సంతోషకోపములు గల, విసంజ్ఞౌ=సంజ్ఞ లేకుండగా, పతితౌ=పడిపోయిన, ఆవామ్=మనల నిద్దరినీ, దృష్ట్వా=చూచి, రణాగ్ర్యలక్ష్మీమ్=యుద్ధప్రారంభమునకు సంబంధించిన విజయలక్ష్మిని, సమాసాద్య=పొంది, ధ్రువమ్=తప్పక, అమరారివాసమ్=రాక్షసనివాసమును, ప్రవేక్ష్యతి=ప్రవేశించగలడు.

తా. మన మిద్దరము యుద్ధమునుండి విరమించి, సంతోషము కాని, రోషము కాని చూపకుండగా, సంజ్ఞ కోల్పోయి క్రింద పడిపోవుట చూచి, ఇతడు యుద్ధప్రారంభమున లభించిన ఈ విజయలక్ష్మిని పొంది తప్పక లంకలోనికి వెళ్ళిపోవును. (మనమిప్పుడు సంజ్ఞ కోల్పోయి పడి ఉన్నట్లు పడి ఉందాము. తరువాత చూచుకొనవచ్చును అని భావము). 72

మూ. తతస్తు తావిన్ద్రజితోఽస్త్రజాలై
ర్బభూవతుస్తత్ర తదా విశస్తౌ,
స చాపి తౌ తత్ర విషాదయిత్వా
ననాద హర్షాద్యుధి రాక్షసేన్ద్రః. 73

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తౌ=వారిద్దరూ, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తు యొక్క, అస్త్రజాలైః=అస్త్రముల సముదాయములచేత, తత్ర=అక్కడ, తదా=అప్పుడు, విశస్తౌ=కొట్టబడినవారు, బభూవతుః=అయిరి. సః=ఆ, రాక్షసేన్ద్రశ్చాపి=రాక్షసనాయకుడు కూడ, తత్ర=అక్కడ, తౌ=వారిద్దరినీ, విషాదయిత్వా=పీడించి, యుధి=యుద్ధమునందు, హర్షాత్=సంతోషమువలన, ననాద=ధ్వనిచేసెను.

తా. పిమ్మట ఆ రామలక్ష్మణులు అక్కడ, ఇంద్రజిత్తు ప్రయోగించిన అస్త్రముల సముదాయములచేత హింసింపబడిరి. ఇంద్రజిత్తు కూడ వారి నా విధముగా హింసించి సంతోషముతో ధ్వనిచేసెను. 73

మూ. తతస్తదా వానరసైన్యమేవం
రామం చ సంఖ్యే సహ లక్ష్మణేన,
విషాదయిత్వా సహసా వివేశ
పురీం దశగ్రీవభుజాభిగుప్తామ్. 74
సంస్తూయమానః స తు యాతుధానైః
పిత్రే చ సర్వం హృషితోఽభ్యువాచ. 75

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాండే త్రిసప్తతితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః=ఆ ఇంద్రజిత్తు, తదా=అప్పుడు, వానరసైన్యమ్=వానరసైన్యమును, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, రామం చ=రాముణ్ణి, సంఖ్యే=యుద్ధమునందు, ఏవమ్=ఈ విధముగా, విషాదయిత్వా=నశింపచేసి, యాతుధానైః=రాక్షసులచేత, సంస్తూయమానః=స్తుతించబడుతూన్నవాడై, దశగ్రీవభుజాభిగుప్తామ్=రావణుని భుజములచేత రక్షింపబడిన, పురీమ్=పురమును, సహసా=వెంటనే, వివేశ=ప్రవేశించెను. హృషితః=సంతోషించుచున్నవాడై, సర్వమ్=అంతనూ, పిత్రే=తండ్రికి, అభ్యువాచ=చెప్పెను.

తా. అప్పుడా ఇంద్రజిత్తు యుద్ధమునందు వానరసైన్యములను నశింపచేసి, రామలక్ష్మణులను పడగొట్టి, రాక్షసులచేత స్తుతింపబడుచు వెంటనే రావణుని భుజములచేత పాలింపబడుచున్న లంకానగరము చేరి సంతోషముతో తండ్రికి జరిగినదంతా తెలిపెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃసప్తతితమః సర్గః

[జాంబవంతుని ఆదేశమును అనుసరించి హనుమంతుడు హిమాలయము నుండి దివ్యౌషధు లున్న పర్వతమును తీసికొనివచ్చుట; వాటి వాసన తగలగానే రామలక్ష్మణులు సమస్తవానరులు స్వాస్థ్యము చెందుట.]

మూ. తయోస్తదా సాదితయో రణాగ్రే
ముమోహ సైన్యం హరియూథపానామ్,
సుగ్రీవనీలాఙ్గదజామ్బవన్తో
న చాపి కించి త్ప్రతిపేదిరే తే. 1

ప్ర. అ. రణాగ్రే=యుద్ధమునందు, తదా=అప్పుడు, తయోః=ఆ రామలక్ష్మణులు, సాదితయోః= పీడింపబడినవా రగుచుండగా, హరియూథపానామ్=వానరసేనానాయకులయొక్క, సైన్యమ్=సైన్యము, ముమోహ= మోహము చెందెను. తే=ఆ, సుగ్రీవనీలాఙ్గదజామ్బవన్తోఽపి=సుగ్రీవ-నీల-అంగద-జాంబవంతులు కూడ, కించిత్= ఏమీ, న ప్రతిపేదిరే=తెలియజాలకుండిరి.

తా. యుద్ధరంగమునందు ఆ రామలక్ష్మణు లిద్దరూ పీడింపబడిరి. వానరసేనానాయకుల సైన్యము కూడ మూర్ఛ చెందెను. ఆ సుగ్రీవ-నీల-అంగద-జాంబవంతులకు ఏమి చేయవలెనో తెలియలేదు. 1

మూ. తతో విషణ్ణం సమవేక్ష్య సర్వం
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః,
ఉవాచ శాఖామృగరాజవీరా
నాశ్వాసయన్నప్రతిమైర్వచోభిః. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బుద్ధిమతామ్=బుద్ధిమంతులలో, వరిష్ఠః=శ్రేష్ఠుడైన, విభీషణః=విభీషణుడు, విషణ్ణమ్=దిగులుచెందిన, సర్వమ్=సమస్తమైన సైన్యమును, సమవేక్ష్య=చూచి, అప్రతిమైః=సాటిలేని, వచోభిః= వాక్యములతో, శాఖామృగరాజవీరాన్=వానరాధిపుడైన సుగ్రీవుని వీరులను, ఆశ్వాసయన్=ఓదార్చుచు, ఉవాచ=పలికెను.

తా. పిదప బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన విభీషణుడు దిగులు చెంది ఉన్న సైన్యము నంతనూ చూచి వానరరాజైన సుగ్రీవుని సైన్యములోని వీరులను

మంచిమాటలతో ఓదార్చుచు ఇట్లు పలికెను. 2

మూ. మా భైష్ట నాస్త్యత్ర విషాదకాలో
యదార్యపుత్రౌ హ్యవశౌ విషణ్ణౌ,
స్వయంభువో వాక్యమథోద్వహన్తౌ
యత్సాదితావిన్ద్రజితాస్త్రజాలైః. 3

ప్ర. అ. ఆర్యపుత్రౌ=పూజ్యుడైన దశరథుని కుమారులు, స్వయంభువః=బ్రహ్మదేవునియొక్క, వాక్యమ్=వాక్యమును, ఉద్వహన్తౌ=మన్నించుచున్నవారై, అథ=అటుపిమ్మట, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, అస్త్రజాలైః=అస్త్రసముదాయములచేత, యత్=ఏ కారణమువలన, సాదితౌ=పీడింపబడినారో, యత్=ఏ కారణమువలన, అవశౌ=తమకు తాము వశులుకానివారై, విషణ్ణౌ=విషాదముచెంది ఉన్నారో, అందువలన, మా భైష్ట=భయపడకుడు; అత్ర=ఇక్కడ, విషాదకాలః=దుఃఖమునకు కాలము, నాస్తి=లేదు.

తా. రామలక్ష్మణు లిద్దరూ బ్రహ్మదేవుని వాక్యమును మన్నించుచు ఇంద్రజిత్తు బాణములచేత పీడింపబడినవారై , వశము తప్పి మూర్ఛిల్లినారు. అందువలన మీరు భయపడకుడు. ఇది దిగులు చెందవలసిన సమయము కాదు. 3

మూ. తస్మై తు దత్తం పరమాస్త్రమేత
త్స్వయంభువా బ్రాహ్మమమోఘవీర్యమ్,
తన్మానయన్తౌ యుధి రాజపుత్రౌ
నిపాతితౌ కోఽత్ర విషాదకాలః. 4

ప్ర. అ. తస్మై=ఇంద్రజిత్తునకు, ఏతత్=ఈ, అమోఘవీర్యమ్=వ్యర్థము కాని శక్తి గల, బ్రాహ్మం పరమాస్త్రమ్=బ్రహ్మదేవతాకమైన గొప్ప అస్త్రము, స్వయంభువా=బ్రహ్మదేవునిచేత, దత్తమ్=ఇవ్వబడినది. తత్= దానిని, మానయన్తౌ=గౌరవించుచు, రాజపుత్రౌ=రాజపుత్రులు, యుధి=యుద్ధమునందు, నిపాతితౌ= పడగొట్టబడినారు. అత్ర=ఇక్కడ, విషాదకాలః=దుఃఖమునకు కాలము, కః=ఏది?

తా. వ్యర్థము కాని శక్తి గల ఈ గొప్పదైన బ్రహ్మాస్త్రమును బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు ఇచ్చి యున్నాడు. దానిని మన్నించి రామలక్ష్మణులు యుద్ధములో మూర్ఛ చెంది ఉన్నారు. ఇక్కడ దుఃఖించవలసిన పని ఏమున్నది?

మూ. బ్రాహ్మమస్త్రం తతో ధీమాన్మానయిత్వా తు మారుతిః,
విభీషణవచః శ్రుత్వా హనూమానిదమబ్రవీత్. 5

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధీమాన్=బుద్ధిమంతుడు, మారుతిః=వాయుదేవుని పుత్రుడు అయిన, హనూమాన్=హనుమంతుడు, బ్రాహ్మమ్ అస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, మానయిత్వా=గౌరవించి, విభీషణవచః=విభీషణుని వాక్యమును, శ్రుత్వా=విని, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు బుద్ధిశాలి, వాయుపుత్రుడూ అయిన హనుమంతుడు బ్రహ్మాస్త్రమును గౌరవించుటకై కొంచెము సేపు బంధములో ఉండి, దానిని విడిపించుకొని, విభీషణుని మాటలు విని ఇట్లు పలికెను. 5

మూ. అస్మిన్నస్త్రహతే సైన్యే వానరాణాం తరస్వినామ్,
యో యో ధారయతే ప్రాణాం స్తం తమాశ్వాసయామహే. 6

ప్ర. అ. అస్త్రహతే=అస్త్రముచేత కొట్టబడిన, తరస్వినామ్=వేగవంతులైన, వానరాణామ్=వానరులయొక్క, అస్మిన్=ఈ, సైన్యే=సైన్యమునందు, యః యః=ఎవడెవడు, ప్రాణాన్=ప్రాణములను, ధారయతే=ధరించి ఉన్నాడో, తం తమ్=ఆ యా వానరుని, ఆశ్వాసయామహే=ఓదార్చెదము.

తా. బలశాలులైన వానరుల ఈ సైన్యము బ్రహ్మాస్త్రముచేత కొట్టబడి ఉన్నది. ఇపుడు వీరిలో ఎవ రెవరు ప్రాణాలతో ఉన్నారో వాళ్ళ నందరినీ ఓదార్చెదము. 6

మూ. తావుభౌ యుగపద్వీరౌ హనూమద్రాక్షసోత్తమౌ,
ఉల్కాహస్తౌ తదా రాత్రౌ రణశీర్షే విచేరతుః. 7

ప్ర. అ. వీరౌ=వీరులైన, తౌ=ఆ, ఉభౌ=ఇద్దరు, హనూమద్రాక్షసోత్తమౌ=హనూమద్విభీషణులు, తదా=అప్పుడు, రాత్రౌ=రాత్రియందు, ఉల్కాహస్తౌ=కొరవులు హస్తములందు కలవారై, రణశీర్షే=రణరంగమునందు, విచేరతుః=సంచరించిరి.

తా. వీరులైన ఆ హనుమద్విభీషణు లిద్దరూ, అప్పుడు, ఆ రాత్రివేళ, కాగడాలు చేత ధరించి యుద్ధభూమిలో సంచరించిరి. 7

మూ. భిన్నలాఙ్గూలహస్తోరుపాదాఙ్గులిశిరోధరైః,
స్రవద్భిః క్షతజం గాత్రైః ప్రస్రవద్భిః సమన్తతః. 8
పతితైః పర్వతాకారైర్వానరైరభిసంవృతామ్,
శస్త్రైశ్చ పతితైర్దీప్తైర్దదృశాతే వసుంధరామ్. 9

ప్ర. అ. భిన్నలాఙ్గూలహస్తోరుపాదాఙ్గులిశిరోధరైః=బ్రద్దలుకొట్టబడిన

తోకలు, చేతులు, తొడలు, పాదములు, వ్రేళ్ళు, శిరస్సులూ గల, గాత్రైః=అవయవములచేత, క్షతజమ్=రక్తమును, స్రవద్భిః=స్రవించుచున్న, ప్రస్రవద్భిః=మూత్రించుచున్న, సమన్తతః=అంతటా, పతితైః=పడియున్న, పర్వతాకారైః=పర్వతమువంటి ఆకారము గల, వానరైః=వానరులచేత, అభిసంవృతామ్=కప్పబడియున్న, పతితైః=పడిన, దీప్తైః=ప్రకాశించుచున్న, శస్త్రైశ్చ=శస్త్రములచేత కూడ కప్పబడిన, వసుంధరామ్=భూమిని, దదృశాతే=చూచిరి.

తా. వానరుల తోకలు, చేతులు, తొడలు, పాదాలు, వ్రేళ్ళు, శిరస్సులు తెగి పడి యుండెను. అవయవములనుండి రక్తము కారుచుండెను. కొందరు మూత్రము విడచుచుండిరి. ఆ విధముగ అంతటా పడియున్న, పర్వతములవంటి ఆకారములు గల వానరులచేత ఆ భూమి అంతా కప్పబడియుండెను. అక్కడ ప్రకాశించుచున్న అనేకములైన ఆయుధములు కూడ పడియుండెను. అట్టి యుద్ధభూమిని ఆ హనుమద్విభీషణులు చూచిరి. 8,9

మూ. సుగ్రీవమఙ్గదం నీలం శరభం గన్ధమాదనమ్,
గవాక్షం చ సుషేణం చ వేగదర్శినమేవ చ. 10
మైన్దం నలం జ్యోతిముఖం ద్వివిదం చాపి వానరమ్,
విభీషణో హనూమాంశ్చ దదృశాతే హతాన్ రణే. 11

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, హనూమాన్ చ=హనుమంతుడు, రణే=యుద్ధమునందు, హతాన్=కొట్టబడిన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, అఙ్గదమ్=అంగదుణ్ణి, నీలమ్=నీలుణ్ణి, శరభమ్=శరభుణ్ణి, గన్ధమాదనమ్=గంధమాదనుణ్ణి, గవాక్షమ్=గవాక్షుణ్ణి, సుషేణం చ=సుషేణుణ్ణి, వేగదర్శినమేవ చ=వేగదర్శిని, మైన్దమ్=మైందుణ్ణి, నలమ్=నలుణ్ణి, జ్యోతిముఖమ్=జ్యోతిముఖుణ్ణి, ద్వివిదమ్=ద్వివిదు డను, వానరం చాపి=వానరుణ్ణి, దదృశాతే=చూచిరి.

తా. విభీషణహనుమంతులు యుద్ధభూమిలో కొట్టబడి యున్న సుగ్రీవ-అంగద-నీల-శరభ-గంధమాదన- గవాక్షులను, సుషేణ-వేగదర్శులను, మైందు-నల-జ్యోతిముఖ-ద్వివిదులను చూచిరి. 10,11

మూ. సప్తషష్టిర్హతాః కోట్యో వానరాణాం తరస్వినామ్,
అహ్నః పఞ్చమశేషేణ వల్లభేన స్వయంభువః. 12

ప్ర. అ. స్వయంభువః=బ్రహ్మదేవునికి, వల్లభేన=ఇష్టుడైన ఇంద్రజిత్తుచేత (లేదా ఇష్టమైన బ్రహ్మాస్త్రముచేత), అహ్నః=పగటిభాగముయొక్క, పఞ్చమశేషేణ=చివరి ఐదవభాగముచేత, తరస్వినామ్=వేగవంతులైన, వానరాణామ్=వానరులయొక్క, సప్తషష్టిః=అరవైఏడు, కోట్యః=కోట్లు, హతాః=కొట్టబడిరి.

తా. బ్రహ్మనుండి వరమును పొందిన ఆ ఇంద్రజిత్తు పగటి చివరి ఐదవభాగములో వేగవంతులైన అరవైఏడుకోట్ల వానరులను కొట్టెను. 12

వి. పగటి భాగమునందు ప్రాతఃకాలము, సంగవము, మధ్యాహ్నము, అపరాహ్ణము, సాయాహ్నము అను ఐదు విభాగము లుండును. ఒక్కొక్కదానికి ఆరు ఘడియలు (రెండు గంటల 24 నిముషములు). ఆ సాయాహ్నమునందు ఈ బ్రహ్మాస్త్రప్రయోగము జరిగె నని అర్థము.

మూ. సాగరౌఘనిభం భీమం దృష్ట్వా బాణార్దితం బలమ్,
మార్గతే జామ్బవన్తం చ హనూమాన్ సవిభీషణః. 13

ప్ర. అ. సవిభీషణః=విభీషణునితో కూడిన, హనూమాన్=హనుమంతుడు, సాగరౌఘనిభమ్=సముద్రజలసంఘాతముతో సమానమైన, బాణార్దితమ్=బాణముల చేత పీడింపబడిన, బలమ్=సైన్యమును, దృష్ట్వా=చూచి, జామ్బవన్తమ్=జాంబవం తుణ్ణి, మార్గతే=వెదకుచున్నాడు.

తా. విభీషణునితో కూడిన హనుమంతుడు బాణములచేత పీడింపబడి యున్న, సముద్రజలసంఘాతము వంటి ఆ వానరసైన్యమును చూచుచు, జాంబవంతునికొరకై వెదకెను. 13

మూ. స్వభావజరయా యుక్తం వృద్ధం శరశతైశ్చితమ్,
ప్రజాపతిసుతం వీరం శామ్యన్తమివ పావకమ్, 14
దృష్ట్వా సమభిసంక్రమ్య పౌలస్త్యో వాక్యమబ్రవీత్.

ప్ర. అ. పౌలస్త్యః=విభీషణుడు, స్వభావజరయా=సహజముగా వచ్చిన ముసలితనముతో, యుక్తమ్=కూడినవాడు, వృద్ధమ్=వృద్ధుడు, శరశతైః=వందలకొలది బాణములచేత, చితమ్=వ్యాపింపబడినవాడు, శామ్యన్తమ్=శాంతించుచున్న, పావకమ్ ఇవ=అగ్నివలె ఉన్నవాడు, వీరమ్=వీరుడూ అయిన, ప్రజాపతిసుతమ్=బ్రహ్మదేవుని పుత్రుడైన జాంబవంతుణ్ణి, దృష్ట్వా=చూచి, సమభిసంక్రమ్య=సమీపించి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. వయోవృద్ధుడైన ఆ బ్రహ్మపుత్రుడైన జాంబవంతుడు వార్ధక్యముచేత సహజముగానే దుర్బలుడుగా ఉండెను. ఆ వీరుడు వందలకొలది బాణములు గ్రుచ్చుకొనుటచే శాంతించుచున్న అగ్నివలె ఉండెను. అట్టి జాంబవంతుడు కనబడగానే విభీషణుడు ఆతనివద్దకు వెళ్లి ఇట్లు పలికెను. 14

మూ. కచ్చిదార్య శరైస్తీక్ష్ణైర్న ప్రాణా ధ్వంసితాస్తవ. 15
విభీషణవచః శ్రుత్వా జామ్బవానృక్షపుంగవః,

కృచ్ఛ్రాదభ్యుద్గిరన్వాక్యమిదం వచనమబ్రవీత్. 16

ప్ర. అ. ఆర్య=పూజ్యుడా ! తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, తవ=నీయొక్క, ప్రాణాః= ప్రాణములు, న ధ్వంసితాః కచ్చిత్=నశింపచేయబడలేదు కదా! ఋక్షపుంగవః=భల్లూకములలో శ్రేష్ఠుడైన, జామ్బవాన్=జాంబవంతుడు, విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, కృచ్ఛ్రాత్=కష్టమువలన, వాక్యమ్=వాక్యమును, అభ్యుద్గిరన్=ఉచ్చరించుచు, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. "ఆర్యా ! వాడియైన బాణములచేత నీ ప్రాణములు నశింపచేయబడలేదు కదా !" భల్లూకములలో శ్రేష్ఠుడైన జాంబవంతుడు విభీషణుని మాటలు విని, మాటలు అతికష్టముమీద ఉచ్చరించుచు ఇట్లు పలికెను.

మూ. నైరృతేన్ద్ర మహావీర్య స్వరేణ త్వాభిలక్షయే,
విద్ధగాత్రః శితైర్బాణైర్న త్వాం పశ్యామి చక్షుషా. 17

ప్ర. అ. మహావీర్య=గొప్ప పరాక్రమముగల, నైరృతేన్ద్ర=రాక్షసనాయకా! స్వరేణ=స్వరముచేత, త్వా=నిన్ను, అభిలక్షయే=గుర్తించుచున్నాను. శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, విద్ధగాత్రః=కొట్టబడిన అవయములు గల నేను, త్వామ్=నిన్ను, చక్షుషా=నేత్రముతో, న పశ్యామి=చూచుటలేదు.

తా. గొప్ప పరాక్రమము గల ఓ విభీషణా ! నిన్ను నీ కంఠస్వరము చేత గుర్తు పట్టుచున్నాను. నా శరీరము వాడియైన బాణములచేత కొట్టబడి యుండుటచేత నిన్ను కంటితో చూడలేకున్నాను. 17

మూ. అఞ్జనా సుప్రజా యేన మాతరిశ్వా చ సువ్రత,
హనుమాన్ వానరశ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్. 18

ప్ర. అ. సువ్రత=మంచి నియమములు కలవాడా ! యేన=ఎవనిచేత, అఞ్జనా=అంజన, సుప్రజాః=మంచి సంతానము గలదో, మాతరిశ్వా చ=వాయుదేవుడు కూడ మంచి సంతానము గలవాడో, అట్టి, వానరశ్రేష్ఠః=వానరులలో శ్రేష్ఠుడైన, హనుమాన్=హనుమంతుడు, క్వచిత్=ఎక్కడనైనా, ప్రాణాన్=ప్రాణములను, ధారయతే=ధరించి ఉన్నాడా ?

తా. ఉత్తమ నియమవంతుడవైన ఓ విభీషణా ! అంజనావాయుదేవుల ఉత్తమపుత్రుడైన, వానరశ్రేష్ఠుడు, హనుమంతుడు ఏ మూలనైనా ప్రాణాలతో ఉన్నాడా ? 18

మూ. శ్రుత్వా జామ్బవతో వాక్యమువాచేదం విభీషణః,
ఆర్యపుత్రావతిక్రమ్య కస్మాత్పృచ్ఛసి మారుతిమ్. 19

ప్ర. అ. జామ్బవతః=జాంబవంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, విభీషణః=విభీషణుడు, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను. ఆర్యపుత్రౌ=పూజ్యుడైన దశరథుని కుమారులను, అతిక్రమ్య= దాటి (విడచి), మారుతిమ్=హనుమంతుణ్ణి గూర్చి, కస్మాత్=ఎందువలన, పృచ్ఛసి=అడుగుచున్నావు?

తా. జాంబవంతుని మాటలు విని విభీషణు డిట్లు పలికెను. రామలక్ష్మణుల విషయ మడుగకుండగా హనుమంతుణ్ణి గూర్చి అడుగుచున్నావేమి? 19

మూ. నైవ రాజని సుగ్రీవే నాఙ్గదే నాపి రాఘవే,
ఆర్య సందర్శితః స్నేహో యథా వాయుసుతే పరః. 20

ప్ర. అ. ఆర్య=పూజ్యుడా ! వాయుసుతే=హనుమంతునియందు, యథా=ఎట్లు, పరః=అధికమైన, స్నేహః= స్నేహము, సందర్శితః=చూపబడినదో, అట్లు, రాజని=రాజైన, సుగ్రీవే=సుగ్రీవునియందు, నైవ=చూపబడలేదు; అఙ్గదే=అంగదునియందు, న=చూపబడలేదు; రాఘవేఽపి=రామునియందు కూడ, న=చూపబడలేదు.

తా. ఓ ! పూజ్యుడా ! నీవు హనుమంతుని విషయమునందు ఎంత అధికమైన స్నేహమును చూపుచున్నావో అంత స్నేహమును రాజైన సుగ్రీవుని విషయమునందు గాని, అంగదుని విషయమునందుగాని, రాముని విషయమునందు గాని చూపుట లేదు ! 20

మూ. విభీషణవచః శ్రుత్వా జామ్బవాన్వాక్యమబ్రవీత్,
శృణు నైర్ఋతశార్దూల యస్మాత్ పృచ్ఛామి మారుతిమ్. 21

ప్ర. అ. జామ్బవాన్=జాంబవంతుడు, విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. నైర్ఋతశార్దూల=రాక్షస శ్రేష్ఠుడా! మారుతిమ్=హనుమంతుణ్ణి గూర్చి, యస్మాత్=ఎందువలన, పృచ్ఛామి=అడుగుచున్నానో, శృణు=వినుము.

తా. విభీషణుని మాటలు విని జాంబవంతు డిట్లు పలికెను. "విభీషణా! నేను హనుమంతునిగూర్చియే ఎందుకు అడుగుచున్నానో వినుము"

మూ. అస్మిన్ జీవతి వీరే తు హతమప్యహతం బలమ్,
హనూమత్యుజ్ఝితప్రాణే జీవన్తోఽపి మృతా వయమ్.

ప్ర. అ. అస్మిన్ వీరే=ఈ వీరుడు, జీవతి=జీవించి యుండగా, హతమపి=చంపబడిన దైనను, బలమ్=సేన, అహతమ్=చంపబడలేదు. హనూమతి=హనుమంతుడు, ఉజ్ఝితప్రాణే=విడువబడిన ప్రాణములు గలవా డగుచుండగా, వయమ్=మనము, జీవన్తః అపి=జీవించి ఉన్నను, మృతాః=మరణించినవారమే.

తా. వీరుడైన ఈ హనుమంతుడు జీవించి ఉన్నట్లయితే సైన్యము చంపబడినను చంపబడనట్లే. ఇతడు మరణించినచో మన మందరము జీవించి ఉన్నను మరణించినట్లే. 22

మూ. ధరతే మారుతిస్తాత మారుతప్రతిమో యది,
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్. 23

ప్ర. అ. తాత=తండ్రీ ! మారుతప్రతిమః=వాయువుతో సమానుడు, వీర్యే=పరాక్రమమునందు, వైశ్వానరసమః=అగ్నితో సమానుడు అయిన, మారుతిః=హనుమంతుడు, ధరతే యది=జీవించి ఉన్నట్లయితే, తతః= అప్పుడు, జీవితాశా=జీవితమునందు ఆశ, భవేత్=ఉండును.

తా. నాయనా ! వాయువుతో సమానుడు, పరాక్రమమునందు అగ్నితుల్యుడు అయిన హనుమంతుడు జీవించి ఉన్నట్లయితే మనకు జీవితమును గూర్చి ఆశ ఉండును. 23

మూ. తతో వృద్ధముపాగమ్య వినయాదభ్యవాదయత్,
గృహ్య జామ్బవతః పాదౌ హనూమాన్మారుతాత్మజః. 24

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మారుతాత్మజః=వాయుకుమారుడైన, హనూమాన్=హనుమంతుడు, వృద్ధమ్=వృద్ధుడైన ఆతనిని, ఉపాగమ్య=సమీపించి, వినయాత్=వినయమువలన, జామ్బవతః=జాంబవంతునియొక్క, పాదౌ=పాదములను, గృహ్య=గ్రహించి, అభ్యవాదయత్=నమస్కరించెను.

తా. పిమ్మట వాయుపుత్రుడైన హనుమంతుడు వృద్ధుడైన జాంబవంతుని సమీపించి వినయపూర్వకముగా ఆతని పాదములకు నమస్కరించెను. 24

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం తదా వివ్యథితేన్ద్రియః,
పునర్జాతమివాత్మానం మన్యతే ప్లవగోత్తమః. 25

ప్ర. అ. తదా=అప్పుడు, వివ్యథితేన్ద్రియః=వ్యథ చెందిన ఇంద్రియములు గల, ప్లవగోత్తమః= వానరశ్రేష్ఠుడైన జాంబవంతుడు, హనుమతః=హనుమంతుని యొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, ఆత్మానమ్=తనను, పునః=మరల, జాతమివ=పుట్టినవానివి వలె, మన్యతే=తలచెను.

తా. అప్పుడు వ్యాకులత చెందిన ఇంద్రియములు గల ఆ జాంబవంతుడు హనుమంతుని మాట వినబడగానే మళ్లీ జన్మ ఎత్తినట్లు భావించెను. 25

మూ. తతోఽబ్రవీన్మహాతేజా హనూమన్తం స జామ్బవాన్,
ఆగచ్ఛ హరిశార్దూల వానరాంస్త్రాతుమర్హసి. 26

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః=ఆ, జామ్బవాన్=జాంబవంతుడు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను. హరిశార్దూల=వానరశ్రేష్ఠుడా ! ఆగచ్ఛ=రమ్ము. వానరాన్=వానరులను, త్రాతుమ్=రక్షించుటకు, అర్హసి=తగి యున్నావు.

తా. అప్పుడు గొప్ప తేజస్సు గల ఆ జాంబవంతుడు హనుమంతునితో ఇట్లు పలికెను. ఓ ! వానరశ్రేష్ఠుడా ! రమ్ము; వానరులను రక్షించుము. 26

మూ. నాన్యో విక్రమపర్యాప్తస్త్వమేషాం పరమః సఖా,
త్వత్పరాక్రమకాలోఽయం నాన్యం పశ్యామి కం చన. 27

ప్ర. అ. త్వమ్=నీవే, ఏషామ్=వీళ్ళకు, విక్రమపర్యాప్తః=పరాక్రమముచేత చాలిన, పరమః=గొప్పవాడైన, సఖా=స్నేహితుడవు. అన్యః=ఇతరు డెవడూ, న=లేడు. అయమ్=ఇది, త్వత్పరాక్రమకాలః=నీ పరాక్రమమునకు కాలము; అన్యమ్=మరి యొకనిని, కం చన=ఎవనినీ, న పశ్యామి=చూడను.

తా. ఈ వానరులకు నీవే పరాక్రమముచేత తగిన స్నేహితుడవు; మరెవ్వరూ లేరు. ఇది నీ పరాక్రమము చూపుటకు తగిన కాలము. ఇతరులెవ్వరూ నాకు కనబడుటలేదు. 27

మూ. ఋక్షవానరవీరాణామనీకాని ప్రహర్షయ,
విశల్యౌ కురు చాప్యేతౌ సాదితౌ రామలక్ష్మణౌ. 28

ప్ర. అ. ఋక్షవానరవీరాణామ్=భల్లూక-వానరవీరులయొక్క, అనీకాని=సైన్యములను, ప్రహర్షయ= సంతోషపెట్టుము. సాదితౌ=పీడింపబడిన, ఏతౌ=ఈ, రామలక్ష్మణౌ చ=రామలక్ష్మణులను కూడ, విశల్యౌ=శల్యము లేనివారినిగా, కురు=చేయుము.

తా. ఈ భల్లూక-వానరవీరుల సైన్యములకు సంతోషము కలిగించుము. పీడితులై ఉన్న ఈ రామలక్ష్మణుల శల్యములను కూడ తొలగింపుము. 28

మూ. గత్వా పరమమధ్వానముపర్యుపరి సాగరమ్,
హిమవన్తం నగశ్రేష్ఠం హనూమన్ గన్తుమర్హసి. 29

ప్ర. అ. హనూమన్=హనుమంతుడా ! సాగరమ్ ఉపర్యుపరి=సముద్రము పైపైన, పరమమ్=గొప్పదైన, అధ్వానమ్=మార్గమును, గత్వా=వెళ్ళి, నగశ్రేష్ఠమ్=పర్వతశ్రేష్ఠమైన, హిమవన్తమ్=హిమవత్పర్వతమును గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ ! హనుమంతుడా ! సముద్రముపైన దీర్ఘమైన మార్గమునందు ప్రయాణము చేసి నీవు పర్వతములలో శ్రేష్ఠమైన హిమవత్పర్వతమునకు వెళ్ళవలెను. 29

మూ. తతః కాఞ్చనమత్యుగ్రమృషభం పర్వతోత్తమమ్,
కైలాసశిఖరం చాత్ర ద్రక్ష్యస్యరినిషూదన. 30

ప్ర. అ. అరినిషూదన=శత్రుసంహారకుడా ! తతః=అటుపిమ్మట, కాఞ్చనమ్=బంగారము వికారము, అత్యుగ్రమ్=చాల భయంకరమూ అయిన, పర్వతోత్తమమ్=పర్వతశ్రేష్ఠమైన, ఋషభమ్=ఋషభపర్వతమును, కైలాసశిఖరం చ=కైలాసశిఖరమును, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! పిమ్మట చాల భయంకరము, సువర్ణమయమూ అయిన ఋషభ మను పర్వతశ్రేష్ఠము, కైలాసశిఖరము నీకు అక్కడ కనబడును. 30

మూ. తయోః శిఖరయోర్మధ్యే ప్రదీప్తమతులప్రభమ్,
సర్వౌషధియుతం వీర ద్రక్ష్యస్యౌషధిపర్వతమ్. 31

ప్ర. అ. వీర=వీరుడా ! తయోః=ఆ, శిఖరయోః=శిఖరములయొక్క, మధ్యే=మధ్యయందు, ప్రదీప్తమ్= ప్రకాశించుచున్న, అతులప్రభమ్=సాటిలేని కాంతి గల, సర్వౌషధియుతమ్=సమస్త ఓషధులతో కూడిన, ఓషధిపర్వతమ్=ఓషధిపర్వతమును, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఆ రెండు శిఖరముల మధ్య నీకు, ప్రజ్వలించుచున్న, సాటిలేని కాంతి గల, సమస్తమైన ఓషధులతో నిండిన ఓషధిపర్వతము కనబడును. 31

మూ. తస్య వానరశార్దూల చతస్రో మూర్ధ్ని సంభవాః,
ద్రక్ష్యస్యోషధయో దీప్తా దీపయన్తీర్దిశో దశ. 32

ప్ర. అ. వానరశార్దూల=వానరశ్రేష్ఠుడా ! తస్య=ఆ పర్వతము యొక్క, మూర్ధ్ని=శిరస్సునందు, సంభవాః=పుట్టిన, దీప్తాః=ప్రజ్వలించుచున్న, చతస్రః=నాలుగు, ఓషధయః=ఓషధులు, ఉన్నవి. దశ=పది, దిశః=దిక్కులను, దీపయన్తీః=ప్రజ్వలింపజేయుచున్న వాటిని, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! దాని శిరస్సుపై మొలచిన నాలుగు ప్రకాశించుచున్న ఓషధులు ఉండును. పది దిక్కులను ప్రకాశింపచేయుచుండు ఆ ఓషధులను చూడగలవు. 32

మూ. మృతసంజీవనీం చైవ విశల్యకరణీమపి,
సువర్ణకరణీం చైవ సంధానీం చ మహౌషధిమ్. 33

ప్ర.అ. మృతసంజీవనీం చైవ=మృతసంజీవనిని (మరణించినవారిని బ్రతికించేది), విశల్యకరణీమ్ అపి=విశల్యకరణిని (శరీరములో ఉన్న ములుకులను తొలగించునది), సువర్ణకరణీం చైవ=సువర్ణకరణిని (దేహమునకు మంచి రంగు కలిగించేది), సంధానీం చ=సంధాని అను (విరిగిన శరీరభాగములను అతికించేది,) మహౌషధిమ్=మహౌషధిని (చూడగలవు).

తా. నీ కక్కడ మృతసంజీవని, విశల్యకరణి, సువర్ణకరణి, సంధానకరణి అను మహౌషధులు కనబడగలవు. 33

మూ. తాః సర్వా హనుమన్ గృహ్య క్షిప్రమాగన్తు మర్హసి,
ఆశ్వాసయ హరీన్ ప్రాణైర్యోజ్య గన్ధవహాత్మజ ! 34

ప్ర. అ. హనుమన్=హనుమంతుడా ! తాః=వాటిని, సర్వాః=అన్నింటిని, గృహ్య=గ్రహించి, క్షిప్రమ్= శీఘ్రముగా, ఆగన్తుమ్=వచ్చుటకు, అర్హసి=తగి ఉన్నావు. గన్ధవహాత్మజ=వాయునందనా ! హరీన్= వానరులను, ప్రాణైః=ప్రాణములతో, యోజ్య=కూర్చి, ఆశ్వాసయ=ఓదార్చుము.

తా. హనుమంతుడా ! ఆ ఓషధులను అన్నింటినీ శీఘ్రముగా తీసికొనిరమ్ము. ఓ ! వాయుకుమారా ! వానరులందరికీ ప్రాణములు పోసి ఓదార్చుము. 34

మూ. శ్రుత్వా జామ్బవతో వాక్యం హనూమాన్ మారుతాత్మజః,
ఆపూర్యత బలోద్ధర్షైర్వాయువేగైరివార్ణవః. 35

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, జామ్బవతః= జాంబవంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, అర్ణవః=సముద్రము, వాయువేగైః ఇవ= వాయువుయొక్క వేగములచేత వలె, బలోద్ధర్షైః=బలముయొక్క ఉత్కర్షలచేత, ఆపూర్యత=నింపబడెను.

తా. వాయుకుమారుడైన హనుమంతుడు జాంబవంతుని మాటలు విని సముద్రము వాయువేగముచేత నింపబడినట్లు అధికమైన బలముచేత పూరింపబడెను. 35

మూ. స పర్వతతటాగ్రస్థః పీడయన్ పర్వతోత్తమమ్,
హనూమాన్ దృశ్యతే వీరో ద్వితీయ ఇవ పర్వతః. 36

ప్ర. అ. పర్వతతటాగ్రస్థః=పర్వతము చివర నిలచిన, పర్వతోత్తమమ్=ఆ ఉత్తమమైన పర్వతమును, పీడయన్=పీడించుచున్న, వీరః=వీరుడైన, సః హనూమాన్=ఆ హనుమంతుడు, ద్వితీయః=రెండవ, పర్వతః ఇవ=పర్వతము వలె, దృశ్యతే=కనబడుచుండెను.

తా. పర్వతము చివర నిలచి, దానిని పీడించుచున్న వీరుడైన హనుమంతుడు రెండవ పర్వతము వలె కనబడుచుండెను. 36

మూ. హరిపాదవినిర్భగ్నో నిషసాద స పర్వతః,
న శశాక తదాత్మానం వోఢుం భృశనిపీడితః. 37

ప్ర. అ. హరిపాదవినిర్భగ్నః=హనుమంతుని పాదములచేత వంచబడిన, సః పర్వతః=ఆ పర్వతము, భృశపీడితః=మిక్కిలి పీడింపబడినదై, తదా=అప్పుడు, ఆత్మానమ్=తనను, వోఢుమ్=వహించుటకు, న శశాక=సమర్థము కాలేదు; నిషసాద=కూరుకొనిపోయెను.

తా. హనుమంతుని పాదములచే అణగద్రొక్కబడిన ఆ పర్వతము మిక్కిలి పీడింపబడినదై నిలద్రొక్కుకొనజాలక క్రిందికి అణగిపోయెను. 37

మూ. తస్య పేతుర్నగా భూమౌ హరివేగాచ్చ జజ్వలుః,
శృఙ్గాణి చ వ్యశీర్యన్త పీడితస్య హనూమతా. 38

ప్ర. అ. హనూమతా=హనుమంతునిచేత, పీడితస్య=పీడింపబడిన, తస్య=ఆ పర్వతముయొక్క, నగాః= వృక్షములు, హరివేగాత్=హనుమంతుని వేగమువలన, భూమౌ=భూమియందు, పేతుః=పడినవి. జజ్వలుః చ= మండిపోయినవి. శృఙ్గాణి చ=శిఖరములు కూడ, వ్యశీర్యన్త=విరిగిపోయినవి.

తా. హనుమంతుడు పీడించుటచే ఆ పర్వతమునుండి వృక్షములు, హనుమంతుని వేగమువలన నేలపై పడి మండిపోయినవి. శిఖరములు విరిగిపోయినవి. 38

మూ. తస్మిన్ సంపీడ్యమానే తు భగ్నద్రుమశిలాతలే,
న శేకుర్వానరాః స్థాతుం ఘూర్ణమానే నగోత్తమే. 39

ప్ర. అ. సంపీడ్యమానే=పీడింపబడుచున్న, భగ్నద్రుమశిలాతలే=విరిగిన వృక్షములు శిలలు గల, తస్మిన్ నగోత్తమే=ఆ పర్వతశ్రేష్ఠము, ఘూర్ణమానే=

తిరిగిపోవుచున్న దగుచుండగా, వానరాః=వానరులు, స్థాతుమ్= నిలచుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. ఆ విధముగా పీడింపబడి, చెట్లు, రాళ్లు విరిగిపడిపోయిన ఆ శ్రేష్ఠమైన పర్వతము తిరిగిపోవుచుండగా వానరులు నిలబడజాలకపోయిరి. 39

మూ. సా ఘూర్ణితమహాద్వారా ప్రభగ్నగృహగోపురా,
లఙ్కా త్రాసాకులా రాత్రౌ ప్రనృత్తేవాభవత్తదా. 40

ప్ర. అ. తదా=అప్పుడు, ఘూర్ణితమహాద్వారా=తిరిగిపోవునట్లు చేయబడిన ప్రధానద్వారములు గలది, ప్రభగ్నగృహగోపురా=విరిగిపోయిన గృహములు గోపురములు గలది, త్రాసాకులా=భయముచేత ఆకులము అయిన, లఙ్కా=లంక, రాత్రౌ=రాత్రియందు, ప్రనృత్తేవ=నృత్యము చేయుచున్నదివలె, అభవత్=ఆయెను.

తా. అప్పుడు, ఆ రాత్రి లంకలో పెద్ద ద్వారము లన్నీ తిరిగిపోయెను, గృహములు, గోపురములు విరిగిపోయెను. భయముచేత ఆకులమై ఆ నగరము నృత్యము చేయుచున్నదా అన్నట్లు ఉండెను. 40

మూ. పృథివీధరసంకాశో నిపీడ్య పృథివీధరమ్,
పృథివీం క్షోభయామాస సార్ణవాం మారుతాత్మజః. 41

ప్ర. అ. పృథివీధరసంకాశః=పర్వతముతో సమానుడైన, మారుతాత్మజః=హనుమంతుడు, పృథివీధరమ్=పర్వతమును, నిపీడ్య=పీడించి, సార్ణవామ్=సముద్రములో కూడిన, పృథివీమ్=భూమిని, క్షోభయామాస=క్షోభింపచేసెను.

తా. పర్వతము వంటి హనుమంతుడు పర్వతమును పీడించి, సముద్రములో కూడిన భూమిని కూడ క్షోభింపచేసెను. 41

మూ. ఆరురోహ తదా తస్మాద్ధరిర్మలయపర్వతమ్,
మేరుమన్దరసంకాశం నానాప్రస్రవణాకులమ్. 42
నానాద్రుమలతాకీర్ణం వికాసికమలోత్పలమ్,
సేవితం దేవగన్ధర్వైః షష్టియోజనముచ్ఛ్రితమ్. 43
విద్యాధరైర్మునిగణైరప్సరోభిర్నిషేవితమ్,
నానామృగగణాకీర్ణం బహుకన్దరశోభితమ్. 44
సర్వానాకులయంస్తత్ర యక్షగన్ధర్వకింనరాన్,
హనుమాన్ మేఘసంకాశో వవృధే మారుతాత్మజః. 45

ప్ర. అ. తదా=అప్పుడు, హరిః=హనుమంతుడు, తస్మాత్=ఆ

పర్వతమునుండి, మేరుమన్దరసంకాశమ్=మేరుమందరపర్వతములతో సమానము, నానాప్రస్రవణాకులమ్=అనేకములైన సెలయేళ్ళతో వ్యాకులము, నానాద్రుమలతాకీర్ణమ్=అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను వ్యాప్తము, వికాసికమలోత్పలమ్=వికసించుచున్న కమలములు నల్లకలవలు గలది, దేవగన్ధర్వైః=దేవతలచేతను గంధర్వులచేతను, సేవితమ్=సేవించబడినది, షష్టియోజనమ్=అరువదియోజనములు, ఉచ్ఛ్రితమ్=ఉన్నతము, విద్యాధరైః=విద్యాధరులచేత, మునిగణైః=మునుల సముదాయములచేతను, అప్సరోభిః=అప్సరః స్త్రీలచేతను, నిషేవితమ్=సేవించబడినది, నానామృగగణాకీర్ణమ్=అనేకవిధములైన మృగముల సముదాయములచేత వ్యాప్తము, బహుకన్దరశోభితమ్=అనేక గుహలచేత ప్రకాశింపచేయుబడినది అయిన, మలయపర్వతమ్=మలయపర్వతమును, ఆరురోహ=ఎక్కెను. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనూమాన్=హనుమంతుడు, తత్ర=అక్కడ, సర్వాన్=సమస్తమైన, యక్షగన్ధర్వకింనరాన్=యక్షులను గంధర్వులను కింనరులను, ఆకులయన్=వ్యాకులమగునట్లు చేయుచు, మేఘసంకాశః=మేఘముతో సమానుడై, వవృధే=వృద్ధి పొందెను.

తా. హనుమంతుడు ఆ త్రికూటపర్వతమునుండి మేరు-మందర పర్వతములతో సమానమైన మలయపర్వతముపైకి ఎక్కెను. ఆ పర్వతము అనేకజలపాతములతో వ్యాకులమై అనేకవిధములైన వృక్షములతోను, లతలతోను వ్యాప్తమై ఉండెను. వికసించుచున్న పద్మములతోను, కలవలతోను నిండియుండెను. అరవై యోజనముల ఎత్తైన ఆ పర్వతముమీద దేవతలు, గంధర్వులు, విద్యాధరులు, మునులు, అప్సరసలు నివసించుచుందురు. అనేకమైన గుహలతో ప్రకాశించుచున్న ఆ పర్వతము అనేకవిధములైన మృగముల గుంపులతో నిండియుండెను. వాయుకుమారుడైన హనుమంతుడు అక్కడ ఉన్న యక్ష-గంధర్వ-కింనరులకు భయము పుట్టించుచు మేఘము వలె శరీరమును పెంచెను.

వి. ఈ నాలుగు శ్లోకాలు (42-45) కొన్ని ప్రతులలో లేవు. లేకుండుటయే సమంజసము. లంకలో ఉన్న హనుమంతుడు సముద్రము దాటుటకు ముందే దక్షిణతీరమునందున్న మలయమును ఎక్కుట అసంభావ్యము కదా! ఇక్కడ బయలుదేరి మలయపర్వతముమీద ఆగి మరల హిమాలయంవైపు వెళ్ళినట్లు చెప్పుట పనితొందరలో ఉన్న హనుమంతుని మహాబలానికి అనుచితము.

మూ. పద్భ్యాం తు శైలమావిధ్య బడబాముఖవన్ముఖమ్,
వివృత్యోగ్రం ననాదోచ్చైస్త్రాసయన్ రజనీచరాన్. 46

ప్ర. అ. శైలమ్=పర్వతమును, పద్భ్యామ్=పాదములచేత, ఆవిధ్య=కొట్టి, బడబాముఖవత్=బడబ (సముద్రములో నివసించుచు అగ్నిజ్వాలలను కక్కు ఆడగుఱ్ఱము) ముఖమువంటి, ఉగ్రమ్=భయంకరమైన, ముఖమ్=ముఖ

మును, వివృత్య=తెరచి, రజనీచరాన్=రాక్షసులను, త్రాసయన్=భయపెట్టుచు, ఉచ్చైః=గట్టిగా, ననాద=ధ్వనిచేసెను.

తా. పాదాలతో పర్వతమును గట్టిగా నొక్కి పట్టి, బడబాముఖము వంటి భయంకరమైన ముఖమును తెరచి, రాక్షసులను భయపెట్టుచు బిగ్గరగా గర్జించెను. 46

మూ. తస్య నానద్యమానస్య శ్రుత్వా నినదముత్తమమ్,
లఙ్కాస్థా రాక్షసవ్యాఘ్రా న శేకుః స్పన్దితుం క్వచిత్. 47

ప్ర. అ. నానద్యమానస్య=అధికముగా ధ్వనిచేయుచున్న, తస్య=వానియొక్క, ఉత్తమమ్=గొప్పదైన, నినదమ్=ధ్వనిని, శ్రుత్వా=విని, లఙ్కాస్థాః=లంకలో ఉన్న, రాక్షసవ్యాఘ్రాః=రాక్షసశ్రేష్ఠులు, క్వచిత్=ఎక్కడా కూడ, స్పన్దితుమ్=కదలుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. బిగ్గరగా గర్జించుచున్న ఆతని ధ్వనిని విని లంకలో ఉన్న రాక్షసవీరులు ఎక్కడా కూడ కదలలేకపోయిరి. 47

మూ. నమస్కృత్వా సముద్రాయ మారుతిర్భీమవిక్రమః,
రాఘవార్థే పరం కర్మ సమీహత పరంతపః. 48

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమముగల, పరంతపః=శత్రుసంహారకుడైన, మారుతిః=హనుమంతుడు, సముద్రాయ=సముద్రమునకు, నమస్కృత్వా=నమస్కరించి, రాఘవార్థే=రాముని నిమిత్తమై, పరమ్=శ్రేష్ఠమైన, కర్మ=కర్మను, సమీహత=అభిలషించెను.

తా. భయంకరమైన పరాక్రమము గల, శత్రుసంహారకుడైన హనుమంతుడు సముద్రమునకు నమస్కరించి, రామునికొరకై గొప్ప పనిచేయుటకు ఇచ్ఛయించెను. 48

మూ. స పుచ్ఛముద్యమ్య భుజఙ్గకల్పం
వినమ్య పృష్ఠం శ్రవణే నికుచ్య,
వివృత్య వక్త్రం బడబాముఖాభ
మాపుప్లువే వ్యోమ్ని సచణ్డవేగః. 49

ప్ర. అ. సః=హనుమంతుడు, భుజఙ్గకల్పమ్=సర్పముతో సమానమైన, పుచ్ఛమ్=తోకను, ఉద్యమ్య=ఎత్తి, పృష్ఠమ్=వీపును, వినమ్య=వంచి, శ్రవణే=చెవులను, నికుచ్య=వంచి, బడబాముఖాభమ్=బడబాముఖమువంటి కాంతి గల, వక్త్రమ్=ముఖమును, వివృత్య=తెరచి, సచణ్డవేగః=తీవ్రమైన వేగముతో కూడినవాడై,

వ్యోమ్ని=ఆకాశమునందు, ఆపుప్లువే=ఎగిరెను.

తా. హనుమంతుడు మహాసర్పము వలె ఉన్న తోకను పైకెత్తి, నడుము వంచి, చెవులు మణుచుకొని బడబాముఖము వంటి ముఖమును తెరచి, తీవ్రమైన వేగముతో ఆకాశమునందు ఎగిరెను. 49

మూ. సవృక్షఖణ్డాంస్తరసా జహార
శైలాన్ శిలాః ప్రాకృతవానరాంశ్చ,
బాహూరువేగోద్ధతసంప్రణున్నా
స్తే క్షీణవేగాః సలిలే నిపేతుః. 50

ప్ర. అ.సః=అతడు, తరసా=వేగముచేత, వృక్షఖణ్డాన్=వృక్షముల సముదాయములను, శైలాన్=పర్వతములను, శిలాః=శిలలను, ప్రాకృతవానరాంశ్చ= సామాన్యులైన వానరులను, జహార=హరించెను. బాహూరువేగోద్ధతసంప్రణున్నాః= బాహువులనుండి ఊరువులనుండి బయలుదేరిన వేగముచేత ఎగురగొట్టబడిన, తే=అవి, క్షీణవేగాః=క్షీణమైన వేగము గలవై, సలిలే=జలమునందు, నిపేతుః=పడినవి.

తా. ఆ హనుమంతుడు తన వేగముచేత వృక్షముల సముదాయములను, శైలములను, శిలలను, సామాన్యవానరులను లాగికొనిపోయెను. బాహువులనుండి, తొడలనుండి బయలుదేరిన వేగముచేత ఎగురగొట్టబడిన ఆ వృక్షాదులు వేగము తగ్గగా నీటిలో పడిపోయినవి. 50

మూ. స తౌ ప్రసార్యోరగభోగకల్పౌ
భుజౌ భుజంగారినికాశవీర్యః,
జగామ శైలం నగరాజమగ్ర్యం
దిశః ప్రకర్షన్నివ వాయుసూనుః. 51

ప్ర. అ. భుజంగారినికాశవీర్యః=గరుత్మంతునితో సమానమైన పరాక్రమము గల, సః వాయుసూనుః=ఆ హనుమంతుడు, ఉరగభోగకల్పౌ=సర్పశరీరము లతో సమానములైన, భుజౌ=భుజములను, ప్రసార్య=చాపి, దిశః=దిక్కులను, ప్రకర్షన్నివ=లాగుచున్నాడా అన్నట్లు, అగ్ర్యమ్=శ్రేష్ఠమైన, శైలమ్=పర్వతమైన, నగరాజమ్=హిమవత్పర్వతమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. గరుత్మంతుని వంటి పరాక్రమము గల ఆ హనుమంతుడు సర్పశరీరముల వంటి బాహువులను చాపి, దిక్కులను లాగుచున్నాడా అన్నట్లు ఎగిరి వెళ్ళి పర్వతములలో శ్రేష్ఠమైన హిమవత్పర్వతమునకు వెళ్లెను. 51

మూ. స సాగరం ఘూర్ణితవీచిమాలం
తథామ్బసా భ్రామితసర్వసత్త్వమ్,
సమీక్షమాణః సహసా జగామ
చక్రం యథా విష్ణుకరాగ్రముక్తమ్. 52

ప్ర. అ. సః=అతడు, ఘూర్ణితవీచిమాలమ్=త్రిప్పబడిన తరంగపంక్తి గల, తథా=మరియు, అమ్బసా=జలముచేత, భ్రామితసర్వసత్త్వమ్=త్రిప్పబడిన సకల జంతువులూ గల, సాగరమ్=సముద్రమును, సమీక్షమాణః=చూచుచు, సహసా=శీఘ్రముగా, విష్ణుకరాగ్రముక్తమ్=విష్ణువుయొక్క హస్తాగ్రముచేత విడవబడిన, చక్రం యథా=చక్రమువలె, జగామ=వెళ్ళెను.

తా. హనుమంతుడు తిరుగుచున్న తరంగపంక్తులతో నిండిన ఉదకముచేత అన్ని జంతువులను త్రిప్పివేయుచున్న సముద్రమును చూచుచు విష్ణుహస్తాగ్రముచేత విడువబడిన చక్రమువలె శీఘ్రముగా వెళ్లెను. 52

మూ. స పర్వతాన్ పక్షిగణాన్ సరాంసి
నదీస్తటాకాని పురోత్తమాని,
స్ఫీతాన్ జనాంస్తానపి సంప్రవీక్ష్య
జగామ వేగాత్పితృతుల్యవేగః. 53

ప్ర. అ. పితృతుల్యవేగః=తండ్రితో సమానమైన వేగము గల, సః=అతడు, పర్వతాన్=పర్వతములను, పక్షిగణాన్=పక్షిసముదాయములను, సరాంసి=సరస్సులను, నదీః=నదులను, తటాకాని=చెరువులను, పురోత్తమాని=శ్రేష్ఠములైన పట్టణములను, తాన్=ఆ, స్ఫీతాన్=అధికమైన, జనాన్ అపి=జనులను, సంప్రవీక్ష్య=చూచి, వేగాత్=వేగమువలన, జగామ=వెళ్లెను.

తా. తండ్రితో సమానమైన పరాక్రమము గల ఆ హనుమంతుడు పర్వతములను, పక్షుల సముదాయములను, సరస్సులను, పెద్ద చెరువులను, నదులను, చెరువులను, శ్రేష్ఠములైన పురములను, జనసముదాయములను చూచుచు, వేగముగా వెళ్ళెను. 53

మూ. ఆదిత్యపథమాశ్రిత్య జగామ స గతశ్రమః,
హనుమాంస్త్వరితో వీరః పితుస్తుల్యపరాక్రమః. 54

ప్ర. అ. పితుః=తండ్రికి, తుల్యపరాక్రమః=సమానమైన పరాక్రమము గల, వీరః=వీరుడైన, సః హనుమాన్= ఆ హనుమంతుడు, గతశ్రమః=పోయిన శ్రమగలవాడై, త్వరితః=తొందర పడుచున్నవాడై, ఆదిత్యపథమ్=సూర్యుని మార్గమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, జగామ=వెళ్లెను.

తా. తండ్రితో సమానమైన పరాక్రమము గల వీరుడైన ఆ హనుమంతుడు ఏ మాత్రము శ్రమ ఎరుగనివాడై సూర్యమార్గమును అనుసరించి శీఘ్రముగా వెళ్లెను. 54

మూ. జవేన మహతా యుక్తో మారుతిర్మారుతో యథా,
జగామ హరిశార్దూలో దిశః శబ్దేన నాదయన్. 55

ప్ర. అ. హరిశార్దూలః=వానరశ్రేష్ఠుడైన, మారుతిః=హనుమంతుడు, మారుతో యథా=వాయువు వలె, మహతా=గొప్ప, జవేన=వేగముతో, యుక్తః= కూడినవాడై, శబ్దేన=శబ్దముచేత, దిశః=దిక్కులను, నాదయన్= ధ్వనింపచేయుచు, జగామ=వెళ్లెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, వాయుదేవుడువలె, మహావేగముతో, దిక్కులను ధ్వనిచేత ప్రతిధ్వనింపచేయుచు వెళ్లెను. 55

మూ. స్మరన్ జామ్బవతో వాక్యం మారుతిర్భీమవిక్రమః,
దదర్శ సహసా చాపి హిమవన్తం మహాకపిః. 56

ప్ర. అ. భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, మహాకపిః= గొప్ప వానరుడైన, మారుతిః=హనుమంతుడు, జామ్బవతః=జాంబవంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, స్మరన్=స్మరించుచు, సహసా చాపి=శీఘ్రముగా, హిమవన్తమ్=హిమవత్పర్వతమును, దదర్శ=చూచెను.

తా. భయంకరమైన పరాక్రమము గల వానరులలో గొప్పవాడైన ఆ హనుమంతుడు జాంబవంతుని మాటలు స్మరించుచు శీఘ్రముగా వెళ్లి హిమవత్పర్వతమును చూచెను. 56

మూ. నానాప్రస్రవణోపేతం బహుకందరనిర్ఝరమ్,
శ్వేతాభ్రచయసంకాశైః శిఖరైశ్చారుదర్శనైః, 57
శోభితం వివిధైర్వృక్షైరగమత్పర్వతోత్తమమ్.

ప్ర. అ. నానాప్రస్రవణోపేతమ్=అనేకవిధములైన జలపాతములతో కూడినది, బహుకందరనిర్ఝరమ్=అనేకములైన గుహలూ, జలప్రవాహములూ కలది, శ్వేతాభ్రచయసంకాశైః=తెల్లని మేఘముల సముదాయములతో సమానములైన, చారుదర్శనైః=అందమైన దర్శనము గల, శిఖరైః=శిఖరములచేత, వివిధైః=అనేకవిధములైన, వృక్షైః= వృక్షములచేత, శోభితమ్=ప్రకాశింపచేయబడిన, పర్వతోత్తమమ్=పర్వతములలో ఉత్తమమైన హిమవత్పర్వతమును గూర్చి, అగమత్=వెళ్లెను.

తా. ఆ పర్వతోత్తమమైన హిమవత్పర్వతమునందు అనేకవిధములైన

జలపాతములు, గుహలు, జలప్రవాహములు ఉండెను. అది తెల్లని మేఘాల గుంపుల వంటి, చూచుటకు అందముగా ఉన్న శిఖరములతో ప్రకాశించుచుండెను.

మూ. స తం సమాసాద్య మహానగేన్ద్ర
మతిప్రవృద్ధోత్తమహేమశృఙ్గమ్,
దదర్శ పుణ్యాని మహాశ్రమాణి
సురర్షిసంఘోత్తమసేవితాని. 58

ప్ర. అ. సః=అతడు, అతిప్రవృద్ధోత్తమహేమశృఙ్గమ్=మిక్కిలి పెరిగిన ఉత్తమములైన బంగారు శిఖరములు గల, తం మహానగేన్ద్రమ్=ఆ గొప్ప పర్వతమును, సమాసాద్య=పొంది, సురర్షిసంఘోత్తమసేవితాని= ఉత్తమములైన సురసంఘములచేత, ఋషిసంఘములచేత సేవింపబడిన, పుణ్యాని=పవిత్రములైన, మహాశ్రమాణి= గొప్ప ఆశ్రమములను, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు చాల పెద్దవైన ఉత్తమములైన బంగారు శిఖరములు గల ఆ మహాపర్వతమును సమీపించి అక్కడ ఉత్తమములైన దేవతా సంఘములు, ఋషిసంఘములు నివసించు పవిత్రములైన గొప్ప ఆశ్రమములను చూచెను. 58

మూ. స బ్రహ్మకోశం రజతాలయం చ
శక్రాలయం రుద్రశరప్రమోక్షమ్,
హయాననం బ్రహ్మశిరశ్చ దీప్తం
దదర్శ వైవస్వతకింకరాంశ్చ. 59

ప్ర. అ. సః=అతడు, బ్రహ్మకోశమ్=బ్రహ్మదేవుని గృహమును, రజతాలయం చ=కైలాసమును, శక్రాలయమ్=దేవేంద్రుని స్థానమును, రుద్రశరప్రమోక్షమ్=రుద్రుని శరములు విడవబడు స్థానమును, హయాననమ్=హయగ్రీవుని పూజించుస్థానమును, దీప్తమ్=ప్రకాశించుచున్న, బ్రహ్మశిరః చ= బ్రహ్మదేవుని శిరస్సు పడిన స్థానమును, వైవస్వతకింకరాంశ్చ=సూర్యుని కింకరులను, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు అక్కడ బ్రహ్మదేవుని గృహమును, కైలాసమును, ఇంద్రుని గృహమును, రుద్రుడు విలాసార్థమై బాణములు విడచు స్థలమును, హయగ్రీవుని ఆరాధించు స్థానమును, ప్రకాశయుక్తమైన, రుద్రుడు బ్రహ్మదేవుని శిరస్సు ఖండించి పడగొట్టిన స్థానమును, సూర్యుని కింకరులను చూచెను. 59

మూ. వజ్రాలయం వైశ్రవణాలయం చ
సూర్యప్రభం సూర్యనిబన్ధనం చ,

బ్రహ్మాసనం శంకరకార్ముకం చ
దదర్శ నాభిం చ వసుంధరాయాః. 60

ప్ర. అ. వజ్రాలయమ్=వజ్రస్థానమును, సూర్యప్రభమ్=సూర్యునివంటి కాంతి గల, వైశ్రవణాలయం చ=కుబేరుని స్థానమును, సూర్యనిబన్ధనం చ=సూర్య నిబంధనమును, బ్రహ్మాసనమ్=బ్రహ్మ కూర్చుండు స్థానమును, శంకరకార్ముకం చ=ఈశ్వరుని ధనస్సు ఉండు స్థానమును, వసుంధరాయాః=భూమియొక్క, నాభిం చ=నాభిని (పాతాలద్వారమును), దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు బ్రహ్మదేవుడు ఇంద్రునకు వజ్రాయుధ మిచ్చిన స్థానమును, సూర్యుని వంటి కాంతి కల కుబేరుని గృహమును, ఛాయాదేవికి ప్రీతి కలిగించుటకు విశ్వకర్మ సూర్యుని కాంతి తగ్గించుటకై శాణముపై ఎక్కించుటకు సూర్యుణ్ణి బంధించిన స్థానమును, బ్రహ్మ కూర్చుండు స్థానమును, శంకరుని ధనస్సు ఉండు స్థానమును, పాతాళప్రవేశద్వారమును చూచెను. 60

మూ. కైలాసముగ్రం హిమవచ్ఛిలాం చ
తథర్షభం కాఞ్చనశైలమగ్ర్యమ్,
ప్రదీప్తసర్వౌషధిసంప్రదీప్తం
దదర్శ సర్వౌషధిపర్వతేన్ద్రమ్. 61

ప్ర. అ. ఉగ్రమ్=ఉగ్రమైన, కైలాసమ్=కైలాసపర్వతమును, హిమవచ్ఛిలాం చ=హిమవచ్ఛిల అను శిలను, తథా=మరియు, ఋషభమ్=ఋషభపర్వతమును, అగ్ర్యమ్=శ్రేష్ఠమైన, కాఞ్చనశైలమ్=మేరుపర్వతమును, ప్రదీప్తసర్వౌషధిసంప్రదీప్తమ్=ప్రజ్వలించుచున్న అన్ని ఓషధులచేత ప్రకాశింపచేయబడిన, సర్వౌషధిపర్వతేన్ద్రమ్=సమస్తమైన ఓషధులు ఉండు పర్వతశ్రేష్ఠమును, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు భయంకరమైన కైలాసపర్వతమును, హిమవచ్ఛిలను, ఋషభపర్వతమును, శ్రేష్ఠమైన మేరుపర్వతమును, ప్రజ్వలించుచున్న సమస్త ఓషధులచేత ప్రకాశింపచేయబడిన ఓషధిపర్వతమును చూచెను. 61

మూ. స తం సమీక్ష్యానలరాశిదీప్తం
విసిష్మియే వాసవదూతసూనుః,
ఆప్లుత్య తం చౌషధిపర్వతేన్ద్రం
తత్రౌషధీనాం విచయం చకార. 62

ప్ర. అ. సః=ఆ, వాసవదూతసూనుః=ఇంద్రుని దూతయైన వాయువు పుత్రుడైన హనుమంతుడు (ఇంద్రుని ఆజ్ఞ ప్రకారము వాయువు మేఘములను ప్రేరేపించుచుగాన ఆతని దూత అని చెప్పబడినాడు.) అనలరాశిదీప్తమ్=అగ్ని

రాశి వలె ప్రకాశించుచున్న, తమ్=ఆ పర్వతమును, సమీక్ష్య=చూచి, విసిష్మియే=ఆశ్చర్యపడెను. తమ్ ఓషధిపర్వతేన్ద్రమ్=శ్రేష్ఠమైన ఆ ఓషధీపర్వతమును, ఆప్లుత్య=దుమికి, తత్ర=అక్కడ, ఓషధీనామ్=ఓషధులయొక్క, విచయమ్=అన్వేషణమును, చకార=చేసెను.

తా. హనుమంతుడు అగ్ని రాశివలె ప్రజ్వలించుచున్న ఆ ఓషధి పర్వతమును చూచి ఆశ్చర్యపడి, దానిమీదకు దిగి అక్కడ ఓషధులను వెదకెను.

మూ. స యోజనసహస్రాణి సమతీత్య మహాకపిః,
దివ్యౌషధిధరం శైలం వ్యచరన్మారుతాత్మజః. 63

ప్ర. అ. మహాకపిః=గొప్ప వానరుడైన, సః మారుతాత్మజః=ఆ హనుమంతుడు, యోజనసహస్రాణి=యోజనముల సహస్రములను, సమతీత్య=దాటి, దివ్యౌషధిధరమ్=దివ్యములైన ఓషధులను ధరించు, శైలమ్=పర్వతమును, వ్యచరత్=సంచరించెను.

తా. వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు వేలకొలది యోజనములు దాటి వెళ్ళి, దివ్యములైన ఓషధు లున్న ఆ పర్వతముమీద వెదకెను. 63

మూ. మహౌషధ్యస్తతః సర్వాస్తస్మిన్ పర్వతసత్తమే,
విజ్ఞాయార్థినమాయాన్తం తతో జగ్ము రదర్శనమ్. 64

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తస్మిన్=ఆ, పర్వతసత్తమే=పర్వతశ్రేష్ఠమునందు, సర్వాః=సమస్తమైన, మహౌషధ్యః=గొప్ప ఓషధులు, అర్థినమ్=తమను కోరుచున్నవానిని, ఆయాన్తమ్=వచ్చుచున్నవానినిగా, విజ్ఞాయ=తెలిసికొని, తతః=అటుపిమ్మట, అదర్శనమ్=కనబడకపోవుటను, జగ్ముః=పొందినవి.

తా. ఆ పర్వతశ్రేష్ఠముపైన ఉన్న మహౌషధు లన్నీ తమకొరకై ఎవరో వచ్చుచున్నాడని తెలిసికొని, అప్పుడు, అదృశ్యములు అయిపోయినవి. 64

మూ. స తా మహాత్మా హనుమానపశ్యం
శ్చుకోప రోషాచ్చ భృశం ననాద,
అమృష్యమాణోఽగ్నిసమానచక్షు
ర్మహీధరేన్ద్రం తమువాచ వాక్యమ్. 65

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, తాః=వాటిని, అపశ్యన్=చూడనివాడై, చుకోప=కోపించెను. కోపాత్=కోపమువలన, భృశమ్=మిక్కిలి, ననాద చ=ధ్వని చేసెను కూడ. అగ్నిసమానచక్షుః= అగ్నితో సమానమైన నేత్రములు గల అతడు, అమృష్యమాణః=సహించనివాడై, తమ్=ఆ,

మహీధరేన్ద్రమ్= పర్వతమును గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. మహాత్ముడైన హనుమంతునకు ఆ ఓషధులు కనబడకపోవుటతోడనే కోపము వచ్చెను. అతడు కోపముతో గట్టిగా అరచెను. ఆతడు సహించనివాడై, అగ్నివలె ఎఱ్ఱగా ఉన్న నేత్రములతో ఆ పర్వతముతో ఇట్లు పలికెను. 65

మూ. కిమేతదేవం సువినిశ్చితం తే
యద్రాఘవేనాసి కృతానుకమ్పః,
పశ్యాద్య మద్బాహుబలాభిభూతో
వికీర్ణమాత్మానమథో నగేన్ద్ర. 66

ప్ర. అ. నగేన్ద్ర=పర్వతమా ! రాఘవే=రాముని విషయమున, కృతానుకమ్పః=చేయబడిన జాలిగలవాడవు, న అసి ఇతి యత్=కావు అనునది ఏది గలదో, ఏతత్=ఇది, ఏవమ్=ఇట్లు, తే=నీకు, సువినిశ్చితం కిమ్=బాగా నిశ్చితమేనా ! అథో=అట్లయితే, అద్య=ఇప్పుడు, మద్బాహుబలాభిభూతః=నా బాహువుల బలముచేత తిరస్కరించబడినవాడవై, ఆత్మానమ్= తనను, వికీర్ణమ్=హింసింపబడినవానినిగా, పశ్య=చూడుము.

తా. ఓ ! పర్వతమా ! రాముని విషయమున జాలి చూపకుండుటయే నీ నిశ్చయ మని అర్థ మగుచున్నది. సరే ! ఇప్పుడు నా బాహుబలముచేత తిరస్కరింపబడినవాడవై, హింపింపబడనున్నావు. చూచుకొనుము ! 66

మూ. స తస్య శృఙ్గం సనగం సనాగం
సకాఞ్చనం ధాతుసహస్రజుష్టమ్,
వికీర్ణకూటం జ్వలితాగ్రసానుం
ప్రగృహ్య వేగాత్సహసోత్పపాత. 67

ప్ర. అ. సః=అతడు, తస్య=ఆ పర్వతముయొక్క, సనగమ్=వృక్షములతో కూడిన, సనాగమ్= గజములతో కూడిన, సకాఞ్చనమ్=బంగారముతో కూడిన, ధాతుసహస్రజుష్టమ్=ధాతువుల సహస్రములతో కూడిన, వికీర్ణకూటమ్=విరిగిన అగ్రభాగములు గల, జ్వలితాగ్రసానుమ్=మండుచున్న చరియల చివరిభాగములు గల, శృఙ్గమ్=శిఖరమును, ప్రగృహ్య=గ్రహించి, సహసా=వెంటనే, వేగాత్=వేగమువలన, ఉత్పపాత=ఎగిరెను.

తా. హనుమంతుడు, చెట్లతోను, ఏనుగులతోను, బంగారముతోను, వేలకొలది ధాతువులతోను నిండి యున్న, విడిపోయిన అగ్రములు గల, ప్రజ్వలించు చరియలు గల ఆ పర్వతమును గ్రహించి వెంటనే వేగముగా పైకి ఎగిరెను.

మూ. స తం సముత్పాట్య ఖముత్పపాత
విత్రాస్య లోకాన్ ససురాసురేన్ద్రాన్,
సంస్తూయమానః ఖచరైరనేకై
ర్జగామ వేగాద్గరుడోగ్రవేగః. 68

ప్ర. అ. సః=అతడు, తమ్=దానిని, సముత్పాట్య=పెకలించి, ససురాసు రేన్ద్రాన్=సురాసుర నాయకులతో కూడిన, లోకాన్=లోకములను, విత్రాస్య=భయపెట్టి, ఖమ్=ఆకాశమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను. అనేకైః=అనేకులైన, ఖచరైః=ఆకాశమునందు సంచరించేవారిచేత, సంస్తూయమానః=స్తుతింపబడుచు, గరుడోగ్రవేగః=గరుత్మంతుని వంటి భయంకరమైన వేగము గలవాడై, వేగాత్=వేగమువలన, జగామ=వెళ్లెను.

తా. హనుమంతుడు ఆ పర్వతశిఖరమును పెకలించి, సురనాయకులతో, అసురనాయకులతో సహా లోకములను భయపెట్టి, అనేకులైన ఆకాశసంచారి భూతములచేత స్తుతింపబడుచు, గరుత్మంతునివంటి భయంకరమైన వేగము గలవాడై వేగముగా వెళ్లెను. 68

మూ. స భాస్కరాధ్వానమనుప్రపన్న
స్తం భాస్కరాభం శిఖరం ప్రగృహ్య,
బభౌ తదా భాస్కరసంనికాశో
రవేః సమీపే ప్రతిభాస్కరాభః. 69

ప్ర. అ. భాస్కరసంనికాశః=సూర్యునివంటి, సః=అతడు, భాస్కరాభమ్=సూర్యునివంటి కాంతి గల, తం శిఖరమ్= ఆ శిఖరమును, ప్రగృహ్య=గ్రహించి, భాస్కరాధ్వానమ్=సూర్యుని మార్గమును, అనుప్రపన్నః=పొందినవాడై, తదా=అప్పుడు, రవేః=సూర్యునియొక్క, సమీపే=సమీపమునందు, ప్రతిభాస్కరాభః=రెండవ సూర్యుని వంటి కాంతి గలవాడై, బభౌ=ప్రకాశించెను.

తా. సూర్యునివంటి కాంతి గల ఆ శిఖరమును గ్రహించి సూర్యమార్గములో (ఆకాశములో) ఎగురుచున్న సూర్యునివంటి కాంతి గల ఆ హనుమంతుడు, సూర్యుని దగ్గర రెండవ సూర్యుడు (సూర్యప్రతిబింబము) వలె ప్రకాశించెను. 69

మూ. స తేన శైలేన భృశం రరాజ
శైలోపమో గన్ధవహాత్మజస్తు,
సహస్రధారేణ సపావకేన
చక్రేణ ఖే విష్ణురివార్పితేన. 70

ప్ర. అ. శైలోపమః=పర్వతముతో సమానుడైన, సః=ఆ, గన్ధవహాత్మజః=హనుమంతుడు, తేన శైలేన=ఆ పర్వతముతో, ఖే=ఆకాశమునందు, అర్పితేన=ప్రయోగించబడిన, సహస్రధారేణ=వేయి అంచులు గల, సపావకేన=అగ్నితో కూడిన, చక్రేణ=చక్రముతో, విష్ణురివ=విష్ణువు వలె, భృశమ్=మిక్కిలి, రరాజ=ప్రకాశించెను.

తా. పర్వతమువంటి ఆ హనుమంతుడు ఆ పర్వతముతో, ఆకాశమునందు ప్రయోగించిన, వేయి అంచులు గల, అగ్నితో కూడిన చక్రముతో విష్ణువు వలె మిక్కిలి ప్రకాశించెను. 70

మూ. తం వానరాః ప్రేక్ష్య తదా వినేదుః
స తావపి ప్రేక్ష్య ముదా ననాద,
తేషాం సముత్కృష్టరవం నిశమ్య
లఙ్కాలయా భీమతరం వినేదుః. 71

ప్ర. అ. తదా=అప్పుడు, వానరాః=వానరులు, తమ్=ఆతనిని, ప్రేక్ష్య=చూచి, వినేదుః=ధ్వనిచేసిరి. సః అపి=అతడు కూడ, తాన్=వాళ్ళను, ప్రేక్ష్య=చూచి, ముదా=సంతోషముతో, ననాద=ధ్వని చేసెను. తేషామ్=వాళ్ళయొక్క, సముత్కృష్టరవమ్=చాల అధికమైన ధ్వనిని, నిశమ్య=విని, లఙ్కాలయాః=లంకలో నివసించువారు, భీమతరమ్= చాల భయంకరముగా, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. అప్పుడు వానరులు హనుమంతుణ్ణి చూచి ధ్వనిచేసిరి. హనుమంతుడు కూడ వాళ్ళను చూడగానే ధ్వని చేసెను. వాళ్ళు చేసిన ఆ అత్యధికమైన ధ్వనిని విని లంకలో ఉన్న వాళ్ళందరూ చాల భయంకరముగా అరచిరి. 71

మూ. తతో మహాత్మా నిపపాత తస్మిన్
శైలోత్తమే వానరసైన్యమధ్యే,
హర్యుత్తమేభ్యః శిరసాభివాద్య
విభీషణం తత్ర చ సస్వజే సః. 72

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మహాత్మా=మహాత్ముడైన హనుమంతుడు, తస్మిన్=ఆ, శైలోత్తమే=ఉత్తమమైన పర్వతమునందు, వానరసైన్యమధ్యే=వానరసైన్యమధ్యమునందు, నిపపాత=దిగెను. సః=అతడు, హర్యుత్తమేభ్యః=వానరశ్రేష్ఠులకు, శిరసా=శిరస్సుచేత, అభివాద్య=నమస్కరించి, తత్ర=అక్కడ, విభీషణమ్=విభీషణుణ్ణి, సస్వజే చ=కౌగలించుకొనెను.

తా. పిమ్మట మహాత్ముడైన ఆ హనుమంతుడు ఆ ఉత్తమమైన

పర్వతముమీద వానరసైన్యమధ్యమునందు దిగి అక్కడ ఉన్న పెద్దలైన వానరులకు శిరస్సు వంచి నమస్కారము చేసి విభీషణుణ్ణి కౌగలించుకొనెను.

మూ. తావప్యుభౌ మానుషరాజపుత్రౌ
తం గన్ధమాఘ్రాయ మహౌషధీనామ్,
బభూవతుస్తత్ర తదా విశల్యా
వుత్తస్థురన్యే చ హరిప్రవీరాః. 73

ప్ర. అ. తౌ=ఆ, మానుషరాజపుత్రౌ=దశరథపుత్రులు, ఉభౌ=ఇరువురు, మహౌషధీనామ్=గొప్ప ఓషధులయొక్క, తం గన్ధమ్=ఆ వాసనను, ఆఘ్రాయ=వానసచూచి, తదా=అప్పుడు, విశల్యౌ=శల్యములు లేనివారు, బభూవతుః=అయిరి. అన్యే=ఇతరులైన, హరిప్రవీరాశ్చ=వానరవీరులు కూడ, ఉత్తస్థుః=లేచిరి.

తా. అప్పుడు మహౌషధుల వాసనను ఆఘ్రాణించగానే రామలక్ష్మణు లిద్దరి శల్యములూ తొలగిపోయినవి. ఇతరులైన వానరనాయకులు కూడ లేచిరి.

మూ. సర్వే విశల్యా విరుజాః క్షణేన
హరిప్రవీరాశ్చ హతా శ్చ యే స్యుః,
గన్ధేన తాసాం ప్రవరౌషధీనాం
సుప్తా నిశాన్తే ష్వివ సంప్రబుద్ధాః. 74

ప్ర. అ. సర్వే=సమస్తమైన, యే=ఏ, హరిప్రవీరాః=వానరవీరులు, హతాః=చంపబడినవారై, స్యుః=ఉండిరో, వారు, తాసామ్=ఆ, ప్రవరౌషధీనామ్=శ్రేష్ఠమైన ఓషధులయొక్క, గన్ధేన=గంధముచేత, క్షణేన=క్షణముచేత, విశల్యాః=పోయిన శల్యముల గలవారై, విరుజాః=పోయిన బాధకలవారై, సుప్తాః=నిద్రపోయినవారు, నిశాన్తే ష్వివ=తెల్లవారుజామునందు వలె, సంప్రబుద్ధాః=లేచినారు.

తా. మరణించిన వానరు లందరూ కూడ శ్రేష్ఠములైన ఆ ఓషధుల వాసన తగలగానే క్షణకాలములో, నిద్రించినవారు తెల్లవారుజామున మేల్కొన్నట్లు లేచిరి. 75

మూ. యదాప్రభృతి లఙ్కాయాం యుధ్యన్తే హరిరాక్షసాః,
తదాప్రభృతి మానార్థమాజ్ఞయా రావణస్య చ. 76
యే హన్యన్తే రణే తత్ర రాక్షసాః కపికుఞ్జరైః,
హతా హతాస్తు క్షిప్యన్తే సర్వ ఏవ తు సాగరే. 77

ప్ర. అ. యదాప్రభృతి=ఏనాడు మొదలుకొని, లఙ్కాయామ్=లంకయందు, హరిరాక్షసాః=వానరులు రాక్షసులు, యుధ్యన్తే=యుద్ధము చేయుచున్నారో,

తదాప్రభృతి=ఆనాడు మొదలు, మానార్థమ్=గౌరవముకొరకును, రావణస్య=రావణునియొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేతను, తత్ర రణే=ఆ యుద్ధమునందు, యే=ఏ, రాక్షసాః=రాక్షసులు, కపికుఞ్జరైః=శ్రేష్ఠులైన వానరులచేత, హన్యన్తే=చంపబడుచున్నారో, సర్వే ఏవ తు=వాళ్లందరూ, హతాః హతాః=చంపబడగా, సాగరే=సముద్రమునందు, క్షిప్యన్తే=పడవేయబడుచున్నారు.

తా. లంకలో వానరరాక్షసుల మధ్య యుద్ధము ప్రారంభ మైనదిమొదలు, రాక్షసులు చావలేదు అని గొప్పలు చెప్పుకొనుటకూ, రావణుని ఆజ్ఞప్రకారమూ కూడ, ఆ యుద్ధములో వానరులచే చంపబడిన రాక్షసుల నందరినీ, చచ్చినవాళ్లను చచ్చిన వెంటనే, సముద్రములో పడవేయుచుండెడివారు.

వి. ఈ ఓషధుల వాసన తగిలిన వెంటనే చచ్చిన వానరు లందరూ లేచినట్లు చచ్చిన రాక్షసు లందరూ కూడ లేచి ఉందురు కదా అను ప్రశ్నకు సమాధానంగా ఈ శ్లోకాలను ఎవరో చేర్చినట్లు కనబడుచున్నది. అంత మహావానరసైన్యమధ్యనుండి రాక్షసులను ఏరి సముద్రములో పడవేయుట అసంభావ్యము. ఆ రోజున ఇంద్రజిత్తు చేతిలో చచ్చిన వానరు లందరూ లేచినారనో, ఆ మహౌషధులు ఎవరికొరకై తీసికొని రాబడునో వారు మాత్రమే జీవించారు; ఇది వాటి మహాత్మ్యము అనో సమాధానం చెప్పుకొనవచ్చును కదా? పై రెండు శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. 76, 77.

మూ. తతో హరిర్గన్ధవహాత్మజస్తు
తమోషధీశైలముదగ్రవేగః,
వినాయ వేగాద్ధిమవన్తమేవ
పునశ్చ రామేణ సమాజగామ. 78

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే చతుఃసప్తతితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ఉదగ్రవేగః=తీవ్రమైన వేగముగల, గన్ధవహాత్మజః=వాయుపుత్రుడైన, హరిః= వానరుడు, తమ్=ఆ, ఓషధీశైలమ్=ఓషధిపర్వతమును, వేగాత్=వేగమువలన, హిమవన్తమేవ=హిమవత్పర్వతమునే, వినాయ=పొందించెను. పునశ్చ=మరల, రామేణ=రామునితో, సమాజగామ=కలిసెను.

తా. పిమ్మట తీవ్రమైన వేగము గల వాయుపుత్రుడైన హనుమంతుడు ఆ ఓషధీపర్వతమును హిమాలయపర్వతమువద్దకు తీసికొనిపోయి అక్కడ చేర్చి, మరల రాముని సన్నిధిని నిలచెను. 78

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో డెబ్బదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చసప్తతితమః సర్గః

[వానరులు లంకను కాల్చుట; రాక్షసులకు వానరులకు మధ్య ఘోరయుద్ధము జరుగుట]

మూ. తతోఽబ్రవీన్మహాతేజాః సుగ్రీవో వానరేశ్వరః,
అర్థ్యం విజ్ఞాపయంశ్చాపి హనూమన్తమిదం వచః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరేశ్వరః=వానరరాజైన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సుగ్రీవః=సుగ్రీవుడు, విజ్ఞాపయన్ చ అపి=విషయమును తెలుపుచు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అర్థ్యమ్=అర్థయుక్తమైన, ఇదమ్=ఈ, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట మహాతేజఃశాలియైన వానరరాజైన సుగ్రీవుడు, చేయవలసిన విషయమును తెలుపుచు హనుమంతునితో అర్థయుక్తమైన వచనమును ఇట్లు పలికెను. 1

మూ. యతో హతః కుమ్భకర్ణః కుమారాశ్చ నిషూదితాః,
నేదానీముపనిర్హారం రావణో దాతుమర్హతి. 2

ప్ర. అ. యతః=ఎందువలన, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, హతః=చంపబడినాడో, కుమారాశ్చ=కుమారులు కూడ, నిషూదితాః=సంహరించబడినారో, అందువలన, రావణః=రావణుడు, ఇదానీమ్=ఇప్పుడు, ఉపనిర్హారమ్=యుద్ధభోజనమును, దాతుమ్=ఇచ్చుటకు, న అర్హతి=తగడు.

తా. కుంభకర్ణుడు, నలుగురు పుత్రులు చంపబడినారు గాన, ఇప్పుడు రావణుడు నగరమునుండి బైటకు వచ్చి మనకు యుద్ధభోజనమును ఇవ్వజాలడు.

మూ. యే యే మహాబలాః సన్తి లఘవశ్చ ప్లవంగమాః,
లఙ్కామభిపతన్త్వాశు గృహ్యోల్కాః ప్లవగర్షభాః, 3
హరయో హరిసంకాశాః ప్రదగ్ధుం రావణాలయమ్.

ప్ర. అ. మహాబలాః=గొప్పబలము గలవారు, లఘవశ్చ=శీఘ్రముగా పనిచేయువారు, ప్లవగర్షభాః=వానరులలో శ్రేష్ఠులూ అయిన, యే యే=ఏ యే, ప్లవంగమాః=వానరులు, సన్తి=ఉన్నారో, హరిసంకాశాః=సింహములతో సమా

నులైన, హరయః=ఆ వానరులు, ఉల్కాః=అగ్నిజ్వాలలను, గృహ్యా=గ్రహించి, రావణాలయమ్=రావణుని నివాసమును, ప్రదగ్ధుమ్=కాల్చుటకు, అశు=శీఘ్రముగా, లఙ్కామ్=లంకను గూర్చి, అభిపతన్తు=వెళ్లెదరుగాక.

తా. గొప్ప బలము గల వానరశ్రేష్ఠులైన, సింహములతో సమానులైన వానరు లందరూ ఉల్కలను చేతపట్టు కొని రావణుని నివాసమును కాల్చివేయుటకై లంకలోనికి శీఘ్రముగా వెళ్లెదరుగాక. 3

మూ. తతో౽స్తం గత ఆదిత్యే రౌద్రే తస్మిన్నిశాముఖే, 4
లఙ్కామభిముఖాః సోల్కా జగ్ముస్తే ప్లవగర్షభాః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ఆదిత్యే=సూర్యుడు, అస్తంగతే=అస్తమించిన వాడగుచుండగా, రౌద్రే=భయంకరమైన, తస్మిన్=ఆ, నిశాముఖే=సాయంసమయ మునందు, తే=ఆ, ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు, సోల్కాః=ఉల్కలతో కూడినవారై, లఙ్కామ్ అభిముఖాః=లంకాభిముఖులై, జగ్ముః=వెళ్లిరి.

తా. పిమ్మట సూర్యాస్తమయానంతరము, భయంకరమైన ఆ సాయం కాలసమయమునందు వానరశ్రేష్ఠులు అగ్నిజ్వాలలను పట్టుకొని లంక వైపు వెళ్లిరి. 4

మూ. ఉల్కాహస్తైర్హరిగణైః సర్వతః సమభిద్రుతాః, 5
ఆరక్షస్థా విరూపాక్షాః సహసా విప్రదుద్రువుః.

ప్ర. అ. ఉల్కాహస్తైః=ఉల్కలు హస్తములందు గల, హరిగణైః=వానరసము దాయములచేత, సర్వతః=అన్ని వైపులా, సమభిద్రుతాః=చుట్టూ ఆక్రమింపబడిన, ఆరక్షస్థాః=రక్షణస్థానములలో ఉన్న, విరూపాక్షాః=వికృతములైన నేత్రములు గల రాక్షసులు, సహసా=వెంటనే, విప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. వానరులు ఉల్కలు చేతులలో గ్రహించి నలువైపులనుండి ఆక్రమించగా, రక్షణస్థానములలో ఉన్న వికృతనేత్రములు గల రాక్షసులు వెంటనే పారిపోయిరి. 5

మూ. గోపురాట్టప్రతోలీషు చర్యాసు వివిధాసు చ, 6
ప్రాసాదేషు చ సంహృష్టాః ససృజుస్తే హుతాశనమ్.

ప్ర. అ. సంహృష్టాః=సంతోషించిన, తే=ఆ వానరులు, గోపురాట్టప్రతోలీషు=పురద్వారములయందు, ప్రాకారముమీద ఉన్న రక్షణగృహములయందు, వీథులయందు, వివిధాసు=అనేకవిధములైన, చర్యాసు= సందులయందు, ప్రాసాదేషు చ=ప్రాసాదములయందు, హుతాశనమ్=అగ్నిని, ససృజుః=విడచిరి.

తా. ఆ వానరులు సంతోషించుచు పురద్వారములయందు, ప్రాకారము లపైన ఉండు రక్షాగృహములయందు, వీథులయందు, అనేకములైన సందులలోను అగ్నిని విడచిరి. 6

మూ. తేషాం గృహసహస్రాణి దదాహ హుతభుక్తదా, 7
ప్రాసాదాః పర్వతాకారాః పతన్తి ధరణీతలే.

ప్ర. అ. తదా=అప్పుడు, హుతభుక్=అగ్ని, తేషామ్=ఆ రాక్షసుల యొక్క, గృహసహస్రాణి= గృహములయొక్క సహస్రములను, దదాహ=కాల్చెను. పర్వతాకారాః=పర్వతములవంటి ఆకారములు గల, ప్రాసాదాః=ప్రాసాదములు, ధరణీతలే=నేలమీద, పతన్తి=పడిపోయినవి.

తా. అప్పుడు అగ్ని ఆ రాక్షసుల వేలకొలది గృహములను కాల్చివేసెను. పర్వతములవంటి ప్రాసాదములు నేలపై కూలిపోయెను. 7

మూ. అగురుర్దహ్యతే తత్ర పరం చైవ సుచన్దనమ్, 8
మౌక్తికా మణయః స్నిగ్ధా వజ్రం చాపి ప్రవాలకమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, అగురుః=అగురువు, దహ్యతే=కాల్చివేయబడెను. పరమ్=శ్రేష్ఠమైన, సుచన్దనమ్=మంచి చందనము, స్నిగ్ధాః=నున్నగా ఉన్న, మౌక్తికాః= ముత్యములు, మణయః=మణులు, వజ్రం చాపి=వజ్రము, ప్రవాలకమ్=పొగడము కాల్చి వేయబడెను.

తా. అక్కడ అగురువు, శ్రేష్ఠమైన చందనము, నున్నని ముత్యములు, మణులు, వజ్రములు, పొగడములు కాల్చివేయబడెను. 8

మూ. క్షౌమం చ దహ్యతే తత్ర కౌశేయం చాపి శోభనమ్, 9
ఆవికం వివిధం చౌర్ణం కాఞ్చనం భాణ్డమాయుధమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, క్షౌమమ్=తెల్లని పట్టువస్త్రము, దహ్యతే=కాల్చివే యబడినది. శోభనమ్=అందమైన, కౌశేయం చ=పట్టువస్త్రము, ఆవికమ్=గొఱ్ఱెల ఉన్నితో నిర్మించిన వస్త్రము, వివిధమ్=అనేకవిధములైన, ఔర్ణం చ=ఇతరజంతు వుల ఉన్నితో తయారు చేసిన వస్త్రము, కాఞ్చనమ్=బంగారము వికారమైన, భాణ్డమ్=అలంకారము, ఆయుధమ్=ఆయుధము, కాల్చివేయబడెను.

తా. అక్కడ తెల్లని పట్టువస్త్రములు, పట్టుపురుగునుండి తీసిన పట్టుతో నేసిన అందమైన వస్త్రములు, గొఱ్ఱె ఉన్నితో నేసిన వస్త్రములు, ఇతరమృగముల రోమములతో నేసిన వస్త్రములు, బంగారు అలంకారములు, ఆయుధములు కాల్చివేయబడెను. 9

మూ. నానావికృతసంస్థానం వాజిభాణ్డపరిచ్ఛదమ్, 10
గజగ్రైవేయకక్ష్యాశ్చ రథభాణ్డాశ్చ సంస్కృతాః.

ప్ర. అ. నానావికృతసంస్థానమ్=అనేకవిధములైన వికారములతో కూడిన ఆకారములు గల, వాజిభాణ్డపరిచ్ఛదమ్=గుఱ్ఱముల అలంకారములు, ఇతరసామగ్రులు, గజగ్రైవేయకక్ష్యాశ్చ=ఏనుగుల కంఠాభరణములు, నడుముకు కట్టు బంధనములు, సంస్కృతాః=సంస్కరించబడిన, రథభాణ్డాశ్చ=రథముల అలంకారములు, కాల్చివేయబడినవి.

తా. అనేక ఆకారములలో ఉండు గుఱ్ఱముల అలంకారములు ఇతరసామగ్రి, ఏనుగుల కంఠాభరణములు, నడుముకు కట్టు బంధనములు, శుభ్రముగా ఉంచబడిన రథాలంకారములు కాల్చివేయబడినవి. 10

మూ. తనుత్రాణి చ యోధానాం హస్త్యశ్వానాం చ చర్మ చ, 11
ఖడ్గా ధనూంషి జ్యాబాణాస్తోమరాఙ్కుశశక్తయః.

ప్ర. అ. యోధానామ్=యోధులయొక్క, హస్త్యశ్వానాం చ=ఏనుగులయొక్క అశ్వములయొక్క, తనుత్రాణి=కవచములు, చర్మ చ=డాలు, ఖడ్గాః=ఖడ్గములు, ధనూంషి=ధనస్సులు, జ్యాః=నారులు, బాణాః=బాణములు, తోమరాఙ్కుశశక్తయః=తోమరములు, అంకుశములు, శక్తులు, (కాల్చబడినవి).

తా. యోధుల కవవచములు గజాశ్వముల కవచములు, డాళ్లు, ఖడ్గములు, ధనస్సులు, అల్లెత్రాళ్లు, బాణాలు, తోమరములు, అంకుశములు, శక్తులు దహింపబడినవి. 11

మూ. రోమజం వాలజం చర్మ వ్యాఘ్రజం చాణ్డజం బహు. 12
ముక్తామణివిచిత్రాంశ్చ ప్రాసాదాంశ్చ సమన్తతః,
వివిధానస్త్రసంఘాతానగ్నిర్దహతి తత్ర వై. 13

ప్ర. అ. అగ్నిః=అగ్ని, సమన్తతః=అంతటా, రోమజమ్=రోమములతో నిర్మించిన వస్త్రములను, వాలజమ్= తోకలనుండి జన్మించిన చామరాదులను, వ్యాఘ్రజమ్=వ్యాఘ్రమువలన పుట్టిన, చర్మ=చర్మను, బహు=అధికమైన, అణ్డజమ్=పక్షిసముదాయమును, ముక్తామణివిచిత్రాన్=ముత్యములతోను మణులతోను విచిత్రములైన, ప్రాసాదాన్ చ=ప్రాసాదములను, వివిధాన్=అనేకవిధములైన, అస్త్రసంఘాతాన్=అస్త్రసముదాయములను, తత్ర= అక్కడ, దహతి వై=కాల్చివేసెను.

తా. అక్కడ అగ్ని ఉన్ని వస్త్రములను, చామరాదులను, వ్యాఘ్రచర్మలను, అనేకపక్షులను, ముత్యములతోను, మణులతోను విచిత్రములైన ప్రాసాదములను, అనేక విధములైన అస్త్రసముదాయములను అంతటా కాల్చివేసెను. 12, 13.

మూ. నానావిధాన్ గృహాంశ్చిత్రాన్ దదాహ హుతభుక్తదా,
ఆవాసాన్ రాక్షసానాం చ సర్వేషాం గృహగృధ్నునామ్. 14
హేమచిత్రతనుత్రాణాం స్రగ్భాణ్డామ్బరధారిణామ్,
సీధుపానచలాక్షాణాం మదవిహ్వలగామినామ్, 15
కాన్తాలమ్బితవస్త్రాణాం శత్రుసంజాతమన్యునామ్.
గదాశూలాసిహస్తానాం ఖాదతాం పిబతామపి, 16
శయనేషు మహార్హేషు ప్రసుప్తానాం ప్రియైః సహ,
త్రస్తానాం గచ్ఛతాం తూర్ణం పుత్రానాదాయ సర్వతః. 17
తేషాం శతసహస్రాణి తదా లఙ్కానివాసినామ్,
అదహత్పావకస్తత్ర జజ్వాల చ పునః పునః. 18

ప్ర. అ. తదా=అప్పుడు, హుతభుక్=అగ్ని, చిత్రాన్=చిత్రములైన, నానావిధాన్=అనేక విధములైన, గృహాన్=గృహములను, గృహగృధ్నునామ్=గృహములయందు అత్యాసక్తి గల, సర్వేషామ్=సమస్తమైన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, ఆవాసాన్=గృహములను, దదాహ=కాల్చివేసెను. తత్ర=అక్కడ, పావకః=అగ్ని, హేమచిత్రతనుత్రాణామ్=బంగారముచేత చిత్రములైన కవచములు గలవారు, స్రగ్భాణ్డామ్బరధారిణామ్=పుష్పమాలలను, అలంకారములను, మంచి వస్త్రములను ధరించినవారు, సీధుపానచలాక్షాణామ్=మద్యపానముచేత చంచలమైన నేత్రములు గలవారు, మదవిహ్వలగామినామ్=మదముచేత వ్యాకులముగా నడచుచున్నవారు, శత్రుసంజాతమన్యూనామ్=శత్రువులయందు పుట్టిన కోపము గలవారు, గదాశూలాసిహస్తానామ్=గదలు, శూలములు ఖడ్గములు హస్తములందు గలవారు, ఖాదతామ్=తినుచున్నవారు, పిబతామపి=త్రాగుచున్నవారు, ప్రియైః సహ=ప్రియమైన దారల (భార్యల)తోకూడ, మహార్హేషు=గొప్ప మూల్యము గల, శయనేషు=శయనములయందు, ప్రసుప్తానామ్=నిద్రించుచున్నవారు, త్రస్తానామ్=భయపడినవారు, పుత్రాన్=పుత్రులను, ఆదాయ=తీసికొని, సర్వతః=అన్ని వైపులా, తూర్ణమ్=శీఘ్రముగా, గచ్ఛతామ్=వెళ్లుచున్నవారు అయిన, తేషామ్=ఆ, లఙ్కానివాసినామ్=లంకలో నివసించు రాక్షసులయొక్క, శతసహస్రాణి=శతములను, సహస్రములను, అదహత్=కాల్చివేసెను. పునః పునః=మాటిమాటికి, జజ్వాల చ=మండెను.

తా. అప్పుడు, అగ్ని, విచిత్రములైన, అనేకవిధములైన గృహములను, గృహమునందు అత్యాసక్తి గల అందరి రాక్షసుల నివాసములను కాల్చివేసెను. అక్కడ అగ్ని లంకలో నివసించు వందలకొలది, వేలకొలది రాక్షసులను కాల్చివేయుచు ఇంకను అధికముగా మండెను. ఆ రాక్షసులలో కొందరు బంగారముచేత విచిత్రములైన కవచములను ధరించిరి. కొందరు మాలలు,

అలంకారములు, మంచి వస్త్రములు ధరించిరి. కొందరు మద్యపానముచేత చంచలమైన కళ్లతో మదముచేత తూలుచు నడచుచుండిరి. కొందరు కాంతల వస్త్రములను లాగుచుండిరి. కొందరు శత్రువులమీద కోపముతో గదా-శూల-ఖడ్గములు హస్తములతో ధరించి ఉండిరి. కొందరు తినుచూ త్రాగుచూ ఉండిరి. కొందరు ప్రియురాళ్లతో కూడ అమూల్యములైన శయనముల మీద శయనించి ఉండిరి. కొంతమంది భయపడి పుత్రభార్యాదులను వెంటబెట్టుకొని పారిపోవుచుండిరి. 14-18

మూ. పారవన్తి మహార్హాణి గమ్భీరగుణవన్తి చ,
హేమచన్ద్రార్ధచన్ద్రాణి చన్ద్రశాలోత్తమాని చ. 19
తత్ర చిత్రగవాక్షాణి సాధిష్ఠానాని సర్వశః,
మణివిద్రుమచిత్రాణి స్పృశన్తీవ దివాకరమ్. 20
క్రౌఞ్చబర్హిణవీణానాం భూషణానాం చ నిఃస్వనైః,
నాదితాన్యచలాభాని వేశ్మాన్యగ్నిర్దదాహ హ. 21

ప్ర. అ. తత్ర=అక్కడ, అగ్నిః=అగ్ని, సారవన్తి=ధనము గలవి, మహార్హాణి=చాల విలువగలవి, గమ్భీరగుణవన్తి చ=గంభీరములు, మంచి సౌంద ర్యాదిగుణములు గలవి, హేమచన్ద్రార్ధచన్ద్రాణి=బంగారముతో నిర్మించిన చంద్రాకారము, అర్ధచంద్రాకారము గలవి, చన్ద్రశాలోత్తమాని చ=పైన నిర్మించిన గృహములచే (అంతస్తులచే) ఉత్తమములు, చిత్రగవాక్షాణి=చిత్రములైన **కిటికీలు** కలవి, సర్వశః=అంతటా, సాధిష్ఠానాని=శయనాసనాదులతో కూడినవి, **మణివి** ద్రుమచిత్రాణి=మణులచేత, పగడముల చేత చిత్రములు, దివాకరమ్=సూర్యుణ్ణి, స్పృశన్తీవ=స్పృశించుచున్నట్లున్నవి. క్రౌఞ్చబర్హిణవీణానామ్=క్రౌంచపక్షులయొక్క, నెమళ్లయొక్క, వీణలయొక్క, భూషణానాం చ=అలంకారములయొక్క, నిస్వనైః= ధ్వనులచేత, నాదితాని=ధ్వనింపచేయబడినవి, అచలాభాని=పర్వతములవంటి శోభ కలవి అయిన, వేశ్మాని=గృహములను, దదాహ హ=కాల్చెను.

తా. అక్కడ అగ్ని సూర్యుణ్ణి స్పృశించుచున్నవా అన్నట్లు ఉన్న పర్వతములవంటి, ధనసమృద్ధములైన గృహములను దహించివేసెను. చాల అందమైన ఆ గృహములు ఎన్నో వాకిళ్లతో చాల గంభీరములుగా ఉండెను. బంగారముతో కొన్ని పూర్ణచంద్రాకారములోను, కొన్ని అర్ధచంద్రాకారములోను నిర్మింపబడెను. అందమైన పై అంతస్తులు గల ఆ గృహములు అన్ని వైపులా విచిత్రములైన కిటికీలు అమర్చబడెను. మణులతోను, పగడములతోను విచిత్రములైన ఆ గృహములు శయనములతో ఆసనములతో నిండియుండెను. క్రౌంచపక్షుల కూతలతోను, నెమ్మళ్ళ కేకాధ్వనులతోను, వీణావాదనములతోను,

అలంకారముల ధ్వనులతోను అవి ప్రతిధ్వనించుచుండెను. 19-21

మూ. జ్వలనేన పరీతాని తోరణాని చకాశిరే,
విద్యుద్భిరివ నద్ధాని మేఘజాలాని ఘర్మగే. 22

ప్ర. అ. జ్వలనేన=అగ్నిచేత, పరీతాని=చుట్టబడిన, తోరణాని=తోరణములు, ఘర్మగే=వర్షర్తుప్రారంభమునందు, విద్యుద్భిః=మెరపులతో, నద్ధాని=కూడిన, మేఘజాలానీవ=మేఘపంక్తుల వలె, చకాశిరే=ప్రకాశించినవి.

తా. అగ్ని చుట్టుముట్టిన ముఖద్వారములు, వర్షాకాలప్రారంభమునందు మెరుపులతో వ్యాప్తములైన మేఘసముదాయములు వలె ఉండెను. 22

మూ. జ్వలనేన పరీతాని గృహాణి ప్రచకాశిరే,
దావాగ్నిదీప్తాని యథా శిఖరాణి మహాగిరేః. 23

ప్ర. అ. జ్వలనేన=అగ్నిచేత, పరీతాని=చుట్టబడిన, గృహాణి=గృహములు, మహాగిరేః=మహాపర్వతముయొక్క, దావాగ్నిదీప్తాని=దావాగ్నిచేత ప్రజ్వలింపచేయబడిన, శిఖరాణి యథా=శిఖరముల వలె, ప్రచకాశిరే=ప్రకాశించినవి.

తా. చుట్టూ అగ్ని ఉన్న భవనములు దావాగ్నిచేత ప్రజ్వలించుచున్న మహాపర్వతశిఖరముల వలె ప్రకాశించినవి. 23

మూ. విమానేషు ప్రసుప్తాశ్చ దహ్యమానా వరాఙ్గనాః,
త్యక్తాభరణసర్వాఙ్గా హా హేత్యుచ్చైర్విచుక్రుశుః. 24

ప్ర. అ. విమానేషు=విమానములయందు, ప్రసుప్తాః=నిద్రించుచున్న, దహ్యమానాః=కాల్చివేయబడుచున్న, వరాఙ్గనాః=ఉత్తమస్త్రీలు, త్యక్తాభరణసర్వాఙ్గాః=విడువబడిన ఆభరణములు గల సమస్త అవయవములు గలవారై, హా హా ఇతి=హా హా అని, ఉచ్చైః=బిగ్గరగా, విచుక్రుశుః=అరచిరి.

తా. విమానాలలో (గృహాలలో) నిద్రించుచున్న ఉత్తమస్త్రీలు సమస్త అవయవములందున్న అలంకారములు జారిపోవుచుండగా అయ్యో! అయ్యో! అని బిగ్గరగా ఏడ్చిరి. 24

మూ. తత్ర చాగ్నిపరీతాని నిపేతుర్భవనాన్యపి,
వజ్రివజ్రహతానీవ శిఖరాణి మహాగిరేః. 25

ప్ర. అ. తత్ర=అక్కడ, అగ్నిపరీతాని=అగ్నిచేత చుట్టబడిన, భవనాన్యపి=భవనములు కూడ, వజ్రివజ్రహతాని=ఇంద్రుని వజ్రాయుధముచేత కొట్టబడిన, మహాగిరేః=గొప్ప పర్వతముయొక్క, శిఖరాణీవ=శిఖరములు వలె, నిపేతుః=పడి

పోయినవి.

తా. అక్కడ అగ్నిచేత వ్యాప్తములైన భవనములు ఇంద్రుని వజ్రాయుధ మ్ముచేత ఛేదించబడిన మహాపర్వతశిఖరముల వలె పడిపోయినవి.

మూ. తాని నిర్దహ్యమానాని దూరతః ప్రచకాశిరే,
హిమవచ్ఛిఖరాణీవ దహ్యమానాని సర్వశః. 26

ప్ర. అ. నిర్దహ్యమానాని=కాల్చబడుచున్న, తాని=ఆ గృహములు, సర్వశః=అన్ని వైపులా, దహ్యమానాని=కాల్చివేయబడుచున్న, హిమవచ్ఛిఖరాణీవ=హిమవత్పర్వతశిఖరముల వలె, దూరతః=దూరమునుండి, ప్రచకాశిరే=ప్రకాశించినవి.

తా. అన్ని వైపులా కాల్చివేయబడుచున్న ఆ గృహములు, దూరమునుండి, దహింపబడుచున్న హిమవత్పర్వతశిఖరముల వలె ప్రకాశించినవి. 26

మూ. హర్మ్యాగ్రైర్దహ్యమానైశ్చ జ్వాలాప్రజ్వలితైరపి,
రాత్రౌ సా దృశ్యతే లఙ్కా పుష్పితైరివ కింశుకైః. 27

ప్ర. అ. దహ్యమానైః=కాల్చివేయబడుచున్న, జ్వాలాప్రజ్వలితైః=జ్వాలలతో మండుచున్న, హర్మ్యాగ్రైః=మేడల పై భాగములతో, సా=ఆ, లఙ్కా=లంక, రాత్రౌ=రాత్రియందు, పుష్పితైః=పుష్పించిన, కింశుకైః ఇవ= కింశుకవృక్షములతో వలె, దృశ్యతే=కనబడుచుండెను.

తా. కాలిపోవుచు, అగ్నిజ్వాలలతో నిండిన మేడల అగ్రభాగములతో రాత్రియందు ఆ లంక, పుష్పించిన మోదుగచెట్లతో నిండినట్లు ఉండెను. 27

మూ. హస్త్యధ్యక్షైర్గజైర్ముక్తైర్ముక్తైశ్చ తురగైరపి,
బభూవ లఙ్కా లోకాన్తే భ్రాన్తగ్రాహ ఇవార్ణవః. 28

ప్ర. అ. లఙ్కా=లంక, హస్త్యధ్యక్షైః=గజాధ్యక్షులచేత, ముక్తైః=విడువబడిన, గజైః=గజములతోను, ముక్తైః= విడువబడిన, తురగైరపి=గుఱ్ఱములతోను, లోకాన్తే=ప్రళయకాలమునందు, భ్రాన్తగ్రాహః=తిరుగుచున్న మొసళ్లు గల, అర్ణవః ఇవ=సముద్రము వలె, బభూవ=ఉండెను.

తా. ఏనుగులు, గుఱ్ఱములు కాలిపోకుండా పారిపోవుటకై వాటిని గజాధ్యక్షులు, అశ్వాధ్యక్షులు బంధనములనుండి విడిచివేయగా ఆ లంకానగరము ప్రలయకాలమునందు ఇటూ అటూ కొట్టుకొనుచున్న జలజంతువులు గల సముద్రమువలె ఉండెను. 28

మూ. అశ్వం ముక్తం గజో దృష్ట్వా క్వచిద్భీతోఽపసర్పతి,
భీతో భీతం గజం దృష్ట్వా క్వచిదశ్వో నివర్తతే. 29

ప్ర. అ. క్వచిత్=ఒకచోట, ముక్తమ్=విడవబడిన, అశ్వమ్=గుఱ్ఱమును, దృష్ట్వా=చూచి, గజః=ఏనుగు, భీతః=భయపడినదై, అపసర్పతి=దూరముగా తొలగిపోవుచున్నది. క్వచిత్=ఒకచోట, భీతమ్=భయపడిన, గజమ్=ఏనుగను, దృష్ట్వా=చూచి, అశ్వః=గుఱ్ఱము, భీతః=భయపడినదై, నివర్తతే=వెనుకకు తిరిగి పారిపోవుచున్నది.

తా. ఒకచోట, బంధనమునుండి విడిచిపెట్టబడిన గుఱ్ఱమును చూచి భయపడి, ఏనుగ పారిపోవుచున్నది. మరొకచోట భయపడిన ఏనుగను చూచి గుఱ్ఱము భయపడి వెనుకకు పారిపోవుచున్నది. 29

మూ. లఙ్కాయాం దహ్యమానాయాం శుశుభే చ మహోదధిః,
ఛాయాసంసక్తసలిలో లోహితోద ఇవార్ణవః. 30

ప్ర. అ. లఙ్కాయామ్=లంక, దహ్యమానాయామ్=కాల్చివేయబడుచుండగా, ఛాయాసంసక్తసలిలః= అగ్నికాంతితో కలిసిన ఉదకము గల, మహోదధిః=మహాసముద్రము, లోహితోదః=ఎఱ్ఱని ఉదకము గల, మహార్ణవః ఇవ=మహాసముద్రము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. లంక దహించబడుచున్నప్పుడు ఆ మంటల కాంతి నీటిలో ప్రతిబింబించుటచేత మహాసముద్రము ఎఱ్ఱని ఉదకము గల సముద్రము వలె ప్రకాశించెను. 30

మూ. సా బభూవ ముహూర్తేన హరిభిర్దీపితా పురీ,
లోకస్యాస్య క్షయే ఘోరే ప్రదీప్తేవ వసుంధరా. 31

ప్ర. అ. ముహూర్తేన=ముహూర్తకాలముచేత, హరిభిః=వానరులచేత, దీపితా=దహించబడిన, సా పురీ=ఆ పట్టణము, అస్య=ఈ, లోకస్య=లోకము యొక్క, ఘోరే=భయంకరమైన, క్షయే=నాశమునందు, ప్రదీప్తా= మండుచున్న, వసుంధరా ఇవ=భూమి వలె, బభూవ=ఆయెను.

తా. వానరులచేత కాల్చివేయబడిన ఆ లంక, ముహూర్తకాలములో, ప్రపంచము నశించు మహాప్రలయసమమునందు మండి పోవుచున్న భూమి వలె అయిపోయెను. 31

మూ. నారీజనస్య ధూమేన వ్యాప్తస్యోచ్చైర్వినేదుషః,
స్వనో జ్వలనతప్తస్య శుశ్రువే శతయోజనమ్. 32

ప్ర. అ. ధూమేన=ధూమముచేత, వ్యాప్తస్య=కప్పబడిన, జ్వలనతప్తస్య= అగ్నిచేత కాల్చబడిన, ఉచ్చైః=బిగ్గరగా, వినేదుషః=ధ్వనిచేసిన, నారీజనస్య=స్త్రీజ

నముయొక్క, స్వనః=ధ్వని, శతయోజనమ్=నూరు యోజనములు, శుశ్రువే= వినబడెను.

తా. ధూమముచేత కప్పివేయబడి అగ్నికి కాలిపోవుచున్న స్త్రీలు చేసిన ఆర్తధ్వని నూరు యోజనముల దూరము వినబడెను. 32

మూ. ప్రదగ్ధకాయానపరాన్ రాక్షసాన్నిర్గతాన్ బహిః,
సహసా హ్యుత్పతన్తి స్మ హరయోఽథ యుయుత్సవః. 33

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ప్రదగ్ధకాయాన్=కాల్చబడిన శరీరములు గల, బహిః=వెలుపలకు, నిర్గతాన్=బయలుదేరి పారిపోవుచున్న, అపరాన్=ఇతరులైన, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, హరయః=వానరులు, యుయుత్సవః=యుద్ధము చేయదలచినవారై, సహసా=వెంటనే, ఉత్పతన్తి స్మ=ఎగిరిరి.

తా. శరీరములు కాలిపోయి బైటకు పారిపోవుచున్న కొందరు రాక్షసులను వానరులు యుద్ధము చేయుటకై ఎదుర్కొనుచుండిరి. 33

మూ. ఉద్ఘుష్టం వానరాణాం చ రాక్షసానాం చ నిఃస్వనః,
దిశో దశ సముద్రం చ పృథివీం చ వ్యనాదయత్. 34

ప్ర. అ. వానరాణామ్=వానరులయొక్క, ఉద్ఘుష్టం చ=అరపు, రాక్షసానామ్=రాక్షసులయొక్క, నిఃస్వనః చ=ధ్వనీ, దశ=పది, దిశః=దిక్కులను, సముద్రం చ=సముద్రమును, పృథివీం చ=భూమినీ, వ్యనాదయత్=ధ్వనింపచేసెను.

తా. వానరుల అరపులు, రాక్షసులు చేయు ధ్వనీ పదిదిక్కులను, సముద్రమును, భూమినీ ప్రతిధ్వనింపచేసినవి. 34

మూ. విశల్యౌ చ మహాత్మానౌ తావుభౌ రామలక్ష్మణౌ,
అసంభ్రాన్తౌ జగృహతుస్తే ఉభే ధనుషీ వరే. 35

ప్ర. అ. మహాత్మానౌ=మహాత్ములైన, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, ఉభౌ=ఇద్దరూ, విశల్యౌ=పోయిన శల్యములు గలవారై, అసంభ్రాన్తౌ=తొందరపాటు లేనివారై, వరే=శ్రేష్ఠములైన, తే=ఆ, ఉభే=రెండు, ధనుషీ=ధనస్సులను, జగృహతుః=గ్రహించిరి.

తా. మహాత్ములైన ఆ రామలక్ష్మణు లిద్దరూ శల్యములు తొలగిపోయిన పిమ్మట ఏ మాత్రము కంగారుపడక శ్రేష్ఠములైన ఆ ధనస్సులను ధరించిరి.

మూ. తతో విస్ఫారయామాస రామశ్చ ధనురుత్తమమ్,
బభూవ తుములః శబ్దో రాక్షసానాం భయావహః. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః చ=రాముడు, ఉత్తమమ్=ఉత్తమ మైన, ధనుః=ధనస్సును, విస్ఫారయామాస=చరచెను. రాక్షసానామ్=రాక్షసులకు, భయావహః=భయము కలిగించు, తుములః=వ్యాకులమైన, శబ్దః=శబ్దము, బభూవ= అయెను.

తా. పిమ్మట రాముడు రాక్షసులకు భయము కలిగించు వ్యాకులమైన ధ్వనిని చేయుచు ఉత్తమమైన ధనస్సును చరచెను. 36

మూ. అశోభత తదా రామో ధనుర్విస్ఫారయన్ మహత్,
భగవానివ సంక్రుద్ధో భవో వేదమయం ధనుః. 37

ప్ర. అ. తదా=అప్పుడు, మహత్=గొప్పదైన, ధనుః=ధనస్సును, విస్ఫారయన్=చరచుచున్న, రామః= రాముడు, వేదమయమ్=వేదరూపమైన (వేదోక్తలక్షణములు గల), ధనుః=ధనస్సును చరచుచున్న, సంక్రుద్ధః=కోపించిన, భగవాన్=భగవంతుడైన, భవః ఇవ=శివుడు వలె, అశోభత=ప్రకాశించెను.

తా. అప్పుడు గొప్పదైన ఆ ధనస్సును చరచుచున్న రాముడు వేదోక్తలక్షణములు గల ధనస్సును చరుచుచున్న కోపించిన రుద్రుడు వలె ఉండెను 37

మూ. ఉద్ఘుష్టం వానరాణాం చ రాక్షసానాం చ నిఃస్వనమ్,
జ్యాశబ్దస్తావుభౌ శబ్దావతి రామస్య శుశ్రువే. 38

ప్ర. అ. రామస్య=రామునియొక్క, జ్యాశబ్దః=నారియొక్కధ్వని, వానరాణామ్=వానరుల యొక్క, ఉద్ఘుష్టమ్=ధ్వనిని, రాక్షసానామ్=రాక్షసులయొక్క, నిఃస్వనం చ=ధ్వనినీ, తౌ=ఆ, ఉభౌ=రెండింటినీ, అతిశుశ్రువే= అతిక్రమించి వినబడెను.

తా. రాముడు చేయుచున్న ధనుష్టంకారధ్వని వానరుల సింహనాదములను, రాక్షసులు చేయు ధ్వనులను మించి వినబడెను. 38

మూ. వానరోద్ఘుష్టశబ్దశ్చ రాక్షసానాం చ నిఃస్వనః,
జ్యాశబ్దశ్చాపి రామస్య త్రయం వ్యాప దిశో దశ. 39

ప్ర. అ. వానరోద్ఘుష్టఘోషః చ=వానరులు చేయు అరపుల ఘోషము, రాక్షసానామ్=రాక్షసులయొక్క, నిఃస్వనః చ=ధ్వనీ, రామస్య=రామునియొక్క, జ్యాశబ్దశ్చాపి=నారి యొక్క ధ్వని, త్రయమ్=ఈ త్రయము, దశ= పది, దిశః=దిక్కులను, వ్యాప=వ్యాపించెను.

తా. వానరులు చేయు మహాధ్వని, రాక్షసుల ధ్వని, రాముని టంకారధ్వని

ఈ మూడు ధ్వనులూ పది దిక్కులలో వ్యాపించినవి. 39

మూ. తస్య కార్ముకనిర్ముక్తైః శరైస్తత్పురగోపురమ్,
కైలాసశృఙ్గప్రతిమం విశీర్ణమపతద్భువి. 40

ప్ర. అ. కైలాసశృఙ్గప్రతిమమ్=కైలాసశిఖరముతో సమానమైన, తత్పురగోపురమ్=ఆ పట్టణముయొక్క గోపురము, తస్య=ఆ రామునియొక్క, కార్ముకనిర్ముక్తైః=ధనస్సునుండి విడవబడిన, శరైః=బాణములచేత, విశీర్ణమ్=ముక్కలై, భువి=నేలమీద, అపతత్=పడినది.

తా. కైలాసపర్వతశిఖరము వంటి ఆ లంకానగరగోపురము రాముని ధనస్సునుండి వెలువడిన బాణాలకు ముక్కముక్కలై నేలమీద పడిపోయెను.

మూ. తతో రామశరాన్ దృష్ట్వా విమానేషు గృహేషు చ,
సంనాహో రాక్షసేన్ద్రాణాం తుములః సమపద్యత. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విమానేషు=ఎత్తైన భవనములయందు, గృహేషు చ=గృహములయందు, రామశరాన్=రాముని బాణములను, దృష్ట్వా=చూచి, రాక్షసేన్ద్రాణామ్=రాక్షసనాయకులయొక్క, సంనాహః= యుద్ధసంనాహము, తుములః=వ్యాకులముగా, సమపద్యత=ఆయెను.

తా. రాముని బాణాలు వచ్చి విమానాలలోను, గృహాలలోను పడుచుండుట చూడగానే రాక్షసుల యుద్ధసంనాహ మంతా వ్యాకులమై పోయెను. 41

మూ. తేషాం సంవహ్యమానానాం సింహనాదం చ కుర్వతామ్,
శర్వరీ రాక్షసేన్ద్రాణాం రౌద్రీవ సమపద్యత. 42

ప్ర. అ. సంగహ్యమానానామ్=సంనాహము చేయుచున్న, సింహనాదమ్=సింహనాదమును, కుర్వతామ్= చేయుచున్న, తేషామ్=ఆ, రాక్షసేన్ద్రాణామ్=రాక్షసనాయకులకు, శర్వరీ=ఆ రాత్రి, రౌద్రీవ=ప్రలయరాత్రి వలె, సమపద్యత=ఆయెను.

తా. యుద్ధసంనాహము చేయుచు, సింహనాదములు చేయుచున్న ఆ రాక్షసనాయకులకు ఆ రాత్రి ప్రలయకాలరాత్రి వలె ఉండెను. 42

మూ. ఆదిష్టా వానరేన్ద్రాస్తే సుగ్రీవేణ మహాత్మనా,
ఆసన్నం ద్వారమాసాద్య యుధ్యధ్వం చ ప్లవంగమాః. 43
యశ్చ వో వితథం కుర్యాత్తత్ర తత్రాప్యుపస్థితః,
స హన్తవ్యోఽభిసంప్లుత్య రాజశాసనదూషకః. 44

ప్ర. అ. తే=ఆ, వానరేన్ద్రాః=వానరనాయకులు, మహాత్మనా=మహాత్ము డైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ఆదిష్టాః=ఆజ్ఞాపింపబడిరి. ప్లవంగమాః=వానరులారా! ఆసన్నమ్=దగ్గరనున్న, ద్వారమ్=ద్వారమును, ఆసాద్య= పొంది, యుధ్యధ్వమ్=యుద్ధముచేయుడు. వః=మీలో, యః=ఎవడు, తత్ర తత్ర=ఆ యా ప్రదేశములయందు, ఉపస్థితః అపి=ఉన్నవాడైనను, వితథమ్=వ్యర్థమునుగా, కుర్యాత్=చేయునో, రాజశాసనదూషకః=రాజాజ్ఞను దూషించిన, సః=అతడు, అభిసంప్లుత్య=ఎగిరి, హన్తవ్యః=చంపదగినవాడు.

తా. అప్పుడు వానరప్రభువైన సుగ్రీవుడు వానరనాయకులను ఇట్లు ఆజ్ఞాపించెను:- "వానరులారా! మీకు దగ్గర నున్న ద్వారము వద్దకు వెళ్లి అక్కడ యుద్ధము చేయుడు. ఆ యా స్థానాలలో ఉండి కూడ యుద్ధము చేయక, రాజాజ్ఞ మన్నింపనివానిని వెంటనే మీద పడి చంపి వేయవలెను." 43, 44

మూ. తేషు వానరముఖ్యేషు దీప్తోల్కోజ్జ్వలపాణిషు,
స్థితేషు ద్వారమాశ్రిత్య రావణం క్రోధ ఆవిశత్. 45

ప్ర. అ. దీప్తోల్కోజ్జ్వలపాణిషు=మండుచున్న కాగడాలతో ప్రకాశించుచున్న హస్తములు గల, తేషు=ఆ, వానరముఖ్యేషు=వానరశ్రేష్ఠులు, ద్వారమ్=ద్వారమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, స్థితేషు=నిలబడి ఉండగా, రావణమ్=రావణుణ్ణి, క్రోధః=క్రోధము, ఆవిశత్=ఆవేశించెను.

తా. మండుచున్న కాగడాలను చేతులలో ధరించి ద్వారమువద్ద ఉన్న ఆ వానరులను చూడగానే రావణునకు క్రోధావేశము కలిగెను. 45

మూ. తస్య జృమ్భితవిక్షేపాద్వ్యామిశ్రా వై దిశో దశ,
రూపవానివ రుద్రస్య మన్యుర్గాత్రేష్వదృశ్యత. 46

ప్ర. అ. తస్య=వానియొక్క, జృమ్భితవిక్షేపాత్=ఒళ్లు విరచుకొనుటవలన కలిగిన కదలికవలన, దశ=పది, దిశః= దిక్కులు, వ్యామిశ్రాః వై=వ్యాప్తమైనవి. గాత్రేషు=ఆతని అవయవములయందు, రుద్రస్య=రుద్రునియొక్క, రూపవాన్=రూపముగల, మన్యుః=కోపము, అదృశ్యత ఇవ=కనబడిన ట్లుండెను.

తా. ఆతడు ఒడలు విరుచుకొనగానే పది దిక్కులూ వ్యాకులము లయ్యెను. ఆతని అవయములలో రుద్రుని కోపము ఆవేశించి నట్లు ఉండెను.

మూ. స కుమ్భం చ నికుమ్భం చ కుమ్భకర్ణాత్మజావుభౌ,
ప్రేషయామాస సంక్రుద్ధో రాక్షసైర్బహుభిః సహ. 47

ప్ర. అ.సంక్రుద్ధః=కోపించిన, సః=అతడు, కుమ్భం చ=కుంభుడూ,

నికుమ్భం చ=నికుంభుడూ అను, కుమ్భకర్ణాత్మజౌ=కుంభకర్ణుని కుమారులను, ఉభౌ=ఇద్దరినీ, బహుభిః=అనేకులైన, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, ప్రేషయామాస=పంపెను.

తా. మిక్కిలి కోపించిన ఆ రావణుడు కుంభుడు, నికుంభుడూ అను కుంభకర్ణపుత్రుల నిద్దరినీ, చాలమంది రాక్షసులతో కూడ పంపెను. 47

మూ. యూపాక్షః శోణితాక్షశ్చ ప్రజఙ్ఘః కమ్పనస్తథా,
నిర్యయుః కౌమ్భకర్ణిభ్యాం సహ రావణశాసనాత్. 48

ప్ర. అ. యూపాక్షః=యూపాక్షుడు, శోణితాక్షశ్చ=శోణితాక్షుడు, ప్రజఙ్ఘః=ప్రజంఘుడు, తథా=మరియు, కమ్పనః=కంపనుడు, రావణశాసనాత్=రావణుని ఆజ్ఞవలన, కౌమ్భకర్ణిభ్యాం సహ=కుంభకర్ణుని పుత్రులతో కూడ, నిర్యయుః=బయలుదేరిరి.

తా. రావణుని ఆజ్ఞచేత యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, కంపనుడు కూడ కుంభకర్ణుని పుత్రులతో కలిసి బయలుదేరిరి. 48

మూ. శశాస చైవ తాన్ సర్వాన్ రాక్షసాన్ స మహాబలాన్,
రాక్షసా గచ్ఛతాద్యైవ సింహనాదం చ నాదయన్. 49

ప్ర. అ. సః=అతడు, మహాబలాన్=గొప్ప బలముగల, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను, శశాస చ=శాసించెను కూడ. రాక్షసాః=రాక్షసులారా! సింహనాదమ్=సింహనాదమును, నాదయన్=చేయుచు, అద్యైవ= అప్పుడే, గచ్ఛత=వెళ్లుడు.

తా. అతడు మహాబలవంతులైన ఆ రాక్షసుల నందరినీ - "రాక్షసులారా సింహనాదములు చేయుచు ఇప్పుడే బయలుదేరి వెళ్లుడు" అని ఆజ్ఞాపించెను.

మూ. తతస్తు చోదితాస్తేన రాక్షసా జ్వలితాయుధాః,
లఙ్కాయా నిర్యయుర్వీరాః ప్రణదన్తః పునః పునః. 50

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేన=ఆతనిచేత, చోదితాః=ప్రేరేపించబడిన, జ్వలితాయుధాః=ప్రజ్వలించుచున్న ఆయుధములు గల, వీరాః=వీరులైన, రాక్షసాః=రాక్షసులు, పునః పునః=మాటిమాటికి, ప్రణదన్తః= ధ్వనిచేయుచున్నవారై, లఙ్కాయాః=లంకనుండి, నిర్యయుః=బయల్వెడలిరి.

తా. పిమ్మట, రావణునిచేత ప్రేరేపింపబడిన వీరులైన రాక్షసులు ప్రకాశించుచున్న ఆయుధములు ధరించి, మాటిమాటికి గర్జించుచు బయలుదేరిరి.

మూ. రక్షసాం భూషణస్థాభిర్భాభిః స్వాభిశ్చ సర్వశః,
చక్రుస్తే సప్రభం వ్యోమ హరయశ్చాగ్నిభిః సహ. 51

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులయొక్క, భూషణస్థాభిః=అలంకారములయం దున్న, భాభిః=కాంతులచేతను, స్వాభిశ్చ= తమ సహజకాంతులచేతను, తే=ఆ రాక్షసులు, అగ్నిభిః సహ=అగ్నులతో ఉన్న, హరయః చ=వానరులూ, వ్యోమ= ఆకాశమును, సప్రభమ్=కాంతితో కూడినదానినిగా, చక్రుః=చేసిరి.

తా. తమ అలంకారముల కాంతులచేత, తమ సహజకాంతులచేత, రాక్షసులూ, అగ్నులతో కూడిన వానరులూ ఆకాశమును, రెండు సైన్యముల మధ్యనున్న అవకాశమును, ప్రకాశముకలదానిని చేసిరి. 51

మూ. తత్ర తారాధిపస్యాభా తారాణాం భా తథైవ చ,
తయోరాభరణాభా చ జ్వలితా ద్యామభాసయత్. 52

ప్ర. అ. తత్ర=అక్కడ, తారాధిపస్య=చంద్రునియొక్క, ఆభా=కాంతి, తథైవ చ=మరియు, తారాణామ్= నక్షత్రములయొక్క, భా=కాంతీ, తయోః=ఆ రెండు సైన్యములయొక్క, ఆభరాణాభా చ=ఆభరణముల కాంతి, జ్వలితా= ప్రజ్వలించుచున్నదై, ద్యామ్=ఆకాశమును, అభాసయత్=ప్రకాశింపచేసెను.

తా. అక్కడ చంద్రుని కాంతి, నక్షత్రముల కాంతి, రెండు సైన్యముల అలంకారముల కాంతి ప్రజ్వలించుచు ఆకాశమును ప్రకాశింపచేసెను. 52

మూ. చన్ద్రాభా భూషణాభా చ గ్రహాణాం జ్వలితా చ భా,
హరిరాక్షససైన్యాని భ్రాజయామాస సర్వతః. 53

ప్ర. అ. చన్ద్రాభా=చంద్రుని కాంతి, భూషణాభా చ=భూషణ ముల కాంతి, జ్వలితా=ప్రజ్వలించుచున్న, గ్రహాణామ్=గ్రహములయొక్క, భా చ=కాంతీ, సర్వతః=అన్ని వైపులా, హరిరాక్షససైన్యాని=వానరరాక్షససైన్యములను, భ్రాజయామాస=ప్రకాశింపచేసెను.

తా. చంద్రుని కాంతి, భూషణముల కాంతి, ప్రజ్వలించుచున్న గ్రహముల కాంతి వానరరాక్షస సైన్యములను అన్ని వైపులా ప్రకాశింపచేసెను. 53

మూ. తత్ర చార్ధప్రదీప్తానాం గృహాణాం సాగరః పునః,
భాభిః సంసక్తసలిలశ్చలోర్మిః శుశుభేఽధికమ్. 54

ప్ర. అ. తత్ర=అక్కడ, చలోర్మిః=చంచలములైన తరంగములు గల, సాగరః పునః=సముద్రమైతే, అర్ధప్రదీప్తానామ్=సగము మండిపోయిన, గృహాణామ్=గృహముల యొక్క, భాభిః=కాంతులతో, సంసక్తసలిలః= కలిసిన ఉదకము

గలదై, అధికమ్=అధికముగా, శుశుభే=ప్రకాశించెను.

తా. అక్కడ సగము కాలిపోయిన ఇండ్ల కాంతులతో కలిసిన జలముతో కదలుచున్న తరంగములు గల సముద్రము అధికముగా ప్రకాశించెను. 54

మూ. పతాకాధ్వజసంయుక్తముత్తమాసిపరశ్వధమ్,
భీమాశ్వరథమాతఙ్గం నానాపత్తిసమాకులమ్. 55
దీప్తశూలగదాఖడ్గప్రాసతోమరకార్ముకమ్,
తద్రాక్షసం బలం భీమం ఘోరవిక్రమపౌరుషమ్. 56
దదృశే జ్వలితప్రాసం కిఙ్కిణీశతనాదితమ్,
హేమజాలాచితభుజం వ్యావేష్టితపరశ్వధమ్. 57
వ్యాఘూర్ణితమహాశస్త్రం బాణసంయుక్తకార్ముకమ్,
గన్ధమాల్యమధూత్సేకసంమోదితమహానిలమ్. 58

ప్ర. అ. పతాకాధ్వజసంయుక్తమ్=పతాకలతోను ధ్వజములతోను కూడినది, ఉత్తమాసిపరశ్వధమ్= ఉత్తమములైన ఖడ్గములు గండ్రగొడ్డళ్లూ కలది, భీమాశ్వరథమాతఙ్గమ్=భయంకరములైన గుఱ్ఱములు, ఏనుగులు కలది, నానాపత్తిసమాకులమ్=అనేకులైన కాలిబంట్లతో వ్యాకులము, దీప్తశూలగదాఖడ్గప్రాసతోమరకార్ముకమ్=ప్రకాశించుచున్న శూలములు, గదలు, ఖడ్గములు, ప్రాసలు, తోమరములు, ధనస్సులు కలది, ఘోర విక్రమపౌరుషమ్=ఘోరమైన పరాక్రమము పౌరుషము గలదీ, జ్వలితప్రాసమ్=ప్రజ్వలించుచున్న ప్రాసలు గలది, కిఙ్కిణీశతనాదితమ్=వందలకొలది గంటలచే ధ్వనింపచేయబడినది, హేమజాలాచితభుజమ్=బంగారు అలంకారముల సముదాయముతో కూడిన భుజములు కలది, వ్యావేష్టితపరశ్వధమ్= త్రిప్పబడిన గండ్రగొడ్డళ్లు కలది, వ్యాఘూర్ణితమహాశస్త్రమ్=త్రిప్పబడిన గొప్ప ఆయుధములు కలది, బాణసంయుక్తకార్ముకమ్=బాణములతో కూడిన ధనస్సులు గలది, గన్ధమాల్యమధూత్సేకసంమోదితమహానిలమ్= గంధములచేత పుష్పమాలలచేత, అధికమైన మద్యములచేత, సువాసన గలదిగా చేయబడిన వాయువు గలది అయిన, తత్= ఆ, రాక్షసబలమ్=రాక్షససైన్యము, భీమమ్=భయంకరముగా, దదృశే=చూడబడెను.

తా. ఆ రాక్షససైన్యము పతాకలతోను, ధ్వజములతోను అలంకృతమై భయంకరములైన అశ్వములతోను, రథములతోను, ఏనుగులతోను, అనేకవిధముల పదాతిదళముతోను వ్యాకులముగా నుండెను. ఉత్తమములైన చిన్న ఖడ్గములు, గండ్రగొడ్డళ్లు, శూలములు, గదలు, పెద్ద ఖడ్గములు, ప్రాసలు, తోమరములు, ధనస్సులు ప్రకాశించుచుండెను. భయంకరమైన పరాక్రమము, పౌరుషము గల రాక్షసులతో నిండి యుండెను. ప్రాసలు ప్రజ్వలించుచుండెను. వందలకొలది చిరు గంటల ధ్వని వినబడుచుండెను. రాక్షసులు తమ భుజములను బంగారు

అలంకారముల సముదాయములతో అలంకరించుకొని యుండిరి. ఆ సైన్యమునందు వాయువు సుగంధద్రవ్యముల గంధముతోను, పుష్పమాలల సువాసనతోను, అధికమైన మద్యగంధములోను నిండి యుండెను. కొందరు రాక్షసులు గండ్రగొడ్డళ్లు త్రిప్పుచుండిరి. కొందరు మహాశస్త్రములను కదల్చుచుండిరి. కొందరు ధనస్సులపై బాణములు సంధించుచుండిరి. ఈ విధముగ ఆ రాక్షససైన్యము చాల భయంకరముగ కనబడెను. 55-58

మూ. ఘోరం శూరజనాకీర్ణం మహాంబుధరనిఃస్వనమ్,
తద్దృష్ట్వా బలమాయాతం రాక్షసానాం దురాసదమ్, 59
సంచచాల ప్లవంగానాం బలముచ్చైర్ననాద చ.

ప్ర. అ. ఘోరమ్=భయంకరము, శూరజనాకీర్ణమ్=శూరులైన జనులతో వ్యాప్తము, మహాంబుధరనిఃస్వనమ్=గొప్ప మేఘము వంటి ధ్వని గలది, దురాసదమ్=ఎదిరింప శక్యము కానిదీ అయిన, ఆయాతమ్=వచ్చిన, తత్=ఆ, రాక్షసానాం బలమ్=రాక్షసుల సైన్యమును, దృష్ట్వా=చూచి, ప్లవంగానామ్=వానరులయొక్క, బలమ్= సైన్యము, సంచచాల=చలించెను. ఉచ్చైః=బిగ్గరగా, ననాద చ=ధ్వని చేసెను కూడ.

తా. భయంకరము, శూరులతో నిండినది, మహామేఘము వలె ధ్వనిచేయుచున్నది, ఎదిరింప శక్యము కానిదీ అయిన ఆ రాక్షససైన్యము వచ్చుట చూచి వానరసైన్యము చలించెను. బిగ్గరగా ధ్వని చేసెను. 59

మూ. జవేనాప్లుత్య చ పునస్తద్బలం రక్షసాం మహత్, 60
అభ్యయాత్ప్రత్యరిబలం పతంగా ఇవ పావకమ్.

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులయొక్క, మహత్=గొప్పదైన, తత్ బలం పునః=ఆ సైన్యమైతే, జవేన=వేగముచేత, ఆప్లుత్య=దుమికి, పతంగాః=మిడతలు, పావకమ్=ఇవ=అగ్నిని గూర్చి వలె, ప్రత్యరిబలమ్=శత్రుబలమునకు ఎదురుగా, ప్రత్యయాత్=వెళ్లెను.

తా. గొప్పదైన ఆ రాక్షససేన శీఘ్రముగా దుముకుచు మిడతలు అగ్నివైపు వెళ్లినట్లు శత్రుసైన్యమువైపు వెళ్లెను. 60

మూ. తేషాం భుజపరామర్శవ్యామృష్టపరిఘాశని, 61
రాక్షసానాం బలం శ్రేష్ఠం భూయః పరమశోభత.

ప్ర. అ.తేషాం రాక్షసానామ్=ఆ రాక్షసులయొక్క, భుజపరామర్శవ్యామృష్టపరిఘాశని=భుజముల స్పర్శచేత ప్రకాశింపచేయబడిన పరిఘలు, వజ్రములు గల, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన, బలమ్=సైన్యము భూయః=మరల, పరమ్= అధికముగా,

అశోభత=శోభించెను.

తా. భుజముల స్పర్శచే శుభ్రముగా చేయబడి ప్రకాశించుచున్న పరిఘలు, వజ్రాయుధములూ గల ఆ రాక్షససైన్యము ఇంకను ఎక్కువగా ప్రకాశించెను.

మూ. తత్రోన్మత్తా ఇవోత్పేతుర్హరయోఽథ యుయుత్సవః, 62
తరుశైలైరభిఘ్నన్తో ముష్టిభిశ్చ నిశాచరాన్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, తత్ర=అక్కడ, యుయుత్సవః=యుద్ధము చేయగోరుచున్న, హరయః=వానరులు, నిశాచరాన్=రాక్షసులను, తరుశైలైః=వృక్షములచేత పర్వతములచేత, ముష్టిభిః చ=పిడికిళ్లచేత, అభిఘ్నన్తః= కొట్టుచున్నవారై ఉన్మత్తాః ఇవ=ఉన్మత్తులు వలె, ఉత్పేతుః=పైకి ఎగిరిరి.

తా. అప్పుడు యుద్ధము చేయగోరుచున్న ఆ వానరులు ఉన్మత్తులు వలె ఎగిరి, రాక్షసులను వృక్షములతోను, పర్వతములతోను, పిడికిళ్లతోను కొట్టిరి.62

మూ. తథైవాపతతాం తేషాం హరీణాం నిశితైః శరైః, 63
శిరాంసి సహసా జహ్రూ రాక్షసా భీమవిక్రమాః.

ప్ర. అ. తథైవ=అట్లే, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, రాక్షసాః=రాక్షసులు, ఆపతతామ్= వచ్చి పడుచున్న, తేషాం హరీణామ్=ఆ వానరులయొక్క, శిరాంసి=శిరస్సులను, సహసా=వెంటనే, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, జహ్రుః=హరించిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల రాక్షసులు కూడ వచ్చుచున్న ఆ వానరుల శిరస్సులను వాడియైన బాణాలచేత వెంటనే ఖండించిరి. 63

మూ. దశనైర్హతకర్ణాశ్చ ముష్టిభిర్భిన్నమస్తకాః, 64
శిలాప్రహారభగ్నాఙ్గా విచేరుస్తత్ర రాక్షసాః.

ప్ర. అ. తత్ర=అక్కడ, రాక్షసాః=రాక్షసులు, దశనైః=దంతములచేత, హతకర్ణాః=కొరికివేయబడిన చెవులు గలవారై, ముష్టిభిః=పిడికిళ్లచేత, భిన్నమస్తకాః=బ్రద్దలుకొట్టబడిన శిరస్సులు కలవారై, శిలాప్రహారభగ్నాఙ్గాః= శిలల దెబ్బలచేత విరగగొట్టబడిన శరీరములు గలవారై, విచేరుః=సంచరించిరి.

తా. అక్కడ సంచరించుచున్న కొందరు రాక్షసుల చెవులను వానరులు దంతాలతో కొరికివేసిరి. కొందరి శిరస్సులను పిడికిళ్ళతో పగులగొట్టిరి. కొందరి శరీరములను రాళ్ళదెబ్బలతో పగులగొట్టిరి. 64

మూ. తథైవాప్యపరే తేషాం కపీనామసిభిః శితైః, 65
ప్రవరానభితో జఘ్నుర్ఘోరరూపా నిశాచరాః.

ప్ర. అ. తథైవ=అట్లే, ఘోరరూపాః=భయంకరములైన రూపములుగల, అపరే=మరికొందరు, నిశాచరాః=రాక్షసులు, శితైః= వాడియైన, అసిభిః=ఖడ్గముల చేత, తేషామ్=ఆ, కపీనామ్=వానరులలో, ప్రవరాన్=శ్రేష్ఠులను, అభితః=అంతటా, జఘ్నుః=కొట్టిరి.

తా. అట్లే ఘోరములైన రూపములు గల కొందరు రాక్షసులు ఆ యుద్ధరంగమునందు అంతటా, ఆ వానరులలో ప్రధానులైన వారిని వాడియైన ఖడ్గాలతో కొట్టిరి. 65

మూ. ఘ్నన్తమన్యం జఘానాన్యః పాతయన్తమపాతయత్, 66
గర్హమాణం జగర్హాన్యో దశన్తమపరోऽదశత్.

ప్ర. అ. ఘ్నన్తమ్=చంపుచున్న, అన్యమ్=ఒకనిని, అన్యః=మరియొకడు, జఘాన=చంపెను. పాతయన్తమ్= పడవేయుచున్నవానిని, అపాతయత్=పడద్రోసెను. గర్హమాణమ్=నిందించుచున్నవానిని, అన్యః=మరియొకడు, జగర్హ=నిందించెను. దశన్తమ్=కొరుకుచున్నవానిని, అపరః=మరియొకడు, అదశత్=కొరికెను.

తా. ఒకడు ఒకనిని చంపుచుండగా మరియొకడు వానిని చంపెను. పడద్రోయుచున్న వానిని మరొకడు పడద్రోసెను. నిందించుచున్నవానిని మరొకడు నిందించెను. కరచుచున్నవానిని మరొకడు కరచెను. 66

మూ. దేహీత్యన్యో దదాత్యన్యో దదామీత్యపరః పునః, 67
కిం క్లేశయసి తిష్ఠేతి తత్రాన్యోన్యం బభాషిరే.

ప్ర. అ. తత్ర=అక్కడ అన్యః=ఒకడు, దేహీతి=దెబ్బను ఇమ్ము అని, అన్యః=మరియొకడు, దదాతి= ఇచ్చుచున్నాడు అనీ, అపరః పునః=మరియొకడు, దదామీతి=ఇచ్చుచున్నాను అనీ, కిం క్లేశయసి=నిన్ను నీవు ఎందుకు శ్రమపెట్టుకొనెదవు అని, తిష్ఠ ఇతి=నిలువుము అని, అన్యోన్యమ్=పరస్పరము, బభాషిరే=మాటలాడుకొనిరి.

తా. 'కొట్టుము' అని ఒకడు, 'ఇదిగో కొట్టుచున్నాను' అని మరొకడు 'కొట్టుచున్నాడు' అని ఒకడూ, 'ఎందుకు శ్రమపడెదవు'అని ఒకడు, 'నిలువుము' అని మరొకడు ఈవిధముగా అక్కడ ఆ యోధులు ఒకరితో ఒకరు అనుకొనుచు యుద్ధము చేసిరి. 67

మూ. విప్రలమ్భిత శస్త్రం చ విముక్తకవచాయుధమ్, 68
సముద్యతమహాప్రాసం యష్టిశూలాసిసంకులమ్,
ప్రావర్తత మహా రౌద్రం యుద్ధం వానరరక్షసామ్. 69

ప్ర. అ. వానరరక్షసామ్=వానరులయొక్క రాక్షసులయొక్క, మహారౌద్రమ్=చాల భయంకరమైన, యుద్ధమ్= యుద్ధము, విప్రలమ్భితశస్త్రమ్=వ్యర్థము చేయబడిన ఆయుధములు కలదిగాను, విముక్తకవచాయుధమ్= విడవబడిన కవచములు ఆయుధములు గలదిగాను, సముద్యతమహాప్రాసమ్=ఎత్తబడిన పెద్ద ప్రాసలు గలదిగాను, యష్టిశూలాసిసంకులమ్=యష్టులతోను, శూలములతోను, ఖడ్గములతోను వ్యాకులముగాను, ప్రావర్తత=జరిగెను.

తా. ఆ వానరులకు రాక్షసులకు మధ్య జరిగిన చాల భయంకరమైన ఆ యుద్ధములో గురి తప్పునట్లు చేయుటచేత శస్త్రములు వ్యర్థముగా చేయబడినవి. కవచములు ఊడిపోయినవి. ఆయుధములు జారిపోయినవి. పెద్ద ప్రాసలు ఎత్తబడినవి. యష్టులు, శూలములు, ఖడ్గములు అధికముగా ప్రయోగింపబడినవి. 68, 69

మూ. వానరాన్ దశ సప్తేతి రాక్షసా జఘ్నురాహవే,
రాక్షసాన్ దశ సప్తేతి వానరాశ్చాభ్యపాతయన్. 70

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, రాక్షసాః=రాక్షసులు, దశ=పదిమందిని, సప్త=ఏడుగురిని, ఇతి=ఈ విధముగా, వానరాన్=వానరులను, జఘ్నుః=చంపిరి. వానరాశ్చ=వానరులుకూడ, రాక్షసాన్=రాక్షసులను, దశ=పదిమందిని, సప్త=ఏడుగురిని, ఇతి=ఈవిధముగా, అభ్యపాతయన్=పడగొట్టిరి.

తా. ఆ యుద్ధమునందు రాక్షసులు వానరులను పదిమందిచొప్పున, ఏడుగురేసి చొప్పున చంపగా వానరులు కూడ రాక్షసులను పదిమందిచొప్పున ఏడుగురేసి చొప్పున పడగొట్టిరి. 70

మూ. విస్రస్తకేశవసనం విముక్తకవచధ్వజమ్,
బలం రాక్షసమాలమ్బ్య వానరాః పర్యవారయన్. 71

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాండే పఞ్చసప్తతితమః సర్గః.

ప్ర. అ. వానరాః=వానరులు, విస్రస్తకేశవసనమ్=జారిపోయిన కేశములు, వస్త్రములు గల, విముక్తకవచధ్వజమ్=విడువబడిన కవచములు ధ్వజములు గల, రాక్షసమ్=రాక్షససంబంధమైన, బలమ్=సైన్యమును, ఆలమ్బ్య=పట్టుకొని, పర్యవారయన్=చుట్టుముట్టిరి.

తా. వానరులు కేశములు వస్త్రములు ఊడిపోవుచున్న, కవచములు,

ధ్వజములు పడిపోవుచున్న ఆ రాక్షససైన్యమును పట్టి చుట్టుముట్టిరి. 71

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్సప్తతితమః సర్గః

[అంగదుడు కంపన-ప్రజంఘులను, ద్వివిదుడు శోణితాక్షుని, మైందుడు యూపాక్షుని, సుగ్రీవుడు కుంభుని చంపుట.]

మూ. ప్రవృత్తే సంకులే తస్మిన్ ఘోరే వీరజనక్షయే,
అఙ్గదః కమ్పనం వీరమాససాద రణోత్సుకః. 1

ప్ర. అ. ఘోరే=భయంకరము, వీరజనక్షయే=వీరజనుల నాశము కలి గించునది అయిన, తస్మిన్=ఆ, సంకులే= యుద్ధము, ప్రవృత్తే=ప్రారంభమైన దగుచుండగా, అఙ్గదః=అంగదుడు, రణోత్సుకః=రణమునందు ఆసక్తి కలవాడై, వీరమ్=వీరుడైన, కమ్పనమ్=కంపనుణ్ణి, ఆససాద=సమీపించెను.

తా. వీరజనులు నశించే భయంకరమైన యుద్ధము ప్రారంభ మయిన వెంటనే అంగదుడు వీరుడైన కంపనునితో యుద్ధమునకై తలపడెను.

మూ. ఆహూయ సోఽఙ్గదం కోపాత్తాడయామాస వేగితః,
గదయా కమ్పనః పూర్వం స చచాల భృశాహతః. 2

ప్ర. అ. సః కమ్పనః=ఆ కంపనుడు, అఙ్గదమ్=అంగదుని, ఆహూయ=పిలచి, పూర్వమ్=ముందుగా, గదయా=గదతో, వేగితః=వేగము గలవాడై, కోపాత్=కోపము వలన, తాడయామాస=కొట్టెను. భృశాహతః=బాగా కొట్టబడిన, సః=అంగదుడు, చచాల=చలించెను.

తా. కంపనుడు అంగదుణ్ణి యుద్ధానికి పిలిచి, కోపముతో ఆతనిని ముందుగా, వేగముగా, గదతో కొట్టెను. అంగదుడు గట్టి దెబ్బ తగిలి కదలిపోయెను. 2

మూ. స సంజ్ఞాం ప్రాప్య తేజస్వీ చిక్షేప శిఖరం గిరేః,
అర్దితశ్చ ప్రహారేణ కమ్పనః పతితో భువి. 3

ప్ర. అ. తేజస్వీ=తేజఃశాలియైన, సః=అంగదుడు, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రాప్య=పొంది, గిరేః=పర్వతముయొక్క, శిఖరమ్=శిఖరమును, చిక్షేప=విసరెను. కమ్పనః=కంపనుడు, ప్రహారేణ=దెబ్బచేత, అర్దితః=పీడింపబడినవాడై, భువి=నేలమీద, పతితః=పడెను.

తా. తేజఃశాలియైన అంగదుడు సంజ్ఞ పొంది వానిపై పర్వత శిఖరమును విసరెను. ఆ దెబ్బచేత పీడింపబడి కంపనుడు నేలపై కూలెను. 3

మూ. తతస్తు కమ్పనం దృష్ట్వా శోణితాక్షో హతం రణే,
రథేనాభ్యపతత్ క్షిప్రం తత్రాఙ్గదమభీతవత్. 4

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శోణితాక్షః=శోణితాక్షుడు, రణే=యుద్ధమునందు, హతమ్=చంపబడిన, కమ్పనమ్= కంపనుణ్ణి, దృష్ట్వా=చూచి, తత్ర=అక్కడ, అభీతవత్=భయము లేకుండగా, రథేన=రథముచేత, అఙ్గదమ్=అంగదుణ్ణి, క్షిప్రమ్=శీఘ్రముగా, అభ్యపతత్=సమీపించెను.

తా. కంపనుడు యుద్ధములో చంపబడుట చూచి శోణితాక్షుడు రథమెక్కి భయములేనివాడై, శీఘ్రముగా అంగదునిమీదికి వెళ్లెను. 4

మూ. సోఽఙ్గదం నిశితైర్బాణైస్తదా వివ్యాధ వేగితః,
శరీరదారణైస్తీక్ష్ణైః కాలాగ్నిసమవిగ్రహైః. 5
క్షురక్షురప్రనారాచైర్వత్సదన్తైః శిలీముఖైః,
కర్ణిశల్యవిపాఠైశ్చ బహుభిర్నిశితైః శరైః. 6

ప్ర. అ. సః=అతడు, తదా=అప్పుడు, వేగితః=వేగము పొందినవాడై, శరీరదారణైః=శరీరమును చీల్చు, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, కాలాగ్నిసమవిగ్రహైః=కాలాగ్ని వంటి ఆకారము గల, నిశితైః=వాడియైన, బాణైః=బాణములచేత, అఙ్గదమ్=అంగదుణ్ణి, వివ్యాధ=కొట్టెను. క్షురక్షురప్రనారాచైః=మంగలికత్తి ఆకారము గలవి, అర్ధచంద్రాకారము గలవి, ముళ్ళు గలవి అయిన బాణములచేతను, వత్సదన్తైః=లేగదూడ దంతముల వంటి అగ్రభాగములు గల బాణములచేతను, శిలీముఖైః=గ్రద్దరెక్క ఆకారము గల బాణములచేతను, కర్ణిశల్యవిపాఠైః చ=రెండు ప్రక్కల చెవులున్న బాణములచేతను, అర్ధనారాచములచేతను, కరవీరపత్రము అగ్రమువంటి అగ్రము గల బాణములచేతను, నిశితైః=వాడియైన, బహుభిః=అనేకములైన, శరైః=బాణములచేతను (కొట్టెను.)

తా. అప్పు డతడు వేగము చూపుచు శరీరమును చీల్చివేయు వాడియైన, కాలాగ్ని వంటి ఆకారము గల బాణముల చేత అంగదుణ్ణి కొట్టెను. క్షురములు, క్షురప్రములు, నారాచములు, వత్సదంతములు, శిలీముఖములు, కర్ణులు, శల్యములు, విపాఠములు అను బాణములను, వాడియైన అనేక ఇతర బాణములను ప్రయోగించి ఆతనిని కొట్టెను. 5, 6

మూ. అఙ్గదః ప్రతివిద్ధాఙ్గో వాలిపుత్రః ప్రతాపవాన్,
ధనురుగ్రం రథం బాణాన్ మమర్ద తరసా బలీ. 7

ప్ర. అ. ప్రతివిద్ధాఙ్గః=కొట్టబడిన శరీరము గల, వాలిపుత్రః=వాలిపుత్రుడైన, ప్రతాపవాన్= ప్రతాపవంతుడైన, బలీ=బలముగల, అఙ్గదః=అంగదుడు, ఉగ్రమ్= భయంకరమైన, ధనుః=ధనస్సును, రథమ్=రథమును, బాణాన్=బాణములను, తరసా=బలముచేత, మమర్ద=మర్దించెను.

తా. వాలిపుత్రుడు, ప్రతాపవంతుడు, బలవంతుడు అయిన అంగదుడు ఆ విధముగా శరీరమునం దంతటా దెబ్బలు తగలగా వాని భయంకరమైన ధనస్సును, రథమును, బాణాలను బలముచేత నశింపచేసెను. 7

మూ. శోణితాక్షస్తతః క్షిప్రమసిచర్మ సమాదదే,
ఉత్పపాత తదా క్రుద్ధో వేగవానవిచారయన్. 8

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శోణితాక్షః=శోణితాక్షుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, అసిచర్మ=కత్తి, డాలూ, సమాదదే=గ్రహించెను. తదా=అప్పుడు, క్రుద్ధః=కోపించినవాడై, వేగవాన్=వేగవంతుడై, అవిచారయన్=ఆలోచించనివాడై, ఉత్పపాత=ఎగిరెను.

తా. పిమ్మట శోణితాక్షుడు కోపించి, మరేమీ ఆలోచించిక శీఘ్రముగా కత్తి, డాలూ, తీసికొని, వేగముగా పైకి ఎగిరెను. 8

మూ. తం క్షిప్రతరమాప్లుత్య పరామృశ్యాఙ్గదో బలీ,
కరేణ తస్య తం ఖడ్గం సమాచ్ఛిద్య ననాద చ. 9

ప్ర. అ. బలీ=బలము గల, అఙ్గదః=అంగదుడు, క్షిప్రతరమ్=ఇంకనూ వేగముగా, ఆప్లుత్య= పైకి ఎగిరి, తమ్=వానిని, పరామృశ్య=పట్టుకొని, కరేణ= చేతితో, తస్య=వానియొక్క, ఖడ్గమ్=ఖడ్గమును, ఆచ్ఛిద్య= లాగికొని, ననాద చ=ధ్వనిచేసెను.

తా. బలశాలియైన అంగదుడు అంతకంటె వేగముగా పైకి ఎగిరి, వానిని పట్టుకొని తన చేతితో ఆతని ఖడ్గమును లాగికొని సింహనాదము చేసెను. 9

మూ. తస్యాంసఫలకే ఖడ్గం నిచఖాన తతోఽఙ్గదః,
యజ్ఞోపవీతవచ్చైనం చిచ్ఛేద కపికుఞ్జరః. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అఙ్గదః=అంగదుడు, తస్య=వానియొక్క, అంసఫలకే=ఫలకమువంటి బుజమునందు, ఖడ్గమ్=ఖడ్గమును, నిచఖాన=పాతెను. కపికుఞ్జరః=ఆ వానరశ్రేష్ఠుడు, ఏనమ్=వీనిని, యజ్ఞోపవీతవత్= యజ్ఞోపవీతము వలె, చిచ్ఛేద=ఛేదించెను.

తా. పిమ్మట వానరశ్రేష్ఠుడైన అంగదుడు ఆ రాక్షసుని ఫలకము వంటి బుజము మీద ఖడ్గమును లోతుగా నాటి జందెముపెట్టున ఆతనిని నరికివేసెను. 10

మూ. తం ప్రగృహ్య మహాఖడ్గం వినద్య చ పునః పునః,
వాలిపుత్రోఽభిదుద్రావ రణశీర్షం పరానరీన్. 11

ప్ర. అ. వాలిపుత్రః=అంగదుడు, తం మహాఖడ్గమ్=ఆ పెద్ద ఖడ్గమును, ప్రగృహ్య=గ్రహించి, పునః పునః=మాటిమాటికి, వినద్య చ=ధ్వనిచేసి, పరాన్=ఇతరులైన, అరీన్=శత్రువులను గూర్చి, రణశీర్షమ్=యుద్ధాగ్రప్రదేశమును గూర్చి, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. అంగదుడు ఆ ఖడ్గమును తీసికొని, మాటిమాటికి గర్జించుచు ఆ యుద్ధరంగమునందు మిగిలిన శత్రువులున్న వైపు శీఘ్రముగా వెళ్లెను. 11

మూ. ప్రజఙ్ఘసహితో వీరో యూపాక్షస్తు తతో బలీ,
రథేనాభియయౌ క్రుద్ధో వాలిపుత్రం మహాబలమ్. 12

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరః=వీరుడు, బలీ=బలశాలీ అయిన, యూపాక్షస్తు=యూపాక్షుడైతే, ప్రజఙ్ఘసహితః=ప్రజంఘునితో కూడినవాడై, క్రుద్ధః=కోపగించినవాడై, మహాబలమ్=గొప్ప బలము గల, వాలిపుత్రమ్=అంగదుని గూర్చి, రథేన=రథముచేత, అభియయౌ=ఎదురుగా వెళ్లెను.

తా. పిమ్మట వీరుడూ బలవంతుడూ అయిన యూపాక్షుడు కోపించి, ప్రజంఘునితో కలిసి రథము మీద, మహాబలశాలియైన అంగదుని ఎదిరించుటకై వెళ్లెను. 12

మూ. ఆయసీం తు గదాం గృహ్య స వీరః కనకాఙ్గదః,
శోణితాక్షః సమాశ్వస్య తమేవానుపపాత హ. 13

ప్ర. అ. వీరః=వీరుడు, కనకాఙ్గదః=బంగారు బాహుపురులు గలవాడు అయిన, సః=ఆ, శోణితాః= శోణితాక్షుడు, సమాశ్వస్య=తెప్పిరిల్లి, ఆయసీమ్=ఇనుపదైన, గదామ్=గదను, గృహ్య=గ్రహించి, తమేవ=ఆ అంగదుని గూర్చియే, అనుపపాత హ=శీఘ్రముగా వెళ్ళెను.

తా. బంగారు బాహుపురులను ధరించిన వీరుడైన ఆ శోణితాక్షుడు మూర్ఛనుండి తేరికొని, ఇనుపగద గ్రహించి ఆ అంగదునిమీదకే శీఘ్రముగా వెళ్లెను. 13

మూ. ప్రజఙ్ఘస్తు మహావీరో యూపాక్షసహితో బలీ,
గదయాభియయౌ క్రుద్ధో వాలిపుత్రం మహాబలమ్. 14

ప్ర. అ. బలీ=బలముగల, మహావీరః=గొప్ప వీరుడైన, ప్రజఙ్ఘః తు=ప్రజంఘుడైతే, యూపాక్షసహితః=యూపాక్షునితో కూడినవాడై, క్రుద్ధః=కోపించినవాడై, మహాబలమ్=గొప్ప బలము గల, వాలిపుత్రమ్=అంగదుణ్ణి గూర్చి, గదయా=గదతో, అభియయౌ=వెళ్లెను.

తా. మహావీరుడు, బలవంతుడు అయిన ప్రజంఘుడు కోపించి, గద ధరించి, గొప్ప బలము గల, అంగదునిమీదికి వెళ్లెను. 14

మూ. తయోర్మధ్యే కపిశ్రేష్ఠః శోణితాక్షప్రజఙ్ఘయోః,
విశాఖయోర్మధ్యగతః పూర్ణచన్ద్ర ఇవాబభౌ. 15

ప్ర. అ. తయోః=ఆ, శోణితాక్షప్రజఙ్ఘయోః=శోణితాక్షప్రజంఘులయొక్క, మధ్యే=మధ్యయందు, కపిశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన అంగదుడు, విశాఖయోః=విశాఖా నక్షత్రములయొక్క, మధ్యగతః=మధ్యయందున్న, పూర్ణచన్ద్రః ఇవ=పూర్ణచంద్రుడు వలె, ఆబభౌ=ప్రకాశించెను. (విశాఖానక్షత్రము రెండు చుక్కల నక్షత్రము)

తా. ఆ శోణితాక్ష-ప్రజంఘుల మధ్య నున్న ఆ అంగదుడు విశాఖానక్షత్రముల మధ్య ఉన్న పూర్ణచంద్రుడు వలె ప్రకాశించెను. 15

మూ. అఙ్గదం పరిరక్షన్తౌ మైన్దో ద్వివిద ఏవ చ,
తస్య తస్థతురభ్యాశే పరస్పరదిదృక్షయా. 16

ప్ర. అ. మైన్దః=మైందుడు, ద్వివిదః ఏవ చ=ద్వివిదుడు, అఙ్గదమ్=అంగదుణ్ణి, పరిరక్షన్తౌ=రక్షించుచున్నవారై, పరస్పరదిదృక్షయా=పరస్పరము (తమకు తగిన శత్రువును) చూడవలెనను కోరికతో, తస్య=అంగదునియొక్క, అభ్యాశే=సమీపమునందు, తస్థతుః=నిలచిరి.

తా. మైందద్వివిదులు అంగదుని రక్షించుచు, ఆతని దగ్గరనే ఉండి తమకు యుద్ధానికి తగిన వానికొరకు చూచుచుండిరి. 16

మూ. అభిపేతుర్మహాకాయాః ప్రతియత్తా మహాబలాః,
రాక్షసా వానరాన్ రోషాదసిబాణగదాధరాః. 17

ప్ర. అ. మహాకాయాః=పెద్ద శరీరములు గల, మహాబలాః=గొప్ప బలము గల, రాక్షసాః=రాక్షసులు, ప్రతియత్తాః=సన్నద్ధులై, అసిబాణగదాధరాః=ఖడ్గములను బాణములను గదలను ధరించినవారై, రోషాత్=కోపమువలన, వానరాన్=వానరులను గూర్చి, అభిపేతుః=శీఘ్రముగా వెళ్లిరి.

తా. పెద్ద శరీరములు, గొప్ప బలము గల రాక్షసులు ఖడ్గములను, బాణములను, గదలను ధరించి, సన్నద్ధులై కోపముతో వానరులను ఎదిరించిరి.

మూ. త్రయాణాం వానరేన్ద్రాణాం త్రిభీ రాక్షసపుంగవైః,
సంసక్తానాం మహద్యుద్ధమభవద్రోమహర్షణమ్. 18

ప్ర. అ. త్రిభిః=ముగ్గురు, రాక్షసపుంగవైః=రాక్షసశ్రేష్ఠులతో, సంసక్తానామ్=తలబడిన, త్రయాణామ్= ముగ్గురు, వానరేన్ద్రాణామ్=వానరనాయకులకు, రోమహర్షణమ్=రోమాంచమును కలిగించు, మహత్=గొప్ప, యుద్ధమ్=యుద్ధము, అభవత్=ఆయెను.

తా. ఆ ముగ్గురు రాక్షసవీరులతో తలబడిన ఆ ముగ్గురు వానరవీరులకు రోమాంచమును కలిగించు భయంకరమైన యుద్ధము జరిగెను. 18

మూ. తే తు వృక్షాన్ సమాదాయ సంప్రచిక్షిపురాహవే,
ఖడ్గేన ప్రతిచిక్షేప తాన్ ప్రజఙ్ఘో మహాబలః. 19

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, తే=ఆ వానరులు, వృక్షాన్=వృక్షములను, సమాదాయ=గ్రహించి, సంప్రచిక్షిపుః=విసిరిరి. మహాబలః=గొప్ప బలము గల, ప్రజఙ్ఘః=ప్రజంఘుడు, ఖడ్గేన=ఖడ్గముచేత, తాన్=వాటిని, ప్రతిచిక్షేప=తెగగొట్టెను.

తా. యుద్ధములో ఆ వానరులు వృక్షములను గ్రహించి వాటిని విసరగా మహాబలవంతుడైన ప్రజంఘుడు వాటిని ఖడ్గముచేత ఛేదించెను. 19

మూ. రథానశ్వాన్ ద్రుమాన్ శైలాన్ ప్రతిచిక్షిపురాహవే,
శరౌఘైః ప్రతిచిచ్ఛేద తాన్యూపాక్షో మహాబలః. 20

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, రథాన్=రథములను గూర్చి, అశ్వాన్=అశ్వములను గూర్చి, ద్రుమాన్= వృక్షములను, శైలాన్=పర్వతములను, ప్రతిచిక్షిపుః=విసిరిరి. మహాబలః=గొప్ప బలము గల, యూపాక్షః=యూపాక్షుడు, తాన్=వాటిని, శరౌఘైః=బాణసముదాయములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. యుద్ధములో ఆ వానరులు రథములమీదికి గుఱ్ఱములమీదికి వృక్షములను, పర్వతములను విసరగా మహాబలశాలియైన యూపాక్షుడు వాటిని బాణసముదాయములచేత ఛేదించెను. 20

మూ. సృష్టాన్ ద్వివిదమైన్దాభ్యాం ద్రుమానుత్పాట్య వీర్యవాన్,
బభఞ్జ గదయా మధ్యే శోణితాక్షః ప్రతాపవాన్. 21

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడు, ప్రతాపవాన్=ప్రతాపవం

తుడు అయిన, శోణితాక్షః=శోణితాక్షుడు, ద్వివిదమైన్దాభ్యామ్=ద్వివిదమైందులచేత, ఉత్పాట్య=పెకలించి, సృష్టాన్=విడువబడిన, ద్రుమాన్=వృక్షములను, గదయా=గదచేత, మధ్యే=మధ్యయందు, బభఞ్జ=విరచెను.

తా. ద్వివిదమైందులు పెకలించి విడచిన వృక్షములను పరాక్రమవంతుడు, ప్రతాపవంతుడూ అయిన శోణితాక్షుడు గదచేత మధ్యయందే విరచివేసెను. 21

మూ. ఉద్యమ్య విపులం ఖడ్గం పరమర్మవిదారణమ్,
ప్రజఙ్ఘో వాలిపుత్రాయ అభిదుద్రావ వేగితః. 22

ప్ర. అ. ప్రజఙ్ఘః=ప్రజంఘుడు, పరమర్మవిదారణమ్=శత్రువుల మర్మస్థానములను చీల్చివేయు, విపులమ్= పెద్దదైన, ఖడ్గమ్=ఖడ్గమును, ఉద్యమ్య=ఎత్తి, వేగితః=వేగవంతుడై, వాలిపుత్రాయ=అంగదునికొరకు, అభిదుద్రావ=ఎదురుగా పరుగెత్తెను.

తా. ప్రజంఘుడు శత్రువుల మర్మస్థానములను చీల్చివేసే పెద్ద ఖడ్గమును ఎత్తి అంగదునిమీదకు వేగముగా వెళ్లెను. 22

మూ. తమభ్యాశగతం దృష్ట్వా వానరేన్ద్రో మహాబలః,
ఆజఘానాశ్వకర్ణేన ద్రుమేణాతిబలస్తదా. 23

ప్ర. అ. తదా=అప్పుడు, మహాబలః=గొప్ప బలము గల, అతిబలః=అందరినీ మించిన బలము గల, వానరేన్ద్రః=వానరనాయకుడు, అభ్యాశగతమ్=దగ్గరగా వచ్చిన, తమ్=వానిని, దృష్ట్వా=చూచి, అశ్వకర్ణేన=అశ్వకర్ణ మను, ద్రుమేణ=వృక్షముచేత, ఆజఘాన=కొట్టెను.

తా. అప్పుడు అందరినీ మించిన బలము గల ఆ అంగదుడు దగ్గరగా వచ్చిన ఆ ప్రజంఘుణ్ణి మద్దిచెట్టుతో కొట్టెను. 23

మూ. బాహుం చాస్య సనిస్త్రింశమాజఘాన స ముష్టినా,
వాలిపుత్రస్య ఘాతేన స పపాత క్షితావసిః. 24

ప్ర. అ. సః=అతడు, అస్య=వీనియొక్క, సనిస్త్రింశమ్=ఖడ్గముతో కూడిన, బాహుమ్=బాహువును, ముష్టినా=పిడికిలిచేత, ఆజఘాన=కొట్టెను. వాలిపుత్రస్య=అంగదునియొక్క, ఘాతేన=దెబ్బచేత, సః అసిః=ఆ ఖడ్గము, క్షితౌ=నేలమీద, పపాత=పడెను.

తా. అంగదుడు కత్తి పట్టిన ప్రజంఘుని చేతిని పిడికిలితో కొట్టగా ఆ దెబ్బకు ఖడ్గము నేలమీద పడెను. 24

మూ. తం దృష్ట్వా పతితం భూమౌ ఖడ్గం ముసలసంనిభమ్,
ముష్టిం సంవర్తయామాస వజ్రకల్పం మహాబలః. 25

ప్ర. అ. భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, ముసలసంనిభమ్=ముసలముతో సమానమైన, తం ఖడ్గమ్=ఆ ఖడ్గమును, దృష్ట్వా=చూచి, మహాబలః=గొప్ప బలము గల ప్రజంఘుడు, వజ్రకల్పమ్= వజ్రమువంటి, ముష్టిమ్=పిడికిలిని, సంవర్తయామాస=బిగించెను.

తా. ముసలము వంటి ఆ ఖడ్గము నేలమీద పడిపోవుట చూచి గొప్ప బలము గల ఆ ప్రజంఘుడు వజ్రాయుధము వంటి పిడికిలిని బిగించెను.

మూ. స లలాటే మహావీర్యమఙ్గదం వానరర్షభమ్,
ఆజఘాన మహాతేజాః స ముహూర్తం చచాల హ. 26

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః=అతడు, మహావీర్యమ్=గొప్ప పరాక్రమము గల, వానరర్షభమ్=వానరశ్రేష్ఠుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, లలాటే=లలాటమునందు, ఆజఘాన=కొట్టెను. సః= అతడు, ముహూర్తమ్=ముహూర్తకాలమును, చచాల హ=చలించెను.

తా. మహాతేజస్సు గల ఆ ప్రజంఘుడు, గొప్ప పరాక్రమము గల వానరశ్రేష్ఠుడైన ఆ అంగదుని లలాటముమీద కొట్టగా అతడు క్షణకాలము చలించిపోయెను.

మూ. స సంజ్ఞాం ప్రాప్య తేజస్వీ వాలిపుత్రః ప్రతాపవాన్,
ప్రజఙ్ఘస్య శిరః కాయాత్పాతయామాస ముష్టినా. 27

ప్ర. అ. తేజస్వీ=తేజస్సు గల, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, సః=ఆ, వాలిపుత్రః=అంగదుడు, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రాప్య=పొంది, ముష్టినా=పిడికిలి చేత, ప్రజఙ్ఘస్య=ప్రజంఘునియొక్క, శిరః= శిరస్సును, కాయాత్=శరీరమునుండి, పాతయామాస=పడగొట్టెను.

తా. తేజఃశాలీ, ప్రతాపవంతుడూ అయిన ఆ అంగదుడు సంజ్ఞ పొంది పిడికిలితో కొట్టి ప్రజంఘుని తలను దేహమునుండి క్రిందికి పడగొట్టెను.

మూ. స యూపాక్షోఽశ్రుపూర్ణాక్షః పితృవ్యే నిహతే రణే,
అవరుహ్య రథాన్ క్షిప్రం క్షీణేషుః ఖడ్గమాదదే. 28

ప్ర. అ. రణే=యుద్ధమునందు, పితృవ్యే=పినతండ్రి, నిహతే=చంపబడినవాడగుచుండగా, సః=ఆ, యూపాక్షః=యూపాక్షుడు, అశ్రుపూర్ణాక్షః=కన్నీళ్ళతో నిండిన నేత్రములు కలవాడై, క్షీణేషుః=క్షీణించిన బాణములు కలవాడై, క్షిప్రమ్=శీఘ్రముగా,

రథాత్=రథమునుండి, అవరుహ్యా=దిగి, ఖడ్గమ్=ఖడ్గమును, ఆదదే=గ్రహించెను.

తా. యుద్ధములో పినతండ్రి మరణించుటచే కండ్లలో కన్నీళ్ళు నిండిన యూపాక్షుడు బాణములు అయిపోవుటచే ఖడ్గమును గ్రహించి వెంటనే రథమునుండి దిగెను. 28

మూ. తమాపతన్తం సంప్రేక్ష్య యూపాక్షం ద్వివిదస్త్వరన్,
అజఘానోరసి క్రుద్ధో జగ్రాహ చ బలాద్బలీ. 29

ప్ర. అ. ద్వివిదః=ద్వివిదుడు, త్వరన్=తొందరపడుచు, ఆపతన్తమ్=శీఘ్రముగా వచ్చుచున్న, తం యూపాక్షమ్= ఆ యూపాక్షుణ్ణి, సంప్రేక్ష్య=చూచి, క్రుద్ధః=కోపించినవాడై, ఉరసి=వక్షఃస్థలముమీద, అజఘాన=కొట్టెను. బలీ=బలవంతుడైన అతడు, బలాత్=బలమువలన, జగ్రాహ=గ్రహించెను.

తా. మీదికి పరుగెత్తి వచ్చుచున్న ఆ యూపాక్షుణ్ణి చూచి బలవంతుడైన ద్వివిదుడు తొందరపడుచు వానిని వక్షఃస్థలముమీద కొట్టి కోపముతో అతనిని బలాత్కారముగా పట్టుకొనెను. 29

మూ. గృహీతం భ్రాతరం దృష్ట్వా శోణితాక్షో మహాబలమ్,
ఆజఘాన మహాతేజా వక్షసి ద్వివిదం తతః. 30

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, శోణితాక్షః=శోణితాక్షుడు, మహాబలమ్=గొప్ప బలము గల, భ్రాతరమ్=సోదరుణ్ణి, గృహీతమ్=గ్రహింపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, ద్వివిదమ్=ద్వివిదుణ్ణి, వక్షసి=వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. మహాబలవంతుడైన తన సోదరుణ్ణి ద్వివిదుడు పట్టుకొనుట చూచి మహాతేజఃశాలియైన శోణితాక్షుడు ఆ ద్వివిదుణ్ణి వక్షఃస్థలముమీద కొట్టెను. 30

మూ. స తతోఽభిహతస్తేన చచాల చ మహాబలః,
ఉద్యతాం చ పునస్తస్య జహార ద్వివిదో గదామ్. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేన=వానిచేత, అభిహతః=కొట్టబడిన, మహాబలః=గొప్ప బలము గల, సః ద్వివిదః=ఆ ద్వివిదుడు, చచాల=చలించెను. పునః=మరల, ఉద్యతామ్=ఎత్తబడిన, తస్య=వానియొక్క, గదామ్=గదను, జహార=హరించెను.

తా. ఆ శోణితాక్షుడు ఆ విధముగా కొట్టగా మహాబలవంతుడైన ఆ ద్వివిదుడు తూలిపోయెను. మరల అతడు గదను ఎత్తగా దానిని లాగికొనెను.

మూ. ఏతస్మిన్నన్తరే మైన్దో ద్వివిదాభ్యాశమాగమత్,
యూపాక్షం తాడయామాస తలేనోరసి వీర్యవాన్. 32

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే=ఈ మధ్యకాలములో, మైన్దః=మైందుడు, ద్వివిదాభ్యాశమ్=ద్వివిదుని సమీపమును గూర్చి, ఆగమత్=వచ్చెను. వీర్యవాన్=పరాక్రమవంతుడైన అతడు, తలేన=అరచేతితో, యూపాక్షమ్=యూపాక్షుణ్ణి, ఉరసి=వక్షఃస్థలమునుందు, తాడయామాస=కొట్టెను.

తా. ఇంతలో పరాక్రమశాలియైన మైందుడు ద్వివిదుని దగ్గరకు వచ్చి అరచేతితో యూపాక్షుణ్ణి వక్షఃస్థలముమీద కొట్టెను. 32

మూ. తౌ శోణితాక్షయూపాక్షౌ ప్లవంగాభ్యాం తరస్వినౌ,
చక్రతుః సమరే తీవ్రమాకర్షోత్పాటనం భృశమ్. 33

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, తౌ=ఆ, తరస్వినౌ=వేగము గల, శోణితాక్షయూపాక్షౌ=శోణితాక్షయూపాక్షులు, ప్లవంగాభ్యామ్=వానరులతో, భృశమ్=మిక్కిలి, తీవ్రమ్=తీవ్రమైన, ఆకర్షోత్పాటనమ్=లాగుటను, చీల్చుటను, చక్రతుః=చేసిరి.

తా. వేగవంతులైన ఆ శోణితాక్షయూపాక్షులు యుద్ధమునందు ఆ మైందద్వివిదులతో చాల తీవ్రమైన లాగుటను చీల్చుటను చేసిరి. 33

మూ. ద్వివిదః శోణితాక్షం తు విదదార నఖైర్ముఖే,
నిష్పిపేష చ వీర్యేణ క్షితావావిధ్య వీర్యవాన్. 34

ప్ర. అ.వీర్యవాన్=పరాక్రమము గల, ద్వివిదః=ద్వివిదుడు, నఖైః=గోళ్లతో, శోణితాక్షమ్=శోణితాక్షుణ్ణి, ముఖే=ముఖమునందు, విదదార=చీల్చెను. వీర్యేణ=పరాక్రమముచేత, క్షితౌ=నేలమీద, ఆవిధ్య=పడవేసి,నిష్పిపేష చ=నలగగొట్టెను.

తా. పరాక్రమవంతుడైన ద్వివిదుడు శోణితాక్షుని ముఖమును గోళ్ళతో చీల్చి ఆతనిని నేలమీద పడేసి నలగగొట్టెను. 34

మూ. యూపాక్షమభిసంక్రుద్ధో మైన్దో వానరపుంగవః,
పీడయామాస బాహుభ్యాం పపాత స హతః క్షితౌ. 35

ప్ర. అ. వానరపుంగవః=వానరశ్రేష్ఠుడైన, మైన్దః=మైందుడు, అభిసంక్రుద్ధః=కోపించినవాడై, యూపాక్షమ్= యూపాక్షుణ్ణి, బాహుభ్యామ్=బాహువులచేత, పీడయామాస=పీడించెను. సః=అతడు, హతః=చంపబడినవాడై, క్షితౌ=నేలమీద, పపాత=పడెను.

తా. వానరశ్రేష్ఠుడైన మైందుడు కోపముతో యూపాక్షుణ్ణి బాహువులతో పట్టి గట్టిగా నొక్కివేయగా అతడు చచ్చి నేలమీద పడిపోయెను. 35

మూ. హతప్రవీరా వ్యథితా రాక్షసేన్ద్రచమూస్తదా,
జగామాభిముఖీ సా తు కుమ్భకర్ణాత్మజో యతః. 36

ప్ర. అ. తదా=అప్పుడు, హతప్రవీరా=చంపబడిన మహావీరులు గల, సా=ఆ, రాక్షసేన్ద్రచమూః=రావణుని సేన, వ్యథితా=వ్యథ చెందినదై, కుమ్భకర్ణాత్మజః=కుంభకర్ణుని కుమారుడు, యతః=ఏ వైపున ఉన్నాడో ఆ వైపునకు, అభిముఖీ=అభిముఖమైనదై, జగామ=వెళ్లెను.

తా. అప్పుడు మహావీరులు చచ్చి నేలమీద పడిపోవుటచే వ్యథ చెందిన రాక్షససేన కుంభకర్ణుని కుమారుడు, కుంభు డున్న వైపు వెళ్లెను. 36

మూ. ఆపతన్తీం చ వేగేన కుమ్భస్తాం సాన్త్వయచ్చమూమ్,
అథోత్కృష్టం మహావీర్యైర్లబ్ధలక్షైః ప్లవంగమైః. 37
నిపాతితమహావీరాం దృష్ట్వా రక్షశ్చమూం తదా,
కుమ్భః ప్రచక్రే తేజస్వీ రణే కర్మ సుదుష్కరమ్. 38

ప్ర. అ. కుమ్భః=కుంభుడు, వేగేన=వేగముతో, ఆపతన్తీమ్=వచ్చుచున్న, తాం చమూమ్=ఆ సేనను, సాన్త్వయత్=ఓదార్చెను. అథ=అటుపిమ్మట, తేజస్వీ=తేజస్సు గల, కుమ్భః=కుంభుడు, మహావీర్యైః=గొప్ప పరాక్రమము గల, లబ్ధలక్షైః=పొందబడిన లక్ష్యము గల, ప్లవంగమైః=వానరులచేత, నిపాతితమహావీరామ్=పడగొట్టబడిన మహావీరులు గల, రక్షశ్చమూమ్=రాక్షససేనను, దృష్ట్వా=చూచి, తదా=అప్పుడు, రణే=యుద్ధమునందు, సుదుష్కరమ్=చేయుటకు శక్యము కాని, ఉత్కృష్టమ్=గొప్ప, కర్మ=పనిని, చక్రే=చేసెను.

తా. కుంభుడు తన వైపు శీఘ్రముగా వచ్చుచున్న ఆ సైన్యమునకు ధైర్యము చెప్పెను. పిమ్మట తేజఃశాలియైన కుంభుడు వానరులచేత చంపబడిన మహావీరులు గల ఆ రాక్షససైన్యమును చూచి యుద్ధమునందు ఇతరు లెవ్వరూ చేయజాలని గొప్ప పని చేసెను. 37, 38

మూ. స ధనుర్ధన్వినాం శ్రేష్ఠః ప్రగృహ్య సుసమాహితః,
ముమోచాశీవిషప్రఖ్యాన్ శరాన్ దేహవిదారణాన్. 39

ప్ర. అ. ధన్వినామ్=ధనుర్ధరులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడైన, సః=అతడు, ధనుః=ధనస్సును, ప్రగృహ్య= గ్రహించి, సుసమాహితః=చాల సావధానచిత్తుడై, ఆశీవిషప్రఖ్యాన్=సర్పముల వంటి, దేహవిదారణాన్=దేహములను చీల్చివేయు,

శరాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన ఆ కుంభుడు ధనస్సు గ్రహించి, చాల సావధానచిత్తుడై దేహములను చీల్చివేయు, సర్పముల వంటి బాణములను విడచెను. 39

మూ. తస్య తచ్ఛుశుభే భూయః సశరం ధనురుత్తమమ్,
విద్యుదైరావతార్చిష్మద్ద్వితీయేన్ద్రధనుర్యథా. 40

ప్ర. అ. సశరమ్=శరముతో కూడిన, ఉత్తమమ్=ఉత్తమమైన, తస్య=అతనియొక్క, తత్=ఆ, ధనుః=ధనస్సు, విద్యుదైరావతార్చిష్మత్=మెరుపుయొక్క, బుజువైన ఇంద్రధనుస్సుయొక్క (బుజువైన ఇంద్రధనుస్సుకు ఐరావత మని పేరు) కాంతి గల, ద్వితీయేన్ద్రధనుః యథా=రెండవ ఇంద్రధనుస్సు వలె, భూయః=అధికముగా, శుశుభే=ప్రకాశించెను.

తా. బాణము సంధించిన ఆతని ఉత్తమమైన ధనస్సు, మెరుపు కాంతితోను, వక్రము కాని ధనస్సు కాంతితోను కూడిన రెండవ ఇంద్రధనస్సు వలె ప్రకాశించెను. 40

మూ. ఆకర్ణకృష్ట ముక్తేన జఘాన ద్వివిదం తదా,
తేన హాటకపుఙ్ఖేన పత్రిణా పత్రవాససా. 41

ప్ర. అ. తదా=అప్పుడు, ఆకర్ణకృష్టముక్తేన=చెవివరకు లాగబడి విడవబడిన, హాటకపుఙ్ఖేన=బంగారు పొన్ను గల, పత్రవాససా=పత్రములు వస్త్రముగా గల, తేన=ఆ, పత్రిణా=బాణముచేత, ద్వివిదమ్=ద్వివిదుణ్ణి, జఘాన=కొట్టెను.

తా. అప్పుడు ఆతడు బంగారు పొన్ను గల, రెక్కలు కట్టిన బాణమును చెవివరకు లాగి విడచి ద్వివిదుణ్ణి కొట్టెను. 41

మూ. సహసాభిహతస్తేన విప్రముక్తపదః స్ఫురన్,
నిపపాత త్రికూటాభో విహ్వలన్ ప్లవగోత్తమః. 42

ప్ర. అ. తేన=ఆ బాణముచేత, సహసా=హటాత్తుగా, అభిహతః=కొట్టబడిన, త్రికూటాభః=త్రికూటపర్వతమువంటి కాంతి గల, ప్లవగోత్తమః=ఆ వానరశ్రేష్ఠుడు, విహ్వలన్=వ్యాకులుడు అగుచు, విప్రముక్తపదః=విడవబడిన పాదన్యాసములు కలవాడై, స్ఫురన్=కదలుచు, నిపపాత=పడిపోయెను.

తా. హటాత్తుగా ఆ బాణము దెబ్బ తినిన ఆ వానరశ్రేష్ఠుడు అడుగులు తడబడగా కదలిపోయి, వ్యాకులుడై త్రికూటపర్వతము వలె పడిపోయెను. 42

మూ. మైన్దస్తు భ్రాతరం తత్ర భగ్నం దృష్ట్వా మహాహవే,
అభిదుద్రావ వేగేన ప్రగృహ్య విపులాం శిలామ్. 43

ప్ర. అ. మైన్దః తు=మైందుడైతే, తత్ర=అక్కడ, మహాహవే=మహా యుద్ధమునందు, భగ్నమ్=పరాజితుడైన, భ్రాతరమ్=సోదరుణ్ణి, దృష్ట్వా=చూచి, విపులామ్=పెద్దదైన, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, వేగేన= వేగముతో, అభిదుద్రావ=రాక్షసునకు ఎదురుగా వెళ్ళెను.

తా. ఆ మహాయుద్ధమునందు పడిపోయిన తన సోదరుణ్ణి చూచి మైందుడు పెద్ద శిలను తీసికొని వేగముగా ఆ రాక్షసుని ఎదిరించుటకై వెళ్లెను. 43

మూ. తాం శిలాం తు ప్రచిక్షేప రాక్షసాయ మహాబలః,
బిభేద తాం శిలాం కుమ్భః ప్రసన్నైః పఞ్చభిః శరైః. 44

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల మైందుడు, తామ్=ఆ, శిలామ్= శిలను, రాక్షసాయ=రాక్షసునికొరకు, ప్రచిక్షేప=విసరెను. కుమ్భః=కుంభుడు, ప్రసన్నైః=ప్రకాశించుచున్న, పఞ్చభిః=ఐదు, శరైః=బాణములచేత, తాం శిలామ్=ఆ శిలను, బిభేద=బ్రద్దలు కొట్టెను.

తా. గొప్ప బలము గల ఆ మైందుడు ఆ శిలను రాక్షసునిపై ప్రయోగించగా ఆతడు దానిని మెరయుచున్న ఐదు బాణాలచేత ముక్కలు చేసెను. 44

మూ. సంధాయ చాన్యం సుముఖం శరమాశీవిషోపమమ్,
ఆజఘాన మహాతేజా వక్షసి ద్వివిదాగ్రజమ్. 45

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల ఆ కుంభుడు, సుముఖమ్=మంచి అగ్రభాగము గల, ఆశీవిషోపమమ్=సర్పముతో సమానమైన, అన్యమ్=మరియొక, శరమ్=బాణమును, సంధాయ=సంధించి, ద్వివిదాగ్రజమ్=ద్వివిదుని అన్నగారైన ఆ మైందుణ్ణి, వక్షసి=వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. మహాతేజఃశాలియైన కుంభుడు మంచి అగ్రభాగము గల సర్పము వంటి మరియొక బాణమును సంధించి మైందుని వక్షఃస్థలముమీద కొట్టెను.

మూ. స తు తేన ప్రహారేణ మైన్దో వానరయూథపః,
మర్మణ్యభిహతస్తేన పపాత భువి మూర్ఛితః. 46

ప్ర. అ. వానరయూథపః=వానరసేనానాయకుడైన, సః మైన్దః=ఆ మైందుడు, తేన=ఆ, ప్రహారేణ=దెబ్బచేత, తేన=ఆ కుంభునిచేత, మర్మణి=మ

ర్మస్థానమునందు, అభిహతః=కొట్టబడినవాడై, మూర్ఛితః=మూర్ఛితుడై, భువి=నేలమీద, పపాత=పడెను.

తా. కుంభుని బాణము దెబ్బ మర్మస్థానమునందు తగులుటచేత వానరసేనానాయకుడైన ఆ మైందుడు మూర్ఛ చెంది నేలమీద పడిపోయెను.

మూ. అఙ్గదో మాతులౌ దృష్ట్వా మథితౌ తు మహాబలౌ,
అభిదుద్రావ వేగేన కుమ్భముద్యతకార్ముకమ్. 47

ప్ర. అ. అఙ్గదః=అంగదుడు, మథితౌ=పీడింపబడిన, మహాబలౌ=గొప్ప బలముగల, మాతులౌ=మేనమామలను, దృష్ట్వా=చూచి, ఉద్యతకార్ముకమ్=ఎత్తబడిన ధనస్సు గల, కుమ్భమ్=కుంభుణ్ణి గూర్చి, వేగేన=వేగముతో, అభిదుద్రావ=పరుగెత్తెను.

తా. మహాబలశాలులైన తన మేనమామ లిద్దరూ పడిపోవుట చూచి అంగదుడు ధనస్సు పట్టి ఉన్న కుంభుని ఎదిరించుటకై శీఘ్రముగా వెళ్లెను. 47

మూ. తమాపతన్తం వివ్యాధ కుమ్భః పఞ్చభిరాయసైః,
త్రిభిశ్చాన్యైః శితైర్బాణైర్మాతఙ్గమివ తోమరైః. 48

ప్ర. అ. కుమ్భః=కుంభుడు, ఆపతన్తమ్=శీఘ్రముగా వచ్చుచున్న, తమ్=ఆ అంగదుణ్ణి, పఞ్చభిః=ఐదు, ఆయసైః=ఇనుప బాణములచేతను, శితైః=వాడియైన, అన్యైః=ఇతరములైన, త్రిభిః బాణైః=మూడు బాణములచేతను, తోమరైః=తోమరములచేత, మాతఙ్గమివ=ఏనుగును వలె, వివ్యాధ=కొట్టెను.

తా. కుంభుడు ఐదు ఇనుప బాణాలతోను, వాడియైన మరి మూడు బాణాలతోను, తనమీదికి వచ్చి పడుచున్న ఆ అంగదుణ్ణి ఏనుగును తోమరములతో కొట్టినట్లు కొట్టెను. 48

మూ. సోఽఙ్గదం బహుభిర్బాణైః కుమ్భో వివ్యాధ వీర్యవాన్,
అకుణ్ఠధారైర్నిశితైస్తీక్ష్ణైః కనకభూషణైః. 49

ప్ర. అ. సః=ఆ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, కుమ్భః=కుంభుడు, అకుణ్ఠధారైః=మొనబోని అంచులుగల, నిశితైః=వాడియైన, తీక్ష్ణైః=బాధకలిగించు (ఇనుపవైన), బహుభిః=అనేకమైన, కనకభూషణైః=బంగారు అలంకారములు గల, బాణైః=బాణములచేత, అఙ్గదమ్=అంగదుణ్ణి, వివ్యాధ=కొట్టెను.

తా. పరాక్రమవంతుడైన ఆ కుంభుడు, మొరబోని అంచులు గల, వాడియైన, బంగారు అలంకారములు గల అనేకమైన ఇనుప బాణములచేత అంగదుణ్ణి కొట్టెను. 49

మూ. అఙ్గదః ప్రతివిష్టాఙ్గో వాలిపుత్రో న కమ్పతే,
శిలాపాదపవర్షాణి తస్య మూర్ధ్ని వవర్ష హ. 50

ప్ర. అ. ప్రతివిష్టాఙ్గః=కొట్టబడిన శరీరము గల, వాలిపుత్రః=వాలికు మారుడైన, అఙ్గదః=అంగదుడు, న కమ్పతే=చలించలేదు. తస్య=వానియొక్క, మూర్ధ్ని=శిరస్సుమీద, శిలాపాదపవర్షాణి=రాళ్ళయొక్క, వృక్షములయొక్క వర్ష ములను, వవర్ష హ=వర్షించెను.

తా. ఆ విధముగా శరీరమునందు కొట్టబడిన వాలిపుత్రుడైన అంగదుడు ఏమాత్రము చలించక ఆ కుంభుని శిరస్సుమీద శిలలను, వృక్షములను వర్షించెను. 50

మూ. స ప్రచిచ్ఛేద తాన్ సర్వాన్ బిభేద చ పునః శిలాః,
కుమ్భకర్ణాత్మజః శ్రీమాన్ వాలిపుత్రసమీరితాన్. 51

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, కుమ్భకర్ణాత్మజః=కుంభకర్ణుని కుమారు డైన, సః=ఆ కుంభుడు, వాలిపుత్రసమీరితాన్=అంగదునిచేత విసరబడిన, తాన్=ఆ, సర్వాన్=అన్ని వృక్షములను, ప్రచిచ్ఛేద=ఛేదించెను. శిలాః పునః=శిలలను అయితే, బిభేద చ=బ్రద్దలు కొట్టెను.

తా. శ్రీమంతుడైన ఆ కుంభుడు అంగదుడు ప్రయోగించిన వృక్షములను, ఛేదించి శిలలను బ్రద్దలు కొట్టెను. 51

మూ. ఆపతన్తం చ సంప్రేక్ష్య కుమ్భో వానరయూథపమ్,
భ్రువోర్వివ్యాథ బాణాభ్యాముల్కాభ్యామివ కుఞ్జరమ్. 52

ప్ర. అ. కుమ్భః=ఆ కుంభుడు, ఆపతన్తమ్=వచ్చి మీద పడుచున్న, వానరయూథపమ్=వానరసేనానాయకుడైన అంగదుణ్ణి, సంప్రేక్ష్య=చూచి, ఉల్కా భ్యామ్=కొరవులచేత, కుఞ్జరమ్ ఇవ=ఏనుగును వలె, బాణాభ్యామ్=బాణములచేత, భ్రువోః=కనుబొమ్మలమీద, వివ్యాధ=కొట్టెను.

తా. కుంభుడు తన మీదకు వచ్చుచున్న అంగదుణ్ణి చూచి కొరవులతో ఏనుగును కొట్టినట్లు రెండు బాణములతో ఆతని కనుబొమ్మలమీద కొట్టెను.

మూ. తస్య సుస్రావ రుధిరం పిహితే చాస్య లోచనే,
అఙ్గదః పాణినా నేత్రే పిధాయ రుధిరోక్షితే, 53
సాలమాసన్నమేకేన పరిజగ్రాహ పాణినా.

ప్ర. అ. తస్య=అంగదునియొక్క, రుధిరమ్=రక్తము, సుస్రావ=స్రవించెను. అస్య=వీనియొక్క, లోచనే=నేత్రములు, పిహితే చ=రక్తముచేత కప్పబడిపోయెను.

అఙ్గదః=అంగదుడు, రుధిరోక్షితే=రక్తముచేత తడపబడిన, నేత్రే=నేత్రములను, పాణినా=ఒక హస్తముచేత, పిధాయ=కప్పి, ఏకేన=ఒక, పాణినా=హస్తముచేత, ఆసన్నమ్=సమీపమునందున్న, సాలమ్=సాలవృక్షమును, పరిజగ్రాహ=గ్రహించెను.

తా. రక్తము కారుటచేత అంగదుని కళ్ళు కప్పబడిపోయెను. అతడు ఒక చేతితో రక్తముచేత తడిసిన నేత్రములు మూసికొని, మరియొక చేతితో దగ్గరనే ఉన్న సాలవృక్షమును పట్టుకొనెను. 53

మూ. సంపీడ్యోరసి సస్కన్ధమ్ కరేణాభినివేశ్య చ, 54
కిఞ్చిదభ్యవనమ్యైనమున్మమాథ మహారణే.

ప్ర. అ. సస్కన్ధమ్=మానుతో కూడిన ఆ వృక్షమును, ఉరసి=వక్షఃస్థల మునందు, సంపీడ్య=గట్టిగా పట్టి, కరేణ=హస్తముచేత, అభినివేశ్య చ=పట్టుకొని, కిఞ్చిత్=కొంచెము, అభ్యవనమ్య=వంగి, మహారణే=ఆ మహాయుద్ధమునందు, ఏనమ్=దీనిని, ఉన్మమాథ=పెకిలించెను.

తా. ఆ మహాయుద్ధమునందు అంగదుడు మ్రానుతో కూడిన ఆ వృక్షమును వక్షఃస్థలము మీద అదిమిపట్టి, చేతిలోనికి తీసికొని, కొంచెము వంగి దానిని నేలనుండి పెకలించెను. 54

మూ. తమిన్ద్రకేతుప్రతిమం వృక్షం మన్దరసన్నిభమ్, 55
సముత్ససర్జ వేగేన మిషతాం సర్వరక్షసామ్.

ప్ర. అ. సర్వరక్షసామ్=సమస్తరాక్షసులు, మిషతామ్=చూచుచుండగా, ఇన్ద్రకేతుప్రతిమమ్=ఇంద్రధ్వజముతో సమానమైన, మన్దరసన్నిభమ్=మన్దరప ర్వతముతో సమానమైన, తం వృక్షమ్=ఆ వృక్షమును, వేగేన=వేగముతో, సముత్ససర్జ=విడచెను.

తా. ఆ రాక్షసులందరూ చూచుచుండగా అంగదుడు ఇంద్రకేతువుతో సమానమైన మందరపర్వతము వంటి వృక్షమును, కుంభునిపై విసరెను. 55

మూ. స చిచ్ఛేద శితైర్బాణైః సప్తభిః కాయభేదనైః, 55
అఙ్గదో వివ్యథేఽభీక్ష్ణం స పపాత ముమోహ చ.

ప్ర. అ. సః=ఆ కుంభుడు, కాయభేదనైః=శరీరమును భేదించు, శితైః= వాడియైన, సప్తభిః=ఏడు, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. సః=ఆ, అఙ్గదః=అంగదుడు, అభీక్ష్ణమ్=మిక్కిలి, వివ్యథే=వ్యథచెందెను. పపాత=పడిపో యెను. ముమోహ చ=మోహము కూడ చెందెను.

తా. కుంభుడు ఆ వృక్షమును శరీరమును బ్రద్దలు కొట్టు వాడియైన

ఏడు బాణములచేత నరికివేసెను. (చాలకాలమునుండి యుద్ధము చేయుటచే) అంగదుడు మిక్కిలి అలసిపోయి మూర్ఛిల్లి పడిపోయెను. 56

మూ. అఙ్గదం పతితం దృష్ట్వా సీదన్తమివ సాగరమ్, 57
దురాసదం హరిశ్రేష్ఠాః రాఘవాయ న్యవేదయన్.

ప్ర. అ. పతితమ్=పడిపోయిన, సీదన్తమ్=నశించుచున్న, సాగరమ్ ఇవ=సముద్రము వలె ఉన్న, దురాసదమ్=ఎదిరింప శక్యము కాని, అఙ్గదమ్=అంగదుణ్ణి, దృష్ట్వా=చూచి, హరిశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, రాఘవాయ=రామునికొరకు, న్యవేదయన్=తెలిపిరి.

తా. ఎదిరింప శక్యము కాని అంగదుడు ఆ విధముగా పడి క్షీణించిన సముద్రమువలె ఉండగా వానరనాయకులు చూచి రామునకు తెలిపిరి. 57

మూ. రామస్తు వ్యథితం శ్రుత్వా వాలిపుత్రం మహాహవే, 58
వ్యాదిదేశ హరిశ్రేష్ఠాన్ జామ్బవత్ప్రముఖాంస్తతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, మహాహవే=ఆ మహాయుద్ధమునందు, వాలిపుత్రమ్=అంగదుణ్ణి, వ్యథితమ్=వ్యథచెందినవానినిగా, శ్రుత్వా=విని, జామ్బవత్ప్రముఖాన్=జాంబవంతుడు మొదలైన, హరిశ్రేష్ఠాన్=వానరశ్రేష్ఠులను, వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. రాముడు ఆ మహాయుద్ధములో అంగదుడు మూర్ఛిల్లినట్లు విని జాంబవంతుడు మొదలైన వానరశ్రేష్ఠులను ఆజ్ఞాపించెను. 58

మూ. తే తు వానరశార్దూలాః శ్రుత్వా రామస్య శాసనమ్, 59
అభిపేతుః సుసంక్రుద్ధాః కుమ్భముద్యతకార్ముకమ్.

ప్ర. అ. తే=ఆ, వానరశార్దూలాః=వానరశ్రేష్ఠులు, రామస్య=రామునియొక్క, శాసనమ్=ఆజ్ఞను, శ్రుత్వా=విని, సుసంక్రుద్ధాః=చాల కోపించినవారై, ఉద్యతకార్ముకమ్=ఎత్తబడిన ధనుస్సు కల, కుమ్భమ్= కుంభుని గూర్చి, అభిపేతుః=శీఘ్రముగా వెళ్ళిరి.

తా. ఆ వానరశ్రేష్ఠులు రాముని ఆజ్ఞ విని కోపావిష్టులై ధనుస్సు ధరించి యున్న కుంభుని గూర్చి శీఘ్రముగా వెళ్లిరి. 59

మూ. తతో ద్రుమశిలాహస్తాః కోపసంరక్తలోచనాః, 60
రిరక్షిషన్తోఽభ్యపతన్నఙ్గదం వానరర్షభాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, ద్రుమశిలా

హస్తాః=వృక్షములు శిలలు హస్తములందు కలవారై, కోపసంరక్తలోచనాః=కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవారై, అఙ్గదమ్=అంగదుణ్ణి, రిరక్షిషన్తః=రక్షింపగోరుచున్నవారై, అభ్యపతన్=శీఘ్రముగా వెళ్ళిరి.

తా. అప్పుడు వానరశ్రేష్ఠులు అంగదుణ్ణి రక్షించుటకై వృక్షములూ శిలలూ చేతులలో ధరించి కోపముచేత ఎఱ్ఱబడిన నేత్రములతో శీఘ్రముగా వెళ్ళిరి. 60

మూ. జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః, 61
కుమ్భకర్ణాత్మజం వీరం క్రుద్ధాః సమభిదుద్రువుః.

ప్ర. అ. జామ్బవాంశ్చ=జాంబవంతుడూ, సుషేణశ్చ=సుషేణుడూ, వానరః=వానరుడైన, వేగదర్శీ చ=వేగదర్శి, క్రుద్ధాః=కోపించినవారై, వీరమ్=వీరుడైన, కుమ్భకర్ణాత్మజమ్=కుంభకర్ణుని కుమారుని గూర్చి, సమభిదుద్రువుః=శీఘ్రముగా వెళ్ళిరి.

తా. జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శీ కోపించినవారై వీరుడైన ఆ కుంభుని ఎదిరించుటకై శీఘ్రముగా వెళ్ళిరి. 61

మూ. సమీక్ష్యాపతతస్తాంస్తు వానరేన్ద్రాన్ మహాబలాన్, 62
ఆవవార శరౌఘేణ నగేనేవ జలాశయమ్.

ప్ర. అ. ఆపతతః=వచ్చుచున్న, మహాబలాన్=గొప్ప బలము గల, తాన్=ఆ, వానరేన్ద్రాన్=వానరనాయకులను, వీక్ష్య=చూచి, జలాశయమ్=చెరువును, నగేనేవ=వృక్షముచేత వలె, శరౌఘేణ=బాణసముదాయముచేత, ఆవవార=కప్పివేసెను.

తా. గొప్ప బలము గల ఆ వానరనాయకులు తనమీదికి వచ్చుచుండగా చూచి, కుంభుడు వారిని చెరువును వృక్షములచేత కప్పినట్లు బాణసముదాయముచేత కప్పివేసెను. 62

మూ. తస్య బాణపథం ప్రాప్య న శేకురతివర్తితుమ్, 63
వానరేన్ద్రా మహాత్మానో వేలామివ మహోదధిః.

ప్ర. అ. మహాత్మానః=మహాత్ములైన, వానరేంద్రాః=వానరశ్రేష్ఠులు, తస్య=వానియొక్క, బాణపథమ్=బాణమార్గమును, ప్రాప్య=పొంది, మహోదధిః=మహాసముద్రము, వేలామ్ ఇవ=తీరమును వలె, అతివర్తితుమ్=దాటుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. మహాత్ములైన ఆ వానరనాయకులు ఆ కుంభుని బాణముల

మార్గమును పొంది, మహాసముద్రము తీరమును వలె దానిని దాటజాలకపోయిరి.

మూ. తాంస్తు దృష్ట్వా హరిగణాన్ శరవృష్టిభిరర్దితాన్, 64
అఙ్గదం పృష్ఠతః కృత్వా భ్రాతృజం ప్లవగేశ్వరః.
అభిదుద్రావ సుగ్రీవః కుమ్భకర్ణాత్మజం రణే, 65
శైలసానుచరం నాగం వేగవానివ కేసరీ.

ప్ర. అ. శరవృష్టిభి=బాణవర్షములచేత, అర్దితాన్=పీడింపబడిన, తాన్=ఆ, హరిగణాన్=వానరసముదాయములను, దృష్ట్వా=చూచి, ప్లవగేశ్వరః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, భ్రాతృజమ్=సోదరుని కుమారుడైన, అఙ్గదమ్=అంగదుణ్ణి, పృష్ఠతః కృత్వా=వెనుక వైపు ఉంచి, రణే=యుద్ధమునందు, వేగవాన్=వేగము కల, కేసరీ=సింహము, శైలసానుచరమ్=పర్వతము చరియపైన సంచరించు చున్న, నాగమివ=ఏనుగును గూర్చి వలె, కుమ్భకర్ణాత్మజమ్=కుంభుణ్ణిగూర్చి, అభిదుద్రావ=శీఘ్రముగా వెళ్లెను.

తా. వానరరాజైన సుగ్రీవుడు బాణవర్షములచేత ఆ వానరులందరూ పీడింపబడుటను చూచి తన సోదరుని కుమారుడైన అంగదుణ్ణి వెనుక ఉంచి సింహము పర్వతము చరియమీద సంచరించుచున్న ఏనుగమీదకు వేగముగా వెళ్ళినట్లు యుద్ధమునందు ఆ కుంభుని మీదకు వెళ్ళెను. 64, 65

మూ. ఉత్పాట్య చ మహావృక్షానశ్వకర్ణాదికాన్ బహూన్, 66
అన్యాంశ్చ వివిధాన్ వృక్షాంశ్చిక్షేప స మహాకపిః.

ప్ర. అ. సః=ఆ, మహాకపిః=వానరరాజు, అశ్వకర్ణాదికాన్=మద్దిచెట్టు మొదలైన, బహూన్=అనేకమైన, మహావృక్షాన్=మహావృక్షములను, ఉత్పాట్య=పెకలించి, వివిధాన్=అనేకవిధములైన, అన్యాన్=ఇతరములైన, వృక్షాన్ చ= వృక్షములనూ, చిక్షేప=విసరెను.

తా. సుగ్రీవుడు మద్దిచెట్టు మొదలైన అనేకమైన మహావృక్షములనూ, ఇంకా అనేకవిధములైన వృక్షములనూ పెకలించి కుంభునిమీదకు విసరెను.

మూ. తాం ఛాదయన్తమాకాశం వృక్షవృష్టిం దురాసదామ్, 67
కుమ్భకర్ణాత్మజః శ్రీమాంశ్చిచ్ఛేద నిశితైః శరైః.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, కుమ్భకర్ణాత్మజః=కుంభుడు, ఆకాశమ్=ఆకాశమును, ఛాదయన్తీమ్= కప్పుచున్న, దురాసదామ్=ఎదిరింప శక్యము కాని, తామ్=ఆ, వృక్షవృష్టిమ్=వృక్షవర్షమును, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. ఆకాశమును కప్పుచున్న ఎదిరింపశక్యము కాని ఆ వృక్షవర్షమును శ్రీమంతుడైన కుంభుడు వాడియైన బాణములచేత ఛేదించెను. 67

మూ. అభిలక్ష్ణేణ తీవ్రేణ కుమ్భేన నిశితైః శరైః, 68
నిర్భిద్యమానాస్తే రేజుర్యథా ఘోరశతఘ్నయః.

ప్ర. అ. అభిలక్ష్ణేణ=మంచి లక్ష్యము కల, తీవ్రేణ=భయంకరుడయిన, కుమ్భేన=కుంభునిచేత, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, నిర్భిద్యమానాః=భేదింపబడుచున్న, తే=ఆ వృక్షములు, ఘోరాః=భయంకరమైన, శతఘ్నయః యథా=శతఘ్నులు వలె, రేజుః=ప్రకాశించినవి.

తా. లక్ష్యమును కొట్టుటలో నేర్పు కల భయంకరు డయిన ఆ కుంభుడు వాడియైన బాణములతో కొట్టిన ఆ వృక్షములు భయంకరమైన శతఘ్నులు వలె (శల్యములు గుచ్చిన ఇనుప ఆయుధములు వలె) ప్రకాశించినవి.

మూ. ద్రుమవర్షం తు తద్భిన్నం దృష్ట్వా కుమ్భేన వీర్యవాన్, 69
వానరాధిపతిః శ్రీమాన్ మహాసత్త్వో న వివ్యథే.

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడూ, శ్రీమాన్=శోభ కలవాడూ, మహాసత్త్వః=గొప్ప బలము కలవాడూ అయిన, వానరాధిపతిః=సుగ్రీవుడు, కుమ్భేన=కుంభునిచేత, భిన్నమ్=తెగగొట్టబడిన, తత్=ఆ, ద్రుమవర్షమ్=వృక్షవర్షమును, దృష్ట్వా=చూచి, న వివ్యథే=వ్యథ చెందలేదు.

తా. పరాక్రమవంతుడూ, శ్రీమంతుడూ, మహాబలశాలీ ఐన సుగ్రీవుడు ఆ వృక్షవర్షమును కుంభుడు ఛేదించగా చూచి వ్యథ చెందలేదు. 69

మూ. స విధ్యమానః సహసా సహమానస్తు తాన్ శరాన్, 70
కుమ్భస్య ధనురాక్షిప్య బభఞ్జేన్ద్రధనుష్ప్రభమ్.

ప్ర. అ. విధ్యమానః=కొట్టబడుచున్న, సః=అతడు, తాన్=ఆ, శరాన్=బాణములను, సహమానః=సహించుచున్నవాడై, కుమ్భస్య=కుంభునియొక్క, ఇన్ద్రధనుష్ప్రభమ్=ఇంద్రధనుస్సువంటి కాంతిగల, ధనుః=ధనుస్సును, సహసా=హఠాత్తుగా, ఆక్షిప్య=లాగి, బభఞ్జ=విరిచివేసెను.

తా. ఆతడు కొట్టుచున్నను సుగ్రీవుడా బాణములను సహించుచూ ఇంద్రధనుస్సువంటి ఆ కుంభుని ధనుస్సును హఠాత్తుగా లాగికొని, విరిచివేసెను.

మూ. అవప్లుత్య తతః శీఘ్రం కృత్వా కర్మ సుదుష్కరమ్, 71
అబ్రవీత్కుపితః కుమ్భం భగ్నశృఙ్గమివ ద్విపమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శీఘ్రమ్=శీఘ్రముగా, అవప్లుత్య=ఎగిరి, సుదుష్కరమ్=చేయుటకు శక్యము కాని, కర్మ=ఆ పనిని, కృత్వా=చేసి, కుపితః=కోపించినవాడై, భగ్నశృఙ్గమ్=విరిగిపోయిన దంతము గల, ద్విపమ్ ఇవ=ఏనుగు వలె ఉన్న, కుమ్భమ్=కుంభుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు ఆ విధముగా ఎగిరి, చేయుటకు శక్యము కాని ఆ పనిని శీఘ్రముగా చేసి, దంతములు విరిగిన ఏనుగువలె ఉన్న ఆ కుంభునితో కోపావిష్టుడై ఇట్లు పలికెను. 71

మూ. నికుమ్భాగ్రజ వీర్యం తే బాణవేగవదద్భుతమ్, 72
సంనతిశ్చ ప్రభావశ్చ తవ వా రావణస్య వా.

ప్ర. అ. నికుమ్భాగ్రజ=నికుంభుని అన్నవైన ఓ కుంభుడా ! తే=నీయొక్క, వీర్యమ్=పరాక్రమము, బాణవేగవత్=బాణవేగము వలె, అద్భుతమ్=ఆశ్చర్యకరమైనది. సంనతిశ్చ=రాక్షసుల విషయమున వినయము, ప్రభావశ్చ=ప్రభావమూ, తవ వా=నీకైన ఉన్నది. రావణస్య వా=రావణునికైనా ఉన్నది.

తా. ఓ కుంభుడా ! నీ పరాక్రమమూ బాణవేగమూ కూడ చాల ఆశ్చర్యకరమైనవి. రాక్షసపక్షపాతమునందూ, ప్రభావమునందూ నీవూ, రావణుడూ కూడ సమానులు. 72

మూ. ప్రహ్లాదబలివృత్రఘ్నకుబేరవరుణోపమ, 73
ఏకస్త్వమనుజాతోఽసి పితరం బలవత్తరమ్.

ప్ర. అ. ప్రహ్లాదబలివృత్రఘ్నకుబేరవరుణోపమ=ప్రహ్లాదునితోనూ, బలితోనూ, దేవేంద్రునితోనూ, కుబేరునితోనూ, వరుణునితోనూ సమానమైనవాడా ! త్వమ్=నీవు, ఏకః=ఒక్కడవే, బలవత్తరమ్=చాల బలవంతుడైన, పితరమ్=తండ్రిని, అనుజాతః=అనుసరించి పుట్టినవాడవు, అసి=అయిఉన్నావు.

తా. ప్రహ్లాద-బలి-ఇంద్ర-కుబేర-వరుణులతో సమానుడవైన ఓ ! కుంభుడా ! నీవొక్కడవే మహాబలవంతుడైన నీ తండ్రిని పోలి పుట్టినావు. 73

మూ. త్వామేవైకం మహాబాహుం శూలహస్తమరిన్దమమ్, 74
త్రిదశా నాతివర్తన్తే జితేన్ద్రియమివాధయః.
విక్రమస్వ మహాబుద్ధే కర్మాణి మమ పశ్య చ. 75

ప్ర. అ. మహాబాహుమ్=గొప్ప బాహువులు కల, శూలహస్తమ్=శూలము హస్తమునందు కల, అరిన్దమమ్=శత్రుసంహారకుడవైన, త్వామ్=నిన్ను, ఏకమేవ=ఒక్కనివే, త్రిదశాః=దేవతలు, జితేన్ద్రియమ్=జయింపబడిన ఇంద్రియములు

కలవానిని, ఆధయః ఇవ=మనోవ్యథలు వలె, నాతివర్తన్తే=అతిక్రమింపజాలరు. మహాబుద్ధే=గొప్ప బుద్ధికలవాడా, విక్రమస్వ=పరాక్రమించుము. మమ=నాయొక్క, కర్మాణి చ=పనులను కూడ, పశ్య=చూడుము.

తా. శూలము హస్తమునందు ధరించి శత్రుసంహారము చేయు మహాబాహువైన నిన్నొక్కనినే జితేంద్రియుణ్ణి మనోవ్యథలు బాధింప జాలనట్లు దేవతలు బాధింపజాలరు. ఓ ! గొప్పబుద్ధి కలవాడా ! నీ పరాక్రమము చూపుము. నేను చేయు పనులను కూడా చూడుము. 74, 75

మూ. వరదానాత్పితృవ్యస్తే సహతే దేవదానవాన్,
కుమ్భకర్ణస్తు వీర్యేణ సహతే చ సురాసురాన్. 76

ప్ర. అ. తే=నీయొక్క, పితృవ్యః=పెదతండ్రియైన రావణుడు, వరదానాత్=వరదానమువలన, దేవదానవాన్=దేవతలనూ, దానవులనూ, సహతే=సహించుచున్నాడు. కుమ్భకర్ణస్తు=కుంభకర్ణుడైతే, వీర్యేణ=పరాక్రమముచేత, సురాసురాన్=సురులను, అసురులను, సహతే=సహించుచున్నాడు.

తా. నీ పెదతండ్రియైన రావణుడు వరమును పొంది యుండుటచేత దేవదానవులను ఎదిరించ గల్గుచున్నాడు. కాని నీ తండ్రి కుంభకర్ణుడైతే సహజమైన పరాక్రమముచేతనే సురాసురులను ఎదిరించగల్గినాడు. 76

మూ. ధనుషీన్ద్రజితస్తుల్యః ప్రతాపే రావణస్య చ,
త్వమద్య రక్షసాం లోకే శ్రేష్ఠోఽసి బలవీర్యతః. 77

ప్ర. అ. ధనుషి=ధనుస్సునందు, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుకూ, ప్రతాపే=ప్రతాపమునందు, రావణస్య చ= రావణునకూ, తుల్యః=సమానుడవైన, త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, రక్షసామ్=రాక్షసులయొక్క, లోకే= సముదాయమునందు, బలవీర్యతః=బలపరాక్రమములచేత, శ్రేష్ఠః=శ్రేష్ఠుడవుగా, అసి=అయివున్నావు.

తా. నీవు ధనుర్యుద్ధమునందు ఇంద్రజిత్తుతోనూ, ప్రతాపమునందు రావణునితోనూ సమానుడవు. అందుచేత నీవు ఇప్పుడు రాక్షసు లందరిలోనూ బలపరాక్రమములచేత శ్రేష్ఠుడవు. 77

మూ. మహావిమర్దం సమరే మయా సహ తవాద్భుతమ్,
అద్య భూతాని పశ్యన్తు శక్రశమ్బరయోరివ. 78

ప్ర. అ. అద్య=ఇప్పుడు, సమరే=యుద్ధమునందు, మయా సహ=నాతో కూడ, తవ=నీయొక్క, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, మహావిమర్దమ్=గొప్ప సంఘర్షమును, శక్రశమ్బరయోరివ=ఇంద్రశంబరాసురుల సంఘర్షమును వలె,

భూతాని=భూతములు, పశ్యన్తు=చూచెదరుగాక.

తా. ఇప్పుడు యుద్ధరంగములో నాతో నీకు జరుగబోవు గొప్ప సంఘర్షమును ఇంద్రునకూ శంబరాసురునకూ మధ్య జరిగిన సంఘర్షమును వలె సకలప్రాణులూ చూచుగాక. 78

మూ. కృతమప్రతిమం కర్మ దర్శితం చాస్త్రకౌశలమ్,
పాతితా హరివీరాశ్చ త్వయైతే భీమవిక్రమాః. 79

ప్ర. అ. త్వయా=నీచేత, అప్రతిమమ్=సాటిలేని, కర్మ=పని, కృతమ్=చేయబడినది. అస్త్రకౌశలం చ=అస్త్రములయందు నేర్పుకూడా, దర్శితమ్=చూపబడినది. భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము కల, ఏతే=ఈ, హరివీరాశ్చ= వానర వీరులు కూడ, పాతితాః=పడగొట్టబడినారు.

తా. నీవు సాటిలేని పని చేసినావు. అస్త్రనైపుణ్యము చూపినావు. భయంకరమైన పరాక్రమము కల వానరవీరులను పడగొట్టినావు. 79

మూ. ఉపాలమ్భభయా చ్చైవ నాసి వీర మయా హతః,
కృతకర్మపరిశ్రాన్తో విశ్రాన్తః పశ్య మే బలమ్. 80

ప్ర. అ. వీర=ఓ వీరుడా ! కృతకర్మపరిశ్రాన్తః=చేయబడిన యుద్ధకర్మ కలవాడవై అలసి ఉన్న నీవు, మయా=నాచేత, ఉపాలమ్భభయాత్=నిందవలన భయము వలన, హతః=చంపబడినవాడవు, న అసి=కావు. విశ్రాన్తః=విశ్రమించినవాడవై, మే=నాయొక్క, బలమ్=బలమును, పశ్య=చూడుము.

తా. నీవు యుద్ధము చేసి అలసి ఉండుటచేత జనులు నిందింతురేమో అని భయపడి నేను నిన్ను చంపలేదు. కొంచెముసేపు విశ్రాంతి తీసికొనిన పిమ్మట నా బలము ఎట్టిదో చూడుము. 80

మూ. తేన సుగ్రీవవాక్యేన సావమానేన మానితః,
అగ్నేరాజ్యహుతస్యేవ తేజస్తస్యాభ్యవర్ధత. 81

ప్ర. అ. సావమానేన=అవమానముతో కూడిన, తేన=ఆ, సుగ్రీవవాక్యేన= సుగ్రీవుని వాక్యముచేత, మానితః=గౌరవించబడెను. ఆజ్యహుతస్య=ఆజ్యముచేత హోమము చేయబడిన, అగ్నేః ఇవ=అగ్నియొక్క వలె, తస్య=ఆతనియొక్క, తేజః=తేజస్సు, అభ్యవర్ధత=పెరిగెను.

తా. కుంభు డీ విధముగా అవమానముతో కూడిన సుగ్రీవ వాక్యముచేత గౌరవింపబడెను. అప్పుడు అతని తేజస్సు, ఆజ్యముచేత హోమము చేసిన అగ్ని తేజస్సు వలె వృద్ధి పొందెను. 81

మూ. తతః కుమ్భస్తు సుగ్రీవం బాహుభ్యాం జగృహే తదా,
గజావివావీతమదౌ నిఃశ్వసన్తౌ ముహుర్ముహుః. 82
అన్యోన్యగాత్రగ్రథితౌ ఘర్షన్తావితరేతరమ్,
సధూమాం ముఖతో జ్వాలాం విసృజన్తౌ పరిశ్రమాత్. 83

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కుమ్భః=కుంభుడు, బాహుభ్యామ్=బాహువులచేత, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, జగృహే=పట్టుకొనెను. తదా=అప్పుడు, అవీతమదౌ=తొలగని మదముగల, గజావివ=ఏనుగులు వలె, ముహుర్ముహుః=మాటి మాటికి, నిఃశ్వసన్తౌ=నిట్టూర్చుచు, అన్యోన్యగాత్రగ్రథితౌ=పరస్పరము మెలిపెట్టబడిన దేహములు గలవారై, ఇతరేతరమ్=పరస్పరము, ఘర్షన్తౌ=ఒరయుచు, పరిశ్రమాత్=అలసటవలన, ముఖతః=ముఖములనుండి, సధూమామ్=ధూమముతో కూడిన, జ్వాలామ్=జ్వాలను, విసృజన్తౌ=విడచుచు (యుద్ధము చేసిరి.)

తా. పిమ్మట కుంభుడు సుగ్రీవుణ్ణి బాహువులతో అదిమి పట్టెను. అప్పుడు ఆ ఇద్దరూ వృద్ధి పొందిన మదము గల ఏనుగులు వలె మాటిమాటికి నిట్టూర్చుచు, ఒకరి దేహమునకు ఒకరు మెలివేయుచు, పరస్పరము ఒరయుచు, అలసటవలన ముఖములనుండి ధూమముతో కూడిన జ్వాలను విడచుచు యుద్ధము చేసిరి. 82, 83

మూ. తయోః పాదాభిఘాతాచ్చ నిమగ్నా చాభవన్మహీ,
వ్యాఘూర్ణితతరఙ్గశ్చ చుక్షుభే వరుణాలయః. 84

ప్ర. అ. తయోః=వాళ్ళయొక్క, పాదాభిఘాతాత్=పాదముల రాపిడివలన, మహీ=భూమి, నిమగ్నా=దిగిపోయినది, అభవత్=ఆయెను. వరుణాలయః=సముద్రము, వ్యాఘూర్ణితతరఙ్గః=త్రిప్పివేయబడిన తరంగములు గలదై, చుక్షుభే=క్షోభ చెందెను.

తా. వాళ్ళ పాదాల రాపిడికి నేల అణగిపోయెను. తరంగములు తిరిగిపోగా సముద్రము క్షోభ చెందెను. 84

మూ. తతః కుమ్భం సముత్క్షిప్య సుగ్రీవో లవణామ్భసి,
పాతయామాస వేగేన దర్శయన్నుదధేస్తలమ్. 85

ప్ర. అ.తతః=అటుపిమ్మట, సుగ్రీవః=సుగ్రీవుడు, కుమ్భమ్=కుంభుణ్ణి, సముత్క్షిప్య=పైకి ఎత్తి, ఉదధేః=సముద్రముయొక్క, తలమ్=అడుగును, దర్శయన్=చూపుచు, వేగేన=వేగముతో, లవణామ్భసి=లవణసముద్రమునందు, పాతయామాస=పడవేసెను.

తా. పిమ్మట సుగ్రీవుడు కుంభుణ్ణి పైకి ఎత్తి, సముద్రము

అడుగువరకు వెళ్ళిపోవునట్లు వేగముగా లవణసముద్రములో పడవేసెను. 85

మూ. తతః కుమ్భనిపాతేన జలరాశిః సముత్థితః,
విన్ధ్యమన్దరసంకాశో విససర్ప సమన్తతః. 86

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కుమ్భనిపాతేన=కుంభునియొక్క పడుటచేత, సముత్థితః=పైకి లేచిన, జలరాశిః=సముద్రము, విన్ధ్యమన్దరసంకాశః=వింధ్యమందరపర్వతములతో సమానమై, సమన్తతః= అన్ని వైపులా, విససర్ప=వ్యాపించెను.

తా. అప్పుడు కుంభుడు పడుటచేత సముద్రము వింధ్యమందరపర్వతము లంత ఎత్తు లేచి అన్ని వైపులా వ్యాపించెను. 86

మూ. తతః కుమ్భః సముత్పత్య సుగ్రీవమభిపత్య చ,
ఆజఘానోరసి క్రుద్ధో వజ్రకల్పేన ముష్టినా. 87

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కుమ్భః=కుంభుడు, సముత్పత్య=పైకి ఎగిరి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, అభిపత్య చ=సమీపించి, క్రుద్ధః=కోపించినవాడై, వజ్రకల్పేన=వజ్రమువంటి, ముష్టినా=పిడికిలిచేత, ఉరసి=వక్షఃస్థలమునందు, ఆజఘాన=కొట్టెను.

తా. పిమ్మట కుంభుడు పైకి లేచి, సుగ్రీవుణ్ణి సమీపించి, కోపముతో, వజ్రమువంటి పిడికిలితో ఆతని వక్షఃస్థలముమీద కొట్టెను. 87

మూ. తస్య వర్మ చ పుస్ఫోట సంజజ్ఞే చాపి శోణితమ్,
స చ ముష్టిర్మహావేగః ప్రతిజఘ్నేఽస్థిమణ్డలే. 88

ప్ర. అ. తస్య=వానియొక్క, వర్మ చ=కవచము కూడ, పుస్ఫోట=బ్రద్దలయ్యెను. శోణితం చాపి=రక్తము కూడ, సంజజ్ఞే=కలిగెను. (స్రవించెను.) మహావేగః=గొప్ప వేగము గల, సః ముష్టిః=ఆ పిడికిలి, అస్థిమణ్డలే= అస్థిమండలమునందు, ప్రతిజఘ్నే=ప్రతిహతమయ్యెను. (ఎదురుదెబ్బ కొట్టబడెను.)

తా. ఆ సుగ్రీవుని కవచము బ్రద్దలైపోయెను. రక్తము స్రవించెను. మహావేగము గల ఆ పిడికిలి సుగ్రీవుని అస్థిపంజరమునందు ఎదురుదెబ్బ తగిలి వ్యర్థ మయ్యెను. 88

మూ. తదా వేగేన తత్రాసీత్తేజః ప్రజ్వలితం మహత్,
వజ్రనిష్పేషసంజాతా జ్వాలా మేరోర్యథా గిరేః. 89

ప్ర. అ. తదా=అప్పుడు, తత్ర=అక్కడ, వేగేన=వేగముచేత, మహత్=గొప్పదైన, తేజః=తేజస్సు, మేరోః గిరేః= మేరుపర్వతముయొక్క, వజ్రనిష్పేషసంజాతా=

వజ్రఘాతముచేత పుట్టిన, జ్వాలా యథా=జ్వాల వలె, ప్రజ్వలితమ్=ప్రజ్వలించినది.

తా. అప్పుడు ఆ దెబ్బకొట్టిన వేగముచేత, మేరుపర్వతమును వజ్రాయుధముతో కొట్టగా బయలుదేరిన అగ్నిజ్వాల వలె, గొప్ప తేజస్సు ప్రజ్వలించెను. 89

మూ. స తత్రాభిహతస్తేన సుగ్రీవో వానరర్షభః,
ముష్టిం సంవర్తయామాస వజ్రకల్పం మహాబలః. 90

ప్ర. అ.తత్ర=అక్కడ, తేన=వానిచేత, అభిహతః=కొట్టబడిన, మహాబలః= గొప్ప బలము గల, వానరర్షభః= వానరశ్రేష్ఠుడైన, సః=ఆ, సుగ్రీవః=సుగ్రీవుడు, వజ్రకల్పమ్=వజ్రాయుధమువంటి, ముష్టిమ్=పిడికిలిని, సంవర్తయామాస=బిగించెను.

తా. అక్కడ కుంభుడు ఆ విధముగా కొట్టగా, మహాబలవంతుడు, వానరశ్రేష్ఠుడూ అయిన సుగ్రీవుడు వజ్రాయుధమువంటి పిడికిలి బిగించెను.

మూ. అర్చిఃసహస్రవికచరవిమణ్డలవర్చసమ్,
స ముష్టిం పాతయామాస కుమ్భస్యోరసి వీర్యవాన్. 91

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=అతడు, అర్చిః=సహస్రవికచరవిమణ్డలవర్చసమ్= వేయి కిరణములతో వికసించిన సూర్యమండలమువంటి కాంతిగల, ముష్టిమ్=పిడికిలిని, కుమ్భస్య=కుంభునియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, పాతయామాస=పడవేసెను.

తా. పరాక్రమవంతుడైన అతడు వేయి కిరణములతో వికసించిన సూర్యమండలమువంటి కాంతి గల పిడికిలిని కుంభుని వక్షఃస్థలముమీద పడవేసెను. 91

మూ. స తు తేన ప్రహారేణ విహ్వలో భృశపీడితః,
నిపపాత తదా కుమ్భో గతార్చిరివ పావకః. 92

ప్ర. అ. సః కుమ్భః=ఆ కుంభుడు, తేన=ఆ, ప్రహారేణ=దెబ్బచేత, భృశపీడితః=మిక్కిలి పీడించబడినవాడై, విహ్వలః=వ్యాకులుడై, తదా=అప్పుడు, గతార్చిః=పోయిన జ్వాల గల, పావకః ఇవ=అగ్ని వలె, నిపపాత=పడిపోయెను.

తా. ఆ కుంభుడు ఆ దెబ్బకు చాల వ్యాకులత చెంది, మిక్కిలి పీడింపబడినవాడై, జ్వాల శాంతించిన అగ్నివలె నేలమీద పడిపోయెను. 92

మూ. ముష్టినాభిహతస్తేన నిపపాతాశు రాక్షసః,
లోహితాఙ్గ ఇవాకాశాద్దీప్తరశ్మిర్యదృచ్ఛయా. 93

ప్ర. అ. తేన=ఆ సుగ్రీవునిచేత, ముష్టినా=పిడికిలిచేత, అభిహతః=కొట్టబడిన, రాక్షసః=రాక్షసుడు, దీప్తరశ్మిః=ప్రకాశించుచున్న కిరణములు గల, లోహితాఙ్గః=కుజుడు, యదృచ్ఛయా=దైవవశముచేత, ఆకాశాదివ=ఆకాశమునుండి వలె, ఆశు=శీఘ్రముగా, నిపపాత=పడెను.

తా. సుగ్రీవుడు అట్లు పిడికిలితో కొట్టగా ఆ రాక్షసుడు, ప్రకాశించుచున్న కిరణములు గల కుజుడు దైవవశముచేత ఆకాశమునుండి పడిపోయినట్లు నేలపై పడెను. 93

మూ. కుమ్భస్య పతతో రూపం భగ్నస్యోరసి ముష్టినా,
బభౌ రుద్రాభిపన్నస్య యథారూపం గవాం పతేః. 94

ప్ర. అ. ఉరసి=వక్షఃస్థలముమీద, ముష్టినా=పిడికిలిచేత, భగ్నస్య=బ్రద్దలు కొట్టబడిన, పతతః=పడుచున్న, కుమ్భస్య=కుంభునియొక్క, రూపమ్=రూపము, రుద్రాభిపన్నస్య=రుద్రునిచేత తిరస్కరింపబడిన, గవాంపతేః= సూర్యునియొక్క, రూపం యథా=రూపమువలె, బభౌ=ప్రకాశించెను.

తా. పిడికిలి దెబ్బకు వక్షఃస్థలము బ్రద్దలై క్రింద పడిపోవుచున్న కుంభుని రూపము రుద్రునిచేత కొట్టబడిన సూర్యుని రూపము వలె ప్రకాశించెను.

మూ. తస్మిన్ హతే భీమపరాక్రమేణ
ప్లవంగమానామృషభేణ యుద్ధే,
మహీ సశైలా సవనా చచాల
భయం చ రక్షాంస్యధికం వివేశ. 94

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాండే షట్సప్తతితమః సర్గః.

ప్ర. అ. భీమపరాక్రమేణ=భయంకరమైన పరాక్రమము గల, ప్లవంగమానామ్=వానరులలో, ఋషభేణ= శ్రేష్ఠుడైన సుగ్రీవునిచేత, యుద్ధే=యుద్ధమునందు, తస్మిన్=అతడు, హతే=చంపబడిన వాడగుచుండగా, సశైలా=శైలములతో కూడిన, సవనా=వనములతో కూడిన, మహీ=భూమి, చచాల=చలించెను. రక్షాంసి=రాక్షసులను, అధికమ్=అధికముగా, భయమ్=భయము, వివేశ=ప్రవేశించెను.

తా. భయంకరమైన పరాక్రమము గల, వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు యుద్ధమునందు ఆ కుంభుణ్ణి చంపగానే పర్వతములతోను, వనములతోను కూడిన భూమి అదిరిపోయెను. రాక్షసులను చాల భయము ఆవహించెను. 94

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బైఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తసప్తతితమః సర్గః

[హనుమంతుడు నికుంభుణ్ణి చంపుట.]

మూ. నికుమ్భో భ్రాతరం దృష్ట్వా సుగ్రీవేణ నిపాతితమ్,
ప్రదహన్నివ కోపేన వానరేన్ద్రముదైక్షత. 1

ప్ర. అ. నికుమ్భః=నికుంభుడు, భ్రాతరమ్=సోదరుణ్ణి, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, నిపాతితమ్=పడగొట్టబడినవానినిగా, దృష్ట్వా=చూచి, కోపేన=కోపముచేత, ప్రదహన్నివ=కాల్చివేయుచున్నాడా అన్నట్లు, వానరేన్ద్రమ్=సుగ్రీవుణ్ణి, ఉదైక్షత=చూచెను.

తా. నికుంభుడు తన సోదరుణ్ణి సుగ్రీవుడు చంపుట చూచి, కోపముతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు సుగ్రీవుణ్ణి చూచెను. 1

మూ. తతః స్రగ్దామసంనద్ధం దత్తపఞ్చాఙ్గులం శుభమ్,
ఆదదే పరిఘం ధీరో మహేన్ద్రశిఖరోపమమ్. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధీరః=ధీరుడైన ఆ నికుంభుడు, స్రగ్దామసంనద్ధమ్=పుష్పమాలలచేత కట్టబడిన, దత్తపఞ్చాఙ్గులమ్=ఇవ్వబడిన ఐదు వ్రేళ్ళుగల, శుభమ్=మంగళప్రదమైన, మహేన్ద్రశిఖరోపమమ్ =మహేంద్రపర్వతశిఖరముతో సమానమైన, పరిఘమ్=పరిఘను, ఆదదే=గ్రహించెను.

తా. పిమ్మట ధీరుడైన ఆ నికుంభుడు మహేంద్రపర్వతశిఖరమువంటి పరిఘను గ్రహించెను. మంగళప్రదమైన ఆ పరిఘకు పుష్పమాలలు కట్టబడియుండెను. చందనకుంకుమాదులతో ఐదు వ్రేళ్ళ ముద్ర లుంచబడెను. 2

మూ. హేమపట్టపరిక్షిప్తం వజ్రవిద్రుమభూషితమ్,
యమదణ్డోపమం భీమం రక్షసాం భయనాశనమ్. 3

ప్ర. అ. హేమపట్టపరిక్షిప్తమ్=బంగారు పట్టీలతో కూడినది, వజ్రవిద్రుమభూషితమ్=వజ్రములచేతను పొగడములచేతను అలంకరింపబడినది, యమదణ్డోపమమ్=యమదండముతో సమానము, భీమమ్=భయంకరము, రక్షసామ్=రాక్షసులయొక్క, భయనాశనమ్=భయమును తొలగించేది అయిన పరిఘను గ్రహించెను.

తా. యమదండము వలె భయంకరమైన ఆ పరిఘ చుట్టూ బంగారు పట్టాలు బిగింపబడెను. వజ్రములతోను, పగడములతోను అలంకరింపబడెను. అది రాక్షసుల భయమును తొలగించునదిగా ఉండెను. 3

మూ. తమావిధ్య మహాతేజాః శక్రధ్వజసమౌజసమ్,
వివనాద వివృత్తాస్యో నికుమ్భో భీమవిక్రమః. 4

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమము గల, నికుమ్భః= నికుంభుడు, శక్రధ్వజసమౌజసమ్=ఇంద్రధ్వజముతో సమానమైన తేజస్సు గల, తమ్=దానిని, ఆవిధ్య=గట్టిగా పట్టి, వివృత్తాస్యః=త్రిప్పబడిన (తెరవబడిన) ముఖము గలవాడై, వినవాద=ధ్వనిచేసెను.

తా. గొప్ప తేజస్సు, భయంకరమైన పరాక్రమము గల ఆ నికుంభుడు ఇంద్రధ్వజము వలె ఉన్న పరిఘను గట్టిగా పట్టి, నోరు తెరచి బిగ్గరగా గర్జించెను.

మూ. ఉరోగతేన నిష్కేణ భుజస్థైరఙ్గదైరపి,
కుణ్డలాభ్యాం చ చిత్రాభ్యాం మాలయా చ స చిత్రయా. 5
నికుమ్భో భూషణైర్భాతి తేన స్మ పరిఘేణ చ,
యథేన్ద్రధనుషా మేఘః స విద్యుత్స్తనయిత్నుమాన్. 6

ప్ర. అ. సః నికుమ్భః=ఆ నికుంభుడు, ఉరోగతేన=వక్షఃస్థలమునందున్న, నిష్కేణ=పదకముతోను, భుజస్థైః=భుజములందున్న, అఙ్గదైః అపి=బాహుపురుల తోను, చిత్రాభ్యామ్=చిత్రములైన, కుణ్డలాభ్యామ్=కుండలములతోను, చిత్రయా=చిత్రమైన, మాలయా చ=మాలతోను, భూషణైః=భూషణములతోను, తేన=ఆ, పరిఘేణ చ=పరిఘతోను, సవిద్యుత్స్తనయిత్నుమాన్=మెరుపులతోను ఉరుము తోను కూడిన, ఇన్ద్రధనుషా=ఇంద్రధనస్సుతో కూడిన, మేఘః యథా=మేఘమువలె, భాతి స్మ=ప్రకాశించెను.

తా. వక్షఃస్థలమునందు పదకము, భుజములందు బాహుపురులు, చిత్రములైన కుండలములు, వివిధ వర్ణములు గల పుష్పమాలలు, ఇతరాలంకారములు ధరించిన ఆ నికుంభుడు ఇంద్రధనస్సుతోను మెరపులతోను ఉరుములతోను కూడిన మేఘము వలె ఉండెను. 5, 6

మూ. పరిఘాగ్రేణ పుస్ఫోట వాతగ్రన్థిర్మహాత్మనః,
ప్రజజ్వాల సఘోషశ్చ విధూమ ఇవ పావకః. 7

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన వానియొక్క, పరిఘాగ్రేణ=పరిఘ అగ్రభాగముచేత, వాతగ్రన్థిః=ఆవహము, ప్రవహము మొదలైన ఏడు వాయు

వుల గ్రంథి, పుస్ఫోట=బద్ధలయ్యెను. సఘోషః=ఘోషముతో కూడినదై, విధూమః=ధూమములేని, పావకః ఇవ=అగ్ని వలె, ప్రజజ్వాల=ప్రజ్వలించెను.

తా. ఆతని పరిఘాగ్రముచేత ఏడు వాయువుల గ్రంథులు బద్ధలైపోయెను. ఘోషముతో కూడిన అతడు లేదా ఆ పరిఘ ధూమములేని అగ్నివలె ప్రజ్వలించెను. 7

మూ. నగర్యా విటపావత్యా గన్ధర్వభవనోత్తమైః,
సతారాగ్రహనక్షత్రం సచన్ద్రం సమహాగ్రహమ్, 8
నికుమ్భపరిఘాఘూర్ణం భ్రమతీవ నభఃస్థలమ్.

ప్ర. అ. విటపావత్యా నగర్యా=అలకాపట్టణముతోను, గన్ధర్వభవనోత్తమైః=ఉత్తమములైన గంధర్వభవనములతోను కూడిన, సతారాగ్రహనక్షత్రమ్=అశ్విన్యాదితారలతోను, బుధాదిగ్రహాలతోను, ఇతరనక్షత్రములతోను కూడిన, సచన్ద్రమ్=చంద్రునితో కూడిన, సమహాగ్రహమ్=శుక్రాదిమహాగ్రహములతో కూడిన, నభఃస్థలమ్=ఆకాశము, నికుమ్భపరిఘాఘూర్ణమ్=నికుంభుని పరిఘముచేత, పరిఘమువలన పుట్టిన గాలిచేత, త్రిప్పబడినదై, భ్రమతీవ=తిరిగిపోవుచున్నట్లుండెను.

తా. నికుంభుని పరిఘ గాలికి అలకాపట్టణముతోను, ఉత్తమములైన గంధర్వనగరములతోను, తారాగ్రహనక్షత్రములతోను, చంద్రునితోను, మహాగ్రహములతోను సహా ఆకాశ మంతా తిరిగి పోవుచున్నట్లు ఉండెను. 8

మూ. దురాసదశ్చ సంజజ్ఞే పరిఘాభరణప్రభః, 9
క్రోధేన్ధనో నికుమ్భాగ్నిర్యుగాన్తాగ్నిరివోత్థితః.

ప్ర. అ. పరిఘాభరణప్రభః=పరిఘయొక్క ఆభరణములయొక్క కాంతి గలది, క్రోధేన్ధనః=క్రోధ మను కట్టెలు గలది అయిన, నికుమ్భాగ్నిః=నికుంభుడనే అగ్ని, ఉత్థితః=పైకిలేచిన, యుగాన్తాగ్నిః ఇవ=ప్రళయకాలాగ్ని వలె, దురాసదః=సమీపింప శక్యము కానిదిగా, సంజజ్ఞే=ఆయెను.

తా. పరిఘ కాంతి, ఆభరణముల కాంతి, క్రోధ మనే కట్టెలు గల నికుంభు డనే అగ్ని విజృంభించిన ప్రళయకాలాగ్ని ఎదిరింప శక్యము కానిది అయ్యెను. 9

మూ. రాక్షసా వానరాశ్చాపి న శేకుః స్పన్దితుం భయాత్, 10
హనుమాంస్తు వివృత్యోరస్తస్థౌ ప్రముఖతో బలీ.

ప్ర. అ. రాక్షసాః=రాక్షసులు, వానరాశ్చాపి=వానరులు కూడ, భయాత్=భయమువలన, స్పన్దితుమ్=కదలుటకు, న శేకుః=సమర్థులు కాకపోయిరి.

బలీ=బలవంతుడైన, హనుమాన్ తు=హనుమంతుడైతే, ఉరః=వక్షఃస్థలమును, వివృత్య=తెరచి, తస్థౌ=నిలచెను.

తా. రాక్షసులూ వానరులూ కూడ భయపడి కదలుటకు కూడ సమర్థులు కాలేదు. బలశాలియైన హనుమంతుడైతే, వక్షఃస్థలమును తెరచి నిలబడెను. 10

మూ. పరిఘోపమబాహుస్తు పరిఘం భాస్కరప్రభమ్, 11
బలీ బలవతస్తస్య పాతయామాస వక్షసి.

ప్ర. అ. పరిఘోపమబాహుః=పరిఘులతో సమానమైన బాహువులు గల, బలీ=బలవంతుడైన ఆ నికుంభుడు, భాస్కరప్రభమ్=సూర్యుని వంటి కాంతి గల, పరిఘమ్=పరిఘను, బలవతః=బలవంతుడైన, తస్య=ఆ హనుమంతునియొక్క, వక్షసి=వక్షఃస్థలమునందు, పాతయామాస=పడవేసెను.

తా. పరిఘుల వంటి బాహువులు గల బలశాలియైన ఆ నికుంభుడు సూర్యునివంటి కాంతి గల ఆ పరిఘను బలశాలియైన హనుమంతుని వక్షఃస్థలముమీద పడవేసెను. 11

మూ. స్థిరే తస్యోరసి వ్యూఢే పరిఘః శతధా కృతః, 12
వికీర్యమాణః సహసా ఉల్కాశతమివామ్బరే.

ప్ర. అ. స్థిరే=స్థిరము, వ్యూఢే=విశాలము అయిన, తస్య ఉరసి=ఆ హనుమంతుని వక్షఃస్థలమునందు, పరిఘః=పరిఘ, శతధా=నూరు ముక్కలుగా, కృతః=చేయుబడినదై, సహసా=వెంటనే, అమ్బరే=ఆకాశమునందు, ఉల్కాశతమివ= అనేక ఉల్కల వలె, వికీర్యమాణః=చిమ్మబడుచున్నది అయ్యెను.

తా. స్థిరము, విశాలము అయిన ఆతని వక్షఃస్థలము మీద పడిన ఆ పరిఘ ముక్కముక్కలై, ఆకాశమునందు అనేక ఉల్కల వలె చిమ్మబడిపోయెను.

మూ. స తు తేన ప్రహారేణ విచచాల మహాకపిః, 13
పరిఘేణ సమాధూతో యథా భూమిచలేఽచలః.

ప్ర. అ. పరిఘేణ=పరిఘచేత, సమాధూతః=కదల్పబడిన, సః మహాకపిః=ఆ హనుమంతుడు, తేన=ఆ, ప్రహారేణ=దెబ్బచేత, భూమిచలే=భూమి చలించినప్పుడు, అచలః యథా=పర్వతము వలె, విచచాల=చలించెను.

తా. ఆ పరిఘచేత కొట్టబడిన హనుమంతుడు ఆ దెబ్బకు భూమి కంపించినప్పుడు పర్వతము చలించినట్లు చలించెను. 13

మూ. స తథాభిహతస్తేన హనుమాన్ ప్లవగోత్తమః, 14
ముష్టిం సంవర్తయామాస బలేనాతిమహాబలః.

ప్ర. అ. తేన=వానిచేత, తథా=అట్లు, అభిహతః=కొట్టబడిన, సః=ఆ, ప్లవగోత్తమః=వానరశ్రేష్ఠుడైన, అతిమహాబలః=గొప్ప బలము గల, హనుమాన్=హనుమంతుడు, బలేన=బలముతో, ముష్టిమ్=పిడికిలిని, సంవర్తయామాస=బిగించెను.

తా. వానిచేత ఆ విధముగా కొట్టబడిన వానరశ్రేష్ఠుడు, మహాబలశాలీ అయిన హనుమంతుడు పిడికిలిని బిగించెను. 14

మూ. తముద్యమ్య మహాతేజా నికుమ్భోరసి వీర్యవాన్, 15
అభిచిక్షేప వేగేన వేగవాన్ వాయువిక్రమః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, వేగవాన్=వేగవంతుడైన, వాయువిక్రమః=వాయువువంటి పరాక్రమము గల హనుమంతుడు, తమ్=ఆ పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, వేగేన=వేగముతో, నికుమ్భోరసి=నికుంభుని వక్షఃస్థలము మీద, అభిచిక్షేప=పడవేసెను.

తా. గొప్పతేజస్సు, బలము, వేగము, వాయువుతో సమానమైన పరాక్రమము గల హనుమంతుడు ఆ పిడికిలి ఎత్తి వేగముగా నికుంభుని వక్షఃస్థలముమీద పడవేసెను. 15

మూ. తత్ర పుస్ఫోట వర్మాస్య ప్రసుస్రావ చ శోణితమ్,
ముష్టినా తేన సంజజ్ఞే మేఘే విద్యుదివోత్థితా. 16

ప్ర. అ. తేన=ఆ, ముష్టినా=పిడికిలిచేత, తత్ర=అక్కడ, అస్య=వీని యొక్క, వర్మ=కవచము, పుస్ఫోట=బ్రద్దలయ్యెను. శోణితం చ=రక్తము కూడ, ప్రసుస్రావ=స్రవించెను. మేఘే=మేఘమునందు, విద్యుత్=మెరుపు, ఉత్థితా ఇవ=లేచినది వలె, సంజజ్ఞే=ఆయెను.

తా. ఆ పిడికిలి దెబ్బచేత అక్కడ ఆ నికుంభుని కవచము బ్రద్దలైపోయెను. రక్తము స్రవించెను. ఆ రక్తస్రావము మేఘమునందు మెరుపు పుట్టినట్లుండెను.

మూ. స తు తేన ప్రహారేణ నికుమ్భో విచచాల హ,
స్వస్థశ్చాపి నిజగ్రాహ హనూమన్తం మహాబలమ్. 17

ప్ర. అ. తేన=ఆ, ప్రహారేణ=దెబ్బచేత, సః=ఆ, నికుమ్భః=నికుంభుడు, విచచాల హ=చలించెను. స్వస్థశ్చాపి= స్వస్థుడై, మహాబలమ్=గొప్ప బలము గల,

హనూమన్తమ్=హనుమంతుణ్ణి, నిజగ్రాహ=పట్టుకొనెను.

తా. ఆ దెబ్బకు నికుంభుడు చలించిపోయెను. కొంత సేపటికి స్వస్థుడై మహాబలశాలియైన హనుమంతుణ్ణి పట్టుకొనెను. 17

మూ. చుక్రుశుశ్చ తదా సంఖ్యే భీమం లఙ్కానివాసినః,
నికుమ్భేనోద్యతం దృష్ట్వా హనూమన్తం మహాబలమ్. 18

ప్ర. అ. తదా=అప్పుడు, సంఖ్యే=యుద్ధమునందు, నికుమ్భేన=నికుంభుని చేత, ఉద్యతమ్=ఎత్తబడిన, మహాబలమ్=గొప్ప బలము గల, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, దృష్ట్వా=చూచి, లఙ్కానివాసినః=రాక్షసులు, భీమమ్=భయంకరముగా, చుక్రుశుః=అరచిరి.

తా. అప్పుడు యుద్ధమునందు మహాబలశాలియైన హనుమంతుణ్ణి నికుంభుడు పట్టి ఎత్తుటను చూచి రాక్షసులు ఆనందముతో భయంకరముగా అరచిరి. 18

మూ. స తథా హ్రియమాణోఽపి హనుమాంస్తేన రక్షసా,
ఆజఘానానిలసుతో వజ్రకల్పేన ముష్టినా. 19

ప్ర. అ. తేన రక్షసా=ఆ రాక్షసునిచేత, తథా=అట్లు, హ్రియమాణః అపి=హరింపబడుచున్నవాడైనను, అనిలసుతః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, వజ్రకల్పేన=వజ్రముతో సమానమైన, ముష్టినా=పిడికిలితో, ఆజఘాన=కొట్టెను.

తా. ఆ రాక్షసుడు ఆ విధముగా తనను పైకెత్తి తీసికొనిపోవుచున్నను వాయుపుత్రుడైన హనుమంతుడు ఆతనిని వజ్రము వంటి పిడికిలితో కొట్టెను.

మూ. ఆత్మానం మోక్షయిత్వాథ క్షితావభ్యవపద్యత,
హనూమానున్మమాథాశు నికుమ్భం మారుతాత్మజః. 20

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనూమాన్=హనుమంతుడు, ఆత్మానమ్=తనను, మోక్షయిత్వా=విడిపించుకొని, అథ=పిమ్మట, క్షితౌ=భూమి యందు, అభ్యపద్యత=పొందెను. ఆశు=శీఘ్రముగా, నికుమ్భమ్=నికుంభుణ్ణి, ఉన్మమాథ=పీడించెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు తనను ఆ నికుంభుని పట్టునుండి విడిపించుకొని, నేలమీద దిగి, వానిని పీడించెను. 20

మూ. నిక్షిప్య పరమాయత్తో నికుమ్భం నిష్పిపేష చ,
ఉత్పత్య చాస్య వేగేన పపాతోరసి వేగవాన్. 21

ప్ర. అ.పరమాయత్తః=మిక్కిలి సావధానుడై, నికుమ్భమ్=నికుంభుణ్ణి, నిక్షిప్య=నేలమీద పడవేసి, నిష్పిపేష చ=నలిపివేసెను. వేగేన=వేగముతో, ఉత్పత్య=పైకి ఎగిరి, వేగవాన్=వేగవంతుడై, అస్య=వీనియొక్క, ఉరసి= వక్షఃస్థలముపైన, పపాత=పడెను.

తా. ప్రయత్నపూర్వకముగా ఆ నికుంభుణ్ణి క్రిందికి పడద్రోసి వానిని నలిపివేసెను. పిదప వేగవంతుడైన ఆ హనుమంతుడు పైకి ఎగిరి వేగముగా ఆతని వక్షఃస్థలముమీద పడెను. 21

మూ. పరిగృహ్యా చ బాహుభ్యాం పరివృత్య శిరోధరామ్,
ఉత్పాటయామాస శిరో భైరవం నదతో మహత్. 22

ప్ర. అ. బాహుభ్యామ్=బాహువులచే, శిరోధరామ్=కంఠమును, పరిగృహ్యా=గ్రహించి, పరివృత్య=మెలికలు తిప్పి, భైరవమ్=భయంకరముగా, నదతః=అరచుచున్న వానియొక్క, మహత్=పెద్దదైన, శిరః=శిరస్సును, ఉత్పాటయామాస=పెకలించెను.

తా. వాని కంఠమును రెండు చేతులతో పట్టి మెలిత్రిప్పి, ఆతడు భయంకరముగా అరచుచుండగా వాని పెద్ద శిరస్సును ఊడలాగెను. 22

మూ. అథ నినదతి సాదితే నికుమ్భే
పవనసుతేన రణే బభూవ యుద్ధమ్,
దశరథసుతరాక్షసేన్ద్రసూన్వో
ర్భృశతరమాగతరోషయోః సుభీమమ్. 23

ప్ర. అ. అథ=అటుపిమ్మట, నినదతి=అరచుచున్న, నికుమ్భే=నికుంభుడు, రణే=యుద్ధమునందు, పవనసుతేన=హనుమంతునిచేత, సాదితే=చంపబడినవాడగుచుండగా, భృశతరమ్=చాల అధికముగా, ఆగతరోషయోః= పొందబడిన కోపముగల, దశరథసుతరాక్షసేన్ద్రసూన్వోః=రామునకు ఖరుని పుత్రుడైన మకరాక్షునకు, సుభీమమ్=చాల భయంకరమైన, యుద్ధమ్=యుద్ధము, బభూవ=ఆయెను.

తా. బిగ్గరగా అరచుచున్న ఆ నికుంభుణ్ణి హనుమంతుడు చంపివేసిన పిమ్మట మిక్కిలి కోపావిష్టులైన రామమకరాక్షులకు చాల భయంకరమైన యుద్ధము జరిగెను. 23

మూ. వ్యపేతే తు జీవే నికుమ్భస్య హృష్టా
వినేదుః ప్లవంగా దిశః సస్వనుశ్చ,
చచాలేవ చోర్వీ పపాతేవ సా ద్యౌ
ర్బలం రాక్షసానాం భయం చావివేశ. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాండే సప్తసప్తతితమః సర్గః.

ప్ర. అ. నికుమ్భస్య=నికుంభునియొక్క, జీవే=జీవుడు, వ్యపేతే=దూర ముగా పోయినవా డగుచుండగా, ప్లవంగాః=వానరులు, హృష్టాః=సంతోషించినవారై, వినేదుః=ధ్వనిచేసిరి. దిశః=దిక్కులు, సస్వనుః చ=మారుమ్రోగినవి. ఉర్వీ=భూమి, చచాలేవ=కదలిపోయినట్లు అయినది. సా=ఆ, ద్యౌః=ఆకాశము, పపాతేవ=పడి పోయినది. రాక్షసానామ్=రాక్షసులయొక్క, బలమ్=సేనను, భయమ్=భయము, ఆవివేశ చ=ఆవేశించెను.

తా. నికుంభుని ప్రాణాలు పోయిన వెంటనే వానరులు సంతోషించుచు దిక్కులు మారుమ్రోగునట్లు గర్జించిరి. భూమి చలించినట్లయ్యెను. ఆకాశము క్రింద పడిపోయినట్లయ్యెను. రాక్షససైన్యమును భయము ఆవహించెను.

వి. రాబోవు సర్గలోని వృత్తాంతాన్ని వెనుకటి సర్గ చివర సూచించడం ఉంటుంది. కాని డెబ్బైతొమ్మిదోసర్గలో వర్ణించబోయే రామమకరాక్షయుద్ధాన్ని ఈ సర్గ చివర సూచించడం సంభావ్యం కాదు. ప్రాచ్యప్రతిలో 23వ శ్లోకం పాఠం మరొక విధంగా ఉన్నది.

"అథ నదతి నిపాతితే నికుమ్భే పవనసుతేన తదా రణస్య మధ్యే,
దశరథసుతవాహినీ సమగ్రా పరమమగాత్సకలా తదా ప్రహర్షమ్"

నికుంభుణ్ణి హనుమంతుడు చంపివేయగానే రాముని సేన చాలా సంతో షించిందని దీని అర్థం. భుజంగప్రయాతవృత్తంలో రామాయణంలో ప్రప్రథమంగా కనబడే ఇరవైనాల్గవ శ్లోకం కూడా ఎవరో వేరొకడు ఉత్సాహాతిశయంతో చేర్చినట్లు కనబడుతుంది. "జీవుడు తొలగిపోవడం" వంటి మాటలు వాల్మీకి ఉపయోగించదు. భావం కూడా అంతంతమాత్రంగానే ఉంది. ఈ శ్లోకం ప్రాచ్యప్రతిలో లేదు. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టసప్తతితమః సర్గః

[రావణుని ఆజ్ఞచేత మకరాక్షుడు యుద్ధానికై బయల్వెడలుట.]

మూ. నికుమ్భం నిహతం శ్రుత్వా కుమ్భం చ వినిపాతితమ్,
రావణః పరమామర్షీ ప్రజజ్వాలానలో యథా. 1

ప్ర. అ. నికుమ్భమ్=నికుంభుణ్ణి, నిహతమ్=చంపబడినవానినిగా, కుమ్భం చ=కుంభుణ్ణి కూడ, వినిపాతితమ్=పడగొట్టబడినవానినిగా, శ్రుత్వా=విని, రావణః=రావణుడు, పరమామర్షీ=చాల కోపము గలవాడై, అనలో యథా=అగ్నివలె, ప్రజజ్వాల=మండిపడెను.

తా. నికుంభుడు, కుంభుడు చంపబడినా రని విని రావణుడు చాల కోపముతో అగ్నివలె మండిపడెను. 1

మూ. నైర్ఋతః క్రోధశోకాభ్యాం ద్వాభ్యాం తు పరిమూర్ఛితః,
ఖరపుత్రం విశాలాక్షం మకరాక్షమచోదయత్. 2

ప్ర. అ. నైర్ఋతః=రావణుడు, క్రోధశోకాభ్యామ్=కోపముతోను శోకముతోను, ద్వాభ్యామ్=రెండింటితోను, పరిమూర్ఛితః=ఆవహించబడినవాడై, విశాలాక్షమ్=విశాలములైన నేత్రములు గల, ఖరపుత్రమ్=ఖరుని పుత్రుడైన, మకరాక్షమ్=మకరాక్షుణ్ణి, అచోదయత్=ప్రేరేపించెను.

తా. రావణుడు క్రోధశోకములు రెండింటితో నిండినవాడై విశాలములైన నేత్రములుగల, ఖరపుత్రుడైన మకరాక్షుణ్ణి ప్రేరేపించెను. 2

మూ. గచ్ఛ పుత్ర మయాజ్ఞప్తో బలేనాభిసమన్వితః,
రాఘవం లక్ష్మణం చైవ జహి తౌ సవనౌకసౌ. 3

ప్ర. అ. పుత్ర=పుత్రుడా ! మయా=నాచేత, ఆజ్ఞప్తః=ఆజ్ఞాపింపబడినావు. బలేన=సేనతో, అభిసమన్వితః=కూడినవాడవై, గచ్ఛ=వెళ్లుము. సవనౌకసౌ=వానరులతో కూడిన, తౌ=ఆ, రాఘవమ్=రాముణ్ణి, లక్ష్మణం చైవ=లక్ష్మణుణ్ణి, జహి=చంపుము.

తా. పుత్రా ! నేను ఆజ్ఞాపించుచున్నాను. నీవు సైన్యమును

తీసికొని వెళ్ళుము. ఆ రామలక్ష్మణులను, వానరులను చంపుము. 3

మూ. రావణస్య వచః శ్రుత్వా శూరమానీ ఖరాత్మజః,
బాఢమిత్యబ్రవీద్ధృష్టో మకరాక్షో నిశాచరమ్. 4

ప్ర. అ. శూరమానీ=శూరుడ నను అభిమానము గల, ఖరాత్మజః=ఖరుని పుత్రుడైన, మకరాక్షః=మకరాక్షుడు, రావణస్య=రావణునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, హృష్టః=సంతోషించినవాడై, నిశాచరమ్= రావణుని గూర్చి, బాఢమ్ ఇతి= 'తప్పక' అని, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప శూరుడను అను అహంకారము గల, ఖరుని పుత్రుడైన ఆ మకరాక్షుడు రావణుని మాటలు విని, సంతోషించుచు, 'తప్పక అట్లు చేసెదను' అని పలికెను. 4

మూ. సోఽభివాద్య దశగ్రీవం కృత్వా చాపి ప్రదక్షిణమ్,
నిర్జగామ గృహాచ్ఛుభ్రాద్రావణస్యాజ్ఞయా బలీ. 5

ప్ర. అ. బలీ=బలము గల, సః=అతడు, దశగ్రీవమ్=రావణుణ్ణి, అభివాద్య=నమస్కరించి, ప్రదక్షిణం కృత్వా చాపి=ప్రదక్షిణము కూడ చేసి, రావణస్య=రావణునియొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, శుభ్రాత్=శుభ్రమైన, గృహాత్=గృహమునుండి, నిర్జగామ=బయలుదేరెను.

తా. బలశాలియైన ఆ మకరాక్షుడు రావణునకు ప్రదక్షిణపూర్వకముగా అభివాదనము చేసి, రావణాజ్ఞచేత శుభ్రమైన ఇంటినుండి బయలుదేరెను. 5

మూ. సమీపస్థం బలాధ్యక్షం ఖరపుత్రోఽబ్రవీద్వచః,
రథమానీయతాం తూర్ణం సైన్యం త్వానీయతాం త్వరాత్. 6

ప్ర. అ. ఖరపుత్రః=ఖరుని పుత్రుడు, సమీపస్థమ్=సమీపమునందున్న, బలాధ్యక్షమ్=సేనాధ్యక్షుని గూర్చి, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను. తూర్ణమ్=శీఘ్రముగా, రథమ్=రథము, ఆనీయతామ్=తీసికొని రాబడుగాక. సైన్యమ్=సైన్యము, త్వరాత్=తొందరగా, ఆనీయతామ్=తీసికొనిరాబడుగాక.

తా. మకరాక్షుడు దగ్గరనున్న సేనానాయకునితో ఇట్లు పలికెను. - "నా రథమును, సైన్యమును తొందరగా రప్పించుము". 6

మూ. తస్య తద్వచనం శ్రుత్వా బలాధ్యక్షో నిశాచరః,
స్యన్దనం చ బలం చైవ సమీపం ప్రత్యపాదయత్. 7

ప్ర. అ. తస్య=వానియొక్క, తత్ వచనమ్= ఆ వచనమును, శ్రుత్వా=విని, బలాధ్యక్షః=సేనాధ్యక్షుడైన, నిశాచరః=రాక్షసుడు, స్యన్దనం చ=రథమును, బలం చైవ=సైన్యమును, సమీపమ్=సమీపమును, ప్రత్యపాదయత్=పొందించెను.

తా. ఆతని మాట విని సేనానాయకుడైన రాక్షసుడు రథమును, సైన్యమును ఆతని సమీపమునకు తీసికొని వచ్చెను. 7

మూ. ప్రదక్షిణం రథం కృత్వా సమాహూయ నిశాచరః,
సూతం సంచోదయామాస శీఘ్రం వై రథ మావహ. 8

ప్ర. అ. నిశాచరః=మకరాక్షుడు, రథమ్=రథమును, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణముచేసి, సూతమ్=సారథిని, సమాహూయ=పిలచి, రథమ్=రథమును, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆవహ=తోలుము అని, సంచోదయామాస=ప్రేరేపించెను.

తా. మకరాక్షుడు రథమునకు ప్రదక్షిణము చేసి ఎక్కి సారథిని సంబోధించి "రథమును శీఘ్రముగా నడుపుము" అని ఆజ్ఞాపించెను. 8

మూ. అథ తాన్ రాక్షసాన్ సర్వాన్ మకరాక్షోఽబ్రవీదిదమ్,
యూయం సర్వే ప్రయుధ్యధ్వం పురస్తాన్మమ రాక్షసాః. 9

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మకరాక్షః=మకరాక్షుడు, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. రాక్షసాః=రాక్షసులారా ! యూయమ్=మీరు, సర్వే=అందరు, మమ=నాయొక్క, పురస్తాత్=ఎదుట, ప్రయుధ్యధ్వమ్=యుద్ధము చెయ్యండి.

తా. పిమ్మట మకరాక్షుడు ఆ రాక్షసులందరితో ఇట్లు పలికెను. "రాక్షసులారా ! మీరందరు నా సమక్షమున యుద్ధము చేయుడు". 9

మూ. అహం రాక్షసరాజేన రావణేన మహాత్మనా,
ఆజ్ఞప్తః సమరే హన్తుం తావుభౌ రామలక్ష్మణౌ. 10

ప్ర. అ. అహమ్=నేను, రాక్షసరాజేన=రాక్షసరాజైన, మహాత్మనా=మహాత్ముడైన, రావణేన=రావణునిచేత, సమరే=యుద్ధమునందు, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, ఉభౌ=ఇద్దరినీ, హన్తుమ్=చంపుటకు, ఆజ్ఞప్తః=ఆజ్ఞాపించబడితిని.

తా. యుద్ధమునందు ఆ రామలక్ష్మణులను ఇద్దరినీ చంపవలె నని రాక్షసరాజు, మహాత్ముడు అయిన రావణుడు నాకు ఆజ్ఞ ఇచ్చినాడు. 10

మూ. అద్య రామం వధిష్యామి లక్ష్మణం చ నిశాచరాః,
శాఖామృగం చ సుగ్రీవం వానరాంశ్చ శరోత్తమైః. 11

ప్ర. అ. నిశాచరాః=రాక్షసులారా ! అద్య=నేడు, రామమ్=రాముణ్ణి, లక్ష్మణం చ=లక్ష్మణుణ్ణి, శాఖామృగమ్=వానరుడైన, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి, వానరాన్ చ=వానరులను, శరోత్తమైః=శ్రేష్ఠములైన బాణములచేత, వధిష్యామి=చంపగలను.

తా. రాక్షసులారా ! నేడు రామలక్ష్మణులను, సుగ్రీవుణ్ణి, ఇతర వానరులను శ్రేష్ఠములైన బాణాలచేత చంపివేయగలను. 11

మూ. అద్య శూలనిపాతైశ్చ వానరాణాం మహాచమూమ్,
ప్రదహిష్యామి సంప్రాప్తాం శుష్కేన్ధనమివానలః. 12

ప్ర. అ. అద్య=ఇప్పుడు, సంప్రాప్తామ్=వచ్చి ఉన్న, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూమ్= మహాసేనను, అనలః=అగ్ని, శుష్కేన్ధనమివ=ఎండిన కట్టెను వలె, శూలనిపాతైః=శూలపాతములచేత, ప్రదహిష్యామి= కాల్చగలను.

తా. ఇప్పుడు ఇక్కడికి వచ్చిన వానరసైన్యమును, అగ్ని ఎండిన కట్టెలను దహించినట్లు శూలపాతములచేత కాల్చివేయగలను. 12

మూ. మకరాక్షస్య తచ్ఛ్రుత్వా వచనం తే నిశాచరాః,
సర్వే నానాయుధోపేతా బలవన్తః సమాహితాః. 13

ప్ర. అ. మకరాక్షస్య=మకరాక్షునియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, బలవన్తః=బలవంతులైన, తే=ఆ, నిశాచరాః=రాక్షసులు, సర్వే=అందరూ, నానాయుధోపేతాః=అనేకవిధములైన ఆయుధములతో కూడినవారై, సమాహితాః=సావధానచిత్తులైరి.

తా. మకరాక్షుని మాటలు విని ఆ బలశాలులైన రాక్షసులందరూ అనేకవిధములైన ఆయుధములు ధరించి సావధానచిత్తులై ఉండిరి. 13

మూ. తే కామరూపిణః క్రూరా దంష్ట్రిణః పిఙ్గలేక్షణాః,
మాతఙ్గా ఇవ నర్దన్తో ధ్వస్తకేశా భయావహాః. 14
పరివార్య మహాకాయా మహాకాయం ఖరాత్మజమ్,
అభిజగ్ముస్తతో హృష్టాశ్చాలయన్తో నభస్తలమ్. 15

ప్ర. అ. కామరూపిణః=స్వేచ్ఛారూపము గలవారు, క్రూరాః=క్రూరులు, దంష్ట్రిణః=కోరలు గలవారు, పిఙ్గలేక్షణాః=పచ్చని కళ్లు గలవారు, ధ్వస్తకేశాః=

ఊడిపోయిన కేశములు గలవారు, భయావహాః=భయము కలిగించువారు, మహాకాయాః=పెద్ద దేహములు గలవారు అయిన, తే=రాక్షసులు, తతః=అటు పిమ్మట, మాతఙ్గాః ఇవ=ఏనుగులువలె, నర్దన్తః=అరచుచు, మహాకాయమ్=పెద్ద శరీరముగల, ఖరాత్మజమ్=మకరాక్షుణ్ణి, పరివార్య=చుట్టి నిలబడి, హృష్టాః=సంతోషించినవారై, నభస్తలమ్=ఆకాశమును, చాలయన్తః=కదల్చుచు, అభిజఘ్నుః=వాద్యములను కొట్టిరి (మ్రోగించిరి.)

తా. క్రూరులైన ఆ రాక్షసులు కోరలతోను, పచ్చని కళ్ళతోను, ఊడిపోయిన జుట్టు ముడులతోను భయంకరులుగా ఉండిరి. స్వేచ్ఛానుసారము రూపము ధరించ గలిగిన పెద్ద శరీరములు గల ఆ రాక్షసులు, పెద్ద శరీరము గల ఆ మకరాక్షుని చుట్టూ చేరి సంతోషముతో ఆకాశము చలించిపోవునట్లు వాద్యములు మ్రోగించిరి. 14-15

మూ. శఙ్ఖభేరీసహస్రాణామాహతానాం సమన్తతః,
క్ష్వేలితాస్ఫోటితానాం చ తత్ర శబ్దో మహానభూత్. 16

ప్ర. అ. తత్ర=అక్కడ, ఆహతానామ్=కొట్టబడిన, శఙ్ఖభేరీసహస్రాణామ్=శంఖములయొక్క, భేరులయొక్క సహస్రములయొక్క, క్ష్వేలితాస్ఫోటితానాం చ=సింహనాదములయొక్క జబ్బలు చరచుటయొక్క, మహాన్=గొప్ప, శబ్దః=శబ్దము, సమన్తతః=అంతటా, అభూత్=ఆయెను.

తా. అక్కడ మ్రోగించిన వేలకొలది శంఖముల, భేరులధ్వని, సింహనాదముల ధ్వని, జబ్బలు చరిచిన ధ్వని అంతటా చాల అధికముగా వ్యాపించెను. 16

మూ. ప్రభ్రష్టోఽథ కరాత్తస్య ప్రతోదః సారథేస్తదా,
పపాత సహసా దైవాద్ధ్వజస్తస్య తు రక్షసః. 17

ప్ర. అ. అథ=అటు పిమ్మట, తదా=అప్పుడు, తస్య=ఆ, సారథేః=సారథియొక్క, కరాత్=హస్తమునుండి, ప్రతోదః=కొరడా, ప్రభ్రష్టః=జారిపోయినది. తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, ధ్వజః=ధ్వజము, సహసా=వెంటనే, దైవాత్=దైవమువలన, పపాత=పడిపోయెను.

తా. అప్పుడు ఆ సారథి చేతినుండి కొరడా జారిపోయెను. దైవవశముచేత ఆ రాక్షసుని ధ్వజము హటాత్తుగా క్రింద పడిపోయెను. 17

మూ. తస్య తే రథసంయుక్తా హయా విక్రమవర్జితాః,
చరణైరాకులైర్గత్వా దీనాః సాస్రముఖా యయుః. 18

ప్ర. అ. తస్య=వానియొక్క, రథసంయుక్తాః=రథమునకు కట్టబడిన, తే=ఆ, హయాః=గుఱ్ఱములు, విక్రమవర్జితాః=శక్తిహీనములై, ఆకులైః=వ్యాకులమైన, చరణైః=పాదాలతో, గత్వా=నడచి, దీనాః=దీనములై, సాస్రముఖాః=కన్నీళ్ళతో కూడిన ముఖములు గలవై, యయుః=వెళ్ళినవి.

తా. ఆతని రథానికి కట్టిన గుఱ్ఱములు నడిచే శక్తి లేక తొట్రుపడుచున్న పాదాలతో నడచుచు, కన్నీళ్ళు కార్చుచు దీనములై వెళ్ళినవి. 18

మూ. ప్రవాతి పవనస్తస్మిన్ సపాంసుః ఖరదారుణః,
నిర్యాణే తస్య రౌద్రస్య మకరాక్షస్య దుర్మతేః. 19

ప్ర. అ. రౌద్రస్య=భయంకరుడు, దుర్మతేః=చెడ్డ బుద్ధిగలవాడు అయిన, తస్య మకరాక్షస్య=ఆ మకరాక్షునియొక్క, తస్మిన్ నిర్యాణే=ఆ ప్రయాణసమయమునందు, సపాంసుః=పరాగముతో కూడిన, ఖరదారుణః=తీవ్రము దారుణము అయిన, పవనః=వాయువు, ప్రవాతి=అధికముగా వీచెను.

తా. భయంకరుడు, దుర్బుద్ధి అయిన ఆ మకరాక్షుడు బయలుదేరు సమయమునందు పరాగముతో నిండి తీవ్రముగాను భయంకరముగాను ఉన్న గాలి వీచెను. 19

మూ. తాని దృష్ట్వా నిమిత్తాని రాక్షసా వీర్యవత్తమాః,
అచిన్త్య నిర్గతాః సర్వే యత్ర తౌ రామలక్ష్మణౌ. 20

ప్ర. అ. వీర్యవత్తమాః=అధికమైన పరాక్రమము గల, రాక్షసాః=రాక్షసులు, సర్వే=అందరు, తాని=ఆ, నిమిత్తాని=శకునములను, దృష్ట్వా=చూచి, అచిన్త్య=లెక్కచేయక, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, యత్ర=ఎక్కడ ఉన్నారో అక్కడికి, నిర్గతాః=బయలుదేరిరి.

తా. గొప్ప పరాక్రమము గల ఆ రాక్షసు లందరూ ఆ శకునములను చూచి కూడ లెక్క చేయక ఆ రామలక్ష్మణులున్న ప్రదేశమునకు వెళ్ళిరి. 20

మూ. ఘనగజమహిషాఙ్గతుల్యవర్ణాః
సమరముఖేష్వసకృద్గదాసిభిన్నాః,
అహమహమితి యుద్ధకౌశలాస్తే
రజనిచరాః పరిబభ్రముర్నదన్తః. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాండే అష్టసప్తతితమః సర్గః.

ప్ర. అ. ఘనగజమహిషాజ్గతుల్యవర్ణాః=మేఘములతోను, ఏనుగుల శరీరములతోనూ, దున్నపోతుల శరీరములతోను సమానమైన రంగు గల, సమరముఖేషు=యుద్ధాగ్రములందు, అసకృత్=అనేకపర్యాయములు, గదాసిభిన్నాః= గదలచేతను, కత్తులచేతను భేదించబడిన, యుద్ధకౌశలాః=యుద్ధమునందు నేర్పుగల, తే రజనిచరాః=ఆ రాక్షసులు, నదన్తః=ధ్వని చేయుచున్నవారై, అహమ్ అహమ్ ఇతి=నేను నేను అని, పరిబభ్రముః=తిరిగిరి.

తా. యుద్ధములో నేర్పు గల ఆ రాక్షసుల శరీరవర్ణము మేఘవర్ణము వలె, గజమహిషముల శరీరవర్ణము వలె ఉండెను. వాళ్ళ శరీరములు అనేక పర్యాయములు యుద్ధములలో గదలచేతను, ఖడ్గములచేతను భేదించబడెను. అట్టి రాక్షసులు నేను ముందు, నేను ముందు' అనుచు యుద్ధభూమిలో తిరిగిరి.21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో డెబ్బది ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ నవసప్తతితమః సర్గః

[రాముడు మకరాక్షుణ్ణి చంపుట.]

మూ. నిర్గతం మకరాక్షం తే దృష్ట్వా వానరపుంగవాః,
అప్లుత్య సహసా సర్వే యోద్ధుకామా వ్యవస్థితాః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరపుంగవాః=వానరశ్రేష్ఠులు నిర్గతమ్=బయలువెడలిన, మకరాక్షమ్=మకరాక్షుణ్ణి, దృష్ట్వా=చూచి, ఆప్లుత్య=ఎగిరి యోద్ధుకామాః=యుద్ధము చేయుటకు కోరిక గలవారై, అవస్థితాః=ఉండిరి.

తా. ఆ వానరశ్రేష్ఠు లందరూ బయలుదేరి వచ్చిన మకరాక్షుణ్ణి చూచి, యుద్ధము చేయవలె నను కోరికతో ఎగిరి వచ్చి నిలచి ఉండిరి. 1

మూ. తతః ప్రవృత్తం సుమహత్తద్యుద్ధం రోమహర్షణమ్,
నిశాచరైః ప్లవంగానాం దేవానాం దానవైరివ. 2

ప్ర. అ. తతః=అటు పిమ్మట, ప్లవంగానామ్=వానరులకు, నిశాచరైః=రాక్షసులతో, దేవానామ్=దేవతలకు, దానవైరివ=దానవులతో వలె, తత్=ఆ, మహత్=చాల గొప్పదైన, లోమహర్షణమ్=రోమాంచజనకమైన, యుద్ధమ్=యుద్ధము, ప్రవృత్తమ్=జరిగినది.

తా. పిమ్మట వానరులకు రాక్షసులతో, దేవతలకు దానవులతో జరిగినట్లు రోమాంచమును కలిగించు చాల గొప్ప యుద్ధము జరిగెను. 2

మూ. వృక్షశూలనిపాతైశ్చ గదాపరిఘపాతనైః,
అన్యోన్యం మర్దయన్తి స్మ తదా కపినిశాచరాః. 3

ప్ర. అ. తదా=అప్పుడు, కపినిశాచరాః=వానరులు, రాక్షసులు, వృక్షశూలనిపాతైః చ=వృక్షములను శూలములను విసరుటచేతను, గదాపరిఘపాతనైః=గదలను పరిఘలను పడవేయుటచేతను, అన్యోన్యమ్=పరస్పరము, మర్దయన్తి స్మ=మర్దించిరి.

తా. అప్పుడు వానరులు, రాక్షసులూ కూడ వృక్షములను శూలములను విసరుచు, గదలను పరిఘలను ప్రయోగించుచు ఒకరి నొకరు మర్దించిరి. 3

మూ. శక్తిఖడ్గగదాకున్తైస్తోమరైశ్చ నిశాచరాః,
పట్టిశైర్భిన్దిపాలైశ్చ బాణపాతైః సమన్తతః. 4
పాశముద్గరదణ్డైశ్చ నిర్ఘాతైశ్చాపరైస్తథా,
కదనం కపిసింహానాం చక్రుస్తే రజనీచరాః. 5

ప్ర. అ. రజనీచరాః=రాత్రియందు సంచరించు, తే నిశాచరాః=ఆ రాక్షసులు, శక్తిఖడ్గగదాకున్తైః=శక్తులచేత, ఖడ్గములచేత, గదలచేత, కుంతములచేత, తోమరైశ్చ=తోమరములచేత, పట్టిశైః=పట్టిశములచేత, భిన్దిపాలైశ్చ=భిందిపాలముల చేత, బాణపాతైః=బాణములను వేయుటచేత, పాశముద్గరదణ్డైః చ=పాశములచేత ముద్గరములచేత దండములచేత, నిర్ఘాతైః=ప్రేలుడుధ్వనులు చేయు యంత్రము లచేత, తథా=మరియు, అన్యైశ్చ=ఇతర ఆయుధములచేత, సమన్తతః=అంతటా, కపిసింహానామ్=వానరశ్రేష్ఠులయొక్క, కదనమ్=హింసను, చక్రుః=చేసిరి.

తా. రాత్రులందు సంచరించు ఆ రాక్షసులు శక్తి-ఖడ్గ-గదా-కుంతములను, తోమరములను, పట్టిశములను, భిందిపాలములను, బాణములను **పాశ**-ముద్గర-దండములను, ప్రేలుడు ధ్వనులను పుట్టించు యంత్రములను, ఇతర ఆయుధములను ప్రయోగించి వానరశ్రేష్ఠులను అంతటా హింసించిరి. 4,5

మూ. బాణౌఘైరర్దితాశ్చాపి ఖరపుత్రేణ వానరాః,
సంభ్రాన్తమనసః సర్వే దుద్రువుర్భయపీడితాః 6

ప్ర. అ. ఖరపుత్రేణ=మకరాక్షునిచేత, బాణౌఘైః=బాణసముదాయ ములచేత, అర్దితాః=పీడించబడిన, సర్వే= సమస్తమైన, వానరాః=వానరులు, సంభ్రాన్తమనసః=భ్రాంతి చెందిన మనస్సులు గలవారై, భయపీడితాః= భయము చేత పీడించబడినవారై, దుద్రువుః=పారిపోయిరి.

తా. ఆ మకరాక్షుడు బాణసముదాయములను ప్రయోగించి పీడింపగా ఆ వానరు లందరు భ్రాంతి చెందిన మనస్సులతో, భయపీడితులై పారిపోయిరి.

మూ. తాన్ దృష్ట్వా రాక్షసాః సర్వే ద్రవమాణాన్ వనౌకసః,
నేదుస్తే సింహవద్దృప్తా రాక్షసా జితకాశినః. 7

ప్ర. అ. సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, తాన్=ఆ, ద్రవమాణాన్=పారిపోవుచున్న, వనౌకసః=వానరులను, దృష్ట్వా=చూచి, నేదుః=ధ్వనిచేసిరి. తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, సింహవత్=సింహములవలె, దృప్తాః=గర్వించినవారై, **జితకాశి**నః=జయముచేత ప్రకాశించుచున్నవారు అయిరి.

తా. పారిపోవుచున్న ఆ వానరులను చూచి సింహముల వలె గర్వించిన ఆ రాక్షసులు జయముతో ప్రకాశించుచు ధ్వనులు చేసిరి. 7

మూ. విద్రవత్సు తదా తేషు వానరేషు సమన్తతః,
రామస్తాన్వారయామాస శరవర్షేణ రాక్షసాన్. 8

ప్ర. అ. తదా=అప్పుడు, తేషు=ఆ, వానరేషు=వానరులు, సమన్తతః=అంతటా, విద్రవత్సు=పారిపోవుచుండగా, రామః=రాముడు, శరవర్షేణ=బాణవర్షముచేత, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, వారయామాస=వారించెను.

తా. అప్పుడు ఆ వానరులు నలుమూలలకు పారిపోవుచుండగా రాముడు బాణవర్షము కురిపించి రాక్షసులను ముందుకు రాకుండ అడ్డగించెను. 8

మూ. వారితాన్ రాక్షసాన్ దృష్ట్వా మకరాక్షో నిశాచరః,
కోపానలసమావిష్టో వచనం చేదమబ్రవీత్. 9

ప్ర. అ. వారితాన్=అడ్డగింపబడిన, రాక్షసాన్=రాక్షసులను, దృష్ట్వా=చూచి, నిశాచరః=రాక్షసుడైన, మకరాక్షః= మకరాక్షుడు, కోపానలసమావిష్టః=కోపాగ్నితో కూడినవాడై, ఇదమ్=ఈ, వచనం చ=వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. రాము డా విధముగ రాక్షసులను అడ్డుకొనుట చూచి మకరాక్షుడు కోపముతో మండిపడుచు ఇట్లు పలికెను. 9

మూ. తిష్ఠ రామ మయా సార్ధం ద్వన్ద్వయుద్ధం భవిష్యతి,
త్యాజయిష్యామి తే ప్రాణాన్ ధనుర్ముక్తైః శితైః శరైః. 10

ప్ర. అ. రామ=రామా! తిష్ఠ=నిలబడుము. మయా సార్ధమ్=నాతో కూడ, ద్వన్ద్వయుద్ధమ్=ద్వన్ద్వయుద్ధము, భవిష్యతి= కాగలదు. ధనుర్ముక్తైః=ధనస్సుచేత విడవబడిన, శితైః=వాడియైన, శరైః=బాణములచేత, తే=నీయొక్క, ప్రాణాన్=ప్రాణములను, త్యాజయిష్యామి=విడిపింపచేసెదను.

తా. రామా! నిలబడుము. మనకిద్దరికీ మధ్య ద్వంద్వయుద్ధము జరుగగలదు. ధనస్సునుండి విడువబడిన బాణములచేత నీ ప్రాణాలను తొలగింపజేయగలను. 10

మూ. యత్తదా దణ్డకారణ్యే పితరం హతవాన్మమ,
తదగ్రతః స్వకర్మస్థం దృష్ట్వా రోషోఽభివర్ధతే. 11

ప్ర. అ. తదా=అప్పుడు, దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, మమ=నా

యొక్క, పితరమ్=తండ్రిని, యత్=ఏ కారణమువలన, హతవాన్=చంపినావో, తత్=ఆ కారణమువలన, స్వకర్మస్థమ్=తన (రాక్షససంహార మను) పనియందున్న నిన్ను, అగ్రతః=ఎదుట, దృష్ట్వా=చూచి, రోషః=కోపము, అభివర్ధతే=వృద్ధి పొందుచున్నది.

తా. నీవు ఆనాడు దండకారణ్యములో నా తండ్రిని చంపినావు. అందుచే అట్టి రాక్షససంహారకర్మ చేయుటకై నిలచియున్న నిన్ను ఎదుట చూడగానే నా కోపము ఎక్కువగుచున్నది.

వి. "స్వకర్మస్థమ్" అను దానికి "తన పనిలో అనగా క్షాత్రధర్మమునందు ఉన్నవాడవు" అని, లేదా "నా తండ్రి ఎట్లు నీకు వధ్యుడైనాడో అట్లే నీవు నాకు వధ్యుడవుగా ఉన్నవాడవు" అని లేదా (సు+అకర్మస్థమ్=)చాల చెడ్డ పనిచేసిన వాడవు అని వ్యాఖ్యాతలు అర్థముచెప్పినారు. కాని--"అనాగసం స్వకర్మస్థం స్మృత్వా కోపోఽ తివర్ధతే" అను ప్రాచ్యపాఠములో అర్థము స్పష్టముగా ఉన్నది. "ఏ అపరాధమూ లేని, తన పని తాను చేసుకొనుచున్న నా తండ్రిని చంపుట స్మరించగానే కోపము పెరిగిపోవుచున్నది" అని ఆ పాఠములో భావము. 11

మూ. దహ్యన్తే భృశమఙ్గాని దురాత్మన్మమ రాఘవ,
యన్మయాసి న దృష్టస్త్వం తస్మిన్ కాలే మహావనే. 12

ప్ర. అ. దురాత్మన్=దుష్టబుద్ధిగలవాడా! రాఘవ=రామా! తస్మిన్ కాలే=ఆ కాలమునందు, త్వమ్=నీవు, మయా=నాచేత, మహావనే=మహావనమునందు, యత్=ఏ కారణమువలన, న దృష్టః అసి=చూడబడలేదో, అందువలన, మమ=నాయొక్క, అఙ్గాని=అవయవములు, భృశమ్=మిక్కిలి, దహ్యన్తే=కాల్చివేయబడుచున్నవి.

తా. దురాత్ముడవైన రామా! ఆ కాలమునందు నీవు ఆ మహావనమునందు నా కంటబడలేదే అని నా అవయవములు మండిపోవుచున్నవి. 12

మూ. దిష్ట్యాసి దర్శనం రామ మమ త్వం ప్రాప్తవానిహ,
కాంక్షితోఽసి క్షుధార్తస్య సింహస్యేవేతరో మృగః. 13

ప్ర. అ. రామ=రామా! దిష్ట్యా=దైవవశముచేత, త్వమ్=నీవు, ఇహ=ఇక్కడ, మమ=నా యొక్క, దర్శనమ్=దృష్టిని, ప్రాప్తవాన్=పొందినావు. క్షుధార్తస్య=ఆకలిచేత పీడింపబడిన, సింహస్య=సింహమునకు, ఇతరః=ఇతరమైన, మృగః ఇవ=మృగము వలె, కాంక్షితః=కోరబడినవాడవు, అసి=అయి ఉన్నావు.

తా. రామా! దైవవశముచేత నీవు ఇక్కడ నాకంట బడినావు.

ఆకలిగొన్న సింహము మృగమును వెదకుచున్నట్లు నేను వెదకుచుంటిని. 13

మూ. అద్య మద్బాణవేగేన ప్రేతరాడ్విషయం గతః,
యే త్వయా నిహతాః శూరాః సహ తైశ్చ వసిష్యసి. 14

ప్ర. అ. అద్య=ఇప్పుడు, మద్బాణవేగేన=నా బాణముల వేగముచేత, ప్రేతరాడ్విషయమ్=యమలోకమును గూర్చి, గతః=వెళ్లినవాడవై, త్వయా=నీచేత, యే=ఏ, శూరాః=శూరులు, నిహతాః=చంపబడిరో, తైః సహ=వాళ్లతో కూడ, వసిష్యసి చ=నివసించగలవు.

తా. ఇపుడు నా బాణాల వేగముచేత యమలోకమునకు వెళ్లి పూర్వము నీవు చంపిన శూరులతో కూడ అక్కడ నివసించగలవు. 14

మూ. బహునాత్ర కిముక్తేన శృణు రామ వచో మమ,
పశ్యన్తు సకలా లోకాస్త్వాం మాం చైవ రణాజిరే. 15

ప్ర. అ. రామ=రామా! అత్ర=ఈ విషయమునందు, బహునా=అధికమైన, ఉక్తేన=చెప్పుటచేత, కిమ్=ఏమి ప్రయోజనము? మమ=నాయొక్క, వచః=వచనమును, శృణు=వినుము. సకలాః=సమస్తమైన, లోకాః=లోకములు, రణాజిరే=యుద్ధభూమియందు, త్వామ్=నిన్ను, మాం చైవ=నన్ను, పశ్యన్తు=చూచెదరుగాక

తా. రామా! ఈ విషయమునందు చాలా చెప్పి ఏమి ప్రయోజనము? నా మాట వినుము. సమస్తలోకములూ కూడ యుద్ధభూమియందు నిన్ను నన్నూ చూచెదరు గాక. 15

మూ. అస్త్రైర్వా గదయా వాపి బాహుభ్యాం వా రణాజిరే,
అభ్యస్తం యేన వా రామ వర్తతాం తేన వా మృధమ్. 16

ప్ర. అ. రామ=రామా! అస్త్రైర్వా=అస్త్రములచేతనైనా, గదయా వాపి=గదచేతనైనా, యేన=దేనిచేత, అభ్యస్తమ్=అభ్యసించబడినదో, తేన వా=దానిచేతనైనా, రణాజిరే=యుద్ధభూమియందు, మృధమ్=యుద్ధము, వర్తతామ్=ప్రవర్తించుగాక.

తా. రామా! మన మిద్దరమూ యుద్ధరంగములో అస్త్రములచేత గాని, బాహువులచేత గాని, లేదా నీవు దేనితో అభ్యసించినావో దానిచేత గాని యుద్ధము చేసెదము. 16

మూ. మకరాక్షవచః శ్రుత్వా రామో దశరథాత్మజః,
అబ్రవీత్ప్రహసన్ వాక్యముత్తరోత్తరవాదినమ్. 17

ప్ర. అ. దశరథాత్మజః=దశరథుని పుత్రుడైన, రామః=రాముడు, మకరాక్షవచః=మకరాక్షుని వచనమును, శ్రుత్వా=విని, ప్రహసన్=నవ్వుచు, ఉత్తరోత్తరవాదినమ్=ముందు ముందు మాటలాడుచునే ఉన్న వానిని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. దశరథనందనుడైన రాముడు మకరాక్షుని మాటలు విని, ఇంకా ఏమేమో మాటలాడుచున్న వానితో, నవ్వుతూ, ఇట్లనెను. 17

మూ. కత్థసే కిం వృథా రక్షో బహూన్యసదృశాని తే,
న రణే శక్యతే జేతుం వినా యుద్ధేన వాగ్బలాత్. 18

ప్ర. అ. రక్షః=రాక్షసుడా! అసదృశాని=తగని, బహూని=అనేకవాక్యములను, వృథా=వ్యర్థముగా, కిం కత్థసే=ఎందుకు గొప్పగా చెప్పుచున్నావు. యుద్ధేన వినా=యుద్ధములేకుండగా, వాగ్బలాత్=మాటల బలమువలన, రణే=యుద్ధమునందు, జేతుమ్=జయించుటకు, తే=నీకు, న శక్యమ్=శక్యము కాదు.

తా. రాక్షసుడా! శూరులకు తగని మాటలు పలుకుచు ఎందుకు వ్యర్థముగా బడాయి చెప్పుకొనెదవు? యుద్ధరంగమునందు యుద్ధము చేయకుండగా నీవు మాటల బలముచేత జయించజాలవు. 18

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం త్వత్పితా చ యః,
త్రిశిరా దూషణశ్చాపి దణ్డకే నిహతా మయా. 19

ప్ర. అ. దణ్డకే=దండకారణ్యమునందు, మయా=నాచేత, రక్షసామ్=రాక్షసులయొక్క, సహస్రాణి= సహస్రములు, చతుర్దశ=పదునాలుగు, యః=ఎవడు, త్వత్పితా=నీ తండ్రియో అతడు, త్రిశిరాః=త్రిశిరస్సు, దూషణశ్చాపి=దూషణుడు, నిహతాః=చంపబడినారు.

తా. నేను దండకారణ్యములో పదునాలుగువేలమంది రాక్షసులను, నీ తండ్రిని, త్రిశిరస్సును, దూషణుణ్ణి చంపి ఉన్నాను. 19

మూ. స్వాశితాశ్చాపి మాంసేన గృధ్రగోమాయువాయసాః,
భవిష్యన్త్యద్య వై పాప తీక్ష్ణతుణ్డనఖాఙ్కురాః. 20

ప్ర. అ.పాప=పాపాత్ముడా! అద్య=ఇప్పుడు, తీక్ష్ణతుణ్డనఖాఙ్కురాః=వాడియైన ముక్కులు, గోళ్లు గల, గృధ్రగోమాయువాయసాః=గ్రద్దలు, నక్కలు, కాకులు, మాంసేన=మాంసముచేత, స్వాశితాః=బాగా భుజింపచేయబడినవి, భవిష్యన్తి=కాగలవు.

తా. పాపాత్ముడా! ఇప్పుడు వాడియైన ముక్కులు, గోళ్లు గల గ్రద్దలు,

నక్కలు, కాకులు బాగా మాంసమును తినగలవు. 20

మూ. రాఘవేణైవముక్తస్తు మకరాక్షో మహాబలః,
బాణౌఘానముచత్తస్మై రాఘవాయ రణాజిరే. 21

ప్ర. అ. రాఘవేణ=రామునిచే, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మహాబలః=గొప్పబలము గల, మకరాక్షః=మకరాక్షుడు, రణాజిరే=యుద్ధభూమియందు, రాఘవాయ=రామునికొరకు,బాణౌఘమ్=బాణసమూహమును, అముచత్=విడచెను.

తా. గొప్ప బలము గల మకరాక్షుడు రాముని మాటలు విని, యుద్ధభూమియందు ఆ రామునిపై బాణసముదాయమును విడచెను. 21

మూ. తాన్ శరాన్ శరవర్షేణ రామశ్చిచ్ఛేద నైకధా,
నిపేతుర్భువి తే ఛిన్నా రుక్మపుఙ్ఖాః సహస్రశః. 22

ప్ర. అ. రామః=రాముడు, తాన్=ఆ, శరాన్=బాణములను, శరవర్షేణ=బాణవర్షముచేత, నైకధా=అనేకవిధములుగా, చిచ్ఛేద=ఛేదించెను. రుక్మపుఙ్ఖాః=బంగారు పొన్నులు గల, తే=అవి, ఛిన్నాః=ఛేదింపబడినవై, సహస్రశః=వేలకొలది, భువి=నేలమీద, నిపేతుః=పడినవి.

తా. రాముడు ఆ బాణములను బాణవర్షముచేత అనేకవిధములుగా ఛేదించెను. బంగారు పొన్నులు గల ఆ బాణములు ఛేదించబడినవై వేలకొలది ముక్కలుగా అయి నేలమీద పడినవి. 22

మూ. తద్యుద్ధమభవత్తత్ర సమేత్యాన్యోన్యమోజసా,
ఖరరాక్షసపుత్రస్య సూనోర్దశరథస్య చ. 23

ప్ర. అ. తత్ర=అక్కడ, అన్యోన్యమ్=పరస్పరము, సమేత్య=కలసి, ఖరరాక్షసపుత్రస్య=ఖరుని పుత్రునకు, దశరథస్య=దశరథునియొక్క, సూనోః చ=పుత్రునకు, ఓజసా=బలముతో, తత్=ఆ, యుద్ధమ్=యుద్ధము, అభవత్=ఆయెను.

తా. అక్కడ ఒండొరులను ఎదిరించిన రామమకరాక్షుల మధ్య గొప్ప బలప్రయోగముతో యుద్ధము జరిగెను. 23

మూ. జీమూతయోరివాకాశే శబ్దో జ్యాతలయోస్తదా,
ధనుర్ముక్తః స్వనోత్కృష్టః శ్రూయతే చ రణాజిరే. 24

ప్ర. అ. తదా=అప్పుడు, రణాజిరే=యుద్ధభూమియందు, ధనుర్ముక్తః=ధనస్సుచేత విడవబడిన, జ్యాతలయోః=నారియొక్క అరచేతియొక్క, స్వనోత్కృష్టః=ధ్వనిచేత అధికమైన, శబ్దః=శబ్దము, ఆకాశే=ఆకాశమునందు,

జీమూతయోరివ=మేఘముల శబ్దమువలె, శ్రూయతే చ=వినబడెను.

తా. అప్పుడు ఆ యుద్ధభూమియందు ధనస్సునుండి బయలుదేరిన, అరచేతితో నారిని ఒరయుటచే కలిగిన అత్యధికమైన శబ్దము ఆకాశమునందు రెండు మేఘముల శబ్దము వలె వినబడెను. 24

మూ. దేవదానవగన్ధర్వాః కింనరాశ్చ మహోరగాః,
అన్తరిక్షగతాః సర్వే ద్రష్టుకామాస్తదద్భుతమ్. 25

ప్ర. అ. అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, తత్=ఆ యుద్ధమును, ద్రష్టుకామాః=చూచుటకు కోరిక గలవారై, సర్వే=సమస్తమైన, దేవదానవగన్ధర్వాః=దేవతలు, దానవులు, గంధర్వులు, కింనరాశ్చ=కింనరులు, మహోరగాః=మహోరగులు, అన్తరిక్షగతాః=ఆకాశమును చేరిరి.

తా. ఆశ్చర్యకరమైన ఆ యుద్ధమును చూడవలె నను కోరికతో దేవతలు, దానవులు, గంధర్వులు, కింనరులు, మహోరగులు అందరూ ఆకాశమును చేరిరి.

మూ. విద్ధమన్యోన్యగాత్రేషు ద్విగుణం వర్ధతే బలమ్,
కృతప్రతికృతాన్యోన్యం కురుతాం తౌ రణాజిరే. 26

ప్ర. అ. అన్యోన్యగాత్రేషు=ఒండొరుల అవయవములమీద, విద్ధమ్=కొట్టుట, బలమ్=బలము, ద్విగుణమ్=రెండు రెట్లు, వర్ధతే=వృద్ధిపొందెను. తౌ=వారిద్దరూ, రణాజిరే=యుద్ధభూమియందు, కృతప్రతికృతాన్యోన్యమ్=పరస్పరము చేసినదానికి ప్రతిక్రియ చేయునట్లుగా, కురుతామ్=(యుద్ధము) చేసిరి.

తా. ఒకరి అవయవములమీద ఒకరు కొట్టుట, బలమూ కూడ రెట్టింపు పెరిగెను. వారిద్దరూ యుద్ధభూమియందు ఒకరు చేసిన దానికి మరొకరు ప్రతిక్రియ చేయుచు యుద్ధము చేసిరి. 26

మూ. రామముక్తాంస్తు బాణౌఘాన్ రాక్షసస్త్వచ్ఛినద్రణే,
రక్షోముక్తాంస్తు రామో వై నైకధా ప్రాచ్ఛినచ్ఛరైః. 27

ప్ర. అ. రణే=యుద్ధమునందు, రామముక్తాన్=రామునిచేత విడువబడిన, బాణౌఘాన్=బాణసముదాయములను, రాక్షసః=రాక్షసుడు, అచ్ఛినత్=ఛేదించెను. రామః=రాముడు, రక్షోముక్తాన్=రాక్షసునిచేత విడువబడిన బాణములను, శరైః=బాణములచేత, నైకధా=అనేకవిధములుగా, ప్రాచ్ఛినత్=ఛేదించెను.

తా. ఆ యుద్ధములో రాముడు ప్రయోగించిన బాణములను ఆ రాక్షసుడు ఛేదించెను. రాక్షసుడు ప్రయోగించిన బాణాలను రాముడు బాణాలతో ముక్కముక్కలుగా ఛేదించెను. 27

మూ. బాణౌఘవితతాః సర్వా దిశశ్చ ప్రదిశస్తథా,
సంఛన్నా వసుధా చైవ సమన్తాన్న ప్రకాశతే. 28

ప్ర. అ. సర్వాః=సమస్తమైన, దిశశ్చ=దిక్కులు, తథా=మరియు, ప్రదిశః చ=విదిక్కులు, బాణౌఘవితతాః=బాణసముదాయముచేత వ్యాప్తమైనవి. సమన్తాత్=అంతటా, వసుధా చైవ=భూమి కూడ, సంఛన్నా=కప్పబడినదై, న ప్రకాశతే=ప్రకాశించలేదు.

తా. సమస్తమైన దిక్కులు, విదిక్కులు కూడ బాణసముదాయములచేత వ్యాప్తములైనవి. భూమి కూడ అంతటా కప్పబడినదై ప్రకాశించలేదు. 28

మూ. తతః క్రుద్ధో మహాబాహుర్ధనుశ్చిచ్ఛేద సంయుగే,
అష్టాభిరథ నారాచైః సూతం వివ్యాధ రాఘవః. 29

ప్ర. అ.తతః=అటుపిమ్మట, సంయుగే=యుద్ధమునందు, క్రుద్ధః=కోపించిన, మహాబాహుః=గొప్ప బాహువులు గల, రాఘవః=రాముడు, ధనుః=ధనస్సును, చిచ్ఛేద=ఛేదించెను. అథ=అటుపిమ్మట, అష్టాభిః=ఎనిమిది, నారాచైః=నారాచబాణములచేత, సూతమ్=సారథిని, వివ్యాధ=కొట్టెను.

తా. పిమ్మట మహాబాహువైన రాముడు యుద్ధమునందు కోపించి ఆ రాక్షసుని ధనస్సును ఛేదించి పిమ్మట ఎనిమిది నారాచబాణాలచేత సారథిని కొట్టెను. 29

మూ. భిత్త్వా రథం శరై రామో హత్వా అశ్వానపాతయత్,
విరథో వసుధాస్థః స మకరాక్షో నిశాచరః. 30

ప్ర. అ. రామః=రాముడు, శరైః=బాణములచేత, రథమ్=రథమును, భిత్త్వా=బ్రద్దలుకొట్టి, అశ్వాన్=గుఱ్ఱములను, హత్వా=చంపి, అపాతయత్=పడగొట్టెను. నిశాచరః=రాక్షసుడైన, సః మకరాక్షః=ఆ మకరాక్షుడు, విరథః=రథము లేనివాడై, వసుధాస్థః=నేలమీద నిలచెను.

తా. రాముడు బాణాలచేత రథమును బ్రద్దలుకొట్టి, గుఱ్ఱములను చంపి నేలమీద పడవేసెను. ఆ మకరాక్షుడు రథము లేనివాడై నేలమీద నిలచెను.

మూ. తత్తిష్ఠద్వసుధాం రక్షః శూలం జగ్రాహ పాణినా,
త్రాసనం సర్వభూతానాం యుగాన్తాగ్నిసమప్రభమ్. 31

ప్ర. అ. వసుధామ్=నేలను (నేలమీద), తిష్ఠత్=నిలచిన, తత్=ఆ, రక్షః=రాక్షసుడు, సర్వభూతానామ్= సకలప్రాణులకు, త్రాసనమ్=భయము కలిగించు, యుగాన్తాగ్నిసమప్రభమ్=ప్రలయకాలాగ్నితో సమానమైన కాంతి గల,

శూలమ్=శూలమును, పాణినా=హస్తముచేత, జగ్రాహ=గ్రహించెను.

తా. నేలమీద నిలచిన ఆ రాక్షసుడు సకలప్రాణులకు భయము కలిగించు, ప్రలయకాలాగ్నితో సమానమైన కాంతి గల శూలమును చేతితో గ్రహించెను. 31

మూ. దురవాపం మహచ్ఛూలం రుద్రదత్తం భయంకరమ్,
జాజ్వల్యమానమాకాశే సంహారాస్త్రమివాపరమ్. 32
యం దృష్ట్వా దేవతాః సర్వా భయార్తా విద్రుతా దిశః.

ప్ర. అ. యమ్=దేనిని, దృష్ట్వా=చూచి, సర్వాః=సమస్తమైన, దేవతాః=దేవతలు, భయార్తాః=భయపీడితులై, దిశః=దిక్కులనుగూర్చి, విద్రుతాః=పారిపోయిరో, అట్టి, దురవాపమ్=పొందుటకు శక్యము కానిది, రుద్రదత్తమ్=రుద్రునిచేత ఇవ్వబడినది, భయంకరమ్=భయంకరము, ఆకాశే=ఆకాశమునందు, జాజ్వల్యమానమ్=మిక్కిలి ప్రకాశించునది, అపరమ్=మరియొక, సంహారాస్త్రమ్ ఇవ=సంహారాస్త్రము వలె ఉన్న, మహత్=గొప్పదైన, శూలమ్=శూలమును, (గ్రహించెను).

తా. పొందశక్యము గాని ఆ గొప్ప శూలమును రుద్రుడు ఆతని కిచ్చి ఉండెను. ఆకాశమునందు మిక్కిలి ప్రకాశించుచున్న భయంకరమైన ఆ శూలము జగత్తును సంహరించే మరొక క్రొత్త అస్త్రము వలె ఉండెను. దానిని చూచి దేవతలందరూ భయపీడితులై, పూర్వము, దిక్కులు పట్టి పారిపోయిరి.

మూ. విభ్రామ్య చ మహచ్ఛూలం ప్రజ్వలన్తం నిశాచరః, 33
స క్రోధాత్ప్రాహిణోత్తస్మై రాఘవాయ మహాత్మనే.

ప్ర. అ. సః నిశాచరః=ఆ రాక్షసుడు, ప్రజ్వలన్తమ్=మండుచున్న, మహత్=గొప్పదైన, శూలమ్=శూలమును, విభ్రామ్య చ=త్రిప్పి, క్రోధాత్=కోపమువలన, మహాత్మనే=మహాత్ముడైన, తస్మై=ఆ, రాఘవాయ=రామునికొరకు, ప్రాహిణోత్=పంపెను.

తా. ఆ రాక్షసుడు మండుచున్న ఆ గొప్ప శూలమును త్రిప్పి, కోపముతో, మహాత్ముడైన ఆ రాముని మీదకు ప్రయోగించెను. 33

మూ. తమాపతన్తం జ్వలితం ఖరపుత్రకరాచ్చ్యుతమ్, 34
బాణైశ్చతుర్భిరాకాశే శూలం చిచ్ఛేద రాఘవః.

ప్ర. అ. రాఘవః=రాముడు, జ్వలితమ్=మండుచున్నది, ఖరపుత్రకరాత్=మకరాక్షుని చేతినుండి, చ్యుతమ్=విడవబడినది, అయిన, ఆపతన్తమ్=వచ్చి మీద పడుచున్న, తం శూలమ్=ఆ శూలమును, చతుర్భిః=నాలుగు, బాణైః=బాణములచేత,

ఆకాశే=ఆకాశమునందు, చిచ్ఛేద=ఛేదించెను.

తా. రాముడు ప్రహస్తునిచేత ప్రయోగింపబడి మీదకు వచ్చుచున్న ఆ మండుచున్న శూలమును నాలుగు బాణాలచేత ఆకాశమునందే ఛేదించివేసెను.

మూ. స భిన్నో నైకధా శూలో దివ్యహాటకమణ్డితః, 35
వ్యశీర్యత మహోల్కేవ రామబాణార్దితో భువి.

ప్ర. అ. రామబాణార్దితః=రాముని బాణములచేత కొట్టబడి, నైకధా=అనేక విధములుగా, భిన్నః=విరిగిపోయిన, దివ్యహాటకమణ్డితః=సుందరమైన బంగారముచేత అలంకరించబడిన, సః శూలః=ఆ శూలము, మహోల్కేవ=గొప్ప ఉల్కవలె, భువి=నేలమీద, వ్యశీర్యత=ముక్కలైపోయెను.

తా. రాముని బాణములచేత కొట్టబడిన, ముక్కముక్కలైపోయిన, దివ్యమైన, బంగారముచేత అలంకరింపబడిన ఆ శూలము పెద్ద ఉల్కవలె (ఆకాశమునుంచి పడు అగ్నిపిండము వలె) నేలమీద విడి విడిగా పడిపోయెను.

మూ. తచ్ఛూలం నిహతం దృష్ట్వా రామేణాక్లిష్టకర్మణా, 36
సాధు సాధ్వితి భూతాని వ్యాహరన్తి నభోగతాః.

ప్ర. అ. అక్లిష్టకర్మణా=క్లేశములేని పనులు గల, రామేణ=రామునిచేత, నిహతమ్=కొట్టబడిన, తత్=ఆ, శూలమ్=శూలమును, దృష్ట్వా=చూచి, భూతాని=సకలప్రాణులు, నభోగతాః=దేవతలు, సాధు సాధు ఇతి=బాగు బాగు అని, వ్యాహరన్తి=పలికినవి.

తా. శ్రమపడకుండా పనులు చేయు రాముడు ఆ శూలమును ఛేదించుట చూచి సకలప్రాణులు, దేవతలు "బాగు బాగు" అని పలికిరి. 36

మూ. తం దృష్ట్వా నిహతం శూలం మకరాక్షో నిశాచరః, 37
ముష్టిముద్యమ్య కాకుత్స్థం తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్.

ప్ర. అ. నిశాచరః=రాక్షసుడైన, మకరాక్షః=మకరాక్షుడు, తమ్=ఆ, శూలమ్=శూలమును, నిహతమ్=కొట్టబడినదానినిగా, దృష్ట్వా=చూచి, ముష్టిమ్=పిడికిలిని, ఉద్యమ్య=ఎత్తి, తిష్ఠ తిష్ఠ=నిలువుము, నిలువుము, ఇతి=అని, కాకుత్స్థమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆ శూలము ఛేదించబడినట్లు చూచి మకరాక్షుడు పిడికిలి ఎత్తి "నిలువుము, నిలువుము" అని అనుచు రామునిమీదికి వచ్చెను. 37

మూ. స తం దృష్ట్వాపతన్తం తు ప్రహస్య రఘునన్దనః, 38
పావకాస్త్రం తతో రామః సందధే తు శరాసనే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రఘునన్దనః=రఘువంశీయులకు ఆనందము చేయు, సః రామః=ఆ రాముడు, ఆపతన్తమ్=వచ్చుచున్న, తమ్=వానిని, దృష్ట్వా= చూచి, ప్రహస్య=నవ్వి, పావకాస్త్రమ్=ఆగ్నేయాస్త్రమును, శరాసనే=ధనస్సుమీద, సందధే=సంధించెను.

తా. రఘువంశమునకు ఆనందకరుడైన ఆ రాముడు మీదికి వచ్చుచున్న వానిని చూచి నవ్వుచు ధనస్సుమీద ఆగ్నేయాస్త్రమును సంధించెను. 38

మూ. తేనాస్త్రేణ హతం రక్షః కాకుత్థ్సేన తదా రణే , 39
సచ్ఛిన్నహృదయం తత్ర పపాత చ మమార చ.

ప్ర. అ. తదా=అప్పుడు, కాకుత్థ్సేన=రామునిచేత, తేన=ఆ, అస్త్రేణ=అస్త్ర ముచేత, హతమ్=కొట్టబడిన, రక్షః=రాక్షసుడు, భిన్నహృదయం సత్=ఛేదించబడిన హృదయము గలవాడై, తత్ర=అక్కడ, రణే=యుద్ధభూమియందు, పపాత=పడెను, మమార చ=మరణించెను.

తా. అప్పుడు రాముడు ఆ అస్త్రమును ప్రయోగించగా ఆ రాక్షసుడు, హృదయము తెగిపోయి, మరణించి పడిపోయెను. 39

మూ. దృష్ట్వా తే రాక్షసాః సర్వే మకరాక్షస్య పాతనమ్, 40
లఙ్కామేవ ప్రధావన్త రామబాణభయార్దితాః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, మకరా క్షస్య=మకరాక్షునియొక్క, పాతనమ్=పడగొట్టుటను, దృష్ట్వా=చూచి, రామబాణ భయార్దితాః=రాముని బాణములవలన కలిగిన భయముచేత పీడింపబడినవారై, లఙ్కామేవ=లంకను గూర్చియే, ప్రధావన్త=పరుగెత్తిరి.

తా. మకరాక్షుడు పడగొట్టబడుట చూచి రాక్షసులందరు రాముని బాణములకు భయపడి లంకలోనికి పారిపోయిరి. 40

మూ. దశరథనృపసూనుబాణవేగై
రజనిచరం నిహతం ఖరాత్మజం తమ్,
ప్రదదృశురథ దేవతాః ప్రహృష్టా
గిరిమివ వజ్రహతం యథా వికీర్ణమ్. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాణ్డే నవసప్తతితమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, దశరథనృపసూనుబాణవేగైః=రాముని బాణ ముల వేగములచేత, నిహతమ్=చంపబడిన, ఖరాత్మజమ్=ఖరునిపుత్రుడైన, తమ్=ఆ,

రజనిచరమ్=రాక్షసుణ్ణి, దేవతాః=దేవతలు, ప్రహృష్టాః=సంతోషించినవారై, వజ్రహతమ్=వజ్రముచేత కొట్టబడిన, వికీర్ణమ్=చిమ్మివేయబడిన, గిరిమివ=పర్వతమును వలె, ప్రదదృశుః=చూచిరి.

తా. అప్పుడు రామబాణవేగముచేత చంపబడిన ఆ మకరాక్షుడు వజ్రముచేత కొట్టబడిన పర్వతము పడియున్నట్లు పడి ఉండుట చూచి దేవతలు సంతోషించిరి. 41

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో డెబ్బదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ అశీతితమః సర్గః

[రావణుడు పంపగా ఇంద్రజిత్తు ఘోరయుద్ధము చేయుట. వానిని చంపేవిషయమున రామలక్ష్మణులు మాటలాడుకొనుట.]

మూ. మకరాక్షం హతం శ్రుత్వా రావణః సమితింజయః,
రోషేణ మహతావిష్టో దన్తాన్ కటకటాయ్య చ. 1
కోపితశ్చ తదా తత్ర కిం కార్యమితి చిన్తయన్,
ఆదిదేశాథ సంక్రుద్ధో రణాయేన్ద్రజితం సుతమ్. 2

ప్ర. అ. సమితిఞ్జయః=యుద్ధమును జయించు, రావణః=రావణుడు, మకరాక్షమ్=మకరాక్షుణ్ణి, హతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, మహతా=గొప్పదైన, రోషేణ=కోపముతో, ఆవిష్టః=కూడినవాడై, దన్తాన్=దంతములను, కటకటాయ్య చ=కటకటా కొరికి, కుపితశ్చ=కోపించినవాడై, తదా=అప్పుడు, తత్ర=అక్కడ, కిమ్=ఏమి, కార్యమ్=చేయతగినది, ఇతి=అని, చిన్తయన్=ఆలోచించుచూ, అథ=పిమ్మట, సంక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, సుతమ్=కుమారుడైన, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, రణాయ=యుద్ధముకొరకు, ఆదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. యుద్ధములను జయించు రావణుడు మకరాక్షుడు చంపబడినట్లు విని కోపావేశముతో దంతములను కటకటలాడించుచూ అప్పుడు అక్కడ ఏమి చేయవలెను అని ఆలోచించుచు చాలా కోపించినవాడై కుమారుడైన ఇంద్రజిత్తును యుద్ధమునకు వెళ్లు మని ఆజ్ఞాపించెను. 1, 2

మూ. జహి వీర మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః. 3

ప్ర. అ. వీర=ఓ వీరుడా!, అదృశ్యః=కనబడనివాడవైగాని, దృశ్యమానో వా=కనబడుచున్నవాడవై గాని, మహావీర్యౌ=గొప్ప పరాక్రమము గల, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, జహి=చంపుము. సర్వథా=అన్నివిధముల, త్వమ్=నీవు, బలాధికః=బలముచేత గొప్పవాడవు.

తా. ఓ! వీరుడా! నీవు కనబడుచూ గాని, కనబడకుండా గాని మహాపరాక్రమవంతులైన సోదరులైన రామలక్ష్మణులను చంపుము. నీవు అన్ని విధముల బలముచే గొప్పవాడవు. 3

మూ. త్వమప్రతిమకర్మాణమిన్ద్రం జయసి సంయుగే,
కిం పునర్మానుషౌ దృష్ట్వా న వధిష్యసి సంయుగే. 4

ప్ర. అ. త్వమ్=నీవు, సంయుగే=యుద్ధమునందు, అప్రతిమకర్మాణమ్=సాటిలేని పనిగల, ఇన్ద్రమ్=ఇంద్రుణ్ణి, జయసి=జయించుచున్నావు. సంయుగే=యుద్ధమునందు, మానుషౌ=మనుష్యులను, దృష్ట్వా=చూచి, కిం పునః న వధిష్యసి=వధింపజాలవా?

తా. నీవు యుద్ధములో సాటి లేని పనులు చేయు ఇంద్రుణ్ణి జయించుచున్నావు. అట్టి నీవు యుద్ధములో ఆ మానవు లిద్దరినీ చూచి వధింపజాలవా? 4

మూ. తథోక్తో రాక్షసేన్ద్రేణ ప్రతిగృహ్య పితుర్వచః,
యజ్ఞభూమౌ స విధివత్ పావకం జుహవేన్ద్రజిత్. 5

ప్ర. అ. రాక్షసేన్ద్రేణ=రావణునిచేత, తథా=అట్లు, ఉక్తః=పలుకబడిన, సః=ఆ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, పితుః=తండ్రియొక్క, వచః=వచనమును, ప్రతిగృహ్య=స్వీకరించి, యజ్ఞభూమౌ=యజ్ఞభూమియందు, విధివత్=యథాశాస్త్రముగా, పావకమ్=అగ్నిని, జుహవ=హోమముచేసెను.

తా. ఆ ఇంద్రజిత్తు రావణుని మాటలు విని తండ్రియైన ఆతని వచనమును స్వీకరించి, యజ్ఞభూమియందు యథాశాస్త్రముగా అగ్నిలో హోమము చేసెను. 5

మూ. జుహ్వతశ్చాపి తత్రాగ్నిం రక్తోష్ణీషధరాః స్త్రియః,
ఆజగ్ముస్తత్ర సమ్భ్రాన్తా రాక్షస్యో యత్ర రావణిః. 6

ప్ర. అ. తత్ర=అక్కడ, అగ్నిమ్=అగ్నిని, జుహ్వతః చ అపి=అతడు హోమము చేయుచుండగా, రక్తోష్ణీషధరాః=ఎర్రని తలపాగలను ధరించిన, రాక్షస్యః స్త్రియః=రాక్షసస్త్రీలు, రావణిః=ఇంద్రజిత్తు, యత్ర=ఎక్కడ ఉన్నాడో, తత్ర=అచటికి, సమ్భ్రాన్తాః=తొందరపడుచున్నవారై, ఆజగ్ముః=వచ్చిరి.

తా. ఇంద్రజిత్తు హోమముచేయ సంకల్పించగానే రాక్షసస్త్రీలు తొందర పడుచూ (ఋత్విక్కులకొరకై) ఎర్రని తలపాగలను తీసికొని ఆతడున్న చోటికి వచ్చిరి. 6

మూ. శస్త్రాణి శరపత్రాణి సమిధోఽథ విభీతకాః,
లోహితాని చ వాసాంసి స్రువం కార్ష్ణాయసం తథా. 7

ప్ర. అ. శరపత్రాణి=రెల్లు గడ్డి ఆకులు, శస్త్రాణి=వేదికదగ్గర పరిచేవిగాను,

విభీతకాః=విభీతకవృక్షకాష్ఠములు, సమిధః=సమిధలుగాను, అథ=మరియు, లోహితాని=ఎర్రని, వాసాంసి=వస్త్రములు, తథా=మరియు, కార్ష్ణాయసమ్=ఇనుము వికారమైన, స్రువమ్=స్రువము (ఆయెను).

తా. ఆ హోమమునందు రెల్లుగడ్డి పరకలు వేదికచుట్టూ పరిచే తృణములుగానూ, విభీతకదారుఖండములు సమిధలుగానూ ఉపయోగింపబడెను. (ఋత్విక్కులకు) ఎర్రని వస్త్రములూ, ఇనుపస్రువమూ ఉపయోగింపబడెను. 7

మూ. సర్వతోఽగ్నిం సమాస్తీర్య శరపత్రైః సతోమరైః,
ఛాగస్య సర్వకృష్ణస్య గలం జగ్రాహ జీవతః. 8

ప్ర. అ. అగ్నిం సర్వతః=అగ్నికి అన్ని వైపుల, సతోమరైః=తోమరములతో కూడిన, శరపత్రైః=రెల్లుగడ్డిపరకలచేత, సమాస్తీర్య=పరచి, జీవతః=జీవించియున్న, సర్వకృష్ణస్య=పూర్తిగా నల్లనైన, ఛాగస్య=మేకయొక్క, గలమ్=కంఠమును, జగ్రాహ=గ్రహించెను.

తా. అగ్ని చుట్టూ రెల్లుగడ్డీ, తోరములూ పరచి ప్రాణాలతో ఉన్న పూర్తిగా నల్లనైన మేక కంఠము పట్టి దానిని బలి ఇచ్చెను. 8

మూ. సకృద్ధోమసమిద్ధస్య విధూమస్య మహార్చిషః,
బభూవుస్తాని లిఙ్గాని విజయం దర్శయన్తి చ. 9

ప్ర. అ. సకృత్=ఒకమారు, హోమసమిద్ధస్య=హోమముచేత వృద్ధిపొందింపబడిన, విధూమస్య=ధూమము లేని, మహార్చిషః=గొప్ప జ్వాలగల (అగ్నియొక్క), విజయమ్=విజయమును, దర్శయన్తి=చూపించు, తాని=ఆ లిఙ్గాని=చిహ్నములు, బభూవుః=ఐనవి.

తా. ఒక్కమారు హోమము చేయుటచే వృద్ధిపొంది అగ్ని ధూమము లేక గొప్ప జ్వాలతో ప్రజ్వలించుచుండగా, విజయసూచకములైన కొన్ని చిహ్నములు కనబడినవి. 9

మూ. ప్రదక్షిణావర్తశిఖస్తప్తహాటకసన్నిభః,
హవిస్తత్ప్రతిజగ్రాహ పావకః స్వయముత్థితః. 10

ప్ర. అ. ప్రదక్షిణావర్తశిఖః=ప్రదక్షిణముగా తిరుగుచున్న జ్వాలలు గల, తప్తహాటకసన్నిభః=కరిగించిన బంగారముతో సమానమైన, పావకః=అగ్ని, స్వయమ్=స్వయముగా, ఉత్థితః=పైకి లేచినదై, తత్=ఆ, హవిః=హవిస్సును, ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

తా. ప్రదక్షిణముగా సుడులు తిరుగుచున్న జ్వాలలతో, కరిగించిన

బంగారము వంటి రంగు గల అగ్ని స్వయముగా పైకి లేచి ఆ హవిస్సును స్వీకరించెను. 10

మూ. హుత్వాగ్నిం తర్పయిత్వాథ దేవదానవరాక్షసాన్,
ఆరురోహ రథశ్రేష్ఠమన్తర్ధానగతం శుభమ్. 11

ప్ర. అ. అగ్నిమ్=అగ్నిని, హుత్వా=హోమముచేసి, అథ=పిమ్మట, దేవదానవరాక్షసాన్=దేవతలనూ, దానవులనూ, రాక్షసులనూ, తర్పయిత్వా=తృప్తిపొందించి, అన్తర్ధానగతమ్=అంతర్ధానము పొందిన, శుభమ్=సుందరమైన, రథశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. అగ్నిలో హోమము చేసి, (అభిచారక్రియకు సంబంధించిన) దేవదానవరాక్షసులకు తృప్తి కలిగించి, ఇతరులకు కనబడని, అందమైన, శ్రేష్ఠమైన రథమును ఎక్కెను. 11

మూ. స వాజిభిశ్చతుర్భిస్తు బాణైస్తు నిశితైర్యుతః,
ఆరోపితమహాచాపః శుశుభే స్యన్దనోత్తమః. 12

ప్ర. అ. చతుర్భిః=నాలుగు, వాజిభిః=గుర్రములతోనూ, నిశితైః=వాడియైన, బాణైః=బాణములతోనూ, యుతః=కూడిన, ఆరోపితమహాచాపః=ఎక్కించబడిన గొప్ప ధనుస్సులు గల, సః=ఆ, స్యన్దనోత్తమః=ఉత్తమమైన రథము, శుశుభే=ప్రకాశించెను.

తా. ప్రకాశించుచున్న ఉత్తమమైన ఆ రథమును నాలుగు గుర్రములు లాగుచుండెను. వాడియైన బాణములు గొప్ప ధనుస్సులూ దానిపై ఎక్కించబడెను.

మూ. జాజ్వల్యమానో వపుషా తపనీయపరిచ్ఛదః,
మృగైశ్చన్ద్రార్ధచన్ద్రైశ్చ స రథః సమలంకృతః. 13

ప్ర. అ. వపుషా=దేహముతో, జాజ్వల్యమానః=ఎక్కువగా ప్రకాశించుచున్న, తపనీయపరిచ్ఛదః=బంగారు ఆవరణములు గల, సః=ఆ, రథః=రథము, మృగైః=మృగములచేతను, చన్ద్రార్ధచన్ద్రైశ్చ=చంద్రాకారములు, అర్ధచంద్రాకారములూ ఐన రచనలచేతనూ, సమలంకృతః=అలంకరింపబడినది.

తా. బంగారపు ఆచ్ఛాదన కలిగి, మిక్కిలి ప్రకాశించుచున్న ఆ రథము మృగములచేతనూ, చంద్రాకార- అర్ధచంద్రాకారరచనలచేతనూ అలంకరింపబడెను.

మూ. జామ్బూనదమహాకమ్బుర్దీప్తపావకసన్నిభః,
బభూవేన్ద్రజితః కేతుర్వైదూర్యసమలంకృతః. 14

ప్ర. అ. జామ్బూనదమహాకమ్బుః=బంగారము వికారమైన పెద్ద వలయము

కలదీ, దీప్తపావకసన్నిభః=మండుచున్న అగ్నితో సమానమూ ఐన, ఇన్ద్రజితః= ఇంద్రజిత్తు యొక్క, కేతుః=ధ్వజము, వైడూర్యసమలంకృతః=వైడూర్యమణులచేత అలంకరింపబడినదై, బభూవ=ఉండెను.

తా. మండుచున్న అగ్నితో సమానమైన ఇంద్రజిత్తు రథముపై నున్న ధ్వజము పెద్ద బంగారపు వలయముచేత, వైడూర్యమణులచేత అలంకరింపబడి ఉండెను. 14

మూ. తేన చాదిత్యకల్పేన బ్రహ్మాస్త్రేణ చ పాలితః,
స బభూవ దురాధర్షో రావణిః సుమహాబలః. 15

ప్ర. అ. ఆదిత్యకల్పేన=సూర్యునితో సమానమైన, తేన బ్రహ్మాస్త్రేణ=ఆ బ్రహ్మాస్త్రముచేత, పాలితః=రక్షింపబడిన, సుమహాబలః=చాల గొప్ప బలము గల, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, దురాధర్షః=ఎదిరింప శక్యము కానివాడుగా, బభూవ=ఆయెను.

తా. సూర్యుని వంటి ఆ బ్రహ్మాస్త్రముచే రక్షింపబడుచున్న మహాబలశాలియైన ఆ ఇంద్రజిత్తు ఎదిరింప శక్యము కానివాడు ఆయెను. 15

మూ. సోఽభినిర్యాయ నగరాదిన్ద్రజిత్సమితిఞ్జయః,
హుత్వాగ్నిం రాక్షసైర్మన్త్రైరన్తర్ధానగతోఽబ్రవీత్. 16

ప్ర. అ. సమితిఞ్జయః=యుద్ధమును జయించు, సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, రాక్షసైః=రాక్షసదేవతాకములైన, మన్త్రైః=మంత్రములచేత, అగ్నిమ్=అగ్నిని, హుత్వా=హోమముచేసి, నగరాత్=నగరమునుండి, అభినిర్యాయ=బయలుదేరి, అన్తర్ధానగతః=అంతర్ధానము చెందినవాడై, అబ్రవీత్=పలికెను.

తా. యుద్ధములలో జయించు ఆ ఇంద్రజిత్తు రాక్షసదేవథాకములైన (లేదా రాక్షసులకు మాత్రమే తెలిసిన) మంత్రములచేత అగ్నిలో హోమము చేసి అంతర్ధానము చెంది నగరమునుండి బయలుదేరి ఇట్లు పలికెను. 16

మూ. అద్య హత్వా రణే యౌ తౌ మిథ్యాప్రవ్రజితౌ వనే,
జయం పిత్రే ప్రదాస్యామి రావణాయ రణార్జితమ్. 17

ప్ర. అ. యౌ=ఏ రామలక్ష్మణులు, వనే=వనమునందు, మిథ్యాప్రవ్రజితౌ= అసత్యముగా వనవాసము చేయుచున్నారో, తౌ=వారిని, రణే=యుద్ధమునందు, అద్య=నేడు, హత్వా=చంపి, పిత్రే=తండ్రియైన, రావణాయ=రావణునికొరకు, రణార్జితమ్=యుద్ధమునందు సంపాదించబడిన, జయమ్=జయమును, ప్రదాస్యామి=ఇచ్చెదను.

తా. అసత్యముగా వనవాసము చేయుచున్న ఆ రామలక్ష్మణులను నేడు యుద్ధమునందు చంపి నా తండ్రియైన రావణునకు యుద్ధమునందు సంపాదించిన జయమును ఇచ్చెదను. 17

మూ. అద్య నిర్వానరాముర్వీం హత్వా రామం చ లక్ష్మణమ్,
కరిష్యే పరమాం ప్రీతిమిత్యుక్త్వాన్తరధీయత. 18

ప్ర. అ. అద్య=నేడు, ఉర్వీమ్=భూమిని, నిర్వానరాం=వానరులు లేనిదానినిగా చేసి, రామమ్=రాముణ్ణీ, లక్ష్మణం చ=లక్ష్మణుణ్ణీ, హత్వా=చంపి, పరమామ్=గొప్పదైన, ప్రీతిమ్=సంతోషమును, కరిష్యే=చేయగలను. ఇతి=అని, ఉక్త్వా=పలికి, అన్తరధీయత=అంతర్ధానము చెందెను.

తా. నేడు భూమిమీద వానరులు లేకుండగా చేసి, రామలక్ష్మణులను చంపి గొప్ప సంతోషమును కలిగించెదను. ఇట్లు పలికి అతడు అంతర్ధానము చెందెను. 18

మూ. ఆపపాతాథ సంక్రుద్ధో దశగ్రీవేణ చోదితః,
తీక్ష్ణకార్ముకనారాచైస్తీక్ష్ణస్త్విన్ద్రరిపూ రణే. 19

ప్ర. అ. తీక్ష్ణకార్ముకనారాచైః=తీక్ష్ణములైన ధనుస్సులచేత, నారాచబాణములచేత, రణే=యుద్ధమునందు, తీక్ష్ణః=తీక్ష్ణుడయిన, ఇన్ద్రరిపుః=ఇంద్రజిత్తు, దశగ్రీవేణ=రావణునిచేత, చోదితః=ప్రేరేపింపబడినవాడై, అథ= అటుపిమ్మట, సంక్రుద్ధః=కోపించినవాడై, పపాత=శీఘ్రముగా వచ్చెను.

తా. వాడియైన ధనుస్సులచేత, నారాచబాణములచేత యుద్ధములో భయంకరుడైన ఇంద్రజిత్తు రావణుడు ప్రేరేపించగా కోపముతో శీఘ్రముగా వచ్చెను. 19

మూ. స దదర్శ మహావీర్యౌ నాగౌ త్రిశిరసావివ,
సృజన్తావిషుజాలాని వీరౌ వానరమధ్యగౌ. 20

ప్ర. అ. సః=అతడు, మహావీర్యౌ=గొప్ప పరాక్రమముకలవారూ, త్రిశిరసౌ=మూడు తలలు గల, నాగౌ ఇవ=సర్పముల వలె ఉన్నవారు, ఇషుజాలాని=బాణముల సముదాయములను, సృజన్తౌ=విడుచుచున్నవారూ, వానరమధ్యగౌ=వానరుల మధ్యయం దున్నవారూ ఐన, వీరౌ=ఇద్దరు వీరులను, దదర్శ=చూచెను.

తా. ఆ ఇంద్రజిత్తు బాణములను వర్షించుచున్న ఇద్దరు వీరులను చూచెను. గొప్ప పరాక్రమము గల ఆ ఇద్దరూ వానరుల మధ్య మూడు తలల సర్పముల వలె ఉండిరి. 20

మూ. ఇమౌ తావితి సంచిన్త్య సజ్యం కృత్వా చ కార్ముకమ్,
సన్తతానేషుధారాభిః పర్జన్య ఇవ వృష్టిమాన్. 21

ప్ర. అ. ఇమౌ=వీరిద్దరూ, తౌ=ఆ రామలక్ష్మణులు, ఇతి=అని, సంచిన్త్య=ఆలోచించి, కార్ముకమ్=ధనుస్సును, సజ్యమ్=నారితో కూడినదానినిగా, కృత్వా=చేసి, వృష్టిమాన్=వర్షము గల, పర్జన్యః ఇవ=మేఘము వలె, ఇషుధారాభిః=బాణధారలచేత, సన్తతాన=కప్పివేసెను.

తా. వీళ్లే ఆ రామలక్ష్మణులు అని గుర్తించి ధనుస్సునకు నారి బిగించి వర్షించుచున్న మేఘము వలె వారిని బాణధారలతో కప్పివేసెను. 21

మూ. స తు వైహాయసం ప్రాప్య సరథో రామలక్ష్మణౌ,
అచక్షుర్విషయే తిష్ఠన్వివ్యాధ నిశితైః శరైః. 22

ప్ర. అ. సరథః=రథముతో కూడిన, సః=అతడు, వైహాయసమ్=ఆకాశమును, ప్రాప్య=పొంది, అచక్షుర్విషయే=నేత్రములకు గోచరము కాకుండగా, తిష్ఠన్=ఉన్నవాడై, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, వివ్యాధ=కొట్టెను.

తా. రథము నెక్కిన ఆ ఇంద్రజిత్తు ఆకాశములో ఉండి ఎవ్వరికిని కనబడనివాడై వాడియైన బాణములతో రామలక్ష్మణులను కొట్టెను. 22

మూ. తౌ తస్య శరవేగేన పరీతౌ రామలక్ష్మణౌ,
ధనుషీ సశరే కృత్వా దివ్యమస్త్రం ప్రచక్రతుః. 23

ప్ర. అ. తస్య=వానియొక్క, శరవేగేన=బాణవేగముచేత, పరీతౌ=వ్యాపించబడిన, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులు, ధనుషీ=ధనుస్సులను, సశరే=బాణములతో కూడినవాటినిగా, కృత్వా=చేసి, దివ్యమ్=దివ్యమైన, అస్త్రమ్=అస్త్రమును, ప్రచక్రతుః=ప్రయోగించిరి.

తా. ఆ ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణముల వేగముచేత పీడింపబడిన రామలక్ష్మణులు ధనుస్సులపై బాణములు సంధించి దివ్యాస్త్రములను ప్రయోగించిరి. 23

మూ. ప్రచ్ఛాదయన్తౌ గగనం శరజాలైర్మహాబలౌ,
తమస్త్రైః సూర్యసంకాశైర్నైవ పస్పర్శతుః శరైః. 24

ప్ర. అ. మహాబలౌ=గొప్ప బలము గల ఆ రామలక్ష్మణులు, శరజాలైః=బాణముల సముదాయముల చేత, గగనమ్=ఆకాశమును, ప్రచ్ఛాదయన్తౌ=కప్పుచున్నవారై, సూర్యసంకాశైః=సూర్యునితో సమానమైన, అస్త్రైః=అస్త్రములచేతనూ,

శరైః=బాణములచేతనూ, తమ్=వానిని, న పస్పర్శతుః=స్పృశించలేదు.

తా. గొప్ప బలము గల ఆ రామలక్ష్మణులు బాణసముదాయముచేత ఆకాశమును కప్పివేయుచున్ననూ, సూర్యునితో సమానమైన అస్త్రములచేత గానీ, బాణముల చేత గానీ ఆతనిని స్పృశింపజాలకపోయిరి. 24

మూ. స హి ధూమాన్ధకారం చ చక్రే ప్రచ్ఛాదయన్నభః,
దిశశ్చాన్తర్దధే శ్రీమాన్నీహారతమసా వృతాః. 25

ప్ర. అ. సః=అతడు, నభః=ఆకాశమును, ప్రచ్ఛాదయన్=కప్పివేయుచూ, ధూమాన్ధకారమ్=పొగచీకటిని, చక్రే=చేసెను. శ్రీమాన్=శ్రీమంతుడైన ఆతడు, నీహారతమసా=పొగమంచువంటి చీకటితో, వృతాః=కూడిన, దిశశ్చ=దిక్కులను, అన్తర్దధే=కప్పివేసెను.

తా. శ్రీమంతుడైన ఆ ఇంద్రజిత్తు పొగచీకటి కల్పించి, ఆకాశమును కప్పివేసెను. దిక్కులను కూడా పొగమంచువంటి చీకటితో కనబడకుండా చేసెను. 25

మూ. నైవ జ్యాతలనిర్ఘోషో న చ నేమిఖురస్వనః,
శుశ్రువే చరతస్తస్య న చ రూపం ప్రకాశతే. 26

ప్ర. అ. తస్య=అతడు, చరతః=సంచరించుచుండగా, జ్యాతలనిర్ఘోషః=నారియొక్క ధ్వని, నైవ శుశ్రువే=వినబడలేదు. నేమిఖురస్వనః చ=చక్రాన్తములయొక్క, డెక్కల యొక్క ధ్వనికూడ, న చ=వినబడలేదు. రూపం చ =రూపము కూడా, న ప్రకాశతే=ప్రకాశించలేదు.

తా. ఆ ఇంద్రజిత్తు సంచరించుచుండగా ధనుష్టంకారధ్వని గాని, చక్రాన్తముల ధ్వని గాని, డెక్కల చప్పుడుగాని వినబడలేదు. ఆతని రూపము కనబడలేదు. 26

మూ. ఘనాన్ధకారే తిమిరే శిలావర్షమివాద్భుతమ్,
స వవర్ష మహాబాహుర్నారాచశరవృష్టిభిః. 27

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః=అతడు, ఘనాన్ధకారే=దట్టమైన, కనులు కనిపించకుండా చేయు, తిమిరే=చీకటియందు, నారాచశరవృష్టిభిః=నారాచబాణముల వర్షముల చేత, అద్భుతమ్= ఆశ్చర్యకరమైన, శిలావర్షమివ=శిలావర్షమును వలె, వవర్ష=వర్షించెను.

తా. గొప్ప బాహువులు గల ఆ ఇంద్రజిత్తు కండ్లు కనిపించని దట్టమైన చీకటిలో నారాచబాణముల వర్షమును ఆశ్చర్యకరమైన శిలావర్షమును

వలె వర్షించెను. 27

మూ. స రామం సూర్యసంకాశైః శరైర్దత్తవరైర్భృశమ్,
వివ్యాధ సమరే క్రుద్ధః సర్వగాత్రేషు రావణిః. 28

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, క్రుద్ధః=కోపించిన, సః=ఆ, రావణిః=ఇంద్రజిత్తు, దత్తవరైః=ఇవ్వబడిన వరము గల, సూర్యసంకాశైః=సూర్యునితో సమానమైన, శరైః=బాణములచేత, రామమ్=రాముణ్ణి, సర్వగాత్రేషు=అన్ని అవయవములయందు, భృశమ్=మిక్కిలి, వివ్యాధ=కొట్టెను.

తా. కోపించిన ఆ ఇంద్రజిత్తు యుద్ధములో వరము పొందిన సూర్యునివలె ప్రకాశించుచున్న బాణములతో రాముణ్ణి అన్ని అవయవములయందు అధికముగా కొట్టెను. 28

మూ. తౌ హన్యమానౌ నారాచైర్ధారాభిరివ పర్వతౌ,
హేమపుఙ్ఖాన్నరవ్యాఘ్రౌ తిగ్మాన్ముముచతుః శరాన్. 29

ప్ర. అ. ధారాభిః=వర్షధారలచేత, పర్వతౌ ఇవ=పర్వతములు వలె, నారాచైః=నారాచబాణములచేత, హన్యమానౌ=కొట్టబడుచున్న, నరవ్యాఘ్రౌ=నరులలో శ్రేష్ఠులైన, తౌ=ఆ రామలక్ష్మణులు, హేమపుఙ్ఖాన్=బంగారు పొన్నులు గల, తిగ్మాన్=వాడియైన, శరాన్=బాణములను, ముముచతుః=విడచిరి.

తా. జలధారలచేత పర్వతముల వలె నారాచబాణములచేత కొట్టబడుచున్న నరశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు బంగారు పొన్నులు గల వాడియైన బాణములను ప్రయోగించిరి. 29

మూ. అన్తరిక్షే సమాసాద్య రావణిం కఙ్కపత్రిణః,
నికృత్య పతగా భూమౌ పేతుస్తే శోణితోక్షితాః. 30

ప్ర. అ. కఙ్కపత్రిణః=గ్రద్దల రెక్కలు గల, తే=ఆ, పతగాః=బాణములు, అన్తరిక్షే=ఆకాశమునందు, రావణిమ్=ఇంద్రజిత్తును, సమాసాద్య=పొంది, నికృత్య=ఖండించి, శోణితోక్షితాః=రక్తముచేత పూయబడినవై, భూమౌ=భూమియందు, పేతుః=పడినవి.

తా. గ్రద్ద రెక్కలు కట్టిన ఆ బాణములు ఆకాశమునందు ఇంద్రజిత్తును చేరి, వాని శరీరమును ఛేదించి, రక్తముతో తడిసి, నేలమీద పడినవి. 30

మూ. అతిమాత్రం శరౌఘేణ దీప్యమానౌ నరోత్తమౌ,
తానిషూన్ పతతో భల్లైరనేకైర్విచకర్తతుః. 31

ప్ర. అ. శరౌఘేణ=బాణసముదాయముచేత, అతిమాత్రమ్=మిక్కిలి, దీప్య

మానౌ=ప్రకాశించుచున్న, నరోత్తమౌ=ఆ నరశ్రేష్ఠులు, పతతః=తమమీద పడుచున్న, తాన్ ఇషూన్=ఆ బాణములను, అనేకైః=అనేకములైన, భల్లైః=భల్లబాణములచేత, విచకర్తతుః=ఛేదించిరి.

తా. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణముల సముదాయముచేత మిక్కిలి ప్రకాశించుచున్న ఆ రామలక్ష్మణులు తమపై పడుచున్న ఆ బాణములను అనేక భల్లబాణములచేత ఛేదించిరి. 31

మూ. యతో హి దదృశాతే తౌ శరాన్ నిపతితాన్ శితాన్,
తతస్తు తౌ దాశరథీ ససృజాతేఽస్త్రముత్తమమ్. 32

ప్ర. అ. తౌ=వారు, యతః=ఎటువైపునుండి, నిపతితాన్=పడిన, శితాన్=వాడియైన, శరాన్=బాణములను, దదృశాతే=చూచిరో, తతః=అటువైపున, తౌ దాశరథీ=ఆ రామలక్ష్మణులు, ఉత్తమమ్=ఉత్తమమైన, అస్త్రమ్=అస్త్రమును, ససృజాతే=విడిచిరి.

తా. ఆ రామలక్ష్మణులు వాడియైన బాణములు ఎటువైపునుండి వచ్చుచున్నట్లు కనబడెనో అటు ఉత్తమాస్త్రములను ప్రయోగించుచుండిరి. 32

మూ. రావణిస్తు దిశః సర్వా రథేనాతిరథోఽపతత్,
వివ్యాధ తౌ దాశరథీ లఘ్వస్త్రో నిశితైః శరైః. 33

ప్ర. అ. అతిరథః=అతిరథుడైన, రావణిస్తు=ఇంద్రజిత్తైతే, రథేన=రథముచేత, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులనుగూర్చి, అపతత్=శీఘ్రముగా వెళ్లెను. లఘ్వస్త్రః=లఘువైన అస్త్రము గల (అస్త్రప్రయోగమునందు చురుకుదనము గల) అతడు, తౌ దాశరథీ=ఆ రామలక్ష్మణులను, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. అతిరథుడైన ఇంద్రజిత్తు రథముచేత అన్ని దిక్కులలోనూ శీఘ్రముగా సంచరించుచు, అస్త్రలాఘవమును చూపుచూ, వాడియైన బాణములతో ఆ రామలక్ష్మణులను కొట్టెను. 33

మూ. తేనాతివిద్ధౌ తౌ వీరౌ రుక్మపుంఖైః సుసంహతైః,
బభూవతుర్దాశరథీ పుష్పితావివ కింశుకౌ. 34

ప్ర. అ. సుసంహతైః=బాగా కలిసిన, ఎడతెరిపి లేని, రుక్మపుఙ్ఖైః=బంగారు పొన్నులు గల బాణములచేత, తేన=వానిచేత, అతివిద్ధౌ=అధికముగా కొట్టబడిన, వీరౌ=వీరులైన, తౌ దాశరథీ=ఆ రామలక్ష్మణులు, పుష్పితౌ=పుష్పించిన, కింశుకౌ ఇవ=కింశుకవృక్షములు వలె, బభూవతుః=అయిరి.

తా. వీరులైన ఆ రామలక్ష్మణులు బంగారు పొన్నులు గల బాణములతో ఇంద్రజిత్తు ఎడతెరిపిలేకుండా కొట్టుటచే పుష్పించిన కింశుకవృక్షములు వలె అయిరి. 34

మూ. నాస్య వేగగతిం కశ్చిన్న చ రూపం ధనుః శరాన్,
న చాన్యద్విదితం కించిత్ సూర్యస్యేవాభ్రసంప్లవే. 35

ప్ర. అ. అభ్రసంప్లవే=మేఘముల అత్యధికప్రవాహమునందు, సూర్యస్యేవ=సూర్యునియొక్క వలె, అస్య=వీనియొక్క, వేగగతిమ్=వేగగమనమును, కశ్చిత్=ఎవ్వడూ, న=తెలుసుకొనలేదు; రూపమ్=రూపమునూ, ధనుః=ధనుస్సునూ, శరాన్=బాణములనూ, న=తెలుసుకొనలేదు. అన్యత్=మరియొకటి, కించిత్=ఏదియు, న విదితమ్=తెలియబడలేదు.

తా. మేఘములు దట్టముగా కప్పినపుడు సూర్యుని గమనాదులను వలె ఆతని వేగగమనమును గాని, రూపమును గాని, ధనుస్సును గాని, బాణములను గాని, ఇతరమైన దేనినీ గాని ఎవ్వరునూ తెలిసికొనజాలకపోయిరి. 35

మూ. తేన విద్ధాశ్చ హరయో నిహతాశ్చ గతాసవః,
బభూవుః శతశస్తత్ర పతితా ధరణీతలే. 36

ప్ర. అ. తేన=వానిచేత, విద్ధాః=కొట్టబడిన, హరయః=వానరులు, నిహతాః=చంపబడిరి. గతాసవః=పోయిన ప్రాణములు కలవారై, శతశః=వందలకొలదీ, తత్ర=అక్కడ, ధరణీతలే=భూమిమీద, పతితాః=పడినవారు, బభూవుః=అయిరి.

తా. వానిచే కొట్టబడిన వానరులు చంపబడిరి. ప్రాణములు గోల్పోయి ఆ వానరులు వందలకొలదీ నేలమీద పడిపోయిరి. 36

మూ. లక్ష్మణస్తు తతః క్రుద్ధో భ్రాతరం వాక్యమబ్రవీత్,
బ్రాహ్మమస్త్రం ప్రయోక్ష్యామి వధార్థం సర్వరక్షసామ్. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, లక్ష్మణస్తు=లక్ష్మణుడైతే, క్రుద్ధః=కోపించినవాడై, భ్రాతరమ్=సోదరునిగూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. సర్వరక్షసామ్=సర్వరాక్షసులయొక్క, వధార్థమ్=వధకొరకు, బ్రాహ్మమ్ అస్త్రమ్=బ్రహ్మాస్త్రమును, ప్రయోక్ష్యామి=ప్రయోగించెదను.

తా. అప్పుడు లక్ష్మణుడు కోపించి "సర్వరాక్షసులనూ సంహరించుటకై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెదను" అని సోదరునితో పలికెను. 37

మూ. తమువాచ తతో రామో లక్ష్మణం శుభలక్షణమ్,
నైకస్య హేతో రక్షాంసి పృథివ్యాం హన్తుమర్హసి. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, శుభలక్షణమ్=మం

గళకరములైన లక్షణములు కల, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుణ్ణి గూర్చి, ఉవాచ=పలికెను. ఏకస్య హేతోః=ఒక్కనికొరకై, పృథివ్యామ్=భూమియందున్న, రక్షాంసి=రాక్షసులను, హన్తుమ్=చంపుటకు, న అర్హసి=తగవు.

తా. అప్పుడు రాముడు శుభలక్షణములు గల లక్ష్మణునితో ఇట్లు పలికెను. ఒక్క రాక్షసుని మూలాన లోకములో నున్న రాక్షసుల నందరినీ నీవు చంపకూడదు. 38

మూ. అయుధ్యమానం ప్రచ్ఛన్నం ప్రాఞ్జలిం శరణాగతమ్,
పలాయమానం మత్తం వా న హన్తుం త్వమిహార్హసి. 39

ప్ర. అ. ఇహ=ఇక్కడ, త్వమ్=నీవు, అయుధ్యమానమ్=యుద్ధముచేయని వానినిగాని, ప్రచ్ఛన్నమ్=దాగి ఉన్నవానిని గానీ, ప్రాఞ్జలిమ్=కట్టబడిన దోసిలిని కలవానిని గానీ, శరణాగతమ్=శరణుపొందిన వానినిగాని, పలాయమానమ్=పారిపో వుచున్న వానిని గాని, మత్తం వా=మదించిన వానిని గాని, హన్తుమ్=చంపుటకు, న అర్హసి=తగవు.

తా. నీవు యుద్ధము చేయనివానిని గాని, దాగి ఉన్నవానిని గాని, నమస్కరించుచున్నవానిని గాని, శరణజొచ్చినవానిని గాని, పారిపోవుచున్న వానిని గాని, మదముతో ఉన్నవానిని గాని చంపకూడదు. 39

మూ. తస్యైవ తు వధే యత్నం కరిష్యావో మహాభుజ,
ఆదేక్ష్యావో మహావేగా నస్త్రానాశీవిషోపమాన్. 40

ప్ర. అ.మహాభుజ=గొప్ప భుజములు కలవాడా, తస్యైవ=ఆ ఇంద్రజిత్తు యొక్కయే, వధే=వధయందు, యత్నమ్=ప్రయత్నమును, కరిష్యావః=చేసెదము. మహావేగాన్=గొప్ప వేగము గల, ఆశీవిషోపమాన్=సర్పములతో సమానములైన, అస్త్రాన్=అస్త్రములను, ఆదేక్ష్యావః=ఉపయోగించెదము.

తా. గొప్ప భుజములు గల ఓ ! లక్ష్మణా ! మనము ఈ ఇంద్రజిత్తునే చంపుటకు ప్రయత్నించెదము. సర్పములవంటి మహావేగము గల అస్త్రములను ప్రయోగించెదము. 40

మూ. తమేనం మాయినం క్షుద్రమన్తర్హితరథం బలాత్,
రాక్షసం విహనిష్యన్తి దృష్ట్వా వానరయూథపాః. 41

ప్ర. అ. మాయినమ్=మాయగలవాడూ, క్షుద్రమ్=నీచుడూ, అన్తర్హితర థమ్=అంతర్ధానము చెందిన రథము గలవాడూ అయిన, తమ్=అట్టి, ఏనమ్=ఈ, రాక్షసమ్=రాక్షసుణ్ణి, దృష్ట్వా=చూచి, వానరయూథపాః=వానర సేనానాయకులు, బలాత్=బలాత్కారముగా, విహనిష్యన్తి=చంపివేయగలరు.

తా. మాయావీ, నీచుడూ, కనబడని రథము కలవాడూ ఐన ఈ

రాక్షసుదు కనబడినట్లైతే వానరనాయకులే బలముచేత వానిని చంపివేయగలరు.

మూ. యద్యేష భూమిం విశతే దివం వా
రసాతలం వాపి నభస్తలం వా,
ఏవం నిగూఢోఽపి మమాస్త్రదగ్ధః
పతిష్యతే భూమితలే గతాసుః. 42

ప్ర. అ. ఏషః=ఇతడు, భూమిమ్=భూమిని, విశతే యది=ప్రవేశించినా, దివం వా=స్వర్గమునైనా, రసాతలం వాపి=పాతాళమునైనా, నభస్తలం వా=ఆకాశమునైనా ప్రవేశించినా, ఏవమ్=ఈ విధముగా, నిగూఢోఽపి=దాగి ఉన్నవాడైననూ, మమ=నాయొక్క, అస్త్రదగ్ధః=అస్త్రముచేత కాల్చబడినవాడై, గతాసుః=పోయిన ప్రాణములు కలవాడై, భూమితలే=నేలమీద, పతిష్యతే=పడగలడు.

తా. ఇతడు భూమిలో ప్రవేశించినా, స్వర్గలోకమునకు వెళ్లినా, పాతాళములో ప్రవేశించినా, ఆకాశములోనికి ఎగిరిపోయినా, ఏ విధముగా దాగి ఉన్నా కూడా నా అస్త్రముచేత కాల్చబడినవాడై ప్రాణములు విడచి నేలమీద పడగలడు. 42

మూ. ఇత్యేవముక్త్వా వచనం మహార్థం
రఘుప్రవీరః ప్లవగర్షభైర్వృతః,
వధాయ రౌద్రస్య నృశంసకర్మణ
స్తదా మహాత్మా త్వరితం నిరీక్షతే. 43

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అశీతితమః సర్గః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, రఘుప్రవీరః=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, మహార్థమ్=గొప్ప అర్థము గల, వచనమ్=వచనమును, ఉక్త్వా=పలికి, ప్లవగర్షభైః=వానరశ్రేష్ఠులతో, వృతః=కూడినవాడై, తదా=అప్పుడు, రౌద్రస్య=భయంకరుడైన, నృశంసకర్మణః=క్రూరమైన కర్మగల ఆ ఇంద్రజిత్తుయొక్క, వధాయ=వధకొరకు, త్వరితమ్=శీఘ్రముగా, నిరీక్షతే=చూచుచుండెను.

తా. మహాత్ముడైన ఆ రాముడు ఈ విధముగా గొప్ప అర్థము గల వాక్యము పలికి, భయంకరుడూ, క్రూరకర్మలు చేయువాడూ అయిన ఈ ఇంద్రజిత్తును శీఘ్రముగా చంపుటకై వానరనాయకులతో కలిసి ఉపాయమును ఆలోచించుచుండెను. 43

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకాశీతితమః సర్గః

[ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట.]

మూ. విజ్ఞాయ తు మనస్తస్య రాఘవస్య మహాత్మనః,
స నివృత్యాహవాత్తస్మాత్ ప్రవివేశ పురం తతః. 1

ప్ర. అ. సః=ఇంద్రజిత్తు, మహాత్మనః=మహాత్ముడైన, తస్య రాఘవస్య=ఆ రామునియొక్క, మనః= మనస్సును, విజ్ఞాయ=తెలిసికొని, తస్మాత్=ఆ, ఆహవాత్=యుద్ధమునుండి, నివృత్య=మరలి, తతః=అటుపిమ్మట, పురమ్=పట్టణమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఇంద్రజిత్తు మహాత్ముడైన రాముని అభిప్రాయమును గ్రహించి ఆ యుద్ధమునుండి మరలి పట్టణములో ప్రవేశించెను. 1

మూ. సోఽనుస్మృత్య వధం తేషాం రాక్షసానాం తరస్వినామ్,
క్రోధతామ్రేక్షణః శూరో నిర్జగామాథ రావణిః. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, శూరః=శూరుడైన, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, తరస్వినామ్=వేగవంతులైన, తేషాం రాక్షసానామ్=ఆ రాక్షసులయొక్క, వధమ్=వధను, అనుస్మృత్య=స్మరించి, క్రోధతామ్రేక్షణః=క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, నిర్జగామ=బయలుదేరి వెళ్లెను.

తా: శూరుడైన ఆ ఇంద్రజిత్తు మహాబలవంతులైన కుంభకర్ణాదుల వధను స్మరించుచు క్రోధముతో ఎఱ్ఱనైన నేత్రములతో బయల్వెడలెను. 2

మూ. స పశ్చిమేన ద్వారేణ నిర్యయౌ రాక్షసైర్వృతః,
ఇన్ద్రజిత్సుమహావీర్యః పౌలస్త్యో దేవకణ్టకః. 3

ప్ర. అ. సుమహావీర్యః=చాల గొప్ప పరాక్రమము గల, దేవకణ్టకః=దేవతలకు ముల్లువంటివాడైన, పౌలస్త్యః=పులస్త్యుని వంశమునందు పుట్టిన, సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, రాక్షసైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, పశ్చిమేన ద్వారేణ=పశ్చిమద్వారముచేత, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. గొప్ప పరాక్రమము గల, దేవతాశత్రువైన, పులస్త్యవంశసంజాతుడైన ఆ ఇంద్రజిత్తు రాక్షసులతో కూడి పశ్చిమద్వారమునుండి బయల్వెడలెను. 3

మూ. ఇన్ద్రజిత్తు తతో దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ,
రణాయాభ్యుద్యతౌ వీరౌ మాయాం ప్రాదుష్కరోత్తదా. 4

ప్ర. అ. ఇన్ద్రజిత్ తు=ఇంద్రజిత్తు, తతః=అటుపిమ్మట, వీరౌ=వీరులైన, భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, రణాయ=యుద్ధముకొరకు, అభ్యుద్యతౌ=సన్నద్ధులనుగా, దృష్ట్వా=తెలిసికొని, తదా=అప్పుడు, మాయామ్=మాయను, ప్రాదుష్కరోత్=ఆవిర్భవింపచేసెను.

తా. పిమ్మట ఇంద్రజిత్తు వీరులైన సోదరులు ఆ రామలక్ష్మణు లిద్దరూ యుద్ధము చేయుటకు సంనద్ధులై ఉన్నా రని తెలిసికొని అప్పుడు మాయను ప్రయోగించెను. 4

మూ. ఇన్ద్రజిత్తు రథే స్థాప్య సీతాం మాయామయీం తదా,
బలేన మహతావృత్య తస్యా వధమరోచయత్. 5

ప్ర. అ. ఇన్ద్రజిత్ తు=ఇంద్రజిత్తు, తదా=అప్పుడు, మాయామయీమ్=మాయారూపముగల, సీతామ్=సీతను, రథే=రథమునందు, స్థాప్య=ఉంచి, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, ఆవృత్య=కప్పి, తస్యాః=ఆమెయొక్క, వధమ్=వధను, అరోచయత్=ఇష్టపడెను.

తా. అప్పుడు ఇంద్రజిత్తు మాయాసీతను రథముమీద ఉంచుకొని, గొప్ప సైన్యమును చుట్టూ నిలిపి ఆమెను చంపవలె నని నిశ్చయించుకొనెను.

మూ. మోహనార్థం తు సర్వేషాం బుద్ధిం కృత్వా సుదుర్మతిః,
హన్తుం సీతాం వ్యవసితో వానరాభిముఖో యయౌ. 6

ప్ర. అ. సుదుర్మతిః=చాలా చెడ్డబుద్ధి గల అతడు, సర్వేషామ్=అందరియొక్క, మోహనార్థమ్=మోహపెట్టుటకొరకు, బుద్ధిమ్=బుద్ధిని, కృత్వా=చేసి, సీతామ్=సీతను, హన్తుమ్=చంపుటకు, వ్యవసితః=నిశ్చయించినవాడై, వానరాభిముఖః=వానరులకు అభిముఖుడై, యయౌ=వెళ్లెను.

తా. దుర్బుద్ధి గల ఆ ఇంద్రజిత్తు అందరినీ మోసము చేయవలె నను కోరికతో సీతను చంపుటకు నిశ్చయించుకొని వానరు లున్న వైపు వెళ్లెను. 6

మూ. తం దృష్ట్వా త్వభినిర్యాన్తం సర్వే తే కాననౌకసః,
ఉత్పేతురభిసంక్రుద్ధాః శిలాహస్తా యుయుత్సవః. 7

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, కాననౌకసః=వానరులు, అభినిర్యాన్తమ్=బయలుదేరి వచ్చుచున్న, తమ్=వానిని, దృష్ట్వా=చూచి, అభిసంక్రుద్ధాః=కోపించినవారై, శిలాహస్తాః=శిలలు హస్తములందు గలవారై, యుయుత్సవః=యుద్ధము

చేయుటకు ఇచ్ఛకలవారై, ఉత్పేతుః=ఎగిరిరి.

తా. బయలుదేరి వచ్చుచున్న ఆతనిని చూచి వానరు లందరూ యుద్ధము చేయుటకు శిలలను హస్తములందు ధరించి కోపముతో పైకి ఎగిరిరి.

మూ. హనూమాన్ పురతస్తేషాం జగామ కపికుఞ్జరః,
ప్రగృహ్యా సుమహచ్ఛృఙ్గం పర్వతస్య దురాసదమ్. 8

ప్ర. అ. కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడైన, హనూమాన్=హనుమంతుడు, పర్వతస్య =పర్వతముయొక్క, సుదురాసదమ్=మిక్కిలి ఎదిరింప శక్యముకాని, సుమహత్=చాల గొప్పదైన, శృఙ్గమ్=శిఖరమును, ప్రగృహ్యా=గ్రహించి, తేషామ్= వాళ్లయొక్క, పురతః=ఎదుట, జగామ=వెళ్లెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఎదిరింప శక్యము కాని, చాల పెద్దదైన పర్వతశిఖరమును గ్రహించి ఆ వానరుల ముందు వెళ్లెను. 8

మూ. స దదర్శ హతానన్దాం సీతామిన్ద్రజితో రథే,
ఏకవేణీధరాం దీనాముపవాసకృశాననామ్, 9
పరిక్లిష్టైకవసనామమృజాం రాఘవప్రియామ్,
రజోమలాభ్యామాలిప్తైః సర్వగాత్రైర్వరస్త్రియమ్. 10

ప్ర. అ. సః=ఆ హనుమంతుడు, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, రథే= రథమునందు, హతానన్దామ్=తొలగిన ఆనందముగలది, ఏకవేణీధరామ్=ఒక జటను ధరించినది, దీనామ్=దీనురాలు, ఉపవాసకృశాననామ్=ఉపవాసములచేత కృశించిన ముఖము గలది, పరిక్లిష్టైకవసనామ్=నలిగిన ఒక వస్త్రము గలది, అమృజామ్=శరీరసంస్కారము లేనిది, రజోమలాభ్యామ్=పరాగముచేతను, మురికిచేతను, ఆలిప్తైః=పూయబడిన, సర్వగాత్రైః=సకలావయవములతో కూడినది, వరస్త్రియమ్=శ్రేష్ఠమైనస్త్రీ అయిన, రాఘవప్రియామ్=రాముని భార్య యైన, సీతామ్=సీతను, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు ఆ ఇంద్రజిత్తు రథమునందు రాముని భార్య, స్త్రీలలో ఉత్తమురాలు అయిన సీతను చూచెను. ఆనందము నశించిన ఆమె ఒకే జడను ధరించెను. ఉపవాసములచేత ఎండిపోయిన ముఖముతో దీనురాలైన ఆమె నలిగి పోయిన ఒక వస్త్రము ధరించెను. ఆమె అవయవము లన్నీ స్నానాదిసంస్కారములు లేక పరాగముచేతను, మురికిచేతను కప్పబడి ఉండెను. 9, 10

మూ. తాం నిరీక్ష్య ముహూర్తం తు మైథిలీమధ్యవస్య చ,
బభూవాచిరదృష్టా హి తేన సా జనకాత్మజా. 11

ప్ర. అ. ముహూర్తమ్=ముహూర్తకాలమును, తామ్=ఆమెను, నిరీక్ష్య=చూచి, మైథిలీమ్=సీతనుగా, అధ్యవస్య చ=నిశ్చయించి, (విషణ్ణః=దిగులు చెందినవాడు) బభూవ=ఆయెను. తేన=ఆతనిచేత, సా=ఆ, జనకాత్మజా=సీత, అచిరదృష్టా హి=కొంచెము కాలము క్రితమే చూడబడినది కదా?

తా. ఆమెను ముహూర్తకాలము చూడగానే హనుమంతుడు ఆమె సీత అని గుర్తుపట్టి విషాదము చెందెను. ఆతడు ఆమెను కొంచెము కాలము క్రితమే చూచి ఉండెను కదా? 11

మూ. అబ్రవీత్తాం తు శోకార్తాం నిరానన్దాం తపస్వినీమ్,
దృష్ట్వా రథస్థితాం దీనాం రాక్షసేన్ద్రసుతశ్రితామ్, 12
కిం సమర్థితమస్యేతి చిన్తయన్స మహాకపిః,
సహ తైర్వానరశ్రేష్ఠైరభ్యధావత రావణిమ్. 13

ప్ర. అ. సః మహాకపిః=ఆ హనుమంతుడు, శోకార్తామ్=శోకముచేత పీడింపబడిన, నిరానన్దామ్=ఆనందము లేని, తపస్వినీమ్=దీనురాలైన, రాక్షసేన్ద్రసుతశ్రితామ్=ఇంద్రజిత్తు ప్రక్కన ఉన్న, తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, అస్య=వీనికి, కిమ్=ఏమి, సమర్థితమ్=చేయ నిశ్చయింపబడినది, ఇతి=అని, అబ్రవీత్=పలికెను. చిన్తయన్=ఈ విధముగా ఆలోచించుచు, తైః=ఆ, వానరశ్రేష్ఠైః సహ=వానరశ్రేష్ఠులతో కూడ, రావణిమ్=ఇంద్రజిత్తును గూర్చి, అభ్యధావత=ఎదురుగా పరుగెత్తెను.

తా. ఆ సీత ఆనందము లేనిదై రథము మీద ఆ ఇంద్రజిత్తు పార్శ్వమునందు చాల దయనీయమైన స్థితిలో ఉండెను. దీనురాలైన ఆమెను చూచి, హనుమంతుడు "ఇతడిప్పుడు ఏమి చేయదలచినాడో !" అని ఆలోచించుచు, ఆ వానరశ్రేష్ఠులకు కూడ తెలిపి వారితో కలిసి శీఘ్రముగా ఆ ఇంద్రజిత్తు ఉన్న వైపు వెళ్లెను. 12, 13

మూ. తద్వానరబలం దృష్ట్వా రావణిః క్రోధమూర్ఛితః,
కృత్వా వికోశం నిస్త్రింశం మూర్ధ్ని సీతామకర్షయత్. 14

ప్ర. అ. రావణిః=ఇంద్రజిత్తు, తత్=ఆ, వానరబలమ్=వానరసైన్యమును, దృష్ట్వా=చూచి, క్రోధమూర్ఛితః=క్రోధముచేత వ్యాప్తుడై, నిస్త్రింశమ్=ఖడ్గమును, వికోశమ్=ఒర లేని దానినిగా, కృత్వా=చేసి, సీతామ్=సీతను, మూర్ధ్ని=శిరస్సునందు, అకర్షయత్=లాగెను.

తా. ఇంద్రజిత్తు ఆ వానరసైన్యమును చూచి క్రోధావేశముతో కత్తిని ఒరనుండి తీసి సీతను తల పట్టి లాగెను. 14

మూ. తాం స్త్రియం పశ్యతాం తేషాం తాడయామాస రాక్షసః,
క్రోశన్తీం రామ రామేతి మాయయా యోజితాం రథే. 15

ప్ర. అ. రాక్షసః=రాక్షసుడు, తేషామ్=ఆ వానరులు, పశ్యతామ్=చూచుచుండగా, మాయయా=మాయచేత, రథే=రథమునందు, యోజితామ్=కూర్చబడిన, రామ రామేతి="రామా! రామా!" అని, క్రోశన్తీమ్=ఏడ్చుచున్న, తాం స్త్రియమ్=ఆ స్త్రీని, తాడయామాస=కొట్టెను.

తా. ఆ రాక్షసుడు ఆ వానరులందరూ చూచుచుండగా, మాయచేత రథమునందు సృష్టించబడిన, "రామా! రామా!" అని ఏడ్చుచున్న ఆ స్త్రీని కొట్టెను. 15

మూ. గృహీతమూర్ధజాం దృష్ట్వా హనుమాన్ దైన్యమాగతః,
దుఃఖజం వారి నేత్రాభ్యాముత్సృజన్మారుతాత్మజః. 16

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, గృహీతమూర్ధజామ్=గ్రహింపబడిన జుట్టు గల ఆమెను, దృష్ట్వా=చూచి, దైన్యమ్ ఆగతః=దైన్యము పొందినవాడై, నేత్రాభ్యామ్=నేత్రములనుండి, దుఃఖజమ్=దుఃఖమువలన కలిగిన, వారి=నీటిని, ఉత్సృజత్=విడచెను.

తా. వాయుపుత్రుడైన హనుమంతుడు సీత జుట్టు ఇంద్రజిత్తు పట్టుకొనుట చూచి, దీనుడై దుఃఖముతో కన్నీళ్లు కార్చెను. 16

మూ. తాం దృష్ట్వా చారుసర్వాఙ్గీం రామస్య మహిషీం ప్రియామ్,
అబ్రవీత్పరుషం వాక్యం క్రోధాద్రక్షోధిపాత్మజమ్. 17

ప్ర. అ. చారుసర్వాఙ్గీమ్=సుందరమైన సకలావయవములు గలది, రామస్య=రామునియొక్క, ప్రియామ్=ప్రియురాలైన, మహిషీమ్=భార్యా అయిన, తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, క్రోధాత్=కోపమువలన, రక్షోధిపాత్మజమ్=ఇంద్రజిత్తును గూర్చి, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముని ప్రియభార్యయైన, అందమైన సకలావయవములు గల ఆ సీతను చూచి హనుమంతుడు కోపము చెంది ఆ ఇంద్రజిత్తుతో పరుషముగా ఇట్లు పలికెను. 17

మూ. దురాత్మన్నాత్మనాశాయ కేశపక్షే పరామృశః,
బ్రహ్మర్షీణాం కులే జాతో రాక్షసీం యోనిమాశ్రితః. 18

ప్ర. అ. దురాత్మన్=ఓ! దురాత్ముడా! బ్రహ్మర్షీణామ్=బ్రహ్మర్షుల యొక్క, కులే=కులమునందు, జాతః=పుట్టినవాడవు, రాక్షసీమ్=రాక్షససంబంధమైన, యోనిమ్=జన్మను, ఆశ్రితః=ఆశ్రయించినవాడవు అయిన నీవు, ఆత్మనాశాయ=నీ నాశముకొరకే, కేశపక్షే=కేశపాశమునందు, పరామృశః=స్పృశించితివి.

తా. ఓ! దురాత్ముడా! బ్రహ్మర్షుల కులమందు పుట్టి రాక్షసజన్మ పొందిన నీవు నీ వినాశముకొరకే ఈమె కేశపాశమును స్పృశించితివి. 18

మూ. ధిక్త్వాం పాపసమాచారం యస్య తే మతిరీదృశీ,
నృశంసానార్య దుర్వృత్త క్షుద్ర పాపపరాక్రమ, 19
అనార్యస్యేదృశం కర్మ ఘృణా తే నాస్తి నిర్ఘృణ.

ప్ర. అ. యస్య=ఏ, తే=నీయొక్క, మతిః=బుద్ధి, ఈదృశీ=ఇట్టిదో, పాపసమాచారమ్=పాపకర్మగల, త్వామ్=అట్టి నిన్ను గూర్చి, ధిక్=నింద అగుగాక. నృశంస=క్రూరుడా! అనార్య=చెడ్డవాడా! దుర్వృత్త=చెడు నడవడిక గలవాడా! క్షుద్ర=నీచుడా! పాపపరాక్రమ=చెడ్డ పరాక్రమము గలవాడా! నిర్ఘృణ=జాలి లేనివాడా! అనార్యస్య=చెడ్డవాడవైన, తే=నీయొక్క, కర్మ=పని, ఈదృశమ్=ఇట్టిది! ఘృణా=జాలి, నాస్తి=లేదా?

తా. క్రూరుడా! అనార్యుడా! చెడ్డ నడవడిక గలవాడా! నీచుడా! పాపమైన పరాక్రమము గలవాడా! జాలి లేనివాడా! పాపప్రవృత్తి గల నీవు, ఛీ! ఎంత చెడ్డపని చేసితివి! అనార్యుడ వైన నీవు ఇట్టి పని చేసితివి కదా! నీకు జాలి లేదా? 19

మూ. చ్యుతా గృహాచ్చ రాజ్యాచ్చ రామహస్తాచ్చ మైథిలీ, 20
కిం తవైషాపరాద్ధా హి యదేనాం హంసి నిర్దయ.

ప్ర. అ. మైథిలీ=సీత, గృహాచ్చ=గృహమునుండి, రాజ్యాచ్చ=రాజ్యమునుండి, రామహస్తాచ్చ=రాముని హస్తమునుండి, చ్యుతా=జారిపోయినది. నిర్దయ=దయలేనివాడా! ఏనామ్=ఈమెను, హంసి యత్=కొట్టుచున్నావే! ఏషా=ఈమె, తవ=నీకు, కిమ్ అపరాద్ధా హి=ఏమి అపరాధము చేసినది?

తా. ఓ! దయావిహీనుడా! ఈ సీత గృహమునుండి, రాజ్యమునుండి, రాముని నుండి దూరమైపోయినది. ఈమెను కొట్టుచున్నావే; ఈమె నీకు ఏమి అపరాధము చేసినది? 20

మూ. సీతాం హత్వా తు న చిరం జీవిష్యసి కథంచన, 21
వధార్హ కర్మణా తేన మమ హస్తగతో హ్యసి.

ప్ర. అ. సీతామ్=సీతను, హత్వా=చంపి, కథంచన=ఏ విధముగాను కూడ, చిరమ్=చిరకాలము, న జీవిష్యసి=జీవించవు. వధార్హ=వధకు తగినవాడా! తేన=ఆ, కర్మణా=పనిచేత, మమ=నాయొక్క, హస్తగతః=చేతిని పొందినవాడవు, అసి హి=అయినావు కదా.

తా. సీతను చంపిన పిమ్మట నీవింక చాల కాలము జీవించవు. వధకు తగినవాడా! అట్టిపని చేయుటచేతనే నీవు నాచేత చిక్కినావు. 21

మూ. యే చ స్త్రీఘాతినాం లోకా లోకవధ్యేషు కుత్సితాః, 22
ఇహ జీవితముత్సృజ్య ప్రేత్య తాన్ ప్రతిలప్స్యసే.

ప్ర. అ. లోకవధ్య=లోకులచేత చంపదగినవాడా! ఇహ=ఇప్పుడు, జీవితమ్=ప్రాణమును, ఉత్సృజ్య=విడచి, ప్రేత్య=పరలోకమునకు వెళ్లి, ఏషు=ఈ లోకములయందు, స్త్రీఘాతినామ్=స్త్రీలను చంపిన వాళ్లకు, యే=ఏ, కుత్సితాః=నింద్యములైన, లోకాః=లోకము లున్నవో, తాన్=వాటిని, ప్రతిలప్స్యసే=పొందగలవు.

తా. లోకులచేత చంపదగినవాడా! నీ విపుడు ప్రాణాలు విడచి, పరలోకమునకు వెళ్లి, పద్నాలుగు లోకములలో ఏవి నింద్యములో, స్త్రీని చంపినవారికి ఏ లోకములు లభించునో వాటికి వెళ్లగలవు. 22

మూ. ఇతి బ్రువాణో హనుమాన్ సాయుధైర్హరిభిర్వృతః, 23
అభ్యధావత్సుసంక్రుద్ధో రాక్షసేన్ద్రసుతం ప్రతి.

ప్ర. అ. హనుమాన్=హనుమంతుడు, ఇతి=ఇట్లు, బ్రువాణః=పలుకుచు,, సాయుధైః=ఆయుధములతో కూడిన, హరిభిః=వానరులతో, వృతః=కూడినవాడై, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, రాక్షసేన్ద్రసుతం ప్రతి=ఇంద్రజిత్తును గూర్చి, అభ్యధావత్=పరుగెత్తెను.

తా. హనుమంతుడు ఇట్లు పలుకుచు, ఆయుధములు ధరించిన వానరులతో కూడినవాడై చాల కోపముతో ఇంద్రజిత్తు మీదికి శీఘ్రముగా వెళ్లెను. 23

మూ. ఆపతన్తం మహావీర్యం తదనీకం వనౌకసామ్, 24
రక్షసాం భీమకోపానామనీకం తు న్యవారయత్.

ప్ర. అ. ఆపతన్తమ్=వచ్చి మీద పడుచున్న, మహావీర్యమ్=గొప్ప పరాక్రమము గల, వనౌకసామ్=వానరులయొక్క, తత్ అనీకమ్=ఆ సేనను, భీమకోపానామ్=

భయంకరమైన కోపము గల, రక్షసామ్=రాక్షసులయొక్క, అనీకమ్=సైన్యము, న్యవారయత్=నివారించెను.

తా. వానరుల గొప్ప పరాక్రమము గల ఆ సైన్యమును భయంకరమైన కోపముగల రాక్షసులసైన్యము నివారించెను. 24

మూ. స తాం బాణసహస్రేణ విక్షోభ్య హరివాహినీమ్, 25
హనూమన్తం హరిశ్రేష్ఠమిన్ద్రజిత్ ప్రత్యువాచ హ.

ప్ర. అ. సః=ఆ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, తాం హరివాహినీమ్=ఆ వానరసైన్యమును, బాణసహస్రేణ=బాణముల సహస్రముచేత, విక్షోభ్య=బాధించి, హరిశ్రేష్ఠమ్=వానరశ్రేష్ఠుడైన, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ప్రత్యువాచ హ=పలికెను.

తా. ఆ ఇంద్రజిత్తు ఆ వానరసైన్యమును అనేకబాణములచేత క్షోభింపచేసి వానరశ్రేష్ఠుడైన హనుమంతునకు ఇట్లు బదులు చెప్పెను. 25

మూ. సుగ్రీవస్త్వం చ రామశ్చ యన్నిమిత్తమిహాగతాః, 26
తాం వధిష్యామి వైదేహీమద్యైవ తవ పశ్యతః.

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, త్వం చ=నీవు, రామశ్చ=రాముడు, యన్నిమిత్తమ్=ఏ సీతకొరకు, ఇహ=ఇక్కడికి, ఆగతాః=వచ్చినారో, తామ్=అట్టి, వైదేహీమ్=సీతను, తవ=నీవు, పశ్యతః=చూచుచుండగానే, అద్యైవ=ఇప్పుడే, వధిష్యామి=చంపెదను.

తా. ఏ సీతకోసమై నీవు, సుగ్రీవుడు, రాముడు ఇక్కడికి వచ్చినారో ఆ సీతను ఇప్పుడు నీవు చూచుచుండగానే చంపెదను. 26

మూ. ఇమాం హత్వా తతో రామం లక్ష్మణం త్వాం చ వానర, 27
సుగ్రీవం చ వధిష్యామి తం చానార్యం విభీషణమ్.

ప్ర. అ. వానర=వానరుడా! ఇమామ్=ఈమెను, హత్వా=చంపి, తతః=అటుపిమ్మట, రామమ్=రాముణ్ణి, లక్ష్మణం చ=లక్ష్మణుణ్ణి, త్వాం చ=నిన్ను, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి, అనార్యమ్=చెడ్డవాడైన, తం విభీషణం చ=ఆ విభీషణుణ్ణి, వధిష్యామి=చంపగలను.

తా. ఓ! వానరుడా! ఈమెను చంపిన పిమ్మట రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, నిన్ను, సుగ్రీవుణ్ణి, చెడ్డవాడైన ఆ విభీషణుణ్ణి చంపగలను. 27

మూ. న హన్తవ్యాః స్త్రియశ్చేతి యద్ బ్రవీషి ప్లవంగమ, 28
పీడాకరమమిత్రాణాం యత్ స్యాత్కర్తవ్యమేవ తత్.

ప్ర. అ. ప్లవంగమ=వానరుడా! స్త్రియః=స్త్రీలు, న హన్తవ్యాః ఇతి=చంపదగనివారు అని, యత్=ఏది, బ్రవీషి=పలుకుచున్నావో (దానికి ఉత్తరము వినుము). యత్=ఏది, అమిత్రాణామ్=శత్రువులకు, పీడాకరమ్=పీడ కలిగించునది, స్యాత్=అగునో, తత్=అది, కర్తవ్యమేవ=చేయదగినదే.

తా. వానరుడా! "స్త్రీలను చంపకూడదు" అని నీవన్నదానికి సమాధానము వినుము. శత్రువులకు పీడ కలిగించే పని తప్పక చేయవలసినదే.

మూ. తమేవముక్త్వా రుదతీం సీతాం మాయామయీం చ తామ్, 29
శితధారేణ ఖడ్గేన నిజఘానేన్ద్రజిత్స్వయమ్.

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, తమ్=వానినిగూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రుదతీమ్=ఏడ్చుచున్న, మాయామయీమ్=మాయావికారమైన, తాం సీతామ్=ఆ సీతను, స్వయమ్=స్వయముగా, శితధారేణ=వాడియైన అంచు గల, ఖడ్గేన=ఖడ్గముచేత, నిజఘాన=కొట్టెను.

తా. ఇంద్రజిత్తు ఇట్లు పలికి మాయానిర్మితయైన ఏడ్చుచున్న ఆ సీతను, వాడియైన అంచు గల ఖడ్గముచేత స్వయముగా కొట్టెను (చంపెను). 29

మూ. యజ్ఞోపవీతమార్గేణ ఛిన్నా తేన తపస్వినీ, 30
సా పృథివ్యాం పృథుశ్రోణీ పపాత ప్రియదర్శనా.

ప్ర. అ. తేన=వానిచేత, యజ్ఞోపవీతమార్గేణ=యజ్ఞోపవీతమార్గముచేత, ఛిన్నా=ఛేదించబడిన, తపస్వినీ=దీనురాలు, పృథుశ్రోణీ=విశాలమైన కటిప్రదేశము గలది, ప్రియదర్శనా=ప్రియమైన దర్శనము గలదీ అయిన, సా=ఆమె, పృథివ్యామ్=నేలమీద, పపాత=పడెను.

తా. దీనురాలు, విశాలమైన కటిప్రదేశము గలది, చూచువారికి ఆనందము కలిగించునది అయిన ఆ సీత, ఆత డా విధముగా జందెముపెట్టున చీల్చివేయగా నేలమీద పడిపోయెను. 30

మూ. తామిన్ద్రజిత్ స్త్రియం హత్వా హనూమన్తమువాచ హ, 31
మయా రామస్య పశ్యేమాం ప్రియాం శస్త్రనిషూదితామ్,
ఏషా విశస్తా వైదేహీ నిష్ఫలో వః పరిశ్రమః. 32

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, తామ్=ఆ, స్త్రియమ్=స్త్రీని, హత్వా=చంపి, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ఉవాచ హ=పలికెను. మయా=నాచేత, శస్త్రనిషూదితామ్=ఆయుధముచేత చంపబడిన, ఇమామ్=ఈ, రామస్య ప్రియామ్=రాముని భార్యను, పశ్య=చూడుము. ఏషా=ఈ, వైదేహీ=సీత, విశస్తా=చంపబడినది. వః=మీయొక్క, పరిశ్రమః=పరిశ్రమ, నిష్ఫలః=వ్యర్థమైనది.

తా. ఆమెను చంపిన పిమ్మట ఇంద్రజిత్తు హనుమంతునితో ఇట్లు పలికెను. "రాముని భార్యను నేను శస్త్రముతో చంపివేసినాను; చూడుము. ఈ సీత మరణించినది; మీ శ్రమ అంతా వ్యర్థమైపోయినది!" 31, 32

మూ. తతః ఖడ్గేన మహతా హత్వా తామిన్ద్రజిత్ స్వయమ్,
హృష్టః స రథమాస్థాయ ననాద చ మహాస్వనమ్. 33

ప్ర. అ. సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, మహతా=పెద్దదైన, ఖడ్గేన=ఖడ్గముచేత, స్వయమ్=స్వయముగా, తామ్=ఆమెను, హత్వా=చంపి, తతః=పిమ్మట, హృష్టః=సంతోషించినవాడై, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, మహాస్వనమ్=గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననాద చ=ధ్వని చేసెను.

తా. ఆ ఇంద్రజిత్తు గొప్ప ఖడ్గముచేత స్వయముగా ఆమెను చంపిన పిమ్మట సంతోషించుచు, రథముపై కూర్చుండి బిగ్గరగా అరచెను. 33

మూ. వానరాః శుశ్రువుః శబ్దమదూరే ప్రత్యవస్థితాః,
వ్యాదితాస్యస్య నదతస్తద్దుర్గం సంశ్రితస్య తు. 34

ప్ర. అ. వ్యాదితాస్యస్య=బాగా తెరవబడిన ముఖము గల, తత్=ఆ, దుర్గమ్=సైన్యదుర్గమును, సంశ్రితస్య=ఆశ్రయించి ఉన్న, నదతః=అరచుచున్న వానియొక్క, శబ్దమ్=శబ్దమును, అదూరే=సమీపమునందు, ప్రత్యవస్థితాః=నిలచి ఉన్న, వానరాః=వానరులు, శుశ్రువుః=వినిరి.

తా. రాక్షససైన్యమధ్యమునందు ఉండి బాగా నోరు తెరచి అరచుచున్న ఆ ఇంద్రజిత్తు చేయు శబ్దమును చుట్టు ప్రక్కల ఉన్న వానరులు వినిరి. 34

మూ. తథా తు సీతాం వినిహత్య దుర్మతిః
ప్రహృష్టచేతాః స బభూవ రావణిః,
తం హృష్టరూపం సముదీక్ష్య వానరా
విషణ్ణరూపాః సహసాభిదుద్రువుః. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకాశీతితమః సర్గః.

ప్ర. అ. దుర్మతిః=దుష్టబుద్ధి గల, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, సీతామ్=సీతను, తథా=అట్లు, వినిహత్య=చంపి, ప్రహృష్టచేతాః=సంతోషించిన చిత్తము గలవాడు, బభూవ=ఆయెను. వానరాః=వానరులు, హృష్టరూపమ్=చాల సంతోషించిన, తమ్=వానిని, సముదీక్ష్య=చూచి, విషణ్ణరూపాః=చాలా దిగులుచెందినవారై, సహసా=వెంటనే, అభిదుద్రువుః=పారిపోయిరి.

తా. దుర్బుద్ధియైన ఆ ఇంద్రజిత్తు సీతను ఆ విధముగా చంపి సంతోషించెను. చాలా సంతోషించుచున్న ఆతనిని చూచి వానరులు మిక్కిలి విషాదము చెంది వెంటనే పారిపోయిరి. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వ్యశీతితమః సర్గః

[హనుమంతుని నాయకత్వములో వానరులు రాక్షసులతో యుద్ధము చేయుట. హనుమంతుడు రామునివద్దకు వెళ్లుట. ఇంద్రజిత్తు నికుంభిలకు వెళ్లి యజ్ఞము చేయుట]

మూ. శ్రుత్వా తు భీమనిర్హ్రాదం శక్రాశనిసమస్వనమ్,
వీక్షమాణా దిశః సర్వా దుద్రువుర్వానరా భృశమ్. 1

ప్ర. అ. శక్రాశనిసమస్వనమ్=దేవేంద్రుని వజ్రము వంటి ధ్వని గల, భీమనిర్హ్రాదమ్=భయంకరమైన అరపును, శ్రుత్వా=విని, వానరాః=వానరులు, వీక్షమాణాః=చూచుచున్నవారై, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను గూర్చి, భృశమ్=మిక్కిలి, దుద్రువుః=పారిపోయిరి.

తా. దేవేంద్రుని వజ్రాయుధముధ్వని వంటి ధ్వని గల భయంకరమైన ఆ అరపు విని వానరులు ఇటు అటు చూచుచు అన్ని దిక్కులకు పారిపోయిరి.

మూ. తానువాచ తతః సర్వాన్ హనుమాన్ మారుతాత్మజః,
విషణ్ణవదనాన్ దీనాంస్త్రస్తాన్విద్రవతః పృథక్. 2

ప్ర. అ. తతః=అటు పిమ్మట, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, విషణ్ణవదనాన్=దిగులు చెందిన ముఖములు గల, దీనాన్=దీనులైన, త్రస్తాన్=భయపడిన, పృథక్=వేరువేరుగా, విద్రవతః=పారిపోవుచున్న, తాన్=ఆ, సర్వాన్=అందరినీ గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ఆ వానరు లందరూ భయపడి, దీనులై, వాడిపోయిన ముఖాలతో వేరువేరుగా పారిపోవుచుండగా వాయుపుత్రుడైన హనుమంతు డిట్లు పలికెను.

మూ. కస్మాద్విషణ్ణవదనా విద్రవధ్వం ప్లవంగమాః,
త్యక్తయుద్ధసముత్సాహాః శూరత్వం క్వ ను వో గతమ్. 3

ప్ర. అ. ప్లవంగమాః=వానరులారా! త్యక్తయుద్ధసముత్సాహాః=విడవబడిన యుద్ధోత్సాహము గలవారై, విషణ్ణవదనాః=దిగులు చెందిన ముఖములు గల వారై, కస్మాత్=ఎందువలన, విద్రవధ్వమ్=పారిపోవుచున్నారు? వః=మీయొక్క, శూరత్వమ్=శూరత్వము, క్వ=ఎక్కడికి, గతమ్=వెళ్లినది?

తా. ఓ! వానరులారా! యుద్ధోత్సాహము విడచి దిగులు చెందిన ముఖాలతో ఎందుకు పారిపోవుచున్నారు? మీ శూరత్వము ఎక్కడికి పోయినది?

మూ. పృష్ఠతోఽనువ్రజధ్వం మామగ్రతో యాన్తమాహవే,
శూరైరభిజనోపేతైరయుక్తం హి నివర్తితుమ్. 4

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, అగ్రతః=ఎదుట, యాన్తమ్=వెళ్లుచున్న, మామ్=నన్ను, పృష్ఠతః=వెనుక, అనువ్రజధ్వమ్=అనుసరించి రండి. అభిజనోపేతైః= ఉత్తమవంశము గల, శూరైః=శూరులచేత, నివర్తితుమ్=వెనుకకు మరలుటకు, అయుక్తం హి=యుక్తము కాదు కదా?

తా. యుద్ధములో ముందు ఉన్న నా వెనుకనే మీరు రండు. ఉత్తమవంశసంజాతులైన శూరులు వెనుకకు మరలిపోగూడదు కదా? 4

మూ. ఏవముక్తాః సుసంక్రుద్ధా వాయుపుత్రేణ ధీమతా,
శైలశృఙ్గాన్ ద్రుమాంశ్చైవ జగృహుర్హృష్టమానసాః. 5

ప్ర. అ. ధీమతా=బుద్ధిమంతుడైన, వాయుపుత్రేణ=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలకబడిన, హృష్టమానసాః=సంతోషించిన మనస్సులు గల ఆ వానరులు, సుసంక్రుద్ధాః=చాలా కోపించినవారై, శైలశృఙ్గాన్=పర్వతశిఖరములను, ద్రుమాన్ చైవ=వృక్షములను, జగృహుః=గ్రహించిరి.

తా. ఆ వానరులు హనుమంతుని మాటలు విని మనస్సులలో ఉత్సాహము చెంది కోపముతో పర్వతశిఖరములను, వృక్షములను గ్రహించిరి.

మూ. అభిపేతుశ్చ గర్జన్తో రాక్షసాన్ వానరర్షభాః,
పరివార్య హనూమన్తమన్వయుశ్చ మహాహవే. 6

ప్ర. అ. వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, గర్జన్తః=గర్జించుచున్నవారై, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, అభిపేతుః=ఎదురుగా వెళ్లిరి. మహాహవే=మహాయుద్ధమునందు, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, పరివార్య=చుట్టి, అన్వయుః=అనుసరించిరి.

తా. వానరశ్రేష్ఠులు గర్జించుచు రాక్షసులమీదికి శీఘ్రముగా వెళ్లిరి. ఆ మహాయుద్ధమునందు హనుమంతుని చుట్టూ చేరి ఆతని వెనుకనే వెళ్లిరి. 6

మూ. స తైర్వానరముఖ్యైస్తు హనుమాన్సర్వతో వృతః,
హుతాశన ఇవార్చిష్మానదహచ్ఛత్రువాహినీమ్. 7

ప్ర. అ. సః=ఆ, హనుమాన్=హనుమంతుడు, తైః=ఆ, వానరముఖ్యైః=వానరశ్రేష్ఠులతో, సర్వతః=అంతటా, వృతః=కూడినవాడై, అర్చిష్మాన్=జ్వాలలు గల,

హుతాశనః ఇవ=అగ్ని వలె, శత్రువాహినీమ్=శత్రుసైన్యమును, అదహత్=కాల్చివే సెను.

తా. ఆ వానరనాయకులందరు అన్ని వైపులా తనను అనుసరించి రాగా, హనుమంతుడు జ్వాలలతో గూడిన అగ్ని వలె శత్రుసైన్యమును దహించివేసెను.

మూ. స రాక్షసానాం కదనం చకార సుమహాకపిః,
వృతో వానరసైన్యేన కాలాన్తకయమోపమః. 8

ప్ర. అ. వానరసైన్యేన=వానరసైన్యముతో, వృతః=కూడిన, సః మహాకపిః=ఆ హనుమంతుడు, కాలాన్తకయమోపమః=ప్రలయకాలమునందు సంహరించు యమునితో సమానుడై, రాక్షసానామ్=రాక్షసులయొక్క, కదనమ్=నాశమును, చక్రే=చేసెను.

తా. వానరసైన్యముతో కూడిన ఆ హనుమంతుడు ప్రలయకాలమునందు సంహారము చేయు యముడు వలె రాక్షససంహారము చేసెను. 8

మూ. స తు శోకేన చావిష్టః కోపేన చ మహాకపిః,
హనూమాన్ రావణిరథే మహతీం పాతయచ్ఛిలామ్. 9

ప్ర. అ. మహతా=గొప్పదైన, శోకేన=శోకముతోను, కోపేన చ=కోపముతోను, ఆవిష్టః=కూడిన, మహాకపిః=మహావానరుడైన, సః హనుమాన్=ఆ హనుమంతుడు, రావణిరథే=ఇంద్రజిత్తు రథముమీద, మహతీమ్=పెద్దదైన, శిలామ్=శిలను, పాతయత్=పడవేసెను.

తా. గొప్ప శోకముతోను, రోషావేశముతోను ఉన్న వానరనాయకుడైన ఆ హనుమంతుడు ఇంద్రజిత్తు రథముమీద పెద్ద శిలను పడవేసెను. 9

మూ. తామాపతన్తీం దృష్ట్వైవ రథః సారథినా తదా,
విధేయాశ్వసమాయుక్తో విదూరమపవాహితః. 10

ప్ర. అ. తదా=అప్పుడు, ఆపతన్తీమ్=మీదపడుచున్న, తామ్=ఆ శిలను, దృష్ట్వైవ=చూడగానే, విధేయాశ్వసమాయుక్తః=విధేయములైన అశ్వములతో కూడిన, రథః=రథము, సారథినా=సారథిచేత, విదూరమ్=చాల దూరముగా, అపవాహితః=తొలగింపబడినది.

తా. మీద పడుచున్న ఆ శిలను చూడగానే సారథి, చెప్పినట్లు చేయు గుఱ్ఱములు కట్టిన రథమును దూరముగా తప్పించివేసెను. 10

మూ. తమిన్ద్రజితమప్రాప్య రథస్థం సహసారథిమ్,
వివేశ ధరణీం భిత్త్వా సా శిలా వ్యర్థముద్యతా. 11

ప్ర. అ. వ్యర్థమ్=వ్యర్థముగా, ఉద్యతా=ప్రయోగింపబడిన, సా శిలా=ఆ శిల, రథస్థమ్=రథమునందున్న, సహసారథిమ్=సారథితో కూడిన, తమ్ ఇన్ద్రజితమ్=ఆ ఇంద్రజిత్తును, అప్రాప్య=చేరకుండగానే, ధరణీమ్=భూమిని, భిత్త్వా=భేదించుకొని, వివేశ=ప్రవేశించెను.

తా. వ్యర్థముగా ప్రయోగించబడిన ఆ శిల సారథితో రథమునందున్న ఇంద్రజిత్తును చేరకుండగనే నేలను బ్రద్దలు కొట్టుకొని క్రిందికి దిగిపోయెను.

మూ. పతితాయాం శిలాయాం తు వ్యథితా రక్షసాం చమూః,
నిపతన్త్యా చ శిలయా రాక్షసా మథితా భృశమ్. 12

ప్ర. అ. శిలాయామ్=శిల, పతితాయామ్=పడినదగుచుండగా, రక్షసామ్=రాక్షసులయొక్క, చమూః=సేన, వ్యథితా=వ్యథ చెందినది. నిపతన్త్యా=క్రింద పడుచున్న, శిలయా=శిలచేత, రాక్షసాః=రాక్షసులు, భృశమ్=మిక్కిలి, మథితాః=నలగగొట్టబడిరి.

తా. శిల క్రింద పడి రాక్షసులు నలిగిపోయిరి. ఈ విధముగా శిల పడుటచే రాక్షససేన వ్యథ చెందెను. 12

మూ. తమభ్యధావన్ శతశో నదన్తః కాననౌకసః,
తే ద్రుమాంశ్చ మహాకాయా గిరిశృఙ్గాణి చోద్యతాః. 13

ప్ర. అ. మహాకాయాః=పెద్ద శరీరములు గల, తే కాననౌకసః=ఆ వానరులు, శతశః=వందలకొలది, ద్రుమాంశ్చ=వృక్షములను, గిరిశృఙ్గాణి చ=పర్వతశిఖరములను, ఉద్యతాః=ఎత్తినవారై, నదన్తః=గర్జించుచున్నవారై, తమ్=ఆ ఇంద్రజిత్తును గూర్చి, అభ్యధావన్=పరుగెత్తిరి.

తా. పెద్ద దేహములు గల వందలకొలది ఆ వానరులు వృక్షములను, పర్వతశిఖరములను గ్రహించి, గర్జించుచు ఆ ఇంద్రజిత్తు మీదికి వెళ్లిరి. 13

మూ. క్షిపన్తీన్ద్రజితం సంఖ్యే వానరా భీమవిక్రమాః,
వృక్షశైలమహావర్షం విసృజన్తః ప్లవఙ్గమాః, 14
శత్రూణాం కదనం చక్రుర్నేదుశ్చ వివిధైః స్వనైః.

ప్ర. అ. భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, వానరాః=వానరులు, సంఖ్యే=యుద్ధమునందు, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును గూర్చి, క్షిపన్తి=వృక్షములను శిఖరములను విసిరిరి. ప్లవంగమాః=వానరులు, వృక్షశైలమహావర్షమ్=వృక్షములయొక్క శైలములయొక్క గొప్ప వర్షమును, విసృజన్తః=విడచుచు, శత్రూణామ్=శత్రువులయొక్క, కదనమ్=నాశమును, చక్రుః=చేసిరి. వివిధైః=అనే

కవిధములైన, స్వనైః=ధ్వనులతో, నేదుశ్చ=అరచిరి.

తా. భయంకర మైన పరాక్రమము గల వానరులు యుద్ధమునందు వృక్షములను, శిఖరములను ఇంద్రజిత్తుపై విసిరిరి. ఆ వానరులు గొప్ప వృక్షవర్షమును, శిలావర్షమును కురిపించుచు శత్రువులను చంపిరి. అనేకవిధములైన స్వరములతో గర్జించిరి. 14

మూ. వానరై స్తైర్మహాభీమైర్ఘోరరూపా నిశాచరాః, 15
వీర్యాదభిహతా వృక్షైర్వ్యచేష్టన్త రణక్షితౌ.

ప్ర. అ. ఘోరరూపాః=భయంకరములైన రూపములు గల, నిశాచరాః=రాక్షసులు, మహాభీమైః=చాల భయంకరులైన, తైః వానరైః=ఆ వానరులచేత, వీర్యాత్=పరాక్రమమువలనను, వృక్షైః=వృక్షములచేత, అభిహతాః=కొట్టబడినవారై, రణక్షితౌ=యుద్ధభూమియందు, వ్యచేష్టన్త=(పడి) కొట్టుకొనిరి.

తా. భయంకరములైన రూపములు గల రాక్షసులు చాల భయంకరులైన వానరులచేత బలపూర్వకముగా వృక్షములచేత కొట్టబడినవారై, యుద్ధభూమి మీద పడి కొట్టుకొనిరి. 15

మూ. స సైన్యమభివీక్ష్యాథ వానరార్దితమిన్ద్రజిత్, 16
ప్రగృహీతాయుధః క్రుద్ధః పరానభిముఖో యయౌ.

ప్ర. అ. సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, వానరార్దితమ్=వానరులచేత పీడింపబడిన, సైన్యమ్=సైన్యమును, అభివీక్ష్య=చూచి, అథ=అటుపిమ్మట, ప్రగృహీతాయుధః=గ్రహింపబడిన ఆయుధములు గలవాడై, క్రుద్ధః=కోపించినవాడై, పరాన్=శత్రువులను గూర్చి, అభిముఖః=అభిముఖుడై, యయౌ=వెళ్లెను.

తా. ఆ ఇంద్రజిత్తు తన సైన్యమును వానరులు పీడించుట చూచి, కోపించినవాడై ఆయుధములు ధరించి శత్రువులకు అభిముఖుడై వెళ్లెను. 16

మూ. స శరౌఘానవసృజన్ స్వసైన్యేనాభిసంవృతః, 17
జఘాన కపిశార్దూలాన్సుబహూన్ దృఢవిక్రమః.

ప్ర. అ. దృఢవిక్రమః=దృఢమైన పరాక్రమము గల, సః=అతడు, స్వసైన్యేన=తన సైన్యముతో, అభిసంవృతః=కూడినవాడై, శరౌఘాన్=బాణసముదాయములను, అవసృజన్=విడచుచు, సుబహూన్=చాలమంది, కపిశార్దూలాన్=వానరశ్రేష్ఠులను, జఘాన=చంపెను.

తా. దృఢమైన పరాక్రమము గల ఆ ఇంద్రజిత్తు తన సైన్యముతో కలిసి బాణములను విడచుచు చాలమంది వానరశ్రేష్ఠులను చంపివేసెను. 17

మూ. శూలైరశనిభిః ఖడ్గైః పట్టిశైః కూటముద్గరైః, 18
తే చాప్యనుచరాస్తస్య వానరాన్ జఘ్నురాహవే.

ప్ర. అ. ఆహవే=యుద్ధమునందు, తస్య=వానియొక్క, తే=ఆ, అనుచరాః అపి=అనుచరులు కూడ, శూలైః=శూలములచేత, అశనిభిః=వజ్రముల చేత, ఖడ్గైః=ఖడ్గములచేత, పట్టిశైః=పట్టిశములచేత, కూటముద్గరైః=కూటములచేత, ముద్గరములచేత, వానరాన్=వానరులను, జఘ్నుః=చంపిరి.

తా. ఇంద్రజిత్తు సైనికులు కూడ, యుద్ధమునందు, వానరులను శూల - వజ్ర - ఖడ్గ - పట్టిశ - కూట - ముద్గములచేత చంపిరి. 18

మూ. సుస్కన్ధవిటపైః శాలైః శిలాభిశ్చ మహాబలః, 19
హనూమాన్ కదనం చక్రే రక్షసాం భీమకర్మణామ్.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, హనూమాన్=హనుమంతుడు, సుస్కన్ధవిటపైః=మంచి మ్రానులు కొమ్మలూ గల, శాలైః=వృక్షములచేత, శిలాభిశ్చ= శిలలచేత, భీమకర్మణామ్=భయంకరమైన కర్మ గల, రక్షసామ్=రాక్షసులయొక్క, కదనమ్=సంహారమును, చక్రే=చేసెను.

తా. మహాబలశాలియైన హనుమంతుడు మంచి మ్రానులు కొమ్మలూ ఉన్న చెట్లచేతను, శిలల చేతను భయంకరమైన కర్మ గల రాక్షసులను చంపెను.

మూ. స నివార్య పరానీకమబ్రవీత్తాన్ వనౌకసః, 20
హనూమాన్ సంనివర్తధ్వం న నః సాధ్యమిదం బలమ్.

ప్ర. అ. సః హనుమాన్=ఆ హనుమంతుడు, పరానీకమ్=శత్రుసైన్యమును, నివార్య=నివారింపజేసి, తాన్ వనౌకసః=ఆ వానరులను గూర్చి, అబ్రవీత్=పలికెను. సంనివర్తధ్వమ్=వెనుకకు మరలండి. ఇదమ్=ఈ, బలమ్=సైన్యము, నః=మనకు, సాధ్యమ్=సాధింప (ఓడింప) దగినది, న=కాదు.

తా. ఆ హనుమంతుడు శత్రుసైన్యమును వెనుకకు పోవునట్లు చేసి వానరులతో ఇట్లు పలికెను. "వెనుకకు మరలుడు; మనము ఈ రాక్షస సైన్యమును ఓడించి ప్రయోజన మేమీ లేదు. 20

మూ. త్యక్త్వా ప్రాణాన్విచేష్టన్తో రామప్రియచికీర్షవః, 21
యన్నిమిత్తం హి యుధ్యామో హతా సా జనకాత్మజా.

ప్ర. అ. రామప్రియచికీర్షవః=రామునకు ప్రియము చేయ దలచినవారమై, ప్రాణాన్=ప్రాణములను, త్యక్త్వా=విడచి, విచేష్టన్తః=పనిచేయుచున్నవారమై,

యన్నిమిత్తమ్=ఏ సీతకొరకు, యుధ్యామః=యుద్ధము చేయుచున్నామో, సా జనకాత్మజా=ఆ సీత, హతా=చంపబడినది.

తా. రామునకు ప్రియము చేయవలె నను కోరికతో ప్రాణాలకు తెగించి పని చేయుచు ఏ సీతకోసమై యుద్ధము చేయుచున్నామో ఆ సీత చంపబడినది. 21

మూ. ఇమమర్థం హి విజ్ఞాప్య రామం సుగ్రీవమేవ చ, 22
తౌ యత్ప్రతివిధాస్యేతే తత్కరిష్యామహే వయమ్.

ప్ర. అ. ఇమమ్=ఈ, అర్థమ్=విషయమును, రామమ్=రాముణ్ణి గూర్చి, సుగ్రీవమేవ చ=సుగ్రీవుణ్ణి గూర్చి, విజ్ఞాప్య=తెలిపి, తౌ=వారిద్దరూ, యత్=ఏది, ప్రతివిధాస్యేతే=ప్రతిక్రియగా చేయగలరో, తత్=దానిని, వయమ్=మనము, కరిష్యామహే=చేసెదము.

తా. ఈ విషయము రామునకు, సుగ్రీవునకు తెలిపి వారు ఏ ప్రతిక్రియ చేయుదురో దానిని మనము చేసెదము". 22

మూ. ఇత్యుక్త్వా వానరశ్రేష్ఠో వారయన్ సర్వవానరాన్, 23
శనైః శనైరసంత్రస్తః సబలః సంన్యవర్తత.

ప్ర. అ. వానరశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడు, సర్వవానరాన్=అందరు వానరులను, వారయన్=నివారించుచు, ఇతి= ఇట్లు, ఉక్త్వా=పలికి, అసంత్రస్తః=భయపడనివాడై, సబలః=సైన్యముతో కూడినవాడై, శనైః శనైః=మెల్లమెల్లగా, సంన్యవర్తత=మరలెను.

తా. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఆ వానరు లందరితో ఇట్లు పలికి, యుద్ధమునుండి వారించి, సైన్యసమేతుడై, భయము చెందక, మెల్లమెల్లగా వెనుకకు మరలెను. 23

మూ. తతః ప్రేక్ష్య హనూమన్తం వ్రజన్తం. యత్ర రాఘవః, 24
స హోతుకామో దుష్టాత్మా గతశ్చైత్యం నికుమ్భిలామ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దుష్టాత్మా=దుష్టబుద్ధి గల, సః=ఆ ఇంద్రజిత్తు, రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, వ్రజన్తమ్=వెళ్లుచున్న, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, ప్రేక్ష్య=చూచి, హోతుకామః=హోమము చేయు కోరిక గలవాడై, నికుమ్భిలామ్=నికుంభిల అను, చైత్యమ్=దేవాలయమును గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. హనుమంతుడు రాముడున్న వైపు వెళ్లుచున్నట్లు చూచి దుర్బుద్ధియైన ఇంద్రజిత్తు హోమము చేయుటకు నికుంభిల అను దేవాలయమునకు వెళ్లెను.

మూ. నికుమ్భిలామధిష్ఠాయ పావకం జుహవేన్ద్రజిత్, 25
యజ్ఞభూమ్యాం తతో గత్వా పావకస్తేన రక్షసా,
హూయమానః ప్రజజ్వాల మాంసశోణితభుక్తదా. 26

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, నికుమ్భిలామ్=నికుంభిలను, అధిష్ఠాయ=అధిష్ఠించి, పావకమ్=అగ్నిని, జుహావ=హోమముచేసెను. తతః=అటుపిమ్మట, యజ్ఞభూమ్యామ్=యజ్ఞభూమియందు, గత్వా=వెళ్లి, తేన రక్షసా= ఆ రాక్షసుని చేత, హూయమానః=హోమముచేయబడుచున్న, పావకః=అగ్ని, తదా=అప్పుడు, మాంసశోణితభుక్= మాంసమును శోణితమును తినుచు, ప్రజజ్వాల=ప్రజ్వలించెను.

తా. ఇంద్రజిత్తు నికుంభిలలో కూర్చొని అగ్నిలో హోమము చేసెను. యజ్ఞభూమికి వెళ్లిన ఆ రాక్షసుడు హోమము చేయుచుండగా, అగ్ని మాంసమును, రక్తమును కబళించుచు ప్రజ్వలించెను. 25, 26

మూ. సోఽర్చిః పినద్ధో దదృశే హోమశోణితతర్పితః,
సంధ్యాగత ఇవాదిత్యః సుతీవ్రోఽగ్నిః సముత్థితః. 27

ప్ర. అ. అర్చిః పినద్ధః=జ్వాలలచేత కట్టబడిన, హోమశోణితతర్పితః=రక్త హోమముచేత తృప్తి పొందింపబడిన, సముత్థితః=పైకి లేచిన, సుతీవ్రః=చాల తీవ్రమైన, అగ్నిః=అగ్ని, సంధ్యాగతః=సంధ్యయందున్న, ఆదిత్యః ఇవ= సూర్యుడు వలె, దదృశే=కనబడెను.

తా. రక్తహోమముచేత తృప్తి పొందింపబడి పైకి లేచిన, జ్వాలలు ముడిపడి ఉన్న చాల తీవ్రమైన అగ్ని సంధ్యాసమయమునందలి సూర్యుడు వలె కనబడెను. 27

మూ. అథేన్ద్రజిద్రాక్షసభూతయే తు
జుహావ హవ్యం విధినా విధానవిత్,
దృష్ట్వా వ్యతిష్ఠన్త చ రాక్షసాస్తే
మహాసమూహేషు నమానయజ్ఞాః. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ద్వ్యశీతితమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, విధానవిత్=విధానమును ఎరిగిన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, రాక్షసభూతయే=రాక్షసుల అభివృద్ధికొరకు, విధినా=శాస్త్రవిధిచేత,

హవ్యమ్=హవ్యమును, జుహావ=హోమముచేసెను. నయానయజ్ఞాః=నీతిని అపనీతిని ఎరిగిన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, దృష్ట్వా=చూచి, మహాసమూహేషు=పెద్ద గుంపులయందు, వ్యతిష్ఠన్త=నిలచిరి. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్ర్యశీతితమః సర్గః

[సీతావధవృత్తాంతము విని రాముడు మూర్ఛపోవుట. లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చుచు పౌరుషమును చూపుటకు ఉద్యమించుట]

మూ. రాఘవశ్చాపి విపులం తం రాక్షసవనౌకసామ్,
శ్రుత్వా సంగ్రామనిర్ఘోషం జామ్బవన్తమువాచ హ. 1

ప్ర. అ. రాఘవశ్చాపి=రాముడు, రాక్షసవనౌకసామ్=రాక్షసులయొక్క, వానరులయొక్క, తమ్=ఆ, విపులమ్= అధికమైన, సంగ్రామనిర్ఘోషమ్=యుద్ధధ్వనిని, శ్రుత్వా=విని, జామ్బవన్తమ్=జాంబవంతుని గూర్చి, ఉవాచ హ=పలికెను.

తా. రాముడు రాక్షసవానరుల ఆ అధికమైన యుద్ధధ్వనిని విని జాంబవంతునితో ఇట్లు పలికెను. 1

మూ. సౌమ్య నూనం హనుమతా కృతం కర్మ సుదుష్కరమ్,
శ్రూయతే చ యథా భీమః సుమహానాయుధస్వనః. 2

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా! సుమహాన్=చాల గొప్పదైన, భీమః=భయంకరమైన, ఆయుధస్వనః= ఆయుధముల ధ్వని, యథా=ఎట్లు, శ్రూయతే=వినబడుచున్నదో, దానిని పట్టి, హనుమతా=హనుమంతునిచేత, సుదుష్కరమ్=చాల చేయ శక్యముకాని, కర్మ=పని, కృతమ్=చేయబడినది. నూనమ్=నిశ్చయము.

తా. సౌమ్యుడా! భయంకరమైన గొప్ప ఆయుధధ్వని వినబడుచున్నది; దీనిని బట్టి హనుమంతుడు చేయ శక్యము కాని పని ఏదో చేసి ఉండును, సందేహము లేదు. 2

మూ. తద్గచ్ఛ కురు సాహాయ్యం స్వబలేనాభిసంవృతః,
క్షిప్రమృక్షపతే తస్య కపిశ్రేష్ఠస్య యుధ్యతః. 3

ప్ర. అ. ఋక్షపతే=భల్లూకరాజా! తత్=ఆ కారణమువలన, స్వబలేన=నీ సేనతో, అభిసంవృతః=కూడినవాడవై, గచ్ఛ=వెళ్లుము. యుధ్యతః=యుద్ధము చేయుచున్న, తస్య=ఆ, కపిశ్రేష్ఠస్య=హనుమంతునకు, క్షిప్రమ్=శీఘ్రముగా, సాహాయ్యమ్=సాహాయ్యమును, కురు=చేయుము.

తా. భల్లూకరాజా! అందువలన నీవు నీ సైన్యముతో కలసి వెళ్లి యుద్ధము చేయుచున్న హనుమంతునకు శీఘ్రముగా సాహాయ్యము చేయుము.

మూ. ఋక్షరాజస్తథేత్యుక్త్వా స్వేనానీకేన సంవృతః,
ఆగచ్ఛత్పశ్చిమద్వారం హనూమాన్యత్ర వానరః. 4

ప్ర. అ. ఋక్షరాజః=భల్లూకరాజు, తథేతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, స్వేన=తన సంబంధమైన, అనీకేన= సైన్యముతో, సంవృతః=కూడినవాడై, వానరః= వానరుడైన, హనూమాన్=హనుమంతుడు, యత్ర=ఎక్కడ ఉండునో అట్టి, పశ్చిమద్వారమ్=పశ్చిమద్వారమును గూర్చి, ఆగచ్ఛత్=వచ్చెను.

తా. జాంబవంతుడు "అట్లే చేసెదను" అని పలికి తన సైన్యముతో కూడినవాడై, హనుమంతు డున్న పశ్చిమద్వారము వైపు వెళ్లెను. 4

మూ. అథాయాన్తం హనూమన్తం దదర్శర్క్షపతిస్తదా,
వానరైః కృతసంగ్రామైః శ్వసద్భిరభిసంవృతమ్. 5

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ఋక్షపతిః=జాంబవంతుడు, కృతసంగ్రామైః= చేయబడిన యుద్ధము గల, శ్వసద్భిః=నిట్టూర్పుచున్న, వానరైః=వానరులతో, అభిసంవృతమ్=కూడిన, ఆయాన్తమ్=వచ్చుచున్న, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, దదర్శ=చూచెను.

తా. పిమ్మట జాంబవంతుడు, యుద్ధము చేసి నిట్టూర్పుచున్న వానరులతో కలిసి వచ్చుచున్న హనుమంతుణ్ణి చూచెను. 5

మూ. దృష్ట్వా పథి హనూమాంశ్చ తదృక్షబలముద్యతమ్,
నీలమేఘనిభం భీమం సంనివార్య న్యవర్తత. 6

ప్ర. అ. హనూమాన్ చ=హనుమంతుడు, ఉద్యతమ్=యుద్ధమునకై ఉద్యుక్తమైన, నీలమేఘనిభమ్=నల్లని మేఘముతో సమానమైన, భీమమ్=భయంకరమైన, తత్=ఆ, ఋక్షబలమ్=భల్లూకముల సైన్యమును, పథి= మార్గమునందు, దృష్ట్వా=చూచి, సంనివార్య=మరల్చి, న్యవర్తత=మరలెను.

తా. యుద్ధానికై బయలుదేరి వచ్చుచున్న భయంకరమైన నీలమేఘముల వంటి ఆ భల్లూకసైన్యమును హనుమంతుడు మార్గమధ్యమునందు చూచి, దానిని వెనుకకు మరల్చి తాను మరలి వచ్చెను. 6

మూ. స తేన సహ సైన్యేన సంనికర్షం మహాయశాః,
శీఘ్రమాగమ్య రామాయ దుఃఖితో వాక్యమబ్రవీత్ 7

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, సః=ఆ హనుమంతుడు, తేన సైన్యేన సహ=ఆ సైన్యముతో కూడ, శీఘ్రమ్=శీఘ్రముగా, సంనికర్షమ్=సమీప

మును, ఆగమ్య=పొంది, దుఃఖితః=దుఃఖించుచున్నవాడై, రామాయ=రామునకు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప కీర్తి గల ఆ హనుమంతుడు సైన్యముతో కూడ శీఘ్రముగా రాముని దగ్గరకు చేరి దుఃఖించుచు ఆతనితో ఇట్లనెను. 7

మూ. సమరే యుధ్యమానానామస్మాకం ప్రేక్షతాం పురః,
జఘాన రుదతీం సీతామిన్ద్రజిద్రావణాత్మజః. 8

ప్ర. అ. రావణాత్మజః=రావణుని కుమారుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, సమరే=యుద్ధమునందు, యుధ్యమానానామ్=యుద్ధముచేయుచున్న, ప్రేక్షతామ్=చూచుచున్న, అస్మాకమ్=మాయొక్క, పురః=ఎదుట, రుదతీమ్=ఏడ్చుచున్న, సీతామ్=సీతను, జఘాన=చంపివేసెను.

తా. యుద్ధరంగములో యుద్ధము చేయుచున్న మేమందరము చూచు చుండగనే మా ఎదుట, రావణుని పుత్రుడైన ఇంద్రజిత్తు, ఏడ్చుచున్న సీతను చంపినాడు. 8

మూ. ఉద్భ్రాన్తచిత్తస్తాం దృష్ట్వా విషణ్ణోఽహమరిందమ,
తదహం భవతో వృతం విజ్ఞాపయితుమాగతః. 9

ప్ర. అ. అరిందమ=శత్రుసంహారకుడా! తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, అహమ్=నేను, ఉద్భ్రాన్తచిత్తః= కలగిపోయిన మనస్సు కలవాడనై, విషణ్ణః=దిగులుచెందితిని. తత్=ఆ, వృత్తమ్=వృత్తాంతమును, భవతః=నీకు, విజ్ఞాపయితుమ్=తెలుపుటకు, అహమ్=నేను, ఆగతః=వచ్చినాను.

తా. ఓ! శత్రుసంహారకుడా! ఆ సీతను చూడగానే నా మనస్సు చెదిరిపోయి, నేను దిగులు చెందితిని. నీ కీ విషయమును తెలుపుటకు వచ్చినాను. 9

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాఘవః శోకమూర్ఛితః,
నిపపాత తదా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః. 10

ప్ర. అ. తదా=అప్పుడు, తస్య=హనుమంతునియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, రాఘవః=రాముడు, శోకమూర్ఛితః=శోకావిష్టుడై, ఛిన్నమూలః=నరకబడిన మొదలు గల, ద్రుమః ఇవ=చెట్టు వలె, భూమౌ=నేలమీద, నిపపాత=పడెను.

తా. అప్పుడు రాముడు హనుమంతుని మాటలు విని శోకాక్రాంతుడై మొదలు నరికిన చెట్టు వలె నేలమీద పడిపోయెను. 10

మూ. తం భూమౌ దేవసంకాశం పతితం దృశ్య రాఘవమ్,
అభిపేతుః సముత్పత్య సర్వతః కపిసత్తమాః. 11

ప్ర. అ. భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, దేవసంకాశమ్=దేవతా పురుషునితో సమానుడైన, తం రాఘవమ్= ఆ రాముణ్ణి, దృశ్య=చూచి, కపిసత్తమాః=వానరశ్రేష్ఠులు, సముత్పత్య=ఎగిరి, సర్వతః=నలువైపులా, అభిపేతుః= సమీపించిరి.

తా. దేవపురుషునితో సమానుడైన రాముడు నేలమీద పడిపోవుట చూచి వానరశ్రేష్ఠు లందరూ అన్ని వైపులనుండి ఎగిరి వచ్చి ఆ రాముణ్ణి సమీపించిరి. 11

మూ. ఆసిఞ్చన్ సలిలైశ్చైనం పద్మోత్పలసుగన్ధిభిః,
ప్రదహన్తమనాసాద్యం సహసాగ్నిమివోద్యతమ్. 12

ప్ర. అ. సహసా=హటాత్తుగా, ఉద్యతమ్=పైకి లేచిన, ప్రదహన్తమ్=కాల్చుచున్న, అగ్నిమివ=అగ్నివలె, అనాసాద్యమ్=సమీపింప శక్యము కాని, ఏనమ్=ఈ రాముణ్ణి, పద్మోత్పలసుగన్ధిభిః=పద్మముల, కలువల సువాసనలు గల, సలిలైః=ఉదకములతో, ఆసిఞ్చన్=తడిపిరి.

తా. హటాత్తుగా పైకి లేచిన దహించివేయుచున్న అగ్ని వలె సమీపింప శక్యము కాని ఆ రామునిపై పద్మముల, కలువల సువాసనలతో నిండిన ఉదకము చల్లిరి. 12

మూ. తం లక్ష్మణోఽథ బాహుభ్యాం పరిష్వజ్య సుదుఃఖితః,
ఉవాచ రామమస్వస్థం వాక్యం హేత్వర్థసంయుతమ్. 13

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సుదుఃఖితః=చాల దుఃఖితుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, అస్వస్థమ్=అస్వస్థుడైన, తం రామమ్=ఆ రాముణ్ణి, బాహుభ్యామ్=బాహువులచేత, పరిష్వజ్య=కౌగలించుకొని, హేత్వర్థసంయుతమ్=తగు హేతువులతోను మంచి అర్థముతోను కూడిన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట దుఃఖించుచున్న లక్ష్మణుడు అస్వస్థుడుగా ఉన్న రాముణ్ణి బాహువులతో కౌగిలించుకొని మంచి హేతువులతోను, అర్థముతోను కూడిన వాక్యము పలికెను. 13

మూ. శుభే వర్త్మని తిష్ఠన్తం త్వామార్య విజితేన్ద్రియమ్,
అనర్థేభ్యో న శక్నోతి త్రాతుం ధర్మో నిరర్థకః. 14

ప్ర. అ. ఆర్య=పూజ్యుడా! శుభే=శుభమైన, వర్త్మని=మార్గమునందు,

తిష్ఠన్తమ్=ఉంటూన్న, విజితేన్ద్రియమ్=జయించబడిన ఇంద్రియములు గల, త్వామ్=నిన్ను, ధర్మః=ధర్మము, అనర్థేభ్యః=అనర్థములనుండి, త్రాతుమ్=రక్షించుటకు, న శక్నోతి=సమర్థము కాదు;. నిరర్థకః=వ్యర్థమైనది.

తా. ఆర్యా !ఉత్తమమార్గమునందున్న జితేంద్రియుడవైన నిన్ను ధర్మము ఆపదనుండి రక్షింపజాలకున్నది. అందుచే ఈ ధర్మము నిష్ప్రయోజనము. 14

మూ. భూతానాం స్థావరాణాం చ జఙ్గమానాం చ దర్శనమ్,
యథాస్తి న తథా ధర్మ స్తేన నాస్తీతి మే మతిః. 15

ప్ర. అ. స్థావరాణామ్=స్థావరములు, జఙ్గమానాం చ=జంగమములు అయిన, భూతానామ్= భూతములయొక్క, దర్శనమ్=దర్శనము, యథా=ఎట్లు, అస్తి=ఉన్నదో, తథా=అట్లు, న=ధర్మాధర్మముల దర్శనము లేదు. తేన=ఆ కారణముచేత, ధర్మః=ధర్మము, నాస్తీతి=లేదు అని, మే=నాయొక్క, మతిః=బుద్ధి.

తా. స్థావరములు జంగమములు అయిన ప్రాణులు కనబడినట్లు ధర్మాధర్మము లనేవి కనబడుట లేదు. అందుచేత ధర్మ మనేది లేదని నా అభిప్రాయము. 15

మూ. యథైవ స్థావరం వ్యక్తం జఙ్గమం చ తథావిధమ్,
నాయమర్థస్తథాయుక్తస్త్వద్విధో న విపద్యతే. 16

ప్ర. అ. స్థావరమ్=స్థావరము, యథైవ=ఏవిధంగా, వ్యక్తమ్=స్పష్టముగా కనబడుచున్నదో, జఙ్గమం చ= జంగమము కూడ, తథావిధమ్=ఆ విధముగా ఉన్నదో, తథా=ఆవిధముగా, అయమ్=ఈ, అర్థః= ధర్మాధర్మరూపపదార్థము, న యుక్తః=యుక్తము కాదు. త్వద్విధః=నీవంటివాడు, న విపద్యతే=ఆపద చెందదు.

తా. స్థావరములైన వృక్షశిలాదులు ఏ విధముగా ప్రత్యక్షముగా కనబడుచున్నవో, జంగమములైన నరమృగాదులు ఏ విధముగా ప్రత్యక్షముగా కనబడుచున్నవో ధర్మాధర్మము లను పదార్థములు ఆ విధముగా ప్రత్యక్షముగా కనబడుటలేదు. ఆట్లు కనబడినచో నీవంటివానికి ఆపదలు వచ్చి ఉండెడివి కావు.

మూ. యద్యధర్మో భవేద్భూతో రావణో నరకం వ్రజేత్,
భవాంశ్చ ధర్మసంయుక్తో నైవం వ్యసనమాప్నుయాత్. 17

ప్ర. అ. అధర్మః=అధర్మము, భూతః=ఉన్నది, భవేద్యది=అయినట్లయితే, రావణః=రావణుడు, నరకమ్= నరకమును, వ్రజేత్=పొందును. ధర్మసంయుక్తః= ధర్మముతో కూడిన, భవాన్ చ=నీవు, ఏవమ్=ఇట్లు, వ్యసనమ్= దుఃఖమును, నాప్నుయాత్=పొందవు.

తా. అధర్మ మనేది ఉన్నట్లయితే రావణుడు నరకమును పొంది ఉండేవాడు. ధర్మమును అనుసరించు నీవు ఈ విధముగా కష్టములు పొందెడివాడవు కావు. 17

మూ. తస్య చ వ్యసనాభావాద్వ్యసనం చాగతే త్వయి,
ధర్మో భవత్యధర్మశ్చ పరస్పరవిరోధినౌ. 18

ప్ర. అ. ("ధర్మేణోపలభేఽధర్మమధర్మేణాపి ధర్మతామ్" అనే ప్రాచ్యపాఠంలో అన్వయము బాగా కుదురుతున్నది.) తస్య=ఆ రావణునకు, వ్యసనాభావాత్=ఆపద లేకపోవుటవలన, త్వయి=నీవు, వ్యసనమ్= వ్యసనమును, ఆగతే=పొందినవాడవగుచుండగా, ధర్మేణ=ధర్మముచేత, అధర్మమ్=అధర్మఫలమును, అధర్మేణ= అధర్మముచేత, ధర్మతామ్=ధర్మత్వమును (ధర్మఫలమును), ఉపలభే=పొందుచున్నాను (చూచుచున్నాను).

తా. ఆ రావణునికి ఆపదలు రాకపోవుటచేతను, నీకు ఆపదలు వచ్చుచుండుటచేతను అధర్మము ధర్మఫలమును (మంచిఫలమును), ధర్మము అధర్మఫలమును (చెడ్డఫలమును) ఇచ్చుచున్నట్లు నాకు తోచుచున్నది. 18

మూ. ధర్మేణోపలభేద్ధర్మమధర్మం చాప్యధర్మతః,
యద్యధర్మేణ యుజ్యేయుర్యేష్వధర్మః ప్రతిష్ఠితః. 19
న ధర్మేణ వియుజ్యేరన్నధర్మరుచయో జనాః,
ధర్మేణ చరతాం ధర్మం చైషాం ధర్మఫలం భవేత్. 20

ప్ర. అ. ధర్మేణ=ధర్మముచేత, ధర్మమ్=ధర్మఫలమును, ఉపలభేత్=పొందునా? అధర్మతః=అధర్మమువలన, అధర్మం చ=అధర్మఫలమును పొందునా? యేషు=ఎవరియందు, అధర్మః=అధర్మము, ప్రతిష్ఠితః=ఉన్నదో వాళ్లు, అధర్మేణ=అధర్మఫలముతో, యుజ్యేరన్ యది=సంబంధించినట్లయితే, అధర్మరుచయః=అధర్మమునందు రుచిగలవారై, జనాః=జనులు, ధర్మేణ=ధర్మముచేత, న వియుజ్యేరన్=వియుక్తులు కాకుండెడివారు. ధర్మేణ=ధర్మముచేత, ధర్మమ్= ధర్మమును, చరతామ్=ఆచరించుచున్న, ఏషామ్=ఈజనులకు, ధర్మఫలమ్=ధర్మఫలము, భవేత్=కలిగి ఉండెడిది.

తా. ధర్మముచేత ధర్మఫలమును పొందు నని, అధర్మముచేత అధర్మఫలమును పొందు నని నియమ మేది? అధర్మము చేయువారు అధర్మఫలమునే పొందే పక్షమున జనులు అధర్మమునందు ఆసక్తి చూపుచు ధర్మమును విడచి ఉండే వారు కారు. ధర్మమును ఆచరించువారికి ఆ ధర్మముచేత ధర్మఫలమే లభించి ఉండెడిది. 19, 20

మూ. యస్మాదర్థా వివర్ధన్తే యేష్వధర్మః ప్రతిష్ఠితః,
క్లిశ్యన్తే ధర్మశీలాశ్చ తస్మాదేతౌ నిరర్థకౌ. 21

ప్ర. అ. యేషు=ఎవరియందు, అధర్మః=అధర్మము, ప్రతిష్ఠితః=నిలచి యున్నదో వాళ్లయందు, యస్మాత్=ఏ కారణమువలన, అర్థాః=ధనములు (లాభములు) వివర్ధన్తే=వృద్ధిపొందుచున్నవో, ధర్మశీలాః చ=ధర్మస్వభావము గలవారు, క్లిశ్యన్తే చ=క్లేశము చెందుచున్నారో, తస్మాత్=ఆ కారణమువలన, ఏతౌ=ఇవి, నిరర్థకౌ=వ్యర్థములు.

తా. అధర్మమునే చేయువారి సంపదలు అభివృద్ధి చెందుచుండుటచేతను, ధర్మప్రవృత్తి గలవారు ఆపదలలో చిక్కుకొనుచుండుటచేతను ఈ ధర్మాధర్మాలు నిష్ఫలములు.

మూ. వధ్యన్తే పాపకర్మాణో యద్యధర్మేణ రాఘవ,
వధకర్మహతోఽధర్మః స హతః కం వధిష్యతి. 22

(ఈ ఘట్టంలోని పది పండ్రెండు శ్లోకాల అర్థం అస్పష్టంగా ఉన్నది. వ్యాఖ్యాతలు కూడ స్థితస్య గతిశ్చిన్తనీయా (ఉన్నదానిని ఏదోవిధంగా సరిపెట్టుకొని అర్థం చెప్పకోవాలి) అన్న పద్ధతిలోనే వ్యాఖ్యానించి నట్లు కనబడుతుంది. "ధర్మంవల్ల సుఖం కలుగుతుంది, అధర్మంవల్ల పాపం కలుగుతుంది" అని చెప్పడమే కాని అది వాస్తవం కాదు. మనకు అనుభవంలో ఆ విధంగా లేదు కదా? అని లక్ష్మణుడు చెప్పదలచిన విషయము. ధర్మాధర్మాలనేవే లేవు అని ఆతని అభిప్రాయము. ఏ క్రియ అయినను మూడు క్షణములకంటె అధికకాలము ఉండదు అని నియమము. ధర్మమైనా అధర్మమైనా క్రియారూపమే - ఏదో ఒక పనియే-గాన ఆ పని జరిగిన నాల్గవక్షణములో అది నశించిపోవును. అట్లు నశించిపోయినది ఫలమును ఎట్లు ఇవ్వగలదు? అని ఈ శ్లోకములో లక్ష్మణుడు అనుచున్నా డని వ్యాఖ్యాతలు వ్రాసినారు.)

ప్ర. అ. రాఘవ=రామా! పాపకర్మాణః=పాపకర్మ చేసినవాళ్లు, అధర్మేణ=అధర్మముచేత, వధ్యన్తే యది= చంపబడినట్లయితే (చంపబడుదురని చెప్పినట్లయితే అది కుదరదు). వధకర్మహతః=నాశ మను కర్మచేత నశింపచేయబడిన, సః అధర్మః=ఆ అధర్మము, హతః=(తానే) నశింపచేయబడినదై, కమ్=ఎవనిని, వధిష్యతి=వధిచగలదు?

తా. అధర్మము పాపాత్ములను చంపివేయును అని చెప్పచుందురు. అది కుదరదు. చేసిన నాల్గవ క్షణమున నశించిపోవు అధర్మమే నశించిపోయినప్పుడు ఇంక అది ఎవరిని చంపగలదు? ధర్మము విషయము కూడ ఇంతే. క్రియ అగుటచేత జరిగిన నాల్గవ క్షణమునందే ధర్మము నశించిపోవును. అట్లు నశించిన

ధర్మము మంచి ఫలితమును ఏమి ఇవ్వగలదు? అందుచేత ధర్మాధర్మములు అనునవియే లేవు అని లక్ష్మణుని అభిప్రాయము. ఇక్కడ ప్రాచ్యపాఠం బాగున్నది.

"బ(వ)ధ్యన్తే పుణ్యకర్మాణో యద్యధర్మేణ రాఘవ,
అధర్మేణ హతో ధర్మః స హతః కిం కరిష్యతి".

అని ఆ పాఠము. రామా! పుణ్యాత్ములు అధర్మముచేత వధింపబడినట్లయితే అధర్మముచేత ధర్మము చంపబడి నట్లయినది. ఆ విధముగ చంపబడిన (వ్యర్థము చేయబడిన) ధర్మము ఏమి చేయును? అట్టి ధర్మము నాచరించి ఏమి ప్రయోజనము అని అర్థము. 22

మూ. అథవా విహితేనాయం హన్యతే హన్తి వా పరమ్,
విధిరాలిప్యతే తేన న స పాపేన కర్మణా. 23

ప్ర. అ. అథవా=అట్లుకాక, విహితేన=విధిచేత అనగా కర్మఫలదాతయైన దేవునిచేత, అయమ్=ఇతడు, అనగా కర్త, హన్యతే=చంపబడినా, అపరమ్=ఇతరుణ్ణి, హన్తి వా=చంపినా, తేన=ఆ, పాపేన కర్మణా=పాపకర్మచేత, సః విధిః=ఆ దైవమే, లిప్యతే=లిప్తుడగును. సః=కర్త, న=లిప్తుడుకాడు.

తా. లేదా విధియే అనగా ధర్మాధర్మఫలముల నిచ్చు పరమేశ్వరుడే అధర్మకర్తను చంపినను లేదా ఇతడు ఇతరుణ్ణి చంపినను ఆ పాపకర్మవలన కలుగు దుష్ఫలము ఆ పరమేశ్వరునకే చెందును కాని కర్తకు రాదు. అనగా ధర్మమనగా సత్కర్మచేత సంతోషించు ఈశ్వరుడు. అధర్మమనగా అసత్కర్మచేత ప్రీతి లేని ఈశ్వరుడు అని అన్నను ఆ ఈశ్వరుడే చేయించినవా డగుటచే ధర్మమువలన కలుగు మంచి ఫలము, అధర్మమువలన కలుగు చెడ్డ ఫలమూ కూడ ప్రేరకుడైన ఈశ్వరునకే చెందవలెను కాని ప్రేరేపింపబడిన కర్తకు చెందకూడదు అని భావము. ఇది వ్యాఖ్యాతలు వ్రాసిన అర్థము. 'విహితేన' 'విధినా' పదములకు వీరు చెప్పిన అర్థము సంతృప్తికరముగా లేదు. అట్లే "అయమ్" అను పదము వెనుక శ్లోకములో ప్రకృతమైన ధర్మమును చెప్పవలెను కాని కర్తను కాదు. ప్రాచ్యపాఠము ఈ క్రింది విధముగా ఉన్నది.

"అథవా విహితేనాయం హన్యతే హన్తి చాపరమ్,
విధాతా లిప్యతే తేన యథా పాపేన కర్మణా."

స్వర్గాదిఫలములను ఉద్దేశించి కొన్ని కర్మలను విధించి నట్లే శత్రువినాశాదులను ఉద్దేశించి వేదములో కొన్ని శ్యేనయాగాదులు విధింపబడినవి. ఇంద్రజిత్తు చేసిన నికుంభిలాహోమము కూడ శాస్త్రవిహితమే. అయినను పరపీడాకరమగుటచేత ఇవి పాపకృత్యములుగా (అధర్మముగా) పరిగణింపబడు చున్నవి. ఈ అధర్మకార్యములు ధర్మాత్ములకు బాధ కలిగించుట ద్వారా

ధర్మమును పీడించుచున్నవి. అట్లే ధర్మము ప్రబలమై నపుడు ఈ అధర్మమును అణగద్రొక్కవచ్చును. కాని ఈ అణగద్రొక్కబడే అధర్మము కూడ వేదవిహితమే. అందుచేత వేదవిహితమైన ధర్మమును పీడించు అధర్మమువలన ఎట్లు పాపము వచ్చునో, అట్లే వేదవిహితమైన (శ్యేనయాగాది) అధర్మమును పీడించు ధర్మమువలన కూడ పాపము రావలెను కదా? ఈ దృష్టితో లక్ష్మణుడు అనుచున్న మాట విని.

ప్ర. అ. అథవా=లేదా, అయమ్=ఈ ధర్మము, విహితేన=వేదవిహితమైన శ్యేనయాగాద్యధర్మముచేత, హన్యతే= నశింపచేయబడినచో, అపరమ్=(తాను ప్రబలమై) ఆ అధర్మమును, హన్తి చ=నశింపజేసినను, తేన=అట్టి ధర్మముచేత, పాపేన కర్మణా యథా=పాపకర్మచేత వలెనే, విధాతా=కర్త, లిప్యతే=లిప్త డగును అని అర్థము. 23

మూ. అదృష్టప్రతికారేణ స్వవ్యక్తేనాసతా సతా,
కథం శక్యం పరం ప్రాప్తుం ధర్మేణారివికర్షణ. 24

ప్ర. అ. అరివికర్షణ=శత్రుసంహారకుడవైన రామా! అదృష్టప్రతికారేణ=చూడబడని ప్రతిక్రియ గలది, (చూడబడని లింగము గలది, అందుచేత అనుమానప్రమాణముచేత తెలియ శక్యము కానిది అని గోవిందరాజవ్యాఖ్య), స్వవ్యక్తేన=చాల అస్పష్టము, అసతా సతా=లేనిదీ అయిన, ధర్మేణ=ధర్మముచేత, పరమ్=శ్రేయస్సును, ప్రాప్తుమ్= పొందుటకు ("వధింపతగిన శత్రువులు మొదలైన వారి స్వరూపమును తెలుసుకొనుటకు" అని కొందరు వ్యాఖ్యాతలు), కథమ్=ఎట్లు, శక్యమ్=శక్యమైనది?

తా. శత్రుసంహారకుడవైన రామా! ధర్మమునకు ప్రతిఘాతము ఎట్లు జరుగునో తెలియదు. (ధర్మ మనునది ఇది అని చెప్పుటకు తగిన లింగము లేదు అని గోవిందరాజవ్యాఖ్యానుసారము అర్థము). ఇది కనబడనిది. అందుచేత లేనిదానివంటిదే. అట్టి ధర్మముచేత శ్రేయస్సును పొందుట ఎట్లు? (గో.రా) అట్టి ధర్మము శత్రువును ఎట్లు తెలిసికొనగలదు? వానిని ఎట్లు పీడింపగలదు? (అని మరొక వ్యాఖ్య)

ఇక్కడ ప్రాచ్యపాఠము ఇట్లున్నది-

"అదృష్టః ప్రతిసంహారో యది పాపస్య కర్మణః,
కథం శక్యం పరం ప్రాప్తుం ధర్మేణారినిషూదన."

"ఓ! శత్రుసంహారకుడా! పాపకర్మను ఎదుర్కొను ఉపాయము కనబడనిచో ధర్మము అధర్మమును ఎట్లు ఎదిరించి నశింపచేయగల్గును" అని దీని భావము.

మూ. యది సత్స్యాత్సతాం ముఖ్య నాసత్స్యాత్తవ కించన,
త్వయా యదీదృశం ప్రాప్తం తస్మాత్సన్నోపపద్యతే. 25

ప్ర. అ. సతామ్=సత్పురుషులలో, ముఖ్య=ముఖ్యుడా! సత్=ఉన్నది, స్యాత్ యది=అయినచో, తవ=నీకు, కించన=ఏదీ, అసత్=చెడుగు, న స్యాత్=అయి ఉండెడిది కాదు. త్వయా=నీచేత, యత్=ఏ కారణమువలన, ఈదృశమ్= ఇట్టి దుఃఖము, ప్రాప్తమ్=పొందబడినదో, తస్మాత్=ఆ కారణమువలన, సత్=ఉన్నది అనుట, న ఉపపద్యతే=కుదరదు.

తా. సత్పురుషులలో శ్రేష్ఠుడవైన రామా! ధర్మ మనేది నిజముగా ఉన్నచో నీకు ఏమీ చెడుగు జరిగి యుండ కూడదు. కాని నీకు ఇట్టి కష్టము సంప్రాప్తించినది. అందుచేత ధర్మ మనేది ఉన్న దని చెప్పుట కుదరదు. 25

మూ. అథవా దుర్బలః క్లీబో బలం ధర్మోఽనువర్తతే,
దుర్బలో హృతమర్యాదో న సేవ్య ఇతి మే మతిః. 26

ప్ర. అ. అథవా=లేదా, ధర్మః=ధర్మము, దుర్బలః=దుర్బలమై, క్లీబః=పిరికిదై, బలమ్=బలమును, అనువర్తతే=అనుసరించినట్లయితే, దుర్బలః=దుర్బలము, హృతమర్యాదః=హరించబడిన మర్యాద (కట్టుబాటు) కలది అయిన ఆ ధర్మము, న సేవ్యః ఇతి=సేవించతగినది కాదు అని, మే=నాయొక్క, మతిః=బుద్ధి.

తా. లేదా ధర్మము దుర్బలమై, పిరికిదై బలానికి లొంగిపోయినట్లయితే, అలాంటి దుర్బలమైన, మర్యాదను పాటించని ధర్మమును పరిత్యజించుటయే మంచి దని నా అభిప్రాయము. 26

మూ. బలస్య యది చేద్ధర్మో గుణభూతః పరాక్రమే,
ధర్మముత్సృజ్య వర్తస్వ యథా ధర్మే తథా బలే. 27

ప్ర. అ. పరాక్రమే=పరాక్రమమునందు (కార్యసాధనము విషయమున), ధర్మః=ధర్మము, బలస్య= బలమునకు, గుణభూతః యది చేత్=అప్రధానమైతే, ధర్మమ్=ధర్మమును, ఉత్సృజ్య=విడచి, ధర్మే=ధర్మమునందు, యథా=ఎట్లో, తథా=ఆ విధముగా, బలే=బలమునందు, వర్తస్వ=ఉండుము.

తా. కార్యసాధనము విషయమునందు ధర్మము అప్రధానమై బలానికి లొంగిపోయే పక్షమున నువ్వు ధర్మమును విడచి, ఇంతవరకు ధర్మమును ఆశ్రయించి నట్లు బలమును ఆశ్రయించుము. 27

మూ. అథ చేత్సత్యవచనం ధర్మః కిల పరంతప,
అనృతస్త్వయ్యకరుణః కిం న బద్ధస్త్వయా పితా. 28

ప్ర. అ. పరంతప=శత్రువులను పీడించువాడా! అథ=మరియు, సత్యవచనమ్=సత్యవచనము, ధర్మః కిల చేత్= ధర్మమైనచో, అనృతః=అసత్యము పలికినవాడు, త్వయి=నీయందు, అకరుణః=జాలి లేనివాడు అయిన, పితా=తండ్రి, త్వయా=నీచేత, కిమ్=ఎందువలన, న బద్ధః=కట్టబడలేదు.

తా. ఓ! శత్రుసంహారకుడా! సత్యము పలుకుట ధర్మమైన పక్షమున, మొదట నీకు రాజ్యమిచ్చెద నని పలికి ఇవ్వక అసత్య మాడిన, నీమీద కరుణ లేని మన తండ్రిని నీవు ఎందుచేత బంధించలేదు? 28

మూ. యది ధర్మో భవేద్భూత అధర్మో వా పరంతప,
న స్మ హత్వా మునిం వజ్రీ కుర్యాదిజ్యాం శతక్రతుః. 29

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా! ధర్మో వా=ధర్మముకాని, అధర్మో వా=అధర్మము కాని, భూతః= ఉన్నది, భవేద్యది=అయినచో, వజ్రీ= వజ్రమును ధరించిన, శతక్రతుః=దేవేంద్రుడు, మునిమ్=మునిని, హత్వా=చంపి, ఇజ్యామ్=యాగమును, న స్మ కుర్యాత్=చేసి ఉండెడివాడు కాదు.

తా. శత్రుసంహారకుడవైన రామా! వజ్రధారియైన ఇంద్రుడు విశ్వరూపు డనే మునిని చంపి యజ్ఞము చేసినాడు కదా! ధర్మమే కర్తవ్యమైనచో అతడు యజ్ఞము మాత్రమే చేసి ఉండేవాడు గాని మునిని చంపుట అను అధర్మమును చేసి ఉండెడివాడు కాడు. అధర్మమే కర్తవ్య మైనచో మునిసంహారము మాత్రమే చేసి ఉండేవాడు గాని యజ్ఞమును చేసి ఉండేవాడుకాడు. కాని రెండూ చేసినాడు. దీనిని పట్టి క్షత్రియులు కాలానుసారము రెండూ చేయుచుండవలె నని తేలినది. 29

మూ. అధర్మసంశ్రితో ధర్మో వినాశయతి రాఘవ,
సర్వమేతద్యథాకామం కాకుత్స్థ కురుతే నరః. 30

ప్ర. అ. రాఘవ=రామా! అధర్మసంశ్రితః=అధర్మముతోకూడిన, ధర్మః=ధర్మము (ధర్మాధర్మములు రెండూ అని అర్థము), వినాశయతి=నశింప చేయును. కాకుత్స్థ=రామా! నరః=మానవుడు, ఏతత్=దీనిని, సర్వమ్=అంతనూ, యథాకామమ్=తన ఇచ్ఛను అనుసరించి, కురుతే=చేయుచుండును.

తా. రామా! ధర్మమును ఆచరించినా, అధర్మమును ఆచరించినా వినాశము కలుగుచునే ఉన్నది. అందుచేతనే మానవుడు తన ఇచ్ఛను అనుసరించి ఈ రెండింటినీ ఆచరించుచుండును.

వి. ఇది గోవిందరాజవ్యాఖ్యానము. ఈ శ్లోకంలోను, పై శ్లోకంలోను అధర్మశబ్దానికి పౌరుషము అను అర్థమును గ్రహించి ఇతరవ్యాఖ్యాతలు

వ్యాఖ్యానించినారు. అధర్మశబ్దానికి ఆ అర్థము ఎట్లు వచ్చినదో తెలియదు. ఏమైనా రెండు వ్యాఖ్యానాలూ కూడ అక్షరానుగుణంగా లేవు. ఈ రెండు శ్లోకాలూ ప్రాచ్యపాఠంలో లేవు. 30

మూ. మమచేదం మతం తాత ధర్మో2యమితి రాఘవ,
ధర్మమూలం త్వయా ఛిన్నం రాజ్యముత్సృజతా తదా. 31

ప్ర. అ. తాత=జాలిపడవలసినస్థితిలో ఉన్నవాడా! (గోవిందరాజవ్యాఖ్య) రాఘవ=రామా! అయమ్=ఇది (ఇష్టానుసారము చేయుట) ధర్మః ఇతి= ధర్మము అని, మమ చ=నాయొక్క కూడా, ఇదమ్=ఈ, మతమ్=మతము. తదా=అప్పుడు, రాజ్యమ్=రాజ్యమును, ఉత్సృజతా=విడచిన, త్వయా=నీచేత, ధర్మమూలమ్=ధర్మమునకు మూలమైనది, ఛిన్నమ్=తెగగొట్టబడినది.

తా. దయనీయస్థితిలో ఉన్న రామా! ఇష్టము ప్రకారము కాలమును పట్టి ధర్మాధర్మాలను అనుసరించుట యుక్త మనియే నా అభిప్రాయము కూడ. ఆ నాడు రాజ్యమును విడనాడి నీవు ధర్మమునకు మూలమైన అర్థమును ఛేదించివేసినావు!

ప్రాచ్యపాఠంలో ఈ శ్లోకము మరొక విధముగా ఉన్నది -

"అథ చైతన్మతం దానం ధర్మో2యమితి రాఘవ,
ధర్మమూలం హి సంభిన్నం రాజ్యముత్సృజతా త్వయా".

"అథచేత్సత్యవచనమ్" ఇత్యాదిశ్లోకంలో "సత్యవచనము ధర్మ మని నీవన్నచో నీవు అసత్యము పలికిన తండ్రిని ఎందుకు బంధించలేదు?" అని ప్రశ్నించి, ఇపుడు "దానము చేయుట ధర్మము" అను పక్షమును గూర్చి చెప్పుచున్నాడు. "దానము చేయుట ధర్మము అని నీ అభిప్రాయమైనచో ఆ విషయమునందు కూడ నీవు సరిగా ప్రవర్తించలేదు. అర్థ మున్ననే కదా దానము చేయునది? ఆ నాడు చేతికి వచ్చిన రాజ్యమును విడిచిపెట్టి దానరూపమైన ధర్మానికి అవసరమైన అర్థము లేకుండ చేసికొన్నావు కదా?" అని భావము. ఈ పాఠము బాగున్నది. 31

మూ. అర్థేభ్యో హి ప్రవృద్ధేభ్యః సంవృత్తేభ్యస్తతస్తతః,
క్రియాః సర్వాః ప్రవర్తన్తే పర్వతేభ్య ఇవాపగాః. 32

ప్ర. అ. తతస్తతః=ఆ యా ఉపాయములవలన, సంవృత్తేభ్యః=సిద్ధించిన, ప్రవృద్ధేభ్యః=వృద్ధిపొందిన, అర్థేభ్యః=ధనములవలననే, పర్వతేభ్యః=పర్వతములనుండి, ఆపగాః ఇవ=నదులు వలె, సర్వాః=సమస్తమైన, క్రియాః= పనులు, ప్రవర్తన్తే హి=ప్రవర్తించును కదా?

తా. ఆ యా ఉపాయములవలన లభించి క్రమముగా వృద్ధిపొందిన ధనము వలననే, పర్వతములనుండి నదులు ప్రవర్తించునట్లు అన్ని పనులూ సిద్ధించును కదా? 32

మూ. అర్థేన హి విముక్తస్య పురుషస్యాల్పచేతసః,
విచ్ఛిద్యన్తే క్రియాః సర్వా గ్రీష్మే కుసరితో యథా. 33

ప్ర. అ. అర్థేన=ధనముచేత, విముక్తస్య=విడవబడిన, అల్పచేతసః=అల్పమైన బుద్ధి గల, పురుషస్య=పురుషునియొక్క, సర్వాః క్రియాః=సమస్తమైన క్రియలు, గ్రీష్మే=గీష్మర్తువునందు, కుసరితో యథా=చిన్న నదులు వలె, విచ్ఛిద్యన్తే=విచ్ఛిన్నములైపోవును.

తా. ధనవిహీనుడైన అల్పబుద్ధి గల పురుషుని పను లన్నీ, గ్రీష్మర్తువులో చిన్న నదులు ఎండిపోయినట్లు భగ్నములై పోవును. 33

మూ. సోఽయమర్థం పరిత్యజ్య సుఖకామః సుఖైధితః,
పాపమారభతే కర్తుం తదా దోషః ప్రవర్తతే. 34

ప్ర. అ. సుఖైధితః=సుఖములతో పెంచబడిన, సః=అట్టి, అయమ్=ఇతడు, అర్థమ్=ధనమును, పరిత్యజ్య=విడచి, సుఖకామః=సుఖమునందు కోరిక గలవాడై, పాపమ్=పాపకృత్యమును, కర్తుమ్=చేయుటకు, ఆరభతే=ప్రారంభించును. తదా=అప్పుడు, దోషః=దోషము, ప్రవర్తతే=ప్రవర్తించును.

తా. సుఖములతో పెరిగిన అట్టి పురుషుడు ధనమును పరిత్యజించి, మరల సుఖములు పొందవలె నను కోరికతో చౌర్యాది పాపకృత్యములు చేయును. అది అనేకదోషములకు దారి తీయును. 34

మూ. యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థాస్తస్య బాన్ధవాః,
యస్యార్థాః స పుమాన్ లోకే యస్యార్థాః స చ పణ్డితః. 35

ప్ర. అ. యస్య=ఎవనికి, అర్థాః=ధనము లున్నవో, తస్య=వానికే, మిత్రాణి=స్నేహితు లుందురు. యస్య= ఎవనికి, అర్థాః=ధనము లున్నవో, తస్య=వానికే, బాన్ధవాః=బంధువులుందురు. యస్య=ఎవనికి, అర్థాః= ధనములున్నవో, సః=అతడే, లోకే=లోకమునందు, పుమాన్=పురుషుడు. యస్య=ఎవనికి, అర్థాః=ధనము లున్నవో, సః=అతడు, పణ్డితః చ=పండితుడు కూడ అగును.

తా. ఎవనివద్ద ధనముండునో వానికే మిత్రు లుందురు. ఎవనివద్ద ధనముండునో వానిదగ్గరకే బంధువులు చేరుదురు. ఈ లోకములో ధనమున్నవాడే పురుషుడు; ధనమున్నవాడే పండితుడుగా పరిగణింపబడును. 35

మూ. యస్యార్థాః స చ విక్రాన్తో యస్యార్థాః స చ బుద్ధిమాన్,
యస్యార్థాః స మహాభాగో యస్యార్థాః స మహాగుణః. 36

ప్ర. అ. యస్య=ఎవనికి, అర్థాః=ధనములుండునో, సః చ=అతడే, విక్రాన్తః=పరాక్రమవంతుడు; యస్య=ఎవనికి, అర్థాః=ధనములుండునో, సః చ=అతడే, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు; యస్య=ఎవనికి, అర్థాః=ధనములుండునో, సః=అతడే, మహాభాగః=మహాభాగ్యవంతుడు; యస్య=ఎవనికి, అర్థాః=ధనములున్నవో, సః=అతడే, మహాగుణః=గొప్ప గుణములు గలవాడు.

తా. ధనమున్నవాడే పరాక్రమవంతుడు. ధనమున్న వాడే బుద్ధిమంతుడు. ధనమున్నవాడే మహాభాగ్యశాలి. ధనమున్నవాడే గొప్ప గుణములు గలవాడు.

మూ. అర్థస్యైతే పరిత్యాగే దోషాః ప్రవ్యాహృతా మయా,
రాజ్యముత్సృజతా ధీర యేన బుద్ధిస్త్వయా కృతా. 37

ప్ర. అ. ధీర=ధీరుడా ! రాజ్యమ్=రాజ్యమును, ఉత్సృజతా=విడచిపెట్టుచున్న, త్వయా=నీచేత, యేన=ఏ కారణముచేత, బుద్ధిః=అట్టి ఆలోచన, కృతా=చేయబడినదో, ఆ కారణముచేత, మయా=నాచేత, అర్థస్య=ధనముయొక్క, పరిత్యాగే=త్యాగము చేయుటయందు, ఏతే=ఈ, దోషాః=దోషములు, ప్రవ్యాహృతాః=చెప్పబడినవి.

తా. ఓ ! ధీరుడా ! నీవు రాజ్యమును విడువవలె నను నిర్ణయము తీసికొని అట్లు చేసితివి. అందుచేతనే నేనిప్పుడు ధనమును విడచుటవలన కలుగు దోషములను చెప్పవలసి వచ్చినది.

వి. "రాజ్యముత్సృజతా వీర న తద్బుద్ధం తదా త్వయా" అను ప్రాచ్యపాఠము బాగున్నది. "ఆనాడు రాజ్యమును విడిచివేయునప్పుడు నీవు ఈ విషయములు గ్రహించలేదు"అని భావము. 37.

మూ. యస్యార్థా ధర్మకామార్థాస్తస్య సర్వం ప్రదక్షిణమ్,
అధనేనార్థకామేన నార్థః శక్యో విచిన్వతా. 38

ప్ర. అ. యస్య=ఎవనికి, అర్థాః=ధనములుండునో, తస్య=వానికి, ధర్మకామార్థాః=ధర్మము, కామము, అర్థమూ కూడ లభించును. సర్వమ్=అంతయు, ప్రదక్షిణమ్=అనుకూలము. అర్థకామేన=ధనమునందు కోరిక గల, విచిన్వతా=ధనముకొరకై అన్వేషించుచున్న, అధనేన=ధనము లేనివానిచేత, అర్థః=ధనము, న శక్యః=సంపాదింప శక్యము కాదు.

తా. ధనమున్నవానికే ధర్మము, కామము, అర్థము కూడ సిద్ధించును. వానికి అంతా అనుకూలముగా జరిగిపోవును. ధనము లేనివాడు ధనముకోసమై

ఎంత ప్రయత్నించినా అది లభించదు. అసలు కొంత ధనమున్నవాడే దానిని ఇంకా సంపాదించుకొనగలుగును. 38

మూ. హర్షః కామశ్చ దర్పశ్చ ధర్మః క్రోధః శమో దమః,
అర్థాదేతాని సర్వాణి ప్రవర్తన్తే నరాధిప. 39

ప్ర. అ. నరాధిప=రాజా! హర్షః=సంతోషము, కామశ్చ=కామము, దర్పశ్చ=దర్పము, ధర్మః=ధర్మము, క్రోధః=క్రోధము, శమః=శాంతి, దమః=ఇంద్రియనిగ్రహము, ఏతాని సర్వాణి=ఇవి అన్నీ, అర్థాత్=ధనమువలన, ప్రవర్తన్తే=శోభించును.

తా. రాజా ! ధనమున్నవానికి, హర్షము, కామము, దర్పము, ధర్మము, క్రోధము, శమము, ఇంద్రియనిగ్రహము మొదలైన గుణములలో ఏవి ఉన్నా కూడ శోభించును. 39

మూ. యేషాం నశ్యత్యయం లోకశ్చరతాం ధర్మచారిణామ్,
తేఽర్థాస్త్వయి న దృశ్యన్తే దుర్దినేషు యథా గ్రహాః. 40

ప్ర. అ. యేషామ్=ఏ అర్థములు, చరతామ్=ఉంటూండగా, ధర్మచారిణామ్=ధర్మమును మాత్రమే ఆచరించువారికి, అయం లోకః=ఈ లోకము, నశ్యతి=నశించునో, తే=అట్టి, అర్థాః=అర్థములు, దుర్దినేషు= దుర్దినములయందు, (మేఘములు కప్పిన దినమునందు) గ్రహాః యథా=గ్రహములు వలె, త్వయి=నీయందు, న దృశ్యన్తే=కనబడుట లేదు.

తా. ఏ ధనము లభించుచున్నను దానిని గ్రహించక ధర్మమే ఆచరించువారికి ఈ లోకముతో ఎట్టి ప్రయోజనమూ ఉండదో అట్టి ధనము, పూర్తిగా మేఘావృతమైన దివసమునందు గ్రహములు కనబడనట్లు నీయందు కనబడుటలేదు. 40

మూ. త్వయి ప్రవ్రజితే వీర గురోశ్చ వచనే స్థితే,
రక్షసాపహృతా భార్యా ప్రాణైః ప్రియతరా తవ. 41

ప్ర. అ. వీర=వీరుడా ! గురోః=తండ్రియొక్క, వచనే=వచనమునందు, స్థితే=ఉన్న, త్వయి=నీవు, ప్రవ్రజితే=ప్రవాసము చెందినవాడ వగుచుండగా, ప్రాణైః=ప్రాణములతో సమానముగా, ప్రియతరా=చాల ప్రియురాలైన, తవ భార్యా=నీ భార్య, రక్షసా=రాక్షసునిచేత, అపహృతా=అపహరింపబడినది.

తా. వీరుడా ! నీవు తండ్రి ఆజ్ఞను అనుసరించి వనమునకు వెళ్లుటచే, ప్రాణములకంటె ఎక్కువ ప్రియురాలైన నీ భార్యను రాక్షసుడు హరించినాడు. 41

మూ. తదద్య విపులం వీర దుఃఖమిన్ద్రజితా కృతమ్,
కర్మణా వ్యపనేష్యామి తస్మాదుత్తిష్ఠ రాఘవ. 42

ప్ర. అ. వీర=వీరుడా ! ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, కృతమ్=చేయబడిన, తత్=ఆ, విపులమ్=అధికమైన, దుఃఖమ్=దుఃఖమును, అద్య=ఇప్పుడు, కర్మణా=కర్మ చేత, వ్యపనేష్యామి=తొలగించగలను. రాఘవ=రామా ! తస్మాత్=ఆకారమువలన, ఉత్తిష్ఠ=లెమ్ము.

తా. ఓ ! వీరుడా ! ఇంద్రజిత్తు నీకు కలిగించిన ఆ అధికమైన దుఃఖమును ఇప్పుడు నా పరాక్రమముచేత తొలగించెదను. అందువలన, ఓ ! రామా ! లెమ్ము. 42

మూ. ఉత్తిష్ఠ నరశార్దూల దీర్ఘబాహో ధృతవ్రత,
కిమాత్మానం మహాత్మానం కృతాత్మానం న బుధ్యసే. 43

ప్ర. అ. నరశార్దూల=నరులలో శ్రేష్ఠుడా ! దీర్ఘబాహో=దీర్ఘములైన బాహువులు కలవాడా ! ధృతవ్రత=ధరింపబడిన నియమము గలవాడా ! ఉత్తిష్ఠ=లెమ్ము, మహాత్మానమ్=మహాత్ముడవు, కృతాత్మానమ్=సుశిక్షితమైన బుద్ధి గలవాడవు, అయిన, ఆత్మానమ్=నిన్ను గూర్చి, కిం న బుధ్యసే=ఎందుకు తెలుసుకొనకున్నావు?

తా. దీర్ఘములైన బాహువులు గలవాడా ! నియమములను పాటించువాడా ! నరశ్రేష్ఠుడా ! లెమ్ము. మహాత్ముడవు, సుశిక్షితమైన బుద్ధిగలవాడవు అయిన నిన్ను గూర్చి నీవే ఎందుకు తెలుసుకొనకున్నావు ?43

మూ. అయమనఘ తవోదితః ప్రియార్థం
జనకసుతానిధనం నిరీక్ష్య రుష్టః,
సరథగజహయాం సరాక్షసేన్ద్రాం
భృశమిషుభిర్వినిపాతయామి లఙ్కామ్. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే త్ర్యశీతితమః సర్గః.

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా ! జనకాసుతానిధనమ్=సీతయొక్క వినాశమును, నిరీక్ష్య=చూచి, రుష్టః=కోపించిన, అయమ్=ఈ నేను, తవ=నీయొక్క, ప్రియార్థమ్=ప్రియము కొరకు, ఉదితః=ఉద్యుక్తుడనై, సరథగజహయామ్=రథములతోను, ఏనుగులతోను, గుఱ్ఱములతోను కూడిన, సరాక్షసేన్ద్రామ్=రావణునితో కూడిన, లఙ్కామ్=లంకను, భృశమ్=మిక్కిలి,

ఇషుభిః=బాణములచేత, వినిపాతయామి=పడగొట్టెదను.

తా. ఎట్టి దోషములూ లేని రామా ! సీతామరణమును చూచుటచే కోపించిన నేను నీకు ప్రియము చేయుటకై ఉద్యుక్తుడనై రథములతో, ఏనుగులతో, గుఱ్ఱములతో, రావణునితో సహా లంకాపట్టణమును నా బాణములు ప్రయోగించి కూల్చివేసెదను. 44

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతురశీతితమః సర్గః

[ఇదంతయు ఇంద్రజిత్తు మాయ అని, సీత జీవించియే ఉన్న దనీ విభీషణుడు రామునితో చెప్పి లక్ష్మణుణ్ణి నికుంభిలకు పంపు మని ప్రార్థించుట.]

మూ. రామమాశ్వాసమానే తు లక్ష్మణే భ్రాతృవత్సలే,
నిక్షిప్య గుల్మాన్ స్వస్థానే తత్రాగచ్ఛద్విభీషణః. 1

ప్ర. అ. భ్రాతృవత్సలే=సోదరునియందు ప్రేమ గల, లక్ష్మణే=లక్ష్మణుడు, రామమ్=రాముణ్ణి, ఆశ్వాసమానే=ఓదార్చుచుండగా, విభీషణః=విభీషణుడు, గుల్మాన్=సేనాసమూహములను, స్వస్థానే=తమ స్థానమునందు, నిక్షిప్య=ఉంచి, తత్ర=అక్కడికి, ఆగచ్ఛత్=వచ్చెను. (45 గురు కాలిబంట్లు, 27 గుఱ్ఱాలు, 9 రథాలు, 9 ఏనుగులు ఉన్న సేనా విభాగానికి గుల్మ మని పేరు. వానరసేనకు అశ్వాదులు లేవు గాన ఇక్కడ గుల్మమనగా కొందరు వానరసైనికుల సముదాయ మని అర్థము.)

తా. సోదరునియందు ప్రేమగల లక్ష్మణుడు ఈ విధముగా రాముణ్ణి ఓదార్చుచుండగా విభీషణుడు సేనాసమూహములను ఆ యా స్థానములందు నిలిపి అచటికి వచ్చెను. 1

మూ. నానాప్రహరణైర్వీరైశ్చతుర్భిరభిసంవృతః,
నీలాఞ్జనచయాకారైర్మాతఙ్గైరివ యూథపైః. 2

ప్ర. అ. నానాప్రహరణైః=అనేక విధములైన ఆయుధములు గల, నీలాఞ్జనచయాకారైః=నల్లని కాటుకప్రోగులవంటి ఆకారములు గల, యూథపైః=గుంపుకు నాయకులైన, మాతఙ్గైః ఇవ=ఏనుగులు వలె ఉన్న, చతుర్భిః=నలుగురు, వీరైః=వీరులతో, అభిసంవృతః=కూడిన, సః=ఆ విభీషణుడు, శోకలాలసమ్=శోకముచేత వ్యాకులుడైన, మహాత్మానమ్=మహాత్ముడైన, రాఘవమ్=రాముణ్ణి, అభిగమ్య=సమీపించి, బాష్పపర్యాకులేక్షణాన్= కన్నీటితో వ్యాకులములైన నేత్రములు గల, వానరాంశ్చాపి=వానరులను కూడ, దదృశే=చూచెను.

తా. అనేకవిధములైన ఆయుధములు ధరించిన, నల్లని కాటుక ప్రోగుల వంటి ఆకారములు గల, గుంపుల నాయకులైన ఏనుగుల వలె ఉన్న నలుగురు వీరులతో కలిసి వచ్చిన ఆ విభీషణుడు, శోకాక్రాంతుడైన మహాత్ముడైన

రాముణ్ణి సమీపించి, కన్నీటితో నిండిన నేత్రములు గల వానరులను కూడ చూచెను. 2, 3

మూ. రాఘవం చ మహాత్మానమిక్ష్వాకుకులనన్దనమ్,
దదర్శ మోహమాపన్నం లక్ష్మణస్యాఙ్కమాశ్రితమ్. 4

ప్ర. అ. మహాత్మానమ్=మహాత్ముడు, ఇక్ష్వాకులనన్దనమ్=ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడు, మోహమ్= మోహమును, ఆపన్నమ్=పొందినవాడు, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, అఙ్కమ్=ఒడిని, ఆశ్రితమ్=ఆశ్రయించినవాడు అయిన, రాఘవం చ=రాముణ్ణి కూడ, దదర్శ=చూచెను.

తా. మూర్ఛ చెంది లక్ష్మణుని ఒడిలో పండుకొని యున్న, ఇక్ష్వాకువంశానందకరుడైన, మహాత్ముడైన రాముణ్ణి కూడ విభీషణుడు చూచెను.

మూ. వ్రీడితం శోకసంతప్తం దృష్ట్వా రామం విభీషణః,
అన్తర్దుఃఖేన దీనాత్మా కిమేతదితి సోఽబ్రవీత్. 5

ప్ర. అ. సః విభీషణః=ఆ విభీషణుడు, వ్రీడితమ్=సిగ్గుపడుచున్న, శోకసంతప్తమ్=శోకముచేత తపింపచేయబడిన, రామమ్=రాముణ్ణి, దృష్ట్వా=చూచి, అన్తః=లోపల, దుఃఖేన=దుఃఖముచేత, దీనాత్మా=దీనమైన మనస్సుగలవాడై, ఏతత్=ఇది, కిమ్=ఏమి, ఇతి=అని, అబ్రవీత్=పలికెను.

తా. సిగ్గుపడుచు, శోకపీడితుడై ఉన్న రాముణ్ణి చూచి, విభీషణుడు మనస్సులో దుఃఖముతో దీనుడై 'ఇది ఏమి?' అని ప్రశ్నించెను. 5

మూ. విభీషణముఖం దృష్ట్వా సుగ్రీవం తాంశ్చ వానరాన్,
లక్ష్మణోవాచ మన్దార్థమిదం బాష్పపరిప్లుతః. 6

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, విభీషణముఖమ్=విభీషణుని ముఖమును, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, తాన్= ఆ, వానరాంశ్చ=వానరులను, దృష్ట్వా=చూచి, బాష్పపరిప్లుతః=కన్నీటితో నిండినవాడై, మన్దార్థమ్=మందమైన అర్థము గల, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. విభీషణుని ముఖమును, సుగ్రీవుణ్ణి, ఆ వానరులను చూచి లక్ష్మణుడు కన్నీరు కార్చుచు మందమైన అర్థము గల ఈ వాక్యమును పలికెను. 6

మూ. హతా ఇన్ద్రజితా సీతా ఇతి శ్రుత్వైవ రాఘవః,
హనూమద్వచనాత్సౌమ్య తతో మోహముపాగతః.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! రాఘవః=రాముడు, హనుమద్వ చనాత్=హనుమంతుని వాక్యమువలన, సీతా=సీత, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, హతా=చంపబడినది, ఇతి=అని, శ్రుత్వైవ=వినగానే, తతః=అటుపిమ్మట, మోహమ్=మోహమును, ఉపాగతః=పొందినాడు.

తా. సౌమ్యుడా ! సీతను ఇంద్రజిత్తు చంపివేసినాడని హనుమంతుడు చెప్పగా వినిన వెంటనే రాముడు మూర్ఛ చెందినాడు. 7

మూ. కథయన్తం తు సౌమిత్రిం సంనివార్య విభీషణః,
పుష్కలార్థమిదం వాక్యం విసంజ్ఞం రామమబ్రవీత్. 8

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, కథయన్తమ్=ఇట్లు చెప్పుచున్న, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, సంనివార్య= నివారించి, విసంజ్ఞమ్=సంజ్ఞ లేని, రామమ్=రాముణ్ణిగూర్చి, పుష్కలార్థమ్=మంచి అర్థము గల, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఈ విధముగా చెప్పుచున్న లక్ష్మణుణ్ణి మధ్యలోనే ఆపి విభీషణుడు, స్పృహ తప్పి ఉన్న రామునితో మంచి అర్థము గల వాక్యమును ఇట్లు పలికెను. 8

మూ. మనుజేన్ద్రార్తరూపేణ యదుక్తస్త్వం హనూమతా,
తదయుక్తమహం మన్యే సాగరస్యేవ శోషణమ్. 9

ప్ర. అ. మనుజేన్ద్ర=మహారాజా ! ఆర్తరూపేణ=మిక్కిలి దుఃఖితుడైన, హనూమతా=హనుమంతునిచేత, త్వమ్=నీవు, యత్=ఏ వాక్యమును, ఉక్తః=చెప్పబడినావో, తత్=దానిని, సాగరస్య=సముద్రముయొక్క, శోషణమ్ ఇవ=ఎండించుటను వలె, అయుక్తమ్=ఆయుక్తమైనదానినిగా, అహమ్=నేను, మన్యే=తలచెదను.

తా. మహారాజా ! మిక్కిలి దుఃఖించుచున్న హనుమంతుడు నీకు చెప్పినది, సముద్రము ఎండిపోయె నని చెప్పుట ఎట్లు అసంభావ్యమో అట్లు అసంభావ్య మని నేను తలచెదను. 9

మూ. అభిప్రాయం తు జానామి రావణస్య దురాత్మనః,
సీతాం ప్రతి మహాబాహో న చ ఘాతం కరిష్యతి. 10

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! సీతాం ప్రతి=సీతను గూర్చి, దురాత్మనః= దురాత్ముడైన, రావణస్య=రావణునియొక్క, అభిప్రాయమ్=అభిప్రాయమును, జానామి=ఎరుగుదును. ఘాతమ్= వధను, న కరిష్యతి=చెయ్యడు.

తా. ఓ ! మహాబాహూ ! సీత విషయములో దురాత్ముడైన రావణుని అభిప్రాయ మెట్టిదో నాకు తెలియును. ఆతడు ఆమెను చంపడు. 10

మూ. యాచ్యమానః సుబహుశో మయా హితచికీర్షుణా,
వైదేహీముత్సృజస్వేతి న చ తత్కృతవాన్వచః. 11

ప్ర. అ. హితచికీర్షుణా=హితము చేయదలచిన, మయా=నాచేత, వైదేహీమ్=సీతను, ఉత్సృజస్వ= విడిచిపెట్టుము, ఇతి=అని, సుబహుశః=చాల పర్యాయములు, యాచ్యమానః=కోరబడుచున్నను, తత్=ఆ, వచః= వచనమును, న కృతవాన్=చేయలేదు.

తా. సీతను విడిచిపెట్టుము అని నేను ఎన్నో పర్యాయములు, ఆతనికి హితము చేయవలె నను బుద్ధితో ప్రార్థించినను ఆ మాట చేయలేదు. 11

మూ. నైవ సామ్నా న దానేన న భేదేన కుతో యుధా,
సా ద్రష్టుమపి శక్యేత నైవ చాన్యేన కేన చిత్. 12

ప్ర. అ. సా=ఆమె, సామ్నా=సామముచేత, ద్రష్టుమ్ అపి=చూచుటకు కూడ, న శక్యేత=శక్యము కాదు. దానేన=దానముచేత, న=కాదు; భేదేన=భేదముచేత, న=కాదు, యుధా=యుద్ధముచేత, కుతః=ఎట్లు శక్యమగును? అన్యేన=మరియొక, కేనచిత్=ఏ ఉపాయముచేతనూ కూడ, నైవ=శక్యము కాదు.

తా. సామముచేత గాని, దానముచేత గాని, భేదముచేత గాని ఆమెను చూచుటకు ఎవ్వరికీ శక్యము కాదు. మరి ఇతర ఉపాయముచేత దేని చేతనూ కూడ శక్యము కాదు. యుద్ధముచేత శక్యము కాదని చెప్పవలెనా ?

మూ. వానరాన్మోహయిత్వా తు ప్రతియాతః స రాక్షసః,
మాయామయీం మహాబాహో తాం విద్ధి జనకాత్మజామ్. 13

ప్ర. అ. సః రాక్షసః=ఆ రాక్షసుడు, వానరాన్=వానరులను, మోహయిత్వా=మోహింపజేసి, ప్రతియాతః=తిరిగి వెళ్ళిపోయినాడు. మహాబాహో=ఓ ! మహాబాహూ ! తాం జనకాత్మజామ్=ఆ సీతను, మాయామయీమ్=మాయా వికారమైనదానినిగా, విద్ధి=తెలుసుకొనుము.

తా. ఆ ఇంద్రజిత్తు వానరులను మోహింపజేసి వెళ్లిపోయినాడు. ఓ ! మహాబాహూ ! ఆ సీత మాయాసీత అను విషయమును తెలిసికొనుము. 13

మూ. చైత్యం నికుమ్భిలాం నామ ప్రాప్య హోమం కరిష్యతి.
హుతవానుపయాతో హి దేవైరపి సవాసవైః, 14
దురాధర్షో భవత్యేష సంగ్రామే రావణాత్మజః.

ప్ర. అ. ఏషః=ఈ, రావణాత్మజః=ఇంద్రజిత్తు, నికుమ్భిలాం నామ=నికుంభిల అను పేరు గల, చైత్యమ్= దేవాలయమును, ప్రాప్య=పొంది, హోమమ్=హోమమును, కరిష్యతి=చేయగలడు. హుతవాన్=హోమముచేసినవాడై, ఉపయాతః=వచ్చిన అతడు, సంగ్రామే=యుద్ధమునందు, సవాసవైః=దేవేంద్రునితో కూడిన, దేవైరపి=దేవతలచేత కూడ, దురాధర్షః=ఎదిరింప శక్యము కానివాడు, భవతి=అగును.

తా. ఈ ఇంద్రజిత్తు నికుంభిల యను దేవాలయమునకు వెళ్లి హోమము చేయును. ఆ హోమము చేసి వచ్చినచో ఆతనిని దేవేంద్రునితో కూడిన దేవతలుకూడ యుద్ధములో ఓడింపజాలరు. 14

మూ. తేన మోహయతా నూనమేషా మాయా ప్రయోజితా, 15
విఘ్నమన్విచ్ఛతా తత్ర వానరాణాం పరాక్రమే.

ప్ర. అ. తత్ర=అక్కడ, వానరాణామ్=వానరులయొక్క, పరాక్రమే=పరాక్రమమునందు, విఘ్నమ్=విఘ్నమును, అన్విచ్ఛతా=కోరుచున్న, మోహయతా=మోహింపచేయుచున్న, తేన=వానిచేత, నూనమ్= నిశ్చయముగా, ఏషా=ఈ, మాయా=మాయ, ప్రయోజితా=ప్రయోగింపబడినది.

తా. వానరుల పరాక్రమప్రదర్శనమునకు విఘ్నము చేయవలె నను తలంపుతో అతడు మోసము చేయుటకై ఈ మాయను ప్రయోగించినాడు; సత్యము. 15

మూ. ససైన్యాస్తత్ర గచ్ఛామో యావత్తన్న సమాప్యతే. 16
త్యజైనం నరశార్దూల మిథ్యాసంతాపమాగతమ్.
సీదతే హి బలం సర్వం దృష్ట్వా త్వాం శోకకర్శితమ్. 17

ప్ర. అ. తత్=ఆ హోమకర్మ, యావత్=ఎంతలో, న సమాప్యతే=సమాప్తి పొందింపబడదో, అంతలో, ససైన్యాః= సైన్యముతో కూడినవారమై, తత్ర=అక్కడికి, గచ్ఛామః=వెళ్లెదము. నరశూర్దూల=నరశ్రేష్ఠుడా ! ఆగతమ్=వచ్చిన, ఏనమ్=ఈ, మిథ్యాసంతాపమ్=అసత్యమైన దుఃఖమును, త్యజ=విడువుము. శోకకర్శితమ్=శోకముచేత పీడింపబడిన, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, సర్వమ్=సమస్తమైన, బలమ్=సైన్యము, సీదతే హి=క్రుంగిపోవుచున్నది కదా ?

తా. ఆ హోమము పూర్తి అయే లోగా సైన్యముతో అక్కడికి వెళ్లెదము. నరులలో శ్రేష్ఠుడవైన రామా ! నీకు కలిగిన అసత్యమైన (కారణము లేని) ఈ దుఃఖమును విడువుము. శోకార్తుడవైన నిన్ను చూచి సైన్య మంతా దిగులుచెందుచున్నది. 16, 17

తా. ఆ రాక్షసశ్రేష్ఠుడైన ఇంద్రజిత్తు హోమకర్మను పూర్తిచేసినచో ఆతడు యుద్ధములో సురాసురులకు కూడ కనబడడు. ఆతడు ఆ కర్మ పూర్తిచేసి యుద్ధము చేయవలె నను కోరికతో వచ్చినచో దేవతలుకూడ గొప్ప ప్రాణసంశయములో పడుదురు. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ఎనభైనాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాశీతితమః సర్గః

[విభీషణుడు ప్రార్థించిన ప్రకారము రాముడు ఇంద్రజిత్తును చంపుటకై లక్ష్మణుని పంపుట; లక్ష్మణుడు నికుంభిల దగ్గరకు వెళ్లుట.]

మూ. తత్తస్య వచనం శ్రుత్వా రాఘవః శోకకర్శితః,
నోపధారయతే వ్యక్తం యదుక్తం తేన రక్షసా. 1

ప్ర. అ. శోకకర్శితః=శోకముచేత పీడితుడైన, రాఘవః=రాముడు, తస్య=వానియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తేన రక్షసా=ఆ రాక్షసునిచేత, యత్=ఏది, ఉక్తమ్=పలకబడినదో, దానిని, వ్యక్తమ్=స్పష్టముగా, నోపధారయతే=గ్రహించలేదు.

తా. శోకపీడితుడైన రాముడు ఆ విభీషణుని మాటలు విన్నను ఆతడేమి చెప్పుచుండెనో స్పష్టముగా అర్థము చేసికొనజాలకపోయెను. 1

మూ. తతో ధైర్యమవష్టభ్య రామః పరపురంజయః,
విభీషణముపాసీనమువాచ కపిసంనిధౌ. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరపురంజయః=శత్రుపురములను జయించు, రామః=రాముడు, ధైర్యమ్=ధైర్యమును, అవష్టభ్య=ఊతగా గొని, ఉపాసీనమ్=సమీపమునందు కూర్చున్న, విభీషణమ్=విభీషణుని గూర్చి, కపిసంనిధౌ=వానరసమీపమునందు, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట శత్రుపురములను జయించు రాముడు ధైర్యము తెచ్చుకొని, తన సమీపమునందు కూర్చుని ఉన్న విభీషణునితో వానరుల సమక్షమునందు ఇట్లు పలికెను. 2

మూ. నైరృతాధిపతే వాక్యం యదుక్తం తే విభీషణ,
భూయస్తచ్ఛ్రోతుమిచ్ఛామి బ్రూహి యత్తే వివక్షితమ్. 3

ప్ర. అ. నైరృతాధిపతే=రాక్షసప్రభువైన, విభీషణ=విభీషణుడా ! తే=నీయొక్క, యత్=ఏ, వాక్యమ్=వాక్యము, ఉక్తమ్=పలకబడినదో, తత్=దానిని, భూయః=మరల, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. తే=నీకు, యత్=ఏది, వివక్షితమ్=చెప్పుటకు అభిలషింపబడినదో, తత్=దానిని, భూయః=మరల,

శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. రాక్షసాధిపతివైన విభీషణా ! నీవు చెప్పిన మాటలు మరల వినవలె నని కోరుచున్నాను. నీవు ఏమి చెప్పదలచుచున్నావో మరల చెప్పుము.

మూ. రాఘవస్య వచః శ్రుత్వా వాక్యం వాక్యవిశారదః,
యత్తత్పునరిదం వాక్యం బభాషేఽథ విభీషణః. 4

ప్ర. అ. "రాఘవస్య వచః శ్రుత్వా సుదీనవదుదాహృతమ్,
యత్నాత్పునరిదం వాక్యం బభాషే స విభీషణః.

అను ప్రాచ్యపాఠము బాగున్నది. 'వచః' "వాక్యమ్" అను రెండు పదాల సమన్వయం సరిగా కుదరదు. సః విభీషణః=ఆ విభీషణుడు, సుదీనవత్=చాల దైన్యముతో, ఉదాహృతమ్=పలకబడిన, రాఘవస్య=రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, పునః=మరల, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, యత్నాత్=ప్రయత్నమువలన, బభాషే=పలికెను.

తా. విభీషణుడు దైన్యముతో పలికిన రాముని మాటలు విని మరల ప్రయత్నపూర్వకముగా ఈ మాటలు పలికెను. 4

మూ. యథాజ్ఞప్తం మహాబాహో త్వయా గుల్మనివేశనమ్,
తత్తథానుష్ఠితం వీర త్వద్వాక్యసమనన్తరమ్. 5

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! వీర=వీరుడా! త్వయా=నీచేత, గుల్మనివేశనమ్=సేనాసముదాయముల నివేశనము, యథా=ఎట్లు, ఆజ్ఞప్తమ్=ఆజ్ఞాపించబడినదో, తత్=అది, త్వద్వాక్యసమనన్తరమ్=నీ వాక్యమునకు వెంటనే, తథా=ఆవిధముగా, అనుష్ఠితమ్=చేయబడినది.

తా. గొప్ప బాహువులు గల వీరుడా ! గుల్మములను సేనాభాగములను ఆ యా స్థానములందు నిలుపు మని నీవు ఆజ్ఞాపించితివి కదా ? నీవు చెప్పిన వెంటనే అది అంతయు అట్లు చేసితిని. 5

మూ. తాన్యనీకాని సర్వాణి విభక్తాని సమన్తతః,
విన్యస్తా యూథపాశ్చైవ యథాన్యాయం విభాగశః. 6

ప్ర. అ. తాని=ఆ, అనీకాని=సైన్యములు, సర్వాణి=అన్నీ, సమన్తతః= అంతటా, విభక్తాని=విభజించబడినవి. యూథపాశ్చైవ=ఆ యా సైన్యవిభాగముల నాయకులు కూడ, యథాన్యాయమ్=నియమానుసారముగా, విభాగశః=వేరు వేరుగా, విన్యస్తాః=ఉంచబడినారు.

తా. సైన్యవిభాగములను అన్నింటినీ అంతటా వేరువేరుగా నిలిపి

వాటి నాయకులను కూడ నియమానుసారము వేరు వేరుగా నిలిపినాను. 6

మూ. భూయస్తు మమ విజ్ఞాప్యం తచ్ఛృణుష్వ మహాప్రభో,
త్వయ్యకారణసంతప్తే సంతప్తహృదయా వయమ్. 7

ప్ర. అ. మహాప్రభో=మహాప్రభూ ! భూయః=ఇంకనూ, మమ=నాకు (నాచే), విజ్ఞాప్యమ్=విజ్ఞాపన చేయవలసి ఉన్నది. తత్=దానిని, శృణుష్వ=వినుము. త్వయి=నీవు, అకారణసంతప్తే=కారణము లేకుండగా దుఃఖించుచుండగా, వయమ్=మేము, సంతప్తహృదయాః=బాధపడుచున్న హృదయములు కలవారము.

తా. మహాప్రభూ ! నేను మరొక విషయము విజ్ఞాపన చేయవలసి ఉన్నది. దానిని వినుము. నీవు నిష్కారణముగా దుఃఖించుచున్నావు. నీ దుఃఖమును చూచి మా మనస్సులు బాధపడుచున్నవి. 7

మూ. త్యజ రాజన్నిమం శోకం మిథ్యాసంతాపమాగతమ్,
తదియం త్యజ్యతాం చిన్తా శత్రుహర్షవివర్ధినీ. 8

ప్ర. అ. రాజన్=రాజా ! ఇమమ్=ఈ, శోకమ్=శోకమును, మిథ్యా=అసత్యమైన, ఆగతమ్=వచ్చిన, సంతాపమ్=దుఃఖమును, త్యజ=విడువుము. తత్=అందువలన, శత్రుహర్షవివర్ధినీ=శత్రువుల సంతోషమును వృద్ధిపొందించు, ఇయమ్=ఈ, చిన్తా=చింత, త్యజ్యతామ్=విడవబడుగాక.

తా. రాజా ! ఈ శోకమును, సత్యమైన కారణము లేని ఈ దుఃఖమును విడిచిపెట్టుము. శత్రువుల ఆనందమును వృద్ధి పొందించు ఈ చింతను విడువుము. 8

మూ. ఉద్యమః క్రియతాం వీర హర్షః సముపసేవ్యతామ్,
ప్రాప్తవ్యా యది తే సీతా హన్తవ్యాశ్చ నిశాచరాః. 9

ప్ర. అ. వీర=వీరుడా ! తే=నీకు, సీతా=సీత, ప్రాప్తవ్యా యది=పొందదగినదైతే, నిశాచరాః=రాక్షసులు, హన్తవ్యాశ్చ=చంపదగినవారైతే, ఉద్యమః=ప్రయత్నము, క్రియతామ్=చేయబడుగాక. హర్షః=సంతోషము, సముపసేవ్యతామ్=సేవింపబడుగాక.

తా. ఓ ! వీరుడా ! నీవు రాక్షసులను సంహరించవలె నన్నచో, సీతను పొందవలె నన్నచో పౌరుషము చూపవలెను. సంతోషముగా ఉండవలెను. 9

మూ. రఘునన్దన వక్ష్యామి శ్రూయతాం మే హితం వచః,
సాధ్వయం యాతు సౌమిత్రిర్బలేన మహతా వృతః. 10

నికుమ్భిలాయాం సంప్రాప్తం హన్తుం రావణిమాహవే,
ధనుర్మణ్డలనిర్ముక్తైరాశీవిషవిషోపమైః. 11

ప్ర. అ. రఘునన్దన=రామా ! వక్ష్యామి=చెప్పెదను. మే=నాయొక్క, హితమ్=హితమైన, వచః=వచనము, శ్రూయతామ్=వినబడుగాక. అయమ్=ఈ, సౌమిత్రిః=లక్ష్మణుడు, మహతా=గొప్పదైన, బలేన=సైన్యముతో, వృతః=కూడిన వాడై, నికుమ్భిలాయామ్=నికుంభిలయందు, సంప్రాప్తమ్=చేరి ఉన్న, రావణిమ్=ఇంద్రజిత్తును, ఆహవే=యుద్ధమునందు, ధనుర్మణ్డలనిర్ముక్తైః=ధనస్సుయొక్క మండలమునుండి విడువబడిన, ఆశీవిషవిషోపమైః=సర్పవిషముతో సమానములైన బాణములచేత, హన్తుమ్=చంపుటకు, సాధు=బాగుగా, యాతు=వెళ్ళుగాక.

తా. రామా ! నేను హితమైన వాక్యమును చెప్పెదను, వినుము. నికుంభిల చేరి ఉన్న ఇంద్రజిత్తును యుద్ధమునందు సర్పవిషము వంటి బాణములను మండలాకారమైన ధనస్సుచేత ప్రయోగించి చంపుటకై ఈ లక్ష్మణుడు పెద్ద సైన్యముతో కలిసి వెంటనే వెళ్ళవలెను. 10, 11

మూ. తేన వీరేణ తపసా వరదానాత్స్వయంభువః,
అస్త్రం బ్రహ్మశిరః ప్రాప్తం కామగాశ్చ తురంగమాః. 12

ప్ర. అ. వీరేణ=వీరుడైన, తేన=వానిచేత, తపసా=తపస్సుచేత, స్వయంభువః=బ్రహ్మదేవునియొక్క, వరదానాత్=వరదానమువలన, బ్రహ్మశిరః=బ్రహ్మశిరస్సు అను, అస్త్రమ్=అస్త్రము, ప్రాప్తమ్=పొందబడినది. కామగాః=ఇచ్ఛానుసారము నడచు, తురంగమాః=గుఱ్ఱములు (పొందబడినవి.)

తా. వీరుడైన ఆ ఇంద్రజిత్తు తపస్సు చేసి, బ్రహ్మ వరముల నిచ్చుటవలన బ్రహ్మశిరస్సు అను అస్త్రమును, ఇష్టానుసారము నడచు గుఱ్ఱములను సంపాదించినాడు. 12

మూ. స ఏష సహ సైన్యేన ప్రాప్తః కిల నికుమ్భిలామ్,
యద్యుత్తిష్ఠేత్కృతం కర్మ హతాన్సర్వాంశ్చ విద్ధి నః. 13

ప్ర. అ. సః ఏషః=అట్టి ఈ ఇంద్రజిత్తు, సైన్యేన సహ=సైన్యముతో కూడ, నికుమ్భిలామ్=నికుంభిలను, ప్రాప్తః కిల=చేరినాడట. కర్మ=ఆ హోమకర్మ, కృతమ్=చేయబడినట్లైతే, ఉత్తిష్ఠేద్యది=నికుంభిలనుండి లేచినట్లయితే, సర్వాన్=సమస్తమైన, నః=మనలను, హతాన్=చంపబడినవాళ్ళనుగా, విద్ధి=తెలిసికొనుము.

తా. అట్టి ఈ ఇంద్రజిత్తు సైన్యముతో కూడి నికుంభిల చేరినాడట. అక్కడ ఆతడు హోమకర్మ పూర్తిచేసికొని లేచినచో మన మందరమూ మరణించినట్లే అని తెలిసికొనుము. 13

మూ. నికుమ్భిలామసంప్రాప్తమహుతాగ్నిం చ యో రిపుః,
త్వామాతాయినం హన్యాదిన్ద్రశత్రో స తే వధః. 14
వరో దత్తో మహాబాహో సర్వలోకేశ్వరేణ వై,
ఇత్యేవం విహితో రాజన్వధస్త్యైష ధీమతః. 15

ప్ర. అ. ఇన్ద్రశత్రో=ఓ ! ఇంద్రజిత్తూ, యః=ఏ, రిపుః=శత్రువు, నికుమ్భిలామ్=నికుంభిలను, అసంప్రాప్తమ్=పొందని, అహుతాగ్నిం చ =హోమము చేయబడని అగ్ని గల, ఆతతాయినమ్=శస్త్రధారివైన, త్వామ్=నిన్ను, హన్యాత్=చంపునో, సః=అతడే, తే=నీకు, వధః=సంహారకుడు. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! సర్వలోకేశ్వరేణ=సర్వలోకములకు ప్రభువైన బ్రహ్మదేవునిచేత, ధీమతః= ధీమంతుడైన, తస్య=వానికి, ఇత్యేవమ్=ఇట్లు, వరః=వరము, దత్తః=ఇవ్వబడినది. ఏషః=ఈ, వధః=వధ, విహితః=విధించబడినది.

తా. "ఓ ! ఇంద్రజిత్తూ ! నీవు నికుంభిల చేరక ముందు గాని, చేరినను అగ్నిలో హోమము చేయుటకు ముందు గాని ఏ శత్రువు ఆయుధము ధరించిన నిన్ను వధించునో ఆతడే నీకు మారకుడు" అని బ్రహ్మదేవుడు బుద్ధిమంతుడైన ఈతనికి వరమును ఇచ్చినాడు. ఓ ! మహాబాహూ ! వీని వధోపాయము ఇదే.

మూ. వధాయేన్ద్రజితో రామ సందిశస్వ మహాబల,
హతే తస్మిన్ హతం విద్ధి రావణం ససుహృద్గణమ్. 16

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గల, రామ=రామా ! ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, వధాయ=వధకొరకు, సందిశస్వ=ఆజ్ఞాపించుము. తస్మిన్=ఆతడు, హతే=చంపబడినవాడగుచుండగా, ససుహృద్గణమ్=మిత్రగణముతో కూడిన, రావణం=రావణుని, హతమ్=చంపబడినవానినిగా, విద్ధి=తెలుసుకొనుము.

తా. మహాబలశాలియైన రామా ! ఇంద్రజిత్తును చంపుటకు ఆజ్ఞ ఇమ్ము. ఆతడు చంపబడిన పిమ్మట స్నేహితుల గణములతో కూడిన రావణుడు మరణించినట్లే అని గ్రహించుము. 16

మూ. విభీషణవచః శ్రుత్వా రామో వాక్యమథాబ్రవీత్,
జానామి తస్య రౌద్రస్య మాయాం సత్యపరాక్రమ. 17

ప్ర. అ. విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, అథ=అటుపిమ్మట, రామః=రాముడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. సత్యపరాక్రమ=సత్యమైన పరాక్రమము గలవాడా ! రౌద్రస్య=భయంకరుడైన, తస్య=వానియొక్క, మాయామ్=మాయను, జానామి=ఎరుగుదును.

తా. విభీషణుని మాటలు విని రాము డిట్లు పలికెను. "సత్యమైన పరాక్రమము గల ఓ ! విభీషణా ! భయంకరుడైన ఆ ఇంద్రజిత్తు మాయలను నేను ఎదుగుదును." 17

మూ. స హి బ్రహ్మాస్త్రవిత్ప్రాజ్ఞో మహామాయో మహాబలః,
కరోత్యసంజ్ఞాన్ సంగ్రామే దేవాన్సవరుణానపి. 18

ప్ర. అ. బ్రహ్మాస్త్రవిత్=బ్రహ్మాస్త్రము తెలిసినవాడు, ప్రాజ్ఞః=బుద్ధిమంతుడు, మహామాయః=గొప్ప మాయలు కలవాడు, మహాబలః=గొప్ప బలము కలవాడు అయిన, సః=అతడు, సవరుణాన్=వరుణునితో కూడిన, దేవానపి=దేవతలను కూడ, సంగ్రామే=యుద్ధమునందు, అసంజ్ఞాన్=సంజ్ఞ లేనివాళ్ళనుగా, కరోతి=చేయును.

తా. ఆ ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము తెలిసినవాడు. బుద్ధిమంతుడు. చాలా మాయలు గలవాడు. గొప్ప బలము గలవాడు. యుద్ధమునందు వరుణునితో కూడిన దేవతలను కూడ సంజ్ఞ లేనివాళ్ళనుగా చేయగలడు. 18

మూ. తస్యాన్తరిక్షే చరతః సరథస్య మహాయశః,
న గతిర్జ్ఞాయతే వీర సూర్యస్యేవాభ్రసంప్లవే. 19

ప్ర. అ. మహాయశః=గొప్ప కీర్తిగలవాడా ! వీర=వీరుడా ! సరథస్య=రథముతో కూడిన, అన్తరిక్షే=ఆకాశమునందు, చరతః=సంచరించుచున్న, తస్య=వానియొక్క, గతిః=గమనము, అభ్రసంప్లవే=మేఘముల ఆవరణమునందు, సూర్యస్యేవ=సూర్యునియొక్క గమనము వలె, న జ్ఞాయతే=తెలియబడదు.

తా. గొప్ప కీర్తి గల ఓ !వీరుడా !ఆతడు రథమునెక్కి ఆకాశమునందు సంచరించుచుండగా, మేఘములు కప్పివేసి ఉన్నప్పుడు సూర్యుని గమనము ఎట్లు తెలియదో అట్లే ఆతని గమనము తెలియదు. 19

మూ. రాఘవస్తు రిపోర్జ్ఞాత్వా మాయావీర్యం దురాత్మనః,
లక్ష్మణం కీర్తిసంపన్నమిదం వచనమబ్రవీత్. 20

ప్ర. అ. రాఘవః=రాముడు, దురాత్మనః=దురాత్ముడైన, రిపోః=శత్రువుయొక్క, మాయావీర్యమ్=మాయాబలమును, జ్ఞాత్వా=తెలిసికొని, కీర్తిసంపన్నమ్=కీర్తితో కూడిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు దురాత్ముడైన శత్రువునకున్న మాయాబలమును తెలిసికొని కీర్తిమంతుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 20

మూ. యద్వానరేన్ద్రస్య బలం తేన సర్వేణ సంవృతః,
హనూమత్ప్రముఖైశ్చైవ యూథపైః సహ లక్ష్మణ. 21
జామ్బవేనార్క్షపతినా సహసైన్యేన సంవృతః,
జహి తం రాక్షససుతం మాయాబలసమన్వితమ్. 22

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా ! వానరేన్ద్రస్య=సుగ్రీవునియొక్క, యత్=ఏ, బలమ్=సైన్యమున్నదో, తేన=దానితో, సర్వేణ=అంతటితోను, సంవృతః=కూడినవాడవై, హనూమత్ప్రముఖైః=హనుమంతుడు మొదలైన, యూథపైశ్చైవ సహ=సేనానాయకులతో కూడిన వాడవై, సహసైన్యేన=సైన్యముతో కూడిన, ఋక్ష పతినా=భల్లూకప్రభువైన, జామ్బవేన= జాంబవంతునితో, సంవృతః=కూడినవాడవై, మాయాబలసమన్వితమ్=మాయాబలముతో కూడిన, తమ్=ఆ, రాక్షససుతమ్=రాక్షసకుమారుణ్ణి, జహి=చంపుము.

తా. లక్ష్మణా ! సుగ్రీవుని అంత సైన్యముతోను, హనుమంతుడు మొదలైన సేనానాయకులతోను, సైన్యసమేతుడైన, భల్లూకప్రభువైన జాంబవంతునితోను కలిసి వెళ్లి మాయాబలము గల ఆ ఇంద్రజిత్తును సంహరించుము. 21, 22

మూ. అయం త్వాం సచివైః సార్థం మహాత్మా రజనీచరః,
అభిజ్ఞస్తస్య మాయానాం పృష్ఠతోఽనుగమిష్యతి. 23

ప్ర. అ. తస్య=వానియొక్క, మాయానామ్=మాయలకు(ను), అభిజ్ఞః=ఎరిగినవాడైన, మహాత్మా=మహాత్ముడైన, అయం రజనీచరః=ఈ విభీషణుడు, సచివైః సార్థమ్=మంత్రులతోకూడ, త్వామ్=నిన్ను, పృష్ఠతః=వెనుకనే, అనుగమిష్యతి=అనుసరించి వెళ్ళగలడు.

తా. ఇంద్రజిత్తు దగ్గర ఉన్న మాయలన్నీ తెలిసిన ఈ విభీషణుడు, అతని అనుచరులూ కూడ నీ వెనుకనే అక్కడికి వచ్చెదరు. 23

మూ. రాఘవస్య వచం శ్రుత్వా లక్ష్మణః సవిభీషణః,
జగ్రాహ కార్ముకశ్రేష్ఠమత్యద్భుతపరాక్రమః. 24

ప్ర. అ. సవిభీషణః=విభీషణునితో కూడిన, అత్యద్భుతపరాక్రమః=చాల ఆశ్చర్యకరమైన పరాక్రమము గల, లక్ష్మణః=లక్ష్మణుడు, రాఘవస్య=రాముని యొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, కార్ముకశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన ధనస్సును, జగ్రాహ=గ్రహించెను.

తా. రాముని మాటలు విని ఆశ్చర్యకరమైన పరాక్రమము గల విభీషణసహితుడైన లక్ష్మణుడు శ్రేష్ఠమైన ధనస్సును గ్రహించెను. 24

మూ. సంనద్ధః కవచీ ఖడ్గీ సశరో వామచాపభృత్,
రామపాదావుపస్పృశ్య హృష్టః సౌమిత్రిరబ్రవీత్. 25

ప్ర. అ. సంనద్ధః=యుద్ధసంనద్ధుడు (సామగ్రి గ్రహించి యుద్ధానికి సిద్ధముగా ఉన్నవాడు), కవచీ=కవచము కలవాడు, ఖడ్గీ=ఖడ్గము కలవాడు, సశరః=బాణములతో కూడినవాడు, వామచాపభృత్=ఎడమచేతియందు ధనస్సు ధరించినవాడు అయిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, హృష్టః=సంతోషించినవాడై, రామపాదౌ=రాముని పాదములను, ఉపస్పృశ్య=స్పృశించి, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణుడు సంతోషించుచు యుద్ధసంనద్ధుడై, కవచము తొడుగుకొని, ఎడమచేతిలో ధనస్సు ధరించి, ఖడ్గము, బాణములు తీసికొని రామునకు పాదములు స్పృశించి నమస్కరించి ఇట్లు పలికెను. 25

మూ. అద్య మత్కార్ముకోన్ముక్తాః శరా నిర్భిద్య రావణిమ్,
లఙ్కామభిపతిష్యన్తి హంసాః పుష్కరిణీమివ. 26

ప్ర. అ. అద్య=నేడు, మత్కార్ముకోన్ముక్తాః=నా ధనస్సునుండి విడువబడిన, శరాః=బాణములు, రావణిమ్=ఇంద్రజిత్తును, నిర్భిద్య=భేదించి, హంసాః=హంసలు, పుష్కరిణీమివ=పద్మసరస్సును వలె, లఙ్కామ్=లంకను గూర్చి, అభిపతిష్యన్తి=వెళ్ళిపడగలవు.

తా. ఈనాడు నా ధనస్సునుండి విడువబడిన బాణములు ఇంద్రజిత్తును భేదించి, హంసలు పద్మసరస్సుకు వలె లంక వైపు వెళ్లగలవు. 26

మూ. అద్యైవ తస్య రౌద్రస్య శరీరం మామకాః శరాః,
విధమిష్యన్తి భిత్త్వా తం మహాచాపగుణచ్యుతాః. 27

ప్ర. అ. అద్యైవ=ఇప్పుడే, మహాచాపగుణచ్యుతాః=గొప్పదైన ధనస్సు యొక్క అల్లెత్రాడునుండి జారిన, మామకాః=నాసంబంధమైన, శరాః=బాణములు, రౌద్రస్య=క్రూరుడైన, తస్య=ఆతనియొక్క, శరీరమ్=శరీరమును, భిత్త్వా=ఛేదించి, తమ్=వానిని, విధమిష్యన్తి=ఎగురగొట్టివేయుగలవు.

తా. గొప్ప ధనస్సు నారినుండి బయలుదేరిన నా బాణములు, ఇప్పుడే, క్రూరుడైన ఆ ఇంద్రజిత్తు శరీరమును బ్రద్దలుకొట్టి వానిని ఎగురగొట్టివేయుగలవు.

మూ. ఏవముక్త్వా తు వచనం ద్యుతిమాన్ భ్రాతురగ్రతః,
స రావణివధాకాఙ్క్షీ లక్ష్మణస్త్వరితం యయౌ. 28

ప్ర. అ. ద్యుతిమాన్=కాంతి గల, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, భ్రాతుః=సోదరునియొక్క, అగ్రతః=ఎదుట, ఏవమ్=ఇట్లు, వచనమ్=వచనమును,

ఉక్త్వా=పలికి, రావణివధాకాఙ్క్షీ=ఇంద్రజిత్తు వధను కోరుచు, త్వరితమ్=శీఘ్రముగా, యయౌ=వెళ్లెను.

తా. తేజఃశాలియైన ఆ లక్ష్మణుడు అన్నగారి సమక్షమున ఇట్లు పలికి ఇంద్రజిత్తును చంపవలె నను నిశ్చయముతో శీఘ్రముగా వెళ్లెను. 28

మూ. సోఽభివాద్య గురోః పాదౌ కృత్వా చాపి ప్రదక్షిణమ్,
నికుమ్భిలామభియయౌ చైత్యం రావణిపాలితమ్. 29

ప్ర. అ. సః=ఆ లక్ష్మణుడు, గురోః=అన్నయొక్క, పాదౌ=పాదములను, అభివాద్య=నమస్కరించి, ప్రదక్షిణం చ=ప్రదక్షిణము కూడ, కృత్వా=చేసి, నికుమ్భిలామ్=నికుంభిల అను, రావణిపాలితామ్=ఇంద్రజిత్తుచేత పాలించబడిన, చైత్యమ్=దేవాలయమును గూర్చి, అభియయౌ=వెళ్లెను.

తా. ఆ లక్ష్మణుడు అన్నగారి పాదములకు నమస్కరించి, ప్రదక్షిణము చేసి, ఇంద్రజిత్తుచేత పాలించబడుచున్న నికుంభిల అను దేవాలయమువైపుకు వెళ్లెను. 29

మూ. విభీషణేన సహితో రాజపుత్రః ప్రతాపవాన్,
కృతస్వస్త్యయనో భ్రాత్రా లక్ష్మణస్త్వరితో యయౌ. 30

ప్ర. అ. రాజపుత్రః=రాజపుత్రుడు, ప్రతాపవాన్=ప్రతాపవంతుడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, భ్రాత్రా=సోదరునిచేత, కృతస్వస్త్యయనః=చేయబడిన స్వస్త్యయనము (ఆశీర్వచనాదికము) గలవాడై, విభీషణేన=విభీషణునితో, సహితః=కూడినవాడై, త్వరితః=తొందరపడుచున్నవాడై, యయౌ=వెళ్లెను.

తా. రాజపుత్రుడు, ప్రతాపవంతుడు అయిన లక్ష్మణుడు అన్నగారి ఆశీర్వాదమును పొంది, విభీషణసహితుడై శీఘ్రముగా వెళ్లెను. 30

మూ. వానరాణాం సహస్రైస్తు హనుమాన్ బహుభిర్వృతః,
విభీషణశ్చ సామాత్యో తదా లక్ష్మణమన్వగాత్. 31

ప్ర. అ. తదా=అప్పుడు, వానరాణామ్=వానరులయొక్క, బహుభిః=అనేకమైన, సహస్రైః=సహస్రములతో, వృతః=కూడిన, హనూమాన్=హనుమంతుడు, సామాత్యః=అనుచరులతో కూడిన, విభీషణశ్చ=విభీషణుడు, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, అన్వగాత్=అనుసరించెను.

తా. అప్పుడు ఎన్నో వేలమంది వానరులతో కూడిన హనుమంతుడు, తన అనుచరులతో కూడిన విభీషణుడు లక్ష్మణుని అనుసరించి వెళ్ళిరి. 31

మూ. మహతా హరిసైన్యేన సవేగమభిసంవృతః,
ఋక్షరాజబలం చైవ దదర్శ పథి విష్ఠితమ్. 32

ప్ర. అ. మహతా=గొప్పదైన, హరిసైన్యేన=వానరసైన్యముచేత, సవేగమ్=వేగముతో కూడుకొన్నట్లుగా, అభిసంవృతః=చుట్టూ చేరబడిన, లక్ష్మణుడు, పథి=మార్గమునందు, విష్ఠితమ్=నిలచి ఉన్న, ఋక్షరాజబలం చైవ=జాంబవంతుని సైన్యమును కూడ, దదర్శ=చూచెను.

తా. వేగముగా వచ్చి తన చుట్టూ చేరిన గొప్ప వానరసైన్యముతో కూడిన ఆ లక్ష్మణుడు జాంబవంతుని సైన్యము కూడ మార్గములో నిలచి యుండుట చూచెను. 32

మూ. స గత్వా దూరమధ్వానం సౌమిత్రిర్మిత్రనన్దనః,
రాక్షసేన్ద్రబలం దూరాదపశ్యద్వ్యూహమాశ్రితమ్.

ప్ర. అ. మిత్రనన్దనః=మిత్రులకు ఆనందకరుడైన, సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, దూరమ్=దూరమైన, అధ్వానమ్=మార్గమును, గత్వా=వెళ్లి, దూరాత్=దూరమునుండి, వ్యూహమ్=వ్యూహమును, ఆశ్రితమ్=ఆశ్రయించి ఉన్న, రాక్షసేన్ద్రబలమ్=రావణుని సైన్యమును, అపశ్యత్=చూచెను.

తా. మిత్రులకు ఆనందము కలిగించు లక్ష్మణుడు చాల దూరము వెళ్లి, వ్యూహముగా ఏర్పడియున్న రావణుని సైన్యమును దూరమునుండే చూచెను. 33

మూ. స తం ప్రాప్య ధనుష్పాణిర్మాయాయోగమరిందమః,
తస్థౌ బ్రహ్మవిధానేన విజేతుం రఘునన్దనః. 34

ప్ర. అ. అరిందమః=శత్రుసంహారకుడైన, సః రఘునందనః=ఆ లక్ష్మణుడు, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు కలవాడై, ప్రాప్య=అక్కడికి చేరి, మాయాయోగమ్=మాయాసంబంధము గల, తమ్=ఆ ఇంద్రజిత్తును, బ్రహ్మవిధానేన=బ్రహ్మదేవుడు చెప్పిన విధానముచేత, విజేతుమ్=జయించుటకు, తస్థౌ=నిలచెను.

తా. శత్రుసంహారకుడైన ఆ లక్ష్మణుడు ధనుర్ధరుడై ఆ ప్రదేశమును చేరి, మాయాసంబంధము గల ఆ ఇంద్రజిత్తును బ్రహ్మదేవుడు చెప్పిన విధానము ప్రకారము హోమము జరుగుటకు పూర్వము చంపుటకై నిలచెను.

మూ. విభీషణేన సహితో రాజపుత్రః ప్రతాపవాన్,
అఙ్గదేన చ వీరేణ తథానిలసుతేన చ. 35

ప్ర. అ.. ప్రతాపవాన్=ప్రతాపముగల, రాజపుత్రః=లక్ష్మణుడు, విభీష ణేన=విభీషణునితోను, వీరేణ=వీరుడైన, అఙ్గదేన=అంగదునితోను, తథా=మరియు, అనిలసుతేన చ=హనుమంతునితోను, సహితః=కూడినవాడై, (తస్థౌ=నిలచెను, వెనుకటి శ్లోకముతో అన్వయము).

తా. ప్రతాపవంతుడైన ఆ లక్ష్మణుడు విభీషణునితోను, వీరుడైన అంగదునితోను, హనుమంతునితోను కూడి నిలచెను. 35

మూ. వివిధమమలశస్త్రభాస్వరం త
ద్ధ్వజగహనం గహనం మహారథైశ్చ,
ప్రతిభయతమమప్రమేయవేగం
తిమిరమివ ద్విషతాం బలం వివేశ. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే పఞ్చాశీతితమః సర్గః.

ప్ర. అ. వివిధమ్=అనేకవిధములైనది, అమలశస్త్రభాస్వరమ్=నిర్మలము లైన శస్త్రములచేత ప్రకాశించుచున్నది, ధజగహనమ్=ధ్వజములచేత ప్రవేశింప శక్యముకానిది, మహారథైశ్చ=గొప్పరథములచేత కూడ, గహనమ్=ప్రవేశించ శక్య ముకానిది, ప్రతిభయతమమ్=చాల భయంకరము, అప్రమేయవేగమ్=ఊహింప శక్యముకాని వేగము గలది. తిమిరమివ=అంధకారము వలె ఉన్నదీ అయిన, ద్విషతామ్=శత్రువులయొక్క, బలమ్=సైన్యమును, వివేశ=ప్రవేశించెను.

తా. అక్కడ నున్న శత్రుసైన్యము అనేకవిధములుగా ఉండెను. నిర్మలములైన ఆయుధములతో మెరయుచుండెను. అనేక ధ్వజములతోను, రథములతోను నిండి ఉండుటచేత ప్రవేశించుటకు శక్యము కాకుండ ఉన్న ఆ సైన్యము సాటిలేని వేగముతో చాల భయంకరముగా ఉండెను. అట్టి, చీకటి వలె ఉన్న శత్రుసైన్యములోనికి లక్ష్మణుడు ప్రవేశించెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షడశీతితమః సర్గః

[వానరులకు రాక్షసులకు మధ్య యుద్ధము జరుగుట. హనుమంతుడు రాక్షససైన్యమును సంహరించుట. ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి యుద్ధానికి పిలచుట. లక్ష్మణుడు ఇంద్రజిత్తును చూచుట.]

మూ. అథ తస్యామవస్థాయాం లక్ష్మణం రావణానుజః,
పరేషామహితం వాక్యమర్థసాధకమబ్రవీత్. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణానుజః=విభీషణుడు, తస్యామ్=ఆ, అవస్థాయామ్=పరిస్థితియందు, పరేషామ్=శత్రువులకు, అహితమ్=హితము కానిది, అర్థసాధకమ్=కార్యమును సాధించునది అయిన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట, విభీషణుడు అట్టి పరిస్థితియందు శత్రువులకు హితము కానిది, తమ కార్యమును సాధించునది అయిన వాక్యమును పలికెను. 1

మూ. యదేతద్రాక్షసానీకం మేఘశ్యామం విలోక్యతే,
ఏతదాయోధ్యతాం శీఘ్రం కపిభిశ్చ శిలాయుధైః. 2

ప్ర. అ. మేఘశ్యామమ్=మేఘముల వలె నల్లనైన, యత్=ఏ, ఏతత్=ఈ, రాక్షసానీకమ్=రాక్షససైన్యము, విలోక్యతే=చూడబడుచున్నదో, ఏతత్=ఇది, శిలాయుధైః=శిలలు ఆయుధములుగా గల, కపిభిః=వానరులచేత, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆయోధ్యతామ్=యుద్ధముచేయించబడుగాక.

తా. మేఘముల వలె నల్లనైన ఆ కనబడుచున్న రాక్షససైన్యమును శిలలు ఆయుధములుగా ధరించిన వానరులు తమతో యుద్ధముచేయు నట్లు చేయవలెను. 2

మూ. అస్యానీకస్య మహతో భేదనే యత లక్ష్మణ,
రాక్షసేన్ద్రసుతోఽప్యత్ర భిన్నే దృశ్యో భవిష్యతి. 3

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! మహతః=గొప్పదైన, అస్య అనీకస్య=ఈ సేనయొక్క, భేదనే=భేదించుటయందు, యత=ప్రయత్నించుము. అత్ర=ఈ సైన్యము, భిన్నే=భేదింపబడిన దగుచుండగా, రాక్షసేన్ద్రసుతోఽపి=ఇంద్రజిత్తు కూడ, దృశ్యః భవిష్యతి=కనబడును.

తా. లక్ష్మణా! ఈ సైన్యమును భేదించుటకు ప్రయత్నించుము. ఈ సైన్యము చీల్చివేయబడినచో ఇంద్రజిత్తు కూడ కనబడును. 3

మూ. స త్వమిన్ద్రాశనిప్రఖ్యైః శరైరవకిరన్పరాన్,
అభిద్రవాశు యావద్వై నైతత్కర్మ సమాప్యతే. 4

ప్ర. అ. సః త్వమ్=అట్టి నీవు, ఇన్ద్రాశనిప్రఖ్యైః=ఇంద్రుని వజ్రాయుధముతో సమానములైన, శరైః=బాణములచేత, పరాన్=శత్రువులను, అవకిరన్=చిమ్ముచు, ఏతత్=ఈ, కర్మ=పని, యావత్=ఎంతలో, న సమాప్యతే=సమాప్తి పొందదో అంతలో, ఆశు =శీఘ్రముగా, అభిద్రవ వై=ముందుకు పరుగెత్తుము.

తా. ఈ హోమము పూర్తి అవకుండగనే నీవు ఇంద్రుని వజ్రాయుధముతో సమానములైన బాణాలు శత్రువులపై చిమ్ముచు శీఘ్రముగా ముందుకు నడువుము. 4

మూ. జహి వీర దురాత్మానం మాయాపరమధార్మికమ్,
రావణిం క్రూరకర్మాణం సర్వలోకభయావహమ్. 5

ప్ర. అ. వీర=వీరుడా! దురాత్మానమ్=దురాత్ముడు, మాయాపరమ్=మాయయందు ఆసక్తి గలవాడు; అధార్మికమ్=అధర్మము ఆచరించువాడు, క్రూరకర్మాణమ్=క్రూరమైన పనులు గలవాడు, సర్వలోకభయావహమ్=సకల లోకములకు భయము కలిగించువాడు అయిన, రావణిమ్=ఇంద్రజిత్తును, జహి=చంపుము.

తా. ఓ! వీరుడా! ఈ ఇంద్రజిత్తు దురాత్ముడు; మాయలు ప్రయోగించువాడు; అధర్మమును ఆచరించువాడు; క్రూరములైన పనులు చేయువాడు; అన్ని లోకములకు భయము కలిగించువాడు. అట్టి వీనిని చంపుము.

మూ. విభీషణవచః శ్రుత్వా లక్ష్మణః శుభలక్షణః,
వవర్ష శరవర్షాణి రాక్షసేన్ద్రసుతం ప్రతి. 6

ప్ర. అ. శుభలక్షణః=శుభములైన లక్షణములు గల, లక్ష్మణః=లక్ష్మణుడు, విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, రాక్షసేన్ద్రసుతం ప్రతి=ఇంద్రజిత్తును గూర్చి, శరవర్షాణి=బాణవర్షములను, వవర్ష=వర్షించెను.

తా. శుభలక్షణములు గల లక్ష్మణుడు విభీషణుని మాటలు విని ఇంద్రజిత్తును ఉద్దేశించి బాణవర్షములు వర్షించెను. 6

మూ. ఋక్షాః శాఖామృగాశ్చైవ ద్రుమప్రవరయోధినః,
అభ్యధావన్త సహితాస్తదనీకమవస్థితమ్. 7

ప్ర. అ. ద్రుమప్రవరయోధినః=శ్రేష్ఠములైన వృక్షములతో యుద్ధము చేయు, ఋక్షాః=భల్లూకములు, శాఖామృగాశ్చైవ=వానరములు, సహితాః=కలిసినవారై, అవస్థితమ్=నిలిచి ఉన్న, తత్ అనీకమ్=ఆ సైన్యమును, అభ్యధావన్త=ఎదురుగా పరుగెత్తిరి.

తా. మహావృక్షములతో యుద్ధము చేయు భల్లూకములు, వానరులు, ఒక్కుమ్మడిగా నిలచి యున్న ఆ రాక్షససైన్యముమీదికి పరుగెత్తిరి. 7

మూ. రాక్షసాశ్చ శితైర్బాణైరసిభిః శక్తితోమరైః,
అభ్యవర్తన్త సమరే కపిసైన్యజిఘాంసవః. 8

ప్ర. అ. రాక్షసాః చ=రాక్షసులు కూడ, సమరే=యుద్ధమునందు, కపిసైన్యజిఘాంసవః=వానరసైన్యమును చంప కోరుచున్నవారై, శితైః=వాడియైన, బాణైః=బాణములతోను, అసిభిః=ఖడ్గములతోను, శక్తితోమరైః=శక్తులతోను, తోమరములతోను, అభ్యవర్తన్త=ఎదిరించిరి.

తా. రాక్షసులు కూడ వాడియైన బాణములు, ఖడ్గములు, శక్తులు, తోమరములు ధరించి, యుద్ధమునందు వానరులను చంపుటకై ఎదురుగా నిలచిరి.

మూ. స సంప్రహారస్తుములః సంజజ్ఞే కపిరక్షసామ్,
శబ్దేన మహతా లఙ్కాం నాదయన్వై సమన్తతః. 9

ప్ర. అ. కపిరక్షసామ్=వానరులకు రాక్షసులకు, మహతా=గొప్పదైన, శబ్దేన=శబ్దముచేత, లఙ్కామ్=లంకను, సమన్తతః=అంతటా, నాదయన్వై=ధ్వనింపచేయుచు, సః=ఆ, తుములః=వ్యాకులమైన, సంప్రహారః=యుద్ధము, సంజజ్ఞే=జరిగెను.

తా. వానరులకు రాక్షసులకు మధ్య వ్యాకులమైన యుద్ధము జరిగెను. అప్పుడు బయలుదేరిన గొప్ప శబ్దము లంకానగరమునందు అంతటా వ్యాపించెను. 9

మూ. శస్త్రైశ్చ వివిధాకారైః శితైర్బాణైశ్చ పాదపైః,
ఉద్యతైర్గిరిశృఙ్గైశ్చ ఘోరైరాకాశమావృతమ్. 10

ప్ర. అ. వివిధాకారైః=అనేక విధములైన ఆకారములు గల, శస్త్రైః=ఆయుధములచేతను, శితైః=వాడియైన, బాణైశ్చ=బాణములచేతను, పాదపైః=వృక్షములచేతను, ఉద్యతైః=ఎత్తబడిన, ఘోరైః=భయంకరములైన, గిరిశృఙ్గైశ్చ=పర్వతశి

ఖరములచేతను, ఆకాశమ్=ఆకాశము, ఆవృతమ్=కప్పబడినది.

తా. అనేకవిధములైన ఆకారములు గల ఆయుధములు, వాడియైన బాణాలు, వృక్షాలు, భయంకరములైన ఎగరవేయబడిన శిఖరములు ఆకాశమును కప్పివేసెను. 10

మూ. తే రాక్షసా వానరేషు వికృతాననబాహవః,
నివేశయన్తః శస్త్రాణి చక్రుస్తే సుమహద్భయమ్. 11

ప్ర. అ. వికృతాననబాహవః=వికృతములైన ముఖములు బాహువులు గల, తే రాక్షసాః=ఆ రాక్షసులు, వానరేషు=వానరులయందు, శస్త్రాణి=ఆయుధములను, నివేశయన్తః=పడవేయుచు, తే=వారు, సుమహత్=చాల అధికమైన, భయమ్=భయమును, చక్రుః=చేసిరి.

తా. వికృతములైన ముఖములు, బాహువులు గల ఆ రాక్షసులు వానరులపై ఆయుధములు ప్రయోగించి చాల భయము కలిగించిరి. 11

మూ. తథైవ సకలైర్వృక్షైర్గిరిశృఙ్గైశ్చ వానరాః,
అభిజఘ్నుశ్చ జఘ్నుశ్చ సమరే సర్వరాక్షసాన్. 12

ప్ర. అ. తథైవ=అట్లే, వానరాశ్చ=వానరులు కూడ, సకలైః=సమస్తములైన, వృక్షైః=వృక్షములచేతను, గిరిశృఙ్గైః చ=పర్వత శిఖరములచేతను, సమరే=యుద్ధమునందు, సర్వరాక్షసాన్=అందరు రాక్షసులను, అభిజఘ్నుః=కొట్టిరి; జఘ్నుః చ=చంపిరి.

తా. వానరులు కూడ యుద్ధమునందు వృక్షములను పర్వతశిఖరములను ప్రయోగించి ఆ రాక్షసుల నందరిని కొట్టి చంపిరి. 12

మూ. ఋక్షవానరముఖ్యైశ్చ మహాకాయైర్మహాబలైః,
రక్షసాం యుధ్యమానానాం మహద్భయమజాయత. 13

ప్ర. అ. మహాకాయైః=పెద్ద దేహములు గల, మహాబలైః=గొప్ప బలము గల, ఋక్షవానరముఖ్యైః=భల్లూకనాయకులతోను, వానరనాయకులతోను, యుధ్యమానానామ్=యుద్ధము చేయుచున్న, రక్షసామ్=రాక్షసులకు, మహత్=గొప్ప, భయమ్=భయము, అజాయత=కలిగెను.

తా. పెద్ద దేహములు, గొప్ప బలము గల భల్లూకనాయకులతోను, వానరనాయకులతోను యుద్ధముచేయుచున్న రాక్షసులకు చాల భయము కలిగెను. 13

మూ. స్వమనీకం విషణ్ణం తు శ్రుత్వా శత్రుభిరర్దితమ్,
ఉదతిష్ఠత దుర్ధర్షః స కర్మణ్యననుష్ఠితే. 14

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, సః=ఇంద్రజిత్తు, శత్రుభిః=శత్రువులచేత, అర్దితమ్=పీడింపబడిన, స్వమ్=తనసంబంధమైన, అనీకమ్=సేనను, విషణ్ణమ్=దిగులుచెందినదానినిగా, శ్రుత్వా=విని, కర్మణి=హోమకర్మ, అననుష్ఠితే=చేయబడకుండగానే, ఉదతిష్ఠత=లేచెను.

తా. శత్రువులచేత పీడింపబడిన తన సైన్యము దిగులుచెంది ఉన్నదని విని, ఎదిరింప శక్యము కాని ఆ ఇంద్రజిత్తు హోమము చేయకుండగానే లేచిపోయెను. 14

మూ. వృక్షాన్ధకారాన్నిర్గమ్య జాతక్రోధః స రావణిః,
ఆరురోహ రథం సజ్జం పూర్వయుక్తం సుసంయుతమ్. 15

ప్ర. అ. జాతక్రోధః=పుట్టిన క్రోధము గల, సః=ఆ, రావణిః=ఇంద్రజిత్తు, వృక్షాన్ధకారాత్=వృక్షముల చీకటినుండి, నిర్గమ్య=బైటకు వచ్చి, పూర్వయుక్తమ్=ముందుగానే గుఱ్ఱములు కట్టి ఉన్న, సుసంయుతమ్=బాగుగా కూర్చబడిన, సజ్జమ్=సిద్ధమైన, రథమ్=రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. ఇంద్రజిత్తు కోపించి, వృక్షముల చీకటినుండి బైటకు వచ్చి, ముందుగానే గుఱ్ఱములు కట్టి ఉన్న బాగుగా కూర్చిన, సిద్ధముగా ఉన్న రథమునెక్కెను. 15

మూ. స భీమకార్ముకశరః కృష్ణాఞ్జనచయోపమః,
రక్తాస్యనయనో భీమో బభౌ మృత్యురివాన్తకః. 16

ప్ర. అ. భీమకార్ముకశరః=భయంకరములైన ధనుర్బాణములు గల, కృష్ణాఞ్జనచయోపమః=నల్లని కాటుక ప్రోగుతో సమానుడైన, రక్తాస్యనయనః=ఎఱ్ఱనైన ముఖము నేత్రములు గల, భీమః=భయంకరుడైన, సః=అతడు, అన్తకః=సంహరించు, మృత్యురివ=మృత్యుదేవత వలె, బభౌ=ప్రకాశించెను.

తా. నల్లని కాటుకప్రోగువలె ఉన్న ఆ ఇంద్రజిత్తు భయంకరములైన ధనుర్బాణములు ధరించి ఉండెను. ముఖము కళ్ళు ఎఱ్ఱబారెను. అతడు సంహారము చేయు మృత్యుదేవత వలె భయంకరుడుగా ఉండెను. 16

మూ. దృష్ట్వైవ తు రథస్థం తం పర్యవర్తత తద్బలమ్,
రక్షసాం భీమవేగానాం లక్ష్మణేన యుయుత్సతామ్. 17

ప్ర. అ. రథస్థమ్=రథముమీద నున్న, తమ్=ఆతనిని, దృష్ట్వైవ=చూ

డగానే, లక్ష్మణేన=లక్ష్మణునితో, యుయుత్సతామ్=యుద్ధము చేయదలచుచున్న, భీమవేగానామ్=భయంకరమైన వేగము గల, రక్షసామ్=రాక్షసులయొక్క, తత్ బలమ్=ఆ సైన్యము, పర్యవర్తత=వెనుకకు తిరిగెను.

తా. రథముపై ఉన్న ఆ ఇంద్రజిత్తును చూడగానే భయంకరమైన వేగము గల ఆ రాక్షససైన్యము లక్ష్మణునితో యుద్ధము చేయుటకై వెనుకకు మరలెను. 17

మూ. తస్మిన్ కాలే తు హనూమానుద్యమ్య సుదురాసదమ్,
ధరణీధరసంకాశో మహావృక్షమరిందమః. 18
స రాక్షసానాం తత్సైన్యం కాలాగ్నిరివ నిర్దహన్,
చకార బహుభిర్వృక్షైర్నిఃసంజ్ఞం యుధి వానరః. 19

ప్ర. అ. తస్మిన్ కాలే=ఆ సమయమునందు, ధరణీధరసంకాశః=పర్వతముతో సమానుడు, అరిందమః=శత్రుసంహారకుడు అయిన, హనుమాన్=హనుమంతుడు, సుదురాసదమ్=పొందశక్యముకాని, మహావృక్షమ్=మహావృక్షమును, ఉద్యమ్య=ఎత్తి, రాక్షసానామ్=రాక్షసులయొక్క, తత్=ఆ, సైన్యమ్=సైన్యమును, కాలాగ్నిరివ=ప్రలయకాలాగ్నివలె, నిర్దహన్=దహించుచు, (యుద్ధముచేసెను). సః=ఆ, వానరః=వానరుడు, యుధి=యుద్ధమునందు, బహుభిః=అనేకమైన, వృక్షైః=వృక్షములచేత, నిఃసజ్ఞమ్=సంజ్ఞ లేనిదానినిగా, చకార=చేసెను.

తా. ఆ సమయమునందు పర్వతము వంటి శత్రుసంహారకుడైన హనుమంతుడు ఎదిరింప శక్యము కాని మహావృక్షమును ఎత్తి ప్రలయకాలాగ్ని వలె రాక్షససైన్యమును నశింపచేసెను. అనేకవృక్షములను ప్రయోగించి ఆ హనుమంతుడు సైన్యమును సంజ్ఞ లేనిదానినిగా చేసెను. 18,19

మూ. విధ్వంసయన్తం తరసా దృష్ట్వైవ పవనాత్మజమ్,
రాక్షసానాం సహస్రాణి హనూమన్తమవాకిరన్. 20

ప్ర. అ. రాక్షసానామ్=రాక్షసులయొక్క సహస్రాణి=సహస్రములు, తరసా=బలముచేత, విధ్వంసయన్తమ్=నశింపచేయుచున్న, పవనాత్మజమ్=హనుమంతుణ్ణి, దృష్ట్వైవ=చూడగానే, అవాకిరన్=శూలాదులతో చిమ్మిరి.

తా. సైన్యమును నశింపచేయుచున్న హనుమంతుణ్ణి చూడగానే వేలకొలది రాక్షసులు ఆతనిపై ఆయుధములను ప్రయోగించిరి. 20

మూ. శితశూలధరాః శూలైరసిభిశ్చాసిపాణయః,
శక్తిహస్తాశ్చ శక్తీభిః పట్టిశైః పట్టిశాయుధాః. 21

పరిఘైశ్చ గదాభిశ్చ కున్తైశ్చ శుభదర్శనైః,
శతశశ్చ శతఘ్నీభిరాయసైరపి ముద్గరైః. 22
ఘోరైః పరశుభిశ్చైవ భిన్దిపాలైశ్చ రాక్షసాః,
ముష్టిభిర్వజ్రకల్పైశ్చ తలైరశనిసంనిభైః. 23
అభిజఘ్నుః సమాసాద్య సమన్తాత్ పర్వతోపమమ్,
తేషామపి చ సంక్రుద్ధశ్చకార కదనం మహత్. 24

ప్ర. అ. శితశూలధరాః=వాడియైన శూలములు ధరించినవాళ్ళు, శూలైః=శూలములచేతను, అసిపాణయః=ఖడ్గములు హస్తములందు కలవారు, అసిభిః చ=ఖడ్గములచేతను, శక్తిహస్తాః=శక్తులు హస్తములందు కలవారు, శక్తిభిః చ=శక్తులచేతను, పట్టిశాయుధాః=పట్టిశములు ఆయుధములుగా గలవారు, పట్టిశైః=పట్టిశములచేతను, శుభదర్శనైః=శుభమైన దర్శనము గల, కున్తైః చ=కుంతములచేతను, శతశః=వందలకొలది, శతఘ్నీభిః=శతఘ్నులచేతను, ఆయసైః=ఇనుపవికారమైన, ముద్గరైరపి=ముద్గరములచేతను, ఘోరైః=ఘోరములైన, పరశుభిశ్చైవ=గండ్రగొడ్డళ్ళచేతను, భిన్దిపాలైశ్చ=భిందిపాలములచేతను, వజ్రకల్పైః=వజ్రముతో సమానమైన, ముష్టిభిః=పిడికిళ్ళచేతను, అశనిసంనిభైః=పిడుగుల వంటి, తలైః=అరచేతి దెబ్బలచేతను, పర్వతోపమమ్=పర్వతముతో సమానుడైన హనుమంతుణ్ణి, సమన్తాత్=అన్ని వైపులా, సమాసాద్య=చేరి, అభిజఘ్నుః=కొట్టిరి. సంక్రుద్ధః=కోపించిన ఆ హనుమంతుడు, తేషామ్=ఆ రాక్షసులయొక్క, మహత్=గొప్పదైన, కదనమ్=నాశమును, చకార=చేసెను.

తా. వాడియైన శూలములు ధరించినవాళ్ళు శూలములతోను, ఖడ్గములు చేతులలో ఉన్నవాళ్ళు ఖడ్గాలతోను, శక్తులు చేతులలో ఉన్నవాళ్ళు శక్తులతోను, పట్టిశములు ఆయుధములుగా గలవాళ్ళు పట్టిశములతోను హనుమంతుణ్ణి కొట్టిరి. ఇతరరాక్షసులు కూడ పర్వతము వలె ఉన్న ఆ హనుమంతుని చుట్టూ చేరి పరిఘములతోను, గదలతోను, చూచుటకు అందముగా ఉన్న కుంతములతోను, వందలకొలది శతఘ్నులతోను, ఇనుప ముద్గరములతోను, ఘోరములైన గండ్రగొడ్డళ్ళతోను, భిందిపాలములతోను, వజ్రముల వంటి పిడికిళ్ళతోను, పిడుగులవంటి అరచేతి చరుపులతోను కొట్టిరి. హనుమంతుడు కూడ చాల కోపించి ఎందరో రాక్షసులను చంపివేసెను.

మూ. స దదర్శ కపిశ్రేష్ఠమచలోపమమిన్ద్రజిత్,
సూదమానమసంత్రస్తమమిత్రాన్ పవనాత్మజమ్. 25

ప్ర. అ. సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, కపిశ్రేష్ఠమ్=వానరులలో శ్రేష్ఠుడు, అచలోపమమ్=పర్వతమువలె ఉన్నవాడు, అసంత్రస్తమ్=భయము

లేనివాడు, అమిత్రాన్=శత్రువులను, సూదమానమ్=చంపుచున్నవాడు అయిన, పవనాత్మజమ్=హనుమంతుణ్ణి, దదర్శ=చూచెను.

తా. పర్వతమువంటి ఆకారము గల వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఏమాత్రము భయ మనేది లేక శత్రువులను చంపివేయుచుండెను. అట్టి హనుమంతుణ్ణి ఇంద్రజిత్తు చూచెను. 25

మూ. స సారథిమువాచేదం యాహి యత్రైష వానరః,
క్షయమేవ హి నః కుర్యాద్రాక్షసానాముపేక్షితః. 26

ప్ర. అ. సః=అతడు, సారథిమ్=సారథిని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను. ఏషః=ఈ, వానరః=వానరుడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, యాహి=వెళ్లుము. ఉపేక్షితః=ఉపేక్షించబడినవాడై, నః=మనయొక్క, రాక్షసానామ్=రాక్షసులయొక్క, క్షయమ్=క్షయమును, కుర్యాదేవ హి=తప్పక చేసివేయును కదా ?

తా. అతడు సారథితో ఇట్లు పలికెను- "ఆ వానరు డున్నచోటికి రథము తీసికొని వెళ్ళుము. ఇతనిని ఉపేక్షించినచో మన రాక్షసుల నందరినీ నశింపచేయును." 27

మూ. ఇత్యుక్తః సారథిస్తేన యయౌ యత్ర స మారుతిః,
వహన్ పరమదుర్ధర్షం స్థితమిన్ద్రజితం రథే. 27

ప్ర. అ. తేన=వానిచేత, ఇతి=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సారథిః=సారథి, రథే=రథమునందు, స్థితమ్=ఉన్న, పరమదుర్ధర్షమ్=మిక్కిలి ఎదిరింప శక్యముకాని, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, వహన్=తీసికొనిపోవుచు, మారుతిః=హనుమంతుడు, యత్ర=ఎక్కడ ఉండెనో అక్కడికి, యయౌ=వెళ్లెను.

తా. సారథి ఆ ఇంద్రజిత్తు మాటలు విని, ఏ మాత్రము ఎదిరింప శక్యము కాని ఆ ఇంద్రజిత్తును రథమునందు కూర్చుండబెట్టుకొని హనుమంతుడున్న చోటికి వెళ్లెను. 27

మూ. సోఽభ్యుపేత్య శరాన్ ఖడ్గాన్ పట్టిశాసిపరశ్వధాన్,
అభ్యవర్షత దుర్ధర్షః కపిమూర్ధని రాక్షసః. 28

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యముకాని, సః రాక్షసః=ఆ రాక్షసుడు, అభ్యుపేత్య=సమీపించి, కపిమూర్ధని=హనుమంతుని శిరస్సుపై, శరాన్=బాణములను, ఖడ్గాన్=ఖడ్గములను, పట్టిశాసిపరశ్వధాన్=పట్టిశములను, చిన్న కత్తులను, గండ్రగొడ్డళ్లను, అభ్యవర్షత=వర్షించెను.

తా. ఎదిరింప శక్యముకాని ఆ ఇంద్రజిత్తు హనుమంతునికి దగ్గరగా వెళ్ళి ఆతని శిరస్సుపై బాణములు, ఖడ్గములు, పట్టిశములు, చిన్న కత్తులు, గండ్రగొడ్డళ్లు కురిపించెను. 28

మూ. తాని శస్త్రాణి ఘోరాణి ప్రతిగృహ్యా స మారుతిః,
రోషేణ మహతావిష్టో వాక్యం చేదమువాచ హ. 29

ప్ర. అ. సః మారుతిః=ఆ హనుమంతుడు, ఘోరాణి=భయంకరములైన, తాని శస్త్రాణి=ఆ ఆయుధములను, ప్రతిగృహ్యా=స్వీకరించి, మహతా=గొప్ప, రోషేణ=రోషముతో, ఆవిష్టః=కూడినవాడై, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, ఉవాచ =పలికెను.

తా. హనుమంతుడు భయంకరములైన ఆ ఆయుధములన్నీ గ్రహించి గొప్ప కోపావేశముతో ఇట్లు పలికెను. 29

మూ. యుధ్యస్వ యది శూరోఽసి రావణాత్మజ దుర్మతే,
వాయుపుత్రం సమాసాద్య న జీవన్ ప్రతియాస్యసి. 30

ప్ర. అ. దుర్మతే=దుష్టబుద్ధి గల, రావణాత్మజ=రావణకుమారా !శూరః=శూరుడవు, అసి యది=అయినట్లయితే, యుధ్యస్వ=యుద్ధముచేయుము. వాయుపుత్రమ్=హనుమంతుణ్ణి, సమాసాద్య=పొంది, జీవన్=జీవించుచున్నవాడవై, న ప్రతియాస్యసి=తిరిగి వెళ్లవు.

తా. దుష్టబుద్ధివైన ఓ ! ఇంద్రజిత్తూ ! శూరుడవైతే యుద్ధము చేయుము. హనుమంతుని దగ్గరకు వచ్చిన తరువాత ఇంక ప్రాణాలతో వెనుకకు వెళ్లవు. 30

మూ. బాహుభ్యాం సంప్రయుధ్యస్వ యది మే ద్వన్ద్వమాహవే,
వేగం సహస్వ దుర్బుద్ధే తతస్త్వం రక్షసాం వరః. 31

ప్ర. అ. దుర్బుద్ధే=దుర్బుద్ధి కలవాడా ! మే=నాకు, ద్వన్ద్వమ్=ద్వంద్వ యుద్ధమును, (ప్రయచ్ఛసి) యది=(ఇచ్చి) నట్లయితే, బాహుభ్యామ్=బాహువులతో, సంప్రయుధ్యస్వ=యుద్ధముచేయుము. ఆహవే=యుద్ధమునందు, వేగమ్=నా వేగ మును, సహస్వ=సహించుము. తతః=అటుపిమ్మట, త్వమ్=నీవు, రక్షసామ్= రాక్షసులలో, వరః=శ్రేష్ఠుడవు.

తా. ఓ ! దుర్బుద్ధీ ! నీవు నాతో ద్వంద్వయుద్ధము చేయకలిగినచో బాహుయుద్ధము చేసి నా వేగమును తట్టుకొనుము. అప్పుడు నీవు రాక్షసులలో శ్రేష్ఠుడవుగా పరిగణింపబడగలవు. 31

మూ. హనూమన్తం జిఘాంసన్తం సముద్యతశరాసనమ్,
రావణాత్మజమాచష్టే లక్ష్మణాయ విభీషణః. 32

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, సముద్యతశరాసనమ్=ఎత్తబడిన ధనస్సు గల, రావణాత్మజమ్=ఇంద్రజిత్తును, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, జిఘాంసన్తమ్=చంపదలచుచున్నవానినిగా, లక్ష్మణాయ=లక్ష్మణునకు, ఆచష్టే=చెప్పెను.

తా. అప్పుడు విభీషణుడు లక్ష్మణునితో - "ధనస్సు ఎత్తి వచ్చుచున్న ఈ ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి చంపుటకు ఉద్యమించుచున్నాడు" అని లక్ష్మణునితో చెప్పెను. 32

మూ. యః స వాసవనిర్జేతా రావణస్యాత్మసంభవః,
స ఏష రథమాస్థాయ హనూమన్తం జిఘాంసతి. 33

ప్ర. అ. వాసవనిర్జేతా=ఇంద్రుణ్ణి జయించిన, సః=ప్రసిద్ధుడైన, యః=ఏ, రావణస్య ఆత్మసంభవః=రావణపుత్రుడు కలడో, సః ఏషః=ఆ ఇతడు, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, జిఘాంసతి=చంపదలచుచున్నాడు.

తా. ఇంద్రుణ్ణి జయించిన ఈ ఇంద్రజిత్తు రథముపై ఎక్కి వచ్చి హనుమంతుణ్ణి చంపవలె నని చూచుచున్నాడు. 33

మూ. తమప్రతిమసంస్థానైః శరైః శత్రునివారణైః,
జీవితాన్తకరైర్ఘోరైః సౌమిత్రే రావణిం జహి. 34

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! అప్రతిమసంస్థానైః=సాటిలేని ఆకారము గల, శత్రునివారణైః=శత్రువులను నివారించు, జీవితాన్తకరైః=జీవితమును అంతముచేయు, ఘోరైః=ఘోరములైన, శరైః=బాణములచేత, తమ్=ఆ, రావణిమ్=ఇంద్రజిత్తును, జహి=చంపుము.

తా. లక్ష్మణా ! సాటిలేని ఆకారము గలవి, శత్రువులను నివారించునవి, జీవితమును అంతమొందించునవి, ఘోరములు అయిన శరములచేత ఇంద్రజిత్తును చంపుము. 34

మూ. ఇత్యేవముక్తస్తు తదా మహాత్మా
విభీషణేనారివిభీషణేన,
దదర్శ తం పర్వతసంనికాశం
రథస్థితం భీమబలం దురాసదమ్. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే షడశీతితమః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, అరివిభీషణేన=శత్రువులకు భయంకరుడైన, విభీషణేన=విభీషణునిచేత, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మహాత్మా=మహాత్ముడైన లక్ష్మణుడు, పర్వతసంనికాశమ్=పర్వతముతో సమానుడు, రథస్థితమ్=రథమునందున్నవాడు, భీమబలమ్=భయంకరమైన బలము గలవాడు, దురాసదమ్=సమీపింప శక్యము కానివాడు అయిన, తమ్=వానిని, దదర్శ=చూచెను.

తా. అప్పుడు శత్రుభయంకరుడైన విభీషణుని మాటలు విని మహాత్ముడైన లక్ష్మణుడు పర్వతముతో సమానుడు, రథమునందున్నవాడు, భయంకరమైన బలము గలవాడు, సమీపింప శక్యము కానివాడు అయిన ఇంద్రజిత్తును చూచెను. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తాశీతితమః సర్గః

[ఇంద్రజిద్విభీషణులు పరస్పరము కోపముతో మాటలాడుకొనుట.]

మూ. ఏవముక్త్వా తు సౌమిత్రిం జాతహర్షో విభీషణః,
ధనుష్పాణిం తమాదాయ త్వరమాణో జగామ సః. 1

ప్ర. అ. సః విభీషణః=ఆ విభీషణుడు, సౌమిత్రిమ్=లక్ష్మణుని గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, జాతహర్షః=పుట్టిన సంతోషము గలవాడై, ధనుష్పాణిమ్=ధనస్సు హస్తమునందు గల, తమ్=ఆతనిని, ఆదాయ=తోడ్కొని, త్వరమాణః=తొందరపడుచు, జగామ=వెళ్లెను.

తా. విభీషణుడు లక్ష్మణునితో ఇట్లు పలికి, ధనస్సు ధరించి ఉన్న ఆతనిని తోడ్కొని, సంతోషించుచు తొందరపడుచు వెళ్లెను. 1

మూ. అవిదూరం తతో గత్వా ప్రవిశ్య తు మహద్వనమ్,
ఆదర్శయత తత్కర్మ లక్ష్మణాయ విభీషణః. 2

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, తతః=అక్కడినుండి, అవిదూరమ్=కొంచెము దూరము, గత్వా=వెళ్ళి, మహత్=గొప్ప, వనమ్=వనమును, ప్రవిశ్య=ప్రవేశించి, లక్ష్మణాయ=లక్ష్మణునకు, తత్=ఆ, కర్మ=పనిని, ఆదర్శయత=చూపెను.

తా. విభీషణుడు అక్కడినుండి కొంచెము దూరము వెళ్ళి పెద్ద వనములో ప్రవేశించి అక్కడ ఆ కర్మను (హోమమును) లక్ష్మణునకు చూపెను. 2

మూ. నీలజీమూతసంకాశం న్యగ్రోధం భీమదర్శనమ్,
తేజస్వీ రావణభ్రాతా లక్ష్మణాయ న్యవేదయత్. 3

ప్ర. అ. తేజస్వీ=తేజస్సు గల, రావణభ్రాతా=విభీషణుడు, లక్ష్మణాయ=లక్ష్మణునకు, నీలజీమూతసంకాశమ్=నల్లని మేఘముతో సమానమైన, భీమదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, న్యగ్రోధమ్=మఱ్ఱిచెట్టును, లక్ష్మణాయ=లక్ష్మణునకు, న్యవేదయత్=చూపెను.

తా. తేజఃశాలియైన విభీషణుడు నల్లని మేఘము వలె ఉన్న చూచుటకు భయంకరమైన మఱ్ఱిచెట్టును లక్ష్మణునకు చూపెను. 3

మూ. ఇహోపహారం భూతానాం బలవాన్ రావణాత్మజః,
ఉపహృత్య తతః పశ్చాత్సంగ్రామమభివర్తతే. 4

ప్ర. అ. బలవాన్=బలవంతుడైన, రావణాత్మజః=ఇంద్రజిత్తు, ఇహ= ఇక్కడ, భూతానామ్=భూతములకు, ఉపహారమ్=బలిని, ఉపహృత్య=సమర్పించి, పశ్చాత్=పిమ్మట, సంగ్రామమ్=యుద్ధమును గూర్చి, అభివర్తతే=వెళ్లుచుండును.

తా. బలవంతుడైన ఇంద్రజిత్తు ఇక్కడనే భూతములకు బలి సమర్పించి పిమ్మట యుద్ధానికి బయలుదేరుచుండును. 4

మూ. అదృశ్యః సర్వభూతానాం తతో భవతి రాక్షసః,
నిహన్తి సమరే శత్రూన్ బధ్నాతి చ శరోత్తమైః. 5

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసః=రాక్షసుడు, సర్వభూతానామ్=సకలప్రాణులకు, అదృశ్యః=కనబడనివాడు, భవతి=అగును. సమరే=యుద్ధమునందు, శత్రూన్=శత్రువులను, నిహన్తి=చంపును; శరోత్తమైః=శ్రేష్ఠములైన బాణములచేత, బధ్నాతి=బంధించును.

తా. అటుపిమ్మట ఈ రాక్షసుడు ఏ ప్రాణికీ కనబడడు. శత్రువులను యుద్ధములో సంహరించుచుండును; శ్రేష్ఠములైన బాణములచేత బంధించుచుండును. 5

మూ. తమప్రవిష్టం న్యగ్రోధం బలినం రావణాత్మజమ్,
విధ్వంసయ శరైర్దీప్తైః సరథం సాశ్వసారథిమ్. 6

ప్ర. అ. న్యగ్రోధమ్=మఱ్ఱిచెట్టును, అప్రవిష్టమ్=ప్రవేశించని, బలినమ్=బలవంతుడైన, సరథమ్=రథముతో కూడిన, సాశ్వసారథిమ్=అశ్వములతోను సారథితోను కూడిన, తమ్=ఆ, రావణాత్మజమ్=ఇంద్రజిత్తును, దీప్తైః=ప్రజ్వలించుచున్న, శరైః=బాణములచేత, విధ్వంసయ=నశింపచేయుము.

తా. బలవంతుడైన ఆ ఇంద్రజిత్తు మఱ్ఱిచెట్టును ప్రవేశించకుండగనే వానిని రథముతోను, అశ్వములతోను, సారథితోను సహా ప్రజ్వలించుచున్న శరములచేత చంపివేయుము. 6

మూ. తథేత్యుక్త్వా మహాతేజాః సౌమిత్రిర్మిత్రనన్దనః,
బభూవావస్థితస్తత్ర చిత్రం విస్ఫారయన్ ధనుః. 7

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, మిత్రనన్దనః=మిత్రులను ఆనందింపచేయు, సౌమిత్రిః=లక్ష్మణుడు, తథేతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, చిత్రమ్=చిత్రమైన, ధనుః=ధనుస్సును, విస్ఫారయన్=చరచుచు, తత్ర=అక్కడ,

అవస్థితః=నిలచినవాడై, బభూవ=ఉండెను.

తా. గొప్ప తేజస్సు గల, మిత్రులకు ఆనందము కలిగించు లక్ష్మణుడు అట్లే అని పలికి, చిత్రమైన ధనస్సును చరచుచు అక్కడ నిలచెను. 7

మూ. స రథేనాగ్నివర్ణేన బలవాన్ రావణాత్మజః,
ఇన్ద్రజిత్కవచీ ఖడ్గీ సధ్వజః ప్రత్యదృశ్యత. 8

ప్ర. అ. బలవాన్=బలవంతుడు, రావణాత్మజః=రావణుని కుమారుడు, కవచీ=కవచము గలవాడు, ఖడ్గీ=ఖడ్గము కలవాడు, సధ్వజః=ధ్వజముతో కూడినవాడు అయిన, సః=ఆ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, అగ్నివర్ణేన=అగ్నివంటి వర్ణము గల, రథేన=రథముతో, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. బలవంతుడు, రావణుని పుత్రుడు, కవచమును ఖడ్గమును ధరించినవాడు, ధ్వజముతో కూడినవాడు అయిన ఇంద్రజిత్తు అగ్నివంటి వర్ణము గల రథముమీద కనబడెను. 8

మూ. తమువాచ మహాతేజాః పౌలస్త్యమపరాజితమ్,
సమాహ్వాయే త్వాం సమరే సమ్యగ్యుద్ధం ప్రయచ్ఛ మే. 9

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల లక్ష్మణుడు, అపరాజితమ్=పరాజితుడు కాని, తమ్=ఆ, పౌలస్త్యమ్=పులస్త్యవంశమునందు పుట్టిన ఇంద్రజిత్తును గూర్చి, ఉవాచ=పలికెను. త్వామ్=నిన్ను, సమరే=యుద్ధమునందు, సమాహ్వాయే=పిలచుచున్నాను. సమ్యక్=బాగుగా, మే=నాకు, యుద్ధమ్=యుద్ధమును, ప్రయచ్ఛ=ఇమ్ము.

తా. గొప్ప తేజస్సు గల లక్ష్మణుడు ఎన్నడూ పరాజయ మెరుగని ఇంద్రజిత్తుతో - "నిన్ను యుద్ధానికి పిలచుచున్నాను, నాకు బాగుగా యుద్ధము ఇమ్ము" అని పలికెను. 9

మూ. ఏవముక్తో మహాతేజా మనస్వీ రావణాత్మజః,
అబ్రవీత్పరుషం వాక్యం తత్ర దృష్ట్వా విభీషణమ్. 10

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మనస్వీ=ఉత్తమమైన మనస్సుగల, రావణాత్మజః=ఇంద్రజిత్తు, తత్ర=అక్కడ, విభీషణమ్=విభీషణుని, దృష్ట్వా=చూచి, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణు డిట్లు పలుకగా, గొప్ప తేజస్సు, పౌరుషము గల ఇంద్రజిత్తు అక్కడ ఉన్న విభీషణుని చూచి పరుషమైన వాక్యము పలికెను.10

మూ. ఇహ త్వం జాతసంవృద్ధః సాక్షాద్భ్రాతా పితుర్మమ,
కథం ద్రుహ్యసి పుత్రస్య పితృవ్యో మమ రాక్షస. 11

ప్ర. అ. రాక్షస=ఓ ! రాక్షసుడా ! త్వమ్=నీవు, ఇహ=ఇక్కడ, జాతసంవృద్ధః=పుట్టి పెరిగినావు. మమ=నాయొక్క, పితుః=తండ్రికి, సాక్షాత్=సాక్షాత్తు, భ్రాతా=సోదరుడవు. మమ=నాకు, పితృవ్యః=పినతండ్రివి. పుత్రస్య=పుత్రునకు, కథమ్=ఎట్లు, ద్రుహ్యసి=ద్రోహము చేయుచున్నావు?

తా. ఓ ! రాక్షసుడా ! నీవు ఇక్కడ పుట్టి పెరిగినావు. నా తండ్రికి సాక్షాత్తు సోదరుడవు. నాకు పినతండ్రివి. అట్టి నీవు నీ పుత్రునకే ఎట్లు ద్రోహము చేయుచున్నావు?

మూ. న జ్ఞాతిత్వం న సౌహార్దం న జాతిస్తవ దుర్మతే,
ప్రమాణం న చ సౌదర్యం న ధర్మో ధర్మదూషణ. 12

ప్ర. అ. దుర్మతే=చెడ్డ బుద్ధి గలవాడా ! ధర్మదూషణ=ధర్మమును దూషించిన వాడా ! తవ=నీకు, జ్ఞాతిత్వమ్=జ్ఞాతిత్వము, న ప్రమాణమ్=ప్రమాణము కాదు. సౌహార్దమ్=స్నేహము, న=కాదు. జాతిః=జాతి, న=కాదు. సౌదర్యమ్=సోదరత్వము, న=కాదు. ధర్మః=ధర్మము, న=కాదు.

తా. ఓ ! దుర్మతీ ! ధర్మమును దూషించినవాడా ! నీవు జ్ఞాతులను విషయమును గాని, స్నేహమును గాని, జాతిని గాని, సోదరత్వమును కాని, ధర్మమును కాని లెక్కచేయక ప్రవర్తించుచున్నావు. 12

మూ. శోచ్యస్త్వమసి దుర్బుద్ధే నిన్దనీయశ్చ సాధుభిః,
యస్త్వం స్వజనముత్సృజ్య పరభృత్యత్వమాగతః. 13

ప్ర. అ. దుర్బుద్ధే=చెడ్డ బుద్ధి గలవాడా ! త్వమ్=నీవు, శోచ్యః=జాలిపడదగినవాడవుగాను, సాధుభిః=సత్పురుషులచేత, నిన్దనీయశ్చ=నిందింపదగినవాడవుగాను, అసి=అయివున్నావు, యః త్వమ్=ఏ నీవు, స్వజనమ్=స్వజనమును, ఉత్సృజ్య=విడచి, పరభృత్యత్వమ్=పరుల భృత్యత్వమును, ఆగతః=పొందినావో.

తా. ఓ ! దుర్బుద్ధీ ! స్వజనమును విడచి పరులకు భృత్యుడవైన నిన్ను చూచి జాలి పడవలెను ! సత్పురుషులు నిన్ను నిందింతురు. 13

మూ. నైతచ్ఛిథిలయా బుద్ధ్యా త్వం వేత్సి మహదన్తరమ్,
క్వ చ స్వజనసంవాసః క్వ చ నీచపరాశ్రయః. 14

ప్ర. అ. స్వజనసంవాసః=స్వజనులతో నివాసము, క్వ చ=ఎక్కడ, నీచపరాశ్రయః=నీచులైన పరుల ఆశ్రయము, క్వ చ=ఎక్కడ? ఏతత్=ఈ,

మహత్=గొప్పదైన, అన్తరమ్=భేదమును, త్వమ్=నీవు, శిథిలయా=శిథిలమైన, బుద్ధ్యా=బుద్ధితో, న వేత్సి=తెలిసికొనుటలేదు.

తా. నీ బుద్ధి అల్పమైనది. అందుచేతనే ఇంత గొప్ప తారతమ్యమును నీవు తెలిసికొనుటలేదు. స్వజనులతో కలిసి నివాసమెక్కడ, నీచులైన పరులను ఆశ్రయించుట ఎక్కడ ! 14

మూ. గుణవాన్వా పరజనః స్వజనో నిర్గుణోఽపి వా,
నిర్గుణః స్వజనః శ్రేయాన్ యః పరః పర ఏవ సః. 15

ప్ర. అ. పరజనః=శత్రుజనము, గుణవాన్వా=గుణములు కలదే కావచ్చును. స్వజనః=స్వజనము, నిర్గుణోపి వా=గుణములు లేనిది కావచ్చును. నిర్గుణః=గుణములు లేని, స్వజనః=స్వజనము, శ్రేయాన్=మంచిది. యః=ఎవడు, పరః=పరుడో, సః=అతడు, పర ఏవ హి=పరుడే కదా !

తా. శత్రువులు గుణవంతులే కావచ్చును, తనవాళ్ళు గుణరహితులే కావచ్చును. గుణములు లేకపోయినను స్వజనమే మేలు. పరుడు ఎప్పటికీ పరుడే కదా ? 15

మూ. యః స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే,
స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చాత్తైరేవ హన్యతే. 16

ప్ర. అ. యః=ఎవడు, స్వపక్షమ్=తన పక్షమును, పరిత్యజ్య=విడచి, పరపక్షమ్=పరుల పక్షమును, నిషేవతే=సేవించునో, సః=అతడు, స్వపక్షే=తన పక్షము, క్షయమ్=క్షయమును, ప్రాప్తే=పొందిన దగుచుండగా, పశ్చాత్=పిమ్మట, తైరేవ=వాళ్ళచేతనే, హన్యతే=చంపబడును.

తా. తన పక్షమును విడచి పరుల పక్షములో చేరినవానిని, వాని స్వపక్షమువారు నశించిన పిమ్మట ఆ పరపక్షమువారు చంపివేయుదురు. 16

మూ. నిరనుక్రోశతా చేయం యాదృశీ తే నిశాచర,
స్వజనేన త్వయా శక్యం పౌరుషం రావణానుజ. 17

ప్ర. అ. రావణానుజ=రావణుని తమ్ముడవైన, నిశాచర=రాక్షసుడా ! తే=నీయొక్క, ఇయమ్=ఈ, యాదృశీ=ఎట్టి, నిరనుక్రోశతా=జాలి లేకపోవుట అనునది కలదో, పౌరుషమ్=ఇట్టి పౌరుషము, స్వజనేన=బంధువైన, త్వయా=నీచేతనే, శక్యమ్=శక్యమైనది.

తా. రావణుని తమ్ముడవైన ఓ ! రాక్షసుడా ! నీవు లక్ష్మణుని ఇక్కడికి తీసికొని వచ్చుట అనే జాలిలేని పని చేసినావు. ఇట్టి పౌరుషము

జ్ఞాతివైన నీవే చేయగలవు !

మూ. ఇత్యుక్తో భ్రాతృపుత్రేణ ప్రత్యువాచ విభీషణః,
అజానన్నివ మచ్ఛీలం కిం రాక్షస వికత్థసే. 18

ప్ర. అ. భ్రాతృపుత్రేణ=సోదరుని కుమారునిచేత, ఇతి=ఇట్లు, ఉక్తః=పల కబడిన, విభీషణః=విభీషణుడు, ప్రత్యువాచ=తిరిగి పలికెను. రాక్షస=రాక్షసుడా ! మచ్ఛీలమ్=నా స్వభావమును, అజానన్నివ=ఎరుగని వాడవు వలె, కిమ్=ఎందుకు, వికత్థసే=గర్వము చూపుచున్నావు ?

తా. సోదరుని కుమారుడైన ఇంద్రజిత్తు పలికిన పలుకులు విని విభీషణుడు ఇట్లు పలికెను. ఓ !రాక్షసుడా ! నా స్వభావము ఎట్టిదో తెలియనివాడవు వలె ఎందుకు గర్వము చూపుచున్నావు? 18

మూ. రాక్షసేన్ద్రసుతాసాధో పారుష్యం త్యజ గౌరవాత్,
కులే యద్యప్యహం జాతో రక్షసాం క్రూరకర్మణామ్. 19
గుణో యః ప్రథమో నృణాం తన్మే శీలమరాక్షసమ్.

ప్ర. అ. అసాధో=చెడ్డవాడా! రాక్షసేన్ద్రసుత=రావణకుమారా! గౌరవాత్=గౌరవమువలన, పారుష్యమ్=పరుషత్వమును, త్యజ=విడువుము. అహమ్=నేను, క్రూరకర్మణామ్=క్రూరమైన కర్మలుగల, రక్షసామ్=రాక్షసులయొక్క, కులే=కులము నందు, జాతః యద్యపి=పుట్టినవాడనైనను, నృణామ్=మానవులయొక్క, యః=ఏ, ప్రథమః=ఉత్తమమైన, గుణః=గుణము గలదో, తత్=అదే, మే=నాయొక్క, అరాక్షసమ్=రాక్షసులకు సంబంధించని, శీలమ్=శీలము.

తా. చెడ్డవాడవైన ఓ ! ఇంద్రజిత్తూ ! పినతండ్రి ననే గౌరవముచేతనైనా పరుషత్వమును విడిచిపెట్టుము. నేను క్రూరకర్మలు చేయు రాక్షసుల కులమునందు పుట్టినాను. అయినను మానవులకు ఏది ఉత్తమగుణమో అట్టి రాక్షసప్రకృతివిరుద్ధమైన శీలమే నా శీలము. 19

మూ. న రమే దారుణేనాహం న చాధర్మేణ వై రమే, 20
భ్రాత్రా విషమశీలోఽపి కథం భ్రాతా నిరస్యతే.

ప్ర. అ. అహమ్=నేను, దారుణేన=క్రూరకృత్యముచేత, న రమే=సంతోషించను. అధర్మేణ చ=అధర్మముచేత కూడ, న రమే వై=సంతోషించను. విషమశీలోఽపి=చెడ్డ స్వభావము కలవాడైనను, భ్రాతా=సోదరుడు, భ్రాత్రా=సోదరునిచేత, కథమ్=ఎట్లు, నిరస్యతే=విడువబడును?

తా. నాకు దారుణకృత్యములు ఇష్టములు కావు; అధర్మము

ఇష్టము కాదు. ఎంత విషమమైన స్వభావ మున్నను సోదరుణ్ణి సోదరుడు పరిత్యజించునా? (నీ తండ్రి అట్లు నన్ను విడచినాడు). 20

మూ. ధర్మాత్ప్రచ్యుతశీలం హి పురుషం పాపనిశ్చయమ్, 21
త్యక్త్వా సుఖమవాప్నోతి హస్తాదాశీవిషం యథా.

ప్ర. అ. ధర్మాత్=ధర్మమునుండి, ప్రచ్యుతశీలమ్=భ్రష్టమైన శీలము గల, పాపనిశ్చయమ్=పాపనిశ్చయము గల, పురుషమ్=పురుషుణ్ణి, హస్తాత్=చేతి నుండి, ఆశీవిషం యథా=సర్పమును వలె, త్యక్త్వా=విడచి, సుఖమ్=సుఖమును, అవాప్నోతి=పొందును.

తా. ధర్మభ్రష్టమైన శీలముతో పాపనిశ్చయము గల పురుషుణ్ణి, చేతిలో ఉన్న పామును విడిచిపెట్టినట్లు, విడచినవాడు సుఖము పొందును. 21

మూ. పరస్వహరణే యుక్తం పరదారాభిమర్శకమ్, 22
త్యాజ్యమాహుర్దురాత్మానం వేశ్మ ప్రజ్వలితం యథా.

ప్ర. అ. పరస్వహరణే=పరుల ధనమును హరించుటయందు, యుక్తమ్=ఆసక్తుడు, పరదారాభిమర్శకమ్=పరభార్యలను స్పృశించువాడు అయిన, దురాత్మానమ్=దురాత్ముణ్ణి, ప్రజ్వలితమ్=మండుచున్న, వేశ్మ యథా=గృహమును వలె, త్యాజ్యమ్=విడువదగినవానినిగా, ఆహుః=చెప్పుదురు.

తా. పరుల ధనమును హరించుటయందు ఆసక్తుడై, పరభార్యలను స్పృశించు దురాత్ముణ్ణి, మండిపోవుచున్న ఇంటిని వలె, విడిచివేయవలె నని పెద్దలు చెప్పుదురు. 22

మూ. పరస్వానాం చ హరణం పరదారాభిమర్శనమ్, 23
సుహృదామతిశఙ్కా చ త్రయో దోషాః క్షయావహాః.

ప్ర. అ. పరస్వానామ్=పరధనములయొక్క, హరణమ్=హరణము, పరదారాభిమర్శనమ్=పరభార్యాస్పర్శనము, సుహృదామ్=స్నేహితులయొక్క, అతి శఙ్కా చ=ఎక్కువ శంకించుట, త్రయః=మూడు, దోషాః=దోషములు, క్షయావహాః=క్షయము కలిగించును.

తా. పరధనమును హరించుట, పరభార్యలను స్పృశించుట, మంచి హృదయము గల వారిని ఎక్కువ శంకించుట ఈ మూడు దోషములు వినాశమును కలిగించును. 23

మూ. మహర్షీణాం వధో ఘోరః సర్వదేవైశ్చ విగ్రహః, 24
అభిమానశ్చ రోషశ్చ వైరిత్వం ప్రతికూలతా,

ఏతే దోషా మమ భ్రాతుర్జీవితైశ్వర్యనాశనాః, 25
గుణాన్ ప్రచ్ఛాదయామాసుః పర్వతానివ తోయదాః.

ప్ర. అ. మహర్షీణామ్=మహర్షులయొక్క, ఘోరః=ఘోరమైన, వధః=వధ, సర్వదేవైః=సకలదేవతలతో, విగ్రహః చ=విరోధము, అభిమానశ్చ=అహంకారము, రోషః చ=రోషము, వైరిత్వం చ=శత్రుత్వము, ప్రతికూలతా=ప్రతికూలత్వము అను, జీవితైశ్వర్యనాశనాః=జీవితమును ఐశ్వర్యమును నశింపచేయు, ఏతే=ఈ, దోషాః= దోషములు, మమ=నాయొక్క, భ్రాతుః=సోదరునియొక్క, గుణాన్=గుణములను, తోయదాః=మేఘములు, పర్వతానివ=పర్వతములను వలె, ప్రచ్ఛాదయామాసుః=కప్పివేసినవి.

తా. మహర్షులను క్రూరముగా చంపివేయుట, దేవతలందరితోను విరోధము, అహంకారము, రోషము, శత్రుత్వము, ప్రతికూలత్వము అను జీవితమును, ఐశ్వర్యమును నశింపచేయు ఈ దోషములు నా సోదరుని గుణాలను, మేఘములు పర్వతాలను కప్పివేసినట్లు కప్పివేసినవి. 24, 25

మూ. దోషైరేతైః పరిత్యక్తో మయా భ్రాతా పితా తవ, 26
నేయమస్తి పురీ లఙ్కా న చ త్వం న చ తే పితా.

ప్ర. అ. తవ=నీ యొక్క, పితా=తండ్రి ఐన, భ్రాతా=నా సోదరుడు, ఏతైః=ఈ, దోషైః=దోషములచేత, మయా=నాచేత, పరిత్యక్తః=విడవబడినాడు. ఇయమ్=ఈ, లఙ్కా పురీ=లంకాపట్టణము, న అస్తి=లేదు. త్వమ్ చ=నీవు కూడా, న=లేవు. తే=నీయొక్క, పితా చ=తండ్రి కూడా, న=లేడు.

తా. నీ తండ్రియైన నా సోదరుణ్ణి ఈ దోషము లుండుటచేత నేను విడిచిపెట్టితిని. ఇటుపైన ఈ లంకానగరముగాని, నీవు గాని, నీ తండ్రిగాని ఉండరు. 26

మూ. అతిమానశ్చ బాలశ్చ దుర్వినీతశ్చ రాక్షస,
బద్ధస్త్వం కాలపాశేన బ్రూహి మాం యద్యదిచ్ఛసి. 27

ప్ర. అ. రాక్షస=ఓ ! రాక్షసుడా ! అతిమానశ్చ=ఎక్కువ గర్వము కలవాడవు, బాలశ్చ=మూర్ఖుడవు, దుర్వినీతశ్చ=వినయము లేనివాడవు, కాలపాశేన=కాలపాశముచేత, బద్ధః=కట్టబడినవాడవూ ఐన, త్వమ్=నీవు, మామ్=నన్ను, యత్ యత్=ఏది, ఏది, ఇచ్ఛసి=కోరుచున్నావో అది, బ్రూహి=పలుకుము.

తా. ఓ ! రాక్షసుడా ! నీవు ఎక్కువ గర్వము కలవాడవు; మూర్ఖుడవు; వినయము లేనివాడవు. యమపాశముచేత బంధింపబడిన అట్టి నీవు నన్ను గూర్చి నీ ఇష్టము వచ్చినట్లు మాట్లాడవచ్చును. 27

మూ. అద్యేహ వ్యసనం ప్రాప్తం యన్మాం పరుషముక్తవాన్,
ప్రవేష్టుం న త్వయా శక్యం న్యగ్రోధం రాక్షసాధమ. 28

ప్ర. అ. రాక్షసాధమ=ఓ !రాక్షసాధముడా ! మామ్=నన్ను గూర్చి, యత్=ఏ కారణమువలన, పరుషమ్=పరుషవాక్యమును, ఉక్తవాన్=పలికినావో అందువలన, అద్య=ఇప్పుడు, ఇహ=ఇక్కడ, వ్యసనమ్=వ్యసనము, ప్రాప్తమ్=వచ్చినది. త్వయా=నీచేత, న్యగ్రోధమ్=మర్రిచెట్టును, ప్రవేష్టుమ్=ప్రవేశించుటకు, న శక్యమ్=శక్యముకాదు.

తా. ఓ ! రాక్షసాధమా ! నీవు నన్ను పరుషములాడినందుకు ఇప్పుడు ఇక్కడ నీకు ఆపద వచ్చినది. నీవు మర్రిచెట్టులో ప్రవేశించజాలవు.28

మూ. ధర్షయిత్వా చ కాకుత్థ్సం న శక్యం జీవితుం త్వయా,
యుధ్యస్వ నరదేవేన లక్ష్మణేన రణే సహ. 29
హతస్త్వం దేవతాకార్యం కరిష్యసి యమక్షయే.

ప్ర. అ. కాకుత్థ్సమ్=లక్ష్మణుణ్ణి,=ధర్షయిత్వా=ఎదిరించి, త్వయా=నీచేత, జీవితుమ్=జీవించుటకు, న శక్యమ్=శక్యము కాదు. రణే=రణమునందు, నరదేవేన=నరుల ప్రభువైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, యుధ్యస్వ=యుద్ధము చేయుము. త్వమ్=నీవు, హతః=చంపబడినవాడవై, యమక్షయే=యమలోకమునందు, దేవతాకార్యమ్=దేవతల కార్యమును, కరిష్యసి=చేయగలవు.

తా. లక్ష్మణుణ్ణి ఎదిరించి నీవు జీవించజాలవు. నరులలో శ్రేష్ఠుడైన లక్ష్మణునితో యుద్ధము చేయుము. నీవు చంపబడి యమలోకములో దేవతలు చెప్పిన పనులు చేయగలవు. 29

మూ. నిదర్శయిత్వాత్మబలం సముద్యతం
కురుష్వ సర్వాయుధసాయకవ్యయమ్,
న లక్ష్మణస్యైత్య హి బాణగోచరం
త్వ మద్య జీవన్ సబలో గమిష్యసి. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
ఆదికావ్యే యుద్ధకాణ్డే సప్తాశీతితమః సర్గః.

ప్ర. అ. సముద్యతమ్=వృద్ధిపొందిన, ఆత్మబలమ్=నీ బలమును, నిదర్శయిత్వా=చూపి, సర్వాయుధసాయకవ్యయమ్=సమస్తమైన ఆయుధములయొక్క బాణములయొక్క వ్యయమును, కురుష్వ=చేయుము. లక్ష్మణస్య=లక్ష్మణుని యొక్క, బాణగోచరమ్=బాణముల మార్గమును, ఏత్య=పొంది, సబలః=సైన్యముతో

కూడిన, త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, జీవన్=జీవించుచు, న గమిష్యసి హి=వెళ్ళవు కదా !

తా. అధికమైన నీ బలమును చూపి, సమస్త ఆయుధములనూ, బాణములనూ వ్యయము చేయుము. లక్ష్మణుని బాణముల బారిని పడి సేనా సహితుడవైన నీవు ప్రాణములతో తిరిగి వెళ్ళవు. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాశీతితమః సర్గః

[లక్ష్మణేంద్రజిత్తులు ఘోరముగా యుద్ధము చేయుట.]

మూ. విభీషణవచః శ్రుత్వా రావణిః క్రోధమూర్ఛితః,
అబ్రవీత్ పరుషం వాక్యం వేగేనాభ్యుత్పపాత చ. 1

ప్ర. అ. విభీషణవచః=విభీషణుని వచనమును, శ్రుత్వా=విని, రావణిః=ఇంద్రజిత్తు, క్రోధమూర్ఛితః= కోపముచేత ఆవేశింపబడినవాడై, పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. వేగేన=వేగముతో, అభ్యుత్పపాత చ=ఎదురుగా వచ్చెను.

తా. ఇంద్రజిత్తు విభీషణుని మాటలు విని క్రోధావేశముతో ఆతనిని పరుషవాక్యములతో నిందించెను. వేగముగా ముందుకు వచ్చెను. 1

మూ. ఉద్యతాయుధనిస్త్రింశో రథే సుసమలంకృతే,
కాలాశ్వయుక్తే మహతి స్థితః కాలాన్తకోపమః. 2
మహాప్రమాణముద్యమ్య విపులం వేగవద్దృఢమ్,
ధనుర్భీమం పరామృశ్య శరాంశ్చామిత్రశాతనాన్. 3

ప్ర. అ. ఉద్యతాయుధనిస్త్రింశః=ఎత్తబడిన ఆయుధములూ ఖడ్గములూ కలవాడై, సుసమలంకృతే=బాగుగా అలంకరింపబడిన, కాలాశ్వయుక్తే=నల్లని గుర్రములతో కూడిన, మహతి=గొప్పదైన, రథే=రథమునందు, స్థితః= ఉన్నవాడై, కాలాన్తకోపమః=ప్రళయకాలయమునితో సమానుడై, మహాప్రమాణమ్=పెద్ద ప్రమాణము గల, విపులమ్=విశాలమైన, వేగవత్=వేగము గల, భీమమ్=భయంకరమైన, ధనుః=ధనస్సును, ఉద్యమ్య=ఎత్తి, అమిత్రశాతనాన్=శత్రువులను పీడించు, శరాంశ్చ=బాణములను, పరామృశ్య=స్పృశించి (ఎదురుగా వచ్చెను అని మొదటి శ్లోకముతో అన్వయము)

తా. ప్రళయకాలమునందలి యమునితో సమానుడైన ఆ ఇంద్రజిత్తు నల్లని గుర్రములు కట్టిన, బాగుగా అలంకరించిన రథము మీద ఉండి, ఆయుధములనూ, ఖడ్గమునూ పైకి ఎత్తెను. పెద్దదీ, విశాలమైనదీ, వేగము కలదీ, దృఢమైనదీ, భయంకరమూ ఐన ధనస్సును సరిచేసికొనుచు, శత్రువులను పీడించు బాణములను గ్రహించెను. 2,3

మూ. తం దదర్శ మహేష్వాసో రథస్థః సమలంకృతః,
అలంకృతమమిత్రఘ్నో రాఘవస్యానుజం బలీ. 4

ప్ర. అ. మహేష్వాసః=గొప్ప ధనస్సు కలవాడూ, రథస్థః=రథమునందున్నవాడూ, సమలంకృతః=బాగుగా అలంకరింపబడినవాడూ, అమిత్రఘ్నః=శత్రుసంహారకుడూ, బలీ=బలవంతుడూ ఐన ఇంద్రజిత్తు, అలంకృతమ్= అలంకరింపబడిన, తమ్=ఆ, రాఘవస్య=రామునియొక్క, అనుజమ్=తమ్ముని, దదర్శ=చూచెను.

తా. గొప్ప ధనస్సు ధరించి, రథముపై కూర్చున్న, బాగుగా అలంకరించుకొని ఉన్న శత్రుసంహారకుడూ, బలశాలీ అయిన ఇంద్రజిత్తు, అలంకరించబడిన (స్వాభావికశోభతో కూడిన) లక్ష్మణుని చూచెను. 4

మూ. హనుమత్పృష్ఠమారూఢముదయస్థరవిప్రభమ్,
ఉవాచైనం సుసంరబ్ధః సౌమిత్రిం సవిభీషణమ్. 5
తాంశ్చ వానరశార్దూలాన్ పశ్యధ్వం మే పరాక్రమమ్.

ప్ర. అ. హనుమత్పృష్ఠమ్=హనుమంతుని వీపును, ఆరూఢమ్=ఎక్కిన, ఉదయస్థరవిప్రభమ్= ఉదయాచలముపై ఉన్న సూర్యుని వంటి కాంతి గల, సవిభీషణమ్=విభీషణునితో కూడిన, ఏనం సౌమిత్రిమ్=ఈ లక్ష్మణుని గూర్చి, తాన్=ఆ, వానరశార్దూలాన్ చ=వానరశ్రేష్ఠులను గూర్చి, సుసంరబ్ధః=మిక్కిలి తొందరపడుచున్నవాడై, ఉవాచ=పలికెను. మే=నాయొక్క, పరాక్రమమ్=పరాక్రమమును, పశ్యధ్వమ్=చూడండి.

తా. హనుమంతుని వీపుపై కూర్చున్న లక్ష్మణుడు ఉదయపర్వతముమీద నున్న సూర్యుడు వలె ప్రకాశించుచుండెను. అట్టి లక్ష్మణునితోనూ, విభీషణునితోనూ, వానరనాయకులతోనూ ఇంద్రజిత్తు చాల తొందరపడుచు ఇట్లనెను. "ఇప్పుడు నా పరాక్రమమును చూడుడు." 5

మూ. అద్య మత్కార్ముకోత్సృష్టం శరవర్షం దురాసదమ్, 6
ముక్తం వర్షమివాకాశే ధారయిష్యథ సంయుగే.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, సంయుగే=యుద్ధమునందు, మత్కార్ముకోత్సృష్టమ్=నా ధనస్సునుండి విడవబడిన, దురాసదమ్=ఎదిరింప శక్యము కాని, ఆకాశే=ఆకాశమునందు, ముక్తమ్=విడవబడిన, వర్షమ్ ఇవ=వర్షమువలె ఉన్న, శరవర్షమ్=బాణవర్షమును, ధారయిష్యథ=ధరించగలరు.

తా. ఇప్పుడు ఆకాశమునుండి పడుచున్న జలధారావర్షము వలె యుద్ధమునందు నా ధనస్సునుండి వెలువడుచున్న ఎదిరింప శక్యము కాని బాణవర్షమును మీరు ధరించగలరు. (ఎదుర్కొనగలరు.) 6

మూ. అద్య వో మామకా బాణా మహాకార్ముకనిఃసృతాః, 7
విధమిష్యన్తి గాత్రాణి తూలరాశిమివానలః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, మహాకార్ముకనిఃసృతాః=గొప్ప ధనస్సు నుండి బయలుదేరిన, మామకాః= నా సంబంధమైన, బాణాః=బాణములు, వః=మీయొక్క, గాత్రాణి=శరీరములను, అనలః=అగ్ని, తూలరాశిమివ= దూది కుప్పను వలె, విధమిష్యన్తి=కాల్చివేయగలవు.

తా. ఇప్పుడు నా గొప్ప ధనస్సునుండి బయలుదేరిన నా బాణములు మీ శరీరములను దూది కుప్పను అగ్ని కాల్చివేసినట్లు కాల్చివేయును. 7

మూ. తీక్ష్ణసాయకనిర్భిన్నాన్ శూలశక్త్యృష్టితోమరైః, 8
అద్య వో గమయిష్యామి సర్వానేవ యమక్షయమ్.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, తీక్ష్ణసాయకనిర్భిన్నాన్=వాడియైన బాణములచేత బ్రద్దలుకొట్టబడిన, శూలశక్త్యృష్టితోమరైః=శూలములచేతా, శక్తులచేతా, ఋష్టుల చేతా, తోమరములచేతా బ్రద్దలుకొట్టబడిన, వః= మిమ్ములను, సర్వానేవ=అందరినీ, యమక్షయమ్=యమలోకమును, గమయిష్యామి=పొందించెదను.

తా. ఇప్పుడు మిమ్ముల నందరినీ వాడియైన బాణములచేతా, శూలముల చేతా, శక్తులచేతా, ఋష్టులచేతా, తోమరములచేతా చీల్చివేసి యమలోకమునకు పంపెదను. 8

మూ. సృజతః శరవర్షాణి క్షిప్రహస్తస్య సంయుగే, 9
జీమూతస్యేవ నదతః కః స్థాస్యతి మమాగ్రతః.

ప్ర. అ. క్షిప్రహస్తస్య=శీఘ్రమైన హస్తము కలవాడనూ, సంయుగే= యుద్ధమునందు, శరవర్షాణి= బాణవర్షములను, సృజతః=విడచుచున్న వాడనూ, జీమూతస్యేవ=మేఘము వలె, నదతః=ధ్వనిచేయుచున్నవాడనూ ఐన, మమ=నా యొక్క, అగ్రతః=ఎదుట, కః=ఎవడు, స్థాస్యతి=నిలబడగలడు.

తా. నేను మేఘము వలె గర్జించుచూ, రణరంగమునందు హస్తలాఘవముతో బాణవర్షములు వర్షించుచుండగా నా ఎదుట ఎవడు నిలబడగలడు? 9

మూ. రాత్రియుద్ధే తదా పూర్వం వజ్రాశనిసమైః శరైః, 10
శాయితౌ స్థో మయా భూమౌ విసంజ్ఞౌ సపురస్సరౌ.

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, తదా=ఆనాడు, రాత్రియుద్ధే=రాత్రియుద్ధము నందు, సపురస్సరౌ= పరివారముతో కూడిన మీరిద్దరూ, వజ్రాశనిసమైః=వజ్రముతోనూ

పిడుగుతోనూ సమానమైన, శరైః=బాణములచేత, విసంజ్ఞౌ=సంజ్ఞ లేనివారుగా, భూవౌ=భూమిమీద, శాయితౌ=శయనింపజేయబడినవారుగా, స్థః=ఐతిరి.

తా. పూర్వము ఆనాడు రాత్రియుద్ధమునందు సుగ్రీవాదులతో కూడిన మీ ఇద్దరినీ వజ్రమువంటి, పిడుగువంటి బాణములచేత సంజ్ఞ లేనివారినిగా చేసి నేలపై పడగొట్టితిని. 10

మూ. స్మృతిర్న తేఽస్తి వా మన్యే వ్యక్తం యాతో యమక్షయమ్, 11
ఆశీవిషసమం క్రుద్ధం యన్మాం యోద్ధుముపస్థితః.

ప్ర. అ. తే=నీకు, స్మృతిః=స్మృతి, నాస్తి వా=లేదా? ఆశీవిషసమమ్=సర్పములతో సమానుడ నయిన, క్రుద్ధమ్=కోపించిన, మామ్=నన్ను, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, యత్=ఎందువలన, ఉపస్థితః=వచ్చినావో వ్యక్తమ్=స్పష్టముగా, యమక్షయమ్=యమలోకమును గూర్చి, యాతః=వెళ్ళినావు అని, మన్యే=తలచుచున్నాను.

తా. నీకు ఆ విషయము జ్ఞాపకము లేదా? కోపించి, సర్పము వలె ఉన్న నాతో యుద్ధము చేయుటకు వచ్చిన నీవు తప్పక యమలోకమునకు వెళ్లినట్లే అని తలచుచున్నాను. 11

మూ. తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రస్య గర్జితం రాఘవస్తదా, 12
అభీతవదనః క్రుద్ధో రావణిం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. తదా=అప్పుడు, రాఘవః=లక్ష్మణుడు, రాక్షసేన్ద్రస్య=ఇంద్రజిత్తు యొక్క, తత్=ఆ, గర్జితమ్= గర్జితమును, శ్రుత్వా=విని, అభీతవదనః=భయపడని ముఖము కలవాడై, క్రుద్ధః=కోపించినవాడై, రావణిమ్= ఇంద్రజిత్తును గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు లక్ష్మణుడు ఆ ఇంద్రజిత్తు చేసిన గర్జనలు విని భయపడక, కోపించి ఆతనితో ఇట్లనెను. 12

మూ. ఉక్తశ్చ దుర్గమః పారః కార్యాణాం రాక్షస త్వయా, 13
కార్యాణాం కర్మణాం పారం యో గచ్ఛతి స బుద్ధిమాన్.

ప్ర. అ. రాక్షస=ఓ రాక్షసుడా ! త్వయా=నీచేత, కార్యాణామ్=కార్యములయొక్క, దుర్గమః=పొంద శక్యము కాని, పారః=అంతము, ఉక్తశ్చ=చెప్పబడినది. యః=ఎవడు, కార్యాణామ్=చేయదగిన, కర్మణామ్= కర్మలయొక్క, పారమ్=పారమును, గచ్ఛతి=పొందునో, సః=అతడే, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు.

తా. ఓ ! రాక్షసుడా ! నీవు పొందజాలని కార్యముల అంతమును

గూర్చి మాటలు మాత్రము చెప్పుచున్నావు. చేయవలసిన పనుల అంతమును పొందగలిగినవాడే బుద్ధిమంతుడు. 13

మూ. స త్వమర్థస్య హీనార్థో దురవాపస్య కేనచిత్, 14
వాచా వ్యాహృత్య జానీషే కృతార్థోఽస్మీతి దుర్మతే.

ప్ర. అ. దుర్మతే=ఓ ! దుర్బుద్ధీ ! హీనార్థః=చెడ్డ ప్రయోజనము గల (కార్యమును సాధించుటకు అసమర్థుడవైన), సః త్వమ్=అట్టి నీవు, కేన చిత్=ఎవరిచేతనూ కూడ, దురవాపస్య=పొంద శక్యము కాని, అర్థస్య=కార్యముయొక్క (సాధించుటను), వాచా=వాక్కులచేత, వ్యాహృత్య=పలికి, కృతార్థః అస్మి=కృతార్థుడను ఐనాను, ఇతి=అని, జానీషే=అనుకొనుచున్నావు.

తా. ఓ ! దుర్మతీ ! చెడు కార్యములు చేయు (కార్యాసమర్థుడవు ఐన) నీవు ఎవ్వరూ చేయజాలని విషయమును గూర్చి మాటలలో చెప్పి కృతార్థుడ నైతిని అని అనుకొనుచున్నావు. 14

మూ. అంతర్ధానగతేనాజౌ యస్త్వయా చరితస్తదా, 15
తస్కరాచరితో మార్గః నైష వీరనిషేవితః.

ప్ర. అ. తదా=అప్పుడు, ఆజౌ=యుద్ధమునందు, అంతర్ధానగతేన=అంతర్ధానము చెందిన, త్వయా=నీచేత, యః=ఏ మార్గము, చరితః=అనుసరించబడినదో, మార్గః=ఆ మార్గము, తస్కరాచరితః=దొంగలచేత అనుసరింపబడు మార్గము. ఏషః=ఇది, వీరనిషేవితః=వీరులచేత సేవింపబడినది, న=కాదు.

తా. ఆనాడు యుద్ధమునందు నీవు అంతర్ధానము చెంది అనుసరించిన మార్గము దొంగలు అనుసరించే మార్గము. అది వీరులు అనుసరించే మార్గము కాదు. 15

మూ. యథా బాణపథం ప్రాప్య స్థితోఽస్మి తవ రాక్షస, 16
దర్శయస్వాద్య తత్తేజో వాచా త్వం కిం వికత్థసే.

ప్ర. అ. రాక్షస=ఓ ! రాక్షసుడా ! తవ=నీయొక్క, బాణపథమ్=బాణమార్గమును, ప్రాప్య=పొంది, యథా=ఎట్లు (ఎందువలన), స్థితః అస్మి=నిలచి ఉన్నానో (అందువలన), తత్=ఆ, తేజః=తేజస్సును, అద్య=ఇప్పుడు, దర్శయస్వ=చూపుము. త్వమ్=నీవు, వాచా=వాక్కుచేత, కిమ్=ఎందుకు, వికత్థసే=బడాయి చెప్పుకొనుచున్నావు.

తా. ఓ ! రాక్షసుడా ! నేను నీ బాణమార్గములో నిలిచి ఉన్నాను కదా ! అందుచేత నీ తేజస్సు ఏదో ఇప్పుడు చూపుము. మాటలలో గొప్పలు

చెప్పుకొనుట ఎందుకు? 16

మూ. ఏవముక్త్వా ధనుర్భీమం పరామృశ్య మహాబలః, 17
ససర్జ నిశితాన్ బాణానింద్రజిత్ సమితిఞ్జయః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మహాబలః=గొప్ప బలము గల, సమితిఞ్జయః=యుద్ధమును జయించు, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, భీమమ్=భయంకరమైన, ధనుః=ధనస్సును, పరామృశ్య=స్పృశించి, నిశితాన్= వాడియైన, శరాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. గొప్ప బలము గల, యుద్ధములలో జయించు ఇంద్రజిత్తు ఆ మాటలు విని, భయంకరమైన ధనస్సును గ్రహించి వాడియైన బాణములను ప్రయోగించెను. 17

మూ. తేన సృష్టా మహావేగాః శరాః సర్పవిషోపమాః, 18
సంప్రాప్య లక్ష్మణం పేతుః శ్వసన్త ఇవ పన్నగాః.

ప్ర. అ. తేన=వానిచేత, సృష్టాః=విడువబడిన, మహావేగాః=గొప్ప వేగము గల, సర్పవిషోపమాః= సర్పవిషముతో సమానములైన, శరాః=బాణములు, లక్ష్మణమ్=లక్ష్మణుని, సంప్రాప్య=పొంది, శ్వసన్తః= నిట్టూర్చుచున్న, పన్నగాః ఇవ=సర్పములు వలె, పేతుః=పడినవి.

తా. ఇంద్రజిత్తు విడచిన గొప్ప వేగము గల సర్పవిషముతో సమానములైన బాణములు లక్ష్మణుని చేరి నిట్టూర్చుచున్న సర్పములు వలె పడినవి. 18

మూ. శరైరతిమహావేగై ర్వేగవాన్ రావణాత్మజః, 19
సౌమిత్రిమిన్ద్రజిద్యుద్ధే వివ్యాధ శుభలక్షణమ్.

ప్ర. అ. వేగవాన్=వేగము గల, రావణాత్మజః=రావణుని పుత్రుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, యుద్ధే= యుద్ధమునందు, అతిమహావేగైః=చాల వేగము గల, శరైః=బాణములచేత, శుభలక్షణమ్=శుభలక్షణములు గల, సౌమిత్రిమ్=లక్ష్మణుని, వివ్యాధ=కొట్టెను.

తా. వేగము గల, రావణపుత్రుడైన ఆ ఇంద్రజిత్తు మహావేగము గల బాణములతో, శుభలక్షణములు గల లక్ష్మణుని యుద్ధమునందు కొట్టెను. 19

మూ. స శరైరతివిద్ధాఙ్గో రుధిరేణ సముక్షితః, 20
శుశుభే లక్ష్మణః శ్రీమాన్విధూమ ఇవ పావకః.

ప్ర. అ. శరైః=బాణములచేత, అతివిద్ధాఙ్గః=బాగా కొట్టబడిన శరీరము

గల, రుధిరేణ=రక్తముచేత, సముక్షితః=పూయబడిన, శ్రీమాన్=శ్రీమంతుడైన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, విధూమః=ధూమము లేని, పావకః ఇవ=అగ్ని వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. శరీరముపై చాల బాణముల దెబ్బలు తగిలి రక్తముతో నిండి యున్న శ్రీమంతుడైన ఆ లక్ష్మణుడు ధూమము లేని అగ్ని వలె ప్రకాశించెను.

మూ. ఇన్ద్రజిత్త్వాత్మనః కర్మ ప్రసమీక్ష్యాభిగమ్య చ, 21
వినద్య సుమహానాదమిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. ఇన్ద్రజిత్తు=ఇంద్రజిత్తైతే, ఆత్మనః=తనయొక్క, కర్మ=కర్మను, ప్రసమీక్ష్య=చూచి, అభిగమ్య చ=ఎదురుగావెళ్ళి, సుమహానాదమ్=చాల గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినద్య=ధ్వనిచేసి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఇంద్రజిత్తు తాను చేసిన పని చూచుకొని ముందుకు ఎదురుగా వెళ్ళి బిగ్గరగా గర్జించుచు ఇట్లు పలికెను. 21

మూ. పత్రిణః శతధారాస్తే శరా మత్కార్ముకచ్యుతాః, 22
ఆదాస్యన్తేఽద్య సౌమిత్రే జీవితం జీవితాన్తకాః.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! పత్రిణః=రెక్కలు గలవి, శతధారాః=అనేకములైన అంచులు గలవి, మత్కార్ముకచ్యుతాః=నా ధనస్సునుండి జారినవి, జీవితాన్తకరాః=ప్రాణములను అంత మొందించునవి అయిన, శరాః=బాణములు, అద్య=ఇప్పుడు, తే జీవితమ్=నీ జీవితమును, ఆదాస్యన్తే=గ్రహిచగలవు.

తా. లక్ష్మణా ! రెక్కలు కట్టినవి, అనేకములైన అంచులు గలవి, జీవితమును అంతమొందించునవి అయిన బాణములు నీ ధనస్సునుండి బయల్వెడలి ఇప్పుడు నీ ప్రాణములను తీసివేయగలవు. 22

మూ. అద్య గోమాయుసంఘాశ్చ శ్యేనసంఘాశ్చ లక్ష్మణ,
గృధ్రాశ్చ నిపతన్తు త్వాం గతాసుం నిహతం మయా. 23

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణుడా ! అద్య=ఇప్పుడు, మయా=నాచేత, నిహతమ్=చంపబడిన, గతాసుమ్=పోయిన ప్రాణములు గల, త్వామ్=నిన్ను గూర్చి, గోమాయుసంఘాశ్చ=నక్కల సముదాయములు, శ్యేనసంఘాశ్చ=డేగల సముదాయములు, గృధ్రాశ్చ=గ్రద్దలు, నిపతన్తు=వచ్చి పడుగాక.

తా. లక్ష్మణా ! ఇప్పుడు నా చేత చంపబడి పడియున్న నీపై నక్కలు, డేగలు, గ్రద్దలు గుంపులుగా వచ్చి పడుగాక. 23

మూ. క్షత్రబన్ధుం సదానార్యం రామః పరమదుర్మతిః, 24
భక్తం భ్రాతరమద్యైవ త్వాం ద్రక్ష్యతి హతం మయా.

ప్ర. అ. పరమదుర్మతిః=చాల చెడ్డ బుద్ధి గల, రామః=రాముడు, క్షత్రబన్ధుమ్=నీచక్షత్రియుడవు, సదా= ఎల్లప్పుడు, అనార్యమ్=చెడ్డవాడవు, భక్తమ్=భక్తుడవు, భ్రాతరమ్=సోదరుడవు అయిన, అద్యైవ=ఇప్పుడే, నిహతమ్= చంపబడిన, త్వామ్=నిన్ను, ద్రక్ష్యతి=చూడగలడు.

తా. చాల దుష్టబుద్ధియైన రాముడు నీచక్షత్రియుడవు, ఎల్లప్పుడు చెడ్డవాడవు, భక్తుడవు, సోదరుడవు అయిన నిన్ను నేను ఇప్పుడే చంపివేయగా చూడగలడు. 24

మూ. విస్రస్తకవచం భూమౌ వ్యపవిద్ధశరాసనమ్, 25
హృతోత్తమాఙ్గం సౌమిత్రే త్వామద్య నిహతం మయా.

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! మయా=నాచేత, అద్య=ఇప్పుడు, నిహతమ్=చంపబడిన, విస్రస్తకవచమ్= జారిన కవచము గల వాడవు, భూమౌ=నేలమీద, వ్యపవిద్ధశరాసనమ్=పడవేయబడిన ధనస్సు గలవాడవు, హృతోత్తమాఙ్గమ్=హరించబడిన శిరస్సు గలవాడవు అయిన, త్వామ్=నిన్ను (రాముడు చూడగలడు.)

తా. లక్ష్మణా ! ఇప్పుడు నేను చంపివేయగా నీవు కవచము జారిపోయి, ధనస్సు క్రింద పడిపోయి, తల తెగి పడి ఉండెదవు. అట్టి నిన్ను రాముడు చూడగలడు. 25

మూ. ఇతి బ్రువాణం సంక్రుద్ధం పరుషం రావణాత్మజమ్, 26
హేతుమద్వాక్యమర్థజ్ఞో లక్ష్మణః ప్రత్యువాచ హ.

ప్ర. అ. ఇతి=ఇట్లు, పరుషమ్=పరుషముగా, బ్రువాణమ్=పలుకుచున్న, సంక్రుద్ధమ్=కోపించిన, రావణాత్మజమ్=ఇంద్రజిత్తును గూర్చి, అర్థజ్ఞః=అర్థమును ఎరిగిన, లక్ష్మణః=లక్ష్మణుడు, హేతుమత్=హేతువులతో కూడిన, వాక్యమ్= వాక్యమును, ప్రత్యువాచ హ=తిరిగి పలికెను.

తా. ఈ విధముగా పరుషముగా మాటలాడుచున్న, కోపావిష్టుడైన ఇంద్రజిత్తుతో అర్థము ఎరిగిన లక్ష్మణుడు హేతుసహితమైన వాక్యమును ఇట్లు పలికెను. 26

మూ. వాగ్బలం త్యజ దుర్బుద్ధే క్రూరకర్మాసి రాక్షస. 27
అథ కస్మాద్వదస్యేతత్సంపాదయ సుకర్మణా.

ప్ర. అ. దుర్బుద్ధే=చెడ్డ బుద్ధి గలవాడా ! వాగ్బలమ్=మాటలలో బలమును, త్యజ=విడువుము. రాక్షస= రాక్షసుడా ! క్రూరకర్మా=క్రూరములైన కర్మలు చేయువాడవు, అసి=అయి ఉన్నావు. అథ=ఇంక, ఏతత్=దీనిని, కస్మాత్=ఎందువలన, వదసి=పలుకుచున్నావు? సుకర్మణా=మంచి పనిచేత, సంపాదయ=సంపాదించుము.

తా. చెడ్డబుద్ధి గలవాడా ! మాటలలో బలము చూపుట మానుము. ఓ ! రాక్షసుడా ! నీవు క్రూరకర్మలు చేయువాడవు. ఇంక ఈ మాటలు మాటలాడెదవెందుకు? పని చేసి సాధించుము. 27

మూ. అకృత్వా కత్థసే కర్మ కిమర్థమిహ రాక్షస, 28
కురు తత్కర్మ యేనాహం శ్రద్దధ్యాం తవ కత్థనమ్.

ప్ర. అ. రాక్షస=రాక్షసుడా ! కర్మ=పనిని, అకృత్వా=చేయకుండగా, కిమర్థమ్=ఎందుకు, ఇహ=ఇక్కడ, కత్థసే=గొప్పలు చెప్పుచున్నావు? యేన=దేనిచేత, అహమ్=నేను, తవ=నీయొక్క, కత్థనమ్=గొప్పలు చెప్పుటను, శ్రద్దధ్యామ్=నమ్ముదునో, తత్=ఆ, కర్మ=పనిని, కురు=చేయుము.

తా. రాక్షసుడా ! పనిలో చూపకుండగా ఎందుకు గొప్పలు చెప్పెదవు? నీ గొప్ప మాటలమీద నాకు నమ్మకము కలుగునట్లు పని చేసి చూపుము.

మూ. అనుక్త్వా పరుషం వాక్యం కించిదప్యనవక్షిపన్, 29
అవికత్థన్ వధిష్యామి త్వాం పశ్య పురుషాధమ.

ప్ర. అ. పురుషాధమ=పురుషులలో అధముడా ! పరుషమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, కించిదపి= కొంచెము కూడ, అనుక్త్వా=పలకక, అనవక్షిపన్=నిందించనివాడనై, అవికత్థన్=గొప్పలు చెప్పుకొననివాడనై, త్వామ్= నిన్ను వధిష్యామి=చంపెదను; పశ్య=చూడుము.

తా. పురుషులలో అధముడా ! నేను కొంచెము కూడ పరుషవాక్యము పలకక, ఏమీ నిందించక, బడాయి చెప్పుకొనక నిన్ను చంపెదను; చూడుము.

మూ. ఇత్యుక్త్వా పఞ్చ నారాచానాకర్ణాపూరితాన్ శరాన్, 30
విజఘాన మహావేగాల్లక్ష్మణో రాక్షసోరసి.

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, ఆకర్ణాపూరితాన్=చెవివరకూ లాగబడిన, పఞ్చ=ఐదు, నారాచాన్=నారాచము లను, శరాన్=బాణములను, మహావేగాత్=గొప్ప వేగమువలన, రాక్షసోరసి=రాక్షసుని వక్షఃస్థలముమీద, విజఘాన=కొట్టెను.

తా. లక్ష్మణుడు ఇట్లు పలికి, ఐదు నారాచబాణములను చెవివరకు

లాగి గొప్ప వేగముతో ఇంద్రజిత్తు వక్షఃస్థలముమీద కొట్టెను. 30

మూ. సుపత్రవాజితా బాణా జ్వలితా ఇవ పన్నగాః, 31
నైర్ఋతోరస్యభాసన్త సవితూ రశ్మయో యథా.

ప్ర. అ. జ్వలితాః=ప్రజ్వలించుచున్న, పన్నగాః ఇవ=సర్పములవలె ఉన్న, సుపత్రవాజితాః= మంచి రెక్కలచేత వేగము కలవిగా చేయబడిన, బాణాః=బాణములు, నైర్ఋతోరసి=రాక్షసుని వక్షఃస్థలమునందు, సవితుః= సూర్యునియొక్క, రశ్మయః యథా=కిరణములు వలె, అభాసన్త=ప్రకాశించినవి.

తా. మంచి రెక్కలచేత వేగము గలవిగా చేయబడిన, ప్రజ్వలించుచున్న సర్పములవలె ఉన్న బాణములు ఆ రాక్షసుని వక్షఃస్థలముమీద, సూర్యుని కిరణములవలె ప్రకాశించినవి. 31

మూ. స శరైరాహతస్తేన సరోషో రావణాత్మజః, 32
సుప్రయుక్తైస్త్రిభిర్బాణైః ప్రతివివ్యాధ లక్ష్మణమ్.

ప్ర. అ. తేన=లక్ష్మణునిచేత, శరైః=బాణములచేత, ఆహతః=కొట్టబడిన, సః=ఆ, రావణాత్మజః=ఇంద్రజిత్తు, సరోషః=కోపముతో కూడినవాడై, సుప్రయుక్తైః=బాగుగా ప్రయోగింపబడిన, త్రిభిః=మూడు, బాణైః=బాణములచేత, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, ప్రతివివ్యాధ=ఎదురుకొట్టెను.

తా. లక్ష్మణుడు బాణములచేత కొట్టగా కోపించిన ఇంద్రజిత్తు మూడు బాణములు బాగుగా ప్రయోగించి లక్ష్మణుని కొట్టెను. 32

మూ. స బభూవ మహాభీమో నరరాక్షససింహయోః, 33
విమర్దస్తుములో యుద్ధే పరస్పరజయైషిణోః.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, పరస్పరజయైషిణోః=పరస్పరమూ జయమును కోరుచున్న, నరరాక్షససింహయోః=నరరాక్షసశ్రేష్ఠులకు, మహాభీమః= చాల భయంకరమైన, సః=ఆ, విమర్దః=పోరాటము, తుములః= వ్యాకులముగా, బభూవ=ఆయెను.

తా. యుద్ధమునందు ఒకరిపై ఒకరు జయము సంపాదింపవలెనని కోరుచున్న నరులలో శ్రేష్ఠుడైన లక్ష్మణునకూ, రాక్షసులలో శ్రేష్ఠుడైన ఇంద్రజిత్తుకూ మధ్య చాల భయంకరమూ, వ్యాకులమూ అయిన పోరాటము జరిగెను. 33

మూ. ఉభౌ హి బలసంపన్నావుభౌ విక్రమశాలినౌ, 34
ఉభౌ పరమదుర్జ్ఞేయావతుల్యబలతేజసౌ.

ప్ర. అ. ఉభౌ=ఇద్దరూ, బలసంపన్నౌ=బలముతో కూడినవారు, ఉభౌ=ఇద్దరూ, విక్రమశాలినౌ=పరాక్రమముతో ప్రకాశించుచున్నవారు, ఉభౌ=ఇద్దరూ, పరమదుర్జయౌ=మిక్కిలి జయింప శక్యము కానివారు, అతుల్యబలతేజసౌ=సాటిలేని బలమూ, తేజస్సూ కలవారు.

తా. ఇద్దరూ బలము కలవారే. ఇద్దరూ పరాక్రమముతో ప్రకాశించుచున్నవారే. ఇద్దరూ జయించుటకు చాల కష్టమైనవారే. ఇద్దరూ సాటిలేని బలమూ, తేజస్సూ కలవారే. 34

మూ. యుయుధాతే తదా వీరౌ గ్రహావివ నభోగతౌ, 35
బలవృత్రావివాభీతౌ యుధి తౌ దుష్ప్రధర్షణౌ.

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, దుష్ప్రధర్షణౌ=ఎదిరింప శక్యము కాని, తౌ వీరౌ=ఆ వీరు లిద్దరూ, తదా= అప్పుడు, నభోగతౌ=ఆకాశమునం దున్న, గ్రహావివ=రెండు గ్రహములు వలె, బలవృత్రావివ=ఇంద్రవృత్రాసురుల వలె, అభీతౌ=భయపడనివారై, యుయుధాతే=యుద్ధముచేసిరి.

తా. యుద్ధమునందు ఎదిరింప శక్యముకాని ఆ వీరులిద్దరూ ఆకాశమునందు ఉన్న రెండు గ్రహముల వలె, ఇంద్రవృత్రాసురుల వలె, భయము లేనివారై యుద్ధము చేసిరి. 35

మూ. యుయుధాతే మహాత్మానౌ తదా కేసరిణావివ. 36
బహూనవసృజన్తౌ హి మార్గణౌఘానవస్థితౌ.
నరరాక్షసముఖ్యౌ తౌ ప్రహృష్టావభ్యయుధ్యతామ్. 37

ప్ర. అ. తదా=అప్పుడు, అవస్థితౌ=నిలబడియున్న, మహాత్మానౌ=ఆ మహాత్ములిద్దరూ, బహూన్=అనేకమైన, మార్గణౌఘాన్=బాణసముదాయములను, అవసృజన్తౌ=విడచుచున్నవారై, కేసరిణావివ=రెండు సింహములు వలె, యుయుధాతే=యుద్ధముచేసిరి. తౌ=ఆ, నరరాక్షసముఖ్యౌ=నరరాక్షసముఖ్యులు, ప్రహృష్టౌ=సంతోషించినవారై, అభ్యయుధ్యతామ్=యుద్ధము చేసిరి.

తా. అప్పుడు ఎదురెదురుగా నిలిచి ఉన్న ఆ మహాత్ములు అనేకమైన బాణములను విడచుచూ, సింహములు వలె యుద్ధము చేసిరి. నరులలో ముఖ్యుడైన లక్ష్మణుడూ, రాక్షసులలో ముఖ్యుడైన ఇంద్రజిత్తూ ఉత్సాహవంతులై యుద్ధము చేసిరి. 36, 37

మూ. తతశ్శరాన్ దాశరథిః సంధాయామిత్రకర్షణః,
ససర్జ రాక్షసేన్ద్రాయ క్రుద్ధః సర్ప ఇవ శ్వసన్. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అమిత్రకర్షణః=శత్రువులను ఈడ్చివేయు, దాశ

రథీః=లక్ష్మణుడు, శరాన్=బాణములను, సంధాయ=సంధించి, క్రుద్ధః=కోపించిన, సర్పః ఇవ=సర్పము వలె, శ్వసన్=బుసలుకొట్టుచు, రాక్షసేన్ద్రాయ=ఇంద్రజిత్తుకొరకు, ససర్జ=విడచెను.

తా. అప్పుడు శత్రుసంహారకుడైన లక్ష్మణుడు బాణములు సంధించి, పగ బట్టిన సర్పము వలె బుసలు కొట్టుచు, ఇంద్రజిత్తుపై ప్రయోగించెను. 38

మూ. తస్య జ్యాతలనిర్ఘోషం స శ్రుత్వా రాక్షసాధిపః,
వివర్ణవదనో భూత్వా లక్ష్మణం సముదైక్షత. 39

ప్ర. అ. సః=ఆ, రాక్షసాధిపః=రాక్షసనాయకుడు, తస్య=ఆతనియొక్క, జ్యాతలనిర్ఘోషమ్=నారియొక్క ధ్వనిని, శ్రుత్వా=విని, వివర్ణవదనః=రంగుమారిన ముఖము కలవాడుగా, భూత్వా=అయి, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, సముదైక్షత=చూచెను.

తా. ఇంద్రజిత్తు లక్ష్మణుని ధనుష్టంకారధ్వనిని విని, పాలిపోయిన ముఖముతో ఆ లక్ష్మణునివైపు చూచెను. 39

మూ. విషణ్ణవదనం దృష్ట్వా రాక్షసం రావణాత్మజమ్,
సౌమిత్రిం యుద్ధసంయుక్తం ప్రత్యువాచ విభీషణః. 40

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, విషణ్ణవదనమ్=దిగులు చెందిన ముఖము కల, రావణాత్మజమ్=రావణుని పుత్రుడైన, రాక్షసమ్=ఇంద్రజిత్తును, దృష్ట్వా=చూచి, యుద్ధసంయుక్తమ్=యుద్ధమునందు లగ్నచిత్తుడైన, సౌమిత్రిమ్=లక్ష్మణుని గూర్చి, ప్రత్యువాచ=పలికెను.

తా. విభీషణుడు దిగులు చెందిన ముఖముతో నున్న ఇంద్రజిత్తును చూచి యుద్ధాసక్తుడైన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 40

మూ. నిమిత్తాన్యుపపశ్యామి యాన్యస్మిన్ రావణాత్మజే,
త్వర తేన మహాబాహో భగ్న ఏష న సంశయః. 41

ప్ర. అ. మహాబాహో=ఓ! మహాబాహూ ! అస్మిన్=ఈ, రావణాత్మజే=ఇంద్రజిత్తునందు, యాని=ఏ, నిమిత్తాని=శకునములను, ఉపపశ్యామి=చూచుచున్నానో, తేన=దానిచేత, ఏషః=ఇతడు, భగ్నః=దుర్బలుడైనవాడు. సంశయః=సంశయము, న=లేదు. త్వర=తొందరపడుము.

తా. ఓ ! మహాబాహూ ! ఈ ఇంద్రజిత్తులో కనబడు లక్షణములను బట్టి ఇతడు దుర్బలుడై పోయినాడు; సంశయము లేదు. నీవు తొందరపడుము.

మూ. తతస్సంధాయ సౌమిత్రిః శరానాశీవిషోపమాన్,
ముమోచ నిశితాంస్తస్మిన్ సర్పానివ విషోల్బణాన్. 42

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఆశీవిషోపమాన్=సర్పములతో సమానములైన, నిశితాన్= వాడియైన, శరాన్=బాణములను, సంధాయ=సంధించి, విషోల్బణాన్=విషముచేత తీవ్రమయిన, సర్పానివ=సర్పములను వలె, తస్మిన్=వానియందు, ముమోచ=విడచెను.

తా. అప్పుడు లక్ష్మణుడు సర్పములవంటి వాడియైన బాణములను సంధించి విషముచేత తీవ్రములయిన సర్పములను వలె ఇంద్రజిత్తుపై ప్రయోగించెను. 42

మూ. శక్రాశనిసమస్పర్శైర్లక్ష్మణేనాహతః శరైః,
ముహూర్తమభవన్మూఢః సర్వసంక్షుభితేన్ద్రియః. 43

ప్ర. అ. లక్ష్మణేన=లక్ష్మణునిచేత, శక్రాశనిసమస్పర్శైః=ఇంద్రుని వజ్రముతో సమానమైన స్పర్శ గల, శరైః= బాణములచేత, ఆహతః=కొట్టబడిన ఇంద్రజిత్తు, సర్వసంక్షుభితేన్ద్రియః=క్షోభింపచేయబడిన సమస్తేంద్రియములు కలవాడై, ముహూర్తమ్=ముహూర్తకాలము, మూఢః=మూఢుడుగా, అభవత్=ఆయెను.

తా. లక్ష్మణుడు ఇంద్రుని వజ్రము వంటి బాణములతో కొట్టగా ఇంద్రజిత్తు ఇంద్రియములన్నీ క్షోభ చెందుటచే ముహూర్తకాలము స్పృహ తప్పి ఉండిపోయెను. 43

మూ. ఉపలభ్య ముహూర్తేన సంజ్ఞాం ప్రత్యాగతేన్ద్రియః,
దదర్శావస్థితం వీరమాజౌ దశరథాత్మజమ్. 44

ప్ర. అ. ముహూర్తేన=ముహూర్తకాలముచేత, సంజ్ఞామ్=సంజ్ఞను, ఉపలభ్య=పొంది, ప్రత్యాగతేన్ద్రియః=తిరిగి వచ్చిన ఇంద్రియములు గలవాడై, ఆజౌ=యుద్ధమునందు, అవస్థితమ్=నిలచి యున్న, వీరమ్=వీరుడైన, దశరథాత్మజమ్=లక్ష్మణుణ్ణి, దదర్శ=చూచెను.

తా. ముహూర్తకాలములో సంజ్ఞను పొంది, తిరిగి వచ్చిన ఇంద్రియములు గల ఆ ఇంద్రజిత్తు యుద్ధములో స్థిరముగా నిలిచి ఉన్న వీరుడైన లక్ష్మణుణ్ణి చూచెను. 44

మూ. సోఽభిచక్రామ సౌమిత్రిం రోషాత్సంరక్తలోచనః,
అబ్రవీచ్చైనమాసాద్య పునః స పరుషం వచః. 45

ప్ర. అ. సః=అతడు, రోషాత్=కోపమువలన, సంరక్తలోచనః=ఎఱ్ఱనైన

నేత్రములు కలవాడై, సౌమిత్రిమ్= లక్ష్మణుని గూర్చి, అభిచక్రామ=నడచెను. సః=అతడు, ఏనమ్=లక్ష్మణుణ్ణి, ఆసాద్య=సమీపించి, పరుషమ్=పరుషమైన, వచః=వచనమును, పునః=మరల, అబ్రవీత్ చ=పలికెను కూడ.

తా. రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములతో అతడు లక్ష్మణుని వైపు వెళ్ళి ఆతనితో మరల పరుషవాక్యము పలికెను. 45

మూ. కిం న స్మరసి తద్యుద్ధే ప్రథమే యత్పరాక్రమమ్,
నిబద్ధస్త్వం సహ భ్రాత్రా యదా భువి విచేష్టసే. 46

ప్ర. అ. త్వమ్=నీవు, భ్రాత్రా సహ=సోదరునితో కూడ, నిబద్ధః=కట్టబడినవాడవై, యదా=ఎప్పుడు, భువి=నేలమీద, విచేష్టసే=దొరలితివో, ప్రథమే=మొదటిదైన, యుద్ధే=యుద్ధమునందు, తత్=ఆ, మత్పరాక్రమమ్=నా పరాక్రమమును, న స్మరసి కిమ్=స్మరించుటలేదా?

తా. మొదటి యుద్ధమునందు చూపిన నా పరాక్రమము నీకు జ్ఞాపకము లేదా? ఆనాడు నీ సోదరునితో పాటు బంధింపబడి నేలమీద దొర్లితివి ! 46

మూ. యువాం ఖలు మహాయుద్ధే శక్రాశనిసమైః శరైః,
శాయితౌ ప్రథమం భూమౌ విసంజ్ఞౌ సపురఃసరౌ. 47

ప్ర. అ. సపురఃసరౌ=పరివారముతో కూడిన, యువామ్=మీరిద్దరూ, ప్రథమమ్=ముందుగా, మహాయుద్ధే=మహాయుద్ధమునందు, శక్రాశనిసమైః=దేవేంద్రుని వజ్రముతో సమానములైన, శరైః=బాణములచేత, విసంజ్ఞౌ=సంజ్ఞ లేనివారుగా, భూమౌ=నేలమీద, శాయితౌ=పండుకొనచేయబడిరి.

తా. మొదట జరిగిన ఆ మహాయుద్ధములో పరివారసహితులైన మీ ఇద్దరినీ ఇంద్రుని వజ్రముతో సమానములైన బాణములచేత సంజ్ఞ లేకుండ చేసి నేలమీద పడగొట్టితిని కదా ? 47

మూ. స్మృతిర్వా నాస్తి తే మన్యే వ్యక్తం వా యమసాదనమ్,
గన్తుమిచ్ఛసి యన్మాం త్వమాధర్షయితుమిచ్ఛసి. 48

ప్ర. అ. త్వమ్=నీవు, మామ్=నన్ను, ఆధర్షయితుమ్=ఎదిరించుటకు, యత్=ఏకారణమువలన, ఇచ్ఛసి= కోరుచున్నావో, అందువలన, తే=నీకు, స్మృతిః= జ్ఞాపకము, నాస్తి వా=లేదా ? వ్యక్తమ్=స్పష్టముగా, యమసాదనమ్=యముని గృహమును గూర్చి, గన్తుమ్=వెళ్ళుటకు, ఇచ్ఛసి వా=కోరుచున్నావా అని, మన్యే= తలచుచున్నాను.

తా. నీవు నన్ను ఎదిరించవలె నని కోరుచున్నా వనగా నీకు ఆ విషయము జ్ఞాపకమైన లేకపోవలె, లేదా స్పష్టముగా యమలోకమునకు వెళ్ళవలె నని నీవు కోరుకొనుచుండవలె అని అనుకొనుచున్నాను. 48

మూ. యది తే ప్రథమే యుద్ధే న దృష్టో మత్పరాక్రమః,
అద్య త్వాం దర్శయిష్యామి తిష్ఠేదానీం వ్యవస్థితః. 49

ప్ర. అ. ప్రథమే=మొదటిదైన, యుద్ధే=యుద్ధమునందు, తే=నీకు, మత్పరాక్రమః=నాపరాక్రమము, న దృష్టః యది=చూడబడకపోయినచో, అద్య=ఇప్పుడు, త్వామ్=నిన్ను, దర్శయిష్యామి=చూచునట్లు చేసెదను; ఇదానీమ్=ఇప్పుడు, వ్యవస్థితః=సిద్ధమైనవాడవై, తిష్ఠ=ఉండుము.

తా. మొదటి యుద్ధములో నీవు నా పరాక్రమమును చూచి ఉండనిచో ఇప్పుడు నీకు చూపెదను. సిద్ధముగా నిలచి ఉండుము. 49

మూ. ఇత్యుక్త్వా సప్తభిర్బాణైరభివివ్యాధ లక్ష్మణమ్,
దశభిస్తు హనూమన్తం తీక్ష్ణధారైః శరోత్తమైః. 50

ప్ర. అ. ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, సప్తభిః=ఏడు, బాణైః=బాణములచేత, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, వివ్యాధ= కొట్టెను. తీక్ష్ణధారైః=తీక్ష్ణములైన అంచులు గల, దశభిః=పది, శరోత్తమైః=ఉత్తమములైన బాణములచేత, హనూమన్తమ్=హనుమంతుణ్ణి కొట్టెను.

తా. ఇట్లు పలికి ఏడు బాణములతో లక్ష్మణుణ్ణి కొట్టెను. వాడియైన అంచులు గల పది బాణాలచేత హనుమంతుణ్ణి కొట్టెను. 50

మూ. తతః శరశతేనైవ సుప్రయుక్తేన వీర్యవాన్,
క్రోధాద్ద్విగుణసంరబ్ధో నిర్బిభేద విభీషణమ్. 51

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన ఇంద్రజిత్తు, క్రోధాత్=కోపమువలను, ద్విగుణసంరబ్ధః=రెట్టింపు తొందర గలవాడై, సుప్రయుక్తేన=బాగుగా ప్రయోగింపబడిన, శరశతేనైవ=శరముల శతముచేత, విభీషణమ్=విభీషణుణ్ణి, నిర్బిభేద=భేదించెను.

తా. పిమ్మట పరాక్రమవంతుడైన ఇంద్రజిత్తు కోపముతో రెట్టింపు తొందరపడుచు బాగుగా ప్రయోగించిన నూరు బాణాలతో విభీషణుణ్ణి కొట్టెను.

మూ. తద్దృష్ట్వా వానరజితా కర్మ కృతం రామానుజస్తదా,
అచిన్తయిత్వా ప్రహసన్నైతత్కించిదితి బ్రువన్. 52

ముమోచ చ శరాన్ ఘోరాన్ సంగృహ్య నరపుంగవః,
అభీతవదనః క్రుద్ధో రావణిం లక్ష్మణో యుధి. 53

ప్ర. అ. తదా=అప్పుడు, రామానుజః=రాముని తమ్ముడు, నరపుంగవః= నరులలో శ్రేష్ఠుడూ అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, యుధి=యుద్ధమునందు, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, కృతమ్=చేయబడిన, తత్=ఆ, కర్మ=పనిని, దృష్ట్వా= చూచి, అచిన్తయిత్వా=లెక్కచేయక, ప్రహసన్=నవ్వుచు, కించిత్=ఏమీ కూడ, న=కాదు, ఇతి=అని, బ్రువన్= పలుకుచు, అభీతవదనః=భయపడని ముఖము కలవాడై, క్రుద్ధః=కోపించినవాడై, రావణిమ్=ఇంద్రజిత్తును గూర్చి, ఘోరాన్=భయంకరములైన, శరాన్=శరములను, సంగృహ్య=గ్రహించి, ముమోచ=విడచెను.

తా. అప్పుడు రాముని తమ్ముడు, నరశ్రేష్ఠుడు అయిన లక్ష్మణుడు యుద్ధములో ఇంద్రజిత్తు చేసిన ఆ పని చూచి, లెక్కచేయక, నవ్వుచు, "ఇది గొప్ప పని ఏమీ కాదు" అని పలుకుచు, భయముచెందనివాడై, క్రోధముతో, భయంకరములైన బాణములు తీసి అతనిపై ప్రయోగించెను. 52, 53

మూ. నైవం రణగతాః శూరాః ప్రహరన్తి నిశాచర,
లఘవశ్చాల్పవీర్యాశ్చ శరా హీమే సుఖాస్తవ. 54

ప్ర. అ. నిశాచర=రాక్షసుడా ! రణగతాః=యుద్ధములో ఉన్న, శూరాః=శూరులు, ఏవమ్=ఇట్లు, న ప్రహరన్తి=కొట్టరు. తవ=నీయొక్క, ఇమే శరాః=ఈ బాణములు, లఘవశ్చ=తేలికగాను, అల్పవీర్యాశ్చ= అల్పమైన పరాక్రమము కలవిగాను, సుఖాః హి=సుఖకరముగాను ఉన్నవి కదా ?

తా. "ఓ ! రాక్షసుడా ! యుద్ధానికి వచ్చిన శూరులు ఈ విధముగా కొట్టరు. ఈ నీ బాణములు తేలికగాను, తక్కువ బలము కలవిగాను, సుఖకరములుగాను ఉన్నవి కదా. 54

మూ. నైవం శూరాస్తు యుధ్యన్తే సమరే జయకాంక్షిణః,
ఇత్యేవం తం బ్రువన్ ధన్వీ శరైరభివవర్ష హ. 55

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, జయకాంక్షిణః=జయమును కోరు, శూరాః=శూరులు, ఏవమ్=ఈ విధముగా, న యుధ్యన్తే=యుద్ధము చేయరు. ఇత్యేవమ్=ఇట్లు, తమ్=అతనిని గూర్చి, బ్రువన్=పలుకుచు, ధన్వీ= ధనుర్ధరుడైన లక్ష్మణుడు, శరైః=బాణములచేత, అభివవర్ష హ=వర్షించెను.

తా. యుద్ధములో జయము కావలె నని కోరుకొనే శూరులు ఈ విధముగా కొట్టరు." ధనుర్ధరుడైన లక్ష్మణుడు ఈ విధముగా పలుకుచు

ఆతనిపై బాణములు కురిపించెను. 55

మూ. తస్య బాణైః సువిధ్వస్తం కవచం కాఞ్చనం మహత్,
వ్యశీర్యత రథోపస్థే తారాజాలమివామ్బరాత్. 56

ప్ర. అ. తస్య=లక్ష్మణునియొక్క, బాణైః=బాణములచేత, సువిధ్వస్తమ్=ధ్వంసముచేయబడిన, కాఞ్చనమ్= బంగారు వికారమైన, మహత్=గొప్పదైన, కవచమ్=కవచము, అమ్బరాత్=ఆకాశమునుండి, తారాజాలమివ= నక్షత్రసముదాయము వలె, రథోపస్థే=రథముయొక్క మధ్యభాగమునందు, వ్యశీర్యత=జారిపడెను.

తా. లక్ష్మణుని బాణములచేత ముక్కలు చేయబడి బంగారము వికారమైన ఇంద్రజిత్తు కవచము, ఆకాశమునుండి నక్షత్రసముదాయము వలె, రథమధ్యమునందు పడిపోయెను. 56

మూ. విధూతవర్మా నారాచైర్బభూవ స కృతవ్రణః,
ఇన్ద్రజిత్సమరే వీరః ప్రత్యూషే భానుమానివ. 57

ప్ర. అ. నారాచైః=నారాచబాణములచేత, విధూతవర్మా=కొట్టివేయబడిన కవచము గల, కృతవ్రణః=చేయబడిన గాయము గల, వీరః=వీరుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, సమరే=యుద్ధమునందు, ప్రత్యూషే=ప్రాతఃకాలమునందు, భానుమానివ=సూర్యుడు వలె, బభూవ=ఉండెను.

తా. నారాచబాణములచేత కవచము బ్రద్దలైపోవుటచే గాయములు తగిలిన వీరుడైన ఇంద్రజిత్తు ప్రాతఃకాలమునందు సూర్యుడు వలె ఉండెను.

మూ. తతః శరసహస్రేణ సంక్రుద్ధో రావణాత్మజః,
బిభేద సమరే వీరో లక్ష్మణం భీమవిక్రమః. 58

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీరః=వీరుడైన, భీమవిక్రమః=భయంకరమైన పరాక్రమముగల, రావణాత్మజః=ఇంద్రజిత్తు, సంక్రుద్ధః=కోపించినవాడై, సమరే=యుద్ధమునందు, లక్ష్మణమ్=లక్ష్మణుని, శరసహస్రేణ=బాణముల సహస్రముచేత, బిభేద=భేదించెను.

తా. అటుపిమ్మట భయంకరమైన పరాక్రమము గల వీరుడైన ఇంద్రజిత్తు కోపించినవాడై యుద్ధమునందు వేయి బాణములచేత లక్ష్మణుణ్ణి కొట్టెను. 58

మూ. వ్యశీర్యత మహద్దివ్యం కవచం లక్ష్మణస్య తు,
కృతప్రతికృతాన్యోన్యం బభూవతురభిద్రుతౌ. 59

ప్ర. అ. లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, మహత్=గొప్పదైన, దివ్యమ్=

దివ్యమైన, కవచమ్=కవచము, వ్యశీర్యత= భగ్నమైపోయెను. కృతప్రతికృతాన్యోన్యమ్=చేసినదానికి ప్రతిక్రియచేయు పరస్పరము కలుగునట్లుగా, అభిద్రుతౌ=మీదికి వచ్చువారుగా, బభూవతుః=ఉండిరి.

తా. లక్ష్మణుని గొప్పదైన, దివ్యమైన కవచము బ్రద్దలై పోయెను. వాళ్ళిద్దరూ ఒకరు చేసినదానికి మరొకరు ప్రతిక్రియ చేయుచు, ఒకరి మీదికి ఒకరు వెళ్ళి పోరాడుచుండిరి. 59

మూ. అభీక్ష్ణం నిఃశ్వసన్తౌ తౌ యుధ్యేతాం తుములం యుధి,
శరసంకృత్తసర్వాఙ్గౌ సర్వతో రుధిరోక్షితౌ. 60

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, శరసంకృత్తసర్వాఙ్గౌ=బాణములచేత ఛేదించబడిన సమస్తదేహము గల, సర్వతః=అంతటా, రుధిరోక్షితౌ=రక్తముచేత పూయబడిన, తౌ=వారిద్దరూ, అభీక్ష్ణమ్=మిక్కిలి, నిఃశ్వసన్తౌ= నిట్టూర్చుచున్నవారై, తుములమ్=వ్యాకులముగా, యుధ్యేతామ్=యుద్ధముచేసిరి.

తా. వారిద్దరూ మిక్కిలి నిట్టూర్చుచు యుద్ధము చేసిరి. ఆ తుముల యుద్ధములో వారి శరీరములు పూర్తిగా బాణముల దెబ్బలకు తూట్లు పడి అంతటా రక్తము చేత తడిసి ఉండెను. 60

మూ. సుదీర్ఘకాలం తౌ వీరావన్యోన్యం నిశితైః శరైః,
తతక్షతుర్మహాత్మానౌ రణకర్మవిశారదౌ. 61

ప్ర. అ. మహాత్మానౌ=మహాత్ములు, రణకర్మవిశారదౌ=యుద్ధమునందు నేర్పు గలవారు అయిన, తౌ=ఆ, వీరౌ=వీరులు, సుదీర్ఘకాలమ్=చాల కాలము, అన్యోన్యమ్=పరస్పరము, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, తతక్షతుః=చెక్కివేసిరి.

తా. మహాత్ములు, యుద్ధములో నేర్పు కలవారు అయిన ఆ వీరులు వాడియైన బాణములచేత, చాల కాలము, ఒకరి నొకరు చెక్కివేసిరి. 61

మూ. బభూవతుశ్చాత్మజయే యత్తౌ భీమపరాక్రమౌ,
తౌ శరౌఘైస్తథాకీర్ణౌ నికృత్తకవచధ్వజౌ, 62
సృజన్తౌ రుధిరం చోష్ణం జలం ప్రస్రవణావివ.

ప్ర. అ. భీమపరాక్రమౌ=భయంకరమైన పరాక్రమము గల వారిద్దరూ, ఆత్మజయే=తమ జయమునందు, యత్తౌ=ప్రయత్నవంతులు, బభూవతుః=అయిరి. శరౌఘైః=బాణసముదాయములచేత, తథా=అట్లు, ఆకీర్ణౌ=చిమ్మబడిన, నికృత్తకవచధ్వజౌ=ఛేదించబడిన కవచములు, ధ్వజమూ గల, తౌ=వారిద్దరు,

ఉష్ణమ్=వేడియైన, రుధిరమ్=రక్తమును, సృజన్తౌ=విడచుచు, జలమ్=జలమును విడచుచున్న, ప్రస్రవణావివ=సెలయేళ్ళ వలె (లేదా ప్రస్రవణపర్వతములవలె) ఉండిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల వారిద్దరు ఎవరికి వారు తాము జయించవలె నని ప్రయత్నించుచుండిరి. ఆ విధముగా బాణసముదాయములచేత వ్యాప్తులై, ఛేదించబడిన కవచములు, ధ్వజము గల వారిద్దరూ వేడియైన రక్తమును స్రవించుచు, జలమును స్రవించుచున్న ప్రస్రవణపర్వతములవలె (లేదా సెలయేళ్ల వలె) ఉండిరి. 62

మూ. శరవర్షం తతో ఘోరం ముఞ్చతోర్భీమనిఃస్వనమ్. 63
సాసారయోరివాకాశే నీలయోః కాలమేఘయోః,
తయోరథ మహాన్ కాలో వ్యతీయాద్యుధ్యమానయోః. 64
న చ తౌ యుద్ధవైముఖ్యం శ్రమం చాప్యుపజగ్మతుః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, భీమనిఃస్వనమ్=భయంకరమైన ధ్వని గల, ఘోరమ్=ఘోరమైన, శరవర్షమ్=బాణవర్షమును, ముఞ్చతోః=విడచుచున్న, ఆకాశే= ఆకాశమునందు, సాసారయోః=ధారావర్షమును కురియుచున్న, నీలయోః=నల్లని, కాలమేఘయోరివ=ప్రలయకాల మేఘములువలె ఉన్న, యుధ్యమానయోః=యుద్ధము చేయుచున్న, తయోః=వారిద్దరికీ, అథ=పిమ్మట, మహాన్=గొప్ప, కాలః=కాలము, వ్యతీయాత్=గడచిపోయెను. తౌ=వారు, యుద్ధవైముఖ్యమ్=యుద్ధమునందు విముఖత్వమును గాని,శ్రమం చాపి=అలసటనుగాని, న ఉపజగ్మతుః=పొందలేదు.

తా. అప్పుడు భయంకరమైన ధ్వని గల ఘోరమైన బాణవర్షమును విడచుచు, ధారావర్షమును కురియుచున్న ఆకాశమునందున్న నల్లని ప్రలయ కాలమేఘములవలె ఉన్న వారు ఆ విధముగా యుద్ధము చేయుచుండగా చాల సమయము గడచిపోయెను. కాని వాళ్ళిద్దరూ కూడ యుద్ధమునందు వైముఖ్యమును గాని, అలసటను గాని పొందలేదు. 63, 64

మూ. అస్త్రాణ్యస్త్రవిదాం శ్రేష్ఠౌ దర్శయన్తౌ పునః పునః, 65
శరానుచ్చావచాకారానన్తరిక్షే బబన్ధతుః.

ప్ర. అ. అస్త్రవిదామ్=అస్త్రవేత్తలలో, శ్రేష్ఠౌ=శ్రేష్ఠులైన వారిద్దరూ, పునః పునః=మాటిమాటికి, అస్త్రాణి=అస్త్రములను, దర్శయన్తౌ=చూపుచున్నవారై, అన్తరిక్షే=ఆకాశమునందు, ఉచ్చావచాన్=అనేకభేదములు గల, శరాన్=బాణములను, బబన్ధతుః=కట్టిరి.

తా. అస్త్రవేత్తలలో శ్రేష్ఠులైన వారిద్దరూ మాటిమాటికి అస్త్రములను

ప్రయోగించుచు, ఆకాశముమీద అనేక ఆకారములు గల బాణములను పంజరము వలె అల్లిరి. 65

మూ. వ్యపేతదోషమస్యన్తౌ లఘు చిత్రం చ సుష్ఠు చ, 66
ఉభౌ తు తుములం ఘోరం చక్రతుర్నరరాక్షసౌ.

ప్ర. అ. నరరాక్షసౌ=ఆ నరరాక్షసులు, ఉభౌ=ఇద్దరూ, వ్యపేతదోషమ్=దోషములు లేకుండగా, లఘు= తేలికగాను, చిత్రం చ=చిత్రముగాను, సుష్ఠు చ=బాగుగాను, అస్యన్తౌ=(బాణములు) చిమ్ముచున్నవారై, తుములమ్=వ్యాకులముగాను, ఘోరమ్=ఘోరముగాను, చక్రతుః=యుద్ధము చేసిరి.

తా. ఆ లక్ష్మణేంద్రజిత్తు లిద్దరు పొరపాటు పడకుండగా, తేలికగా, చిత్రముగా, బాగుగా బాణములను ప్రయోగించుచు వ్యాకులముగాను, ఘోరముగాను యుద్ధము చేసిరి. 66

మూ. తయోః పృథక్ పృథగ్భీమః శుశ్రువే తుములః స్వనః, 67
స కమ్పం జనయామాస నిర్ఘాత ఇవ దారుణః.

ప్ర. అ. తయోః=వారిద్దరియొక్క, భీమః=భయంకరము, తుములః=వ్యాకులము అయిన, స్వనః=ధ్వని, పృథక్ పృథక్=వేరువేరుగా, శుశ్రువే=వినబడెను. సః=ఆ ధ్వని, దారుణః=భయంకరమైన, నిర్ఘాతః ఇవ=ఉరుము వలె, కమ్పమ్=కంపమును, జనయామాస=పుట్టించెను.

తా. ఆ ఇద్దరివల్ల జనించిన వ్యాకులమైన ధ్వని వేరు వేరుగా వినబడెను. అది దారుణమైన ఉరుము వలె కంపమును పుట్టించెను. 67

మూ. తయోః స భ్రాజతే శబ్దస్తథా సమరయత్తయోః, 68
సుఘోరయోర్నిఃస్వనతోర్గగనే మేఘయోరివ.

ప్ర. అ. తథా=ఆ విధముగా, సమరయత్తయోః=యుద్ధమునందు ఆసక్తులైన, తయోః=వారియొక్క, సః శబ్దః= ఆ శబ్దము, గగనే=ఆకాశమునందు, నిఃస్వనతోః=ధ్వనిచేయుచున్న, సుఘోరయోః=చాల ఘోరమైన, మేఘయోరివ=మేఘముల ధ్వని వలె, భ్రాజతే=ప్రకాశించెను.

తా. యుద్ధమునందు ఆసక్తులైన వారి ఇద్దని ధ్వని, ఆకాశమునందు ఉరుముచున్న, చాల భయంకరములైన మేఘముల ధ్వని వలె ఉండెను. 68

మూ. సువర్ణపుఙ్ఖైర్నారాచైర్బలవన్తౌ కృతవ్రణౌ, 69
ప్రసుస్రువాతే రుధిరం కీర్తిమన్తౌ జయే ధృతౌ.

ప్ర. అ. జయే=జయమునందు, ధృతౌ=నిశ్చయము కలవారు, కీర్తిమన్తౌ=కీ

ర్తిగలవారు, సువర్ణపుఙ్ఖైః=బంగారు పొన్నులు గల, నారాచైః=నారాచబాణములచేత, కృతవ్రణౌ=చేయబడిన గాయములు గలవారు, బలవన్తౌ= బలవంతులూ అయిన ఆ ఇద్దరూ, రుధిరమ్=రక్తమును, ప్రసుస్రువాతే=స్రవించిరి.

తా. కీర్తిమంతులు, జయము సంపాదింపవలె నను పట్టుదల గలవారు, మహాబలవంతులు అయిన వారిద్దరూ బంగారుపొన్నులు గల నారాచములచేత గాయములు ఏర్పడగా రక్తమును స్రవించిరి. 69

మూ. తే గాత్రయోర్నిపతితా రుక్మపుఙ్ఖాః శరా యుధి, 70
అసృగ్దిగ్ధా వినిష్పేతుర్వివిశుర్ధరణీతలమ్.

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, గాత్రయోః=దేహములమీద, పతితాః= పడిన, రుక్మపుఙ్ఖాః=బంగారు పొన్నులు గల, తే శరాః=ఆ బాణములు, అసృగ్దిగ్ధాః=రక్తముచేత పూయబడినవై,వినిష్పేతుః=బైటకువచ్చినవి. ధరణీతలమ్= భూమిని, వివిశుః=ప్రవేశించినవి.

తా. యుద్ధమునందు వారి దేహములమీద పడిన, బంగారు పొన్నులు గల ఆ బాణములు రక్తముచేత పూయబడినవై బైటకు వచ్చి నేలలో ప్రవేశించినవి. 70

మూ. అన్యే సునిశితైః శస్త్రైరాకాశే సంజఘట్టిరే, 71
బభఞ్జుశ్చిచ్ఛిదుశ్చైవ తయోర్బాణాః సహస్రశః.

ప్ర. అ. తయోః=వారియొక్క, అన్యే బాణాః=మరి కొన్ని బాణములు, సునిశితైః=చాలా వాడియైన, శస్త్రైః= ఆయుధములతో, ఆకాశే=ఆకాశము నందు, సంజఘట్టిరే=ఢీకొనెను. సహస్రశః=వేలకొలది, బభఞ్జుః=విరిచివేసినవి, చిచ్ఛిదుశ్చ=ఛేదించినవి.

తా. వారిద్దరు ప్రయోగించిన కొన్ని బాణములు ఆకాశమునందు వాడియైన ఆయుధములతో ఢీకొని వాటిని వేలకొలది ముక్కలుగా విరచివేసెను.

మూ. స బభూవ రణే ఘోరస్తయోర్బాణమయశ్చయః, 72
అగ్నిభ్యామివ దీప్తాభ్యాం సత్రే కుశమయశ్చయః.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, తయోః=వారియొక్క, ఘోరః=భయంకర మైన, బాణమయః=బాణవికారమైన, చయః=సముదాయము, సత్రే=యజ్ఞమునందు, దీప్తాభ్యామ్=మండుచున్న, అగ్నిభ్యామ్=అగ్నులవలన, కుశమయః=దర్భలవికారమైన, చయః ఇవ=సముదాయమువలె, బభూవ=ఆయెను.

తా. యుద్ధమునందు ప్రోగుపడిన వారి బాణముల సముదాయము

యజ్ఞమునందు రెండు అగ్నులవలన ఏర్పడిన కుశసముదాయము వలె ఉండెను. (యజ్ఞములో అగ్నుల ప్రక్క దర్భలు ప్రోగులుగా పడి ఉన్నట్లు వారి బాణములు ప్రోగులుగా పడియుండె నని భావము). 72

మూ. తయోః కృతవ్రణౌ దేహౌ శుశుభాతే మహాత్మనోః 73
సుపుష్పావివ నిష్పత్రౌ వనే కింశుకశాల్మలీ.

ప్ర. అ. తయోః మహాత్మనోః=ఆ మహాత్ములయొక్క, కృతవ్రణౌ=చేయబడిన గాయములు గల, దేహౌ=దేహములు, వనే=వనమునందు, సుపుష్పౌ=మంచి పుష్పములు గల, నిష్పత్రౌ=ఆకులు లేని, కింశుకశాల్మలీ ఇవ=కింశుక శాల్మలీవృక్షములవలె, శుశుభాతే=ప్రకాశించినవి.

తా. గాయములతో ఆ మహాత్ముల దేహములు బాగా పుష్పించి, ఆకులు లేని మోదుగచెట్టు, బూరుగచెట్టు వలె ప్రకాశించెను. 73

మూ. చక్రతుస్తుములం ఘోరం సంనిపాతం ముహుర్ముహుః, 74
ఇన్ద్రజిల్లక్ష్మణశ్చైవ పరస్పరజయైషిణౌ.

ప్ర. అ. ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, లక్ష్మణశ్చైవ=లక్ష్మణుడూ, పరస్పరజయైషిణౌ=ఒండొరుల జయమును కోరుచున్నవారై, ముహుర్ముహుః=మాటిమాటికి, తుములమ్=వ్యాకులమైన, ఘోరమ్=భయంకరమైన, సంనిపాతమ్=యుద్ధమును, చక్రతుః=చేసిరి.

తా. ఇంద్రజిత్తు, లక్ష్మణుడూ కూడ ఒకరినొకరు జయించవలె నను కోరికతో మాటిమాటికి వ్యాకులమైన, భయంకరమైన యుద్ధము చేసిరి. 74

మూ. లక్ష్మణో రావణిం యుద్ధే రావణిశ్చాపి లక్ష్మణమ్, 75
అన్యోన్యం తావభిఘ్నన్తౌ న శ్రమం ప్రతిపద్యతామ్.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, లక్ష్మణః=లక్ష్మణుడు, రావణిమ్=ఇంద్రజిత్తును, రావణిశ్చాపి=ఇంద్రజిత్తు, లక్ష్మణం చాపి=లక్ష్మణునీ, తౌ=వారు, అన్యోన్యమ్=పరస్పరము, అభిఘ్నన్తౌ=కొట్టుచున్నవారై, శ్రమమ్=అలసటను, న ప్రతిపద్యతామ్=పొందలేదు.

తా. యుద్ధమునందు లక్ష్మణుడు ఇంద్రజిత్తును, ఇంద్రజిత్తు లక్ష్మణునీ, ఈ విధముగా ఇద్దరూ పరస్పరమూ కొట్టుకొనుచు, అలసట చెందలేదు. 75

మూ. బాణజాలైః శరీరస్థైరవగాఢైస్తరస్వినౌ, 76
శుశుభాతే మహావీర్యౌ ప్రరూఢావివ పర్వతౌ.

ప్ర. అ. మహావీర్యౌ=గొప్ప పరాక్రమము గల, తరస్వినౌ=వేగవంతులైన వారిద్దరూ, అవగాఢైః=లోతుగా దిగిన, శరీరస్థైః=శరీరములందున్న, బాణజాలైః=బాణసముదాయములచేత, ప్రరూఢౌ=మొక్కలు మొలిచిన, పర్వతౌ ఇవ=పర్వతములు వలె, శుశుభాతే=ప్రకాశించిరి.

తా. గొప్ప పరాక్రమము, వేగము గల ఆ లక్ష్మణేంద్రజిత్తులు దేహములలో లోతుగా దిగి నిలచి ఉన్న బాణములతో మొక్కలు మొలచిన పర్వతముల వలె ప్రకాశించిరి. 76

మూ. తతో రుధిరసిక్తాని సంవృతాని శరైర్భృశమ్, 77
బభ్రాజుః సర్వగాత్రాణి జ్వలన్త ఇవ పావకాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రుధిరసిక్తాని=రక్తముచేత తడపబడినవి, శరైః=బాణములచేత, సంవృతాని= కప్పబడినవి అయిన, సర్వగాత్రాణి=అన్ని అవయవములు, జ్వలన్తః=మండుచున్న, పావకాః ఇవ=అగ్నులు వలె, భృశమ్=మిక్కిలి, బభ్రాజుః=ప్రకాశించినవి.

తా. అప్పుడు రక్తముచేత తడిసి, బాణములచేత కప్పబడిన వారి అన్ని అవయవములు మండుచున్న అగ్నుల వలె ప్రకాశించినవి. 77

మూ. తయోరథ మహాన్ కాలో వ్యతీయాద్యుధ్యమానయోః, 78
న చ తౌ యుద్ధవైముఖ్యం శ్రమం చాప్యభిజగ్మతుః.

ప్ర. అ. తా. 64వ శ్లోకము చూడుడు. 78

మూ. అథ సమరపరిశ్రమం నిహన్తుం
సమరముఖేష్వజితస్య లక్ష్మణస్య,
ప్రియహితముపపాదయన్మహాత్మా
సమరముపేత్య విభీషణోఽవతస్థే. 79

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అష్టాశీతితమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడైన, విభీషణః=విభీషణుడు, సమరముఖేషు=యుద్ధాగ్రస్థానములయందు, అజితస్య=జయించబడని, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, సమరపరిశ్రమమ్=యుద్ధపరిశ్రమను, నిహన్తుమ్=తొలగించుటకు, ప్రియహితమ్=ప్రియమును, హితమును, ఉపపాదయన్=కల్పించుచు,

సమరమ్=యుద్ధమును, ఉపేత్య=పొంది, అవతస్థే=నిలచెను.

తా. అప్పుడు మహాత్ముడైన విభీషణుడు, యుద్ధరంగమునందు పరాజయము ఎరుగని లక్ష్మణుని యుద్ధపరిశ్రమను తొలగించుటకై, ఆతనికి ప్రియమును, హితమును చేకూర్చుచు, యుద్ధరంగమును చేరి ఉండెను. 79

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోననవతితమః సర్గః

[విభీషణుడు రాక్షసులను వధించుచు వానరనాయకులను ప్రోత్సహించుట ఇంద్రజిత్తు సారథిని లక్ష్మణుడు చంపివేయుట. వానరులు రథాశ్వములను చంపివేయుట.]

మూ. యుధ్యమానౌ తతో దృష్ట్వా ప్రసక్తౌ నరరాక్షసౌ,
ప్రభిన్నావివ మాతఙ్గౌ పరస్పరజయైషిణౌ. 1
తయోర్యుద్ధం ద్రష్టుకామో వరచాపధరో బలీ,
శూరః స రావణభ్రాతా తస్థౌ సంగ్రామమూర్ధని. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వరచాపధరః=శ్రేష్ఠమైన ధనస్సును ధరించిన, బలీ=బలవంతుడూ, శూరః=శూరుడూ ఐన, సః రావణభ్రాతా=ఆ విభీషణుడు, ప్రసక్తౌ=ఏకాగ్రచిత్తులూ, యుధ్యమానౌ=యుద్ధముచేయుచున్నవారూ, ప్రభిన్నౌ=మదము స్రవించుచున్న, మాతఙ్గౌ ఇవ=ఏనుగుల వలె, పరస్పరజయైషిణౌ=పరస్పరమూ జయమును కోరుచున్న, నరరాక్షసౌ=ఆ నరరాక్షసులను, దృష్ట్వా=చూచి, తయోః=వారియొక్క, యుద్ధమ్=యుద్ధమును, ద్రష్టుకామః=చూడకోరిక గలవాడై, సంగ్రామమూర్ధని=యుద్ధరంగముయొక్క అగ్రభాగమునందు, తస్థౌ=నిలబడెను.

తా. ఏకాగ్రచిత్తులైన ఆ లక్ష్మణఇంద్రజిత్తులు మదించిన ఏనుగులు వలె ఒకరిపై ఒకరు జయమును కోరుచు యుద్ధము చేయుచుండగా చూచి శ్రేష్ఠమైన ధనస్సును ధరించిన బలవంతుడూ, శూరుడూ ఐన విభీషణుడు ఆ యుద్ధమును ఇంకనూ చూడవలెనను కోరికతో రణరంగాగ్రభాగమున నిలబడెను.

మూ. తతో విస్ఫారయామాస మహద్ధనురవస్థితః,
ఉత్ససర్జ చ తీక్ష్ణాగ్రాన్ రాక్షసేషు మహాశరాన్. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అవస్థితః=నిలచినవాడై, మహత్=గొప్పదైన, ధనుః=ధనస్సును, విస్ఫారయామాస=చరచెను. రాక్షసేషు=రాక్షసులయందు, తీక్ష్ణాగ్రాన్=వాడియైన అగ్రభాగములు కల, మహాశరాన్=గొప్ప బాణములను, ఉత్ససర్జ చ=విడచెను కూడ.

తా. అతడట్లు నిలిచి గొప్ప ధనుస్సును చరచి, వాడియైన కొనలు

గల శ్రేష్ఠములైన బాణములను రాక్షసులపై ప్రయోగించెను. 3

మూ. తే శరాః శిఖిసంస్పర్శా నిపతన్తస్సమాహితాః,
రాక్షసాన్ దారయామాసుర్వజ్రా ఇవ మహాగిరీన్. 4

ప్ర. అ. సమాహితాః=కలసినవై, నిపతన్తః=పడుచున్న, శిఖిసంస్పర్శాః= అగ్నిస్పర్శ వంటి స్పర్శ గల, తే=శరాః=ఆ బాణములు, వజ్రాః=వజ్రములు, మహాగిరీన్ ఇవ=మహాపర్వతములను వలె, రాక్షసాన్=రాక్షసులను, దారయా మాసుః=చీల్చివేసినవి.

తా. కలిసి పడుచున్న అగ్నిస్పర్శవంటి స్పర్శ గల ఆ బాణములు వజ్రములు మహాపర్వతములను చీల్చినట్లు రాక్షసులను చీల్చి వేసినవి. 4

మూ. విభీషణస్యానుచరాస్తేఽపి శూలాసిపట్టిశైః,
చిచ్ఛిదుః సమరే వీరాన్ రాక్షసాన్ రాక్షసోత్తమాః. 5

ప్ర. అ. విభీషణస్య=విభీషణునియొక్క, అనుచరాః=అనుచరులైన, తే=ఆ, రాక్షసోత్తమాః అపి=రాక్షసశ్రేష్ఠులు కూడా, సమరే=యుద్ధమునందు, వీరాన్= వీరులైన, రాక్షసాన్=రాక్షసులను, శూలాసిపట్టిశైః=శూలములచేత, ఖడ్గములచేత, పట్టిశములచేత, చిచ్ఛిదుః=ఛేదించిరి.

తా. విభీషణుని అనుచరులైన ఆ రాక్షసశ్రేష్ఠులు కూడా యుద్ధమునందు శూలములచేత, ఖడ్గములచేత, పట్టిశములచేత వీరులైన రాక్షసులను ఛేదించిరి.5

మూ. రాక్షసైస్తైః పరివృతః స తదా తు విభీషణః,
బభౌ మధ్యే ప్రధృష్టానామ్ కలభానామివ ద్విపః. 6

ప్ర. అ. తదా=అప్పుడు, తైః=ఆ, రాక్షసైః=రాక్షసులతో, పరివృతః= కూడిన, సః విభీషణః=ఆ విభీషణుడు, ప్రధృష్టానామ్=ధైర్యముతో నున్న, కలభానామ్=ఏనుగు గున్నలయొక్క, మధ్యే=మధ్యయందు, ద్విపః ఇవ=ఏనుగు వలె, బభౌ=ప్రకాశించెను.

తా. అప్పుడు తన అమాత్యులైన ఆ రాక్షసులతో కూడిన విభీషణుడు ధైర్యము గల ఏనుగు గున్నల మధ్య నున్న ఏనుగు వలె ప్రకాశించెను. 6

మూ. తతస్సంచోదమానో వై హరీన్ రక్షోవధప్రియాన్,
ఉవాచ వచనం కాలే కాలజ్ఞో రక్షసాం వరః. 7

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కాలజ్ఞః=తగిన కాలము నెరిగిన, రక్షసాం వరః=రాక్షసులలో శ్రేష్ఠుడైన విభీషణుడు, కాలే=ఆ సమయమునందు,

రక్షోవధప్రియాన్=రాక్షసులను చంపుట ప్రియముగా గల, హరీన్=వానరులను, సంచోదమానః=ప్రేరేపించుచూ, వచనమ్=వచనమును, ఉవాచ వై=పలికెను.

తా. అప్పుడు తగిన కాలము నెరిగిన రాక్షసశ్రేష్ఠుడైన విభీషణుడు అది తగిన సమయమని గుర్తించి రాక్షసులను చంపుట యందు ఆసక్తి కల ఆ వానరులను ప్రోత్సహించుచూ ఇట్లు పలికెను. 7

మూ. ఏకో౽యం రాక్షసేన్ద్రస్య పరాయణమవస్థితః,
ఏతచ్ఛేషం బలం తస్య కిం తిష్ఠత హరీశ్వరాః. 8

ప్ర. అ. హరీశ్వరాః=వానరనాయకులారా ! అయమ్=ఇతడు, ఏకః=ఒక్కడే, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, పరాయణమ్=గతిగా, అవస్థితః=ఉన్నాడు. తస్య=వానియొక్క, బలమ్=బలము, ఏతచ్ఛేషమ్=ఇతడే శేషముగా కలది. కిమ్=ఎందువలన, తిష్ఠత=నిలబడెదరు?

తా. ఓ ! వానరనాయకులారా ! ఇక రావణునకు ఇతడొక్కడే గతి. ఆతని బలములో మిగిలినది ఇతడే. ఎందుకు ఊరక నిలబడెదరు? 8

మూ. అస్మింశ్చ నిహతే పాపే రాక్షసే రణమూర్ధని,
రావణం వర్జయిత్వా తు శేషమస్య బలం హతమ్. 9

ప్ర. అ. రణమూర్ధని=రణాగ్రమునందు, పాపే=పాపాత్ముడైన, అస్మిన్=ఈ, రాక్షసే=రాక్షసుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, రావణమ్=రావణుణ్ణి, వర్జయిత్వా=విడచి, అస్య=వీనియొక్క, శేషమ్=మిగిలిన, బలమ్=సైన్యము, హతమ్=చంపబడినది.

తా. ఈ రణాగ్రమునందు పాపాత్ముడైన ఈ రాక్షసుణ్ణి చంపివేసినచో రావణుడు తప్ప మిగిలిన సైన్య మంతా చంపబడినట్లే. 9

మూ. ప్రహస్తో నిహతో వీరో నికుమ్భశ్చ మహాబలః,
కుమ్భకర్ణశ్చ కుమ్భశ్చ ధూమ్రాక్షశ్చ నిశాచరః. 10
జమ్బుమాలీ మహామాలీ తీక్ష్ణవేగో౽శనిప్రభః,
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ వజ్రదంష్ట్రశ్చ రాక్షసః. 11
సంహ్రాదీ వికటో౽రిఘ్నస్తపనో మంద ఏవ చ,
ప్రఘాసః ప్రఘసశ్చైవ ప్రజఙ్ఘో జఙ్ఘ ఏవ చ. 12
అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ వీర్యవాన్,
విద్యుజ్జిహ్వో ద్విజిహ్వశ్చ సూర్యశత్రుశ్చ రాక్షసః. 13

అకమ్పనః సుపార్శ్వశ్చ చక్రమాలీ చ రాక్షసః,
కమ్పనః సత్త్వవన్తౌ తౌ దేవాన్తకనరాన్తకౌ. 14

ప్ర. అ. ప్రహస్తః=ప్రహస్తుడు, నిహతః=చంపబడినాడు. వీరః=వీరుడైన, నికుమ్భశ్చ=నికుంభుడూ, మహాబలః=గొప్ప బలము కల, కుమ్భకర్ణశ్చ=కుంభకర్ణుడూ, కుమ్భశ్చ=కుంభుడూ, ధూమ్రాక్షః=ధూమ్రాక్షు డను, నిశాచరః=రాక్షసుడూ, జమ్బుమాలీ=జంబుమాలి, మహామాలీ=మహామాలి, తీక్ష్ణవేగః=తీక్ష్ణమైన వేగము గల, అశనిప్రభః=అశనిప్రభుడూ, సుప్తఘ్నః=సుప్తఘ్నుడు యజ్ఞకోపశ్చ=యజ్ఞకోపుడూ, వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రు డను రాక్షసః=రాక్షసుడూ, సంహ్రాదీ=సంహ్రాదీ, అరిఘ్నః=శత్రువులను సంహరించు, వికటః=వికటుడూ, తపనః=తపనుడూ, మందః ఏవ చ=మందుడూ, ప్రఘాసః=ప్రఘాసుడూ, ప్రఘసశ్చైవ=ప్రఘసుడూ, ప్రజఙ్ఘః=ప్రజంఘుడూ, జఙ్ఘః ఏవ చ=జంఘుడూ, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, అగ్నికేతుశ్చ=అగ్నికేతువూ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రశ్మికేతుశ్చ=రశ్మికేతువూ, విద్యుజ్జిహ్వః=విద్యుజ్జిహ్వుడూ, ద్విజిహ్వః=ద్విజిహ్వుడు, సూర్యశత్రుః=సూర్యశత్రు వను, రాక్షసశ్చ=రాక్షసుడూ, అకమ్పనః=అకంపనుడూ, సుపార్శ్వశ్చ=సుపార్శ్వుడూ, చక్రమాలీ=చక్రమాలి అను, రాక్షసశ్చ=రాక్షసుడూ, కమ్పనః=కంపనుడూ, సత్త్వవన్తౌ=బలము గల, దేవాన్తకనరాన్తకౌ=దేవాంతక నరాంతకులూ (నిహతాః=చంపబడినారు.)

తా. ప్రహస్తుడూ, వీరుడైన నికుంభుడూ, మహాబలశాలియైన కుంభకర్ణుడూ, కుంభుడూ, ధూమ్రాక్షుడూ, జంబుమాలి, మహామాలి, తీవ్రమైన వేగము కల అశనిప్రభుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, వజ్రదంష్ట్రుడూ, సంహ్రాది, శత్రుసంహారకుడైన వికటుడూ, తపనుడూ, మందుడూ, ప్రఘాస-ప్రఘస-ప్రజంఘ-జంఘులూ, ఎదిరింప శక్యము కాని అగ్నికేతువూ, పరాక్రమవంతుడైన రశ్మికేతువూ, విద్యుజ్జిహ్వ-ద్విజిహ్వ-సూర్యశత్రు-అకంపన- సుపార్శ్వ-చక్రమాలి-కంపనులూ, బలశాలులైన దేవాంతక-నరాంతకులూ చంపబడినారు. 10-14

మూ. ఏతాన్నిహత్యాతిబలాన్ బహూన్ రాక్షససత్తమాన్,
బాహుభ్యాం సాగరం తీర్త్వా లఙ్ఘ్యతాం గోష్పదం లఘు. 15

ప్ర. అ. అతిబలాన్=మిక్కిలి బలము గల, ఏతాన్=ఈ, బహూన్=అనేకులైన, రాక్షససత్తమాన్=రాక్షసశ్రేష్ఠులను, నిహత్య=చంపి, బాహుభ్యామ్=బాహువులచేత, సాగరమ్=సముద్రమును, తీర్త్వా=దాటి,లఘు=చిన్నదైన, గోష్పదమ్=గోష్పదము (ఎద్దు అడుగు వేయగా ఏర్పడిన గుంట), లఙ్ఘ్యతామ్=దాటబడుగాక.

తా. మీరు గొప్ప బలము గల ఇంతమంది రాక్షసవీరులను చంపివేసినారు. బాహువులతో సముద్రము దాటినారు. ఇంక మిగిలిన ఈ

చిన్న గోష్పదమును దాటి వేయుదు. 15

మూ. ఏతావదేవ శేషం వో జేతవ్యమిహ వానరాః,
హతాస్సర్వే సమాగమ్య రాక్షసా బలదర్పితాః. 16

ప్ర. అ. వానరాః=వానరులారా ! వః=మీకు, ఇహ=ఇక్కడ, జేతవ్యమ్=జయించదగినది, ఏతావదేవ=ఇంతమాత్రమే, శేషమ్=మిగిలినది. బలదర్పితాః=బలముచేత గర్వించిన, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, సమాగమ్య=వచ్చి, హతాః=చంపబడినారు.

తా. ఓ ! వానరులారా ! మీకు ఇక్కడ జయించవలసినది ఇంతమాత్రమే మిగిలినది. బలము చేత గర్వించి వచ్చిన రాక్షసుల నందరినీ చంపివేసినారు. 16

మూ. అయుక్తం నిధనం కర్తుం పుత్రస్య జనితుర్మమ,
ఘృణామపాస్య రామార్థే నిహన్యాం భ్రాతురాత్మజమ్. 17

ప్ర. అ. జనితుః=తండ్రినైన, మమ=నాకు, పుత్రస్య=పుత్రునియొక్క, నిధనమ్=వధను, కర్తుమ్=చేయుటకొరకు, అయుక్తమ్=యుక్తముకాదు. రామార్థే=రామునికొరకై, ఘృణామ్=జాలిని, అపాస్య=విడచి, భ్రాతుః=సోదరునియొక్క, ఆత్మజమ్=కుమారుణ్ణి, నిహన్యామ్=చంపెదను.

తా. తండ్రినైన నేను పుత్రుణ్ణి చంపుట యుక్తము కాదు. అయిననూ, జాలి విడచి రాముని నిమిత్తమై నా సోదరుని కుమారుణ్ణి చంపెదను. 17

మూ. హన్తుకామస్య మే బాష్పం చక్షుశ్చైవ నిరుధ్యతి,
తమేవైష మహాబాహుర్లక్ష్మణః శమయిష్యతి. 18
వానరా ఘ్నత సంభూయ భృత్యానస్య సమీపగాన్.

ప్ర. అ. హన్తుకామస్య=చంపుటకు ఇచ్ఛ గల, మే=నాయొక్క, చక్షుః=నేత్రమును, బాష్పమ్=కన్నీరు, నిరుధ్యతి=అడ్డుకొనుచున్నది. మహాబాహుః=గొప్ప బాహువులు గల, ఏషః=ఈ, లక్ష్మణః ఏవ=లక్ష్మణుడే, తమ్=వానిని, శమయిష్యతి=శాంతింపజేయగలడు. వానరాః=ఓ ! వానరులారా ! సంభూయ=కలిసి, అస్య=వీనియొక్క, సమీపగాన్=సమీపమునందున్న, భృత్యాన్=భృత్యులను, ఘ్నత=చంపుడు.

తా. నేను ఇతనిని చంపవలెనని అనుకొనుచున్నను, నా నేత్రమును కన్నీరు కప్పివేయుచున్నది. వీనిని మహాబాహువైన లక్ష్మణుడే శాంతింపచేయగలడు. వానరులారా ! మీరందరూ కలిసి ఈతని సమీపమునందున్న అనుచరులను

చంపివేయుదు. 18

మూ. ఇతి తేనాతియశసా రాక్షసేనాభిచోదితాః, 19
వానరేన్ద్రా జహృషిరే లాఙ్గూలాని చ వివ్యధుః.

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, అతియశసా=గొప్ప కీర్తి కల, తేన=ఆ, రాక్షసేన=రాక్షసునిచేత, అభిచోదితాః=ప్రేరేపింపబడిన, వానరేన్ద్రాః=వానరనాయకులు, జహృషిరే=సంతోషించిరి. లాఙ్గూలాని=తోకలను, వివ్యధుః చ=గట్టిగా కదల్చిరి.

తా. గొప్ప కీర్తి కల ఆ విభీషణు డిట్లు ప్రేరేపించగా వానరులు సంతోషించుచూ తోకలు గట్టిగా విదిపిరి. 19

మూ. తతస్తు కపిశార్దూలాః క్ష్వేడన్తశ్చ పునః పునః, 20
ముముచుర్వివిధాన్ నాదాన్ మేఘాన్ దృష్ట్వేవ బర్హిణః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, కపిశార్దూలాః=వానరశ్రేష్ఠులు, పునః పునః=మాటి మాటికి, క్ష్వేడన్తః=ధ్వనిచేయుచు, మేఘాన్=మేఘములను, దృష్ట్వా=చూచి, బర్హిణః ఇవ=నెమళ్ళు వలె, వివిధాన్=అనేకవిధములైన, నాదాన్=ధ్వనులను, ముముచుః=విడచిరి.

తా. పిమ్మట ఆ వానరశ్రేష్ఠులు మాటిమాటికి సింహనాదములు చేయుచు, మేఘములను చూచిన నెమళ్ళవలె అనేకవిధములైన ధ్వనులను చేసిరి. 20

మూ. జామ్బవానపి తైః సర్వైః సయూథ్యైరభిసంవృతః, 21
తేఽశ్మభిస్తాడయామాసుర్నఖైర్దన్తైశ్చ రాక్షసాన్.

ప్ర. అ. సర్వైః=సమస్తమైన, తైః=ఆ, సయూథ్యై=సమానయూథమునకు చెందినవారితో, అభిసంవృతః=కూడిన, జామ్బవానపి=జాంబవంతుడూ, తే=ఆ వానరులూ, రాక్షసాన్=రాక్షసులను, అశ్మభిః=రాళ్లతోనూ, నఖైః=గోళ్లతోనూ, దన్తైశ్చ=దంతములతోనూ, తాడయామాసుః=కొట్టిరి.

తా. తన సైన్యమునకు చెందిన అందరితోనూ కూడిన జాంబవంతుడూ, ఆ వానరులూ రాక్షసులను శిలలతోనూ, గోళ్లతోనూ, దంతములతోనూ పీడించిరి.

మూ. నిఘ్నన్తమృక్షాధిపతిం రాక్షసాస్తే మహాబలాః, 22
పరివవ్రుర్భయం త్యక్త్వా తమనేకవిధాయుధాః.

ప్ర. అ. మహాబలాః=గొప్ప బలముకల, తే రాక్షసాః=ఆ రాక్షసులు, అనేక విధాయుధాః=అనేకవిధములైన ఆయుధములు కలవారై, నిఘ్నన్తమ్=తమను

కొట్టుచున్న, తం ఋక్షాధిపతిమ్=ఆ జాంబవంతుణ్ణి, భయమ్=భయమును, త్యక్త్వా=విడచి, పరివవ్రుః=చుట్టుముట్టిరి.

తా. గొప్ప బలము కల ఆ రాక్షసులు భయము విడచి, అనేక విధములైన ఆయుధములు ధరించి, తమను కొట్టుచున్న ఆ జాంబవంతుని చుట్టుముట్టిరి. 22

మూ. శరైః పరశుభిస్తీక్ష్ణైః పట్టిశైర్యష్టితోమరైః, 23
జామ్బవన్తం మృధే జఘ్నుర్నిఘ్నన్తం రాక్షసీం చమూమ్.

ప్ర. అ. మృధే=యుద్ధమునందు, రాక్షసీమ్=రాక్షసుల సంబంధమైన, చమూమ్=సేనను, నిఘ్నన్తమ్=చంపుచున్న, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, శరైః=బాణములచేత, తీక్ష్ణైః=తీక్ష్ణములయిన, పరశుభిః=గండ్రగొడ్డళ్లచేత, పట్టిశైః=పట్టిశములచేత, యష్టితోమరైః=కఱ్ఱలచేతా, తోమరములచేతా, జఘ్నుః=కొట్టిరి.

తా. యుద్ధమునందు రాక్షససేనను చంపుచున్న ఆ జాంబవంతుణ్ణి బాణములతోను, వాడియైన గండ్రగొడ్డళ్లతోను, పట్టిశములతోనూ, కఱ్ఱలతోనూ, తోమరములతోనూ కొట్టిరి. 23

మూ. స సంప్రహారస్తుములః సంజజ్ఞే కపిరక్షసామ్, 24
దేవాసురాణాం క్రుద్ధానాం యథా భీమో మహాస్వనః.

ప్ర. అ. కపిరక్షసామ్=వానరులకూ, రాక్షసులకూ, సః=ఆ, తుములః=వ్యాకులమూ, మహాస్వనః=గొప్ప ధ్వని కలదీ, భీమః=భయంకరమూ అయిన, సః=ఆ, సంప్రహారః=యుద్ధము, క్రుద్ధానాం=కోపించిన, దేవాసురాణాం యథా=దేవాసురులకు వలె, సంజజ్ఞే=జరిగెను.

తా. ఆ వానరులకూ రాక్షసులకూ కోపించిన దేవాసురులకు వలె వ్యాకులమూ, భయంకరమూ, గొప్ప ధ్వని కలదీ అయిన యుద్ధము జరిగెను.

మూ. హనూమానపి సంక్రుద్ధః సానుముత్పాట్య పర్వతాత్, 25
స లక్ష్మణం స్వయం పృష్ఠాదవరోప్య మహామనాః,
రక్షసాం కదనం చక్రే సమాసాద్య సహస్రశః. 26

ప్ర. అ. మహామనాః=గొప్ప మనస్సు గల, సః హనూమానపి=ఆ హనుమంతుడు కూడా, సంక్రుద్ధః=కోపించినవాడై, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, స్వయమ్=స్వయముగా, పృష్ఠాత్=వీపునుండి, అవరోప్య=దింపి, పర్వతాత్=పర్వతమునుండి, సానుమ్=చరియను, ఉత్పాట్య=పెకలించి, సమాసాద్య=(రాక్షసులను) చేరి, సహస్రశః=వేలకొలది, రక్షసామ్=రాక్షసులయొక్క, కదనమ్=నాశనమును,

చక్రే=చేసెను.

తా. ధైర్యవంతుడైన ఆ హనుమంతుడు కూడా కోపించి, లక్ష్మణుణ్ణి తన వీపునుండి క్రిందకు దింపి, పర్వతమునుండి పెద్ద శిలను పెకలించి, వేలకొలది రాక్షసుల సంహారము చేసెను. 25, 26,

మూ. స దత్త్వా తుములం యుద్ధం పితృవ్యస్యేన్ద్రజిత్ బలీ,
లక్ష్మణం పరవీరఘ్నః పునరేవాభ్యధావత. 27

ప్ర. అ. బలీ=బలవంతుడు, పరవీరఘ్నః=శత్రువీరులను చంపువాడు అయిన, సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, పితృవ్యస్య=పినతండ్రికి, తుములమ్=వ్యాకులమైన, యుద్ధమ్=యుద్ధమును, దత్త్వా=ఇచ్చి, పునరేవ=మరల, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, అభ్యధావత్=ఎదురుగా పరుగెత్తెను.

తా. బలవంతుడూ, శత్రువీరులను సంహరించువాడు అయిన ఇంద్రజిత్తు పినతండ్రితో వ్యాకులమైన యుద్ధముచేసి మరల లక్ష్మణుని మీదికి శీఘ్రముగా వెళ్లెను. 27

మూ. తౌ ప్రయుద్ధౌ తదా వీరౌ మృధే లక్ష్మణరాక్షసౌ,
శరౌఘానభివర్షన్తౌ జఘ్నతుస్తౌ పరస్పరమ్. 28

ప్ర. అ. మృధే=యుద్ధమునందు, ప్రయుద్ధౌ=అధికమైన యుద్ధము గల, తౌ=ఆ, వీరౌ=వీరులైన, లక్ష్మణరాక్షసౌ=లక్ష్మణరాక్షసులు, శరౌఘాన్=బాణసముదాయములను, అభివర్షన్తౌ=వర్షించుచున్నవారై, తౌ=వాళ్లు, పరస్పరమ్=పరస్పరమును, జఘ్నతుః=కొట్టిరి.

తా. యుద్ధమునందు తీవ్రముగా యుద్ధము చేయుచున్న వీరులైన ఆ లక్ష్మణేంద్రజిత్తులు బాణసముదాయములను వర్షించుచు పరస్పరము కొట్టుకొనిరి.

మూ. అభీక్ష్ణమన్తర్దధతుః శరజాలైర్మహాబలౌ,
చన్ద్రాదిత్యావివోష్ణాన్తే యథా మేఘైస్తరస్వినౌ. 29

ప్ర. అ. మహాబలౌ=గొప్ప బలము గల, తరస్వినౌ=వేగము గల లక్ష్మణేంద్రజిత్తులు, ఉష్ణాన్తే=గ్రీష్మర్తువు అంతమునందు, మేఘైః=మేఘములచేత, చన్ద్రాదిత్యావివ యథా=చంద్రసూర్యులు వలె, శరజాలైః=బాణసముదాయములచేత, అభీక్ష్ణమ్=అధికముగా, అన్తర్దధతుః=అంతర్ధానము చెందిరి.

తా. మహాబలవంతులు, వేగవంతులూ అయిన ఆ లక్ష్మణేంద్రజిత్తులు గ్రీష్మాంతమునందు మేఘములచేత సూర్యచంద్రులు వలె, బాణసముదాయముచేత మిక్కిలి అంతర్ధానము చెందిరి. 29

మూ. న హ్యాదానం న సంధానం ధనుషో వా పరిగ్రహః,
న విప్రమోక్షో బాణానాం న వికర్షో న విగ్రహః. 30

మూ. న ముష్టిప్రతిసంధానం న లక్ష్యప్రతిపాదనమ్,
అదృశ్యత తయోస్తత్ర యుధ్యతోః పాణిలాఘవాత్. 31

ప్ర. అ. తత్ర=అక్కడ, యుధ్యతోః=యుద్ధము చేయుచున్న, తయోః=వారిద్దరియొక్క, పాణిలాఘవాత్=హస్తలాఘవమువలన, ధనుషః=ధనస్సుయొక్క, పరిగ్రహః వా=గ్రహణము, న అదృశ్యత=చూడబడలేదు. బాణానామ్=బాణములయొక్క,ఆదానమ్=తీయుట, న హి=చూడబడలేదు. సంధానమ్=సంధించుట, న=చూడబడలేదు. విప్రమోక్షః=విడుచుట, న=చూడబడలేదు. వికర్షః=లాగుట, న=చూడబడలేదు. విగ్రహః=బాణముల విభాగము, న=చూడబడలేదు. ముష్టిప్రతి సంధానమ్=పిడికిలి బిగించుట, న=చూడబడలేదు. లక్ష్యప్రతిపాదనమ్=లక్ష్యమును చేరుట, న=చూడబడలేదు.

తా. యుద్ధము చేయుచున్న వారిద్దరూ చూపుచున్న హస్తలాఘవమువలన ధనస్సును గ్రహించుట గాని, బాణములు తీయుట గాని, సంధించుట గాని, విడుచుట గాని, లాగుట కాని, ధనస్సు, నారి, బాణములు మొదలైనవాటి విభాగముగాని, పిడికిలి పట్టుటగాని, లక్ష్యమును చేరుట గాని కనబడలేదు.

మూ. చాపవేగప్రయుక్తైశ్చ బాణజాలైః సమన్తతః,
అన్తరిక్షేఽభిసంపన్నే న రూపాణి చకాశిరే. 32

ప్ర. అ. చాపవేగప్రయుక్తైః=ధనస్సుయొక్క వేగముచేత ప్రయోగించబడిన, బాణజాలైః=బాణముల సముదాయములచేత, సమన్తతః=అంతటా, అన్తరిక్షే=ఆకాశము, అభిసంపన్నే=పొందబడిన దగుచుండగా, రూపాణి=రూపములు, న చకాశిరే=ప్రకాశించలేదు.

తా. ధనుర్వేగముచేత ప్రయోగింపబడిన బాణసముదాయములు అన్ని వైపులా ఆకాశమును ఆక్రమించుటచే రూపములు ప్రకాశించలేదు. 32

మూ. లక్ష్మణో రావణిం ప్రాప్య రావణిశ్చాపి లక్ష్మణమ్,
అవ్యవస్థా భవత్యుగ్రా తాభ్యామన్యోన్యవిగ్రహే. 33

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, రావణిమ్=ఇంద్రజిత్తును, ప్రాప్య=పొంది, రావణిశ్చాపి=ఇంద్రజిత్తు, లక్ష్మణమ్=లక్ష్మణుని, ప్రాప్య=పొంది, తాభ్యామ్=వారిచేత, అన్యోన్యవిగ్రహే=పరస్పరము విరోధము చేయబడగా, ఉగ్రా=భయంకరమైన, అవ్యవస్థా=అవ్యవస్థ, భవతి=అగుచుండెను.

తా. ఒకమారు లక్ష్మణుడు ఇంద్రజిత్తును ఆక్రమించి, మరొకమారు

ఇంద్రజిత్తు లక్ష్మణుణ్ణి ఆక్రమించి, ఈ విధముగా వారిద్దరూ యుద్ధము చేయుచుండగా జయపరాజయముల విషయమున భయంకరమైన అవ్యవస్థ ఏర్పడుచుండెను. 33

మూ. తాభ్యాముభాభ్యాం తరసా ప్రసృష్టైర్విశిఖైః శితైః,
నిరన్తరమివాకాశం బభూవ తమసా వృతమ్. 34

ప్ర. అ. తాభ్యామ్=ఆ, ఉభాభ్యామ్=ఇద్దరిచేత, తరసా=బలముచేత, ప్రసృష్టైః=విడవబడిన, శితైః=వాడియైన, విశిఖైః=బాణములచేత, నిరన్తరమివ=అవకాశములేనిదివలె ఉన్న, ఆకాశమ్=ఆకాశము, తమసా=చీకటిచేత, వృతమ్=కప్పబడినది, బభూవ=ఆయెను.

తా. వారిద్దరూ విడచిన వాడియైన బాణములచేత అవకాశము లేనిదిగా చేయబడిన ఆకాశము చీకటిచేత ఆవరింపబడెను. 34

మూ. తైః పతద్భిశ్చ బహుభిస్తయోః శరశతైః శితైః,
దిశశ్చ ప్రదిశశ్చైవ బభూవుః శరసంకులాః. 35

ప్ర. అ. పతద్భిః=పడుచున్న, శితైః=వాడియైన, బహుభిః=అనేకములైన, తయోః=వారిద్దరియొక్క, శరశతైః=శరముల శతములచేత, దిశశ్చ=దిక్కులు, ప్రదిశశ్చ=విదిక్కులు, శరసంకులాః=బాణములచే వ్యాకులములు, బభూవుః=అయినవి.

తా. వాళ్లిద్దరూ ప్రయోగించిన వాడియైన అనేకబాణములు వందలకొలది పడుటచేత దిక్కులు, విదిక్కులు బాణములచేత వ్యాప్తములైనవి. 35

మూ. తమసా పిహితం సర్వమాసీత్ప్రతిభయం మహత్,
అస్తంగతే సహస్రాంశౌ సంవృతే తమసా చ వై.
రుధిరౌఘా మహానద్యః ప్రావర్తన్త సహస్రశః. 36

ప్ర. అ. సర్వమ్=అంతయూ, తమసా=చీకటిచేత, పిహితమ్=కప్పబడెను. మహత్=గొప్ప, ప్రతిభయమ్=భయము, ఆసీత్=ఆయెను. సహస్రాంశౌ=సూర్యుడు, అస్తంగతే=అస్తమించగా, తమసా=చీకటిచేత, సంవృతే=కప్పబడిన దగుచుండగా, సహస్రశః=వేలకొలది, రుధిరౌఘమహానద్యః=రక్తప్రవాహము గల మహానదులు, ప్రావర్తన్త=ప్రవర్తించినవి.

తా. అంతటా చీకటి ఆవరించెను. చాల భయము కలిగెను. సూర్యుడు అస్తమించిన పిమ్మట చీకటి వ్యాపించగా, రక్తప్రవాహనదులు వేలకొలది బయలుదేరెను. 36

మూ. క్రవ్యాదా దారుణా వాగ్భిశ్చిక్షిపుర్భీమనిఃస్వనాన్, 37
న తదానీం వవౌ వాయుర్న చ జజ్వాల పావకః.

ప్ర. అ. దారుణాః=భయంకరములైన, క్రవ్యాదాః=మాంసభక్షకజంతువులు, వాగ్భిః=వాక్కులచేత, భీమనిఃస్వనాన్=భయంకరములైన ధ్వనులను, చిక్షిపుః=ప్రసరింపచేసినవి. తదానీమ్=అప్పుడు, వాయుః=వాయువు, న వవౌ=వీచలేదు. పావకః చ=అగ్ని కూడ, న జజ్వాల=మండలేదు.

తా. క్రూరములైన మాంసము తిను జంతువులు భయంకరముగా అరచినవి. అప్పుడు వాయువు వీచలేదు. అగ్ని మండలేదు. 37

మూ. స్వస్త్యస్తు లోకేభ్య ఇతి జజల్పుస్తే మహర్షయః, 38
సంపేతుశ్చాత్ర సంతప్తా గన్ధర్వాః సహ చారణైః.

ప్ర. అ. లోకేభ్యః=లోకములకొరకు, స్వస్తి=క్షేమము, అస్తు=అగుగాక, ఇతి=అని, తే=ఆ, మహర్షయః=మహర్షులు, జజల్పుః=పలికిరి. సంతప్తాః=భయపడినవారై, గన్ధర్వాః=గంధర్వులు, చారణైః సహ=చారణులతో కూడ, అత్ర=ఇచ్చట, సంపేతుః=వచ్చిరి.

తా. "లోకములకు క్షేమ మగు గాక" అని మహర్షులు పలికిరి. గంధర్వులు, చారణులు, ఏమగునో అని భయపడుచు చూచుటకై వచ్చి చేరిరి. 38

మూ. అథ రాక్షససింహస్య కృష్ణాన్ కనకభూషణాన్, 39
శరైశ్చతుర్భిః సౌమిత్రిర్వివ్యాధ చతురో హయాన్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, రాక్షససింహస్య=ఆ రాక్షసశ్రేష్ఠునియొక్క, కనకభూషణాన్=బంగారు అలంకారములు గల, కృష్ణాన్=నల్లని, చతురః=నాలుగు, హయాన్=గుఱ్ఱములను, చతుర్భిః=నాలుగు, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. అప్పుడు లక్ష్మణుడు నాలుగు బాణములు ప్రయోగించి, ఆ రాక్షసశ్రేష్ఠుని, బంగారు అలంకారములు గల నల్లని నాలుగు గుఱ్ఱములను కొట్టెను. 39

మూ. తతోఽపరేణ భల్లేన పీతేన నిశితేన చ, 40
సంపూర్ణాయతముక్తేన సుపత్రేణ సువర్చసా.
మహేన్ద్రాశనికల్పేన సూతస్య విచరిష్యతః, 41
స తేన బాణాశనినా తలశబ్దానునాదినా.
లాఘవాద్రాఘవః శ్రీమాన్ శిరః కాయాదపాహరత్. 42

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శ్రీమాన్=శ్రీమంతుడైన, సః రాఘవః=ఆ లక్ష్మణుడు, పీతేన=పచ్చగా ఉన్న, నిశితేన చ=వాడియైన, సంపూర్ణాయతముక్తేన=పూర్తిగా లాగబడి విడువబడిన, సుపత్రేణ=మంచి రెక్కలు గల, సువర్చసా=మంచి కాంతి గల, మహేన్ద్రాశనికల్పేన=మహేంద్రుని వజ్రాయుధముతో సమానమైన, తలశబ్దానునాదినా=అరచేతి శబ్దమును ప్రతిధ్వనించుచున్న, భల్లేన=భల్ల మను, తేన=ఆ, అపరేణ=మరియొక, బాణాశనినా= అశనివంటి బాణముచేత, విచరిష్యతః=సంచరించనున్న, సూతస్య=సారథియొక్క, శిరః=శిరస్సును, లాఘవాత్=లాఘవమువలన, కాయాత్=దేహమునుండి, అపాహరత్=పడగొట్టెను.

తా. పిమ్మట శ్రీమంతుడైన ఆ లక్ష్మణుడు తన హస్తలాఘవము చూపుచు, బంగారముతో పచ్చగా నున్న, వాడియైన, పూర్తిగా బాగా లాగబడిన, మంచి రెక్కలు గల, మంచి కాంతి గల, మహేంద్రుని వజ్రముతో సమానమైన, అరచేతి చప్పుదును అనుసరించి ధ్వనిచేయుచున్న మరియొక భల్ల మను పిడుగువంటి బాణమును ప్రయోగించి సంచరించబోవుచున్న సారథి శిరస్సును దేహమునుండి వేరుచేసెను. 40-42.

మూ. స యన్తరి మహాతేజా హతే మన్దోదరీసుతః,
స్వయం సారథ్యమకరోత్పునశ్చ ధనురస్పృశత్ 43

ప్ర. అ. యన్తరి=సారథి, హతే=చంపబడిన వాడగుచుండగా, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః మన్దోదరీసుతః=ఆ ఇంద్రజిత్తు, స్వయమ్=స్వయముగా, సారథ్యమ్=సారథ్యమును, అకరోత్=చేసెను. పునశ్చ=మరల, ధనుః=ధనస్సును, అస్పృశత్=స్పృశించెను.

తా. సారథి చనిపోయిన పిమ్మట ఆ మహాతేజఃశాలియైన ఇంద్రజిత్తు స్వయముగానే సారథ్యము చేసికొనుచు ధనస్సును కూడ ఉపయోగించెను. 43

మూ. తదద్భుతమభూత్తత్ర సామర్థ్యం పశ్యతాం యుధి,
హయేషు వ్యగ్రహస్తం తం వివ్యాధ నిశితైః శరైః, 44
ధనుష్యథ పునర్వ్యగ్రే హయేషు ముముచే శరాన్.

ప్ర. అ. యుధి=యుద్ధమునందు, తత్ర=అక్కడ, తత్=ఆ, సామర్థ్యమ్=సామర్థ్యమును, పశ్యతామ్=చూచుచున్నవారికి, తత్=అది, అద్భుతమ్=ఆశ్చర్యముగా, అభూత్=అయెను. హయేషు=గుఱ్ఱములయందు, వ్యగ్రహస్తమ్=పనిచేయుచున్న హస్తము గల, తమ్=వానిని, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను. అథ=పిమ్మట, పునః=మరల, ధనుషి=ధనస్సునందు, వ్యగ్రే=పనిచేయుచుండగా, హయేషు=గుఱ్ఱములమీద, శరాన్=బాణములను, ముముచే=విడచెను.

తా. ఆ యుద్ధమునందు అతని సామర్థ్యమును చూచువారికి అది ఆశ్చర్యకరముగా ఉండెను. ఆతడు గుఱ్ఱములను తోలుటలో వ్యగ్రుడై ఉండగా లక్ష్మణుడు ఆతనిని వాడియైన బాణాలతో కొట్టెను. పిమ్మట అతడు ధనస్సును ఉపయోగించుటకు ప్రయత్నించుచుండగా గుఱ్ఱములమీద బాణములను విడచెను.

మూ. ఛిద్రేషు తేషు బాణౌఘైర్విచరన్తమభీతవత్, 45
అర్దయామాస సమరే సౌమిత్రిః శీఘ్రకృత్తమః.

ప్ర. అ. శీఘ్రకృత్తమః=మిక్కిలి శీఘ్రముగా చేయు, సౌమిత్రిః=లక్ష్మణుడు, సమరే=యుద్ధమునందు, అభీతవత్=భయములేకుండా, విచరన్తమ్=సంచరించుచున్న ఆతనిని, తేషు=ఆ, ఛిద్రేషు=అవకాశములయందు, బాణౌఘైః=బాణసముదాయములచేత, అర్దయామాస=పీడించెను.

తా. చాల శీఘ్రముగా పనులు చేయు లక్ష్మణుడు యుద్ధమునందు నిర్భయముగా సంచరించుచున్న ఆ ఇంద్రజిత్తును ఆ అవకాశములయందు బాణసముదాయములచేత కొట్టెను. 45

మూ. నిహతం సారథిం దృష్ట్వా సమరే రావణాత్మజః, 46
ప్రజహౌ సమరోద్ధర్షం విషణ్ణః స బభూవ హ.

ప్ర. అ. సః రావణాత్మజః=ఆ ఇంద్రజిత్తు, సమరే=యుద్ధమునందు, నిహతమ్=చంపబడిన, సారథిమ్=సారథిని, దృష్ట్వా=చూచి, సమరోద్ధర్షమ్=యుద్ధమునందు ఉత్సాహమును, ప్రజహౌ=విడచెను. విషణ్ణః=దిగులుచెందినవాడుగా, బభూవ=ఆయెను.

తా. యుద్ధములో సారథి మరణించుట చూడగానే ఇంద్రజిత్తు దిగులుచెంది, యుద్ధమునందు ఉత్సాహమును కోల్పోయెను. 46

మూ. విషణ్ణవదనం దృష్ట్వా రాక్షసం హరియూథపాః, 47
తతః పరమసంహృష్టా లక్ష్మణం చాభ్యపూజయన్.

ప్ర. అ. హరియూథపాః=వానరసేనానాయకులు, విషణ్ణవదనమ్=దిగులుచెందిన ముఖముగల, రాక్షసమ్=రాక్షసుణ్ణి, దృష్ట్వా=చూచి, తతః=అటుపిమ్మట, పరమసంహృష్టాః=మిక్కిలి సంతోషించినవారై, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, అభ్యపూజయన్=పూజించిరి.

తా. ఇంద్రజిత్తు ముఖము దిగులుచెందుట చూచి వానరనాయకులు చాల సంతోషించుచు లక్ష్మణుణ్ణి పూజించిరి. 47

మూ. తతః ప్రమాథీ రభసః శరభో గన్ధమాదనః, 48
అమృష్యమాణాశ్చత్వారశ్చక్రుర్వేగం హరీశ్వరాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రమాథీ=ప్రమాథి, రభసః=రభసుడు, శరభః=శరభుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, చత్వారః=నలుగురు, హరీశ్వరాః=వానరనాయకులు, అమృష్యమాణాః=సహించనివారై, వేగమ్=వేగమును, చక్రుః=చేసిరి.

తా. పిమ్మట ప్రమాథి, రభసుడు, శరభుడు, గంధమాదనుడు అను నలుగురు వానరనాయకులు ఓర్పు లేనివారై వేగమును ప్రదర్శించిరి. 48

మూ. తే చాస్య హయముఖ్యేషు తూర్ణముత్పత్య వానరాః, 49
చతుర్షు సుమహావీర్యా నిపేతుర్భీమవిక్రమాః.

ప్ర. అ. సుమహావీర్యాః=గొప్ప బలము గల, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, తే=ఆ, వానరాః=వానరులు, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్పత్య=ఎగిరి, అస్య=వీనియొక్క, హయముఖ్యేషు=శ్రేష్ఠములైన గుఱ్ఱములమీద, నిపేతుః=పడిరి.

తా. గొప్ప బలము, భయంకరమైన పరాక్రమము గల ఆ నలుగురు వానరులు శీఘ్రముగా ఎగిరి ఆతని అశ్వశ్రేష్ఠముల మీద వాలిరి. 49

మూ. తేషా మధిష్ఠితానాం తైర్వానరైః పర్వతోపమైః, 50
ముఖేభ్యో రుధిరం రక్తం హయానాం సమవర్తత.

ప్ర. అ. పర్వతోపమైః=పర్వతములతో సమానమైన, తైః వానరైః=ఆ వానరులచేత, అధిష్ఠితానామ్=ఎక్కబడిన, తేషాం హయానామ్=ఆ గుఱ్ఱముల యొక్క, ముఖేభ్యః=ముఖములనుండి, రక్తమ్=ఎఱ్ఱనైన, రుధిరమ్=రక్తము, సమవర్తత=బయలుదేరెను.

తా. పర్వతములవంటి ఆ వానరులు మీది కెక్కి కూర్చుండగానే ఆ గుఱ్ఱముల నోళ్ళనుండి ఎఱ్ఱని రక్తము స్రవించెను. 50

మూ. తే హయా మథితా భగ్నా వ్యసవో ధరణీం గతాః, 51
తే నిహత్య హయాంస్తస్య ప్రమథ్య చ మహారథమ్.
పునరుత్పత్య వేగేన తస్థుర్లక్ష్మణపార్శ్వతః. 52

ప్ర. అ. మథితాః=నలగగొట్టబడిన, తే హయాః=ఆ గుఱ్ఱములు, భగ్నాః=విరిగిపోయినవై, వ్యసవః=పోయిన ప్రాణములు గలవై, ధరణీమ్=భూమిని, గతాః=పొందినవి. తే=ఆ వానరులు, తస్య=వానియొక్క, హయాన్=గుఱ్ఱములను, నిహత్య=చంపి, మహారథమ్=గొప్ప రథమును, ప్రమథ్య చ=విరుగగొట్టి,

పునః=మరల, వేగేన=వేగముతో, ఉత్పత్య=ఎగిరి, లక్ష్మణపార్శ్వతః=లక్ష్మణుని పార్శ్వమునందు, తస్థుః=నిలచిరి.

తా. ఆ గుఱ్ఱములు నలిగిపోయి, విరిగిపోయి, ప్రాణములు కోల్పోయి నేలపై పడినవి. ఆ వానరులు గుఱ్ఱములను చంపి, మహారథమును కూడ విరుగగొట్టి మరల వేగముగా ఎగిరి వెళ్ళి లక్ష్మణుని పార్శ్వమునందు నిలచిరి.

మూ. స హతాశ్వాదవప్లుత్య రథాన్మథితసారథిః,
శరవర్షేణ సౌమిత్రిమభ్యధావత రావణిః. 53

ప్ర. అ. హతసారథిః=చంపబడిన సారథి గల, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, హతాశ్వాత్=చంపబడిన గుఱ్ఱములు గల, రథాత్=రథమునుండి, అవప్లుత్య=క్రిందికి దుమికి, శరవర్షేణ=బాణవర్షముతో, సౌమిత్రిమ్=లక్ష్మణుని, అభ్యధావత=ఎదురుగా శీఘ్రముగా వెళ్ళెను.

తా. సారథి మరణించిన ఇంద్రజిత్తు గుఱ్ఱములు కూడ చంపబడగానే ఆ రథమునుండి క్రిందికి దుమికి బాణములు వర్షించుచు లక్ష్మణునిమీదికి శీఘ్రముగా వెళ్ళెను. 53

మూ. తతో మహేన్ద్రప్రతిమః స లక్ష్మణః
పదాతినం తం నిహతైర్హయోత్తమైః,
సృజన్తమాజౌ నిశితాన్ శరోత్తమాన్
భృశం తదా బాణగణైర్న్యవారయత్. 54

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకోననవతితమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహేన్ద్రప్రతిమః=మహేంద్రునితో సమానుడైన, సః=ఆ, లక్ష్మణః=లక్ష్మణుడు, నిహతైః=చంపబడిన, హయోత్తమైః=ఉత్తమాశ్వములచేత, పదాతినమ్=కాలినడకచే వచ్చుచున్న, ఆజౌ=యుద్ధమునందు, నిశితాన్=వాడియైన, శరోత్తమాన్=శ్రేష్ఠమైన బాణములను, సృజన్తమ్=విడచుచున్న, తమ్=అతనిని, తదా=అప్పుడు, భృశమ్=మిక్కిలి, బాణగణైః=బాణసముదాయములచేత, న్యవారయత్=నివారించెను.

తా. పిమ్మట మహేంద్రునితో సమానుడైన ఆ లక్ష్మణుడు ఉత్తమాశ్వములు చంపబడుటచేత కాలినడకన వచ్చుచున్న, యుద్ధమునందు వాడియైన శరములను విడచుచున్న ఆ ఇంద్రజిత్తును, అప్పుడు, బాణముల సముదాయములచేత నివారించెను. 54

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో ఎనుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ నవతితమః సర్గః

[ఇంద్రజిల్లక్ష్మణులు ఘోరముగా పోరాడుట; లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట]

మూ. స హతాశ్వో మహాతేజా భూమౌ తిష్ఠన్ నిశాచరః,
ఇన్ద్రజిత్ పరమక్రుద్ధః సంప్రజజ్వాల తేజసా. 1

ప్ర. అ. హతాశ్వః=చంపబడిన అశ్వములు గల, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, నిశాచరః=రాక్షసుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, భూమౌ=నేలమీద, తిష్ఠన్=నిలచి ఉన్నవాడై, పరమక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, తేజసా=తేజస్సుతో, ప్రజజ్వాల=ప్రజ్వలించెను.

తా. అశ్వములు చంపబడుటచే నేలమీద నిలచి ఉన్న మహాతేజఃశాలియైన ఇంద్రజిత్తు మిక్కిలి కోపించి తేజస్సుతో ప్రకాశించెను. 1

మూ. తౌ ధన్వినౌ జిఘాంసన్తావన్యోన్యమిషుభిర్భృశమ్,
విజయేనాభినిష్క్రాన్తౌ వనే గజవృషావివ. 2

ప్ర. అ. ధన్వినౌ=ధనస్సులు కలవారు, ఇషుభిః=బాణములచేత, అన్యోన్యమ్=పరస్పరము, భృశమ్=మిక్కిలి, జిఘాంసన్తౌ=చంపవలె నని కోరుచున్నవారు అయిన, తౌ=వారిద్దరు, వనే=వనమునందు, విజయేన=విజయ మను నిమిత్తముచేత, అభినిష్క్రాన్తౌ=బయటకు వచ్చిన, గజవృషౌ ఇవ=శ్రేష్ఠములైన గజముల వలె ఉండిరి.

తా. ధనుర్ధరులై బాణములచేత ఒకరి నొకరు చంపవలె నను తీవ్రమైన ఇచ్ఛ గల ఆ లక్ష్మణేంద్రజిత్తులు వనములో విజయము నిమిత్తము బైటకు వచ్చి పోరాడుచున్న గజశ్రేష్ఠముల వలె ఉండిరి. 2

మూ. నిబర్హయన్తశ్చాన్యోన్యం తే రాక్షసవనౌకసః,
భర్తారం న జహుర్యుద్ధే సంపతన్తస్తతస్తతః. 3

ప్ర. అ. తతస్తతః=ఆ యా వైపులనుండి, సంపతన్తః=వచ్చుచున్న, అన్యోన్యమ్=పరస్పరము, నిబర్హయన్తః=నశింపచేయుచున్న, తే=ఆ, రాక్షసవనౌకసః=రాక్షసులు, వానరులు, యుద్ధే=యుద్ధమునందు, భర్తారమ్=తమ ప్రభువును, న జహుః=విడవలేదు.

తా. ఆ యా వైపులనుండి వచ్చుచు పరస్పరము చంపుకొనుచున్న వానరులు, రాక్షసులూ కూడ యుద్ధములో తమ ప్రభువును విడువలేదు. 3

మూ. తతస్తాన్ రాక్షసాన్ సర్వాన్ హర్షయన్ రావణాత్మజః,
స్తువానో హర్షమాణశ్చ ఇదం వచనమబ్రవీత్. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణాత్మజః=ఇంద్రజిత్తు, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన , రాక్షసాన్=రాక్షసులను, హర్షయన్=సంతోషపెట్టుచు, స్తువానః=స్తుతించుచు, హర్షమాణశ్చ=సంతోషించుచు, ఇదం వచనమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట ఇంద్రజిత్తు ఆ రాక్షసులకు అందరికీ సంతోషము కలిగించుచు, వాళ్ళను చూచి సంతోషముతో ఇట్లు పలికెను. 4

మూ. తమసా బహులేనేమాః సంసక్తాః సర్వతో దిశః,
నేహ విజ్ఞాయతే స్వో వా పరో వా రాక్షసోత్తమాః. 5

ప్ర. అ. రాక్షసోత్తమాః=రాక్షసశ్రేష్ఠులారా! ఇమాః=ఈ, దిశః=దిక్కులు, సర్వతః=అంతటా, బహులేన=అధికమైన, తమసా=చీకటితో, సంసక్తాః=కూడినవి. ఇహ=ఇక్కడ, స్వో వా=తనవాడు గాని, పరో వా=పరుడు గాని, న విజ్ఞాయతే=తెలియబడుటలేదు.

తా. ఓ! రాక్షసోత్తములారా! ఈ దిక్కులలో అంతటా అధికమైన చీకటి ఆవరించి ఉన్నది. తమవారెవరో ఇతరులెవరో తెలియుటలేదు. 5

మూ. ధృష్టం భవన్తో యుధ్యన్తు హరీణాం మోహనాయ వై,
అహం తు రథమాస్థాయ ఆగమిష్యామి సంయుగే. 6

ప్ర. అ. భవన్తః=మీరు, హరీణామ్=వానరులయొక్క, మోహనాయ=మోసముచేయుటకు, ధృష్టమ్=ధైర్యముగా, యుధ్యన్తు=యుద్ధము చేయుదురుగాక. అహం తు=నేనైతే, రథమ్=రథమును, ఆస్థాయ=ఎక్కి, సంయుగే=యుద్ధమునందు, ఆగమిష్యామి=రాగలను.

తా. మీరు వానరులను మోసగించుటకై ధైర్యముగా యుద్ధము చేయుచుండుడు. నేను రథము నెక్కి యుద్ధమునకు వచ్చెదను. 6

మూ. తథా భవన్తః కుర్వన్తు యథేమే హి వనౌకసః,
న యుధ్యేయుర్దురాత్మానః ప్రవిష్టే నగరం మయి. 7

ప్ర. అ. మయి=నేను, నగరమ్=నగరమును, ప్రవిష్టే=ప్రవేశించినవాడనగుచుండగా, ఇమే=ఈ, దురాత్మానః=దురాత్ములైన, వనౌకసః=వానరులు,

యథా=ఎట్లు, న యుధ్యేయుః=యుద్ధముచేయరో, భవన్తః=మీరు, తథా=అట్లు, కుర్వన్తు=చేయుదురు గాక.

తా. నేను నగరములో ప్రవేశించి నప్పుడు దురాత్ములైన ఈ వానరులు (నాతో) యుద్ధము చేయకుండా ఉండేటట్లు చేయుడు. 7

మూ. ఇత్యుక్త్వా రావణసుతో వఞ్చయిత్వా వనౌకసః,
ప్రవివేశ పురీం లఙ్కాం రథహేతోరమిత్రహా. 8

ప్ర. అ. అమిత్రహా=శత్రుసంహారకుడైన , రావణసుతః=ఇంద్రజిత్తు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, వనౌకసః=వానరులను, వఞ్చయిత్వా=వంచించి, రథహేతోః=రథముకొరకై, లఙ్కాం పురీమ్=లంకానగరమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. శత్రుసంహారకుడైన ఇంద్రజిత్తు ఇట్లు పలికి, వానరులను వంచించి, రథముకొరకై లంకాపురములో ప్రవేశించెను. 8

మూ. స రథం భూషయిత్వాథ రుచిరం హేమభూషితమ్,
ప్రాసాసిశరసంయుక్తం యుక్తం పరమవాజిభిః, 9
అధిష్ఠితం హయజ్ఞేన సూతేనాప్తోపదేశినా,
ఆరురోహ మహాతేజా రావణిః సమితింజయః. 10

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, సమితింజయః=యుద్ధమును జయించు, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, రుచిరమ్=సుందరము, హేమభూషితమ్=బంగారముచేత అలంకరించబడినది, ప్రాసాసిశరసంయుక్తమ్=ప్రాసలతోను, ఖడ్గములతోను, బాణములతోను, కూడినది, పరమవాజిభిః=ఉత్తమములైన గుఱ్ఱములతో, యుక్తమ్=కూడినది, హయజ్ఞేన=గుఱ్ఱములను ఎరిగిన, ఆప్తోపదేశినా=హితముగ ఉపదేశించు, సూతేన=సారథిచేత, అధిష్ఠితమ్=అధిష్ఠింపబడినది అయిన, రథమ్=రథమును, భూషయిత్వా=అలంకరించి, ఆరురోహ=ఎక్కెను.

తా. గొప్ప తేజస్సు గల, యుద్ధమును జయించు ఇంద్రజిత్తు అందమైనది, బంగారముచేత అలంకరింపబడినది, ప్రాస-ఖడ్గ-బాణములతో కూడినది, ఉత్తమములైన గుఱ్ఱములు కట్టినది, గుఱ్ఱముల స్వభావము తెలిసినవాడు, హితమైన ఉపదేశము ఇచ్చువాడు అయిన సారథిచేత అధిష్ఠించబడినదీ అయిన రథమును అలంకరింపచేసి, దానిని ఎక్కెను. 9, 10

మూ. స రాక్షసగణైర్ముఖ్యైర్వృతో మన్దోదరీసుతః,
నిర్యయౌ నగరాద్వీరః కృతాన్తబలచోదితః. 11

ప్ర. అ. వీరః=వీరుడైన, సః మన్దోదరీసుతః=మందోదరి కుమారు

డైన ఆ ఇంద్రజిత్తు, ముఖ్యైః=ముఖ్యములైన, రాక్షసగణైః=రాక్షసగణములతో, వృతః=కూడినవాడై, కృతాన్తబలచోదితః=దైవబలముచేత ప్రేరేపింపబడినవాడై, నగరాత్=నగరమునుండి, నిర్యయౌ=బయలుదేరెను.

తా. వీరుడైన ఆ ఇంద్రజిత్తు ముఖ్యములైన రాక్షసగణములు వెంట రాగా, దైవప్రేరితుడై నగరమునుండి బయలుదేరెను. 11

మూ. సో௨భినిష్క్రమ్య నగరాదిన్ద్రజిత్పరవీరహా,
అభ్యయాజ్జవనైరశ్వైర్లక్ష్మణం సవిభీషణమ్. 12

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించు, సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, నగరాత్=నగరమునుండి, అభినిష్క్రమ్య=బయలుదేరి, జవనైః=వేగముగల, అశ్వైః=అశ్వముల చేత, సవిభీషణమ్=విభీషణునితో కూడిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అభ్యయాత్=ఎదురుగా వెళ్ళెను.

తా. శత్రువీరసంహారకుడైన ఆ ఇంద్రజిత్తు నగరమునుండి బయలుదేరి, వేగము గల అశ్వముల సహాయముతో లక్ష్మణ విభీషణులను ఎదిరించుటకై వెళ్ళెను. 12

మూ. తతో రథస్థమాలోక్య సౌమిత్రీ రావణాత్మజమ్,
వానరాశ్చ మహావీర్యా రాక్షసశ్చ విభీషణః, 13
విస్మయం పరమం జగ్ముర్లాఘవాత్తస్య ధీమతః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రథస్థమ్=రథమునందున్న, రావణాత్మజమ్=ఇంద్రజిత్తును, ఆలోక్య=చూచి, సౌమిత్రిః=లక్ష్మణుడు, మహావీర్యాః=గొప్ప పరాక్రమము గల, వానరాశ్చ=వానరులు, రాక్షసః=రాక్షసుడైన, విభీషణశ్చ=విభీషణుడు, ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య=వానియొక్క, లాఘవాత్=చురుకుదనమువలన, పరమమ్= అధికమైన, విస్మయమ్=ఆశ్చర్యమును, జగ్ముః=పొందిరి.

తా. అప్పుడు రథముమీద ఉన్న ఆ ఇంద్రజిత్తును చూచి లక్ష్మణుడు, గొప్ప పరాక్రమము గల వానరులు, విభీషణుడు బుద్ధిమంతుడైన ఆతని చురుకుదనమునకు చాల ఆశ్చర్యపడిరి. 13

మూ. రావణిశ్చాపి సంక్రుద్ధో రణే వానరయూథపాన్, 14
పాతయామాస బాణౌఘైః శతశో௨థ సహస్రశః.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, సంక్రుద్ధః=కోపించిన, రావణిశ్చాపి=ఇంద్రజిత్తు కూడ, బాణౌఘైః=బాణసముదాయములచేత, శతశః=వందల కొలది, అథ=మరియు, సహస్రశః=వేలకొలది, వానరయూథపాన్=వానర సేనానాయకులను,

పాతయామాస=పడగొట్టెను.

తా. ఇంద్రజిత్తు యుద్ధమునందు, కోపావేశములో బాణసముదాయము లను ప్రయోగించి వందలకొలది, వేలకొలది వానరులను పడగొట్టెను. 14

మూ. స మణ్డలీకృతధనూ రావణిః సమితింజయః, 15
హరీనభ్యహనత్క్రుద్ధః పరం లాఘవమాస్థితః.

ప్ర. అ. సమితింజయః=యుద్ధమును జయించు, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, మణ్డలీకృతధనుః=మండాలాకారముగా చేయబడిన ధనస్సుకలవాడై, క్రుద్ధః=కోపించినవాడై, పరమ్=గొప్ప, లాఘవమ్=లాఘవమును, (చురుకుదన మును), ఆస్థితః=అవలంబించినవాడై, హరీన్=వానరులను, అభ్యహనత్=చంపెను.

తా. యుద్ధమును జయించు ఆ ఇంద్రజిత్తు కోపముతో ధనస్సును మండలాకారముగా చేసి గొప్ప లాఘవముతో వానరులను చంపెను. 15

మూ. తే వధ్యమానా హరయో నారాచైర్భీమవిక్రమాః, 16
సౌమిత్రిం శరణం ప్రాప్తాః ప్రజాపతిమివ ప్రజాః.

ప్ర. అ. నారాచైః=నారాచబాణములచేత, వధ్యమానాః=చంపబడుచున్న, భీమవిక్రమాః=భయంకరమైన పరాక్రమము గల, తే హరయః=ఆ వానరులు, ప్రజాః=ప్రజలు, ప్రజాపతిమివ=బ్రహ్మదేవుని వలె, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, శరణం ప్రాప్తాః=శరణుజొచ్చిరి.

తా. భయంకరమైన పరాక్రమము గల ఆ వానరులు నారాచబాణము లచేత చంపివేయబడుచు, ప్రజలు బ్రహ్మదేవుని శరణుజొచ్చినట్లు లక్ష్మణుని శరణుజొచ్చిరి. 16

మూ. తతః సమరకోపేన జ్వలితో రఘునన్దనః, 17
చిచ్ఛేద కార్ముకం తస్య దర్శయన్ పాణిలాఘవమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రఘునన్దనః=లక్ష్మణుడు, సమరకోపేన= యుద్ధకోపముతో, జ్వలితః=మండిపడుచు, పాణిలాఘవమ్=హస్తలాఘవమును, దర్శ యన్=చూపుచు,తస్య=వానియొక్క, కార్ముకమ్=ధనస్సును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. అప్పుడు లక్ష్మణుడు యుద్ధమునందు కోపముతో మండిపడుచు, తన హస్తలాఘవమును చూపుచు ఆతని ధనస్సును ఛేదించెను. 17

మూ. సోఽన్యత్కార్ముకమాదాయ సజ్జం చక్రే త్వరన్నివ, 18
తదప్యస్య త్రిభిర్బాణైర్లక్ష్మణో నిరకృన్తత.

ప్ర. అ. సః=అతడు, అన్యత్=మరియొక, కార్ముకమ్=ధనస్సును, ఆదాయ=గ్రహించి, త్వరన్నివ=తొందరపడుచు, సజ్జమ్=సిద్ధమైనదానినిగా, చక్రే=చేసెను. లక్ష్మణః=లక్ష్మణుడు, అస్య=వీనియొక్క, తదపి=ఆ ధనస్సును కూడ, త్రిభిః బాణైః=మూడు బాణముల చేత, నిరకృన్తత=ఛేదించెను.

తా. ఆతడు తొందరపడుచు మరియొక ధనస్సు తీసుకొని దానిని సిద్ధము చేసెను. లక్ష్మణుడు మూడు బాణాలతో దానిని కూడ ఛేదించెను.

మూ. అథైనం ఛిన్నధన్వానమాశీవిషవిషోపమైః, 19
వివ్యాధోరసి సౌమిత్రీ రావణిం పఞ్చభిః శరైః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, ఛిన్నధన్వానమ్=ఛేదించబడిన ధనస్సు గల, ఏనమ్=ఈ, రావణిమ్=ఇంద్రజిత్తును, ఆశీవిషవిషోపమైః=సర్పవిషముతో సమానములైన, పఞ్చభిః=ఐదు, బాణైః=బాణములచేత, ఉరసి=వక్షఃస్థలమునందు, వివ్యాధ=కొట్టెను.

తా. ధనస్సును ఛేదించిన పిమ్మట లక్ష్మణుడు ఆ ఇంద్రజిత్తును సర్పవిషము వంటి ఐదు బాణాలతో వక్షఃస్థలమునందు కొట్టెను. 19

మూ. తే తస్య కాయం నిర్భిద్య మహాకార్ముకనిఃసృతాః, 20
నిపేతుర్ధరణీం బాణా రక్తా ఇవ మహోరగాః.

ప్ర. అ. మహాకార్ముకనిఃసృతాః=గొప్ప ధనస్సునుండి బయలుదేరిన, తే=ఆ, బాణాః=బాణములు, తస్య=వానియొక్క, కాయమ్=శరీరమును, నిర్భిద్య=భేదించి, రక్తాః=ఎఱ్ఱని, మహోరగాః ఇవ=మహాసర్పములు వలె, ధరణీమ్=భూమిని గూర్చి, నిపేతుః=పడినవి.

తా. గొప్ప ధనస్సునుండి బయలుదేరిన ఆ బాణములు ఆతని శరీరమును భేదించి ఎఱ్ఱని మహాసర్పములు వలె నేలమీద పడినవి. 20

మూ. స ఛ్చిన్నధన్వా రుధిరం వమన్ వక్త్రేణ రావణిః, 21
జగ్రాహ కార్ముకశ్రేష్ఠం దృఢజ్యం బలవత్తరమ్.

ప్ర. అ. ఛిన్నధన్వా=ఛేదింపబడిన ధనస్సుగల, వక్త్రేణ=ముఖముచేత, రుధిరమ్=రక్తమును, వమన్=కక్కుచున్న, సః రావణిః=ఆ ఇంద్రజిత్తు, దృఢజ్యమ్=దృఢమైన నారి గల, బలవత్తరమ్=ఎక్కువ బలము గల, కార్ముకశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన ధనస్సును, జగ్రాహ=గ్రహించెను.

తా. ధనస్సు ఛేదింపబడి, ముఖమునుండి రక్తము కక్కుచున్న ఆ ఇంద్రజిత్తు మంచి నారి గల, చాల దృఢమైన మరొక ధనస్సును గ్రహించెను.

మూ. స లక్ష్మణం సముద్దిశ్య పరం లాఘవమాశ్రితః, 22
వవర్ష శరవర్షాణి వర్షాణీవ పురన్దరః.

ప్ర. అ. సః=అతడు, పరమ్=అధికమైన, లాఘవమ్=లాఘవమును, ఆశ్రితః=ఆశ్రయించినవాడై, లక్ష్మణమ్=లక్ష్మణుని, ఉద్దిశ్య=ఉద్దేశించి, పురన్దరః=దేవేంద్రుడు,వర్షాణీవ=వర్షములను వలె, శరవర్షాణి=బాణవర్షములను, వవర్ష=వర్షించెను.

తా. ఆతడు చాల లాఘవము చూపుచు దేవేంద్రుడు వర్షము కురిపించి నట్లు లక్ష్మణునిపై బాణవర్షములు కురిపించెను. 22

మూ. ముక్తమిన్ద్రజితా తత్తు శరవర్షమరిందమః, 23
అవారయదసంభ్రాన్తో లక్ష్మణః సుదురాసదమ్.

ప్ర. అ. అరిందమః=శత్రుసంహారకుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుచేత, ముక్తమ్=విడవబడిన, సుదురాసదమ్=మిక్కిలి ఎదిరింప శక్యముకాని, శరవర్షమ్=బాణవర్షమును, అసంభ్రాన్తః=కంగారుపడనివాడై, అవారయత్=నివారించెను.

తా. శత్రుసంహారకుడైన లక్ష్మణుడు ఏ మాత్రము కంగారు పడనివాడై, ఇంద్రజిత్తు ప్రయోగించిన, ఎదిరింప శక్యముకాని ఆ బాణవర్షమును నివారించెను.

మూ. సందర్శయామాస తదా రావణిం రఘునన్దనః, 24
అసంభ్రాన్తో మహాతేజాస్తదద్భుతమివాభవత్.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, రఘునన్దనః=లక్ష్మణుడు, అసంభ్రాన్తః=కంగారు చెందనివాడై, తదా=అప్పుడు, రావణిమ్=ఇంద్రజిత్తును (కు), సందర్శయామాస=(తన పరాక్రమమును) చూపెను. తత్=అది, అద్భుతమివ=ఆశ్చర్యకరముగా, అభూత్=ఉండెను.

తా. అప్పుడు గొప్ప తేజస్సు గల, లక్ష్మణుడు కంగారుపడక తన పరాక్రమమును ఇంద్రజిత్తుకు చూపెను. అది చాల ఆశ్చర్యకరముగా ఉండెను.

మూ. తతస్తాన్ రాక్షసాన్ సర్వాంస్త్రిభిరేకైక మాహవే, 25
అవిధ్యత్పరమక్రుద్ధః శీఘ్రాస్త్రం సంప్రదర్శయన్.
రాక్షసేన్ద్రసుతం చాపి బాణౌఘైః సమతాడయత్. 26

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, శీఘ్రాస్త్రమ్=శీఘ్రమైన అస్త్రమును, సంప్రదర్శయన్=చూపుచు, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, సర్వాన్=అందరినీ, ఏకైకమ్=ఒక్కొక్కనిని, త్రిభిః=మూడు బాణములచేత, అవిధ్యత్=కొట్టెను. తమ్=ఆ, రాక్షసేన్ద్రసుతం చాపి=ఇంద్రజిత్తును

కూడ, బాణౌఘైః=బాణముల సముదాయములచేత, సమతాడయత్=కొట్టెను.

తా. పిమ్మట చాల కోపించి, ఆయుధప్రయోగములో తన కున్న లాఘవమును చూపుచు, రాక్షసు లందరినీ మూడేసి బాణాలచేత కొట్టెను. ఇంద్రజిత్తును కూడ బాణసముదాయములచేత కొట్టెను. 25, 26

మూ. సోఽతివిద్ధో బలవతా శత్రుణా శత్రుఘాతినా,
అసక్తం ప్రేషయామాస లక్ష్మణాయ బహూన్ శరాన్. 27

ప్ర. అ. శత్రుఘాతినా=శత్రుసంహారకుడైన, బలవతా=బలవంతుడైన, శత్రుణా=శత్రువుచేత, అతివిద్ధః=మిక్కిలి కొట్టబడిన, సః=ఇంద్రజిత్తు, లక్ష్మణాయ=లక్ష్మణునికొరకు, బహూన్=అనేకమైన, శరాన్=బాణములను, అసక్తమ్=అడ్డు లేకుండగా, ప్రేషయామాస=పంపెను.

తా. బలవంతుడు శత్రుసంహారకుడూ అయిన శత్రువైన లక్ష్మణునిచేత గట్టిగా కొట్టబడిన ఆ ఇంద్రజిత్తు ఆతనిపై వాడియైన అనేక బాణములను ప్రయోగించెను. 27

మూ. తానప్రాప్తాన్ శితైర్బాణైశ్చిచ్ఛేద పరవీరహా,
సారథేరస్య చ రణే రథినో రఘుసత్తమః, 28
శిరో జహార ధర్మాత్మా భల్లేనానతపర్వణా.

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించు లక్ష్మణుడు, అప్రాప్తాన్=తనమీదకు రాని, తాన్=ఆ బాణములను, శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రఘుసత్తమః=లక్ష్మణుడు, రణే=యుద్ధమునందు, రథినః=రథికుడైన, అస్య=ఇంద్రజిత్తుయొక్క, సారథేః=సారథియొక్క, శిరః=శిరస్సును, ఆనతపర్వణా=వంగిన కణుపులుగల, భల్లేన=భల్లబాణముచేత, జహార=హరించెను.

తా. శత్రసంహారకుడు ధర్మాత్ముడు అయిన లక్ష్మణుడు ఆ బాణములు తన మీదికి రాకుండగనే వాడియైన బాణాలచేత ఛేదించి, వంగిన కణుపులు ఉన్న భల్లబాణముచేత, రథికుడైన ఆ ఇంద్రజిత్తు సారథి తలను ఖండించెను. 28

మూ. అసూతాస్తే హయాస్తత్ర రథమూహురవిక్లబాః, 29
మణ్డలాన్యభిధావన్తస్తదద్భుతమివాభవత్.

ప్ర. అ. తత్ర=అక్కడ, అసూతాః=సారథి లేని, తే=ఆ, హయాః=గుఱ్ఱములు, అవిక్లబాః=వ్యాకులములు కానివై, మణ్డలాని=మండలములను, అభిధావన్తః=పరుగెత్తుచున్నవై, రథమ్=రథమును, ఊహుః=వహించినవి. తత్=

అది, అద్భుతమివ=ఆశ్చర్యకరముగా, అభవత్=ఉండెను.

తా. ఆ గుఱ్ఱములు సారథి లేక పోయినను, ఏ మాత్రము కంగారుపడక, మండలాకారముగా సంచరించుచు రథమును లాగినవి. అది అశ్చర్యకరముగా ఉండెను.

29

మూ. అమర్షవశమాపన్నః సౌమిత్రిర్దృఢవిక్రమః, 30
ప్రత్యవిధ్యద్ధయాంస్తస్య శరైర్విత్రాసయన్ రణే.

ప్ర. అ. దృఢవిక్రమః=దృఢమైన పరాక్రమము గల, సౌమిత్రిః=లక్ష్మణుడు, రణే=యుద్ధమునందు, అమర్షవశమ్=క్రోధవశమును, ఆపన్నః=పొందినవాడై, తస్య=వానియొక్క, హయాన్=గుఱ్ఱములను, విత్రాసయన్=భయపెట్టుచు, శరైః=బాణములచేత, ప్రత్యవిధ్యత్=కొట్టెను.

తా. దృఢమైన పరాక్రమము గల లక్ష్మణుడు కోపము చెంది, ఆ యుద్ధమునందు ఇంద్రజిత్తు గుఱ్ఱములను భయపెట్టుటకై వాటిని బాణములతో కొట్టెను.

30

మూ. అమర్షమాణస్తత్కర్మ రావణస్య సుతో రణే, 31
వివ్యాధ దశభిర్బాణైః సౌమిత్రిం తమమర్షణమ్.

ప్ర. అ. రావణస్య=రావణుని యొక్క, సుతః=కుమారుడు, రణే=యుద్ధమునందు, తత్=ఆ, కర్మ=పనిని, అమర్షమాణః=సహించనివాడై, అమర్షణమ్=కోపముగల, తం సౌమిత్రిమ్=ఆ లక్ష్మణుణ్ణి, దశభిః=పది, బాణైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. ఇంద్రజిత్తు యుద్ధములో లక్ష్మణుడు చేసిన ఆ పని సహించక కోపముతో ఉన్న ఆతనిని పది బాణములతో కొట్టెను.

31

మూ. తే తస్య వజ్రప్రతిమాః శరాః సర్పవిషోపమాః, 32
విలయం జగ్మురాగత్య కవచం కాఞ్చనప్రభమ్.

ప్ర. అ. తస్య=వానియొక్క, వజ్రప్రతిమాః=వజ్రముతో సమానములైన, సర్పవిషోపమాః=సర్పవిషముతో సమానములైన, తే శరాః=ఆ బాణములు, కాఞ్చనప్రభమ్=బంగారు కాంతి గల, కవచమ్=కవచమును, ఆగత్య=పొంది, విలయమ్=వినాశమును, జగ్ముః=పొందినవి.

తా. ఇంద్రజిత్తు ప్రయోగించిన, వజ్రముతోను, సర్పవిషముతోను సమానములైన బాణములు బంగారు కాంతి గల కవచమును స్పృశించి విరిగి పడిపోయినవి.

32

మూ. అభేద్యకవచం మత్వా లక్ష్మణం రావణాత్మజః, 33
లలాటే లక్ష్మణం బాణైః సుపుఙ్ఖైస్త్రిభిరిన్ద్రజిత్,
అవిధ్యత్పరమక్రుద్ధః శీఘ్రమస్త్రం ప్రదర్శయన్. 34

ప్ర. అ. రావణాత్మజః=రావణుని కుమారుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, లక్ష్మణమ్=లక్ష్మణుని, అభేద్యకవచమ్=భేదింప శక్యముకాని కవచము గల వానిగా, మత్వా=తలచి, పరమక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, అస్త్రమ్=అస్త్రమును, శీఘ్రమ్=శీఘ్రముగా, ప్రదర్శయన్=చూపుచు, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, సుపుఙ్ఖైః=మంచి పొన్నులు గల, త్రిభిః బాణైః=మూడు బాణములచేత, లలాటే=లలాటమునందు, అవిధ్యత్=కొట్టెను.

తా. రావణపుత్రుడైన ఇంద్రజిత్తు లక్ష్మణుని కవచము ఛేదింప శక్యముకానిది అని తెలిసికొని, చాల కోపించి, అస్త్రప్రయోగములో తన చురుకుతనమును చూపుచు, మంచి పొన్నులు ఉన్న మూడు బాణాలతో లక్ష్మణుని లలాటముమీద కొట్టెను. 33, 34

మూ. తైః పృషత్కైర్లలాటస్థైః శుశుభే రఘునన్దనః,
రణాగ్రే సమరశ్లాఘీ త్రిశృఙ్గ ఇవ పర్వతః. 35

ప్ర. అ. సమరశ్లాఘీ=యుద్ధమును శ్లాఘించు, రఘునన్దనః=లక్ష్మణుడు, లలాటస్థైః=లలాటమునందున్న, తైః=ఆ, పృషత్కైః=బాణములతో, సమరే=యుద్ధమునందు, త్రిశృఙ్గః=మూడు శిఖరములు గల, పర్వతః ఇవ=పర్వతము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. యుద్ధప్రియుడైన లక్ష్మణుడు లలాటమునందు నాటుకొని ఉన్న ఆ బాణములతో మూడు శిఖరములున్న పర్వతము వలె యుద్ధరంగములో ప్రకాశించెను. 35

మూ. స తథాప్యర్దితో బాణై రాక్షసేన తదా మృధే,
తమాశు ప్రతివివ్యాధ లక్ష్మణః పఞ్చభిః శరైః. 36
వికృష్యేన్ద్రజితో యుద్ధే వదనే శుభకుణ్డలే.

ప్ర. అ. తదా=అప్పుడు, మృధే=యుద్ధమునందు, రాక్షసేన=రాక్షసునిచేత, తథా=అట్లు, అర్దితః=పీడింపబడిన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, ఆశు=శీఘ్రముగా, ఆకృష్య=ధనస్సును లాగి, యుద్ధే=యుద్ధమునందు, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, శుభకుణ్డలే=సుందరములైన కుండలములు గల, వదనే=ముఖమునందు, తమ్=వానిని, పఞ్చభిః= ఐదు, శరైః=బాణములచేత, ప్రతివివ్యాధ=తిరిగి కొట్టెను.

తా. అప్పుడు యుద్ధమునందు ఆ రాక్షసునిచేత ఆ విధముగా

బాణములచేత పీడింపబడిన లక్ష్మణుడు వెంటనే ధనస్సును లాగి ఐదు బాణములతో అందమైన కుండలములు గల ఆ ఇంద్రజిత్తు ముఖముమీద కొట్టెను. 36

మూ. లక్ష్మణేన్ద్రజితౌ వీరౌ మహాబలశరాసనౌ, 37
అన్యోన్యం జఘ్నతుర్బాణైర్విశిఖైర్భీమవిక్రమౌ.

ప్ర. అ. వీరౌ=వీరులు, మహాబలశరాసనౌ=గొప్ప బలము ధనస్సులూ కలవారూ, భీమవిక్రమౌ=భయంకరమైన, పరాక్రమము గలవారు అయిన, లక్ష్మణేన్ద్రజితౌ=లక్ష్మణేంద్రజిత్తులు, విశిఖైః=విశిష్టములైన అగ్రభాగములు గల, బాణైః=బాణములచేత, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నతుః=కొట్టిరి.

తా. వీరులు, గొప్ప బలము ధనస్సులూ కలవారూ, భయంకరమైన పరాక్రమము కలవారు అయి ఆ లక్ష్మణేంద్రజిత్తులు వాడియైన బాణాలతో ఒకరినొకరు కొట్టిరి. 37

మూ. తతః శోణితదిగ్ధాఙ్గౌ లక్ష్మణేన్ద్రజితావుభౌ, 38
రణే తౌ రాజతుర్వీరౌ పుష్పితావివ కింశుకౌ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శోణితదిగ్ధాఙ్గౌ=రక్తముచేత పూయబడిన శరీరములు గల, తౌ=ఆ, లక్ష్మణేన్ద్రజితౌ=లక్ష్మణేంద్రజిత్తులు, ఉభౌ=ఇద్దరూ, రణే=యుద్ధమునందు, పుష్పితౌ=పుష్పించిన, కింశుకౌ ఇవ=కింశుకవృక్షములు వలె, రేజతుః=ప్రకాశించిరి.

తా. అప్పుడు యుద్ధమునందు రక్తముచేత పూయబడిన శరీరములు గల ఆ లక్ష్మణేంద్రజిత్తులు ఇద్దరూ పుష్పించిన మోదుగచెట్ల వలె ఉండిరి. 38

మూ. తౌ పరస్పరమభ్యేత్య సర్వగాత్రేషు ధన్వినౌ, 39
ఘోరైర్వివ్యధతుర్బాణైః కృతభావావుభౌ జయే.

ప్ర. అ. జయే=జయమునందు, కృతభావౌ=చేయబడిన భావము గల, ధన్వినౌ=ధనుర్ధరులైన, తౌ=ఆ, ఉభౌ=ఇద్దరూ, పరస్పరమ్=పరస్పరమును, అభ్యేత్య=సమీపించి, ఘోరైః=ఘోరములైన, బాణైః=బాణములచేత, సర్వగాత్రేషు=అన్ని అవయవములందు, వివ్యధతుః=కొట్టిరి.

తా. జయము సంపాదించవలె నను నిశ్చయముతో ధనుర్ధరులైన వారిద్దరూ ఒకరిని ఒకరు సమీపించి ఘోరములైన బాణములచేత అన్ని అవయవములందు కొట్టుకొనిరి. 39

మూ. తతః సమరకోపేన సంవృతో రావణాత్మజః, 40
విభీషణం త్రిభిర్బాణైర్వివ్యాధ వదనే శుభే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సమరకోపేన=యుద్ధకోపముతో, సంవృతః=కూడిన, రావణాత్మజః=ఇంద్రజిత్తు, శుభే=శుభమైన, వదనే=ముఖమునందు, విభీషణమ్=విభీషణుణ్ణి, త్రిభిః=మూడు, బాణైః=బాణములచేత, వివ్యాధ=కొట్టెను.

తా. అప్పుడు యుద్ధకోపముతో కూడిన ఇంద్రజిత్తు విభీషణుణ్ణి, మూడు బాణాలచేత మంగళకరమైన ముఖముమీద కొట్టెను. 40

మూ. అయోముఖైస్త్రిభిర్విద్ధ్వా రాక్షసేన్ద్రం విభీషణమ్, 41
ఏకైకేనాభివివ్యాధ తాన్సర్వాన్ హరియూథపాన్.

ప్ర. అ. రాక్షసేన్ద్రమ్=రాక్షసనాయకుడైన, విభీషణమ్=విభీషణుని, త్రిభిః=మూడు, అయోముఖైః=బాణములచేత, విద్ధ్వా=కొట్టి, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, హరియూథపాన్=వానర నాయకులను, ఏకైకేన=ఒక్కొక్క బాణముచేత, అభివివ్యాధ=కొట్టెను.

తా. రాక్షసనాయకుడైన విభీషణుణ్ణి మూడు బాణాలతో కొట్టి వానర నాయకులనందరినీ ఒక్కొక్క బాణముచేత కొట్టెను. 41

మూ. తస్మై దృఢతరం క్రుద్ధో జఘాన గదయా హయాన్, 42
విభీషణో మహాతేజా రావణేః స దురాత్మనః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సుగల, సః విభీషణః=ఆ విభీషణుడు, తస్మై=వానికొరకు, దృఢతరమ్=చాల అధికముగా, క్రుద్ధః=కోపించినవాడై, దురాత్మనః=దురాత్ముడైన, రావణేః=ఇంద్రజిత్తుయొక్క, హయాన్=గుఱ్ఱములను, గదయా=గదచేత, జఘాన=చంపివేసెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ విభీషణుడు దురాత్ముడైన ఆ ఇంద్రజిత్తుమీద చాల కోపించి వాని గుఱ్ఱములను గదతో చంపివేసెను. 42

మూ. స హతాశ్వాత్సమాప్లుత్య రథాన్మథితసారథిః, 43
అథ శక్తిం మహాతేజాః పితృవ్యాయ ముమోచ హ.

ప్ర. అ. మథితసారథిః=చంపబడిన సారథి గల, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః=ఆ ఇంద్రజిత్తు, హతాశ్వాత్=చంపబడిన గుఱ్ఱములు గల, రథాత్=రథమునుండి, సమాప్లుత్య=దిగి, అథ=అటుపిమ్మట, పితృవ్యాయ=పినతండ్రికొరకు, శక్తిమ్=శక్తిని, ముమోచ హ=విడచెను.

తా. ముందుగానే సారథి లేని మహాతేజఃశాలియైన ఇంద్రజిత్తు చంపబడిన గుఱ్ఱములు గల రథమునుండి క్రిందికి దుమికి పినతండ్రిపై శక్తిని ప్రయోగించెను.

మూ. తామాపతన్తీం సంప్రేక్ష్య సుమిత్రానన్దవర్ధనః, 44
చిచ్ఛేద నిశితై ర్బాణైర్దశధాపాతయద్భువి.

ప్ర. అ. సుమిత్రానన్దవర్ధనః=లక్ష్మణుడు, ఆపతన్తీమ్=వచ్చి పడుచున్న, తామ్=దానిని, సంప్రేక్ష్య=చూచి, నిశితైః=వాడియైన, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. దశధా=పదిగా, భువి=నేలమీద, అపాతయత్=పడగొట్టెను.

తా. లక్ష్మణుడు వచ్చుచున్న ఆ శక్తిని చూచి వాడియైన బాణములచేత ఛేదించి పది ముక్కలుగా నేలమీద పడగొట్టెను. 44

మూ. తస్మై దృఢతనుః క్రుద్ధో హతాశ్వాయ విభీషణః, 45
వజ్రస్పర్శసమాన్ పఞ్చ ససర్జోరసి సాయకాన్.

ప్ర. అ. దృఢతనుః=దృఢమైన శరీరము గల, విభీషణః=విభీషణుడు, హతాశ్వాయ=చంపబడిన అశ్వములు గల, తస్మై=వానికి, క్రుద్ధః=కోపించినవాడై, ఉరసి=వక్షఃస్థలమునందు, వజ్రస్పర్శసమాన్=వజ్రస్పర్శతో సమానములైన, పఞ్చ=ఐదు, సాయకాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. దృఢమైన శరీరము గల విభీషణుడు అశ్వములను కోల్పోయిన ఆ ఇంద్రజిత్తుపై కోపముతో, ఆతని వక్షఃస్థలముమీద వజ్రముతో సమానమైన స్పర్శగల ఐదు బాణములను విడచెను. 45

మూ. తే తస్య కాయం భిత్త్వా తు రుక్మపుఙ్ఖా నిమిత్తగాః, 46
బభూవుర్లోహితాదిగ్ధా రక్తా ఇవ మహోరగాః.

ప్ర. అ. నిమిత్తగాః=లక్ష్యము గూర్చి వెళ్లు, రుక్మపుఙ్ఖాః=బంగారు పొన్నులు గల, తే=ఆ బాణములు, తస్య=వానియొక్క, కాయమ్=శరీరమును, భిత్త్వా తు=భేదించి, లోహితాదిగ్ధాః=రక్తముచేత పూయబడినవై, రక్తాః=ఎఱ్ఱని, మహోరగాః ఇవ=మహాసర్పములు వలె, బభూవుః=అయినవి.

తా. లక్ష్యమును గూర్చి వెళ్లు, బంగారు పొన్నులు గల ఆ బాణములు వాని శరీరమును ఛేదించి రక్తముచేత పూయబడినవై ఎఱ్ఱని మహాసర్పముల వలె అయినవి. 46

మూ. స పితృవ్యస్య సంక్రుద్ధ ఇన్ద్రజిచ్ఛరమాదదే, 47
ఉత్తమం రక్షసాం మధ్యే యమదత్తం మహాబలమ్.

ప్ర. అ. సః ఇన్ద్రజిత్=ఆ ఇంద్రజిత్తు, పితృవ్యస్య=పినతండ్రికి,

సం(క్రుద్ధః=కోపించినవాడై, రక్షసామ్=రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, యమదత్తమ్=యమునిచేత ఇవ్వబడిన, మహాబలమ్=గొప్ప బలము గల, ఉత్తమమ్=ఉత్తమమైన, శరమ్=బాణమును, ఆదదే=(గ్రహించెను.

తా. ఇం(ద్రజిత్తు పినతం(డ్రిమీద కోపించి, రాక్షసుల మధ్యలో ఉండి, యముడిచ్చిన, గొప్ప బలము గల ఉత్తమమైన బాణమును (గ్రహించెను. 47

మూ. తం సమీక్ష్య మహాతేజా మహేషుం తేన సంహితమ్, 48
లక్ష్మణోఽప్యాదదే బాణమన్యద్భీమపరా(క్రమః.

(ప. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, భీమపరా(క్రమః=భయంకరమైన పరా(క్రమము గల, లక్ష్మణోఽపి=లక్ష్మణుడు కూడ, తేన=వానిచేత, సంహితమ్=సంధింపబడిన, తమ్=ఆ, మహేషుమ్=మహాబాణమును, సమీక్ష్య=చూచి, అన్యత్=మరియొక, బాణమ్=బాణమును, ఆదదే=(గ్రహించెను.

తా. గొప్ప తేజస్సు భయంకరమైన పరా(క్రమము గల లక్ష్మణుడు ఆతడు సంధించిన మహాబాణమును చూచి మరొక బాణమును తీసెను.

మూ. కుబేరేణ స్వయం స్వప్నే యద్దత్తమమితాత్మనా, 49
దుర్జయం దుర్విషహ్యం చ సేన్ద్రైరపి సురాసురైః.

(ప. అ. యత్=ఏది, అమితాత్మనా=అమితమైన (ప్రభావముగల, కుబేరేణ=కుబేరునిచేత, స్వయమ్=స్వయముగా, స్వప్నే=స్వప్నమునందు, దత్తమ్=ఇవ్వబడినదో, సేన్ద్రైః=ఇం(ద్రునితో కూడిన, సురాసురైరపి=సురులచేతను అసురులచేతను కూడ, దుర్జయమ్=జయింప శక్యముకానిదో, దుర్విషహ్యం చ=సహించ శక్యము కూడ కాదో, (అట్టి బాణమును (గ్రహించెను అని పూర్వశ్లోకముతో అన్వయము.)

తా. ఆ బాణమును కుబేరుడు స్వయముగా స్వప్నములో లక్ష్మణునకు ఇచ్చి ఉండెను. దీనిని ఇం(ద్రునితో కూడిన సురాసురులు కూడ జయించజాలరు, సహించజాలరు. 49

మూ. తయోస్తు ధనుషీ (శ్రేష్ఠే బాహుభిః పరిఘోపమైః, 50
వికృష్యమాణే బలవత్ (క్రౌఞ్చావివ చుకూజతుః.

(ప. అ. పరిఘోపమైః=పరిఘలవంటి, బాహుభిః=బాహువులచేత, బలవత్=బలముగా, వికృష్యమాణే=లాగబడుచున్న, తయోః=వారిద్దరియొక్క, (శ్రేష్ఠే=(శ్రేష్ఠములైన, ధనుషీ=ధనస్సులు, (క్రౌఞ్చావివ=(క్రౌంచ పక్షులు వలె, చుకూజతుః=ధ్వనిచేసినవి.

తా. పరిఘలవంటి బాహువులచేత బలముగా లాగబడిన ఆ లక్ష్మణేం(ద్రజిత్తుల (శ్రేష్ఠములైన ధనస్సులు (క్రౌంచపక్షులవలె చప్పుడు చేసినవి. 50

మూ. తాభ్యాం తు ధనుషి శ్రేష్ఠే సంహితౌ సాయకోత్తమౌ, 51
వికృష్యమాణే వీరాభ్యాం భృశం జజ్వలతుః శ్రియా.

ప్ర. అ. తాభ్యాం వీరాభ్యామ్=ఆ వీరులచేత, శ్రేష్ఠే=శ్రేష్ఠమైన, ధనుషి=ధనస్సునందు, సంహితౌ=సంధించబడిన, వికృష్యమాణే=లాగబడుచున్న, సాయకోత్తమౌ=శ్రేష్ఠములైన బాణములు, భృశమ్=మిక్కిలి, శ్రియా=శోభతో, జజ్వలతుః=ప్రజ్వలించినవి.

తా. వీరులైన ఆ లక్ష్మణేంద్రజిత్తులు ధనస్సుమీద సంధించి లాగిన శ్రేష్ఠములైన ఆ బాణములు శోభతో ప్రజ్వరిల్లినవి. 51

మూ. తౌ భాసయన్తావాకాశం ధనుర్భ్యాం విశిఖౌ చ్యుతౌ, 52
ముఖేన ముఖమాహత్య సంనిపేతతురోజసా.

ప్ర. అ. ధనుర్భ్యామ్=ధనస్సు నుండి, చ్యుతౌ=జారిన, తౌ=ఆ, విశిఖౌ=బాణములు, ఆకాశమ్=ఆకాశమును, భాసయన్తౌ=ప్రకాశింపచేయుచున్నవై, ముఖేన=ముఖముచేత, ముఖమ్=ముఖమును, ఆహత్య=కొట్టి, ఓజసా=తేజస్సుతో, సంనిపేతతుః=సంఘర్షమును పొందినవి.

తా. ధనస్సులనుండి బైటకు వచ్చి ఆ బాణములు ఆకాశమును ప్రకాశింపజేయుచు ముఖముతో ముఖమును కొట్టి, కాంతిమంతములై సంఘర్షణ పొందినవి. 52

మూ. సంనిపాతస్తయోశ్చాసీచ్ఛరయోర్ఘోరరూపయోః, 53
సధూమవిస్ఫులిఙ్గశ్చ తజ్జోఽగ్నిర్దారుణోఽభవత్.

ప్ర. అ. ఘోరరూపయోః=భయంకరమైన ఆకారము గల, తయోః శరయోః=ఆ బాణములయొక్క, సంనిపాతః=సంఘర్షము, సధూమవిస్ఫులిఙ్గః=ధూమముతోను అగ్నికణములతోను కూడినదిగా, ఆసీత్=ఆయెను. తజ్జః=దానివలన పుట్టిన, అగ్నిః=అగ్ని, దారుణః=దారుణముగా, అభవత్=ఉండెను.

తా. భయంకరమైన రూపముగల ఆ బాణముల సంఘర్షమువలన ధూమము, అగ్నికణములు బయలుదేరెను. దాని వలన పుట్టిన అగ్ని భయంకరముగా ఉండెను. 53

మూ. తౌ మహాగ్రహసంకాశావన్యోన్యం సంనిపత్య చ, 54
సంగ్రామే శతధా యాతౌ మేదిన్యాం చైవ పేతతుః.

ప్ర. అ. సంగ్రామే=యుద్ధమునందు, మహాగ్రహసంకాశౌ=మహాగ్రహములవంటి, తౌ=ఆ బాణములు, అన్యోన్యమ్=పరస్పరము, సంనిపత్య=ఢీకొని,

శతధా=నూరు ముక్కలుగా, యాతౌ=అయినవై, మేదిన్యామ్=భూమిమీద, పేతతుః=పడినవి.

తా. మహాగ్రహముల వలె ఉన్న ఆ బాణములు యుద్ధములో ఒకదానితో ఒకటి ఢీకొని నూరు ముక్కలై నేలమీద పడిపోయినవి. 54

మూ. శరౌ ప్రతిహతౌ దృష్ట్వా తావుభౌ రణమూర్ధని, 55
వ్రీడితౌ జాతరోషౌ చ లక్ష్మణేన్ద్రజితౌ తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, తౌ=ఆ, లక్ష్మణేన్ద్రజితౌ=లక్ష్మణేంద్రజిత్తులు, ఉభౌ=ఇద్దరూ, రణమూర్ధని=రణాగ్రమునందు, ప్రతిహతౌ=కొట్టబడిన, శరౌ=బాణములను, దృష్ట్వా=చూచి, వ్రీడితౌ=సిగ్గుపడిరి. జాతరోషౌ చ=పుట్టిన రోషము కలవారు అయిరి.

తా. అప్పుడు ఆ లక్ష్మణేంద్రజిత్తు లిద్దరూ రణాగ్రమునందు తమ బాణములు దెబ్బ తిని పడిపోవుట చూచి సిగ్గు చెందిరి. వారికి కోపావేశము కూడ కలిగెను. 55

మూ. స సంరబ్ధస్తు సౌమిత్రిరస్త్రం వారుణమాదదే, 56
రౌద్రం మహేన్ద్రజిద్యుద్ధేఽప్యసృజద్యుద్ధవిష్ఠితః.

ప్ర. అ. సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, సంరబ్ధః=తొందరపడుచు, వారుణమ్=వారుణ మను, అస్త్రమ్=అస్త్రమును, ఆదదే=గ్రహించెను. యుద్ధే=ఆ యుద్ధమునందు, యుద్ధవిష్ఠితః=యుద్ధమునందు స్థిరుడైన, మహేన్ద్రజిదపి=ఇంద్రజిత్తుకూడ, రౌద్రమ్=రౌద్రాస్త్రమును, అసృజత్=సృజించెను.

తా. లక్ష్మణుడు తొందరపడుచు వారుణాస్త్రమును ప్రయోగించగా యుద్ధమునందు స్థిరుడైన ఇంద్రజిత్తుకూడ యుద్ధమునందు, రౌద్రాస్త్రమును ప్రయోగించెను. 56

మూ. తేన తద్విహతం శస్త్రం వారుణం పరమాద్భుతమ్, 57
తతః క్రుద్ధో మహాతేజా ఇన్ద్రజిత్సమితింజయః,
ఆగ్నేయం సందధే దీప్తం స లోకం సంక్షిపన్నివ. 58

ప్ర. అ. తేన=ఆ రౌద్రాస్త్రముచేత, పరమాద్భుతమ్=చాల ఆశ్చర్యకరమైన, తత్=ఆ, వారుణమ్ అస్త్రమ్=వారుణాస్త్రము, విహతమ్=కొట్టబడినది. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సమితింజయః=యుద్ధమును జయించు, సః=ఆ, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, లోకమ్=లోకమును, సంక్షిపన్నివ=నశింపచేయుచున్నవాడు వలె, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, ఆగ్నేయమ్=ఆగ్నేయాస్త్రమును, సందధే=సంధించెను.

తా. ఆ రౌద్రాస్త్రము చాల ఆశ్చర్యకరమైన వారుణాస్త్రమును కొట్టివేసెను. పిమ్మట గొప్ప తేజస్సు గల, యుద్ధమును జయించు ఇంద్రజిత్తు కోపించినవాడై లోకమునంతనూ నశింపచేయ నున్నాడా అన్నట్లు, ప్రజ్వలించుచున్న ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. 57, 58

మూ. సౌరేణాస్త్రేణ తద్వీరో లక్ష్మణః పర్యవారయత్,
అస్త్రం నివారితం దృష్ట్వా రావణిః క్రోధమూర్ఛితః, 59
ఆదదే నిశితం బాణమాసురం శత్రుదారణమ్.

ప్ర. అ. వీరః=వీరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, సౌరేణ అస్త్రేణ=సౌరాస్త్రముచేత, తత్=దానిని, పర్యవారయత్=నివారింపచేసెను. అస్త్రమ్=అస్త్రమును, నివారితమ్=నివారింపబడినదానినిగా, దృష్ట్వా=చూచి, రావణిః=ఇంద్రజిత్తు, క్రోధమూర్ఛితః=క్రోధావిష్టుడై, శత్రుదారణమ్=శత్రువులను చీల్చివేయు, నిశితమ్=వాడియైన, ఆసురం బాణమ్=ఆసురాస్త్రముతో కూడిన బాణమును, ఆదదే=గ్రహించెను.

తా. వీరుడైన లక్ష్మణుడు సూర్యాస్త్రముచేత ఆ ఆగ్నేయాస్త్రమును నివారించెను. ఆ అస్త్రము నివారింపబడుట చూచి ఇంద్రజిత్తు క్రోధావిష్టుడై శత్రువినాశకమైన వాడియైన ఆసురబాణమును సంధించెను. 59

మూ. తస్మాచ్చాపాద్వినిష్పేతుర్భాస్వరాః కూటముద్గరాః, 60
శూలాని చ భుశుణ్డ్యశ్చ గదాః ఖడ్గాః పరశ్వధాః.

ప్ర. అ. తస్మాత్=ఆ, చాపాత్=ధనస్సునుండి, భాస్వరాః=ప్రకాశించుచున్న, కూటముద్గరాః=కూటములు ముద్గరములు, శూలాని చ=శూలములు, భుశుణ్డ్యశ్చ=భుశుండులు, గదాః=గదలు, ఖడ్గాః=ఖడ్గములు, పరశ్వధాః=గండ్రగొడ్డళ్ళు, వినిష్పేతుః=బయలుదేరినవి.

తా. ఆ ధనస్సునుండి ప్రకాశించుచున్న కూటములు, ముద్గరములు, శూలములు, భుశుండులు, గదలు, ఖడ్గములు, గండ్రగొడ్డళ్లు బయలుదేరినవి. 60

మూ. తద్దృష్ట్వా లక్ష్మణః సంఖ్యే ఘోరమస్త్రం సుదారుణమ్, 61
అవార్యం సర్వభూతానాం సర్వశస్త్రవిదారణమ్,
మాహేశ్వరేణ ద్యుతిమాంస్తదస్త్రం ప్రత్యవారయత్. 62

ప్ర. అ. ద్యుతిమాన్=కాంతి గల, లక్ష్మణః=లక్ష్మణుడు, సంఖ్యే=యుద్ధమునందు, సుదారుణమ్=చాల దారుణము, సర్వభూతానామ్=సమస్తభూతములకు, అవార్యమ్=నివారింప శక్యము కానిది, సర్వశస్త్రవిదారణమ్=సకల శస్త్రములను చీల్చివేయునది అయిన, తత్=ఆ, ఘోరమ్=ఘోరమైన, అస్త్రమ్=అస్త్రమును,

దృష్ట్వా=చూచి, మాహేశ్వరేణ=మాహేశ్వరాస్త్రముచేత, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, ప్రత్యవారయత్=నివారించెను.

తా. కాంతిమంతుడైన లక్ష్మణుడు యుద్ధమునందు చాల భయంకరము, సకల భూతములచేత నివారింప శక్యముకానిది, సకల శస్త్రములను చీల్చి వేయునది అయిన ఆ ఘోరమైన ఆసురాస్త్రమును చూచి దానిని మాహేశ్వరాస్త్రముచేత నివారించెను. 61, 62

మూ. తయోః సమభవద్యుద్ధమద్భుతం రోమహర్షణమ్,
గగనస్థాని భూతాని లక్ష్మణం పర్యవారయన్. 63

ప్ర. అ. తయోః=వాళ్ళిద్దరికీ, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, రోమహర్షణమ్=రోమాంచము కలిగించు, యుద్ధమ్=యుద్ధము, సమభవత్=ఆయెను. గగనస్థాని=ఆకాశమునందున్న, భూతాని=భూతములు, లక్ష్మణమ్=లక్ష్మణుని, పర్యవారయన్=చుట్టి నిలచినవి.

తా. వాళ్ళిద్దరికీ ఆశ్చర్యకరమైన, రోమాంచమును కలిగించు యుద్ధము జరిగెను. ఆకాశమునందు సంచరించు భూతములు లక్ష్మణుని చుట్టూ నిలచెను.

మూ. భైరవాభిరుతే భీమే యుద్ధే వానరరక్షసామ్,
భూతైర్బహుభిరాకాశం విస్మితైరావృతం బభౌ. 64

ప్ర. అ. వానరరక్షసామ్=వానరరాక్షసులయొక్క, భైరవాభిరుతే=భయంకరమైన ధ్వని గల, భీమే=భయంకరమైన, యుద్ధే=యుద్ధమునందు, విస్మితైః=ఆశ్చర్యముచెందిన, బహుభిః=అనేకమైన, భూతైః=ప్రాణులచేత, ఆవృతమ్=ఆవరించబడిన, ఆకాశమ్=ఆకాశము, బభౌ=ప్రకాశించెను.

తా. భయంకరమైన ధ్వనితో నిండిన, భయంకరమైన ఆ వానరరాక్షసుల మధ్య జరుగుచున్న యుద్ధమునందు ఆశ్చర్యపడుచున్న ప్రాణులచేత ఆవరింపబడినదై ఆకాశము ప్రకాశించెను. 64

మూ. ఋషయః పితరో దేవా గన్ధర్వగరుడోరగాః,
శతక్రతుం పురస్కృత్య రరక్షుర్లక్ష్మణం రణే. 65

ప్ర. అ. ఋషయః=ఋషులు, పితరః=పితృదేవతలు, దేవాః=దేవతలు, గన్ధర్వగరుడోరగాః=గంధర్వులు, గరుడులు, ఉరగులు, శతక్రతుమ్=దేవేంద్రుణ్ణి, పురస్కృత్య=ముందు ఉంచుకొని, లక్ష్మణం=లక్ష్మణుణ్ణి, రణే=యుద్ధమునందు, రరక్షుః=రక్షించిరి.

తా. దేవేంద్రుణ్ణి ముందు ఉంచుకొని నిలచి ఉన్న ఋషులు,

పితృదేవతలు, దేవతలు, గంధర్వులు, గరుడులు, ఉరగులు, యుద్ధములో లక్ష్మణుణ్ణి రక్షించిరి. 65

మూ. అథాన్యం మార్గణశ్రేష్ఠం సందధే రాఘవానుజః,
హుతాశనసమస్పర్శం రావణాత్మజదారణమ్. 66

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రాఘవానుజః=లక్ష్మణుడు, హుతాశనసమస్పర్శమ్=అగ్నితో సమానమైన స్పర్శ గలది, రావణాత్మజదారణమ్=ఇంద్రజిత్తును చీల్చివేయునది అయిన, అన్యమ్=మరియొక, మార్గణశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన బాణమును, సందధే=సంధించెను.

తా. పిమ్మట లక్ష్మణుడు అగ్ని స్పర్శవంటి స్పర్శ గలది, ఇంద్రజిత్తును చీల్చి వేయునది అయిన మరియొక శ్రేష్ఠమైన బాణమును సంధించెను. 66

మూ. సుపత్రమనువృత్తాఙ్గం సుపర్వాణం సుసంస్థితమ్,
సువర్ణవికృతం వీరః శరీరాన్తకరం శరమ్. 67
దురావారం దుర్విషహం రాక్షసానాం భయావహమ్,
ఆశీవిషవిషప్రఖ్యం దేవసంఘైః సమర్చితమ్. 68

ప్ర. అ. వీరః=వీరుడైన లక్ష్మణుడు, సుపత్రమ్=మంచి రెక్కలు గలది, అనువృత్తాఙ్గమ్=అనువృత్తమైన (మొదట సన్నముగాను క్రమముగా లావుగాను ఉన్న) శరీరము గలది, సుపర్వాణమ్=మంచి కణుపులు గలది, సుసంస్థితమ్=బాగుగా ఉన్నది, సువర్ణవికృతమ్=బంగారము చేత అలంకరింపబడినది, శరీరాన్తకరమ్=శరీరమునకు అంతము చేయునది, దురావారమ్=నివారింప శక్యముకానిది, దుర్విషహమ్=సహింప శక్యము కానిది, రాక్షసానామ్= రాక్షసులకు, భయావహమ్=భయమును కలిగించునది, ఆశీవిషవిషప్రఖ్యమ్=సర్పవిషముతో సమానము, దేవసంఘైః= దేవతల సముదాయముచేత, సమర్చితమ్=పూజింపబడినది అయిన, శరమ్=బాణమును (సంధించెను).

తా. వీరుడైన లక్ష్మణుడు సంధించిన ఆ బాణము మంచి రెక్కలతో, అనువృత్తమైన ఆకారముతో, అందమైన కణుపులతో చక్కగా ఉండెను. బంగారము చేత అలంకరించబడెను. అది శత్రువులను చంపివేయు సమర్థము. నివారింప శక్యముకానిది. సహింప శక్యము కానిది. రాక్షసులకు భయము కలిగించునది. సర్పవిషముతో సమానమైన ఆ బాణము దేవతలచేత పూజింపబడినది. 67, 68

మూ. యేన శక్రో మహాతేజా దానవానజయత్ప్రభుః,
పురా దేవాసురే యుద్ధే వీర్యవాన్ హరివాహనః. 69

ప్ర. అ. పురా=పూర్వము, దేవాసురే యుద్ధే=దేవాసురుల యుద్ధమునందు, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, ప్రభుః=ప్రభువైన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, హరివాహనః=ఆకుపచ్చని గుఱ్ఱములు గల, శక్రః=దేవేంద్రుడు, యేన=దేనిచేత, దానవాన్=దానవులను, అజయత్=జయించెనో ఆ బాణమును సంధించెను.

తా. పూర్వము దేవాసురయుద్ధమునందు గొప్ప తేజస్సు గలవాడు, సమర్థుడు, పరాక్రమవంతుడు, ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు అయిన దేవేంద్రుడు ఈ బాణముచేతనే దానవులను జయించెను. 69

మూ. తదైన్ద్రిమస్త్రం సౌమిత్రిః సంయుగేష్వపరాజితమ్,
శరశ్రేష్ఠం ధనుఃశ్రేష్ఠే వికర్షన్నిదమబ్రవీత్, 70
లక్ష్మీవాన్ లక్ష్మణో వాక్యమర్థసాధకమాత్మనః.

ప్ర. అ. సౌమిత్రిః=సుమిత్రాపుత్రుడు, లక్ష్మీవాన్=శోభ కలవాడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, సంయుగేషు=యుద్ధములందు, అపరాజితమ్=ఓడింపబడని, తత్=ఆ, ఐన్ద్రిమ్=ఇంద్రుని సంబంధమైన, అస్త్రమ్=అస్త్రమును, శరశ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన బాణమును, ధనుఃశ్రేష్ఠే=శ్రేష్ఠమైన ధనస్సునందు, వికర్షన్=లాగుచు, ఆత్మనః=తనయొక్క, అర్థసాధకమ్=కార్యమును సాధించు, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. సుమిత్రాపుత్రుడు, సౌందర్యశోభితుడు అయిన లక్ష్మణుడు యుద్ధములలో ఎన్నడూ ఓటమి లేని ఐంద్రాస్త్రమును, శ్రేష్ఠమైన బాణమును శ్రేష్ఠమైన ధనస్సునందు సంధించి లాగుచు తన కార్యమును సాధించు ఈ వాక్యమును పలికెను. 70

మూ. ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథిర్యది, 71
పౌరుషే చాప్రతిద్వన్ద్వః శరైనం జహి రావణిమ్.

ప్ర. అ. దాశరథిః=దశరథకుమారుడైన, రామః=రాముడు, ధర్మాత్మా=ధర్మాత్ముడు, సత్యసన్ధశ్చ=సత్యసంధుడు, పౌరుషే=పౌరుషమునందు, అప్రతిద్వన్ద్వః చ యది=ఎదిరించువాడు లేనివాడు అయితే, శర=ఓ ! బాణమా! ఏనమ్=ఈ, రావణిమ్=ఇంద్రజిత్తును, జహి=చంపుము.

తా. ఓ ! బాణమా! రాముడు ధర్మాత్ముడైతే, సత్యసంధుడైతే, పౌరుషములో ఎదిరించగలవాడు ఎవడూ లేనివాడైతే ఈ ఇంద్రజిత్తును చంపుము.

మూ. ఇత్యుక్త్వా బాణమాకర్ణం వికృష్య తమజిహ్మగమ్, 72
లక్ష్మణః సమరే వీరః ససర్జైన్ద్రజితం ప్రతి.

ప్ర. అ. వీరః=వీరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, సమరే=యుద్ధమునందు, అజిహ్మగమ్=వంకర లేకుండా పోవు, బాణమ్=బాణమును, ఆకర్ణమ్=చెవి వరకు, వికృష్య=లాగి, ఇన్ద్రజితం ప్రతి=ఇంద్రజిత్తును గూర్చి, ససర్జ=విడచెను.

తా. వీరుడైన లక్ష్మణుడు ఇట్లు పలికి వంకర లేకుండా (ఋజువుగా) వెళ్లు ఆ బాణమును చెవివరకు లాగి, యుద్ధమునందు, ఇంద్రజిత్తుపై ప్రయోగించెను.

మూ. ఐన్ద్రాస్త్రేణ సమాయుజ్య లక్ష్మణః పరవీరహా, 73
తచ్ఛిరః సశిరస్త్రాణం శ్రీమజ్జ్వలితకుణ్డలమ్,
ప్రమథ్యేన్ద్రజితః కాయాత్పాతయామాస భూతలే. 74

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించు, లక్ష్మణః=లక్ష్మణుడు, ఐన్ద్రాస్త్రేణ=ఐంద్రాస్త్రముచేత, సమాయుజ్య=కూర్చి, సశిరస్త్రాణమ్=శిరః కవచముతో కూడిన, శ్రీమత్=శోభాయుక్తమైన, జ్వలితకుణ్డలమ్=ప్రకాశించుచున్న కుండలములు గల, తత్=ఆ, శిరః=శిరస్సును, ప్రమథ్య=ఛేదించి, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, కాయాత్=శరీరమునుండి, భూతలే=నేలమీద, పాతయామాస=పడగొట్టెను.

తా. శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు ఐంద్రాస్త్రమును ప్రయోగించి, శిరఃకవచముతో కూడిన, శోభాయుక్తమైన, ప్రకాశించుచున్న కుండలములు గల శిరస్సును ఇంద్రజిత్తు శరీరమునుండి ఖండించి నేలమీద పడవేసెను.73, 74

మూ. తద్రాక్షసతనూజస్య భిన్నస్కన్ధం శిరో మహత్,
తపనీయనిభం భూమౌ దదృశే రుధిరోక్షితమ్. 75

ప్ర. అ. భిన్నస్కన్ధమ్=ఖండించబడిన మొండెము గల, రుధిరోక్షితమ్=రక్తముచేత తడపబడిన, రాక్షసతనూజస్య=ఇంద్రజిత్తుయొక్క, మహత్=పెద్దదైన, తత్ శిరః=ఆ శిరస్సు, తపనీయనిభమ్=బంగారముతో సమానమై, భూమౌ=నేలమీద, దదృశే=చూడబడెను.

తా. మూపునుండి వేరుచేయబడిన పెద్దదైన ఆ ఇంద్రజిత్తు శిరస్సు రక్తముచేత తడపబడినదై నేలమీద సువర్ణమయము వలె కనబడెను. 75

మూ. హతః స నిపపాతాథ ధరణ్యాం రావణాత్మజః,
కవచీ సశిరస్త్రాణో విప్రవిద్ధశరాసనః. 76

ప్ర. అ. అథ=అటుపిమ్మట, కవచీ=కవచముకలవాడు, సశిరస్త్రాణః=శిరః కవచముతో కూడినవాడు, విప్రవిద్ధశరాసనః=దూరముగా విసిరివేయబడిన ధనస్సు కలవాడు అయిన, సః రావణాత్మజః=ఆ ఇంద్రజిత్తు, హతః=చంపబడినవాడై,

ధరణ్యామ్=నేలమీద, నిపపాత హ=పడిపోయెను.

తా. కవచమును, శిరోరక్షక మగు ఆచ్ఛాదనమును ధరించిన ఆ ఇంద్రజిత్తు చంపబడినవాడై, ధనస్సు దూరముగా పడిపోగా నేలపై కూలెను.76

మూ. చుక్రుశుస్తే తతః సర్వే వానరాః సవిభీషణాః,
హృష్యన్తో నిహతే తస్మిన్ దేవా వృత్రవధే యథా. 77

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సవిభీషణాః=విభీషణునితో కూడిన, తే=ఆ, సర్వే=సమస్తమైన, వానరాః=వానరులు, తస్మిన్=అతడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, వృత్రవధే=వృత్రాసురునివధయందు, దేవాః యథా=దేవతలు వలె, హృష్యన్తః=సంతోషించుచు, చుక్రుశుః=అరచిరి.

తా. అప్పుడు ఆ వానరులందరు, విభీషణుడూ కూడ ఆతడు చంపబడుటచే, వృత్రాసురుడు చంపబడినప్పుడు దేవతల వలె సంతోషించుచు ఆనందముతో అరచిరి. 77

మూ. అథాన్తరిక్షే భూతానామృషీణాం చ మహాత్మనామ్,
జజ్ఞేఽథ జయసంనాదో గన్ధర్వాప్సరసామపి. 78

ప్ర. అ. అథ=అటుపిమ్మట, అన్తరిక్షే=ఆకాశమునందు, భూతానామ్=భూతములయొక్క, మహాత్మనామ్=మహాత్ములైన, ఋషీణాం చ=ఋషులయొక్క, అథ=మరియు, గన్ధర్వాప్సరసాం చ=గంధర్వులయొక్క అప్సరసలయొక్క, జయసంనాదః=జయధ్వని, జజ్ఞే=పుట్టెను.

తా. పిమ్మట ఆకాశముపై ఉన్న మహాత్ములైన ఋషులు, గంధర్వులు, అప్సరసలు ఇతరభూతములు జయధ్వానములను చేసిరి. 78

మూ. పతితం తమభిజ్ఞాయ రాక్షసీ సా మహాచమూః,
వధ్యమానా దిశో భేజే హరిభిర్జితకాశిభిః. 79

ప్ర. అ. రాక్షసీ=రాక్షససంబంధమైన, సా=ఆ, మహాచమూః=గొప్పసేన, జితకాశిభిః=జయముచేత ప్రకాశించుచున్న, హరిభిః=వానరులచేత, వధ్యమానా=కొట్టబడుచు, తమ్=ఆతనిని, పతితమ్=పడిపోయిన వానినిగా, అభిజ్ఞాయ=గుర్తించి, దిశః=దిక్కులను, భేజే=పొందెను.

తా. ఆతడు పడిపోవుట చూచి ఆ రాక్షససేన జయముతో ప్రకాశించుచున్న వానరులచేత కొట్టబడుచున్నదై దిక్కులకు పోయెను. 79

మూ. వానరైర్వధ్యమానాస్తే శస్త్రానుత్సృజ్య రాక్షసాః,
లఙ్కామభిముఖాః సస్రుర్భ్రష్టసంజ్ఞాః ప్రధావితాః. 80

ప్ర. అ. తే రాక్షసాః=ఆ రాక్షసులు, వానరైః=వానరులచేత, వధ్యమానాః=చంపబడుచున్నవారై, శస్త్రాణి=ఆయుధములను, ఉత్సృజ్య=విడచి, భ్రష్టసంజ్ఞాః=నశించిన సంజ్ఞ గలవారై, ప్రధావితాః=పరుగెత్తుచున్నవారై, లఙ్కామ్ అభిముఖాః=లంకను గూర్చి అభిముఖులై, సస్రుః=వెళ్లిరి.

తా. ఆ వానరులు చంపివేయుచుండగా ఆ రాక్షసులు ఆయుధములు విడచి, సంజ్ఞ లేనివారై, పరుగెత్తుచు లంక వైపు వెళ్లిపోయిరి. 80

మూ. దుద్రువుర్బహుధా భీతా రాక్షసాః శతశో దిశః,
త్యక్త్వా ప్రహరణాన్ సర్వే పట్టిశాసిపరశ్వధాన్. 81

ప్ర. అ. భీతాః=భయపడిన, సర్వే రాక్షసాః=రాక్షసులందరూ, ప్రహరణాన్=ఆయుధములను, పట్టిశాసిపరశ్వధాన్=పట్టిసములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్ళను, త్యక్త్వా=విడచి, బహుధా=అనేకవిధములుగా, శతశః=వందలకొలది, దిశః=దిక్కులను గూర్చి, దుద్రువుః=పరుగెత్తిరి.

తా. భయపడిన ఆ రాక్షసులందరు వందలకొలది కలసి ఆయుధములను, పట్టిశములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్ళను విడచి దిక్కులు పట్టి పారిపోయిరి. 81

మూ. కేచిల్లఙ్కాం పరిత్రస్తాః ప్రవిష్టా వానరార్దితాః,
సముద్రే పతితాః కేచిత్ కేచిత్ పర్వతమాశ్రితాః. 82

ప్ర. అ. వానరార్దితాః=వానరులచేత పీడింపబడిన, కేచిత్=కొందరు, పరిత్రస్తాః=భయపడిన వారై, లఙ్కామ్=లంకను, ప్రవిష్టాః=ప్రవేశించిరి. కేచిత్=కొందరు, సముద్రే=సముద్రమునందు, పతితాః=పడిపోయిరి. కేచిత్=కొందరు, పర్వతమ్=పర్వతమును, ఆశ్రితాః=ఆశ్రయించిరి.

తా. వానరులచేత పీడింపబడి కొందరు భయపడినవారై లంకలో ప్రవేశించిరి. కొందరు సముద్రములో పడిపోయిరి. కొందరు పర్వతమును ఆశ్రయించిరి. 82

మూ. హతమిన్ద్రజితం దృష్ట్వా శయానం చ రణక్షితౌ,
రాక్షసానాం సహస్రేషు న కశ్చిత్ప్రత్యదృశ్యత. 83

ప్ర. అ. హతమ్=చంపబడిన, రణక్షితౌ=యుద్ధభూమియందు, శయానమ్=శయనించి ఉన్న, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, దృష్ట్వా=చూచి, రాక్షసా

నామ్=రాక్షసులయొక్క, సహస్రేషు=సహస్రములలో, కశ్చిత్=ఒక్కడును, న ప్రత్యదృశ్యత=చూడబడలేదు.

తా. ఇంద్రజిత్తు చంపబడి యుద్ధభూమిలో పడి ఉండుట చూడగానే వేలకొలది రాక్షసులలో ఒక్కడు కూడ కనబడకుండపోయెను. 83

మూ. యథాస్తంగత ఆదిత్యే నావతిష్ఠన్తి రశ్మయః,
తథా తస్మిన్నిపతితే రాక్షసాస్తే గతా దిశః. 84

ప్ర. అ. ఆదిత్యే=సూర్యుడు, అస్తం గతే=అస్తమించగా, రశ్మయః=కిరణములు, యథా=ఎట్లు, నావతిష్ఠన్తి=ఉండవో, తథా=అట్లే, తస్మిన్=అతడు, నిపతితే=పడినవాడగుచుండగా, తే రాక్షసాః=ఆ రాక్షసులు, దిశః=దిక్కులను గూర్చి, గతాః=వెళ్లిరి.

తా. సూర్యుడు అస్తమించగానే కిరణాలు నిలవ నట్లు ఇంద్రజిత్తు మరణించగానే ఆ రాక్షసులు దిక్కులు పట్టి పోయిరి. 84

మూ. శాన్తరశ్మిరివాదిత్యో నిర్వాణ ఇవ పావకః,
బభూవ స మహాబాహుర్వ్యపాస్తగతజీవితః. 85

ప్ర. అ. వ్యపాస్తగతజీవితః=జారవిడవబడిన అవయవములతో కూడి పోయిన జీవితము గల, మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః=అతడు, శాన్తరశ్మిః=శాంతించిన కిరణములు గల, ఆదిత్యః ఇవ=సూర్యుడు వలె, నిర్వాణః=ఆరిపోయిన, పావకః ఇవ=అగ్నివలె, బభూవ=ఆయెను.

తా. ప్రాణములు పోయి, అవయవములు జారవిడచి పడియున్న ఆ మహాబాహువైన ఇంద్రజిత్తు కిరణములు శాంతించిన సూర్యుడు వలె, ఆరిపోయిన అగ్నివలె ఉండెను. 85

మూ. ప్రశాన్తపీడాబహులో వినష్టారిః ప్రహర్షవాన్,
బభూవ లోకః పతితే రాక్షసేన్ద్రసుతే తదా. 86

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షసేన్ద్రసుతే=ఇంద్రజిత్తు, పతితే=పడిపోయినవాడగుచుండగా, లోకః=లోకము, వినష్టారిః=నశించిన శత్రువు కలదై, ప్రశాన్తపీడాబహులః=శాంతించిన అధికమైన పీడ గలదై, ప్రహర్షవాన్=సంతోషము గలది, బభూవ=ఆయెను.

తా. ఆ ఇంద్రజిత్తు మరణించగానే అప్పుడు లోక మంతా, శత్రువు నశించుటచే చాలవరకు పీడ తొలగిపోయి సంతోషించినది. 86

మూ. హర్షం చ శక్రో భగవాన్ సహ సర్వైర్మహర్షిభిః,
జగామ నిహతే తస్మిన్ రాక్షసే పాపకర్మణి. 87

ప్ర. అ. పాపకర్మణి=పాపకర్మలు గల, తస్మిన్ రాక్షసే=ఆ రాక్షసుడు, నిహతే=చంపబడిన వాడగుచుండగా, భగవాన్=భగవంతుడైన, శక్రః=దేవేంద్రుడు, సర్వైః=సమస్తమైన, మహర్షిభిః సహ=మహర్షులతో కూడ, హర్షమ్=సంతోషమును, జగామ=పొందెను.

తా. పాపాత్ముడైన ఆ రాక్షసుడు మరణించుటచే సకలమహర్షులు, భగవంతుడైన దేవేంద్రుడు సంతోషించిరి. 87

మూ. ఆకాశే చాపి దేవానాం శుశ్రువే దున్దుభిస్వనః,
నృత్యద్భిరప్సరోభిశ్చ గన్ధర్వైశ్చ మహాత్మభిః. 88

ప్ర. అ. ఆకాశే=ఆకాశమునందు, దేవానామ్=దేవతలయొక్క, దున్దుభిస్వనః=దుందుభిధ్వని, నృత్యద్భిః=నాట్యముచేయుచున్న, అప్సరోభిః=అప్సరఃస్త్రీలచేత, మహాత్మభిః=మహాత్ములైన, గన్ధర్వైశ్చ=గంధర్వులచేత చేయబడిన ధ్వని, శుశ్రువే=వినబడెను.

తా. ఆకాశమునందు దేవతల దుందుభిధ్వని, నాట్యముచేయుచున్న అప్సరసల నాట్యధ్వని, మహాత్ములైన గంధర్వుల గీతధ్వని వినబడెను. 88

మూ. వవర్షుః పుష్పవర్షాణి తదద్భుతమివాభవత్,
ప్రశశంసుర్హతే తస్మిన్ రాక్షసే క్రూరకర్మణి. 89

ప్ర. అ. క్రూరకర్మణి=క్రూరమైన కర్మగల, తస్మిన్ రాక్షసే=ఆ రాక్షసుడు, హతే=చంపబడినవాడగుచుండగా, పుష్పవర్షాణి=పుష్పవర్షములను, వవర్షుః=వర్షించిరి. ప్రశశంసుః=ప్రశంసించిరి. తత్=అది, అద్భుతమివ= ఆశ్చర్యకరముగా, అభవత్=ఆయెను.

తా. క్రూరమైన కర్మలు గల ఆ రాక్షసుడు చంపబడగానే దేవతలు స్తుతించుచు పుష్పవర్షములు కురిపించిరి. అది ఆశ్చర్యకరముగా ఉండెను. 89

మూ. శుద్ధా ఆపో నభశ్చైవ జహృషుర్దేవదానవాః,
ఆజగ్ముః పతితే తస్మిన్ సర్వలోకభయావహే. 90

ప్ర. అ. సర్వలోకభయావహే=సకలలోకములకు భయము కలిగించు, తస్మిన్=అతడు, పతితే=పడిపోయినవాడగుచుండగా, ఆపః=ఉదకములు, నభశ్చైవ=ఆకాశము కూడ, శుద్ధాః=నిర్మలములైనవి. దేవదానవాః=దేవతలు దానవులు, జహృషుః=సంతోషించిరి. ఆజగ్ముః=అక్కడికి వచ్చిరి.

తా. సకలలోకములకు భయమును కలిగించిన ఆ ఇంద్రజిత్తు పడిపోయిన వెంటనే ఉదకములు, ఆకాశము కూడ నిర్మలములయ్యెను. దేవతలు, దానవులు సంతోషించి అక్కడికి వచ్చిరి. 90

మూ. ఊచుశ్చ సహితాస్తుష్టా దేవగన్ధర్వదానవాః,
విజ్వరాః శాన్తకలుషా బ్రాహ్మణా విచరన్త్వితి. 91

ప్ర. అ. దేవగన్ధర్వదానవాః=దేవతలు, గంధర్వులు, దానవులు, తుష్టాః=సంతోషించినవారై, సహితాః=కలిసినవారై, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, శాన్తకలుషాః=శాంతించిన దుఃఖము కలవారై, విజ్వరాః=భయము లేనివారై, విచరన్తు=సంచరించెదరు గాక, ఇతి=అని, ఊచుశ్చ=పలికిరి కూడ.

తా. సంతోషించిన దేవగంధర్వదానవులు కలిసి "బ్రాహ్మణులు ఎట్టి భయము ఆపదలు లేనివారై సంచరించెదరుగాక" అని పలికిరి. 91

మూ. తతోఽభ్యనన్దన్ సంహృష్టాస్సమరే హరియూథపాః,
తమప్రతిబలం దృష్ట్వా హతం నైరృతపుంగవమ్. 92

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సమరే=యుద్ధమునందు, హతమ్=చంపబడిన, అప్రతిబలమ్=ఎదిరించు బలము లేని, తమ్=ఆ, నైరృతపుంగవమ్=రాక్షసశ్రేష్ఠుణ్ణి, దృష్ట్వా=చూచి, హరియూథపాః=వానరసేనానాయకులు, సంహృష్టాః=సంతోషించినవారై, అభ్యనన్దన్=అభినందించిరి.

తా. ఎదిరించు బలము లేని ఆ రాక్షసశ్రేష్ఠుడు యుద్ధములో చంపబడుట చూచి వానరసేనానాయకులు సంతోషించి లక్ష్మణుణ్ణి అభినందించిరి. 92

మూ. విభీషణో హనూమాంశ్చ జామ్బవాంశ్చర్క్షయూథపః,
విజయేనాభినన్దన్తస్తుష్టువుశ్చాపి లక్ష్మణమ్. 93

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, హనూమాంశ్చ=హనుమంతుడు, ఋక్షయూథపః=భల్లూకసేనానాయకుడైన, జామ్బవాన్ చ=జాంబవంతుడు, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, విజయేన=విజయముచేత, అభినన్దన్తః=అభినందించుచున్నవారై, తుష్టువుః చ అపి=స్తుతించిరి కూడ.

తా. విభీషణుడు, హనుమంతుడు, భల్లూకప్రభువైన జాంబవంతుడు లక్ష్మణుణ్ణి జయము పొందినందుకు అభినందించుచు స్తుతించిరి. 93

మూ. క్ష్వేడన్తశ్చ ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవంగమాః,
లబ్ధలక్షా రఘుసుతం పరివార్యోపతస్థిరే. 94

ప్ర. అ. లబ్ధలక్షాః=పొందబడిన లక్ష్యము గల, ప్లవంగమాః=వానరులు,

క్ష్వేదన్తశ్చ=సింహనాదములు చేయుచు, ప్లవన్తశ్చ=గంతులువేయుచు, గర్జన్తశ్చ=గర్జించుచు, రఘుసుతమ్=లక్ష్మణుణ్ణి, పరివార్య=చుట్టి, ఉపతస్థిరే=సమీపించిరి.

తా. తమ లక్ష్యమును సాధించిన వానరులు సింహనాదములు చేయుచు, ఎగురుచు, గర్జించుచు లక్ష్మణుని చుట్టూ చేరి నిలచిరి. 94

మూ. లాంగూలాని ప్రవిధ్యన్తః స్ఫోటయన్తశ్చ వానరాః,
లక్ష్మణో జయతీత్యేవం వాక్యం విశ్రావయంస్తదా. 95

ప్ర. అ. తదా=అప్పుడు, వానరాః=వానరులు, లాంగూలాని=తోకలను, ప్రవిధ్యన్తః=ఎత్తికొట్టుచు, స్ఫోటయన్తః చ=జబ్బలు చరచుచు, లక్ష్మణః జయతి=లక్ష్మణుడు జయించుచున్నాడు, ఇత్యేవమ్=ఇట్లు, వాక్యమ్=వాక్యమును, విశ్రావయన్=వినిపించిరి.

తా. అప్పుడు వానరులు తోకలు గట్టిగా కదుపుచు, జబ్బలు చరచుచు "లక్ష్మణుడు జయించుచున్నాడు" అను వాక్యమును పలికిరి. 95

మూ. అన్యోన్యం చ సమాశ్లిష్య హరయో హృష్టమానసాః,
చక్రురుచ్చావచగుణా రాఘవాశ్రయసత్కథాః. 96

ప్ర. అ. హరయః=వానరులు, హృష్టమానసాః=సంతోషించిన మనస్సు గలవారై, అన్యోన్యమ్=పరస్పరము, సమాశ్లిష్య=కౌగిలించుకొని, ఉచ్చావచగుణాః=వివిధములైన గుణములు గల, రాఘవాశ్రయసత్కథాః=లక్ష్మణునకు సంబంధించిన ఉత్తమకథలను, చక్రుః=చేసిరి.

తా. వానరులు సంతోషించిన మనస్సు గలవారై పరస్పరము కౌగలించుకొని వివిధ గుణములు గల లక్ష్మణునకు సంబంధించిన ఉత్తమకథలను చెప్పుకొనిరి.

మూ. తదసుకరమథాభివీక్ష్య హృష్టాః
ప్రియసుహృదో యుధి లక్ష్మణస్య కర్మ,
పరమముపలభన్ మనఃప్రహర్షం
వినిహతమిన్ద్రరిపుం నిశమ్య దేవాః. 97

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే నవతితమః సర్గః.

ప్ర. అ. దేవాః=దేవతలు, ఇన్ద్రరిపుమ్=ఇంద్రజిత్తును, వినిహతమ్=చంపబడినవానినిగా, నిశమ్య=విని, అథ=అటుపిమ్మట, ప్రియసుహృదః=ప్రియమిత్రుడైన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, తత్=ఆ, అసుకరమ్=చేయుటకు శక్యముకాని, కర్మ=కర్మను, యుధి=యుద్ధమునందు, అభివీక్ష్య=చూచి, హృష్టాః=సంతోషించినవారై,

పరమమ్=గొప్ప, మనఃప్రహర్షమ్=మనస్సుయొక్క ఆనందమును, ఉపలభన్=పొందిరి.

తా. దేవతలు ఇంద్రజిత్తు చంపబడినాడని విని, తమ ప్రియమిత్రుడైన లక్ష్మణుడు చేసిన, ఎవరూ యుద్ధములో చేయజాలని ఆ పనిని చూచి, మనస్సులో గొప్ప ఆనందమును పొందిరి. 97

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదవసర్గ సమాప్తము.

# అథ ఏకనవతితమః సర్గః

[లక్ష్మణవిభీషణాదులు రామునివద్దకు వచ్చి ఇంద్రజిద్వధవృత్తాంతము తెలుపుట, రాముడు సంతోషించి లక్ష్మణుని కౌగిలించుకొనుట, సుషేణుడు లక్ష్మణాదులకు చికిత్స చేయుట.]

మూ. రుధిరక్లిన్నగాత్రస్తు లక్ష్మణః శుభలక్షణః,
బభూవ హృష్టస్తం హత్వా శక్రజేతారమాహవే. 1

ప్ర. అ. రుధిరక్లిన్నగాత్రః=రక్తముచేత తడిసిన శరీరము గల, శుభలక్షణః=మంగళకరములైన లక్షణములు గల, లక్ష్మణః=లక్ష్మణుడు, ఆహవే=యుద్ధమునందు, తమ్=ఆ, శక్రజేతారమ్=ఇంద్రజిత్తును, హత్వా=చంపి, హృష్టః=సంతోషించినవాడుగా, బభూవ=ఆయెను.

తా. రక్తముచేత తడిసిన శరీరము గల శుభలక్షణవంతుడైన లక్ష్మణుడు యుద్ధమునందు ఆ ఇంద్రజిత్తును సంహరించి సంతోషము పొందెను. 1

మూ. తతః స జామ్బవన్తం చ హనూమన్తం చ వీర్యవాన్,
సంనిపత్య మహాతేజాస్తాంశ్చ సర్వాన్ వనౌకసః. 2
ఆజగామ తతః శీఘ్రం యత్ర సుగ్రీవరాఘవౌ,
విభీషణమవష్టభ్య హనూమన్తం చ లక్ష్మణః. 3

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, హనూమన్తంచ=హనుమంతుణ్ణి, సర్వాన్=సమస్తమైన, తాన్=ఆ, వనౌకసః చ=వానరులను, సంనిపత్య=నమస్కరించి, తతః=అచటినుండి, విభీషణమ్=విభీషణుణ్ణి, హనూమన్తం చ=హనుమంతుణ్ణి, అవష్టభ్య=ఆనుకొని, సుగ్రీవరాఘవౌ=సుగ్రీవరాములు, యత్ర=ఎక్కడ ఉన్నారో అక్కడికి, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆజగామ=వచ్చెను.

తా. పరాక్రమవంతుడు, మహాతేజఃశాలీ అయిన లక్ష్మణుడు జాంబవంతునకు హనుమంతునకు ఆ వానరులందరికి నమస్కరించి, విభీషణ - హనుమంతులమీద ఊతకై ఆనుకుని రామసుగ్రీవులున్న చోటికి వచ్చెను.

వి. "సంనివర్త్య మహాతేజాః సహ సర్వైః ప్లవంగమైః" అను ప్రాచ్యపాఠము బాగున్నది". "జాంబవదాదులను వెనుకకు మరల్చి" అని అర్థము.2, 3,

మూ. తతో రామమభిక్రమ్య సౌమిత్రిరభివాద్య చ,
తస్థౌ భ్రాతృసమీపస్థః శక్రస్యేన్ద్రానుజో యథా. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, రామమ్=రాముణ్ణి, అభిక్రమ్య=సమీపించి, అభివాద్య చ=నమస్కరించి, శక్రస్య=దేవేంద్రుని సమీపమునందు, అనుజో యథా=ఆతని తమ్ముడైన ఉపేంద్రుడు వలె, భ్రాతృసమీపస్థః=సోదరుని సమీపమునందున్నవాడై, తస్థౌ=నిలచెను.

తా. పిమ్మట లక్ష్మణుడు రాముణ్ణి సమీపించి అభివాదనము చేసి దేవేంద్రుని సమీపమునందు ఉపేంద్రుడు వలె ఆ సోదరుని సమీపమునందు నిలచెను. 4

మూ. నిష్టనన్నివ చాగత్య రాఘవాయ మహాత్మనే,
ఆచచక్షే తదా వీరో ఘోరమిన్ద్రజితో వధమ్. 5

ప్ర. అ. తదా=అప్పుడు, వీరః=వీరుడైన లక్ష్మణుడు, ఆగత్య=వచ్చి, మహాత్మనే=మహాత్ముడైన, రాఘవాయ=రామునకు, నిష్టనన్నివ=గొణుగుచున్నవాడు వలె, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, ఘోరమ్=ఘోరమైన, వధమ్=వధను గూర్చి, ఆచచక్షే=చెప్పెను.

తా. అప్పుడు వీరుడైన లక్ష్మణుడు మహాత్ముడైన రాముణ్ణి సమీపించి, అలసి ఉండుటచే అస్పష్టమైన వాక్కుతో గొణుగుచున్నట్లు ఆతనికి ఘోరమైన ఇంద్రజిత్సంహారమును గూర్చి చెప్పెను. 5

మూ. రావణేస్తు శిరశ్ఛిన్నం లక్ష్మణేన మహాత్మనా,
న్యవేదయత రామాయ తదా హృష్టో విభీషణః. 6

ప్ర. అ. తదా=అప్పుడు, విభీషణః=విభీషణుడు, హృష్టః=సంతోషించినవాడై, మహాత్మనా=మహాత్ముడైన, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, రావణేః=ఇంద్రజిత్తుయొక్క, శిరః=శిరస్సును, ఛిన్నమ్=ఛేదించబడినదానినిగా, రామాయ=రామునకు, న్యవేదయత=తెలిపెను.

తా. అప్పుడు విభీషణుడు సంతోషించుచు "మహాత్ముడైన లక్ష్మణునిచేత ఇంద్రజిత్తు శిరస్సు ఛేదించబడినది" అని రామునకు తెలిపెను.(లక్ష్మణుడు వినయముచేత అస్పష్టముగా చెప్పిన విషయమును విభీషణుడు స్పష్టముగా చెప్పెనని భావము.) 6

మూ. శ్రుత్వైవ తు మహావీర్యో లక్ష్మణేనేన్ద్రజిద్వధమ్,
ప్రహర్షమతులం లేభే వాక్యం చేదమువాచ హ. 7

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల రాముడు, లక్ష్మణేన=ల క్ష్మణునిచేత, ఇన్ద్రజిద్వధమ్=ఇంద్రజిత్తుయొక్క వధను, శ్రుత్వైవ తు=వినగానే, అతులమ్=సాటిలేని, ప్రహర్షమ్=సంతోషమును, లేభే=పొందెను. ఇదమ్=ఈ, వాక్యం చ=వాక్యమును కూడ, ఉవాచ హ=పలికెను.

తా. గొప్ప పరాక్రమము గల రాముడు, లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించి నట్లు విని చాలా సంతోషించెను. ఈ వాక్యమును కూడ పలికెను. 7

మూ. సాధు లక్ష్మణ తుష్టోఽస్మి కర్మ చాసుకరం కృతమ్,
రావణేర్హి వినాశేన జితమిత్యుపధారయ. 8

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! సాధు=బాగున్నది. తుష్టః=సంతోషించినవా డను, అస్మి=అయితిని. అసుకరమ్=సులభముగా చేయ శక్యము కాని, కర్మ=పని, కృతమ్=చేయబడినది. రావణేః=ఇంద్రజిత్తుయొక్క, వినాశేన=సంహారముచేత, జితమ్ ఇతి=జయము పొందబడినది అని, ఉపధారయ=నిర్ణయించుము.

తా. లక్ష్మణా! బాగున్నది; సంతోషించినాను. సులభముగా చేయ శక్యము కాని పని చేసినావు. ఇంద్రజిత్తు మరణించినాడు గాన ఇక మనకు జయము లభించిన దని నిశ్చయించుకొనుము. 8

మూ. స తం శిరస్యుపాఘ్రాయ లక్ష్మణం కీర్తివర్ధనమ్,
లజ్జమానం బలాత్స్నేహాదఙ్కమారోప్య వీర్యవాన్, 9
ఉపవేశ్య తముత్సఙ్గే పరిష్వజ్యావపీడితమ్,
భ్రాతరం లక్ష్మణం స్నిగ్ధం పునః పునరుదైక్షత. 10

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=ఆ రాముడు, కీర్తివర్ధనమ్= కీర్తిని వృద్ధి పొందించు, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుణ్ణి, శిరసి=శిరస్సుమీద, ఉపాఘ్రాయ=వాసనచూచి, లజ్జమానమ్=సిగ్గుపడుచున్న ఆతనిని, స్నేహాత్=స్నే హమువలన, బలాత్=బలాత్కారముగా, అఙ్కమ్=తొడను, ఆరోప్య=అధిష్ఠింపజేసి, భ్రాతరమ్=సోదరుడైన, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుణ్ణి, ఉత్సఙ్గే=ఒడిలో, ఉపవేశ్య= కూర్చుండబెట్టుకొని, అవపీడతమ్=పీడించునట్లుగా, పరిష్వజ్య=కౌగలించుకొని, స్నిగ్ధమ్=స్నేహపూర్వకముగా, పునః పునః=మాటిమాటికి, ఉదైక్షత=చూచెను.

తా. పరాక్రమవంతుడైన ఆ రాముడు కీర్తిని వృద్ధిపొందించు లక్ష్మ ణుణ్ణి శిరస్సుపై మూర్కొని, ఆతడు సిగ్గుపడుచున్నను స్నేహపూర్వకముగా బలాత్కారముగా, తన తొడపై కూర్చుండపెట్టుకొనెను. ఆ విధముగా సోదరుడైన లక్ష్మణుణ్ణి ఒడిలో కూర్చుండబెట్టుకొని, గాఢముగా కౌగలించుకొని, స్నేహపూర్వకముగా మాటిమాటికి ఆతనినే చూచెను. 9, 10.

మూ. శల్యసంపీడితం శస్తం నిఃశ్వసన్తం తు లక్ష్మణమ్,
రామస్తు దుఃఖసంతప్తం తం తు నిఃశ్వాసపీడితమ్, 11
మూర్ధ్ని చైనముపాఘ్రాయ భూయః సంస్పృశ్య చ త్వరన్,
ఉవాచ లక్ష్మణం వాక్యమాశ్వాస్య పురుషర్షభః. 12

ప్ర. అ. పురుషర్షభః=పురుషశ్రేష్ఠుడైన, రామః=రాముడు, శల్యసంపీడితమ్=శల్యములచేత పీడింపబడిన, శస్తమ్=శత్రువుచేత బాధింపబడిన, నిఃశ్వసన్తమ్=నిట్టూర్చుచున్న, లక్ష్మణమ్=మంచి లక్షణములు గల, దుఃఖసంతప్తమ్=బాధచేత పీడితుడైన, నిఃశ్వాసపీడితమ్=నిట్టూర్పులచే పీడించబడిన, తమ్=ఆ, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, మూర్ధ్ని=శిరస్సునందు, ఉపాఘ్రాయ=వాసనచూచి, ఏనమ్=ఇతనిని, భూయః=మరల, సంస్పృశ్య చ=స్పృశించి, ఆశ్వాస్య=ఊరడించి, త్వరన్=తొందరపడుచు, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. శత్రువుచే హింసింపబడిన ఆ లక్ష్మణుడు శల్యములచేత పీడింపబడి నిట్టూర్చుచుండెను. నొప్పులచేత బాధపడుచూ, తీవ్రముగా వగర్చుచుండెను. అట్టి ఆ లక్ష్మణుణ్ణి, పురుషశ్రేష్ఠుడైన రాముడు శిరస్సుపై మూర్కొని మాటిమాటికీ అతని శరీరమును తడవుచూ ఓదార్చి తొందరపడుచు ఇట్లు పలికెను. 11, 12

మూ. కృతం పరమకళ్యాణం కర్మ దుష్కరకర్మణా,
అద్య మన్యే హతే పుత్రే రావణం నిహతం యుధి. 13

ప్ర. అ. దుష్కరకర్మణా=చేయ శక్యముకాని కర్మ గల నీచేత, పరమకళ్యాణమ్=మిక్కిలి మంగళప్రదమైన, కర్మ=పని, కృతమ్=చేయుబడినది. అద్య=ఇప్పుడు, పుత్రే=పుత్రుడు, హతే=చంపబడినవాడగుచుండగా, యుధి=యుద్ధమునందు, రావణమ్=రావణుణ్ణి, నిహతమ్=చంపబడినవానినిగా, మన్యే=తలచుచున్నారు.

తా. ఎవ్వరూ చేయజాలని పని చేయగలిగిన నీవు చాల మంగళకరమైన పని చేసినావు. ఇప్పుడు పుత్రుడు చంపబడుటచేత యుద్ధములో రావణుడు చంపబడినట్లే అని తలచుచున్నాను. 13

మూ. అద్యాహం విజయీ శత్రౌ హతే తస్మిన్ దురాత్మని,
రావణస్య నృశంసస్య దిష్ట్యా వీర త్వయా రణే, 14
ఛిన్నో హి దక్షిణో బాహుః స హి తస్య వ్యపాశ్రయః.
విభీషణహనూమద్భ్యాం కృతం కర్మ మహద్రణే. 15

ప్ర. అ. దురాత్మని=దురాత్ముడైన, తస్మిన్=ఆ, శత్రౌ=శత్రువు, హతే=చంపబడినవాడగుచుండగా, అద్య=ఇప్పుడు, అహమ్=నేను, విజయీ=విజయవంతుడను.

వీర=ఓ! వీరుడా! రణే=యుద్ధమునందు, త్వయా=నీచేత, దిష్ట్యా=అదృష్టవశముచేత, నృశంసస్య=క్రూరుడైన, రావణస్య=రావణునియొక్క, దక్షిణః=కుడిదైన, బాహుః=బాహువు, ఛిన్నో హి=నరికివేయబడినదిగదా! సః=అతడు, తస్య=వానికి, వ్యపాశ్రయః హి=ఆశ్రయము కదా. రణే=యుద్ధమునందు, విభీషణహనూమద్భ్యామ్=విభీషణ, హనుమంతులచేత, మహత్=గొప్పదైన, కర్మ=పని, కృతమ్=చేయబడినది.

తా. దురాత్ముడైన ఆ శత్రువు ఈ నాడు చంపబడుటచే నేను విజయవంతుడను అయినాను. వీరుడవైన లక్ష్మణా! నీవు యుద్ధములో క్రూరుడైన రావణుని కుడి బాహువును అదృష్టవశముచే నరికివేసినావు. ఆ రావణునకు ఇంద్రజిత్తే ప్రధానమైన ఆశ్రయము కదా! విభీషణుడూ, హనుమంతుడూ కూడ యుద్ధములో గొప్ప పని చేసినారు. 14, 15,

మూ. అహోరాత్రైస్త్రిభిర్వీరః కథంచిద్వినిపాతితః,
నిరమిత్రః కృతోఽస్మ్యద్య నిర్యాస్యతి హి రావణః, 16
బలవ్యూహేన మహతా శ్రుత్వా పుత్త్రం నిపాతితమ్.

ప్ర. అ. వీరః=వీరుడైన ఇంద్రజిత్తు, త్రిభిః=మూడు, అహోరాత్రైః=అహోరాత్రములచేత, కథంచిత్=ఎట్లో, వినిపాతితః=పడగొట్టబడినాడు. అద్య=ఇప్పుడు, నిరమిత్రః=శత్రువులు లేనివాడనుగా, కృతః అస్మి=చేయబడితిని. రావణః=రావణుడు, పుత్రమ్=పుత్రుణ్ణి, నిపాతితమ్=పడగొట్టబడినవానినిగా, శ్రుత్వా=విని, మహతా=గొప్ప, బలవ్యూహేన=సేనావ్యూహముతో, నిర్యాస్యతి హి=బయలుదేరివచ్చును గదా?

తా. వీరుడైన ఆ ఇంద్రజిత్తును మూడు అహోరాత్రములు పోరాడి, ఎట్లో చంపివేసినావు. ఇప్పుడు నాకు శత్రువులు లేకుండా చేసినావు. ఎందుచేత ననగా కుమారుడు చంపబడినట్లు విని రావణుడు పెద్ద సైన్యముతో బయలుదేరి రాగలడు. 16

మూ. తం పుత్రవధసన్తప్తం నిర్యాన్తం రాక్షసాధిపమ్, 17
బలేనావృత్య మహతా నిహనిష్యామి దుర్జయమ్.

ప్ర. అ. పుత్రవధసన్తప్తమ్=పుత్రుని వధచేత దుఃఖితుడైన, నిర్యాన్తమ్=బయలుదేరి వచ్చుచున్న, దుర్జయమ్=జయింప శక్యముకాని, తం రాక్షసాధిపమ్=ఆ రావణుణ్ణి, మహతా=గొప్పదైన, బలేన=బలముచేత, ఆవృత్య=కప్పివేసి, నిహనిష్యామి=చంపెదను.

తా. పుత్రవధచేత పీడితుడై బయలుదేరి వచ్చుచున్న జయింపశక్యము కాని ఆ రావణుణ్ణి గొప్ప బలముచేత అడ్డగించి చంపివేసెదను. 17

మూ. త్వయా లక్ష్మణ నాథేన సీతా చ పృథివీ చ మే, 18
న దుష్ప్రాపా హతే తస్మిన్ శక్రజేతరి చాహవే.

ప్ర. అ. లక్ష్మణ=ఓ! లక్ష్మణా! నాథేన=రక్షకుడవైన, త్వయా=నీచేత, ఆహవే=యుద్ధమునందు, తస్మిన్=ఆ, శక్రజేతరి=ఇంద్రజిత్తు, హతే=చంపబడిన వాడగుచుండగా, మే=నాకు, సీతా చ=సీతయు, పృథివీ చ=ఈ భూమి, దుష్ప్రాపా=పొంద శక్యముగానిది, న=కాదు.

తా. లక్ష్మణా! నా సంరక్షకుడవైన నీవు యుద్ధములో ఆ ఇంద్రజిత్తును చంపివేసినావు. అందుచే నాకు సీత గాని, ఈ భూమండలము కాని పొంద శక్యముకానిది కాదు. 18

మూ. స తం భ్రాతరమాశ్వాస్య పరిష్వజ్య చ రాఘవః, 19
రామః సుషేణం ముదితః సమాభాష్యేదమబ్రవీత్.

ప్ర. అ. రాఘవః=రఘువంశ సంజాతుడైన, సః రామః=ఆ రాముడు, తం భ్రాతరమ్=ఆ సోదరుణ్ణి, ఆశ్వాస్య=ఓదార్చి, పరిష్వజ్య చ=కౌగిలించుకొని. ముదితః=సంతోషించుచున్నవాడై, సుషేణమ్=సుషేణుణ్ణి, సమాభాష్య=పిలచి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ రాముడు లక్ష్మణుణ్ణి ఈ విధముగా ఓదార్చి, కౌగిలించుకొని, సంతోషించుచు, సుషేణుణ్ణి పిలిచి ఇట్లు పలికెను. 19

మూ. సశల్యోఽయం మహాప్రాజ్ఞః సౌమిత్రిర్మిత్రవత్సలః, 20
యథా భవతి సుస్వస్థస్తథా త్వం సముపాచర.

ప్ర. అ. మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధిమంతుడైన, మిత్రవత్సలః=మిత్రులయందు ప్రేమ గల, సశల్యః=శల్యములతో కూడిన, అయం సౌమిత్రిః=ఈ లక్ష్మణుడు, సుస్వస్థః=బాగా స్వస్థుడుగా, యథా=ఎట్లు, భవతి=అగునో, తథా=అట్లు, త్వమ్=నీవు, సముపాచర=ఉపచారము చేయుము.

తా. గొప్ప బుద్ధిమంతుడూ, మిత్రులయందు ప్రేమ కలవాడూ అయిన ఈ లక్ష్మణుడు శరీరమంతా శల్యములతో నిండి ఉన్నాడు. ఇతడు పూర్తిగా స్వస్థ డగునట్లు చికిత్స చేయుము. 20

మూ. విశల్యః క్రియతాం క్షిప్రం సౌమిత్రిః సవిభీషణః, 21
ఋక్షవానరసైన్యానాం శూరాణాం ద్రుమయోధినామ్,
యే చాప్యన్యేఽత్ర యుధ్యన్తి సశల్యా వ్రణినస్తథా, 22
తేఽపి సర్వే ప్రయత్నేన క్రియన్తాం సుఖినస్తథా.

ప్ర. అ. సవిభీషణః=విభీషణునితో కూడిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, విశల్యః=శల్యములు లేనివాడుగా, క్రియతామ్=చేయబడుగాక. ఋక్షవానరసైన్యానామ్=భల్లూక - వానరసైన్యములయొక్క, ద్రుమయోధినామ్=వృక్షములతో యుద్ధము చేయు, శూరాణామ్=శూరులలో, యే చ=ఏ, అన్యే=ఇతరులు, అత్ర=ఇక్కడ, యుధ్యన్తి=యుద్ధము చేసినారో, సశల్యాః=శల్యములతో కూడిన వారో, తథా=మరియు, వ్రణినః=వ్రణములు కలవారో, తే సర్వేఽపి=వారందరూ కూడ, తథా=అట్లే, ప్రయత్నేన=ప్రయత్నముచేత, సుఖినః=సుఖవంతులుగా, క్రియన్తామ్=చేయబడుదురుగాక.

తా. వెంటనే లక్ష్మణునికీ విభీషణునికీ కూడ శల్యము లన్నీ తొలిగించుము. భల్లూకసైన్యములకూ, వానరసైన్యములకూ చెందిన, వృక్షములతో యుద్ధము చేయు శూరులలో ఎవరు యుద్ధము చేసినారో, శల్యములు గుచ్చుకొని ఉన్నారో, గాయపడి ఉన్నారో వారందరికీ కూడ ప్రయత్నపూర్వకముగా చికిత్స చేసి, వారిని సుఖవంతులను చేయుము. 21, 22

మూ. ఏవముక్తస్స రామేణ మహాత్మా హరియూథపః, 23
లక్ష్మణాయ దదౌ నస్తః సుషేణః పరమౌషధమ్.

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, మహాత్మా=మహాత్ముడైన, హరియూథపః=వానరసేనానాయకుడైన, సః సుషేణః=ఆ సుషేణుడు, లక్ష్మణాయ=లక్ష్మణుని కొరకు, నస్తః=నాసికనుండి, పరమౌషధమ్=గొప్ప ఔషధమును దదౌ=ఇచ్చెను.

తా. మహాత్ముడూ, వానరసేనానాయకుడూ ఐన ఆ సుషేణుడు రాముని ఆజ్ఞ ప్రకారము లక్ష్మణునకు నాసిక ద్వారా ఉత్తమమైన ఔషధమును ఇచ్చెను. 23

మూ. స తస్య గంధమాఘ్రాయ విశల్యః సమపద్యత, 24
తదా నిర్వేదనశ్చైవ సంరూఢవ్రణ ఏవ చ.

ప్ర. అ. సః=లక్ష్మణుడు, తదా=అప్పుడు, తస్య=ఆ ఔషధముయొక్క, గంధమ్=వాసనను, ఆఘ్రాయ= వాసనచూచి, విశల్యః=శల్యములు లేనివాడుగానూ, నిర్వేదనశ్చైవ=బాధ లేనివాడుగానూ, సంరూఢవ్రణ ఏవ చ= మానిపోయిన గాయములు కలవాడుగానూ, సమపద్యత=అయ్యెను.

తా. ఆ ఔషధమును వాసనచూడగానే లక్ష్మణుని శరీరములోని శల్యము లన్నీ తొలగిపోయెను. బాధ తగ్గెను. గాయములు మానిపోయెను. 24

మూ. విభీషణముఖానాం చ సుహృదాం రాఘవాజ్ఞయా, 25
సర్వవానరముఖ్యానాం చికిత్సామకరోత్తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, రాఘవాజ్ఞయా=రాముని ఆజ్ఞచేత, విభీషణముఖానామ్=విభీషణుడు మొదలైన, సుహృదామ్=స్నేహితులయొక్క, సర్వవానరముఖ్యానామ్=సమస్తవానరనాయకులయొక్క, చికిత్సామ్=చికిత్సను, అకరోత్=చేసెను.

తా. అప్పుడు రాముని ఆజ్ఞచేత అతడు విభీషణుడు మొదలైన స్నేహితులకూ, సమస్త వానరనాయకులకూ చికిత్స చేసెను. 25

మూ. తతః ప్రకృతిమాపన్నో హృతశల్యో గతక్లమః, 26
సౌమిత్రిర్ముముదే తత్ర క్షణేన విగతజ్వరః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సౌమిత్రిః=లక్ష్మణుడు, హృతశల్యః=హరింపబడిన శల్యములు గలవాడై, గతక్లమః=పోయిన అలసట కలవాడై, విగతజ్వరః=తొలగిన బాధ కలవాడై, క్షణేన=క్షణకాలముచేత, ప్రకృతిమ్=స్వాస్థ్యమును, ఆపన్నః=పొందినవాడై, తత్ర=అక్కడ, ముముదే=సంతోషించెను.

తా. పిమ్మట లక్ష్మణుడు శల్యములు తొలగిపోయి, అలసట తగ్గి, బాధ ఉపశమించుటచే క్షణకాలములో స్వాస్థ్యమును పొంది సంతోషముతో ఉండెను.

మూ. తదైవ రామః ప్లవగాధిపస్తథా
విభీషణశ్చర్క్షపతిశ్చ వీర్యవాన్,
అవేక్ష్య సౌమిత్రిమరోగముత్థితం
ముదా ససైన్యాః సుచిరం జహర్షిరే. 27

ప్ర. అ. తదైవ=అప్పుడు, రామః=రాముడు, తథా=మరియు, ప్లవగాధిపః=సుగ్రీవుడూ, విభీషణశ్చ=విభీషణుడూ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, ఋక్షపతిశ్చ=జాంబవంతుడూ, ససైన్యాః=సైన్యములతో కూడినవారై, అరోగమ్=రోగము లేకుండగా, ఉత్థితమ్=లేచిన, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, అవేక్ష్య=చూచి, సుచిరమ్=చాలా కాలము, జహర్షిరే=సంతోషించిరి.

తా. అప్పుడు రోగము లేకుండగా లేచిన లక్ష్మణుణ్ణి చూచి రాముడు, సుగ్రీవుడు, విభీషణుడు, పరాక్రమవంతుడైన జాంబవంతుడూ అందరు సైనికులూ కూడా చాలసేపు సంతోషించిరి. 27

మూ. అపూజయత్ కర్మ స లక్ష్మణస్య
సుదుష్కరం దాశరథిర్మహాత్మా,

బభూవ హృష్టో యుధి వానరేన్ద్రో
నిశమ్య తం శక్రజితం నిపాతితమ్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకనవతితమః సర్గః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, సః దాశరథిః=ఆ రాముడు, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, సుదుష్కరమ్=చేయుటకు చాలకష్టమైన, కర్మ=పనిని, అపూజయత్=కొనియాడెను. వానరేన్ద్రః=సుగ్రీవుడు, తం శక్రజితమ్=ఆ ఇంద్రజిత్తును, యుధి=యుద్ధమునందు, నిపాతితమ్=పడగొట్టబడినవానినిగా, నిశమ్య=విని, హృష్టః=సంతోషించినవాడు, బభూవ=ఆయెను.

తా. రాముడు, లక్ష్మణుడు చేసిన ఆ చాల కష్టమైన పనిని కొనియాడెను. యుద్ధరంగములో ఇంద్రజిత్తు చంపబడినాడని విని సుగ్రీవుడు సంతోషించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదిఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వినవతితమః సర్గః

*[రావణుడు శోకించుట, సుపార్శ్వుడు ఓదార్చుటచే అతడు సీతను చంపుటనుండి విరమించుట]*

మూ. తతః పౌలస్త్యసచివాః శ్రుత్వా చేన్ద్రజితో వధమ్,
ఆచచక్షురభిజ్ఞాయ దశగ్రీవాయ సత్వరాః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పౌలస్త్యసచివాః=రావణుని మంత్రులు, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, వధమ్=వధను, శ్రుత్వా=విని, సత్వరాః=తొందరతో కూడినవారై, అభిజ్ఞాయ=(ఆ విషయమును నిశ్చయపూర్వకముగా) తెలిసికొని, దశగ్రీవాయ=రావణునకు, ఆచచక్షుః=చెప్పిరి.

తా. పిమ్మట రావణుని మంత్రులు ఇంద్రజిత్తు వధను విని, ఆ విషయము ధ్రువీకరించుకొని, తొందరతో కూడినవారై రావణునకు తెలిపిరి.1

మూ. యుద్ధే హతో మహారాజ లక్ష్మణేన తవాత్మజః,
విభీషణసహాయేన మిషతాం నో మహాద్యుతిః. 2

ప్ర. అ. మహారాజ=మహారాజా! తవ=నీయొక్క, మహాద్యుతిః=గొప్ప కాంతి గల, ఆత్మజః=కుమారుడు, యుద్ధే=యుద్ధమునందు, నః=మేము, మిషతామ్=చూచుచుండగా, విభీషణసహాయేన=విభీషణుడు సహాయుడుగా గల, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, హతః=చంపబడినాడు.

తా. మహారాజా! విభీషణుని సాహాయ్యముతో లక్ష్మణుడు, యుద్ధములో మేమందరము చూచుచుండగనే మహాతేజఃశాలియైన నీ పుత్రుణ్ణి చంపివేసినాడు.

మూ. శూరః శూరేణ సంగమ్య సంయుగేష్వపరాజితః,
లక్ష్మణేన హతః శూరః పుత్రస్తే విబుధేన్ద్రజిత్. 3
గతః స పరమాన్ లోకాన్ శరైః సంతాప్య లక్ష్మణమ్.

ప్ర. అ. శూరః=శూరుడు, సంయుగేషు=యుద్ధములయందు, అపరాజితః=ఓడింపబడనివాడు,తే పుత్రః=నీ పుత్రుడు, విబుధేన్ద్రజిత్=దేవేంద్రుణ్ణి జయించిన, శూరః=ఆ శూరుడు, శూరేణ=శూరుడైన, లక్ష్మణేన=లక్ష్మణునితో, సంగమ్య=తలబడి, హతః=చంపబడినాడు. సః=అతడు, శరైః=బాణములచేత,

లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, సంతాప్య=పీడించి, పరమాన్ లోకాన్=ఉత్తమలోకములను గూర్చి, గతః=వెళ్లినాడు.

తా. యుద్ధములలో పరాజయము చెందనివాడు, దేవేంద్రుని జయించిన వాడు, అయిన శూరుడైన నీ పుత్రుడు శూరుడైన లక్ష్మణునితో యుద్ధమునకు తలబడి, బాణములచేత లక్ష్మణునికి పీడ కలిగించి ఉత్తమలోకములకు వెళ్లిపోయినాడు.3

మూ. స తం ప్రతిభయం శ్రుత్వా వధం పుత్రస్య దారుణమ్, 4
ఘోరమిన్ద్రజితః సంఖ్యే కశ్మలం ప్రావిశన్మహత్.

ప్ర. అ. సః=అతడు, సంఖ్యే=యుద్ధమునందు, పుత్రస్య=పుత్రుడైన, ఇన్ద్రజితః=ఇంద్రజిత్తుయొక్క, ప్రతిభయమ్=భయంకరము, దారుణమ్=దారుణము, ఘోరమ్=ఘోరమూ అయిన, తం వధమ్=ఆ వధను, శ్రుత్వా=విని, మహత్=గొప్ప, కశ్మలమ్=మూర్ఛను, ప్రావిశత్=ప్రవేశించెను.

తా. యుద్ధములో తన పుత్రుడైన ఇంద్రజిత్తు చంపబడినాడను ఘోరము, దారుణము, భయంకరము అయిన ఆ వార్త విని అతడు దీర్ఘమైన మూర్ఛ పొందెను. 4

మూ. ఉపలభ్య చిరాత్సంజ్ఞాం రాజా రాక్షసపుంగవః, 5
పుత్రశోకాకులో దీనో విలలాపాకులేన్ద్రియః.

ప్ర. అ. రాజా=రాజైన, రాక్షసపుంగవః=రావణుడు, చిరాత్=చిరకాలమునకు, సంజ్ఞామ్=సంజ్ఞను, ఉపలభ్య=పొంది, పుత్రశోకాకులః=పుత్రశోకముతో వ్యాకులుడై, దీనః=దీనుడై, ఆకులేన్ద్రియః=వ్యాకులములైన ఇంద్రియములు గలవాడై, విలలాప=విలపించెను.

తా. రాక్షసరాజైన ఆ రావణునకు చాల సేపటికి సంజ్ఞ వచ్చెను. ఆతని ఇంద్రియములు పనిచేయకుండెను. అతడు పుత్రశోకముచేత వ్యాకులుడై విలపించెను. 5

మూ. హా రాక్షసచమూముఖ్య మమ వత్స మహాబల, 6
జిత్వేన్ద్రం కథమద్య త్వం లక్ష్మణస్య వశం గతః.

ప్ర. అ. హా=అయ్యో! రాక్షసచమూముఖ్య=రాక్షస సేనలో ప్రధానుడా! మమ వత్స=నా పుత్రుడా! మహాబల=గొప్ప బలము గలవాడా! ఇన్ద్రమ్=ఇంద్రుణ్ణి, జిత్వా=జయించి, త్వమ్=నీవు, అద్య=ఇప్పుడు, కథమ్=ఎట్లు, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, వశం గతః=వశము పొందినావు?

తా. అయ్యో! రాక్షససైన్యముఖ్యుడా! నా పుత్రుడా! మహాబలము

కలవాడా! ఇంద్రుణ్ణి కూడా జయించిన నీవు ఈనాడు లక్ష్మణునిచేతిలో ఎట్లు ఓడిపోయినావు? 6

మూ. నను త్వమిషుభిః క్రుద్ధో భిన్ద్యాః కాలాన్తకావపి, 7
మన్దరస్యాపి శృఙ్గాణి కిం పునర్లక్ష్మణం యుధి.

ప్ర. అ. క్రుద్ధః=కోపించిన, త్వమ్=నీవు, ఇషుభిః=బాణములచేత, కాలాన్తకౌ అపి=కాలుణ్ణి, యముణ్ణి కూడ, మన్దరస్య=మందరపర్వతముయొక్క, శృఙ్గాణ్యపి= శిఖరములను కూడ, భిన్ద్యాః నను=భేదింతువుకదా? యుధి=యుద్ధమునందు, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, కిం పునః=చెప్పనేల?

తా. కోపము వచ్చినచో నీవు బాణాలచేత కాలపురుషుణ్ణి, యముణ్ణి, మందరపర్వతశిఖరములనూ కూడ భేదించగలవాడవుకదా! యుద్ధములో లక్ష్మణుణ్ణి భేదించుటను గూర్చి చెప్పవలెనా. 7

మూ. అద్య వైవస్వతో రాజా భూయో బహుమతో మమ, 8
యేనాద్య త్వం మహాబాహో సంయుక్తః కాలధర్మణా.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా, యేన=ఏ యమునిచేత, అద్య=నేడు, త్వమ్=నీవు, కాలధర్మణా=మరణముతో, సంయుక్తః=చేర్చబడినావో, అట్టి, వైవస్వతః=సూర్యుని పుత్రుడైన, రాజా=యమధర్మరాజు, మమ=నాకు, అద్య=ఇప్పుడు, భూయః=అధికముగా, బహుమతః=బహుమానపాత్రుడు.

తా. ఓ! మహాబాహూ! నీకు కూడ మరణము కల్పించిన ఆ యముడు చాల బలవంతు డని నా కిప్పుడు ఆతనిపై గౌరవము పెరుగుచున్నది. 8

మూ. ఏష పన్థాః సుయోధానాం సర్వామరగణేష్వపి, 9
యః కృతే హన్యతే భర్తుః స పుమాన్ స్వర్గమృచ్ఛతి.

ప్ర. అ. సర్వామరగణేష్వపి=సమస్తదేవతాగణములలో కూడ, సుయోధానామ్=గొప్ప వీరులకు, ఏషః=ఇది, పన్థాః=మార్గము. యః=ఎవడు, భర్తుః కృతే=ప్రభువు నిమిత్తమై, హన్యతే=చంపబడునో, సః పుమాన్=ఆ పురుషుడు, స్వర్గమ్=స్వర్గమును, ఋచ్ఛతి=పొందును.

తా. సమస్తదేవతలలో కూడ గొప్ప యోధులకు ఇదే మార్గము. ప్రభువుకొరకై ప్రాణములను విడచువాడు స్వర్గమును పొందును. 9

మూ. అద్య దేవగణాః సర్వే లోకపాలా మహర్షయః, 10
హతమిన్ద్రజితం దృష్ట్వా సుఖం స్వప్స్యన్తి నిర్భయాః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, హతమ్=చంపబడి నవానినిగా, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, దేవగణాః=దేవతల గణములు, లోకపాలాః=లోకపాలకులు, మహర్షయః=మహర్షులు, నిర్భయాః=భయములేనివారై, సుఖమ్=సుఖముగా, స్వప్స్యన్తి=నిద్రించగలరు.

తా. ఇంద్రజిత్తు మరణించుటను చూచి సమస్తదేవతాగణములు, లోకపాలకులు, మహర్షులు ఇటుపై ఏ భయమూ లేనివారై సుఖముగా నిద్రించగలరు. 10

మూ. అద్య లోకాస్త్రయః కృత్స్నా పృథివీ చ సకాననా, 11
ఏకేనేన్ద్రజితా హీనా శూన్యేవ ప్రతిభాతి మే.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఏకేన=ఒక్క, ఇన్ద్రజితా=ఇంద్రజిత్తుతో, హీనా=శూన్యమైన, సకాననా=అడవులతో కూడిన, కృత్స్నా=సమస్తమైన, పృథివీ=భూమి, మే=నాకు, శూన్యేవ=శూన్యమైనదిగా, ప్రతిభాతి=కనబడుచున్నది. త్రయః=మూడు, లోకాః=లోకములు శూన్యములుగా కనబడుచున్నవి.

తా. ఈనాడు ఒక ఇంద్రజిత్తు లేకపోవుటచేత అడవులతో కూడిన ఈ సమస్త భూమి, మూడు లోకాలూ కూడ నాకు శూన్యములుగా కనబడుచున్నవి.

మూ. అద్య నైర్‌ృతకన్యానాం శ్రోష్యామ్యన్తఃపురే రవమ్, 12
కరేణుసంఘస్య యథా నినాదం గిరిగహ్వరే.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అన్తఃపురే=అంతఃపురమునందు, నైర్‌ృతకన్యానామ్=రాక్షసకన్యలయొక్క, రవమ్=ధ్వనిని, గిరిగహ్వరే=పర్వతగుహలో, కరేణుసంఘస్య=ఆడ ఏనుగుల సముదాయముయొక్క, నినాదం యథా=ధ్వనిని వలె, శ్రోష్యామి=వినగలను.

తా. ఇప్పుడు, పర్వతగుహలో ఆడ ఏనుగుల ధ్వనిని వలె అంతఃపురములో రాక్షసయువతుల విలాపమును వినగలను. 12

మూ. యౌవరాజ్యం చ లఙ్కాం చ రక్షాంసి చ పరంతప, 13
మాతరం మాం చ భార్యాశ్చ క్వ గతోఽసి విహాయ నః.

ప్ర. అ. పరంతప=శత్రువులను పీడించువాడా! యౌవరాజ్యం చ=యౌవరాజ్యమును, లఙ్కాం చ=లంకను, రక్షాంసి చ=రాక్షసులను, మాతరమ్=తల్లిని, మాం చ=నన్ను, భార్యాశ్చ=భార్యలను, నః=మమ్ములను, విహాయ=విడచి, క్వ=ఎక్కడికి, గతః అసి=వెళ్లినావు?

తా. ఓ! శత్రుసంహారకా! యౌవరాజ్యమును, లంకను, రాక్షసులను, తల్లిని, నన్ను, భార్యలను, మమ్ములనందరినీ విడచి ఎక్కడికి వెళ్లినావు? 13

మూ. మమ నామ త్వయా వీర గతస్య యమసాదనమ్, 14
ప్రేతకార్యాణి కార్యాణి విపరీతే హి వర్తసే.

ప్ర. అ. వీర=వీరుడా! యమసాదనమ్=యమలోకమును గూర్చి, గతస్య=వెళ్లిన, మమ=నాయొక్క, ప్రేతకార్యాణి నామ=ప్రేతకార్యములు, త్వయా=నీచేత, కార్యాణి=చేయదగినవి కదా! విపరీతే=విపరీతమార్గమునందు, వర్తసే హి=ఉంటున్నావు కదా!

తా. వీరుడా! నేను మరణించిన పిదప నా ప్రేతకార్యములు నీవు చేయవలెను కదా! నీవు అందుకు విరుద్ధముగా చేసినావు కదా ? 14

మూ. స త్వం జీవతి సుగ్రీవే లక్ష్మణేన చ రాఘవే, 15
మమ శల్యమనుద్ధృత్య క్వ గతోఽసి విహాయ నః.

ప్ర. అ. సః త్వమ్=అట్టి నీవు, సుగ్రీవే=సుగ్రీవుడు, జీవతి=జీవించి ఉండగా, లక్ష్మణేన=లక్ష్మణునితో, రాఘవే=రాముడు జీవించి ఉండగా, మమ=నాయొక్క, శల్యమ్=బాధను, అనుద్ధృత్య=ఉద్ధరించకుండగా, నః=మమ్ము, విహాయ=విడచి, క్వ=ఎక్కడికి, గతః అసి=వెళ్లినావు.

తా. సుగ్రీవుడు, రామలక్ష్మణులూ ఇంకా జీవించియే ఉండగా, నీవు నా బాధలను తొలగించకుండగానే మమ్ములను విడచి ఎక్కడికి వెళ్లినావు?15

మూ. ఏవమాదివిలాపార్తం రావణం రాక్షసాధిపమ్, 16
ఆవివేశ మహాన్ కోపః పుత్రవ్యసనసంభవః.

ప్ర. అ. ఏవమాదివిలాపార్తమ్=ఈ మొదలైన విలాపముచేత పీడితుడైన, రాక్షసాధిపమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుణ్ణి, పుత్రవ్యసన సంభవః=పుత్రవ్యసనమువలన కలిగిన, మహాన్=గొప్ప, కోపః=కోపము, ఆవివేశ=ఆవేశించెను.

తా. ఈ విధముగా ఆర్తుడై విలపించుచున్న రాక్షసరాజైన ఆ రావణుణ్ణి పుత్రవ్యసనముచేత చాల కోపము ఆవహించెను. 16

మూ. ప్రకృత్యా కోపనం హ్యేనం పుత్రస్య పునరాధయః, 17
దీప్తం సందీపయామాసుర్ఘర్మేఽర్కమివ రశ్మయః

ప్ర. అ. ప్రకృత్యా=స్వభావముచేత, కోపనమ్=కోపముగల, ఏనమ్=ఇతనిని, పుత్రస్య=పుత్రునియొక్క, ఆధయః=మనోవ్యథలు, ఘర్మే=గ్రీష్మర్తువునందు,

దీప్తమ్=ప్రజ్వలించుచున్న, అర్కమ్=సూర్యుణ్ణి, రశ్మయః ఇవ=కిరణములువలె, పునః=ఇంకను, సందీపయామాసుః=ప్రజ్వలింపచేసినవి.

తా. సహజముగానే కోపస్వభావము గల ఆతనిని పుత్రశోకమువలన కలిగిన మనోవ్యథ-ప్రకాశించుచున్న సూర్యుణ్ణి గ్రీష్మమునందు కిరణములు వలె, ఇంకను అధికముగా మండిపడునట్లు చేసినది. 17

మూ. లలాటే భ్రుకుటీభిశ్చ సంగతాభిర్వ్యరోచత, 18
యుగాన్తే సహనక్రైస్తు మహోర్మిభిరివోదధిః.

ప్ర. అ. లలాటే=లలాటమునందు, సంగతాభిః=కలిసిన, భ్రుకుటీభిః=కను బొమ్మల విరుపులచేత, యుగాన్తే=ప్రలయకాలమునందు, సహనక్రైః=మొసళ్లతో కూడిన, మహోర్మిభిః=గొప్ప తరంగములతో, ఉదధిః ఇవ=సముద్రము వలె, వ్యరోచత=ప్రకాశించెను.

తా. లలాటమునందు కలిసిన భ్రుకుటులతో ఆతడు ప్రళయకాలమునందు మొసళ్లతో కూడిన తరంగములతో సముద్రమువలె ప్రకాశించెను. 18

మూ. కోపాద్విజృమ్భమాణస్య వక్త్రాద్వ్యక్తమివ జ్వలన్, 19
ఉత్పపాత సధూమాగ్నిర్వృత్రస్య వదనాదివ.

ప్ర. అ. కోపాత్=కోపమువలన, విజృమ్భమాణస్య=ఆవులించుచున్న ఆతనియొక్క, వక్త్రాత్=ముఖమునుండి, వ్యక్తమ్=స్పష్టముగా, జ్వలన్నివ=మండు చున్నది వలె, వృత్రస్య=వృత్రాసురునియొక్క, వదనాదివ=ముఖమునుండి వలె, సధూమాగ్నిః=ధూమముతో కూడిన అగ్ని, ఉత్పపాత=పైకి లేచెను.

తా. ఆతడు కోపముతో ఆవులించగా ఆతని ముఖమునుండి, వృత్రాసురుని ముఖమునుండి వలె స్పష్టముగా మండుచు, ధూమముతో కూడిన అగ్ని బయలుదేరెను. 19

మూ. స పుత్రవధసంతప్తః శూరః క్రోధవశం గతః, 20
సమీక్ష్య రావణో బుద్ధ్యా వైదేహ్యా రోచయద్వధమ్.

ప్ర. అ. పుత్రవధసంతప్తః=పుత్రుని వధచేత దుఃఖితుడైన, శూరః=శూరు డైన, సః రావణః=ఆ రావణుడు, క్రోధవశమ్=కోపవశమును, గతః=పొందినవాడై, బుద్ధ్యా=బుద్ధిచేత, సమీక్ష్య=చూచి, వైదేహ్యాః=సీతయొక్క, వధమ్=వధను, రోచ యత్=ఇష్టపడెను.

తా. పుత్రుని వధచేత దుఃఖితుడైన శూరుడైన ఆ రావణుడు క్రోధమునకు వశుడై బుద్ధితో ఆలోచించి సీతను వధించవలె నని నిర్ణయించుకొనెను. 20

మూ. తస్య ప్రకృత్యా రక్తే చ రక్తే క్రోధాగ్నినాపి చ, 21
రావణస్య మహాఘోరే దీప్తే నేత్రే బభూవతుః.

ప్ర. అ. తస్య రావణస్య=ఆ రావణునియొక్క, ప్రకృత్యా=స్వభావముచేత, రక్తే చ=ఎఱ్ఱనివీ, క్రోధాగ్నినాపి చ=క్రోధాగ్ని చేత కూడ, రక్తే=ఎఱ్ఱనివీ అయిన, మహాఘోరే=చాల భయంకరములైన, నేత్రే=నేత్రములు, దీప్తే=మండుచున్నవిగా, బభూవతుః=అయినవి.

తా. స్వభావముచేతనే ఎఱ్ఱగా నున్న, కోపాగ్నిచేత కూడ ఇంకనూ ఎఱ్ఱగా అయిన చాలా భయంకరములైన ఆతని నేత్రములు ప్రజ్వలించినవి.21

మూ. ఘోరం ప్రకృత్యా రూపం తత్తస్య క్రోధాగ్నిమూర్ఛితమ్, 22
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ దురాసదమ్.

ప్ర. అ. ప్రకృత్యా=స్వభావముచేత, ఘోరమ్=భయంకరమైన, క్రోధాగ్ని మూర్ఛితమ్=క్రోధాగ్నిచేత వ్యాప్తమైన, తస్య=ఆతనియొక్క, తత్ రూపమ్=ఆ రూపము, క్రుద్ధస్య=కోపించిన, రుద్రస్య ఇవ=రుద్రునియొక్క రూపము వలె, దురాసదమ్=సమీపింప శక్యము కానిది, బభూవ=ఆయెను.

తా. సహజముగా భయంకరమై, క్రోధాగ్నితో నిండిన ఆతని శరీరము కోపించిన రుద్రుని శరీరము వలె సమీపింప శక్యముకాని దయ్యెను. 22

మూ. తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపతన్నశ్రుబిన్దవః, 23
దీపాభ్యామివ దీప్తాభ్యాం సార్చిషః స్నేహబిన్దవః.

ప్ర. అ. క్రుద్ధస్య=కోపించిన, తస్య=ఆతనియొక్క, నేత్రాభ్యామ్=నేత్రములనుండి, దీప్తాభ్యామ్=మండుచున్న, దీపాభ్యామ్=దీపములనుండి, సార్చిషః=అగ్ని జ్వాలతో కూడిన, స్నేహబిన్దవః ఇవ=తైలబిందువులు వలె, అశ్రుబిన్దవః=కన్నీటి చుక్కలు, ప్రాపతన్=రాలినవి.

తా. మండుచున్న కాగడాలనుండి మంటతో కూడిన తైలబిందువులు రాలినట్లు కోపించిన ఆతని నేత్రములనుండి కన్నీటి చుక్కలు రాలినవి. 23

మూ. దన్తాన్విదశతస్తస్య శ్రూయతే దశనస్వనః, 24
యన్త్రస్యాకృష్యమాణస్య మహతో దానవైరివ.

ప్ర. అ. దన్తాన్=దంతములను, విదశతః=కొరుకుచున్న, తస్య=రావణునియొక్క, దశనస్వనః=దంతధ్వని, దానవైః=దానవులచేత, ఆకృష్యమాణస్య= లాగబడుచున్న, మహతః=గొప్పదైన, యన్త్రస్యేవ=యంత్రముయొక్క ధ్వనివలె, శ్రూయతే=వినబడినది.

తా. అతడు పండ్లు పటపటా కొరకగా ఆ ధ్వని దానవులు లాగుచున్న పెద్దయంత్రము ధ్వనివలె వినబడెను. 24

మూ. కాలాగ్నిరివ సంక్రుద్ధో యాం యాం దిశమవైక్షత, 25
తస్యాం తస్యాం భయత్రస్తా రాక్షసాః సంవిలిల్యిరే.

ప్ర. అ. కాలాగ్నిరివ=ప్రలయకాలాగ్ని వలె, సంక్రుద్ధః=కోపించినవాడై, యాం యామ్=ఏ యే, దిశమ్=దిక్కును, అవైక్షత=చూచెనో, తస్యాం తస్యామ్=ఆ యా దిక్కునందు, రాక్షసాః=రాక్షసులు, భయత్రస్తాః=భయముచేత వణకుచున్నవారై, సంవిలిల్యిరే=అణగిపోయిరి.

తా. అతడు ప్రళయకాలాగ్ని వలె కోపించి ఏ యే దిక్కు చూచెనో ఆ యా దిక్కునందున్న రాక్షసులు అణిగి మణిగి ఉండిపోయిరి. 25

మూ. తమన్తకమివ క్రుద్ధం చరాచరచిఖాదిషుమ్, 26
వీక్షమాణం దిశః సర్వా రాక్షసా నోపచక్రముః.

ప్ర. అ. చరాచరచిఖాదిషుమ్=జంగమస్థావరములను తినివేయదలచిన, క్రుద్ధమ్=కోపించిన, అన్తకమివ=యముడు వలె ఉన్న, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను, వీక్షమాణమ్=చూచుచున్న, తమ్=ఆతనిని, రాక్షసాః=రాక్షసులు, నోపచక్రముః=సమీపించలేదు.

తా. జంగమ స్థావరరూపమైన జగత్తును తినివేయ సంకల్పించిన కోపించిన మృత్యుదేవత వలె ఉన్న ఆ రావణుడు అన్ని దిక్కుల వైపు చూచుచుండగా అందరు రాక్షసులూ కూడ ఆతనిని సమీపించుటకు భయపడిరి.

మూ. తతః పరమసంక్రుద్ధో రావణో రాక్షసాధిపః, 27
అబ్రవీద్రక్షసాం మధ్యే సంస్తమ్భయిషురాహవే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరమసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన, రాక్షసాధిపః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, ఆహవే=యుద్ధమునందు, సంస్తంభయిషుః=నిలువదలచినవాడై, రక్షసామ్=రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, అబ్రవీత్=పలికెను.

తా. పిదప రాక్షసరాజైన రావణుడు భయపడియున్న ఆ రాక్షసులను మరల యుద్ధమునందు స్థిరముగా నిలుపవలె నను కోరికతో ఆ రాక్షసుల మధ్య ఇట్లు పలికెను. 27

మూ. మయా వర్షసహస్రాణి చరిత్వా పరమం తపః, 28
తేషు తేష్వవకాశేషు స్వయంభూః పరితోషితః.

ప్ర. అ. మయా=నాచేత, వర్షసహస్రాణి=వేలకొలది సంవత్సరములు, పరమమ్=గొప్ప, తపః=తపస్సును, చరిత్వా=చేసి, తేషు తేషు=ఆ యా, అవకాశేషు=తపః సమాప్తులయందు, స్వయంభూః=బ్రహ్మదేవుడు, పరితోషితః= సంతోషింపచేయబడినాడు.

తా. నేను వేలకొలది సంవత్సరములు తపస్సుచేసి ఒక్కొక్క తపస్సు ముగిసినప్పు డెల్ల బ్రహ్మదేవుణ్ణి సంతోషపెట్టితిని. 28

మూ. తస్యైవ తపసో వ్యుష్ట్యా ప్రసాదాచ్చ స్వయంభువః, 29
నాసురేభ్యో న దేవేభ్యో భయం మమ కదాచన.

ప్ర. అ. తస్య=ఆ, తపసః ఏవ=తపస్సుయొక్కయే, వ్యుష్ట్యా=ఫలోదయముచేతను, స్వయంభువః=బ్రహ్మదేవునియొక్క, ప్రసాదాచ్చ=అనుగ్రహమువలన, మమ=నాకు, కదాచన=ఎన్నడూ, అసురేభ్యః=రాక్షసులనుండి, భయమ్=భయము, న=లేదు. దేవేభ్యః=దేవతలనుండి, న=లేదు.

తా. ఆ తపస్సు ఫల మీయుటకు ఉపక్రమించుటచేతను, బ్రహ్మదేవుని అనుగ్రహముచేతను నాకు ఎన్నడూ అసురులనుండి గాని, దేవతలనుండి గాని, భయము లేదు. 29

మూ. కవచం బ్రహ్మదత్తం మే యదాదిత్యసమప్రభమ్, 30
దేవాసురవిమర్దేషు న భిన్నం వజ్రముష్టిభిః.

ప్ర. అ. మే=నాకు, బ్రహ్మదత్తమ్=బ్రహ్మచేత ఇవ్వబడిన, ఆదిత్యసమప్రభమ్=సూర్యునితో సమానమైన కాంతిగల, యత్=ఏ, కవచమ్=కవచ మున్నదో, అది, దేవాసురవిమర్దేషు=దేవతలతోను అసురులతోను జరిగిన యుద్ధములందు, వజ్రముష్టిభిః=వజ్రముచేత గాని, పిడికిళ్ల చేత గాని, న భిన్నమ్=బ్రద్దలుకొట్టబడలేదు.

తా. నాకు బ్రహ్మదేవు డిచ్చిన, సూర్యుని వంటి కాంతి గల కవచమును, దేవతలతోను అసురులతోను జరిగిన యుద్ధములలో వజ్రాయుధము గాని, పిడికిళ్లు గాని బ్రద్దలుకొట్టలేదు. 30

మూ. తేన మామద్య సంయుక్తం రథస్థమిహ సంయుగే, 31
ప్రతీయాత్కోఽద్య మామాజౌ సాక్షాదపి పురన్దరః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఇహ=ఈ, సంయుగే=యుద్ధమునందు, తేన=ఆ కవచముతో, సంయుక్తమ్=కూడిన, రథస్థమ్=రథమునందున్న, మామ్=నన్ను, అద్య=ఇప్పుడు, కః=ఎవడు, ఆజౌ=యుద్ధమునందు, సాక్షాత్=సాక్షాత్తు, పురన్దరః అపి=దేవేంద్రుడైనను, ప్రతీయాత్=ఎదుర్కొనును?

తా. ఇప్పుడీ యుద్ధములో ఆ కవచము ధరించి రథముమీద ఉన్న నన్ను సాక్షాత్తు దేవేంద్రుడైనను ఎవడు ఎదిరించగలడు?

వి. రావణుని కోపావేశమును సూచించుటకై "మామ్" "మామ్" "అద్య" "అద్య" అని పునరుక్తి, "సంయుగే" "ఆజౌ" అను పర్యాయపదముల ప్రయోగము చేయబడినది. 31

మూ. యత్తదాతిప్రసన్నేన సశరం కార్ముకం మహత్, 32
దేవాసురవిమర్దేషు మమ దత్తం స్వయంభువా.
అద్య తూర్యశతైర్భీమం ధనురుత్థాప్యతాం మమ. 33
రామలక్ష్మణయోరేవ వధాయ పరమాహవే.

ప్ర. అ. దేవాసురవిమర్దేషు=దేవాసురుల యుద్ధములయందు, తదా=అప్పుడు, అతిప్రసన్నేన=మిక్కిలి సంతోషించిన, స్వయంభువా=బ్రహ్మదేవునిచేత, సశరమ్=బాణములతో కూడిన, మహత్=గొప్పదైన, యత్=ఏ, కార్ముకమ్=ధనస్సు, పరమాహవే=మహాయుద్ధమునందు, రామలక్ష్మణయోః=రామలక్ష్మణుల యొక్క, వధాయైవ=వధకొరకు, అద్య=ఇప్పుడు, తూర్యశతైః=అనేకమంగళవాద్యములతో, ఉత్థాప్యతామ్=పైకి తీయబడుగాక.

తా. పూర్వము దేవాసురయుద్ధములలో సంతోషించిన బ్రహ్మదేవుడు బాణసహితమైన గొప్ప ధనస్సును నాకిచ్చినాడు కదా; ఇప్పుడు భయంకరమైన ఆ ధనస్సును మహాయుద్ధములో రామలక్ష్మణులను చంపుటకై ఉపయోగించవలెను. దానిని మంగళవాద్యములతో పైకి తీయుడు. 32, 33

మూ. స పుత్రవధసంతప్తః క్రూరః క్రోధవశం గతః, 34
సమీక్ష్య రావణో బుద్ధ్యా సీతాం హన్తుం వ్యవస్యత.

ప్ర. అ. పుత్రవధసంతప్తః=పుత్రవధచేత దుఃఖితుడైన, క్రూరః=క్రూరుడైన, సః రావణః=ఆ రావణుడు, క్రోధవశమ్=క్రోధవశమును, గతః=పొందినవాడై, బుద్ధ్యా=బుద్ధిచేత, సమీక్ష్య=ఆలోచించి, సీతామ్=సీతను, హన్తుమ్=చంపుటకు, వ్యవస్యత=నిశ్చయించెను.

తా. పుత్రుని వధచేత దుఃఖితుడైన క్రూరుడైన ఆ రావణుడు క్రోధావిష్టుడై, బుద్ధితో ఆలోచించి సీతను చంపవలె నని నిశ్చయించుకొనెను. 34

మూ. ప్రత్యవేక్ష్య తు తామ్రాక్షః సుఘోరో ఘోరదర్శనః, 35
దీనో దీనస్వరాన్ సర్వాంస్తానువాచ నిశాచరాన్.

ప్ర. అ. తామ్రాక్షః=ఎఱ్ఱని కళ్ళుగల, సుఘోరః=చాల భయంకరు

డైన, ఘోరదర్శనః=భయంకరమైన దర్శనము గల, దీనః=దీనుడైన ఆ రావణుడు, దీనస్వరాన్=దీనమైన స్వరము గల, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, నిశాచరాన్=రాక్షసులను, ప్రత్యవేక్ష్య=కలియ జూచి, ఉవాచ=పలికెను.

తా. ఎఱ్ఱని కళ్లు గల, చాల భయంకరుడు, చూడ ఘోరముగా ఉన్నవాడు, దీనుడు అయిన ఆ రావణుడు దీనమైన కంఠస్వరము గల ఆ రాక్షసుల నందరినీ కలియచూచి ఇట్లు పలికెను. 35

మూ. మాయయా మమ వత్సేన వఞ్చనార్థం వనౌకసామ్, 36
కించిదేవ హతం తత్ర సీతేయమితి దర్శితమ్.

ప్ర. అ. మమ=నాయొక్క, వత్సేన=కుమారునిచేత, మాయయా=మాయచేత, వనౌకసామ్=వానరులయొక్క, వఞ్చనార్థమ్=వంచనము కొరకు, తత్ర=అక్కడ, కించిదేవ=ఏదో, హతమ్=చంపబడినది. ఇయమ్=ఇది, సీతా ఇతి=సీత అని, దర్శితమ్=చూపబడినది.

తా. నా కుమారుడు వానరులను వంచించుటకై మాయచే దేనినో చంపి ఇది సీత అని అక్కడ చూపినాడు. 36

మూ. తదిదం తథ్యమేవాహం కరిష్యే ప్రియమాత్మనః, 37
వైదేహీం నాశయిష్యామి క్షత్రబన్ధుమనువ్రతామ్.
ఇత్యేవముక్త్వా సచివాన్ ఖడ్గమాశు పరామృశత్. 38

ప్ర. అ. అహమ్=నేను, ఆత్మనః=నాకు, ప్రియమ్=ఇష్టమైన, తత్ ఇదమ్=అట్టి దీనిని, తథ్యమేవ=యథార్థమైనదానినిగా, కరిష్యే=చేసెదను. క్షత్ర బన్ధుమ్=దుష్టక్షత్రియుడైన రాముణ్ణి, అనువ్రతామ్=అనుసరించిన వ్రతము గల, వైదేహీమ్=సీతను, నాశయిష్యామి=నశింపచేసెదను. సచివాన్=మంత్రులను గూర్చి, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, ఆశు=శీఘ్రముగా, ఖడ్గమ్=ఖడ్గమును, పరామృశత్=స్పృశించెను.

తా. "నా కిష్టమైన అట్టి ఈ పని నే నిపుడు చేసెదను. దుష్టక్షత్రియుడైన రామునిపై ప్రేమ గల సీతను చంపివేసెదను." ఇట్లు మంత్రులతో పలికి అతడు వెంటనే ఖడ్గము గ్రహించెను. 37, 38

మూ. ఉత్ప్లుత్య గుణసంపన్నం విమలామ్బరవర్చసమ్,
నిష్పపాత స వేగేన సభార్యః సచివైర్వృతః. 39
రావణః పుత్రశోకేన భృశమాకులచేతనః.
సంక్రుద్ధః ఖడ్గమాదాయ సహసా యత్ర మైథిలీ. 40

["సభార్యః" అనుదానికి బదులు "సభాయాః" అను ప్రాచ్యపాఠము బాగున్నది.]

ప్ర. అ. పుత్రశోకేన=పుత్రశోకముచేత, భృశమ్=మిక్కిలి, ఆకులచేతనః=వ్యాకులమైన మనస్సు గల, రావణః=రావణుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, ఉత్ప్లుత్య=ఎగిరి, గుణసంపన్నమ్=గుణములతో కూడిన, విమలామ్బరవర్చసమ్=నిర్మలమైన ఆకాశము వంటి కాంతి గల, ఖడ్గమ్=ఖడ్గమును,ఆదాయ=గ్రహించి, సచివైః=మంత్రులతో, వృతః=కూడినవాడై, మైథిలీ=సీత, యత్ర=ఎక్కడ ఉన్నదో అక్కడికి, సహసా=వెంటనే, వేగేన=వేగముతో, సభాయాః=సభనుండి, నిష్పపాత=బయలుదేరెను.

తా. పుత్రశోకముచేత చాల వ్యాకులమైన చిత్తముతో కోపావిష్టుడైన ఆ రావణుడు మంచి గుణములు గల, నిర్మలమైన ఆకాశము వంటి కాంతి గల ఖడ్గమును తీసికొని వెంటనే, సీత ఉన్న ప్రదేశమునకు, సభనుండి మహావేగముతో బయలుదేరెను. 39, 40

మూ. వ్రజన్తం రాక్షసం ప్రేక్ష్య సింహనాదం విచుక్రుశుః,
ఊచుశ్చాన్యోన్యమాలిఙ్గ్య సంక్రుద్ధం ప్రేక్ష్య రాక్షసమ్. 41

ప్ర. అ. వ్రజన్తమ్=వెళ్లుచున్న, రాక్షసమ్=రావణుణ్ణి, ప్రేక్ష్య=చూచి, సింహనాదమ్=సింహనాదము కలుగునట్లుగా విచుక్రుశుః=అరచిరి. సంక్రుద్ధమ్=కోపించిన, రాక్షసమ్=రాక్షసుణ్ణి, ప్రేక్ష్య=చూచి, అన్యోన్యమ్=పరస్పరము, ఆలిఙ్గ్య=కౌగిలించుకొని, ఊచుశ్చ=పలికిరి.

తా. వెళ్లుచున్న ఆతనిని చూచి ఆతని అనుచరులు సింహనాదము చేసి నట్లు అరచిరి. కోపించిన ఆతనిని చూచి పరస్పరము కౌగిలించుకొని ఇట్లు పలికిరి. 41

మూ. అద్యైనం తావుభౌ దృష్ట్వా భ్రాతరౌ ప్రవ్యథిష్యతః,
లోకపాలా హి చత్వారః క్రుద్ధేనానేన తర్జితాః. 42
బహవః శత్రవశ్చాన్యే సంయుగేష్వభిపాతితాః.

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ఏనమ్=ఈతనిని, దృష్ట్వా=చూచి, తౌ=ఆ, భ్రాతరౌ=సోదరులు, ఉభౌ=ఇద్దరూ, ప్రవ్యథిష్యతః=వ్యథ చెందగలరు. క్రుద్ధేన=కోపించిన, అనేన=వీనిచేత, చత్వారః=నలుగురు, లోకపాలాః=లోకపాలకులు, తర్జితాః హి=భయపెట్టబడినారు కదా. అన్యే=ఇతరులైన, బహవః=అనేకులు, శత్రవశ్చాపి=శత్రువులు కూడ, సంయుగేషు=యుద్ధములయందు, అభిపాతితాః=పడగొట్టబడినారు.

తా. ఇప్పుడు ఇతనిని చూడగానే సోదరులైన ఆ రామలక్ష్మణు లిద్దరూ

వ్యథ చెందగలరు. కోపించిన ఇతడు నలుగురు లోకపాలులను భయపెట్టినాడు కదా. యుద్ధములలో ఎంతోమంది ఇతర శత్రువులు కూడ వధింపబడినారు. 42

మూ. త్రిషు లోకేషు రత్నాని భుజ్క్తే చాహృత్య రావణః, 43
విక్రమే చ బలే చైవ నాస్త్యస్య సదృశో భువి.

ప్ర. అ. రావణః=రావణుడు, త్రిషు=మూడు, లోకేషు=లోకములయందు, రత్నాని=శ్రేష్ఠవస్తువులను, ఆహృత్య=తీసికొని వచ్చి, భుజ్క్తే చ=అనుభవించును. విక్రమే చ=పరాక్రమమునందును, బలే చైవ=బలమునందును, అస్య=ఈతనికి, సదృశః=సమానుడు, భువి=భూమియందు, నాస్తి=లేడు.

తా. ఈ రావణుడు మూడు లోకాలలో ఉన్న శ్రేష్ఠవస్తువులను తీసికొని వచ్చి అనుభవించుచున్నాడు. పరాక్రమములోను, బలములోను ఈతనిని పోలినవాడు ఈ భూమిలో లేడు. 43

మూ. తేషాం సంజల్పమానానామశోకవనికాం గతామ్, 44
అభిదుద్రావ వైదేహీం రావణః క్రోధమూర్ఛితః.

ప్ర. అ. తేషామ్=వాళ్లు, సంజల్పమానానామ్=ఈ విధముగా మాటలాడుకొనుచుండగా, రావణః=రావణుడు, క్రోధమూర్ఛితః=క్రోధముచేత వ్యాపింపబడినవాడై, అశోకవనికామ్=అశోకవనమును, గతామ్=పొందిన, వైదేహీమ్=సీతను గూర్చి, అభిదుద్రావ=శీఘ్రముగా వెళ్లెను.

తా. ఆ రాక్షసు లిట్లు అనుకొనుచుండగా రావణుడు క్రోధావేశముతో అశోకవనములో ఉన్న సీత దగ్గరకు చాల తొందరగా వెళ్లెను. 44

మూ. వార్యమాణః సుసంక్రుద్ధః సుహృద్భిర్హితబుద్ధిభిః, 45
అభ్యధావత సంక్రుద్ధః ఖే గ్రహో రోహిణీమివ.

ప్ర. అ. సుసంక్రుద్ధః=చాల కోపించిన అతడు, హితబుద్ధిభిః=హిత బుద్ధి గల, సుహృద్భిః=స్నేహితులచేత, వార్యమాణః=నివారింపబడుచున్నను, సంక్రుద్ధః=కోపించిన, గ్రహః=గ్రహము, ఖే=ఆకాశమునందు, రోహిణీమివ=రోహిణీ నక్షత్రమును గూర్చి వలె, అభ్యధావత=శీఘ్రముగా వెళ్లెను.

తా. మిక్కిలి కోపించిన ఆ రావణుడు హితమును కోరు స్నేహితులు వారించుచున్నను, కోపించిన అంగారకగ్రహము ఆకాశమునందు రోహిణిని గూర్చి వెళ్లినట్లుగా శీఘ్రముగా వెళ్ళెను. 45

మూ. మైథిలీ రక్ష్యమాణా తు రాక్షసీభిరనిన్దితా, 46
దదర్శ రాక్షసం క్రుద్ధం నిస్త్రింశవరధారిణమ్.

ప్ర. అ. రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, రక్ష్యమాణా=రక్షింపబడుచున్న, అనిన్దితా=నిందింపబడని, మైథిలీ తు=సీత యైతే, నిస్త్రింశవరధారిణమ్=ఉత్తమమైన ఖడ్గమును ధరించిన, క్రుద్ధమ్=కోపించిన, రాక్షసమ్=రాక్షసుణ్ణి, దదర్శ=చూచెను.

తా. రాక్షసస్త్రీలచేత రక్షింపబడుచున్న దోషశూన్యరాలైన సీత ఉత్తమమైన ఖడ్గమును ధరించి వచ్చుచున్న ఆ రాక్షసుణ్ణి చూచెను. 46

మూ. తం నిశామ్య సనిస్త్రింశం వ్యథితా జనకాత్మజా, 47
నివార్యమాణం బహుశః సుహృద్భిరనివర్తినమ్.

ప్ర. అ. సనిస్త్రింశమ్=ఖడ్గముతో కూడినవాడు, సుహృద్భిః=మిత్రులచేత, బహుశః=అనేక విధములుగా, నివార్యమాణమ్=నివారింపబడుచున్నను, అనివర్తినమ్=మరలనివాడు అయిన, తమ్=ఆతనిని, నిశామ్య=చూచి, జనకాత్మజా=సీత, వ్యథితా=వ్యథచెందినది.

తా. మిత్రులు అనేకవిధాల నివారించుచున్నను మరలక ఖడ్గము ధరించి వచ్చుచున్న ఆతనిని చూచి సీత వ్యథ చెందెను. 47

మూ. సీతా దుఃఖసమావిష్టా విలపన్తీదమబ్రవీత్, 48
యథాయం మామభిక్రుద్ధః సమభిద్రవతి స్వయమ్,
వధిష్యతి సనాథాం మామనాథామివ దుర్మతిః. 49

ప్ర. అ. సీతా=సీత, దుఃఖసమావిష్టా=దుఖముతో కూడినదై, విలపన్తీ=విలపించుచు, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను. దుర్మతిః=దుష్టబుద్ధియైన, అయమ్=ఇతడు, అభిక్రుద్ధః=కోపించినవాడై, యథా=ఎట్లు, మామ్=నన్ను గూర్చి, అభిద్రవతి=శీఘ్రముగా వచ్చుచున్నాడో, (దానిని పట్టి), సనాథామ్=నాథునితో కూడిన, మామ్=నన్ను, అనాథామివ=నాథుడు లేనిదానిని వలె, వధిష్యతి=చంపగలడు.

తా. సీత దుఃఖముతో విలపించుచు ఇట్లు అనుకొనెను.–"దుష్టబుద్ధియైన ఈ రావణుడు కోపముతో నావైపు వచ్చుచున్నాడు. దీనిని పట్టి సనాథురాలనైనను నన్ను అనాథురాలిని వలె చంపనున్నా డని తోచుచున్నది." 48,49

మూ. బహుశశ్చోదయామాస భర్తారం మామనువ్రతామ్,
భార్యా మమ భవస్వేతి ప్రత్యాఖ్యాతో ధ్రువం మయా, 50
సోఽయం మామనుపస్థానే వ్యక్తం నైరాశ్యమాగతః,
క్రోధమోహసమావిష్టో వ్యక్తం మాం హన్తుముద్యతః. 51

ప్ర. అ. భర్తారమ్=భర్తను, అనువ్రతామ్=అనుసరించిన వ్రతము గల, మామ్=నన్ను, మమ భార్యా=నా భార్యవుగా, భవస్వ=అగువు, ఇతి=అని,

**బహుశః**=అనేక పర్యాయములు, చోదయామాస=ప్రేరేపించెను. మయా=నాచేత, ధ్రువమ్=నిశ్చితముగా, ప్రత్యాఖ్యాతః=ప్రత్యాఖ్యానము చేయబడిన, సః అయమ్= అట్టి ఇతడు, అనుపస్థానే=(ఆతనిని) చేరకుండుటయందు (చేత), మామ్=నన్ను గూర్చి, వ్యక్తమ్=స్పష్టముగా, నైరాశ్యమ్=నిరాశత్వమును, ఆగతః=పొందినవాడై, క్రోధమోహసమావిష్టః=క్రోధమోహములతో కూడినవాడై, వ్యక్తమ్=నిశ్చయముగా, మామ్=నన్ను, హన్తుమ్=చంపుటకు, ఉద్యతః=ఉద్యమించినాడు.

**తా.** భర్తను అనుసరించుటయే నియమముగా పాటించుచున్న నన్ను ఇతడు "నా భార్యవు అగుము" అని అనేకపర్యాయములు ప్రార్థించినాడు. నేను దృఢముగా ప్రత్యాఖ్యానము చేసినాను. నేను ఆతనిని చేరకపోవుటచే నిరాశ చెంది కోపావిష్టుడై నన్ను చంపుటకై ఉద్యమించుచున్నాడు. నిశ్చయము.50,51

**మూ.** అథవా తౌ నరవ్యాఘ్రౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
మన్నిమిత్తమనార్యేణ సమరేఽద్య నిపాతితౌ. 52

ప్ర. అ. అథవా=లేదా, నరవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులైన, భ్రాతరౌ=సోదరులైన, తౌ రామలక్ష్మణౌ=ఆ రామలక్ష్మణులు, అనార్యేణ=చెడ్డవాడైన వీనిచేత, అద్య=ఇప్పుడు, మన్నిమిత్తమ్=నా నిమిత్తము, సమరే=యుద్ధమునందు, నిపాతితౌ=పడగొట్టబడిరి.

**తా.** లేదా నేడు యుద్ధములో ఇతడు నామూలాన నరశ్రేష్ఠులు, సోదరులు అయిన ఆ రామలక్ష్మణులను చంపివేసి ఉండును. 52

**మూ.** భైరవో హి మహాన్నాదో రాక్షసానాం శ్రుతో మయా,
బహూనామిహ హృష్టానాం తథా విక్రోశతాం ప్రియమ్. 53

ప్ర. అ. ఇహ=ఇక్కడ, హృష్టానామ్=సంతోషించినవారు, తథా=మరియు, ప్రియమ్=ప్రియమైన విషయమును గూర్చి, విక్రోశతామ్=అరచుచున్నవారు అయిన, బహూనామ్=అనేకులైన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, భైరవః=భయంకరమైన, మహాన్=గొప్పదైన, నాదః=ధ్వని, మయా=నాచేత, శ్రుతః హి=వినబడినది కదా!

**తా.** ఎందుచేత ననగా చాలమంది రాక్షసులు సంతోషించి, తమకు జరిగిన ప్రియమును గూర్చి అరచుచు భయంకరముగా గొప్ప ధ్వని చేయగా నేను ఇక్కడ విన్నాను. 53

**మూ.** అహో ధిఙ్మన్నిమిత్తోఽయం వినాశో రాజపుత్రయోః,
అథవా పుత్రశోకేన అహత్వా రామలక్ష్మణౌ, 54
విధమిష్యతి మాం రౌద్రో రాక్షసః పాపనిశ్చయః.

ప్ర. అ. అహో=అయ్యో ! ధిక్=ఛీ ! రాజపుత్రయోః=రాజపుత్రులయొక్క, అయం వినాశః=ఈ వినాశము, మన్నిమిత్తః=నేను నిమిత్తముగా కలదికదా? అథవా=లేదా, పాపనిశ్చయః=పాపనిశ్చయము గల, రౌద్రః=భయంకరుడైన, రాక్షసః=ఈ రాక్షసుడు, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, అహత్వా=చంపకుండగా, పుత్రశోకేన=పుత్రశోకముచేత, మామ్=నన్ను, విధమిష్యతి=చంపగలడు.

తా. అయ్యో! ఆ రాజపుత్రులకు నావలన వినాశము కలిగినది కదా! ఛీ!లేదా, పాపనిశ్చయము కల క్రూరుడైన ఈ రాక్షసుడు రామలక్ష్మణులను వధింపక, పుత్రశోకముచేత నన్నే వధించుటకు వచ్చుచుండును. 54

మూ. హనూమతస్తు తద్వాక్యం న కృతం క్షుద్రయా మయా, 55
యద్యహం తస్య పృష్ఠేన తదాయాసమనిర్జితా,
నాద్యైవమనుశోచేయం భర్తురఙ్కగతా సతీ. 56

ప్ర. అ. క్షుద్రయా=అల్పబుద్ధి గల, మయా=నాచేత, హనూమతః=హనుమంతునియొక్క, తత్=ఆ, వాక్యమ్=వాక్యము, న కృతమ్=చేయబడలేదు. తదా=ఆనాడు, అహమ్=నేను, అనిర్జితా=జయింపబడకపోయినను, తస్య=వానియొక్క, పృష్ఠేన=వీపుచేత, అయాసం యది=వెళ్లి ఉన్నట్లయితే, భర్తుః=భర్తయొక్క, అఙ్కగతా సతీ=సమీపమునం దున్న దాననై, అద్య=ఈనాడు, ఏవమ్=ఇట్లు, న అనుశోచేయమ్=దుఃఖించెడిదానను కాను.

తా. అల్పబుద్ధినైన నేను హనుమంతుని మాట వినలేదు. రాముడు బలము చూపి నన్ను జయించుకొనకపోయినను నేను ఆనాడు హనుమంతుని వీపుమీద ఎక్కి వెళ్లి ఉన్నచో భర్త సమీపము చేరిన నేను నేడు ఈ విధముగా దుఃఖించేదానను కాను. 55,56

మూ. మన్యే తు హృదయం తస్యాః కౌసల్యాయాః ఫలిష్యతి,
ఏకపుత్రా యదా పుత్రం వినష్టం శ్రోష్యతే యుధి. 57

ప్ర. అ. ఏకపుత్రా=ఒకే పుత్రుడు గల ఆమె, యదా=ఎప్పుడు, పుత్రమ్=పుత్రుణ్ణి, యుధి=యుద్ధమునందు, వినష్టమ్=మరణించినవానినిగా, శ్రోష్యతే=వినగలదో అప్పుడు, తస్యాః=ఆ, కౌసల్యాయాః=కౌసల్యయొక్క, హృదయమ్=హృదయము, ఫలిష్యతి=బ్రద్దలైపోవును అని, మన్యే=తలచుచున్నాను.

తా. యుద్ధములో తన పుత్రుడు మరణించినా డని వినగానే ఒకే పుత్రుడు గల కౌసల్య గుండె బ్రద్దలైపోవు నని అనుకొనెదను. 57

మూ. సా హి జన్మ చ బాల్యం చ యౌవనం చ మహాత్మనః,
ధర్మకార్యాణి రూపం చ రుదతీ సంస్మరిష్యతి. 58

ప్ర. అ. సా=ఆమె, రుదతీ=ఏడ్చుచున్నదై, మహాత్మనః=మహాత్ముడైన రామునియొక్క, జన్మ చ=జన్మను, బాల్యం చ=బాల్యమును, యౌవనం చ=యౌవనమును, ధర్మకార్యాణి=ధర్మకృత్యములను, రూపం చ=రూపమును, సంస్మరిష్యతి=స్మరించగలదు.

తా. ఆమె ఏడ్చుచు మహాత్ముడైన రాముని జన్మ, బాల్యము, యౌవనము, ఆతడు చేసిన ధర్మకృత్యములు, రూపము - వీటిని గూర్చి స్మరించగలదు.58

మూ. నిరాశా నిహతే పుత్రే దత్త్వా శ్రాద్ధమచేతనా,
అగ్నిమావేక్ష్యతే నూనమాపో వాపి ప్రవేక్ష్యతి. 59

ప్ర. అ. పుత్రే=పుత్రుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, నిరాశా=ఆశ లేనిదై, అచేతనా=స్పృహ లేనిదై, శ్రాద్ధమ్=శ్రాద్ధమును, దత్త్వా=ఇచ్చి, నూనమ్=నిశ్చయముగా, అగ్నిమ్=అగ్నిని, ఆవేక్ష్యతే=ప్రవేశించగలదు, ఆపః=జలమును, ప్రవేక్ష్యతి వాపి=ప్రవేశించగలదు.

తా. పుత్రుడు మరణించుటచే నిరాశురాలై ఆమె శ్రాద్ధమును ఇచ్చి, స్మృతి తప్పినదై, అగ్నిలోనైనా ప్రవేశించును లేదా జలములో దుముకును.59

మూ. ధిగస్తు కుబ్జామసతీం మన్థరాం పాపనిశ్చయామ్,
యన్నిమిత్తమిమం శోకం కౌసల్యా ప్రతిపత్స్యతే. 60

ప్ర. అ. కౌసల్యా=కౌసల్య, యన్నిమిత్తమ్=ఎవతె నిమిత్తముగా గల, ఇమమ్=ఈ, శోకమ్=శోకమును, ప్రతిపత్స్యతే=పొందగలదో అట్టి, అసతీమ్=చెడ్డది, పాపనిశ్చయామ్=పాపనిశ్చయము గలది అయిన, కుబ్జామ్=గూనుదైన, మన్థరామ్=మంథరను గూర్చి, ధిక్=నింద, అస్తు=అగుగాక.

తా. గూనుది, పాపనిశ్చయము గలది అయిన మంథర ఛీ ! ఎంత చెడ్డది ! ఆమె మూలముననే కదా కౌసల్యకు ఇంత శోకము కలుగ నున్నది.60

మూ. ఇత్యేవం మైథిలీం దృష్ట్వా విలపన్తీం తపస్వినీమ్,
రోహిణీమివ చన్ద్రేణ వినా గ్రహవశం గతామ్. 61
ఏతస్మిన్నన్తరే తస్య అమాత్యః శీలవాన్ శుచిః,
సుపార్శ్వో నామ మేధావీ రావణం రక్షసాం వరమ్, 62
నివార్యమాణః సచివైరిదం వచనమబ్రవీత్.

ప్ర. అ. ఇత్యేవమ్=ఉట్లు, విలపన్తీమ్=విలపించుచున్న, తపస్వినీమ్=దీనురాలైన, చన్ద్రేణ వినా=చంద్రుడు లేకుండా, గ్రహవశమ్=అంగారకగ్రహమునకు వశమును, గతామ్=పొందిన, రోహిణీమివ=రోహిణి వలె ఉన్న, మైథిలీమ్=సీతను,

దృష్ట్వా=చూచి, ఏతస్మిన్=ఈ, అన్తరే=అవకాశమునందు, తస్య=రావణునియొక్క, అమాత్యః=మంత్రి, శీలవాన్=మంచి శీలము గలవాడు, శుచిః=శుద్ధుడు, మేధావీ=మేధ గలవాడు అయిన, సుపార్శ్వో నామ=సుపార్శ్వుడనువాడు, సచివైః=ఇతరమంత్రులచే, నివార్యమాణః=నివారింపబడుచు, రక్షసామ్=రాక్షసులలో, వరమ్=శ్రేష్ఠుడైన, రావణమ్=రావణుని గూర్చి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఈ విధముగా విలపించుచు దీనురాలైన ఆ సీత చంద్రుడు లేని సమయమునందు అంగారక గ్రహమునకు వశమైన రోహిణి వలె ఉండెను. ఇంతలో ఆ రావణుని అమాత్యుడు, మంచి శీలముగలవాడు, శుద్ధమైన నడవడిక గలవాడు, మేధావి అయిన సుపార్శ్వుడు అట్టి సీతను చూచి, ఏమీ మాటలాడవద్దని ఇతరులైన సచివులు నివారించుచున్నను, రాక్షసప్రభువైన రావణునితో ఇట్లు పలికెను. 61, 62

మూ. కథం నామ దశగ్రీవ సాక్షాద్వైశ్రవణానుజ, 63
హన్తుమిచ్ఛసి వైదేహీం క్రోధాద్ధర్మమపాస్య చ.

ప్ర. అ. సాక్షాత్=సాక్షాత్తు, వైశ్రవణానుజ=కుబేరుని తమ్ముడవైన, దశగ్రీవ=ఓ! రావణా! క్రోధాత్=క్రోధమువలన, ధర్మమ్=ధర్మమును, అపాస్య=విడచి, వైదేహీమ్=సీతను, హన్తుమ్=చంపుటకు, కథమ్=ఎట్లు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. రావణా! నీవు సాక్షాత్తు కుబేరుని తమ్ముడవు. అట్టి నీవు క్రోధముచేత ధర్మమును విడచి సీతను చంపవలె నని ఎట్లు కోరుచున్నావు?

మూ. వేదవిద్యావ్రతస్నాతః స్వకర్మనిరతస్తథా, 64
స్త్రియః కస్మాద్వధం వీర మన్యసే రాక్షసేశ్వర.

ప్ర. అ. వీర=వీరుడా!, రాక్షసేశ్వర=రాక్షసరాజా! వేదవిద్యావ్రతస్నాతః=వేదవిద్యలను అభ్యసించుటకై గ్రహించిన బ్రహ్మచర్యవ్రతమును పూర్తిచేసికొన్నవాడవు, తథా=మరియు, స్వకర్మనిరతః=గృహస్థుల అగ్నిహోత్రాదికర్మలయందు ఆసక్తి గలవాడవు అయిన నీవు, కస్మాత్=ఏ కారణమువలన, స్త్రియః=స్త్రీయొక్క, వధమ్=వధను, మన్యసే=తలచుచున్నావు.?

తా. వీరుడవైన రాక్షసరాజా! వేదవిద్యాభ్యాసము నిమిత్తము గ్రహింపబడిన బ్రహ్మచర్యాశ్రమము ముగించుకొని అగ్నిహోత్రము మొదలైన గృహస్థధర్మములను శ్రద్ధగా ఆచరించుచున్న నీవు స్త్రీని చంపవలె నని ఎందుకు కోరుచున్నావు ?

మూ. మైథిలీం రూపసంపన్నాం ప్రత్యవేక్షస్వ పార్థివ, 65
తస్మిన్నేన సహాస్మాభిరాహవే క్రోధముత్సృజ.

ప్ర. అ. పార్థివ=రాజా!, రూపసంపన్నామ్=సౌందర్యవంతురాలైన, మైథిలీమ్=సీతను, ప్రత్యవేక్షస్వ=నిరీక్షించుము, అస్మాభిః సహ=మాతో కూడ కలిసి, ఆహవే=యుద్ధమునందు, క్రోధమ్=కోపమును, తస్మిన్నేవ=ఆ రాముని యందే, ఉత్సృజ=విడువుము.

తా. రాజా! సౌందర్యవంతురాలైన సీతను ఏమీ చేయకుము. మాతో కలిసి నీ కోపమును యుద్ధములో ఆ రాముని పైననే చూపుము. 65

మూ. అభ్యుత్థానం త్వమద్యైవ కృష్ణపక్షచతుర్దశీమ్, 66
కృత్వా నిర్యాహ్యమావాస్యాం విజయాయ బలైర్వృతః.

ప్ర. అ. త్వమ్=నీవు, అద్యైవ=నేడే, కృష్ణపక్షచతుర్దశీమ్=కృష్ణపక్షచతుర్దశిని, అభ్యుత్థానమ్=యుద్ధసంనాహమును, కృత్వా=చేసి, బలైః=సేనలతో, వృతః=కూడినవాడవై, అమావాస్యామ్=అమావాస్యను, విజయాయ=విజయముకొరకు, నిర్యాహి=బయలుదేరుము.

తా. ఈనాడే కృష్ణపక్షచతుర్దశి. నేడు యుద్ధసన్నాహము ప్రారంభించి, సేనాసమేతుడవై రేపు అమావాస్యనాడు విజయముకొరకు బయలుదేరుము.66

మూ. శూరో ధీమాన్ రథీ ఖడ్గీ రథప్రవరమాస్థితః, 67
హత్వా దాశరథిం రామం భవాన్ ప్రాప్స్యసి మైథిలీమ్.

ప్ర. అ. శూరః=శూరుడవు, ధీమాన్=బుద్ధిమంతుడవు, రథీ=రథికుడవు, ఖడ్గీ=ఖడ్గధారివి అయిన, భవాన్=నీవు, రథప్రవరమ్=శ్రేష్ఠమైన రథమును, ఆస్థితః=అధిష్ఠించినవాడవై, దాశరథిమ్=దశరథకుమారుడైన, రామమ్=రాముణ్ణి, హత్వా=చంపి, మైథిలీమ్=సీతను, ప్రాప్స్యసి=పొందగలవు.

తా. శూరుడవు, బుద్ధిమంతుడవు, రథికుడవు, ఖడ్గధారివి అయిన నీవు శ్రేష్ఠమైన రథము నెక్కి వెళ్లి, దశరథపుత్రుడైన రాముణ్ణి చంపి సీతను పొందగలవు. 67

మూ. స తద్దురాత్మా సుహృదా నివేదితం
వచః సుధర్మ్యం ప్రతిగృహ్య రావణః,
గృహం జగామాథ తతశ్చ వీర్యవాన్
పునః సభాం చ ప్రయయౌ సుహృద్వృతః. 68

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ద్వినవతితమః సర్గః.

ప్ర. అ. దురాత్మా=దురాత్ముడైన, రావణః=రావణుడు, సుహృదా=స్నే

హితునిచేత, నివేదితమ్=తెలుపబడిన, సుధర్మ్యమ్=చాల ధర్మసంమతమైన, వచః=వచనమును, ప్రతిగృహ్య=స్వీకరించి, గృహమ్=గృహమును గూర్చి, జగామ=వెళ్లెను. అథ=అటు పిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన ఆతడు, సుహృద్వృతః=స్నేహితులతో కూడినవాడై, తతః=అక్కడినుండి, పునః=మరల, సభాం చ=సభను గూర్చి కూడ, ప్రయయౌ=వెళ్లెను.

తా. దురాత్ముడైన రావణుడు స్నేహితుడు చెప్పిన ధర్మసంమతములైన ఆ మాటలు అంగీకరించి ఇంటికి వెళ్లెను. పిమ్మట వీర్యవంతుడైన ఆ రావణుడు స్నేహితులతో కూడి అక్కడినుండి మరల సభకు వెళ్లెను. 68

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో తొంబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రినవతితమః సర్గః

[రాముడు రాక్షససేనను సంహరించుట.]

మూ. స ప్రవిశ్య సభాం రాజా దీనః పరమదుఃఖితః,
నిషసాదాసనే ముఖ్యే సింహః క్రుద్ధ ఇవ శ్వసన్. 1

ప్ర. అ. దీనః=దీనుడు, పరమదుఃఖితః=మిక్కిలి దుఃఖితుడు అయిన, సః రాజా=ఆ రాజు, సభామ్=సభను, ప్రవిశ్య=ప్రవేశించి, క్రుద్ధః=కోపించిన, సింహః ఇవ= సింహము వలె, శ్వసన్=నిట్టూర్చుచు, ముఖ్యే=ముఖ్యమైన, ఆసనే=ఆసనమునందు, నిషసాద=కూర్చుండెను.

తా. చాల దుఃఖితుడై దీనుడై ఉన్న ఆ రాజు సభలో ప్రవేశించి, కోపించిన సింహము వలె నిట్టూర్చుచు సింహాసనముమీద కూర్చుండెను. 1

మూ. అబ్రవీచ్చ స తాన్ సర్వాన్ బలముఖ్యాన్ మహాబలః,
రావణః ప్రాఞ్జలిర్వాక్యం పుత్రవ్యసనకర్శితః. 2

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, పుత్రవ్యసనకర్శితః=పుత్రశోకముచేత కృశింపచేయబడిన, సః రావణః=ఆ రావణుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి గలవాడై, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, బలముఖ్యాన్=సేనలో ముఖ్యులైనవారిని గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీచ్చ=పలికెను.

తా. పుత్రశోకముచేత కృశింపచేయబడిన గొప్ప బలము గల ఆ రావణుడు సేనానాయకులతో, అంజలి ఘటించి ఇట్లు పలికెను. 2

మూ. సర్వే భవన్తః సర్వేణ హస్త్యశ్వేన సమావృతాః,
నిర్యాన్తు రథసంఘైశ్చ పాదాతైశ్చోపశోభితాః. 3

ప్ర. అ. సర్వే=సమస్తమైన, భవన్తః=మీరు, సర్వేణ=సమస్తమైన, హస్త్యశ్వేన=ఏనుగులతోను గుఱ్ఱములతోను, సమావృతాః=కూడినవారై, రథసంఘైశ్చ=రథసముదాయములచేతను, పాదాతైశ్చ=కాలిబంట్లతోను, ఉపశోభితాః=ప్రకాశింపచేయబడినవారై, నిర్యాన్తు=బయలుదేరి వెళ్లెదరుగాక.

తా. మీరందరూ సమస్తమైన గజసేనతోను, అశ్వసేనతోను కూడినవారై, రథముల సముదాయములచేత, కాలిబంట్లచేత ప్రకాశింపచేయబడినవారై బయలుదేరి

వెళ్లుడు. 3

మూ. ఏకం రామం పరిక్షిప్య సమరే హన్తుమర్హథ,
వర్షన్తః శరవర్షాణి ప్రావృట్ కాల ఇవామ్బుదాః. 4

ప్ర. అ. ఏకమ్=ఒక్క, రామమ్=రాముణ్ణి, పరిక్షిప్య=చుట్టుముట్టి, సమరే=యుద్ధమునందు, ప్రావృట్కాలే=వర్షకాలమునందు, అమ్బుదాః ఇవ=మేఘములు వలె, శరవర్షాణి=బాణవర్షములను, వర్షన్తః=వర్షించుచున్నవారై, హన్తుమ్=చంపుటకు, అర్హథ=తగియున్నారు.

తా. యుద్ధములో మీరు ఒక్క రాముణ్ణి మాత్రమే చుట్టుముట్టి వర్షకాలములో మేఘములు వలె, బాణవర్షములను వర్షించుచు ఆతనిని చంపుడు.

మూ. అథవాహం శరైస్తీక్ష్ణైర్భిన్నగాత్రం మహాహవే,
భవద్భిః శ్వో నిహన్తాస్మి రామం లోకస్య పశ్యతః. 5

ప్ర. అ. అథవా=లేదా, అహమ్=నేను, మహాహవే=మహాయుద్ధమునందు, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణములచేత, భవద్భిః=మీచేత, భిన్నగాత్రమ్=బ్రద్దలు కొట్టబడిన శరీరముగల, రామమ్=రాముణ్ణి, లోకస్య=లోకము, పశ్యతః=చూచు చుండగా, శ్వః=రేపు, నిహన్తాస్మి=చంపగలను.

తా. మహాయుద్ధములో వాడియైన బాణాలచేత మీరు ఆతని శరీరమును బ్రద్దలుకొట్టిన పిమ్మట రేపు నేను అందరూ చూచుచుండగా ఆతనిని చంపివేసెదను. 5

మూ. ఇత్యేతద్వాక్యమాదాయ రాక్షసేన్ద్రస్య రాక్షసాః,
నిర్యయుస్తే రథైః శీఘ్రైర్నానానీకైశ్చ సంయుతాః. 6

ప్ర. అ. తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, ఇతి=ఇట్లు, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, ఆదాయ=గ్రహించి, శీఘ్రైః=శీఘ్రములైన, రథైః=రథములతోను, నానానీకైశ్చ=అనేకసేనలతోను, సంయుతాః=కూడినవారై, నిర్యయుః=బయలుదేరిరి.

తా. రాక్షసులు రావణుని ఈ మాటలు విని, శీఘ్రముగా నడచు రథములతోను, అనేక విధములైన సైన్యములతోను కలిసి బయలుదేరిరి. 6

మూ. పరిఘాన్ పట్టిశాంశ్చైవ శరఖడ్గపరశ్వధాన్,
శరీరాన్తకరాన్ సర్వే చిక్షిపుర్వానరాన్ ప్రతి, 7
వానరాశ్చ ద్రుమాన్ శైలాన్ రాక్షసాన్ ప్రతి చిక్షిపుః.

ప్ర. అ. సర్వే=వారందరూ, శరీరాన్తకరాన్=శరీరములను అంత మొందించు, పరిఘాన్=పరిఘలను, పట్టిశాంశ్చైవ=పట్టిశములను, శరఖడ్గపరశ్వధాన్=బాణములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్లను, వానరాన్ ప్రతి=వానరులను గూర్చి, చిక్షిపుః=విసరిరి. వానరాశ్చ=వానరులు కూడ, రాక్షసాన్ ప్రతి=రాక్షసులను గూర్చి, ద్రుమాన్= వృక్షములను, శైలాన్=పర్వతములను, చిక్షిపుః=విసరిరి.

తా. ఆ రాక్షసు లందరూ వానరులమీదికి శరీరములను అంత మొందించు పరిఘలను, పట్టిశములను, బాణములను, ఖడ్గములను, గండ్రగొడ్డళ్లను, విసరిరి. వానరులు కూడ రాక్షసులమీదికి వృక్షములను, పర్వతములను విసరిరి. 7

మూ. స సంగ్రామో మహాభీమః సూర్యస్యోదయనం ప్రతి, 8
రక్షసాం వానరాణాం చ తుములః సమపద్యత.

ప్ర. అ. సూర్యస్య=సూర్యునియొక్క, ఉదయనం ప్రతి=ఉదయమును ప్రారంభించి, రక్షసామ్=రాక్షసులయొక్క, వానరాణాం చ=వానరులయొక్క, మహాభీమః=చాల భయంకరమైన, సః సంగ్రామః=ఆ యుద్ధము, తుములః=చాల వ్యాకులముగా, సమపద్యత=జరిగెను.

తా. సూర్యోదయసమయము మొదలు రాక్షసులకు వానరులకు మధ్య భయంకరమైన, వ్యాకులమైన ఆ యుద్ధము జరిగెను. 8

మూ. తే గదాభిశ్చ చిత్రాభిః ప్రాసైః ఖడ్గైః పరశ్వధైః, 9
అన్యోన్యం సమరే జఘ్నుస్తదా వానరరాక్షసాః.

ప్ర. అ. తే=ఆ, వానరరాక్షసాః=వానరులు రాక్షసులు, తదా=అప్పుడు, చిత్రాభిః=చిత్రములైన, గదాభిః=గదలతోను, ప్రాసైః=ప్రాసలతోను, ఖడ్గైః=ఖడ్గములతోను, పరశ్వధైః=గండ్రగొడ్డళ్లతోను, సమరే=యుద్ధమునందు, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నుః=కొట్టుకొనిరి.

తా. యుద్ధములో ఆ వానరులు, రాక్షసులూ కూడ పరస్పరము చిత్రములైన గదలతోను, ప్రాసలతోను, ఖడ్గములతోను, గండ్రగొడ్డళ్లతోను కొట్టుకొనిరి. 9

మూ. ఏవం ప్రవృత్తే సంగ్రామే హ్యద్భుతం సుమహద్రజః, 10
రక్షసాం వానరాణాం చ శాన్తం శోణితవిస్రవైః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, సంగ్రామే=యుద్ధము, ప్రవృత్తే=ప్రారంభమైనదగుచుండగా, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, సుమహత్=చాల గొప్పదైన, రజః=పరాగము, రక్షసామ్=రాక్షసులయొక్క, వానరాణాం చ=వానరులయొక్క, శోణితవిస్రవైః=రక్తస్రావములచేత, శాన్తమ్=శాంతించినది.

తా. యుద్ధము ఈ విధముగా ప్రారంభము కాగా ఆశ్చర్యకరమైన చాల అధికమైన పరాగము వానరులయొక్క రాక్షసులయొక్క రక్తస్రావములచేత శాంతించినది. 10

మూ. మాతఙ్గరథకూలాశ్చ వాజిమత్స్యా ధ్వజద్రుమాః, 11
శరీరసంఘాటవహాః ప్రసస్రుః శోణితాపగాః.

ప్ర. అ. మాతఙ్గరథకూలాః చ=ఏనుగులు రథములు ఒడ్లుగా గలవి, వాజిమత్స్యాః=గుఱ్ఱములు మత్స్యములుగా గలవి, ధ్వజద్రుమాః=ధ్వజములు వృక్షములుగా గలవి, శరీరసంఘాటవహాః=శరీరము లను కట్టుతెప్పలను వహించుచున్నవి అయిన, శోణితాపగాః=రక్తనదులు, ప్రసస్రుః=స్రవించినవి.

తా. ఏనుగులు, రథములు ఒడ్లుగా గలవి, గుఱ్ఱములు మత్స్యములుగా గలవి, ధ్వజములే వృక్షములుగా గలవి అయిన రక్తనదులు ప్రవహించినవి. వాటిలో శరీరము లను తెప్పలు కొట్టుకొనిపోవుచుండెను. 11

మూ. తతస్తే వానరాః సర్వే శోణితౌఘపరిప్లుతాః, 12
ధ్వజవర్మరథానశ్వాన్నానాప్రహరణాని చ,
ఆప్లుత్యాప్లుత్య సమరే వానరేన్ద్రా బభఞ్జిరే. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరాః= వానరులు, శోణితౌఘపరిప్లుతాః=రక్తసముదాయముచేత పూయబడిరి. సమరే= యుద్ధమునందు, వానరేన్ద్రాః=వానరనాయకులు, ధ్వజవర్మరథాన్=ధ్వజములను, కవచములను, రథములను, అశ్వాన్=గుఱ్ఱములను, నానాప్రహరణాని చ=అనేకములైన ఆయుధములను, ఆప్లుత్య ఆప్లుత్య=ఎగిరిఎగిరి, బభఞ్జిరే=విరిచిరి.

తా. అప్పుడు ఆ వానరు లందరు రక్తముతో తడిసి పోయిరి. వానరనాయకులు ఎగిరి ఎగిరి, ఆయుద్ధములో ధ్వజములను, కవచములను, రథములను, అశ్వములను, అనేకవిధములైన ఆయుధములను విరచిరి. 12, 13

మూ. కేశాన్ కర్ణలలాటం చ నాసికాశ్చ ప్లవంగమాః,
రక్షసాం దశనైస్తీక్ష్ణైర్నఖైశ్చాపి వ్యకర్తయన్. 14

ప్ర. అ. ప్లవంగమాః=వానరులు, తీక్ష్ణైః=వాడియైన, దశనైః=దంతములచేత, నఖైశ్చాపి=గోళ్లచేత, రక్షసామ్=రాక్షసులయొక్క, కేశాన్=కేశములను, కర్ణలలాటాంశ్చ=చెవులను లలాటములను, నాసికాశ్చాపి=ముక్కులను, వ్యకర్తయన్= ఛేదించిరి.

తా. వానరులు వాడియైన దంతాలతోను, గోళ్లతోను, రాక్షసుల

కేశములను, చెవులను, నుదుళ్లను, ముక్కులను ఖండించివేసిరి. 14

మూ. ఏకైకం రాక్షసం సంఖ్యే శతం వానరపుంగవాః,
అభ్యధావన్త ఫలినం వృక్షం శకునయో యథా. 15

ప్ర. అ. సంఖ్యే=యుద్ధమునందు, ఏకైకమ్=ఒక్కొక్క, రాక్షసమ్=రాక్షసుణ్ణి, శతమ్=నూరుగురు, వానరపుంగవాః=వానరశ్రేష్ఠులు, ఫలినమ్=ఫలములుగల, వృక్షమ్=వృక్షమును, శకునయో యథా=పక్షులు వలె, అభ్యధావన్త=ఎదురుగా పరుగెత్తి వెళ్లిరి.

తా. ఫలములతో నిండిన చెట్టుమీదికి పక్షులు వెళ్లినట్లు, ఆ యుద్ధములో ఒక్కొక్క రాక్షసునిమీదికి నూరుగురు చొప్పున వానరశ్రేష్ఠులు పరుగెత్తివెళ్లిరి.15

మూ. తదా గదాభిర్గుర్వీభిః ప్రాసైః ఖడ్గైః పరశ్వధైః,
నిర్జఘ్నుర్వానరాన్ ఘోరాన్ రాక్షసాః పర్వతోపమాః. 16

ప్ర. అ. తదా=అప్పుడు, పర్వతోపమాః=పర్వతములతో సమానులైన, రాక్షసాః=రాక్షసులు, గుర్వీభిః=పెద్దవైన, గదాభిః=గదలచేతను, ప్రాసైః=ప్రాసలచేతను, ఖడ్గైః=ఖడ్గములచేతను, పరశ్వధైః=గండ్రగొడ్డళ్ళచేతను, ఘోరాన్=భయంకరులైన, వానరాన్=వానరులను, నిర్జఘ్నుః=కొట్టిరి.

తా. అప్పుడు పర్వతముల వంటి ఆ రాక్షసులు భయంకరులైన వానరులను పెద్ద గదలతోను, ప్రాసలతోను, ఖడ్గములతోను, గండ్రగొడ్డళ్లతోను కొట్టిరి. 16

మూ. రాక్షసైర్వధ్యమానానాం వానరాణాం మహాచమూః,
శరణ్యం శరణం యాతా రామం దశరథాత్మజమ్. 17

ప్ర. అ. రాక్షసైః=రాక్షసులచేత, వధ్యమానానామ్=చంపబడుచున్న, వానరాణామ్=వానరులయొక్క, మహాచమూః=మహాసేన, శరణ్యమ్=శరణాగతరక్షకుడైన, దశరథాత్మజమ్=దశరథకుమారుడైన, రామమ్=రాముణ్ణి, శరణమ్=రక్షకునిగా, యాతా=పొందినది.

తా. రాక్షసులు చంపివేయుచుండగా వానరుల ఆ మహాసేన శరణాగతరక్షకుడైన రాముణ్ణి శరణుజొచ్చినది. 17

మూ. తతో రామో మహాతేజా ధనురాదాయ వీర్యవాన్,
ప్రవిశ్య రాక్షసం సైన్యం శరవర్షం వవర్ష హ. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామః=రాముడు, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్ర

హించి, రాక్షసమ్=రాక్షసులసంబంధమైన, సైన్యమ్=సైన్యమును, ప్రవిశ్య=ప్రవేశించి, శరవర్షమ్=బాణవర్షమును, వవర్ష హ=వర్షించెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సు పరాక్రమము గల రాముడు ధనస్సు గ్రహించి, రాక్షససైన్యములో ప్రవేశించి బాణవర్షమును కురిపించెను. 18

మూ. ప్రవిష్టం తు తదా రామం మేఘాః సూర్యమివామ్బరే,
నాధిజగ్ముర్మహాఘోరా నిర్దహన్తం శరాగ్నినా. 19

ప్ర. అ. తదా=అప్పుడు, ప్రవిష్టమ్=సైన్యములో ప్రవేశించిన, శరాగ్నినా=బాణాగ్నిచేత, నిర్దహన్తమ్=కాల్చివేయుచున్న, రామమ్=రాముణ్ణి, మహాఘోరాః=చాల భయంకరులైన ఆ రాక్షసులు, అమ్బరే=ఆకాశమునందు, మేఘాః=మేఘములు, సూర్యమివ=సూర్యుణ్ణి వలె, నాధిజగ్ముః=పొందలేదు.

తా. అప్పుడు సైన్యములో ప్రవేశించి బాణాగ్నిచేత కాల్చివేయుచున్న ఆ రాముణ్ణి, భయంకరులైన ఆ రాక్షసులు, ఆకాశమునందు మేఘములు సూర్యుణ్ణి సమీపించజాలనట్లు సమీపింపజాలకపోయిరి. 19

మూ. కృతాన్యేవ సుఘోరాణి రామేణ రజనీచరాః,
దదృశుస్తే న వై రామం కర్మాణ్యసుకరాణి తే. 20

ప్ర. అ. తే=ఆ, రజనీచరాః=రాక్షసులు, రణే=యుద్ధమునందు, రామేణ=రామునిచేత, కృతాని=చేయబడిన, సుఘోరాణి=చాల భయంకరములైన, అసుకరాణి=సులభముగా చేయ శక్యముకాని, రామస్య=రాముని యొక్క, కర్మాణ్యేవ=కర్మలను మాత్రమే, దదృశుః=చూచిరి.

తా. యుద్ధములో ఆ రాక్షసులు రాముడు చేసిన, ఇతరు లెవరూ చేయజాలని భయంకరములైన పనులను మాత్రమే చూడగల్గిరి. చేయబడుచున్నవాటిని మాత్రము చూడజాలకపోయిరి. 20

మూ. చాలయన్తం మహాసైన్యం విధమన్తం మహారథాన్,
దదృశుస్తే న వై రామం వాతం వనగతం యథా. 21

ప్ర. అ. తే=వాళ్లు, మహాసైన్యమ్=మహాసైన్యమును, చాలయన్తమ్=కదల్చివేయుచున్న, మహారథాన్=మహారథములను, విధమన్తమ్=ఎగురగొట్టివేయుచున్న, రామమ్=రాముణ్ణి, వనగతమ్=వనములో ఉన్న, వాతం యథా=వాయువును వలె, న దదృశుః=చూడలేదు.

తా. మహాసైన్యము నూపివేయుచు, మహారథములను ఎగురగొట్టివేయుచున్న ఆ రాముణ్ణి వనములో ఉన్న వాయువును వలె ఆ రాక్షసులు

చూడజాలకపోయిరి. 21

మూ. ఛిన్నం భిన్నం శరైర్దగ్ధం ప్రభిన్నం శస్త్రపీడితమ్,
బలం రామేణ దదృశుర్న రామం శీఘ్రకారిణమ్. 22

ప్ర. అ. రామేణ=రామునిచేత, శరైః=బాణములచేత, ఛిన్నమ్=ఛేదించబడిన, భిన్నమ్=బ్రద్దలుకొట్టబడిన, శస్త్రపీడితమ్=ఆయుధములచేత పీడింపబడిన, బలమ్=సైన్యమును, దదృశుః=చూచిరి. శీఘ్రకారిణమ్=శీఘ్రముగా చేయు, రామమ్=రాముణ్ణి, న=చూడలేదు.

తా. ఆ రాముడు బాణములచేత ఛేదించి, బ్రద్దలుకొట్టి, కాల్చివేసి, ముక్కలుచేసి, ఆయుధములచేత పీడించిన సైన్యమును మాత్రమే వారు చూచుచుండిరి గాని శీఘ్రముగా పనులు చేయు రాముణ్ణి చూడజాలకపోయిరి.

మూ. ప్రహరన్తం శరీరేషు న తే పశ్యన్తి రాఘవమ్,
ఇన్ద్రియార్థేషు తిష్ఠన్తం భూతాత్మానమివ ప్రజాః. 23

ప్ర. అ. శరీరేషు=శరీరములయందు, ప్రహరన్తమ్=కొట్టుచున్న, రాఘవమ్=రాముణ్ణి, తే=వారు, ఇన్ద్రియార్థేషు=ఇంద్రియవిషములయందు, తిష్ఠన్తమ్=ఉంటూన్న, భూతాత్మానమ్=జీవాత్మను, ప్రజాః ఇవ=ప్రజలు వలె, న పశ్యన్తి=చూడలేదు.

తా. ఆ రాక్షసులు తమ శరీరములపై కొట్టుచున్న రాముణ్ణి, ప్రజలు (మానవులు) ఇంద్రియముల ద్వారా భోగ్యవస్తువులను అనుభవించుచున్న జీవాత్మను చూడజాలనట్లుగా చూడలేకపోయిరి. 23

మూ. ఏష హన్తి గజానీకమేష హన్తి మహారథాన్,
ఏష హన్తి శరైస్తీక్ష్ణైః పదాతీన్వాజిభిః సహ, 24
ఇతి తే రాక్షసాః సర్వే రామస్య సదృశాన్ రణే,
అన్యోన్యం కుపితా జఘ్నుః సాదృశ్యాద్రాఘవస్య తు. 25

ప్ర. అ. ఏషః=ఇడిగో, గజానీకమ్=గజసేనను, హన్తి=చంపుచున్నాడు, ఏషః=ఇడిగో, మహారథాన్=గొప్ప రథములను, హన్తి=ధ్వంసముచేయుచున్నాడు, ఏషః=ఇడిగో, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరైః=బాణాలచేత, వాజిభిః సహ=అశ్వములతో కూడ, పదాతీన్=కాలిబంట్లను, హన్తి=చంపుచున్నాడు, ఇతి=ఇట్లు, సర్వే=సమస్తమైన, తే రాక్షసాః=ఆ రాక్షసులు, రణే=యుద్ధమునందు, రామస్య=రామునకు, సదృశాన్=సమానులను, చూచుచు, కుపితాః=కోపించినవారై, రాఘవస్య=రాముని యొక్క, సాదృశ్యాత్=సాదృశ్యమువలన, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నుః=కొట్టిరి.

తా. "ఇడిగో రాముడు, ఇక్కడ గజసేనలను చంపుచున్నాడు; ఇడిగో మహారథసైన్యములను చంపుచున్నాడు; ఇడిగో అశ్వసైన్యాలను, కాలిబంట్లను చంపుచున్నాడు" అని అనుచు రాక్షసులు భయభ్రాంతులై యుద్ధములో రాముని పోలిక ఉన్నవాళ్లనే చూచుచు, రాముని సాదృశ్య ముండుటచేత, అనగా తమ ఎదుట నున్నవాడు రాముడుగానే కనబడుటచేత, ఒకరి నొకరు, కోపముతో కొట్టుకొనిరి. 24, 25

మూ. న తే దదృశిరే రామం దహన్తమపి వాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాన్ధర్వేణ మహాత్మనా. 26

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన రామునిచేత, గాన్ధర్వేణ=గాంధర్వ మను, పరమాస్త్రేణ=పరమాస్త్రముచేత, మోహితాః=మోహింపచేయబడినవారై, తే=వారు, వాహినీమ్=సేనను, దహన్తమపి=కాల్చివేయుచున్నను, రామమ్=రాముణ్ణి, న దదృశిరే=చూడలేదు.

తా. మహాత్ముడైన రాముడు గాంధర్వాస్త్రముచేత మోహింపచేయుటచే ఆ రాక్షసులు ఒక మూల తమను కాల్చివేయుచున్నను ఆ రాముణ్ణి కనుగొనలేకపోయిరి. 26

మూ. తే తు రామసహస్రాణి రణే పశ్యన్తి రాక్షసాః,
పునః పశ్యన్తి కాకుత్స్థమేకమేవ మహాహవే. 27

ప్ర. అ. రణే=యుద్ధమునందు, తే రాక్షసాః=ఆ రాక్షసులు, రామసహస్రాణి=రాములయొక్క సహస్రములను. పశ్యన్తి=చూచిరి. మహాహవే=ఆ మహాయుద్ధమునందు, పునః=మరల, ఏకమ్=ఒక్క, కాకుత్స్థమేవ=రాముణ్ణిమాత్రమే, పశ్యన్తి=చూచుచుండిరి.

తా. ఆ మహాయుద్ధములో ఆ రాక్షసులకు వేలకొలది రాములు కనబడుచుండిరి. మరు క్షణములో ఒకే రాముడు కనబడుచుండెను. 27

మూ. భ్రమన్తీం కాఞ్చనీం కోటిం కార్ముకస్య మహాత్మనః,
అలాతచక్రప్రతిమాం దదృశుస్తే న రాఘవమ్. 28

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, మహాత్మనః=మహాత్ముడైన రాముని యొక్క, కార్ముకస్య=ధనస్సుయొక్క, భ్రమన్తీమ్=తిరుగుచున్న, కాఞ్చనీమ్=బంగారు వికారమైన, అలాతచక్రప్రతిమామ్=కొరవియొక్క చక్రముతో సమానమైన, కోటిమ్=అగ్రభాగమును, దదృశుః=చూచిరి. రాఘవమ్=రాముణ్ణి, న=చూడలేదు.

తా. ఆ రాక్షసులకు మహాత్ముడైన రాముని ధనస్సుయొక్క, అలాతచక్రము

వంటి తిరుగుచున్న బంగారు అగ్రభాగమే కనబడుచుండెను గాని రాముడు కనబడుటలేదు. (చివర నిప్పు ఉన్న కర్రను వేగముగా గుండ్రముగా త్రిప్పినప్పుడు ఎదురుగా నిలచి చూచువారికి అది గుండ్రని అగ్నివలె కనబడును. అలాత చక్ర మనగా అదే). 28

మూ. శరీరనాభి సత్త్వార్చిః శరారం నేమికార్ముకమ్,
జ్యాఘోషతలనిర్ఘోషం తేజోబుద్ధిగుణప్రభమ్, 29
దివ్యాస్త్రగుణపర్యన్తం నిఘ్నన్తం యుధి రాక్షసాన్,
దదృశూ రామచక్రం తత్కాలచక్రమివ ప్రజాః. 30

ప్ర. అ. ప్రజాః=ప్రజలు, శరీరనాభి=శరీర మను నాభి (మధ్యప్రదేశము) గలది, సత్త్వార్చిః=బల మను జ్వాలలు గలది, శరారమ్=బాణములను ఆకులు గలది, నేమికార్ముకమ్=చక్రాంతముగా ఉన్న ధనస్సు గలది, జ్యాఘోషతలనిర్ఘోషమ్=నారిధ్వని, తల (చేతికి నారిదెబ్బ తగలకుండగా కట్టుకొనిన చర్మము), ధ్వని గలది, తేజోబుద్ధిగుణప్రభమ్=తేజస్సు బుద్ధిగుణము అను కాంతి గలది, దివ్యాస్త్రగుణపర్యన్తమ్=దివ్యములైన అస్త్రముల గుణములు ప్రాంతములందు గలది అయిన, యుధి=యుద్ధమునందు, రాక్షసాన్=రాక్షసులను, నిఘ్నన్తమ్=చంపుచున్న, కాలచక్రమివ=కాలచక్రము వలె ఉన్న, రామచక్రమ్=రాము డనే చక్రమును, దదృశుః=చూచిరి.

తా. యుద్ధమునందు మృత్యుచక్రము వలె రాక్షసులను చంపుచున్న రాము డనే చక్రమును ప్రజలు చూచిరి. ఆ రామచక్రమునకు రాముని శరీరమే మధ్యభాగము. ధనస్సును గట్టిగా లాగుటచే అది రాముని నడుము చుట్టూ తిరిగి మండలముగా ఏర్పడగా దాని మధ్యనున్న రాముని దేహము చక్రనాభి (మధ్యభాగము) వలె ఉండెను. ఆతని బలమే జ్వాలలు. శరములే దాని ఆకులు. ధనస్సే చక్రాంతము. నారివలన, తలమువలన కలిగిన ధ్వనియే దాని ఘోషము. తేజస్సు, బుద్ధి అనునవే దాని కాంతి. దివ్యములైన అస్త్రముల గుణములు దాని చివరి భాగములు. అట్టి రామచక్రము ఆ సైన్యమునందు అంతటా తిరిగి రాక్షసులను కాల్చివేసె నని భావము. 29, 30

మూ. అనీకం దశసాహస్రం రథానాం వాతరంహసామ్,
అష్టాదశ సహస్రాణి కుఞ్జరాణాం తరస్వినామ్, 31
చతుర్దశ సహస్రాణి సారోహాణాం చ వాజినామ్,
పూర్ణే శతసహస్రే ద్వే రాక్షసానాం పదాతినామ్, 32
దివసస్యాష్టభాగేన శరైరగ్నిశిఖోపమైః,
హతాన్యేకేన రామేణ రక్షసాం కామరూపిణామ్. 33

ప్ర. అ. కామరూపిణామ్=స్వేచ్ఛానుసారము రూపములు ధరించు, రక్షసామ్=రాక్షసులకు సంబంధించిన, వాతరంహసామ్=వాయువేగము గల, రథానామ్=రథములయొక్క, దశసాహస్రమ్=పదివేల, అనీకమ్=సైన్యము, తరస్వినామ్=బలము గల, కుఞ్జరాణామ్=ఏనుగులయొక్క, అష్టాదశ=పదునెనిమిది, సహస్రాణి=వేలు, సారోహాణామ్=రౌతులతో కూడిన, వాజినామ్=గుఱ్ఱములయొక్క, చతుర్దశ=పదునాలుగు, సహస్రాణి=వేలు, పదాతినామ్=కాలిబంటులైన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, పూర్ణే=పరిపూర్ణమైన, ద్వే=రెండు, శతసహస్రే=శతముల సహస్రములు, ఏకేన=ఒక్క, రామేణ=రామునిచేత, దివసస్య=దినముయొక్క, అష్టభాగేన=ఎనిమిదవ భాగముచేత, అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలతో సమానములైన, శరైః=బాణములచేత, హతాని=చంపబడినవి.

తా. ఒక్క రాముడు ఒక జాము (మూడు గంటలు) కాలములో, ఇష్టానుసారము రూపములు ధరించగలిగిన రాక్షసులకు సంబంధించిన వాయువేగము గల పది వేల రథాలను, మంచి బలము గల పద్దెనిమిది వేల ఏనుగులను, రౌతులతో సహా పద్నాలుగు వేల గుఱ్ఱములను రెండు లక్షలమంది కాలిబంట్లను అగ్నిశిఖల వంటి బాణములచేత సంహరించెను 31-33

మూ. తే హతాశ్వా హతరథాః శాన్తా విమథితధ్వజాః,
అభిపేతుః పురీం లఙ్కాం హతశేషా నిశాచరాః. 34

ప్ర. అ. హతాశ్వాః=చంపబడిన అశ్వములు గలవారు, హతరథాః=నశింపచేయబడిన రథములు గలవారు, శాన్తాః=శాంతించినవారు, విమథితధ్వజాః=విరుగగొట్టబడిన ధ్వజములు గలవారు అయిన, హతశేషాః=చంపగామిగిలిన, తే నిశాచరాః=ఆ రాక్షసులు, లఙ్కాం పురీమ్=లంకానగరమును గూర్చి, అభిపేతుః=శీఘ్రముగా పరుగెత్తిరి.

తా. గుఱ్ఱములు చంపబడినవి. రథములు ధ్వస్తమైనవి. ధ్వజములు విరుగగొట్టబడినవి. ఇంక చంపగా మిగిలిన రాక్షసులు లంకానగరము వైపు పరుగెత్తిరి. 34

మూ. హతైర్గజపదాత్యశ్వైస్తద్బభూవ రణాజిరమ్,
ఆక్రీడభూమిః క్రుద్ధస్య రుద్రస్యేవ మహాత్మనః. 35

ప్ర. అ. హతైః=చంపబడిన, గజపదాత్యశ్వైః=గజములతోను, కాలిబంట్లతోను, అశ్వములతోను, తత్=ఆ, రణాజిరమ్=యుద్ధభూమి, క్రుద్ధస్య=కోపించిన, మహాత్మనః=మహాత్ముడైన, రుద్రస్య=రుద్రునియొక్క, ఆక్రీడభూమిః ఇవ=విహారస్థానము వలె, బభూవ=అయెను.

తా. చంపబడిన ఏనుగులతోను, కాలిబంట్లతోను, గుఱ్ఱములతోను, వ్యాప్తమై ఆ రణభూమి కోపించిన మహాత్ముడైన రుద్రుడు విహరించిన ప్రదేశము వలె ఆయెను. 35

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
సాధు సాధ్వితి రామస్య తత్కర్మ సమపూజయన్. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, దేవాః=దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, రామస్య=రామునియొక్క, తత్ కర్మ=ఆ పనిని, సాధు సాధు ఇతి=బాగు బాగు అని, సమపూజయన్=కొనియాడిరి.

తా. అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు రాముడు చేసిన ఆ పనిని "బాగు బాగు" అని కొనియాడిరి. 36

మూ. అబ్రవీచ్చ తదా రామః సుగ్రీవం ప్రత్యనన్తరమ్,
విభీషణం చ ధర్మాత్మా హనూమన్తం చ వానరమ్, 37
జామ్బవన్తం హరిశ్రేష్ఠం మైన్దం ద్వివిదమేవ చ,
ఏతదస్త్రబలం దివ్యం మమ వా త్ర్యమ్బకస్య వా. 38

ప్ర. అ. తదా=అప్పుడు, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, ప్రత్యనన్తరమ్=సమీపమునందున్న, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, విభీషణం చ=విభీషణుణ్ణి, వానరమ్=వానరుడైన, హనూమన్తం చ=హనుమంతుణ్ణి, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, హరిశ్రేష్ఠమ్=వానరశ్రేష్ఠుడైన మైన్దమ్=మైందుణ్ణి, ద్వివిదమేవ చ=ద్వివిదుణ్ణి గూర్చి, అబ్రవీచ్చ=పలికెను కూడ. ఏతత్=ఈ, దివ్యమ్=దివ్యమైన, అస్త్రబలమ్=అస్త్రప్రయోగబలము, మమ వా=నాకైన ఉన్నది, త్ర్యమ్బకస్య వా=ఈశ్వరునికైన ఉన్నది.

తా. అప్పుడు మహాత్ముడైన రాముడు దగ్గరనే ఉన్న సుగ్రీవునితోను, విభీషణునితోను, హనుమంతునితోను, జాంబవంతునితోను, వానరశ్రేష్ఠులైన మైంద ద్వివిదులతోను ఇట్లు పలికెను."ఇట్టి దివ్యమైన అస్త్ర ప్రయోగశక్తి నాకూ, ఈశ్వరునికి మాత్రమే ఉన్నది." 37, 38

మూ. నిహత్య తాం రాక్షసరాజవాహినీం
రామస్తదా శక్రసమో మహాత్మా,
అస్త్రేషు శస్త్రేషు జితక్లమశ్చ
సంస్తూయతే దేవగణైః ప్రహృష్టైః. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే త్రినవతితమః సర్గః.

ప్ర. అ. శక్రసమః=ఇంద్రునితో సమానుడు, మహాత్మా=మహాత్ముడు, అస్త్రేషు=అస్త్రములయందు, శస్త్రేషు=ఆయుధములయందు, జితక్లమః చ=జయించబడిన అలసట గల, రామః=రాముడు, తదా=అప్పుడు, తామ్=ఆ, రాక్షసరాజవాహినీమ్=రావణుని సైన్యమును, నిహత్య=చంపి, ప్రహృష్టైః=సంతోషించిన, దేవగణైః=దేవతలసముదాయములచేత, సంస్తూయతే=స్తుతింపబడెను.

తా. ఇంద్రునితో సమానుడు, మహాత్ముడు, అస్త్రములందు గాని, శస్త్రములందు గాని అలసట లేనివాడు అయిన, రావణసైన్యమును చంపివేసిన ఆ రాముణ్ణి దేవతాగణము లన్నీ సంతోషముతో స్తుతించెను. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్నవతితమః సర్గః

[రాక్షసస్త్రీలు విలపించుట.]

మూ. తాని నాగసహస్రాణి సారోహాణి చ వాజినామ్,
రథానాం త్వగ్నివర్ణానాం సధ్వజానాం సహస్రశః, 1
రాక్షసానాం సహస్రాణి గదాపరిఘయోధినామ్,
కాఞ్చనధ్వజచిత్రాణాం శూరాణాం కామరూపిణామ్, 2
నిహతాని శరైర్దీప్తైస్తప్తకాఞ్చనభూషణైః,
రావణేన ప్రయుక్తాని రామేణాక్లిష్టకర్మణా. 3

ప్ర. అ. రావణేన=రావణునిచేత, ప్రయుక్తాని=పంపబడిన, సారోహాణి=ఎక్కిన యోధులతో కూడిన, తాని=ఆ, నాగసహస్రాణి=వేలకొలది ఏనుగులు, వాజినామ్=గుఱ్ఱములయొక్క సహస్రములు, అగ్నివర్ణానామ్=అగ్నివంటి వర్ణము గల, సధ్వజానామ్=ధ్వజములతో కూడిన, సహస్రశః=వేలకొలది, రథానామ్=రథములయొక్క (సముదాయములు), గదాపరిఘయోధినామ్=గదలతోను పరిఘలతోను యుద్ధము చేయు, కాఞ్చనధ్వజచిత్రాణామ్=బంగారు ధ్వజములచేత చిత్రవర్ణము గల, శూరాణామ్=శూరులైన, కామరూపిణామ్=స్వేచ్ఛారూపము గల, రాక్షసానామ్=రాక్షసులయొక్క, సహస్రాణి=సహస్రములు, అక్లిష్టకర్మణా=శ్రమపడకుండపనిచేయు, రామేణ=రామునిచేత, దీప్తైః=ప్రకాశించుచున్న, తప్తకాఞ్చనభూషణైః=శుద్ధమైన బంగారము అలంకారముగా గల, శరైః=బాణములచేత, హతాని=చంపబడినవి.

తా. అలసటచెందకుండా పనులు చేయు రాముడు రావణుడు పంపిన వేల కొలది ఏనుగులను, వేలకొలది గుఱ్ఱములను, ఆ ఏనుగుల మీద గుఱ్ఱాల మీదా ఉన్న యోధులను, ధ్వజములు గల, అగ్నితుల్యమైన వర్ణములు గల, వేలకొలది రథములను, గదలతోను, పరిఘలతోను యుద్ధము చేయువారు, బంగారు ధ్వజములచేత చిత్రవర్ణము గలవారు, శూరులు, స్వేచ్ఛానుసారము రూపములు ధరించగలవారు అయిన వేలకొలది రాక్షసులను శుద్ధమైన బంగారముచే అలంకరించబడిన, ప్రజ్వలించుచున్న బాణాలచేత సంహరించెను.1-3

మూ. దృష్ట్వా శ్రుత్వా చ సంభ్రాన్తా హతశేషా నిశాచరాః,
రాక్షసీశ్చ సమాగమ్య దీనాశ్చిన్తాపరిప్లుతాః, 4

విధవా హతపుత్రాశ్చ క్రోశన్త్యో హతబాన్ధవాః,
రాక్షస్యః సహ సంగమ్య దుఃఖార్తాః పర్యదేవయన్. 5

ప్ర. అ. హతశేషాః=చంపబడగా మిగిలిన, నిశాచరాః=రాక్షసులు, దృష్ట్వా=చూచి, శ్రుత్వా చ=విని, సంభ్రాన్తాః=భయపడినవారై, దీనాః=దీనులై, చిన్తాపరిప్లుతాః=దుఃఖముతో నిండిన వారై, రాక్షసీః=రాక్షస స్త్రీలను, సమాగమ్య=పొంది, పర్యదేవయన్=ఏడ్చిరి. విధవాః=పోయిన భర్తలు గలవారు, హతపుత్రాశ్చ=చంపబడిన పుత్రులు గలవారు, హతబాన్ధవాః చ=చంపబడిన బంధువులు గలవారు అయిన, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, సహ సంగమ్య=కూడా కలసి, దుఃఖార్తాః=దుఃఖముచేత పీడింపబడిన వారై, (ఏడ్చిరి).

తా. చంపగా మిగిలిన రాక్షసులు రాక్షసవధను చూచి, విని, భయపడినవారై, తమ భార్యాదులను చేరి దీనులై, చింతాక్రాంతులై ఏడ్చిరి. భర్తలు మరణించినవారు, పుత్రులు పోయిన వారు, బంధువులను కోల్పోయిన వారు అయిన రాక్షసస్త్రీలు అందరూ ఒకచోట కలసి దుఃఖార్తలై విలపించిరి.4, 5

మూ. కథం శూర్పణఖా వృద్ధా కరాలా నిర్ణతోదరీ,
ఆససాద వనే రామం కన్దర్పసమరూపిణమ్. 6

ప్ర. అ. వృద్ధా=ముసలిది, కరాలా=వికృతురాలు, నిర్ణతోదరీ=వంగిన ఉదరము గలది అయిన, శూర్పణఖా=శూర్పణఖ, కన్దర్పసమరూపిణమ్=మన్మథునితో సమానమైన రూపము గల, రామమ్=రాముణ్ణి, వనే=వనమునందు, కథమ్=ఎట్లు, ఆససాద=పొందెను?

తా. వికృతమైన రూపము, లోతైన పొట్ట గల ఆ ముసలి శూర్పణఖ మన్మథునితో సమానమైన రూపము గల రాముని దగ్గరకు వనములో ఎట్లు వెళ్ళినదో ! 6

మూ. సుకుమారం మహాసత్త్వం సర్వభూతహితే రతమ్,
తం దృష్ట్వా లోకనిన్ద్యా సా హీనరూపా ప్రకామితా. 7

ప్ర. అ. లోకనిన్ద్యా=లోకముచేత నిందింపదగిన , హీనరూపా=చెడ్డ ఆకారము గల, సా=ఆమె, సుకుమారమ్=సుకుమారుడు, మహాసత్త్వమ్=గొప్ప బలము గలవాడు, సర్వభూతహితే=సమస్తప్రాణుల హితమునందు, రతమ్=ఆసక్తుడైన, తమ్=ఆ రాముణ్ణి, దృష్ట్వా=చూచి, (కథమ్=ఎట్లు), ప్రకామితా=కామము కలదైనది?

తా. అందరిచేత నిందింపదగిన, కురూపిణియైన ఆ శూర్పణఖ

సుకుమారుడు, మహాబలశాలి, సకలప్రాణులహితమునందు ఆసక్తి కలవాడు అయిన ఆ రాముణ్ణి చూచి ఎట్లు కామవంతురాలైనది! 7

మూ. కథం సర్వగుణైర్హీనా గుణవన్తం మహౌజసమ్,
సుముఖం దుర్ముఖీ రామం కామయామాస రాక్షసీ. 8

ప్ర. అ. సర్వగుణైః=అన్నిసద్గుణములతోను, హీనా=హీనురాలు, దుర్ముఖీ=చెడ్డ ముఖము గలది అయిన, రాక్షసీ=ఆ రాక్షసి, గుణవన్తమ్=మంచి గుణములు గల, సుముఖమ్=అందమైన ముఖము గల, రామమ్=రాముణ్ణి, కథమ్=ఎట్లు, కామయామాస=కోరెను.

తా. ఏ మంచిగుణాలూ లేని చెడ్డ ముఖము గల ఆ రాక్షసి సద్గుణవంతుడు, గొప్ప తేజస్సు గలవాడు, అందమైన ముఖము గలవాడు అయిన రాముణ్ణి ఎట్లు కోరినదో కదా! 8

మూ. జనస్యాస్యాల్పభాగ్యత్వాద్వలినీ శ్వేతమూర్ధజా,
అకార్యమపహాస్యం చ సర్వలోకవిగర్హితమ్, 9
రాక్షసానాం వినాశాయ దూషణస్య ఖరస్య చ,
చకారాప్రతిరూపా సా రాఘవస్య ప్రధర్షణమ్. 10

ప్ర. అ. వలినీ=ముడతలు గలది, శ్వేతమూర్ధజా=తెల్లని జుట్టు గలది, అప్రతిరూపా=తగని రూపము గలదీ అయిన ఆమె, అస్య జనస్య=ఈ జనముయొక్క, అల్పభాగ్యత్వాత్=అల్పమైన భాగ్యము కలిగి ఉండుటవలన, రాక్షసానామ్=రాక్షసులయొక్క, దూషణస్య=దూషణునియొక్క, ఖరస్య చ=ఖరునియొక్క, వినాశాయ=నాశము కొరకు, అకార్యమ్=చేయకూడనిది, అపహాస్యమ్=పరిహసింపదగినది, సర్వలోకవిగర్హితమ్=సమస్తలోకములచేత నింద్యము అయిన, రాఘవస్య=రామునియొక్క, ప్రధర్షణమ్=ఎదిరించుటను, చకార=చేసెను.

తా. ఒడలు నిండా ముడతలతో, తెల్లని జుట్టుతో చెడ్డ ఆకారము గల ఆ శూర్పణఖ మన అందరి దురదృష్టముచేతనూ, రాక్షసులు, ఖరదూషణులు మరణించుటకూ ఆ విధముగా చేయకూడని, హాస్యాస్పదమైన, సర్వలోకనింద్యమైన రామధర్షణము చేసినది. 9, 10

మూ. తన్నిమిత్తమిదం వైరం రావణేన కృతం మహత్,
వధాయ సీతా సానీతా దశగ్రీవేణ రక్షసా. 11

ప్ర. అ. తన్నిమిత్తమ్=ఆమెనిమిత్తము, రావణేన=రావణునిచేత, మహత్=గొప్పదైన, ఇదం వైరమ్=ఈ వైరము, కృతమ్=చేయబడినది. రక్షసా=రాక్షసుడైన,

దశగ్రీవేణ=రావణునిచేత, సా సీతా=ఆ సీత, వధాయ=వధకొరకే, ఆనీతా=తీసికొనిరాబడినది.

తా. రావణుడు ఆ శూర్పణఖమూలాన ఇంత గొప్ప వైరము పెట్టుకొన్నాడు. అతడు తన చావుకొరకే సీతను తెచ్చినాడు. 11

మూ. న చ సీతాం దశగ్రీవః ప్రాప్నోతి జనకాత్మజామ్,
బద్ధం బలవతా వైరమక్షయం రాఘవేణ చ. 12

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, జనకాత్మజామ్=జనకుని కుమార్తెయైన, సీతామ్=సీతను, న చ ప్రాప్నోతి=పొందడు. బలవతా=బలవంతుడైన, రాఘవేణ=రామునితో, అక్షయమ్=అనంతమైన, వైరమ్=వైరము, బద్ధమ్=కట్టబడినది.

తా. రావణుడు జనకాత్మజయైన సీతను పొందజాలడు కాని బలవంతుడైన రామునితో అంతము లేని వైరము పెట్టుకొన్నాడు. 12

మూ. వైదేహీం ప్రార్థయానం తం విరాధం ప్రేక్ష్య రాక్షసమ్,
హతమేకేన రామేణ పర్యాప్తం తన్నిదర్శనమ్. 13

ప్ర. అ. వైదేహీమ్=సీతను, ప్రార్థయానమ్=కోరుచున్నవాడు, ఏకేన=ఒక్క, రామేణ=రామునిచేత, హతమ్=చంపబడినవాడూ అయిన, రాక్షసమ్=రాక్షసుడైన, విరాధమ్=విరాధుణ్ణి, ప్రేక్ష్య=చూచి, తత్=ఆ, నిదర్శనమ్=నిదర్శనము, పర్యాప్తమ్=చాలును.

తా. సీతను కోరుటచే ఒక్క రామునిచేత చంపబడిన విరాధుణ్ణి చూచినచో ఆ నిదర్శనము చాలదా? 13

మూ. చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
నిహతాని జనస్థానే శరైరగ్నిశిఖోపమైః. 14

ప్ర. అ. జనస్థానే=జనస్థానమునందు, భీమకర్మణామ్=భయంకరమైన కర్మ గల, రక్షసామ్=రాక్షసులయొక్క, చతుర్దశ=పదునాలుగు, సహస్రాణి=సహస్రములు, అగ్నిశిఖోపమైః=అగ్ని జ్వాలలతో సమానములైన, శరైః=బాణములచేత, నిహతాని=చంపబడినవి.

తా. జనస్థానములో రాముడు అగ్నిజ్వాలల వంటి బాణాలతో, భయంకరమైన పనులుచేయు పదునాలుగు వేలమంది రాక్షసులను చంపివేసినాడు. 14

మూ. ఖరశ్చ నిహతః సంఖ్యే దూషణస్త్రిశిరాస్తథా,
శరైరాదిత్యసంకాశైః పర్యాప్తం తన్నిదర్శనమ్. 15

ప్ర. అ. సంఖ్యే=యుద్ధమునందు, ఆదిత్యసంకాశైః=సూర్యునితో సమానములైన, శరైః=బాణములచేత, ఖరశ్చ=ఖరుడు, నిహతః=చంపబడినాడు. దూషణః=దూషణుడు, తథా=మరియు, త్రిశిరాః=త్రిశిరస్సు చంపబడినారు. తత్=అది, పర్యాప్తమ్=సరిపోయిన, నిదర్శనమ్=నిదర్శనము.

తా. యుద్ధములో ఖరుడు, దూషణుడు త్రిశిరస్సు, సూర్యునివంటి బాణాలచేత చంపబడినారు. ఆ నిదర్శనమే చాలును. 15

మూ. హతో యోజనబాహుశ్చ కబన్ధో రుధిరాశనః,
క్రోధాన్నాదం నదన్ సోஉథ పర్యాప్తం తన్నిదర్శనమ్. 16

ప్ర. అ. అథ=మరియు, క్రోధాత్=కోపమువలన, నాదం నదన్=ధ్వనిచేయుచున్న, యోజనబాహుః = యోజనము పొడవైన బాహువులు గల, రుధిరాశనః=రక్తము ఆహారముగా గల, సః=ఆ, కబన్ధః=కబంధుడు, హతః=చంపబడినాడు. తత్=అది, పర్యాప్తమ్=చాలినంత, నిదర్శనమ్=నిదర్శనము.

తా. యోజనప్రమాణములైన బాహువులు గలవాడు, రక్తము ఆహారముగా గలవాడు అయిన, క్రోధముతో అరచుచున్న కబంధుడు చంపబడినాడు. ఈ నిదర్శనము చాలును. 16

మూ. జఘాన బలినం రామః సహస్రనయనాత్మజమ్,
వాలినం మేఘసంకాశం పర్యాప్తం తన్నిదర్శనమ్. 17

ప్ర. అ. రామః=రాముడు, బలినమ్=బలవంతుడు, సహస్రనయనాత్మజమ్=ఇంద్రుని పుత్రుడు, మేఘసంకాశమ్=మేఘముతో సమానుడూ అయిన, వాలినమ్=వాలిని, జఘాన=చంపినాడు. తత్=అది, పర్యాప్తమ్=చాలిన, నిదర్శనమ్=నిదర్శనము.

తా. మహాబలశాలీ, ఇంద్రుని కుమారుడూ, మేఘమువంటి పెద్ద శరీరము గలవాడు అయిన వాలిని రాముడు చంపినాడు. ఆ నిదర్శనమే చాలును. 17

మూ. ఋష్యమూకే వసంశ్చైవ దీనో భగ్నమనోరథః,
సుగ్రీవః ప్రాపితో రాజ్యం పర్యాప్తం తన్నిదర్శనమ్. 18

ప్ర. అ. ఋష్యమూకే=ఋష్యమూక పర్వతమునందు, వసన్=నివసించుచున్న, దీనః=దీనుడు, భగ్నమనోరథః=భగ్నములైన కోరికలు కలవాడు

అయిన, సుగ్రీవః=సుగ్రీవుడు, రాజ్యమ్=రాజ్యమును, ప్రాపితః=పొందించబడినాడు. తత్=అది, పర్యాప్తమ్=చాలిన, నిదర్శనమ్=నిదర్శనము.

తా. మనోరథములు భగ్నము కాగా దీనుడై ఋష్యమూకపర్వతముమీద నివసించుచున్న సుగ్రీవునకు రాజ్యము ఇవ్వబడినది. ఈ నిదర్శనము చాలును.

మూ. ధర్మార్థసహితం వాక్యం సర్వేషాం రక్షసాం హితమ్,
యుక్తం విభీషణేనోక్తం మోహాత్తస్య న రోచతే. 19

ప్ర. అ. ధర్మార్థసహితమ్=ధర్మార్థములతో కూడినది, సర్వేషామ్=సమస్తమైన, రక్షసామ్=రాక్షసులకు, హితమ్=హితము, యుక్తమ్=తగినదీ అయిన, విభీషణేన=విభీషణునిచేత, ఉక్తమ్=పలకబడిన, వాక్యమ్=వాక్యము, మోహాత్=అజ్ఞానమువలన, తస్య=ఆతనికి, న రోచతే=ఇష్టమగుటలేదు.

తా. విభీషణుడు చెప్పిన మాట ధర్మార్థసహితము. రాక్షసు లందరికీ హితము. కాని అజ్ఞానముచేత రావణుడు దానిని వినుటలేదు. 19

మూ. విభీషణవచః కుర్యాద్యది స్మ ధనదానుజః,
శ్మశానభూతా దుఃఖార్తా నేయం లఙ్కా భవిష్యతి. 20

ప్ర. అ. ధనదానుజః=రావణుడు, విభీషణవచః=విభీషణుని వచనమును, కుర్యాత్ స్మ యది=చేసినట్లయితే, ఇయమ్=ఈ, లఙ్కా=లంక, శ్మశానభూతా=శ్మశానమై, దుఃఖార్తా=దుఃఖపీడితమైనది, న భవిష్యతి=కాదు.

తా. రావణుడు విభీషణుడు చెప్పిన మాట విన్నచో ఈ లంక దుఃఖపీడితమై, శ్మశానమువలె అయి ఉండెడిది కాదు. 20

మూ. కుమ్భకర్ణం హతం శ్రుత్వా రాఘవేణ మహాబలమ్,
అతికాయం చ దుర్మర్షం లక్ష్మణేన హతం తదా, 21
ప్రియం చేన్ద్రజితం పుత్రం రావణో నావబుధ్యతే.

ప్ర. అ. తదా=అప్పుడు, మహాబలమ్=గొప్ప బలము గల, కుమ్భకర్ణమ్=కుమ్భకర్ణుణ్ణి, రాఘవేణ=రామునిచేత, హతమ్=చంపబడినవానినిగా, శ్రుత్వా=విని, దుర్మర్షమ్=ఎదిరింప శక్యముకాని, అతికాయమ్=అతికాయుణ్ణి, ప్రియం పుత్రమ్=ప్రియపుత్రుడైన, ఇన్ద్రజితమ్=ఇంద్రజిత్తును, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, హతమ్=చంపబడినవానినిగా, (శ్రుత్వా=విని), రావణః=రావణుడు, నావబుధ్యతే=తెలిసికొనుటలేదు.

తా. గొప్ప బలముగల కుంభకర్ణుణ్ణి రాముడు చంపివేసినట్లు, ఎదిరింప శక్యముకాని అతికాయుణ్ణి, ప్రియపుత్రుడైన ఇంద్రజిత్తునూ లక్ష్మణుడు

చంపివేసినట్లు విని కూడ రావణుడు తెలిసికొనజాలకున్నాడు. 21

మూ. మమ పుత్రో మమ భ్రాతా మమ భర్తా రణే హతః; 22
ఇత్యేష శ్రూయతే శబ్దో రాక్షసీనాం కులే కులే.

ప్ర. అ. మమ=నాయొక్క, పుత్రః=పుత్రుడు, రణే=యుద్ధమునందు, హతః=చంపబడినాడు. మమ=నాయొక్క, భ్రాతా=సోదరుడు (చంపబడినాడు). మమ=నాయొక్క, భర్తా=భర్త, (చంపబడినాడు), ఇతి=ఇట్లు, ఏషః=ఈ, రాక్షసీనామ్=రాక్షసస్త్రీలయొక్క, శబ్దః=ధ్వని, కులే కులే=ప్రతిగృహమునందు, శ్రూయతే=వినబడెను.

తా. యుద్ధములో నా పుత్రుడు చనిపోయినాడు; నా సోదరుడు చనిపోయినాడు; నా భర్త చనిపోయినాడు అని అనుచు రాక్షసస్త్రీల ఏడ్పు ప్రతి ఇంటిలోనూ వినబడుచుండెను. 22

మూ. రథాశ్చాశ్వాశ్చ నాగాశ్చ హతాః శతసహస్రశః, 23
రణే రామేణ శూరేణ హతాశ్చాపి పదాతయః.

ప్ర. అ. శూరేణ=శూరుడైన, రామేణ=రామునిచేత, రణే=యుద్ధమునందు, రథాశ్చ=రథములు, అశ్వాశ్చ=గుఱ్ఱములు, నాగాశ్చ=ఏనుగులు, శతసహస్రశః=వందలకొలది వేలకొలది, హతాః=చంపబడినవి. పదాతయశ్చాపి=కాలిబంటులు కూడ, హతాః=చంపబడిరి.

తా. శూరుడైన రాముడు యుద్ధములో వందలకొలది, వేలకొలది, రథాలను (రథికులను), గుఱ్ఱములను, ఏనుగులను చంపినాడు. కాలిబంటులను కూడ చంపినాడు. 23

మూ. రుద్రో వా యది వా విష్ణుర్మహేన్ద్రో వా శతక్రతుః, 24
హన్తి నో రామరూపేణ యది వా స్వయమన్తకః.

ప్ర. అ. రుద్రో వా=రుద్రుడో, యది వా=లేక, విష్ణుః=విష్ణువో, శతక్రతుః=నూరు యజ్ఞములు చేసిన, మహేన్ద్రో వా=మహేంద్రుడో, యది వా=లేక, స్వయమ్=స్వయముగా, అన్తకః=యముడో, రామరూపేణ=రాముని రూపముచేత, నః=మనలను, హన్తి=చంపుచున్నాడు.

తా. రుద్రుడో, విష్ణువో, నూరు యజ్ఞములు చేసిన దేవేంద్రుడో, లేదా సాక్షాత్తు యముడో రాముని రూపముతో వచ్చి మనలను చంపుచున్నాడు.24

మూ. హతప్రవీరా రామేణ నిరాశా జీవితే వయమ్, 25
అపశ్యన్త్యో భయస్యాన్తమనాథా విలపామహే.

ప్ర. అ. రామేణ=రామునిచేత, హతప్రవీరాః=చంపబడిన వీరులు గల, వయమ్=మనము, జీవితే=జీవితమునందు, నిరాశాః=ఆశ లేనివాళ్లమై, భయస్య=భయమునకు, అన్తమ్=అంతమును, అపశ్యన్త్యః=చూడనివారమై, అనాథాః=అనాథలమై, విలపామహే=విలపించుచున్నాము.

తా. రాముడు మహావీరుల నందరిని చంపివేయుటచేత మనము జీవితమునందు ఆశ లేని వాళ్లమై, భయమునకు అంతము కానక, అనాథలమై విలపించుచున్నాము. 25

మూ. రామహస్తాద్దశగ్రీవః శూరో దత్తమహావరః, 26
ఇదం భయం మహాఘోరం సముత్పన్నం న బుధ్యతే.

ప్ర. అ. శూరః=శూరుడు, దత్తమహావరః=ఇవ్వబడిన గొప్ప వరములు కలవాడు అయిన, దశగ్రీవః=రావణుడు, రామహస్తాత్=రాముని హస్తము నుండి, సముత్పన్నమ్=పుట్టిన, ఇదమ్=ఈ, మహాఘోరమ్=చాల ఘోరమైన, భయమ్=భయమును, న బుధ్యతే=తెలిసికొనుటలేదు.

తా. బ్రహ్మదేవునివలన గొప్ప వరములు పొందిన శూరుడైన రావణుడు రామునివలన కలిగిన చాల ఘోరమైన ఈ భయమును తెలిసికొనుటలేదు.26

మూ. తం న దేవా న గన్ధర్వా న పిశాచా న రాక్షసాః, 27
ఉపసృష్టం పరిత్రాతుం శక్తా రామేణ సంయుగే.

ప్ర. అ. రామేణ=రామునిచేత, సంయుగే=యుద్ధమునందు, ఉపసృష్టమ్=సమీపించబడిన, తమ్=ఆ రావణుణ్ణి, త్రాతుమ్=రక్షించుటకు, దేవాః=దేవతలు, న శక్తాః=సమర్థులు కారు, గన్ధర్వాః=గంధర్వులు, న=కారు, పిశాచాః=పిశాచులు, న=కారు, రాక్షసాః=రాక్షసులు, న=కారు.

తా. రామునితో యుద్ధానికి తలబడిన ఆ రావణుణ్ణి దేవతలు గాని, గంధర్వులు గాని, పిశాచులు గాని, రాక్షసులు గాని రక్షింపజాలరు. 27

మూ. ఉత్పాతాశ్చాపి దృశ్యన్తే రావణస్య రణే రణే, 28
కథయన్తి హి రామేణ రావణస్య నిబర్హణమ్.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, రణే రణే=ప్రతియుద్ధమునందు, ఉత్పాతాశ్చాపి=దుఃశకునములు కూడ, దృశ్యన్తే=చూడబడుచున్నవి. రామేణ=రామునిచేత, రావణస్య=రావణునియొక్క, నిబర్హణమ్=వధను, కథయన్తి హి=చెప్పుచున్నవి కదా?

తా. రావణునికి ఆ యా వీరులు యుద్ధానికి బయలుదేరినపుడు ఆ

ప్రతియుద్ధమునందూ అపశకునములు కనబడుచున్నవి. అవి రాముడు రావణుణ్ణి వధించగల డని చెప్పుచున్నవి కదా? 28

మూ. పితామహేన ప్రీతేన దేవదానవరాక్షసైః, 29
రావణస్యాభయం దత్తం మనుష్యేభ్యో న యాచితమ్.

ప్ర. అ. ప్రీతేన=సంతోషించిన, పితామహేన=బ్రహ్మదేవునిచేత, రావణస్య=రావణునకు, దేవదానవరాక్షసైః=దేవదానవరాక్షసులచేత, (నుండి), అభయమ్=అభయము, దత్తమ్=ఇవ్వబడినది. మనుష్యేభ్యః=మనుష్యులనుండి, న యాచితమ్=యాచింపబడలేదు.

తా. తపస్సుకు సంతోషించిన బ్రహ్మదేవుడు రావణునకు దేవదానవరాక్షసులనుండి అభయము ఇచ్చినాడు. కాని ఇతడు మనుష్యులనుండి అభయమును కోరలేదు. 29

మూ. తదిదం మానుషం మన్యే ప్రాప్తం నిఃసంశయం భయమ్, 30
జీవితాన్తకరం ఘోరం రక్షసాం రావణస్య చ.

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులకు, రావణస్య చ=రావణునకు, జీవితాన్తకరమ్=జీవితాంతమును చేసేది, ఘోరమ్=భయంకరము అయిన, మానుషమ్=మనుష్యసంబంధమైన, తత్ ఇదమ్=అట్టి, ఈ, భయమ్=భయము, ప్రాప్తమ్=ప్రాప్తించినది అని, మన్యే=తలచెదను (ము). నిఃసంశయమ్=సంశయములేదు.

తా. రాక్షసులకు రావణునకూ కూడ ప్రాణాంతకమైన ఆ మనుష్యునివలన కలిగే భయమే ఇప్పుడు వచ్చినది. సందేహము లేదు. 30

మూ. పీడ్యమానాస్తు బలినా వరదానేన రక్షసా, 31
దీప్తైస్తపోభిర్విబుధాః పితామహమపూజయన్.

ప్ర. అ. వరదానేన=వరదానముచేత, బలినా=బలవంతుడైన, రక్షసా=రావణునిచేత, పీడ్యమానాః=పీడింపబడుచున్న, విబుధాః=దేవతలు, దీప్తైః=ప్రకాశించుచున్న, తపోభిః=తపస్సులచేత, పితామహమ్=బ్రహ్మదేవుణ్ణి, అపూజయన్=పూజించిరి.

తా. వరములు పొందుటచేత అధికబలవంతుడైన రావణుడు పీడించగా దేవతలు అధికములైన తపస్సులచేత బ్రహ్మదేవుణ్ణి సంతోషపెట్టిరి. 31

మూ. దేవతానాం హితార్థాయ మహాత్మా వై పితామహః, 32
ఉవాచ దేవతాః సర్వా ఇదం తుష్టో మహద్వచః.

ప్ర. అ. తుష్టః=సంతోషించిన, మహాత్మా=మహాత్ముడైన, పితామహః=బ్రహ్మదేవుడు, దేవతానామ్=దేవతలయొక్క, హితార్థాయ=హితముకొరకు, సర్వాః=సమస్తమైన, దేవతాః=దేవతలను గూర్చి, ఇదమ్=ఈ, మహత్=గొప్ప, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. మహాత్ముడైన బ్రహ్మదేవుడు సంతోషించి దేవతల హితముకొరకై వారందరితో ఈ విధముగా ఉత్తమమైన వాక్యము పలికెను. 32

మూ. అద్యప్రభృతి లోకాంస్త్రీన్ సర్వే దానవరాక్షసాః, 33
భయేన ప్రావృతా నిత్యం విచరిష్యన్తి శాశ్వతమ్.

ప్ర. అ. అద్య ప్రభృతి=నేడు మొదల్కొని, సర్వే=సమస్తమైన, దానవరాక్షసాః=దానవులు, రాక్షసులూ, నిత్యమ్=ఎల్లపుడూ, భయేన=భయముతో, ప్రావృతాః=కూడినవారై, శాశ్వతమ్=శాశ్వతముగా, త్రీన్=మూడు, లోకాన్=లోకములను, విచరిష్యన్తి=సంచరించగలరు.

తా. నేడు మొదలు సమస్తమైన దానవులూ, రాక్షసులూ కూడ ఎల్లపుడూ భయపడుచు, మూడు లోకములలో సర్వదా తిరుగుచు ఉందురు.33

మూ. దైవతైస్తు సమాగమ్య సర్వైశ్చేన్ద్రపురోగమైః, 34
వృషధ్వజస్త్రిపురహా మహాదేవః ప్రసాదితః.

ప్ర. అ. ఇన్ద్రపురోగమైః=ఇంద్రుడు మొదలైన, సర్వైః=సమస్తమైన, దైవతైః=దేవతలచేత, సమాగమ్య=కలిసి, వృషధ్వజః=వృషభము ధ్వజమునందు గల, త్రిపురహా=మూడు పురములను సంహరించిన, మహాదేవః=పరమేశ్వరుడు, ప్రసాదితః=అనుగ్రహింపచేసికొనబడినాడు.

తా. ఇంద్రుడు మొదలైన దేవత లందరూ కలసి వృషభధ్వజుడు, త్రిపుర సంహారకుడు అయిన పరమేశ్వరుణ్ణి అనుగ్రహింపచేసికొనినారు. 34

మూ. ప్రసన్నస్తు మహాదేవో దేవానేతద్వచోఽబ్రవీత్, 35
ఉత్పత్స్యతి హితార్థం వో నారీ రక్షఃక్షయావహా.

ప్ర. అ. ప్రసన్నః=ప్రసన్నుడైన, మహాదేవః=మహాదేవుడు, దేవాన్=దేవతలను గూర్చి, ఏతత్=ఈ, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను, వః=మీయొక్క, హితార్థమ్=హితముకొరకు, రక్షఃక్షయావహా=రాక్షసుల క్షయమును కలిగించు, నారీ=స్త్రీ, ఉత్పత్స్యతి=పుట్టగలదు.

తా. ఈశ్వరుడు ప్రసన్నుడై దేవతలతో ఇట్లు పలికెను. "మీ హితము కొరకై, రాక్షసుల వినాశమునకు హేతువైన ఒక స్త్రీ (సీత) పుట్టగలదు." 35

మూ. ఏషా దేవైః ప్రయుక్తా తు క్షుద్యథా దానవాన్ పురా, 36
భక్షయిష్యతి నః సీతా రాక్షసఘ్నీ సరావణాన్.

ప్ర. అ. పురా=పూర్వము, క్షుత్=ఆకలి, దానవాన్ యథా=దానవులను వలె, దేవైః=దేవతలచేత, ప్రయుక్తా=ప్రయోగింపబడిన, రాక్షసఘ్నీ=రాక్షసవినాశకురాలైన, ఏషా సీతా=ఈ సీత, సరావణాన్=రావణునితో కూడిన, నః= మనలను, భక్షయిష్యతి=భక్షించగలదు.

తా. దేవతలు ప్రయోగించిన రాక్షససంహారకురాలైన ఈ సీత, పూర్వము ఆకలి దానవులను భక్షించివేసినట్లు రావణునితో సహా మనల నందరినీ భక్షించివేయుగలదు. 36

మూ. రావణస్యాపనీతేన దుర్వినీతస్య దుర్మతేః, 37
అయం నిష్టానకో ఘోరః శోకేన సమభిప్లుతః.

ప్ర. అ. దుర్వినీతస్య=చెడ్డవాడు, దుర్మతేః=చెడ్డబుద్ధిగలవాడు అయిన, రావణస్య=రావణునియొక్క, అపనీతేన=చెడ్డనీతిచేత, శోకేన=శోకముతో, సమభిప్లుతః=నిండిన, ఘోరః=భయంకరమైన, అయమ్=ఈ, నిష్టానకః=వినాశము (ప్రాప్తించినది).

తా. వినయము లేనివాడు, దుర్మతీ అయిన రావణుని చెడు నడవడికకు ఫలితముగా శోకమును కలిగించు ఈ ఘోరమైన వినాశము ప్రాప్తించినది. 37

మూ. తం న పశ్యామహే లోకే యో నః శరణదో భవేత్, 38
రాఘవేణోపసృష్టానాం కాలేనేవ యుగక్షయే.

ప్ర. అ. యుగక్షయే=ప్రళయకాలమునందు, కాలేన=మృత్యువుచేత, ఉపసృష్టానామ్ ఇవ=సమీపించబడినవారికి వలె, రాఘవేణ=రామునిచేత, ఉపసృష్టానామ్=ఆక్రమించబడిన, నః=మనకు, లోకే=ఈ లోకమునందు, యః=ఎవడు, శరణదః=రక్షణము ఇచ్చువాడు, భవేత్=అగునో, తమ్=అట్టివానిని, న పశ్యామహే=చూడము.

తా. ప్రళయకాలమునందు మృత్యువు వలె రాముడు మనలను ఆక్రమించి ఉన్నాడు. ఇప్పుడు మన కీ లోకములో రక్షణము ఇచ్చువా డెవడూ కనబడుటలేదు.

మూ. నాస్తి నః శరణం కశ్చిద్భయే మహతి తిష్ఠతామ్, 39
దావాగ్నివేష్టితానాం హి కరేణూనాం యథా వనే.

ప్ర. అ. వనే=వనమునందు, దావాగ్నివేష్టితానామ్=దావాగ్నిచేత చుట్టబడిన, కరేణూనాం యథా=ఆడ ఏనుగులకు వలె, మహతి=గొప్ప, భయే=భయము

నందు, తిష్ఠతామ్=ఉంటూన్న, నః=మనకు, శరణమ్=రక్షకుడు, కశ్చిత్=ఎవడూ, నాస్తి=లేడు.

తా. అరణ్యములో దావాగ్ని చుట్టుముట్టిన ఆడ ఏనుగులకు వలె, గొప్ప ఆపదలో ఉన్న మనకు రక్షణము ఇచ్చువాడు ఎవడూ లేడు. 39

మూ. ప్రాప్తకాలం కృతం తేన పౌలస్త్యేన మహాత్మనా, 40
యత ఏవం భయం దృష్టం తమేవ శరణం గతః.

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, తేన పౌలస్త్యేన=ఆ విభీషణునిచేత, ప్రాప్తకాలమ్=కాలమునకు తగిన పని, కృతమ్=చేయబడినది, యతః=ఎవనివలన, ఏవమ్=ఇట్లు, భయమ్=భయము, దృష్టమ్=చూడబడినదో, తమేవ=వానినే, శరణం గతః=శరణుజొచ్చినాడు.

తా. మహాత్ముడైన విభీషణుడు ఎవనివలన ఇట్టి భయము కలిగినదో ఆతనినే శరణుజొచ్చి సమయానుకూలముగా ప్రవర్తించినాడు. 40

మూ. ఇతీవ సర్వా రజనీచరస్త్రియః
పరస్పరం సంపరిరభ్య బాహుభిః,
విషేదురార్తా అతిభయాభిపీడితా
వినేదురుచ్చైశ్చ తదా సుదారుణమ్. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే చతుర్నవతితమః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, సర్వాః=సమస్తమైన, రజనీచరస్త్రియః=రాక్షసస్త్రీలు, పరస్పరమ్=పరస్పరమును, బాహుభిః=బాహువులచేత, సంపరిరభ్య=కౌగిలించుకొని, ఆర్తాః=దుఃఖితలై, అతిభయాభిపీడితాః=మిక్కిలి భయముచేత పీడింపబడినవారై, ఇతీవ=ఈ విధముగా, విషేదుః=దిగులుచెందిరి. సుదారుణమ్=చాల దారుణముగా, ఉచ్చైః=గట్టిగా, వినేదుశ్చ=ఏడ్చిరి.

తా. అప్పుడు రాక్షసస్త్రీలు అందరూ పరస్పరము బాహువులతో కౌగలించుకొని, దుఃఖితలై, మిక్కిలి భయముచేత పీడింపబడినవారై ఈ విధముగా దిగులు చెంది బిగ్గరగా ఏడ్చిరి. 41

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చనవతితమః సర్గః

[రావణుడు తన అమాత్యుల నందరినీ పిలిపించి తన యుద్ధోత్సాహమును ప్రకటించుట, వారందరూ యుద్ధరంగమును చేరి పరాక్రమమును చూపుట.]

మూ. ఆర్తానాం రాక్షసీనాం తు లఙ్కాయాం వై కులే కులే,
రావణః కరుణం శబ్దం శుశ్రావ పరిదేవితమ్. 1

ప్ర. అ. రావణః=రావణుడు, లఙ్కాయామ్=లంకయందు, కులే కులే=ప్రతిగృహమునందు, ఆర్తానామ్=దుఃఖితలైన, రాక్షసీనామ్=రాక్షసస్త్రీలయొక్క, కరుణమ్=దీనమైన, శబ్దమ్=శబ్దమును, పరిదేవితమ్=ఏడ్పును, శుశ్రావ=వినెను.

తా. రావణుడు లంకలోని ప్రతిగృహములోను దుఃఖించుచున్న రాక్షసస్త్రీల దీనమైన శబ్దమును, ఏడ్పును వినెను. 1

మూ. స తు దీర్ఘం వినిఃశ్వస్య ముహూర్తం ధ్యానమాస్థితః,
బభూవ పరమక్రుద్ధో రావణో భీమదర్శనః. 2

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, దీర్ఘమ్=దీర్ఘముగా, వినిః శ్వస్య=నిట్టూర్చి, ముహూర్తమ్= ముహూర్త కాలము, ధ్యానమ్=ధ్యానమును, ఆస్థితః=అవలంబించినవాడై, పరమక్రుద్ధః=మిక్కిలి కోపించి, భీమదర్శనః=భయంకరమైన దర్శనము కలవాడు, బభూవ=అయెను.

తా. ఆ రావణుడు క్షణకాలము ఆలోచించి, దీర్ఘముగా నిట్టూర్పు విడిచి, చాల కోపావిష్టుడై చూచువారికి భయము కలిగించుచుండెను. 2

మూ. సందశ్య దశనైరోష్ఠం క్రోధసంరక్తలోచనః,
రాక్షసైరపి దుర్దర్శః కాలాగ్నిరివ మూర్ఛితః. 3

ప్ర. అ. దశనైః=దంతములచేత, ఓష్ఠమ్=పెదవిని, సందశ్య=కఱచి, క్రోధసంరక్తలోచనః=కోపముచేత ఎఱ్ఱబడిన నేత్రములు కలవాడై, మూర్ఛితః=విజృంభించిన, కాలాగ్నిరివ=ప్రలయ కాలాగ్నివలె, రాక్షసైరపి=రాక్షసులచేత గూడ, దుర్దర్శః=చూచుటకు శక్యముకానివాడుగా ఉండెను.

తా. అతడు దంతాలతో పెదవులు కొరుకుచుండెను. అతని నేత్రములు క్రోధముచేత ఎఱ్ఱబడెను. విజృంభించిన ప్రలయకాలాగ్నివలె రాక్షసులకు కూడ చూడ శక్యము కానివాడై ఉండెను. 3

మూ. ఉవాచ చ సమీపస్థాన్ రాక్షసాన్ రాక్షసేశ్వరః,
క్రోధావ్యక్తకథస్తత్ర నిర్దహన్నివ చక్షుషా. 4
మహోదరం మహాపార్శ్వం విరూపాక్షం చ రాక్షసమ్,
శీఘ్రం వదత సైన్యాని నిర్యాతేతి మమాజ్ఞయా. 5

ప్ర. అ. క్రోధావ్యక్తకథః=క్రోధముచేత అస్పష్టమైన మాటలు గల, రాక్షసేశ్వరః=రావణుడు, చక్షుషా=నేత్రముచేత, నిర్దహన్నివ=కాల్చివేయుచున్నవాడు వలె, తత్ర=అక్కడ, సమీపస్థాన్=సమీపమునందున్న, మహోదరమ్=మహోదరుణ్ణి, మహాపార్శ్వమ్=మహాపార్శ్వుణ్ణి, రాక్షసమ్=రాక్షసుడైన, విరూపాక్షమ్=విరూపాక్షుణ్ణి, సమీపస్థాన్=సమీపమునందున్న, రాక్షసాన్=రాక్షసులను గూర్చి, ఉవాచ=పలికెను. మమ=నాయొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞచేత, శీఘ్రమ్=శీఘ్రముగా, నిర్యాత=బయలుదేరండి, ఇతి=అని, సైన్యాని=సైన్యములను గూర్చి, వదత=చెప్పండి.

తా. కోపముచేత మాటలు తడబడుచున్న ఆ రావణుడు నేత్రముతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు చూచుచు, సమీపమునందున్న మహోదర మహాపార్శ్వ-విరూపాక్షులతో "వెంటనే బయలుదేరవలెను అని నా ఆజ్ఞగా సైన్యములతో చెప్పుడు" అని పలికెను. 4,5

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాస్తే భయార్దితాః,
చోదయామాసురవ్యగ్రాన్ రాక్షసాంస్తాన్నృపాజ్ఞయా. 6

ప్ర. అ. తే రాక్షసాః=ఆ రాక్షసులు, తస్య=వానియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, భయార్దితాః=భయపీడితులై, అవ్యగ్రాన్=తొందరపాటులేని, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, నృపాజ్ఞయా=రాజాజ్ఞచేత, చోదయామాసుః=ప్రేరేపించిరి.

తా. ఆ రాక్షసులు రావణుని మాటలు విని భయపడుచు, రాజాజ్ఞానుసారము, సావధానచిత్తులైన ఆ రాక్షసులను ప్రేరేపించిరి. 6

మూ. తే తు సర్వే తథేత్యుక్త్వా రాక్షసా భీమదర్శనాః,
కృతస్వస్త్యయనాః సర్వే తే రణాభిముఖా యయుః. 7

ప్ర. అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, భీమదర్శనాః=భయంకరమైన దర్శనము గల, రాక్షసాః=రాక్షసులు, తథేతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, కృతస్వస్త్యయనాః=చేయబడిన స్వస్త్యయనము కలవారై, తే=వారు, సర్వే=అందరూ, రణాభిముఖాః=యుద్ధాభిముఖులై, యయుః=వెళ్ళిరి.

తా. చూచుటకు భయంకరులుగా ఉండు ఆ రాక్షసులందరూ "అట్లే

వెళ్లెదము" అని పలికి స్వస్త్యయనము చేసికొని యుద్ధాభిముఖులై వెళ్ళిరి. 7

మూ. ప్రతిపూజ్య యథాన్యాయం రావణం తే మహారథాః,
తస్థుః ప్రాఞ్జలయః సర్వే భర్తుర్విజయకాఙ్క్షిణః. 8

ప్ర. అ. మహారథాః=మహారథులైన, సర్వే=సమస్తమైన, తే=ఆ రాక్షసులు, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, రావణమ్=రావణుని, ప్రతిపూజ్య=పూజించి, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్ళు కలవారై, భర్తుః=ప్రభువుయొక్క, విజయకాఙ్క్షిణః=విజయమును కోరుచున్నవారై, తస్థుః=నిలచిరి.

తా. మహారథులైన ఆ రాక్షసులందరూ న్యాయానుసారము రావణుని పూజించి, ప్రభువునకు విజయమును కోరుచు, దోసిళ్ళు కట్టి నిలచిరి. 8

మూ. తతోవాచ ప్రహస్యైతాన్ రావణః క్రోధమూర్ఛితః,
మహోదరమహాపార్శ్వౌ విరూపాక్షం చ రాక్షసమ్. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణః=రావణుడు, క్రోధమూర్ఛితః=కోపముతో నిండినవాడై, ప్రహస్య=నవ్వి, ఏతాన్=ఈ రాక్షసులను గూర్చి, మహోదరమహాపార్శ్వౌ=మహోదరమహాపార్శ్వులను గూర్చి, రాక్షసమ్=రాక్షసుడైన, విరూపాక్షంచ=విరూపాక్షుణ్ణి గూర్చి, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట క్రోధముతో నిండిన రావణుడు నవ్వుచు ఆ రాక్షసులతోను, మహోదరమహాపార్శ్వవిరూపాక్షులతోను ఇట్లు పలికెను.

వెనుక మరణించిన మహోదరమహాపార్శ్వులు రావణుని సోదరులు. వీరిద్దరూ మంత్రులు అని వ్యాఖ్యాతలు వ్రాసినారు. 9

మూ. అద్య బాణైర్ధనుర్ముక్తైర్యుగాన్తాదిత్యసంనిభైః,
రాఘవం లక్ష్మణం చైవ నేష్యామి యమసాదనమ్. 10

ప్ర. అ. అద్య=నేడు, ధనుర్ముక్తైః=ధనస్సునుండి విడువబడిన, యుగాన్తాదిత్యసంనిభైః=ప్రళయ కాలసూర్యునితో సమానమైన, బాణైః=బాణములచేత, రాఘవమ్=రాముణ్ణి, లక్ష్మణం చైవ=లక్ష్మణుణ్ణి, యమసాదనమ్=యమలోకమును, నేష్యామి=పంపెదను.

తా. నేడు ధనస్సునుండి విడచిన, ప్రళయకాలసూర్యునితో సమానములైన బాణాలతో రామలక్ష్మణులను యమలోకమునకు పంపెదను. 10

మూ. ఖరస్య కుమ్భకర్ణస్య ప్రహస్తేన్ద్రజితోస్తథా,
కరిష్యామి ప్రతీకారమద్య శత్రువధాదహమ్. 11

ప్ర. అ. అద్య=ఇప్పుడు, శత్రువధాత్=శత్రువులను చంపుటవలన, అహమ్=నేను, ఖరస్య=ఖరునకు, కుమ్భకర్ణస్య=కుంభకర్ణునకు, తథా=మరియు, ప్రహస్తేన్ద్రజితోః=ప్రహస్తునకు ఇంద్రజిత్తుకు, ప్రతీకారమ్=ప్రతిక్రియను, కరిష్యామి=చేయగలను.

తా. ఇప్పుడు శత్రువులను చంపి నేను ఖరుడు, కుంభకర్ణుడు, ప్రహస్తుడు, ఇంద్రజిత్తు చంపబడినందుకు ప్రతిక్రియ చేసెదను. 11

మూ. నైవాన్తరిక్షం న దిశో న చ ద్యౌర్నాపి సాగరాః,
ప్రకాశత్వం గమిష్యన్తి మద్బాణజలదావృతాః. 12

ప్ర. అ. మద్బాణజలదావృతాః=నా బాణము లనే మేఘములచేత కప్పబడిన, అన్తరిక్షమ్=ఆకాశము, ప్రకాశత్వమ్=స్పష్టత్వమును, న (గమిష్యతి)=పొందదు. దిశః=దిక్కులు, న=పొందవు, ద్యౌః=ఆకాశముపైనున్న లోకము, న=పొందదు, సాగరాః అపి=సముద్రములు కూడ, న గమిష్యన్తి=పొందవు.

తా. నా బాణము లనే మేఘములు కప్పివేయుటచేత ఆకాశము కాని, దిక్కులు కాని, ద్యులోకము కాని, సాగరములు గాని స్పష్టముగా కనిపించవు. 12

మూ. అద్య వానరముఖ్యానాం తాని యూథాని భాగశః,
ధనుషా శరజాలేన వధిష్యామి పతత్రిణా. 13

ప్ర. అ. అద్య=ఇప్పుడు, ధనుషా=ధనస్సుచేతను, పతత్రిణా=రెక్కలు గల, శరజాలేన=బాణసముదాయముచేతను, వానరముఖ్యానామ్=వానరులలో ప్రధానులైన వారియొక్క, యూథాని=గుంపులను, భాగశః=వేరువేరుగా, వధిష్యామి=చంపగలను.

తా. ఇప్పుడు ధనస్సుచేత, రెక్కలు గల బాణములచేత వేరువేరుగా ఉన్న వానరనాయకుల గుంపులను చంపివేసెదను. 13

మూ. అద్య వానరసైన్యాని రథేన పవనౌజసా,
ధనుఃసముద్రాదుద్భూతైర్మథిష్యామి శరోర్మిభిః. 14

ప్ర. అ. పవనౌజసా=వాయువువంటి తేజస్సు గల (వేగము గల), రథేన=రథముచేత, ధనుఃసముద్రాత్=ధనస్సు అనే సముద్రమునుండి, ఉద్భూతైః=పుట్టిన, శరోర్మిభిః=బాణము లనే తరంగములచేత, వానరసైన్యాని=వానరసైన్యములను, మథిష్యామి=మథించెదను.

తా. వాయువేగము గల రథము నెక్కి, ధనస్సు అనే సముద్రమునుండి పుట్టిన బాణతరంగాలచేత ఈనాడు వానరసైన్యములను నశింపచేసెదను. 14

మూ. వ్యాకోశపద్మవక్త్రాణి పద్మకేసరవర్చసామ్,
అద్య యూథతటాకాని గజవత్ప్రమథామ్యహమ్. 15

ప్ర. అ. అద్య=నేడు, వ్యాకోశపద్మవక్త్రాణి=వికసించిన పద్మముల వంటి ముఖములు గల, పద్మకేసరవర్చసామ్=పద్మకేసరములవంటి కాంతి గల వానరులయొక్క, యూథతటాకాని=గుంపు లనే చెరువులను, అహమ్=నేను, గజవత్=ఏనుగు వలె, ప్రమథామి=మథించివేసెదను.

తా. ఇప్పుడు పద్మముల కింజల్కముల వంటి కాంతి గల వానరులయొక్క వికసించిన పద్మముల వంటి ముఖములు గల, గుంపు లనే చెరువులను నేను ఏనుగువలె కలిచివేసెదను. 15

మూ. సశరైరద్య వదనైః సంఖ్యే వానరయూథపాః,
మణ్డయిష్యన్తి వసుధాం సనాలైరివ పఙ్కజైః. 16

ప్ర. అ. అద్య=నేడు, సంఖ్యే=యుద్ధమునందు, వానరయూథపాః=వానరనాయకులు, సశరైః=బాణములతో కూడిన, వదనైః=ముఖములచేత, సనాలైః=కాడలతో కూడిన, పఙ్కజైరివ=పద్మముల చేతవలె, వసుధామ్=భూమిని, మణ్డయిష్యన్తి=అలంకరించగలరు.

తా. నేడు యుద్ధములో వానరసేనానాయకులు బాణములతో కూడిన ముఖాలను, కాడలతో ఉన్న పద్మాలను వలె పరచి భూమిని అలంకరించగలరు.

మూ. అద్య యూథప్రచణ్డానాం హరీణాం ద్రుమయోధినామ్,
ముక్తేనైకేషుణా యుద్ధే భేత్స్యామి చ శతం శతమ్. 17

ప్ర. అ. అద్య=నేడు, యుద్ధే=యుద్ధమునందు, ముక్తేన=విడవబడిన, ఏకేషుణా=ఒక బాణముచేత, యూథప్రచణ్డానామ్=గుంపులతో చాల తీవ్రముగా ఉన్న, ద్రుమయోధినామ్=వృక్షములతో యుద్ధము చేయు, హరీణామ్=వానరులయొక్క, శతం శతమ్=వందేసిమందిని, భేత్స్యామి=భేదించెదను.

తా. నేడు యుద్ధమునందు ఒక్కొక్క బాణముతో, గుంపులతో తీవ్రముగా ఉన్న, వృక్షాలతో యుద్ధము చేయు వానరులను వందేసి మందిని బ్రద్దలుకొట్టెదను. 17

మూ. హతో భ్రాతా చ యేషాం వై యేషాం చ తనయో హతః,
వధేనాద్య రిపోస్తేషాం కరోమ్యశ్రుప్రమార్జనమ్. 18

ప్ర. అ. అద్య=నేడు, రిపోః=శత్రువుయొక్క, వధేన=వధచేత, యేషాం=ఎవరియొక్క, భ్రాతా=సోదరుడు, హతః=చంపబడినాడో, యేషామ్=ఎవరియొక్క,

తనయః=కుమారుడు, హతః=చంపబడినాడో, తేషామ్=వాళ్లయొక్క, అశ్రుప్రమా ర్జనమ్=కన్నీళ్లు తుడుచుటను, కరోమి=చేసెదను.

తా. నేడు శత్రువును చంపి, సోదరులను కుమారులను కోల్పోయిన రాక్షసుల కన్నీళ్లు తుడిచెదను. 18

మూ. అద్య మద్బాణనిర్భిన్నైః ప్రస్తీర్ణైర్గతచేతసైః,
కరోమి వానరైర్యుద్ధే యత్నావేక్ష్యతలాం మహీమ్. 19

ప్ర. అ. అద్య=నేడు, యుద్ధే=యుద్ధమునందు, మద్బాణనిర్భిన్నైః=నా బాణములచేత బ్రద్దలుకొట్టబడిన, గతచేతసైః=పోయిన ప్రాణములు గల, ప్రస్తీర్ణైః= పరచబడిన, వానరైః=వానరులతో, మహీమ్=భూమిని, యత్నావేక్ష్యతలామ్=ప్రయ త్నముచేత చూడదగిన పైభాగము గలదానినిగా, కరోమి=చేయుచున్నాను.

తా. నేడు యుద్ధములో వానరులను నా బాణములచేత చీల్చివేసి, చంపి, వారి దేహములను పరచుటచేత భూమి పై భాగము కనబడకుండ చేసెదను. 19

మూ. అద్య కాకాశ్చ గృధ్రాశ్చ యే చ మాంసాశినోఽపరే,
సర్వాంస్తాంస్తర్పయిష్యామి శత్రుమాంసైః శరాహతైః. 20

ప్ర. అ. అద్య=నేడు, కాకాశ్చ=కాకులు, గృధ్రాశ్చ=గ్రద్దలూ, మాంసా శినః=మాంసమును తిను, యే=ఏ, అపరే=ఇతరప్రాణులు, గలవో, తాన్=వాటిని, సర్వాన్=అన్నింటినీ, శరాహతైః=బాణములచేత చంపబడిన, శత్రుమాంసైః=శత్రువుల మాంసములచేత, తర్పయిష్యామి=తృప్తిపొందించెదను.

తా. నా బాణములచేత చంపబడిన శత్రువుల మాంసములచేత ఈనాడు కాకులకు, గ్రద్దలకు, మాంసమును తిను ఇతర జంతువులకు తృప్తి కలిగించెదను.

మూ. కల్ప్యతాం మే రథః శీఘ్రం క్షిప్రమానీయతాం ధనుః,
అనుప్రయాన్తు మాం యుద్ధే యేఽత్ర శిష్టా నిశాచరాః. 21

ప్ర. అ. మే=నాయొక్క, రథః=రథము, శీఘ్రమ్=శీఘ్రముగా, కల్ప్య తామ్=ఏర్పరుపబడుగాక. ధనుః=ధనస్సు, క్షిప్రమ్=శీఘ్రముగా, ఆనీయతామ్=తీ సుకొనిరాబడుగాక. అత్ర=ఇక్కడ, శిష్టాః=మిగిలిన, యే=ఏ, నిశాచరాః=రాక్షసులు గలరో వారు, యుద్ధే=యుద్ధమున, మామ్=నన్ను, అనుప్రయాన్తు=అనుసరించి వెళ్లెదరు గాక.

తా. శీఘ్రముగా నా రథము ఏర్పాటు చేయుడు. వెంటనే నా ధనస్సు తీసికొని రండు. మిగిలిన రాక్షసు లందరూ నాతో యుద్ధానికి బయలుదేరుడు.

మూ. తస్య తద్వచనం శ్రుత్వా మహాపార్శ్వోఽబ్రవీద్వచః,
బలాధ్యక్షాన్ స్థితాంస్తత్ర బలం సంత్వర్యతామితి. 22

ప్ర. అ. తస్య=రావణునియొక్క, తత్ వచనమ్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, మహాపార్శ్వః=మహాపార్శ్వుడు, తత్ర=అక్కడ, స్థితాన్=ఉన్న, బలాధ్యక్షాన్=సేనాధ్యక్షులను గూర్చి, బలమ్=సేన, సంత్వర్యతామ్ ఇతి=తొందర చేయబడుగాక అని, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రావణుని మాటలు విని మహాపార్శ్వుడు అక్కడ ఉన్న సేనానాయకులతో- "సైన్యమును శీఘ్రముగా సిద్ధముచేయుడు" అని పలికెను. 22

మూ. బలాధ్యక్షాస్తు సంరబ్ధా రాక్షసాంస్తాన్ గృహే గృహే,
చోదయన్తః పరియయుర్లఙ్కాం లఘుపరాక్రమాః. 23

ప్ర. అ. లఘుపరాక్రమాః=శీఘ్రమైన పరాక్రమము గల, బలాధ్యక్షాస్తు=సేనానాయకులైతే, సంరబ్ధాః=తొందరపడుచున్నవారై, గృహే గృహే=ప్రతిగృహమునందు, తాన్=ఆ, రాక్షసాన్=రాక్షసులను, చోదయన్తః=ప్రేరేపించుచు, లఙ్కామ్=లంకను, పరియయుః=చుట్టి వెళ్లిరి (సంచరించిరి ).

తా. శీఘ్రపరాక్రమవంతులైన సేనానాయకులు తొందరపడుచు, ప్రతి ఇంటికీ వెళ్లి రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించుచు లంకాపట్టణ మంతా తిరిగిరి.

మూ. తతో ముహూర్తాన్నిష్పేతూ రాక్షసా భీమదర్శనాః,
నదన్తో భీమవదనా నానాప్రహరణైర్భుజైః. 24
అసిభిః పట్టిశైః శూలైర్గదాభిర్ముసలైర్హలైః,
శక్తిభిస్తీక్ష్ణధారాభిర్మహద్భిః కూటముద్గరైః. 25
యష్టిభిర్వివిధైశ్చక్రైర్నిశితైశ్చ పరశ్వధైః,
భిన్దిపాలైః శతఘ్నీభిరన్యైశ్చాపి వరాయుధైః. 26

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భీమదర్శనాః=భయంకరమైన దర్శనము గల, భీమవదనాః=భయంకరమైన ముఖములు గల, రాక్షసాః=రాక్షసులు, నదన్తః=ధ్వనిచేయుచు, అసిభిః=ఖడ్గములతోను, పట్టిశైః=పట్టిశములతోను, శూలైః=శూలములతోను, గదాభిః=గదలతోను, ముసలైః=ముసలములతోను, హలైః=నాగళ్లతోను, తీక్ష్ణధారాభిః=వాడియైన అంచులు గల, శక్తిభిః=శక్తులతోను, మహద్భిః=పెద్దవైన, కూటముద్గరైః=కూటములతోను, ముద్గరములతోను, యష్టిభిః=కఱ్ఱలతోను, వివిధైః=అనేకవిధములైన, చక్రైః=చక్రములతోను, నిశితైః=వాడియైన, పరశ్వధైః=గండ్రగొడ్డళ్లతోను, భిన్దిపాలైః=భిందిపాలములతోను, శతఘ్నీభిః=శతఘ్నులతోను,

అన్యైః=ఇతరములైన, వరాయుధైః=శ్రేష్ఠములైన ఆయుధములతోను, నానాప్రహరణైః=అనేక విధములైన ఆయుధములతోను కూడిన, భుజైః=భుజములతో, ముహూర్తాత్ =ముహూర్తకాలములో, నిష్పేతుః=బయలుదేరిరి.

తా. పిమ్మట చూచుటకు భయంకరులుగా ఉన్న, భయంకరములైన ముఖములు గల రాక్షసులు, గర్జించుచు, కత్తులు, పట్టిశములు, శూలములు, గదలు, ముసలములు, నాగళ్లు, వాడియైన అంచులు గల శక్తులు, పెద్ద కూటములు, ముద్గరములు, కఱ్ఱలు, అనేక విధములైన చక్రములు, వాడియైన గండ్రగొడ్డళ్ళు, భిందిపాలములు, శతఘ్నులు, మొదలైన అనేక విధములైన శ్రేష్ఠములైన ఆయుధములు హస్తములతో ధరించి ముహూర్తకాలములో బయలుదేరిరి. 24-26

మూ. అథానయద్ బలాధ్యక్షః సత్వరో రావణాజ్ఞయా,
ఆరురోహ తదా భీమో దీప్యమానం స్వతేజసా,
ద్రుతం సూతసమాయుక్తం యుక్తాష్టతురగం రథమ్. 27

ప్ర. అ. అథ=అటుపిమ్మట, బలాధ్యక్షః=సేనానాయకుడు, రావణాజ్ఞయా=రావణుని ఆజ్ఞచేత, సత్వరః=తొందరతో కూడినవాడై, ద్రుతమ్=శీఘ్రముగా నడుచునది, సూతసమాయుక్తమ్=సారథితో కూడినది, యుక్తాష్టతురగమ్=కట్టబడిన ఎనిమిది గుఱ్ఱములు గలది అయిన, రథమ్=రథమును, ఆనయత్=తీసికొనివచ్చెను. తదా=అప్పుడు, భీమః=భయంకరుడైన రావణుడు, స్వతేజసా=తన తేజస్సు చేత, దీప్యమానమ్=ప్రకాశించుచున్న ఆ రథమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట సేనానాయకుడు తొందరపడుచు రావణాజ్ఞ ప్రకారము సారథితో కూడిన ఎనిమిది గుఱ్ఱములు కట్టిన, శీఘ్రముగా నడచు రథమును తెచ్చెను. అప్పుడు భయంకరుడైన రావణుడు తన తేజస్సుతో ప్రకాశించుచున్న ఆ రథమును ఎక్కెను. 27

మూ. తతః ప్రయాతః సహసా రాక్షసైర్బహుభిర్వృతః, 28
రావణః సత్త్వగామ్భీర్యాద్దారయన్నివ మేదినీమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణః=రావణుడు, బహుభిః=అనేకులైన, రాక్షసైః=రాక్షసులతో, వృతః=కూడినవాడై, సత్త్వగామ్భీర్యాత్=బలాధిక్యమువలన, మేదినీమ్=భూమిని, దారయన్నివ=చీల్చుచున్నవాడు వలె, సహసా=శీఘ్రముగా, ప్రయాతః=బయలుదేరినాడు.

తా. పిమ్మట రావణుడు చాలమంది రాక్షసులతో కూడి బలాధిక్యముచేత భూమిని చీల్చివేయుచున్నాడా అన్నట్లు వెంటనే బయలుదేరెను. 28

మూ. తతశ్చాసీన్మహానాదస్తూర్యాణాం చ తతస్తతః, 29
మృదఙ్గైః పటహైః శఙ్ఖైః కలహైః సహ రక్షసామ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మృదఙ్గైః=మృదంగములతోను, పటహైః=పటహములతోను, శఙ్ఖైః=శంఖములతోను, రక్షసామ్=రాక్షసులయొక్క, కలహైః సహ=కలహములతోను కూడ, తతస్తతః=అక్కడక్కడినుండి, తూర్యాణామ్=తూర్యములయొక్క, మహాన్=గొప్ప, నాదః=ధ్వని, ఆసీత్=ఆయెను.

తా. పిమ్మట మృదంగ-పటహ-శంఖధ్వనులతోను, రాక్షసుల కలకలములతోను కలిసిన గొప్ప వాద్యధ్వని ఆ యా ప్రాంతములనుండి బయలుదేరెను. 29

మూ. ఆగతో రక్షసాం రాజా ఛత్రచామరసంయుతః, 30
సీతాపహారీ దుర్వృత్తో బ్రహ్మఘ్నో దేవకణ్టకః.
యోద్ధుం రఘువరేణేతి శుశ్రువే కలహధ్వనిః. 31

ప్ర. అ. ఛత్రచామరసంయుతః=ఛత్రచామరములతో కూడినవాడు, సీతాపహారీ=సీతను అపహరించినవాడు, దుర్వృత్తః=చెడ్డనడవడిక కలవాడు, బ్రహ్మఘ్నః=బ్రాహ్మణులను చంపినవాడు, దేవకణ్టకః=దేవతలకు శత్రువు అయిన, రాక్షసానాం రాజా=రాక్షసరాజు, రఘువరేణ=రామునితో, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, ఆగతః=వచ్చినవాడు, ఇతి=అని, కలహధ్వనిః=కోలాహలధ్వని, శుశ్రువే=వినబడెను.

తా. సీతను అపహరించినవాడు, చెడ్డ చరిత్ర కలవాడు, బ్రాహ్మణులను చంపినవాడు, దేవతల శత్రువూ అయిన రావణుడు, ఛత్రచామరములు ధరించి రామునితో యుద్ధముచేయుటకు వచ్చినాడు అని కోలాహలధ్వని వినబడెను.

మూ. తేన నాదేన మహతా పృథివీ సమకమ్పత,
తం శబ్దం సహసా శ్రుత్వా వానరా దుద్రువుర్భయాత్. 32

ప్ర. అ. మహతా=గొప్పదైన, తేన నాదేన=ఆ ధ్వనిచేత, పృథివీ=భూమి, సమకమ్పత=కంపించెను. వానరాః=వానరులు, తం శబ్దమ్=ఆ శబ్దమును, సహసా=హటాత్తుగా, శ్రుత్వా=విని, భయాత్=భయమువలన, దుద్రువుః=పారిపోయిరి.

తా. ఆ పెద్ద ధ్వనికి భూమి కదిలిపోయెను. వానరులు హటాత్తుగా ఆ శబ్దము వినగానే భయపడి పారిపోయిరి. 32

మూ. రావణస్తు మహాబాహుః సచివైః పరివారితః,
ఆజగామ మహాతేజా జయాయ విజయం ప్రతి. 33

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణస్తు=రావణుడైతే, సచివైః=మంత్రులతో, పరివారితః=కూడినవాడై, విజయం ప్రతి=విజయమును గూర్చి, జయాయ=జయమునకు (యుద్ధరంగము నకు), ఆజగామ=వచ్చెను.

తా. గొప్ప బాహువులు గల, మహాతేజఃశాలియైన రావణుడు, మంత్రులతో కూడినవాడై విజయమును ఉద్దేశించి, జయమునకు (జయస్థానమైన యుద్ధమునకు) వచ్చెను. 33

మూ. రావణేనాభ్యనుజ్ఞాతౌ మహాపార్శ్వమహోదరౌ,
విరూపాక్షశ్చ దుర్ధర్షో రథానారురుహుస్తదా. 34

ప్ర. అ. రావణేన=రావణునిచేత, అభ్యనుజ్ఞాతౌ=అనుజ్ఞ ఇవ్వబడిన, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులు, దుర్ధర్షః=ఎదిరింప శక్యముకాని, విరూపాక్షశ్చ=విరూపాక్షుడు, తదా=అప్పుడు, రథాన్=రథములను, ఆరురుహుః=ఎక్కిరి.

తా. అప్పుడు రావణుని అనుజ్ఞచేత మహాపార్శ్వమహోదరులు, ఎదిరింప శక్యముకాని విరూపాక్షుడు రథములను ఎక్కిరి. 34

మూ. తే తు హృష్టా వినర్దన్తో భిన్దన్త ఇవ మేదినీమ్,
నాదం ఘోరం విముఞ్చన్తో నిర్యయుర్జయకాఙ్క్షిణః. 35

ప్ర. అ. తే=ఆ రాక్షసులు, హృష్టాః=సంతోషించినవారై, వినర్దన్తః=అరచుచున్నవారై, మేదినీమ్=భూమిని, భిన్దన్తః ఇవ=బ్రద్దలుకొట్టుచున్నవారి వలె, ఘోరమ్=భయంకరమైన, నాదమ్=ధ్వనిని, విముఞ్చన్తః=విడుచుచు, జయకాఙ్క్షిణః=జయమును కోరుచున్నవారై, నిర్యయుః=బయలుదేరిరి.

తా. ఆ రాక్షసులు ఉత్సాహముతో ధ్వని చేయుచు, భూమిని బ్రద్దలుకొట్టుచున్నారా అన్నట్లు భయంకరముగా అరచుచు, జయాభిలాషతో బయలుదేరిరి. 35

మూ. తతో యుద్ధాయ తేజస్వీ రక్షోగణబలైర్వృతః,
నిర్యయావుద్యతధనుః కాలాన్తకయమోపమః. 36

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేజస్వీ=తేజఃశాలి, రక్షోగణబలైః=రాక్షసగణముల సైన్యములతో కూడినవాడు, కాలాన్తకయమోపమః=ప్రలయకాలమునందు జగత్తును నశింప చేయు యమునితో సమానుడు అయిన రావణుడు, ఉద్యతధనుః=ఎత్తబడిన ధనస్సు కలవాడై, యుద్ధాయ=యుద్ధముకొరకు, నిర్యయౌ=బయలుదేరెను.

తా. అప్పుడు తేజఃశాలి ప్రలయకాలమునందలి యమునితో సమానుడు అయిన రావణుడు రాక్షససైన్యములతో కూడి, ధనస్సును సిద్ధముగా ఉంచుకొని బయలుదేరెను. 36

మూ. తతః ప్రజవితాశ్వేన రథేన స మహారథః,
ద్వారేణ నిర్యయౌ తేన యత్ర తౌ రామలక్ష్మణౌ. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహారథః=మహారథుడైన, సః=ఆ రావణుడు, ప్రజవితాశ్వేన=వేగము కలవిగా చేయబడిన గుఱ్ఱములు గల, రథేన=రథముచేత, తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, యత్ర=ఎక్కడ ఉన్నారో, తేన=ఆ, ద్వారేణ=ద్వారముచేత, నిర్యయౌ=బయల్వెడలెను.

తా. పిమ్మట మహారథుడైన ఆ రావణుడు రథమునెక్కి తొందరగా గుఱ్ఱములు తోలించి, రామలక్ష్మణు ఉన్న ద్వారమునుండి బయలుదేరెను. 37

మూ. తతో నష్టప్రభః సూర్యో దిశశ్చ తిమిరావృతాః,
ద్విజాశ్చ నేదుర్ఘోరాశ్చ సంచచాల చ మేదినీ. 38

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సూర్యః=సూర్యుడు, నష్టప్రభః=నష్టమైన కాంతి కలవాడైనాడు. దిశశ్చ=దిక్కులు కూడ, తిమిరావృతాః=చీకటిచేత కప్పబడినవి, ఘోరాః=భయంకరములైన, ద్విజాశ్చ=పక్షులు, నేదుః=అరచినవి, మేదినీ చ=భూమి కూడ, సంచచాల=చలించెను.

తా. అప్పుడు సూర్యుని కాంతి తగ్గెను. దిక్కులు చీకటిచేత ఆవరించబడెను. భయంకరములైన పక్షులు అరచెను. భూమి అదిరెను. 38

మూ. వవర్ష రుధిరం దేవశ్చస్ఖలుశ్చ తురంగమాః,
ధ్వజాగ్రే న్యపతద్గృధ్రో వినేదుశ్చాశివాః శివాః. 39

ప్ర. అ. దేవః=పర్జన్యుడు (మేఘము), రుధిరమ్=రక్తమును, వవర్ష=వర్షించెను. తురంగమాః=గుఱ్ఱములు, చస్ఖలుశ్చ=తొట్రుబడినవి. ధ్వజాగ్రే=ధ్వజము చివర, గృధ్రః=గ్రద్ద, న్యపతత్=వాలెను, అశివాః=అమంగళకరమైన, శివాశ్చ=నక్కలు కూడ, వినేదుః=అరచినవి.

తా. మేఘము రక్తమును కురిసెను. గుఱ్ఱములు తొట్రుపడినవి. ధ్వజము చివర గ్రద్ద వ్రాలెను. అమంగళకరములైన నక్కలు కూసినవి. 39

మూ. నయనం చాస్ఫురద్వామం వామో బాహురకమ్పత,
వివర్ణవదనశ్చాపి కించిదభ్రశ్యత స్వనః. 40

ప్ర. అ. వామమ్=ఎడమదైన, నయనం చ=నేత్రము, అస్ఫురత్=అదిరెను.

వామః=ఎడమదైన, బాహుః=బాహువు, అకమ్పత=కదలెను, వివర్ణవదనః చ=రంగు మారిన ముఖము కలవాడుగా కూడ, ఆసీత్=అయెను, కించిత్=కొంచెము, స్వనః=ధ్వని, అభ్రశ్యత=తగ్గిపోయెను.

తా. ఆతని ఎడమ కన్ను అదిరెను. ఎడమ చెయ్యి కదలెను. ముఖము పాలిపోయెను. కంఠస్వరము కొంచెము తగ్గెను. 40

మూ. తతో నిష్పతతో యుద్ధే దశగ్రీవస్య రక్షసః,
రణే నిధనశంసీని రూపాణ్యేతాని జజ్ఞిరే. 41

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రక్షసః=రాక్షసుడైన, దశగ్రీవస్య=రావణుడు, యుద్ధే=యుద్ధమునందు, నిష్పతతః=బయలుదేరి వచ్చుచుండగా, రణే=యుద్ధమునందు,నిధనశంసీని=మరణమును సూచించు, ఏతాని=ఈ, రూపాణి=రూపములు, జజ్ఞిరే=పుట్టినవి.

తా. రావణుడు యుద్ధానికై బయలుదేరి వెళ్ళుచున్న సమయమునందు ఆతనికి యుద్ధమునందు వినాశమును సూచించు ఈ శకునములు కనబడెను.

మూ. అన్తరిక్షాత్ప్రపాతోల్కా నిర్ఘాతసమనిఃస్వనా,
వినేదురశివా గృధ్రా వాయసైరభిమిశ్రితాః. 42

ప్ర. అ. అన్తరిక్షాత్=ఆకాశమునుండి, నిర్ఘాతసమనిఃస్వనా=పిడుగుతో సమానమైన ధ్వని గల, ఉల్కా=ఉల్క, పపాత=పడెను. వాయసైః=కాకులతో, అభిమిశ్రితాః=కలిసిన, అశివాః=అమంగళకరమైన, గృధ్రాః=గ్రద్దలు, వినేదుః=ధ్వని చేసినవి.

తా. ఆకాశమునుండి పిడుగు వంటి ధ్వని గల ఉల్క పడెను. అమంగళకరములైన గ్రద్దలు కాకులతో కలిసి అరచినవి. 42

మూ. ఏతానచిన్తయన్ ఘోరానుత్పాతాన్ సమవస్థితాన్,
నిర్యయౌ రావణో మోహాద్వధార్థం కాలచోదితః. 43

ప్ర. అ. రావణః=రావణుడు, కాలచోదితః=కాలముచేత ప్రేరేపింపబడినవాడై, ఘోరాన్=భయంకరములైన, సమవస్థితాన్=వచ్చిన, ఏతాన్=ఆ, ఉత్పాతాన్=దుఃశకునములను, అచిన్తయన్=లెక్కచేయనివాడై, మోహాత్=అజ్ఞానమువలన, వధార్థమ్=వధకొరకు, నిర్యయౌ=బయలుదేరెను.

తా. రావణుడు కనబడుచున్న ఆ అపశకునములను మోహముచేత లెక్కచేయక, కాలముచేత ప్రేరితుడై చావుకొరకే బయలుదేరి వెళ్లెను. 43

మూ. తేషాం తు రథఘోషేణ రాక్షసానాం మహాత్మనామ్,
వానరాణామపి చమూర్యుద్ధాయైవాభ్యవర్తత. 44

ప్ర. అ. మహాత్మనామ్=మహాత్ములైన, తేషాం రాక్షసానామ్=ఆ రాక్షసులయొక్క, రథఘోషేణ=రథధ్వనిచేత, వానరాణామ్=వానరులయొక్క, చమూః అపి=సేన కూడ, యుద్ధాయైవ=యుద్ధముకొరకు, అభ్యవర్తత=సిద్ధమాయెను.

తా. మహాత్ములైన ఆ రాక్షసుల రథధ్వని వినగానే ఆ సేన కూడ యుద్ధానికే సంనద్ధమాయెను. 44

మూ. తేషాం తు తుములం యుద్ధం బభూవ కపిరక్షసామ్,
అన్యోన్యమాహ్వయానానాం క్రుద్ధానాం జయమిచ్ఛతామ్. 45

ప్ర. అ. అన్యోన్యమ్=పరస్పరము, ఆహ్వయానానామ్=పిలుచుచున్న, క్రుద్ధానామ్=కోపించిన, జయమ్=జయమును, ఇచ్ఛతామ్=కోరుచున్న, తేషామ్=ఆ, కపిరక్షసామ్=వానరులకు రాక్షసులకు, తుములమ్=వ్యాకులమైన, యుద్ధమ్=యుద్ధము, బభూవ=ఆయెను.

తా. కోపముతో ఒకరి నొకరు పిలుచుకొనుచున్న, జయాభిలాషులైన ఆ వానరరాక్షసుల మధ్య తుములమైన యుద్ధము జరిగెను. 45

మూ. తతః క్రుద్ధో దశగ్రీవః శరైః కాఞ్చనభూషణైః,
వానరాణామనీకేషు చకార కదనం మహత్. 46

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రుద్ధః=కోపించిన, దశగ్రీవః=రావణుడు, కాఞ్చనభూషణైః=బంగారు అలంకారములు గల, శరైః=బాణములచేత, వానరాణామ్=వానరులయొక్క, అనీకేషు=సేనలయందు, మహత్=గొప్ప, కదనమ్=యుద్ధమును (సంహారమును), చకార=చేసెను.

తా. పిమ్మట కోపించిన రావణుడు బంగారు అలంకారములు గల బాణాలను ప్రయోగించి, వానరసైన్యముల అత్యధికమైన హింస చేసెను. 46

మూ. నికృత్తశిరసః కేచిద్రావణేన వలీముఖాః,
కేచిద్విచ్ఛిన్నహృదయాః కేచిచ్ఛ్రోత్రవివర్జితాః. 47

ప్ర. అ. కేచిత్=కొందరు, వలీముఖాః=వానరులు, రావణేన=రావణునిచేత, నికృత్తశిరసః=ఛేదించబడిన శిరస్సులు కలవారు. కేచిత్=కొందరు, విభిన్నహృదయాః=భేదింపబడిన హృదయములు గలవారు. కేచిత్=కొందరు, శ్రోత్రవివర్జితాః=చెవులతో శూన్యులు.

తా. రావణుడు బాణములచేత కొందరి శిరస్సులు ఛేదించెను. కొందరి

హృదయములు బ్రద్దలుకొట్టెను. కొందరి చెవులు తెగగొట్టెను. 47

మూ. నిరుచ్ఛ్వాసా హతాః కేచిత్కేచిత్పార్శ్వేషు దారితాః,
కేచిద్విభిన్నశిరసః కేచిచ్చక్షుర్వినాకృతాః. 48

ప్ర. అ. కేచిత్=కొందరు, నిరుచ్ఛ్వాసాః=ఉచ్ఛ్వాసము లేనివారుగా, హతాః=చంపబడిరి. కేచిత్=కొందరు, పార్శ్వేషు=పార్శ్వములయందు, దారితాః= చీల్చబడిరి. కేచిత్=కొందరు, విభిన్నశిరసః=బ్రద్దలుకొట్టబడిన శిరస్సులు గలవారు, కేచిత్=కొందరు, చక్షుర్వినా=నేత్రములు లేకుండా, కృతాః=చేయబడినారు.

తా. ఆ రావణుడు కొందరు వానరులను ఉచ్ఛ్వాసము లేకుండా చంపివేసెను. కొందరిని పార్శ్వములయందు చీల్చివేసెను. కొందరి శిరస్సులు బ్రద్దలు కొట్టెను. కొందరిని నేత్రహీనులను చేసెను. 48

మూ. దశాననః క్రోధవివృత్తనేత్రో యతోయతో ఽభ్యేతి రథేన సంఖ్యే,
తతస్తతస్తస్య శరప్రవేగం సోఢుం న శేకుర్హరియూథపాస్తే. 49

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే పఞ్చనవతితమః సర్గః.

ప్ర. అ. దశాననః=రావణుడు, క్రోధవివృత్తనేత్రః=క్రోధముచేత తిరుగుచున్న నేత్రములు కలవాడై, సంఖ్యే=యుద్ధమునందు, యతః యతః=ఏ యే వైపునకు, అభ్యేతి=వచ్చుచుండునో, తతస్తతః=ఆ యా వైపులందు, తే=ఆ, హరియూథపాః= వానరసేనా నాయకులు, శరప్రవేగమ్=బాణవేగమును, సోఢుమ్=సహించుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. రావణుడు క్రోధముచేత తిరిగిపోవుచున్న నేత్రములతో యుద్ధములో రథముమీద ఏ యే వైపులకు వెళ్ళెనో ఆ యా వైపులందున్న వానరసేనా నాయకులు వాని ముందు నిలువజాలక పోయిరి. 49

" బాలానందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదియైదవ సర్గ సమాప్తము.

# అథ షణ్ణవతితమః సర్గః

[సుగ్రీవుడు రాక్షససేనను సంహరించి విరూపాక్షుణ్ణి వధించుట.]

మూ. తథా తైః కృత్తగాత్రైస్తు దశగ్రీవేణ మార్గణైః,
బభూవ వసుధా తత్ర ప్రకీర్ణా హరిభిస్తదా. 1

ప్ర. అ. దశగ్రీవేణ=రావణునిచేత, తథా=ఆ విధముగా, మార్గణైః=బాణములచేత, తదా=అప్పుడు, కృత్తగాత్రైః=ఛేదించబడిన అవయవములు గల, తైః=ఆ, హరిభిః=వానరులచేత, తత్ర=అక్కడ, వసుధా=భూమి, ప్రకీర్ణా=వ్యాప్తము, బభూవ=ఆయెను.

తా. రావణుడు ఆ విధముగా బాణములచేత అప్పుడు అవయవములు ఛేదించిన ఆ వానరులచేత అక్కడ భూమి కప్పివేయబడెను. 1

మూ. రావణస్యాప్రసహ్యం తం శరసంపాతమేకతః,
న శేకుః సహితుం దీప్తం పతఙ్గా జ్వలనం యథా. 2

ప్ర. అ. ఏకతః=ఒక్క, రావణస్య=రావణునియొక్క, అప్రసహ్యమ్=సహింప శక్యముకాని, తమ్=ఆ, శరసంపాతమ్=బాణపాతమును, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, జ్వలనమ్=అగ్నిని, పతఙ్గాః యథా=మిడతలు వలె, (ఆ వానరులు), సహితుమ్=సహించుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. ఆ వానరులు ఒక రావణునినుండి వచ్చుచున్న సహింప శక్యము కాని ఆ బాణపాతమును, అగ్నిని మిడతలు వలె, సహింపజాలకపోయిరి. 2

మూ. తేఽర్దితా నిశితైర్బాణైః క్రోశన్తో విప్రదుద్రువుః,
పావకార్చిఃసమావిష్టా దహ్యమానా యథా గజాః. 3

ప్ర. అ. నిశితైః=వాడియైన, బాణైః=బాణములచేత, అర్దితాః=పీడింపబడిన, తే=ఆ వానరులు, పావకార్చిఃసమావిష్టాః=అగ్నిజ్వాలలచేత చుట్టుముట్టబడిన, దహ్యమానాః=కాల్చివేయబడుచున్న, గజాః యథా=ఏనుగులు వలె, క్రోశన్తః=అరచుచు, విప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. వాడియైన బాణాలచేత పీడింపబడుచున్న ఆ వానరులు, అగ్నిజ్వాలలచే చుట్టుముట్టి దహింపబడుచున్న ఏనుగులు వలె అరచుచు పారిపోయిరి.

మూ. ప్లవంగానామనీకాని మహాభ్రాణీవ మారుతః,
సంయయౌ సమరే తస్మిన్ విధమన్ రావణః శరైః. 4

ప్ర. అ. తస్మిన్=ఆ, సమరే=యుద్ధమునందు, రావణః=రావణుడు, శరైః=బాణములచేత, మహాభ్రాణి=మహామేఘములను, మారుతః ఇవ=వాయువు వలె, ప్లవంగమానామ్=వానరులయొక్క, అనీకాని=సైన్యములను, విధమన్=ఎగుర గొట్టుచు, సంయయౌ=వెళ్లెను.

తా. ఆ యుద్ధమునందు రావణుడు బాణములచేత వానరుల సైన్యములను వాయువు మహామేఘములను వలె ఎగురగొట్టుచు వెళ్లెను. 4

మూ. కదనం తరసా కృత్వా రాక్షసేన్ద్రో వనౌకసామ్,
ఆసపాద తతో యుద్ధే త్వరితం రాఘవం రణే. 5

ప్ర. అ. రాక్షసేన్ద్రః=రావణుడు, యుద్ధే=యుద్ధమునందు, వనౌకసామ్=వానరులయొక్క, కదనమ్=సంహారమును, తరసా=బలముచేత, కృత్వా=చేసి, తతః=అటుపిమ్మట, రణే=యుద్ధమునందు, త్వరితమ్=శీఘ్రముగా, రాఘవమ్=రాముణ్ణి, ఆససాద=పొందెను.

తా. రావణుడు యుద్ధమునందు బలముచేత వానరులను సంహరించి పిమ్మట రణరంగమునందు శీఘ్రముగా రాముని వైపు వెళ్లెను. 5

మూ. సుగ్రీవస్తాన్ కపీన్ దృష్ట్వా భగ్నాన్ విద్రావితాన్ రణే,
గుల్మే సుషేణం నిక్షిప్య చక్రే యుద్ధే ద్రుతం మనః. 6

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, రణే=యుద్ధమునందు, భగ్నాన్=ఓడింపబడిన, విద్రావితాన్=పారిపోవునట్లు చేయబడిన, తాన్ కపీన్=ఆ వానరులను, దృష్ట్వా=చూచి, సుషేణమ్=సుషేణుణ్ణి, గుల్మే=గుల్మమునందు, నిక్షిప్య=ఉంచి, ద్రుతమ్=శీఘ్రముగా, మనః=మనస్సును, యుద్ధే=యుద్ధమునందు, చక్రే=చేసెను.

తా. యుద్ధములో పరాజితులై పారిపోవుచున్న ఆ వానరులను చూచి సుగ్రీవుడు తానున్న గుల్మమును (సేనా విభాగమును) రక్షించుటకై సుషేణుణ్ణి అక్కడ నిలిపి శీఘ్రముగా యుద్ధము చేయుటకు నిర్ణయించుకొనెను. 6

మూ. ఆత్మనః సదృశం వీరం స తం నిక్షిప్య వానరమ్,
సుగ్రీవో ఽభిముఖం శత్రుం ప్రతస్థే పాదపాయుధః. 7

ప్ర. అ. సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, ఆత్మనః=తనకు, సదృశమ్=స

మానుడైన, వీరమ్=వీరుడైన, తం వానరమ్=ఆ సుషేణుణ్ణి, నిక్షిప్య=ఉంచి, పాదపాయుధః=వృక్షము ఆయుధముగా గలవాడై, శత్రుమ్ అభిముఖమ్=శత్రువుకు అభిముఖముగా, ప్రతస్థే=ప్రయాణమాయెను.

తా. ఆ సుగ్రీవుడు తనతో సమానుడైన ఆ సుషేణుణ్ణి అక్కడ నిలిపి, వృక్షమును ఆయుధముగా ధరించి శత్రువులకు ఎదురుగా బయలుదేరెను. 7

మూ. పార్శ్వతః పృష్ఠతశ్చాస్య సర్వే వానరయూథపాః,
అనుజగ్ముర్మహాశైలాన్ వివిధాంశ్చ వనస్పతీన్. 8

ప్ర. అ. సర్వే=సమస్తమైన, వానరయూథపాః=వానరనాయకులు, అస్య=వీనియొక్క, పార్శ్వతః=పార్శ్వమునందు, పృష్ఠతశ్చ=వెనుక భాగమునందును, మహాశైలాన్=మహాపర్వతములను, వివిధాన్=అనేకవిధములైన, వనస్పతీంశ్చ=వృక్షములను, గ్రహించి, అనుజగ్ముః=అనుసరించి వెళ్లిరి.

తా. ఆ వానరనాయకు లందరూ కూడ పెద్ద పర్వతములను, అనేక విధములైన వృక్షములను ధరించి ఆ సుగ్రీవుని ప్రక్కలయందును, వెనుక భాగమునందును అనుసరించి వెళ్లిరి. 8

మూ. ననర్ద యుధి సుగ్రీవః స్వరేణ మహతా మహాన్,
పోథయన్వివిధాంశ్చాన్యాన్మమన్థోత్తమరాక్షసాన్. 9

ప్ర. అ. మహాన్=గొప్పవాడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, యుధి=యుద్ధమునందు, మహతా=పెద్దదైన, స్వరేణ=స్వరముతో, ననర్ద=ధ్వనిచేసెను. వివిధాన్=అనేకవిధములైన, అన్యాన్=ఇతరులను, పోథయన్=కుమ్ముచు, ఉత్తమరాక్షసాన్=ఉత్తములైన రాక్షసులను, మమన్థ=మథించెను.

తా. పెద్ద దేహము గల సుగ్రీవుడు పెద్ద స్వరముతో, యుద్ధమునందు గర్జించుచు అనేకరాక్షసులను కుమ్మివేయుచు, రాక్షస శ్రేష్ఠులను మథించివేసెను.

మూ. మమర్ద చ మహాకాయో రాక్షసాన్వానరేశ్వరః,
యుగాన్తసమయే వాయుః ప్రవృద్ధానగమానివ. 10

ప్ర. అ. మహాకాయః=పెద్ద శరీరము గల, వానరేశ్వరః=సుగ్రీవుడు, యుగాన్తసమయే=ప్రళయకాలమునందు, వాయుః=వాయువు, ప్రవృద్ధాన్=పెరిగిన, అగమానివ=వృక్షములను వలె, రాక్షసాన్=రాక్షసులను, మమర్ద చ=మర్దించెను.

తా. పెద్ద శరీరము గల సుగ్రీవుడు ప్రళయకాలమునందు వాయువు పెరిగిన చెట్లను పడగొట్టినట్లు రాక్షసులను పడగొట్టెను. 10

మూ. రాక్షసానామనీకేషు శైలవర్షం వవర్ష హ,
అశ్మవర్షం యథా మేఘః పక్షిసంఘేషు కాననే. 11

ప్ర. అ. మేఘః=మేఘము, కాననే=అరణ్యమునందు, పక్షిసంఘేషు=పక్షుల సముదాయములయందు, అశ్మవర్షం యథా=వడగళ్ల వర్షము వలె, రాక్షసానామ్=రాక్షసులయొక్క, అనీకేషు=సైన్యముమీద, శైలవర్షమ్=శిలావర్షమును, వవర్ష=వర్షించెను.

తా. మేఘము అరణ్యములో ఉన్న పక్షులమీద వడగళ్లు కురిపించినట్లు రాక్షససైన్యములపై శిలావర్షమును కురిపించెను. 11

మూ. కపిరాజవిముక్తైస్తైః శైలవర్షైస్తు రాక్షసాః,
వికీర్ణశిరసః పేతుర్వికీర్ణా ఇవ పర్వతాః. 12

ప్ర. అ.రాక్షసాః=రాక్షసులు, కపిరాజవిముక్తైః=సుగ్రీవుని చేత విడువబడిన, తైః=ఆ, శైలవర్షైః=శిలావర్షములచేత, వికీర్ణశిరసః=చిమ్మివేయబడిన శిరస్సులు గలవారై, వికీర్ణాః=ఇటు నటు పడగొట్టబడిన, పర్వతాః ఇవ=పర్వతములు వలె, పేతుః=పడిపోయిరి.

తా. సుగ్రీవుడు చేసిన ఆ శిలావర్షముచేత రాక్షసులు తలలు ఊడిపోయి ఇటు అటు చిమ్మివేసిన పర్వతముల వలె పడిపోయిరి. 12

మూ. అథ సంక్షీయమాణేషు రాక్షసేషు సమన్తతః,
సుగ్రీవేణ ప్రభగ్నేషు నదత్సు చ పతత్సు చ. 13
విరూపాక్షః స్వకం నామ ధన్వీ విశ్రావ్య రాక్షసః,
రథాదాప్లుత్య దుర్ధర్షో గజస్కన్ధముపారుహత్. 14

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సుగ్రీవేణ=సుగ్రీవుని చేత, ప్రభగ్నేషు=ఓడింపబడిన, రాక్షసేషు=రాక్షసులు, సమన్తతః=అన్నివైపులా, సంక్షీయమాణేషు=తగ్గిపోవుచుండగా, నదత్సు=అరచుచుండగా, పతత్సు చ=పడిపోవుచుండగా, ధన్వీ=ధనుర్ధరుడు, దుర్ధర్షః=ఎదిరింప శక్యముకానివాడు అయిన, రాక్షసః=రాక్షసుడైన, విరూపాక్షః=విరూపాక్షుడు, స్వమ్=తన సంబంధమైన, నామ=పేరు, విశ్రావ్య=వినిపించి, రథాత్=రథమునుండి, ఆప్లుత్య=దిగి, గజస్కన్ధమ్=ఏనుగు మూపును, ఉపారుహత్=ఎక్కెను.

తా. సుగ్రీవునిచేత ఓడింపబడి అరచుచు నేలపై పడిపోవుచున్న రాక్షసులు అన్ని వైపులా తగ్గిపోవుచుండగా, ఎదిరింప శక్యముకాని విరూపాక్షుడు ధనస్సు ధరించి, తన పేరు చెప్పుచు, రథమునుండి క్రిందికి దుమికి ఏనుగమూపుపై ఎక్కెను. 13,14

మూ. స తం ద్విపమథారుహ్య విరూపాక్షో మహాబలః,
నవర్ద భీమనిర్హ్రాదం వానరానభ్యధావత. 15

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః విరూపాక్షః=ఆ విరూపాక్షుడు, తం ద్విపమ్=ఆ ఏనుగును, ఆరుహ్య=ఎక్కి, అథ=అటుపిమ్మట, భీమనిర్హ్రాదమ్=భయంకరమైన ధ్వని కలుగునట్లుగా, నవర్ద=ధ్వనిచేసెను, వానరాన్=వానరులను గూర్చి, అభ్యధావత=పరుగెత్తెను.

తా. గొప్ప బలము గల విరూపాక్షుడు ఏనుగను ఎక్కి భయంకరముగా ధ్వని చేయుచు వానరులమీదికి శీఘ్రముగా వెళ్లెను. 15

మూ. సుగ్రీవే చ శరాన్ ఘోరాన్ విససర్జ చమూముఖే,
స్థాపయామాస చోద్విగ్నాన్ రాక్షసాన్ సంప్రహర్షయన్. 16

ప్ర.అ. చమూముఖే=సేనాముఖమునందు, సుగ్రీవే=సుగ్రీవునిమీద, ఘోరాన్=భయంకరములైన, శరాన్=బాణములను, విససర్జ=విడచెను. ఉద్విగ్నాన్=దిగులుచెందిన, రాక్షసాన్=రాక్షసులను, సంప్రహర్షయన్=సంతోషపెట్టుచు, స్థాపయామాస=నిలిపెను.

తా. విరూపాక్షుడు సేనాగ్రమునందుండి సుగ్రీవునిమీద భయంకరములైన బాణాలను ప్రయోగించెను. దిగులు చెందిన రాక్షసులకు ఉత్సాహము కల్పించి వాళ్లు నిలద్రొక్కుకొనునట్లు చేసెను. 16

మూ. సోఽతివిద్ధః శితైర్బాణైః కపీన్ద్రస్తేన రక్షసా,
చుక్రోశ చ మహాక్రోధో వధే చాస్య మనో దధే. 17

ప్ర. అ.తేన=ఆ, రక్షసా=రాక్షసునిచేత, శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, అతివిద్ధః=మిక్కిలి కొట్టబడిన, సః కపీన్ద్రః=ఆ వానరరాజు, చుక్రోశ=అరచెను. మహాక్రోధః=చాల కోపము కలవాడై, అస్య=వీనియొక్క, వధే=వధయందు, మనః=మనస్సును, దధే=ఉంచెను.

తా. ఆ రాక్షసుడు వాడియైన బాణములతోఎక్కువ కొట్టగా సుగ్రీవుడు అరచెను. చాల కోపించి ఆతనిని చంపవలె నని నిశ్చయించుకొనెను. 17

మూ. తతః పాదపముద్ధృత్య శూరః సంప్రధనో హరిః,
అభిపత్య జఘానాస్య ప్రముఖే తం మహాగజమ్. 18

ప్ర. అ.తతః=అటుపిమ్మట, సంప్రధనః=కొట్టేవాడైన, శూరః=శూరుడైన, హరిః=సుగ్రీవుడు, పాదపమ్=వృక్షమును, ఉద్ధృత్య=ఎత్తి, అస్య=వీనియొక్క,

తమ్=ఆ, మహాగజమ్=మహాగజమును, అభిపత్య=సమీపించి, ప్రముఖే=ముఖము నందు, జఘాన=కొట్టెను.

తా. పిమ్మట, శూరుడు కొట్టుటలో సమర్థుడూ అయిన ఆ సుగ్రీవుడు చెట్టును ఎత్తి ఎగిరి వెళ్లి, వాని మహాగజమును ముఖమునందు కొట్టెను. 18

మూ. స తు ప్రహారాభిహతః సుగ్రీవేణ మహాగజః,
అపాసర్పద్ధనుర్మాత్రం నిషసాద ననాద చ. 19

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ప్రహారాభిహతః=దెబ్బచేత కొట్టబడిన, సః=ఆ, మహాగజః=పెద్ద ఏనుగు, ధనుర్మాత్రమ్=ధనస్సు అంత దూరము,అపాసర్పత్=తూలెను. నిషసాద=కూర్చుండిపోయెను. ననాద చ=ధ్వనిచేసెను కూడా.

తా. సుగ్రీవుని చేతిలో దెబ్బ తిన్న ఆ మహాగజము ధనస్సంత దూరము (రెండు గజములు దూరము) తూలి క్రిందపడి అరచెను. 19

మూ. గజాత్తు మథితాత్తూర్ణమపక్రమ్య స వీర్యవాన్,
రాక్షసో౽భిముఖః శత్రుం ప్రత్యుద్గమ్య తతః కపిమ్, 20
ఆర్షభం చర్మ ఖడ్గం చ ప్రగృహ్య లఘువిక్రమః,
భర్త్సయన్నివ సుగ్రీవమాససాద వ్యవస్థితమ్. 21

ప్ర. అ.తతః=అటుపిమ్మట, సః=ఆ, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రాక్షసః=రాక్షసుడు, మథితాత్=చంపబడిన, గజాత్=గజమునుండి, తూర్ణమ్=శీఘ్రముగా, అపక్రమ్య=తొలగి, అభిముఖః=అభిముఖుడై, శత్రుమ్=శత్రువైన, కపిమ్=సుగ్రీవుని, ప్రత్యుద్గమ్య=ఎదురుగా వెళ్లి, ఆర్షభమ్=వృషభసంబంధమైన, చర్మ=చర్మను, ఖడ్గం చ = ఖడ్గమును, ప్రగృహ్య=గ్రహించి, లఘువిక్రమః=శీఘ్రపరాక్రమము గలవాడై, వ్యవస్థితమ్=నిలచి ఉన్న, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, భర్త్సయన్నివ=భయపెట్టుచున్నవాడు వలె, ఆససాద=సమీపించెను.

తా. పరాక్రమవంతుడైన ఆ రాక్షసుడు చంపబడిన ఆ ఏనుగునుండి దిగి, అభిముఖుడై, శత్రువైన ఆ సుగ్రీవునకు ఎదురుగా వెళ్లి ఎద్దు చర్మతో చేసిన డాలును ఖడ్గమును గ్రహించి, చురుకుగా పరాక్రమము చూపుచు, నిలచి ఉన్న సుగ్రీవుణ్ణి భయపెట్టుచున్నాడా అన్నట్లు ఆతని మీదికి వెళ్లెను. 20, 21

మూ. స హి తస్యాభిసంక్రుద్ధః ప్రగృహ్య విపులాం శిలామ్,
విరూపాక్షస్య చిక్షేప సుగ్రీవో జలదోపమామ్. 22

ప్ర. అ.సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, తస్య=వానికి, అభిసంక్రుద్ధః=కోపించి

నవాడై, విపులామ్=విశాలమైన, జలదోపమామ్=మేఘము వంటి, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, విరూపాక్షస్య=విరూపాక్షునకు, చిక్షేప=విసిరెను.

తా. సుగ్రీవుడు ఆ విరూపాక్షునిపై కోపించి, మేఘమువంటి విశాలమైన శిలను గ్రహించి ఆతనిమీదికి విసిరెను. 22

మూ. స తాం శిలామాపతన్తీం దృష్ట్వా రాక్షసపుంగవః,
అపక్రమ్య సువిక్రాన్తః ఖడ్గేన ప్రాహరత్తదా. 23

ప్ర. అ.తదా=అప్పుడు, సువిక్రాన్తః=మంచి పరాక్రమము గల, సః రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుడు, ఆపతన్తీమ్=వచ్చుచున్న, తాం శిలామ్=ఆ శిలను, దృష్ట్వా=చూచి, అపక్రమ్య=ప్రక్కకు తొలగి, ఖడ్గేన=ఖడ్గముచేత, ప్రాహరత్=కొట్టెను.

తా. అప్పుడు, మంచి పరాక్రమము గల ఆ రాక్షసశ్రేష్ఠుడు మీదికి వచ్చుచున్న ఆ శిలను చూచి, ప్రక్కకు తొలగి, ఖడ్గముతో వానిని కొట్టెను. 23

మూ. తేన ఖడ్గప్రహారేణ బలినా రక్షసా హతః,
ముహూర్తమభవద్భూమౌ విసంజ్ఞ ఇవ వానరః. 24

ప్ర. అ.బలినా=బలవంతుడైన, తేన=ఆ, రక్షసా=రాక్షసునిచేత, ఖడ్గ ప్రహారేణ=ఖడ్గముయొక్క దెబ్బచేత, హతః=కొట్టబడిన, వానరః=సుగ్రీవుడు, ముహూర్తమ్=ముహూర్తకాలము, భూమౌ=భూమియందు, విసంజ్ఞః ఇవ=సంజ్ఞ లేనివాడు వలె, అభవత్=ఆయెను.

తా. బళవంతుడైన ఆ రాక్షసుడు ఖడ్గప్రహారము చేయగా సుగ్రీవుడు ముహూర్తకాలము పాటు, భూమి మీద సంజ్ఞ లేనివాడు వలె ఆయెను. 24

మూ. సహసా స తదోత్పత్య రాక్షసస్య మహాహవే,
ముష్టిం సంవర్త్య వేగేన పాతయామాస వక్షసి. 25

ప్ర. అ. సః=అతడు, తదా=అప్పుడు, మహాహవే=మహాయుద్ధమునందు, సహసా=హటాత్తుగా, ఉత్పత్య=ఎగిరి, ముష్టిమ్=పిడికిలిని, సంవర్త్య=బిగించి, వేగేన=వేగముతో, రాక్షసస్య=ఆ రాక్షసునియొక్క, వక్షసి=వక్షః స్థలమునందు, పాతయామాస=పడవేసెను.

తా. అప్పు డా సుగ్రీవుడు హటాత్తుగా, ఆ మహాయుద్ధమునందు పైకి ఎగిరి, పిడికిలి బిగించి వేగముగా ఆ రాక్షసుని వక్షఃస్థలముమీద కొట్టెను. 25

మూ. ముష్టిప్రహారాభిహతో విరూపాక్షో నిశాచరః,
తేన ఖడ్గేన సంక్రుద్ధః సుగ్రీవస్య చమూముఖే, 26

కవచం పాతయామాస పద్భ్యామభిహతోఽపతత్.

ప్ర. అ. ముష్టిప్రహారాభిహతః=పిడికిలి దెబ్బచేత కొట్టబడిన, నిశాచరః=రాక్షసుడైన, విరూపాక్షః=విరూపాక్షుడు, సంక్రుద్ధః=కోపించినవాడై, తేన ఖడ్గేన=ఆ ఖడ్గముచేత, చమూముఖే=సేనాముఖమునందు, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, కవచమ్=కవచమును, పాతయామాస=పడగొట్టెను. అభిహతః=కొట్టబడిన సుగ్రీవుడు, పద్భ్యామ్=పాదములచేత, అపతత్=పడెను.

తా. ఆ పిడికిలి దెబ్బ తిని కోపించిన,విరూపాక్షుడు సేనాగ్రభాగమునందు ఆ ఖడ్గముతో కొట్టి సుగ్రీవుని కవచమును పడగొట్టెను. ఆ దెబ్బ తిన్న సుగ్రీవుడు పాదాలు తొట్రుపడి పడిపోయెను. 26

మూ. స సముత్థాయ పతితః కపిస్తస్య వ్యసర్జయత్, 27
తలప్రహారమశనేః సమానం భీమనిఃస్వనమ్.

ప్ర. అ. పతితః=పడిపోయిన, సః కపిః=ఆ సుగ్రీవుడు, సముత్థాయ=లేచి, అశనేః=పిడుగుకు, సమానమ్=సమానమైన, తలప్రహారమ్=అరిచేతి దెబ్బను, భీమనిఃస్వనమ్=భయంకరమైన ధ్వని కలుగునట్లుగా, తస్య=వానికి, వ్యసర్జయత్=విడచెను(ఇచ్చెను).

తా. సుగ్రీవుడు క్రింద పడి లేచి భయంకరధ్వని చేయుచు, పిడుగువంటి అరిచేతి దెబ్బను ఆతనిని ఉద్దేశించి ప్రయోగించెను. 27

మూ. తలప్రహారం తద్రక్షః సుగ్రీవేణ సముద్యతమ్, 28
నైపుణ్యాన్మోచయిత్వైనం ముష్టినోరస్యతాడయత్.

ప్ర. అ. తత్=ఆ, రక్షః=రాక్షసుడు, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత,సముద్యతమ్=ఎత్తబడిన, తలప్రహారమ్=అరిచేతదెబ్బను, నైపుణ్యాత్=నేర్పువలన, మోచయిత్వా=విడిపించుకొని, ఏనమ్=ఈతనిని, ముష్టినా=పిడికిలిచేత, ఉరసి=వక్షఃస్థలమునందు, అతాడయత్=కొట్టెను.

తా. ఆ రాక్షసుడు సుగ్రీవుడు వేసిన ఆ అరిచేత దెబ్బను నేర్పుతో తప్పించుకొని ఆతని వక్షఃస్థలముమీద పిడికిలితో కొట్టెను. 28

మూ. తతస్తు సంక్రుద్ధతరః సుగ్రీవో వానరేశ్వరః, 29
మోక్షితం చాత్మనో దృష్ట్వా ప్రహారం తేన రక్షసా.

ప్ర. అ.తతః=అటుపిమ్మట, వానరేశ్వరః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, ఆత్మనః=తనయొక్క, ప్రహారమ్=దెబ్బను, తేన రక్షసా=ఆ రాక్షసునిచేత, మోక్షితమ్=విడిపించుకొనబడినదానినిగా, దృష్ట్వా=చూచి, సంక్రుద్ధతరః=మిక్కిలి

కోపించినవాడాయెను.

తా. అప్పుడు వానరరాజైన సుగ్రీవుడు తన దెబ్బను ఆ రాక్షసుడు తప్పించుకొనుట చూచి చాల కోపించెను. 29

మూ. స దదర్శాన్తరం తస్య విరూపాక్షస్య వానరః, 30
తతోఽన్యత్పాతయత్ క్రోధాచ్ఛఙ్ఖదేశే మహాతలమ్.

ప్ర. అ.సః వానరః=ఆ వానరుడు, తస్య విరూపాక్షస్య=ఆ విరూపాక్షునియొక్క, అన్తరమ్=అవకాశమును, దదర్శ=చూచెను. తతః=అటుపిమ్మట, క్రోధాత్=కోపమువలన, అన్యత్=మరియొక, మహాతలమ్=గొప్ప అరిచేతి దెబ్బను, శఙ్ఖదేశే=కణతయందు, పాతయత్=పడవేసెను.

తా. సుగ్రీవుడు, ఆ విరూపాక్షుడు కొంచెము అసావధానముగా ఉన్న అవకాశము చూచి అతని కణతమీద మరొక పెద్ద అరిచేతిదెబ్బ కొట్టెను. 30

మూ. మహేన్ద్రాశనికల్పేన తలేనాభిహతః క్షితౌ, 31
పపాత రుధిరక్లిన్నః శోణితం హి సముద్గిరన్.
స్రోతోభ్యస్తు విరూపాక్షో జలం ప్రస్రవణాదివ. 32

ప్ర. అ.మహేన్ద్రాశనికల్పేన=మహేంద్రుని వజ్రాయుధముతో సమానమైన, తలేన=అరచేతిచేత, అభిహతః=కొట్టబడిన, విరూపాక్షః=విరూపాక్షుడు, ప్రస్రవణాత్=జలపాతస్థానమునుండి, జలమివ=జలమును వలె, స్రోతోభ్యః=నాసికాది రంధ్రములనుండి, బహు=అధికమైన, శోణితమ్=రక్తమును, సముద్గిరన్=కార్చుచు, రుధిరక్లిన్నః=రక్తముచేత తడిసినవాడై, క్షితౌ=నేలమీద, పపాత=పడెను.

తా. విరూపాక్షుడు మహేంద్రుని వజ్రాయుధము వంటి ఆ అరచేతి దెబ్బ తిని, జలపాతమార్గమునుండి జలమును వలె, నాసికాదిరంధ్రములనుండి రక్తము కార్చుచు, రక్తముచేత తడిసి నేలపై పడెను. 31, 32

మూ. వివృత్తనయనం క్రోధాత్సఫేనం రుధిరాప్లుతమ్,
దదృశుస్తే విరూపాక్షం విరూపాక్షతరం కృతమ్. 33

ప్ర. అ. తే=వారు, క్రోధాత్=కోపమువలన, వివృత్తనయనమ్=త్రిప్పబడిన నేత్రములు కలవాడు, సఫేనమ్=నురుగుతో కూడిన వాడు, రుధిరాప్లుతమ్=రక్తముతో నిండినవాడు, అయిన, విరూపాక్షతరమ్=ఎక్కువ వికృతములైన నేత్రములు కలవాడుగా, కృతమ్=చేయబడిన, విరూపాక్షమ్=విరూపాక్షుణ్ణి, దదృశుః=చూచిరి.

తా. అక్కడ ఉన్న వాళ్లందరూ, కోపముచేత తిరిగిపోయిన నేత్రములతో నురుగు కక్కుచు, రక్తములో మునిగి, ఎక్కువ వికృతములైన నేత్రములు

కలవాడుగా అయిన ఆ విరూపాక్షుణ్ణి చూచిరి. 33

మూ. స్ఫురన్తం పరివర్తన్తం పార్శ్వేన రుధిరోక్షితమ్,
కరుణం చ వినర్దన్తం దదృశుః కపయో రిపుమ్. 34

ప్ర. అ. కపయః=వానరులు, స్ఫురన్తమ్=కొట్టుకొనుచున్నవాడు, పార్శ్వేన=పార్శ్వముచేత, పరివర్తన్తమ్=దొర్లుచున్నవాడును, రుధిరోక్షితమ్=రక్తముచేత తడపబడినవాడు, కరుణమ్=జాలిగా, వినర్దన్తమ్=అరచుచున్నవాడు అయిన, రిపుమ్=శత్రువును, దదృశుః=చూచిరి.

తా. ఆ విరూపాక్షుడు కాళ్లూ చేతులూ కొట్టుకొనుచు ప్రక్కలకు ఒత్తిగిలుచు, జాలి గొల్పునట్లు అరచుచు రక్తముతో తడిసి ఉండెను. అట్టివానిని వానరులు చూచిరి. 34

మూ. తథా తు తౌ సంయతి సంప్రయుక్తౌ
తరస్వినౌ వానరరాక్షసానామ్,
బలార్ణవౌ సస్వనతుశ్చ భీమౌ
మహార్ణవౌ ద్వావివ భిన్నసేతూ. 35

ప్ర. అ. తథా=ఆ విధముగా, సంయతి=యుద్ధమునందు, సంప్రయుక్తౌ=కలిసిన, తరస్వినౌ=వేగముగల, భీమౌ=భయంకరములైన, వానరరాక్షసానామ్=వానరరాక్షసులయొక్క, బలార్ణవౌ=సముద్రమువంటి సేనలు, భిన్నసేతూ=భేదించబడిన సేతువులు గల, ద్వౌ=రెండు, మహార్ణవౌ ఇవ=మహాసముద్రములు వలె, సస్వనతుశ్చ=ధ్వని చేసినవి.

తా. బలము గలవి, భయంకరములూ అయిన ఆ వానరరాక్షస సేనాసముద్రములు యుద్ధములో ఆ విధముగా కలిసి, సేతువును తెగగొట్టిన రెండు మహాసముద్రముల వలె ధ్వని చేసినవి. 35

మూ. వినాశితం ప్రేక్ష్య విరూపనేత్రం
మహాబలం తం హరిపార్థివేన,
బలం సమేతం కపిరాక్షసానా
ముద్వృత్తగఙ్గాప్రతిమం బభూవ. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే షణ్ణవతితమః సర్గః.

ప్ర. అ. హరిపార్థివేన=సుగ్రీవునిచేత, వినాశితమ్=చంపబడిన, తమ్=ఆ, మహాబలమ్=గొప్ప బలము గల, విరూపనేత్రమ్=విరూపాక్షుణ్ణి, ప్రేక్ష్య=చూచి,

సమేతమ్=కలిసి ఉన్న, కపిరాక్షసానామ్=వానరరాక్షసులయొక్క, బలమ్=సైన్యము, ఉద్వృత్తగఙ్గాప్రతిమమ్=విజృంభించిన గంగతో సమానము, బభూవ=ఆయెను.

తా. మహాబలుడైన ఆ విరూపాక్షుడు సుగ్రీవునిచేత చంపబడుట చూచిన ఆ వానరరాక్షససైన్యము విజృంభించి ప్రవహించుచున్న గంగానది వలె ఉండెను.

"బాలానందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో తొంబదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తనవతితమః సర్గః

[సుగ్రీవుడు మహోదరుని వధించుట.]

మూ. హన్యమానే బలే తూర్ణమన్యోన్యం తే మహామృధే,
సరసీవ మహాఘర్మే సూపక్షీణే బభూవతుః. 1

ప్ర. అ. మహామృధే=ఆ మహాయుద్ధమునందు, అన్యోన్యమ్=పరస్పరము, హన్యమానే=చంపబడుచున్న,తే బలే=ఆ సైన్యములు, మహాఘర్మే=గొప్ప గ్రీష్మమునందు, సరసీవ=సరస్సులు వలె, తూర్ణమ్=శీఘ్రముగా, సూపక్షీణే=బాగాక్షీణించినవిగా, బభూవతుః=అయినవి.

తా. ఆ మహాయుద్ధమునందు ఆ సైన్యములు రెండూ పరస్పరము చంపుకొనుచు, తీవ్రగ్రీష్మమునందు రెండు సరస్సులు వలె శీఘ్రముగా, బాగా క్షీణించిపోయినవి. 1

మూ. స్వబలస్య తు ఘాతేన విరూపాక్షవధేన చ,
బభూవ ద్విగుణం క్రుద్ధో రావణో రాక్షసాధిపః. 2

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, స్వబలస్య=తన సైన్యముయొక్క, ఘాతేన=చంపుటచేతను, విరూపాక్షవధేన చ=విరూపాక్షుని వధచేతను, ద్విగుణమ్=రెండు రెట్లు, క్రుద్ధః=కోపించినవాడు, బభూవ=ఆయెను.

తా. రాక్షసప్రభువైన రావణుడు తన సైన్యము చంపబడుటచేతను, విరూపాక్షుని వధచేతను, రెట్టింపు కోపమును పొందెను. 2

మూ. ప్రక్షీణం స్వబలం దృష్ట్వా వధ్యమానం వలీముఖైః,
బభూవాస్య వ్యథా యుద్ధే దృష్ట్వా దైవవిపర్యయమ్. 3

ప్ర. అ.యుద్ధే=యుద్ధమునందు, వలీముఖైః=వానరులచేత, వధ్యమానమ్=చంపబడుచున్న, ప్రక్షీణమ్=క్షీణించిన, స్వబలమ్=తన సైన్యమును, దృష్ట్వా=చూచి, దైవవిపర్యయమ్=దైవవైపరీత్యమును, దృష్ట్వా=చూచి, అస్య=వీనికి, వ్యథా=వ్యథ, బభూవ=ఆయెను.

తా. యుద్ధములో వానరులచేత చంపబడి క్షీణించిన తన సైన్యమును, దైవవైపరీత్యమును చూచి రావణునకు వ్యథ కలిగెను. 3

**మూ.** ఉవాచ చ సమీపస్థం మహోదరమరిందమమ్,
అస్మిన్ కాలే మహాబాహో జయాశా త్వయి మే స్థితా. 4

ప్ర. అ. సమీపస్థమ్=సమీపమునందున్న, అరిందమమ్=శత్రుసంహారకుడైన, మహోదరమ్=మహోదరుని గూర్చి, ఉవాచ=పలికెను. మహాబాహో=ఓ ! మహాబాహూ ! అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, మే=నాయొక్క, జయాశా=జయమును గూర్చిన ఆశ, త్వయి=నీయందు, స్థితా=ఉన్నది.

తా. దగ్గరనే ఉన్న, శత్రుసంహారకుడైన మహోదరునితో ఇట్లు పలికెను. " ఓ ! మహాబాహూ ! ఇప్పుడు నా జయాశ అంతా నీమీద ఉన్నది. " 4

**మూ.** జహి శత్రుచమూం వీర దర్శయాద్య పరాక్రమమ్,
భర్తృపిణ్డస్య కాలోఽయం నిర్వేష్టుం సాధు యుధ్యతామ్. 5

ప్ర. అ. వీర=వీరుడా, శత్రుచమూమ్=శత్రుసేనను, జహి=చంపుము. అద్య=ఇప్పుడు, పరాక్రమమ్=పరాక్రమమును, దర్శయ=చూపుము. అయమ్=ఇది, భర్తృపిణ్డస్య=ప్రభువుయొక్క అన్నమునకు, నిర్వేష్టుమ్=ఋణము తీర్చుకొనుటకు, కాలః=సమయము. సాధు=బాగుగా, యుధ్యతామ్=యుద్ధము చేయబడుగాక.

తా. వీరుడా ! శత్రుసైన్యమును చంపుము. ఇప్పుడు నీ పరాక్రమమును చూపుము. ఇది ప్రభువు పెట్టిన అన్నానికి ఋణము తీర్చుకొను సమయము. బాగుగా యుద్ధము చేయుము. 5

**మూ.** ఏవముక్తస్తథేత్యుక్త్వా రాక్షసేన్ద్రో మహోదరః,
ప్రవివేశారిసేనాం తాం పతఙ్గ ఇవ పావకమ్. 6

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రాక్షసేన్ద్రః=రాక్షసనాయకుడైన, మహోదరః=మహోదరుడు, తథా ఇతి=అట్లే అని, ఉక్త్వా=పలికి, పతఙ్గః=మిడత, పావకమ్ ఇవ=అగ్నిని వలె, తామ్ అరిసేనామ్=ఆ శత్రుసేనను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. రావణుని మాటలు విని రాక్షసనాయకుడైన మహోదరుడు " అట్లే చేసెదను " అని పలికి, మిడత అగ్నిలో ప్రవేశించినట్లు ఆ శత్రుసైన్యములో ప్రవేశించెను. 6

**మూ.** తతః స కదనం చక్రే వానరాణాం మహాబలః,
భర్తృవాక్యేన తేజస్వీ స్వేన వీర్యేణ చోదితః. 7

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబలః=గొప్ప బలము గల, తేజస్వీ=తేజఃశాలి అయిన, సః=అతడు, భర్తృవాక్యేన=ప్రభువు మాటచేతను,

స్వేన=తనసంబంధమైన, వీర్యేణ=పరాక్రమముచేతను, చోదితః=ప్రేరేపించబడిన వాడై, వానరాణామ్=వానరులయొక్క, కదనమ్=సంహారమును, చక్రే=చేసెను.

తా. పిమ్మట మహాబలశాలీ,తేజోవంతుడూ అయిన అతడు ప్రభువు మాటలచేతను, తన పరాక్రమముచేతను ప్రేరితుడై వానరసంహారము చేసెను.

మూ. వానరాశ్చ మహాసత్త్వాః ప్రగృహ్య విపులాః శిలాః,
ప్రవిశ్యారిబలం భీమం జఘ్నుస్తే సర్వరాక్షసాన్. 8

ప్ర. అ. మహాసత్త్వాః=గొప్ప బలము గల, తే=ఆ, వానరాశ్చ=వానరులు కూడ, విపులాః=పెద్దవైన, శిలాః=శిలలను, పరిగృహ్య=గ్రహించి, భీమమ్=భయంకరమైన,అరిబలమ్=శత్రుసైన్యమును, ప్రవిశ్య=ప్రవేశించి, సర్వరాక్షసాన్=సకలరాక్షసులను, జఘ్నుః=చంపిరి.

తా. గొప్ప బలము గల వానరులు కూడ విశాలములైన శిలలు ధరించి, భయంకరమైన శత్రుసైన్యములో ప్రవేశించి ఆ రాక్షసుల నందరినీ చంపిరి. 8

మూ. మహోదరః సుసంక్రుద్ధః శరైః కాఞ్చనభూషణైః,
చిచ్ఛేద పాణిపాదోరు వానరాణాం మహాహవే. 9

ప్ర. అ. మహాహవే=మహాయుద్ధమునందు, సుసంక్రుద్ధః=చాల కోపించిన, మహోదరః=మహోదరుడు, కాఞ్చనభూషణైః=బంగారు అలంకారములు గల, శరైః=బాణాలచేత, వానరాణామ్=వానరులయొక్క, పాణిపాదోరు=చేతులను, పాదాలను,తొడలను, చిచ్ఛేద=ఛేదించెను.

తా. ఆ మహాయుద్ధములో మహోదరుడు కోపించి బంగారు అలంకారములు గల బాణాలచేత వానరుల చేతులు, పాదాలు, తొడలు ఛేదించెను. 9

మూ. తతస్తే వానరాః సర్వే రాక్షసైరర్దితా భృశమ్,
దిశో దశ ద్రుతాః కేచిత్కేచిత్సుగ్రీవమాశ్రితాః. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, తే వానరాః=ఆ వానరులు, రాక్షసైః=రాక్షసులచేత, భృశమ్=మిక్కిలి, అర్దితాః=పీడింపబడినవారై, కేచిత్=కొందరు, దశ=పది, దిశః=దిక్కులను గూర్చి, ద్రుతాః=పారిపోయిరి. కేచిత్=కొందరు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ఆశ్రితాః=ఆశ్రయించినారు.

తా. అప్పుడు రాక్షసులచేత మిక్కిలి పీడింపబడిన వానరులలో కొందరు పది దిక్కులకు పారిపోయిరి. మరికొందరు సుగ్రీవుణ్ణి ఆశ్రయించిరి. 10

మూ. ప్రభగ్నం సమరే దృష్ట్వా వానరాణాం మహాబలమ్,
అభిదుద్రావ సుగ్రీవో మహోదరమనన్తరమ్. 11

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, ప్రభగ్నమ్=పరాజితమైన, వానరాణామ్=వానరులయొక్క, మహాబలమ్=మహాసైన్యమును, దృష్ట్వా=చూచి, సుగ్రీవః=సుగ్రీవుడు, అనన్తరమ్=దగ్గర ఉన్న, మహోదరమ్=మహోదరుణ్ణి గూర్చి, అభిదుద్రావ=ఎదురుగా పరుగెత్తెను.

తా. సుగ్రీవుడు యుద్ధమునందు ఓడిపోయిన వానరమహాసైన్యమును చూచి దగ్గర నున్న మహోదరునిమీదికి శీఘ్రముగా వెళ్ళెను. 11

మూ. ప్రగృహ్య విపులాం ఘోరాం మహీధరసమాం శిలామ్,
చిక్షేప చ మహాతేజాస్తద్వధాయ హరీశ్వరః. 12

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, హరీశ్వరః=సుగ్రీవుడు, మహీధరసమామ్=పర్వతముతో సమానమైన, ఘోరామ్=ఘోరమైన, విపులామ్=విశాలమైన, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, తద్వధాయ=వాని వధకొరకు, చిక్షేప=విసిరెను.

తా. గొప్ప తేజస్సు గల సుగ్రీవుడు విశాలము, భయంకరము, పర్వతసమానము అయిన శిలను గ్రహించి ఆ రాక్షసుణ్ణి చంపుటకై విసరెను.

మూ. తామాపతన్తీం సహసా శిలాం దృష్ట్వా మహోదరః,
అసంభ్రాన్తస్తతో బాణైర్నిర్బిభేద దురాసదామ్. 13

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహోదరః=మహోదరుడు, సహసా=హటాత్తుగా, ఆపతన్తీమ్=వచ్చిపడుచున్న, దురాసదామ్=ఎదిరింప శక్యముకాని, తాం శిలామ్=ఆ శిలను, దృష్ట్వా=చూచి, అసంభ్రాన్తః=భయపడనివాడై, బాణైః=బాణములచేత, నిర్బిభేద=భేదించెను.

తా. పిమ్మట మహోదరుడు హటాత్తుగా వచ్చి మీదపడుచున్న ఎదిరింప శక్యము కాని ఆ శిలను చూచి, భయపడక, బాణాలతో భేదించెను. 13

మూ. రక్షసా తేన బాణౌఘైర్నికృత్తా సా సహస్రధా,
నిపపాత తదా భూమౌ గృధ్రచక్రమివాకులమ్. 14

ప్ర. అ. తదా=అప్పుడు, తేన రక్షసా=ఆ రాక్షసునిచేత, సహస్రధా=వేయి ముక్కలుగా, నికృత్తా=ఛేదించబడిన, సా=ఆ శిల, ఆకులమ్=వ్యాకులమైన, గృధ్రచక్రమివ=గ్రద్దల సముదాయము వలె, భూమౌ=నేలమీద, నిపపాత=పడెను.

తా. ఆ రాక్షసునిచేత వేయి ముక్కలుగా ఛేదింపబడిన ఆ శిల

వ్యాకులమైన గ్రద్దల గుంపువలె నేలపై పడెను. 14

మూ. తాం తు భిన్నాం శిలాం దృష్ట్వా సుగ్రీవః క్రోధమూర్ఛితః,
పాలముత్పాట్య చిక్షేప తం స చిచ్ఛేద నైకధా. 15

ప్ర. అ. సుగ్రీవః=సుగ్రీవుడు, భిన్నామ్=బ్రద్దలుకొట్టబడిన, తాం శిలామ్=ఆ శిలను, దృష్ట్వా=చూచి, క్రోధమూర్ఛితః=క్రోధముతో నిండినవాడై, సాలమ్=సాలవృక్షమును, ఉత్పాట్య=పెరికి, చిక్షేప=విసరెను. సః=అతడు, తమ్=దానిని, నైకధా=అనేకవిధములుగా, చిచ్ఛేద=ఛేదించెను.

తా. ఆ శిలను బ్రద్దలు కొట్టినట్లు చూచిన సుగ్రీవుడు క్రోధావిష్టుడై సాలవృక్షమును పెరికి ప్రయోగించగా మహోదరుడు దానిని చాల ముక్కలుగా ఖండించెను. 15

మూ. శరైశ్చ విదదారైనం శూరః పరబలార్దనః,
స దదర్శ తతః క్రుద్ధః పరిఘం పతితం భువి. 16

ప్ర. అ. శూరః=శూరుడు, పరబలార్దనః=శత్రుసేనలను పీడించువాడు అయిన మహోదరుడు, ఏనమ్=సుగ్రీవుణ్ణి, శరైః=బాణాలచేత, విదదార=చీల్చెను. తతః=అటుపిమ్మట, సః=సుగ్రీవుడు, క్రుద్ధః=కోపించినవాడై, భువి=నేలమీద, పతితమ్=పడిన, పరిఘమ్=పరిఘను, దదర్శ=చూచెను.

తా. శత్రుసేనాసంహారకుడైన ఆ మహోదరుడు బాణాలతో ఆ సుగ్రీవుణ్ణి చీల్చివేసెను. అప్పుడు కోపించిన సుగ్రీవుడు క్రింద పడి ఉన్న ఒక పరిఘను చూచెను. 16

మూ. ఆవిధ్య తు స తం దీప్తం పరిఘం తస్య దర్శయన్,
పరిఘేణోగ్రవేగేన జఘానాస్య హయోత్తమాన్. 17

ప్ర. అ. సః=సుగ్రీవుడు, దీప్తమ్=ప్రకాశించుచున్న, తం పరిఘమ్=ఆ పరిఘను, ఆవిధ్య=నేలకువేసి కొట్టి, తస్య=వానికి, దర్శయన్=చూపుచు, ఉగ్రవేగేన=ఉగ్రమైన వేగము గల, పరిఘేణ=పరిఘచేత, అస్య=వీనియొక్క, హయోత్తమాన్=శ్రేష్ఠములైన గుఱ్ఱములను, జఘాన=చంపెను.

తా. సుగ్రీవుడు ప్రకాశించుచున్న ఆ పరిఘను నేలపై వేసి కొట్టుచు, ఆ రాక్షసునికి చూపి వాని గుఱ్ఱములను దానితో చంపివేసెను. 17

మూ. తస్మాద్ధతహయాద్వీరః సోఽవప్లుత్య మహారథాత్,
గదాం జగ్రాహ సంక్రుద్ధో రాక్షసోఽథ మహోదరః. 18

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వీరః=వీరుడైన, రాక్షసః=రాక్షసుడైన,

సః=ఆ, మహోదరః=మహోదరుడు, హతహయాత్=చంపబడిన గుఱ్ఱములు గల, తస్మాత్= ఆ, మహారథాత్=గొప్ప రథమునుండి, అవప్లుత్య=క్రిందికి దుమికి, క్రుద్ధః=కోపించినవాడై, గదామ్=గదను, జగ్రాహ=గ్రహించెను.

తా. వీరుడైన మహోదరుడు గుఱ్ఱములు చంపబడిన ఆ మహారథమునుండి క్రిందికి దుమికి కోపముతో గదను గ్రహించెను. 18

మూ. గదాపరిఘహస్తౌ తౌ యుధి వీరౌ సమీయతుః,
నర్దన్తౌ గోవృషప్రఖ్యౌ ఘనావివ సవిద్యుతౌ. 19

ప్ర. అ. గదాపరిఘహస్తౌ=గద పరిఘ హస్తములందు గల, వీరౌ=వీరులైన, గోవృషప్రఖ్యౌ=వృషభములతో సమానులైన, తౌ=వారిద్దరూ, సవిద్యుతౌ=మెరుపులతో కూడిన, ఘనావివ=రెండు మేఘముల వలె, నర్దన్తౌ=ధ్వనిచేయుచున్నవారై, యుధి=యుద్ధమునందు, సమీయతుః=తలబడిరి.

తా. వృషభముల వలె ఉన్న వీరులైన వారిద్దరూ గర్జించుచు, గదను పరిఘను హస్తములలో ధరించి, మెరుపులతో కూడిన మేఘములు వలె యుద్ధానికి తలబడిరి. 19

మూ. తతః క్రుద్ధో గదాం తస్య చిక్షేప రజనీచరః,
జ్వలన్తీం భాస్కరాభాసాం సుగ్రీవాయ మహోదరః. 20

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తస్య=సుగ్రీవునకు, క్రుద్ధః=కోపించిన, రజనీచరః=రాక్షసుడైన, మహోదరః=మహోదరుడు, జ్వలన్తీమ్=ప్రజ్వలించుచున్న, భాస్కరాభాసామ్=సూర్యునివంటి కాంతి గల, గదామ్=గదను, సుగ్రీవాయ=సుగ్రీవునకు, చిక్షేప=విసిరెను.

తా. పిమ్మట మహోదరుడు సుగ్రీవునిపై కోపించి, ప్రజ్వలించుచున్న, సూర్యునివంటి కాంతి గల ఆ గదను ఆతనిపైకి విసిరెను. 20

మూ. గదాం తాం సుమహాఘోరామాపతన్తీం మహాబలః,
సుగ్రీవో రోషతామ్రాక్షః సముద్యమ్య మహాహవే, 21
ఆజఘాన గదాం తస్య పరిఘేణ హరీశ్వరః,
పపాత స గదోద్భిన్నః పరిఘస్తస్య భూతలే. 22

ప్ర. అ. మహాహవే=మహాయుద్ధమునందు, ఆపతన్తీమ్=వచ్చిపడుచున్న, సుమహాఘోరామ్=చాల భయంకరమైన, తాం గదామ్=ఆ గదను,(చూచి), మహాబలః=గొప్ప బలము గల, రోషతామ్రాక్షః=రోషముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల, హరీశ్వరః=వానరప్రభువైన, సుగ్రీవః=సుగ్రీవుడు, సముద్యమ్య=పరిఘను ఎత్తి,

తస్య=వానియొక్క, గదామ్=గదను, ఆజఘాన=కొట్టెను. గదోద్భిన్నః=గదచేత విరగ గొట్టబడినదై, తస్య=వానియొక్క, పరిఘః=పరిఘ, భూతలే=నేలమీద, పపాత=పడెను.

తా. ఆ మహాయుద్ధమునందు వచ్చి మీద పడుచున్న, చాల భయంకరమైన ఆ గదను చూచి, మహాబలవంతుడూ, వానరరాజూ అయిన సుగ్రీవుడు కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో దానిని ఆ పరిఘతో కొట్టెను. కాని ఆ పరిఘ గదచేత విరుగగొట్టబడి నేలమీద పడిపోయెను. 21, 22

మూ. తతో జగ్రాహ తేజస్వీ సుగ్రీవో వసుధాతలాత్,
ఆయసం ముసలం ఘోరం సర్వతో హేమభూషితమ్. 23

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేజస్వీ=తేజః శాలియైన, సుగ్రీవః=సుగ్రీవుడు, వసుధాతలాత్=నేలమీదనుండి, సర్వతః=అంతటా, హేమభూషితమ్=బంగారముచేత అలంకరింపబడిన, ఘోరమ్=భయంకరమైన, ఆయసమ్=ఇనుము వికారమైన, ముసలమ్=ముసలమును, జగ్రాహ=గ్రహించెను.

తా. పిమ్మట తేజఃశాలియైన సుగ్రీవుడు అంతటా బంగారముచేత అలంకరింపబడిన, భయంకరమైన ఇనుపరోకలిని నేలమీదనుండి గ్రహించెను.

మూ. స తముద్యమ్య చిక్షేప సోఽప్యస్య ప్రాక్షిపద్గదామ్,
భిన్నావన్యోన్యమాపాద్య పేతతుస్తౌ మహీతలే. 24

ప్ర. అ. సః=సుగ్రీవుడు, తమ్=ఆ ముసలమును, ఉద్యమ్య=ఎత్తి, చిక్షేప=విసిరెను. సోఽపి=అతడు కూడా, అస్య=వీనికి (వీనిమీదికి), గదామ్=గదను, ప్రాక్షిపత్=విసరెను. తౌ=ఆ రెండూ, అన్యోన్యమ్=ఒకదాని నొకటి, ఆపాద్య=పొంది, భిన్నౌ=విరిగినవై, మహీతలే=భూమిమీద, పేతతుః=పడినవి.

తా. సుగ్రీవుడు దానిని ఎత్తి విసరెను. మహోదరుడు కూడ మరొక గదను విసరెను. ఆ రెండూ ఒకదానికి ఒకటి తగిలినవై నేలమీద పడినవి. 24

మూ. తతో భిన్నప్రహరణౌ ముష్టిభ్యాం తౌ సమీయతుః,
తేజోబలసమావిష్టౌ దీప్తావివ హుతాశనౌ. 25

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేజోబలసమావిష్టౌ=తేజస్సుతోను బలముతోను కూడిన, తౌ=వారిద్దరూ, భిన్నప్రహరణౌ=విరిగిపోయిన ఆయుధములు కలవారై, దీప్తౌ=మండుచున్న, హుతాశనౌ ఇవ=అగ్నుల వలె, ముష్టిభ్యామ్=పిడికిళ్లతో, సమీయతుః=కలిసిరి.

తా. ఆయుధములు విరిగిపోయిన పిమ్మట తేజోబలములు గల,

ప్రజ్వలించుచున్న అగ్నుల వలె ఉన్న వారిద్దరూ ముష్టియుద్ధమునకు తలబడిరి.

మూ. జఘ్నతుస్తౌ తదాన్యోన్యం నదన్తౌ చ పునః పునః,
తలైశ్చాన్యోన్యమాహత్య పేతతుశ్చ మహీతలే. 26

ప్ర. అ. తదా=అప్పుడు, తౌ=వారిద్దరూ, పునః పునః=మాటిమాటికి, నదన్తౌ=ధ్వనిచేయుచున్నవారై, అన్యోన్యమ్=పరస్పరము, జఘ్నతుః=కొట్టుకొనిరి. అన్యోన్యమ్=పరస్పరము, తలైః=అరచేతులచేత, ఆహత్య=కొట్టుకొని, మహీతలే= నేలమీద, పేతతుః చ=పడిరి.

తా. వాళ్ళిద్దరూ మాటి మాటికి అరచుచు పరస్పరము కొట్టుకొనిరి. అరచేతులతో ఒకరి నొకరు కొట్టుకొని నేలమీద పడిరి. 26

మూ. ఉత్పేతతుస్తదా తూర్ణం జఘ్నతుశ్చ పరస్పరమ్,
భుజైశ్చిక్షిపతుర్వీరావన్యోన్యమపరాజితౌ. 27

ప్ర. అ. తదా=అప్పుడు, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్పేతతుః=పైకి ఎగిరిరి. పరస్పరమ్=పరస్పరము, జఘ్నతుః చ=కొట్టుకొనిరి. వీరౌ=వీరులైన వారి ద్దరూ, అపరాజితౌ=ఓడిపోనివారై, అన్యోన్యమ్=పరస్పరము, భుజైః=భుజములచేత, చిక్షిపతుః=విసిరి కొట్టిరి.

తా. అప్పుడు వీరులైన వాళ్ళిద్దరూ పరాజయము చెందక శీఘ్రముగా లేచి కొట్టుకొనిరి. భుజముచేత ఒకరి నొకరు గెంటికొనిరి. 27

మూ. జగ్మతుస్తౌ శ్రమం వీరౌ బాహుయుద్ధే పరంతపౌ,
జహార చ తదా ఖడ్గమదూరపరివర్తినమ్, 28
రాక్షసశ్చర్మణా సార్ధం మహావేగో మహోదరః.

ప్ర. అ. పరంతపౌ=శత్రువినాశకులైన, తౌ=ఆ, వీరౌ=వీరులు, బాహుయుద్ధే= బాహుయుద్ధమునందు, శ్రమమ్=శ్రమను, జగ్మతుః=పొందిరి. తదా=అప్పుడు, మహావేగః=గొప్ప వేగము గల, రాక్షసః=రాక్షసుడైన, మహోదరః=మహోదరుడు, అదూరపరివర్తినమ్=సమీపమునందు పడి యున్న, ఖడ్గమ్=ఖడ్గమును, చర్మణా సార్ధమ్=డాలుతో కూడ, జహార=గ్రహించెను.

తా. శత్రుసంహారకులైన ఆ వీరులిద్దరూ బాహుయుద్ధము చేసి అలిసిపోయిరి. అప్పుడు మహావేగము గల మహోదరుడు దగ్గరనే పడి ఉన్న కత్తిని డాలును తీసికొనెను. 28

మూ. తథైవ చ మహాఖడ్గం చర్మణా పతితం సహ, 29
జగ్రాహ వానరశ్రేష్ఠః సుగ్రీవో వేగవత్తరః.

ప్ర. అ. తథైవ=అట్లే, వేగవత్తరః=అధికమైన వేగము గల, వానరశ్రేష్ఠః=వానర శ్రేష్ఠుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, పతితమ్=పడి ఉన్న, మహాఖడ్గమ్=గొప్ప ఖడ్గమును, చర్మణా సహ=చర్మముతో కూడ, జగ్రాహ=గ్రహించెను.

తా. అధికవేగవంతుడు, వానరశ్రేష్ఠుడూ అయిన సుగ్రీవుడు కూడ పడి ఉన్న మహాఖడ్గమును, డాలును గ్రహించెను. 29

మూ. తతో రోషపరీతాఙ్గౌ నదన్తావభ్యధావతామ్, 30
ఉద్యతాసీ రణే హృష్టౌ యుద్ధే శస్త్రవిశారదౌ.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రోషపరీతాఙ్గౌ=రోషముతో నిండిన శరీరములు గలవారు, ఉద్యతాసీ=ఎత్తబడిన ఖడ్గములు గలవారు, యుద్ధే=యుద్ధమునందు, శస్త్రవిశారదౌ=ఆయుధములయందు సమర్థులు అయిన వాళ్లిద్దరూ, రణే=యుద్ధమునందు, హృష్టౌ=సంతోషించినవారై, నదన్తౌ=ధ్వనిచేయుచున్నవారై, అభ్యధావతామ్=ఎదురెదురుగా వెళ్లిరి.

తా. పిమ్మట రోషముతో నిండిన శరీరములు గల్లవారు, యుద్ధమునందు ఆయుధ ప్రయోగము చేయు నేర్పు గలవారు అయిన వాళ్లిద్దరూ యుద్ధమునందు ఉత్సాహవంతులై, ఖడ్గము లెత్తి గర్జించుచు ఒకరిపై ఒకరు దుమికిరి. 30

మూ. దక్షిణం మణ్డలం చోభౌ సుతూర్ణం సంపరీయతుః, 31
అన్యోన్యమభిసంక్రుద్ధౌ జయే ప్రణిహితావుభౌ.

ప్ర. అ. అన్యోన్యమ్=పరస్పరము, అభిసంక్రుద్ధౌ=కోపించిన, జయే=జయమునందు, ప్రణిహితౌ=ఏకాగ్రమనస్సు గల, ఉభౌ=వారిద్దరూ, సుతూర్ణమ్=చాల శీఘ్రముగా, ప్రదక్షిణమ్=ప్రదక్షిణముగా, మణ్డలమ్=మండలభ్రమణమును (గుండ్రముగా తిరుగుటను), సంపరీయతుః=చేసిరి.

తా. జయము సంపాదించవలె నను నిశ్చయము గల వారిద్దరూ పరస్పరము కోపించి అతిశీఘ్రముగా, ప్రదక్షిణమండలభ్రమణములు చేసిరి. 31

మూ. స తు శూరో మహావేగో వీర్యశ్లాఘీ మహోదరః, 32
మహాచర్మణి తం ఖడ్గం పాతయామాస దుర్మతిః.

ప్ర. అ. శూరః=శూరుడు, వీర్యశ్లాఘీ=పరాక్రమముచే శ్లాఘించుకొనువాడు, దుర్మతిః=దుష్టబుద్ధి అయిన, సః మహోదరః=ఆ మహోదరుడు, మహావేగః=గొప్ప వేగముగలవాడై, తమ్=ఆ, ఖడ్గమ్=ఖడ్గమును, మహాచర్మణి=గొప్ప చర్మమునందు, పాతయామాస=పడవేసెను.

తా. శూరుడు, తన పరాక్రమమును గూర్చి శ్లాఘించుకొనువాడు,

దుష్టబుద్ధి అయిన మహోదరుడు మహావేగముతో ఖడ్గమును (సుగ్రీవుని చేతిలోని) డాలుమీద నాటెను. 32

మూ. లగ్నముత్కర్షతః ఖడ్గం ఖడ్గేన కపికుఞ్జరః, 33
జహార సశిరస్త్రాణం కుణ్డలోపగతం శిరః.

ప్ర. అ. కపికుఞ్జరః=సుగ్రీవుడు, లగ్నమ్=లగ్నమైన, ఖడ్గమ్=ఖడ్గమును, ఉత్కర్షతః=పైకి లాగుచున్న వానియొక్క, సశిరస్త్రాణమ్=తల కవచముతో కూడిన, కుణ్డలోపగతమ్=కుండలములతో కూడిన, శిరః=శిరస్సును, ఖడ్గేన=ఖడ్గముచేత, జహార=హరించెను.

తా. డాలుపైన తగుల్కొన్న ఖడ్గమును లాగికొనుచుండగా, శిరస్త్రాణముతో కూడిన, కుండలాలంకృతమైన ఆతని శిరస్సును సుగ్రీవుడు ఖడ్గముచేత ఖండించెను. 33

మూ. నికృత్తశిరసస్తస్య పతితస్య మహీతలే, 34
తద్బలం రాక్షసేన్ద్రస్య దృష్ట్వా తత్ర న దృశ్యతే.

ప్ర. అ. నికృత్తశిరసః=ఖండించబడిన శిరస్సు గల, తస్య=అతడు, మహీతలే=నేలమీద, పతితస్య=పడిపోయినవాడగుచుండగా, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, బలమ్=సైన్యము, తత్=దానిని, దృష్ట్వా=చూచి, తత్ర=అక్కడ, న దృశ్యతే=కనబడలేదు.

తా. మహోదరుడు శిరస్సు ఖండింపబడి నేలమీద పడిపోయిన వెంటనే అది చూచి రావణుని సైన్యము అక్కడ కనబడకుండా పారిపోయిరి. 34

మూ. హత్వా తం వానరైః సార్ధం ననాద ముదితో హరిః, 35
చుక్రోధ చ దశగ్రీవో బభౌ హృష్టశ్చ రాఘవః.

ప్ర. అ. హరిః=సుగ్రీవుడు, తమ్=వానిని, హత్వా=చంపి, వానరైః=సార్ధమ్=వానరులతో కూడ, ముదితః=సంతోషించినవాడై, ననాద=ధ్వనిచేసెను. దశగ్రీవః=రావణుడు, చుక్రోధ చ=కోపించెను. రాఘవశ్చ=రాముడు కూడ, హృష్టః=సంతోషించినవాడై, బభౌ=ప్రకాశించెను.

తా. సుగ్రీవుడు ఆతనిని చంపి సంతోషించి వానరులతో కూడి విజయధ్వానములు చేసెను. రావణునకు కోపము, రామునకు సంతోషము కలిగెను. 35

మూ. విషణ్ణవదనాః సర్వే రాక్షసా దీనచేతసః, 36
విద్రవన్తి తతః సర్వే భయవిత్రస్తచేతసః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, విషణ్ణవదనాః=దిగులు చెందిన ముఖములు గలవారై, దీనచేతసః=దీనమైన చిత్తములు గలవారు అయిరి. సర్వే=అందరూ, భయవిత్రస్తచేతసః=భయాక్రాంతములైన మనస్సులు కలవారై, తతః=అక్కడినుండి, విద్రవన్తి=పారిపోయిరి.

తా. ఆ రాక్షసులందరూ దైన్యముతో కూడిన మనస్సులతో, పాలిపోయిన ముఖాలతో భయాక్రాంతచిత్తులై అక్కడినుండి పారిపోయిరి. 36

మూ. మహోదరం తం వినిపాత్య భూమౌ
మహాగిరేః కీర్ణమివైకదేశమ్,
సూర్యాత్మజస్తత్ర రరాజ లక్ష్మ్యా
సూర్యః స్వతేజోభిరివాప్రధృష్యః. 37

ప్ర. అ. సూర్యాత్మజః=సుగ్రీవుడు, మహాగిరేః=మహాపర్వతముయొక్క, కీర్ణమ్=దూరముగా పడవేయబడిన, ఏకదేశమ్ ఇవ=ఒక భాగమువలె ఉన్న, తం మహోదరమ్=ఆ మహోదరుణ్ణి, భూమౌ=నేలమీద, వినిపాత్య=పడవేసి, అప్రధృష్యః=ఎదిరింప శక్యము గానివాడై, సూర్యః=సూర్యుడు, స్వతేజోభిరివ=తన తేజస్సులతో వలె, తత్ర=అక్కడ, లక్ష్మ్యా=శోభతో, రరాజ=ప్రకాశించెను.

తా. పర్వత భాగమును ఒక దానిని పడగొట్టినట్లు ఆ మహోదరుని నేలమీద పడగొట్టి ఎదిరింప శక్యముకాని సుగ్రీవుడు సూర్యుడు తన తేజస్సుతో ప్రకాశించి నట్లు జయలక్ష్మితో ప్రకాశించెను. 37

మూ. అథ విజయమవాప్య వానరేన్ద్రః
సమరముఖే సురసిద్ధయక్షసంఘైః,
అవనితలగతైశ్చ భూతసంఘై
ర్హరుషసమాకులితైర్నిరీక్ష్యమాణః. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
సప్తనవతితమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వానరేన్ద్రః=సుగ్రీవుడు, సమరముఖే=యుద్ధాగ్రమునందు, విజయమ్=విజయమును, అవాప్య=పొంది, సురసిద్ధయక్షసంఘైః=సుర-సిద్ధ-యక్షుల సముదాయములచేతను, హరుషసమాకులితైః=సంతోషముచేత

వ్యాకులులుగా చేయబడిన, అవనితలగైః=భూమియందున్న, భూతసంఘైః చ=ప్రాణుల సముదాయములచేతను, నిరీక్ష్యమాణః=చూడబడుచున్నవాడు (ఆయెను).

తా. అప్పుడు యుద్ధరంగమునందు విజయమును పొందిన ఆ సుగ్రీవుణ్ణి దేవతలు, సిద్ధులు, యక్షులు, భూమిమీద నివసించు వారందరూ సంతోషముతో చూచిరి. 38

" బాలానందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో తొంబదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టనవతితమః సర్గః

[అంగదుడు మహాపార్శ్వుణ్ణి చంపుట.]

మూ. మహోదరే తు నిహతే మహాపార్శ్వో మహాబలః,
సుగ్రీవేణ సమీక్ష్యాథ క్రోధాత్సంరక్తలోచనః, 1
అఙ్గదస్య చమూం భీమాం క్షోభయామాస మార్గణైః.

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, మహోదరే=మహోదరుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, మహాబలః=గొప్ప బలము గల, మహాపార్శ్వః=మహాపార్శ్వుడు, సమీక్ష్య=చూచి, అథ=అటుపిమ్మట, క్రోధసంరక్తలోచనః=క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, మార్గణైః=బాణములచేత, అఙ్గదస్య=అంగదునియొక్క, భీమామ్=భయంకరమైన,చమూమ్=సేనను, క్షోభయామాస=క్షోభింపచేసెను.

తా. మహోదరుడు సుగ్రీవునిచేత చంపబడుట చూచి మహాబలశాలియైన మహాపార్శ్వుడు కోపముతో నేత్రములు ఎఱ్ఱబడగా, బాణాలచేత అంగదుని భయంకరమైన సైన్యమును క్షోభింపచేసెను. 1

మూ. స వానరాణాం ముఖ్యానాముత్తమాఙ్గాని రాక్షసః, 2
పాతయామాస కాయేభ్యః ఫలం వృన్తాదివానిలః.

ప్ర. అ. సః రాక్షసః=ఆ రాక్షసుడు, ముఖ్యానామ్=ముఖ్యులైన, వానరాణామ్=వానరులయొక్క, ఉత్తమాఙ్గాని=శిరస్సులను, అనిలః=వాయువు, వృన్తాత్=తొడిమనుండి, ఫలమివ=ఫలమును వలె, కాయేభ్యః=శరీరములనుండి, పాతయామాస=పడగొట్టెను.

తా. ఆ రాక్షసుడు ముఖ్యులైన వానరుల శిరస్సులను, వాయువు తొడిమనుండి ఫలములను వలె, శరీరములనుండి పడగొట్టెను. 2

మూ. కేషాం చిదిషుభిర్బాహూంశ్చిచ్ఛేదాథ స రాక్షసః, 3
వానరాణాం సుసంరబ్ధః పార్శ్వం కేషాం చిదాక్షిపత్.

ప్ర. అ. అథ=మరియు, సః రాక్షసః=ఆ రాక్షసుడు, సుసంరబ్ధః- చాల తొందరపడు చున్నవాడై, కేషాం చిత్=కొందరు, వానరాణామ్=వానరులయొక్క, బాహూన్=బాహువులను, ఇషుభిః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. కేషాం

చిత్=కొందరియొక్క, పార్శ్వమ్=పార్శ్వమును, ఆక్షిపత్=కొట్టివేసెను.

తా. ఆ రాక్షసుడు బాగుగా విజృంభించి బాణాలచేత కొందరు వానరుల బాహువులను ఛేదించెను. కొందరి పార్శ్వభాగములను చెక్కివేసెను. 3

మూ. తే ఽర్దితా బాణవేగేన మహాపార్శ్వేన వానరాః, 4
విషాదవిముఖాః సర్వే బభూవుర్గతచేతసః.

ప్ర. అ. మహాపార్శ్వేన=మహాపార్శ్వునిచేత, బాణవేగేన=బాణముల వేగముచేత, అర్దితాః=పీడింపబడిన, తే వానరాః=ఆ వానరులు, సర్వే=అందరూ, విషాదవిముఖాః=దుఃఖముచేత విముఖులై, గతచేతసః=పోయిన చైతన్యము కలవారు, బభూవుః=అయిరి.

తా. మహాపార్శ్వుని బాణవేగముచే పీడింపబడిన ఆ వానరులందరూ దుఃఖముచేత యుద్ధవిముఖులై చైతన్యము లేనివారు అయిరి. 4

మూ. నిశమ్య బలముద్విగ్నమఙ్గదో రాక్షసార్దితమ్, 5
వేగం చక్రే మహావేగః సముద్ర ఇవ పర్వసు.

ప్ర. అ. అఙ్గదః=అంగదుడు, రాక్షసార్దితమ్=రాక్షసునిచేత పీడింపబడిన, ఉద్విగ్నమ్=దిగులుచెంది ఉన్న, బలమ్=సైన్యమును, నిశమ్య=విని, పర్వసు=పర్వములయందు, సముద్రః ఇవ=సముద్రమువలె, మహావేగః=గొప్ప వేగముగలవాడై, వేగమ్=వేగమును, చక్రే=చేసెను.

తా. అంగదుడు సైన్యము రాక్షసునిచేత పీడింపబడి దిగులుచెంది ఉన్నట్లు విని మహావేగవంతుడై, పర్వకాలములయందు సముద్రమువలె గొప్ప వేగమును చేసెను. 5

మూ. ఆయసం పరిఘం గృహ్య సూర్యరశ్మిసమప్రభమ్, 6
సమరే వానరశ్రేష్ఠో మహాపార్శ్వే న్యపాతయత్.

ప్ర. అ. వానరశ్రేష్ఠః=అంగదుడు, సూర్యరశ్మిసమప్రభమ్=సూర్యకిరణములతో సమానమైన కాంతిగల, ఆయసమ్=ఇనుము వికారమైన, పరిఘమ్=పరిఘను, గృహ్య=గ్రహించి, సమరే=యుద్ధమునందు, మహాపార్శ్వే=మహాపార్శ్వునిమీద, న్యపాతయత్=పడవేసెను.

తా. అంగదుడు సూర్యకిరణములతో సమానమైన కాంతి గల ఇనుప పరిఘను గ్రహించి, యుద్ధమునందు ఆ మహాపార్శ్వునిపై పడవేసెను. 6

మూ. స తు తేన ప్రహారేణ మహాపార్శ్వో విచేతనః, 7
ససూతః స్యన్దనాత్తస్మాద్విసంజ్ఞశ్చాపతద్భువి.

ప్ర. అ. సః మహాపార్శ్వః=ఆ మహాపార్శ్వుడు, తేన ప్రహారేణ=ఆ దెబ్బచేత, విచేతనః=పోయిన చైతన్యము గలవాడై, ససూతః=సారథిసహితుడై, తస్మాత్=ఆ, స్యన్దనాత్=రథమునుండి, విసంజ్ఞః=సంజ్ఞ పోయినవాడై భువి=నేలమీద, అపతత్=పడెను.

తా. ఆ దెబ్బకు చైతన్యము కోల్పోయిన మహాపార్శ్వుడు మూర్ఛచెంది సారథితో సహా ఆ రథమునుండి క్రింద పడెను. 7

మూ. తస్యర్క్షరాజస్తేజస్వీ నీలాఞ్జనచయోపమః, 8
నిష్పత్య సుమహావీర్యః స్వయూథాన్మేఘసంనిభాత్,
ప్రగృహ్య గిరిశృఙ్గాభాం క్రుద్ధః స విపులాం శిలామ్, 9
అశ్వాన్ జఘాన తరసా బభఞ్జ స్యన్దనం చ తమ్.

ప్ర. అ. తేజస్వీ=తేజస్సు కలవాడు, నీలాఞ్జనచయోపమః=నల్లని కాటుక ప్రోగుతో సమానుడు, సుమహావీర్యః=చాల గొప్ప పరాక్రమము గలవాడు అయిన, ఋక్షరాజః=జాంబవంతుడు, క్రుద్ధః=కోపించినవాడై, మేఘసంనిభాత్=మేఘము వంటి, స్వయూథాత్=తన గుంపునుండి, నిష్పత్య=బైటకు ఎగిరి వచ్చి, గిరిశృఙ్గాభామ్=పర్వతశిఖరము వంటి కాంతి గల, విపులామ్=విశాలమైన, శిలామ్=శిలను, ప్రగృహ్య=గ్రహించి, తరసా=బలముచేత, తస్య=వానియొక్క, అశ్వాన్=గుఱ్ఱములను, జఘాన=చంపెను. తమ్=ఆ, స్యన్దనం చ=రథమును కూడ, బభఞ్జ=విరచెను.

తా. తేజః శాలి, గొప్ప పరాక్రమము గలవాడు అయిన, నల్లని కాటుక ప్రోగు వంటి జాంబవంతుడు మేఘము వలె ఉన్న తన గుంపునుండి ఎగిరి బైటకు వచ్చి, క్రోధముతో పర్వతశిఖరము వంటి విశాలమైన శిలను గ్రహించి, బలముచేత, ఆతని గుఱ్ఱములను చంపి ఆ రథమును కూడ విరుగగొట్టెను.

మూ. ముహూర్తాల్లబ్ధసంజ్ఞస్తు మహాపార్శ్వో మహాబలః, 10
అఙ్గదం బహుభిర్బాణైర్భూయస్తం ప్రత్యవిధ్యత.

ప్ర. అ. ముహూర్తాత్=ముహూర్తకాలములో, లబ్ధసంజ్ఞః=పొందబడిన సంజ్ఞ గల, మహాబలః=గొప్ప బలము గల, మహాపార్శ్వః=మహాపార్శ్వుడు, బహుభిః=అనేకములైన, బాణైః=బాణములచేత, తమ్=ఆ, అఙ్గదమ్=అంగదుణ్ణి, భూయః=మరల, ప్రత్యవిధ్యత=కొట్టెను.

తా. మహాబలవంతుడైన మహాపార్శ్వుడు ముహూర్తకాలములో మూర్ఛ నుండి తేరుకొని, అనేకబాణములతో మరల అంగదుని కొట్టెను. 10

మూ. జామ్బవన్తం త్రిభిర్బాణైరాజఘాన స్తనాన్తరే, 11
ఋక్షరాజం గవాక్షం చ జఘాన బహుభిః శరైః.

ప్ర. అ. ఋక్షరాజమ్=భల్లూకరాజైన, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, స్తనాన్తరే=వక్షఃస్థలమునందు, త్రిభిః=మూడు, బాణైః=బాణాలతో, ఆజఘాన=కొట్టెను. గవాక్షం చ=గవాక్షుణ్ణి కూడ, బహుభిః=అనేకములైన, శరైః=బాణములచేత, జఘాన=కొట్టెను.

తా. భల్లూకరాజైన జాంబవంతుణ్ణి మూడు బాణాలచేత వక్షఃస్థలముమీద కొట్టి గవాక్షుణ్ణి కూడ అనేకబాణములతో కొట్టెను. 11

మూ. గవాక్షం జామ్బవన్తం చ స దృష్ట్వా శరపీడితౌ, 12
జగ్రాహ పరిఘం ఘోరమఙ్గదః క్రోధమూర్ఛితః.

ప్ర. అ. సః అఙ్గదః=ఆ అంగదుడు, శరపీడితౌ=శరములచేత పీడింపబడిన, గవాక్షమ్=గవాక్షుణ్ణి, జామ్బవన్తం చ=జాంబవంతుణ్ణి, దృష్ట్వా=చూచి, క్రోధమూర్ఛితః=క్రోధముతో నిండినవాడై, ఘోరమ్=భయంకరమైన, పరిఘమ్=పరిఘను, జగ్రాహ=గ్రహించెను.

తా. శరములచేత పీడింపబడిన గవాక్షుణ్ణి, జాంబవంతుణ్ణి చూచి అంగదుడు కోపావేశముతో, భయంకరమైన పరిఘను గ్రహించెను. 12

మూ. తస్యాఙ్గదః సరోషాక్షో రాక్షసస్య తమాయసమ్, 13
దూరస్థితస్య పరిఘం రవిరశ్మిసమప్రభమ్.
ద్వాభ్యాం భుజాభ్యాం సంగృహ్య భ్రామయిత్వా చ వేగవత్, 14
మహాపార్శ్వస్య చిక్షేప వధార్థం వాలినః సుతః.

ప్ర. అ. వాలినః=వాలియొక్క, సుతః=పుత్రుడైన, అఙ్గదః=అంగదుడు, సరోషాక్షః=రోషముతో కూడిన కన్నులు కలవాడై, రవిరశ్మిసమప్రభమ్=సూర్యకిరణములతో సమానమైన కాంతిగల, ఆయసమ్=ఇనుము వికారమైన, తం పరిఘమ్=ఆ పరిఘను, ద్వాభ్యామ్=రెండు, భుజాభ్యామ్=భుజములతో, సంగృహ్య=పట్టుకొని, వేగవత్=వేగముగా, భ్రామయిత్వాచ=త్రిప్పి, దూరస్థితస్య=దూరమునందున్న, రాక్షసస్య=రాక్షసుడైన, తస్య=ఆ, మహాపార్శ్వస్య=మహాపార్శ్వునియొక్క, వధార్థమ్=వధకొరకు, చిక్షేప=విసిరెను.

తా. వాలిపుత్రుడైన అంగదుడు సూర్యకిరణములవంటి కాంతి గల ఆ ఇనుప పరిఘను రెండు చేతులతో పట్టి, వేగముగా త్రిప్పి, కోపముతో నిండిన నేత్రములు కలవాడై, దూరముగా ఉన్న ఆ మహాపార్శ్వుని చంపుటకై విసరెను.

మూ. స తు క్షిప్తో బలవతా పరిఘస్తస్య రక్షసః, 15
ధనుశ్చ సశరం హస్తాచ్ఛిరస్త్రాణం చ పాతయత్.

ప్ర. అ. బలవతా=బలవంతుడైన అంగదునిచేత, క్షిప్తః=విసరబడిన, సః పరిఘః=ఆ పరిఘ, తస్య రక్షసః=ఆ రాక్షసునియొక్క, హస్తాత్=హస్తమునుండి, సశరమ్=బాణముతో కూడిన, ధనుశ్చ=ధనస్సును, శిరస్త్రాణం చ=శిరస్సును రక్షించే ఆచ్ఛాదనమును, పాతయత్=పడగొట్టెను.

తా. బలవంతుడైన అంగదుడు విసిరిన ఆ పరిఘ ఆ రాక్షసుని హస్తమునుండి శరముతో కూడిన ధనస్సును, శిరస్త్రాణమును పడగొట్టెను.15

మూ. తం సమాపాద్య వేగేన వాలిపుత్రః ప్రతాపవాన్, 16
తలేనాభ్యహనత్క్రుద్ధః కర్ణమూలే సకుణ్డలే.

ప్ర.అ. ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, వాలిపుత్రః=అంగదుడు, క్రుద్ధః=కోపించినవాడై, తమ్=వానిని, వేగేన=వేగముతో, సమాసాద్య=పొంది, సకుణ్డలే=కుండలముతో కూడిన, కర్ణమూలే=కణతయందు, తలేన=అరచేతితో, అభ్యహనత్=కొట్టెను.

తా. ప్రతాపవంతుడైన అంగదుడు వేగముగా ఆతనిని సమీపించి, కోపముతో, కుండలాలంకృతమైన కణతమీద అరచేతితో కొట్టెను. 16

మూ. స తు క్రుద్ధో మహావేగో మహాపార్శ్వో మహాద్యుతిః, 17
కరేణైకేన జగ్రాహ సుమహాన్తం పరశ్వధమ్.

ప్ర.అ. మహావేగః=గొప్ప వేగము గల, మహాద్యుతిః=గొప్ప కాంతి గల, సః మహాపార్శ్వః=ఆ మహాపార్శ్వుడు, క్రుద్ధః=కోపించినవాడై, ఏకేన=ఒక్క, కరేణ=హస్తముచేత, సుమహాన్తమ్=చాల పెద్దదైన, పరశ్వధమ్=గండ్రగొడ్డలిని, జగ్రాహ=గ్రహించెను.

తా. గొప్ప వేగము, గొప్ప కాంతి గల మహాపార్శ్వుడు కోపించి ఒక చేతితో చాల పెద్దదైన గండ్రగొడ్డలి గ్రహించెను. 17

మూ. తం తైలధౌతం విమలం శైలసారమయం దృఢమ్, 18
రాక్షసః పరమక్రుద్ధో వాలిపుత్రే న్యపాతయత్.

ప్ర.అ. పరమక్రుద్ధః=మిక్కిలి కోపించిన, రాక్షసః=రాక్షసుడు, తైలధౌతమ్=తైలముచేత శుభ్రము చేయబడిన, విమలమ్=మాలిన్యములేని, శైలసారమయమ్=ఇనుప వికారమైన, దృఢమ్=దృఢమైన, తమ్=ఆ గండ్రగొడ్డలిని, వాలిపుత్రే=అంగదుని యందు, న్యపాతయత్=పడవేసెను.

**తా.** ఆ రాక్షసుడు చాల కోపించి తైలము పట్టించి శుద్ధము చేయబడి, నిర్మలమైన, ఇనుపవికారమైన, ఆ గండ్రగొడ్డలిని అంగదుని మీదికి విసిరెను.

మూ. తేన వామాంసఫలకే భృశం ప్రత్యవపాతితమ్, 19
అఙ్గదో మోక్షయామాస సరోషః స పరశ్వధమ్.

ప్ర.అ. సరోషః=కోపముతో కూడిన, సః అఙ్గదః= ఆ అంగదుడు, తేన=వానిచేత, వామాంసఫలకే=ఎడమ భుజఫలకమునందు, భృశమ్=మిక్కిలి, ప్రత్యవ పాతితమ్=పడవేయబడిన, పరశ్వధమ్=గండ్రగొడ్డలిని, మోక్షయామాస=త ప్పించుకొనెను.

**తా.** రోషముతో కూడిన ఆ అంగదుడు తన ఎడమ భుజముమీదికి గురిచేసి ఆ రాక్షసుడు విసిరిన ఆ గండ్రగొడ్డలిని తప్పించుకొనెను. 19

మూ. స వీరో వజ్రసంకాశమఙ్గదో ముష్టిమాత్మనః, 20
సంవర్తయత్సుసంక్రుద్ధః పితృతుల్యపరాక్రమః.

ప్ర.అ. పితృతుల్యపరాక్రమః=తండ్రితో సమానమైన పరాక్రమము గల, వీరః=వీరుడైన, సః అఙ్గదః=ఆ అంగదుడు, సుసంక్రుద్ధః=చాల కోపించిన వాడై, ఆత్మనః=తనయొక్క, వజ్రసంకాశమ్=వజ్రమువంటి, ముష్టిమ్=పిడికిలిని, సంవర్తయామాస=బిగించెను.

**తా.** తండ్రితో సమానమైన పరాక్రమము గల వీరుడైన అంగదుడు చాల కోపించి తన వజ్రమువంటి పిడికిలిని గట్టిగా బిగించెను. 20

మూ. రాక్షసస్య స్తనాభ్యాశే మర్మజ్ఞో హృదయం ప్రతి, 21
ఇన్ద్రాశనిసమస్పర్శం స ముష్టిం విన్యపాతయత్.

ప్ర.అ. మర్మజ్ఞః=మర్మప్రదేశమును ఎరిగిన, సః=అంగదుడు, రాక్షసస్య= రాక్షసునియొక్క, స్తనాభ్యాశే=స్తనము దగ్గర, హృదయం ప్రతి=హృదయమును గూర్చి, ఇన్ద్రాశనిసమస్పర్శమ్=ఇంద్రుని వజ్రముతో సమానమైన స్పర్శ గల, ముష్టిమ్=పిడికిలిని, విన్యపాతయత్=పడవేసెను.

**తా.** మర్మస్థానముల నెరిగిన అంగదుడు ఆ రాక్షసుని స్తనము దగ్గర హృదయమువైపు ఇంద్రుని వజ్రము వంటి స్పర్శ గల పిడికిలిని పడవేసెను.21

మూ. తేన తస్య నిపాతేన రాక్షసస్య మహామృధే, 22
పఫాల హృదయం చాస్య స పపాత హతో భువి.

ప్ర. అ. మహామృధే=ఆ మహాయుద్ధమునందు, తస్య=ఆ పిడికిలియొక్క,

తేన=ఆ, నిపాతేన=పడుటచేత, అస్య రాక్షసస్య=ఈ రాక్షసునియొక్క, హృదయమ్=హృదయము, పఫాల=బ్రద్దలయ్యెను. సః=అతడు, హతః=చంపబడినవాడై, భువి=నేలమీద, పపాత=పడెను.

తా. ఆ మహాయుద్ధములో ఆ పిడికిలి దెబ్బకు ఆ రాక్షసుని గుండె పగిలిపోయెను. అతడు చచ్చి నేలమీద పడెను. 22

మూ. తస్మిన్ వినిహతే భూమౌ తత్సైన్యం సంప్రచుక్షుభే, 23
అభవచ్చ మహాన్ క్రోధః సమరే రావణస్య తు.

ప్ర. అ. తస్మిన్=అతడు, భూమౌ=భూమియందు, వినిహతే=చచ్చి పడిపోగా, తత్=ఆ, సైన్యమ్=సైన్యము, సంప్రచుక్షుభే=క్షోభ చెందెను. సమరే=యుద్ధమునందు, రావణస్య=రావణునకు, మహాన్=గొప్ప, క్రోధః=కోపము, అభవత్ చ=కలిగెను కూడ

తా. అతడు చచ్చి భూమి మీద పడిపోగానే ఆ సైన్యము క్షోభ చెందెను. రావణునకు యుద్ధములో గొప్ప కోపము కలిగెను. 23

మూ. వానరాణాం ప్రహృష్టానాం సింహనాదః సుపుష్కలః, 24
స్ఫోటయన్నివ శబ్దేన లఙ్కాం సాట్టాలగోపురామ్,
సహేన్ద్రేణేవ దేవానాం నాదః సమభవన్మహాన్. 25

ప్ర.అ. ప్రహృష్టానామ్=సంతోషించిన, వానరాణామ్=వానరులయొక్క, సుపుష్కలః=చాల అధికమైన, సింహనాదః=సింహనాదము, శబ్దేన=శబ్దముచేత, సాట్టాలగోపురామ్=బురుజులతోను గోపురములతోను కూడిన, లఙ్కామ్=లంకను, శబ్దేన=శబ్దముచేత, స్ఫోటయన్నివ=బ్రద్దలుకొట్టుచున్నది వలె, సహేన్ద్రేణ=మహేంద్రునితో కూడిన, దేవానామ్=దేవతలయొక్క, మహాన్=గొప్ప, నాదః ఇవ=ధ్వని వలె, సమభవత్=ఆయెను.

తా. అప్పుడు సంతోషించిన వానరులు సింహనాదమును చేసిరి. మహేంద్రునితో కూడిన దేవతలు చేసిన మహానాదము వలె ఉన్న ఆ సింహనాదము శబ్దముచేత బురుజులతోను, గోపురములతోను కూడిన లంకను బ్రద్దలుకొట్టుచున్నట్లు ఉండెను. 24, 25

మూ. అథేన్ద్రశత్రుస్త్రిదశాలయానాం
వనౌకసాం చైవ మహాప్రణాదమ్,
శ్రుత్వా సరోషం యుధి రాక్షసేన్ద్రః
పునశ్చ యుద్ధాభిముఖోఽవతస్థే. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అష్టనవతితమః సర్గః.

ప్ర.అ. అథ=అటుపిమ్మట, ఇన్ద్రశత్రుః=ఇంద్రుని శత్రువైన, రాక్షసేన్ద్రః=రావణుడు, యుధి=యుద్ధమునందు, త్రిదశాలయానామ్=దేవతలయొక్క, వనౌకసాం చైవ=వానరులయొక్క, మహాప్రణాదమ్=గొప్ప ధ్వనిని, శ్రుత్వా=విని, సరోషమ్=కోపముతో కూడినట్లుగా, పునశ్చ=మరల, యుద్ధాభిముఖః=యుద్ధమునకు అభిముఖుడై, అవతస్థే=నిలచెను.

తా. పిమ్మట ఇంద్రశత్రువైన రావణుడు యుద్ధభూమియందు వానరులు, దేవతలు చేయుచున్న గొప్ప ధ్వనిని విని కోపముతో మరల యుద్ధానికి సంనద్ధుడై నిలచెను. 26

" బాలానందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో తొంబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ నవనవతితమః సర్గః

[రామరావణుల యుద్ధము.]

శ్లో. మహోదరమహాపార్శ్వౌ హతౌ దృష్ట్వా తు రాక్షసౌ,
తస్మింశ్చ నిహతే వీరే విరూపాక్షే మహాబలే, 1
ఆవివేశ మహాన్ క్రోధో రావణం తు మహామృధే,
సూతం సంచోదయామాస వాక్యం చేదమువాచ హ. 2

ప్ర.అ. రాక్షసౌ=రాక్షసులైన, మహోదరమహాపార్శ్వౌ=మహోదరమహాపార్శ్వులను, హతౌ=చంపబడినవారినిగా, దృష్ట్వా=చూచి,వీరే=వీరుడైన, మహాబలే=గొప్ప బలము గల, తస్మిన్=ఆ, విరూపాక్షే=విరూపాక్షుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, మహామృధే=మహాయుద్ధమునందు, రావణమ్=రావణున్ని, మహాన్=గొప్ప, క్రోధః=కోపము, ఆవివేశ=ఆవేశించెను. సూతమ్=సారథిని, సంచోదయామాస=ప్రేరేపించెను. ఇదమ్=ఈ, వాక్యం చ=వాక్యమును కూడ,ఉవాచ హ=పలికెను.

తా. మహోదరమహాపార్శ్వులు, మహాబలశాలియైన విరూపాక్షుడు మరణించుట చూచిన రావణునకు ఆ మహాయుద్ధమునందు గొప్ప క్రోధావేశము కలిగెను. అతడు సారథిని ప్రేరేపించి ఇట్లు పలికెను. 12

మూ. నిహతానామమాత్యానాం రుద్ధస్య నగరస్య చ,
దుఃఖమేవాపనేష్యామి హత్వా తౌ రామలక్ష్మణౌ. 3

ప్ర.అ. తౌ=ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను, హత్వా=చంపి, నిహతానామ్=చంపబడిన, అమాత్యానామ్=మంత్రులయొక్క, రుద్ధస్య=అరికట్టబడిన, నగరస్య చ=నగరముయొక్క, దుఃఖమ్=దుఃఖమును, అపనేష్యామ్యేవ=తప్పక తొలగించెదను.

తా. ఆ రామలక్ష్మణులను సంహరించి, అమాత్యులు మరణించుటచేతను లంకానగరము ముట్టడించబడుటచేతను కలిగిన దుఃఖమును తొలగించెదను.

మూ. రామవృక్షం రణే హన్మి సీతాపుష్పఫలప్రదమ్,
ప్రశాఖా యస్య సుగ్రీవో జామ్బవాన్ కుముదో నలః, 4

ద్వివిదశ్చైవ మైన్దశ్చ అఙ్గదో గన్ధమాదనః,
హనూమాంశ్చ సుషేణశ్చ సర్వే చ హరియూథపాః. 5

ప్ర.అ. యస్య=దేనికి, సుగ్రీవః=సుగ్రీవుడు, జామ్బవాన్=జాంబవంతుడు, కుముదః=కుముదుడు, ద్వివిదశ్చైవ= ద్వివిదుడు, మైన్దశ్చ=మైందుడు, అఙ్గదః=అంగదుడు, గన్ధమాదనః=గంధమాదనుడు, హనుమాంశ్చ= హనుమంతుడు, సుషేణశ్చ=సుషేణుడు, సర్వే=సమస్తమైన, హరియూథపాశ్చ=వానరసేనానాయకులు, ప్రశాఖాః= శాఖలో అట్టి, సీతాపుష్పఫలప్రదమ్=సీత అనే పుష్పఫలములను ఇచ్చు, రామవృక్షమ్=రాము డనే వృక్షమును, రణే= యుద్ధమునందు, హన్మి=చంపెదను.

తా. సుగ్రీవ-జాంబవత్-కుముద-నల-ద్వివిద-మైంద-అంగద-గంధమాదన హనూమాన్-సుషేణాది సర్వవానరు లనే శాఖలు గల, సీత అనే పుష్పఫలముల నిచ్చు రాము డనే వృక్షమును రణములో ఛేదించెదను.

వి. "సీతాపుష్పఫలప్రదమ్" అనే దాని అర్థము సరిగా అన్వయించుటలేదు. ప్రాచ్య ప్రతిలో ఇది లేదు. వానరుల మాట మాత్రమే ఉన్నది. 4, 5

మూ. స దిశో దశ ఘోషేణ రథస్యాతిరథో మహాన్,
నాదయన్ ప్రయయౌ తూర్ణం రాఘవం చాభ్యధావత. 6

ప్ర. అ. మహాన్=గొప్ప, అతిరథః=అతిరథుడైన, సః=రావణుడు, రథస్య=రథముయొక్క, ఘోషేణ=ధ్వనిచేత, దశ=పది, దిశః=దిక్కులను, నాదయన్=ధ్వనింపచేయుచు, తూర్ణమ్=శీఘ్రముగా, ప్రయయౌ=వెళ్లెను. రాఘవమ్=రాముణ్ణి గూర్చి, అభ్యధావత=ఎదురుగా శీఘ్రముగా వెళ్లెను.

తా. మహాతిరథుడైన ఆ రావణుడు రథఘోషముచేత పది దిక్కులను ధ్వనింపచేయుచు శీఘ్రముగా రామునికి అభిముఖముగా వెళ్లెను. 6

మూ. పూరితా తేన శబ్దేన సనదీగిరికాననా,
సంచచాల మహీ సర్వా త్రస్తసింహమృగద్విజా. 7

ప్ర. అ. సనదీగిరికాననా=నదులతోను, పర్వతములతోను, అడవులతోను కూడిన, త్రస్తసింహమృగద్విజా=భయపడిన సింహములు, లేళ్లు, పక్షులు గల, సర్వా=సమస్తమైన, మహీ=భూమి, తేన శబ్దేన=ఆ శబ్దముచేత, పూరితా=నింపబడినదై,సంచచాల=చలించెను.

తా. ఆ శబ్దముచేత నింపబడి నదీ-పర్వత-వనములతో కూడిన భూమి అంతా అదరిపోయెను. సింహములు, లేళ్లు, పక్షులు భయపడినవి. 7

మూ. తామసం సుమహాఘోరం చకారాస్త్రం సుదారుణమ్,
నిర్దదాహ కపీన్ సర్వాంస్తే ప్రపేతుః సమన్తతః. 8

ప్ర.అ. సుమహాఘోరమ్=చాల భయంకరమైన, సుదారుణమ్=చాల క్రూర మైన, తామసమ్=తామస మను పేరుగల, అస్త్రమ్=అస్త్రమును, చకార=ప్రయోగించెను. సర్వాన్=సమస్తమైన, కపీన్=వానరులను, నిర్దదాహ=దహించివేసెను. తే=వాళ్లు, సమన్తతః=అంతటా, ప్రపేతుః=పడిపోయిరి.

తా. రావణుడు చాల భయంకరము, క్రూరము అయిన తామసాస్త్రమును ప్రయోగించగా అది ఆ రాక్షసుల నందరినీ కాల్చివేసెను. వారందరూ పడిపోయిరి. 8

మూ. ఉత్పపాత రజో భూమౌ తైర్భగ్నైః సంప్రధావితైః,
న హి తత్సహితుం శేకుర్బ్రహ్మణా నిర్మితం స్వయమ్. 9

ప్ర.అ. భగ్నైః=ఓడిపోయిన, సంప్రధావితైః=పారిపోవుచున్న, తైః=వాళ్లచేత, భూమౌ=భూమియందు, రజః=పరాగము, ఉత్పపాత=ఎగిరెను. బ్రహ్మణా= బ్రహ్మచేత, స్వయమ్=స్వయముగా, నిర్మితమ్=నిర్మించబడిన, తత్=దానిని, సహితుమ్=సహించుటకు, న శేకుః హి=సమర్థులు కాజాలకపోయిరి కదా.

తా. బ్రహ్మదేవుడు స్వయముగా నిర్మించిన ఆ అస్త్రమును సహించ జాలక పరాజితులై ఆ వానరులు పారిపోవునపుడు భూమినుండి పరాగము ఎగసెను. 9

మూ. తాన్యనీకాన్యనేకాని రావణస్య శరోత్తమైః,
దృష్ట్వా భగ్నాని శతశో రాఘవః పర్యవస్థితః. 10

ప్ర.అ. రావణస్య=రావణునియొక్క, శరోత్తమైః=ఉత్తమములైన బాణము లచేత, భగ్నాని=పరాభవము పొందింపబడిన, తాని=ఆ, అనేకాని=అనేకములైన, శతశః=వందలకొలది, అనీకాని=సైన్యములను, దృష్ట్వా=చూచి, రాఘవః=రాముడు, పర్యవస్థితః=నిలచినాడు.

తా. రావణుని శ్రేష్ఠములైన బాణాలచేత భగ్నములైన వందల కొలదిగా ఉన్న ఆ అనేక సైన్యములను చూచి రాముడు యుద్ధసన్నద్ధుడై నిలచెను.10

మూ. తతో రాక్షసశార్దూలో విద్రావ్య హరివాహినీమ్,
స దదర్శ తతో రామం తిష్ఠన్తమపరాజితమ్, 11
లక్ష్మణేన సహ భ్రాత్రా విష్ణునా వాసవం యథా,
ఆలిఖన్తమివాకాశమవష్టభ్య మహద్ధనుః, 12

పద్మపత్రవిశాలాక్షం దీర్ఘబాహుమరిందమమ్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రాక్షసశార్దూలః=రాక్షసశ్రేష్ఠుడైన, సః=రావణుడు, హరివాహినీమ్=వానర సైన్యమును, విద్రావ్య=పారద్రోలి, తతః=అటు పిమ్మట, విష్ణునా=విష్ణువుతో, వాసవం యథా=దేవేంద్రుదు వలె, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, మహత్=గొప్ప, ధనుః=ధనస్సును, అవష్టభ్య=ఆనుకొని, తిష్ఠన్తమ్=నిలచీ ఉన్న, అపరాజితమ్=ఓడింపబడని, ఆకాశమ్=ఆకాశమును, ఆలిఖన్తమ్=ఒరయుచున్నాడా అన్నట్లున్న, పద్మపత్రవిశాలాక్షమ్=పద్మము రేకుల వలె విశాలములైన నేత్రములు గల, దీర్ఘబాహుమ్=దీర్ఘములైన బాహువులు గల, అరిందమమ్=శత్రుసంహారకుడైన, రామమ్=రాముణ్ణి, దదర్శ=చూచెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన రావణుడు వానరసేనను పారద్రోలి, పిమ్మట ఉపేంద్రునితో కూడిన దేవేంద్రుడువలె సోదరుడైన లక్ష్మణునితో కలసి ఉన్న, ఎవ్వరిచేతా ఓడింపబడని రాముణ్ణి చూచెను. పద్మపత్రములవలె విశాలములైన నేత్రములు గల, దీర్ఘబాహువు, శత్రుసంహారకుడూ అయిన ఆ రాముడు ధనస్సుమీద ఆనుకొని నిలచి ఆకాశమును ఒరయుచున్నాడా అన్నట్లు కనబడుచుండెను.

మూ. తతో రామో మహాతేజాః సౌమిత్రిసహితో బలీ, 13
వానరాంశ్చ రణే భగ్నానాపతన్తం చ రావణమ్,
సమీక్ష్య రాఘవో హృష్టో మధ్యే జగ్రాహ కార్ముకమ్. 14

ప్ర.అ. తతః=అటు పిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, బలీ=బలవంతుడైన, రాఘవః=రఘువంశసంజాతుడైన, సౌమిత్రిసహితః=లక్ష్మణునితో కూడిన, రామః=రాముదు, రణే=యుద్ధమునందు, భగ్నాన్=పరాజితులైన, వానరాన్ చ=వానరులను, ఆపతన్తమ్=శీఘ్రముగా వచ్చుచున్న, రావణమ్=రావణుణ్ణీ, సమీక్ష్య=చూచి, హృష్టః=సంతోషించినవాడై, కార్ముకమ్=ధనస్సును, మధ్యే=మధ్యయందు, జగ్రాహ=గ్రహించెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సూ, బలమూ కల రఘువంశసంజాతుడైన లక్ష్మణసమేతుడైన రాముడు యుద్ధములో ఓడిపోయిన వానరులను, తన మీదికి వచ్చుచున్న రావణునీ చూచి సంతోషముతో, ధనస్సును మధ్య భాగమునందు పట్టుకొనెను. 13, 14

మూ. విస్ఫారయితుమారేభే తతః స ధనురుత్తమమ్,
మహావేగం మహానాదం నిర్భిన్దన్నివ మేదినీమ్. 15

ప్ర.అ. తతః=అటు పిమ్మట, సః=రాముదు,ఉత్తమమ్=ఉత్తమము, మహావేగమ్=గొప్ప వేగము గలది, మహానాదమ్=గొప్ప ధ్వని కలదీ అయిన,

ధనుః=ధనస్సును, మేదినీమ్=భూమిని, నిర్భిన్దన్నివ=బ్రద్దలు కొట్టుచున్నాడా అన్నట్లు, విస్ఫారయితుమ్=చరచుటకు, ఆరేభే=ప్రారంభించెను.

తా. పిమ్మట రాముడు భూమిని బ్రద్దలుకొట్టుచున్నాడా అన్నట్లు గొప్ప వేగము, మహాధ్వనీ గల ఉత్తమమైన ధనస్సును చరచుటకు ప్రారంభించెను.15

మూ. రావణస్య చ బాణౌఘై రామవిస్ఫారితేన చ,
శబ్దేన రాక్షసాస్తేన పేతుశ్చ శతశస్తదా. 16

ప్ర. అ. తదా=అప్పుడు, రావణస్య=రావణునియొక్క, బాణౌఘైః=బాణస ముదాయములచేతను, రామవిస్ఫారితేన=రాముని ధనస్సు చరచుటచేతను కలిగిన, తేన=ఆ, శబ్దేన=శబ్దముచేత, తే=ఆ, రాక్షసాః=రాక్షసులు, శతశః=వందల కొలది, పేతుః చ=పడిపోయిరి.

తా. రాముని ధనుష్టంకారధ్వనిచేతను, రావణుని బాణధ్వనిచేతను, వందలకొలది రాక్షసులు క్రింద పడిపోయిరి. 16

మూ. తయోః శరపథం ప్రాప్య రావణో రాజపుత్రయోః,
స బభౌ చ యథా రాహుః సమీపే శశిసూర్యయోః. 17

ప్ర. అ. సః=ఆ, రావణః=రావణుడు, తయోః=ఆ, రాజపుత్రయోః=రాజ కుమారులయొక్క, శరపథమ్=బాణమార్గమును, ప్రాప్య=పొంది, శశిసూర్యయోః= చంద్రసూర్యులయొక్క, సమీపే=సమీపమునందు, రాహుః యథా=రాహువు వలె, బభౌ=ప్రకాశించెను.

తా. ఆ రామలక్ష్మణుల బాణమార్గమునం దున్న ఆ రావణుడు చంద్రసూర్యుల సమీపమునం దున్న రాహువు వలె ప్రకాశించెను. 17

మూ. తమిచ్ఛన్ ప్రథమం యోద్ధుం లక్ష్మణో నిశితైః శరైః,
ముమోచ ధనురాయమ్య శరానగ్నిశిఖోపమాన్. 18

ప్ర.అ. ప్రథమమ్=ముందుగా, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, తమ్=వానివి, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, ఇచ్ఛన్=కోరుచున్న, లక్ష్మణః= లక్ష్మణుడు, ధనుః=ధనస్సును, ఆయమ్య=వంచి, అగ్నిశిఖోపమాన్=అగ్నిశిఖలతో సమానములైన, శరాన్=బాణములను, ముమోచ=విడిచెను.

తా. ముందుగా తాను వాడియైన బాణములతో వానితో యుద్ధము చేయవలె నను కోరికతో లక్ష్మణుడు ధనస్సు వంచి అగ్నిశిఖలవంటి శరములను విడచెను. 18

మూ. తాన్ముక్తమాత్రానాకాశే లక్ష్మణేన ధనుష్మతా,
బాణాన్ బాణైర్మహాతేజా రావణః ప్రత్యవారయత్. 19

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రావణః=రావణుడు, ధనుష్మతా=ధనస్సు గల, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ముక్తమాత్రాన్=విడువబడిన, తాన్=ఆ, బాణాన్=బాణములను, బాణైః=బాణములచేత, ఆకాశే=ఆకాశమునందు, ప్రత్యవారయత్=నివారించెను.

తా. గొప్ప తేజస్సు గల రావణుడు ధనుర్ధారియైన లక్ష్మణుడు ప్రయోగించిన వెంటనే ఆ బాణములను బాణములచేత ఆకాశమునందే నివారించెను. 19

మూ. ఏకమేకేన బాణేన త్రిభిస్త్రీన్ దశభిర్దశ,
లక్ష్మణస్య ప్రచిచ్ఛేద దర్శయన్ పాణిలాఘవమ్. 20

ప్ర. అ. పాణిలాఘవమ్=హస్తలాఘవమును, దర్శయన్=చూపుచు, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, ఏకమ్=ఒక బాణమును, ఏకేన బాణేన=ఒక బాణముచేత, త్రిభిః=మూడు బాణములచేత, త్రీన్=మూడు బాణములను, దశభిః=పది బాణములచేత, దశ=పది బాణములను, ప్రచిచ్ఛేద=ఛేదించెను.

తా. రావణుడు హస్తలాఘవమును చూపుచు లక్ష్మణుని ఒక బాణమును ఒక బాణముచేతను, మూడు బాణములను మూడింటిచేతను, పది బాణములను పదింటిచేతను ఛేదించెను. 20

మూ. అభ్యతిక్రమ్య సౌమిత్రిం రావణః సమితింజయః,
ఆససాద రణే రామం స్థితం శైలమివాపరమ్. 21

ప్ర.అ. సమితింజయః=యుద్ధమును జయించు, రావణః=రావణుడు, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, అభ్యతిక్రమ్య=దాటి, రణే=యుద్ధమునందు, అపరమ్=మరియొక, శైలమివ=పర్వతము వలె,స్థితమ్=నిలచి ఉన్న, రామమ్=రాముణ్ణి, ఆససాద=పొందెను.

తా. యుద్ధములు జయించు రావణుడు లక్ష్మణుణ్ణి దాటి వెళ్లి యుద్ధమునందు పర్వతమువలె అకంప్యుడై నిలచి యున్న రాముణ్ణి సమీపించెను.

మూ. స రాఘవం సమాసాద్య క్రోధసంరక్తలోచనః,
వ్యసృజచ్ఛరవర్షాణి రావణో రాక్షసేశ్వరః. 22

ప్ర. అ. రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, సః రావణః=ఆ రావణుడు, రాఘవమ్=రాముణ్ణి, సమాసాద్య= సమీపించి, క్రోధసంరక్తలోచనః=కోపముచేత,

ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, శరవర్షాణి=బాణవర్షములను, వ్యసృజత్=విడచెను.

తా. రాక్షసప్రభువైన ఆ రావణుడు రాముణ్ణి సమీపించి, క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై బాణవర్షములు కురిపించెను. 22

మూ. శరధారాస్తతో రామో రావణస్య ధనుశ్చ్యుతాః,
దృష్ట్వైవాపతితాః శీఘ్రం భల్లాన్ జగ్రాహ సత్వరమ్. 23

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, రావణస్య=రావణుని యొక్క, ధనుశ్చ్యుతాః=ధనస్సునుండి బయలుదేరిన, ఆపతితాః=వచ్చిపడిన, శరధారాః=బాణధారలను, దృష్ట్వైవ=చూడగానే, శీఘ్రమ్=శీఘ్రముగా, సత్వరమ్=తొందరగా, భల్లాన్=భల్లబాణములను, జగ్రాహ=గ్రహించెను.

తా. రాముడు రావణుని ధనస్సునుండి వెడలి వచ్చుచున్న బాణధారలను చూడగానే శీఘ్రముగా భల్లబాణములను గ్రహించెను. 23

మూ. తాన్ శరౌఘాంస్తతో భల్లైస్తీక్ష్ణైశ్చిచ్ఛేద రాఘవః,
దీప్యమానాన్ మహాఘోరాన్ క్రుద్ధానాశీవిషానివ. 24

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, దీప్యమానాన్=ప్రకాశించుచున్న, మహాఘోరాన్=చాల భయంకరములైన, క్రుద్ధాన్=కోపించిన, ఆశీవిషానివ=సర్పములువలె ఉన్న, తాన్=ఆ, శరౌఘాన్= బాణసముదాయములను, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, భల్లైః=భల్లబాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను.

తా. రాముడు కోపించిన సర్పముల వలె ఉన్న, ప్రకాశించుచున్న, చాల భయంకరములైన ఆ బాణసముదాయములను వాడియైన భల్లబాణములచేత ఛేదించెను. 24

మూ. రాఘవో రావణం తూర్ణం రావణో రాఘవం తథా,
అన్యోన్యం వివిధైస్తీక్ష్ణైః శరవర్షైర్వవర్షతుః. 25

ప్ర. అ. రాఘవః=రాముడు, రావణమ్=రావణునీ, తథా=మరియు, రావణః=రావణుడు, రాఘవమ్=రాముణ్ణీ, తూర్ణమ్=శీఘ్రముగా, అన్యోన్యమ్=పరస్పరము, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, శరవర్షైః=బాణవర్షములచేత, వవర్షతుః=వర్షించిరి.

తా. రాముడు రావణునిమీదా, రావణుడు రామునిమీదా పరస్పరము వాడియైన బాణముల వర్షము వర్షించిరి. 25

మూ. చేరతుశ్చ చిరం చిత్రం మణ్డలం సవ్యదక్షిణమ్,
బాణవేగాత్సముత్క్షిప్తావన్యోన్యమపరాజితౌ. 26

ప్ర. అ. బాణవేగాత్=బాణముల వేగమువలన, స ముత్క్షిప్తౌ=దూరము చేయబడిన, అన్యోన్యమ్=పరస్పరము, అపరాజితౌ=పరాజితులు కాని వారిద్దరూ, సవ్యదక్షిణమ్=ఎడమ కుడి వైపులకు, చిత్రమ్=చిత్రమైన, మణ్డలమ్=మండలాకార భ్రమణమును, చిరమ్=చిరకాలము, చక్రతుః=చేసిరి.

తా. బాణముల వేగముచేత ఒకరి కొకరు దూర మగుచు, పరస్పరము పరాజితులు కాని ఆ రామరావణులు చిత్రముగా, కుడి ఎడమల వైపు మండలభ్రమణములు (గుండ్రముగా తిరుగుచు యుద్ధముచేయుట) చేసిరి. 26

మూ. తయోర్భూతాని విత్రేసుర్యుగపత్సంప్రయుధ్యతోః,
రౌద్రయోః సాయకముచోర్యమాన్తకనికాశయోః. 27

ప్ర. అ. రౌద్రయోః=భయంకరులు, సాయకముచోః=బాణములను విడుచు చున్న వారు, యమాన్తకనికాశయోః=యమునితోను మృత్యుదేవతతోను సమానులు అయిన, తయోః=వారిద్దరూ, యుగపత్=ఒక్కమారుగా, సంప్రయుధ్యతోః=యుద్ధము చేయుచుండగా, భూతాని=ప్రాణులు, విత్రేసుః=భయపడినవి.

తా. భయంకరులు, యమునితోను మృత్యుదేవతతోను సమానులు అయిన వారిద్దరూ ఒక్కసారిగా బాణములు విడచుచు యుద్ధము చేయుచుండగా ప్రాణులు భయపడినవి. 27

మూ. సతతం వివిధైర్బాణైర్బభూవ గగనం తదా,
ఘనైరివాతపాపాయే విద్యున్మాలాసమాకులైః. 28

ప్ర. అ. తదా=అప్పుడు, గగనమ్=ఆకాశము, ఆతపాపాయే=గ్రీష్మాంతమునందు, విద్యున్మాలాసమాకులైః=మెరుపుల పంక్తులతో వ్యాకులములైన, ఘనైః ఇవ=మేఘములచేత వలె, వివిధైః=అనేకవిధములైన, బాణైః=బాణములచేత, సతతమ్=దట్టమైనది, బభూవ=అయెను.

తా. అప్పుడు ఆకాశము, గ్రీష్మాంతమునందు మెరుపుల పంక్తులతో వ్యాకులములైన మేఘములచేత వలె, అనేకవిధములైన బాణములచేత దట్టముగా వ్యాప్తమాయెను. 28

మూ. గవాక్షితమివాకాశం బభూవ శరవృష్టిభిః,
మహావేగైః సుతీక్ష్ణాగ్రైర్గృధ్రపత్రైః సువాజితైః. 29

ప్ర. అ. మహావేగైః=గొప్ప వేగము గల, సుతీక్ష్ణాగ్రైః=చాల తీక్ష్ణమైన అగ్రభాగములు గల, గృధ్రపత్రైః= గ్రద్దల రెక్కలచేత, సువాజితైః=బాగా వేగము కలవిగా చేయబడిన, శరవృష్టిభిః=బాణముల వర్షములచేత, ఆకాశమ్=ఆకాశము,

గవాక్షితమివ=కిటికీలు కలదిగా చేయబడినట్లు, బభూవ=ఆయెను.

తా. గొప్ప వేగము, బాగా వాడియైన అగ్రభాగములూ కలవి, గ్రద్దల రెక్కలు కట్టి మంచి వేగము కలుగునట్లు చేయబడినవి అయిన బాణముల వర్షములచేత ఆకాశము కిటికీలతో నింపబడినట్లు ఆయెను. 29

మూ. శరాన్ధకారమాకాశం చక్రతుః ప్రథమం తదా,
గతేఽస్తం తపనే చాపి మహామేఘావివోత్థితౌ. 30

ప్ర. అ. తదా=అప్పుడు, ప్రథమమ్=ముందుగా, ఆకాశమ్=ఆకాశమును, శరాన్ధకారమ్=శరములచేత చీకటిగా, చక్రతుః=చేసిరి. తపనే=సూర్యుడు, అస్తంగతే చాపి=అస్తమించిన పిమ్మటకూడ, ఉత్థితౌ=లేచిన, మహామేఘావివ=పెద్దమేఘములు వలె, (చీకటిగా చేసిరి).

తా. అప్పుడు ముందుగా ఆకాశమును శరములచేత అంధకారమయముగా చేసిరి. సూర్యాస్తమయము తరవాత కూడ పైకి లేచిన మేఘములు వలె అంధకారము చేసిరి. 30

మూ. తయోరభూన్మహద్యుద్ధమన్యోన్యవధకాఙ్క్షిణోః,
అనాసాద్యమచిన్త్యం చ వృత్రవాసవయోరివ. 31

ప్ర. అ. అన్యోన్యవధకాఙ్క్షిణోః=పరస్పరముయొక్క వధను కోరుచున్న, తయోః=వారిద్దరికీ, వృత్రవాసవయోరివ=వృత్రాసురునకు ఇంద్రునకు వలె, అనాసాద్యమ్=దగ్గరగా చేరశక్యముకాని, అచిన్త్యం చ=ఊహింప శక్యము కాని, మహత్=గొప్ప, యుద్ధమ్=యుద్ధము, అభూత్=ఆయెను.

తా. పరస్పరము చంపుకొనగోరుచున్న వారిద్దరకీ, వృత్రాసురదేవేంద్రులకు వలె దగ్గరకు వెళ్లుటకు గాని, ఊహించుటకు కాని శక్యము కాని గొప్ప యుద్ధము జరిగెను. 31

మూ. ఉభౌ హి పరమేష్వాసావుభౌ యుద్ధవిశారదౌ,
ఉభావస్త్రవిదాం ముఖ్యావుభౌ యుద్ధే విచేరతుః. 32

ప్ర. అ. ఉభౌ=ఇద్దరూ కూడ, పరమేష్వాసౌ=గొప్ప ధనస్సులు కలవారు. ఉభౌ=ఇద్దరూ, యుద్ధవిశారదౌ=యుద్ధమునందు నేర్పు గలవారు. ఉభౌ=ఇద్దరూ, అస్త్రవిదామ్=అస్త్రవేత్తలలో, ముఖ్యౌ=ముఖ్యులు. ఉభౌ=ఇద్దరూ, యుద్ధే=యుద్ధమునందు, విచేరతుః=సంచరించిరి.

తా. ఇద్దరూ గొప్ప ధనస్సులు కలవారే. ఇద్దరూ యుద్ధమునందు నేర్పు గలవారే. ఇద్దరూ అస్త్రవేత్తలలో ప్రధానులే. అట్టి వారిద్దరూ యుద్ధములో

సంచరించిరి. 32

మూ. ఉభౌ హి యేన వ్రజతస్తేన తేన శరోర్మయః,
ఊర్మయో వాయునా విద్ధా జగ్ముః సాగరయోరివ. 33

ప్ర. అ. ఉభౌ=వారిద్దరూ, యేన=ఏ మార్గముచేత, వ్రజతుః=వెళ్లిరో, తేన తేన= ఆ యా మార్గముచేత, శరోర్మయః=బాణతరంగములు, సాగరయోః=రెండు సముద్రముల యొక్క, వాయువిద్ధాః=వాయువుచేత కొట్టబడిన, ఊర్మయః ఇవ=తరంగములు వలె, జగ్ముః=వెళ్లినవి.

తా. వారిద్దరూ ఏ యే వైపునకు వెళ్లిరో ఆ వైపునకు, రెండు సముద్రములందు వాయువుచేత ఎగురగొట్టబడిన తరంగముల వలె బాణతరంగములు వెళ్లినవి. 33

మూ. తతః సంసక్తహస్తస్తు రావణో లోకరావణః,
నారాచమాలాం రామస్య లలాటే ప్రత్యముఞ్చత. 34

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సంసక్తహస్తః=నేర్పుగల హస్తములు గల, లోకరావణః=లోకములను ఏడ్పించిన, రావణః=రావణుడు, రామస్య= రామునియొక్క, లలాటే=లలాటమునందు, నారాచమాలామ్=నారాచబాణముల పంక్తిని,ప్రత్యముఞ్చత=విడచెను.

తా. పిమ్మట హస్తనైపుణ్యము గల, లోకములను ఏడ్పించిన రావణుడు రాముని లలాటము మీద వరుసగా కొన్ని నారాచబాణములను నాటెను.34

మూ. రౌద్రచాపప్రయుక్తాం తాం నీలోత్పలదలప్రభామ్,
శిరసాధారయద్రామో న వ్యథామభ్యపద్యత. 35

ప్ర. అ. రౌద్రచాపప్రయుక్తామ్=భయంకరమైన ధనస్సునుండి ప్రయోగింప బడిన, నీలోత్పలదలప్రభామ్=నల్లకలువల దళముల వంటి కాంతి గల, తామ్=ఆ నారాచమాలను, రామః=రాముడు, శిరసా=శిరస్సుచేత, అధారయత్=ధరించెను. వ్యథామ్=వ్యథను, న అభ్యపద్యత=పొందలేదు.

తా. భయంకరమైన ధనస్సునుండి వెలువడిన, నల్ల కలువల దళముల వంటి కాంతి గల ఆ నారాచబాణమాలను రాముడు శిరస్సుతో ధరించెను. ఏ మాత్రము వ్యథ చెందలేదు. 35

మూ. అథ మన్త్రానభిజపన్ రౌద్రమస్త్రముదీరయన్,
శరాన్ భూయః సమాదాయ రామః క్రోధసమన్వితః, 36
ముమోచ చ మహాతేజాశ్చాపమాయమ్య వీర్యవాన్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామః=రాముడు, క్రోధసమన్వితః=క్రోధముతో కూడినవాడై, మన్త్రాన్=మంత్రములను, అభిజపన్=జపించుచు, రౌద్రమ్ అస్త్రమ్=రౌద్రాస్త్రమును, ఉదీరయన్=పలుకుచు, భూయః=మరల, శరాన్=బాణములను, సమాదాయ=గ్రహించి, చాపమ్=ధనస్సును, ఆయమ్య=వంచి, ముమోచ చ=విడచెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సు, పరాక్రమ మూ గల రాముడు కోపించి, మంత్రములను జపించుచు, రౌద్రాస్త్రమును ఉచ్చరించుచు మరల బాణములు గ్రహించి ధనస్సు వంచి వాటిని ప్రయోగించెను. 36

మూ. తే మహామేఘసంకాశే కవచే పతితాః శరాః, 37
అవధ్యే రాక్షసేన్ద్రస్య న వ్యథాం జనయంస్తదా.

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, మహామేఘసంకాశే=మహామేఘముతో సమానమైన, అవధ్యే=ఛేదింప శక్యము కాని, కవచే=కవచమునందు, పతితాః=పడిన, తే శరాః=ఆ బాణములు, తదా=అప్పుడు, వ్యథామ్=వ్యథను, న జనయన్=కలిగించలేదు.

తా. రావణుని మహామేఘము వంటి అభేద్యమైన కవచముమీద పడిన ఆ బాణములు ఆతనికి వ్యథను కలిగించలేదు. 37

మూ. పునరేవాథ తం రామో రథస్థం రాక్షసాధిపమ్, 38
లలాటే పరమాస్త్రేణ సర్వాస్త్రకుశలోఽభినత్.

ప్ర. అ. అథ=పిమ్మట, సర్వాస్త్రకుశలః=అన్ని అస్త్రములందు నేర్పు గల, రామః=రాముడు, రథస్థమ్=రథమునందున్న, తం రాక్షసాధిపమ్=ఆ రావణుణ్ణి, పునరేవ=మరల, పరమాస్త్రేణ=గొప్ప అస్త్రముచేత, లలాటే=లలాటమునందు, అభినత్=భేదించెను.

తా. పిమ్మట సమస్తమైన అస్త్రములందు నేర్పుగల రాముడు ఆ రావణుణ్ణి గొప్ప అస్త్రముచేత లలాటమునందు మరల కొట్టెను. 38

మూ. తే భిత్త్వా బాణరూపాణి పఞ్చశీర్షా ఇవోరగాః, 39
శ్వసన్తో వివిశుర్భూమిం రావణప్రతికూలితాః.

ప్ర. అ. తే=ఆ బాణములు, పఞ్చశీర్షాః=ఐదు శిరస్సులు గల, ఉరగాః ఇవ=సర్పములు వలె, బాణరూపాణి=రావణుని బాణముల రూపములను, భిత్త్వా=భేదించి, రావణప్రతికూలితాః=రావణునిచేత ప్రతికూలము చేయబడినవై, శ్వసన్తః=నిట్టూర్చుచు, భూమిమ్=భూమిని, వివిశుః=ప్రవేశించినవి.

తా. రాముడు ప్రయోగించిన బాణములు ఐదు శిరస్సులు గల సర్పములు వలె రావణుని బాణముల రూపములను భేదించి రావణునిచేత త్రిప్పి కొట్టబడినవై, చప్పుడు చేయుచు, భూమిలో ప్రవేశించినవి. 39

మూ. నిహత్య రాఘవస్యాస్త్రం రావణః క్రోధమూర్ఛితః, 40
ఆసురం సుమహాఘోరమన్యదస్త్రం చకార సః.

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, రాఘవస్య=రామునియొక్క, అస్త్రమ్=అస్త్రమును, నిహత్య=కొట్టివేసి, క్రోధమూర్ఛితః=క్రోధావిష్టుడై, సుమహాఘోరమ్=చాల భయంకరమైన, అన్యత్=మరియొక్క, ఆసురమ్ అస్త్రమ్=ఆసురాస్త్రమును, చకార=చేసెను.

తా. ఆ రావణుడు రాముని అస్త్రమును కొట్టివేసి క్రోధావేశముతో మరి యొక ఆసురాస్త్రమును ప్రయోగించెను. 40

మూ. సింహవ్యాఘ్రముఖాంశ్చాపి కఙ్కకాకముఖానపి, 41
గృధ్రశ్యేనముఖాంశ్చాపి శృగాలవదనాంస్తథా,
ఈహామృగముఖాంశ్చాపి వ్యాదితాస్యాన్ భయావహాన్, 42
పఞ్చాస్యాన్ లేలిహానాంశ్చ ససర్జ నిశితాన్ శరాన్.

ప్ర. అ. సింహవ్యాఘ్రముఖాన్ చ అపి=సింహముల ముఖములు వ్యాఘ్రముఖములు గల, కఙ్కకాకముఖానపి=కంకపక్షులయొక్క కాకులయొక్క ముఖములు గల, గృధ్రశ్యేనముఖాంశ్చాపి=గ్రద్దలయొక్క డేగలయొక్క ముఖములు గల, తథా=మరియు, శృగాలవదనాన్=నక్కల ముఖములు గల, ఈహామృగ ముఖాంశ్చాపి=తోడేళ్ళ ముఖములు గల, వ్యాదితాస్యాన్=తెరవబడిన ముఖములు గల బాణములను, భయావహాన్=భయమును కలిగించు, పఞ్చాస్యాన్=ఐదు ముఖములు గల, లేలిహానాంశ్చ=సర్పాకారములు ఉన్న, నిశితాన్=వాడియైన, శరాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. నోరు తెరచుకొని ఉన్న సింహములు, పెద్దపులులు, కంకములు, కాకులు, గ్రద్దలు, డేగలు, నక్కలు, తోడేళ్ళు ఈ జంతువుల ముఖములు గల బాణములను, భయంకరములైన ఐదు ముఖాల సర్పాల రూపములో ఉన్న వాడియైన బాణములను ప్రయోగించెను. 41, 42

మూ. శరాన్ ఖరముఖాంశ్చాన్యాన్వరాహముఖసంశ్రితాన్, 43
శ్వానకుక్కుటవక్త్రాంశ్చ మకరాశీవిషాననాన్,
ఏతాంశ్చాన్యాంశ్చ మాయావీ ససర్జ నిశితాన్ శరాన్. 44
రామం ప్రతి మహాతేజాః క్రుద్ధః సర్ప ఇవ శ్వసన్.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, మాయావీ=మాయావంతుడైన ఆ రావణుడు, ఖరముఖాన్=గాడిదల ముఖములు గల, శరాన్=బాణములను, వరాహముఖసంశ్రితాన్=వరాహముఖములు గల, అన్యాన్=ఇతరబాణములను, శ్వాన కుక్కుటవక్త్రాంశ్చ=కుక్కలయొక్క కోళ్లయొక్క ముఖములు గలవాటిని, మక రాశీవిషాననాన్=మొసళ్లయొక్క, సర్పములయొక్క ముఖములు గలవి అయిన బాణములను, ఏతాన్=వీటిని, అన్యాన్=ఇతరములైన, శరాన్ చ=బాణములను, క్రుద్ధః=కోపించిన, సర్పః ఇవ=సర్పము వలె, శ్వసన్=నిట్టూర్చుచు, రామం ప్రతి=రాముణ్ణి గూర్చి, ససర్జ=విడచెను.

తా. మహాతేజఃశాలీ మాయావీ అయిన ఆ రావణుడు కోపించిన సర్పమువలె బుసలు కొట్టుచు, గాడిదల ముఖములు, వరాహముల ముఖములు, కుక్కల ముఖములు, కోళ్ల ముఖములు, మకర-సర్పముల ముఖములు గల బాణములను, ఇంకా మరికొన్ని వాడియైన బాణములను రామునిమీద ప్రయోగించెను. 43, 44

మూ. ఆసురేణ సమావిష్టః సోఽస్త్రేణ రఘుపుంగవః, 45
ససర్జాస్త్రం మహోత్సాహః పావకం పావకోపమః.

ప్ర. అ. ఆసురేణ అస్త్రేణ=ఆసురాస్త్రముచేత, సమావిష్టః=చుట్టబడిన, మహోత్సాహః=గొప్ప ఉత్సాహము గల, పావకోపమః=అగ్నితో సమానుడైన, సః=ఆ, రఘుపుంగవః=రాముడు, పావకమ్ అస్త్రమ్=పావకాస్త్రమును, ససర్జ=సృష్టించెను.

తా. ఆ ఆసురాస్త్రముచేత ఆక్రమింపబడి గొప్ప ఉత్సాహము గల, అగ్నితో సమానుడైన రాముడు పావకాస్త్రమును ప్రయోగించెను. 45

మూ. అగ్నిదీప్తముఖాన్ బాణాంస్తత్ర సూర్యముఖానపి, 46
చన్ద్రార్ధచన్ద్రవక్త్రాంశ్చ ధూమకేతుముఖానపి,
గ్రహనక్షత్రవర్ణాంశ్చ మహోల్కాముఖసంస్థితాన్, 47
విద్యుజ్జిహ్వోపమాంశ్చాపి ససర్జ వివిధాన్ శరాన్.

ప్ర. అ. తత్ర=అక్కడ, అగ్నిదీప్తముఖాన్=అగ్నిచేత మండుచున్న ముఖ ములు గల, బాణాన్=బాణములను, సూర్యముఖానపి=సూర్యుని వంటి ముఖములు గల బాణములను, చన్ద్రార్ధచన్ద్రవక్త్రాన్ చ=చంద్రుని వంటి అర్ధచంద్రుని వంటి ముఖములు గల బాణములను, ధూమకేతుముఖానపి=తోకచుక్క వంటి ముఖము కల బాణములను, గ్రహనక్షత్రవర్ణాంశ్చ=గ్రహములయొక్క నక్షత్రములయొక్క వర్ణము గల బాణములను, మహోల్కాముఖసంస్థితాన్=పెద్ద ఉల్కల (అగ్ని పిండ ముల) వంటి ముఖములతో ఉన్న బాణములను, విద్యుజ్జిహ్వోపమాన్=మెరుపు

నాలుకల వంటి బాణములను, వివిధాన్=అనేకవిధములైన, శరాన్=బాణములను, ససర్జ=ప్రయోగించెను.

తా. అక్కడ రాముడు అనేకవిధములైన బాణములు ప్రయోగించెను. అగ్నితో మండుచున్న ముఖములు గలవి, సూర్యుని వంటి ముఖములు గలవి, చంద్ర-అర్ధచంద్రాకారములైన ముఖములు గలవి, ధూమకేతువులవంటి ముఖములు గలవి, గ్రహ-నక్షత్రములవంటి రంగులు గలవి, పెద్ద ఉల్కాల వంటి ముఖము లున్నవి, మెరపునాలుకల వంటివి అయిన బాణములు ప్రయోగించెను.

మూ. తే రావణశరా ఘోరా రాఘవాస్త్రసమాహతాః, 48
విలయం జగ్మురాకాశే జగ్ముశ్చైవ సహస్రశః.

ప్ర. అ. రాఘవాస్త్రసమాహతాః=రాముని అస్త్రముచేత కొట్టబడిన, తే=ఆ,ఘోరాః=భయంకరములైన, రావణశరాః=రావణుని బాణములు, ఆకాశే=ఆకాశమునందు, విలయమ్=లయమును, జగ్ముః=పొందినవి. సహస్రశః=వేలకొలది ముక్కలుగా, జగ్ముః=వెళ్ళినవి.

తా. భయంకరములైన రావణుని బాణములు రాముని అస్త్రముచేత కొట్టబడినవై ఆకాశమునందు నశించి వేలకొలది ముక్కలుగా అయి పడిపోయినవి.

మూ. తదస్త్రం నిహతం దృష్ట్వా రామేణాక్లిష్టకర్మణా, 49
హృష్టా నేదుస్తతః సర్వే కపయః కామరూపిణః.
సుగ్రీవప్రముఖా వీరాః సంపరిక్షిప్య రాఘవమ్. 50

ప్ర. అ. అక్లిష్టకర్మణా=శ్రమపడకుండగా పనులు చేయు, రామేణ=రాముని చేత, నిహతమ్=కొట్టివేయబడిన, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, దృష్ట్వా=చూచి, తతః=అటుపిమ్మట, కామరూపిణః=స్వేచ్ఛారూపములు గల, సుగ్రీవప్రముఖాః=సుగ్రీవుడుమొదలైన, వీరాః=వీరులైన, సర్వే=అందరు, కపయః=వానరులు, హృష్టాః=సంతోషించిన వారై, రామమ్=రాముణ్ణి, సంపరిక్షిప్య=చుట్టి, నేదుః=ధ్వనిచేసిరి.

తా. శ్రమపడకుండగా పనులు చేయు రాముడు ఆ అస్త్రమును భగ్నము చేయుట చూచి, స్వేచ్ఛారూపధారణసమర్థులైన ఆ వీరులైన సుగ్రీవాది వానరులందరు రాముని చుట్టూ చేరి సంతోషముతో అరచిరి. 49,50

మూ. తతస్తదస్త్రం వినిహత్య రాఘవః
ప్రసహ్య తద్రావణబాహునిఃసృతమ్,
ముదాన్వితో దాశరథిర్మహాత్మా
వినేదురుచ్చైర్ముదితాః కపీశ్వరాః 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకోనశతతమః సర్గః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడైన, దాశరథిః=రాముడు, తద్రావణబాహునిః సృతమ్=ఆ రావణుని బాహువులనుండి బయలుదేరిన, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, ప్రసహ్య=బలాత్కారముగా, వినిహత్య=కొట్టివేసి, తతః=అటుపిమ్మట, ముదా=సంతోషముతో, అన్వితః=కూడినవాడు ఆయెను. కపీశ్వరాః=వానరనాయకులు, ముదితైః=సంతోషించినవారై, ఉచ్చైః=గట్టిగా, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. మహాత్ముడైన రాముడు రావణునిచే ప్రయోగించబడిన అస్త్రమును బలప్రయోగముచేత శాంతింపచేసి సంతోషించెను. వానరులు సంతోషించి బిగ్గరగా ధ్వని చేసిరి. 51

" బాలనందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో తొంబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ శతతమః సర్గః

[రామరావణుల యుద్ధము. రావణుడు శక్త్యాయుధము ప్రయోగించగా లక్ష్మణుడు మూర్ఛపోవుట. రావణుడు యుద్ధమునుండి పారిపోవుట.]

మూ. తస్మిన్ ప్రతిహతేఽ స్త్రే తు రావణో రాక్షసాధిపః,
క్రోధం చ ద్విగుణం చక్రే క్రోధాచ్చాస్త్రమనన్తరమ్. 1

ప్ర.అ. తస్మిన్=ఆ; అస్త్రే=అస్త్రము, ప్రతిహతే=కొట్టబడినదగుచుండగా, రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, ద్విగుణమ్=రెండు రెట్లు, క్రోధమ్=క్రోధమును, చక్రే=చేసెను. క్రోధాత్=క్రోధముకంటె, అనన్తరమ్=అనంతరము, అస్త్రమ్=అస్త్రమును (చేసెను).

తా. ఆ అస్త్రము భగ్నముచేయబడగా రాక్షసరాజైన రావణుడు రెట్టింపు కోపముతో అస్త్రమును ప్రయోగించెను. 1

మూ. మయేన విహితం రౌద్రమన్యదస్త్రం మహాద్యుతిః,
ఉత్స్రష్టుం రావణో భీమం రాఘవాయ ప్రచక్రమే. 2

ప్ర.అ. మహాద్యుతిః=గొప్ప కాంతి గల, రావణః=రావణుడు, మయేన=మయునిచేత, విహితమ్=నిర్మించబడిన, రౌద్రమ్=క్రూరమైన, భీమమ్=భయంకరమైన, అన్యత్=మరియొక, అస్త్రమ్=అస్త్రమును, రాఘవాయ=రామునకు, ఉత్స్రష్టుమ్=విడచుటకు, ప్రచక్రమే=ఉపక్రమించెను.

తా. గొప్ప కాంతి గల రావణుడు మయుడు నిర్మించిన, క్రూరమూ, భయంకరమూ అయిన మరొక అస్త్రమును రామునిపై ప్రయోగించుటకు ఉపక్రమించెను. 2

మూ. తతః శూలాని నిశ్చేరుర్గదాశ్చ ముసలాని చ,
కార్ముకాద్దీప్యమానాని వజ్రసారాణి సర్వశః. 3

ప్ర.అ. తతః=అటుపిమ్మట, కార్ముకాత్=ధనస్సునుండి, సర్వశః=అన్ని వైపులా, వజ్రసారాణి=వజ్రమువంటి సారము గల, దీప్యమానాని=ప్రకాశించుచున్న, శూలాని=శూలములు, గదాశ్చ=గదలు, ముసలాని చ=ముసలములు, నిశ్చేరుః=బయలుదేరినవి.

తా. అప్పుడు ధనస్సునుండి వజ్రమువంటి సారము గల ప్రకాశించుచున్న శూలములు, గదలు, ముసలములు అన్ని వైపులా బయలుదేరినవి. 3

మూ. ముద్గరాః కూటపాశాశ్చ దీప్తాశ్చాశనయస్తథా,
నిష్పేతుర్వివిధాస్తీక్ష్ణా వాతా ఇవ యుగక్షయే. 4

ప్ర.అ. వివిధాః=అనేక విధములైన, తీక్ష్ణాః=తీక్ష్ణములైన, ముద్గరాః=ముద్గరములు, కూటపాశాశ్చ=కూటములు, పాశములు, తథా=మరియు, దీప్తాః=ప్రజ్వలించుచున్న, అశనయశ్చ=వజ్రాయుధములు, యుగక్షయే=ప్రళయకాలమునందు, వాతాః ఇవ=వాయువులు వలె, నిష్పేతుః=బయలుదేరినవి.

తా. ప్రళయకాలమునందు వాయువులు బయలుదేరి నట్లు అనేక విధములైన, తీక్ష్ణములైన ముద్గరములు, కూటములు, పాశములు, ప్రజ్వలించుచున్న వజ్రాయుధములు బయలుదేరెను. 4

మూ. తదస్త్రం రాఘవః శ్రీమానుత్తమాస్త్రవిదాం వరః,
జఘాన పరమాస్త్రేణ గాన్ధర్వేణ మహాద్యుతిః. 5

ప్ర.అ. శ్రీమాన్=శ్రీమంతుడు, ఉత్తమాస్త్రవిదామ్=ఉత్తమమైన అస్త్రములు ఎరిగినవారిలో, వరః=శ్రేష్ఠుడు, మహాద్యుతిః=గొప్ప కాంతి కలవాడు అయిన, రాఘవః=రాముడు, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, గాన్ధర్వేణ=గాంధర్వమను, పరమాస్త్రేణ=గొప్ప అస్త్రముచేత, జఘాన=కొట్టివేసెను.

తా. శ్రీమంతుడు, ఉత్తమాస్త్రములు తెలిసినవారిలో శ్రేష్ఠుడు, మహా కాంతిమంతుడూ అయిన రాముడు ఆ అస్త్రమును గాంధర్వ మనే గొప్ప అస్త్రముచేత కొట్టివేసెను. 5

మూ. తస్మిన్ ప్రతిహతేఽస్త్రే తు రాఘవేణ మహాత్మనా,
రావణః క్రోధతామ్రాక్షః సౌరమస్త్రముదైరయత్. 6

ప్ర.అ. మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, తస్మిన్=ఆ, అస్త్రే=అస్త్రము, ప్రతిహతే=కొట్టబడినదగుచుండగా, రావణః=రావణుడు, క్రోధతామ్రాక్షః=క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, సౌరమ్ అస్త్రమ్=సౌరాస్త్రమును, ఉదైరయత్=ప్రయోగించెను.

తా. మహాత్ముడైన రామునిచేత ఆ అస్త్రము కొట్టి వేయబడగా, రావణుడు, క్రోధముచేత నేత్రములు ఎఱ్ఱబడగా సౌరాస్త్రమును ప్రయోగించెను.

మూ. తతశ్చక్రాణి నిష్పేతుర్భాస్వరాణి మహాన్తి చ,
కార్ముకాద్భీమవేగస్య దశగ్రీవస్య ధీమతః. 7

ప్ర.అ. తతః=అటుపిమ్మట, భీమవేగస్య=భయంకరమైన వేగము గల, ధీమతః=బుద్ధిమంతుడైన, దశగ్రీవస్య=రావణునియొక్క, కార్ముకాత్=ధనస్సునుండి, భాస్వరాణి=ప్రకాశించుచున్న, మహాన్తి=గొప్పవైన, చక్రాణి=చక్రములు, నిష్పేతుః=బయల్వెడలినవి.

తా. పిమ్మట భయంకరమైన వేగము గల ధీమంతుడైన ఆ రావణుని ధనస్సునుండి ప్రకాశించుచున్న పెద్ద పెద్ద చక్రములు బయలుదేరెను. 7

మూ. తైరాసీద్గగనం దీప్తం సంపతద్భిః సమన్తతః,
పతద్భిశ్చ దిశో దీప్తైశ్చన్ద్రసూర్యగ్రహైరివ. 8

ప్ర.అ. సమన్తతః=అన్ని వైపులనుండి, సంపతద్భిః=వచ్చుచున్న, పతద్భిశ్చ=పడుచున్న, తైః=వాటిచేత, దీప్తైః=ప్రజ్వలించుచున్న, చన్ద్రసూర్యగ్రహైరివ=చంద్రసూర్యులచేతను గ్రహములచేతనూ వలె, గగనమ్=ఆకాశము, దీప్తమ్=ప్రజ్వలించుచున్నది, ఆసీత్=ఆయెను. దిశశ్చ=దిక్కులుకూడ, (ప్రజ్వలించినవి).

తా. అన్ని వైపులనుండీ వచ్చి పడుచున్న ఆ చక్రములచేత, ప్రకాశించుచున్న చంద్ర సూర్యగ్రహములచేత వలె ఆకాశము, దిక్కులు ప్రకాశించినవి. 8

మూ. తాని చిచ్ఛేద బాణౌఘైశ్చక్రాణి తు స రాఘవః,
ఆయుధాని చ చిత్రాణి రావణస్య చమూముఖే. 9

ప్ర. అ. సః రాఘవః=ఆ రాముడు, బాణౌఘైః=బాణసముదాయముల చేత, తాని=ఆ, చక్రాణి=చక్రములను, రావణస్య=రావణునియొక్క, ఆయుధాని చ=ఆయుధములను, చమూముఖే=సేనాగ్రమునందు, చిచ్ఛేద=ఛేదించెను.

తా. సేనాగ్రభాగమునందు రాముడు ఆ చక్రములను రావణుని ఆయుధములను బాణములచేత ఖండించెను. 9

మూ. తదస్త్రం తు హతం దృష్ట్వా రావణో రాక్షసాధిపః,
వివ్యాధ దశభిర్బాణై రామం సర్వేషు మర్మసు. 10

ప్ర.అ. రాక్షసాధిపః=రాక్షసప్రభువైన, రావణః=రావణుడు, తత్=ఆ, అస్త్రమ్=అస్త్రమును, హతమ్=కొట్టబడినదానినిగా, దృష్ట్వా=చూచి, దశభిః=పది, బాణైః=బాణములచేత, రామమ్=రాముణ్ణి, సర్వేషు=సమస్తమైన, మర్మసు=మర్మస్థానములయందు, వివ్యాధ=కొట్టెను.

తా. రాక్షసరాజైన రావణుడు ఆ అస్త్రము కొట్టబడినట్లు చూచి పది బాణములతో రాముణ్ణి అన్ని మర్మస్థానములందు కొట్టెను. 10

మూ. స విద్ధో దశభిర్బాణైర్మహాకార్ముకనిఃసృతైః,
రావణేన మహాతేజా న ప్రాకమ్పత రాఘవః. ll

ప్ర.అ. రావణేన=రావణునిచేత, మహాకార్ముకనిఃసృతైః=గొప్ప ధనస్సునుండి బయల్వెడలిన, దశభిః=పది, బాణైః=బాణములచేత, విద్ధః=కొట్టబడిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః రాఘవః=ఆ రాముడు, న ప్రాకమ్పత=చలించలేదు.

తా. ఆ రావణుడు మహాధనస్సుతో ప్రయోగించిన ఆ పది బాణములతో కొట్టినను గొప్ప తేజస్సు గల ఆ రాముడు చలించలేదు. ll

మూ. తతో వివ్యాధ గాత్రేషు సర్వేషు సమితింజయః,
రాఘవస్తు సుసంక్రుద్ధో రావణం బహుభిః శరైః. 12

ప్ర.అ. తతః=అటుపిమ్మట, సమితింజయః=యుద్ధమును జయించు, రాఘవస్తు=రాముడు, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, రావణమ్=రావణుణ్ణి, బహుభిః=అనేకములైన, శరైః=బాణాలచేత, సర్వేషు=సమస్తమైన, గాత్రేషు=అవయవములయందు, వివ్యాధ=కొట్టెను.

తా. అప్పుడు యుద్ధములందు జయించు రాముడు చాల కోపించి అనేకబాణములచేత రావణుణ్ణి అన్ని అవయవములయందు కొట్టెను. 12

మూ. ఏతస్మిన్నన్తరే క్రుద్ధో రాఘవస్యానుజో బలీ,
లక్ష్మణః సాయకాన్ సప్త జగ్రాహ పరవీరహా. 13

ప్ర.అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యయందు, క్రుద్ధః=కోపించినవాడు, రాఘవస్య=రామునియొక్క, అనుజః=తమ్ముడు, బలీ=బలవంతుడు, పరవీరహా=శత్రువీరులను సంహరించువాడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, సప్త=ఏడు, సాయకాన్=బాణములను, జగ్రాహ=గ్రహించెను.

తా. ఇంతలో బలశాలి, రాముని తమ్ముడూ, శత్రుసంహారకుడూ అయిన లక్ష్మణుడు కోపించి ఏడు బాణములను గ్రహించెను. 13

మూ. తైః సాయకైర్మహావేగై రావణస్య మహాద్యుతిః,
ధ్వజం మనుష్యశీర్షం తు తస్య చిచ్ఛేద నైకధా. 14

ప్ర. అ.మహాద్యుతిః=గొప్ప కాంతి గల లక్ష్మణుడు, మహావేగైః=గొప్ప వేగము గల, తైః సాయకైః=ఆ బాణములచేత, తస్య రావణస్య=ఆ రావణుని యొక్క, మనుష్యశీర్షమ్=మనుష్యుని శిరస్సు చిహ్నంగా గల, ధ్వజమ్=ధ్వజమును, నైకధా=అనేకవిధములుగా, చిచ్ఛేద=ఛేదించెను.

తా. గొప్ప కాంతి గల లక్ష్మణుడు మహావేగము గల ఆ బాణాలతో

రావణుని మనుష్యశిరస్సు చిహ్నముగా గల ధ్వజమును ముక్కముక్కలుగా ఛేదించివేసెను. 14

మూ. సారథేశ్చాపి బాణేన శిరో జ్వలితకుణ్డలమ్,
జహార లక్ష్మణః శ్రీమాన్ నైరృతస్య మహాబలః. 15

ప్ర.అ. శ్రీమాన్=శ్రీమంతుడు, మహాబలః=గొప్ప బలము కలవాడు అయిన, లక్ష్మణః=లక్ష్మణుడు, బాణేన=బాణముచేత, నైరృతస్య=రావణునియొక్క, సారథేః=సారథియొక్క, జ్వలితకుణ్డలమ్=ప్రకాశించుచున్న కుండలములు గల, శిరః=శిరస్సును, జహార=హరించెను.

తా. శ్రీమంతుడు మహాబలశాలీ అయిన లక్ష్మణుడు ఒక బాణముతో ఆ రావణుని సారథియొక్క, ప్రకాశించుచున్న కుండలములు గల శిరస్సును హరించెను. 15

మూ. తస్య బాణైశ్చ చిచ్ఛేద ధనుర్గజకరోపమమ్,
లక్ష్మణో రాక్షసేన్ద్రస్య పఞ్చభిర్నిశితైస్తదా. 16

ప్ర. అ.తదా=అప్పుడు, లక్ష్మణః=లక్ష్మణుడు, నిశితైః=వాడియైన, పఞ్చభిః=ఐదు, బాణైః=బాణములచేత, తస్య రాక్షసేన్ద్రస్య=ఆ రావణుని యొక్క, గజకరోపమమ్=ఏనుగ తొండమువంటి, ధనుః=ధనస్సును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. లక్ష్మణుడు ఐదు వాడియైన బాణాలతో ఆ రావణుని ఏనుగు తొండమువలె ఉన్న ధనస్సును ఛేదించెను. 16

మూ. నీలమేఘనిభాంశ్చాస్య సదశ్వాన్ పర్వతోపమాన్,
జఘానాప్లుత్య గదయా రావణస్య విభీషణః. 17

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, ఆప్లుత్య=దుమికి, గదయా=గదచేత, అస్య రావణస్య=ఈ రావణునియొక్క, నీలమేఘనిభాన్=నీలమేఘములతో సమానములైన, పర్వతోపమాన్=పర్వతములతో సమానములైన, సదశ్వాన్=ఉత్తమాశ్వములను, జఘాన=చంపెను.

తా. విభీషణుడు ఎగిరి వెళ్లి ఆ రావణుని నల్లని మేఘముల వలె ఉన్న పర్వతముల వలె పెద్దవైన ఉత్తమాశ్వములను గదతో చంపెను. 17

మూ. హతాశ్వాత్తు తదా వేగాదవప్లుత్య మహారథాత్,
కోపమాహారత్తీవ్రం భ్రాతరం ప్రతి రావణః. 18

ప్ర. అ. తదా=అప్పుడు, రావణః=రావణుడు, హతాశ్వాత్=చంపబడిన గుఱ్ఱములు గల, మహారథాత్=మహారథమునుండి, వేగాత్=వేగమువలన, అవప్లుత్య=

దిగి, భ్రాతరం ప్రతి=సోదరుని గూర్చి, తీవ్రమ్=తీవ్రమైన, కోపమ్=కోపమును, ఆహారయత్=తెప్పించుకొనెను.

తా. రావణుడు చంపబడిన గుఱ్ఱములు గల ఆ మహారథమునుండి క్రిందికి వేగముగా దుమికి సోదరునిపై తీవ్రమైన కోపమును చూపెను. 18

మూ. తతః శక్తిం మహాశక్తిః ప్రదీప్తామశనీమివ,
విభీషణస్య చిక్షేప రాక్షసేన్ద్రః ప్రతాపవాన్. 19

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాశక్తిః=గొప్ప శక్తి గల, ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, రాక్షసేన్ద్రః=రావణుడు, ప్రదీప్తామ్=మండుచున్న, అశనీమివ=వజ్రాయుధమువలె ఉన్న, శక్తిమ్=శక్తిని, విభీషణస్య=విభీషణునకు, చిక్షేప=విసిరెను.

తా. అప్పుడు గొప్ప శక్తీ, ప్రతాపము గల రావణుడు మండుచున్న వజ్రాయుధము వలె ఉన్న శక్తిని విభీషణునిపై ప్రయోగించెను. 19

మూ. అప్రాప్తామేవ తాం బాణైస్త్రిభిశ్చిచ్ఛేద లక్ష్మణః,
అథోదతిష్ఠత్సంనాదో వానరాణాం మహారణే. 20

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, అప్రాప్తామేవ=దగ్గరకు రాకుండగానే, తామ్=ఆ శక్తిని, త్రిభిః=మూడు, బాణైః=బాణములచేత, చిచ్ఛేద=ఛేదించెను. అథ=అటుపిమ్మట, మహారణే=మహాయుద్ధమునందు, వానరాణామ్=వానరులయొక్క, సంనాదః=ధ్వని, ఉదతిష్ఠత్=బయలుదేరెను.

తా. లక్ష్మణుడు ఆ శక్తి విభీషణుణ్ణి చేరకముందే మూడు బాణాలతో ఛేదించెను. అప్పుడు ఆ మహాయుద్ధములో వానరుల హర్షధ్వని బయలుదేరెను.

మూ. సంపపాత త్రిధా ఛిన్నా శక్తిః కాఞ్చనమాలినీ,
సవిస్ఫులిఙ్గా జ్వలితా మహోల్కేవ దివశ్చ్యుతా. 21

ప్ర. అ. త్రిధా=మూడు విధములుగా, ఛిన్నా=ఛేదించబడిన, కాఞ్చనమాలినీ=బంగారు మాలలుగల, శక్తిః=శక్తి, దివః=ఆకాశమునుండి, చ్యుతా=పడిన, మహోల్కేవ=పెద్ద అగ్నిపిండము వలె, సవిస్ఫులిఙ్గా=అగ్నికణములతో కూడినదై, సంపపాత=పడెను.

తా. బంగారు మాలలు గల ఆ శక్తి మూడు ముక్కలుగా ఛేదింపబడి, అగ్నికణములు చిమ్ముచు, ఆకాశమునుండి పడిన పెద్ద ఉల్క వలె పడెను.21

మూ. తతః సంభావితతరాం కాలేనాపి దురాసదామ్,
జగ్రాహ విపులాం శక్తిం దీప్యమానాం స్వతేజసా. 22

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సంభావితతరామ్=మిక్కిలి గౌరవించబడినది, **కాలేనా** పి=యమునిచేత కూడ, దురాసదామ్=సమీపింప శక్యము కానిది, స్వతేజసా= **తన** తేజస్సుతో, దీప్యమానామ్=ప్రజ్వలించుచున్నదీ అయిన, విపులామ్=పెద్దదైన, శక్తిమ్=శక్తిని, జగ్రాహ=గ్రహించెను.

తా. పిమ్మట రావణుడు మిక్కిలి గౌరవింపదగిన మరొక పెద్ద శక్తిని గ్రహించెను. యముడు కూడ ఎదిరించుటకు శక్యము కాని ఆ శక్తి తన తేజస్సుతో ప్రకాశించుచుండెను. 22

మూ. సా వేగితా బలవతా రావణేన దురాత్మనా,
జజ్వాల సుమహాతేజా దీప్తాశనిసమప్రభా. 23

ప్ర. అ. బలవతా=బలవంతుడు, దురాత్మనా=దురాత్ముడు అయిన, రావణేన=రావణుని చేత, వేగితా=వేగముగా ప్రయోగింపబడిన, సుమహాతేజాః=చాల గొప్ప తేజస్సు గల, దీప్తాశనిసమప్రభా=ప్రజ్వలించుచున్న పిడుగుతో సమానమైన కాంతి గల, సా=ఆ శక్తి, జజ్వాల=మండుచుండెను.

తా. మండుచున్న పిడుగు వంటి కాంతి కల ఆ శక్తి గొప్ప తేజస్సుతో మండుచుండెను. బలవంతుడు, దురాత్ముడూ అయిన రావణుడు దానిలో వేగము కలిగించెను. 23

మూ. ఏతస్మిన్నన్తరే వీరో లక్ష్మణస్తం విభీషణమ్,
ప్రాణసంశయమాపన్నం తూర్ణమభ్యవపద్యత. 24

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యలో, వీరః=వీరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, ప్రాణసంశయమ్=ప్రాణాలను గూర్చిన సంశయమును, ఆపన్నమ్=పొందిన, తం విభీషణమ్=ఆ విభీషణుణ్ణి, తూర్ణమ్=శీఘ్రముగా, అభ్యవపద్యత=ఆదుకొనెను.

తా. ఇంతలో వీరుడైన లక్ష్మణుడు ప్రాణసంశయమును పొందిన విభీషణుణ్ణి శీఘ్రముగా వెళ్లి ఆదుకొనెను. 24

మూ. తం విమోక్షయితుం వీరశ్చాపమాయమ్య లక్ష్మణః,
రావణం శక్తిహస్తం వై శరవర్షైరవాకిరత్. 25

ప్ర. అ. వీరః=వీరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, తమ్=విభీషణుణ్ణి, విమోచయితుమ్=విడిపించుటకు, చాపమ్=ధనస్సును, ఆయమ్య=వంచి, శక్తిహస్తమ్=శక్తి హస్తమునందు గల, రావణమ్=రావణుణ్ణి, శరవర్షైః=బాణవర్షములచేత, **అవాకిరత్**=చల్లెను.

**తా.** వీరుడైన లక్ష్మణుడు ఆ విభీషణుణ్ణి విడిపించుటకు **ధనస్సు**

వంచి, శక్తి హస్తమునందున్న ఆ రావణునిపై బాణవర్షము కురిపించెను. 25

మూ. కీర్యమాణః శరౌఘేణ విసృష్టేన మహాత్మనా,
న ప్రహర్తుం మనశ్చక్రే విముఖీకృతవిక్రమః. 26

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన లక్ష్మణునిచేత, విసృష్టేన=విడవబడిన, శరౌఘేణ=బాణసముదాయముచేత, కీర్యమాణః=చిమ్మబడుచున్న రావణుడు, విముఖీకృతవిక్రమః=విముఖము చేయబడిన పరాక్రమము గలవాడై, ప్రహర్తుమ్=విభీషణుణ్ణి కొట్టుటకు, మనః=మనస్సును, న చక్రే=చేయలేదు.

తా. మహాత్ముడైన లక్ష్మణుడు విడచిన బాణసముదాయముచేత కప్పివేయబడిన ఆ రావణుడు విభీషణుని విషయమున తన పరాక్రమము విముఖము కాగా, ఆతనిని చంపు సంకల్పమును విడచెను. 26

మూ. మోక్షితం భ్రాతరం దృష్ట్వా లక్ష్మణేన స రావణః,
లక్ష్మణాభిముఖస్తిష్ఠన్నిదం వచనమబ్రవీత్. 27

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, భ్రాతరమ్=తన సోదరుణ్ణి, మోక్షితమ్=విడిపింపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, లక్ష్మణాభిముఖః=లక్ష్మణునకు అభిముఖుడై, తిష్ఠన్=నిలచి, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రావణుడు తన సోదరుడైన విభీషణుణ్ణి లక్ష్మణుడు శక్తి ప్రహారమునుండి తప్పించుట చూచి, లక్ష్మణునకు ఎదురుగా నిలచి ఈ వచనమును పలికెను. 27

మూ. మోక్షితస్తే బలశ్లాఘిన్యస్మాదేవం విభీషణః,
విముచ్య రాక్షసం శక్తిస్త్వయీయం వినిపాత్యతే. 28

ప్ర. అ. బలశ్లాఘిన్=బలముచేత శ్లాఘించుకొనుచున్నవాడా ! యస్మాత్=ఏ కారణమువలన, విభీషణః=విభీషణుడు, తే=నీకు(నీచేత), ఏవమ్=ఇట్లు, మోక్షితః=విడిపింపబడినాడో అందువలన, ఇయమ్=ఈ, శక్తిః=శక్తి, రాక్షసమ్=రాక్షసుణ్ణి, విముచ్య=విడచి, త్వయి=నీమీద, వినిపాత్యతే=పడవేయబడుచున్నది.

తా. బలముచేత శ్లాఘించుకొనుచున్న లక్ష్మణా ! నీవు ఈ విధముగా విభీషణుణ్ణి విడిపించినావు గాన ఈ శక్తి విభీషణుణ్ణి విడచి నీమీద ప్రయోగింపబడుచున్నది. 28

మూ. ఏషా తే హృదయం భిత్త్వా శక్తిర్లోహితలక్షణా,
మద్బాహుపరిఘోత్సృష్టా ప్రాణానాదాయ యాస్యతి. 29

ప్ర. అ. లోహితలక్షణా=రక్తము లక్షణము (గుర్తుగా గల), మద్బాహుపరిఘోత్సృష్టా=నా పరిఘులవంటి బాహువులచేత విడవబడిన, ఏషా=ఈ, శక్తిః=శక్తి, తే=నీయొక్క, హృదయమ్=హృదయమును, భిత్త్వా=భేదించి, ప్రాణాన్=ప్రాణములను, ఆదాయ=గ్రహించి, యాస్యతి=వెళ్లగలదు.

తా. శత్రురక్తముచేత పూయబడి ఆ గుర్తులు గల ఈ శక్తి పరిఘులవంటి నా బాహువులచేత ప్రయోగింపబడి, నీ హృదయమును భేదించి, నీ ప్రాణాలు గ్రహించి వెళ్లగలదు. 29

**మూ. ఇత్యేవముక్త్వా తాం శక్తిమష్టఘణ్టాం మహాస్వనామ్,**
**మయేన మాయావిహితామమోఘాం శత్రుఘాతినీమ్, 30**
**లక్ష్మణాయ సముద్దిశ్య జ్వలన్తీమివ తేజసా,**
**రావణః పరమక్రుద్ధశ్చిక్షేప చ ననాద చ. 31**

ప్ర. అ. పరమక్రుద్ధః=మిక్కిలి కోపించిన, రావణః=రావణుడు, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, అష్టఘణ్టామ్=ఎనిమిది ఘంటలు కలది, మహాస్వనామ్=గొప్ప ధ్వని గలది, మయేన=మయునిచేత, మాయావిహితామ్=మాయచేత నిర్మింపబడినది, అమోఘామ్=వ్యర్థము కానిది, శత్రువిఘాతినీమ్=శత్రువులను చంపేది, తేజసా=తేజస్సుచేత, జ్వలన్తీమివ=మండుచున్నది వలె ఉన్నది అయిన, తాం శక్తిమ్=ఆ శక్తిని, లక్ష్మణాయ=లక్ష్మణునకు, సముద్దిశ్య=ఉద్దేశించి, చిక్షేప=విసిరెను. ననాద చ=ధ్వని చేసెను కూడ.

తా. గొప్ప ధ్వని చేయుచున్న ఆ శక్తికి ఎనిమిది ఘంటలు కట్టబడి ఉండెను. మయుడు మాయచేత నిర్మించిన ఆ శక్తి తన తేజస్సుతో మండుచున్నట్లు ఉండెను. ఎన్నడూ వ్యర్థము కాని, శత్రువులను చంపే ఆ శక్తిని రావణుడు కోపావిష్టుడై , పై విధముగా పలుకుచు, లక్ష్మణునిమీద ప్రయోగించి బిగ్గరగా అరచెను. 30, 31

**మూ. సా క్షిప్తా భీమవేగేన వజ్రాశనిసమస్వనా,**
**శక్తిరభ్యపతద్వేగాల్లక్ష్మణం రణమూర్ధని. 32**

ప్ర. అ. భీమవేగేన=భయంకరమైన వేగముగల రావణునిచేత, క్షిప్తా=విసరబడిన, వజ్రాశనిసమస్వనా=వజ్రాయుధముతోను, పిడుగుతోను సమానమైన ధ్వని గల, సా శక్తిః=ఆ శక్తి, రణమూర్ధని=యుద్ధాగ్రభూమియందు, వేగాత్=వేగమువలన,లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి గూర్చి, అభ్యపతత్=శీఘ్రముగా వెళ్లెను.

తా. భయంకరమైన వేగము గల రావణుడు ప్రయోగించిన, వజ్రాయుధముతోను, పిడుగుతోను సమానమైన ధ్వని గల ఆ శక్తి, యుద్ధాగ్రమునందు

వేగముగా లక్ష్మణునిమీద పడెను. 32

మూ. తామనువ్యాహరచ్ఛక్తిమాపతన్తీం స రాఘవః,
స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘా భవ హతోద్యమా. 33

ప్ర. అ. సః రాఘవః=ఆ రాముడు, ఆపతన్తీమ్=వచ్చిపడుచున్న, తాం శక్తిమ్= ఆ శక్తిని గూర్చి, లక్ష్మణాయ=లక్ష్మణునకు, స్వస్తి=క్షేమము, అస్తు=అగుగాక; మోఘా=వ్యర్థమైనదానవు, హతోద్యమా=కొట్టబడిన ప్రయత్నము కలదానవు, భవ=అగుము, ఇతి=అని, అనువ్యాహరత్=పలికెను.

తా. వచ్చి పడుచున్న శక్తిని గూర్చి రాముడు-"లక్ష్మణునకు క్షేమ మగుగాక, నీవు వ్యర్థము అయ్యెదవుగాక ; నీ ప్రయత్నము విఫల మగుగాక" అని పలికెను. 33

మూ. రావణేన రణే శక్తిః క్రుద్ధేనాశీవిషోపమా,
ముక్తాశూరస్యభీతస్య లక్ష్మణస్య మమజ్జ సా. 34

ప్ర. అ. క్రుద్ధేన=కోపించిన, రావణేన=రావణునిచేత, రణే=యుద్ధము నందు, ముక్తా=విడవబడిన, ఆశీవిషోపమా=సర్పముతో సమానమైన, సా శక్తిః=ఆ శక్తి, ఆశు=శీఘ్రముగా, అభీతస్య=భయపడని, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, మమజ్జ=మునిగెను.

తా. యుద్ధములో రావణుడు ప్రయోగించిన సర్పము వంటి ఆశక్తి వెంటనే, భయపడని లక్ష్మణుని వక్షఃస్థలములో దిగిపోయెను. 34

మూ. న్యపతత్సా మహావేగా లక్ష్మణస్య మహోరసి,
జిహ్వేవోరగరాజస్య దీప్యమానా మహాద్యుతిః. 35

ప్ర. అ. ఉరగరాజస్య=వాసుకియొక్క, దీప్యమానా=ప్రజ్వరిల్లుచున్న, జిహ్వేవ=జిహ్వవలె ఉన్న, మహాద్యుతిః=గొప్ప కాంతి గల, మహావేగా=గొప్ప వేగము గల, సా=ఆ శక్తి, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, మహోరసి=మహావక్షః స్థలమునందు, న్యపతత్=పడెను.

తా. ప్రజ్వలించుచున్న, వాసుకి నాలుక వలె ఉన్న, గొప్ప కాంతి గల ఆ శక్తి గొప్ప వేగముతో లక్ష్మణుని విశాలవక్షఃస్థలముమీద పడెను. 35

మూ. తతో రావణవేగేన సుదూరమవగాఢయా,
శక్త్యా విభిన్నహృదయః పపాత భువి లక్ష్మణః. 36

ప్ర.అ. తతః=అటుపిమ్మట, రావణవేగేన=రావణుని వేగముచేత, సుదూరమ్=చాల లోపలికి, అవగాఢయా=దిగిన, శక్త్యా=శక్తిచేత, విభిన్నహృదయః=

బ్రద్దలుకొట్టబడిన వక్షఃస్థలముగలవాడై,, లక్ష్మణః=లక్ష్మణుడు, భువి=నేలమీద, పపాత=పడెను.

తా. అప్పుడు రావణుని వేగముచేత చాల లోతుగా దిగిపోయిన ఆ శక్తిచేత వక్షఃస్థలము భేదింపబడిగా లక్ష్మణుడు నేలపై పడెను. 36

మూ. తదవస్థం సమీపస్థో లక్ష్మణం ప్రేక్ష్య రాఘవః,
భ్రాతృస్నేహాన్మహాతేజా విషణ్ణహృదయో౽ భవత్. 37

ప్ర.అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సమీపస్థః=సమీపమునందున్న, రాఘవః=రాముడు, తదవస్థమ్=అట్టి అవస్థలో ఉన్న, లక్ష్మణమ్=లక్ష్మణుని, ప్రేక్ష్య=చూచి, భ్రాతృస్నేహాత్=సోదరప్రేమవలన, విషణ్ణహృదయః=దుఃఖించిన హృదయము కలవాడు, అభవత్=అయెను.

తా. దగ్గరనే ఉన్న మహాతేజఃశాలియైన రాముడు అట్టి అవస్థలో ఉన్న లక్ష్మణుణ్ణి చూచి సోదరస్నేహమువలన దుఃఖాక్రాంతు డయ్యెను. 37

మూ. స ముహూర్తమివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః,
బభూవ సంరబ్ధతరో యుగాన్త ఇవ పావకః. 38

ప్ర.అ. సః=రాముడు, ముహూర్తమివ=క్షణకాలము, ధ్యాత్వా=ఆలోచించి, బాష్పపర్యాకులేక్షణః=కన్నీటిచేత వ్యాకులమైన నేత్రములు కలవాడై, యుగాన్తే=ప్రళయకాలమునందు, పావకః ఇవ=అగ్ని వలె, సంరబ్ధతరః=మిక్కిలి కోపము గలవాడుగా, బభూవ=అయెను.

తా. రాముడు కన్నీటితో నిండిన నేత్రములతో క్షణకాలము ఆలోచించి, ప్రళయకాలాగ్ని వలె చాల క్రోధావేశము చెందెను. 38

మూ. న విషాదస్య కాలో౽యమితి సంచిన్త్య రాఘవః,
చక్రే సుతుములం యుద్ధం రావణస్య వధే ధృతః, 39
సర్వయత్నేన మహతా లక్ష్మణం పరివీక్ష్య చ.

ప్ర.అ. అయమ్=ఇది, విషాదస్య=దుఃఖమునకు, కాలః=కాలము, న=కాదు, ఇతి=అని, సంచిన్త్య=ఆలోచించి, లక్ష్మణమ్=లక్ష్మణుని, పరివీక్ష్య=చూచి, రాఘవః=రాముడు, రావణస్య=రావణుని యొక్క, వధే=వధయందు, ధృతః=నిశ్చితుడై, మహతా=గొప్పదైన, సర్వయత్నేన=పూర్ణప్రయత్నముచేత, సుతుములమ్=చాల వ్యాకులమైన, యుద్ధమ్=యుద్ధమును, చక్రే=చేసెను.

తా. ఇది దుఃఖించుటకు సమయము కాదు అని ఆలోచించి, రాముడు, రావణుని చంపవలె నని దృఢముగా సంకల్పించి గొప్పదైన పూర్తి ప్రయత్నముతో

చాల వ్యాకులమైన యుద్ధమును చేసెను. 39

మూ. స దదర్శ తతో రామః శక్త్యా భిన్నం మహాహవే, 40
లక్ష్మణం రుధిరాదిగ్ధం సపన్నగమివాచలమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః రామః= ఆ రాముడు, మహాహవే=మహాయుద్ధమునందు, శక్త్యా=శక్తిచేత, భిన్నమ్=కొట్టబడిన, రుధిరాదిగ్ధమ్=రక్తముచేత పూయబడిన, సపన్నగమ్=సర్పములతో కూడిన, అచలమ్ ఇవ=పర్వతమువలె ఉన్న, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, దదర్శ=చూచెను.

తా. మహాయుద్ధములో శక్తిచేత పడగొట్టబడి, రక్తముచేత తడిసి సర్పములతో కూడిన పర్వతము వలె ఉన్న లక్ష్మణుణ్ణి రాముడు చూచెను.

మూ. తామపి ప్రహితాం శక్తిం రావణేన బలీయసా, 41
యత్నతస్తే హరిశ్రేష్ఠా న శేకురవమర్దితుమ్,
అర్దితాశ్చైవ బాణౌఘైస్తే ప్రవేకేణ రక్షసామ్. 42

ప్ర. అ. రక్షసామ్=రాక్షసులలో, ప్రవేకేణ=శ్రేష్ఠుడైన రావణుని చేత, బాణౌఘైః=బాణసముదాయములచేత, అర్దితాః చైవ=పీడింపబడినవారై, తే=ఆ, హరిశ్రేష్ఠాః=వానరశ్రేష్ఠులు, బలీయసా=బలవంతుడైన, రావణేన=రావణునిచేత, ప్రహితామ్=పంపబడిన, తామ్=ఆ, శక్తిమ్=శక్తిని, యత్నతః అపి=ప్రయత్నముచేత కూడ, అవమర్దితుమ్=పైకి లాగుటకు, న శేకుః=సమర్థులు కాలేదు.

తా. బలవంతుడైన రావణుడు ప్రయోగించిన ఆ శక్తిని పైకి లాగివేయుటకు ప్రయత్నించినను ఆ వానరశ్రేష్ఠులు, రాక్షసరాజైన రావణుడు బాణసముదాయములచేత పీడించుటచే లాగజాలకపోయిరి. 41, 42

మూ. సౌమిత్రేః సా వినిర్భిద్య ప్రవిష్టా ధరణీతలమ్,
తాం కరాభ్యాం పరామృశ్య రామః శక్తిం భయావహామ్, 43
బభఞ్జ సమరే క్రుద్ధో బలవాన్ విచకర్ష చ.

ప్ర. అ. సా=ఆ శక్తి, సౌమిత్రేః=లక్ష్మణునియొక్క వక్షస్థలమును, వినిర్భిద్య=భేదించి, ధరణీతలమ్=భూమిని, ప్రవిష్టా=స్పృశించినది. బలవాన్=బలవంతుడైన, రామః=రాముడు, సమరే=యుద్ధమునందు, క్రుద్ధః=కోపించినవాడై, భయావహామ్=భయంకరమైన, తాం శక్తిమ్=ఆ శక్తిని, కరాభ్యామ్=హస్తములచేత, పరామృశ్య=స్పృశించి, విచకర్ష=లాగెను. బభఞ్జ చ=విరిచివేసెను.

తా. ఆ శక్తి లక్ష్మణుని వక్షఃస్థలమును భేదించి నేలను స్పృశించెను. బలవంతుడైన రాముడు కోపించి యుద్ధములో ఆ భయంకరమైన శక్తిని

రెండు చేతులతో పట్టి పైకి లాగి విరిచివేసెను. 43

మూ. తస్య నిష్కర్షతః శక్తిం రావణేన బలీయసా, 44
శరాః సర్వేషు గాత్రేషు పాతితా మర్మభేదినః.

ప్ర. అ. బలీయసా=బలవంతుడైన, రావణేన=రావణునిచేత, శక్తిమ్=శక్తిని, నిష్కర్షతః=లాగుచున్న, తస్య=రామునియొక్క, సర్వేషు=సమస్తమైన, గాత్రేషు=అవయవములయందు, మర్మభేదినః=మర్మస్థానములను భేదించు, శరాః=బాణములు, పాతితాః=పడవేయబడినవి.

తా. రాముడు ఆ శక్తిని పైకి లాగుచుండగా బలశాలియైన రావణుడు ఆతని అన్ని అవయవములయందు, మర్మస్థానములను భేదించు శరములను ప్రయోగించెను. 44

మూ. అచిన్తయిత్వా తాన్ బాణాన్ సమాశ్లిష్య చ లక్ష్మణమ్, 45
అబ్రవీచ్చ హనూమన్తం సుగ్రీవం చ మహాకపిమ్.

ప్ర.అ. తాన్=ఆ, బాణాన్=బాణములను, అచిన్తయిత్వా=లెక్కచేయక, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, సమాశ్లిష్య=కౌగిలించుకొని, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, మహాకపిమ్=మహావానరుడైన, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి గూర్చి, అబ్రవీచ్చ=పలికెను.

తా. రాముడు ఆ బాణాలను లెక్కచేయక, లక్ష్మణుణ్ణి కౌగలించుకొని, హనుమంతుని తోను, వానర రాజైన సుగ్రీవునితోను ఇట్లు పలికెను. 45

మూ. లక్ష్మణం పరివార్యైవ తిష్ఠధ్వం వానరోత్తమాః, 46
పరాక్రమస్య కాలోఽయం సంప్రాప్తో మే చిరేప్సితః.
పాపాత్మాయం దశగ్రీవో వధ్యతాం పాపనిశ్చయః, 47
కాఙ్క్షితం చాతకస్యేవ ఘర్మాన్తే మేఘదర్శనమ్.

ప్ర. అ. వానరోత్తమాః=వానరశ్రేష్ఠులారా ! లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, పరివార్యైవ=చుట్టియే, తిష్ఠధ్వమ్=ఉండుడు. పాపాత్మా=పాపాత్ముడు, పాపనిశ్చయః=పాపనిశ్చయము కలవాడు అయిన, అయం దశగ్రీవః=ఈ రావణుడు, వధ్యతామ్=చంపబడుగాక (వీనిని చంపే సమయము వచ్చినది). ఘర్మాన్తే=గ్రీష్మాంతమునందు, చాతకస్య=చాతకపక్షికి, కాఙ్క్షితమ్=కోరబడిన, మేఘదర్శనమివ=మేఘముయొక్క దర్శనము వలె, మే=నాకు, చిరేప్సితః=చిరకాలమునుండి కోరబడిన, అయమ్=ఈ, పరాక్రమస్య కాలః=పరాక్రమమునకు కాలము, సంప్రాప్తః=వచ్చినది.

తా. వానరవీరులారా ! మీరు ఈ లక్ష్మణుని చుట్టూ నిలచి ఉండుడు.

ఇప్పుడు, పాపాత్ముడు, పాపనిశ్చయము కలవాడు అయిన రావణుని చంపు సమయము వచ్చినది. గ్రీష్మాంతమునందు చాతక పక్షికి అది కోరుకొనే మేఘదర్శనము అయినట్లు నేను చిరకాలమునుండి కోరుచున్న పరాక్రమప్రదర్శన కాలము వచ్చినది. 46, 47

**మూ.** అస్మిన్ ముహూర్తే నచిరాత్సత్యం ప్రతిశృణోమి వః, 48
అరావణమరామం వా జగద్ద్రక్ష్యథ వానరాః.

ప్ర. అ. వానరాః=వానరులారా ! అస్మిన్=ఈ, ముహూర్తే=ముహూర్తమునందు, వః=మీకు, సత్యమ్=సత్యముగా, ప్రతిశృణోమి=ప్రతిజ్ఞచేయుచున్నాను. జగత్=జగత్తును, అరావణమ్=రావణుడు లేని దానినిగా అయినను, అరామం వా=రాముడు లేనిదానినిగా నైనను, నచిరాత్=కొద్ది కాలములో, ద్రక్ష్యథ=చూడగలరు.

**తా.** వానరులారా ! ఈ ముహూర్తమునందు మీ ఎదుట సత్యముగా ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. మీరు అచిరకాలములో ఈ జగత్తునందు రావణుడో లేదా రాముడో లేకపోవుట చూడగలరు. 48

**మూ.** రాజ్యనాశం వనే వాసం దణ్డకే పరిధావనమ్, 49
వైదేహ్యాశ్చ పరామర్శం రక్షోభిశ్చ సమాగమమ్.

ప్ర. అ. రాజ్యనాశమ్=రాజ్యనాశమును, వనే=వనమునందు, వాసమ్=నివాసమును, దణ్డకే=దండకావనమునందు, పరిధావనమ్=ఇటూ అటూ పరుగులెత్తుటను, రక్షోభిః=రాక్షసులచేత, వైదేహ్యాః=సీతయొక్క, పరామర్శమ్=స్పర్శనమును, సమాగమమ్=పొందితిని.

**తా.** నాకు రాజ్యనాశము, వనవాసము, దండకావనములో తిరుగుట, రాక్షసులు సీతను అవమానించుట ఇవన్నీ కలిగినవి. 49

**మూ.** ప్రాప్తం దుఃఖం మహద్ఘోరం క్లేశశ్చ నిరయోపమః, 50
అద్య సర్వమహం త్యక్ష్యే విహత్వా రావణం రణే.

ప్ర. అ. మహత్=గొప్ప, ఘోరమ్=ఘోరమైన, దుఃఖమ్=దుఃఖము, ప్రాప్తమ్=పొందబడినది. నిరయోపమః=నరకముతో సమానమైన, క్లేశశ్చ=క్లేశము కూడ (పొందబడినది). అద్య=ఇప్పుడు, అహమ్=నేను, రణే=యుద్ధమునందు, రావణమ్=రావణుణ్ణి, నిహత్య=చంపి, సర్వమ్=ఆ క్లేశమునంతనూ, త్యక్ష్యే=విడువగలను.

**తా.** చాల ఘోరమైన దుఃఖమును పొందినాను. నరకమువంటి క్లేశమును అనుభవించినాను. ఇప్పుడు నేను యుద్ధములో రావణుణ్ణి సంహరించి దీని నంతనూ విడిచిపెట్టెదను. 50

మూ. యదర్థం వానరం సైన్యం సమానీతమిదం మయా, 51
సుగ్రీవశ్చ కృతో రాజ్యే నిహత్వా వాలినం రణే,
సో౽యమద్య రణే పాపశ్చక్షుర్విషయమాగతః 52

ప్ర. అ. యదర్థమ్=ఎవని నిమిత్తము, మయా=నాచేత, ఇదమ్=ఈ, వానరమ్=వానరులకు సంబంధించిన, సైన్యమ్=సైన్యము, సమానీతమ్=తీసికొని రాబడినదో, రణే=యుద్ధమునందు, వాలినమ్=వాలిని, నిహత్వా=చంపి, సుగ్రీవః చ=సుగ్రీవుడు, రాజ్యే=రాజ్యమునందు, కృతః=చేయబడినాడో, యదర్థమ్=ఎవని నిమిత్తమై, సాగరే=సాగరమునందు, సేతుః=సేతువు, బద్ధః=కట్టబడినదో, సాగరః=సముద్రము, క్రాన్తః=దాటబడినదో, సః=ఆ, అయం పాపః=ఈ పాపాత్ముడు, అద్య=ఇప్పుడు, రణే=యుద్ధమునందు, చక్షుర్విషయమ్=నేత్రవిషయమును, ఆగతః=పొందినాడు.

తా. ఎవని నిమిత్తమై నేను ఈ వానరసైన్యమును తీసికొనివచ్చినానో, వాలిని యుద్ధములో చంపి సుగ్రీవుణ్ణి రాజ్యమునందు అభిషిక్తుని చేసినానో, ఎవని నిమిత్తమై సాగరముపై సేతువు కట్టి సముద్రము దాటినానో అట్టి ఈ పాపాత్ముడు ఇప్పుడు నాకంట బడినాడు. 51, 52

మూ. చక్షుర్విషయమాగత్య నాయం జీవితుమర్హతి, 53
దృష్టిం దృష్టివిషస్యేవ సర్పస్య మమ రావణః.
యథా వా వైనతేయస్య దృష్టిం ప్రాప్తో భుజంగమః. 54

ప్ర. అ. అయం రావణః=ఈ రావణుడు, మమ=నాయొక్క, చక్షుర్విషయమ్=నేత్రవిషయమును, ఆగత్య=పొంది, దృష్టివిషస్య=దృష్టియందు విషము గల, సర్పస్య=సర్పము యొక్క, దృష్టిమ్ ఇవ=దృష్టిని పొంది వలె, వైనతేయస్య=గరుత్మంతునియొక్క, దృష్టిమ్=దృష్టిని, ప్రాప్తః=పొందిన, భుజంగమః యథా వా=సర్పము వలె, జీవితుమ్=జీవించుటకు, నార్హతి=తగడు.

తా. నా కంట బడిన ఈ రావణుడు చూపులో విషము ఉండే సర్పము దృష్టిలో పడినవాడు వలె, గరుత్మంతుని దృష్టిలో పడిన సర్పము వలె ఇంక జీవించజాలడు. 53, 54

మూ. స్వస్థాః పశ్యత దుర్ధర్షా యుద్ధం వానరపుంగవాః,
ఆసీనాః పర్వతాగ్రేషు మమేదం రావణస్య చ. 55

ప్ర. అ. దుర్ధర్షాః=ఎదిరింప శక్యము కాని, వానరపుంగవాః=వానరశ్రేష్ఠులారా, స్వస్థాః=స్వస్థులై, పర్వతాగ్రేషు=పర్వతాగ్రములయందు, ఆసీనాః=కూర్చున్నవారై, మమ=నాయొక్క, రావణస్య చ=రావణుని యొక్క, ఇదమ్=ఈ,

యుద్ధమ్=యుద్ధమును, పశ్యత=చూడండి.

తా. ఎదిరింపశక్యము కాని వానరవీరులారా ! మీరు స్వస్థచిత్తులై పర్వతశిఖరములమీద కూర్చుండి నేను రావణుడు చేయు యుద్ధమును చూడండి.

మూ. అద్య రామస్య రామత్వం పశ్యన్తు మమ సంయుగే,
త్రయో లోకాః సగన్ధర్వాః సదేవాః సర్షిచారణాః. 56

ప్ర. అ. అద్య=నేడు, మమ=నాయొక్క, సంయుగే=యుద్ధమునందు, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, సదేవాః=దేవతలతో కూడిన, సర్షిచారణాః= ఋషులతోను చారణులతోను కూడిన, త్రయః=మూడు, లోకాః=లోకములు, రామస్య=రామునియొక్క, రామత్వమ్=రామత్వమును, పశ్యన్తు=చూచెదరుగాక.

తా. ఈనాడు నేను చేయు యుద్ధమునందు రాముని రామత్వమును- రాము డెట్టివాడు అను విషయమును - గంధర్వ - దేవ - ఋషి - చారణాదులతో సహా మూడు లోకములవారూ చూచెదరుగాక. 56

మూ. అద్య కర్మ కరిష్యామి యల్లోకాః సచరాచరాః,
సదేవాః కథయిష్యన్తి యావద్భూమిర్ధరిష్యతి. 57
సమాగమ్య సదా లోకే యథా యుద్ధం ప్రవర్తితమ్.

ప్ర. అ. సచరాచరాః=చరాచరములతో కూడిన, సదేవాః=దేవతలతో కూడిన, లోకాః=లోకములు, యత్=దేనిని, భూమిః=భూమి, యావత్=ఎంతవరకు, ధరిష్యతి=నిలవగలదో అంతవరకు, కథయిష్యన్తి=చెప్పగలరో, కర్మ=అట్టి పనిని, అద్య=ఇప్పుడు, కరిష్యామి=చేసెదను. లోకే=లోకమునందు, సమాగమ్య=కలిసి, యుద్ధమ్=యుద్ధము, యథా=ఎట్లు, ప్రవర్తితమ్=చేయబడినదో(చెప్పకొందురో అట్లు చేసెదను.)

తా. ఈ భూమి నిలచి ఉన్నంతవరకు స్థావరజంగమములతోను,దేవతల తోను సహా ఈ లోకములు దేనిని గూర్చి చెప్పకొందురో, ఈ లోకములో అందరూ కలసి యుద్ధము ఎట్లు జరిగినదో అని దేనిని గూర్చి చెప్పకొందురో అట్టి పనిని నేడు చేసెదను. 57

మూ. ఏవముక్త్వా శితైర్బాణై స్తప్తకాఞ్చనభూషణైః, 58
అజఘాన రణే రామో దశగ్రీవం సమాహితః.

ప్ర. అ. రామః=రాముడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రణే=యుద్ధము నందు, సమాహితః=సావధానచిత్తుడై, తప్తకాఞ్చనభూషణైః=శుద్ధమైన బంగారు అలంకారములు గల, శితైః=వాడియైన, బాణైః=బాణములచేత, దశగ్రీవమ్=రావణుణ్ణి,

ఆజఘాన=కొట్టెను.

తా. రాముడు ఇట్లు పలికి, యుద్ధమునందు, సావధానచిత్తుడై శుద్ధమైన బంగారముచేత అలంకరింపబడిన వాడియైన బాణాలచేత రావణుణ్ణి కొట్టెను.58

మూ. అథ ప్రదీప్తైర్నారాచైర్ముసలైశ్చాపి రావణః, 59
అభ్యవర్షత్తదా రామం ధారాభిరివ తోయదః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణః=రావణుడు, ప్రదీప్తైః=ప్రకాశించుచున్న, నారాచైః=నారాచబాణములచేతను, ముసలైశ్చాపి =ముసలములచేతను, తదా=అప్పుడు, రామమ్=రాముణ్ణి,తోయదః=మేఘము, ధారాభిరివ=జలధారలచేత వలె, అభ్యవర్షత్=వర్షించెను.

తా. పిమ్మట రావణుడు ప్రకాశించుచున్న నారాచబాణములను, ముసలములను, మేఘము జలధారలు కురిపించి నట్లు, రామునిమీద కురిపించెను. 59

మూ. రామరావణముక్తానామన్యోన్యమభినిఘ్నతామ్, 60
శరాణాం చ శరాణాం చ బభూవ తుములః స్వనః.

ప్ర. అ. రామరావణముక్తానామ్=రామరావణులచేత విడవబడిన, శరాణాం చ=బాణాలూ, శరాణాం చ=బాణాలూ, అన్యోన్యమ్=పరస్పరము, అభినిఘ్నతామ్=కొట్టుకొనుచుండగా, తుములః=వ్యాకులమైన, స్వనః=ధ్వని, బభూవ=ఆయెను.

తా. రామరావణులు ప్రయోగించిన ఆ బాణాలూ, ఈ బాణాలూ పరస్పరము కొట్టుకొనుచుండగా అధికమైన ధ్వని కలిగెను. 60

మూ. విభిన్నాశ్చ వికీర్ణాశ్చ రామరావణయోః శరాః, 61
అన్తరిక్షాత్ప్రదీప్తాగ్రా నిపేతుర్ధరణీతలే.

ప్ర. అ. రామరావణయోః=రామరావణులయొక్క, శరాః=బాణములు, విభిన్నాశ్చ=విరగగొట్టబడినవై, వికీర్ణాశ్చ= చెల్లాచెదరు చేయబడినవై, ప్రదీప్తాగ్రాః=ప్రకాశించుచున్న అగ్రభాగములు కలవై, అన్తరిక్షాత్=ఆకాశమునుండి, ధరణీతలే=నేలమీద, నిపేతుః=పడినవి.

తా. రామరావణుల బాణములు విరిగిపోయి చెల్లాచెదరై ప్రకాశించుచున్న అగ్రభాగములతో ఆకాశమునుండి నేలమీద పడినవి. 61

మూ. తయోర్జ్యాతలనిర్ఘోషో రామరావణయోర్మహాన్, 62
త్రాసనః సర్వభూతానాం బభూవాద్భుతదర్శనః.

ప్ర. అ. తయోః=ఆ, రామరావణయోః=రామరావణులయొక్క, మహాన్=గొప్పదైన, జ్యాతలనిర్ఘోషః=నారియొక్క తలముయొక్క ధ్వని, సర్వభూతానామ్=సకలప్రాణులకు, త్రాసనః=భయము కలిగించేదిగాను, అద్భుతదర్శనః=అద్భుతమైన దర్శనము కలదిగాను,బభూవ=ఉండెను.

తా. ఆ రామరావణుల నారియొక్క, తలము (చేతికి కట్టిన చర్మ) యొక్క గొప్ప ధ్వని సకల ప్రాణులకు భయమును కలిగించుచు, చూచువారికి ఆశ్చర్యకరముగా ఉండెను. 62

మూ. వికీర్యమాణః శరజాలవృష్టిభి
ర్మహాత్మనా దీప్తధనుష్మతార్దితః,
భయాత్ప్రదుద్రావ సమేత్య రావణో
యథానిలేనాభిహతో బలాహకః. 63

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే శతతమః సర్గః.

ప్ర. అ. దీప్తధనుష్మతా=ప్రకాశించుచున్న ధనస్సు గల, మహాత్మనా=మహాత్ముడైన రామునిచేత, శరజాలవృష్టిభిః= బాణసముదాయవర్షములచేత, వికీర్యమాణః=చల్లబడుచున్న, రావణః=రావణుడు, సమేత్య=కలిసి, భయాత్=భయమువలన, అనిలేన=వాయువుచేత, అభిహతః=కొట్టబడిన, వలాహకః యథా=మేఘము వలె, ప్రదుద్రావ=పారిపోయెను.

తా. ప్రకాశించుచున్న ధనస్సు గల మహాత్ముడైన రాముడు బాణసముదాయవర్షములను కురిపించగా, రావణుడు తనవాళ్లతో కలిసి భయమువలన, గాలిచేత కొట్టబడిన మేఘమువలె, పారిపోయెను. 63

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూరవ సర్గ సమాప్తము.

# అథ ఏకాధికశతతమః సర్గః

[రాముడు విలపించుట, హనుమంతుడు తీసికొనివచ్చిన ఓషధిని సుషేణుడు ఇవ్వగా లక్ష్మణుడు మూర్ఛనుండి తేరికొనుట]

మూ. శక్త్యా నిపాతితం దృష్ట్వా రావణేన బలీయసా,
లక్ష్మణం సమరే శూరం శోణితౌఘపరిప్లుతమ్, 1
స దత్త్వా తుములం యుద్ధం రావణస్య దురాత్మనః,
విసృజన్నేవ బాణౌఘాన్ సుషేణమిదమబ్రవీత్. 2

ప్ర. అ. బలీయసా=బలవంతుడైన, రావణేన=రావణునిచేత, శక్త్యా=శక్తిచేత, నిపాతితమ్=పడగొట్టబడిన, సమరే=యుద్ధమునందు, శూరమ్=శూరుడైన, శోణితౌఘపరిప్లుతమ్=రక్తప్రవాహముచేత తడిసిన, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, దృష్ట్వా=చూచి, సః=రాముడు, దురాత్మనః=దురాత్ముడైన, రావణస్య=రావణునకు, తుములమ్=వ్యాకులమైన, యుద్ధమ్=యుద్ధమును, దత్త్వా=ఇచ్చి, బాణౌఘాన్=బాణాల సముదాయములను, విసృజన్నేవ=విడచుచున్న వాడగుచునే, సుషేణమ్=సుషేణుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. యుద్ధమునందు శూరుడైన లక్ష్మణుణ్ణి అధికబలవంతుడైన రావణుడు శక్తిచేత పడగొట్టగా రక్తప్రవాహముచేత తడిసిన ఆ లక్ష్మణుని చూచి రాముడు దురాత్ముడైన రావణునితో తీవ్రముగా యుద్ధముచేసి, బాణములను ప్రయోగించుచునే సుషేణునితో ఇట్లు పలికెను. 1, 2

మూ. ఏష రావణవీర్యేణ లక్ష్మణః పతితో భువి,
సర్పవచ్చేష్టతే వీరో భూమౌ శోకముదీరయన్. 3

ప్ర. అ. రావణవీర్యేణ=రావణుని పరాక్రమముచేత, భువి=నేలమీద, పతితః=పడిన, ఏషః=ఈ, వీరః=వీరుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, శోకమ్=దుఃఖమును, ఉదీరయన్=అధికముచేయుచు, సర్పవత్=సర్పమువలె, భూమౌ=నేలమీద, చేష్టతే=కొట్టుకొనుచున్నాడు.

తా. రావణుని పరాక్రమముచేత నేలమీద పడిపోయిన వీరుడైన ఈ లక్ష్మణుడు నా శోకమును వృద్ధి పొందించుచు, సర్పమువలె నేలమీద కొట్టుకొనుచున్నాడు. 3

మూ. శోణితార్ద్రిమిమం వీరం ప్రాణైః ప్రియతరం మమ,
పశ్యతో మమ కా శక్తిర్యోద్ధుం పర్యాకులాత్మనః. 4

ప్ర. అ. మమ=నాయొక్క, ప్రాణైః=ప్రాణములచేత, ప్రియతరమ్=మిక్కిలి ప్రియుడైన, శోణితార్ద్రిమ్=రక్తముచేత తడిసిన, ఇమమ్=ఈ, వీరమ్=వీరుణ్ణి, పశ్యతః=చూచుచున్న, పర్యాకులాత్మనః=వ్యాకులమైన మనస్సు గల, మమ=నాకు, యోద్ధుమ్=యుద్ధముచేయుటకు, శక్తిః=శక్తి, కా=ఏమి ?

తా. నాకు ప్రాణాలతో సమానముగా ఇష్టుడైన ఇతడు రక్తముతో తడిసి ఉండగా చూచుచున్న మనస్సు వ్యాకులముగా ఉన్న నాకు యుద్ధము చేయు శక్తి ఎక్కడిది ? 4

మూ. అయం స సమరశ్లాఘీ భ్రాతా మే శుభలక్షణః,
యది పఞ్చత్వమాపన్నః ప్రాణైర్మే కిం సుఖేన వా. 5

ప్ర. అ. సమరశ్లాఘీ=యుద్ధమునందు శ్లాఘ గల, శుభలక్షణః=శుభములైన లక్షణములు గల, సః=అట్టి, అయమ్=ఈ, మే=నాయొక్క, భ్రాతా=సోదరుడు, పఞ్చత్వమ్=మరణమును, ఆపన్నః యది=పొందినట్లయితే, మే=నాకు, ప్రాణైః=ప్రాణములచేత గాని, సుఖేన వా=సుఖముచేత గాని, కిమ్=ఏమిప్రయోజనము.

తా. యుద్ధములలో శ్లాఘాపాత్రుడు, శుభలక్షణములు గలవాడు అయిన అట్టి ఈ నా సోదరుడు మరణించినచో నాకు ప్రాణము లెందుకు, సుఖమెందుకు? 5

మూ. లజ్జతీవ చ మే వీర్యం భ్రశ్యతీవ కరాద్ధనుః,
సాయకా వ్యవసీదన్తి దృష్టిర్బాష్పవశం గతా. 6

ప్ర. అ. మే=నాయొక్క, వీర్యమ్=పరాక్రమము, లజ్జతీవ=సిగ్గుపడుచున్నట్లు ఉన్నది. ధనుః=ధనస్సు, కరాత్=చేతినుండి, భ్రశ్యతీవ=జారిపోవుచున్నట్లున్నది. సాయకాః=బాణములు, వ్యవసీదన్తి=దుర్బలము లగుచున్నవి. దృష్టిః=దృష్టి, బాష్పవశమ్=బాష్పవశమును, గతా=పొందినది.

తా. నా పరాక్రమము సిగ్గుపడుచున్నట్లున్నది. చేతిలోనుండి ధనస్సు జారిపోవుచున్నట్లున్నది. బాణములు దుర్బలము లగుచున్నవి. చూపు కన్నీటికి లొంగిపోవుచున్నది. 6

మూ. అవసీదన్తి గాత్రాణి స్వప్నయానే నృణామివ,
చిన్తా మే వర్తతే తీవ్రా ముమూర్షాపి చ జాయతే. 7

ప్ర. అ. స్వప్నయానే=స్వప్నమునందు నడచునపుడు, నృణామివ=మానవుల

అవయవములు వలె, గాత్రాణి=అవయవములు, అవసీదన్తి=దుర్బలము లగుచున్నవి. మే=నాకు, చిన్తా=చింత, తీవ్రా=తీవ్రముగా, వర్తతే=ఉన్నది. ముమూర్షాపి చ=మరణించవలె నను ఇచ్ఛకూడ, జాయతే=పుట్టుచున్నది.

తా. స్వప్నములో నడచేవారి అవయవములు సరిగా పనిచేయ నట్లు నా అవయవములు దుర్బలము లగుచున్నవి. నాకు చింత చాల తీవ్రముగా ఉన్నది. మరణించవలె నను కోరిక గూడ కలుగుచున్నది. 7

మూ. భ్రాతరం నిహతం దృష్ట్వా రావణేన దురాత్మనా,
విష్టనన్తం తు దుఃఖార్తం మర్మణ్యభిహతం భృశమ్. 8

ప్ర. అ. దురాత్మనా=దురాత్ముడైన, రావణేన=రావణునిచేత, నిహతమ్=కొట్టబడిన, విష్టనన్తమ్=మూలుగుచున్న, దుఃఖార్తమ్=దుఃఖపీడితుడైన, భృశమ్=మిక్కిలి, మర్మణి=మర్మప్రదేశమునందు, అభిహతమ్=కొట్టబడిన, భ్రాతరమ్=నా సోదరుణ్ణి, దృష్ట్వా=చూచి (నా అవయవములు దుర్బలము లగుచున్నవి-ఇత్యాది పూర్వశ్లోకార్థముతో అన్వయము).

తా. నా సోదరుడు దురాత్ముడైన రావణునిచేత కొట్టబడి దుఃఖార్తుడై మూలుగు చున్నాడు. ఎక్కువగా మర్మస్థానమునందు కొట్టబడినాడు. 8

మూ. రాఘవో భ్రాతరం దృష్ట్వా ప్రియం ప్రాణం బహిశ్చరమ్,
దుఃఖేన మహతావిష్టో ధ్యానశోకపరాయణః. 9

ప్ర. అ. రాఘవః=రాముడు, బహిశ్చరమ్=బైటసంచరించుచున్న, ప్రియమ్=ప్రియమైన, ప్రాణమ్=ప్రాణమైన, భ్రాతరమ్=సోదరుణ్ణి, దృష్ట్వా=చూచి, మహతా=గొప్ప, దుఃఖేన=దుఃఖముచేత, ఆవిష్టః=ఆవిష్టుడై, ధ్యానశోకపరాయణః=ధ్యానశోకములకు అధీను డాయెను.

తా. బైట సంచరించు ప్రియమైన ప్రాణమైన సోదరుణ్ణి చూచి రాముడు గొప్ప దుఃఖముతో కూడి ధ్యానశోకములకు అధీను డాయెను. 9

మూ. పరం విషాదమాపన్నో విలలాపాకులేన్ద్రియః,
భ్రాతరం నిహతం దృష్ట్వా లక్ష్మణం రణపాంసుషు. 10

ప్ర. అ. నిహతమ్=కొట్టబడిన, భ్రాతరమ్=సోదరుడైన, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, రణపాంసుషు=యుద్ధభూమిపరాగములందు, దృష్ట్వా=చూచి, పరమ్=అధికమైన, విషాదమ్=దుఃఖమును, ఆపన్నః=పొందినవాడై, ఆకులేన్ద్రియః=వ్యాకులములైన ఇంద్రియములు కలవాడై, విలలాప=విలపించెను.

తా. సోదరుడైన లక్ష్మణుడు కొట్టబడి రణభూమియందలి పరాగములో

పడియుండుట చూచి రాముడు చాల దుఃఖించుచు, వ్యాకులములైన ఇంద్రియములతో విలపించెను. 10

మూ. విజయోఽపి హి మే శూర న ప్రియాయోపకల్పతే,
అచక్షుర్విషయశ్చన్ద్రః కాం ప్రీతిం జనయిష్యతి. 11

ప్ర. అ. శూర=ఓ ! శూరుడా ! విజయోపి=విజయము కూడ, మే=నాకు, ప్రియాయ=ప్రియముకొరకు, న ఉపకల్పతే=ఉపకరించునది కాదు. అచక్షుర్విషయః= కంటికి విషయము కాని, చన్ద్రః చంద్రుడు, కామ్=ఏ, ప్రీతిమ్=సంతోషమును, జనయిష్యతి=కలిగించును ?

తా. శూరుడా! నాకు విజయము లభించినను సంతోషమును కలిగించజాలదు.కంటికి కలబడని చంద్రుడు ఏమి సంతోషమును కలిగించును? 11

మూ. కిం మే యుద్ధేన కిం ప్రాణైర్యుద్ధకార్యం న విద్యతే,
యత్రాయం నిహతః శేతే రణమూర్ధని లక్ష్మణః. 12

ప్ర. అ. మే=నాకు, యుద్ధేన=యుద్ధముచేత, కిమ్=ఏమి ప్రయోజనము? ప్రాణైః=ప్రాణములచేత, కిమ్=ఏమి ప్రయోజనము? అయం లక్ష్మణః=ఈ లక్ష్మణుడు, రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, నిహతః=చంపబడిన వాడై, యత్ర=ఏ కారణమువలన, శేతే=శయనించి యున్నాడో, ఆ కారణమువలన, యుద్ధకార్యమ్=యుద్ధముచేత ప్రయోజనము, న విద్యతే=లేదు.

తా. నాకు యుద్ధమెందుకు? ఈ ప్రాణము లెందుకు? లక్ష్మణుడు చఠపబడి రణభూమియందు శయనించినప్పుడు ఇంక యుద్ధమువలన ఏమి ప్రయోజనము? 12

మూ. యథైవ మాం వనం యాన్తమనుయాతి మహాద్యుతిః,
అహమప్యుపయాస్యామి తథైవైనం యమక్షయమ్. 13

[ఈ శ్లోకము మొదలు పన్నెండు శ్లోకములు కొన్ని ప్రతులలో లేవు. గోవిందరాజాదుల వ్యాఖ్యలు కూడ లేవు.]

ప్ర. అ. మహాద్యుతిః=గొప్పకాంతిగల లక్ష్మణుడు, వనమ్=వనమునుగూర్చి, యాన్తమ్=వెళ్లుచున్న, మామ్=నన్ను, యథైవ=ఎట్లు, అనుయాతి=అనుసరించి వెళ్లెనో, అహమపి=నేనుకూడ, తథైవ=అట్లే, ఏనమ్=వీనిని, యమక్షయమ్=యమలోకమును గూర్చి, ఉపయాస్యామి=అనుసరించి వెళ్లెదను.

తా. మహాకాంతిమంతుడైన ఈ లక్ష్మణుడు వనమునకు వెళ్లుచున్నప్పుడు

నా వెనుకనే వచ్చినట్లే నేను కూడ ఈతని వెనుక యమలోకమునకు వెళ్లెదను.

మూ. ఇష్టబన్ధుజనో నిత్యం మాం స నిత్యమనువ్రతః,
ఇమామవస్థాం గమితో రాక్షసైః కూటయోధిభిః. 14

ప్ర. అ. ఇష్టబన్ధుజనః=ఇష్టమైన బంధుజనము గల, నిత్యమ్=నిత్యమూ, మామ్=నన్ను, అనువ్రతః=అనుసరించిన వ్రతము గల, సః=లక్ష్మణుడు, కూటయోధిభిః=కపటయుద్ధముచేయు, రాక్షసైః=రాక్షసులచేత, ఇమామ్=ఈ, అవస్థామ్=అవస్థను,గమితః=పొందింపబడినాడు.

తా. బంధుజనులయందు ప్రేమ గలవాడు, ఎల్లప్పుడు నన్ను అనుసరించుటయే నియమముగా గలవాడూ అయిన ఈ లక్ష్మణునకు కపటయుద్ధము చేయు శత్రువులు ఇట్టి అవస్థ కలిగించినారు. 14

మూ. దేశే దేశే కలత్రాణి దేశే దేశే చ బాన్ధవాః,
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః. 15

ప్ర. అ. దేశే దేశే=ప్రతిదేశమునందూ, కలత్రాణి=భార్యలు లభింతురు. దేశే దేశే చ=ప్రతిదేశమునందు, బాన్ధవాః=బంధువులు లభింతురు. సహోదరః=సమానోదరము నుండి పుట్టిన, భ్రాతా=భ్రాత, యత్ర=ఏ దేశమునందు లభించునో, తమ్=అట్టి, దేశం తు=దేశము నైతే, న పశ్యామి=చూడను

తా. ప్రతిదేశములోను భార్యలు దొరుకుదురు. ప్రతిదేశములోను బంధువులు దొరుకుదురు. కాని సమానోదరుడైన భ్రాత లభించు దేశ మేదీ కనబడదు. 15

మూ. ఇత్యేవం విలపన్తం తం శోకవిహ్వలితేన్ద్రియమ్,
వివేష్టమానం కరుణముచ్ఛ్వసన్తం పునః పునః. 16

ప్ర. అ. ఇత్యేవమ్=ఇట్లు, విలపన్తమ్=విలపించుచున్న, శోకవిహ్వలితేన్ద్రియమ్=శోకముచేత వ్యాకులములుగా చేయబడిన ఇంద్రియములు కలుగునట్లుగా, వివేష్టమానమ్=చుట్టుకొనిపోవుచున్న, పునః పునః=మాటి మాటికి, కరుణమ్=దీనముగా, ఉచ్ఛ్వసన్తమ్=నిట్టూర్చుచున్న, తమ్=ఆ రాముణ్ణి, (వానరులు చూచిరి).

తా. రాముడీ విధముగా దుఃఖముచేత వ్యాకులములైన ఇంద్రియములతో ఇటూ అటూ తిరిగి పోవుచు మాటిమాటికి దీనముగా నిట్టూర్చుచు విలపించుచుండెను. 16

మూ. కిం ను రాజ్యేన దుర్ధర్షలక్ష్మణేన వినా మమ,
కథం వక్ష్యామ్యహం త్వమ్బాం సుమిత్రాం పుత్రవత్సలామ్. 17

ప్ర. అ. దుర్ధర్షలక్ష్మణేన వినా=ఎదిరింపశక్యము కాని లక్ష్మణుడు లేకుండగా, మమ=నాకు, రాజ్యేన=రాజ్యముచేత, కిం ను=ఏమి ప్రయోజనము? పుత్రవత్సలామ్=పుత్రునియందు ప్రేమ గల, అమ్బామ్=తల్లియైన, సుమిత్రామ్=సుమిత్రను గూర్చి, అహమ్=నేను, కిం ను వక్ష్యామి=ఏమి చెప్పుదును?

తా. ఎదిరింప శక్యము కాని వీరుడైన లక్ష్మణుడు లేకుండగా నాకు రాజ్యము ఎందుకు? పుత్రునియందు ప్రేమ గల తల్లియైన సుమిత్రకు నేను ఏమి చెప్పగలను ? 17

మూ. ఉపాలమ్భం న శక్ష్యామి సోఢుం దత్తం సుమిత్రయా,
కిం ను వక్ష్యామి కౌసల్యాం మాతరం కిం ను కైకయీమ్. 18

ప్ర. అ. సుమిత్రయా=సుమిత్రచేత, దత్తమ్=ఇవ్వబడిన, ఉపాలమ్భమ్=నిందను, సోఢుమ్=సహించుటకు, న శక్ష్యామి=సమర్థుడను కాజాలను. మాతరమ్=తల్లియైన, కౌసల్యామ్=కౌసల్యను గూర్చి, కిం ను వక్ష్యామి=ఏమి చెప్పుదును? కైకయీమ్=కైకేయిని గూర్చి, కిం ను=ఏమి చెప్పుదును?

తా. సుమిత్ర చేయు నిందను ఎట్లు సహించగలను? తల్లులైన కౌసల్యతోను, కైకేయితోను ఏమి చెప్పుదును? 18

మూ. భరతం కిం ను వక్ష్యామి శత్రుఘ్నం చ మహాబలమ్,
సహ తేన వనం యాతో వినా తేనాగతః కథమ్. 19

ప్ర. అ. తేన సహ=వానితో కూడ, వనమ్=వనమును గూర్చి, యాతః=వెళ్లినావు, తేన వినా=ఆతడు లేకుండగా, కథమ్=ఎట్లు, ఆగతః=వచ్చినావు అని ప్రశ్నించు, భరతమ్=భరతుని గూర్చి, మహాబలమ్=గొప్ప బలము గల, శత్రుఘ్నం చ=శత్రుఘ్నుని గూర్చి, కిం ను =ఏమి, వక్ష్యామి=చెప్పెదను?

తా. లక్ష్మణునితో కలిసి వనమునకు వెళ్లిన నీవు ఆతడు లేకుండా ఎట్లు వచ్చినావు? అని ప్రశ్నించు భరతునికీ మహాబలవంతుడైన శత్రుఘ్నునికీ ఏమి చెప్పగలను? 19

మూ. ఇహైవ మరణం శ్రేయో న తు బన్ధువిగర్హణమ్,
కిం మయా దుష్కృతం కర్మ కృతమన్యత్ర జన్మని, 20
యేన మే ధార్మికో భ్రాతా విహతశ్చాగ్రతః స్థితః.

ప్ర. అ. ఇహైవ=ఇక్కడనే, మరణమ్=మరణము, శ్రేయః= శ్రేయస్కరము,

తు=కాని, బన్ధువిగర్హణమ్=బంధువుల నింద, న=కాదు. యేన=దేనిచేత, ధార్మికః=ధర్మాత్ముడైన, మే=నాయొక్క, భ్రాతా=సోదరుడు, నిహతః=చంపబడినవాడై, అగ్రతః=ఎదుట, స్థితః=ఉన్నాడో, అట్టి, కిమ్=ఏ, దుష్కృతం కర్మ=పాపకర్మ, మయా=నాచేత, అన్యత్ర జన్మని=మరియొక జన్మయందు, కృతమ్=చేయబడినదో.

తా. బంధువులచేత నిందలు పడుటకంటె ఇక్కడనే మరణించుట మేలు. ధర్మాత్ముడైన నా సోదరుడు ఈ విధముగా చంపబడి నా యెదుట పడి ఉండుటకు నేను పూర్వజన్మంలో ఏమి పాపము చేసితినో కదా. 20

మూ. హా భ్రాతర్మనుజశ్రేష్ఠ శూరాణాం ప్రవర ప్రభో, 21
ఏకాకీ కిం ను మాం త్యక్త్వా పరలోకాయ గచ్ఛసి.

ప్ర. అ. హా=అయ్యో !, భ్రాతః=సోదరుడా, మనుజశ్రేష్ఠ=మనుజులలో శ్రేష్ఠుడా! శూరాణామ్=శూరులలో, ప్రవర=శ్రేష్ఠుడా ! ప్రభో=ప్రభూ ! మామ్=నన్ను, త్యక్త్వా=విడచి, ఏకాకీ=ఒంటరివాడవై, కిం ను=ఎందువలన, పరలోకాయ=పరలోకమునకు, గచ్ఛసి=వెళ్లుచున్నావు?

తా. అయ్యో ! మానవులలో శ్రేష్ఠుడవు, శూరులలో గొప్పవాడవు, సమర్థుడవూ అయిన ఓ ! సోదరుడా ! నన్ను విడచి నీవు ఒంటరిగా పరలోకమునకు ఎందుకు వెళ్లుచున్నావు? 21

మూ. విలపన్తం చ మాం భ్రాతః కిమర్థం నావభాషసే, 22
ఉత్తిష్ఠ పశ్య కిం శేషే దీనం మాం పశ్య చక్షుషా.

ప్ర. అ. భ్రాతః=సోదరుడా, విలపన్తమ్=విలపించుచున్న, మామ్=నన్ను గూర్చి, కిమ్=ఎందువలన, నావభాషసే=పలుకుటలేదు? ఉత్తిష్ఠ=లెమ్ము, పశ్య=చూడుము, కిమ్=ఎందువలన, శేషే=శయనించి ఉన్నావు. దీనమ్=దీనుడనైన, మామ్=నన్ను, చక్షుషా=నేత్రములో, పశ్య=చూడుము.

తా. సోదరుడా! విలపించుచున్న నాతో ఎందుకు మాటలాడవు? లెమ్ము; చూడుము; ఎందుకు శయనించి ఉన్నావు? దీనుడనైన నన్ను కళ్లు విప్పి చూడుము. 22

మూ. శోకార్తస్య ప్రమత్తస్య పర్వతేషు వనేషు చ, 23
విషణ్ణస్య మహాబాహో సమాశ్వాసయితా మమ.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా, పర్వతేషు=పర్వతములయందు, వనేషు చ=వనములయందు, శోకార్తస్య=శోకముచేత పీడింపబడి, ప్రమత్తస్య=ఏమరిపాటుతో ఉన్న, విషణ్ణస్య=దిగులుచెందిన, మమ=నాకు (నన్ను),

సమాశ్వాసయితా=ఊరడించువాడవుకదా?

తా. ఓ! మహాబాహూ ! నేను పర్వతాలమీదా అరణ్యాలలోను శోకార్తుడనై ఏమరిపాటు చెంది, దిగులు చెంది ఉన్నప్పుడు నీవు ఓదార్చేవాడవు కదా? 23

మూ. రామమేవం బ్రువాణం తు శోకవ్యాకులితేన్ద్రియమ్, 24
ఆశ్వాసయన్నువాచేదం సుషేణః పరమం వచః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, శోకవ్యాకులితేన్ద్రియమ్=శోకముచేత వ్యాకులములుగా చేయబడిన ఇంద్రియములు గల, రామమ్=రాముణ్ణి, ఆశ్వాసయన్=ఓదార్చుచు, సుషేణః=సుషేణుడు, పరమమ్=గొప్ప, ఇదమ్=ఈ, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. శోకముచేత ఇంద్రియములు వ్యాకులములు కాగా ఇట్లు పలుకుచున్న రాముణ్ణి ఓదార్చుచు సుషేణుడు ఉత్తమమైన వాక్యమును ఇట్లు పలికెను.

వి. ఈ ఘట్టములోని చాలా శ్లోకాలు కొన్ని ప్రతులలో లేవు. రాముడు సామాన్యమానవుడుగా ప్రవర్తించెనని చెప్పడానికై కొందరు ఈ ఘట్టంలోను, సీతాహరణ ఘట్టంలోను రాముడు అతిగా విలపించి నట్లు వర్ణించుచు చాలా శ్లోకాలు చేర్చి ఉందురు. ఇది రాముని ధీరోదాత్తత్వానికి భంగకరంగా ఉన్నది. ఇట్టి కల్పనలు అనావశ్యకములు. పై శ్లోకములు కొన్ని ప్రతులలో లేవని వెనుక చూచి ఉన్నాము. అందుచేత ఈ శ్లోకం ఉత్తరార్ధములో " రామమాశ్వాసయన్వీరః సుషేణో వాక్యమబ్రవీత్ " అను పాఠమున్నది. పూర్వార్థం లేని పక్షంలో ఈ పాఠమే గ్రహించవలసి ఉంటుంది. రాబోవు శ్లోకం కూడ కొన్ని ప్రతులలో లేదు. 24

మూ. త్యజేమాం నరశార్దూల బుద్ధిం వైక్లబ్యకారిణీమ్, 25
శోకసంజననీం చిన్తాం తుల్యాం బాణైశ్చమూముఖే.

ప్ర. అ. నరశార్దూల=నరశ్రేష్ఠుడా, వైక్లబ్యకారిణీమ్=మనోవ్యాకులత్వమును కలిగించు, బుద్ధిమ్=బుద్ధిని, శోకసంజననీమ్=శోకమును కలిగించు, చమూముఖే=సేనాగ్రమునందు, బాణైః=బాణములతో, తుల్యామ్=సమానమైన, ఇమాం చిన్తామ్=ఈ చింతను, త్యజ=విడువుము.

తా. నరశ్రేష్ఠుడవైన రామా ! వ్యాకులత్వమును కలిగించు ఈ బుద్ధిని, సేనాగ్రమునందలి బాణముల వంటి, శోకహేతువైన చింతను విడువుము. 25

మూ. నైవ పఞ్చత్వమాపన్నో లక్ష్మణో లక్ష్మివర్ధనః, 26
న హ్యస్య వికృతం వక్త్రం న చ శ్యామత్వమాగతమ్.

ప్ర. అ. లక్ష్మివర్ధనః=లక్ష్మిని వృద్ధి పొందించు, లక్ష్మణః=లక్ష్మణుడు, పఞ్చత్వమ్=మరణమును, నైన ఆపన్నః=పొందలేదు. అస్య=ఈతనియొక్క, వక్త్రమ్=ముఖము, న వికృతం హి=వికారము చెందలేదు కదా? శ్యామత్వం చ=నలుపు కూడ, నాగతమ్=రాలేదు.

తా. లక్ష్మివర్ధకుడైన లక్ష్మణుడు మరణము పొందలేదు. ఎందుచేత ననగా ఈతని ముఖములో వికారము లేదు. శరీరమునందు నలుపు కూడ రాలేదు. 26

మూ. సుప్రభం సుప్రసన్నం చ ముఖమస్య నిరీక్ష్యతామ్, 27
పద్మపత్రతలౌ హస్తౌ సుప్రసన్నే చ లోచనే.

ప్ర. అ. సుప్రభమ్=మంచి కాంతి గల, సుప్రసన్నం చ=బాగా ప్రసన్నమైన, అస్య=ఈతనియొక్క, ముఖమ్=ముఖము, నిరీక్ష్యతామ్=చూడబడుగాక. హస్తౌ=చేతులు, పద్మపత్రతలౌ=పద్మము రేకులవంటి అరచేతులు గలవి. లోచనే చ=నేత్రములు కూడ, సుప్రసన్నే=బాగా ప్రసన్నములుగా ఉన్నవి.

తా. ఈతని ముఖము మంచి కాంతితో చాల ప్రసన్నముగా ఉన్నది. అరచేతులు పద్మముల రేకుల వలె ఉన్నవి. నేత్రములు కూడ చాల ప్రసన్నములుగా ఉన్నవి. 27

మూ. నేదృశం దృశ్యతే రూపం గతాసూనాం విశాం పతే, 28
విషాదం మా కృథా వీర సప్రాణోఽయమరిందమ.

ప్ర. అ. విశాం పతే=రాజా ! గతాసూనామ్=పోయిన ప్రాణములు గలవారియొక్క, రూపమ్=రూపము, ఈదృశమ్=ఈ విధముగా, న దృశ్యతే=చూడబడదు. వీర=వీరుడా ! అరిందమ=శత్రుసంహారకుడా! అయమ్=ఇతడు, సప్రాణః=ప్రాణములతో కూడినవాడు. విషాదమ్=దుఃఖమును, మా కృథాః=చేయకుము.

తా. రాజా ! మరణించినవారి రూపము ఈ విధముగా ఉండదు. ఓ! శత్రుసంహారకుడవైన వీరుడా ! ఇతడు ప్రాణములతో ఉన్నాడు, దిగులు చెందకుము. 28

మూ. ఆఖ్యాతి తు ప్రసుప్తస్య స్రస్తగాత్రస్య భూతలే, 29
సోచ్ఛ్వాసం హృదయం వీర కమ్పమానం ముహుర్ముహుః.

ప్ర. అ. వీర=వీరుడా ! ప్రసుప్తస్య=నిద్రపోవుచున్న, భూతలే=నేలమీద, స్రస్తగాత్రస్య=జారవిడవబడిన అవయవములు గల ఇతనియొక్క, సోచ్ఛ్వాసమ్=శ్వాసతో కూడిన, ముహుర్ముహుః=మాటిమాటికి, కమ్పమానమ్=కంపించుచున్న,

హృదయమ్=హృదయము, ఆఖ్యాతి=చెప్పుచున్నది.

తా. అవయవములను నేలమీద జారవిడచి నిద్రపోవుచున్న ఈతని హృదయము శ్వాసతో కూడినదై మాటిమాటికి కదలుచున్నది. అట్టి హృదయమే ఇతడు మరణించలేదని చెప్పుచున్నది. 29

మూ. ఏవముక్త్వా మహాప్రాజ్ఞః సుషేణో రాఘవం వచః, 30
సమీపస్థమువాచేదం హనూమన్తం మహాకపిమ్.

ప్ర. అ. మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధి గల, సుషేణః=సుషేణుడు, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, ఏవమ్=ఇట్లు, వచః=వచనమును, ఉక్త్వా=పలికి, సమీపస్థమ్=సమీపమునందున్న, మహాకపిమ్=మహావానరుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. గొప్ప బుద్ధి గల సుషేణుడు రామునితో ఇట్లు పలికి సమీపమునందే ఉన్న మహావానరుడైన హనుమంతునితో ఇట్లు పలికెను. 30

మూ. సౌమ్య శీఘ్రమితో గత్వా శైలమౌషధిపర్వతమ్, 31
పూర్వం తు కథితో యోఽసౌ వీర జామ్బవతా తవ,
దక్షిణే శిఖరే జాతాం మహౌషధిమిహానయ. 32
విశల్యకరణీం నామ్నా సావర్ణ్యకరణీం తథా,
సంజీవకరణీం వీర సంధానీం చ మహౌషధీమ్, 33
సంజీవనార్థం వీరస్య లక్ష్మణస్య మహాత్మనః.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! వీర=వీరుడా! యః అసౌ=ఏ పర్వతము, పూర్వమ్=పూర్వము, జామ్బవతా=జాంబవంతునిచేత, తవ=నీకు, కథితః=చెప్పబడినదో, ఆ, ఔషధిపర్వతమ్=ఔషధిపర్వత మను, శైలమ్=పర్వతమును గూర్చి, ఇతః=ఇక్కడి నుండి, శీఘ్రమ్=శీఘ్రముగా, గత్వా=వెళ్లి, దక్షిణే శిఖరే=దక్షిణశిఖరమునందు, జాతామ్=పుట్టిన, నామ్నా=పేరుచేత, విశల్యకరణీమ్=విశల్యకరణి అను (శల్యములు శరీరమునుండి పోవు నట్లు చేయునది), మహౌషధిమ్=మహౌషధిని, తథా=మరియు, సావర్ణ్యకరణీమ్=సావర్ణ్యకరణిని (మామూలు రంగు ఇచ్చునది), సంజీవకరణీమ్=సంజీవకరణిని, సంధానీం చ=సంధాని (అతుకునది) అను, మహౌషధీమ్=మహౌషధిని, మహాత్మనః=మహాత్ముడు, వీరస్య=వీరుడు ఐన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, సంజీవనార్థమ్=జీవింపచేయుటకొరకు, ఇహ=ఇక్కడికి, ఆనయ=తీసికొనిరమ్ము.

తా. సౌమ్యుడవైన ఓ వీరుడా ! పూర్వము నీకు జాంబవంతుడు చెప్పిన ఔషధిపర్వత మను పర్వతమునకు శీఘ్రముగా వెళ్లి, దాని దక్షిణశిఖర

మునందు మొలచిన విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధాని అను మహౌషధులను మహాత్ముడూ వీరుడూ అయిన లక్ష్మణుణ్ణి జీవింపచేయుటకు ఇక్కడికి తీసికొనిరమ్ము. 31-33

మూ. ఇత్యేవముక్తో హనుమాన్గత్వా చౌషధిపర్వతమ్, 34
చిన్తామభ్యగమచ్ఛ్రీమానజానంస్తా మహౌషధీః.

ప్ర. అ. ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, శ్రీమాన్=శ్రీమంతుడైన, హనుమాన్=హనుమంతుడు, ఔషధిపర్వతమ్=ఔషధిపర్వతమును గూర్చి, గత్వా=వెళ్లి, తాః=ఆ, మహౌషధీః=గొప్ప ఓషధులను, అజానన్=గుర్తుపట్టనివాడై, చిన్తామ్=చింతను, అభ్యగమత్=పొందెను.

తా. శ్రీమంతుడైన హనుమంతుడు ఆ మాట విని, ఔషధి పర్వతమునకు వెళ్లి అక్కడ ఆ గొప్ప ఓషధులను గుర్తుపట్టజాలక చింతించెను. 34

మూ. తస్య బుద్ధిః సముత్పన్నా మారుతేరమితౌజసః, 35
ఇదమేవ గమిష్యామి గృహీత్వా శిఖరం గిరేః.

ప్ర. అ. అమితౌజసః=అపరమితమైన తేజస్సు గల, తస్య మారుతేః=ఆ హనుమంతునకు, బుద్ధిః=బుద్ధి, సముత్పన్నా=పుట్టినది. గిరేః=పర్వతముయొక్క, ఇదమ్=ఈ, శిఖరమేవ=శిఖరమునే, గృహీత్వా=గ్రహించి, గమిష్యామి=వెళ్లగలను.

తా. అమితమైన తేజస్సు గల ఆ హనుమంతునకు " ఈ పర్వతశిఖరమునే తీసికొని వెళ్లెదను " అను ఆలోచన కలిగెను. 35

మూ. అస్మింస్తు శిఖరే జాతామోషధిం తాం సుఖావహామ్, 36
ప్రతర్కేణావగచ్ఛామి సుషేణో హ్యేవమబ్రవీత్.

ప్ర. అ. సుఖావహామ్=సుఖమును కలిగించు, తామ్=ఆ, ఓషధిమ్=ఓషధిని, అస్మిన్=ఈ, శిఖరే=శిఖరమునందు, జాతామ్=పుట్టినదానినిగా, ప్రతర్కేణ=ఊహచేత, అవగచ్ఛామి=తెలుసుకొనుచున్నాను. సుషేణః=సుషేణుడు, ఏవమ్=ఇట్లు, అబ్రవీత్ హి=చెప్పినాడు కదా?

తా. సుఖకరమైన ఆ ఓషధి ఈ శిఖరమునందే మొలచి ఉండు నని ఊహించుచున్నాను. సుషేణుడు అట్లే చెప్పినాడు కదా? 36

మూ. అగృహ్య యది గచ్ఛామి విశల్యకరణీమహమ్, 37
కాలాత్యయేన దోషః స్యాద్వైక్లబ్యం చ మహద్భవేత్.

ప్ర. అ. అహమ్=నేను, విశల్యకరణీమ్=విశల్యకరణిని, అగృహ్య=గ్రహించ

కుండా, గచ్ఛామి యది=వెళ్లినట్లయితే, కాలాత్యయేన=కాలము గడచిపోవుటచేత, దోషః=దోషము, స్యాత్=అగును. మహత్=గొప్ప, వైక్లబ్యం చ=దుఃఖము కూడ, భవేత్=అగును.

తా. నేను విశల్యకరణిని గ్రహించకుండా వెళ్లినచో కాలము గడచిపోయి ఆలస్య మగుటచేత గొప్ప దోషము కలుగును. అది దుఃఖానికి దారి తీయును.

మూ. ఇతి సంచిన్త్య హనుమాన్ గత్వా క్షిప్రం మహాబలః, 38
ఆసాద్య పర్వతశ్రేష్ఠం త్రిః ప్రకమ్ప్య గిరేః శిరః,
ఫుల్లనానాతరుగణం సముత్పాట్య మహాబలః, 39
గృహీత్వా హరిశార్దూలో హస్తాభ్యాం సమతోలయత్.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, హరిశార్దూలః=వానర శ్రేష్ఠుడైన, హనుమాన్=హనుమంతుడు, ఇతి=ఇట్లు,సంచిన్త్య=ఆలోచించి, క్షిప్రమ్=శీఘ్రముగా, గత్వా=వెళ్లి, పర్వతశ్రేష్ఠమ్=ఆ గిరిశ్రేష్ఠమును, ఆసాద్య=సమీపించి, గిరేః=పర్వతము యొక్క, శిఖరం=శిఖరమును, హస్తాభ్యామ్=హస్తములచేత, గృహీత్వా=గ్రహించి, త్రిః=మూడు సార్లు, ప్రకమ్ప్య=ఊపి, ఫుల్లనానాతరుగణమ్=వికసించిన అనేకవిధములైన వృక్షసముదాయములు గల దానిని, సముత్పాట్య=పెకలించి, మహాబలః=మహాబలము గల అతడు, సమతోలయత్=పైకి ఎత్తెను.

తా. గొప్ప బలము గల వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు ఈ విధముగా ఆలోచించి, శీఘ్రముగా వెళ్లి, ఆ పర్వతమును సమీపించి, దాని శిఖరమును హస్తములతో పట్టుకొని, మూడు సార్లు ఊపి, పుష్పించిన అనేక విధములైన వృక్షములు గల దానిని పెకలించి, పైకి ఎత్తెను. 38, 39

మూ. స నీలమివ జీమూతం తోయపూర్ణం నభస్తలాత్, 40
ఉత్పపాత గృహీత్వా తు హనూమాన్ శిఖరం గిరేః.

ప్ర. అ. సః హనూమాన్=ఆ హనుమంతుడు, తోయపూర్ణమ్=నీటితో నిండిన, నీలమ్=నల్లని, జీమూతమ్ ఇవ=మేఘము వలె ఉన్న, గిరేః శిఖరమ్=పర్వతముయొక్క శిఖరమును, గృహీత్వా=గ్రహించి, నభస్తలాత్=ఆకాశమునుండి, ఉత్పపాత=ఎగిరెను.

తా. హనుమంతుడు నీటితో నిండిన నీలమేఘమువలె ఉన్న ఆ పర్వత శిఖరమును గ్రహించి ఆకాశమార్గమునందు ఎగిరెను. 40

మూ. సమాగమ్య మహావేగః సంన్యస్య శిఖరం గిరేః, 41
విశ్రమ్య కించిద్ధనుమాన్ సుషేణమిదమబ్రవీత్.

ప్ర. అ. మహావేగః=గొప్ప వేగము గల, హనుమాన్=హనుమంతుడు, **సమా**గమ్య=వచ్చి, గిరేః=పర్వతముయొక్క, శిఖరమ్=శిఖరమును, సంన్యస్య=**ఉంచి, కించిత్**=కొంచెము, విశ్రమ్య=విశ్రమించి, సుషేణమ్=సుషేణుణ్ణి గూర్చి, ఇదమ్=**ఈ వాక్య**మును, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు మహావేగముతో తిరిగి వచ్చి పర్వతశిఖరమును **క్రింద** దింపి కొంచెము విశ్రమించి, సుషేణునితో ఇట్లు పలికెను. 41

**మూ.** ఓషధీర్నావగచ్ఛామి తా అహం హరిపుఙ్గవ, 42
తదిదం శిఖరం కృత్స్నం గిరేస్తస్యాహృతం మయా.

ప్ర. అ. హరిపుంగవ=వానరశ్రేష్ఠుడా ! అహమ్=నేను, **తాః=ఆ,** ఓషధీః=ఓషధులను, నావగచ్ఛామి=ఎరుగను. తస్య గిరేః=ఆ పర్వతముయొక్క, తత్=ఆ, ఇదమ్=ఈ, కృత్స్నమ్=సమస్తమైన, శిఖరమ్=శిఖరము, మయా=నాచేత, ఆహృతమ్=తీసికొనిరాబడినది.

తా. ఓ ! వానరశ్రేష్ఠుడా ! నేను ఆ ఓషధులను గుర్తించజాలక ఆ పర్వత శిఖరము నంతను తీసికొని వచ్చినాను.

వి. ఇక్కడ ఉన్న పాఠభేదాలను పట్టి విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధాని అను నాలుగు వేరు వేరు ఓషధులనీ, శల్యములు తొలగించుట, మామూలు శరీరచ్ఛాయను ఇచ్చుట, జీవింపచేయుట, అతుకుట అను గుణములు గల ఒకే ఓషధి అనీ తెలియుచున్నది. పై శ్లోకాలలో "ఓషధీమ్," "ఓషధీః" ఇత్యాది విధముగా ఏకవచన పాఠము, బహువచనపాఠము ఉన్నవి.గోవిందరాజులు ఏకవచన పాఠమునే గ్రహించి వ్యాఖ్యానించినారు. ఇక్కడ మేము బహువచనపాఠమును గ్రహించి వ్యాఖ్యానించినను ఏకవచనపాఠమే యుక్తమని తోచుచున్నది. 42

**మూ.** ఏవం కథయమానం తు ప్రశస్య పవనాత్మజమ్, 43
సుషేణో వానరశ్రేష్ఠో జగ్రాహోత్పాట్య చౌషధీః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, కథయమానమ్=చెప్పుచున్న, పవనాత్మజమ్=హనుమంతుణ్ణి, ప్రశస్య=ప్రశంసించి, వానరశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన, సుషేణః=సుషేణుడు, ఓషధీః=ఓషధులను, ఉత్పాట్య=పెకలించి, జగ్రాహ=గ్రహించెను.

తా. వానర శ్రేష్ఠుడైన సుషేణుడు హనుమంతుని మాటలు విని ఆతనిని ప్రశంసించి, ఓషధులను లాగి పైకి తీసెను. 43

**మూ.** విస్మితాస్తు బభూవుస్తే సర్వే వానరపుంగవాః, 44
దృష్ట్వా హనూమతః కర్మ సురైరపి సుదుష్కరమ్.

ప్ర. అ. సురైరపి=దేవతలచేత కూడ, సుదుష్కరమ్=మిక్కిలి చేయ శక్యముకాని, హనూమతః=హనుమంతునియొక్క, కర్మ= ఆ పనిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, తే=ఆ, **వానరపుంగవాః= వానర శ్రేష్ఠులు,విస్మితాః=ఆశ్చర్యము చెందినవారు, బభూవుః=అయిరి,.**

తా. దేవతలకు కూడ చేయ శక్యము కాని హనుమంతుడు చేసిన ఆ పనిని చూచి, ఆ వానర శ్రేష్ఠు లందరూ ఆశ్చర్యపడిరి. 44

మూ. తతః సంక్షోదయిత్వా తామోషధిం వానరోత్తమః, 45
లక్ష్మణస్య దదౌ నస్తః సుషేణః సుమహాద్యుతిః.

ప్ర. అ. తతః= అటుపిమ్మట, వానరోత్తమః=వానరశ్రేష్ఠుడు, సుమహాద్యుతిః=గొప్ప కాంతి గలవాడూ అయిన, సుషేణః=సుషేణుడు, తామ్=ఆ, ఓషధిమ్=ఓషధిని, సంక్షోదయిత్వా=నలగకొట్టి, లక్ష్మణస్య=లక్ష్మణునకు, నస్తః=ముక్కునుండి, దదౌ=ఇచ్చెను.

తా. పిమ్మట, వానరశ్రేష్ఠుడు మహాకాంతిమంతుడు అయిన సుషేణుడు ఆ ఓషధిని నలగగొట్టి లక్ష్మణునకు ముక్కు ద్వారా ఇచ్చెను. 45

మూ. సశల్యః స సమాఘ్రాయ లక్ష్మణః పరవీరహా, 46
విశల్యో విరుజః శీఘ్రముదతిష్ఠన్మహీతలాత్.

ప్ర. అ. సశల్యః=శల్యముతో కూడిన, పరవీరహా=శత్రువీరసంహారకుడైన, సః=ఆ, లక్ష్మణః=లక్ష్మణుడు, సమాఘ్రాయ=వాసన చూచి, విశల్యః=శల్యములు లేనివాడై, విరుజః=పోయిన బాధకలవాడై, మహీతలాత్=నేలమీదనుండి, శీఘ్రమ్=శీఘ్రముగా, ఉదతిష్ఠత్=పైకి లేచెను.

తా. శరీరమునందు శల్యములున్న, శత్రువీరసంహారకు డైన లక్ష్మణుడు దానిని వాసన చూడగానే శల్యము లన్నీ తొలగిపోగా బాధ లేనివాడై వెంటనే నేలమీదనుండి లేచెను. 46

మూ. తముత్థితం తు హరయో భూతలాత్ప్రేక్ష్య లక్ష్మణమ్, 47
సాధు సాధ్వితి సుప్రీతా లక్ష్మణం ప్రత్యపూజయన్.

ప్ర. అ. హరయః=వానరులు, భూతలాత్=నేలమీదనుండి, ఉత్థితమ్=లేచిన, తం లక్ష్మణమ్=ఆ లక్ష్మణుణ్ణి, దృష్ట్వా=చూచి, సుప్రీతాః=చాల సంతోషించినవారై, సాధు సాధు ఇతి=బాగు బాగు అని, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, ప్రత్యపూజయన్=పూజించిరి.

తా. వానరులు నేలపైనుండి లేచిన లక్ష్మణుణ్ణి చూచి చాల

సంతోషించుచు " బాగు బాగు " అని ఆతనిని అభినందించిరి. 47

మూ. ఏహ్యేహీత్యబ్రవీద్రామో లక్ష్మణం పరవీరహా, 48
సస్వజే స్నేహగాఢం చ బాష్పపర్యాకులేక్షణః.

ప్ర. అ. పరవీరహా=శత్రువీరులను సంహరించు, రామః=రాముడు, ఏహి, ఏహి=రమ్ము, రమ్ము, ఇతి=అని, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను. బాష్పపర్యాకులేక్షణః=కన్నీటిచేత వ్యాకులమైన నేత్రములు కలవాడై, స్నేహగాఢం చ=స్నేహముచేత గాఢముగా, సస్వజే=కౌగలించుకొనెను.

తా. శత్రువీరసంహారకుడైన రాముడు " రమ్ము, రమ్ము " అని లక్ష్మణునితో అనుచు ఆతనిని, కన్నీళ్లతో వ్యాకులములైన నేత్రములతో, స్నేహముచేత గాఢముగా కౌగలించుకొనెను. 48

మూ. అబ్రవీచ్చ పరిష్వజ్య సౌమిత్రిం రాఘవస్తదా, 49
దిష్ట్యా త్వాం వీర పశ్యామి మరణాత్పునరాగతమ్.

ప్ర. అ. తదా=అప్పుడు, రాఘవః=రాముడు, సౌమిత్రిమ్=లక్ష్మణుణ్ణి, పరిష్వజ్య=కౌగలించుకొని, అబ్రవీచ్చ=పలికెను కూడ. వీర=వీరుడా ! దిష్ట్యా=అదృష్టవశముచేత, మరణాత్=మరణమునుండి, పునః=మరల, ఆగతమ్=వచ్చిన, త్వామ్=నిన్ను, పశ్యామి=చూచుచున్నాను.

తా. అప్పుడు రాముడు లక్ష్మణుణ్ణి కౌగలించుకొని - " వీరుడా ! మరణమునుండి తిరిగి వచ్చిన నిన్ను అదృష్టవశముచేత చూచుచున్నాను" అని పలికెను. 49

మూ. న హి మే జీవితేనార్థః సీతయా విజయేన వా, 50
కో హి మే వద తేనార్థస్త్వయి పఞ్చత్వమాగతే.

ప్ర. అ. త్వయి=నీవు, పఞ్చత్వమ్=మరణమును, ఆగతే=పొందినవాడవగుచుండగా, మే=నాకు, జీవితేన=జీవితముచేత గాని, సీతయా=సీతచేత గాని, విజయేన వా=విజయముచేత గాని, అర్థః=ప్రయోజనము, న హి=లేదు కదా? మే=నాకు, తేన=దానిచేత, కః=ఏమి, అర్థః=ప్రయోజనము? వద=చెప్పుము.

తా. నీవు మరణించిన పిదప నాకు జీవితముచేత గాని, సీతచేత గాని, విజయముచేత గాని ఏమి ప్రయోజనము? వీటి అన్నింటివలన నాకేమి ప్రయోజనము? చెప్పుము. 50

మూ. ఇత్యేవం వదతస్తస్య రాఘవస్య మహాత్మనః, 51
ఖిన్నః శిథిలయా వాచా లక్ష్మణో వాక్యమబ్రవీత్.

ప్ర.అ. మహాత్మనః=మహాత్ముడైన, రాఘవస్య=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, వదతః=పలుకుచుండగా, ఖిన్నః=అలసి ఉన్న, లక్ష్మణః=లక్ష్మణుడు, శిథిలయా= శిథిలమైన, వాచా=వాక్కుతో, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ముడైన రాము డిట్లు పలుకుచుండగా అలసి ఉన్న లక్ష్మణుడు శిథిలమైన వాక్కుతో ఇట్లు పలికెను. 51

**మూ. తాం ప్రతిజ్ఞాం ప్రతిజ్ఞాయ పురా సత్యపరాక్రమ, 52**
**లఘుః కశ్చిదివాసత్త్వో నైవం వక్తుమిహార్హసి.**

ప్ర. అ. సత్యపరాక్రమ=సత్యమైన పరాక్రమము గలవాడా ! పురా=పూర్వము, తాం ప్రతిజ్ఞామ్= ఆ ప్రతిజ్ఞను, ప్రతిజ్ఞాయ=చేసి, అసత్త్వః=ధైర్యములేని, లఘుః=తేలికయైన, కశ్చిదివ=ఎవడో ఒక వ్యక్తి వలె, ఇహ= ఇప్పుడు, ఏవమ్=ఇట్లు, వక్తుమ్=పలుకుటకు, న అర్హసి=తగవు.

తా. సత్యమైన పరాక్రమము గల అన్నా ! పూర్వము రావణసంహారము చేసెద నని ప్రతిజ్ఞ చేసి, ఇప్పుడు ఎవ్వడో సామాన్య మానవుడు వలె నీవు ఇట్లు పలుకుట యుక్తము కాదు. 52

**మూ. న హి ప్రతిజ్ఞాం కుర్వన్తి వితథాం సత్యవాదినః, 53**
**లక్షణం హి మహత్త్వస్య ప్రతిజ్ఞాపరిపాలనమ్.**

ప్ర. అ. సత్యవాదినః=సత్యము పలుకువారు, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, వితథామ్=వ్యర్థమైన దానినిగా, న కుర్వన్తి హి=చేయరుగదా? ప్రతిజ్ఞాపరిపాలనమ్= ప్రతిజ్ఞను పాలించుట,మహత్త్వస్య=గొప్పతనముయొక్క, లక్షణం హి=లక్షణము కదా?

తా. సత్యము పలుకువారు ప్రతిజ్ఞను వ్యర్థము చేయరు కదా? ప్రతిజ్ఞను పాలించుటయే మహత్త్వమునకు లక్షణము కదా? 53

**మూ. నైరాశ్యముపగన్తుం చ నాలం తే మత్కృతేఽనఘ, 54**
**వధేన రావణస్యాద్య ప్రతిజ్ఞామనుపాలయ.**

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా, మత్కృతే=నా నిమిత్తమై, నైరాశ్యమ్=నైరాశ్యమును, ఉపగన్తుం చ=పొందుట కూడా, తే=నీకు, నాలమ్= తగినది కాదు. అద్య=ఇప్పుడు, రావణస్య=రావణునియొక్క, వధేన=వధచేత, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, అనుపాలయ=పాలించుము.

**తా. దోషరహితుడా ! నా నిమిత్తము నీవు నిరాశుడవు అగుట యుక్తము కాదు. ఇప్పుడు రావణుని వధించుటచే ప్రతిజ్ఞను పాలించుము.** 54

55

మూ. న జీవన్యాస్యతే శత్రుస్తవ బాణపథం గతః,
నర్దతస్తీక్ష్ణదంష్ట్రస్య సింహస్యేవ మహాగజః.

ప్ర. అ. తవ=నీయొక్క, బాణపథమ్=బాణమార్గమును, గతః=పొందిన, శత్రుః=శత్రువు, నర్దతః=గర్జించుచున్న, తీక్ష్ణదంష్ట్రస్య=తీక్ష్ణములైన కోరలు గల, సింహస్య=సింహముయొక్క దారిని పొందిన, మహాగజః ఇవ=మహాగజము వలె, జీవన్=జీవించుచు, న యాస్యతే=వెళ్లడు.

తా. నీ బాణమార్గమును పొందిన శత్రువు, గర్జించుచున్న, తీక్ష్ణములైన కోరలు గల సింహము బారిన పడిన మహాగజము వలె, ప్రాణములతో తిరిగి వెళ్ళడు కదా? 55

56

మూ. అహం తు వధమిచ్ఛామి శీఘ్రమస్య దురాత్మనః,
యావదస్తం న యాత్యేష కృతకర్మా దివాకరః.

ప్ర. అ. ఏషః=ఈ, దివాకరః=సూర్యుడు, కృతకర్మా=చేయబడిన కర్మ గలవాడై, యావత్=ఎంతలో, అస్తమ్=అస్తాద్రిని, న యాతి=పొందడో, అంతలో, అస్య=ఈ, దురాత్మనః=దురాత్మునియొక్క, వధమ్=వధను, శీఘ్రమ్=శీఘ్రముగా, అహమ్=నేను, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. సూర్యుడు తన పని పూర్తిచేసికొని అస్తాద్రిని చేరే లోగా ఈ దురాత్ముడు శీఘ్రముగా చంపబడ వలె నని నేను కోరుచున్నాను. 56

మూ. యది వధమిచ్ఛసి రావణస్య సంఖ్యే
యది చ కృతాం హి తవేచ్ఛసి ప్రతిజ్ఞామ్,
యది తవ రాజసుతాభిలాష ఆర్య
కురు చ వచో మమ శీఘ్రమద్య వీర. 57

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకాధికశతతమః సర్గః.

ప్ర. అ. వీర=వీరుడా ! ఆర్య=పూజ్యుడా ! సంఖ్యే=యుద్ధము నందు, రావణస్య=రావణునియొక్క, వధమ్=వధను, ఇచ్ఛసియది=కోరినట్లయితే, తవ=నీయొక్క, ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, కృతామ్=నెరవేర్చబడినదానినిగా, ఇచ్ఛసి యది=ఇచ్ఛయించినట్లయితే, తవ=నీకు, రాజసుతాభిలాషః యది=రాజకుమారియైన సీతయందు అభిలాష ఉన్నచో, శీఘ్రమ్=శీఘ్రముగా, అద్య=ఇప్పుడు, మమ=నా యొక్క, వచః=వచనమును, కురు చ=చేయుము.

తా. పూజ్యుడవైన వీరుడా ! నీకు యుద్ధములో రావణుణ్ణి చంపవలెనను కోరిక ఉన్నచో, నీ ప్రతిజ్ఞను నిలబెట్టుకొనవలె నను కోరిక ఉన్నచో, సీతను పొందవలె నను అభిలాష ఉన్నచో శీఘ్రముగా ఇప్పుడు నేను చెప్పినట్లు చేయుము. 57

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వ్యధికశతతమః సర్గః

[ఇంద్రుడు పంపిన రథము నెక్కి రాముడు రావణునితో యుద్ధము చేయుట.]

మూ. లక్ష్మణేన తు తద్వాక్యముక్తం శ్రుత్వా స రాఘవః,
సందధే పరవీరఘ్నో ధనురాదాయ వీర్యవాన్. 1

ప్ర. అ. పరవీరఘ్నః=శత్రువీరులను సంహరించు, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః రాఘవః= ఆ రాముడు, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ఉక్తమ్=పలకబడిన, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి, సందధే=సంధించెను.

తా. శత్రువీరసంహారకుడు, పరాక్రమవంతుడూ అయిన ఆ రాముడు లక్ష్మణుడు పలికిన మాటలు విని, ధనస్సును గ్రహించి బాణములు సంధించెను.1

మూ. రావణాయ శరాన్ ఘోరాన్విససర్జ చమూముఖే,
అథాన్యం రథమాస్థాయ రావణో రాక్షసాధిపః, 2
అభ్యధావత కాకుత్స్థం స్వర్భానురివ భాస్కరమ్.

ప్ర. అ. చమూముఖే=సేనాముఖమునందు, రావణాయ=రావణునికొరకు, ఘోరాన్=భయంకరములైన, శరాన్=బాణములను, విససర్జ=విడిచెను. అథ=అటు పిమ్మట, రాక్షసాధిపః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, అన్యమ్=మరి యొక, రథమ్=రథమును ఆస్థాయ=అధిష్ఠించి, కాకుత్స్థమ్=రాముణ్ణి గూర్చి, స్వర్భానుః= రాహువు, భాస్కరమ్ ఇవ=సూర్యుణ్ణి కూర్చి వలె, అభ్యధావత=శీఘ్రముగా వెళ్లెను.

తా. సేనాముఖమునందు రాముడు రావణుణ్ణి ఉద్దేశించి భయంకరములైన బాణాలను విడచెను. పిమ్మట రాక్షసరాజైన రావణుడు మరొక రథమును అధిష్ఠించి, రాహువు సూర్యుని మీదకు వెళ్లినట్లు రామునిమీదకు శీఘ్రముగా వెళ్లెను. 2

మూ. దశగ్రీవో రథస్థస్తు రామం వజ్రోపమైః శరైః, 3
ఆజఘాన మహాశైలం ధారాభిరివ తోయదః.

ప్ర. అ. రథస్థః=రథముపైనున్న, దశగ్రీవః తు=రావణుడైతే, **రామమ్=రాముణ్ణి**, వజ్రోపమైః=వజ్రాయుధముతో సమానములైన, శరైః=బాణములచేత, **తోయదః**=మేఘము, ధారాభిః=జలధారలచేత, మహాశైలమ్ ఇవ=మహాపర్వతమును **వలె**, ఆజఘాన=కొట్టెను.

తా. రథముమీద నున్న రావణుడు వజ్రాయుధము వంటి బాణములతో, మేఘము జలధారలతో పర్వతమును కొట్టినట్లు రాముణ్ణి కొట్టెను. 3

**మూ.** దీప్తపావకసంకాశైః శరైః కాఞ్చనభూషణైః, 4
అభ్యవర్షద్రణే రామో దశగ్రీవం సమాహితః.

ప్ర. అ. రామః=రాముడు, సమాహితః=సావధానచిత్తుడై, దీప్తపావకసంకాశైః=ప్రజ్వలించుచున్న అగ్నితో సమానములైన, కాఞ్చనభూషణైః=బంగారము అలంకారముగా గల, శరైః=బాణములచేత, రణే=యుద్ధమునందు, దశగ్రీవమ్=రావణుణ్ణి, అభ్యవర్షత్=వర్షించెను.

తా. రాముడు సావధానచిత్తుడై, యుద్ధమునందు, మండుచున్న అగ్నితో సమానములైన, బంగారముచేత అలంకరింపబడిన బాణములను రావణుని మీద వర్షించెను. 4

**మూ.** భూమౌ స్థితస్య రామస్య రథస్థస్య చ రక్షసః, 5
న సమం యుద్ధమిత్యాహుర్దేవగన్ధర్వకింనరాః.

ప్ర. అ. భూమౌ=నేలమీద, స్థితస్య=ఉన్న, రామస్య=రామునకు, రథస్థస్య=రథముమీద నున్న, రక్షసః=రాక్షసునకు, యుద్ధమ్=యుద్ధము, సమమ్=సమానమైనది, న=కాదు, ఇతి=అని, దేవగన్ధర్వకింనరాః=దేవతలు, గంధర్వులు, కింనరులు, ఆహుః=పలికిరి.

తా. రాముడు నేలమీదా, రావణుడు రథముమీదా ఉండి యుద్ధము చేయుట సరిగా లేదని దేవ-గంధర్వ-కింనరులు అనుకొనిరి. 5

**మూ.** తతో దేవవరః శ్రీమాన్ శ్రుత్వా తేషాం వచోఽమృతమ్, 6
ఆహూయ మాతలిం శక్రో వచనం చేదమబ్రవీత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దేవవరః=దేవతాశ్రేష్ఠుడు, శ్రీమాన్=శ్రీమంతుడూ అయిన, శక్రః=దేవేంద్రుడు, తేషామ్=వాళ్లయొక్క, వచోమృతమ్=అమృతమువంటి వచనమును, శ్రుత్వా=విని, మాతలిమ్=మాతలిని, ఆహూయ=**పిలిచి**, **ఇదమ్=ఈ**,వచనం చ=వచనమును కూడ, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు దేవతాప్రభువు, శ్రీమంతుడు అయిన ఇంద్రుడు **వాళ్ల**

అమృతమువంటి మాటలు విని మాతలిని పిలచి ఇట్లు పలికెను. 6

మూ. రథేన మమ భూమిష్ఠం శీఘ్రం యాహి రఘూత్తమమ్, 7
ఆహూయ భూతలం యాతః కురు దేవహితం మహత్.

ప్ర. అ. మమ=నా యొక్క, రథేన=రథముతో, శీఘ్రమ్=శీఘ్రముగా, భూమిష్ఠమ్=భూమిమీదనున్న, రఘూత్తమమ్=రాముణ్ణి గూర్చి, యాహి=వెళ్లుము. ఆహూయ=పిలచి, భూతలమ్=భూమిని, యాతః=పొందిన నీవు, మహత్=గొప్ప, దేవహితమ్=దేవతలకు హితమును, కురు=చేయుము.

తా. నీవు శీఘ్రముగా నా రథమును తీసికొని భూమిమీద ఉన్న రామునివద్దకు వెళ్లుము. భూమికి వెళ్లిన నీవు, రాముణ్ణి పిలచి (రామునకు ఈ విషయము చెప్పి) గొప్ప దేవతాహితమైన కార్యము చేయుము. 7

మూ. ఇత్యుక్తో దేవరాజేన మాతలిర్దేవసారథిః, 8
ప్రణమ్య శిరసా దేవం తతో వచనమబ్రవీత్.

ప్ర. అ. దేవరాజేన=ఇంద్రునిచేత, ఇతి=ఇట్లు, ఉక్తః=పలకబడిన, దేవసారథిః=దేవసారథియైన, మాతలిః=మాతలి, శిరసా=శిరస్సుచేత, దేవమ్=ప్రభువును, ప్రణమ్య=నమస్కరించి, తతః=అటుపిమ్మట, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. దేవసారథియైన మాతలి దేవేంద్రుని మాటలు విని ఆతనికి శిరస్సు వంచి నమస్కరించి ఇట్లు పలికెను. 8

మూ. శీఘ్రం యాస్యామి దేవేన్ద్ర సారథ్యం చ కరోమ్యహమ్, 9
తతో హయైశ్చ సంయోజ్య హరితైః స్యన్దనోత్తమమ్.

ప్ర. అ. దేవేన్ద్ర=దేవేంద్రుడా! అహమ్=నేను, స్యన్దనోత్తమమ్=శ్రేష్ఠమైన రథమును, హరితైః=ఆకుపచ్చని రంగు గల, హయైః=గుఱ్ఱములతో, సంయోజ్య=కట్టి, తతః=అటుపిమ్మట, శీఘ్రమ్=శీఘ్రముగా, యాస్యామి=వెళ్లగలను. సారథ్యం చ=సారథ్యమును కూడ, కరోమి=చేయుదును.

తా. దేవేంద్రా! నేను శ్రేష్ఠమైన రథమునకు ఆకుపచ్చని రంగు గల గుఱ్ఱములు కట్టుకొని శీఘ్రముగా వెళ్లి సారథ్యము చేసెదను. 9

మూ. తతః కాఞ్చనచిత్రాఙ్గః కిఙ్కిణీశతభూషితః, 10
తరుణాదిత్యసంకాశో వైదూర్యమయకూబరః,
సదశ్వైః కాఞ్చనాపీడైర్యుక్తః శ్వేతప్రకీర్ణకైః, 11

హరిభిః సూర్యసంకాశైర్హేమజాలవిభూషితైః,
రుక్మవేణుధ్వజః శ్రీమాన్ దేవరాజరథో వరః, 12
దేవరాజేన సందిష్టో రథమారుహ్య మాతలిః,
అభ్యవర్తత కాకుత్స్థమవతీర్య త్రివిష్టపాత్. 13

ప్ర. అ. తతః=అటు పిమ్మట, దేవరాజేన=దేవేంద్రునిచేత, సందిష్టః=ఆజ్ఞాపింపబడిన, మాతలిః=మాతలి, కాఞ్చనచిత్రాఙ్గః=బంగారముచేత చిత్రములైన చక్రములు కలది, కిఙ్కిణీశతభూషితః=వందల కొలది చిరుగంటలచేత అలంకరింపబడినది, తరుణాదిత్యసంకాశః=లేతసూర్యునితో సమానము, వైదూర్యమయకూబరః=వైదూర్య మాణిక్య వికారమైన నిలువు పోలు గలది, కాఞ్చనాపీడైః=బంగారు శిరోభూషణములు గల, శ్వేతప్రకీర్ణకైః=తెల్లని చామరములు గల, హరిభిః=ఆకుపచ్చని రంగు గల, సూర్యసంకాశైః=సూర్యునితో సమానములైన, హేమజాలవిభూషితైః=బంగారు జరీచేత అలంకరింపబడిన, సదశ్వైః=ఉత్తమములైన గుఱ్ఱములతో, యుక్తః=కట్టబడినది, రుక్మవేణుధ్వజః=బంగారు వేదురుకట్ట గల ధ్వజము గలది, శ్రీమాన్=శోభాయుక్తము, వరః=శ్రేష్ఠము అయిన, (యః=ఏ), దేవరాజరథః=దేవేంద్రుని రథము గలదో, రథమ్=ఆ రథమును, ఆరుహ్య=ఎక్కి, త్రివిష్టపాత్=స్వర్గమునుండి, అవతీర్య=దిగి, కాకుత్స్థమ్=రాముణ్ణి, అభ్యవర్తత=సమీపించెను.

తా. పిమ్మట దేవేంద్రుని ఆజ్ఞ ప్రకారము మాతలి దేవేంద్రుని రథమునెక్కి, స్వర్గమునుండి దిగి వచ్చి రాముని దగ్గరకు వెళ్లెను. ఆ రథము చక్రములు బంగారముచేత చిత్రవర్ణములై ఉండెను. అది వందల కొలది చిరుగంటలచేత అలంకరింపబడి ఉండెను. లేత సూర్యుడు వలె ఉన్న దాని నిలువు దూలము వైదూర్యమణులచేత అలంకరింపబడెను. దానికి బంగారు శిరోభూషణములతోను, తెల్లని చామరములతోను, బంగారు జరీతోను అలంకరించిన, సూర్యునితో సమానములైన, ఆకుపచ్చ రంగు ఉత్తమాశ్వములు కట్టబడెను. దాని ధ్వజము వెదురు ఆకారము గల బంగారు దండముపై ఎగురుచుండెను. 10 - 13

మూ. అబ్రవీచ్చ తదా రామం సప్రతోదో రథే స్థితః,
ప్రాఞ్జలిర్మాతలిర్వాక్యం సహస్రాక్షస్య సారథిః. 14

ప్ర. అ. తదా=అప్పుడు, సహస్రాక్షస్య=దేవేంద్రునియొక్క, సారథిః=సారథియైన, మాతలిః=మాతలి, సప్రతోదః=కొరడాతో కూడినవాడై, రథే=రథమునందు, స్థితః=ఉన్నవాడై, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలికలవాడై, రామమ్=రాముణ్ణి గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్ చ=పలికెను.

తా. అప్పుడు ఇంద్రుని సారథియైన మాతలి కొరడాతో రథమునందే ఉండి నమస్కరించుచు రామునితో ఇట్లు పలికెను. 14

మూ. సహస్రాక్షేణ కాకుత్స్థ రథోఽయం విజయాయ తే,
దత్తస్తవ మహాసత్త్వ శ్రీమన్ శత్రునిబర్హణ. 15

ప్ర. అ. మహాసత్త్వ=గొప్ప బలముగలవాడా !, శ్రీమన్=శోభాయుక్తుడా! శత్రునిబర్హణ=శత్రుసంహారకా ! కాకుత్స్థ=రామా ! అయమ్=ఈ, రథః=రథము, తే=నీయొక్క, విజయాయ=విజయముకొరకు, సహస్రాక్షేణ=దేవేంద్రుని చేత, తవ=నీకు, దత్తః=ఇవ్వబడినది.

తా. గొప్ప బలము గలవాడవు, శోభాయుక్తుడవు, శత్రుసంహారకుడవు అయిన ఓ! రామా! ఈ రథమును నీ విజయముకొరకు దేవేంద్రుడు నీకు పంపినాడు. 15

మూ. ఇదమైన్ద్రం మహచ్చాపం కవచం చాగ్నిసంనిభమ్,
శరాశ్చాదిత్యసంకాశాః శక్తిశ్చ విమలా శివా. 16

ప్ర. అ. ఐన్ద్రిమ్=ఇంద్రసంబంధమైన, ఇదమ్=ఈ, మహత్=గొప్పదైన, చాపమ్=ధనస్సు, అగ్నిసంనిభమ్=అగ్నితో సమానమైన, కవచం చ=కవచము, ఆది త్యసంకాశాః=సూర్యునితో సమానములైన, శరాశ్చ=బాణములు, విమలా=నిర్మలము, శివా=మంగళప్రదమూ అయిన, శక్తిశ్చ=శక్తి(ఇవ్వబడినవి).

తా. ఇంద్రుని ఈ గొప్ప ధనస్సు, అగ్నితో సమానమైన కవచము, సూర్యునివంటి బాణములు, నిర్మలము, మంగళప్రదము అయిన శక్తి కూడ పంపినాడు. 16

మూ. ఆరుహ్యేమం రథం వీర రాక్షసం జహి రావణమ్,
మయా సారథినా రాజన్ మహేన్ద్ర ఇవ దానవాన్. 17

ప్ర. అ. వీర=వీరుడా! రాజన్=రాజా! సారథినా=సారథినైన, మయా=నాతో కూడిన, ఇమమ్=ఈ, రథమ్=రథమును, ఆరుహ్య=ఎక్కి, మహేన్ద్రః=మహేంద్రుడు, దానవాన్ ఇవ=దానవులను వలె, రాక్షసమ్=రాక్షసుడైన, రావణమ్=రావణుణ్ణి, జహి=చంపుము.

తా. వీరుడవైన రాజా ! నేను సారథిగా ఉన్న, ఈ రథము నెక్కి, మహేంద్రుడు దానవులను చంపినట్లు రావణుణ్ణి చంపుము. 17

మూ. ఇత్యుక్తః సంపరిక్రమ్య రథం తమభివాద్య చ,
ఆరురోహ తదా రామో లోకాన్ లక్ష్మ్యా విరాజయన్. 18

ప్ర. అ. ఇతి=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రామః=రాముడు, సంపరి క్రమ్య=ప్రదక్షిణముచేసి, తమ్=ఆ, రథమ్=రథమును, అభివాద్య చ=నమస్కరించి,

తదా=అప్పుడు, లోకాన్=లోకములను, లక్ష్మ్యా=శోభతో, విరాజయన్=ప్రకాశింపచేయుచు, ఆరురోహ=ఎక్కెను.

తా. అప్పుడు రాముడు ఆ రథమునకు ప్రదక్షిణము చేసి నమస్కరించి, లోకములను శోభతో ప్రకాశింపచేయుచు ఎక్కెను. 18

మూ. బభూవ చ మహాయుద్ధం తుములం రోమహర్షణమ్,
రామస్య చ మహాబాహో రావణస్య చ రక్షసః. 19

ప్ర. అ. మహాబాహోః=గొప్ప బాహువులు గల, రామస్య చ=రామునకు, రక్షసః=రాక్షసుడైన, రావణస్య చ=రావణునకు, తుములమ్=వ్యాకులము, రోమహర్షణమ్=రోమాంచమును కలిగించునది అయిన, మహాయుద్ధమ్=గొప్ప యుద్ధము, బభూవ చ=జరిగెను.

తా. గొప్ప బాహువులు గల రామునకు, రావణునకు వ్యాకులము రోమాంచము పుట్టించునదీ అయిన మహాయుద్ధము జరిగెను. 19

మూ. స గాన్ధర్వేణ గాన్ధర్వం దైవం దైవేన రాఘవః,
అస్త్రం రాక్షసరాజస్య జఘాన పరమాస్త్రవిత్. 20

ప్ర. అ. పరమాస్త్రవిత్=గొప్ప అస్త్రములను ఎరిగిన, సః రాఘవః=ఆ రాముడు, రాక్షసరాజస్య=రావణునియొక్క, గాన్ధర్వమ్=గాంధర్వ మను, అస్త్రమ్=అస్త్రమును, గాన్ధర్వేణ=గాంధర్వాస్త్రముచేతను, దైవమ్=దైవాస్త్రమును, దైవేన=దైవాస్త్రముచేతను, జఘాన=కొట్టెను.

తా. గొప్ప అస్త్రములను ఎరిగిన రాముడు,రావణుడు ప్రయోగించిన గాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్రముచేతను, దైవాస్త్రమును దైవాస్త్రముచేతను కొట్టివేసెను. 20

మూ. అస్త్రం తు పరమం ఘోరం రాక్షసం రాక్షసాధిపః,
ససర్జ పరమక్రుద్ధః పునరేవ నిశాచరః. 21

ప్ర. అ. రాక్షసాధిపః=రాక్షసరాజైన, నిశాచరః=రావణుడు, పరమక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, పరమమ్=మిక్కిలి, ఘోరమ్=ఘోరమైన, రాక్షసమ్ అస్త్రమ్=రాక్షసాస్త్రమును, పునరేవ=మరల, ససర్జ=విడచెను.

తా. రావణుడు చాల కోపించి మరల చాల ఘోరమైన రాక్షసాస్త్రమును ప్రయోగించెను. 21

మూ. తే రావణధనుర్ముక్తాః శరాః కాఞ్చనభూషణాః,
అభ్యవర్తన్త కాకుత్స్థం సర్పా భూత్వా మహావిషాః. 22

ప్ర. అ. రావణధనుర్ముక్తాః=రావణుని ధనస్సునుండి విడువబడిన, కాఞ్చనభూషణాః=బంగారము అలంకారముగా గల, తే శరాః=ఆ బాణ ములు, మహావిషాః=గొప్ప విషము గల, సర్పాః=సర్పములుగా, భూత్వా=అయి, కాకుత్ స్థమ్=రాముణ్ణి గూర్చి, అభ్యవర్తన్త=వచ్చినవి.

తా. రావణుని ధనస్సునుండి బయలుదేరిన, బంగారముచేత అలంకరిం పబడిన ఆ బాణములు గొప్ప విషము గల సర్పములుగా అయి రామునిమీదికి వచ్చినవి. 22

మూ. తే దీప్తవదనా దీప్తం వమన్తో జ్వలనం ముఖైః,
రామమేవాభ్యవర్తన్త వ్యాదితాస్యా భయానకాః. 23

ప్ర. అ. దీప్తవదనాః=మండుచున్న ముఖములు గల, తే=ఆ సర్పములు, ముఖైః=ముఖములచేత, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, జ్వలనమ్=అగ్నిని, వమన్తః=కక్కు చున్నవై, వ్యాదితాస్యాః=తెరవబడిన ముఖములు గలవై, భయానకాః=భయంకరములై, రామమేవ=రాముణ్ణే, అభ్యవర్తన్త=సమీపించినవి.

తా. మండుచున్న ముఖములు గల భయంకరములైన ఆ సర్పములు ముఖములతో నిప్పులు కక్కుచు, నోళ్లు తెరచుకొని రాముని మీదకే వెళ్లినవి.23

మూ. తైర్వాసుకిసమస్పర్శైర్దీప్తభోగైర్మహావిషైః,
దిశశ్చ సంతతాః సర్వా విదిశశ్చ సమావృతాః. 24

ప్ర. అ. వాసుకిసమస్పర్శైః=వాసుకితో సమానమైన స్పర్శగల, దీప్తభోగైః= మండుచున్న పడగలు గల, మహావిషైః=అధికమైన విషము గల, తైః=సర్పములచేత, సర్వాః=సమస్తమైన, దిశశ్చ=దిక్కులు, సంతతాః=కప్పబడినవి. విదిశశ్చ=విదిక్కులు కూడ, సమావృతాః=ఆవరింపబడినవి.

తా. వాసుకి స్పర్శ వంటి తీవ్రమైన స్పర్శ గల, ప్రకాశించుచున్న పడగలు గల మహావిషములైన ఆ సర్పములు సమస్తమైన దిక్కులను విదిక్కులను కప్పివేసెను. 24

మూ. తాన్ దృష్ట్వా పన్నగాన్ రామః సమాపతత ఆహవే,
అస్త్రం గారుత్మతం ఘోరం ప్రాదుశ్చక్రే భయావహమ్. 25

ప్ర. అ. రామః=రాముడు, ఆహవే=యుద్ధమునందు, సమాపతతః=వచ్చి మీదపడుచున్న, తాన్ పన్నగాన్=ఆ సర్పములను, దృష్ట్వా=చూచి, ఘోరమ్= ఘోరము, భయావహమ్=భయమును కలిగించునదీ అయిన, గారుత్మతమ్ అస్త్రమ్=గారుత్మతాస్త్రమును, ప్రాదుశ్చక్రే=సృజించెను.

తా. యుద్ధములో వచ్చి మీదపడుచున్న ఆ సర్పములను చూచి రాముడు ఘోరము, భయంకరమూ అయిన గారుత్మతాస్త్రమును ప్రయోగించెను. 25

మూ. తే రాఘవధనుర్ముక్తా రుక్మపుఙ్ఖాః శిఖిప్రభాః,
సుపర్ణాః కాఞ్చనా భూత్వా విచేరుః సర్పశత్రవః. 26

ప్ర. అ. రాఘవధనుర్ముక్తాః=రాముని ధనస్సునుండి విడువబడిన, రుక్మపుఙ్ఖాః=బంగారు పొన్నులు గల, శిఖిప్రభాః=అగ్నివంటి కాంతి గల, తే=ఆ బాణములు, సర్పశత్రవః=సర్పములకు శత్రువులైన, కాఞ్చనాః=బంగారము వికారములైన, సుపర్ణాః=గరుత్మంతులుగా, భూత్వా=అయి, విచేరుః=సంచరించినవి.

తా. రాముని ధనస్సునుండి విడువబడిన, బంగారు పొన్నులు గల, అగ్నివలె ప్రకాశించుచున్న ఆ బాణములు సర్పములకు శత్రువులైన బంగారు గరుత్మంతులుగా అయి సంచరించెను. 26

మూ. తే తాన్ సర్వాన్ శరాన్ జఘ్నుః సర్పరూపాన్ మహాజవాన్,
సుపర్ణరూపా రామస్య విశిఖాః కామరూపిణః. 27

ప్ర. అ. రామస్య=రామునియొక్క, కామరూపిణః=స్వేచ్ఛానుసారము రూపములు గల, సుపర్ణరూపాః=గరుత్మద్రూపములు గల, తే=ఆ, విశిఖాః=బాణములు, మహాజవాన్=గొప్ప వేగము గల, సర్పరూపాన్=సర్పరూపములో ఉన్న, సర్వాన్=సమస్తమైన, తాన్ శరాన్=ఆ బాణములను, జఘ్నుః=కొట్టివేసినవి.

తా. స్వేచ్ఛారూపము గల, గరుత్మత్ పక్షుల ఆకారములతో ఉన్న ఆ రాముని బాణములు, గొప్ప వేగము గల, సర్పరూపములైన ఆ బాణముల నన్నింటిని కొట్టివేసెను. 27

మూ. అస్త్రే ప్రతిహతే క్రుద్ధో రావణో రాక్షసాధిపః,
అభ్యవర్షత్తదా రామం ఘోరాభిః శరవృష్టిభిః. 28

ప్ర. అ. అస్త్రే=అస్త్రము, ప్రతిహతే=కొట్టివేయబడినదగుచుండగా, క్రుద్ధః=కోపించిన, రాక్షసాధిపః=రావణుడు, తదా=అప్పుడు, ఘోరాభిః=భయంకరములైన, శరవృష్టిభిః=బాణవర్షములచేత, రామమ్=రామున్ణి, అభ్యవర్షత్=వర్షించెను.

తా. ఆ అస్త్రము కొట్టివేయబడుటచే కోపించిన రాక్షసరాజైన రావణుడు, అప్పుడు రామునిపై ఘోరములైన బాణవర్షములు కురిపించెను. 28

మూ. తతః శరసహస్రేణ రామమక్లిష్టకారిణమ్,
అర్దయిత్వా శరౌఘేణ మాతలిం ప్రత్యవిధ్యత. 29

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శరసహస్రేణ=బాణముల సహస్రము చేత, అక్లిష్టకారిణమ్=శ్రమలేకుండా పనులు చేయు, రామమ్=రాముణ్ణి, అర్దయిత్వా=పీడించి, శరౌఘేణ=బాణసముదాయముచేత, మాతలిమ్=మాతలిని, ప్రత్యవిధ్యత=కొట్టెను.

తా. పిమ్మట వేయి బాణాలచేత, శ్రమపడకుండా కార్యములు చేయు రాముణ్ణి పీడించి, బాణసముదాయముచే మాతలిని కొట్టెను. 29

మూ. చిచ్ఛేద కేతుముద్దిశ్య శరేణైకేన రావణః,
పాతయిత్వా రథోపస్థే రథాత్కేతుం చ కాఞ్చనమ్, 30
ఐన్ద్రానపి జఘానాశ్వాన్ శరజాలేన రావణః.

ప్ర. అ. రావణః=రావణుడు, ఏకేన=ఒక, శరేణ=బాణముచేత, ఉద్దిశ్య=గురిచూచి, కేతుమ్=కేతువును, చిచ్ఛేద=ఛేదించెను. కాఞ్చనమ్=బంగారము వికారమైన, కేతుమ్=ధ్వజమును, రథాత్=రథమునుండి, రథోపస్థే=రథము పైభాగమునందు, పాతయిత్వా=పడగొట్టి, రావణః=రావణుడు, శరజాలేన=బాణసముదాయముచేత, ఐన్ద్రాన్=ఇంద్రుని సంబంధమైన, అశ్వాన్ అపి=గుఱ్ఱములను కూడ, జఘాన=కొట్టెను.

తా. రావణుడు ఒక బాణముతో గురి చూచి కొట్టి ధ్వజమును ఛేదించెను. ఆ బంగారు ధ్వజమును రథశిఖరమునుండి రథము పైభాగమున పడగొట్టి బాణసముదాయముచేత ఇంద్రుని అశ్వములను కొట్టెను. 30

మూ. విషేదుర్దేవగన్ధర్వాచారణా దానవైః సహ, 31
రామమార్తం తథా దృష్ట్వా సిద్ధాశ్చ పరమర్షయః,
వ్యథితా వానరేన్ద్రాశ్చ బభూవుః సవిభీషణాః, 32
రామచన్ద్రమసం దృష్ట్వా గ్రస్తం రావణరాహుణా.

ప్ర. అ. తదా=అప్పుడు, ఆర్తమ్=పీడితుడైన, రామమ్=రాముణ్ణి, దృష్ట్వా=చూచి, దేవగన్ధర్వచారణాః=దేవతలు, గంధర్వులు, చారణులు, దానవైః సహ=దానవులతో కూడ, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, విషేదుః=దిగులు చెందిరి. రావణరాహుణా=రావణు డనే రాహువుచేత, గ్రస్తమ్=మింగబడిన, రామచన్ద్రమసమ్=రాము డనే చంద్రుణ్ణి, దృష్ట్వా=చూచి, సవిభీషణాః=విభీషణునితో కూడిన, వానరేన్ద్రాశ్చ=వానరనాయకులు కూడ, వ్యథితాః=వ్యథ చెందినవారు, బభూవుః=అయిరి.

తా. ఆ విధముగా పీడింపబడిన రాముణ్ణి చూచి దేవ - గంధర్వ - చారణులు, దానవులు, సిద్ధులు, మహర్షులు దిగులు చెందిరి. రావణు డనే

రాహువు రాము డనే చంద్రుణ్ణి మ్రింగివేయుట చూచి వానరనాయకులు, విభీషణుడూ కూడ వ్యథ చెందిరి. 31, 32

మూ. ప్రాజాపత్యం చ నక్షత్రం రోహిణీం శశినః ప్రియామ్, 33
సమాక్రమ్య బుధస్తస్థౌ ప్రజానామశుభావహః.

ప్ర. అ. ప్రాజాపత్యమ్=ప్రజాపతిదేవతాకమైన, నక్షత్రమ్=నక్షత్రమైన, శశినః=చంద్రునకు, ప్రియామ్=ఇష్టురాలైన, రోహిణీమ్=రోహిణిని, బుధః=బుధుడు, ఆక్రమ్య=ఆక్రమించి, ప్రజానామ్=ప్రజలకు, అశుభావహః=అశుభమును సూచించుచు, తస్థౌ=ఉండెను.

తా. బుధుడు ప్రజలకు అశుభమును సూచించుచు, ప్రజాపతి దేవతగా గల నక్షత్రమైన, చంద్రునకు ప్రియురాలైన రోహిణిని ఆక్రమించుకొని ఉండెను.

మూ. సధూమపరివృత్తోర్మిః ప్రజ్వలన్నివ సాగరః, 34
ఉత్పపాత తదా క్రుద్ధః స్పృశన్నివ దివాకరమ్.

ప్ర.అ. సధూమపరివృత్తోర్మిః=ధూమముతో కూడిన, ఎగురుచున్న తరంగములు గల, ప్రజ్వలన్నివ=మండుచున్నది వలె ఉన్న, సాగరః=సముద్రము, తదా=అప్పుడు, క్రుద్ధః=కోపించినదై, దివాకరమ్=సూర్యుణ్ణి, స్పృశన్నివ=స్పృశించుచున్నది వలె, ఉత్పపాత=ఎగిరెను.

తా. అప్పుడు ధూమముతో కూడి ఎగురుచున్న తరంగములతో మండుచున్నదా అన్నట్లు ఉన్న సముద్రము ప్రకోపించి, సూర్యుణ్ణి స్పృశించుచున్నదా అన్నట్లు పైకి లేచెను. 34

మూ. శస్త్రవర్ణః సుపరుషో మన్దరశ్మిర్దివాకరః, 35
అదృశ్యత కబన్ధాఙ్కః సంసక్తో ధూమకేతునా.

ప్ర. అ. శస్త్రవర్ణః=ఖడ్గమువంటి నల్లని కాంతి గల, సుపరుషః=చాల పరుషముగా ఉన్న, మన్దరశ్మిః=మందములైన కిరణములు గల, దివాకరః=సూర్యుడు, కబన్ధాఙ్కః=మొండెము సమీపమునందు కలవాడై, ధూమకేతునా=తోకచుక్కతో, సంసక్తః=కలసినవాడై, అదృశ్యత=కనబడెను.

తా. కిరణములు కాంతివిహీనములు కాగా నల్లగా అయిన, పరుషముగా ఉన్న సూర్యమండలము దగ్గర మొండెము, తోకచుక్క కనబడెను. 35

మూ. కోసలానాం చ నక్షత్రం వ్యక్తమిన్ద్రాగ్నిదైవతమ్, 36
ఆక్రమ్యాఙ్గారకస్తస్థౌ విశాఖామపి చామ్బరే.

ప్ర. అ. అమ్బరే=ఆకాశమునందు, అఙ్గారకః=అంగారకుడు, ఐన్ద్రాగ్నిదై

వతమ్=ఇంద్రాగ్నులు దేవతలుగా గల, కోసలానామ్=కోసలదేశరాజులయొక్క, నక్షత్రమ్=నక్షత్రమైన, విశాఖామ్=విశాఖను, ఆక్రమ్య=ఆక్రమించి, తస్థౌ=ఉండెను.

తా. ఇక్ష్వాకువంశీయుల నక్షత్రము, ఇంద్రాగ్నులు దేవతలుగా గలదీ అయిన విశాఖను ఆకాశమునందు అంగారకుడు ఆక్రమించుకొని ఉండెను.36

మూ. దశాస్యో వింశతిభుజః ప్రగృహీతశరాసనః, 37
అదృశ్యత దశగ్రీవో మైనాక ఇవ పర్వతః.

ప్ర. అ. దశాస్యః=పది ముఖములు గలవాడు, వింశతిభుజః=నూరు భుజములు గలవాడు, ప్రగృహీతశరాసనః=గ్రహింపబడిన ధనస్సు కలవాడు అయిన, దశగ్రీవః=రావణుడు, మైనాకః పర్వతః ఇవ=మైనాక పర్వతము వలె, అదృశ్యత=కనబడెను.

తా. ధనస్సు ధరించి పది ముఖములతో, ఇరవై చేతులలో నిలచి ఉన్న ఆ రావణుడు మైనాకపర్వతమువలె కనబడుచుండెను. 37

మూ. నిరస్యమానో రామస్తు దశగ్రీవేణ రక్షసా, 38
నాశక్నోదభిసంధాతుం సాయకాన్ రణమూర్ధని.

ప్ర. అ. రక్షసా=రాక్షసుడైన, దశగ్రీవేణ=రావణునిచేత, రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, నిరస్యమానః= కొట్టబడుచున్న, రామః=రాముడు, సాయకాన్=బాణములను, అభిసంధాతుమ్=సంధించుటకు, నాశక్నోత్= సమర్థుడు కాలేదు.

తా. రాక్షసుడైన రావణుడు యుద్ధాగ్రమునందు ఈవిధముగా ఆక్రమించి కొట్టుచుండగా రాముడు బాణాలను సంధించజాలకపోయెను. 38

మూ. స కృత్వా భ్రుకుటిం క్రుద్ధః కించిత్సంరక్తలోచనః, 39
జగామ సుమహాక్రోధం నిర్దహన్నివ చక్షుషా.

ప్ర. అ. సః= ఆ రాముడు, క్రుద్ధః=కోపించినవాడై, భృకుటిమ్=కనుబొమ్మల విరుపును, కృత్వా=చేసి, కించిత్=కొంచెము, సంరక్తలోచనః=ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, చక్షుషా=నేత్రముతో, నిర్దహన్నివ=కాల్చివేయుచున్నవాడు వలె, సుమహాక్రోధమ్=చాల అధికమైన క్రోధమును, జగామ=పొందెను.

తా. ఆ రాముడు కోపించి, కనుబొమ్మలు విరిచి, కొంచెను ఎఱ్ఱగానున్న నేత్రములు గలవాడై చూపుతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు చాల కోపము చెందెను. 39

మూ. తస్య క్రుద్ధస్య వదనం దృష్ట్వా రామస్య ధీమతః, 40
సర్వభూతాని విత్రేసుః ప్రాకమ్పత చ మేదినీ.

ప్ర. అ. క్రుద్ధస్య=కోపించిన, ధీమతః=బుద్ధిమంతుడైన, తస్య రామస్య=ఆ రామునియొక్క, వదనమ్=ముఖమును, దృష్ట్వా=చూచి, సర్వభూతాని=సకలభూతములు, విత్రేసుః=భయపడినవి. మేదినీ చ=భూమి కూడ, ప్రాకమ్పత=కంపించెను.

తా. కోపించిన బుద్ధిమంతుడైన రాముని ముఖము చూచి సకల ప్రాణులు భయము చెందినవి. భూమి కూడ కంపించెను. 40

మూ. సింహశార్దూలవాన్ శైలః సంచచాల చలద్ద్రుమః,
బభూవ చాపి క్షుభితః సముద్రః సరితాం పతిః. 41

ప్ర. అ. సింహశార్దూలవాన్=సింహశార్దూరములు గల, చలద్ద్రుమః=కదలుచున్న వృక్షములు గల, శైలః=పర్వతము, సంచచాల=చలించెను. సరితాం పతిః=నదుల భర్తయైన, సముద్రః చాపి=సముద్రము కూడ, క్షుభితః=క్షోభ చెందినది, బభూవ=అయెను.

తా. సింహములతోను, పెద్దపులులతోను కూడిన పర్వతము చలించెను. దానిమీద నున్న చెట్లు ఇటు అటు ఆడిపోయెను. నదుల ప్రభువైన సముద్రము క్షోభించెను. 41

మూ. ఖరాశ్చ ఖరనిర్ఘోషా గగనే పరుషా ఘనాః,
ఔత్పాతికాశ్చ నర్దన్తః సమన్తాత్ పరిచక్రముః. 42

ప్ర. అ. ఖరాః=గాడిదల రంగు గల, ఖరనిర్ఘోషాః=కటువైన ఉరుములు గల, పరుషాః=పరుషములైన, ఔత్పాతికాః=ఉపద్రవమును సూచించు, ఘనాః=మేఘములు, గగనే=ఆకాశమునందు, సమన్తాత్=అంతటా, పరిచక్రముః=తిరిగినవి.

తా. గాడిదరంగుతో కటువైన ఉరుములు గల పరుషములైన మేఖములు, రాబోవు ఉపద్రవమును సూచించుచు, ధ్వని చేయుచు, ఆకాశములో అంతటా ఎగిరినవి. 42

మూ. రామం దృష్ట్వా సుసంక్రుద్ధముత్పాతాంశ్చైవ దారుణాన్,
విత్రేసుః సర్వభూతాని రావణస్యాభవద్భయమ్. 43

ప్ర. అ. సుసంక్రుద్ధమ్=మిక్కిలి కోపించిన, రామమ్=రాముణ్ణి, దారుణాన్=దారుణములైన, ఉత్పాతాన్ చ=అపశకునములను, దృష్ట్వా=చూచి, సర్వభూతాని=సకలభూతములు, విత్రేసుః=భయపడినవి. రావణస్య=రావణునకు, భయమ్=భయము, అభవత్=కలిగెను.

తా. చాల కోపించిన రాముణ్ణీ, దారుణములైన దుఃశకునములను చూచి ప్రాణు లన్నీ భయపడినవి. రావణునకు భయము కలిగెను. 43

మూ. విమానస్థాస్తదా దేవా గన్ధర్వాశ్చ మహోరగాః,
ఋషిదానవదైత్యాశ్చ గరుత్మన్తశ్చ ఖేచరాః, 44
దదృశుస్తే తదా యుద్ధం లోకసంవర్తసంస్థితమ్,
నానాప్రహరణైర్భీమైః శూరయోః సంప్రయుధ్యతోః. 45

ప్ర. అ. తదా=అప్పుడు, భీమైః=భయంకరములైన, నానాప్రహరణైః=అనేకవిధములైన ఆయుధములతో, సంప్రయుధ్యతోః=యుద్ధముచేయుచున్న, శూరయోః=ఆ ఇద్దరు శూరులయొక్క, లోకసంవర్తసంస్థితమ్=ప్రలయకాలమువంటి స్వరూపము గల, యుద్ధమ్=యుద్ధమును,తదా=అప్పుడు, విమానస్థాః=విమానములయందున్న, దేవాః=దేవతలు, గన్ధర్వాశ్చ=గంధర్వులు, మహోరగాః=మహోరగులు, ఋషిదానవదైత్యాశ్చ=ఋషులు, దానవులు, దైత్యులు, ఖేచరాః=ఆకాశమునందు తిరుగుచున్న, తే=ఆ, గరుత్మన్తశ్చ=గరుడపక్షులు, దదృశుః=చూచిరి.

తా. అప్పుడు భయంకరములైన అనేకవిధములైన ఆయుధములతో యుద్ధము చేయుచున్న ఆ ఇద్దరు శూరుల, ప్రళయముతో సమానమైన యుద్ధమును, విమానములలో ఉన్న దేవతలు, గంధర్వులు, మహోరథులు, ఋషులు, దానవులు, దైత్యులు ఆకాశముమీద సంచరించుచున్న గరుత్మంతులు చూచిరి. 44, 45

మూ. ఊచుః సురాసురాః సర్వే తదా విగ్రహమాగతాః,
ప్రేక్షమాణా మహద్యుద్ధం వాక్యం భక్త్యా ప్రహృష్టవత్. 46

ప్ర. అ. తదా=అప్పుడు, మహత్=గొప్ప, యుద్ధమ్=యుద్ధమును, ప్రేక్షమాణాః=చూచుచున్న, సర్వే=సమస్తమైన, సురాసురాః=సురులు అసురులు, విగ్రహమ్=విరోధమును, ఆగతాః=పొందినవారై, ప్రహృష్టవత్=సంతోషించినవారై, భక్త్యా=భక్తితో, వాక్యమ్=వాక్యమును, ఊచుః=పలికిరి.

తా. అప్పుడు ఆ మహాయుద్ధమును చూచుచున్న సురులూ, అసురులూ అందరూ ఒకరితో ఒకరు కలహించుకొనుచు, సంతోషించుచు ఆసక్తితో ఇట్లు పలికిరి. 46

మూ. దశగ్రీవం జయేత్యాహురసురాః సమవస్థితాః,
దేవా రామమవోచంస్తే త్వం జయేతి పునః పునః. 47

ప్ర. అ. సమవస్థితాః=అక్కడ నిలచిన, అసురాః=అసురులు, దశగ్రీవమ్=రావణుని గూర్చి, జయ ఇతి=జయించుము అని, ఆహుః=పలికిరి.

తే=ఆ, దేవాః=దేవతలు, త్వమ్=నీవు, జయ=జయించుము, ఇతి=అని, పునః పునః=మాటిమాటికి, రామమ్=రాముణ్ణి గూర్చి, ఆహుః=పలికిరి.

తా.అక్కడ చేరిన అసురులు "నీవు జయించుము" అని రావణునితోను, దేవతలు, "నీవు జయించుము" అని రామునితోను మాటి మాటికి పలికిరి.47

మూ. ఏతస్మిన్నన్తరే క్రోధాద్రాఘవస్య స రావణః,
ప్రహర్తుకామో దుష్టాత్మా స్పృశన్ ప్రహరణం మహత్, 48
వజ్రసారం మహానాదం సర్వశత్రునిబర్హణమ్,
శైలశృఙ్గనిభైః కూటైశ్చిత్తదృష్టిభయావహమ్, 49
సధూమమివ తీక్ష్ణాగ్రం యుగాన్తాగ్నిచయోపమమ్,
అతిరౌద్రమనాసాద్యం కాలేనాపి దురాసదమ్, 50
త్రాసనం సర్వభూతానాం దారణం భేదనం తథా,
ప్రదీప్తమివ రోషేణ శూలం జగ్రాహ రావణః. 51

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యయందు, దుష్టాత్మా=దుష్టబుద్ధిగల, రావణః=శత్రువులను ఏడ్పించు, సః=ఆ, రావణః=రావణుడు, క్రోధాత్=కోపమువలన, రాఘవస్య=రామునకు, ప్రహర్తుకామః=కొట్టుటకు కోరిక గలవాడై, మహత్=గొప్పదైన, ప్రహరణమ్=ఆయుధమును, స్పృశన్=స్పృశించుచు, వజ్రసారమ్=వజ్రమువంటి సారము గలది, మహానాదమ్=గొప్ప ధ్వని గలది, సర్వశత్రునిబర్హణమ్=సకల శత్రువులను సంహరించునది, శైలశృఙ్గనిభైః=పర్వతశిఖరములతో సమానములైన, కూటైః=అగ్రభాగములచేత, చిత్తదృష్టిభయావహమ్=చిత్తమునకు దృష్టికీ భయము కలిగించునది, సధూమమివ=ధూమముతో కూడినట్లున్నది, తీక్ష్ణాగ్రమ్=తీక్ష్ణమైన అగ్రభాగము గలది, యుగాన్తాగ్నిచయోపమమ్=ప్రళయకాలమునందలి అగ్నిరాశితో సమానము, అతిరౌద్రమ్=చాల భయంకరము, అనాసాద్యమ్=సమీపింప శక్యము కానిది, కాలేనాపి=యమునిచేత గూడ, దురాసాద్యమ్=ఎదిరింప శక్యము కానిది, సర్వభూతానామ్=సకల ప్రాణులకు, త్రాసనమ్=భయము కలిగించునది, దారణమ్=చీల్చునది, తథా=మరియు, భేదనమ్=బద్దలుకొట్టునది అయిన, ప్రదీప్తమ్ ఇవ=మండుచున్నట్లు ఉన్న, శూలమ్=శూలమును, రోషేణ=రోషముతో, జగ్రాహ=గ్రహించెను.

తా. ఇంతలో దురాత్ముడైన, శత్రువులను ఏడిపించు ఆ రావణుడు కోపముతో, రాముణ్ణి కొట్టుటకై గొప్ప ఆయుధమును స్పృశించుచు వజ్రమువంటి సారము, గొప్ప ధ్వనీ గల, సర్వశత్రువినాశకమైన శూలమును గ్రహించెను. అది పర్వత శిఖరములు వలె ఉన్న అగ్రభాగములతో చూచుటకు, చిత్తమునకు భయము కలిగించుచుండెను. ధూమముతో కూడిన తీక్ష్ణాగ్రములు గల ఆ

శూలము ప్రళయకాలమునందలి అగ్నిరాశి వలె చాల భయంకరమై సమీపింప శక్యము కానిదిగా ఉండెను. యముడు కూడ ఎదిరించ జాలని ఆ శూలము సకల ప్రాణులకు భయంకరమై ఉండెను. అది చీల్చుటకు బ్రద్దలుకొట్టుటకు సమర్థమై మండుచున్నదా అన్నట్లుండెను. 48 - 51

మూ. తచ్ఛూలం పరమక్రుద్ధో మధ్యే జగ్రాహ వీర్యవాన్,
అనీకైః సమరే శూరై రాక్షసైః పరివారితః. 52

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, రాక్షసైః=రాక్షససంబంధమైన, శూరైః=శౌర్యముగల, అనీకైః=సైన్యములచేత, పరివారితః=చుట్టబడిన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన రావణుడు, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, తత్=ఆ, శూలమ్=శూలమును, మధ్యే=మధ్యయందు, జగ్రాహ=గ్రహించెను.

తా. యుద్ధమునందు శూరులైన రాక్షససైనికులతో కూడిన పరాక్రమవంతుడైన ఆ రావణుడు మిక్కిలి కోపించి, ఆ శూలమును మధ్య భాగమునందు పట్టుకొనెను. 52

మూ. సముద్యమ్య మహాకాయో ననాద యుధి భైరవమ్,
సంరక్తనయనో రోషాత్ స్వసైన్యమభిహర్షయన్. 53

ప్ర. అ. మహాకాయః=పెద్ద శరీరము గల ఆ రావణుడు, సముద్యమ్య=ఎత్తి, రోషాత్=కోపమువలన, సంరక్తనయనః=ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, స్వసైన్యమ్=తన సైన్యమును, అభిహర్షయన్=సంతోషపెట్టుచు, యుధి=యుద్ధమునందు, భైరవమ్=భయంకరముగా, ననాద=ధ్వని చేసెను.

తా. పెద్ద శరీరము గల ఆ రావణుడు కోపమువలన ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై తన సైన్యమునకు సంతోషము కలిగించుచు, యుద్ధమునందు, భయంకరముగా అరచెను. 53

మూ. పృథివీం చాన్తరిక్షం చ దిశశ్చ ప్రదిశస్తథా,
ప్రాకమ్పయత్తదా శబ్దో రాక్షసేన్ద్రస్య దారుణః. 54

ప్ర. అ. తదా=అప్పుడు, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, దారుణః=భయంకరమైన, శబ్దః=శబ్దము, పృథివీం చ=భూమిని, అన్తరిక్షం చ=ఆకాశమును, దిశశ్చ=దిక్కులను, తథా=మరియు, ప్రదిశశ్చ=విదిక్కులను, ప్రాకమ్పయత్=కంపింపచేసెను.

తా. అప్పుడు రావణుడు చేసిన దారుణమైన శబ్దము భూమిని, ఆకాశమును, దిక్కులను, విదిక్కులను కంపింపచేసెను. 54

మూ. అతికాయస్య నాదేన తేన తస్య దురాత్మనః,
సర్వభూతాని విత్రేసుః సాగరశ్చ ప్రచుక్షుభే. 55

ప్ర. అ. అతికాయస్య=పెద్ద శరీరము గల, దురాత్మనః=దురాత్ముడైన, తస్య=వానియొక్క, తేన నాదేన=ఆ ధ్వనిచేత, సర్వభూతాని=సకలభూతములు, విత్రేసుః=భయపడినవి. సాగరశ్చ=సముద్రము కూడ, ప్రచుక్షుభే=క్షోభించెను.

తా. పెద్ద శరీరము గల ఆ దురాత్ముని ధ్వనిచేత సకలభూతములు భయపడినవి. సముద్రము కూడ క్షోభించెను. 55

మూ. స గృహీత్వా మహావీర్యః శూలం తద్రావణో మహత్,
వినద్య సుమహానాదం రామం పరుషమబ్రవీత్. 56

ప్ర. అ. మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, సః=ఆ, రావణః=రావణుడు, మహత్=గొప్పదైన, తత్ శూలమ్=ఆ శూలమును, గృహీత్వా=గ్రహించి, సుమహానాదమ్=చాల గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినద్య=ధ్వనిచేసి, రామమ్=రాముణ్ణి గూర్చి, పరుషమ్=పరుషముగా, అబ్రవీత్=పలికెను.

తా. గొప్ప పరాక్రమము గల ఆ రావణుడు ఆ పెద్ద శూలమును గ్రహించి చాల బిగ్గరగా అరచి రామునితో పరుషముగా ఇట్లు పలికెను. 56

మూ. శూలోఽయం వజ్రసారస్తే రామ రోషాన్మయోద్యతః,
తవ భ్రాతృసహాయస్య సమ్యక్ ప్రాణాన్ హరిష్యతి. 57

ప్ర. అ. రామ=రామా! రోషాత్=కోపమువలన, మయా=నాచేత, ఉద్యతః=ఎత్తబడిన, వజ్రసారః=వజ్రమువంటి సారము గల, అయం శూలః=ఈ శూలము, భ్రాతృసహాయస్య=సోదరుడు సహాయుడుగా గల, తవ=నీయొక్క, ప్రాణాన్=ప్రాణములను, సమ్యక్=బాగుగా,. హరిష్యతి=హరించగలదు.

తా. ఓ రామా! కోపముతో నేను ఎత్తి ప్రయోగించిన, వజ్రమువంటి శక్తి గల ఈ శూలము నీ ప్రాణములను, నీ సోదరుని ప్రాణములను, తప్పక హరించగలదు. 57

మూ. రక్షసామద్య శూరాణాం నిహతానాం చమూముఖే,
త్వాం నిహత్య రణశ్లాఘీ కరోమి తరసా సమమ్. 58

ప్ర. అ. రణశ్లాఘీ=రణమునందు శ్లాఘ గల నేను, అద్య=ఇప్పుడు, తరసా=బలముచేత, త్వామ్=నిన్ను, నిహత్య=చంపి, చమూముఖే=సేనాగ్రము నందు, నిహతానామ్=చంపబడిన, శూరాణామ్=శూరులైన, రక్షసామ్=రాక్షసులకు, సమమ్=సమున్ణిగా, కరోమి=చేయుచున్నాను.

తా. రణమునందు శ్లాఘకు పాత్రుడ నైన నేను ఇప్పుడు బలముచేత నిన్ను చంపి, నిన్ను, యుద్ధరంగమునందు నీచేత చంపబడిన రాక్షసులతో సమానునిగా చేసెదను. 58

మూ. తిష్ఠేదానీం నిహన్మి త్వామేష శూలేన రాఘవ,
ఏవముక్త్వా స చిక్షేప తచ్ఛూలం రాక్షసాధిపః. 59

ప్ర. అ. రాఘవ=రామా ! తిష్ఠ=నిలువుము. ఏషః=ఈ నేను, ఇదానీమ్=ఇప్పుడు, శూలేన=శూలముచేత, త్వామ్=నిన్ను, నిహన్మి=చంపుచున్నాను. ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, సః=ఆ, రాక్షసాధిపః=రావణుడు, తత్=ఆ, శూలమ్=శూలమును, చిక్షేప=విసరెను.

తా. "రామా ! నిలబడుము, నిన్ను ఈ శూలముచేత చంపెదను." ఆ రావణుడు ఇట్లు పలికి శూలమును విసరెను. 59

మూ. తద్రావణకరాన్ముక్తం విద్యున్మాలాసమావృతమ్,
అష్టఘణ్టం మహానాదం వియద్గతమశోభత. 60

ప్ర. అ. రావణకరాత్=రావణుని హస్తమునుండి, ముక్తమ్=విడవబడినది, విద్యున్మాలాసమావృతమ్=మెరుపుల పంక్తులచేత కప్పబడినది, అష్టఘణ్టమ్=ఎనిమిది ఘంటలు గలది, మహానాదమ్=గొప్ప ధ్వని గలది అయిన,తత్=ఆ శూలము, వియద్గతమ్=ఆకాశమును పొందినదై, అశోభత=ప్రకాశించెను.

తా. మెరుపుల పంక్తులు చుట్టూ ఉన్న, ఎనిమిది ఘంటలు గల, గొప్ప ధ్వని చేయుచున్న ఆ శూలము రావణుని హస్తమునుండి విడవబడి ఆకాశమునందు ప్రకాశించెను. 60

మూ. తచ్ఛూలం రాఘవో దృష్ట్వా జ్వలన్తం ఘోరదర్శనమ్,
ససర్జ విశిఖాన్ రామశ్చాపమాయమ్య వీర్యవాన్. 61

ప్ర. అ. రాఘవః=రఘువంశసంజాతుడు, వీర్యవాన్=పరాక్రమవంతుడూ అయిన, రామః=రాముడు, జ్వలన్తమ్=మండుచున్న, ఘోరదర్శనమ్=భయంకరమైన దర్శనము గల, తత్=ఆ, శూలమ్=శూలమును, దృష్ట్వా=చూచి, చాపమ్=ధనస్సును, ఆయమ్య=వంచి, విశిఖాన్=బాణములను, ససర్జ=విడచెను.

తా. రఘువంశసంజాతుడు, పరాక్రమవంతుడూ అయిన రాముడు చూచుటకు భయంకరముగా నున్న, మండుచున్న ఆ శూలమును చూచి, ధనస్సు వంచి బాణములను విడచెను. 61

మూ. ఆపతన్తం శరౌఘేణ వారయామాస రాఘవః,
ఉత్పతన్తం యుగాన్తాగ్నిం జలౌఘైరివ వాసవః. 62

ప్ర. అ. ఆపతన్తమ్=వచ్చుచున్న ఆ శూలమును, రాఘవః=రాముడు, ఉత్పతన్తమ్=పైకి లేచుచున్న, యుగాన్తాగ్నిమ్=ప్రళయకాలాగ్నిని, వాసవః=దేవేంద్రుడు, జలౌఘైః ఇవ=జలసముదాయములచేత వలె, శరౌఘేణ=బాణసముదాయముచేత, వారయామాస=వారించెను.

తా. రాముడు వచ్చి మీద పడుచున్న ఆ శూలమును పైకి లేచుచున్న ప్రళయకాలాగ్నిని దేవేంద్రుడు జలధారలచేత వలె, బాణసముదాయముచేత నివారించెను. 62

మూ. నిర్దదాహ స తాన్ బాణాన్ రామకార్ముకనిఃసృతాన్,
రావణస్య మహాన్ శూలః పతఙ్గానివ పావకః. 63

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, సః=ఆ, మహాన్=గొప్పదైన, శూలః=శూలము, రామకార్ముకనిఃసృతాన్=రాముని ధనస్సునుండి బయలుదేరిన, తాన్ బాణాన్=ఆ బాణములను, పావకః=అగ్ని, పతఙ్గానివ=మిడతలను వలె, నిర్దదాహ=కాల్చివేసెను.

తా. రావణుని ఆ మహాశూలము రాముని ధనస్సునుండి బయలుదేరిన ఆ బాణములను అగ్ని మిడతలను కాల్చివేసినట్లు కాల్చివేసెను. 63

మూ. తాన్ దృష్ట్వా భస్మసాద్భూతాన్ శూలసంస్పర్శచూర్ణితాన్,
సాయకానన్తరిక్షస్థాన్ రాఘవః క్రోధమాహరత్. 64

ప్ర. అ. రాఘవః=రాముడు, శూలసంస్పర్శచూర్ణితాన్=శూలముయొక్క స్పర్శచేత చూర్ణముగా చేయబడిన, అన్తరిక్షస్థాన్=ఆకాశముమీద ఉన్న, భస్మసాద్భూతాన్=భస్మముగా అయిన, తాన్=ఆ, సాయకాన్=బాణములను, దృష్ట్వా=చూచి, క్రోధమ్=క్రోధమును, ఆహరత్=పొందెను.

తా. ఆకాశముమీద ఉండగానే శూలస్పర్శచేత చూర్ణితములై భస్మమైపోయిన ఆ బాణములను చూచి రాముడు కోపించెను. 64

మూ. స తాం మాతలినానీతాం శక్తిం వాసవసంమతామ్,
జగ్రాహ పరమక్రుద్ధో రాఘవో రఘునన్దనః. 65

ప్ర. అ. రఘునన్దనః=రఘువంశమునకు ఆనందకరుడైన, సః=ఆ, రాఘవః=రాముడు, పరమక్రుద్ధః=చాల కోపించినవాడై, మాతలినా=మాతలిచేత, ఆనీతామ్=తీసికొనిరాబడిన, వాసవసంమతామ్=ఇంద్రునిచేత గౌరవింపబడిన, తాం శక్తిమ్=ఆ శక్తిని, జగ్రాహ=గ్రహించెను.

తా. రఘువంశమునకు ఆనందకరుడైన రాముడు చాల కోపించి, మాతలి తీసికొనివచ్చిన, దేవేంద్రుని గౌరవమునకు పాత్రమైన ఆ శక్తిని గ్రహించెను. 65

మూ. సా తోలితా బలవతా శక్తిర్ఘణ్టాకృతస్వనా,
నభః ప్రజ్వాలయామాస యుగాన్తోల్కేవ సప్రభా. 66

ప్ర. అ. బలవతా=బలవంతుడైన రామునిచేత, తోలితా=కదల్పబడిన, ఘణ్టాకృతస్వనా=ఘంటలచేత చేయబడిన ధ్వని గల, సా శక్తిః=ఆ శక్తి, సప్రభా=కాంతితో కూడిన, యుగాన్తోల్కేవ=ప్రళయకాలమునందలి ఉల్క వలె, నభః=ఆకాశమును, ప్రజ్వాలయామాస=ప్రజ్వలింపచేసెను.

తా. బలవంతుడైన రాముడు పైకి ఎత్తిన ఆ శక్తి ఘంటల ధ్వని చేయుచు ప్రళయకాలమునందు పడుచున్న కాంతివంతమైన ఉల్కవలె ఆకాశమునందు మంటలు పుట్టించెను. 66

మూ. సా క్షిప్తా రాక్షసేన్ద్రస్య తస్మిన్ శూలే పపాత హ,
భిన్నః శక్త్యా మహాన్ శూలో నిపపాత హతద్యుతిః. 67

ప్ర. అ. సా=ఆ శక్తి, క్షిప్తా=విసరబడినదై, రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, తస్మిన్=ఆ, శూలే=శూలముమీద, నిపపాత హ=పడెను. మహాన్=గొప్పదైన, శూలః=శూలము, శక్త్యా=శక్తిచేత, భిన్నః=విరగగొట్టబడినదై, హతద్యుతిః=నశింపచేయబడిన కాంతి గలదై, నిపపాత=పడెను.

తా. రాముడు విసరిన ఆ శక్తి ఆ రావణుని శూలముమీద పడెను. ఆ మహాశూలము శక్తిచేత విరగగొట్టబడినదై, కాంతిహీనమై నేలమీద పడెను.

మూ. నిర్బిభేద తతో బాణైర్హయానస్య మహాజవాన్,
రామస్తీక్ష్ణైర్మహావేగైర్బాణవద్భిరజిహ్మగైః. 68

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, తీక్ష్ణైః=తీక్ష్ణములు, మహావేగైః=గొప్ప వేగము గలవి, బాణవద్భిః=ధ్వని గలవి, అజిహ్మగైః=తిన్నగా పోవునవి అయిన, బాణైః=బాణములచేత, మహాజవాన్=గొప్ప వేగము గల, అస్య=రావణునియొక్క, హయాన్=గుఱ్ఱములను, నిర్బిభేద=భేదించెను.

తా. పిమ్మట రాముడు తీక్ష్ణములు, గొప్ప వేగము గలవి, తిన్నగా వెళ్లునవి అయిన బాణాలచేత రావణుని మహావేగముగల గుఱ్ఱములను కొట్టెను.

మూ. నిర్బిభేదోరసి తదా రావణం నిశితైః శరైః,
రాఘవః పరమాయత్తో లలాటే పత్త్రిభిస్త్రిభిః. 69

ప్ర. అ. రాఘవః=రాముడు, తదా=అప్పుడు, నిశితైః=వాడియైన, శరైః=బాణములచేత, రావణమ్=రావణుణ్ణి, ఉరసి=వక్షః స్థలముమీద, నిర్బిభేద=భేదించెను. పరమాయత్తః=మిక్కిలి ప్రయత్నము చేయుచున్నవాడై, త్రిభిః=మూడు, పత్త్రిభిః=బాణములచేత, లలాటే=లలాటమునందు, కొట్టెను.

తా. రాముడు అప్పుడు వాడియైన బాణాలచేత రావణుని వక్షస్థలమును భేదించెను. మూడు బాణాలచేత, ప్రయత్న పూర్వకముగా ఆతని లలాటముమీద కొట్టెను. 69

మూ. స శరైర్భిన్నసర్వాఙ్గో గాత్రప్రస్రుతశోణితః,
రాక్షసేన్ద్రః సమూహస్థః ఫుల్లాశోక ఇవాబభౌ. 70

ప్ర. అ. శరైః=బాణములచేత, భిన్నసర్వాఙ్గః=భేదింపబడిన సకల అవయములు గల, గాత్రప్రస్రుతశోణితః= శరీరమునుండి స్రవించుచున్న రక్తము గల, సః=ఆ, రాక్షసేన్ద్రః=రావణుడు, సమూహస్థః= వృక్షసమూహమునందున్న, ఫుల్లాశోకః ఇవ=వికసించిన అశోకవృక్షము వలె, ఆబభౌ=ప్రకాశించెను.

తా. బాణములచేత అవయవము లన్నీ భేదింపబడగా దేహమునుండి రక్తము కారుచున్న ఆ రావణుడు వృక్షముల మధ్య నున్న వికసించిన అశోకవృక్షమువలె ఉండెను. 70

మూ. స రామబాణైరతివిద్ధగాత్రో
నిశాచరేన్ద్రః క్షతజార్ద్రగాత్రః,
జగామ ఖేదం చ సమాజమధ్యే
క్రోధం చ చక్రే సుభృశం తదానీమ్. 71

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ద్వ్యధికశతతమః సర్గః.

ప్ర. అ. రామబాణైః=రాముని బాణములచేత, అతివిద్ధగాత్రః=మిక్కిలి కొట్టబడిన అవయవములు గల, క్షతజార్ద్రగాత్రః=రక్తముచేత తడిసిన శరీరముగల, సః=ఆ, నిశాచరేన్ద్రః=రావణుడు, సమాజమధ్యే=రాక్షససమూహమందు, ఖేదమ్=శ్రమను, జగామ=పొందెను. తదానీమ్=అప్పుడు, సుభృశమ్=మిక్కిలి, క్రోధం చ=క్రోధమును కూడ, చక్రే=చేసెను.

తా. రాముని బాణములచేత ఎక్కువగా కొట్టబడి రక్తముతో తడిసిన శరీరము గల ఆ రావణుడు రాక్షససమూహము మధ్య ఎక్కువ అలసట చెంది చాల కోపించెను. 71

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో నూటరెండవ సర్గ సమాప్తము.

## అథ త్ర్యధికశతతమః సర్గః

*[రాముడు రావణుని అధిక్షేపించుట. యుద్ధములో అలసిపోయిన రావణుని ఆతని సారథి యుద్ధరంగమునుండి దూరముగా తీసికొనిపోవుట.]*

మూ. స తు తేన తదా క్రోధాత్ కాకుత్స్థేనార్దితో భృశమ్,
రావణః సమరశ్లాఘీ మహాక్రోధముపాగమత్. 1

ప్ర. అ. తదా=అప్పుడు, తేన కాకుత్స్థేన=ఆ రావణునిచేత, క్రోధాత్=కోపమువలన, భృశమ్=మిక్కిలి, అర్దితః=పీడించబడిన, సమరశ్లాఘీ=యుద్ధమునందు శ్లాఘించుకొను, సః రావణః=ఆ రావణుడు, మహాక్రోధమ్=గొప్ప క్రోధమును, ఉపాగమత్=పొందెను.

తా. కోపించిన రామునిచేత ఆ విధముగా పీడించబడిన, రణమునందు శ్లాఘించుకొను ఆ రావణుడు చాల కోపమును పొందెను. 1

మూ స దీప్తనయనోఽమర్షాచ్చాపముద్యమ్య వీర్యవాన్,
అభ్యర్దయత్ సుసంక్రుద్ధో రాఘవం పరమాహవే, 2
బాణధారాసహస్రైస్తు స తోయద ఇవామ్బరాత్,
రాఘవం రావణో బాణైస్తటాకమివ పూరయన్. 3

ప్ర. అ. ("బాణైః"కి బదులు "వీరః" అని ప్రాచ్యపాఠము బాగున్నది). వీర్యవాన్=పరాక్రమము గల, వీరః=వీరుడైన, సః=అతడు, అమర్షాత్=కోపమువలన, దీప్తనయనః=ప్రజ్వలించుచున్న నేత్రములు గలవాడై, రాఘవమ్=రామునిగూర్చి, సుసంక్రుద్ధః=చాల కోపించినవాడై, చాపమ్=ధనస్సును, ఉద్యమ్య=ఎత్తి, అమ్బరాత్=ఆకాశమునుండి, సః=ప్రసిద్ధమైన, తోయదః ఇవ=మేఘము వలె, తటాకమ్ ఇవ=చెరువును వలె, బాణధారాసహస్రైః=బాణధారల సహస్రముచేత, రాఘవమ్=రాముణ్ణి, పూరయన్=నింపుచు, అభ్యర్దయత్=పీడించెను.

తా. పరాక్రమవంతుడు వీరుడూ అయిన ఆ రావణుడు కోపమువలన ప్రజ్వలించుచున్న నేత్రములు కలవాడై ఆ మహాయుద్ధమునందు రాముని పై కోపించి, ఆకాశమునుండి మేఘము చెరువును వలె వేలకొలది బాణధారలచేత

రాముణ్ణి నింపివేసి పీడించెను. 2, 3

మూ. పూరితః శరజాలేన ధనుర్ముక్తేన సంయుగే,
మహాగిరిరివాకమ్ప్యః కాకుత్స్థో న ప్రకమ్పతే. 4

ప్ర. అ. సంయుగే=యుద్ధమునందు, ధనుర్ముక్తేన=ధనస్సునుండి విడువబడిన, శరజాలేన=బాణసముదాయముచేత, పూరితః=నింపబడిన, కాకుత్స్థః=రాముడు, అకమ్ప్యః=కంపింప శక్యముకాని, మహాగిరిరివ=మహా పర్వతమువలె, న కమ్పతే=కంపించలేదు.

తా. యుద్ధములో ధనస్సునుండ విడువబడిన బాణసముదాయముచేత నింపబడిన రాముడు, కంపింపచేయ శక్యము కాని మహాపర్వతము వలె కంపింపలేదు. 4

స శరైః శరజాలాని వారయన్ సమరే స్థితః,
గభస్తీనివ సూర్యస్య ప్రతిజగ్రాహ వీర్యవాన్. 5

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సః=రాముడు, సమరే=యుద్ధమునందు, స్థితః=నిలచినవాడై, శరైః=బాణములచేత, శరజాలాని=బాణసముదాయములను, వారయన్=నివారించుచు, సూర్యస్య=సూర్యునియొక్క, గభస్తీనివ=కిరణములను వలె, ప్రతిజగ్రాహ=స్వీకరించెను.

తా. పరాక్రమశాలియైన రాముడు యుద్ధములో నిలచి, బాణసముదాయములను బాణములచేత నివారించుచు, సూర్యకిరణములను వలె స్వీకరించెను. 5

మూ. తతః శరసహస్రాణి క్షిప్రహస్తో నిశాచరః,
నిజఘానోరసి క్రుద్ధో రాఘవస్య మహాత్మనః. 6

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్షిప్రహస్తః=శీఘ్రమైన హస్తము గల, నిశాచరః=రావణుడు, క్రుద్ధః=కోపించినవాడై, మహాత్మనః=మహాత్ముడైన, రాఘవస్య=రామునియొక్క, ఉరసి=వక్షః స్థలమునందు, శరసహస్రాణి=వేలకొలది బాణములను, నిజఘాన=కొట్టెను.

తా. పిమ్మట హస్తలాఘవము గల రావణుడు కోపించి మహాత్ముడైన రాముని వక్షఃస్థలముమీద వేలకొలది బాణములను ప్రయోగించెను. 6

మూ. స శోణితసమాదిగ్ధః సమరే లక్ష్మణాగ్రజః,
దృష్టః ఫుల్ల ఇవారణ్యే సుమహాన్ కింశుకద్రుమః. 7

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, శోణితసమాదిగ్ధః=రక్తముచేత పూయు బడిన, లక్ష్మణాగ్రజః=రాముడు, అరణ్యే=అరణ్యమునందు, ఫుల్లః=వికసించిన, సుమహాన్=చాల పెద్దదైన, కింశుకద్రుమః ఇవ=మోదుగచెట్టు వలె, దృష్టః=చూడబడెను.

తా. యుద్ధమునందు రక్తముతో తడిసిన రాముడు అరణ్యములో పుష్పించిన పెద్దదైన కింశుకవృక్షమువలె కనబడెను. 7

మూ. శరాభిఘాతసంరబ్ధః సోఽభిజగ్రాహ సాయకాన్,
కాకుత్స్థః సుమహాతేజా యుగాన్తాదిత్యతేజసః. 8

ప్ర. అ. శరాభిఘాతసంరబ్ధః=శరముల దెబ్బచేత తొందరపడుచున్నవాడై, సుమహాతేజాః=గొప్ప తేజస్సు గల, సః కాకుత్స్థః= ఆ రాముడు, యుగాన్తాదిత్యతేజసః=యుగాంతమునం దున్న సూర్యునితో సమానమైన తేజస్సు గల, సాయకాన్=బాణములను, అభిజగ్రాహ=గ్రహించెను.

తా. బాణముల దెబ్బ తినుటచే తొందరపడుచు గొప్ప తేజస్సు గల రాముడు ప్రళయకాలాగ్నితో సమానమైన తేజస్సు గల బాణములను గ్రహించెను.

మూ. తతోఽన్యోన్యం సుసంరబ్ధౌ తావుభౌ రామరావణౌ,
శరాన్ధకారే సమరే నోపలక్షయతాం తదా. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుసంరబ్ధౌ=బాగా తొందరపడుచున్న, తౌ=ఆ, ఉభౌ=ఇద్దరు, రామరావణౌ=రామరావణులు, తదా=అప్పుడు, శరాన్ధకారే=బాణములచేత అంధకారముతో కూడిన, సమరే=యుద్ధమునందు, అన్యోన్యమ్=పరస్పరమును, నోపలక్షయతామ్=చూడలేదు.

తా. చాల కోపావేశములో ఉన్న ఆ రామరావణు లిద్దరూ అప్పుడు ఆ యుద్ధమునందు బాణములచేత ఏర్పడిన అంధకారములో ఒకరికొకరు కనబడలేదు. 9

మూ. తతః క్రోధసమావిష్టో రామో దశరథాత్మజః,
ఉవాచ రావణం వీరః ప్రహస్య పరుషం వచః. 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దశరథాత్మజః=దశరథపుత్రుడు, వీరః=వీరుడూ అయిన, రామః=రాముడు, క్రోధసమావిష్టః=క్రోధముతో కూడినవాడై, ప్రహస్య=నవ్వి, రావణమ్=రావణుని గూర్చి, పరుషమ్=పరుషమైన, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట దశరథ కుమారుడు, వీరుడూ అయిన రాముడు,

క్రోధముతో నవ్వి రావణునితో ఇట్లు పరుషముగా పలికెను. 10

మూ. మమ భార్యా జనస్థానాదజ్ఞానాద్రాక్షసాధమ,
హృతా తే వివశా యస్మాత్తస్మాత్త్వం నాసి వీర్యవాన్. 11

ప్ర. అ. రాక్షసాధమ=రాక్షసాధముడా ! వివశా=వివశురాలైన, మమ భార్యా=నా భార్య, యస్మాత్=ఏ కారణమువలన, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, తే=నీకు,(నీచే), హృతా=హరింపబడినదో, తస్మాత్=ఆ కారణమువలన, త్వమ్=నీవు, వీర్యవాన్=పరాక్రమవంతుడవు, నాసి=కావు.

తా. ఓ రాక్షసాధమా! అసహాయురాలైన నా భార్యను నీవు నాకు తెలియకుండగా, జనస్థానమునుండి తీసికొనివచ్చినావు. అందుచేత నీవు పరాక్రమవంతుడవు కావు. 11

మూ. మయా విరహితాం దీనాం వర్తమానాం మహావనే,
వైదేహీం ప్రసభం హృత్వా శూరోఽహమితి మన్యసే. 12

ప్ర. అ. మయా=నాతో, విరహితామ్=శూన్యురాలు, దీనామ్=దీనురాలు, మహావనే=మహావనమునందు, వర్తమానామ్=ఉంటున్నదీ అయిన, వైదేహీమ్=సీతను, ప్రసభమ్=బలాత్కారముగా, హృత్వా=హరించి, అహమ్=నేను, శూరః=శూరుడను, ఇతి=అని, మన్యసే=తలచుచున్నావు.

తా. నేను దగ్గర లేని సీత మహావనములో ఉంటూండగా ఆ దీనురాలిని హరించి "నేను మహాశూరుడను " అని అనుకొనుచున్నావు. 12

మూ. స్త్రీషు శూర వినాథాసు పరదారాభిమర్శక,
కృత్వా కాపురుషం కర్మ శూరోఽహమితి మన్యసే. 13

ప్ర. అ. వినాథాసు=రక్షకులు లేని, స్త్రీషు=స్త్రీల విషయమున, శూర=శూరుడా ! పరదారాభిమర్శక= పరభార్యలను స్పృశించువాడా ! కాపురుషమ్=చెడ్డపురుషులు చేయు, కర్మ=పనిని, కృత్వా=చేసి, అహమ్=నేను, శూరః=శూరుడను, ఇతి=అని, మన్యసే=తలచుచున్నావు.

తా. రక్షకులు లేని స్త్రీల విషయమున శూరుడా! పరభార్యాస్పర్శ చేయువాడా! నీచపురుషులు చేయు పని చేని "నేను శూరుడను" అని అనుకొనుచున్నావు. 13

మూ. భిన్నమర్యాద నిర్లజ్జ చారిత్రేష్వనవస్థిత,
దర్పాన్మృత్యుముపాదాయ శూరోఽహమితి మన్యసే. 14

ప్ర. అ. భిన్నమర్యాద=చెడగొట్టబడిన కట్టుబాట్లు కలవాడా! నిర్లజ్జ=సిగ్గు

లేనివాడా! చారిత్రేషు=మంచి చరిత్రలయందు, అనవస్థిత=నిలవనివాడా! దర్పాత్=గర్వమువలన, మృత్యుమ్=మృత్యువును, ఉపాదాయ=గ్రహించి, అహమ్=నేను, శూరః=శూరుడను, ఇతి=అని, మన్యసే=తలచుచున్నావు.

తా. కట్టుబాట్లు చెడగొట్టినవాడా! సిగ్గులేనివాడా! సచ్చరిత్రను అనుసరించనివాడా! గర్వముచేత మృత్యువును దగ్గరకు పిలచుకొన్న నీవు "నేను శూరుడను" అని అనుకొనుచున్నావు. 14

మూ. శూరేణ ధనదభ్రాత్రా బలైః సముదితేన చ,
శ్లాఘనీయం మహత్కర్మ యశస్యం చ కృతం త్వయా. 15

ప్ర. అ. శూరేణ=శూరుడవు, ధనదభ్రాత్రా=కుబేరుని సోదరుడవు, బలైః=సైన్యములతో, సముదితేన చ=కూడినవాడవు అయిన, త్వయా=నీచేత, శ్లాఘనీయమ్=శ్లాఘించదగిన, యశస్యం చ=యశస్కరము కూడ అయిన, మహత్=గొప్పదైన, కర్మ=పని, కృతమ్=చేయబడినది.

తా. కుబేరుని సోదరుడవు, శూరుడవు, సైన్యములు ఉన్నవాడవు అయిన నీవు శ్లాఘింపదగిన, యశస్సును కలిగించే గొప్ప పని చేసినావు! 15

మూ. ఉత్సేకేనాభిపన్నస్య గర్హితస్యాహితస్య చ,
కర్మణః ప్రాప్నుహీదానీం తస్యాద్య సుమహత్ఫలమ్. 16

ప్ర. అ. ఉత్సేకేన=గర్వముచేత, అభిపన్నస్య=చేయబడిన, గర్హితస్య=నింద్యమైన, అహితస్య చ=హితము కాని, తస్య కర్మణః=ఆ కర్మయొక్క, సుమహత్=చాల గొప్పదైన, ఫలమ్=ఫలమును, అద్య=నేడు, ఇదానీమ్=ఇప్పుడు, ప్రాప్నుహి=పొందుము.

తా. గర్వముచేత చేసిన, నింద్యమూ, అహితమూ అయిన ఆ కర్మకు చాల గొప్ప ఫలమును నేడు, ఇప్పుడే పొందుము. 16

మూ. శూరోఽహమితి చాత్మానమవగచ్ఛసి దుర్మతే,
నైవ లజ్జాస్తి తే సీతాం చౌరవద్వ్యపకర్షతః. 17

ప్ర. అ. దుర్మతే=దుష్టబుద్ధి కలవాడా! ఆత్మానమ్=నిన్నుగూర్చి, అహమ్=నేను, శూరః=శూరుడను, ఇతి=అని, అవగచ్ఛసి=అనుకొనుచున్నావు. చౌరవత్=దొంగవలె, సీతామ్=సీతను, వ్యపకర్షతః=అపహరించిన, తే=నీకు, లజ్జా=సిగ్గు, నైవ అస్తి=లేనే లేదు.

తా. దుర్మతీ! "నేను శూరుడను" అని నిన్ను గూర్చి నీవు అనుకొనుచున్నావు. దొంగ వలె సీతను అపహరించిన నీకు ఏమాత్రము సిగ్గే

లేదు. 17

మూ. యది మత్సన్నిధౌ సీతా ధర్షితా స్యాత్త్వయా బలాత్,
భ్రాతరం తు ఖరం పశ్యేస్తదా మత్సాయకైర్హతః. 18

ప్ర. అ. సీతా=సీత, త్వయా=నీచేత, మత్సంనిధౌ=నా సంనిధిలో, బలాత్=బలమువలన, ధర్షితా=అవమానించబడినది, స్యాద్యది=అయి ఉన్నట్లయితే, తదా=అప్పుడు, మత్సాయకైః=నా బాణములచేత, హతః=చంపబడినవాడవై, భ్రాతరమ్=సోదరుడైన, ఖరమ్=ఖరుణ్ణి, పశ్యేః=చూచి ఉందువు.

తా. నీవు నేను దగ్గర ఉండగా బలము చూపి సీతను అవమానించి ఉన్నచో అప్పుడు నా బాణములచేత చంపబడినవాడవై నీ సోదరుడైన ఖరుణ్ణి చూచి ఉండెడివాడవు. 18

మూ. దిష్ట్యాసి మమ మన్దాత్మంశ్చక్షుర్విషయమాగతః,
అద్య త్వాం సాయకైస్తీక్ష్ణైర్నయామి యమసాదనమ్. 19

ప్ర. అ. మన్దాత్మన్=మందబుద్ధిగలవాడా! దిష్ట్యా=దైవవశముచేత, మమ=నాయొక్క, చక్షుర్విషయమ్=నేత్రవిషయమును, ఆగతః అసి=పొందినావు. అద్య=ఇప్పుడు, త్వామ్=నిన్ను, తీక్ష్ణైః=తీక్ష్ణములైన, సాయకైః=బాణములచేత, యమసాదనమ్=యమలోకమును, నయామి=పొందించెదను.

తా. ఓ! మందబుద్ధి గలవాడా! దైవవశముచే నీవు నాకంట పడినావు; ఇప్పుడు నిన్ను వాడియైన బాణాలచేత యమలోకమునకు పంపెదను. 19

మూ. అద్య తే మచ్ఛరైశ్ఛిన్నం శిరో జ్వలితకుణ్డలమ్,
క్రవ్యాదా వ్యపకర్షన్తు వికీర్ణం రణపాంసుషు. 20

ప్ర. అ. అద్య=ఇప్పుడు, మచ్ఛరైః=నా బాణములచేత, ఛిన్నమ్=ఛేదించబడిన, రణపాంసుషు=యుద్ధపరాగములయందు, వికీర్ణమ్=పడవేయబడిన, జ్వలితకుణ్డలమ్=ప్రకాశించుచున్న కుండలములు గల, తే శిరః=నీ శిరస్సును, క్రవ్యాదాః=మాంసమును తిను మృగములు, వ్యపకర్షన్తు=లాగుగాక.

తా. ఇప్పుడు నేను బాణములచేత ఛేదించగా యుద్ధభూమి పరాగములలో పడి ఉన్న నీ ప్రకాశించుచున్న కుండలములు గల శిరస్సును మాంసము తిను మృగములు లాగుగాక. 20

మూ. నిపత్యోరసి గృధ్రాస్తే క్షితౌ క్షిప్తస్య రావణ,
పిబన్తు రుధిరం తర్షాద్బాణశల్యాన్తరోత్థితమ్. 21

ప్ర. అ. రావణ=రావణుడా! క్షితౌ=నేలమీద, క్షిప్తస్య=పడవేయబడిన, తే=నీయొక్క, ఉరసి=వక్షః స్థలముమీద, నిపత్య=వాలి, గృధ్రాః=గ్రద్దలు, బాణశల్యాన్తరోత్థితమ్=బాణముల ములుకుల మధ్య నుండి పైకి వచ్చుచున్న, రుధిరమ్=రక్తమును, పిబన్తు=త్రాగుగాక.

తా. రావణా! నేలమీద పడగొట్టబడిన నీ వక్షస్థలముమీద వాలి గ్రద్దలు బాణాల ములుకుల సందులనుండి కారిన రక్తమును ఆసక్తిలో త్రాగుగాక.21

మూ. అద్య మద్బాణభిన్నస్య గతాసోః పతితస్య తే,
కర్షన్త్వన్త్రాణి పతగా గరుత్మన్త ఇవోరగాన్. 22

ప్ర. అ. అద్య=నేడు, మద్బాణభిన్నస్య=నా బాణములచేత బ్రద్దలు కొట్టబడిన, గతాసోః=పోయిన ప్రాణములు గల, పతితస్య=పడిన, తే=నీయొక్క, అన్త్రాణి=ప్రేగులను, పతగాః=పక్షులు, గరుత్మన్తః=గరుడపక్షులు, ఉరగానివ=సర్పములను వలె, కర్షన్తు=లాగుగాక.

తా. నేడు నా బాణములచేత బ్రద్దలు కొట్టబడి, ప్రాణములు పోయి క్రింద పడి ఉన్న నీ ప్రేగులను పక్షులు, గరుడపక్షులు సర్పములను లాగినట్లు లాగుగాక. 22

మూ. ఇత్యేవం స వదన్వీరో రామః శత్రునిబర్హణః,
రాక్షసేన్ద్రం సమీపస్థం శరవర్షైరవాకిరత్. 23

ప్ర. అ. వీరః=వీరుడు, శత్రునిబర్హణః=శత్రుసంహారకుడూ అయిన, రామః=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, వదన్=పలుకుచు, సమీపస్థమ్=సమీపమునందున్న, రాక్షసేన్ద్రమ్=రావణుణ్ణి, శరవర్షైః=బాణవర్షములచేత, అవాకిరత్=చల్లెను.

తా. వీరుడు, శత్రుసంహారకుడూ అయిన రాముడు ఇట్లు పలుకుచు సమీపమునందున్న రావణునిపై బాణవర్షములు కురిపించెను. 23

మూ. బభూవ ద్విగుణం వీర్యం బలం హర్షశ్చ సంయుగే,
రామస్యాస్త్రబలం చైవ శత్రోర్నిధనకాఙ్క్షిణః. 24

ప్ర. అ. సంయుగే=యుద్ధమునందు, శత్రోః=శత్రువుయొక్క, నిధనకాఙ్క్షిణః=మరణమును కోరుచున్న, రామస్య=రామునియొక్క, వీర్యమ్=పరాక్రమము, బలమ్=బలము, హర్షశ్చ=ఉత్సాహము, అస్త్రబలం చైవ=అస్త్రబలము, ద్విగుణమ్=రెండు రెట్లుగా, బభూవ=అయెను.

తా. యుద్ధములో శత్రువును చంపవలె నని నిశ్చయించుకొన్న రాముని పరాక్రమము, బలము, ఉత్సాహము, అస్త్రబలమూ కూడ రెండు రెట్లు అయ్యెను.

మూ. ప్రాదుర్బభూవురస్త్రాణి సర్వాణి విదితాత్మనః,
ప్రహర్షాచ్చ మహాతేజాః శీఘ్రహస్తతరో౽భవత్. 25

ప్ర. అ. విదితాత్మనః=ప్రసిద్ధమైన బుద్ధి గల ఆ రామునకు, సర్వాణి=సమస్తమైన, అస్త్రాణి=అస్త్రములు, ప్రాదుర్బభూవుః=స్ఫురించినవి. మహాతేజాః=గొప్ప తేజస్సు గల రాముడు, ప్రహర్షాత్=సంతోషమువలన, శీఘ్రహస్తతరః=అధికముగా శీఘ్రమైన హస్తము కలవాడు, అభూత్=ఆయెను.

తా. ప్రసిద్ధమైన బుద్ధి గల ఆ రామునకు అన్ని అస్త్రములు స్ఫురించెను. మహాతేజఃశాలియైన అతని హస్తలాఘవము ఉత్సాహముచేత చాల అధికమయ్యెను. 25

మూ. శుభాన్యేతాని చిహ్నాని విజ్ఞాయాత్మగతాని సః,
భూయ ఏవార్దయద్రామో రావణం రాక్షసాన్తకృత్. 26

ప్ర. అ. రాక్షసాన్తకృత్=రాక్షససంహారకుడైన, సః రామః= ఆ రాముడు, ఆత్మగతాని=తనలో ఉన్న, శుభాని=శుభకరములైన, ఏతాని=ఈ, చిహ్నాని=చిహ్నములను, విజ్ఞాయ=తెలుసుకొని, రావణమ్=రావణుణ్ణి, భూయః ఏవ=ఇంకనూ, ఆర్దయత్=పీడించెను.

తా. రాక్షససంహారకుడైన ఆ రాముడు తనలో కనబడుచున్న ఈ శుభచిహ్నములను గుర్తించి రావణుణ్ణి ఇంకా అధికముగా పీడించెను. 26

మూ. హరీణాం చాశ్మనికరైః శరవర్షాచ్చ రాఘవాత్,
హన్యమానో దశగ్రీవో విఘూర్ణహృదయో౽భవత్. 27

ప్ర. అ. హరీణామ్=వానరులయొక్క, అశ్మనికరైః=రాళ్ల సముదాయములచేతను, రాఘవాత్=రామునినుండి, శరవర్షాచ్చ=బాణముల వర్షమువలనను, హన్యమానః=కొట్టబడుచున్న, దశగ్రీవః=రావణుడు, విఘూర్ణహృదయః=తిరిగిపోయిన హృదయము కలవాడు, అభవత్=ఆయెను.

తా. వానరుల రాళ్లచేతను రాముని బాణవర్షముచేతనూ కొట్టబడిన రావణుని హృదయము తిరిగిపోయినట్లు అయ్యెను. 27

మూ. యదా చ శస్త్రం నారేభే న చకర్ష శరాసనమ్,
నాస్య ప్రత్యకరోద్వీర్యం విక్లబేనాన్తరాత్మనా. 28

ప్ర. అ. యదా=ఎప్పుడు, శస్త్రమ్=శస్త్రమును, నారేభే=ఆరంభించలేదో, శరాసనమ్=ధనస్సును, న చకర్ష=లాగలేదో, విక్లబేన=వ్యాకులమైన, అన్తరాత్మనా=అంతరాత్మతో, అస్య=రామునియొక్క, వీర్యమ్=పరాక్రమమును, న

ప్రత్యకరోత్=ఎదిరించలేదో.

తా. ఆ సమయమునందు అతడు శస్త్రప్రయోగము ప్రారంభించలేదు. ధనస్సును లాగలేదు. ఆ రాముని పరాక్రమమునకు ప్రతిక్రియ చేయలేదు. ఆతని అంతరాత్మ వ్యాకులమై ఉండెను. 28

మూ. క్షిప్తాశ్చాశు శరాస్తేన శస్త్రాణి వివిధాని చ,
న రణార్థాయ వర్తన్తే మృత్యుకాలోఽభ్యవర్తత. 29

ప్ర. అ. తేన=వానిచేత, ఆశు=శీఘ్రముగా, క్షిప్తాః=విసరబడిన, శరాః=బాణములు, వివిధాని=అనేకవిధములైన, శస్త్రాణి చ=ఆయుధములు, రణార్థాయ=యుద్ధప్రయోజనముకొరకు, న వర్తన్తే=ప్రవర్తించలేదు. మృత్యుకాలః=మృత్యుకాలము, అభ్యవర్తత=సమీపించెను.

తా. ఆతనికి మృత్యుకాలము ఆసన్నమగుటచే ఆతడు శీఘ్రముగా ఉపయోగించిన బాణములు, ఆనేకవిధములైన ఆయుధములు యుద్ధకార్యమును సాధింపజాలకపోయినవి. 29

మూ. సూతస్తు రథనేతాస్య తదవస్థం నిరీక్ష్య తమ్,
శనైర్యుద్ధాదసంభ్రాన్తో రథం తస్యాపవాహయత్. 30

ప్ర. అ. అస్య=రావణునియొక్క, రథనేతా=రథమును నడిపించు, సూతస్తు=సారథియైతే, తదవస్థమ్=ఆ అవస్థ గల, తమ్=ఆతనిని, నిరీక్ష్య=చూచి, ఆసంభ్రాన్తః=కంగారు పడనివాడై, శనైః=మెల్లగా, తస్య=వానియొక్క, రథమ్=రథమును, యుద్ధాత్=యుద్ధమునుండి, అపవాహయత్=తొలగించెను.

తా. రావణుని రథమును నడుపుచున్న సారథి, అతడు అట్టి పరిస్థితిలో ఉండుట చూచి, కంగారుపడక ఆతని రథమును మెల్లగా యుద్ధభూమినుండి దూరముగా తీసికొనిపోయెను. 30

మూ. రథం చ తస్యాథ జవేన సారథి
ర్నివార్య భీమం జలదస్వనం తదా,
జగామ భీత్యా సమరాన్మహీపతిం
విరస్తవీర్యం పతితం సమీక్ష్య. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే త్ర్యధికశతతమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సారథిః=సారథి, మహీపతిమ్=రాజును, నిరస్త వీర్యమ్=పోయిన పరాక్రమము కలవానినిగాను, పతితమ్=ఓడిపోయినవానినిగాను,

సమీక్ష్య=చూచి, తదా=అప్పుడు, తస్య=వానియొక్క, జలదస్వనమ్=మేఘమువంటి ధ్వని గల, భీమమ్=భయంకరమైన, రథమ్=రథమును, జవేన=వేగముచేత, నివార్య=మరలించి, భీత్యా=భయముచేత, సమరాత్=యుద్ధమునుండి, జగామ=వెళ్ళెను.

తా. అప్పుడు సారథి తన ప్రభువు పరాక్రమము ఉడిగి ఓడిపోయినట్లు చూచి, భయపడి, భయంకరము, మేఘధ్వని వంటి ధ్వని కలదీ అయిన రథమును వెంటనే మరల్చి యుద్ధభూమి విడచి వెళ్ళిపోయెను. 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటమూడవసర్గ సమాప్తము.

# అథ చతురధికశతతమః సర్గః

[రావణుడు సారథిని నిందించుట, సారథి రావణునకు తగు కారణము చెప్పి నచ్చచెప్పి రథమును మరల యుద్ధభూమికి తీసికొనివెళ్లుట.]

మూ. స తు మోహాత్సుసంక్రుద్ధః కృతాన్తబలచోదితః,
క్రోధసంరక్తనయనో రావణః సూతమబ్రవీత్. 1

ప్ర. అ. మోహాత్=అజ్ఞానమువలన, సుసంక్రుద్ధః=మిక్కిలి కోపించిన, కృతాన్తబలచోదితః=దైవబలముచేత ప్రేరేపించబడిన, సః రావణః=ఆ రావణుడు, క్రోధసంరక్తనయనః=కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, సూతమ్=సారథిని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. దైవబలముచేత ప్రేరేపింపబడిన ఆ రావణుడు అజ్ఞానమువలన కోపించి, కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో సారథితో ఇట్లు పలికెను. 1

మూ. హీనవీర్యమివాశక్తం పౌరుషేణ వివర్జితమ్,
భీరుం లఘుమివాసత్త్వం విహీనమివ తేజసా, 2
విముక్తమివ మాయాభిరస్త్రైరివ బహిష్కృతమ్,
మామవజ్ఞాయ దుర్బుద్ధే స్వయా బుద్ధ్యా విచేష్టసే. 3

ప్ర. అ. దుర్బుద్ధే=ఓ! చెడ్డబుద్ధిగలవాడా! అశక్తమ్=అసమర్థుడైన, పౌరుషేణ=పౌరుషముతో, వివర్జితమ్=శూన్యుడైన, హీనవీర్యమివ=వీర్యము లేనివానిని వలె, భీరుమ్=పిరికివాడైన, అసత్త్వమ్=బలములేని, లఘుమివ=తేలిక అయిన వానిని వలె, తేజసా=తేజస్సుతో, విహీనమివ=విహీనుణ్ణి వలె, మాయాభిః=మాయలచేత, విముక్తమివ=విడవబడినవానిని వలె, అస్త్రైః=అస్త్రములచేత, బహిష్కృతమ్ ఇవ=బహిష్కరింపబడినవానిని వలె, మామ్=నన్ను, అవజ్ఞాయ=అవమానముచేసి, స్వయా=నీసంబంధమైన, బుద్ధ్యా=బుద్ధిచేత, విచేష్టసే=పనిచేయుచున్నావు!

తా. ఓ! చెడ్డబుద్ధి కలవాడా! అసమర్థుడైన, పౌరుషము లేని పరాక్రమహీనుణ్ణి వలె, భయస్వభావము గల, బలము లేని సామాన్యవ్యక్తిని వలె, తేజస్సు లేనివానిని వలె, మాయాశక్తు లన్నీ కోల్పోయినవానిని వలె, అస్త్రములచేత విడువబడిన వానిని వలె నన్ను అవమానముచేసి నీ ఆలోచన ప్రకారము ప్రవర్తించుచున్నావేమి? 2, 3

మూ. కిమర్థం మామవజ్ఞాయ మచ్ఛన్దమనవేక్ష్య చ,
త్వయా శత్రుసమక్షం మే రథోఽయమపవాహితః. 4

ప్ర. అ. శత్రుసమక్షమ్=శత్రువుల ఎదుట, మామ్=నన్ను, అవజ్ఞాయ=అవమానముచేసి, మచ్ఛన్దమ్=నా అభిలాషను, అనవేక్ష్య చ=చూడక, అయమ్=ఈ, మే రథః=నా రథము, కిమర్థమ్=ఎందుకు, అపవాహితః=దూరముగా తొలగించబడినది?

తా. శత్రువుల సమక్షమునందు నాకు అవమానము కలుగునట్లుగా, నా అభిప్రాయమును తెలిసికొనకుండా నీవు నా రథమును ఎందుకు దూరముగా తీసికొనివచ్చినావు. 4

మూ. త్వయాద్య హి మమానార్య చిరకాలసమార్జితమ్,
యశో వీర్యం చ తేజశ్చ ప్రత్యయశ్చ వినాశితః. 5

ప్ర. అ. అనార్య=చెడ్డవాడా! అద్య=ఈనాడు, త్వయా=నీచేత, మమ=నాయొక్క, చిరకాలసమార్జితమ్=చిరకాలమునుండి సంపాదింపబడిన, యశః=కీర్తి, వీర్యమ్=పరాక్రమము, తేజశ్చ=తేజస్సు, ప్రత్యయశ్చ=విశ్వాసము, వినాశితః=నశింపచేయబడినది.

తా. అనార్యుడా! నీ వీనాడు నేను చిరకాలమునుండి సంపాదించిన కీర్తిని, పరాక్రమమును, తేజస్సును, నమ్మకమును (మహాశూరుడ నని నాపై ఇతరుల కున్న నమ్మకమును) నశింపచేసినావు. 5

మూ. శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రఞ్జనీయస్య విక్రమైః,
పశ్యతో యుద్ధలుబ్ధోఽహం కృతః కాపురుషస్త్వయా. 6

ప్ర. అ. ప్రఖ్యాతవీర్యస్య=ప్రసిద్ధమైన పరాక్రమము కలవాడు, విక్రమైః=పరాక్రమములచేత, రఞ్జనీయస్య=సంతోషపెట్టదగినవాడు అయిన, శత్రోః=శత్రువు, పశ్యతః=చూచుచుండగా, త్వయా=నీచేత, యుద్ధలుబ్ధః=యుద్ధమునందు ఆసక్తి గల, అహమ్=నేను, కాపురుషః=నీచపురుషుడుగా, కృతః=చేయబడితిని.

తా. ప్రసిద్ధమైన పరాక్రమము గలవాడు, పరాక్రమములచేత సంతోషపెట్టదగినవాడూ అయిన శత్రువు చూచుచుండగా నీవు యుద్ధమునందు అత్యాసక్తి గల నన్ను నీచపురుషుణ్ణిగా చేసివేసినావు! 6

మూ. యస్త్వం రథమిదం మోహాన్న చేద్వహసి దుర్మతే,
సత్యోఽయం ప్రతితర్కో మే పరేణ త్వముపస్కృతః. 7

ప్ర. అ. దుర్మతే=ఓ! దుర్బుద్ధి కలవాడా! యః త్వమ్=ఏ నీవు, ఇదం రథమ్=ఈ రథమును, మోహాత్=అజ్ఞానమువలన, న వహసి చేత్=తోలికొనిపో

వనిచో, అయమ్=ఈ, ప్రతితర్కః=నా ఊహ, సత్యః=సత్యమైనది, త్వమ్=నీవు, పరేణ=శత్రువుచేత, ఉపస్కృతః=లంచమిచ్చి సత్కరింపబడితివి.

తా. ఓ! దుర్మతీ! నీవు ఈ రథమును తెలివితక్కువతనమున ఇట్లు తీసికొనిరాకున్నచో నీకు శత్రువు లంచ మిచ్చి యుండును అను నా ఊహ సత్యము. 7

మూ. న హి తద్విద్యతే కర్మ సుహృదో హితకాఙ్క్షిణః,
రిపూణాం సదృశం త్వేతద్యత్త్వయైతదనుష్ఠితమ్. 8

ప్ర. అ. త్వయా=నీచేత, యత్=ఏ, ఏతత్=ఇది, అనుష్ఠితమ్=చేయబడినదో, ఏతత్=ఇది, రిపూణామ్=శత్రువులకు, సదృశమ్=తగినది. తత్=అది, హితకాఙ్క్షిణః=హితమును కోరు, సుహృదః=మిత్రునియొక్క, కర్మ=కర్మగా, న విద్యతే హి=లేదు కదా!

తా. నీవు చేసిన ఈ పని శత్రువులు చేయ దగినదే కాని హితమును కోరు మిత్రుడు చేయదగినది కాదు. 8

మూ. నివర్తయ రథం శీఘ్రం యావన్నాపైతి మే రిపుః,
యది వాధ్యుషితోఽసి త్వం స్మర్యతే యది మే గుణః. 9

ప్ర. అ. త్వమ్=నీవు, అధ్యుషితః=చాలకాలము నాతో కలిసి ఉన్నవాడవు, అపి యది=అయినట్లయితే, మే=నాయొక్క, గుణః=గుణము, యది స్మర్యతే=స్మరింపబడినట్లయితే, మే రిపుః=నాశత్రువు, యావత్=ఎంతలో, నాపైతి=దూరముగా వెళ్లడో అంతలో, శీఘ్రమ్=శీఘ్రముగా, రథమ్=రథమును, నివర్తయ=మరల్చుము.

తా. నీవు నాదగ్గర చాల కాలము నివసించిన విషయము జ్ఞాపకమున్నచో నేను నీకు చేసిన ఉపకారాదులు జ్ఞాపకమున్నచో నా శత్రువు దూరముగా వెళ్లిపోక మునుపే రథమును శీఘ్రముగా మరల్చుము. 9

మూ. ఏవం పరుషముక్తస్తు హితబుద్ధిరబుద్ధినా,
అబ్రవీద్రావణం సూతో హితం సానునయం వచః. 10

ప్ర. అ. అబుద్ధినా=బుద్ధివిహీనుడైన రావణునిచేత, ఏవమ్=ఇట్లు, పరుషమ్=పరుషముగా, ఉక్తః=పలకబడిన, హితబుద్ధిః=హితబుద్ధి గల, సూతః=సారథి, రావణమ్=రావణుణ్ణి గూర్చి, సానునయమ్=అనునయముతో కూడిన, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. బుద్ధివిహీనుడైన రావణుడు పలికిన ఆ పరుషవాక్యములు విని హితబుద్ధియైన ఆ సారథి ఆతనిని బ్రతిమాలుకొనుచు ఇట్లు పలికెను. 10

మూ. న భీతోఽస్మి న మూఢోఽస్మి నోపజప్తోఽస్మి శత్రుభిః,
న ప్రమత్తో న నిఃస్నేహో విస్మృతా న చ సత్క్రియా. 11

ప్ర. అ. భీతః=భయపడినవాడను, నాస్మి=కాను, మూఢః=తెలివితక్కువ వాడను, న అస్మి=కాను, శత్రుభిః=శత్రువులచేత, ఉపజప్తః=లంచము మొదలైన వాటిచేత వశము చేసికొనబడినవాడను, న అస్మి=కాను, ప్రమత్తః=పొరబడిన వాడను, న=కాను, నిఃస్నేహః=స్నేహము లేనివాడను, న=కాను, సత్క్రియా చ=సత్కారము కూడ, న విస్మృతా=మరవబడలేదు.

తా. నేను భయపడలేదు; నా ఆలోచనలు చెడలేదు. శత్రువులచే లంచము మొదలైనవి ఇచ్చి వశముచేసికొనబడలేదు. పొరబడలేదు. స్నేహవిహీను డను కాలేదు. నీవు చేసిన సత్కారము మరువలేదు. 11

మూ. మయా తు హితకామేన యశశ్చ పరిరక్షతా,
స్నేహప్రసన్నమనసా హితమిత్యప్రియం కృతమ్. 12

ప్ర. అ. హితకామేన=నీ హితమును కోరుచున్న, యశశ్చ=కీర్తిని, పరిరక్షతా=రక్షించుచున్న, స్నేహప్రసన్నమనసా=స్నేహముచేత ప్రసన్నమైన మనస్సు గల,మయా=నాచేత, హితమ్ ఇతి=హిత మనే కారణముచే, అప్రియమ్=నీకు ఇష్టము కాని పని, కృతమ్=చేయబడినది.

తా. నీ మంచిని కోరిన, నీ కీర్తిని రక్షించుచున్న, స్నేహముచేత ప్రసన్నమైన మనస్సు గల నేను నీకు ప్రియము కాకున్నను ఈ పని నీకు హితము (శ్రేయస్కరము) అను కారణముచేత చేసితిని. 12

మూ. నాస్మిన్నర్థే మహారాజ త్వం మాం ప్రియహితే రతమ్,
కశ్చిల్లఘురివానార్యో దోషతో గన్తుమర్హసి. 13

ప్ర. అ. మహారాజ=మహారాజా ! ప్రియహితే=నీ ప్రియమునందు హితము నందు, రతమ్=ఆసక్తుడనైన, మామ్=నన్ను, అస్మిన్=ఈ, అర్థే=విషయమునందు, త్వమ్=నీవు, కశ్చిత్=ఎవ్వడో, లఘుః=తేలికబుద్ధి గల, అనార్యః ఇవ=చెడ్డవాడు వలె, దోషతః=దోషమువలన, గన్తుమ్=తెలిసికొనుటకు, న అర్హసి=తగవు.

తా. మహారాజా! నీ ప్రియహితములను కోరు నన్ను ఈ విషయమునందు నీవు,ఎవడో లఘుబుద్ధి గల అనార్యుడు వలె దోషము చేసినట్లు భావించకుము.

మూ. శ్రూయతాం ప్రతిదాస్యామి యన్నిమిత్తం మయా రథః,
నదీవేగ ఇవాభోగే సంయుగే వినివర్తితః. 14

ప్ర. అ. ఆభోగే=ఉన్నతప్రదేశమునందు, నదీవేగః ఇవ=నదీవేగము

వలె, సంయుగే=యుద్ధమునందు, రథః=రథము, యన్నిమిత్తమ్=ఎందు నిమిత్తము, వినివర్తితః=మరల్పబడినదో, ప్రతిదాస్యామి=ప్రత్యుత్తర మిచ్చెదను, శ్రూయతామ్=వినబడుగాక,

తా. ఉన్నత ప్రదేశమునందు నదిని వలె యుద్ధరంగమునుండి నేను రథమును ఏ కారణమువలన మరల్చితినో చెప్పెదను వినుము. 14

మూ. శ్రమం తవావగచ్ఛామి మహతా రణకర్మణా,
న హి తే వీర్యసౌముఖ్యం ప్రకర్షం వోపధారయే. 15

ప్ర. అ. మహతా=గొప్పదైన, రణకర్మణా=యుద్ధకర్మ చేత, తవ=నీయొక్క, శ్రమమ్=శ్రమను, అవగచ్ఛామి=తెలిసికొనుచున్నాను. తే=నీయొక్క, వీర్యసౌముఖ్యమ్=వీర్యము విషయమున సుముఖత్వమును గాని, ప్రకర్షం వా=ఆధిక్యమును గాని, నోపధారయే=నిర్ణయించుటలేదు.

తా. ఎక్కువగా యుద్ధము చేసి ఉండుటచే నీవు శ్రమ చెందినట్లు తెలిసికొన్నాను. పరాక్రమము చూపు విషయమున సుముఖత్వముగాని, శత్రువుకంటె ఆధిక్యము గాని నీలో నాకు కనబడలేదు. 15

మూ. రథోద్వహనఖిన్నాశ్చ భగ్నా మే రథవాజినః,
దీనా ఘర్మపరిశ్రాన్తా గావో వర్షహతా ఇవ. 16

ప్ర. అ. మే=నాయొక్క, రథవాజినః=రథముయొక్క గుఱ్ఱములు, రథోద్వహనఖిన్నాః=రథమును లాగుటచేత అలసినవై, భగ్నాః=భగ్నములైపోయినవి. వర్షహతాః=వర్షముచేత కొట్టబడిన, గావః ఇవ=గోవులు వలె, ఘర్మపరిశ్రాన్తాః=వేడిచేత అలసినవై, దీనాః=దీనములై ఉండెను.

తా. నా రథము గుఱ్ఱములు రథమును లాగుటచేత అలసి కదలలేకుండ అయినవి. వర్షముచేత కొట్టబడిన గోవులు వలె, వేడిచేత అలసినవై దీనములుగా ఉన్నవి. 16

మూ. నిమిత్తాని చ భూయిష్ఠం యాని ప్రాదుర్భవన్తి నః,
తేషు త్వేష్వభిపన్నేషు లక్షయామ్యప్రదక్షిణమ్. 17

ప్ర. అ. నః=మనకు, యాని=ఏ, నిమిత్తాని=శకునములు, భూయిష్ఠమ్=అధికముగా, ప్రాదుర్భవన్తి=పుట్టుచున్నవో, అభిపన్నేషు=పరీక్షింపబడిన, తేషు తేషు=వాటి అన్నింటి యందు, అప్రదక్షిణమ్=అననుకూలత్వమును, లక్షయామి=చూచుచున్నాను.

తా. మనకు కనబడుచున్న నిమిత్తములు (శకునములు) చాలవరకు

పరీక్షించగా మనకు ప్రతికూలముగానే ఉన్నట్లు నాకు కనబడినవి. 17

మూ. దేశకాలౌ చ విజ్ఞేయౌ లక్షణానీఙ్గితాని చ,
దైన్యం హర్షశ్చ ఖేదశ్చ రథినశ్చ మహాబల. 18

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా! దేశకాలౌ చ=దేశకాలములు, విజ్ఞేయౌ=తెలియదగనవి. లక్షణాని=లక్షణములు, ఇఙ్గితాని చ=భావమును సూచించు ముఖవికారాదులు, రథినః=రథికునియొక్క, దైన్యమ్=దైన్యము, హర్షశ్చ=సంతోషము, ఖేదశ్చ=అలసట తెలిసికొనదగినవి.

తా. మహాబలవంతుడా! సారథిగా ఉన్నవాడు దేశకాలాలను, రథికుని లక్షణాలను, ముఖవికారములను, దైన్యమును, ఉత్సాహమును, అలసటను చూచుచుండవలెను. 18

మూ. స్థలనిమ్నాని భూమేశ్చ సమాని విషమాణి చ,
యుద్ధకాలశ్చ విజ్ఞేయః పరస్యాన్తరదర్శనమ్. 19

ప్ర. అ. భూమేః=భూమియొక్క, స్థలనిమ్నాని=ఎత్తు పల్లములు, సమాని=సమప్రదేశములు, విషమాణి చ=గతుకులు, యుద్ధకాలశ్చ=యుద్ధమునకు సమయము, విజ్ఞేయః=తెలియదగినది. పరస్య=శత్రువుయొక్క, అన్తరదర్శనమ్=అవకాశముల దర్శనము కూడ చేయదగినది.

తా. సారథి నేలమీద ఎత్తు పల్లములు, సమప్రదేశములు, సమముగా లేని ప్రదేశములు, యుద్ధసమయము వీటి నన్నింటిని తెలిసికొనవలెను. శత్రువులో ఉన్న లోపములను కూడ గుర్తించుచుండవలెను. 19

మూ. ఉపయానాపయానే చ స్థానం ప్రత్యపసర్పణమ్,
సర్వమేతద్రథస్థేన జ్ఞేయం రథకుటుమ్బినా. 20

ప్ర. అ. రథస్థేన=రథమునందున్న, రథకుటుమ్బినా=రథసంరక్షకుడైన సారథిచేత, ఉపయానాపయానే చ=దగ్గరకు వెళ్లుట దూరము వెళ్లుట, స్థానమ్=నిలచుట, ప్రత్యపసర్పణమ్=దూరముగా తొలగుట, ఏతత్=ఇది, సర్వమ్=అంతా, జ్ఞేయమ్=తెలియదగినది.

తా. రథమునందున్న రథసంరక్షకుడైన సారథి దగ్గరగా వెళ్లుట, దూరముగా వెళ్లుట, నిలుచుట, దూరముగా తొలగుట - ఇవన్నీ తెలియవలెను.

మూ. తవ విశ్రామహేతోస్తు తథైషాం రథవాజినామ్,
రౌద్రం వర్జయతా ఖేదం క్షమం కృతమిదం మయా. 21

ప్ర. అ. తవ=నీయొక్క, విశ్రామహేతోః=విశ్రాంతికొరకు, తథా=మరియు, ఏషామ్=ఈ, రథవాజినామ్=రథాశ్వములయొక్క విశ్రాంతికొరకు, రౌద్రమ్=భయంకరమైన, ఖేదమ్=అలసటను, వర్జయతా=తప్పించుకొనుచున్న, మయా=నాచేత, ఇదమ్=ఇది, క్షమమ్=యుక్తమే, కృతమ్=చేయబడినది.

తా. భయంకరమైన అలసటను తప్పించుటకు, నీకూ, రథాశ్వములకూ విశ్రాతి కొరకూ నేను ఈ పనిని యుక్తముగానే చేసితిని. 21

మూ. స్వేచ్ఛయా న మయా వీర రథోఽయమపవాహితః,
భర్తృస్నేహపరీతేన మయేదం యత్కృతం ప్రభో. 22

ప్ర. అ. వీర=వీరుడా! ప్రభో=ప్రభూ! అయమ్=ఈ, రథః=రథము, మయా=నాచేత, స్వేచ్ఛయా=నా ఇచ్ఛచేత, న అపవాహితః=దూరముగా తొలగించబడలేదు. మయా=నాచేత, యత్=ఏది, కృతమ్=చేయబడినదో, ఇదమ్=ఇది, భర్తృస్నేహపరీతేన=ప్రభుభక్తితో కూడిన నాచేత చేయబడినది.

తా. ఓ! వీరుడా! ఓ! ప్రభూ! నేను ఈ రథము కేవలము నా ఇష్టము ప్రకారము తొలగించలేదు. నేను చేసిన ఈ పని ప్రభుభక్తిచేతనే చేయబడినది. 22

మూ. ఆజ్ఞాపయ యథాతత్త్వం వక్ష్యస్యరినిషూదన,
తత్కరిష్యామ్యహం వీర గతానృణ్యేన చేతసా. 23

ప్ర. అ. అరిషూదన=శత్రువినాశకుడా!వీర=వీరుడా!ఆజ్ఞాపయ=ఆజ్ఞాపించుము, త్వమ్=నీవు, తత్=ఆకార్యమును, యథా=ఎట్లు, వక్ష్యసి=చెప్పగలవో, తత్=దానిని, అహమ్=నేను, గతానృణ్యేన=పొందబడిన ఋణము లేకపోవుట గల, చేతసా=చిత్తముతో, కరిష్యామి=చేసెదను.

తా. శత్రుసంహారకుడవైన వీరుడా! ఆజ్ఞాపించుము, నీవు ఎట్లు చేయుమని చెప్పెదవో అట్లే, నీ ఋణమును తీర్చుకొనవలెను అను ఆలోచనతో, చేసెదను. 23

మూ. సంతుష్టస్తేన వాక్యేన రావణస్తస్య సారథేః,
ప్రశస్యైనం బహువిధం యుద్ధలుబ్ధోఽబ్రవీదిదమ్. 24

ప్ర. అ. తస్య సారథేః=ఆ సారథి యొక్క, తేన వాక్యేన=ఆ వాక్యముచేత, సంతుష్టః=సంతోషించిన, రావణః=రావణుడు, ఏనమ్=వీనిని, బహువిధమ్=అనేకవిధములుగా, ప్రశస్య=ప్రశంసించి, యుద్ధలుబ్ధః=యుద్ధమునందు ఆసక్తి గలవాడై, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ సారథి పలికిన మాటలకు సంతోషించిన రావణుడు ఆతనిని అనేకవిధముల ప్రశంసించి, యుద్ధమునందు ఆసక్తి కలవాడై ఇట్లు పలికెను.24

మూ. రథం శీఘ్రమిమం సూత రాఘవాభిముఖం నయ,
నాహత్వా సమరే శత్రూన్నివర్తిష్యతి రావణః. 25

ప్ర. అ. సూత=సారథీ! ఇమమ్=ఈ, రథమ్=రథమును, శీఘ్రమ్=శీఘ్రముగా, రాఘవాభిముఖమ్=రామునకు అభిముఖముగా, నయ=తీసికొనివెళ్లుము. రావణః=రావణుడు, సమరే=యుద్ధమునందు, శత్రూన్=శత్రువులను, అహత్వా=చంపకుండగా, న నివర్తిష్యతి=మరలడు.

తా. సారథీ! రథమును రామునకు ఎదురుగా తీసికొనివెళ్లుము. రావణుడు యుద్ధములో శత్రువులను చంపకుండగా వెనుకకు తిరిగి వెళ్లడు.25

మూ. ఏవముక్త్వా తతస్తుష్టో రావణో రాక్షసేశ్వరః,
దదౌ తస్య శుభం హ్యేకం హస్తాభరణముత్తమమ్, 26
శ్రుత్వా రావణవాక్యాని సారథిః స న్యవర్తత.

ప్ర. అ. తుష్టః=సంతోషించిన, రాక్షసేశ్వరః=రాక్షస ప్రభువైన, రావణః=రావణుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=అటుపిమ్మట, తస్య=ఆతనికి, శుభమ్=సుందరమైన, ఏకమ్=ఒక, ఉత్తమమ్=శ్రేష్ఠమైన, హస్తాభరణమ్=హస్తాభరణమును, దదౌ=ఇచ్చెను. సః సారథిః=ఆ సారథి, రావణవాక్యాని=రావణుని వాక్యములను, శ్రుత్వా=విని, న్యవర్తత=వెనుకకు మరలెను.

తా. రాక్షసప్రభువైన రావణుడు ఇట్లు పలికి, సంతోషించినవాడై, ఆతనికి ఒక అందమైన శ్రేష్ఠమైన హస్తాభరణమును బహూకరించెను. ఆ సారథి రావణుని మాటలు విని వెనుకకు మరలెను. 26

మూ. తతో ద్రుతం రావణవాక్యచోదితః
ప్రచోదయామాస హయాన్ స సారథిః,
స రాక్షసేన్ద్రస్య తతో మహారథః
క్షణేన రామస్య రథాగ్రతోఽభవత్. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే చతురధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణవాక్యచోదితః=రావణుని మాటలచేత ప్రేరేపింపబడిన, సః సారథిః=ఆ సారథి, హయాన్=గుఱ్ఱములను, ప్రచోదయామాస=తోలెను. తతః=అటుపిమ్మట, రాక్షసేన్ద్రస్య=రావణుని యొక్క, సః=ఆ,

మహారథః=గొప్ప రథము, క్షణేన=క్షణకాలముచేత, రామస్య=రామునియొక్క, రథాగ్రతః=రథమునకు ఎదుట, అభవత్=ఉండెను.

తా. పిమ్మట, రావణుని వాక్యముచేత ప్రేరితుడై ఆ సారథి శీఘ్రముగా గుఱ్ఱములను తోలెను. పిమ్మట క్షణకాలములో ఆ రావణుని రథము రాముని రథము ఎదుట ఉండెను. 27

"బాలానందిని " అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటనాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాధికశతతమః సర్గః

[అగస్త్యుడు వచ్చి యుద్ధములో జయము సంపాదించుటకు ఆదిత్యహృదయస్తోత్రమును పఠింపు మని రామునకు ఉపదేశించుట.]

మూ. తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయా స్థితమ్,
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్. 1
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్,
ఉపగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, దైవతైః=దేవతలతో, సమాగమ్య=కలిసి, రణమ్=యుద్ధమును, ద్రష్టుమ్=చూచుటకు, అభ్యాగతః=వచ్చిన, భగవాన్=భగవంతుడైన, అగస్త్యః ఋషిః=అగస్త్యమహర్షి, యుద్ధపరిశ్రాన్తమ్=యుద్ధమునందు అలసిన, యుద్ధాయ=యుద్ధముకొరకు, సముపస్థితమ్=వచ్చి ఉన్న, రావణమ్=రావణుణ్ణి, అగ్రతః=ఎదుట, దృష్ట్వా=చూచి, సమరే=యుద్ధమునందు, చిన్తయా=చింతతో, స్థితమ్=ఉన్న, రామమ్=రాముణ్ణి, ఉపగమ్య=సమీపించి, అబ్రవీత్=పలికెను.

తా. యుద్ధమును చూచుటకై దేవతలతో కలిసి వచ్చిన భగవంతుడైన అగస్త్యమహర్షి, అప్పుడు, యుద్ధముచేసి అలసి, యుద్ధమునకై వచ్చి ఎదుట ఉన్న రావణుని చూచి యుద్ధరంగములో చింతాక్రాంతుడై ఉన్న రాముని దగ్గరకు వెళ్లి ఇట్లు పలికెను. 1, 2

మూ. రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వానరీన్వత్స సమరే విజయిష్యసే. 3

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గల, రామ రామ=ఓ! రామా! సనాతనమ్=నిత్యమైన, గుహ్యమ్=రహస్యమును, శృణు=వినుము. వత్స=నాయనా! యేన=దేనిచేత, సమరే=యుద్ధమునందు, సర్వాన్=సమస్తమైన, అరీన్=శత్రువులను, విజయిష్యసే=జయించగలవో.

తా. గొప్ప బాహువులు గల నాయనా! ఓ! రామా! రామా! నిత్యమైన ఒక రహస్యమైన స్తోత్రమును వినుము. దీనిచేత యుద్ధములో సర్వశత్రువులను జయించగలవు. 3

మూ. ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్,
జయావహం జపేన్నిత్యమక్షయ్యం పరమం శివమ్. 4
సర్వమఙ్గలమఙ్గల్యం సర్వపాపప్రణాశనమ్,
చిన్తాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్. 5

ప్ర. అ. పుణ్యమ్=పుణ్యప్రదము, సర్వశత్రువినాశనమ్=సకల శత్రువులను నశింపచేయునది, జయావహమ్=జయమును ఇచ్చునది, అక్షయ్యమ్=క్షయము లేని ఫలమును ఇచ్చేది, పరమం శివమ్=మిక్కిలి పావనము, సర్వమఙ్గలమఙ్గల్యమ్=అన్ని మంగళకరములలోను మంగళకరమైనది, సర్వపాపప్రణాశనమ్=సకల పాపములను నశింపచేసేది, చిన్తాశోకప్రశమనమ్=చింతను శోకమును శాంతింప చేసేది, ఉత్తమమ్=ఉత్తమమైన, ఆయుర్వర్ధనమ్=ఆయుస్సును వృద్ధిపొందించునదీ అయిన, ఆదిత్యహృదయమ్=ఆదిత్యుని హృదయములో (మధ్యయందు) ఉన్న బ్రహ్మను ప్రతిపాదించుటచేత ఆదిత్యహృదయ మను పేరు గల స్తోత్రమును, నిత్యమ్=ఎల్లప్పుడూ, జపేత్=జపించవలెను.

తా. పుణ్యప్రదమైన ఆదిత్యహృదయస్తోత్రమును నిత్యము జపించవలెను. ఇది సకలశత్రువులను నశింపచేయును. జయము నిచ్చును. అక్షయమైన ఫలమును ఇచ్చును. చాల పవిత్రమైనది. మంగళప్రదములైన అన్ని స్తోత్రాదులలోను ఇది అధిక మంగళప్రదము. సకలపాపములను తొలగించును. చింతను, శోకమును శాంతింపచేయును. ఆయుస్సును వృద్ధిపొందించు ఉత్తమసాధనము. 4, 5

మూ. రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతమ్,
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్. 6

ప్ర. అ. రశ్మిమన్తమ్=ప్రశస్తమైన కిరణములు కలవాడు, సముద్యన్తమ్=ఉదయించుచున్నవాడు, దేవాసురనమస్కృతమ్=దేవతలచేతను అసురులచేతను నమస్కరించబడినవాడు, వివస్వన్తమ్=ఇతరతేజస్సులను కప్పివేయువాడు, భాస్కరమ్=కాంతిని చేయువాడు (ఇచ్చువాడు), భువనేశ్వరమ్=లోకములకు నియామకుడు అయిన సూర్యుణ్ణి, పూజయస్వ=పూజించుము.

తా. సూర్యుడుప్రశస్తములైన కిరణములు గలవాడు, ఉదయపర్వతమునందు ఉదయించువాడు, (లోకులను తమ తమ పనులలో ప్రవర్తింపచేయువాడు అని కొందరు వ్యాఖ్యాతలు); దేవతలచేత అసురుల చేత కూడ నమస్కరింపబడినవాడు. తన తేజస్సుచే ఇతర తేజస్సులను కప్పివేయువాడు. కాంతిని ఇచ్చువాడు. సర్వలోకములను నియమించువాడు. అట్టి సూర్యుణ్ణి ఆరాధింపుము.

వి. ఈ విశేషణములకు "నమః" చేర్చుటచే నమస్కారార్చనమంత్రములు ఏర్పడు నని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసిరి.

1. రశ్మిమతే నమః 2. సముద్యతే నమః 3. దేవాసురనమస్కృతాయ నమః 4. వివస్వతే నమః 5. భాస్కరాయ నమః 6. భువనేశ్వరాయ నమః6

మూ. సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః. 7

ప్ర. అ. ఏషః=ఇతడు, సర్వదేవాత్మకః=సకల దేవతాస్వరూపుడు, తేజస్వీ=గొప్ప తేజస్సు కలవాడు, రశ్మిభావనః=కిరణములచేత లోకములను అనుభవింపచేయువాడు అనగా రక్షించువాడు, ఏషః=ఇతడు, గభస్తిభిః=కిరణములచేత, దేవాసురగణాన్=దేవాసురగణములను, లోకాన్=జనులను, పాతి=రక్షించును.

తా. ఇతడు సర్వదేవతాస్వరూపుడు; గొప్ప తేజస్సు కలవాడు. కిరణములచేత లోకులను రక్షించువాడు. ఈ సూర్యుడు కిరణములచేత దేవగణములను అసురగణములను, జనులను రక్షించుచున్నాడు.

7. సర్వదేవాత్మకాయ నమః 8. తేజస్వినే నమః 9. రశ్మిభావనాయ నమః 10. దేవాసురగణలోకపాలాయ నమః 7

మూ. ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కన్దః ప్రజాపతిః,
మహేన్ద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః. 8

ప్ర. అ. ఏషః=ఇతడు, బ్రహ్మా చ=బ్రహ్మదేవుడు, విష్ణుశ్చ=విష్ణువు, శివః=శివుడు, స్కన్దః=కుమారస్వామి. ప్రజాపతిః=ప్రజాపతి (తొమ్మండుగురు ప్రజాపతులు). మహేన్ద్రః=మహేంద్రుడు, ధనదః=కుబేరుడు, కాలః=కాలము, యమః=యముడు, సోమః=చంద్రుడు, అపాంపతిః=జలాధిష్ఠానదేవతయైన వరుణుడు.

తా. ఈ సూర్యుడే బ్రహ్మదేవుడు; విష్ణువు; స్కందుడు; నవప్రజాపతులు; కుబేరుడు; కాలపురుషుడు; యముడు; సోముడు; వరుణుడు.

11. బ్రహ్మణే నమః 12. విష్ణవే నమః 13. శివాయ నమః 14. స్కన్దాయ నమః 15. ప్రజాపతయే నమః 16. మహేన్ద్రాయ నమః 17. ధనదాయ నమః 18. కాలాయ నమః 19. యమాయ నమః 20. సోమాయ నమః 21. అపాం పతయే నమః. 8

మూ. పితరో వసవః సాధ్యా అశ్వినౌ మరుతో మనుః,
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణ ఋతుకర్తా ప్రభాకరః. 9

ప్ర. అ. పితరః=పితృదేవతలు, వసవః=అష్టవసువులు, సాధ్యాః=సాధ్యులు, అశ్వినౌ=అశ్వినీదేవతలు, మరుతః=నలభైతొమ్మండుగురు మరుత్తులు, మనుః=మనువు, వాయుః=వాయువు, వహ్నిః=అగ్ని, ప్రజాః=ప్రజలు, ప్రాణః=ప్రాణవాయువు, ఋతుకర్తా=ఋతువులను ఏర్పరచువాడు, ప్రభాకరః=కాంతిని

చేయువాడు (ఇచ్చువాడు).

తా. పితృదేవతలు, వసువులు, సాధ్యులు, అశ్వినీదేవతలు, మరుత్తులు, మనువు, వాయువు, అగ్ని, ప్రజలు, ప్రాణవాయువు - ఇవన్నీ సూర్యుడే. ఇతడు ఋతువులను నిర్మించును. కాంతిని ఇచ్చును.

22. పితృదేవతాయై నమః, 23. వసుమూర్తయే నమః, 24. సాధ్యమూర్తయే నమః, 25. అశ్విమూర్తయే నమః, 26. మరున్మూర్తయే నమః, 27. మనవే నమః, 28. వాయుమూర్తయే నమః, 29. వహ్నయే నమః, 30. ప్రజారూపాయ నమః, 31. ప్రాణాయ నమః, 32. ఋతుకర్త్రే నమః, 33. ప్రభాకరాయ నమః. 9

మూ. ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః. 10

ప్ర. అ. ఆదిత్యః=అదితి కుమారుడు లేదా అఖండమైన భూమికి అధిపతి, సవితా=జగత్తును సృష్టించువాడు, సూర్యః=జనులను కర్మలయందు ప్రేరేపించువాడు, ఖగః=ఆకాశమునందు సంచరించువాడు, పూషా=జగత్తును వర్షముచేత పోషించువాడు, గభస్తిమాన్=కిరణములు గలవాడు, సువర్ణసదృశః=బంగారముతో సమానుడు (బంగారువర్ణము గలవాడు), భానుః=ప్రకాశించువాడు, హిరణ్యరేతాః=బంగారము రేతస్సుగా గలవాడు, (బంగారు బ్రహ్మాండమును సృజించినవాడు), దివాకరః=పగలును చేయువాడు.

తా. అదితికుమారుడు. జగత్తు సృష్టించినవాడు. జనులను తమ తమ పనులలో ప్రేరేపించువాడు. ఆకాశమునందు సంచరించువాడు. జగత్తును వర్షాదులచేత పోషించువాడు. కిరణములు గలవాడు. బంగారు రంగు గలవాడు. ప్రకాశించువాడు, బంగారు రేతస్సు గలవాడు, పగలు కల్పించువాడు.

34. ఆదిత్యాయ నమః, 35. సవిత్రే నమః, 36.సూర్యాయ నమః, 37.ఖగాయ నమః, 38.పూష్ణే నమః, 39.గభస్తిమతే నమః, 40. సువర్ణసదృశాయ నమః, 41.భానవే నమః, 42.హిరణ్యరేతసే నమః, 43.దివాకరాయ నమః, 10

మూ. హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్,
తిమిరోన్మథనః శమ్భుస్త్వష్టా మార్తణ్డకోఽంశుమాన్. 11

ప్ర. అ. హరిదశ్వః=ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు, సహస్రార్చిః=వెయ్యి కిరణములు గలవాడు, సప్తసప్తిః=సప్త అను పేరు గల గుఱ్ఱము గలవాడు (అని, గోవిందరాజు) ఏడు గుఱ్ఱములు గలవాడు, మరీచిమాన్=కిరణములు గలవాడు, తిమిరోన్మథనః=చీకటిని నశింపచేయువాడు, శమ్భుః=సుఖమునకు ఉత్పత్తి స్థానమైనవాడు, త్వష్టా=అన్ని రూపములను చెక్కి సన్నము చేసేవాడు (సంహారకుడు),

మార్తణ్డకః=బ్రహ్మాండము మరణించిన పిమ్మట మరల దాని సృష్టికై మరల ఆవిర్భవించిన వాడు, అంశుమాన్=కిరణములు గలవాడు.

తా. సూర్యుని అశ్వములు ఆకుపచ్చనివి. వేయి కిరణములు గలవాడు. ఏడు గుఱ్ఱములు, కిరణములు, గలవాడు. చీకటిని నశింపచేయువాడు. సుఖమును ఇచ్చువాడు. ప్రాణులను సంహరించువాడు. బ్రహ్మాండమును ప్రలయానంతరము మరల సృజించువాడు. కిరణములు గలవాడు.

44. హరిదశ్వాయ నమః, 45. సహస్రార్చిషే నమః; 46. సప్తసప్తయే నమః, 47.మరీచిమతే నమః, 48.తిమిరోన్మథనాయ నమః, 49.శంభవే నమః, 50.త్వష్ట్రే నమః, 51.మార్తణ్డకాయ నమః, 52.అంశుమతే నమః, 11

మూ. హిరణ్యగర్భః శిశిరస్తపనోఽహస్కరో రవిః,
అగ్నిగర్భోఽదితేః పుత్రః శఙ్ఖః శిశిరనాశనః. 12

ప్ర. అ. హిరణ్యగర్భః=సకల జగదుత్పత్తి స్థితిలయకర్తయైన బ్రహ్మవిష్ణు రుద్రరూపుడు. ["భగవతే హిరణ్యగర్భాయ నమః" అను ద్వాదశాక్షరి ఆదిత్య హృదయరహస్య మని వ్యాఖ్యాతలు వ్రాసినారు.] శిశిరః= తాపత్రయతప్తుల తాపమును పోగొట్టు చల్లనివాడు, తపనః=వేడి కలిగించువాడు, అహస్కరః=పగటిని చేయువాడు, రవిః=అందరిచేత స్తుతింపబడువాడు, అగ్నిగర్భః=అగ్ని గర్భమునందు గలవాడు. అదితేః=అదితియొక్క, పుత్రః=పుత్రుడు, శఙ్ఖః=సాయంకాలమునందు స్వయముగానే శాంతించువాడు, శిశిరనాశనః=మంచును నశింపచేయువాడు.

తా. సూర్యుడు బ్రహ్మవిష్ణురుద్రరూపుడు, చల్లనివాడు, తపింపచేయు వాడు, పగటిని కల్పించువాడు. స్తుతింపబడువాడు, అగ్ని గర్భమునందు గలవాడు, అతిది పుత్రుడు, శాంతించువాడు, శిశిరమును నశింపచేయువాడు.

53. హిరణ్యగర్భాయ నమః, 54. శిశిరాయ నమః, 55. తపనాయ నమః, 56. అహస్కరాయ నమః, 57. రవయే నమః, 58. అగ్నిగర్భాయ నమః, 59. అదితేః పుత్రాయ నమః, 60. శఙ్ఖాయ నమః, 61. శిశిరనాశనాయ నమః. 12

మూ. వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుఃసామపారగః,
ఘనవృష్టిరపాం మిత్రో విన్ధ్యవీథీప్లవంగమః. 13

ప్ర. అ. వ్యోమనాథః=ఆకాశమునకు ప్రభువు, తమోభేదీ=రాహువును భేదించువాడు, ఋగ్యజుఃసామపారగః=ఋగ్యజుః సామవేదముల పారమును పొందినవాడు, ఘనవృష్టిః=అధికమైన వర్షము గలవాడు, అపామ్=జలములకు, మిత్రః=మిత్రుడు, విన్ధ్యవీథీప్లవంగమః=ఆకాశమార్గమునందు శీఘ్రముగా వెళ్లువాడు.

తా. సూర్యుడు ఆకాశమునకు ప్రభువు. రాహువును భేదించువాడు.

ఋగ్యజుఃసామవేదముల పారమును పొందినవాడు. అధికమైన వర్ష మిచ్చువాడు. ఉదకమునకు మిత్రుడు. ఆకాశమున శీఘ్రముగా సంచరించువాడు.

62. వ్యోమనాథాయ నమః, 63. తమోభేదినే నమః, 64. ఋగ్యజుఃసామపారగాయ నమః, 65. ఘనవృష్టయే నమః, 66. అపాంమిత్రాయ నమః, 67. విన్ధ్యవీథీప్లవంగమాయ నమః. 13

మూ. ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గలః సర్వతాపనః,
కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః. 14

ప్ర. అ. ఆతపీ=ఎండగలవాడు, మణ్డలీ=మండలము గలవాడు, మృత్యుః=శత్రువులకు మృత్యువు, పిఙ్గలః=ఎఱ్ఱని రంగు గలవాడు, సర్వతాపనః=అన్నింటినీ అందరినీ తపింపచేయువాడు, కవిః=పండితుడు, విశ్వః=ప్రపంచమును నడుపువాడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గలవాడు, రక్తః=అందరియందు అనురాగము గలవాడు, సర్వభవోద్భవః=అందరి సంసారమునకు ఉత్పత్తి స్థానమైనవాడు.

తా. సూర్యుడు ఎండ ఇచ్చువాడు. మండలము గలవాడు. శత్రు సంహారకుడు. ఉదయసమయమున ఎఱ్ఱగా నుండువాడు. అందరికీ తాపము కలిగించువాడు. పండితుడు. ప్రపంచ వ్యవహారము నడుపువాడు. గొప్ప తేజస్సు గలవాడు. అందరియందు ప్రేమ గలవాడు. అందరి సంసారానికీ కారణభూతుడు. 68. ఆతపినే నమః, 69. మణ్డలినే నమః, 70. మృత్యవే నమః, 71. పిఙ్గలాయ నమః, 72. సర్వతాపనాయ నమః, 73. కవయే నమః, 74. విశ్వాస్మై నమః, 75. మహాతేజసే నమః, 76. రక్తాయ నమః, 77. సర్వభవోద్భవాయ నమః. 14

మూ. నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః,
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోఽస్తు తే. 15

ప్ర. అ. నక్షత్రగ్రహతారాణామ్=అశ్విన్యాదినక్షత్రములకు, గ్రహములకు, తారలకు అధిపతి, విశ్వభావనః=ప్రపంచమును స్థాపించినవాడు, తేజసామపి=అగ్న్యాదితేజస్సులలో కూడ, తేజస్వీ=అధికతేజస్సు కలవాడు, అట్టి సూర్యునకు నమస్కారము, ద్వాదశాత్మన్=పన్నెండు రూపములు గలవాడా, తే=నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. సూర్యనకు పన్నెండు మూర్తులు ఉన్నట్లు.

"ఇన్ద్రో ధాతా భగః పూషా మిత్రోఽథ వరుణోఽర్యమా,
అర్చిర్వివస్వాన్ త్వష్టా చ సవితా విష్ణురేవ చ."

ఇత్యాదిస్మృతివాక్యములు చెప్పుచున్నవి.

తా. సూర్యుడు, అశ్విన్యాది నక్షత్రములకు, చంద్రాది గ్రహములకు,

తారలకు అధిపతి. జగత్తునకు స్థాపకుడు. అగ్న్యాదితేజస్సులమధ్య అధికతేజస్సు గలవాడు. అట్టి సూర్యునకు నమస్కారము. ఓ! ద్వాదశస్వరూపములు గలవాడా! నీకు నమస్కారము.

78. నక్షత్రగ్రహతారాధిపాయ నమః, 79. విశ్వభావనాయ నమః, 80. తేజసామపి తేజస్వినే నమః, 81. ద్వాదశాత్మనే నమః. 15

మూ. నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః,
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః. 16

ప్ర. అ. పూర్వాయ గిరయే=పూర్వపర్వతస్వరూపునకు, నమః=నమస్కారము, పశ్చిమాయ అద్రయే=పశ్చిమపర్వతరూపునకు, నమః=నమస్కారము, దినాధిపతయే=దినముయొక్క అధిపతికి, నమః=నమస్కారము.

తా. పూర్వ(తూర్పు) పర్వతరూపునకు నమస్కారము. పశ్చిమపర్వతరూపునకు నమస్కారము. జ్యోదిర్గణముల అధిపతికి నమస్కారము. దినాధిపతికి నమస్కారము.

82. పూర్వాయ గిరయే నమః, 83. పశ్చిమాద్రయే నమః, 84. జ్యోతిర్గణానాం పతయే నమః, 85. దినాధిపతయే నమః. 16

మూ. జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః. 17

ప్ర. అ. జయాయ=ఉపాసకులకు జయము నిచ్చువానికి, జయభద్రాయ=జయమును (ఉన్నతిని) భద్రమును ఇచ్చువానికి, హర్యశ్వాయ=ఆకుపచ్చని గుఱ్ఱములు గలవానికి, నమః నమః=నమస్కారము, నమస్కారము, ఆదిత్యాయ=ఆదిత్యునకు, నమః నమః=నమస్కారము, నమస్కారము.

తా. ఉపాసకులకు విజయమును, ఉన్నతిని, క్షేమమును (మంగళమును) ఇచ్చువాడు, ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు అయిన సూర్యునకు నమస్కారము, నమస్కారము. వేయి కిరణములు కలవాడా! నమస్కారము నమస్కారము. ఆదిత్యునకు నమస్కారము.

86. జయాయ నమః, 87. జయభద్రాయ నమః, 88. హర్యశ్వాయ నమః, 89. సహస్రాంశవే నమః, 90. ఆదిత్యాయ నమః. 17

మూ. నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ ప్రచణ్డాయ నమోఽస్తు తే. 18

ప్ర. అ. ఉగ్రాయ=శత్రువులకు ఉగ్రుడైన, వీరాయ=ప్రాణులను అనేకవిధముల ప్రేరేపించువానికి, నమః=నమస్కారము, సారఙ్గాయ=శీఘ్రముగా ప్రయాణము

చేయువానికి, నమః నమః=నమస్కారము, నమస్కారము. పద్మప్రబోధాయ=పద్మములను వికసింపచేయువానికి, నమః=నమస్కారము, ప్రచణ్డాయ=తీక్ష్ణుడవైన, తే=నీకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక.

తా. ఉగ్రునకు నమస్కారము. వీరునకు నమస్కారము. శీఘ్రముగా వెళ్లువానికి నమస్కారము, నమస్కారము. పద్మములను వికసింపచేయువానికి నమస్కారము. తీక్ష్ణమైన నీకు నమస్కారము.

91. ఉగ్రాయ నమః, 92. వీరాయ నమః, 93. సారఙ్గాయ నమః, 94. పద్మప్రబోధాయ నమః, 95. ప్రచణ్డాయ నమః. 18

మూ. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే,
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః. 19

ప్ర. అ. బ్రహ్మేశానాచ్యుతేశాయ=బ్రహ్మ - ఈశ్వర - అచ్యుతరూపునకు, సూర్యాయ=సూర్యునకు, ఆదిత్యవర్చసే=ఆదిత్యరూపమైన కాంతి గలవానికి, భాస్వతే=కాంతిగలవానికి, సర్వభక్షాయ=సర్వసంహారకుడైన, రౌద్రాయ వపుషే=రౌద్రదేహము కలవానికి, నమః=నమస్కారము.

తా. బ్రహ్మ - విష్ణు - శివాత్మకునకు, సూర్యునకు, ఆదిత్యరూపమైన తేజస్సు కలవానికి, కాంతి గలవానికి, సర్వసంహారము చేయువానికి, రౌద్ర రూపము గలవానికి నమస్కారము.

96. బ్రహ్మేశానాచ్యుతేశాయ నమః, 97. సూర్యాయ నమః, 98. ఆదిత్యవర్చసే నమః, 99. భాస్వతే నమః, 100. సర్వభక్షాయ నమః, 101. రౌద్రవపుషే నమః, 19

మూ. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః. 20

ప్ర. అ. తమోఘ్నాయ=చీకటిని నశింపచేయువానికి, హిమఘ్నాయ=మంచును నశింపచేయువానికి, శత్రుఘ్నాయ=శత్రువులను నశింపచేయువానికి, అమితాత్మనే=ఇంత అని ఇట్టిదని కొలిచి చెప్ప శక్యముకాని స్వరూపము కలవానికి, కృతఘ్నఘ్నాయ=కృతఘ్నులను సంహరించువానికి, దేవాయ= ప్రకాశించువానికి, జ్యోతిషామ్=జ్యోతిస్సుల, పతయే=అధిపతికి, నమః=నమస్కారము.

తా. చీకటిని, మంచును, శత్రువులను, కృతఘ్నులను నశింపచేయువానికి, అపరిచ్ఛిన్నమైన స్వరూపము కలవానికి, ప్రకాశించుచున్నవానికి, జ్యోతిస్సుల అధిపతికి నమస్కారము.

102. తమోఘ్నాయ నమః, 103. హిమఘ్నాయ నమః, 104.

శత్రుఘ్నాయ నమః, 105. అమితాత్మనే నమః, 106. కృతఘ్నఘ్నాయ నమః, 107. దేవాయ నమః, 108. జ్యోతిషాం పతయే నమః. 20

మూ. తప్తచామీకరాభాయ హరయే విశ్వకర్మణే,
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే. 21

ప్ర. అ. తప్తచామీకరాభాయ=కరిగించిన బంగారము వంటి కాంతి కలవానికి, హరయే=అజ్ఞానమును హరించువానికి, విశ్వకర్మణే=జగత్తును సృష్టించిన వానికి, తమోభినిఘ్నాయ=చీకటిని తొలగించువానికి, రుచయే=ప్రకాశస్వరూపునకు, లోకసాక్షిణే=లోకుల పుణ్యపాపములకు సాక్షియైనవానికి, నమః=నమస్కారము.

తా. కాల్చిన బంగారము వంటి కాంతి కలవానికి, హరికి, విశ్వస్రష్టకు, తమోవినాశకునకు, ప్రకాశస్వరూపునకు, లోకసాక్షికి నమస్కారము.

109. తప్తచామీకరాభాయ నమః, 110. హరయే నమః, 111. విశ్వకర్మణే నమః, 112. తమోభినిఘ్నాయ నమః, 113. రుచయే నమః, 114. లోకసాక్షిణే నమః. 21

మూ. నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః,
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః. 22

ప్ర. అ. ప్రభుః=ప్రభువైన, ఏషః వై=ఈ సూర్యుడే, భూతమ్=జగత్తును, నాశయతి=నశింపచేయును, తదేవ=దానినే, సృజతి=సృష్టించును, ఏషః=ఇతడు, గభస్తిభిః=కిరణములచేత, పాయతి=ఎండింపచేయును, ఏషః=ఇతడు, తపతి=తపింపచేయును, ఏషః=ఇతడు, వర్షతి=వర్షించును.

తా. ప్రభువైన ఇతడే జగత్తును ప్రళయకాలమునందు నశింపచేయును, దానినే సృష్టించును. ఇతడు కిరణములచేత శుష్కింపచేయును; తపింపచేయును; వర్షించును.

115. భూతనాశాయ నమః, 116. భూతస్రష్ట్రే నమః, 117. ప్రభవే నమః, 118. పాయతే నమః, 119. తపతే నమః, 120. వర్షతే నమః. 22

మూ. ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్. 23

ప్ర. అ. ఏషః=ఇతడు, భూతేషు=ప్రాణులు, సుప్తేషు=నిద్రించుచుండగా, పరినిష్ఠితః=వాటిలో ఉన్నవాడై, జాగర్తి=మెలకువగా ఉండును. ఏషః చైవ=ఇతడే, అగ్నిహోత్రం చ=అగ్నిహోత్రము; అగ్నిహోత్రిణామ్=అగ్నిహోత్రముచేయువారియొక్క, ఫలం చ=ఫలము కూడ.

తా. అన్ని ప్రాణులూ నిద్రించుచుండగా ఇతడు వాటిలో అంతరాత్మ రూపమున ఉండి మేల్కొని ఉండును. ఇతడే అగ్నిహోత్రము, అగ్నిహోత్రము చేయువారికి ఫలము నిచ్చువాడు.

121. సుప్తేషు జాగ్రతే నమః, 122. భూతేషు పరినిష్ఠితాయ నమః, 123. అగ్నిహోత్రాయ నమః, 124. అగ్నిహోత్రఫలప్రదాయ నమః. 23

మూ. దేవాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ,
యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమప్రభుః. 24

ప్ర. అ. దేవాః=దేవతలు, క్రతవశ్చైవ=క్రతువులు, క్రతూనామ్=క్రతువుల యొక్క, ఫలమేవ చ=ఫలము, ఇతడే. సర్వేషు=సమస్తమైన, లోకేషు=లోకముల యందు, యాని=ఏ, కృత్యాని=కృత్యములు గలవో, వాటియందు, పరమప్రభుః=చాల సమర్థుడు.

తా. దేవతలు, క్రతువులు, క్రతువుల ఫలమూ కూడ సూర్యుడే. లోకములో ఉన్న సమస్తకృత్యముల (యజ్ఞయాగాదుల) విషయమువ మిక్కిలి సమర్థుడు ఇతడే.

125. పరమసమర్థాయ భగవతే బ్రహ్మణే నమః. ఈ నూటఇరవైయైదూ భగవత్పూజారహస్యనామమంత్రము లని ఒక వ్యాఖ్యాత చెప్పినారు. మరొక వ్యాఖ్యాత అభిప్రాయము ప్రకారము "(7) శ్లోకం మొదలు "లోకసాక్షిణే" అను పదము అంతమునందు గల శ్లోకమువరకు (21) ఉన్న శ్లోకములలోని 108 నామములు ఆదిత్యహృదయస్తోత్రనామమంత్రములు. 24

మూ. ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ,
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ. 25

ప్ర. అ. రాఘవ=రామా! ఏనమ్=ఈ ఆదిత్యుణ్ణి, ఆపత్సు=ఆపదలయందు, కృచ్ఛ్రేషు=కష్టములలోను, కాన్తారేషు=దుర్గమమార్గములయందు, భయేషు=భయని మిత్తములందు, కీర్తయన్=కీర్తించుచున్న, పురుషః=పురుషుడు, కశ్చిత్=ఎవ్వడూ, నావసీదతి=నశించదు.

తా. రామా! ఆపదలలోను, దుర్గమప్రదేశములలోను, భయసమయము లలోను ఈ ఆదిత్యుణ్ణి కీర్తించు ఏ మానవుడూ నశించదు. 25

మూ. పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి. 26

ప్ర. అ. జగత్పతిమ్=జగత్తుకు ప్రభువు, దేవదేవమ్=దేవతలకు దేవుడూ అయిన, ఏనమ్=ఈ సూర్యుణ్ణి, ఏకాగ్రః=ఏకాగ్రచిత్తముకలవాడవై, పూజయస్వ=పూ

జించుము. ఏతత్=దీనిని, త్రిగుణితమ్=మూడు పర్యాయములు, జప్త్వా=జపించి, యుద్ధేషు=యుద్ధములయందు, విజయిష్యసి=జయించగలవు.

తా. జగత్తునకు ప్రభువైన ఈ దేవదేవుణ్ణి ఏకాగ్రచిత్తముతో పూజించుము. ఈ ఆదిత్య హృదయమును మూడు పర్యాయములు జపించినచో యుద్ధములలో జయము పొందగలవు. 26

మూ. అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి,
ఏవముక్త్వా తతోఽగస్త్యో జగామ స యథాగతమ్. 27

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా! అస్మిన్=ఈ, క్షణే=క్షణమునందు, త్వమ్=నీవు, రావణమ్=రావణుణ్ణి, వధిష్యసి=చంపగలవు. అగస్త్యః=అగస్త్యుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, తతః=పిమ్మట, యథాగతమ్=వచ్చిన విధముగానే, జగామ=వెళ్లిపోయెను.

తా. ఓ! మహాబాహూ! నీవు ఈ క్షణమునందే రావణుణ్ణి చంపగలవు. అగస్త్యు డీ విధముగా పలికి వచ్చిన విధముగానే వెళ్లిపోయెను. 27

మూ. ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్.. 28

ప్ర. అ. తదా=అప్పుడు, మహాతేజాః=గొప్ప తేజస్సు గల రాముడు, ఏతత్=దీనిని, శ్రుత్వా=విని, నష్టశోకః=నశించిన శోకము గలవాడు, అభవత్=ఆయెను. రాఘవః=రాముడు, సుప్రీతః=చాల సంతోషించినవాడై, ప్రయతాత్మవాన్=నిశ్చలమైన మనస్సు కలవాడై, ధారయామాస=ధరించెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు అప్పుడు అది విని శోకమును విడిచిపెట్టెను. రాముడు చాల సంతోషించి, నిశ్చలమైన మనస్సుతో ఆ మంత్రమును ధరించెను. 28

మూ. ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్,
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్, 29
రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధార్థం సముపాగమత్.
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్. 30

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన రాముడు, ఆదిత్యమ్=సూర్యుణ్ణి, ప్రేక్ష్య=చూచి, త్రిః=మూడుపర్యాయములు, ఆచమ్య=ఆచమనము చేసి, శుచిః=పవిత్రుడు, భూత్వా=అయి, జప్త్వా=జపించి, పరమ్=గొప్ప, హర్షమ్=సంతోషమును, అవాప్తవాన్=పొందెను. ధనుః=ధనస్సును, ఆదాయ=గ్రహించి,

రావణమ్=రావణుణ్ణి, ప్రేక్ష్య=చూచి, హృష్టాత్మా=సంతోషించిన మనస్సు గలవాడై, యుద్ధార్థమ్=యుద్ధముకొరకు, సముపాగమత్=వచ్చెను. మహతా=గొప్పదైన, సర్వయత్నేన=సకల ప్రయత్నముచేత, తస్య=వానియొక్క, వధే=చంపుటయందు, ధృతః=స్థిరచిత్తుడు, అభవత్=ఆయెను.

తా. పరాక్రమవంతుడైన ఆ రాముడు మూడు పర్యాయములు ఆచమనము చేసి పవిత్రుడై సూర్యుణ్ణి చూచి, ఆదిత్యహృదయమును జపించి, గొప్ప సంతోషమును పొందెను. ధనస్సు గ్రహించి రావణుని చూచి సంతోషించిన మనస్సుతో యుద్ధమునకై వచ్చెను. సర్వప్రయత్నములచేత ఆతనిని చంపుటకు నిశ్చయించుకొనెను.

29, 30

మూ. అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే పఞ్చోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, ముదితమనాః=సంతోషించిన మనస్సు గల, రవిః=సూర్యుడు, పరమ్=మిక్కిలి, ప్రహృష్యమాణః=రోమాంచవంతుడగుచు, రామమ్=రాముణ్ణి, నిరీక్ష్య=చూచి, నిశిచరపతిసంక్షయమ్=రావణుని మరణ మును, విదిత్వా=తెలిసికొని, సురగణమధ్యగతః=దేవతాగణమధ్యమునం దున్నవాడై, త్వర=తొందరపడుము, ఇతి=అని, వచః=వచనమును, అవదత్=పలికెను.

తా. అప్పుడు సంతోషించిన సూర్యుడు రోమాంచము కలిగిన శరీరముతో దేవగణము మధ్య నిలచి, రాముణ్ణి చూచి, రావణుడు మరణింపనున్నా డని తెలిసికొని (లేదా రావణుడు మరణించు నట్లు అనుగ్రహించి) "తొందరపడుము" అని పలికెను.

31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఐదవ సర్గ సమాప్తము.

# అథ షడుత్తరశతతమః సర్గః

[రావణుని రథమును చూచి రాముడు మాతలికి తగు విధముగా చెప్పుట, రావణుని పరాజయమును, రాముని విజయమును సూచించు శకునములు కనబడుట.]

మూ. సారథిః స రథం హృష్టం పరసైన్యప్రధర్షణమ్,
గన్ధర్వనగరాకారం సముచ్ఛ్రితపతాకినమ్, 1
యుక్తం పరమసంపన్నైర్వాజిభిర్హేమమాలిభిః,
యుద్ధోపకరణైః పూర్ణం పతాకాధ్వజమాలినమ్, 2
గ్రసన్తమివ చాకాశం నాదయన్తం వసుంధరామ్,
ప్రణాశం పరసైన్యానాం స్వసైన్యస్య ప్రహర్షణమ్, 3
రావణస్య రథం క్షిప్రం చోదయామాస సారథిః.

ప్ర. అ. సః సారథిః=ఆ సారథి, హృష్టః=సంతోషించినవాడై, పరసైన్య ప్రధర్షణమ్=శత్రుసైన్యమును ఎదిరించేది, గన్ధర్వనగరాకారమ్=మాయాకల్పిత మైన (గంధర్వ) నగరమువంటి ఆకారము గలది, సముచ్ఛ్రితపతాకినమ్=ఎత్తబడిన పతాకలు గలది, పరమసంపన్నైః=ఉత్తమగుణములతో కూడిన, హేమమాలిభిః=బంగారు మాలలు గల, వాజిభిః=గుఱ్ఱములచేత, యుక్తమ్=కట్టబడినది, యుద్ధోపకరణైః= యుద్ధసాధనములతో, పూర్ణమ్=నిండినది, పతాకాధ్వజమాలినమ్=పతాకలయొక్క ధ్వజములయొక్క మాలలు కలది, ఆకాశమ్=ఆకాశమును, గ్రసన్తమివ=మ్రింగుచున్నదివలె ఉన్నది, వసుంధరామ్=భూమిని, నాదయన్తమ్=ధ్వనింపచేయుచున్నది, పరసైన్యానామ్=శత్రుసైన్యములకు, ప్రణాశమ్=నాశకరము, స్వసైన్యస్య=తన సైన్యమునకు, ప్రహర్షణమ్=ఆనందింపచేయునది అయిన, రావణస్య రథమ్=రావణుని రథమును, క్షిప్రమ్=శీఘ్రముగా, చోదయామాస=తోలెను.

తా. ఆ సారథి సంతోషించి ఎగురవేయబడిన పతాకలతో గంధర్వనగరము వలె ఉన్న, శత్రుసైన్యమును ఎదిరించు ఆ రావణుని రథమును తోలుకొనివచ్చెను. దానికి వేగము మొదలైన అన్ని మంచి గుణములు గల, బంగారు మాలలు అలంకరించిన గుఱ్ఱములు కట్టబడెను. యుద్ధమునకు కావలసిన ఉపకరణములన్నీ దానిపై అమర్చబడెను. భూమిని ధ్వనింపచేయుచుండెను. అది శత్రుసైన్యములను నశింపచేసి స్వసైన్యములకు ఆనందము కలిగించెను. 1 - 3

మూ. తమాపతన్తం సహసా స్వనవన్తం మహాధ్వజమ్, 4
రథం రాక్షసరాజస్య నరరాజో దదర్శ హ,
కృష్ణవాజిసమాయుక్తం యుక్తం రౌద్రేణ వర్చసా, 5
దీప్యమానమివాకాశే విమానం సూర్యవర్చసం,
తడిత్పతాకాగహనం దర్శితేన్ద్రాయుధప్రభమ్. 6

ప్ర. అ. స్వనవన్తమ్=ధ్వని గలది, మహాధ్వజమ్=గొప్ప ధ్వజము గలది, కృష్ణవాజిసమాయుక్తమ్=నల్లని గుఱ్ఱములతో కూడినది, రౌద్రేణ=భయంకరమైన, వర్చసా=తేజస్సుతో, యుక్తమ్=కూడినది, ఆకాశే=ఆకాశమునందు, దీప్యమానమ్=ప్రకాశించుచున్న, విమానమివ=విమానము వలె ఉన్నది, సూర్యవర్చసమ్=సూర్యుని వంటి కాంతి గలది, తడిత్పతాకాగహనమ్=మెరుపులవంటి పతాకలతో నిండినది, దర్శితేన్ద్రాయుధప్రభమ్=చూపబడిన ఇంద్రధనస్సువంటి కాంతి గలది అయిన, సహసా=శీఘ్రముగా, ఆపతన్తమ్=వచ్చుచున్న, తమ్=ఆ, రాక్షసరాజస్య=రావణునియొక్క, రథమ్=రథమును, నరరాజః=రాముడు, దదర్శ హ=చూచెను.

తా. గొప్ప ధ్వని చేయుచు శీఘ్రముగా వచ్చుచున్న ఆ రావణుని రథమును రాముడు చూచెను. దానిపై పెద్ద ధ్వజము ఎగురుచుండెను. దానికి నల్లని గుఱ్ఱములు కట్టబడి ఉండెను. దాని కాంతి భయంకరముగా ఉండెను. సూర్యునివంటి కాంతితో అది ఆకాశమునందు ప్రకాశించుచున్న విమానము వలె ఉండెను. మెరుపుల వంటి పతాకలతో నిండి ఇంద్రధనస్సు వంటి కాంతితో కనబడుచుండెను. 4.–6

మూ. శరధారా విముఞ్చన్తం ధారాసారమివామ్బుదమ్,
తం దృష్ట్వా మేఘసంకాశమాపతన్తం రథం రిపోః, 7
గిరేర్వజ్రాభిమృష్టస్య దీర్యతః సదృశస్వనమ్,
విస్ఫారయన్వై వేగేన బాలచన్ద్రానతం ధనుః, 8
ఉవాచ సారథిం రామః సహస్రాక్షస్య మాతలిమ్.

ప్ర. అ. శరధారాః=బాణధారలను, విముఞ్చన్తమ్=విడచుచున్నది, ధారాసారమ్=ధారావర్షము కురియుచున్న, అమ్బుదమివ=మేఘము వలె ఉన్నది, మేఘసంకాశమ్=మేఘముతో సమానము, వజ్రాభిమృష్టస్య=వజ్రముచేత కొట్టబడిన, దీర్యతః=బ్రద్దలగుచున్న, గిరేః=పర్వతమునకు, సదృశస్వనమ్=సమానమైన ధ్వని గలది అయిన, ఆపతన్తమ్=వచ్చుచున్న, తమ్=ఆ, రిపోః రథమ్=శత్రువుయొక్క రథమును, దృష్ట్వా=చూచి, రామః=రాముడు, బాలచన్ద్రానతమ్ =బాలచంద్రుడు వలె వంచబడిన, ధనుః=ధనస్సును, వేగేన= వేగముచేత, విస్ఫారయన్=చరచుచు,

సహస్రాక్షస్య=దేవేంద్రునియొక్క, సారథిమ్=సారథియైన, మాతలిమ్=మాతలిని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. బాణధారలు విడచుచున్న ఆ రథము జలధారలు విడచుచున్న మేఘము వలె ఉండెను. దాని ధ్వని వజ్రముచేత కొట్టగా బ్రద్దలగుచున్న పర్వతము ధ్వని వలె ఉండెను. అట్టి మేఘము వలె ఉన్న శత్రురథము వచ్చుచుండగా చూచి, రాముడు ధనస్సును బాలచంద్రాకారములో వంకరగా వంగునట్లు చరచుచు ఇంద్రుని సారథియైన మాతలితో ఇట్లనెను. 7, 8

మూ. మాతలే పశ్య సంరబ్ధమాపతన్తం రథం రిపోః, 9
యథాపసవ్యం పతతా వేగేన మహతా పునః,
సమరే హన్తుమాత్మానం తథానేన కృతా మతిః. 10

ప్ర. అ. మాతలే=మాతలీ ! సంరబ్ధమ్=తొందరగా, ఆపతన్తమ్=వచ్చుచున్న, రిపోః=శత్రువుయొక్క, రథమ్=రథమును, పశ్య=చూడుము. అపసవ్యమ్=ప్రదక్షిణముగా, మహతా=గొప్ప, వేగేన=వేగముతో, పునః=మరల, పతతా=వచ్చుచున్న, అనేన=వీనిచేత, సమరే=యుద్ధమునందు, ఆత్మానమ్=తనను, హన్తుమ్=చంపుటకు, యథా=ఎట్లో, తథా=అట్లు, మతిః=బుద్ధి, కృతా=చేయబడినది.

తా. మాతలీ! తొందరగా వచ్చుచున్న ఈ శత్రురథమును చూడుము. ఇతడు మరల మహావేగముతో ప్రదక్షిణముగా వచ్చుచున్నాడు. దీనిని పట్టి తాను చచ్చుటకే వచ్చుచున్నా డని తోచుచున్నది! 9, 10

మూ. తదప్రమాదమాతిష్ఠ ప్రత్యుద్గచ్ఛ రథం రిపోః,
విధ్వంసయితుమిచ్ఛామి వాయుర్మేఘమివోత్థితమ్. 11

ప్ర. అ. తత్= ఆ కారణమువలన, అప్రమాదమ్=పొరబాటు లేకుండుటను, ఆతిష్ఠ=అవలంబించుము. రిపోః=శత్రువుయొక్క, రథమ్=రథమును, ప్రత్యుద్గచ్ఛ=ఎదురుగా వెళ్లుము. వాయుః=వాయువు, ఉత్థితమ్=పైకి లేచిన, మేఘమివ=మేఘమును వలె, విధ్వంసయితుమ్=నశింపచేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. అందుచేత పొరపాటు చెందక ఈ శత్రువు రథమునకు ఎదురుగా వెళ్లుము. పైకి లేచిన మేఘమును ధ్వంసము చేసినట్లు వీనిని నశింపచేయ గోరుచున్నాను. 11

మూ. అవిక్లబమసంభ్రాన్తమవ్యగ్రహృదయేక్షణమ్,
రశ్మిసంచారనియతం ప్రచోదయ రథం ద్రుతమ్. 12

ప్ర. అ. అవిక్లబమ్=భయము లేకుండగను, అసంభ్రాన్తమ్=తొందర పడకుండగను, అవ్యగ్రహృదయేక్షణమ్=దిగులు చెందని హృదయము, చూపు కలుగునట్లుగాను, రశ్మిసంచారనియతమ్=కళ్లెము పట్టుటచే నిగ్రహింపబడిన, రథమ్=రథమును, ద్రుతమ్=శీఘ్రముగా, ప్రచోదయ=తోలుము.

తా. గుఱ్ఱముల కళ్లెములను బాగుగా పట్టి రథమును అదుపులో ఉంచుకొని శీఘ్రముగా తీసికొని వెళ్లుము. భయపడక, తొందరపడక హృదయమునందు, చూపులలోను తొందరబాటు లేక నడుపుము. 12

మూ. కామం న త్వం సమాధేయః పురందరరథోచితః,
యుయుత్సురహమేకాగ్రః స్మారయే త్వాం న శిక్షయే. 13

ప్ర. అ. పురందరరథోచితః=దేవేంద్రుని రథమునకు అలవడిన, త్వమ్=నీవు, కామమ్=వాస్తవముగా, న సమాధేయః=బోధించదగినవాడవు కావు. అహమ్=నేను, ఏకాగ్రః=ఏకాగ్రచిత్తుడనై, యుయుత్సుః=యుద్ధము చేయదలచుచు, త్వామ్=నిన్ను, స్మారయే=గుర్తుచేయుచున్నాను, న శిక్షయే=శిక్షించుటలేదు. (బోధించుటలేదు).

తా. దేవేంద్రుని రథానికి అలవాటు పడిన నీకు వాస్తవములో చెప్పవలసిన పని లేదు. నేను ఏకాగ్రచిత్తముతో యుద్ధము చేయదలచుచున్నాను. అందుచేత నీకు జ్ఞాపకముచేయుచున్నాను కాని బోధించుటలేదు. 13

మూ. పరితుష్టః స రామస్య తేవ వాక్యేన మాతలిః,
ప్రచోదయామాస రథం సురసారథిరుత్తమః. 14

ప్ర. అ. ఉత్తమః=ఉత్తముడైన, సురసారథిః=దేవతాసారథియైన, సః=ఆ, మాతలిః=మాతలి, రామస్య=రామునియొక్క, తేన వాక్యేన=ఆ వాక్యముచేత, పరితుష్టః=సంతోషించినవాడై, రథమ్=రథమును, ప్రచోదయామాస=తోలెను.

తా. ఉత్తముడైన దేవతాసారథియైన మాతలి రాముని ఆ మాటలకు సంతోషించి రథమును నడిపెను. 14

మూ. అపసవ్యం తతః కుర్వన్ రావణస్య మహారథమ్,
చక్రసంభూతరజసా రావణం వ్యవధూనయన్. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రావణస్య=రావణునియొక్క, రథమ్=రథమును, అపసవ్యమ్=ప్రదక్షిణముగా ఉండునట్లు, కుర్వన్=చేయుచు, చక్రసంభూతరజసా=చక్రముల నుండి బయలుదేరిన పరాగముచేత, రావణమ్=రావణుని, వ్యవధూనయన్=దుమ్ముతో కప్పుచు, (రథమును నడిపెను).

తా. పిమ్మట అతడు రావణుని రథము ప్రదక్షిణముగా ఉండునట్లు

చేయుచు, చక్రములవలన రేగిన పరాగముచేత రావణుని కప్పుచు రథమును నడిపెను. 15

మూ. తతః క్రుద్ధో దశగ్రీవస్తామ్రవిస్ఫారితేక్షణః,
రథప్రతిముఖం రామం సాయకైరవధూనయత్. 16

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రుద్ధః=కోపించిన, దశగ్రీవః=రావణుడు, తామ్రవిస్ఫారితేక్షణః=ఎఱ్ఱని, పెద్దవిగా చేయబడిన నేత్రములు కలవాడై, రథప్రతిముఖమ్=రథమునకు ఎదురుగా నున్న, రామమ్=రాముణ్ణి, సాయకైః=బాణములచేత, అవధూనయత్=కంపింపచేసెను.

తా. పిమ్మట కోపించిన రావణుడు ఎఱ్ఱని కళ్ళు పెద్దవి చేసి రథమునకు ఎదురుగా ఉన్న రాముణ్ణి బాణాలచేత కంపింపచేసెను. 16

మూ. ధర్షణామర్షితో రామో ధైర్యం రోషేణ లమ్భయన్,
జగ్రాహ సుమహావేగమైన్ద్రం యుధి శరాసనమ్. 17

ప్ర. అ. ధర్షణామర్షితః=ఎదిరించుటచేత కోపింపచేయబడిన, రామః= రాముడు, ధైర్యమ్=ధైర్యమును, రోషేణ=రోషముతో, లమ్భయన్=పొందుచు, యుధి=యుద్ధమునందు, సుమహావేగమ్=చాల గొప్ప వేగము గల, ఐన్ద్రమ్=ఇంద్రదేవతాకమైన, శరాసనమ్=ధనస్సును, జగ్రాహ=గ్రహించెను.

తా. రావణుడు అట్లు ఎదిరించుటచేత కోపింపచేయబడిన రాముడు రోషముతో ధైర్యమును, అనగా యుద్ధమునకు సంబంధించిన తీవ్రత్వమును పొందుచు, యుద్ధమునందు మహావేగము గల ఇంద్రుని ధనస్సును గ్రహించెను.

మూ. శరాంశ్చ సుమహావేగాన్ సూర్యరశ్మిసమప్రభాన్,
తదుపోఢం మహద్యుద్ధమన్యోన్యవధకాఙ్క్షిణోః, 18
పరస్పరాభిముఖయోర్దృప్తయోరివ సింహయోః.

ప్ర. అ. సుమహావేగాన్=చాల గొప్ప వేగము గల, సూర్యరశ్మిసమప్రభాన్=సూర్యకిరణములతో సమానమైన కాంతి గల, శరాన్ చ=బాణములను కూడ గ్రహించెను. అన్యోన్యవధకాఙ్క్షిణోః=పరస్పరముయొక్క వధను కోరుచున్న వారిద్దరికీ, తత్=ఆ, మహత్=గొప్పదైన, యుద్ధమ్=యుద్ధము, పరస్పరాభిముఖయోః=పరస్పరము అభిముఖములైన, దృప్తయోః=గర్వించిన, సింహయోరివ=సింహములకు వలె, ఉపోఢమ్=అధికమైనది.

తా. సూర్యకిరణముల వంటి కాంతి గల బాణములను కూడ గ్రహించెను. పరస్పరసంహారమును కోరుచున్న వారిద్దరికీ మధ్య పరస్పరము ఎదురెదురుగా

ఉన్న గర్వించిన సింహముల మధ్య వలె గొప్ప యుద్ధము పెరిగెను. 18

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః, 19
సమీయుర్ద్వైరథం ద్రష్టుం రావణక్షయకాఙ్క్షిణః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, దేవాః=దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, రావణక్షయకాఙ్క్షిణః=రావణుని వినాశమును కోరుచున్నవారై, ద్వైరథమ్=ఇద్దరు రథికుల యుద్ధమును, ద్రష్టుమ్=చూచుటకు, సమీయుః=వచ్చిరి.

తా. పిమ్మట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు రావణుని వినాశమును కోరుచు ఆ ఇద్దరు రథికుల యుద్ధమును చూచుటకై వచ్చిరి.19

మూ. సముత్పేతురథోత్పాతా దారుణా రోమహర్షణాః, 20
రావణస్య వినాశాయ రాఘవస్యోదయాయ చ.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రావణస్య=రావణునియొక్క, వినాశాయ=వినాశముకొరకు, రాఘవస్య=రామునియొక్క, ఉదయాయ చ=అభివృద్ధికొరకు, దారుణాః=దారుణములైన, రోమహర్షణాః=రోమాంచమును పుట్టించు, ఉత్పాతాః=శకునములు, సముత్పేతుః=బయలుదేరినవి.

తా. పిమ్మట రావణుని వినాశమును, రాముని విజయమును సూచించుచు దారుణములు, రోమాంచము కలిగించునవి అయిన ఉత్పాతములు బయలుదేరినవి. 20

మూ. వవర్ష రుధిరం దేవో రావణస్య రథోపరి, 21
వాతా మణ్డలినస్తీవ్రా హ్యపసవ్యం ప్రచక్రముః.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, రథోపరి=రథముమీద, దేవః=పర్జన్యదేవుడు, రుధిరమ్=రక్తమును, వవర్ష=వర్షించెను. మణ్డలినః=మండలములుగా తిరుగు, తీవ్రాః=తీవ్రములైన, వాతాః=వాయువులు, అపసవ్యమ్=ప్రదక్షిణముగా, ప్రచక్రముః=వీచినవి.

తా. పర్జన్యదేవుడు రావణుని రథము మీది రక్తము కురిపించెను. తీవ్రమైన గాలులు మండలాకాలముగా తిరుగుచు ప్రదక్షిణముగా వీచినవి. 21

మూ. మహద్ గృధ్రకులం చాస్య భ్రమమాణం నభస్తలే, 22
యేన యేన రథో యాతి తేన తేన ప్రధావతి.

ప్ర. అ. నభస్తలే=ఆకాశమునందు, భ్రమమాణమ్=తిరుగుచున్న, మహత్=

గొప్పదైన, గృధ్రకులమ్=గ్రద్దల సముదాయము, అస్య=రావణునియొక్క, రథః= రథము, యేన యేన=ఏ యే మార్గముచేత, యాతి=వెళ్లుచున్నదో, తేన తేన=ఆ యా మార్గముచేత, ప్రధావతి=పరుగెత్తుచున్నది.

తా. ఒక పెద్ద గద్దల గుంపు ఆకాశముమీద తిరుగుచు ఈ రావణుని రథము ఏ యే వైపులకు తిరుగుచుండెనో ఆ వైపులకే ఎగురుచుండెను. 22

మూ. సంధ్యయా చావృతా లఙ్కా జపాపుష్పనికాశయా, 23
దృశ్యతే సంప్రదీప్తేవ దివసేఽపి వసుంధరా.

ప్ర. అ. లఙ్కా=లంక, జపాపుష్పనికాశయా=జపాపుష్పముతో సమానమైన, సంధ్యయా=సంధ్యచేత, ఆవృతా=ఆవరింపబడినది. వసుంధరా=(లంకాప్రాంతము నందలి) భూమి, దివసేఽపి=పగటియందు కూడ, సంప్రదీప్తేవ=మండుచున్నది వలె, దృశ్యతే=కనబడుచున్నది.

తా. లంకమీద జపాపుష్పము వంటి సంధ్య ఆవరించెను. అందుచే ఆ ప్రాంతమునందలి భూమి, పగలుకూడ మండిపోవుచున్నట్లు ఎఱ్ఱగా కనబడెను.

మూ. సనిర్ఘాతా మహోల్కాశ్చ సంప్రపేతుర్మహాస్వనాః, 24
విషాదయంస్తే రక్షాంసి రావణస్య తదాహితాః.

ప్ర. అ. సనిర్ఘాతాః=ఉరుములతో కూడిన, మహాస్వనాః=గొప్ప ధ్వని గల, మహోల్కాశ్చ=పెద్ద ఉల్కలు, సంప్రపేతుః=పడినవి. రావణస్య=రావణునకు, అహితాః=హితములు కాని, తే=అవి, రక్షాంసి=రాక్షసులను, విషాదయన్=దిగులు చెందునట్లు చేసినవి.

తా. అప్పుడు ఉరుములతో కూడిన పెద్ద ఉల్కలు పెద్ద ధ్వనితో పడినవి. రావణునకు చెడ్డవైన అవి రాక్షసులకు విషాదమును కలిగించినవి.24

మూ. రావణశ్చ యతస్తత్ర ప్రచచాల వసుంధరా, 25
రక్షసాం చ ప్రహరతాం గృహీతా ఇవ బాహవః.

ప్ర. అ. రావణః=రావణుడు, యతః=ఎటువైపున ఉండెనో, తత్ర=అక్కడ, వసుంధరా=భూమి, ప్రచచాల=చలించెను. ప్రహరతామ్=యుద్ధముచేయుచున్న, రక్షసాం చ=రాక్షసులయొక్క, బాహవః=బాహువులు, గృహీతా ఇవ=పట్టుకొనబడి నట్లు అయినవి.

తా. రావణుడు ఉన్న చోట భూమి అదిరెను. యుద్ధము చేయుచున్న రాక్షసుల బాహువులను ఎవరో పట్టుకొన్నట్లు ఆయెను. 25

మూ. తామ్రాః పీతాః సితాశ్వేతాః పతితాః సూర్యరశ్మయః, 26
దృశ్యన్తే రావణస్యాగ్రే పర్వతస్యేవ ధాతవః.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, అగ్రే=ఎదుట, తామ్రాః=ఎఱ్ఱని, పీతాః=పచ్చని, సితాశ్వేతాః=తెల్లనివి, నల్లనివీ అయిన, సూర్యరశ్మయః=సూర్యకిరణములు, పతితాః=పడినవై, పర్వతస్య=పర్వతముయొక్క, ధాతవః ఇవ=ధాతువులువలె, దృశ్యన్తే=కనబడుచున్నవి.

తా. రావణుని ఎదుట ఎఱ్ఱగాను, పచ్చగాను, తెల్లగాను, నీలవర్ణముతోను, ఉన్న సూర్యకిరణములు ప్రసరించి పర్వతముయొక్క ధాతువుల వలె కనబడుచుండెను. 26

మూ. గృధ్రైరనుగతాశ్చాస్య వమన్త్యో జ్వలనం ముఖైః, 27
ప్రణేదుర్ముఖమీక్షన్త్యః సంరబ్ధమశివం శివాః.

ప్ర.అ. గృధ్రైః=గ్రద్దలచేత, అనుగతాః=అనుసరించబడిన, శివాః=ఆడనక్కలు, ముఖైః=ముఖములచేత, జ్వలనమ్=అగ్నిని, వమన్త్యః=కక్కుచున్నవై, అస్య=రావణునియొక్క, ముఖమ్=ముఖమును, ఈక్షన్త్యః=చూచుచు, సంరబ్ధమ్=తొందరగా, అశివమ్=అమంగళముగా, ప్రణేదుః=ధ్వని చేసినవి.

తా. గ్రద్దలు వెనుకనే రాగా ఆడ నక్కలు రావణుని ముఖమువైపు చూచుచు, నోళ్లనుండి అగ్నిని కక్కుచు, తొందరగా, అమంగళకరముగా అరచినవి.

మూ. ప్రతికూలం వవే వాయూ రణే పాంసూన్ సముత్కిరన్, 28
తస్య రాక్షసరాజస్య కుర్వన్ దృష్టివిలోపనమ్.

ప్ర. అ. వాయుః=వాయువు, తస్య రాక్షసరాజస్య=ఆ రాక్షసరాజుయొక్క, దృష్టివిలోపనమ్=దృష్టిలోపమును, కుర్వన్=చేయుచు, రణే=యుద్ధభూమియందు, పాంసూన్=పరాగములను, సముత్కిరన్=చిమ్ముచు, ప్రతికూలమ్=ప్రతికూలముగా, వవౌ=వీచెను.

తా. వాయువు యుద్ధభూమిలో పరాగము ఎగురగొట్టుచు, ఆ రావణుని కళ్లు కప్పివేయుచు ప్రతికూలముగా వీచెను. 28

మూ. నిపేతురిన్ద్రాశనయః సైన్యే చాస్య సమన్తతః, 29
దుర్విషహ్యస్వనా ఘోరం వినా జలధరోదయమ్.

ప్ర. అ. జలధరోదయం వినా=మేఘముల ఆవిర్భావము లేకుండగనే, ఘోరమ్=భయంకరముగా, దుర్విషహ్యస్వనాః=సహింప శక్యము కాని ధ్వని గల, ఇన్ద్రాశనయః=పిడుగులు, అస్య=ఈతనియొక్క, సైన్యే=సైన్యమునందు,

సమన్తతః=అంతటా, నిపేతుః=పడినవి.

తా. మేఘములు లేకుండగానే ఆ రావణుని సైన్యమునందు అంతటా ఘోరమైన సహింప శక్యముకాని ధ్వనితో పిడుగులు పడినవి. 29

మూ. దిశశ్చ ప్రదిశః సర్వా బభూవుస్తిమిరావృతాః, 30
పాంసువర్షేణ మహతా దుర్దర్శం చ నభోఽభవత్.

ప్ర. అ. సర్వాః=సమస్తమైన, దిశః చ=దిక్కులూ, ప్రదిశశ్చ=విదిక్కులూ, తిమిరావృతాః=చీకటిచేత కప్పబడినవి, బభూవుః=అయినవి. నభః=ఆకాశము, మహతా=గొప్ప, పాంసువర్షేణ=పరాగముయొక్క వర్షముచేత, దుర్దర్శమ్=చూడ శక్యము కానిది. అభవత్=ఆయెను.

తా. సమస్తమైన దిక్కులూ, విదిక్కులూ చీకటిచేత కప్పబడెను. ఆకాశము పెద్ద పరాగముచేత కప్పబడి చూచుటకు కష్టముగా ఉండెను. 30

మూ. కుర్వన్త్యః కలహం ఘోరం సారికాస్తద్రథం ప్రతి, 31
నిపేతుః శతశస్తత్ర దారుణా దారుణారుతాః.

ప్ర. అ. దారుణారుతాః=దారుణమైన ధ్వని గల, దారుణాః=దారుణములైన, శతశః=వందలకొలది, సారికాః=గోరింకలు, ఘోరమ్=ఘోరముగా, కలహమ్=కలహమును, కుర్వన్త్యః=చేయుచు, తత్ర=అక్కడ, తద్రథం ప్రతి=రావణుని రథమును గూర్చి, నిపేతుః=పడినవి.

తా. దారుణములైన వందలకొలది గోరెంకలు దారుణముగా అరచుచు, భీకరముగా పోరాడుచు ఆతని రథము వైపు ఎగిరినవి. 31

మూ. జఘనేభ్యః స్ఫులిఙ్గాంశ్చ నేత్రేభ్యోఽశ్రూణి సంతతమ్, 32
ముముచుస్తస్య తురగాస్తుల్యమగ్నిం చ వారి చ.

ప్ర. అ. తస్య=వానియొక్క, తురగాః=గుఱ్ఱములు, జఘనేభ్యః=జఘనములనుండి, స్ఫులిఙ్గాన్ చ=అగ్నికణములను, నేత్రేభ్యః=నేత్రములనుండి, అశ్రూణి చ=కన్నీళ్లను, అగ్నిం చ=అగ్నిని, వారి చ =నీటిని, తుల్యమ్=సమానముగా, సంతతమ్=అవిచ్ఛిన్నముగా, ముముచుః=విడచినవి.

తా. ఆతని గుఱ్ఱములు జఘనములనుండి అగ్నికణములను, నేత్రములనుండి కన్నీళ్లను, ఈ విధముగా అగ్నిని నీటిని కూడ సమముగా నిరంతరమూ విడచినవి. 32

మూ. ఏవంప్రకారా బహవః సముత్పాతా భయావహాః, 33
రావణస్య వినాశాయ దారుణాః సంప్రజజ్ఞిరే.

ప్ర. అ. ఏవంప్రకారాః=ఈవిధములైన, బహవః=అనేకమైన, భయావహాః=భయమును కలిగించు, దారుణాః=దారుణములైన, సముత్పాతాః=ఉత్పాతములు, రావణస్య=రావణునియొక్క, వినాశాయ=నాశముకొరకు, సంప్రజజ్ఞిరే=పుట్టినవి.

తా. భయము కలిగించే, దారుణములైన ఈ విధములైన అనేక అపశకునములు రావణుని వినాశమును సూచించుచు కనబడినవి. 33

మూ. రామస్యాపి నిమిత్తాని సౌమ్యాని చ శివాని చ, 34
బభూవుర్జయశంసీని ప్రాదుర్భూతాని సర్వశః.

ప్ర. అ. సర్వశః=అన్నివైపులా, ప్రాదుర్భూతాని=పుట్టిన, సౌమ్యాని=సౌమ్యములు, శివాని=మంగళప్రదములూ అయిన, రామస్య=రామునియొక్క, జయశంసీని=జయమును సూచించు, నిమిత్తాని=నిమిత్తములు, బభూవుః=పుట్టినవి.

తా. ఇట్లే సౌమ్యములు, మంగళప్రదములు అయిన శకునములు రామునికి జయమును సూచించుచు అన్ని వైపులా కనబడినవి. 34

మూ. నిమిత్తాని చ సౌమ్యాని రాఘవః స్వజయాయ వై, 35
దృష్ట్వా పరమసంహృష్టో హతం మేనే చ రావణమ్.

ప్ర.అ. రాఘవః=రాముడు, స్వజయాయ=తన జయముకొరకు, సౌమ్యాని=సౌమ్యములైన, నిమిత్తాని=నిమిత్తములను, దృష్ట్వా=చూచి, పరమసంహృష్టః=మిక్కిలి సంతోషించిన వాడై, రావణమ్=రావణుణ్ణి, హతమ్=చంపబడినవానినిగా, మేనే=తలచెను.

తా. రాముడు తన జయమును సూచించు సౌమ్యములైన శకునములను చూచి, చాల సంతోషించి రావణుడు చచ్చినట్లే అని తలచెను. 35

మూ. తతో నిరీక్ష్యాత్మగతాని రాఘవో
రణే నిమిత్తాని నిమిత్తకోవిదః,
జగామ హర్షం చ పరాం చ నిర్వృతిం
చకార యుద్ధే హ్యధికం చ విక్రమమ్. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే షడుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, నిమిత్తకోవిదః=శకునములలో పండితుడైన, రాఘవః=రాముడు, రణే=యుద్ధమునందు, ఆత్మగతాని=తనలో ఉన్న, నిమిత్తాని=నిమిత్తములను (శకునములను), నిరీక్ష్య=చూచి, హర్షం చ=సంతో

షమును, పరామ్=అధికమైన, నిర్వృతిం చ=సుఖమును, జగామ=పొందెను. యుద్ధే=యుద్ధమునందు, అధికమ్=అధికమైన, విక్రమం చ=పరాక్రమమును కూడ, చకార=చేసెను.

తా. అప్పుడు శకునముల విషయములో మంచి జ్ఞానము గల రాముడు యుద్ధరంగమునందు తనలో కనబడిన శకునములకు సంతోషించెను. సుఖము పొందెను. యుద్ధమునందు అధికపరాక్రమమును చూపెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండములో నూటఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తోత్తర శతతమః సర్గః

[రామరావణులు భయంకరముగ పోరాడుట.]

మూ. తతః ప్రవృత్తం సుక్రూరం రామరావణయోస్తదా,
సుమహద్ద్వైరథం యుద్ధం సర్వలోకభయావహమ్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తదా=అప్పుడు, రామరావణయోః=రామరావణులకు, సుక్రూరమ్=చాలక్రూరము, సుమహత్=చాల గొప్పది, సర్వలోకభయావహమ్=సమస్తలోకములకు భయమును కలిగించేది అయిన, ద్వైరథమ్=రెండు రథములకు సంబంధించిన, యుద్ధమ్=యుద్ధము, ప్రవృత్తమ్=ప్రవర్తించినది.

తా. పిమ్మట ఆ సమయమునందు రామరావణుల మధ్య సకలలోకములకు భయమును కలిగించు రెండురథములకు సంబంధించిన (ఇద్దరు రథికుల) చాల క్రూరమైన గొప్ప యుద్ధము జరిగెను.

మూ. తతో రాక్షససైన్యం చ హరీణాం చ మహద్బలమ్,
ప్రగృహీతప్రహరణం నిశ్చేష్టం సమవర్తత. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షససైన్యం చ=రాక్షససైన్యము, హరీణామ్=వానరులయొక్క, మహత్=గొప్ప, బలం చ=సైన్యమూ, ప్రగృహీతప్రహరణమ్=గ్రహించబడిన ఆయుధములు కలదై, నిశ్చేష్టమ్=నిశ్చేష్టమై, సమవర్తత=ఉండెను.

తా. అప్పుడు రాక్షససైన్యము, వానరసైన్యమూ కూడ ఆయుధములు ధరించి ఆశ్చర్యముతో నిశ్చేష్టమై నిలచి ఉండెను. 2

మూ. సంప్రయుద్ధే తు తౌ దృష్ట్వా బలవన్నరరాక్షసౌ,
వ్యాక్షిప్తహృదయాః సర్వే పరం విస్మయమాగతాః. 3

ప్ర. అ. సంప్రయుద్ధౌ=ప్రవర్తించిన యుద్ధము గల, తౌ=ఆ, బలవన్నరరాక్షసౌ=బలవంతులైన నరరాక్షసులను, దృష్ట్వా=చూచి, సర్వే=అందరూ, వ్యాక్షిప్తహృదయైః=ఆకర్షింపబడిన హృదయములు కలవారై, పరమ్=మిక్కిలి, విస్మయమ్=ఆశ్చర్యమును, ఆగతాః=పొందిరి.

తా. బలశాలులైన ఆ నరరాక్షసు లిద్దరూ యుద్ధమునకు దిగుట చూచి

అక్కడ నున్న రాక్షసవానరు లందరూ ఆ యుద్ధము చూచుటకు ఆకర్షింపబడిన హృదయము గలవారై మిక్కిలి **ఆశ్చర్యము** చెందిరి.

మూ. **నానాప్రహరణైర్వ్యగ్రైర్భుజైర్విస్మితబుద్ధయః,**
తస్థుః ప్రేక్ష్య చ సర్వే తే నాభిజగ్ముః పరస్పరమ్. 4

ప్ర. అ. తే=వాళ్లు, సర్వే=అందరూ, నానాప్రహరణైః=అనేకవిధములైన ఆయుధములతో, వ్యగ్రైః=వ్యగ్రములై (పట్టుకొని) ఉన్న, **భుజైః=భుజములతో** కూడినవారై, విస్మితబుద్ధయః=ఆశ్చర్యపడుచున్న బుద్ధులు గలవారై, ప్రేక్ష్య=చూచి, తస్థుః=నిలచిరి. పరస్పరమ్=పరస్పరమును గూర్చి, నాభిజగ్ముః=వెళ్లలేదు.

తా. ఆ సైనికు లందరు హస్తములలో అనేకవిధములైన ఆయుధములు ధరించి, చూచుచు నిలబడి పోయిరి. ఒకరి మీదికి ఒకరు యుద్ధానికి వెళ్లలేదు.4

మూ. రక్షసాం రావణం చాపి వానరాణాం చ రాఘవమ్,
పశ్యతాం విస్మితాక్షాణాం సైన్యం చిత్రమివాబభౌ. 5

ప్ర. అ. రావణమ్=రావణుణ్ణి, పశ్యతామ్=చూచుచున్న, విస్మితాక్షాణామ్= **ఆశ్చర్యము**చెందిన నేత్రములు గల, రక్షసామ్=రాక్షసులయొక్క, రాఘవమ్=రాముణ్ణి చూచుచున్న, వానరాణాం చ=వానరులయొక్క, సైన్యమ్=సైన్యము, చిత్రమివ= చిత్తరువు వలె, ఆబభౌ=ప్రకాశించెను.

తా. రావణుణ్ణి చూచుచున్న రాక్షససైన్యము, రాముణ్ణి చూచుచున్న వానరసైన్యము ఆశ్చర్యముచెందిన కళ్లతో చిత్తరువులో ఉన్నట్లు ఉండిపోయెను.5

మూ. తే తు తత్ర నిమిత్తాని దృష్ట్వా రాఘవరావణౌ,
కృతబుద్ధీ స్థిరామర్షౌ యుయుధాతే హ్యభీతవత్. 6

ప్ర. అ. తౌ=ఆ, రాఘవ రావణౌ=రామరావణులు, తత్ర=అక్కడ, నిమిత్తాని=శకునములను, దృష్ట్వా=చూచి, కృతబుద్ధీ=చేయబడిన బుద్ధి (నిర్ణయము) కలవారై, **స్థిరామర్షౌ=స్థిరమైన** కోపము గలవారై, అభీతవత్=భయ పడనివారై, యుయుధాతే=యుద్ధముచేసిరి.

తా. ఆ రామరావణులు అక్కడ కనబడిన శకునములను చూచి, మనస్సులలో స్థిరమైన కోపముతో, భయపడకుండ యుద్ధము చేసిరి. 6

మూ. **జేతవ్యమితి కాకుత్స్థో మర్తవ్యమితి రావణః,**
ధృతౌ స్వవీర్యసర్వస్వం యుద్ధేఽదర్శయతాం తదా. 7

ప్ర. అ. జేతవ్యమ్=జయించవలెను, ఇతి=అని, **కాకుత్స్థః=రాముడు,** మర్తవ్యమ్=మరణించవలెను, ఇతి=అని, రావణః=రావణుడు, ధృతౌ=నిశ్చయిం

చుకొన్నవారై, తదా=అప్పుడు, యుద్ధే=యుద్ధమునందు, స్వవీర్యసర్వస్వమ్=తమ పరాక్రమముయొక్క సమస్తధనమును, అదర్శయతామ్=చూపిరి.

తా. ఆ సమయమున నాకు జయము లభించి తీరు నని రాముడు, నేనెట్లైన మరణించవలసినదే అని రావణుడు నిశ్చయించుకొని యుద్ధములో తమ బలము నంతా చూపిరి. 7

మూ. **తతః క్రోధాద్దశగ్రీవః శరాన్ సంధాయ వీర్యవాన్,**
**ముమోచ ధ్వజముద్దిశ్య రాఘవస్య రథే స్థితమ్.** 8

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమముగల, దశగ్రవః= రావణుడు, క్రోధాత్=కోపమువలన, శరాన్=బాణములను, సంధాయ=సంధించి, రాఘవస్య=రామునియొక్క, ధ్వజే=ధ్వజమునందు, స్థితమ్=ఉన్న, ధ్వజమ్=ధ్వజ మును, ఉద్దిశ్య=ఉద్దేశించి, ముమోచ=విడచెను.

తా. పిమ్మట పరాక్రమవంతుడైన రావణుడు కోపముతో బాణములు సంధించి రాముని రథముమీద నున్న ధ్వజముమీద ప్రయోగించెను. 8

మూ. **తే శరాస్తమనాసాద్య పురందరరథధ్వజమ్,**
**రథశక్తిం పరామృశ్య నిపేతుర్ధరణీతలే.** 9

ప్ర. అ. తే=ఆ, శరాః=బాణములు, తమ్=ఆ, పురందరరథధ్వజమ్=ఇం ద్రుని రథముయొక్క ధ్వజమును, అనాసాద్య=పొందక, రథశక్తిమ్=రథముయొక్క శక్తిని, పరామృశ్య=స్పృశించి, ధరణీతలే=నేలమీద, నిపేతుః=పడినవి.

తా. ఆ బాణములు దేవేంద్రుని ధ్వజమును చేరకుండగానే రథశక్తిని స్పృశించి నేలమీద పడిపోయినవి. (శక్తి అనగా బహుశా ధ్వజము కట్టిన దృఢమైన రథశిఖరమై ఉండును. రథముయొక్క ప్రభావం చేత క్రింద పడిపోయినవి అని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఒక వ్యాఖ్యాత మాత్రం **"రథావయవవిశేషము" అని** అర్థముకూడ కావచ్చును అని వ్రాసినాడు). 9

మూ. **తతో రామోఽపి సంక్రుద్ధశ్చాపమాకృష్య వీర్యవాన్,**
**కృతప్రతికృతం కర్తుం మనసా సంప్రచక్రమే.** 10

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామోఽ పి=రాముడు కూడ, సంక్రుద్ధః=కోపించినవాడై, చాపమ్=ధనస్సును, ఆకృష్య=లాగి, కృతప్రతికృతమ్=(ఆతడు) చేసినదానికి ప్రతిక్రియను,**కర్తుమ్=చేయుటకు, మనసా=** మనస్సుచేత, సంప్రచక్రమే=ప్రారంభించెను.

తా. పిమ్మట పరాక్రమవంతుడైన రాముడు కూడ కోపించి, ధనస్సు

లాగి, ఆతడు చేసినదానికి ప్రతిక్రియ చేయవలె నని మనసా సంకల్పించెను.10

మూ. రావణధ్వజముద్దిశ్య **ముమోచ నిశితం శరమ్,**
మహాసర్పమివాసహ్యం జ్వలన్తం స్వేన తేజసా. 11

ప్ర. అ. రావణధ్వజమ్=రావణునిధ్వజమును, ఉద్దిశ్య=ఉద్దేశించి, మహాసర్ప మివ=మహాసర్పము వలె, **అసహ్యామ్=సహింప శక్యముకాని,** స్వేన=తనసంబంధమైన, తేజసా=తేజస్సుతో, జ్వలన్తమ్ ఇవ=మండుచున్నదా అన్నట్లున్న, నిశితమ్=వాడియైన, శరమ్=బాణమును, ముమోచ=విడచెను.

తా. రాముడు మహాసర్పము వలె సహింప శక్యము గాని, తన తేజస్సుతో ప్రజ్వలించుచున్నదా అన్నట్లున్న వాడియైన బాణమును రావణుని ధ్వజముపై విడచెను. 11

మూ. రామశ్చిక్షేప తేజస్వీ కేతుముద్దిశ్య సాయకమ్,
జగామ స మహీం ఛిత్త్వా దశగ్రీవధ్వజం శరః. 12

ప్ర. అ. **తేజస్వీ=తేజఃశాలియైన,** రామః=రాముడు, కేతుమ్=ధ్వజమును, ఉద్దిశ్య=ఉద్దేశించి, సాయకమ్= బాణమును, చిక్షేప=విడచెను. సః శరః=ఆ బాణము, దశగ్రీవధ్వజమ్=రావణుని ధ్వజమును, ఛిత్త్వా=ఛేదించి, మహీమ్=భూమిని గూర్చి, జగామ=వెళ్లెను.

తా. రాముడు ఆ ధ్వజమును గురిచూచి బాణమును విడువగా ఆ బాణము రావణుని ధ్వజమును ఛేదించి నేలమీద పడెను. 12

మూ. స నికృత్తో౽పతద్భూమౌ రావణస్యన్దనధ్వజః,
ధ్వజస్యోన్మథనం దృష్ట్వా రావణః స మహాబలః. 13
**సంప్రదీప్తో౽భవత్క్రోధాదమర్షాత్ప్రహసన్నివ,**
స రోషవశమాపన్నః శరవర్షం వవర్ష హ. 14

ప్ర. అ. సః=ఆ, **రావణస్యన్దనధ్వజః=రావణుని** రథముపై నున్న ధ్వజము, నికృత్తః=ఛేదింపబడినదై, భూమౌ=నేలమీద, అపతత్=పడెను. మహాబలః=గొప్ప బలము గల, సః రావణః=ఆ రావణుడు, ధ్వజస్య=ధ్వజముయొక్క, **ఉన్మథనమ్=ఖండ** నమును, దృష్ట్వా=చూచి, అమర్షాత్=అసూయవలన, ప్రహసన్నివ=నవ్వుచున్నవాడు వలె, క్రోధాత్=కోపమువలన, సంప్రదీప్తః=మండిపోవుచున్నవాడుగా, అభవత్= ఆయెను. సః=ఆతడు, **రోషవశమ్=కోపవశమును,** ఆపన్నః=పొందినవాడై, శరవర్షమ్=బాణవర్షమును, వవర్ష హ=వర్షించెను.

తా. రావణుని రథముపై నున్న ఆ ధ్వజము ఛేదింపబడి క్రింద

పడెను. మహాబలశాలియైన ఆ రావణుడు ధ్వజము ఛేదింపబడుట చూచి, అమర్షముతో నవ్వుచున్నాడా అన్నట్లు కనబడెను. కోపముతో మండిపడుచు ఆ రోషావేశముతో బాణవర్షమును కురిపించెను. 13, 14

మూ. రామస్య తురగాన్ దీప్తైః **శరైర్వివ్యాధ రావణః,**
తే దివ్యా హరయస్తత్ర నాస్థలన్నాపి బభ్రముః, 15
బభూవుః **స్వస్థహృదయాః** పద్మనాలైరివాహతాః.

ప్ర. అ. **రావణః=రావణుడు,** దీప్తైః=ప్రజ్వలించుచున్న, శరైః=బాణములచేత, రామస్య=రామునియొక్క, తురగాన్=గుఱ్ఱములను, వివ్యాధ=కొట్టెను. దివ్యాః=దివ్యములైన, తే తురగాః=ఆ గుఱ్ఱములు, తత్ర= అక్కడ, నాస్థలన్= తొట్రుపాటుపడలేదు, న బభ్రముః=భ్రాంతి చెందలేదు, **పద్మనాలైః=తామరతూళ్ల** చేత, ఆహతాః ఇవ=కొట్టబడినవి వలె, స్వస్థహృదయాః=స్వస్థమైన హృదయములు గలవై, బభూవుః=ఉండెను.

తా. రావణుడు ప్రజ్వలించుచున్న బాణాలతో రాముని గుఱ్ఱములను కొట్టెను. దేవలోకమునకు సంబంధించిన ఆ గుఱ్ఱములు అక్కడ తొట్రుపాటుపడలేదు, భయము కూడ చెందలేదు. తామరతూడులతో కొట్టినట్లు నిర్భయములై ఉండెను. 15

మూ. **తేషామసంభ్రమం దృష్ట్వా వాజినాం రావణస్తదా,** 16
భూయ ఏవ సుసంక్రుద్ధః శరవర్షం ముమోచ హ.

ప్ర. అ. తదా=అప్పుడు, రావణః=రావణుడు, తేషామ్=ఆ, వాజినామ్=గుఱ్ఱములయొక్క, అసంభ్రమమ్=భయము లేకపోవుటను, దృష్ట్వా=చూచి, భూయః ఏవ=మరల, సుసంక్రుద్ధః=మిక్కిలి కోపించినవాడై, శరవర్షమ్=బాణవర్షమును, ముమోచ హ=విడచెను.

తా. ఆ గుఱ్ఱములు ఏ మాత్రము బెదరకపోవుట చూచిన రావణునకు కోపము అధికమయ్యెను. అతడు మరల బాణవర్షము కురిపించెను. 16

మూ. గదాశ్చ పరిఘాంశ్చైవ చక్రాణి ముసలాని చ, 17
గిరిశృఙ్గాణి వృక్షాంశ్చ తథా శూలపరశ్వధాన్.

ప్ర. అ. గదాశ్చ=గదలను, పరిఘాంశ్చ=పరిఘలను, చక్రాణి=చక్రములను, ముసలాని చ=ముసలములను, గిరిశృఙ్గాణి=పర్వతశిఖరములను, **వృక్షాన్** చ=వృక్షములను, తథా=మరియు, శూలపరశ్వధాన్=శూలములను, గండ్రగొడ్డళ్ళను ప్రయోగించెను.

తా. గదలను, పరిఘలను, చక్రములను, ముసలములను, పర్వతశిఖర

ములను, వృక్షములను, శూలములను, గండ్రగొడ్డళ్లను వర్షించెను.

మూ. మాయావిహితమేతత్తు శస్త్రవర్షమపాతయత్, 18
సహస్రశస్తదా బాణానశ్రాన్తహృదయోద్యమః.

ప్ర. అ. తదా=అప్పుడు, అశ్రాన్తహృదయోద్యమః=అలసట చెందని హృదయము, ఉద్యమము కలవాడై, ఏతత్=ఈ, మాయావిహితమ్=మాయచేత సృష్టించబడిన, శస్త్రవర్షమ్=ఆయుధవర్షమును, సహస్రశః=వేలకొలది, బాణాన్=బాణములను, అపాతయత్=ప్రయోగించెను.

తా. హృదయమునందు గాని, ఉద్యమమునందు గాని అలసట చెందక మాయాకల్పితమైన ఈ ఆయుధవర్షమును, వేలకొలది బాణాలను ప్రయోగించెను.

మూ. తుములం త్రాసజననం భీమం భీమప్రతిస్వనమ్, 19
తద్వర్షమభవద్యుద్ధే నైకశస్త్రమయం మహత్.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, తుములమ్=వ్యాకులము, త్రాసజననమ్=భయమును కలిగించునది, భీమమ్=భయంకరము, భీమప్రతిస్వనమ్=భయంకరమైన ప్రతిధ్వని గలది, తత్=ఆ, నైకశస్త్రమయమ్=అనేకశస్త్రములతో ఏర్పడిన, మహత్=గొప్పదైన, వర్షమ్=వర్షము, అభవత్=ఆయెను.

తా. ఆ యుద్ధమునందు వ్యాకులము, భయమును పుట్టించునది, భయంకరము, భయంకరమైన ప్రతిధ్వని కలదీ అయిన శస్త్రముల గొప్ప వర్షము కురిసెను. 19

మూ. విముచ్య రాఘవరథం సమన్తాద్వానరే బలే, 20
సాయకైరన్తరిక్షం చ చకార సునిరన్తరమ్.

ప్ర. అ. రాఘవరథమ్=రాముని రథమును, విముచ్య=విడచి, సమన్తాత్=చుట్టూ ఉన్న, వానరే=వానరుల సంబంధమైన, బలే=సైన్యమునందు, సాయకైః=బాణములచేత, అన్తరిక్షమ్=ఆకాశమును, సునిరన్తరమ్=చాల దట్టముగా, చకార=చేసెను.

తా. అతడు రాముని రథమును విడిచిపెట్టి చుట్టూ ఉన్న వానరసైన్యముమీద బాణములు ప్రయోగించుచు ఆకాశమును అవకాశము లేకుండ చేసెను. 20

మూ. ముమోచ చ దశగ్రీవో నిఃసంగేనాన్తరాత్మనా,
వ్యాయచ్ఛమానం తం దృష్ట్వా తత్పరం రావణం రణే,
ప్రహసన్నివ కాకుత్స్థః సందధే నిశితాన్ శరాన్. 22

స ముమోచ తతో బాణాన్ శతశోఽథ సహస్రశః.

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, నిఃసజ్ఞేన=ప్రాణాశ లేని, అన్తరాత్మనా=మనస్సుతో, ముమోచ చ= ఆయుధములను ప్రయోగించెను. వ్యాయచ్ఛమానమ్=ప్రయత్నము చేయుచున్న, రణే తత్పరమ్=యుద్ధమునందు ఆసక్తి గల, తం రావణమ్=ఆ రావణుణ్ణి, దృష్ట్వా=చూచి, **కాకుత్‌స్థః=రాముడు,** ప్రహసన్నివ=నవ్వుచున్నవాడు వలె, నిశితాన్=వాడియైన, శరాన్=బాణములను, సందధే=సంధించెను. తతః=పిమ్మట, సః=రాముడు, శతశః= వందలకొలది, సహస్రశః=వేలకొలది, బాణాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. రావణుడు ప్రాణములమీద ఆశ వదలి ఆయుధములను ప్రయోగించెను. రాముడు ఆ విధముగా యుద్ధములో విజృంభించి యుద్ధమునందు అత్యాసక్తితో ఉన్న రావణుణ్ణి చూచి నవ్వుచున్నవాడు వలె **(అనాయాసముగా)** వాడియైన బాణాలు సంధించి వందలకొలది, వేలకొలది బాణాలను ప్రయోగించెను.

మూ. **తాన్ దృష్ట్వా** రావణశ్చక్రే స్వశరైః ఖం నిరన్తరమ్, 23
తాభ్యాం నియుక్తేన తదా శరవర్షేణ భాస్వతా,
**శరబద్ధమివాభాతి ద్వితీయం** భాస్వదమ్బరమ్. 24

ప్ర. అ. రావణః=రావణుడు, తాన్=బాణములను, దృష్ట్వా=చూచి, స్వశరైః=తన బాణములచేత, ఖమ్=ఆకాశమును, నిరన్తరమ్=అవకాశము లేనిదానినిగా, చక్రే=చేసెను. తదా=అప్పుడు, తాభ్యామ్=వారిద్దరిచేత, నియుక్తేన=ప్రయోగించబడిన, భాస్వతా=ప్రకాశించుచున్న, శరవర్షేణ=బాణవర్షముచేత, భాస్వత్=కాంతి గల, **అమ్బరమ్=ఆకాశము,** శరబద్ధమ్=శరములచేత కట్టబడిన, ద్వితీయమ్ ఇవ=రెండవ ఆకాశమువలె, ఆభాతి=ప్రకాశించుచున్నది.

తా. రావణుడు ఆ బాణములు చూచి తన బాణములచేత ఆకాశమును అవకాశము లేని దానినిగా చేసెను. అప్పుడు వారిద్దరూ ప్రయోగించిన ప్రకాశించుచున్న బాణవర్షముచేత, ఆకాశము బాణాలచేత కట్టబడిన కాంతి గల రెండవ ఆకాశము వలె ప్రకాశించుచుండెను. 23, 24

మూ. నానిమిత్తోఽభవద్బాణో నానిర్భేత్తా న నిష్ఫలః,
అన్యోన్య మభిసంహత్య నిపేతుర్ధరణీతలే, 25
తథా విసృజతోర్బాణాన్ **రామరావణయోర్మృధే.**

ప్ర. అ. మృధే=యుద్ధమునందు, రామరావణయోః=రామరావణులు, తథా=అట్లు, బాణాన్=బాణములను, విసృజతోః=విడచుచుండగా, అనిమిత్తః=లక్ష్యము లేని, బాణః=బాణము, న అభవత్=లేకుండెను. అనిర్భేత్తా=లక్ష్యమును

భేదించనిది, న=లేదు. నిష్ఫలః=వ్యర్థమైనది, న=లేదు. అన్యోన్యమ్=పరస్పరము, అభిసంహత్య=కొట్టి, ధరణీతలే=నేలమీద, నిపేతుః=పడిపోయినవి.

తా. ఆ రామరావణులు యుద్ధములో ఆ విధముగా బాణాలను ప్రయోగించుచుండగా లక్ష్యము లేనిది కాని, లక్ష్యమును భేదించనిది కాని, వ్యర్థమైనది కాని ఒక్క బాణము కూడ లేకుండెను. అవి పరస్పరము కొట్టుకొని క్రింద పడిపోయినవి. 25

మూ. ప్రాయుధ్యతామవిచ్ఛిన్నమస్యన్తౌ సవ్యదక్షిణమ్, 26
చక్రతుశ్చ శరైర్ఘోరైర్నిరుచ్ఛ్వాసమివామ్బరమ్.

ప్ర. అ. సవ్యదక్షిణమ్=ఎడమవైపు, కుడివైపు, అవిచ్ఛిన్నమ్=ఎడతెగకుండగా, అస్యన్తౌ=బాణములను విడచుచు, ప్రాయుధ్యేతామ్=యుద్ధము చేసిరి. ఘోరైః=భయంకరములైన, శరైః=బాణములచేత, అమ్బరమ్=ఆకాశమును, నిరుచ్ఛ్వాసమివ=ఊపిరిసలపనిదానిని వలె, చక్రతుః చ=చేసిరి.

తా. వారిద్దరూ ఎడమచేతితోను, కుడి చేతితోను అవిచ్ఛిన్నముగా బాణములు వదలుచు యుద్ధము చేసిరి. భయంకరములైన బాణములచేత ఆకాశమును ఊపిరిసలపకుండా చేసిరి. 26

మూ. రావణస్య హయాన్ రామో హయాన్రామస్య రావణః, 27
జఘ్నతుస్తౌ తదాన్యోన్యం కృతానుకృతకారిణౌ.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, హయాన్=గుఱ్ఱములను, రామః=రాముడు, రామస్య=రామునియొక్క, హయాన్=గుఱ్ఱములను, రావణః=రావణుడు, తౌ=వారిద్దరూ, తదా=అప్పుడు, అన్యోన్యమ్=పరస్పరము, కృతానుకృతకారిణౌ=చేసినదానిని అనుకరించి చేయుచు, జఘ్నతుః=కొట్టిరి.

తా. రావణుని గుఱ్ఱములను రాముడు కొట్టెను. రాముని గుఱ్ఱములను రావణుడు కొట్టెను. ఈ విధముగా వారిద్దరూ ఒకరు చేసినదానిని మరొకరు అనుకరించి చేయుచు, యుద్ధము చేసిరి. 27

మూ. ఏవం తు తౌ సుసంక్రుద్ధౌ చక్రతుర్యుద్ధముత్తమమ్, 28
ముహూర్తమభవద్యుద్ధం తుములం రోమహర్షణమ్.

ప్ర. అ. సుసంక్రుద్ధౌ=చాలా కోపించిన, తౌ=వారిద్దరూ, ఏవమ్=ఈ విధముగా, ఉత్తమమ్=ఉత్తమమైన, యుద్ధమ్=యుద్ధమును, చక్రతుః=చేసిరి. ముహూర్తమ్=ముహూర్తకాలము, తుములమ్=వ్యాకులము, రోమహర్షణమ్=రోమాంచము కలిగించునదీ అయిన, యుద్ధమ్=యుద్ధము, అభవత్=ఆయెను.

తా. వారిద్దరూ చాల కోపముతో ఈ విధముగా గొప్ప యుద్ధము చేసిరి. ముహూర్తకాలము వ్యాకులము, రోమాంచకరము అయిన యుద్ధము జరిగెను. 28

మూ. ప్రయుధ్యమానౌ సమరే మహాబలౌ
శితైః శరై రావణలక్ష్మణాగ్రజౌ,
ధ్వజావపాతేన స రాక్షసాధిపో
భృశం ప్రచుక్రోధ తదా రఘూత్తమే. 29

ప్ర. అ. మహాబలౌ=గొప్ప బలము గల, రావణలక్ష్మణాగ్రజౌ=రావణరాములు, సమరే=యుద్ధమునందు, శితైః=వాడియైన, శరైః=బాణములచేత, ప్రయుధ్యమానౌ=బాగుగా యుద్ధముచేయుచు ఉండిరి. సః రాక్షసాధిపః=ఆ రావణుడు, ధ్వజావపాతేన=ధ్వజము పడిపోవుటచేత, తదా=అప్పుడు, రఘూత్తమే=రామునియందు, భృశమ్=మిక్కిలి, ప్రచుక్రోధ=కోపించెను.

తా. మహాబలవంతులైన ఆ రామరావణులు యుద్ధరంగమునందు వాడియైన బాణాలతో బాగుగా యుద్ధము చేయుచుండిరి. ధ్వజము పడిపోవుట చేత రావణునకు అప్పుడు రామునిపై చాల కోపము కలిగెను. 29

మూ. తౌ తథా యుధ్యమానౌ తు సమరే రామరావణౌ,
దదృశుః సర్వభూతాని విస్మితేనాన్తరాత్మనా. 30

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, తథా=అట్లు, యుధ్యమానౌ=యుద్ధము చేయుచున్న, రామరావణౌ=రామరావణులను, సర్వభూతాని=సకల భూతములు, విస్మితేన=ఆశ్చర్యపడిన, అన్తరాత్మనా=మనస్సుతో, దదృశుః=చూచిరి.

తా. యుద్ధరంగములో ఆ విధముగా యుద్ధము చేయుచున్న ఆ రామరావణులను సకల భూతములు, ఆశ్చర్యము చెందిన మనస్సుతో చూచిరి.30

మూ. అర్దయన్తౌ తు సమరే తయోస్తౌ స్యన్దనోత్తమౌ,
పరస్పరమభిక్రుద్ధౌ పరస్పరమభిద్రుతౌ. 31

ప్ర. అ. తయోః=ఆ ఇద్దరియొక్క, స్యన్దనోత్తమౌ=శ్రేష్ఠములైన రథములు, పరస్పరమ్=పరస్పరమును, అర్దయన్తౌ=పీడించుచు, అభిక్రుద్ధౌ=కోపించినవై, పరస్పరమ్=పరస్పరమును, అభిద్రుతౌ=ఎదురుగా వెళ్లినవి.

తా. వారి శ్రేష్ఠములైన రథములు పరస్పరము పీడించుకొనుచు, మహాకోపములో ఒకదానికి ఎదురుగా ఒకటి వెళ్లినవి. 31

మూ. పరస్పరవధే యుక్తౌ ఘోరరూపౌ బభూవతుః,
మణ్డలాని చ వీథీశ్చ గతప్రత్యాగతాని చ, 32
దర్శయన్తౌ బహువిధాం సూతసామర్థ్యజాం గతిమ్.

ప్ర. అ. పరస్పరవధే=పరస్పరముయొక్క వధయందు, యుక్తౌ=ఆసక్తి గలవై, మణ్డలాని=మండలగతులను, వీథీశ్చ=ప్రసిద్ధమార్గములందు గతులను, గతప్రత్యాగతాని=దూరముగా వెళ్లుటను, తిరిగి వచ్చుటను, సూతసామర్థ్యజామ్=సారథుల సామర్థ్యమువలన కలిగిన, బహువిధామ్=అనేకవిధములైన, గతిమ్=గమనమును, దర్శయన్తౌ=చూపుచు, ఘోరరూపౌ=భయంకరమైన రూపములు గలవి, బభూవతుః=అయినవి.

తా. ఆ రథములు ఒకదానినొకటి నశింపచేయుటకై ప్రయత్నించుచు సారథుల సామర్థ్యముచేత ఏర్పడిన మండలగతులను, ఋజుగతులను, దూరము వెళ్లి వచ్చుచుండుటను, బహువిధములైన ఇతరగతులను చూపుచు భయంకరములుగా ఉండెను. 32

మూ. అర్దయన్ రావణం రామో రాఘవం చాపి రావణః, 33
గతివేగం సమాపన్నౌ ప్రతివేగప్రవర్తనే.

ప్ర. అ. **రావణమ్=రావణుణ్ణి,** అర్దయన్=పీడించుచున్న, రామః=రాముడు, రాఘవమ్=రాముణ్ణి పీడించుచున్న, రావణః చాపి=రావణుడు, ప్రతివేగప్రవర్తనే=శత్రువునకు ఎదురుగా వేగమును చూపుటయందు, గతివేగమ్=గతివేగమును, సమాపన్నౌ=పొందిరి.

తా. రాముడు రావణుణ్ణీ, రావణుడు రాముణ్ణీ పీడించుచు ఒకరి గతిని మరొకరు అడ్డుకొనుటకై గతివేగమును చూపుచుండిరి. 33

మూ. క్షిపతోః శరజాలాని తయోస్తౌ స్యన్దనోత్తమౌ, 34
చేరతుః సంయుగమహీం సాసారౌ జలదావివ.

ప్ర. అ. శరజాలాని=బాణసముదాయములను, క్షిపతోః=చిమ్ముచున్న, తయోః=వారిద్దరియొక్క, స్యన్దనోత్తమౌ=ఉత్తమములైన రథములు, సాసారౌ=ధారావర్షముతో కూడిన, జలదౌ ఇవ=రెండు మేఘములు వలె, సంయుగమహీమ్=యుద్ధభూమిని, చేరతుః=సంచరించినవి.

తా. బాణసముదాయములు చిమ్ముచున్న వారి రథశ్రేష్ఠములు జలధారలు వర్షించుచున్న మేఘములు వలె యుద్ధభూమిలో సంచరించినవి. 34

మూ. దర్శయిత్వా తదా తౌ తు గతిం బహువిధాం రణే, 35
పరస్పరస్యాభిముఖౌ పునరేవ చ తస్థతుః.

ప్ర. అ. తదా=అప్పుడు, తౌ=ఆ రథములు, రణే=యుద్ధమునందు, బహువిధామ్=అనేకవిధములైన, గతిమ్=గమనమును, దర్శయిత్వా=చూపి, పునరేవ=మరల, పరస్పరస్య=పరస్పరమునకు, అభిముఖౌ=అభిముఖములై, తస్థతుః=నిలచినవి.

తా. ఆ రథములు యుద్ధములో అనేకవిధములైన గతులు చూపి మరల ఒకదానికొకటి ఎదురుగా నిలచినవి. 35

మూ. ధురం ధురేణ రథయోర్వక్త్రం వక్త్రేణ వాజినామ్, 36
పతాకాశ్చ పతాకాభిః సమీయుః స్థితయోస్తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, స్థితయోః=నిలచిన, రథయోః=రథములయొక్క, ధురమ్=కాడి, ధురేణ=కాడితోను, వాజినామ్=గుఱ్ఱములయొక్క, వక్త్రమ్=ముఖము, వక్త్రేణ=ముఖముతోను, పతాకాః=పతాకలు, పతాకాభిః చ=పతాకలతోను, సమీయుః=కలిసినవి.

తా. అప్పుడు రథములు నిలచినప్పుడు వాటి కాడి కాడితోను, గుఱ్ఱాల ముఖాలు ముఖాలతోను, పతాకలు పతాకలతోను కలిసినవి. 36

మూ. రావణస్య తతో రామో ధనుర్ముక్తైః శితైః శరైః, 37
చతుర్భిశ్చతురో దీప్తాన్ హయాన్ ప్రత్యపసర్పయత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, ధనుర్ముక్తైః=ధనస్సుచేత విడవబడిన, చతుర్భిః=నాలుగు, శితైః=వాడియైన, శరైః=బాణముల చేత, రావణస్య=రావణునియొక్క, దీప్తాన్=ప్రకాశించుచున్న, చతురః=నాలుగు, హయాన్=గుఱ్ఱములను, ప్రత్యపసర్పయత్=వెనుకను మరలునట్లు చేసెను.

తా. అప్పుడు రాముడు ధనస్సునుండి నాలుగు వాడియైన బాణాలు ప్రయోగించి రావణుని ప్రకాశించుచున్న నాలుగు గుఱ్ఱములు వెనుకకు మరలునట్లు చేసెను. 37

మూ. స క్రోధవశమాపన్నో హయానామపసర్పణే, 38
ముమోచ నిశితాన్ బాణాన్ రాఘవాయ దశాననః.

ప్ర. అ. హయానామ్=గుఱ్ఱములయొక్క, అపసర్పణే=వెనుకకు మరలుటయందు, క్రోధవశమ్=కోపవశమును, ఆపన్నః=పొందిన,సః దశాననః=ఆ రావణుడు, రాఘవాయ=రామునకు, నిశితాన్=వాడియైన, బాణాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. గుఱ్ఱములు వెనుకకు పోవునట్లు చేయుటచేత కోపించిన ఆ రావణుడు రామునిపై వాడియైన బాణాలు ప్రయోగించెను. 38

మూ. సోఽతివిద్ధో బలవతా దశగ్రీవేణ రాఘవః, 39
జగామ న వికారం చ న చాపి వ్యథితోఽభవత్.

ప్ర. అ. బలవతా=బలవంతుడైన, దశగ్రీవేణ=రావణునిచేత, అతి విద్ధః=ఎక్కువగా కొట్టబడిన, రాఘవః=రాముడు, వికారమ్=వికారమును, న జగామ=పొందలేదు. వ్యథితః చ=వ్యథ చెందినవాడు కూడ, న అభవత్=కాలేదు.

తా. బలవంతుడైన రావణుడు అంతగా బాణాలతో కొట్టినా కూడ రాముడు ఏ మాత్రము వికారము పొందలేదు; వ్యథ చెందలేదు. 39

మూ. చిక్షేప చ పునర్బాణాన్ వజ్రపాతసమస్వనాన్, 40
సారథిం వజ్రహస్తస్య సముద్దిశ్య దశాననః.

ప్ర. అ. దశాననః=రావణుడు, వజ్రహస్తస్య=ఇంద్రునియొక్క, సారథిమ్=సారథిని, ఉద్దిశ్య=ఉద్దేశించి, పునః=మరల, వజ్రపాతసమస్వనాన్=పిడుగుపాటుతో సమానమైన ధ్వని గల, బాణాన్=బాణములను, చిక్షేప=విసరెను.

తా. రావణుడు మరల మాతలిపై పిడుగుపాటు వంటి ధ్వని గల బాణములను ప్రయోగించెను. 40

మూ. మాతలేస్తు మహావేగాః శరీరే పతితాః శరాః, 41
న సూక్ష్మమపి సంమోహం వ్యథాం వా ప్రదదుర్యుధి.

ప్ర. అ. మాతలేః=మాతలియొక్క, శరీరే=శరీరముమీద, పతితాః=పడిన, మహావేగాః=గొప్ప వేగము గల, శరాః=బాణములు, సుసూక్ష్మమపి=చాల కొంచెమైనను, సంమోహమ్=సంమోహమును గాని, **వ్యథాం వా=వ్యథను కాని,** న ప్రదదుః=కలిగించలేదు.

తా. మాతలి శరీరముమీద పడిన మహావేగము గల బాణములు కొంచెమైనను సంమోహమును గాని, వ్యథను కాని కలిగించలేదు. 41

మూ. తయా ధర్షణయా క్రుద్ధో మాతలేర్న తథాత్మనః, 42
చకార శరజాలేన రాఘవో విముఖం రిపుమ్.

ప్ర. అ. రాఘవః=రాముడు, మాతలేః=మాతలియొక్క, తయా ధర్షణయా=ఆ పీడించుటచేత, క్రుద్ధః=కోపించెను. ఆత్మనః=తనయొక్క, ధర్షణముచేత, తథా=అట్లు, న=కోపించలేదు. శరజాలేన=బాణసముదాయముచేత, రిపుమ్=శత్రువును, విముఖమ్=విముఖునిగా, చకార=చేసెను.

తా. రావణుడు మాతలిని పీడించుటచే కలిగినంతగా రామునకు తనను పీడించుటచేత కూడ కోపము కలుగలేదు. అతడు బాణసముదాయమును ప్రయోగించి శత్రువును విముఖుణ్ణిగా చేసెను. 42

మూ. వింశతిం త్రింశతిం షష్టిం శతశోఽథ సహస్రశః, 43
ముమోచ రాఘవో వీరః సాయకాన్ స్యన్దనే రిపోః.

ప్ర. అ. వీరః=వీరుడైన, రాఘవః=రాముడు, రిపోః=శత్రువుయొక్క, స్యన్దనే=రథమునందు, వింశతిమ్=ఇరువది, త్రింశతిమ్=ముప్పది, **షష్టిమ్=అరువది,** అథ=మరియు, శతశః=వందలకొలది, సహస్రశః=వేలకొలది, సాయకాన్=బాణములను, ముమోచ=విడచెను.

తా. వీరుడైన రాముడు శత్రువు రథముపై ఇరవై, ముప్పై, అరవై, వంద, వెయ్యి - ఈ విధముగా బాణములను విడచెను. 43

మూ. రావణోఽపి తతః క్రుద్ధో రథస్థో రాక్షసేశ్వరః, 44
గదాముసలవర్షేణ రామం ప్రత్యర్దయద్రణే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, క్రుద్ధః=కోపించిన, రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణోఽపి=రావణుడు కూడ రణే=యుద్ధమునందు, రామమ్=రాముణ్ణి, గదాముసలవర్షేణ=గదలయొక్క ముసలములయొక్క వర్షముచేత, ప్రత్యర్దయత్= **పీడించెను.**

తా. అప్పుడు రాక్షసరాజైన రావణుడు కూడ కోపించి రామునిపై గదలను, ముసలములను వర్షించి పీడించెను. 44

మూ. తత్ప్రయుక్తం పునర్యుద్ధం తుములం రోమహర్షణమ్, 45
గదానాం ముసలానాం చ పరిఘాణాం చ నిఃస్వనైః,
శరాణాం పుఙ్ఖవాతైశ్చ క్షుభితాః సప్త సాగరాః. 46

ప్ర. అ. పునః=మరల, తత్ప్రియుక్తమ్=వారిచేత చేయబడిన, యుద్ధమ్= యుద్ధము, తుములమ్=వ్యాకులముగాను, **రోమహర్షణమ్=రోమాంచజనకముగాను,** గదానామ్=గదలయొక్క, ముసలానాం చ=ముసలములయొక్క, పరిఘాణాం చ=పరిఘలయొక్క, నిఃస్వనైః=ధ్వనులచేత, సప్త సాగరాః=ఏడు సముద్రములు, క్షుభితాః=క్షోభింపచేయబడినవి.

తా. మరల వారిద్దరూ ప్రారంభించిన యుద్ధము వ్యాకులముగాను రోమాంచజనకముగాను ఉండెను. గదల, ముసముల, పరిఘల ధ్వనులచేతను, బాణముల పొన్నుల గాలులచేతను, ఏడు సముద్రములు క్షోభింపబడెను.

మూ. క్షుబ్ధానాం సాగరాణాం చ పాతాలతలవాసినః,
వ్యథితా దానవాః సర్వే పన్నగాశ్చ సహస్రశః. 47

ప్ర. అ. క్షుబ్ధానామ్=క్షోభ చెందిన, సాగరాణామ్=సముద్రములయొక్క, పాతాలతలవాసినః=పాతాలమునందు నివసించుచున్న, సర్వే=సమస్తమైన, దానవాః= దానవులు, సహస్రశః=వేలకొలది, పన్నగాశ్చ=పన్నగులు (సర్పములు), వ్యథితాః=వ్యథ చెందెను.

తా. సాగరములు క్షోభచెందగా వాటి క్రింద నున్న పాతాళములో నివసించు దానవు లందరు, వేలకొలది పన్నగులు వ్యథ చెందిరి. 47

మూ. చకమ్పే మేదినీ కృత్స్నా సశైలవనకాననా,
భాస్కరో నిష్ప్రభశ్చాసీన్న వవౌ చాపి మారుతః. 48

ప్ర. అ. సశైలవనకాననా=శైలములతో, వనములతో, అరణ్యములతో కూడిన, కృత్స్నా=సమస్తమైన, మేదినీ=భూమి, చకమ్పే=కంపించెను. భాస్కరశ్చ=సూర్యుడు కూడ, **నిష్ప్రభః**=కాంతి లేనివాడు, ఆసీత్=ఆయెను. మారుతశ్చాపి=వాయువు కూడ, న వవౌ=వీచలేదు.

తా. పర్వతములతో, వనములతో, అరణ్యములతో సహా సమస్తభూమి కంపించెను. సూర్యుని కాంతి తగ్గెను. గాలి వీచుట మానివేసెను.

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
చిన్తామాపేదిరే సర్వే సకింనరమహోరగాః. 49

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సగన్ధర్వాః=గంధర్వులతో కూడిన, దేవాః= దేవతలు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, సకింనరమహోరగాః=కింనరులతోను మహోరగులతోను కూడిన, సర్వే=అందరూ, చిన్తామ్=చింతను, ఆపేదిరే=పొందిరి.

తా. అప్పుడు, దేవతలు,, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, కింనరులు, మహోదరులు వీరందరూ చింతాక్రాంతులైరి. 49

మూ. **స్వస్తి** గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకాస్తిష్ఠన్తు శాశ్వతాః,
జయతాం రాఘవః సంఖ్యే రావణం రాక్షసేశ్వరమ్. 50
ఏవం జపన్తోఽపశ్యంస్తే దేవాః **సర్షిగణాస్తదా,**
రామరావణయోర్యుద్ధం సుఘోరం రోమహర్షణమ్. 51

ప్ర. అ. తదా=అప్పుడు, సర్షిగణాః=ఋషిగణములతో కూడిన, తే=ఆ,

దేవాః=దేవతలు, గోబ్రాహ్మణేభ్యః=గోవులకు, బ్రాహ్మణులకు, స్వస్తి=స్వస్తి, అస్తు= అగుగాక, లోకాః=లోకములు, శాశ్వతాః=శాశ్వతములై, తిష్ఠన్తు=ఉండుగాక, రాఘవః=రాముడు, సంఖ్యే=యుద్ధమునందు, రాక్షసేశ్వరమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుణ్ణి, జయతామ్=జయించుగాక, ఏవమ్=ఇట్లు, జపన్తః=మెల్లగా చెప్పకొనుచు, ఘోరమ్=చాల ఘోరమైన,రోమహర్షణమ్=రోమాంచజనకమైన, రామరావణయోః=రామరావణులయొక్క, యుద్ధమ్=యుద్ధమును, అపశ్యన్=చూచిరి.

తా. అప్పుడు దేవతలు, ఋషిగణములు --"గోవులకు బ్రాహ్మణులకు స్వస్తి అగుగాక! లోకములు నశించకుండా స్థిరముగా ఉండుగాక! రాముడు యుద్ధములో రాక్షసరాజైన రావణుణ్ణి జయించుగాక" అని మెల్లగా చెప్పకొనుచు చాల ఘోరము, రోమాంచజనకము అయిన ఆ రామరావణుల యుద్ధమును చూచిరి. 48, 51

మూ. గన్ధర్వాప్సరసాం సంఘా దృష్ట్వా యుద్ధమనూపమమ్,
గగనం గగనాకారం సాగరః సాగరోపమః, 52
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ.
ఏవం బ్రువన్తో దదృశుస్తద్యుద్ధం రామరావణమ్. 53

ప్ర. అ. గన్ధర్వాప్సరసామ్=గంధర్వులయొక్క అప్సరసలయొక్క, సంఘాః= సంఘములు, అనూపమమ్=సాటి లేని, యుద్ధమ్=యుద్ధమును, దృష్ట్వా=చూచి, గగనమ్=ఆకాశము, గగనాకారమ్=ఆకాశముయొక్క ఆకారము వంటి ఆకారము గలది., సాగరః=సముద్రము, సాగరోపమః=సముద్రముతో సమానము, రామరావణయోః=రామరావణులయొక్క, యుద్ధమ్=యుద్ధము, రామరావణయోరివ=రామరావణుల యుద్ధము వలె ఉన్నది, ఏవమ్=ఇట్లు, బ్రువన్తః=పలుకుచు, రామరావణమ్=రామరావణుల సంబంధమైన, తత్=ఆ, యుద్ధమ్=యుద్ధమును, దదృశుః=చూచిరి.

తా. గంధర్వుల సంఘములు, అప్సరసల సంఘములు సాటిలేని ఆ యుద్ధము చూచి "ఆకాశము ఆకాశము వంటిది; సముద్రము సముద్రము వంటిది; రామరావణుల యుద్ధము రామరావణుల యుద్ధము వంటిది" అని ఒకరితో ఒకరు అనుకొనుచు ఆ రామరావణ యుద్ధమును చూచిరి. 52, 53

మూ. తతః క్రోధాన్మహాబాహూ రఘూణాం కీర్తివర్ధనః,
సంధాయ ధనుషా రామః శరమాశీవిషోపమమ్, 54
రావణస్య శిరోఽచ్ఛినచ్ఛ్రీమజ్జ్వలితకుణ్డలమ్.
తచ్ఛిరః పతితం భూమౌ దృష్టం లోకైస్త్రిభిస్తదా. 55

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాబాహుః=గొప్ప బాహువులు గల, రఘూణామ్=రఘువంశ రాజుల, కీర్తివర్ధనః=కీర్తిని వృద్ధి పొందించు, రామః=రాముడు, క్రోధాత్=కోపమువలన, ధనుషా=ధనస్సుచేత, ఆశీవిషోపమమ్=సర్పమువంటి, శరమ్=బాణమును, సంధాయ=సంధించి, శ్రీమత్=శోభాయుక్తమైన, జ్వలితకుణ్డలమ్=ప్రకాశించుచున్న కుండలములు గల, రావణస్య శిరః=రావణుని శిరస్సును, అచ్ఛిన్దత్=ఛేదించెను. తదా=అప్పుడు, భూమౌ=నేలమీద, పతితమ్=పడిన, తత్=ఆ, శిరః=శిరస్సు, త్రిభిః=మూడు, లోకైః=లోకములచేత, దృష్టమ్=చూడబడినది.

తా. పిమ్మట, గొప్ప బాహువులు గలవాడు, రఘువంశరాజుల కీర్తిని వృద్ధి పొందించువాడూ అయిన రాముడు కోపించి, సర్పము వంటి బాణమును ధనస్సుమీద సంధించి, శోభాయుక్తము, ప్రకాశించుచున్న కుండలములు గలదీ అయిన రావణుని శిరస్సును ఛేదించెను. అప్పుడు నేలమీద పడిన ఆ శిరస్సును మూడు లోకములు చూచెను. 54, 55,

మూ. తస్యైవ సదృశం చాన్యద్రావణస్యోత్థితం శిరః,
తత్ క్షిప్తం క్షిప్రహస్తేన రామేణ క్షిప్రకారిణా. 56

ప్ర. అ. తస్యైవ=ఆ శిరస్సుకే, సదృశమ్=సమానమైన, అన్యత్=మరియొక, రావణస్య=రావణునియొక్క, శిరః=శిరస్సు, ఉత్థితమ్=లేచినది, తత్=అది, క్షిప్రహస్తేన=శీఘ్రహస్తము గల, క్షిప్రకారిణా=శీఘ్రముగా పని చేయు, రామేణ=రామునిచేత, క్షిప్తమ్=తెగగొట్టబడినది.

తా. ఆ శిరస్సు వంటిదే మరి యొక శిరస్సు రావణునికి మొలచెను. హస్తలాఘవముతో శీఘ్రముగా పనులు చేయు రాముడు దానిని కూడ ఛేదించెను.

మూ. ద్వితీయం రావణశిరశ్ఛిన్నం సంయతి సాయకైః,
ఛిన్నమాత్రం చ తచ్ఛీర్షం పునరేవ ప్రదృశ్యతే. 57

ప్ర. అ. సంయతి=యుద్ధమునందు, ద్వితీయమ్=రెండవ, రావణశిరః=రావణుని శిరస్సు, సాయకైః=బాణములచేత, ఛిన్నమ్=ఛేదించబడినది. తత్=ఆ, శీర్షమ్=శిరస్సు, ఛిన్నమాత్రమ్=ఛేదించబడిన వెంటనే, పునరేవ=మరల, దృశ్యతే=కనబడెను.

తా. యుద్ధమునందు రావణుని ఆ రెండవ శిరస్సు కూడ బాణముచేత ఛేదించబడెను. ఛేదించబడిన వెంటనే అది మరల కనబడెను. 57

మూ. తదప్యశనిసంకాశైశ్ఛిన్నం రామస్య సాయకైః,
ఏవమేవ శతం ఛిన్నం శిరసాం తుల్యవర్చసామ్. 58

ప్ర. అ. తదపి=అదికూడ, అశనిసంకాశైః=వజ్రమువంటి, రామసాయకైః=

రాముని బాణములచేత, ఛిన్నమ్=ఛేదించబడినది. ఏవమేవ=ఈవిధముగానే, తుల్యవర్చసామ్=సమానమైన కాంతి గల, శిరసామ్=శిరస్సులయొక్క, శతమ్=శతము, ఛిన్నమ్=ఛేదింపబడినది.

తా. రాముడు వజ్రాయుధము వంటి బాణములచేత దానిని కూడ ఛేదించెను. ఈ విధముగా సమానమైన కాంతి గల నూరు శిరస్సులను ఖండించెను. 58

మూ. న చైవ రావణస్యాన్తో దృశ్యతే జీవితక్షయే,
తతః సర్వాస్త్రవిద్వీరః కౌసల్యానన్దవర్ధనః, 59
మార్గణైర్బహుభిర్యుక్తశ్చిన్తయామాస రాఘవః.

ప్ర. అ. రావణస్య=రావణునియొక్క, జీవితక్షయే=జీవితక్షయము కలుగగా, అన్తః=అంతము, న చైవ దృశ్యతే=కనబడుటలేదు. తతః=అటుపిమ్మట, సర్వాస్త్రవిత్=సకల అస్త్రములను ఎరిగిన, **వీరః=వీరుడైన,** కౌసల్యానన్దవర్ధనః=కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించు, బహుభిః=అనేకములైన, మార్గణైః=బాణములతో, యుక్తః=కూడిన, రాఘవః=రాముడు, చిన్తయామాస=ఆలోచించెను.

తా. ఇన్ని **మార్లు** ఛేదించినను రావణుడు ప్రాణములు విడచి అంతమొందుట కనబడలేదు. అప్పుడు, సకలాస్త్రములు ఎరిగినవాడు, వీరుడు, **కౌసల్యానందవర్ధనుడు,**. అనేక బాణములు గలవాడు అయిన రాముడు ఇట్లు చింతించెను. 59

మూ. మారీచో నిహతో యైస్తు ఖరో యైస్తు సదూషణః,
క్రౌఞ్చావనే విరాధస్తు **కబన్ధో** దణ్డకే వనే,
యైః సాలా గిరయో భగ్నా వాలీ చ క్షుభితోఽమ్బుధిః, 60
త ఇమే సాయకాః సర్వే యుద్ధే ప్రాత్యయికా మమ,
కిం ను తత్కారణం యేన రావణే మన్దతేజసః. 61

ప్ర. అ. యైః=వేటిచేత, మారీచః=మారీచుడు, నిహతః=చంపబడినాడో, యైః=వేటిచేత, సదూషణః=దూషణునితో కూడిన, ఖరః=ఖరుడు, క్రౌఞ్చావనే=క్రౌంచవనమునందు, కబన్ధః=కబంధుడు, దణ్డకావనే=దండకారణ్యమునందు, విరాధః తు=విరాధుడు చంపబడినాడో, యైః=వేటిచేత, సాలాః=సాలవృక్షములు, గిరయః=పర్వతములు, భగ్నాః=బ్రద్దలుకొట్టబడినవో, వాలీ చ=వాలికూడ చంపబడినాడో, అమ్బుధిః=సముద్రము, క్షుభితః=క్షోభపెట్టబడినదో, తే=అట్టి, ఇమే సాయకాః=ఈ బాణములు, సర్వే=అన్నీ, మమ=నాకు, యుద్ధే=యుద్ధమునందు, ప్రాత్యయికాః=విశ్వాసస్థానములు. యేన=దేనిచేత, రావణే=రావణుని విషయమున, మన్దతేజసః=మందమైన తేజస్సు గలవో, తత్=ఆ, కారణమ్=కారణము, కిం

ను=ఏది?

తా. ఏ బాణములచేత మారీచుడు చంపబడినాడో, వేటిచేత ఖరదూషణులు, క్రౌంచవనములో కబంధుడు, దండకావనములో విరాధుడు చంపబడినారో, ఏ బాణములచేత సాలవృక్షములు, పర్వతమూ ఛేదింపబడినవో, వేటిచే వాలి చంపబడెనో, సముద్రము క్షోభింపచేయబడెనో, యుద్ధములో నాకు విశ్వాసస్థానములైన అట్టి ఈ బాణములు రావణుని విషయమున అల్పవీర్యము లగుటకు కారణము ఏమై ఉండును! 60, 61

మూ. ఇతి చిన్తాపరశ్చాసీ దప్రమత్తశ్చ సంయుగే,
వవర్ష శరవర్షాణి రాఘవో రావణోరసి. 62

ప్ర.అ. రాఘవః=రాముడు, సంయుగే=యుద్ధమునందు, ఇతి=ఇట్లు, చిన్తాపరః=చింతానిమగ్నుడై, అప్రమత్తశ్చ=ఏమరిపాటు లేనివాడుగా, ఆసీత్=ఉండెను. రావణోరసి=రావణునివక్షఃస్థలమునందు, శరవర్షాణి=బాణవర్షములను, వవర్ష=వర్షించెను.

తా. రాముడు యుద్ధరంగములో ఈ విధముగా ఆలోచించుచు, ఏమరిపాటు లేనివాడై, రావణుని వక్షఃస్థలము మీద బాణవర్షములు కురిపించెను. 62

మూ. రావణోఽపి తతః క్రుద్ధో రథస్థో రాక్షసేశ్వరః,
గదాముసలవర్షేణ రామం ప్రత్యర్దయద్రణే. 63

ప్ర. అ. తా.ఈ సర్గలోని 43 వ శ్లోకము చూడుడు.

మూ. తత్ప్రవృత్తం మహద్యుద్ధం తుములం రోమహర్షణమ్,
అన్తరిక్షే చ భూమౌ చ పునశ్చ గిరిమూర్ధని. 64

ప్ర. అ. తుములమ్=వ్యాకులము, రోమహర్షణమ్=రోమాంచకరము అయిన, మహత్=గొప్పదైన, తత్=ఆ, యుద్ధమ్=యుద్ధము,**అన్తరిక్షే చ=ఆకాశ** మునందు, **భూమౌ చ=భూమిమీద,** పునశ్చ=మరల, గిరిమూర్ధని=పర్వతము పైన, ప్రవృత్తమ్=జరిగినది.

తా. వ్యాకులము, రోమాంచకరమూ అయిన ఆ మహాయుద్ధము ఆకాశమునందు, నేలమీద, పర్వతముమీద జరిగెను. 64

మూ. దేవదానవయక్షాణాం పిశాచోరగరక్షసామ్,
పశ్యతాం తన్మహాయుద్ధం సప్తరాత్రమవర్తత. 65

ప్ర. అ. దేవదానవయక్షాణామ్=దేవతలు, దానవులు, యక్షులు, పిశాచోరగ

రక్షసామ్=పిశాచములు ఉరగులు, రాక్షసులు, పశ్యతామ్=చూచుచుండగా, తత్=ఆ, మహాయుద్ధమ్=మహాయుద్ధము, సప్తరాత్రమ్=ఏడు రోజులు, అవర్తత=జరిగెను.

తా. దేవ - దానవ - యక్ష - పిశాచ - ఉరగ - రాక్షసులు చూచుచుండగా ఆ మహాయుద్ధము ఏడు రోజులు జరిగెను. 65

మూ. నైవ రాత్రిం న దివసం న ముహూర్తం న చ క్షణమ్,
రామరావణయోర్యుద్ధం విరామముపగచ్ఛతి. 66

ప్ర. అ. రామరావణయోః=రామరావణులయొక్క, యుద్ధమ్=యుద్ధము, రాత్రిమ్=రాత్రిని (రాత్రియందు), విరామమ్=విరామమును, న ఉపగచ్ఛతి=పొందలేదు. దివసమ్=పగలు, న=పొందలేదు. ముహూర్తమ్=ముహూర్తమును, న=పొందలేదు, క్షణం చ=క్షణమును కూడ, న=పొందలేదు.

తా. ఆ రామరావణయుద్ధమునకు రాత్రి గాని, పగలు గాని, ఒక ముహూర్తము గాని, ఒక్క క్షణము గాని విరామము లేకుండెను. 66

మూ. దశరథసుతరాక్షసేన్ద్రయో
ర్జయమనవేక్ష్య రణే స రాఘవస్య,
సురవరరథసారథిర్మహాత్మా
రణరతరామమువాచ వాక్యమాశు. 67

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే సప్తోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. దశరథసుతరాక్షసేన్ద్రయోః=రామరావణులయొక్క, రణే=యుద్ధమునందు, రాఘవస్య=రామునియొక్క, జయమ్=జయమును, అనవేక్ష్య=చూడక, మహాత్మా=మహాత్ముడైన, సః=ఆ, సురవరరథసారథిః=మహేంద్రరథసారథి, **రణరతరామమ్=యుద్ధమునందు ఆసక్తుడై ఉన్న రాముణ్ణి గూర్చి, ఆశు=శీఘ్ర** ముగా,వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రామరావణుల మధ్య జరుగుచున్న ఆ యుద్ధములో రాము డింకా జయించకుండుట చూచి మహాత్ముడైన మాతలి, యుద్ధాసక్తుడైన రామునితో శీఘ్రముగా ఇట్లు పలికెను. 67

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టోత్తరశతతమః సర్గః

[రాముడు రావణుని సంహరించుట.]

మూ. అథ సంస్మారయామాస మాతలీ రాఘవం తదా,
అజానన్నివ కిం వీర త్వమేనమనువర్తసే. 1

ప్ర. అ.అథ=పిమ్మట, తదా=అప్పుడు, మాతలిః=మాతలి రాఘవమ్=రాముణ్ణి, సంస్మారయామాస= స్మరింపచేసెను. వీర=ఓ! వీరుడా! అజానన్నివ=ఏమీ ఎరుగనివాడు వలె, త్వమ్=నీవు, ఏనమ్=వీనిని, కిమ్=ఎందుకు, అనువర్తసే=అనువర్తించుచున్నావు?

తా. అప్పుడు మాతలి రామునకు జ్ఞాపకము చేసెను. "ఓ! వీరుడా! ఏమీ తెలియనివాడవు వలె ఎందుకు ఈతనితో ఇంతసేపు యుద్ధము చేయుచున్నావు?" 1

మూ. విసృజాస్మై వధాయ త్వమస్త్రం పైతామహం ప్రభో,
వినాశకాలః కథితో యః సురైః సోఽద్య వర్తతే. 2

ప్ర. అ. ప్రభో=ఓ! ప్రభూ! త్వమ్=నీవు, వధాయ=వీని సంహారముకొరకు, అస్మై=వీనికి, పైతామహమ్=బ్రహ్మదేవుని సంబంధమైన, అస్త్రమ్=అస్త్రమును, విసృజ=విడువుము. సురైః=దేవతలచేత, యః=ఏ, వినాశకాలః=వినాశకాలము, కథితః=చెప్పబడినదో, సః=అది, అద్య=ఇప్పుడు, వర్తతే=ఉన్నది.

తా. ఓ! సర్వసమర్థుడా! ఈతనిని చంపుటకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించుము. దేవతలు చెప్పిన వీని వినాశకాలము ఇప్పుడు వచ్చి ఉన్నది.2

మూ. తతః సంస్మారితో రామస్తేన వాక్యేన మాతలేః,
జగ్రాహ స శరం దీప్తం నిఃశ్వసన్తమివోరగమ్, 3
యం తస్మై ప్రథమం ప్రాదాదగస్త్యో భగవానృషిః,
బ్రహ్మదత్తం మహాబాణమమోఘం యుధి వీర్యవాన్. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మాతలేః=మాతలియొక్క, తేన వాక్యేన=ఆ వాక్యముచేత, సంస్మారితః=స్మరింపచేయబడిన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రామః=ఆ రాముడు, బ్రహ్మదత్తమ్=బ్రహ్మచేత ఇవ్వబడిన, యుధి=యుద్ధము

నందు, అమోఘమ్=వ్యర్థము కాని, యమ్=ఏ, మహాబాణమ్=గొప్ప బాణమును, ప్రథమమ్=పూర్వము, భగవాన్=భగవంతుడైన, అగస్త్యః ఋషిః=అగస్త్య ఋషి, తస్మై=ఆతనికి, ప్రాదాత్=ఇచ్చెనో, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, నిఃశ్వసన్తమ్=బుసకొట్టుచున్న, ఉరగమ్ ఇవ=సర్పము వలె ఉన్న, శరమ్=బాణమును, జగ్రాహ=గ్రహించెను.

తా. పిమ్మట మాతలి వాక్యముచేత స్మరింపజేయబడిన పరాక్రమశాలియైన ఆ రాముడు, బ్రహ్మచేత ఇవ్వబడిన, యుద్ధములో తిరుగు లేని ఏ బాణమును పూర్వము భగవంతుడైన అగస్త్యుడు తన కిచ్చెనో అట్టి, బుసలు కొట్టుచున్న పాము వలె ఉన్న ప్రకాశించుచున్న బాణమును తీసెను. 3, 4

మూ. బ్రహ్మణా నిర్మితం పూర్వమిన్ద్రార్థమమితౌజసా,
దత్తం సురపతేః పూర్వం త్రిలోకజయకాఙ్క్షిణః. 5

ప్ర. అ. (మూడవ శ్లోకము మొదలు పన్నెండవ శ్లోకము వరకు అన్ని శ్లోకాలకు ఒకటే అన్వయము). పూర్వమ్=పూర్వము, ఇన్ద్రార్థమ్=ఇంద్రుని నిమిత్తము, అమితౌజసా=గొప్ప తేజస్సు గల, బ్రహ్మణా=బ్రహ్మదేవునిచేత, నిర్మితమ్=నిర్మింపబడిన, పూర్వమ్=పూర్వము, త్రిలోకజయకాఙ్క్షిణః=మూడు లోకముల జయమును కోరు, సురపతేః=దేవేంద్రునకు, దత్తమ్=ఇవ్వబడిన (బాణమును గ్రహించెను.)

తా. పూర్వము గొప్ప తేజస్సు గల బ్రహ్మదేవుడు దీనిని ఇంద్రుని కొరకై నిర్మించి మూడు లోకములను జయించుటకై ఆతనికి ఇచ్చెను. 5

మూ. యస్య వాజేషు పవనః ఫలే పావకభాస్కరౌ,
శరీరమాకాశమయం గౌరవే మేరుమన్దరౌ. 6

ప్ర. అ. యస్య=దేనియొక్క, వాజేషు=వేగసాధనములైన రెక్కలయందు, పవనః=వాయువు, ఫలే=ములికియందు, పావకభాస్కరౌ=అగ్నిసూర్యులూ, గౌరవే=బరువునందు, మేరుమన్దరౌ=మేరుమందరపర్వతములూ అధిష్ఠానదేవతలుగా ఉన్నారో, శరీరమ్=శరీరము, ఆకాశమయమ్=ఆకాశస్వరూపమో (బ్రహ్మస్వరూపమో) అట్టి శరమును గ్రహించెను.

తా. దాని వేగసాధనములైన రెక్కలయందు వాయువు, ములికియందు అగ్నిసూర్యులు, బరువునందు మేరుమందరపర్వతములు అధిష్ఠానదేవతలుగా ఉందురు. దాని శరీరము బ్రహ్మమయము. 6

మూ. జాజ్వల్యమానం వపుషా సుపుఙ్ఖం హేమభూషితమ్,
తేజసా సర్వభూతానాం కృతం భాస్కరవర్చసమ్. 7

ప్ర. అ. వపుషా=దేహముచేత, జాజ్వల్యమానమ్=ప్రజ్వలించుచున్నది, సుపుఙ్ఖమ్=మంచి పొన్నుగలది, హేమభూషితమ్=బంగారముచేత అలంకరించబడినది, సర్వభూతానామ్=సమస్తభూతములయొక్క, తేజసా=తేజస్సుచేత, కృతమ్=చేయబడినది, భాస్కరవర్చసమ్=సూర్యునివంటి కాంతి గలదీ (అయిన బాణమును గ్రహించెను.)

తా. దాని శరీరము మంటలతో నిండి ఉండెను. బంగారముచేత అలంకరించిన దాని పొన్ను చక్కగా ఉండెను. అది సకలభూతములలోని తేజస్సును తీసి దానితో నిర్మింపబడెను. సూర్యునివంటి కాంతితో ఉండెను. 7

మూ. సధూమమివ కాలాగ్నిం దీప్తమాశీవిషోపమమ్,
నరనాగాశ్వవృన్దానాం భేదనం క్షిప్రకారిణమ్. 8

ప్ర. అ. సధూమమ్=ధూమముతోకూడిన, కాలాగ్నిమ్ ఇవ=కాలాగ్నివలె, దీప్తమ్=ప్రజ్వలించుచున్నది, ఆశీవిషోపమమ్=సర్పము వలె ఉన్నది, నరనాగాశ్వవృన్దానామ్=నరుల, గజముల, అశ్వముల సముదాయములకు, భేదనమ్=బ్రద్దలుకొట్టునది, క్షిప్రకారిణమ్=శీఘ్రముగా పని చేయునది, (అయిన బాణమును గ్రహించెను.)

తా. సర్పము వంటి ఆ బాణము ధూమముతో కూడిన ప్రళయకాలాగ్ని వలె ప్రజ్వలించుచుండెను. నరుల, గజముల, అశ్వముల సముదాయములను బ్రద్దలుకొట్టినది. శీఘ్రముగా పనిచేయును. 8

మూ. ద్వారాణాం పరిఘాణాం చ గిరీణాం చాపి భేదనమ్,
నానారుధిరదిగ్ధాఙ్గం మేదోదిగ్ధం సుదారుణమ్. 9

ప్ర. అ. ద్వారాణామ్=ద్వారములకు, పరిఘాణామ్=కోటగడియలకు, గిరీణాం చాపి=పర్వతములకు, భేదనమ్=భేదనము చేసినది, నానారుధిరదిగ్ధాఙ్గమ్=అనేకవిధములైన రక్తములచేత పూయబడిన శరీరము గలది, మేదోదిగ్ధమ్=కొవ్వుచేత పూయబడినది, సుదారుణమ్=చాల భయంకరమూ (అయిన బాణమును గ్రహించెను.)

తా. ఆ బాణము ఎన్నో ద్వారములను, కోట గడియలను, పర్వతములను బ్రద్దలుకొట్టెను. దాని శరీరము అనేకవిధములైన రక్తముచేత, కొవ్వుచేత పూయబడి చాల భయంకరముగా ఉండెను. 9

మూ. వజ్రసారం మహానాదం నానాసమితిదారణమ్,
సర్వవిత్రాసనం భీమం శ్వసన్తమివ పన్నగమ్. 10

ప్ర. అ. వజ్రసారమ్=వజ్రమువంటి సారము గలది, మహానాదమ్=గొప్ప ధ్వని గలది, నానాసమితిదారణమ్=అనేకయుద్ధములందు చీల్చివేయునది,

సర్వవిత్రాసనమ్=అందరినీ భయపెట్టునదీ, శ్వసన్తమ్=బుసలుగొట్టుచున్న, పన్నగమ్ ఇవ=సర్పము వలె ఉన్నది. (అయిన బాణమును గ్రహించెను.)

తా. ఆ బాణము వజ్రమువంటి సారము గలది. గొప్ప ధ్వని చేయునది, అనేక యుద్ధములలో శత్రుసైన్యాదులను చీల్చివేసినది. అందరినీ భయపెట్టునది. బుసలు కొట్టుచున్న పామువలె భయంకరముగా ఉన్నది. 10

మూ. కఙ్కగృధ్రబకానాం చ గోమాయుగణరక్షసామ్,
నిత్యం భక్షప్రదం యుద్ధే యమరూపం భయావహమ్. 11

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, కఙ్కగృధ్రబకానాం చ=డేగలకు, గ్రద్దలకు, కొంగలకు, గోమాయుగణరక్షసామ్=నక్కల గుంపులకు రాక్షసులకు, నిత్యమ్=నిత్యము, భక్షప్రదమ్=ఆహారము నిచ్చునది, యమరూపమ్=యమునివంటి రూపము గలది, భయావహమ్=భయమును కలిగించునది అయిన బాణమును గ్రహించెను.

తా. ఆ బాణము నిత్యమూ యుద్ధములో డేగలకు, గ్రద్దలకు, నక్కల గుంపులకు, రాక్షసులకు ఆహారము నిచ్చుచుండును. యముని వంటి రూపముతో భయంకరముగా ఉండును. 11

మూ. నన్దనం వానరేన్ద్రాణాం రక్షసామవసాదనమ్,
వాజితం వివిధైర్వాజైశ్చారుచిత్రైర్గరుత్మతః. 12

ప్ర. అ. వానరేన్ద్రాణామ్=వానరనాయకులకు, నన్దనమ్=ఆనందకరము, రక్షసామ్=రాక్షసులకు, అవసాదనమ్=వినాశకరము, గరుత్మతః=గరుత్మంతునియొక్క, చిత్రైః=చిత్రవర్ణములైన, వివిధైః=అనేకవిధములైన, వాజైః=రెక్కలచేత, వాజితమ్=వేగము కలదిగా చేయబడినదీ (అయిన బాణమును గ్రహించెను.)

తా. ఆ బాణము వానరనాయకులకు ఆనందము కలిగించునది. రాక్షసులను నశింపచేయునది. గరుత్మంతుని విచిత్రవర్ణములు గల అనేకవిధములైన రెక్కలు కట్టి మంచి వేగము ఉండునట్లు చేయబడినది. 12

మూ. తముత్తమేషుం లోకానామిక్ష్వాకుభయనాశనమ్,
ద్విషతాం కీర్తిహరణం ప్రహర్షకరమాత్మనః. 13
అభిమన్త్ర్య తతో రామస్తం మహేషుం మహాబలః,
వేదప్రోక్తేన విధినా సందధే కార్ముకే బలీ. 14

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, బలీ=బాహుబలముగల, రామః=రాముడు, లోకానామ్=లోకములలో, ఉత్తమేషుమ్=ఉత్తమబాణ మైనది,

ఇక్ష్వాకుభయనాశనమ్=ఇక్ష్వాకువంశీయుల భయమును నశింపచేయునది, ద్విష తామ్=శత్రువులయొక్క, కీర్తిహరణమ్=కీర్తిని హరించునది, ఆత్మనః=తనకు, ప్రహర్షణమ్=సంతోషము కలిగించునది అయిన, తమ్=ఆ, మహేషుమ్=మహాబాణ మును, వేదప్రోక్తేన=వేదోక్తమైన, విధినా=విధానముచేత, అభిమన్త్ర్య=అభిమంత్రించి, కార్ముకే=ధనస్సునందు, సందధే=సంధించెను.

తా. ఆ బాణము మూడు లోకములలోను ఉత్తమమైనది. ఇక్ష్వాకువం శీయుల భయమును నశింపచేయునది. శత్రువుల కీర్తిని హరించునది. తనకు సంతోషము కలిగించునది. మహాబలశాలియైన రాముడు ఆ మహాబాణమును వేదోక్తప్రకారము అభిమంత్రించి ధనస్సుమీద సంధించెను. 13, 14

మూ. తస్మిన్ సంధీయమానే తు రాఘవేణ శరోత్తమే,
సర్వభూతాని సంత్రేసుశ్చచాల చ వసుంధరా. 15

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, తస్మిన్=ఆ, శరోత్తమే=ఉత్తమమైన బాణము,. సంధీయమానే=సంధింపబడుచుండగా, సర్వభూతాని=సకలభూతములు, సంత్రేసుః=భయపడినవి. వసుంధరా=భూమి, చచాల=చలించెను.

తా. రాముడు శ్రేష్ఠమైన ఆ బాణమును సంధించుచున్నప్పుడు సకలభూతములు భయపడినవి. భూమి కంపించెను. 15

మూ. స రావణాయ సంక్రుద్ధో భృశమాయమ్య కార్ముకమ్,
చిక్షేప పరమాయత్తః శరం మర్మవిదారణమ్. 16

ప్ర. అ. సంక్రుద్ధః=కోపించిన, సః=ఆ రాముడు, కార్ముకమ్=ధనస్సును, భృశమ్=మిక్కిలి, ఆయమ్య=వంచి, పరమాయత్తః=మిక్కిలి సావధానచిత్తుడై, మర్మవిదారణమ్=మర్మస్థలమును చీల్చివేయు, శరమ్=ఆ బాణమును,రావ ణాయ=రావణునికొరకు, చిక్షేప=ప్రయోగించెను.

తా. కోపించిన ఆ రాముడు ధనస్సును బాగా లాగి, సావధానచిత్తుడై మర్మస్థానమును చీల్చివేయు ఆ బాణమును రావణునిపై ప్రయోగించెను. 16

మూ. స వజ్ర ఇవ దుర్ధర్షో వజ్రిబాహువిసర్జితః,
కృతాన్త ఇవ చావార్యో న్యపతద్రావణోరసి. 17

ప్ర. అ. వజ్రిబాహువిసర్జితః=ఇంద్రుని బాహువుచేత విడవబడిన, వజ్రః ఇవ=వజ్రము వలె, దుర్ధర్షః=ఎదిరింప శక్యము కానిది, కృతాన్తః ఇవ=య ముడు వలె, అవార్యః=నివారింప శక్యము కానిదీ అయిన, సః=ఆ బాణము, రావణోరసి=రావణుని వక్షఃస్థలమునందు, న్యపతత్=పడెను.

తా. ఇంద్రుని బాహువుచేత ప్రయోగింపబడిన వజ్రాయుధము వలె ఎదిరింప శక్యము కానిది, యముడు వలె నివారింప శక్యము కానిదీ అయిన ఆ బాణము రావణుని వక్షఃస్థలముమీద పడెను. 17

మూ. స విసృష్టో మహావేగః శరీరాన్తకరః శరః,
చిచ్ఛేద హృదయం తస్య రావణస్య దురాత్మనః. 18

ప్ర. అ. విసృష్టః=విడవబడిన, మహావేగః=గొప్ప వేగము గల, శరీరాన్తకరః=శరీరమును అంత మొందించు, సః శరః=ఆ బాణము, దురాత్మనః=దురాత్ముడైన, తస్య=ఆ, రావణస్య=రావణునియొక్క, హృదయమ్=హృదయమును, బిభేద=భేదించెను.

తా. శరీరమును అంత మొందించు మహావేగము గల ఆ బాణము ఆ విధముగా విడవబడినదై దురాత్ముడైన ఆ రావణుని హృదయమును బ్రద్దలు కొట్టెను. 18

మూ. రుధిరాక్తః స వేగేన శరీరాన్తకరః శరః,
రావణస్య హరన్ ప్రాణాన్ వివేశ ధరణీతలమ్. 19

ప్ర. అ. శరీరాన్తకరః=శరీరమును అంతమొందించు, సః శరః=ఆ బాణము, వేగేన=వేగముతో, రావణస్య=రావణునియొక్క, ప్రాణాన్=ప్రాణములను, హరన్=హరించుచు, రుధిరాక్తః=రక్తముచేత పూయబడినదై, ధరణీతలమ్=నేలను, వివేశ=ప్రవేశించెను.

తా. శరీరమును అంత మొందించు ఆ బాణము వేగముగా వెళ్ళి రావణుని ప్రాణములను హరించి, రక్తముచేత పూయబడినదై నేలలో ప్రవేశించెను.

మూ. స శరో రావణం హత్వా రుధిరార్ద్రీకృతచ్ఛవిః,
కృతకర్మా నిభృతవత్స్వతూణీం పునరావిశత్. 20

ప్ర. అ. సః శరః=ఆ బాణము, రావణమ్=రావణుణ్ణి, హత్వా=చంపి, రుధిరార్ద్రీకృతచ్ఛవిః=రక్తముచేత తడిగా చేయబడిన కాంతిగలదై, కృతకర్మా=చేయబడిన పని గలదై, నిభృతవత్=రహస్యముగా వలె, స్వతూణీమ్=తన అంబులపాదిని, పునః=మరల, ఆవిశత్=ప్రవేశించెను.

తా. ఆ బాణము రావణుణ్ణి సంహరించి, రక్తముచేత తడిసి, తాను చేయవలసిన పని చేసిన పిమ్మట చడీ చప్పుడూ లేకుండ తానుండు అంబులపాదిలోనికి మరల ప్రవేశించెను. 20

మూ. తస్య హస్తాద్ధతస్యాశు కార్ముకం చ ససాయకమ్,
విపపాత సహ ప్రాణైర్భ్రశ్యమానస్య జీవితాత్. 21

ప్ర. అ. హతస్య=చంపబడిన, జీవితాత్=జీవితమునుండి, భ్రశ్యమానస్య=భ్రష్టుడగుచున్న (దూరమగుచున్న), తస్య=వానియొక్క, హస్తాత్=హస్తమునుండి, ససాయకమ్=బాణముతో కూడిన, కార్ముకమ్=ధనస్సు, ఆశు=శీఘ్రముగా, ప్రాణైః సహ=ప్రాణాలతో కూడ, నిపపాత=పడెను.

తా. ఆ విధముగా చంపబడి జీవితమును కోల్పోవుచున్న ఆ రావణుని హస్తమునుండి బాణముతో కూడిన ధనస్సు క్రింద పడెను. ప్రాణములు పోయెను. 21

మూ. గతాసుర్భీమవేగస్తు నైర్ఋతేన్ద్రో మహాద్యుతిః,
పపాత స్యన్దనాద్భూమౌ వృత్రో వజ్రహతో యథా. 22

ప్ర.అ. భీమవేగః=భయంకరమైన వేగము గలవాడు, మహాద్యుతిః=గొప్ప కాంతి కలవాడూ అయిన, నైర్ఋతేన్ద్రః=ఆ రాక్షసరాజు, గతాసుః=పోయిన ప్రాణములు గలవాడై, వజ్రహతః=వజ్రాయుధముచేత కొట్టబడిన, వృత్రః యథా=వృత్రాసురుడు వలె, స్యన్దనాత్=రథమునుండి, భూమౌ=నేలమీద, పపాత=పడెను.

తా. భయంకరమైన వేగము, గొప్ప తేజస్సు గల ఆ రావణుడు ప్రాణములు విడచి, వజ్రాయుధము చేత కొట్టబడిన వృత్రాసురుడు వలె రథముపైనుండి నేలమీద పడెను. 22

మూ. తం దృష్ట్వా పతితం భూమౌ హతశేషా నిశాచరాః,
హతనాథా భయత్రస్తాః సర్వతః సంప్రదుద్రువుః. 23

ప్ర. అ. భూమౌ=నేలమీద,పతితమ్=పడిన, తమ్=ఆ రావణుణ్ణి, దృష్ట్వా=చూచి, హతశేషాః=చంపబడగా మిగిలిన, నిశాచరాః=రాక్షసులు, హతనాథాః=చంపబడిన ప్రభువు కలవారై, భయత్రస్తాః=అపాయమునుండి భయపడినవారై, సర్వతః=అన్ని వైపులా, సంప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. నేలమీద పడిపోయిన ఆ రావణుణ్ణి చూచి చంపగా మిగిలిన రాక్షసు లందరూ ప్రభువు మరణించుటచేత భయాక్రాంతులై అన్ని వైపులకు పారిపోయిరి. 23

మూ. సర్వతశ్చాభిపేతుస్తాన్ వానరా ద్రుమయోధినః,
దశగ్రీవవధం దృష్ట్వా వానరా జితకాశినః. 24

ప్ర. అ. ద్రుమయోధినః=వృక్షములతో యుద్ధము చేయు, వానరాః=

వానరులు, తాన్=వాళ్ళను, సర్వతః=అన్ని వైపులా, అభిపేతుః=ఎదిరించి వెళ్ళిరి. దశగ్రీవవధమ్=రావణుని వధను, దృష్ట్వా=చూచి, వానరాః=వానరులు, జితకాశినః=జయముచేత ప్రకాశించువారు అయిరి.

తా. వృక్షములతో యుద్ధము చేయు వానరులు పారిపోవుచున్న ఆ రాక్షసులను అన్ని వైపులనుండి ఎదిరించిరి. రావణుని వధను చూచి వానరులందరు విజయముచేత ప్రకాశించిరి (ఆనందించిరి). 24

మూ. అర్దితా వానరైర్భ్రష్టా లఙ్కామభ్యపతన్ భయాత్,
హతాశ్రయత్వాత్కరుణైర్బాష్పప్రస్రవణైర్ముఖైః. 25

ప్ర. అ. వానరైః=వానరులచేత, అర్దితాః=పీడింపబడిన ఆ రాక్షసులు, భ్రష్టాః=పారిపోయినవారై, భయాత్=భయమువలన, హతాశ్రయత్వాత్=చంపబడిన ఆశ్రయము కలవారగుటవలన, కరుణైః=దీనములైన, బాష్పప్రస్రవణైః=కన్నీళ్లు కార్చుచున్న, ముఖైః=ముఖములతో, లఙ్కామ్=లంకను గూర్చి, అభ్యపతన్=పరుగెత్తి వెళ్లిరి.

తా. వానరులచేత పీడింపబడిన ఆ రాక్షసులు పారిపోయి తమకు ఆశ్రయము నిచ్చు రావణుడు చంపబడుటచే దీనములైన, కన్నీళ్లు కార్చుచున్న ముఖములతో, భయాక్రాంతులై లంకకు పరుగెత్తిరి. 25

మూ. తతో వినేదుః సంహృష్టా వానరా జితకాశినః,
వదన్తో రాఘవజయం రావణస్య చ తద్వధమ్. 26

ప్ర. అ. తతః=అటుపిమ్మట, జితకాశినః=జయముచేత ప్రకాశించుచున్న, వానరాః=వానరులు, సంహృష్టాః=సంతోషించినవారై, రాఘవజయమ్=రాముని జయమును, రావణస్య=రావణునియొక్క, తద్వధం చ=ఆ రామునిచేత వధనూ కూర్చి, వదన్తః=చెప్పుకొనుచున్నవారై, వినేదుః=ధ్వని చేసిరి.

తా. పిమ్మట విజయముతో ప్రకాశించుచున్న వానరులు సంతోషించుచు రాముని విజయమును, రాముడు రావణుని సంహరించుటను గూర్చి చెప్పుకొనుచు హర్షధ్వానములు చేసిరి. 26

మూ. అథాన్తరిక్షే వ్యనదత్సౌమ్యస్త్రిదశదున్దుభిః,
దివ్యగన్ధవహస్తత్ర మారుతః సుసుఖో వవౌ. 27

ప్ర. అ. అథ=అటుపిమ్మట, అన్తరిక్షే=ఆకాశమునందు, సౌమ్యః=సౌమ్యమైన, త్రిదశదున్దుభిః=దేవతల దుందుభి, వ్యనదత్=మ్రోగెను. తత్ర=అక్కడ, దివ్యగన్ధవహః=దివ్యగంధమును మోయుచున్న, సుసుఖః=చాల సుఖకరమైన, మారుతః=వాయువు, వవౌ=వీచెను.

తా. అప్పుడు దేవదుందుభి మధురముగా మ్రోగెను. అక్కడ దివ్యమైన సుగంధమును వహించుచు వాయువు సుఖకరముగా వీచెను. 27

మూ. నిపపాతాన్తరిక్షాచ్చ పుష్పవృష్టిస్తదా భువి,
కిరన్తీ రాఘవరథం దురవాపా మనోహరా. 28

ప్ర. అ. తదా=అప్పుడు, అన్తరిక్షాత్=ఆకాశమునుండి, రాఘవరథమ్=రాముని రథమును, కిరన్తీ=చల్లుచు, దురవాపా=పొందుటకు శక్యముకాని, మనోహరా=మనోహరమైన, పుష్పవృష్టిః=పుష్పవర్షము, భువి=భూమిమీద, నిపపాత=పడెను.

తా. అప్పుడు ఇతరులకు ఎవరికీ లభించని మనోహరమైన పుష్పవర్షము రాముని రథముమీద పుష్పములు వెదజల్లుచు, ఆకాశమునుండి నేలమీద పడెను. 28

మూ. రాఘవస్తవసంయుక్తా గగనే చ విశుశ్రువే,
సాధు సాధ్వితి వాగగ్ర్యా దేవతానాం మహాత్మనామ్. 29

ప్ర. అ. మహాత్మనామ్=మహాత్ములైన, దేవతానామ్=దేవతలయొక్క, సాధు సాధు ఇతి=బాగు బాగు అని, రాఘవస్తవసంయుక్తా=రాముని స్తోత్రముతో కూడిన, అగ్ర్యా=శ్రేష్ఠమైన, వాక్=వాక్కు, గగనే=ఆకాశమునందు, విశుశ్రువే చ=వినబడెను కూడ.

తా. రాముణ్ణి స్తుతించు మహాత్ములైన దేవతలు పలికిన "బాగు బాగు" అను శ్రేష్ఠమైన వాక్కు ఆకాశమునందు వినబడెను. 29

మూ. ఆవివేశ మహాన్ హర్షో దేవానాం చారణైః సహ,
రావణే నిహతే రౌద్రే సర్వలోకభయంకరే. 30

ప్ర. అ. రౌద్రే=క్రూరుడు, సర్వలోకభయంకరే=సర్వలోకములకు భయంకరుడూ అయిన, రావణే=రావణుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, చారణైః=చారణులతో కూడ, దేవానామ్=దేవతలకు (ను), మహాన్=గొప్ప, హర్షః=సంతోషము, ఆవివేశ=ఆవేశించెను.

తా. క్రూరుడు, సర్వలోకభయంకరుడూ అయిన ఆ రావణుడు చంపబడగానే దేవతలు, చారణులు, గొప్ప సంతోషము పొందిరి. 30

మూ. తతః సకామం సుగ్రీవమఙ్గదం చ విభీషణమ్,
చకార రాఘవః ప్రీతో హత్వా రాక్షసపుంగవమ్. 31

ప్ర. అ. ... ...ంగవమ్=రాక్షసశ్రేష్ఠుణ్ణి, హత్వా=

చంపి, ప్రీతః=సంతోషించిన, రాఘవః=రాముడు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, అఙ్గదం చ=అంగదుణ్ణి, విభీషణం చ=విభీషణుణ్ణి, సకామమ్=తీరిన కోరిక గలవానినిగా, చకార=చేసెను.

తా. రావణుణ్ణి చంపి సంతోషించుచున్న రాముడు రావణసంహారముచేత సుగ్రీవాంగదవిభీషణుల కోరికను తీర్చెను. 31

మూ. తతః ప్రజగ్ముః ప్రశమం మరుద్గణా
దిశః ప్రసేదుర్విమలం నభోఽభవత్,
మహీ చకమ్పే న చ మారుతో వవౌ
స్థిరప్రభశ్చాప్యభవద్దివాకరః. 32

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మరుద్గణాః=దేవతాగణములు, ప్రశమమ్=శాంతిని, ప్రజగ్ముః=పొందినవి. దిశః=దిక్కులు, ప్రసేదుః=ప్రసన్నములైనవి. నభః=ఆకాశము, విమలమ్=నిర్మలము, అభవత్=ఆయెను, మహీ=భూమి, న చకమ్పే=కంపించలేదు. మారుతః=వాయువు, వవౌ=వీచెను. దివాకరః చాపి=సూర్యుడు కూడ, స్థిరప్రభః=స్థిరమైన కాంతి గలవాడు, అభవత్=ఆయెను.

తా. అప్పుడు దేవత లందరు మనఃశాంతి పొందిరి. దిక్కులు ప్రసన్నములైనవి. ఆకాశము నిర్మల మయ్యెను. భూమి కంపించలేదు. వాయువు సుఖకరముగా వీచెను. సూర్యుని కాంతి స్థిరముగా ఉండెను. 32

మూ. తతస్తు సుగ్రీవవిభీషణాఙ్గదాః
సుహృద్విశిష్టాః సహలక్ష్మణాస్తదా,
సమేత్య హృష్టా విజయేన రాఘవం
రణేఽభిరామం విధినాభ్యపూజయన్. 33

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుహృద్విశిష్టాః=స్నేహితులతో కూడిన, సహలక్ష్మణాః=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవవిభీషణాఙ్గదాః=సుగ్రీవవిభీషణాంగదులు, రణే=యుద్ధమునందు, విజయేన=విజయముచేత, హృష్టాః=సంతోషించినవారై అభిరామమ్=మనోహరుడైన, రామమ్=రాముణ్ణి, సమేత్య=చేరి, తదా=అప్పుడు, విధినా=నియమానుసారముగా, అభ్యపూజయన్=పూజించిరి.

తా. పిమ్మట సుగ్రీవవిభీషణాంగదులు, లక్ష్మణుడు, ఇతరమిత్రులు యుద్ధములో రాముని విజయముచేత సంతోషించి, ఆతనిని సమీపించి, మనోహరుడైన ఆ రాముణ్ణి యథావిధిగా పూజించిరి. (కొనియాడిరి). 33

మూ. స తు నిహతరిపుః స్థిరప్రతిజ్ఞః
స్వజనబలాభివృతో రణే రరాజ,
రఘుకులనృపనన్దనో మహౌజా
స్త్రిదశగణైరభిసంవృతో యథేన్ద్రః. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అష్టోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. నిహతరిపుః=చంపబడిన శత్రువు గల, స్థిరప్రతిజ్ఞః=స్థిరమైన ప్రతిజ్ఞ గల, మహౌజాః=గొప్ప తేజస్సు గల, రఘుకులనృపనన్దనః=రఘువంశరాజులకు ఆనందకరుడైన, సః=ఆ రాముడు, రణే=యుద్ధరంగమునందు, స్వజనబలాభివృతః=స్వజనులచేతను, సైన్యముచేతను చుట్టు వారుకొనబడిన, మహేన్ద్రః ఇవ=మహేంద్రుడు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. రఘువంశరాజులకు ఆనందకరుడైన ఆ రాముడు శత్రువును చంపి, ప్రతిజ్ఞను నిలుపుకొని, యుద్ధరంగములో తన మిత్రాదులతోను సైన్యముతోను కూడినవాడై, దేవతాగణములతో కూడిన ఇంద్రుడు వలె ప్రకాశించెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ నవాధిక శతతమః సర్గః

[విభీషణుడు విలపించుట, రాముడు ఆతనిని ఊరడించి రావణునకు అంత్యసంస్కారము చేయు మని ఆతనిని ఆదేశించుట.]

మూ. భ్రాతరం నిహతం దృష్ట్వా శయానం నిర్జితం రణే,
శోకవేగపరీతాత్మా విలలాప విభీషణః.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, నిర్జితమ్=జయింపబడిన, నిహతమ్=చంపబడిన, శయానమ్=శయనించి యున్న, భ్రాతరమ్=సోదరుణ్ణి, దృష్ట్వా=చూచి, విభీషణః=విభీషణుడు, శోకవేగపరీతాత్మా=శోకవేగముతో కూడిన మనస్సు గలవాడై విలలాప=విలపించెను.

తా. యుద్ధమునందు జయింపబడి, మృతుడై, శయనించి యున్న సోదరుణ్ణి చూచి, శోకవేగముతో కూడిన మనస్సు కలవాడై విభీషణుడు విలపించెను. 1

మూ. వీర విక్రాన్త విఖ్యాత ప్రవీణ నయకోవిద,
మహార్హశయనోపేత కిం శేషే నిహతో భువి. 2

ప్ర. అ. వీర=వీరుడా! విక్రాన్త=పరాక్రమించువాడా! విఖ్యాత=ప్రసిద్ధుడా! ప్రవీణ=సమర్థుడా! నయకోవిద=నీతియందు పండితుడా, మహార్హశయనోపేత=అమూల్యములైన శయనములు కలవాడా! నిహతః=చంపబడినవాడవై, భువి=నేలమీద, కిమ్=ఎందువలన, శేషే=శయనించి ఉన్నావు?

తా. వీరుడా! పరాక్రమించువాడా! సమర్థుడా! నీతిని ఎరిగిన వాడా! అమూల్యమైన శయనములు కలవాడా! నీవు చంపబడి నేలమీద పడియున్నావేమి? 2

మూ. నిక్షిప్య దీర్ఘౌ నిశ్చేష్టౌ భుజావఙ్గదభూషితౌ,
ముకుటేనాపవృత్తేన భాస్కరాకారవర్చసా. 3

ప్ర. అ. అఙ్గదభూషితౌ=బాహుపురులచేత అలంకరింపబడిన, నిశ్చేష్టౌ=చేష్టలేని, భుజౌ=భుజములను, నిక్షిప్య=పడవేసి, అపవృత్తేన=తిరిగిపోయిన, భాస్కరాకారవర్చసా=సూర్యుని వంటి ఆకారము తేజస్సు గల, ముకుటేన=కిరీటముతో, (ఎందుచేత శయనించినావు?).

తా. బాహుపురులచేత అలంకరింపబడిన, కదలని భుజాలను నేలమీద పడవేసి, సూర్యునివంటి కాంతి గల కిరీటము తిరిగిపోగా ఎందుకు పడిఉన్నావు?

మూ. తదిదం వీర సంప్రాప్తం యన్మయా పూర్వమీరితమ్,
కామమోహపరీతస్య యత్తన్న రుచితం తవ. 4

ప్ర. అ. వీర=వీరుడా! మయా=నాచేత, యత్=ఏది, పూర్వమ్=పూర్వము నందే, ఈరితమ్=చెప్పబడినదో, యత్=ఏది, కామమోహపరీతస్య=కామమోహములతో కూడిన, తవ=నీకు, న రుచితమ్=ఇష్టము కాలేదో, తత్=ఆ, ఇదమ్=ఇది, ప్రాప్తమ్=వచ్చినది.

తా. నేను నీకు పూర్వమే ఏది చెప్పి ఉన్నానో, కామమోహములతో నిండిన మనస్సుతో ఉన్న నీకు ఏది ఇష్టము కాలేదో అదే వచ్చినది. 4

మూ. యన్న దర్పాత్ ప్రహస్తో వా నేన్ద్రజిన్నాపరే జనాః,
న కుమ్భకర్ణోऽతిరథో నాతికాయో నరాన్తకః, 5
న స్వయం త్వమమన్యేథాస్తస్యోదర్కోऽయమాగతః.

ప్ర. అ. యత్=దేనిని, దర్పాత్=గర్వమువలన, ప్రహస్తో వా=ప్రహస్తుడు, న=అంగీకరించలేదో, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు కాని, అపరే జనాః=ఇతరజనులు గాని, న=అంగీకరించలేదో, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, న=అంగీకరించలేదో, అతిరథః=అతిరథుడు, అతికాయః=అతికాయుడు, నరాన్తకః=నరాంతకుడు, న=అంగీకరించలేదో, స్వయమ్=స్వయముగా, త్వమ్=నీవు, న అమన్యేథాః=అంగీకరించలేదో, తస్య=దానియొక్క, అయమ్=ఈ, ఉదర్కః=ఫలము, ఆగతః=వచ్చినది.

తా. ప్రహస్తుడు కాని, ఇంద్రజిత్తు గాని, ఇతరులు గాని, కుంభకర్ణుడు గాని, అతిరథుడు గాని, అతికాయుడు కాని, నరాంతకుడు గాని, స్వయముగా నేను కాని దేనిని అంగీకరించలేదో దాని ఫలిత మిదిగో వచ్చినది. 5

మూ. గతః సేతుః సునీతీనాం గతో ధర్మస్య విగ్రహః, 6
గతః సత్త్వస్య సంక్షేపః ప్రస్తావానాం గతిర్గతా,
ఆదిత్యః పతితో భూమౌ మగ్నస్తమసి చన్ద్రమాః, 7
చిత్రభానుః ప్రశాన్తార్చిర్వ్యవసాయో నిరుద్యమః,
అస్మిన్నిపతితే వీరే భూమౌ శస్త్రభృతాం వరే. 8

ప్ర. అ. శస్త్రభృతామ్=శస్త్రధారులలో, వరే=శ్రేష్ఠుడైన, అస్మిన్ వీరే=ఈ వీరుడు, భూమౌ=నేలమీద, నిపతితే=పడినవాడగుచుండగా, సునీతీనామ్=మంచి నీతులయొక్క, సేతుః=మర్యాద, గతః=పోయినది. ధర్మస్య=ధర్మముయొక్క,

విగ్రహః=శరీరము, గతః=పోయినది. సత్త్వస్య=బలముయొక్క, సంక్షేపః=ఒక్క చోట కలయిక, గతః=పోయినది. ప్రస్తావానామ్=ఉత్తమస్తుతులయొక్క, గతిః=గతి, గతా=పోయినది. ఆదిత్యః=సూర్యుడు, భూమౌ=నేలమీద, పతితః=పడినాడు. చన్ద్రమాః=చంద్రుడు, తమసి=అంధకారములో, మగ్నః=మునిగినాడు. చిత్రభానుః= అగ్ని, ప్రశాన్తార్చిః=శాంతించిన జ్వాలలు కలది, వ్యవసాయః=ఉత్సాహము, నిరుద్యమః=ఉద్యమము లేనిది.

తా. శస్త్రధారులలో శ్రేష్ఠుడైన ఈ వీరుడు నేలమీద పడిపోవుటచే మంచి నీతుల మర్యాద పోయినది. ధర్మముయొక్క శరీరము పోయినది. ఒక్కచోట ప్రోగు చేయబడిన బలము పోయినది. మంచి స్తుతుల గతి పోయినది. సూర్యుడు నేలమీద పడిపోయినాడు. చంద్రుడు చీకట్లో మునిగినాడు. అగ్ని జ్వాలలు శాంతించినవి. ఉత్సాహము ఉద్యమము లేని దైనది. 6, 7

మూ. కిం శేషమిహ లోకస్య గతసత్త్వస్య సంప్రతి,
రణే రాక్షసశార్దూలే ప్రసుప్త ఇవ పాంసుషు. 8

ప్ర. అ. రాక్షసశార్దూలే=రాక్షసశ్రేష్ఠుడు, రణే=యుద్ధమునందు, పాంసుషు= పరాగములయందు, ప్రసుప్తే ఇవ=నిద్రించుచున్నట్లు ఉండగా, సంప్రతి=ఇప్పుడు, గతసత్త్వస్య=పోయిన బలము గల, లోకస్య=లోకమునకు, ఇహ=ఇప్పుడు, కిమ్=ఏమి, శేషమ్=మిగిలినది?

తా. రాక్షస శ్రేష్ఠుడైన ఈ రావణుడు రణరంగములో నిద్రించినట్లు పడియుండగా ఇప్పుడు ఈ లోకములో మిగిలినది ఏమున్నది? 8

మూ. ధృతిప్రవాలః ప్రసహాగ్ర్యపుష్ప
స్తపోబలః శౌర్యనిబద్ధమూలః,
రణే మహాన్ రాక్షసరాజవృక్షః
సంమర్దితో రాఘవమారుతేన. 9

ప్ర. అ. ధృతిప్రవాలః=ధైర్య మనే చిగురు కలది, ప్రసహాగ్ర్యపుష్పః= సహనశక్తియే శ్రేష్ఠమైన పుష్పములుగా గలది, తపోబలః=తపస్సే బలము గలది, శౌర్యనిబద్ధమూలః=శౌర్యమే దృఢమైన మొదలు కలది అయిన, మహాన్=గొప్ప, రాక్షసరాజవృక్షః=రావణు డనే వృక్షము, రాఘవమారుతేన=రాము డనే వాయువుచేత, రణే=యుద్ధమునందు, సంమర్దితః=పడగొట్టబడినది.

తా. ధైర్యమనే చిగురు, సహనశక్తి అనే శ్రేష్ఠమైన పుష్పము, తపస్సనే బలము, శౌర్య మనే దృఢమైన మొదలు గల రాక్షసరా జనే వృక్షమును, యుద్ధములో రాము డనే వాయువు పడగొట్టివేసెను. 9

మూ. తేజోవిషాణః కులవంశవంశః
కోపప్రసాదాపరగాత్రహస్తః,
ఇక్ష్వాకుసింహావగృహీతదేహః
సుప్తః క్షితౌ రావణగన్ధహస్తీ. 10

ప్ర. అ. తేజోవిషాణః=తేజస్సు అనే దంతములు గలది, కులవంశవంశః= కులము వంశము అనే వెన్నెముక గలది, కోపప్రసాదాపరగాత్రహస్తః=కోపము అనుగ్రహము అను శరీరము వెనుకభాగము తొండము కలది అయిన, రావణగన్ధహస్తీ=రావణు డనే మదగజము, ఇక్ష్వాకుసింహావగృహీతదేహః=రాము డనే సింహముచేత ఆక్రమింపబడిన దేహము కలదై, క్షితౌ=నేలమీద, సుప్తః=నిద్రించినది.

తా. తేజస్సు అనే దంతాలు, కులవంశము లనే వెన్నెముక, కోపము ప్రసాదము అనే శరీరము వెనుకభాగము, తొండము గల రావణు డనే మదగజము రాము డనే సింహము శరీరమును ఆక్రమింపగా నేలపై నిద్రించినది. 10

మూ. పరాక్రమోత్సాహవిజృమ్భితార్చి
ర్నిఃశ్వాసధూమః స్వబలప్రతాపః,
ప్రతాపవాన్ సంయతి రాక్షసాగ్ని
ర్నిర్వాపితో రామపయోధరేణ. 11

ప్ర. అ. పరాక్రమోత్సాహవిజృమ్భితార్చిః=పరాక్రమము ఉత్సాహము అను విజృంభించిన జ్వాలలు గలది, నిఃశ్వాసధూమః=నిట్టూర్పు లనే ధూమము కలది, స్వబలప్రతాపః=తన బల మనే ప్రతాపము కలది, సంయతి=యుద్ధమునందు, ప్రతాపవాన్=ప్రతాపము కలదీ అగు, రాక్షసాగ్నిః=రావణు డనే అగ్ని, రామపయోధరేణ=రాము డనే మేఘముచేత, నిర్వాపితః=ఆర్పివేయబడినది.

తా. పరాక్రమము ఉత్సాహమూ అనే విజృంభించిన జ్వాలలు కలది, నిట్టూర్పు లనే ధూమము కలది, తన బల మనే ప్రతాపముకలది, యుద్ధమునందు ప్రతాపము కలది అయిన రావణు డనే అగ్నిని రాము డనే మేఘము ఆర్పివేసినది.

మూ. సింహర్క్షలాఙ్గూలకకుద్విషాణః
పరాభిజిద్గన్ధనగన్ధహస్తీ,
రక్షోవృషశ్చాపలకర్ణచక్షుః
క్షితీశ్వరవ్యాఘ్రహతోఽవసన్నః. 12

ప్ర. అ. సింహర్క్షలాఙ్గూలకకుద్విషాణః=రాక్షసులనే తోక, మూపు, కొమ్ములు గలది, పరాభిజిత్=శత్రువులను జయించునది, గన్ధనగన్ధహస్తీ=ఉత్సాహ

మునందు మదగజమూ, **చాపలకర్ణచక్షుః=చపలత్వ** మను కర్ణములు నేత్రములు గలది అయిన, రక్షోవృషః=రాక్షసు డనే వృషభము, క్షితీశ్వరవ్యాఘ్రహతః=రాము డనే వ్యాఘ్రముచేత చంపబడినదై, అవసన్నః=నశించినది.

తా. రాక్షసులనే తోక, మూపు, కొమ్ములు గలది, శత్రువులను ఓడించునది, ఉత్సాహమునందు మదగజము వంటిది, చాపల్యమనే చెవులూ నేత్రములూ గలది అయిన రావణు డనే వృషభము రాము డనే వ్యాఘ్రముచేత చంపబడి నశించినది. 12

**మూ.** వదన్తం హేతుమద్వాక్యం పరిదృష్టార్థనిశ్చయమ్,
రామః శోకసమావిష్టమిత్యువాచ విభీషణమ్. 13

ప్ర. అ. రామః=రాముడు, వదన్తమ్=ఈ విధముగా పలుకుచున్న, శోకసమావిష్టమ్=శోకావిష్టుడైన, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, హేతుమత్=హేతువులు గలది, పరిదృష్టార్థనిశ్చయమ్=చూడబడిన కార్యనిశ్చయము కలదీ అయిన, వాక్యమ్=వాక్యమును, ఇతి=ఈ విధముగా, ఉవాచ=పలికెను.

తా. శోకముతో కూడి ఈ విధముగా పలుకుచున్న విభీషణునితో రాముడు యుక్తియుక్తము స్పష్టమైన కార్యనిశ్చయము కలదీ అయిన వాక్యమును ఇట్లు పలికెను. 13

**మూ.** నాయం వినష్టో నిశ్చేష్టః సమరే చణ్డవిక్రమః,
అత్యున్నతమహోత్సాహః పతితోఽయమశఙ్కితః. 14

ప్ర. అ. అయమ్=ఇతడు, నిశ్చేష్టః=ఏ చేష్టా లేనివాడై, న వినష్టః=నశించలేదు, సమరే=యుద్ధమునందు, చణ్డవిక్రమః=తీవ్రమైన పరాక్రమము గల, అయమ్=ఇతడు, అత్యున్నతమహోత్సాహః=చాల ఉన్నతమైన గొప్ప ఉత్సాహము కలవాడై, అశఙ్కితః=భయములేనివాడై, పతితః=పడిపోయినాడు.

తా. ఇతడు పిరికిపంద వలె ఏమీ చేయక మరణించలేదు, యుద్ధములో తీవ్రమైన పరాక్రమము గల ఇతడు అత్యున్నతమైన గొప్ప ఉత్సాహమును చూపి నిర్భయుడై ప్రాణాలు విడచినాడు. 14

**మూ.** నైవం వినష్టాః శోచ్యన్తే క్షత్రధర్మవ్యవస్థితాః,
వృద్ధిమాశంసమానా యే నిపతన్తి రణాజిరే. 15

ప్ర. అ. యే=ఎవరు, క్షత్రధర్మవ్యవస్థితాః=క్షత్రియధర్మమునందు నిలచినవారై, వృద్ధిమ్=వృద్ధిని, ఆశంసమానాః=కోరుచు, రణాజిరే=యుద్ధభూమియందు, నిపతన్తి=పడిపోవుదురో, వినష్టాః=అట్లు మరణించినవారు, ఏవమ్=ఈ విధముగా,

న శోచ్యన్తే=దుఃఖించబడరు.

తా. వృద్ధిని కోరుచు క్షత్రియధర్మమును అవలంబించి రణభూమియందు పడిపోయి మరణించినవారిని గూర్చి ఈ విధముగా దుఃఖించగూడదు. 15

మూ. యేన సేన్ద్రాస్త్రయో లోకాస్త్రాసితా యుధి ధీమతా,
తస్మిన్ కాలసమాయుక్తే న కాలః పరిశోచితుమ్. 16

ప్ర. అ. ధీమతా=బుద్ధిమంతుడైన, యేన=ఎవనిచేత, యుధి=యుద్ధమునందు, సేన్ద్రాః=ఇంద్రునితో కూడిన, త్రయః=మూడు, లోకాః=లోకములు, త్రాసితాః=భయపెట్టబడినవో, తస్మిన్=అట్టివాడు, కాలసమాయుక్తే=మరణముతో కూడినవాడగుచుండగా, పరిశోచితుమ్=దుఃఖించుటకు, కాలః=కాలము, న=కాదు.

తా. ఏ బుద్ధిమంతుడు యుద్ధములో ఇంద్రునితో కూడిన మూడు లోకాలను భయపెట్టినాడో అట్టివాడు మరణించగా అది విచారించుటకు తగిన సమయము కాదు. 16

మూ. నైకాన్తవిజయో యుద్ధే భూతపూర్వః కదాచన,
పరైర్వా హన్యతే వీరః పరాన్వా హన్తి సంయుగే. 17

ప్ర. అ. కదాచన=ఎన్నడూ, యుద్ధే=యుద్ధమునందు, ఏకాన్తవిజయః=తప్పనిసరిగా విజయమును, న భూతపూర్వః=పూర్వ మెప్పుడూ కలగలేదు. వీరః=వీరుడైనవాడు, సంయుగే=యుద్ధమునందు, పరైః=శత్రువులచేత, హన్యతే వా=చంపబడనైనా చంపబడును, పరాన్=శత్రువులను, హన్తి వా=చంపనైన చంపును.

తా. యుద్ధములో తప్పక విజయమే లభించు ననునది పూర్వము ఎన్నడూ జరగలేదు. వీరుడైనవాడు యుద్ధములో శత్రువులచేత చంపబడనైన చంపబడును లేదా శత్రువులను చంపును. 17

మూ. ఇయం హి పూర్వైః సందిష్టా గతిః క్షత్రియసంమతా,
క్షత్రియో నిహతః సంఖ్యే న శోచ్య ఇతి నిశ్చయః. 18

ప్ర. అ. ఇయమ్=ఇది (చెప్పబోవునది), పూర్వైః=ప్రాచీనులచేత, సందిష్టా=చెప్పబడిన, క్షత్రియసంమతా=క్షత్రియులకు తగిన, గతిః=గతి. సంఖ్యే=యుద్ధమునందు, నిహతః=చంపబడిన, క్షత్రియః=క్షత్రియుడు (శూరుడు), న శోచ్యః=విచారింపదగనివాడు, ఇతి=అని, నిశ్చయః=నిశ్చయము.

తా. యుద్ధములో మరణించిన శూరుణ్ణి గూర్చి విచారించకూడదు అనునది క్షత్రియులకు సంమతమైన పూర్వులు అంగీకరించిన పద్ధతి. 18

మూ. తదేవం నిశ్చయం దృష్ట్వా తత్త్వమాస్థాయ విజ్వరః,
యదిహానన్తరం కార్యం కల్ప్యం తదనుచిన్తయ. 19

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, ఏవమ్=ఇట్లు, నిశ్చయమ్=నిశ్చయమును, దృష్ట్వా=చూచి, తత్త్వమ్=తత్త్వమును, ఆస్థాయ=అవలంబించి, విజ్వరః=శోకములేనివాడవై, ఇహ=ఇక్కడ, అనన్తరమ్=అనంతరము, యత్=ఏ, కార్యమ్=కార్యము, కల్ప్యమ్=చేయదగినదో, తత్=దానిని, అనుచిన్తయ=ఆలోచించుము.

తా. అందుచేత పూర్వుల ఈ నిశ్చయమును చూచి, తత్త్వము తెలిసికొని, శోకము లేనివాడవై ఇప్పుడు తరువాత చేయవలసిన కార్య మేమో ఆలోచించుము. 19

మూ. తముక్తవాక్యం విక్రాన్తం రాజపుత్రం విభీషణః,
ఉవాచ శోకసంతప్తో భ్రాతుర్హితమనన్తరమ్. 20

ప్ర. అ. ఉక్తవాక్యమ్=పలకబడిన వాక్యముగల, విక్రాన్తమ్=విక్రమవంతుడైన, తం రాజపుత్రమ్=రాముణ్ణి గూర్చి, శోకసంతప్తః=శోకముతో బాధపడుచున్న, విభీషణః=విభీషణుడు, అనన్తరమ్=తరువాత చేయదగిన, భ్రాతుః=సోదరునకు, హితమ్=హితమైన కార్యమును గూర్చి, ఉవాచ=పలికెను.

తా. శోకతప్తుడైన విభీషణుడు ఈ విధముగా పలికిన పరాక్రమశాలియైన ఆ రామునితో తరువాత చేయదగిన, తన సోదరునకు హితమైన కార్యమును గూర్చి ఇట్లు పలికెను. 20

మూ. యోఽయం విమర్దేష్వవిభగ్నపూర్వః
సురైః సమస్తైరపి వాసవేన,
భవన్తమాసాద్య రణే విభగ్నో
వేలామివాసాద్య యథా సముద్రః. 21

ప్ర. అ. యః అయమ్=ఏ ఇతడు, విమర్దేషు=యుద్ధములయందు, సమస్తైః=సమస్తమైన, సురైరపి=దేవతలచేతను, వాసవేన=ఇంద్రునిచేతను, అవిభగ్నపూర్వః=పూర్వ మెన్నడూ **ఓడింపబడలేదో** అట్టి ఇతడు, భవన్తమ్=నిన్ను, ఆసాద్య=పొంది, వేలామ్=తీరమును, ఆసాద్య=పొంది, సముద్రః యథా=సముద్రము వలె, రణే=యుద్ధమునందు, విభగ్నః=ఓడిపోయినాడు.

తా. యుద్ధములలో సమస్తదేవతలచేతను, దేవేంద్రునిచేతను కూడ ఏ రావణుడు పూర్వమెన్నడూ ఓడింపబడలేదో అట్టి ఇతడు నిన్ను ఎదిరించి, తీరము వరకు వచ్చిన సముద్రము భగ్న మైనట్లు యుద్ధములో ఓడిపోయినాడు.

మూ. అనేన దత్తాని వనీపకేషు
భుక్తాశ్చ భోగా నిభృతాశ్చ భృత్యాః,
ధనాని మిత్రేషు సమర్పితాని
వైరాణ్యమిత్రేషు నిపాతితాని. 22

ప్ర. అ. అనేన=వీనిచేత, వనీపకేషు=యాచకులయందు, దత్తాని=దానములు ఇవ్వబడినవి. భోగాశ్చ=భోగములు, భుక్తాః=అనుభవించబడినవి. భృత్యాః=భృత్యులు, నిభృతాః=బాగా పోషించబడినారు. ధనాని=ధనములు, మిత్రేషు=మిత్రులయందు, సమర్పితాని=సమర్పించబడినవి. వైరాణి=వైరములు, అమిత్రేషు=శత్రువులయందు, నిపాతితాని=పడవేయబడినవి.

తా. ఇతడు యాచకులకు దానములు చేసినాడు. భోగాలు అనుభవించినాడు. భృత్యులను బాగుగా పోషించినాడు. మిత్రులకు ధనములు ఇచ్చినాడు. శత్రువుల విషయమున వైరము చూపినాడు. 22

మూ. ఏషోహితాగ్నిశ్చ మహాతపాశ్చ
వేదాన్తగః కర్మసు చాగ్ర్యశూరః,
ఏతస్య యత్ప్రేతగతస్య కృత్యం
తత్కర్తుమిచ్ఛామి తవ ప్రసాదాత్. 23

ప్ర. అ. ఏషః=ఇతడు, హితాగ్నిః=ఆహితాగ్ని, మహాతపాశ్చ=గొప్ప తపస్సు కలవాడు. వేదాన్తగః=వేదముల అంతమును పొందినవాడు. కర్మసు చ=కర్మలలో కూడ, అగ్రశూరః=శ్రేష్ఠుడైన శూరుడు. ప్రేతగతస్య=మరణించిన, ఏతస్య=ఇతనికి, యత్=ఏది, కృత్యమ్=చేయదగినదో దానిని, తవ=నీ యొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, కర్తుమ్=చేయుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. ఇతడు ఆహితాగ్ని. గొప్ప తపస్సు గలవాడు. పూర్తిగా వేదాధ్యయనము చేసినవాడు. వైదికకర్మలు చేసిన వారిలో ప్రధానుడు. మరణించిన ఈతనికి చేయవలసిన సంస్కారమును నీ అనుమతితో చేయవలెనని కోరుచున్నాను. 23

మూ. స తస్య వాక్యైః కరుణైర్మహాత్మా
సంబోధితః సాధు విభీషణేన,
ఆజ్ఞాపయామాస నరేన్ద్రసూనుః
స్వర్గీయమాధానమదీనసత్త్వః. 24

ప్ర. అ. విభీషణేన=విభీషణునిచేత, తస్య=వానియొక్క, కరుణైః=దీనములైన, వాక్యైః=వాక్యములచేత, సాధు=బాగుగా, సంబోధితః=బోధింపబడిన

(ప్రార్థింపబడిన), అదీనసత్త్వః=గొప్ప బలము గల, సః=ఆ, నరేన్ద్రసూనుః=రాముడు, స్వర్గీయమ్=స్వర్గమునకు సాధనమగు, ఆధానమ్=విధానమును, ఆజ్ఞాపయామాస= ఆజ్ఞాపించెను.

తా. విభీషణుడు జాలి గొల్పు మాటలతో ఈ విధముగా ప్రార్థింపగా గొప్ప బలము గల ఆ రాముడు "రావణునకు స్వర్గహేతువైన అంత్యసంస్కారము చేయుము"అని ఆజ్ఞాపించెను. 24

మూ. **మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్,**
**క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ. 25**

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే నవాధికశతతమః సర్గః.

ప్ర. అ. వైరాణి=వైరములు, మరణాన్తాని=మరణము అంతముగా గలవి. నః=మాయొక్క, ప్రయోజనమ్=ప్రయోజనము, నిర్వృత్తమ్=పూర్తియైనది. అస్య= వీనియొక్క, సంస్కారః=సంస్కారము, క్రియతామ్=చేయబడుగాక. ఏషః=ఇతడు, మమాపి=నాకు కూడ, తవ=నీకు, యథా=ఎట్లో అట్లే.

తా. వైరములు మరణముతో సమసిపోవును. మేము అనుకొన్న పని పూర్తియైనది. ఇతనికి అంత్యసంస్కారము చేయుము. ఇతడు నీ కెట్లో నాకు కూడ ఇప్పుడు అట్లే (సోదరుడువంటి వాడు).

వి. ఈ సర్గలోని పెద్ద వృత్తంలో ఉన్న శ్లోకాలు (9-12; 21-24), చివరి శ్లోకము ప్రక్షిప్తాలుగా కనబడుచున్నవి. (11, 12 శ్లోకాలు ప్రాచ్యపాఠంలో లేవు). 111వ సర్గలో, 91-101 శ్లోకాలలో "రావణుడు అధర్మములు చేసిన పాపాత్ముడు; ఇతనికి నేను సంస్కారము చెయ్యను"అని విభీషణుడు అనగా "అట్లు కాదు; సంస్కారము చెయ్యవలెను"అని రాముడు ఆజ్ఞాపించి నట్లు ఉన్నది. దానిని పట్టి ఇక్కడ విభీషణుని ఈ మాటలు అసంగతములు. "రావణుని భార్య లందరూ ఒక మూల దీనముగా విలపిస్తూండగా విభీషణుని శోకము తగ్గి ఇతడు మనస్సు మార్చుకొని ఇలా అని ఉంటాడు". ఇత్యాది సమాధానాలు సంతృప్తికరంగా ఉండవు. ఇలాంటి ప్రక్షేపాలు అతి ప్రాచీనమైన రామాయణంలో ఉండడం సహజమే. వాటిని కొంతవరకైనా గుర్తించి చదువుకుంటే చాల వరకు పరస్పరవిరుద్ధవచనాలకు సమాధానం సరిగా కుదురుతుంది. గతానుగతికత్వం అంత మంచిది కాదు. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో **నూటతొమ్మిదవ** సర్గ సమాప్తము.

# అథ దశాధిక శతతమః సర్గః

[రావణుని స్త్రీలు విలపించుట.]

మూ. రావణం నిహతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా,
అన్తఃపురాద్వినిష్పేతుః రాక్షస్యః శోకకర్శితాః 1

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, రావణమ్=రావణుణ్ణి, నిహతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, శోకకర్శితాః=శోకముచేత పీడింపబడినవారై, అన్తఃపురాత్=అంతఃపురమునుండి, వినిష్పేతుః=బైటకు శీఘ్రముగా వచ్చిరి.

తా. మహాత్ముడైన రామునిచేత రావణుడు **చంపబడినట్లు** చూచి రాక్షసస్త్రీలు శోకముతో బాధపడుచు శీఘ్రముగా అంతఃపురమునుండి బైటకు వచ్చిరి. 1

మూ. వార్యమాణాః సుబహుశో వేష్టన్త్యః క్షితిపాంసుషు,
విముక్తకేశ్యః శోకార్తా గావో వత్సహతా యథా. 2

ప్ర. అ. సుబహుశః=అనేకవిధములుగా, వార్యమాణాః=నివారింపబడుచున్నను, క్షితిపాంసుషు=భూమిమీద నున్న పరాగముల యందు, వేష్టన్త్యః=దొర్లుచు, విముక్తకేశ్యః=విడిపోయిన కేశములు కలవారై, **వత్సహతాః=చంపబడినలేగదూడలు,** గల, గావః యథా=గోవులు వలె, శోకార్తాః=శోకముచేత పీడితలై (బైటకు వచ్చిరి).

తా. ఎంత నివారించినను నేలమీద పరాగములో దొర్లుచు, విరబోసికొనిన జుట్టుతో, దూడలు చచ్చిన ఆవులు వలె శోకముచేత పీడితులై బైటకు వచ్చిరి.2

మూ. ఉత్తరేణ వినిష్క్రమ్య ద్వారేణ సహ రాక్షసైః,
ప్రవిశ్యాయోధనం ఘోరం విచిన్వన్త్యో హతం పతిమ్, 3
ఆర్యపుత్రేతి వాదిన్యో హా నాథేతి చ సర్వశః,
పరిపేతుః కబన్ధాఙ్కాం మహీం శోణితకర్దమామ్. 4

ప్ర. అ. రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, ఉత్తరేణ ద్వారేణ=ఉత్తరద్వారముచేత, వినిష్క్రమ్య=బయటకు వెడలి, హతమ్=చంపబడిన, పతిమ్=భర్తను, విచిన్వన్త్యః=వెదకుచున్నవారై, ఘోరమ్=ఘోరమైన, ఆయోధనమ్=యుద్ధమును,

ప్రవిశ్య=ప్రవేశించి, ఆర్యపుత్రేతి=ఆర్యపుత్రా అని, హా నాథేతి=అయ్యో నాథా అని, వాదిన్యః=పలుకున్నవారై, కబన్ధాఙ్కామ్=మొండెములు చిహ్నములుగా గల, శోణితకర్దమామ్=రక్తపు బురద గల, మహీమ్=భూమిని గూర్చి, సర్వశః=అన్ని వైపులనుండి, పరిపేతుః=వచ్చిపడిరి.

తా. రాక్షసులతో కూడా ఉత్తరద్వారమునుండి బైటకు వచ్చి, చంపబడిన భర్తను వెదకుకొనుచు, ఘోరమైన యుద్ధరంగమును ప్రవేశించి, "అయ్యో ! ఆర్యపుత్రుడా ! అయ్యో ! నాథా !"అని విలపించుచు మొండెములతో వ్యాప్తమై రక్తపు బురదతో నిండిన నేలమీద అన్ని వైపులనుండి వచ్చిపడిరి. 3, 4

మూ. తా బాష్పపరిపూర్ణాక్ష్యో భర్తృశోకపరాజితాః,
కరేణ్వ ఇవ నర్దన్త్యో వినేదుర్హతయూథపాః. 5

ప్ర. అ. బాష్పపరిపూర్ణాక్ష్యః=కన్నీళ్లతో నిండిన నేత్రములు గల, భర్తృశోకపరాజితాః=భర్తను గూర్చిన శోకముచేత ఓడింపబడిన, తాః=ఆ స్త్రీలు, హతయూథపాః=చంపబడిన యూథనాయకుడు గల, కరేణ్వః ఇవ=ఆడ ఏనుగులు వలె, నర్దన్త్యః=అరచుచు, వినేదుః=ధ్వనిచేసిరి.

తా. భర్తృశోకముచేత పీడింపబడిన ఆ స్త్రీలు కన్నీళ్లతో నిండిన నేత్రములతో, గుంపు నాయకుడు చంపబడినప్పుడు అరచు ఆడ ఏనుగులు వలె ఏడ్చిరి. 5

మూ. దదృశుస్తా మహాకాయం మహావీర్యం మహాద్యుతిమ్,
రావణం నిహతం భూమౌ నీలాఞ్జనచయోపమమ్. 6

ప్ర. అ. తాః=ఆ స్త్రీలు, మహాకాయమ్=గొప్ప శరీరము గలవాడు, మహావీర్యమ్=గొప్ప పరాక్రమము గలవాడు, మహాద్యుతిమ్=గొప్ప కాంతి గలవాడు, నీలాఞ్జనచయోపమమ్=నల్లని కాటుక రాసితో సమానుడూ అయిన, నిహతమ్=చంపబడిన ఆ రావణుణ్ణి, భూమౌ=నేలమీద, దదృశుః=చూచిరి.

తా. పెద్ద శరీరము, గొప్ప పరాక్రమము, కాంతి గల ఆ రావణుడు చంపబడి నల్లని కాటుకరాశివలె నేలమీద పడి యుండెను. అట్టి ఆతనిని ఆ స్త్రీలు చూచిరి. 6

మూ. తాః పతిం సహసా దృష్ట్వా శయానం రణపాంసుషు,
నిపేతుస్తస్య గాత్రేషు ఛిన్నా వనలతా ఇవ. 7

ప్ర. అ. తాః=ఆ స్త్రీలు, రణపాంసుషు=యుద్ధభూమి పరాగముల యందు, శయానమ్=శయనించి ఉన్న, పతిమ్=భర్తను, సహసా=హటాత్తుగా,

దృష్ట్వా=చూచి, ఛిన్నాః=ఛేదించబడిన, వనలతా ఇవ=వనమునందలి లతలు వలె, తస్య=అతనియొక్క, గాత్రేషు=అవయవములమీద, నిపేతుః=పడిరి.

తా. ఆ స్త్రీలు యుద్ధభూమిలో పరాగములో పడి యున్న భర్తను హటాత్తుగా చూచి తెగగొట్టిన లతలు వలె ఆతని అన్ని అవయవములమీద పడిరి. 7

మూ. బహుమానాత్పరిష్వజ్య కాచిదేవం రురోద హ,
చరణౌ కాచిదాలమ్బ్య కాచిత్కణ్ఠేఽవలమ్బ్య చ. 8

ప్ర. అ. కాచిత్=ఒక స్త్రీ, బహుమానాత్=గౌరవభావమువలన, ఏనమ్=వీనిని, పరిష్వజ్య=కౌగిలించుకొని, రురోద హ=ఏడ్చెను. కాచిత్=ఒక స్త్రీ, చరణౌ=పాదములను, ఆలమ్బ్య=పట్టుకొని, కాచిత్=మరియొక స్త్రీ, కణ్ఠే=కంఠమునందు, అవలమ్బ్య చ=పట్టుకొని (ఏడ్చెను).

తా. ఒక స్త్రీ ప్రేమతో ఆతనిని కౌగలించుకొని ఏడ్చెను. ఒక స్త్రీ ఆతని పాదములను, మరొక స్త్రీ కంఠమును గ్రహించి ఏడ్చెను. 8

మూ. ఉత్క్షిప్య చ భుజౌ కాచిద్ భూమౌ సుపరివర్తతే,
హతస్య వదనం దృష్ట్వా కాచిన్మోహముపాగమత్. 9

ప్ర. అ. కాచిత్=ఒక స్త్రీ, భుజౌ=భుజములను, ఉత్క్షిప్య=పైకి ఎత్తి, భూమౌ=నేలమీద, సుపరివర్తతే=బాగా దొర్లుచున్నది. కాచిత్=ఒక స్త్రీ, హతస్య=చంపబడిన ఆతని యొక్క, వదనమ్=ముఖమును, దృష్ట్వా=చూచి, మోహమ్=మోహమును, ఉపాగమత్=పొందెను.

తా. ఒక స్త్రీ భుజములు పైకెత్తి బాగా నేలమీద దొర్లెను. ఒక స్త్రీ మరణించిన ఆతని ముఖమును చూచి మూర్ఛచెందెను. 9

మూ. కాచిదఙ్కే శిరః కృత్వా రురోద ముఖమీక్షతీ,
స్నాపయన్తీ ముఖం బాష్పైస్తుషారైరివ పఙ్కజమ్. 10

ప్ర. అ. కాచిత్=ఒక స్త్రీ, శిరః=రావణుని శిరస్సును, అఙ్కే=తన ఒడిలో, కృత్వా=ఉంచి, ముఖమ్=ముఖమును, ఈక్షతీ=చూచుచున్నదై, తుషారైః=మంచు బిందువులచేత, పఙ్కజమ్ ఇవ=పద్మమును వలె, ముఖమ్= ఆతని ముఖమును, బాష్పైః=కన్నీళ్లచేత, స్నాపయన్తీ=తడుపుచున్నదై, రురోద=ఏడ్చెను.

తా. ఒక స్త్రీ ఆతని శిరస్సు తన ఒడిలో ఉంచుకొని, ఆతని ముఖమును చూచుచు, మంచు బిందువులచేత పద్మమును తడిపి నట్లు ఆ ముఖమును కన్నీళ్లచేత తడుపుచు ఏడ్చెను. 10

మూ. ఏవమార్తాః పతిం దృష్ట్వా రావణం నిహతం భువి,
చక్రుశుర్బహుధా శోకాద్భూయస్తాః పర్యదేవయన్. 11

ప్ర. అ. భువి=నేలమీద, నిహతమ్=పడగొట్టబడిన, పతిమ్=భర్తయైన, రావణమ్=రావణుని, దృష్ట్వా=చూచి, ఏవమ్=ఇట్లు, ఆర్తాః=దుఃఖించినవారై, తాః=ఆ స్త్రీలు, బహుధా=అనేకవిధములుగా, చుక్రుశుః=ఏడ్చిరి. శోకాత్=శోకమువలన, భూయః=మరల, పర్యదేవయన్=ఇట్లు చెప్పచు విలపించిరి.

తా. ఆ స్త్రీలు నేలపై పడగొట్టబడిన భర్తయైన రావణుణ్ణి చూచి దుఃఖముతో ఈ విధముగా అనేక రీతులలో ఏడ్చిరి. శోకావేశముతో ఏమేమో అనుచు మరల విలపించిరి. 11

మూ. యేన విత్రాసితః శక్రో యేన విత్రాసితో యమః,
యేన వైశ్రవణో రాజా పుష్పకేణ వియోజితః, 12
గన్ధర్వాణామృషీణాం చ సురాణాం చ మహాత్మనామ్,
భయం యేన రణే దత్తం సోఽయం శేతే రణే హతః. 13

ప్ర. అ. యేన=ఎవనిచేత, శక్రః=ఇంద్రుడు, విత్రాసితః=భయపెట్టబడినాడో, యేన=ఎవనిచేత, యమః=యముడు, విత్రాసితః=భయపెట్టబడినాడో, యేన=ఎవనిచేత, రాజా=రాజైన, వైశ్రవణః=కుబేరుడు, పుష్పకేణ=పుష్పకముతో, వియోజితః=వియోగము కలవాడుగా చేయబడినాడో, యేన=ఎవనిచేత, రణే=యుద్ధమునందు, గన్ధర్వాణామ్=గంధర్వులకు, ఋషీణాం చ=ఋషులకు, మహాత్మనామ్=మహాత్ములైన, సురాణాం చ=దేవతలకు, భయమ్=భయము, దత్తమ్=ఇవ్వబడినదో, సః అయమ్=అట్టి ఈ రావణుడు, రణే=రణమునందు, హతః=చంపబడినవాడై, శేతే=శయనించి ఉన్నాడు.

తా. ఎవ్వడు దేవేంద్రుణ్ణి, యముణ్ణి భయపెట్టినాడో, ఎవ్వడు కుబేరునకు పుష్పకము లేకుండ చేసినాడో, ఎవ్వడు గంధర్వులకు, ఋషులకు, మహాత్ములైన దేవతలకు యుద్ధములో భయము కలిగించినాడో అట్టి రావణుడు యుద్ధములో చంపబడి శయనించి ఉన్నాడు. 12, 13

మూ. అసురేభ్యః సురేభ్యో వా పన్నగేభ్యోఽపి వా తథా,
భయం యో న విజానాతి తస్యేదం మానుషాద్ భయమ్. 14

ప్ర. అ. యః=ఎవ్వడు, అసురేభ్యః=అసురులనుండి గాని, సురేభ్యో వా=దేవతలనుండి గాని, తథా=మరియు, పన్నగేభ్యోఽపి వా=సర్పములనుండి గాని, భయమ్=భయమును, న విజానాతి=ఎరుగడో, తస్య=అట్టివానికి, మానుషాత్=మనుష్యుని నుండి, ఇదమ్=ఈ, భయమ్=భయము ప్రాప్తించినది.

తా. ఏ రావణుడు అసురులనుండి గాని, దేవతలనుండి గాని, సర్పములనుండి గాని భయము ఎరుగడో అట్టి ఈ రావణునికి మానవునివలన ఈ భయము కలిగినది ! 14

మూ. అవధ్యో దేవతానాం యస్తథా దానవరక్షసామ్,
హతః సోఽయం రణే శేతే మానుషేణ పదాతినా. 15

ప్ర. అ. యః=ఎవ్వడు, దేవతానామ్=దేవతలకు, తథా=మరియు, దానవరక్షనామ్=దానవులకు రాక్షసులకూ, అవధ్యః=చంప శక్యము కానివాడో, సః అయమ్=అట్టి ఈ రావణుడు, పదాతినా=పాదచారియైన, మానుషేణ=మానవునిచేత, రణే=యుద్ధమునందు, హతః=చంపబడినవాడై, శేతే=శయనించి ఉన్నాడు.

తా. దేవతలచేత, దానవులచేత, రాక్షసులచేత, చంప శక్యముకానివాడు పాదచారియైన మానవునిచేత యుద్ధమునందు చంపబడి శయనించి ఉన్నాడు.15

మూ. యో న శక్యః సురైర్హన్తుం న యక్షైర్నాసురైస్తథా,
సోఽయం కశ్చిదివాసత్త్వో మృత్యుం మర్త్యేన లమ్భితః. 16

ప్ర. అ. యః=ఎవ్వడు, సురైః=దేవతలచేత, హన్తుమ్=చంపుటకు, న శక్యః=శక్యమైనవాడు కాడో, యక్షైః=యక్షులచేత, న=కాడో, తథా=మరియు, అసురైః=అసురులచేత, న=కాడో, సః=అట్టి, అయమ్=ఇతడు, అసత్త్వః=బలము లేని, కశ్చిదివ=ఒకనొక సామాన్యవ్యక్తి వలె, మర్త్యేన=మానవునిచేత, మృత్యుమ్=మృత్యువును, లమ్భితః=పొందింపబడినాడు.

తా. దేవతలు గాని, యక్షులు గాని, అసురులు గాని చంపుటకు శక్యము కాని వానిని, బలము లేని ఒక సామాన్యవ్యక్తిని వలె మానవమాత్రుడు చంపివేసినాడు. 16

మూ. ఏవం వదన్త్యో రురుదుస్తస్య తా దుఃఖితాః స్త్రియః,
భూయ ఏవ చ దుఃఖార్తా విలేపుశ్చ పునః పునః. 17

ప్ర. అ. తస్య=రావణునియొక్క, దుఃఖితాః=దుఃఖించిన, తాః స్త్రియః=ఆ స్త్రీలు, ఏవమ్=ఉట్లు, వదన్త్యః=పలుకుచు, రురుదుః=ఏడ్చిరి. భూయః ఏవ చ=మరల, దుఃఖార్తాః=దుఃఖముచేత పీడింపబడినవారై, పునః పునః=మాటి మాటికి, విలేపుః=విలపించిరి.

తా. ఆ రావణుని స్త్రీలు ఈ విధముగా పలుకుచు, దుఃఖముతో ఏడ్చిరి. ఇంకను దుఃఖముచేత పీడింపబడినవారై మాటిమాటికి విలపించిరి.17

మూ. అశృణ్వతా తు సుహృదాం సతతం హితవాదినామ్,
మరణాయాహృతా సీతా రాక్షసాశ్చ నిపాతితాః. 18
ఏతాః సమమిదానీం తే వయమాత్మా చ పాతితః.

ప్ర. అ. సతతమ్=ఎల్లప్పుడూ, హితవాదినామ్=హితమును పలుకు, సుహృదామ్=మిత్రులకు, అశృణ్వతా=విననినీ చేత, మరణాయ=మరణముకొరకే, సీతా=సీత, ఆహృతా=కొనిరాబడినది. రాక్షసాశ్చ=రాక్షసులు, నిపాతితాః=చంపబడినారు. ఆత్మా చ=తాను కూడ, (నీవుకూడ), పాతితః=పడగొట్టబడితివి. సమమ్=నీతో కూడా, తే=నీకు సంబంధించిన, ఏతాః వయమ్=ఈ మేము, ఇదానీమ్=ఇప్పుడు, (పడకొట్టబడితిమి).

తా. ఎల్లప్పుడు హితమునే పలుకు మిత్రుల మాటలు వినక నీవు చావుకొరకే సీతను తీసికొనివచ్చినావు. రాక్షసులను చంపినావు. నీకు, మాకు కూడా సమముగా కీడు తెచ్చిపెట్టినావు. 18

మూ. బ్రువాణోఽపి హితం వాక్యమిష్టో భ్రాతా విభీషణః, 19
ధృష్టం పరుషితో మోహాత్త్వయాత్మవధకాఙ్క్షిణా.

ప్ర. అ. హితమ్=హితమైన, వాక్యమ్=వాక్యమును, బ్రువాణోఽపి=పలుకుచున్నను, ఇష్టః భ్రాతా=ప్రియసోదరుడైన, విభీషణః=విభీషణుడు, ధృష్టమ్=ధార్ష్ట్యపూర్వకముగా, (ఆత్మవధకాఙ్క్షిణా=తన) చావును కోరిన, త్వయా=నీచేత, మోహాత్=అజ్ఞానమువలన, పరుషితః=దూషింపబడినాడు.

తా. నీ ప్రియసోదరుడైన విభీషణుడు నీ హితమే చెప్పుచున్నను చావునే కోరి యున్న నీవు అజ్ఞానముచేత అహంకారముతో ఆతనిని దూషించినావు.19

మూ. యది నిర్యాతితా తే స్యాత్సీతా రామాయ మైథిలీ, 20
న నః స్యాద్వ్యసనం ఘోరమిదం మూలహరం మహత్.

ప్ర. అ. మైథిలీ=మిథిలారాజకుమారి యైన, సీతా=సీత, తే=నీకు (నీచేత), రామాయ=రామునికొరకు, నిర్యాతితా=తిరిగి ఇచ్చివేయబడినది, యది స్యాత్=అయి ఉన్నచో, నః=మనకు, మూలహరమ్=మూలమునే హరించు, ఇదమ్=ఈ, మహత్=గొప్ప, ఘోరమ్=ఘోరమైన, వ్యసనమ్=వ్యసనము, న స్యాత్=అయి (వచ్చి) ఉండెడిది కాదు.

తా. నీవు మిథిలారాజకుమారియైన సీతను రామునకు తిరిగి ఇచ్చివేసి ఉన్నచో మనకు మూలమునే నశింపచేయు ఘోరమైన ఈ గొప్ప ఆపద వచ్చి ఉండెడిది కాదు. 20

మూ. వృత్తకామో భవేద్భ్రాతా రామో మిత్రకులం భవేత్, 21
వయం చావిధవాః సర్వాః సకామా న చ శత్రవః.

ప్ర. అ. భ్రాతా=సోదరుడైన విభీషణుడు, వృత్తకామః=సిద్ధించిన కోరిక గలవాడు, భవేత్=అయి ఉండెడివాడు. రామః=రాముడు, మిత్రకులమ్=మిత్రపక్షమువాడు, భవేత్=అయి ఉండెడివాడు. వయమ్=మేము, సర్వాః=అందరము, అవిధవాః=అవిధవలముగా ఉండేవారము. శత్రవః చ=శత్రువులు, సకామాః=తీరిన కోరికగలవారు, న=అయిఉండేవారుకారు.

తా. నీవు సీతను తిరిగి ఇచ్చినచో నీ సోదరుడైన విభీషణుని కోరిక తీరి ఉండెడిది. రాముడు మిత్రుడై ఉండెడివాడు. మాకు వైధవ్యము వచ్చి ఉండెడిది కాదు. నీ శత్రువుల (దేవాదుల) కోరిక తీరి ఉండెడిది కాదు. 21

మూ. త్వయా పునర్నృశంసేన సీతాం సంరుద్ధతా బలాత్, 22
రాక్షసా వయమాత్మా చ త్రయం తుల్యం నిపాతితమ్.

ప్ర. అ. నృశంసేన=క్రూరుడవై, **సీతామ్=సీతను,** బలాత్=బలాత్కారమున, సంరుద్ధతా=బందీచేసిన, త్వయా పునః=నీచేత నైతే, రాక్షసాః=రాక్షసులూ, వయమ్=మేము, ఆత్మా చ=తాను, త్రయమ్=ఈ త్రయము, తుల్యమ్=సమానముగా, నిపాతితమ్=పడగొట్టబడినది.

తా. క్రూరుడవై బలాత్కారముగా సీతను బంధించిన నీవు రాక్షసులను, మమ్ములను, తననూ, ఈ త్రయమునూ కూడ ఒక్కమారుగా నశింపచేసినావు. 22

మూ. న కామకారః కామం వా తవ రాక్షసపుంగవ,
దైవం చేష్టయతే సర్వం హతం దైవేన హన్యతే. 23

ప్ర. అ. రాక్షసపుంగవ=రాక్షస శ్రేష్ఠుడా ! కామమ్=సత్యముగా, తవ=నీయొక్క, కామకారః=స్వేచ్ఛాచరణమే, న వా=ఇందుకు కారణము కాకపోవచ్చును. సర్వమ్=సమస్తమును, దైవమ్=దేవమే, చేష్టయతే=నడిపించును, దేవేన=దైవముచేత, హతమ్=కొట్టబడినదై, హన్యతే=నశింపచేయబడును.

తా. లేదా, రాక్షస శ్రేష్ఠుడా ! నీ స్వేచ్ఛాచరణమే వాస్తవమున కారణము కాదు. ప్రతి పనిని దైవమే చేయించును. దైవముచేత కొట్టబడినదై సర్వమూ నశించును. 23

మూ. వానరాణాం వినాశోఽయం రాక్షసానాం చ తే రణే,
తవ చైవ మహాబాహో దైవయోగాదుపాగతః. 24

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా! రణే=యుద్ధమునందు, వానరాణామ్=వానరులయొక్క, తే రాక్షసానాం చ=నీ రాక్షసులయొక్క, తవ చ=నీ యొక్క, అయమ్=ఈ, వినాశః=వినాశము, దైవయోగాత్=దైవయోగమువలననే, ఉపాగతః=వచ్చినది.

తా. ఓ ! మహాబాహూ ! యుద్ధములో వానరులు, రాక్షసులు, నీవు నశించుట అనేది దైవయోగమువల్లనే వచ్చినది. 24

మూ. నైవార్థేన న కామేన విక్రమేణ న చాజ్ఞయా,
శక్యా దైవగతిర్లోకే నివర్తయితుముద్యతా. 25

ప్ర. అ. ఉద్యతా=ఫలోన్ముఖమైన, దైవగతిః=దైవగతి, లోకే=లోకమునందు, అర్థేన=ధనముచేత, నివర్తయితుమ్=మరల్చుటకు, న శక్యా=శక్యమైనది కాదు. కామేన=కామముచేత, న=శక్యము కాదు. విక్రమేణ=పరాక్రమముచేత, న=శక్యము కాదు. ఆజ్ఞయా చ=ఆజ్ఞచేత కూడ, న=శక్యమైనది కాదు.

తా. ఫలము నిచ్చుటకు సిద్ధమైన దైవగతి ధనముచేత గాని, కామముచేత గాని, పరాక్రమముచేత గాని, ఆజ్ఞచేత గాని మరల్చుటకు శక్యము కాదు.

మూ. విలేపురేవం దీనాస్తా రాక్షసాధిపయోషితః,
కురర్య ఇవ దుఃఖార్తా బాష్పపర్యాకులేక్షణాః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే దశాధికశతతమః సర్గః.

ప్ర. అ. తాః=ఆ, రాక్షసాధిపయోషితః=రావణుని స్త్రీలు, దీనాః=దీనలై, దుఃఖార్తాః=దుఃఖముచేత పీడింపబడినవారై, బాష్పపర్యాకులేక్షణాః=బాష్పముచేత వ్యాకులములైన నేత్రములు గలవారై, కురర్యః ఇవ=ఆడగోరెంకల వలె, ఏవమ్=ఇట్లు, విలేపుః=విలపించిరి.

తా. ఆ రాక్షసరాజైన రావణుని స్త్రీలు దుఃఖముతో బాధపడుచు కన్నీళ్లచేత వ్యకులములైన నేత్రములు గలవారై, ఆడ గోరెంకల వలె ఇట్లు దీనముగా ఏడ్చిరి. 26

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదవ సర్గ సమాప్తము.

# అథ ఏకాదశాధిక శతతమః సర్గః

[మండోదరి విలపించుట, విభీషణుడు రావణునకు అంత్యసంస్కారములు చేయుట.]

మూ. తాసాం విలపమానానాం తదా రాక్షసయోషితామ్,
జ్యేష్ఠపత్నీ ప్రియా దీనా భర్తారం సముదైక్షత. 1

ప్ర. అ. తదా=అప్పుడు, తాసామ్=ఆ, రాక్షసయోషితామ్=రాక్షసస్త్రీలు, విలపమానానామ్=విలపించుచుండగా, ప్రియా=ప్రియురాలైన, జ్యేష్ఠపత్నీ=పెద్ద భార్యయైన మండోదరి, దీనా=దీనురాలై, భర్తారమ్=భర్తను, సముదైక్షత=చూచెను.

తా. అప్పుడు ఆ రాక్షస స్త్రీలు విలపించుచుండగా ప్రియురాలు, జ్యేష్ఠభార్య అయిన మండోదరి దీనురాలై భర్తను చూచెను. 1

మూ. దశగ్రీవం హతం దృష్ట్వా రామేణాచిన్త్యకర్మణా,
పతిం మణ్డోదరీ తత్ర కృపణా పర్యదేవయత్. 2

ప్ర. అ. అచిన్త్యకర్మణా=ఊహింప శక్యము కాని కర్మ గల, రామేణ=రామునిచేత, హతమ్=చంపబడిన, పతిమ్=భర్తయైన, దశగ్రీవమ్=రావణుణ్ణి, దృష్ట్వా=చూచి, మణ్డోదరీ=మండోదరి, తత్ర=అక్కడ, కృపణా=దీనురాలై, పర్యదేవయత్=విలపించెను.

తా. ఊహింప శక్యము కాని కర్మలు చేయగల రామునిచేత చంపబడిన భర్తయైన రావణుణ్ణి చూచి ఆ మండోదరి దీనురాలై విలపించెను. 2

మూ. నను నామ మహాబాహో తవ వైశ్రవణానుజ,
క్రుద్ధస్య ప్రముఖే స్థాతుం త్రస్యత్యపి పురన్దరః. 3

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా ! వైశ్రవణానుజ= కుబేరుని తమ్ముడా ! క్రుద్ధస్య=కోపించిన, తవ=నీయొక్క, ప్రముఖే=ఎదుట, స్థాతుమ్=నిలచుటకు, పురన్దరః అపి=దేవేంద్రుడు కూడ, త్రస్యతి నను నామ=భయపడుచున్నాడు కదా.

తా. ఓ ! గొప్ప బాహువులు గలవాడా ! ఓ ! కుబేరుని తమ్ముడా ! కోపించిన నీ ఎదుట నిలబడుటకు దేవేంద్రుడు కూడ భయపడును కదా !3

మూ. ఋషయశ్చ మహాన్తోఽపి గన్ధర్వాశ్చ యశస్వినః,
నను నామ తవోద్వేగాచ్చారణాశ్చ దిశో గతాః. 4

ప్ర. అ. తవ=నీయొక్క, ఉద్వేగాత్=భయమువలన, మహాన్తః=గొప్పవారైన, ఋషయః=ఋషీశ్వరులు, యశస్వినః=కీర్తి గల, గన్ధర్వాశ్చ=గంధర్వులు, చారణాః=చారణులు, దిశః=దిక్కులను గూర్చి, గతాః నను నామ=వెళ్లినారు కదా ?

తా. నీకు భయపడి మహర్షులు, కీర్తిమంతులైన గంధర్వులు, చారణులూ కూడ దిక్కులు పట్టి పారిపోయినారు కదా ! 4

మూ. స త్వం మానుషమాత్రేణ రామేణ యుధి నిర్జితః,
న వ్యపత్రపసే రాజన్ కిమిదం రాక్షసేశ్వర. 5

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసప్రభూ ! రాజన్=రాజా ! సః త్వమ్=అట్టి నీవు, మానుషమాత్రేణ=మనుష్యమాత్రుడైన, రామేణ=రామునిచేత, యుధి=యుద్ధమునందు, నిర్జితః=జయింపబడినవాడవై, న వ్యపత్రపసే=సిగ్గుపడుటలేదు. ఇదమ్=ఇది, కిమ్=ఏమి?

తా. రాక్షసాధిపతివైన ఓ! రాజా! అట్టి నీవు మానవమాత్రుడైన రామునిచేత యుద్ధమునందు జయింపబడి సిగ్గుచెందుటలేదా? ఇది ఏమిటి? 5

మూ. కథం త్రైలోక్యమాక్రమ్య శ్రియా వీర్యేణ చాన్వితమ్,
అవిషహ్యం జఘాన త్వాం మానుషో వనగోచరః. 6

ప్ర. అ. త్రైలోక్యమ్=మూడు లోకములను, ఆక్రమ్య=ఆక్రమించి, శ్రియా=ఐశ్వర్యముతోను, వీర్యేణ చ=పరాక్రమముతోను, అన్వితమ్=కూడిన, అవిషహ్యమ్=సహింప శక్యముకాని, త్వామ్=నిన్ను, వనగోచరః=వనమునందు తిరుగు, మానుషః=మానవుడు, కథమ్=ఎట్లు, జఘాన=చంపెను.

తా. మూడు లోకములను ఆక్రమించి ఐశ్వర్య పరాక్రమములతో ప్రకాశించుచు ఎదిరింప శక్యము కాకుండ ఉన్న నిన్ను అడవిలో తిరుగు మానవుడు ఎట్లు చంపినాడు? 6

మూ. మానుషాణామవిషయే చరతః కామరూపిణః,
వినాశస్తవ రామేణ సంయుగే నోపపద్యతే. 7

ప్ర. అ. మానుషాణామ్=మానవులకు, అవిషయే=గోచరముగాని ప్రదేశమునందు, చరతః=సంచరించుచున్న, కామరూపిణః=స్వేచ్ఛారూపము గల,

తవ=నీయొక్క, వినాశః=వినాశము, రామేణ=రామునిచేత, సంయుగే=యుద్ధము నందు, నోపపద్యతే=తగదు.

తా. మనుష్యులు ప్రవేశింప శక్యము కాని ప్రదేశములో సంచరించుచున్న, స్వేచ్ఛారూపములను ధరింప సమర్థుడ వైన నీవు యుద్ధములో రామునిచేతిలో మరణించుట యుక్తముగా లేదు. 7

మూ. న చైతత్కర్మ రామస్య శ్రద్దధామి చమూముఖే,
సర్వతః సముపేతస్య తవ తేనాభిమర్షణమ్. 8

ప్ర. అ. చమూముఖే=సేనాగ్రమునందు, రామస్య=రామునియొక్క, ఏతత్=ఈ, కర్మ=పనిని, న శ్రద్ధధామి=నమ్మను. సర్వతః=అన్ని విధములచేత, సముపేతస్య=యుద్ధసామగ్రితో పూర్ణుడవైన, తవ=నీయొక్క, తేన=ఆతనిచేత, ధర్షణమ్=ఎదిరించుటను (నమ్మను).

తా. సేనాముఖమునందు రాముడు ఈ పనిచేయ గలిగినా డని, సమస్తమైన యుద్ధసామగ్రితో పరిపూర్ణుడ వైన నిన్ను ఆతడు ఎదిరించినా డని నేను నమ్మలేకున్నాను. 8

మూ. యదైవ చ జనస్థానే రాక్షసైర్బహుభిర్వృతః,
ఖరస్తవ హతో భ్రాతా తదైవాసౌ న మానుషః. 9

ప్ర. అ. జనస్థానే=జనస్థానమునందు, బహుభిః=చాలమంది, రాక్షసైః= రాక్షసులతో, వృతః=కూడిన, తవ భ్రాతా=నీ సోదరుడైన, ఖరః=ఖరుడు, హతః=చంపబడినాడో, తదైవ=అప్పుడే, అసౌ=ఈ రాముడు, మానుషః=మానవుడు, న=కాదు.

తా. జనస్థానములో అనేకరాక్షసులతో కూడిన, నీ సోదరుడైన ఖరుడు చంపబడినా డనగా అలా చంపిన రాముడు మానవమాత్రుడు కాజాలడు. 9

మూ. యదైవ నగరీం లఙ్కాం దుష్ప్రవేశాం సురైరపి,
ప్రవిష్టో హనుమాన్వీర్యాత్తదైవ వ్యథితా వయమ్. 10

ప్ర. అ. యదైవ=ఎప్పుడు, హనుమాన్=హనుమంతుడు, సురైరపి=దేవత లచేతకూడ, దుష్ప్రవేశామ్=ప్రవేశింప శక్యము కాని, లఙ్కాం నగరీమ్=లంకాన గరమును, వీర్యాత్=పరాక్రమమువలన, ప్రవిష్టః=ప్రవేశించినాడో, తదైవ=అప్పుడే, వయమ్=మేము, వ్యథితాః=వ్యథ చెందినాము.

తా. దేవతలకు కూడా ప్రవేశింప శక్యము కాని లంకాపురములో హనుమంతుడు పరాక్రమముచేత ప్రవేశించిననాడే మేము చాల వ్యథ చెందినాము.

మూ. యదైవ వానరైర్ఘోరైర్బద్ధః సేతుర్మహార్ణవే,
తదైవ హృదయేనాహం శఙ్కే రామమమానుషమ్. 11

ప్ర. అ. ఘోరైః=భయంకరులైన, వానరైః=వానరులచేత, మహార్ణవే=మహాసముద్రమునందు, యదైవ=ఎప్పుడు, సేతుః=సేతువు, బద్ధః=కట్టబడినదో, తదైవ=అప్పుడే, అహమ్=నేను, రామమ్=రాముణ్ణి, అమానుషమ్=మానవుడు కాని వానినిగా, హృదయేన=హృదయముచేత, శఙ్కే=శంకించుచున్నాను.

తా. భయంకరులైన వానరులు మహాసముద్రముమీద ఏనాడు సేతువు కట్టినారో ఆనాడే రాముడు మానవమాత్రుడు కాడని నేను మనస్సులో శంకించితిని. 11

మూ. అథవా రామరూపేణ కృతాన్తః స్వయమాగతః,
మాయాం తవ వినాశాయ విధాయాప్రతితర్కితామ్. 12

ప్ర. అ. అథవా=లేదా, స్వయమ్=స్వయముగా, కృతాన్తః=యముడే, తవ=నీయొక్క, వినాశాయ=వినాశముకొరకు, అప్రతితర్కితామ్=ఊహింపబడని, మాయామ్=మాయను, విధాయ=ప్రయోగించి, రామరూపేణ=రాముని రూపముచేత, ఆగతః=వచ్చినాడు.

తా. లేదా నిన్ను చంపుటకై ఎవరూ ఊహించని మాయను కల్పించి యముడే స్వయముగా రాముని రూపములో వచ్చి ఉండును. 12

మూ. అథవా వాసవేన త్వం ధర్షితోఽసి మహాబల,
వాసవస్య తు కా శక్తిస్త్వాం ద్రష్టుమపి సంయుగే. 13

ప్ర. అ. అథవా=లేదా, మహాబల=ఓ! మహాబలవంతుడా ! త్వమ్=నీవు, వాసవేన=దేవేంద్రునిచేత, ధర్షితః అసి=ఎదిరించబడితివి, తు=కాని, వాసవస్య=దేవేంద్రునకు, సంయుగే=యుద్ధమునందు, త్వామ్=నిన్ను, ద్రష్టుమపి=చూచుటకు కూడ, కా శక్తిః=ఏమి శక్తి ఉన్నది?

తా. ఓ మహాబలశాలీ ! లేదా దేవేంద్రుడు నిన్ను ఎదిరించి ఉండును. కాని యుద్ధములో నిన్ను చూచుటకు కూడ దేవేంద్రునకు శక్తి ఎక్కడిది? 13

మూ. వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా సనాతనః,
అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్, 14
తమసః పరమో ధాతా శఙ్ఖచక్రగదాధరః,

శ్రీవత్సవక్షా నిత్యశ్రీరజయ్యః శాశ్వతో ధ్రువః, 15
మానుషం రూపమాస్థాయ విష్ణుః సత్యపరాక్రమః,
సర్వైః పరివృతో దేవైర్వానరత్వముపాగతైః, 16
సర్వలోకేశ్వరః శ్రీమాన్ లోకానాం హితకామ్యయా,
సరాక్షసరపరీవారం హతవాంస్త్వాం మహాద్యుతిః. 17

ప్ర. అ. వ్యక్తమ్=స్పష్టముగా, ఏషః=ఈ రాముడు, మహాయోగీ=గొప్ప యోగి, సనాతనః=నిత్యుడు, అనాదిమధ్యనిధనః=ఆది, మధ్యము, అంతము లేనివాడు, మహతః=మహత్తుకంటె, పరమః=ఉత్తమమైన, మహాన్=గొప్పవాడు, తమసః=అజ్ఞానముకంటె, పరమః=అతీతుడు, ధాతా=పోషకుడు, **శఙ్ఖచక్రగదా ధరః**=శంఖచక్రగదలను ధరించినవాడు, శ్రీవత్సవక్షాః=శ్రీవత్సము వక్షఃస్థలమునందు కలవాడు, నిత్యశ్రీః=నిత్యమైన లక్ష్మి గలవాడు, అజయ్యః=జయింప శక్యము కానివాడు, శాశ్వతః=ఎల్లప్పుడూ ఉండువాడు, ధ్రువః=స్థిరుడు అయిన, పరమాత్మా=పరమాత్మయే. సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గలవాడు, సర్వలోకేశ్వరః=సకల లోకములకు ప్రభువు, శ్రీమాన్=శ్రీమంతుడు, మహాద్యుతిః=గొప్ప కాంతి గలవాడూ, విష్ణుః=విష్ణువు, లోకానామ్=లోకములయొక్క, హితకామ్యయా=హితమునందు కోరికచేత, మానుషమ్=మనుష్యసంబంధమైన, రూపమ్=రూపమును, ఆస్థాయ=అవలంబించి, వానరత్వమ్=వానరత్వమును, ఉపాగతైః=పొందిన, సర్వైః=సమస్తమైన, దేవైః=దేవతలతో, పరివృతః=కూడినవాడై, సరాక్షసపరీవారమ్=రాక్షసపరివారముతో కూడిన, త్వామ్=నిన్ను, హతవాన్=చంపినాడు.

తా. ఈ రాముడు నిశ్చితముగా, మహాయోగి, నిత్యుడు, ఆది-మధ్య-అంతములు లేనివాడు, బ్రహ్మాది మహాపురుషులందరికంటె **గొప్పవాడు**, అజ్ఞానాతీతుడు, పోషకుడు, శంఖచక్రగదలను ధరించినవాడు, శీవత్స మను పుట్టుమచ్చ వక్షఃస్థలమునం దున్నవాడు, నిత్యము లక్ష్మీసమేతుడు, జయింప శక్యము కానివాడు, శాశ్వతుడు, స్థిరుడు అయిన పరమాత్మయే. సకలలోకములకు ప్రభువు, శ్రీమంతుడు, గొప్ప కాంతి గలవాడు అయిన విష్ణువు, లోకముల హితమును కోరి, వానర రూపములు ధరించిన దేవతలతో కూడినవాడై, రాక్షసపరివారసహితుడవైన నిన్ను చంపినాడు. 14 - 17

మూ. ఇన్ద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా,
స్మరద్భిరివ తద్వైరమిన్ద్రియైరేవ నిర్జితః. 18

ప్ర. అ. పురా=పూర్వము, త్వయా=నీచేత, ఇన్ద్రియాణి=ఇంద్రియములను, జిత్వా=జయించి, త్రిభువనమ్=ముడు లోకముల సముదాయము, జితమ్=జయించబడినది తత్=ఆ, వైరమ్=వైరమును, స్మరద్భిః ఇవ=స్మరించుచున్నవా అన్నట్లున్న,

ఇన్ద్రియైరేవ=ఇంద్రియములచేతనే, త్వమ్=నీవు, నిర్జితః=జయింపబడితివి.

తా. పూర్వము నీవు ఇంద్రియములు జయించి గొప్ప తపస్సుచేసి మూడు లోకాలను జయించినావు. ఆ వైరమును స్మరించుచున్నవా అన్నట్లు ఇప్పుడు ఆ ఇంద్రియములే నిన్ను జయించినవి. 18

మూ. యద్వైవ హి జనస్థానే రాక్షసైర్బహుభిర్వృతః,
ఖరస్తు నిహతో భ్రాతా తదా రామో న మానుషః. 19
యద్వైవ నగరీం లఙ్కాం దుష్ప్రవేశాం సురైరపి,
ప్రవిష్టో హనుమాన్వీర్యాత్తదైవ వ్యథితా వయమ్. 20

ప్ర. అ. తా. పైన 9, 10 శ్లోకములను చూడుడు.

మూ. క్రియతామవిరోధశ్చ రాఘవేణేతి యన్మయా,
ఉచ్యమానం న గృహ్ణాసి తస్యేయం వ్యుష్టిరాగతా. 21

ప్ర. అ. రాఘవేణ=రామునితో, అవిరోధః=మైత్రి, క్రియతామ్=చేయబడుగాక, ఇతి=అని, మయా=నాచేత, ఉచ్యమానమ్=చెప్పబడుచున్నదానిని, యత్=ఎందువలన, న గృహ్ణాసి=గ్రహించుటలేదో, తస్య=దానికి, ఇయమ్=ఈ, వ్యుష్టిః=ఫలితము, ఆగతా=వచ్చినది.

తా. "రామునితో మైత్రి చేసికొనుము"అని నేను చెప్పగా విననందుకే ఈ ఫలితము వచ్చినది. 21

మూ. అకస్మాచ్చాభికామోఽసి సీతాం రాక్షసపుంగవ,
ఐశ్వర్యస్య వినాశాయ దేహస్య స్వజనస్య చ. 22

ప్ర. అ. రాక్షసపుంగవ=రాక్షస శ్రేష్ఠుడా ! ఐశ్వర్యస్య=ఐశ్వర్యముయొక్క, దేహస్య=నీ దేహముయొక్క, స్వజనస్య=స్వజనముయొక్క, వినాశాయ=వినాశము కొరకే, సీతామ్=సీతను గూర్చి, అకస్మాత్=హటాత్తుగా, అభికామః=కామము గలవాడవు, అసి=అయితివి.

తా. రాక్షసశ్రేష్ఠుడా! ఐశ్వర్యము, నీ దేహము, బంధుజనము నశించుటకే నీకు హటాత్తుగా సీతయందు కోరిక పుట్టినది. 22

మూ. అరున్ధత్యా విశిష్టాం తాం రోహిణ్యాశ్చాపి దుర్మతే,
సీతాం ధర్షయతా మాన్యాం త్వయా హ్యసదృశం కృతమ్. 23

ప్ర. అ. దుర్మతే=ఓ ! దుర్బుద్ధి కలవాడా ! అరున్ధత్యాః=అరుంధతికంటెను, రోహిణ్యాశ్చాపి=రోహిణికంటెను, విశిష్టామ్=ఉత్తమురాలైన, మాన్యామ్=గౌరవింపద

గిన, సీతామ్=సీతను, ధర్షయతా=అవమానించిన, త్వయా=నీచేత, అసదృశమ్=తగని పని, కృతం హి=చేయబడినది కదా.

తా. ఓ ! దుర్బుద్ధి కలవాడా ! అరుంధతికంటె, రోహిణికంటె కూడ ఉత్తమురాలైన గౌరవింపదగిన సీతను అవమానించి నీవు చెడ్డ పని చేసితివి కదా? 23

మూ. వసుధాయా హి వసుధాం శ్రియః శ్రీం భర్తృవత్సలామ్,
సీతాం సర్వానవద్యాఙ్గీమరణ్యే విజనే శుభామ్, 24
ఆనయిత్వా తు తాం దీనాం ఛద్మనాత్మస్వదూషణ,
అప్రాప్య తం చైవ కామం మైథిలీసంగమే కృతమ్, 25
పతివ్రతాయాస్తపసా నూనం దగ్ధోఽసి మే ప్రభో.

ప్ర. అ. ఆత్మస్వదూషణ=తనను తనవారినీ నశింపచేసినవాడా ! మే=నాయొక్క, ప్రభో=ప్రభూ ! వసుధాయాః=భూమికి, వసుధామ్=భూమి, శ్రియః=లక్ష్మికి, శ్రీమ్=లక్ష్మి అయిన, భర్తృవత్సలామ్=భర్తయందు ప్రేమ గల, సర్వానవద్యాఙ్గీమ్=దోషములు లేని సకలావయవములుగల, విజనే=జనశూన్యమైన, అరణ్యే=అరణ్యమునందు ఉన్న, శుభామ్=మంగళప్రదురాలైన, దీనామ్=దీనురాలు, ఐన, తాం సీతామ్=ఆ సీతను, ఛద్మనా=కపటముచేత, ఆనయిత్వా=తీసికొనివచ్చి, మైథిలీసంగమే=సీతా సంగమవిషయమున, కృతమ్=చేయబడిన, తం కామమ్=ఆ కామమును, అప్రాప్య చైవ=పొందక, పతివ్రతాయాః=ఆ పతివ్రతయొక్క, తపసా= తపస్సుచేత, దగ్ధః అసి=కాల్చబడితివి. నూనమ్=నిశ్చయము.

తా. తనకూ, తనవారికీ కూడ కీడు తెచ్చిపెట్టిన నా ప్రభూ! సీత భూమికి కూడ భూమి (గొప్ప ఓర్పు గలది). లక్ష్మికి లక్ష్మి. భర్తయందు అనురాగము గలది. ఎట్టి దోషములూ లేని సకలావయవములు గలది. మంగళప్రదురాలు. జనశూన్యమైన అరణ్యములో నివసించుచున్న దీనురాలైన అట్టి సీతను కపటముగా తెచ్చితివి. ఆమె సంగమమును గూర్చిన నీ అభిలాష వ్యర్థమైనది. నీవు నిజముగా ఆ పతివ్రత తపస్సుచేతనే కాల్చబడితివి. 24, 25

మూ. తదైవ యన్న దగ్ధస్త్వం ధర్షయంస్తనుమధ్యమామ్, 26
దేవా బిభ్యతి తే సర్వే సేన్ద్రాః సాగ్నిపురోగమాః.

ప్ర. అ. తనుమధ్యమామ్=సన్నని నడుము గల సీతను, ధర్షయన్=అవమానించుచున్న, త్వమ్=నీవు, తదైవ=అప్పుడే, న దగ్ధః ఇతి యత్=కాల్చబడలేదు అనునది ఏది కలదో, దానికి కారణమేమనగా, సేన్ద్రాః=ఇంద్రునితో కూడిన, సాగ్నిపురోగమాః=అగ్ని పురోగముడుగా గల, దేవాః=దేవతలు, తే=నీకు, అబి

భ్యత=భయపడిరి.

తా. సీతను అవమానించునప్పుడే నీవు కాల్చబడకుండుటకు కారణమే మనగా ఆ పాపమునకు ఫలమీయవలసిన ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలు నీకు భయపడిరి. 24

మూ. అవశ్యమేవ లభతే ఫలం పాపస్య కర్మణః,
ఘోరం పర్యాగతే కాలే కర్తా నాస్త్యత్ర సంశయః. 25

ప్ర. అ. కర్తా=చేసినవాడు, పాపస్య కర్మణః=పాపకర్మయొక్క, ఘోరమ్=ఘోరమైన, ఫలమ్=ఫలమును, కాలే=కాలము, పర్యాగతే=వచ్చినదగుచుండగా, అవశ్యమేవ=తప్పక, లభతే=పొందును. అత్ర=దీనియందు, సంశయః=సంశయము, నాస్తి=లేదు.

తా. పాపకర్మ చేసినవాడు దాని ఘోరమైన ఫలమును, కాలము వచ్చినప్పుడు తప్పక అనుభవించును. సందేహము లేదు. 25

మూ. శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్పాపమశ్నుతే,
విభీషణః సుఖం ప్రాప్తస్త్వం ప్రాప్తః పాపమీదృశమ్. 26

ప్ర. అ. శుభకృత్=శుభముచేసినవాడు, శుభమ్=శుభమును, ఆప్నోతి=పొందును. పాపకృత్=పాపము చేసినవాడు, పాపమ్=చెడ్డ ఫలమును, అశ్నుతే=పొందును. విభీషణః=విభీషణుడు, శుభమ్=శుభమును, ప్రాప్తః=పొందినాడు. త్వమ్=నీవు, ఈదృశమ్=ఇట్టి, పాపమ్=అశుభమును, ప్రాప్తః=పొందినావు.

తా. పుణ్యము చేసినవాడు మంచి ఫలమును పొందును. పాపము చేసినవాడు చెడ్డ ఫలమును పొందును. విభీషణునకు మంచి ఫలము లభించినది. నీకు ఇట్టి చెడ్డ ఫలము లభించినది. 26

మూ. సన్త్యన్యాః ప్రమదాస్తుభ్యం రూపేణాభ్యధికాస్తతః,
అనఙ్గవశమాపన్నస్త్వం తు మోహాన్న బుధ్యసే. 27

ప్ర. అ. రూపేణ=రూపముచేత, తతః=సీతకంటె, అభ్యధికాః=అధికలైన, అన్యాః ప్రమదాః=ఇతరస్త్రీలు, తుభ్యమ్=నీకొరకు, సన్తి=ఉన్నారు. త్వం తు=నీవైతే, అనఙ్గవశమ్=మన్మథవశమును, ఆపన్నః=పొందినవాడవై, మోహాత్=అజ్ఞానమువలన, న బుధ్యసే=తెలుసుకొనకున్నావు.

తా. సీతకంటె అధికసౌందర్యము గల స్త్రీలు ఎందరో నీ కున్నారు. కాని నీవు మన్మథవశుడవై అజ్ఞానమువలన ఆ విషయమును తెలిసికొనలేదు.27

మూ. న కులేన న రూపేణ న దాక్షిణ్యేన మైథిలీ,
మయాధికా వా తుల్యా వా తత్త్వం మోహాన్న బుధ్యసే. 28

ప్ర. అ. మైథిలీ=సీత, కులేన=కులముచేత, మయా=నాతో, అధికా వా=అధికురాలు గాని, తుల్యా వా=సమానురాలు గాని, న=కాదు. రూపేణ=రూపముచేత, న=కాదు. దాక్షిణ్యేన=నేర్పుచేత, న=కాదు. త్వమ్=నీవు, మోహాత్=అజ్ఞానమువలన, తత్=దానిని, న బుధ్యసే=తెలిసికొనుటలేదు.

తా. కులముచేత గాని, రూపముచేత గాని, విద్యాదులయందు నేర్పుచేత గాని సీత నాకంటె గొప్పది గాని, సమానురాలు కాని కాదు. కాని అజ్ఞానమువలన నీవు ఈ విషయమును తెలిసికొనలేదు. 28

మూ. సర్వదా సర్వభూతానాం నాస్తి మృత్యురలక్షణః,
తవ తావదయం **మృత్యుర్మైథిలీకృతలక్షణః.** 29

ప్ర. అ. సర్వభూతానామ్=సమస్తప్రాణులకు, సర్వదా=ఎల్లప్పుడూ, అలక్షణః=కారణములేని, మృత్యుః=మరణము, నాస్తి=లేదు. తవ తావత్=నీకైతే, అయమ్=ఇది, మైథిలీకృతలక్షణః=సీతచేత చేయబడిన కారణము గలది.

తా. ఎన్నడూ, ఏ ప్రాణికీ కూడ ఏదో ఒక నిమిత్తము లేకుండా మరణము రాదు. నీకీ మరణము సీత అను నిమిత్తముచేత వచ్చినది. 29

మూ. సీతానిమిత్తజో మృత్యుస్త్వయా దూరాదుపాహృతః,
మైథిలీ సహ రామేణ విశోకా విహరిష్యతి. 30

ప్ర. అ. త్వయా=నీచేత, సీతానిమిత్తజః=సీత అనే నిమిత్తము వలన కలిగిన, మృత్యుః=మృత్యువు, దూరాత్=దూరమునుండి, ఉపాహృతః=తీసికొనిరాబడినది. మైథిలీ=సీత, విశోకా=పోయిన శోకము గలదై, రామేణ సహ=రామునితో కూడ, విహరిష్యతి=విహరించగలదు.

తా. సీత అనే నిమిత్తమువలన కలిగే మృత్యువు దూరమునుండి తెచ్చుకొన్నావు. సీత ఇటుపై శోకరహితురాలై రామునితో కలిసి విరహించగలదు.

మూ. అల్పపుణ్యా త్వహం ఘోరే పతితా **శోకసాగరే,**
కైలాసే మన్దరే మేరౌ తథా చైత్రరథే వనే. 31
దేవోద్యానేషు సర్వేషు విహృత్య సహితా త్వయా,
విమానేనానురూపేణ యా యామ్యతులయా శ్రియా, 32
పశ్యన్తీ వివిధాన్ దేశాంస్తాంస్తాంశ్చిత్రస్రగమ్బరా,
భ్రంశితా కామభోగేభ్యః సాస్మి వీర వధాత్తవ. 33

సైవాన్యేవాస్మి సంవృత్తా ధిగ్రాజ్ఞాం చఞ్చలాః శ్రియః.

ప్ర. అ. అల్పపుణ్యా=అల్పమైన పుణ్యము గల, అహం తు=నే నైతే, ఘోరే=ఘోరమైన, శోకసాగరే=శోకసముద్రమునందు, పతితా=పడినాను, యా=ఏ నేను, చిత్రస్రగమ్బరా=చిత్రములైన మాలికలు, వస్త్రములు కలదా నన్నై, అనురూపేణ=తగిన, విమానేన=విమానముచేత, కైలాసే=కైలాసమునందు, మన్దరే=మందరపర్వతమునందు, మేరౌ=మేరుపర్వతమునందు, తథా=మరియు, చైత్రరథే=చైత్రరథ మను,, వనే=వనమునందు, సర్వేషు=సమస్తమైన, దేవోద్యానేషు=దేవతల ఉద్యానవనములందు, విహృత్య=విహరించి, తాన్ తాన్=ఆ యా, వివిధాన్=అనేక విధములైన, దేశాన్=దేశములను, పశ్యన్తీ=చూచుచున్నదాననై, అతులయా=సాటిలేని, శ్రియా=శోభతో, యామి=వెళ్లుచున్నానో, సా=అట్టి నేను, వీర=ఓ ! వీరుడా ! తవ=నీయొక్క, వధాత్=వధవలన, కామభోగేభ్యః=కామ భోగములనుండి, భ్రంశితా=భ్రష్టము చేయబడిన దానిని, అస్మి=అయి ఉన్నాను. సైవ=ఆ నేనే, అన్యేవ=మరొకదానను వలె, సంవృత్తా అస్మి=అయిపోయినాను. ధిక్=ఛీ ! రాజ్ఞామ్=రాజులయొక్క, శ్రియః=ఐశ్వర్యములు, చఞ్చలాః=చంచలమైనవి కదా.

తా. ఓ ! వీరుడా ! ఏ నేను చిత్రములైన పుష్పమాలలను వస్త్రములనూ ధరించి, నీతో కలిసి, తగిన విమానముపై ఎక్కి కైలాసమునందు, మందరమునందు, మేరుపర్వతమునందు, చైత్రరథ మను ఉద్యానమునందు, సమస్త దేవవనములందు విహరించుచు, అనేకవిధములైన ఆ యా దేశములను చూచుచు సాటిలేని శోభతో సంచరించుచుండెడిదాననో అట్టి నేను నీవు మరణించుటవలన ఆ కామభోగములకు దూరము చేయబడితిని. ఆదే నేను మరొకదానను వలె అయిపోయినాను. ఛీ ! రాజుల సంపదలు ఎంత చంచల మైనవి ! 31 - 33

మూ. హా రాజన్ సుకుమారం తే సుభ్రు సుత్వక్సమున్నసమ్, 34
కాన్తిశ్రీద్యుతిభిస్తుల్యమిన్దుపద్మదివాకరైః,
కిరీటకూటోజ్జ్వలితం తామ్రాస్యం దీప్తకుణ్డలమ్, 35
మదవ్యాకులలోలాక్షం భూత్వా యత్పానభూమిషు,
వివిధస్రగ్ధరం చారు వల్గుస్మితకథం శుభమ్, 36
తదేవాద్య తవైవం హి వక్త్రం న భ్రాజతే ప్రభో,
రామసాయకనిర్భిన్నం రక్తం రుధిరవిస్రవైః, 37
వీశీర్ణమేదోమస్తిష్కం రూక్షం స్యన్దనరేణుభిః.

ప్ర. అ. హా ! రాజన్=అయ్యో ! రాజా ! ప్రభో=ఓ ! ప్రభూ ! తే=నీ

యొక్క, యత్=ఏ, సుకుమారమ్=సుకుమారము, సుభ్రు=మంచి కనుబొమ్మలు కలది, సుత్వక్=మంచి చర్మము గలది, సమున్నసమ్=ఎత్తైన ముక్కు గలది, కాన్తి శ్రీద్యుతిభిః=కాంతిచేత, శోభచేత, తేజస్సుచేత, ఇన్దుపద్మదివాకరైః=చంద్ర - పద్మ - సూర్యులతో, తుల్యమ్=సమానమూ, కిరీటకూటోజ్జ్వలితమ్=కిరీటాగ్రభాగముచేత ప్రకాశింపచేయబడినది, తామ్రాస్యమ్=ఎఱ్ఱని నోరు గలది, దీప్తకుణ్డలమ్=ప్రకాశించుచున్న కుండలములు గలది, వివిధస్రగ్ధరమ్=అనేకవిధములైన మాలికలను ధరించినది, చారు=సుందరము, పానభూమిషు=మద్యపానప్రదేశములయందు, మదవ్యాకులలోలాక్షమ్=మదముచేత వ్యాకులములు చంచలములు అయిన నేత్రములు కలదిగా, భూత్వా=అయి, వల్గుస్మితకథమ్=సుందరమైన చిరునవ్వు, మాటలు కలది, **శుభమ్=శుభకరము అయిన**, వక్త్రమ్=ముఖము (ప్రకాశించుచుండెడిదో), తవ=నీయొక్క, తదేవ=ఆ ముఖమే, అద్య=ఇప్పుడు, రామసాయకనిర్భిన్నమ్=రాముని బాణములచేత బ్రద్దలుగొట్టబడినదై, రుధిరవిస్రవైః=రక్తస్రావములచేత, రక్తమ్=ఎఱ్ఱనైనదై, విశీర్ణమేదోమస్తిష్కమ్=చెదరగొట్టబడిన కొవ్వు, మెదడూ కలదై, స్యన్దనరేణుభిః=రథపరాగములచేత, రూక్షమ్=కఠినమై, న భ్రాజతే=ప్రకాశంచుటలేదు.

తా. అయ్యో ! ఓ ! రాజా ! ఓ ! ప్రభూ ! మంచి కనుబొమ్మలు, మంచి చర్మము, ఎత్తైన ముక్కు గల సుకుమారమైన నీ ముఖము కాంతిచేత చంద్రునితోను, శోభచేత పద్మముతోను, తేజస్సుచేత సూర్యునితోను సమానముగా ఉండెడిది. ఎఱ్ఱని నోరు, ప్రకాశించిన కుండలములు గల ఆ ముఖము కిరీటాగ్రభాగముతో **మెరయుచు** అందముగా ఉండెడిది. అనేక పుష్పమాలలు ధరించిన ఆ ముఖము మద్యపానశాలలో మత్తుచేత వ్యాకులములైన చంచలములైన నేత్రములతో అందమైన చిరునవ్వుతో, మధురసంభాషణలతో ప్రకాశించుచుండెడిది. ఆ ముఖమే ఇప్పుడు రాముని బాణాలచేత ఛేదింపబడి, రక్తస్రావములచేత ఎఱ్ఱనై, కొవ్వు, మెదడు చిమ్మివేయబడగా రథపరాగముచేత సౌకుమార్యవిహీనమై ప్రకాశించుటలేదు. 34 - 37

మూ. హా పశ్చిమా మే సంప్రాప్తా దశా వైధవ్యదాయినీ, 38
యా మయాసీన్న సంబుద్ధా కదాచిదపి మన్దయా.

ప్ర. అ. హా=అయ్యో ! మే=నాకు, వైధవ్యదాయినీ=వైధవ్యమును ఇచ్చు, పశ్చిమా=చివరిదైన, దశా=అవస్థ, సంప్రాప్తా=వచ్చినది, యా=ఏది, మన్దయా=తెలివి తక్కువదాననైన, **మయా=నాచేత**, కదాచిదపి=ఎన్నడూ, సంబుద్ధా=తెలియబడినది (ఊహింపబడినది), నాసీత్=కాదో

తా. అయ్యో ! నాకు వైధవ్యము నిచ్చే చివరి దశ సంప్రాప్తించినది. తెలివి తక్కువదాననైన నేను దీనిని కూర్చి ఎన్నడూ ఊహించి కూడ ఉండలేదు. 38

మూ. పితా దానవరాజో మే భర్తా మే రాక్షసేశ్వరః, 39
పుత్రో మే శక్రనిర్జేతా ఇత్యహం గర్వితా భృశమ్.

ప్ర. అ. మే=నాయొక్క, పితా=తండ్రి, దానవరాజః=దానవుల రాజు. మే=నాయొక్క, భర్తా=భర్త, రాక్షసేశ్వరః=రాక్షసుల ప్రభువు. మే పుత్రః=నా పుత్రుడు, శక్రనిర్జేతా=దేవేంద్రుణ్ణి జయించినవాడు, ఇతి=అని, అహమ్=నేను, భృశమ్=మిక్కిలి, గర్వితా=గర్వించితిని.

తా. నా తండ్రి దానవరాజు, భర్త రాక్షసప్రభువు, కుమారుడు దేవేంద్రుణ్ణి జయించినవాడు అని నాకు గర్వముండెడిది. 39

మూ. దృప్తారిమర్దనాః శూరాః ప్రఖ్యాతబలపౌరుషాః, 40
అకుతశ్చిద్భయా నాథా మమేత్యాసీన్మతిర్దృఢా.

ప్ర. అ. మమ=నాయొక్క, నాథాః=రక్షకులు, దృప్తారిమర్దనాః=గర్వించిన శత్రువులను నశింపచేయువారు, శూరాః=శూరులు, ప్రఖ్యాతబలపౌరుషాః=ప్రసిద్ధమైన బలపౌరుషములు గలవారు, అకుతశ్చిద్భయాః=ఎవరినుండీ భయము లేనివారు, ఇతి=అని, దృఢా=దృఢమైన, మతిః=బుద్ధి, ఆసీత్=ఉండెడిది.

తా. నా సంరక్షకులందరూ గర్వించిన శత్రువులను నశింపచేయువారు, శూరులు, ప్రసిద్ధమైన బలము, పౌరుషము కలవారు, ఎవరినుండీ భయములేనివారు అని దృఢమైన అభిప్రాయము ఉండెడిది. 40

మూ. తేషామేవంప్రభావాణాం యుష్మాకం రాక్షసర్షభాః, 41
కథం భయమసంబుద్ధం మానుషాదిదమాగతమ్.

ప్ర. అ. రాక్షసర్షభాః=రాక్షసశ్రేష్ఠులారా ! తేషామ్=అట్టి, ఏవంప్రభావాణామ్=ఇట్టి ప్రభావము గల, యుష్మాకమ్=మీకు, మానుషాత్=మనుష్యునినుండి, అసంబుద్ధమ్=తెలియబడకుండగా, ఇదం భయమ్=ఈ భయము, కథమ్=ఎట్లు, ఆగతమ్=వచ్చినది?

తా. ఓ ! రాక్షసశ్రేష్ఠులారా ! అట్టి ప్రభావము గల మీకు మానవునినుండి ఇలాంటి భయము, తెలియకుండా ఎట్లు వచ్చినది? 41

మూ. స్నిగ్ధేన్ద్రనీలనీలం తు ప్రాంశుశైలోపమం మహత్, 42
కేయూరాఙ్గదవైదూర్యముక్తాహారస్రగుజ్జ్వలమ్,
కాన్తం విహారేష్వధికం దీప్తం సంగ్రామభూమిషు, 43
భాత్యాభరణభాభిర్యద్విద్యుద్భిరివ తోయదః,
తదేవాద్య శరీరం తే తీక్ష్ణైర్నైకశరైశ్చితమ్, 44

పునర్దుర్లభసంస్పర్శం పరిష్వక్తుం న శక్యతే,
శ్వావిధః శలకైర్యద్వద్బాణైర్లగ్నైర్నిరన్తరమ్, 45
స్వర్పితైర్మర్మసు భృశం సంఛిన్నస్నాయుబన్ధనమ్,
క్షితౌ నిపతితం రాజన్ శ్యామం వై రుధిరచ్ఛవి, 46
వజ్రప్రహారాభిహతో వికీర్ణ ఇవ పర్వతః.

ప్ర. అ. రాజన్=రాజా !, స్నిగ్ధేన్ద్రనీలనీలమ్=నున్నగా నున్న ఇంద్రనీల మాణిక్యము వలె నీలవర్ణము గలది, ప్రాంశుశైలోపమమ్=ఉన్నతమైన పర్వతముతో సమానము, మహత్=గొప్పది, కేయూరాఙ్గదవైదూర్యముక్తాహారస్రగుజ్జ్వలమ్=బాహుపురులతోను వైదూర్యమణులతోను అంగదములతోను ముత్యాలహారములతోను పుష్పమాలలతోను ప్రకాశించుచున్నది, విహారేషు=విహారసమయములయందు, అధికమ్=అధికముగా, కాన్తమ్=మనోహరము, సంగ్రామభూమిషు=యుద్ధభూములయందు, దీప్తమ్=ప్రకాశించునది అయిన, యత్=ఏ, తే శరీరమ్=నీ శరీరము, ఆభరణభాభిః=ఆభరణముల కాంతులచేత, విద్యుద్భిః=మెరుపులచేత, తోయదః ఇవ=మేఘము వలె, భాతి=ప్రకాశించుచున్నదో (ప్రకాశించెడిదో), పునః=మరల, దుర్లభసంస్పర్శమ్=దుర్లభమైన స్పర్శ గలదీ, అద్య=ఇప్పుడు, **తీక్ష్ణైః=తీక్ష్ణములైన,** నైకశరైః=అనేకబాణములచేత, చితమ్=వ్యాప్తము, శ్వావిధః=ఏదుమపందిళ్ళయొక్క, శలకైః యద్వత్=ములుకులవంటి, లగ్నైః=తగుల్కొని యున్న, నిరన్తరమ్=అవకాశము లేకుండగా, మర్మసు=మర్మస్థానములయందు, స్వర్పితైః=బాగా కొట్టబడిన, బాణైః=బాణములచేత, సంభిన్నస్నాయుబన్ధనమ్=తెగగొట్టబడిన ప్రేగులు గలదీ, **క్షితౌ=నేలమీద,** నిపతితమ్=పడినది, శ్యామమ్=నల్లనిది, రుధిరచ్ఛవి=రక్తకాంతి గలది, వజ్రప్రహారాభిహతః=వజ్రప్రహారముచేత, కొట్టబడిన, వికీర్ణః=క్రింద పడగొట్టబడిన, పర్వతః ఇవ=పర్వతము వలె ఉన్న, తదేవ=ఆ శరీరమే, పరిష్వక్తుమ్=కౌగిలించుకొనుటకు, న శక్యతే=శక్యముకాదు.

తా. రాజా ! నున్నగా నున్న ఇంద్రనీలమణుల వలె నీలవర్ణము గలది, ఉన్నత శైలమువంటిది, గొప్పదీ, కేయూరములతోను, వైదూర్యవికారములైన అంగదములతోను, ముత్యాల హారములతోను, పుష్పమాలలతోను ప్రకాశించునదీ, అయిన ఏ నీ శరీరము మెరుపులతో మేఘము వలె అలంకారముల కాంతులతో ప్రకాశించుచుండెడిదో అదే శరీరము ఇప్పుడు ఏదుమ పంది ముళ్ళ వంటి, అవకాశము లేకుండగా మర్మస్థానములలో గుచ్చబడిన, ఇంకను తగుల్కొని ఉన్న బాణాలచేత తెగగొట్టబడిన ప్రేగుగలదై కౌగలించుకొనుటకు శక్యము కాకుండ ఉన్నది. దీని స్పర్శ ఇంక లభించదు. నల్లనై, రక్తముతో ఎఱ్ఱనై నేలమీద పడియున్న ఈ శరీరము వజ్రముచేత నేలమీద పడగొట్టబడిన పర్వతము వలె ఉన్నది. 42 - 46

మూ. హా స్వప్నః సత్యమేవేదం త్వం రామేణ కథం హతః, 47
త్వం మృత్యోరపి మృత్యుః స్యాః కథం మృత్యువశం గతః.

ప్ర. అ. హా=అయ్యో ! స్వప్నః=స్వప్నమా? ఇదమ్=ఇది, సత్యమేవ=సత్యమేనా? త్వమ్=నీవు, రామేణ=రామునిచేత, కథమ్=ఎట్లు, హతః=చంపబడినావు? త్వమ్=నీవు, మృత్యోరపి=మృత్యువునకు కూడ, మృత్యుః=మృత్యువు, స్యాః=అగుదువు. కథమ్=ఎట్లు, మృత్యువశమ్=మృత్యువశమును, గతః=పొందినావు?

తా. అయ్యో ! ఇదంతా స్వప్నమా లేక నిజమేనా? నీవు రామునిచేత ఎట్లు చంపబడినావు? మృత్యువుకు కూడ మృత్యువైన నీవు ఎట్లు మృత్యువునకు లొంగిపోయినావు? 47

మూ. త్రైలోక్యవసుభోక్తారం త్రైలోక్యోద్వేగదం మహత్, 48
జేతారం లోకపాలానాం క్షేప్తారం శంకరస్య చ.

ప్ర. అ. (ఈ శ్లోకాలలో ఉన్న ద్వితీయాంతపదాలన్నింటికి 55వ శ్లోకములో ఉన్న "భర్తారమ్" అనుదానితో అన్వయము). త్రైలోక్యవసుభోక్తారమ్=మూడులోకములలోని ధనమును అనుభవించువాడు, మహత్=అధికముగా, త్రైలోక్యోద్వేగదమ్=మూడు లోకములకు భయము కలిగించినవాడు, లోకపాలానామ్=లోకపాలులకు, జేతారమ్=జయించినవాడు, శంకరస్య=శంకరునకు, క్షేప్తారమ్=విసిరివేసినవాడు (అయిన భర్తను).

తా. నా భర్త మూడు లోకములలోని ఐశ్వర్యమును అనుభవించినవాడు. మూడు లోకాలకు చాల భయము కలిగించినవాడు. లోకపాలులను జయించినవాడు. కైలాసము నెత్తి శంకరుణ్ణి కదిపేసినవాడు. 48

మూ. దృప్తానాం నిగ్రహీతారమావిష్కృతపరాక్రమమ్, 49
లోకక్షోభయితారం చ నాదైర్భూతవిరావిణమ్.

ప్ర. అ. దృప్తానామ్=గర్వించినవారికీ, నిగ్రహీతారమ్=నిగ్రహించువాడు, ఆవిష్కృతపరాక్రమమ్=ప్రకటింపబడిన పరాక్రమము గలవాడు, లోకక్షోభయితారమ్=లోకములను క్షోభపెట్టినవాడు, నాదైః=ధ్వనులచేత, భూతవిరావిణమ్=భూతములను ఏడ్పించినవాడు, (అయిన భర్తను).

తా. నా భర్త గర్వించినవాళ్ళను నిగ్రహించువాడు. పరాక్రమమును ప్రకటించి లోకములను క్షోభపెట్టినవాడు. ధ్వనులచేత భూతములను ఏడ్పించినవాడు.

మూ. ఓజసా దృప్తవాక్యానాం వక్తారం రిపుసంనిధౌ, 49
స్వయూథభృత్యగోప్తారం హన్తారం భీమకర్మణామ్.

ప్ర. అ. రిపుసంనిధౌ=శత్రువుల సంనిధిలో, ఓజసా=పరాక్రమముచేత, దృప్తవాక్యానామ్=గర్వోక్తులకు, వక్తారమ్=పలుకువాడు, స్వయూథభృత్యగోప్తారమ్=తన సంఘమువారికి, భృత్యులకూ రక్షకుడు, భీమకర్మణామ్=భయంకరమైన కర్మ గలవారికి, హన్తారమ్=చంపువాడు (అయిన భర్తను).

తా. నా భర్త శత్రుసంనిధిలో గర్వోక్తులు పలుకువాడు. తనవారిని తన భృత్యులను రక్షించువాడు. భయంకరమైన పనులు చేయువారిని చంపువాడు.50

మూ. హన్తారం దానవేన్ద్రాణాం యక్షాణాం చ సహస్రశః, 51
నివాతకవచానాం చ సంగ్రహీతారమాహవే.

ప్ర. అ. సహస్రశః=వేలకొలది, దానవేన్ద్రాణామ్=దానవేంద్రులకు, యక్షాణాం చ=యక్షులకు, హన్తారమ్=చంపువాడు, ఆహవే=యుద్ధమునందు, నివాతకవచానామ్=నివాతకవచు లను రాక్షసులకు, సంగ్రహీతారమ్=సంగ్రహము చేయువాడు (అయిన భర్తను).

తా. నా భర్త వేలకొలది దానవవీరులను, యక్షులను సంహరించినవాడు. యుద్ధములో నివాతకవచు లను రాక్షసులను చేరదీయుచుండెడివాడు. 51

మూ. నైకయజ్ఞవిలోప్తారం త్రాతారం స్వజనస్య చ, 52
ధర్మవ్యవస్థాభేత్తారం మాయాస్రష్టారమాహవే.

ప్ర. అ. నైకయజ్ఞవిలోప్తారమ్=అనేకములైన యజ్ఞములను నశింపచేసిన వాడు, స్వజనస్యచ=స్వజనమునకు, త్రాతారమ్=రక్షకుడు, ధర్మవ్యవస్థాభేత్తారమ్=ధర్మవ్యవస్థను భేదించినవాడు, ఆహవే=యుద్ధమునందు, మాయాస్రష్టారమ్=మాయను సృష్టించువాడు (అయిన భర్తను).

తా. నా భర్త అనేకయజ్ఞములను పాడుచేసినవాడు. స్వజనమును రక్షించువాడు. ధర్మవ్యవస్థను చెడగొట్టినవాడు. యుద్ధములో మాయను సృష్టించెడివాడు. 52

మూ. దేవాసురనృకన్యానామాహర్తారం తతస్తతః, 53
శత్రుస్త్రీశోకదాతారం నేతారం స్వజనస్య చ.

ప్ర. అ. తతస్తతః=అక్కడక్కడినుండి, **దేవాసురనృకన్యానామ్=దేవాసుర మానవకన్యలకు,** ఆహర్తారమ్=తీసికొనివచ్చెడివాడు, శత్రుస్త్రీశోకదాతారమ్=శత్రువుల స్త్రీలకు శోకమును ఇచ్చువాడు, స్వజనస్య=స్వజనమునకు, నేతారమ్=నాయకుడు (అయిన భర్తను).

తా. నా భర్త ఆ యా దేశములనుండి దేవ-అసుర-మానవకన్యలను

తీసికొని వచ్చినవాడు. శత్రువుల స్త్రీలకు శోకము కలిగించువాడు. స్వజనమునకు నాయకుడు. 53

మూ. లఙ్కాద్వీపస్య గోప్తారం కర్తారం భీమకర్మణామ్, 54
అస్మాకం కామభోగానాం దాతారం రథినాం వరమ్.

ప్ర. అ. లఙ్కాద్వీపస్య=లంకాద్వీపమునకు, గోప్తారమ్=రక్షకుడు, భీమకర్మణామ్=భయంకరములైన కర్మలకు, కర్తారమ్=కర్త, అస్మాకమ్=మాకు, కామభోగానామ్=కామభోగములకు, దాతారమ్=ఇచ్చువాడు, రథినామ్=రథికులలో, వరమ్=శ్రేష్ఠుడూ (అయిన భర్తను).

తా. నా భర్త లంకాద్వీపమునకు రక్షకుడు. భయంకరములైన కర్మలు చేయువాడు. మాకు అన్ని కామభోగములను ఇచ్చువాడు. రథికులలో శ్రేష్ఠుడు.

మూ. ఏవంప్రభావం భర్తారం దృష్ట్వా రామేణ పాతితమ్, 55
స్థిరాస్మి యా దేహమిమం ధారయామి హతప్రియా.

ప్ర. అ. ఏవంప్రభావమ్=ఇట్టి ప్రభావము గల, భర్తారమ్=భర్తను, రామేణ=రామునిచేత, పాతితమ్=పడగొట్టబడినవానినిగా, దృష్ట్వా=చూచి, హతప్రియా=చంపబడిన భర్త గల, యా=ఏ నేను, ఇమమ్=ఈ, దేహమ్=దేహమును, ధారయామి=ధరించి ఉన్నానో, అట్టి నేను, స్థిరా=స్థిరురాలను, అస్మి=అయి ఉన్నాను.

తా. ఇట్టి భర్తను రాముడు పడగొట్టివేయగా చూచి, చంపబడిన భర్త గల నేను ఇంకను దేహమును ధరించి ఉన్నాననగా నేను చాల మొండిదానను.

మూ. శయనేషు మహార్హేషు శయిత్వా రాక్షసేశ్వర, 56
ఇహ కస్మాత్ప్రసుప్తోఽసి ధరణ్యాం రేణుగుణ్ఠితః

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! మహార్హేషు=అధికమూల్యము గల, శయనేషు=శయనములయందు, శయిత్వా=శయనించి, ఇహ=ఇక్కడ, ధరణ్యామ్=భూమిమీద, రేణుగుణ్ఠితః=పరాగముచేత కప్పబడినవాడవై, కస్మాత్=ఎందువలన, ప్రసుప్తః=నిద్రించినవాడవు, అసి=అయిఉన్నావు?

తా. రాక్షసరాజా ! అమూల్యములైన శయనములమీద శయనించిన నీవు ఇక్కడ నేలమీద పరాగముచేత కప్పబడి ఎందుకు నిద్రించుచున్నావు? 56

మూ. యదా తే తనయః శస్తో లక్ష్మణేనేన్ద్రజిద్యుధి, 57
తదా త్వభిహతా తీవ్రమద్య త్వస్మి నిపాతితా.

ప్ర. అ. తే తనయః=నీ కుమారుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, యుధి=యుద్ధమునందు, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, యదా=ఎప్పుడు, శస్తః=చంపబడినాడో, తదా=అప్పుడు, తీవ్రమ్=తీవ్రముగా, అభిహతా=కొట్టబడితిని. అద్య తు=ఇప్పుడైతే, నిపాతితా అస్మి=పడగొట్టబడితిని.

తా. నీ కుమారుడైన ఇంద్రజిత్తు యుద్ధములో లక్ష్మణునిచేత చంపబడినప్పుడు నాకు పెద్ద దెబ్బ తగిలినది. ఇప్పుడైతే పూర్తిగా పడిపోయితిని.

మూ. సాహం బన్ధుజనైర్హీనా హీనా నాథేన చ త్వయా, 58
విహీనా కామభోగైశ్చ శోచిష్యే శాశ్వతీః సమాః.

ప్ర. అ. బన్ధుజనేన=బంధుజనముతో, హీనా=హీనురాలనైన, నాథేన=నాథుడవైన, త్వయా చ=నీతో కూడ, హీనా=హీనురాలనైన, కామభోగైశ్చ=కామభోగములతో కూడ, విహీనా=విహీనురాలనైన, సా అహమ్=అట్టి నేను, శాశ్వతీః=అనేకములైన, సమాః=సంవత్సరములను, శోచిష్యే=దుఃఖించెదను.

తా. బంధుజనులు గాని, నాథుడవైన నీవు గాని లేక, కామభోగములు లేని నేను అనేక సంవత్సరములు దుఃఖించుచుండవలెను. 58

మూ. ప్రపన్నో దీర్ఘమధ్వానం రాజన్నద్య సుదుర్గమమ్, 59
నయ మామపి దుఃఖార్తాం న వర్తిష్యే త్వయా వినా.

ప్ర. అ. రాజన్=రాజా ! అద్య=ఇప్పుడు, సుదుర్గమమ్=వెళ్లుటకు చాల కష్టమైన, దీర్ఘమ్=దీర్ఘమైన, అధ్వానమ్=మార్గమును, ప్రపన్నః=పొందినావు. దుఃఖార్తామ్=దుఃఖపీడితురాలనైన, మామపి=నన్ను కూడ, నయ=తీసికొనివెళ్ళుము. త్వయా వినా=నీవు లేకుండగా, న వర్తిష్యే=జీవించను.

తా. రాజా ! వెళ్లుటకు శక్యము కాని దీర్ఘమైన మార్గములో ప్రయాణమైనావు. దుఃఖముచేత పీడితురాలనైన నన్ను కూడ తీసికొనివెళ్లుము. నీవు లేకుండా ఉండజాలను. 59

మూ. కస్మాత్త్వం మాం విహాయేహ కృపణాం గన్తుమిచ్ఛసి, 60
దీనాం విలపతీం మన్దాం కిం వా మాం నాభిభాషసే.

ప్ర. అ. త్వమ్=నీవు, కృపణామ్=దీనురాలనైన, మామ్=నన్ను, ఇహ=ఇక్కడ, విహాయ=విడచి, కస్మాత్=ఏ కారణమువలన, గన్తుమ్=వెళ్లుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు? దీనామ్=దీనురాలను, విలపతీమ్=విలపించుచున్నదానను, మన్దామ్=మందురాలను అయిన, మామ్=నన్ను గూర్చి, కిం వా=ఎందువలన, నాభిభాషసే=మాటలాడవు?

తా. నీవు దీనురాలనైన నన్ను ఇక్కడనే విడచి ఎందుకు వెళ్లిపోదల చుచున్నావు? దీనురాలను, విలపింపుచున్న దానను, మందబుద్ధి గలదానను అయిన నాతో ఎందుకు మాటలాడవు? 60

మూ. దృష్ట్వా న ఖల్వభిక్రుద్ధో మామిహానవగుణ్ఠితామ్, 61
నిర్గతాం నగరద్వారాత్పద్భ్యామేవాగతాం ప్రభో.

ప్ర. అ. ప్రభో=ప్రభూ ! నగరద్వారాత్=నగరద్వారమునుండి, నిర్గతామ్=బయటకు వచ్చిన, పద్భ్యామేవ=పాదములచేతనే, ఆగతామ్=వచ్చిన, అనవగుణ్ఠితామ్=ఆచ్ఛాదింపబడని, మామ్=నన్ను, ఇహ=ఇక్కడ, దృష్ట్వా=చూచి, న అభిక్రుద్ధః ఖలు=కోపించలేదుకదా ?

తా. ప్రభూ ! నేను మేలిముసుగు లేకుండా పాదచారిణిని అయి నగరద్వారమునుండి బైటకు వచ్చి ఇక్కడ ఉన్నా నని చూచి నీకు కోపము రాలేదు కదా ? 61

మూ. పశ్యేష్టదార దారాంస్తే భ్రష్టలజ్జావగుణ్ఠనాన్, 62
బహిర్నిష్పతితాన్ సర్వాన్ కథం దృష్ట్వా న కుప్యసి.

ప్ర. అ. ఇష్టదార=ఇష్టమైన భార్యలు కలవాడా ! భ్రష్టలజ్జావగుణ్ఠనాన్=లజ్జ అనే ముసుగు జారిపోయిన, బహిః=బైటకు, నిష్పతితాన్=వచ్చిన, తే=నీయొక్క, సర్వాన్=సమస్తమైన, దారాన్=భార్యలను, పశ్య=చూడుము. దృష్ట్వా=చూచి, కథం న కుప్యసి=ఎందుకు కోపించుట లేదు?

తా. భార్యలయందు ప్రేమగలవాడా ! నీ భార్యలందరు లజ్జ అనే మేలి ముసుగు జారవిడచి బైటకు వచ్చినారు, చూడుము. వాళ్లను చూచి కోపించవేమి ? 62

మూ. అయం క్రీడాసహాయస్తేఽనాథో లాలప్యతే జనః, 63
న చైనమాశ్వాసయసి కిం వా న బహుమన్యసే.

ప్ర. అ. తే=నీకు, క్రీడాసహాయః=క్రీడయందు సహాయమైన, అయం జనః=ఈ జనము, అనాథః=నాథుడు లేనిదై, లాలప్యతే=ఏడ్చుచున్నది. ఏనమ్=ఈ జనమును, న చ ఆశ్వాసయసి=ఊరడించకున్నావు. న బహుమన్యసే కిం వా=గౌరవించవా ?

తా. నీకు క్రీడయందు సహాయులుగా ఉన్న ఈ స్త్రీలందరు నాథుడు లేక ఏడ్చుచున్నారు. వాళ్లను ఎందుచేత ఓదార్చవు? వీళ్లపైన నీకు అభిమానములేదా ? 63

మూ. యాస్త్వయా విధవా రాజన్ కృతా నైకాః కులస్త్రియః, 64
పతివ్రతా ధర్మరతా గురుశుశ్రూషణే రతాః,
తాభిః శోకాభితప్తాభిః శప్తః పరవశం గతః, 65
త్వయా విప్రకృతాభిర్యత్తదా శప్తం తదాగతమ్.

ప్ర. అ. రాజన్=రాజా ! నైకాః=అనేకులైన, పతివ్రతాః=పతివ్రతలు, ధర్మరతాః=ధర్మమునందు ఆసక్తి గలవారు, గురుశుశ్రూషణే=గురువులను సేవించుటయందు, రతాః=ఆసక్తి గలవారు అయిన, యాః=ఏ, కులస్త్రియః=కులస్త్రీలు, త్వయా=నీచేత, విధవాః=విధవలుగా, కృతాః=చేయబడినారో, శోకాభితప్తాభిః=శోకముచేత పీడింపబడిన, తాభిః=వాళ్ళచేత, శప్తః=శపింపబడినవాడవై, పరవశం గతః=పరవశుడవైనావు. తదా=అప్పుడు, త్వయా=నీచేత, విప్రకృతాభిః=వియోగమును పొందించబడిన స్త్రీలచేత, యత్=ఏది, శప్తమ్=చంపించబడినదో, తత్=అది, ఆగతమ్=వచ్చినది.

తా. రాజా ! పతివ్రతలు, ధర్మనిరతలు, పెద్దల సేవయందు ఆసక్తి గలవారు అయిన ఏ అనేకకులస్త్రీలను నీవు భర్తలు లేనివారినిగా చేసినావో, దుఃఖముచే తపింపబడిన వాళ్లు శపించుటచే నీ విట్లు ఓడిపోయినావు. నీవు భర్తృవియోగము కలిగించిన స్త్రీలు ఇచ్చిన శాపమే ఇప్పుడు తగిలినది.64, 65

మూ. ప్రవాదః సత్య ఏవాయం త్వాం ప్రతి ప్రాయశో నృప, 66
పతివ్రతానాం నాకస్మాత్పతన్త్యశ్రూణి భూతలే.

ప్ర. అ. నృప=రాజా !, పతివ్రతానామ్=పతివ్రతలయొక్క, అశ్రూణి=కన్నీళ్లు, అకస్మాత్=కారణము లేకుండా (ఫలితము నివ్వకుండగా), భూతలే=నేలమీద, న పతన్తి=పడవు అను, అయమ్=ఈ, ప్రవాదః=లోకోక్తి, త్వాం ప్రతి=నిన్ను గూర్చి, ప్రాయశః=బహుశా, సత్య ఏవ=సత్యమే అయినది.

తా. రాజా ! "నేలమీద పడిన పతివ్రతల కన్నీళ్లు ఊరక పోవు"అను ఈ లోకులు చెప్పు మాట బహుశా నీ విషయమున సత్యమే అయినది. 66

మూ. కథం చ నామ తే రాజన్ లోకానాక్రమ్య తేజసా, 67
నారీచౌర్యమిదం క్షుద్రం కృతం శౌణ్డీర్యమానినా.

ప్ర. అ. రాజాన్=రాజా ! తే తేజసా=నీ తేజస్సుచేత, లోకాన్=లోకములను, ఆక్రమ్య=ఆక్రమించి; శౌణ్డీర్యమానినా=శూరుడ నను అభిమానము గల నీచేత, క్షుద్రమ్=నీచమైన, ఇదమ్=ఈ, నారీచౌర్యమ్=స్త్రీచౌర్యము, కథం చ నామ=ఎట్లు, కృతమ్=చేయబడినది.

తా. రాజా ! తేజస్సుచేత మూడు లోకములను ఆక్రమించి శూరుడ నని అనుకొనే నీవు నీచమైన ఈ స్త్రీచౌర్యమును ఎట్లు చేసినావు? 67

మూ. అపనీయాశ్రమాద్రామం యన్మృగచ్ఛద్మనా త్వయా, 68
ఆనీతా రామపత్నీ సా తత్తే కాతర్యలక్షణమ్.

ప్ర. అ. మృగచ్ఛద్మనా=మృగ మను వంకచేత, రామమ్=రాముణ్ణి, ఆశ్రమాత్=ఆశ్రమమునుండి, అపనీయ=దూరముగా తొలగించి, త్వయా=నీచేత, సా=ఆ, రామపత్నీ=రాముని భార్య, యత్ ఆనీతా=తీసికొనిరాబడినది అనునది ఏది కలదో, తత్=అది, తే=నీయొక్క, కాతర్యలక్షణమ్=పిరికితనముయొక్క లక్షణము.

తా. నీవు మృగ మనే మిషచేత రాముణ్ణి ఆశ్రమమునుండి దూరము చేసి ఆతని భార్యను తీసికొనివచ్చితివే - అది నీ పిరికితనము లక్షణము. 68

మూ. కాతర్యం న చ తే యుద్ధే కదాచిత్సంస్మరామ్యహమ్, 69
తత్తు భాగ్యవిపర్యాసాన్నూనం తే పక్వలక్షణమ్.

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, కదాచిత్=ఎన్నడూ, తే=నీయొక్క, కాతర్యమ్=పిరికితనమును, అహమ్=నేను, న సంస్మరామి=స్మరించను. తత్తు=ఆ సీతాపహారమైతే, భాగ్యవిపర్యాసాత్=భాగ్యము చెడిపోవుట వలన జరిగినది. నూనమ్=నిశ్చయముగా, తే=నీయొక్క, పక్వలక్షణమ్=పాపము పండుటకు లక్షణము.

తా. నీవు ఎన్న డైనా యుద్ధములో భయపడి నట్లు నాకు జ్ఞాపకము లేదు. దురదృష్టవశముచేత చేసిన ఆ సీతాపహారము నీ పాపము పండుటకు లక్షణము. 69

మూ. అతీతానాగతార్థజ్ఞో వర్తమానవిచక్షణః, 70
మైథిలీమాహృతాం దృష్ట్వా ధ్యాత్వా నిఃశ్వస్య చాయతమ్,
సత్యవాక్స మహాబాహో దేవరో మే యదబ్రవీత్, 71
అయం రాక్షసముఖ్యానాం వినాశః పర్యుపస్థితః,
కామక్రోధసముత్థేన వ్యసనేన ప్రసజ్గినా. 72

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! అతీతానాగతార్థజ్ఞః=గడచిన విషయములను రాబోవు విషయములను ఎరుగువాడు, వర్తమానవిచక్షణః=వర్తమానకార్యములయందు నేర్పు గలవాడు అయిన, సత్యవాన్=సత్యమైన వాక్కు గల, సః=ఆ, మే=నాయొక్క, దేవరః=మరదియైన విభీషణుడు,

ఆహృతామ్=తీసికొనిరాబడిన, మైథిలీమ్=సీతను, దృష్ట్వా=చూచి, ధ్యాత్వా=ఆలోచించి, ఆయతమ్=దీర్ఘముగా, నిఃశ్వస్య=నిట్టూర్చి, యత్=దేనిని, అబ్రవీత్=చెప్పెనో, అయమ్=ఈ, రాక్షసముఖ్యానామ్=రాక్షసముఖ్యులయొక్క, వినాశః=వినాశము, కామక్రోధసముత్థేన=కామక్రోధములవలన కలిగిన, ప్రసజ్గినా=స్త్రీయందు అత్యాసక్తితో కూడిన, వ్యసనేన=నీ వ్యసనముచేత, పర్యుపస్థితః=వచ్చినది.

తా. గడచిన విషయములను, రాబోవు విషయములను ఎరిగినవాడు, వర్తమానకార్యములందు నేర్పుగలవాడు, సత్యవాక్యము కలవాడు అయిన నా మరది విభీషణుడు తీసికొనిరాబడిన సీతను చూచి, ఆలోచించి, దీర్ఘముగా నిట్టూర్చి చెప్పినట్లుగా కామక్రోధములవలన కలిగిన నీ స్త్రీప్రసంగవ్యసనముచేత ఈ రాక్షసనాయకుల వినాశము వచ్చిపడినది. 70 - 72

మూ. నిర్వృత్తస్త్వత్కృతేఽనర్థః సోఽయం మూలహరో మహాన్,
త్వయా కృతమిదం సర్వమనాథం రాక్షసం కులమ్. 73

ప్ర. అ. త్వత్కృతే=నీ నిమిత్తముగా, సః అయమ్=అట్టి ఈ,మూలహరః=మూలమునే హరించు, మహాన్=గొప్ప, అనర్థః=అనర్థము, నిర్వృత్తః=జరిగినది. సర్వమ్=సమస్తమైన, ఇదమ్=ఈ, రాక్షసం కులమ్=రాక్షసులకు సంబంధించిన కులము, త్వయా=నీచేత, అనాథమ్=రక్షకుడు లేనిదిగా, కృతమ్=చేయబడినది.

తా. మూలమునే హరించిన ఈ గొప్ప అనర్థము నీ వలననే జరిగినది. నీవు ఈ రాక్షస కులము నంతనూ రక్షకుడు లేనిదానినిగా చేసినావు. 73

మూ. న హి త్వం శోచితవ్యో మే ప్రఖ్యాతబలపౌరుషః,
స్త్రీస్వభావాత్తు మే బుద్ధిః కారుణ్యే పరివర్తతే. 74

ప్ర. అ. ప్రఖ్యాతబలపౌరుషః=ప్రసిద్ధములైన బలపౌరుషములు గల, త్వమ్=నీవు, మే=నాకు, శోచితవ్యః=దుఃఖించదగినవాడవు, న హి=కాదు కదా? స్త్రీస్వభావాత్=స్త్రీస్వభావమువలన, మే బుద్ధిః=నాయొక్క బుద్ధి, కారుణ్యే=దైన్యమునందు, పరివర్తతే=ప్రవర్తించుచున్నది.

తా. ప్రసిద్ధములైన బలపౌరుషములు గల నిన్ను గూర్చి నేను విచారించకూడదు. కాని స్త్రీస్వభావము ననుసరించి నా బుద్ధి దైన్యమును పొందుచున్నది. 74

మూ. సుకృతం దుష్కృతం చ త్వం గృహీత్వా స్వాం గతిం గతః,
ఆత్మానమనుశోచామి త్వద్వినాశేన దుఃఖితామ్. 75

ప్ర. అ. త్వమ్=నీవు, సుకృతమ్=పుణ్యమును, దుష్కృతం చ=పాపమును,

గృహీత్వా=గ్రహించి, స్వామ్=నీకు సంబంధించిన, గతిమ్=గతిని, గతః=పొందినావు. త్వద్వినాశేన=నీ మరణముచేత, దుఃఖితామ్=దుఃఖించిన, ఆత్మానమ్=తనను గూర్చి, అనుశోచామి=దుఃఖించుచున్నాను.

తా. నీ పుణ్యపాపములను తీసికొని నీ దారిన నీవు వెళ్లిపోయినావు. నీ మరణముచేత దుఃఖితురాలనైన నన్ను గూర్చియే నేను విచారించుచున్నాను.75

మూ. సుహృదాం హితకామానాం న శ్రుతం వచనం త్వయా,
భ్రాతౄణాం చైవ కార్త్స్న్యేన హితముక్తం దశానన. 76

ప్ర. అ. దశానన=ఓ ! దశాననా ! త్వయా=నీచేత, హితకామానామ్=హితమును కోరుచున్న, సుహృదామ్=మిత్రులయొక్క, వచనమ్=వచనము, న శ్రుతమ్=వినబడలేదు. భ్రాతౄణాం చ=సోదరులయొక్క కూడా, ఉక్తమ్=చెప్పబడిన, హితమ్=హితవచనము, కార్త్స్న్యేన=పూర్తిగా, న=వినబడలేదు.

తా. దశాననా ! నీవు నీ హితమును కోరు మిత్రుల వచనమును గాని, సోదరులు చెప్పిన హితవచనములు గాని ఏ మాత్రమూ వినలేదు. 76

మూ. హేత్వర్థయుక్తం విధివచ్ఛ్రేయస్కరమదారుణమ్,
విభీషణేనాభిహితం న కృతం హేతుమత్త్వయా. 77

ప్ర. అ. త్వయా=నీచేత, హేత్వర్థయుక్తమ్=హేతువులతోను, మంచి అర్థముతోను కూడినది, విధివత్=యథాశాస్త్రముగాఉన్నది, శ్రేయస్కరమ్=శ్రేయస్సును కలిగించేది, అదారుణమ్=దారుణముకానిది, హేతుమత్=యుక్తులు కలది అయిన, విభీషణేన=విభీషణునిచేత, అభిహితమ్=చెప్పబడినది, న కృతమ్=చేయబడలేదు.

తా. విభీషణుడు మంచి హేతువులు అర్థమూ గల, శాస్త్రసంమతమైన, శ్రేయస్కరమైన, క్రూరము కాని, యుక్తియుక్తమైన కార్యమును బోధించగా నీవు అది చేయలేదు. 77

మూ. మారీచకుమ్భకర్ణాభ్యాం వాక్యం మమ పితుస్తథా,
న శ్రుతం వీర్యమత్తేన తస్యేదం ఫలమీదృశమ్. 78

ప్ర. అ. మారీచకుమ్భకర్ణాభ్యామ్=మారీచకుంభకర్ణులచే పలకబడిన వాక్యము, తథా=మరియు, మమ=నా వాక్యము, పితుః=తండ్రియొక్క, వాక్యమ్=వాక్యము, వీర్యమత్తేన=పరాక్రమముచేత మదించిన నీచేత, న శ్రుతమ్=వినబడలేదు. తస్య=దానికి, ఈదృశమ్=ఇట్టి, ఇదమ్=ఈ, ఫలమ్=ఫలము లభించినది.

తా. పరాక్రమముచేత మదించిన నీవు మారీచకుంభకర్ణుల మాట, నా మాట, నా తండ్రిమాట కూడ వినలేదు. ఇది దాని ఫలమే. 78

మూ. నీలజీమూతసంకాశ పీతామ్బర శుభాఙ్గద,
స్వగాత్రాణి వినిక్షిప్య కిం శేషే రుధిరాప్లుతః. 79

ప్ర. అ.నీలజీమూతసంకాశ=నల్లని మేఘముతో సమానుడా, పీతామ్బర=పచ్చని వస్త్రము గలవాడా ! శుభాఙ్గద=సుందరములైన బాహుపురులు గలవాడా ! స్వగాత్రాణి=నీ అవయవములను, వినిక్షిప్య=నేలమీద పడవేసి, రుధిరాప్లుతః=రక్తముచేత పూయబడినవాడవై, కిమ్=ఎందువలన, శేషే=నిద్రించుచున్నావు?

తా. నల్లని మేఘమువంటివాడా ! పీతవస్త్రము ధరించినవాడా ! సుందరములైన బాహుపురులు గలవాడా! నీ అవయువములను నేలపై పడవేసి రక్తముచేత తడిసి ఎందుకు ఇట్లు పండుకొని ఉన్నావు? 79

మూ. ప్రసుప్త ఇవ శోకార్తాం కిం మాం న ప్రతిభాషసే,
మహావీర్యస్య దక్షస్య సంయుగేష్వపలాయినః, 80
యాతుధానస్య దౌహిత్ర కిం మాం న ప్రతిభాషసే.

ప్ర. అ. ప్రసుప్తః ఇవ=నిద్రపోవుచున్నవాడవు వలె, శోకార్తామ్=శోకముచేత పీడితురాలనైన, మామ్=నన్ను గూర్చి, కిమ్=ఎందువలన, న ప్రతిభాషసే=బదులు పలుకుటలేదు. మహావీర్యస్య=గొప్ప పరాక్రమము గలవాడు, దక్షస్య=సమర్థుడు, సంయుగేషు=యుద్ధములయందు, అపలాయినః=పరుగెత్తనివాడు అయిన, యాతుధానస్య =(మాల్యవంతుడను) రాక్షసుని యొక్క, దౌహిత్ర=దౌహిత్రుడా ! మామ్=నన్ను గూర్చి, కిమ్=ఎందువలన, న ప్రతిభాషసే=బదులు చెప్పుటలేదు?

తా. నీవు నిద్రపోవుచున్నవాడవు వలె శోకపీడితురాలనైన నాకు ఎందుకు బదులు చెప్పవు? గొప్ప పరాక్రమము గలవాడు, యుద్ధములలో వెనుకకు తిరగనివాడు అయిన మాల్యవంతుని దౌహిత్రుడా ! నాకు బదులు చెప్పవేమి?

మూ. ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే నవే పరిభవే కృతే, 81
అద్య వై నిర్భయా లఙ్కాం ప్రవిష్టాః సూర్యరశ్మయః.

ప్ర. అ. ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ=లెమ్ము, లెమ్ము. నవే=నూతనమైన, పరిభవే=పరాభవము, కృతే=చేయబడినదగుచుండగా, కిమ్=ఎందుకు, శేషే=శయనించుచున్నావు? అద్య=ఇప్పుడు, సూర్యరశ్మయః=సూర్యకిరణములు, నిర్భయాః=భయము లేనివై, లఙ్కామ్=లంకను, ప్రవిష్టాః=ప్రవేశించినవి.

తా. క్రొత్తగా ఇంత పరాభవము జరిగిన పిమ్మట కూడ ఎందుకు శయనించి ఉన్నావు? లెమ్ము, లెమ్ము. ఇంతకాలము భయపడుచు భయపడుచు లంకలో ప్రవేశించిన సూర్యకిరణములు ఇప్పుడు నిర్భయముగా ప్రవేశించుచున్నవి.

మూ. యేన సూదయసే శత్రూన్ సమరే సూర్యవర్చసా, 82
వజ్రం వజ్రధరస్యేవ సోఽయం తే సతతార్చితః,
రణే బహుప్రహరణో హేమజాలపరిష్కృతః, 83
పరిఘో వ్యవకీర్ణస్తే బాణైశ్ఛిన్నః సహస్రధా.

ప్ర. అ. సూర్యవర్చసా=సూర్యుని వంటి కాంతి గల, యేన=దేని చేత, సమరే=యుద్ధమునందు, శత్రూన్=శత్రువులను, సూదయసే=చంపుదువో, సః=అట్టి, సతతార్చితః=ఎల్లప్పుడూ పూజింపబడినదీ, రణే=యుద్ధమునందు, బహుప్రహరణః=అనేకులను కొట్టునది, హేమజాలపరిష్కృతః=అధికమైన బంగారముచేత అలంకరింపబడినది, వజ్రధరస్య=ఇంద్రుని, వజ్రమ్ ఇవ=వజ్రము వంటి, తే=నీ యొక్క, అయం పరిఘః=ఈ పరిఘ, బాణైః=బాణములచేత, సహస్రధా=వేయి ముక్కలుగా, ఛిన్నః=ఛేదింపబడినదై, వ్యవకీర్ణః=పడిఉన్నది.

తా. సూర్యుని వంటి తేజస్సు గల దేనితో నీవు శత్రువులను నశింపచేసెడివాడవో, అట్టి ఎల్లప్పుడూ పూజింపబడినది, యుద్ధములో చాలమందిని సంహరించేదీ, బంగారముచేత అలంకరింపబడినదీ అయిన, దేవేంద్రుని వజ్రాయుధము వంటి నీ ఈ పరిఘ బాణాలచేత వేయి ముక్కలుగా బ్రద్దలుకొట్టబడినదై ముక్కలుగా పడి యున్నది. 82, 83.

మూ. ప్రియామివోపసంగృహ్య కిం శేషే రణమేదినీమ్, 84
అప్రియామివ కస్మాచ్చ మాం నేచ్ఛస్యభిభాషితుమ్.

ప్ర. అ. రణమేదినీమ్=యుద్ధభూమిని, ప్రియామివ=ప్రియురాలిని వలె, ఉపసంగృహ్య=కౌగలించుకొని, కిమ్=ఎందువలన, శేషే=శయనించి ఉన్నావు? మామ్=నన్ను గూర్చి, అప్రియామివ=అప్రియురాలిని వలె, అభిభాషితుమ్=బదులు చెప్పుటకు, కస్మాత్=ఏ కారణమువలన, నేచ్ఛసి=ఇచ్ఛయించుటలేదు?

తా. యుద్ధభూమిని ప్రియురాలిని వలె కౌగలించుకొని ఎందుకు పండుకొని ఉన్నావు? అప్రియురాలిని వలె నన్ను పలుకరించుటకు ఎందుకు ఇచ్ఛయించుటలేదు? 84

మూ. ధిగస్తు హృదయం యస్యా మమేదం న సహస్రధా, 85
త్వయి పఞ్చత్వమాపన్నే ఫలతే శోకపీడితమ్.

ప్ర. అ. త్వయి=నీవు, పఞ్చత్వమ్=మరణమును, ఆపన్నే=పొందినవాడవగుచుండగా, యస్యాః=ఏ, మమ=నాయొక్క, ఇదం హృదయమ్=ఈ హృదయము, శోకపీడితమ్=దుఃఖపీడితమై, సహస్రధా=వెయ్యి ముక్కలుగా, న ఫలతే=బ్రద్దలగుటలేదో, అట్టి నన్ను గూర్చి, ధిక్ అస్తు=నింద అగుగాక.

తా. ఛీ ! ఈ నా హృదయము ఎంత చెడ్డది ! నీవు మరణించిన పిమ్మట కూడ దుఃఖపీడితమై వేయి ముక్కలుగా బ్రద్దలగుటలేదు. 85

మూ. ఇత్యేవం విలపన్తీ సా బాష్పపర్యాకులేక్షణా, 86
స్నేహోపస్కన్నహృదయా తదా మోహముపాగమత్.

ప్ర. అ. సా=ఆ మండోదరి, ఇత్యేవమ్=ఇట్లు, విలపన్తీ=విలపించుచున్నదై, బాష్పపర్యాకులేక్షణా=కన్నీళ్లచేత వ్యాకులమైన చూపు గలదై, స్నేహోపస్కన్నహృదయా=స్నేహముచేత అణగిన హృదయము గలదై, తదా=అప్పుడు, మోహమ్=మోహమును, ఉపాగమత్=పొందెను.

తా. ఆ మండోదరి ఈ విధముగా విలపించుచు, కన్నీటిచేత చూపు వ్యాకులము కాగా, స్నేహముచేత దుర్బలమైన హృదయముతో అప్పుడు మూర్ఛ చెందెను. 86

మూ. కశ్మలాభిహతా సన్నా బభౌ సా రావణోరసి, 87
సంధ్యానురక్తే జలదే దీప్తా విద్యుదివోజ్జ్వలా.

ప్ర. అ. కశ్మలాభిహతా=దుఃఖముచేత కొట్టబడిన, సన్నా=దుర్బలురాలైన, సా=ఆమె, రావణోరసి=రావణుని వక్షఃస్థలముమీద, సంధ్యానురక్తే=సంధ్యచేత ఎఱ్ఱనైన, జలదే=మేఘమునందు, దీప్తా=ప్రజ్వలించుచున్న, ఉజ్జ్వలా=ప్రకాశించుచున్న, విద్యుదివ=మెరుపు వలె, బభౌ=ప్రకాశించెను.

తా. దుఃఖపీడితురాలై కృశించి రావణుని వక్షఃస్థలము మీద వ్రాలిన ఆ మండోదరి సంధ్యారాగముచేత ఎఱ్ఱనైన మేఘముమీద ప్రకాశించు మెరుపు వలె ఉండెను. 87

మూ. తథాగతాం సముత్థాప్య సపత్న్యస్తాం భృశాతురాః, 88
పర్యవస్థాపయామాసూ రుదన్త్యో రుదతీం భృశమ్.

ప్ర. అ. సపత్న్యః=సవతులు, తథాగతామ్=ఆ విధముగా అయిన, తామ్=ఆమెను, సముత్థాప్య=లేవదీసి, భృశాతురాః=మిక్కిలి పీడితలై, రుదన్త్యః=ఏడ్చుచున్నవారై, భృశమ్=మిక్కిలి, రుదన్తీమ్=ఏడ్చుచున్న ఆమెను, పర్యవస్థాపయామాసుః=ఓదార్చిరి.

తా. సవతులు అట్టి స్థితిలో ఉన్న ఆ మండోదరిని లేవదీసి, చాల పీడింపబడినవారై, ఏడ్చుచు, మిక్కిలి ఏడ్చుచున్న ఆమెను ఓదార్చిరి. 88

మూ. కిం తే న విదితా దేవి లోకానాం స్థితిరధ్రువా, 89
దశావిభాగపర్యాయే రాజ్ఞాం వై చఞ్చలాః శ్రియః.

ప్ర. అ. దేవి=ఓ ! దేవీ ! తే=నీకు, న విదితా కిమ్=తెలియదా? లోకానామ్=లోకముల, స్థితిః=స్థితి, అధ్రువా=స్థిరము కానిది. దశావిభాగ పర్యాయే=దశయొక్క మార్పు వంతు వచ్చినప్పుడు, రాజ్ఞామ్=రాజులయొక్క, శ్రియః=లక్ష్ములు, చఞ్చలాః=చంచలములు.

తా. దేవీ ! లోకముల స్థితి అస్థిరమైన దను విషయము నీకు తెలియదా ? దశలు మారినప్పుడు రాజుల వైభవములు చంచలములు కదా ?

మూ. ఇత్యేవముచ్యమానా సా సశబ్దం ప్రరురోద హ, 90
స్నాపయన్తీ తదాఽస్రేణ స్తనౌ వక్త్రం సునిర్మలమ్.

ప్ర. అ. సా=ఆమె, ఇత్యేవమ్=ఇట్లు, ఉచ్యమానా=చెప్పబడుచున్నదై, తదా=అప్పుడు, అస్రేణ=కన్నీటిచేత, స్తనౌ=స్తనములను, సునిర్మలమ్=మిక్కిల నిర్మలమైన, వక్త్రమ్=ముఖమునూ, స్నాపయన్తీ=తడుపుచున్నదై, సశబ్దమ్=శబ్దముతో కూడినట్లుగా, ప్రరురోద హ=ఏడ్చెను.

తా. వాళ్లు ఇట్లు పలుకుచుండగా ఆమె కన్నీళ్లతో నిర్మలమైన ముఖమును, స్తనములను తడుపుచు బిగ్గరగా ఏడ్చెను. 90

మూ. ఏతస్మిన్నన్తరే రామో విభీషణమువాచ హ, 91
సంస్కారః క్రియతాం భ్రాతుః స్త్రీగణః పరిసాన్త్వ్యతామ్.

ప్ర. అ. ఏతస్మిన్=ఈ, అన్తరే=మధ్యసమయమునందు, రామః=రాముడు, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, ఉవాచ హ=పలికెను. భ్రాతుః=సోదరునియొక్క, సంస్కారః=సంస్కారము, క్రియతామ్=చేయబడుగాక. స్త్రీగణః=స్త్రీసముదాయము, పరిసాన్త్వ్యతామ్=ఓదార్చబడుగాక.

తా. ఇంతలో రాముడు విభీషణునితో- "నీ సోదరునకు సంస్కారము చేయుము. ఈ స్త్రీల నందరినీ ఓదార్చుము"అని పలికెను. 91

మూ. తమువాచ తతో ధీమాన్ విభీషణ ఇదం వచః, 92
విమృశ్య బుద్ధ్యా ధర్మజ్ఞో ధర్మార్థసహితం హితమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధీమాన్=బుద్ధిమంతుడు, ధర్మజ్ఞః=ధర్మము తెలిసినవాడు అయిన, విభీషణః=విభీషణుడు, బుద్ధ్యా=బుద్ధితో, విమృశ్య=విమర్శించి, ధర్మార్థసహితమ్=ధర్మార్థములతో కూడిన, హితమ్=హితమైన, ఇదమ్=ఈ, వచః=వచనమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట బుద్ధిమంతుడు, ధర్మములు తెలిసినవాడు అయిన విభీషణుడు బుద్ధిచేత విమర్శించి ధర్మార్థములతో కూడినది, హితమూ అయిన

వాక్యము నిట్లు పలికెను. 92

మూ. త్యక్తధర్మవ్రతం క్రూరం నృశంసమనృతం తథా, 93
నాహమర్హో౽స్మి సంస్కర్తుం పరదారాభిమర్శినమ్.

ప్ర. అ. త్యక్తధర్మవ్రతమ్=విడవబడిన ధర్మము వ్రతము గలవాడు, క్రూరమ్=క్రూరుడు, నృశంసమ్= మానవులను చంపువాడు, తథా=మరియు, అనృతమ్=అసత్యస్వభావుడు, పరదారాభిమర్శినమ్=పరభార్యలను స్పృశించువాడు అయిన వీనిని, సంస్కర్తుమ్=సంస్కరించుటకు, అహమ్=నేను, అర్హః=తగినవాడను, న అస్మి=కాను.

తా. ధర్మమును వ్రతములను త్యజించినవాడు, క్రూరుడు, నరహింసకుడు, అసత్యస్వభావుడు, పరభార్యలను స్పృశించువాడు అయిన వీని సంస్కారముచేయుటకు నేను తగను. 93

మూ. భ్రాతృరూపో హి మే శత్రురేష సర్వాహితే రతః, 94
రావణో నార్హతే పూజాం పూజ్యో౽పి గురుగౌరవాత్.

ప్ర. అ. సర్వాహితే=అందరియొక్క అహితమునందు, రతః=ఆసక్తి గల, ఏషః రావణః=ఈ రావణుడు, గురుగౌరవాత్=పెద్దవా డనే గౌరవమువలన, పూజ్యో౽పి=పూజ్యుడే అయినను, భ్రాతృరూపః=సోదరరూపము గల, మే శత్రుః=నా శత్రువు. పూజామ్=పూజను, న అర్హతే=తగడు.

తా. అందరికి అపకారము చేయుటయందు ఆసక్తి గల ఈ రావణుడు పెద్దవాడనే గౌరవమువలన పూజ్యుడే అయినను పూజకు తగడు; ఇతడు నాకు సోదర రూపములో ఉన్న శత్రువు. 94

మూ. నృశంస ఇతి మాం రామ వక్ష్యన్తి మనుజా భువి, 95
శ్రుత్వా తస్యాగుణాన్ సర్వే వక్ష్యన్తి సుకృతం పునః.

ప్ర. అ. రామ=రామా ! భువి=భూలోకములో, మనుజాః=మానవులు, మామ్=నన్ను, నృశంసః ఇతి=క్రూరుడు అని, వక్ష్యన్తి=పలకగలరు. సర్వే=వాళ్లందరూ, పునః=మరల, తస్య=వానియొక్క, అగుణాన్=చెడ్డ గుణములను, శ్రుత్వా=విని, సుకృతమ్=మంచి పనినిగా, వక్ష్యన్తి=చెప్పగలరు.

తా. రామా ! నేను సంస్కారము చేయనిచో భూలోకములోని మానవులందరూ నన్ను క్రూరు డని నిందించెదరు. కాని వీని చెడ్డగుణములను గూర్చి విని మంచి పని చేసినాడని మరల అందురు. 95

మూ. తచ్ఛ్రుత్వా పరమప్రీతో రామో ధర్మభృతాం వరః, 96
విభీషణమువాచేదం వాక్యజ్ఞం వాక్యకోవిదః.

ప్ర. అ. తత్=ఆ వాక్యమును శ్రుత్వా=విని, పరమప్రీతః=చాల సంతోషించిన, ధర్మభృతామ్=ధర్మపోషకులలో, వరః=శ్రేష్ఠుడైన, వాక్యకోవిదః=వాక్యములను ఎరిగిన, రామః=రాముడు, వాక్యజ్ఞమ్=మాటలను ఎరిగిన, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును ఉవాచ=పలికెను.

తా. ఆ మాటలు విని ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడూ, మాటలలో నేర్పరీ అయిన రాముడు చాల సంతోషించి మాటలలో నేర్పుగల విభీషణునితో ఇట్లు పలికెను. 96

మూ. తవాపి మే ప్రియం కార్యం త్వత్ప్రభావాన్మయా జితమ్, 97
అవశ్యం తు క్షమం వాచ్యో మయా త్వం రాక్షసేశ్వర.

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! తవ=నీకు, మే అపి=నాకు (నాచేత) కూడ, ప్రియమ్=ప్రియము, కార్యమ్=చేయదగినది. త్వత్ప్రభావాత్=నీ ప్రభావమువలననే, మయా=నాచేత, జితమ్=జయించబడినది. అవశ్యమ్=తప్పకుండగా, మయా=నాచేత, క్షమమ్=యుక్తమైన విషయమును, వాచ్యః=చెప్పదగినావు.

తా. విభీషణా ! నేను కూడ నీకు ప్రియమైన పనిని చేయవలసి ఉన్నది. ఎందుచేత ననగా నీ ప్రభావముచేతనే నేను జయించకలిగితిని. నేను నీకు తప్పక తగిన విషయము చెప్పవలెను. 97

మూ. అధర్మానృతసంయుక్తః కామం త్వేష నిశాచరః, 98
తేజస్వీ బలవాన్ శూరః సంగ్రామేషు చ నిత్యశః.

ప్ర. అ. ఏషః=ఈ, నిశాచరః=రాక్షసుడు, అధర్మానృతసంయుక్తః కామమ్=అధర్మముతోను, అసత్యముతోను కూడినవాడే కావచ్చును. తు=కాని, తేజస్వీ=తేజఃశాలి. బలవాన్=బలవంతుడు. సంగ్రామేషు=యుద్ధములయందు, నిత్యశః=ఎల్లప్పుడూ, శూరః చ=శూరుడు.

తా. ఈ రావణుడు అధర్మముగా ప్రవర్తించినవాడు అసత్యశీలుడు కావచ్చును. కాని ఇతడు తేజఃశాలి, బలవంతుడు, ఎల్లప్పుడు యుద్ధములో శూరుడు. 98

మూ. శతక్రతుముఖైర్దేవైః శ్రూయతే న పరాజితః, 99
మహాత్మా బలసంపన్నో రావణో లోకరావణః.

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడు, బలసంపన్నః=బలముతో కూడినవాడు,

లోకరావణః=లోకములను ఏడ్పించినవాడు అయిన, రావణః=రావణుడు, శతక్రతుముఖైః=దేవేంద్రుడు మొదలైన, వీరైః=వీరులచేత, న పరాజితః=పరాజితుడు కానివాడుగా, శ్రూయతే=వినబడుచున్నాడు.

తా. మహాత్ముడు, బలవంతుడు, లోకములను ఏడ్పించినవాడు అయిన ఈ రావణుణ్ణి దేవేంద్రుడు మొదలైన వీరులు కూడ ఓడించజాలకపోయి రని వినుచున్నాము. 99

మూ. మరణాన్తాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్, 100
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ.
ప్ర.అ.తా. 109 సర్గలోని 25వ శ్లోకం చూడుడు. 100 100

మూ. త్వత్సకాశాద్దశగ్రీవః సంస్కారం విధిపూర్వకమ్, 101
ప్రాప్తు మర్హతి ధర్మేణ త్వం యశోభాగ్భవిష్యసి.

ప్ర. అ. దశగ్రీవః=రావణుడు, త్వత్సకాశాత్=నీనుండి, విధిపూర్వకమ్=శాస్త్రపూర్వకముగా, సంస్కారమ్=సంస్కారమును, ప్రాప్తుమ్=పొందుటకు, ధర్మేణ=ధర్మముచేత, అర్హతి=తగి ఉన్నాడు. త్వమ్=నీవు, యశోభాక్=కీర్తిని పొందేవాడవు, భవిష్యసి=కాగలవు.

తా. ధర్మానుసారముగా రావణునకు నీనుండి యథాశాస్త్రముగా సంస్కారము పొందుటకు అర్హత ఉన్నది. నీకు కూడ కీర్తి లభించును. 101

మూ. రాఘవస్య వచః శ్రుత్వా త్వరమాణో విభీషణః, 102
సంస్కారయితుమారేభే భ్రాతరం రావణం హతమ్.

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, రాఘవస్య=రామునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, త్వరమాణః=తొందరపడుచు, హతమ్=చంపబడిన, భ్రాతరమ్=సోదరుడైన, రావణమ్=రావణుణ్ణి, సంస్కారయితుమ్=సంస్కరింపచేయుటకు, ఆరేభే=ప్రారంభించెను.

తా. విభీషణుడు రాముని మాటలు విని తొందరపడుచు, మరణించిన, సోదరుడైన రావణునకు అంత్యసంస్కారము చేయుటకు ప్రారంభించెను. 102

మూ. స ప్రవిశ్య పురీం లఙ్కాం రాక్షసేన్ద్రో విభీషణః, 103
రావణస్యాగ్నిహోత్రం తు నిర్యాపయతి సత్వరమ్.

ప్ర. అ. రాక్షసేన్ద్రః=రాక్షసప్రభువైన, సః విభీషణః=ఆ విభీషణుడు, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, ప్రవిశ్య=ప్రవేశించి, సత్వరమ్=శీఘ్రముగా, రావణస్య=రావణునియొక్క, అగ్నిహోత్రమ్=అగ్నిహోత్రమును, నిర్యాపయతి=బైటకు

తెప్పించెను.

తా. రాక్షస ప్రభువైన ఆ విభీషణుడు లంకానగరములో ప్రవేశించి శీఘ్రముగా రావణుని అగ్నిహోత్రమును తెప్పించెను.

(ఈ శ్లోకము మొదలు తొమ్మిదిన్నర శ్లోకములు చాలా ప్రతులలో లేవు. గోవిందరాజాదులు వ్యాఖ్యానించలేదు. ప్రాచ్యప్రతిలో లేవు.) 103

మూ. శకటాన్ దారురూపాణి అగ్నీన్ వై యాజకాంస్తథా, 104
తథా చన్దనకాష్ఠాని కాష్ఠాని వివిధాని చ,
అగరూణి సుగన్ధీని గన్ధాంశ్చ సురభీంస్తథా, 105
మణిముక్తాప్రవాళాని నిర్యాపయతి రాక్షసః.

ప్ర. అ. శకటాన్=బండ్లను, దారురూపాణి=కఱ్ఱతో చేసిన సామాన్లను, అగ్నీన్=అగ్నులను, తథా=మరియు, యాజకాన్=ఋత్విక్కులను, తథా=మరియు, చన్దనకాష్ఠాని=మంచిగంధపు కట్టెలను, వివిధాని=అనేక విధములైన, కాష్ఠాని=కట్టెలను, సుగన్ధీని=మంచి గంధము గల, అగరూణి=అగరువులను, గన్ధాంశ్చ=గంధద్రవ్యములను, తథా=మరియు, సురభీన్=పరిమళించు ద్రవ్యములను, మణిముక్తాప్రవాళాని=మణులను, ముత్యములను, పగడములను, రాక్షసః=విభీషణుడు, నిర్యాతయతి=బైటకు తెప్పించెను.

తా. విభీషణుడు బండ్లను, కఱ్ఱసామానులను, అగ్నులను, ఋత్విక్కులను, చందనకాష్ఠములను, ఇతరములైన కట్టెలను, పరిమళించు అగరువులను, గంధద్రవ్యములను, బాగా పరిమళించు వస్తువులను, మణులను, ముత్యములను, పగడములను తెప్పించెను. 104, 105

మూ. ఆ జగామ ముహూర్తేన రాక్షసైః పరివారితః 106
తతో మాల్యవతా సార్ధం క్రియామేవ చకార సః.

ప్ర. అ. రాక్షసైః=రాక్షసులచేత, పరివారితః=చుట్టబడినవాడై, ముహూర్తేన=ముహూర్తకాలముచేత, ఆజగామ=వచ్చెను. తతః=అటుపిమ్మట, మాల్యవతా సార్ధమ్=మాల్యవంతునితో కూడ, క్రియామ్=క్రియను, సః=అతడు, చకార=చేసెను.

తా. అతడు రాక్షసులతో కలిసి శీఘ్రముగా వచ్చి మాల్యవంతునితో కూడ క్రియలు చేసెను. 106

మూ. సౌవర్ణీం శిబికాం దివ్యామారోప్య క్షౌమవాససమ్, 107
రావణం రాక్షసాధీశమశ్రుపూర్ణముఖా ద్విజాః,
తూర్యఘోషైశ్చ వివిధైః స్తువద్భిశ్చాభినన్దితమ్, 108

పతాకాభిశ్చ చిత్రాభిః సుమనోభిశ్చ చిత్రితామ్,
ఉత్క్షిప్య శిబికాం తాం తు విభీషణపురోగమాః 109
దక్షిణాభిముఖాః సర్వే గృహ్య కాష్ఠాని భేజిరే.

ప్ర. అ. అశ్రుపూర్ణముఖాః=కన్నీళ్ళతో నిండిన ముఖములు గల, సర్వే=సమస్తమైన, ద్విజాః=బ్రాహ్మణులు, క్షౌమవాసనమ్=పట్టుబట్టలు గలవాడు, వివిధైః=అనేకవిధములైన, తూర్యఘోషైః=వాద్యఘోషములచేతను, స్తువద్భిః చ=స్తోత్రపాఠకులచేతను, అభినన్దితమ్=అభినందించబడిన, రాక్షసాధీశమ్=రాక్షసప్రభువైన, రావణమ్=రావణుణ్ణి, సౌవర్ణీమ్=బంగారము వికారమైన, దివ్యామ్=సుందరమైన, శిబికామ్=పల్లకీని, ఆరోప్య=ఎక్కించి, చిత్రాభిః=చిత్రవర్ణములుగల, పతాకాభిశ్చ=పతాకలచేతను, సుమనోభిః=పుష్పములచేతను, చిత్రితామ్=వేరువేరురంగులు కలదిగా చేయబడిన, తాం శిబికామ్= పల్లకీని, ఉత్క్షిప్య=ఎత్తి, విభీషణపురోగమాః=విభీషణుడు ముందు నడచువాడుగా కలవారై,కాష్ఠాని=కట్టెలను, గృహ్య=గ్రహించి, దక్షిణాభిముఖాః=దక్షిణాభిముఖులై, భేజిరే=(శ్మశానమార్గమును) పొందిరి.

తా. కన్నీళ్ళతో నిండిన ముఖములతో బ్రాహ్మణులందరూ, పట్టువస్త్రములు ధరించిన, అనేకవిధములైన వాద్యధ్వనులచేతను, స్తోత్రపాఠకులచేతను అభినందింపబడుచున్న, రాక్షస ప్రభువైన ఆ రావణుణ్ణి సుందరమైన బంగరు పల్లకీ ఎక్కించి, చిత్రవర్ణములైన పతాకలతోను, పుష్పములతోను విచిత్రవర్ణముగల ఆ పల్లకీని ఎత్తి, విభీషణుడు ముందు నడచుచుండగా కట్టెలను తీసికొని, దక్షిణాభిముఖులై శ్మశానము వైపు వెళ్ళిరి.

మూ. అగ్నయో దీప్యమానాస్తే తదాధ్వర్యుసమీరితాః, 110
శరణాభిగతాః సర్వే పురస్తాత్తస్య తే యయుః.

ప్ర. అ. తదా=అప్పుడు, అధ్వర్యుసమీరితాః=అధ్వర్యునిచేత ప్రేరేపింపబడిన, తే=ఆ, అగ్నయః=అగ్నులు,లు, దీప్యమానాః=ప్రజ్వలించుచున్నవిగా అయినవి. సర్వే=సమస్తమైన, తే=ఆ అగ్నులు, శరణాభిగతాః=తమ స్థానములైన కుండలలో ఉన్నవై, తస్య=ఆ రావణునియొక్క, పురస్తాత్=ముందు, యయుః=వెళ్లినవి.

తా. అప్పుడు అధ్వర్యువు ప్రజ్వలింపచేయగా అగ్నులు మండినవి. కుండలలో ఉంచబడిన ఆ అగ్నులన్నీ ఆ రావణునికి ముందు వెళ్ళినవి. 110

మూ. అన్తఃపురాణి సర్వాణి రుదమానాని సత్వరమ్, 111
పృష్ఠతోఽనుయయుస్తాని ప్లవమానాని సర్వతః.

ప్ర. అ. తాని=ఆ, సర్వాణి=సమస్తమైన, అన్తఃపురాణి=అంతఃపురములు, రుదమానాని=ఏడ్చుచు, సర్వతః=అన్ని వైపులా, సత్వరమ్=తొందరగా,

ప్లవమానాని=ఎగురుచు, పృష్ఠతః=వెనుక, అనుయయుః=అనుసరించి వెళ్ళినవి.

తా. అంతఃపుర స్త్రీలందరూ ఏడ్చుచు, నడక అలవాటు లేకపోవుటచేత గంతులు వేయుచున్నట్లు నడచుచు, తొందరగా అన్నివైపులనుండీ ఆతని వెనుక వెళ్లిరి. 111

మూ. రావణం ప్రయతే దేశే స్థాప్య తే భృశదుఃఖితాః, 112
చితాం చన్దనకాష్ఠైశ్చ పద్మకోశీరసంవృతామ్.
బ్రాహ్మ్యా సంవర్తయామాసూ రాఙ్కవాస్తరణావృతామ్, 113
వర్తతే వేదవిహితో రాజ్ఞో వై పశ్చిమః క్రతుః.

ప్ర. అ. తే=వాళ్ళు, రావణమ్=రావణుణ్ణి, ప్రయతే=పవిత్రమైన, దేశే=ప్రదేశమునందు, స్థాప్య=ఉంచి, భృశదుఃఖితాః=చాల దుఃఖించుచు, చన్దన కాష్ఠైశ్చ=మంచిగంధపు కట్టెలతో, పద్మకోశీరసంవృతామ్=పద్మకము ఉశీరము అనుసుగంధద్రవ్యముచేత తడపబడిన, రాఙ్కవాస్తరణావృతామ్=ఉన్ని బట్టతో కప్పబడిన, చితామ్=చితను, బ్రాహ్మ్యా=వేదవిధానముచేత, సంవర్తయామాసుః=ఏర్పరిచిరి. రాజ్ఞః=ఆ రాక్షసరాజుయొక్క, పశ్చిమః క్రతుః=చివరి, సంస్కారము, వేదవిహితః=వేదవిహితమైనది, వర్తతే=జరుగుచున్నది.

తా. చాల దుఃఖించుచున్న వాళ్ళు రావణుణ్ణి ఒక పవిత్ర స్థానమునందు ఉంచి, మంచిగంధపు కట్టెలతో పద్మకముచేతను, వట్టివేళ్ళచేతను కప్పబడిన, ఉన్నిబట్ట పైన పరచిన చితను వేదోక్తరీతిలో ఏర్పరిచిరి. ఆ రావణుని అంత్యక్రియలు వేదోక్తవిధానమున జరుపబడినవి. 112, 113

మూ. ప్రచక్రూ రాక్షసేన్ద్రస్య పితృమేధమనుత్తమమ్, 114
వేదిం చ దక్షిణప్రాచ్యాం యథాస్థానం చ పావకమ్.

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య=రావణునకు, అనుత్తమమ్=శ్రేష్ఠమైన, పితృమేధమ్=పితృమేధమును, ప్రచక్రుః=చేసిరి. దక్షిణప్రాచ్యామ్=ఆగ్నేయమునందు, వేదిం చ=వేదిని, యథాస్థానమ్=స్థానానుసారముగా, పావకమ్=అగ్నిని ఉంచిరి.

తా. రాక్షసరాజునకు శ్రేష్ఠమైన పితృమేధోక్తమైన కర్మను చేసిరి. ఆగ్నేయమున వేదిని ఏర్పరచి తగుస్థానములలో అగ్నిని ఉంచిరి. [అనగా ఆగ్నేయమునందు ఆహవనీయాగ్నిని, వాయవ్యమునందు గార్హపత్యాగ్నిని, నైరృతియందు దక్షిణాగ్నిని ఉంచిరి. ఈ ప్రక్రియ అంతా ఆహితాగ్నికి చేయవలసిన అంత్యేష్టిలో చేయబడును. రావణుడు అనేక యజ్ఞాదులు చేసిన ఆహితాగ్ని.]

మూ. పృషదాజ్యేన సంపూర్ణం స్రువం స్కన్ధే ప్రచిక్షిపుః, 115
పాదయోః శకటం ప్రాదురూర్వోశ్చోలూఖలం తదా.

ప్ర. అ. [ఆహితాగ్ని జీవితకాలములో ఉపయోగించిన యజ్ఞోప యుక్తసాధనాలన్నీ ఆతని చితిలో పడవేయబడును.] పృషదాజ్యేన=పెరుగు కలిపిన నేతితో, సంపూర్ణమ్=నిండిన, స్రువమ్=స్రువమును, స్కన్ధే=భుజముపైన, ప్రచిక్షిపుః=పడవేసిరి. శకటమ్=సోమలతను తీసికొనివచ్చుటకు ఉపయోగించిన బండిని, పాదయోః=పాదములయందు, ప్రాదుః=ఉంచిరి. తదా=అప్పుడు, ఉలూఖ లమ్=(హోమము చేయుటకై ధాన్యమును దంచు)రోలును, ఊర్వోః చ=తొడల యందు ఉంచిరి.

తా. పెరుగు కలిపిన నేతితో నింపిన స్రువమును ఆతని భుజము వైపు పడవేసిరి. బండిని పాదాల దగ్గర, రోలును తొడల దగ్గర ఉంచిరి. 115

మూ. దారుపాత్రాణి సర్వాణి అరణిం చోత్తరారణిమ్, 116
దత్త్వా తు ముసలం చాన్యం యథాస్థానం విచక్రముః.

ప్ర. అ. సర్వాణి=సమస్తమైన, దారుపాత్రాణి=కఱ్ఱగిన్నెలను, అరణిమ్=అ రణిని (యజ్ఞము మొదలైన వైదికకర్మలకు అవసరమైన అగ్నిని పుట్టించుటకు ఒక కఱ్ఱకు రంధ్రముచేసి, ఆ రంధ్రములో మరొక కఱ్ఱ అగ్రభాగము చొనిపి, పైనుండి ఒకరు గట్టిగా అదిమిపట్టగా మరొకరు మజ్జిగ చిలికినట్లు చిలకగా కొంతసేపటికి అగ్ని పడును. ఆ అగ్ని మాత్రమే నిత్యాగ్నిహోత్రాది వైదికకర్మలకు ఉపయోగించవలెను. ఈ కఱ్ఱలకు అరణి అని పేరు.) ఉత్తరారణిమ్=పై అరణిని, ముసలమ్=రోకలిని, అన్యం చ=ఇతర వస్తువులను, యథాస్థానమ్=స్థానానుసారముగా, దత్త్వా=ఉంచి, విచక్రముః=చితచుట్టూ నడచిరి.

తా. కఱ్ఱగిన్నెలు, అరణి, ఉత్తరారణి, రోకలి, ఇతర వస్తువులు శాస్త్రోక్తస్థానములలో ఉంచి చిత చుట్టూ తిరిగిరి. 116

మూ. శాస్త్రదృష్టేన విధినా మహర్షివిహితేన చ, 117
తత్ర మేధ్యం పశుం హత్వా రాక్షసేన్ద్రస్య రాక్షసాః,
పరిస్తరణికాం రాజ్ఞో ఘృతాక్తాం సమవేశయన్. 118

ప్ర. అ. తత్ర=అక్కడ, రాక్షసాః=రాక్షసులు, శాస్త్రదృష్టేన=శాస్త్రములలో చూడబడిన, మహర్షివిహితేన చ=మహర్షులచేత విధింపబడిన, విధినా=విధిచేత, మేధ్యమ్=పవిత్రమైన, పశుమ్=పశువును, హత్వా=చంపి, రాక్షసేన్ద్రస్య=రాక్షసప్ర భువైన, రాజ్ఞః=రావణునికి, ఘృతాక్తామ్=నేతిలో తడపబడిన, పరిస్తరణికామ్=వసను, సమవేశయన్=ఉంచిరి.

తా. రాక్షసులు అక్కడ శాస్త్రోక్తమైన, మహర్షులచేత విధింపబడిన విధానముచేత పవిత్రమైన పశువును (మేకను) చంపి, దాని వపను [మేక కడుపులో ఉండే ఉల్లిపొర కాగితము వంటి పదార్థము] ఆ రాక్షస రాజు ముఖముపై ఉంచిరి. 117, 118

మూ. గన్ధైర్మాల్యైరలంకృత్య రావణం దీనమానసాః, 119
విభీషణసహాయాస్తే వస్త్రైశ్చ వివిధైరపి,
లాజైరవకిరన్తి స్మ బాష్పపూర్ణముఖాస్తథా. 120

ప్ర. అ. విభీషణసహాయాః=విభీషణునితో కూడిన, తే=ఆ రాక్షసులు, దీనమానసాః=దీనమైన మనస్సు గలవారై, రావణమ్=రావణుణ్ణి, గన్ధైః=గంధములచేత, మాల్యైః=మాలలచేత, వివిధైః=అనేకవిధములైన, వస్త్రైశ్చ=వస్త్రములచేత, అలంకృత్య=అలంకరించి, తథా=మరియు, బాష్పపూర్ణముఖాః=కన్నీళ్ళతో నిండిన ముఖములు గలవారై, లాజైః=పేలాలచేత, అవాకిరన్తి స్మ=చల్లిరి.

తా. విభీషణునితో కూడిన, దీనములైన, మనస్సులు గల ఆ రాక్షసులు రావణుణ్ణి గంధములచేత, పుష్పమాలలచేత, అనేక విధములైన వస్త్రములచేత అలంకరించి, కన్నీళ్ళతో నిండిన ముఖములతో ఆతనిపై పేలాలు చల్లిరి. 120

మూ. స దదౌ పావకం తస్య విధియుక్తం విభీషణః.
స్నాత్వా చైవార్ద్రవస్త్రేణ తిలాన్ దర్భవిమిశ్రితాన్, 121
ఉదకేన చ సంమిశ్రాన్ ప్రదాయ విధిపూర్వకమ్,
ప్రదాయ చోదకం తస్మై మూర్ధ్నా చైనం నమస్య చ. 122
తాః స్త్రియోఽనునయామాస సాన్త్వయిత్వా పునః పునః,
గమ్యతామితి తాః సర్వా వివిశుర్నగరం తతః. 123

ప్ర. అ. సః విభీషణః=ఆ విభీషణుడు, తస్య=వానికి, విధియుక్తమ్=యథాశాస్త్రముగా, పావకమ్=అగ్నిని, దదౌ=ఇచ్చెను. స్నాత్వా=స్నానముచేసి, ఆర్ద్రవస్త్రేణ=తడిబట్టతో, దర్భవిమిశ్రితాన్=దర్భలతో కలపబడిన, ఉదకేన చ=ఉదకముతో కూడ, సంమిశ్రాన్=కలిసిన, తిలాన్=తిలలను, విధిపూర్వకమ్=యథాశాస్త్రముగా, ప్రదాయ=ఇచ్చి, తస్మై=ఆతనికి, ఉదకం చ=ఉదకమును కూడ ప్రదాయ=ఇచ్చి, ఏనమ్=వీనిని, మూర్ధ్నా=శిరస్సుచేత, నమస్య చ=నమస్కరించి, తాః స్త్రియః=ఆ స్త్రీలను, పునః పునః=మాటిమాటికి, సాన్త్వయిత్వా=ఓదార్చి, గమ్యతామ్=వెళ్లెదరుగాక, ఇతి=అని, అనునయామాస=బ్రతిమాలెను. తాః సర్వాః=ఆ స్త్రీలందరూ, తతః=అటుపిమ్మట, నగరమ్=నగరమును,వివిశుః=ప్రవేశించిరి.

తా. విభీషణుడు యథాశాస్త్రముగా రావణుని చితికి నిప్పు ముట్టించి,

స్నానము చేసి, తడి బట్టతో ఉండగానే దర్భలు, ఉదకము కలిపిన తిలలను ఆతనికి యథావిధిగా సమర్పించి, జలతర్పణము కూడ చేసి, తలవంచి ఆతనికి యథావిధిగా నమస్కరించి, పిదప ఆ స్త్రీలను మాటిమాటికి ఓదార్చి ఇంటికి వెళ్లుడని బ్రతిమాలుకొనెను. అప్పుడా స్త్రీలందరూ నగరములో ప్రవేశించిరి.

మూ. ప్రవిష్టాసు పురీం స్త్రీషు రాక్షసేన్ద్రో విభీషణః,
రామపార్శ్వముపాగమ్య తదాతిష్ఠద్వినీతవత్. 124

ప్ర. అ. స్త్రీషు=స్త్రీలు, పురీమ్=పట్టణమును, ప్రవిష్టాసు=ప్రవేశించిన వారగుచుండగా, రాక్షసేన్ద్రః= రాక్షస ప్రభువైన, విభీషణః=విభీషణుడు, తదా=అప్పుడు, రామపార్శ్వమ్=రాముని పార్శ్వమును, ఉపాగమ్య=చేరి, వినీతవత్=వినయవంతుడై, అతిష్ఠత్=నిలచెను.

తా. ఆ స్త్రీలు పట్టణములో ప్రవేశించిన పిమ్మట రాక్షస ప్రభువైన విభీషణుడు, రాముని దగ్గరకు వచ్చి వినయముతో నిలబడెను. 124

మూ. రామోఽపి సహ సైన్యేన ససుగ్రీవః సలక్ష్మణః,
హర్షం లేభే రిపుం హత్వా వృత్రం వజ్రధరో యథా. 125

ప్ర. అ. ససుగ్రీవః=సుగ్రీవునితో కూడిన, సలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, సైన్యేన సహ=సైన్యముతో కూడ ఉన్న, రామోఽపి=రాముడు కూడ, రిపుమ్=శత్రువును, హత్వా=చంపి, వృత్రమ్=వృత్రాసురుణ్ణి, హత్వా=చంపి, వజ్రధరో యథా=దేవేంద్రుడు వలె, హర్షమ్=సంతోషమును, లేభే=పొందెను.

తా. సైన్యముతోను, లక్ష్మణసుగ్రీవులతోను కూడిన రాముడు శత్రువును చంపి, వృత్రాసురుణ్ణి చంపిన ఇంద్రుడు వలె సంతోషించెను. 125

మూ. తతో విముక్త్వా సశరం శరాసనం
మహేన్ద్రదత్తం కవచం చ తన్మహత్,
విముచ్య రోషం రిపునిగ్రహాత్తతో
రామః సుసౌమ్యత్వముపాగతోఽరిహా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకాదశాధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అరిహా=శత్రుసంహారకుడైన, సః రామః=ఆ రాముడు, సశరమ్=శరములతో కూడిన, శరాసనమ్=ధనస్సును, మహేన్ద్రదత్తమ్= మహేంద్రునిచేత ఇవ్వబడిన, మహత్=గొప్పదైన, తత్=ఆ, కవచమ్=కవచమును, విముచ్య=విడచి, రిపునిగ్రహాత్=శత్రువును నిగ్రహించుటవలన, రోషమ్=కోప

మును, విముక్త్వా=విడచి, తతః=పిమ్మట, సుసౌమ్యత్వమ్=చాల సౌమ్యత్వమును, ఉపాగతః=పొందినాడు.

తా. శత్రుసంహారకుడైన ఆ రాముడు బాణములను, ధనస్సును, దేవేంద్రు డిచ్చిన ఆ గొప్ప కవచమును విడచి, శత్రుసంహారము అయిపోవుటచేత కోపమును విడచి, చాలా సౌమ్యత్వమును పొందెను.

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదకొండవ సర్గ సమాప్తము.

# అథ ద్వాదశాధికశతతమః సర్గః

[విభీషణుని రాజ్యాభిషేకము, రాముడు హనుమంతునిద్వారా సీతకు సందేశము పంపుట.]

మూ. తే రావణవధం దృష్ట్వా దేవగన్ధర్వదానవాః,
జగ్ముః స్వైః స్వై ర్విమానైస్తే కథయన్తః శుభాః కథాః. 1

ప్ర. అ. తే=ఆ, దేవగన్ధర్వ దానవాః=దేవతలు, గంధర్వులు, దానవులు, రావణవధమ్=రావణుని వధను, దృష్ట్వా=చూచి, తే=వారు, శుభాః=శుభములైన, కథాః=కథలను, కథయన్తః=చెప్పుకొనుచు, స్వైః స్వైః=తమ తమ, విమానైః=విమానములచేత, జగ్ముః=వెళ్లిపోయిరి.

తా. ఆ దేవ-గంధర్వ-దానవులు రావణసంహారమును చూచి ఆ యా వృత్తాంతములను గూర్చి ముచ్చటించుకొనుచు తమ తమ విమానములమీద వెళ్లిపోయిరి. 1

మూ. రావణస్య వధం ఘోరం రాఘవస్య పరాక్రమమ్,
సుయుద్ధం వానరాణాం చ సుగ్రీవస్య చ మన్త్రితమ్. 2
అనురాగం చ వీర్యం చ సౌమిత్రే ర్లక్ష్మణస్య చ,
పతివ్రతాత్వం సీతాయా హనూమతి పరాక్రమమ్, 3
కథయన్తో మహాభాగా జగ్ముర్హృష్టా యథాగతమ్.

ప్ర. అ. మహాభాగాః=గొప్ప భాగ్యవంతులైన ఆ దేవతాదులు, రావణస్య=రావణునియొక్క, ఘోరమ్=ఘోరమైన, వధమ్=వధను, రాఘవస్య=రామునియొక్క, పరాక్రమమ్=పరాక్రమమును, వానరాణామ్=వానరులయొక్క, సుయుద్ధమ్=మంచి యుద్ధమును, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, మన్త్రితమ్=ఆలోచనను, సౌమిత్రేః=సుమిత్రా కుమారుడైన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, అనురాగం చ=అనురాగమును, వీర్యం చ=పరాక్రమమును, సీతాయాః=సీతయొక్క, పతివ్రతాత్వమ్=పాతివ్రత్యమును, హనూమతి=హనుమంతునియందు, పరాక్రమమ్=పరాక్రమమును, కథయన్తః=చెప్పుకొనుచు, హృష్టాః=సంతోషించినవారై, యథాగతమ్=వచ్చినట్లుగానే, జగ్ముః=వెళ్లిరి.

తా. మహాభాగ్యవంతులైన ఆ దేవగంధర్వాదులు ఘోరమైన రావణవధ,

రాముని పరాక్రమము, వానరులు చేసిన మంచి యుద్ధము, సుగ్రీవుని ఆలోచనాశక్తి, సుమిత్రాపుత్రుడైన లక్ష్మణుని భ్రాతృస్నేహము, పరాక్రమము, సీత పాతివ్రత్యము, హనుమంతుని పరాక్రమము మొదలైన విషయములు చెప్పుకొనుచు సంతోషముతో వచ్చినట్లుగానే తిరిగి వెళ్లిపోయిరి. 2, 3.

మూ. రాఘవస్తు రథం దివ్యమిన్ద్రదత్తం శిఖిప్రభమ్, 4
అనుజ్ఞాయ మహాబాహుర్మాతలిం ప్రత్యపూజయత్.

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, రాఘవస్తు=రాముడైతే, ఇన్ద్రదత్తమ్=ఇంద్రునిచేత ఇవ్వబడిన, శిఖిప్రభమ్=అగ్నివంటి కాంతి గల, దివ్యమ్=దివ్యమైన, రథమ్=రథమును, అనుజ్ఞాయ=అనుమతించి, మాతలిమ్=మాతలిని, ప్రత్యపూజయత్=పూజించెను.

తా. గొప్ప బాహువులు గల రాముడు ఇంద్రుడు పంపిన, అగ్నివంటి కాంతి గల ఆ దివ్య రథమును గూర్చి అనుజ్ఞ ఇచ్చి మాతలిని గౌరవించెను. 4

మూ. రాఘవేణాభ్యనుజ్ఞాతో మాతలిః శక్రసారథిః, 5
దివ్యం తం రథమాస్థాయ దివమేవోత్పపాత హ.

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, అభ్యనుజ్ఞాతః=అనుజ్ఞ ఇవ్వబడిన, శక్రసారథిః=ఇంద్రుని సారథియైన, మాతలిః=మాతలి, దివ్యమ్=దివ్యమైన, తం రథమ్=ఆ రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, దివమేవ=స్వర్గమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను.

తా. ఇంద్రుని సారథియైన మాతలి రాముని అనుజ్ఞ పొంది ఆ దివ్యమైన రథమునెక్కి స్వర్గమునకు ఎగిరి వెళ్లెను. 5

మూ. తస్మింస్తు దివమారూఢే సరథే రథినాం వరః, 6
రాఘవః పరమప్రీతః సుగ్రీవం పరిషస్వజే.

ప్ర. అ. తస్మిన్=ఆ మాతలి, సరథే=రథసహితుడై, దివమ్=స్వర్గమును, ఆరూఢే=ఎక్కినవాడగుచుండగా, రథినామ్=రథికులలో, వరః=శ్రేష్ఠుడైన, రాఘవః=రాముడు, పరమప్రీతః=మిక్కిలి సంతోషించినవాడై, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, పరిషస్వజే=కౌగిలించుకొనెను.

తా. మాతలి రథసహితుడై స్వర్గలోకములోనికి వెళ్లిన పిమ్మట రథికులలో శ్రేష్ఠుడైన రాముడు చాల సంతోషించి సుగ్రీవుణ్ణి కౌగలించుకొనెను.

మూ. పరిష్వజ్య చ సుగ్రీవం- లక్ష్మణేనాభివాదితః, 7
పూజ్యమానో హరిగణైరాజగామ బలాలయమ్.

ప్ర. అ. సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, పరిష్వజ్య చ=కౌగలించుకొని, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, అభివాదితః=నమస్కరించబడినవాడై, హరిగణైః=వానరసముదాయములచేత, పూజ్యమానః=పూజించబడుచు, బలాలయమ్=సేనానివాసమును గూర్చి, ఆజగామ=వచ్చెను.

తా. సుగ్రీవుణ్ణి కౌగలించుకొని, లక్ష్మణునిచేత నమస్కరింపబడినవాడై, వానరసముదాయములచేత పూజింపబడుచు సేనానివాసమునకు వచ్చెను. 7

మూ. అథోవాచ స కాకుత్థ్సః సమీపపరివర్తినమ్, 8
సౌమిత్రిం సత్త్వసంపన్నం లక్ష్మణం శుభలక్షణమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సః కాకుత్థ్సః=ఆ రాముడు, సమీపపరివర్తినమ్=సమీపమునందు ఉన్న, సౌమిత్రిమ్=సుమిత్రాపుత్రుడైన, సత్త్వసంపన్నమ్=బలముతో కూడిన, శుభలక్షణమ్=శుభలక్షణములు గల, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట రాముడు తన సమీపమునందున్న, సుమిత్రాపుత్రుడు, బలసంపన్నుడు, శుభలక్షణములు కలవాడు అయిన లక్ష్మణునితో ఇట్లు పలికెను.

మూ. విభీషణమిమం సౌమ్య లఙ్కాయామభిషేచయ, 9
అనురక్తం చ భక్తం చ తథా పూర్వోపకారిణమ్.

ప్ర. అ. సౌమ్య=ఓ ! సౌమ్యుడా ! అనురక్తమ్=ప్రేమ గలవాడు, భక్తం చ=భక్తుడు, తథా=మరియు, పూర్వోపకారిణమ్=పూర్వము ఉపకారము చేసినవాడు అయిన, ఇమమ్=ఈ, విభీషణమ్=విభీషణుణ్ణి, లఙ్కాయామ్=లంకయందు, అభిషేచయ=అభిషేకించుము.

తా. సౌమ్యుడా ! మనయందు స్నేహ మున్నవాడు, భక్తుడు, ఉపకారము చేసి ఉన్నవాడూ అయిన ఈ విభీషణుణ్ణి లంకారాజ్యమునందు అభిషిక్తుని చేయుము. 9

మూ. ఏష మే పరమః కామో యదిమం రావణానుజమ్, 10
లఙ్కాయాం సౌమ్య పశ్యేయమభిషిక్తం విభీషణమ్.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! ఏషః=ఇది, మే=నాయొక్క, పరమః=గొప్ప, కామః=కోరిక, యత్=ఏమనగా, రావణానుజమ్=రావణుని తమ్ముడైన, ఇమం విభీషణమ్=ఈ విభీషణుణ్ణి, లఙ్కాయామ్=లంకయందు, అభిషిక్తమ్=అభిషేకించబడినవానినిగా, పశ్యేయమ్=చూతును.

తా. రావణుని తమ్ముడైన ఈ విభీషణుడు లంకా రాజ్యమునందు

అభిషిక్తుడై ఉండగా చూడవలె నని నాకు పెద్ద కోరిక ఉన్నది. 10

మూ. ఏవముక్తస్తు సౌమిత్రీ రాఘవేణ మహాత్మనా, 11
తథేత్యుక్త్వా సుసంహృష్టః సౌవర్ణం ఘటమాదదే.

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సౌమిత్రిః=లక్ష్మణుడు, తథేతి=అట్లే అని, సుసంహృష్టః=చాల సంతోషించినవాడై, సౌవర్ణమ్=బంగారము వికారమైన, ఘటమ్=ఘటమును, ఆదదే=గ్రహించెను.

తా. మహాత్ముడైన రాముని మాటలు విని లక్ష్మణుడు అట్లే చేసెదను అని పలికి, చాల సంతోషించుచు, బంగారు ఘటమును తీసికొనెను. 11

మూ. తం ఘటం వానరేన్ద్రాణాం హస్తే దత్త్వా మనోజవాన్, 12
వ్యాదిదేశ మహాసత్త్వః సముద్రసలిలం తదా.

ప్ర. అ. మహాసత్త్వః=గొప్ప బలము గల లక్ష్మణుడు, తదా=అప్పుడు, తమ్=ఆ, ఘటమ్=ఘటమును, వానరేన్ద్రాణామ్=వానరనాయకులయొక్క, హస్తే=హస్తమునందు, దత్త్వా=ఇచ్చి, మనోజవాన్=మనోవేగము గల వాళ్ళను, సముద్రసలిలమ్=సముద్రజలమును గూర్చి, వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. గొప్ప బలము గల లక్ష్మణుడు అప్పుడు ఆ ఘటమును వానరనాయకుల చేతిలో ఇచ్చి సముద్రజలము తీసికొని రండని మనోవేగము గల ఆ వానరులను ఆజ్ఞాపించెను. 12

మూ. అతిశీఘ్రం తతో గత్వా వానరాస్తే మనోజవాః, 13
ఆగతాస్తు జలం గృహ్య సముద్రాద్వానరోత్తమాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మనోజవాః=మనోవేగము వంటి వేగము గల, వానరోత్తమాః=వానరశ్రేష్ఠులు, అతి శీఘ్రమ్=చాల శీఘ్రముగా, గత్వా=వెళ్లి, సముద్రాత్=సముద్రమునుండి, జలమ్=జలమును, గృహ్య=గ్రహించి, ఆగతాః=వచ్చిరి.

తా. పిమ్మట మనోవేగము వంటి వేగము గల వానరశ్రేష్ఠులు అతి శీఘ్రముగా వెళ్లి సముద్రమునుండి జలము తీసికొని వచ్చిరి. 13

మూ. తతస్త్వేకం ఘటం గృహ్య సంస్థాప్య పరమాసనే, 14
ఘటేన తేన సౌమిత్రిరభ్యషిఞ్చద్విభీషణమ్,
లఙ్కాయాం రక్షసాం మధ్యే రాజానం రామశాసనాత్. 15
విధినా మన్త్రదృష్టేన సుహృద్గణసమావృతః.

ప్ర. అ. సౌమిత్రిః=లక్ష్మణుడు, సుహృద్గణసమావృతః=మిత్రగణముతో కూడినవాడై, తతః=అటుపిమ్మట, ఏకమ్=ఒక, ఘటమ్=ఘటమును, గృహ్యా=గ్రహించి, విభీషణమ్=విభీషణుణ్ణి, పరమాసనే=సింహాసనముమీద, సంస్థాప్య=కూర్చుండబెట్టి, తేన=ఆ, ఘటేన=ఘటముచేత, రక్షసామ్=రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, మన్త్రిదృష్టేన=మంత్రములందు చూడబడిన, విధినా=విధానముచేత, రామశాసనాత్=రాముని ఆజ్ఞవలన, లఙ్కాయామ్=లంకయందు, రాజానమ్=రాజునుగా, అభ్యషిఞ్చత్=అభిషేకించెను.

తా. అప్పుడు మిత్రగణముతో కూడిన లక్ష్మణుడు, ఒక ఘటమును గ్రహించి, విభీషణుణ్ణి సింహాసనముమీద కూర్చుండబెట్టి, వేదోక్త విధిప్రకారము, ఆతనిని, రామాజ్ఞానుసారము రాక్షసులందరూ చూచుచుండగా లంకకు రాజునుగా ఆ ఘటోదకముతో అభిషేకించెను. 14, 15

మూ. అభ్యషిఞ్చంస్తదా సర్వే రాక్షసా వానరాస్తథా, 16
ప్రహర్షమతులం గత్వా తుష్టువూ రామమేవ హ.

ప్ర. అ. తదా=అప్పుడు, సర్వే=సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, తథా=మరియు, వానరాః=వానరులు, అభ్యషిఞ్చన్=అభిషేకించిరి. అతులమ్=అత్యధికమైన, ప్రహర్షమ్=సంతోషమును, గత్వా=పొంది, రామమేవ హి=రాముణ్ణే, తుష్టువుః=స్తుతించిరి.

తా. అప్పుడు అక్కడ నున్న వానరులు, రాక్షసులందరూ కూడ అభిషేకము చేసిరి. వారందరూ చాల సంతోషించుచు రాముణ్ణే స్తుతించిరి.

మూ. తస్యామాత్యా జహృషిరే భక్తా యే చాస్య రాక్షసాః, 17
దృష్ట్వాభిషిక్తం లఙ్కాయాం రాక్షసేన్ద్రం విభీషణమ్.

ప్ర. అ. లఙ్కాయామ్=లంకయందు, అభిషిక్తమ్=అభిషేకింపబడిన, రాక్షసేన్ద్రమ్=రాక్షసప్రభువైన, విభీషణమ్=విభీషణుణ్ణి, దృష్ట్వా=చూచి, తస్య=ఆతని యొక్క, అమాత్యాః=మంత్రులూ, అస్య=ఈతనియొక్క, భక్తాః=భక్తులైన, యే రాక్షసాః=ఏ రాక్షసు లున్నారో వారూ, జహృషిరే=సంతోషించిరి.

తా. రాక్షసప్రభువైన విభీషణుడు లంకలో అభిషిక్తు డగుట చూచి ఆతనితో కూడ ఉండు నలుగురు మంత్రులు, ఆతనియందు భక్తి గల రాక్షసులూ సంతోషించిరి. 17

మూ. రాఘవః పరమాం ప్రీతిం జగామ సహలక్ష్మణః, 18
స తద్రాజ్యం మహత్ప్రాప్య రామదత్తం విభీషణః.

ప్ర. ౧. సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడన, రాఘవః=రాముడు, పరమామ్=గొప్ప, ప్రీతిమ్=సంతోషమును, జగామ=పొందెను. సః=ఆ, విభీషణః= విభీషణుడు, రామదత్తమ్=రామునిచేత ఇవ్వబడిన, మహత్=గొప్పదైన, తత్ రాజ్యమ్=ఆ రాజ్యమును, ప్రాప్య=పొంది, గొప్ప సంతోషమును పొందెను.

తా. రామలక్ష్మణులు చాల సంతోషించిరి. రాము డిచ్చిన ఆ గొప్ప రాజ్యమును పొంది విభీషణుడు చాల సంతోషించెను. 18

మూ. ప్రకృతీః సాన్త్వయిత్వా చ తతో రామముపాగమత్, 19
దధ్యక్షతాన్ మోదకాంశ్చ లాజాః సుమనసస్తథా,
ఆజహ్రురథ సంతుష్టాః పౌరాస్తస్మై నిశాచరాః. 20

ప్ర. అ. ప్రకృతీః=ప్రజలను, సాన్త్వయిత్వా=ఓదార్చి, తతః=అటుపిమ్మట, రామమ్=రామున్ణి, ఉపాగమత్=చేరెను. అథ=అటుపిమ్మట, పౌరాః=పౌరులైన, నిశాచరాః=రాక్షసులు, సంతుష్టాః=సంతోషించినవారై, దధి=పెరుగును, అక్షతాన్= అక్షతలను, మోదకాంశ్చ=మధురభక్ష్యములను, లాజాః=పేలాలను, తథా=మరియు, సుమనసః=పుష్పములను, తస్మై=అతనికొరకు, ఆజహ్రుః=తీసికొని వచ్చిరి.

తా. పిమ్మట విభీషణుడు ప్రజలతో మంచి మాటలు చెప్పి వారికి సంతోషము కలిగించి రాముని వద్దకు వచ్చెను. పౌరులైన రాక్షసులు సంతోషించి ఆతనికొరకై పెరుగు, అక్షతలు, మధురఖాద్యములు, పేలాలు, పుష్పములు మొదలైన మంగళ ద్రవ్యములు తీసికొనివచ్చిరి. 19, 20

మూ. స తాన్ గృహీత్వా దుర్ధర్షో రాఘవాయ న్యవేదయత్, 21
మాఙ్గల్యం మఙ్గలం సర్వం లక్ష్మణాయ చ వీర్యవాన్.

ప్ర. అ. దుర్ధర్షః=ఎదిరింప శక్యముకానివాడు, వీర్యవాన్=పరాక్రమ వంతుడు అయిన, సః=ఆ విభీషణుడు, తాన్=వాటిని, గృహీత్వా=గ్రహించి, సర్వమ్=సమస్తమైన, మాఙ్గల్యమ్=మంగళప్రదమైన ఆ ద్రవ్యమును, మంగలమ్= మంగలకర మగునట్లుగా, రాఘవాయ=రామునకు, లక్ష్మణాయ=లక్ష్మణునకు, న్యవేదయత్=సమర్పించెను.

తా. ఎదిరింప శక్యము కానివాడు, పరాక్రమవంతుడు అయిన ఆ విభీషణుడు వాటిని గ్రహించి, మంగళకరములైన ఆ సమస్తద్రవ్యములను, మంగళ ప్రదమగునట్లుగా రామునకు లక్ష్మణునకు సమర్పించెను. 21

మూ. కృతకార్యం సమృద్ధార్థం దృష్ట్వా రామో విభీషణమ్, 22
ప్రతిజగ్రాహ తత్సర్వం తస్యైవ ప్రియకామ్యయా.

ప్ర. అ. రామః=రాముడు, కృతకార్యమ్=చేయబడిన కార్యము గల, సమృద్ధార్థమ్=సఫలమైన ప్రయోజనము గల, విభీషణమ్=విభీషణుణ్ణి, దృష్ట్వా=చూచి, తస్య=ఆతనియొక్క, ప్రియకామ్యయా ఏవ=ప్రియమునందు కోరికచేత మాత్రమే, తత్=దానిని, సర్వమ్=అంతనూ, ప్రతిజగ్రాహ=గ్రహించెను.

తా. రాముడు కార్యము చేసిన, ప్రయోజనమును సాధించిన ఆ విభీషణుణ్ణి చూచి ఆతనికి ప్రియము చేకూర్చవలె నను కోరిక మాత్రము చేతనే దాని నంతనూ గ్రహించెను. 22

మూ. తతః శైలోపమం వీరం ప్రాఞ్జలిం ప్రణతం స్థితమ్, 23
ఉవాచేదం వచో రామో హనూమన్తం ప్లవఙ్గమమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, శైలోపమమ్=పర్వతముతో సమానుడు, వీరమ్=వీరుడు, ప్రాఞ్జలిమ్=ఎత్తబడిన దోసిలి గలవాడు, ప్రణతమ్=నమ్రుడుగా, స్థితమ్=ఉన్న, ప్లవఙ్గమమ్=వానరుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి గూర్చి, ఇదం వచః=ఈ వచనమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట రాముడు పర్వతముతో సమానుడు, వీరుడు అయిన అంజలి ఘటించి వినయముతో నిలచి ఉన్న హనుమంతునితో ఈ వాక్యము పలికెను. 23

మూ. అనుజ్ఞాప్య మహారాజమిమం సౌమ్య విభీషణమ్, 24
ప్రవిశ్య నగరీం లఙ్కాం కౌశలం బ్రూహి మైథిలీమ్.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! మహారాజమ్=మహారాజైన, ఇమమ్=ఈ, విభీషణమ్=విభీషణుణ్ణి, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, లఙ్కాం నగరీమ్=లంకానగరమును, ప్రవిశ్య=ప్రవేశించి, మైథిలీమ్=సీతను గూర్చి, కౌశలమ్=క్షేమమును, బ్రూహి=చెప్పుము.

తా. ఓ ! సౌమ్యుడా ! మహారాజైన ఈ విభీషణుని అనుమతి పొంది లంకా నగరములో ప్రవేశించి, సీతకు మా క్షేమము తెలుపుము. 24

మూ. వైదేహ్యై మాం కుశలినం సుగ్రీవం చ సలక్ష్మణమ్, 25
ఆచక్ష్వ వదతాం శ్రేష్ఠ రావణం చ హతం రణే.

ప్ర. అ. వదతామ్=మాటలాడువారిలో, శ్రేష్ఠ=శ్రేష్ఠుడా ! మామ్=నన్ను, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణీ, కుశలినమ్=కుశలముగలవారినిగాను, రావణమ్=రావణుణ్ణి, రణే=యుద్ధమునందు, హతమ్=చంపబడినవానినిగాను, వైదేహ్యై=సీతకు, ఆచక్ష్వ=చెప్పుము.

తా. మాటలలో మంచి నేర్పు గల ఓ హనుమంతుడా! నేను, లక్ష్మణుడు సుగ్రీవుడు కుశలముగా ఉన్నట్లు, రావణుడు యుద్ధములో చంపబడినట్లు సీతకు చెప్పుము. 25

మూ. ప్రియమేతదుదాహృత్య వైదేహ్యాస్త్వం హరీశ్వర, 26
ప్రతిగృహ్య చ సందేశముపావర్తితుమర్హసి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ద్వాదశాధికశతతమః సర్గః.

ప్ర. అ. హరీశ్వర=వానరనాయకుడా ! త్వమ్=నీవు, వైదేహ్యాః=సీతకు, ఏతత్=ఈ, ప్రియమ్=ప్రియమును, ఉదాహృత్య=చెప్పి, సందేశమ్=ఆమె చెప్పు విషయమును, ప్రతిగృహ్య=తీసికొని, ఉపావర్తితుమ్=తిరిగి వచ్చుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. ఓ ! హనుమంతుడా ! సీతకు ఈ ప్రియవృత్తాంతము తెలిసి ఆమె చెప్పు సందేశమును తీసికొని తిరిగి రమ్ము. 26

"బాలానందిని" అను శ్రీ మద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపన్నెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయోదశాధికశతతమః సర్గః

[హనుమంతుడు సీతతో మాటలాడి తిరిగి వచ్చి రామునకు ఆమె సందేశము తెలుపుట.]

మూ. ఇతి ప్రతిసమాదిష్టో హనూమాన్ మారుతాత్మజః,
ప్రవివేశ పురీం లఙ్కాం పూజ్యమానో నిశాచరైః.

ప్ర. అ. ఇతి=ఇట్లు, ప్రతిసమాదిష్టః=ఆజ్ఞాపించబడిన, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్= హనుమంతుడు, నిశాచరైః=రాక్షసులచేత, పూజ్యమానః=పూజింపబడుచు, లఙ్కాం పురీమ్=లంకానగరమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఈ విధముగా రామునిచేత ఆజ్ఞాపించబడినవాడై వాయుపుత్రుడైన హనుమంతుడు రాక్షసులచేత పూజింపబడుచు లంకాపురమును ప్రవేశించెను.1

మూ. ప్రవిశ్య చ పురీం లఙ్కామనుజ్ఞాప్య విభీషణమ్,
తతస్తేనాభ్యనుజ్ఞాతో హనూమాన్ వృక్షవాటికామ్. 2
సంప్రవిశ్య యథాన్యాయం సీతాయా విదితో హరిః,
దదర్శ మృజయా హీనాం సాతఙ్కాం రోహిణీమివ. 3
వృక్షమూలే నిరానన్దాం రాక్షసీభిః పరీవృతామ్,
నిభృతః ప్రణతః ప్రహ్వః సోఽభిగమ్యాభివాద్య చ. 4

ప్ర. అ. సీతాయాః=సీతకు, విదితః=తెలియబడిన, హరిః=వానరుడైన, సః=ఆ, హనూమాన్=హనుమంతుడు, లఙ్కాం పురీమ్=లంకాపురమును, ప్రవిశ్య=ప్రవేశించి, విభీషణమ్=విభీషణుణ్ణి, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, తతః=అటుపిమ్మట, తేన=వానిచేత, అభ్యనుజ్ఞాతః=అనుజ్ఞ ఇవ్వబడినవాడై, వృక్షవాటికామ్=వృక్షవాటికను, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, సంప్రవిశ్య=ప్రవేశించి, మృజయా=సంస్కారముతో, హీనామ్=హీనురాలు, సాతఙ్కామ్=భయముతో కూడిన, రోహిణీమివ=రోహిణి వలె ఉన్నది, నిరానన్దామ్=ఆనందము లేనిది, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, పరీవృతామ్=చుట్టువారుకొనబడినది అయిన సీతను, వృక్షమూలే=చెట్టుమొదట, దదర్శ=చూచెను. సః=అతడు, అభిగమ్య=సమీపించి, అభివాద్య చ=నమస్కరించి, ప్రణతః=వినయవంతుడై, ప్రహ్వః=వంగినవాడై,

నిభృతః=నిశ్చలముగా ఉండెను.

తా. సీతకు తెలిసిన ఆ హనుమంతుడు లంకా నగరములో ప్రవేశించి, విభీషణుని అనుమతి కోరి, ఆతనిచే అనుమతింపబడినవాడై, న్యాయానుసారముగా ఉద్యానవనములో ప్రవేశించి ఒక చెట్టు క్రింద ఉన్న సీతను చూచెను. ఆమె స్నానాదిసంస్కారములు లేక భయపడుచున్న రోహిణి వలె ఆనందశూన్యురాలై ఉండెను. ఆమె చుట్టూ రాక్షసస్త్రీలు ఉండిరి. అతడు అట్టి సీతను సమీపించి, నమస్కరించి వినయవంతుడై, వంగి మౌనముగా నిలబడెను. 2 - 4.

మూ. దృష్ట్వా సమాగతం దేవీ హనూమన్తం మహాబలమ్,
తూష్ణీమాస్త తదా దృష్ట్వా స్మృత్వా హృష్టాభవత్తదా. 5

ప్ర. అ. దేవీ=సీతాదేవి, తదా=అప్పుడు, సమాగతమ్=వచ్చిన, మహాబలమ్=మహాబలవంతుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, దృష్ట్వా=చూచి, తూష్ణీమ్=మౌనముగా, ఆస్త=ఉండిపోయెను. తదా=అప్పుడు, దృష్ట్వా=చూచి, స్మృత్వా=స్మరించి, హృష్టా=సంతోషించినది, అభవత్=ఆయెను.

తా. అప్పుడు సీతాదేవి అక్కడకు వచ్చిన మహాబలవంతుడైన హనుమంతుణ్ణి చూచి కూడ మౌనముగా ఉండి పోయెను. మరల చూచి ఆతనిని గుర్తించి అప్పుడు సంతోషించెను. 5

మూ. సౌమ్యం తస్యా ముఖం దృష్ట్వా హనూమాన్ ప్లవగోత్తమః,
రామస్య వచనం సర్వమాఖ్యాతుముపచక్రమే. 6

ప్ర. అ. ప్లవగోత్తమః=వానరశ్రేష్ఠుడైన, హనూమాన్=హనుమంతుడు, సౌమ్యమ్=ప్రసన్నమైన, తస్యాః=ఆమెయొక్క, ముఖమ్=ముఖమును, దృష్ట్వా=చూచి, రామస్య=రామునియొక్క, సర్వమ్=సమస్తమైన, వచనమ్=వచనమును, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు ప్రసన్నముగా ఉన్న సీత ముఖమును చూచి రాముని సందేశమును పూర్తిగా చెప్పుటకు ప్రారంభించెను.6

మూ. వైదేహి కుశలీ రామః సహసుగ్రీవలక్ష్మణః,
విభీషణసహాయశ్చ హరీణాం సహితో బలైః. 7

ప్ర. అ. వైదేహి=సీతా ! సహసుగ్రీవలక్ష్మణః=సుగ్రీవలక్ష్మణులతో కూడిన, విభీషణ సహాయశ్చ=విభీషణుడు సహాయుడుగా గల, హరీణామ్=వానరులయొక్క, బలైః=సైన్యములతో, సహితః=కూడిన, రామః=రాముడు, కుశలీ=క్షేమము గలవాడు.

తా. సీతా ! సుగ్రీవలక్ష్మణులతోను, విభీషణునితోను, వానరు

సైన్యములతోను కూడిన రాముడు క్షేమముగా ఉన్నాడు. 7

మూ. కుశలం త్వాహ సిద్ధార్థో హతశత్రురమిత్రజిత్,
విభీషణసహాయేన రామేణ హరిభిః సహ, 8
నిహతో రావణో దేవి లక్ష్మణేన చ వీర్యవాన్.

ప్ర. అ. అమిత్రజిత్=శత్రుసంహారకుడైన రాముడు, హతశత్రుః=చంపబడిన శత్రువులు గలవాడై, సిద్ధార్థః=సిద్ధమైన ప్రయోజనముకలవాడై, త్వా=నిన్ను, కుశలమ్=కుశలమును, ఆహ=పలుకుచున్నాడు, దేవి=దేవీ ! విభీషణసహాయేన=విభీషణుడు సహాయుడుగా గల, హరిభిః సహ=వానరులతో కూడిన, రామేణ=రామునిచేత, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రావణః=రావణుడు, నిహతః=చంపబడినాడు.

తా. దేవీ ! శత్రుసంహారకుడైన రాముడు శత్రువును సంహరించి, కార్యసిద్ధిని పొందినాడు. నీకు క్షేమమును తెలుపుచున్నాడు. వానరులతో కూడిన రామలక్ష్మణులు విభీషణుని సాహాయ్యముచేత పరాక్రమవంతుడైన రావణుని సంహరించినారు. 8

మూ. ప్రియమాఖ్యామి తే దేవి భూయశ్చ త్వాం సభాజయే, 9
తవ ప్రభావాద్ధర్మజ్ఞే మహాన్ రామేణ సంయుగే,
లబ్ధోఽయం విజయః సీతే స్వస్థా భవ గతజ్వరా. 10

ప్ర. అ. దేవి=దేవీ ! తే=నీకు, ప్రియమ్=ప్రియమును, ఆఖ్యామి=చెప్పచున్నాను, భూయః=మరల, త్వామ్=నిన్ను, సభాజయే=సంతోషపరచుచున్నాను. ధర్మజ్ఞే=ధర్మము నెరిగిన, సీతే=సీతా ! తవ=నీయొక్క, ప్రభావాత్=ప్రభావమువలన, సంయుగే=యుద్ధమునందు, రామేణ=రామునిచేత, మహాన్=గొప్పదైన, అయమ్=ఈ, విజయః=విజయము, లబ్ధః=పొందబడినది. గతజ్వరా=పోయిన దుఃఖము గలదానవై, స్వస్థా= స్వస్థురాలవు, భవ=అగుము.

తా. ఓ ! దేవీ ! నీకు ప్రియమైన విషయము చెప్పి నీ కింకను సంతోషము కలిగించుచున్నాను. ధర్మముల నెరిగిన ఓ ! సీతా ! నీ ప్రభావముచేత రాముడు యుద్ధములో గొప్ప విజయము పొందినాడు. నీవు దుఃఖము విడచి స్వస్థురాలవు అగుము. 9, 10

మూ. రావణశ్చ హతః శత్రుర్లఙ్కా చైవ వశీకృతా,
మయా హ్యలబ్ధనిద్రేణ ధృతేన తవ నిర్జయే. 11
ప్రతిజ్ఞైషా వినిస్తీర్ణా బద్ధ్వా సేతుం మహోదధౌ.

ప్ర. అ. శత్రుః=శత్రువైన, రావణశ్చ=రావణుడు, హతః=చంపబడినాడు. లఙ్కా చైవ=లంక కూడ, వశీకృతా=వశము చేసికొనబడినది. తవ=నీయొక్క, నిర్జయే=జయించుకొనుటయందు, ధృతేన=నిశ్చయము గల, అలబ్ధనిద్రేణ=పొందబడని నిద్ర గల, మయా=నాచేత, మహోదధౌ=మహాసముద్రమునందు, సేతుమ్=సేతువును బద్ధ్వా=కట్టి, ఏషా=ఈ, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, వినిస్తీర్ణా=దాటబడినది.

తా. శత్రువైన రావణుడు చంపబడినాడు. లంక వశము చేసికొనబడినది. నిన్ను సంపాదించవలె నను దృఢనిశ్చయముతో నిద్ర కూడ పొందక నేను మహాసముద్రములో సేతువును నిర్మించి ఈ ప్రతిజ్ఞను దాటినాను.

మూ. సంభ్రమశ్చ న కర్తవ్యో వర్తన్త్యా రావణాలయే, 12
విభీషణవిధేయం హి లఙ్కైశ్వర్యమిదం కృతమ్.

ప్ర. అ. రావణాలయే=రావణుని గృహములో, వర్తన్త్యా=ఉంటూన్న నీచేత, సంభ్రమః చ=భయము, న కర్తవ్యః=చేయదగినది కాదు. ఇదమ్=ఈ, లఙ్కైశ్వర్యమ్=లంకానగరైశ్వర్యము, విభీషణవిధేయమ్=విభీషణుని ఆధీనముగా, కృతం హి=చేయబడినది కదా !

తా. నీవు రావణుని గృహములో ఉన్నందుకు భయపడకుము. ఎందుచేత ననగా ఈ లంకారాజ్యము విభీషణుని అధీనములో ఉంచబడినది. 12

మూ. తదాశ్వసిహి విస్రబ్ధం స్వగృహే పరివర్తసే, 13
అయం చాభ్యేతి సంహృష్టస్త్వద్దర్శనసముత్సుకః.

ప్ర. అ. తత్=ఆకారణమువలన, విస్రబ్ధమ్=విశ్వాసపూర్వకముగా, ఆశ్వసిహి=ఊరడిల్లుము. స్వగృహే=స్వగృహమునందు, పరివర్తసే=ఉన్నావు. అయం చ=ఈ విభీషణుడు కూడ, సంహృష్టః=సంతోషించినవాడై, త్వద్దర్శనసముత్సుకః=నీ దర్శనమునందు వేడుక గలవాడై, అభ్యేతి=వచ్చుచున్నాడు.

తా. అందువల్ల నీవు విశ్వాసముతో ఊరడిల్లుము. నీవు ఇప్పుడు స్వగృహములోనే ఉన్నావు. ఈ విభీషణుడు కూడ సంతోషముతో నీ దర్శనము చేయవలె నని కోరుచు వచ్చుచున్నాడు. 13

మూ. ఏవముక్తా తు సా దేవీ సీతా శశినిభాననా, 14
ప్రహర్షేణావరుద్ధా సా వ్యాహర్తుం న శశాక హ.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, శశినిభాననా=చంద్రునితో సమానమైన ముఖము గల, దేవీ=దేవియైన, సా సీతా=ఆ సీత, ప్రహర్షేణ=సంతోషముచేత, అవరుద్ధా=అడ్డుకొనబడినదై, వ్యాహర్తుమ్=పలుకుటకు, న శశాక

హ =సమర్థురాలు కాలేదు.

తా. చంద్రుని వంటి ముఖము గల సీత ఆ మాటలు విని, ఆనందాతిశయముచేత ఏమీ చేయజాలని స్థితిలో ఉండి మాటలాడజాలకపోయెను.

మూ. తతోఽబ్రవీద్ధరివరః సీతామప్రతిజల్పతీమ్, 15
కిం త్వం చిన్తయసే దేవి కిం చ మాం నాభిభాషసే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరివరః=హనుమంతుడు, అప్రతిజల్పతీమ్=ప్రత్యుత్తర మీయని, సీతామ్=సీతను గూర్చి, అబ్రవీత్=పలికెను. దేవి=దేవీ! త్వమ్=నీవు, కిమ్=ఏమి, చిన్తయసే=ఆలోచించుచున్నావు? మామ్=నన్ను గూర్చి, కిమ్=ఎందువలన, నాభిభాషసే=పలుకకున్నావు?

తా. సమాధానము చెప్పని సీతతో అప్పుడు హనుమంతుడు ఇట్లు పలికెను - "ఓ ! దేవీ ! ఏమి ఆలోచించుచున్నావు? నాతో మాటలాడ వేమి?" 15

మూ. ఏవముక్తా హనుమతా సీతా ధర్మపథే స్థితా, 16
అబ్రవీత్పరమప్రీతా బాష్పగద్గదయా గిరా.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, ధర్మపథే=ధర్మమార్గమునందు, స్థితా=ఉన్న, సీతా=సీత, పరమప్రీతా=చాల సంతోషించినదై, బాష్పగద్గదయా=కన్నీటిచేత గద్గదమైన, గిరా=వాక్కుతో, అబ్రవీత్=పలికెను.

తా. ధర్మమార్గమునందు స్థిరురాలైన సీత హనుమంతుని మాటలు విని చాల సంతోషించుచు బాష్పముచేత గద్గదమైన స్వరముతో ఇట్లు పలికెను.

మూ. ప్రియమేతదుపశ్రుత్య భర్తుర్విజయసంశ్రయమ్, 17
ప్రహర్షవశమాపన్నా నిర్వాక్యాస్మి క్షణాన్తరమ్.

ప్ర. అ. భర్తుః=భర్తయొక్క, విజయసంశ్రయమ్=విజయమునకు సంబంధించిన, ఏతత్=ఈ, ప్రియమ్=ప్రియమును, ఉపశ్రుత్య=విని, ప్రహర్షవశమ్=ఆనందవశమును, ఆపన్నా=పొందినదాననై, క్షణాన్తరమ్=క్షణకాలసమయమును, నిర్వాక్యా=మాటలు లేనిదానను, అస్మి=అయినాను.

తా. నా భర్తకు లభించిన విజయమును గూర్చిన ప్రియమైన వార్త వినగానే సంతోషావేశముతో ఒక క్షణకాలముపాటు మాట రానిదానను అయితిని.

మూ. న హి పశ్యామి సదృశం చిన్తయన్తీ ప్లవంగమ, 18
మత్ప్రియాఖ్యానకస్యేహ దాతుం ప్రత్యభినన్దనమ్.

ప్ర.అ.ప్లవంగమ=హనుమంతుడా !, చిన్తయన్తీ-ఆలోచించు చున్నదాననై, ఇహ=ఇక్కడ,మత్ప్రియాఖ్యానకస్య=నాకుప్రియముచెప్పిన నీకు, దాతుమ్=ఇచ్చుటకు, సదృశమ్=తగిన, ప్రత్యభినన్దనమ్=ప్రతిప్రియవచనమును, న పశ్యామి హి=చూడను కదా?

తా. హనుమంతుడా ! నాకు ప్రియవార్తను చెప్పిన నీకు ఇచ్చుటకు తగిన ప్రియమైనది ఎంత ఆలోచించినను నాకు కనబడుటలేదు. 18

మూ. న చ పశ్యామి సదృశం పృథివ్యామపి కించన, 19
సదృశం యత్ప్రియాఖ్యానే తవ దత్వా భవేత్సుఖమ్.

ప్ర. అ. ప్రియాఖ్యానే=ప్రియమును చెప్పుట విషయమునందు, సదృశమ్=తగిన, యత్=దేనిని, తవ=నీకు, దత్వా=ఇచ్చి, సుఖమ్=సుఖము, భవేత్=అగునో, అట్టి, సదృశమ్=తగినదానిని, కించన=దేనినీ, పృథివ్యామ్=ఈ భూమియందు, న చ పశ్యామి=చూడను.

తా. నీవు చెప్పిన ప్రియవార్తకు తగిన ఏ వస్తువును నీ కిచ్చినచో నా మనస్సుకు సంతృప్తి కలుగునో అట్టి తగిన వస్తువేదీ నాకు ఈ భూమి మీద కనబడుటలేదు. 19

మూ. హిరణ్యం వా సువర్ణం వా రత్నాని వివిధాని చ, 20
రాజ్యం వా త్రిషు లోకేషు నైతదర్హతి భాషితమ్.

ప్ర. అ. హిరణ్యం వా=వెండి గాని, సువర్ణం వా=బంగారము గాని, వివిధాని=అనేకవిధములైన, రత్నాని=రత్నములు గాని, త్రిషు లోకేషు=మూడు లోకములయందు, రాజ్యం వా=రాజ్యము గాని, ఏతత్=ఈ, భాషితమ్=నీ వాక్యమును, నార్హతి=తగదు.

తా. వెండి గాని, బంగారము గాని, వివిధరత్నములు గాని, త్రిలోకసామ్రాజ్యము గాని నీ మాటలకు సరికావు. 20

మూ. ఏవముక్తస్తు వైదేహ్యా ప్రత్యువాచ ప్లవంగమః, 21
ప్రగృహీతాఞ్జలిర్హర్షాత్సీతాయాః ప్రముఖే స్థితః.

ప్ర. అ. వైదేహ్యా=సీతచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ప్లవంగమః=హనుమంతుడు, ప్రగృహీతాఞ్జలిః=గ్రహింపబడిన దోసిలి కలవాడై, సీతాయాః=సీతయొక్క, ప్రముఖే=ఎదుట, స్థితః=ఉన్నవాడై, హర్షాత్=సంతోషమువలన,

ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. హనుమంతుడు సీత మాటలు విని అంజలి ఘటించి ఆమె ఎదుట నిలచి సంతోషముతో ఇట్లు పలికెను. 21

మూ. భర్తుః ప్రియహితే యుక్తే భర్తుర్విజయకాంక్షిణి, 22
స్నిగ్ధమేవంవిధం వాక్యం త్వమేవార్హస్యనిన్దితే.

ప్ర. అ. భర్తుః=భర్తయొక్క, ప్రియహితే=ప్రియమునందు హితమునందు, యుక్తే=ఆసక్తి గలదానా ! భర్తుః=భర్తయొక్క, విజయకాఙ్క్షిణి=విజయమును కోరుచున్నదానా ! అనిన్దితే=నిందింపబడనిదానా ! స్నిగ్ధమ్=స్నేహముతో కూడిన, ఏవంవిధమ్=ఇట్టి, వాక్యమ్=వాక్యమును, త్వమేవ=నీవే, అర్హసి=తగిఉన్నావు.

తా. భర్తయొక్క ప్రియహితములను కోరుదానవు, భర్త విజయమును కాంక్షించుదానవు అయిన ఎట్టి దోషములు లేని ఓ ! దేవీ ! స్నేహపూర్ణమైన ఇట్టి మాటలు పలుకుటకు నీవే తగినదానవు. 22

మూ. తవైతద్వచనం సౌమ్యే సారవత్ స్నిగ్ధమేవ చ, 23
రత్నౌఘాద్వివిధాచ్చాపి దేవరాజ్యాద్విశిష్యతే.

ప్ర. అ. సౌమ్యే=సౌమ్యురాలా ! తవ=నీయొక్క, సారవత్=సారము గలది, స్నిగ్ధమేవ చ=స్నేహముతో కూడినదీ అయిన, ఏతత్ వచనమ్=ఈ వచనము, వివిధాత్=అనేకవిధములైన, రత్నౌఘాత్=రత్నసమూహముకంటెను, దేవరాజ్యాత్=దేవరాజ్యముకంటెను, విశిష్యతే=విశేషించి ఉన్నది.

తా. ఓ ! సౌమ్యురాలా ! నీవు పలికిన సారగర్భితము, స్నేహభరితమూ అయిన ఈ మాట వివిధరత్నసముదాయముకంటెను, దేవరాజ్యముకంటెను కూడ గొప్పది. 23

మూ. అర్థతశ్చ మయా ప్రాప్తా దేవరాజ్యాదయో గుణాః, 24
హతశత్రుం విజయినం రామం పశ్యామి సుస్థితమ్.

ప్ర. అ. హతశత్రుమ్=చంపబడిన శత్రువులు గల, విజయినమ్=విజయవంతుడైన, సుస్థితమ్=బాగుగా ఉన్న, రామమ్=రాముణ్ణి, పశ్యామి=చూచుచున్నాను, అర్థతః=అర్థమువలన, మయా=నాచేత, దేవరాజ్యాదయః=దేవరాజ్యము మొదలైన, గుణాః=గుణములు, ప్రాప్తాః=పొందబడినవి.

తా. రాముడు శత్రువులను సంహరించి, విజయవంతుడై, స్వస్థుడై ఉండగా చూచుచున్నాను. అందుచేత నాకు దేవరాజ్యముమొదలైన గుణములు లభించినవనే అర్థము. 24

మూ. తస్య తద్వచనం శ్రుత్వా మైథిలీ జనకాత్మజా, 25
తతః శుభతరం వాక్యమువాచ పవనాత్మజమ్.

ప్ర. అ. జనకాత్మజా=జనకుని పుత్రి యైన, మైథిలీ=సీత, తస్య=వానియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, తతః=అటుపిమ్మట, పవనాత్మజమ్=హనుమంతుణ్ణి గూర్చి, శుభతరమ్=మిక్కిలి శుభకరమైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. జనకపుత్రియైన సీత ఆ హనుమంతుని మాటలు విని ఆతనితో మిక్కిలి శుభమైన వాక్యము పలికెను. 25

మూ. అతిలక్షణసంపన్నం మాధుర్యగుణభూషితమ్, 26
బుద్ధ్యా హ్యష్టాఙ్గయా యుక్తం త్వమేవార్హసి భాషితుమ్.

ప్ర. అ. అతిలక్షణసంపన్నమ్=అధికముగా మంచి లక్షణములతో కూడినది, మాధుర్యగుణభూషితమ్=మాధుర్యగుణముచేత అలంకరించబడినదీ అయిన వచనమును, అష్టాఙ్గయా=ఎనిమిది అంగములు గల, బుద్ధ్యా=బుద్ధితో, యుక్తమ్=కూడునట్లుగా, భాషితుమ్=పలుకుటకు, త్వమేవ=నీవే, అర్హసి=తగి ఉన్నావు.

తా. అధికముగా మంచి లక్షణములతో కూడినది, మాధుర్యగుణము అలంకారము గలదీ అయిన వచనమును ఎనిమిది అంగములు గల బుద్ధితో యుక్త మగు నట్లుగా పలుకుటకు నీవే తగినవాడవు. 26

వి. "శుశ్రూషా శ్రవణం చైవ గ్రహణం ధారణం తథా,
ఊహాపోహో౽ర్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః".

అని ఎనిమిది బుద్ధిగుణములు చెప్పబడినవి. "ఇతరులు చెప్పదానిని వినవలెనను కోరిక, వినుట, గ్రహించుట, జ్ఞాపకము ఉంచుకొనుట, చెప్పనిదానిని ఊహించుకొనుట, అనావశ్యకమైనదానిని త్యజించుట, అర్థమును తెలిసికొనుట, యథార్థమును నిర్ణయించుట అనేవి బుద్ధిగుణములు."

"గ్రహణం ధారణం చైవ స్మరణం ప్రతిపాదనమ్,
ఊహాపోహో౽ర్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః."

అని పాఠాంతరము. స్మరణమ్=విన్నదానిని స్మరించుట, ప్రతిపాదనమ్=యుక్తియుక్తముగా ఒక విషయమును ప్రతిపాదించుట.

మూ. శ్లాఘనీయో౽నిలస్య త్వం సుతః పరమధార్మికః, 27
బలం శౌర్యం శ్రుతం సత్త్వం విక్రమో దాక్ష్యముత్తమమ్.
తేజః క్షమా ధృతిః స్థైర్యం వినీతత్వం న సంశయః. 28

ఏతే చాన్యే చ బహవో గుణాస్త్వయ్యేవ శోభనాః.

ప్ర. అ. అనిలస్య=వాయుదేవునియొక్క, శ్లాఘనీయః=శ్లాఘించదగిన, సుతః=కుమారుడవైన, త్వమ్=నీవు, పరమధార్మికః=మిక్కిలి ధార్మికుడవు. బలమ్=బలము, శౌర్యమ్=శూరత్వము, శ్రుతమ్=శాస్త్రజ్ఞానము, సత్త్వమ్=బుద్ధిబలము, విక్రమః=పరాక్రమము, ఉత్తమమ్=ఉత్తమమైన, తేజః=తేజస్సు, క్షమా=ఓర్పు, ధృతిః=ధైర్యము, స్థైర్యమ్=స్థిరత్వము, వినీతత్వమ్=వినయము, ఏతే=ఇవి, అన్యే=ఇతరములైన, బహవః=అనేకమైన, శోభనాః=మంచి, గుణాః=గుణములు, త్వయ్యేవ=నీయందే ఉన్నవి. సంశయః=సంశయము, న=లేదు.

తా. నీవు ప్రశంసాపాత్రుడవైన వాయుదేవుని పుత్రుడవు. గొప్ప ధార్మికుడవు. బలము, శౌర్యము, శాస్త్రజ్ఞానము, బుద్ధిబలము, పరాక్రమము, ఉత్తమమైన నేర్పు, తేజస్సు, ఓర్పు, ధైర్యము, స్థైర్యము, వినయము - ఈ గుణములు, ఇంకను ఎన్నో ఉత్తమగుణములు నీయందు ఉన్నవి. సందేహము లేదు. 27, 28

మూ. అథోవాచ పునః సీతామసంభ్రాన్తో వినీతవత్, 29
ప్రగృహీతాఞ్జలిర్హర్షాత్ సీతాయాః ప్రముఖే స్థితః.

ప్ర. అ. అథ=పిమ్మట, ప్రగృహీతాఞ్జలిః=గ్రహింపబడిన దోసిలి గలవాడై, సీతాయాః=సీతయొక్క, పురతః=ఎదుట, స్థితః=నిలిచినవాడై, అసంభ్రాన్తః=కంగారుపడనివాడై, వినీతవత్=వినీతుడై, పునః=మరల, సీతామ్=సీతను గూర్చి, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట హనుమంతుడు అంజలి ఘటించి సీత ఎదుట నిలచి, కంగారు పడక, వినయవంతుడై మరల సీతతో ఇట్లు పలికెను. 29

మూ. ఇమాస్తు ఖలు రాక్షస్యో యది త్వమనుమన్యసే, 30
హన్తుమిచ్ఛామి తాః సర్వా యాభిస్త్వం తర్జితా పురా.

ప్ర. అ. ఇమాః=వీళ్ళు, పురా=పూర్వము, త్వమ్=నీవు, యాభిః=ఎవరిచేత, తర్జితా=భయపెట్టబడితివో, ఆ, రాక్షస్యః ఖలు=రాక్షసస్త్రీలు కదా. త్వమ్=నీవు, అనుమన్యసే యది=అంగీకరించినట్లయితే, తాః సర్వాః=వాళ్లనందరినీ, హన్తుమ్=చంపుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. వీళ్ళందరూ పూర్వము నిన్ను భయపెట్టిన రాక్షసస్త్రీలే కదా? నీవు అనుమతించినట్లయితే వీళ్లనందరినీ చంపవలె నని కోరుచున్నాను. 30

మూ. క్లిశ్యన్తీం పతిదేవాం త్వామశోకవనికాం గతామ్, 31
ఘోరరూపసమాచారాః క్రూరాః క్రూరతరేక్షణాః,
ఇహ శ్రుతా మయా దేవి రాక్షస్యో వికృతాననాః, 32
అసకృత్పరుషైర్వాక్యైర్వదన్త్యో రావణాజ్ఞయా.

ప్ర. అ. దేవి=ఓ ! దేవీ ! క్లిశ్యన్తీమ్=దుఃఖించుచున్నదానవు, పతిదేవామ్=భర్తయే దేవుడు గలదానవు, అశోకవనికామ్=అశోకవనమును, గతామ్=పొంది ఉన్న దానవూ అయిన, త్వామ్=నిన్ను, ఘోరరూపసమాచారాః=ఘోరమైన రూపమూ ప్రవర్తనలూ గల, క్రూరాః=క్రూరురాండ్రు, క్రూరతరేక్షణాః=మిక్కిలి క్రూరమైన నేత్రములు గలవారు, వికృతాననాః=వికృతములైన ముఖములు గలవారూ అయిన, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, రావణాజ్ఞయా=రావణుని ఆజ్ఞచేత, అసకృత్=మాటిమాటికి, పరుషైః=పరుషములైన, వాక్యైః=వాక్యములచేత, వదన్త్యః=పలుకుచు, ఇహ=ఇక్కడ, మయా=నాచేత, శ్రుతాః=వినబడినారు.

తా. దేవీ ! ఘోరమైన రూపము ప్రవర్తనా గలవారు, క్రూరురాండ్రు, మిక్కిలి క్రూరములైన నేత్రములు గలవారు, వికృతములైన ముఖములు గలవారు అయిన రాక్షసస్త్రీలు, దుఃఖించుచు ఈ అశోకవనములో ఉన్న, పతియే దేవతగా గల నిన్ను రావణుని ఆజ్ఞచేత మాటిమాటికి పరుషవాక్యములతో పీడించుచుండగా నేను ఇక్కడ విని ఉన్నాను. 31, 32

మూ. వికృతా వికృతాకారాః క్రూరాః క్రూరకచేక్షణాః, 33
ఇచ్ఛామి వివిధైర్ఘాతైర్హన్తుమేతాః సుదారుణాః.
రాక్షస్యో దారుణకథా వరమేతత్ప్రయచ్ఛ మే. 34

ప్ర. అ. వికృతాః=వికారము గలవారు, వికృతాకారాః=వికృతములైన ఆకారములు గలవారు, క్రూరాః=క్రూరురాండ్రు, క్రూరకచేక్షణాః=క్రూరములైన జుట్లు, చూపులు గలవారు, సుదారుణాః=చాల దారుణస్వభావము గల వారు, దారుణకథాః=దారుణములైన కథలు కలవారు అయిన, ఏతాః=ఈ, రాక్షస్యః=రాక్షసస్త్రీలను, వివిధైః=అనేకవిధములైన, ఘాతైః=దెబ్బలచేత, హన్తుమ్=చంపుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. మే=నాకు, ఏతత్=ఈ, వరమ్=వరమును, ప్రయచ్ఛ=ఇమ్ము.

తా. వికారముగా ఉన్నవారు, వికృతములైన ఆకారములు గలవారు, క్రూరురాండ్రు, మిక్కిలి క్రూరములైన జుట్లు, చూపులు గలవారు, చాల దారుణస్వభావము గలవారు, దారుణములైన మాటలు మాటలాడువారు అయిన ఈ రాక్షసస్త్రీలను అనేకవిధములైన దెబ్బలచేత చంపెదను; నాకు అనుమతి ఇమ్ము. 33, 34

మూ. ముష్టిభిః పాణిఘాతైశ్చ విశాలైశ్చైవ బాహుభిః,
జఙ్ఘాజానుప్రహారైశ్చ దన్తానాం చైవ పీడనైః, 35
భక్షణైః కర్ణనాసానాం కేశానాం లుఞ్చనైస్తథా,
భృశం శుష్కముఖైశ్చైవ దారణైర్లఙ్ఘనైర్హతైః, 36
విభిన్నశఙ్కుగ్రీవాంశపార్శ్వకైశ్చ కలేవరైః,
నిపాత్య హన్తుమిచ్ఛామి తవ విప్రియకారిణీః. 37

ప్ర. అ. తవ=నీకు, విప్రియకారిణీః=అపకారము చేసిన ఈ రాక్షసస్త్రీలను, ముష్టిభిః=పిడికిళ్లచేతను, పాణిఘాతైశ్చ=చేతి దెబ్బలచేతను, విశాలైః=విశాలములైన, బాహుభిః=బాహువులచేతను, జఙ్ఘాజానుప్రహారైశ్చ=పిక్కలయొక్క, మోకాళ్లయొక్క, దెబ్బలచేతను, దన్తానామ్=దంతములయొక్క, పీడనైః=పీడించుటచేత, కర్ణనాసానామ్=చెవులయొక్క ముక్కులయొక్క, భక్షణైః=భక్షణములచేత, తథా=మరియు, కేశానామ్=కేశములయొక్క, లుఞ్చనైః=పీకుటచేత, భృశమ్=మిక్కిలి, శుష్కముఖైః చైవ=ఎండిన ముఖములచేతను (అగ్న్యాదుల ద్వారా ముఖములు ఎండిపోవునట్లు చేయుటచేతను), దారణైః=చీల్చుటచేతను, లఙ్ఘనైః=మీదకు లంఘించుటలచేతను, హతైః=చంపుటలచేతను, విభిన్నశఙ్కుగ్రీవాంసపార్శ్వకైః=బ్రద్దలుకొట్టబడిన దౌడలు, మెడలు, భుజములు, పార్శ్వములు గల, కలేవరైః=దేహములతో, నిపాత్య=క్రింద పడవేసి, హన్తుమ్=చంపుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. నీకు అపకారము చేసిన ఈ రాక్షసస్త్రీలను, పిడికిళ్లతోను, అరచేతులతోను, విశాలములైన బాహువులతోను, పిక్కలతోను మోకాళ్లతోను కొట్టి, దంతములతో కరిచి, ముక్కులు, చెవులు కొరికి, జుట్లు పీకి, ముఖాలు ఎండిపోవునట్లుచేసి, చీల్చి, ఎగిరి ఎగిరి మీదపడి కొట్టి, ఎముకలు, మెడలు, భుజములు, పార్శ్వములు విరిగిపోయిన దేహాలు క్రింద పడవేసి చంపవలె నని కోరుచున్నాను. 35 - 37

మూ. ఏవం ప్రహారైర్బహుభిః సంప్రహార్య యశస్విని,
ఘాతయే తీవ్రరూపాభిర్యాభిస్త్వం తర్జితా పురా. 38

ప్ర. అ. యశస్విని=కీర్తి గలదానా ! పురా=పూర్వము, త్వమ్=నీవు, తీవ్రరూపాభిః=భయంకరములైన రూపములు గల, యాభిః=ఏ స్త్రీలచేత, తర్జితా=భయపెట్టబడితివో వాళ్లను, ఏవమ్=ఈ విధముగా, బహుభిః=అనేకములైన, ప్రహారైః=దెబ్బలచేత, సంప్రహార్య=కొట్టి, ఘాతయే=చంపెదను.

తా. కీర్తి గలదానా ! పూర్వము నిన్ను భయపెట్టిన, భయంకరరూపములు గల ఈ స్త్రీలను ఈ విధముగ అనేకములైన దెబ్బలు కొట్టి చంపెదను. 38

మూ. ఇత్యుక్తా సా హనుమతా కృపణా దీనవత్సలా,
హనూమన్తమువాచేదం చిన్తయిత్వా విమృశ్య చ. 39

ప్ర. అ. ఇతి=ఇట్లు, హనుమతా=హనుమంతునిచేత, ఉక్తా=పలకబడిన, దీనవత్సలా=దీనులయందు జాలి గల, కృపణా=దయావంతురాలైన, సా=సీత, చిన్తయిత్వా=ఆలోచించి, విమృశ్య చ=విమర్శించి, హనుమన్తమ్=హనుమంతుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. దీనులయందు జాలి గల, దయామయురాలైన ఆ సీత హనుమంతుని మాటలు విని, ఆలోచించి, విమర్శించి ఇట్లు పలికెను. 39

మూ. రాజసంశ్రయవశ్యానాం కుర్వతీనాం పరాజ్ఞయా,
విధేయానాం చ దాసీనాం కః కుప్యేద్వానరోత్తమ. 40

ప్ర. అ. వానరోత్తమ=వానరశ్రేష్ఠుడా ! రాజసంశ్రయవశ్యానామ్=రాజును ఆశ్రయించుటచే రాజుకు వశ్యులైన వారు, పరాజ్ఞయా=ఇతరుల ఆజ్ఞచేత, కుర్వతీనామ్=పనిచేయుచున్నవారు, విధేయానామ్=ఇతరులకు విధేయులు అయిన, దాసీనామ్=దాసీలకు, కః=ఎవడు, కుప్యేత్=కోపించును.

తా. వానరోత్తమా ! ఈ రాక్షసస్త్రీలు రాజసేవ చేయువా రగుటచేత అస్వతంత్రలు. పరుల ఆజ్ఞ ప్రకారము పని చేయువారు, వాళ్లకు లొంగి ఉండువాళ్లు, అట్టి దాసీల విషయమున ఎవడైనా కోపించునా? 40

మూ. భాగ్యవైషమ్యదోషేణ పురస్తాద్దుష్కృతేన చ,
మయైతత్ప్రాప్యతే సర్వం స్వకృతం హ్యుపభుజ్యతే. 41

ప్ర. అ. భాగ్యవైషమ్యదేషేణ=భాగ్యముయొక్క, వైషమ్య మనే దోషముచేతను, పురస్తాత్=పూర్వము చేయబడిన, దుష్కృతేన చ=పాపముచేతను, మయా=నాచేత, ఏతత్=ఇది, సర్వమ్=అంతా, ప్రాప్యతే=పొందబడుచున్నది. స్వకృతమ్=తనచేత చేయబడినదే, ఉపభుజ్యతే హి=అనుభవించబడును కదా.

తా. నా భాగ్యము ప్రతికూలముగా ఉండుటచేతను, నేను పూర్వము చేసిన పాపముచేతను, నేను ఇదంతా అనుభవించవలసి వచ్చినది. ప్రతివారూ తాము చేసిన కర్మఫలమునే అనుభవింతురు కదా? 41

మూ. మైవం వద మహాబాహో దైవీ హ్యేషా పరా గతిః,
ప్రాప్తవ్యం తు దశాయోగాన్మమైతదితి నిశ్చితమ్. 42
దాసీనాం రావణస్యాహం మర్షయామీహ దుర్బలా.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! ఏవమ్=ఇట్లు, మా వద=పలకకుము. ఏషా=ఇది, దైవీ=దైవమునకు సంబంధించిన, పరా=గొప్పదైన, గతిః హి=గతి కదా?. మయా=నాచేత, దశాయోగాత్=దశాయోగమువలన, ఇదమ్=ఇది, ప్రాప్తవ్యమ్=పొందదగినది, ఇతి=అని, నిశ్చితమ్=నిశ్చయింపబడినది. దుర్బలా=దుర్బలురాలనైన, అహమ్=నేను, ఇహ=ఇక్కడ, రావణస్య=రావణుని యొక్క, దాసీనామ్=దాసీలకు, మర్షయామి=సహించుచున్నాను.

తా. ఓ ! మహాబాహూ ! ఇట్లు పలుకకుము. ఇది గొప్ప దైవనిర్ణయము. దశాసంబంధమును పట్టి నాకు ఇట్టి దుఃఖమును పొందవలె నని నిశ్చయింపఃబడినది. దైవవశముచేత ఆ నాడు దుర్బలురాలనైన నేను ఇక్కడ రావణుని దాసీలు పెట్టిన బాధలు క్షమించుచున్నాను. 42

మూ. ఆజ్ఞప్తా రాక్షసేనేహ రాక్షస్యస్తర్జయన్తి మామ్, 43
హతే తస్మిన్న కుర్వన్తి తర్జనం మారుతాత్మజ.

ప్ర. అ. మారుతాత్మజ=హనుమంతుడా ! ఇహ=ఇక్కడ, రాక్షసేన=రాక్షసునిచేత, ఆజ్ఞప్తాః=ఆజ్ఞాపించబడినవారై, రాక్షస్యః=రాక్షసస్త్రీలు, మామ్=నన్ను, తర్జయన్తి=భయపెట్టినారు. తస్మిన్=అతడు, హతే=చంపబడినవాడగుచుండగా, తర్జనమ్=భయపెట్టుటను, న కుర్వన్తి=చేయరు.

తా. హనుమంతుడా ! ఈ రాక్షసస్త్రీలు రావణునిచేత ఆజ్ఞాపింపబడిన వారై నన్ను భయపెట్టిరి. కాని ఇతడు చంపబడిన పిమ్మట ఇటుపైన వీళ్లు అట్లు చేయరు. 43

మూ. అయం వ్యాఘ్రసమీపే తు పురాణో ధర్మసంహితః, 44
ఋక్షేణ గీతః శ్లోకోఽస్తి తం నిబోధ ప్లవంగమ.

ప్ర. అ. ప్లవంగమ=హనుమంతుడా ! వ్యాఘ్రసమీపే=వ్యాఘ్రసమీపమునందు, ఋక్షేణ=భల్లూకముచేత, గీతః=చెప్పబడిన, పురాణః=ప్రాచీనమైన, ధర్మసంహితః=ధర్మసంమతమైన, శ్లోకః=శ్లోకము, అస్తి=ఉన్నది. తమ్=దానిని, నిబోధ=తెలిసికొనుము.

తా. హనుమంతుడా ! వ్యాఘ్రముతో భల్లూకము చెప్పిన ఒక ప్రాచీనము, ధర్మసంమతము అయిన శ్లోక మున్నది. దానిని వినుము. 44

మూ. న పరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్, 45
సమయో రక్షితవ్యస్తు సన్తశ్చారిత్రభూషణాః.

ప్ర. అ. పరేషామ్=పరులవిషయమునందు, పాపకర్మణామ్=పాపకర్మ

చేయువారికి, పరః=ఉత్తముడు, పాపమ్=పాపకర్మను, నాదత్తే=ఆచరించడు, సమయః=నియమము, రక్షితవ్యః తు=రక్షించదగినది. సన్తః=సత్పురుషులు, చారిత్రభూషణాః=మంచి చరిత్రమే భూషణముగా గలవారు.

తా. పరుల విషయములో పాపకర్మ ఆచరించువానికి కూడ ఉత్తముడు పాపమును (ప్రత్యపకారమును) చెయ్యడు. అపకారముచేసిన వానికి కూడ ప్రత్యపకారము చేయగూడదు అను నియమమును రక్షించవలెను. సత్పురుషులకు మంచి చరిత్రయే అలంకారము. 45

వి. ఒక వేటగానిని పెద్దపులి తరుముకొని రాగా ఆతడు ఒక చెట్టు ఎక్కెను. దానిపై ఉన్న ఎలుగుబంటితో - "ఈ మానవుడు మన కందరికీ శత్రువు; వీనిని క్రిందికి త్రోసివేయుము" అని పెద్దపులి చెప్పినను ఎలుగుబంటు అందుకు అంగీకరించలేదు. వానికి అభయమిచ్చి తాను నిద్రపోయెను. అప్పుడు పెద్దపులి "దానిని క్రిందికి పడద్రోయుము" అని ఆ వేటగానితో అనగా ఆత డట్లు పడదోసెను. కాని ఆ ఎలుగుబంటు అభ్యాసవశముచేత నేలపైపడే లోగా కొమ్మ గట్టిగా పట్టుకొనెను. అట్లు తనకు అపకారము చేసినను ఆ వేటగానికి ప్రత్యుపకారము చేయుటకు అంగీకరించక పై శ్లోకమును చదివెను, అను పురాణగాథ ఇక్కడ స్మర్తవ్యము.

ఈ శ్లోకమునకు పైన చూపిన వ్యాఖ్యానము ప్రాచీనవ్యాఖ్యాతల వ్యాఖ్యానమును అనుసరించినది. కాని ఇది అంతగా అక్షరానుగుణముగా లేదు. ఈ విధముగా చేసిన బాగుండు నని తోచును.-- "పాపకర్మణామ్=పాపకర్మలుగల, పరేషామ్=ఇతరులయొక్క, పాపమ్=పాపమును, పరః=మరియొకడు, నాదత్తే=గ్రహించడు" అనగా - "ఎవడైన అపకారము చేయుట వంటి పాపకర్మ చేసినచో దాని ఫలము ఆతడే అనుభవించునుగాని ఇతరు డెవ్వడూ అనుభవించడు. అందుచేత అట్టివానికి ప్రత్యపకారము చేయవలసిన పని లేదు" అని భావము.

మూ. పాపానాం వా శుభానాం వా వధార్హాణామథాపి వా, 46
కార్యం కారుణ్యమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి.

ప్ర. అ. పాపానాం వా=పాపాత్ములవిషయములో నైనా, శుభానాం వా=పుణ్యాత్ముల విషయములోనైనా, అథాపి వా=లేక, వధార్హాణామ్=వధకు తగినవారి విషయములో నైనా, ఆర్యేణ=మంచి పురుషునిచేత, కారుణ్యమ్=దయ, కార్యమ్=చేయదగినది, కశ్చిత్=ఏ ఒక్కడూ, నాపరాధ్యతి ఇతి న=అపరాధము చేయడనునది లేదు కదా?

తా. సత్పురుషుడు పాపాత్ముల విషయములో నైనా, పుణ్యాత్ములవి

షయములో నైనా, చంపదగినవారి విషయములోనైనా దయ చూపవలెను. లోకములో ఏదో ఒక అపరాధము చేయనివాడు ఎవడూ ఉండడు కదా! 46

మూ. లోకహింసావిహారాణాం క్రూరాణాం పాపకర్మణామ్, 47
కుర్వతామపి పాపాని నైవ కార్యమశోభనమ్.

ప్ర. అ. లోకహింసావిహారాణామ్=లోకహింసయే విహారముగా గల వారై, క్రూరాణామ్=క్రూరులు, పాపకర్మణామ్=పాపకర్మలు గలవారై, పాపాని= పాపములను, కుర్వతామపి=చేయుచున్నవారికి కూడ, అశోభనమ్=చెడ్డదైన, కార్యమ్=కార్యము, న కార్యమ్=చేయదగినది కాదు.

తా. లోకాలను హింసించుటయే విహారముగా గలిగి, క్రూరులై, పాపకర్మలు గలవారై, పాపములను చేయుచున్నవారికి కూడ చెడును చేయగూడదు. 47

మూ. ఏవముక్తస్తు హనుమాన్ సీతయా వాక్యకోవిదః, 48
ప్రత్యువాచ తతః సీతాం రామపత్నీమనిన్దితామ్.

ప్ర. అ. సీతయా=సీతచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, వాక్యకో విదః=మాటలలో నేర్పరియైన, హనుమాన్=హనుమంతుడు, తతః=అటుపిమ్మట, రామపత్నీమ్=రాముని భార్య, అనిన్దితామ్=నిందింపబడనిదీ అయిన, సీతామ్=సీతను గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. మాటలలో నేర్పరియైన హనుమంతుడు సీత మాటలు విని, పిమ్మట రాముని భార్య, దోషరహితురాలూ అయిన ఆ సీతతో ఇట్లు పలికెను.

మూ. యుక్తా రామస్య భవతీ ధర్మపత్నీ గుణాన్వితా, 49
ప్రతిసందిశ మాం దేవి గమిష్యే యత్ర రాఘవః.

ప్ర. అ. దేవి=దేవీ ! గుణాన్వితా=సద్గుణములతో కూడిన, భవతీ=నీవు, రామస్య=రామునకు, యుక్తా=తగిన, ధర్మపత్నీ=ధర్మపత్నివి. మామ్=నన్ను గూర్చి, ప్రతిసందిశ=ప్రతిసందేశము ఇమ్ము. రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడ నున్నాడో అక్కడికి, గమిష్యే=వెళ్లగలను.

తా. ఓ ! దేవీ ! సద్గుణవంతురాలవైన నీవు రామునకు తగిన ధర్మపత్నివి. నేను తీసికొని వచ్చిన సందేశమునకు బదులుగా సందేశము ఇమ్ము. రాముడున్నచోటికి వెళ్లెదను. 49

మూ. ఏవముక్తా హనుమతా వైదేహీ జనకాత్మజా, 50
సాబ్రవీద్ద్రష్టుమిచ్ఛామి భర్తారం వానరోత్తమ.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, జనకాత్మజా=జనకుని కుమార్తెయైన, సా=ఆ, వైదేహీ=సీత, అబ్రవీత్=పలికెను. వానరోత్తమ=ఓ ! వానరోత్తమా ! భర్తారమ్=నా భర్తను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. హనుమంతుని మాటలు విని జనకుని కుమార్తెయైన సీత ఇట్లు పలికెను.-- "హనుమంతుడా ! నేను నా భర్తను చూడవలె నని కోరుచున్నాను"

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః, 51
హర్షయన్మైథిలీం వాక్యమువాచేదం మహామతిః.

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడు, మహామతిః=గొప్ప బుద్ధి గలవాడూ అయిన, హనుమాన్=హనుమంతుడు, తస్యాః=ఆమెయొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, మైథిలీమ్=సీతను, హర్షయన్=సంతోషింపచేయుచు, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. వాయుపుత్రుడు, గొప్ప బుద్ధి కలవాడు అయిన హనుమంతుడు సీత పలికిన మాట విని, ఆమెకు సంతోషము కలిగించుచు, ఇట్లు పలికెను.51

మూ. పూర్ణచన్ద్రముఖం రామం ద్రక్ష్యస్యద్య సలక్ష్మణమ్, 52
స్థిరమిత్రం హతామిత్రం శచీవ త్రిదశేశ్వరమ్.

ప్ర. అ. పూర్ణచన్ద్రముఖమ్=పూర్ణచంద్రుని వంటి ముఖము గలవాడు, సలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడినవాడు, స్థిరమిత్రమ్=స్థిరులైన మిత్రులు గలవాడు, హతామిత్రమ్=చంపబడిన అమిత్రులు గలవాడు అయిన, రామమ్=రాముణ్ణి, శచీ=శచీదేవి, త్రిదశేశ్వరమ్ ఇవ=దేవేంద్రుణ్ణి వలె, అద్య=ఇప్పుడు, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. స్థిరులైన మిత్రులు గలవాడు, శత్రువులను సంహరించినవాడు, పూర్ణచంద్రుని వంటి ముఖము కలవాడు అయిన లక్ష్మణసహితుడైన రాముణ్ణి శచీదేవి దేవేంద్రుణ్ణి చూచినట్లు ఇప్పుడే చూడగలవు. 52

మూ. తామేవముక్త్వా రాజన్తీం సీతాం సాక్షాదివ శ్రియమ్, 53
ఆజగామ మహాతేజా హనూమాన్యత్ర రాఘవః.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, హనూమాన్=హనుమంతుడు, సాక్షాత్=సాక్షాత్తు, శ్రియమివ=లక్ష్మి వలె, రాజన్తీమ్=ప్రకాశించుచున్న, తామ్=ఆ సీతను గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, రాఘవః=రాముడు, యత్ర=ఎక్కడ ఉన్నాడో అక్కడికి, ఆజగామ=వచ్చెను.

తా. మహాతేజఃశాలియైన హనుమంతుడు సాక్షాత్తు లక్ష్మి వలె ప్రకాశించుచున్న ఆ సీతతో ఇట్లు పలికి రాముడున్న చోటికి వచ్చెను. 53

మూ. సపది హరివరస్తతో హనూమాన్
ప్రతివచనం జనకేశ్వరాత్మజాయాః,
కథితమకథయద్యథాక్రమేణ
త్రిదశవరప్రతిమాయ రాఘవాయ. 54

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే త్రయోదశాధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, హరివరః=వానరశ్రేష్ఠుడైన, హనూమాన్=హనుమంతుడు, సపది=వెంటనే, కథితమ్=చెప్పబడిన, జనకేశ్వరాత్మజాయాః=సీతయొక్క, ప్రతివచనమ్=ప్రత్యుత్తరమును, త్రిదశవరప్రతిమాయ=ఇంద్రునితో సమానుడైన, రాఘవాయ=రామునకు, యథాక్రమేణ=క్రమానుసారముగా, అకథయత్=చెప్పెను.

తా. పిమ్మట వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు సీత చెప్పిన ప్రత్యుత్తరమును దేవేంద్రునితో సమానుడైన రామునకు క్రమానుసారముగా చెప్పెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్దశాధికశతతమః సర్గః

[రాముని ఆజ్ఞ చేత విభీషణుడు సీతను రాముని వద్దకు రప్పించుట; సీత రాముణ్ణి చూచుట.]

మూ. తమువాచ మహాప్రాజ్ఞః సోఽభివాద్య ప్లవంగమః,
రామం కమలపత్రాక్షం వరం సర్వధనుష్మతామ్. 1

ప్ర. అ. మహాప్రాజ్ఞః=గొప్ప బుద్ధిమంతుడైన, సః ప్లవంగమః=ఆ హనుమంతుడు, కమల పత్రాక్షమ్=తామరపూరేకుల వంటి నేత్రములు గలవాడు, సర్వధనుష్మతామ్=సగకలధనుర్ధరులలో, వరమ్=శ్రేష్ఠుడు అయిన, తం రామమ్=ఆ రాముణ్ణి, అభివాద్య=నమస్కరించి, ఉవాచ=పలికెను.

తా. మహాబుద్ధిశాలియైన ఆ హనుమంతుడు కమలపత్రములవంటి నేత్రములు గలవాడు, సకల ధనుర్ధారులలో శ్రేష్ఠుడూ అయిన రామునకు నమస్కరించి ఇట్లు చెప్పెను. 1

మూ. యన్నిమిత్తోఽయమారమ్భః కర్మణాం యః ఫలోదయః,
తాం దేవీం శోకసంతప్తాం ద్రష్టుమర్హసి మైథిలీమ్. 2

ప్ర. అ. కర్మణామ్=కర్మలయొక్క, అయమ్=ఈ, ఆరమ్భః=ఆరంభము, యన్నిమిత్తః=ఎవతె నిమిత్తముగా కలదో, యః=ఏది, ఫలోదయః=ఫలోదయమో, తామ్=అట్టి, శోకసంతప్తామ్=శోకముచేత పీడితురాలైన, దేవీమ్=దేవియైన, మైథిలీమ్=సీతను, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి=తగి యున్నావు.

తా. ఏ సీతకొరకే ఈ పనులన్నీ ప్రారంభించి చేసినామో, ఏ సీత ఈ పనులకు ఫలమో, అట్టి దుఃఖసంతప్తురాలైన సీతాదేవిని నీవు చూడవలెను.

మూ. సా హి శోకసమావిష్టా బాష్పపర్యాకులేక్షణా
మైథిలీ విజయం శ్రుత్వా ద్రష్టుం త్వామభికాఙ్క్షతి. 3

ప్ర. అ. శోకసమావిష్టా=దుఃఖముతో కూడిన, సా మైథిలీ=ఆ సీత, విజయమ్=విజయమును, శ్రుత్వా=విని, బాష్పపర్యాకులేక్షణా=కన్నీటిచేత వ్యాకులములైన నేత్రములు కలదై, త్వామ్=నిన్ను, ద్రష్టుమ్=చూచుటకు, అభికాఙ్క్షతి=కోరుచున్నది.

తా. శోకాక్రాంతురాలైన ఆ సీత నీ విజయవార్త వినగానే

ఆనందబాష్పములతో నిండిన నేత్రములు గలదై నిన్ను చూడవలె నని కోరుచున్నది. 3

మూ. పూర్వకాత్ప్రత్యయాచ్చాహముక్తో విశ్వస్తయా తయా,
భర్తారం ద్రష్టుమిచ్ఛామి కృతార్థం సహలక్ష్మణమ్. 4

ప్ర. అ. పూర్వకాత్=పూర్వమునందున్న, ప్రత్యయాత్=నమ్మకమువలన, విశ్వస్తయా=విశ్వసించిన, తయా=ఆమెచేత, అహమ్=నేను, ఉక్తః=చెప్పబడితిని. కృతార్థమ్=కృతార్థుడైన, సహలక్ష్మణమ్=లక్ష్మణసమేతుడైన, భర్తారమ్=భర్తను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. వెనుకటి నమ్మకముచేత నా మాటయందు విశ్వాసము గల ఆమె "కార్యమును సాధించిన లక్ష్మణ సహితుడైన భర్తను చూడవలె నని కోరుచున్నాను" అని నాతో పలికినది. 4

మూ. ఏవముక్తో హనుమతా రామో ధర్మభృతాం వరః,
ఆగచ్ఛత్సహసా ధ్యానమీషద్బాష్పపరిప్లుతః. 5

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ధర్మభృతామ్=ధర్మమును పోషించువారిలో, వరః=శ్రేష్ఠుడైన, రామః=రాముడు, ఈషత్=కొంచెము, బాష్పపరిప్లుతః=కన్నీళ్ళతో వ్యాకులుడై, సహసా=వెంటనే, ధ్యానమ్=ఆలోచనను, ఆగచ్ఛత్=పొందెను.

తా. హనుమంతుని మాటలు విని ధర్మాత్ములలో శ్రేష్ఠుడైన రాముడు కొంచెము కన్నీళ్ళతో వ్యాకులుడై వెంటనే కొంత సేపు ఆలోచించెను. 5

మూ. దీర్ఘముష్ణం వినిఃశ్వస్య జగతీమవలోకయన్,
ఉవాచ మేఘసంకాశం విభీషణముపస్థితమ్. 6

ప్ర. అ. దీర్ఘమ్=దీర్ఘముగాను, ఉష్ణమ్=వేడిగాను, వినిఃశ్వస్య=నిట్టూర్చి, జగతీమ్=భూమిని, అవలోకయన్=చూచుచు, ఉపస్థితమ్=సమీపమునందున్న, మేఘసంకాశమ్=మేఘముతో సమానుడైన, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, ఉవాచ=పలికెను.

తా. దీర్ఘముగాను, వేడిగాను నిట్టూర్చి, నేలవైపు చూచుచు, దగ్గరనే ఉన్న మేఘముతో సమానుడైన విభీషణునితో ఇట్లు పలికెను. 6

మూ. దివ్యాఙ్గరాగాం వైదేహీం దివ్యాభరణభూషితామ్,
ఇహ సీతాం శిరఃస్నాతాముపస్థాపయ మా చిరమ్. 7

ప్ర. అ. శిరఃస్నాతామ్=శిరఃస్నానము చేసినది, దివ్యాఙ్గరాగామ్=శ్రేష్ఠమైన అంగరాగము గలది, దివ్యాభరణభూషితామ్=శ్రేష్ఠమైన అలంకారములచేత అలంకరింపబడినదీ అయిన, సీతామ్=సీతను, ఇహ=ఇక్కడికి, ఉపస్థాపయ=తీసికొని రమ్ము; చిరమ్=చిరకాలము, మా=చేయవద్దు.

తా. శిరఃస్నానము చేసి, శ్రేష్ఠమైన మైపూత పూసికొని, దివ్యములైన ఆభరణములు అలంకరించుకొన్న సీతను వెంటనే ఇక్కడికి తీసికొని రమ్ము. 7

మూ. ఏవముక్తస్తు రామేణ త్వరమాణో విభీషణః,
ప్రవిశ్యాన్తఃపురం సీతాం స్త్రీభిః స్వాభిరచోదయత్. 8

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, రామేణ=రామునిచేత, ఉక్తః=పలకబడిన, విభీషణః=విభీషణుడు, త్వరమాణః=తొందరపడుచు, అన్తఃపురమ్=అంతఃపురమును, ప్రవిశ్య=ప్రవేశించి, స్వాభిః=తన సంబంధమైన, స్త్రీభిః=స్త్రీలచేత, సీతామ్=సీతను, అచోదయత్=ప్రేరేపించెను.

తా. రాముని మాటలు విని విభీషణుడు తొందరపడుచు అంతఃపురములో ప్రవేశించి, తన స్త్రీలద్వారా సీతకు ఈ విషయము చెప్పించెను.

మూ. తతః సీతాం మహాభాగాం దృష్ట్వోవాచ విభీషణః,
మూర్ధ్ని బద్ధాఞ్జలిః శ్రీమాన్వినీతో రాక్షసేశ్వరః. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శ్రీమాన్=శ్రీమంతుడు, రాక్షసేశ్వరః=రాక్షసప్రభువు అయిన, విభీషణః=విభీషణుడు, మహాభాగామ్=మహాభాగ్యవంతురాలైన, సీతామ్=సీతను,దృష్ట్వా=చూచి, వినీతః=వినయము గలవాడై, మూర్ధ్ని=శిరస్సుపై, బద్ధాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట శ్రీమంతుడు, రాక్షస ప్రభువూ అయిన విభీషణుడు మహాభాగ్యవంతురాలైన సీతను చూచి, వినయవంతుడై, శిరస్సుపై దోసిలి కట్టి ఇట్లు పలికెను. 9

మూ. దివ్యాఙ్గరాగా వైదేహి దివ్యాభరణభూషితా,
యానమారోహ భద్రం తే భర్తా త్వాం ద్రష్టుమిచ్ఛతి. 10

ప్ర. అ. వైదేహి=సీతా, దివ్యాఙ్గరాగా=దివ్యమైన అంగరాగము గలదానవై, దివ్యాభరణభూషితా=దివ్యములైన ఆభరణములచేత అలంకరింపబడినదానవై, యానమ్=వాహనమును, ఆరోహ=ఎక్కుము. తే=నీకు, భద్రమ్=క్షేమ మగుగాక. భర్తా=భర్త, త్వామ్=నిన్ను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు.

తా. ఓ ! సీతా ! దివ్యమైన అంగరాగము పూసికొని, దివ్యములైన ఆభరణములు అలంకరించుకొని వాహనమును ఎక్కుము. నీ భర్త నిన్ను చూడవలె నని కోరుచున్నాడు. నీకు క్షేమ మగుగాక. 10

మూ. ఏవముక్తా తు వైదేహీ ప్రత్యువాచ విభీషణమ్,
అస్నాత్వా ద్రష్టుమిచ్ఛామి భర్తారం రాక్షసేశ్వర. 11

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, వైదేహీ=సీత, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. రాక్షసేశ్వర=ఓ రాక్షసరాజా, అస్నాత్వా=స్నానము చేయకుండగనే, భర్తారమ్=భర్తను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. సీత విభీషణుని మాటలు విని ఆతనితో ఇట్లు పలికెను. రాక్షసరాజా ! స్నానము చేయకుండగానే భర్తను చూడవలెనని కోరుచున్నాను.

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా ప్రత్యువాచ విభీషణః,
యథాహ రామో భర్తా తే తత్తథా కర్తుమర్హసి. 12

ప్ర. అ. తస్యాః=ఆమెయొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, విభీషణః=విభీషణుడు, ప్రత్యువాచ=తిరిగి పలికెను. తే=నీయొక్క, భర్తా=భర్తయైన, రామః=రాముడు, యథా=ఎట్లు, ఆహ=పలికెనో, తత్=దానిని, తథా=అట్లు, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. ఆమె మాటలు విని విభీషణుడు తిరిగి పలికెను. "నీ భర్తయైన రాముడు చెప్పినట్లు చేయుట మంచిది". 12

మూ. తస్య తద్వచనం శ్రుత్వా మైథిలీ పతిదేవతా,
భర్తృభక్త్యా వృతా సాధ్వీ తథేతి ప్రత్యభాషత. 13

ప్ర. అ. పతిదేవతా=భర్తయే దేవతగా గల, సాధ్వీ=మంచి స్వభావము గల, మైథిలీ=సీత, తస్య=విభీషణునియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, భర్తృభక్త్యా=భర్తయందు భక్తితో, వృతా=కూడినదై, తథేతి=అట్లే అని, ప్రత్యభాషత=పలికెను.

తా. భర్తయే దేవతగా గల, ఉత్తమస్వభావవంతురాలైన సీత విభీషణుని మాటలు విని, భర్తయందు భక్తితో అట్లే చేసెదను అని పలికెను. 13

మూ. తతః సీతాం శిరఃస్నాతాం సంయుక్తాం ప్రతికర్మణా,
మహార్హాభరణోపేతాం మహార్హామ్బరధారిణీమ్, 14

ఆరోప్య శిబికాం దీప్తాం పరార్ధ్యామ్బరసంవృతామ్,
రాక్షసైర్బహుభిర్గుప్తామాజహార విభీషణః. 15

ప్ర. అ. తతః=అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, శిరఃస్నాతామ్=స్నానము చేసినది, ప్రతికర్మణా=సంస్కారముతో, సంయుక్తామ్=కూడినది, మహార్హాభరణోపేతామ్=చాల వెలగల ఆభరణములతో కూడినది, మహార్హామ్బరధారిణీమ్=చాల మూల్యము గల వస్త్రములను ధరించినది అయిన, సీతామ్=సీతను, దీప్తామ్=ప్రకాశించుచున్నది, పరార్ధ్యామ్బర సంవృతామ్=శ్రేష్ఠములైన వస్త్రములచేత కప్పబడినది, బహుభిః=అనేకులైన, రాక్షసైః=రాక్షసులచేత, గుప్తామ్=రక్షింపబడినది అయిన, శిబికామ్=పల్లకీని, ఆరోప్య=ఎక్కించి, ఆజహార=తీసికొనివచ్చెను.

తా. పిమ్మట విభీషణుడు, తగు శరీరసంస్కారాదులు చేసికొని శిరఃస్నానము చేసిన, అమూల్యములైన ఆభరణములు, శ్రేష్ఠములైన వస్త్రములు ధరించిన సీతను, శ్రేష్ఠములైన వస్త్రములచేత కప్పబడిన, ప్రకాశించుచున్న, అనేక రాక్షసులు రక్షించుచున్న పల్లకీ ఎక్కించి తీసికొని వచ్చెను. 14, 15

మూ. సోఽభిగమ్య మహాత్మానం జ్ఞాత్వాపి ధ్యానమాస్థితమ్,
ప్రణతశ్చ ప్రహృష్టశ్చ ప్రాప్తాం సీతాం న్యవేదయత్. 16

ప్ర. అ. సః=విభీషణుడు, జ్ఞాత్వాపి=తెలిసి కూడ, ధ్యానమ్=ధ్యానమును, ఆస్థితమ్=అవలంబించిన, మహాత్మానమ్=మహాత్ముడైన రాముణ్ణి, అభిగమ్య=సమీపించి, ప్రణతః చ=నమస్కరించుచున్నవాడై, ప్రహృష్టశ్చ=సంతోషించుచున్నవాడై, సీతామ్=సీతను, ప్రాప్తామ్=వచ్చిన దానినిగా, న్యవేదయత్=తెలిపెను.

తా. సీత వచ్చినట్లు తెలిసికూడ ఏదో ఆలోచించుచున్న మహాత్ముడైన ఆ రాముని దగ్గరకు వెళ్లి, విభీషణుడు నమస్కరించుచు, సీత వచ్చినది అని సంతోషపూర్వకముగా తెలిపెను. 16

మూ. తామాగతాముపశ్రుత్య రక్షోగృహచిరోషితామ్,
హర్షో దైన్యం చ రోషశ్చ త్రయం రాఘవమావిశత్. 17

ప్ర. అ. రక్షోగృహచిరోషితామ్=రాక్షసుని గృహమునందు చిరకాలమున్న, తామ్=ఆమెను, ఆగతామ్=వచ్చినదానినిగా, ఉపశ్రుత్య=విని, రాఘవమ్=రాముణ్ణి, హర్షః=సంతోషము, దైన్యమ్=దైన్యము, రోషశ్చ=కోపము, త్రయమ్=ఈ త్రయమూ కూడ, ఆవిశత్=ఆవేశించెను.

తా. రాక్షసుని ఇంట్లో చాల కాలము నివసించిన ఆ సీత వచ్చినదని వినగానే రామునకు సంతోషము, దైన్యము, కోపమూ ఈ మూడూ కూడ కలిగెను. 17

మూ. తతః పార్శ్వగతం దృష్ట్వా సవిమర్శం విచారయన్,
విభీషణమిదం వాక్యమహృష్టో రాఘవోఽబ్రవీత్. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, అహృష్టః=సంతోషించనివాడై, సవిమర్శమ్=విమర్శపూర్వకముగా, విచారయన్=ఆలోచించుచు, పార్శ్వగతమ్=పార్శ్వమునందున్న, విభీషణమ్=విభీషణుణ్ణి, దృష్ట్వా=చూచి, ఇదమ్=ఈ, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట రాముడు సంతోషము లేనివాడై, విమర్శపూర్వకముగా ఆలోచించుచు, ప్రక్క నున్న విభీషణుని చూచి, ఇట్లు పలికెను. 18

మూ. రాక్షసాధిపతే సౌమ్య నిత్యం మద్విజయే రత,
వైదేహీ సంనికర్షం మే శీఘ్రం సముపగచ్ఛతు. 19

ప్ర. అ. నిత్యమ్=ఎల్లప్పుడూ, మద్విజయే=నా విజయమునందు, రత=ఆసక్తి గలవాడా, సౌమ్య=సౌమ్యుడా, రాక్షసాధిపతే=రాక్షసరాజా, వైదేహీ=సీత, శీఘ్రమ్=శీఘ్రముగా, మే=నాయొక్క, సంనికర్షమ్=సమీపమును, సముపగచ్ఛతు=పొందుగాక.

తా. నిత్యమూ నా విజయము కోరు, సౌమ్యుడవైన ఓ విభీషణా! సీత శీఘ్రముగా నా దగ్గరకు వచ్చుగాక. 19

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య విభీషణః,
తూర్ణముత్సారణం తత్ర కారయామాస ధర్మవిత్. 20

ప్ర. అ. తస్య రాఘవస్య=ఆ రామునియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, ధర్మవిత్=ధర్మముల నెరిగిన, విభీషణః=విభీషణుడు, తత్ర=అక్కడ, తూర్ణమ్=శీఘ్రముగా, ఉత్సారణమ్=జనులను తొలగించుటను, కారయామాస=చేయించెను.

తా. ధర్మములు తెలిసిన విభీషణుడు రాముడు పలికిన ఆ మాటలు విని శీఘ్రముగా జనులను దూరముగా తొలగింపచేసెను. 20

మూ. కఞ్చుకోష్ణీషిణస్తత్ర వేత్రజర్ఝరపాణయః,
ఉత్సారయన్తస్తాన్ యోధాన్ సమన్తాత్ పరిచక్రముః. 21

ప్ర. అ. తత్ర=అక్కడ, కఞ్చుకోష్ణీషిణః=పొడవైన చొక్కాలు తలపాగలు గల, వేత్రజర్ఝరపాణయః=బెత్తముచేత గరుకుగా ఉన్న చేతులు గల కంచుకులు, తాన్=ఆ, యోధాన్=యోధులను, ఉత్సారయన్తః=దూరముగా తొలగించుచు, సమన్తాత్=అంతటా, పరిచక్రముః=నడచిరి.

తా. అప్పుడు ఎల్లప్పుడూ బెత్తములు పట్టుకొని ఉండుట చేత బిరుసెక్కిన హస్తములు గల, పొడవైన చొక్కాలు తలపాగలు ధరించిన కంచుకులు అక్కడ నున్న యోధులను దూరముగా తొలగుడు అని చెప్పుచు అంతటా సంచరించిరి. 21

మూ. ఋక్షాణాం వానరాణాం చ రాక్షసానాం చ సర్వశః,
వృన్దాన్యుత్సార్యమాణాని దూరముత్తస్థురన్తతః. 22

ప్ర. అ. ఋక్షాణామ్=భల్లూకములయొక్క, వానరాణాం చ=వానరులయొక్క, రాక్షసానాం చ=రాక్షసులయొక్క, సర్వశః=అన్నివైపులా, ఉత్సార్యమాణాని=దూరముగా తొలగించబడుచున్న, వృన్దాని=సముదాయములు, అన్తతః=సమీపమునుండి, దూరమ్=దూరము, ఉత్తస్థుః=ఎగిరినవి.

తా. అన్ని వైపులనుండీ తొలగింపబడుచున్న భల్లూకములు, వానరులు, రాక్షసులు సమీప ప్రదేశమునుండి దూరమునకు ఎగిరి వెళ్లిపోయిరి. 22

మూ. తేషాముత్సార్యమాణానాం నిఃస్వనః సుమహానభూత్,
వాయునోద్ధూయమానస్య సాగరస్యేవ నిఃస్వనః. 23

ప్ర. అ. తేషామ్=వారు, ఉత్సార్యమాణానామ్=తొలగించబడుచుండగా, వాయునా=వాయువుచేత, ఉద్ధూయమానస్య=ఎగరగొట్టబడుచున్న, సాగరస్య=సముద్రముయొక్క, నిఃస్వనః ఇవ=ధ్వని వలె, సుమహాన్=చాల పెద్దదైన, స్వనః=ధ్వని, అభూత్=ఆయెను.

తా. వాళ్లు ఆ విధముగా తొలగింపబడుచున్నప్పుడు, వాయువుచేత ఎగరగొట్టబడుచున్న సముద్రము ధ్వనివంటి గొప్ప ధ్వని కలిగెను. 23

మూ. ఉత్సార్యమాణాన్ దృష్ట్వాథ జగత్యాం జాతసంభ్రమాన్,
దాక్షిణ్యాత్తదమర్షాచ్చ వారయామాస రాఘవః. 24

ప్ర. అ. అథ=పిమ్మట, రాఘవః=రాముదు, ఉత్సార్యమాణాన్=తొలగింపబడుచున్న, జగత్యామ్=భూమిమీద, జాతసంభ్రమాన్=కలిగిన తొందరగల వాళ్లను, దృష్ట్వా=చూచి, దాక్షిణ్యాత్=మంచితనమువలనను, అమర్షాత్=సహించకపోవుటవలనను, తత్=దానిని, వారయామాస=నివారించెను.

తా. అప్పుడు ఆ విధముగా తొలగింపబడుచున్న ఆ వానరాదులు నేలమీద త్రొక్కిసలాటలో చిక్కుకొని ఉండగా చూచి, రాముదు వాళ్లపై నున్న ప్రేమచేతను, దానిని సహించకపోవుటచేతను, ఆ నివారణమును నివారించెను.

మూ. సంరబ్ధశ్చాబ్రవీద్రామశ్చక్షుషా ప్రదహన్నివ,
విభీషణం మహాప్రాజ్ఞం సోపాలమ్భమిదం వచః. 25

ప్ర. అ. రామః=రాముడు, సంరబ్ధః చ=కోపించినవాడై, చక్షుషా=చూపుచేత, ప్రదహన్నివ=కాల్చుచున్నవాడు వలె, మహాప్రాజ్ఞమ్=గొప్ప బుద్ధి గల, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, సోపాలమ్భమ్=ఆక్షేపపూర్వకముగా, ఇదం వచః=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. రాముడు కోపించి చూపులతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు మహాబుద్ధిశాలియైన విభీషణునితో ఇట్లు పలికెను. 25

మూ. కిమర్థం మామనాదృత్య క్లిశ్యతేఽయం త్వయా జనః,
నివర్తయైనముద్యోగం జనోఽయం స్వజనో మమ. 26

ప్ర. అ. మామ్=నన్ను, అనాదృత్య=అనాదరించి, త్వయా=నీచేత, అయం జనః=ఈ జనము, కిమర్థమ్=ఎందువలన, క్లిశ్యతే=క్లేశపెట్టబడుచున్నది? ఉద్యోగమ్=ఈ ప్రయత్నమును, నివర్తయ=నివర్తింపచేయుము. అయమ్=ఈ, జనః=జనము, మమ=నాయొక్క, స్వజనః=స్వజనము.

తా. నా మాట కాదని వీళ్ల నందరినీ ఎందుకు బాధపెట్టుచున్నావు? ఈ ప్రయత్నము ఆపివేయుము. వీళ్లందరూ నావాళ్ళు. 26

మూ. న గృహాణి న వస్త్రాణి న ప్రాకారాస్తిరస్క్రియా,
నేదృశా రాజసత్కారా వృత్తమావరణం స్త్రియాః. 27

ప్ర. అ. స్త్రియాః=స్త్రీకి, గృహాణి=గృహము, ఆవరణమ్=ఆవరణము, న=కాదు. వస్త్రాణి=వస్త్రములు, న=కాదు. ప్రాకారాః=ప్రాకారములు, న=కాదు. తిరస్క్రియా=తెర, న=కాదు. ఈదృశాః=ఇట్టి, రాజసత్కారాః=రాచమర్యాదలు, న=కావు. వృత్తమ్=మంచి నడవడికయే, (ఆవరణమ్=ఆవరణము).

తా. స్త్రీకి ఇల్లు గాని, వస్త్రములు గాని, ప్రాకారములు గాని, తెరలు గాని, ఈ విధములైన రాజసత్కారములు గాని ఆవరణము కాదు. మంచి నడవడికయే ఆవరణము. 27

మూ. వ్యసనేషు న కృచ్ఛ్రేషు న యుద్ధేషు స్వయంవరే,
న క్రతౌ నో వివాహే వా దర్శనం దూష్యతే స్త్రియాః. 28

ప్ర. అ. వ్యసనేషు=ఇష్టజనుల వియోగములయందు, స్త్రియాః=స్త్రీయొక్క, దర్శనమ్=దర్శనము, న దూష్యతే=దూషింపబడదు. కృచ్ఛ్రేషు=రాజ్యక్షోభములయందు, యుద్ధేషు=యుద్ధములందు, స్వయంవరే=స్వయంవరమునందు,

న=దూషింపబడదు. క్రతౌ=యజ్ఞమునందు, న=దూషింపబడదు. వివాహే వా=వివాహమునందు కాని, న=దూషింపబడదు.

తా. ఇష్టజనవియోగము మొదలైన వ్యసనములందు గాని, రాజ్యక్షోభాదు లందు గాని, యుద్ధములందు గాని, స్వయంవరమునందు గాని, యజ్ఞమునందు గాని, వివాహమునందు గాని స్త్రీలు ఇతరుల కంటబడుటలో దోషము లేదు.28

మూ. సైషా విపద్గతా చైవ కృచ్ఛ్రే చ మహతి స్థితా,
దర్శనే నాస్తి దోషోఽస్యా మత్సమీపే విశేషతః. 29

ప్ర. అ. సా ఏషా=అట్టి ఈమె, విపద్గతా చైవ=ఆపదలను పొందినది. మహతి=గొప్ప, కృచ్ఛ్రే=కష్టమునందు, స్థితా=ఉన్నది. అస్యాః=ఈమెయొక్క, దర్శనే=దర్శనమునందు, దోషః=దోషము, నాస్తి=లేదు, విశేషతః=విశేషించి, మత్సమీపే=నాదగ్గర దోషము లేదు.

తా. ఈమె ఆపదలలో ఉన్నది. గొప్ప కష్టపరిస్థితిలో ఉన్నది. అందుచేత ఈమెను అందరూ చూచినా దోషము లేదు. విశేషించి నా దగ్గర ఉన్నప్పుడు అసలే లేదు. 29

మూ. విసృజ్య శిబికాం తస్మాత్పద్భ్యామేవోపసర్పతు,
సమీపే మమ వైదేహీం పశ్యన్త్వేతే వనౌకసః. 30

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, శిబికామ్=పల్లకీని, ఉత్సృజ్య= విడచి, పద్భ్యామేవ=పాదములచేతనే, ఉపసర్పతు=వచ్చుగాక. ఏతే=ఈ, వనౌ కసః=వానరులు, మమ=నాయొక్క, సమీపే=సమీపమునందు, వైదేహీమ్=సీతను, పశ్యన్తు=చూచెదరు గాక.

తా. అందువలన ఈమె పల్లకీ విడచి కాలినడకనే నా దగ్గరకు వచ్చుగాక. ఈ వానరులందరూ నా దగ్గర నుండగా ఈమెను చూచెదరు గాక. 30

మూ. ఏవముక్తస్తు రామేణ సవిమర్శో విభీషణః,
రామస్యోపానయత్సీతాం సంనికర్షం వినీతవత్. 31

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలుకబడిన, సవి మర్శః=ఆలోచనతో కూడిన, విభీషణః=విభీషణుడు, సీతామ్=సీతను, వినీతవత్=వి నయవంతుడై, రామస్య=రామునకు, ఉపానయత్=సమీపమునకు తీసికొనివచ్చెను.

తా. రాముని మాటలు విని, విభీషణుడు ఆలోచించుచు సీతను

సవినయముగా రాముని దగ్గరకు తీసికొని వచ్చెను. 31

మూ. తతో లక్ష్మణసుగ్రీవౌ హనూమాంశ్చ ప్లవంగమః,
నిశమ్య వాక్యం రామస్య బభూవుర్వ్యథితా భృశమ్. 32

ప్ర. అ. తతః=అటు పిమ్మట, లక్ష్మణసుగ్రీవౌ=లక్ష్మణసుగ్రీవులు, ప్లవంగమః=వానరుడైన, హనూమాంశ్చ=హనుమంతుడు, రామస్య=రామునియొక్క, వాక్యమ్=వాక్యమును, నిశమ్య=విని, భృశమ్=మిక్కిలి, వ్యథితాః=వ్యథ చెందినవారు, బభూవుః=అయిరి.

తా. అప్పుడు లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు రాముని మాటలు విని చాల వ్యథ చెందిరి. 32

మూ. కలత్రనిరపేక్షైశ్చ ఇఙ్గితైరస్య దారుణైః,
అప్రీతమివ సీతాయాం తర్కయన్తి స్మ రాఘవమ్. 33

ప్ర. అ. కలత్రనిరపేక్షైః=భార్యయందు ఆసక్తి లేని, అస్య=ఈ రామునియొక్క, దారుణైః=భయంకరములైన, ఇఙ్గితైః=ముఖవికారాదులచేత, రాఘవమ్=రాముణ్ణి, సీతాయామ్=సీత విషయమున, అప్రీతమ్=ప్రీతిలేనివాడా అన్నట్లు, తర్కయన్తి స్మ=ఊహించిరి.

తా. భార్యయందు ఔదాసీన్యమును సూచించు ఇతని భయంకరములైన ముఖవికారాదులచేత ఈతనికి భార్యయందు ప్రీతి లేదా, అను సంశయము వారికి కలిగెను.

మూ. లజ్జయా త్వవలీయన్తీ స్వేషు గాత్రేషు మైథిలీ,
విభీషణేనానుగతా భర్తారం సాభ్యవర్తత. 34

ప్ర. అ. సా=ఆ, మైథిలీ తు=సీతయైతే, లజ్జయా=సిగ్గుచేత, స్వేషు=తన సంబంధమైన, గాత్రేషు=అవయవములలో, అవలీయన్తీ=అణిగిపోవుచు, విభీషణేన=విభీషణునిచేత, అనుగతా=అనుసరించబడినదై, భర్తారమ్=భర్తను, అభ్యవర్తత=సమీపించెను.

తా. సీతయైతే సిగ్గుచేత తన అవయవాలలో అణగిపోవుచు, విభీషణుడు వెంట రాగా, భర్తను సమీపించెను. 34

మూ. విస్మయాచ్చ ప్రహర్షాచ్చ స్నేహాచ్చ పతిదేవతా,
ఉదైక్షత ముఖం భర్తుః సౌమ్యం సౌమ్యతరాననా. 35

ప్ర. అ. సౌమ్యతరాననా మిక్కిలి సౌమ్యమైన ముఖము గల, పతిదేవతా

పతియే దేవతగా గల సీత, విస్మయాచ్చ=ఆశ్చర్యమువలన, ప్రహర్షాచ్చ=సంతోష మువలన, స్నేహాచ్చ=స్నేహమువలన, భర్తుః=భర్తయొక్క, సౌమ్యమ్=సుందరమైన, ముఖమ్=ముఖమును, సముద్రైక్షత=చూచెను.

తా. మిక్కిలి సౌమ్యమైన ముఖము గల పతివ్రతయైన ఆ సీత సుందరమైన భర్త ముఖమును ఆశ్చర్యముతోను, ఆనందాతిశయముతోను, స్నేహముతోను, కళ్లు పైకెత్తి చూచెను. 35

మూ. అథ సమపనుదన్మనఃక్లమం సా
సుచిరమదృష్టముదీక్ష్య వై ప్రియస్య,
వదనముదితచన్ద్రపూర్ణకాన్తం
విమలశశాఙ్కనిభాననా తదానీమ్. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే చతుర్దశాధికశతతమః సర్గః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, విమలశశాఙ్కనిభాననా=స్వచ్ఛమైన చంద్రుని వంటి ముఖము గల, సా=ఆ సీత, తదానీమ్=అప్పుడు, ప్రియస్య=ప్రియునియొక్క, సుచిరమ్=చాలకాలము, అదృష్టమ్=చూడబడని, ఉదితచన్ద్రపూర్ణకాన్తమ్=ఉదయించిన చంద్రుడు వలె పూర్తిగా మనోహరమైన, వదనమ్=ముఖమును, ఉదీక్ష్య=చూచి, మనఃక్లమమ్=మనస్సులోని క్లేశమును, అపనుదత్=తొలగించుకొనెను.

తా. నిర్మలమైన చంద్రబింబము వంటి ముఖము గల ఆ సీత అప్పుడు చాల కాలము చూడబడని ఉదయించిన చంద్రుని వంటి పరిపూర్ణకాంతి గల భర్త ముఖము చూచి మనస్సులోని ఖేదమును విడచెను. 36

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదునాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చదశాధికశతతమః సర్గః

[సీత చరిత్రను శంకించిన రాముడు "నీ వెక్కడికైన వెళ్లవచ్చును" అని ఆమెను ఆదేశించుట.]

మూ. తాం తు పార్శ్వే స్థితాం ప్రహ్వాం రామః సంప్రేక్ష్య మైథిలీమ్,
హృదయాన్తర్గతం భావం వ్యాహర్తుముపచక్రమే. 1

ప్ర. అ. రామః=రాముడు, పార్శ్వే=పార్శ్వమునందు, స్థితామ్=నిలచిన, ప్రహ్వామ్=వంగి యున్న, తాం మైథిలీమ్=ఆ సీతను, సంప్రేక్ష్య=చూచి, హృదయాన్తర్గతమ్=తన హృదయములో నున్న, భావమ్=భావమును, వ్యాహర్తుమ్=చెప్పుటకు, ఉపచక్రమే=ఉపక్రమించెను.

తా. రాముడు వినయముతో వంగి తన ప్రక్క నిలచిన సీతను చూచి తన మనస్సులోని భావము చెప్పుటకు ప్రారంభించెను. 1

మూ. ఏషాసి నిర్జితా భద్రే శత్రుం జిత్వా రణాజిరే,
పౌరుషాద్యదనుష్ఠేయం మయైతదుపపాదితమ్. 2

ప్ర. అ. భద్రే=మంగళప్రదురాలా ! ఏషా=ఈ నీవు, రణాజిరే=యుద్ధరంగమునందు, శత్రుమ్=శత్రువును, జిత్వా=జయించి, నిర్జితా=జయింపబడినదానవు, అసి=అయి ఉన్నావు. పౌరుషాత్=పౌరుషమువలన, యత్=ఏది, అనుష్ఠేయమ్=చేయదగినదో, తత్=అది, మయా=నాచేత, ఉపపాదితమ్=చేయబడినది.

తా. ఓ ! మంగళప్రదురాలా ! యుద్ధరంగమునందు శత్రువును జయించి నిన్ను జయించుకొన్నాను. పురుషప్రయత్నమువలన చేయదగినదానిని చేసినాను. 2

మూ. గతోఽస్మ్యన్తమమర్షస్య ధర్షణా సంప్రమార్జితా,
అవమానశ్చ శత్రుశ్చ యుగపన్నిహతౌ మయా. 3

ప్ర. అ.అమర్షస్య=కోపముయొక్క, అన్తమ్=అంతమును, గతః అస్మి=పొందితిని. ధర్షణా=అవమానము, సంప్రమార్జితా=తుడిచివేయబడినది. మయా=నాచేత, అవమానశ్చ=అవమానము, శత్రుశ్చ=శత్రువు, యుగపత్=ఒక్కమారుగా, నిహతౌ=తొలగించబడిరి.

తా.కోపమునకు అంతమును పొందితిని. అవమానమును తుడిచివేసితిని నేను అవమానమును శత్రువునూ కూడ ఒక్కమారుగా తొలగించితిని. 3

మూ. అద్య మే పౌరుషం దృష్టమద్య మే సఫలః శ్రమః,
అద్య తీర్ణప్రతిజ్ఞోఽహం ప్రభవామ్యద్య చాత్మనః. 4

ప్ర. అ. అద్య=ఇప్పుడు, మే=నాయొక్క, పౌరుషమ్=పౌరుషము, దృష్టమ్=చూడబడినది. అద్య=నేడు, మే=నాయొక్క, శ్రమః=శ్రమ, సఫలః=సఫలమైనది. అద్య=ఇప్పుడు, అహమ్=నేను, తీర్ణప్రతిజ్ఞః=దాటబడిన ప్రతిజ్ఞ గలవాడను. అద్య=ఇప్పుడు, ఆత్మనః=నాకు, ప్రభవామి=సమర్థుడ నగుచున్నాను.

తా. ఇప్పుడు నా పౌరుషము అందరిచేతను చూడబడినది. ఇప్పుడు నా శ్రమ సఫల మైనది. ఇప్పుడు నా ప్రతిజ్ఞ తీర్చుకొంటిని. ఇప్పుడు నాపై నేను స్వాతంత్ర్యము పొందగలిగితిని. 4

మూ. యా త్వం విరహితా నీతా చలచిత్తేన రక్షసా,
దైవసంపాదితో దోషో మానుషేణ మయా జితః. 5

ప్ర. అ. యా త్వమ్=ఏ నీవు, విరహితా=నానుండి దూరమైనదానవై, చలచిత్తేన=చంచలచిత్తము గల, రక్షసా=రాక్షసునిచేత, నీతా=తీసుకొనిపోబడితివో, దైవసంపాదితః=దైవముచేత చేయబడిన, దోషః=దోషము, మానుషేణ=మనుష్యుడనైన, మయా=నాచేత, జితః=జయించబడినది.

తా. నేను నీ దగ్గరలేని సమయమున చపలచిత్తుడైన రాక్షసుడు నిన్ను అపహరించినాడు. దైవకృతమైన ఈ దోషమును మానవుడ నైన నేను మానవయత్నముచే సరిచేసితిని. 5

మూ. సంప్రాప్తమవమానం యస్తేజసా న ప్రమార్జతి,
కస్తస్య పౌరుషేణార్థో మహతాప్యల్పచేతసః. 6

ప్ర. అ. యః=ఎవడు, సంప్రాప్తమ్=వచ్చిన, అవమానమ్=అవమానమును, తేజసా=తేజస్సుచేత, న ప్రమార్జతి=తుడిచివేయడో, అల్పచేతసః=అల్పమైన చిత్తము గల, తస్య=వానియొక్క, మహతాపి=గొప్పదైనను, పౌరుషేణ=పౌరుషముచేత, కః అర్థః=ఏమి ప్రయోజనము?

తా. జరిగిన అవమానమును ఎవడు తేజస్సుచేత తుడిచివేయడో అట్టి అల్పచిత్తునకు ఎంత గొప్ప పౌరుష మున్నను ఏమి ప్రయోజనము? 6

మూ. లఙ్ఘనం చ సముద్రస్య లఙ్కాయాశ్చాపి మర్దనమ్,
సఫలం తస్య చ శ్లాఘ్యమద్య కర్మ హనూమతః. 7

ప్ర. అ. తస్య హనూమతః=ఆ హనుమంతునియొక్క, సముద్రస్య=సముద్రముయొక్క, లఙ్ఘనమ్=దాటుట, లఙ్కాయాః=లంకయొక్క, మర్దనం చ=మర్దనము, శ్లాఘ్యమ్=శ్లాఘించదగిన, కర్మ=ఈ పని అంతా, అద్య=ఇప్పుడు, సఫలమ్=సఫలమైనది.

తా. సముద్రమును దాటుట, లంకను మర్దించుట అను హనుమంతుడు చేసిన శ్లాఘించదగిన పని ఇప్పుడు సఫల మైనది. 7

మూ. యుద్ధే విక్రమతశ్చైవ హితం మన్త్రియతస్తథా,
సుగ్రీవస్య ససైన్యస్య సఫలోఽద్య పరిశ్రమః. 8

ప్ర. అ. యుద్ధే=యుద్ధమునందు, విక్రమతః=పరాక్రమించినవాడు, తథా=మరియు, హితమ్=హితమును, మన్త్రియతః=ఆలోచించువాడూ అయిన, ససైన్యస్య=సైన్యముతో కూడిన, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, పరిశ్రమః=పరిశ్రమ, అద్య=ఇప్పుడు, సఫలః=సఫల మైనది.

తా. యుద్ధములో పరాక్రమము చూపుచు హిత మగు ఆలోచనలు చేయు సైన్యసహితుడైన సుగ్రీవుని పరిశ్రమ ఇప్పుడు సఫలమైనది. 8

మూ. విభీషణస్య చ తథా సఫలోఽద్య పరిశ్రమః,
విగుణం భ్రాతరం త్యక్త్వా యో మాం స్వయముపస్థితః. 9

ప్ర. అ. తథా=మరియు, విభీషణస్య=విభీషణునియొక్క, పరిశ్రమశ్చ=పరిశ్రమ కూడ, అద్య=ఇప్పుడు, సఫలః=సఫలమైనది, యః=ఏ విభీషణుడు, విగుణమ్=చెడ్డ గుణములు గల, భ్రాతరమ్=సోదరుణ్ణి, త్యక్త్వా=విడచి, స్వయమ్=స్వయముగా, మామ్=నన్ను, ఉపస్థితః=చేరినాడో.

తా. చెడ్డ గుణములు గల సోదరుణ్ణి విడచి స్వయముగా నన్ను చేరిన విభీషణుని పరిశ్రమ కూడ ఇప్పుడు సఫల మైనది. 9

మూ. ఇత్యేవం వదతః శ్రుత్వా సీతా రామస్య తద్వచః,
మృగీవోత్ఫుల్లనయనా బభూవాశ్రుపరిప్లుతా. 10

ప్ర. అ. సీతా=సీత, ఇత్యేవమ్=ఇట్లు, వదతః=పలుకుచున్న, రామస్య=రామునియొక్క,తత్=ఆ, వచః=వచనమును, శ్రుత్వా=విని, మృగీవ=ఆడలేడి వలె, ఉత్ఫుల్లనయనా=వికసించిన నేత్రములు గలదై, అశ్రుపరిప్లుతా=కన్నీళ్లతో నిండినది, బభూవ=ఆయెను.

తా. సీత ఇట్లు పలుకుచున్న రాముని మాటలు విని ఆడలేడి వలె వికసించిన నేత్రములు గలదై కన్నీళ్లు రాల్చెను. 10

మూ. పశ్యతస్తాం తు రామస్య సమీపే హృదయప్రియామ్,
జనవాదభయాద్రాజ్ఞో బభూవ హృదయం ద్విధా. 11

ప్ర. అ. సమీపే=సమీపమునందు, హృదయప్రియామ్=హృదయప్రియురాలైన, తామ్=ఆమెను, పశ్యతః=చూచుచున్న, రాజ్ఞః=రాజైన, రామస్య=రామునియొక్క, హృదయమ్=హృదయము, జనవాదభయాత్=జనవాదమువలన భయమువలన, ద్విధా=రెండు విధములుగా, బభూవ=ఆయెను.

తా. తన హృదయమునకు ప్రియురాలైన, సమీపమునందే నిలచియున్న సీతను చూచుచున్న ఆ రాజైన రాముని హృదయము జనాపవాదభయముచేత రెండు విధములుగా ఉండెను. 11

మూ. సీతాముత్పలపత్రాక్షీం నీలకుఞ్చితమూర్ధజామ్,
అవదద్వై వరారోహాం మధ్యే వానరరక్షసామ్. 12

ప్ర. అ. ఉత్పలపత్రాక్షీమ్=ఉత్పలపత్రములవంటి నేత్రములు గల, నీలకుఞ్చితమూర్ధజామ్=నల్లని వక్రములైన కేశములు గల, వరారోహామ్=శ్రేష్ఠమైన కటిప్రదేశము గల, సీతామ్=సీతను గూర్చి, వానరరక్షసామ్=వానరులయొక్క, రాక్షసులయొక్క, మధ్యే=మధ్యయందు, అవదత్ వై=పలికెను.

తా. నల్లకలువరేకుల వంటి నేత్రములు, నల్లని వక్రములైన కేశములు, శ్రేష్ఠమైన కటిప్రదేశము గల సీతతో, వానరులయొక్క, రాక్షసులయొక్క మధ్యయందు రాము డిట్లు పలికెను. 12

మూ. యత్కర్తవ్యం మనుష్యేణ ధర్షణాం ప్రతిమార్జతా,
తత్కృతం రావణం హత్వా మయేదం మానకాఙ్క్షిణా. 13

ప్ర. అ. మానకాఙ్క్షిణా=గౌరవమును కోరిన, మయా=నాచేత, రావణమ్=రావణుణ్ణి, హత్వా=చంపి, ధర్షణామ్=అవమానమును, ప్రతిమార్జతా=తుడిచివేయు, మనుష్యేణ=మనుష్యునిచేత, యత్=ఏది, కర్తవ్యమ్=చేయదగినదో, తత్=ఆ, ఇదమ్=ఇది, కృతమ్=చేయబడినది.

తా. గౌరవమును కోరిన నేను రావణుని సంహరించి, అవమానమును తొలగించుకొనకోరు మానవుడు ఏమి చేయునో అది చేసితిని. 13

మూ. నిర్జితా జీవలోకస్య తపసా భావితాత్మనా,
అగస్త్యేన దురాధర్షా మునినా దక్షిణేవ దిక్. 14

ప్ర. అ. తపసా=తపస్సుచేత, భావితాత్మనా=పరిశుద్ధము చేయబడిన మనస్సు గల, అగస్త్యేన=అగస్త్యునిచేత, జీవలోకస్య=జీవసముదాయమునకు,

దురాధర్షా=సంచరింప శక్యము కాని, దక్షిణా దిక్ ఇవ=దక్షిణ దిక్కు వలె, నీవు, నిర్జితా=(శత్రువునుండి) జయించబడితివి.

తా. తపస్సుచేత పరిశుద్ధము చేసికొనబడిన మనస్సు గల అగస్త్యుడు ఇల్వలాదులు ఆక్రమించి ఉండుటచేత లోకులకు సంచరింప శక్యము కాని దక్షిణదిక్కును జయించి నట్లు నేను నిన్ను శత్రువునుండి జయించితిని. 14

మూ. విదితశ్చాస్తు భద్రం తే యోఽయం రణపరిశ్రమః,
సుతీర్ణః సుహృదాం వీర్యాన్న త్వదర్థం మయా కృతః. 15
రక్షతా తు మయా వృత్తమపవాదం చ సర్వతః,
ప్రఖ్యాతస్యాత్మవంశస్య న్యఙ్గం చ పరిమార్జతా. 16

ప్ర. అ. యః=ఏ, రణపరిశ్రమః=యుద్ధపరిశ్రమము, సుహృదామ్=స్నేహితులయొక్క, వీర్యాత్=పరాక్రమమువలన, సుతీర్ణః=బాగుగా దాటబడినదో, అయమ్=ఇది, మయా=నాచేత, త్వదర్థమ్=నీకొరకు, న కృతః=చేయబడలేదు అని, విదితః=తెలియబడినది, అస్తు=అగుగాక. తే=నీకు, భద్రమ్=మంగళము, అస్తు=అగుగాక. వృత్తమ్=చారిత్రమును, సర్వతః=అన్ని వైపులనుండి, అపవాదం చ=అపవాదమును, రక్షతా=రక్షించుచున్న, ప్రఖ్యాతస్య=ప్రసిద్ధమైన, ఆత్మవంశస్య=తన వంశముయొక్క, న్యఙ్గమ్=కళంకమును, పరిమార్జతా=తుడిచివేయుచున్న, మయా=నాచేత (చేయబడినది).

తా. ఏ యుద్ధపరిశ్రమను నేను స్నేహితుల పరాక్రమముచేత దాటగలిగితినో అట్టి ఈ యుద్ధపరిశ్రమను నేను నీ కొరకై చేయలేదను విషయమును గ్రహింపుము. నా చరిత్రను రక్షించుకొనుటకు, అన్ని వైపులనుండి లోకాపవాదము రాకుండ చేసికొనుటకూ, ప్రసిద్ధమైన నా వంశము కళంకమును తుడిచివేయుటకు నేను ఈ పరిశ్రమ చేసితిని. నీకు క్షేమ మగుగాక.15, 16

మూ. ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢమ్. 17

ప్ర. అ. ప్రాప్తచారిత్రసందేహా=పొందబడిన చరిత్రసందేహము గలదానవైన, మమ=నాకు, ప్రతిముఖే=ఎదుట, స్థితా=నిలచిన, నీవు, నేత్రాతురస్య=నేత్రరోగము గలవానికి, దీపః ఇవ=దీపము వలె, మే=నాకు, దృఢమ్=అధికముగా, ప్రతికూలా అసి=ప్రతికూలురాలవుగా ఉన్నావు.

తా. చరిత్ర విషయమున సందేహింప దగిన నీవు నా ఎదుట నిలచి, కంటి జబ్బుతో బాధపడుచున్నవానికి దీపము వలె నాకు చాల భరింప శక్యము కానిదానవుగా ఉన్నావు. 17

మూ. తద్గచ్ఛ త్వానుజానేఽద్య యథేష్టం జనకాత్మజే,
ఏతా దశ దిశో భద్రే కార్యమస్తి న మే త్వయా. 18

ప్ర. అ. జనకాత్మజే=ఓ ! సీతా ! తత్=ఆ కారణమువలన, అద్య=ఇప్పుడు, త్వా=నిన్ను, అనుజానే=అనుమతించుచున్నాను. యథేష్టమ్=ఇష్టానుసారముగా, ఏతాః=ఈ, దశ=పది, దిశః=దిక్కులను గూర్చి, గచ్ఛ=వెళ్లుము. భద్రే=ఓ ! మంగళప్రదురాలా, మే=నాకు, త్వయా=నీచేత, కార్యమ్=కార్యము, నాస్తి=లేదు.

తా. ఓ ! సీతా ! అందుచేత ఇప్పుడు నీకు అనుజ్ఞ ఇచ్చుచున్నాను; ఈ పది దిక్కులలో నీ కిష్టమువచ్చిన దిక్కునకు వెళ్లవచ్చును. ఓ ! మంగళప్రదురాలా ! నాకు నీతో పని లేదు. 18

మూ. కః పుమాంస్తు కులే జాతః స్త్రియం పరగృహోషితామ్,
తేజస్వీ పునరాదద్యాత్ సుహృల్లేఖ్యేన చేతసా. 19

ప్ర. అ. కులే=సత్కులమందు, జాతః=పుట్టిన, తేజస్వీ=తేజశ్శాలియైన, కః పుమాన్=ఏ పురుషుడు, పరగృహోషితామ్=పరగృహమునం దున్న, స్త్రియమ్=స్త్రీని, సుహృల్లేఖ్యేన=ఆసక్తితో కూడిన, చేతసా=చిత్తముతో, పునః=మరల, ఆదద్యాత్=గ్రహించును?

తా. సత్కులమందు పుట్టిన తేజశ్శాలియైన ఏ పురుషుడైన పరగృహములో ఉన్న స్త్రీని అత్యాసక్తితో కూడిన మనస్సుతో మరల తీసికొనునా? 19

మూ. రావణాఙ్కపరిక్లిష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా,
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్. 20

ప్ర. అ. మహత్=గొప్పదైన, కులమ్=కులమును, వ్యపదిశన్=చెప్పుకొనుచు, రావణాఙ్కపరిక్లిష్టామ్=రావణుని ఒడిలో నలిగిన దానవు, దుష్టేన=దుష్టమైన, చక్షుషా=నేత్రముచేత, దృష్టామ్=చూడబడినదానవు అయిన, త్వామ్=నిన్ను, పునః=మరల, కథమ్=ఎట్లు, ఆదద్యామ్=గ్రహింతును?

తా. రావణుని ఒడిలో నలిగినదానవు, దుష్టమైన చూపులతో ఆతనిచేత చూడబడినదానవు అయిన నిన్ను, గొప్ప కులములో పుట్టినా నని చెప్పుకొనుచు నే నెట్లు మరల గ్రహించగలను ! 20

మూ. తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా,
నాస్తి మే త్వయ్యభిష్వఙ్గో యథేష్టం గమ్యతామితః. 21

ప్ర. అ. త్వమ్=నీవు, తదర్థమ్=ఆ కులము నిమిత్తము, మే=నాకు, (నాచేత),

నిర్జితా=జయింపబడితివి. మయా=నాచేత, యశః=కీర్తి, ప్రత్యాహృతమ్=తిరిగి త్రిప్పికొనిరాబడినది. మే=నాకు, త్వయి=నీయందు, అభిష్వఙ్గః=ఆసక్తి, నాస్తి=లేదు. ఇతః=ఇక్కడనుండి, యథేష్టమ్=ఇష్టానుసారముగా, గమ్యతామ్=వెళ్ళెదవుగాక.

తా. నేను నా కులము గౌరవము కాపాడుటకే నిన్ను జయించితివి. కీర్తిని మరల సంపాదించితిని. నీయందు నాకు ఆసక్తి లేదు. అందుచేత ఇక్కడినుండి నీ కిష్టము వచ్చిన చోటికి వెళ్లవచ్చును. 21

మూ. తదద్య వ్యాహృతం భద్రే మయైతత్ కృతబుద్ధినా,
లక్ష్మణే వాథ భరతే కురు బుద్ధిం యథాసుఖమ్. 22

ప్ర. అ. భద్రే=ఓ !మంగళప్రదురాలా ! తత్=ఆ కారణమువలన, అద్య=ఇప్పుడు, కృతబుద్ధినా=చేయబడిన బుద్ధి గల, మయా=నాచేత, ఏతత్=ఇది, వ్యాహృతమ్=పలకబడినది. యథాసుఖమ్=నీకు సుఖము కలుగు విధముగా, లక్ష్మణే వా=లక్ష్మణునియందు గాని, అథ=లేక, భరతే=భరతుని యందు గాని, బుద్ధిమ్=బుద్ధిని, కురు=చేయుము.

తా. ఓ ! మంగళప్రదురాలా ! అందుచేత నేను నిర్ణయము చేసికొనియే ఈ మాటలు చెప్పుచున్నాను. నీ ఇష్టము ప్రకారము లక్ష్మణుని సంరక్షణములో కాని, భరతుని సంరక్షణములో కాని ఉండుటకు నిశ్చయించుకొనుము. 22

మూ. శత్రుఘ్నే వాథ సుగ్రీవే రాక్షసే వా విభీషణే,
నివేశయ మనః సీతే యథా వా సుఖమాత్మనః. 23

ప్ర. అ. సీతే=సీతా! శత్రుఘ్నే వా=శత్రుఘ్నునియందు గాని, అథ=లేక, సుగ్రీవే=సుగ్రీవునియందు గాని, రాక్షసే=రాక్షసుడైన, విభీషణే వా=విభీషణుని యందు గాని, ఆత్మనః=నీకు, యథా=ఎట్లు, సుఖమ్=సుఖముండునో అట్లు గాని, మనః=మనస్సును, నివేశయ=ఉంచుము.

తా. సీతా ! శత్రుఘ్నుని సంరక్షణములో గాని, సుగ్రీవుని సంరక్షణములో గాని, రాక్షసుడైన విభీషణుని సంరక్షణములో గాని ఉండుటకు నిశ్చయించుకొనుము. లేదా నీ కిష్టము వచ్చినట్లు చేయుము. 23

మూ. న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్,
మర్షయేత చిరం సీతే స్వగృహే పర్యవస్థితామ్. 24

ప్ర. అ. సీతే=సీతా ! దివ్యరూపామ్=దివ్యమైనరూపముగల, మనోరమామ్=మనోహరురాలవైన, స్వగృహే=తన గృహములో, చిరమ్=చిరకాలము, పర్యవస్థితామ్=ఉన్న, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, రావణః=రావణుడు, న

మర్షయేత హి=సహింపజాలదు కదా !

తా. సీతా ! దివ్యమైన సౌందర్యము గల, మనోహరురాలవైన, తన ఇంటిలో చాల కాలము ఉన్న నిన్ను చూచి రావణుడు ఊరకుండజాలడు కదా? 24

మూ. తతః ప్రియార్హశ్రవణా తదప్రియం
ప్రియాదుపశ్రుత్య చిరస్య మైథిలీ,
ముమోచ బాష్పం సుభృశం ప్రవేపితా
గజేన్ద్రహస్తాభిహతేవ వల్లరీ. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే పఞ్చదశాధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రియార్హశ్రవణా=ప్రియమైన మాటలు వినుటకు తగిన, మైథిలీ=సీత, ప్రియాత్=ప్రియునినుండి, అప్రియమ్=అప్రియమైన, తత్=దానిని, ఉపశ్రుత్య=విని, గజేన్ద్రహస్తాభిహతా=ఏనుగు తొండముచేత కొట్టబడిన, వల్లరీవ=లత వలె, చిరస్య=చాలసేపు, సుభృశమ్=మిక్కిలి, ప్రవేపితా=వణకిపోయినదై, బాష్పమ్=కన్నీటిని, ముమోచ=విడచెను.

తా. అప్పుడు ప్రియమైన మాటలు వినుటకు తగిన ఆ సీత ప్రియునినుండి అప్రియమైన ఆ మాట విని, ఏనుగు తొండముచేత కదల్చబడిన లత వలె చాలసేపు మిక్కిలి వణకిపోయి కన్నీరు విడచెను. 25

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదిహేనవ సర్గ సమాప్తము.

# అథ షోడశాధికశతతమః సర్గః

*[సీత అధిక్షేపపూర్వకముగా రామునకు సమాధానము చెప్పి తన పాతివ్రత్యమును పరీక్షించుటకు అగ్నిలో ప్రవేశించుట.]*

మూ. ఏవముక్తా తు వైదేహీ పరుషం రోమహర్షణమ్,
రాఘవేణ సరోషేణ శ్రుత్వా ప్రవ్యథితాభవత్. 1

ప్ర. అ. సరోషేణ=రోషముతో కూడిన, రాఘవేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, పరుషమ్=పరుషముగాను, రోమహర్షణమ్=భయము కలుగునట్లుగాను, ఉక్తా=పలకబడిన, వైదేహీ=సీత, శ్రుత్వా=విని, ప్రవ్యథితా=చాల వ్యథ చెందినది, అభవత్=ఆయెను.

తా. రాముడు కోపముతో ఈ విధముగా పరుషముగాను, భయము కలుగునట్లుగాను పలుకగా ఆ మాటలు విని సీత చాల వ్యథ చెందెను. 1

మూ. సా తదాశ్రుతపూర్వం హి జనే మహతి మైథిలీ,
శ్రుత్వా భర్తుర్వచో ఘోరం లజ్జయావనతా భవత్. 2

ప్ర. అ. తదా=అప్పుడు, సా మైథిలీ=ఆ సీత, మహతి=గొప్ప, జనే=జనసమూహమునందు, అశ్రుతపూర్వమ్= పూర్వ మెన్నడూ వినబడని, ఘోరమ్=భయంకరమైన, భర్తుః=భర్తయొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, లజ్జయా=సిగ్గుచేత, అవనతా=వంగినది, అభవత్=ఆయెను.

తా. ఆ సీత ఆ గొప్ప జనసముదాయములో భర్త పలికిన, పూర్వ మెన్నడూ ఎరుగని భయంకరమైన మాటలు విని సిగ్గుతో క్రుంగిపోయెను. 2

మూ. ప్రవిశన్తీవ గాత్రాణి స్వాని సా జనకాత్మజా,
వాక్శరైస్తైః సశల్యేవ భృశమశ్రూణ్యవర్తయత్. 3

ప్ర. అ. సా జనకాత్మజా=ఆ సీత, స్వాని=తన సంబంధమైన, గాత్రాణి=అవయవములను, ప్రవిశన్తీవ=ప్రవేశించుచున్నదివలె, తైః=ఆ, వాక్శరైః=మాటలనే బాణములచేత, సశల్యేవ=ములుకులతో కూడినది వలె, భృశమ్=మిక్కిలి, అశ్రూణి=కన్నీళ్లను, అవర్తయత్=విడచెను.

తా. తన అవయవములలోనికి క్రుంగిపోవుచున్నదా అన్నట్లున్న ఆ సీత

ఆ మాట లనే బాణముల ములుకులు శరీరములో ఉన్నవా అన్నట్లు మిక్కిలి కన్నీళ్లు విడచెను. 3

మూ. తతో బాష్పపరిక్లిన్నం ప్రమార్జన్తీ స్వమాననమ్,
శనైర్గద్గదయా వాచా భర్తారమిదమబ్రవీత్. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బాష్పపరిక్లిన్నమ్=కన్నీటిచేత తడిసిన, స్వమ్=తన సంబంధమైన, ఆననమ్=ముఖమును, ప్రమార్జన్తీ=తుడుచుకొనుచు, న్నదై, భర్తారమ్=భర్తను గూర్చి, గద్గదయా=గద్గదమైన, వాచా=వాక్కుతో, శనైః=మెల్లగా, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట ఆమె కన్నీటితో తడిసిన ముఖమును తుడుచుకొనుచు గద్గదమైన వాక్కుతో మెల్లగా భర్తతో ఇట్లు పలికెను. 4

మూ. కిం మామసదృశం వాక్యమీదృశం శ్రోత్రదారుణమ్,
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతామివ. 5

ప్ర. అ. వీర=వీరుడా ! మామ్=నన్ను గూర్చి, ప్రాకృతః=సామాన్యపురుషుడు, ప్రాకృతామివ=సామాన్య స్త్రీని గూర్చి వలె, మామ్=నన్ను గూర్చి, అసదృశమ్=తగని, ఈదృశమ్=ఇట్టి, శ్రోత్రదారుణమ్=చెవులకు చాల బాధాకరమైన, రూక్షమ్=పరుషమైన, వాక్యమ్=వాక్యమును, కిమ్=ఎందువలన, శ్రావయసే=వినిపించుచున్నావు?

తా. వీరుడా ! ఒక సామాన్యపురుషుడు సామాన్యస్త్రీతో పలుకుచున్నట్లు నాతో ఇట్టి తగని, చెవులకు దారుణమైన, పరుషమైన మాట పలుకుచున్నావేమి?

మూ. న తథాస్మి మహాబాహో యథా మామవగచ్ఛసి,
ప్రత్యయం గచ్ఛ మే స్వేన చారిత్రేణైవ తే శపే. 6

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! మామ్=నన్ను, యథా=ఎట్లు, అవగచ్ఛసి=తెలుసుకొనుచున్నావో, తథా=అట్లు, న అస్మి=కాను. మే=నా విషయమునందు, ప్రత్యయమ్=నమ్మకమును, గచ్ఛ=పొందుము. స్వేన=నా సంబంధమైన, చారిత్రేణ=సచ్చరిత్రచేత, తే=నీకు, శపే=ఒట్టుపెట్టుచున్నాను.

తా. ఓ ! మహాబాహూ ! నేను నీవు అనుకున్నట్లు ప్రవర్తించినదానను కాను. నన్ను విశ్వసింపుము. నా సచ్చరిత్రపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 6

మూ. పృథక్స్త్రీణాం ప్రచారేణ జాతిం త్వం పరిశఙ్కసే,
పరిత్యజైనాం శఙ్కాం తు యది తేఽహం పరీక్షితా. 7

ప్ర. అ. పృథక్స్త్రీణామ్=సామాన్యస్త్రీలయొక్క, ప్రచారేణ=ప్రవృత్తిచేత, త్వమ్=నీవు, జాతిమ్=స్త్రీజాతినే, పరిశఙ్కసే=శంకించుచున్నావు. అహమ్=నేను, తే=నీకు, పరీక్షితా యది=పరీక్షింపబడిన ట్లయితే, ఏనామ్=ఈ, శఙ్కామ్=శంకను, పరిత్యజ=విడువుము.

తా. ప్రాకృతస్త్రీల ప్రవృత్తిని పట్టి నీవు స్త్రీజాతినే శంకించుచున్నావు. నీవు ఇంతకు ముందు నన్ను పరీక్షించియే ఉన్నచో, (అనగా నా స్వభావ మెట్టిదో నీకు తెలిసిన విషయమే గాన) ఈ శంకను విడువుము. 7

మూ. యదహం గాత్రసంస్పర్శం గతాస్మి వివశా ప్రభో,
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి. 8

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! వివశా=వివశురాలనైన, అహమ్=నేను, గాత్రసంస్పర్శమ్=శరీరస్పర్శను, గతా=పొందినదానను, అస్మి=అయితిని, ఇతి యత్=అనునది ఏది గలదో, తత్ర=అక్కడ, మే=నాకు, కామకారః=ఇచ్ఛాపూర్వకముగా చేయుట, న=లేదు. తత్ర=ఆ విషయమునందు, దైవమ్=దైవమే, అపరాధ్యతి=అపరాధము చేయుచున్నది.

తా. ప్రభూ ! నేను నా వశములో లేని స్థితిలో రావణుని శరీరము స్పర్శ కలిగిన దనగా ఆ విషయమునందు దైవముయొక్క అపరాధమే కాని అది నేను మనఃపూర్వకముగా చేసినది కాదు. 8

మూ. మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే,
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యామ్యనీశ్వరీ. 9

ప్ర. అ. యత్=ఏది, మదధీనమ్=నా ఆధీనమైనదో, తత్=ఆ, మే=నా యొక్క, హృదయం తు=హృదయమైతే, త్వయి=నీయందు, వర్తతే=ఉన్నది. పరాధీనేషు=పరాధీనములైన, గాత్రేషు=అవయవముల విషయమునందు, అనీశ్వరీ=అసమర్థురాలనైన నేను, కిమ్=ఏమి, కరిష్యామి=చేయుదును?

తా. కాని నా చెప్పుచేతులలో నున్న హృదయము మాత్రము నీయందే నిలచి ఉన్నది. పరాధీనమైన శరీరము విషయమున, అసమర్థురాలనైన నేను ఏమి చేయగలను? 9

మూ. సహసంవృద్ధభావేన సంసర్గేణ చ మానద,
యది తేఽహం న విజ్ఞాతా హతా తేనాస్మి శాశ్వతమ్. 10

ప్ర. అ. మానద=మానమును ఇచ్చువాడా ! సహసంవృద్ధభావేన=కూడా పెరుగుటచేతను, సంసర్గేణ చ=సంబంధముచేతను కూడ, అహమ్=నేను, తే=నీకు,

న విజ్ఞాతా యది=తెలియబడక పోయినచో, తేన=దానిచేత, శాశ్వతమ్=శాశ్వతముగా, హతా అస్మి=కొట్టబడితిని.

తా. మానమును కాపాడువాడా ! ఇంతకాలము కలిసి పెరిగి, కలిసి ఉండీ కూడ నీవు నే నెట్టిదాననో తెలిసికొనకపోయినచో నేను పూర్తిగా నశించినట్లే. 10

మూ. ప్రేషితస్తే మహావీరో హనుమానవలోకకః,
లఙ్కాస్థాహం త్వయా రాజన్ కిం తదా న విసర్జితా. 11

ప్ర. అ. రాజన్=రాజా ! మహావీరః=మహావీరుడైన, హనుమాన్=హనుమంతుడు, అవలోకకః=వెదకేవాడుగా, తే=నీకు (నీచేత), ప్రేషితః=పంపబడినాడు. లఙ్కాస్థా=లంకలో ఉన్న, అహమ్=నేను, త్వయా=నీచేత, తదా=అప్పుడే, కిమ్=ఎందువలన, న విసర్జితా=విడవబడలేదు?

తా. రాజా ! నన్ను వెదకుటకు మహావీరుడైన హనుమంతుణ్ణి పంపినావు. లంకలో ఉన్నట్లు తెలిసిన నన్ను అప్పుడే ఎందుకు త్యజించలేదు.11

మూ. ప్రత్యక్షం వానరస్యాస్య తద్వాక్యసమనన్తరమ్,
త్వయా సంత్యక్తయా వీర త్యక్తం స్యాజ్జీవితం మయా. 12

ప్ర. అ. వీర=వీరుడా ! అస్య=ఈ, వానరస్య=వానరునియొక్క, ప్రత్యక్షమ్=ప్రత్యక్షముగా, తద్వాక్యసమనన్తరమ్=ఆ వాక్యము తరువాత, త్వయా=నీచేత, సంత్యక్తయా=విడవబడిన, మయా=నాచేత, జీవితమ్=జీవితము, త్యక్తమ్=విడవబడినది, స్యాత్=అయి ఉండెడిది.

తా. వీరుడా ! ఈ హనుమంతుడు ప్రత్యక్షముగా చూచి చెప్పిన పిమ్మట నీవు నన్ను త్యజించి ఉన్నచో నేను నా ప్రాణములు విడచి ఉండెదానను. 12

మూ. న వృథా తే శ్రమోఽయం స్యాత్సంశయే న్యస్య జీవితమ్,
సుహృజ్జనపరిక్లేశో న చాయం విఫలస్తవ. 13

ప్ర. అ. జీవితమ్=జీవితమును, సంశయే=సంశయమునందు, న్యస్య=ఉంచి, తే=నీకు, వృథా=వ్యర్థముగా, అయం శ్రమః=ఈ శ్రమ, న స్యాత్=ఉండెడిది కాదు. అయమ్=ఈ, విఫలః=వ్యర్థమైన, తవ=నీయొక్క, సుహృజ్జనపరిక్లేశః=స్నేహితుల క్లేశము, న చ=ఉండెడిది కాదు.

తా. నీవు ఆ విధముగా చేసి ఉన్నచో జీవితమును సంశయములో పెట్టుకొని వ్యర్థముగా నీవు ఇంత శ్రమ పడవలసి ఉండెడిది కాదు. నీ

మిత్రులకు కూడ ఇంత నిష్ఫలమైన క్లేశము కలిగి యుండెడిది కాదు. 13

మూ. త్వయా తు నృపశార్దూల దోషమేవానువర్తతా,
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్. 14

ప్ర. అ. నృపశార్దూల=రాజశ్రేష్ఠుడా ! రోషమేవ=కోపమునే, అనువర్తతా=అనుసరించుచున్న, త్వయా తు=నీచేతనైతే, లఘునా=తేలిక స్వభావము గల, మనుష్యేణ ఇవ=మనుష్యునిచేత వలె, స్త్రీత్వమేవ=స్త్రీత్వమే, పురస్కృతమ్=ప్రధానముగా చూడబడినది.

తా. ఓ ! రాజశ్రేష్ఠుడా ! నీవైతే కేవలము కోపావేశముతో చిన్న బుద్ధిగల మానవుడు వలె స్త్రీ అనుదానికే ప్రాధాన్య మిచ్చినావు. 14

మూ. అపదేశేన జనకాదుత్పత్తిర్వసుధాతలాత్,
మమ వృత్తం చ వృత్తజ్ఞ బహు తే న పురస్కృతమ్. 15

ప్ర. అ. వృత్తజ్ఞ=సచ్చరిత్రము ఎరిగినవాడా ! అపదేశేవ=లోకప్రసిద్ధి చేత, జనకాత్=జనకునినుండి, వసుధాతలాత్=భూమినుండి, ఉత్పత్తిః=నా ఉత్పత్తి. మమ=నాయొక్క,బహు=అధికమైన, వృత్తం చ=సచ్చరిత్రము, తే=నీకు (నీచేత), న పురస్కృతమ్=గౌరవింపబడలేదు. (వాటిని గూర్చి ఆలోచించలేదు).

తా. సదాచారము నెరిగినవాడా ! లోకప్రసిద్ధిని పట్టి నేను జనకునికి పుట్టినాను, కాని వాస్తమున నా పుట్టుక భూమినుండి జరిగినది. అట్టి నా పుట్టుకకు, నా మంచి నడవడికకు నీవు ఏమాత్రము గౌరవ మివ్వలేదు. 15

మూ. న ప్రమాణీకృతః పాణిర్బాల్యే మమ నిపీడితః,
మమ భక్తిశ్చ శీలం చ సర్వం తే పృష్ఠతః కృతమ్. 16

ప్ర. అ. బాల్యే=బాల్యమునందు, నిపీడితః=గ్రహింపబడిన, మమ పాణిః=నా హస్తము, న ప్రమాణీకృతః=ప్రమాణముగా చేయబడలేదు. మమ=నాయొక్క, భక్తిశ్చ=భక్తి, శీలం చ=శీలము, సర్వమ్=అంతా కూడ, తే=నీకు (నీచేత), పృష్ఠతః కృతమ్=వెనుకకు ఉంచబడినది.

తా. నీవు బాల్యమునందు నా హస్తమును గ్రహించి వివాహ మాడిన విషయమును ప్రమాణముగా గ్రహించలేదు. నా భక్తి, శీలము, అంతా కూడ వెనుకకు నెట్టివేసినావు. 16

మూ. ఇతి బ్రువన్తీ రుదతీ బాష్పగద్గదభాషిణీ,
ఉవాచ లక్ష్మణం సీతా దీనం ధ్యానపరాయణమ్. 17

ప్ర. అ. ఇతి=ఇట్లు, బ్రువన్తీ=పలుకుచున్న, రుదతీ=ఏడ్చుచున్న, బాష్పగద్గదభాషిణీ=కన్నీటిచేత గద్గదముగా మాటలాడుచున్న, సీతా=సీత, దీనమ్=దీనుడై, ధ్యానపరాయణమ్=ధ్యానమునకు అధీనుడైన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ఈ విధముగా పలుకుచు, ఏడ్చుచు, కన్నీటిచేత గద్గదముగా మాటలాడుచున్న సీత, దీనుడై ఆలోచనలో మునిగి ఉన్న లక్ష్మణునితో ఇట్లు పలికెను. 17

మూ. చితాం మే కురు సౌమిత్రే వ్యసనస్యాస్య భేషజమ్,
మిథ్యాపవాదోపహతా నాహం జీవితుముత్సహే. 18

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా ! మే=నాకొరకు, అస్య వ్యసనస్య=ఈ ఆపదకు, భేషజమ్=మందైన, చితామ్= చితను, కురు=చేయుము. మిథ్యాపవాదోపహతా=అసత్యమైన ప్రవాదముచేత పీడితురాలనైన, అహమ్=నేను, జీవితుమ్=జీవించుటకు, న ఉత్సహే=ఇచ్ఛయించను.

తా. లక్ష్మణా ! ఈ కష్టాలకు ఔషధమైన చితను నాకొరకు తయారు చేయుము. అసత్యమైన అపవాదుచేత దూషితురాలనైన నేను ఇంక జీవించుటకు ఇచ్ఛయించను. 18

మూ. అప్రీతేన గుణైర్భర్త్రా త్యక్తా యా జనసంసది,
యా క్షమా మే గతిర్గన్తుం ప్రవేక్ష్యే హవ్యవాహనమ్. 19

ప్ర. అ. గుణైః=గుణములచేత, అప్రీతేన=సంతోషించని, భర్త్రా=భర్తచేత, జనసంసది=జనసమూహమునందు, త్యక్తాయాః=విడవబడిన, మే=నాకు, యా=ఏ, గతిః=గతి, గన్తుమ్=పొందుటకు, క్షమా=తగినదో, అట్టి, హవ్యవాహనమ్=అగ్నిని, ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

తా. నా గుణములకు సంతోషించని భర్తచే జనుల సమక్షమున విడవబడిన నాకు ఏ గతి పొందుట యుక్తమో ఆ గతిని పొందుటకై అగ్నిలో ప్రవేశించెదను. 19

మూ. ఏవముక్తస్తు వైదేహ్యా లక్ష్మణః పరవీరహా,
అమర్షవశమాపన్నో రాఘవం సముదైక్షత. 20

ప్ర. అ. వైదేహ్యా=సీతచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, పరవీరహా=శత్రువీరసంహారకుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, అమర్షవశమ్=కోపమునకు వశముఘు, ఆపన్నః=పొందినవాడై, రాఘవమ్=రాముణ్ణి, సముదైక్షత=చూచెను.

తా. శత్రువీరులను సంహరించు లక్ష్మణుడు సీత మాటలు విని, రాముని వైపు కోపావేశముతో చూచెను. 20

మూ. స విజ్ఞాయ మనశ్ఛన్దం రామస్యాకారసూచితమ్,
చితాం **చకార సౌ**మిత్రిర్మతే రామస్య వీర్యవాన్. 21

ప్ర. అ. **వీర్యవాన్**=పరాక్రమవంతుడైన, సః సౌమిత్రిః=ఆ లక్ష్మణుడు, రామస్య=రామునియొక్క, ఆకారసూచితమ్=ఆకారముచేత సూచింపబడిన, మనశ్ఛన్దమ్=మనోభిలాషను, విజ్ఞాయ=తెలిసికొని, రామస్య= రామునియొక్క, మతే=మతమునందు, చితామ్=చితను, చకార=చేసెను.

తా. పరాక్రమవంతుడైన ఆ లక్ష్మణుడు రాముని ఆకారముచేత సూచింపబడిన ఆతని అభిలాషను తెలిసికొని, ఆతని అభిమతము ప్రకారము చితను నిర్మించెను. 21

మూ. న హి రామం తదా కశ్చిత్కాలాన్తకయమోపమమ్,
అనునేతుమథో వక్తుం ద్రష్టుం వా ప్యశకత్సుహృత్. 22

ప్ర. అ. తదా=అప్పుడు, కాలాన్తకయమోపమమ్=ప్రళయకాలమునందు సంహారముచేయుచున్న యమునితో సమానుడైన, రామమ్=రాముణ్ణి, కశ్చిత్ సుహృత్=ఏ స్నేహితుడూ కూడా, అనునేతుమ్=బ్రతిమాలుటకు, అథో=లేదా, వక్తుమ్=మాటలాడుటకు, ద్రష్టుం వాపి=లేదా చూచుటకు, న అశకత్ హి=సమర్థుడు కాలేదు కదా.

తా. ఆ సమయమునందు ప్రళయకాలమునందు సంహారము**చేయు** యముడు వలె ఉన్న రాముణ్ణి బ్రతిమాలుటకు గాని, పలకరించుటకు గాని, చూచుటకు గాని ఏ మిత్రునకూ కూడ ధైర్యము లేక పోయెను. 22

మూ. అధోముఖం స్థితం రామం తతః కృత్వా ప్రదక్షిణమ్,
ఉపావర్తత వైదేహీ దీప్యమానం హుతాశనమ్. 23

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వైదేహీ=సీత, అధోముఖమ్=క్రిందికి ముఖము గలవాడుగా, స్థితమ్=ఉన్న, రామమ్=రాముణ్ణి, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, దీప్యమానమ్=ప్రజ్వలించుచున్న, హుతాశనమ్=అగ్నిని గూర్చి, ఉపావర్తత=తిరిగి వచ్చెను.

తా. పిమ్మట సీత తల వంచుకొని నిలచి యున్న రాము**నకు** ప్రదక్షిణము చేసి ప్రజ్వలించుచున్న అగ్ని దగ్గరకు వెళ్లెను. **23**

మూ. ప్రణమ్య దైవతేభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాఞ్జలిపుటా చేదమువాచాగ్నిసమీపతః. 24

ప్ర. అ. మైథిలీ=సీత, దైవతేభ్యశ్చ=దేవతలకు, బ్రాహ్మణేభ్యశ్చ=బ్రాహ్మణులకును, ప్రణమ్య=నమస్కరించి, అగ్నిసమీపతః=అగ్నియొక్క సమీపమునందు, బద్ధాఞ్జలిపుటా=కట్టబడిన దోసిలి కలదై, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ చ=పలికెను కూడ.

తా. సీత దేవతలకు బ్రాహ్మణులకు నమస్కరించి అగ్ని దగ్గర అంజలి ఘటించి ఇట్లు పలికెను. 24

మూ. యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. 25

ప్ర. అ. మే=నాయొక్క, హృదయమ్=హృదయము, రాఘవాత్=రామునినుండి, నాపసర్పతి యథా=తొలగనిచో, తథా=అట్లు అయినచో, లోకస్య=లోకము యొక్క, సాక్షీ=సాక్షియైన, పావకః=అగ్ని, మామ్=నన్ను, సర్వతః=అన్నివైపులనుండి, పాతు=రక్షించుగాక.

తా. నా హృదయము ఎన్నడూ రామునినుండి దూరము కానిచో (రామునియందే స్థిరముగా ఉన్నచో) లోకమునకు సాక్షియైన అగ్ని నన్ను అన్ని విధాల రక్షించుగాక. 25

మూ. యథా మాం శుద్ధచరితాం దుష్టాం జానాతి రాఘవః,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. 26

ప్ర. అ. శుద్ధచరితామ్=శుద్ధమైన చరితము గల, మామ్=నన్ను, రాఘవః=రాముడు, దుష్టామ్=దుష్టురాలినిగా, జానాతి=తెలిసికొనుచు, యథా=అనుకొనుచున్నట్లయితే, తథా=అట్లు అయినచో, లోకస్య=లోకమునకు, సాక్షీ=సాక్షియైన, పావకః=అగ్ని, సర్వతః=అన్నివైపుల నుండి, మామ్=నన్ను, పాతు=రక్షించుగాక.

తా. రాముడు శుద్ధమైన చరితముగల నన్ను దుష్టురాలినిగా భావించుచున్నట్లయితే (నేను రాము డనుకొనుచున్నట్లు చరితము కలదానిని కానిచో) లోకమునకు సాక్షియైన అగ్ని నన్ను రక్షించుగాక. 26

మూ. కర్మణా మనసా వాచా యథా నాతిచరామ్యహమ్,
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతు పావకః. 27

ప్ర. అ. అహమ్=నేను, కర్మణా=కర్మచేతను, మనసా=మనస్సుచేతను, వాచా=వాక్కుచేతను, సర్వధర్మజ్ఞమ్=సకలధర్మములను ఎరిగిన, రాఘవమ్=రా

ముణ్ణే, యథా నాతిచరామి=అతిక్రమించకుండ ఉన్నచో, తథా=అట్లయినచో, మామ్=నన్ను, పావకః=అగ్ని, పాతు=రక్షించుగాక.

తా. నేను మనస్సుచేత గాని, వాక్కుచేత గాని, కర్మచేత గాని, ధర్మము లన్నీ తెలిసిన రాముణ్ణే అతిక్రమించకున్నచో అగ్ని నన్ను రక్షించుగాక. 27

మూ. ఆదిత్యో భగవాన్ వాయుర్దిశశ్చన్ద్రస్తథైవ చ,
అహశ్చాపి తథా సన్ధ్యే రాత్రిశ్చ పృథివీ తథా, 28
యథాన్యేఽపి విజానన్తి తథా చారిత్రసంయుతామ్.

ప్ర. అ. భగవాన్=పూజ్యుడైన, ఆదిత్యః=సూర్యుడు, వాయుః=వాయువు, దిశః=దిక్కులు, తథైవ చ=మరియు, చన్ద్రః=చంద్రుడు, అహశ్చాపి=పగలు, తథా=మరియు, సంధ్యే=సంధ్యలు, రాత్రిశ్చ=రాత్రి, తథా=మరియు, పృథివీ=భూమి, అన్యేఽపి=ఇతరులు, చారిత్రసంయుతామ్=సచ్చరిత్రతో కూడినదానినిగా, విజానన్తి యథా=తెలిసికొన్నచో, తథా=అట్లయినచో, (అగ్ని నన్ను రక్షించుగాక).

తా. పూజ్యుడైన సూర్యుడు, వాయువు, దిక్కులు, చంద్రుడు, పగలు, సంధ్యలు, రాత్రి, భూమి, ఇతరదేవతలు నేను సచ్చరిత్రకలదాని నని ఎరిగి ఉన్నచో అగ్ని నన్ను రక్షించుగాక. 28

మూ. ఏవముక్త్వా తు వైదేహీ పరిక్రమ్య హుతాశనమ్,
వివేశ జ్వలనం దీప్తం నిఃశఙ్కేనాన్తరాత్మనా. 29

ప్ర. అ. వైదేహీ=సీత, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, హుతాశనమ్=అగ్నిని, పరిక్రమ్య=ప్రదక్షిణముచేసి, నిఃశఙ్కేన=శంక లేని, అన్తరాత్మనా=మనస్సుతో, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, జ్వలనమ్=అగ్నిని, వివేశ=ప్రవేశించెను.

తా. సీత ఇట్లు పలికి, అగ్నికి ప్రదక్షిణము చేసి, ఏ మాత్రమూ శంక లేని మనస్సుతో, ప్రజ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించెను. 29

మూ. జనశ్చ సుమహాంస్తత్ర బాలవృద్ధసమాకులః, 30
దదర్శ మైథిలీం దీప్తాం ప్రవిశన్తీం హుతాశనమ్.

ప్ర. అ. తత్ర=అక్కడ, బాలవృద్ధసమాకులః=బాలులతోను వృద్ధులతోను వ్యాకులమైన, సుమహాన్=చాల గొప్పదైన, జనశ్చ=జనము కూడ, హుతాశనమ్=అగ్నిని, ప్రవిశన్తీమ్=ప్రవేశించుచున్న, దీప్తామ్=ప్రకాశించుచున్న, మైథిలీమ్=సీతను, దదర్శ=చూచెను.

తా. అక్కడ నున్న బాలులతోను, వృద్ధులతోను వ్యాకులమైన చాల పెద్దదైన జనసముదాయము ప్రకాశించుచున్న సీత అగ్నిలో ప్రవేశించుచుండగా

చూచెను. 30

మూ. సా తప్తనవహేమాభా తప్తకాఞ్చనభూషణా, 31
పపాత జ్వలనం దీప్తం సర్వలోకస్య సంనిధౌ.

ప్ర. అ. తప్తనవహేమాభా=శుద్ధమైన బంగారమువంటి కాంతి గల, తప్తకాఞ్చనభూషణా=శుద్ధమైన బంగారు అలంకారములు గల, సా=ఆ సీత, సర్వలోకస్య=సకలలోకముయొక్క, సంనిధౌ=సంనిధియందు, దీప్తమ్=ప్రజ్వలించుచున్న, జ్వలనమ్=అగ్నిని గూర్చి, పపాత=పడెను.

తా. శుద్ధమైన బంగారము వంటి కాంతి గల, శుద్ధమైన బంగారు ఆభరణములు ధరించిన ఆ సీత అందరి జనుల సమక్షమున ప్రజ్వలించుచున్న అగ్నిలోనికి దుమికెను. 31

మూ. దదృశుస్తాం విశాలాక్షీం పతన్తీం హవ్యవాహనమ్, 32
సీతాం సర్వాణి రూపాణి రుక్మవేదినిభాం తదా.

ప్ర. అ. విశాలాక్షీమ్=విశాలములైన నేత్రములు గల, హవ్యవాహనమ్=అగ్నిని గూర్చి, పతన్తీమ్=దుముకుచున్న, రుక్మవేదినిభామ్=బంగారు వేదికతో సమానురాలైన, తాం సీతామ్=ఆ సీతను, సర్వాణి=సమస్తమైన, రూపాణి=భూతములు, దదృశుః=చూచినవి.

తా. బంగారు వేదికతో సమానురాలైన విశాలములైన నేత్రములు గల ఆ సీత అగ్నిలోనికి దుముకుచుండగా అప్పుడు సమస్తభూతములు చూచినవి. 32

మూ. దదృశుస్తాం మహాభాగాం ప్రవిశన్తీం హుతాశనమ్, 33
సీతాం కృత్స్నాస్త్రయో లోకాః పుణ్యామాజ్యాహుతీమివ.

ప్ర. అ. హుతాశనమ్=అగ్నిని, ప్రవిశన్తీమ్=ప్రవేశించుచున్న, మహాభాగామ్=మహాభాగ్యవంతురాలైన, తాం సీతామ్=ఆ సీతను, కృత్స్నాః=సమస్తమైన, త్రయః=మూడు, లోకాః=లోకములు, పుణ్యామ్=పవిత్రమైన, ఆజ్యాహుతీమివ=నేతి ఆహుతిని వలె, దదృశుః=చూచిరి.

తా. అగ్నిలో ప్రవేశించుచున్న మహాభాగ్యవంతురాలైన ఆ సీత చూచుచున్న మూడు లోకములవారికిని పవిత్రమైన నేతి ఆహుతి వలె కనబడెను. 33

మూ. ప్రచుక్రుశుః స్త్రియః సర్వాస్తాం దృష్ట్వా హవ్యవాహనే, 34
పతన్తీం సంస్కృతాం మన్త్రైర్వసోర్ధారామివాధ్వరే.

ప్ర. అ. అధ్వరే=యజ్ఞమునందు, మన్త్రైః=మంత్రములచేత, సంస్కృ

తామ్=సంస్కరింపబడిన, వసోః=ఆజ్యముయొక్క, ధారామివ=ధార వలె, హవ్యవాహనే=అగ్నియందు, పతన్తీమ్=పడుచున్న, తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, సర్వాః=సమస్తమైన, స్త్రియః=స్త్రీలు, ప్రచుక్రుశుః=అరచిరి.

తా. యజ్ఞములో మంత్రాలచేత సంస్కరింపబడిన ఆజ్యధార వలె అగ్నిలో పడుచున్న ఆ సీతను చూచి స్త్రీలందరూ బిగ్గరగా ఏడ్చిరి. 34

మూ. దదృశుస్తాం త్రయో లోకా దేవగన్ధర్వదానవాః, 35
శప్తాం పతన్తీం నిరయే త్రిదివాద్దేవతామివ.

ప్ర. అ. త్రయః=మూడు, లోకాః=లోకములు, దేవగన్ధర్వదానవాః=దేవతలు గంధర్వులు, దానవులు, శప్తామ్=శపింపబడిన, నిరయే=నరకమునందు, త్రిదివాత్=స్వర్గమునుండి, పతన్తీమ్=పడుచున్న, దేవతామివ=దేవతను వలె, తామ్=ఆ సీతను, దదృశుః=చూచిరి.

తా. మూడు లోకములు, దేవగంధర్వదానవులూ కూడ ఆమెను, శపింపబడి స్వర్గలోకమునుండి నరకములో పడుచున్న దేవతను వలె చూచిరి.

మూ. తస్యామగ్నిం విశన్త్యాం తు హా హేతి విపులః స్వనః, 36
రక్షసాం వానరాణాం చ సంబభూవాద్భుతోపమః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే షోడశాధికశతతమః సర్గః.

ప్ర. అ. తస్యామ్=ఆమె, అగ్నిమ్=అగ్నిని, విశన్త్యామ్=ప్రవేశించుచుండగా, రక్షసామ్=రాక్షసులయొక్క, వానరాణాం చ=వానరులయొక్క, అద్భుతోపమః=అద్భుతతుల్యమైన, హా హా ఇతి=అయ్యో అయ్యో అని, విపులః=అధికమైన, స్వనః=ధ్వని, సంబభూవ=ఆయెను.

తా. ఆమె అగ్నిలో ప్రవేశించుచుండగా, రాక్షసులూ, వానరులూ కూడ అయ్యో ! అయ్యో ! అని చాల బిగ్గరగా, ఆశ్చర్యముగా అరచిరి. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో, నూటపదహారవ సర్గ సమాప్తము.

# అథ సప్తదశాధికశతతమః సర్గః

[రాముని వద్దకు దేవతలు వచ్చుట. బ్రహ్మదేవుడు నీవు మహావిష్ణు వని రామునకు చెప్పి రాముని స్తుతించుట.]

మూ. తతో హి దుర్మనా రామః శ్రుత్వైవం వదతాం గిరః,
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, ఏవమ్=ఇట్లు, వదతామ్=హా హా అని పలుకుచున్నవారియొక్క, గిరః=వాక్కులను, శ్రుత్వా=విని, దుర్మనాః=దుఃఖపూరితమైన మనస్సు గలవాడై, బాష్పపూరితలోచనః=కన్నీటిచేత నింపబడిన నేత్రములు కలవాడై, ముహూర్తమ్=ముహూర్తకాలమును, దధ్యౌ=ధ్యానము చేసెను.

తా. పిమ్మట ధర్మాత్ముడైన రాముడు ఇట్లు హా హా కారము చేయుచున్న వారి ఆర్తనాదములు విని దుఃఖించుచున్న మనస్సుతో, కన్నీళ్ళతో నిండిన నేత్రములతో ముహూర్తకాలము ఆలోచించుచు నిలబడిపోయెను. 1

మూ. తతో వైశ్రవణో రాజా యమశ్చ పితృభిః సహ,
సహస్రాక్షశ్చ దేవేశో వరుణశ్చ జలేశ్వరః. 2
షడర్ధనయనః శ్రీమాన్ మహాదేవో వృషధ్వజః,
కర్తా సర్వస్య లోకస్య బ్రహ్మా బ్రహ్మవిదాం వరః. 3
ఏతే సర్వే సమాగమ్య విమానైః సూర్యసంనిభైః,
ఆగమ్య నగరీం లఙ్కామభిజగ్ముశ్చ రాఘవమ్. 4

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజా=యక్షుల రాజైన, వైశ్రవణః=కుబేరుడు, పితృభిః సహ=పితృదేవతలతో కూడ, యమశ్చ=యముడు, దేవేశః=దేవతల ప్రభువైన, సహస్రాక్షశ్చ=ఇంద్రుడు, జలేశ్వరః=జలమునకు ప్రభువైన, వరుణశ్చ=వరుణుడు, షడర్ధనయనః=మూడు నేత్రములు గల, శ్రీమాన్=శ్రీమంతుడైన, వృషధ్వజః=వృషభము ధ్వజమునందు గల, మహాదేవః=మహేశ్వరుడు, సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకమునకు, కర్తా=కర్త అయిన, బ్రహ్మవిదామ్=బ్రహ్మవేత్తలలో, వరః=శ్రేష్ఠుడైన, బ్రహ్మా=బ్రహ్మయు, ఏతే=వీరు, సర్వే=అందరు, సమాగమ్య=కలసి, సూర్యసంనిభైః=సూర్యునితో సమానములైన, విమానైః=విమానములచేత,

లఙ్కాం నగరీమ్=లంకానగరమును గూర్చి, ఆగమ్య=వచ్చి, రాఘవమ్=రాముణ్ణి, అభిజగ్ముః=సమీపించిరి.

తా. ఇంతలో కుబేరుడు, పితృదేవతలతో కూడిన యముడు, దేవతల ప్రభువైన ఇంద్రుడు, జలమునకు ప్రభువైన వరుణుడు, మూడు నేత్రములు గల, శ్రీమంతుడు, వృషభధ్వజుడూ అయిన మహేశ్వరుడు, సకల జగత్తును సృజించు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు-వీరందరూ కలసి, సూర్యుని వంటి విమానములచేత లంకానగరము చేరి రాముని వద్దకు వెళ్లిరి. 2-4.

మూ. తతః సహస్తాభరణాన్ ప్రగృహ్య విపులాన్ భుజాన్,
అబ్రువంస్త్రిదశశ్రేష్ఠా రాఘవం ప్రాఞ్జలిం స్థితమ్. 5

ప్ర. అ. తతః=అటుపిమ్మట, త్రిదశశ్రేష్ఠాః=ఆ దేవతాశ్రేష్ఠులు, సహస్తాభరణాన్=హస్తాభరణములతో కూడిన, విపులాన్=దీర్ఘములైన, భుజాన్=భుజములను, ప్రగృహ్య=పైకి ఎత్తి, ప్రాఞ్జలిమ్=కట్టబడిన దోసిలి కలవాడై, స్థితమ్=నిలచిన, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. ఆ దేవతాశ్రేష్ఠులందరూ హస్తాభరణములతో కూడిన దీర్ఘములైన భుజములను ఎత్తి, దోసిలి కట్టి నిలచి ఉన్న రామునితో ఇట్లు పలికిరి. 5

మూ. కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం ప్రభుః,
ఉపేక్షసే కథం సీతాం పతన్తీం హవ్యవాహనే, 6
కథం దేవగణశ్రేష్ఠమాత్మానం నావబుద్ధ్యసే.

ప్ర. అ. సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకమునకు, కర్తా=కర్తవు, జ్ఞానవతామ్=జ్ఞానవంతులలో, శ్రేష్ఠః=శ్రేష్ఠుడవు, ప్రభుః=సర్వసమర్థుడవూ అయిన నీవు, హవ్యవాహనే=అగ్నియందు, పతన్తీమ్=పడుచున్న, సీతామ్=సీతను, కథమ్=ఎట్లు, ఉపేక్షసే=ఉపేక్షించుచున్నావు? దేవగణశ్రేష్ఠమ్=దేవతాగణమునందు శ్రేష్ఠుడవైన, ఆత్మానమ్=నిన్ను, కథమ్=ఎట్లు, నావబుద్ధ్యసే=తెలిసికొనుట లేదు?

తా. సకలలోకములకు కర్తవు, జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవు, సర్వసమర్థుడవు అయిన నీవు సీత అగ్నిలో పడుచుండగా ఎందుకు ఉపేక్షించుచున్నావు? దేవతాగణములో శ్రేష్ఠుడవైన నిన్ను గూర్చి ఎందుకు తెలిసికొనుటలేదు ?

మూ. ఋతధామా వసుః పూర్వం వసూనాం చ ప్రజాపతిః, 7
త్రయాణామపి లోకానామాదికర్తా స్వయం ప్రభుః.

ప్ర. అ. పూర్వమ్=పూర్వకల్పమునందు, వసూనామ్=వసువులలో, ఋతధామా=ఋతధాము డను, వసుః=వసువు, త్రయాణామపి=మూడు, లోకా

నామ్=లోకముల యొక్క, ఆదికర్తా=మొదటి కర్త, స్వయం ప్రభుః=తనకు తానే సర్వసమర్థుడూ అయిన, ప్రజాపతిః=ప్రజాపతివి.

తా. నీవు పూర్వకల్పములో, వసువులలో ఋతధాముడ వను వసువువు. మూడు లోకములను సృష్టించిన, ఇతర ప్రభువు లెవ్వరూ లేని ప్రజాపతివి. 7

మూ. రుద్రాణామష్టమో రుద్రః సాధ్యానామపి పఞ్చమః, 8
అశ్వినౌ చాపి కర్ణౌ తే సూర్యాచన్ద్రమసౌ దృశౌ.

ప్ర. అ. రుద్రాణామ్=రుద్రులలో, అష్టమః=ఎనిమిదవ, రుద్రః=రుద్రుడవు. సాధ్యానామ్ అపి= సాధ్యులలో, పఞ్చమః=ఐదవవాడవు. అశ్వినౌ=అశ్వినీదేవతలు, తే=నీయొక్క, కర్ణౌ=చెవులు. సూర్యాచన్ద్రమసౌ=సూర్యచంద్రులు, దృశౌ=నేత్రములు.

తా. నీవు రుద్రులలో ఎనిమిదవ రుద్రుడవు. సాధ్యులలో ఐదవవాడవు. అశ్వినీ దేవతలు నీ చెవులు, సూర్యచంద్రులు నీ నేత్రములు. 8

మూ. అన్తే చాదౌ చ లోకానాం దృశ్యసే చ పరంతప, 9
ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా.

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా ! లోకానామ్=లోకములయొక్క, ఆదౌ=ఆదియందు, అన్తే చ=అంతమునందు, దృశ్యసే=చూడబడుచున్నావు. ప్రాకృతః=ప్రాకృతుడైన, మానుషో యథా=మానవుడవు వలె, వైదేహీమ్=సీతను, ఉపేక్షసే చ=ఉపేక్షించుచున్నావు.

తా. ఓ శత్రుసంహారకుడా ! నీవు లోకములకు ముందు, వాటి నాశానంతరము కూడ ఉండువాడవు. అట్టి నీవు సాధారణ మానవుడు వలె సీతను ఉపేక్షించుచున్నావు. 9

మూ. ఇత్యుక్తో లోకపాలైస్తైః స్వామీ లోకస్య రాఘవః, 10
అబ్రవీత్త్రిదశశ్రేష్ఠాన్ రామో ధర్మభృతాం వరః.

ప్ర. అ. తైః లోకపాలైః=ఆ లోకపాలకులచేత, ఇతి=ఇట్లు, ఉక్తః=పలకబడిన, లోకస్య=లోకమునకు, స్వామీ=ప్రభువైన, రాఘవః=రఘువంశసంజాతుడైన, ధర్మభృతామ్=ధర్మమును పోషించువారిలో, వరః=శ్రేష్ఠుడైన, రామః=రాముడు, త్రిదశశ్రేష్ఠాన్=ఆ దేవతాశ్రేష్ఠులను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. లోకమునకు ప్రభువు, రఘువంశమునందు పుట్టినవాడు, ధర్మమును సంరక్షించువారిలో శ్రేష్ఠుడూ అయిన రాముడు ఆ దేవతానాయకులతో

ఇట్లు పలికెను. 10

మూ. ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్, 11
సోఽహం యస్య యతశ్చాహం భగవంస్తద్బ్రవీతు మే.

ప్ర. అ. ఆత్మానమ్=నన్ను, దశరథాత్మజమ్=దశరథుని కుమారుడు, మానుషమ్=మానవుడు అయిన, రామమ్=రాముణ్ణిగా, మన్యే=తలచుచున్నాను. సః అహమ్=అట్టి నేను, యస్య=ఎవనికి సంబంధించినవాడనో, అహమ్=నేను, యశ్చ=ఎవడనో, తత్=దానిని, భగవాన్=భగవంతుడవైన నీవు, మే=నాకు.బ్రవీతు=చెప్పెదవుగాక !

తా. నేను దశరథకుమారుడైన రాము డను పేరు గల మానవుడను అనియే అనుకొనుచున్నాను. నేను ఎవరివాడనో, ఎందువలన ఇట్లున్నానో భగవంతుడ వైన నీవు చెప్పుము. 11

మూ. ఇతి బ్రువాణం కాకుత్స్థం బ్రహ్మా బ్రహ్మవిదాం వరః, 12
అబ్రవీచ్ఛృణు మే వాక్యం సత్యం సత్యపరాక్రమ.

ప్ర. అ. ఇతి=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, కాకుత్స్థమ్=రాముణ్ణి గూర్చి, బ్రహ్మవిదామ్=బ్రహ్మవేత్తలలో, వరః=శ్రేష్ఠుడైన, బ్రహ్మా=బ్రహ్మ, అబ్రవీత్=పలికెను. సత్యపరాక్రమ=సత్యమైన పరాక్రమము గలవాడా ! మే=నాయొక్క, సత్యమ్=సత్యమైన, వాక్యమ్=వాక్యమును, శృణు=వినుము.

తా. ఇట్లు అనుచున్న రామునితో వేదవేత్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను. "సత్యమైన పరాక్రమము గల రామా ! నేను చెప్పుచున్న సత్యమైన మాట వినుము." 12

మూ. భవాన్నారాయణో దేవః శ్రీమాంశ్చక్రాయుధః ప్రభుః, 13
ఏకశృఙ్గో వరాహస్త్వం భూతభవ్యసపత్నజిత్.

ప్ర. అ. భవాన్=నీవు, దేవః=స్వయముగా ప్రకాశించువాడవు, శ్రీమాన్=ఎల్లప్పుడూ లక్ష్మితో కూడినవాడవు, చక్రాయుధః=చక్రము ఆయుధముగా కలవాడవు, ప్రభుః=సమర్థుడవు అయిన, నారాయణః=నారాయణుడవు. త్వమ్=నీవు, ఏకశృఙ్గః=ఒక కొమ్ముగల, వరాహః=వరాహమూర్తివి. భూతభవ్యసపత్నజిత్=భూతకాలమునకు, భవిష్యత్కాలమునకు సంబంధించిన శత్రువులను జయించువాడవు.

తా. నీవు స్వప్రకాశస్వరూపుడు, లక్ష్మి సమేతుడు, చక్రము ఆయుధముగా గలవాడు, సర్వసమర్థుడూ అయిన నారాయణుడవు. నీవు ఒక కొమ్ము గల వరాహమూర్తి. భూతకాలములోని శత్రువులను జయించినవాడవు.

భవిష్యత్తుకు సంబంధించిన శత్రువులను జయించగలవాడవు. 13

మూ. అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాన్తే చ రాఘవ, 14
లోకానాం త్వం పరో ధర్మో విష్వక్సేనశ్చతుర్భుజః.

ప్ర. అ. అక్షరమ్=నాశము లేనిది, మధ్యే చ=మధ్యయందు, అన్తే చ=అంతమునందూ కూడ, సత్యం చ=సత్యమైన, బ్రహ్మ=బ్రహ్మ, నీవే. త్వమ్=నీవు, లోకానామ్=లోకములయొక్క, పరః=గొప్ప, ధర్మః=ధర్మము. విష్వక్సేనః=అన్ని వైపులా సేన గలవాడవు. చతుర్భుజః=నాలుగు భుజములు గలవాడవు.

తా. వినాశరహితము, మధ్యయందు, అంతమునందు కూడ సత్యమూ అయిన బ్రహ్మ నీవే. లోకుల అత్యుత్తమధర్మము యజ్ఞము నీవే. నీ సైన్యము అంతటా వ్యాపించి ఉన్నది. నీవు నాల్గు భుజములు కలవాడవు. 14

మూ. శార్జ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః, 15
అజితః ఖడ్గధృగ్విష్ణుః కృష్ణశ్చైవ మహాబలః.

ప్ర. అ. నీవు, శార్జ్గధన్వా=శార్జ్గ మను ధనస్సు కలవాడవు. హృషీకేశః=ఇంద్రియములకు అధిపతివి. పురుషః=హృదయగుహలో ఉండువాడవు. పురుషోత్తమః=పురుషులలో ఉత్తముడవు. అజితః=జయించబడనివాడవు. ఖడ్గభృత్=నందక మను ఖడ్గమును ధరించినవాడవు. విష్ణుః=అంతటా వ్యాపించినవాడవు. కృష్ణశ్చైవ=భూమికి సుఖము నిచ్చువాడవు. మహాబలః=గొప్ప బలము గలవాడవు.

తా. నీవు శార్జ్గమును ధరించువాడవు. ఇంద్రియములను నియమించువాడవు. మానవుల హృదయగుహలో నివసించువాడవు. పురుషులలో ఉత్తముడవు. జయింపబడనివాడవు. ఖడ్గమును ధరించువాడవు. అంతటా వ్యాపించి ఉన్నవాడవు. భూమికి సుఖము ఇచ్చువాడవు. గొప్ప బలము గలవాడవు. 15

మూ. సేనానీర్గ్రామణీశ్చ త్వం త్వం బుద్ధి స్త్వం క్షమా దమః. 16
ప్రభవశ్చాప్యయశ్చ త్వముపేన్ద్రో మధుసూదనః.

ప్ర. అ. త్వమ్=నీవు, సేనానీః=సేనాపతివి. గ్రామణీశ్చ=గ్రామాధిపతివి. త్వమ్=నీవు, బుద్ధిః=బుద్ధివి. త్వమ్=నీవు, క్షమా=ఓర్పు. దమః=ఇంద్రియ నిగ్రహము. త్వమ్=నీవు, ప్రభవః=సృష్టి, అప్యయశ్చ=ప్రలయము కూడ. ఉపేన్ద్రః=ఉపేంద్రుడవు. మధుసూదనః=మధు వను రాక్షసుని చంపినవాడవు.

తా. నీవు సేనానాయకుడవు. గ్రామాధిపతివి. నీవే బుద్ధి,

ఓర్పు, ఇంద్రియ నిగ్రహము, సృష్టిప్రళయములు. నీవే ఉపేంద్రుడవు. నీవే మధుసూదనుడవు. 16

మూ. ఇన్ద్రకర్మా మహేన్ద్రస్త్వం పద్మనాభో రణాన్తకృత్, 17
శరణ్యం శరణం చ త్వామాహుర్దివ్యా మహర్షయః.

ప్ర. అ. త్వమ్=నీవు, ఇన్ద్రకర్మా=ఇంద్రుని వంటి కర్మలు చేయగలవాడవు. మహేన్ద్రః=మహేంద్రుడవు. పద్మనాభః=నాభియందు పద్మ మున్నవాడవు. రణాన్తకృత్=రణమునందు వినాశము చేయువాడవు. దివ్యాః=దివ్యులైన, మహర్షయః=మహర్షులు, త్వామ్=నిన్ను, శరణ్యమ్=శరణుజొచ్చినవారిని. రక్షించగలిగిన, శరణమ్=శరణమునుగా, ఆహుః=చెప్పచున్నారు.

తా. నీవు ఇంద్రుని వంటి పనులు చేయగలవాడవు. నీవే ఇంద్రుడవు. నీ నాభియందు పద్మమున్నది. యుద్ధములో వినాశము చేయువాడవు నీవే. నీవు శరణు జొచ్చిన వారిని రక్షింపగలిగిన శరణమని దేవర్షులు చెప్పదురు. 17

మూ. సహస్రశృఙ్గో వేదాత్మా శతశీర్షో మహర్షభః. 18
త్వం త్రయాణాం హి లోకానామాదికర్తా స్వయంప్రభుః.
సిద్ధానామపి సాధ్యానామాశ్రయశ్చాపి పూర్వజః. 19

ప్ర. అ. సహస్రశృఙ్గః=వేయి (శృంగములు) శాఖలు గల, శతశీర్షః=వందలకొలది విధివాక్యము లనే శిరస్సులు గల, మహర్షభః=గొప్ప కర్మలను విమర్శించు, వేదాత్మా=వేదస్వరూపుడవు. త్వమ్=నీవు, త్రయాణామ్= మూడు, లోకానామ్=లోకములకు, ఆదికర్తా=సృష్టికర్తవు. స్వయంప్రభుః=స్వయముగా ప్రభువువు. సిద్ధానామ్=సిద్ధులకు, సాధ్యానామపి=సాధ్యులకు, పూర్వజః=పూర్వమునందే, ఉన్న, ఆశ్రయః చ=ఆశ్రయముగా కూడ, అపి=అయి ఉన్నావు.

తా. నీవు వేలకొలది శాఖలు అనే కొమ్మలు, వందలకొలది విధివాక్యము లనే శిరస్సులు గల, గొప్ప కర్మాలోచనము చేయు వేదములు ఆత్మగా కలవాడవు. మూడు లోకములను సృష్టించినవాడవు. స్వతంత్రుడవు. నీవు సిద్ధులకు .సాధ్యులకు అతి ప్రాచీనమైన ఆశ్రయమైనవాడవు. 18, 19

మూ. త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమోంకారః పరాత్పరః, 20
ప్రభవం నిధనం వా తే నో విదుః కో భవానితి.

ప్ర. అ. త్వమ్=నీవు, యజ్ఞః=యజ్ఞము. త్వమ్=నీవు, వషట్కారః=వషట్కారము. త్వమ్=నీవు, ఓంకారః=ఓంకారము. పరాత్=పరమైనదానికంటె, పరః=పరుడవు. తే=నీయొక్క, ప్రభవమ్=పుట్టుకను, నిధనం చాపి=నాశమును, నో విదుః=ఎరుగరు. భవాన్=నీవు, కః ఇతి=ఎవరు అని, ఎరుగరు.

తా. నీవే యజ్ఞము, నీవే వషట్కారము, నీవే ఓంకారము, నీవు అందరికంటె ఉత్కృష్టుడవు. నీ పుట్టుకను గాని, నాశమును గాని, నీవు ఎవరవు అను విషయమును గాని ఎవరూ ఎరుగరు. 20

మూ. దృశ్యసే సర్వభూతేషు గోషు చ బ్రాహ్మణేషు చ, 21
దిక్షు సర్వాసు గగనే పర్వతేషు నదీషు చ.

ప్ర. అ. సర్వభూతేషు=సమస్తభూతములయందు, గోషు చ=గోవులయందు, బ్రాహ్మణేషు చ=బ్రాహ్మణులయందు, సర్వాసు=సమస్తమైన, దిక్షు=దిక్కులయందు, గగనే=ఆకాశమునందు, పర్వతేషు=పర్వతములయందు, నదీషు చ=నదులయందు, దృశ్యసే=చూడబడుచున్నావు.

తా. నీవు సకలప్రాణులలోను, గోవులలోను, బ్రాహ్మణులలోను, సమస్త దిక్కులయందు, ఆకాశమునందు, పర్వతములలోను, నదులలోను కనబడుదువు.

మూ. సహస్రచరణః శ్రీమాన్ శతశీర్షః సహస్రదృక్, 22
త్వం ధారయసి భూతాని పృథివీం చ సపర్వతామ్.

ప్ర. అ. సహస్రచరణః=వేలకొలది పాదములు గలవాడవు, శ్రీమాన్=లక్ష్మీ సహితుడవు, శతశీర్షః=వందలకొలది శిరస్సులు గలవాడవు, సహస్రదృక్=వేలకొలది నేత్రములు గలవాడవు, అయిన, త్వమ్=నీవు, భూతాని=భూతములను, సపర్వతామ్=పర్వతములతో కూడిన, పృథివీం చ=భూమిని, ధారయసి=ధరించుచున్నావు.

తా. వేలకొలది పాదములు, వందలకొలది శిరస్సులు, వేలకొలది నేత్రములు గల లక్ష్మీసహితుడవైన నీవు సమస్తప్రాణులను, పర్వతములతో కూడిన భూమిని ధరించుచున్నావు. 22

మూ. అన్తే పృథివ్యాః సలిలే దృశ్యసే త్వం మహోరగః, 23
త్రీన్ లోకాన్ ధారయన్ రామ దేవగన్ధర్వదానవాన్.

ప్ర. అ. రామ=ఓ రామా ! పృథివ్యాః=భూమియొక్క, అన్తే=అంతమునందు, సలిలే=నీటిలో, త్వమ్=నీవు, త్రీన్=మూడు, లోకాన్=లోకములను, దేవగన్ధర్వదానరాన్=దేవతలను, గంధర్వులను దానవులను, ధారయన్=ధరించు, మహోరగః=మహాసర్పమై, దృశ్యసే=కనబడుచున్నావు.

తా. రామా భూమికి అడుగున నీటిలో నీవు ఆదిశేషుని రూపములో మూడు లోకాలను, దేవగంధర్వదానవులను, ధరించుచు కనబడుచున్నావు. 23

మూ. అహం తే హృదయం రామ జిహ్వా దేవీ సరస్వతీ, 24
దేవా రోమాణి గాత్రేషు బ్రహ్మణా నిర్మితాః ప్రభో.

ప్ర. అ. రామ=ఓ రామా ! అహమ్=నేను, తే=నీయొక్క, హృదయమ్=హృదయము. దేవీ=దేవియైన, సరస్వతీ=సరస్వతి, జిహ్వా=జిహ్వా. ప్రభో=ఓ ప్రభూ, దేవాః=దేవతలు, సర్వగాత్రేషు=సమస్త అవయవములయందు, రోమాణి=రోమములుగా, బ్రహ్మణా=బ్రహ్మచేత, నాచేత, నిర్మితాః=నిర్మింపబడి నారు.

తా. రామా నేను నీ హృదయము. సరస్వతీదేవి నీ నాలుక. ఓ ప్రభూ ! నీ సమస్తఅవయవములయందు దేవతలు రోమములుగా నాచేత నిర్మింపబడినారు. 24

మూ. నిమేషస్తే స్మృతా రాత్రిరున్మేషో దివసస్తథా, 25
సంస్కారాస్త్వభవన్వేదా నైతదస్తి త్వయా వినా.

ప్ర. అ. తే=నీయొక్క, నిమేషః=రెప్పపాటు, రాత్రిః=రాత్రిగా, స్మృతా=చెప్పబడినది. తథా=మరియు, ఉన్మేషః=కండ్లు తెరచుట, దివసః=పగలు. సంస్కారాః=విధినిషేధములు, వేదాః=వేదములు. త్వయా వినా=నీవు లేని, ఏతత్=ఇది, నాస్తి=లేదు.

తా. నీ కనురెప్పపాటు రాత్రి , కన్ను తెరచుట పగలు, విధినిషేధములు వేదములు, నీవు లేనిది ఏదీ లేదు. 25

మూ. జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలమ్. 26
అగ్నిః కోపః ప్రసాదస్తే సోమః శ్రీవత్సలక్షణః.

ప్ర. అ. సర్వమ్=సమస్తమైన, జగత్=జగత్తు, తే=నీయొక్క, శరీరమ్=శరీరము. తే=నీయొక్క, స్థైర్యమ్=స్థైర్యము, వసుధాతలమ్=భూమి. కోపః=కోపము, అగ్నిః=అగ్ని. తే=నీయొక్క, ప్రసాదః=అనుగ్రహము, సోమః=చంద్రుడు. శ్రీవత్స లక్షణః=నీవు విష్ణువు.

తా. ఈ జగత్తంతా నీ శరీరమే. నీ స్థిరత్వమే భూమి. నీ కోపము అగ్ని, నీ ప్రసాదము చంద్రుడు, నీవు విష్ణువు. 26

మూ. త్వయా లోకాస్త్రయః క్రాన్తాః పురా స్వైర్విక్రమైస్త్రిభిః. 27
మహేన్ద్రశ్చ కృతో రాజా బలిం బద్ధ్వా సుదారుణమ్.

ప్ర. అ. పురా=పూర్వము, త్వయా=నీచేత, స్వైః=నీ సంబంధమైన, త్రిభిః=మూడు, విక్రమైః=పాదన్యాసములచేత, త్రయః=మూడు, లోకాః=లోకములు, క్రాన్తాః=ఆక్రమించబడినవి. సుదారుణమ్=చాల భయంకరుడైన, బలిమ్=బలిని, బద్ధ్వా=కట్టి, మహేన్ద్రః=మహేంద్రుడు, రాజా=రాజుగా, కృతః=చేయబడినాడు.

తా. పూర్వము నీవు మూడు పాదన్యాసములచేత మూడు లోకములను ఆక్రమించి, భయంకరుడైన బలిని బంధించి దేవేంద్రుని త్రిలోకప్రభువునుగా చేసినావు. 27

మూ. సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుర్దేవః కృష్ణః ప్రజాపతిః, 28
వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్.

ప్ర. అ. సీతా=సీత, లక్ష్మీః=లక్ష్మి. భవాన్=నీవు, దేవః=ప్రకాశస్వరూపుడు, కృష్ణః=కృష్ణవర్ణము కలవాడు, ప్రజాపతిః=ప్రజాపతిస్వరూపుడూ అయిన, విష్ణుః=విష్ణువు. రావణస్య=రావణునియొక్క, వధార్థమ్=వధకొరకు, ఇహ=ఇక్కడ, మానుషమ్=మనుష్యసంబంధమైన, తనుమ్=శరీరమును, ప్రవిష్టః=ప్రవేశించినావు.

తా. సీత లక్ష్మీదేవి. నీవు ప్రకాశస్వభావము గల, కృష్ణవర్ణుడైన, ప్రజాపతి స్వరూపుడైన విష్ణువు. నీవు ఈ లోకమునందు రావణుని వధించుటకై మనుష్య శరీరము దాల్చినావు. 28

మూ. తదిదం నస్త్వయా కార్యం కృతం ధర్మభృతాం వర, 29
నిహతో రావణో రామ ప్రహృష్టో దివమాక్రమ.

ప్ర. అ. ధర్మభృతామ్=ధర్మమును పోషించువారిలో, వర=శ్రేష్ఠుడా, రామ=రామా, తత్=ఆ, ఇదమ్=ఈ, నః కార్యమ్=మా కార్యము, కృతమ్=చెయుబడినది. రావణః=రావణుడు, నిహతః=చంపబడినాడు. ప్రహృష్టః=సంతోషించినవాడవై దివమ్=స్వర్గమును, ఆక్రమ=అధిష్ఠించుము.

తా. ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడవైన ఓ రామా ! నీవు రావణుణ్ణి చంపి మా కార్యమును పూర్తి చేసితివి. ఇంక సంతోషముతో తిరిగి స్వర్గమును అధిష్ఠించుము. 29

మూ. అమోఘం దేవ వీర్యం తే న తే మోఘాః పరాక్రమాః, 30
అమోఘం దర్శనం రామ అమోఘస్తవ సంస్తవః.

ప్ర. అ. దేవ=ఓ ప్రభూ, తే=యొక్క, వీర్యమ్=బలము, అమోఘమ్=వ్యర్థము కానిది. తే=నీయొక్క, పరాక్రమాః=పరాక్రమములు, మోఘాః=వ్యర్థములు, న=కావు. రామ=రామా, దర్శనమ్=నీ దర్శనము, అమోఘమ్=వ్యర్థము కానిది. తవ=నీ యొక్క, సంస్తవః=స్తుతి, అమోఘః=వ్యర్థము కానిది.

తా. ఓ ప్రభూ ! నీ వీర్యము అమోఘము. నీ పరాక్రమములు అమోఘములు. ఓ రామా నీ దర్శనము అమోఘము. నిన్ను స్తుతించుట అమోఘము. 30

మూ. అమోఘాస్తే భవిష్యన్తి భక్తిమన్తో నరా భువి, 31
యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్,
ప్రాప్నువన్తి సదా కామానిహ లోకే పరత్ర చ. 32

ప్ర. అ. భువి=భూలోకమునందు, తే భక్తిమన్తః=నీ భక్తి గల, నరాః=నరులు, అమోఘాః=వ్యర్థము కానివారు, భవిష్యన్తి=కాగలరు. యే=ఎవరు, దేవమ్=ప్రభువు, ధ్రువమ్=నిత్యుడు, పురాణమ్=ప్రాచీనుడు, పురుషోత్తమమ్=పురుషోత్తముడూ అయిన, త్వామ్=నిన్ను గూర్చి, భక్తాః=భక్తులో, వారు, ఇహ లోకే=ఈ లోకమునందు, పరత్ర చ=పరలోకమునందు, సదా=ఎల్లప్పుడూ, కామాన్=కామములను, ప్రాప్నువన్తి=పొందుదురు.

తా. ఈ భూలోకములో నీయందు భక్తి గలవారు సార్థకమైన జీవితము కలవారు అగుదురు. ప్రభువు, నిత్యుడు, పురాతనుడు, పురుషులలో శ్రేష్ఠుడూ అయిన నీ యందు భక్తి గలవారు ఇహలోకమునందు, పరలోకమునందు కూడ ఎల్లప్పుడూ తమ కోరికలను పొందెదరు. 31, 32

మూ. ఇమమార్షం స్తవం దివ్యమితిహాసం పురాతనమ్, 33
యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే సప్తదశాధికశతతమః సర్గః.

ప్ర. అ. యే నరాః=ఏ మానవులు, దివ్యమ్=దివ్యము, పురాతనమ్=ప్రాచీనమైన, ఇతిహాసమ్=ఇతిహాసము, ఆర్షమ్=వేదసంమతమూ అయిన, ఇమమ్=ఈ, స్తవమ్=స్తోత్రమును, కీర్తయిష్యన్తి=పఠింతురో, తేషామ్=వారికి, పరాభవః=పరాభవము, నాస్తి=లేదు.

తా. పురాతనేతిహాసమునకు సంబంధించిన ఈ దివ్యమైన స్తోత్రమును పఠించు మానవులకు ఎన్నడూ పరాభవము ఉండదు. 33

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపదిహేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాదశాధికశతతమః సర్గః

[అగ్నిదేవుడు ప్రత్యక్షమై సీత పవిత్రురా లని చెప్పి రామునకు సమర్పించుట. రాముడు సంతోషపూర్వకముగా ఆమెను స్వీకరించుట.]

మూ. ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం పితామహసమీరితమ్,
అఙ్కేనాదాయ వైదేహీముత్పపాత విభావసుః. 1

ప్ర. అ. విభావసుః=అగ్ని, పితామహసమీరితమ్=బ్రహ్మదేవునిచేత పలకబడిన, శుభమ్=శుభమైన, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, వైదేహీమ్=సీతను, అఙ్కేన=అంకముచేత, ఆదాయ=గ్రహించి, ఉత్పపాత=పైకి వచ్చెను.

తా. అగ్నిదేవుడు బ్రహ్మ పలికిన శుభమైన ఈ వాక్యము విని, సీతను అంకముపై కూర్చుండబెట్టుకొని పైకి లేచెను. 1

మూ. విధూయాథ చితాం తాం తు వైదేహీం హవ్యవాహనః,
ఉత్తస్థౌ మూర్తిమానాశు గృహీత్వా జనకాత్మజామ్. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, హవ్యవాహనః=అగ్ని, మూర్తిమాన్=మూర్తిగలవాడై, ఆశు=శీఘ్రముగా, తామ్=ఆ, చితామ్=చితను, విధూయ=పైకి త్రోసివేసి, జనకాత్మజామ్=జనకుని కుమార్తె యైన, తాం వైదేహీమ్=ఆ సీతను, గృహీత్వా=గ్రహించి, ఉత్తస్థౌ=పైకి లేచెను.

తా. అగ్నిదేవుడు శరీరము ధరించి వెంటనే ఆ చితను పైకి త్రోసివేసి జనకుని కుమార్తె యైన సీతను తీసికొని పైకి లేచెను. 2

మూ. తరుణాదిత్యసంకాశాం తప్తకాఞ్చనభూషణామ్,
రక్తామ్బరధరాం బాలాం నీలకుఞ్చితమూర్ధజామ్. 3
అక్లిష్టమాల్యాభరణాం తథారూపామనిన్దితామ్,
దదౌ రామాయ వైదేహీమఙ్కే కృత్వా విభావసుః. 4

ప్ర. అ. విభావసుః=అగ్నిదేవుడు, తరుణాదిత్యసంకాశామ్=లేతసూర్యునితో సమానురాలు, తప్తకాఞ్చనభూషణామ్=శుద్ధమైన, బంగారు అలంకారములు గలది. రక్తామ్బరధరామ్=ఎఱ్ఱని వస్త్రములు ధరించినది, నీలకుఞ్చితమూర్ధజామ్=నల్లని

వంగిన జుట్టు గలది, అక్లిష్టమాల్యాభరణామ్=నలగని మాలికలు ఆభరణములు గలది, తథారూపామ్=పూర్వమెట్టి రూపమో అట్టి రూపమే గలది, అనిన్దితామ్=నిందింపబడనిది అయిన, బాలామ్=బాల అయిన, వైదేహీమ్=సీతను, అఙ్కే=అంకమునందు, కృత్వా=ఉంచుకొని, రామాయ=రామునకు, దదౌ=ఇచ్చెను.

తా. శుద్ధమైన బంగారు అలంకారములు, ఎఱ్ఱని వస్త్రములు ధరించిన సీత లేత సూర్యుడు వలె ఉండెను. ఆమె జుట్టు నల్లగా, వంకరగా ఉండెను. ఆమె శరీరముమీద నున్న పుష్పమాలలు గాని, ఇతరాలంకారములుగాని చెక్కుచెదరలేదు. ఆమె అగ్నిలో ప్రవేశించునపుడు ఎట్లుండెనో అట్లే ఉండెను. ఎట్టి దోషములు లేని బాలయైన ఈ సీతను అగ్నిదేవుడు తన అంకమునందు కూర్చుండబెట్టుకొని తీసికొని వచ్చి రామున కిచ్చెను. 3, 4.

మూ. అబ్రవీత్తు తదా రామం సాక్షీ లోకస్య పావకః,
ఏషా తే రామ వైదేహీ పాపమస్యాం న విద్యతే. 5

ప్ర. అ. తదా=అప్పుడు, లోకస్య=లోకముయొక్క, సాక్షీ=సాక్షియైన, పావకః=అగ్నిదేవుడు, రామమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ తు=పలికెను. రామ=రామా ! ఏషా=ఈమె, తే=నీయొక్క, వైదేహీ=సీత. అస్యామ్=ఈమెయందు, పాపమ్=పాపము, న విద్యతే=లేదు.

తా. అప్పుడు లోకసాక్షియైన అగ్నిదేవుడు రామునితో ఇట్లు పలికెను. రామా ! ఇదిగో నీ సీత; ఈమెయందు ఏమాత్రమూ పాపము లేదు. 5

మూ. నైవ వాచా న మనసా నైవ బుద్ధ్యా న చక్షుషా,
సువృత్తా వృత్తశౌణ్డీర్యం న త్వామత్యచరచ్ఛుభా. 6

ప్ర. అ. సువృత్తా=మంచి నడవడిక గల, శుభా=మంగళప్రదురాలైన ఈ సీత, వృత్తశౌణ్డీర్యమ్=మంచి నడవడికయందు పట్టుదల గల, త్వామ్=నిన్ను, వాచా=వాక్కుచేత, న అత్యచరత్=అతిచరించలేదు. మనసా=మనస్సుచేత, న=అతిచరించలేదు. బుద్ధ్యా=బుద్ధిచేత, నైవ=అతిచరించలేదు. చక్షుషా=నేత్రముచేత, న=అతిచరించలేదు.

తా. మంచి చరిత్ర గల, పవిత్రురాలైన ఈ సీత వాక్కుచేత గాని, మనస్సుచేతగాని, బుద్ధిచేత గాని, చూపుచేత గాని, సచ్చరిత్రవిషయమునందు పట్టుదల గల నిన్ను అతిచరించలేదు. 6

మూ. రావణేనాపనీతైషా వీర్యోత్సిక్తేన రక్షసా,
త్వయా విరహితా దీనా వివశా నిర్జనాద్వనాత్. 7

ప్ర. అ. త్వయా=నీతో, విరహితా=శూన్యురాలైన, దీనా=దీనురాలైన, వివశా=వివశురాలుగా ఉన్న, ఏషా=ఈమె, వీర్యోత్సిక్తేన=పరాక్రమముచేత గర్వించిన, రక్షసా=రాక్షసుడైన, రావణేన=రావణునిచేత, నిర్జనాత్=జనశూన్యమైన, వనాత్=వనమునుండి, అపనీతా=అపహరించబడినది.

తా. నీవు దగ్గర లేక దీనురాలైన వివశురాలైన ఈమెను పరాక్రమముచేత గర్వించిన రాక్షసుడైన రావణుడు నిర్జనవనమునుండి అపహరించినాడు. 7

మూ. రుద్ధా చాన్తఃపురే గుప్తా త్వచ్చిత్తా త్వత్పరాయణా,
రక్షితా రాక్షసీభిశ్చ ఘోరాభిర్ఘోరబుద్ధిభిః. 8

ప్ర. అ. త్వచ్చిత్తా=నీయందే చిత్తము గల, త్వత్పరాయణా=నీవే ఉత్తమగతిగా గల ఈ సీత, అన్తఃపురే=అంతఃపురమునందు, రుద్ధా=అరికట్టబడినదై, గుప్తా=దాచివేయబడినది. ఘోరాభిః=భయంకరలైన, ఘోరబుద్ధిభిః=భయంకరమైన బుద్ధిగల, రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత, రక్షితా=రక్షింపబడినది.

తా. నీయందే చిత్తము నిలిపి నీవే ఉత్తమగతి యని తలచుచున్న ఈమెను అంతఃపురములో బంధించి దాచివేసినారు. ఈమెను భయంకరమైన బుద్ధి గల రాక్షసస్త్రీలు రక్షించుచుండిరి. 8

మూ. ప్రలోభ్యమానా వివిధం తర్జ్యమానా చ మైథిలీ,
నాచిన్తయత తద్రక్షస్త్వద్గతేనాన్తరాత్మనా. 9

ప్ర. అ. వివిధమ్=అనేకవిధములుగా, ప్రలోభ్యమానా=లోభపెట్టబడుచున్న, తర్జ్యమానా=భయపెట్టబడుచున్న, మైథిలీ=సీత, త్వద్గతేన=నీయందు ఉన్న, అన్తరాత్మనా=మనస్సుతో, తత్=ఆ, రక్షః=రాక్షసుణ్ణి, నాచిన్తయత=లెక్కచేయలేదు.

తా. నీయందే చిత్తమును నిలిపిన సీత అనేకవిధములుగా లోభపెట్టబడినను, భయపెట్టబడినను ఆ రాక్షసుణ్ణి లెక్కచేయలేదు. 9

మూ. విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ మైథిలీమ్,
న కించిదభిధాతవ్యా అహమాజ్ఞాపయామి తే. 10

ప్ర. అ. విశుద్ధభావామ్=విశుద్ధమైన భావము గల, నిష్పాపామ్=పాపము లేని, మైథిలీమ్=సీతను, ప్రతిగృహ్ణీష్వ=స్వీకరించుము. కించిత్=ఏమీ కూడ, న అభిధాతవ్యా=పలకదగినది కాదు. అహమ్=నేను, తే=నీకు, ఆజ్ఞాపయామి=ఆజ్ఞాపించుచున్నాను.

తా. విశుద్ధమైన భావము గల, పాపము లేని సీతను స్వీకరించుము. నీవు ఆమెను ఏమీ అనకూడదు, నేను ఆజ్ఞాపించుచున్నాను. 10

మూ. తతః ప్రీతమనా రామః శ్రుత్వైవం వదతాం వరః,
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః. 11

ప్ర. అ. తతః=అటుపిమ్మట, వదతామ్=మాటలాడువారిలో, వరః=శ్రేష్ఠుడు, ధర్మాత్మా=ధర్మాత్ముడూ అయిన, రామః=రాముడు, ఏవమ్=ఇట్లు, శ్రుత్వా=విని, ప్రీతమనాః=సంతోషించిన మనస్సు గలవాడై, బాష్పవ్యాకులలోచనః=కన్నీటిచేత వ్యాకులములైన నేత్రములు గలవాడై, ముహూర్తమ్=ముహూర్తకాలము, దధ్యౌ=ఆలోచించెను.

తా. మాటలాడువారిలో శ్రేష్ఠుడు, ధర్మాత్ముడు అయిన రాముడు సంతోషించిన మనస్సు గల వాడై, కన్నీటిచేత నేత్రములు వ్యాకులములు కాగా క్షణకాలముపాటు ఆలోచించెను. 11

మూ. ఏవముక్తో మహాతేజా ధృతిమానురువిక్రమః,
ఉవాచ త్రిదశశ్రేష్ఠం రామో ధర్మభృతాం వరః. 12

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ధృతిమాన్=ధైర్యవంతుడు, ఉరువిక్రమః=గొప్ప పరాక్రమము గలవాడు, ధర్మభృతామ్=ధర్మమును పోషించువారిలో, వరః=శ్రేష్ఠుడూ అయిన, రామః=రాముడు, త్రిదశశ్రేష్ఠమ్=దేవతలలో శ్రేష్ఠుడైన అగ్ని దేవుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. ధైర్యవంతుడు, గొప్ప పరాక్రమము గలవాడు, ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడు అయిన రాముడు ఆ మాటలు విని, దేవతలలో శ్రేష్ఠుడైన అగ్నిదేవునితో ఇట్లనెను. 12

మూ. అవశ్యం చాపి లోకేషు సీతా పావనమర్హతి,
దీర్ఘకాలోషితా హీయం రావణాన్తఃపురే శుభా. 13

ప్ర. అ. సీతా=సీత, అవశ్యమ్=తప్పక, లోకేషు=లోకములయందు, పావనమ్=శుద్ధిని, అర్హతి=తగి ఉన్నది. శుభా=మంగళప్రదురాలైన, ఇయమ్=ఈమె, రావణాన్తఃపురే=రావణుని అంతఃపురమునందు, దీర్ఘకాలోషితా హి=దీర్ఘకాలము నివసించినది కదా ?

తా. మంగళప్రదురాలైన ఈ సీత రావణుని అంతఃపురములో చాలకాలము ఉండుటచే లోకములో తప్పక శుద్ధిని పొందుటకు నిర్దోషురాలని నిరూపించుకొనుటకు తగి ఉన్నది. 13

మూ. బాలిశో బత కామాత్మా రామో దశరథాత్మజః,
ఇతి వక్ష్యతి మాం లోకో జానకీమవిశోధ్య హి. 14

ప్ర. అ. జానకీమ్=జానకిని, అవిశోధ్య=శోధించకపోయినచో, దశరథాత్మజః=దశరథుని పుత్రుడైన, రామః=రాముడు, బాలిశః=మూర్ఖుడు, కామాత్మా=కామముతో నిండిన చిత్తము కలవాడు, బత=ఎంతకష్టము. ఇతి=అని, లోకః=లోకము, మామ్=నన్నుగూర్చి, వక్ష్యతి=చెప్పగలదు.

తా. సీతను శోధించకుండగా గ్రహించినచో లోకు లందరూ దశరథపుత్రుడైన రాముడు, అయ్యో, ఎంత మూర్ఖుడు. కామమునకు వశమైన మనస్సు కలవాడు అని నన్ను గూర్చి చెప్పికొనగలరు. 14

మూ. అనన్యహృదయాం భక్తాం మచ్చిత్తపరివర్తినీమ్,
అహమప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్. 15

ప్ర. అ. మచ్చిత్తపరివర్తినీమ్=నా చిత్తమునందు మెదలుచున్న, జనకాత్మజామ్=జనకుని పుత్రికయైన, మైథిలీమ్=సీతను, అనన్యహృదయామ్=ఇతరులమీద హృదయములేనిదానినిగాను, భక్తామ్=భక్తురాలినిగాను, అహమపి=నేను కూడ, అవగచ్ఛామి=ఎరుగుదును.

తా. ఎల్లప్పుడూ నా మనస్సులో మెదలుచుండే జనకరాజపుత్రి యైన సీత ఇతరులయందు హృదయము లేని దనీ, నాయందు భక్తి కల దనీ నాకు కూడ తెలియును. 15

మూ. ఇమామపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా,
రావణో నాతివర్తేత వేలా మివ మహోదధిః. 16

ప్ర. అ. స్వేన తేజసా=తన తేజస్సుచేత, రక్షితామ్=రక్షింపబడిన, ఇమామ్=ఈ, విశాలాక్షీమ్=విశాలములైన నేత్రములు గల సీతను, మహోదధిః=మహాసముద్రము, వేలామివ=తీరమును వలె, రావణః=రావణుడు, నాతివర్తేత=అతిక్రమించజాలడు.

తా. మహాసముద్రము తీరమును ఎట్లు దాటజాలదో అట్లే తన తేజస్సుచేత రక్షింపబడుచున్న విశాలాక్షియైన ఈ సీతను రావణుడు అతిక్రమింపజాలడు; ముట్టజాలడు. 16

మూ. ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః,
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశన్తీం హుతాశనమ్. 17

ప్ర. అ. సత్యసంశ్రయః=సత్యము ఆశ్రయముగా గల నేను, త్రయాణామ్=మూడు, లోకానామ్=లోకములయొక్క, ప్రత్యయార్థమ్=నమ్మకముకొరకు, హుతాశనమ్=అగ్నిని, ప్రవిశన్తీమ్=ప్రవేశించుచున్న, వైదేహీమ్=సీతను, ఉపేక్షే

చాపి=ఉపేక్షించితిని.

తా. సత్యమును ఆశ్రయించి ఉన్న నేను మూడు లోకములకు నమ్మకము కలుగుటకై సీత అగ్నిలో ప్రవేశించుచుండగా ఉపేక్షించితిని. 17

మూ. న చ శక్తః సుదుష్టాత్మా మనసాపి హి మైథిలీమ్,
ప్రధర్షయితుమప్రాప్యాం దీప్తామగ్నిశిఖామివ. 18

ప్ర. అ. సుదుష్టాత్మా=చాల దుష్టబుద్ధియైన ఆ రావణుడు, అప్రాప్యామ్=పొంద శక్యముకాని, మైథిలీమ్=సీతను, దీప్తామ్=ప్రజ్వలించుచున్న, అగ్నిశిఖామివ=అగ్నిశిఖను వలె, మనసాపి=మనస్సు చేత కూడ, ప్రధర్షయితుమ్=ఎదిరించుటకు, న చ శక్తః=సమర్థుడు కాదు కూడ.

తా. దుష్టబుద్ధి గల ఆ రావణుడు పొంద శక్యము కాని ఈమెను, ప్రజ్వలించుచున్న అగ్ని శిఖను వలె మనసా కూడ ఎదిరించుటకు సమర్థుడు కాదు కూడ. 18

మూ. నేయ మర్హతి చైశ్వర్యం రావణాన్తఃపురే శుభా,
అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా. 19

ప్ర. అ. శుభా=మంగళప్రదురాలైన, ఇయమ్=ఈమె, రావణాన్తః పురే = రావణుని అంతఃపురమునందు, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమునుగూర్చి, నార్హతి=తగదు. సీతా=సీత, భాస్కరేణ=సూర్యునిచేత, ప్రభా యథా=కాంతి వలె, మయా=నా చేత, అనన్యా హి=అన్యుడెవ్వడూ లేనిది కదా ?

తా. మంగళ ప్రదురాలైన ఈ సీతకు రావణుని అంతఃపురములోని ఐశ్వర్యముతో పని లేదు. కాంతి సూర్యుని విడచి మరెక్కడికి వెళ్లనట్లు సీత నన్ను విడచి మరెవ్వరి సంబంధమును పొందదు. 19

మూ. విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా,
న విహాతుం మయా శక్యా కీర్తిరాత్మవతా యథా. 20

ప్ర. అ. జనకాత్మజా=జనకుని పుత్రియైన, మైథిలీ=సీత, త్రిషు లోకేషు=మూడు లోకముల యందు, విశుద్ధా=పరిశుద్ధురాలు. ఆత్మవతా=ఆత్మాభిమానము కలవానిచేత, కీర్తిః యథా=కీర్తివలె, మయా=నాచేత, విహాతుమ్=విడచుటకు, న శక్యా=శక్యమైనది కాదు.

తా. జనకుని పుత్రియైన సీతతో సమానమైన పవిత్రురాలు ఈ మూడు లోకములలోను కూడ లేదు. ఆత్మాభిమానము కలవాడు కీర్తిని ఎట్లు వదలజాలడో అట్లే నేను ఈమెను వదలజాలను. 20

మూ. అవశ్యం చ మయా కార్యం సర్వేషాం వో వచో హితమ్,
స్నిగ్ధానాం లోకనాథానామేవం చ వదతాం హితమ్. 21

ప్ర. అ. స్నిగ్ధానామ్=స్నేహముకలవారు, లోకనాథానామ్=లోకపాలకులు, ఏవమ్=ఇట్లు, హితమ్=హితమును, వదతామ్=పలుకుచున్నవారు అయిన, వః సర్వేషామ్=మీ అందరియొక్క, హితమ్=హితమైన, వచః=వచనము, మయా=నాచేత, అవశ్యమ్=తప్పక, కార్యమ్=చేయదగినది.

తా. నాయందు స్నేహము గల లోకపాలకులైన మీరందరూ ఈ విధముగా హితమును చెప్పుచున్నారు. ఈ హితవచనమును నేను తప్పక ఆచరించవలెను. 21

మూ. ఇత్యేవముక్త్వా విజయీ మహాబలః
ప్రశస్యమానః స్వకృతేన కర్మణా,
సమేత్య రామః ప్రియయా మహాయశాః
సుఖం సుఖార్హోఽనుబభూవ రాఘవః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అష్టాదశాధిక శతతమః సర్గః.

ప్ర. అ. విజయీ=విజయమును పొందిన, మహాబలః=గొప్ప బలము గల, మహాయశాః=గొప్ప కీర్తి గల, సుఖార్హః=సుఖమునకు తగిన, రాఘవః=రఘువంశమునందు పుట్టిన, రామః=రాముడు, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, స్వకృతేన=తన చేత చేయబడిన, కర్మణా=పనిచేత, ప్రశస్యమానః=ప్రశంసింపబడుచు, ప్రియయా=ప్రియురాలితో, సమేత్య=కలసి, సుఖమ్=సుఖమును, అనుబభూవ=అనుభవించెను.

తా. విజయమును పొందినవాడు, గొప్ప బలము కలవాడు, మహా సుఖమునకు తగినవాడు, రఘువంశసంజాతుడు అయిన రాముడు ఇట్లు పలికి, తాను చేసిన పనికి అందరిచేత ప్రశంసింపబడుచు ప్రియురాలితో కలిసి సుఖమును సంతోషమును పొందెను. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపద్దెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనవింశత్యధికశతతమః సర్గః

[మహాదేవుని ఆజ్ఞచే రామలక్ష్మణులు విమానము నెక్కి వచ్చిన దశరథునకు నమస్కరించుట, దశరథుడు పుత్రులకు సీతకు చెప్పవలసిన మాటలు చెప్పి ఇంద్రలోకమునకు వెళ్లిపోవుట.]

మూ. ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం రాఘవేణానుభాషితమ్,
తతః శుభతరం వాక్యం వ్యాజహార మహేశ్వరః. 1

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, అనుభాషితమ్=పలకబడిన, ఏతత్=ఈ, శుభమ్=శుభమైన, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, మహేశ్వరః=మహేశ్వరుడు, తతః=అటుపిమ్మట, శుభతరమ్=మిక్కిలి శుభమైన, వాక్యమ్=వాక్యమును, వ్యాజహార=పలికెను.

తా. రాముడు పలికిన ఈ శుభకరమైన వాక్యమును విని, పిమ్మట మహేశ్వరుడు మిక్కిలి శుభకరమైన వాక్యమును పలికెను. 1

మూ. పుష్కరాక్ష మహాబాహో మహావక్షః పరంతప,
దిష్ట్యా కృతమిదం కర్మ త్వయా ధర్మభృతాం వర. 2

ప్ర. అ. పుష్కరాక్ష=పద్మములవంటి నేత్రములు గలవాడా ! మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా ! మహావక్షః=గొప్ప వక్షఃస్థలము గలవాడా! పరంతప=శత్రుసంహారకుడా ! ధర్మభృతామ్=ధర్మమును పోషించువారిలో, వర=శ్రేష్ఠుడా ! దిష్ట్యా=దైవయోగముచేత, ఇదం కర్మ=ఈ పని, త్వయా=నీచేత, కృతమ్=చేయబడినది.

తా. పద్మములవంటి నేత్రములు గలవాడా ! మహాబాహూ ! విశాలమైన వక్షఃస్థలము గలవాడా ! శత్రుసంహారకా ! ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడా! నీవు ఈ పనిని అదృష్టవశముచేత పూర్తి చేసితివి. 2

మూ. దిష్ట్యా సర్వస్య లోకస్య ప్రవృద్ధం దారుణం తమః,
అపావృత్తం త్వయా సంఖ్యే రామ రావణజం భయమ్. 3

ప్ర. అ. రామ=రామా ! సర్వస్య=సమస్తమైన, లోకస్య=లోకముయొక్క, రావణజమ్=రావణునివలన కలిగిన, భయమ్=భయ మనెడు, ప్రవృద్ధమ్=వృద్ధి

పొందిన, దారుణమ్=దారుణమైన, తమః=అంధకారము, దిష్ట్యా=దైవవశముచేత, త్వయా=నీచేత, సంఖ్యే=యుద్ధమునందు, అపావృత్తమ్=తొలగించబడినది.

తా. నీవు అదృష్టవశముచేత లోకమునకు రావణుని వలన కలిగిన భయ మనే అత్యధికము, భయంకరమూ అయిన అంధకారమును తొలగించితివి. 3

మూ. ఆశ్వాస్య భరతం దీనం కౌసల్యాం చ యశస్వినీమ్,
కైకేయీం చ సుమిత్రాం చ దృష్ట్వా లక్ష్మణమాతరమ్, 4
ప్రాప్య రాజ్యమయోధ్యాయాం నన్దయిత్వా సుహృజ్జనమ్,
ఇక్ష్వాకూణాం కులే వంశం స్థాపయిత్వా మహాబల, 5
ఇష్ట్వా తురగమేధేన ప్రాప్య చానుత్తమం యశః,
బ్రాహ్మణేభ్యో ధనం దత్త్వా త్రిదివం గన్తుమర్హసి. 6

ప్ర. అ. మహాబల=గొప్ప బలముగలవాడా ! దీనమ్=దీనుడైన, భరతమ్=భరతుణ్ణి, యశస్వినీమ్=కీర్తిమంతురాలైన, కౌసల్యాం చ=కౌసల్యను, ఆశ్వాస్య=ఓదార్చి, కైకేయీం చ=కైకేయిని, లక్ష్మణమాతరమ్=లక్ష్మణుని తల్లియైన, సుమిత్రాం చ=సుమిత్రను, దృష్ట్వా=చూచి, అయోధ్యాయామ్=అయోధ్యయందు, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్య=పొంది, సుహృజ్జనమ్=మిత్రజనమును, నన్దయిత్వా=సంతోషపెట్టి, ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకువంశీయులయొక్క, కులే=కులమునందు, వంశమ్=వంశమును, స్థాపయిత్వా=స్థాపించి, తురగమేధేన=అశ్వమేధముచేత, ఇష్ట్వా=యాగముచేసి, అనుత్తమమ్=గొప్ప, యశః=కీర్తిని, ప్రాప్య=పొంది, బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకు, ధనమ్=ధనమును, దత్త్వా=ఇచ్చి, త్రిదివమ్=స్వర్గమును గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, అర్హసి=తగియున్నావు.

తా. గొప్ప బలము గల ఓ రామా ! దీనుడైన భరతుణ్ణి, కీర్తిమంతురాలైన కౌసల్యను ఓదార్చి, కైకేయిని, లక్ష్మణుని తల్లియైన సుమిత్రను చూచి, అయోధ్యలో రాజ్యము పొంది, మిత్రజనమునకు ఆనందము కలిగించి, (పుత్రులను కనుటచేత) ఇక్ష్వాకుకులమునందు వంశమును నిలిపి, అశ్వమేధయాగము చేసి, గొప్ప యశస్సును పొంది, బ్రాహ్మణులకు దానములు చేసి, పిమ్మట నీవు స్వర్గమునకు చేరవలెను. 4 - 6

మూ. ఏష రాజా దశరథో విమానస్థః పితా తవ,
కాకుత్స్థ మానుషే లోకే గురుస్తవ మహాయశాః. 7

ప్ర. అ. కాకుత్స్థ=రామా ! మానుషే లోకే=మనుష్యలోకమునందు, తవ=నీయొక్క, గురుః=పూజ్యుడు, తవ=నీయొక్క, పితా=తండ్రి, మహాయశాః=గొప్ప కీర్తి గలవాడు అయిన, ఏషః=ఈ, రాజా=రాజైన, దశరథః=దశరథుడు,

విమానస్థః=విమానమునందు ఉన్నాడు.

తా. మనుష్యలోకమునందు నీ తండ్రి, నీకు పూజ్యుడు, గొప్ప కీర్తి గలవాడు అయిన ఈ దశరథ మహారాజు విమానములో ఉన్నాడు. 7

మూ. ఇన్ద్రలోకం గతః శ్రీమాం స్త్వయా పుత్రేణ తారితః,
లక్ష్మణేన సహ భ్రాత్రా త్వమేనమభివాదయ. 8

ప్ర. అ. పుత్రేణ=పుత్రుడవైన, త్వయా=నీచేత, తారితః=తరింపచేయబడినవాడై, శ్రీమాన్=శ్రీమంతుడైన ఇతడు, ఇన్ద్రలోకమ్=ఇంద్రలోకమును, గతః=పొందినాడు. భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, త్వమ్=నీవు, ఏనమ్=ఈతనిని, అభివాదయ=నమస్కరించుము.

తా. పుత్రుడైన నీచేత తరింపచేయబడినవాడై శోభాయుక్తుడైన ఈ దశరథుడు ఇంద్రలోకము చేరినాడు. నీవు లక్ష్మణసహితుడవై ఈతనికి అభివాదనము చేయుము. 8

మూ. మహాదేవవచః శ్రుత్వా రాఘవః సహలక్ష్మణః,
లక్ష్మణేన సహ భ్రాత్రా దదర్శ పితరం ప్రభుః. 9

ప్ర. అ. సహలక్ష్మణః=లక్ష్మణునితో కూడిన, రాఘవః=రాముడు, మహాదేవవచః=మహేశ్వరుని వచనమును, శ్రుత్వా=విని, విమానశిఖరస్థస్య=విమానశిఖరమునందున్న, పితుః=తండ్రియొక్క, ప్రణామమ్=నమస్కారమును, చకార=చేసెను.

తా. లక్ష్మణసహితుడైన రాముడు మహేశ్వరుని మాటలు విని విమానాగ్రమునందు ఉన్న తండ్రికి నమస్కరించెను. 9

మూ. దీప్యమానం స్వయా లక్ష్మ్యా విరజోఽమ్బరధారిణమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా దదర్శ పితరం ప్రభుః. 10

ప్ర. అ. ప్రభుః=ప్రభువైన రాముడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన=లక్ష్మణునితో కూడి, స్వయా=తన సంబంధమైన, లక్ష్మ్యా=శోభతో, దీప్యమానమ్=ప్రకాశించుచున్న, విరజోఽమ్బరధారిణమ్=పరాగములేని వస్త్రములను ధరించిన, పితరమ్=తండ్రిని, దదర్శ=చూచెను.

తా. ప్రభువైన రాముడు లక్ష్మణసహితుడై తన తేజస్సుతో ప్రకాశించుచున్న, నిర్మలములైన వస్త్రములు ధరించిన తండ్రిని చూచెను. 10

మూ. హర్షేణ మహతావిష్టో విమానస్థో మహీపతిః,
ప్రాణైః ప్రియతరం దృష్ట్వా పుత్రం దశరథస్తదా. 11

ఆరోప్యాఙ్కే మహాబాహుర్వరాసనగతః ప్రభుః,
బాహుభ్యాం సంపరిష్వజ్య తతో వాక్యం సమాదదే. 12

ప్ర. అ. తదా=అప్పుడు, విమానస్థః=విమానమునందున్న, మహీపతిః=రాజైన, ప్రభుః=సమర్థుడైన, వరాసనగతః=శ్రేష్ఠమైన ఆసనమునం దున్న, దశరథః=దశరథుడు, ప్రాణైః=ప్రాణములచేత, ప్రియతరమ్=చాల ఇష్టుడైన, పుత్రమ్=పుత్రుణ్ణి, దృష్ట్వా=చూచి, మహతా=గొప్ప, హర్షేణ=సంతోషముతో, ఆవిష్టః=కూడినవాడై, అఙ్కే=ఒడిలో, ఆరోప్య=కూర్చుండబెట్టుకొని, బాహుభ్యామ్=బాహువులచేత, సంపరిష్వజ్య=కౌగలించుకొని, తతః=అటుపిమ్మట, వాక్యమ్=వాక్యమును, సమాదదే=గ్రహించెను.

తా. అప్పుడు విమానములో శ్రేష్ఠమైన ఆసనముమీద కూర్చొని ఉన్న ప్రభువైన దశరథమహారాజు ప్రాణముకంటె కూడ ఎక్కువ ప్రియుడైన పుత్రుణ్ణి చూచి, ఆనందపరవశుడై, ఒడిలో కూర్చుండబెట్టుకొని, బాహువులతో కౌగలించుకొని ఇట్లు పలికెను. 11 - 12

మూ. న మే స్వర్గో బహుమతః సంమానశ్చ సురర్షభైః,
త్వయా రామ విహీనస్య సత్యం ప్రతిశృణోమి తే. 13

ప్ర. అ. రామ=రామా ! త్వయా=నీతో, విహీనస్య=శూన్యుడవైన, మే=నాకు, స్వర్గః=స్వర్గము, న బహుమతః=ఇష్టము కాదు. సురర్షభైః=దేవతలలో శ్రేష్ఠులైన వారిచేత, సంమానశ్చ=సంమానము కూడ ఇష్టముకాదు. తే=నీకు, సత్యమ్=నిజముగా, ప్రతిశృణోమి=చెప్పుచున్నాను.

తా. రామా ! నీవు దగ్గర లేని నాకు స్వర్గము గాని, దేవతా శ్రేష్ఠులు చేయు సంమానము గాని ఇష్టము కాదు, నీకు సత్యమును చెప్పుచున్నాను.13

మూ. అద్య త్వాం నిహతామిత్రం దృష్ట్వా సంపూర్ణమానసమ్,
నిస్తీర్ణవనవాసం చ ప్రీతిరాసీత్పరా మమ. 14

ప్ర. అ. అద్య=ఇప్పుడు, నిహతామిత్రమ్=చంపబడిన శత్రువులు గల, సంపూర్ణమానసమ్=సంపూర్ణమైన మనస్సుగల, నిస్తీర్ణవనవాసం చ=దాటబడిన వనవాసము గల, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, మమ=నాకు, పరా=అధికమైన, ప్రీతిః=సంతోషము, ఆసీత్=అయినది.

తా. నేడు, శత్రువులను సంహరించి, ఆనందముతో నిండిన మనస్సుతో వనవాసనియమమును పూర్తిచేసికొనిన నిన్ను చూచి ఈ నాడు నాకు చాల సంతోషము కలిగినది. 14

మూ. కైకేయ్యా యాని చోక్తాని వాక్యాని వదతాం వర,
తవ ప్రవ్రాజనార్థాని స్థితాని హృదయే మమ. 15

ప్ర. అ. వదతామ్=మాటలాడువారిలో, వర=శ్రేష్ఠుడా ! తవ=నీయొక్క, ప్రవ్రాజనార్థాని=ప్రవాసమునకు పంపుటకొరకైన, యాని=ఏ, వాక్యాని=వాక్యములు, కైకేయ్యా=కైకేయిచేత, ఉక్తాని=పలకబడినవో, తాని=అవి, మమ=నాయొక్క, హృదయే=హృదయమునందు, స్థితాని=ఉన్నవి.

తా. మాటలలో నేర్పు గలవారిలో శ్రేష్ఠుడవైన రామా ! నిన్ను అరణ్యమునకు పంపుటకై కైకేయి పలికిన మాటలు ఇంకా నా హృదయములో మెదులుచున్నవి. 15

మూ. త్వాం తు దృష్ట్వా కుశలినం పరిష్వజ్య సలక్ష్మణమ్,
అద్య దుఃఖాద్విముక్తోఽస్మి నీహారాదివ భాస్కరః. 16

ప్ర. అ. సలక్ష్మణమ్=లక్ష్మణసహితుడవైన, త్వామ్=నిన్ను, కుశలినమ్=క్షేమముగా ఉన్న వానినిగా, దృష్ట్వా=చూచి, పరిష్వజ్య=కౌగలించుకొని, అద్య=ఈనాడు, భాస్కరః=సూర్యుడు, నీహారాదివ=మంచునుండి వలె, దుఃఖాత్=దుఃఖమునుండి, విముక్తః అస్మి=విడువబడితిని.

తా. నీవు లక్ష్మణుడు కుశలముగా ఉన్నట్లు చూచి, మీ ఇద్దరిని కౌగలించుగొనిన పిమ్మట నేడు సూర్యుడు మంచునుండి దూరమైనట్లు దుఃఖమునుండి దూరమైతిని. 16

మూ. తారితోఽహం త్వయా పుత్ర సుపుత్రేణ మహాత్మనా,
అష్టావక్రేణ ధర్మాత్మా కహోలో బ్రాహ్మణో యథా. 17

ప్ర. అ. పుత్ర=పుత్రుడా ! **మహాత్మనా**=మహాత్ముడవైన, సుపుత్రేణ=సుపుత్రుడవైన, త్వయా=నీచేత, అష్టావక్రేణ=అష్టావక్రునిచేత, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, కహోలః=కహోలు డను, బ్రాహ్మణో యథా=బ్రాహ్మణుడు వలె, అహమ్=నేను, తారితః=తరింపచేయబడితిని.

తా. పుత్రా ! సుపుత్రుడవైన, మహాత్ముడవైన నీవు అష్టావక్రుడు ధర్మాత్ముడైన కహోలు డను బ్రాహ్మణుణ్ణి తరింపచేసినట్లు నన్ను తరింపచేసినావు.

మూ. ఇదానీం చ విజానామి యథా సౌమ్య సురేశ్వరైః,
వధార్థం రావణస్యేహ విహితం **పురుషోత్తమ.** 18

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! పురుషోత్తమ=పురుషులలో శ్రేష్ఠుడా ! ఇహ=ఇక్కడ, రావణస్య=రావణునియొక్క, వధార్థమ్=వధకొరకు, సురేశ్వరైః=దే

వప్రముఖులచేత, యథా=ఎట్లు, విహితమ్=చేయబడినదో, ఇదానీం చ=ఇప్పుడే, విజానామి=తెలుసుకొనుచున్నాను.

తా. సౌమ్యుడా ! పురుషోత్తముడా ! రావణుని వధకొరకై దేవతలు ఈ విధము (అభిషేకవిఘ్నాదులు) చేసినట్లు ఇప్పుడే నాకు తెలిసినది. 18

మూ. సిద్ధార్థా ఖలు కౌసల్యా యా త్వాం రామ గృహం గతమ్,
వనాన్నివృత్తం సంహృష్టా ద్రక్ష్యతే శత్రుసూదనమ్. 19

ప్ర. అ. రామ=రామా ! వనాత్=వనమునుండి, నివృత్తమ్=మరలిన, శత్రుసూదనమ్=శత్రుసంహారకుడవైన, గృహమ్=గృహమును, గతమ్=పొందిన, త్వామ్=నిన్ను, యా=ఏ కౌసల్య, సంహృష్టా=సంతోషించినదై, ద్రక్ష్యతే=చూడగలదో, కౌసల్యా=అట్టి కౌసల్య, సిద్ధార్థా ఖలు=సిద్ధించిన ప్రయోజనము కలది కదా?

తా. రామా ! వనవాసమునుండి తిరిగి వచ్చి ఇల్లు చేరిన శత్రుసంహారకుడవైన నిన్ను చూడబోవుచున్న కౌసల్య అదృష్టవంతురాలు గదా?

మూ. సిద్ధార్థాః ఖలు తే రామ నరా యే త్వాం పురీం గతమ్,
రాజ్యే చైవాభిషిక్తం చ ద్రక్ష్యన్తే వసుధాధిపమ్. 20

ప్ర. అ. రామ=రామా ! పురీమ్=పురమును గూర్చి, గతమ్=వెళ్లిన, రాజ్యే=రాజ్యమునందు, అభిషిక్తం చ=అభిషేకించబడిన, త్వామ్=నిన్ను, వసుధాధిపమ్=మహారాజునుగా, యే నరాః=ఏ మానవులు, ద్రక్ష్యన్తే=చూడగలరో, తే=వారు, సిద్ధార్థాః ఖలు=కృతార్థులు కదా ?

తా. రామా ! అయోధ్యకు తిరిగి వెళ్ళిన నీవు రాజ్యాభిషిక్తుడవైన పిమ్మట నిన్ను మహారాజునుగా చూడగలిగిన ఆ జనులు కృతార్థులు కదా ?

మూ. అనురక్తేన బలినా శుచినా ధర్మచారిణా,
ఇచ్ఛేయం త్వామహం ద్రష్టుం భరతేన సమాగతమ్. 21

ప్ర. అ. అనురక్తేన=నీయందు ప్రేమ గలవాడు, బలినా=బలవంతుడు, శుచినా=పరిశుద్ధుడు, ధర్మచారిణా=ధర్మమును ఆచరించువాడు అయిన, భరతేన=భరతునితో, సమాగతమ్=కలిసిన, త్వామ్=నిన్ను, ద్రష్టుమ్=చూచుటకు, అహమ్=నేను, ఇచ్ఛేయమ్=ఇచ్ఛయించుచుదును.

తా. నీవు అనురాగవంతుడు, బలవంతుడు, పరిశుద్ధుడు, ధర్మము ఆచరించువాడు అయిన భరతునితో కలియగా చూడవలె నని నా కోరిక.21

మూ. చతుర్దశ సమాః సౌమ్య వనే నిర్యాతితాస్త్వయా,
వసతా సీతయా సార్ధం లక్ష్మణేన చ ధీమతా. 22

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! సీతయా సార్ధమ్=సీతతోను, ధీమతా=బుద్ధిమంతుడైన, లక్ష్మణేన చ=లక్ష్మణునితోను, వసతా=నివసించిన త్వయా=నీచేత, చతుర్దశ=పదునాలుగు, సమాః=సంవత్సరములు, వనే=వనమునందు, నిర్యాతితాః=గడపబడినది.

తా. ఓ ! సౌమ్యుడా ! నీవు సీతతోను బుద్ధిమంతుడైన లక్ష్మణునితోను కలిసి అరణ్యములో నివసించి పదునాలుగు సంవత్సరములు గడపినావు. 22

మూ. నివృత్తవనవాసోఽసి ప్రతిజ్ఞా పూరితా త్వయా,
రావణం చ రణే హత్వా దేవతాః పరితోషితాః. 23

ప్ర. అ. నివృత్తవనవాసః=పూర్తియైన వనవాసము కలవాడవు, అసి=అయితివి, త్వయా=నీచేత, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, పూరితా=పూరింపబడినది. రణే=యుద్ధమునందు, రావణమ్=రావణుని, హత్వా=చంపి, దేవతాః చ=దేవతలు కూడా, పరితోషితాః=సంతోషపెట్టబడినారు.

తా. వనవాసము పూర్తి చేసితివి. నీ ప్రతిజ్ఞ నిలుపుకొంటివి. యుద్ధములో రావణుని సంహరించి దేవతలకు సంతోషము కూడ కలిగించితివి. 23

మూ. కృతం కర్మ యశః శ్లాఘ్యం ప్రాప్తం తే శత్రుసూదన,
భ్రాతృభిః సహ రాజ్యస్థో దీర్ఘమాయురవాప్నుహి. 24

ప్ర. అ. శత్రుసూదన=శత్రుసంహారకుడా ! కర్మ=గొప్ప పని, కృతమ్=చేయబడినది. తే=నీకు (నీచేత), శ్లాఘ్యమ్=శ్లాఘింపదగిన, యశః=కీర్తి, ప్రాప్తమ్=పొందబడినది. భ్రాతృభిః సహ=సోదరులతో కూడ, రాజ్యస్థః=రాజ్యమునందున్నవాడవై, దీర్ఘమ్=దీర్ఘమైన, ఆయుః=ఆయుర్దాయమును, అవాప్నుహి=పొందుము.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! గొప్ప పని చేసి శ్లాఘించతగిన కీర్తి సంపాదించితివి. సోదరులతో కూడ రాజ్యము పాలించుచు దీర్ఘాయుర్దాయవంతుడవు అగుము. 24

మూ. ఇతి బ్రువాణం రాజానం రామః ప్రాఞ్జలిరబ్రవీత్,
కురు ప్రసాదం ధర్మజ్ఞ కైకేయ్యా భరతస్య చ. 25

ప్ర. అ. ఇతి=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, రాజానమ్=రాజును గూర్చి, రామః=రాముడు, ప్రాఞ్జలిః=ఎత్తబడిన దోసిలి కలవాడై, అబ్రవీత్=పలికెను. ధర్మజ్ఞ=ధర్మములు ఎరిగిన వాడా ! కైకేయ్యాః=కైకేయియొక్క, భరతస్య చ=భరతునియొక్క, ప్రసాదమ్ అనుగ్రహమును, కురు చేయుము.

తా. ఇట్లు పలుకుచున్న రాజుతో రాముడు అంజలి ఘటించి ఇట్లనెను -- "ధర్మములు ఎరిగినవాడా ! కైకేయి విషయమునందు, భరతుని విషయమునందు అనుగ్రహము చూపుము." 25

మూ. సపుత్రాం త్వాం త్యజామీతి యదుక్తా కేకయీ త్వయా,
స శాపః కేకయీం ఘోరః సపుత్రాం న స్పృశేత్ ప్రభో. 26

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! సపుత్రామ్=పుత్రునితో కూడిన, త్వామ్=నిన్ను, త్యజామీతి=విడచుచున్నాను అని, త్వయా=నీచేత, కేకయీ=కైకేయి, యత్=ఏ వాక్యము, ఉక్తా=చెప్పబడినదో, సః=ఆ, ఘోరః=ఘోరమైన, శాపః=శాపము, సపుత్రామ్=పుత్రునితో కూడిన, కేకయీమ్=కైకేయిని, న స్పృశేత్=స్పృశించకుందుగాక.

తా. "నిన్ను నీ పుత్రుణ్ణీ విడచివేయుచున్నాను" అని నీవు కైకేయితో ఏ మాట పలికితివో, ఆ ఘోరమైన శాపము పుత్రసహితురాలైన ఆమెను స్పృశించకుందుగాక. 26

మూ. తథేతి స మహారాజో రామముక్త్వా కృతాఞ్జలిమ్,
లక్ష్మణం చ పరిష్వజ్య పునర్వాక్యమువాచ హ. 27

ప్ర. అ. సః మహారాజః=ఆ మహారాజు, తథేతి=అట్లే అని, కృతాఞ్జలిమ్=చేయబడిన దోసిలి గల, రామమ్=రాముణ్ణి గూర్చి, ఉక్త్వా=పలికి, లక్ష్మణం చ=లక్ష్మణుని కూడ, పరిష్వజ్య=కౌగలించుకొని, పునః=మరల, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. దశరథమహారాజు అంజలి ఘటించి ఉన్న రామునితో అట్లే జరుగుగాక అని పలికి, లక్ష్మణుణ్ణి కూడ కౌగలించుకొని మరల ఇట్లు పలికెను.

మూ. రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా,
కృతా మమ మహాప్రీతిః ప్రాప్తం ధర్మఫలం చ తే. 28

ప్ర. అ. వైదేహ్యా=విదేహ రాజపుత్రియైన, సీతయా సహ=సీతతో కూడ, రామమ్=రాముణ్ణి, భక్త్యా=భక్తితో, శుశ్రూషతా=శుశ్రూష చేయుచున్న నీచేత, మమ=నాకు, మహాప్రీతిః=గొప్ప సంతోషము, కృతా=చేయబడినది. తే=నీకు, ధర్మఫలం చ=ధర్మఫలము కూడ, ప్రాప్తమ్=పొందబడినది.

తా. నీవు రాముణ్ణి, విదేహరాజపుత్రియైన సీతను సేవించుట ద్వారా నాకు చాల సంతోషము కలిగించినావు. ధర్మఫలమును పొందినావు. 28

మూ. ధర్మం ప్రాప్స్యసి ధర్మజ్ఞ యశశ్చ విపులం భువి,
రామే ప్రసన్నే స్వర్గం చ మహిమానం తథోత్తమమ్. 29

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మము తెలిసిన లక్ష్మణా ! ధర్మమ్=ధర్మమును, భువి=ఈ భూలోకమునందు, విపులమ్=అధికమైన, యశశ్చ=కీర్తినీ, ప్రాప్స్యసి=పొందగలవు. రామే=రాముడు, ప్రసన్నే=ప్రసన్నుడైనవాడగుచుండగా, స్వర్గం చ=స్వర్గమును, ఉత్తమమ్=ఉత్తమమైన, మహిమానమ్=గొప్పతనమును, పొందగలవు.

తా. ధర్మములు తెలిసిన ఓ ! లక్ష్మణా ! నీవు ధర్మమును, ఈ భూలోకమునందు అధికమైన యశస్సును పొందగలవు. రాముడు ప్రసన్నుడైనచో స్వర్గమును, ఉత్తమమైన గొప్పతనమును కూడ పొందగలవు. 29

మూ. రామం శుశ్రూష భద్రం తే సుమిత్రానన్దవర్ధన,
రామః సర్వస్య లోకస్య హితేష్వభిరతః సదా. 30

ప్ర. అ. సుమిత్రానన్దవర్ధన=సుమిత్రయొక్క ఆనందమును వృద్ధిపొందించువాడా ! తే=నీకు, భద్రమ్=మంగళ మగుగాక. రామమ్=రాముణ్ణి, శుశ్రూష=సేవించుము. రామః=రాముడు, సదా=ఎల్లప్పుడు, సర్వలోకస్య=సమస్త లోకముయొక్క, హితేషు=హితములయందు, అభిరతః=ఆసక్తుడు.

తా. లక్ష్మణా ! నీకు మంగళ మగు గాక. రామునకు సేవ చేయుచుండుము. రాముడు ఎల్లప్పుడు సకలలోకహితమునందు ఆసక్తి గలవాడు.

మూ. ఏతే సేన్ద్రాస్త్రయో లోకాః సిద్ధాశ్చ పరమర్షయః,
అభిగమ్య మహాత్మానమర్చన్తి పురుషోత్తమమ్. 31

ప్ర. అ. సేన్ద్రాః=ఇంద్రునితో కూడిన, ఏతే=ఈ, లోకాః=లోకములు, సిద్ధాశ్చ=సిద్ధులు, పరమర్షయః=మహర్షులు, మహాత్మానమ్=మహాత్ముడైన, పురుషోత్తమమ్=పురుషశ్రేష్ఠుడైన రాముణ్ణి, అభిగమ్య=సమీపించి, అర్చన్తి=పూజించుచున్నారు.

తా. ఇంద్రునితో కూడిన ఈ మూడులోకములు, సిద్ధులు, మహర్షులు, మహాత్ముడూ, ఉత్తమ పురుషుడూ అయిన ఈ రాముని సన్నిధి చేరి పూజించుచున్నారు. 31

మూ. ఏతత్తదుక్తమవ్యక్తమక్షరం బ్రహ్మ నిర్మితమ్,
దేవానాం హృదయం సౌమ్య గుహ్యం రామః పరంతప. 32

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! పరంతప=శత్రుసంహారకుడా !

అవ్యక్తమ్=వ్యక్తము కానిది, అక్షరమ్=నాశరహితము, దేవానామ్=దేవతలయొక్క, హృదయమ్=హృదయము, గుహ్యమ్=రహస్యమూ అయిన, తత్=ప్రసిద్ధమైన, ఏతత్=ఈ, బ్రహ్మ=పరబ్రహ్మయే, రామః=రాముడుగా, నిర్మితమ్=నిర్మింపబడిన దిగా, ఉక్తమ్=చెప్పబడినది.

తా. అవ్యక్తము, నాశరహితము, దేవతల హృదయము, రహస్యమూ అయిన బ్రహ్మయే రాముడుగా అవతరించె నని చెప్పుచున్నారు. 32

మూ. అవాప్తం ధర్మచరణం యశశ్చ విపులం త్వయా,
ఏనం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా. 33

ప్ర. అ. వైదేహ్యా=విదేహరాజపుత్రియైన, సీతయా సహ=సీతతో కూడ, ఏనమ్=ఈతనిని, భక్త్యా=భక్తితో, శుశ్రూషతా=శుశ్రూషచేయుచున్న, త్వయా=నీచేత, ధర్మాచరణమ్=ధర్మానుష్ఠానము, అవాప్తమ్=పొందబడినది. విపులమ్=అధికమైన, యశశ్చ=కీర్తి కూడ, పొందబడినది.

తా. సీతాసహితుడైన ఈ రాముణ్ణి భక్తితో సేవించుచున్న నీవు ధర్మానుష్ఠానమును, అధికమైన కీర్తిని పొందినావు. 33

మూ. ఇత్యుక్త్వా లక్ష్మణం రాజా స్నుషాం బద్ధాఞ్జలిం స్థితామ్,
పుత్రీత్యాభాష్య మధురం శనైరేనామువాచ హ. 34

ప్ర. అ. రాజా=రాజు, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, బద్ధాఞ్జలిమ్=కట్టబడిన దోసిలి కలదై, స్థితామ్=నిలచి ఉన్న, స్నుషామ్=కోడలిని, పుత్రి=ఓ ! పుత్రీ, ఇతి=అని, ఆభాష్య=పలకరించి, ఏనామ్=ఈమెను గూర్చి, శనైః=మెల్లగా, మధురమ్=మధురముగా, ఉవాచ=పలికెను.

తా. రాజు లక్ష్మణునితో ఇట్లు పలికి, అంజలి ఘటించి నిలచి ఉన్న కోడలిని "ఓ ! పుత్రీ !" అని పలకరించి, ఈమెతో మెల్లగా మధురముగా ఇట్లు పలికెను. 34

మూ. కర్తవ్యో న తు వైదేహి మన్యుస్త్యాగమిమం ప్రతి,
రామేణేదం విశుద్ధ్యర్థం కృతం వై త్వద్ధితైషిణా. 35

ప్ర. అ. వైదేహి=సీతా ! ఇమమ్=ఈ, త్యాగం ప్రతి=త్యాగమును గూర్చి, మన్యుః=కోపము, న తు కర్తవ్యః=చేయదగినది కాదు. త్వద్ధితైషిణా=నీ హితమును కోరుచున్న, రామేణ=రామునిచేత, ఇదమ్=ఇది, విశుద్ధ్యర్థమ్=విశుద్ధికొరకు, కృతమ్=చేయబడినది.

తా. సీతా ! రాముడు నిన్ను విడిచిపెట్టినందుకు కోపించకుము.

రాముడు నీ హితమునే కోరి విశుద్ధికొరకై ఇట్లు చేసినాడు. 35

మూ. సుదుష్కరమిదం పుత్రి తవ చారిత్రలక్షణమ్,
కృతం యత్తేఽన్యనారీణాం యశో హ్యాభిభవిష్యతి. 36

ప్ర. అ. పుత్రి=ఓ ! పుత్రీ ! తవ=నీయొక్క, చారిత్రలక్షణమ్=చరిత్ర అను స్వరూపము గల, యత్=ఏ, సుదుష్కరమ్=చాల చేయ శక్యము కాని పని, కృతమ్=చేయబడినదో, తే=నీయొక్క, ఇదమ్=ఇది, అన్యనారీణామ్= ఇతరస్త్రీలయొక్క, యశః=కీర్తిని, అభిభవిష్యతి=తిరస్కరించగలదు.

తా. పుత్రీ ! ఇతరు లెవ్వరికీ చేయుశక్యము కాని చరిత్రరూపమైన ఏ కార్యమును నీవు చేసినావో ఇది ఇతరస్త్రీల కీర్తిని కప్పివేయును. 36

మూ. న త్వం కామం సమాధేయా భర్తృశుశ్రూషణం ప్రతి,
అవశ్యం తు మయా వాచ్యమేష తే దైవతం పరమ్. 37

ప్ర. అ. త్వమ్=నీవు, భర్తృశుశ్రూషణం ప్రతి=భర్తయొక్క సేవను గూర్చి, న సమాధేయా కామమ్= నిజముగా బోధించ దగిన దానవు కాదు. తు=కాని, మయా=నాచేత, అవశ్యమ్=తప్పక, వాచ్యమ్=చెప్పదగినది. ఏషః= ఈ భర్త, తే=నీకు, పరమ్=గొప్ప, దైవతమ్=దేవత.

తా. నీకు భర్తృశుశ్రూషను గూర్చి చెప్పవలసిన పని లేదనునది నిజమే; అయినను నేను చెప్పవలయును. ఈతడే నీకు పరమదేవత. 37

మూ. ఇతి ప్రతిసమాదిశ్య పుత్రౌ సీతాం చ రాఘవః,
ఇన్ద్రలోకం విమానేన యయౌ దశరథో నృపః. 38

ప్ర. అ. రాఘవః=రఘువంశసంజాతుడైన, దశరథః నృపః=దశరథ మహారాజు, పుత్రౌ=పుత్రులను, సీతాం చ=సీతను, ఇతి=ఇట్లు, ప్రతిసమాదిశ్య= ఉపదేశించి, విమానేన=విమానముచేత, ఇన్ద్రలోకమ్=ఇంద్రలోకమును గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. రఘువంశసంజాతుడైన దశరథమహారాజు, పుత్రులకు, సీతకు ఇట్లు ఉపదేశించి విమానముపై ఇంద్రలోకమునకు వెళ్ళెను. 38

మూ. విమానమాస్థాయ మహానుభావః
శ్రియా చ సంహృష్టతనుర్నృపోత్తమః,
ఆమన్త్ర్య పుత్రౌ సహ సీతయా చ
జగామ దేవప్రవరస్య లోకమ్. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకోనవింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. మహానుభావః=గొప్ప ప్రభావము గల, నృపోత్తమః=రాజులలో శ్రేష్ఠుడైన దశరథుడు, శ్రియా=కాంతితో కూడినవాడై, సంహృష్టతనుః=సంతోషించిన దేహము కలవాడై, సీతయా సహ=సీతతో కూడ, పుత్రౌ=పుత్రులను, ఆమన్త్ర్య=ఆమంత్రించి, విమానమ్=విమానమును, ఆస్థాయ=అధిష్ఠించి, దేవప్రవరస్య=ఇంద్రునియొక్క, లోకమ్=లోకమును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. గొప్ప ప్రభావము గలవాడు, శోభతో కూడిన వాడు రాజులలో ఉత్తముడూ అయిన దశరథుడు సంతోషించిన (పులకించిన) దేహము గలవాడై వెళ్లెద నని సీతారామలక్ష్మణులతో చెప్పి, విమాన మధిరోహించి స్వర్గలోకమునకు వెళ్లెను. 39

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటపందొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ వింశత్యధికశతతమః సర్గః

[రాముడు కోరగా ఇంద్రుడు మరణించిన వానరులను జీవింపచేయుట, దేవతలు స్వర్గమునకు వెళ్లిపోవుట, వానరసేన విశ్రమించుట.]

మూ. ప్రతిప్రయాతే కాకుత్స్థే మహేన్ద్రః పాకశాసనః,
అబ్రవీత్ పరమప్రీతో రాఘవం ప్రాఞ్జలిం స్థితమ్. 1

ప్ర. అ. కాకుత్స్థే=దశరథుడు, ప్రతిప్రయాతే=తిరిగి వెళ్లినవాడగుచుండగా, పాకశాసనః=పాకాసుర సంహర్తయైన, మహేన్ద్రః=మహేంద్రుడు, పరమప్రీతః=చాల సంతోషించినవాడై, ప్రాఞ్జలిమ్=బంధింపబడిన దోసిలి గల, స్థితమ్=నిలచి ఉన్న, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. దశరథుడు తిరిగి వెళ్లి పోయిన పిమ్మట, పాకాసురసంహారకుడైన దేవేంద్రుడు, చాల సంతోషించుచు, అంజలి ఘటించి నిలచి ఉన్న రామునితో ఇట్లు పలికెను. 1

మూ. అమోఘం దర్శనం రామ తవాస్మాకం నరర్షభ,
ప్రీతియుక్తాః స్మ తేన త్వం బ్రూహి యన్మనసేప్సితమ్. 2

ప్ర. అ. నరర్షభ=మనుష్యశ్రేష్ఠుడా! రామ=రామా ! తవ=నీకు, అస్మాకమ్=మాయొక్క, దర్శనమ్=దర్శనము, అమోఘమ్=వ్యర్థము కానిది. ప్రీతి యుక్తాః=సంతోషముతో కూడిన వారము, స్మ=అయి ఉన్నాము. తేన=అందుచేత, మనసా=నీ మనస్సుచేత, యత్=ఏది, ఈప్సితమ్=పొంద కోరబడుచున్నదో దానిని, త్వమ్=నీవు, బ్రూహి=చెప్పుము.

తా. మానవులలో శ్రేష్ఠుడవైన రామా ! నీకు లభించిన మా దర్శనము వ్యర్థము కాకూడదు. నీ విషయమున సంతోషముతో ఉన్నాము. నీ కేమి కావలెనో చెప్పుము. 2

మూ. ఏవముక్తో మహేన్ద్రేణ ప్రసన్నేన మహాత్మనా,
సుప్రసన్నమనా హృష్టో వచనం ప్రాహ రాఘవః. 3

ప్ర. అ. ప్రసన్నేన=ప్రసన్నుడైన, మహాత్మనా=మహాత్ముడైన, మహే న్ద్రేణ=మహేంద్రునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రాఘవః=రాముడు,

సుప్రసన్నాత్మా=మిక్కిలి ప్రసన్నమైన మనస్సు కలవాడై, హృష్టః=సంతోషించినవాడై, వచనమ్=వచనమును, ప్రాహ=పలికెను.

తా. మహాత్ముడైన మహేంద్రుడు ప్రసన్నుడై ఇట్లు పలుకగా రాముడు చాల ప్రసన్నమైన మనస్సు గలవాడై సంతోషించి ఇట్లు పలికెను. 3

మూ. యది ప్రీతిః సముత్పన్నా మయి తే విబుధేశ్వర,
వక్ష్యామి కురు మే సత్యం వచనం వదతాం వర. 4

ప్ర. అ. వదతాం వర=మాటలాడు వారిలో శ్రేష్ఠుడా ! విబుధేశ్వర=దేవేంద్రుడా ! తే=నీకు, మయి=నాయందు, ప్రీతిః=ప్రేమ, సముత్పన్నా యది=పుట్టినట్లయితే, వక్ష్యామి=చెప్పెదను, మే=నాయొక్క, వచనమ్=వచనమును, సత్యమ్=సత్యమైనదానినిగా, కురు=చేయుము.

తా. మాటలాడువారిలో శ్రేష్ఠుడ వైన దేవేంద్రా ! నీకు నాయందు ప్రేమ కలిగినచో నేను చెప్పబోవు దానిని సత్యము చేయుము. 4

మూ. మమ హేతోః పరాక్రాన్తా యే గతా యమసాదనమ్,
తే సర్వే జీవితం ప్రాప్య సముత్తిష్ఠన్తు వానరాః. 5

ప్ర. అ. మమ హేతోః=నా నిమిత్తమై, పరాక్రాన్తాః=పరాక్రమించిన, యే=ఏ, వానరాః=వానరులు, యమసాదనమ్=యమలోకమును గూర్చి, గతాః=వెళ్లినారో, తే సర్వే=వాళ్లందరూ, జీవితమ్=జీవితమును, ప్రాప్య=పొంది, సముత్తిష్ఠన్తు=లేచెదరుగాక.

తా. నా నిమిత్తమైన పరాక్రమము చూపి యమలోకమునకు వెళ్లిన వానరు లందరూ మరల జీవితమును పొంది లేచెదరుగాక. 5

మూ. మత్కృతే విప్రయుక్తా యే పుత్రైర్దారైశ్చ వానరాః,
తాన్ ప్రీతమనసః సర్వాన్ ద్రష్టుమిచ్ఛామి మానద. 6

ప్ర. అ. మానద=గౌరవమును ఇచ్చువాడా ! మత్కృతే=నా నిమిత్తమై, యే=ఏ, వానరాః=వానరులు, పుత్రైః=పుత్రులతోను, దారైశ్చ=భార్యలతోను, విప్రయుక్తాః=వియోగము పొందినారో, తాన్=వారిని, సర్వాన్=అందరినీ, ప్రీతమనసః=సంతోషించుచున్న మనస్సులు కలవారినిగా, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. గౌరవమును ఇచ్చువాడా ! నా నిమిత్తమై పుత్రులకు, భార్యలకూ దూరమైన వానరు లందరు సంతోషించిన మనస్సులతో ఉండగా వాళ్లను చూడవలెనని కోరుచున్నాను. 6

మూ. విక్రాన్తాశ్చాపి శూరాశ్చ న మృత్యుం గణయన్తి చ,
కృతయత్నా విపన్నాశ్చ జీవయైనాన్ పురందర. 7

ప్ర. అ. విక్రాన్తాః చ=విక్రమించినవారు, శూరాశ్చ=శూరులు, మృత్యుమ్=మృత్యువును, న గణయన్తి చ=లెక్కచేయరు. కృతయత్నాః=చేయబడిన ప్రయత్నము కలవారై, విపన్నాః చ=ఆపద చెందినారు. పురందర=దేవేంద్రా !ఏతాన్=వీళ్ళను, జీవయ=జీవింపచేయుము.

తా. ఈ వానరు లందరు శూరులు, పరాక్రమము చూపించినవారు, మరణమును లెక్కచేయరు. అట్టి వారు యుద్ధము చేయుచు మరణించినారు. దేవేంద్రా ! వాళ్ల నందరినీ జీవింపచేయుము. 7

మూ. మత్ప్రియేష్వభిరక్తాశ్చ న మృత్యుం గణయన్తి యే,
త్వత్ప్రసాదాత్సమేయుస్తే వరమేతమహం వృణే. 8

ప్ర. అ. మత్ప్రియేషు=నా ప్రియములయందు, అభిరక్తాః=ఆసక్తి గల, యే=ఏ వానరులు, మృత్యుమ్=మృత్యువును, న గణయన్తి=లెక్కచేయరో, తే=వాళ్లు, త్వత్ప్రసాదాత్=నీ అనుగ్రహమువలన, సమేయుః=వచ్చెదరు గాక. అహమ్=నేను, ఏతమ్=ఈ, వరమ్=వరమును, వృణే=కోరుచున్నాను.

తా. నాకు ప్రియము చేయుటకై ఏ వానరులు మృత్యువును కూడ లెక్కచేయలేదో వాళ్ళందరు నీ అనుగ్రహమువలన తిరిగి వచ్చెదరు గాక. నేను ఈ వరమును కోరుచున్నాను. 8

మూ. నీరుజో నిర్వ్రణాంశ్చైవ సంపన్నబలపౌరుషాన్,
గోలాఙ్గూలాంస్తథర్క్షాంశ్చ ద్రష్టుమిచ్ఛామి మానద. 9

ప్ర. అ. మానద=గౌరవమును ఇచ్చువాడా ! గోలాఙ్గూలాన్=కొండముచ్చులను, తథా=మరియు, ఋక్షాంశ్చ=ఎలుగుబంట్లను, నీరుజః=రోగము లేనివాటిని గాను, నిర్వ్రణాంశ్చైవ=వ్రణములు లేనివాటిని గాను, సంపన్నబలపౌరుషాన్=సమృద్ధమైన బలపౌరుషములు గలవాటిని గాను, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. వానరులే కాక గోలాంగూలములు, భల్లూకములు కూడ ఏ రోగమూ లేక, గాయములు లేక, బలపౌరుషములతో నిండి ఉండగా చూడగోరుచున్నాను.9

మూ. అకాలే చాపి పుష్పాణి మూలాని చ ఫలాని చ,
నద్యశ్చ విమలాస్తత్ర తిష్ఠేయుర్యత్ర వానరాః. 10

ప్ర. అ. వానరాః=వానరులు, యత్ర=ఎక్కడ, తిష్ఠేయుః=ఉందురో,

తత్ర=అక్కడ, అకాలే చాపి=అకాలమునందు కూడ, పుష్పాణి=పుష్పములు, మూలాని చ=మూలములు, ఫలాని చ=ఫలములు, విమలాః=నిర్మలములైన, నద్యశ్చ=నదులూ, ఉండుగాక.

తా. ఈ వానరులు ఎక్కడెక్కడ నివసించెదరో అక్కడ అకాలమునందు కూడ పుష్పఫలములు, నిర్మలమైన ఉదకము కల నదులు ఉండుగాక. 10

మూ. శ్రుత్వా తు వచనం తస్య రాఘవస్య మహాత్మనః,
మహేన్ద్రః ప్రత్యువాచేదం వచనం ప్రీతిసంయుతమ్. 11

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, తస్య=ఆ, రాఘవస్య=రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా తు=విని, మహేన్ద్రః=మహేంద్రుడు, ప్రీతిసంయుతమ్=ప్రేమతో కూడిన, ఇదమ్=ఈ, వచనమ్=వచనమును, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. మహాత్ముడైన ఆ రాముడు పలికిన మాటలు విని మహేంద్రుడు సంతోషముతో మరల ఇట్లు పలికెను. 11

మూ. మహానయం వరస్తాత యస్త్వయోక్తో రఘూత్తమ,
ద్విర్మయా నోక్తపూర్వం చ తస్మాదేతద్భవిష్యతి. 12

ప్ర. అ. తాత=నాయనా ! రఘూత్తమ=రామా ! యః=ఏది, త్వయా=నీచేత, ఉక్తః=చెప్పబడినదో, అయమ్=ఈ, వరః=వరము, మహాన్=చాల గొప్పది. మయా=నాచేత, ద్విః=రెండుమార్లు, న ఉక్తపూర్వమ్=పూర్వమెన్నడూ చెప్పబడలేదు, తస్మాత్=ఆ కారణమువలన, ఏతత్=ఇది, ఏవమ్=ఇట్లు, భవిష్యతి=కాగలదు.

తా. నాయనా ! రామా ! నీవు అడిగిన ఈ వరము చాల గొప్పది. నేను ఎన్నడూ రెండు మాటలు పలకలేదు. అందువలన నీవు కోరి నట్లు జరుగగలదు. 12

మూ. సముత్తిష్ఠన్తు తే సర్వే హతా యే యుధి రాక్షసైః,
ఋక్షాశ్చ సహ గోపుచ్ఛైర్నికృత్తాననబాహవః. 13

ప్ర. అ. యే=ఎవరు, యుధి=యుద్ధమునందు, రాక్షసైః=రాక్షసులచేత, హతాః=చంపబడిరో, తే సర్వే=ఆ వానరులందరు, నికృత్తాననబాహవః=ఛేదింపబడిన ముఖములు బాహువులు గలవారు, గోపుచ్ఛైః=గోపుచ్ఛములతో కూడ, ఋక్షాశ్చ=భల్లూకములు, సముత్తిష్ఠన్తు=లేచెదరుగాక.

తా. యుద్ధములో రాక్షసులచేత చంపబడిన వానరు లందరు,

భల్లూకములు, గోపుచ్ఛములు, ముఖములు బాహువులు తెగి పడి ఉన్న వానరాదులు లేచెదరుగాక. 13

మూ. నీరుజో నిర్వ్రణాశ్చైవ సంపన్నబలపౌరుషాః,
సముత్థాస్యన్తి హరయః సుప్తా నిద్రాక్షయే యథా. 14

ప్ర. అ. హరయః=వానరులు, నీరుజః=రోగము లేనివారై, నిర్వ్రణాశ్చైవ=వ్రణములు లేనివారై, సంపన్నబలపౌరుషాః=సమృద్ధమైన బలపౌరుషములు గలవారై, సుప్తాః=నిద్రపోయినవారు, నిద్రాక్షయే యథా=నిద్ర అయిపోయిన తరువాత వలె, సముత్థాస్యన్తి=లేవగలరు.

తా. వానరులు ఏ రోగములూ లేనివారై, గాయములు లేనివారై అధికమైన బలపౌరుషములతో, నిద్రించినవాళ్లు నిద్రానంతరము లేచినట్లు లేచెదరు.

మూ. సుహృద్భిర్బాన్ధవైశ్చైవ జ్ఞాతిభిః స్వజనేన చ,
సర్వ ఏవ సమేష్యన్తి సంయుక్తాః పరయా ముదా. 15

ప్ర. అ. సర్వే ఏవ=అందరూ, పరయా=గొప్ప, ముదా=సంతోషముతో, సంయుక్తాః=కూడినవారై, సుహృద్భిః=మిత్రులతోను, బాన్ధవైశ్చైవ=బంధువులతోను, జ్ఞాతిభిః=జ్ఞాతులతోను, స్వజనేన=తమ కుటుంబమువారితోను, సమేష్యన్తి=కలవగలరు.

తా. అందరూ గొప్ప సంతోషముతో తమ మిత్రులతోను, బంధువులతోను, జ్ఞాతులతోను, కుటుంబమువారితోను కలసికొనవగలరు. 15

మూ. అకాలే పుష్పశబలాః ఫలవన్తశ్చ పాదపాః,
భవిష్యన్తి మహేష్వాస నద్యశ్చ సలిలాయుతాః. 16

ప్ర. అ. మహేష్వాస=గొప్ప ధనస్సు కలవాడా ! పాదపాః=వృక్షములు, అకాలే=అకాలమునందు, పుష్పశబలాః=పుష్పములతో చిత్రవర్ణము కలవిగాను, ఫలవన్తశ్చ=ఫలములు కలవిగాను, భవిష్యన్తి=కాగలవు. నద్యశ్చ=నదులు కూడ, సలిలాయుతాః=నీటితో కూడినవి కాగలవు.

తా. గొప్ప ధనస్సు ధరించిన రామా ! అకాలములో కూడ వృక్షములు పుష్పములచేత విచిత్రవర్ణము కలవిగాను, ఫలములతో నిండినవిగాను కాగలవు. నదులు జలములతో నిండి యుండును. 16

మూ. సవ్రణైః ప్రథమం గాత్రైరిదానీం నిర్వ్రణైః సమైః,
తతః సముత్థితాః సర్వే సుప్త్వేవ హరియూథపాః, 17
బభూవుర్వానరాః సర్వే కిం న్వేతదితి విస్మితాః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వే=సమస్తమైన, హరియూథపాః=వానరసేనానాయకులు, ప్రథమమ్=పూర్వము, సవ్రణైః=గాయములతో కూడిన, ఇదానీమ్=ఇప్పుడు, నిర్వ్రణైః=గాయములు లేనివై, సమైః=సమములుగా ఉన్న, గాత్రైః=శరీరములతో, సుప్త్వేవ=నిద్రించి వలె, సముత్థితాః=లేచిరి. సర్వే=సమస్తమైన, వానరాః=ఆ వానరులు, ఏతత్=ఇది, కిం ను=ఏమిటి, ఇతి=అని, విస్మితాః=అశ్చర్యము చెందినవారు, బభూవుః=అయిరి.

తా. పిమ్మట ఆ వానరప్రముఖు లందరూ పూర్వము గాయములతో నిండి ఉండి ఇప్పుడు గాయములు పోవుటచే సమముగా ఉన్న శరీరములతో నిద్రనుండి లేచినట్లు లేచిరి. ఆ వానరులందరు ఇది ఏమిటని ఆశ్చర్యము చెందిరి. 17

మూ. కాకుత్థ్సం పరిపూర్ణార్థం దృష్ట్వా సర్వే సురోత్తమాః, 18
అబ్రువన్ పరమప్రీతాః స్తుత్వా రామం సలక్ష్మణమ్.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, సురోత్తమాః=దేవతాశ్రేష్ఠులు, పరిపూర్ణార్థమ్=పరిపూర్ణమైన ప్రయోజనము గల, కాకుత్థ్సమ్=రాముణ్ణి, దృష్ట్వా=చూచి, పరమప్రీతాః=చాల సంతోషించినవారై, సలక్ష్మణమ్=లక్ష్మణసహితుడైన, రామమ్=రాముణ్ణి, స్తుత్వా=స్తుతించి, అబ్రువన్=పలికిరి.

తా. ఆ దేవతాప్రముఖు లందరు కార్యమునందు సఫలుడైన రాముణ్ణి చూచి, చాల సంతోషించి, లక్ష్మణసహితుడైన ఆ రాముణ్ణి స్తుతించి ఇట్లు పలికిరి. 18

మూ. గచ్ఛాయోధ్యామితో రాజన్ విసర్జయ చ వానరాన్, 19
మైథిలీం సాన్త్వయస్వైనామనురక్తాం యశస్వినీమ్.

ప్ర. అ. రాజన్=రాజా ! ఇతః=ఇక్కడినుండి, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, గచ్ఛ=వెళ్లుము. వానరాన్=వానరులను, విసర్జయ చ=విడువుము. అనురక్తామ్=నీయందు అనురాగము గల, యశస్వినీమ్=కీర్తిమంతురాలైన, ఏనామ్=ఈ, మైథిలీమ్=సీతను, సాన్త్వయస్వ=ఓదార్చుము.

తా. రాజా ! ఇక్కడినుండి అయోధ్యకు వెళ్లుము. వానరులను వారి స్థానములకు పంపివేయుము. నీయందు అనురాగము గల కీర్తిమంతురాలైన ఈ సీతను ఓదార్చుము. 19

మూ. భ్రాతరం భరతం పశ్య త్వచ్ఛోకాద్వ్రతచారిణమ్, 20
శత్రుఘ్నం చ మహాత్మానం మాతౄః సర్వాః పరంతప,
అభిషేచయ చాత్మానం పౌరాన్గత్వా ప్రహర్షయ. 21

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడా ! త్వచ్ఛోకాత్=నిన్ను గూర్చిన శోకమువలన, వ్రతచారిణమ్=వ్రతమును ఆచరించుచున్న, భ్రాతరమ్=సోదరుడైన, భరతమ్=భరతుణ్ణి, మహాత్మానమ్=మహాత్ముడైన, శత్రుఘ్నుం చ=శత్రుఘ్నుణ్ణీ, సర్వాః=సమస్తమైన, మాతౄః=తల్లులను, పశ్య=చూచుము. ఆత్మానమ్=తనను, అభిషేచయ=అభిషిక్తుని చేయించుకొనుము. గత్వా=వెళ్లి, పౌరాన్=పౌరులను, ప్రహర్షయ=సంతోషింపచేయుము.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! నిన్ను గూర్చిన శోకములో వ్రతమును (నియమములు) ఆచరించుచున్న నీ సోదరుడైన భరతుణ్ణీ, మహాత్ముడైన శత్రుఘ్నుణ్ణీ, అందరు తల్లులనూ చూడుము. వెళ్లి పట్టాభిషిక్తుడవై పౌరులకు ఆనందము కలిగించుము. 20, 21

మూ. ఏవముక్త్వా సహస్రాక్షో రామం సౌమిత్రిణా సహ,
విమానైః సూర్యసంకాశైర్యయౌ హృష్టః సురైః సహ. 22

ప్ర. అ. సహస్రాక్షః=దేవేంద్రుడు, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో కూడిన, రామమ్=రాముణ్ణి గూర్చి, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, హృష్టః=సంతోషించినవాడై, సురైః సహ=దేవతలతో కూడ, సూర్యసంకాశైః=సూర్యునితో సమానములైన, విమానైః=విమానములతో, యయౌ=వెళ్లెను.

తా. దేవేంద్రుడు లక్ష్మణసహితుడైన రామునితో ఇట్లు పలికి, సంతోషించుచు, ఇతరదేవత లందరితో కూడ సూర్యునివంటి విమానములపై వెళ్లెను. 22

మూ. అభివాద్య చ కాకుత్స్థః సర్వాంస్తాంస్త్రిదశోత్తమాన్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వాసమాజ్ఞాపయత్తదా. 23

ప్ర. అ. తదా=అప్పుడు, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడిన, కాకుత్స్థః=రాముడు, తాన్=ఆ, సర్వాన్=సమస్తమైన, త్రిదశోత్తమాన్=దేవతాప్రముఖులను, అభివాద్య=నమస్కరించి, వాసమ్=నివాసమును, ఆజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను.

తా. అప్పుడు లక్ష్మణసమేతుడైన రాముడు ఆ దేవత లందరికీ నమస్కరించి వానరు లందరినీ తమ స్థానములందు విశ్రమించుటకై ఆజ్ఞాపించెను.

మూ. తతస్తు సా లక్ష్మణరామపాలితా
మహాచమూర్హృష్టజనా యశస్వినీ,

శ్రియా జ్వలన్తీవిరరాజ సర్వతో
నిశా ప్రణీతేవ హి శీతరశ్మినా. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే వింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, లక్ష్మణరామపాలితా=రామలక్ష్మణులచేత పాలింపబడిన, హృష్టజనా=సంతోషించిన జనులు గల, యశస్వినీ=కీర్తి గల, సా=ఆ, మహాచమూః=గొప్ప సేన, శ్రియా=శోభతో, జ్వలన్తీ=ప్రజ్వలించుచున్నదై, శీతరశ్మినా=చంద్రునిచేత, ప్రణీతా=ప్రకాశింపచేయబడిన, నిశేవ=రాత్రి వలె, సర్వతః=అన్ని వైపులా, విరరాజ=ప్రకాశించెను.

తా. అప్పుడు రామలక్ష్మణులచే రక్షింపబడుచున్న, సంతోషించిన జనులు గల, కీర్తి గల, ఆ మహాసేన శోభతో ప్రజ్వలించుచున్నదా అన్నట్లు చంద్రునిచే ప్రకాశింపచేయబడిన రాత్రివలె అంతటా ప్రకాశించెను. 24

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరవైయవ సర్గ సమాప్తము.

# అథ ఏకవింశత్యధికశతతమః సర్గః

[రాముడు అయోధ్యకు వెళ్లుటకు ఉద్యుక్తు డగుట. రాముని ఆజ్ఞచేత విభీషణుడు పుష్పకమును తీసికొనివచ్చుట.]

మూ. తాం రాత్రిముషితం రామం సుఖోదితమరిందమమ్,
అబ్రవీత్ ప్రాఞ్జలిర్వాక్యం జయం పృష్ట్వా విభీషణః. 1

ప్ర. అ. తామ్=ఆ, రాత్రిమ్=రాత్రిని, ఉషితమ్=ఉన్న, సుఖోదితమ్=సుఖముగా మేల్కొనిన, అరిందమమ్=శత్రుసంహారకుడైన, రామమ్=రాముణ్ణి, విభీషణః=విభీషణుడు, జయమ్=జయమును, పృష్ట్వా=అడిగి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ రాత్రి అక్కడ శయనించి సుఖముగా మేల్కొనిన శత్రు సంహారకుడైన రాముని వద్దకు వెళ్లి విభీషణుడు జయశబ్దము పలుకుచు, దోసిలి కట్టి నమస్కరించి ఇట్లు పలికెను. 1

మూ. స్నానాని చాఙ్గరాగాణి వస్త్రాణ్యాభరణాని చ,
చన్దనాని చ మాల్యాని దివ్యాని వివిధాని చ. 2
అలంకారవిదశ్చైతా నార్యః పద్మనిభేక్షణాః,
ఉపస్థితాస్త్వాం విధివత్ స్నాపయిష్యన్తి రాఘవ. 3

ప్ర. అ. రాఘవ=రామా ! అలంకారవిదః=అలంకరించుటయందు నేర్పు గల, పద్మనిభేక్షణాః=పద్మములతో సమానములైన నేత్రములు గల, ఏతాః=ఈ, నార్యః=స్త్రీలు, స్నానాని=స్నానపు సాధనములైన, అఙ్గరాగాణి=శరీరమునకు పూసుకొను సుగంధ ద్రవ్యములను, వస్త్రాణి=వస్త్రములను, ఆభరణాని చ=ఆభరణములను, చన్దనాని చ=చందనములను, దివ్యాని=దివ్యములైన, వివిధాని=అనేక విధములైన, మాల్యాని చ=పుష్పమాలలను, గ్రహించి, ఉపస్థితాః=వచ్చినారు. త్వామ్=నిన్ను, విధివత్=యథా శాస్త్రముగా, స్నాపయిష్యన్తి=స్నానము చేయించెదరు.

తా. రామా ! అలంకరించుటలో నేర్పు గల, పద్మముల వంటి నేత్రములు గల ఈ స్త్రీలు స్నానసాధనములైన అంగరాగములను, వస్త్రములను, ఆభరణములను, చందనములను, దివ్యములైన అనేకవిధములైన మాలికలను తీసికొని వచ్చి ఉన్నారు. వీళ్ళు యథోచితముగా నీకు స్నానము చేయించెదరు.

మూ. ఏవముక్తస్తు కాకుత్థ్సః ప్రత్యువాచ విభీషణమ్,
హరీన్ సుగ్రీవముఖ్యాంస్త్వం స్నానేనోపనిమన్త్రయ. 4

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, కాకుత్థ్సః=రాముడు, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. త్వమ్=నీవు, సుగ్రీవముఖ్యాన్=సుగ్రీవుడు మొదలైన, హరీన్=వానరులను, స్నానేన=స్నానముచేత, ఉపనిమన్త్రయ=ఆహ్వానించుము.

తా. ఆ మాటలు విని రాముడు విభీషణునితో ఇట్లు పలికెను. నీవు సుగ్రీవుడు మొదలైన వానరులను స్నానముకొరకై ఆహ్వానించుము. 4

మూ. స తు తామ్యతి ధర్మాత్మా మమ హేతోః సుఖోచితః,
సుకుమారో మహాబాహుర్భరతః సత్యసంశ్రయః. 5

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడు, సుఖోచితః=సుఖములకు అలవాటుపడినవాడు, సుకుమారః=సుకుమారుడు, మహాబాహుః=గొప్ప బాహువులు గలవాడు, సత్యసంశ్రయః=సత్యమునకు ఆశ్రయము అయిన, సః భరతః=ఆ భరతుడు, మమ హేతోః=నా మూలమున, తామ్యతి=శ్రమపడుచున్నాడు.

తా. ధర్మాత్ముడు, సుఖములకు అలవాటు పడినవాడు, సుకుమారుడు, మహాబాహువు, సత్యమునకు ఆశ్రయభూతుడు అయిన భరతుడు నా నిమిత్తమై శ్రమపడుచున్నాడు. 5

మూ. తం వినా కైకయీపుత్రం భరతం ధర్మచారిణమ్,
న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ. 6

ప్ర. అ. కైకయీపుత్రమ్=కైకేయీపుత్రుడైన, ధర్మచారిణమ్=ధర్మమును ఆచరించుచున్న, తం భరతం వినా=ఆ భరతుడు లేకుండగా, మే=నాకు, స్నానమ్=స్నానము, న బహుమతమ్=ఇష్టముకాదు. వస్త్రాణి=వస్త్రములు, ఆభరణాని చ=ఆభరణములు ఇష్టములు కావు.

తా. ధర్మమును ఆచరించుచున్న ఆ కైకేయీపుత్రుడైన భరతుడు లేకుండగా నాకు స్నానము గాని, వస్త్రములు గాని, అలంకారములు గాని ఇష్టములు కావు. 6

మూ. ఏతత్ పశ్య యథా క్షిప్రం ప్రతిగచ్ఛామ తాం పురీమ్,
అయోధ్యాం గచ్ఛతో హ్యేష పన్థాః పరమదుర్గమః. 7

ప్ర. అ. తాం పురీమ్=ఆ పట్టణమును గూర్చి, యథా=ఎట్లు, ప్రతిగచ్ఛామ=తిరిగి వెళ్లెదమో, ఏతత్=దీనిని, పశ్య=చూడుము. అయోధ్యామ్=అ

యోధ్యను గూర్చి, గచ్ఛతః=నడచి వెళ్ళువానికి, ఏషః పన్థాః=ఈ మార్గము, పరమదుర్గమః హి=చాల వెళ్ళుటకు కష్టమైనది కదా?

తా. అయోధ్యానగరమునకు శీఘ్రముగా వెళ్ళు ఉపాయమును చూడుము. కాలినడకతో అయోధ్యకు వెళ్లువారికి ఈ మార్గము చాల ప్రయాణమునకు కష్టమైనది కదా? 7

మూ. ఏవముక్తస్తు కాకుత్థ్సం ప్రత్యువాచ విభీషణః,
అహ్నా త్వాం ప్రాపయిష్యామి తాం పురీం పార్థివాత్మజ. 8

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, విభీషణః=విభీషణుడు, కాకుత్థ్సమ్=రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. పార్థివాత్మజ=రాజకుమారా ! త్వామ్=నిన్ను, తాం పురీమ్=ఆ పట్టణమును, అహ్నా=ఒకదినముచేత, ప్రాపయిష్యామి=పొందించెదను.

తా. విభీషణుడు రాముని మాటలు విని ఇట్లు పలికెను. రామా ! ఒక్క దినములో నిన్ను అయోధ్యానగరము చేర్చెదను. 8

మూ. పుష్పకం నామ భద్రం తే విమానం సూర్యసంనిభమ్,
మమ భ్రాతుః కుబేరస్య రావణేన బలీయసా. 9

మూ. హృతం నిర్జిత్య సంగ్రామే కామగం దివ్యముత్తమమ్,
త్వదర్థం పాలితం చేదం తిష్ఠత్యతులవిక్రమ. 10

ప్ర. అ. అతులవిక్రమ=సాటి లేని పరాక్రమము గలవాడా, సూర్యసంనిభమ్=సూర్యునితో సమానము, కామగమ్=ఇష్టము ప్రకారము వెళ్లునది, దివ్యమ్=దివ్యము, ఉత్తమమ్=ఉత్తమము అయిన, పుష్పకం నామ=పుష్పకమను, మమ=నా యొక్క, భ్రాతుః=సోదరుడైన, కుబేరస్య=కుబేరుని యొక్క, విమానమ్=విమానము,బలీయసా=అధిక బలవంతుడైన, రావణేన=రావణుని చేత, సంగ్రామే=యుద్ధమునందు,యుద్ధములో ంచి, హృతమ్=హరించబడినది. తే=నీకు, భద్రమ్=మంగళ మగుగాక. ఇదమ్=ఇది, త్వదర్థమ్=నీకొరకై, పాలితమ్=పాలించబడినదై, తిష్ఠతి=ఉన్నది.

తా. సాటిలేని పరాక్రమము గల రామా ! సూర్యునితో సమానము, ఇచ్ఛను అనుసరించి ప్రయాణము చేయునది, ఉత్తమము అయిన పుష్పక మను, నా సోదరుడైన కుబేరుని దివ్యమైన విమానము నధికబలవంతుడైన రావణుడు యుద్ధములో జయించిహరించినాడు. దానిని నీకొరకై రక్షించి ఉంచినాను. నీకు భద్ర మగుగాక. 9, 10.

మూ. తదిదం మేఘసంకాశం విమానమిహ తిష్ఠతి,
యేన యాస్యసి యానేన త్వమయోధ్యాం గతజ్వరః. 11

ప్ర. అ. మేఘసంకాశమ్=మేఘముతో సమానమైన, తత్=ఆ, ఇదమ్=ఈ, విమానమ్=విమానము, ఇహ=ఇక్కడ, తిష్ఠతి=ఉన్నది. యేన యానేన=ఏ విమానముచేత, త్వమ్=నీవు, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, విగతజ్వరః=పోయిన బాధ కలవాడవై, యాస్యసి=వెళ్లగలవో.

తా. అట్టి ఈ మేఘమువంటి విమానము ఇక్కడ ఉన్నది. నీవు ఎట్టి దిగులు లేక ఈ విమానముపై అయోధ్యకు వెళ్లవచ్చును. 11

మూ. అహం తే యద్యనుగ్రాహ్యో యది స్మరసి మే గుణాన్,
వస తావదిహ ప్రాజ్ఞ యద్యస్తి మయి సౌహృదమ్. 12

ప్ర. అ. ప్రాజ్ఞ=బుద్ధిమంతుడా ! తే=నీకు, అహమ్=నేను, అనుగ్రాహ్యః యది=అనుగ్రహింపదగినవాడ నైనచో, మే=నాయొక్క, గుణాన్=గుణములను, స్మరసి యది=స్మరించుచున్నట్లయితే, మయి=నాయందు, సౌహృదమ్=ప్రేమ, అస్తి యది=ఉన్నట్లయితే, ఇహ=ఇక్కడ, వస తావత్=నివసించుము.

తా. ప్రజ్ఞాశాలివైన రామా ! నీకు నామీద అనుగ్రహమున్నచో, నా గుణములను నీవు స్మరించుచున్నచో, నాయందు స్నేహభావ మున్నచో ఇక్కడ ఉండుము. 12

మూ. లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా భార్యయా సహ,
అర్చితః సర్వకామైస్త్వం తతో రామ గమిష్యసి. 13

ప్ర. అ. రామ=రాముడా ! భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, భార్యయా=భార్యయైన, వైదేహ్యా సహ=సీతతో కూడ, త్వమ్=నీవు, సర్వకామైః =సమస్తకామములచే, అర్చితః=పూజింపబడినవాడవై, తతః=అటు పిమ్మట, గమిష్యసి=వెళ్ళగలవు.

తా. రామా ! సోదరుడైన లక్ష్మణునితోను, భార్యయైన సీతతోను కలిసిన నీవు నాచేత అన్ని భోగ్యవస్తువులు సమర్పించి పూజింపబడినవాడవై అటుపిమ్మట వెళ్లవచ్చును. 13

మూ. ప్రీతియుక్తస్య విహితాం ససైన్యః ససుహృద్గణః,
సత్క్రియాం రామ మే తావద్గృహాణ త్వం మయోద్యతామ్.

ప్ర. అ. రామ=రామా ! ససైన్యః=సైన్యముతోకూడిన, ససుహృద్గణః=మిత్రుల గణముతో కూడిన, త్వమ్=నీవు, మయా=నాచేత, ఉద్యతామ్=ఏర్పరుపబడిన,

విహితామ్=యథాశాస్త్రముగా చేయబడిన, ప్రీతియుక్తస్య=సంతోషముతో కూడిన, మే=నాయొక్క, సత్క్రియామ్=సత్కారమును, గృహాణ తావత్=గ్రహించుము.

తా. రామా ! సైన్యముతోను, మిత్రగణముతోను కూడిన నీవు నేను ఏర్పరచిన, యథాశాస్త్రముగా సమర్పింపబడిన, సంతోషముతో కూడిన నా ఈ సత్కారమును స్వీకరింపుము. 14

మూ. ప్రణయాద్బహుమానాచ్చ సౌహార్దేన చ రాఘవ,
ప్రసాదయామి ప్రేష్యోఽహం న ఖల్వాజ్ఞాపయామి తే. 15

ప్ర. అ. రాఘవ=రామా ! ప్రణయాత్=ప్రేమవలన, బహుమానాచ్చ=గౌరవభావమువలన, సౌహార్దేన చ= స్నేహముచేత, ప్రసాదయామి=బ్రతిమాలుచున్నాను. అహమ్=నేను, ప్రేష్యః=కింకరుడను. తే=నీకు, నాజ్ఞాపయామి ఖలు=ఆజ్ఞాపించుట లేదు.

తా. రామా ! ప్రేమవలన, గౌరవమువలన, స్నేహమువలన నిన్ను బ్రతిమాలుచున్నాను. నేను నీ భృత్యుడను. నీకు ఆజ్ఞాపించుటలేదు. 15

మూ. ఏవముక్తస్తతో రామః ప్రత్యువాచ విభీషణమ్,
రక్షసాం వానరాణాం చ సర్వేషామేవ శృణ్వతామ్. 16

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రామః=రాముడు, తతః=అటుపిమ్మట, విభీషణమ్=విభీషణుణ్ణి గూర్చి, రక్షసామ్=రాక్షసులు, వానరాణాం చ=వానరులు, సర్వేషామ్=అందరూ, శృణ్వతామ్=వింటూండగా, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. రాముడు ఆ మాటలు విని, రాక్షసులు వానరులు అందరూ వినుచుండగా విభీషణునితో ఇట్లు పలికెను. 16

మూ. పూజితోఽస్మి త్వయా వీర సాచివ్యేన పరంతప,
సర్వాత్మనా చ చేష్టాభిః సౌహార్దేన పరేణ చ. 17

ప్ర. అ. పరంతప=శత్రుసంహారకుడవైన, వీర=వీరుడా ! సాచివ్యేన=సాహాయ్యముచేతను, చేష్టాభిః=పనులచేతను, పరేణ=అధికమైన, సౌహార్దేన చ=స్నేహముచేతను, సర్వాత్మనా=అన్ని విధాలచేత, త్వయా=నీచేత, పూజితః అస్మి=పూజింపబడితిని.

తా. శత్రుసంహారకుడవైన ఓ ! వీరుడా ! ఆలోచనలలో సాహాయ్యము చేయుటచేత, పనులచేత, అత్యధికమైన స్నేహముచేత నీవు అన్ని విధాలా నన్ను పూజించితివి. 17

మూ. న ఖల్వేతన్న కుర్యాం తే వచనం రాక్షసేశ్వర,
తం తు మే భ్రాతరం ద్రష్టుం భరతం త్వరతే మనః. 18

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! తే=నీయొక్క, ఏతత్=ఈ, వచనమ్=వచనమును, న కుర్యామితి న ఖలు=చేయ నను మాట లేదు. తు=కాని, భ్రాతరమ్=సోదరుడైన, తమ్=ఆ, భరతమ్=భరతుణ్ణి, ద్రష్టుమ్=చూచుటకు, మనః=మనస్సు, త్వరతే=తొందరపడుచున్నది.

తా. రాక్షసరాజా ! నీవు చెప్పినట్లుగా నేను చేయకపోవుట అనేది లేదు; కాని నా మనస్సు సోదరుడైన ఆ భరతుని చూడవలె నని తొందరపడుచున్నది. 18

మూ. మాం నివర్తయితుం యోఽసౌ చిత్రకూటముపాగతః,
శిరసా యాచతో యస్య వచనం న కృతం మయా. 19
కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీం చ యశస్వినీమ్,
గుహం చ సుహృదం చైవ పౌరాన్ జనపదైః సహ. 20

ప్ర. అ. యః అసౌ=ఏ ఈ భరతుడు, మామ్=నన్ను, నివర్తయితుమ్=మరల్చుటకు, చిత్రకూటమ్=చిత్రకూటపర్వతమును గూర్చి, ఉపాగతః=వచ్చినాడో, శిరసా=శిరస్సుచేత, యాచతః=యాచించుచున్న, యస్య=ఎవనియొక్క, వచనమ్=వచనము, మయా=నాచేత, న కృతమ్=చేయబడలేదో (అట్టి భరతుణ్ణి), కౌసల్యాం చ=కౌసల్యను, సుమిత్రాం చ=సుమిత్రను, యశస్వినీమ్=కీర్తి గల, కైకేయీం చ=కైకేయిని, సుహృదమ్=మిత్రుడైన, గుహం చ=గుహుణ్ణి, జానపదైః సహ=గ్రామవాసులతో కూడిన, పౌరాన్=పౌరులను, (చూడవలె నని మనస్సు తొందరపడుచున్నది.)

తా. ఏ భరతుడు నన్ను వెనుకకు తీసికొని వెళ్లుటకై చిత్రకూటమునకు వచ్చినాడో, తల వంచి నమస్కరించుచు నన్ను ప్రార్థించిన ఏ భరతుని మాట ప్రకారము నేను చేయలేదో, అట్టి భరతుణ్ణి, కౌసల్యను, సుమిత్రను, కీర్తి గల కైకేయిని, మిత్రుడైన గుహుణ్ణి, పౌరులను, జానపదులను చూచుటకై నా మనస్సు తొందరపడుచున్నది. 19, 20

మూ. అనుజానీహి మాం సౌమ్య పూజితోఽస్మి విభీషణ,
మన్యుర్న ఖలు కర్తవ్యః సఖే త్వాం చానుమానయే. 21

ప్ర. అ. సౌమ్య=ఓ సౌమ్యుడా ! విభీషణ=విభీషణా ! మామ్=నన్ను, అనుజానీహి=అనుమతించుము. పూజితః అస్మి=పూజించబడితిని. సఖే=మిత్రుడా, మన్యుః=కోపము, న కర్తవ్యః ఖలు=చేయదగినది కాదు. త్వామ్=నిన్ను,

అనుమానయే చ=బ్రతిమాలుకొనుచున్నాను.

తా. సౌమ్యుడా ! విభీషణా ! నాకు అనుజ్ఞ ఇమ్ము. నీవు నన్ను పూజించినట్లే. మిత్రుడా ! కోపింపకుము, నిన్ను బ్రతిమాలుకొనుచున్నాను. 21

మూ. ఉపస్థాపయ మే శీఘ్రం విమానం రాక్షసేశ్వర,
కృతకార్యస్య మే వాసః కథం స్యాదిహ సంమతః. 22

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! శీఘ్రమ్=శీఘ్రముగా, మే=నాకు, విమానమ్=విమానమును, ఉపస్థాపయ=తెప్పించుము. కృతకార్యస్య=చేయబడిన కార్యము గల, మే=నాకు, ఇహ=ఇక్కడ, వాసః=నివాసము, కథమ్=ఎట్లు, సంమతః=యుక్తము, స్యాత్=అగును?

తా. విభీషణా ! వెంటనే విమానమును తెప్పించుము. పని పూర్తి అయిన తరువాత నేను ఇక్కడ ఉండుట యుక్తము కాదు కదా ? 22

మూ. ఏవముక్తస్తు రామేణ రాక్షసేన్ద్రో విభీషణః,
విమానం సూర్యసంకాశమాజుహావ త్వరాన్వితః. 23
తతః కాఞ్చనచిత్రాఙ్గం వైదూర్యమణివేదికమ్,
కూటాగారైః పరిక్షిప్తం సర్వతో రజతప్రభమ్, 24
పాణ్డురాభిః పతాకాభిర్ధ్వజైశ్చ సమలంకృతమ్,
కాఞ్చనం కాఞ్చనైర్హర్మ్యైర్హేమపద్మవిభూషితైః. 25
ప్రకీర్ణం కిఙ్కిణీజాలైర్ముక్తామణిగవాక్షకమ్,
ఘణ్టాజాలైః పరిక్షిప్తం సర్వతో మధురస్వనమ్. 26
తం మేరుశిఖరాకారం నిర్మితం విశ్వకర్మణా,
బృహద్భిర్భూషితం హర్మ్యైర్ముక్తారజతశోభితైః. 27
తలైః స్ఫటికచిత్రాఙ్గైర్వైదూర్యైశ్చ వరాసనైః,
మహార్హాస్తరణోపేతైరుపపన్నం మహాధనైః. 28

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రాక్షసేన్ద్రః=రాక్షసరాజైన, విభీషణః=విభీషణుడు, త్వరాన్వితః=తొందరతో కూడినవాడై, తతః=అటుపిమ్మట, కాఞ్చనచిత్రాఙ్గమ్=బంగారముచేత చిత్రవర్ణములైన అవయవములు గలది, వైదూర్యమణివేదికమ్=వైదూర్యమాణిక్యముల వికారమైన వేదికలు కలది, కూటాగారైః=మండపములతో, పరిక్షిప్తమ్=వ్యాప్తము, సర్వతః=అంతటా, రజతప్రభమ్=వెండి కాతి గలది, పాణ్డురాభిః=తెల్లనైన, పతాకాభిః=పతాకలచేతను, ధ్వజైశ్చ=ధ్వజములచేతను, సమలంకృతమ్=అలంకరింపబడినది, కాఞ్చనమ్=బంగా

రము వికారము, హేమపద్మవిభూషితైః=బంగారు పద్మములచేత అలంకరించబడిన, కాఞ్చనైః=బంగారము వికారములైన, హర్మ్యైః=మేడలచేత, అలంకరించబడినది, కిఙ్కిణీజాలైః=చిరుగంటల సముదాయములతో, ప్రకీర్ణమ్=వ్యాప్తము, ముక్తామణిగవాక్షకమ్=ముత్యముల మణుల వికారములైన కిటికీలు గలది, ఘణ్టాజాలైః=ఘంటల సముదాయములచేత, పరిక్షిప్తమ్=వ్యాప్తము, సర్వతః=అన్ని వైపులా, మధురస్వనమ్=మధురమైన ధ్వని గలది, మేరు శిఖరాకారమ్=మేరు పర్వతశిఖరమువంటి ఆకారము గలది, విశ్వకర్మణా=విశ్వకర్మచేత,నిర్మితమ్=నిర్మించబడినది, ముక్తారజత శోభితైః=ముత్యములచేతను, వెండిచేతను శోభింపచేయబడిన, బృహద్భిః=పెద్దవైన, హర్మ్యైః=మేడలచేత, శోభితమ్=ప్రకాశింపచేయబడినది, స్ఫటికచిత్రాఙ్గైః=స్ఫటికమాటిక్యములతో విచిత్రములైన భాగములు గల, తలైః=క్రిది ప్రదేశములతోనూ, వైడూర్యైః=వైడూర్యమాణిక్యవికారములైన, మహార్ధనైః=గొప్ప వెల గల, మహార్హాస్తరణోపేతైః=గొప్ప విలువ గల అస్తరణములతో కూడిన, వరాసనైః=శ్రేష్ఠములైన ఆసనములతో, ఉపేతమ్=కూడినది అయిన, తమ్=ఆ, విమానమ్=విమానమును, ఆజుహావ=పిలచెను.

తా. రాముని మాటలు విని రాక్షసేంద్రుడైన విభీషణుడు తొందరపడుచు సూర్యునితో సమానమైన ఆ విమానమును పిలచెను. దాని భాగములు బంగారముచేత విచిత్రములుగా ఉండెను. అంతటా వెండి కాంతితో కూడిన ఆ విమానమునందు చుట్టు ప్రక్కల వైడూర్యమాణిక్యవికారములైన అరుగులు, మండపములు, తెల్లని పతాకలచేత, ధ్వజములచేత అలంకరింపబడెను. ఆ బంగారు విమానములో బంగారు పద్మాలచేత అలంకరించబడిన బంగారు మేడలు ఉండెను. ముత్యముల, మణుల కిటికీలు గల ఆ విమానము చుట్టూ చిరుగంటలు, గంటలూ కట్టి ఉండుటచే మధురముగా ధ్వని చేయుచుండెను. విశ్వకర్మ నిర్మించిన ఆ విమానము మేరుపర్వతశిఖరము వలె ఉండెను. ముత్యములతోను, వెండితోను ప్రకాశించుచున్న పెద్ద మేడలతో అది అలంకృతమై ఉండెను. దాని క్రింది ప్రదేశమునందలి భాగములు స్ఫటికమాణిక్యములతో విచిత్రములుగా ఉండెను. దానియందు అంతటా మంచి విలువ గల ఆస్తరణములు కప్పిన, అమూల్యములైన, వైడూర్యమణివికారములైన శ్రేష్ఠములైన ఆసనములు అమర్చబడి ఉండెను. 23 - 28

మూ. ఉపస్థితమనాధృష్యం తద్విమానం మనోజవమ్,
నివేదయిత్వా రామాయ తస్థౌ తత్ర విభీషణః. 29

ప్ర. అ. అనాధృష్యమ్=ఎదిరింప శక్యము కానిది, మనోజవమ్=మనోవేగము గలదీ అయిన, తత్=ఆ, విమానమ్=విమానమును, ఉపస్థితమ్=వచ్చినదానినిగా, రామాయ=రామునకు, నివేదయిత్వా=తెలిపి, విభీషణః=విభీషణుడు, తత్ర=అక్కడ,

తస్థౌ=నిలచెను.

తా. మనోవేగము వంటి వేగము గల, ఎదిరింప శక్యము కాని ఆ విమానము వచ్చినట్లు రామునకు తెలిపి విభీషణుడు అక్కడ నిలచెను. 29

మూ. తత్పుష్పకం కామగమం విమాన
ముపస్థితం భూధరసంనికాశమ్,
దృష్ట్వా తదా విస్మయమాజగామ
రామః ససౌమిత్రిరుదారసత్త్వః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఏకవింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. తదా=అప్పుడు, ససౌమిత్రిః=లక్ష్మణునితోకూడిన, ఉదార సత్త్వః=అధికమైన బలము గల, రామః=రాముడు, ఉపస్థితమ్=వచ్చిన, కామగ మమ్=ఇచ్ఛానుసారముగా ప్రయాణము చేయు, భూధరసంనికాశమ్=పర్వతముతో సమానమైన, తత్=ఆ, పుష్పకమ్=పుష్పక మను, విమానమ్=విమానమును, దృష్ట్వా=చూచి, విస్మయమ్=ఆశ్చర్యమును, ఆజగామ=పొందెను.

తా. గొప్ప బలము గల లక్ష్మణసమేతుడైన రాముడు అక్కడకు వచ్చిన, ఇచ్ఛానుసారము ప్రయాణము చేయు, పర్వతము వలె ఉన్న ఆ పుష్పకవిమానమును చూచి ఆశ్చర్యము చెందెను. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరువదియొకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వావింశత్యధిక శతతమః సర్గః

[రాముని ఆజ్ఞచేత విభీషణుడు వానరులను బాగుగా సత్కరించుట; రాముడు విభీషణుణ్ణి వానరులను కూడా తీసికొని పుష్పకముపై అయోధ్యకు బయలుదేరుట.]

మూ. ఉపస్థితం తు తం కృత్వా పుష్పకం పుష్పభూషితమ్,
అవిదూరే స్థితో రామమిత్యువాచ విభీషణః. 1

ప్ర. అ. విభీషణః=విభీషణుడు, పుష్పభూషితమ్=పుష్పములచేత అలంకరింపబడిన, తమ్=ఆ, పుష్పకమ్=పుష్పకమును, ఉపస్థితమ్=వచ్చినదానినిగా, కృత్వా=చేసి, అవిదూరే=సమీపమునందు, స్థితః=నిలచినవాడై, రామమ్=రాముణ్ణి గూర్చి, ఇతి=ఇట్లు, ఉవాచ=పలికెను.

తా. విభీషణుడు పుష్పములచేత అలంకరింపబడిన ఆ పుష్పకవిమానము తెప్పించి రాముని దగ్గర నిలచి ఆతనితో ఇట్లు పలికెను. 1

మూ. స తు బద్ధాఞ్జలిపుటో వినీతో రాక్షసేశ్వరః,
అబ్రవీత్త్వరయోపేతః కిం కరోమీతి రాఘవమ్. 2

ప్ర. అ. సః రాక్షసేశ్వరః=ఆ విభీషణుడు, వినీతః=వినయసంపన్నుడై, బద్ధాఞ్జలిపుటః=కట్టబడిన దోసిలి కలవాడై, త్వరయా=తొందరతో, ఉపేతః= కూడినవాడై, కిమ్=ఏమి, కరోమి=చేయుదును, ఇతి=అని, రాఘవమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. ఆ విభీషణుడు చేతులు జోడించి, వినీతుడై, తొందరపడుచు రామునితో "ఇంకా ఏమి చేయుదును?" అని పలికెను. 2

మూ. తమబ్రవీన్మహాతేజా లక్ష్మణస్యోపశృణ్వతః,
విమృశ్య రాఘవో వాచమిదం స్నేహపురస్కృతమ్. 3

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాఘవః=రాముడు, విమృశ్య=విమర్శించి, లక్ష్మణస్య=లక్ష్మణుడు, ఉపశృణ్వతః=వినుచుండగా, తమ్=ఆతనిని గూర్చి, స్నేహపురస్కృతమ్=స్నేహపూర్వకమైన, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు విమర్శించి, లక్ష్మణుడు వినుచుండగా,

ఆ విభీషణునితో స్నేహపూర్వకముగా ఇట్లు పలికెను. 3

మూ. కృతప్రయత్నకర్మాణః సర్వ ఏవ వనేచరాః,
రత్నైరర్థైశ్చ వివిధైః సంపూజ్యన్తాం విభీషణ. 4

ప్ర. అ. విభీషణ=విభీషణుడా ! కృతప్రయత్నకర్మాణః=చేయబడిన ప్రయత్నము కర్మా గల, సర్వే=సమస్తమైన, వనేచరాః=వానరులు, రత్నైః=రత్నములచేతను, వివిధైః=అనేక విధములైన, అర్థైశ్చ=ధనములచేతను, సంపూజ్యన్తామ్=పూజింపబడుదురుగాక.

తా. విభీషణా ! గొప్ప ప్రయత్నము పనులు చేసిన ఈ వానరులందరికీ రత్నములూ, అనేకవిధములైన ధనములూ ఇచ్చి సత్కరించుము. 4

మూ. సహామీభిస్త్వయా లఙ్కా నిర్జితా రాక్షసేశ్వర,
హృష్టైః ప్రాణభయం త్యక్త్వా సంగ్రామేష్వనివర్తిభిః. 5

ప్ర. అ. రాక్షసేశ్వర=రాక్షసరాజా ! హృష్టైః=సంతోషించినవారు, ప్రాణభయమ్=ప్రాణభయమును, త్యక్త్వా=విడచి, సంగ్రామేషు=యుద్ధములందు, అనివర్తిభిః=వెనుకకు మరలనివారూ అయిన, అమీభిః సహ=వీళ్ళతో కలిసి, త్వయా=నీచేత, లఙ్కా=లంక, నిర్జితా=జయింపబడినది.

తా. విభీషణా ! ఉత్సాహవంతులు, యుద్ధములలో ప్రాణభయము విడచినవారు వెనుకకు మరలనివారు అయిన ఈ వానరులతో కలిసి నీవు లంకను జయించినావు. 5

మూ. త ఇమే కృతకర్మాణః సర్వ ఏవ వనౌకసః,
ధనరత్నప్రదానేన కర్మైషాం సఫలం కురు. 6

ప్ర. అ. తే=అట్టి, ఇమే=ఈ, వనౌకసః=వానరులు, సర్వే ఏవ=అందరూ, కృతకర్మాణః=చేయబడిన కర్మ గలవారు. ధనరత్నప్రదానేన=ధనముయొక్క రత్నములయొక్క దానముచేత, ఏషామ్=వీరియొక్క, కర్మ=కర్మను, సఫలమ్=సఫలమైనదానినిగా, కురు=చేయుము.

తా. ఈ వానరు లందరూ పని చేసినవారే. వీరికి ధనములను, శ్రేష్ఠవస్తువులను ఇచ్చి వీరు చేసిన కర్మను సఫలము చేయుము. 6

మూ. ఏవం సంమానితాశ్చైతే నన్ద్యమానా యథా త్వయా,
భవిష్యన్తి కృతజ్ఞేన నిర్వృతా హరియూథపాః. 7

ప్ర. అ. యథా=ఎట్లు, నన్ద్యమానాః=సంతోషపెట్టబడుదురో, ఏవమ్=ఈ

విధముగా, కృతజ్ఞేన=కృతజ్ఞుడవైన, త్వయా=నీచేత, సంమానితాః=గౌరవించబడిన, ఏతే=ఈ, హరియూథపాః=వానర సేనాధిపతులు, నిర్వృతాః=సంతోషించినవారు, భవిష్యన్తి=కాగలరు.

తా. కృతజ్ఞుడవైన నీవు సంతోషము కలుగు విధముగా ఈ వానరవీరులకు సంమానము చేసినచో వీరందరూ ఆనందింతురు. 7

మూ. త్యాగినం సంగ్రహీతారం సానుక్రోశం జితేన్ద్రియమ్,
సర్వే త్వామభిగచ్ఛన్తి తతః సంబోధయామి తే. 8

ప్ర. అ. త్యాగినమ్=దానగుణము కలవాడవు, సంగ్రహీతారమ్=దగ్గరకు చేర్చువాడవు, సానుక్రోశమ్=జాలి కలవాడవు, జితేన్ద్రియమ్=జయించబడిన ఇంద్రియములు కలవాడవు అయిన, త్వామ్=నిన్ను, సర్వే=అందరూ, అభిగచ్ఛన్తి=చేరుదురు. తతః=ఆ కారణమువలన, తే=నీకు, సంబోధయామి=చెప్పుచున్నాను.

తా. నీవు త్యాగశీలుడవు, అందరిని దగ్గరకు చేర్చుకొనువాడవు (లేదా ధనము సంపాదించువాడవు), దయ కలవాడవు, జితేంద్రియుడవు అయినచో అందరూ నీ దగ్గరకు చేరుదురు. అందుచేతనే నేను ఇట్లు చెప్పుచున్నాను. 8

మూ. హీనం రతిగుణైః సర్వైరభిహన్తారమాహవే,
సేనా త్యజతి సంవిగ్నా నృపతిం తం నరేశ్వర. 9

ప్ర. అ. నరేశ్వర=రాజా ! సర్వైః=సమస్తమైన, రతిగుణైః=ప్రేమ కల్గించు గుణములతో, హీనమ్=హీనుడూ, ఆహవే=యుద్ధమునందు, హన్తారమ్=చంపువాడూ అయిన, తం నృపతిమ్=అట్టి రాజును, సేనా=సేన, త్యజతి=విడచివేయును.

తా. రాజా ! ప్రేమించదగిన గుణము లేవీ లేక యుద్ధములకు తీసికొని వెళ్లి చంపించే రాజును సైన్యము విడచివేయును. 9

మూ. ఏవముక్తస్తు రామేణ వానరాంస్తాన్విభీషణః,
రత్నార్థసంవిభాగేన సర్వానేవాభ్యపూజయత్. 10

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, విభీషణః=విభీషణుడు, సర్వానేవ=సమస్తమైన, తాన్ వానరాన్=ఆ వానరులను, రత్నార్థసంవిభాగేన=రత్నములయొక్క, ధనముయొక్క పంచుటచేత, అభ్యపూజయత్=పూజించెను.

తా. విభీషణుడు రాముని మాటలు విని ఆ వానరులందరికీ రత్నములు, ధనము ఇచ్చి పూజించెను. 10

మూ. తతస్తాన్ పూజితాన్ దృష్ట్వా రత్నారైర్హరియూథపాన్,
ఆరురోహ తదా రామస్తద్విమానమనుత్తమమ్. 11

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రత్నార్థైః=రత్నములచేత, ధనములచేత, తాన్ హరియూథపాన్=ఆ వానరసేనానాయకులను, పూజితాన్=పూజింపబడినవారినిగా, దృష్ట్వా=చూచి, రామః=రాముడు, తదా=అప్పుడు, అనుత్తమమ్=శ్రేష్ఠమైన, తత్=ఆ, విమానమ్=విమానమును, ఆరురోహ=ఎక్కెను.

తా. పిమ్మట ఆ వానరసేనాయకు లందరూ రత్నములచేత, ధనముచేత పూజింపబడి నట్లు చూచి రాముడు అప్పుడు అత్యుత్తమమైన ఆ విమానమును ఎక్కెను. 11

మూ. అఙ్కేనాదాయ వైదేహీం లజ్జమానాం యశస్వినీమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా విక్రాన్తేన ధనుష్మతా. 12

ప్ర. అ. లజ్జమానామ్=సిగ్గుపడుచున్న, యశస్వినీమ్=కీర్తి గల, వైదేహీమ్=సీతను, అఙ్కేన=అంకముచేత, ఆదాయ=గ్రహించి, విక్రాన్తేన=పరాక్రమవంతుడు, ధనుష్మతా=ధనస్సు కలవాడూ అయిన, భ్రాత్రా=సోదరుడైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ (విమానము నెక్కెను).

తా. సిగ్గుపడుచున్న కీర్తిమంతురాలైన సీతను సమీపమున కూర్చుండ బెట్టుకొని పరాక్రమవంతుడు, ధనుర్ధరుడు అయిన, సోదరుడైన లక్ష్మణునితో కూడ విమాన మెక్కెను. 12

మూ. అబ్రవీత్స విమానస్థః పూజయన్ సర్వవానరాన్,
సుగ్రీవం చ మహావీర్యం కాకుత్స్థః సవిభీషణమ్. 13

ప్ర. అ. సః కాకుత్స్థః=ఆ రాముడు, విమానస్థః=విమానమునందున్నవాడై, సర్వవానరాన్=సమస్తవానరులను, సవిభీషణమ్=విభీషణునితో కూడిన, మహావీర్యమ్=గొప్ప పరాక్రమము గల, సుగ్రీవం చ=సుగ్రీవుణ్ణి, పూజయన్=పూజించుచు, అబ్రవీత్=పలికెను.

తా. ఆ రాముడు విమానమునందు ఉండి, సకల వానరులను, మహావీర్యవంతుడైన సుగ్రీవుణ్ణి, విభీషణుణ్ణి పూజించుచు(ఆదరించుచు) ఇట్లు పలికెను. 13

మూ. మిత్రకార్యం కృతమిదం భవద్భిర్వానరర్షభాః,
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం ప్రతిగచ్ఛత. 14

ప్ర. అ. వానరర్షభాః=వానరశ్రేష్ఠులారా ! భవద్భిః=మీచేత, ఇదమ్=ఈ,

మిత్రకార్యమ్=మిత్రుని కార్యము, కృతమ్=చేయబడినది. సర్వే=మీరందరూ, మయా=నాచేత, అనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడినారు. యథేష్టమ్=మీ ఇష్టము ప్రకారము, ప్రతిగచ్ఛత=తిరిగి వెళ్లండి.

తా. వానరశ్రేష్ఠులారా ! మీరు మిత్రుని కార్యము సాధించినారు. నేను మీకందరికీ అనుజ్ఞ ఇచ్చుచున్నాను. మీ కిష్టమైన విధముగా తిరిగి వెళ్లుడు.14

మూ. యత్తు కార్యం వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ,
కృతం సుగ్రీవ తత్సర్వం భవతా ధర్మభీరుణా. 15
కిష్కిన్ధాం ప్రతియాహ్యాశు స్వసైన్యేనాభిసంవృతః.

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! స్నిగ్ధేన=స్నేహము గల, హితేన చ=హితుడైన, వయస్యేన=స్నేహితునిచేత, యత్ తు=ఏది, కార్యమ్=చేయదగినదో, తత్=అది, సర్వమ్=అంతా, ధర్మభీరుణా=ధర్మమువిషయమునందు భయము గల, భవతా=నీచేత, కృతమ్=చేయబడినది. ఆశు=శీఘ్రముగా, స్వసైన్యేన=నీ సైన్యముతో, అభిసంవృతః=కూడినవాడవై, కిష్కిన్ధామ్=కిష్కింధను గూర్చి, యాహి=వెళ్లుము.

తా. సుగ్రీవా ! స్నేహముగల, హితము కోరు స్నేహితుడు చేయవలసిన దంతా ధర్మము విషయమునందు భయము గల నీవు చేసినావు. నీ సైన్యముతో కూడి శీఘ్రముగా కిష్కింధకు వెళ్లుము. 15

మూ. స్వరాజ్యే వస లఙ్కాయాం మయా దత్తే విభీషణ, 16
న త్వాం ధర్షయితుం శక్తాః సేన్ద్రా అపి దివౌకసః.

ప్ర. అ. విభీషణ=విభీషణుడా ! లఙ్కాయామ్=లంకయందు, మయా=నాచేత, దత్తే=ఇవ్వబడిన, స్వరాజ్యే=స్వరాజ్యమునందు, వస=నివసించుము. సేన్ద్రాః=ఇంద్రునితో కూడిన, దివౌకసః అపి=దేవతలు కూడ, త్వామ్=నిన్ను, ధర్షయితుమ్=ఎదిరించుటకు, న శక్తాః=సమర్థులు కారు.

తా. విభీషణా ! నీవు లంకలో నే నిచ్చిన నీ రాజ్యములో నివసించుము. ఇంద్రునితో కూడ దేవతలు కూడ నిన్ను ఎదిరింపజాలరు. 16

మూ. అయోధ్యాం ప్రతియాస్యామి రాజధానీం పితుర్మమ, 17
అభ్యనుజ్ఞాతుమిచ్ఛామి సర్వానామన్త్రయామి వః.

ప్ర. అ. మమ పితుః=నా తండ్రియొక్క, రాజధానీమ్=రాజధానియైన, అయోధ్యాం ప్రతి=అయోధ్యను గూర్చి, యాస్యామి=వెళ్లెదను, అభ్యనుజ్ఞాతుమ్=అనుజ్ఞ ఇచ్చుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను. వః=మిమ్ములను, సర్వాన్=అందరినీ,

ఆమంత్రయామి=ఆమంత్రించుచున్నాను.

తా. నా తండ్రి రాజధానియైన అయోధ్యకు వెళ్లెదను. అనుజ్ఞను కోరుచున్నాను. మీ అందరి దగ్గరా సెలవు తీసికొనుచున్నాను. 17

మూ. ఏవముక్తాస్తు రామేణ హరీన్ద్రా హరయస్తథా, 18
ఊచుః ప్రాఞ్జలయః సర్వే రాక్షసశ్చ విభీషణః.

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలకబడిన, హరీన్ద్రాః=వానరనాయకులు, తథా=మరియు, హరయః=వానరులు, రాక్షసః=రాక్షసుడైన, విభీషణశ్చ=విభీషణుడు, సర్వే=అందరూ, ప్రాఞ్జలయః=కట్టబడిన దోసిళ్లు కలవారై, ఊచుః=పలికిరి.

తా. రాముని మాటలు విని వానరనాయకులు, వానరులు, విభీషణుడు వీరందరూ కూడా చేతులు జోడించి ఇట్లు పలికిరి. 18

మూ. అయోధ్యాం గన్తుమిచ్ఛామః సర్వాన్ నయతు నో భవాన్, 19
ముద్యుక్తా విచరిష్యామో వనాన్యుపవనాని చ.

ప్ర. అ. అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, ఇచ్ఛామః=కోరుచున్నాము. భవాన్=నీవు, సర్వాన్=సమస్తమైన, నః=మమ్ములను, నయతు=తీసికొనివెళ్లెదవు గాక. ముద్యుక్తాః=సంతోషముతో కూడిన వారమై, వనాని=వనములను, ఉపవనాని చ=ఉద్యానములను, విచరిష్యామః=సంచరించెదము.

తా. మేము కూడ అయోధ్యకు వెళ్లవలె నని కోరుచున్నాము. మమ్ముల నందరినీ కూడ తీసికొని వెళ్లుము. సంతోషముతో వనాలలోను, ఉద్యానవనాలలోను సంచరించెదము. 19

మూ. దృష్ట్వా త్వామభిషేకార్ద్రం కౌసల్యామభివాద్య చ, 20
అచిరాదాగమిష్యామః స్వగృహాన్నృపసత్తమ.

ప్ర. అ. నృపసత్తమ=రాజశ్రేష్ఠుడా ! అభిషేకార్ద్రమ్=అభిషేకముచేత తడిసిన, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, కౌసల్యామ్=కౌసల్యను, అభివాద్య చ=నమస్కరించి, అచిరాత్=శీఘ్రముగా, స్వగృహాన్=మా గృహములను గూర్చి, ఆగమిష్యామః=వచ్చెదము.

తా. రాజశ్రేష్ఠుడా ! పట్టాభిషిక్తుడ వైన నిన్ను చూచి, కౌసల్యకు నమస్కరించి, శీఘ్రముగా ఇంటికి వెళ్లిపోయెదము. 20

మూ. ఏవముక్తః స ధర్మాత్మా వానరైః సవిభీషణైః, 21
అబ్రవీద్వానరాన్రామః ససుగ్రీవవిభీషణాన్.

ప్ర. అ. సవిభీషణైః=విభీషణునితో కూడిన, వానరైః=వానరులచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సః రామః=ఆ రాముడు, ససుగ్రీవవిభీషణాన్=సుగ్రీవవిభీషణులతో కూడిన, వానరాన్=వానరులను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. వానరులు, విభీషణుడు ఇట్లు పలుకగా ధర్మాత్ముడైన రాముడు సుగ్రీవవిభీషణులతోను, వానరులతోను ఇట్లు పలికెను. 21

మూ. ప్రియాత్ప్రియతరం లబ్ధం యదహం ససుహృజ్జనః, 22
సర్వైర్భవద్భిః సహితః ప్రీతిం లప్స్యే పురీం గతః.

ప్ర. అ. అహమ్=నేను, ససుహృజ్జనః=మిత్రజనముతో కూడినవాడనై, సర్వైః=సమస్తమైన, భవద్భిః=మీతో, సహితః=కూడినవాడనై, పురీమ్=పట్టణమును గూర్చి, గతః=వెళ్లినవాడనై, ప్రీతిమ్=సంతోషమును, యత్=ఎందువలన, లప్స్యే=పొందగలనో, అందువలన, ప్రియాత్=ఒక ప్రియమునుండి, ప్రియతరమ్=ఇంకను ప్రియమైన మరొకటి, లబ్ధమ్=పొందబడినది.

తా. నేను మీ అందరితో కలిసి, మిత్రసహితుడనై అయోధ్య చేరి సంతోషము పొందుట అనునది ఒక ప్రియముకంటె ఇంకను ప్రియమైనది లభించినట్లే. 22

మూ. క్షిప్రమారోహ సుగ్రీవ విమానం వానరైః సహ, 23
త్వమప్యారోహ సామాత్యో రాక్షసేన్ద్ర విభీషణ.

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! వానరైః సహ=వానరులతో కూడ, క్షిప్రమ్=శీఘ్రముగా, విమానమ్=విమానమును, ఆరోహ=ఎక్కుము. రాక్షసేన్ద్ర=రాక్షసరాజైన, విభీషణ=విభీషణా ! సామాత్యః=అమాత్యులతో కూడినవాడవై, త్వమపి=నీవు కూడ, ఆరోహ=ఎక్కుము.

తా. సుగ్రీవుడా ! వానరులతో కూడ శీఘ్రముగా విమానమును ఎక్కుము. రాక్షసరాజా ! విభీషణా ! నీవు కూడ నీ అమాత్యులతో కలిసి ఎక్కుము. 23

మూ. తతః స పుష్పకం దివ్యం సుగ్రీవః సహ వానరైః, 24
ఆరురోహ ముదా యుక్తః సామాత్యశ్చ విభీషణః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః సుగ్రీవః=ఆ సుగ్రీవుడు, వానరైః సహ=వానరులతో కూడ, ముదా=సంతోషముతో, యుక్తః=కూడినవాడై, దివ్యమ్=దివ్యమైన, పుష్పకమ్=పుష్పకమును, ఆరురోహ=ఎక్కెను. సామాత్యః=అమాత్యులతో

కూడిన, విభీషణశ్చ=విభీషణుడు కూడ, ఎక్కెను.

తా. పిమ్మట సుగ్రీవుడు, వానరులు, అమాత్యులతో కూడిన విభీషణుడు సంతోషించుచు ఆ దివ్యమైన పుష్పక విమానము ఎక్కిరి. 24

మూ. తేష్వారూఢేషు సర్వేషు కౌబేరం పరమాసనమ్, 25
రాఘవేణాభ్యనుజ్ఞాతముత్పపాత విహాయసమ్.

ప్ర. అ. తేషు=వారు, సర్వేషు=అందరూ, ఆరూఢేషు=ఎక్కినవారగుచుండగా, కౌబేరమ్=కుబేరుని సంబంధమైన, పరమాసనమ్=శ్రేష్ఠమైన ఆసనము, రాఘవేణ=రామునిచేత, అభ్యనుజ్ఞాతమ్=అనుజ్ఞ ఇవ్వబడినదై, విహాయసమ్=ఆకాశమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను.

తా. వాళ్లందరూ ఎక్కిన పిమ్మట కుబేరునికి సంబంధించిన ఆ ఉత్తమమైన విమానము రాముని ఆజ్ఞచేత ఆకాశముపైకి ఎగిరెను. 25

మూ. ఖగతేన విమానేన హంసయుక్తేన భాస్వతా, 26
ప్రహృష్టశ్చ ప్రతీతశ్చ బభౌ రామః కుబేరవత్.

ప్ర.అ. ప్రహృష్టశ్చ=సంతోషించిన, ప్రతీతశ్చ=శ్లాఘించబడిన, రామః=రాముడు, ఖగతేన=ఆకాశమును చేరిన, హంసయుక్తేన=హంసలతో కూడిన, భాస్వతా=ప్రకాశించుచున్న, విమానేన=విమానముచేత, కుబేరవత్=కుబేరుడువలె, బభౌ=ప్రకాశించెను.

తా. రాముడు ఆకాశములో ఎగురుచున్న, హంసల ప్రతిమలతో కూడిన ఆ ప్రకాశించుచున్న విమానమునందు సంతోషించుచు, శ్లాఘింపబడుచు, కుబేరుడు వలె ప్రకాశించెను. 26

మూ. తే సర్వే వానరర్క్షాశ్చ రాక్షసాశ్చ మహాబలాః, 27
యథాసుఖమసంబాధం దివ్యే తస్మిన్నుపావిశన్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ద్వావింశత్యధికశతతమః సర్గః.

ప్ర.అ. సర్వే=సమస్తమైన, తే=ఆ, వానరర్క్షాశ్చ=వానరులు భల్లూకములు, మహాబలాః=గొప్ప బలము గల, రాక్షసాశ్చ=రాక్షసులు, దివ్యే=దివ్యమైన, తస్మిన్=ఆ విమానమునందు, యథాసుఖమ్=సుఖముగా, అసంబాధమ్= ఇరుకు లేకుండగా,

ఉపావిశన్=కూర్చుండిరి.

తా. ఆ వానరులు, భల్లూకములు, మహాబలవంతులైన రాక్షసులు, అందరూ కూడ ఆ దివ్యమైన విమానములో సుఖముగా ఇరుకు లేకుండగా కూర్చుండిరి. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరువదియొకటవ సర్గ సమాప్తము.

# అథ త్రయోవింశత్యధికశతతమః సర్గః

[అయోధ్యకు వెళ్లుచు రాముడు సీతకు మార్గమధ్యమునందు ఉన్న ఆ యా స్థానములను చూపుట.]

మూ. అనుజ్ఞాతం తు రామేణ తద్విమానమనుత్తమమ్,
హంసయుక్తం మహానాదముత్పపాత విహాయసమ్. 1

ప్ర. అ. అనుత్తమమ్=చాలశ్రేష్ఠము, హంసయుక్తమ్=హంసలతో కూడినది, మహానాదమ్=గొప్ప ధ్వని కలది అయిన, తత్=ఆ, విమానమ్=విమానము, రామేణ=రామునిచేత, అనుజ్ఞాతమ్=అనుజ్ఞ ఇవ్వబడినదై, విహాయసమ్=ఆకాశమును గూర్చి, ఉత్పపాత=ఎగిరెను.

తా. హంసల ప్రతిమలతో కూడిన అత్యుత్తమమైన ఆ విమానము రాముని ఆజ్ఞ ప్రకారము గొప్ప ధ్వని చేయుచు ఆకాశములోనికి ఎగిరెను. 1

మూ. పాతయిత్వా తతశ్చక్షుః సర్వతో రఘునన్దనః,
అబ్రవీన్మైథిలీం సీతాం రామః శశినిభాననామ్. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రఘునన్దనః=రఘువంశమునకు ఆనందకరుడైన, రామః=రాముడు, చక్షుః=నేత్రమును, సర్వతః=అన్ని వైపులా, పాతయిత్వా=ప్రసరింపచేసి, శశినిభాననామ్=చంద్రునితో సమానమైన ముఖము గల, మైథిలీమ్=మిథిలారాజపుత్రియైన, సీతామ్=సీతను గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట రఘువంశమునకు ఆనందజనకుడైన రాముడు అంతటా దృష్టి ప్రసరింపచేయుచు చంద్రుని వంటి ముఖము గల, మిథిలారాజకుమారియైన సీతతో ఇట్లనెను. 2

మూ. కైలాసశిఖరాకారే త్రికూటశిఖరే స్థితామ్,
లఙ్కామీక్షస్వ వైదేహి నిర్మితాం విశ్వకర్మణా. 3

ప్ర. అ. వైదేహి=సీతా ! కైలాసశిఖరాకారే=కైలాసశిఖరము వంటి ఆకారము గల, త్రికూటశిఖరే=త్రికూట పర్వతశిఖరముపైన, స్థితామ్=ఉన్న, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నిర్మితామ్=నిర్మించబడిన, లఙ్కామ్=లంకను, ఈక్షస్వ=చూడుము.

తా. సీతా ! కైలాసశిఖరమువంటి త్రికూటపర్వతశిఖరముమీద ఉన్న, విశ్వకర్మ నిర్మించిన లంకను చూడుము. 3

మూ. ఏతదాయోధనం పశ్య మాంసశోణితకర్దమమ్,
హరీణాం రాక్షసానాం చ సీతే విశసనం మహత్. 4

ప్ర. అ. సీతే=సీతా ! మాంసశోణితకర్దమమ్=మాసము రక్తము అను బురద గల, హరీణామ్=వానరులయొక్క, రాక్షసానాం చ=రాక్షసులయొక్క, విశసనమ్=మరణ సాధనమైన, మహత్=గొప్పదైన, ఏతత్=ఈ, ఆయోధనమ్=యుద్ధభూమిని, పశ్య=చూడుము.

తా. సీతా ! వానరులు రాక్షసులూ మరణించుటకు కారణమైన, మాంసరక్తముల బురదతో నిండిన ఈ గొప్ప యుద్ధభూమిని చూడుము. 4

మూ. అత్ర దత్తవరః శేతే ప్రమాథీ రాక్షసేశ్వరః,
తవ హేతోర్విశాలాక్షి నిహతో రావణో మయా. 5

ప్ర. అ. విశాలాక్షి=విశాలమైన నేత్రములు గలదానా ! దత్తవరః=ఇవ్వబడిన వరములు గల, ప్రమాథీ=పీడించువాడైన, రాక్షసేశ్వరః=రాక్షసరాజైన, రావణః=రావణుడు, తవ హేతోః=నీకొరకై, మయా=నాచేత, నిహతః=చంపబడినవాడై, అత్ర=ఇక్కడ,, శేతే=శయనించి ఉన్నాడు.

తా. విశాలములైన నేత్రములు గల ఓ ! సీతా ! బ్రహ్మనుండి వరములు పొంది లోకములను పీడించిన రాక్షసరాజైన రావణుడు నీ నిమిత్తమై నాచేత చంపబడి ఇక్కడ పడిపోయినాడు. 5

మూ. కుమ్భకర్ణోఽత్ర నిహతః ప్రహస్తశ్చ నిశాచరః,
ధూమ్రాక్షశ్చాత్ర నిహతో వానరేణ హనూమతా. 6

ప్ర. అ. అత్ర=ఇక్కడ, కుమ్భకర్ణః=కుంభకర్ణుడు, నిహతః=చంపబడినాడు. నిశాచరః=రాక్షసుడైన, ప్రహస్తశ్చ=ప్రహస్తుడు (చంపబడినాడు). వానరేణ=వానరుడైన, హనూమతా=హనుమంతునిచేత, అత్ర=ఇక్కడ, ధూమ్రాక్షశ్చ=ధూమ్రాక్షుడు, నిహతః=చంపబడినాడు.

తా. ఇక్కడ కుంభకర్ణుడు చంపబడినాడు. ఇక్కడ ప్రహస్తుడు చంపబడినాడు. ఇక్కడ హనుమంతునిచేత ధూమ్రాక్షుడు చంపబడినాడు. 6

మూ. విద్యున్మాలీ హతశ్చాత్ర సుషేణేన మహాత్మనా,
లక్ష్మణేనేన్ద్రజిచ్చాత్ర రావణిర్నిహతో రణే. 7

ప్ర. అ. అత్ర=ఇక్కడ, మహాత్మనా=మహాత్ముడైన, సుషేణేన=సుషేణునిచేత, విద్యున్మాలీ=విద్యున్మాలి, హతః=చంపబడినాడు. అత్ర=ఇక్కడ, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, రావణేః=రావణుని పుత్రుడైన, ఇన్ద్రజిత్=ఇంద్రజిత్తు, రణే=యుద్ధమునందు, నిహతః=చంపబడినాడు.

తా. ఇక్కడ మహాత్ముడైన సుషేణుడు విద్యున్మాలిని చంపినాడు. ఇక్కడ యుద్ధములో రావణుని పుత్రుడైన ఇంద్రజిత్తు లక్ష్మణునిచేత చంపబడినాడు.7

మూ. అఙ్గదేనాత్ర నిహతో వికటో నామ రాక్షసః,
విరూపాక్షశ్చ దుష్ప్రేక్ష్యో మహాపార్శ్వమహోదరౌ. 8
అకమ్పనశ్చ నిహతో బలినోఽన్యే చ రాక్షసాః,
త్రిశిరాశ్చాతికాయశ్చ దేవాన్తకనరాన్తకౌ. 9

ప్ర. అ. అత్ర=ఇక్కడ, అఙ్గదేన=అంగదునిచేత, వికటో నామ=వికటు డను పేరు గల, రాక్షసః=రాక్షసుడు, నిహతః=చంపబడినాడు. దుష్ప్రేక్ష్యః=చూడ శక్యము కాని, విరూపాక్షశ్చ=విరూపాక్షుడు, మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వమహోదరులు, (చంపబడిరి). అకమ్పనశ్చ=అకంపనుడు కూడ, నిహతః=చంపబడినాడు. బలినః=బలవంతులైన, అన్యే=ఇతరులైన, రాక్షసాః చ=రాక్షసులు, త్రిశిరాః=త్రిశిరస్సు, అతికాయశ్చ=అతికాయుడు, దేవాన్తకనరాన్తకౌ=దేవాంతకనరాంతకులు (చంపబడినారు).

తా. ఇక్కడ అంగదునిచేత వికటు డను రాక్షసుడు చంపబడినాడు. చూచుటకు కూడ శక్యము కాని విరూపాక్షుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, అకంపనుడు, బలవంతులైన మరికొందరు రాక్షసులు, త్రిశిరస్సు అతికాయుడు, దేవాంతకుడు, నరాంతకుడు చంపబడినారు. 8 - 9

మూ. యుద్ధోన్మత్తశ్చ మత్తశ్చ రాక్షసప్రవరావుభౌ,
నికుమ్భశ్చైవ కుమ్భశ్చ కుమ్భకర్ణాత్మజౌ బలీ, 10
వజ్రదంష్ట్రశ్చ దంష్ట్రశ్చ బహవో రాక్షసా హతాః,
మకరాక్షశ్చ దుర్ధర్షో మయా యుధి నిపాతితః. 11

ప్ర. అ. రాక్షసప్రవరౌ=రాక్షసశ్రేష్ఠులైన, యుద్ధోన్మత్తశ్చ=యుద్ధోన్మత్తుడు, మత్తశ్చ=మత్తుడు అను, ఉభౌ=ఇద్దరూ, కుమ్భకర్ణాత్మజౌ=కుంభకర్ణుని కుమారులైన, నికుమ్భశ్చైవ=నికుంభుడు, కుమ్భశ్చ=కుంభుడు, బలీ=బలవంతుడైన, వజ్రదంష్ట్రశ్చ=వజ్రదంష్ట్రుడు, దంష్ట్రశ్చ=దంష్ట్రుడు, బహవః=చాలామంది, రాక్షసాః=రాక్షసులు, హతాః=చంపబడినారు. దుర్ధర్షః=ఎదిరింప శక్యము కాని, మకరాక్షశ్చ=మకరాక్షుడు, మయా=నాచేత, యుధి=యుద్ధమునందు, నిపాతితః=పడగొట్టబడినాడు.

తా. యుద్ధోన్మత్తుడు, మత్తుడు అను ఇద్దరు రాక్షసశ్రేష్ఠులు, నికుంభుడు, కుంభుడు అను కుంభకర్ణుని పుత్రులు, వజ్రదంష్ట్రుడు, దంష్ట్రుడు, ఇంకను చాలమంది రాక్షసులు చంపబడనారు. ఎదిరింప శక్యము కాని మకరాక్షుణ్ణి నేను యుద్ధములో పడగొట్టితిని. 10 - 11

మూ. అకమ్పనశ్చ నిహతః శోణితాక్షశ్చ వీర్యవాన్,
యూపాక్షశ్చ ప్రజఙ్ఘశ్చ నిహతౌ తు మహాహవే. 12

ప్ర. అ. మహాహవే=మహాయుద్ధమునందు, అకమ్పనశ్చ=అకంపనుడు, నిహతః=చంపబడినాడు. వీర్యవాన్=పరాక్రమము గల, శోణితాక్షశ్చ=శోణితాక్షుడు (చంపబడినాడు). యూపాక్షశ్చ=యూపాక్షుడు, ప్రజఙ్ఘశ్చ=ప్రజంఘుడు, నిహతౌ= చంపబడిరి.

తా. మహాయుద్ధములో అకంపనుడు, పరాక్రమవంతుడైన శోణితాక్షుడు, యూపాక్షుడు, ప్రజంఘుడు చంపబడినారు. 12

మూ. విద్యుజ్జిహ్వోఽత్ర నిహతో రాక్షసో భీమదర్శనః,
యజ్ఞశత్రుశ్చ నిహతః సుప్తఘ్నశ్చ మహాబలః, 13
సూర్యశత్రుశ్చ నిహతో బ్రహ్మశత్రుస్తథాపరః.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, భీమదర్శనః=భయంకరమైన దర్శనము గల, రాక్షసః=రాక్షసుడైన, విద్యుజ్జిహ్వః=విద్యుజ్జిహ్వుడు, నిహతః=చంపబడినాడు. యజ్ఞశత్రుశ్చ=యజ్ఞశత్రువు కూడ, నిహతః=చంపబడినాడు. మహాబలః=గొప్ప బలము గల, సుప్తఘ్నశ్చ=సుప్తఘ్నుడు, నిహతః=చంపబడినాడు. సూర్యశత్రుశ్చ=సూర్యశత్రువు, నిహతః=చంపబడినాడు. తథా=మరియు, అపరః=మరియొక రాక్షసుడు, బ్రహ్మశత్రుః=బ్రహ్మశత్రువు అనువాడు, నిహతః=చంపబడినాడు.

తా. ఇక్కడ చూచుటకు భయంకరుడైన విద్యుజ్జిహ్వుడు, యజ్ఞశత్రువు, గొప్ప బలముగల సుప్తఘ్నుడు, సూర్యశత్రువు, బ్రహ్మశత్రువు చంపబడినారు.13

మూ. అత్ర మన్దోదరీ నామ భార్యా తం పర్యదేవయత్, 14
సపత్నీనాం సహస్రేణ సాగ్రేణ పరివారితా.

ప్ర. అ. అత్ర=ఇక్కడ, సపత్నీనామ్=సవతులయొక్క, సాగ్రేణ=అగ్రముతో కూడిన, సహస్రేణ=సహస్రముచేత, పరివారితా=చుట్టబడిన, మన్దోదరీ నామ=మండోదరి అను, భార్యా=భార్య, తమ్=ఆ రావణుని గూర్చి, పర్యదేవయత్=విలపించెను.

తా. ఇక్కడ వెయ్యికి మించిన సవతులతో కూడి రావణుని భార్యయైన మండోదరి ఆతనికొరకై విలపించెను. 14

మూ. ఏతత్తు దృశ్యతే తీర్థం సముద్రస్య వరాననే, 15
యత్ర సాగరముత్తీర్య తాం రాత్రిముషితా వయమ్.

ప్ర. అ. వరాననే=సుందరమైన ముఖము గల సీతా ! సముద్రస్య=సముద్రముయొక్క, ఏతత్=ఈ, తీర్థమ్=తీర్థము (రేవు), దృశ్యతే=చూడబడుచున్నది. సాగరమ్=సముద్రమును, ఉత్తీర్య=దాటి, వయమ్=మేము, తాం రాత్రిమ్=ఆ రాత్రిని (యందు), యత్ర=ఎక్కడ, ఉషితాః=నివసించినామో.

తా. సుందరమైన ముఖము గల ఓ సీతా ! మేము సముద్రమును దాటి రాత్రి విడిసిన సముద్రము రేవు ఇదిగో, ఇటు కనబడుచున్నది. 15

మూ. ఏష సేతుర్మయా బద్ధః సాగరే లవణార్ణవే, 16
తవ హేతోర్విశాలాక్షి నలసేతుః సుదుష్కరః.

ప్ర. అ. విశాలాక్షి=విశాలములైన నేత్రములు కలదానా ! ఏషః=ఇది, సాగరే=సగరచక్రవర్తిచే త్రవ్వించబడిన, లవణార్ణవే=లవణసముద్రమునందు, మయా=నాచేత, బద్ధః=కట్టబడిన, (కట్టించబడిన), సుదుష్కరః=నిర్మించుటకు చాల కష్టమైన, నలసేతుః=నలుడు కట్టిన సేతువు.

తా. ఓ ! విశాలాక్షీ ! ఇది నీకొరకై నేను, సగరచక్రవర్తి త్రవ్వించిన లవణసముద్రముమీద కట్టించిన, నలుడు కట్టిన సేతువు. 16

మూ. పశ్య సాగరమక్షోభ్యం వైదేహి వరుణాలయమ్, 17
అపారమివ గర్జన్తం శఙ్ఖశుక్తిసమాకులమ్.

ప్ర. అ. వైదేహి=ఓ ! సీతా ! అక్షోభ్యమ్=క్షోభింపచేయ శక్యము కానిది, వరుణాలయమ్=వరుణుని నివాసము, అపారమివ=అవతలి ఒడ్డు లేనిది వలె ఉన్నది, గర్జన్తమ్=గర్జించుచున్నది, శఙ్ఖశుక్తిసమాకులమ్=శంఖములతోను ముత్యపు చిప్పలతోను వ్యాకులము అయిన, సాగరమ్=సముద్రమును, పశ్య=చూడుము.

తా. సీతా ! క్షోభింప శక్యము కాని, వరుణుని వాసమైన ఈ సముద్రమును చూడుము. ఇది అవతలి ఒడ్డు లేదా అన్నట్లు చాల విశాలముగా ఉండి గర్జించుచున్నది. శంఖములతోను ముత్యపు చిప్పలతోను వ్యాకులముగా ఉన్నది. 17

మూ. హిరణ్యనాభం శైలేన్ద్రం కాఞ్చనం పశ్య మైథిలి, 18
విశ్రమార్థం హనుమతో భిత్త్వా సాగరముత్థితమ్.

ప్ర. అ. మైథిలి=సీతా ! హనుమతః=హనుమంతునియొక్క, విశ్రమార్థమ్=విశ్రాంతికొరకు, సాగరమ్=సముద్రమును, భిత్త్వా=భేదించుకొని, ఉత్థి

తమ్=లేచిన, కాఞ్చనమ్=బంగారము వికారమైన, హిరణ్యానాభమ్=మైనాకపర్వత మును, పశ్య=చూడుము.

తా. సీతా ! ఈ బంగారు మైనాక పర్వతమును చూడుము. ఇది హనుమంతుని విశ్రాంతికొరకై సముద్రమును భేదించుకొని పైకి లేచినది. 18

మూ. ఏతత్ కుక్షౌ సముద్రస్య స్కన్ధావారనివేశనమ్, 19
అత్ర పూర్వం మహాదేవః ప్రసాదమకరోత్ప్రభుః.

ప్ర. అ. సముద్రస్య=సముద్రముయొక్క, కుక్షౌ=మధ్యభాగమునందు, ఏతత్=ఇది, స్కన్ధావారనివేశనమ్=సేన విడిది చేసిన స్థానము. అత్ర=ఈ స్థానమునందు, పూర్వమ్=పూర్వము, ప్రభుః=ప్రభువైన, మహాదేవః=ఈశ్వరుడు, ప్రసాదమ్=అనుగ్రహమును, అకరోత్=చేసెను.

తా. ఇది సముద్రము మధ్యలో (అనగా సముద్రముమీద కట్టిన సేతువు మధ్యలో) సేన విడిది చేసిన చోటు. ఇక్కడ పూర్వము సర్వసమర్థుడైన శివుడు నన్ను అనుగ్రహించినాడు. 19

వి. సేతునిర్మాణము నిర్విఘ్నముగా జరుగుటకై రాముడు శివలింగమును పూజించి నట్లు దీనినిపట్టి తెలియుచున్న దని కొందరు వ్యాఖ్యాతలు చెప్పిరి. వీరి ప్రకారము 'పూర్వము' అనగా సేతునిర్మాణమునకు ముందు అని అర్థము. కాని ఆ ఘట్టమునందు శివలింగప్రతిష్ఠాపనాదికమును చెప్పలేదు గాన ఇక్కడ "మహాదేవః"అనగా సముద్రుడు అని అర్థము. సముద్రుడు సేతుబంధనానికి అనుమతించినాడని భావము అని గోవిందరాజులు వివరించిరి. కాని 'మహేశ్వర మొదలైన శబ్దాలు శివపరములుగానే ప్రయోగింపబడును గాన మహాదేవశబ్దానికి శివుడు అను అర్థము చెప్పుటయే యుక్తము. గోవిందరాజులు శివుడు అనే అర్థమును గ్రహించుటలో కొన్ని అనుపపత్తులు చూపి ఉన్నారు. రాముణ్ణి శివుడు అనుగ్రహించినాడు అని చెప్పుట విష్ణుభక్తులకు అనిష్టముగాన ఆయన ఆ విధముగా వ్రాసినా రని కొందరి అభిప్రాయము. ఆయన చూపిన ఇతర యుక్తుల మాట ఎలా ఉన్నా ఆ ఘట్టంలో చెప్పని ఇంతటి ప్రధాన విషయాన్ని ఒక్క శ్లోకార్థంలో అనువదించుట అసంగతము. అందుచేత పురాణాదులలోని కథను పట్టి ఎవరో శివభక్తులే ఈ శ్లోకార్థమును ఇక్కడ ఇమడ్చి ఉందు రని నా అభిప్రాయము. ఇది ప్రాచ్యపాఠములో లేకపోవుట గమనార్హము. 19

మూ. ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః, 20
సేతుబన్ధ ఇతి ఖ్యాతం త్రైలోక్యేన చ పూజితమ్,

ఏతత్పవిత్రం పరమం మహాపాతకనాశనమ్, 21
అత్ర రాక్షసరాజోఽయమాజగామ విభీషణః.

ప్ర. అ. మహాత్మనః=మహాత్ముడైన, సాగరస్య=సముద్రునియొక్క, సేతు బన్ధః ఇతి=సేతుబంధ మని, ఖ్యాతమ్=ప్రసిద్ధమైన, త్రైలోక్యేన చ=మూడు లోకములచేత, పూజితమ్=పూజింపబడిన, ఏతత్ తు=ఈ, తీర్థమ్=తీర్థము, దృశ్యతే=చూడబడుచున్నది. ఏతత్=ఇది, పరమమ్=మిక్కిలి, పవిత్రమ్=పవిత్రమైనది. మహాపాతకనాశనమ్=మహాపాతకములను నశింపచేయునది. అత్ర=ఇక్కడ, అయమ్=ఈ, రాక్షసరాజః=రాక్షసరాజైన, విభీషణః=విభీషణుడు, ఆజగామ=వచ్చెను.

తా. ఈ కనబడుచున్నది మహాత్ముడైన సముద్రుని సేతుబంధ మను పేరు గల మూడు లోకములలో పూజించబడిన తీర్థము. ఇది చాల పవిత్రము. మహాపాతకములను నశింపచేయునది. ఈ స్థలమునందు రాక్షసరాజైన విభీషణుడు నావద్దకు వచ్చినాడు. 20 - 21

మూ. ఏషా సా దృశ్యతే సీతే కిష్కిన్ధా చిత్రకాననా, 22
సుగ్రీవస్య పురీ రమ్యా యత్ర వాలీ మయా హతః.

ప్ర. అ. సీతే=సీతా ! సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, పురీ=పట్టణము, రమ్యా=సుందరము, చిత్రకాననా=చిత్రములైన వనములు గల, సా=ఆ, ఏషా=ఈ, కిష్కిన్ధా=కిష్కింధ, దృశ్యతే=కనబడుచున్నది. యత్ర=ఎక్కడ, మయా=నాచేత, వాలీ=వాలి, హతః=చంపబడెనో.

తా. సీతా ! ఇదిగో ఇక్కడ చిత్రములైన వనములు గల అందమైన సుగ్రీవుని నగరమైన కిష్కింధ కనబడుచున్నది. ఇక్కడనే నేను వాలిని చంపితిని. 22

మూ. అథ దృష్ట్వా పురీం సీతా కిష్కిన్ధాం వాలిపాలితామ్, 23
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం రామం ప్రణయసాధ్వసా.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సీతా=సీత, వాలిపాలితామ్=వాలిచేత పాలించబడిన, కిష్కిన్ధాం పురీమ్=కిష్కింధను, దృష్ట్వా=చూచి, ప్రణయసాధ్వసా=ప్రేమ,తొందర కలదై, రామమ్=రాముణ్ణి గూర్చి, ప్రశ్రితమ్=వినయపూర్వకమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు సీత పూర్వము వాలి పాలించిన ఆ కిష్కింధా నగరమును చూచి, ప్రేమసాధ్వసములతో కూడినదై, వినయపూర్వకముగా రామునితో ఇట్లు పలికెను. 23

మూ. సుగ్రీవప్రియభార్యాభిస్తారాప్రముఖతో నృప, 24
అన్యేషాం వానరేన్ద్రాణాం స్త్రీభిః పరివృతా హ్యహమ్,
గన్తుమిచ్ఛే సహాయోధ్యాం రాజధానీం త్వయా సహ. 25

ప్ర. అ. నృప=రాజా ! తారాప్రముఖతః=తార మొదలైన, సుగ్రీవప్రియభార్యాభిః=సుగ్రీవుని ప్రియభార్యలతోను, అన్యేషామ్=ఇతరులైన, వానరేన్ద్రాణామ్=వానరముఖ్యులయొక్క, స్త్రీభిః=స్త్రీలతోను,పరివృతా=కూడినదాననై, అహమ్=నేను, త్వయా సహ=నీతో కూడ, రాజధానీమ్=రాజధానియైన, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, ఇచ్ఛే=కోరుచున్నాను.

తా. రాజా ! తార మొదలైన సుగ్రీవుని ప్రియభార్యలతోను, ఇతరవానరనాయకుల స్త్రీలతోను కలిసి నేను నీతో కూడ రాజధానియైన అయోధ్యకు వెళ్ల వలె నని కోరుచున్నాను. 24 - 25.

మూ. ఏవముక్తోఽథ వైదేహ్యా రాఘవః ప్రత్యువాచ తామ్,
ఏవమస్త్వితి కిష్కిన్ధాం ప్రాప్య సంస్థాప్య రాఘవః. 26
విమానం ప్రేక్ష్య సుగ్రీవం వాక్యమేతదువాచ హ.

ప్ర. అ. వైదేహ్యా=సీతచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రాఘవః=రాముడు, అథ=అటుపిమ్మట, ఏవమ్=ఇట్లు, అస్తు=అగుగాక, ఇతి=అని,తామ్=ఆమెను గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను. రాఘవః=రాముడు, కిష్కిన్ధామ్=కిష్కింధను, ప్రాప్య=పొంది, విమానమ్=విమానమును, సంస్థాప్య=నిలిపి, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, ప్రేక్ష్య=చూచి, ఏతత్=ఈ, వాక్యమ్=వాక్యమును, ఉవాచ హ=పలికెను.

తా. సీత మాట విని, రాముడు "అట్లే అగుగాక"అని పలికి, కిష్కింధ చేరి, విమానమును నిలిపి సుగ్రీవునితో ఇట్లు పలికెను. 26

మూ. బ్రూహి వానరశార్దూల సర్వాన్ వానరపుఙ్గవాన్, 27
స్త్రీభిః పరివృతాః సర్వే హ్యయోధ్యాం యాన్తు సీతయా.

ప్ర. అ. వానరశార్దూల=వానరశ్రేష్ఠుడా ! సర్వాన్=సమస్తమైన, వానరపుంగవాన్=వానరశ్రేష్ఠులను గూర్చి, సర్వే=అందరూ, స్త్రీభిః=స్త్రీలతో, పరివృతాః=కూడినవారై, సీతయా=సీతతో, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, యాన్తు=వెళ్ళెదరు గాక అని, బ్రూహి=చెప్పుము.

తా. వానరరాజా ! వానరనాయకు లందరితోను - "మీరందరు మీ స్త్రీలతో కూడినవారై సీతతో కూడ అయోధ్యకు రండు"అని చెప్పుము. 27

మూ. తథా త్వమపి సర్వాభిః స్త్రీభిః సహ మహాబల, 28
అభిత్వరస్వ సుగ్రీవ గచ్ఛామః ప్లవగాధిప.

ప్ర. అ. మహాబల=గొప్ప బలము గలవాడా ! ప్లవగాధిప=వానరరాజా ! సుగ్రీవ=సుగ్రీవుడా ! తథా=అట్లే, త్వమ్ అపి=నీవుకూడ, సర్వాభిః=సమస్తమైన, స్త్రీభిః సహ=నీ స్త్రీలతోను, అభిత్వరస్వ=తొందరపడుము. గచ్ఛామః=వెళ్లుచున్నాము. (వెళ్ళెదము).

తా. మహాబలవంతుడవు, వానరప్రభువూ అయిన సుగ్రీవా ! నీవు కూడ నీ స్త్రీలతో తొందరపడుము. (తొందరగా రమ్ము), వెళ్లెదము. 28

మూ. ఏవముక్తస్తు సుగ్రీవో రామేణామితతేజసా, 29
వానరాధిపతిః శ్రీమాంస్తైశ్చ సర్వైః సమావృతః,
ప్రవిశ్యాన్తఃపురం శీఘ్రం తారాముద్వీక్ష్య సోఽబ్రవీత్. 30

ప్ర. అ. అమితతేజసా=గొప్ప తేజస్సు గల, రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, వానరాధిపతిః=వానరప్రభువైన, శ్రీమాన్=శోభగల, సః సుగ్రీవః=సుగ్రీవుడు, సర్వైః=సమస్తమైన, తైః=ఆ వానరులతో, సమావృతః=కూడినవాడై, శీఘ్రమ్=శీఘ్రముగా, అన్తఃపురమ్=అంతఃపురమును, ప్రవిశ్య=ప్రవేశించి, తారామ్=తారను, ఉద్వీక్ష్య=చూచి, అబ్రవీత్=పలికెను.

తా. వానరప్రభువు, శ్రీమంతుడు అయిన ఆ సుగ్రీవుడు అమితమైన తేజస్సు గల రాముని మాటలు విని శీఘ్రముగా అంతఃపురములో ప్రవేశించి తారను చూచి, ఇట్లు పలికెను. 29, 30.

మూ. ప్రియే త్వం సహనారీభిర్వానరాణాం మహాత్మనామ్,
రాఘవేణాభ్యనుజ్ఞాతా మైథిలీప్రియకామ్యయా. 31

ప్ర. అ. ప్రియే=ప్రియురాలా ! త్వమ్=నీవు, మహాత్మనామ్=మహాత్ములైన, వానరాణామ్=వానరులయొక్క, నారీభిః సహ=స్త్రీలతో కూడ, రాఘవేణ=రామునిచేత, మైథిలీప్రియకామ్యయా=సీతయొక్క ప్రియమునందు కోరికచేత, అభ్యనుజ్ఞాతా=అనుజ్ఞ ఇవ్వబడితివి.

తా. ప్రియురాలా ! మహాత్ములైన వానరుల భార్యలకు నీకు కూడ రాముడు సీతకు ప్రియము చేకూర్చుటకై అనుజ్ఞ ఇచ్చినాడు. 31

మూ. త్వర త్వమభిగచ్ఛామో గృహ్య వానరయోషితః,
అయోధ్యాం దర్శయిష్యామః సర్వా దశరథస్త్రియః. 32

ప్ర. అ. త్వమ్=నీవు, త్వర=తొందరపడుము. వానరయోషితః=వానరుల

భార్యలను, గృహ్యా=గ్రహించి, గచ్ఛామః=వెళ్లెదము. అయోధ్యామ్=అయోధ్యను, సర్వాః=సమస్తమైన, దశరథస్త్రియః=దశరథుని భార్యలను, దర్శయిష్యామః=చూపెదము.

తా. నీవు తొందరగా సిద్ధ మగుము. వానరుల భార్యలను తీసికొని వెళ్లెదము. వారికి అయోధ్యను, దశరథుని భార్యలను చూపెదము. 32

మూ. సుగ్రీవస్య వచః శ్రుత్వా తారా సర్వాఙ్గశోభనా,
ఆహూయ చాబ్రవీత్సర్వా వానరాణాం తు యోషితః. 33

ప్ర. అ. సర్వాఙ్గశోభనా=అన్ని అవయువములయందు సౌందర్యము గల, తారా=తార, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, వానరాణామ్=వానరులయొక్క, సర్వాః=సమస్తమైన, స్త్రియః=స్త్రీలను, ఆహూయ చ=పిలచి, అబ్రవీత్=పలికెను.

తా. సుందరములైన సర్వావయువములు గల తార సుగ్రీవుని మాటలు విని వానరస్త్రీల నందరినీ పిలచి ఇట్లు పలికెను. 33

మూ. సుగ్రీవేణాభ్యనుజ్ఞాతా గన్తుం సర్వైశ్చ వానరైః,
మమ చాపి ప్రియం కార్యమయోధ్యాదర్శనేన చ. 34

ప్ర. అ. సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, సర్వైః=సమస్తమైన, వానరైశ్చ=వానరులచేతను, గన్తుమ్=వెళ్లుటకు, అనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడినారు. అయోధ్యాదర్శనేన=అయోధ్యను చూచుటచేత, మమ చాపి=నాకు కూడ, ప్రియమ్=ప్రియము, కార్యమ్=చేయదగినది.

తా. సుగ్రీవుడు, వానరు లందరూ కూడ మీకు అనుజ్ఞ ఇచ్చినారు. అయోధ్యను చూచుటచేత నాకు కూడ ప్రియము చేయవలసి ఉన్నది. 34

మూ. ప్రవేశం చైవ రామస్య పౌరజానపదైః సహ,
విభూతిం చైవ సర్వాసాం స్త్రీణాం దశరథస్య చ. 35

ప్ర. అ. పౌరజానపదైః సహ=పౌరులతోను జానపదులతోను, రామస్య=రామునియొక్క, ప్రవేశం చైవ=నగరప్రవేశమును, సర్వాసామ్=సమస్తమైన, దశరథస్య=దశరథునియొక్క, స్త్రీణామ్=స్త్రీలయొక్క, విభూతిం చైవ=ఐశ్వర్యమును, (చూచెదము).

తా. పౌరులతోను జానపదులతోను కూడి రాముడు పురములో ప్రవేశించుటను, దశరథుని అందరి స్త్రీల ఐశ్వర్యమును చూచెదము. 35

మూ. తారయా చాభ్యనుజ్ఞాతాః సర్వా వానరయోషితః,
నేపథ్యవిధిపూర్వం తు కృత్వా చాపి ప్రదక్షిణమ్. 36
అధ్యారోహన్విమానం తత్సీతాదర్శనకాఙ్క్షయా.

ప్ర. అ. తారయా చ=తారచేత, అభ్యనుజ్ఞాతాః=అనుజ్ఞ ఇవ్వబడిన, సర్వాః=సమస్తమైన, వానరయోషితః=వానరస్త్రీలు, నేపథ్యవిధిపూర్వకమ్=అలంకారవిధి పూర్వకముగా, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము, కృత్వా=చేసి, సీతాదర్శనకాఙ్క్షయా=సీతను చూడవలె నను కోరికతో, తత్=ఆ, విమానమ్=విమానమును, అధ్యారోహన్=ఎక్కిరి.

తా. తారచేత అనుమతింపబడిన ఆ వానరస్త్రీ లందరూ అలంకారములు ధరించి, ఆ విమానమునకు ప్రదక్షిణము చేసి సీతను చూడవలె నను ఉత్కంఠతో విమానమును ఎక్కిరి. 36

మూ. తాభిః సహోత్థితం శీఘ్రం విమానం ప్రేక్ష్య రాఘవః, 37
ఋష్యమూకసమీపే తు వైదేహీం పునరబ్రవీత్.

ప్ర. అ. తాభిః సహ=వానరస్త్రీలతో కూడ, శీఘ్రమ్=శీఘ్రముగా, ఉత్థితమ్=లేచిన, విమానమ్=విమానమును, ప్రేక్ష్య=చూచి, రాఘవః=రాముడు, ఋష్యమూకసమీపే=ఋష్యమూకసమీపమునందు, వైదేహీమ్=సీతను గూర్చి, పునః=మరల, అబ్రవీత్=పలికెను.

తా. ఆ విమానము వానరస్త్రీలు ఎక్కిన పిమ్మట శీఘ్రముగా పైకి ఎగిరెను. అప్పుడు రాముడు చూచి ఋష్యమూకపర్వతము దగ్గర సీతతో మరల ఇట్లు పలికెను. 37

మూ. దృశ్యతేఽసౌ మహాన్ సీతే సవిద్యుదివ తోయదః, 38
ఋష్యమూకో గిరివరః కాఞ్చనైర్ధాతుభిర్వృతః.

ప్ర. అ. సీతే=సీతా ! కాఞ్చనైః=బంగారము వికారమైన, ధాతుభిః=ధాతువులతో, వృతః=కూడిన, సవిద్యుత్=మెరుపులతో కూడిన, తోయదః ఇవ=మేఘము వలె ఉన్న, అసౌ=ఈ, గిరివరః=పర్వతశ్రేష్ఠమైన, ఋష్యమూకః=ఋష్యమూకపర్వతము, దృశ్యతే=చూడబడుచున్నది.

తా. సీతా ! ఇదిగో ఇక్కడ ఋష్యమూకపర్వతము కనబడుచున్నది. ఇది బంగారు ధాతువులతో, మెరుపులతో కూడిన మేఘము వలె ఉన్నది. 38

మూ. అత్రాహం వానరేన్ద్రేణ సుగ్రీవేణ సమాగతః, 39
సమయశ్చ కృతః సీతే వధార్థం వాలినో మయా.

ప్ర. అ. సీతే=సీతా ! అత్ర=ఇక్కడ, అహమ్=నేను, వానరేన్ద్రేణ=వానరేంద్రుడైన, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సమాగతః=కలిసితిని. మయా=నాచేత, వాలినః=వాలియొక్క, వధార్థమ్=వధకొరకు, సమయశ్చ=ఒడంబడిక కూడ, కృతః=చేయబడినది.

తా. సీతా ! ఇక్కడ నేను వానరప్రభువైన సుగ్రీవునితో కలుసుకున్నాను. వాలిని చంపుటకై నేను ఒడంబడిక కూడ చేసితిని. 39

మూ. ఏషా సా దృశ్యతే పమ్పా నలినీ చిత్రకాననా, 40
త్వయా విహీనో యత్రాహం విలలాప సుదుఃఖితః.

ప్ర. అ. నలినీ=పద్మములు కలది, చిత్రకాననా=చిత్రములైన అడవులు కలది అయిన, ఏషా=ఈ, పమ్పా=పంపానది, దృశ్యతే=చూడబడుచున్నది. యత్ర=ఎక్కడ, అహమ్=నేను, త్వయా=నీతో, విహీనః=విహీనుడనై, సుదుఃఖితః=చాల దుఃఖించినవాడనై, విలలాప=విలపించితినో.

తా. పద్మములు గలది, చుట్టూ విచిత్రములైన వనము లున్నదీ అయిన ఈ పంపానది కనబడుచున్నది. నేను నీ వియోగముచేత చాల దుఃఖితుడనై ఇక్కడనే విలపించితిని. 40

మూ. అస్యాస్తీరే మయా దృష్టా శబరీ ధర్మచారిణీ, 41
అత్ర యోజనబాహుశ్చ కబన్ధో నిహతో మయా.

ప్ర. అ. అస్యాః=దీనియొక్క, తీరే=తీరమునందు, ధర్మచారిణీ=ధర్మమును ఆచరించు, శబరీ=శబరి, మయా=నాచేత, దృష్టా=చూడబడినది. అత్ర=ఇక్కడ, మయా=నాచేత, యోజనబాహుః=యోజన ప్రమాణము బాహువులు గల, కబన్ధః=కబంధుడు, నిహతః=చంపబడినాడు.

తా. ధర్మము నాచరించు శబరిని నేను ఈ పంపాతీరమునందే చూచితిని. ఇక్కడ నేను యోజనబాహువైన కబంధుణ్ణి చంపితిని. 41

మూ. దృశ్యతేఽసౌ జనస్థానే శ్రీమాన్ సీతే వనస్పతిః, 42
జటాయుశ్చ మహాతేజాస్తవ హేతోర్విలాసిని,
రావణేన హతో యత్ర పక్షిణాం ప్రవరో బలీ. 43

ప్ర. అ. సీతే=సీతా ! జనస్థానే=జనస్థానమునందు, శ్రీమాన్=శోభాయుక్తమైన, అసౌ=ఈ, వనస్పతిః=వృక్షము, దృశ్యతే=చూడబడుచున్నది. విలాసిని=ఓ!

విలాసవంతురాలా ! యత్ర=ఎక్కడ, తవ హేతోః=నీ నిమిత్తమై, పక్షిణామ్=పక్షులలో, ప్రవరః=శ్రేష్ఠుడు, బలీ=బలవంతుడూ అయిన, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, జటాయుశ్చ=జటాయువు, రావణేన=రావణునిచేత, నిహతః=చంపబడినాడో.

తా. ఓ ! సీతా ! జనస్థానమునందు ఈ మహావృక్షము కనబడుచున్నది. ఓ ! విలాసవతీ ! ఇక్కడనే రావణుడు, గొప్ప తేజస్సు గలవాడు, బలవంతుడు, పక్షులలో శ్రేష్ఠుడూ అయిన జటాయువును, నీ నిమిత్తమై చంపినాడు.42-43

మూ. ఖరశ్చ నిహతో యత్ర దూషణశ్చ నిపాతితః,
త్రిశిరాశ్చ మహావీర్యో మయా బాణైరజిహ్మగైః, 44
ఏతత్తదాశ్రమపదమస్మాకం వరవర్ణిని,
పర్ణశాలా తథా చిత్రా దృశ్యతే శుభదర్శనే, 45
యత్ర త్వం రాక్షసేన్ద్రేణ రావణేన హృతా బలాత్.

ప్ర. అ. వరవర్ణిని=శ్రేష్ఠమైన వర్ణము కలదానా ! ఏతత్=ఇది, యత్ర=ఎక్కడ, మయా=నాచేత, అజిహ్మగైః=తిన్నగా పోవు, శరైః=బాణాలచేత, ఖరశ్చ=ఖరుడు, నిహతః=చంపబడినాడో, దూషణశ్చ=దూషణుడు, నిపాతితః= పడగొట్టబడినాడో, మహావీర్యః=గొప్ప పరాక్రమము గల, త్రిశిరాశ్చ=త్రిశిరస్సు (పడగొట్టబడినాడో), తత్=ఆ, అస్మాకమ్=మనయొక్క, ఆశ్రమపదమ్=ఆశ్రమ స్థానము. తథా=మరియు, శుభదర్శనే=శుభకరమైన దర్శనము గలదానా ! త్వమ్=నీవు, యత్ర=ఎక్కడ, రాక్షసేన్ద్రేణ=రాక్షసరాజైన, రావణేన=రావణునిచేత, బలాత్=బలాత్కారముగా, హృతా=హరింపబడినావో, అట్టి, పర్ణశాలా=పర్ణశాల, దృశ్యతే=చూడబడుచున్నది.

తా. శ్రేష్ఠమైన శరీరవర్ణము గల సీతా ! వంకర లేకుండా వెళ్లు బాణములతో నేను ఖరుణ్ణి, దూషణుణ్ణి, గొప్ప పరాక్రమము గల త్రిశిరస్సునూ చంపిన మన ఆ ఆశ్రమము ఇదే. చూచువారికి శుభము కూర్చుదానా ! రాక్షసరాజైన రావణుడు నిన్ను బలాత్కారముగా అపహరించి తీసికొనిపోయిన పర్ణశాల ఇక్కడ కనబడుచున్నది. 44 - 45

మూ. ఏషా గోదావరీ రమ్యా ప్రసన్నసలిలా శుభా, 46
అగస్త్యస్యాశ్రమశ్చైవ దృశ్యతే కదలీవృతః.

ప్ర. అ. ఏషా=ఇది, ప్రసన్నసలిలా=నిర్మలమైన ఉదకము గల, శుభా=శుభకరమైన, రమ్యా=సుందరమైన, గోదావరీ=గోదావరి. కదలీవృతః= అరటిచెట్లచేత కప్పబడిన, అగస్త్యస్య=అగస్త్యునియొక్క, ఆశ్రమశ్చైవ=ఆశ్రమము కూడ,దృశ్యతే=చూడబడుచున్నది.

తా. ఇది రమ్యమైన, నిర్మలమైన ఉదకము గల, శుభకరమైన గోదావరీనది. చుట్టూ అరటితోపులు ఉన్న అగస్త్యాశ్రమము కూడ కనబడుచున్నది. 46

మూ. దీప్తశ్చైవాశ్రమో హ్యేష సుతీక్ష్ణస్య మహాత్మనః, 47
దృశ్యతే చైవ వైదేహి శరభఙ్గాశ్రమో మహాన్,
ఉపయాతః సహస్రాక్షో యత్ర శక్రః పురందరః. 48

ప్ర. అ. దీప్తః=ప్రకాశించుచున్న, ఏషః ఆశ్రమః=ఈ ఆశ్రమము, మహాత్మనః=మహాత్ముడైన, సుతీక్ష్ణస్య=సుతీక్ష్ణునిది. వైదేహి=సీతా ! మహాన్=గొప్పదైన, శరభఙ్గాశ్రమః చైవ=శరభంగాశ్రమము కూడ దృశ్యతే=చూడబడుచున్నది. యత్ర=ఏ ఆశ్రమమునందు, సహస్రాక్షః=వేయి నేత్రములు గల, పురందరః=శత్రుపురములను నశింపచేసిన, శక్రః=దేవేంద్రుడు, ఉపయాతః=వచ్చినాడో.

తా. ఈ ప్రకాశించుచున్న ఆశ్రమము మహాత్ముడైన సుతీక్ష్ణుని ఆశ్రమము. సీతా ! గొప్పదైన శరభంగాశ్రమము కూడ కనబడుచున్నది. ఇక్కడికే ఆనాడు సహస్రాక్షుడు, శత్రుపురవినాశకుడూ అయిన దేవేంద్రుడు వచ్చినాడు.47, 48

మూ. ఏతే తే తాపసా దేవి దృశ్యన్తే తనుమధ్యమే,
అత్రిః కులపతిర్యత్ర సూర్యవైశ్వానరోపమః. 49

ప్ర. అ. తనుమధ్యమే=సన్నని నడుము గల సీతా ! ఏతే=ఈ, తే=ఆ, తాపసాః=మునులు, దృశ్యన్తే=కనబడుచున్నారు, యత్ర=ఎక్కడ, సూర్యవైశ్వానరోపమః=సూర్యునితోను, అగ్నితోను సమానుడైన, అత్రిః=అత్రి, కులపతిః=కులపతియో.

తా. సన్నని నడుము గల సీతా ! ఏ తాపసులకు సూర్యునితోను, అగ్నితోను సమానుడైన అత్రి కులపతియో అట్టి ఈ మునులు కనబడుచున్నారు.

మూ. అస్మిన్ దేశే మహాకాయో విరాధో నిహతో మయా,
అత్ర సీతే త్వయా దృష్టా తాపసీ ధర్మచారిణీ. 50

ప్ర. అ. అస్మిన్ దేశే=ఈ ప్రదేశమునందు, మహాకాయః=గొప్ప శరీరము గల, విరాధః=విరాధుడు, మయా=నాచేత, నిహతః=చంపబడినాడు. సీతే=సీతా! అత్ర=ఇక్కడ, ధర్మచారిణీ=ధర్మమును ఆచరించు, తాపసీ=తాపసియైన అనసూయ, త్వయా=నీచేత, దృష్టా=చూడబడినది.

తా. ఈ ప్రదేశమునందు నేను విరాధుణ్ణి చంపినాను. సీతా ! ఈ ప్రదేశమునందు నీవు ధర్మాత్మురాలైన అనసూయను చూచినావు. 50

మూ. అసౌ సుతను శైలేన్ద్రశ్చిత్రకూటః ప్రకాశతే,
అత్ర మాం కైకయీపుత్రః ప్రసాదయితుమాగతః. 51

ప్ర. అ. సుతను=అందమైన శరీరము గల సీతా ! అసౌ=ఈ, శైలేన్ద్రః=పర్వతశ్రేష్ఠమైన, చిత్రకూటః=చిత్రకూటము, ప్రకాశతే=ప్రకాశించుచున్నది. అత్ర=ఇక్కడ, కైకయీపుత్రః=భరతుడు, మామ్=నన్ను, ప్రసాదయితుమ్=అనుగ్రహింపచేసికొనుటకు, ఆగతః=వచ్చినాడు.

తా. సీతా ! ఇదిగో పర్వతశ్రేష్ఠమైన చిత్రకూటము ఇక్కడ ప్రకాశించుచున్నది. భరతుడు ఇక్కడనే నన్ను బ్రతిమాలుకొనుటకు వచ్చినాడు.

మూ. ఏషా సా యమునా రమ్యా దృశ్యతే చిత్రకాననా,
భరద్వాజాశ్రమః శ్రీమాన్ దృశ్యతే చైష మైథిలి. 52

ప్ర. అ. మైథిలి=సీతా ! ఏషా=ఇదే, చిత్రకాననా=చిత్రమైన అడవులు గల, రమ్యా=సుందరమైన, సా యమునా=ఆ యమున, దృశ్యతే=చూడబడుచున్నది. శ్రీమాన్=శోభాయుక్తమైన, ఏషః=ఈ, భరద్వాజాశ్రమః=భరద్వాజాశ్రమము, దృశ్యతే=చూడబడుచున్నది.

తా. సీతా ! ఇదిగో చిత్రములైన వనములు చుట్టూ ఉన్న ఆ యమునానది కనపడుచున్నది. శోభాయుక్తమైన ఈ భరద్వాజాశ్రమము కూడ కనబడుచున్నది. 52

మూ. ఇయం చ దృశ్యతే గఙ్గా పుణ్యా త్రిపథగా నదీ,
నానాద్విజగణాకీర్ణా సంప్రపుష్పితకాననా. 53

ప్ర. అ. నానాద్విజగణాకీర్ణా=అనేకవిధములైన పక్షిసమూహములతో నిండిన, సంప్రపుష్పితపాదపా=పుష్పించిన వృక్షములు గల, ఇయమ్=ఈ, పుణ్యా=పవిత్రమైన, త్రిపథగా=మూడు మార్గములలో ప్రవహించుచున్న, గఙ్గా నదీ=గంగానది, దృశ్యతే=కనబడుచున్నది.

తా. అనేక విధములైన పక్షులతో వ్యాప్తమైన బాగా పుష్పించిన అడవులు గలది, పవిత్రము, మూడు లోకములలో ప్రవహించునదీ అయిన గంగానది కనబడుచున్నది. 53

మూ. శృఙ్గిబేరపురం చైతద్గుహో యత్ర సఖా మమ,
ఏషా సా దృశ్యతే సీతే సరయూర్యూపమాలినీ, 54
నానాతరుశతాకీర్ణా సంప్రపుష్పితకాననా.

ప్ర. అ. ఏతత్=ఇది, శృఙ్గిబేరపురం చ=శృంగిబేరపురము; యత్ర=ఎక్కడ, మమ=నాయొక్క, సఖా=మిత్రుడైన, గుహ=గుహుడు ఉన్నాడో. సీతే=సీతా ! యూపమాలినీ=యూపస్తంభముల పంక్తులు గలది, నానాతరుశతాకీర్ణా=అనేకవిధ ములైన వందలకొలది వృక్షములచేత వ్యాప్తము, సంప్రపుష్పితకాననా=పుష్పించిన అడవులు కలదీ అయిన, సా=ఆ, సరయూః=సరయూనది, ఏషా=ఇదిగో! దృశ్యతే=చూడబడుచున్నది.

తా. ఇది నా మిత్రుడైన గుహుడు నివసించు శృంగిబేరపురము. సీతా! ఇదిగో ! యూపస్తంభముల పంక్తులు గలది, అనేకవిధములైన వందలకొలది వృక్షములతో నిండినది, పుష్పించిన వనములు కలదీ అయిన ఆ సరయూనది కనబడుచున్నది. 54

మూ. ఏషా సా దృశ్యతే సీతే రాజధానీ పితుర్మమ, 55
అయోధ్యాం కురు వైదేహి ప్రణామం పునరాగతా.

ప్ర. అ. సీతే=సీతా ! ఏషా=ఇదిగో ! మమ=నాయొక్క, పితుః=తండ్రి యొక్క, సా రాజధానీ=ఆ రాజధాని, దృశ్యతే=చూడబడుచున్నది. వైదేహి=ఓ! వైదేహీ ! పునః=మరల, ఆగతా=వచ్చిన నీవు, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, ప్రణామమ్=నమస్కారమును, కురు=చేయుము.

తా. సీతా ! మా తండ్రిగారి రాజధాని ఇదిగో; ఇటు కనబడుచున్నది. ఓ ! వైదేహీ ! తిరిగి వచ్చినావు. ఈ అయోధ్యకు నమస్కారము చేయుము.55

మూ. తతస్తే వానరాః సర్వే రాక్షసాః సవిభీషణాః, 56
ఉత్పత్యోత్పత్య సంహృష్టాస్తాం పురీం దదృశుస్తదా.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తే=ఆ, సర్వే=సమస్తమైన, వానరాః=వాన రులు, సవిభీణాః=విభీషణునితో కూడిన, రాక్షసాః=రాక్షసులు, సంహృష్టాః=సంతో షించినవారై, తదా=అప్పుడు, ఉత్పత్యోత్పత్య=పైకి లేచి లేచి, తాం పురీమ్=ఆ పట్టణమును, దదృశుః=చూచిరి.

తా. పిమ్మట ఆ సమస్తవానరులు, విభీషణాదిరాక్షసులు సంతోషముతో పైకి లేచీ లేచి అయోధ్యానగరమును చూచిరి. 56

మూ. తతస్తు తాం పాణ్డురహర్మ్యమాలినీం
విశాలకక్ష్యాం గజవాజిభిర్వృతామ్,
పురీమపశ్యన్ ప్లవగాః సరాక్షసాః
పురీం మహేన్ద్రస్య యథామరావతీమ్. 57

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే త్రయోవింశత్యధికశతతమః సర్గః

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సరాక్షసాః=రాక్షసులతో కూడిన, ప్లవంగమాః=వానరులు, పాణ్డురహర్మ్యమాలినీమ్=తెల్లని మేడల పంక్తులు గలది, విశాలకక్ష్యామ్=విశాలములైన వీథులు కలది, గజవాజిభిః=గజములతోను అశ్వములతోను కూడినది, మహేన్ద్రస్య=మహేంద్రునియొక్క, పురీమ్=పట్టణమైన, అమరావతీం యథా=అమరావతి వలె ఉన్న, తాం పురీమ్=ఆ అయోధ్యను, అపశ్యన్=చూచిరి.

తా. అప్పుడు వానరులు, రాక్షసులూ కూడ తెల్లని మేడల పంక్తులు, విశాలములైన వీథులూ గల, ఏనుగులతోను గుఱ్ఱములతోను నిండిన, ఇంద్రుని అమరావతి వలె ఉన్న, ఆ అయోధ్యానగరమును చూచిరి. 57

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమువందు
యుద్ధకాండలో నూటఇరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుర్వింశత్యధికశతతమః సర్గః

[రాముడు భరద్వాజమహర్షి ఆశ్రమములో దిగి ఆయన దర్శనము చేయుట.]

మూ. పూర్ణే చతుర్దశే వర్షే పఞ్చమ్యాం లక్ష్మణాగ్రజః,
భరద్వాజాశ్రమం ప్రాప్య వవన్దే నియతో మునిమ్. 1

ప్ర. అ. చతుర్దశే=పదునాల్గవ, వర్షే=సంవత్సరము, పూర్ణే=నిండిన దగుచుండగా, పఞ్చమ్యామ్=పంచమియందు, లక్ష్మణాగ్రజః=రాముడు, భరద్వాజాశ్రమమ్=భరద్వాజుని ఆశ్రమమును, ప్రాప్య=పొంది, నియతః=నియమవంతుడై, మునిమ్=మునిని, వవన్దే=నమస్కరించెను.

తా. పదునాల్గవ సంవత్సరము పూర్తియైన పిదప పంచమినాడు రాముడు భరద్వాజాశ్రమము చేరి మనోవాక్కాయనియతుడై మునికి నమస్కరించెను. 1

మూ. సోఽపృచ్ఛదభివాద్యైనం భరద్వాజం తపోధనమ్,
శృణోషి కచ్చిద్భగవన్ సుభిక్షానామయం పురే, 2
కచ్చిత్స యుక్తో భరతో జీవన్త్యపి చ మాతరః.

ప్ర. అ. సః=రాముడు, ఏనమ్=ఈ, తపోధనమ్=తపస్సే ధనముగా గల, భరద్వాజమ్=భరద్వాజుణ్ణి, అభివాద్య=నమస్కరించి, అపృచ్ఛత్=ప్రశ్నించెను. భగవన్=పూజ్యుడా ! పురే=పట్టణమునందు, సుభిక్షానామయమ్=సుభిక్షమును ఆరోగ్యమును, శృణోషి కచ్చిత్=వినుచున్నావా? సః భరతః=ఆ భరతుడు, యుక్తః కచ్చిత్=ప్రజాపాలనమునందు జాగరూకుడుగా ఉన్నాడు కదా ? మాతరః=మా తల్లులు, అపి జీవన్తి=జీవించి ఉన్నారు కదా?

తా. రాముడు తపోధనుడైన భరద్వాజునకు నమస్కరించి ప్రశ్నించెను. పూజ్యుడా ! అయోధ్యానగరములో సుభిక్షముగా ఉన్నట్లు, ఆరోగ్య మున్నట్లు, వినుచున్నావా? భరతుడు పాలనకార్యమునందు సావధానముగా ఉన్నాడు కదా? మా తల్లు[illegible] జీవించి ఉన్నారు కదా ? 2

మూ. ఏవముక్తస్తు రామేణ భరద్వాజో మహామునిః, 3
ప్రత్యువాచ రఘుశ్రేష్ఠం స్మితపూర్వం ప్రహృష్టవత్.

ప్ర. అ. రామేణ=రామునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, మహామునిః=మహామునియైన, భరద్వాజః=భరద్వాజుడు, ప్రహృష్టవత్=సంతోషించుచు,

స్మితపూర్వమ్=చిరునవ్వు పూర్వమునందు కలుగునట్లు, రఘుశ్రేష్ఠమ్=రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. రాముని మాటలు విని మహాముని యైన భరద్వాజుడు సంతోషించుచు, చిరునవ్వుతో రామునకు ప్రత్యుత్తర మిచ్చెను. 3

4

మూ. పఙ్కదిగ్ధస్తు భరతో జటిలస్త్వాం ప్రతీక్షతే,
పాదుకే తే పురస్కృత్య సర్వం చ కుశలం గృహే.

ప్ర. అ. భరతః=భరతుడు, పఙ్కదిగ్ధః తు=పంకము చేత పూయబడినవాడై, జటిలః=జటాధారియై, తే=నీయొక్క, పాదుకే=పాదుకలను, పురస్కృత్య=ముందు ఉంచుకొని, త్వామ్=నిన్ను, ప్రతీక్షతే=ఎదురుచూచుచున్నాడు. గృహే=గృహమునందు, సర్వం చ=అంతా, కుశలమ్=క్షేమముగా ఉన్నది.

తా. భరతుడు మురికి పట్టిన శరీరముతో జటాధారియై నీ పాదుకలు ముందు ఉంచుకొని నీకోసమై ఎదురుచూచుచున్నాడు. ఇంట్లో అందరూ క్షేమమే. 4

5

మూ. త్వాం పురా చీరవసనం ప్రవిశన్తం మహావనమ్,
స్త్రీతృతీయం చ్యుతం రాజ్యాద్ధర్మకామం చ కేవలమ్, 6
పదాతిం త్యక్తసర్వస్వం పితృనిర్దేశకారిణమ్,
సర్వభోగైః పరిత్యక్తం స్వర్గచ్యుతమివామరమ్, 7
దృష్ట్వా తు కరుణా పూర్వం మమాసీత్సమితింజయ.
కైకేయీవచనే యుక్తం వన్యమూలఫలాశినమ్.

ప్ర. అ. సమితింజయ=యుద్ధములందు జయించు రామా! పురా=పూర్వము, కైకేయీవచనే=కైకేయి మాటయందు, యుక్తమ్=కట్టుబడినవాడవు, స్త్రీతృతీయమ్=భార్య మూడవదిగా గలవాడవు, రాజ్యాత్=రాజ్యమునుండి, చ్యుతమ్=జారిపోయినవాడవు, కేవలమ్=కేవలము, ధర్మకామం చ=ధర్మమునందు కోరిక గలవాడవు,పదాతిమ్=కాలినడకచే వెళ్లుచున్నవాడవు, త్యక్తసర్వస్వమ్=విడువబడిన సర్వస్వము కలవాడవు, పితృనిర్దేశకారిణమ్=తండ్రి ఆజ్ఞను చేయుచున్నవాడవు, సర్వభోగైః=సమస్తభోగములచేత, పరిత్యక్తమ్=విడువబడినవాడవు, స్వర్గచ్యుతమ్=స్వర్గమునుండి క్రిందపడిన, అమరమ్ ఇవ=దేవతాపురుషుడు వలె ఉన్నవాడవు, వన్యమూలఫలాశినమ్=వనమునకు సంబంధించిన దుంపలను ఫలములను తినుచున్నవాడవు, చీరవసనమ్=నారచీరలు ధరించినవాడవు, మహావనమ్=మహారణ్యమును, ప్రవిశన్తమ్=ప్రవేశించుచున్న, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, పూర్వమ్=పూర్వము, మమ=నాకు, కరుణా=జాలి, ఆసీత్=కలిగెను.

తా. యుద్ధములో జయమును పొందు ఓ రామా ! పూర్వము నీవు కైకేయి మాటను, తండ్రి ఆజ్ఞను పాలించుచు, రాజ్యభ్రష్టుడవై, కేవలము ధర్మమును ఆచరించుటయందే అభిలాషతో సర్వస్వమును విడచి, అన్ని భోగములు పరిత్యజించి, వనములోని దుంపలను ఫలములను తినుచు, నారచీరలు ధరించి, తమ్మునితోను భార్యతోను కలిసి కాలినడకచేత మహారణ్యములో ప్రవేశించుచుండగా చూచి నాకు అప్పుడు జాలి కలిగెను. 5-7

మూ. సాంప్రతం తు సమృద్ధార్థం సమిత్రగణబాన్ధవమ్, 8
సమీక్ష్య విజితారిం చ మమాభూత్ప్రీతిరుత్తమా.

ప్ర. అ. సాంప్రతం తు=ఇప్పుడైతే, సమృద్ధార్థమ్=సిద్ధించిన ప్రయోజనము గల, సమిత్రగణబాన్ధవమ్=మిత్రగణముతోను బంధువులతోను కూడిన, విజితారిమ్=జయించబడిన శత్రువులు గల నిన్ను, సమీక్ష్య=చూచి, మమ=నాకు, ఉత్తమా=అధికమైన, ప్రీతిః=సంతోషము, అభూత్=అయినది.

తా. ఇప్పుడు కార్యమును సాధించి, శత్రువులను సంహరించి, మిత్రబంధువులతో కలసి వచ్చిన నిన్ను చూచి నాకు చాల ఆనందము కలిగినది. 8

మూ. సర్వం చ సుఖదుఃఖం తే విదితం మమ రాఘవ,
యత్త్వయా విపులం ప్రాప్తం జనస్థాననివాసినా. 9

ప్ర. అ. రాఘవ=రామా, జనస్థాననివాసినా=జనస్థానమునందు నివసించిన, త్వయా=నీచేత, విపులమ్=అధికమైన, యత్=ఏ, సుఖదుఃఖమ్=సుఖమూ, దుఃఖమూ, ప్రాప్తమ్=పొందబడినదో, తే=నీయొక్క, సర్వమ్=అది అంతా, మమ=నాకు, విదితమ్=తెలియబడినది.

తా. రామా !నీవు జనస్థానములో ఉన్నప్పుడు అనుభవించిన, అధికమైన సుఖము దుఃఖముకూడ నాకు పూర్తిగా తెలిసినది. 9

మూ. బ్రాహ్మణార్థే నియుక్తస్య రక్షతః సర్వతాపసాన్,
రావణేన హృతా భార్యా బభూవేయమనిన్దితా. 10

ప్ర. అ. బ్రాహ్మణార్థే=బ్రాహ్మణులకొరకై, నియుక్తస్య=ప్రార్థించబడిన, సర్వతాపసాన్=సమస్తమునులను, రక్షతః=రక్షించుచున్న నీయొక్క, భార్యా=భార్యయైన, అనిన్దితా=దోషములు లేని, ఇయమ్=ఈ సీత, రావణేన=రావణునిచేత, హృతా=హరించబడినది, బభూవ=అయెను.

తా. బ్రాహ్మణుల తపస్సును రక్షించుట అనే కార్యము చేయుటకై ప్రార్థింపబడి, నీవు ఆ మునులనందరిని రక్షించుచుంటివి. నీ భార్యయైన,

దోషశూన్యురాలైన ఈ సీతను రావణుడు హరించినాడు. 10

మూ. మారీచదర్శనం చైవ సీతోన్మథనమేవ చ,
కబన్ధదర్శనం చైవ పమ్పాభిగమనం తథా. 11
సుగ్రీవేణ చ తే సఖ్యం యథా వాలీ హతస్త్వయా,
మార్గణం చైవ వైదేహ్యాః కర్మ వాతాత్మజస్య చ. 12
విదితాయాం చ సీతాయాం నలసేతుర్యథా కృతః.
యథా చాదీపితా లఙ్కా ప్రహృష్టైర్హరియూథపైః. 13
సపుత్రబాన్ధవామాత్యః సబలః సహవాహనః,
యథా చ నిహతః సంఖ్యే రావణో బలదర్పితః, 14
యథా చ నిహతే తస్మిన్ రావణే దేవకణ్టకే,
సమాగమశ్చ త్రిదశైర్యథా దత్తశ్చ తే వరః. 15
సర్వం మమైతద్విదితం తపసా ధర్మవత్సల,
సంపతన్తి చ మే శిష్యాః ప్రవృత్త్యాఖ్యాః పురీమితః. 16

ప్ర. అ. ధర్మవత్సల=ధర్మమునందు ఆసక్తి గల ఓ రామా, మారీచదర్శనం చైవ=మాయామారీచుని దర్శనము, సీతోన్మథనమేవ చ=సీతాహరణము, కబన్ధదర్శనం చైవ=కబంధుని దర్శనము, తథా=మరియు, పమ్పాభిగమనమ్=పంపను చేరుట, సుగ్రీవేణ=సుగ్రీవునితో, తే=నీయొక్క, సఖ్యమ్=స్నేహము, త్వయా=నీచేత, వాలీ=వాలి, యథా=ఎట్లు, హతః=చంపబడినాడో అదీ, వైదేహ్యాః=సీతయొక్క, మార్గణమ్=వెదకుట, వాతాత్మజస్య=హనుమంతుని యొక్క, కర్మ=కర్మ, వైదేహ్యామ్=సీత, విదితాయామ్=తెలియబడిన దగుచుండగా, నలసేతుః=నలుని సేతువు, యథా=ఎట్లు, కృతః=చేయబడినదో ఆ విషయము, ప్రహృష్టైః=సంతోషించిన, హరియూథపైః=వానరనాయకులచేత, లఙ్కా=లంక, యథా=ఎట్లు, ఆదీపితా=కాల్చబడినదో ఆ విషయము, సపుత్రబాన్ధవామాత్యః=పుత్రులతోను, బంధువులతోను, మంత్రులతోను కూడిన, సబలః=సైన్యముతో కూడిన, సహవాహనః=వాహనములతో కూడిన, బలదర్పితః=బలముచేత గర్వించిన, రావణః=రావణుడు, సంఖ్యే=యుద్ధమునందు, యథా=ఎట్లు, నిహతః=చంపబడినాడో ఆ విషయము, దేవకణ్టకే=దేవతాశత్రువైన, తస్మిన్=ఆ, రావణే=రావణుడు, నిహతే=చంపబడినవాడగుచుండగా, త్రిదశైః=దేవతలతో, సమాగమః=సమాగమము, యథా=ఎట్లు జరిగినదో ఆ విషయము, తే=నీకు, వరః చ=వరము, యథా=ఎట్లు, దత్తశ్చ=ఇవ్వబడినదో ఆ విషయము, ఏతత్=ఇది, సర్వమ్=అంతా, మయా=నాచేత, తపసా=తపస్సుచేత, విదితమ్=తెలియబడినది. ప్రవృత్త్యాఖ్యాః=వార్తలను చెప్పువారైన, మే శిష్యాః=నా శిష్యులు, ఇతః=ఇక్కడినుండి, పురీమ్=అయోధ్యాపురమును

గూర్చి, సంపతన్తి=వెళ్లుచుందురు.

తా. ధర్మరక్షకుడవైన ఓ రామా ! నీవు మాయామారీచుణ్ణి చూచుట, సీతాహరణము, నీవు కబంధుణ్ణి చూచుట, పంపకు వెళ్లుట, సుగ్రీవునితో స్నేహము, వాలిని నీవు వధించుట, సీతను వానరులు వెదకుట, హనుమంతుడు చేసిన మహాకార్యము, సీత వృత్తాంతము తెలిసిన పిమ్మట నలుడు సేతువును నిర్మించుట, సంతోషించిన వానరనాయకులు లంకను కాల్చివేయుట, పుత్ర బంధుమిత్రులతో, సైన్యముతో, వాహనములతో సహా బలముచేత గర్వితుడైన రావణుణ్ణి నీవు రణములో సంహరించుట, దేవతలకు బాధ కలిగించు, శత్రువైన ఆతనిని చంపిన పిమ్మట నీవు దేవతలతో కలియుట, వారు నీకు వరము నిచ్చుట, ఈ విషయము లన్నీ నేను తపోబలముచేత తెలిసికొన్నాను. ఇక్కడినుండి అయోధ్యకు వెళ్లివచ్చే నా శిష్యులు అక్కడి వార్తలు కూడ నాకు చెప్పుచుందురు. 11-16.

మూ. అహమప్యద్య తే దద్మి వరం శస్త్రభృతాం వర,
అర్ఘ్యం ప్రతిగృహాణేదమయోధ్యాం శ్వో గమిష్యసి. 17

ప్ర. అ. శస్త్రభృతామ్=శస్త్రములు ధరించినవారిలో, వర=శ్రేష్ఠుడా! అద్య=ఇప్పుడు, అహమపి=నేను కూడ, తే=నీకు, వరమ్=వరమును, దద్మి=ఇచ్చెదను. ఇదమ్=ఈ, అర్ఘ్యమ్=పూజను, ప్రతిగృహాణ=స్వీకరించుము. శ్వః=రేపు, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి గమిష్యసి=వెళ్ళగలవు.

తా. శస్త్రధారులలో శ్రేష్ఠుడవైన రామా ! నేను కూడ నీకు వరము ఇచ్చెదను. ఈ పూజను స్వీకరించుము. రేపు అయోధ్యకు వెళ్ళవచ్చును. 17

మూ. తస్య తచ్ఛిరసా వాక్యం ప్రతిగృహ్య నృపాత్మజః,
బాఢమిత్యేవ సంహృష్టః శ్రీమాన్వరమయాచత. 18

ప్ర. అ. శ్రీమాన్=శోభాసంపన్నుడైన, నృపాత్మజః=రాజకుమారుడైన రాముడు, సంహృష్టః=సంతోషించినవాడై, తస్య=భరద్వాజునియొక్క, తత్=ఆ, వాక్యమ్=వాక్యమును, బాఢమ్ ఇత్యేవ=తప్పక అట్లే అని పలికి, శిరసా=శిరస్సుచేత, ప్రతిగృహ్య=స్వీకరించి, వరమ్=వరమును, అయాచత=కోరెను.

తా. శ్రీమంతుడైన రాముడు భరద్వాజుని వాక్యమును తప్పక అట్లే చేసెదను అని శిరస్సు వంచి సంతోషపూర్వకముగా అంగీకరించి, వరమును కోరెను. 18

మూ. అకాలఫలినో వృక్షాః సర్వే చాపి మధుస్రవాః,
ఫలాన్యమృతగన్ధీని బహూని వివిధాని చ. 19
భవన్తు మార్గే భగవన్నయోధ్యాం ప్రతి గచ్ఛతః.

ప్ర. అ. భగవన్=పూజ్యుడా ! సర్వే చాపి=సమస్తమైన, వృక్షాః=వృక్షములు, అకాలఫలినః=అకాలమునందు కూడ ఫలించేవిగాను, మధుస్రవాః=తేనెను స్రవించేవిగను, భవన్తు=అగుగాక. అమృతగన్ధీని=అమృతముయొక్క గంధము గల, బహూని=అనేకమైన, వివిధాని చ=అనేక విధములైన, ఫలాని=ఫలములు, అయోధ్యాం ప్రతి=అయోధ్యను గూర్చి, గచ్ఛతః=వెళ్ళుచున్న నా యొక్క, మార్గే=మార్గమునందు (భవన్తు=ఉండుగాక.)

తా. పూజ్యుడవైన మహామునీ ! నేను అయోధ్యకు వెళ్లుచున్నప్పుడు మార్గములోని వృక్షములన్నీ అకాలమునందుకూడ, ఫలించుగాక. తేనెను స్రవించుగాక. అమృతమువంటి అనేకవిధములైన, అనేకఫలములు లభించుగాక.

మూ. తథేతి చ ప్రతిజ్ఞాతే వచనాత్సమనన్తరమ్, 20
అభవన్పాదపాస్తత్ర స్వర్గపాదపసంనిభాః.

ప్ర. అ. తథేతి=అట్లే అని, ప్రతిజ్ఞాతే=ప్రతిజ్ఞ చేయబడిన దగుచుండగా, వచనాత్=ఆ వచనముకంటె, సమనన్తరమ్=వెంటనే, తత్ర=అక్కడ, పాదపాః=వృక్షములు, స్వర్గపాదపసంనిభాః=స్వర్గమునందలి వృక్షములతో సమానములుగా, అభవన్=అయినవి.

తా. అట్లే అగుగాక అని ఆ ముని పలికిన వెంటనే అక్కడ నున్న వృక్షము లన్నీ స్వర్గము లోని వృక్షములతో సమానము లయ్యెను. 20

మూ. నిష్ఫలాః ఫలినశ్చాసన్విపుష్పాః పుష్పశాలినః. 21
శుష్కాః సమగ్రపత్రాస్తే నగాశ్చైవ మధుస్రవాః,
సర్వతో యోజనాస్త్రిస్రో గచ్ఛతామభవంస్తదా. 22

ప్ర. అ. తదా=అప్పుడు, గచ్ఛతామ్=వెళ్లుచున్న వారియొక్క, తిస్రః=మూడు, యోజనాః=యోజనములు, సర్వతః=అన్నివైపుల, నగాః=వృక్షములు, నిష్ఫలాః=ఫలములు లేనివిగాను, ఫలినశ్చ=ఫలములు గలవి, విపుష్పాః=పుష్పములు లేనివి, పుష్పశాలినః=పుష్పములతో ప్రకాశించేవిగాను, శుష్కాః=ఎండినవి, సమగ్ర పత్రాశ్చ=పూర్తిగా ఉన్న ఆకులు కలవిగాను, మధుస్రవాః=తేనెను స్రవించునవి గాను, అభవన్=అయినవి.

తా. వారు వెళ్లవలసిన మూడు యోజనముల దూరములో అంతటా కూడ పండ్లు లేని చెట్లు పండ్లతో నిండెను. పూవులు లేనివి పూవులు పూసెను.

ఎండిపోయినవి పూర్తిగా ఆకులతో నిండెను. అన్ని చెట్లూ తేనెను స్రవించెను.

మూ. తతః ప్రహృష్టాః ప్లవగర్షభాస్తే
బహూని దివ్యాని ఫలాని చైవ,
కామాదుపాశ్నన్తి సహస్రశస్తే
ముదాన్వితాః స్వర్గజితో ముదేవ. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే చతుర్వింశత్యధిక శతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తే ప్లవగర్షభాః=ఆ వానరశ్రేష్ఠులు, ప్రహృష్టాః=సంతోషించిన వారై, స్వర్గజితః=స్వర్గమును జయించినవారు, ముదేవ=సంతోషముతో కూడినట్లు, ముదా=సంతోషముతో, అన్వితాః=కూడినవారై, బహూని=అనేకమైన, దివ్యాని=దివ్యములైన, ఫలాని=ఫలములను, సహస్రశః=వేలకొలది, కామాత్=ఇష్టానుసారము, ఉపాశ్నన్తి=తినిరి.

తా. పిమ్మట సంతోషించిన ఆ వానరనాయకులు, స్వర్గమును జయించిన వారు వలె ఆనందభరితులై, దివ్యములైన అనేకములైన ఆ ఫలములను ఇష్టానుసారము భుజించిరి. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరువదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చవింశత్యధికశతతమః సర్గః

[హనుమంతుడు గుహునకు, భరతునకు రాముని రాకను గూర్చి చెప్పుట. భరతుడు సంతోషించి హనుమంతునకు బహుమతి ఇచ్చుటకు నిశ్చయించుట.]

మూ. అయోధ్యాం తు సమాలోక్య చిన్తయామాస రాఘవః,
ప్రియకామః ప్రియం రామస్తతస్త్వరితవిక్రమః 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రఘువంశసంజాతుడు, త్వరితవిక్రమః=శీఘ్రమైన పరాక్రమము గలవాడు అయిన, రామః=రాముడు, అయోధ్యామ్=అయోధ్యను, సమాలోక్య=చూచి, ప్రియకామః=ప్రియమైన విషయమును చేయ కోరిక గలవాడై, ప్రియమ్=ప్రియవిషయమును గూర్చి, చిన్తయామాస=ఆలోచించెను.

తా. పిమ్మట రఘువంశసంజాతుడు, శీఘ్రపరాక్రమము గలవాడు అయిన రాముడు అయోధ్యను చూచి, ప్రియవిషయము చేయదలచినవాడై, అట్టి ప్రియమును గూర్చి ఆలోచన చేసెను. 1

మూ. చిన్తయిత్వా తతో దృష్టిం వానరేషు న్యపాతయత్,
ఉవాచ ధీమాంస్తేజస్వీ హనూమన్తం ప్లవఙ్గమమ్. 2

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ధీమాన్=బుద్ధిమంతుడు, తేజస్వీ=తేజఃశాలీ అయిన రాముడు, చిన్తయిత్వా= ఆలోచించి, వానరేషు=వానరులయందు, దృష్టిమ్=దృష్టిని, న్యపాతయత్=ప్రసరింపచేసెను. ప్లవఙ్గమమ్=వానరుడైన, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. బుద్ధిమంతుడు, తేజఃశాలీ అయిన రాముడు ఆలోచించి, పిదప వానరులపై దృష్టి ప్రసరింపచేసి, హనుమంతునితో ఇట్లు పలికెను. 2

మూ. అయోధ్యాం త్వరితో గత్వా శీఘ్రం ప్లవగసత్తమ,
జానీహి కచ్చిత్కుశలీ జనో నృపతిమన్దిరే. 3

ప్ర. అ. ప్లవగసత్తమ=వానరోత్తమా! త్వరితః=తొందరపడుచున్నవాడవై, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, శీఘ్రమ్=శీఘ్రముగా, గత్వా=వెళ్లి, నృపతిమన్దిరే=రాజభవనమునందు, జనః=జనము, కుశలీ కచ్చిత్= కుశలమే కదా అను విషయమును, జానీహి=తెలిసికొనుము.

తా. వానరశ్రేష్ఠా ! నీవు శీఘ్రముగా అయోధ్యకు వెళ్ళి రాజభవనములోని వా రందరూ క్షేమమా అను విషయము తెలిసికొనుము. 3

మూ. శృఙ్గబేరపురం ప్రాప్య గుహం గహనగోచరమ్,
నిషాదాధిపతిం బ్రూహి కుశలం వచనాన్మమ. 4

ప్ర. అ. శృఙ్గబేరపురమ్=శృంగబేరపురమును గూర్చి, గత్వా=వెళ్లి, గహనగోచరమ్=అరణ్యములో నివసించు, నిషాదాధిపతిమ్=నిషాదుల ప్రభువైన, గుహమ్=గుహుణ్ణి గూర్చి, మమ=నాయొక్క, వచనాత్=వచనమువలన, కుశలమ్=కుశలమును, బ్రూహి=చెప్పుము.

తా. శృంగబేరపురమునకు వెళ్లి, అరణ్యములో నివసించు, నిషాదప్రభువైన గుహునితో నా మాటగా కుశలమును చెప్పుము. 4

మూ. శ్రుత్వా తు మాం కుశలినమరోగం విగతజ్వరమ్,
భవిష్యతి గుహః ప్రీతః స మమాత్మసమః సఖా. 5

ప్ర. అ. మామ్=నన్ను, కుశలినమ్=క్షేమముగా ఉన్నవానినిగాను, అరోగమ్=రోగములు లేనివానినిగాను, విగతజ్వరమ్=పోయిన బాధలు కలవానినిగాను, శ్రుత్వా=విని, గుహః=గుహుడు, ప్రీతః=సంతోషించినవాడు, భవిష్యతి=కాగలడు. సః=అతడు, మమ=నాకు, ఆత్మసమః=నాతో సమానుడైన, సఖా=మిత్రుడు.

తా. నేను ఏ రోగము లేక, బాధలు తొలగి సుఖముగా ఉన్నా నని విని గుహుడు సంతోషించగలడు. అతడు నాకు నాతో సమానుడైన స్నేహితుడు.5

మూ. అయోధ్యాయాశ్చ తే మార్గం ప్రవృత్తిం భరతస్య చ,
నివేదయిష్యతి ప్రీతో నిషాదాధిపతిర్గుహః. 6

ప్ర. అ. ప్రీతః=సంతోషించిన, నిషాదాధిపతిః=నిషాదుల అధిపతియైన, గుహః=గుహుడు, తే=నీకు, అయోధ్యాయాః=అయోధ్యకు, మార్గమ్=మార్గమును, భరతస్య=భరతునియొక్క, ప్రవృత్తిం చ=వృత్తాంతమును, నివేదయిష్యతి=చెప్పగలడు.

తా. నిషాదుల ప్రభువైన ఆ గుహుడు సంతోషించి నీకు అయోధ్య వెళ్ళే మార్గమును, భరతుని వృత్తాంతమును చెప్పగలడు. 6

మూ. భరతస్తు త్వయా వాచ్యః కుశలం వచనాన్మమ,
సిద్ధార్థం శంస మాం తస్మై సభార్యం సహలక్ష్మణమ్. 7

ప్ర. అ. భరతః తు=భరతుడు, మమ=నాయొక్క, వచనాత్=వచనమువలన, కుశలమ్=క్షేమమును వాచ్యః= చెప్పదగినవాడు. సభార్యమ్=భార్యతో కూడిన,

సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, మామ్=నన్ను, సిద్ధార్థమ్= పూర్ణమైన కార్యము కలవానినిగా, తస్మై=వానికొరకు, శంస=చెప్పుము.

తా. నీవు నా మాటగా భరతునితో నా కుశలవృత్తాంతమును చెప్పుము. భార్యతోను, లక్ష్మణునితోను కూడిన నేను నా కార్యమును (పితృవాక్యపాలనమును) పరిపూర్ణము కావించితి నని చెప్పుము. 7

మూ. హరణం చాపి వైదేహ్యా రావణేన బలీయసా,
సుగ్రీవేణ చ సంవాదం వాలినశ్చ వధం రణే. 8

ప్ర. అ. బలీయసా=బలవంతుడైన, రావణేన=రావణునిచేత, వైదేహ్యాః= సీతయొక్క, హరణమ్=హరణమును, సుగ్రీవేణ=సుగ్రీవునితో, సంవాదం చ=సం భాషణమును, రణే=యుద్ధమునందు, వాలినః=వాలియొక్క, వధమ్=వధను, (శంస=చెప్పుము.)

తా. బలవంతుడైన రావణుడు సీతను అపహరించుటను, సుగ్రీవునితో నా సంభాషణమును, యుద్ధములో వాలివధను ఆతనికి చెప్పుము. 8

మూ. మైథిల్యన్వేషణం చైవ యథా చాధిగతా త్వయా,
లఙ్ఘయిత్వా మహాతోయమాపగాపతిమవ్యయమ్. 9

ప్ర. అ. మైథిల్యన్వేషణం చైవ=సీతను వెదకుటను, త్వయా=నీచేత, మహాతోయమ్=గొప్ప ఉదకము గల, అవ్యయమ్=అనంతమైన, ఆపగాపతిమ్= సముద్రమును, లఙ్ఘయిత్వా=దాటి, యథా=ఎట్లు, అధిగతా=పొందబడినదో ఆ విషయమును (చెప్పుము).

తా. సీతను అన్వేషించుటను, నీవు అత్యధికమైన జలముగల, అనంతమైన సముద్రమును దాటి ఆమెను కనుగొన్న విధమును చెప్పుము. 9

మూ. ఉపయానం సముద్రస్య సాగరస్య చ దర్శనమ్,
యథా చ కారితః సేతూ రావణశ్చ యథా హతః. 10

ప్ర. అ. సముద్రస్య=సముద్రముయొక్క, ఉపయానమ్=సమీపించు టను, సాగరస్య=సముద్రముయొక్క, దర్శనం చ=దర్శనమును, సేతుః=సేతువు, యథా=ఎట్లు, కారితః=కట్టించబడినదో, రావణశ్చ=రావణుడు, యథా=ఎట్లు, హతః=చంపబడినాడో ఆ విషయములను (చెప్పుము).

తా. నేను సైన్యముతో సముద్రము చేరుటను, సముద్రుడు నాకు దర్శన మిచ్చుటను, సేతువును కట్టించుటను, రావణుని వధను చెప్పుము.10

మూ. వరదానం మహేన్ద్రేణ బ్రహ్మణా వరుణేన చ,
మహాదేవప్రసాదాచ్చ పిత్రా మమ సమాగమమ్. 11

ప్ర. అ. మహేన్ద్రేణ=మహేంద్రునిచేతను, బ్రహ్మణా=బ్రహ్మచేతను, వరుణేన చ=వరుణునిచేతను, వరదానమ్= వరదానమును, మహాదేవప్రసాదేవ=మహేశ్వరుని అనుగ్రహముచేత, పిత్రా=తండ్రితో, మమ=నాయొక్క, సమాగమమ్=సమాగమమును, (చెప్పుము).

తా. బ్రహ్మేంద్రవరుణులు నాకు వరము లిచ్చుటను, మహేశ్వరుని అనుగ్రహముచేత నేను తండ్రిగానిని కలియుటను చెప్పుము. 11

మూ. ఉపయాతం చ మాం సౌమ్య భరతాయ నివేదయ,
సహ రాక్షసరాజేన హరీణామీశ్వరేణ చ. 12

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! మామ్=నన్ను, రాక్షసరాజేన సహ=విభీషణునితోను, హరీణామ్= వానరులయొక్క, ఈశ్వరేణ=ప్రభువైన, సుగ్రీవునితోను, ఉపయాతమ్=వచ్చినవానినిగా, భరతాయ=భరతునకు, నివేదయ=తెలుపుము.

తా. సౌమ్యుడా ! నేను విభీషణునితోను సుగ్రీవునితోను కలిసి వచ్చినట్లు, భరతునకు తెలుపుము. 12

మూ. జిత్వా శత్రుగణాన్ రామః ప్రాప్య చానుత్తమం యశః,
ఉపాయాతి సమృద్ధార్థః సహ మిత్రైర్మహాబలైః. 13

ప్ర. అ. రామః=రాముడు, శత్రుగణాన్=శత్రుగణములను, జిత్వా=జయించి, అనుత్తమామ్=చాల ఉత్తమమైన, యశః=కీర్తిని, ప్రాప్య చ=పొంది, సమృద్ధార్థః=సఫలమైన కార్యము గలవాడై, మహాబలైః=గొప్ప బలము గల, మిత్రైః సహ=మిత్రులతో కూడ, ఉపాయాతి=వచ్చుచున్నాడు.

తా. రాముడు శత్రువుల నందరినీ జయించి, చాల ఉత్తమమైన కీర్తిని పొంది, కార్యమునందు సఫలుడై, మహాబలవంతులైన మిత్రులతో కలిసి వచ్చుచున్నాడు. అని చెప్పుము. 13

మూ. ఏతచ్ఛ్రుత్వా యమాకారం భజతే భరతస్తతః,
స చ తే వేదితవ్యః స్యాత్సర్వం యచ్చాపి మాం ప్రతి. 14

ప్ర. అ. ఏతత్=దీనిని, శ్రుత్వా=విని, తతః=అటుపిమ్మట, భరతః=భరతుడు, యమ్=ఏ, ఆకారమ్= ఆకారమును, భజతే=పొందునో, సః చ=అది కూడ, తే=నీకు, వేదితవ్యః=తెలియదగినది. మాం ప్రతి=నన్ను గూర్చి, యచ్చాపి=ఏదేది, స్యాత్=అగునో, సర్వమ్=అది అంతా కూడ, (తెలియదగినది).

తా. ఈ మాటలు విన్న పిమ్మట భరతుని ఆకారము (ముఖప్రసాదము మొదలగునది) ఎట్లుండునో నీవు గమనింపవలెను. నన్ను గూర్చి మరి యేమైన జరిగినను అది గమనించవలెను. 14

మూ. జ్ఞేయాః సర్వే చ వృత్తాన్తాః భరతస్యేఙ్గితాని చ,
తత్త్వేన ముఖవర్ణేన దృష్ట్యా వ్యాభాషితేన చ. 15

ప్ర. అ. సర్వేచ=సమస్తమైన, వృత్తాన్తాః=వృత్తాంతములు, జ్ఞేయాః=తెలియదగినవి. ముఖవర్ణేన= ముఖము రంగుచేత, దృష్ట్యా=చూపుచేత, వ్యాభాషితేవ చ=మాటలచేత, భరతస్య=భరతునియొక్క, ఇఙ్గితాని=చేష్టలు, (లోపలనున్న భావాలు), తత్త్వతః=యథార్థముగా, జ్ఞేయాః=తెలియదగినవి.

తా. అక్కడ జరుగుచున్న వృత్తాంతము లన్నీ తెలుసుకొనుము. ముఖవర్ణముచేత, చూపుచేత, మాటలచేత, భరతుని ముఖభావాలను సరిగా తెలుసుకొనవలెను. 15

మూ. సర్వకామసమృద్ధం హి హస్త్యశ్వరథసంకులమ్,
పితృపైతామహం రాజ్యం కస్య నావర్తయేన్మనః.

ప్ర. అ. సర్వకామసమృద్ధమ్=సమస్తకామములతో సమృద్ధమైన, హస్త్యశ్వరథసంకులమ్= ఏనుగులతోను గుఱ్ఱములతోను రథములతోను వ్యాప్తమైన, పితృపైతామహమ్ =తండ్రితాతలకు సంబంధించిన, రాజ్యమ్=రాజ్యము, కస్య=ఎవనియొక్క, మనః=మనస్సును, న ఆవర్తయేత్=త్రిప్పివేయకుండా ఉండును?

తా. సమస్తభోగాలతో సమృద్ధమై, ఏనుగులతో, గుఱ్ఱములతో, రథములతో నిండి ఉన్న తండ్రితాతలనుండి వచ్చుచున్న రాజ్యము ఎవరి మనస్సును మార్చివేయదు? 16

మూ. సంగత్యా భరతః శ్రీమాన్ రాజ్యేనార్థీ స్వయం భవేత్,
ప్రశాస్తు వసుధాం సర్వామఖిలాం రఘునన్దనః. 17

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, భరతః=భరతుడు, సంగత్యా=ఇంతకాలము ఏర్పడిన సంబంధముచేత, రాజ్యేన=రాజ్యముచేత, అర్థీ=కోరిక గలవాడుగా, స్వయమ్=తానే, భవేత్=అయితే, రఘునన్దనః=ఆ భరతుడే, సర్వామ్=సమస్తమైన, అఖిలామ్=ఖండములు చేయబడని, వసుధామ్=భూమిని, ప్రశాస్తు=పరిపాలించుగాక.

తా. ఇంత కాలము రాజ్యముతో సంబంధ ముండుటచేత శ్రీమంతుడైన భరతునకు తనకే ఈ రాజ్య ముండవలె నను కోరిక ఉన్నచో ఆతడే ఈ సమస్తభూమండలమును పాలించుగాక. 17

మూ. తస్య బుద్ధిం చ విజ్ఞాయ వ్యవసాయం చ వానర,
యావన్న దూరం యాతాః స్మ క్షిప్రమాగన్తుమర్హసి. 18

ప్ర. అ. వానర=హనుమంతుడా ! తస్య=ఆతనియొక్క, బుద్ధిమ్=బుద్ధిని, వ్యవసాయం చ=ఉద్యమమును, విజ్ఞాయ=తెలిసికొని, యావత్=ఎంతలో, దూరమ్=దూరమును, న యాతాః స్మః=వెళ్ళమో అంతలో, క్షిప్రమ్= శీఘ్రముగా, ఆగన్తుమ్=వచ్చుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. హనుమంతుడా ! భరతుని ఆలోచనను, ప్రయత్నాలను తెలిసికొని మేము అయోధ్యకు చాల దూరము వెళ్ళక ముందే శీఘ్రముగా రమ్ము. 18

వి. భరతుని స్వభావము పూర్తిగా తెలిసి ఉండి కూడ రాము డిట్లు ఆతనిని పరీక్షించుటకై ప్రయత్నించుట అసంగతముగా ఉన్నది. అందుచేత గోవిందరాజులు తమ వ్యాఖ్యానములో --"భరతుడు పూర్వము రాజ్యమును నిరాకరించినను, ఇప్పుడు నేను వచ్చి ఈ రాజ్యము నీవే తీసికొమ్ము అని చెప్పినచో తీసికొనే అభిప్రాయములో ఉండునేమో తెలిసికొని రమ్ము" అని రాముని అభిప్రాయమని చెప్పినారు. కాని 16, 17, శ్లోకాల అర్థం ఆ భావాన్ని ఇచ్చేటట్లుగా లేదు. అందుచేతనే ఈ వ్యాఖ్యాత --"రాముడు భరతుని స్వభావము పూర్తిగా తెలిసినవాడైనను లౌకికదృష్టితో రాజనీత్యనుసారము ఈ విధముగా పరీక్షించవలెను గాన అట్లు చేసినాడు అని కొందరి అభిప్రాయము" అని చివర వ్రాసినారు. అయితే ప్రాచ్యపాఠంలో ఈ ఘట్టంలో ఉన్న నాలుగు శ్లోకాలు కొంతవరకు ఈ అశంకకు సమాధానము ఇచ్చేవిగా ఉన్నాయి.--

"న తస్యైవంవిధం చిత్తం భూతపూర్వం కదాచన,
ప్రకృతిర్నీతిశాస్త్రాణాం యేనైవం క్రియతే మయా,
కామం న స నరవ్యాఘ్రః కృతాం సంస్థామతిక్రమేత్,
న స మార్గాత్తు విచలేద్ధర్మో మానుషవిగ్రహః,
హృదయేనాభిజానామి భరతస్య తు హృద్గతమ్,
మన్నిమిత్తమపి ప్రాణాంస్త్యజేన్నాస్త్యత్ర సంశయః."

"ఆ భరతుని చిత్తము పూర్వ మెన్నడూ ఇట్లు ఆలోచించలేదు. అయినను నేను నీతి శాస్త్రములో విధించినదానిని బట్టి ఇట్లు చేయుచున్నాను. మానవులలో శ్రేష్ఠుడైన ఆ భరతుడు మర్యాదను ఎన్నడూ అతిక్రమించడు. ఆతడు మనుష్యరూపములో ఉన్న ధర్మము. ఉత్తమమార్గమునుండి చలించడు. భరతుని హృదయము ఎట్టిదో నా హృదయానికి తెలియును. నాకోసమై ఆతడు ప్రాణాలు కూడా పరిత్యజించును. సందేహము లేదు"అని వీటి భావము. 18

మూ. ఇతి ప్రతిసమాదిష్టో హనూమాన్ మారుతాత్మజః,
మానుషం ధారయన్ రూపమయోధ్యాం త్వరితో యయౌ. 19

ప్ర. అ. ఇతి=ఇట్లు, ప్రతిసమాదిష్టః=ఆజ్ఞాపింపబడిన, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్= హనుమంతుడు, త్వరితః=తొందరపడుచు, మానుషం రూపమ్=మనుష్యరూపమును, ధారయన్=ధరించుచు, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. ఇట్లు రాముడు ఆజ్ఞాపింపగా వాయుపుత్రుడైన హనుమంతుడు మనుష్యరూపము ధరించి తొందరపడుచు అయోధ్య వైపు వెళ్లెను. 19

మూ. అథోత్పపాత వేగేన హనూమాన్ మారుతాత్మజః,
గరుత్మానివ వేగేన జిఘృక్షన్ పన్నగోత్తమమ్. 20

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనూమాన్=హనుమంతుడు, పన్నగోత్తమమ్=ఉత్తమమైన సర్పమును, వేగేన=వేగముతో, జిఘృక్షన్=గ్రహింపనిచ్ఛయించుచున్న, గరుత్మానివ= గరుత్మంతుడు వలె, వేగేన= వేగముతో, ఉత్పపాత=ఎగిరెను.

తా. పిమ్మట వాయుపుత్రుడైన హనుమంతుడు మహాసర్పమును పట్టదలచిన గరుత్మంతుడు వేగముగా ఎగిరినట్లు పైకి వేగముగా ఎగిరెను.20

మూ. లఙ్ఘయిత్వా పితృపథం విహగేన్ద్రాలయం శుభమ్,
గఙ్గాయమునయోర్భీమం సమతీత్య సమాగమమ్, 21
శృఙ్గబేరపురం ప్రాప్య గుహమాసాద్య వీర్యవాన్.
స వాచా శుభయా హృష్టో హనుమానిదమబ్రవీత్. 22

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమమును గల, సః హనుమాన్=ఆ హనుమంతుడు, విహగేన్ద్రాలయమ్= పక్షులకు స్థానమైన, శుభమ్=శుభకరమైన, పితృపథమ్=తన తండ్రియైన వాయుదేవుని మార్గమును, లఙ్ఘయిత్వా= లంఘించి, గఙ్గాయమునయోః= గంగాయమునలయొక్క, భీమమ్=భయంకరమైన, సమాగమమ్=సమాగమమును, సమతీత్య=దాటి, శృఙ్గబేరపురమ్=శృంగబేరపురమును, ప్రాప్య=పొంది, గుహమ్= గుహుణ్ణి, ఆసాద్య=సమీపించి, హృష్టః=సంతోషించినవాడై, శుభయా=శుభమైన, వాచా=వాక్కుతో, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పరాక్రమవంతుడైన హనుమంతుడు, పక్షుల సంచారస్థానమైన ఆకాశములోనికి ఎగిరి, భయంకరమైన గంగాయమునాసంగమమును దాటి, శృంగబేరపురము చేరి, గుహునివద్దకు వెళ్లి శుభకరమైన వాక్కుతో సంతోషపూ

ర్వకముగా ఇల్లు పలికెను. 21,22

మూ. సఖా తు తవ కాకుత్స్థో రామః సత్యపరాక్రమః,
ససీతః సహసౌమిత్రిః స త్వాం కుశలమబ్రవీత్. 23

ప్ర. అ. తవ=నీయొక్క, సఖా=స్నేహితుడు, కాకుత్స్థః=కకుత్స్థుని వంశమునందు పుట్టినవాడు, సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గలవాడు, ససీతః=సీతతో కూడిన వాడు, సహసౌమిత్రిః=లక్ష్మణునితో కూడిన వాడు అయిన, సః రామః=ఆ రాముడు, త్వామ్=నిన్ను, కుశలమ్=కుశలమును, అబ్రవీత్=పలికెను.

తా. నీ మిత్రుడు, కకుత్స్థవంశమునందు పుట్టినవాడు, సత్యమైన పరాక్రమము గలవాడు, సీతాలక్ష్మణసమేతుడు అయిన ఆ రాముడు నీ క్షేమమును అడుగుచున్నాడు. 23

మూ. పఞ్చమీమద్య రజనీముషిత్వా వచనాన్మునేః,
భరద్వాజాభ్యనుజ్ఞాతం ద్రక్ష్యస్యద్యైవ రాఘవమ్. 24

ప్ర. అ. అద్య=నేడు, మునేః=మునియొక్క, వచనాత్=వచనమువలన, పఞ్చమీమ్=పంచమికి సంబంధించిన, రజనీమ్=రాత్రిని, ఉషిత్వా=ఉండి, భరద్వాజాభ్యనుజ్ఞాతమ్=భరద్వాజునిచేత అనుజ్ఞ ఇవ్వబడిన, రాఘవమ్= రాముణ్ణి, అద్యైవ=అచిరకాలమునందే, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. రాముడు భరద్వాజమహర్షి మాట ప్రకారము పంచమినాటి రాత్రి ఆ ఆశ్రమములో ఉండి, ఆ ముని అనుమతిచే (రేపు) బయలుదేరి రాగలడు. అట్టి రాముణ్ణి అచిరకాలములో చూడగలవు. 24

మూ. ఏవముక్త్వా మహాతేజాః సంప్రహృష్టతనూరుహః,
ఉత్పపాత మహావేగాద్వేగవానవిచారయన్. 25

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సంప్రహృష్టతనూరుహః=గగుర్పాటు చెందిన రోమములు గల, వేగవాన్=వేగము గల ఆ హనుమంతుడు, అవిచారయన్=ఆలోచించనివాడై, మహావేగాత్=గొప్ప వేగమువలన, ఉత్పపాత=ఎగిరెను.

తా. సంతోషముతో గగుర్పాటు చెందిన శరీరము గల, గొప్ప తేజస్సు, వేగము గల ఆ హనుమంతుడు, మరొక ఆలోచన ఏమీ లేనివాడై వేగముగా ఎగిరెను. 25

మూ. సో౽పశ్యద్రామతీర్థం చ నదీం వాలుకినీం తథా,
వరూథీం గోమతీం చైవ భీమం శాలవనం తథా, 26
ప్రజాశ్చ బహుసాహస్రీః స్ఫీతాన్ జనపదానపి.

ప్ర. అ. సః=ఆ హనుమంతుడు, రామతీర్థం చ=పరశురామతీర్థమును, తథా=మరియు, వాలుకినీం నదీమ్=వాలుకినీనదిని, వరూథీమ్=వరూథిని, గోమతీం చైవ=గోమతిని, తథా=మరియు, భీమమ్=భయంకరమైన, శాలవనమ్=శాలవృక్షముల వనమును, బహుసాహస్రీః=ఎన్నో వేలమంది, ప్రజాశ్చ=ప్రజలను, స్ఫీతాన్=విశాలములైన, జనపదానపి=జనపదములను, అపశ్యత్=చూచెను.

తా. హనుమంతుడు దారిలో పరశురామతీర్థమును, వాలుకీనదిని, వరూథీనదిని, గోమతీనదిని, భయంకరమైన మద్దిచెట్ల అడవిని, వేలకొలది ప్రజలను, విశాలములైన జనపదములను చూచెను. 26

మూ. స గత్వా దూరమధ్వానం త్వరితః కపికుఞ్జరః, 27
ఆససాద ద్రుమాన్ ఫుల్లాన్నన్దిగ్రామసమీపగాన్, 1
సురాధిపస్యోపవనే యథా చైత్రరథే ద్రుమాన్, 28
స్త్రీభిః సపుత్రైర్వృద్ధైశ్చ రమమాణైః స్వలంకృతైః.

ప్ర. అ. సః=ఆ, కపికుఞ్జరః=వానరశ్రేష్ఠుడు, త్వరితః=తొందరపడుచున్నవాడై, దూరమ్=దూరమైన, అధ్వానమ్=మార్గమును, గత్వా=వెళ్లి, స్త్రీభిః=స్త్రీలచేతను, సపుత్రైః=పుత్రులతో కూడిన, స్వలంకృతైః= బాగుగా అలంకరించబడిన, రమమాణైః=క్రీడించుచున్న, వృద్ధైశ్చ=వృద్ధులచేతను సేవింపబడుచున్న, సురాధిపస్య=దేవేంద్రునియొక్క, ఉపవనే=ఉద్యానమైన నందనమునందు, చైత్రరథే=చైత్రరథమునందు ఉన్న, ద్రుమాన్ యథా= వృక్షముల వలె ఉన్న, నన్దిగ్రామసమీపగాన్=నందిగ్రామసమీపమునం దున్న, ఫుల్లాన్=వికసించిన, ద్రుమాన్= వృక్షములను, ఆససాద=సమీపించెను.

తా. హనుమంతుడు తొందరపడుచు దూరమైన మార్గమును దాటి వెళ్లి, దేవేంద్రుని ఉద్యానమైన నందనవనమునందు చైత్రరథ మను ఉద్యానమునందు ఉన్న వృక్షముల వలె ఉన్న, నందిగ్రామము సమీపమునం దున్న వికసించిన వృక్షములను సమీపించెను. అవి స్త్రీలచేతను, పుత్రులతో కూడిన, బాగుగా అలంకరించుకొనియున్న, విహరించుచున్న వృద్ధులచేతను సేవింపబడుచుండెను.

మూ. క్రోశమాత్రే త్వయోధ్యాయాశ్చీరకృష్ణాజినామ్బరమ్, 29
దదర్శ భరతం దీనం కృశమాశ్రమవాసినమ్,

జటిలం మలదిగ్ధాఙ్గం భ్రాతృవ్యసనకర్శితమ్. 30
ఫలమూలాశినం దాన్తం తాపసం ధర్మచారిణమ్,
సమున్నతజటాభారం వల్కలాజినవాససమ్. 31
నియతం భావితాత్మానం బ్రహ్మర్షిసమతేజసమ్,
పాదుకే తే పురస్కృత్య ప్రశాసన్తం వసుంధరామ్, 32
చాతుర్వర్ణ్యస్య లోకస్య త్రాతారం మహతో భయాత్,
ఉపస్థితమమాత్యైశ్చ శుచిభిశ్చ పురోహితైః, 33
బలముఖ్యైశ్చ యుక్తైశ్చ కాషాయామ్బరధారిభిః.

ప్ర. అ. అయోధ్యాయాః=అయోధ్యనుండి, క్రోశమాత్రే=క్రోశదూరమునందు, చీరకృష్ణాజినామ్బరమ్=నారచీరలు కృష్ణాజినము వస్త్రములుగా గలవాడు, దీనమ్=దీనుడు, కృశమ్=కృశించినవాడు, జటిలమ్=జటాధారి, మలదిగ్ధాఙ్గమ్=మురికిచేత పూయబడిన శరీరము గలవాడు, భ్రాతృవ్యసనకర్శితమ్=సోదరుని గూర్చిన దుఃఖముచేత కృశింపచేయబడినవాడు, ఫలమూలాశినమ్=ఫలమూలములను తినుచున్నవాడు, దాన్తమ్=ఇంద్రియ నిగ్రహము గలవాడు, తాపసమ్=తాపసుడు, ధర్మచారిణమ్=ధర్మమును ఆచరించుచున్నవాడు, సమున్నతజటాభారమ్=ఎత్తైన జటాభారము గలవాడు, వల్కలాజినవాససమ్=నారచీరలు, చర్మము వస్త్రముగా గలవాడు, నియతమ్=నియమవంతుడు, భావితాత్మానమ్=పవిత్రము చేయబడిన మనస్సు గలవాడు, బ్రహ్మర్షిసమతేజసమ్= బ్రహ్మర్షులతో సమానమైన తేజస్సు గలవాడు, తే=ఆ, పాదుకే=పాదుకలను, పురస్కృత్య=ఎదుట ఉంచుకొని, వసుంధరామ్=భూమిని, ప్రశాసన్తమ్=శాసించుచున్నవాడు, చాతుర్వర్ణ్యస్య=చతుర్వర్ణాత్మకమైన, లోకస్య=లోకమునకు, సర్వతః=సమస్తమైన, భయాత్=భయమునుండి, త్రాతారమ్=రక్షకుడు, శుచిభిః=పరిశుద్ధులైన, అమాత్యైశ్చ=మంత్రులచేతను, పురోహితైః=పురోహితులచేతను, యుక్తైః=తమ తమ విధులందు సావధానచిత్తులైన, బలముఖ్యైశ్చ=సేనానాయకులచేతను, ఉపస్థితమ్=సమీపించబడినవాడు అయిన, ఆశ్రమవాసినమ్=ఆశ్రమములో నివసించుచున్న, భరతమ్=భరతుణ్ణి, దదర్శ=చూచెను.

తా. హనుమంతుడు అయోధ్యకు క్రోశు దూరములో నారచీరలు, కృష్ణాజినము ధరించి ఆశ్రమములో నివసించుచున్న కృశించి దీనుడుగా ఉన్న భరతుని చూచెను. సోదరుని గూర్చిన దుఃఖముచేత కృశింపచేయబడిన ఆ భరతుడు, జడలు కట్టిన జుట్టుతో మురికి పట్టిన దేహముతో ఉండెను. అతడు ఫలమూలములు తినుచు ఇంద్రియములను నిగ్రహించుకొని తాపసుడై ధర్మమును ఆచరించుచుండెను. ఎత్తైన జటాభారముతో నారచీరలు, చర్మము వస్త్రములుగా ధరించి నియమవంతుడై, పరిశుద్ధమైన మనస్సుతో బ్రహ్మర్షితో సమానమైన

తేజస్సుతో ప్రకాశించుచుండెను. రామపాదుకలు ఎదుట ఉంచుకొని రాజ్యమును పాలించుచుండెను. లోకములో ఉన్న నాలుగు వర్ణముల వారిని ఎట్టి భయము లేకుండ రక్షించుచుండెను. శుద్ధమైన చరిత్రగల మంత్రులు, పురోహితులు, పనులలో సావధానచిత్తులైన సేనానాయకులు కాషాయాంబరధారులై ఆతని దగ్గర కూర్చొని ఉండిరి. 29 - 33

మూ. న హి తే రాజపుత్రం తం చీరకృష్ణాజినామ్బరమ్, 34
పరిభోక్తుం వ్యవస్యన్తి పౌరా వై ధర్మవత్సలాః.

ప్ర. అ. ధర్మవత్సలాః=ధర్మమునందు ఆసక్తి గల, తే పౌరాః=ఆ పౌరులు, చీరకృష్ణాజినామ్బరమ్= నారచీరలు, కృష్ణాజినము వస్త్రములుగా గల, రాజపుత్రమ్=రాజపుత్రుడైన, తమ్=ఆ భరతుణ్ణి, పరిభోక్తుమ్= విడచి భోగములు అనుభవించుటకు, న వ్యవస్యన్తి హి=ఇచ్ఛయించరు కదా ?

తా. ధర్మమునందు ఆసక్తి గల ఆ పౌరులు నారచీరలు కృష్ణాజినము ధరించిన రాజకుమారుడైన భరతుడు ఏ భోగములూ అనుభవించకుండా ఉండగా తాము భోగములు అనుభవించుటకు ఇష్టపడలేదు. 34

మూ. తం ధర్మమివ ధర్మజ్ఞం దేహవన్తమివాపరమ్, 35
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం హనూమాన్ మారుతాత్మజః.

ప్ర. అ. మారుతాత్మజః=వాయుపుత్రుడైన, హనుమాన్=హనుమంతుడు, ధర్మజ్ఞమ్=ధర్మములను ఎరిగినవాడు, దేహవన్తమ్=దేహము గల, అపరమ్=మరి యొక, ధర్మమివ=ధర్మమువలె ఉన్న, తమ్=ఆ భరతుణ్ణి గూర్చి, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. సకలధర్మములు తెలిసిన దేహము ధరించిన మరొక ధర్మమా అన్నట్లు ఉన్న భరతునితో, వాయుపుత్రుడైన హనుమంతుడు అంజలి ఘటించి ఇట్లు పలికెను. 35

మూ. వసన్తం దణ్డకారణ్యే యం త్వం చీరజటాధరమ్, 36
అనుశోచసి కాకుత్స్థం స త్వాం కౌశలమబ్రవీత్.

ప్ర. అ. దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, వసన్తమ్=నివసించుచున్న, చీరజటాధరమ్=నారచీరలను జటలను ధరించిన, యమ్=ఏ, కాకుత్స్థమ్=రాముని గూర్చి, అనుశోచసి=దుఃఖించుచున్నావో, సః=అట్టి రాముడు, త్వామ్=నిన్ను, కౌశలమ్=క్షేమమును, అబ్రవీత్=పలికెను.

తా. నారచీరలు జటలు ధరించి దండకారణ్యములో నివసించుచున్న

ఏ రాముణ్ణి గూర్చి నీవు దుఃఖించుచున్నావో ఆ రాముడు నీ క్షేమమును గూర్చి అడుగుచున్నాడు. 36

మూ. ప్రియమాఖ్యామి తే దేవ శోకం త్యజ సుదారుణమ్, 37
అస్మిన్ ముహూర్తే భ్రాత్రా త్వం రామేణ సహ సంగతః.

ప్ర. అ. దేవ=ప్రభూ ! తే=నీకు, ప్రియమ్=ప్రియమును, ఆఖ్యామి=చెప్పుచున్నాను. సుదారుణమ్=చాల దారుణమైన, శోకమ్=శోకమును, త్యజ=విడువుము. అస్మిన్=ఈ, ముహూర్తే=ముహూర్తమునందు, త్వమ్= నీవు; భ్రాత్రా=సోదరుడైన, రామేణ సహ=రామునితో కూడ, సంగతః=కలిసినావు.

తా. ఓ ! ప్రభూ ! నీకు ప్రియమైన విషయము చెప్పుచున్నాను. చాల దారుణమైన ఈ శోకమును విడిచిపెట్టుము. ఈ ముహూర్తములో నీవు నీ సోదరుడైన రామునితో కలవబోతున్నావు. 37

మూ. నిహత్య రావణం రామః ప్రతిలభ్య చ మైథిలీమ్, 38
ఉపయాతి సమృద్ధార్థః సహ మిత్రైర్మహాబలైః.

ప్ర. అ. రామః=రాముడు, రావణమ్=రావణుణ్ణి, నిహత్య=చంపి, మైథిలీమ్=సీతను, ప్రతిలభ్య=మరల పొంది, సమృద్ధార్థః=సిద్ధించిన కార్యము గలవాడై, మహాబలైః=గొప్ప బలము గల, మిత్రైః సహ=స్నేహితులతో కూడ, ఉపయాతి=వచ్చుచున్నాడు.

తా. రాముడు రావణుణ్ణి చంపి, సీతను మరల పొంది చేయదగిన కార్యమును పూర్తి చేసికొనినవాడై, మహాబలవంతులైన మిత్రులతో కలసి వచ్చుచున్నాడు. 38

మూ. లక్ష్మణశ్చ మహాతేజా వైదేహీ చ యశస్వినీ, 39
సీతా సమగ్రా రామేణ మహేన్ద్రేణ శచీ యథా.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, (వచ్చుచున్నాడు). యశస్వినీ=కీర్తి గల, రామేణ=రామునితో, సమగ్రా=కూడిన, సీతా=సీత, మహేన్ద్రేణ=మహేంద్రునితో కూడిన, శచీ యథా=శచీదేవి వలె, వచ్చుచున్నది.

తా. గొప్ప తేజస్సు గల లక్ష్మణుడు, మహేంద్రునితో కూడిన శచీదేవి వలె రామునితో కూడిన కీర్తిమంతురాలైన సీతా కూడ వచ్చుచున్నారు. 39

మూ. ఏవముక్తో హనుమతా భరతః కైకయీసుతః, 40
పపాత సహసా హృష్టో హర్షాన్మోహముపాగమత్.

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, కైకయీసుతః=కైకేయి పుత్రుడైన, భరతః=భరతుడు, హృష్టః=సంతోషించినవాడై, సహసా=వెంటనే, భూమౌ=నేలమీద, పపాత=పడిపోయెను. హర్షాత్= సంతోష మువలన, మోహమ్=మూర్ఛను, ఉపాగమత్=పొందెను.

తా. హనుమంతుని మాటలు విని, కైకేయి పుత్రుడైన భరతుడు సంతోషించి వెంటనే నేలమీద పడిపోయెను. సంతోషాతిరేకముచేత మూర్ఛ చెందెను. 40

మూ. తతో ముహూర్తాదుత్థాయ ప్రత్యాశ్వస్య చ రాఘవః, 41
హనూమన్తమువాచేదం భరతః ప్రియవాదినమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రఘువంశమునందు పుట్టిన, భరతః=భరతుడు, ముహూర్తాత్= ముహూర్తకాలములో, ఉత్థాయ=లేచి, ప్రత్యాశ్వస్య చ=సర్దుకొని, ప్రియవాదినమ్=ప్రియమును పలికిన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. పిమ్మట భరతుడు ముహూర్తకాలములో లేచి, తెప్పిరిల్లి, ప్రియవార్త చెప్పిన ఆ హనుమంతునితో ఇట్లు పలికెను. 41

మూ. అశోకజైః ప్రీతిమయైః కపిమాలిఙ్గ్య సంభ్రమాత్, 42
సిషేచ భరతః శ్రీమాన్ విపులైరశ్రుబిన్దుభిః.

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, భరతః=భరతుడు, కపిమ్=హను మంతుణ్ణి, సంభ్రమాత్=తొందరవలన, ఆలిఙ్గ్య=కౌగలించుకొని, అశోకజైః=ఆ నందమువలన కలిగిన, ప్రీతిమయైః=సంతోషవికారములైన, విపులైః=అధికమైన, అశ్రుబిన్దుభిః=కన్నీళ్లతో, సిషేచ=తడిపెను.

తా. శ్రీమంతుడైన ఆ భరతుడు వెంటనే హనుమంతుణ్ణి కౌగలించుకొని, మూర్తీభవించిన సంతోషమైన అధికమైన ఆనందాశ్రువులతో ఆతనిని తడిపెను.

మూ. దేవో వా మానుషో వా త్వమనుక్రోశాదిహాగతః, 43
ప్రియాఖ్యానస్య తే సౌమ్య దదామి బ్రువతః ప్రియమ్.
గవాం శతసహస్రం చ గ్రామాణాం చ శతం పరమ్, 44
సకుణ్డలాః శుభాచారా భార్యాః కన్యాస్తు షోడశ,
హేమవర్ణాః సునాసోరూః శశిసౌమ్యాననాః స్త్రియః, 45
సర్వాభరణసంపన్నాః సంపన్నాః కులజాతిభిః.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! అనుక్రోశాత్=జాలివలన, ఇహ= ఇక్కడకు, ఆగతః=వచ్చిన, త్వమ్=నీవు, దేవో వా=దేవతాపురుషుడవా ?

మానుషో వా=మనుష్యుడవా ? ప్రియమ్=ప్రియమును, బ్రువతః= చెప్పు చున్న, తే=నీయొక్క, ప్రియాఖ్యానస్య=ప్రియము చెప్పుటకు, గవామ్=గోవులయొక్క, శతసహస్రం చ=లక్షను, పరమ్=మరియు, గ్రామాణామ్=గ్రామములయొక్క, శతమ్= శతమును, సకుణ్డలాః=కుండలములతో కూడిన, శుభాచారాః=మంచి నడవడిక గల, షోడశ=పదహారుగురు, కన్యాః=కన్యలను, భార్యాః=భార్యలను గాను, హేమ వర్ణాః=బంగారు రంగు గల, సునాసోరూః=అందమైన ముక్కులు ఊరువులూ గల, శశిసౌమ్యాననాః=చంద్రునివలె సుందరములైన ముఖములు గల, సర్వా భరణసంపన్నాః=సమస్తములైన అలంకారములతో కూడిన, కులజాతిభిః=మంచి కులముతోను జాతితోను, సంపన్నాః=కూడిన, స్త్రియః=స్త్రీలను, దదామి=(వాళ్లకు దాసీలనుగా) ఇచ్చుచున్నాను.

తా. సౌమ్యుడా ! నా మీద జాలిగొని వచ్చిన నీవు దేవతాపురుషుడవా లేక మానవుడవేనా ? ప్రియమైన వృత్తాంతమును చెప్పుచున్న నీవు ఇట్టి ప్రియమును చెప్పినందుకు నీకు లక్ష గోవులను, నూరు గ్రామాలను ఇచ్చెదను. కుండలములు ధరించిన, సదాచారవతులైన, అవివాహితలైన పదహారుగురు కన్యలను భార్యలను గాను, బంగారు శరీరచ్ఛాయ గల, అందమైన ముక్కులూ ఊరువులూ గల, చంద్రునివంటి అందమైన ముఖములు గల, సకలాభరణములు అలంకరించుకొనిన, ఉత్తమ కులజాతులు గల స్త్రీలను వాళ్లకు దాసీలను గాను ఇచ్చెదను. 43 - 45.

మూ. నిశమ్య రామాగమనం నృపాత్మజః
కపిప్రవీరస్య తదాద్భుతోపమమ్,
ప్రహర్షితో రామదిదృక్షయాఽభవ
త్పునశ్చ హర్షాదిదమబ్రవీద్వచః. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే పఞ్చవింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. నృపాత్మజః=ఆ రాజకుమారుడు, తదా=అప్పుడు, అద్భుతోపమమ్= ఆశ్చర్యకరమైన, రామాగమనమ్=రాముని రాకను, కపిప్రవీరస్య=హనుమంతునినుండి, నిశమ్య=విని, రామదిదృక్షయా=రాముణ్ణి చూడవలె నను కోరికచేత, ప్రహర్షితః=చాల సంతోషించినవాడు, అభవత్=ఆయెను. పునశ్చ=మరల, హర్షాత్=సంతోషమువలన, ఇదమ్=ఈ, వచః=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. భరతుడు అత్యద్భుతవిషయమువంటి రాముని రాకను గూర్చి హనుమంతునినుండి విని, రాముని చూడవలె నను కోరికతో ఆనందభరితుడై మరల సంతోషముతో ఇట్లు పలికెను. 46

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరువదియైదవ సర్గ సమాప్తము.

# అథ షడ్వింశత్యధికశతతమః సర్గః

[హనుమంతుడు సీతారామలక్ష్మణుల వనవాససమయమునందు జరిగిన వృత్తాంతములు చెప్పుట.]

మూ. బహూని నామ వర్షాణి గతస్య సుమహద్వనమ్,
శృణోమ్యహం ప్రీతికరం మమ నాథస్య కీర్తనమ్. 1

ప్ర. అ. బహూని=అనేకములైన, వర్షాణి=సంవత్సరములను, సుమహత్=చాలా పెద్దదైన, వనమ్=వనమును గూర్చి, గతస్య=వెళ్లిన, మమ నాథస్య=నా ప్రభువుయొక్క, ప్రీతికరమ్=ఆనందకరమైన, కీర్తనమ్=కీర్తనమును, అహమ్=నేను, శృణోమి నామ=వినుచున్నాను కదా ?

తా. చాల సంవత్సరములపాటు మహారణ్యమునకు వెళ్లిన నా ప్రభువును గూర్చిన ఆనందకరమైన వర్ణనమును నేను వినుచున్నాను కదా ! 1

మూ. కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మామ్,
ఏతి జీవన్తమానన్దో నరం వర్షశతాదపి. 2

ప్ర. అ. జీవన్తమ్=జీవించి ఉన్న, నరమ్=మానవుణ్ణి, వర్షశతాదపి=నూరు సంవత్సరములకైనా, ఆనన్దః=ఆనందము, ఏతి=పొందును అను, ఇయమ్=ఈ, లౌకికీ=లోకసంబంధమైన, గాథా=గాథ, మామ్=నన్ను గూర్చి, కల్యాణీ=కల్యాణ కరముగా, ప్రతిభాతి=తోచుచున్నది.

తా. మానవుడు బ్రతికి ఉన్నచో నూరు సంవత్సరాలకైనా ఆనందము లభించును అను ఈ లోకోక్తి నా విషయమునందు కల్యాణకరముగా ఉన్నదని తోచుచున్నది. 2

మూ. రాఘవస్య హరీణాం చ కథమాసీత్సమాగమః,
కస్మిన్ దేశే కిమాశ్రిత్య తత్త్వమాఖ్యాహి పృచ్ఛతః. 3

ప్ర. అ. రాఘవస్య చ=రామునకు, కపీనాం చ=వానరులకు, కస్మిన్ దేశే=ఏ దేశమునందు, కిమ్=దేనిని, ఆశ్రిత్య=ఆశ్రయించి, కథమ్=ఎట్లు, సమాగమః=సమాగమము, ఆసీత్=ఆయెను? పృచ్ఛతః=అడుగుచున్న నాకు, తత్త్వమ్=యథార్థమును,ఆఖ్యాహి=చెప్పుము.

తా. రామునకు వానరులకూ ఎట్లు, ఏ దేశమునందు, ఎందు నిమిత్తము సంబంధము ఏర్పడినది? అడుగుచున్న నాకు యథార్థమును తెలుపుము. 3

మూ. స పృష్టో రాజపుత్రేణ బృశ్యాం సముపవేశితః,
ఆచచక్షే తతః సర్వం రామస్య చరితం వనే. 4

ప్ర. అ. బృస్యామ్=మునులు కూర్చొను ఆసనమునందు, సముపవేశితః=కూర్చుండబెట్టబడినవాడై, రాజపుత్రేణ=భరతునిచేత, పృష్టః=అడగబడిన, సః=హనుమంతుడు, తతః=అటుపిమ్మట, వనే=వనమునందు, రామస్య=రాముని యొక్క, సర్వమ్=సమస్తమైన, చరితమ్=చరిత్రను, ఆచచక్షే=చెప్పెను.

తా. బృసిపై కూర్చొనబెట్టి భరతుడు ఈ విధముగా ప్రశ్నించగా హనుమంతుడు వనములో జరిగిన రాముని వృత్తాంతము నంతను చెప్పెను.4

మూ. యథా ప్రవ్రాజితో రామో మాతుర్దత్తౌ వరౌ తవ,
యథా చ పుత్రశోకేన రాజా దశరథో మృతః. 5
యథా దూతైస్త్వమానీతస్తూర్ణం రాజగృహాత్ప్రభో,
త్వయాయోధ్యాం ప్రవిష్టేన యథా రాజ్యం న చేప్సితమ్. 6
చిత్రకూటగిరిం గత్వా రాజ్యేనామిత్రకర్శనః,
నిమన్త్రితస్త్వయా భ్రాతా ధర్మమాచరతా సతామ్. 7
స్థితేన రాజ్ఞో వచనే యథా రాజ్యం విసర్జితమ్,
ఆర్యస్య పాదుకే గృహ్య యథాసి పునరాగతః. 8
సర్వమేతన్మహాబాహో యథావద్విదితం తవ,
త్వయి ప్రతిప్రయాతే తు యద్వృత్తం తన్నిబోధ మే. 9

ప్ర. అ. ప్రభో=ఓ ! ప్రభూ ! మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా ! తవ=నీయొక్క, మాతుః=తల్లికి, వరౌ=వరములు, యథా=ఎట్లు, దత్తౌ=ఇవ్వబడినవో, రామః=రాముడు ఎట్లు, ప్రవ్రాజితః=అరణ్యమునకు పంపబడినాడో, రాజా=రాజైన, దశరథః=దశరథుడు, పుత్రశోకేన=పుత్రశోకముతో, యథా=ఎట్లు, మృతః=మరణించినాడో, త్వమ్=నీవు, దూతైః=దూతలచేత, రాజగృహాత్=రాజగృహమునుండి, తూర్ణమ్=శీఘ్రముగా, యథా=ఎట్లు, ఆనీతః=తీసికొనిరాబడినావో, అయోధ్యామ్=అయోధ్యను, ప్రవిష్టేన=ప్రవేశించిన, త్వయా=నీచేత, రాజ్యమ్=రాజ్యము, యథా=ఎట్లు, న చ ఈప్సితమ్=అంగీకరింపబడలేదో, సతామ్=సత్పురుషులయొక్క, ధర్మమ్=ధర్మమును, ఆచరతా=ఆచరించుచున్న, త్వయా=నీచేత, చిత్రకూటగిరిమ్=చిత్రకూటపర్వతమును గూర్చి, గత్వా=వెళ్లి, అమిత్రకర్శనః=శత్రువులను పీడించు, భ్రాతా=సోదరుడు, యథా=ఎట్లు, రాజ్యేన=రాజ్యముచేత,

నిమన్త్రితః=ఆహ్వానింపబడినాడో, రాజ్ఞః=రాజుయొక్క, వచనే=వచనమునందు, స్థితేన=ఉన్న రాముని చేత, యథా=ఎట్లు, రాజ్యమ్=రాజ్యము, విసర్జితమ్= విడవబడినదో, ఆర్యస్య=అన్నయొక్క, పాదుకే=పాదుకలను, గృహ్యా=గ్రహించి, యథా=ఎట్లు, పునః=మరల, ఆగతః అసి=వచ్చినావో, ఏతత్=ఇది, సర్వమ్=అంతా, తవ=నీకు, యథావత్=ఉన్న దున్నట్లు, విదితమ్=తెలిసినది. త్వయి=నీవు, ప్రతిప్రయాతే=తిరిగి వెళ్లినవాడ వగుచుండగా, యత్=ఏది, వృత్తమ్=జరిగినదో దానిని, మే=నానుండి, నిబోధ=తెలిసికొనుము.

తా. గొప్ప బాహువులు గల ఓ ! ప్రభూ ! నీ తల్లికి రెండు వరములు ఇచ్చుట, రాముడు అరణ్యమునకు పంపబడుట, పుత్రశోకముతో దశరథమహారాజు మరణించుట, నిన్ను దూతలద్వారా రాజగృహమునుండి రప్పించుట, అయోధ్యకు వచ్చిన నీవు రాజ్యమును అంగీకరించకపోవుట, సత్పురుషుల ధర్మమును పాటించుచు నీవు చిత్రకూటమునకు వెళ్లి రాజ్యమును స్వీకరింపు మని పలుకుచు శత్రుసంహారకుడైన సోదరుని కోరుట, రాజు మాటమీద నిలచిన రాముడు రాజ్యమును అంగీకరించకపోవుట, అన్నగారి పాదుకలు తీసికొని నీవు మరల తిరిగి వచ్చుట -- ఈ విషయము లన్నీ నీకు జరిగినవి జరిగినట్లు తెలియును కదా ! నీవు తిరిగి వెళ్ళిపోయిన పిమ్మట ఏమి జరిగెనో చెప్పెదను, వినుము.

మూ. అపయాతే త్వయి తదా సముద్భ్రాన్తమృగద్విజమ్,
పరిద్యూనమివాత్యర్థం తద్వనం సమపద్యత. 10

ప్ర. అ. త్వయి=నీవు, తదా=అప్పుడు, అపయాతే=వెళ్లినవాడవగుచుండగా, సముద్భ్రాన్తమృగద్విజమ్=భయపడిన మృగములు పక్షులు గల, అత్యర్థమ్=మిక్కిలి, పరిద్యూనమ్ ఇవ=పీడింపబడినట్లున్న, తత్=ఆ, వనమ్=వనమును, సమపద్యత=పొందెను.

తా. అప్పుడు నీవు తిరిగి వెళ్లిపోయిన పిమ్మట రాముడు క్రొత్త మనుష్యులను చూచుటచేత భయపడిన మృగపక్ష్యాదులు గల, పీడింపబడినదా అన్నట్లు ఉన్న వనములోనికి ప్రవేశించెను. 10

మూ. తద్ధస్తిమృదితం ఘోరం సింహవ్యాఘ్రమృగాకులమ్,
ప్రవివేశాథ విజనం స మహద్దణ్డకావనమ్. 11

ప్ర. అ. సః=ఆ రాముడు, అథ=అటుపిమ్మట, హస్తిమృదితమ్=ఏనుగుల చేత మర్దింపబడిన, సింహవ్యాఘ్రమృగాకులమ్=సింహములతోను, పెద్దపులులతోను, మృగములతోను, వ్యాకులముగా ఉన్న, ఘోరమ్=భయంకరమైన, విజనమ్=జనులు లేని, మహత్=గొప్పదైన, తత్=ఆ, దణ్డకావనమ్=దండకారణ్యమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట రాముడు ఏనుగులచేత మర్దింపబడిన, సింహవ్యాఘ్రమృగములతో వ్యాకులముగా ఉన్న నిర్జనమై భయంకరముగా ఉన్న ఆ దండకా మహారణ్యములో ప్రవేశించెను. 11

మూ. తేషాం పురస్తాద్బలవాన్ గచ్ఛతాం గహనే వనే,
వినదన్ సుమహానాదం విరాధః ప్రత్యదృశ్యత. 12

ప్ర. అ. గహనే=దట్టమైన, వనే=వనమునందు, గచ్ఛతామ్=వెళ్లుచున్న, తేషామ్=వారియొక్క, పురస్తాత్=ఎదుట, సుమహానాదమ్=చాల గొప్ప ధ్వని కలుగునట్లుగా, వినదన్=అరచుచు, విరాధః=విరాధుడు, ప్రత్యదృశ్యత=చూడబడెను.

తా. సీతారామలక్ష్మణులు దట్టమైన ఆ అరణ్యములో వెళ్ళుచుండగా వారి ఎదుట విరాధుడు బిగ్గరగా అరచుచు కనబడెను. 12

మూ. తముత్క్షిప్య మహానాదమూర్ధ్వబాహుమధోముఖమ్,
నిఖాతే ప్రక్షిపన్తి స్మ నదన్తమివ కుఞ్జరమ్. 13

ప్ర. అ. ఊర్ధ్వబాహుమ్=పైకి బాహువులు గల, మహానాదమ్=గొప్ప ధ్వని గల, తమ్=వానిని, ఉత్క్షిప్య=ఎత్తి, నదన్తమ్=అరచుచున్న, కుఞ్జరమివ=ఏనుగును వలె, అధోముఖమ్=అధోముఖునిగా, నిఖాతే=గోతిలో, ప్రక్షిపన్తి స్మ=పడవేసిరి.

తా. చేతులు పైకెత్తి గొప్ప ధ్వని చేయుచున్న ఆతనిని ఎత్తి అరచుచున్న ఏనుగును వలె, ముఖము క్రిందకు ఉండునట్లు గోతిలో పడవేసిరి. 13

మూ. తత్కృత్వా దుష్కరం కర్మ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సాయాహ్నే శరభఙ్గస్య రమ్యమాశ్రమమీయతుః. 14

ప్ర. అ. భ్రాతరౌ=సోదరులైన, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, దుష్కరమ్=చేయ శక్యము కాని, తత్=ఆ, కర్మ=పనిని, కృత్వా=చేసి, సాయాహ్నే=సాయంకాలమునందు, శరభఙ్గస్య=శరభంగునియొక్క, రమ్యమ్=రమ్యమైన, ఆశ్రమమ్=ఆశ్రమమును గూర్చి, ఈయతుః=వెళ్ళిరి.

తా. సోదరులైన రామలక్ష్మణులు, ఎవ్వరూ చేయజాలని ఆ పని చేసి, సాయంకాలమునకు శరభంగుని సుందరమైన ఆశ్రమమునకు వెళ్ళిరి. 14

మూ. శరభఙ్గే దివం ప్రాప్తే రామః సత్యపరాక్రమః,
అభివాద్య మునీన్ సర్వాన్ జనస్థానముపాగమత్. 15

ప్ర. అ. శరభఙ్గే=శరభంగుడు, దివమ్=స్వర్గమును, ప్రాప్తే=పొందినవాడగుచుండగా, సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గల, రామః=రాముడు, సర్వాన్=సమస్తమైన, మునీన్=మునులను, అభివాద్య=నమస్కరించి,

జనస్థానమ్=జనస్థానమును, ఉపాగమత్=చేరెను.

తా. శరభంగుడు స్వర్గమునకు వెళ్ళిన పిమ్మట సత్యమైన పరాక్రమము గల రాముడు, మును లందరికి సమస్కరించి జనస్థానము చేరెను. 15

మూ. పశ్చాచ్ఛూర్పణఖా నామ రామపార్శ్వముపాగతా,
తతో రామేణ సందిష్టో లక్ష్మణః సహసోత్థితః, 16
ప్రగృహ్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసే మహాబలః.

ప్ర. అ. పశ్చాత్=అటుపిమ్మట, శూర్పణఖా నామ=శూర్పణఖ అను రాక్షసి, రామపార్శ్వమ్=రాముని పార్శ్వమును, ఉపాగతా=పొందినది. తతః=అటుపిమ్మట, రామేణ=రామునిచేత, సందిష్టః=ఆజ్ఞాపింపబడిన, మహాబలః=గొప్ప బలముగల, లక్ష్మణః=లక్ష్మణుడు, సహసా=శీఘ్రముగా, ఉత్థితః=లేచినవాడై, ఖడ్గమ్=ఖడ్గమును, ప్రగృహ్య=గ్రహించి, కర్ణనాసే=చెవులను ముక్కును, చిచ్ఛేద=ఛేదించెను.

తా. పిమ్మట శూర్పణఖ అను రాక్షసి రామునివద్దకు వచ్చెను. అప్పుడు రాముడు ఆజ్ఞాపింపగా మహాబలశాలియైన లక్ష్మణుడు ఖడ్గము గ్రహించి ఆమె చెవులూ, ముక్కూ ఛేదించెను. 16

మూ. చతుర్దశ సహస్రాణి జనస్థాననివాసినామ్,
హతాని వసతా తత్ర రాఘవేణ మహాత్మనా. 17

ప్ర. అ. తత్ర=అక్కడ, వసతా=నివసించుచున్న, మహాత్మనా=మహాత్ముడైన, రాఘవేణ=రామునిచేత, జనస్థాననివాసినామ్=జనస్థానమునందు నివసించుచున్న రాక్షసులయొక్క, చతుర్దశ=పదునాలుగు, సహస్రాణి=వేలు, హతాని=చంపబడినవి.

తా. అక్కడ నివసించుచున్నప్పుడు మహాత్ముడైన రాముడు జనస్థానములో నివసించుచున్న పదునాలుగు వేలమంది రాక్షసులను చంపెను. 17

మూ. ఏకేన సహ సంగమ్య రామేణ రణమూర్ధని,
అహ్నశ్చతుర్థభాగేన నిఃశేషా రాక్షసాః కృతాః. 18

ప్ర. అ. ఏకేన=ఒక్క, రామేణ=రామునిచేత, రణమూర్ధని=యుద్ధాగ్రమునందు, సహ సంగమ్య=కూడా కలసివచ్చిన, రాక్షసాః=రాక్షసులు, అహ్నః=పగటియొక్క, చతుర్థభాగేన=నాల్గవ యామముచేత, (నాల్గవ యామములోని ఒకటిన్నర ముహూర్తముల కాలముచేత), నిఃశేషాః=శేషము లేనివారుగా, కృతాః=చేయబడిరి.

తా. కలసి యుద్ధరంగమునకు వచ్చిన రాక్షసులను ఒక్క రాముడు

సాయంకాలమున (ఒకటిన్నర ముహూర్తముల కాలములో) సంహరించినాడు.18

మూ. మహాబలా మహావీర్యాస్తపసో విఘ్నకారిణః, 19
నిహతా రాఘవేణాజౌ దణ్డకారణ్యవాసినః.

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, ఆజౌ=యుద్ధమునందు, మహాబలాః=గొప్ప బలముకల, మహావీర్యాః=గొప్ప పరాక్రమముగల, తపసః=తపస్సునకు, విఘ్నకారిణః=విఘ్నము చేయుచున్న, దణ్డకారణ్యవాసినః=దండకారణ్యములో నివసించు రాక్షసులు, నిహతాః=చంపబడినారు.

తా. రాముడు యుద్ధములో గొప్ప బలము, పరాక్రమము గల, తపస్సుకు విఘ్నముచేయు దండకారణ్యవాసులైన రాక్షసులను చంపివేసెను.19

మూ. రాక్షసాశ్చ వినిష్పిష్టాః ఖరశ్చ నిహతో రణే, 20
దూషణం చాగ్రతో హత్వా త్రిశిరాస్తదనన్తమ్.

ప్ర. అ. రణే=యుద్ధమునందు, రాక్షసాః చ=రాక్షసులు, వినిష్పిష్టాః=నలగగొట్టబడిరి. ఖరః చ=ఖరుడు కూడ, నిహతః=చంపబడినాడు. అగ్రతః=ముందుగా, దూషణమ్=దూషణుని, హత్వా=చంపి, తదనన్తరమ్=అటుపిమ్మట, త్రిశిరాః=త్రిశిరస్సు చంపబడినాడు.

తా. యుద్ధములో రాముడు ఆ రాక్షసుల నందరినీ చంపివేసెను. ఖరుణ్ణి కూడ చంపెను. ముందుగా దూషణుణ్ణి, పిదప త్రిశిరస్సును చంపెను.

మూ. తతస్తేనార్దితా బాలా రావణం సముపాగతా, 21
రావణానుచరో ఘోరో మారీచో నామ రాక్షసః,
లోభయామాస వైదేహీం భూత్వా రత్నమయో మృగః. 22

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తేన=రాక్షససంహారముచేత, అర్దితా=పీడింపబడిన, బాలా=మూర్ఖురాలు, రావణమ్=రావణుని, సముపాగతా=చేరినది. రావణానుచరః=రావణుని అనుచరుడైన, ఘోరః=భయంకరుడైన, మారీచో నామ=మారీచు డను, రాక్షసః=రాక్షసుడు, రత్నమయః=రత్నవికారమైన, మృగః=మృగముగా, భూత్వా=అయి, వైదేహీమ్=సీతను, లోభయామాస=లోభపెట్టెను.

తా. అప్పుడు రాక్షసులు చచ్చి పోవుటచేత దుఃఖితురాలై మూర్ఖురాలైన శూర్పణఖ రావణునివద్దకు వెళ్లి చెప్పెను. రావణుని అనుచరుడైన మారీచు డనే భయంకరుడైన రాక్షసుడు రత్నవికారమైన మృగముగా అయి సీతను లోభపెట్టెను. 21, 22,

మూ. సా రామమబ్రవీద్దృష్ట్వా వైదేహీ గృహ్యతామితి,
అయం మనోహరః కాన్త ఆశ్రమో నో భవిష్యతి. 23

ప్ర. అ. సా వైదేహీ=ఆ సీత, దృష్ట్వా=చూచి, నః=మనయొక్క, ఆశ్రమః=ఆశ్రమము, మనోహరః=మనోహరము, కాన్తః=సుందరము, భవిష్యతి=కాగలదు, అయమ్=ఈ మృగము, గృహ్యతామ్=గ్రహింపబడుగాక, ఇతి=అని, రామమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. అప్పు డా సీత రామునితో --"ఈ మృగమును పట్టుకొనుము; ఇది ఉన్నచో మన ఆశ్రమము సుందరముగాను మనోహరముగాను ఉండును"అని పలికెను. 23

మూ. తతో రామో ధనుష్పాణిర్మృగం తమనుధావతి,
స తం జఘాన ధావన్తం శరేణానతపర్వణా. 24

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామః=రాముడు, ధనుష్పాణిః=ధనస్సు హస్తమునందు కలవాడై, తం మృగమ్=ఆ మృగమును, అనుధావతి=అనుసరించి పరుగెత్తెను. సః=రాముడు, ధావన్తమ్=పరుగెత్తుచున్న, తమ్=దానిని, ఆనతపర్వణా=వంగిన కణుపులు గల, శరేణ=బాణముతో, జఘాన=చంపెను.

తా. అప్పుడు రాముడు ధనస్సు హస్తమునందు ధరించి ఆ మృగము వెంట పరుగెత్తి, పారిపోవుచున్న దానిని వంగిన కణుపులు గల బాణముచేత చంపెను.

మూ. అథ సౌమ్య దశగ్రీవో మృగం యాతే తు రాఘవే,
లక్ష్మణే చాపి నిష్క్రాన్తే ప్రవివేశాశ్రమం తదా. 25

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా ! రాఘవే=రాముడు, మృగమ్=మృగమును గూర్చి, యాతే=వెళ్లినవాడగుచుండగా, లక్ష్మణే చాపి=లక్ష్మణుడు కూడ, నిష్క్రాన్తే=బైటకు వెళ్లినవాడగుచుండగా, అథ=అటుపిమ్మట, దశగ్రీవః=రావణుడు, తదా=అప్పుడు, ఆశ్రమమ్=ఆశ్రమమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. ఓ ! సౌమ్యుడా ! అప్పుడు రాముడు మృగమును వెంబడించి వెళ్లగా, లక్ష్మణుడు కూడ బైటకు వెళ్లగా రావణుడు ఆశ్రమములో ప్రవేశించెను.

మూ. జగ్రాహ తరసా సీతాం గ్రహః ఖే రోహిణీమివ,
త్రాతుకామం తతో యుద్ధే హత్వా గృధ్రం జటాయుషమ్, 26
ప్రగృహ్య సహసా సీతాం జగామాశు స రాక్షసః.

ప్ర. అ. ఖే=ఆకాశమునందు, గ్రహః=అంగారకగ్రహము, రోహిణీమివ=

రోహిణిని వలె, తరసా=బలముచేత, సీతామ్=సీతను, జగ్రాహ=గ్రహించెను. తతః=అటుపిమ్మట, త్రాతుకామమ్=ఆమెను రక్షించుటకు కోరిక గల, జటాయుషమ్=జటాయువును, గృధ్రమ్=గ్రద్దను, యుద్ధే=యుద్ధమునందు, హత్వా=చంపి, సః రాక్షసః=ఆ రాక్షసుడు, సీతామ్=సీతను, ప్రగృహ్య=గ్రహించి, సహసా=శీఘ్రముగా, ఆశు=వెంటనే, జగామ=వెళ్లెను.

తా. అంగారకగ్రహము ఆకాశమునందు రోహిణిని గ్రహించినట్లు రావణుడు సీతను బలాత్కారముగా పట్టుకొనెను. ఆమెను రక్షింపదలచిన జటాయువును యుద్ధమునందు చంపి సీతను తీసికొని శీఘ్రముగా వెళ్లిపోయెను.

మూ. తతస్త్వద్భుతసంకాశాః స్థితాః పర్వతమూర్ధని, 27
సీతాం గృహీత్వా గచ్ఛన్తం వానరాః పర్వతోపమాః,
దదృశుర్విస్మితాకారా రావణం రాక్షసాధిపమ్. 28

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అద్భుతసంకాశాః=ఆశ్చర్యకరులు, పర్వతమూర్ధని=పర్వతశిఖరముమీద, స్థితాః=ఉన్నవారు, పర్వతోపమాః=పర్వతముతో సమానులు అయిన, వానరాః=వానరులు, సీతామ్=సీతను, గృహీత్వా=గ్రహించి, గచ్ఛన్తమ్=వెళ్లుచున్న, రాక్షసాధిపమ్=రాక్షసరాజైన, రావణమ్=రావణుని, విస్మితాకారాః=ఆశ్చర్యము చెందిన ఆకారము గలవారై, దదృశుః=చూచిరి.

తా. పిమ్మట ఆశ్చర్యకరులైన పర్వతశిఖరమునందున్న, పర్వతములవంటి వానరులు సీతను తీసికొని పోవుచున్న రాక్షసరాజైన రావణుని ఆశ్చర్యముతో చూచిరి. 27, 28

మూ. తతః శీఘ్రతరం గత్వా తద్విమానం మనోజవమ్,
ఆరుహ్య సహ వైదేహ్యా పుష్పకం స మహాబలః, 29
ప్రవివేశ తదా లఙ్కాం రావణో రాక్షసేశ్వరః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాక్షసేశ్వరః=రాక్షసప్రభువైన, మహాబలః=గొప్ప బలము గల, రావణః=రావణుడు, శీఘ్రతరమ్=ఎక్కువ శీఘ్రముగా, గత్వా=వెళ్లి, మనోజవమ్=మనోవేగము గల, తత్=ఆ, పుష్పకం విమానమ్=పుష్పకవిమానమును, వైదేహ్యా సహ=సీతతో కూడ, ఆరుహ్య=ఎక్కి, తదా=అప్పుడు, లఙ్కామ్=లంకను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట మహాబలశాలీ, రాక్షసరాజూ అయిన రావణుడు ఇంకను శీఘ్రముగా వెళ్లి, మనోవేగము వంటి వేగము గల ఆ పుష్పకవిమానమును సీతతో కూడ ఎక్కి లంకలో ప్రవేశించెను. 29

మూ. తాం సువర్ణపరిష్కారే శుభే మహతి వేశ్మని, 30
ప్రవేశ్య మైథిలీం వాక్యైః సాన్త్వయామాస రావణః.

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, తాం మైథిలీమ్=ఆ సీతను, సువర్ణపరిష్కారే=బంగారు అలంకరణము గల, శుభే=శుభమైన, మహతి=గొప్ప, వేశ్మని=గృహమునందు, మైథిలీమ్=సీతను, ప్రవేశ్య=ప్రవేశపెట్టి, వాక్యైః=మాటలతో, సాన్త్వయామాస=బ్రతిమాలెను.

తా. ఆ రావణుడు సీతను బంగారముచేత అలంకరించబడిన సుందరమైన గొప్ప గృహమునందు ఉంచి మాటలతో ఓదార్చి బ్రతిమాలుకొనెను. 30

మూ. తృణవద్భాషితం తస్య తం చ నైర్ఋతపుంగవమ్, 31
అచిన్తయన్తీ వైదేహీ హ్యశోకవనికాం గతా.

ప్ర. అ. వైదేహీ=సీత, తస్య=వానియొక్క, భాషితమ్=భాషణమును, తమ్=ఆ, నైర్ఋతపుంగవం చ=రాక్షసశ్రేష్ఠుణ్ణీ, తృణవత్=గడ్డిపరకగా కూడ, అచిన్తయన్తీ=ఆలోచించనిదై, అశోకవనికామ్=అశోకవనమును, గతా=పొందినది.

తా. సీత ఆ రావణునకూ ఆతని మాటలకూ గడ్డిపరకంత విలువ కూడ ఇవ్వలేదు. తరువాత ఆమె అశోకవనములో ఉండెను. 31

మూ. న్యవర్తత తదా రామో మృగం హత్వా తదా వనే, 32
వివర్తమానః కాకుత్స్థో దృష్ట్వా గృధ్రం స వివ్యథే,
గృధ్రం హతం తదా దృష్ట్వా రామః ప్రియతరం పితుః. 33

ప్ర. అ. తదా=అప్పుడు, రామః=రాముడు, మృగమ్=మృగమును, హత్వా=చంపి, న్యవర్తత=మరలెను. తదా=అప్పుడు, నివర్తమానః=మరలివచ్చుచున్న, కాకుత్స్థః=రాముడు, వనే=వనమునందు, గృధ్రమ్=జటాయువును, దృష్ట్వా=చూచి, వివ్యథే=వ్యథ చెందెను. తదా=అప్పుడు, రామః=రాముడు, పితుః=తండ్రికంటె, ప్రియతరమ్=ఎక్కువ ఇష్టుడైన, (లేదా తండ్రియొక్క మిత్రుడైన), గృధ్రమ్=జటాయువును, హతమ్=చంపబడినవానినిగా, దృష్ట్వా=చూచి (వ్యథ చెందెను).

తా. అప్పుడు రాముడు ఆ మృగమును చంపి వెనుకకు మరలెను. అప్పుడు తిరిగి వచ్చుచున్న రాముడు వనములో జటాయువును చూచి వ్యథ చెందెను. రాముడు తన తండ్రికంటె కూడ ఎక్కువ ఇష్టుడైన జటాయువు చంపబడుట చూచి వ్యథ చెందెను.

వి. పై శ్లోకం (33) అన్వయం సరిగా కుదరడం లేదు. పునరుక్తి ఉన్నది.

కొందరు వ్యాఖ్యాతలు "అదృష్ట్వా" అని పదచ్ఛేదం చేసి అదృష్ట్వా=సీతను చూడక, గృధ్రమ్=జటాయువును (చూడక) అని వ్యాఖ్యానించినారు. ఉత్తరార్థంలో క్రియలేదు. ఏమైనా అర్థం సంతృప్తికరంగా కుదురుటలేదు. ప్రాచ్యపాఠం ఇట్లున్నది.---.

మూ. "రావణేన హృతాం సీతాం స శ్రుత్వా రహితాం బలాత్,
నివర్తమానః కాకుత్స్థో వివ్యథే గృధ్రరాజతః.
గృధ్రరాజం స సత్కృత్య (సంస్కృత్య) పితుః ప్రియసఖం హతమ్.
మన్దాకినీమన్వతరద్వనోద్దేశాంశ్చ పుష్పితాన్".

"తిరిగి వచ్చుచున్న రాముడు ఒంటరిగా ఉన్న సీతను రావణుడు హరించినట్లు జటాయువు చెప్పగా విని వ్యథ చెందెను. తండ్రి ప్రియమిత్రుడైన, చంపబడిన ఆ జటాయువుకు సంస్కారము చేసి ... ... అని భావము.

మూ. మార్గమాణస్తు వైదేహీం రాఘవః సహలక్ష్మణః,
గోదావరీమన్వచరద్వనోద్దేశాంశ్చ పుష్పితాన్. 34

ప్ర. అ. వైదేహీమ్=సీతను, మార్గమాణః=అన్వేషించుచున్న, సహలక్ష్మణః=లక్ష్మణసహితుడైన, రామః=రాముడు, గోదావరీమ్=గోదావరిని, పుష్పితాన్=పుష్పించిన, వనోద్దేశాంశ్చ=వనప్రదేశములను, అన్వచరత్=అనుసరించి సంచరించెను.

తా. సీతను వెదకుచున్న, లక్ష్మణసమేతుడైన రాముడు గోదావరీనదీ ప్రాంతమునందు, పుష్పించిన వనప్రదేశములందు సంచరించెను. 34

మూ. ఆసేదతుర్మహారణ్యే కబన్ధం నామ రాక్షసమ్,
తతః కబన్ధవచనాద్రామః సత్యపరాక్రమః, 35
ఋష్యమూకగిరిం గత్వా సుగ్రీవేణ సమాగతః.

ప్ర. అ. మహారణ్యే=మహారణ్యమునందు, కబన్ధం నామ=కబంధుడు అను పేరు గల, రాక్షసమ్=రాక్షసుణ్ణి, ఆసేదతుః=సమీపించిరి. తతః=అటుపిమ్మట, సత్యపరాక్రమః=సత్యమైన పరాక్రమము గల, రామః=రాముడు, కబన్ధవచనాత్=కబంధుని మాట వలన, ఋష్యమూకగిరిమ్=ఋష్యమూకపర్వతమును గూర్చి, గత్వా=వెళ్లి, సుగ్రీవేణ= సుగ్రీవునితో, సమాగతః=కలిసినాడు.

తా. రామలక్ష్మణులు మహారణ్యములో కబంధు డను రాక్షసుణ్ణి కలిసిరి. పిమ్మట సత్యమైన పరాక్రమము గల రాముడు కబంధుడు చెప్పగా ఋష్యమూకపర్వతమునకు వెళ్లి సుగ్రీవునితో కలిసెను. 35

మూ. తయోః సమాగమః పూర్వం ప్రీత్యా హార్దో వ్యజాయత. 36
భ్రాత్రా నిరస్తః క్రుద్ధేన సుగ్రీవో వాలినా పురా,
ఇతరేతరసంవాదాత్ప్రగాఢః ప్రణయస్తయోః.

ప్ర. అ. పూర్వమ్=పూర్వము, తయోః=వారిద్దరియొక్క, సమాగమః=సమాగమము, ప్రీత్యా=ప్రేమతో, హార్దః=హృదయపూర్వకమై, వ్యజాయత=ఏర్పడెను. పురా=పూర్వము, సుగ్రీవః=సుగ్రీవుడు, క్రుద్ధేన=కోపించిన, భ్రాత్రా=సోదరుడైన, వాలినా=వాలిచేత, నిరస్తః=దూరముచేయబడినాడు. ఇతరేతరసంవాదాత్=పరస్పరము మాటలాడుకొనుటవలన, తయోః=వారిద్దరియొక్క, ప్రణయః=స్నేహము, ప్రగాఢః=గాఢమైనది.

తా. ప్రారంభమునందే వారిద్దరి సమాగమము ప్రేమతో, హృదయపూర్వకముగా జరిగెను. పూర్వము సుగ్రీవుణ్ణి అతని సోదరుడైన వాలి కోపముతో దూరముగా తరిమివేసెను. ఆ రామసుగ్రీవులు పరస్పరము సంభాషించుకొనుటచేత వారి స్నేహము చాల గాఢ మయ్యెను. 37

మూ. రామః స్వబాహువీర్యేణ స్వరాజ్యం ప్రత్యపాదయత్, 38
వాలినం సమరే హత్వా మహాకాయం మహాబలమ్.

ప్ర. అ. రామః=రాముడు, స్వబాహువీర్యేణ=తన బాహుబలముచేత, మహాకాయమ్=గొప్ప శరీరము గల, మహాబలమ్=గొప్ప బలము గల, వాలినమ్=వాలిని, సమరే=యుద్ధమునందు, హత్వా=చంపి, స్వరాజ్యమ్= స్వరాజ్యమును, ప్రత్యపాదయత్=పొందింపచేసెను.

తా. రాముడు గొప్ప శరీరము, బలమూ గల వాలిని యుద్ధములో తన బాహుపరాక్రమముచేత చంపి సుగ్రీవునకు స్వరాజ్యము లభింపచేసెను.38

మూ. సుగ్రీవః స్థాపితో రాజ్యే సహితః సర్వవానరైః, 39
రామాయ ప్రతిజానీతే రాజపుత్ర్యాస్తు మార్గణమ్.

ప్ర. అ. రాజ్యే=రాజ్యమునందు, స్థాపితః=స్థాపింపచేయబడిన, సర్వవానరైః=సమస్తవానరులతో, సహితః=కూడిన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామాయ=రామునికొరకు, రాజపుత్ర్యాః=సీతయొక్క, మార్గణమ్=అన్వేషణమును, ప్రతిజానీతే=ప్రతిజ్ఞచేసినాడు.

తా. రాజ్యమునందు స్థాపింపబడిన, సకలవానరసహితుడైన సుగ్రీవుడు "సీతను వెదకించెదను" అని రామునకు ప్రతిజ్ఞచేసి చెప్పెను. 39

మూ. ఆదిష్టా వానరేన్ద్రేణ సుగ్రీవేణ మహాత్మనా, 40
దశ కోట్యః ప్లవంగానాం సర్వాః ప్రస్థాపితా దిశః.

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, వానరేన్ద్రేణ=వానరప్రభువైన, సుగ్రీవేణ=సుగ్రీవునిచేత, ఆదిష్టాః= ఆజ్ఞాపించబడిన, ప్లవంగానామ్=వానరులయొక్క, దశ కోట్యః=పది కోట్లు, సర్వాః=సమస్తమైన, దిశః=దిక్కులను గూర్చి, ప్రస్థాపితాః=పంపబడిరి.

తా. మహాత్ముడైన వానరరాజు సుగ్రీవుడు ఆజ్ఞాపించి పదికోట్లు వానరులను అన్ని దిక్కులకు పంపెను. 40

మూ. తేషాం నో విప్రనష్టానాం విన్ధ్యే పర్వతసత్తమే,
భృశం శోకాభితప్తానాం మహాన్ కాలోఽత్యవర్తత. 41

ప్ర. అ. పర్వతసత్తమే=పర్వతశ్రేష్ఠమైన, విన్ధ్యే=వింధ్యమునందు, విప్రనష్టానామ్=దారితప్పిన, భృశమ్=మిక్కిలి, శోకాభితప్తానామ్=శోకముచేత పీడింపబడిన, తేషాం నః=అట్టి మాకు, మహాన్=గొప్ప, కాలః=కాలము, అత్యవర్తత=గడచెను.

తా. మేము వింధ్య పర్వతమునందు దారి తప్పి చాల దుఃఖముతో బాధపడుచుండగా చాల కాలము గడచిపోయెను. 41

మూ. భ్రాతా తు గృధ్రరాజస్య సంపాతిర్నామ వీర్యవాన్,
సమాఖ్యాతి స్మ వసతీం సీతాం రావణమన్దిరే. 42

ప్ర. అ. గృధ్రరాజస్య=జటాయువుయొక్క, భ్రాతా=సోదరుడైన, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, సంపాతిర్నామ=సంపాతి అను నతడు, సీతామ్=సీతను, రావణమన్దిరే=రావణుని ఇంట్లో, వసతీమ్=నివసించుచున్న దానినిగా, సమాఖ్యాతి స్మ=చెప్పెను.

తా. జటాయువు సోదరుడైన, పరాక్రమవంతుడైన సంపాతి సీత రావణుని ఇంటిలో ఉన్నదని చెప్పెను. 42

మూ. సోఽహం దుఃఖపరీతానాం దుఃఖం తద్ జ్ఞాతీనాం నుదన్,
ఆత్మవీర్యం సమాస్థాయ యోజనానాం శతం ప్లుతః. 43

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, దుఃఖపరీతానామ్=దుఃఖముతో కూడిన, జ్ఞాతీనామ్=జ్ఞాతులయొక్క, తత్=ఆ, దుఃఖమ్=దుఃఖమును, నుదన్=తొలగించుచు, ఆత్మవీర్యమ్=నా పరాక్రమమును, సమాస్థాయ=అవలంబించి, యోజనానామ్=యోజనములయొక్క, శతమ్=శతమును, ప్లుతః=దాటినాను.

తా. నేను దుఃఖముతో నిండిన నా మిత్రుల దుఃఖమును తొలగించుచు, నా బలమునే ఊతగా గొని నూరు యోజనములు దాటితిని. 43

మూ. తత్రాహమేకామద్రాక్షమశోకవనికాం గతామ్,
కౌశేయవస్త్రాం మలినాం నిరానన్దాం దృఢవ్రతామ్. 44

ప్ర. అ. తత్ర=అక్కడ, అహమ్=నేను, అశోకవనికామ్=అశోకవనమును, గతామ్=పొందిన, కౌశేయవస్త్రామ్= పట్టు చీర కట్టుకొనిన, మలినామ్=మురికితో ఉన్న, నిరానన్దామ్=ఆనందము లేని, దృఢవ్రతామ్=దృఢమైన నియమములు గల, ఏకామ్=ఒక స్త్రీని, అద్రాక్షమ్=చూచితిని.

తా. అక్కడ నేను అశోకవనములో ఒక స్త్రీని చూచితిని. ఆమె పట్టుచీర కట్టుకొని మాలిన్యములో నిండి ఉండెను. దృఢమైన వ్రతమును పాలించుచున్న ఆమె ఆనందశూన్యురాలై ఉండెను. 44

మూ. తయా సమేత్య విధివత్ పృష్ట్వా సర్వమనిన్దితామ్,
అభిజ్ఞానం మయా దత్తం రామనామాఙ్గులీయకమ్. 45

ప్ర. అ. తయా=ఆమెతో, సమేత్య=కలిసి, అనిన్దితామ్=నిందితురాలు కాని ఆమెను, సర్వమ్=అంతయూ, విధివత్=యథాశాస్త్రముగా, పృష్ట్వా=అడిగి, రామనామాఙ్గులీయకమ్=రామనామ మున్న ఉంగరము, అభిజ్ఞానమ్=ఆనవాలుగా, మయా=నాచేత, దత్తమ్=ఇవ్వబడినది.

తా. నేను ఆమెను సమీపించి, దోషరహితురాలైన ఆమెను అన్ని విషయములు యథాన్యాయముగా అడిగి, ఆమెకు రామనామము గుర్తు గల ఉంగరమును ఆనవాలుగా ఇచ్చితిని. 45

మూ. అభిజ్ఞానం మణిం లబ్ధ్వా చరితార్థోఽహమాగతః,
మయా చ పునరాగమ్య రామస్యాక్లిష్టకర్మణః, 46
అభిజ్ఞానం మయా దత్తమర్చిష్మాన్ స మహామణిః.

ప్ర. అ. అహమ్=నేను, మణిమ్=మణిని, అభిజ్ఞానమ్=ఆనవాలునుగా, లబ్ధ్వా=పొంది, చరితార్థః=చేయబడిన కార్యము గలవాడనై, ఆగతః=వచ్చినాను. మయా=నాచేత, పునః=మరల, ఆగమ్య=వచ్చి, అర్చిష్మాన్=కాంతి గల, సః=ఆ, మహామణిః=గొప్ప మణి, అభిజ్ఞానమ్=ఆనవాలుగా, అక్లిష్టకర్మణః=శ్రమపడకుండా పనులు చేయు, రామస్య=రామునకు, మయా=నాచేత, దత్తమ్=ఇవ్వబడినది.

తా. నేను సీతనుండి ఆనవాలుగా మణిని గ్రహించి, చరితార్థుడనై వచ్చితిని. తిరిగి వచ్చిన నేను కాంతి గల ఆ మణి శ్రమలేకుండగా పనులు సాధించు రామునకు, ఆనవాలుగా ఇచ్చితిని. 46

మూ. శ్రుత్వా తాం మైథిలీం రామస్త్వాశశంసే చ జీవితమ్, 47
జీవితాన్తమనుప్రాప్తః పీత్వామృతమివాతురః.

ప్ర. అ. రామస్తు=రాముడైతే, తాం మైథిలీమ్=ఆ సీతను గూర్చి, శ్రుత్వా=విని, జీవితాన్తమ్=జీవితాంతమును, అనుప్రాప్తః=పొందిన, ఆతురః=రోగి, అమృతమ్=అమృతమును, పీత్వేవ=త్రాగి వలె, జీవితమ్=జీవితమును, ఆశశంసే=కోరెను.

తా. సీత వార్త విని రాముడు, మరణించనున్న రోగి అమృతమును త్రాగి వలె, జీవితమునందు ఆశ కలవా డయ్యెను. 47

మూ. ఉద్యోజయిష్యన్నుద్యోగం దధ్రే లఙ్కావధే మనః, 48
జిఘాంసురివ లోకాన్తే సర్వాన్ లోకాన్ విభావసుః.

ప్ర. అ. ఉద్యోగమ్=ఉద్యమమును, ఉద్యోజయిష్యన్=చేయుదలచినవాడై, లోకాన్తే=లోకాంతకాలమునందు, సర్వాన్=సమస్తమైన, లోకాన్=లోకములను, జిఘాంసుః=చంపదలచిన, విభావసుః ఇవ=అగ్ని వలె, లఙ్కావధే=లంకను చంపుటయందు, మనః=మనస్సును, దధ్రే=ధరించెను.

తా. ఉద్యమము చేయ నున్న వాడై రాముడు, ప్రళయకాలమునందు సమస్తలోకములను సంహరింప నున్న అగ్ని వలె, లంకను నశింపచేయుటకై నిర్ణయము చేసెను. 48

మూ. తతః సముద్రమాసాద్య నలం సేతుమకారయత్, 49
అతరత్కపివీరాణాం వాహినీ తేన సేతునా.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సముద్రమ్=సముద్రమును, ఆసాద్య=పొంది, నలమ్=నలుణ్ణి, సేతుమ్=సేతువును, అకారయత్=చేయించెను. కపివీరాణామ్=వానరవీరులయొక్క, వాహినీ=సేన, తేన సేతునా=ఆ సేతువుచేత, అతరత్=దాటెను.

తా. పిమ్మట సముద్రము చేరి నలునిచేత సేతువు నిర్మింపచేసెను. ఆ సేతువు ద్వారా వానరసేన సముద్రమును దాటెను. 49

మూ. ప్రహస్తమవధీన్నీలః కుమ్భకర్ణం తు రాఘవః, 50
లక్ష్మణో రావణసుతం స్వయం రామస్తు రావణమ్.

ప్ర. అ. నీలః=నీలుడు, ప్రహస్తమ్=ప్రహస్తుణ్ణి, అవధీత్=చంపెను. రాఘవః=రఘువంశసంజాతుడైన, రామః=రాముడు, కుమ్భకర్ణమ్=కుంభకర్ణుణ్ణి, రావణమ్=రావణుణ్ణి, స్వయమ్=స్వయముగా చంపెను. లక్ష్మణః=లక్ష్మణుడు, రావణసుతమ్=ఇంద్రజిత్తును చంపెను.

తా. నీలుడు ప్రహస్తుణ్ణి, రాముడు స్వయముగా రావణకుంభకర్ణులను, లక్ష్మణుడు ఇంద్రజిత్తునూ చంపిరి. 50

మూ. స శక్రేణ సమాగమ్య యమేన వరుణేన చ, 51
మహేశ్వరస్వయంభూభ్యాం తథా దశరథేన చ,
తైశ్చ దత్తవరః శ్రీమానృషిభిశ్చ సమాగతైః, 52
సురర్షిభిశ్చ కాకుత్స్థో వరాన్ లేభే పరంతపః.

ప్ర. అ. పరంతపః=శత్రుసంహారకుడైన, శ్రీమాన్=శ్రీమంతుడైన, కాకుత్స్థః=ఆ రాముడు, శక్రేణ=ఇంద్రునితోను, యమేన=యమునితోను, వరుణేన చ=వరుణునితోను, మహేశ్వరస్వయంభూభ్యామ్=మహేశ్వరునితోను బ్రహ్మదేవునితోను,తథా=మరియు, దశరథేన చ=దశరథునితోను, సమాగమ్య=కలిసి, తైః=వారిచేత,దత్తవరః=ఇవ్వబడిన వరములు గలవాడై, సమాగతైః=వచ్చిన, ఋషిభిః=ఋషులచేతను, సురర్షిభిశ్చ=దేవర్షులచేతను, వరాన్=వరములను, లేభే=పొందెను.

తా. శ్రీమంతుడు, శత్రుసంహారకుడు అయిన రాముడు ఇంద్రయమ వరుణులతోను, మహేశ్వర బ్రహ్మదేవులతోను, దశరథునితోను కలిసి వారి వల్ల వరములను పొందెను. అక్కడికి వచ్చిన ఋషులు, దేవర్షులూ కూడ రామునకు వరము లిచ్చిరి. 51, 52

మూ. స తు దత్తవరః ప్రీత్యా వానరైశ్చ సమాగతః, 53
పుష్పకేన విమానేన కిష్కిన్ధామభ్యుపాగమత్.

ప్ర. అ. ప్రీత్యా=ప్రేమచేత, దత్తవరః=ఇవ్వబడిన వరములు గల, సః తు=ఆ రాముడు, వానరైః చ= వానరులతో, సమాగతః=కూడినవాడై, పుష్పకేన విమానేన=పుష్పకవిమానముచేత, కిష్కిన్ధామ్=కిష్కింధను, అభ్యుపాగమత్=చేరెను.

తా. ప్రేమతో వారందరూ ఇచ్చిన వరములు తీసికొని రాముడు వానరులతో కలిసి పుష్పకవిమానముపై కిష్కింధకు వచ్చెను. 53

మూ. తం గఙ్గాం పునరాసాద్య వసన్తం మునిసంనిధౌ, 54
అవిఘ్నం పుష్యయోగేన శ్వో రామం ద్రష్టుమర్హసి.

ప్ర. అ. గఙ్గామ్=గంగను, పునః=మరల, ఆసాద్య=చేరి, మునిసంనిధౌ= మునిసమీపమునందు, వసన్తమ్=నివసించుచున్న, తం రామమ్=ఆ రాముణ్ణి, పుష్యయోగేన=పుష్యమీనక్షత్రసంబంధముచేత, అవిఘ్నమ్=విఘ్నములు లేకుండగా, శ్వః=రేపు, ద్రష్టుమ్=చూచుటకు, అర్హసి=తగిఉన్నావు.

తా. మరల రాముడు గంగాతీరము చేరి భరద్వాజముని ఆశ్రమములో

ఉన్నాడు. రేపు పుష్యయోగము. అందుచే ఎట్టి విఘ్నములూ లేకుండగా రాముణ్ణి రేపు చూడగలవు. 54

మూ. తతః స వాక్యైర్మధురైర్హనూమతో
నిశమ్య హృష్టో భరతః కృతాఞ్జలిః,
ఉవాచ వాణీం మనసః ప్రహర్షిణీం
చిరస్య పూర్ణః ఖలు మే మనోరథః. 55

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే షడ్వింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భరతః=భరతుడు, హనూమతః=హనుమంతునియొక్క, మధురైః=మధురములైన, వాక్యైః=వాక్యములచేత, నిశమ్య=(రామవృత్తాంతమును) విని, హృష్టః=సంతోషించినవాడై, కృతాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, మనసః=మనస్సుకు, ప్రహర్షిణీమ్=ఆనందమును కలిగించు, వాణీమ్=వాక్కును, ఉవాచ=పలికెను. మే=నాయొక్క, మనోరథః=కోరిక, చిరస్య=చిరకాలమునకు, పూర్ణః ఖలు=నిండినది కదా.

తా. భరతుడు మధురములైన హనుమంతుని మాటలు విని సంతోషించి అంజలి ఘటించి మనస్సుకు సంతోషము కలిగించు విధముగా ---"నా కోరిక చాల కాలానికి తీరినది కదా" అని పలికెను. 55

*"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు*
*యుద్ధకాండలో నూటఇరువదియారవ సర్గ సమాప్తము.*

# అథ సప్తవింశత్యధికశతతమః సర్గః

[రాముని సత్కారముకొరకై అయోధ్యలో ఏర్పాట్లు. రామునకు ఎదురు వెళ్లుటకై పౌరులందరూ నందిగ్రామములో ఉన్న భరతుని వద్దకు చేరుట. రాముడు నందిగ్రామము చేరుట. భరతాదులతో రాముడు కలియుట. పుష్పక విమానమును కుబేరునివద్దకు పంపివేయుట.]

మూ. శ్రుత్వా తు పరమానన్దం భరతః సత్యవిక్రమః,
హృష్టమాజ్ఞాపయామాస శత్రుఘ్నం పరవీరహా.

ప్ర. అ. సత్యవిక్రమః=సత్యమైన పరాక్రమము గల, పరవీరహా=శత్రువీరసంహారకుడైన, భరతః=భరతుడు, పరమానన్దమ్=అత్యానందకరమైన ఆ వాక్యమును, శ్రుత్వా తు=విని, హృష్టమ్=సంతోషించిన, శత్రుఘ్నమ్= శత్రుఘ్నుణ్ణి, ఆజ్ఞాపయామాస=ఆజ్ఞాపించెను.

తా. సత్యమైన పరాక్రమము గల, శత్రువీరసంహారకుడైన భరతుడు పరమానందకరములైన హనుమంతుని మాటలు విని, సంతోషించుచున్న శత్రుఘ్నుణ్ణి ఇట్లాజ్ఞాపించెను. 1

మూ. దైవతాని చ సర్వాణి చైత్యాని నగరస్య చ,
సుగన్ధమాల్యైర్వాదిత్రైరర్చన్తు శుచయో నరాః. 2

ప్ర. అ. సర్వాణి=సమస్తమైన, దైవతాని=దేవతలను, నగరస్య=నగరముయొక్క, చైత్యాని చ=చతుష్పథ (నాల్గువీథులమొగ) మండపములను, శుచయః=పరిశుద్ధులైన, నరాః=మనుష్యులు, సుగన్ధమాల్యైః= సుగంధములతోను లతోను, వాదిత్రైః=వాద్యములతోను, అర్చన్తు=పూజింతురుగాక.

తా. పరిశుద్ధముగా ఉన్న నరులు దేవత లందరినీ, నగరముల లోని చతుష్పథములందున్న మండపములను, సుగంధములను పుష్పమాలలతోను వాద్యములతోను పూజించెదరుగాక. 2

మూ. సూతాః స్తుతిపురాణజ్ఞాః సర్వే వైతాలికాస్తథా,
సర్వే వాదిత్రకుశలా గణికాశ్చైవ సంఘశః. 3
రాజదారాస్తథామాత్యాః సైన్యాః సేనాఙ్గనాగణాః,
బ్రాహ్మణాశ్చ సరాజన్యాః శ్రేణీముఖ్యాస్తథా గణాః. 4

అభినిర్యాన్తు రామస్య ద్రష్టుం శశినిభం ముఖమ్.

ప్ర. అ. స్తుతిపురాణజ్ఞాః=స్తుతులను పురాణములను ఎరిగిన, సూతాః=సూతులు, తథా=మరియు, సర్వే=సమస్తమైన, వైతాలికాః=వైతాళికులు (స్తోత్రపాఠకులు), సర్వే=సమస్తమైన, వాదిత్రకుశలాః=వాద్యనిపుణులు,సంఘశః=సంఘములుగా, గణికాః=వేశ్యలు,రాజదారాః=రాజభార్యలు, తథా=మరియు, అమాత్యాః=మంత్రులు, సైన్యాః=జీతము తీసికొనే సైనికులు, సేనాజ్గనాగణాః= అటవీప్రాంతాలనుండి అప్పు డప్పుడు తీసికొనబడే సేనలు, స్త్రీగణములు, సరాజన్యాః=రాజపుత్రులతో కూడిన, బ్రాహ్మణాశ్చ=బ్రాహ్మణులు, శ్రేణీముఖ్యాః=వర్తకులు మొదలగువారి శ్రేణుల ప్రధానులు, తథా=మరియు, గణాః=ఆ యా వృత్తులవారి గణములు, రామస్య=రామునియొక్క, శశినిభమ్=చంద్రునితో సమానమైన, ముఖమ్=ముఖమును, ద్రష్టుమ్=చూచుటకు, అభినిర్యాన్తు=బయలుదేరెదరుగాక.

తా. స్తుతులు పురాణములు తెలిసిన సూతులు, అందరు వైతాళికులు, వాద్యనిపుణులు, వేశ్యలు, కౌసల్యాది రాజభార్యలు, అమాత్యులు, సైన్యములు, సేనలు, స్త్రీగణములు, బ్రాహ్మణులు, రాజకుమారులు, శ్రేణీనాయకులు, గణములు రాముని చంద్రుని వంటి ముఖమును చూచుటకై బయలుదేరెదరుగాక. 3, 4

మూ. భరతస్య వచః శ్రుత్వా శత్రుఘ్నః పరవీరహా, 5
విష్టీరనేకసాహస్రీశ్చోదయామాస భాగశః.

ప్ర. అ. పరవీరహా=శత్రువీరసంహారకుడైన, శత్రుఘ్నః=శత్రుఘ్నుడు, భరతస్య=భరతునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, అనేకసాహస్రీః=చాలా వేలమంది, విష్టీః=కర్మకరులను, భాగశః=వేరువేరుగా, చోదయామాస=ప్రేరేపించెను.

తా. శత్రువీరసంహారకుడైన శత్రుఘ్నుడు భరతుని మాటలు విని, చాల వేలమంది కర్మకరులను, పనివారిని వేరు వేరు పనులు చేయుటకు గుంపులు గుంపులుగా నియమించెను. 5

మూ. సమం కురుత నిమ్నాని విషమాని సమాని చ, 6
స్థానాని తు నిరస్యన్తాం నన్దిగ్రామాదితః పరమ్.

ప్ర. అ. ఇతః=ఈ, నన్దిగ్రామాత్=నందిగ్రామమునుండి, పరమ్=అవతలి వరకు, నిమ్నాని=పల్లములను, సమీకురుత=సమముగా ఉండునట్లు చేయుడు, విషమాణి=విషమములు, సమాని చ=సమములు అయిన, స్థానాని=స్థానములు, నిరస్యన్తామ్=తొలగింపబడుగాక.

తా. ఈ నందిగ్రామమునుండి అయోధ్యవరకు పల్లములను పూడ్చివేయుడు. విషమములుగాను, సమముగాను ఉన్న స్థానాలను ఆ భేదము

లేకుండునట్లు సమము చేయుదు. 6

మూ. సిఞ్చన్తు పృథివీం కృత్స్నాం హిమశీతేన వారిణా, 7
తతోఽభ్యవకిరన్త్వన్యే లాజైః పుష్పైశ్చ సర్వతః.

ప్ర. అ. కృత్స్నామ్=సమస్తమైన, పృథివీమ్=నేలను, హిమశీతేన=మంచువలె చల్లని, వారిణా=ఉదకముచేత, సిఞ్చన్తు=తడుపుదురుగాక. తతః=అటుపిమ్మట, అన్యే=ఇతరులు, సర్వతః=అన్ని వైపుల, లాజైః=పేలాలచేతను, పుష్పైశ్చ=పుష్పములచేతను, అభ్యవకిరన్తు=చల్లెదరు గాక.

తా. నేల నంతను మంచువలె చల్లనైన నీటితో తడపవలెను. మరి కొందరు అన్నివైపులా పేలాలు, పువ్వులు చల్లవలెను. 7

మూ. సముచ్ఛ్రితపతాకాస్తు రథ్యాః పురవరోత్తమే, 8
శోభయన్తు చ వేశ్మాని సూర్యస్యోదయనం ప్రతి.

ప్ర. అ. పురవరోత్తమే=పురములలో శ్రేష్ఠమైన అయోధ్యయందు, రథ్యాః=వీథులు, సముచ్ఛ్రిత పతాకాః=ఎత్తబడిన పతాకలు కలవిగా చేయబడు గాక. సూర్యస్య=సూర్యునియొక్క, ఉదయనం ప్రతి=ఉదయము సమయానికి, వేశ్మాని=గృహములను, శోభయన్తు=అలంకరింతురు గాక.

తా. అయోధ్యానగరములోని వీథులలో పతాకలు ఎగురవేయవలెను. సూర్యోదయము అగుసరికి ఇండ్లను అలంకరించవలెను. 8

మూ. స్రగ్దామముక్తపుష్పైశ్చ సుగన్ధైః పఞ్చవర్ణకైః, 9
రాజమార్గమసంబాధం కిరన్తు శతశో నరాః.

ప్ర. అ. శతశః=వందలకొలది, నరాః=మనుష్యులు, సుగన్ధైః=మంచి వాసన గల, పఞ్చవర్ణకైః=ఐదు రంగుల చేతను, స్రగ్దామముక్తపుష్పైశ్చ=పుష్పమాలల పంక్తులచేతను, విడి పూవులచేతను, అసంబాధమ్=ఇరుకు లేని, రాజమార్గమ్=రాజమార్గమును, కిరన్తు=చిమ్మెదరు గాక.

తా. వందలకొలది మనుష్యులు మంచి వాసన గల, ఐదు రంగుల చూర్ణములు, పుష్పమాలాపంక్తులు, విడి పువ్వులు విశాలమైన రాజమార్గమునందు చల్లవలెను. రంగులతో ముగ్గులు పెట్టి, మాలలు కట్టి పువ్వులు చల్లవలెను. 9

మూ. తతస్తచ్ఛాసనం శ్రుత్వా శత్రుఘ్నస్య ముదాన్వితాః. 10
ధృష్టిర్జయన్తో విజయః సిద్ధార్థశ్చార్థసాధకః,
అశోకో మన్త్రిపాలశ్చ సుమన్త్రశ్చాపి నిర్యయుః. 11

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శత్రుఘ్నస్య=శత్రుఘ్నునియొక్క, తత్=ఆ, శాసనమ్=ఆజ్ఞను, శ్రుత్వా= విని, ముదా=సంతోషముతో, అన్వితాః=కూడినవారై, ధృష్టిః=ధృష్టి, జయన్తః=జయంతుడు, విజయః=విజయుడు, సిద్ధార్థశ్చ=సిద్ధార్థుడు, అర్థసాధకః=అర్థసాధకుడు, అశోకః=అశోకుడు, మన్త్రిపాలశ్చ=మంత్రపాలుడు, సుమన్త్రశ్చాపి=సుమంత్రుడు, నిర్యయుః=బయల్వెడలిరి.

తా. అటు పిమ్మట శత్రుఘ్నుని ఆజ్ఞ విని ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలకుడు, సుమంత్రుడు సంతోషముతో బయలుదేరిరి. 10, 11.

మూ. మత్తైర్నాగసహస్రైశ్చ సధ్వజైః సువిభూషితైః,
అపరే హేమకక్ష్యాభిః సగజాభిః కరేణుభిః, 12
నిర్యయు స్త్వరయా యుక్తా రథైశ్చ సుమహారథాః.

ప్ర. అ. మత్తైః=మదించిన, సధ్వజైః=ధ్వజములతో కూడిన, సువిభూషితైః=బాగా అలంకరించబడిన, నాగసహస్రైః=ఏనుగుల సహస్రములచేత (కొందరు), అపరే తు=మరికొందరైతే, హేమకక్ష్యాభిః=బంగారు నడుము త్రాళ్ళు గల, సగజాభిః=గజములతో కూడిన, కరేణుభిః=ఆడ ఏనుగులచేతను, సుమహారథాః=ఉత్తమములైన మహారథులు, రథైశ్చ=రథములచేతను, త్వరయా=తొందరతో, యుక్తాః=కూడినవారై, నిర్యయుః=బయలుదేరిరి.

తా. కొందరు ధ్వజములతో కూడిన, బాగా అలంకరించిన మదగజముల నెక్కి, కొందరు బంగారు నడుము త్రాళ్ళు గల, ఏనుగులతో కూడిన ఆడ ఏనుగులపైనా, గొప్పమహారథులు రథముల మీదా శీఘ్రముగా బయలుదేరిరి. 12

మూ. శక్త్యృష్టిపాశహస్తానాం సధ్వజానాం పతాకినామ్, 13
తురగాణాం సహస్రైశ్చ ముఖ్యైర్ముఖ్యతరాన్వితైః,
పదాతీనాం సహస్రైశ్చ వీరాః పరివృతా యయుః. 14

ప్ర. అ. తురగాణామ్=అశ్వములయొక్క, ముఖ్యైః=ప్రధానమైనవి, ముఖ్యతరాన్వితైః=చాల ప్రధానులైన వారితో కూడినవి అయినే, సహస్రైః=సహస్రములతోను, శక్త్యృష్టిపాశహస్తానామ్=శక్తులు, ఋష్టులు, పాశములు హస్తములందు గల, సధ్వజానామ్=ధ్వజములతో కూడిన, పతాకినామ్=పతాకలు గల, పదాతీనామ్=కాలిబంట్లయొక్క, సహస్రైశ్చ=వేలచేతను, పరివృతాః=చుట్టబడిన వారై, వీరాః=వీరులు, యయుః=వెళ్లిరి.

తా. శక్తులు, ఋష్టులు, పాశములు, చేతులలో ధరించిన ధ్వజములు, పతాకలు గ్రహించిన వేలకొలది కాలిబంట్లు, చాల ముఖ్యమైన యోధులు

ఎక్కిన, ప్రధానములైన వేలకొలది గుఱ్ఱములు వెంట రాగా వీరులు బయలుదేరి వెళ్లిరి. 13, 14

మూ. తతో యానాన్యుపారూఢాః సర్వా దశరథస్త్రియః,
కౌసల్యాం ప్రముఖే కృత్వా సుమిత్రాం చాపి నిర్యయుః. 15
కైకేయ్యా సహితాః సర్వా నన్దిగ్రామముపాగమన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సర్వాః=సమస్తమైన, దశరథస్త్రియః=దశరథుని భార్యలు, యానాని=వాహనములను, ఉపారూఢాః=ఎక్కినవారై, కౌసల్యామ్=కౌసల్యను, సుమిత్రాం చాపి=సుమిత్రను, ప్రముఖే కృత్వా=ముందు ఉంచుకొని, నిర్యయుః=బయలుదేరిరి. సర్వాః=అందరూ, కైకేయ్యా=కైకేయితో, సహితాః=కూడినవారై, నన్దిగ్రామమ్=నందిగ్రామమును, ఉపాయయుః=చేరిరి.

తా. పిమ్మట దశరథుని భార్య లందరూ కౌసల్యను, సుమిత్రను ముందు ఉంచుకొని, వాహనము నెక్కి, బయలుదేరిరి. వారందరు కైకేయితో కూడ నందిగ్రామము చేరిరి. 15

మూ. ద్విజాతిముఖ్యైర్ధర్మాత్మా శ్రేణీముఖ్యైః సనైగమైః, 16
మాల్యమోదకహస్తైశ్చ మన్త్రిభిర్భరతో వృతః,
శఙ్ఖభేరీనినాదైశ్చ వన్దిభిశ్చాభివన్దితః, 17
ఆర్యపాదౌ గృహీత్వా తు శిరసా ధర్మకోవిదః.
పాణ్డురం ఛత్రమాదాయ శుక్లమాల్యోపశోభితమ్. 18
శుక్లే చ వాలవ్యజనే రాజార్హే హేమభూషితే,
ఉపవాసకృశో దీనశ్చీరకృష్ణాజినామ్బరః. 19
భ్రాతురాగమనం శ్రుత్వా తత్పూర్వం హర్షమాగతః,
ప్రత్యుద్యయౌ తదా రామం మహాత్మా సచివైః సహ. 20

ప్ర. అ. ద్విజాతిముఖ్యైః=బ్రాహ్మణశ్రేష్ఠులతోను, సనైగమైః=వర్తకులతో కూడిన, శ్రేణీముఖ్యైశ్చ=శ్రేణులలో ప్రధానులైనవారితోను, మాల్యమోదకహస్తైః=పుష్పమాలలు, మధురపదార్థములు హస్తములందు గల, మన్త్రిభిః=మంత్రులతోను, వృతః=కూడినవాడు, ధర్మాత్మా=ధర్మాత్ముడు, శఙ్ఖభేరీనినాదైశ్చ=శంఖములయొక్క భేరులయొక్క ధ్వనులచేత, వన్దిభిశ్చ=స్తోత్రపాఠకులచేత, అభివన్దితః=అభివందింపబడినవాడు, ధర్మకోవిదః=ధర్మము తెలిసినవాడు, ఉపవాసకృశః=ఉపవాసముచేత కృశించినవాడు, దీనః=దీనుడు, చీరకృష్ణాజినామ్బరః=నారచీరలు, కృష్ణాజినము వస్త్రములుగా గలవాడు, భ్రాతుః=సోదరునియొక్క, ఆగమనమ్=ఆగమనమును, శ్రుత్వా=విని, తత్పూర్వమ్=అదే తొలిసారిగా, హర్షమ్=సంతోషమును, ఆగతః=

పొందినవాడు, అయిన మహాత్మా=మహాత్ముడూ అయిన, భరతః=భరతుడు, ఆర్యపాదౌ=అన్నగారి పాదుకలను, శిరసా=శిరస్సుచేత, గృహీత్వా=గ్రహించి, శుక్ల మాల్యోపశోభితమ్=తెల్లని పుష్పమాలలచేత ప్రకాశింపచేయుబడిన, పాణ్డరమ్=తెల్లని, ఛత్రమ్=ఛత్రమును, రాజార్హే=రాజుకు తగిన, హేమభూషితే=బంగారముచేత అలంకరించబడిన, శుక్లే=తెల్లని, వాలవ్యజనే=వింజామరలను, ఆదాయ=గ్రహించి, సచివైః సహ=మంత్రులతో కూడ, తదా=అప్పుడు, ప్రత్యుద్యయౌ=ఎదురు వెళ్లెను.

తా. అప్పుడు ధర్మాత్ముడు, ధర్మములు తెలిసినవాడు, మహాత్ముడూ అయిన భరతుడు అన్నగారి పదములను శిరస్సుపై ఉంచుకొని ఆయనకు ఎదురుగా వెళ్లెను. ఆతడు ఉపవాసములచేత కృశించి దీనుడై, నారచీరలను కృష్ణాజినమును ధరించి ఉండెను. ఇంత సుదీర్ఘకాలములో ఆతనికి సంతోషము తొలిసారిగా కలిగినది సోదరుని రాకను గూర్చి వినినప్పుడే. తెల్లటి పుష్పమాలలచేత అలంకరించబడిన శ్వేతచ్ఛత్రమును, బంగారముచేత అలంకరించిన, రాజుకు తగిన తెల్లని వింజామరలను కూడ తీసికొనివెళ్లెను. శంఖధ్వనులతోను, భేరీధ్వానములతోను బయలుదేరిన ఆతనిని వందిమాగధులు స్తుతించుచుండిరి. బ్రాహ్మణశ్రేష్ఠులు, శ్రేణుల నాయకులు, వర్తకులు, పుష్పమాలలు మధురపదార్థములు చేతులలో ధరించిన మంత్రులు, సచివులు ఆ భరతుని వెంట ఉండిరి. 16-20

మూ. అశ్వానాం ఖురశబ్దైశ్చ రథనేమిస్వనేన చ,
శఙ్ఖదున్దుభినాదేన సంచచాలేవ మేదినీ. 21

ప్ర. అ. అశ్వానామ్=గుఱ్ఱములయొక్క, ఖురశబ్దేన=డెక్కల చప్పుడుచేతను, రథనేమిస్వనేన చ=రథచక్రాంతముల ధ్వనిచేతను, శఙ్ఖదున్దుభిఘోషేణ=శంఖముల దుందుభుల ధ్వనిచేతను, మేదినీ=భూమి, సంచచాలేవ=అదరిన ట్లయ్యెను.

తా. గుఱ్ఱముల డెక్కల చప్పుళ్ళచేతను, రథచక్రాంతముల ధ్వనిచేతను, శంఖదుందుభుల నాదముచేతను భూమి అదరినట్లు అయ్యెను. 21

మూ. కృత్స్నం తు నగరం తత్తు నన్దిగ్రామముపాగమత్,
సమీక్ష్య భరతో వాక్యమువాచ పవనాత్మజమ్. 22

ప్ర. అ. తత్=ఆ, కృత్స్నమ్=సమస్తమైన, నగరమ్=నగరము, నన్దిగ్రామమ్=నందిగ్రామమును, ఉపాగమత్=చేరెను. భరతః=భరతుడు, సమీక్ష్య=పరికించి చూచి, పవనాత్మజమ్=హనుమంతుణ్ణి గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. అయోధ్యానగర మంతా నందిగ్రామము చేరెను. భరతుడు పరిశీలించి చూచి హనుమంతునితో ఇట్లు పలికెను. 22

మూ. కచ్చిన్న ఖలు కాపేయీ సేవ్యతే చలచిత్తతా,
న హి పశ్యామి కాకుత్స్థ రామమార్యం పరంతపమ్. 23

ప్ర. అ. కాపేయీ=కపికి సంబంధించిన, చలచిత్తతా=చంచలచిత్తము కలిగి ఉండుట. న సేవ్యతే ఖలు కచ్చిత్=నీచేత అవలంబించబడుటలేదు కదా ! కాకుత్స్థమ్=కకుత్స్థవంశీయుడు,పరంతపమ్=శత్రుసంహారకుడూ, ఆర్యమ్=అన్నగారు అయిన, రామమ్=రాముణ్ణి, న పశ్యామి హి=చూడను కదా !

తా. నీవు కపికి సహజమైన చపలచిత్తత్వమును చూపలేదు కద ! ఎందుచేతననగా కకుత్స్థవంశీయుడు, శత్రుసంహారకుడు, అన్నగారు అయిన రాముడు కనబడుటలేదు. 23

మూ. అథైవముక్తే వచనే హనూమానిదమబ్రవీత్,
అర్థ్యం విజ్ఞాపయన్నేవ భరతం సత్యవిక్రమమ్. 24

ప్ర. అ. అథ=అటు పిమ్మట, ఏవమ్=ఇట్లు, వచనే=వచనము, ఉక్తే=పలకబడిన దగుచుండగా, హనుమాన్=హనుమంతుడు, సత్యవిక్రమమ్=సత్యమైన పరాక్రమము గల, భరతమ్=భరతుణ్ణి గూర్చి, విజ్ఞాపయన్నేవ=విజ్ఞాపనము చేయుచునే, అర్థ్యమ్=అర్థయుక్తమైన, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. భరతుడు ఆ విధముగా పలుకగా హనుమంతుడు సత్యమైన పరాక్రమము గల ఆతనితో విజ్ఞాపన చేయుచు విషయపూర్వకముగా అర్థయుక్తమైన ఈ వాక్యము పలికెను. 24

మూ. సదాఫలాన్ కుసుమితాన్ వృక్షాన్ ప్రాప్య మధుస్రవాన్,
భరద్వాజప్రసాదేన మత్తభ్రమరనాదితాన్. 25
తస్య చైష వరో దత్తో వాసవేన పరంతప,
ససైన్యస్య తవాతిథ్యం కృతం సర్వగుణాన్వితమ్. 26
నిఃస్వనః శ్రూయతే భీమః ప్రహృష్టానాం వనౌకసామ్,
మన్యే వానరసేనా సా నదీం తరతి గోమతీమ్. 27

ప్ర. అ. [25వ శ్లోకానికి 27వ శ్లోక పూర్వార్థముతో అన్వయము 26వ శ్లోకము అవాంతరవాక్యము.] భరద్వాజప్రసాదేన=భరద్వాజుని అనుగ్రహముచేత, సదాఫలాన్=ఎల్లప్పుడూ ఫలములు గల, కుసుమితాన్=పుష్పించిన, మధుస్రవాన్=తేనెను స్రవించు, మత్తభ్రమరనాదితాన్=మదించిన తుమ్మెదలచేత ధ్వనింపజేయబడిన, వృక్షాన్=వృక్షములను, ప్రాప్య=పొంది, ప్రహృష్టానామ్=సంతోషించిన, వనౌకసామ్=వానరులయొక్క, భీమః=భయంకరమైన, నిఃస్వనః=ధ్వని, శ్రూయతే=వినబడుచున్నది. పరంతప=శత్రుసంహారకుడా, తస్య=భరద్వాజునకు,

ఏషః=ఈ, వరః=వరము, వాసవేన=దేవేంద్రునిచేత, దత్తః=ఇవ్వబడినది. స సైన్యస్య=సైన్యముతో కూడిన, తవ=నీకు, సర్వగుణాన్వితమ్=సమస్తగుణములతో కూడిన, ఆతిథ్యమ్=ఆతిథ్యము, కృతమ్=చేయబడినది. సా=ఆ, వానరసేనా=వానరసేన, గోమతీం నదీమ్=గోమతీ నదిని, తరతి=దాటుచున్నది అని, మన్యే=తలచుచున్నాను.

తా. భరద్వాజముని అనుగ్రహముచే ఎల్లప్పుడు ఫలాలు గలవి, పుష్పించినవి, తేనెను స్రవించుచున్నవి, మదించిన తుమ్మెదలచేత ధ్వనింపచేయ బడినవీ అయిన వృక్షములు కనబడుటచే సంతోషించిన వానరుల భయంకరమైన ధ్వని వినబడుచున్నది. ఆ వానరసేన గోమతీనదిని దాటుచున్న దని అనుకొనుచున్నాను. ఓ శత్రుసంహారకుడా ! భరద్వాజునకు దేవేంద్రుడు అట్టి వరమును ఇచ్చి ఉన్నాడు. అందుచేతనే నీకు నీ సైన్యమునకు పూర్వము అతడు సకలగుణములతో కూడిన ఆతిథ్యమును ఇచ్చినాడు. 25-27

మూ. రజోవర్షం సముద్భూతం పశ్య సాలవనం ప్రతి,
మన్యే సాలవనం రమ్యం లోపయన్తి ప్లవంగమాః. 28

ప్ర. అ. సాలవనం ప్రతి=సాలవనము వైపు, సముద్భూతమ్=పుట్టిన, రజోవర్షమ్=పరాగవర్షమును, పశ్య=చూడుము, ప్లవంగమాః=వానరులు, రమ్యమ్=సుందరమైన, సాలవనమ్=సాలవనమును, లోలయన్తి=కదుపుచున్నారు అని, మన్యే=తలచెదను.

తా. ఆ సాలవనమువైపు పరాగవర్షము బయలుదేరినది. చూడుము. వానరులు సుందరమైన ఆ సాలవనమువైపు కదల్చివేయుచున్నా రని తలచెదను.

మూ. తదేతద్దృశ్యతే దూరాద్విమానం చన్ద్రసంనిభమ్, 1
విమానం పుష్పకం దివ్యం మనసా బ్రహ్మనిర్మితమ్. 29

ప్ర. అ. చన్ద్రసంనిభమ్=చంద్రునితో సమానమైన, తత్=ఆ, ఏతత్=ఈ, విమానమ్=విమానము, దూరాత్=దూరమునుండి, దృశ్యతే=చూడబడుచున్నది. దివ్యమ్=దివ్యమైన, పుష్పకం విమానమ్=ఈ పుష్పకవిమానము, బ్రహ్మణా=బ్రహ్మచేత (విశ్వకర్మచేత), మనసా=మనస్సుచేత, నిర్మితమ్=నిర్మించబడినది.

తా. అదుగో ! చంద్రునితో సమానమైన విమానము దూరమునుండి కనబడుచున్నది. దివ్యమైన ఈ పుష్పకవిమానమును విశ్వకర్మ మనస్సుచేత నిర్మించినాడు. 29

మూ. రావణం బాన్ధవైః సార్ధం హత్వా లబ్ధం మహాత్మనా,
తరుణాదిత్యసంకాశం విమానం రామవాహనమ్, 30
ధనదస్య ప్రసాదేన దివ్యమేతన్మనోజవమ్.

ప్ర. అ. రావణమ్=రావణుణ్ణి, బాన్ధవైః సార్ధమ్=బంధువులతో కూడ, హత్వా=చంపి, మహాత్మనా=మహాత్ముడైన రాముని చేత, లబ్ధమ్=పొందబడిన, తరుణాదిత్యసంకాశమ్=బాలసూర్యునితో సమానమైన, రామవాహనమ్=రాముని వాహనముగా ఉన్న, ఏతత్=ఈ, దివ్యమ్=దివ్యమైన, మనోజవమ్=మనోవేగము గల, విమానమ్=విమానము, ప్రసాదేన=బ్రహ్మదేవుని అనుగ్రహముచేత, ధనదస్య=కుబేరునికి సంబంధించినది.

తా. మహాత్ముడైన రాముడు రావణుణ్ణి అతని బంధువులను చంపి ఈ విమానమును సంపాదించినాడు. ప్రస్తుతము రాముని వాహనముగా ఉన్న, బాలసూర్యునితో సమానమైన, మనోవేగము గల ఈ దివ్యవిమానము బ్రహ్మదేవుని అనుగ్రహముచేత కుబేరునకు లభించినది. 30

మూ. ఏతస్మిన్ భ్రాతరౌ వీరౌ వైదేహ్యా సహ రాఘవౌ, 31
సుగ్రీవశ్చ మహాతేజా రాక్షసశ్చ విభీషణః.

ప్ర. అ. వీరౌ=వీరులైన, భ్రాతరౌ=సోదరులైన, వైదేహ్యా సహ=సీతతో కూడిన, రాఘవౌ=రామలక్ష్మణులు, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సుగ్రీవశ్చ=సుగ్రీవుడు, రాక్షసః=రాక్షసుడైన, విభీషణశ్చ=విభీషణుడు, ఏతస్మిన్=ఈ విమానములో ఉన్నారు.

తా. ఈ విమానములో సోదరులైన వీరులు రామలక్ష్మణులు, సీత, గొప్ప తేజస్సు గల సుగ్రీవుడు, విభీషణుడు ఉన్నారు. 31

మూ. తతో హర్షసముద్భూతో నిఃస్వనో దివమస్పృశత్, 32
స్త్రీబాలయువవృద్ధానాం రామోఽయమితి కీర్తితే.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, అయమ్=ఇడిగో, రామః=రాముడు, ఇతి=అని, కీర్తితే=చెప్పబడగా, స్త్రీబాలయువవృద్ధానామ్=స్త్రీలయొక్క, బాలురయొక్క, యువకులయొక్క, వృద్ధులయొక్క, హర్షసముద్భూతః=సంతోషమువలన కలిగిన, నిఃస్వనః=ధ్వని, దివమ్=ఆకాశమును, అస్పృశత్=స్పృశించెను.

తా. ఇంతలో "ఇడిగో రాముడు వచ్చినాడు" అని అనగానే స్త్రీలు, బాలలు, యువకులు, వృద్ధులు సంతోషముతో చేసిన ధ్వని మిన్ను ముట్టెను.

మూ. రథకుఞ్జరవాజిభ్యస్తేఽవతీర్య మహీం గతాః, 33
దదృశుస్తం విమానస్థం నరాః సోమమివామ్బరే.

ప్ర. అ. రథకుఞ్జరవాజిభ్యః=రథములనుండి, ఏనుగులనుండి, గుఱ్ఱముల నుండి, అవతీర్య=దిగి, మహీమ్=భూమిని, గతాః=పొందిన, తే నరాః=ఆ మనుష్యులు,

విమానస్థమ్=విమానమునందున్న, తమ్=ఆ రాముణ్ణి, అమ్బరే=ఆకాశమునందున్న, సోమమివ=చంద్రుణ్ణి వలె, దదృశుః=చూచిరి.

తా. రథములనుండి, ఏనుగులనుండి, గుఱ్ఱములనుండి దిగి నేలమీద నిలచిన వాళ్ళందరూ విమానములో ఉన్న ఆ రాముణ్ణి ఆకాశములో ఉన్న చంద్రుణ్ణి చూచినట్లు చూచిరి. 33

మూ. ప్రాఞ్జలిర్భరతో భూత్వా ప్రహృష్టో రాఘవోన్ముఖః, 34
స్వాగతేన యథార్హేణ తతో రామమపూజయత్.

ప్ర. అ. ప్రాఞ్జలిః=ఎత్తబడిన దోసిలి గల, ప్రహృష్టః=సంతోషించిన, భరతః=భరతుడు, రాఘవోన్ముఖః=రామునకు అభిముఖుడుగా, భూత్వా=అయి, యథార్హేణ=తగిన, స్వాగతేన=స్వాగతముచేత, రామమ్=రాముణ్ణి, అపూజయత్=పూజించెను.

తా. భరతుడు దోసిలి కట్టి ఆనందముతో రామునకు ఎదురుగా ముఖము పైకెత్తి నిలచి తగు విధముగా స్వాగతవచనములతో రాముణ్ణి పూజించెను. 34

మూ. మనసా బ్రహ్మణా సృష్టే విమానే భరతాగ్రజః, 35
రరాజ పృథుదీర్ఘాక్షో వజ్రపాణిరివాపరః.

ప్ర. అ. మనసా=మనస్సుతో, బ్రహ్మణా=బ్రహ్మచేత, సృష్టే=సృష్టింపబడిన, విమానే=విమానమునందు, పృథుదీర్ఘాక్షః=పెద్ద, విశాలములైన నేత్రములు గల, భరతాగ్రజః=రాముడు, అపరః=మరియొక, వజ్రపాణిరివ=దేవేంద్రుడు వలె, రరాజ=ప్రకాశించెను.

తా. బ్రహ్మదేవుడు మనసా సృజించిన ఆ విమానములో ఉన్న, పెద్దవైన విశాలములైన నేత్రములు గల రాముడు రెండవ దేవేంద్రుడు వలె ప్రకాశించెను. 35

మూ. తతో విమానాగ్రగతం భరతో భ్రాతరం తదా, 36
వవన్దే ప్రణతో రామం మేరుస్థమివ భాస్కరమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, భరతః=భరతుడు, విమానాగ్రగతమ్=విమానాగ్రమునందున్న, మేరుస్థమ్=మేరుపర్వతము మీద నున్న, భాస్కరం యథా=సూర్యుడు వలె ఉన్న, రామమ్=రాముణ్ణి, తదా=అప్పుడు, ప్రణతః=వంగినవాడై, వవన్దే=నమస్కరించెను.

తా. పిమ్మట భరతుడు మేరుపర్వతముమీద ఉన్న సూర్యుడు వలె,

విమానాగ్రమునం దున్న రామునకు వంగి నమస్కారము చేసెను. 36

మూ. తతో రామాభ్యనుజ్ఞాతం తద్విమానమనుత్తమమ్, 37
హంసయుక్తం మహావేగం నిపపాత మహీతలే.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, అనుత్తమమ్=చాల ఉత్తమము, హంసయుక్తమ్=హంసల ప్రతిమలతో కూడినది, మహావేగమ్=గొప్ప వేగము గలదీ అయిన, తత్ విమానమ్=ఆ విమానము, రామాభ్యనుజ్ఞాతమ్=రామునిచేత అనుజ్ఞ ఇవ్వబడినదై, మహీతలే=నేలమీద, నిపపాత=దిగెను.

తా. పిమ్మట చాల ఉత్తమము, హంసల ప్రతిమలు కలది, గొప్ప వేగము గలది అయిన ఆ విమానము రాముని ఆజ్ఞచేత నేలమీద దిగెను.37

మూ. ఆరోపితో విమానం తద్భరతః సత్యవిక్రమః, 38
రామమాసాద్య ముదితః పునరేవాభ్యవాదయత్.

ప్ర. అ. తత్ విమానమ్=ఆ విమానమును, ఆరోపితః=ఎక్కించబడిన, సత్యవిక్రమః=సత్యమైన పరాక్రమము గల, భరతః=భరతుడు, రామమ్=రాముణ్ణి, ఆసాద్య=సమీపించి, పునరేవ=మరల, అభ్యవాదయత్=నమస్కరించెను.

తా. రాముడు విమానమును ఎక్కించగా సత్యమైన పరాక్రమము గల భరతుడు రాముణ్ణి చేరి మరల అభివాదనము చేసెను. 38

మూ. తం సముత్థాప్య కాకుత్స్థశ్చిరస్యాక్షిపథం గతమ్, 39
అఙ్కే భరతమారోప్య ముదితః పరిషస్వజే.

ప్ర. అ. కాకుత్స్థః=రాముడు, చిరాయ=చిరకాలమునకు, అక్షిపథమ్=నేత్రమార్గమును, గతమ్=పొందిన, తమ్=ఆ, భరతమ్=భరతుణ్ణి, సముత్థాప్య=లేవదీసి, అఙ్కమ్=తొడను, ఆరోప్య=అధిష్ఠింపజేసి, ముదితః=సంతోషించినవాడై, పరిషస్వజే=కౌగిలించుకొనెను.

తా. రాముడు చిరకాలానికి కనబడిన ఆ భరతుణ్ణి పైకి లేవదీసి తన తొడపై కూర్చుండబెట్టుకొని, ఆనందముతో కౌగలించుకొనెను. 39

మూ. తతో లక్ష్మణమాసాద్య వైదేహీం చ పరంతపః, 40
అథాభ్యవాదయత్ప్రీతో భరతో నామ చాబ్రవీత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పరంతపః=శత్రుసంహారకుడైన, భరతః=భరతుడు, ప్రీతః=సంతోషించినవాడై, లక్ష్మణమ్=లక్ష్మణుణ్ణి, వైదేహీం చ=సీతను, ఆసాద్య=పొంది, అథ=పిమ్మట, అభ్యవాదయత్=నమస్కరించెను, నామ=పేరును,

అబ్రవీత్ చ=చెప్పెను.

తా. పిమ్మట శత్రుసంహారకుడైన భరతుడు సంతోషముతో లక్ష్మణుని వద్దకు, సీతవద్దకు వెళ్లి, తన పేరు చెప్పుచు నమస్కరించెను. 40

మూ. సుగ్రీవం కేకయీపుత్రో జామ్బవన్తమథాఙ్గదమ్, 41
మైన్దం చ ద్వివిదం నీలమృషభం పరిషస్వజే.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, కేకయీపుత్రః=భరతుడు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, జామ్బవన్తమ్=జాంబవంతుణ్ణి, అఙ్గదమ్=అంగదుణ్ణి, మైన్దమ్=మైందుణ్ణి, ద్వివిదం చైవ=ద్వివిదుణ్ణి, నీలమ్=నీలుణ్ణి, ఋషభమ్=ఋషభుణ్ణి, పరషస్వజే=కౌగలించుకొనెను.

తా. పిమ్మట భరతుడు సుగ్రీవుణ్ణి, జాంబవంతుణ్ణి, అంగదుణ్ణి, మైంద-ద్వివిద-నీల-ఋషభులను కౌగలించుకొనెను. 41

మూ. సుషేణం చ నలం చైవ గవాక్షం గన్ధమాదనమ్, 42
శరభం పనసం చైవ పరితః పరిషస్వజే.

ప్ర. అ. సుషేణం చ=సుషేణుణ్ణి, నలం చైవ=నలుణ్ణి, గవాక్షమ్=గవాక్షుణ్ణి, గన్ధమాదనమ్=గంధమాదనుణ్ణి, శరభమ్=శరభుణ్ణి, పనసం చైవ=పనసుణ్ణి, పరితః=అంతటా (గాఢముగా లేదా పరితః=ఆ చుట్టుప్రక్కల ఉన్న, సుషేణాదులను), పరిషస్వజే=కౌగలించుకొనెను.

తా. అక్కడనే ఉన్న సుషేణుణ్ణి, నలుణ్ణి, గవాక్షుణ్ణి, గంధమాదనుణ్ణి, శరభుణ్ణి, పనసుణ్ణి కౌగలించుకొనెను. 42

మూ. తే కృత్వా మానుషం రూపం వానరాః కామరూపిణః, 43
కుశలం పర్యపృచ్ఛంస్తే ప్రహృష్టా భరతం తదా.

ప్ర. అ. తదా=అప్పుడు, కామరూపిణః=స్వేచ్ఛారూపములు గల, తే వానరాః=ఆ వానరులు, మానుషం రూపమ్=మనుష్యరూపమును, కృత్వా=చేసి, ప్రహృష్టాః=సంతోషించినవారై, భరతమ్=భరతుణ్ణి, కుశలమ్=కుశలమును, పర్యపృచ్ఛన్=అడిగిరి.

తా. ఇచ్ఛానుసారము రూపములు ధరించగలిగిన ఆ వానరులు మనుష్యరూపములు ధరించి సంతోషించుచు భరతుణ్ణి కుశలప్రశ్న వేసిరి. 43

మూ. అథాబ్రవీద్రాజపుత్రః సుగ్రీవం వానరర్షభమ్, 44
పరిష్వజ్య మహాతేజా భరతో ధర్మిణాం వరః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సుగల, ధర్మిణామ్=ధర్మవంతులలో, వరః=శ్రేష్ఠుడైన, రాజపుత్రః=రాజపుత్రుడైన, భరతః=భరతుడు, వానరర్షభమ్=వానర శ్రేష్ఠుడైన, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, పరిష్వజ్య=కౌగలించుకొని,. అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట దశరథపుత్రుడు, మహాతేజఃశాలి, ధర్మాత్ములలో శ్రేష్ఠుడూ అయిన భరతుడు సుగ్రీవుణ్ణి కౌగలించుకొని ఇట్లు పలికెను. 44

మూ. త్వమస్మాకం చతుర్ణాం వై భ్రాతా సుగ్రీవ పఞ్చమః, 45
సౌహార్దాజ్జాయతే మిత్రమపకారోఽరిలక్షణమ్.

ప్ర. అ. సుగ్రీవ=సుగ్రీవుడా ! త్వమ్=నీవు, అస్మాకమ్=మాకు, చతుర్ణామ్=నలుగురికీ, పఞ్చమః=ఐదవ, భ్రాతా=సోదరుడవు. సౌహార్దాత్=ప్రేమవలన, మిత్రమ్=మిత్రుడు, జాయతే=ఏర్పడును. అపకారః=అపకారము, అరిలక్షణమ్=శత్రువుయొక్క లక్షణము.

తా. సుగ్రీవా ! నీవు మా నలుగురికీ ఐదవ సోదరుడవు. స్నేహమును పట్టి మిత్రుడు ఏర్పడును. అపకారము చేయుట శత్రులక్షణము. 45

మూ. విభీషణం చ భరతః సాన్త్వవాక్యమథాబ్రవీత్, 46
దిష్ట్యా త్వయా సహాయేన కృతం కర్మ సుదుష్కరమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, భరతః=భరతుడు, విభీషణం చ=విభీషణుని గూర్చి, సాన్త్వవాక్యమ్=మంచి మాటను, అబ్రవీత్=పలికెను. దిష్ట్యా=దైవవశము చేత, సహాయేన=సహాయుడవైన, త్వయా=నీచేత, సుదుష్కరమ్=చేయుటకు చాల కష్టమైన, కర్మ=పని, కృతమ్=చేయబడినది.

తా. పిమ్మట భరతుడు విభీషణునితో -- అదృష్టవశముచేత నీవు సహాయుడవుగా ఉండి చేయుటకు చాలా కష్టమైన పని చేసితివి. (లేదా నీవు సహాయుడుగా ఉండుటచేత రాముడు చేయ శక్యము కాని పని చేయగలిగినాడు).

మూ. శత్రుఘ్నశ్చ తదా రామమభివాద్య సలక్ష్మణమ్, 47
సీతాయాశ్చరణౌ వీరో వినయాదభ్యవాదయత్.

ప్ర. అ. తదా=అప్పుడు, వీరః=వీరుడైన, శత్రుఘ్నశ్చ=శత్రుఘ్నుడు, సలక్ష్మణమ్=లక్ష్మణసహితుడైన, రామమ్=రాముణ్ణి, అభివాద్య=నమస్కరించి, సీతాయాః=సీతయొక్క, చరణౌ=పాదములను, వినయాత్=వినయమువలన, అభ్యవాదయత్=నమస్కరించెను.

తా. అప్పుడు వీరుడైన శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు నమస్కరించి

వినయముతో సీత పాదములకు నమస్కరించెను. 47

మూ. రామో మాతరమాసాద్య వివర్ణాం శోకకర్శితామ్, 48
జగ్రాహ ప్రణతః పాదౌ మనో మాతుః ప్రహర్షయన్.

ప్ర. అ. రామః=రాముడు, వివర్ణామ్=మారిపోయిన రంగు గల, శోకకర్శితామ్=శోకముచేత కృశింపచేయబడిన, మాతరమ్=తల్లిని, ఆసాద్య=సమీపించి, ప్రణతః=వంగినవాడై, మాతుః=తల్లియొక్క, మనః=మనస్సును, ప్రహర్షయన్=సంతోషపెట్టుచు, పాదౌ=పాదములను, జగ్రాహ=పట్టుకొనెను.

తా. రాముడు, శోకముచేత కృశించినదై శరీరచ్ఛాయ మారిపోయిన తల్లి దగ్గరకు వెళ్లి ఆమె మనస్సుకు సంతోషము కలిగించుచు వినయముతో పాదాభివందనము చేసెను. 48

మూ. అభివాద్య సుమిత్రాం చ కైకేయీం చ యశస్వినీమ్, 49
స మాతౄశ్చ తతః సర్వాః పురోహితముపాగమత్.

ప్ర. అ. సః=రాముడు, సుమిత్రాం చ=సుమిత్రను, యశస్వినీమ్=కీర్తి గల, కైకేయీం చ=కైకేయిని, అభివాద్య=నమస్కరించి, సర్వాః=సమస్తమైన, మాతౄశ్చ=తల్లులను నమస్కరించి, తతః=అటు పిమ్మట, పురోహితమ్=పురోహితుణ్ణి, ఉపాగమత్=సమీపించెను.

తా. రాముడు సుమిత్రకు, కీర్తి గల కైకేయికి, సమస్తమైన తల్లులకు నమస్కారము చేసి పిమ్మట పురోహితుడైన వసిష్ఠుని దగ్గరకు వెళ్లి నమస్కరించెను.

మూ. స్వాగతం తే మహాబాహో కౌసల్యానన్దవర్ధన, 50
ఇతి ప్రాఞ్జలయః సర్వే నాగరా రామమబ్రువన్.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! కౌసల్యానన్దవర్ధన=కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించువాడా! తే=నీకు, స్వాగతమ్=స్వాగతము, ఇతి=అని, సర్వే=సమస్తమైన, నాగరాః=నగరజనులు, ప్రాఞ్జలయః=ఎత్తబడిన దోసిళ్లు కలవారై, రామమ్=రాముణ్ణి గూర్చి, అబ్రువన్=పలికిరి.

తా. "ఓ ! మహాబాహూ ! కౌసల్య ఆనందమును వృద్ధిపొందించు రామా ! నీకు స్వాగతము"అని నగరజను లందరు అంజలులు ఘటించి నమస్కరించుచు రామునితో పలికిరి. 50

మూ. తాన్యఞ్జలిసహస్రాణి ప్రగృహీతాని నాగరైః, 51
వ్యాకోశానీవ పద్మాని దదర్శ భరతాగ్రజః.

ప్ర. అ. నాగరైః=నగరజనులచేత, ప్రగృహీతాని=గ్రహింపబడిన, తాని=ఆ, అఞ్జలిసహస్రాణి=వేలకొలది దోసిళ్లను, భరతాగ్రజః=రాముడు, వ్యాకోచాని=వికసించిన, పద్మానీవ=పద్మములను వలె, దదర్శ=చూచెను.

తా. ఆ నాగరకులు నమస్కరించుచు కట్టిన వేలకొలది దోసిళ్లు రామునకు వికసించిన పద్మములు వలె కనబడెను. 51

మూ. పాదుకే తే తు రామస్య గృహీత్వా భరతః స్వయమ్, 52
చరణాభ్యాం నరేన్ద్రస్య యోజయామాస ధర్మవిత్.

ప్ర. అ. ధర్మవిత్=ధర్మములను ఎరిగిన, భరతః=భరతుడు, రామస్య=రామునియొక్క, తే=ఆ, పాదుకే=పాదుకలను, గృహీత్వా=గ్రహించి, స్వయమ్=స్వయముగా, నరేన్ద్రస్య=ప్రభువైన రామునియొక్క, చరణాభ్యామ్=పాదములతో, యోజయామాస=కూర్చెను.

తా. ధర్మములను ఎరిగిన భరతుడు ఆ రాముని పాదుకలు తీసికొని స్వయముగా ఆతని పాదాలకు తొడిగెను. 52

మూ. అబ్రవీచ్చ తదా రామం భరతః స కృతాఞ్జలిః, 53
ఏతత్తే సకలం రాజ్యం న్యాసం నిర్యాతితం మయా.

ప్ర. అ. సః భరతః=ఆ భరతుడు, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలిలవాడై, తదా=అప్పుడు, రామమ్ =రాముణ్ణిగూర్చి, అబ్రవీచ్చ=పలికెను కూడ. న్యాసమ్=న్యాసముగా ఉన్న, (కొంతకాలము దాచ మని చెప్పి ఒకరిదగ్గరి ఉంచిన వస్తువు న్యాసము), తే=నీయొక్క, సకలమ్=సమస్తమైన, ఏతత్=ఈ, రాజ్యమ్=రాజ్యము, మయా=నాచేత, నిర్యాతితమ్=తిరిగి ఇచ్చివేయబడినది.

తా. అప్పుడు భరతుడు అంజలి ఘటించి రామునితో ఇట్లు పలికెను. ---"నీవు నావద్ద న్యాసముగా ఉంచిన ఈ రాజ్యమును అంతనూ నేను తిరిగి అప్పగించుచున్నాను." 53

మూ. అద్య జన్మ కృతార్థం మే సంవృత్తశ్చ మనోరథః, 54
యత్త్వాం పశ్యామి రాజానమయోధ్యాం పునరాగతమ్.

ప్ర. అ. అద్య=నేడు, మే=నాయొక్క, జన్మ=జన్మ, కృతార్థమ్=చరితార్థమైనది. మనోరథః చ=మనోరథము కూడ, సంవృత్తః=సిద్ధించినది. యత్=ఎందువలన, అయోధ్యామ్=అయోధ్యను గూర్చి, పునః=మరల, ఆగతమ్=వచ్చిన, త్వామ్=నిన్ను, రాజానమ్=రాజునుగా, పశ్యామి=చూచుచున్నానో.

తా. నీవు అయోధ్యకు తిరిగి వచ్చి రాజు కాబోవుట చూచుచున్నాను,

అందుచేత నేడు నా జన్మ చరితార్థ మైనది. కోరిక తీరినది. 54

మూ. అవేక్షతాం భవాన్ కోశం కోష్ఠాగారం గృహం బలమ్, 55
భవతస్తేజసా సర్వం కృతం దశగుణం మయా.

ప్ర. అ. భవాన్=నీవు, కోశమ్=ధనాగారమును, కోష్ఠాగారమ్=ధాన్యాదులు నిలువ ఉంచు స్థానమును, గృహమ్=గృహమును, బలమ్=సైన్యమును, అవేక్షతామ్=చూచెదవు గాక. భవతః=నీయొక్క, తేజసా=తేజస్సుచేత, మయా=నాచేత, సర్వమ్=అంతా, దశగుణమ్=పదిరెట్లు, కృతమ్=చేయబడినది.

తా. నీవు కోశమును, కోష్ఠాగారములను, గృహములను, సైన్యమును చూడుము. నీ తేజస్సుచేత నేను అన్నింటినీ పది రెట్లు చేసినాను. 55

మూ. తథా బ్రువాణం భరతం దృష్ట్వా తం భ్రాతృవత్సలమ్, 56
ముముచుర్వానరా బాష్పం రాక్షసశ్చ విభీషణః.

ప్ర. అ. తథా=అట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, భ్రాతృవత్సలమ్=సోదరునియందు ప్రేమ గల, తం భరతమ్= ఆ భరతుణ్ణి, దృష్ట్వా=చూచి, వానరాః=వానరులు, బాష్పమ్=కన్నీటిని, ముముచుః=విడచిరి. రాక్షసః=రాక్షసుడైన, విభీషణః చ=విభీషణుడు కూడ (విడచెను).

తా. సోదరునియందు ప్రేమ గల భరతుడు అట్లు పలుకుచుండగా విని వానరులు, విభీషణుడు కన్నీళ్లు రాల్చిరి. 56

మూ. తతః ప్రహర్షాద్భరతమఙ్కమారోప్య రాఘవః, 57
యయౌ తేన విమానేన ససైన్యో భరతాశ్రమమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, ప్రహర్షాత్=సంతోషమువలన, భరతమ్=భరతుణ్ణి, అఙ్కమ్=తొడను, ఆరోప్య=అధిష్ఠింపచేసి, ససైన్యః=సైన్యముతో కూడినవాడై, భరతాశ్రమమ్=భరతుని ఆశ్రమమును గూర్చి, యయౌ=వెళ్లెను.

తా. పిమ్మట రాముడు సంతోషముతో భరతుణ్ణి తొడపై కూర్చుండబెట్టుకొని, ఆ విమానముమీదనే సైన్యసహితుడై భరతుని ఆశ్రమమునకు వెళ్ళెను. 57

మూ. భరతాశ్రమమాసాద్య ససైన్యో రాఘవస్తదా, 58
అవతీర్య విమానాగ్రాదవతస్థే మహీతలే.

ప్ర. అ. తదా=అప్పుడు, రాఘవః=రాముడు, భరతాశ్రమమ్=భరతుని ఆశ్రమమును, ఆసాద్య=పొంది, ససైన్యః=సైన్యముతో కూడినవాడై, విమా

న్నాగ్రాత్=విమానాగ్రమునుండి, అవతీర్య=దిగి, మహీతలే=నేలమీద, అవతస్థే=నిలచెను.

తా. అప్పుడు రాముడు భరతుని ఆశ్రమము చేరి, సైన్యముతో ఆ విమానమునుండి దిగి నేలమీద నిలచెను. 58

మూ. అబ్రవీత్తు తదా రామస్తద్విమానమనుత్తమమ్, 59
వహ వైశ్రవణం దేవమనుజానామి గమ్యతామ్.

బి ప్ర. అ. తదా=అప్పుడు, రామః=రాముడు, అనుత్తమమ్=చాల శ్రేష్ఠమైన, తత్=ఆ, విమానమ్= విమానమును గూర్చి, అబ్రవీత్=పలికెను. దేవమ్=ప్రభువైన, వైశ్రవణమ్=కుబేరుణ్ణి, వహ=మోయుము. అనుజానామి=అనుజ్ఞ ఇచ్చుచున్నాను. గమ్యతామ్=వెళ్లెదవు గాక.

తా. అప్పుడు రాముడు అత్యుత్తమమైన ఆ విమానముతో --- "ఇటుపై ప్రభువైన కుబేరుని వాహనముగా ఉండుము. అనుజ్ఞ ఇచ్చుచున్నాను, వెళ్ళుము" అని పలికెను. 59

మూ. తతో రామాభ్యనుజ్ఞాతం తద్విమానమనుత్తమమ్, 60
ఉత్తరాం దిశముద్దిశ్య జగామ ధనదాలయమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రామాభ్యనుజ్ఞాతమ్=రామునిచేత అనుజ్ఞ ఇవ్వబడిన, అనుత్తమమ్=చాల శ్రేష్ఠమైన, తత్ విమానమ్=ఆ విమానము, ధనదాలయమ్ ఉద్దిశ్య=కుబేరుని గృహమును ఉద్దేశించి, ఉత్తరాం దిశమ్=ఉత్తరదిక్కును గూర్చి, జగామ=వెళ్లెను.

తా. పిమ్మట ఆ అత్యుత్తమమైన విమానము రామునిచేత ఆజ్ఞాపింపబడినదై కుబేరుని స్థానము చేరుటకై ఉత్తరము వైపు వెళ్ళిపోయెను.

మూ. విమానం పుష్పకం దివ్యం సంగృహీతం తు రక్షసా, 61
అగమద్ధనదం వేగాద్రామవాక్యప్రచోదితమ్.

ప్ర. అ. రక్షసా=రావణునిచేత, సంగృహీతమ్=గ్రహింపబడిన, దివ్యమ్=దివ్యమైన, పుష్పకం విమానమ్=పుష్పకవిమానము, రామవాక్యప్రచోదితమ్=రాముని వాక్యముచేత, ప్రేరేపింపబడి, వేగాత్=వేగమువలన, ధనదమ్=కుబేరుని గూర్చి, అగమత్=వెళ్ళెను.

తా. రావణుడు అపహరించిన ఆ పుష్పకవిమానము రాముని ఆజ్ఞ ప్రకారము వేగముగా కుబేరుని దగ్గరకు వెళ్ళెను. 61

మూ. పురోహితస్యాత్మసమస్య రాఘవో
బృహస్పతేః శక్ర ఇవామరాధిపః,
నిపీడ్య పాదౌ పృథగాసనే శుభే
సహైవ తేనోపవివేశ వీర్యవాన్. 62

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే సప్తవింశత్యధికశతతమః సర్గః.

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడైన, రాఘవః=రాముడు, ఆత్మసమస్య=తనకు తగిన, పురోహితస్య=పురోహితునియొక్క, పాదౌ=పాదములను, అమరాధిపః=దేవతల ప్రభువైన, శక్రః=ఇంద్రుడు, బృహస్పతేః ఇవ=బృహస్పతి యొక్క పాదములను వలె, నిపీడ్య=స్పృశించి, తేన సహైవ=అతనితో కూడ, శుభే=శుభమైన, పృథగాసనే=వేరు ఆసనమునందు, ఉపవివేశ=కూర్చుండెను.

తా. పరాక్రమవంతుడైన రాముడు తనకు తగిన పురోహితుడైన వసిష్ఠుని పాదములకు, దేవతాప్రభువైన ఇంద్రుడు బృహస్పతి పాదములకు నమస్కరించినట్లు నమస్కరించి అతనితో పాటు వేరు ఆసనముమీద కూర్చుండెను. 62

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
యుద్ధకాండలో నూటఇరువదిఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశత్యధికశతతమః సర్గః

[భరతుడు రామునకు రాజ్యమును తిరిగి అప్పగించుట. రాముడు అయోధ్యలో ప్రవేశించుట. రాముడు రాజ్యాభిషిక్తు డగుట. వానరులను వెనుకకు పంపుట. శ్రీమద్రామాయణగ్రంథమాహాత్మ్యము.]

మూ. శిరస్యఞ్జలిమాధాయ కైకేయ్యానన్దవర్ధనః,
బభాషే భరతో జ్యేష్ఠం రామం సత్యపరాక్రమమ్. 1

ప్ర. అ. కైకేయ్యానన్దవర్ధనః=కైకేయియొక్క ఆనందమును వృద్ధి పొందించు, భరతః=భరతుడు, శిరసి=శిరస్సునందు, అఞ్జలిమ్=దోసిలిని, ఆధాయ=ఉంచి, సత్య పరాక్రమమ్=సత్యమైన పరాక్రమము గల, జ్యేష్ఠమ్=పెద్దవాడైన, రామమ్=రాముణ్ణి గూర్చి, బభాషే=పలికెను.

తా. కైకేయికి ఆనందమును వృద్ధిపొందించు భరతుడు శిరస్సుపై అంజలి ఘటించి సత్యమైన పరాక్రమము గల జ్యేష్ఠసోదరుడైన రామునితో ఇట్లు పలికెను. 1

మూ. పూజితా మామికా మాతా దత్తం రాజ్యమిదం మమ,
తద్దదామి పునస్తుభ్యం యథా త్వమదదా మమ. 2

ప్ర. అ. మామికా=నా సంబంధమైన, మాతా=తల్లి, పూజితా=పూజింప బడినది. ఇదం రాజ్యమ్=ఈ రాజ్యము, మమ= నాకు, దత్తమ్=ఇవ్వబడినది. తత్=దానిని, త్వమ్=నీవు, మమ=నాకు, యథా=ఎట్లు, అదదాః=ఇచ్చితివో, అట్లే, పునః=తిరిగి, తుభ్యమ్=నీకొరకు, దదామి=ఇచ్చుచున్నాను.

తా. నీవు మా తల్లి మాట మన్నించి నాకు రాజ్యము ఇచ్చినావు. నీవు నాకు ఇచ్చినట్లే నేను తిరిగి ఆ రాజ్యమును నీకు ఇచ్చుచున్నాను. 2

మూ. ధురమేకాకినా న్యస్తాం వృషభేణ బలీయసా,
కిశోరవద్గురుం భారం న వోఢుమహముత్సహే. 3

ప్ర. అ. బలీయసా=మంచి బలము గల, ఏకాకినా=ఒంటరిదైన, వృషభేణ=వృషభముచేత, న్యస్తామ్=అనాయాసముగా లాగబడిన, ధురమ్=కాడిని (భారమును), కిశోరవత్=లేగదూడవలె, గురుమ్=పెద్దదైన, భారమ్=ఈ భారమును, అహమ్=నేను, వోఢుమ్=మోయుటకు, న ఉత్సహే=సమర్థుడనుకాను.

తా. మంచి బలము గల ఎద్దు ఒంటరిగా అనాయాసముగా లాగగలిగిన భారమును లేగదూడ ఎట్లు లాగజాలదో అట్లే నేను ఈ పెద్ద బరువును మోయజాలను. 3

మూ. వారివేగేన మహతా భిన్నః సేతురివ క్షరన్,
దుర్బన్ధనమిదం మన్యే రాజ్యచ్ఛిద్రమసంవృతమ్. 4

ప్ర. అ. మహతా=గొప్పదైన, వారివేగేన=జలవేగముచేత, భిన్నః=బ్రద్దలుకొట్టబడిన, క్షరన్=స్రవించుచున్న, సేతురివ=సేతువు వలె, ఇదమ్=ఈ, రాజ్యచ్ఛిద్రమ్=రాజ్యమునకు సంబంధించిన ఛిద్రము, అసంవృతమ్=సరిగా ఆచ్ఛాదించబడనిదై, దుర్బన్ధమ్=బంధింప శక్యముకానిది అని, మన్యే=తలచెదను.

తా. గొప్ప జలవేగముచేత బీటలు తీసిన, జలమును స్రవించుచున్న సేతువు వలె ఈ రాజ్యచ్ఛిద్రము, అనగా అనేక ఛిద్రములు గల రాజ్యము, సరిగా కప్పబడనిచో బంధింప శక్యము కాదు అని తలచెదను. 4

మూ. గతిం ఖర ఇవాశ్వస్య హంసస్యేవ చ వాయసః,
నాన్వేతుముత్సహే వీర తవ మార్గమరిందమ. 5

ప్ర. అ. అరిందమ=శత్రుసంహారకుడా ! వీర=వీరుడా ! ఖరః=గాడిద, అశ్వస్య=గుఱ్ఱముయొక్క, గతిమ్ ఇవ=గమనమును వలె, వాయసః=కాకి, హంసస్యేవ=హంసయొక్క గమనమును వలె, తవ=నీయొక్క, మార్గమ్=మార్గమును, అన్వేతుమ్=అనుసరించుటకు, న ఉత్సహే=సమర్థుడను కాను.

తా. శత్రుసంహారకుడవైన ఓ ! వీరుడా ! గాడిద గుఱ్ఱముయొక్క నడకను వలె, కాకి హంసయొక్క నడకను వలె నీ గమనమును నేను అనుసరించజాలను. 5

మూ. యథా చారోపితో వృక్షో జాతశ్చాన్తర్నివేశనే,
మహానపి దురారోహో మహాస్కన్ధః ప్రశాఖవాన్, 6
శీర్యేత పుష్పితో భూత్వా న ఫలాని ప్రదర్శయన్,
తస్య నానుభవేదర్థం యస్య హేతోః స రోపితః, 7
ఏషోపమా మహాబాహో త్వమర్థం వేత్తుమర్హసి,
యద్యస్మాన్మనుజేన్ద్ర త్వం భర్తా భృత్యాన్న శాధి హి. 8

ప్ర. అ. అన్తర్నివేశనే=ఇంటి వెనుక, ఆరోపితః=నాటబడిన, వృక్షః=వృక్షము, మహాన్=గొప్పదిగాను, దురారోహః=ఎక్కుటకు శక్యము కానిది గాను, మహాస్కన్ధః=పెద్ద మాను కలదిగాను, ప్రశాఖవాన్=విస్తృతములైన శాఖలు కలదిగాను,

జాతః అపి=అయినను, పుష్పితః భూత్వా=పుష్పించినదై, ఫలాని=ఫలములను, న ప్రదర్శయన్=చూపక, యథా=ఎట్లు, శీర్యేత=వ్యర్థ మగునో, సః=అది, యస్య హేతోః=ఏ ఫలము నిమిత్తమై, రోపితః=నాటబడినదో, తస్య=దానియొక్క, అర్థమ్=ప్రయోజనమును (ఫలమును), నానుభవేత్=అనుభవించడో, ఏషా=ఇది, ఉపమా=ఉపమ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా ! మనుజేన్ద్ర=మనుజుల ప్రభువా ! త్వమ్=నీవు, భర్తా=పోషకుడవుగా ఉండి, భృత్యాన్=పోషింపదగిన, నః=మమ్ములను, న శాధి యది హి=పరిపాలింపకపోయినచో, త్వమ్=నీవు, అర్థమ్=అర్థమును, వేత్తుమ్=తెలిసికొనుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. గొప్ప బాహువులు గల మహారాజా ! ఒకడు ఇంటి పెరటిలో ఒక మొక్క నాటినాడు. అది పెద్ద మ్రానుతో, విశాలములైన కొమ్మలతో, ఎక్కుటకు శక్యము కానంత పెద్దదిగా పెరిగినది. పుష్పించినది. కాని ఫలములను ఇవ్వకుండా వ్యర్థమై పోయినది. పాతినవాడు ఏ ఫలముకొరకై పాతినాడో అది అనుభవించలేకపోయినాడు. నీవు ప్రభువుగా ఉండి భృత్యులమైన మమ్ములను పోషించకపోయినచో ఈ చెట్టు విషయమే ఉపమానము. దీని అర్థము నీవే గ్రహించుము. మన తండ్రిగారైన దశరథుడు ప్రజాపాలకుడైన పుత్రుడు కావలె నని కోరి పుత్రేష్ట్యాదులు చేసి నిన్ను కనినాడు. నీవు ఇంత గొప్ప వాడవైన పిమ్మట ఆయన ఉద్దేశించిన అసలు కార్యము చేయకున్నచో ఆయన ఆశ వ్యర్థమైపోవును అని భావము. 6 - 8

మూ. జగదద్యాభిషిక్తం త్వామనుపశ్యతు రాఘవ,
ప్రతపన్తమివాదిత్యం మధ్యాహ్నే దీప్తతేజసమ్. 9

ప్ర. అ. రాఘవ=రామా ! జగత్=జగత్తు, అద్య=ఇప్పుడు, అభిషిక్తమ్=రాజ్యాభిషిక్తుడవైన, త్వామ్= నిన్ను, మధ్యాహ్నే=మధ్యాహ్న కాలము నందు, ప్రతపన్తమ్=తపించుచున్న, దీప్తతేజసమ్=ప్రజ్వలించుచున్న తేజస్సు గల, ఆదిత్యమివ=సూర్యుణ్ణి వలె, అనుపశ్యతు=చూచుగాక.

తా. రామా ! మధ్యాహ్నమునందు తపించుచున్న, ప్రకాశించుచున్న తేజస్సు గల సూర్యుణ్ణివలె, పట్టాభిషిక్తుడవైన నిన్ను జగత్తు ఇప్పుడు చూచుగాక.9

మూ. తూర్యసంఘాతనిర్ఘోషైః కాఞ్చీనూపురనిఃస్వనైః,
మధురైర్గీతశబ్దైశ్చ ప్రతిబుధ్యస్వ శేష్వ చ. 10

ప్ర. అ. తూర్యసంఘాతనిర్ఘోషైః=తూర్యసముదాయముల ధ్వనులచేత, కాఞ్చీనూపుర నిఃస్వనైః= వడ్డాణములయొక్క నూపురములయొక్క ధ్వనులచేత, మధురైః=మధురములైన, గీతశబ్దైశ్చ=సంగీతధ్వనులచేత, ప్రతిబుధ్యస్వ=మేల్కొనుము, శేష్వ చ=శయనించుము.

తా. మంగళవాద్యములు మ్రోగుచుండగా, వడ్డాణములు, నూపురములు గల గల లాడుచుండగా, మధురములైన సంగీతధ్వనులు వినవచ్చుచుండగా మేల్కొనుము. నిద్ర పొమ్ము. 10

మూ. యావదావర్తతే చక్రం యావతీ చ వసుంధరా,
తావత్త్వమిహ లోకస్య స్వామిత్వమనువర్తయ. 11

ప్ర. అ. చక్రమ్=జ్యోతిశ్చక్రము, యావత్=ఎంతవరకు, ఆవర్తతే=తిరుగునో, వసుంధరా=భూమి, యావత్= ఎంత దూరముండునో, తావత్=అంతవరకు, ఇహ=ఇక్కడ, లోకస్య=లోకమునకు, స్వామిత్వమ్=ప్రభుత్వమును, అనువర్తయ=నడిపింపుము.

తా. జ్యోతిశ్చక్రము ఆకాశమునందు ఎంత కాలము తిరుగునో అంతకాలము, భూమి ఎంతవరకు విస్తరించి యున్నదో అంతవరకు నీవు ఈ లోకమునకు ప్రభుత్వము వహింపుము. 11

వి. 'చక్రమ్ ఆవర్తతే' అనగా జోతిశ్చక్రము అనగా నక్షత్రమండలము తిరుగు నంత కాలము అని వ్యాఖ్యాతలు అర్థం చెప్పినారు. కాని అది అత్యతిశయోక్తి అగునేమో అని సందేహము. అందుచేత రథచక్రము ఎంతవరకు తిరుగునో అంతవరకు అనగా యావద్భూమిపై అని అర్థము చెప్పిన బాగుండునేమో. దాని స్పష్టీకరణమే. "యావతీ చ వసుంధరా"అనునది. అట్టి సమ్రాట్టుకే చక్రవర్తి అని పేరు కదా. హిమవత్సముద్రాలమధ్య ఉన్న క్షేత్రానికి చక్రవర్తిక్షేత్రం అని పేరు అని అర్థశాస్త్రంలో చెప్పబడింది. "దేశః పృథివీ; తస్యాం హిమవత్సముద్రాన్తరముదీచీనం యోజనసహస్రపరిమాణం తిర్యక్ చక్రవర్తిక్షేత్రమ్" (కౌటిల్యుని అర్థశాస్త్రం 9 - 1.) రథచక్రం నడచేవరకూ ఉన్న భూమిని పాలించేవాడు చక్రవర్తి అనే విషయాన్ని అభిజ్ఞానశాకుంతలం సప్తమాంకం చివర కాళిదాసు సూచించి ఉన్నాడు.

మూ. భరతస్య వచః శ్రుత్వా రామః పరపురంజయః,
తథేతి ప్రతిజగ్రాహ నిషసాదాసనే శుభే. 12

ప్ర. అ. పరపురంజయః=శత్రుపురాలను జయించిన, రామః=రాముడు, భరతస్య=భరతునియొక్క, వచః=వచనమును, శ్రుత్వా=విని, తథేతి=అట్లే అని, ప్రతిజగ్రాహ=స్వీకరించెను. శుభే=శుభమైన, ఆసనే= ఆసనమునందు, నిషసాద=కూర్చుండెను.

తా. శత్రుపురసంహారకుడైన రాముడు భరతుని మాటలు విని అట్లే అని అంగీకరించెను. రాముడు అంగీకరించిన పిదప భరతుడు మంగళకరమైన

ఆసనముమీద కూర్చుండెను. 12

మూ. తతః శత్రుఘ్నవచనాన్నిపుణాః శ్మశ్రువర్ధనాః,
సుఖహస్తాః సుశీఘ్రాశ్చ రాఘవం పర్యవారయన్. 13

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శత్రుఘ్నవచనాత్=శత్రుఘ్నుని ఆజ్ఞవలన, నిపుణాః=నేర్పు గల, సుఖహస్తాః=సుఖకరమైన హస్తములు గల, సుశీఘ్రాశ్చ=చాల శీఘ్రముగా చేయు, శ్మశ్రువర్ధనాః=మంగళ్లు, రాఘవమ్=రాముణ్ణి, పర్యవారయన్=చుట్టిరి.

తా. పిమ్మట శత్రుఘ్నుడు ఆజ్ఞాపించగా సుఖమైన హస్తములు గల, చాల శీఘ్రముగా పని చేయు, నేర్పు గల మంగళ్లు రాముని వద్దకు వచ్చిరి.13

మూ. పూర్వం తు భరతే స్నాతే లక్ష్మణే చ మహాబలే,
సుగ్రీవే వానరేన్ద్రే చ రాక్షసేన్ద్రే విభీషణే, 14
విశోధితజటః స్నాతశ్చిత్రమాల్యానులేపనః,
మహార్హవసనోపేతస్తస్థౌ తత్ర శ్రియా జ్వలన్. 15

ప్ర. అ. పూర్వమ్=ముందుగా, భరతే=భరతుడు, స్నాతే=స్నానముచేసినవాడగుచుండగా, మహాబలే=గొప్ప బలము గల, లక్ష్మణే చ=లక్ష్మణుడు, వానరేన్ద్రే=వానరప్రభువైన, సుగ్రీవే=సుగ్రీవుడు, రాక్షసేన్ద్రే=రాక్షసరాజైన, విభీషణే=విభీషణుడు, స్నానముచేసినవారగుచుండగా, విశోధితజటః=విడదీయబడిన జటలు కలవాడై, స్నాతః= స్నానముచేసినవాడై, చిత్రమాల్యానులేపనః=చిత్రములైన మాలికలు మైపూతలు గలవాడై, మహార్హవసనోపేతః=చాల వెల గల వస్త్రములతో కూడినవాడై, తత్ర=అక్కడ, శ్రియా=శోభతో, జ్వలన్=ప్రకాశించుచు, తస్థౌ=ఉండెను.

తా. ముందుగా భరతుడు స్నానముచేసిన పిమ్మట గొప్ప బలము గల లక్ష్మణుడు, వానరరాజైన సుగ్రీవుడు, రాక్షసరాజైన విభీషణుడు స్నానము చేసిరి. పిదప రాముడు జటలు విప్పించుకొని, స్నానము చేసి, చిత్రములైన పుష్పమాలలు, ధరించి, చందనాదులు పూసుకొని, శ్రేష్ఠములైన వస్త్రములు ధరించి అక్కడ శోభతో ప్రకాశించుచు ఉండెను. 14, 15,

మూ. ప్రతికర్మ చ రామస్య కారయామాస వీర్యవాన్,
లక్ష్మణస్య చ లక్ష్మీవానిక్ష్వాకుకులవర్ధనః. 16

ప్ర. అ. వీర్యవాన్=పరాక్రమవంతుడు, లక్ష్మీవాన్=శోభాసంపన్నుడు, ఇక్ష్వాకుకులవర్ధనః= ఇక్ష్వాకువంశమును వృద్ధిపొందించు, శత్రుఘ్నుడు, రామస్య=రామునకు, లక్ష్మణస్య చ=లక్ష్మణునకు, ప్రతికర్మ= అలంకరణమును, కారయామాస=చేయించెను.

తా. పరాక్రమవంతుడు, శోభాసంపన్నుడు అయిన శత్రుఘ్నుడు రామునకు, లక్ష్మణునకు అలంకరణము చేయించెను. 16

మూ. ప్రతికర్మ చ సీతాయాః సర్వా దశరథస్త్రియః,
ఆత్మనైవ తదా చక్రుర్మనస్విన్యో మనోహరమ్. 17

ప్ర. అ. తదా=అప్పుడు, సర్వాః=సమస్తమైన, మనస్విన్యః=ఉత్తమమైన మనస్సులు గల, దశరథస్త్రియః= దశరథుని భార్యలు, సీతాయాః=సీతయొక్క, మనోహరమ్=మనోహరమైన, ప్రతికర్మ=అలంకరణమును, ఆత్మనైవ= స్వయముగానే, చక్రుః=చేసిరి.

తా. అప్పుడు ఉత్తమమైన మనస్సులు గల దశరథభార్య లందరు సీతకు మనోహరముగా అలంకరణమును స్వయముగా చేసిరి. 17

మూ. తతో వానరపత్నీనాం సర్వాసామేవ శోభనమ్,
చకార యత్నాత్ కౌసల్యా ప్రహృష్టా పుత్రవత్సలా. 18

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్రహృష్టా=సంతోషించిన, పుత్రవత్సలా= పుత్రునియందు ప్రేమ గల, కౌసల్యా=కౌసల్య, సర్వాసామ్=సమస్తమైన, వానరపత్నీనామ్=వానరభార్యలకు, యత్నాత్=ప్రయత్నమువలన, శోభనమ్=అందమైన అలంకరణమును, చకార=చేసెను.

తా. పిమ్మట పుత్రవాత్సల్యవంతురాలైన కౌసల్య వానరభార్య లందరికీ, సంతోషముతో, ప్రయత్నపూర్వకముగా అలంకరణమును చేసెను. 18

మూ. తతః శత్రుఘ్నవచనాత్సుమన్త్రో నామ సారథిః,
యోజయిత్వాభిచక్రామ రథం సర్వాఙ్గశోభనమ్. 19

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సుమన్త్రో నామ=సుమంత్రుడను పేరు గల, సారథిః=సారథి, శత్రుఘ్నవచనాత్=శత్రుఘ్ని వచనమువలన, సర్వాఙ్గశోభనమ్=అన్ని అవయవములయందు ప్రకాశించుచున్న, రథమ్=రథమును, యోజయిత్వా=కూర్చి, అభిచక్రాను=బయలుదేరెను.

తా. పిమ్మట శత్రుఘ్నుని ఆజ్ఞచేత, సుమంత్రు డను సారథి అన్ని అవయవములయందూ అందముగా ఉన్న రథమును గుఱ్ఱములు కట్టి తోలుకొని వచ్చెను. 19

మూ. అర్కమణ్డలసంకాశం దివ్యం దృష్ట్వా రథం స్థితమ్,
ఆరురోహ మహాబాహూ రామః పరపురంజయః. 20

ప్ర. అ. అర్కమణ్డలసంకాశమ్=సూర్యమండలముతో సమానమైన, స్థితమ్=నిలచిఉన్న, దివ్యమ్=దివ్యమైన, రథమ్=రథమును, దృష్ట్వా=చూచి, మహాబాహుః=గొప్ప బాహువులు గల, పరపురంజయః=శత్రుపురములను జయించు, రామః=రాముడు, ఆరురోహ=ఎక్కెను.

తా. గొప్ప బాహువులు గల, శత్రుపురజేతయైన రాముడు సూర్యమండలముతో సమానమైన నిలచి ఉన్న దివ్యమైన రథమును చూచి, దానిని ఎక్కెను. 20

మూ. సుగ్రీవో హనుమాంశ్చైవ మహేన్ద్రసదృశద్యుతీ,
స్నాతౌ దివ్యనిభైర్వస్త్రైర్జగ్మతుః శుభకుణ్డలౌ. 21

ప్ర. అ. మహేన్ద్రసదృశద్యుతీ=మహేంద్రునితో సమానమైన కాంతి గల, సుగ్రీవః=సుగ్రీవుడూ, హనుమాంశ్చైవ=హనుమంతుడు, స్నాతౌ=స్నానము చేసిన వారై, శుభకుణ్డలౌ=సుందరములైన కుండలములు కలవారై, దివ్యనిభైః=దివ్యములైన, వస్త్రైః=వస్త్రములతో, జగ్మతుః=వెళ్ళిరి.

తా. మహేంద్రునితో సమానమైన కాంతి గల సుగ్రీవహనుమంతులు స్నానము చేసి దివ్యములైన వస్త్రములు ధరించి, సుందరములైన కుండలములు అలంకరించుకొని వెళ్లిరి. 21

మూ. సర్వాభరణజుష్టాశ్చ యయుస్తాః శుభకుణ్డలాః,
సుగ్రీవపత్న్యః సీతా చ ద్రష్టుం నగరముత్సుకాః. 22

ప్ర. అ. తాః=ఆ, సుగ్రీవపత్న్యః=సుగ్రీవుని భార్యలు, సీతా చ=సీతయు, సర్వాభరణజుష్టాః=సమస్తములైన ఆభరణములతో కూడినవారై, శుభకుణ్డలాః=సుందరములైన కుండలములు కలవారై, నగరమ్=నగరమును, ద్రష్టుమ్=చూచుటకు, ఉత్సుకాః=వేడుకకలవారై, యయుః=వెళ్ళిరి.

తా. ఆ సుగ్రీవభార్యలు, సీతా కూడ సమస్తాభరణములు, కుండలములు అలంకరించుకొని, నగరమును చూడవలె నను ఔత్సుక్యముతో వెళ్ళిరి. 22

మూ. అయోధ్యాయాం తు సచివా రాజ్ఞో దశరథస్య చ,
పురోహితం పురస్కృత్య మన్త్రయామాసురర్థవత్. 23

ప్ర. అ. అయోధ్యాయాం తు=అయోధ్యలో, రాజ్ఞః=రాజైన, దశరథస్య=దశరథునియొక్క, సచివాః=మంత్రులు, పురోహితమ్=పురోహితుణ్ణి, పురస్కృత్య=ముందు ఉంచుకొని, అర్థవత్=అర్థయుక్తముగా, మన్త్రయామాసుః=ఆలోచించిరి.

తా. అయోధ్యలో దశరథుని మంత్రులు పురోహితుడైన వసిష్ఠుణ్ణి

ముందు ఉంచుకొని అభిషేకమును గూర్చి, ప్రయోజనకరములైన ఆలోచనలు చేసిరి. 23

మూ. అశోకో విజయశ్చైవ సిద్ధార్థశ్చ సమాహితాః,
మన్త్రయన్ రామవృద్ధ్యర్థం బుద్ధ్యర్థం నగరస్య చ. 24

ప్ర. అ. అశోకః=అశోకుడు, విజయశ్చైవ=విజయుడు, సిద్ధార్థశ్చ=సిద్ధార్థుడు, సమాహితాః=సావధానచిత్తులై, రామవృద్ధ్యర్థమ్=రాముని అభివృద్ధికొరకు, నగరస్య=నగరముయొక్క, బుద్ధ్యర్థమ్=సమృద్ధికొరకు, మన్త్రయన్=ఆలోచించిరి.

తా. అశోకుడు, విజయుడు, సిద్ధార్థుడు సావధానచిత్తులై రాముని అభివృద్ధికొరకు, నగరసమృద్ధికొరకు ఆలోచనలు సలిపిరి. 24

మూ. సర్వమేవాభిషేకార్థం జయార్హస్య మహాత్మనః,
కర్తుమర్హథ రామస్య యద్యన్మఙ్గలపూర్వకమ్. 25

ప్ర. అ. జయార్హస్య=జయమునకు తగిన, మహాత్మనః=మహాత్ముడైన, రామస్య=రామునియొక్క, అభిషేకార్థమ్=అభిషేకముకొరకు, యద్యత్=ఏదేది చేయవలెనో, సర్వమ్=దాని నంతనూ, మఙ్గలపూర్వకమ్= మంగళపూర్వకముగా, కర్తుమ్=చేయుటకు, అర్హథ=తగియున్నారు.

తా. "విజయమునకు తగిన మహాత్ముడైన రాముని అభిషేకము నిమిత్తము ఏదేది చేయవలెనో దానిని అంతా మంగళపూర్వకముగా చేయుడు."

మూ. ఇతి తే మన్త్రిణః సర్వే సందిశ్య చ పురోహితమ్,
నగరాన్నిర్యయుస్తూర్ణం రామదర్శనబుద్ధయః. 26

ప్ర. అ. తే=ఆ, సర్వే=సమస్తమైన, మన్త్రిణః=మంత్రులు, పురోహితమ్=పురోహితుణ్ణి, ఇతి=ఇట్లు, సందిశ్య=నిర్దేశించి, రామదర్శనబుద్ధయః=రాముని దర్శనమునందు బుద్ధి గలవారై, తూర్ణమ్=శీఘ్రముగా, నగరాత్=నగరమునుండి, నిర్యయుః=బయలుదేరిరి.

తా. ఈ విధముగ మంత్రు లందరూ పురోహితునకు చెప్పి రాముణ్ణి చూడవలె నను అభిలాషతో శీఘ్రముగా నగరమునుండి బయలుదేరిరి. 26

మూ. హరియుక్తం సహస్రాక్షో రథమిన్ద్ర ఇవానఘః,
ప్రయయౌ రథమాస్థాయ రామో నగరముత్తమమ్. 27

ప్ర. అ. సహస్రాక్షః=వేయి నేత్రములు గల, ఇన్ద్రః=ఇంద్రుడు, హరియుక్తమ్=ఆకుపచ్చని రంగు గల గుఱ్ఱములు కట్టిన, రథమివ=రథమును వలె,

అనఘః=దోషరహితుడైన, రామః=రాముడు, ఉత్తమమ్= ఉత్తమమైన, రథమ్=రథమును, ఆస్థాయ=అధిష్ఠించి, నగరమ్=నగరమును గూర్చి, ప్రయయౌ=వెళ్లెను.

తా. వేయికన్నులు గల దేవేంద్రుడు ఆకుపచ్చ రంగు గుఱ్ఱములు కట్టిన రథమును ఎక్కినట్లు దోషరహితుడైన రాముడు ఉత్తమమైన రథము నెక్కి నగరమునకు బయలుదేరెను. 27

మూ. జగ్రాహ భరతో రశ్మీన్ శత్రుఘ్నశ్ఛత్రమాదదే,
లక్ష్మణో వ్యజనం తస్య మూర్ధ్ని సంపర్యవీజయత్. 28
శ్వేతం చ వాలవ్యజనం జగృహే పరితః స్థితః,
అపరం చన్ద్రసంకాశం రాక్షసేన్ద్రో విభీషణః. 29

ప్ర. అ. భరతః=భరతుడు, రశ్మీన్=కళ్లెములను, జగ్రాహ=పట్టుకొనెను. శత్రుఘ్నః=శత్రుఘ్నుడు, ఛత్రమ్=ఛత్రమును, తస్య=రాముని యొక్క, మూర్ధ్ని=శిరస్సుపై, ఆదదే=గ్రహించెను. లక్ష్మణః=లక్ష్మణుడు, వ్యజనమ్=వింజామరను, సంపర్యవీజయత్=వీచెను. పరితః స్థితః=దగ్గరనే ఉన్న, రాక్షసేన్ద్రః=రాక్షసరాజైన, విభీషణః=విభీషణుడు, చన్ద్రసంకాశమ్=చంద్రునితో సమానమైన, శ్వేతమ్=తెల్లని, అపరమ్=మరియొక, వాలవ్యజనమ్=వింజామరను, జగృహే=గ్రహించెను.

తా. భరతుడు గుఱ్ఱముల కళ్ళెములు పట్టి సారథ్యము చేయుచుండగా శత్రుఘ్నుడు శిరస్సుపై ఛత్రమును పట్టెను. లక్ష్మణుడు వింజామర వీచెను. దగ్గరనే ఉన్న రాక్షసరాజైన విభీషణుడు చంద్రుడు వలె ఉన్న తెల్లని మరియొక వింజామర పట్టెను. 28, 29

మూ. ఋషిసంఘైస్తదాకాశే దేవైశ్చ సమరుద్గణైః,
స్తూయమానస్య రామస్య శుశ్రువే మధురధ్వనిః. 30

ప్ర. అ. తదా=అప్పుడు, రామస్య=రాముడు, ఋషిసంఘైః=ఋషి సంఘములచేత, సమరుద్గణైః=మరుద్గణములతోకూడిన, దేవైశ్చ=దేవతలచేతను, ఆకాశే=ఆకాశమునందు, స్తూయమానస్య=స్తుతించబడుచుండగా, మధురధ్వనిః=మధురమైన ధ్వని, శుశ్రువే=వినబడెను.

తా. అప్పుడు ఋషిసంఘములు దేవతలు, మరుద్గణములు ఆకాశముమీద చేరి రాముణ్ణి స్తుతించుచుండగా ఆ మధురధ్వని వినబడెను. 30

మూ. తతః శత్రుంజయం నామ కుఞ్జరం పర్వతోపమమ్,
ఆరురోహ మహాతేజాః సుగ్రీవః ప్లవగర్షభః. 31

ప్ర. అ. తతః=అటుపిమ్మట, ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుడైన, మహాతేజాః=

గొప్ప తేజస్సు గల, సుగ్రీవః=సుగ్రీవుడు, శత్రుంజయం నామ=శత్రుంజయ మను పేరు గల, పర్వతోపమమ్=పర్వతముతో సమానమైన, కుఞ్జరమ్=ఏనుగును, ఆరురోహ=ఎక్కెను.

తా. అప్పుడు గొప్ప తేజస్సు గల వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు, శత్రుంజయ మను పేరు గల పర్వతము వంటి ఏనుగును ఎక్కెను. 31

మూ. నవ నాగసహస్రాణి యయురాస్థాయ వానరాః,
మానుషం విగ్రహం కృత్వా సర్వాభరణభూషితాః. 32

ప్ర. అ. వానరాః=వానరులు, మానుషమ్=మనుష్యసంబంధమైన, విగ్రహమ్=శరీరమును, కృత్వా=చేసి, సర్వాభరణభూషితాః=సమస్తఆభరణములచేత అలంకరింపబడినవారై, నవనాగసహస్రాణి=తొమ్మిదివేలఏనుగులను, ఆస్థాయ=అధిష్ఠించి, యయుః=వెళ్ళిరి.

తా. వానరులు మనుష్యరూపములు ధరించి సకల అలంకారములు అలంకరించుకొని తొమ్మిది వేల ఏనుగులను ఎక్కి వెళ్లిరి. 32

మూ. శఙ్ఖశబ్దప్రణాదైశ్చ దున్దుభీనాం చ నిఃస్వనైః,
ప్రయయౌ పురుషవ్యాఘ్రస్తాం పురీం హర్మ్యమాలినీమ్. 33

ప్ర. అ. పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుడైన రాముడు, శఙ్ఖశబ్దప్రణాదైశ్చ=శంఖధ్వనులతోను, దున్దుభీనామ్=దుందుభులయొక్క, నిఃస్వనైః చ=ధ్వనులతోను, హర్మ్యమాలినీమ్=మేడల పంక్తులు గల, తాం పురీమ్=ఆ అయోధ్యానగరమును గూర్చి, ప్రయయౌ=వెళ్లెను.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు శంఖధ్వనులతోను, దుందుభిధ్వనులతోను, మేడల పంక్తులు గల ఆ అయోధ్యానగరమునకు వెళ్లెను. 33

మూ. దదృశుస్తే సమాయాన్తం రాఘవం సపురఃసరమ్,
విరాజమానం వపుషా రథేనాతిరథం తదా. 34

ప్ర. అ. తదా=అప్పుడు, తే=వారు, సపురఃసరమ్=ముందునడిచే భటాదులతో కూడినవాడు, వపుషా= దేహముచేత, విరాజమానమ్=ప్రకాశించుచున్నవాడు అయిన, రథేన=రథముచేత, సమాయాన్తమ్=వచ్చుచున్న, అతిరథమ్=అతిరథుడైన, రాఘవమ్=రాముణ్ణి, దదృశుః=చూచిరి.

తా. అప్పుడు ప్రజలందరూ సుందరమైన ఆకారముతో ప్రకాశించుచున్న అతిరథుడైన ఆ రాముడు, ముందు భటులు నడుచుచుండగా, రథము నెక్కి వచ్చుచుండగా చూచిరి. 34

మూ. తే వర్ధయిత్వా కాకుత్థ్సం రామేణ ప్రతినన్దితాః,
అనుజగ్ముర్మహాత్మానం భ్రాతృభిః పరివారితమ్. 35

ప్ర. అ. తే=వాళ్లు, కాకుత్థ్సమ్=రాముణ్ణి, వర్ధయిత్వా=జయజయధ్వానములచేత అభినందించి, రామేణ= రామునిచేత, ప్రతినన్దితాః=ప్రత్యభినందింపబడినవారై, భ్రాతృభిః=సోదరులతో, పరివారితమ్=చుట్టువారుకొనబడిన, మహాత్మానమ్=మహాత్ముడైన ఆ రాముణ్ణి, అనుజగ్ముః=అనుసరించి వెళ్లిరి.

తా. ఆ పౌరులందరూ రాముణ్ణి జయజయధ్వానాలతో అభినందించగా రాముడు వారల అభినందనలను స్వీకరించుచు ప్రత్యభినందనము చేసెను. పిదప వాళ్లు చుట్టూ సోదరు లున్న ఆ మహాత్ముణ్ణి అనుసరించి నగరమువైపు వెళ్లిరి. 35

మూ. అమాత్యైర్బ్రాహ్మణైశ్చైవ తథా ప్రకృతిభిర్వృతః,
శ్రియా విరురుచే రామో నక్షత్రైరివ చన్ద్రమాః. 36

ప్ర. అ. అమాత్యైః=అమాత్యులతోను, బ్రాహ్మణైశ్చైవ=బ్రాహ్మణులతోను, తథా=మరియు, ప్రకృతిభిః= ప్రకృతులతోను, వృతః=కూడిన, రామః=రాముడు, నక్షత్రైః=నక్షత్రములతో కూడిన, చన్ద్రమాః ఇవ=చంద్రుడు వలె, శ్రియా=కాంతితో, విరురుచే=ప్రకాశించెను.

తా. అమాత్యులతోను, బ్రాహ్మణులతోను, ప్రకృతులతోను కూడిన రాముడు, నక్షత్రములతో కూడిన చంద్రుడు వలె శోభతో ప్రకాశించెను. 36

మూ. స పురోగామిభిస్తూర్యైస్తాలస్వస్తికపాణిభిః,
ప్రవ్యాహరద్భిర్ముదితైర్మఙ్గలాని వృతో యయౌ. 37

ప్ర. అ. సః=ఆ రాముడు, పురోగామిభిః=ముందు నడుచుచున్న, తూర్యైః=తూర్యములతోను, తాలస్వస్తికపాణిభిః=తాలములు, స్వస్తికవాద్యములూ హస్తములందు గల, మఙ్గలాని=మంగలములను, ప్రవ్యాహరద్భిః=పలుకుచున్న, ముదితైః=సంతోషించిన వందిమాగదాదులతోను, వృతః=కూడినవాడై, యయౌ=వెళ్లెను.

తా. ఆ రాముడు తూర్యములు తాల-స్వస్తికవాద్యములు చేతులలో ధరించిన, మంగళ వచనములు పలుకుచున్న సంతోషించిన వందిమాగధాదులు ముందు నడవగా నగరములోనికి వెళ్లెను. 37

మూ. అక్షతం జాతరూపం చ గావః కన్యాః సహద్విజాః,
నరా మోదకహస్తాశ్చ రామస్య పురతో యయుః. 38

ప్ర. అ. అక్షతమ్=అక్షతలు, జాతరూపం చ=బంగారము, గావః=గోవులు, కన్యాః=కన్యలు, సహద్విజాః=బ్రాహ్మణులతో కూడిన, మోదకహస్తాః=మధురభక్ష్యములు హస్తములందు గల, నరాః=మనుష్యులు, రామస్య=రామునియొక్క, పురతః=ముందు, యయుః=వెళ్లిరి.

తా. అక్షతలు, బంగారము గ్రహించిన కొందరు మనుష్యులు, గోవులు, కన్యలు, బ్రాహ్మణులు, మధురభక్ష్యములు చేతులలో ఉన్న మనుష్యులు రాముని ముందు నడచిరి. ("అక్షతాః"అని ప్రాచ్యపాఠము). 38

మూ. సఖ్యం చ రామః సుగ్రీవే ప్రభావం చానిలాత్మజే,
వానరాణాం చ తత్కర్మ హ్యాచచక్షేఽథ మన్త్రిణామ్. 39

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రామః=రాముడు, సుగ్రీవే=సుగ్రీవుని యందు, సఖ్యం చ=స్నేహమును, అనిలాత్మజే=హనుమంతునియందు, ప్రభావం చ=ప్రభావమును, వానరాణామ్=వానరులయొక్క, తత్=ఆ, కర్మ చ=పనినీ, మన్త్రిణామ్=మంత్రులకు, ఆచచక్షే=చెప్పెను.

తా. రాముడు తనకు సుగ్రీవునితో ఏర్పడిన స్నేహమును, హనుమంతుని ప్రభావమును వానరులు చేసిన ఆ మహాకార్యములను మంత్రులకు చెప్పెను.39

మూ. శ్రుత్వా చ విస్మయం జగ్మురయోధ్యాపురవాసినః,
వానరాణాం చ తత్కర్మ రాక్షసానాం చ తద్బలమ్. 40

ప్ర. అ. అయోధ్యాపురవాసినః=అయోధ్యాపురములో నివసించినవారు, వానరాణామ్=వానరులయొక్క, తత్=ఆ, కర్మ=పనినీ, రాక్షసానామ్=రాక్షసుల యొక్క, తత్=ఆ, బలం చ=బలమును, శ్రుత్వా=విని, విస్మయమ్=ఆశ్చర్యమును, జగ్ముః=పొందిరి.

తా. అయోధ్యాపురములో నివసించువారందరూ వానరులు చేసిన ఆ పనులు, రాక్షసుల ఆ బలమును విని ఆశ్చర్యము చెందిరి. 40

మూ. విభీషణస్య సంయోగమాచచక్షేఽథ మన్త్రిణామ్,
ద్యుతిమానేతదాఖ్యాయ రామో వానరసంయుతః, 41
హృష్టపుష్టజనాకీర్ణామయోధ్యాం ప్రవివేశ సః.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మన్త్రిణామ్=మంత్రులకు, విభీషణస్య=విభీషణునియొక్క, సంయోగమ్= కలియుటను, ఆచచక్షే=చెప్పెను. ద్యుతిమాన్=కాంతి గల, సః=ఆ, రామః=రాముడు, ఏతత్=దీనిని, ఆఖ్యాయ=చెప్పి, వానరసంయుతః= వానరులతో కూడినవాడై, హృష్టపుష్టజనాకీర్ణామ్=సంతోషించిన, సుఖముగా ఉన్న

జనాలతో నిండిన, అయోధ్యామ్=అయోధ్యను, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. పిమ్మట మంత్రులకు విభీషణునితో తనకు ఏర్పడిన సంబంధమును గూర్చి కూడ చెప్పెను. ఈ విషయము లన్నీ చెప్పుచు కాంతిమంతుడైన రాముడు వానరసహితుడై సుఖసంతోషములతో ఉన్న జనులతో నిండిన అయోధ్యానగరమును ప్రవేశించెను. 41

మూ. తతో హ్యభ్యుచ్ఛ్రియన్ పౌరాః పతాకాశ్చ గృహే గృహే. 42
ఐక్ష్వాకాధ్యుషితం రమ్యమాససాద పితుర్గృహమ్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, పౌరాః=పౌరులు, గృహే గృహే=ప్రతిఇంటి మీదా, పతాకాః=పతాకలను, అభ్యుచ్ఛ్రియన్=ఎగురవేసిరి. ఐక్ష్వాకాధ్యుషితమ్=ఐక్ష్వాకురాజులచేత అధిష్ఠింపబడిన, పితుః=తండ్రియొక్క, రమ్యమ్= సుందరమైన, గృహమ్=గృహమును, ఆససాద=పొందెను.

తా. అప్పుడు పౌరులు ప్రతిఇంటి మీద పతాకలు ఎగురవేసిరి. రాముడు ఇక్ష్వాకురాజులు నివసించు సుందరమైన తండ్రిగారి గృహము చేరెను. 42

మూ. అథాబ్రవీద్రాజపుత్రో భరతం ధర్మిణాం వరమ్, 43
అర్థోపహితయా వాచా మధురం రఘునన్దనః,
పితుర్భవనమాసాద్య ప్రవిశ్య చ మహాత్మనః, 44
కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీమభివాద్య చ.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రాజపుత్రః=రాజపుత్రుడైన,రఘునన్దనః=రాముడు, మహాత్మనః=మహాత్ముడైన, పితుః=తండ్రియొక్క, భవనమ్=గృహమును, ఆసాద్య=సమీపించి, కౌసల్యాం చ=కౌసల్యను, సుమిత్రాం చ= సుమిత్రను, కైకేయీం చ=కైకేయిని, అభివాద్య చ=నమస్కరించి, ధర్మిణామ్=ధర్మము కలవారిలో, వరమ్=శ్రేష్ఠుడైన, భరతమ్=భరతుణ్ణి గూర్చి, అర్థోపహితయా=అర్థయుక్తమైన, వాచా=వాక్కుతో, మధురమ్=మధురముగా, అబ్రవీత్=పలికెను.

తా. పిమ్మట రాజపుత్రుడైన రాముడు మహాత్ముడైన తండ్రి గృహమును సమీపించి, దానిలో ప్రవేశించి, కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి నమస్కరించి ధార్మికులలో శ్రేష్ఠుడైన భరతునితో మంచి అర్థముతో కూడిన వాక్కుతో మధురముగా ఇట్లు పలికెను. 43, 44

మూ. తచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్,
ముక్తావైదూర్యసంకీర్ణం సుగ్రీవాయ నివేదయ.

ప్ర. అ. శ్రేష్ఠమ్=శ్రేష్ఠమూ, సాశోకవనికమ్=అశోకవనములతో కూడినది,

ముక్తావైదూర్యసంకీర్ణమ్= ముత్యములతో వైదూర్యములతోను వ్యాప్తమూ అయిన, మహత్=గొప్పదైన, తత్=ఆ, మద్భవనమ్=నా గృహమును, సుగ్రీవాయ=సుగ్రీవునకు, నివేదయ=చూపుము.

తా. అశోకవనములతో కూడిన, ముత్యములలోను వైదూర్యమణులతోను వ్యాప్తమైన శ్రేష్ఠమైన నా గొప్ప గృహమును సుగ్రీవునకు నివాసముకొరకు ఇమ్ము. 45

మూ. తస్య తద్వచనం శ్రుత్వా భరతః సత్యవిక్రమః, 46
హస్తే గృహీత్వా సుగ్రీవం ప్రవివేశ తమాలయమ్.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సత్యవిక్రమః=సత్యమైన పరాక్రమము గల, భరతః=భరతుడు, తస్య= రామునియొక్క,తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా=విని, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి, హస్తే=హస్తమునందు, గృహీత్వా=గ్రహించి, తమ్ ఆలయమ్=ఆ గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. సత్యమైన పరాక్రమము గల భరతుడు రాముని మాటలు విని సుగ్రీవుణ్ణి చేతియందు పట్టుకొని ఆ గృహములో ప్రవేశపెట్టెను. 46

మూ. తతస్తైలప్రదీపాంశ్చ పర్యఙ్కాస్తరణాని చ, 47
గృహీత్వా వివిశుః క్షిప్రం శత్రుఘ్నేన ప్రచోదితాః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, శత్రుఘ్నేన=శత్రుఘ్నునిచేత, ప్రచోదితాః= ప్రేరేపింపబడిన మనుష్యులు, తైలప్రదీపాంశ్చ=తైలదీపములను, పర్యఙ్కాస్తరణాని చ=పరుపులను ఆస్తరణములను, గృహీత్వా=గ్రహించి, క్షిప్రమ్=శీఘ్రముగా, వివిశుః= ప్రవేశించిరి.

తా. పిమ్మట శత్రుఘ్నుడు ఆజ్ఞాపింపగా కొందరు మనుష్యులు తైలదీపములు, పరుపులు ఆస్తరణములను తీసికొని శీఘ్రముగా ఆ ఇంటికి వెళ్ళిరి. 47

మూ. ఉవాచ చ మహాతేజాః సుగ్రీవం రాఘవానుజః, 48
అభిషేకాయ రామస్య దూతానాజ్ఞాపయ ప్రభో.

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాఘవానుజః=భరతుడు, సుగ్రీవమ్=సుగ్రీవుణ్ణి గూర్చి, ఉవాచ చ=పలికెను - ప్రభో=ఓ ! సమర్థుడా ! రామస్య=రామునియొక్క, అభిషేకాయ=అభిషేకముకొరకు, దూతాన్=దూతలను, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపించుము.

తా. గొప్ప తేజస్సు గల భరతుడు సుగ్రీవునితో -- "సమర్థుడవైన

ఓ! సుగ్రీవా ! రాముని అభిషేకము కొరకై దూతలను ఆజ్ఞాపించుము"అని పలికెను. 48

మూ. సౌవర్ణాన్వానరేన్ద్రాణాం చతుర్ణాం చతురో ఘటాన్, 49
దదౌ క్షిప్రం స సుగ్రీవః సర్వరత్నవిభూషితాన్.

ప్ర. అ. సః=ఆ, సుగ్రీవః=సుగ్రీవుడు, క్షిప్రమ్=శీఘ్రముగా, చతుర్ణామ్=నలుగురు, వానరేన్ద్రాణామ్=వానరనాయకులకు, సౌవర్ణాన్=బంగారము వికారమైన, సర్వరత్నవిభూషితాన్=సమస్తమైన రత్నములచేత అలంకరింపబడిన, చతురః=నాలుగు, ఘటాన్=ఘటములను, దదౌ=ఇచ్చెను.

తా. సుగ్రీవుడు వెంటనే సమస్తమైన రత్నములచేత అలంకరించబడిన నాలుగు బంగారు కలశలను నలుగురు వానరుల కిచ్చెను. 49

మూ. యథా ప్రత్యూషసమయే చతుర్ణాం సాగరామ్భసామ్, 50
పూర్ణైర్ఘటైః ప్రతీక్షధ్వం తథా కురుత వానరాః.

ప్ర. అ. వానరాః=వానరులారా ! చతుర్ణామ్=నాలుగు, సాగరామ్భసామ్=సముద్రముల ఉదకములయొక్క, పూర్ణైః=నిండిన, ఘటైః=కలశలతో, ప్రత్యూషసమయే=ప్రత్యూషకాలమునందు, యథా=ఎట్లు, ప్రతీక్షధ్వమ్=నిరీక్షించెదరో, తథా=అట్లు, కురుత=చెయ్యండి.

తా. వానరులారా ! తెల్లవారుసరికి నాలుగు సముద్రముల నీళ్లు నింపిన ఈ కలశలతో వచ్చి ఎట్లు వేచిఉండెదరో అట్లు చేయవలెను. 50

మూ. ఏవముక్తా మహాత్మానో వానరా వారణోపమాః, 51
ఉత్పేతుర్గగనం శీఘ్రం గరుడా ఇవ శీఘ్రగాః.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలకబడిన, వారణోపమాః=ఏనుగులతో సమానులైన, గరుడాః ఇవ= గరుత్మంతుల వలె, శీఘ్రగాః=శీఘ్రముగా వెళ్లు, మహాత్మానః=మహాత్ములైన, వానరాః=వానరులు, శీఘ్రమ్= శీఘ్రముగా, గగనమ్=ఆకాశమును గూర్చి, ఉత్పేతుః=ఎగిరిరి.

తా. సుగ్రీవునిచేత ఈ విధముగా ఆజ్ఞాపింపబడిన, ఏనుగులవంటి, గరుత్మంతుల వలె శీఘ్రముగా వెళ్లు మహాత్ములైన వానరులు శీఘ్రముగా ఆకాశములోనికి ఎగిరిరి. 51

మూ. జామ్బవాంశ్చ హనూమాంశ్చ వేగదర్శీ చ వానరః, 52
ఋషభశ్చైవ కలశాన్ జలపూర్ణానథానయన్,
నదీశతానాం పఞ్చానాం జలం కుమ్భైరుపాహరన్. 53

ప్ర. అ. అథ=అటుపిమ్మట, జామ్బవాంశ్చ=జాంబవంతుడు, హనూమాంశ్చ=హనుమంతుడు, వేగదర్శీ చ= వేగదర్శి అను, వానరః=వానరుడు, ఋషభశ్చైవ=ఋషభుడు, జలపూర్ణాన్=జలముతో నిండిన, కలశాన్=కలశలను, ఆనయన్=తీసికొనివచ్చిరి. పఞ్చానామ్=అయిదు, నదీశతానామ్=నదీశతములయొక్క, జలమ్=జలమును, కుమ్భైః= కలశలతో, ఉపాహరన్=తీసికొనివచ్చిరి.

తా. జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శి, ఋషభుడు జలము నింపిన కలశములను తీసికొని వచ్చిరి. వీరు ఐదువందల నదుల జలమును కలశలలో తీసికొనివచ్చిరి. 52, 53,

మూ. పూర్వాత్సముద్రాత్కలశం జలపూర్ణమథానయత్,
సుషేణః సత్త్వసంపన్నః సర్వరత్నవిభూషితమ్. 54

ప్ర. అ. అథ=అటుపిమ్మట, సత్త్వసంపన్నః=బలసంపన్నుడైన, సుషేణః=సుషేణుడు, పూర్వాత్ సముద్రాత్=పూర్వసముద్రమునుండి, సర్వరత్నవిభూషితమ్=సమస్తరత్నములచేత అలంకరింపబడిన, జలపూర్ణమ్=జలముతో నిండిన, కలశమ్=కలశను, ఆనయత్=తీసికొనివచ్చెను.

తా. బలవంతుడైన సుషేణుడు తూర్పుసముద్రమునుండి జలముతో నిండిన, సకలరత్నములచేత అలంకరించబడిన కలశమును తీసికొనివచ్చెను.54

మూ. ఋషభో దక్షిణాత్తూర్ణం సముద్రాజ్జలమానయత్,
రక్తచన్దనశాఖాభిః సంవృతం కాఞ్చనం ఘటమ్. 55

ప్ర. అ. ఋషభః=ఋషభుడు, దక్షిణాత్ సముద్రాత్=దక్షిణసముద్రమునుండి, రక్తచన్దనశాఖాభిః=రక్తచందనవృక్షముల కొమ్మలచేత, సంవృతమ్=కప్పబడిన, కాఞ్చనమ్=బంగారము వికారమైన, ఘటమ్=కలశమును, జలమ్=జలమును, తూర్ణమ్=శీఘ్రముగా, ఆనయత్=తీసికొనివచ్చెను.

తా. ఋషభుడు దక్షిణసముద్రమునుండి జలపూర్ణమైన ఘటమును రక్తచందనవృక్షముల కొమ్మలు కప్పి శీఘ్రముగా తీసికొనివచ్చెను. 55

మూ. గవయః పశ్చిమాత్తోయమాజహార మహార్ణవాత్,
రత్నకుమ్భేన మహతా శీతం మారుతవిక్రమః. 56

ప్ర. అ. మారుతవిక్రమః=వాయుదేవుని వంటి పరాక్రమము గల, గవయః=గవయుడు, మహతా=గొప్పదైన, రత్నకుమ్భేన=రత్నకలశముతో, పశ్చిమాత్=పశ్చిమమునందున్న, మహార్ణవాత్=మహాసముద్రమునుండి, శీతమ్=చల్లని, తోయమ్=జలమును, ఆజహార=తీసికొనివచ్చెను.

తా. వాయుదేవుని వంటి పరాక్రమము గల గవయుడు పశ్చిమసముద్రమునుండి చల్లని జలమును రత్నకలశములో తీసికొనివచ్చెను.

మూ. ఉత్తరాచ్చ జలం శీఘ్రం గరుడానిలవిక్రమః,
ఆజహార స ధర్మాత్మా నలః సర్వగుణాన్వితః. 57

ప్ర. అ. గరుడానిలవిక్రమః=గరుత్మంతుని వంటి, వాయుదేవుని వంటి పరాక్రమము గల, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, సర్వగుణాన్వితః=అన్నిగుణములతో కూడిన, సః=ఆ, నలః=నలుడు, ఉత్తరాత్=ఉత్తరసముద్రమునుండి, శీఘ్రమ్=శీఘ్రముగా, జలమ్=జలమును, ఆజహార=తీసికొనివచ్చెను.

తా. గరుత్మంతుని వంటి, వాయువువంటి పరాక్రమము గల, సమస్తగుణములతో కూడిన ధర్మాత్ముడైన నలుడు ఉత్తరసముద్రమునుండి శీఘ్రముగా జలము తీసికొనివచ్చెను. 57

వి. కొందరు వ్యాఖ్యాతలు "ధర్మాత్మానిలః=ధర్మాత్మా + అనిలః"అను పాఠము గ్రహించి అనిలః అనగా హనుమంతుడు అని అర్థము చెప్పినారు. ఇక్కడ ప్రయోగించిన విశేషణాలనుపట్టి అది యుక్త మేమో అనిపించుచున్నది. హనుమంతుడు వెనుక చెప్పినట్లు నదీజలమును, ఈ జలమును కూడ తీసికొనివచ్చినా డని గ్రహించవలెను. కొందరు అనలః = అనలుడు అని అర్థము చెప్పినారు.

మూ. తతస్తైర్వానరశ్రేష్ఠైరానీతం ప్రేక్ష్య తజ్జలమ్,
అభిషేకాయ రామస్య శత్రుఘ్నః సచివైః సహ, 58
పురోహితాయ శ్రేష్ఠాయ సుహృద్భ్యశ్చ న్యవేదయత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సచివైః సహ=మంత్రులతో కూడిన, శత్రుఘ్నః=శత్రుఘ్నుడు, రామస్య= రామునియొక్క, అభిషేకాయ=అభిషేకముకొరకు, తైః=ఆ, వానరశ్రేష్ఠైః=వానరశ్రేష్ఠులచేత, ఆనీతమ్=తీసికొనిరాబడిన, తత్=ఆ, జలమ్=జలమును, శ్రేష్ఠాయ=శ్రేష్ఠుడైన, పురోహితాయ=పురోహితునకు, సుహృద్భ్యః చ=మిత్రులకు, న్యవేదయత్=తెలిపెను.

తా. అప్పుడు మంత్రులతో కూడిన శత్రుఘ్నుడు రాముని అభిషేకముకొరకు ఆ వానరశ్రేష్ఠులు తీసికొనివచ్చిన ఆ జలమును పురోహితుడైన వసిష్ఠునకు, మిత్రులకు చూపి సిద్ధముగా ఉన్న దని తెలిపెను. 58

మూ. తతః స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణైః సహ, 59
రామం రత్నమయే పీఠే ససీతం సంన్యవేశయత్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బ్రాహ్మణైః సహ=బ్రాహ్మణులతో కూడిన, వృద్ధః=వృద్ధుడైన, వసిష్ఠః= వసిష్ఠుడు, ప్రయతః=సావధానచిత్తుడై, ససీతమ్=సీతతో కూడిన, రామమ్=రాముణ్ణి, రత్నమయే=రత్నవికారమైన, పీఠే=పీఠముమీద, సంన్యవేశయత్=కూర్చుండబెట్టెను.

తా. అప్పుడు బ్రాహ్మణులతో కూడిన వృద్ధుడైన వసిష్ఠుడు సావధానచిత్తుడై సీతాసమేతుడైన రాముణ్ణి రత్నపీఠముమీద కూర్చుండబెట్టెను. 58

మూ. వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథ కాశ్యపః, 59
కాత్యాయనో సుయజ్ఞశ్చ గౌతమో విజయస్తథా,
అభ్యషిఞ్చన్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగన్ధినా, 60
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా.

ప్ర. అ. వసిష్ఠః=వసిష్ఠుడు, వామదేవశ్చ=వామదేవుడు, జాబాలిః=జాబాలిః, అథ=మరియు, కాశ్యపః= కాశ్యపుడు, కాత్యాయనః=కాత్యాయనుడు, సుయజ్ఞః=సుయజ్ఞుడు, గౌతమః=గౌతముడు, తథా=మరియు, విజయః=విజయుడు, ప్రసన్నేన=నిర్మలము, సుగన్ధినా=మంచి సువాసన గలది అయిన, సలిలేన=ఉదకముచేత, వసవః= వసువులు, సహస్రాక్షమ్=వేయి నేత్రములు గల, వాసవం యథా=ఇంద్రుణ్ణి వలె, నరవ్యాఘ్రమ్=నరశ్రేష్ఠుడైన రాముణ్ణి, అభ్యషించన్=అభిషేకించిరి.

తా. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు అను ఎనమండుగురు మునులు నిర్మలము, సుగంధయుక్తము అయిన జలముతో అష్ట వసువులు సహస్రాక్షుడైన దేవేంద్రునకు అభిషేకము చేసినట్లు రామునకు అభిషేకము చేసిరి. 59, 60.

మూ. ఋత్విగ్భిర్బ్రాహ్మణైః పూర్వం కన్యాభిర్మన్త్రిభిస్తథా, 61
యోధైశ్చైవాభ్యషిఞ్చంస్తే సంప్రహృష్టాః సనైగమైః,
సర్వౌషధిరసైశ్చాపి దైవతైర్నభసి స్థితైః, 62
చతుర్భిర్లోకపాలైశ్చ సర్వైర్దేవైశ్చ సంగతైః.

ప్ర. అ. సంప్రహృష్టాః=మిక్కిలి సంతోషించుచున్న, తే=ఆ వసిష్ఠాదులు, పూర్వమ్=ముందుగా, ఋత్విగ్భిః= ఋత్విక్కులైన, బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత, కన్యాభిః=కన్యలచేత, తథా=మరియు, మన్త్రిభిః=మంత్రులచేత, సనైగమైః= వర్తకులు మొదలైనవారి సంఘముల అధిపతులతో కూడిన, యోధైశ్చ=యోధులచేత, నభసి=ఆకాశమునందు, స్థితైః= ఉన్న, దేవైః=దేవతలచేత, చతుర్భిః=నలుగురు, లోకపాలైశ్చ=లోకపాలులచేత, సంగతైః=వచ్చిన, సర్వైః=సమస్తమైన, దేవైశ్చ=దేవతలచేత,

సర్వౌషధిరసైశ్చాపి=సమస్తమైన ఓషధిరసముచేత కూడ, అభ్యషించన్=అభిషేక ముచేయించిరి.

తా. మిక్కిలి సంతోషించుచున్న ఆ వసిష్ఠాదులు ముందుగా ఋత్విక్కులైన బ్రాహ్మణులచేత, కన్యలచేత, మంత్రులచేత, యోధులచేత, నైగములచేత, ఆకాశమునందున్న దేవతలచేత, నలుగురు లోకపాలులచేత, గుమిగూడిన సకలదేవతలచేత అభిషేకము చేయించిరి. వీరందరూ నదీసముద్రాదిజలములతోనే కాక సమస్తమైన ఓషధుల రసములతో కూడ రామునకు అభిషేకము చేసిరి.

మూ. బ్రహ్మణా నిర్మితం పూర్వం కిరీటం రత్నశోభితమ్, 64
అభిషిక్తః పురా యేన మనుస్తం దీప్తతేజసమ్,
తస్యాన్వవాయే రాజానః క్రమాద్యేనాభిషేచితాః, 65
సభాయాం హేమక్లృప్తాయాం శోభితాయాం మహాధనైః,
రత్నైర్నానావిధైశ్చైవ చిత్రితాయాం సుశోభనైః, 66
నానారత్నమయే పీఠే కల్పయిత్వా యథావిధి,
కిరీటేన తతః పశ్చాద్వసిష్ఠేన మహాత్మనా, 67
ఋత్విగ్భిర్భూషణైశ్చైవ సమయోక్ష్యత రాఘవః.

ప్ర. అ. యేన=ఏ కిరీటముతో, పురా=పూర్వము, మనుః=మనుచక్రవర్తి, అభిషిక్తః=అభిషేకింపబడినాడో, తస్య=ఆ మనుచక్రవర్తియొక్క, అన్వవాయే=వంశమునందు, రాజానః=రాజులు, యేన=దేనితో, అభిషేచితాః=అభిషేకింపబడినారో, తమ్=అట్టి, పూర్వమ్=పూర్వమునందు, బ్రహ్మణా=బ్రహ్మచేత, నిర్మితమ్=నిర్మించబడిన, రత్నశోభితమ్=రత్నములచేత అలంకరించబడిన, దీప్తతేజసమ్=ప్రజ్వలించుచున్న తేజస్సు గల, కిరీటమ్=కిరీటమును, హేమక్లృప్తాయామ్=బంగారముచేత అలంకరింపబడిన, మహాధనైః=గొప్ప ధనములచేత, శోభితాయామ్=ప్రకాశింపచేయబడిన, నానావిధైః=అనేకవిధములైన, సుశోభనైః=చాల అందమైన, రత్నైః=రత్నములచేత, చిత్రితాయామ్=చిత్రవర్ణము కలదిగా చేయబడిన, సభాయామ్=సభయందు, నానారత్నమయే=అనేకరత్నముల వికారమైన, పీఠే= పీఠమునందు, యథావిధి=యథాశాస్త్రముగా, కల్పయిత్వా=ఉంచి, తతః పశ్చాత్=అటుపిమ్మట, మహాత్మనా=మహాత్ముడైన, వసిష్ఠేన=వసిష్ఠునిచేత, కిరీటేన=కిరీటముతోను, ఋత్విగ్భిః=ఋత్విక్కులచేత, భూషణైశ్చైవ=భూషణములతోను, రాఘవః=రాముడు, సమయోక్ష్యత=కూర్చబడెను.

తా. పిదప మహాత్ముడైన వసిష్ఠుడు, పూర్వము బ్రహ్మ నిర్మించిన రత్నమయమైన, తేజస్సుతో ప్రకాశించుచున్న కిరీటమును సభామధ్యములో ఉన్న వివిధరత్నములు మాటిన పీఠముపై యథావిధిగా ఉంచెను. పట్టాభిషేక సమయమునందు పూర్వము మనుచక్రవర్తి, పిదప క్రమముగా ఆయన వంశమునకు

చెందిన రాజు లందరు ఆ కిరీటమును ధరించెడివారు. ఆ మహాసభాభవనము బంగారముచేత అలంకరింపబడెను. చాల విలువైన వస్తువులతో శోభించుచుండెను. అనేకవిధములైన చాల అందమైన రత్నములతో అది చిత్రవర్ణమై ఉండెను. పిదప రత్నపీఠముపై ఉంచిన ఆ కిరీటమును తీసి వసిష్ఠుడు రాముని శిరస్సుపై అలంకరించెను. అనంతరము ఋత్విక్కులు రామునకు ఇతరాలంకారములు అలంకరించిరి. 64 - 67

మూ. ఛత్రం తస్య చ జగ్రాహ శత్రుఘ్నః పాణ్డురం శుభమ్, 68
శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః,
అపరం చన్ద్రసంకాశం రాక్షసేన్ద్రో విభీషణః. 69

ప్ర. అ. శత్రుఘ్నః=శత్రుఘ్నుడు, తస్య=రామునకు, పాణ్డురమ్=తెల్లని, శుభమ్=మంగళకరమైన, ఛత్రమ్=ఛత్రమును, జగ్రాహ=గ్రహించెను. వానరేశ్వరః=వానరరాజైన, సుగ్రీవః=సుగ్రీవుడు, శ్వేతమ్=తెల్లని, వాలవ్యజనమ్=వింజామరను, రాక్షసేన్ద్రః=రాక్షసరాజైన, విభీషణః=విభీషణుడు, చన్ద్రసంకాశమ్=చంద్రునితో సమానమైన, అపరం చ=మరియొక వింజామరను, గ్రహించెను.

తా. శత్రుఘ్నుడు రామునకు తెల్లని, సుందరమైన ఛత్రము పట్టెను. వానరరాజైన సుగ్రీవుడు తెల్లని వింజామర పట్టెను. రాక్షసరాజైన విభీషణుడు చంద్రుని వంటి మరియొక వింజామర పట్టెను. 68, 69

మూ. మాలాం జ్వలన్తీం వపుషా కాఞ్చనీం శతపుష్కరామ్,
రాఘవాయ దదౌ వాయుర్వాసవేన ప్రచోదితః. 70

ప్ర. అ. వాయుః=వాయువు, వాసవేన=దేవేంద్రునిచేత, ప్రచోదితః=ప్రేరేపింపబడినవాడై, వపుషా=శరీరముతో, జ్వలన్తీమ్=ప్రకాశించుచున్న, కాఞ్చనీమ్=బంగారము వికారమైన, శతపుష్కరామ్=నూరు పద్మములు గల, మాలామ్=మాలను, రాఘవాయ=రామునకు, దదౌ=ఇచ్చెను.

తా. వాయువు దేవేంద్రునిచేత ప్రేరేపింపబడినవాడై నూరు పద్మములు గల, ప్రకాశించుచున్న ఆకారము గల బంగారు మాలను రామునకు బహూకరించెను.

మూ. సర్వరత్నసమాయుక్తం మణిభిశ్చ విభూషితమ్,
ముక్తాహారం నరేన్ద్రాయ దదౌ శక్రప్రచోదితః. 71

ప్ర. అ. శక్రప్రచోదితః=ఇంద్రునిచేత ప్రేరేపింపబడిన వాయువు, సర్వరత్నసమాయుత్తమ్=సమస్తములైన రత్నములతో కూడిన, మణిభిశ్చ=మణులచేత, విభూషితమ్=అలంకరించబడిన, ముక్తాహారమ్=ముత్యాలహారమును, నరేన్ద్రాయ=రాజునకు, దదౌ=ఇచ్చెను.

తా. వాయువు దేవేంద్రునిచేత ప్రేరేపింపబడినవాడై రాజైన రామునకు సకలరత్నములతో కూడిన, మణులచేత అలంకరించబడిన ముత్యాలహారమును కూడ ఇచ్చెను. 71

మూ. ప్రజగుర్దేవగన్ధర్వా ననృతుశ్చాప్సరోగణాః,
అభిషేకే తదర్హస్య తదా రామస్య ధీమతః. 72

ప్ర. అ. తదా=అప్పుడు, తదర్హస్య=అభిషేకమునకు తగినవాడైన, రామస్య=రామునియొక్క, అభిషేకే=అభిషేకమునందు, దేవగన్ధర్వాః=దేవతలు గంధర్వులు, ప్రజగుః=గానముచేసిరి. అప్సరోగణాః=అప్సరస్త్రీసముదాయములు, ననృతుః=నాట్యముచేసినవి.

తా. అభిషేకము పొందుటకు అర్హుడైన రామునకు అభిషేకము జరిగిన ఆ సమయమునందు దేవతలు గంధర్వులు గానము చేసిరి. అప్సరఃస్త్రీలు నాట్యము చేసిరి. 72

మూ. భూమిః సస్యవతీ చైవ ఫలవన్తశ్చ పాదపాః,
గన్ధవన్తి చ పుష్పాణి బభూవూ రాఘవోత్సవే. 73

ప్ర. అ. రాఘవోత్సవే=రామునకు ఉత్సవము జరుగగా, భూమిః=భూమి, సస్యవతీ=సస్యములు కలది ఆయెను. పాదపాః=వృక్షములు, ఫలవన్తశ్చ=ఫలములు కలవి గాను, పుష్పాణి=పుష్పములు, గన్ధవన్తి చ=గంధము కలవిగాను, బభూవుః=అయినవి.

తా. రాముని అభిషేకమహోత్సవసమయమునందు భూమి సస్యసమృద్ధ మయ్యెను. వృక్షములు ఫలములతో నిండెను. పుష్పములు సుగంధము కలవయ్యెను. 73

మూ. సహస్రశతమశ్వానాం ధేనూనాం చ గవాం తథా,
దదౌ శతవృషాన్ పూర్వం ద్విజేభ్యో మనుజర్షభః. 74

ప్ర. అ. మనుజర్షభః=మనుష్యులలో శ్రేష్ఠుడైన రాముడు, పూర్వమ్=ముందుగా, అశ్వానామ్=గుఱ్ఱములయొక్క, సహస్రశతమ్=లక్షను, తథా=మరియు, ధేనూనామ్=క్రొత్తగా ప్రసవించిన, గవాం చ=గోవులయొక్క సహస్రశతమును, శతవృషాన్=నూరు ఎద్దులను, ద్విజేభ్యః=ద్విజులకొరకు, దదౌ=ఇచ్చెను.

తా. రాముడు ముందుగా ద్విజులకు లక్ష గుఱ్ఱములను, లక్ష క్రొత్తగా ఈనిన ఆవులను, నూరు ఎద్దులను ఇచ్చెను. 74

మూ. త్రింశత్కోటీర్హిరణ్యస్య బ్రాహ్మణేభ్యో దదౌ పునః,
నానాభరణవస్త్రాణి మహార్హాణి చ రాఘవః. 75

ప్ర. అ. రాఘవః=రాముడు, పునః=మరల, బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొరకు, హిరణ్యస్య=బంగారముయొక్క, త్రింశత్కోటీః=ముప్పై కోట్లను,మహార్హాణి=చాల విలువ గల, నానాభరణవస్త్రాణి=అనేకవిధములైన ఆభరణములను వస్త్రములను, దదౌ=ఇచ్చెను.

తా. రాముడు మరల బ్రాహ్మణులకు ముప్పై కోట్ల బంగారు నాణెములు, చాల విలువ గల అనేకవిధములైన ఆభరణములు, వస్త్రములు ఇచ్చెను. 75

మూ. అర్కరశ్మిప్రతీకాశాం కాఞ్చనీం మణివిగ్రహామ్,
సుగ్రీవాయ స్రజం దివ్యాం ప్రాయచ్ఛన్మనుజాధిపః. 76

ప్ర. అ. మనుజాధిపః=రాముడు, సుగ్రీవాయ=సుగ్రీవునకు, అర్కరశ్మిప్రతీకాశామ్=సూర్యకిరణముల వలె ఉన్న, మణివిగ్రహామ్=అధికముగా మణులు గల, కాఞ్చనీమ్=బంగారము వికారమైన, దివ్యామ్=దివ్యమైన, స్రజమ్=మాలను, సుగ్రీవాయ=సుగ్రీవునకు, ప్రాయచ్ఛత్=ఇచ్చెను.

తా. రాముడు సూర్యకిరణములతో సమానము, మాణిక్యములతో నిండినదీ అయిన బంగారపు దివ్యమైన మాలను సుగ్రీవునకు బహూకరించెను.76

మూ. వైదూర్యమయచిత్రే చ మణిరత్నవిభూషితే,
వాలిపుత్రాయ ధృతిమానఙ్గదాయాఙ్గదే దదౌ. 77

ప్ర. అ. ధృతిమాన్=ప్రేమగల రాముడు, వైదూర్యమయచిత్రే చ=వైదూర్యములతో నిండి చిత్రముగా ఉన్న, మణిరత్నవిభూషితే=మణులచేతను, రత్నములచేతను అలంకరింపబడిన, అఙ్గదే=బాహుపురులను, వాలిపుత్రాయ=వాలిపుత్రుడైన, అఙ్గదాయ=అంగదునకు, దదౌ=ఇచ్చెను.

తా. ప్రేమభావము గల రాముడు, వైదూర్యమణులతో నిండి చిత్రవర్ణములై ఉన్న, మణులచేత రత్నములచేత అలంకరించబడిన బాహుపురులను వాలిపుత్రుడైన అంగదునకు బహూకరించెను. 77

మూ. మణిప్రవరజుష్టం తం ముక్తాహారమనుత్తమమ్,
సీతాయై ప్రదదౌ రామశ్చన్ద్రరశ్మిసమప్రభమ్, 78
అరజే వాససీ దివ్యే శుభాన్యాభరణాని చ.

ప్ర. అ. రామః=రాముడు, మణిప్రవరజుష్టమ్=శ్రేష్ఠములైన మణులతో కూడిన, అనుత్తమమ్=శ్రేష్ఠమైన, తమ్=ఆ,చన్ద్రరశ్మి సమప్రభమ్=చంద్రకిరణములతో

సమానమైన కాంతి గల, ముక్తాహారమ్=ముత్యాలహారమును, అరజే=పరిశుద్ధము లైన, దివ్యే=దివ్యములైన, వాససీ=రెండు వస్త్రములను, శుభాని=సుందరములైన, ఆభరణాని చ=ఆభరణములను, సీతాయై=సీతకు, ప్రదదౌ=ఇచ్చెను.

తా. రాముడు శ్రేష్ఠములైన మణులతో కూడిన, చంద్రకిరణముల వంటి కాంతి గల శ్రేష్ఠమైన ముత్యాలహారమును, నిర్మలములైన దివ్యములైన రెండు వస్త్రములను, సుందరములైన అలంకారములను సీతకు ఇచ్చెను. 78

మూ. అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే 79
అవముచ్యాత్మనః కణ్ఠాద్ధారం జనకనన్దినీ.
అవైక్షత హరీన్ సర్వాన్ భర్తారం చ ముహుర్ముహుః. 80

ప్ర. అ. ("అవేక్షమాణా" ఇత్యాది శ్లోకార్ధానికి బదులు ప్రాచ్యప్రతిలో ఉన్న -
"అవేక్ష్య మైథిలీ చైవ హనుమన్తం ప్లవఙ్గమమ్"
అనుపాఠము బాగున్నది.)

జనకనన్దినీ=జనకుని కుమార్తెయైన, మైథిలీ=సీత, ప్లవఙ్గమమ్=వానరుడైన, హనూమన్తమ్=హనుమంతుణ్ణి, అవేక్ష్య=చూచి, ఆత్మనః=తనయొక్క, కణ్ఠాత్=కంఠమునుండి, హారమ్=హారమును, అవముచ్య=పైకి తీసి, సర్వాన్=సమస్తమైన, హరీన్=వానరులను, భర్తారం చ=భర్తను, ముహుర్ముహుః=మాటిమాటికి, అవైక్షత=చూచెను.

తా. జనకనందిని అయిన సీత హనుమంతుని వైపు చూచి, ఆ హారమును తన కంఠమునుండి తీసి ఆ వానరులందరి వైపూ, భర్త వైపూ మాటిమాటికి చూచెను. 79 - 80

మూ. తామిఙ్గితజ్ఞః సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్,
ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని. 81
తేజో ధృతిర్యశో దాక్ష్యం సామర్థ్యం వినయో నయః,
పౌరుషం విక్రమో బుద్ధిర్యస్మిన్నేతాని సర్వదా. 82

ప్ర. అ. ఇఙ్గితజ్ఞః=అభిప్రాయమును గుర్తించిన రాముడు, తామ్=ఆమెను, సంప్రేక్ష్య=చూచి, తామ్=ఆ, జనకాత్మజామ్=సీతను గూర్చి, బభాషే=పలికెను. సుభగే=సౌభాగ్యము గల, భామిని=ఓ సీతా, యస్య=ఎవనికి, తుష్టా=సంతోషించిన దానవు, అసి=అయి ఉన్నావో, యస్మిన్=ఎవనిలో, తేజః=తేజస్సు, ధృతిః=ధైర్యము, యశః=కీర్తి, దాక్ష్యమ్=నేర్పు, సామర్థ్యమ్=సామర్థ్యము, వినయః=వినయము, నయః=నీతి, పౌరుషమ్=పౌరుషము, విక్రమః=పరాక్రమము, బుద్ధిః=బుద్ధి, ఏతాని=

ఇవి, సర్వదా=ఎల్లప్పుడూ ఉన్నవో అతనికి, హారమ్=హారమును ప్రదేహి=ఇమ్ము.

తా. పరాభిప్రాయమును గుర్తించు సామర్థ్యము గల రాముడు సీతను చూచి ఇట్లనెను- "సౌభాగ్యవతియైన ఓ సీతా ! నీకు ఎవని విషయమునందు సంతోషమున్నదో, తేజస్సు, ధైర్యము, యశస్సు, నేర్పు, సామర్థ్యము, వినయము, నీతి, పౌరుషము, పరాక్రమము, బుద్ధి అను ఈ గుణములు ఎవనిలో ఎల్లప్పుడూ ఉన్నవో ఆతనికి ఈ హారమును ఇమ్ము." 81-82

మూ. దదౌ సా వాయుపుత్రాయ తం హారమసితేక్షణా,
హనూమాంస్తేన హారేణ శుశుభే వానరర్షభః, 83
చన్ద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ యథాచలః.

ప్ర. అ. అసితేక్షణా=నల్లని నేత్రములు గల, సా=సీత, తం హారమ్=ఆ హారమును, వాయుపుత్రాయ=హనుమంతునకు, దదౌ=ఇచ్చెను. వానరర్షభః= వానరశ్రేష్ఠుడైన, హనూమాన్=హనుమంతుడు, చన్ద్రాంశుచయగౌరేణ=చంద్రుని కిరణసముదాయము వలె తెల్లగా ఉన్న, తేన హారేణ=ఆ హారముచేత, శ్వేతాభ్రేణ=తెల్లని మేఘముచేత, అచలః యథా=మేఘము వలె, శుశుభే=ప్రకాశించెను.

తా. నల్లని నేత్రములు గల ఆ సీత ఆ హారమును హనుమంతునకు బహూకరించెను. చంద్రుని కిరణముల సముదాయము వలె తెల్లగా నున్న ఆ హారమును ధరించిన వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు తెల్లని మేఘముతో పర్వతము ప్రకాశించినట్లు ప్రకాశించెను. 83

మూ. సర్వే వానరవృద్ధాశ్చ యే చాన్యే వానరోత్తమాః, 84
వాసోభిర్భూషణైశ్చైవ యథార్హం ప్రతిపూజితాః.

ప్ర. అ. సర్వే=సమస్తమైన, వానరవృద్ధాశ్చ=వానరవృద్ధులు, యే=ఏ, అన్యే=ఇతరులైన, వానరోత్తమాః=వానర శ్రేష్ఠ ులున్నారో, వారు, యథార్హమ్= తగు విధముగా, వాసోభిః=వస్త్రములచేతను, భూషణైశ్చైవ=అలంకారములచేతను, ప్రతిపూజితాః=పూజింపబడిరి.

తా. వానరులలోని పెద్దవాళ్ళందరూ, వానరశ్రేష్ఠులూ కూడ వస్త్రములు, భూషణములు బహూకరించి తగు విధముగా సత్కరింపబడిరి.84

మూ. తతో ద్వివిదమైన్దాభ్యాం నీలాయ చ పరంతపః. 85
సర్వాన్ కామగుణాన్వీక్ష్య ప్రదదౌ వసుధాధిపః.

ప్ర. అ. తతః=పిమ్మట, పరంతపః=శత్రుసంహారకుడైన, వసుధాధిపః=రాముడు, వీక్ష్య=ఆలోచించి, మైన్దద్వివిదాభ్యామ్=మైందద్వివిదులకు, నీలాయ

చ=నీలునకు, సర్వాన్=సమస్తమైన, కామగుణాన్=కోరదగిన శ్రేష్ఠ వస్తువులను, ప్రదదౌ=ఇచ్చెను.

తా. పిమ్మట, శత్రు సంహారకుడైన రాముడు ఆలోచించి, మైందద్వివిదులకు, నీలునకు సమస్తమైన కోరదగిన వస్తువులను ఇచ్చెను. 85

మూ. విభీషణోఽథ సుగ్రీవో హనుమాన్ జామ్బవాంస్తథా, 86
సర్వే వానరముఖ్యాశ్చ రామేణాక్లిష్టకర్మణా,

మూ. యథార్హం పూజితాః సర్వే కామై రత్నైశ్చ పుష్కలైః, 87
ప్రహృష్టమనసః సర్వే జగ్మురేవ యథాగతమ్.

ప్ర. అ. అథ=అటుపిమ్మట, విభీషణః=విభీషణుడు, సుగ్రీవః=సుగ్రీవుడు, హనుమాన్=హనుమంతుడు, తథా=మరియు, జామ్బవాన్=జాంబవంతుడు, సర్వే=సమస్తమైన, వానరముఖ్యాశ్చ=వానర శ్రేష్ఠులు, సర్వే=అందరూ, అక్లిష్ట కర్మణా=శ్రమపడకుండగ పనులుచేయు, రామేణ=రామునిచేత, కామైః=కోరికల చేత, పుష్కలైః=సమృద్ధములైన, రత్నైః=రత్నములచేత, యథార్హమ్=తగు విధముగా, ప్రతిపూజితాః=పూజించబడినవారై, సర్వే=అందరూ, ప్రహృష్టమనసః=సంతోషించిన, మనస్సులు కలవారై, యథాగతమ్=వచ్చినట్లుగా, జగ్మురేవ=వెళ్లిరి.

తా. శ్రమపడకుండ పనులు చేయు రాముడు విభీషణుణ్ణి, సుగ్రీవుణ్ణి, హనుమంతుణ్ణి, జాంబవంతుణ్ణి, ప్రధానులైన వానరులందరినీ కోరదగిన వస్తువులు, పుష్కలములైన, రత్నములు ఇచ్చి తగు విధముగా సన్మానించెను. వాళ్ళందరూ చాల సంతోషించిన మనస్సులతో వచ్చినట్లు గానే తిరిగి వారి వారి స్థానములకు వెళ్లిరి. 86-87

మూ. నత్వా సర్వే మహాత్మానస్తతస్తే వానరర్షభాః, 88
విసృష్టాః పార్థివేన్ద్రేణ కిష్కిన్ధాం సముపాగమన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాత్మానః=మహాత్ములైన, తే=ఆ, వానరర్షభాః=వానరశ్రేష్ఠులు, సర్వే=అందరూ, నత్వా=నమస్కరించి, పార్థివేన్ద్రేణ=రామునిచేత, విసృష్టాః=విడవబడినవారై, కిష్కిన్ధామ్=కిష్కింధను, సముపాగమన్=చేరిరి.

తా. మహాత్ములైన ఆ వానర శ్రేష్ఠులందరూ రామునకు నమస్కరించి, అతని అనుజ్ఞ పొంది, కిష్కింధకు వెళ్ళిరి. 88

మూ. సుగ్రీవో వానరశ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్, 89
పూజితశ్చైవ రామేణ కిష్కిన్ధాం ప్రావిశత్పురీమ్.

ప్ర. అ. వానరశ్రేష్ఠః=వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, రామా

భిషేచనమ్=రాముని అభిషేకమును, దృష్ట్వా=చూచి, రామేణ=రామునిచేత, పూజితశ్చైవ=పూజించబడినవాడై, కిష్కిన్ధాం పురీమ్=కిష్కింధాపురమును, ప్రావిశత్=ప్రవేశించెను.

తా. వానర రాజైన సుగ్రీవుడు రామపట్టాభిషేకమహోత్సవము చూచి, రాముని సన్మానము పొంది కిష్కింధాపురమును ప్రవేశించెను. 89

మూ. విభీషణోఽపి ధర్మాత్మా సహ తైర్నైరృతర్షభైః, 90
లబ్ధ్వా కులధనం రాజా లఙ్కాం ప్రాయాన్ మహాయశాః.

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడు, మహాయశాః=గొప్ప కీర్తి గల, రాజా=రాజైన, విభీషణః అపి=విభీషణుడు కూడ, కులధనమ్=కులధనమైన రాక్షసరాజ్యమును, లబ్ధ్వా=పొంది, తైః=ఆ, నైరృతర్షభైః సహ=రాక్షసశ్రేష్ఠులతో కూడ, లఙ్కామ్=లంకను గూర్చి, ప్రాయాత్=వెళ్లెను.

తా. తన కులధనమును పొంది రాక్షసరాజైన ధర్మాత్ముడు గొప్ప కీర్తి గలవాడు అయిన విభీషణుడు కూడ ఆ రాక్షస శ్రేష్ఠులతో కలిసి లంకకు వెళ్లెను. 90

మూ. స రాజ్యమఖిలం శాసన్నిహతారిర్మహాయశాః, 91
రాఘవః పరమోదారః శశాస పరయా ముదా,
ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలః. 92

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, పరమోదారః=మిక్కిలి ఉదారస్వభావుడైన, సః రాఘవః=ఆ రాముడు, నిహతారిః=చంపబడిన శత్రువులు గలవాడై, అఖిలమ్=సమస్తమైన, రాజ్యమ్=రాజ్యమును, శాసన్=పరిపాలించుచు, పరయా=గొప్ప, ముదా=సంతోషముతో, శశాస=అనుభవించెను. ధర్మవత్సలః=ధర్మమునందు ప్రేమ గల, రామః=రాముడు, ధర్మజ్ఞమ్=ధర్మమెరిగిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. గొప్ప కీర్తి గల, మిక్కిలి ఉదారస్వభావుడైన రాముడు శత్రువులను సంహరించి రాజ్యమునంతను పరిపాలించుచు ఆనందముతో అనుభవించెను. ధర్మమునందు అత్యాసక్తి గల ఆ రాము డొకనాడు ధర్మము నెరిగిన లక్ష్మణునితో ఇట్లు పలికెను. 91-92

మూ. ఆతిష్ఠ ధర్మజ్ఞ మయా సహేమాం
గాం పూర్వరాజాధ్యుషితాం బలేన,
తుల్యం మయా త్వం పితృభిర్ధృతా యా
తాం యౌవరాజ్యే ధురముద్వహస్వ. 93

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసినవాడా! పూర్వరాజాధ్యుషితామ్=పూర్వ కాలపు రాజులచేత అధిష్ఠించబడిన, ఇమామ్=ఈ, గామ్=భూమిని, బలేన=బలముచేత, మయా సహ=నాతో కూడ, ఆతిష్ఠ=అధిష్ఠించుము. యా=ఏది, పితృభిః=మన పూర్వజులచేత, ధృతా=ధరింపబడినదో, తామ్=ఆ, ధురమ్=భారమును, త్వమ్= నీవు, మయా=నాతో, తుల్యమ్=సమానముగా, యౌవరాజ్యే=యౌవరాజ్యమునందు, ఉద్వహస్వ=మోయుము.

తా. ధర్మము నెరిగిన ఓ లక్ష్మణా! మన వంశమునకు చెందన పూర్వరాజులు అధిష్ఠించిన ఈ భూమిని నీవు కూడ నాతో కలిసి, బలముచేత, పాలింపుము. మన పూర్వీకులు ధరించిన ఈ రాజ్యభారమును, నీవు యౌవరాజ్యాభిషిక్తుడవై నాతో కలిసి మోయుము. 93

మూ. సర్వాత్మనా పర్యనునీయమానో
యదా న సౌమిత్రిరుపైతి యోగమ్,
నియుజ్యమానోఽ పి చ యౌవరాజ్యే
తతోఽభ్యషిఞ్చద్భరతం మహాత్మా. 94

ప్ర. అ. యౌవరాజ్యే=యౌవరాజ్యమునందు, నియుజ్యమానోఽపి=నియ మించబడుచున్నను, సౌమిత్రిః=లక్ష్మణుడు, పర్యనునీయమానః=బ్రతిమాలుకొనబడిన వాడైనను, యదా=ఎప్పుడు, సర్వాత్మనా=అన్ని విధముల, యోగమ్=అంగీకారమును, నోపైతి=పొందలేదో, తతః=అటుపిమ్మట, మహాత్మా=మహాత్ముడైన రాముడు, భరతమ్=భరతుణ్ణి, అభ్యషిఞ్చత్=అభిషేకించెను.

తా. యౌవరాజ్యమును అంగీకరింపుమని ఎంత బ్రతిమాలినను లక్ష్మణుడు ఏ విధముగానూ కూడ అందుకు అంగీకరించకపోవుటతో మహాత్ముడైన రాముడు భరతుణ్ణి యౌవరాజ్యమునందు అభిషేకించెను. 94

మూ. పౌణ్డరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చాసకృత్,
అన్యైశ్చ వివిధైర్యజ్ఞైరయజత్పార్థివాత్మజః. 95

ప్ర. అ. పార్థివాత్మజః=రాముడు, పౌణ్డరీకాశ్వమేధాభ్యామ్=పౌండరీకాశ్వ మేధములచేతను, వాజపేయేన=వాజపేయయాగముచేత, వివిధైః=అనేకవిధములైన, అన్యైః=ఇతరములైన, యజ్ఞైః=యజ్ఞములచేత, అసకృత్=అనేకపర్యాయములు, అయ జత్=దేవతలను పూజించెను.

తా. రాముడు అనేక పర్యాయములు పౌండరీకము, అశ్వమేధము, వాజపేయము, ఇంకా అనేక విధములైన యజ్ఞములు చేసెను. 95

మూ. రాజ్యం దశ సహస్రాణి ప్రాప్య వర్షాణి రాఘవః,
శతాశ్వమేధానాజహ్రే సదశ్వాన్ భూరిదక్షిణాన్. 96

ప్ర. అ. రాఘవః=రాముడు, దశసహస్రాణి= పదివేలు, వర్షాణి= సంవత్సరములను, రాజ్యమ్= రాజ్యమును, ప్రాప్య=పొంది, సదశ్వాన్=మంచి అశ్వములు గల, భూరిదక్షిణాన్=అధికమైన దక్షిణలు గల, శతాశ్వమేధాన్=నూరు అశ్వమేధములను, ఆజహ్రే=చేసెను.

తా. రాముడు పదివేల సంవత్సరములు రాజ్యము చేసి మంచి గుఱ్ఱములతో, అధికమైన దక్షిణలు ఇచ్చుచు నూరు అశ్వమేధయాగములు చేసెను. 96

మూ. ఆజానులమ్బిబాహుః స మహోవక్షాః ప్రతాపవాన్,
లక్ష్మణానుచరో రామః శశాస పృథివీమిమామ్. 97

ప్ర. అ. ఆజానులమ్బిబాహుః=మోకాళ్ళవరకు వ్రేలాడుచున్న బాహువులు గలవాడు, మహోవక్షాః=గొప్ప వక్షఃస్థలము గలవాడు, ప్రతాపవాన్=ప్రతాపవంతుడు అయిన, సః=ఆ, రామః=రాముడు, లక్ష్మణానుచరః=లక్ష్మణుడు అనుచరుడుగా కలవాడై, ఇమామ్=ఈ, పృథివీమ్=భూమిని, శశాస=పరిపాలించెను.

తా. ఆజానుబాహువు, విశాలమైన వక్షఃస్థలము కలవాడు, ప్రతాపవంతుడు అయిన ఆ రాముడు, తనకు లక్ష్మణుడు అనుచరుడై ఉండగా ఈ భూమినంతను పాలించెను. 97

మూ. రాఘవశ్చాపి ధర్మాత్మా ప్రాప్య రాజ్యమనుత్తమమ్,
ఈజే బహువిధైర్యజ్ఞైః ససుతభ్రాతృబాన్ధవః. 98

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రాఘవశ్చాపి=రాముడు, అనుత్తమమ్=చాల ఉత్తమమైన, రాజ్యమ్=రాజ్యమును, ప్రాప్య=పొంది, ససుతభ్రాతృబాన్ధవః=పుత్రులతోను, సోదరులతోను బంధువులతోను కూడినవాడై, బహువిధైః=అనేకవిధములైన, యజ్ఞైః=యజ్ఞములచేత, ఈజే=దేవతలను పూజించెను.

తా. ధర్మాత్ముడైన రాముడు చాల ఉత్తమమైన రాజ్యమును పొంది, పుత్రులతోను, సోదరులతోను, బంధువులతోను కూడి అనేకవిధములైన యజ్ఞములు చేసెను. 98

మూ. న పర్యదేవన్విధవా న చ వ్యాలకృతం భయమ్,
న వ్యాధిజం భయం చాసీద్రామే రాజ్యం ప్రశాసతి. 99

ప్ర. అ. రామే=రాముడు, రాజ్యమ్=రాజ్యమును, ప్రశాసతి=పాలించుచుం

డగా, విధవాః=విధవలు, న పర్యదేవన్=ఏడ్వలేదు. వ్యాలకృతమ్=క్రూరజంతువులచేత చేయబడిన, భయమ్=భయము, నాసీత్=లేకుండెను. వ్యాధిజమ్=వ్యాధులవలన కలిగిన, భయమ్=భయముకూడ, న=లేకుండెను.

తా. రాముడు రాజ్యమును పాలించిన కాలములో స్త్రీలు వైధవ్య దుఃఖమును పొందలేదు. క్రూరజంతువులవలన భయము కాని, వ్యాధులవలన భయము కాని లేకుండెను. 99

మూ. నిర్దస్యురభవల్లోకో నానర్థం కశ్చిదస్పృశత్,
న చ స్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే. 100

ప్ర. అ. లోకః=లోకము, నిర్దస్యుః=దొంగలు లేనిది, అభవత్=ఆయెను. కశ్చిత్=ఎవ్వడూకూడ, అనర్థమ్=అనర్థమును, న అస్పృశత్=స్పృశించలేదు. వృద్ధాః=వృద్ధులు, బాలానామ్=చిన్నవాళ్ళకు, ప్రేతకార్యాణి=ప్రేతకార్యములను, న చ కుర్వతే స్మ=చేయలేదు.

తా. లోకములో దొంగలు లేకుండిరి. ఎవ్వనికీ కూడ ఏ అనర్థమూ కలగలేదు. పెద్దవాళ్లు చిన్నవాళ్ళకు ప్రేతకార్యము చేయు అవసర మెన్నడూ ఎక్కడా కలగలేదు. 100

మూ. సర్వం ముదితమేవాసీత్ సర్వో ధర్మపరోఽభవత్,
రామమేవానుపశ్యన్తో నాభ్యహింసన్ పరస్పరమ్. 101

ప్ర. అ. సర్వమ్=అంతా కూడ, ముదితమేవ=ఆనందముతో కూడినదిగానే, అసీత్=ఉండెను. సర్వః=ప్రతీవాడు, ధర్మపరః=ధర్మమునందు ఆసక్తి కలవాడు, అభవత్=ఆయెను. రామమేవ=రాముణ్ణే, అనుపశ్యన్తః=చూచుచు, పరస్పరమ్=పరస్పరమును, నాభ్యహింసన్=హింసించలేదు.

తా. అంతా ఆనందమయముగానే ఉండెను. అందరూ ధర్మపరులై ఉండిరి. రాముణ్ణే చూచుచు అనగా రాముని మనస్సుకు బాధ కలుగును అను అభిప్రాయముతో లేదా రాము డెక్కడ శిక్షించునో అను భయముతో ప్రజలు ఒకరి నొకరు హింసించుకొనలేదు. 101

మూ. ఆసన్వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః,
నిరామయా విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి. 102

ప్ర. అ. రామే=రాముడు, రాజ్యమ్=రాజ్యమును, ప్రశాసతి=పాలించుచుండగా, వర్షసహస్రాణి=వేలకొలది సంవత్సరములను, తథా=మరియు, పుత్రసహస్రిణః=వేలకొలది పుత్రులు కలవారై, నిరామయాః=రోగములు లేనివారై,

విశోకాశ్చ=శోకము లేనివారై ప్రజలు ఉండిరి.

తా. రాముడు రాజ్యము చేయుచున్న కాలములో ప్రజలు వేలకొలది సంవత్సరములు వేలకొలది పుత్రులతో రోగములు గాని, దుఃఖము కాని లేనివారై ఉండిరి. 102

మూ. రామో రామో రామ ఇతి ప్రజానామభవన్ కథాః,
రామభూతం జగదభూద్రామే రాజ్యం ప్రశాసతి. 103

ప్ర. అ. రామే=రాముడు, రాజ్యమ్=రాజ్యమును, ప్రశాసతి=రక్షించుచుండగా, రామః రామః రామః ఇతి=రాముడు, రాముడు, రాముడు అని, ప్రజానామ్=ప్రజలలో, కథాః=కథలు, అభవన్=అయినవి. జగత్=జగత్తు, రామభూతమ్=రామమయముగా, అభూత్=ఆయెను.

తా. ప్రజలు ఎక్కడ చూచినా రాముడు, రాముడు, రాముడు అని ఎల్లప్పుడూ రాముణ్ణి గూర్చిన కథలు చెప్పుకొనిరి. రాముడు రాజ్యమును పాలించు కాలములో జగత్తు అంతా రామమయము అయిపోయెను. 103

మూ. నిత్యపుష్పా నిత్యఫలాస్తరవస్తత్ర నిర్వ్రణాః,
కామవర్షీ చ పర్జన్యః సుఖస్పర్శశ్చ మారుతః. 104

ప్ర. అ. తత్ర=అక్కడ, తరవః=వృక్షములు, నిత్యపుష్పాః=ఎల్లప్పుడూ పుష్పములు కలవి, నిత్యఫలాః=నిత్యమూ ఫలములు కలవి, నిర్వ్రణాః=వ్రణములు లేనివి అయి ఉండెను. పర్జన్యః=మేఘము, కాలవర్షీ=తగు కాలమునందు వర్షించునదిగాను, మారుతః=వాయువు, సుఖస్పర్శః=సుఖకరమైన స్పర్శ కలదికాను, ఉండెను.

తా. అప్పుడు వృక్షములు ఎట్టి వ్రణములు, అనగా క్రిమికీటాదులవలన గాయములు, లేక నిత్యము పుష్పఫలములతో నిండి ఉండెను. మేఘము తగిన కాలమునందు వర్షించుచుండెను. వాయువు స్పర్శ సుఖకరముగా ఉండెను.

మూ. బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా లోభవివర్జితాః,
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాః స్వైరేవ కర్మభిః. 105
ఆసన్ ప్రజా ధర్మపరా రామే శాసతి నానృతాః.

ప్ర. అ. బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, క్షత్రియాః=క్షత్రియులు, వైశ్యాః=వైశ్యులు, శూద్రాః=శూద్రులు, లోభవివర్జితాః=లోభముతో, దురాశతో, శూన్యులై, స్వైః=తమసంబంధమైన, కర్మభిరేవ=కర్మలచేతనే, తుష్టాః=సంతోషించుచున్నవారై, స్వకర్మసు=తమ తమ కర్మలయందు, ప్రవర్తన్తే=ప్రవర్తించుచుండిరి. రామే=రాముడు, శాసతి=పరిపాలించుచుండగా, ప్రజాః=ప్రజలు, ధర్మపరాః=ధర్మమునందు

ఆసక్తి కలవారుగా, ఆసన్=ఉండిరి. అన్నృతాః=అసత్యపరులుగా, న=లేకుండిరి.

తా. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు దురాశ లేక తమ తమ పనులలోనే తృప్తి చెందుచు తన తమ కర్తవ్యములు చేసికొనుచుండిరి. రాముడు రాజ్యము పరిపాలించుచుండగా ప్రజలు ధర్మతత్పరులై, అసత్యమనేది లేక నివసించుచుండిరి. 105

106

మూ. సర్వే లక్షణసంపన్నాః సర్వే ధర్మపరాయణాః,
దశ వర్షసహస్రాణి రామో రాజ్యమకారయత్.

ప్ర. అ. సర్వే=అందరూ, లక్షణసంపన్నాః=ఉత్తమలక్షణములతో కూడినవారు, సర్వే=అందరూ, ధర్మపరాయణాః=ధర్మమునందు ఆసక్తి గలవారు. రామః=రాముడు, దశ=పది, వర్షసహస్రాణి=సంవత్సరముల సహస్రములను, రాజ్యమ్=రాజ్యమును, అకారయత్=చేసెను.

తా. ప్రజలందరూ ఉత్తమలక్షణసంపన్నులే. అందరూ ధర్మమునందు ఆసక్తి కలవారే. రాముడు ఈ విధముగ పదివేల సంవత్సరములు రాజ్యము చేసెను. 106

107

మూ. ధర్మ్యం యశస్యమాయుష్యం రాజ్ఞాం చ విజయావహమ్,
ఆదికావ్యమిదం చార్షం పురా వాల్మీకినా కృతమ్,
పఠేద్యః శృణుయాల్లోకే నరః పాపాత్ప్రముచ్యతే. 108

ప్ర. అ. ధర్మ్యమ్=ధర్మసంమతము, యశస్యమ్=యశస్సు ఇచ్చునది, ఆయుష్యమ్=ఆయుర్దాయము నిచ్చునది, రాజ్ఞామ్=రాజులకు, విజయావహం చ=విజయమును ఇచ్చునది అయిన, పురా=పూర్వము, వాల్మీకినా=వాల్మీకిచేత, కృతమ్=రచించబడిన, ఆర్షమ్=ఋషిప్రోక్తమైన లేదా వేదముతో సంబంధము గల, ఇదమ్=ఈ, ఆదికావ్యమ్=ఆదికావ్యమును, లోకే=లోకమునందు, యః నరః=ఏ నరుడు, పఠేత్=పఠించునో, శృణుయాత్=వినునో అతడు, పాపాత్=పాపమునుండి, ప్రముచ్యతే=విడువబడును.

తా. పూర్వము వాల్మీకి రచించిన ఈ ఆదికావ్యము ధర్మసంమతము. కీర్తిని ఇచ్చును. ఆయుర్దాయమును పెంచును. రాజులకు విజయము చేకూర్చును. అట్టి ఆర్షమైన ఈ ఆదికావ్యమును ఎవ్వడు చదువునో, ఎవ్వడు వినునో అతడు సమస్తపాపములనుండి విముక్తు డగును. 107 - 108.

మూ. పుత్రకామశ్చ పుత్రాన్వై ధనకామో ధనాని చ, 109
లభతే మనుజో లోకే శ్రుత్వా రామాభిషేచనమ్.
మహీం విజయతే రాజా రిపూంశ్చాప్యధితిష్ఠతి.

ప్ర. అ. రామాభిషేచనమ్=రామాభిషేకమువరకు ఉన్న ఈ కావ్యమును, శ్రుత్వా=విని, లోకే=లోకములో, పుత్రకామః=పుత్రులయందు కోరిక గల, మనుజః=మానవుడు, పుత్రాన్=పుత్రులను, ధనకామః=ధనమునందు కోరిక గలవాడు, ధనాని చ=ధనములను, లభతే వై=తప్పక పొందును. రాజా=రాజు, మహీమ్=భూమిని, విజయతే=జయించును. రిపూన్=శత్రువులను, అధితిష్ఠతి చ=అణగద్రొక్కి ఉండును.

తా. రాముని పట్టాభిషేకమువరకు ఉన్న ఈ గ్రంథము ఈ లోకములో వినినచో పుత్రులు కావలెనని కోరువాడు పుత్రులను, ధనము కావలె నని కోరువాడు ధనములను పొందును. రాజు భూమిని జయించి శత్రువులను అణగద్రొక్కివేయును. 109

మూ. రాఘవేణ యథా మాతా సుమిత్రా లక్ష్మణేన చ 110
భరతేన చ కైకేయీ జీవపుత్రాస్తథా స్త్రియః.
భవిష్యన్తి సదానన్దాః పుత్రపౌత్రసమన్వితాః. 111

ప్ర. అ. రాఘవేణ=రామునిచేత, మాతా=తల్లియైన కౌసల్య, యథా=ఎట్లో, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, సుమిత్రా చ=సుమిత్ర ఎట్లో, భరతేన చ=భరతునిచేత, కైకేయీ=కైకేయి ఎట్లో, తథా=అట్లే, స్త్రియః=స్త్రీలు, జీవపుత్రాః=జీవించి ఉన్న పుత్రులు కలవారై, పుత్రపౌత్రసమన్వితాః=పుత్రపౌత్రులతో కూడినవారై, సదానన్దాః=ఎల్లప్పుడూ ఆనందము కలవారు, భవిష్యన్తి=కాగలరు.

తా. కౌసల్య రామునిచేత ఎట్లు జీవపుత్ర (జీవించిన పుత్రుడు కలది) అయినదో, సుమిత్ర లక్ష్మణుని చేత ఎట్లు జీవపుత్ర అయినదో, కైకేయి భరతునిచేత ఎట్లు జీవపుత్ర అయినదో అట్లే ఈ ఆదికావ్యమును చదివిన లేదా వినిన స్త్రీలు జీవపుత్రులై, పుత్రపౌత్రులతో కూడినవారై ఎల్లప్పుడూ ఆనందముతో ఉందురు. 110 - 111.

మూ. శ్రుత్వా రామాయణమిదం దీర్ఘమాయుశ్చ విన్దతి,
రామస్య విజయం చైవ సర్వమక్లిష్టకర్మణః. 112

ప్ర. అ. ఇదమ్=ఈ, రామాయణమ్=రామాయణమును, అక్లిష్టకర్మణః=శ్రమపడకుండా పనులు చేయు, రామస్య=రామునియొక్క, సర్వమ్=సమస్తమైన, విజయం చైవ=విజయమును, శ్రుత్వా=విని, దీర్ఘమ్=దీర్ఘమైన, ఆయుశ్చ=ఆయుర్దాయమును కూడ, విన్దతి=పొందును.

తా. ఈ రామాయణకావ్యమును, అక్లిష్టకర్మయైన రాముని విజయవృత్తాంతమును అంతనూ వినిన మానవుడు దీర్ఘాయుర్దాయము కూడ పొందును. 112

మూ. శృణోతి య ఇదం కావ్యం పురా వాల్మీకినా కృతమ్,
శ్రద్దధానో జితక్రోధో దుర్గాణ్యతితరత్యసౌ. 113

ప్ర. అ. పురా=పూర్వము, వాల్మీకినా=వాల్మీకిచేత, కృతమ్=చేయ బడిన, ఇదం కావ్యమ్=ఈ కావ్యమును, యః=ఎవడు, శ్రద్దధానః=నమ్ముచు, జితక్రోధః=జయించబడిన కోపము గలవాడై, శృణోతి=వినునో, అసౌ=ఇతడు, దుర్గాణి=కష్టములను, అతితరతి=దాటును.

తా. పూర్వము వాల్మీకి రచించిన ఈ మహాకావ్యమును నమ్మకముతో, కోపమును జయించి వినువాడు కష్టములను దాటును. 113

మూ. సమాగమ్య ప్రవాసాన్తే రమన్తే సహ బాన్ధవైః,
శృణ్వన్తి య ఇదం కావ్యం పురా వాల్మీకినా కృతమ్. 114

ప్ర. అ. పురా=పూర్వము, వాల్మీకినా=వాల్మీకిచేత, కృతమ్=రచించబడిన, ఇదమ్=ఈ, కావ్యమ్=కావ్యమును, యే=ఎవరు, శృణ్వన్తి=విందురో, తే=వారు, ప్రవాసాన్తే=ప్రవాసము చివర, బాన్ధవైః సహ=బంధువులతో కూడ,సమాగమ్య=కలిసి, రమన్తే=సంతోషింతురు.

తా. పూర్వము వాల్మీకి రచించిన ఈ కావ్యమును విన్నవారు ప్రవాసాంతమునందు బంధువులతో కూడ కలసి ఆనందముగా ఉందురు. 114

మూ. తే ప్రార్థితాన్ వరాన్ సర్వాన్ ప్రాప్నువన్తీహ రాఘవాత్,
శ్రవణేన సురాః సర్వే ప్రీయన్తే సంప్రశృణ్వతామ్. 115

ప్ర. అ. తే=వాళ్లు, రాఘవాత్=రామునినుండి, ప్రార్థితాన్=కోరబడిన, సర్వాన్=సమస్తమైన, వరాన్=వరములను, ఇహ=ఇక్కడ, ప్రాప్నువన్తి=పొందుదురు. శ్రవణేన=వినుటచేత, సర్వే=సమస్తమైన, సురాః=దేవతలు, సంప్రశృణ్వతామ్=విను వారివిషయమున, ప్రీయన్తే=సంతోషింతురు.

తా. ఈ కావ్యమును విన్నవారు రామునినుండి కోరిన వరములన్నింటినీ పొందెదరు. దీనిని వినుటచేత దేవతలందరూ వినువారి విషయమున సంతోషింతురు. 115

మూ. వినాయకాశ్చ శామ్యన్తి గృహే తిష్ఠన్తి యస్య వై,
విజయేత మహీం రాజా ప్రవాసీ స్వస్తిమాన్ భవేత్. 116

ప్ర. అ. యస్య=ఎవనియొక్క, గృహే=గృహమునందు, వినాయకాః=వినాయకులు, దుష్టభూతాదులు, తిష్ఠన్తి=ఉందురో, వానియింట్లో, శామ్యన్తి=శాంతింతురు. రాజా =రాజు, మహీమ్=భూమిని, విజయేత=జయిం

చును. ప్రవాసీ=ప్రవాసములో ఉన్నవాడు, స్వస్తిమాన్=క్షేమము కలవాడు, భవేత్=అగును.

తా. దీనిని చదివినచో ఇంట్లో ఉన్న దుష్టభూతాదులు శాంతించును. రాజు భూమిని జయించును. ప్రవాసములో ఉన్నవాడు క్షేమముగా ఉండును.

మూ. స్త్రియో రజస్వలాః శ్రుత్వా పుత్రాన్ సూయురనుత్తమాన్,
పూజయంశ్చ పఠంశ్చైనమితిహాసం పురాతనమ్. 117
సర్వపాపైః ప్రముచ్యేత దీర్ఘమాయురవాప్నుయాత్.

ప్ర. అ. రజస్వలాః=రజస్వలలైన, స్త్రియః=స్త్రీలు, శ్రుత్వా=విని, అనుత్తమాన్=చాల ఉత్తములైన, పుత్రాన్=పుత్రులను, సూయుః=కనెదరు. పురాతనమ్=ప్రాచీనమైన, ఏనమ్=ఈ, ఇతిహాసమ్=ఇతిహాసమును, పూజయన్ చ=పూజించువాడు, పఠన్ చ=చదువువాడు, సర్వపాపైః=సమస్తపాపములచేత, ప్రముచ్యేత=విడువబడును. దీర్ఘమ్=దీర్ఘమైన, ఆయుః=ఆయుర్దాయమును, అవాప్నుయాత్=పొందును.

తా. రజస్వలలైన స్త్రీలు ఈ రామాయణమును విన్నచో చాల ఉత్తములైన పుత్రులను కనెదరు. పురాతనమైన ఈ ఇతిహాసము పూజించువాడు, చదువువాడు సమస్తపాపములనుండి విముక్తుడై దీర్ఘాయుర్దాయమును పొందును.

మూ. ప్రణమ్య శిరసా నిత్యం శ్రోతవ్యం క్షత్రియైర్ద్విజాత్. 118
ఐశ్వర్యం పుత్రలాభశ్చ భవిష్యతి న సంశయః.
రామాయణమిదం కృత్స్నం శృణ్వతః పఠతః సదా. 119

ప్ర. అ. క్షత్రియైః=క్షత్రియులచేత, శిరసా=శిరస్సుచేత, ప్రణమ్య=నమస్కరించి, ద్విజాత్=బ్రాహ్మణునినుండి, శ్రోతవ్యమ్=వినదగినది. కృత్స్నమ్=సమస్తమైన, ఇదమ్=ఈ, రామాయణమ్=రామాయణమును, సదా=ఎల్లప్పుడు, శృణ్వతః=వినుచున్నవానికి, పఠతః=చదువుచున్నవానికి, ఐశ్వర్యమ్=ఐశ్వర్యము, పుత్రలాభశ్చ=పుత్రలాభము, భవిష్యతి=కాగలదు, సంశయః=సంశయము, న=లేదు.

తా. క్షత్రియుడు శిరస్సు వంచి నమస్కరించుచు ఎల్లప్పుడూ దీనిని బ్రాహ్మణునినుండి వినవలెను. ఈ రామాయణమునంతనూ ఎల్లప్పుడూ వినువానికి చదువువానికి ఐశ్వర్యము, పుత్రలాభము కలుగును. సంశయము లేదు. 118 - 119

మూ. ప్రీయతే సతతం రామః సహి విష్ణుః సనాతనః,
ఆదిదేవో మహాబాహుర్హరిర్నారాయణః ప్రభుః. 120
సాక్షాద్రామో రఘుశ్రేష్ఠః శేషో లక్ష్మణ ఉచ్యతే.

ప్ర. అ. రామః=రాముడు, సతతమ్=ఎల్లప్పుడూ, ప్రీయతే=సంతోషించును. సః=అతడు, సనాతనః= నిత్యుడైన, విష్ణుః హి=విష్ణువు కదా. రఘుశ్రేష్ఠః=రఘువంశశ్రేష్ఠుడైన, రామః=రాముడు, సాక్షాత్=సాక్షాత్తు, ఆదిదేవః= ఆదిదేవుడు, మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడు, హరిః=సర్వపాపహరుడు, ప్రభుః=ప్రభువూ అయిన, నారాయణః=నారాయణుడు. లక్ష్మణః=లక్ష్మణుడు, శేషః=ఆదిశేషుడుగా, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. దీనిని చదువుటచేత రాముడు ఎల్లప్పుడూ సంతోషించును; అనుగ్రహించును. అతడు నిత్యుడైన విష్ణువు కదా. రఘువంశమునందు శ్రేష్ఠుడైన రాముడు సాక్షాత్తు ఆదిదేవుడు, మహాబాహువు, పాపహారి, ప్రభువు అయిన నారాయణుడే. లక్ష్మణుడు ఆదిశేషుడు. 120

మూ. ఏవమేతత్పురావృత్తమాఖ్యానం భద్రమస్తు వః, 121
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్.

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, పురా=పూర్వము, వృత్తమ్=జరిగిన, ఏతత్=ఈ, ఆఖ్యానమ్=ఆఖ్యానమును, విస్రబ్ధమ్=నిర్భయముగా, ప్రవ్యాహరత=చెప్పడు. వః=మీకు, భద్రమ్=క్షేమము, అస్తు=అగుగాక. విష్ణోః=విష్ణువుయొక్క, బలమ్=బలము, ప్రవర్ధతామ్=వృద్ధిపొందుగాక.

తా. ఓ జనులారా ! పూర్వము ఈ విధముగా జరిగిన ఈ ఇతిహాసమును అడిగినవారికి నిర్భయముగా లేదా ధృఢవిశ్వాసముతో చెప్పడు. మీకు క్షేమ మగు గాక. విష్ణువు బలము వృద్ధి చెందుగాక. 121

మూ. దేవాశ్చ సర్వే తుష్యన్తి గ్రహణాచ్ఛ్రవణాత్తథా. 122
రామాయణస్య శ్రవణే తుష్యన్తి పితరః సదా.

ప్ర. అ. గ్రహణాత్=ఈ కావ్యమును గ్రహించుటవల్లను, తథా=మరియు, శ్రవణాత్=వినుట వలనను, సర్వే=సమస్తమైన, దేవాః చ=దేవతలు కూడ, తుష్యన్తి= సంతోషింతురు. రామాయణస =రామాయణముయొక్క, శ్రవణే=శ్రవణమునందు, పితరః=పితృదేవతలు, సదా=ఎల్లప్పుడు, తుష్యన్తి=సంతోషింతురు.

తా. ఈ రామాయణమును పఠించినా, వినినా దేవతలు అనుగ్రహింతురు. రామాయణమును వినుటచే పితృదేవతలు సంతోషింతురు.

మూ. భక్త్యా రామస్య యే చేమాం సంహితామృషిణా కృతామ్, 123
యే లిఖన్తీహ చ నరాస్తేషాం వాసస్త్రివిష్టపే.

ప్ర. అ. ఋషిణా=వాల్మీకిమహర్షిచేత, కృతామ్=రచించబడిన,

ఇమామ్=ఈ, రామస్య=రామునియొక్క, సంహితామ్=సంహితను, భక్త్యా=భక్తితో, లిఖన్తి చ=వ్రాస్తారో, తేషామ్=వారికి, త్రివిష్టపే=స్వర్గమునందు, వాసః=నివాసము.

తా. వాల్మీకిమహర్షి రచించిన రామునికి సంబంధించిన ఈ సంహితను భక్తి పూర్వకముగా వ్రాయు నరులకు స్వర్గమునందు నివాసము లభించును.123

మూ. కుటుమ్బవృద్ధిం ధనధాన్యవృద్ధిం
స్త్రియశ్చ ముఖ్యాః సుఖముత్తమం చ,
శ్రుత్వా శుభం కావ్యమిదం మహార్థం
ప్రాప్నోతి సర్వాం భువి చార్థసిద్ధిమ్. 124

ప్ర. అ. మహార్థమ్=గొప్ప అర్థము గల, శుభమ్=శుభమైన, కావ్యమ్=కావ్యమును, శ్రుత్వా=విని, కుటుమ్బవృద్ధిమ్=కుటుబవృద్ధిని, ధనధాన్యవృద్ధిమ్=ధనధాన్యవృద్ధిని, ముఖ్యాః=ముఖ్యలైన, స్త్రియశ్చ=స్త్రీలను, ఉత్తమమ్=ఉత్తమమైన, సుఖం చ=సుఖమును, భువి=భూలోకమునందు, సర్వామ్=సమస్తమైన, అర్థసిద్ధిం చ=కార్యసిద్ధిని, ప్రాప్నోతి=పొందును.

తా. గొప్ప అర్థము గల శుభకరమైన ఈ కావ్యమును చదివినవాడు కుటుంబాభివృద్ధిని, ధనధాన్యసమృద్ధిని, ఉత్తమస్త్రీలను, గొప్ప సుఖమును, ఈ భూలోకములో సకలకార్యసిద్ధిని పొందును. 124

మూ. ఆయుష్యమారోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం శుభం చ,
శ్రోతవ్యమేతన్నియమేన సద్భి
రాఖ్యానమోజస్కరమృద్ధికామైః. 125

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే అష్టావింశత్యధిక శతతమః సర్గః.

ప్ర. అ. ఋద్ధికామైః=సమృద్ధిని కోరు, సద్భిః=సత్పురుషులచేత, ఆయుష్యమ్=ఆయుర్దాయవర్ధకము, ఆరోగ్యకరమ్=ఆరోగ్యము నిచ్చేది, యశస్యమ్=కీర్తిని ఇచ్చేది, సౌభ్రాతృకమ్=భ్రాతృప్రేమను కలిగించేది, బుద్ధికరమ్=సద్బుద్ధిని ఇచ్చేది, శుభం చ=శుభకరము, ఓజస్కరమ్=కాంతిని కలిగించేది అయిన, ఏతత్=ఈ, ఆఖ్యానమ్=ఆఖ్యానము, నియమేన=నియమముచేత, శ్రోతవ్యమ్=వినదగినది.

తా. ఈ ఆఖ్యానము ఆయుర్దాయమును వృద్ధి పొందించును, ఆరోగ్యమును ఇచ్చును. కీర్తిని కలిగించును. సోదరప్రేమను పెంచును. సద్బుద్ధిని కలిగించును. శుభకరము. గొప్ప తేజస్సును వృద్ధిచేయును. అట్టి ఈ శ్రీమద్రామాయణమును సమృద్ధిని కోరు సత్పురుషులు నియమపూర్వకముగా వినవలెను. 125

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన
"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానమునందు యుద్ధకాండలో నూట ఇరవై ఎనిమిదవ సర్గ సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్తాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః

## వ్యాఖ్యాయాః రచయితుః వంశాదేః పరిచయః

శ్రీమద్గోదావరీస్రోతఃపరిక్షిప్తా తిస్పృష్వపి,
దిక్ష్వబ్ధినా చ పూర్వస్యాం దిశాయాం సంపరీవృతా. 1

అచ్ఛగోదావరీవారివాహినీభిః సమన్తతః,
కుల్యాభిః సర్వసస్యౌఘశ్యామతాముపలమ్భితా. 2

నారికేలామ్రపనసకదలీవనశోభితా,
ఆన్ధ్రేష్వసీమసౌభాగ్యా "కోనసీమా" విరాజతే. 3

విజృమ్భమాణే తౌరుష్కదౌరాత్మ్యే, ధర్మవిప్లవే,
మహత్యుపస్థితే, పూర్వం వేదసంరక్షణేచ్ఛుభిః. 4

రాజభిః శ్రోత్రియా నైకే యస్యాముపనివేశితాః,
పుపుషుర్వైదికం ధర్మం యజనాదిపరాశ్చిరమ్. 5

గోదావర్యుపనద్యాశ్చ కౌశిక్యాః పావనే తటే,
సోమేశ్వరజటాగ్రేన్దుసుధాధారాభిరాప్లుతః. 6

పురా గృహే గృహే వేదపాఠఘోషానునాదితః,
"ఇన్దుపల్లి"రితి ఖ్యాతః గ్రామో ఽస్తీన్దుఫలీ మహాన్. 7

తైత్తిరీయయజుఃశాఖాధ్యేతౄణాం వృత్తశోభినామ్,
శ్రితాపస్తమ్బసూత్రాణాం కుణ్డినానాం చ గోత్రతః. 8

జనుఃకృతిపవిత్రాణాం పాత్రాణాం రాజసత్కృతేః,
వంశోఽస్తి పుల్లెలోపాహ్వావిదుషాం పాపవిద్విషామ్. 9

తత్రాసీద్రామచన్ద్రాఖ్యో వేదశాస్త్రాబ్ధిపారగః,
లేభే యః పాణ్డితీహ్యష్టాత్ పెద్దాపురనరేన్ద్రతః. 10

'జమీందారీం' 'మహారాజశ్రీ' త్యాదిబిరుదాఙ్కితామ్,
విశాలాం కౌశికీతీరే భువం సుక్షేత్రమణ్డితామ్. 11

వంశేఽస్య వీరభద్రావధాన్యభూద్ఘనపారగః,
బృన్దాన్ విద్యార్థినామష్టాదశ యోఽధ్యాపయత్సుధీః. 12

వేదం ఘనాన్తమప్యష్టాదశవారం నిజే గృహే,
అశనావాసవసనైః పుత్రవత్పరిపాలయన్. 13

తస్యాసీత్తనయః సూర్యనారాయణసుధీర్యమీ,
అధీతవేదో జనకాత్ స్వధర్మైకపరాయణః. 14

నృసింహశాస్త్రీ తస్యాసీజ్జ్యేష్ఠోఽధీతశ్రుతిః సుతః,
సత్యనారాయణః శాస్త్రీ యవీయాంస్తనయోఽభవత్. 15

యః శబ్దశాస్త్రే వేదాన్తే నిష్ణాతో జ్యోతిషే తథా,
శ్రీరామచన్ద్రపాదాబ్జచఞ్చరీకన్మనా మునిః. 16

ధర్మమార్గైకనిరతః సర్వలోకహితేచ్ఛుకః,
సదాచారో యథాలాభపరితుష్టస్తపోధనః. 17

పూతో రామాయణానేకవారపారాయణక్రమైః,
శ్రీరామానుగ్రహసంక్రాన్తిసంరక్షితనిజాశ్రితః. 18

యస్యార్ధాఙ్గీ సత్యమామ్బా వేదసంమితభర్తృవాక్,
గౌరీలోకమగాత్పుణ్యం విశ్రాన్తా యస్య హస్తయోః. 19

శ్రీసత్యనారాయణస్య తస్య సన్తి మనీషిణః,
పుత్రౌ శ్రీరామచన్ద్రశ్చ శ్రీకృష్ణః సద్గుణాకరః. 20

సూర్యకాన్తా చ లక్ష్మీకాన్తాభిధా శేషమామ్బికా,
అన్నపూర్ణేతి పుత్ర్యశ్చ చతస్రో ధర్మతత్పరాః. 21

స త్యక్త్వేన్దుఫలీగ్రామం త్రింశేఽబ్దే వయసః సుధీః,
ఐనవల్ల్యాఖ్యసద్గ్రామే న్యవసత్సకుటుమ్బకః. 22

విరాజతే జగత్త్రాతా యత్ర సిద్ధివినాయకః,
స్మృతిమాత్రేణ భక్తేభ్యః కార్యసిద్ధిప్రదాయకః. 23

శ్రీరామచన్ద్రనామాసౌ పితృభ్యాం ప్రేమలాలితః,
బాల్యే పితుస్తతః సుబ్బరాయశాస్త్రిమహాబుధాత్. 24

కొంపెల్లోపాహ్వయాల్లబ్ధ్వా శబ్దశాస్త్రాదికం తతః,
సంస్కృతోచ్చకలాశాలాం ప్రాప్య మద్రపురీగతామ్. 25

మాన్యానాం శ్రీరామచన్ద్రదీక్షితానాం, చ పోలగమ్
రామశాస్త్రిబుధేన్ద్రాణాం, కృష్ణమూర్త్యర్యశాస్త్రిణామ్. 26

శ్రీమల్లక్ష్మణశాస్త్ర్యాఖ్యబుధేన్ద్రాణామనుగ్రహాత్,
గన్ధం కించిదివాఘ్రాసీద్వేదాన్తాదేర్మనోహరమ్. 27

సంస్కృతేఽలభతోపాధిం స "వేదాన్తశిరోమణిమ్",
"విద్వాన్" ఇత్యాన్ధ్రభాషాయాం "యం ఏ" డిగ్రీశ్చ సంస్కృతే,

హిన్ద్యాం, తథాంగ్లభాషాయాం ప్రాప్యాథార్యేన్ద్రశర్మణామ్,
ప్రసాదేనోస్మానియాతః ప్రాప్నోత్ "పీహెచ్డీ"మపి. 29

కాశ్యామధీతశాస్త్రస్య శబ్దశాస్త్రే పితుర్గురోః,
ఉపాయంస్త సుతాం మంగిపూడి వేంకటశాస్త్రిణః. 30

దారాశ్చేమే గుణోదారాః సుబ్బలక్ష్మిర్వినీతధీః,
జ్యాయసీ తనయా సత్యా శారదా చ కనీయసీ. 31

సత్యానారాయణః శాస్త్రీ సుతోఽపత్యేషు మధ్యమః,
సర్వే సౌహార్దభరితాః వర్ధయన్తి సదా ముదమ్. 32

ఆదౌ చ పాఠశాలాయామున్నతాయాం మలిక్పురే,
అభూదధ్యాపకో వర్షత్రితయం సంస్కృతస్య సః. 33

తతోఽమలాపురకలాశాలాయాం నవ వత్సరాన్,
తతశ్చోస్మానియావిశ్వవిద్యాలయనియోగగః. 34

పఞ్చ వర్షాణ్యేకశిలాపుర్యామధ్యాపయత్తతః,
హైదరాబాదనగరం ప్రాప్య చాచార్యతాదిభాక్. 35

చిరముస్మానియావిశ్వవిద్యాలయమసేవత,
పాఠనైర్గ్రన్థరచనైర్గ్రన్థసంపాదనాదిభిః. 36

మధ్యే చ పఞ్చషాన్మాసాన్ ప్రాప్నోదాచార్యతాపదమ్,
విశ్వవిద్యాలయే శ్రీమద్వేఙ్కటేశ్వరసంనిధౌ. 37

సేవావృత్తేశ్చ విశ్రాన్తః సోఽద్యాధ్యేతి యథారుచి,
తాంస్తాన్ గ్రన్థాన్ సదా రామపాదామ్బుజనివిష్టధీః. 38

"పాణ్డితీం సంస్కృతే శాస్త్రవైశారద్యం"ప్రశంసతా,
సంమానితోఽభవద్రాష్ట్రపతినా భారతస్య సః. 39

"ఆన్ధ్రప్రదేశసాహిత్యాకాడమ్యా"మానితోఽభవత్,
వైకాలంకారశాస్త్రాన్ధ్రగ్రన్థానాలక్ష్య నిర్మితాన్. 40

అమానయచ్చ తెలుగువిశ్వవిద్యాలయోఽపి తమ్,
గైర్వాణవాణీసాహిత్యపాణ్డిత్యాదిప్రశంసకః. 41

"గీతాఞ్జలి"ర్నాటకం చ తత్ "సుసంహతభారతమ్,"
తస్యోత్తరప్రదేశస్థసర్వకారపురస్కృతే. 42

రసగఙ్గాధరామర్శో గ్రన్థోఽప్యాఙ్గ్ల్యాం వినిర్మితః,
భారతప్రాచ్యపరిషత్పురస్కారేణ సత్కృతః. 43

లక్షరూప్యాత్మికాం "విశ్వభారతీ"తి పురస్కృతిమ్,
ప్రాప్నోదుదక్ప్రదేశస్థాత్ సంస్థానాత్ సంస్కృతస్య సః. 44

గుర్వనుగ్రహతోఽగ్రథ్నాద్ గ్రన్థానాం పఞ్చసప్తతిమ్,
నిబన్ధాన్ శతశశ్చాపి న్యబధ్నాద్వివదాదృతాన్. 45

సోఽహం శ్రీరామచన్ద్రాఖ్యః శ్రీరామానుగ్రహభాజనమ్,
న్యబధ్నాం రామచన్ద్రిం తం విశ్వవ్యాప్తం ప్రభుం హృది. 46

స ఏవ రామో విశ్వాత్మా విలేఖయతి సర్వదా,
కరణేన మయా సర్వం నాస్తి మే కాపి కర్తృతా. 47

శ్రీమత్పమిడిఘణ్టాన్వవాయక్షీరాబ్ధిచన్ద్రమాః,
అస్తి కోదణ్డరామయ్యసుధీర్ధర్మనివిష్టధీః. 48

భద్రాచలేఽమ్యాసత్రం సంస్థాప్య యత్పూర్వజైర్మహీ,
అనేక 'యాకర్' ప్రమితా రామసేవార్థమర్పితా. 49

యోఽవలమ్బ్య చిరం న్యాయవాదితాం ధర్మసంమతామ్,
న్యాయాధీశపదం ప్రాపోచ్చన్యాయాలయే శుచిః. 50

రామభక్తాగ్రణీర్నిత్యం సముపాసితసజ్జనః,
కాలం నయతి సద్గ్రన్థపఠనైర్ధర్మచిన్తనైః. 51

శ్రీమత్కోదణ్డరామయ్యసుధియా తేన చోదితః,
రామాయణస్య వ్యదధాం వ్యాఖ్యామాన్ధ్రీం యథామతి. 52

శ్రీమద్రామాయణస్యేయం పాఠమాదృత్య దాక్షిణమ్,
వ్యాఖ్యా వినిర్మితా భూయాద్భూయస్యై సహృదాం ముదే. 53

అహం యదల్పప్రజ్ఞోఽపి నిర్విఘ్నం తామపూరయమ్,
తత్ర కోదణ్డరామయ్యసత్సంకల్పః పరం బలమ్. 54

స్పష్టార్థా మధురా దివ్యా శ్రీరామచరితాశ్రితా,
లోకోత్తరమహానన్దభూమిరాదికవేః కృతిః. 55

అనాస్వాద్య యథావత్తామారోప్యార్థాన్ స్వకల్పితాన్,
కేచిత్ప్రఖ్యాపయన్త్యేనాం రహస్యార్థౌఘగర్భితామ్. 56

అద్వైతిభిర్ద్వైతిభిశ్చ విశిష్టాద్వైతిభిస్తథా,
శైవైః శాక్తైర్యోగిభిశ్చ కల్ప్యన్తేఽర్థాః స్వసంమతాః. 57

సన్తి ప్రామాణికా గ్రన్థాస్తత్తదాచార్యనిర్మితాః,
పఠన్తు పాఠయన్త్వేతాన్ కిం తదర్థోఽత్ర రోప్యతే. 58

ఈక్షన్తే ప్రతిసాహస్రం గాయత్ర్యక్షరమాదితః,
దర్శయన్తోఽక్షరం వా తత్ఖణ్డం వా తత్ర కేచన. 59

సుస్పష్టమర్థం సంత్యజ్య వ్యాఖ్యాతారశ్చ కేచన,
విపరీతాన్ బహూనర్థాన్ కల్పయన్తి స్వమేధయా. 60

"శ్లోకో విరచితో ఽర్థోఽస్మిన్ నిక్షేప్తవ్య"ఇతీరితమ్,
ప్రసిద్ధం తద్వదేవేదం నానార్థపరికల్పనమ్. 61

వ్యాఖ్యాయామస్మదీయాయామీదృగర్థగవేషిణః,
నిరాశాః సర్వ ఏవ స్యుః క్షన్తవ్యాస్తైర్వయం జనైః. 62

యుద్ధకాణ్డాన్తమేవ స్యాద్రామాయణమియం కృతిః,
వాల్మీకేః, రుత్తరం కాణ్డం నేతి నిశ్చినుమో వయమ్. 63

గతాః సర్వేఽభిషేకాన్తే వానరాద్యా గృహానితి,
వర్ణితం యుద్ధకాణ్డాన్తే ఫలశ్రుతిరపీరితా. 64

పునః కుతో వా సంప్రాప్తా వానరా రాక్షసాశ్చ తే,
అయోధ్యాం, పునరేతేషాం కథం ప్రతినివర్తనమ్. 65

అగస్త్యో మునిభిః సార్ధమయోధ్యామగమత్కిల,
కుతో విన్ధ్యాచలో నోదతస్థౌ తం సమయం స్మరన్. 66

"పౌలస్త్యవధ" మిత్యన్యన్నామాస్యాః ప్రథితం కృతేః,
"పౌలస్త్యచరితం" హి స్యాదుత్తరే కాణ్డ ఆదృతే. 67

లోకోత్తరా హ్యేషా వాల్మీకేర్వర్ణనానైపుణీ పరా,
రీతిశ్చ మధురా రమ్యా న్యృగ్యే హ్యుత్తరకాణ్డకే, 68

శుశోచ యాం హృతాం రామో వనే సీతాం తథా తదా,
కుతో నాతిశుశోచైనాం త్యక్త్వాప్యనపరాధినీమ్. 69

స్యాన్నామ వృత్తిః శూద్రస్య త్రైవర్ణ్యజనసంశ్రయః,
త్యక్త్వైతాం చేత్తపః కుర్యాత్కో వా దోషోఽత్ర చిన్త్యతామ్. 70

పాపత్వేఽప్యస్య రాజా వా తద్భృత్యుర్వాస్తు దుఃఖభాక్,
పాపేనాన్యకృతేన స్యాత్కథం విప్రసుతక్షయః. 71

నైవ త్రైవర్ణికాసేవా పాపహేతుర్యతో గుహః,
మిత్రం రామస్య రాజాసీన్న తు త్రైవర్ణ్యసేవకః. 72

గృధ్రోలూకయతిశ్వానాద్యుపాఖ్యానాదికం యథా,
భుసుణ్డ్యానన్దరామాయణాదిగాశ్చ యథా కథాః. 73

తథా శమ్బూకవృత్తాన్తః కల్పితో నాత్ర సంశయః,
గుహమిత్రం కథం రామో హన్యాచ్ఛూద్రం నిరాగసమ్. 74

సుతౌ కుశలవౌ జ్ఞాత్వా రామస్తాభ్యాం తతోఽశృణోత్,
భావిస్వదేహత్యాగాదీత్యేతన్నైవోపపద్యతే. 75

మహాభారతగే రామోపాఖ్యానే నైవ దృశ్యతే,
కథోత్తరస్య కాణ్డస్య, పురాణేషు తు కేషుచిత్. 76

విష్ణుధర్మోత్తరాద్యేషు దృశ్యతే చ యథాతథమ్,
పౌలస్త్యచరితాదీతి తతః సంగృహ్య కేనచిత్. 77

దృబ్ధం రామాయణస్యాన్తే బహోః కాలాత్పురైవ తత్,
భాసాదర్వాక్కాలిదాసాత్పూర్వమేవాత ఏవ హి. 78

న కించిన్నిరమాద్భాసో రూపకం తేన వస్తునా,
కథం జహ్యాత్కథామేతాం స శోకేన పరిప్లుతామ్. 79

ఏతైస్తైర్హేతుభిరన్యైశ్చ నైవ వాల్మీకికర్తృకమ్,
ఉత్తరం కాణ్డమిత్యేవ ధృఢం విశ్వసిమో వయమ్. 80

తథాప్యస్యాపి కాణ్డస్య వ్యాఖ్యాస్మాభిర్వినిర్మితా,
శ్రద్ధాలవోఽత్ర కతిచిద్భవేయురితి చిన్తయా. 81

శ్రీరామానుగ్రహాత్ పిత్రోరాశిషా గుర్వనుగ్రహాత్,
శ్రీమత్కోదణ్డరామయ్యసత్సంకల్పబలాత్తథా. 82

వ్యాఖ్యాం సమాపితామేతాం జగజ్జన్మాదిహేతవే,
సర్వదేవాధిదేవాయ బ్రహ్మవిష్ణుశివాత్మనే. 83

శక్తిసన్దోహరూపాయ సర్వసద్గుణశాలినే,
భక్తరక్షదీక్షాయ శ్రీరామాయార్పయామ్యహమ్. 84

శ్రీమద్రామాయణవ్యాఖ్యాం విరచ్యాఖిలసుగ్రహామ్,
యత్పుణ్యమాప్నవం తేన ప్రీయతాం పరమేశ్వరః. 85

శ్రీః శ్రీః శ్రీః

T. R. కృష్ణాచార్య సంపాదకులుగా, T. R. వెంకోబాచార్య ప్రకాశకులుగా, 1930 లో మద్రాసు హిందీ ప్రచార ప్రెస్సుచే ముద్రించబడిన శ్రీమద్రామాయణంలో ఈ శ్లోకం కనిపిస్తున్నది.

మిత్రాణి ధనధాన్యాని ప్రజానాం సమ్మతాని హ,
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ.

*యుద్ధ.124 - 17.*

# మన దేశంలో వివిధభాషల్లో వెలువడిన కొన్ని రామాయణాలు

## తెలుగు భాషలో

1. రంగనాథరామాయణం - గోన బుద్ధారెడ్డి
2. భాస్కరరామాయణం - హుళక్కి భాస్కరుడు
3. అనర్ఘరాఘవం - మురారి
4. ప్రసన్నరాఘవం - జయదేవుడు
5. మొల్లరామాయణం - మొల్ల
6. అచ్చతెనుగు రామాయణం - కూచిమంచి తిమ్మన
7. వరదరాజ రామాయణం - కట్టా వరదరాజన్
8. కృష్ణరామాయణం - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
9. ధర్మసారరామాయణం - జనమంచి శేషాద్రిశర్మ
10. ఆంధ్ర శ్రీమద్రామాయణం - జనమంచి శేషాద్రిశర్మ
11. మానికొండ రామాయణం - మానికొండ సత్యనారాయణశాస్త్రి
12. గోపీనాథరామాయణం - గోపీనాథము వేంకటకవి
13. రామాభ్యుదయం - అయ్యలరాజు రామభద్రుడు
14. గోవిందరామాయణం - ఆత్మకూరు గోవిందాచార్యులు
15. జగన్నాథరామాయణం - తంగిరాల జగన్నాథశాస్త్రి
16. ఆనందరామాయణం - గుండు లక్ష్మణకవి (పద్యాలు)
17. ఆనందరామాయణం - నూతలపాటి పేరాజు
18. మాలికారామాయణం - ఆకుండి వెంకటశాస్త్రి మొ. ఆర్గురు
19. అధ్యాత్మరామాయణం - కంచర్ల శరభకవి
20. అధ్యాత్మరామాయణం - పురాణపండ రామమూర్తి
21. అధ్యాత్మరామాయణం - మునిపల్లి సుబ్రహ్మణ్యకవి
22. అధ్యాత్మరామాయణం - కాణాదము పెద్దన సోమయాజి
23. అధ్యాత్మరామాయణం - బులుసు వేంకటేశ్వర్లు
24. అధ్యాత్మరామాయణం - శ్రీమతి మామిడమ్మ సుభద్రాంబ
25. నిర్వచనోత్తరరామాయణం - తిక్కన సోమయాజి
26. ఉత్తరరామాయణం - పెన్మత్స సత్యనారాయణరాజు
27. ఉత్తరరామాయణం - కంకంటి పాపరాజు

28. శ్రీమద్రామాయణం - వావిలకొలను సుబ్బారావు (వాసుదాసు)
29. ఉత్తరరామాయణం (విమర్శ) - యం. పాండురంగారావు
30. రఘునాథ రామాయణం (బాలకాండ)
31. సుభద్రారామాయణం - శ్రీమతి సిరము సుభద్రాంబ
32. సరస్వతీరామాయణం - శ్రీమతి చేబ్రోలు సరస్వతి
33. యోగానందరామాయణం - చిల్లరిగె యోగానందయ్య
34. రామకథారసవాహిని - భగవాన్ సత్యసాయిబాబా
35. ఆత్మారామం - భగవాన్ సత్యసాయిబాబా
36. రామాయణకల్పవృక్షం - విశ్వనాథ సత్యనారాయణ
37. యథాశ్లోక తాత్పర్య రామాయణం - గద్వాల సంస్థాన కవులు
38. రామోదయం - రంగయకవి (చిన్నయసూరి సమకాలికుడు)
39. దాశరథీవిలాసం - క్రొత్తపల్లి వేంకటప్పయ్యశాస్త్రి
40. శ్రీరామకథామృతం - తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి
41. ఆంజనేయరామాయణం - ధర్మవరం సీతారామాంజనేయులు
42. హనుమద్రామాయణం - కొండేపూడి సూర్యనారాయణ
43. ఆత్మరామాయణం - టి. గురుమూర్తి
44. రామాయణపరమార్థం - డా.॥ ఇలపావులూరి పాండురంగారావు
45. అంతరార్థ రామాయణం - వేదుల సూర్యనారాయణశర్మ
46. బౌద్ధరామాయణం - జాతకకథల్లో భాగంగా
47. జైనరామాయణం - పేరు లేదు.
48. శ్రీమద్రామాయణవైభవం - డా. మల్లాది గోపాలకృష్ణశర్మ
49. రామాయణసుధాలహరి - కల్లూరి చంద్రమౌళి
50. జనప్రియరామాయణం - పుట్టపర్తి నారాయణాచార్యులు
51. శ్రీమద్రామాయణం - గడియారం వెంకటశాస్త్రి
52. ధనకుధర రామాయణం - ధనకుధరం వేంకటాచార్యులు
53. లత రామాయణం - శ్రీమతి తెన్నేటి హేమలత
54. కంబరామాయణం - పూతలపట్టు శ్రీరాములు రెడ్డి
55. శ్రీమద్రామాయణం - (బాలకాండ) కోపల్లె శివకామేశ్వరరావు
56. రామాయణ గాథ (జైమిని భారతంలో) - పిల్లలమర్రి పినవీరభద్రుడు
57. శ్రీకల్పవల్లికా - సంస్కృతవ్యాఖ్య - బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి
58. తులసీరామాయణం - భాగవతుల నరసింహశర్మ (పద్యకావ్యం)
59. తులసీరామాయణం - మైలవరపు సూర్యనారాయణమూర్తి పద్యకావ్యం
60. తులసీరామాయణం - శ్రీనివాసశర్మ (గద్యకావ్యం)
61. తులసీరామాయణం - శ్రీమతి నేలనూతల పార్వతీకృష్ణమూర్తి (గద్యం)

62. తులసీరామాయణం - శ్రీమతి ఏలూరిపాటి సరస్వతి, గద్యకావ్యం
63. తులసీరామాయణం - కేశవతీర్థస్వామి (ద్విపద)
64. తులసీరామాయణం - పాటీలు తిమ్మారెడ్డి (టి.టి.డి. ప్రచురణ)
66. తులసీరామాయణం - (మురారిబాబుగారివి తెలుగులో ప్రసంగాలు)
-- రాగం ఆంజనేయులు
67. తులసీరామాయణం - యథాతథ అనువాదం (ముద్రణలో)
-- చందూరి వేంకట సుబ్రహ్మణ్యం
68. శ్రీమద్రామాయణం - (వచనం) వావిళ్ల రామస్వామిశాస్త్రి
69. శ్రీమద్రామాయణం - (వచనం) ఉషశ్రీ
70. శ్రీమద్రామాయణం - (వచనం) శ్రీనివాస శిరోమణి
71. శ్రీమద్రామాయణం - (వచనం) సరస్వతుల సుబ్బరామశాస్త్రి
72. శ్రీమద్రామాయణం - (వచనం) నోరి గురులింగశాస్త్రి
73. శ్రీమద్రామాయణం - (వచనం) దొడ్డా వెంకటరామిరెడ్డి
74. శ్రీమద్రామాయణం - (వచనం) దేవరాజ సుధీమణి
75. శ్రీమద్రామాయణం - (వచనం) మోడేపర్తి గున్నయ్య
76. శ్రీమదాంధ్ర సద్గురు రామాయణం - (అధ్యాత్మం)
గోనెల సన్యాసిరావు
77. శ్రీమద్రామాయణం - ఎర్రాప్రెగ్గడ
78. శ్రీరామావతారరహస్యం - మర్రిబోయిన రామసుబ్బయ్య
79. శ్రీవాల్మీకి రామాయణం - వ్యాఖ్య బాల, యుద్ధకాండలు
-- చందూరి వేంకట సుబ్రహ్మణ్యం
80. శ్రీమద్రామాయణం - చాడ గోపాలకృష్ణ
81. శ్రీసీతాకల్యాణం - చాడ గోపాలకృష్ణ
82. శ్రీమదక్షరరామాయణం - చాడ గోపాలకృష్ణ
83. సుందరకాండ - దేవరకొండ వీరవెంకటరావు

## జానపద రామాయణాలు

84. ధర్మపురి రామాయణం
85. మోక్షగుండ రామాయణం
86. కూచకొండ రామాయణం
87. గుత్తెనదీవి రామాయణం
88. శారద రామాయణం
89. సంక్షేపరామాయణం
90. రామకథాసుధార్ణవము
92. సూక్ష్మరామాయణం
93. అధ్యాత్మరామాయణం
94. లంకాసారథి
95. చిట్టిరామాయణం
96. శ్రీరామదండములు
97. శ్రీరామజావళీలు
98. రామాయణగొబ్బిపాటలు

99. శాంతగోవిందనామాలు
100. అడవిగోవిందనామాలు
101. సేతుగోవిందనామాలు
102. పెండ్లి గోవిందనామాలు
103. సుందరకాండ పదములు
104. శాంతాకల్యాణం
105. పుత్రకామేష్టి
106. కౌసల్యబైకలు
107. కౌసల్య వేవిళ్లు
108. శ్రీరామజననం
109. శ్రీరామఉగ్గుపాటలు
110. శ్రీరాఘవకల్యాణం
111. శ్రీరాములవారి అలుక
112. ఋష్యాశ్రమాలు
113. సుగ్రీవవిజయం
114. కోవెల రాయబారం
115. అంగదరాయబారం
116. లక్ష్మణమూర్ఛ
117. లంకాయాగము
118. గుహభరతుల అగ్నిప్రవేశం
119. శ్రీరామపట్టాభిషేకము
120. లక్ష్మణదేవరనవ్వు
121. ఊర్మిళనిద్ర
122. కుశలాయకం
123. కుశలవ కుచ్చులచరిత్ర
124. కుచ్చెలకథ
125. కుశలవయుద్ధం
126. పాతాళహోమం
127. శతకంఠ రామాయణం
128. సీతావిజయం

కేవలం సీతమ్మపైనున్న జానపదాలు

129. సీత పుట్టుక
130. సీతాకల్యాణం
131. సీత నత్తవారింటికి పంపుట
132. సీతసమర్త
133. సీత శుభగోష్ఠి
134. సీతగడియ
135. సీత వామనగుంటలు
136. సీతమ్మ అలుక
137. సీత వసంతము
138. సీత దాగిలిమూతలు
139. సీత సురటి
140. సీత మేలుకొలుపు
141. సీత ముద్రికలు
142. సీత చెర
142ఎ. సీతఆనవాలు
143. సీత అగ్నిప్రవేశం
144. సీత వేవిళ్ళు
144ఎ. రామాయణతత్త్వకథనం
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి
145. శ్రీమద్రామాయణం (గేయాలు)
సూరంపూడి రాధాకృష్ణమూర్తి
145ఎ. షోడశి రామాయణం
గుంటూరు శేషేంద్రశర్మ
145బి. రామాయణసారోద్ధారం - ములుకుట్ల నరసింహవధాని పాకయాజి
145సి. అద్భుతరామాయణం
వేదుల వేంకటశాస్త్రి (పద్యకావ్యం)
145డి. శ్రీ సుందరకాండే బ్రహ్మవిద్య
దివాకరుని వెంకట సుబ్బారావు
145ఇ. శ్రీరామచరితామృతం
- శ్రీ ఎక్కిరాల వేదవ్యాస్

## సంస్కృత రామాయణాలు

146. శ్రీమద్రామాయణం
ఆదికవి శ్రీ వాల్మీకి కృతం

147. అధ్యాత్మరామాయణం
(బ్రహ్మాండపురాణాంతర్గతం)

148. రామకథ (ఋగ్వేదాంతర్గతం)
10వ మం.

149. శ్రీరామపూర్వోత్తర
తాపిన్యుపనిషత్

150. శ్రీరామరహస్యోపనిషత్

151. శ్రీ సీతోపనిషత్

152. అనర్ఘరాఘవమ్

153. ఆనందరామాయణం

154. ప్రసన్నరాఘవం

155. భుశుండి రామాయణం

156. యోగవాసిష్ఠం
(వాసిష్ఠరామాయణం)

157. రామాయణ - కథకటీకా
- నాగోజిభట్ట

158. రామాయణ టీకా
శ్రీ గోవిందరాజు

159. కౌశికీ రామాయణం

160. రఘువంశం (కాళిదాసు)

161. రామకథ
(విష్ణుపురాణాంతర్గతం)

162. భృగుసంహిత

163. స్కాందపురాణం

164. ప్రేమరామాయణ్
(తులసీరామాయణం పై
శ్రీరాముద్వివేదిగారు)
సంస్కృతంలో వ్యాఖ్య 16 శతాబ్ది)

165. రామాయణకథ
(విష్ణుపురాణాంతర్గతం)

166. శతకోటి రామాయణ్

167. బౌద్ధరామాయణం

168. గాయత్రీరామాయణం

169. విశిష్ట రామాయణం

170. పూర్వగాథాలహరి

171. హనుమద్రామాయణం

172. అగస్త్యరామాయణం

173. పులస్త్యరామాయణం

174. విశ్వామిత్రరామాయణం

175. జటాయురామాయణం

176. సుతీక్ష్ణరామాయణం

176ఎ. పశ్చిమోత్తరశాఖీయరామాయణం

176బి. వేదధరాతల్ -
పం., శ్రీ గిరీష్‌చంద్ర

177. సుగ్రీవరామాయణం

178. భారద్వాజరామాయణం

179. విభీషణరామాయణం

180. ఆశ్చర్యరామాయణం
(తెలుగు- లక్కావఝల
వెంకటకృష్ణశాస్త్రి)

181. అఖండరామాయణం

శ్రీరామాయ నమః

శ్రీ మద్వాల్మీకి మహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# ఉత్తరకాండము

## (మొదటి సంపుటము)



ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన
బాలానందినీ వ్యాఖ్యతో కూడినది

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు
హైదరాబాదు
1994

ప్రథమ ముద్రణ - భావ విజయదశమి (13-10-'94)

ప్రతులు-2000



ప్రతులకు :

**శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,**
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు-500 034.

**ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు,**
నందనం, 7-1-32/4, ప్లాట్ నం. 2,
బేగంపేట, హైదరాబాదు-500 016.

**మూల్యము రూ. 80-00**

**ముద్రణ :**
**శివాజీ ప్రెస్,**
**గంజ్ బజార్,**
**సికింద్రాబాదు-3**

ప్రథమ ముద్రణ - భావ విజయదశమి (13-10-'94)

ప్రతులు-2000



ప్రతులకు :

**శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,**
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు-500 034.

**ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు,**
నందనం, 7-1-32/4, ప్లాట్ నం. 2,
బేగంపేట, హైదరాబాదు-500 016.

**మూల్యము రూ. 80-00**

ముద్రణ :
**శివాజీ ప్రెస్,**
గంజ్ బజార్,
సికింద్రాబాదు-3.

# ముందుమాట

జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్య
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి
ఆర్ష విజ్ఞాన ట్రస్టు స్థాపకాధ్యక్షులు.

శ్రీరామసదనం
జూబ్లీహిల్సు,
హైదరాబాదు-500 034.

ఈ ఉత్తరకాండ ప్రచురణతో ఆర్ష విజ్ఞాన సంస్థవారు తలపెట్టిన సారస్వత యజ్ఞమున ఒక ముఖ్యమైన ఘట్టము పూర్తి అయినది. రామాయణమునకు సీతా చరితము, పౌలస్త్యవధము అని మరి రెండు పేర్లుకూడ ఉన్నవి. ఈ కాండయందు రావణుని పరాక్రమము, అతడు సాధించిన విజయపరంపరలు సుదీర్ఘంగా వర్ణించ బడినవి.

ఈ కాండ అధ్యయనమువలన రెండు విషయములు స్థూలముగా మన హృదయమున నెలకొనును. అందొకటి రావణుని స్వభావమువల్ల తెలియదగినది-

హనుమంతుడు మొట్టమొదట రావణుని చూడగానే—

"అహో రూప మహో ధైర్యమహో సత్త్వమహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా."

(సుందర. 49-17)

"ఆహా ! ఏమి ఈ రావణుని రూపము ! ఏమి ధైర్యము ! ఏమి బలము ! ఏమి కాంతి ! ఏమి సర్వలక్షణ సంపన్నత్వము ! బలవత్తరమైన అధర్మప్రవర్తన లేనిచో ఇంద్రునితో సహా దేవలోకాని కంతటికి ప్రభువై ఉండేవాడు." అని భావించాడు.

రాముడు కూడా అతనిని మొదట చూచినపుడు—

"అహో ! దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః.
ఆదిత్య ఇవ దుష్ప్రేక్షో రశ్మిభిర్భాతి రావణః."

(యుద్ధ. 59-26)

"అహో! ఈ రాక్షసరాజగు రావణుడు దివ్య తేజముతో వెలుగుచున్న
మహా ప్రతాపుడుగ నున్నాడు. ఆశ్చర్యము! ఇతడు తేజమున సూర్యునివలె
శక్యముకాక వెలుగుచున్నాడు."

చివరిసారి రావణుడు సర్వసన్నద్ధుడై వచ్చినపుడు ఇతనిని జయించగ
అని రాముడు చింతించగా అగస్త్యుడు వచ్చి ఆదిత్య హృదయము ఉపదేశిం

విభీషణుడు కూడా రావణవధను పురస్కరించుకొని-

గతః సేతుః సునీతానాం గతో ధర్మస్య విగ్రహః,
గతః సత్త్వస్య సంక్షేపః ప్రస్తావానాం గతి ర్గతా.

యుద్ధ. 112-6

'సమస్త నీతులు తెలిసినవాడు నశించెను. ధర్మము యొక్క ఆకారమే
దగినవాడు నశించెను. సమస్తలోకములందు అందరికన్న బలవంతు డన
వాడు మృతినొందెను. అందరికిని స్తోత్రపాత్రమైనవాడు పడిపోయెను.'
అనెను.

ఈ సీతాపహరణ మహాపాపకార్యమువల్ల ఇతని కీ దుర్గతి పట్టెను. అ
భార్య మందోదరి తీవ్రముగా విలపించెను. 'నీవు ఇంద్రియములను జయి
ముల్లోకములు జయించితివి. ఇపుడు ఇంద్రియములకు లోబడుటచే హతుడ
వని చింతించెను. పరస్త్రీయైన సీతవిషయమున మోహము పొందితివి. నీచ
స్త్రీచౌర్యము చేసితివి. అదే నీ ఈ గతికి కారణమని విలపించెను.

శ్రీరాముడు లంకపై దండెత్తి వచ్చినపుడు రాముని తల కల్పించి, దా
ధనుఃసహితముగా విద్యుజ్జిహ్వునిచే తెప్పించి, రాముడు మరణించెనని ఘోర
అసత్యముపలికి సీతను వశపరచుకొన చూచెను. రావణుడు వేదాధ్యయనమున
గొప్ప నిష్ణాతుడు. అతని పాత్రకమము ఈనాటికి దేశమున అనుసరింత
ధర్మము, సత్యము ఉల్లంఘించిన వారికి వేదాధ్యయనము నిష్ప్రయోజన
కావున ఈ కాండ అధ్యయనము వలన రామునివలె ప్రవర్తించవలెను కాని రావ
వలె కాదని రూఢిగా తెలియును.

శ్రీరాముడు ఆదర్శపురుషుడే కాక ఆదర్శపరిపాలకుడుగా కూడ ఈ వ
కావ్యమున రూపొందెను. ఈ రాజధర్మము సామాన్య మానవధర్మమునకు పైస్థా

సమకూర్చిన ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తాము కృతకృత్యు
సంస్థ సభ్యులను ధన్యజీవులను చేసిరి. ఆయన దీర్ఘతరమైన తన శ్రమకు ఆ
ఏ విధమైన ప్రతిఫలమును అంగీకరింపని సౌజన్యశీలుడు. గ్రంథము
ఆయన రచించిన—

'దేవతానుగ్రహః పిత్రోస్తప శ్చాచార్యసత్కృపా,
కర్తాస్మద్గ్రంథజాతస్య కరణం కేవలం వయమ్."

తను రచించిన కృతులకుదేవతానుగ్రహము, మాతృ-పితృపాదుల త
ఆచార్యుల కృపా కారణమని, తాను కేవలము ఉపకరణమని తెలిపిన వారి వా
వారికి ఆర్షసంప్రదాయమునందు కల విశ్వాసమును వేనోళ్ళ చాటుచున్నది.
త్పరుడు వీరికి సర్వశ్రేయస్సులు సమకూర్చుగాక.

ఈ గ్రంథరాజముల ముద్రణమునకు సహాయపడిన వదాన్యులందరి
ఆర్ష విజ్ఞాన సంస్థ పక్షమున కృతజ్ఞతా పూర్వక వందనములు.

భావ విజయదశమీ — పమిడిఘంటం కోదండరావ

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

## బాలానందినీసహితమగు

# శ్రీమద్రామాయణము - ఉత్తరకాండము

(మొదటి సంపుటము)

## ప్రథమః సర్గః

*[రాముని సభకు మహర్షులు వచ్చుట, వారితో రాముడు సంభాషించుచు వారిని కొన్ని విషయములు అడుగుట.]*

మూ. ప్రాప్తరాజ్యస్య రామస్య రాక్షసానాం వధే కృతే,
ఆజగ్ముర్మునయః సర్వే రాఘవం ప్రతినన్దితుమ్. 1

కౌశికోఽథ యవక్రీతో గార్గ్యో గాలవ ఏవ చ,
కణ్వో మేధాతిథేః పుత్రః పూర్వస్యాం దిశి యే శ్రితాః. 2

ప్ర. అ. రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వధే = వధ, కృతే = చేయబడినదగుచుండగా, రామస్య = రాముడు, ప్రాప్తరాజ్యస్య = పొందబడిన రాజ్యము కలవాడగుచుండగా, రాఘవమ్ = రాముణ్ణి, ప్రతినన్దితుమ్ = అభినందించుటకు, సర్వే = సమస్తమైన, మునయః = మునులు, ఆజగ్ముః = వచ్చిరి. పూర్వస్యామ్ = తూర్పు, దిశి = దిక్కునందు, యే = ఎవరు, శ్రితాః = ఆశ్రయించి ఉన్నారో, అట్టి, కౌశికః = కౌశికుడు, అథ = మరియు, యవక్రీతః = యవక్రీతుడు, గార్గ్యః = గార్గ్యుడు, గాలవ ఏవ చ = గాలవుడు, మేధాతిథేః = మేధాతిథియొక్క, పుత్రః = పుత్రుడైన, కణ్వః = కణ్వుడు, (ఆజగ్ముః = వచ్చిరి).

తా. రాక్షసులను సంహరించిన పిమ్మట రాముడు రాజ్యమును ? యుండగా ఆతనిని అభినందించుటకై మును లందరూ వచ్చిరి. తూర్పుది నందు నివసించుచున్న కౌశికుడు, యవక్రీతుడు, గార్గ్యుడు, గాలవుడు, మేధ పుత్రుడైన కణ్వుడు ఆ ప్రాంతమునుండి వచ్చిరి.

మూ. అథాత్రేయశ్చ భగవాన్నముచిః ప్రముచిస్తథా,
అగస్త్యోత్రిశ్చ భగవాన్సుముఖో విముఖస్తథా,
ఆజగ్ముస్తే సహాగస్త్యా యే శ్రితా దక్షిణాం దిశమ్.

ప్ర. అ. అథ=పిమ్మట, యే=ఎవరు, దక్షిణాం దిశమ్=దక్షిణదిక్కు శ్రితాః=ఆశ్రయించినారో, తే=అట్టి, ఆత్రేయశ్చ=ఆత్రేయుడు, భగవా పూజ్యుడైన, నముచిః=నముచి, తథా=మరియు, ప్రముచిః=ప్రముచి, తథ మరియు, అగస్త్యః=అగస్త్యుడు, అత్రిశ్చ=అత్రి, భగవాన్=పూజ్యు సుముఖః=సుముఖుడు, తథా=మరియు, విముఖః=విముఖుడు, సహాగ =అగస్త్యసహితులై, ఆజగ్ముః=వచ్చిరి.

తా. దక్షిణదిక్కునందు నివసించు ఆత్రేయుడు, నముచి, ప్రమ అగస్త్యుడు, అత్రి, సుముఖుడు, విముఖుడు అగస్త్యుణ్ణి ముందు ఉంచుకొని వచ్చి

మూ. నృషఙ్గః కవషీ ధౌమ్యః కౌషేయశ్చ మహానృషిః,
తేఽప్యాజగ్ముః సశిష్యా వై యే శ్రితాః పశ్చిమాం దిశ

ప్ర. అ. నృషఙ్గః=నృషంగుడు, కవషీ=కవషి, ధౌమ్యః=ధౌమ్యు కౌషేయశ్చ=కౌషేయుడను, మహాన్=గొప్ప, ఋషిః=ఋషి, యే=ఏ మును పశ్చిమాం దిశమ్=పశ్చిమదిక్కును, శ్రితాః=ఆశ్రయించినారో, తేఽపి=వ కూడా, సశిష్యాః=శిష్యసహితులై, ఆజగ్ముః=వచ్చిరి.

తా. పశ్చిమదిక్కునందు నివసించు నృషంగుడు, కవషి, ధౌమ్యు కౌషేయు డను మహర్షి-పశ్చిమదిక్కునందు నివసించు ఈ ఋషులు కూడ శి లతో కలసి వచ్చిరి.

మూ. వసిష్ఠః కశ్యపోఽథాత్రిర్విశ్వామిత్రః సగౌతమః,
జమదగ్నిర్భరద్వాజస్తేఽపి సప్తర్షయస్తథా,
ఉదీచ్యాం దిశి సప్తైతే నిత్యమేవ నివాసినః.

అగస్త్యః = అగస్త్యుడు, ద్వాఃస్థమ్ = ద్వారపాలకుని గూర్చి, ప్రోవాచ = పలికెను ఋషీన్ = ఋషులమైన, అస్మాన్ = మమ్ములను, ఉపాగతాన్ = వచ్చినవారినిగా దాశరథేః = రామునకు, నివేద్యతామ్ = తెలుపబడుగాక.

తా. ధర్మాత్ముడైన అగస్త్యమహాముని ద్వారపాలకునితో- "ఋషులమై మేము వచ్చినట్లు రామునకు చెప్పుము" అని పలికెను.

మూ. ప్రతీహార స్తతస్తూర్ణమగస్త్యవచనాద్ద్రుతమ్,
సమీపం రాఘవస్యాశు ప్రవివేశ మహాత్మనః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రతీహారః = ద్వారపాలకుడు, అగస్త్య వచనాత్ = అగస్త్యుని మాటవలన, తూర్ణమ్ = శీఘ్రముగా, మహాత్మనః = మహాత్ము డైన, రాఘవస్య = రామునియొక్క, సమీపమ్ = సమీపమును, ద్రుతమ్ = పరుగెత్తు చున్నట్లుగా, ఆశు = శీఘ్రముగా, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట ఆ ద్వారపాలకుడు అగస్త్యుని మాట విని, శీఘ్రముగా పరుగెత్తుచున్నట్లుగా, వెంటనే, మహాత్ముడైన రాముని సమీపమునకు వెళ్లెను.

మూ. నయేఙ్గితజ్ఞః సద్వృత్తో దక్షో ధైర్యసమన్వితః, 10
స రామం వీక్ష్య సహసా పూర్ణచన్ద్రసమద్యుతిమ్,
అగస్త్యం కథయామాస సంప్రాప్తమృషిసత్తమమ్. 11

ప్ర. అ. నయేఙ్గితజ్ఞః = నీతిని, మనోభావములను ఎరిగినవాడు, సద్వృత్తః = మంచి నడవడిక గలవాడు, దక్షః = సమర్థుడు, ధైర్యసమన్వితః = ధైర్యముతో కూడినవాడు అయిన, సః = ద్వారపాలకుడు, పూర్ణచన్ద్రసమద్యుతిమ్ = పూర్ణ చంద్రునితో సమానమైన కాంతి గల, రామమ్ = రాముణ్ణి, సహసా = శీఘ్రముగా వీక్ష్య = చూచి, ఋషిసత్తమమ్ = ఋషిశ్రేష్ఠుడైన, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి సంప్రాప్తమ్ = వచ్చినవానినిగా, కథయామాస = చెప్పెను.

తా. నీతిని, ఇతరుల మనోభావమును ఎరిగినవాడు, మంచి నడవడిక కల వాడు, సమర్థుడు, ధైర్యవంతుడు అయిన ఆ ద్వారపాలకుడు చంద్రునితో సమాన మైన కాంతి గల ఆ రాముణ్ణి చూచి అగస్త్యమహాముని వచ్చినట్లు చెప్పెను. 10,1

మృగచర్మయుతేషు చ = కృష్ణాజినములతో కూడిన, తేషు = ఆ, ఆసనేషు = ఆస
ములయందు, తే = ఆ, ఋషిపుఙ్గవాః = ఋషిశ్రేష్ఠులు, యథార్హమ్ = త
విధముగా, ఉపవిష్టాః = కూర్చున్నారు.

తా. రాముడు నమస్కరించి, నియమవంతుడై వారికి ఆసనములన
చూపెను. ఆ ఋషిపుంగవులు బంగారముచేత చిత్రములైన, అడుగున కుశల
పరచిన, మృగచర్మముతో కూడిన శ్రేష్ఠములైన ఆ గొప్ప ఆసనములమీద త
విధముగా కూర్చుండిరి. 14, 1

మూ. రామేణ కుశలం పృష్టాః సశిష్యాః సపురోగమాః,
మహర్షయో వేదవిదో రామం వచనమబ్రువన్,
కుశలం నో మహాబాహో సర్వత్ర రఘునన్దన. 16

ప్ర. అ. రామేణ = రామునిచేత, కుశలమ్ = కుశలమును, పృష్టాః =
అడగబడిన, సపురోగమాః = ముందు నడచు పరివారముతో కూడిన, సశిష్యాః =
శిష్యులతో కూడిన, వేదవిదః = వేదవేత్తలైన, మహర్షయః = మహర్షులు
రామమ్ = రాముణ్ణి గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి
మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! రఘునన్దన = రామా! నః = మాకు
సర్వత్ర = అంతటా, కుశలమ్ = క్షేమము.

తా రాముడు కుశలప్రశ్న చేయగా, శిష్యులతోను, ముందు నడచ
పరివారముతోను కూడిన ఆ వేదవేత్తలైన మహర్షులు రామునితో ఇట్లు పలికిరి–
"గొప్ప బాహువులు గల రామా! మేము అన్ని విషయములందు క్షేమముగా
ఉన్నాము. 16

మూ. త్వాం తు దిష్ట్యా కుశలినం పశ్యామో హతశాత్రవమ్,
దిష్ట్యా త్వయా హతో రాజన్ రావణో లోకరావణః. 17

ప్ర. అ. దిష్ట్యా = భాగ్యవశముచేత, హతశాత్రవమ్ = చంపబడిన
శత్రువులుగల, కుశలినమ్ = కుశలవంతుడవైన, త్వామ్ = నిన్ను, పశ్యామః =
చూచుచున్నాము. రాజన్ = రాజా!, దిష్ట్యా = భాగ్యవశముచేత, లోకరావణః =
లోకములను ఏడ్పించిన, రావణః = రావణుడు, త్వయా = నీచేత, హతః =
చంపబడినాడు.

నీకు హితమును చేసిన, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన = లక్ష్మణునితోను, మాతృభిః = తల్లులతోను, భ్రాతృసహితమ్ = సోదరులతో కూడిన నిన్ను, వయమ్ = మేము, అద్య = నేడు, దిష్ట్యా = భాగ్యవశముచేత, పశ్యామః = చూచుచున్నాము.

తా. ధర్మాత్ముడవైన రాజా! నీకు హితమును చేయువాడైన సోదరుడైన లక్ష్మణునితోను, తల్లులతోను, ఇతర సోదరులతోను కూడిన నిన్ను అదృష్ట వశముచేత ఇప్పుడు చూడగల్గుచున్నాము. 20

మూ. దిష్ట్యా ప్రహస్తో వికటో విరూపాక్షో మహోదరః,
అకమ్పనశ్చ దుర్ధర్షో నిహతాస్తే నిశాచరాః. 21

ప్ర. అ. దిష్ట్యా = భాగ్యవశముచేత, ప్రహస్తః = ప్రహస్తుడు, వికటః = వికటుడు, విరూపాక్షః = విరూపాక్షుడు, మహోదరః = మహోదరుడు, దుర్ధర్షః = ఎదిరింప శక్యముకాని, అకమ్పనశ్చ = అకంపనుడు, నిశాచరాః = ఈ రాక్షసులు, తే = నీకు, నిహతాః = చంపబడిరి.

తా. అదృష్టవశముచేత నీవు ప్రహస్తుడు, వికటుడు, విరూపాక్షుడు, మహోదరుడు, ఎదిరింపశక్యము కాని అకంపనుడు-ఈ రాక్షసులను సంహరించినావు. 21

మూ. యస్య ప్రమాణాద్విపులం ప్రమాణం నేహ విద్యతే,
దిష్ట్యా తే సమరే రామ కుమ్భకర్ణో నిపాతితః. 22

ప్ర. అ. రామ = రామా! యస్య = ఎవనియొక్క, ప్రమాణాత్ = ప్రమాణముకంటె, విపులమ్ = పెద్దదైన, ప్రమాణమ్ = ప్రమాణము, ఇహ = ఇక్కడ, న విద్యతే = లేదో, కుమ్భకర్ణః = అట్టి కుంభకర్ణుడు, దిష్ట్యా = భాగ్యవశము చేత, సమరే = యుద్ధమునందు, తే = నీకు, నిపాతితః = పడగొట్టబడినాడు.

తా. ఎవని ప్రమాణమును మించిన ప్రమాణము ఈ ప్రపంచకములో లేదో అట్టి కుంభకర్ణుణ్ణి అదృష్టవశముచేత యుద్ధములో సంహరించినావు. 23

మూ. త్రిశిరాశ్చాతికాయశ్చ దేవాన్తకనరాన్తకౌ,
దిష్ట్యా తే నిహతా రామ మహావీర్యా నిశాచరాః. 23

తా. ప్రలయకాలమునందు సంహారము చేయు యమునితో సమానులైన యుద్ధోన్మత్త-మత్తులు, బలవంతుడైన యజ్ఞకోపుడు, ధూమ్రాక్షుడు- ఘోరమైన యుద్ధము చేయు శస్త్రాస్త్రములయందు నిపుణులైన ఈ రాక్షసులందరినీ, అదృష్టవశముచేత నీవు యముని వంటి బాణాలచేత సంహరించినావు. 25, 26

మూ. దిష్ట్యా త్వం రాక్షసేన్ద్రేణ ద్వన్ద్వయుద్ధముపాగతః,
దేవతానామవధ్యేన విజయం ప్రాప్తవానసి. 27

ప్ర. అ. దేవతానామ్ = దేవతలకు కూడ, అవధ్యేన = అవధ్యుడైన, రాక్షసేన్ద్రేణ = రావణునితో, ద్వన్ద్వయుద్ధమ్ = ద్వంద్వయుద్ధమును, ఉపాగతః = పొందిన, త్వమ్ = నీవు, దిష్ట్యా = భాగ్యవశము చేత, విజయమ్ = విజయమును, ప్రాప్తవాన్ అసి = పొందినావు.

తా. దేవతలు కూడ చంపజాలని, రాక్షసరాజైన రావణునితో ద్వంద్వ యుద్ధములో పాల్గొని అదృష్టవశముచేత విజయము పొందినావు. 27

మూ. సంఖ్యే తస్య న కించిత్తు రావణస్య పరాభవః,
ద్వన్ద్వయుద్ధమనుప్రాప్తో దిష్ట్యా తే రావణిర్హతః, 28

ప్ర. అ. సంఖ్యే = యుద్ధమునందు, తస్య రావణస్య = ఆ రావణుని యొక్క, పరాభవః = పరాభవము, న కించిత్తు = ఏమీ కాదు. దిష్ట్యా = భాగ్య వశముచేత, ద్వన్ద్వయుద్ధమ్ = ద్వంద్వయుద్ధమును, అనుప్రాప్తః = పొందిన, రావణిః = ఇంద్రజిత్తు, తే = నీకు, హతః చంపబడినాడు.

తా. యుద్ధములో (ప్రత్యక్షముగా కనబడే) రావణుని చంపుట అంత గొప్ప పని కాదు. కాని ద్వంద్వయుద్ధములో నిలచిన ఇంద్రజిత్తును నీవు (నీ సోదరుడు) అదృష్టవశముచేత చంపినావు. 28

మూ. దిష్ట్యా తస్య మహాబాహో కాలస్యేవాభిధావతః,
ముక్తః సురరిపోర్వీర ప్రాప్తశ్చ విజయస్త్వయా. 29

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా. వీర = వీరుడా! దిష్ట్యా = భాగ్యవశముచేత, కాలస్యేవ = యముడు వలె, అభిధావతః = పరుగెత్తి

అదృష్టవశముచేత ఈ రాక్షసులను, స్వేచ్ఛా రూపధారులైన చాలమంది ఇతర రాక్షసులను చంపినావు. 31

మూ. దత్త్వా పుణ్యామిమాం వీర సౌమ్యామభయదక్షిణామ్,
దిష్ట్యా వర్ధసి కాకుత్స్థ జయేనామిత్రకర్శన. 32

ప్ర. అ. వీర = వీరుడా ! అమిత్రకర్శన = శత్రువినాశకా ! కాకుత్స్థ= రామా ! పుణ్యామ్ = పుణ్యమైన, ఇమామ్ = ఈ, సౌమ్యామ్ = సౌమ్యమైన, అభయదక్షిణామ్ = అభయ మనే దక్షిణను, దత్త్వా = ఇచ్చి, దిష్ట్యా = భాగ్య వశముచేత, జయేన = జయముతో, వర్ధసి = వృద్ధిపొందుచున్నావు.

తా. వీరుడవు, శత్రుసంహారకుడవు అయిన ఓ ! రామా ! పుణ్యమైన, సౌమ్యమైన ఈ అభయదక్షిణను ఇచ్చి అదృష్టవశముచేత జయముతో వృద్ధి పొందుచున్నావు. 32

మూ. శ్రుత్వా తు వచనం తేషాం మునీనాం భావితాత్మనామ్,
విస్మయం పరమం గత్వా రామః ప్రాఞ్జలిరబ్రవీత్. 33

ప్ర. అ. భావితాత్మనామ్=పవిత్ర మైన మనస్సు గల, తేషాం మునీనామ్= ఆ మునులయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, రామః=రాముడు, పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, గత్వా = పొంది, ప్రాఞ్జలిః= కట్టబడిన దోసిలి కలవాడై, అబ్రవీత్ = పలికెను.

తా. పవిత్రమైన మనస్సు గల ఆ మునుల వచనమును విని రాముడు ఆశ్చర్యపడుచు, చేతులు జోడించి నమస్కరించుచు పలికెను. 33

మూ. భవన్తః కుమ్భకర్ణం చ రావణం చ నిశాచరమ్,
అతిక్రమ్య మహావీర్యా కిం ప్రశంసథ రావణిమ్. 34

ప్ర. అ. భవన్తః = మీరు, మహావీర్యా=గొప్ప పరాక్రమము గల, కుమ్భ కర్ణం చ = కుంభకర్ణుణ్ణి, నిశాచరమ్ = రాక్షసుడైన, రావణం చ = రావణుణ్ణి, అతిక్రమ్య = అతిక్రమించి, రావణిమ్ = ఇంద్రజిత్తును, కిమ్ = ఎందువలన, ప్రశంసథ = ప్రశంసించుచున్నారు ?

ఏషః = ఇతడు, కేన వా = ఏ, కారణేన = కారణముచేత, రావణాత్ = రావణుని కంటె, అతిరిచ్యతే = గొప్పవాడగుచున్నాడు ?

తా. అతని ప్రభావము ఎట్టిది ? బలము ఎట్టిది ? పరాక్రమము ఎట్టిది ? అతడు ఏ కారణము చేత రావణునికంటె గొప్పవాడు ? 37

మూ. శక్యం యది మయా శ్రోతుం న ఖల్వాజ్ఞాపయామి వః,
యది గుహ్యం న చేద్వక్తుం శ్రోతుమిచ్ఛామి కథ్యతామ్. 38

ప్ర. అ. మయా = నాచేత, శ్రోతుమ్ = వినుటకు, శక్యం యది = శక్యమైనచో, వక్తుమ్ = చెప్పుటకు, గుహ్యమ్ = రహస్యమైనది, న చేత్ = కానిచో, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, కథ్యతామ్ = చెప్పబడుగాక, వః = మిమ్ములను, న ఆజ్ఞాపయామి ఖలు = ఆజ్ఞాపించుటలేదు కదా !

తా. నేను వినుటకు యోగ్యమైనచో, చెప్పుటకు అది రహస్యము కానిచో, నేను వినవలె నని కోరుచున్నాను; చెప్పుడు; కాని మిమ్ములను ఆజ్ఞాపింపజాలను.

మూ. శక్రోఽపి విజితస్తేన కథం లబ్ధవరశ్చ సః,
కథం చ బలవాన్పుత్రో న పితా తస్య రావణః. 39

ప్ర. అ. తేన = వానిచేత, శక్రోఽపి = దేవేంద్రుడు కూడ, కథమ్ = ఎట్లు, విజితః = జయింపబడినాడు ? సః = అతడు, కథమ్ = ఎట్లు, లబ్ధవరశ్చ = పొందబడిన వరములు గలవాడు ? పుత్రః = పుత్రుడు, కథమ్ = ఎట్లు, బలవాన్ = బలముగలవాడు, తస్య = వానియొక్క, పితా = తండ్రియైన, రావణః = రావణుడు, న = కాడు ?

తా. అతడు దేవేంద్రుణ్ణి కూడ ఎట్లు జయించినాడు ? వరములు ఎట్లు పొందినాడు ? కుమారుడే ఎట్లు అధికబలవంతుడు ? తండ్రి ఎందువలన కాడు ?

మూ. కథం పితుశ్చాప్యధికో మహాహవే
శక్రస్య జేతా హి కథం స రాక్షసః,
వరాశ్చ లబ్ధాః కథయస్వ మేఽద్య
తత్ప్రచ్ఛతశ్చాస్య మునీన్ద్ర సర్వమ్. 40

# అథ ద్వితీయః సర్గః

[అగస్త్యుడు పులస్త్యుని గుణములను తపస్సును వర్ణించి చెప్పి ఆతనికి విశ్రవస్సు పుట్టుటను చెప్పుట.]

మూ. తస్య తద్ వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
కుమ్భయోనిర్మహాతేజా వాక్యమేతదువాచ హ. 1

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాఘవస్య = ఆ రాముని యొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, కుమ్భయోనిః = అగస్త్యుడు, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. మహాత్ముడైన రాముని మాటలు విని గొప్ప తేజస్సు గల అగస్త్యుడిట్లు పలికెను. 1

మూ. శృణు రామ తథా వృత్తం తస్య తేజో బలం మహత్,
జఘాన శత్రూన్యేనాసౌ న చ వధ్యః స శత్రుభిః. 2

ప్ర. అ. రామ = రామా ! తస్య = ఆ ఇంద్రజిత్తుయొక్క, వృత్తమ్ = చరిత్రను, తేజః = తేజస్సును, తథా = మరియు, మహత్ = గొప్పదైన, బలమ్ = బలమును, శృణు = వినుము; యేన = దేనిచేత, అసౌ = ఇతడు, శత్రూన్ = శత్రువులను, జఘాన = చంపెనో; సః = అట్టి, అసౌ చ = ఇతడు, శత్రుభిః = శత్రువులచేత, న వధ్యః = చంప శక్యము కానివాడో.

తా. రామా ! ఏ తేజోబలాదులచేత ఈ ఇంద్రజిత్తు శత్రువులను వధించెనో, తాను వధింప శక్యముకానివాడై ఉండెనో అట్టి వాని చరితమును, తేజస్సును, గొప్ప బలమును వినుము. 2

మూ. ప్రజాపతిసుతత్వేన దేవానాం వల్లభో హి సః,
ఇష్టః సర్వస్య లోకస్య గుణైః శుభ్రైర్మహామతిః. 6

ప్ర. అ. సః = పులస్త్యుడు, ప్రజాపతిసుతత్వేన = బ్రహ్మపుత్రుడగుట చేత, దేవానామ్ = దేవతలకు, వల్లభః హి = ఇష్టుడు కదా ? మహామతిః = గొప్ప బుద్ధి గల అతడు, శుభ్రైః = శుభ్రములైన, గుణైః = గుణములచేత, సర్వస్య లోకస్య = సమస్తలోకమునకు, ఇష్టః = ఇష్టుడు.

తా. ఆ పులస్త్యుడు ప్రజాపతిపుత్రు డగుటచేత దేవతలకు ఇష్టుడు. గొప్ప బుద్ధిగల అతడు పరిశుద్ధములైన గుణములచేత సమస్తలోకమునకు ఇష్టుడు. 6

మూ. స తు ధర్మప్రసంగేన మేరోః పార్శ్వే మహాగిరేః,
తృణబిన్ద్వాశ్రమం గత్వా న్యవసన్మునిపుఙ్గవః. 7

ప్ర. అ. సః = ఆ, మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడు, ధర్మప్రసంగేన = ధర్మప్రసంగము చేత, మహాగిరేః = మహాపర్వతమైన, మేరోః = మేరువుయొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, తృణబిన్ద్వాశ్రమమ్ = తృణబింద్వాశ్రమమునుగూర్చి, గత్వా = వెళ్ళి, న్యవసత్ = నివసించెను.

తా. ఆ మహాముని ధర్మాచరణమునందు ఆసక్తిచేత మేరుమహాపర్వత పార్శ్వమునం దున్న తృణబింద్వాశ్రమమునకు వెళ్ళి అక్కడ నివసించెను. 7

మూ. తపస్తేపే స ధర్మాత్మా స్వాధ్యాయనియతేన్ద్రియః,
గత్వాశ్రమపదం తస్య విఘ్నం కుర్వన్తి కన్యకాః. 8

ప్ర. అ. సః = ఆ, ధర్మాత్మా = ధర్మాత్ముడు, స్వాధ్యాయనియతేన్ద్రియః = స్వాధ్యాయమునందు నియమింపబడిన ఇంద్రియములు కలవాడై, తపః = తపస్సును, తేపే = చేసెను. కన్యకాః = కన్యకలు, తస్య = వానియొక్క, ఆశ్రమ పదమ్ = ఆశ్రమస్థానమును గూర్చి, గత్వా = వెళ్ళి, విఘ్నమ్ = విఘ్నమును, కుర్వన్తి = చేయుచుండిరి.

తా. ధర్మాత్ముడైన ఆ పులస్త్యుడు స్వాధ్యాయమునందు ఇంద్రియములను

లాసయన్త్యః = నాట్యముచేయుచు. తపస్వినః = తపస్సు గల, తస్య మునేః = ఆ మునికి, విఘ్నమ్ = విఘ్నమును, చక్రుః = చేసిరి.

తా. ఆ పులస్త్యుడు ఉన్న ఆ ప్రదేశము సుందర మగుటచేత దోషరహితలైన ఆ కన్యకలు అక్కడ గానము చేయుచు, వాద్యములు వాయించుచు, నాట్యమాడుచు తపఃశాలియైన ఆ మునికి విఘ్నము చేసిరి. 11

మూ. అథ రుష్టో మహాతేజా వ్యాజహార మహామునిః, 12
యా మే దర్శనమాగచ్ఛేత్సా గర్భం ధారయిష్యతి.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రుష్టః = కోపించిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల మహామునిః = ఆ మహాముని, వ్యాజహార పలికెను. యా = ఏ స్త్రీ, మే = నాయొక్క, దర్శనమ్ = దర్శనమును, ఆగచ్ఛేత్ = పొందునో, సా = ఆమె, గర్భమ్ = గర్భమును, ధారయిష్యతి = ధరించగలదు.

తా. అప్పుడు మహాతేజఃశాలియైన ఆ మహాముని కోపించి "నా కంటబడిన స్త్రీ గర్భము ధరించును" అని పలికెను. 12

మూ. తాస్తు సర్వాః ప్రతిశ్రుత్య తస్య వాక్యం మహాత్మనః, 13
బ్రహ్మశాపభయాద్భీతాస్తం దేశం నోపచక్రముః.

ప్ర. అ. తాః సర్వాః = ఆ అందరు కన్యలు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ పులస్త్యునియొక్క, వాక్యమ్ = వాక్యమును, ప్రతిశ్రుత్య = విని, బ్రహ్మశాపభయాత్ = బ్రాహ్మణశాపభయమువలన, భీతాః = భయపడినవారై, తం దేశమ్ = ఆ ప్రదేశమును, నోపచక్రముః = వెళ్ళలేదు.

తా. ఆ కన్యక లందరూ ఆ పులస్త్యుని మాట విని, బ్రాహ్మణశాపమునకు భయపడి ఆ ప్రదేశమునకు వెళ్ళుట మానివేసిరి. 13

మూ. తృణబిన్దోస్తు రాజర్షేస్తనయా న శృణోతి తత్, 14
గత్వాశ్రమపదం తత్ర విచచార సునిర్భయా.

ప్ర. అ. రాజర్షేః = రాజర్షియైన, తృణబిన్దోః = తృణబిందువుయొక్క, తనయా తు = కుమార్తె అయితే, తత్ = ఆ వాక్యమును, న శృణోతి = వినలేదు.

ప్ర. అ. ఆత్మనః = తనయొక్క, తత్ = ఆ, దోషమ్ = దోషమును, దృష్ట్వా = చూచి, సముద్విగ్నా = దిగులుచెందినదై, బభూవ చ = ఆయెను. మే = నాయొక్క, ఇదమ్ = ఇది, కిం తు = ఏమి, ఇతి = అని, జ్ఞాత్వా = ఆలోచించి, గత్వా = వెళ్ళి, పితుః = తండ్రియొక్క, ఆశ్రమే = ఆశ్రమము నందు, స్థితా = ఉన్నది.

తా. ఆమె తనలో గలిగిన ఆ దోషమును చూచి, దిగులుచెందెను. నాకు ఇదేమి, ఇట్లు జరిగినది అని ఆలోచించుకొనుచు తిరిగి వెళ్ళి తండ్రి ఆశ్రమములో ఉండెను. 18

మూ. తాం తు దృష్ట్వా తథాభూతాం తృణబిన్దురథాబ్రవీత్,
కిం త్వమేత త్త్వసదృశం ధారయస్యాత్మనో వపుః. 19

ప్ర. అ. అథ = అనంతరము, తృణబిన్దుః = తృణబిందువు, తథా భూతామ్ = ఆ విధముగా ఉన్న, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, త్వమ్ = నీవు, అసదృశమ్ = తగని, ఏతత్ = ఈ, ఆత్మనః వపుః = నీ శరీరమును, ధారయసి = ధరించుచున్నావు; కిమ్ = ఇది ఏమి ? అని, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు తృణబిందువు ఆ విధముగా ఉన్న ఆమెను చూచి "నీ శరీరము ఉండవలసిన విధముగా లేదు; ఇది ఏమి ?" అని ప్రశ్నించెను. 19

మూ. సా తు కృత్వాఞ్జలిం దీనా కన్యోవాచ తపోధనమ్,
న జానే కారణం తాత యేన మే రూపమీదృశమ్. 20

ప్ర. అ. సా కన్యా తు = ఆ కన్య అయితే, దీనా = దీనురాలై, అఞ్జలిమ్ = దోసిలిని, కృత్వా = చేసి, తపోధనమ్ = ఆ రాజర్షిని గూర్చి, ఉవాచ = పలికెను. తాత = తండ్రీ, యేన = ఏ కారణముచేత, మే = నాయొక్క, రూపమ్ = రూపము, ఈదృశమ్ = ఇట్టిదిగా అయినదో, కారణమ్ = ఆ కారణమును, న జానే = ఎరుగను.

తా. ఆ కన్య దీనురాలై, అంజలి ఘటించి ఇట్లు చెప్పెను :- "తండ్రీ ! నా రూపము ఇట్లు ఎందుచేత అయినదో నాకు తెలియదు." 20

మూ. స తు విజ్ఞాయ తం శాపం మహర్షేర్భావితాత్మనః,
గృహీత్వా తనయాం గత్వా పులస్త్యమిదమబ్రవీత్. 24

ప్ర. అ. సః = అతడు, భావితాత్మనః = పవిత్రమైన మనస్సు గల, మహర్షేః = మహర్షియొక్క, తం శాపమ్ = ఆ శాపమును, జ్ఞాత్వా = తెలిసికొని, తనయామ్ = కుమార్తెను, గృహీత్వా = తీసికొని, గత్వా = వెళ్ళి, పులస్త్యమ్ = పులస్త్యుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అతడు పవిత్రమైన మనసుగల ఆ మహర్షి ఇచ్చిన శాపమును తెలిసికొని, కుమార్తెను తీసికొని వెళ్ళి పులస్త్యునితో ఇట్లు పలికెను. 24

మూ. భగవంస్తనయాం మే త్వం గుణైః స్వైరేవ భూషితామ్,
భిక్షాం ప్రతిగృహాణేమాం మహర్షే స్వయముద్యతామ్. 25

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! మహర్షే = మహర్షీ! స్వైః = తన సంబంధమైన, గుణైరేవ = గుణములచేతనే, భూషితామ్ = అలంకరించబడిన, మే తనయామ్ = నా కుమార్తెయైన, ఇమామ్ = ఈమెను, స్వయమ్ = స్వయముగా, ఉద్యతామ్ = ఇవ్వబడిన, భిక్షామ్ = భిక్షనుగా, ప్రతిగృహాణ = స్వీకరించుము.

తా. పూజ్యుడవైన ఓ మహర్షీ! ఈమె నా కుమార్తె. తన గుణములచేతనే అలంకరించబడినది. ఈమెను తనంతట తానుగా వచ్చిన భిక్షనుగా స్వీకరింపుము. 25

మూ. తపశ్చరణయుక్తస్య శ్రామ్యమాణేన్ద్రియస్య తే,
శుశ్రూషణపరా నిత్యం భవిష్యతి న సంశయః 26

ప్ర. అ. తపశ్చరణయుక్తస్య = తపస్సును ఆచరించుటయందు లగ్నమైన, శ్రామ్యమాణేన్ద్రియస్య = శ్రమపడుచున్న ఇంద్రియములు గల, తే = నీయొక్క, నిత్యమ్ = నిత్యమూ, శుశ్రూషణపరా = శుశ్రూషణమునందు ఆసక్తి కలది, భవిష్యతి = కాగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. తపస్సు చేయుచు శ్రమపడుచున్న ఇంద్రియములు గల నీకు నిత్యమూ శుశ్రూష చేయుటయందే ఈమె ఆసక్తి గలదై ఉండగలదు; సందేహము లేదు. 26

సంతోషించెను. గొప్ప తేజస్సు గల ఆ పులస్త్యుడు సంతోషించి ఈ వాక్యమును పలికెను. 29

మూ. పరితుష్టోఽస్మి సుశ్రోణి గుణానాం సంపదా భృశమ్,
తస్మాద్దేవి దదామ్యద్య పుత్రమాత్మసమం తవ,
ఉభయోర్వంశకర్తారం పౌలస్త్య ఇతి విశ్రుతమ్. 30

ప్ర. అ. సుశ్రోణి = ఓ ! సుందరీ ! గుణానామ్ = గుణములయొక్క, సంపదా = సంపదచేత, భృశమ్ = మిక్కిలి, పరితుష్టః అస్మి = సంతోషించితిని. దేవి = ఓ! దేవీ ! తస్మాత్ = ఆ కారణమువలన, తవ = నీకు, ఆత్మసమమ్ = నాతో సమానుడు, ఉభయోః = మన ఇద్దరియొక్క, వంశకర్తారమ్ = వంశమును చేయువాడు, పౌలస్త్యః ఇతి = పౌలస్త్యుడు అని, విశ్రుతమ్ = ప్రసిద్ధుడూ అయిన, పుత్రమ్ = పుత్రుణ్ణి , అద్య = ఇప్పుడు, దదామి = ఇచ్చుచున్నాను.

తా. ఓ ! సుందరీ ! నీ గుణసంపదకు చాలా సంతోషించినాను. అందువలన నీకు, ఇప్పుడు, ఉభయవంశములను ఉద్ధరించు, పౌలస్త్యుడను కుమారుణ్ణి ఇచ్చెదను. 30

మూ. యస్మాత్తు విశ్రుతో వేదస్త్వయేహాధ్యయతో మమ,
తస్మాత్స విశ్రవా నామ భవిష్యతి న సంశయః. 31

ప్ర. అ. ఇహ = ఇక్కడ, మమ = నేను, అధ్యయతః = చదువుచుండగా, వేదః = వేదము, యస్మాత్ = ఏ కారణమువలన, విశ్రుతః = వినబడినదో, తస్మాత్ = ఆ కారణమువలన, విశ్రవాః నామ = విశ్రవస్సు అను పేరుగలవాడు, భవిష్యతి = కాగలడు. సంశయః = సంశయము, న = లేదు.

తా. నేను ఇక్కడ వేదాధ్యయనము చేయుచుండగా నీవు విని ఉన్నావు కదా ? అందుచేత వానికి “విశ్రవుడు” అను పేరు వచ్చును; సందేహములేదు. 31

మూ. ఏవముక్తా తు సా దేవీ ప్రహృష్టేనాన్తరాత్మనా,
అచిరేణైవ కాలేనాసూత విశ్రవసం సుతమ్,
త్రిషు లోకేషు విఖ్యాతం యశోధర్మసమన్వితమ్. 32

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, సా దేవీ = ఆ దేవి,

# అథ తృతీయః సర్గః

[విశ్రవసుకు వైశ్రవణుడు అను పుత్రుడు జనించుట. అతడు తపస్సు చేసి వరములు పొంది లంకలో నివసించుట.]

మూ. అథ పుత్రః పులస్త్యస్య విశ్రవా మునిపుఙ్గవః,
అచిరేణైవ కాలేన పితేవ తపసి స్థితః. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, పులస్త్యస్య = పులస్త్యునియొక్క, పుత్రః = పుత్రుడైన, మునిపుంగవః = మునిశ్రేష్ఠుడైన, విశ్రవాః = విశ్రవసుడు, పితేవ = తండ్రివలె, అచిరేణైవ = అల్పమైన, కాలేన = కాలముచేత, తపసి = తపస్సునందు, స్థితః = ఉండెను.

తా. పులస్త్యుని కుమారుడైన మునిశ్రేష్ఠుడైన విశ్రవసుడు అల్పకాలమునందే తండ్రి వలె తపోనిష్ఠాగరిష్ఠు డాయెను. 1

మూ. సత్యవాన్ శీలవాన్ దాన్తః స్వాధ్యాయనిరతః శుచిః,
సర్వభోగేష్వసంసక్తో నిత్యం ధర్మపరాయణః. 2

ప్ర. అ. సత్యవాన్ = సత్యవంతుడు, శీలవాన్ = మంచి శీలము గలవాడు, దాన్తః = ఇంద్రియనిగ్రహవంతుడు, స్వాధ్యాయనిరతః = స్వాధ్యాయమునందు ఆసక్తి కలవాడు, శుచిః = పరిశుద్ధుడు, సర్వభోగేషు = సమస్తభోగములయందు, అసంసక్తః = ఆసక్తిలేనివాడు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, ధర్మపరాయణః = ధర్మమునందు ఆసక్తి కలవాడు అయి ఉండెను.

తా. స్వాధ్యాయాధ్యయనము నందు ఆసక్తుడై, ఇంద్రియనిగ్రహముతో పవిత్రుడుగా ఉన్న అతడు సత్యసచ్ఛీలములతో ఏ భోగములయందును ఆసక్తిలేనివాడై నిత్యము ధర్మము నాచరించుచుండెను. 2

శ్రేయస్సును కోరుచు ఆ భరద్వాజుని కుమార్తెను ధర్మానుసారముగా స్వీకరించి, ఆమెయందు పరాక్రమవంతుడు, చాల ఆశ్చర్యమును కలిగించువాడు, సమస్తమైన బ్రాహ్మణగుణములతో కూడినవాడు అయిన పుత్రుణ్ణి జనింపచేసెను. 4,5

మూ. తస్మిన్ జాతే తు సంహృష్టః స బభూవ పితామహః. 6
దృష్ట్వా శ్రేయస్కరీం బుద్ధిం ధనాధ్యక్షో భవిష్యతి,
నామ చాస్యాకరోత్ప్రీతః సార్ధం దేవర్షిభి స్తదా. 7

ప్ర. అ. తస్మిన్ = అతడు, జాతే = పుట్టినవాడగుచుండగా, సః = ఆ, పితామహః = పితామహుడు, సంహృష్టః = సంతోషించినవాడు, బభూవ హ = ఆయెను. శ్రేయస్కరామ్ = శ్రేయస్కరమైన, బుద్ధిమ్ = బుద్ధిని, దృష్ట్వా = చూచి, ధనాధ్యక్షః = ధనాధ్యక్షుడు, భవిష్యతి = కాగలడు (అని పలికెను). ప్రీతః = సంతోషించినవాడై, తదా = అప్పుడు, దేవర్షిభిః సార్ధమ్ = దేవర్షులతో కూడ కలిసి, అస్య = వీనికి, నామ చ = పేరును కూడ, అకరోత్ = చేసెను.

తా. ఆతడు పుట్టుటచే పితామహుడైన పులస్త్యుడు సంతోషించెను. ఆతని శ్రేయస్కరమైన బుద్ధిని గుర్తించి "ఇతడు ధనాధ్యక్షుడు కాగలడు"అని పలికెను. అప్పుడు దేవర్షులతో కూడి సంతోషపూర్వకముగా ఇతనికి నామధేయము చేసెను.

మూ. యస్మాద్విశ్రవసోఽపత్యం సాదృశ్యాద్విశ్రవా ఇవ,
తస్మాద్వైశ్రవణో నామ భవిష్యత్యేష విశ్రుతః. 8

ప్ర. అ. యస్మాత్ = ఏ కారణమువలన, విశ్రవసః = విశ్రవసుని యొక్క, అపత్యమ్ = సంతానమో, సాదృశ్యాత్ = సాదృశ్యమువలన, విశ్రవాః ఇవ = విశ్రవస్సు వలె ఉన్నాడో, తస్మాత్ = ఆ కారణమువలన, ఏషః = ఇతడు, వైశ్రవణో నామ = వైశ్రవణు డని, విశ్రుతః = ప్రసిద్ధుడు, భవిష్యతి = కాగలడు.

తా. విశ్రవసుని పుత్రుడైన ఇతడు విశ్రవసుని పోలికలో ఉన్నాడు. అందుచేత ఇతడు వైశ్రవణు డని ప్రసిద్ధి పొందగలడు. 8

మూ. స తు వైశ్రవణ స్తత్ర తపోవనగత స్తదా,
అవర్ధతాహుతిహుతో మహాతేజా యథానలః. 9

ప్ర. అ. పూర్ణే = పూర్ణమైన, వర్షసహస్రాన్తే = వేయి సంవత్సరముల అంతమునందు, జలాశీ = జలమును మాత్రమే భుజించుచు, మారుతాహారః = వాయువే ఆహారముగా కలవా డగుచు, తథైవ చ = మరియు, నిరాహారః = ఆహారములేని వాడగుచు, తం తమ్ = ఆ యా, విధిమ్ = నియమమును, అకల్పయత్ = కల్పించుకొనెను. ఏవమ్ = ఇట్లు, తాని = ఆ, వర్షసహస్రాణి = వేలకొలది సంవత్సరములు, ఏకవర్షవత్ = ఒకే సంవత్సరము వలె, జగ్ముః = వెళ్ళినవి.

తా. వేయి సంవత్సరముల కాలము పూర్తిఅయిన పిమ్మట అతడు జలము మాత్రమే త్రాగుట, వాయువు మాత్రమే ఆహారముగా తీసికొనుట, ఆహార మేమీ లేకపోవుట మొదలైన ఆ యా నియమములను పాటించెను. ఈ విధముగా వేల కొలది సంవత్సరములు ఒక్క సంవత్సరముగా గడచిపోయెను. 12

మూ. అథ ప్రీతో మహాతేజాః సేన్ద్రైః సురగణైః సహ,
గత్వా తస్యాశ్రమపదం బ్రహ్మేదం వాక్యమబ్రవీత్ · 13

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, బ్రహ్మ = బ్రహ్మ, ప్రీతః = సంతోషించినవాడై, సేన్ద్రైః = ఇంద్రునితో కూడిన, సురగణైః సహ = దేవతాగణములతో కూడ, తస్య = అతనియొక్క, ఆశ్రమ పదమ్ = ఆశ్రమస్థానమును గూర్చి, గత్వా = వెళ్ళి, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల బ్రహ్మదేవుడు సంతోషించి, ఇంద్రునితో కూడిన దేవతాగణములతో కూడ అతని ఆశ్రమమునకు వెళ్ళి ఇట్లు పలికెను. 13

మూ. పరితుష్టోఽస్మి తే వత్స కర్మణానేన సువ్రత,
వరం వృణీష్వ భద్రం తే వరార్హస్త్వం మహామతే. 14

ప్ర. అ. సువ్రత = మంచి నియమములు గలవాడా ! వత్స = నాయనా! తే = నీయొక్క, అనేన = ఈ, కర్మణా = కర్మచేత, పరితుష్టః అస్మి = సంతోషించితిని. మహామతే = గొప్ప బుద్ధి కలవాడా, త్వమ్ = నీవు, వరార్హః = వరములకు తగినవాడవు. వరమ్ = వరమును, వృణీష్వ = కోరుకొనుము. తే = నీకు, భద్రమ్ = క్షేమ మగు గాక.

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మముతెలిసినవాడా! అహమ్=నేను, లోకపాలానామ్ = లోకపాలులైన, యమేన్ద్రవరుణానాం చ = యమ - ఇంద్ర - వరుణులకు, చతుర్థమ్ = నాల్గవవానిని, స్రష్టుమ్ = సృజించుటకు, ఉద్యతః = ఉద్యుక్తుడనై ఉన్నాను. తవ = నీకు, యత్ = ఏది, ఈప్సితమ్ = ఇష్టమైనదో, తత్ = దానిని, గచ్ఛ = పొందుము. బత = ఆహా ! నిధీశత్వమ్ = నిధులకు అధిపత్యమును, అవాప్నుహి = పొందుము, త్వమ్ = నీవు, శక్రామ్బుపయమానామ్ = ఇంద్ర - వరుణ—యములకు, చతుర్థః = నాల్గవవాడవు, భవిష్యసి = కాగలవు.

తా. ధర్మములు తెలిసిన ఓ ! వైశ్రవణుడా ! ప్రస్తుతము లోకపాలులుగా ఉన్న యమ-ఇంద్ర-వరుణులు కాక మరొక నాల్గవ లోకపాలుణ్ణి సృష్టించవలెనని అనుకొనుచున్నాను. అందుచేత నీ కిష్టమైన లోకపాలత్వమును పొందుము. నిధులకు అధిపతివిగా కూడ అగుము; నీవు ఇటుపై ఇంద్ర-వరుణ-యములకు నాల్గవవాడవు కాగలవు. 17, 18

మూ. ఏతచ్చ పుష్పకం నామ విమానం సూర్యసంనిభమ్,
ప్రతిగృహ్ణీష్వ యానార్థం త్రిదశైః సమతాం వ్రజ. 19

ప్ర. అ. యానార్థమ్ = ప్రయాణముకొరకు, సూర్యసంనిభమ్ = సూర్యునితో సమానమైన, ఏతత్ = ఈ, పుష్పకం నామ = పుష్పక మను పేరు గల, విమానమ్ = విమానమును, ప్రతిగృహ్ణీష్వ = గ్రహించుము. త్రిదశైః = దేవతలతో, సమతామ్ = సమత్వమును, వ్రజ = పొందుము.

తా. నీవు సంచారము చేయుటకై సూర్యునితో సమానమైన ఈ పుష్పక విమానమును స్వీకరించుము; దేవతలతో సమానుడవు అగుము. 19

మూ. స్వస్తి తేఽస్తు గమిష్యామః సర్వ ఏవ యథాగతమ్,
కృతకృత్యా వయం తాత దత్త్వా తవ వరద్వయమ్. 20

ప్ర. అ. తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక. సర్వే ఏవ = అందరమూ, యథాగతమ్ = వచ్చినట్లుగా, గమిష్యామః = వెళ్లెదము. తాత = నాయనా ! తవ = నీకు, వరద్వయమ్ = రెండు వరములను, దత్త్వా = ఇచ్చి; వయమ్ = మేము, కృతకృత్యాః = కృతకృత్యులము అయినాము.

తమ్ = అట్టి, కంచిత్ = ఒకానొక, నివాసమ్ = నివాసమును, సాధు = బాగుగా, పశ్య = చూడుము; యత్ర = ఎక్కడ, యస్య కస్య చిత్ = ఏ ఒక్క, ప్రాణినః = ప్రాణికి, పీడా = పీడ, న భవేత్ = కలగదో.

తా. సర్వసమర్థుడవైన ఓ! పూజ్యుడా! నాకొరకై ఏ ప్రాణికి కూడ పీడ కలగని నివాసస్థానమును చూడుము. 23

మూ. ఏవముక్తస్తు పుత్రేణ విశ్రవా మునిపుఙ్గవః,
వచనం ప్రాహ ధర్మజ్ఞః శ్రూయతామితి సత్తమ. 24

ప్ర. అ. పుత్రేణ = పుత్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ధర్మజ్ఞః = ధర్మములు ఎరిగిన, మునిపుఙ్గవః = మునిశ్రేష్ఠుడైన, విశ్రవాః = విశ్రవుడు, సత్తమ = చాల మంచివాడా, శ్రూయతామ్ = వినబడుగాక, ఇతి = అని, వచనమ్ = వచనమును, ప్రాహ = పలికెను.

తా. మునిశ్రేష్ఠుడు, ధర్మములు ఎరిగినవాడూ అయిన విశ్రవసుడు పుత్రుని మాటలు విని, "ఓ! సత్పురుషుడా! వినుము" అని పలికెను. 24

మూ. దక్షిణస్యోదధేస్తీరే త్రికూటో నామ పర్వతః,
తస్యాగ్రే తు విశాలా సా మహేన్ద్రస్య పురీ యథా. 25

లఙ్కా నామ పురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా,
రాక్షసానాం నివాసార్థం యథేన్ద్రస్యామరావతీ. 26

ప్ర. అ. దక్షిణస్య ఉదధేః = దక్షిణ సముద్రముయొక్క, తీరే = తీరమునందు, త్రికూటో నామ = త్రికూట మను పేరు గల, పర్వతః = పర్వత మున్నది. తస్య = దానియొక్క, అగ్రే = అగ్రమునందు, మహేన్ద్రస్య = మహేంద్రుని యొక్క, పురీ యథా = పట్టణము వలె, విశాలా = విశాలమైన, సా పురీ = ఆ పట్టణ మున్నది. రమ్యా = రమ్యమైన, లఙ్కా నామ = లంక అను, పురీ = పట్టణము, ఇన్ద్రస్య = ఇంద్రునియొక్క, అమరావతీ యథా = అమరావతి వలె, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, నివాసార్థమ్ = నివాసముకొరకు, నిర్మితా = నిర్మించబడినది.

తా. దక్షిణ సముద్రతీరమునందు త్రికూట మను పర్వత మున్నది. దాని

తా. రాక్షసు లందరూ రసాతలముక్రిందికి వెళ్ళిపోయినారు. అక్కడ ఎవ్వరూ లేరు. ఈ విధముగా ఇప్పుడు లంక శూన్యముగా ఉన్నది. దానికి ప్రభువు ఎవ్వడూ లేడు. 29

మూ. స త్వం తత్ర నివాసాయ గచ్ఛ పుత్ర యథాసుఖమ్,
నిర్దోష స్తత్ర తే వాసో న బాధ స్తత్ర కస్య చిత్. 30

ప్ర. అ. పుత్ర = పుత్రుడా! సః = అట్టి, త్వమ్ = నీవు, తత్ర = అక్కడ, నివాసాయ = నివాసముకొరకు, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్లుము. తత్ర = అక్కడ, తే = నీయొక్క, వాసః = నివాసము, నిర్దోషః = దోషములు లేనిది. తత్ర = అక్కడ, కస్య చిత్ = ఎవనియొక్కా, బాధః = బాధ, న = లేదు.

తా. పుత్రా! నీవు అక్కడ నివసించుటకు సుఖముగా వెళ్లుము. అక్కడ నీవు నివసించుటలో ఏ దోషమూ ఉండదు. ఎవరి బాధా కూడ ఉండదు. 30

మూ. ఏతచ్ఛ్రుత్వా స ధర్మాత్మా ధర్మిష్ఠం వచనం పితుః,
నివాసయామాస తదా లఙ్కాం పర్వతమూర్ధని. 31

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆతడు, పితుః = తండ్రియొక్క, ధర్మిష్ఠమ్ = ధర్మసంమతమైన, ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, పర్వతమూర్ధని = పర్వతాగ్రమునందు, లఙ్కామ్ = లంకను, తదా = అప్పుడు, నివాసయామాస = నివాసముగా ఏర్పరచెను.

తా. ధర్మాత్ముడైన ఆ వైశ్రవణుడు తండ్రి పలికిన ధర్మ సంమతమైన ఆ వాక్యము విని పర్వతశిఖరముమీద ఉన్న లంకను నివాసముగా ఏర్పరచుకొనెను. 31

మూ. నైర్ఋతానాం సహస్రైస్తు హృష్టైః ప్రముదితైః సదా,
అచిరేణైవ కాలేన సంపూర్ణా తస్య శాసనాత్. 32

ప్ర. అ. తదా = అప్పుడు, తస్య = ఆతనియొక్క, శాసనాత్ = శాసనము వలన, అచిరేణ కాలేనైవ = కొద్ది కాలముచేతనే, హృష్టైః = సంతోషించిన,

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
## తృతీయః సర్గః.

ప్ర. అ. దేవగన్ధర్వగణైః = దేవతలయొక్క, గంధర్వులయొక్క, గణములచేత, అభిష్టుతః = స్తుతించబడిన, తథా = మరియు, అప్సరోనృత్యవిభూషితాలయః = అప్సరస్త్రీల నృత్యములచేత అలంకరించబడిన గృహము గల, సః = ఆ, సః = ప్రసిద్ధుడైన, విత్తపః = ధనాధ్యక్షుడు, గభస్తిభిః = కిరణములచేత, సూర్యః ఇవ = సూర్యుడు వలె, అవభాసయన్ = ప్రకాశింపచేయుచు, పితుః = తండ్రియొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి, ప్రయయౌ = వెళ్ళెను.

తా. దేవతాగణములచేతను, గంధర్వగణములచేతను స్తుతింపబడినవాడు, అప్సరస్త్రీల నృత్యములచేత అలంకరించబడిన గృహము గలవాడు అయిన ఆ వైశ్రవణుడు కిరణములచేత సూర్యుడు వలె ప్రకాశింపచేయుచు తండ్రి సమీపమునకు వెళ్లెను. 35

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో మూడవ సర్గ సమాప్తము.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! ఏషా = ఈ, లఙ్కా = లంక, పూర్వమపి = పూర్వముకూడా, పిశితాశినామ్ = రాక్షసులయొక్క నివాసముగా, ఆసీత్ = ఉండెను అని, ఇదమ్ = ఈ, భగవద్వాక్యమ్ = పూజ్యుడవైన నీ వాక్యమును, శ్రుత్వా = విని, మే = నాకు, పరః = అధికమైన, విస్మయః = ఆశ్చర్యము కలిగినది.

తా. పూజ్యుడా ! ఈ లంక పూర్వము కూడ రాక్షసుల నివాసముగా ఉండేదని నీ మాటలు విని నాకు చాల అధికమైన ఆశ్చర్యము కలుగుచున్నది. 3

మూ. పులస్త్యవంశాదుద్భూతా రాక్షసా ఇతి నః శ్రుతమ్,
ఇదానీమన్యతశ్చాపి సంభవః కీర్తిత స్త్వయా. 4

ప్ర. అ. రాక్షసాః = రాక్షసులు, పులస్త్యవంశాత్ = పులస్త్యవంశమునుండి, ఉద్భూతాః ఇతి = పుట్టినారు అని, నః = మాకు, శ్రుతమ్ = వినబడినది. ఇదానీమ్ = ఇప్పుడు, త్వయా = నీచేత, అన్యతశ్చాపి = ఇతరులవల్ల కూడ, సంభవః = పుట్టుక, కీర్తితః = చెప్పబడినది.

తా. రాక్షసులు పులస్త్యవంశమునందే పుట్టినా రని మేము విని ఉన్నాము. కాని ఇప్పుడు నీవు, ఇతరవంశములందు పుట్టిన రాక్షసులు కూడ ఉండెడివారని చెప్పుచున్నావు. 4

మూ. రావణాత్కుమ్భకర్ణాచ్చ ప్రహస్తాద్వికటాదపి,
రావణస్య చ పుత్రేభ్యః కిం ను తే బలవత్తరాః. 5

ప్ర. అ. తే = వాళ్ళు, రావణాత్ = రావణునికంటె, కుమ్భకర్ణాచ్చ = కుంభకర్ణునికంటె, ప్రహస్తాత్ = ప్రహస్తునికంటె, వికటాదపి = వికటునికంటె, రావణస్య = రావణునియొక్క, పుత్రేభ్యః = పుత్రులకంటె, బలవత్తరాః కిం ను = ఎక్కువ బలము కలవారా ?

తా. ఆ రాక్షసులు రావణ- కుంభకర్ణ-ప్రహస్త-వికటులకంటెను, రావణ పుత్రులకంటెను అధికబలవంతులా ? 5

మూ. క ఏషాం పూర్వకో బ్రహ్మన్ కింనామా చ బలోత్కటః,
అపరాధం చ కం ప్రాప్య విష్ణునా ద్రావితాః కథమ్. 6

ప్ర. అ. సలిలసంభవః=ఉదకమునుండి పుట్టిన, పద్మసంభవః=పద్మము నుండి పుట్టిన, ప్రజాపతిః = బ్రహ్మదేవుడు, అపః = ఉదకములను, సృష్ట్వా= సృష్టించి, తాసామ్ = వాటియొక్క, గోపాయనే= రక్షణమునందు, సత్త్వాన్= ప్రాణులను, అసృజత్ = సృజించెను.

తా. జలములో పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు పగలు గడచిన పిమ్మట భూమిక్రింద ఉన్న సముద్రరూపమైన జలమును సృష్టించి రాత్ర్యంతము నందు ఆ ఉదకమునందే విష్ణునాభికమలములో ఉండి, ఆ ఉదకమును రక్షించు టకై జంతువులను సృజించెను. (ఇది గోవిందరాజులు చెప్పిన భావము). 9

మూ. తే సత్త్వాః సత్త్వకర్తారం వినీతవదుపస్థితాః,
కిం కుర్మ ఇతి భాషన్తః క్షుత్పిపాసాభయార్దితాః. 10

ప్ర. అ. తే = ఆ, సత్త్వాః = ప్రాణులు, క్షుత్పిపాసాభయార్దితాః = ఆకలిచేత, దప్పికచేత, భయముచేత పీడితులై, కిమ్ = ఏమి, కుర్మః = చేయు దుము, ఇతి = అని, భాషన్తః = పలుకుచు, సత్త్వకర్తారమ్ = ప్రాణులను సృష్టించిన ఆ బ్రహ్మదేవుణ్ణి, వినీతవత్ = వినయవంతులై, ఉపస్థితాః = సమీ పించిరి.

తా. ఆ ప్రాణులు ఆకలిచేత, దప్పికచేత, భయముచేత పీడితులై, "మేము ఏమి చేయవలెను ?" అని పలుకుచు, తమను సృష్టించిన ఆ బ్రహ్మదేవునివద్దకు వినయపూర్వకముగా వెళ్ళిరి. 10

మూ. ప్రజాపతిస్తు తాన్ సర్వాన్ ప్రత్యాహ ప్రహసన్నివ,
ఆభాష్య వాచా యత్నేన రక్షధ్వమితి మానవాః. 11

ప్ర. అ. ప్రజాపతిస్తు=బ్రహ్మదేవుడైతే, ప్రహసన్నివ = నవ్వుచు, తాన్ =ఆ, సర్వాన్ = అందరినీ, వాచా=వాక్కుతో, ఆభాష్య = పలకరించి, మానవాః =మానవులారా ! యత్నేన = ప్రయత్నముతో, రక్షధ్వమ్=రక్షించుడు, ఇతి = అని, ప్రత్యాహ = తిరిగి పలికెను.

తా. బ్రహ్మదేవుడు వారి నందరిని మంచి మాటలతో పలకరించి,

తా. ఆ రాక్షసులలో మధుకైటభులతో సమానులైన, శత్రుసంహారకులైన, హేతి, ప్రహేతి అను రాక్షసనాయకులైన సోదరులు ఉండిరి. 14

మూ. ప్రహేతిర్ధార్మిక స్తత్ర తపోవనగత స్తదా,
హేతిర్దారక్రియార్థే తు పరం యత్నమథాకరోత్. 15

ప్ర. అ. తత్ర = వారిలో, ధార్మికః = ధార్మికుడైన, ప్రహేతిః = ప్రహేతి, తదా = అప్పుడు, తపోవనగతః = తపోవనమును పొందెను. అథ = పిమ్మట, హేతిః తు = హేతియైతే, దారక్రియార్థే = వివాహమునిమిత్తము, పరమ్ = గొప్ప, ప్రయత్నమ్ = ప్రయత్నమును, అకరోత్ = చెసెను.

తా. వారిలో ప్రహేతి చాల ధార్మికుడు. అతడు తపోవనమునకు వెళ్ళి పోయెను. అప్పుడు హేతిమాత్రము వివాహము చేసికొనవలె నని గొప్ప ప్రయత్నము చేసెను. 15

మూ. స కాలభగినీం కన్యాం భయాం నామ మహాభయామ్,
ఉదావహదమేయాత్మా స్వయమేవ మహామతిః. 16

ప్ర. అ. అమేయాత్మా = గొప్ప బలము గల, మహామతిః = గొప్పబుద్ధి గల, సః = హేతి, కాలభగినీమ్ = యముని సోదరి, మహాభయామ్ = చాల భయంకరురాలు అయిన, భయాం నామ = భయ అను పేరు గల, కన్యామ్ = కన్యను, స్వయమేవ = స్వయముగనే, ఉదావహత్ = వివాహమాడెను.

తా. గొప్ప బుద్ధిపరాక్రమములు గల ఆ హేతి తానే స్వయముగా వెళ్ళి కోరి యముని సోదరియైన, చాల భయంకరురాలైన భయ అను కన్యను వివాహమాడెను. 16

మూ. స తస్యాం జనయామాస హేతీ రాక్షసపుంగవః,
పుత్రం పుత్రవతాం శ్రేష్ఠో విద్యుత్కేశమితి శ్రుతమ్.

ప్ర. అ. పుత్రవతామ్ = పుత్రవంతులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు, రాక్షసపుంగవః = రాక్షసశ్రేష్ఠుడు అయిన, సః హేతిః = ఆ హేతి, తస్యామ్ = ఆమె యందు, విద్యుత్కేశమితి = విద్యుత్కేశు డను, శ్రుతమ్ = ప్రసిద్ధుడైన, పుత్రమ్ = పుత్రుణ్ణి, జనయామాస = జనింపచేసెను.

తా. పిమ్మట రాక్షసశ్రేష్ఠుడైన హేతి తన కుమారుని నిమిత్తమై సంధ్యతో సమానురాలైన సంధ్యాపుత్రికను వరించెను. 20

మూ. అవశ్యమేవ దాతవ్యా పరస్మై సేతి సంధ్యయా,
చిన్తయిత్వా సుతా దత్తా విద్యుత్కేశాయ రాఘవ. 21

ప్ర. అ. రాఘవ = రామా ! అవశ్యమేవ = తప్పక, పరస్మై = పరునకు, దాతవ్యా = ఇవ్వదగినది, ఇతి = అని, చిన్తయిత్వా = ఆలోచించి, సంధ్యయా = సంధ్యచేత, సా సుతా = ఆ పుత్రిక, విద్యుత్కేశాయ = విద్యుత్కేశునకు, దత్తా = ఇవ్వబడినది.

తా. తప్పక పరునకు ఇవ్వవలసినదే కదా అని ఆలోచించి సంధ్య ఆ పుత్రికను విద్యుత్కేశునకు ఇచ్చెను. 21

మూ. సంధ్యాయాస్తనయాం లబ్ధ్వా విద్యుత్కేశో నిశాచరః,
రమతే స్మ తయా సార్ధం పౌలోమ్యా మఘవానివ. 22

ప్ర. అ. నిశాచరః = రాక్షసుడైన, విద్యుత్కేశః = విద్యుత్కేశుడు, సంధ్యాయాః = సంధ్యయొక్క, తనయామ్ = కుమార్తెను, లబ్ధ్వా = పొంది, మఘవాన్ = ఇంద్రుడు, పౌలోమ్యా ఇవ = శచీదేవితో వలె, తయా సార్ధమ్ = ఆమెతో కూడ, రమతే స్మ = క్రీడించెను.

తా. విద్యుత్కేశుడు సంధ్య కుమార్తెను పొంది, దేవేంద్రుడు శచీదేవితో క్రీడించినట్లు ఆమెతో క్రీడించెను. 22

మూ. కేనచిత్త్వథ కాలేన రామ సాలఙ్కటఙ్కటా,
విద్యుత్కేశాద్గర్భమాప ఘనరాజిరివార్ణవాత్. 23

ప్ర. అ. రామ = రామా ! అథ = అటుపిమ్మట, సాలఙ్కటఙ్కటా = సాలంకటంకట, కేనచిత్ = ఒకానొక, కాలేన = కాలముచేత, ఘనరాజిః = మేఘపంక్తి, అర్ణవాత్ ఇవ = సముద్రమునుండి వలె, విద్యుత్కేశాత్ = విద్యుత్కేశునివలన, గర్భమ్ = గర్భమును, ఆప = పొందెను.

ద్యుతిః = శరత్కాలసూర్యునివంటి కాంతి గల, సః శిశుః = ఆ శిశువు, స్వయమ్ = తానే, ఆస్యే = ముఖమునందు, ముష్టిమ్ = పిడికిలిని, నిధాయ = ఉంచి, తదా = అప్పుడు, శనకైః = మెల్లగా, రురోద = ఏడ్చెను.

తా. ఆమె ఇట్లు విడచివేయగా శరత్కాలసూర్యునివంటి కాంతి గల ఆ శిశువు తానే నోట్లో పిడికిలి పెట్టుకొని మెల్లగా ఏడ్చెను. 26

మూ. తతో వృషభమాస్థాయ పార్వత్యా సహితః శివః,
వాయుమార్గేణ గచ్ఛన్వై శుశ్రావ రుదితస్వనమ్. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వృషభమ్ = వృషభమును, ఆస్థాయ = అధిష్ఠించి, వాయుమార్గేణ = వాయుమార్గముచేత, గచ్ఛన్ = వెళ్ళుచున్న, పార్వత్యా = పార్వతితో, సహితః = కూడిన, శివః = ఈశ్వరుడు, రుదితస్వనమ్ = రోదనధ్వనిని, శుశ్రావ = వినెను.

తా. అప్పుడు పార్వతీసమేతుడై, నందిని ఎక్కి వాయుమార్గములో వెళ్ళుచున్న పరమేశ్వరుడు ఆ ఏడ్పును వినెను. 27

మూ. అపశ్యదుమయా సార్ధం రుదన్తం రాక్షసాత్మజమ్.
కారుణ్యభావాత్పార్వత్యా భవస్త్రిపురసూదనః. 28

ప్ర. అ. పార్వత్యా = పార్వతితో కూడిన, త్రిపురసూదనః = త్రిపుర సంహారకుడైన, భవః = ఈశ్వరుడు, రుదన్తమ్ = ఏడ్చుచున్న, రాక్షసాత్మజమ్ = రాక్షసకుమారుణ్ణి, ఉమయా సార్ధమ్ = పార్వతితో కూడ, కారుణ్యభావాత్ = కారుణ్యముతో, అపశ్యత్ = చూచెను.

తా. పార్వతీసహితుడైన త్రిపురసంహారకుడైన ఈశ్వరుడు ఏడ్చుచున్న ఆ రాక్షసపుత్రుణ్ణి జాలితో చూచెను. 28

మూ. తం రాక్షసాత్మజం చక్రే మాతురేవ వయఃసమమ్,
అమరం చైవ తం కృత్వా మహాదేవోఽక్షరోఽవ్యయః.
పురమాకాశగం ప్రాదాత్పార్వత్యాః ప్రియకామ్యయా,
ఉమయాపి వరో దత్తో రాక్షసీనాం నృపాత్మజ. 30

# ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
# చతుర్థః సర్గః

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాన్ = గొప్పవాడు, మహామతిః = గొప్ప బుద్ధి గలవాడు అయిన, సుకేశః = సుకేశుడు, ప్రభోః = ప్రభువైన, హరస్య = ఈశ్వరునియొక్క, పార్శ్వతః = పార్శ్వమునుండి, శ్రియమ్ = ఐశ్వర్యమును, ప్రాప్య = పొంది, వరదానగర్వితః = వరదానము చేత గర్వించినవాడై, ఖగమ్ = ఆకాశమునందు సంచరించు, పురమ్ = పురమును, ప్రాప్య = పొంది, పురందరో యథా = దేవేంద్రుడు వలె, సర్వత్ర = అంతటా, చచార = సంచరించెను.

తా. గొప్పవాడు, గొప్ప తేజస్సు కలవాడు అయిన సుకేశుడు ప్రభువైన మహేశ్వరుని వైపునుండి ఐశ్వర్యమును పొంది, ఆకాశమునందు సంచరించు నగరమును పొంది దేవేంద్రుడు వలె అంతటా సంచరించెను. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నాల్గవసర్గ సమాప్తము.

లతో ప్రకాశించుచున్న రెండవ లక్ష్మీదేవియా అన్నట్లున్న దేవవతి అను కుమార్తె ఉండెను. ధర్మాత్ముడైన ఆతడు ఆమెను, రాక్షసరాజ్యలక్ష్మిని వలె, సుకేశునకు ఇచ్చెను. 2

మూ. వరదానకృతైశ్వర్యం సా తం ప్రాప్య పతిం ప్రియమ్, 3
ఆసీద్దేవవతీ తుష్టా ధనం ప్రాప్యేవ నిర్ధనః.

ప్ర. అ. సా = ఆ, దేవవతీ = దేవవతి, వరదానకృతైశ్వర్యమ్ = వరదానము చేత చేయబడిన ఐశ్వర్యము గల, ప్రియమ్ = ప్రియుడైన, తమ్ = ఆతనిని, పతిమ్ = భర్తనుగా, ప్రాప్య = పొంది, నిర్ధనః = ధనము లేనివాడు, ధనమ్ = ధనమును, ప్రాప్యేవ = పొంది వలె, తుష్టా = సంతోషించినది, ఆసీత్ = ఆయెను.

తా. వరదానముచేత ఐశ్వర్యవంతుడైన, ప్రియుడైన ఆతనిని భర్తనుగా పొంది దేవవతి, ధనమును పొందిన నిర్ధనుడు వలె, చాల సంతోషించెను. 3

మూ. స తయా సహ సంయుక్తో రరాజ రజనీచరః, 4
అఞ్జనాదభినిష్క్రాన్తః కరేణ్వేవ మహాగజః.

ప్ర. అ. తయా సహ = ఆమెతో కూడ, సంసక్తః = కూడిన, సః రజనీచరః = ఆ రాక్షసుడు, అఞ్జనాత్ = అంజన మను దిగ్గజమునుండి, అభినిష్క్రాన్తః = పుట్టిన, మహాగజః = మహాగజము, కరేణ్వేవ = ఆడఏనుగుతో వలె, రరాజ = ప్రకాశించెను.

తా. ఆమెతో కూడిన ఆ రాక్షసుడు అంజన మను దిగ్గజమునకు పుట్టిన, మహాగజము ఆడఏనుగుతో కలిసి ప్రకాశించినట్లు ప్రకాశించెను. 4

మూ. తతః కాలే సుకేశస్తు జనయామాస రాఘవ,
త్రీన్ పుత్రాన్ జనయామాస త్రేతాగ్నిసమవిగ్రహాన్. 5

ప్ర. అ. రాఘవ = రామా! తతః = అటుపిమ్మట, సుకేశస్తు = సుకేశుడు, కాలే = తగినకాలమునందు, జనయామాస = పుత్రులను కనెను. త్రేతాగ్నిసమవిగ్రహాన్ = మూడు అగ్నులతోసమానములైన శరీరములు గల, త్రీన్ = ముగ్గురు, పుత్రాన్ = పుత్రులను, జనయామాస = కనెను.

మూడు దోషములు వలె ఉన్న, త్రేతాగ్నితో సమానమైన తేజస్సు గల సుకేశుని ముగ్గురు పుత్రులు ఉపేక్షించబడిన వ్యాధులు వలె అక్కడ వృద్ధి పొందిరి. 7,8

మూ. వరప్రాప్తిం పితుస్తే తు జ్ఞాత్వైశ్వర్యం తపోబలాత్,
తప స్తప్తుం గతా మేరుం భ్రాతరః కృతనిశ్చయాః. 9

ప్ర. అ. తే భ్రాతరః = ఆ సోదరులు, పితుః = తండ్రియొక్క, వరప్రాప్తిమ్ = వరముల ప్రాప్తిని, తపోబలాత్ = తపోబలమువల్ల, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును, జ్ఞాత్వా = తెలిసికొని, కృతనిశ్చయాః = చేయబడిన నిశ్చయము గలవారై, తపః = తపస్సును, తప్తుమ్ = చేయుటకు, మేరుమ్ = మేరుపర్వతమును గూర్చి, గతాః = వెళ్ళిరి.

తా. తమ తండ్రికి వరములు లభించిన విషయమును, తపోబలముచేత ఐశ్వర్యము లభించినట్లూ తెలిసికొని ఆ సోదరులు తపస్సు చేయవలె నని నిశ్చయించుకొని, మేరుపర్వతమునకు వెళ్ళిరి. 9

మూ. ప్రగృహ్య నియమాన్ ఘోరాన్ రాక్షసా నృపసత్తమ,
విచేరుస్తే తపో ఘోరం సర్వభూతభయావహమ్. 10

ప్ర. అ. నృపసత్తమ = రాజశ్రేష్ఠుడా ! తే = ఆ, రాక్షసాః = రాక్షసులు, ఘోరాన్ = భయంకరములైన, నియమాన్ = నియమములను, ప్రగృహ్య = గ్రహించి, సర్వభూతభయావహమ్ = సకలప్రాణులకు భయమును కలిగించు, ఘోరమ్ = ఘోరమైన, తపః = తపస్సును, చేరుః = చేసిరి.

తా. రామా ! ఆ రాక్షసులు కఠినములైన నియమములను అవలంబించి, సకలప్రాణులకు భయమును కలిగించు ఘోరమైన తపస్సు చేసిరి. 10

మూ. సత్యార్జవశమోపేతైస్తపోభిర్భువి దుర్లభైః,
సంతాపయన్త్స్త్రీన్ లోకాన్సదేవాసురమానుషాన్. 11

ప్ర. అ. సత్యార్జవశమోపేతైః = సత్యముతోను, ఋజుత్వముతోను, శమముతోను కూడిన, భువి = భూమియందు, దుర్లభైః = దుర్లభములైన, తపోభిః = తపస్సులచేత, సదేవాసురమానుషాన్ = దేవతలతోను, అసురులతోను, మానవుల

ప్ర. అ. దేవ=ఓ! ప్రభూ! తపసా=తపస్సు చేత, ఆరాధితః=పూజించబడిన నీవు, నః= మాకు, వరమ్ = వరమును, దిశసే యది = ఇచ్చినట్లయితే, అజేయాః = జయింప శక్యము కానివారము, శత్రుహన్తారః = శత్రువులను సంహరించేవారము, తథైవ = మరియు చిరజీవినః=చిరకాలము జీవించువారము, ప్రభవిష్ణవః = సర్వసమర్థులము, పరస్పరమ్ = పరస్పరమూ, అనువ్రతాః = ప్రేమకలవారము, భవామ = అగుదుముగాక, ఇతి = అని (పలికిరి).

తా. ప్రభూ ! మా తపస్సుచేత సంతోషించినవాడవై మాకు వరములు ఇవ్వదలచినచో , మేము శత్రువులను నశింపచేసేవారముగాను, జయింప శక్యము కానివారముగాను, చిరకాలము జీవించువారముగాను, అత్యధిక సామర్థ్యము ఉన్న వారముగాను, పరస్పరము స్నేహము కలవారముగాను అగునట్లు వరమిమ్ము.14

మూ. ఏవం భవిష్యథేత్యుక్త్వా సుకేశతనయాన్విభుః,
స యయౌ బ్రహ్మలోకాయ బ్రహ్మ బ్రాహ్మణవత్సలః

ప్ర. అ. విభుః = ప్రభువైన, బ్రాహ్మణవత్సలః = బ్రాహ్మణులయందు ప్రేమ గల, సః బ్రహ్మ = ఆ బ్రహ్మదేవుడు, ఏవమ్ = ఇట్లు, భవిష్యథ = కాగలరు, ఇతి = అని, సుకేశతనయాన్ = సుకేశుని కుమారులను గూర్చి, ఉక్త్వా = పలికి, బ్రహ్మలోకాయ = బ్రహ్మలోకముకొరకు, యయౌ = వెళ్ళెను.

తా. ప్రభువైన, బ్రాహ్మణులయందు ప్రేమ గల ఆ బ్రహ్మదేవుడు సుకేశుని కుమారులతో "అట్లే అయ్యెదరు" అనిపలికి బ్రహ్మలోకానికి వెళ్ళిరి. 15

మూ. వరం లబ్ధ్వా తు తే సర్వే రామ రాత్రించరా స్తదా,
సురాసురాన్ ప్రబాధ న్తే వరదానసునిర్భయాః. 16

ప్ర. అ. రామ = రామా! తదా = అప్పుడు, నర్వే = సమస్తమైన, తే నిశాచరాః = రాక్షసులు, వరమ్ = వరమును, లబ్ధ్వా = పొంది, వరదానసునిర్భయాః = వరదానముచేత చాల భయములేనివారై, సురాసురాన్ = సురులను అసురులను కూడ, ప్రబాధ న్తే = బాధించుచున్నారు

తా. రామా ! ఆ రాక్షసులందరు వరములు పొంది, వరములు పొందుట చేత ఏ మాత్రము భయము లేనివారై సురులను, అసురులను బాధించిరి. 16

మూ. అస్మాకమపి తావత్త్వం గృహం కురు మహామతే,
హిమవన్తముపాశ్రిత్య మేరుమన్దరమేవ వా, 20
మహేశ్వరగృహప్రఖ్యం గృహం నః క్రియతాం మహత్.

ప్ర. అ. మహామతే = గొప్ప బుద్ధి కలవాడా! హిమవన్తమ్ = హిమవత్పర్వతమును గానీ, మేరుమన్దరమేవ వా = మేరుపర్వతమును గాని, మందర పర్వతమును గాని, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, అస్మాకమపి = మాకు కూడ, త్వమ్ = నీవు, గృహమ్ = గృహమును, కురు తావత్ = నిర్మించుము. నః = మాకు, మహేశ్వరగృహప్రఖ్యమ్ = మహేశ్వరుని గృహమువంటి, మహత్ = గొప్పదైన, గృహమ్ = గృహము, క్రియతామ్ = నిర్మించబడుగాక

తా. గొప్ప బుద్ధి గలవాడా! హిమవత్పర్వతము మీద గాని, మేరుపర్వతము మీద గాని, మందరపర్వతముమీద గాని మాకు కూడ గృహమును నిర్మింపుము. మాకు మహేశ్వరుని గృహము వంటి గృహమును నిర్మింపుము. 20

మూ. విశ్వకర్మా తతస్తేషాం రాక్షసానాం మహాభుజః, 21
నివాసం కథయామాస శక్రస్యేవామరావతీమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాభుజః = గొప్ప భుజములు గల, విశ్వకర్మా = విశ్వకర్మ, శక్రస్య = దేవేంద్రునియొక్క, అమరావతీమివ = అమరావతి వంటి, నివాసమ్ = నివాసమును, తేషాం రాక్షసానామ్ = ఆ రాక్షసులకు, కథయామాస = చెప్పెను.

తా. పిమ్మట గొప్ప భుజములు గల విశ్వకర్మ దేవేంద్రుని అమరావతితో సమానమైన నివాసమును గూర్చి ఆ రాక్షసులకు చెప్పెను. 21

మూ. దక్షిణస్యోదధేస్తీరే త్రికూటో నామ పర్వతః, 22
సువేల ఇతి చాప్యన్యో ద్వితీయో రాక్షసేశ్వరాః.

ప్ర అ. రాక్షసేశ్వరాః = రాక్షస ప్రభువులారా! దక్షిణస్య = దక్షిణపు, ఉదధేః = సముద్రముయొక్క, తీరే = తీరమునందు, త్రికూటో నామ = త్రికూటమను, పర్వతః = పర్వత మున్నది. సువేలః ఇతి = సువేల మను, అన్యః = మరియొక, ద్వితీయోఽపి చ = రెండవది కూడ (ఉన్నది).

= పొంది, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, దివౌకసః ఇవ = దేవతలు వలె, తస్యామ్ = దానియందు, వసత = నివసించండి.

తా. రాక్షసశ్రేష్ఠులారా! మీరు ఆ నగరములో, అమరావతిని పొంది ఇంద్రాదిదేవతలు వలె, ఎదిరింప శక్యముకానివారై నివసించండి. 26

మూ. లఙ్కాదుర్గం సమాసాద్య రాక్షసైర్బహుభిర్వృతాః,
భవిష్యథ దురాధర్షాః శత్రూణాం శత్రుసూదనాః. 27

ప్ర. అ. శత్రుసూదనాః=శత్రుసంహారకులారా! లఙ్కాదుర్గమ్ = లంకా దుర్గమును, సమాసాద్య=పొంది, బహుభిః=అనేకులైన, రాక్షసైః=రాక్షసులతో, వృతాః = కూడినవారై, శత్రూణామ్ = శత్రువులకు, దురాధర్షాః = ఎదిరింప శక్యముకానివారు, భవిష్యథ = కాగలరు.

తా. శత్రుసంహారకులారా! లంకాదుర్గము చేరి, అనేకరాక్షసులతో కూడిన మిమ్ములను శత్రువు లెవ్వరూ ఎదిరింపజాలరు. 27

మూ. విశ్వకర్మవచః శ్రుత్వా తతస్తే రాక్షసోత్తమాః,
సహస్రానుచరా భూత్వా గత్వా తామవసన్పురీమ్. 28

ప్ర. అ. తే రాక్షసోత్తమాః = ఆ రాక్షసశ్రేష్ఠులు, విశ్వకర్మవచః = విశ్వకర్మవచనమును, శ్రుత్వా = విని, తతః = అటుపిమ్మట, సహస్రానుచరాః = వేలకొలది అనుచరులు కలవారై, తామ్ = ఆ, పురీమ్ = పట్టణమును గూర్చి, గత్వా = వెళ్ళి, అవసన్ = నివసించిరి.

తా. రాక్షసశ్రేష్ఠులైన ఆ ముగ్గురూ విశ్వకర్మ మాటలు విని వేలకొలది అనుచరులతో కూడినవారై ఆ పురమునకు వెళ్ళి నివసించిరి. 28

మూ. దృఢప్రాకారపరిఖాం హైమైర్గృహశతైర్వృతామ్,
లఙ్కామవాప్య తే హృష్టా న్యవసన్ రజనీచరాః. 29

ప్ర. అ. తే రజనీచరాః = ఆ రాక్షసులు, దృఢప్రాకారతోరణామ్ = దృఢమైన ప్రాకారము పరిఖా గల, హైమైః = బంగారువికారమైన, గృహశతైః =

తా. ఆ నర్మదకు హ్రీదేవి, శ్రీదేవి, కీర్తిదేవి వంటి ముగ్గురు కుమార్తెలు ఉండిరి. రాక్షసజాతికి చెందని ఆ నర్మద పూర్ణచంద్రుని వంటి ముఖములు గల ఆ కన్యకలను జ్యేష్ఠక్రమమున, అనగా పెద్దవానికి పెద్ద కుమార్తెను, రెండవవానికి రెండవ కుమార్తెను, మూడవవానికి మూడవ కుమార్తెను, సంతోషపూర్వకముగా ఇచ్చెను. మహాభాగ్యవతులైన ఆ ముగ్గురు గంధర్వకన్యలను తల్లి ఆ రాక్షస శ్రేష్ఠులకు భగుడు దేవతగా గల ఉత్తరఫల్గునీ నక్షత్రముతో కూడిన దివసము నందు ఇచ్చెను. 31, 32

మూ. కృతదారాస్తు తే రామ సుకేశతనయాస్తదా, 33
చిక్రీడుః సహ భార్యాభిరప్సరోభి రివామరాః.

ప్ర. అ. రామ = రామా! తదా = అప్పుడు, కృతదారాః = వివాహమాడిన, తే = ఆ, సుకేశతనయాః = సుకేశుని పుత్రులు, అమరాః = దేవతలు, అప్సరోభిరివ = అప్సరఃస్త్రీలతో వలె, భార్యాభిః సహ = భార్యలతో కూడ, చిక్రీడుః = క్రీడించిరి.

తా. రామా! అప్పుడు వివాహము చేసికొనిన పిమ్మట సుకేశుని పుత్రులు, దేవతలు అప్సరఃస్త్రీలతో క్రీడించినట్లు క్రీడించిరి. 33

మూ. తతో మాల్యవతో భార్యా సున్దరీ నామ సున్దరీ, 34
స తస్యాం జనయామాస యదపత్యం నిబోధ తత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మాల్యవతః = మాల్యవంతుని యొక్క, భార్యా = భార్య, సున్దరీ నామ = సుందరి అను, సున్దరీ = సౌందర్యవతి. సః = అతడు, తస్యామ్ = ఆమెయందు, యత్ = ఏ, అపత్యమ్ = సంతానమును, జనయామాస = పుట్టించెనో, తత్ = దానిని గూర్చి, నిబోధ = తెలిసికొనుము.

తా. సుందరి అను పేరు గల సౌందర్యవతి మాల్యవంతుని భార్య. ఆతడు ఆమెయందు ఏ సంతానమును పుట్టించెనో తెలిసికొనుము. (వినుము). 34

మూ. వజ్రముష్టి ర్విరూపాక్షో దుర్ముఖ శ్చైవ రాక్షసః, 35
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ మత్తోన్మత్తౌ తథైవ చ,
అనలా చాభవత్కన్యా సున్దర్యాం రామ సున్దరీ. 36

సంహ్రాదిః ప్రఘసశ్చైవ భాసకర్ణశ్చ రాక్షసః,
రాకాపుష్పోత్కటా చైవ కైకసీ చ శుచిస్మితాః,
కుమ్భీనసీ చ ఇత్యేతే సుమాలేః ప్రసవాః స్మృతాః. 40

ప్ర. అ. ప్రహస్తః = ప్రహస్తుడు, అకమ్పనశ్చైవ = అకంపనుడు, వికటః = వికటుడు, కాలికా ముఖః = కాలికాముఖుడు, ధూమ్రాక్షశ్చైవ = ధూమ్రాక్షుడు, దణ్డశ్చ=దండుడు, మహాబలః=గొప్పబలము గల, సుపార్శ్వశ్చ = సుపార్శ్వుడు, సంహ్రాదిః = సంహ్రాది, ప్రఘసః చైవ=ప్రఘసుడు, రాక్షసః= రాక్షసుడైన, భాసకర్ణశ్చ = భాసకర్ణుడు, శుచిస్మితాః = తెల్లని చిరునవ్వు గల, రాకా = రాక, పుష్పోత్కటా చైవ = పుష్పోత్కట, కైకసీ = కైకసి, కుమ్భీనసీ చ = కుంభీనసి, ఇత్యేతే = వీళ్ళు, సుమాలేః = సుమాలియొక్క, ప్రసవాః = సంతానముగా, స్మృతాః = చెప్పబడినారు.

తా. ప్రహస్తుడు, అకంపనుడు, వికటుడు, కాలికాముఖుడు, ధూమ్రాక్షుడు, దండుడు, సుపార్శ్వుడు, సంహ్రాది, ప్రఘసుడు, భాసకర్ణుడు అను పుత్రులు, తెల్లని చిరునవ్వు గల రాక, పుష్పోత్కట, కైకసి, కుంభీనసి అను కుమార్తెలు సుమాలి సంతానము. 39, 40

మూ. మాలేస్తు వసుదా నామ గన్ధర్వీ రూపశాలినీ,
భార్యాసీత్పద్మపత్రాక్షీ స్వక్షీ యక్షీవరోపమా. 41

ప్ర. అ. రూపశాలినీ = రూపముతో ప్రకాశించునది, పద్మపత్రాక్షీ = పద్మపత్రములవంటి నేత్రములు కలది, స్వక్షీ = అందమైన నేత్రము గలది, యక్షీవరోపమా = శ్రేష్ఠమైన యక్షస్త్రీతో సమానురాలు అయిన, వసుదా నామ=వసుద అను, గన్ధర్వీ = గంధర్వస్త్రీ, మాలేః = మాలియొక్క, భార్యా = భార్యగా, ఆసీత్ = అయెను.

తా. సౌందర్యముతో ప్రకాశించునది, పద్మపత్రములవంటి నేత్రములు గలది, అందమైన నేత్రములు గలది, శ్రేష్ఠురాలైన యక్షస్త్రీతో సమానురాలు అయిన వసుద అను గంధర్వస్త్రీ మాలికి భార్య ఆయెను. 41

మూ. సుమాలేరనుజస్తస్యాం జనయామాస యత్ప్రభో,
అపత్యం కథ్యమానం తు మయా త్వం శృణు రాఘవ.

మూ. జగద్భ్రమన్తోఽనిలవద్దురాసదా
రణేషు మృత్యుప్రతిమానతేజసః.
వరప్రదానాదపి గర్వితా భృశం
క్రతుక్రియాణాం ప్రశమంకరాః సదా. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చమః సర్గః.

ప్ర. అ. అనిలవత్ = వాయువు వలె, జగత్ = జగత్తును, భ్రమన్తః = తిరుగుచున్నవారై, దురాసదాః = ఎదిరింప శక్యముకానివారై, రణేషు = యుద్ధములయందు, మృత్యుప్రతిమానతేజసః = మృత్యువుతో సమానమైన తేజస్సు కలవారై, వరప్రదానాత్ అపి = వరములను ఇచ్చుటవలన కూడ, భృశమ్ = మిక్కిలి, గర్వితాః = గర్వించినవారై, సదా = ఎల్లప్పుడు, క్రతుక్రియాణామ్ = యజ్ఞక్రియలకు, ప్రశమంకరాః = శాంతిని చేయుచున్నవారై, (దేవాదులను బాధించిరి).

తా. యుద్ధములందు మృత్యువుతో సమానమైన తేజస్సు గలవారు, ఎదిరింప శక్యము కానివారు, బ్రహ్మ వరములు ఇచ్చుటచేత మిక్కిలి గర్వితులు అయిన ఆ రాక్షసులు ఎల్లప్పుడు యజ్ఞములకు విఘాతము చేయుచు, వాయువు వలె జగత్తునందు అంతటా తిరుగుచు అందరినీ బాధించిరి. 45

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
ఐదవ సర్గ సమాప్తము.

ముల శత్రువు, త్రిలోచనమ్ = మూడు నేత్రములు కలవాడు అయిన మహేశ్వ రుణ్ణి, సమేత్య = చేరి, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్ళు గలవారై, భయగద్గద భాషిణః = భయముచేత గద్గదముగా మాటలాడుచు, ఊచుః = పలికిరి.

తా. జగత్సృష్టిలయములు చేయువాడు, పుట్టుక లేనివాడు, వ్యక్తము కాని రూపము గలవాడు, సకలలోకములకు ఆధారమైనవాడు, అందరూ ఆరాధించ దగిన పరమగురువు, మన్మథశత్రువు, మూడు పురముల శత్రువు, మూడు నేత్ర ములు గలవాడు అయిన మహేశ్వరునివద్దకు వెళ్ళి, దేవతలు అంజలులు ఘటించి, భయముచేత డగ్గుత్తిక పొందిన కంఠస్వరములతో ఇట్లు పలికిరి. 2, 3.

మూ. సుకేశపుత్త్రైర్భగవన్ పితామహవరోద్ధతైః,
ప్రజాధ్యక్ష ప్రజాః సర్వా బాధ్యన్తే రిపుబాధకైః. 4

ప్ర. అ. ప్రజాధ్యక్ష = ప్రజలకు ప్రభువైనవాడా ! భగవన్=పూజ్యుడా! పితామహవరోద్ధతైః = బ్రహ్మవరములచేత దృప్తులైన, రిపుబాధకైః = శత్రువు లను బాధించు, సుకేశపుత్త్రైః = సుకేశుని పుత్రులచేత, సర్వాః = సమస్తమైన, ప్రజాః = ప్రజలు, బాధ్యన్తే = బాధింపబడుచున్నారు.

తా. ప్రజల ప్రభువైన ఓ ! పూజ్యుడా ! బ్రహ్మ ఇచ్చిన వరములచేత గర్వించి ఉన్న, శత్రువులను బాధించువారైన సుకేశుని పుత్రులు ప్రజల నందరిని బాధించుచున్నారు. 4

మూ. శరణాన్యశరణ్యాని హ్యాశ్రమాణి కృతాని నః,
స్వర్గాచ్చ దేవాన్ ప్రచ్యావ్య స్వర్గే క్రీడన్తి దేవవత్. 5

ప్ర. అ. నః = మాయొక్క, శరణాని = గృహములు, ఆశ్రమాణి = ఆశ్రమములు, అశరణ్యాని = రక్షణమును ఇచ్చునవి కానివిగా, కృతాని = చేయ బడినవి. స్వర్గాత్ = స్వర్గమునుండి, దేవాన్ = దేవతలను, ప్రచ్యావ్య=తొలగించి, స్వర్గే = స్వర్గమునందు, దేవవత్ = దేవతలవలె, క్రీడన్తి = క్రీడించుచున్నారు.

తా. ఆ రాక్షసులు మా గృహములను, ఆశ్రమములను రక్షణ ఇవ్వని ప్రదేశములుగా చేసివేసినారు. స్వర్గమునుండి దేవతలను వెడలగొట్టి స్వర్గములో దేవతల వలె క్రీడించుచున్నారు.

మూ. ఇత్యుక్తస్తు సురైః సర్వైః కపర్దీ నీలలోహితః,
సుకేశం ప్రతి సాపేక్షః ప్రాహ దేవగణాన్ ప్రభుః. 9

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, సురైః = దేవతలచేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడిన, కపర్దీ = కపర్ద మను జట ధరించిన, ప్రభుః = ప్రభువైన, నీలలోహితః = శివుడు, సుకేశం ప్రతి = సుకేశుణ్ణి గూర్చి, సాపేక్షః = ప్రేమ కలవాడై, దేవగణాన్ = దేవతాగణములను గూర్చి, ప్రాహ = పలికెను.

తా. దేవతలు అందరు ఈ విధముగా ప్రార్థింపగా జటాధారి, ప్రభువు అయిన శివుడు తనను ఆశ్రయించిన సుకేశుని విషయమున పక్షపాతము గల వాడగుటచేత, దేవగణములతో ఇట్లు పలికెను. 9

మూ. అహం తాన్న హనిష్యామి మమావధ్యా హి తే సురాః,
కిం తు మన్త్రం ప్రదాస్యామి యో వై తాన్నిహనిష్యతి.

ప్ర. అ. సురాః = దేవతలారా ! అహమ్ = నేను, తాన్ = వాళ్ళను, న హనిష్యామి = చంపను. తే = వాళ్ళు, మమ = నాకు, అవధ్యాః హి = చంప దగనివారు కదా. కిం తు = కాని, యః వై = ఎవడు, తాన్ = వాళ్ళను, నిహ నిష్యతి = చంపగలడో, మన్త్రమ్ = అట్టి ఆలోచనను, ప్రదాస్యామి = ఇచ్చెదను.

తా. దేవతలారా ! వాళ్ళు నేను చంపదగినవారు కాదు, అందుచేత నేను వాళ్ళను చంపను. కాని ఎవడు వాళ్ళను చంపగలడో దానిని గూర్చిన ఆలోచన చెప్పెదను. 10

మూ. ఏతమేవ సముద్యోగం పురస్కృత్య మహర్షయః,
గచ్ఛధ్వం శరణం విష్ణుం హనిష్యతి స తాన్ ప్రభుః.

ప్ర. అ. మహర్షయః = మహర్షులారా ! ఏతమ్ = ఈ, సముద్యోగమ్ ఏవ = ప్రయత్నమునే, పురస్కృత్య = పురస్కరించుకొని, విష్ణుమ్ = విష్ణువును, శరణమ్ = శరణము, గచ్ఛధ్వమ్ = పొందుడు. ప్రభుః = సమర్థుడైన, సః = అతడు, తాన్ = వాళ్ళను, హనిష్యతి = చంపగలడు.

తా. మహర్షులారా ! ఈ ప్రయత్నమునే పురస్కరించుకొని విష్ణువును శరణుపొందుడు. సమర్థుడైన అతడు వాళ్ళను చంపగలడు. 11

ప్ర. అ. దుర్గా = ప్రవేశింప శక్యము కాని, లఙ్కా నామ = లంక అను, పురీ = పట్టణము, త్రికూటశిఖరే = త్రికూటపర్వతశిఖరమునందు, స్థితా = ఉన్నది. తత్ర = దానియందు, స్థితాః = ఉన్నవారై, క్షణదాచరాః = రాక్షసులు, నః = మమ్ములను, సర్వాన్ = అందరినీ, ప్రబాధన్తే = బాధించుచున్నారు.

తా. త్రికూటపర్వతశిఖరముమీద లంక అను ఇతరులు ప్రవేశింప శక్యము కాని పట్టణ మున్నది. రాక్షసులు దానియందు నివసించుచు మమ్ముల నందరినీ బాధించుచున్నారు. 15

మూ. స త్వమస్మద్ధితార్థాయ జహి తాన్మధుసూదన,
శరణం త్వాం వయం ప్రాప్తా గతిర్భవ సురేశ్వర. 16

ప్ర. అ. సురేశ్వర = దేవతాప్రభువైన, మధుసూదన = ఓ ! మధుసూదనా! సః త్వమ్ = అట్టి నీవు, అస్మద్ధితార్థాయ = మా హితముకొరకు, తాన్ = వాళ్ళను, జహి = చంపుము. వయమ్ = మేము, త్వామ్ = నిన్ను, శరణం ప్రాప్తాః = శరణు పొందినాము. గతిః = గతివిగా, భవ = అగుము.

తా. దేవతల ప్రభువైన ఓ ! మధుసూదనా ! అట్టి నీవు మా హితము కొరకై ఆ రాక్షసులను చంపుము. నిన్ను శరణుజొచ్చినాము. మాకు గతివి అగుము. 16

మూ. చక్రకృత్తాస్యకమలాన్నివేదయ యమాయ వై,
భయేష్వభయదోఽస్మాకం నాన్యోఽస్తి భవతా వినా. 17

ప్ర. అ. చక్రకృత్తాస్యకమలాన్ = చక్రముచేత తెగగొట్టబడిన ముఖపద్మములు గల ఆ రాక్షసులను, యమాయ = యమునికొరకు, నివేదయ = సమర్పించుము; భవతా వినా = నీవు తప్ప, అస్మాకమ్ = మాకు, భయేషు = భయములయందు, అభయదః = అభయము నిచ్చువాడు, అన్యః = మరియొకడు, నాస్తి = లేడు.

తా. ఆ రాక్షసుల ముఖపద్మములను చక్రముచేత చేదించి వాళ్ళను యమలోకమునకు పంపుము. భయములు కలిగినప్పుడు అభయ మిచ్చువాడు నీవు తప్ప మాకు మరెవ్వరూ లేరు. 17

మూ. తానహం సమతిక్రాన్తమర్యాదాన్ రాక్షసాధమాన్,
నిహనిష్యామి సంక్రుద్ధః సురా భవత విజ్వరాః. 21

ప్ర. అ. సురాః = దేవతలారా ! సమతిక్రాన్తమర్యాదాన్ = దాటబడిన కట్టుబాట్లు గల, తాన్ = ఆ, రాక్షసాధమాన్ = రాక్షసాధములను, సంక్రుద్ధః = కోపించిన, అహమ్ = నేను, నిహనిష్యామి = చంపగలను. విగతజ్వరాః = పోయిన మనస్తాపము గలవారుగా, భవత = అగుడు.

తా. దేవతలారా ! కట్టుబాట్లు అతిక్రమించిన ఆ రాక్షసులను నేను కోపావిష్టుడనై సంహరించెదను. మనస్తాపమును విడిచిపెట్టుడు. 21

మూ. ఇత్యుక్తాస్తే సురాః సర్వే విష్ణునా ప్రభవిష్ణునా,
యథావాసం యయుర్హృష్టాః ప్రశంసన్తో జనార్దనమ్. 22

ప్ర. అ. ప్రభవిష్ణునా = సమర్థుడైన, విష్ణునా = విష్ణువుచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, సర్వే = సమస్తమైన, తే = ఆ, సురాః = దేవతలు, హృష్టాః = సంతోషించినవారై, జనార్దనమ్ = విష్ణువును, ప్రశంసన్తః = ప్రశంసించుచు, యథావాసమ్ = తమ తమ నివాసములను అనుసరించి, యయుః = వెళ్ళిరి.

తా. సమర్థుడైన విష్ణువు మాటలు విని ఆ దేవత లందరు సంతోషించి, విష్ణువును ప్రశంసించుచు తమ తమ గృహములకు వెళ్ళిరి. 22

మూ. విబుధానాం సముద్యోగం మాల్యవాంస్తు నిశాచరః,
శ్రుత్వా తౌ భ్రాతరౌ వీరావిదం వచనమబ్రవీత్. 23

ప్ర. అ. నిశాచరః = రాక్షసుడైన, మాల్యవాంస్తు = మాల్యవంతుడైతే, విబుధానామ్ = దేవతలయొక్క, సముద్యోగమ్ = ప్రయత్నమును, శ్రుత్వా = విని, వీరౌ = వీరులైన, తౌ = ఆ, భ్రాతరౌ = సోదరులను గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాక్షసుడైన మాల్యవంతుడు దేవతల ప్రయత్నమును గూర్చి విని, వీరులైన తన సోదరులతో ఇట్లు పలికెను. 23

మూ. తదస్మాకం హితార్థాయ జహి తాంశ్చ త్రిలోచన,
రాక్షసాన్ హుంకృతేనైవ దహ ప్రదహతాం వర. 27

ప్ర. అ. త్రిలోచన = ఓ ! మహేశ్వరా ! తత్ = ఆకారణమువలన, అస్మాకమ్ = మాయొక్క, హితార్థాయ = హితముకొరకు, తాన్ = వాళ్ళను, జహి = చంపుము. ప్రదహతామ్ = కాల్చివేయువారిలో, వర = శ్రేష్ఠుడా ! రాక్షసాన్ = రాక్షసులను, హుంకృతేనైవ = హుంకారముచేతనే, దహ = కాల్చి వేయుము. 27

తా. మూడు నేత్రములు కలవాడా ! అందువలన మా హితముకొరకై వాళ్ళను చంపివేయుము. దహించువారిలో శ్రేష్ఠుడా ! ఆ రాక్షసులను హుంకారము చేతనే కాల్చివేయుము. 27

మూ. ఇత్యేవం త్రిదశైరుక్తో నిశమ్యాన్ధకసూదనః,
శిరః కరౌ చ ధున్వాన ఇదం వచనమబ్రవీత్. 28

ప్ర. అ. త్రిదశైః = దేవతలచేత, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, అన్ధకసూదనః = అంధకాసురసంహారియైన ఈశ్వరుడు, నిశమ్య = విని, శిరః = శిరస్సును, కరౌ చ = హస్తములను, ధున్వానః = కదల్చుచు, ఇదం వచనమ్ = ఈ వచనమును. అబ్రవీత్ = పలికెను.

తా. దేవతల మాటలు విని మహేశ్వరుడు శిరస్సు,హస్తములు కదల్చుచు ఇట్లు పలికెను. 28

మూ. అవధ్యా మమ తే దేవాః సుకేశతనయా రణే,
మన్త్రం తు వః ప్రదాస్యామి యస్తాన్వై విహనిష్యతి.

ప్ర. అ. దేవాః = దేవతలారా ! తే = ఆ, సుకేశతనయాః = సుకేశ పుత్రులు, రణే = యుద్ధమునందు, మమ = నాకు, అవధ్యాః = చంపదగనివారు. యః = ఎవడు, తాన్ = వాళ్ళను, విహనిష్యతి = చంపగలడో, మన్త్రం తు = ఆలోచననైతే, వః = మీకు, ప్రదాస్యామి = ఇచ్చెదను.

తా. దేవతలారా ! నేను యుద్ధములో సుకేశుని పుత్రులను చంపుటకు వీలులేదు. వాళ్ళను ఎవడు చంపగలడో ఆ ఉపాయమును మీకు చెప్పెదను. 29

మూ. దేవానాం భయభీతానాం హరిణా రాక్షసర్షభౌ,
ప్రతిజ్ఞాతో వధోఽస్మాకం చిన్త్యతాం యదిహ క్షమమ్.

ప్ర. అ. రాక్షసర్షభౌ = రాక్షసశ్రేష్ఠులారా! భయభీతానామ్ = భయ హేతువువలన భయపడిన, దేవానామ్ = దేవతలకు, హరిణా = విష్ణువుచేత, అస్మాకమ్ = మనయొక్క, వధః = వధ, ప్రతిజ్ఞాతః = ప్రతిజ్ఞచేయబడినది. ఇహ = ఈ విషయమునందు, యత్ = ఏది, క్షమమ్ = యుక్తమో, చిన్త్యతామ్ ఆలోచించబడుగాక.

తా. ఓ! రాక్షసశ్రేష్ఠులారా! మనలను చంపెదనని విష్ణువు భయార్తులైన దేవతలకు ప్రతిజ్ఞచేసి చెప్పినాడు. ఈ విషయమునందు ఏమి చేయుట యుక్తమో ఆలోచించుడు. 33

మూ. హిరణ్యకశిపోర్మృత్యురన్యేషాం చ సురద్విషామ్,
నముచిః కాలనేమిశ్చ సంహ్రాదో వీరసత్తమః. 34
రాధేయో బహుమాయీ చ లోకపాలోఽథ ధార్మికః,
యమలార్జునౌ చ హార్దిక్యః శుమ్భశ్చైవ నిశుమ్భకః. 35
అసురా దానవాశ్చైవ సత్త్వవన్తో మహాబలాః,
సర్వే సమరమాసాద్య న శ్రూయన్తేఽపరాజితాః. 36

ప్ర. అ. హిరణ్యకశిపోః = హిరణ్యకశిపునకు, అన్యేషామ్ = ఇతరులైన, సురద్విషాం చ = రాక్షసులకు, మృత్యుః = మరణము (వచ్చినది). నముచిః = నముచి, కాలనేమిశ్చ = కాలనేమి, వీరసత్తమః = ఉత్తమవీరుడైన, సంహ్రాదః = సంహ్రాదుడు, బహుమాయీ = చాల మాయలు గల, రాధేయః = రాధేయుడు, అథ = మరియు, ధార్మికః = ధార్మికుడైన, లోకపాలః = లోకపాలుడు, యమలార్జునౌ చ = యమలార్జునులు, హార్దిక్యః = హార్దిక్యుడు, శుమ్భశ్చైవ = శుంభుడు, నిశుమ్భకః = నిశుంభకుడు, సత్త్వవన్తః = ధైర్యముగల, మహాబలాః = గొప్ప బలము గల, అసురాః = అసురులు, దానవాశ్చైవ = దానవులు, సర్వే = వీరందరూ, సమరమ్ = యుద్ధమును, ఆసాద్య = పొంది, అపరాజితాః = పరాజయము పొందింపబడనివారుగా, న శ్రూయన్తే = వినబడుటలేదు.

తా. ఈ విషయమును తెలిసికొని మన అందరికీ తగిన కార్యము చేయుడు. మనలను చంపుటకై నిర్ణయించుకొన్న నారాయణుణ్ణి జయించుట కష్టము. 38

మూ. తతః సుమాలీ మాలీ చ శ్రుత్వా మాల్యవతో వచః,
ఊచతుర్భ్రాతరం జ్యేష్ఠమశ్వినావివ వాసవమ్. 39

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమాలీ = సుమాలి, మాలీ చ = మాలీ కూడ, మాల్యవతః = మాల్యవంతునియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, అశ్వినౌ = అశ్వినీదేవతలు, వాసవమివ = ఇంద్రుని గూర్చి వలె, జ్యేష్ఠం భ్రాతరమ్ = అన్నగారిని గూర్చి, ఊచతుః = పలికిరి.

తా. అన్నగారి మాటలు విన్న సుమాలి, మాలీ కూడ, అశ్వినీదేవతలు దేవేంద్రునితో పలికి నట్లు అన్నగారితో ఇట్లు పలికిరి. 39

మూ. స్వధీతం దత్తమిష్టం చ ఐశ్వర్యం పరిపాలితమ్,
ఆయుర్నిరామయం ప్రాప్తం సుధర్మః స్థాపితః పథి. 40

ప్ర. అ. స్వధీతమ్ = బాగా అధ్యయనము చేయబడినది. దత్తమ్ = ఇవ్వ బడినది. ఇష్టం చ = యాగము చేయబడినది. ఐశ్వర్యమ్ = ఐశ్వర్యము, పరిపాలితమ్ = పాలించబడినది. నిరామయమ్ = రోగములు లేని, ఆయుః = ఆయుర్దాయము, ప్రాప్తమ్ = పొందబడినది. సుధర్మః = మంచి ధర్మము, పథి = మార్గమునందు, స్థాపితః = స్థాపించబడినది.

తా. మనము బాగా అధ్యయనము చేసినాము. దానములు ఇచ్చినాము. యాగాలు చేసినాము. ఐశ్వర్యము పాలించినాము. రోగములు లేని ఆయుర్దాయమును పొందినాము. మంచి ధర్మమార్గమును నిలిపినాము. 40

మూ. దేవసాగరమక్షోభ్యం శస్త్రైః సమవగాహ్య చ,
జితా ద్విషో హ్యప్రతిమా స్తన్నో మృత్యుకృతం భయమ్.

ప్ర. అ. అక్షోభ్యమ్ = క్షోభింప శక్యము కాని, దేవసాగరమ్ = దేవతా సముద్రమును, శస్త్రైః = ఆయుధములతో, సమవగాహ్య చ = ప్రవేశించి, అప్రతిమాః = సాటి లేని, ద్విషః = శత్రువులు, జితాః = జయించబడినారు. తత్ =

యేభ్యః = ఏ దేవతలనుండి, దోషః = ఈ దోషము, సముత్థితః = కలిగినదో, దేవానేవ = అట్టి దేవతలనే, జిఘాంసామః = చంపుటకు ఇచ్ఛయించెదము.

తా. అందువలన ఇప్పుడే కలిసి వెళ్ళి. ఒకరి నొకరు రక్షించుకొనుచు, ఈ దోషమునకు కారణభూతులైన దేవతలను చంపెదము. 44

మూ. ఏవం సంమన్త్ర్య బలినః సర్వసైన్యసమావృతాః,
ఉద్యోగం ఘోషయిత్వా తు సర్వే నైరృతపుంగవాః, 45
యుద్ధాయ నిర్యయుః క్రుద్ధా జమ్భవృత్రాదయో యథా.

ప్ర. అ. బలినః = బలవంతులైన, సర్వే=సమస్తమైన, నైరృతపుంగవాః = రాక్షసశ్రేష్ఠులు, ఏవమ్ = ఇట్లు, సంమన్త్ర్య = ఆలోచించి, సర్వసైన్యసమావృతాః = సమస్తసైన్యముతో కూడినవారై, ఉద్యోగమ్ = తమప్రయత్నమును, ఘోషయిత్వా = చాటించి, క్రుద్ధాః = కోపించినవారై, జమ్భవృత్రాదయో యథా = జంభుడు వృత్రాసురుడు మొదలైనవారు వలె, యుద్ధాయ = యుద్ధముకొరకు, నిర్యయుః = బయలుదేరిరి.

తా. బలవంతులైన ఆ రాక్షసశ్రేష్ఠులు ఈ విధముగా ఆలోచించి సకల సైన్యములతో కూడినవారై తమ ప్రయత్నమును చాటించి, జంభ-వృత్రాసురాదులు వలె, కోపముతో యుద్ధానికి బయలుదేరిరి. 45

మూ. ఇతి తే రామ సంమన్త్ర్య సర్వోద్యోగేన రాక్షసాః, 46
యుద్ధాయ నిర్యయుః సర్వే మహాకాయా మహాబలాః.

ప్ర. అ. రామ = రామా ! మహాకాయాః = గొప్ప దేహములు గల, మహాబలాః = గొప్పబలము గల, సర్వే = సమస్తమైన, తే రాక్షసాః = ఆ రాక్షసులు, ఇతి = ఇట్లు, సంమన్త్ర్య = ఆలోచించి, సర్వోద్యోగేన = సమస్తప్రయత్నముచేత, యుద్ధాయ = యుద్ధముకొరకు, నిర్యయుః = బయలుదేరిరి.

తా. రామా ! పెద్ద శరీరములు గల, మహాబలశాలులైన ఆ రాక్షసులందరూ ఈ విధముగా ఆలోచించి అన్ని విధముల ప్రయత్నములు చేసి యుద్ధమునకై బయలుదేరిరి. 46

ప్ర. అ. అథ = అటుపిమ్మట, లఙ్కాలయాని = లంక నివాసముగా గల, యాని = ఏ, భూతాని = ప్రాణులు గలవో అవి, లఙ్కావిపర్యయమ్ = లంకలోని మార్పును, దృష్ట్వా = చూచి, సర్వశః = అన్ని వైపులా, భయదర్శిని = భయము చూచుచున్నవై, విమనస్కాని = ఉత్సాహశూన్యమైన మనస్సులు కలవి అయినవి.

తా. పిమ్మట లంకలో నివసించు ప్రాణులన్నీ లంకలో కనబడుచున్న లోకవిరుద్ధములైన విషయములను చూచి, భయము రానున్నదని భావించుచు, మనస్సులో దిగులు చెందినవి. 50

మూ. రథోత్తమైరుహ్యమానాః శతశోఽథ సహస్రశః, 51
ప్రయాతా రాక్షసాస్తూర్ణం దేవలోకం ప్రయత్నతః,
రక్షసామేవ మార్గేణ దైవతాన్యపచక్రముః. 52

ప్ర. అ. అథ = అటుపిమ్మట, శతశః = వందలకొలది, సహస్రశః = వేలకొలది, రాక్షసాః = రాక్షసులు, రథోత్తమైః = శ్రేష్ఠములైన రథములచేత, ఉహ్యమానాః = మోయబడుచున్నవారై, ప్రయత్నతః = ప్రయత్నపూర్వకముగా, తూర్ణమ్ = శీఘ్రముగా, దేవలోకమ్ = దేవలోకమును గూర్చి, ప్రయాతాః = వెళ్ళిరి. దైవతాని = దేవతలు, రక్షసామ్ = రాక్షసులయొక్క, మార్గేణైవ = మార్గముచేతనే, అపచక్రముః = పారిపోయిరి.

తా. వందలకొలది, వేలకొలది రాక్షసులు శ్రేష్ఠములైన రథము లెక్కి, శీఘ్రముగా, ప్రయత్నపూర్వకముగా స్వర్గలోకమునకు వెళ్ళిరి. వాళ్ళు అటు బయలుదేరగానే దేవతలు ఇటు పారిపోయిరి. 51, 52

మూ. భౌమాశ్చైవాన్తరిక్షాశ్చ కాలాజ్ఞప్తా భయావహాః,
ఉత్పాతా రాక్షసేన్ద్రాణామభావాయ సముత్థితాః. 53

ప్ర. అ. భౌమాశ్చైవ = భూమికి సంబంధించినవి, ఆన్తరిక్షాశ్చ = అంతరిక్షమునకు సంబంధించినవి అయిన, భయావహాః = భయంకరములైన, ఉత్పాతాః = దుశ్శకునములు, కాలాజ్ఞప్తాః = కాలముచేత అజ్ఞాపించబడినవై, రాక్షసేన్ద్రాణామ్ = రాక్షసప్రభువులయొక్క, అభావాయ = వినాశముకొరకు, సముత్థితాః = బయలుదేరినవి.

మూ. సంపతన్త్యథ భూతాని దృశ్యన్తే చ యథాక్రమమ్,
గృధ్రచక్రం మహచ్చాత్ర ప్రజ్వాలోద్గారిభిర్ముఖైః. 56
రక్షోగణస్యోపరిష్టాత్పరిభ్రమతి కాలవత్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, భూతాని = పృథివ్యాది భూతములు (లేదా ప్రాణులు) యథాక్రమమ్ = క్రమానుసారముగా, సంపతన్తి = పడిపోవుచున్నవిగా, దృశ్యన్తే = కనబడుచున్నవి. అత్ర = ఇక్కడ, మహత్ = గొప్పదైన, గృధ్ర చక్రమ్ = గ్రద్దల సముదాయము, ప్రజ్వాలోద్గారిభిః = గొప్ప జ్వాలలను విడచు చున్న, ముఖైః = ముఖములతో, కాలవత్ = యముడువలె, రక్షోగణస్య = రాక్షస సముదాయము యొక్క, ఉపరి = పైన, భ్రమతి = తిరుగుచున్నది.

తా. పృథివ్యాదిమహాభూతములు (లేదా ప్రాణులు) క్రమానుసారముగా పడిపోవుచున్నట్లు కనబడెను. గ్రద్దల పెద్ద గుంపు జ్వాలలు కక్కుచున్న ముఖా లతో యముడు వలె రాక్షసుల పైన తిరుగుచుండెను. 56

మూ. కపోతా రక్తపాదాశ్చ సారికా విద్రుతా యయుః, 57
కాకా వాశ్యన్తి తత్రైవ బిడాలాశ్చ ద్విపాదికాః.

ప్ర. అ. రక్తపాదాః = ఎఱ్ఱని పాదములు గల, కపోతాః = పావురములు, సారికాః = గోరింకలు, విద్రుతాః = పరుగెత్తినవై, యయుః = వెళ్ళినవి. తత్రైవ = అక్కడనే, కాకాః = కాకులు, బిడాలాశ్చ = పిల్లులు, ద్విపాదికాః = రెండు పాద ములు గలవి, వాశ్యన్తి = కూయుచున్నవి.

తా. ఎఱ్ఱని పాదాలు గల పావురములు, గోరింకలు పరుగెత్తుచు అక్క డికి వచ్చెను. కాకులు, పిల్లులు, ద్విపాదికలు కూయుచుండెను. 57

మూ. ఉత్పాతాంస్తాననాదృత్య రాక్షసా బలదర్పితాః, 58
యాన్త్యేవ న నివర్తన్తే మృత్యుపాశావపాశితాః.

ప్ర. అ. బలదర్పితాః = బలముచేత గర్వించిన, రాక్షసాః = రాక్షసులు, తాన్ = ఆ, ఉత్పాతాన్ = అపశకునములను, అనాదృత్య = అనాదరము చేసి, మృత్యుపాశావపాశితాః = మృత్యుపాశముచేత కట్టబడినవారై, యాన్త్యేవ = వెళ్ళు చునే ఉన్నారు, న నివర్తన్తే = మరలుట లేదు.

తా. మహామేఘముల వలె అధికముగా గర్జించుచున్న ఆ రాక్షససైన్యము మాలి నాయకత్వములో, జయమును కోరుచు దేవలోకమునకు వెళ్ళెను. 61

మూ. రాక్షసానాం సముద్యోగం తం తు నారాయణః ప్రభుః,
దేవదూతాదుపశ్రుత్య చక్రే యుద్ధే తదా మనః. 62

ప్ర. అ. తదా = అప్పుడు, ప్రభుః = ప్రభువైన, నారాయణః = విష్ణువు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, తమ్ = ఆ, సముద్యోగమ్ = ప్రయత్నమును, దేవదూతాత్ = దేవదూతవలన, ఉపశ్రుత్య = విని, యుద్ధాయ = యుద్ధముకొరకు, మనః = మనస్సును, చక్రే = చేసెను.

తా. అప్పుడు ప్రభువైన శ్రీ మహావిష్ణువు దేవదూతద్వారా రాక్షసుల ప్రయత్నమును గూర్చి విని యుద్ధము చేయవలె నని సంకల్పించెను. 62

మూ. స సజ్జాయుధతూణీరో వైనతేయోపరి స్థితః, 63
ఆసాద్య కవచం దివ్యం సహస్రార్కసమద్యుతి,
ఆబధ్య శరసంపూర్ణే ఇషుధీ విమలే తదా. 64

శ్రోణిసూత్రం చ ఖడ్గం చ విమలం కమలేక్షణః,
శఙ్ఖచక్రగదాశార్ఙ్గఖడ్గాంశ్చైవ వరాయుధాన్ 65

సుపర్ణం గిరిసంకాశం వైనతేయమథాస్థితః,
రాక్షసానామభావాయ యయౌ తూర్ణతరం ప్రభుః. 66

ప్ర. అ. తదా = అప్పుడు, కమలేక్షణః = పద్మముల వంటి నేత్రములు గల, ప్రభుః = ప్రభువైన, సః = ఆ విష్ణువు, సజ్జాయుధతూణీరః = సిద్ధముగా ఉన్న ఆయుధములు అంబులపొదలు గలవాడై, వైనతేయోపరి = గరుత్మంతుని పైన, స్థితః = ఉన్నవాడై, సహస్రార్కసమద్యుతి = వేయి సూర్యులతో సమానమైన కాంతి గల, దివ్యమ్ = దివ్యమైన, కవచమ్ = కవచమును, ఆసాద్య = పొంది, శరసంపూర్ణే = బాణములతో నిండిన, విమలే = నిర్మలమైన, ఇషుధీ = అంబులపొదులను, ఆబధ్య = కట్టుకొని, శ్రోణిసూత్రం చ = నడుముకు కట్టుకొను త్రాడును, విమలమ్ = నిర్మలమైన, ఖడ్గం చ = ఖడ్గమును, శఙ్ఖచక్రగదాశార్ఙ్గ

సిద్ధదేవర్షిమహోరగైశ్చ = సిద్ధులచేతను, దేవర్షులచేతను, మహోరగులచేతను, గన్ధర్వయక్షైః = గంధర్వులచేతను, యక్షులచేతను, ఉపగీయమానః = స్తుతింపబడుచున్నవాడై, చక్రాసిశార్ఙ్గాయుధ శఙ్ఖపాణిః = చక్రము, ఖడ్గము, శార్ఙ్గము అను ఆయుధములు, శంఖము హస్తములందు గలవాడై, సమాససాద = సమీపించెను

తా. ఆ శ్రీమహావిష్ణువు, సిద్ధులు, దేవర్షులు, మహోరగులు, గంధర్వులు, యక్షులు స్తుతించుచుండగా, చక్ర - ఖడ్గ - శార్ఙ్గ - శంఖములను హస్తములందు ధరించి, రాక్షససైన్యసంహారము చేయువాడై ఆ సైన్యమును సమీపించెను.

మూ. సుపర్ణపక్షానిలనున్నపక్షం
భ్రమత్పతాకం ప్రవికీర్ణశస్త్రమ్,
చచాల తద్రాక్షసరాజసైన్యం
చలోపలం నీలమివాచలాగ్రమ్. 69

ప్ర. అ. సుపర్ణపక్షానిల నున్నపక్షమ్ = గరుత్మంతుని రెక్కల గాలిచేత ఎగురకొట్టబడిన వీరులు గలది, భ్రమత్పతాకమ్ = తిరుగుచున్న పతాకలు గలది, ప్రవికీర్ణశస్త్రమ్ = చిమ్మివేయబడిన ఆయుధములు గలది అయిన, తత్ = ఆ, రాక్షసరాజసైన్యమ్ = రాక్షసరాజుయొక్క సైన్యము, చలోపలమ్ = కదలుచున్న రాళ్ళు గల, నీలమ్ = నల్లని, అచలాగ్రమివ = పర్వతశిఖరము వలె, చచాల = చలించెను.

తా. గరుత్మంతుని రెక్కల గాలిచే ఆ రాక్షససైన్యము ఎగిరిపోవుచుండెను. పతాకలు తిరిగిపోవుచుండెను. ఆయుధములు చెల్లాచెదరగుచుండెను. ఆ విధముగ ఆ రాక్షససైన్యము ఎగురుచున్న రాళ్ళు గల నల్లని పర్వతశిఖరము వలె కదలిపోయెను. 69

మూ. తతః శితైః శోణితమాంసరూషితై
ర్యుగాన్తవైశ్వానరతుల్యవిగ్రహైః,
నిశాచరాః సంపరివార్య మాధవం
వరాయుధైర్నిర్బిభిదుః సహస్రశః. 70

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే షష్ఠః సర్గః.

# అథ సప్తమః సర్గః

[శ్రీమహావిష్ణువు రాక్షసులను సంహరించుట. రాక్షసులు పారి పోవుట]

మూ. నారాయణగిరిం తే తు గర్జన్తో రాక్షసామ్బుదాః,
వవర్షుః శరవర్షేణ వర్షేణేవాద్రిమమ్బుదాః. 1

ప్ర. అ. తే = ఆ, రాక్షసామ్బుదాః = రాక్షసు లనే మేఘములు, గర్జన్తః = గర్జించుచున్నవై, అమ్బుదాః = మేఘములు, వర్షేణ = వర్షముచేత, అద్రిమివ = పర్వతమును వలె, నారాయణగిరిమ్ = నారాయణు డనే పర్వతమును, శరవర్షేణ = బాణవర్షముచేత, వవర్షుః = వర్షించినవి.

తా. రాక్షసు లనే మేఘములు, గర్జించుచు, మేఘములు పర్వతము మీద వర్షించినట్లు నారాయణు డనే పర్వతముమీద బాణవర్షము కురిపించిరి. 1

మూ. శ్యామావదాతస్తైర్విష్ణుర్నీలైర్నక్తంచరోత్తమైః,
వృతోఽఞ్జనగిరీవాసీద్వర్షమాణైః పయోధరైః. 2

ప్ర. అ. నీలైః = నల్లనైన, తైః = ఆ, నక్తంచరోత్తమైః = రాక్షసశ్రేష్ఠులచేత, వృతః = చుట్టుముట్టబడిన, శ్యామావదాతః = నల్లగాను, శుభ్రముగాను ఉన్న, విష్ణుః = విష్ణువు, వర్షమాణైః = వర్షించుచున్న, పయోధరైః = మేఘములచేత కప్పబడిన, అఞ్జనగిరిః ఇవ = అంజనపర్వతము వలె, ఆసీత్ = ఉండెను.

తా. నల్లని రాక్షసు లందరూ చుట్టుముట్టగా, నల్లగా శుభ్రముగా ఉన్న విష్ణువు వర్షించుచున్న మేఘములచేత కప్పబడిన అంజనగిరి వలె ఉండెను. 2

మూ. శలభా ఇవ కేదారం మశకా ఇవ పావకమ్,
యథామృతఘటం దంశా మకరా ఇవ చార్ణవమ్. 3

రూడులు, అశ్వముల నెక్కి వచ్చిన ఆశ్వికులు, ఆకాశముమీద నిలచిన కాలిబంట్లు, పర్వతములవంటి రాక్షసశ్రేష్ఠులు బాణములచేతను, శక్తులచేతను, ఋష్టులచేతను, తోమరములచేతను, విష్ణుమూర్తిని, ప్రాణాయామములు బ్రాహ్మణుని వలె ఊపిరి లేనివానినిగా చేసిరి (ఊపిరిసలపకుండా చేసిరి). 5, 6

మూ. నిశాచరైస్తాడ్యమానో మీనైరివ మహోదధిః,
శార్ఙ్గమాయమ్య దుర్ధర్షో రాక్షసేభ్యోఽసృజచ్ఛరాన్. 7

ప్ర. అ. మీనైః = మీనములచేత, మహోదధిః ఇవ = మహాసముద్రము వలె, నిశాచరైః = రాక్షసులచేత, తాడ్యమానః = కొట్టబడుచున్న, దుర్ధర్షః = ఎదిరింప శక్యము కాని విష్ణువు, శార్ఙ్గమ్ = శార్ఙ్గధనస్సును, ఆయమ్య = వంచి, రాక్షసేభ్యః = రాక్షసులకు, శరాన్ = బాణములను, అసృజత్ = విడచెను.

తా. మీనములు మహాసముద్రమును కొట్టినట్లు రాక్షసులు కొట్టుచుండగా, ఎదురింప శక్యముకాని ఆ మహావిష్ణువు శార్ఙ్గధనస్సును ఎక్కుపెట్టి రాక్షసులపై బాణములు ప్రయోగించెను. 7

మూ. శరైః పూర్ణాయతోత్సృష్టైః వజ్రకల్పైర్మనోజవైః,
చిచ్ఛేద విష్ణుర్నిశితైః శతశోఽథ సహస్రశః 8

ప్ర. అ. అథ = అటుపిమ్మట, విష్ణుః = విష్ణువు, పూర్ణాయతోత్సృష్టైః = పూర్తిగా లాగుటచేత విడవబడిన, వజ్రకల్పైః = వజ్రముతో సమానమైన, నిశితైః = వాడియైన, శతశః = వందలకొలది, సహస్రశః = వేలకొలది, శరైః = బాణములచేత, చిచ్ఛేద = భేదించెను.

తా. పిమ్మట శ్రీమహావిష్ణువు వజ్రముతో సమానములైన, మనోవేగమువంటి వేగము గల వందలకొలది వేలకొలది బాణములను పూర్తిగా లాగి రాక్షసులను ఛేదించెను. 8

మూ. విద్రావ్య శరవర్షేణ వర్షం వాయురివోత్థితమ్,
పాఞ్చజన్యం మహాశఙ్ఖం ప్రదధ్మౌ పురుషోత్తమః. 9

మూ. న శేకురశ్వాః సంస్థాతుం విమదాః కుఞ్జరాభవన్,
స్యన్దనేభ్యశ్చ్యుతా వీరాః శఙ్ఖరావితదుర్బలాః. 12

ప్ర. అ. శఙ్ఖరావితదుర్బలాః = శంఖధ్వనిచేత దుర్బలములై, అశ్వాః = గుఱ్ఱములు, సంస్థాతుమ్ = నిలచుటకు, న శేకుః = సమర్థములు కాలేదు. కుఞ్జరాః = ఏనుగులు, విమదాః = మదములేనివి, అభవన్ = అయినవి. వీరాః = వీరులు, స్యన్దనేభ్యః = రథములనుండి, చ్యుతాః = జారిపడిరి.

తా. శంఖధ్వని వినగానే బలము ఉడిగిపోయి అశ్వములు నిలవలేక పోయినది. ఏనుగుల మదము అణగిపోయెను. వీరులు రథములనుండి జారిపడి పోయిరి. 12

మూ. శార్‌ఙ్గచాపవినిర్ముక్తా వజ్రతుల్యాననాః శరాః,
విదార్య తాని రక్షాంసి సుపుఙ్ఖా వివిశుః క్షితిమ్. 13

ప్ర. అ. శార్‌ఙ్గచాపవినిర్ముక్తాః = శార్‌ఙ్గ మను ధనస్సునుండి విడువబడిన, వజ్రతుల్యాననాః = వజ్రముతో సమానమైన అగ్రభాగములుగల, సుపుఙ్ఖాః = మంచి పొన్నులుగల, శరాః = బాణములు, తాని రక్షాంసి = ఆ రాక్షసులను, విదార్య = చీల్చి, క్షితిమ్ = భూమిని, వివిశుః = ప్రవేశించినవి.

తా. శార్‌ఙ్గధనస్సునుండి బయలుదేరిన, వజ్రమువంటి అగ్రభాగములు, అందమైన పొన్నులు గల బాణములు ఆ రాక్షసులను చీల్చివేసి నేలలో ప్రవేశించినవి. 13

మూ. భిద్యమానాః శరైః సంఖ్యే నారాయణకరచ్యుతైః,
నిపేతూ రాక్షసా భూమౌ శైలా వజ్రహతా ఇవ 14

ప్ర. అ. నారాయణకరచ్యుతైః = విష్ణువుయొక్క హస్తములనుండి జారిన, శరైః = బాణములచేత, సంఖ్యే = యుద్ధమునందు, భిద్యమానాః = బద్దలుకొట్టబడుచున్న, రాక్షసాః = రాక్షసులు, వజ్రహతాః = వజ్రముచేత కొట్టబడిన, శైలాః ఇవ = పర్వతములు వలె, భూమౌ = నేలమీద, నిపేతుః = పడిరి.

తా. శ్రీ మహావిష్ణువు ప్రయోగించిన బాణములచేత యుద్ధమునందు బద్దలు

తా. ఆ శ్రీమహావిష్ణువు బాణాలచేత ఆ రాక్షసుల కదల్చబడుచున్న కంఠములను, బాణములను, ధ్వజములను, ధనస్సులను, రథములను, పతాకలను, అంబులపొందులను చేదించెను. 17

మూ. సూర్యాదివ కరా ఘోరా వార్యోఘా ఇవ సాగరాత్,
పర్వతాదివ నాగేన్ద్రా ధారౌఘా ఇవ చామ్బుదాత్. 18

తథా శార్ఙ్గవినిర్ముక్తాః శరా నారాయణేరితాః,
నిర్ధావన్తీషవస్తూర్ణం శతశోఽథ సహస్రశః. 19

ప్ర. అ. అథ = అటు పిమ్మట, నారాయణేరితాః = విష్ణువుచేత ప్రయోగించబడిన, శార్ఙ్గవినిర్ముక్తాః = శార్ఙ్గమునుండి విడువబడిన, శతశః = వందలకొలది, సహస్రశః = వేలకొలది, శరాః = సంహారకములైన, ఇషవః = బాణములు, సూర్యాత్ = సూర్యునినుండి, ఘోరాః = భయంకరములైన, కరాః ఇవ = కిరణములు వలె, సాగరాత్ = సముద్రమునుండి, వార్యోఘాః ఇవ = జలప్రవాహములు వలె, పర్వతాత్ = పర్వతమునుండి, నాగేన్ద్రాః ఇవ = గజేంద్రములు వలె, అమ్బుదాత్ = మేఘమునుండి, ధారౌఘాః ఇవ = జలధారాసముదాయములు వలె, తథా = అట్లు, తూర్ణమ్ = శీఘ్రముగా, నిర్ధావన్తి = పరుగెత్తివచ్చినవి.

తా. విష్ణువు ప్రయోగింపగా శార్ఙ్గమునుండి బయల్వెడలిన, శత్రువులను హింసించు, వందలకొలది వేలకొలది బాణములు సూర్యుని నుండి భయంకరములైన కిరణములు వలె, సముద్రమునుండి జలప్రవాహములు వలె, పర్వతములనుండి గజేంద్రముల వలె, మేఘమునుండి జలప్రవాహము వలె శీఘ్రముగా వచ్చినవి. 18,19

మూ. శరభేణ యథా సింహాః సింహేన ద్విరదా యథా,
ద్విరదేన యథా వ్యాఘ్రా వ్యాఘ్రేణ ద్వీపినో యథా.

ద్వీపినేవ యథా శ్వానః శునా మార్జారకో యథా,
మార్జారేణ యథా సర్పాః సర్పేణ చ యథాఖవః. 21

తథా తే రాక్షసాః సర్వే విష్ణునా ప్రభవిష్ణునా,
ద్రవన్తి ద్రావితా శ్చాన్యే శాయితాశ్చ మహీతలే. 22

పడిన, శఙ్ఖనాదసువిహ్వలమ్ = శంఖధ్వనిచేత చాల వ్యాకులమైన, రాక్షసం బలమ్ = రాక్షససేన, ప్రభగ్నమ్ = ఓడిపోయినదై, లఙ్కామ్ అభిముఖమ్ = లంకను గూర్చి అభిముఖమై, యయౌ = వెళ్లెను.

తా. ఆ రాక్షససైన్యము నారాయణుని బాణాలకు భయపడి, శంఖధ్వని చేత వ్యాకులత చెంది, ఓడిపోయి లంకవైపు పారిపోయెను. 24

మూ. ప్రభగ్నే రాక్షసబలే నారాయణశరాహతే,
సుమాలీ శరవర్షేణ నివవార రణే హరిమ్. 25

ప్ర. అ. రాక్షసబలే=రాక్షససైన్యము, నారాయణశరాహతే=నారాయణుని శరములచేత కొట్టబడినదై, ప్రభగ్నే = భగ్నమైన దగుచుండగా, సుమాలీ = సుమాలి, రణే = యుద్ధమునందు, హరిమ్ = విష్ణువును, శరవర్షేణ = బాణవర్షము చేత, నివవార = వారించెను.

తా. ఆ రాక్షససైన్యము నారాయణుని బాణములచేత కొట్టబడి ఓడిపోవుట చూచి సుమాలి బాణవర్షముచేత విష్ణువును నివారించెను. 25

మూ. స తు తం ఛాదయామాస నీహార ఇవ భాస్కరమ్,
రాక్షసాః సత్త్వసంపన్నాః పునర్ధైర్యం సమాదధుః. 26

ప్ర. అ. సః తు = ఆ సుమాలియైతే, తమ్ = విష్ణువును, నీహారః = పొగమంచు, భాస్కరం యథా = సూర్యుణ్ణి వలె, ఛాదయామాస = కప్పివేసెను. సత్త్వసంపన్నాః = బలముతో కూడిన, రాక్షసాః = రాక్షసులు, పునః = మరల, ధైర్యమ్ = ధైర్యమును, సమాదధుః = పొందిరి.

తా. ఆ సుమాలి విష్ణువును, పొగమంచు సూర్యుణ్ణి కప్పివేసినట్లు బాణాలతో కప్పివేసెను. అప్పుడు బలవంతులైన రాక్షసులకు మరల ధైర్యము కలిగెను. 26

మూ. అథ సోఽభ్యపతద్రోషాద్రాక్షసో బలదర్పితః,
మహానాదం ప్రకుర్వాణో రాక్షసాన్ జీవయన్నివ. 27

ప్ర. అ. అథ = అటుపిమ్మట, బలదర్పితః = బలముచేత గర్వించిన, సః=ఆ, రాక్షసః = రాక్షసుడు, మహానాదమ్=గొప్ప ధ్వనిని, ప్రకుర్వాణః =

ప్ర. అ. రాక్షసేశ్వరః = రాక్షసప్రభువైన, సుమాలీ = సుమాలి, భ్రాన్తైః = తిరిగిపోవుచున్న, తైః = ఆ, అశ్వైః = అశ్వములచేత, పరిభ్రాన్తైః = తిరిగి పోవుచున్న, ఇన్ద్రియాశ్వైః = ఇంద్రియము లనే అశ్వములచేత, ధృతిహీనః = ధైర్యవిహీనుడైన, నరః యథా = నరుడు వలె, భ్రామ్యతే = త్రిప్పివేయబడు చున్నాడు.

తా. సారథి లేని గుఱ్ఱాలు స్వేచ్ఛగా తిరుగుటతో, ఇంద్రియము లనే గుఱ్ఱములు స్వేచ్ఛగా తిరుగుచుండగా నిలకడలేని మానవుడు వలె, రాక్షసప్రభువైన సుమాలి తిరిగిపోయెను. 30

మూ. తతో విష్ణుం మహాబాహుం ప్రపతన్తం రణాజిరే,
హృతే సుమాలేరశ్వైశ్చ రథే విష్ణురథం ప్రతి,
మాలీ చాభ్యద్రవద్యుక్తః ప్రగృహ్య సశరాసనమ్. 31

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమాలేః = సుమాలియొక్క, రథే = రథము, అశ్వైః = అశ్వములచేత, హృతే = హరించబడిన దగుచుండగా, సః = ఆ, మాలీ = మాలి, యుక్తః = సన్నద్ధుడై, శరాసనమ్ = ధనస్సును, ప్రగృహ్య = గ్రహించి, రణాజిరే = యుద్ధభూమియందు, ప్రపతన్తమ్ = వచ్చి మీదపడుచున్న, మహాబాహుమ్ = గొప్ప బాహంవులు గల, విష్ణుమ్ = విష్ణువును గూర్చి, విష్ణురథం ప్రతి = విష్ణువుయొక్క రథమును గూర్చి, అభ్యద్రవత్ = శీఘ్రముగా పరుగెత్తెను.

తా. సుమాలిరథమును గుఱ్ఱములు దూరముగా తీసికొనిపోయెను. అప్పుడు మాలి యుద్ధసన్నద్ధుడై ధనస్సు ధరించి, యుద్ధభూమిలో వచ్చుచున్న మహాబాహువైన విష్ణువు మీదికి, ఆతని రథముమీదికి శీఘ్రముగా వెళ్లెను. 31

మూ. మాలేర్ధనుశ్చ్యుతా బాణాః కార్తస్వరవిభూషితాః,
వివిశుర్హరిమాసాద్య క్రౌఞ్చం పత్రరథా ఇవ. 32

ప్ర. అ. మాలేః = మాలియొక్క, ధనుశ్చ్యుతాః = ధనస్సునుండి జారిన, కార్తస్వరవిభూషితాః = బంగారముచేత అలంకరించబడిన, బాణాః = బాణములు, పత్రరథాః = పక్షులు, క్రౌఞ్చమ్ ఇవ = క్రౌంచపర్వతమును వలె, హరిమ్ = విష్ణువును, ఆసాద్య = సమీపించి, వివిశుః = ప్రవేశించినవి.

= పొంది నాగాః = సర్పములు, సుధారసమ్ ఇవ = అమృతరసమును వలె, తస్య = వానియొక్క, రుధిరమ్ = రక్తమును, పిబన్తి = త్రాగుచున్నవి.

తా. వజ్రాయుధము వలె, మెరపుల వలె ప్రకాశించుచున్న ఆ బాణములు మాలి దేహమును సమీపించి, సర్పములు అమృతమును త్రాగి నట్లు ఆతని రక్తమును త్రాగినవి. 35

మూ. మాలినం విముఖం కృత్వా శఙ్ఖచక్రగదాధరః,
మాలిమౌలిం ధ్వజం చాపం వాజినశ్చాప్యపాతయత్. 36

ప్ర. అ. శఙ్ఖచక్రగదాధరః = శంఖచక్రగదలను ధరించిన ఆ విష్ణువు, మాలినమ్ = మాలిని, విముఖమ్ = విముఖుణ్ణిగా, కృత్వా = చేసి, మాలిమౌలిమ్ = మాలియొక్క కిరీటమును, ధ్వజమ్ = ధ్వజమును, చాపమ్ = ధనస్సును, వాజినశ్చాపి = గుఱ్ఱములను, అపాతయత్ = పడగొట్టెను.

తా. శంఖ-చక్ర-గదలు ధరించిన శ్రీమహావిష్ణువు మాలిని యుద్ధవిముఖునిగా చేసి ఆతని కిరీటమును, ధ్వజమును, ధనస్సును, గుఱ్ఱములను పడగొట్టెను.

మూ. విరథస్తు గదాం గృహ్య మాలీ నక్తంచరోత్తమః,
ఆపుప్లువే గదాపాణిర్గిర్యగ్రాదివ కేసరీ. 37

ప్ర. అ. నక్తంచరోత్తమః = రాక్షసులలో శ్రేష్ఠుడైన, మాలీ = మాలి, విరథః = రథము లేనివాడై, గదామ్ = గదను, గృహ్య = గ్రహించి, గదాపాణిః = గద హస్తమునందు కలవాడై, గిర్యగ్రాత్ = పర్వతాగ్రమునుండి, కేసరీ ఇవ = సింహము వలె, ఆపుప్లువే = దుమికెను.

తా. రథము లేని మాలి గద ధరించి, పర్వతాగ్రమునుండి సింహము వలె, క్రిందికి దుమికెను. 37

మూ. గదయా గరుడేశానమీశానమివ చాన్తకః,
లలాటదేశేఽభ్యహనద్వజ్రేణేవ యథాచలమ్. 38

ప్ర. అ. అన్తకః = యముడు, ఈశానమివ = ఈశ్వరుణ్ణి వలె, వజ్రేణ = వజ్రముచేత, ఇన్ద్రః = ఇంద్రుడు, అచలమివ = పర్వతమును వలె, గదయా =

యొక్క, రావమ్ = ధ్వనిని, శ్రుత్వా = విని, సంక్రుద్ధః = కోపించినవాడై, పక్షిశే = గరుత్మంతునియందు, తిర్యక్ = అడ్డముగా, ఆస్థాయ = కూర్చుండి, పరాఙ్ముఖః = వెనుకకు తిరిగిన ముఖము గలవాడైనను, మాలేః = మాలియొక్క, జిఘాంసయా = చంపవలె నను ఇచ్ఛచేత, చక్రమ్ = చక్రమును, ఉత్ససర్జ = విడచెను.

తా. ఇంద్రుని తమ్ముడైన భగవంతుడైన శ్రీమహావిష్ణువు అరచుచున్న ఆ రాక్షసుల అరపులు విని, గరుత్మంతునిమీద అడ్డముగా కూర్చుండి, మాలిని చంపుటకై, వెనుకకు తిరిగి ఉండియే చక్రమును ప్రయోగించెను. 41

మూ. తత్సూర్యమణ్డలాభాసం స్వభాసా భాసయన్నభః, 42
కాలచక్రనిభం చక్రం మాలేః శీర్షమపాతయత్.

ప్ర. అ. సూర్యమణ్డలాభాసమ్ = సూర్యమండలము వలె ప్రకాశించుచున్న, కాలచక్రనిభమ్ = కాలచక్రముతో సమానమైన, తత్ చక్రమ్ = ఆ చక్రము, స్వభాసా = తన కాంతిచేత, నభః = ఆకాశమును, భాసయత్ = ప్రకాశింపచేయుచు, మాలేః = మాలియొక్క, శీర్షమ్ = శిరస్సును. అపాతయత్ = పడవేసెను.

తా. కాలచక్రము వలె తిరుగుచున్న, సూర్యమండలము వంటి కాంతి గల ఆ చక్రము తన కాంతిచేత ఆకాశమును ప్రకాశింపచేయుచు మాలి శిరస్సును పడగొట్టెను. 42

మూ. తచ్ఛిరో రాక్షసేన్ద్రస్య చక్రోత్కృత్తం విభీషణమ్,
పపాత రుధిరోద్గారి పురా రాహుశిరో యథా. 43

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజుయొక్క, చక్రోత్కృత్తమ్ = చక్రముచేత నరికివేయబడిన, విభీషణమ్ = భయంకరమైన, తత్ శిరః = ఆ శిరస్సు, రుధిరోద్గారి = రక్తమును కార్చుచున్నదై, పురా = పూర్వము, రాహుశిరో యథా = రాహువు శిరస్సు వలె, పపాత = పడెను.

తా. చక్రముచేత ఛేదించబడిన ఆ రాక్షసుని భయంకరమైన శిరస్సు, పూర్వము రాహువు శిరస్సు వలె, రక్తము కార్చుచు క్రింద పడెను. 43

= పొంది నాగాః = సర్పములు, సుధారసమ్ ఇవ = అమృతరసమును వలె, తస్య = వానియొక్క, రుధిరమ్ = రక్తమును, పిబన్తి = త్రాగుచున్నవి.

తా. వజ్రాయుధము వలె, మెరపుల వలె ప్రకాశించుచున్న ఆ బాణములు మాలి దేహమును సమీపించి, సర్పములు అమృతమును త్రాగి నట్లు అతని రక్తమును త్రాగినవి. 35

మూ. మాలినం విముఖం కృత్వా శఙ్ఖచక్రగదాధరః,
మాలిమౌలిం ధ్వజం చాపం వాజినశ్చాప్యపాతయత్. 36

ప్ర. అ. శఙ్ఖచక్రగదాధరః = శంఖచక్రగదలను ధరించిన ఆ విష్ణువు, మాలినమ్ = మాలిని, విముఖమ్ = విముఖుణ్ణిగా, కృత్వా = చేసి, మాలిమౌలిమ్ = మాలియొక్క కిరీటమును, ధ్వజమ్ = ధ్వజమును, చాపమ్ = ధనస్సును, వాజినశ్చాపి = గుఱ్ఱములను, అపాతయత్ = పడగొట్టెను.

తా. శంఖ-చక్ర-గదలు ధరించిన శ్రీమహావిష్ణువు మాలిని యుద్ధవిముఖునిగా చేసి అతని కిరీటమును, ధ్వజమును, ధనస్సును, గుఱ్ఱములను పడగొట్టెను.

మూ. విరథస్తు గదాం గృహ్య మాలీ నక్తంచరోత్తమః,
ఆపుప్లువే గదాపాణిర్గిర్యగ్రాదివ కేసరీ. 37

ప్ర. అ. నక్తంచరోత్తమః = రాక్షసులలో శ్రేష్ఠుడైన, మాలీ = మాలి, విరథః = రథము లేనివాడై, గదామ్ = గదను, గృహ్య = గ్రహించి, గదాపాణిః = గద హస్తమునందు కలవాడై, గిర్యగ్రాత్ = పర్వతాగ్రమునుండి, కేసరీ ఇవ = సింహము వలె, ఆపుప్లువే = దుమికెను.

తా. రథము లేని మాలి గద ధరించి, పర్వతాగ్రమునుండి సింహము వలె, క్రిందికి దుమికెను. 37

మూ. గదయా గరుడేశానమీశానమివ చాన్తకః,
లలాటదేశేఽభ్యహనద్వజ్రేణేవ యథాచలమ్. 38

ప్ర. అ. అన్తకః = యముడు, ఈశానమివ = ఈశ్వరుణ్ణి వలె, వజ్రేణ = వజ్రముచేత, ఇన్ద్రః = ఇంద్రుడు, అచలమివ = పర్వతమును వలె, గదయా =

= పొంది నాగాః = సర్పములు, సుధారసమ్ ఇవ = అమృతరసమును వలె, తస్య = వానియొక్క, రుధిరమ్ = రక్తమును, పిబన్తి= త్రాగుచున్నవి.

తా. వజ్రాయుధము వలె, మెరపుల వలె ప్రకాశించుచున్న ఆ బాణములు మాలి దేహమును సమీపించి, సర్పములు అమృతమును త్రాగి నట్లు ఆతని రక్తమును త్రాగినవి. 35

మూ. మాలినం విముఖం కృత్వా శఙ్ఖచక్రగదాధరః,
మాలిమౌలిం ధ్వజం చాపం వాజినశ్చాప్యపాతయత్. 36

ప్ర. అ. శఙ్ఖచక్రగదాధరః = శంఖచక్రగదలను ధరించిన ఆ విష్ణువు, మాలినమ్ = మాలిని, విముఖమ్ = విముఖుణ్ణిగా, కృత్వా = చేసి, మాలిమౌలిమ్ = మాలియొక్క కిరీటమును, ధ్వజమ్ = ధ్వజమును, చాపమ్ = ధనస్సును, వాజినశ్చాపి = గుఱ్ఱములను, అపాతయత్ = పడగొట్టెను.

తా. శంఖ-చక్ర-గదలు ధరించిన శ్రీమహావిష్ణువు మాలిని యుద్ధవిముఖునిగా చేసి ఆతని కిరీటమును, ధ్వజమును, ధనస్సును, గుఱ్ఱములను పడగొట్టెను.

మూ. విరథస్తు గదాం గృహ్య మాలీ నక్తంచరోత్తమః,
ఆపుప్లువే గదాపాణిర్గిర్యగ్రాదివ కేసరీ. 37

ప్ర. అ. నక్తంచరోత్తమః=రాక్షసులలో శ్రేష్ఠుడైన, మాలీ=మాలి, విరథః = రథము లేనివాడై, గదామ్ = గదను, గృహ్య = గ్రహించి, గదాపాణిః = గద హస్తమునందు కలవాడై, గిర్యగ్రాత్ = పర్వతాగ్రమునుండి, కేసరీ ఇవ = సింహము వలె, ఆపుప్లువే = దుమికెను.

తా. రథము లేని మాలి గద ధరించి, పర్వతాగ్రమునుండి సింహము వలె, క్రిందికి దుమికెను. 37

మూ. గదయా గరుడేశానమీశానమివ చాన్తకః,
లలాటదేశేఽభ్యహనద్వజ్రేణేవ యథాచలమ్. 38

ప్ర. అ. అన్తకః = యముడు, ఈశానమివ = ఈశ్వరుణ్ణి వలె, వజ్రేణ = వజ్రముచేత, ఇన్ద్రః = ఇంద్రుడు, అచలమివ = పర్వతమును వలె, గదయా =

యొక్క, రావమ్ = ధ్వనిని, శ్రుత్వా = విని, సంక్రుద్ధః = కోపించినవాడై, పక్షీశే = గరుత్మంతునియందు, తిర్యక్ = అడ్డముగా, ఆస్థాయ = కూర్చుండి, పరాఙ్ముఖః = వెనుకకు తిరిగిన ముఖము గలవాడైనను, మాలేః = మాలియొక్క, జిఘాంసయా = చంపవలె నను ఇచ్ఛచేత, చక్రమ్ = చక్రమును, ఉత్ససర్జ = విడచెను.

తా. ఇంద్రుని తమ్ముడైన భగవంతుడైన శ్రీమహావిష్ణువు అరచుచున్న ఆ రాక్షసుల అరపులు విని, గరుత్మంతునిమీద అడ్డముగా కూర్చుండి, మాలిని చంపుటకై, వెనుకకు తిరిగి ఉండియే చక్రమును ప్రయోగించెను. 41

మూ. తత్సూర్యమణ్డలాభాసం స్వభాసా భాసయన్నభః, 42
కాలచక్రనిభం చక్రం మాలేః శీర్షమపాతయత్.

ప్ర. అ. సూర్యమణ్డలాభాసమ్ = సూర్యమండలము వలె ప్రకాశించుచున్న, కాలచక్రనిభమ్ = కాలచక్రముతో సమానమైన, తత్ చక్రమ్ = ఆ చక్రము, స్వభాసా = తన కాంతిచేత, నభః = ఆకాశమును, భాసయత్ = ప్రకాశింపచేయుచు, మాలేః = మాలియొక్క, శీర్షమ్ = శిరస్సును. అపాతయత్ = పడవేసెను.

తా. కాలచక్రము వలె తిరుగుచున్న, సూర్యమండలము వంటి కాంతి గల ఆ చక్రము తన కాంతిచేత ఆకాశమును ప్రకాశింపచేయుచు మాలి శిరస్సును పడగొట్టెను. 42

మూ. తచ్ఛిరో రాక్షసేన్ద్రస్య చక్రోత్కృత్తం విభీషణమ్,
పపాత రుధిరోద్గారి పురా రాహుశిరో యథా. 43

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య = రాక్షసరాజుయొక్క, చక్రోత్కృత్తమ్ = చక్రముచేత నరికివేయబడిన, విభీషణమ్ = భయంకరమైన, తత్ శిరః = ఆ శిరస్సు, రుధిరోద్గారి = రక్తమును కార్చుచున్నదై, పురా = పూర్వము, రాహుశిరో యథా = రాహువు శిరస్సు వలె, పపాత = పడెను.

తా. చక్రముచేత చేదించబడిన ఆ రాక్షసుని భయంకరమైన శిరస్సు, పూర్వము రాహువు శిరస్సు వలె, రక్తము కార్చుచు క్రింద పడెను. 43

మూ. చక్రకృత్తాస్యకమలా గదాసంచూర్ణితోరసః,
లాఙ్గలగ్లపితగ్రీవా ముసలైర్భిన్నమస్తకాః. 47
కేచిచ్ఛైవాసినా భిన్నా స్తథాన్యే శరతాడితాః,
నిపేతురమ్బరాత్తూర్ణం రాక్షసాః సాగరామ్బసి. 48

ప్ర. అ. కేచిత్ = కొందరు, రాక్షసాః = రాక్షసులు, చక్రకృత్తాస్య కమలాః = చక్రముచేత ఛేదించబడిన ముఖపద్మములు గలవారై, గదాసంచూర్ణితోరసః = గదచేత చూర్ణముచేయబడిన వక్షఃస్థలములుగలవారై, లాఙ్గలగ్లపితగ్రీవాః = నాగలిచేత వాడిపోవునట్లు చేయబడిన కంఠములు గలవారై, ముసలైః = రోకళ్లచేత, భిన్నమస్తకాః = బ్రద్దలుకొట్టబడిన శిరస్సులు కలవారై, అసినా = ఖడ్గముచేత, ఛిన్నాః = ఛేదించబడినవారై, తథా = మరియు, అన్యే = మరికొందరు, శరతాడితాః = బాణములచేత కొట్టబడినవారై, తూర్ణమ్ = శీఘ్రముగా, అమ్బరాత్ = ఆకాశము నుండి, సాగరామ్బసి = సముద్రజలమునందు, నిపేతుః = పడిరి.

తా. కొందరు రాక్షసుల ముఖపద్మములు చక్రముచేత ఛేదింపబడెను. కొందరి వక్షఃస్థలములు గదచేత చూర్ణము చేయబడెను. కొందరి కంఠములు నాగలి దెబ్బకు వాడిపోవునట్లు చేయబడెను. కొందరి తలలు ముసలముచేత బద్దలు కొట్టబడెను. కొందరు ఖడ్గముచేత ఛేదించబడిరి. మరికొందరు బాణములచేత కొట్టబడిరి. ఈ విధముగా ఆ రాక్షసులు ఆకాశమునుండి వెంటనే సముద్రములో పడిపోయిరి. 47, 48

మూ. నారాయణోఽపీషువరాశనీభి
ర్విదారయామాస ధనుర్విముక్తైః,
నక్తంచరాన్ ధూతవిముక్తకేశాన్
యథాశనీభిః సతడిన్మహాభ్రః. 49

ప్ర. అ. నారాయణోఽపి = విష్ణువు, సతడిత్ = మెరుపులతో కూడిన, మహాభ్రః = మహామేఘము, అశనీభిః యథా = పిడుగులచేత వలె, ధనుర్విముక్తైః = ధనస్సునుండి విడవబడిన, ఇషువరాశనీభిః = పిడుగులవంటి శ్రేష్ఠములైన బాణములచేత, ధూతవిముక్తకేశాన్ = కదల్చబడిన విడిపోయిన కేశములు గల, నక్తంచరాన్ = రాక్షసులను, విదారయామాస = చీల్చివేసెను.

తా. శ్రీమహావిష్ణువు మర్దించగా ఏనుగులతో సహా రాక్షసుల ధ్వనులు, వేగము సింహముచేత ఆక్రమించబడిన ఏనుగుల ధ్వనివేగముల వలె ఉండెను.

మూ. తే వార్యమాణా హరిబాణజాలైః
స్వబాణజాలాని సముత్సృజన్తః,
ధావన్తి నక్తంచరకాలమేఘా
వాయుప్రణున్నా ఇవ కాలమేఘాః. 52

ప్ర. అ. హరిబాణజాలైః = విష్ణువుయొక్క బాణముల సముదాయముల చేత, వార్యమాణాః = నివారింపబడుచున్న, స్వబాణజాలాని = తమ బాణముల సముదాయములను, సముత్సృజన్తః = విడచుచున్న, తే = ఆ, నక్తంచరకాలమేఘాః = కాలమేఘముల వంటి రాక్షసులు, వాయుప్రణున్నాః = వాయువుచేత ఎగరగొట్టబడిన, కాలమేఘా ఇవ = నల్లని మేఘములు వలె, ధావన్తి = పరుగెత్తుచున్నారు.

తా. విష్ణువు ప్రయోగించిన బాణములచేత నివారింపబడుచు, తమ బాణములను విడచుచున్న, కాలమేఘముల వంటి ఆ రాక్షసులు వాయువుచేత ఎగురగొట్టబడిన నల్లని మేఘములు వలె పారిపోయిరి. 52

మూ. చక్రప్రహారైర్వినికృత్తశీర్షాః
సంచూర్ణితాఙ్గాశ్చ గదాప్రహారైః,
అసిప్రహారైర్ద్వివిధా విభిన్నాః
పతన్తి శైలా ఇవ రాక్షసేన్ద్రాః. 53

ప్ర. అ. చక్రప్రహారైః = చక్రము దెబ్బలచేత, వినికృత్తశీర్షాః = ఛేదించబడిన శిరస్సులు కలవారు, గదాప్రహారైః = గద దెబ్బలచేత, సంచూర్ణితాఙ్గాశ్చ = చూర్ణముచేయబడిన శరీరములు గలవారు, అసిప్రహారైః = ఖడ్గప్రహారములచేత, ద్వివిధాః = రెండు ముక్కలుగా, విభిన్నాః = భేదింపబడినవారు అయిన, రాక్షసేన్ద్రాః = రాక్షసనాయకులు, శైలాః ఇవ = పర్వతములు వలె, పతన్తి = పడుచున్నారు.

తా. ఆ రాక్షసవీరు లందరు చక్రము దెబ్బలచేత శిరస్సులు తెగి, గద

# అథ అష్టమః సర్గః

[మాల్యవంతుడు యుద్ధము చేసి పరాజితు డగుట, సుమాలి మొదలైన రాక్షసులు రసాతలములో ప్రవేశించుట.]

మూ. హన్యమానే బలే తస్మిన్ పద్మనాభేన పృష్ఠతః,
మాల్యవాన్ సంనివృత్తోఽథ వేలామేత్య ఇవార్ణవః. 1

ప్ర. అ. తస్మిన్ = ఆ, బలే = సేన, పద్మనాభేన = విష్ణువుచేత, పృష్ఠతః = వెనుకనుండి, హన్యమానే = చంపబడుచుండగా, అథ = అటుపిమ్మట, మాల్యవాన్ = మాల్యవంతుడు, వేలామ్ = తీరమును, ఏత్య = పొంది, అర్ణవః ఇవ = సముద్రము వలె, సంనివృత్తః = మరలినాడు.

తా. విష్ణువు సైన్యమును వెనుకనుండి చంపివేయుచుండగా మాల్యవంతుడు, తీరమును దాటి సముద్రము వచ్చినట్లు, వెనుకకు వచ్చెను. 1

మూ. సంరక్తనయనః క్రోధాచ్చలన్మౌలిర్నిశాచరః,
పద్మనాభమిదం ప్రాహ వచనం పురుషోత్తమమ్. 2

ప్ర. అ. నిశాచరః = ఆ రాక్షసుడు, సంరక్తనయనః = ఎఱ్ఱనైన నేత్రములు కలవాడై, క్రోధాత్ = కోపమువలన, చలన్మౌలిః = కదలుచున్న శిరస్సు కలవాడై, పురుషోత్తమమ్ = పురుషులలో శ్రేష్ఠుడైన, పద్మనాభమ్ = విష్ణువును గూర్చి, ఇదం వచనమ్ = ఈ వచనమును, ప్రాహ = పలికెను.

తా. మాల్యవంతుడు కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములతో, శిరస్సు కదలుచుండగా పురుషోత్తముడైన పద్మనాభునితో ఇట్లు పలికెను. 2

మూ. నారాయణ న జానీషే క్షాత్రధర్మం పురాతనమ్,
అయుద్ధమనసో భీతానస్మాన్ హంసి యథేతరః. 3

మూ. మాల్యవన్తం స్థితం దృష్ట్వా మాల్యవన్తమివాచలమ్,
ఉవాచ రాక్షసేన్ద్రం తం దేవరాజానుజో బలీ. 6

ప్ర. అ. బలీ=బలవంతుడైన, దేవరాజానుజః=విష్ణువు; మాలవ్యన్తమ్= మాల్యవంత మను; అచలమివ = పర్వతము వలె; స్థితమ్ = నిలచిన, రాక్షసేన్ద్రమ్ = రాక్షసరాజైన, తం మాల్యవన్తమ్=ఆ మాల్యవంతుణ్ణి, దృష్ట్వా=చూచి, ఉవాచ = పలకెను.

తా. బలవంతుడైన శ్రీమహావిష్ణువు మాల్యవత్పర్వతము వలె నిలచిన రాక్షసరాజైన ఆ మాల్యవంతుణ్ణి చూచి ఇట్లనెను. 6

మూ. యుష్మత్తో భయభీతానాం దేవానాం వై మయాభయమ్,
రాక్షసోత్సాదనం దత్తం తదేతదనుపాల్యతే. 7

ప్ర. అ. మయా = నాచేత; యుష్మత్తః = మీనుండి; భయభీతానామ్ = భయకారణమువలన భయపడిన; దేవానామ్ = దేవతలకు; రాక్షసోత్సాదనమ్ = రాక్షససంహార రూపమైన; అభయమ్=అభయము; దత్తమ్=ఇవ్వబడినది. తదేవ=అదియే; అనుపాల్యతే=పాలింపబడుచున్నది.

తా. మీవలన వచ్చిన అపాయమునుండి భయపడిన దేవతలకు నేను, రాక్షససంహారము చేయుదు నని అభయ మిచ్చి ఉన్నాను. ఆ ప్రతిజ్ఞనే పాలించుచున్నాను. 7

మూ. ప్రాణైరపి ప్రియం కార్యం దేవానాం హి సదా మయా,
సోఽహం వో నిహనిష్యామి రసాతలగతానపి. 8

ప్ర. అ. మయా = నాచేత, సదా = ఎల్లప్పుడు, దేవానామ్ = దేవతలకు. ప్రాణైరపి = ప్రాణములచేత కూడ, ప్రియమ్ = ప్రియము, కార్యమ్ = చేయదగినది. సః అహమ్ = అట్టి నేను, రసాతలగతానపి = రసాతలమును పొందినను, వః = మిమ్ములను, నిహనిష్యామి = చంపెదను.

తా. నేను నా ప్రాణములైన ఇచ్చి ఎల్లప్పుడు దేవతలకు ప్రియము చేయవలసి ఉన్నది. అట్టి నేను మీరు రసాతలమునకు వెళ్ళినను మిమ్ములను చంపెదను. 8

మూ. స్కన్దోత్సృష్టేవ సా శక్తిర్గోవిన్దకరనిఃసృతా,
కాఙ్క్షన్తీ రాక్షసం ప్రాయాన్మహోల్కేవాఞ్జనాచలమ్. 12

ప్ర. అ. గోవిన్దకరనిఃసృతా = విష్ణుహస్తమునుండి బయల్వెడలిన, సా శక్తిః = ఆ శక్తి, స్కన్దోత్సృష్టేవ = కుమారస్వామిచేత విడవబడిన శక్తి వలె, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, కాఙ్క్షన్తీ = కోరుచున్నదై, మహోల్కా = గొప్ప ఉల్క, అఞ్జనాచలమ్ ఇవ = అంజనాచలమును గూర్చి వలె, ప్రాయాత్ = వెళ్ళెను.

తా. విష్ణువు హస్తమునుండి బయల్వెడలిన ఆ శక్తి కుమారస్వామి ప్రయోగించిన శక్తి వలె, ఆ రాక్షసుని మీదకు, కొరవి అంజన పర్వతముమీదికి వెళ్ళినట్లు వెళ్ళెను. 12

మూ. సా తస్యోరసి విస్తీర్ణే హారభారావభాసితే,
ఆపతద్రాక్షసేన్ద్రస్య గిరికూట ఇవాశనిః. 13

ప్ర. అ. సా = ఆ శక్తి, హారభారావభాసితే = హారముల భారముచేత ప్రకాశింపచేయబడిన, విస్తీర్ణే = విశాలమైన, తస్య రాక్షసేన్ద్రస్య = ఆ రాక్షసరాజుయొక్క, ఉరసి = వక్షఃస్థలమునందు, గిరికూటే = పర్వతశిఖరమునందు, అశనిః ఇవ = పిడుగు వలె, అపతత్ = పడెను.

తా. ఆ శక్తి హారముల సముదాయముతో ప్రకాశించుచున్న, విశాలమైన ఆ రాక్షసరాజు వక్షఃస్థలముమీద పర్వతశిఖరముమీద పిడుగు పడినట్లు పడెను.

మూ. తయా భిన్నతనుత్రాణః ప్రావిశద్విపులం తమః,
మాల్యవాన్ పునరాశ్వస్తస్తస్థౌ గిరిరివాచలః. 14

ప్ర. అ. తయా = దానిచేత, భిన్నతనుత్రాణః = భేదించబడిన కవచము గలవాడై, మాల్యవాన్ = మాల్యవంతుడు, విపులమ్ = అధికమైన, తమః = చీకటిని (మోహమును), ప్రావిశత్ = ప్రవేశించెను. పునః = మరల, ఆశ్వస్తః = తెప్పిరిల్లినవాడై, గిరిరివ = పర్వతమువలె, అచలః = చలించనివాడై, తస్థౌ = నిలచెను.

తా. ఆ శక్తి దెబ్బకు కవచము బ్రద్దలైపోగా మాల్యవంతుడు మూర్ఛపోయెను. మరల తెప్పిరిల్లి పర్వతము వలె కదలకుండ నిలబడెను. 14

మూ. వైనతేయస్తతః క్రుద్ధః పక్షవాతేన రాక్షసమ్,
వ్యపోహద్బలవాన్వాయుః శుష్కపర్ణచయం యథా. 18

ప్ర. ప. తతః = అటుపిమ్మట, వైనతేయః = గరుత్మంతుడు, క్రుద్ధః = కోపించినవాడై, రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, పక్షవాతేన = రెక్కల గాలిచేత, బలవాన్ = బలముగల, వాయుః = వాయువు, శుష్కపత్రచయం యథా = ఎండుటాకుల ప్రోగును వలె, వ్యపోహత్ = ఎగురగొట్టెను.

తా. అప్పుడు గరుత్మంతుడు కోపించి, బలముగల వాయువు ఎండుటాకుల ప్రోగును ఎగురగొట్టినట్లు, ఆ రాక్షసుణ్ణి రెక్కల గాలిచేత ఎగురగొట్టెను. 18

మూ. ద్విజేన్ద్రపక్షవాతేన ద్రావితం వీక్ష్య పూర్వజమ్,
సుమాలీ స్వబలైః సార్ధం లఙ్కామభిముఖో యయౌ. 19

ప్ర. అ. ద్విజేన్ద్రపక్షవాతేన = గరుత్మంతుని రెక్కల గాలిచేత, ద్రావితమ్ = ఎగురగొట్టబడిన, పూర్వజమ్ = అన్నను, వీక్ష్య = చూచి, సుమాలీ = సుమాలి, స్వబలైః సార్ధమ్ = తన సేనలతో కూడ, లఙ్కామ్ = లంకను గూర్చి, అభిముఖః = అభిముఖుడై, యయౌ = వెళ్ళెను.

తా. తన అన్నయైన మాల్యవంతుడు గరుత్మంతుని రెక్కల గాలికి ఎగిరిపోవుట చూచి సుమాలి సైన్యముతో లంక వైపు వెళ్ళిపోయెను. 19

మూ. పక్షవాతబలోద్ధూతో మాల్యవానపి రాక్షసః,
స్వబలేన సమాగమ్య యయౌ లఙ్కాం హ్రియా వృతః.

ప్ర. అ. పక్షవాతబలోద్ధూతః = రెక్కల గాలియొక్క బలముచేత ఎగురగొట్టబడిన, రాక్షసః = రాక్షసుడైన, మాల్యవానపి = మాల్యవంతుడు కూడ, స్వబలేన = తన సైన్యముతో, సమాగమ్య = కలిసి, హ్రియా = సిగ్గుతో, వృతః = కూడినవాడై, లఙ్కామ్ = లంకను గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. బలమైన గరుత్మంతుని రెక్కల గాలి ఎగురగొట్టివేయగా మాల్యవంతుడు కూడ సిగ్గుపడుచు సైన్యముతో లంకలో ప్రవేశించెను. 20

ఆ రాక్షసులు సుమాలి పాలనలో ఉండిరి. (సాలకటంకట మాల్యవంతుడు మొదలైనవాళ్ళ పితామహి, విద్యుత్కేశుని భార్య). 23

మూ. యే త్వయా నిహతాస్తే తు పౌలస్త్యా నామ రాక్షసాః,
సుమాలీ మాల్యవాన్మాలీ యే చ తేషాం పురఃసరాః,
సర్వ ఏతే మహాభాగా రావణాద్బలవత్తరాః. 24

ప్ర. అ. త్వయా = నీచేత, యే రాక్షసాః = ఏ రాక్షసులు, నిహతాః = చంపబడినారో, తే తు = వారు, పౌలస్త్యాః నామ = పౌలస్త్య లను పేరు గలవారు. సుమాలీ = సుమాలి, మాల్యవాన్ = మాల్యవంతుడు, మాలీ = మాలి, తేషామ్ = వాళ్ళకు, పురఃసరాః = ముందు ఉన్న, యే చ = ఎవరు గలరో, సర్వే = సమస్తమైన, మహాభాగాః = మహాభాగ్యవంతులైన, సర్వే = అందరూ, రావణాత్ = రావణునికంటె, బలవత్తరాః = ఎక్కువ బలము గలవారు.

తా. నీవు చంపిన రాక్షసులు పులస్త్యవంశమునకు చెందినవారు. సుమాలి, మాల్యవంతుడు, మాలి, వాళ్ళ పూర్వీకులు, వాళ్ళందరూ చాల గొప్పవాళ్లు. రావణునికంటె కూడ అధికబలవంతులు. 24

మూ. న చాన్యో రాక్షసాన్ హన్తా సురారీన్ దేవకణ్టకాన్,
ఋతే నారాయణం దేవం శఙ్ఖచక్రగదాధరమ్. 25

ప్ర. అ. శఙ్ఖచక్రగదాధరమ్ = శంఖచక్రగదాధారియైన, దేవమ్ = ప్రభువైన, నారాయణమ్ ఋతే = నారాయణుడు తప్ప, అన్యః = మరి యెవ్వడును. సురారీన్ = దేవతాశత్రువులు, దేవకణ్టకాన్ = దేవతలకు బాధ కలిగించువారు అయిన, రాక్షసాన్ = రాక్షసులను, న హన్తా = చంపగలవాడు కాదు.

తా. శంఖచక్రగదాధారి, భగవంతుడు, నారాయణుడు తప్ప మరెవ్వడూ దేవతాశత్రువులు, దేవతలకు బాధ కలిగించువారు అయిన రాక్షసులను చంపగలవాడు లేడు. 25

మూ. భవాన్నారాయణో దేవశ్చతుర్బాహుః సనాతనః,
రాక్షసాన్ హన్తుముత్పన్నో హ్యజయ్యః ప్రభురవ్యయః.

తా. మహారాజా ! రామా ! రాక్షసుల జన్మవృత్తాంతమును గూర్చి నీకింత వరకు నివేదించితిని. ఇప్పుడు రావణునియొక్క, ఆతని పుత్రులయొక్క జన్మ వృత్తాంతమును, సాటి లేని వాళ్ళ ప్రభావము నంతనూ గూర్చి చెప్పెదను; వినుము. 28

మూ. చిరాత్సుమాలీ వ్యచరద్రసాతలం
సరాక్షసో విష్ణుభయార్దిత స్తదా,
పుత్రైశ్చ పౌత్రైశ్చ సమన్వితో బలీ
తతస్తు లఙ్కామవసద్ధనేశ్వరః. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, సుమాలీ = సుమాలి, విష్ణుభయార్దితః = విష్ణువు వలన భయముచేత పీడితుడై, సరాక్షసః = రాక్షసులతో కూడినవాడై, చిరాత్ = చిరకాలము, రసాతలమ్ = పాతాళమును, వ్యచరత్ = సంచరించెను. తతః = అటు పిమ్మట, బలీ = బలవంతుడైన, ధనేశ్వరః = కుబేరుడు, పుత్రైశ్చ = పుత్రులతోను, పౌత్రైశ్చ = పౌత్రులతోను, సమన్వితః = కూడినవాడై, లఙ్కామ్ = లంకను, అవసత్ = నివసించెను.

తా. అప్పుడు సుమాలి, విష్ణువునకు భయపడి, రాక్షసులతో కూడి చాల కాలము రసాతలములో సంచరించెను. అటుపిమ్మట బలశాలియైన కుబేరుడు పుత్ర పౌత్రులతో కలిసి లంకలో నివసించెను. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
అష్టమ సర్గ సమాప్తము.

తా. అప్పుడు పద్మములు ధరించని లక్ష్మి వలె ఉన్న, అవివాహితయైన కుమార్తెను వెంటబెట్టుకొని భూలోకమునందు సంచరించుచున్న, నీలమేఘసమానుడు, పరిశుద్ధమైన బంగారు కుండలములు ధరించినవాడు అయిన ఆ సుమాలి, పుష్పకముమీద ఎక్కి వెళ్ళుచున్న కుబేరుణ్ణి చూచెను. 2, 3

మూ. గచ్ఛన్తం పితరం ద్రష్టుం పులస్త్యతనయం విభుమ్,
తం దృష్ట్వామరసంకాశం స్వచ్ఛన్దం పావకోపమమ్, 4

రసాతలం ప్రవిష్టః సన్ మర్త్యలోకాత్సవిస్మయః.
ఇత్యేవం చిన్తయామాస రాక్షసానాం మహామతిః, 5
కిం కృత్వా శ్రేయ ఇత్యేవం వర్ధేమహి కథం వయమ్.

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల అతడు, పితరమ్ = తండ్రిని, ద్రష్టుమ్ = చూచుటకు, గచ్ఛన్తమ్=వెళ్ళుచున్నవాడు, విభుమ్=సమర్థుడు, అమర సంకాశమ్= దేవతాతుల్యుడు, స్వచ్ఛన్దమ్ = స్వేచ్ఛగా ఉన్నవాడు, పావకోపమమ్ = అగ్నితో సమానుడు అయిన, పులస్త్యతనయమ్ = పులస్త్యుని పుత్రుడైన కుబేరుణ్ణి, దృష్ట్వా=చూచి, సవిస్మయః = ఆశ్చర్యముతో కూడినవాడై, మర్త్యలోకాత్ = మనుష్యలోకమునుండి, రసాతలమ్ = పాతాళమును, ప్రవిష్టః సన్ = ప్రవేశించినవాడై, రాక్షసానామ్ = రాక్షసుల విషయమున, ఇత్యేవమ్=ఇట్లు, చిన్తయామాస = ఆలోచించెను. శ్రేయః = శ్రేయస్కరమైన, కిమ్ = ఏమి, కృత్వా = చేసి, వయమ్ = మనము, కథమ్ = ఎట్లు, ఇత్యేవమ్ = ఈ విధముగా, వర్ధేమహి= వృద్ధిపొందెదము ?

తా. పులస్త్యుని కుమారుడైన ఆ కుబేరుడు తండ్రిని చూచుటకై వెళ్ళుచుండెను. సర్వసమర్థుడైన, స్వేచ్ఛగా సంచరించుచున్న, అతడు దేవతుల్యుడై, అగ్నివలె ప్రకాశించుచుండెను. మహాబుద్ధిశాలియైన సుమాలి అతనిని చూచి, ఆశ్చర్యచకితుడై, భూలోకమునుండి రసాతలమునకు తిరిగి వెళ్ళి రాక్షసులను గూర్చి ఇట్లు ఆలోచించెను. "మనము ఏ మంచి పనులు చేసినచో ఎట్లు ఈ కుబేరుడు వలె వృద్ధిపొందెదము ?" 4, 5

మూ. అథాబ్రవీత్సుతాం రక్షః కైకసీం నామ నామతః, 6
పుత్రి ప్రదానకాలోఽయం యౌవనం వ్యతివర్తతే.

ఆత్మాభిమానవంతు లందరికీ కన్యకు తలిదండ్రులై ఉండుట దుఃఖకారణము. ఎట్టి వాడు, వచ్చి కన్యను వరించునో తెలియదు కదా ? 8, 9

మూ. మాతుః కులం పితృకులం యత్ర చైవ చ దీయతే,
కులత్రయం సదా కన్యా సంశయే స్థాప్య తిష్ఠతి. 10

ప్ర. అ. కన్యా = కన్య, మాతుః = తల్లియొక్క, కులమ్ = కులమును, పితృకులమ్ = తండ్రియొక్క కులమును, యత్ర = ఏ కులమునందు, దీయతే = ఇవ్వబడుచున్నదో అ కులమును, కులత్రయమ్ = కులముల త్రయమును, సదా = ఎల్లప్పుడూ, సంశయే = సంశయమునందు, స్థాప్య = ఉంచి, తిష్ఠతి = ఉండును.

తా. కన్య తల్లివంశము, తండ్రివంశము, ఏ వంశమునకు వెళ్ళునో ఆ వంశము, ఈ మూడు వంశములను సర్వదా సంశయములో ఉంచును. 10

మూ. సా త్వం మునివరం శ్రేష్ఠం ప్రజాపతికులోద్భవమ్,
భజ విశ్రవసం పుత్రి పౌలస్త్యం వరయ స్వయమ్. 11

ప్ర. అ. పుత్రి = ఓ ! పుత్రీ ! సా త్వమ్ = అట్టి నీవు, మునివరమ్ = మునులలో ఉత్తముడు, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠుడు, ప్రజాపతికులోద్భవమ్ = బ్రహ్మ యొక్క కులమునందు పుట్టినవాడు అయిన, విశ్రవసమ్ = విశ్రవసుణ్ణి, భజ = సేవించుము. పౌలస్త్యమ్ = పులస్త్యుని పుత్రుడైన ఆతనిని, స్వయమ్ = స్వయముగా, వరయ = వరించుము.

తా. పుత్రీ ! నీవు మునులలో గొప్పవాడు, శ్రేష్ఠుడు, ప్రజాపతివంశములో పుట్టినవాడు అయిన విశ్రవసుణ్ణి సేవించుము. నీవు స్వయముగా ఆ పులస్త్య కుమారుణ్ణి వరించుము. 11

మూ. ఈదృశాస్తే భవిష్యన్తి పుత్రాః పుత్రి న సంశయః,
తేజసా భాస్కరసమో యాదృశోఽయం ధనేశ్వరః. 12

ప్ర. అ. పుత్రి = పుత్రీ ! తేజసా = తేజస్సుచేత, భాస్కరసమః = సూర్యునితో సమానుడైన, అయం ధనేశ్వరః = ఈ కుబేరుడు, యాదృశః = ఎట్టివాడో, ఈదృశాః = ఇట్టి, పుత్రాః = పుత్రులు, తే = నీకు, భవిష్యన్తి = పుట్టగలరు. సంశయః = సంశయము, న = లేదు.

చున్నదై, చరణాధోముఖీ = చరణమువైపు క్రిందికి ఉన్న ముఖము గలదై, తస్య = ఆతనియొక్క, అగ్రతః = ఎదుట, స్థితా = నిలచినది.

తా. ఆ కైకసి తండ్రియందున్న గౌరవముచేత, ఆ సమయము దారుణమైన దని కూడ ఆలోచించక, ఆ ముని పాదముల వైపు చూచుచు, కాలి బొటనవ్రేలిచేత మాటిమాటికి నేల వ్రాయుచు, అతని ఎదుట నిలచెను. 15

మూ. స తు తాం వీక్ష్య సుశ్రోణీం పూర్ణచన్ద్రనిభాననామ్, 16
అబ్రవీత్పరమోదారో దీప్యమానాం స్వతేజసా.

ప్ర. అ. పరమోదారః = చాల ఉత్తమస్వభావము గల, సః = విశ్రవస్సు, సుశ్రోణీమ్ = అందమైన పిరుదులు గల, పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల, స్వతేజసా = తన తేజస్సుతో, దీప్యమానామ్ = ప్రకాశించుచున్న, తామ్ = ఆమెను, వీక్ష్య = చూచి, అబ్రవీత్ = పలికెను.

తా. చాల ఉత్తమమైన స్వభావము గల ఆ విశ్రవస్సు, అందమైన కటిప్రదేశము, పూర్ణచంద్రుని వంటి ముఖమూ గల, సహజతేజస్సుతో ప్రకాశించుచున్న ఆ కైకసిని చూచి ఇట్లు పలికెను. 16

మూ. భద్రే కస్యాసి దుహితా కుతో వా త్వమిహాగతా,
కిం కార్యం కస్య వా హేతో స్తత్త్వతో బ్రూహి శోభనే.

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా ! త్వమ్ = నీవు, కస్య = ఎవనియొక్క, దుహితా = కుమార్తెవు, అసి = అయిఉన్నావు ? శోభనే = ఓ ! సుందరీ ! కుతః వా = ఎక్కడినుండి, కస్య వా హేతోః = ఏ కారణమువలన, ఇహ = ఇక్కడికి, ఆగతా = వచ్చినావు ? కార్యమ్ = పని, కిమ్ = ఏమి ?

తా. మంగళప్రదురాలా ! నీవు ఎవరి కుమార్తెవు? ఎక్కడినుండి, ఎందుకు ఇక్కడికి వచ్చినావు ? ఓ ! సుందరీ ! నీవు ఏపనిమీద ఇక్కడికి వచ్చినావు? 17

మూ. ఏవముక్తా తు సా కన్యా కృతాఞ్జలిరథాబ్రవీత్,
ఆత్మప్రభావేణ మునే జ్ఞాతుమర్హసి మే మతమ్. 18

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, సా కన్యా = ఆ కన్య, అథ

శృణు తస్మాత్సుతాన్ భద్రే యాదృశాన్ జనయిష్యసి,
దారుణాన్ దారుణాకారాన్ దారుణాభిజనప్రియాన్. 22
ప్రసవిష్యసి సుశ్రోణి రాక్షసాన్ క్రూరకర్మణః.

ప్ర. అ. మత్తమాతఙ్గగామిని = మదించిన ఏనుగు వలె నడచుదానా! మత్తః = నావలన, తే = నీకు, సుతాభిలాషః = పుత్రుల అభిలాష ఉన్నది. తు = కాని, త్వమ్ = నీవు, యస్మాత్ = ఏ కారణమువలన, దారుణాయామ్ = దారుణమైన, వేలాయామ్ = సమయమునందు, మామ్ = నన్ను, ఉపస్థితా = చేరినావో, తస్మాత్ = అందువలన, భద్రే = మంగళప్రదురాలా ! యాదృశాన్ = ఎట్టి, సుతాన్ = కుమారులను, జనయిష్యసి = కనెదవో, శృణు = వినుము. సుశ్రోణి = అందమైన పిరుదులు గలదానా ! దారుణాన్ = క్రూరులు, దారుణాకారాన్ = భయంకరమైన ఆకారము గలవారు, దారుణాభిజనప్రియాన్ = దారుణులైన బంధుజనులు ప్రియులుగా గలవారు, క్రూరకర్మణః = క్రూరమైన కర్మలు గలవారు అయిన, రాక్షసాన్ = రాక్షసులను, ప్రసవిష్యసి = కనగలవు.

తా. ఓ! మత్తగజగమనా! నీకు నావలన పుత్రులు కలగవలె నను కోరిక ఉన్నది. కాని నీవు నా వద్దకు దారుణమైన సంధ్యాసమయమునందు వచ్చినావు. అందుచే నీకు ఎట్టి పుత్రులు కలిగెదరో వినుము. నీకు భయంకరులు, భయంకరమైన ఆకారము గలవారు, క్రూరులైన బంధువులయందు ప్రీతి కలవారు, క్రూరములైన పనులు చేయువారు అయిన రాక్షసులు పుత్రులుగా పుట్టెదరు. 21,22

మూ. సా తు తద్వచనం శ్రుత్వా ప్రణిపత్యాబ్రవీద్వచః. 23
భగవన్నీదృశాన్ పుత్రాంస్త్వత్తోఽహం బ్రహ్మవాదినః,
నేచ్ఛామి సుదురాచారాన్ ప్రసాదం కర్తుమర్హసి. 24

ప్ర. అ. సా తు = ఆమె యైతే, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, ప్రణిపత్య = నమస్కరించి, వచః = వచనమును, అబ్రవీత్ = పలికెను. భగవన్ = పూజ్యుడా ! బ్రహ్మవాదినః = వేదాధ్యేతవైన, త్వత్తః = నీనుండి, అహమ్ = నేను, ఈదృశాన్ = ఇట్టి, సుదురాచారాన్ = చాల చెడ్డ నడవడిక గల, పుత్రాన్ = పుత్రులను, నేచ్ఛామి = కోరను, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. రామా! విశ్రవసుడు ఇట్లు చెప్పిన కొంతకాలానికి ఆ కన్య, భయంకరుడు, చాలక్రూరుడు అయిన, రాక్షసరూపము గల పుత్రుని కనెను. 27

మూ. దశగ్రీవం మహాదంష్ట్రం నీలాఞ్జనచయోపమమ్,
తామ్రోష్ఠం వింశతిభుజం మహాస్యం దీప్తమూర్ధజమ్. 28

ప్ర. అ. దశగ్రీవమ్ = పది కంఠములు గలవాడు, మహాదంష్ట్రమ్ = గొప్ప కోరలు గలవాడు, నీలాఞ్జనచయోపమమ్ = నల్లని కాటుకతో సమానుడు, తామ్రోష్ఠమ్ = ఎఱ్ఱని పెదవులు గలవాడు, వింశతిభుజమ్ = ఇరువది భుజములు గలవాడు, మహాస్యమ్ = గొప్ప ముఖములు గలవాడు, దీప్తమూర్ధజమ్ = ప్రకాశించుచున్న కేశములు గలవాడు అయిన (పుత్రుని కనెను).

తా. ఆ పిల్లవానికి పది కంఠములు, పెద్ద కోరలు, ఎఱ్ఱని పెదవులు, ఇరవై చేతులు, పెద్ద నోళ్లు, ప్రకాశించుచున్న జుట్టు ఉండెను. అతడు నల్లని కాటుక కుప్ప వలె ఉండెను. 28

మూ. తస్మిన్ జాతే తు తత్కాలే సజ్వాలకవలాః శివాః,
క్రవ్యాదాశ్చాపసవ్యాని మణ్డలాని ప్రచక్రముః. 29

ప్ర. అ. తత్కాలే = ఆ కాలమునందు, తతః = అటుపిమ్మట, తస్మిన్ = అతడు, జాతే = పుట్టినవాడగుచుండగా, సజ్వాలకవలాః = జ్వాలాకబళములతో కూడిన, శివాః = ఆడనక్కలు, క్రవ్యాదాశ్చ = మాంసము తిను మృగములు, అపసవ్యాని = అపసవ్యములైన, మణ్డలాని = మండలములను, ప్రచక్రముః = తిరిగినవి.

తా. అతడు పుట్టగానే నిప్పు ముద్దలు నోళ్ళలో ఉన్న ఆడు నక్కలు, మాంసము తిను మృగాలు, అపసవ్యముగా, గుండ్రముగా తిరిగినవి.

మూ. వవర్ష రుధిరం దేవో మేఘాశ్చ ఖరనిఃస్వనాః,
ప్రబభౌ న చ సూర్యో వై మహోల్కాశ్చాపతన్ భువి. 30

ప్ర. అ. దేవః = దేవుడు, రుధిరమ్ = రక్తమును, వవర్ష = వర్షించెను. మేఘాశ్చ = మేఘములు కూడ, ఖరనిఃస్వనాః = కటువైన ధ్వని గలవి. సూర్యః

తా. దశగ్రీవుని తరఘాత మహాబలవంతుడైన కుంభకర్ణుడు పుట్టెను. ఆతని శరీర ప్రమాణమును మించిన ప్రమాణము ఈ లోకములో లేదు. 33

మూ. తతః శూర్పణఖా నామ సంజజ్ఞే వికృతాననా,
విభీషణశ్చ ధర్మాత్మా కైకస్యాః పశ్చిమః సుతః. 34

ప్ర. అ. తతః = పిమ్మట, వికృతాననా = వికృతమైన ముఖము గల, శూర్పణఖా నామ = శూర్పణఖ అనునది, సంజజ్ఞే = పుట్టెను, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, విభీషణశ్చ = విభీషణుడు, కైకస్యాః = కైకసియొక్క, పశ్చిమః సుతః = చివరి పుత్రుడుగా జనించెను.

తా. పిమ్మట వికృతమైన ముఖము గల శూర్పణఖ పుట్టెను. ధర్మాత్ముడైన విభీషణుడు కైకసి చివరి పుత్రుడుగా జనించెను. 34

మూ. తస్మిన్ జాతే మహాసత్త్వే పుష్పవర్షం పపాత హ,
నభఃస్థలే దున్దుభయో దేవానాం ప్రాణదంస్తథా.
వాక్యం చైవాన్తరిక్షే చ సాధు సాధ్వితి తత్తదా. 35

ప్ర. అ. మహాసత్త్వే = గొప్ప బుద్ధి గల, తస్మిన్ = అతడు, జాతే = పుట్టినవాడగుచుండగా, పుష్పవర్షమ్ = పుష్పవర్షము, పపాత హ = పడెను, తథా = మరియు, నభఃస్థలే = ఆకాశమునందు, దేవదున్దుభయః = దేవతల దుందుభులు, ప్రాణదన్ = ధ్వనిచేసినవి. తదా = అప్పుడు, అన్తరిక్షే = ఆకాశమునందు, సాధు సాధు ఇతి = బాగు బాగు అని, వాక్యమ్ = వాక్యము (వినబడెను).

తా. మహాబుద్ధిశాలియైన విభీషణుడు పుట్టినప్పుడు పుష్పవర్షము కురిసెను. ఆకాశమునందు దేవదుందుభులు మ్రోగెను. ఆకాశమునందు "బాగు బాగు" అను మాటలు వినబడెను. 35

మూ. తౌ తు తత్ర మహారణ్యే వవృధాతే మహౌజసౌ,
కుమ్భకర్ణదశగ్రీవౌ లోకోద్వేగకరౌ తదా. 36

ప్ర. అ. తదా = అప్పుడు, మహౌజసౌ = గొప్ప తేజస్సు గల, లోకోద్వేగకరౌ = లోకమునకు భయము కలిగించు, తౌ = ఆ, కుమ్భకర్ణదశగ్రీవౌ

పుష్పకేణ = పుష్పకముచేత, తత్ర = అక్కడికి, పితరమ్ = తండ్రిని, ద్రష్టుమ్ = చూచుటకు, ఆగతః = వచ్చినాడు.

తా. పిమ్మట కొంత కాలమునకు ధనాధిపతియైన దేవుడు కుబేరుడు తండ్రి దర్శనమునకై పుష్పకముమీద అక్కడికి వచ్చెను. 39

మూ. తం దృష్ట్వా కైకసీ తత్ర జ్వలన్తమివ తేజసా,
ఆగమ్య రాక్షసీ తత్ర దశగ్రీవమువాచ హ. 40

ప్ర. అ. తత్ర = ఆ సమయమునందు, రాక్షసీ = రాక్షసస్త్రీయైన, కైకసీ = కైకసి, తత్ర = అక్కడ, తేజసా = తేజస్సుతో, జ్వలన్తమివ = ప్రజ్వలించుచున్నట్లున్న, తమ్=ఆతనిని, దృష్ట్వా=చూచి, ఆగమ్య = వచ్చి, దశగ్రీవమ్= దశగ్రీవుణ్ణి గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. అపుడు రాక్షసియైన కైకసి అక్కడ తేజస్సుతో మండుచున్నాడా అన్నట్లు ఉన్న ఆ కుబేరుణ్ణి చూచి దశగ్రీవునివద్దకు వచ్చి ఇట్లు పలికెను. 40

మూ. పుత్ర వైశ్రవణం పశ్య భ్రాతరం తేజసావృతమ్,
భ్రాతృభావే సమానేఽపి పశ్యాత్మానం త్వమీదృశమ్. 41

ప్ర. అ. పుత్ర = పుత్రుడా ! తేజసా = తేజస్సుతో, వృతమ్ = కూడిన, భ్రాతరమ్ = సోదరుడైన, వైశ్రవణమ్ = కుబేరుణ్ణి, పశ్య = చూడుము. భ్రాతృభావే = సోదరత్వము, సమానేఽపి = సమానమే అయినను, త్వమ్ = నీవు, ఈదృశమ్ = ఈవిధముగా ఉన్న, ఆత్మానమ్ = తనను, పశ్య = చూచుకొనుము.

తా. పుత్రా ! నీ సోదరుడైన కుబేరుడు తేజస్సుతో ఎట్లు ప్రకాశించుచున్నాడో చూడుము. సోదరత్వము సమానమే అయినను ఈ విధముగా ఉన్న నిన్ను చూచుకొనుము. 41

మూ. దశగ్రీవ తథా యత్నం కురుష్వామితవిక్రమ,
యథా త్వమపి మే పుత్ర భవేర్వైశ్రవణోపమః. 42

ప్ర. అ. పుత్ర = కుమారా ! అమితవిక్రమ = సాటిలేని పరాక్రమము గలవాడా ! దశగ్రీవ = దశగ్రీవుడా ! త్వమపి = నీవు కూడ, యథా = ఎట్లు,

చేయ శక్యము కాని, కర్మ = పనిని, చికీర్షుః = చేయదలచినవాడై, తపసే = తపస్సుకొరకు, ధృతమానసః = నిశ్చయింపబడిన మనస్సుకలవా డయ్యెను.

తా. పిమ్మట సోదరసహితుడైన దశగ్రీవుడు ఆ కోపావేశముతోనే కూడి, ఎవ్వరూ చేయజాలని పని చేయ దలచినవాడై తపస్సు చేయుటకు నిశ్చయించు కొనెను.

మూ. ప్రాప్స్యామి తపసా కామమితి కృత్వాధ్యవస్య చ,
ఆగచ్ఛదాత్మసిద్ధ్యర్థం గోకర్ణస్యాశ్రమం శుభమ్. 46

ప్ర. అ. తపసా = తపస్సుచేత, కామమ్ = కోరికను, ప్రాప్స్యామి = పొందగలను, ఇతి = ఇట్లు, (మనః) కృత్వా = మనస్సు చేసి, అధ్యవస్య చ = నిర్ణయించి, ఆత్మసిద్ధ్యర్థమ్ = తన కార్యసిద్ధికొరకై, శుభమ్ = శుభమైన, గోకర్ణస్య = గోకర్ణక్షేత్రముయొక్క, ఆశ్రమం ప్రతి = ఆశ్రమమును గూర్చి, ఆగచ్ఛత్ = వచ్చెను.

తా. తపస్సుచేత కోరికను సాధించవలె నను దృఢసంకల్పముతో ఆతడు తన కార్యము సిద్ధించుటకై పవిత్రమైన గోకర్ణక్షేత్రమును చేరెను. 46

మూ. స రాక్షస స్తత్ర సహానుజ స్తదా
తపశ్చచారాతులముగ్రవిక్రమః,
అతోషయచ్చాపి పితామహం విభుం
దదౌ స తుష్టశ్చ వరాన్ జయావహాన్. 47

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
నవమః సర్గః.

ప్ర. అ. ఉగ్రపరాక్రమః = ఉగ్రమైన పరాక్రమము గల, సః రాక్షసః = ఆ రాక్షసుడు, సహానుజః = అనుజులతో కూడినవాడై, తదా = అప్పుడు, తత్ర = అక్కడ, అతులమ్ = సాటిలేని, తపః = తపస్సును, చచార = చేసెను. విభుమ్ = ప్రభువైన, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి, అతోషయచ్చ = సంతోషపెట్టెను,

# అథ దశమః సర్గః

[రావణాదులు తపస్సు చేసి వరములు పొందుట.]

మూ. అథాబ్రవీన్మునిం రామః కథం తే భ్రాతరో వనే,
కీదృశం తు తదా బ్రహ్మంస్తపస్తేపుర్మహాబలాః. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామః = రాముడు, మునిమ్ = మునిని గూర్చి, అబ్రవీత్ = పలికెను. బ్రహ్మన్ = ఓ ! బ్రాహ్మణోత్తముడా, మహాబలాః = గొప్ప బలము గల, తే భ్రాతరః = ఆ సోదరులు, వనే = వనమునందు, తదా = అప్పుడు, కీదృశమ్ = ఎట్టి, తపః = తపస్సు, తేపుః = చేసిరి.

తా. పిమ్మట రాముడు అగస్త్యమహామునిని - "ఓ ! బ్రాహ్మణోత్తమా ! అపుడు మహాబలశాలులైన ఆ సోదరులు ఎట్లు తపస్సు చేసిరి ?"అని ప్రశ్నించెను.

మూ. అగస్త్యస్త్వబ్రవీత్తత్ర రామం సుప్రీతమానసమ్,
తాంస్తాన్ ధర్మవిధీంస్తత్ర భ్రాతరస్తే సమావిశన్.

ప్ర. అ. తత్ర = అక్కడ, సంప్రీతమానసమ్ = సంతోషించిన మనస్సు గల, రామమ్ = రాముణ్ణి గూర్చి, అగస్త్యస్తు = అగస్త్యుడు, అబ్రవీత్ = పలికెను. తే = ఆ, భ్రాతరః = సోదరులు, తత్ర = అక్కడ, తాంస్తాన్ = ఆ యా, ధర్మ విధీన్ = ధర్మవిధానములను, సమావిశన్ = ప్రవేశించిరి.

తా. చాల ఆసక్తితో కూడిన మనస్సు గల రామునితో అగస్త్యుడు ఇట్లు చెప్పెను-"ఆ సోదరులు ఆ యా ధర్మవిధానములను ఆచరించిరి". 2

మూ. కుమ్భకర్ణస్తతో యత్తో నిత్యం ధర్మపథే స్థితః,
తతాప గ్రీష్మకాలే తు పఞ్చాగ్నీన్ పరితః స్థితః. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కుమ్భకర్ణః = కుంభకర్ణుడు, యత్తః =

మూ. విభీషణస్తు ధర్మాత్మా నిత్యం ధర్మపరః శుచిః,
పఞ్చ వర్షసహస్రాణి పాదేనైకేన తస్థివాన్. 6

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విభీషణస్తు=విభీషణుడైతే, నిత్యమ్ = ఎల్లప్పుడు, ధర్మపరః = ధర్మాసక్తుడై, శుచిః = పవిత్రుడై, పఞ్చ = ఐదు, వర్షసహస్రాణి = సంవత్సరముల వేలు, ఏకేన = ఒక, పాదేన = పాదముచేత, తస్థివాన్ = నిలచినాడు.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు నిత్యము ధర్మపరుడై, పవిత్రుడై ఐదు వేలసంవత్సరములు ఒక్క పాదముమీద నిలబడెను. 6

మూ. సమాప్తే నియమే తస్య ననృతుశ్చాప్సరోగణాః,
పపాత పుష్పవర్షం చ తుష్టువుశ్చాపి దేవతాః. 7

ప్ర. అ. తస్య = అతనియొక్క, నియమే = నియమము, సమాప్తే = సమాప్తమైనదగుచుండగా, అప్సరోగణాః = అప్సరఃస్త్రీగణములు, ననృతుశ్చ = నృత్యము చేసినవి. పుష్పవర్షం చ = పుష్పవర్షము కూడ, పపాత = పడెను. దేవతాశ్చాపి = దేవతలు కూడ, తుష్టువుః = స్తోత్రము చేసిరి.

తా. అతని నియమము పూర్తి అయినప్పుడు అప్సరఃస్త్రీలు నృత్యము చేసిరి. పుష్పవర్షము కురిసెను. దేవతలు కూడ స్తుతించిరి. 7

మూ. పఞ్చ వర్షసహస్రాణి సూర్యం చైవాన్వవర్తత,
తస్థౌ చోర్ధ్వశిరోబాహుః స్వాధ్యాయే ధృతమానసః. 8

ప్ర. అ. పఞ్చ = ఐదు, వర్షసహస్రాణి=సంవత్సరముల వేలు, సూర్యమ్ = సూర్యుణ్ణి, అన్వవర్తతచ=అనుసరించెను. స్వాధ్యాయే=స్వాధ్యాయమునందు, ధృతమానసః = స్థిరముచేయబడిన మనస్సుగలవాడై, ఊర్ధ్వశిరోబాహుః = పైకి శిరస్సు బాహువులు కలవాడై, తస్థౌ = నిలచెను.

తా. స్వాధ్యాయమునందు మనస్సును స్థిరముగా నిలిపి, ముఖము బాహువులు పైకి ఎత్తి నిలచి ఐదు వేల సంవత్సరములు సూర్యుణ్ణి అనుసరించెను. (సూర్యుడు ఏ దిక్కున ఉండునో ఆ దిక్కుకు ముఖము త్రిప్పి సూర్యుని చూచుచు నిలచెను). 8

సంవత్సరములు గడచినవి. అతని తొమ్మిది శిరస్సులు అగ్నిలో హోమముచేయ బడినవి. 11

మూ. అథ వర్షసహస్రే తు దశమే దశమం శిరః,
ఛేత్తుకామే దశగ్రీవే ప్రాప్తస్తత్ర పితామహః. 12

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దశమే = పదవ, వర్షసహస్రే = సంవత్సరముల సహస్రమునందు, దశగ్రీవే = దశగ్రీవుడు, దశమమ్ = పదవ, శిరః = శిరస్సును, ఛేత్తుకామే = ఛేదించుటకు కోరికగలవాడగుచుండగా, పితామహః = బ్రహ్మదేవుడు, తత్ర = అక్కడికి, ప్రాప్తః = వచ్చినాడు.

తా. పదివేల సంవత్సరములు పూర్తి అయిన పిమ్మట దశగ్రీవుడు పదవ శిరస్సు ఛేదించుటకు ఉద్యుక్తుడగుచుండగా బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చెను.

మూ. పితామహస్తు సుప్రీతః సార్ధం దేవైరుపస్థితః,
తవ తావద్దశగ్రీవ ప్రీతోఽస్మీత్యభ్యభాషత. 13

ప్ర. అ. పితామహస్తు = బ్రహ్మదేవుడైతే, సుప్రీతః = చాల సంతోషించినవాడై, దేవైః సార్ధమ్ = దేవతలతో కూడ, ఉపస్థితః = వచ్చినాడు. దశగ్రీవ = దశగ్రీవుడా! తవ = నీకు, ప్రీతః = సంతోషించినవాడను, అస్మి తావత్ = అయినాను; ఇతి = అని, అభ్యభాషత = పలికెను.

తా. బ్రహ్మదేవుడు సంతోషించి, దేవతలతో కలిసి వచ్చి-"దశగ్రీవా! నీ విషయమున సంతోషించినాను"అని పలికెను. 13

మూ. శీఘ్రం వరయ ధర్మజ్ఞ వరో యస్తేఽభికాఙ్క్షితః,
కం తే కామం కరోమ్యద్య న వృథా తే పరిశ్రమః. 14

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! తే = నీకు, యః = ఏ, వరః = వరము, అభికాఙ్క్షితః = కోరబడినదో, దానిని, శీఘ్రమ్ = శీఘ్రముగా, వరయ = కోరుము. అద్య = ఇప్పుడు, తే = నీయొక్క, కమ్ = ఏ, కామమ్ = కోరికను, కరోమి = చేయుదును? తే = నీయొక్క, పరిశ్రమః = శ్రమ, వృథా = వ్యర్థముగా, న = కాకూడదు.

= పూర్తిగా మరణము లేకపోవుట, నాస్తి = లేదు. అన్యమ్ = మరియొక, పరమ్ = వరమును, మే = నానుండి, వృణీష్వ = కోరుము.

తా. ఆ మాటలు విని బ్రహ్మదేవుడు దశగ్రీవునితో ఇట్లు పలికెను- "నీకు పూర్తిగా మరణము లేకుండుట అనునది లేదు. మరొక వరమేదైన కోరుకొనుము." 17

మూ. ఏవముక్తే తదా రామ బ్రహ్మణా లోకకర్తృణా,
దశగ్రీవ ఉవాచేదం కృతాఞ్జలిరథాగ్రతః. 18

ప్ర. అ. రామ = రామా ! తదా = అప్పుడు, లోకకర్తృణా = లోకముల సృష్టికర్తయైన, బ్రహ్మణా = బ్రహ్మచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = చెప్పబడగా, అథ = అటుపిమ్మట, దశగ్రీవః = దశగ్రీవుడు, అగ్రతః = ఎదుట, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రామా ! లోకములను సృజించిన బ్రహ్మదేవుడు పలికిన మాటలు విని దశగ్రీవుడు అంజలి ఘటించి ఎదుట నిలచి ఇట్లు పలికెను. 18

మూ. సుపర్ణనాగయక్షాణాం దైత్యదానవరక్షసామ్,
అవధ్యోఽహం ప్రజాధ్యక్ష దేవతానాం చ శాశ్వత. 19

ప్ర. అ. ప్రజాధ్యక్ష = ప్రజల ప్రభువైనవాడా ! శాశ్వత = నిత్యుడా ! అహమ్ = నేను, సుపర్ణనాగయక్షాణామ్ = పక్షులకు, నాగులకు, యక్షులకు, దైత్యదానవరక్షసామ్ = దైత్యులకు, దానవులకు రాక్షసులకు, దేవతానాం చ = దేవతలకు, అవధ్యః = చంప శక్యము కానివాడను అగుదును గాక.

తా. నిత్యుడవైన ఓ ! ప్రజాపతీ ! నన్ను పక్షులు, నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, దేవతలు చంపజాలకుండునట్లు వర మిమ్ము. 19

మూ. న హి చిన్తా మమాన్యేషు ప్రాణిష్వమరపూజిత,
తృణభూతా హి తే మన్యే ప్రాణినో మానుషాదయః. 20

ప్ర. అ. అమరపూజిత = దేవతలచేత పూజించబడినవాడా ! మమ = నాకు, అన్యేషు = ఇతరములైన, ప్రాణిషు = ప్రాణులవిషయమునందు, చిన్తా = చింత,

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! రాక్షస=రాక్షసుడా! త్వయా=నీచేత, పూర్వమ్=పూర్వము, యాని శీర్షాణి=ఏ శిరస్సులు, అగ్నౌ=అగ్నియందు, హుతాని=హోమముచేయబడినవో, తాని=అవి, తవ=నీకు, తథైవ=అట్లే, పునః=మరల, భవిష్యన్తి=కాగలవు.

తా. దోషములు లేని రాక్షసుడా! పూర్వము నీవు అగ్నిలో హోమము చేసిన శిరస్సులు నీకు మరల పూర్వమువలెనే రాగలవు. 23

మూ. వితరామీహ తే సౌమ్య వరం చాన్యం దురాసదమ్, 24
ఛన్దత స్తవ రూపం చ మనసా యద్యదీప్సితమ్,
భవిష్యతి న సన్దేహో మద్వరాత్తవ రాక్షస. 25

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా! ఇహ=ఇప్పుడు, దురాసదమ్=పొందశక్యముకాని, అన్యం వరం చ=మరియొక వరమును కూడ, వితరామి=ఇచ్చుచున్నాను. రాక్షస=రాక్షసుడా! మనసా=మనస్సుచేత, యత్=ఏది, యథా=ఎట్లు, ఈప్సితమ్=ఇష్టమో, రూపం చ=అట్టి రూపము కూడ, తవ=నీయొక్క, ఛన్దతః=ఇచ్ఛవలన, మద్వరాత్=నా వరమువలన, తవ=నీకు, భవిష్యతి=కాగలదు. సన్దేహః=సందేహము, న=లేదు.

తా. ఓ! సౌమ్యుడా! చాల దుర్లభమైన మరొక వరము కూడ నీ కిచ్చుచున్నాను. నీ మనస్సుకు ఏ రూపము, ఎట్లు ఇష్టమో అది నీ ఇచ్ఛానుసారము, నా వరముచే లభించగలదు; సందేహము లేదు. 24, 25

మూ. ఏవం పితామహోక్తస్య దశగ్రీవస్య రక్షసః,
అగ్నౌ హుతాని శీర్షాణి పునస్తాన్యుత్థితాని వై. 26

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, పితామహోక్తస్య=బ్రహ్మదేవునిచేత చెప్పబడిన, రక్షసః=రాక్షసుడైన, దశగ్రీవస్య=దశగ్రీవునియొక్క, అగ్నౌ=అగ్నియందు, హుతాని=హోమముచేయబడిన, తాని=అ, శీర్షాణి=శిరస్సులు, పున,=మరల, ఉత్థితాని వై=మొలచినవి.

తా. బ్రహ్మదేవుడు చెప్పిన ప్రకారము, పూర్వము దశగ్రీవుడు హోమము చేసిన శిరస్సులన్ని మరల మొలచెను. 26

మూ. భగవన్ కృతకృత్యోఽహం యన్మే లోకగురుః స్వయమ్,
ప్రీతేన యది దాతవ్యో వరో మే శృణు సువ్రత. 30

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! లోకగురుః = లోకమునకుగురువైన నీవు, స్వయమ్ = స్వయముగా, యత్ = ఏ కారణమువలన, మే = నావిషయమున (సంతోషించినావో) (అందువలన), అహమ్ = నేను, కృతకృత్యః = కృతకృత్యుడను. సువ్రత = మంచి వ్రతము గలవాడా ! ప్రీతేన = సంతోషించిన నీచేత, మే = నాకు, వరః = వరము, దాతవ్యః యది = ఇవ్వదగినచో, శృణు = వినుము.

తా. భగవంతుడా ! లోకమున కంతకు పూజ్యుడవైన నీవు స్వయముగా నా విషయమునందు సంతోషించినందుకు నేను కృతకృత్యుడను. ఆనందించిన నీవు నాకు వరము ఇవ్వదలచినచో, ఓ! మంచి నిర్ణయముగలవాడా ! వినుము. 30

మూ. పరమాపద్గతస్యాపి ధర్మే మమ మతిర్భవేత్,
అశిక్షితం చ బ్రహ్మాస్త్రం భగవన్ ప్రతిభాతు మే. 31

ప్ర. అ. పరమాపద్గతస్యాపి = గొప్ప ఆపదలను పొందినవాడనైనను, మమ = నాయొక్క, మతిః = బుద్ధి, ధర్మే = ధర్మమునందు భవేత్ = అగుగాక. భగవన్ = భగవంతుడా ! అశిక్షితమ్ = నేర్పబడకపోయినను, బ్రహ్మాస్త్రమ్ = బ్రహ్మాస్త్రము, మే = నాకు, ప్రతిభాతు = స్ఫురించుగాక.

తా. భగవంతుడా ! ఎట్టి ఆపదలలో ఉన్నను నా బుద్ధి ధర్మమునందే స్థిరముగా ఉండుగాక. ఉపదేశము లేకున్నను నాకు బ్రహ్మాస్త్రము స్ఫురించుగాక. 31

మూ. యా యా మే జాయతే బుద్ధిర్యేషు యేష్వాశ్రమేషు చ,
సా సా భవతు ధర్మిష్ఠా తం తం ధర్మం చ పాలయే. 32

ప్ర. అ. యేషు యేషు = ఏ యే, ఆశ్రమేషు = ఆశ్రమములయందు, మే = నాకు, యా యా = ఏ యే, బుద్ధిః = బుద్ధి, జాయతే = పుట్టునో, సా సా = ఆ యా బుద్ధి, ధర్మిష్ఠా = ధర్మ సంమతము, భవతు = అగుగాక. తం తమ్ = ఆ యా, ధర్మమ్ = ధర్మమును, పాలయే చ = పాలించెదను గాక.

తా. శత్రుసంహారకా! నీవు రాక్షసవంశములో పుట్టినను నీ బుద్ధి అధర్మము నందు ప్రసరించుటలేదు. అందుచేత నీకు మరణము లేకపోవుటను వరముగా ఇచ్చుచున్నాను. 35

మూ. ఇత్యుక్త్వా కుమ్భకర్ణాయ వరం దాతుమవస్థితమ్,
ప్రజాపతిం సురాః సర్వే వాక్యం ప్రాఞ్జలయోఽబ్రువన్.

ప్ర. అ. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, కుమ్భకర్ణాయ = కుంభకర్ణుని కొరకు, వరమ్ = వరమును, దాతుమ్ = ఇచ్చుటకు, అవస్థితమ్ = నిలచిన, ప్రజాపతిమ్ = బ్రహ్మదేవుని గూర్చి, సర్వే = సమస్తమైన, సురాః = దేవతలు, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్ళుగలవారై, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. విభీషణునితో ఇట్లు పలికి కుంభకర్ణునికి వరము లిచ్చుటకై నిలచిన బ్రహ్మదేవునితో దేవత లందరు అంజలులు ఘటించి ఇట్లు పలికిరి. 36

మూ. న తావత్కుమ్భకర్ణాయ ప్రదాతవ్యో వర స్త్వయా,
జానీషే హి యథా లోకాంస్త్రాసయత్యేష దుర్మతిః. 37

ప్ర. అ. త్వయా = నీచేత, కుమ్భకర్ణాయ = కుంభకర్ణునకు, వరః = వరము, న ప్రదాతవ్యః తావత్ = ఇవ్వదగినది కాదు. దుర్మతిః = దుర్మతియైన, ఏషః = ఇతడు, లోకాన్ = లోకములను, యథా = ఎట్లు, త్రాసయతి = భయపెట్టుచున్నాడో, జానీషే హి = ఎరుగుదువు కదా?

తా. నీవు కుంభకర్ణునకు వరము ఇవ్వవద్దు. దుర్మతియైన ఇతడు లోకములను ఎట్లు బాధించుచున్నాడో నీకు తెలియును కదా? 37

మూ. నన్దనేఽప్సరసః సప్త మహేన్ద్రానుచరా దశ,
అనేన భక్షితా బ్రహ్మన్నృషయో మానుషా స్తథా. 38

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రహ్మదేవుడా! అనేన = వీనిచేత, నన్దనే = నందనము నందు, సప్త = ఏడుగురు, అప్సరసః = అప్సరఃస్త్రీలు, దశ = పదిమంది, మహేన్ద్రానుచరాః = మహేంద్రుని అనుచరులు, ఋషయః = ఋషులు, తథా = మరియు, మానుషాః = మనుష్యులు, భక్షితాః = భక్షింపబడినారు.

తా. దేవతల మాట విని, పద్మమునందు పుట్టిన బ్రహ్మ సరస్వతిని తలచెను. ఆతడు తలచిన వెంటనే సరస్వతీదేవి ఆతనివద్దకు వచ్చెను.

మూ. ప్రాఞ్జలిః సా తు పార్శ్వస్థా ప్రాహ వాక్యం సరస్వతీ,
ఇయమస్మ్యాగతా దేవ కిం కార్యం కరవాణ్యహమ్. 42

ప్ర. అ. సా సరస్వతీ=ఆ సరస్వతి, పార్శ్వస్థా=పార్శ్వమునందున్నదై, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలికలదై, వాక్యమ్=వాక్యమును, ప్రాహ=పలికెను. దేవ=ఓ! ప్రభూ ! ఇయమ్=ఈ నేను, ఆగతా అస్మి=వచ్చి ఉన్నాను. అహమ్=నేను, కిమ్=ఏ, కార్యమ్=కార్యమును, కరవాణి=చేయుదును.

తా. ఆ సరస్వతి పార్శ్వమునందు నిలిచి, అంజలి ఘటించి ఇట్లు పలికెను. "ఓ! దేవా ! ఇదిగో నేను వచ్చినాను. నేను ఏమి చేయవలెను? 42

మూ. ప్రజాపతిస్తు తాం ప్రాప్తాం ప్రాహ వాక్యం సరస్వతీమ్,
వాణి త్వం రాక్షసేన్ద్రస్య భవ వాగ్దేవతేప్సితా. 43

ప్ర. అ. ప్రజాపతిస్తు=బ్రహ్మదేవుడు, ప్రాప్తామ్ = వచ్చిన, తాం సరస్వతీమ్=ఆ సరస్వతినిగూర్చి, వాక్యమ్=వాక్యమును, ప్రాహ=పలికెను. వాణి=ఓ! సరస్వతీ! త్వమ్=నీవు, దేవతేప్సితా=దేవతలకు ఇష్టమైన, వాక్=వాక్కుగా, రాక్షసేన్ద్రస్య=కుంభకర్ణునకు, భవ=అగుము.

తా. బ్రహ్మదేవుడు వచ్చిన ఆ సరస్వతితో ఇట్లు పలికెను. ఓ! వాణీ! నీవు కుంభకర్ణునియందు, దేవతలకు ఇష్టమైన వాక్కుగా అగుము. 43

మూ. తథేత్యుక్త్వా ప్రవిష్టా సా ప్రజాపతిరథాబ్రవీత్,
కుమ్భకర్ణ మహాబాహో వరం వరయ యో మతః. 44

ప్ర. అ. సా=ఆమె, తథేతి=అట్లే అని, ఉక్త్వా = పలికి, ప్రవిష్టా= ప్రవేశించినది. అథ=అటుపిమ్మట, ప్రజాపతిః=బ్రహ్మదేవుడు, అబ్రవీత్= పలికెను. మహాబాహో=గొప్ప బాహువులుగలవాడా! కుమ్భకర్ణ=కుంభకర్ణుడా ! యః=ఏది, మతః=ఇష్టమో, వరమ్=అట్టి వరమును, వరయ=కోరుము.

తా. "అట్లే చేసెదను" అని పలికి ఆ సరస్వతి వాని నోట ప్రవేశించెను.

మూ. కుమ్భకర్ణస్తు దుష్టాత్మా చిన్తయామాస దుఃఖితః,
ఈదృశం కిమిదం వాక్యం మమాద్య వదనాచ్చ్యుతమ్,
అహం వ్యామోహితో దేవైరితి మన్యే తదాగతైః.

ప్ర. అ. దుష్టాత్మా = దుష్టబుద్ధి గల, కుమ్భకర్ణస్తు = కుంభకర్ణుడైతే, దుఃఖితః = దుఃఖించినవాడై, చిన్తయామాస = ఆలోచించెను. అద్య = ఇప్పుడు, మమ = నాయొక్క, వదనాత్ = ముఖమునుండి, ఈదృశమ్ = ఇట్టి, వాక్యమ్ = వాక్యము, చ్యుతమ్ = జారినది; ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి? అహమ్ = నేను, తదా = అప్పుడు, ఆగతైః = వచ్చిన, దేవైః = దేవతలచేత, వ్యామోహితః = మోహింపచేయబడినాను, ఇతి = అని, మన్యే = తలచెదను.

తా. దుష్టాత్ముడైన కుంభకర్ణుడు దుఃఖించుచు ఇట్లు ఆలోచించెను- "నా నోటినుండి ఇప్పుడు ఇట్టి మాట జారినది; ఇది ఏమి ? ఇక్కడికి వచ్చిన ఆ దేవతలు నా కిట్లు మోహము కలిగించి ఉందురు". 48

మూ. ఏవం లబ్ధవరాః సర్వే భ్రాతరో దీప్తతేజసః, 49
శ్లేష్మాతకవనం గత్వా తత్ర తే న్యవసన్ సుఖమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
దశమః సర్గః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, లబ్ధవరాః = పొందబడిన వరములు గల, దీప్తతేజసః = ప్రకాశించుచున్న తేజస్సు గల, తే = ఆ, సర్వే = సమస్తమైన, భ్రాతరః = సోదరులు, శ్లేష్మాతకవనమ్ = శ్లేష్మాతకవృక్షముల వనమును గూర్చి, గత్వా = వెళ్ళి, తత్ర = అక్కడ, సుఖమ్ = సుఖముగా, న్యవసన్ = నివసించిరి.

తా. తేజస్సుతో ప్రకాశించుచున్న ఆ సోదరు లందరు ఈ విధముగా వరములు పొంది శ్లేష్మాతకవనమునకు వెళ్ళి అక్కడ సుఖముగా నివసించిరి. 49

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో దశమసర్గ సమాప్తము.

శ్రేష్ఠులతో కూడ, వృతః = కూడిన, సుమాలీ = సుమాలి, దశగ్రీవమ్ = దశగ్రీవుణ్ణి, అభిగమ్య = సమీపించి, పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సుమాలి మంత్రులైన రాక్షసశ్రేష్ఠులతో కలిసి వచ్చి దశగ్రీవుణ్ణి కౌగలించుకొని ఇట్లు పలికెను. 3

మూ. దిష్ట్యా తే వత్స సంప్రాప్తశ్చిన్తితోఽయం మనోరథః,
యస్త్వం త్రిభువనశ్రేష్ఠాల్లబ్ధవాన్వరముత్తమమ్. 4

ప్ర. అ. వత్స = నాయనా ! యః = ఏ, త్వమ్ = నీవు, త్రిభువనశ్రేష్ఠాత్ = మూడు లోకాలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవునినుండి, ఉత్తమమ్ = ఉత్తమమైన, వరమ్ = వరమును, ప్రాప్తః = పొందినావో, తే = అట్టి నీయొక్క, చిన్తితః = ఆలోచించబడిన, అయమ్ = ఈ, మనోరథః = మనోరథము, దిష్ట్యా = అదృష్టవశముచేత, లబ్ధః = పొందబడినది.

తా. నాయనా ! నీవు బ్రహ్మదేవునినుండి ఉత్తమమైన వరమును పొందినావు. అదృష్టవశముచేత నీవు కోరిన కోరిక సిద్ధించినది. 4

మూ. యత్కృతే చ వయం లఙ్కాం త్యక్త్వా యాతా రసాతలమ్,
తద్గతం నో మహాబాహో మహద్విష్ణుకృతం భయమ్. 5

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా, వయమ్ = మేము, యత్కృతే చ = దేని మూలమున, లఙ్కామ్ = లంకను, త్యక్త్వా = విడచి, రసాతలమ్ = రసాతలమును గూర్చి, యాతాః = వెళ్ళినామో, తత్ = ఆ, నః = మాయొక్క, విష్ణుకృతమ్ = విష్ణువువలన ఏర్పడిన, మహత్ = గొప్ప, భయమ్ = భయము, గతమ్ = పోయినది.

తా. ఓ ! మహాబాహూ ! విష్ణువువలన కలిగిన ఏ మహాభయముచేత మేము లంకను విడచి రసాతలమునకు వెళ్ళితిమో ఆ భయము తొలగినది. 5

మూ. అసకృత్తద్భయాద్భగ్నాః పరిత్యజ్య స్వమాలయమ్,
విద్రుతాః సహితాః సర్వే ప్రవిష్టాః స్మ రసాతలమ్. 6

మూ. త్వం చ లఙ్కేశ్వరస్తాత భవిష్యసి న సంశయః,
త్వయా రాక్షసవంశోఽయం నిమగ్నోఽపి సముద్ధృతః, 9
సర్వేషాం నః ప్రభుశ్చైవ భవిష్యసి మహాబల.

ప్ర. అ. తాత = నాయనా ! త్వంచ = నీవు, లఙ్కేశ్వరః = లంకాధిపతివిగా, భవిష్యసి = కాగలవు; సంశయః = సంశయము, న = లేదు. నిమగ్నోఽపి = మునిగిపోయినను, అయమ్ = ఈ, రాక్షసవంశః = రాక్షసవంశము, త్వయా = నీచేత, సముద్ధృతః=ఉద్ధరించబడినది. మహాబల=గొప్ప బలము గలవాడా! నః = మాకు, సర్వేషామ్ = అందరికి, ప్రభుఃచైవ = ప్రభువుగా కూడ, భవిష్యసి = కాగలవు.

తా. నాయనా ! నీవు ఈ లంకకు అధిపతివి కాగలవు. మునిగిపోయిన ఈ రాక్షసవంశమును నీవు ఉద్ధరించినావు. గొప్ప బలముగల నీవు మాకందరికి ప్రభువు కాగలవు. 9

మూ. అథాబ్రవీద్దశగ్రీవో మాతామహముపస్థితమ్, 10
విత్తేశో గురురస్మాకం నార్హసే వక్తుమీదృశమ్.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, దశగ్రీవః = దశగ్రీవుడు, ఉపస్థితమ్ = వచ్చిన, మాతామహమ్ = మాతామహుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను. విత్తేశః = కుబేరుడు, అస్మాకమ్ = మాకు, గురుః = పూజ్యుడు. ఈదృశమ్ = ఇట్టి వాక్యమును, వక్తుమ్ = పలుకుటకు, నార్హసే = తగవు.

తా. అప్పుడు దశగ్రీవుడు దగ్గరకు వచ్చిన మాతామహునితో ఇట్లు పలికెను. "కుబేరుడు మాకు పూజ్యుడు; నీవు ఇట్లు పలుకుట తగదు." 10

మూ. సామ్నా హి రాక్షసేన్ద్రేణ ప్రత్యాఖ్యాతో గరీయసా, 11
కించిన్నాహ తదా రక్షో జ్ఞాత్వా తస్య చికీర్షితమ్.

ప్ర. అ. గరీయసా = గొప్పవాడైన, రాక్షసేన్ద్రేణ = రాక్షసశ్రేష్ఠుడైన రావణునిచేత, సామ్నా = సామముచేతనే, ప్రత్యాఖ్యాతః = ప్రత్యాఖ్యానముచేయబడిన, రక్షః = ఆ రాక్షసుడు, తదా=అప్పుడు, తస్య=వానియొక్క, చికీర్షితమ్

ప్ర. అ. పరమరూపిణ్యౌ = గొప్ప రూపము గల, భగిన్యౌ = సోదరీలు అయిన, తే = ఆ, అదితిశ్చ = అదితీ, దితిశ్చ = దితీ, సహితే = కలిసినవారై, ప్రజాపతేః = ప్రజాపతియైన, కశ్యపస్య = కశ్యపునియొక్క, భార్యే = భార్యలు.

తా. పరమసౌందర్యవతులు, తోబుట్టువులూ అయిన అదితీ, దితీ ఇద్దరూ కూడ కశ్యపప్రజాపతి భార్యలు. 14

మూ. అదితిర్జనయామాస దేవాంస్త్రిభువనేశ్వరాన్, 15
దితి స్త్వజనయద్దైత్యాన్ కశ్యపస్యాత్మసంభవాన్.

ప్ర. అ. అదితిః = అదితి, త్రిభువనేశ్వరాన్ = మూడులోకాలకి ప్రభువువైన, దేవాన్ = దేవతలను, జనయామాస = కనెను. దితిస్తు = దితియైతే, కశ్యపస్య = కశ్యపునియొక్క, ఆత్మసంభవాన్ = కుమారులైన, దైత్యాన్ = దైత్యులను, అజనయత్ = కనెను.

తా. అదితి మూడు లోకాలకి ప్రభువులైన దేవతలను కనెను. దితి కశ్యపుని వలన దైత్యులను కనెను. 15

మూ. దైత్యానాం కిల ధర్మజ్ఞ పురేయం వసనార్ణవా, 16
సపర్వతా మహీ వీర తేఽభవన్ ప్రభవిష్ణవః.

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! వీర = వీరుడా! పురా = పూర్వము, వసనార్ణవా = సముద్రము వస్త్రముగా గల, సపర్వతా = పర్వతములతో కూడిన, ఇయం మహీ = ఈ భూమి, దైత్యానాం కిల = దైత్యులదట. తే = వాళ్ళు, ప్రభవిష్ణవః = ప్రభువులుగా; అభవన్ = ఉండిరి.

తా. ధర్మములు తెలిసిన ఓ! వీరుడా! సముద్రము వస్త్రముగా గల, పర్వతములతో కూడిన ఈ భూమి పూర్వము దైత్యులకు చెందినదై ఉండెను. ఆ దైత్యులు దీనిపై అధికారము కలవారై ఉండిరి. 16

మూ. నిహత్య తాంస్తు సమరే విష్ణునా ప్రభవిష్ణునా, 17
దేవానాం వశమానీతం త్రైలోక్యమిదమవ్యయమ్.

ప్ర. అ. ప్రభవిష్ణునా = సమర్థుడైన, విష్ణునా = విష్ణువుచేత, సమరే =

తస్మిన్ అహని = ఆ దివసమునందే, తేన హర్షేణైవ = ఆ ఉత్సాహముతోనే, తైః = ఆ, క్షణదాచరైః సహ = రాక్షసులతో కూడ, వనమ్ = వనమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. పరాక్రమవంతుడైన ఆ దశగ్రీవుడు ఆ ఉత్సాహముతోనే, ఆ రోజునందే, ఆ రాక్షసు లందరితో కలిసి వనమునకు వెళ్లెను. 20

మూ. త్రికూటస్థః స తు తదా దశగ్రీవో నిశాచరః, 21
ప్రేషయామాస దౌత్యేన ప్రహస్తం వాక్యకోవిదమ్

ప్ర. అ. తదా = అప్పుడు, త్రికూటస్థః = త్రికూటపర్వతముమీద నున్న, నిశాచరః = రాక్షసుడైన, సః దశగ్రీవః = ఆ దశగ్రీవుడు, వాక్యకోవిదమ్ = వాక్యములు ఎరిగిన, ప్రహస్తమ్ = ప్రహస్తుణ్ణి, దౌత్యేన = దౌత్యముచేత, ప్రేషయామాస = పంపెను.

తా. అప్పుడు రాక్షసుడైన ఆ రావణుడు త్రికూటపర్వతముపై ఉండి, మాటలతో నేర్పరియైన ప్రహస్తుణ్ణి దౌత్యము చేయుటకై పంపెను. 21

మూ. ప్రహస్త శీఘ్రం గచ్ఛ త్వం బ్రూహి నైరృతపుంగవమ్,
వచసా మమ విత్తేశం సామపూర్వమిదం వచః.

ప్ర. అ. ప్రహస్త = ప్రహస్తుడా! త్వమ్ = నీవు, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్ళుము, విత్తేశమ్ = ధనాధిపతియైన, నైరృత పుంగవమ్ = కుబేరుని గూర్చి, మమ = నాయొక్క, వచసా = వచనముచేత, సామపూర్వమ్ = సామపూర్వకముగా, ఇదమ్ = ఈ, వచః = వచనమును, బ్రూహి = చెప్పుము.

తా. ప్రహస్తా! నీవు శీఘ్రముగా వెళ్ళి ధనాధిపతియైన కుబేరునితో నా మాటగా ఇట్లు, సామపూర్వకముగా (బ్రతిమాలుకొనుచున్నట్లు) చెప్పుము. 22

మూ. ఇయం లఙ్కాపురీ రాజన్ రాక్షసానాం మహాత్మనామ్, 23
త్వయా నివేశితా సౌమ్య నైతద్యుక్తం తవానఘ.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా, అనఘ = దోషములులేనివాడా! రాజన్ = ఓ! కుబేరా! మహాత్మనామ్ = మహాత్ములైన, రాక్షసానామ్ = రాక్షసులదైన,

ప్ర. అ. సువ్రత=మంచి నియమములు కలవాడా! మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! సర్వశస్త్రభృతామ్ = సమస్తమైన శస్త్రధారులలో, వర= శ్రేష్ఠుడా! అహమ్=నేను, తవ=నీయొక్క, భ్రాతా=సోదరుడైన, దశగ్రీవేణ= దశగ్రీవునిచేత, త్వత్సమీపమ్ = నీ సమీపమును, ప్రేషితః=పంపబడితిని.

తా. మంచి నియమములు గలవాడా, మహాబాహూ! సర్వశస్త్రధారులలో శ్రేష్ఠుడా! నీ సోదరుడైన దశగ్రీవుడు నన్ను నీవద్దకు పంపినాడు. 26

మూ. తచ్ఛ్రూయతాం మహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద, 27
వచనం మమ విత్తేశ యద్బ్రవీతి దశాననః.

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధిమంతుడా! సర్వశాస్త్రవిశారద = సమస్తశాస్త్రములలో విశారదుడా! విత్తేశ = కుబేరుడా! దశాననః = దశాననుడు, యత్ = దేనిని, బ్రవీతి= చెప్పుచున్నాడో. తత్ = ఆ, మమ వచనమ్ = నా వచనము, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. గొప్ప బుద్ధి గలవాడా! సకలశాస్త్రములందు పండితుడా! ధనాధీశా! దశానుని ఆజ్ఞచేత నేను చెప్పుచున్న వాక్యము వినుము. 27

మూ. ఇయం కిల పురీ రమ్యా సుమాలిప్రముఖైః పురా, 28
భుక్తపూర్వా విశాలాక్ష రాక్షసైర్భీమవిక్రమైః.

ప్ర. అ. విశాలాక్ష = విశాలములైన నేత్రములు గలవాడా! రమ్యా= రమ్యమైన, ఇయం పురీ=ఈ పట్టణము, పురా=పూర్వము, సుమాలిప్రముఖైః= సుమాలి మొదటగా గల, భీమవిక్రమైః=భయంకరమైన పరాక్రమము గల, రాక్షసైః= రాక్షసులచేత, భుక్తపూర్వాకిల = పూర్వము (ముందుగా) అనుభవించ బడినది కదా?

తా. విశాలములైన నేత్రములు గలవాడా! పూర్వము, రమ్యమైన ఈ లంకానగరమును భయంకరమైన పరాక్రమము గల సుమాలి మొదలైన రాక్షసులు ముందుగా అనుభవించినారు కదా? 28

మూ. తేన విజ్ఞాప్యతే సోఽయం సాంప్రతం విశ్రవాత్మజ, 29
తదేషా దీయతాం తాత యాచతస్తస్య సామతః.

మూ. బ్రూహి గచ్ఛ దశగ్రీవం పురీ రాజ్యం చ యన్మమ, 32
తవాప్యేతన్మహాబాహో భుజ్క్ష్వ రాజ్యమకణ్టకమ్.
అవిభక్తం త్వయా సార్ధం రాజ్యం యచ్చాపి మే వసు, 33

ప్ర. అ. గచ్ఛ=వెళ్ళుము, దశగ్రీవమ్=దశగ్రీవుణ్ణి గూర్చి, బ్రూహి=చెప్పుము, మహాబాహో=మహాబాహూ! పురీ=పట్టణము, మమ=నాయొక్క, యత్=ఏ, రాజ్యమ్=రాజ్యమున్నదో, ఏతత్=ఇది, తవాపి=నీకు కూడ సంబంధించినది. అకణ్టకమ్=కంటకములు లేని, రాజ్యమ్=రాజ్యమును, భుజ్క్ష్వ=అనుభవింపుము. మే=నాయొక్క, రాజ్యమ్=రాజ్యము, యత్=ఏ, వసు చ అపి=ధనము కూడ ఉన్నదో అదీ, త్వయా సార్ధమ్=నీతో కూడ, అవిభక్తమ్=విభజింపబడనిది.

తా. నీవు వెళ్ళి దశగ్రీవునితో చెప్పుము-"ఓ! మహాబాహూ! ఈ పట్టణము, నా ఈరాజ్యమూ నీకు కూడ సంబంధించినవే. ఏ బాధలూ లేని రాజ్యమును అనుభవింపుము. నా రాజ్యము, ధనమూ కూడ నీతో నేను పంచుకొనవలసిన పనిలేదు. ఇవి మనమిద్దరము కలసి అనుభవించవలసినవి." 32, 33

మూ. ఏవముక్త్వా ధనాధ్యక్షో జగామ పితురన్తికమ్,
అభివాద్య గురుం ప్రాహ రావణస్య యదీప్సితమ్. 34

ప్ర. అ. ధనాధ్యక్షః=కుబేరుడు, ఏవమ్=ఇట్లు, ఉక్త్వా=పలికి, పితుః=తండ్రియొక్క, అన్తికమ్=సమీపమును గూర్చి, జగామ=వెళ్ళెను. గురుమ్=తండ్రిని, అభివాద్య=నమస్కరించి, రావణస్య=రావణునియొక్క, యత్=ఏ, ఈప్సితమ్=కోరిక గలదో దానిని, ప్రాహ=చెప్పెను.

తా. కుబేరుడు ఇట్లు పలికి తండ్రి దగ్గరకు వెళ్ళి ఆయనకు అభివాదనము చేసి, రావణుని మనస్సులోని కోరికను చెప్పెను. 34

మూ. ఏష తాత దశగ్రీవో దూతం ప్రేషితవాన్మమ
దీయతాం నగరీ లఙ్కా పూర్వం రక్షోగణోషితా, 35
మయాత్ర యదనుష్ఠేయం తన్మమాచక్ష్వ సువ్రత

ప్ర. అ. తాత=తండ్రీ! ఏషః=ఈ, దశగ్రీవః=దశగ్రీవుడు, మమ=

తా. మహాబాహువైన ఆ దశగ్రీవుడు ఈ విషయమును నాదగ్గరకూడ చెప్పినాడు. నేను చాల దుష్టబుద్ధి గల వానిని మందలించి అనేకవిధాల చెప్పితిని. 37

మూ. సక్రోధేన మయా చోక్తో ధ్వంససే చ పునః పునః, 38
శ్రేయోభియుక్తం ధర్మ్యం చ శృణు పుత్ర వచో మమ.

ప్ర. అ. సక్రోధేన = కోపముతో కూడిన, మయా = నాచేత, ధ్వంససే = నశించుచున్నావు అని, పునః పునః = మాటిమాటికి, ఉక్తః = పలకబడినాడు, పుత్ర = పుత్రా ! శ్రేయోభియుక్తమ్ = శ్రేయస్సుతో కూడినది, ధర్మ్యం చ = ధర్మసంమతమూ అయిన, మమ = నాయొక్క, వచః = వచనమును, శృణు = వినుము.

తా. నేను కోపముతో - "ఇట్లు చేసినచో నీవు నశించెదవు"అని అనేక పర్యాయములు చెప్పినాను. కుమారా ! శ్రేయస్కరము, ధర్మసంమతమూ అయిన నేను చెప్పుచున్న మాట వినుము. 38

మూ. వరప్రదానసంమూఢో మాన్యామాన్యం సుదుర్మతిః, 39
న వేత్తి మమ శాపాచ్చ ప్రకృతిం దారుణాం గతః.

ప్ర. అ. వరప్రదానసంమూఢః = వరప్రదానముచేత మిక్కిలి మూఢుడై, మమ = నాయొక్క, శాపాత్ = శాపమువలన, దారుణామ్ = దారుణమైన, ప్రకృతిం చ = స్వభావమును కూడ, గతః = పొందిన, సుదుర్మతిః = మిక్కిలి దుర్మతి అయిన ఆ దశగ్రీవుడు, మాన్యామాన్యమ్ = గౌరవింపదగినదా (వా) నిని గూర్చి, గౌరవింపదగనిదా(వా)నినిగూర్చి, న వేత్తి = ఎరుగడు.

తా. వరప్రదానముచేత ఏమీ తెలియని స్థితిలో ఉన్న, చాల దుర్మతియైన ఆ రావణుడు నా శాపముచేత కూడ దారుణమైన స్వభావమును పొందినాడు. వాని కేమీ మంచిచెడ్డలు తెలియుటలేదు. 39

మూ. తస్మాద్గచ్ఛ మహాబాహో కైలాసం ధరణీధరమ్, 40
నివేశయ నివాసార్థం త్యక్త్వా లఙ్కాం సహానుగః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా ! తస్మాత్ = ఆ కారణమువలన, లఙ్కామ్ = లంకను, త్యక్త్వా = విడచి, సహానుగః = అనుచరు

తా. ఎల్లప్పుడూ విహరించే స్వభావము గల దేవతలు, గంధర్వులు, అప్సరఃస్త్రీలు, ఉరగులు, కింనరులు, సర్వదా ఆ ప్రాంతమునందు నివసించుచు క్రీడించుచుందురు. 43

మూ. న హి క్షమం తవానేన వైరం ధనద రక్షసా,
జానీషే హి యథానేన లబ్ధః పరమకో వరః. 44

ప్ర. అ. ధనద = కుబేరా ! తవ = నీకు, అనేన రక్షసా = ఈ రాక్షసునితో, వైరమ్ = వైరము, క్షమమ్ = యుక్తము, న హి = కాదు కదా ? అనేన = వీనిచేత, పరమకః = గొప్పదైన, వరః = వరము, యథా = ఎట్లు, లబ్ధః = పొందబడినదో, జానీషే హి = ఎరుగుదువు కదా ?

తా. కుబేరా ! నీవు ఈ రాక్షసునితో వైరము పెట్టుకొనుట మంచిది కాదు. ఇతడు గొప్ప వరమును సంపాదించిన విషయము నీకు తెలియును కదా ? 44

మూ. ఏవముక్తో గృహీత్వా తు తద్వచః పితృగౌరవాత్, 45
సదారపుత్రః సామాత్యః సవాహనధనో గతః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన కుబేరుడు, తత్ = ఆ, వచః = వచనమును, పితృగౌరవాత్ = తండ్రియందలి గౌరవముచేత, గృహీత్వా = గ్రహించి, సదారపుత్రః = భార్యాపుత్రులతో కూడినవాడై, సామాత్యః = మంత్రులతో కూడినవాడై, సవాహనధనః = వాహనములతోను, ధనములతోను కూడినవాడై, గతః = వెళ్ళిపోయినాడు.

తా. కుబేరుడు ఆ మాటలను తండ్రియందు ఉన్న గౌరవముచే అంగీకరించి, భార్యాపుత్రులతోను, అమాత్యులతోను కలిసి, వాహనములు, ధనములు వెంట తీసికొని వెళ్ళిపోయెను. 45

మూ. ప్రహస్తోఽథ దశగ్రీవం గత్వా వచనమబ్రవీత్,
ప్రహృష్టాత్మా మహాత్మానం సహామాత్యం సహానుజమ్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ప్రహస్తః = ప్రహస్తుడు, ప్రహృష్టాత్మా = సంతోషించిన మనస్సు గలవాడై, సహామాత్యమ్ = అమాత్యులతో కూడిన, సహానుజమ్ = తమ్ములతో కూడిన, మహాత్మానమ్ = మహాత్ముడైన, దశగ్రీవమ్ =

బడిన విశాలమార్గములు గల ఆ లంకను, దేవాధిపః = దేవేంద్రుడు, స్వర్గం యథా = స్వర్గమును వలె, ఆరురోహ = ఎక్కెను.

తా. దేవతల శత్రువైన ఆ రావణుడు కుబేరుడు విడిచిపెట్టివేసిన, బాగుగా విభజింపబడిన విశాలమార్గములు గల ఆ లంకలో, దేవేంద్రుడు స్వర్గములో ప్రవేశించినట్లు ప్రవేశించెను. 48

మూ. స చాభిషిక్తః క్షణదాచరైస్తదా,
నివేశయామాస పురీం దశాననః.
నికామపూర్ణా చ బభూవ సా పురీ,
నిశాచరైర్నీలబలాహకోపమైః. 50

ప్ర. అ. తదా = అప్పుడు, క్షణదాచరైః = రాక్షసులచేత, అభిషిక్తః = అభిషేకింపబడిన, సః దశాననః = ఆ రావణుడు, పురీమ్ = లంకను, నివేశయామాస = నివాసముగా చేసికొనెను. సా పురీ = ఆ పట్టణము, నీలబలాహకోపమైః = నల్లని మేఘములవంటి, నిశాచరైః = రాక్షసులతో, నికామపూర్ణా = చాలా నిండినది, బభూవ = ఆయెను.

తా. అప్పుడా దశాననుడు రాక్షసులచేత రాజ్యమునందు అభిషిక్తుడై ఆ నగరమును నివాసముగా ఏర్పరచుకొనెను. ఆ నగరము నల్లని మేఘముల వలె ఉన్న రాక్షసులతో పూర్తిగా నిండిపోయెను. 50

మూ. ధనేశ్వరస్త్వథ పితృవాక్యగౌరవా,
న్న్యవేశయచ్ఛశివిమలే గిరౌ పురీమ్.
స్వలంకృతైర్భవనవరైర్విభూషితాం,
పురందరః స్వరివ యథామరావతీమ్. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ధనేశ్వరస్తు = కుబేరుడైతే, పితృవాక్యగౌరవాత్ = తండ్రి మాటమీద గౌరవమువలన, శశివిమలే = చంద్రుడు వలె నిర్మలమైన, గిరౌ = కైలాసపర్వతముమీద, స్వలంకృతైః = బాగా అలకరించ

# అథ ద్వాదశః సర్గః

[శూర్పణఖ వివాహము; రావణాదుల వివాహములు, ఇంద్రజిత్తు పుట్టుట.]

మూ. రాక్షసేన్ద్రోఽభిషిక్తస్తు భ్రాతృభ్యాం సహితస్తదా,
తతః ప్రదానం రాక్షస్యాః భగిన్యాః సమచిన్తయత్. 1

ప్ర అ. తదా = అప్పుడు, అభిషిక్తః = అభిషేకింపబడిన, రాక్షసేన్ద్రః = రావణుడు, తతః = అటుపిమ్మట, భ్రాతృభ్యామ్ = సోదరులతో, సహితః = కూడినవాడై, భగిన్యాః = సోదరియైన, రాక్షస్యాః = రాక్షసియొక్క, ప్రదానమ్ = దానమును గూర్చి, సమచిన్తయత్ = ఆలోచించెను

తా. రాజ్యాభిషిక్తుడైన రావణుడు సోదరులతో కలిసి సోదరియైన శూర్పణఖ వివాహమును గూర్చి ఆలోచించెను. 1

మూ. స్వసారం కాలకేయాయ దానవేన్ద్రాయ రాక్షసీమ్,
దదౌ శూర్పణఖాం నామ విద్యుజ్జిహ్వాయ రాక్షసః. 2

ప్ర. అ. రాక్షసః = రావణుడు, రాక్షసీమ్ = రాక్షసియైన, శూర్పణఖాం నామ = శూర్పణఖ అను ప్రసిద్ధి గల, స్వసారమ్ = సోదరిని, కాలకేయాయ = కాలకుని పుత్రుడైన, దానవేన్ద్రాయ = దానవప్రభువైన, విద్యుజ్జిహ్వాయ = విద్యుజ్జిహ్వునకు, దదౌ = ఇచ్చెను.

తా. రావణుడు సోదరియైన శూర్పణఖను కాలకుని పుత్రుడైన, దానవ నాయకుడైన విద్యుజ్జిహ్వునకు ఇచ్చి వివాహము చేసెను. 2

మూ. అథ దత్త్వా స్వయం రక్షో మృగయామటతే స్మ తత్,
తత్రాపశ్యత్తతో రామ మయం నామ దితేః సుతమ్. 3

మయుడు ఇట్లు పలికెను. ఇది ఎట్లు జరిగినదో దానిని అంతనూ నీకు చెప్పెదను; వినుము. 5

మూ. హేమా నామాప్సరాస్తాత శ్రుతపూర్వా యది త్వయా, 6
దైవతైర్మమ సా దత్తా పౌలోమీవ శతక్రతోః.

ప్ర. అ. తాత = నాయనా ! హేమా నామ = హేమ అను, అప్సరాః = అప్సరఃస్త్రీ, త్వయా = నీచేత, శ్రుతపూర్వా యది = పూర్వము వినబడి ఉండవచ్చును. సా = ఆమె, శతక్రతోః = దేవేంద్రునకు, పౌలోమీవ = శచీదేవి వలె, మమ = నాకు, దైవతైః = దేవతలచేత, దత్తా = ఇవ్వబడినది.

తా. నాయనా ! హేమ అను అప్సరఃస్త్రీ ఉన్నది. నీవు వినిఉండవచ్చును. దేవతలు ఆమెను నాకు, దేవేంద్రునకు శచీదేవిని ఇచ్చినట్లు ఇచ్చినారు. 6

మూ. తస్యాం సక్తమనా హ్యాసం దశవర్షశతాన్యహమ్, 7
సా చ దైవతకార్యేణ త్రయోదశసమా గతాః,
వర్షం చతుర్దశం చైవ తతో హేమమయం పురమ్, 8
వజ్రవైదూర్యచిత్రం చ మాయయా నిర్మితం మయా.

ప్ర. అ. అహమ్ = నేను, దశ = పది, వర్షసహస్రాణి = సంవత్సరముల సహస్రములను, తస్యామ్ = ఆమెయందు, సక్తమనాః = లగ్నమైన మనస్సు కలవాడను, ఆసమ్ = అయితిని. సా చ = ఆమె, దైవతకార్యేణ = దేవతల కార్యముచేత, వెళ్ళినది. త్రయోదశ = పదమూడు, సమాః = సంవత్సరములు, గతాః = గడచినవి. చతుర్దశమ్ = పదునాల్గవ, వర్షం చ = సంవత్సరము కూడ, గడచిపోయినది. తతః = అటుపిమ్మట, మయా = నాచేత, మాయయా = మాయచేత, హేమమయమ్ = బంగారము వికారమైన, వజ్రవైదూర్యచిత్రం చ = వజ్రములతోను వైదూర్యములతోను చిత్రమైన, పురమ్ = పట్టణము, నిర్మితమ్ = నిర్మించబడినది.

తా. నేను పది వేల సంవత్సరముల కాలము ఆమెయందు లగ్నమైన మనస్సుతో గడిపితిని. ఆమె దేవతల పనిమీద వెళ్ళినది. పదమూడు సంవత్సరములు గడచినవి. పదునాల్గవ సంవత్సరము కూడ గడచిపోయినది. అప్పుడు

తా. గౌరవమును కోరు ప్రతివారికీ కన్యకు తండ్రి అయి ఉండుట దుఃఖానికి కారణము కదా? కన్య తలితండ్రుల రెండు వంశాలను, నిత్యము సంశయస్థితిలో ఉంచును కదా? 11

మూ. పుత్రద్వయం మమాప్యస్యాం భార్యాయాం సంబభూవ హ,
మాయావీ ప్రథమస్తాత దున్దుభి స్తదన న్తరః. 12

ప్ర. అ. మమ = నాకు, అస్యాం భార్యాయామ్ = ఈ భార్యయందు, పుత్రద్వయమ్=పుత్రులద్వయము, సంబభూవ హ = పుట్టెను. తాత=నాయనా! మాయావీ = మాయావి, ప్రథమః = మొదటివాడు. తదన న్తరః = వానితరవాతవాడు, దున్దుభిః = దుందుభి.

తా. నాకు ఈ భార్యయందు ఇద్దరు పుత్రులు పుట్టినారు. మాయావి మొదటివాడు, రెండవవాడు దుందుభి. 12

మూ. ఏవం తే సర్వమాఖ్యాతం యాథాతథ్యేన పృచ్ఛతః, 13
త్వమిదానీం కథం తాత జానీయాం కో భవానితి.

ప్ర. అ. పృచ్ఛతః=అడుగుచున్న, తే = నీకు, ఏవమ్ = ఇట్లు, సర్వమ్ = సమస్తమూ, యాథాతథ్యేన = యథార్థముగా, ఆఖ్యాతమ్ = చెప్పబడినది. తాత = నాయనా! త్వమ్ = నీవు, కథమ్ = ఎట్లు వచ్చినావు? భవాన్ = నీవు, కః ఇతి = ఎవ్వరవు అని, ఇదానీమ్ = ఇప్పుడు, జానీయామ్ = తెలిసికొందునా?

తా. నీవు ప్రశ్నించినావు గాన నేను ఈ విషయ మంతా యథార్థముగా చెప్పినాను. ఇప్పుడు నీవు ఎవరవో, ఇక్కడికి ఎందుకు వచ్చినావో తెలిసికొనగోరుచున్నాను. 13

మూ. ఏవముక్తం తు తద్రక్షో వినీతమిదమబ్రవీత్, 14
అహం పౌలస్త్యతనయో దశగ్రీవశ్చ నామతః,
మునేర్విశ్రవసో యస్తు తృతీయో బ్రహ్మణోఽభవత్. 15

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తమ్=పలకబడిన, తత్ రక్షః=ఆ రాక్షసుడు, వినీతమ్ = వినయముకలవాడై, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

మూ. ఇయం మమాత్మజా రాజన్ హేమయాప్సరసా ధృతా, 18
కన్యా మన్దోదరీ నామ పత్న్యర్థం ప్రతిగృహ్యతామ్.

ప్ర. అ. రాజన్ = రాజా! ఇయమ్ = ఈ, కన్యా = కన్య, అప్సరసా = అప్సరసయైన, హేమయా = హేమచేత, ధృతా = (గర్భములో) ధరించబడిన, మన్దోదరీ నామ = మందోదరి అను పేరు గల, మమ = నాయొక్క, ఆత్మజా = కుమార్తె. పత్న్యర్థమ్ = భార్య అగుటకొరకు, ప్రతిగృహ్యతామ్ = స్వీకరింపబడుగాక.

తా. రాజా! ఈమె అప్సరసయైన హేమ గర్భమునందు పుట్టిన మందోదరి అను నా కుమార్తెయైన కన్యక. ఈమెను పత్నిగా స్వీకరింపుము. 18

మూ. బాఢమిత్యేవ తం రామ దశగ్రీవో ఽభ్యభాషత, 19
ప్రజ్వాల్య తత్ర చైవాగ్నిమకరోత్పాణిసంగ్రహమ్.

ప్ర. అ. రామ = రామా! దశగ్రీవః = దశగ్రీవుడు, తమ్ = ఆతనిని గూర్చి, బాఢమ్ ఇత్యేవ = తప్పక అట్లే అని, అభ్యభాషత = పలికెను. తత్ర = అక్కడ, అగ్నిమ్ = అగ్నిని, ప్రజ్వాల్య = మండించి, పాణిసంగ్రహమ్ = పాణిగ్రహణమును, అకరోత్ = చేసెను.

తా. రామా ! దశగ్రీవుడు మయునితో "తప్పక అట్లే చేసెదను"అని చెప్పి, అక్కడ అగ్నిని ప్రజ్వలింపచేసి ఆమెను వివాహమాడెను. 19

మూ. స హి తస్య మయో రామ శాపాభిజ్ఞస్తపోధనాత్, 20
విదిత్వా తేన సా దత్తా తస్య పైతామహం కులమ్.

ప్ర. అ. రామ = రామా! సః మయః = ఆ మయుడు, తపోధనాత్ = విశ్రవసునుండి, తస్య = ఆ దశగ్రీవునియొక్క, శాపాభిజ్ఞః = శాపమును ఎరిగినవాడు. తేన = ఆతనిచేత, తస్య = వానియొక్క, పైతామహమ్ = పితామహునకు సంబంధించిన, కులమ్ = కులమును, విదిత్వా = తెలిసికొని, సా = ఆమె, దత్తా = ఇవ్వబడినది.

తా. "ఇతడు దారుణస్వభావుడు కాగలడు"అని విశ్రవసుడు రావణునికి

తా. రావణుడు వైరోచనుని దౌహిత్రి అయిన వజ్రజ్వాల అను కన్యను కుంభకర్ణునకు భార్యనుగా చేసెను.

మూ. గన్ధర్వరాజస్య సుతాం శైలూషస్య మహాత్మనః, 24
సరమాం నామ ధర్మజ్ఞాం లేభే భార్యాం విభీషణః.

ప్ర. అ. విభీషణః = విభీషణుడు, మహాత్మనః = మహాత్ముడైన, గన్ధర్వ రాజస్య = గంధర్వరాజైన, శైలూషస్య = శైలూషునియొక్క, సుతామ్ = కుమార్తెయైన, ధర్మజ్ఞామ్ = ధర్మములు తెలిసిన, సరమాం నామ = సరమ అను కన్యను, భార్యామ్ = భార్యనుగా, లేభే = పొందెను.

తా. విభీషణుడు మహాత్ముడైన గంధర్వరాజైన శైలూషుని కుమార్తెయైన, ధర్మము లన్నీ తెలిసిన సరమను వివాహ మాడెను. 24

మూ. తీరే తు సరసో వై తు సంజజ్ఞే మానసస్య హి, 25
సర స్తదా మానసం తు వవృధే జలదాగమే.

ప్ర. అ. మానసస్య = మానస మను, సరసః = సరస్సుయొక్క, తీరే = తీరమునందు, సంజజ్ఞే వై తు హి = పుట్టెను. తదా = అప్పుడు, జలదాగమే = వర్షాకాలమునందు, మానసం సరః తు = ఆ మానససరస్సు, వవృధే = వృద్ధి పొందెను.

తా. ఆ కన్య మానససరోవరతీరమునందు పుట్టెను. అప్పుడు వర్షాకాలమునందు ఆ మానససరస్సు వృద్ధి పొందెను. 25

మూ. మాత్రా తు తస్యాః కన్యాయాః స్నేహేనాక్రన్దితం వచః,
సరో మా వర్ధయస్వేతి తతః సా సరమాభవత్. 26

ప్ర. అ. తస్యాః కన్యాయాః = ఆ కన్యయొక్క, మాత్రా తు = తల్లిచేత, స్నేహేన = స్నేహముచేత, సరః = ఓ ! సరస్సా ! మా వర్ధయస్వ = పెరగకుము, ఇతి = అని, వచః = వచనము, ఆక్రన్దితమ్ = అరవబడినది, తతః = ఆకారణము వలన, సా = ఆ కన్య, సరమా = సరమగా, అభవత్ = ఆయెను.

తా. అప్పుడు ఆ శిశువు తల్లి స్నేహముతో - "ఓ ! సరస్సా ! పెరగకుము"అని పలికినది, అందువలన ఆ కన్యకు 'సరమ' అను పేరు వచ్చెను.

ప్ర. అ. రాఘవ = రామా ! తస్య = వానియొక్క, నాదేన = ధ్వనిచేత, సా లఙ్కా = ఆ లంక, జడీకృతా చ = జడముగా చేయబడినది, పితా = తండ్రి, తస్య = వానియొక్క, నామ = పేరును, మేఘనాదః ఇతి = మేఘనాదుడు అని, స్వయమ్ = స్వయముగా, అకరోత్ = చేసెను.

తా. రామా ! ఆతడు చేసిన ధ్వనికి లంకాపట్టణ మంతా జడమైపోయెను. తండ్రి ఆతనికి "మేఘనాదుడు" అని స్వయముగా నామకరణము చేసెను. 30

మూ. సోఽవర్ధత తదా రామ రావణాన్తఃపురే శుభే, 31
రక్ష్యమాణో వరస్త్రీభిశ్ఛన్నః కాష్ఠైరివానలః,
మాతాపిత్రోర్మహాహర్షం జనయన్ రావణాత్మజః. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వాదశః సర్గః.

ప్ర. అ. రామ = రామా ! సః రావణాత్మజః = ఆ రావణపుత్రుడు, మాతాపిత్రోః = తలిదండ్రులకు, మహాహర్షమ్ = గొప్ప సంతోషమును, జనయన్ = పుట్టించుచు, వరస్త్రీభిః = ఉత్తమస్త్రీలచేత, రక్ష్యమాణః = రక్షింపబడుచు, కాష్ఠైః = కఱ్ఱలచేత, ఛన్నః = కప్పబడిన, అనలః ఇవ = అగ్ని వలె, తదా = అప్పుడు, శుభే = సుందరమైన, రావణాన్తఃపురే = రావణుని అంతఃపురమునందు, అవర్ధత = పెరిగెను.

తా. రామా ! అప్పుడా రావణపుత్రుడైన మేఘనాదుడు, తలిదండ్రులకు సంతోషము కలిగించుచు, ఉత్తమలైన స్త్రీల సంరక్షణమునందు, కఱ్ఱలు కప్పిన నిప్పు వలె, రమ్యమైన రావణాంతఃపురములో పెరిగెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో పండ్రెండవ సర్గ సమాప్తము.

మూ. వినియుక్తాస్తతో రాజ్ఞా శిల్పినో విశ్వకర్మవత్,
విస్తీర్ణం యోజనం స్నిగ్ధం తతో ద్విగుణమాయతమ్, 3
దర్శనీయం నిరాబాధం కుమ్భకర్ణస్య చక్రిరే.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాజ్ఞా = రాజుచేత, వినియుక్తాః = ఆజ్ఞాపింపబడిన, శిల్పినః = శిల్పులు, విశ్వకర్మవత్ = విశ్వకర్మ వలె, యోజనమ్ = యోజనము, విస్తీర్ణమ్ = విస్తృతమైనది, తతః = దానికంటె, ద్విగుణమ్ = రెండు రెట్లు, ఆయతమ్ = పొడవైనది, స్నిగ్ధమ్ = సుందరము, దర్శనీయమ్ = చూడదగినది, నిరాబాధమ్ = ఇరుకు లేనిది అయిన గృహమును, కుమ్భకర్ణస్య = కుంభకర్ణునకు, చక్రిరే = చేసిరి.

తా. అప్పుడు రావణుడు ఆజ్ఞాపించగా విశ్వకర్మ వంటి శిల్పులు ఒక యోజనము (ఎనిమిది లేదా పది మైళ్ళు) వెడల్పు, దానికి రెండు రెట్లు (మూడు యోజనములు) పొడవు ఉన్న, చూచుటకు అందముగా ఉన్న విశాలమైన గృహమును కుంభకర్ణునకై నిర్మించిరి. 2, 3

మూ. స్ఫాటికైః కాఞ్చనైశ్చిత్రైః స్తమ్భైః సర్వత్ర శోభితమ్,
వైడూర్యకృతసోపానం కిఙ్కిణీజాలకం తథా,
దాన్తతోరణవిన్యస్తం వజ్రస్ఫటికవేదికమ్, 5
మనోహరం సర్వసుఖం కారయామాస రాక్షసః.

ప్ర. అ. రాక్షసః = రావణుడు, స్ఫాటికైః = స్ఫటికవికారమైన, కాఞ్చనైః = బంగారువికారమైన, చిత్రైః = చిత్రములైన, స్తమ్భైః = స్తంభములతో, సర్వత్ర = అంతటా, శోభితమ్ = శోభింపచేయబడినది, వైడూర్యకృతసోపానమ్ = వైడూర్యమాణిక్యములతో చేయబడిన మెట్లు కలది, తథా = మరియు, కిఙ్కిణీజాలకమ్ = చిరుగంటల సముదాయము గలది, దాన్తతోరణవిన్యస్తమ్ = దంతవికారమైన ముఖద్వారవిన్యాసముగలది, వజ్రస్ఫటికవేదికమ్ = వజ్రవికారమైన, స్ఫటికమణిమయమైన అరుగులు గలది అయిన, మనోహరమ్ = అందముగా ఉన్న, సర్వసుఖమ్ = అన్ని సుఖములూ గల గృహమును, కారయామాస = చేయించెను.

తా. రావణుడు నిర్మింపచేసిన ఆ మనోహరమైన గృహము అన్ని సుఖ

మూ. ఉద్యానాని విచిత్రాణి నన్దనాదీని యాని చ,
తాని గత్వా సుసంక్రుద్ధో భినత్తి స్మ దశాననః. 9

ప్ర. అ. విచిత్రాణి = విచిత్రములైన, నన్దనాదీని = నందనము మొదలైన, యాని = ఏ, ఉద్యానాని = ఉద్యానములు కలవో, తాని = వాటిని గూర్చి, గత్వా = వెళ్ళి, దశాననః = రావణుడు, సుసంక్రుద్ధః = మిక్కిలి కోపించినవాడై, భినత్తి స్మ = భేదించెను.

తా. చాల కోపించిన రావణుడు నందనము మొదలైన విచిత్రములైన ఉద్యానములకు వెళ్ళి వాటిని నశింపచేసెను. 9

మూ. నదీం గజ ఇవ క్రీడన్ వృక్షాన్ వాయురివ క్షిపన్,
నగాన్ వజ్ర ఇవోత్సృష్టో విధ్వంసయతి రాక్షసః. 10

ప్ర. అ. క్రీడన్ = క్రీడించుచున్న, గజః = ఏనుగు, నదీమివ = నదిని వలె, క్షిపన్ = విసిరివేయుచున్న, వాయుః = వాయువు, వృక్షానివ = వృక్షములను వలె, ఉత్సృష్టః = విడవబడిన, వజ్రః = వజ్రము, నగానివ = పర్వతములను వలె, రాక్షసః = రాక్షసుడు, విధ్వంసయతి = నశింపచేసెను.

తా. క్రీడించుచున్న ఏనుగ నదిని వలె, ఎగురగొట్టుచున్న వాయువు వృక్షములను వలె, విడవబడిన వజ్రాయుధము పర్వతములను వలె, రావణుడు ఉద్యానాదులను ధ్వంసము చేసెను. 10

మూ. తథావృత్తం తు విజ్ఞాయ దశగ్రీవం ధనేశ్వరః,
కులానురూపం ధర్మజ్ఞో వృత్తం సంస్మృత్య చాత్మనః.

సౌభ్రాత్రదర్శనార్థం తు దూతం వైశ్రవణస్తదా,
లఙ్కాం సంప్రేషయామాస దశగ్రీవస్య వై హితమ్. 12

ప్ర. అ. తదా = అప్పుడు, ధనేశ్వరః = ధనాధిపతి, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడు అయిన, వైశ్రవణః = కుబేరుడు, దశగ్రీవమ్ = దశగ్రీవుణ్ణి, తథావృత్తమ్ = అట్టి నడవడిక గలవానినిగా, విజ్ఞాయ = తెలిసికొని, ఆత్మనః = తనయొక్క, కులానురూపమ్ = కులమునకు తగిన, వృత్తమ్ = ప్రవర్తనను,

ప్ర. అ. సః = ఆ దూత, తత్ర = అక్కడ, స్వతేజసా = తన తేజస్సుతో, దీప్యమానమ్ = ప్రకాశించుచున్న, రాజానమ్ = రాక్షసరాజును, దృష్ట్వా = చూచి, జయ ఇతి = జయ అను, వాచా = వాక్కుచేత, సంపూజ్య = పూజించి, తూష్ణీమ్ = మౌనముగా, సమభివర్తత = ఉండెను.

తా. ఆ దూత, అక్కడ తన సహజతేజస్సుతో ప్రజ్వలించుచున్న ఆ రాక్షసరాజును చూచి "జయ విజయీ భవ"అని పలికి క్షణకాలము ఊరకుండెను.

మూ. తం తత్రోత్తమపర్యఙ్కే వరాస్తరణశోభితే,
ఉపవిష్టం దశగ్రీవం దూతో వాక్యమథాబ్రవీత్. 16

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దూతః = దూత, తత్ర = అక్కడ, వరాస్తరణశోభితే = శ్రేష్ఠమైన ఆస్తరణముచేత ప్రకాశింపచేయబడిన, ఉత్తమ పర్యఙ్కే = ఉత్తమమైన పర్యంకము (సోఫా) నందు, ఉపవిష్టమ్ = కూర్చున్న, దశగ్రీవమ్ = దశగ్రీవుణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట ఆ దూత, శ్రేష్ఠమైన ఆస్తరణముతో ప్రకాశించుచున్న ఉత్తమమైన పర్యంకముపై కూర్చొని ఉన్న రావణునితో ఇట్లు పలికెను. 16

మూ. రాజన్ వదామి తే సర్వం భ్రాతా తవ యదబ్రవీత్,
ఉభయోః సదృశం వీర వృత్తస్య చ కులస్య చ. 17

ప్ర. అ. వీర = వీరుడా, రాజన్ = రాజా, తవ భ్రాతా = నీ సోదరుడు, ఉభయోః = మీ ఇద్దరియొక్క, వృత్తస్య = చరిత్రకు, కులస్య చ = కులమునకు, సదృశమ్ = తగిన, యత్ = దేనిని, అబ్రవీత్ = పలికెనో, సర్వమ్ = దాని నంతనూ, తే = నీకు, వదామి = చెప్పుచున్నాను.

తా. వీరుడవైన రాజా! మీ ఇద్దరి చరిత్రకు, కులమునకు తగు విధముగా నీ సోదరుడు చెప్పిన దంతా చెప్పెదను. 17

మూ. సాధు పర్యాప్తమేతావత్కృతశ్చారిత్రసంగ్రహః,
సాధు ధర్మే వ్యవస్థానం క్రియతాం యది శక్యతే. 18

ప్ర. అ. చారిత్రసంగ్రహః = సచ్చరితసంపాదనము, కృతః = చేయ

ప్ర. అ. అహమ్=నేను, రౌద్రమ్=రుద్రునకు సంబంధించిన, వ్రతమ్= వ్రతమును, సమాస్థాయ = అవలంబించి, నియతః = నియమవంతుడనై, నియతేన్ద్రియః=నియమించబడిన ఇంద్రియములుగలవాడనై, ధర్మమ్=ధర్మమును, ఉపాసితుమ్=ఉపాసించుటకు, హిమవత్పృష్ఠమ్ = హిమవత్పర్వతము పైభాగమును గూర్చి, గతః=వెళ్ళితిని.

తా. నేను రుద్రుని అనుగ్రహమును సంపాదించు వ్రతమును అవలంభించి నియమవంతుడనై, ఇంద్రియములను నిగ్రహించుకొని ధర్మమును ఉపాసించుటకై హిమవత్పర్వతము పైకి వెళ్ళితిని. 21

మూ. తత్ర దేవో మయా దృష్ట ఉమయా సహితః ప్రభుః,
సవ్యం చక్షుర్మయా దైవా త్తత్ర దేవ్యాం నిపాతితమ్. 22

ప్ర. అ. తత్ర = అక్కడ, ఉమయా = పార్వతితో, సహితః = కూడిన, ప్రభుః = సర్వసమర్థుడైన, దేవః = మహాదేవుడు, మయా = నా చేత, దృష్టః = చూడబడినాడు. దైవాత్ = దైవమువలన, తత్ర = అక్కడ, మయా = నాచేత, సవ్యమ్ = ఎడమదైన, చక్షుః = నేత్రము, దేవ్యామ్ = దేవిమీద, నిపాతితమ్ = పడవేయబడినది.

తా. అక్కడ నేను పార్వతితో కూడి ఉన్న సర్వసమర్థుడైన పరమేశ్వరుణ్ణి చూచితిని. దైవవశముచేత నా ఎడమ కన్ను అక్కడ ఉన్న పార్వతి దేవి పై ప్రసరించినది. 32

మూ. కాన్వేషేతి మహారాజ న ఖల్వన్యేన హేతునా,
రూపం చానుపమం కృత్వా రుద్రాణీ తత్ర తిష్ఠతి. 23

ప్ర. అ. మహారాజ = మహారాజా! ఏషా = ఈమె, కా ను = ఎవరు, ఇతి = అని నా నేత్రము ప్రసరించినది. అన్యేన = మరియొక, హేతునా = హేతువు చేత, న ఖలు = కాదు. రుద్రాణీ = పార్వతి, అనుపమమ్ = సాటి లేని, రూపమ్ = రూపమును, కృత్వా = చేసి, తత్ర = అక్కడ, తిష్ఠతి = ఉన్నది.

తా. రాక్షసరాజా ! ఈమె ఎవరై ఉండునా అను ఉద్దేశముతోనే

తా. ఆ నియమము పూర్తియైన పిమ్మట అక్కడ, సమర్థుడైన మహేశ్వరుడు సంతోషించిన మనస్సుతో, నాతో ఇట్లు పలికెను. 26

మూ. ప్రీతోఽస్మి తవ ధర్మజ్ఞ తపసానేన సువ్రత,
మయా చైతద్వ్రతం, చీర్ణం త్వయా చైవ ధనాధిప.27

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! సువ్రత = మంచి నియమము గలవాడా! ధనాధిప = కుబేరా! తవ = నీకు, ప్రీతః అస్మి = సంతోషించితిని. ఏతత్ = ఈ, వ్రతమ్ = వ్రతము, మయా చ = నాచేతను, త్వయా చైవ = నీచేతను, చీర్ణమ్ = చేయబడినది.

తా. ధర్మములు తెలిసిన, మంచి నియమములు గల ఓ! కుబేరా! నీ విషయమునందు సంతోషించితిని. ఈ వ్రతమును నేను చేసితిని; ఇప్పుడు నీవు చేసినావు. 27

మూ. తృతీయః పురుషో నాస్తి యశ్చరేద్వ్రతమీదృశమ్,
వ్రతం సుదుష్కరం హ్యేత న్మయైవోత్పాదితం పురా.

ప్ర. అ. ఈదృశమ్ = ఇట్టి, వ్రతమ్ = వ్రతమును, యః = ఎవడు, చరేత్ = ఆచరించునో, అట్టి, తృతీయః = మూడవ, పురుషః = పురుషుడు, నాస్తి = లేడు. సుదుష్కరమ్ = చేయుటకు చాల కష్టమైన, ఏతత్ = ఈ, వ్రతమ్ = వ్రతము, పురా = పూర్వము, మయైవ = నా చేతనే, ఉత్పాదితమ్ = పుట్టింపబడినది.

తా. ఇట్టి వ్రతము చేయగల మూడవవాడు ఎవ్వడూ లేడు. చేయుటకు చాల కష్టమైన ఈ వ్రతమును పూర్వము నేనే కనుగొన్నాను. 28

మూ. తత్సఖిత్వం మయా సౌమ్య రోచయస్వ ధనేశ్వర,
తపసా నిర్జిత శ్చైవ సఖా భవ మమానఘ. 29

ప్ర. అ. ధనేశ్వర = కుబేరా! తత్ = ఆ కారణమువలన, మయా = నాతో, సఖిత్వమ్ = మిత్రత్వమును, రోచయస్వ = అంగీకరించుము. అనఘ = దోషములు లేనివాడా! మమ = నాకు, తపసా = తపస్సుచేత, నిర్జితః చైవ = జయింపబడిన, సఖా = మిత్రుడవుగా, భవ = అగుము.

ప్ర. అ. తత్ = అ కారణమువలన, కులదూషణాత్ = కులమును దూషించు, అధర్మిష్ఠసంయోగాత్ = ధర్మసంమతము కాని కార్యముతో సంబంధమునుండి, నివర్త = మరలుము. సర్షిసంఘైః = ఋషుల సంఘములతో కూడిన, సురైః = దేవతలచేత, తవ = నీయొక్క, వధోపాయః = వధకు ఉపాయము, చిన్త్యతే = ఆలోచించబడుచున్నది.

తా. అందువలన కులమునకు అపకీర్తిని తెచ్చు అధర్మకార్యములనుండి దూరముగా ఉండుము. ఋషులు, దేవతలు కలిసి నిన్ను చంపుటకు ఉపాయమును ఆలోచించుచున్నారు. 32

మూ. ఏవముక్తో దశగ్రీవః కోపసంరక్తలోచనః, 33
హస్తాన్ దన్తాంశ్చ సంపీడ్య వాక్యమేతదువాచ హ

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దశగ్రీవః = రావణుడు, కోపసంరక్తలోచనః = కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, హస్తాన్ = హస్తములను, దన్తాంశ్చ=దంతములను, సంపీడ్య=పీడించి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ మాటలు విన్న రావణుడు కోపముచేత కళ్లు ఎఱ్ఱబడగా, చేతులు చరచి, పళ్లు కొరుకుచు ఇట్లు పలికెను. 33

మూ. విజ్ఞాతం తే మయా దూత వాక్యం యత్త్వం ప్రభాషసే,
నైవ త్వమసి నైవాసౌ భ్రాతా యేనాసి చోదితః.

ప్ర. అ. దూత = దూతా ! త్వమ్ = నీవు, యత్ = ఏ, వాక్యమ్ = వాక్యమును, ప్రభాషసే = మాటలాడుచున్నావో, తే = నీయొక్క ఆ వాక్యము, విజ్ఞాతమ్ = తెలియబడినది. త్వమ్ = నీవు, నైవ అసి = ఇంక లేవు. యేన = ఏ, భ్రాత్రా = సోదరునిచేత, చోదితః = ప్రేరేపింపబడితివో, అసౌ = ఇతడు కూడ, నైవ = లేడు.

తా. ఓ ! దూతా ! నీవు పలికిన మాటలు విన్నాను. నీవు గాని, నిన్ను పంపిన నా సోదరుడు గాని ఇంక ఉండరు. 34

తా. కాని, ఇప్పుడు వాని మాటలు విన్న పిమ్మట బాహుపరాక్రమముచేత మూడు లోకములను జయింపవలె నని నిశ్చయించుకొన్నాను. 38

మూ. ఏతన్ముహూర్తమేవాహం తస్యైకస్య తు వై కృతే,
చతురో లోకపాలాంస్తాన్నయిష్యామి యమక్షయమ్. 39

ప్ర. అ. అహమ్ = నేను, ఏతన్ముహూర్తమేవ = ఈ క్షణమునందే, ఏకస్య = ఒక్క, తస్య కృతే = వానిమూలమున, తాన్ = ఆ, చతురః = నలుగురు, లోకపాలాన్ = లోకపాలకులను, యమక్షయమ్ = యమలోకమును, నయిష్యామి = పొందించెదను.

తా. ఆ కుబేరుడు ఇట్లు పలికినందుకు నేను ఈ క్షణమునందే ఆ నలుగురు లోకపాలకులను యమలోకమునకు పంపివేసెదను. 39

మూ. ఏవముక్త్వా తు లఙ్కేశో దూతం ఖడ్గేన జఘ్నివాన్,
దదౌ భక్షయితుం హ్యేనం రాక్షసానాం దురాత్మనామ్.

ప్ర. అ. లఙ్కేశః = రావణుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, దూతమ్ = దూతను, ఖడ్గేన = ఖడ్గముచేత, జఘ్నివాన్ = చంపినవాడై, ఏనమ్ = వీనిని, దురాత్మనామ్ = దుష్టులైన, రాక్షసానామ్ = రాక్షసులకు, భక్షయితుమ్ = భక్షించుటకు, దదౌ = ఇచ్చెను.

తా. రావణుడు ఇట్లు పలికి, ఖడ్గముతో ఆ దూతను చంపి వానిని దుష్టులైన రాక్షసులకు భక్షించుటకై ఇచ్చెను. 40

మూ. తతః కృతస్వస్త్యయనో రథమారుహ్య రావణః,
త్రైలోక్యవిజయాకాఙ్క్షీ యయౌ యత్ర ధనేశ్వరః. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రావణః = రావణుడు, కృతస్వస్త్యయనః = చేయబడిన స్వస్త్యయనము కలవాడై, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి,

# అథ చతుర్దశః సర్గః

*[రావణుడు మంత్రులతో కలిసి వెళ్లి యక్షులపై ఆక్రమణము చేయుట: యక్షులు ఓడిపోవుట.]*

మూ. తతః స సచివైః సార్ధం షడ్భిర్నిత్యబలోద్ధతః,
మహోదరప్రహస్తాభ్యాం మారీచశుకసారణైః. 1

ధూమ్రాక్షేణ చ వీరేణ నిత్యం సమరగర్ధినా,
వృతః సంప్రయయౌ శ్రీమాన్ క్రోధాల్లోకాన్ దహన్నివ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నిత్యబలోద్ధతః = నిత్యమూ బలముచేత ఉద్ధతుడైన, శ్రీమాన్ = శ్రీమంతుడైన, సః = ఆ రావణుడు, మహోదర ప్రహస్తాభ్యామ్ = మహోదర ప్రహస్తులతోను, మారీచశుకసారణైః = మారీచ-శుక-సారణులతోను, నిత్యమ్ = ఎల్లప్పుడు, సమరగర్ధినా = యుద్ధమునందు ఆసక్తి గల, వీరేణ = వీరుడైన, ధూమ్రాక్షేణ = ధూమ్రాక్షునితోను, షడ్భిః = ఆరుగురు, సచివైః సార్ధమ్ = మంత్రులతో, వృతః = కూడినవాడై, క్రోధాత్ = కోపమువలన, లోకాన్ = లోకములను, దహన్నివ = కాల్చుచున్నవాడు వలె, సంప్రయయౌ = బయలుదేరి వెళ్ళెను.

తా. నిత్యము బలముచేత ఉద్ధతుడైన శ్రీమంతుడైన ఆ రావణుడు, మహోదర-ప్రహస్త-మారీచ-శుక-సారణులతోను, నిత్యము యుద్ధమును కోరు వీరుడైన ధూమ్రాక్షునితోను, ఈ ఆరుగురు సచివులతో కలిసి, కోపమువలన లోకములను కాల్చివేయుచున్నాడా అన్నట్లు బయలుదేరి వెళ్ళెను. 1, 2

మూ. పురాణి స నదీః శైలాన్వనాన్యుపవనాని చ,
అతిక్రమ్య ముహూర్తేన కైలాసం గిరిమాగమత్. 3

ప్ర. అ. ముహూర్తేన = ముహూర్తకాలముచేత, పురాణి = పట్టణములను,

మూ. అనుజ్ఞాతా యయుర్హృష్టా యుద్ధాయ ధనదేన తే, 6
తతో బలానాం సంక్షోభో వ్యవర్ధత ఇవోదధేః.
తస్య నైరృతరాజస్య శైలం సంచలయన్నివ. 7

ప్ర. అ. తే = వాళ్ళు, ధనదేన = కుబేరుని చేత, అనుజ్ఞాతాః = అనుజ్ఞ ఇవ్వబడినవారై, హృష్టాః = సంతోషించినవారై, యుద్ధాయ = యుద్ధముకొరకు, యయుః = వెళ్ళిరి. తతః = అటుపిమ్మట, తస్య = ఆ, నైరృతరాజస్య = కుబేరుని యొక్క, బలానామ్ = సైన్యములయొక్క, సంక్షోభః = సంక్షోభము, ఉదధేః ఇవ = సముద్రము సంక్షోభము వలె, శైలమ్ = పర్వతమును, సంచలయన్నివ = కదల్చుచున్నదివలె, వ్యవర్ధత = వృద్ధిపొందెను.

తా. పిమ్మట ఆ యక్షులు కుబేరుని అనుమతి పొంది సంతోషించుచు యుద్ధమునకు వెళ్ళిరి. అప్పుడు ఆ కుబేరుని సైన్యముల సంక్షోభము సముద్ర సంక్షోభము వలె. ఆ పర్వతమును కదల్చి వేయుచున్నదా అన్నట్లు వృద్ధి పొందెను. 6, 7

మూ. తతో యుద్ధం సమభవద్యక్షరాక్షససంకులమ్,
వ్యథితాశ్చాభవం స్తత్ర సచివా రాక్షసస్య తే. 8

ప్ర. అ. తతః = అటు పిమ్మట, యక్షరాక్షససంకులమ్ = యక్షుల తోను, రాక్షసులతోను వ్యాకులమైన, యుద్ధమ్ = యుద్ధము, సమభవత్ = ఆయెను. తత్ర = అక్కడ, రాక్షసస్య = రాక్షసునియొక్క, తే = ఆ, సచివాః = మంత్రులు, వ్యథితాః = వ్యథచెందినవారుగా, అభవన్ = అయిరి.

తా. అప్పుడు యక్షరాక్షసుల మధ్య సంకులమైన యుద్ధము జరిగెను. అప్పుడు రావణుని మంత్రులు వ్యథ చెందిరి. 8

మూ. స దృష్ట్వా తాదృశం సైన్యం దశగ్రీవో నిశాచరః,
హర్షనాదాన్ బహూన్ కృత్వా స క్రోధా దభ్యధావత. 9

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, సః = ఆ, నిశాచరః = రాక్షసుడైన, దశగ్రీవః = రావణుడు, తాదృశమ్ = అట్టి, సైన్యమ్ = సైన్యమును, దృష్ట్వా = చూచి,

ఆడకుండగా, వధ్యమానః=కొట్టబడు, సః దశాననః=ఆ రావణుడు, అవరుధ్యత= అడ్డుకొనబడెను.

తా. వర్షించుచున్న మేఘములు వలె ఆ యక్షులు బాణాదులధారలతో ఊపిరి ఆడకుండే టట్లు కొట్టుచు ఆ రావణుని అడ్డుకొనిరి. 12

మూ. న చకార వ్యథాం చైవ యక్షశస్త్రైః సమాహతః,
మహీధర ఇవామ్భోదైర్ధారాశతసముక్షితః. 13

ప్ర. అ. యక్షశస్త్రైః= యక్షుల శస్త్రములచేత, సమాహతః = కొట్ట బడిన ఆ రావణుడు, అమ్భోదైః= మేఘములచేత, ధారాశతసముక్షితః= అనేక జలధారలచేత తడబడిన, మహీ ధరః ఇవ=పర్వతము వలె, వ్యథామ్=వ్యథను, న చకార = చేయలేదు.

తా. యక్షులు ఆయుధముతో కొట్టుచున్నను ఆ రావణుడు, మేఘముల చేత, జలధారలతో కొట్టబడిన పర్వతము వలె, ఏ మాత్రము వ్యథ చెందలేదు. 13

మూ. స మహాత్మా సముద్యమ్య కాలదణ్డోపమాం గదామ్,
ప్రవివేశ తతః సైన్యం నయన్ యక్షాన్ యమక్షయమ్.

ప్ర. అ. తతః= ఆటుపిమ్మట, మహాత్మా=గొప్ప మనస్సు గల, సః= ఆతడు, కాలదణ్డోపమామ్= యమదండముతో సమానమైన, గదామ్ = గదను, సముద్యమ్య= ఎత్తి, యక్షాన్ = యక్షులను, యమక్షయమ్ = యమలోకమును, నయన్ = పొందించుచు, సైన్యమ్= సైన్యమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. అపుడు అ రావణుడు యమదండముతో సమానమైన గదను గ్రహించి యక్షులను యమలోకమునకు పంపుచు ఆ సైన్యములో ప్రవేశించెను. 14

మూ. స కక్షమివ విస్తీర్ణం శుష్కేన్ధనమివాకులమ్,
వాతేనాగ్నిరివాదీప్తో యక్షసైన్యం దదాహ తత్. 15

ప్ర. అ. సః= అతడు, వాతేన= వాయువుచేత, ఆదీప్తః= ప్రజ్వలించు చున్న, అగ్నిరివ= అగ్ని వలె, విస్తీర్ణమ్= విశాలమైన, శుష్కేన్ధనమ్=ఎండిన కట్టెలు గల, ఆకులమ్=వ్యాకులమైన, కక్షమివ=డొంకను వలె, తత్=ఆ, యక్షసైన్యమ్=యక్షులసైన్యమును, దదాహ= కాల్చెను.

తా. అప్పుడు కొందరు యక్షులు అలసిపోయి, శస్త్రములు జారవిడచి, ఒకరి నొకరు కౌగలించుకొనుచు, నీటిచేత నదుల ఒడ్లు వలె కూలిపోయిరి. 18

మూ. హతానాం గచ్ఛతాం స్వర్గం యుధ్యతామథ ధావతామ్,
ప్రేక్షతామృషిసంఘానాం బభూవ న తదాన్తరమ్. 19

ప్ర. అ. అథ = అటుపిమ్మట, హతానామ్ = చంపబడిన యక్షులు, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, గచ్ఛతామ్ = వెళ్ళుచుండగా, యుధ్యతామ్ = యుద్ధముచేయుచున్నవాళ్ళు, ధావతామ్ = పారిపోవుచుండగా, తదా = అప్పుడు, ప్రేక్షతామ్ = చూచుచున్న, ఋషిసంఘానామ్ = ఋషుల సముదాయములకు, అన్తరమ్ = అవకాశము, న బభూవ = లేకపోయెను.

తా. చంపబడిన యక్షు లందరు స్వర్గమునకు పోవుచుండిరి. యుద్ధము చేయుచున్న కొందరు పారిపోవుచుండిరి. అందుచే అక్కడ చూచుటకై వచ్చిన ఋషులకు ఆకాశమున నిలచుటకు చోటు లేకపోయెను. 19

మూ. భగ్నాంస్తు తాన్ సమాలక్ష్య యక్షేన్ద్రాంస్తు మహాబలాన్,
ధనాధ్యక్షో మహాబాహుః ప్రేషయామాస యక్షకాన్. 20

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, ధనాధ్యక్షః = కుబేరుడు, భగ్నాన్ = ఓడిపోయిన, మహాబలాన్ = గొప్ప బలముగల, తాన్ = ఆ, యక్షేన్ద్రాన్ = యక్షాధిపతులను, సమాలక్ష్య = చూచి, యక్షకాన్ = యక్షులను, ప్రేషయామాస = పంపెను.

తా. గొప్ప బాహువులు గల కుబేరుడు ఆ యక్షనాయకులు ఓడిపోవుట చూచి మరికొందరు యక్షులను పంపెను. 20

మూ. ఏతస్మిన్నన్తరే రామ విస్తీర్ణబలవాహనః,
ప్రేషితో న్యపతద్యక్షో నామ్నా సంయోధకణ్టకః. 21

ప్ర. అ. రామ = రామా! ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యయందు, విస్తీర్ణ బలవాహనః = అధికమైన సైన్యము వాహనములు గల, నామ్నా = పేరుచేత, సంయోధకణ్టకః = సంయోధకంటకు డను, యక్షః = యక్షుడు, ప్రేషితః = పంపబడినవాడై, న్యపతత్ = శీఘ్రముగా వచ్చెను.

మర్యాదామ్ = హద్దు అయిన, తోరణాన్తరమ్ = ముఖద్వారమధ్యమును, ఆవిశత్ = ప్రవేశించెను.

తా. పిమ్మట రావణుడు ద్వారపాలకులు నిలచు సరిహద్దు అయిన ముఖ ద్వార మధ్యభాగములో ప్రవేశించెను. దాని భాగములు బంగారముచేత విచిత్రములుగా ఉండెను. ఆ ప్రాంతములందు వైడూర్యమాణిక్యముల పొడి చల్లబడెను. 24

మూ. తం తు రాజన్ దశగ్రీవం ప్రవిశన్తం నిశాచరమ్,
సూర్యభానురితి ఖ్యాతో ద్వారపాలో న్యవారయత్. 25

ప్ర. అ. రాజన్ = రాజా! ప్రవిశన్తమ్ = ప్రవేశించుచున్న, నిశాచరమ్ = రాక్షసుడైన, తమ్ = ఆ, దశగ్రీవమ్ = రాక్షసుణ్ణి, సూర్యభానుః ఇతి = సూర్యభానుడు అని, ఖ్యాతః = ప్రసిద్ధి చెందిన, ద్వారపాలః = ద్వారపాలుడు, న్యవారయత్ = నివారించెను.

తా. రామా! నిశాచరుడైన రావణుడు ప్రవేశించుచుండగా అతనిని సూర్యపాలు డను ద్వారపాలుడు అడ్డుకొనెను. 25

మూ. స వార్యమాణో యక్షేణ ప్రవివేశ నిశాచరః,
యదా తు వారితో రామ న వ్యతిష్ఠత్సరాక్షసః, 26
తతస్తోరణముత్పాట్య తేన యక్షేణ తాడితః.

ప్ర. అ. సః నిశాచరః = ఆ రావణుడు, యక్షేణ = యక్షునిచేత, వార్యమాణః = నివారింపబడుచున్నను, ప్రవివేశ = ప్రవేశించెను. రామ = రామా! వారితః = నివారింపబడిన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, యదా = ఎప్పుడు, న వ్యతిష్ఠత్ = నిలబడలేదో, తతః = అటుపిమ్మట, తోరణమ్ = తోరణమును, ఉత్పాట్య = పెకలించి, తేన యక్షేణ = ఆ యక్షునిచేత, తాడితః = కొట్టబడెను. 26

తా. ఆ విధముగా యక్షునిచేత నివారింపబడుచున్నను రావణుడు ప్రవేశించెను. రామా! నివారించినను ఆగని ఆ రాక్షసుణ్ణి యక్షుడు ఆ తోరణమును పెకలించి కొట్టెను. 26

మూ. రుధిరం ప్రస్రవన్ భాతి శైలో ధాతుస్రవైరివ, 27
స శైలశిఖరాభేణ తోరణేన సమాహతః,
జగామ న క్షతిం వీరో వరదానాత్ స్వయంభువః. 28

= అటు పిమ్మట, భయపీడితాః = భయముచేత పీడింపబడినవారై, త్యక్తప్రహరణాః = విడవబడిన ఆయుధములు గలవారై, శ్రాన్తాః = అలసినవారై, తదా = అప్పుడు, వివర్ణవదనాః = రంగులు చెడిన ముఖములు గలవారై, నదీః = నదులను, గుహాశ్చైవ = గుహలను, వివిశుః = ప్రవేశించిరి.

తా. పిమ్మట యక్షులందరూ ఆ రాక్షసుని పరాక్రమమును చూచి పారిపోయిరి. భయపీడితులై, అలసి, ఆయుధములు విడచి, రంగుమారిపోయిన ముఖాలతో నదులలోను, గుహలలోను ప్రవేశించిరి. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో పదునాల్గవ సర్గ సమాప్తము.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాబాహుః = గొప్ప బాహువులు గల, సుదుర్జయః = జయించుటకు మిక్కిలి శక్యము కాని, మాణిభద్రః = మాణిభద్రుడు, చతుర్భిః = నాలుగు, యక్షసహస్రైః = యక్షుల సహస్రములతో, వృతః = కూడినవాడై, సమయోధయత్ = యుద్ధము చేయించెను.

తా. గొప్ప బాహువులు గల, జయించుటకు ఏ మాత్రమూ శక్యము కాని ఆ మాణిభద్రుడు ఆ మాటలు విని, నాలుగువేలమంది యక్షులతో కలిసి వెళ్ళి యుద్ధము చేసెను. 3

మూ. తే గదాముసలప్రాసైః శక్తితోమరముద్గరైః,
అభిఘ్నన్తస్తదా యక్షా రాక్షసాన్ సముపాద్రవన్. 4

ప్ర. అ. తదా = అప్పుడు, తే యక్షాః = ఆ యక్షులు, రాక్షసాన్ = రాక్షసులను, గదాముసలప్రాసైః = గదలతోను, రోకళ్ళతోను, ప్రాసలతోను, శక్తితోమరముద్గరైః = శక్తులతోను తోమరములతోను, ముద్గరములతోను, అభిఘ్నన్తః = కొట్టుచు, సముపాద్రవన్ = శీఘ్రముగా వెళ్ళిరి.

తా. అప్పుడు ఆ యక్షులు రాక్షసులను గదలతోను, ముసలములతోను, ప్రాసలతోను, శక్తులతోను, తోమరములతోను, ముద్గరములతోను కొట్టుచు, శీఘ్రముగా వాళ్ళమీదికి పరుగెత్తి వెళ్ళిరి. 4

మూ. కుర్వన్తస్తుములం యుద్ధం చరన్తః శ్యేనవల్లఘు,
బాఢం ప్రయచ్ఛ నేచ్ఛామి దీయతామితి భాషిణః. 5

ప్ర. అ. తుములమ్ = వ్యాకులమైన, యుద్ధమ్ = యుద్ధమును, కుర్వన్తః = చేయుచున్నవారై, శ్యేనవత్ = డేగల వలె, లఘు = శీఘ్రముగా, చరన్తః = సంచరించుచున్నవారై, బాఢమ్ = తప్పక, ప్రయచ్ఛ = ఇమ్ము. న ఇచ్ఛామి = ఇచ్ఛయించను. దీయతామ్ = ఖండించబడుగాక. ఇతి = అని, భాషిణః = మాటలాడుచు, (వెళ్ళిరి).

తా. ఆ యక్షులు చాల వ్యాకులమైన యుద్ధము చేయుచు, డేగల వలె శీఘ్రముగా సంచరించుచు, "తప్పక (యుద్ధమును)ఇమ్ము; (వెనుకకు మరలుటకు) ఇచ్ఛయించను. (వాని ఆయుధాదికము) ఖండించుము"అని పలుకుచు వెళ్ళిరి. 5

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషులలో శ్రేష్ఠుడవైన రామా ! యక్షార్జవమ్ = యక్షుల ఆర్జవముతో కూడిన (కపటములేని), యుద్ధమ్ = యుద్ధము, క్వ చ = ఎక్కడ ? రక్షసామ్ = రాక్షసులయొక్క, మాయాబలాశ్రయమ్ = మాయాబలము ఆశ్రయముగా గల యుద్ధము, క్వ చ = ఎక్కడ ? తేన = ఆ కారణముచేత, తే = ఆ రాక్షసులు, యుధి = యుద్ధమునందు, అభ్యధికాః = అధికులు.

తా. పురుషశ్రేష్ఠుడవైన రామా ! కపటము లేని యక్షుల యుద్ధ మెక్కడ; మాయాబలముమీద ఆధారపడిన రాక్షసుల యుద్ధము ఎక్కడ ? ఆ కారణము చేతనే రాక్షసులు యుద్ధములో అధికులు. 9

మూ. ధూమ్రాక్షేణ సమాగమ్య మాణిభద్రో మహారణే,
ముసలేనోరసి క్రోధాత్తాడితో న చ కమ్పితః. 10

ప్ర. అ. మహారణే = మహాయుద్ధమునందు, ధూమ్రాక్షేణ = ధూమ్రాక్షుని చేత, సమాగమ్య = వచ్చి, మాణిభద్రః = మాణిభద్రుడు, ముసలేన = ముసలము చేత, క్రోధాత్ = కోపమువలన, ఉరసి = వక్షఃస్థలముమీద, తాడితః = కొట్టబడెను; న చ కమ్పితః = కంపించలేదు.

తా. ఆ మహాయుద్ధములో ధూమ్రాక్షుడు మాణిభద్రుని సమీపించి ముసలముతో ఆతని వక్షఃస్థలముమీద కొట్టెను; కాని అతడు కంపించలేదు. 10

మూ. తతో గదాం సమావిధ్య మాణిభద్రేణ రాక్షసః,
ధూమ్రాక్షస్తాడితో మూర్ధ్ని విహ్వలః స పపాత హ. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాక్షసః = రాక్షసుడైన, ధూమ్రాక్షః = ధూమ్రాక్షుడు, మాణిభద్రేణ = మాణిభద్రునిచేత, గదామ్ = గదను, సమావిధ్య = గట్టిగా ఊపి, మూర్ధ్ని = శిరస్సుపై, తాడితః = కొట్టబడెను. సః = అతడు, విహ్వలః = వ్యాకులుడై, పపాత హ = పడెను.

తా. పిమ్మట మాణిభద్రుడు గదను వేగముగా ఊపి ధూమ్రాక్షుని వక్షః స్థలముమీద కొట్టగా అతడు వ్యాకులుడై పడిపోయెను. 11

మూ. ధూమ్రాక్షం తాడితం దృష్ట్వా పతితం శోణితోక్షితమ్,
అభ్యధావత సంగ్రామే మాణిభద్రం దశాననః. 12

తతః ప్రభృతి = అది మొదలు, అసౌ యక్షః = ఈ యక్షుడు, పార్శ్వమౌలిః = పార్శ్వమౌలిగా (ప్రక్కకు శిరస్సు కలవాడుగా) అభూత్ కిల = అయెనట.

తా. పిమ్మట ఆ మాణిభద్రుడు యుద్ధముచేయుచు ఎదిరించినను రావణుడు కంపించలేదు. అది మొదలు మణిభద్రుడు 'పార్శ్వమౌలి'గా ప్రసిద్ధి చెందెను. 15

మూ. తస్మింస్తు విముఖీభూతే మాణిభద్రే మహాత్మని,
సంనాదః సుమహాన్ రాజంస్తస్మిన్ శైలే వ్యవర్ధత. 16

ప్ర. అ. రాజన్ = రాజా! మహాత్మని = మహాత్ముడైన, తస్మిన్ = ఆ, మాణిభద్రే = మాణిభద్రుడు, విముఖీభూతే = విముఖు డగుచుండగా, తస్మిన్ శైలే = ఆ పర్వతమునందు, సుమహాన్ = చాల గొప్పదైన, సంనాదః = ధ్వని, వ్యవర్ధత = పెరిగెను.

తా. రాజా! మహాత్ముడైన ఆ మాణిభద్రుడు విముఖుడై వెళ్ళిపోగా ఆ పర్వతము మీద చాల అధికమైన శబ్దము వృద్ధి పొందెను. 16

మూ. తతో దూరాత్ప్రదదృశే ధనాధ్యక్షో గదాధరః,
శుక్రప్రౌష్ఠపదాభ్యాం చ పద్మశఙ్ఖసమావృతః. 17

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధనాధ్యక్షః = కుబేరుడు, గదాధరః = గదను ధరించినవాడై, శుక్రప్రౌష్ఠపదాభ్యాం చ = శుక్రప్రౌష్ఠపదులతో, పద్మశఙ్ఖ సమావృతః = పద్మము, శంఖము అను నిధులతో కూడినవాడై, దూరాత్ = దూరమునుండి, ప్రదదృశే = చూడబడెను.

తా. పిమ్మట కుబేరుడు శుక్రుడు, ప్రౌష్ఠపదుడు అను మంత్రులతోను, పద్మము, శంఖము అను నిధుల అధిష్ఠానదేవతలలోను కూడి, గద ధరించి దూరమునుండి కనబడెను. 17

మూ. స దృష్ట్వా భ్రాతరం సంఖ్యే శాపాద్విభ్రష్టగౌరవమ్,
ఉవాచ వచనం ధీమాన్ యుక్తం పైతామహే కులే. 18

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతుడైన, సః = ఆ కుబేరుడు, సంఖ్యే = యుద్ధమునందు, శాపాత్ = శాపమువలన, విభ్రష్టగౌరవమ్ = నశించిన గౌరవము

చేత, దేవతాః = దేవతలు, నాభినన్దన్తి = అభినందించరు. త్వమ్ = నీవు, యేన = దేనిచేత, ఈదృశమ్ = ఇట్టి భావమ్ = భావమును, నీతః = పొందించబడితివో, తచ్చ = దానిని కూడ, నావబుధ్య సే = తెలిసికొనుటలేదు.

తా. నీవు ఏదైన ధర్మసంమతమైన పని చేసినను దేవతలు అభినందించరు. నీకు ఇట్టి దుష్టబుద్ధి ఎందుకు కలిగినదో ఆ విషయమును తెలిసికొనజాలకున్నావు.

మూ. మాతరం పితరం విప్రమాచార్యం చావమన్య వై,
స పశ్యతి ఫలం తస్య ప్రేతరాజవశం గతః. 22

ప్ర. అ. మాతరమ్ = తల్లిని, పితరమ్ = తండ్రిని, విప్రమ్ = బ్రాహ్మణుని, ఆచార్యమ్ = గురువును, అవమన్య వై = అవమానించి, సః = వాడు, ప్రేతరాజవశమ్ = యముని వశమును, గతః = పొందినవాడై, తస్య ఫలమ్ = దాని ఫలమును, పశ్యతి = చూచును.

తా. తల్లిని, తండ్రిని, బ్రాహ్మణుని, గురువును అవమానించినవాడు మరణానంతరము తాను చేసిన పనికి ఫలము అనుభవించగలడు. 22

మూ. అధ్రువే హి శరీరే యో న కరోతి తపోర్జనమ్,
స పశ్చాత్తప్యతే మూఢో మృతో గత్వాత్మనో గతిమ్. 23

ప్ర. అ. శరీరే = శరీరము, అధ్రువే = అస్థిరమై ఉండగా, యః = ఎవడు, తపోర్జనమ్ = తపఃసంపాదనమును, న కరోతి = చేయడో, మూఢః = మూఢుడైన, సః = అతడు, మృతః = మరణించినవాడై, ఆత్మనః = తనయొక్క, గతిమ్ = గతిని, గత్వా = పొంది, పశ్చాత్ = తరువాత, తప్యతే = దుఃఖించును.

తా. ఈ శరీరము అస్థిరము. అట్టి ఈ శరీర మున్నప్పుడే తపస్సంపాదన చేయని మూఢుడు మరణానంతరము తాను పొందవలసిన దుర్గతిని పొంది పశ్చాత్తాపపడును. 23

మూ. ధర్మాద్రాజ్యం ధనం సౌఖ్యమధర్మాద్దుఃఖమేవ చ,
తస్మాద్ధర్మం సుఖార్థాయ కుర్యాత్పాపం విసర్జయేత్. 24

ప్ర. అ. ధర్మాత్ = ధర్మమువలన, రాజ్యమ్ = రాజ్యము, ధనమ్ = ధనము,

మూ. బుద్ధిరూపం ఫలం పుత్రాన్విత్తం శూరత్వమేవ చ,
ప్రాప్నువన్తి నరా లోకే నిర్జితం పుణ్యకర్మభిః. 27

ప్ర. అ. లోకే = లోకమునందు, నరాః = మానవులు, పుణ్యకర్మభిః = పుణ్యకర్మలచేత, నిర్జితమ్ = జయింపబడిన, బుద్ధిరూపమ్ = బుద్ధిరూపమైన, ఫలమ్ = ఫలమును, పుత్రాన్ = పుత్రులను, విత్తమ్ = ధనమును, శూరత్వమేవ చ = శూరత్వమును, ప్రాప్నువన్తి = పొందుదురు.

తా. లోకములో నరులు పుణ్యకర్మలచేత జయించి బుద్ధిరూపమైన ఫలమును, పుత్రులను, ధనమును, శూరత్వమును పొందుదురు 27

మూ. ఏవం నిరయగామీ త్వం యస్య తే మతిరీదృశీ,
న త్వాం సమభిభాషిష్యేఽసద్వృత్తేష్వేష నిర్ణయః. 28

ప్ర. అ. యస్య తే = ఏ నీయొక్క, మతిః = బుద్ధి, ఈదృశీ = ఇట్టిదో, త్వమ్ = అట్టి నీవు, ఏవమ్ = ఇట్లు, నిరయగామీ = నరకమునకు వెళ్ళువాడవు. త్వామ్ = నిన్ను (నీతో), న సమభిభాషిష్యే = మాటలాడను. దుర్వృత్తేషు = చెడ్డ నడవడిక కలవారి విషయమునందు, ఏషః = ఇదే, నిర్ణయః = నిర్ణయము.

తా. ఇట్టి దుర్బుద్ధి గల నీవు నరకమునకే వెళ్ళనున్నావు. నేను నీతో మాటలాడను. చెడ్డ నడవడిక గలవారివిషయమునందు ఇదే నిర్ణయము. 28

మూ. ఏవముక్తాస్తతస్తేన తస్యామాత్యాః సమాహతాః,
మారీచప్రముఖాః సర్వే విముఖా విప్రదుద్రువుః. 29

ప్ర. అ. తేన = ఆతనిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, మారీచప్రముఖాః = మారీచుడు మొదలైన, సర్వే = సమస్తమైన, అమాత్యాః = అమాత్యులు, సమాహతాః = కొట్టబడినవారై, విముఖాః = విముఖులై, విప్రదుద్రువుః = పారిపోయిరి.

తా. మారీచుడు మొదలైన రావణుని అమాత్యు లందరితోను కూడ కుబేరుడు ఇట్లు పలికి వాళ్ళను కొట్టగా వాళ్ళు యుద్ధవిముఖులై పారిపోయిరి.

మూ. తతస్తేన దశగ్రీవో యక్షేన్ద్రేణ మహాత్మనా,
గదయాఽభిహతో మూర్ధ్ని న చ స్థానాత్ప్రకమ్పితః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాక్షసీమ్ = రాక్షససంబంధమైన, మాయామ్ = మాయను, ప్రవిష్టః = ప్రవేశించిన, అసౌ = ఈ, రాక్షసేశ్వరః = రావణుడు, వినాశాయ = కుబేరుని నాశముకొరకు, రూపాణామ్ = రూపముల యొక్క, శతసాహస్రమ్ = నూరు సహస్రములను, చకార = చేసెను.

తా. అప్పుడు రావణుడు రాక్షసమాయలో ప్రవేశించి కుబేరుని నశింప చేయుటకై ఎన్నో వేల రూపములు సృజించెను. 33

మూ. వ్యాఘ్రో వరాహో జీమూతః పర్వతః సాగరో ద్రుమః,
యక్షో దైత్యస్వరూపీ చ సోఽదృశ్యత దశాననః. 34

ప్ర. అ. సః దశాననః = ఆ రావణుడు, వ్యాఘ్రః = పెద్దపులిగాను, వరాహః = వరాహముగాను, జీమూతః = మేఘముగాను, పర్వతః = పర్వతముగాను, సాగరః = సముద్రముగాను, ద్రుమః = వృక్షముగాను, యక్షః = యక్షుడుగాను, దైత్యస్వరూపీ చ = దైత్యరూపము గలవాడుగాను, అదృశ్యత = చూడబడెను.

తా. రావణుడు పెద్దపులిగాను, వరాహముగాను, మేఘముగాను, పర్వతముగాను, సముద్రముగాను, వృక్షముగాను, యక్షుడుగాను, దైత్యుడుగాను కనబడెను. 34

మూ. బహూని చ కరోతి స్మ దృశ్యతే న త్వసౌ తతః,
ప్రతిగృహ్య తతో రామ మహదస్త్రం దశాననః, 35
జఘాన మూర్ధ్ని ధనదం వ్యావిద్ధ్య మహతీం గదామ్.

ప్ర. అ. బహూని చ = అనేకరూపములను కూడ, కరోతి స్మ = చేసెను. అసౌ తు = ఇతడైతే, న దృశ్యతే = కనబడుటలేదు. తతః = అటుపిమ్మట, రామ = రామా! దశాననః = రావణుడు, మహత్ = గొప్ప, అస్త్రమ్ = అస్త్రమైన, మహతీమ్ = గొప్ప, గదామ్ = గదను, ప్రతిగృహ్య = గ్రహించి, వ్యావిద్ధ్య = గట్టిగా ఊపి, ధనదమ్ = కుబేరుణ్ణి, మూర్ధ్ని = శిరస్సుమీద, జఘాన = కొట్టెను.

తా. రామా! రావణుడు ఇంకా అనేకరూపములు కూడ సృజించెను. తాను

తా. రావణుడు ఆ కుబేరుని జయించి, మనస్సులో సంతోషించుచు, అతని పుష్పకవిమానమును విజయచిహ్నముగా అపహరించెను. 38

మూ. కాఞ్చనస్తమ్భసంవీతం వైడూర్యమణితోరణమ్. 39
ముక్తాజాలప్రతిచ్ఛన్నం సర్వకాలఫలద్రుమమ్,
మనోజవం కామగమం కామరూపం విహంగమమ్. 40

మణికాఞ్చనసోపానం తప్తకాఞ్చనవేదికమ్,
దేవోపవాహ్యమక్షయ్యం సదాదృష్టిమనఃసుఖమ్. 41

బహ్వాశ్చర్యం భక్తిచిత్రం బ్రహ్మణా పరినిర్మితమ్,
నిర్మితం సర్వకామైస్తు మనోహరమనుత్తమమ్. 42

న తు శీతం న చోష్ణం చ సర్వర్తుసుఖదం శుభమ్,
స తం రాజా సమారుహ్య కామగం వీర్యనిర్జితమ్. 43

జితం త్రిభువనం మేనే దర్పోత్సేకాత్సుదుర్మతిః,
జిత్వా వైశ్రవణం దేవం కైలాసాత్సమవాతరత్. 44

ప్ర. అ. సుదుర్మతిః = చాల దుష్టబుద్ధి గల, సః రాజా = ఆ రాక్షస రాజు, కాఞ్చనస్తమ్భసంవీతమ్ = బంగారు స్తంభములతో కూడినది, వైడూర్యమణితోరణమ్ = వైడూర్యమణుల ముఖద్వారము గలది, ముక్తాజాలప్రతిచ్ఛన్నమ్ = ముత్యముల గుంపులచేత కప్పబడినది, సర్వకాలఫలద్రుమమ్ = సమస్తకాలములందు పండ్లు ఇచ్చు వృక్షములు గలది, మనోజవమ్ = మనస్సువంటి వేగము గలది, కామగమమ్ = ఇచ్ఛానుసారము వెళ్ళునది, కామరూపమ్ = ఇచ్ఛానుసారము రూపము గలది, విహఙ్గమమ్ = ఆకాశమునందు పోవునది, మణికాఞ్చనసోపానమ్ = మాణిక్యసువర్ణవికారమైన మెట్లు గలది, తప్తకాఞ్చనవేదికమ్ = శుద్ధమైన బంగారము వికారమైన అరుగులు గలది, దేవోపవాహ్యమ్ = దేవతలకు వాహనము, అక్షయ్యమ్ = నాశము లేనిది, సదా = ఎల్లప్పుడూ, దృష్టిమనఃసుఖమ్ = దృష్టికి మనస్సుకూ సుఖకరమూ, బహ్వాశ్చర్యమ్ = చాల ఆశ్చర్యకరము, భక్తిచిత్రమ్ = నగిషీలచేత చిత్రముగా ఉన్నదీ, బ్రహ్మణా = బ్రహ్మచేత, పరినిర్మితమ్ = నిర్మింపబడినది, సర్వకామైః = సమస్తకామములతో, నిర్మితమ్ =

ప్ర. అ. ప్రతాపవాన్ = ప్రతాపము గలవాడు, విమలకిరీటహారవాన్ = నిర్మలమైన కిరీటము హారములు కలవాడు అయిన, సః నిశాచరః = ఆ రాక్షసుడు, తేజసా = తేజస్సుచేత, విపులమ్ = అధికమైన, జయమ్ = ఆ జయమును, అవాప్య = పొంది, తం పరమవిమానమ్ = ఆ గొప్ప విమానమును, ఆస్థితః = అధిష్ఠించినవాడై, సదసి = యజ్ఞసదస్సునందు, గతః = ఉన్న, అనలః యథా = అగ్ని వలె, రరాజ వై = ప్రకాశించెను.

తా. నిర్మలములైన కిరీటము, హారములు ధరించిన ప్రతాపవంతుడైన ఆ రావణుడు తేజస్సుచేత గొప్ప విజయమును పొంది, ఆ గొప్ప విమానమును అధిష్ఠించి, యజ్ఞశాలలో ఉన్న అగ్ని వలె ప్రకాశించెను. 41

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో పదునైదవ సర్గ సమాప్తము.

ప్ర. అ. రామ = రామా ! సః = అతడు, రమ్యవనాన్తరమ్ = సుందరములైన వనమధ్యప్రదేశములు గల, కం చిత్ = ఒకానొక, పర్వతమ్ = పర్వతమును, సమారుహ్య = ఎక్కి, తదా = అప్పుడు, తత్ర = అక్కడ, విష్టమ్భితమ్ = కదలకుండ చేయబడిన, పుష్పకమ్ = పుష్పకమును, అపశ్యత్ = చూచెను.

తా. రామా! అతడు రమ్యములైన వనమధ్యప్రదేశములు గల ఒక పర్వతము నెక్కెను. అప్పుడు తన పుష్పకము అక్కడ కదలకుండా నిలచిపోవుట చూచెను.

3

మూ. విష్టబ్ధం పుష్పకం దృష్ట్వా హ్యాగమం కామగం కృతమ్,
అచిన్తయద్రాక్షసేన్ద్రః సచివైః స్తైః సమావృతః. 4

ప్ర. అ. సచివైః = మంత్రులతో, సమావృతః = కూడిన, రాక్షసేన్ద్రః = రావణుడు, కామగమ్ = ఇచ్ఛానుసారము వెళ్లు, పుష్పకమ్ = పుష్పకమును, అగమమ్ = వెళ్లనిదిగా, కృతమ్ = చేయబడినదిగాను, విష్టబ్ధమ్ = నిలచిపోయినదానినిగాను, దృష్ట్వా = చూచి, అచిన్తయత్ = ఆలోచించెను.

తా. స్వేచ్ఛగా సంచరించు ఆ పుష్పకము ముందుకు వెళ్లకుండ చేయబడినదై కదలకుండా నిలచిపోవుటను చూచి రావణుడు మంత్రులతో కలిసి ఆలోచించెను.

4

మూ. కింనిమిత్తం చేచ్ఛయా మే నేదం గచ్ఛతి పుష్పకమ్,
పర్వతస్యోపరిష్ఠస్య కర్మేదం కస్య చిద్భవేత్. 5

ప్ర. అ ఇదం పుష్పకమ్ = ఈ పుష్పకము, మే = నాయొక్క, ఇచ్ఛయా = ఇచ్ఛచేత, న గచ్ఛతి = వెళ్ళుట లేదు. నిమిత్తమ్ = కారణము, కిమ్ = ఏమి? ఇదమ్ = ఇది, పర్వతస్య = పర్వతముయొక్క, ఉపరిష్ఠస్య = పైన ఉన్న, కస్య చిత్ = ఎవనియొక్కయో, కర్మ = పని, భవేత్ = అయి ఉండును.

తా. ఈ పుష్పకము నా ఇచ్ఛ ప్రకారము నడుచుటలేదు. కారణము ఏమై ఉండును? ఇది పర్వతముమీద ఉన్న ఎవని పనియో అయి ఉండును. 5

మూ. తతోఽబ్రవీత్తదా రామ మారీచో బుద్ధికోవిదః,
నేదం నిష్కారణం రాజన్ పుష్పకం యన్న గచ్ఛతి. 6

న్తమ్ = రావణుని గూర్చి, ఇదమ్ = ఈ, వచః చ = వచనమును కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. అతని మాట పూర్తికాకుండగానే, ఇంతలో శివుని అనుచరుడు, నిత్యానందవంతుడు అయిన నందీశ్వరుడు నిర్భయముగా రావణునివద్దకు వచ్చి ఇట్లు చెప్పెను. ధూసరవర్ణములో ఉన్న అతడు ముండితశిరస్కుడై పొట్టిగా, వికృతముగా, భయంకరుడుగా ఉండెను. బలవంతుడైన అతని భుజములు పొట్టిగా ఉండెను. 8, 9

మూ. నివర్తస్వ దశగ్రీవ శైలే క్రీడతి శంకరః,
సుపర్ణనాగయక్షాణాం దేవగన్ధర్వరక్షసామ్. 10

సర్వేషామేవ భూతానామగమ్యః పర్వతః కృతః,
తన్నివర్తస్వ దుర్బుద్ధే మా వినాశమవాప్స్యసి. 11

ప్ర. అ. దశగ్రీవ = రావణా! నివర్తస్వ = మరలుము, శైలే = పర్వతము మీద, శంకరః = శివుడు, క్రీడతి = క్రీడించుచున్నాడు. పర్వతః = పర్వతము, సుపర్ణనాగయక్షాణామ్ = పక్షులకు, నాగులకు, యక్షులకు, దేవగన్ధర్వరక్షసామ్ = దేవతలకు, గంధర్వులకు, రాక్షసులకు, సర్వేషామ్ = సమస్తమైన, భూతానామ్ = ప్రాణులకు, అగమ్యః = పొంద శక్యము కానిదిగా, కృతః = చేయబడినది. దుర్బుద్ధే = ఓ! చెడ్డబుద్ధి గలవాడా! తత్ = ఆ కారణమువలన, నివర్తస్వ = మరలుము. వినాశమ్ = నాశమును, మా అవాప్స్యసి = పొందకుండెదవుగాక.

తా. రావణా! వెనుకకు మరలి పొమ్ము. పర్వతముమీద శంకరుడు క్రీడించుచున్నాడు. పక్షులు, నాగులు, యక్షులు, దేవతలు, గంధర్వులు, రాక్షసులు, ఏ ఇతర భూతములూ, (ప్రాణులూ) కూడ ఈ పర్వతముమీదికి రాకూడదని శాసింపబడినది. అందువలన, ఓ! దుర్బుద్ధీ! వెనుకకు మరలుము. లేకున్నచో నశించగలవు. 10, 11

మూ. ఇతి నన్దివచః శ్రుత్వా క్రోధాత్కమ్పితకుణ్డలః,
రోషాత్తు తామ్రనయనః పుష్పకాదవరుహ్య సః. 12
కోఽయం శంకర ఇత్యుక్త్వా శైలమూలముపాగతః.

మూ. తం క్రుద్ధో భగవాన్నన్దీ శంకరస్యాపరా తనుః, 15
అబ్రవీత్తత్ర తద్రక్షో దశాననముపస్థితమ్.

ప్ర. అ. శంకరస్య = శంకరునియొక్క, అపరా = మరియొక, తనుః = శరీరమైన, భగవాన్ = పూజ్యుడైన, నన్దీ = నంది, తత్ర = అక్కడ, ఉపస్థితమ్ = వచ్చి ఉన్న, తం దశాననమ్ = ఆ రావణుని గూర్చి, క్రుద్ధః = కోపించినవాడై, తత్ రక్షః = ఆ రాక్షసుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. శంకరుని రెండవ రూపమువంటివాడైన పూజ్యుడైన ఆ నందీశ్వరుడు కోపించి, అక్కడకు వచ్చిన ఆ రావణునితో ఇట్లు పలికెను. 15

మూ. యస్మాద్వానరరూపం మామవజ్ఞాయ దశానన, 16
అశనీపాతసంకాశమపహాసం ప్రముక్తవాన్,
తస్మాన్మద్రూపసంపన్నా మద్వీర్యసమతేజసః. 17
ఉత్పత్స్యన్తి వధార్థం హి కులస్య తవ వానరాః.

ప్ర. అ. దశానన = రావణా! యస్మాత్ = ఏ కారణమువలన, వానర రూపమ్ = వానరునివంటి రూపము గల, మామ్ = నన్ను, అవజ్ఞాయ = అనాదరముచేసి, అశనీపాతసంకాశమ్ = వజ్రపాతముతో సమానమైన, అపహాసమ్ = నవ్వును, ప్రముక్తవాన్ = ప్రయోగించినావో, తస్మాత్ = ఆకారణమువలన, మద్రూపసంపన్నాః = నా రూపము వంటి రూపముతో కూడిన, మద్వీర్యసమతేజసః = నా పరాక్రమముతో సమానమైన తేజస్సు గల, వానరాః = వానరులు, తవ = నీయొక్క, కులస్య = కులముయొక్క, వధార్థమ్ = వధకొరకు, ఉత్పత్స్యన్తి = పుట్టగలరు.

తా. ఓ రావణా! నా వానరరూపము వంటి రూపమును చూచి, నన్ను అవమానించుచు పిడుగు వలె ధ్వని చేయుచు నవ్వినావు. అందుచేత నావంటి రూపము, నాతో సమానమైన పరాక్రమము గల వానరులు నీ కులమును నశింపచేయుటకై పుట్టగలరు. 16, 17

మూ. నఖదంష్ట్రాయుధాః క్రూర మనఃసంపాతరంహసః, 18
యుద్ధోన్మత్తా బలోద్రిక్తాః శైలా ఇవ విసర్పిణః,

ఇతి = ఇట్లు, ఉదీరితవాక్యే = పలకబడిన వాక్యము కలవాడగుచుండగా, దేవదున్దుభయః = దేవతల దుందుభులు, నేదుః = ధ్వని చేసినవి. ఖాత్ = ఆకాశమునుండి, పుష్పవృష్టిశ్చ = పుష్పవర్షము కూడ, చ్యుతా = జారినది.

తా. మహాత్ముడైన ఆ నందీశ్వరుడు ఇట్లు పలకగానే దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశమునుండి పుష్పవర్షము కూడ పడినది. 21

మూ. అచిన్తయిత్వా స తదా నన్దివాక్యం మహాబలః, 22
పర్వతం తు సమాసాద్య వాక్యమాహ దశాననః.

ప్ర. అ. తదా = అప్పుడు, మహాబలః = గొప్ప బలము గల, సః దశాననః = ఆ రావణుడు, నన్దివాక్యమ్ = నంది మాటను, అచిన్తయిత్వా = ఆలోచించక, పర్వతం తు = పర్వతమును, సమాసాద్య = పొంది, వాక్యమ్ = వాక్యమును, ఆహ = పలికెను.

తా. అప్పుడు గొప్ప బలము గల దశాననుడు నంది మాటలను లెక్క చేయక పర్వతమును సమీపించి ఇట్లు పలికెను. 22

మూ. పుష్పకస్య గతిశ్ఛిన్నా యత్కృతే మమ గచ్ఛతః, 23
త మిమం శైలమున్మూలం కరోమి తవ గోపతే.

ప్ర. అ. గోపతే = ఈశ్వరుడా ! యత్కృతే = దేని మూలమున, గచ్ఛతః = వెళ్ళుచున్న, మమ = నాయొక్క, పుష్పకస్య = పుష్పకముయొక్క, గతిః = గమనము, ఛిన్నా = ఛేదించబడినదో, తవ = నీయొక్క, ఇమమ్ = ఈ, తం శైలమ్ = ఆ పర్వతమును, ఉన్మూలమ్ = పెకలించబడినదానినిగా, కరోమి = చేయుచున్నాను.

తా. ఈశ్వరుడా ! నేను వెళ్లుచుండగా దేని మూలమున నా పుష్పకము నడక ఆగిపోయినదో అట్టి ఈ నీ పర్వతమును పెకలించివేసెదను. 23

మూ. కేన ప్రభావేణ భవో నిత్యం క్రీడతి రాజవత్, 24
విజ్ఞాతవ్యం న జానీతే భయస్థానముపస్థితమ్.

ప్ర. అ. భవః = ఈశ్వరుడు, కేన ప్రభావేణ = ఏ ప్రభావముచేత, నిత్యమ్

ప్రవరః = శ్రేష్ఠుడు, హరః = పాపములను హరించువాడూ అయిన, మహాదేవః = మహేశ్వరుడు, తం శైలమ్ = ఆ పర్వతమును, లీలయా = విలాసచేత, పాదాఙ్గుష్ఠేన = కాలి బొటనవ్రేలితో, పీడయామాస = పీడించెను.

తా. రామా! అప్పుడు, దేవతలలో శ్రేష్ఠుడు, సకల పాపహరుడు అయిన మహేశ్వరుడు కాలి బొటనవ్రేలితో, అనాయాసముగా ఆ పర్వతమును నొక్కెను.

మూ. పీడితాస్తు తతస్తస్య శైలస్యాధోగతా భుజాః, 28
విస్మితాశ్చాభవంస్తత్ర సచివాస్తస్య రక్షసః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, శైలస్య=పర్వతముయొక్క, అధోగతాః= క్రింద ఉన్న, తస్య భుజాః = వాని భుజములు, పీడితాః తు = పీడింపబడినవి, తత్ర = అక్కడ, తస్య రక్షసః = ఆ రాక్షసునియొక్క, సచివాః = మంత్రులు, విస్మితాః చ = ఆశ్చర్యము చెందినవారు, అభవన్ = అయిరి.

తా. అప్పుడు ఆ పర్వతము క్రింద పడి అతని చేతులు నలిగిపోయినవి. అక్కడ ఉన్న ఆతని సచివులు ఆశ్చర్యపడిరి. 28

మూ. రక్షసా తేన రోషాచ్చ భుజానాం పీడనాత్తదా, 29
ముక్తో విరావః సహసా త్రైలోక్యం యేన కమ్పితమ్.

ప్ర. అ. తేన రక్షసా = ఆ రాక్షసునిచేత, రోషాచ్చ = కోపమువలనా, తథా = మరియు, భుజానామ్ = భుజములయొక్క, పీడనాత్ = పీడనమువలనా, సహసా = వెంటనే, విరావః = ధ్వని, ముక్తః = విడవబడినది, యేన = దేనిచేత, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, కమ్పితమ్ = కంపింపబడినదో.

తా. అప్పుడు ఆ రాక్షసుడు రోషమువలనా, భుజములు నలిగిపోవుట వలనా వెంటనే బిగ్గరగా అరచెను. దానితో మూడులోకములు అదరిపోయెను. 29

మూ. మేనిరే వజ్రనిష్పేషం తస్యామాత్యా యుగక్షయే, 30
తదా వర్త్మసు చలితా దేవా ఇన్ద్రపురోగమాః.

ప్ర. అ. తస్య = వానియొక్క, అమాత్యాః = మంత్రులు, యుగక్షయే = యుగాంతమునందు, వజ్రనిష్పేషమ్ = వజ్రమువలన కలిగిన నలుగుటనుగా,

పెట్టుము. ఈ విషయమున రక్షించగలవాడు అతడు తప్ప మరెవ్వడూ మాకు కనబడుటలేదు." 32, 33

మూ. స్తుతిభిః ప్రణతో భూత్వా తమేవ శరణం వ్రజ,
కృపాలుః శఙ్కరస్తుష్టః ప్రసాదం తే విధాస్యతి. 34

ప్ర. అ. స్తుతిభిః = స్తోత్రములతో, ప్రణతః = వంగినవాడవు, భూత్వా = అయి, తమేవ = ఆ మహాదేవుణ్ణే, శరణమ్ = శరణమునుగా, వ్రజ = పొందుము. కృపాలుః = కృపగల, శంకరః = శంకరుడు, తుష్టః = సంతోషించినవాడై, తే = నీకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కరిష్యతి = చేయగలడు.

తా. నీవు స్తుతించుచు నమస్కరించి ఆ మహాదేవుణ్ణే శరణుపొందుము. దయాశాలియైన ఆ శంకరుడు సంతోషించి నిన్ను అనుగ్రహించగలడు. 34

మూ. ఏవముక్తస్తదామాత్యైస్తుష్టావ వృషభధ్వజమ్,
సామభిర్వివిధైః స్తోత్రైః ప్రణమ్య స దశాననః. 35

ప్ర. అ. తదా = అప్పుడు, అమాత్యైః = మంత్రులచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః దశాననః = ఆ దశాననుడు, ప్రణమ్య = నమస్కరించి, సామభిః = సామలచేతను, వివిధైః = అనేకవిధములైన, స్తోత్రైః = స్తోత్రముల చేతను, వృషభధ్వజమ్ = పరమేశ్వరుణ్ణి, తుష్టావ = స్తుతించెను.

తా. అమాత్యుల మాటలు విని దశాననుడు ఆ శివునకు నమస్కరించి, సామలచేతను, అనేకవిధములైన స్తోత్రములచేతను ఆయనను స్తుతించెను. 35

మూ. సంవత్సరసహస్రం తు రుదతో రక్షసో గతమ్,
తతః ప్రీతో మహాదేవః శైలాగ్రే విష్ఠితః ప్రభుః, 36
ముక్త్వా చాస్య భుజాన్ రామ ప్రాహ వాక్యం దశాననమ్.

ప్ర. అ. రక్షసః = ఆ రాక్షసుడు, రుదతః = ఏడ్చుచుండగా, సంవత్సర సహస్రమ్ = వేయి సంవత్సరముల కాలము, గతమ్ = వెళ్ళినది. రామ = రామా! తతః = అటు పిమ్మట, శైలాగ్రే = పర్వతశిఖరమునందు, విష్ఠితః = నిలచిన, ప్రభుః = సర్వసమర్థుడైన, మహాదేవః = మహాదేవుడు, ప్రీతః = సంతోషించిన

వారందరూ, త్వామ్ = నిన్ను, ఏవమ్ = ఇట్లు, లోకరావణమ్ = లోకములను ఏడ్పించిన, రావణమ్ = రావణునిగా, అభిధాస్యన్తి = చెప్పగలరు.

తా. దేవతలు, మానవులు, యక్షులు, భూమిమీద ఉన్న ఇతరులు నిన్ను ఈ విధముగా లోకమును ఏడ్పించిన రావణుణ్ణిగా చెప్పుచుందురు. 39

మూ. గచ్ఛ పౌలస్త్య విస్రబ్ధం పథా యేన త్వమిచ్ఛసి, 40
మయా చైవాభ్యనుజ్ఞాతో రాక్షసాధిప గమ్యతామ్.

ప్ర. అ. పౌలస్త్య = రావణా ! త్వమ్ = నీవు, యేన పథా = ఏ మార్గముచేత, ఇచ్ఛసి = కోరుచున్నావో ఆ మార్గముచేత, విస్రబ్ధమ్ = నమ్మకముగా, గచ్ఛ = వెళ్ళుము. రాక్షసాధిప = రాక్షసరాజా, మయా = నాచేత, అభ్యనుజ్ఞాతః = అనుమతింపబడితివి; గమ్యతామ్ = వెళ్ళుము.

తా. రావణా ! నీవు ఏ మార్గమున వెళ్ళవలె నని కోరుకొనుచున్నావో ఆ మార్గమున నిర్భయముగా వెళ్ళుము. రాక్షసరాజా ! నేను అనుజ్ఞ ఇచ్చుచున్నాను, వెళ్ళుము. 40

మూ. ఏవముక్తస్తు లఙ్కేశః శంభునా స్వయమబ్రవీత్, 41
ప్రీతో యది మహాదేవ వరం మే దేహి యాచతః.

ప్ర. అ. శంభునా = ఈశ్వరునిచేత, స్వయమ్ = స్వయముగా, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లఙ్కేశః = రావణుడు, అబ్రవీత్ = పలికెను. మహాదేవ = ఓ ! మహాదేవా ! ప్రీతః యది = సంతోషించినట్లయితే, యాచతః = కోరుచున్న, మే = నాకు, వరమ్ = వరమును, దేహి = ఇమ్ము.

తా. మహేశ్వరుడు స్వయముగా పలికిన మాటలు విని రావణుడు ఇట్లు అనెను. "మహాదేవా ! నీవు అనుగ్రహించినట్లయితే యాచించుచున్న నాకు ఒక వరము ఇమ్ము. 41

మూ. అవధ్యత్వం మయా ప్రాప్తం దేవగన్ధర్వదానవైః, 42
రాక్షసైర్గుహ్యకైర్నాగైర్యే చాన్యే బలవత్తరాః.

ప్ర. అ. దేవగన్ధర్వదానవైః = దేవతలచేతా, గంధర్వులచేతా, దానవుల

|ప. అ. తేన రావణేన = ఆ రావణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః=పలకబడిన, సః శఙ్కరః = ఆ శంకరుడు, చన్ద్రహాసమితి = చం|ద్రహాసము అని, |శుతమ్ = |పసిద్ధమైన, మహాదీప్తమ్ = గొప్ప కాంతి గల, ఖడ్గమ్ = ఖడ్గమును, దదౌ = ఇచ్చెను. తదా = అప్పుడు, భూతపతిః = ఈశ్వరుడు, ఆయుషః = ఆయుస్సుయొక్క. శేషం చ = శేషమును కూడ, దదౌ = ఇచ్చెను.

తా. అప్పుడు రావణుడు అట్లు కోరగా శంకరుడు ఆతనికి చం|ద్రహాసమని |పసిద్ధి పొందిన గొప్ప కాంతి గల ఖడ్గమును, ఆయుర్దాయశేషమును, అనగా ఆతడు చేయు పాపకృత్యములకు ఫలితముగా అకాలమృత్యువు రాకుండునట్లు వరమును ఇచ్చెను. 45

మూ. దత్త్వోవాచ తతః శమ్భుర్నావజ్ఞేయమిదం త్వయా, 46
అవజ్ఞాతం యది హి తే మామేవైష్యత్యసంశయః.

|ప. అ. శమ్భుః = ఈశ్వరుడు, దత్త్వా = ఇచ్చి, తతః = అటుపిమ్మట, ఉవాచ = పలికెను. ఇదమ్ = ఈ ఖడ్గము, త్వయా = నీచేత, నావజ్ఞేయమ్ = అనాదరింపదగినదికాదు. తే = నీకు (నీచేత) అవజ్ఞాతం యది = అవమానించబడినట్లయితే, మామేవ = నన్నే, ఏష్యతి = పొందగలదు. అసంశయః = సంశయము లేదు.

తా. శివుడు ఆ ఖడ్గమును ఇచ్చి-"నీవు దీనిని అవమానించకూడదు. అవమానించినట్లైతే ఇది మరల నా దగ్గరికి వచ్చివేయును; సందేహము లేదు"అని పలికెను. 46

వి. 41-46½ శ్లోకాలు |ప్రాచ్య|ప్రతిలో లేవు.

మూ. ఏవం మహేశ్వరేణైవ కృతనామా స రావణః, 47
అభివాద్య మహాదేవమారురోహాథ పుష్పకమ్.

|ప. అ. ఏవమ్=ఇట్లు, మహేశ్వరేణైవ=మహేశ్వరునిచేతనే, కృతనామా = చేయబడిన పేరుగల, సః = ఆ, రావణః = రావణుడు, మహాదేవమ్ = మహేశ్వరుణ్ణి, అభివాద్య = నమస్కరించి, అథ = అటుపిమ్మట, పుష్పకమ్ = పుష్పకమును, ఆరురోహ = ఎక్కెను.

జానన్తః=ఎగిరినవారై, బలదర్పితమ్=బలముచేత గర్వించి ఉన్న, రాక్షసమ్=ఆ రాక్షసుణ్ణి గూర్చి, జితాః స్మః=జయించబడినాము, ఇతి=అని, అభాషన్త=పలికిరి.

తా. బుద్ధిమంతులైన మరి కొందరు క్షత్రియులు ఈ రాక్షసుణ్ణి జయించుట కష్టమని గ్రహించి, బలముచేత దృప్తుడై ఉన్న అతనితో "మేము ఓడిపోయినాము" అని పలికిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో పదహారవ సర్గ సమాప్తము.

మూ. స దృష్ట్వా రూపసంపన్నాం కన్యాం తాం సుమహావ్రతామ్,
కామమోహపరీతాత్మా పప్రచ్ఛ ప్రహసన్నివ. 3

ప్ర. అ. రూపసంపన్నామ్=రూపముతో కూడిన, సుమహావ్రతామ్=చాల గొప్ప వ్రతము గల, తాం కన్యామ్=ఆ కన్యను, దృష్ట్వా=చూచి, సః=అతడు, కామమోహపరీతాత్మా = కామమోహములతో నిండిన మనస్సు గలవాడై, ప్రహసన్నివ = నవ్వుచు, పప్రచ్ఛ = అడిగెను.

తా. ఆ రావణుడు గొప్ప నియమమును అవలంబించి ఉన్న మంచి సౌందర్యముగల, ఆ కన్యను చూడగానే కామమోహములతో నిండిన మనస్సుతో నవ్వుచు ఇట్లు పలికెను. 3

మూ. కిమిదం వర్తసే భద్రే విరుద్ధం యౌవనస్య తే,
న హి యుక్తా తవైతస్య రూపస్యేదం ప్రతిక్రియా. 4

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా ! తే = నీయొక్క, యౌవనస్య = యౌవనమునకు, విరుద్ధమ్ = విరుద్ధముగా, వర్తసే = ప్రవర్తించుచున్నావు; ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి ? తవ=నీయొక్క, ఏతస్య రూపస్య= ఈ రూపమునకు, ఇదంప్రతిక్రియా = ఈ విరుద్ధమైన క్రియ, న యుక్తా హి = యుక్తము కాదు కదా.

తా. ''మంగళప్రదురాలా ! ఏమిది! నీవు నీ యౌవనమునకు విరుద్ధముగా ప్రవర్తించుచున్నావు? నీ ఈ సౌందర్యమునకు విరుద్ధముగా ఇట్టి ప్రవర్తన యుక్తము కాదు కదా ?" 4

మూ. రూపం తేఽనుపమం భీరు కామోన్మాదకరం నృణామ్,
న యుక్తం తపసి స్థాతుం నిర్గతో హ్యేష నిర్ణయః. 5

ప్ర. అ. భీరు = భయస్వభావము గలదానా ! తే = నీయొక్క, అనుపమమ్ = సాటిలేని, రూపమ్ = రూపము, నృణామ్ = మానవులకు, కామోన్మాదకరమ్ = కామోన్మాదమును కలిగించునది, తపసి = తపస్సునందు, స్థాతుమ్ = ఉండుటకు, న యుక్తమ్ = యుక్తము కాదు. ఏషః = ఈ, నిర్ణయః = నిర్ణయము, నిర్గతః హి = ప్రసిద్ధము కదా ?

మూ. కుశధ్వజో నామ పితా బ్రహ్మర్షిరమితప్రభః, 8
బృహస్పతిసుతః శ్రీమాన్ బుద్ధ్యా తుల్యో బృహస్పతేః.

ప్ర. అ. అమితప్రభః = గొప్ప కాంతి గలవాడు, బృహస్పతిసుతః = బృహస్పతి కుమారుడు, శ్రీమాన్ = శోభాయుక్తుడు, బుద్ధ్యా = బుద్ధిచేత, బృహస్పతేః = బృహస్పతికి, తుల్యః = సమానుడు అయిన, కుశధ్వజో నామ = కుశధ్వజు డను, బ్రహ్మర్షిః = బ్రహ్మర్షి, పితా = నా తండ్రి.

తా. గొప్ప తేజస్సు గలవాడు, బృహస్పతి కుమారుడు, బుద్ధిచేత బృహస్పతితో సమానుడు, శోభావంతుడు అయిన కుశధ్వజు డనే బ్రహ్మర్షి నా తండ్రి.

మూ. తస్యాహం కుర్వతో నిత్యం వేదాభ్యాసం మహాత్మనః,
సంభూతా వాఙ్మయీ కన్యా నామ్నా వేదవతీ స్మృతా.

ప్ర. అ. నిత్యమ్ = నిత్యమూ, వేదాభ్యాసమ్ = వేదాభ్యాసమును, కుర్వతః = చేయుచున్న, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆతనికి, అహమ్ = నేను, వాఙ్మయీ = వేదవాఙ్మయురాలైన, కన్యా = కన్యనుగా, సంభూతా = పుట్టితిని. నామ్నా = పేరుచేత, వేదవతీ = వేదవతిగా, స్మృతా = చెప్పబడితిని.

తా. నిత్యమూ వేదాభ్యాసము చేయు ఆ మహాత్మునకు వేదవాఙ్మయ స్వరూపిణినైన నేను కన్యగా పుట్టినాను. నా పేరు వేదవతి. 9

మూ. తతో దేవాః సగన్ధర్వా యక్షరాక్షసపన్నగాః,
తే చాపి గత్వా పితరం వరణం రోచయన్తి మే. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, తే = ఆ, యక్షరాక్షసపన్నగాః చాపి = యక్షులు, రాక్షసులు, పన్నగులు కూడ, పితరమ్ = తండ్రిని గూర్చి, గత్వా = వెళ్ళి, మే = నాయొక్క, వరణమ్ = వరణమును గూర్చి, రోచయన్తి = ఇష్టపడిరి.

తా. అప్పుడు దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు నా తండ్రి దగ్గరకు వెళ్ళి తమకు నన్ను ఇమ్మని కోరిరి. 10

మూ. తతో మే జననీ దీనా తచ్ఛరీరం పితుర్మమ,
పరిష్వజ్య మహాభాగా ప్రవిష్టా హవ్యవాహనమ్. 14

ప్ర. అ. తతః = అటు పిమ్మట, మహాభాగా = మహాభాగ్యవంతురాలైన, మే జననీ = నా తల్లి, దీనా = దీనురాలై, మమ పితుః = నా తండ్రియొక్క, తత్ = ఆ, శరీరమ్ = శరీరమును, పరిష్వజ్య = కౌగలించుకొని, హవ్యవాహనమ్ = అగ్నిని, ప్రవిష్టా = ప్రవేశించినది.

తా. పిమ్మట మహాభాగ్యవంతురాలైన నా తల్లి దీనురాలై నా తండ్రి శరీరమును కౌగలించుకొని అగ్నిలో ప్రవేశించినది. 14

మూ. తతో మనోరథం సత్యం పితుర్నారాయణం ప్రతి,
కరోమీతి తమేవాహం హృదయేన సముద్వహే. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అహమ్ = నేను, నారాయణం ప్రతి = విష్ణువును గూర్చి, పితుః = తండ్రియొక్క, మనోరథమ్ = మనోరథమును, సత్యమ్ = సత్యమైనదానినిగా, కరోమీతి = చేయుదును అని, తమేవ = ఆ నారాయణునే, హృదయేన = హృదయముచేత, సముద్వహే = వహించు చున్నాను.

తా. నారాయణుణ్ణి గూర్చి మా తండ్రికి ఉన్న మనోరథమును సత్యమైన దానినిగా చేయవలె నని నిశ్చయించుకొని నేను ఆ నారాయణుణ్ణే హృదయములో ఉంచుకొని ఉన్నాను. 15

మూ. ఇతి ప్రతిజ్ఞామారుహ్య చరామి విపులం తపః,
ఏతత్తే సర్వమాఖ్యాతం మయా రాక్షసపుంగవ. 16

ప్ర. అ. ఇతి = ఇట్లు, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, ఆరుహ్య = అధిష్ఠించి, విపులమ్ = అధికమైన, తపః = తపస్సును, చరామి = ఆచరించుచున్నాను. రాక్షసపుంగవ = రాక్షసశ్రేష్ఠుడా ! మయా = నాచేత, ఏతత్ = ఈ, సర్వమ్ = అంతా, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. ఈ విధముగా ప్రతిజ్ఞ చేసి గొప్ప తపస్సు చేయుచున్నాను. రాక్షస శ్రేష్ఠుడా ! ఈ విషయ మంతా నీకు చెప్పినాను. 16

తా. మన్మథశరములచేత పీడింపబడిన ఆ రావణుడు విమానాగ్రభాగము నుండి దిగి, గొప్ప తపస్సు చేయుచున్న ఆ కన్యతో మరల ఇట్లనెను. 19

మూ. అవలిప్తాసి సుశ్రోణి యస్యాస్తే మతిరీదృశీ,
వృద్ధానాం మృగశాబాక్షి భ్రాజతే పుణ్యసంచయః. 20

ప్ర. అ. సుశ్రోణి = అందమైన పిరుదులు గలదానా ! యస్యాః = ఏ, తే = నీయొక్క, మతిః = బుద్ధి, ఈదృశీ = ఈ విధముగా ఉన్నదో (అట్టి నీవు), అవలిప్తా = గర్వించినదానవు, అసి = అయి ఉన్నావు. మృగశాబాక్షి = లేడిపిల్ల నేత్రములవంటి నేత్రములు గలదానా ! పుణ్యసంచయః = పుణ్యమును ప్రోగు చేయుట, వృద్ధానామ్ = ముసలివాళ్ళకు, శోభతే = శోభించును.

తా. ఓ ! సుశ్రోణీ ! ఇట్టి ఆలోచన గల నీవు గర్వముతో ఉన్నావు. ఓ ! బాలమృగనయనా ! ఈ విధముగా తపస్సు చేయుట అనునది ముసలివాళ్ళకు మాత్రమే తగిన పని. 20

మూ. త్వం సర్వగుణసంపన్నా నార్హసే వక్తుమీదృశమ్,
త్రైలోక్యసున్దరీ భీరు యౌవనం తేఽతివర్తతే. 21

ప్ర. అ. భీరు = భయస్వభావముగలదానా ! త్వమ్ = నీవు, సర్వగుణ సంపన్నా = సమస్తగుణములతో కూడినదానవు. త్రైలోక్యసున్దరీ = మూడు లోకముల సముదాయమునందూ సుందరివి. ఈదృశమ్ = ఈ విధమైన వాక్యమును, వక్తుమ్ = చెప్పుటకు, నార్హసే = తగవు. తే = నీయొక్క, యౌవనమ్ = యౌవనము, అతివర్తతే = దాటిపోవుచున్నది.

తా. భయస్వభావముగలదానా! సమస్తసద్గుణములు ఉన్నదానవు. మూడు లోకములలో సుందరివి అయిన నీవు ఇట్లు పలుకుట తగదు. నీ యౌవనము దాటి పోవుచున్నది. 21

మూ. అహం లఙ్కాపతిర్భద్రే దశగ్రీవ ఇతి శ్రుతః,
తస్య మే భవ భార్యా త్వం భుఙ్క్ష్వ భోగాన్యథాసుఖమ్.

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా ! అహమ్ = నేను, లఙ్కాపతిః = లంకాధిపతిని. దశగ్రీవః ఇతి = దశగ్రీవుడు అని, శ్రుతః = ప్రసిద్ధుడను. త్వమ్

మూ. త్రైలోక్యాధిపతిం విష్ణుం సర్వలోకనమస్కృతమ్,
త్వదృతే రాక్షసేన్ద్రాన్యః కోఽవమన్యేత బుద్ధిమాన్. 25

ప్ర. అ. రాక్షసేన్ద్ర = రాక్షసరాజా ! త్వదృతే = నీవు తప్ప, బుద్ధిమాన్ = బుద్ధిమంతుడైన, అన్యః = మరొకడు, కః = ఎవడు, త్రైలోక్యాధిపతిమ్ = మూడు లోకముల అధిపతి, సర్వలోకనమస్కృతమ్ = సమస్తలోకములచేత నమస్కరించబడినవాడు అయిన, విష్ణుమ్ = విష్ణువును, అవమన్యేత = అవమానించును ?

తా. రాక్షసరాజా ! నీవు తప్ప బుద్ధిమంతుడైన మరెవ్వడైనా, మూడు లోకముల అధిపతీ, సర్వలోకములచేత నమస్కరింపబడేవాడూ అయిన విష్ణువును అవమానించునా ? 25

మూ. ఏవముక్తస్తయా తత్ర వేదవత్యా నిశాచరః,
మూర్ధజేషు తదా కన్యాం కరాగ్రేణ పరామృశత్. 26

ప్ర. అ. తత్ర = అక్కడ, తయా = ఆ, వేదవత్యా = వేదవతిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, నిశాచరః = రాక్షసుడు, తదా = అప్పుడు, కన్యామ్ = ఆ కన్యను, కరాగ్రేణ = హస్తాగ్రముచేత, మూర్ధజేషు = కేశములయందు, పరామృశత్ = స్పృశించెను.

తా. ఆ వేదవతి అట్లు చెప్పుచుండగా రావణుడు హస్తాగ్రముతో ఆమె శిరోజములను పట్టుకొనెను. 26

మూ. తతో వేదవతీ క్రుద్ధా కేశాన్ హస్తేన సాచ్ఛినత్,
అసిర్భూత్వా కరస్తస్యాః కేశాంశ్ఛిన్నాంస్తదాకరోత్. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సా = ఆ, వేదవతీ = వేదవతి, క్రుద్ధా = కోపించినదై, హస్తేన = హస్తముచేత, కేశాన్ = కేశములను, అచ్ఛినత్ = ఛేదించెను. తదా = అప్పుడు, తస్యాః = ఆమెయొక్క, కరః = హస్తము, అసిః = కత్తిగా, భూత్వా = అయి, కేశాన్ = కేశములను, ఛిన్నాన్ = ఛేదింపబడినవాటినిగా, అకరోత్ = చేసెను.

తా. పాపాత్ముడవైన నీవు నన్ను వనములో అవమానించినావు. అందు వలన నిన్ను చంపుటకై నేను మరల జన్మించెదను. 30

మూ. న హి శక్యః స్త్రియా హన్తుం పురుషః పాపనిశ్చయః,
శాపే త్వయి మయోత్సృష్టే తపసశ్చ వ్యయో భవేత్. 31

ప్ర. అ. పాపనిశ్చయః = పాపమైన నిశ్చయము గల, పురుషః = పురుషుడు, స్త్రియా = స్త్రీచేత, హన్తుమ్ = చంపుటకు, న శక్యః హి = శక్యమైనవాడు కాడు కదా ? త్వయి = నీయందు, శాపే = శాపము, మయా = నాచేత, ఉత్సృష్టే = విడవబడినదగుచుండగా, తపసః = తపస్సుయొక్క, వ్యయశ్చ = వ్యయము కూడ, భవేత్ = అగును.

తా. పాపనిశ్చయము గల పురుషుణ్ణి స్త్రీ చంపజాలదుకదా ? నీకు శాపమిచ్చినచో నా తపస్సు వ్యయమైపోవును. 31

మూ. యది త్వస్తి మయా కించిత్కృతం దత్తం హుతం తథా,
తస్మాత్త్వయోనిజా సాధ్వీ భవేయం ధర్మిణః సుతా. 32

ప్ర. అ. మయా = నాచేత, కించిత్ = ఏమైనా, కృతమ్ = చేయబడినది, దత్తమ్ = ఇవ్వబడినది తథా = మరియు, హుతమ్ = హోమముచేయబడినదీ, అస్తి యది = ఉన్నట్లయితే, తస్మాత్ = దానివలన, అయోనిజా = అయోనిజ (గర్భవాసము చేసి జనించనిది)యైన, సాధ్వీ = పతివ్రతయైన, ధర్మిణః సుతా = ధర్మాత్ముని కుమార్తెగా, భవేయమ్ = అగుదును.

తా. నేను ఏదైన మంచి పని కాని, దానము కాని, హోమము కాని చేసి ఉన్నచో దానికి ఫలితముగా రాబోవు జన్మలో ఒక ధర్మాత్ముని అయోనిజయైన కుమార్తెగా, పతివ్రతగా పుట్టగలను. 32

మూ. ఏవముక్త్వా ప్రవిష్టా సా జ్వలితం జాతవేదసమ్,
పపాత చ దివో దివ్యా పుష్పవృష్టిః సమన్తతః. 33

ప్ర. అ. సా = ఆమె, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, జ్వలితమ్ = ప్రజ్వలింపచేయబడిన, జాతవేదసమ్ = అగ్నిని, ప్రవిష్టా = ప్రవేశించినది. దివః

తా. సాముద్రికలక్షణములు తెలిసిన ఆ మంత్రి ఆ శిశువును చూడగానే రావణునితో "ఈమె నీ వధకొరకే గృహము చేరినది"అని పలికెను. 36

మూ. ఏతచ్ఛ్రుత్వార్ణవే రామ తాం ప్రచిక్షేప రావణః,
సా చైవ క్షితిమాసాద్య యజ్ఞాయతనమధ్యగా,
రాజ్ఞో హలముఖోత్కృష్టా పునరప్యుత్థితా సతీ. 37

ప్ర. అ. రామ = రామా ! ఏతత్ = దీనిని, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, తామ్ = ఆమెను, అర్ణవే = సముద్రమునందు, చిక్షేప = విసిరివేసెను. సతీ = ఉత్తమురాలైన, సా చైవ = ఆమె, క్షితిమ్ = భూమిని, ఆసాద్య = పొంది, యజ్ఞాయతనమధ్యగా=యజ్ఞగృహమధ్యమును పొందినదై, రాజ్ఞః=రాజుయొక్క, హలముఖోత్కృష్టా = నాగలి అగ్రభాగముచేత రాయబడినదై, పునరపి = మరల, ఉత్థితా= పైకి లేచినది.

తా. రామా ! ఆ మాట విని రావణుడు ఆమెను సముద్రములోనికి విసిరి వేసెను. ఉత్తమురాలైన ఆమె భూమిని చేరి, జనకుని నాగలి అగ్రభాగముచేత గీయబడినదై మరల పైకి వచ్చినది.

వి. 34-37 శ్లోకాలు చాలా ప్రతులలో లేవు. వ్యాఖ్యాతలు కూడ వ్యాఖ్యానించలేదు. 37

మూ. సైషా జనకరాజస్య ప్రసూతా తనయా ప్రభో,
తవ భార్యా మహాబాహో విష్ణుస్త్వం హి సనాతనః. 38

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా ! ప్రభో = ఓ ! ప్రభూ ! జనకరాజస్య = జనకమహారాజుయొక్క, తనయా = కుమార్తెగా, ప్రసూతా = పుట్టిన, సా ఏషా = అట్టి ఈమెయే, తవ = నీయొక్క, భార్యా = భార్య. త్వమ్ = నీవు, సనాతనః = సనాతనుడవైన, విష్ణుః హి = విష్ణువుకదా !

తా. ఓ ! ప్రభూ ! జనకుని కుమార్తెగా పుట్టిన ఈమెయే నీ భార్య. ఓ ! మహాబాహూ ! నీవు సనాతనుడవైన విష్ణుమూర్తివే కదా! 38

మూ. పూర్వం క్రోధహతః శత్రు ర్యయాసౌ నిహత స్త్వయా,
ఉపాశ్రయిత్వా శైలాభ స్తవ వీర్యమనుత్తమమ్. 39

త్రేతాయుగమ్ = త్రేతాయుగమును, అనుప్రాప్య = పొంది, తస్య రక్షసః = ఆ రాక్షసునియొక్క, వధార్థమ్ = వధకొరకు, మహాత్మనః = మహాత్ముడైన, జనకస్య = జనకునియొక్క, మైథిలకులే = మిథిలానగరమునకు చెందిన వంశమునందు, ఉత్పన్నా = పుట్టినది. పునః = మరల, సీతోత్పన్నా = నాగలిచాలునుండి పుట్టిన ఈమె, మానుషైః = మానవులచేత, సీతేతి = సీత అని, ఉచ్యతే = చెప్పబడు చున్నది.

తా. పూర్వము కృతయుగమునందు వేదవతి అను పేరుతో ఉన్న ఈమె త్రేతాయుగమునందు రావణుని సంహరించుటకై మహాత్ముడైన జనకుని కులము నందు జనించినది. సీతనుండి (నాగలిచాలునుండి) జనించుటచే ఈమెను మాన వులు 'సీత'అని అనుచున్నారు 42

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో పదిహేడవ సర్గ సమాప్తము.

ప్ర. అ. బృహస్పతేః = బృహస్పతియొక్క, సాక్షాత్ భ్రాతా = సాక్షాత్తు సోదరుడు, ధర్మజ్ఞః=ధర్మములు తెలిసినవాడు అయిన, సంవర్తో నామ=సంవర్తుడను, బ్రహ్మర్షిః = బ్రహ్మర్షి, సర్వైః = సమస్తమైన, దేవగణైః = దేవతాగణములతో, వృతః = కూడినవాడై, యాజయామాస = యాగము చేయించెను.

తా. సాక్షాత్తు బృహస్పతి సోదరుడు, ధర్మములు ఎరిగినవాడూ అయిన సంవర్తు డను బ్రహ్మర్షి సమస్తదేవతాగణములతో కూడినవాడై యాగము చేయించెను. 3

మూ. దృష్ట్వా దేవాస్తు తద్రక్షో వరదానేన దుర్జయమ్,
తిర్యగ్యోనిసమావిష్టాస్తస్య ధర్షణభీరవః. 4

ప్ర. అ. దేవాః తు=దేవతలు, వరదానేన=వరదానముచేత, దుర్జయమ్=జయింప శక్యముకాని, తత్ రక్షః = ఆ రాక్షసుణ్ణి, దృష్ట్వా = చూచి, తస్య = వానియొక్క, ధర్షణభీరవః = ఎదిరించుటనుండి భయపడుచున్నవారై, తిర్యగ్యోని సమావిష్టాః = తిర్యగ్ జంతువులయందు ప్రవేశించిరి.

తా. వరదానముచేత జయింప శక్యము కాని ఆ రాక్షసుణ్ణి చూచి, దేవతలు ఆతడు ఎదిరించు నని భయపడి తిర్యగ్జంతువులలో ప్రవేశించిరి. 4

మూ. ఇన్ద్రో మయూరః సంవృత్తో ధర్మరాజస్తు వాయసః,
కృకలాసో ధనాధ్యక్షో హంసశ్చ వరుణోఽభవత్. 5

ప్ర. అ. ఇన్ద్రః = ఇంద్రుడు, మయూరః = నెమలిగా, సంవృత్తః = అయినాడు, ధర్మరాజస్తు = యమధర్మరాజు, వాయసః = కాకి అయినాడు, ధనాధ్యక్షః = కుబేరుడు, కృకలాసః = తొండగాను, వరుణః=వరుణుడు, హంసశ్చ= హంసగాను, అభవత్ = ఆయెను.

తా. ఇంద్రుడు నెమలిగాను, యముడు కాకిగాను, కుబేరుడు తొండగాను, వరుణుడు హంసగాను ఆయెను. 5

మూ. అన్యేష్వపి గతేష్వేవం దేవేష్వరినిషూదన,
రావణః ప్రావిశద్యజ్ఞం సారమేయ ఇవాశుచిః. 6

ప్ర. అ. పార్థివ = రాజా ! యః = ఏ నీవు, ధనదస్య = కుబేరునియొక్క, అనుజమ్ = తమ్ముడనైన, రావణమ్ = రావణుడనైన, మామ్ = నన్ను గూర్చి, నావగచ్ఛసి = తెలుసుకొనుటలేదో, తవ = అట్టి నీయొక్క, అకుతూహలభావేన = ఆశ్చర్యము లేకపోవుటచేత, ప్రీతః = సంతోషించినవాడను, అస్మి = అయి ఉన్నాను.

తా. రాజా ! కుబేరుని తమ్ముడను, రావణుడను అయిన నన్ను కూడ నీవు గుర్తించలేదన్నచో నీలో ఉన్న ఆశ్చర్యపడకపోవుట (తెలియవలసిన విషయములు కూడ తెలిసికొనకపోవుట) అనే గుణము చూచి నేను సంతోషించుచున్నాను. 9

మూ. త్రిషు లోకేషు కోఽన్యోఽస్తి యో న జానాతి మే బలమ్,
భ్రాతరం యేన నిర్జిత్య విమానమిదమాహృతమ్. 10

ప్ర. అ. యేన = ఏ నాచేత, భ్రాతరమ్ = సోదరుణ్ణి, నిర్జిత్య = జయించి, ఇదమ్ = ఈ, విమానమ్ = విమానము, ఆహృతమ్ = తీసికొనిరాబడినదో, మే = అట్టి నాయొక్క, బలమ్ = బలమును, యః = ఎవడు, న జానాతి = ఎరుగడో అట్టి, అన్యః = మరియొకడు, కః = ఎవడు, త్రిషు = మూడు, లోకేషు = లోకములలో, అస్తి = ఉన్నాడు.

తా. సోదరుణ్ణి జయించి ఈ విమానమును హరించిన నా బలమును గూర్చి తెలియనివాడు ఈ మూడు లోకాలలో నీవు తప్ప మరొకడు ఎవడు ఉన్నాడు ?

మూ. తతో మరుత్తః స నృపస్తం రావణమథాబ్రవీత్,
ధన్యః ఖలు భవాన్యేన జ్యేష్ఠో భ్రాతా రణే జితః. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ, నృపః = రాజైన, మరుత్తః = మరుత్తుడు, అథ = ఆటుపిమ్మట, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. యేన = ఏ నీచేత, రణే = యుద్ధమునందు, జ్యేష్ఠః = పెద్దవాడైన, భ్రాతా సోదరుడు, జితః = జయింపబడినాడో, భవాన్ = అట్టి నీవు, ధన్యః ఖలు = అదృష్టవంతుడవు కదా !

తా. అప్పుడు మరుత్తమహారాజు రావణునితో ఇట్లు పలికెను-"యుద్ధములో అన్నగారిని జయించిన నీవు ఎంత ధన్యుడవు !'' 11

తిరిగి వెళ్ళవు. అద్య = ఇప్పుడు, నిశితైః = వాడియైన, బాణైః = బాణములచేత, త్వామ్ = నిన్ను, యమక్షయమ్ = యమలోకమును గూర్చి, ప్రేషయామి = పంపుచున్నాను.

తా. ఓ ! దుర్మతీ ! నిలబడుము; నీవు ప్రాణాలతో తిరిగి వెళ్ళవు. ఇపుడు వాడియైన బాణాలచేత నిన్ను యమలోకమునకు పంపెదను. 14

మూ. తతః శరాసనం గృహ్య సాయకాంశ్చ నరాధిపః, 15
రణాయ నిర్యయౌ క్రుద్ధః సంవర్తో మార్గమావృణోత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నరాధిపః = ఆ రాజు, క్రుద్ధః = కోపించినవాడై, శరాసనమ్ = ధనస్సును, సాయకాంశ్చ = బాణములను, గృహ్య = గ్రహించి, రణాయ = యుద్ధముకొరకు, నిర్యయౌ = బయలువెడలెను. సంవర్తః = సంవర్తుడు, మార్గమ్ = మార్గమును, అవృణోత్ = ఆవరించెను.

తా. పిమ్మట ఆ మరుత్తుడు కోపించి, ధనస్సును, బాణములను గ్రహించి యుద్ధమునకై బయలుదేరగా సంవర్తుడు అతనిని అడ్డగించెను. 15

మూ. సోఽబ్రవీత్స్నేహసంయుక్తం మరుత్తం తం మహానృషిః,
శ్రోతవ్యం యది మద్వాక్యం సంప్రహారో న తే క్షమః.

ప్ర. అ. సః = ఆ, మహాన్ = గొప్పవాడైన, ఋషిః = ఋషి, తం మరుత్తమ్ = ఆ మరుత్తుణ్ణి గూర్చి, స్నేహసంయుక్తమ్ = స్నేహముతో కూడుకొన్నట్లుగా, అబ్రవీత్ = పలికెను. మద్వాక్యమ్ = నా వాక్యము, శ్రోతవ్యం యది = వినదగినట్లయితే, తే = నీకు, సంప్రహారః = యుద్ధము, న క్షమః = తగినది కాదు.

తా. మహాఋషియైన ఆ సంవర్తుడు మరుత్తునితో స్నేహపూర్వకముగా ఇట్లు పలికెను. "నీవు నా మాట విన్నచో-ఇప్పుడు యుద్ధము చేయుట తగదు."

మూ. మాహేశ్వరమిదం సత్రమసమాప్తం కులం దహేత్. 17
దీక్షితస్య కుతో యుద్ధం క్రోధిత్వం దీక్షితే కుతః.

ప్ర. అ. మాహేశ్వరమ్ = మహేశ్వరసంబంధమైన, ఇదమ్ = ఈ,

తా. పిమ్మట శుకుడు ఆతడు జయింపబడినట్లు గ్రహించి ఆ విధముగా చాటించెను. "రావణుడు సర్వోత్కర్షగా ఉన్నాడు" అని బిగ్గరగా అరచెను. 20

మూ. తాన్ భక్షయిత్వా తత్రస్థాన్ మహర్షీన్ యజ్ఞమాగతాన్,
వితృప్తో రుధిరైస్తేషాం పునః సంప్రయయౌ మహీమ్.

ప్ర. అ. యజ్ఞమ్ = యజ్ఞమును గూర్చి, ఆగతాన్ = వచ్చిన, తత్రస్థాన్ = అక్కడ ఉన్న, ఋషీన్ = ఋషులను, భక్షయిత్వా = భక్షించి, తేషామ్ = వాళ్ళయొక్క, రుధిరైః = రక్తములచేత, వితృప్తః = బాగా తృప్తిచెందినవాడై, పునః = మరల, మహీమ్ = భూమిని గూర్చి, సంప్రయయౌ = వెళ్ళెను.

తా. యజ్ఞము నిమిత్తమై వచ్చి అక్కడ ఉన్న ఋషులను భక్షించి, వాళ్ళ రక్తముచేత బాగా తృప్తిచెంది రావణుడు మరల భూలోకమునకు వెళ్ళెను.

మూ. రావణే తు గతే దేవాః సేన్ద్రాశ్చైవ దివౌకసః,
తతః స్వాం యోనిమాసాద్య తాని సత్త్వాని చాబ్రువన్.

ప్ర. అ. రావణే = రావణుడు, గతే = వెళ్ళినవాడగుచుండగా, దేవాః = ప్రకాశించువారైన, సేన్ద్రాశ్చైవ = ఇంద్రునితో కూడిన, దివౌకసః = దేవతలు, తతః = అటుపిమ్మట, స్వామ్ = తమ సంబంధమైన, యోనిమ్ = జన్మను (రూపమును), ఆసాద్య = పొంది, తాని = ఆ, సత్త్వాని = జంతువులను గూర్చి, అబ్రువన్ = పలికిరి.

తా. రావణుడు వెళ్ళిపోయిన పిమ్మట ఇంద్రుడు మొదలైన ఆ దేవతలు తమ తమ రూపములు దాల్చి ఆ జంతువులతో ఇట్లు పలికిరి. 22

మూ. హర్షాత్తదాబ్రవీదిన్ద్రో మయూరం నీలబర్హిణమ్,
ప్రీతోఽస్మి తవ ధర్మజ్ఞ భుజంగాద్ధి న తే భయమ్. 23

ప్ర. అ. తదా = అప్పుడు, ఇన్ద్రః = ఇంద్రుడు, హర్షాత్ = సంతోషము వలన, నీలబర్హిణమ్ = నల్లని పింఛము గల, మయూరమ్ = నెమలిని గూర్చి, అబ్రవీత్ = పలికెను. ధర్మజ్ఞ = ధర్మము తెలిసినదానా! తవ = నీకు, ప్రీతః = సంతోషించినవాడను, అస్మి = అయి ఉన్నాను. తే = నీకు, భుజంగాత్ = సర్పము వలన, భయమ్ = భయము, న హి = ఉండదు.

ప్ర. అ. ధర్మరాజః = యమధర్మరాజు, ప్రాగ్వంశే = యజ్ఞశాలలోని కట్టమీద ఉన్న, వాయసం ప్రతి = కాకిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. పక్షిన్ = ఓ! పక్షి! తవ = నీకు, సుప్రీతః = చాల సంతోషించినవాడను, అస్మి = అయిఉన్నాను. ప్రీతస్య = సంతోషించుచున్న నాయొక్క, వచనమ్ = వచనమును, శృణు = వినుము.

తా. యజ్ఞశాలలోని కట్టమీద ఉన్న కాకితో యముడు ఇట్లు పెలికెను- "ఓ! పక్షి! నీ విషయమున సంతోషించితిని. సంతోషించుచున్న నా మాట వినుము." 26

మూ. యథాన్యే వివిధై రోగైః పీడ్యన్తే ప్రాణినో మయా, 27
తే న తే ప్రభవిష్యన్తి మయి ప్రీతే న సంశయః.

ప్ర. అ. అన్యే = ఇతరములైన, ప్రాణినః = ప్రాణులు, మయా = నాచేత, వివిధైః = అనేకవిధములైన, రోగైః = రోగములచేత, యథా = ఎట్లు, పీడ్యన్తే = పీడించబడుచున్నారో, ఆ విధముగా, తే = ఆ రోగములు, మయి = నేను, ప్రీతే = సంతోషించిన వాడనగుచుండగా, తే = నీ విషయమునందు, న ప్రభవన్తి = సమర్థములు కావు. సంశయః = సంశయము, న = లేదు.

తా. "ఇతరప్రాణులను నేను వివిధరోగాలచే పీడించుచుందును. కాని నీ విషయమున సంతోషించినాను గాన నీకు ఆ రోగాల బాధ ఉండదు. సందేహము లేదు." 27

మూ. మృత్యుతస్తే భయం నాస్తి వరాన్మమ విహంగమ, 28
యావత్త్వాం న వధిష్యన్తి నరాస్తావద్భవిష్యసి.

ప్ర. అ. విహంగమ = ఓ! పక్షి! మమ = నాయొక్క, వరాత్ = వరము వలన, తే = నీకు, మృత్యుతః = మృత్యువువలన, భయమ్ = భయము, నాస్తి = లేదు. నరాః = నరులు, త్వామ్ = నిన్ను, యావత్ = ఎంతవరకు, న వధిష్యన్తి = చంపరో, తావత్ = అంతవరకు, భవిష్యసి = ఉండగలవు.

తా. ఓ! పక్షి! నేను వరము ఇచ్చుచున్నాను; నీకు మృత్యుభయము లేదు. నరులు నిన్ను చంపేవరకు నీవు జీవించి ఉందువు." 28

మూ. మచ్ఛరీరం సమాసాద్య కాన్తో నిత్యం భవిష్యసి, 32
ప్రాప్స్యసే చాతులాం ప్రీతిమేతన్మే ప్రీతిలక్షణమ్.

ప్ర. అ. మచ్ఛరీరమ్ = నా శరీరమును, సమాసాద్య = పొంది, నిత్యమ్ = ఎల్లప్పుడూ, కాన్తః = సుందరమైనదానవు, భవిష్యసి = కాగలవు. అతులామ్ = సాటిలేని, ప్రీతిం = సంతోషమును, ప్రాప్స్యసే చ = పొందగలవు. ఏతత్ = ఇది, మే = నాయొక్క, ప్రీతిలక్షణమ్ = ప్రేమకు లక్షణము.

తా. "నీవు నా శరీరమైన జలముమీద ఎల్లప్పుడూ విహరించుచు, మనోహరముగా ఉందువు; అధికమైన సంతోషము పొందెదవు. ఇది నాకు నీ విషయమున కలిగిన సంతోషమునకు లక్షణము(గుర్తు)." 32

మూ. హంసానాం హి పురా రామ న వర్ణః సర్వపాణ్డురః, 33
పక్షా నీలాగ్రసంవీతాః క్రోడాః శష్పాగ్రనిర్మలాః.

ప్ర. అ. రామ = రామా! పురా = పూర్వము, హంసానామ్ = హంసల యొక్క, వర్ణః = రంగు, సర్వపాణ్డురః = పూర్తిగా తెల్లనిదిగా, న = లేదు. పక్షాః = రెక్కలు, నీలాగ్రసంవీతాః = నీలమైన అగ్రభాగములతో కూడినవి. క్రోడాః = వక్షఃస్థలములు, శష్పాగ్రసంనిభాః = పచ్చగడ్డి చిగుళ్ళతో సమానలు.

తా. రామా! పూర్వము హంసలు పూర్తిగా తెల్లగా ఉండేవి కాదు. వాటి రెక్కల చివరి భాగములు నీలవర్ణముతోను, వక్షఃస్థలము పచ్చగడ్డి చిగుళ్ళ రంగులోను ఉండెడివి. 33

మూ. అథాబ్రవీద్వైశ్రవణః కృకలాసం గిరౌ స్థితమ్, 34
హైరణ్యం సంప్రయచ్ఛామి వర్ణం ప్రీత స్తవాప్యహమ్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, వైశ్రవణః = కుబేరుడు, గిరౌ = పర్వతము మీద, స్థితమ్ = ఉన్న, కృకలాసమ్ = తొండను గూర్చి, అబ్రవీత్ = పలికెను. అహమ్ = నేను, తవాపి = నీ విషయమునందు కూడా, ప్రీతః = సంతోషించితిని.

దత్త్వా = ఇచ్చి, రాజ్ఞా సహ = రాజుతో కూడ, నివృత్తాః = మరలినవారై, పునః = మరల, స్వభవనమ్ = తమ భవనమును గూర్చి, గతాః = వెళ్ళిరి.

తా. ఆ యజ్ఞమహోత్సవమునందు ఆ దేవతలు వాటికి ఈ విధముగా వరములు ఇచ్చి ఆ రాజుతో కలిసి వెళ్ళి మరల తమ ఇండ్లకు వెళ్ళిపోయిరి. 36

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో పద్దెనిమిదవ సర్గ సమాప్తము.

బ్రూత = చెప్పండి. ఏషః = ఇది, మే = నాయొక్క, సునిశ్చయః హి = దృఢమైన నిశ్చయము కదా ? అన్యథా = మరియొక విధముగా, కుర్వతామ్ = చేయువారికి, ఏవమ్ = ఇట్లు, మోక్షః = మోక్షము, నైవోపపద్యతే = ఉపపన్నము కాదు.

తా. లేదా ఓడిపోయినా మని ఒప్పుకొనండి. ఇదే నా దృఢమైన నిశ్చయము. మరొక విధముగా చేసినచో మీకు మోక్షము (విడుదల) లేదు. 3

మూ. తత స్త్వభీరవః ప్రాజ్ఞాః పార్థివా ధర్మనిశ్చయాః,
మన్త్రయిత్వా తతోఽన్యోన్యం రాజానః సమహాబలాః.
నిర్జితాః స్మేత్యభాష న్త జ్ఞాత్వా వరబలం రిపోః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అభీరవః = భయము లేనివారు, ప్రాజ్ఞాః = బుద్ధిమంతులు, పార్థివాః = భూమికి అధిపతులు, ధర్మనిశ్చయాః = ధర్మనిశ్చయము గలవారు, సమహాబలాః = గొప్ప బలములతో కూడినవారు అయిన, రాజానః = రాజులు, అన్యోన్యమ్ = పరస్పరము, మన్త్రయిత్వా = ఆలోచించుకొని, రిపోః = శత్రువుయొక్క, వరబలమ్ = వరములవల్ల లభించిన బలమును, జ్ఞాత్వా = తెలిసికొని, తతః = అటుపిమ్మట, నిర్జితాః స్మః = జయింపబడినాము, ఇతి = అని, అభాషన్త = పలికిరి.

తా. అప్పుడు భయము లేనివారు, బుద్ధిమంతులు, భూమికి ప్రభువులు, ధర్మసంమతమైన నిశ్చయము గలవారు. సైన్యములతో కూడినవారు అయిన రాజులు ఒకరితో ఒకరు ఆలోచించుకొని, శత్రువున కున్న వరబలమును తెలిసికొని "ఓడిపోయినాము"అని ఒప్పుకొనిరి. 4

మూ. దుష్యన్తః సురథో గాధిర్గయో రాజా పురూరవః, 5
ఏతే సర్వేఽబ్రువంస్తాత నిర్జితాః స్మేతి పార్థివాః.

ప్ర. అ. తాత = తండ్రీ! దుష్యన్తః = దుష్యంతుడు, సురథః = సురథుడు, గాధిః = గాధి, గయః = గయుడు, రాజా = రాజైన, పురూరవః = పురూరవుడు, ఏతే సర్వే = ఈ సమస్తమైన, పార్థివాః = రాజులు, నిర్జితాః స్మ = జయించబడినాము, ఇతి = అని, అబ్రువన్ = పలికిరి.

శ్రుత్వా=విని, అథ = అటుపిమ్మట, సంక్రుద్ధః=కోపించినవాడై, రాక్షసేన్ద్రమ్= ఆ రాక్షసరాజును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అయోధ్యాప్రభులైన ఆ అనరణ్యుడు పాపాత్ముడైన అతని మాటలు విని, మిక్కిలి కోపించి ఇట్లు పలికెను. 9

మూ. దీయతే ద్వన్ద్వయుద్ధం తే రాక్షసాధిపతే మయా,
సంతిష్ఠ క్షిప్రమాయత్తో భవ చైవం భవామ్యహమ్. 10

ప్ర. అ. రాక్షసాధిపతే = రాక్షసరాజా! తే = నీకు, మయా = నా చేత, ద్వన్ద్వయుద్ధమ్ = ద్వంద్వయుద్ధము, దీయతే = ఇవ్వబడుచున్నది. సంతిష్ఠ = నిలబడుము. క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆయత్తః = సంనద్ధుడవు, భవ = అగుము. అహమ్ = నేను కూడా, ఏవమ్=ఇట్లు, (సన్నద్ధుడను), భవామి=అగుచున్నాను.

తా. "రాక్షసరాజా! నీకు నేను యుద్ధము నిచ్చెదను. నిలువుము. వెంటనే సన్నద్ధుడవు అగుము; నేను కూడ సిద్ధ మగుచున్నాను." 10

మూ. అథ పూర్వం శ్రుతార్థేన నిర్జితం సుమహద్బలమ్,
నిష్క్రామత్తన్నరేన్ద్రస్య బలం రక్షోవధోద్యతమ్. 11

ప్ర. అ. ఈ శ్లోకం అన్వయం సరిగా కుదురుటలేదు. ప్రాచ్యపాఠం బాగున్నది:—

"అథ పూర్వం శ్రుతార్థేన నిశ్చితం సుమహద్బలమ్
నిశ్చక్రామ నరేన్ద్రశ్చ రాక్షసేన్ద్రవధే ద్రుతమ్."

ప్ర. అ. అథ = అటుపిమ్మట, శ్రుతార్థేన = వినబడిన విషయము గల అనరణ్యునిచేత, పూర్వమ్=పూర్వమే, నిశ్చితమ్=నిశ్చయింపబడిన, సుమహత్ = చాల గొప్పదైన, బలమ్ = సైన్యము, నరేన్ద్రశ్చ = రాజూ, రాక్షసేన్ద్రవధే = రావణుని వధనిమిత్తమై, ద్రుతమ్ = శీఘ్రముగా, నిశ్చక్రామ = బయలుదేరెను.

తా. రావణుని గూర్చి విని ఉన్న అనరణ్యుడు ముందుగానే నిశ్చయించిన చాల పెద్ద సైన్యము, ఆ రాజూ కూడా రావణుని చంపుటకై శీఘ్రముగా బయలుదేరిరి. 11

ప్రాప్య = పొంది, అనలే=అగ్నియందు, హుతమ్ = హోమముచేయబడిన, హవ్యమివ = హోమద్రవ్యము వలె, ప్రాణశ్యత = నశించెను.

తా. అప్పుడు ఆ రాజు సైన్యమంతా రావణసైన్యమును చేరి, అగ్నిలో హోమము చేసిన హోమద్రవ్యము వలె నశించెను. 14

మూ. యుద్ధ్వా చ సుచిరం కాలం కృత్వా విక్రమముత్తమమ్,
ప్రజ్వలన్తం తమాసాద్య క్షిప్రమేవావశేషితమ్.
ప్రావిశత్సంకులం తత్ర శలభా ఇవ పావకమ్. 16

ప్ర. అ. అవశేషితమ్ = మిగిలిన సైన్యము, సుచిరం కాలమ్ = చాల కాలము, యుద్ధ్వా చ=యుద్ధము చేసి, ఉత్తమమ్=ఉత్తమమైన, విక్రమమ్=పరాక్రమమును, కృత్వా=చేసి, ప్రజ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, తమ్=ఆతనిని, సమాసాద్య = సమీపించి, సంకులమ్ = వ్యాకులమై, శలభాః = మిడతలు, పావకమివ = అగ్నిని వలె, తత్ర = వానియందు, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. మిగిలిన సైన్యము చాల సేపు యుద్ధము చేసి, గొప్ప పరాక్రమము చూపి, ప్రజ్వలించుచున్న ఆ రావణుని సమీపించి, వ్యాకులమై, అగ్నిలో మిడతలు ప్రవేశించి నట్లు ఆతనిలో ప్రవేశించినది. 15,16

మూ. సోఽపశ్యత్తన్నరేన్ద్రస్తు నశ్యమానం మహాబలమ్,
మహార్ణవం సమాసాద్య వనాపగశతం యథా. 17

ప్ర. అ. సః నరేన్ద్రః తు = ఆ రాజు, మహార్ణవమ్=మహాసముద్రమును, సమాసాద్య=పొంది, వనాపగశతం యథా=నీటితో నిండిన నదుల శతము వలె, నశ్యమానమ్ = నశించుచున్న, తత్ = ఆ, మహాబలమ్ = గొప్ప సైన్యమును, అపశ్యత్ = చూచెను.

తా. మహాసముద్రమును చేరి అదృశ్యమై పోవుచున్న వందలకొలది నదుల వలె నశించి పోవుచున్న ఆ మహాసైన్యమును రాజు చూచెను. 17

మూ. తతః శక్రధనుఃప్రఖ్యం ధనుర్విస్ఫారయన్ స్వయమ్,
ఆససాద నరేన్ద్రస్తం రావణం క్రోధమూర్ఛితః. 18

మేఘములనుండి, గిరిమూర్ధని = పర్వతశిఖరమునందు, పతన్త్యః = పడుచున్న, వారిధారాః ఇవ = జలధారలు వలె, తస్య = వానికి, క్వచిత్ = ఎక్కడను, క్షతమ్ = దెబ్బను, న చక్రిరే = చేయలేదు.

తా. రావణునిమీద పడుచున్న ఆ బాణములు, మేఘములనుండి పర్వత శిఖరముమీద పడుచున్న జలధారలు వలె ఆతనికి ఏ మాత్రము పీడ కలిగించ లేదు. 21

మూ. తతో రాక్షసరాజేన క్రుద్ధేన నృపతిస్తదా,
తలేనాభిహతో మూర్ధ్ని స రథాన్నిపపాత హ. 22

ప్ర. అ. తతః = అటుపిమ్మట, క్రుద్ధేన = కోపించిన, రాక్షసరాజేన = రావణునిచేత, తదా = అప్పుడు, తలేన = అరచేతితో, మూర్ధ్ని = శిరస్సుమీద, అభిహతః = కొట్టబడెను. సః నృపతిః = ఆ రాజు, రథాత్ = రథమునుండి, నిపపాత హ = పడిపోయెను.

తా. అపుడు కోపించిన రావణుడు అరచేతితో శిరస్సుమీద కొట్టగా ఆ రాజు రథమునుండి పడిపోయెను. 22

మూ. స రాజా పతితో భూమౌ విహ్వలః పరివేపితః,
వజ్రదగ్ధ ఇవారణ్యే సాలో నిపతితో యథా. 23

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, అరణ్యే = అరణ్యమునందు, వజ్రదగ్ధః = పిడుగుచేత కాల్చబడిన, నిపతితః = పడిన, సాలో యథా = సాలవృక్షము వలె, విహ్వలః = వ్యాకులుడై, పరివేపితః = వణకుచున్నవాడై, భూమౌ = నేలమీద, పతితః = పడినాడు.

తా. ఆ రాజు వ్యాకులుడై, వణకుచు, అరణ్యములో పిడుగుపాటుకు కాలి పడిపోయిన సాలవృక్షము వలె నేలపై కూలెను. 23

మూ. తం ప్రహస్యాబ్రవీద్రక్ష ఇక్ష్వాకుం పృథివీపతిమ్,
కిమిదానీం ఫలం ప్రాప్తం మాం త్వయా ప్రతియుధ్యతా.

ప్ర. అ. రక్షః = రావణుడు, ప్రహస్య = నవ్వి, ఇక్ష్వాకుమ్ = ఇక్ష్వాకు

మూ. న హ్యహం నిర్జితో రక్షస్త్వయా వీరప్రశంసినా,
కాలేనైవ విపన్నోఽహం హేతుభూతస్తు మే భవాన్. 27

ప్ర. అ. రక్షః = ఓ! రాక్షసుడా, అహమ్ = నేను, వీరప్రశంసినా = వీరుడ నని ప్రశంసించుకొనుచున్న, త్వయా = నీచేత, న నిర్జితః హి = జయింపబడలేదు కదా! అహమ్ = నేను, కాలేనైవ = కాలముచేతనే, విపన్నః = ఆపదను చెందితిని. భవాన్ తు = నీవైతే, హేతుభూతః = కారణమైనవాడవు.

తా. ఓ! రాక్షసుడా! వీరుడ నని చెప్పుకొనుచున్న నీవు నన్ను జయించలేదు. కాలమే నాకి ఆపద కలిగించినది. నీవు కేవలము నిమిత్త మాత్ర మైనావు."

మూ. కిం త్విదానీం మయా శక్యం కర్తుం ప్రాణపరిక్షయే,
న హ్యహం విముఖీ రక్షో యుధ్యమాన స్త్వయా హతః.

ప్ర. అ. రక్షః = ఓ! రాక్షసుడా! ప్రాణపరిక్షయే = ప్రాణములకు క్షయము కలిగినప్పుడు, ఇదానీమ్ = ఇప్పుడు, మయా = నాచేత, కిం తు = ఏమి, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యమైనది? అహమ్ = నేను, విముఖీ = (యుద్ధము నుండి) విముఖుడను, న హి = కాను కదా? యుధ్యమానః = యుద్ధము చేయుచున్న నేను, త్వయా = నీచేత, హతః = కొట్టబడితిని.

తా. రాక్షసుడా! కాలప్రభావముచేత ప్రాణాపాయము వచ్చినపుడు నేను ఏమి చేయగలుగుదును? నేను యుద్ధమునుండి పారిపోలేదుకదా? యుద్ధము చేయుచుండగానే నన్ను నీవు చంపినావు (మరణించేటట్లు కొట్టినావు). 28

మూ. ఇక్ష్వాకుపరిభావిత్వాద్వచో వక్ష్యామి రాక్షస,
యది దత్తం యది హుతం యది మే సుకృతం తపః. 29
యది గుప్తాః ప్రజాః సమ్యక్తదా సత్యం వచోఽస్తు మే.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడా! ఇక్ష్వాకుపరిభావిత్వాత్ = ఇక్ష్వాకురాజులను తిరస్కరించినవాడ వగుటవలన, వచః = వాక్యమును, వక్ష్యామి = పలికెదను. దత్తం యది = దానము చేయబడినట్లతే, యది హుతమ్ = హోమము చేయబడినట్లయితే, మే = నాకు, (నాచేత) తపః = తపస్సు, సుకృతమ్ = బాగా చేయబడినట్లయితే, ప్రజాః = ప్రజలు, సమ్యక్ = బాగుగా, గుప్తాః యది = రక్షించబడి

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. రాజేన్ద్ర = రామా! తతః = అటుపిమ్మట, సః రాజా = ఆ రాజు, త్రివిష్టపమ్ = స్వర్గము అను, స్థానమ్ = స్థానమును గూర్చి, గతః = వెళ్లెను, తస్మిన్ = ఆ, నృపే = రాజు, స్వర్గతే = స్వర్గమునకు వెళ్ళినవాడగుచుండగా, సః రాక్షసః = ఆ రాక్షసుడు, అపసర్పత = వెళ్ళెను.

తా. రామా! అటుపిమ్మట అనరణ్యుడు స్వర్గస్థు డయ్యెను. అతడు స్వర్గస్థుడైన పిమ్మట రావణుడు అచటినుండి వెళ్ళిపోయెను. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో పందొమ్మిదవ సర్గ సమాప్తము.

మూ. నారదస్తు మహాతేజా దేవర్షిరమితప్రభః,
అబ్రవీన్మేఘపృష్ఠస్థో రావణం పుష్పకే స్థితమ్. 3

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడు, దేవర్షిః = దేవర్షి, అమితప్రభః = సాటిలేని కాంతి గలవాడు అయిన, నారదస్తు = నారదుడు, మేఘపృష్ఠస్థః = మేఘము పైభాగమునందున్నవాడై, పుష్పకే = పుష్పకమునందు, స్థితమ్ = ఉన్న, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. గొప్ప తేజస్సు, అధికమైన కాంతి గల, దేవర్షియైన నారదుడు మేఘముపైన ఉండి, పుష్పకములో ఉన్న రావణునితో ఇట్లు పలికెను. 3

మూ. రాక్షసాధిపతే సౌమ్య తిష్ఠ విశ్రవసః సుత,
ప్రీతోఽస్మ్యభిజనోపేత విక్రమైరూర్జితైస్తవ. 4

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! విశ్రవసః సుత = విశ్రవసుని కుమారుడా! రాక్షసాధిపతే = రాక్షసరాజా! తిష్ఠ = నిలువుము, అభిజనోపేత = మంచి బంధుజనముతో కూడినవాడా! తవ = నీయొక్క, ఊర్జితైః = గొప్ప, విక్రమైః = పరాక్రమములచేత, ప్రీతః = సంతోషించినవాడను, అస్మి = అయితిని.

తా. విశ్రవసుని కుమారుడవు, సౌమ్యుడవు అయిన ఓ! రాక్షసరాజా! ఆగుము. మంచి బంధువులు కలవాడా! నీ గొప్ప పరాక్రమములకు సంతోషించితిని. 4

మూ. విష్ణునా దైత్యఘాతైశ్చ గన్ధర్వోరగఘర్షణైః,
త్వయా సమం విమర్దైశ్చ భృశం హి పరితోషితః 5

ప్ర. అ. విష్ణునా = విష్ణువుచేత, దైత్యఘాతైశ్చ = దైత్యుల సంహారములచేతను, గన్ధర్వోరగఘర్షణైః = గంధర్వోరగుల యుద్ధములచేతను, త్వయా సమమ్ = నీతో కూడ, విమర్దైశ్చ = యుద్ధములచేతను, భృశమ్ = మిక్కిలి, పరితోషితో హి = సంతోషింప చేయబడితిని కదా?

తా. విష్ణువు చేసిన దైత్యసంహారములు, గంధర్వ-ఉరగుల మధ్య జరిగిన యుద్ధాలు నీవు చేసిన యుద్ధాలు చూచి సంతోషించితిని. 5

వధ్యుడవు కాని, త్వయా = నీచేత, మానుష్యః లోకః = మనుష్యసంబంధమైన లోకము, క్లేష్టుమ్ = బాధించుటకు, న యోగ్యః = యోగ్యము కాదు.

తా. నిన్ను దేవ-దానవ-దైత్యులు గాని, యక్ష-గంధర్వ-రాక్షసులు గాని చంప జాలరు కదా. అట్టి నీవు మనుష్యలోకమును బాధించుట యుక్తము కాదు. 8

మూ. నిత్యం శ్రేయసి సంమూఢం మహద్భిర్వ్యసనైర్వృతమ్, 9
హన్యాత్కస్తాదృశం లోకం జరావ్యాధిశతైర్యుతమ్.

ప్ర. అ. నిత్యమ్ = నిత్యమూ, శ్రేయసి = శ్రేయస్సు విషయమునందు, సంమూఢమ్ = మూఢముగా (తెలియనిదిగా) ఉన్నది, మహద్భిః = గొప్ప, వ్యసనైః = వ్యసనములతో, వృతమ్ = కూడినదీ, జరావ్యాధిశతైః = ముసలితనముతోను, అనేక వ్యాధులతోను కూడినదీ అయిన, తాదృశమ్ = అట్టి, లోకమ్ = లోకమును, కః = ఎవడు, హన్యాత్ = చంపును.

తా. ఈ మనుష్యలోకము ఏది తనకు శ్రేయస్కరమో తెలియని స్థితిలో ఉన్నది. అనేకములైన గొప్ప ఆపదలలో చిక్కుకొను చుండును. ముసలితనము చేత, వందలకొలది రోగములచేత బాధింపబడుచున్నది. అట్టి ఈ భూలోకమును ఎవరు చంపుదురు? 9

మూ. తైస్తైరనిష్టోపగమైరజస్రం యత్ర కుత్ర కః, 10
మతిమాన్మానుషే లోకే యుద్ధేన ప్రణయీ భవేత్.

ప్ర. అ. అజస్రమ్ = ఎల్లప్పుడూ తైః తైః = ఆ యా, అనిష్టోపగమైః = అనిష్టముల ప్రాప్తిచేత (బాధింపబడుచున్న), కః = ఏ, మతిమాన్ = బుద్ధిమంతుడు, మానుషే = మనుష్యసంబంధమైన, లోకే = లోకమునందు, యత్ర కుత్ర = ఎక్కడనైనా, యుద్ధేన = యుద్ధముచేత (యుద్ధమునందు), ప్రణయీ = కోరిక గలవాడు, భవేత్ = అగునా?

తా. ఎల్లప్పుడూ ఆ యా అనిష్టములు ప్రాప్తించుటచేత బాధ పడుచు ఉండు ఎవడైనా మనుష్యలోకములో, ఎక్కడనైనా, యుద్ధమునందు ఆసక్తి కలిగి ఉండునా? 10

చుందురు. మరి కొన్ని చోట్ల కొందరు దుఃఖితులై కన్నీళ్ళతో నిండిన నేత్రము లతో, ముఖములతో ఏడ్చుచుందురు. 13

మూ. మాతాపితృసుతస్నేహభార్యాబన్ధుమనోరమైః, 14
మోహితోఽయం జనో ధ్వస్తః క్లేశం స్వం నావబుధ్యతే.

ప్ర. అ. అయమ్ = ఈ, జనః = జనము, మాతాపితృసుతస్నేహభార్యాబన్ధుమనోరమైః = తల్లిదండ్రులయందు, సుతులయందు స్నేహముచేత, భార్యల యందు, బంధువులయందు ప్రేమచేత, మోహితః = మోహింపబడినదై, ధ్వస్తః = నశింపచేయబడి, స్వమ్ = తన సంబంధమైన, క్లేశమ్ = క్లేశమును, నావబుధ్యతే = తెలుసుకొనుటలేదు.

తా. మనుష్యలోకములోని జనులు తల్లి, తండ్రి, పుత్రులు, భార్య, బంధువులు మొదలైనవారిపై ప్రేమచేత మోహము చెంది, దానితో బాధపడుచున్నను తమ క్లేమును గుర్తించజాలకున్నారు. 14

మూ. తత్కిమేవం పరిక్లిశ్య లోకం మోహనిరాకృతమ్, 15
జిత ఏవ త్వయా సౌమ్య మర్త్యలోకో న సంశయః.

ప్ర. అ. సౌమ్య = ఓ! సౌమ్యుడా! ఏవమ్ = ఇట్లు, మోహనిరాకృతమ్ = మోహముచేత తిరస్కృతమై ఉన్న, లోకమ్ = లోకమును, పరిక్లిశ్య = బాధించి, కిమ్ = ఏమి ప్రయోజనము. త్వయా = నీచేత, మర్త్యలోకః = మర్త్య లోకము, జితః ఏవ = జయింపబడినదే; సంశయః = సంశయము, న = లేదు.

తా. ఓ! సౌమ్యుడా! ఈ విధముగా మోహముతో కొట్టుమిట్లాడుచున్న ఈ లోకాన్ని ఇంకా బాధపెట్టి ఏమి ప్రయోజనము? దీనిని నీవు జయించినట్లే; సందేహము లేదు. 15

మూ. అవశ్యమేభిః సర్వైశ్చ గన్తవ్యం యమసాదనమ్, 16
తన్నిగృహ్ణీష్వ పౌలస్త్య యమం పరపురంజయ.

ప్ర. అ. ఏభిః = ఈ, సర్వైః = అందరిచేత, యమసాదనమ్ = యమ లోకమును గూర్చి, గన్తవ్యమేవ = వెళ్ళవలసియే ఉన్నది. పరపురంజయ =

మూ. తతో లోకత్రయం జిత్వా స్థాప్య నాగాన్ సురాన్ వశే,
సముద్రమమృతార్థం చ మథిష్యామి రసాలయమ్. 20

ప్ర. అ. తతః = అటు పిమ్మట, లోకత్రయమ్ = లోకముల త్రయమును, జిత్వా = జయించి, నాగాన్ = నాగులను, సురాన్ = దేవతలను, వశే = వశమునందు, స్థాప్య = ఉంచి, అమృతార్థమ్ = అమృతముకొరకు, రసాలయమ్ = జలమునకు స్థానమైన, సముద్రమ్ = సముద్రమును, మథిష్యామి = మథించగలను.

తా. పిమ్మట మూడు లోకములను జయించి, నాగులను, దేవతలను వశము చేసికొని, అమృతము కొరకై సముద్రమును మథించెదను. 20

మూ. అథాబ్రవీద్దశగ్రీవం నారదో భగవానృషిః,
క్వ ఖల్విదానీం మార్గేణ త్వయా హ్యన్యేన గమ్యతే. 21

ప్ర. అ. అథ = అటు పిమ్మట, భగవాన్ = పూజ్యుడైన, నారదఃఋషిః = నారదమహర్షి, దశగ్రీవమ్ = రావణుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఇదానీమ్ = ఇప్పుడు, త్వయా = నీచేత, అన్యేన మార్గేణ = మరొక మార్గముచేత, క్వ ఖలు = ఎక్కడికి, గమ్యతే = గమనము చేయబడుచున్నది.

తా. అప్పుడు భగవంతుడైన నారదమహర్షి రావణునితో ఇట్లనెను- "నీవు ఇప్పుడు మరొక మార్గముచేత ఎక్కడికి వెళ్ళుచున్నావు ?" (రసాతలమునకు వెళ్ల దలచిన నీవు మరొక మార్గమున వెళ్ళుచున్నావేమి ? అని భావము). 21

మూ. అయం ఖలు సుదుర్గమ్యః ప్రేతరాజపురం ప్రతి,
మార్గో గచ్ఛతి దుర్ధర్ష యమస్యామిత్రకర్శన. 22

ప్ర. అ. దుర్ధర్ష = ఎదిరింప శక్యము కానివాడా ! అమిత్రకర్శన = శత్రువులను పీడించువాడా ! సుదుర్గమ్యః = వెళ్ళుటకు చాల కష్టమైన, అయమ్ = ఈ, మార్గః = మార్గము, యమస్య = యమునియొక్క, ప్రేతరాజపురం ప్రతి = యమలోకమును గూర్చి, గచ్ఛతి = వెళ్లును.

తా. ఎదిరింప శక్యముకానివాడా ! శత్రువులను పీడించువాడా ! వెళ్లుటకు చాల కష్టమైన ఈ మార్గము యమలోకమునకు వెళ్లును. (రసాతలమునకు వెళ్ళే మార్గము కాదు అని అర్థము). 22

మూ. తదిహ ప్రస్థితోఽహం వై యమరాజపురం ప్రతి,
ప్రాణిసంక్లేశకర్తారం యోజయిష్యామి మృత్యునా. 26

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, అహమ్ = నేను, ఇహ = ఇప్పుడు, యమరాజపురం ప్రతి = యముని నగరమును గూర్చి, ప్రస్థితః = ప్రయాణమైనాను. ప్రాణిసంక్లేశకర్తారమ్ = ప్రాణులకు క్లేశము కలిగించు అతనిని, మృత్యునా = మృత్యువుతో, యోజయిష్యామి = చేర్చెదను.

తా. అందువలన నేనిప్పుడు యమలోకమునకు వెళ్ళి ప్రాణులకు క్లేశము కలిగించు ఆ యముణ్ణి చంపివేసెదను. 26

మూ. ఏవముక్త్వా దశగ్రీవో మునిం తమభివాద్య చ,
ప్రయయౌ దక్షిణామాశాం ప్రవిష్టః సహ మన్త్రిభిః. 27

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తం మునిమ్ = ఆ మునీశ్వరుణ్ణి, అభివాద్య చ = నమస్కరించి, దక్షిణామ్ ఆశామ్ = దక్షిణదిక్కును గూర్చి, ప్రయయౌ = వెళ్ళెను. సహ మన్త్రిభిః = మంత్రులతో కూడ ప్రవిష్టః = ప్రవేశించెను.

తా. రావణుడు ఇట్లు పలికి, నారదునకు అభివాదనము చేసి, దక్షిణపు దిక్కు వైపు వెళ్ళి మంత్రులతో కూడ ఆ దక్షిణదిగ్భాగమును ప్రవేశించెను. 27

మూ. నారదస్తు మహాతేజా ముహూర్తం ధ్యానమాస్థితః,
చిన్తయామాస విప్రేన్ద్రో విధూమ ఇవ పావకః. 28

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విధూమః = ధూమము లేని, పావకః ఇవ = అగ్నివలె ఉన్న, విప్రేన్ద్రః = బ్రాహ్మణశ్రేష్ఠుడైన, నారదస్తు = నారదుడైతే, ముహూర్తమ్ = ముహూర్తకాలమును, ధ్యానమ్ = ధ్యానమును, ఆస్థితః = అవలంబించినవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. గొప్ప తేజస్సు గలవాడు, ధూమము లేని అగ్ని వలె ఉన్నవాడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు అయిన నారదుడు క్షణకాలము ధ్యానములో ఉండి ఇట్లు ఆలోచించెను. 28

మూ. యో విధాతా చ ధాతా చ సుకృతం దుష్కృతం తథా,
త్రైలోక్యం విజితం యేన తం కథం విజయష్యతే.
అపరం కిం తు కృత్వాయం విధానం సంవిధాస్యతి. 33

ప్ర. అ. యః = ఎవడు, ధాతా = (లోకమునకు) కర్తయో, విధాతా చ = విశేషముగా కర్తయో, తథా = మరియు, సుకృతమ్ = పుణ్యమో, దుష్కృతమ్ = పాపమో, యేన = ఎవనిచేత, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, విజితమ్ = జయించబడినదో, తమ్ = అట్టి యముణ్ణి, కథమ్ = ఎట్లు, విజేష్యతే = జయించగలడు? అయమ్ = ఇతడు, అపరమ్ = మరియొక, విధానమ్ = విధానమును (ఉపాయమును), కృత్వా = చేసి, సంవిధాస్యతి కిమ్ = జయమును చేయునా?

తా. లోకమును సామాన్యరూపమున, విశేషరూపమున సృష్టించినవాడు యముడు. పుణ్యపాపఫలములను ఇచ్చువాడు; మూడు లోకములను జయించినవాడు. అట్టి యముణ్ణి మరేదైనా ఉపాయము అవలంబించి ఇతడు జయించునా?

మూ. కౌతూహలసముత్పన్నో యాస్యామి యమసాదనమ్,
విమర్దం ద్రష్టుమనయోర్యమరాక్షసయోః స్వయమ్. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
వింశః సర్గః.

ప్ర. అ. కౌతూహలసముత్పన్నః = పుట్టిన కుతూహలము గల నేను, అనయోః = ఈ, యమరాక్షసయోః = యమరాక్షసులయొక్క, విమర్దమ్ = యుద్ధమును, స్వయమ్ = స్వయముగా, ద్రష్టుమ్ = చూచుటకు, యమసాదనమ్ = యమలోకమును గూర్చి, యాస్యామి = వెళ్లెదను.

తా. ఈ యమ-రావణ యుద్ధమును స్వయముగా చూడవలె నని నాకు కుతూహలముగా ఉన్నది. అందుచేత యమలోకమునకే వెళ్లెదను. 34

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఇరువదవ సర్గ సమాప్తము.

ప్ర. అ. సః = ఆ, యమః తు = యముడు, తత్ర = అక్కడికి, ఆగతమ్ = వచ్చిన, మహర్షిమ్ = మహర్షియైన, నారదమ్ = నారదుణ్ణి, దృష్ట్వా = చూచి, ధర్మతః = ధర్మానుసారము, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, అవేద్య = తెలిపి (ఇచ్చి), సుఖమ్ = సుఖముగా, ఆసీనమ్ = కూర్చొని ఉన్న అతనిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. యముడు అక్కడికి వచ్చిన నారదమహర్షిని చూచి, ధర్మానుసారము అర్ఘ్యము సమర్పించి, సుఖముగా కూర్చున్న అతనితో ఇట్లు పలికెను. 3

మూ. కచ్చిత్ క్షేమం ను దేవర్షే కచ్చిద్ధర్మో న నశ్యతి,
కిమాగమనకృత్యం తే దేవగన్ధర్వసేవిత. 4

ప్ర. అ. దేవర్షే = ఓ! దేవర్షి! క్షేమం కచ్చిత్ ను = క్షేమమే కదా? ధర్మః = ధర్మము, న నశ్యతి కచ్చిత్ = నశించుటలేదు కదా? దేవగన్ధర్వసేవిత = దేవతలచేతను గంధర్వులచేతను సేవించబడినవాడా! తే = నీయొక్క, అగమన కృత్యమ్ = వచ్చుటకు పని, కిమ్ = ఏమి?

తా. దేవర్షీ! అంతా క్షేమమే కద? ధర్మము నశించుటలేదు కద? దేవతల చేతను, గంధర్వులచేతను సేవించబడే ఓ! మునీ! నీవు వచ్చిన పని ఏమి? 4

మూ. అబ్రవీత్తు తదా వాక్యం నారదో భగవానృషిః,
శ్రూయతామభిధాస్యామి విధానం చ విధీయతామ్. 5

ప్ర. అ. తదా = అప్పుడు, భగవాన్ = పూజ్యుడైన, నారదః ఋషిః = నారద మహర్షి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను, అభిధాస్యామి = చెప్పెదను. శ్రూయతామ్ = వినబడుగాక, విధానం చ = ఉపాయము, విధీయతామ్ = చేయబడుగాక.

తా. నారదమహర్షి ఆ వాక్యము విని ఇట్లు పలికెను. చెప్పెదను, వినుము. తగు ఉపాయము కూడ చేయుము. 5

మూ. ఏష నామ్నా దశగ్రీవః పితృరాజ నిశాచరః,
ఉపయాతి వశం నేతుం విక్రమైస్త్వాం సుదుర్జయమ్. 6

ఆ పుష్పకముయొక్క, ప్రభయా = కాంతి చేత, తం దేశమ్ = ఆ ప్రదేశమును, సర్వమ్ = అంతనూ, వితిమిరమ్ = చీకటి లేనిదానినిగా, కృత్వా = చేసి, సమీపమ్ = సమీపమును, అభ్యవర్తత = చేరెను.

తా. మహాబలవంతుడైన ఆ రావణుడు ఆ విమానము కాంతిచేత ఆ ప్రదేశము నంతనూ చీకటి లేనిదానినిగా చేయుచు సమీపించెను. 9

మూ. సోఽపశ్యత్స మహాబాహుర్దశగ్రీవస్తత స్తతః,
ప్రాణినః సుకృతం చైవ భుఞ్జానాంశ్చైవ దుష్కృతమ్.

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః దశగ్రీవః = ఆ రావణుడు, తతస్తతః = ఆ యా ప్రదేశములలో, సుకృతం చైవ = పుణ్యమును, దుష్కృతం చైవ = పాపమును, భుఞ్జానాన్ = అనుభవించుచున్న, ప్రాణినః = ప్రాణులను, అపశ్యత్ = చూచెను.

తా. మహాబాహువైన ఆ రావణుడు అక్కడక్కడ పుణ్యఫలమును, పాప ఫలమునూ అనుభవించుచున్న ప్రాణులను చూచెను. 10

మూ. అపశ్యత్ సైనికాంశ్చాస్య యమస్యానుచరైః సహ,
యమస్య పురుషైరుగ్రైః ఘోరరూపైర్భయానకైః. 11

దదర్శ వధ్యమానాంశ్చ క్లిశ్యమానాంశ్చ దేహినః,
క్రోశతశ్చ మహానాదం తీవ్రనిష్టనతత్పరాన్. 12

ప్ర. అ. తత్ర = అక్కడ, యమస్య = యమునియొక్క, అనుచరైః సహ = అనుచరులతో కూడ, అస్య = వీనియొక్క, సైనికాంశ్చ = సైనికులను కూడ, అపశ్యత్ = చూచెను. ఉగ్రైః = ఉగ్రులైన, ఘోరరూపైః = ఘోరములైన రూపములు గల, భయానకైః = భయంకరులైన, యమస్య పురుషైః = యమభటులచేత, వధ్యమానాన్ చ = కొట్టబడుచున్న, క్లిశ్యమానాన్ = బాధ పెట్టబడుచున్న, మహానాదమ్ = గొప్ప ధ్వని కలుగునట్లుగా, క్రోశతః చ = అరచుచున్న, తీవ్రనిష్టనతత్పరాన్ = తీవ్రమైన ధ్వనియందు ఆసక్తులైన, దేహినః చ = ప్రాణులను కూడ, దదర్శ = చూచెను.

భిద్యమానాన్ = భేదింపబడుచున్న, అధార్మికాన్ = పాపాత్ములను, రౌరవే = రౌరవనరకమునందు, క్షారనద్యాం చ = కారమునీళ్ళు ఉన్న నదియందు, క్షుర ధారాసు చైవ = కత్తుల పదనైన అగ్రభాగములమీదా బాధింపబడుచున్నవారిని (చూచెను).

తా. కొందరు పాపాత్ములను అసిపత్రవనములో నడిపించి వారి దేహ ములు తెగిపోవునట్లు చేయుచుండిరి. కొందరిని రౌరవనరకములోని క్షారనది లోను, కత్తుల అగ్రభాగములమీద పడవేయుచుండిరి. 15

మూ. పానీయం యాచమానాంశ్చ తృషితాన్ క్షుధితానపి,
శవభూతాన్ కృశాన్ దీనాన్ వివర్ణాన్ ముక్తమూర్ధజాన్.

ప్ర. అ. పానీయమ్ = జలమును, యాచమానాన్ = యాచించుచున్న, తృషితాన్ = దప్పికొన్నవాళ్ళను, క్షుధితానపి = ఆకలిగొన్నవాళ్ళను, శవభూతాన్ = శవముల వలె అయిపోయినవాళ్ళను, కృశాన్ = చిక్కినవాళ్ళను, దీనాన్ = దీను లను, వివర్ణాన్ = మారిపోయిన రంగు గలవార్లను, ముక్తమూర్ధజాన్ = విడవ బడిన కేశములు కలవాళ్ళను (చూచెను).

తా. అక్కడ ఆకలితో, దప్పికతో బాధపడుచున్న కొందరు జలమును యాచించుచుండిరి. కొందరు కృశించి, దీనులై, రంగు మారి, జుట్టు విరబోసికొని శవముల వలె ఉండిరి. 16

మూ. మలపఙ్కధరాన్ దీనాన్ రూక్షాంశ్చ పరిధావతః,
దదర్శ రావణో మార్గే శతశోఽథ సహస్రశః. 17

ప్ర. అ. రావణః = రావణుడు, మార్గే = మార్గమునందు, మలపఙ్కధ రాన్ = మలమును బురదను ధరించినవారిని, దీనాన్ = దీనులను, రూక్షాన్ = మొరటుగా ఉన్నవాళ్ళను, పరిధావతః = ఇటు అటు పరుగెత్తుచున్నవాళ్ళను, శతశః = వందలకొలది, అథ = మరియు, సహస్రశః = వేలకొలది, దదర్శ = చూచెను.

తా. రావణుడు మార్గములో మలముతోను, పంకముతోను నిండిన దేహాలు కలవారిని దీనులను, మొరటుగా ఉన్నవారిని, ఇటు అటు పరుగులెత్తుచున్న వాళ్ళను, వందలకొలది, వేలకొలది ప్రాణులను చూచెను. 17

దాభిః=స్త్రీలతో కూడిన వారు, స్వతేజసా=తమ తేజస్సుతో, దీప్యమానాన్=ప్రకాశించుచున్నవారు అయిన, అపరాన్ = మరి కొందరు, ధార్మికాన్ = ధార్మికులను, దదర్శ=చూచెను.

తా. గొప్ప బాహువులు గల, రాక్షసరాజైన ఆ రావణుడు అక్కడ తమ తేజస్సుతో ప్రకాశించుచున్న మరికొందరు ధార్మికులను కూడ చూచెను. వారు బంగారము, మణులు, ముత్యములు అలంకరించుకొని స్త్రీలతో విహరించుచుండిరి. 20

మూ. తతస్తాన్భిద్యమానాంశ్చ కర్మభిర్దుష్కృతైః స్వకైః, 21
రావణో మోచయామాస విక్రమేణ బలాద్బలీ.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, బలీ=బలవంతుడైన, రావణః=రావణుడు, స్వకైః=తమ సంబంధమైన, దుష్కృతైః=పాపరూపములైన, కర్మభిః=కర్మలచేత, భిద్యమానాన్ = భేదించబడుచున్న, తాన్ = ఆ పాపాత్ములను, బలాత్= బలాత్కారముగా, విక్రమేణ = పరాక్రమముచేత, మోచయామాస=విడిపించెను.

తా. పిమ్మట బలవంతుడైన రావణుడు తమ పాపములకు ఫలితముగా చీల్చివేయబడుచున్న ఆ పాపాత్ములను బలాత్కారముగా, పరాక్రమముచేత విడిపించెను. 21

మూ. ప్రాణినో మోక్షితాస్తేన దశగ్రీవేణ రక్షసా, 22
సుఖమాపుర్ముహూర్తం తే హ్యతర్కితమచిన్తితమ్.

ప్ర. అ. రక్షసా = రాక్షసుడైన, తేన దశగ్రీవేణ = ఆ రావణునిచేత, మోక్షితాః = విడిపించబడిన, తే = ఆ, ప్రాణినః = ప్రాణులు, అతర్కితమ్ = ఊహించబడని, అచిన్తితమ్ = ఆలోచించబడని, సుఖమ్ = సుఖమును, ముహూర్తమ్ = ముహూర్తకాలము, ఆపుః = పొందిరి.

తా. రావణునిచేత విడిపింపబడిన ఆ ప్రాణులు క్షణకాలముపాటు తలవని విధముగా, ఊహింప శక్యముకాకుండగా వచ్చిన సుఖమును పొందిరి. 22

మూ. ప్రేతేషు ముచ్యమానేషు రాక్షసేన మహీయసా, 23
ప్రేతగోపాః సుసంక్రుద్ధా రాక్షసేన్ద్రమభిద్రవన్.

ప్ర. అ. తే = ఆ యోధులు, మధుకరా ఇవ = తేనెటీగల వలె, తస్య పుష్పకస్య = ఆ పుష్పకముయొక్క, ఆసనాని = ఆసనములను, ప్రాసాదాన్ = మేడలను, వేదికాః = అరుగులను, తోరణాని చ = ముఖద్వారములను, శీఘ్రమ్= శీఘ్రముగా, బభఞ్జుః = విరిచివేసిరి.

తా. ఆ యోధులు తేనెటీగల వలె శీఘ్రముగా ముసురుకొని ఆ పుష్పకము లోని ఆసనాలను, ప్రాసాదములను, వేదికలను, తోరణాలను విరుగగొట్టిరి. 26

మూ. దేవనిష్ఠానభూతం తద్విమానం పుష్పకం మృధే, 27
భజ్యమానం తథైవాసీదక్షయం బ్రహ్మతేజసా.

ప్ర. అ. మృధే = యుద్ధమునందు, భజ్యమానమ్=విరుగగొట్టబడుచున్న, దేవనిష్ఠానభూతమ్ = దేవతలకు స్థానమైన, తత్ = ఆ, పుష్పకం విమానమ్ = పుష్పకవిమానము, బ్రహ్మతేజసా = బ్రహ్మదేవుని తేజస్సుచేత, అక్షయమ్ = నాశరహితమై, తథైవ = వెనుకటి వలెనే, ఆసీత్ = ఉండెను.

తా. దేవతలు ఎక్కే ఆ పుష్పకవిమానము యుద్ధములో యోధులు పగల గొట్టుచున్నను బ్రహ్మదేవుని తేజస్సుచేత నశించకుండా పూర్వమువలెనే ఉండెను.

మూ. అసంఖ్యా సుమహత్యాసీత్తస్య సేనా మహాత్మనః, 28
శూరాణామగ్రయాత్రాణాం సహస్రాణి శతాని చ.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య = యమునియొక్క, సేనా = సేన, అసంఖ్యా = సంఖ్య లేనిదై, సుమహతీ = చాలపెద్దదిగా, ఆసీత్ = ఉండెను. అగ్రయాత్రాణామ్ = ముందు వెళ్ళే, శూరాణామ్ = శూరులయొక్క, సహస్రాణి చ = సహస్రములు, శతాని చ = శతములు ఉండెను.

తా. మహాత్ముడైన ఆ యముని గొప్ప సేన లెక్కలేకుండ ఉండెను. వందలకొలది, వేలకొలది శూరులు ముందుకు వచ్చుచుండిరి. 28

మూ. తతో వృక్షైశ్చ శైలైశ్చ ప్రాసాదానాం శతైస్తథా, 29
తతస్తే సచివాస్తస్య యథాకామం యథాబలమ్,
అయుధ్యన్త మహావీరాః స చ రాజా దశాననః. 30

మూ. అమాత్యాంస్తాంస్తు సంత్యజ్య యమయోధా మహాబలాః,
తమేవ చాభ్యధావన్త శూలవర్షైర్దశాననమ్. 33

ప్ర. అ. మహాబలాః = గొప్ప బలము గల, యమయోధాః = యముని యోధులు, తాన్ = ఆ, అమాత్యాన్ = అమాత్యులను, సంత్యజ్య = విడచి, శూలవర్షైః = శూలముల వర్షములచేత, తమ్ = ఆ, దశాననమేవ = రావణుని గూర్చి, అభ్యధావన్త = ఎదురుగా వరుగెత్తిరి.

తా. గొప్ప బలము గల ఆ యమయోధులు ఆ మంత్రులను విడచి, శూలములు వర్షించుచు ఆ రావణునిమీదికి శీఘ్రముగా వెళ్ళిరి. 33

మూ. తతః శోణితదిగ్ధాఙ్గః ప్రహారైర్జర్జరీకృతః,
ఫుల్లాశోక ఇవాభాతి పుష్పకే రాక్షసాధిపః. 34

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శోణితదిగ్ధాఙ్గః = రక్తముచేత పూయబడిన శరీరము గల, ప్రహారైః = ఆయుధములచేత, జర్జరీకృతః = శిథిలముగా చేయబడిన, రాక్షసాధిపః = రావణుడు, పుష్పకే = పుష్పకమునందు, ఫుల్లాశోక ఇవ = వికసించిన అశోకము వలె, ఆభాతి = ప్రకాశించుచున్నాడు.

తా. ఆయుధములచేత తూట్లుపడిన శరీరముపై రక్తముతో నిండిన ఆ రావణుడు పుష్పకవిమానమునందు వికసించిన అశోకవనము వలె ఉండెను. 34

మూ. స తు శూలగదాప్రాసాన్ శక్తితోమరసాయకాన్,
ముసలాని శిలావృక్షాన్ముమోచాస్త్రబలాద్బలీ. 35

ప్ర. అ. బలీ = బలము గల, స చ = ఆ రావణుడు కూడ, అస్త్రబలాత్ = అస్త్రబలమువలన, శూలగదాప్రాసాన్ = శూలములను, గదలను, ప్రాసలను, శక్తితోమరసాయకాన్ = శక్తులను, తోమరములను, బాణములను, ముసలాని = ముసలములను, శిలావృక్షాన్ = శిలలను, వృక్షములను, ముమోచ = విడచెను.

తా. బలవంతుడైన ఆ రావణుడైతే అస్త్రబలమువలన శూల-గదా-ప్రాస-శక్తి-తోమర-బాణములను, శిలలను, వృక్షములను ప్రయోగించెను. 35

మూ. విముక్తకవచః క్రుద్ధః సిక్తః శోణితవిస్రవైః,
తతః స పుష్పకం త్యక్త్వా పృథివ్యామవతిష్ఠత. 39

ప్ర. అ. తతః = అటు పిమ్మట, విముక్తకవచః = విడవబడిన కవచము గలవాడు, శోణితవిస్రవైః = రక్తప్రవాహములచేత, సిక్తః = తడపబడినవాడు అయిన, సః = అతడు, క్రుద్ధః = కోపించినవాడై, పుష్పకమ్ = పుష్పకమును, త్యక్త్వా = విడచి, పృథివ్యామ్ = నేలమీద, అవతిష్ఠత = నిలచెను.

తా. అప్పుడు కవచము జారిపోగా, రక్తప్రవాహములచేత తడిసిన రావణుడు కోపించి, పుష్పకమును వదలి నేలమీద నిలచెను. 39

మూ. తతః సకార్ముకీ బాణీ సమరే చాభివర్ధత,
లబ్ధసంజ్ఞో ముహూర్తేన క్రుద్ధస్తస్థౌ యథాన్తకః. 40

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కార్ముకీ = ధనస్సు కలవాడు, బాణీ = బాణములు గలవాడు అయిన, సః = అతడు, సమరే = యుద్ధమునందు, అభివర్ధత = వృద్ధిపొందెను. ముహూర్తేన = ముహూర్తముచేత, లబ్ధసంజ్ఞః = పొందబడిన సంజ్ఞగల, క్రుద్ధః = కోపించిన అతడు, అన్తకఃయథా = యముడు వలె, తస్థౌ = నిలచెను.

తా. పిమ్మట ధనుర్బాణములు ధరించిన అతడు యుద్ధమునందు ఉత్సాహవంతు డయ్యెను. ముహూర్తకాలములో సంజ్ఞ పొందిన అతడు కోపించి యముడు వలె నిలచెను. 40

మూ. తతః పాశుపతం దివ్యమస్త్రం సంధాయ కార్ముకే,
తిష్ఠ తిష్ఠేతి తానుక్త్వా తచ్చాపం వ్యపకర్షత. 41

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దివ్యమ్ = దివ్యమైన, పాశుపతమ్ అస్త్రమ్ = పాశుపతాస్త్రమును, కార్ముకే = ధనస్సునందు, సంధాయ = సంధించి, తిష్ఠ తిష్ఠ ఇతి = నిలుపుము, నిలువుము అని, తాన్ = వాళ్ళను గూర్చి, ఉక్త్వా = పలికి, తత్ = ఆ, చాపమ్ = ధనస్సును, వ్యపకర్షత = లాగెను.

తా. పిమ్మట అతడు పాశుపతాస్త్రమును ధనస్సుమీద సంధించి "నిలువుము, నిలువుము" అని వాళ్ళతో పలుకుచు ఆ ధనస్సును లాగెను. 41

నుండియే పుట్టిన క్రూరమృగాలచేత అనుసరించబడిన ఆ బాణము పొదలను, వృక్షాలను భస్మముచేయుచు శీఘ్రముగా వెళ్లెను. 44

మూ. తే తస్య తేజసా దగ్ధాః సైన్యా వైవస్వతస్య తు,
బలే తస్మిన్నిపతితా మాహేన్ద్రా ఇవ కేతవః. 45

ప్ర. అ. తస్య = దానియొక్క, తేజసా = తేజస్సుచేత, దగ్ధాః = కాల్చి వేయబడిన, తే = ఆ, వైవస్యతస్య సైన్యాః = యముని సైన్యములు, మాహేన్ద్రాః = మహేంద్రుని సంబంధమైన, కేతవః ఇవ = ధ్వజములు వలె, తస్మిన్ = ఆ, బలే = సైన్యమునందు, నిపతితాః = పడిపోయిరి.

తా. ఆ యముని సైన్యములోని సైనికులు ఆ బాణము తేజస్సుచేత కాల్చబడి, ఇంద్రధ్వజముల వలె పడిపోయిరి. 45

మూ. తతస్తు సచివైః సార్ధం రాక్షసో భీమవిక్రమః,
ననాద సుమహానాదం కమ్పయన్నివ మేదినీమ్. 46

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భీమవిక్రమః = భయంకరమైన పరాక్రమము గల, రాక్షసః = రాక్షసుడు, సచివైః సార్ధమ్ = మంత్రులతో కూడ, మేదినీమ్ = భూమిని, కమ్పయన్నివ = కంపింపచేయుచున్నవాడు వలె, సుమహానాదమ్ = చాల గొప్ప ధ్వని కలుగునట్లుగా, ననాద = ధ్వని చేసెను.

తా. అప్పుడు మంత్రులతో కూడిన ఆ భయంకర పరాక్రమవంతుడైన రావణుడు భూమిని కంపింపచేయుచున్నాడా అన్నట్లు భిగ్గరగా సింహనాదము చేసెను. 46

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఇరవైఒకటవ సర్గ సమాప్తము.

మూ. తస్య సూతస్తదా దివ్యముపస్థాప్య మహారథమ్,
స్థితః స చ మహాతేజా అధ్యారోహత తం రథమ్. 3

ప్ర. అ. తదా = అప్పుడు, సూతః = సారథి, తస్య = ఆతనియొక్క, దివ్యమ్ = దివ్యమైన, మహారథమ్ = మహారథమును, ఉపస్థాప్య = తీసికొనివచ్చి, స్థితః = నిలబడినాడు. సః చ = అతడు, తం మహారథమ్ = ఆ మహారథమును, అధ్యారోహత = ఎక్కెను.

తా. అప్పుడా సారథి ఆతని దివ్యమైన రథమును తీసికొని వచ్చి నిలచెను. ఆ యముడు ఆ మహారథమును ఎక్కెను. 3

మూ. ప్రాసముద్గరహస్తశ్చ మృత్యుస్తస్యాగ్రతః స్థితః,
యేన సంక్షిప్యతే సర్వం త్రైలోక్యమిదమవ్యయమ్. 4

ప్ర. అ. యేన = ఏ మృత్యువుచేత, ఇదమ్ = ఈ, అవ్యయమ్ = నిత్యమైన, సర్వమ్ = సమస్తమైన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, సంక్షిప్యతే = నశింపచేయబడునో, మృత్యుః = అట్టి మృత్యువు, ప్రాసముద్గర హస్తశ్చ = ప్రాసముద్గరములు హస్తములందు గలవాడై, తస్య = యముని యొక్క, అగ్రతః = ఎదుట, స్థితః = నిలచెను.

తా. నిత్యమైన ఈ మూడు లోకములను నశింపచేయుచుండు మృత్యు దేవుడు ప్రాసముద్గరములు హస్తములలో ధరించి వచ్చి యముని ఎదుట నిలబడెను.

మూ. కాలదణ్డస్తు పార్శ్వస్థో మూర్తిమానస్య చాభవత్,
యమప్రహరణం దివ్యం తేజసా జ్వలదగ్నిమత్. 5

ప్ర. అ. తేజసా = తేజస్సుతో, జ్వలత్ = మండుచున్న, అగ్నిమత్ = అగ్నికల, దివ్యమ్ = దివ్యమైన, యమప్రహరణమ్ = యముని ఆయుధము అయిన, కాలదణ్డః తు = కాలదండమైతే, మూర్తిమాన్ = మూర్తి ధరించినదై, అస్య = యమునకు, పార్శ్వస్థః = పార్శ్వమునందున్నది, అభవత్ = ఆయెను.

తా. తేజస్సుతో ప్రజ్వలించుచున్నది, అగ్నితో కూడినది, యముని దివ్యమైన ఆయుధమూ అయిన కాలదండము ఆకారమును ధరించి యముని ప్రక్క నిలబడెను. 5

మూ. ముహూర్తేన యమం తే తు హయా హరిహయోపమాః,
ప్రాపయన్ మనసస్తుల్యా యత్ర తత్ప్రస్తుతం రణమ్. 9

ప్ర. అ. హరిహయోపమాః = ఇంద్రుని అశ్వములతో సమానములైన, మనసః = మనస్సుకు, తుల్యాః = సమానములైన, తే హయాః = ఆ గుఱ్ఱములు, ముహూర్తేన = ముహూర్తకాలములో, తత్ = ఆ, రణమ్ = యుద్ధము, యత్ర = ఎక్కడ, ప్రస్తుతమ్ = ప్రారంభించబడినదో అక్కడికి, యమమ్ = యముణ్ణి, ప్రాపయన్ = పొందించినవి.

తా. మనోవేగము వంటి వేగము గల, ఇంద్రుని అశ్వముల వంటి అశ్వములు ముహూర్తకాలములో యముణ్ణి యుద్ధము జరుగుచున్న ప్రదేశమునకు తీసికొనివెళ్ళినవి. 9

మూ. దృష్ట్వా తథైవ వికృతం రథం మృత్యుసమన్వితమ్,
సచివా రాక్షసేన్ద్రస్య సహసా విప్రదుద్రువుః. 10

ప్ర. అ. రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, సచివాః = మంత్రులు, తథైవ = ఆ విధముగా, వికృతమ్ = భయంకరముగా ఉన్న, మృత్యుసమన్వితమ్ = మృత్యువుతో కూడిన, రథమ్ = రథమును, దృష్ట్వా = చూచి, సహసా = వెంటనే, విప్రదుద్రువుః = పారిపోయిరి.

తా. మృత్యుదేవతలతో కూడి భయంకరముగా ఉన్న ఆ రథమును చూడగానే రావణుని మంత్రులు పారిపోయిరి. 10

మూ. లఘుసత్త్వతయా తే హి నష్టసంజ్ఞా భయార్దితాః,
నేహ యోద్ధుం సమర్థాః స్మ ఇత్యుక్త్వా ప్రయయుర్దిశః.

ప్ర. అ. తే = వాళ్ళు, లఘుసత్త్వతయా = అల్పబలము గలవారగుటచేత, నష్టసంజ్ఞాః = నష్టమైన సంజ్ఞ గలవారై, భయార్దితాః = భయపీడితులై, ఇహ = ఇక్కడ, యోద్ధుమ్ = యుద్ధముచేయుటకు, సమర్థాః = సమర్థులము, న స్మః = కాము, ఇతి = అని, ఉక్త్వా = పలికి, దిశః = దిక్కులను గూర్చి, ప్రయయుః = వెళ్ళిరి.

తా. వాళ్ళు అల్పబలము కలవారగుటచేత సంజ్ఞ కోల్పోయి, భయపీడితులై

తా. పిమ్మట రావణుడు స్వస్థుడై, మేఘము జలమును వర్షించినట్లు ఆ యముని రథముమీద బాణములు వర్షించెను. 14

మూ. తతో మహాశక్తిశతైః పాత్యమానైర్మహోరసి,
నాశక్నోత్ప్రతికర్తుం స రాక్షసః శరపీడితః. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శరపీడితః = బాణములచేత పీడింపబడిన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, మహోరసి = విశాలమైన వక్షస్థలముమీద, పాత్యమానైః = పడవేయబడుచున్న, మహాశక్తిశతైః = గొప్ప శక్తుల శతములచేత, ప్రతికర్తుమ్ = ప్రతిక్రియ చేయుటకు, నాశక్నోత్ = సమర్థుడు కాలేదు.

తా. బాణములచేత పీడింపబడిన ఆ రాక్షసుడు వందలకొలది శక్తులు తన విశాలమైన వక్షఃస్థలముమీద పడవేయబడుచుండగా వాటికి ప్రతిక్రియ చేయజాలకపోయెను. 15

మూ. ఏవం నానాప్రహరణైర్యమేనామిత్రకర్శినా,
సప్తరాత్రం కృతః సంఖ్యే విసంజ్ఞో విముఖో రిపుః. 16

ప్ర. అ. అమిత్రకర్శినా = శత్రువులను పీడించు, యమేన = యముని చేత, నానాప్రహరణైః = అనేకవిధములైన ఆయుధములచేత, రిపుః = శత్రువు, సంఖ్యే = యుద్ధమునందు, సప్తరాత్రమ్ = ఏడు రాత్రులను, ఏవమ్ = ఈ విధముగా, విసంజ్ఞః = సంజ్ఞ లేనివాడుగాను. విముఖః = విముఖుడుగాను, కృతః = చేయబడినాడు.

తా. శత్రువులను పీడించు యముడు యుద్ధములో అనేకవిధములైన ఆయుధములు ప్రయోగించి ఏడు రోజులపాటు శత్రువును సంజ్ఞ లేనివానిని గాను యుద్ధపరాఙ్ముఖునిగాను చేసెను. 16

మూ. తదాసీత్తుములం యుద్ధం యమరాక్షసయోర్ద్వయోః,
జయమాకాఙ్క్షతోర్వీర సమరేష్వనివర్తినోః. 17

ప్ర. అ. వీర = వీరుడా! జయమ్ = జయమును, ఆకాఙ్క్షతోః = కోరుచున్న, సమరేషు = యుద్ధములయందు, అనివర్తినోః = వెనుకకు మరలని,

చరచి, తతః = అటుపిమ్మట, ఆకాశమ్ = ఆకాశమును, నిరన్తరమివ = అవకాశము లేనిదానిని వలె, కుర్వన్ = చేయుచు, బాణాన్ = బాణములను, అస్సృజత్ = విడచెను.

తా. రావణుడు కూడ ఇంద్రుని వజ్రాయుధము వంటి కాంతి గల ధనస్సును చరచి, ఆకాశమునందు అవకాశము లేకుండ చేయుచు బాణములు విడచెను. 20

మూ. మృత్యుం చతుర్భిర్విశిఖైః సూతం సప్తభిరార్దయత్,
యమం శతసహస్రేణ శీఘ్రం మర్మస్వతాడయత్. 21

ప్ర. అ. చతుర్భిః = నాలుగు, విశిఖైః = బాణములచేత, మృత్యుమ్ = మత్యువును, సప్తభిః = ఏడు బాణములచేత, సూతమ్ = సారథిని, ఆర్దయత్ = పీడించెను. శతసహస్రేణ = లక్ష బాణములచేత, యమమ్ = యముణ్ణి, శీఘ్రమ్ = శీఘ్రముగా, మర్మసు = మర్మస్థానములయందు, అతాడయత్ = కొట్టెను.

తా. నాలుగు బాణాలతో మృత్యువును, ఏడు బాణాలతో సారథినీ పీడించి లక్ష బాణములతో యముని మర్మస్థానములయందు కొట్టెను. 21

మూ. తతః క్రుద్ధస్య వదనాద్యమస్య సమజాయత,
జ్వాలామాలీ సనిఃశ్వాసః సధూమః కోపపావకః. 22

ప్ర. అ. తతః = అటుపిమ్మట, క్రుద్ధస్య = కోపించిన, యమస్య = యమునియొక్క, వదనాత్ = ముఖమునుండి, జ్వాలామాలీ = జ్వాలామాలలు గల, సధూమః = ధూమముతో కూడిన, సనిఃశ్వాసః = నిట్టూర్పులతో కూడిన, కోపపావకః = కోపాగ్ని, సమజాయత = పుట్టెను.

తా. అప్పుడు కోపించిన యముని ముఖమునుండి నిట్టూర్పులతో కలిసి జ్వాలామాలలతోను ధూమముతోను కూడిన కోపాగ్ని బయలుదేరెను. 22

మూ. తదాశ్చర్యమథో దృష్ట్వా దేవదానవసంనిధౌ,
ప్రహర్షితౌ సుసంరబ్ధౌ మృత్యుకాలౌ బభూవతుః. 23

ప్ర. అ. అథో = అటుపిమ్మట, దేవదానవసంనిధౌ = దేవదానవుల సంనిధి

శ్రీమంతుడైన, నముచిః = నముచి, తథా = మరియు, శమ్బరః = శంబరుడు, విసంధిః = విసంధి, ధూమకేతుశ్చ = ధూమకేతువు, వైరోచనః = విరోచనుని కుమారుడైన, బలిః = బలి, దైత్యః = దైత్యుడైన, దమ్భః = దంభుడు, మహారాజః = మహారాజైన, వృత్రః = వృత్రుడు, తథైవ చ = మరియు, బాణః = బాణుడు, శాస్త్రవిదః = శాస్త్రవేత్తలైన, రాజర్షయః = రాజర్షులు, సమహోరగాః = మహోరగులతో కూడిన, గన్ధర్వాః = గంధర్వులు, ఋషయః = ఋషులు, పన్నగాః = పన్నగులు, దైత్యాః = దైత్యులు, యక్షాః చ అపి = యక్షులు, అప్సరోగణాః = అప్సరఃస్త్రీగణములు, యుగాన్తపరివర్తే = యుగాంతమునందు వచ్చు ప్రళయమునందు, సమహార్ణవా = మహాసముద్రముతో కూడిన, సపర్వతసరిద్ద్రుమా = పర్వతములతోను నదులతోను వృక్షములతోను కూడిన, పృథివీ చ = భూమీ, క్షయమ్ = క్షయమును, నీతాః = పొందించబడిరి.

తా. మహారాజా ! ఇప్పుడు ఈ రాక్షసుడు ఇంక జీవించకూడదు. ఇది స్వభావసిద్ధమైన మర్యాద (కట్టుబాటు)కదా ? శ్రీమంతుడైన హిరణ్యకశిపుడు, నముచి, శంబరుడు, విసంధి, ధూమకేతువు, విరోచనుని కుమారుడైన బలి, దంభుడను దైత్యుడు, మహారాజైన వృత్రుడు, బాణుడు, శాస్త్రవేత్తలైన రాజర్షులు, గంధర్వులు, మహోరగులు, ఋషులు, పన్నగులు, దైత్యులు, యక్షులు, అప్సరసలు, ప్రళయకాలమునందు మహాసముద్రములతో, పర్వతములతో, నదులతో, వృక్షములతో కూడిన భూమీ నాచేత నశింపచేయబడినారు. 25-28

మూ. ఏతే చాన్యే చ బహవో బలవన్తో దురాసదాః,
వినిపన్నా మయా దృష్టాః కిముతాయం నిశాచరః. 29

ప్ర. అ. ఏతే చ = వీళ్లు, దురాసదాః = ఎదిరింప శక్యము కాని, బలవన్తః = బలవంతులైన, బహవః = అనేకులైన, అన్యే చ = ఇతరులు, మయా = నాచేత, దృష్టాః = చూడబడినవారై, విపన్నాః = నశించినారు. అయమ్ = ఈ, నిశాచరః = రాక్షసుడు, కిముత = చెప్పనేల ?

తా. వీళ్ళు, ఎదిరింపశక్యము కాని బలవంతులైన ఇంకను ఎందరో వీరులు నేను చూడగానే నశించినారు. ఈ నిశాచరుని మాట చెప్పవలెనా ? 29

మూ. తతః సంరక్తనయనః క్రుద్ధో వైవస్వతః ప్రభుః,
కాలదణ్డమమోఘం తు తోలయామాస పాణినా. 33

ప్ర. అ. తతః = పిమట, క్రుద్ధః = కోపించిన, సంరక్తనయనః = ఎఱ్ఱనైన నేత్రములు గల, ప్రభుః = సమర్థుడైన, వైవస్వతః = యముడు, అమోఘమ్ = వ్యర్థము కాని, కాలదణ్డమ్ = కాలదండమును, పాణినా = హస్తముచేత, తోలయామాస = కదల్చెను.

తా. పిమ్మట కోపముతో ఎఱ్ఱనైన నేత్రములు గల ప్రభువైన యముడు, వ్యర్థము కాని కాలదండమును చేతితో కదల్చెను (చేత పట్టెను). 33

మూ. యస్య పార్శ్వే సునిహితాః కాలపాశాః ప్రతిష్ఠితాః,
పావకాశనిసంకాశో ముద్గరో మూర్తిమాన్ స్థితః. 34

దర్శనాదేవ యః ప్రాణాన్ ప్రాణినామథ కర్షతి,
కిం పునః స్పృశ్యమానస్య పాత్యమానస్య వా పునః. 35

స జ్వాలాపరివారస్తు నిర్దహన్నివ రాక్షసమ్,
తేన స్పృష్టో బలవతా మహాప్రహరణోఽస్ఫురత్. 36

ప్ర. అ. యస్య = దేనియొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, సునిహితాః = బాగుగా ఉంచబడిన, కాలపాశాః = కాలపాశములు, ప్రతిష్ఠితాః = స్థిరముగా ఉన్నవో, పావకాశనిసంకాశః = అగ్నితోను, వజ్రముతోను సమానమైన, మూర్తిమాన్ = మూర్తి గల, ముద్గరః = ముద్గరము, స్థితః = ఉన్నదో, యః = ఏది, దర్శనాదేవ = దర్శనమువలననే, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, అథ = పిమ్మట, కర్షతి = లాగివేయునో, స్పృశ్యమానస్య = స్పృశింపబడుచున్నది గాని, వా = లేదా, పాత్యమానస్య = మీద పడవేయబడుచున్నది గాని అయినచో, కిం పునః = చెప్పనేల, బలవతా = బలవంతుడైన, తేన = యమునిచేత, స్పృష్టః = స్పృశించబడిన, జ్వాలాపరివారః = అగ్నిజ్వాలల పరివారము గల, సః = ఆ, మహాప్రహరణః = గొప్ప ఆయుధము, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, నిర్దహన్నివ = కాల్చివేయుచున్నదా అన్నట్లు, అస్ఫురత్ = ప్రకాశించెను.

తా. ఆ యమదండము ప్రక్కలయందు కాలపాశములు అమర్చబడి

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా ! అమితవిక్రమ = అమితమైన పరాక్రమము కలవాడా ! వైవస్వత = యముడా ! ఏషః నిశాచరః = ఈ రాక్షసుడు, త్వయా = నీ చేత, ఏతేన దణ్డేన = ఈ దండముచేత, న న హ న్తవ్యః = చంపదగినవాడు కాడు, కాడు.

తా. గొప్ప బాహువులూ, అమితమైన పరాక్రమమూ గల ఓ యమధర్మ రాజా ! నీవు ఈ రాక్షసుణ్ణి ఈ దండముతో చంపవద్దు, చంపవద్దు. 39

మూ. వరః ఖలు మయైతస్మై దత్తస్త్రిదశపుంగవ,
స త్వయా నానృతః కార్యో యన్మయా వ్యాహృతం వచః.

ప్ర. అ. త్రిదశపుంగవ = దేవతలలో శ్రేష్ఠుడా, మయా = నాచేత, ఏతస్మై = ఇతనికి, వరః = వరము, దత్తః ఖలు = ఇవ్వబడినది కదా. సః = అది, త్వయా = నీచేత, అనృతః = అసత్య మైనదిగా, న కార్యః = చేయదగినది కాదు. మయా = నాచేత, యత్ = ఏ, వచః = వచనము, వ్యాహృతమ్ = పలకబడినదో అది, అసత్యః న కార్యః = అసత్యముగా చేయదగినది కాదు.

తా. ఓ ! దేవతాశ్రేష్ఠుడా ! నే నీతనికి వరము ఇచ్చినాను కదా ? ఆ వరమును, నా మాటను నీవు అసత్య మయేటట్లు చేయవద్దు. 40

మూ. యో హి మామనృతం కుర్యాద్దేవో వా మానుషోఽపి వా,
త్రైలోక్యమనృతం తేన కృతం స్యాన్నాత్ర సంశయః. 41

ప్ర. అ. దేవో వా = దేవతాపురుషుడైనా, మానుషోఽపి వా = మనుష్యుడైనా, యః = ఎవడు, మామ్ = నన్ను, అనృతమ్ = అసత్యము పలికినవానినిగా, కుర్యాత్ = చేయునో, తేన = వానిచేత, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, అన్యతమ్ = అసత్యముగా, కృతమ్ = చేయబడినది, స్యాత్ = అగును; అత్ర = ఈ విషయమున, సంశయః = సంశయము, న = లేదు.

తా. దేవతాపురుషుడే అయినా, మానవుడైనా ఎవడైన నా మాటను అసత్యము చేసినచో అతడు మూడు లోకాలను అసత్యము చేసినట్లే; సందేహము లేదు. 41

మూ. యది హ్యస్మిన్నిపతితే న మ్రియేతైష రాక్షసః,
మ్రియతే వా దశగ్రీవ స్తదాప్యుభయతో ఒనృతమ్. 45

ప్ర. అ. అస్మిన్ = ఇది, నిపతితే = పడిన దగుచుండగా, ఏషః = ఈ, రాక్షసః = రాక్షసుడైన, దశగ్రీవః = రావణుడు, న మ్రియేత యది = మరణించక పోయినట్లయితే, మ్రియతే వా = మరణించినట్లయినా, తదా = అప్పుడు, ఉభయతః అపి = రెండు విధాలా కూడ, అనృతమ్ = అసత్యము అగును.

తా. నీ దండము పడిన పిమ్మట ఈ రావణుడు మరణించినా, మరణించక పోయినా కూడ, రెండు విధాలా నా మాట అసత్య మగును. 45

మూ. తన్నివర్తయ లఙ్కేశాద్దణ్డ మేతం సముద్యతమ్,
సత్యం చ మాం కురుష్వాద్య లోకాం స్త్వం యద్యవేక్షసే. 46

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, అద్య = ఇప్పుడు, లోకాన్ = లోకములను, అవేక్షసే యది = చూచినట్లయితే, సముద్యతమ్ = ఎత్తబడిన, ఏతం దణ్డమ్ = ఈ దండమును, లఙ్కేశాత్ = రావణునినుండి, నివర్తయ = మరల్చుము. మాం చ = నన్ను కూడ, సత్యమ్ = సత్యవాక్యము కలవానినిగా, కురుష్వ = చేయుము.

తా. అందువలన నీకు ఈ లోకాలను రక్షించ వలె నను అభిప్రాయ మున్నచో రావణుని మీద ప్రయోగించుటకు ఎత్తిన ఈ దండమును ఉపసంహరించుము. నా మాట సత్య మగునట్లు చేయుము. 46

మూ. ఏవముక్తస్తు ధర్మాత్మా ప్రత్యువాచ యమ స్తదా,
ఏష వ్యావర్తితో దణ్డః ప్రభవిష్ణుర్హి నో భవాన్. 47

ప్ర. అ. తదా = అప్పుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, యమః = యముడు, ప్రత్యువాచ = తిరిగి పలికెను. ఏషః = ఇదిగో, దణ్డః = దండము, వ్యావర్తితః = మరల్చబడినది. భవాన్ = నీవు, నః = మాకు, ప్రభవిష్ణుః హి = ప్రభువువు కదా ?

తా. ధర్మాత్ముడైన యముడు ఆ మాటలు విని ఇట్లు పలికెను. "ఇదిగో

రావణు డీ విధముగా యమ్ముణ్ణి జయించి, తన పేరు చాటి, మరల పుష్పకము ఎక్కి యమలోకమునుండి బయలుదేరి వెళ్ళెను. 50

మూ. స తు వైవస్వతో దేవైః సహ బ్రహ్మపురోగమైః,
జగామ త్రిదివం హృష్టో నారదశ్చ మహామునిః. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వావింశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, వైవస్వతః తు = యముడైతే, బ్రహ్మపురోగమైః = బ్రహ్మ మొదలైన, దేవైః సహ = దేవతలతో కూడ, హృష్టః = సంతోషించినవాడై, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను. మహామునిః = మహాముని యైన, నారదశ్చ = నారదుడు కూడ వెళ్లెను.

తా. బ్రహ్మ మొదలైన దేవతలతో కూడి యముడు సంతోషముతో స్వర్గమునకు వెళ్ళెను. నారదమహాముని కూడ వెళ్ళెను. 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఇరువదిరెండవ సర్గ సమాప్తము.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మారీచప్రముఖాః = మారీచుడు మొదలైన వాళ్లు, జయేన = జయశబ్దముచేత, వర్ధయిత్వా = వృద్ధి పొందించి, రావణేన = రావణునిచేత, సాన్త్వితాః = ఓదార్చబడినవారై, పుష్పకమ్ = పుష్పకమును, భేజిరే = పొందిరి.

తా. అప్పుడు మారీచుడు మొదలైన రాక్షసులు జయజయధ్వానములతో ఆ రావణుని అభినందించిరి. రావణుడు వారికి ధైర్యము చెప్పెను. వారందరూ పుష్పకమును ఎక్కిరి. 3

మూ. తతో రసాతలం రక్షః ప్రవిష్టః పయసాం నిధిమ్,
దైత్యోరగగణాధ్యుష్టం వరుణేన సురక్షితమ్. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రక్షః = రావణుడు, రసాతలమ్ = రసాతలమును గూర్చి (వెళ్లుచు), దైత్యోరగగణాధ్యుష్టమ్ = దైత్యులయొక్క, ఉరగుల యొక్క సముదాయములచేత అధిష్ఠించబడినది, వరుణేన = వరుణునిచేత, సురక్షితమ్ = బాగుగా రక్షింపబడినదీ అయిన, పయసాం నిధిమ్ = సముద్రమును, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. పిమ్మట రావణుడు రసాతలమునకు వెళ్లుటకై దైత్యుల, ఉరగుల సముదాయములకు నివాసము, వరుణునిచేత బాగుగా రక్షింపబడినదీ అయిన సముద్రములో ప్రవేశించెను. 4

మూ. స తు భోగవతీం గత్వా పురీం వాసుకిపాలితామ్,
కృత్వా నాగాన్ వశే హృష్టో యయౌ మణిమయీం పురీమ్.

ప్ర. అ. సః = అతడు, వాసుకిపాలితామ్ = వాసుకిచేత పాలింపబడిన, భోగవతీమ్ = భోగవతిని గూర్చి, గత్వా = వెళ్ళి, నాగాన్ = నాగములను, వశే = వశమునందు, కృత్వా = చేసికొని, హృష్టః = సంతోషించినవాడై, మణిమయీమ్ = మణిమయి అను, పురీమ్ = పట్టణమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. రావణుడు వాసుకి పాలించుచున్న భోగవతీపురికి వెళ్ళి, నాగులను తన వశము చేసికొని మణిమయపురమునకు వెళ్ళెను. 5

త్రిశూలములు, పర్జాయుధములు, పట్టిశములు, ఖడ్గములు, గొడ్డళ్ళు మొదలైన ఆయుధాలతో బ్రద్దలు కొట్టిరి. 8

మూ. తేషాం తు యుధ్యమానానాం సాగ్రః సంవత్సరో గతః,
న చాన్యతరత స్తత్ర విజయో వా క్షయోఽపి వా. 9

ప్ర. అ. తేషామ్ = వాళ్ళు, యుధ్యమానానామ్=యుద్ధము చేయుచుండగా, సాగ్రః = కొంత చివరి భాగముతో కూడిన, సంవత్సరః=సంవత్సరము, గతః= గడచినది. తత్ర = అక్కడ, అన్యతరతః = ఒక పక్షమునందు, విజయో వా = జయము కాని, క్షయోఽపి వా = పరాజయము గాని, న = లేకుండెను.

తా. వాళ్ళు ఆ విధముగా యుద్ధము చేయుచుండగా కొంచెము ఎక్కువగా సంవత్సరకాలము గడచెను. ఎవరికీ కూడ జయము కాని, పరాజయము కాని కలగలేదు. 9

మూ. తతః పితామహ స్తత్ర త్రైలోక్యగతిరవ్యయః,
ఆజగామ ద్రుతం దేవో విమానవరమాస్థితః. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, త్రైలోక్యగతిః = మూడు లోకములకు గతి అయినవాడు, అవ్యయః = నాశరహితుడు, దేవః = దేవుడు అయిన, పితామహః = బ్రహ్మ, విమానవరమ్ = శ్రేష్ఠమైన విమానమును, ఆస్థితః = అధిష్ఠించినవాడై, ద్రుతమ్ = శీఘ్రముగా, తత్ర = అక్కడికి, ఆజగామ = వచ్చెను.

తా. ఇంతలో మూడు లోకములకు గతి అయిన, నాశరహితుడైన బ్రహ్మ దేవుడు, శ్రేష్ఠమైన విమానము నెక్కి అచటికి వచ్చెను. 10

మూ. నివాతకవచానాం తు నివార్య రణకర్మ తత్,
వృద్ధః పితామహో వాక్యమువాచ విదితార్థవత్. 11

ప్ర. అ. వృద్ధః = వృద్ధుడైన, పితామహః = బ్రహ్మదేవుడు, నివాతకవచనామ్ = నివాతకవచుల యొక్క, తత్ = ఆ, రణకర్మ = యుద్ధమును, నివార్య = నివారించి, విదితార్థవత్ = తెలియబడిన అర్థము గల, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట రావణుడు అగ్నిసాక్షికముగా అక్కడ నివాతకవచులతో స్నేహము చేసికొని చాల సంతోషించెను. 14

మూ. అర్చితస్తైర్యథాన్యాయం సంవత్సర మథోషితః,
స్వపురాన్నిర్విశేషం చ ప్రియం ప్రాప్తో దశాననః. 15

ప్ర. అ. తైః=వాళ్ళచేత, యథాన్యాయమ్=న్యాయానుసారముగా, అర్చితః పూజింపబడిన, దశాననః=రావణుడు, అథ=పిమ్మట, తత్ర=అక్కడ, సంవత్సరమ్=సంవత్సరకాలము, ఉషితః=నివసించినవాడై, స్వపురాత్=తన పురముకంటె, నిర్విశేషమ్ = భేదములేని, ప్రియమ్=సంతోషమును, ప్రాప్తః=పొందినాడు.

తా. రావణుడు న్యాయానుసారము వాళ్ళనుండి పూజలను అందుకొనుచు ఒక సంవత్సరము అక్కడ నివసించి తన పురమునందు వలెనే సంతోషమును పొందెను. 15

మూ. తత్రోపధార్య మాయానాం శతమేకం సమాప్తవాన్,
సలిలేన్ద్రపురాన్వేషీ భ్రమతి స్మ రసాతలమ్. 16

ప్ర. అ. తత్ర = అక్కడ, ఉపధార్య = వాళ్ళను అనుసరించి, మాయానామ్=మాయలయొక్క, ఏకం శతమ్=ఒక శతమును, సమాప్తవాన్ =పొందినాడు. సలిలేన్ద్రపురాన్వేషీ=వరుణుని పురమును వెదకుచున్న వాడై, రసాతలమ్=రసాతలమును, భ్రమతి స్మ=తిరిగెను.

తా. రావణుడు ఆ మణిమయపురమునందు ఆ నివాతకవచులకు అనుగుణముగా ప్రవర్తించుచు నూరు మాయలను నేర్చుకొనెను. వరుణుని పురము కొరకు అన్వేషించుచు రసాతలమునందు సంచరించెను. 16

మూ. తతోఽశ్మనగరం నామ కాలకేయైరధిష్ఠితమ్,
గత్వా తు కాలకేయాంశ్చ హత్వా తత్ర బలోత్కటాన్. 17

శూర్పణఖ్యాశ్చ భర్తారమసినా ప్రాచ్ఛినత్తదా,
శ్యాలం చ బలవన్తం చ విద్యుజ్జిహ్వాం బలోత్కటమ్. 18

తా. పిమ్మట రావణుడు తెల్లని మేఘము వలె ఉన్న, కైలాసము వలె ప్రకాశించుచున్న దివ్యమైన వరుణుని గృహమును చూచెను. 20

మూ. క్షరన్తీం చ పయస్తత్ర సురభిం గామవస్థితామ్,
యస్యాః పయోఽభినిష్యన్దాత్ క్షీరోదో నామ సాగరః.21

ప్ర. అ. యస్యాః = ఏ కామధేనువుయొక్క, పయోభినిష్యన్దాత్ = పాల యొక్క ప్రవాహము (కారుట)వలన, క్షీరోదో నామ = క్షీరసముద్ర మను, సాగరః = సముద్రము జన్మించెనో అట్టి, పయః = పాలను, క్షరన్తీమ్ = స్రవించుచున్న, అవస్థితామ్ = నిలచి ఉన్న, సురభిం గామ్ = కామధేనువును, తత్ర = అక్కడ, చూచెను.

తా. అక్కడ నిలచి పాలను స్రవించుచున్న కామధేనువును చూచెను. ఆ కామధేనువు కార్చుచున్న పాలవలననే క్షీరసముద్రము పుట్టినది. 21

మూ. దదర్శ రావణస్తత్ర గోవృషేన్ద్రవరారణిమ్,
యస్మాచ్చన్ద్రః ప్రభవతి శీతరశ్మిర్నిశాకరః. 22

యం సమాశ్రిత్య జీవన్తి ఫేనపాః పరమర్షయః,
అమృతం యత్ర చోత్పన్నం స్వధా చ స్వధభోజినామ్.

ప్ర. అ. రావణః = రావణుడు, తత్ర = అక్కడ, గోవృషేన్ద్రవరారణిమ్ = రుద్రుని వృషభరాజుకు కారణమైన (తల్లియైన) కామధేనువును, దదర్శ = చూచెను. యస్మాత్ = దేనినుండి, శీతరశ్మిః = చల్లని కిరణములుగల, నిశాకరః = రాత్రినిచేయు, చన్ద్రః = చంద్రుడు, ప్రభవతి = పుట్టుచున్నాడో, ఫేనపాః = నురుగును త్రాగు, పరమర్షయః = మహర్షులు, యమ్ = దేనిని, సమాశ్రిత్య = ఆశ్రయించి, జీవన్తి = జీవించుచుందురో, యత్ర = దేనియందు, అమృతమ్ = అమృతము, ఉత్పన్నమ్ = పుట్టినదో, స్వధభోజినామ్ = స్వధను తినేవారికి, స్వధా చ = స్వధయు, పుట్టినదో అట్టి క్షీరసముద్రమునకు కారణమైన కామధేనువును చూచెను.

తా. రావణుడు అక్కడ రుద్రుని వాహనమైన మహావృషభమునకు తల్లియైన కామధేనువును చూచెను. ఆ కామధేనువునుండి పుట్టిన క్షీరసముద్రమునుండి

ప్ర. అ. తతః = అటుపిమ్మట, బలాధ్యక్షాన్ = సేనాధ్యక్షులను, హత్వా = చంపి, సమరే = యుద్ధమునందు, తైః = వాళ్ళచేత, తాడితశ్చ = కొట్టబడిన వాడై (రావణుడు), తతః = పిమ్మట, యోధాన్ = యోధులను గూర్చి, అబ్రవీత్ చ = పలికెను. రాజా = మీ రాజు, శీఘ్రమ్ = శీఘ్రముగా, నివేద్యతామ్ = తెలుపబడుగాక.

తా. పిమ్మట రావణుడు యుద్ధమునందు సేనాధ్యక్షులను చంపి, వారి ప్రహారములను తిని, పిమ్మట ఆ యోధులతో ఇట్లు పలికెను. "శీఘ్రముగా వెళ్ళి మీ రాజుతో ఇట్లు చెప్పుడు. 26

మూ. యుద్ధార్థీ రావణః ప్రాప్తస్తస్య యుద్ధం ప్రదీయతామ్, 27
వద వా న భయం తేఽస్తి నిర్జితోఽస్మీతి సాఞ్జలిః.

ప్ర. అ. రావణః = రావణుడు, యుద్ధార్థీ = యుద్ధమును కోరుచున్నవాడై, ప్రాప్తః = వచ్చినాడు. తస్య = వానికి, యుద్ధమ్ = యుద్ధము, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక. తే = నీకు, భయమ్ = భయము, నాస్తి = లేదు అని గాని, వా = లేక, సాఞ్జలిః = దోసిలితో కూడినవాడవై, నిర్జితః అస్మి ఇతి = జయించబడినాను అని గాని, వద = చెప్పుము.

తా. "రావణుడు యుద్ధమును కోరి వచ్చినాడు. ఆతనికి యుద్ధము ఇమ్ము. నీకు భయము లేదని అయినా చెప్పుము; లేదా అంజలి ఘటించి జయించబడినానని ఒప్పుకొనుము." 27

మూ. ఏతస్మిన్నన్తరే క్రుద్ధా వరుణస్య మహాత్మనః, 28
పుత్రాః పౌత్రాశ్చ నిష్క్రామన్ గౌశ్చ పుష్కర ఏవ చ.

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యయందు, మహాత్మనః = మహాత్ముడైన, వరుణస్య = వరుణునియొక్క, పుత్రాః = పుత్రులు, పౌత్రాశ్చ = పౌత్రులు, గౌశ్చ = గౌ అనువాడు, పుష్కర ఏవ చ = పుష్కరుడు, క్రుద్ధాః = కోపించినవారై, నిష్క్రామన్ = బైటకు వచ్చిరి.

తా. ఇంతలో మహాత్ముడైన వరుణుని పుత్రులు, పౌత్రులు, వాళ్ళ బలాధ్యక్షులైన గో-పుష్కరులు కోపముతో బైలుదేరి వచ్చిరి. 28

మూ. సమీక్ష్య స్వబలం సంఖ్యే వరుణస్య సుతాస్తదా, 32
అర్దితాః శరజాలేన నివృత్తా రణకర్మణః.

ప్ర. అ. తదా = అప్పుడు, వరుణస్య = వరుణునియొక్క, సుతాః = కుమారులు, సంఖ్యే = యుద్ధమునందు, స్వబలమ్ = తమ సైన్యమును, సమీక్ష్య = చూచి, శరజాలేన = బాణముల సముదాయముచేత, అర్దితాః = పీడింపబడినవారై, రణకర్మణః = యుద్ధముచేయుటనుండి, నివృత్తాః = మరలిరి.

తా. అప్పుడు వరుణుని కుమారులు యుద్ధములో తమ సైన్యములు పడిపోవుట చూచి, బాణములచేత పీడితులై యుద్ధమునుండి విరమించిరి. 32

మూ. మహీతలగతాస్తే తు రావణం దృశ్య పుష్పకే, 33
ఆకాశమాశు వివిశుః స్యన్దనైః శీఘ్రగామిభిః.

ప్ర. అ. మహీతలగతాః = నేలమీద ఉన్న, తే = వారు, పుష్పకే = పుష్పకమునందు, రావణమ్ = రావణుణ్ణి, దృశ్య = చూచి, శీఘ్రగామిభిః = శీఘ్రముగా వెళ్లు, స్యన్దనైః = రథములతో, ఆకాశమ్ = ఆకాశమును, వివిశుః = ప్రవేశించిరి.

తా. నేలమీద ఉన్న ఆ వరుణపుత్రులు పుష్పకములో ఉన్న రావణుణ్ణి చూచి శీఘ్రముగా నడచు రథములతో ఆకాశములోనికి వెళ్ళిరి. 33

మూ. మహదాసీత్తతస్తేషాం తుల్యం స్థానమవాప్య తత్, 34
ఆకాశయుద్ధం తుములం దేవదానవయోరివ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తత్ = ఆ, తుల్యమ్ = సమానమైన, స్థానమ్ = స్థానమును, అవాప్య = పొంది, తేషామ్ = వాళ్ళకు, దేవదానవయోరివ = దేవదానవులకు వలె, తుములమ్ = వ్యాకులమైన, మహత్ = గొప్ప, ఆకాశయుద్ధమ్ = ఆకాశమునందు యుద్ధము, ఆసీత్ = అయెను.

తా. పిమ్మట సమానస్థానములలో ఉన్న ఆ రావణ-వరుణ కుమారులకు దేవదానవులకు వలె, వ్యాకులమైన గొప్ప యుద్ధము జరిగెను. 34

మూ. తతస్తే రావణం యుద్ధే శరైః పావకసంనిభైః, 35
విముఖీకృత్య సంహృష్టా వినేదుర్వివిధాన్ రవాన్.

ప్ర. అ. తేషామ్ = ఆ, వరుణసూనూనామ్ = వరుణపుత్రులయొక్క యోధాన్ = యోధులను, తాన్ = ఆ, హయాన్ చ = గుఱ్ఱములను, హత్వా = చంపి, విరథాన్ = రథములు లేని, స్థితాన్ = నిలచి ఉన్న, తాన్ = వాళ్ళను, ప్రేక్ష్య = చూచి, ఆశు = శీఘ్రముగా, మహానాదమ్ = మహాధ్వనిని, ముమోచ = విడచెను.

తా. మహోదరుడు వరుణపుత్రుల యోధులను, గుఱ్ఱములను చంపి, రథములు లేక నేలమీద నిలచిన వాళ్ళను చూచి గొప్ప ధ్వని చేసెను. 38

మూ. తే తు తేషాం రథాః సాశ్వాః సహసారథిభిర్వరైః, 39
మహోదరేణ నిహతాః పతితాః పృథివీతలే.

ప్ర. అ. తేషామ్ = వాళ్ళయొక్క, సాశ్వాః = గుఱ్ఱములతో కూడిన, తే = ఆ, రథాః = రథములు, వరైః = శ్రేష్ఠులైన, సారథిభిః సహ = సారథులతో కూడ, మహోదరేణ = మహోదరునిచేత, నిహతాః = కొట్టబడినవై, పృథివీతలే = నేలమీద, పతితాః = పడినవి.

తా. మహోదరుడు కొట్టివేయగా అశ్వములతోను, శ్రేష్ఠులైన సారథులతోను సహా ఆ వరుణపుత్రుల రథములు నేలమీద కూలినవి. 39

మూ. తే తు త్యక్త్వా రథాన్ పుత్రా వరుణస్య మహాత్మనః, 40
ఆకాశే విష్ఠితాః శూరాః స్వప్రభావాన్న వివ్యథుః.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, వరుణస్య = వరుణునియొక్క, తే = ఆ, శూరాః = శూరులైన, పుత్రాః = పుత్రులు, రథాన్ = రథములను, త్యక్త్వా = విడచి, ఆకాశే = ఆకాశమునందు, విష్ఠితాః = నిలచినవారై, స్వప్రభావాత్ = తమ ప్రభావమువలన, న వివ్యథుః = వ్యథ చెందలేదు.

తా. మహాత్ముడైన వరుణుని శూరులైన కుమారులు రథములు విడచి, ఆకాశముమీద నిలచి సహజముగా ప్రభావవంతులగుటచేత వ్యథ చెందలేదు. 40

మూ. ధనూంషి కృత్వా సజ్జాని వినిర్భిద్య మహోదరమ్, 41
రావణం సమరే క్రుద్ధాః సహితాః సమవారయన్.

మూ. ముసలాని విచిత్రాణి తతో భల్లశతాని చ. 44
పట్టిశాంశ్చైవ శక్తీశ్చ శతఘ్నీర్మహతీరపి,
పాతయామాస దుర్ధర్షస్తేషాముపరి విష్ఠితః. 45

ప్ర. అ. దుర్ధర్షః = ఎదిరింప శక్యము కాని అతడు, విష్ఠితః = స్థిరముగా నిలచినవాడై, తతః = అటుపిమ్మట, విచిత్రాణి = విచిత్రములైన, ముసలాని = ముసలములను, భల్లశతాని చ = వందలకొలది భల్ల బాణములను, పట్టిశాన్ చైవ = పట్టిశములను, శక్తీః = శక్తులను, మహతీః = గొప్ప, శతఘ్నీః = శతఘ్నులను, తేషామ్ = వాళ్లయొక్క, ఉపరి = పైన, పాతయామాస = పడవేసెను.

తా. ఎదురింప శక్యము కాని ఆ రావణుడు స్థిరముగా నిలచి విచిత్రములైన ముసలములను, వందలకొలది భల్ల బాణములను, పట్టిశములను, శక్తులను, గొప్ప శతఘ్నులను వాళ్లపై ప్రయోగించెను. 44, 45

మూ. అపవిద్ధాస్తు తే వీరా వినిష్పేతుః పదాతయః,
తతస్తేనైవ సహసా సీదన్తి స్మ పదాతినః, 46
మహాపఙ్క మివాసాద్య కుఞ్జరాః షష్టిహాయనాః.

ప్ర. అ. అపవిద్ధాః = చెదరగొట్టబడిన, పదాతయః = కాలిబంటులైన, తే వీరాః = ఆ వీరులు, వినిష్పేతుః = శీఘ్రముగా వచ్చిరి. తతఃఅటుపిమ్మట, తేనైవ = ఆ ఆయుధవర్షముచేతనే, పదాతినః = కాళ్ళతో నడచుచున్న ఆ వరుణపుత్రులు, మహాపఙ్కమ్ = గొప్ప బురదను, ఆసాద్య = పొంది, షష్టిహాయనాః = అరువది సంవత్సరములు గల, కుఞ్జరాః ఇవ = ఏనుగులు వలె, సహసా = వెంటనే, సీదన్తి స్మ = క్షీణించుచుండిరి.

తా. ఆ విధముగా చెదరగొట్టబడిన, పాదచారులైన ఆ వీరులు శీఘ్రముగా ఆతనిమీదికి వచ్చిరి. పిమ్మట ఆ ఆయుధవర్షముచేత నడచుచు యుద్ధము చేయుచున్న ఆ వరుణపుత్రులు గొప్ప బురదలో చిక్కుకొన్న, అరవై సంవత్సరాల వయస్సు గల ఏనుగులు వలె క్షీణించుచుండిరి. 46

మూ. సీదమానాన్సుతాన్ దృష్ట్వా విహ్వలాన్ స మహాబలః,
ననాద రావణో హర్షాన్మహానమ్బుధరో యథా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రక్షః = రావణుడు, తాన్ = వాళ్లను గూర్చి, అబ్రవీత్ = పలికెను. వరుణాయ = వరుణునకు, నివేద్యతామ్ = తెలుపబడుగాక. ప్రహాసో నామ = ప్రహాసు డను, వారుణః = వరుణుని సంబంధమైన, మన్త్రి = మంత్రి, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు రావణుడు వారితో "వరుణునికి చెప్పుడు" అని పలికెను. ప్రహాసు డను వరుణుని మంత్రి రావణునితో ఇట్లనెను. 50

మూ. గతః ఖలు మహారాజో బ్రహ్మలోకం జలేశ్వరః, 51
గాన్ధర్వం వరుణః శ్రోతుం యం త్వమాహ్వాయసే యుధి.

ప్ర. అ. యమ్ = ఎవనిని, త్వమ్ = నీవు, యుధి = యుద్ధమునందు, ఆహ్వాయసే = పిలచుచున్నావో, అట్టి, మహారాజః = మహారాజైన, జలేశ్వరః = జలముల అధిపతియైన, వరుణః = వరుణుడు, గాన్ధర్వమ్ = సంగీతమును, శ్రోతుమ్ = వినుటకు, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, గతః ఖలు = వెళ్ళినాడు కదా.

తా. నీవు ఎవనిని యుద్ధానికి పిలచుచున్నావో ఆ మహారాజూ, జలాధిపతీ అయిన వరుణుడు సంగీతము వినుటకై బ్రహ్మలోకమునకు వెళ్ళినాడు. 51

మూ. తత్కిం తవ వృథా వీర పరిశ్రమ్య గతే నృపే, 52
యే తు సంనిహితా వీరాః కుమారాస్తే పరాజితాః.

ప్ర. అ. వీర = ఓ! వీరుడా! తత్ = ఆ కారణమువలన, నృపే = రాజు, గతే = వెళ్ళిన వాడగుచుండగా, తవ = నీకు, వృథా = వ్యర్థముగా, పరిశ్రమ్య = పరిశ్రమించి, కిమ్ = ఏమి ప్రయోజనము? వీరాః = వీరులైన, యే = ఏ, కుమారాః = కుమారులు, సంనిహితాః = సంనిహితులో, తే = వారు, పరాజితాః = ఓడింపబడినారు.

తా. "అందువలన ఓ వీరుడా! రాజు లేనప్పుడు నీవు వ్యర్థముగా పరిశ్రమ చేసి ఏమి ప్రయోజనము? ఇక్కడ ఉన్న వీరులైన వరుణుని పుత్రులను నీవు ఓడించే ఉన్నావు కదా?" 52

మూ. రాక్షసేన్ద్రస్తు తచ్ఛ్రుత్వా నామ విశ్రావ్య చాత్మనః, 53
హర్షాన్నాదం విముఞ్చన్వై నిష్క్రాన్తో వరుణాలయాత్.

# అథ ప్రక్షిప్తాః పఞ్చ సర్గాః

(రాబోవు ఐదు సర్గలు ప్రక్షిప్త సర్గలు. వ్యాఖ్యాతలు వీటికి వ్యాఖ్యలు వ్రాయలేదు.)

[*రావణుడు బలిచక్రవర్తి నివసించు అశ్మనగరమునకు వెళ్లి ఆతనిని చూచి మాటలాడుట.*]

మూ. తతోఽశ్మనగరం భూయో విచేరుర్యుద్ధదుర్మదాః,
యత్రాపశ్యద్దశగ్రీవో గృహం పరమభాస్వరమ్. 1

వైదూర్యతోరణాకీర్ణం ముక్తాజాలవిభూషితమ్,
సువర్ణస్తమ్భగహనం వేదికాభిః సమన్తతః. 2

వజ్రస్ఫటికసోపానం కిఙ్కిణీజాల సంవృతమ్,
బహ్వాసనయుతం రమ్యం మహేన్ద్రభవనోపమమ్. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యుద్ధదుర్మదాః = యుద్ధమునందు పెద్ద మదము గల ఆ రాక్షసులు, భూయః = మరల, అశ్మనగరమ్ = అశ్మనగరమును, విచేరుః = సంచరించిరి. యత్ర = ఏ నగరమునందు, దశగ్రీవః = రావణుడు, పరమభాస్వరమ్ = చాల ప్రకాశించుచున్నది, వైదూర్య తోరణాకీర్ణమ్ = వైదూర్య మాణిక్యముల వికారమైన ముఖద్వారములతో వ్యాప్తము, ముక్తాజాలవిభూషితమ్ = ముత్యముల సముదాయముచేత అలంకరించ బడినదీ, సువర్ణస్తమ్భగహనమ్ = బంగారు స్తంభములతో ప్రవేశింప శక్యముకానిదీ, సమన్తతః = అన్ని వైపులా, వేదికాభిః = అరుగులతో కూడినదీ, వజ్రస్ఫటిక సోపానమ్ = వజ్రములయొక్క, స్ఫటికములయొక్క మెట్లు గలది, కిఙ్కిణీజాలసంయుతమ్ = చిరుగంటల సముదాయముతో కూడినదీ, బహ్వాసనయుతమ్ = అనేకమైన ఆసనములతో కూడినదీ, రమ్యమ్ = సుందరము, మహేన్ద్రభవనోపమమ్ = మహేంద్రుని భవనముతో సమానమూ అయిన, గృహమ్ = గృహమును, అపశ్యత్ = చూచెనో.

తా. పిమ్మట యుద్ధమునందు అత్యధికమైన మదము గల ఆ రాక్షసులు

తా. ప్రహస్తుడు ఆతని ఆజ్ఞ ప్రకారము ఆ గృహశ్రేష్ఠములో ప్రవేశించెను. కాని ఆ ప్రదేశము జనశూన్యమై ఉండుట చూచి మరియొక వాకలిలో ప్రవేశించెను.

మూ. సప్త కక్ష్యాన్తరం గత్వా తతో జ్వాలామపశ్యత, 6
తతో దృష్టః పుమాంస్తత్ర హృష్టో హాసం ముమోచ సః.

ప్ర. అ. సప్తకక్ష్యాన్తరమ్=ఏడు వాకిళ్ల మధ్య భాగమును గూర్చి, గత్వా = వెళ్ళి, తతః = అటుపిమ్మట, జ్వాలామ్ = జ్వాలను, అపశ్యత = చూచెను. తతః= అటుపిమ్మట, తత్ర = అక్కడ, పుమాన్ = ఒక పురుషుడు, దృష్టః = చూడబడెను. హృష్టః=సంతోషించిన, సః=అతడు, హాసమ్=నవ్వును, ముమోచ = విడచెను.

తా. ఏడు వాకిళ్ళ లోపలికి వెళ్ళి అతడు జ్వాలను చూచెను. పిమ్మట ఒక పురుషుడు కనబడెను. అతడు సంతోషించి బిగ్గరగా నవ్వెను. 6

మూ. శ్రుత్వా స తు మహాహాసమూర్ధ్వరోమాభవత్తదా, 7
జ్వాలామధ్యే స్థిత స్తత్ర హేమమాలీ న్యదృశ్యత,
ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యః సాక్షాదివ యమః స్థితః. 8

ప్ర. అ. సః = అతడు, తదా=అప్పుడు, మహాహాసమ్=గొప్ప నవ్వును, శ్రుత్వా=విని, ఊర్ధ్వరోమా = పైకి రోమములు కలవాడుగా, అభవత్=అయెను. తత్ర=అక్కడ, జ్వాలామధ్యే=జ్వాల మధ్యయందు, స్థితః=ఉన్న, హేమమాలీ= బంగారు మాల గల పురుషుడు, న్యదృశ్యత = చూడబడెను. ఆదిత్యః ఇవ= సూర్యుడు వలె, దుష్ప్రేక్ష్యః=చూడ శక్యము కాని అతడు, సాక్షాత్=సాక్షాత్తు, యమః ఇవ = యముడు వలె, స్థితః = ఉండెను.

తా. ఆ అట్టహాసము వినగానే ఆతని ఒడలు గగుర్పొడిచెను. ఆ జ్వాలా మధ్యమునందు బంగారు మాల ధరించిన పురుషుడు కనబడెను. సూర్యుడు వలె చూడశక్యముకాని ఆ పురుషుడు సాక్షాత్తు యముడు వలె ఉండెను. 7,8

మూ. తథా దృష్ట్వా తు వృత్తాన్తం త్వరమాణో వినిర్గతః,
వినిర్గమ్యాబ్రవీత్సర్వం రావణాయ నిశాచరః. 9

సహసా = వెంటనే, ద్వారమ్ = ద్వారమును, ఆవృత్య = కప్పి, అస్య = వీని యొక్క, అగ్రతః = ఎదుట, స్థితః = నిలబడెను.

తా. శిరస్సుపై చంద్రుణ్ణి ధరించిన పెద్ద శరీరము గల ఒక భయంకరుడైన పురుషుడు హటాత్తుగా వచ్చి ద్వారమునకు అడ్డముగా రావణుని ఎదుట నిలబడెను. అతని నాలుక అగ్నిజ్వాల వలె ఉండెను. కళ్ళు ఎఱ్ఱగా ఉండెను. దంతములు అందముగా ఉండెను. పెదవులు దొండపండు వలె ఎఱ్ఱగా ఉండెను. అతడు చూచుటకు అందముగా ఉండెను. ముక్కు చాల భయంకరముగా ఉండెను. శంఖము వంటి కంఠము గల అతని దవుడలు చాల పెద్దవిగా ఉండెను. 11, 12

మూ. రూఢశ్మశ్రుర్నిగూఢాస్థిర్దంష్ట్రాలో లోమహర్షణః,
గృహీత్వా లోహముసలం ద్వారం విష్టభ్య తిష్ఠతి. 13

ప్ర. అ. రూఢశ్మశ్రుః = (దట్టముగా) మొలచిన మీసము గలవాడు, నిగూఢాస్థిః = అణగిన (ఎముకలు) గలవాడు, దంష్ట్రాలః = పెద్ద కోరలు గలవాడు, లోమహర్షణః = రోమాంచమును కలిగించువాడు అయిన ఆ పురుషుడు, లోహముసలమ్ = ఇనుప ముసలమును, గృహీత్వా = గ్రహించి, ద్వారమ్ = ద్వారమును, విష్టభ్య = అడ్డుకొని, తిష్ఠతి = నిలచి ఉన్నాడు.

తా. ఇనుప రోకలిని చేతిలో ధరించి ద్వారానికి అడ్డముగా నిలచిన ఆతని మీసములు చాలా దట్టముగా ఉండెను. ఎముకలు పైకి కనబడుటలేదు. (కండరముల పుష్టితో ఉండెను). పెద్ద కోరలతో గగుర్పాటు కలిగించేటట్లు ఉండెను. 13

మూ. అథ సందర్శనాత్తస్య ఊర్ధ్వరోమా బభూవ సః,
హృదయం కమ్పతే చాస్య వేపథుశ్చాప్యజాయత. 14

ప్ర. అ. అథ = పిమ్మట, తస్య = వానియొక్క, సందర్శనాత్ = చూచుట వలన, సః = అతడు, ఊర్ధ్వలోమా = పైకి లేచిన రోమములు కలవాడు, బభూవ = ఆయెను. అస్య = వీనియొక్క, హృదయమ్ = హృదయము, కమ్పతే = కంపించుచున్నది. వేపథుః చ = వణకు కూడ, అజాయత = పుట్టెను.

తా. ఆతనిని చూడగానే రావణుని ఒడలు గగుర్పొడిచెను. గుండె కొట్టుకొనెను. వణకు పుట్టెను. 14

మూ. రావణోఽభిహితో భూయ ఊర్ధ్వరోమా వ్యజాయత,
అథ ధైర్యం సమాలమ్బ్య రావణో వాక్యమబ్రవీత్. 18

ప్ర. అ. అభిహితః=ఇట్లు పలకబడిన, రావణః=రావణుడు, భూయః= మరల, ఊర్ధ్వరోమా = లేచిన రోమములు గలవాడుగా, వ్యజాయత = ఆయెను. అథ = పిమ్మట, రావణః = రావణుడు, ధైర్యమ్ = ధైర్యమును, సమాలమ్బ్య = అవలంబించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆతని మాటలు వినగానే రావణునకు మరల గగుర్పాటు కలిగెను. పిదప అతడు ధైర్యము అవలంబించి ఇట్లు పలికెను. 18

మూ. గృహేషు తిష్ఠతే కో హి తద్ బ్రూహి వదతాం వర,
తేనైవ సహ యోత్స్యామి యథా వా మన్యతే భవాన్. 19

ప్ర. అ. వదతామ్ = మాటలాడుచున్నవారిలో, వర = శ్రేష్ఠుడా ! గృహేషు = గృహమునందు, కః హి = ఎవడు, తిష్ఠతే = ఉన్నాడో, తత్ = దానిని, బ్రూహి=చెప్పుము. తేనైవ సహ = ఆతనితోనే, యోత్స్యామి=యుద్ధము చేసెదను. భవాన్ = నీవు, యథా వా = ఎట్లు, మన్యసే = తలచుచున్నావో.

తా. మాటలాడువారిలో శ్రేష్ఠుడా! ఈ గృహములో ఎవరున్నారో చెప్పుము; ఆతనితోనే యుద్ధము చేసెదను. లేదా నీవు ఎట్లు తలచెదవో అట్లే చేసెదను.

మూ. స ఏనం పునరప్యాహ దానవేన్ద్రోఽత్ర తిష్ఠతి,
ఏష వై పరమోదారః శూరః సత్యపరాక్రమః. 20

ప్ర. అ. సః = అతడు, పునరపి = మరల, ఏనమ్ = ఇతనిని గూర్చి, ఆహ = పలికెను. అత్ర = ఇక్కడ, దానవేన్ద్రః = దానవుల ప్రభువు, తిష్ఠతి = ఉన్నాడు. ఏషః = ఇతడు, పరమోదారః=మిక్కిలి ఉదారుడు, శూరః = శూరుడు, సత్యపరాక్రమః వై = సత్యమైన పరాక్రమము గలవాడు.

తా. ఆ పురుషుడు మరల ఇట్లు పలికెను—"ఈ గృహములో దానవప్రభువు నివసించుచున్నాడు. ఇతడు చాల ఔదార్యవంతుడు; శూరుడు; సత్యమైన పరాక్రమము గలవాడు. 20

మునందు ఆసక్తి గలవాడు, ఏషః = ఇతడు, గచ్ఛతి = వెళ్లుచున్నాడు; ఏషః = ఇతడు, వాతి = వీచుచున్నాడు, జ్వలతే = మండుచున్నాడు; తథా = మరియు, తపతే = తపించుచున్నాడు.

తా. గొప్ప ధైర్యము గల ఇతడు తొందరపాటు లేక తగు సమయము నకై వేచి ఉండువాడు, సత్యము పలుకువాడు. ఈతడు చూచుటకు చాల సౌమ్యుడు. కార్యసమర్థుడు. సమస్తగుణములు ఉన్నవాడు, శూరుడు. వేదాధ్యయనమునందు ఆసక్తి గలవాడు. ఇతడు నడచును. ఇతడు వీచును. ఇతడు ప్రజ్వలించును. వేడి కలిగించును. (అనగా వాయ్వగ్న్యాదుల శక్తి ఇతని కున్నదని భావము) 23

మూ. దేవైశ్చ భూతసంఘైశ్చ పన్నగైశ్చ పతత్రిభిః 24
భయం యో నాభిజానాతి తేన త్వం యోద్ధుమిచ్ఛసి.

ప్ర. అ. యః = ఎవడు, దేవైశ్చ = దేవతలతోను, భూతసంఘైశ్చ = భూతముల సముదాయములతోను, పన్నగైశ్చ = సర్పములతోను, పతత్రిభిః = పక్షులతోను, భయమ్ = భయమును, నాభిజానాతి = ఎరుగడో, తేన = అట్టి వానితో, త్వమ్ = నీవు, యోద్ధుమ్ = యుద్ధముచేయుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. ఇతడు దేవతలకు గాని, భూతముల సముదాయములకు గాని, సర్పములకు గాని, పక్షులకు గాని భయపడి ఎరుగడు. అట్టి వానితో నీవు యుద్ధము చేయవలె నని కోరుచున్నావు! 24

మూ. బలినా యది తే యోద్ధుం రోచతే రాక్షసేశ్వర, 25
ప్రవిశ త్వం మహాసత్త్వ సంగ్రామం కురు మా చిరమ్.

ప్ర. అ. మహాసత్త్వ = గొప్ప బలము గలవాడా! రాక్షసేశ్వర = రాక్షసరాజా! బలినా = బలితో, యోద్ధుమ్ = యుద్ధముచేయుటకు, తే = నీకు, రోచతే యది = ఇష్టమైనచో, త్వమ్ = నీవు, ప్రవిశ = ప్రవేశించుము. సంగ్రామమ్ = యుద్ధమును, కురు = చేయుము, చిరమ్ = చిరకాలము (ఆలస్యము), మా = వద్దు.

తా. మహాబలవంతుడవైన రాక్షసరాజా! నీకు బలితో యుద్ధము చేయుట ఇష్టమైనచో లోపలికి వెళ్ళుము. యుద్ధము చేయుము. ఆలస్యము చేయకుము. 25

తా. గొప్ప బాహువులు గల రావణా! నీకు నేను ఏమి కోరిక తీర్చవలెను? రాక్షసరాజా! నీవు వచ్చిన పని యేమి? చెప్పుము. 29

మూ. ఏవముక్తస్తు బలినా రావణో వాక్యమబ్రవీత్,
శ్రుతం మయా మహాభాగ బద్ధస్త్వం విష్ణునా పురా, 30
సోఽహం మోక్షయితుం శక్తో బన్ధనాత్త్వాం న సంశయః.

ప్ర. అ. బలినా = బలిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, రావణః=రావణుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహాభాగ= మహాభాగ్యవంతుడా! త్వమ్ = నీవు, పురా = పూర్వము, విష్ణునా = విష్ణువుచేత, బద్ధః = కట్టబడినావు అని, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది. సః అహమ్ = అట్టి నేను, త్వామ్ = నిన్ను, బన్ధనాత్ = బంధనమునుండి, మోక్షయి తుమ్=విడిపించుటకు, శక్తః=సమర్థుడను. సంశయః=సంశయము, న=లేదు.

తా. బలి మాటలు విని రావణుడు ఇట్లు పలికెను-"పూర్వము నిన్ను విష్ణువు బంధించినా డని వింటిని. నేను నిన్ను బంధనమునుండి విడిపించగలను. సందేహము లేదు". 30

మూ. ఏవముక్తే తతో హాసం బలిర్ముక్త్వైనమబ్రవీత్, 31
శ్రూయతామభిధాస్యామి యత్త్వం పృచ్ఛసి రావణ.

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తే= పలకబడగా, తతః=పిమ్మట, బలిః= బలి, హాసమ్ = నవ్వును, ముక్త్వా = విడచి, ఏనమ్ = ఇతనిని గూర్చి, అబ్రవీత్ = పలికెను. రావణ = రావణా! త్వమ్ = నీవు. యత్ = దేనిని, పృచ్ఛసి = అడుగుచున్నావో, అభిధాస్యామి = చెప్పెదను. శ్రూయతామ్ = వినబడుగాక.

తా. బలి ఆ మాటలు విని నవ్వి ఇట్లు పలికెను-"రావణా! నీవు అడిగిన దానిని గూర్చి చెప్పెదను, వినుము. 31

మూ. య ఏష పురుషః శ్యామో ద్వారే తిష్ఠతి నిత్యదా, 32
ఏతేన దానవేన్ద్రాశ్చ తథాన్యే బలవత్తరాః,
వశం నీతా బలవతా పూర్వే పూర్వతరాశ్చ తే. 33

మూ. నత్వం వేద న చైవాహం భూతభవ్యభవత్ప్రభుః,
కలిశ్చైవైష కాలశ్చ సర్వభూతాపహారకః. 36

ప్ర. అ. త్వమ్ = నీవు, న వేద = ఎరుగవు. అహం చ = నేను కూడ, నైవ = ఎరుగను. భూతభవ్యభవత్ప్రభుః = జరిగిపోయినదానికి జరగనున్న దానికి, జరుగుచున్నదానికి ప్రభువు. ఏషః = ఇతడు, కలిశ్చ = కలి పురుషుడు. కాలశ్చ = కాలము, సర్వభూతపహారకః = సమస్తప్రాణులను సంహరించువాడు.

తా. ఇతడు జరిగిపోయినదానికి, జరగనున్నధానికి, జరుగుచన్నదానికి ప్రభువు. ఇతడే కలి; ఇతడే కాలము. సకలప్రాణులను సంహరించువాడు. ఇతని గూర్చి నీవు గాని నేను గాని తెలిసికొనజాలము. 36

మూ. లోకత్రయస్య సర్వస్య హర్తా స్రష్టా తథైవ చ,
సంహరత్యేష భూతాని స్థావరాణి చరాణి చ. 37

ప్ర. అ. సర్వస్య = సమస్తమైన, లోకత్రయస్య = లోకత్రయమునకు, హర్తా = సంహారకుడు. తథైవ చ = మరియు, స్రష్టా = సృజించువాడు. ఏషః = ఇతడు, స్థావరాణి = స్థిరములు, చరాణి చ = చరములు అయిన, భూతాని = భూతములను (ప్రాణులను), సంహరతి = సంహరించును.

తా. ఇతడు మూడు లోకములనూ సంహరించును; సృజించును. ఇతడు స్థావరములు, జంగమములు అయిన ప్రాణులను సంహరించుచుండును. 37

మూ. పునశ్చ సృజతే సర్వమనాద్యన్తో మహేశ్వరః,
ఇష్టం చైవ హి దత్తం చ హుతం చైవ నిశాచర. 38

ప్ర. అ. నిశాచర = రాక్షసుడా! అనాద్యన్తః = ఆది కాని అంతము కాని లేని, మహేశ్వరః = మహేశ్వరుడు. సర్వమ్ = సమస్తమునూ, పునశ్చ = మరల, సృజతే = సృజించును. ఇష్టమ్ = యాగము, దత్తం చ = దానము, హుతం చైవ = హోమమూ కూడ ఇతడే.

తా. రావణా! ఆది కాని అంతము కాని లేని ఈ మహేశ్వరుడు సంహరించినదానిని అంతనూ మరల సృజించుచుండును. ఇతడు యాగస్వరూపుడు; దానస్వరూపుడు; హోమస్వరూపుడు. 38

చ=యమలార్జునులు, కంసశ్చ=కంసుడు, మధునా సహ=మధువుతో కూడ, కైటభః=కైటభుడు, ఏతే=వీరందరు, తపన్తి=తపించుదురు (వేడి కలిగింతురు), ద్యోతన్తి=ప్రకాశించుచుందురు. వాన్తి=వీచుదురు; వర్షన్తి చైవ హి= వర్షింతురు.

తా. వృత్రుడు, దనువు, శుకుడు, శంబుడు, నిశుంభుడు, శుంభుడు, కాలనేమి, ప్రహ్లాదునికుమారుడు, కూటుడు, విరోచనుని పుత్రుడు, మృదువు, యమలార్జునులు, కంసుడు, కైటభుడు, మధువు వీరందరూ తపించగలరు; ప్రకాశించగలరు; వీచగలరు; వర్షించగలరు. 41,42

మూ. సర్వైః క్రతుశతైరిష్టం సర్వైస్తప్తం మహత్తపః,
సర్వే తే సుమహాత్మానః సర్వే వై యోగధర్మిణః. 43

ప్ర. అ. సర్వైః=వాళ్ల అందరిచేత, క్రతుశతైః=వందలకొలది క్రతువులచేత, ఇష్టమ్=యాగము చేయబడినది. మహత్=గొప్ప, తపః=తపస్సు, తప్తమ్=చేయబడినది. సర్వే=సమస్తమైన, తే=వారు, సుమహాత్మానః= చాల మహాత్ములు. సర్వే = అందరూ, యోగధర్మిణః వై=యోగధర్మము గలవారే.

తా. వాళ్ళందరూ వందలకొలది యజ్ఞములు చేసిరి. అందరూ గొప్ప తపస్సుచేసిరి. వారందరూ చాల మహాత్ములే. అందరూ యోగాభ్యాసము చేసినవారే.

మూ. సర్వైరైశ్వర్యమాసాద్య భుక్తం భోగైర్మహత్తరైః,
దత్తమిష్టమధీతం చ ప్రజాశ్చ పరిపాలితాః. 44

ప్ర. అ. సర్వైః=అందరిచేతను, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, ఆసాద్య= పొంది, మహత్తరైః= చాల గొప్ప, భోగైః=భోగములచేత, భుక్తమ్=అనుభవించుట చేయబడినది. దత్తమ్=ఇవ్వబడినది. ఇష్టమ్=యాగము చేయబడినది. అధీతం చ=అధ్యయనము చేయబడినది. ప్రజాశ్చ=ప్రజలు కూడ, పరిపాలితాః =పాలింపబడిరి.

తా. వారందరూ కూడ ఐశ్వర్యము పొంది చాల గొప్ప భోగములు అనుభవించినారు. దానములు, యాగములు చేసినారు. అధ్యయనము చేసినారు. ప్రజలను పాలించినారు. 44

మూ. దేవానామప్రియే సక్తాః స్వపక్షపరిపాలకాః,
ప్రమత్తాశ్చోపసక్తాశ్చ బాలార్కసమతేజసః. 48

ప్ర. అ. దేవానామ్ = దేవతలకు, అప్రియే = అప్రియము చేయుటయందు, సక్తాః = ఆసక్తులు. స్వపక్షపరిపాలకాః = తమ పక్షమును పాలించువారు. ప్రమత్తాః = బాగా మదించినవారు. ఉపసక్తాశ్చ = (భోగములయందు) ఆసక్తులు. బాలార్కసమతేజసః = బాలసూర్యునితో సమానమైన తేజస్సు కలవారు.

తా. దేవతలకు అపకారము చేయుటయందు అసక్తి గలవారు. తమ పక్షమును పాలించువారు. మదించినవారు. భోగాసక్తులు. బాలసూర్యునితో సమానమైన తేజస్సు గలవారు. 48

మూ. యే తు దేవాన్ ప్రధర్షన్తే తదేషాం విష్ణురీశ్వరః,
ఉపాయపూర్వకం నాశం సంవేత్తా భగవాన్ హరిః. 49

ప్ర. అ. యే తు = ఎవరు, దేవాన్ = దేవతలను, ప్రధర్షన్తే = అవమానింతురో, తదేషామ్ = అట్టివారియొక్క, ఉపాయపూర్వకమ్ = ఉపాయపూర్వకముగా, నాశమ్ = నాశమును గూర్చి, ఈశ్వరః = ప్రభుపూ, భగవాన్ = భగవంతుడైన, విష్ణుః = సర్వవ్యాపకుడైన, హరిః = విష్ణువు, సంవేత్తా = ఎరిగినవాడు.

తా. సర్వసమర్థుడు, సర్వవ్యాపకుడూ, భగవంతుడూ అయిన విష్ణువు దేవతలను అవమానించువారిని ఉపాయపూర్వకముగా ఎట్లు నశింపచేయవలెనో బాగుగా తెలిసినవాడు. 49

మూ. ప్రాదుర్భావం వికురుతే యేనైతన్నిధనం భవేత్,
పునరేవాత్మనాత్మానమధిష్ఠాయ స తిష్ఠతి. 50

ప్ర. అ. యేన = దేనిచేత, ఏతన్నిధనమ్ = వీళ్ళ నాశనము, భవేత్ = అగునో, అట్టి, ప్రాదుర్భావమ్ = పుట్టుకను, వికురుతే = చేయును. పునరేవ = తిరిగి, ఆత్మానమ్ = తనను, ఆత్మనా = తనచేత, అధిష్ఠాయ = అధిష్ఠించి, సః = అతడు, తిష్ఠతి = ఉండును.

తా. అతడు దేవతలను బాధించువారి నాశము చేయుటకే అవతారము లెత్తుచుండును. మరల తన స్వరూపముతో ఉండిపోవును. 50

తా. బలి చక్రవర్తి ఇట్లు పలికి రావణునితో మరల ఇట్లనెను. "గొప్ప బలముగల ఓ ! వీరుడా ! ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న ఆ చక్రమును నా వద్దకు తీసికొని రమ్ము." 53

మూ. తతోఽహం తవ వ్యాఖ్యాస్యే ముక్తికారణమవ్యయమ్, 54
తత్కురుష్వ మహాబాహో మా విలమ్బస్వ రావణ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అహమ్ = నేను, అవ్యయమ్ = మార్పు లేని, ముక్తికారణమ్ = నా విముక్తికి కారణమును, తవ = నీకు, ఆఖ్యాస్యే = చెప్పగలను. మహాబాహో = గొప్ప బాహువులు గల, రావణ = రావణా ! తత్ = దానిని, కురుష్వ = చేయుము. మా విలమ్బస్వ = ఆలస్యము చేయకుము.

తా. "తరువాత నేను నీకు నా విడుదలకు తిరుగులేని ఉపాయమును చెప్పెదను. గొప్ప బాహువులు గల రావణా! ఆ పని చేయుము. ఆలసించకుము." 54

మూ. ఏతచ్ఛ్రుత్వా గతో రక్షః ప్రహసంశ్చ మహాబలః, 55
యత్ర స్థితం మహద్దివ్యం కుణ్డలం రఘునన్దన.

ప్ర. అ. రఘునన్దన = రామా ! మహాబలః = గొప్ప బలము గల, రక్షః = రాక్షసుడు, ఏతత్ = ఈ వాక్యమును, శ్రుత్వా = విని, ప్రహసన్ చ = నవ్వుచు, దివ్యమ్ = దివ్యమైన, మహత్ = గొప్ప, కుణ్డలమ్ = కుండలము, యత్ర = ఎక్కడ, స్థితమ్ = ఉన్నదో అక్కడికి, గతః = వెళ్ళెను.

తా. రామా ! గొప్ప బలము గల ఆ రాక్షసుడు ఈ మాట విని నవ్వుచు దివ్యమైన ఆ గొప్ప కుండల మున్న చోటికి వెళ్లెను. 55

మూ. లీలయోత్పాటనం చక్రే రావణో బలదర్పితః, 56
న చ చాలయితుం శక్తో రావణోఽభూత్కథం చన.

ప్ర. అ. బలదర్పితః = బలముచేత గర్వించిన, రావణః = రావణుడు, లీలయా = విలాసతో, ఉత్పాటనమ్ = పైకి లాగుటను, చక్రే = చేసెను. రావణః = రావణుడు, కథం చన = ఏ విధముగానూ కూడ, చాలయితుమ్ = కదల్చుటకు, శక్తః = సమర్థుడు, న చ అభూత్ = కాలేదు.

చేతనామ్ = చేతనను, లబ్ధ్వా = పొంది, ఉత్థితమ్ = లేచిన, లజ్జయా = సిగ్గుచేత, అవనతీభూతమ్ = వంగిన, రక్షః = రాక్షసుని గూర్చి, బలిః = బలి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. పిమ్మట ముహూర్తకాలములో స్పృహ వచ్చి సిగ్గుతో తలవంచుకొని ఉన్న రావణునితో బలి ఇట్లు పలికెను. 60

మూ. ఆగచ్ఛ రాక్షసశ్రేష్ఠ వాక్యం శృణు మయోదితమ్,
యత్త్వయా చోద్యతం వీర కుణ్డలం మణిభూషితమ్, 61
ఏతద్ధి పూర్వజస్యాసీత్కర్ణాభరణమీక్ష్యతామ్.

ప్ర. అ. రాక్షసశ్రేష్ఠ = రాక్షసులలో శ్రేష్ఠుడా! ఆగచ్ఛ = రమ్ము. మయా = నాచేత, ఉదితమ్ = పలకబడిన, వాక్యమ్ = వాక్యమును, శృణు = వినుము. వీర = వీరుడా! మణిభూషితమ్ = మణులచేత అలంకరించబడిన, యత్ = ఏ, కుణ్డలమ్ = కుండలము, ఉద్యతమ్ = ఎత్తబడినదో, ఏతత్ హి = ఇది, పూర్వజస్య = నా వంశములో పూర్వము పుట్టినవానియొక్క, కర్ణాభరణమ్ = చెవికి అలంకారముగా, ఆసీత్ = ఉండెను. ఈక్ష్యతామ్ = చూడబడుగాక.

తా. రావణా! రమ్ము; నేను చెప్పు మాటలు వినుము. నీవు ఎత్తిన, మణిభూషితమైన ఈ కుండలము మా ముత్తాతగారైన హిరణ్యకశిపుని చెవికి అలంకారముగా ఉండెడిది; చూడుము. 61

మూ. ఏతత్పతితవచ్చైవమత్ర భూమౌ మహాబల, 62
అన్యత్ పర్వతసానౌ హి పతితం కుణ్డలాదను,
ముకుటం వేదిసామీప్యే పతితం యుధ్యతో భువి, 63
హిరణ్యకశిపోః పూర్వం మమ పూర్వపితామహాత్.

ప్ర. అ. మహాబల = గొప్ప బలముగలవాడా! పూర్వమ్ = పూర్వము, యుధ్యతః = యుద్ధముచేయుచున్న, మమ పూర్వపితామహాత్ = నా ముత్తాతయైన, హిరణ్యకశిపోః = హిరణ్యకశిపునినుండి, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, అత్ర = ఈ, భూమౌ = భూమిమీద, పతితవత్ = పడినది. అన్యత్ = మరియొకటి, పర్వతసానౌ = పర్వతము చరియమీద, పతితమ్ = పడినది. కుణ్డలాదను = కుండలమును

ప్ర. అ. రాక్షసశ్రేష్ఠ = రాక్షసులలో శ్రేష్ఠుడా ! ప్రహ్లాదేన సమమ్ = ప్రహ్లాదునితో, పరమదారుణమ్ = చాల దారుణమైన, వాదమ్ = వాదమును, చక్రే = చేసెను. తస్య = ఆతనికి, సర్వవర్యస్య = అందరికి పూజ్యుడైన, వీరస్య = వీరుడైన, మహాత్మనః = మహాత్ముడైన, ప్రహ్లాదస్య = ప్రహ్లాదునికి, వాదే = వాదము, సముత్పన్నే = పుట్టినదగుచుండగా, లోకభయంకరః = లోకములకు భయము కలిగించు, నృసింహాకృతిరూపధృక్ = నృసింహాకారమును, రూపమును ధరించిన, ధీరః = ధీరుడు, ఉత్పన్నః = పుట్టినాడు.

తా. రావణా ! హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో చాల క్రూరమైన వాదమును చేసెను. అందరికి పూజ్యుడూ, మహాత్ముడూ, వీరుడూ అయిన ప్రహ్లాదునకూ, ఆ హిరణ్యకశిపునకూ వాదము ఏర్పడగా నృసింహాకారమును ధరించి లోకములకు భయము కలిగించు వీరుడు ఆవిర్భవించెను. 66, 67

మూ. దృష్టం చ తేన రౌద్రేణ క్షుబ్ధం సర్వమశేషతః, 68
తత ఉద్ధృత్య బాహుభ్యాం నఖైర్నిన్యే యమక్షయమ్,
ఏష తిష్ఠతి ద్వారస్థో వాసుదేవో నిరఞ్జనః. 69

ప్ర. అ. రౌద్రేణ = భయంకరుడైన, తేన = ఆ నృసింహునిచేత, దృష్టమ్ = చూడబడిన, సర్వమ్ = అంతయూ, క్షుబ్ధమ్ = క్షోభింపచేయబడినది. తతః = అటుపిమ్మట, బాహుభ్యామ్ = బాహువులచేత, ఉద్ధృత్య = ఎత్తి, నఖైః = గోళ్ళ చేత, యమక్షయమ్ = యమలోకమును, నిన్యే = పొందించబడెను. నిరఞ్జనః = దోషములు లేని, ఏషః = ఈ, వాసుదేవః = వాసుదేవుడు, ద్వారస్థః = ద్వారపాలకుడుగా, తిష్ఠతి = ఉన్నాడు.

తా. భయంకరుడైన ఆ నృసింహుడు చూచిన ప్రతివస్తువును చెల్లా చెదరు చేసి, చేతులతో ఆ హిరణ్యకశిపుణ్ణి ఎత్తి, గోళ్లతో చంపివేసినాడు. ఇడిగో, ఏ దోషములూ అంటని ఆ వాసుదేవుడే ద్వారపాలకుడై నిలచి ఉన్నాడు. 68,69

మూ. తస్య దేవాధిదేవస్య గదతో మే శృణుష్వ హ,
వాక్యం పరమభావేన యది తే వర్తతే హృది. 70

ప్ర. అ. తస్య = ఆ, దేవాధిదేవస్య = దేవతలకు అదిదేవుడైన విష్ణువు

విని, రావణః=రావణుడు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. మయా=నాచేత, ప్రేతేశ్వరః=మరణించినవాళ్ళ ప్రభువు, మృత్యునా సహ=మృత్యువుతో కూడిన, కృతాన్తః= యముడు, దృష్టః=చూడబడినాడు. పాశహస్తః= పాశము హస్తమునందు గలవాడు, మహాజ్వాలః=గొప్ప జ్వాలలు కలవాడు, ఊర్ధ్వరోమా=పైకి నిలచిన రోమములు గలవాడు, భయానకః= భయంకరుడు, దంష్ట్రిలః=కోరలు గలవాడు, విద్యుజ్జిహ్వశ్చ=మెరపువంటి నాలుక గలవాడు, సర్పవృశ్చిక రోమవాన్ = సర్పములు, తేళ్లు రోమములుగా కలవాడు, రక్తాక్షః= ఎఱ్ఱని కళ్లు గలవాడు, భీమవేగః చ = భయంకరమైన వేగము గలవాడు, సర్వసత్త్వ భయంకరః= అన్ని ప్రాణులకు భయము కలిగించువాడు, ఆదిత్యః ఇవ = సూర్యుడువలె, దుష్ప్రేక్ష్యః= చూడశక్యము కానివాడు, సమరేషు = యుద్ధములయందు, అనివర్తకః= మరలనివాడు, పాపానామ్ = పాపాత్ములకు, శాసితా = శిక్షకుడు అయిన, సః=ఆ యముడు, మయా=నాచేత, యుధి = యుద్ధమునందు, నిర్జితః=జయింపబడినాడు.

తా. బలిచక్రవర్తి మాటలు విని రావణుడిట్లు పలికెను-"నేను ప్రేత ప్రభువైన యముణ్ణి,మృత్యువును చూచితిని. హస్తమునందు పాశమునుధరించి పెద్ద జ్వాలలను కక్కుచు పైకి లేచిన రోమాలు గల అతడు చాల భయంకరుడు. పెద్ద కోరలు, మెరుపువంటి నాలుక గల ఆతనికి సర్పములు, తేళ్లు రోమములుగా ఉండును. ఎఱ్ఱని కళ్లు, భయంకరమైన వేగము గలవాడు, సూర్యుడు వలె చూడ శక్యము కానివాడు అయిన ఆతడు యుద్ధములలో వెనుకకు మరలనివాడు. పాపాత్ములను శిక్షించువాడు. అట్టి యముణ్ణి కూడ నేను జయించితిని. 72-75

మూ. న చ మే తత్ర భీః కాచిద్యథా వా దానవేశ్వర,
ఏనం తు నాభిజానామి తద్భవాన్ వక్తుమర్హసి. 76

ప్ర. అ. దానవేశ్వర = దానవరాజా! మే = నాకు, తత్ర = ఆ విష్ణువు విషయమున, కాచిత్ = ఏమియు, భీః = భయము, యథా వా = ఎట్లైనను,న= లేదు. తు = కాని, ఏనమ్ = వీనిని, నాభిజానామి = గుర్తించను. తత్ = అందు వలన, భవాన్ = నీవు, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగియున్నావు.

తా- దానవేంద్రా! నేను ఆ విష్ణువునకు ఏమాత్రము భయపడను. కాని నేను ఆతనిని గుర్తించజాలను. అందుచేత నీవు ఆతనిని గూర్చి చెప్పుము". 76

తా. శ్రీ మహావిష్ణువు పన్నెండుగురు సూర్యులతో సమానుడు. అతి ప్రాచీనుడైన (ఆది లేని) పురుషశ్రేష్ఠుడు. నల్లనిమేఘముతో సమానుడు. దేవతల ప్రభువు. దేవతలలో శ్రేష్ఠుడు. 79

మూ. జ్వాలామాలీ మహాబాహో యోగీ భక్తజనప్రియః,
ఏష ధారయతే లోకానేష వై సృజతే ప్రభుః. 80

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు కలవాడా, ప్రభుః=ప్రభువైన, ఏషః=ఇతడు, జ్వాలామాలీ=జ్వాలల మాలలు కలవాడు, యోగీ=యోగి, భక్తజనప్రియః=భక్తజనులు ప్రియులుగా కలవాడు, ఏషః=ఇతడే, లోకాన్=లోకములను, ధారయతే=ధరించుచున్నాడు (పోషించుచున్నాడు), సృజతే వై=సృజించుచున్నాడు.

తా. గొప్ప బాహువులు గలవాడా! ఇతని చుట్టూ జ్వాలల మాలలు ఉండును. ఇతడు యోగీశ్వరుడు. ఇతనికి భక్తులమీద ప్రేమ అధికము. సమర్థుడైన ఇతడే లోకములను సృజించును; వాటిని రక్షించుచుండును. 80

మూ. ఏష సంహరతే చైవ కాలో భూత్వా మహాబలః,
ఏష యజ్ఞశ్చ యాజ్యశ్చ చక్రాయుధధరో హరిః. 81

ప్ర. అ. మహాబలః=గొప్పబలముగల, ఏషః=ఇతడు, కాలః=కాలముగా, భూత్వా=అయి, సంహరతే చైవ=సంహరించుచుండును, చక్రాయుధధరః=చక్రాయుధమును ధరించినన ఏషః=ఈ, హరిః=విష్ణువే, యజ్ఞః చ=యజ్ఞము; యాజ్యశ్చ=యజ్ఞముచేత పూజింపదగినవాడు.

తా. గొప్ప బలము గల ఈ మహావిష్ణువే కాలమై సంహారము చేయుచున్నాడు. యజ్ఞమూ, యజ్ఞము చేసి పూజింపదగినవాడూ కూడ చక్రాయుధధారియైన ఈ మహావిష్ణువే. 81

మూ. సర్వదేవమయశ్చైవ సర్వభూతమయస్తథా,
సర్వలోకమయశ్చైవ సర్వజ్ఞానమయస్తథా. 82

ప్ర. అ. సర్వదేవమయః చ ఏవ = సకలదేవతాస్వరూపుడు. తథా =

మహావిష్ణువును స్మరించుటచేతను, స్తుతించుటచేతను, పూజించుటచేతను అన్ని కోరికలను పొందవచ్చును. 84

మూ. ఏతచ్ఛ్రుత్వా చ వచనం రావణో నిర్యయౌ తదా, 85
క్రోధసంరక్తనయన ఉద్యతాస్త్రో౽ మహాబలః.

ప్ర. అ. ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, మహాబలః = గొప్ప బలముగల, రావణః = రావణుడు, క్రోధసంరక్తనయనః = క్రోధముచేత ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై, ఉద్యతాస్త్రః = ఎత్తబడిన అస్త్రములు గలవాడై, నిర్యయౌ = బయల్వెడలెను.

తా. గొప్ప బలము గల రావణుడు ఈ మాటలు విని క్రోధముచేత కళ్లు ఎఱ్ఱజేసి ఆయుధము నెత్తి బయలుదేరెను. 85

మూ. తథాభూతం చ తం దృష్ట్వా హరిర్ముసలధృక్ప్రభుః, 86
నైనం హన్మ్యధునా పాపం చిన్తయిత్వేతి రూపధృక్,
అన్తర్ధానం గతో రామ బ్రహ్మణః ప్రియకామ్యయా. 87

ప్ర. అ. రామ = రామా! రూపధృక్ = రూపమును ధరించి ఉన్న, ముసలధృక్ = ముసలమును ధరించిన, ప్రభుః = సర్వసమర్థుడైన, హరిః = విష్ణువు, తథాభూతమ్ = అట్టి, తమ్ = వానిని, దృష్ట్వా చ = చూచి, పాపమ్ = పాపాత్ముడైన, ఏనమ్ = వీనిని, అధునా = ఇప్పుడు, న హన్మి = చంపను, ఇతి = అని, చిన్తయిత్వా = ఆలోచించి, బ్రహ్మణః = బ్రహ్మకు, ప్రియకామ్యయా = ప్రియము చేయవలెనను కోరికచేత, అన్తర్ధానమ్ = అంతర్ధానమును, గతః = పొందినాడు.

తా. కంటికి కనబడు రూపముతో ముసలము ధరించి ఉన్న మహావిష్ణువు ఆ విధముగా ఉన్న రావణుణ్ణి చూచి, "ఈ పాపాత్ముణ్ణి ఇప్పుడు చంపకూడదు" అని ఆలోచించుకొని, బ్రహ్మకు ప్రియము చేయవలెనను ఉద్దేశ్యముతో అంతర్ధానము చెందెను. 86,87

మూ. న చ తం పురుషం తత్ర పశ్యతే రజనీచరః,
హర్షాన్నాదం విముఞ్చన్వై నిష్క్రా౽మన్వరుణాలయాత్,
యేనైవ సంప్రవిష్టః స పథా తేనైవ నిర్యయౌ. 88

## అథ ద్వితీయః ప్రక్షిప్తసర్గః

[రావణుడు సూర్యుని జయించుటకై సూర్యలోకమునకు వెళ్లుట.]

మూ. అథ సంచిన్త్య లఙ్కేశః సూర్యలోకం జగామ హ,
మేరుశృఙ్గే వరే రమ్యే ఉషిత్వా తత్ర శర్వరీమ్. 1

పుష్పకం తత్సమారుహ్య రవేస్తురగసంనిభమ్,
నానాపాతగతిర్దివ్యం విహారవియతి స్థితమ్. 2

ప్ర. అ. అథ = అటుపిమ్మట, లఙ్కేశః = రావణుడు, వరే = శ్రేష్ఠమైన, రమ్యే = సుందరమైన, తత్ర = ఆ, మేరుశృఙ్గే = మేరుపర్వతశిఖరమునందు, శర్వరీమ్ = రాత్రిని, ఉషిత్వా = ఉండి, సంచిన్త్య = ఆలోచించి, రవేః = సూర్యునియొక్క, తురగసంనిభమ్ = గుఱ్ఱముతో సమానమైన, దివ్యమ్ = దివ్యమైన, విహారవియతి = విహారము చేయుటకు తగు ఆకాశమునందు, స్థితమ్ = ఉన్న, తత్ = ఆ, పుష్పకమ్ = పుష్పకమును, సమారుహ్య = ఎక్కి, నానాపాతగతిః = అనేకవిధములుగా ఎగురుట అను గమనము కలవాడై, సూర్యలోకమ్ = సూర్యలోకమును గూర్చి, జగామ హ = వెళ్లెను.

తా. పిమ్మట రావణుడు శ్రేష్ఠమూ, సుందరమూ అయిన మేరుపర్వత శిఖరముమీద ఆ రాత్రి ఉండి ఆలోచించి, సూర్యాశ్వముతో సమానమూ, దివ్యమూ, ఆకాశమునందు విహరించుటకు యోగ్యము అయిన ఆ పుష్పకవిమానము నెక్కి, అది అనేకరీతులలో ఎగురునట్లు చేయుచు సూర్యలోకమునకు వెళ్లెను. 1,2

మూ. తత్రాపశ్యద్రవిం దేవం సర్వతేజోమయం శుభమ్,
వరకాఞ్చనకేయూరరత్నామ్బరవిభూషితమ్. 3

ప్ర. అ. తత్ర = అక్కడ, దేవమ్ = దేవుడు, సర్వతేజోమయమ్ = సమస్తతేజఃస్వరూపుడు, శుభమ్ = మంగళప్రదుడు, వరకాఞ్చన కేయూర రత్నా

మూ. అనాద్యన్తమమధ్యం చ లోకసాక్షిం జగత్పతిమ్,
తం దృష్ట్వా ప్రవరం దేవం రావణో రక్షసాం వరః, 6
స ప్రహస్తమువాచేదం రవితేజోబలార్దితః.

ప్ర. అ. రక్షసామ్ = రాక్షసులలో, వరః = శ్రేష్ఠుడైన, సః రావణః = ఆ రావణుడు, అనాద్యన్తమ్ = ఆది గాని అంతము గాని లేనివాడు, అమధ్యం చ = మధ్యము లేనివాడు, లోకసాక్షిమ్ = లోకమునకు సాక్షి. జగత్పతిమ్ = జగత్తుకు ప్రభువూ అయిన, తమ్ = ఆ. ప్రవరమ్ = శ్రేష్ఠుడైన. దేవమ్ = దేవుణ్ణి, దృష్ట్వా = చూచి, రవితేజోబలార్దితః = ఆ సూర్యుని తేజస్సుయొక్క బలముచేత పీడితుడై, అథ = పిమ్మట, ప్రహస్తమ్ = ప్రహస్తుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాక్షసశ్రేష్ఠుడైన ఆ రావణుడు, ఆద్యంతములూ మధ్యమూ కూడ లేనివాడు, లోకమునకు సాక్షి, జగత్తునకు ప్రభువు అయిన శ్రేష్ఠుడైన ఆ సూర్యదేవుని చూచి ఆతని తేజోబలముచేత పీడింపబడినవాడై ప్రహస్తునితో ఇట్లు పలికెను. 6

మూ. గచ్ఛామాత్య వదస్వైనం నిదేశాన్మమ శాసనమ్, 7
యుద్ధార్థం రావణః ప్రాప్తో యుద్ధం తస్య ప్రదీయతామ్.
నిర్జితోఽస్మీతి వా బ్రూహి పక్షమేకతరం కురు. 8

ప్ర. అ. అమాత్య = అమాత్యుడా! గచ్ఛ = వెళ్లుము. మమ = నాయొక్క, నిదేశాత్ = ఆజ్ఞవలన, శాసనమ్ = నా శాసనమును, ఏనమ్ = వీనిని గూర్చి, వదస్వ = చెప్పుము. యుద్ధార్థమ్ = యుద్ధముకొరకై, రావణః = రావణుడు, ప్రాప్తః = వచ్చినాడు. తస్య = వానికి, యుద్ధమ్ = యుద్ధము, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక. వా = లేదా, నిర్జితః = జయించబడినవాడను, అస్మి = అయినాను, ఇతి = అని, బ్రూహి = చెప్పుము. ఏకతరమ్ = ఒక్క, పక్షమ్ = పక్షమును, కురు = చేయుము.

తా. ప్రహస్తా! నీవు వెళ్ళి నా ఆజ్ఞగా ఇతనితో చెప్పుము-"రావణుడు యుద్ధానికి వచ్చినాడు; ఆతనికి యుద్ధమైనా ఇమ్ము; లేదా ఓడిపోయినా నని చెప్పుము; ఏదో ఒక పక్షము చేయుము." 7,8

మూ. తస్య తద్వచనాద్రక్షః సూర్యస్యాన్తికమాగమత్,
పిఙ్గలం దణ్డినం చైవ సోఽపశ్యద్ద్వారపాలకౌ. 9

బుద్ధిమంతుడు, రాత్రిని తొలగించువాడు అయిన సూర్యుడు దండినుండి రావణుని వృత్తాంతము విని ఆలోచించి ఇట్లు పలికెను. 11

మూ. గచ్ఛ దణ్డిన్ జయస్వైనం నిర్జితోఽస్మీతి వా వద, 12
యత్తేఽభికాఙ్క్షితం కార్షీః కం చిత్కాలం క్షపాచరమ్.

ప్ర. అ. దణ్డిన్ = దండీ! గచ్ఛ = వెళ్లుము. ఏనమ్ = వీనిని, జయస్వ = జయించుము. వా = లేదా, నిర్జితః అస్మీతి = జయించబడినాను అని, వద = చెప్పుము. తే = నీకు, యత్ = ఏది, అభికాఙ్క్షితమ్ = ఇష్టమో, కంచిత్ కాలమ్ = కొంచెము సమయమును, క్షపాచరమ్ = రాక్షసుని గూర్చి, కార్షీః = చేయుము.

తా. దండీ! నీవు వెళ్ళి ఇతనిని జయింపుము; లేదా ఓడిపోయినా నని చెప్పుము. ఈ రాక్షసుని విషయమున కొంచెము కాలము నీ కెట్లు ఇష్టమో అట్లు చేయుము. 12

మూ. స గత్వా వచనాత్తస్య రాక్షసస్య మహాత్మనః, 13
కథయామాస తత్సర్వం సూర్యోక్తవచనం తదా.

ప్ర. అ. సః = అతడు, తస్య = సూర్యునియొక్క, వచనాత్ = వచనము వలన, గత్వా = వెళ్ళి, తదా = అప్పుడు, తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, సూర్యోక్తవచనమ్ = సూర్యునిచేత పలకబడిన వాక్యమును, మహాత్మనః = మహాత్ముడైన, రాక్షసస్య = రాక్షసునకు, కథయామాస = చెప్పెను.

తా. అతడు సూర్యుని ఆజ్ఞ ప్రకారము వెళ్లి అతడు చెప్పిన మాటలను మహాత్ముడైన రావణునకు పూర్తిగా వివరించి చెప్పెను. 13

మూ. స శ్రుత్వా వచనం తస్య దణ్డినో రాక్షసేశ్వరః, 14
ఘోషయిత్వా జగామాథ స్వజయం రాక్షసాధిపః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వితీయః ప్రక్షిప్తః సర్గః.

ప్ర. అ. రాక్షసేశ్వరః రాక్షసుల ప్రభువైన, సః = ఆ, రాక్షసాధిపః = రావణుడు, తస్య దణ్డినః = ఆ దండియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా =

# అథ తృతీయః ప్రక్షిప్తసర్గః

[రావణుడు చంద్రునితో యుద్ధానికి బయలుదేరి వెళ్ళుచు దారిలో స్వర్గలోకాలకు వెళ్ళుచున్న కొందరు పుణ్యాత్ములను చూచుట. మాంధాత కనబడగా అతనితో యుద్ధము చేయుట. పులస్త్యగాలవులు వచ్చి వారి యుద్ధము నిలుపుట.]

మూ. అథ సంచిన్త్య లఙ్కేశః సోమలోకం జగామ హ,
మేరుశృఙ్గవరే రమ్యే రజనీముష్య వీర్యవాన్. 1

ప్ర. అ. అథ=అటుపిమ్మట, వీర్యవాన్=పరాక్రమవంతుడైన, లఙ్కేశః=రావణుడు, రమ్యే= సుందరమైన, మేరుశృఙ్గవరే=శ్రేష్ఠమైన మేరుపర్వత శిఖరముపై, రజనీమ్=రాత్రిని, ఉష్య=ఉండి, సంచిన్త్య=ఆలోచించి, సోమ లోకం=చంద్రలోకమును గూర్చి, జగామ హ=వెళ్ళెను.

తా. పిమ్మట రావణుడు సుందరమైన మేరుపర్వతశిఖరముమీద రాత్రి గడిపి, ఆలోచించి చంద్రలోకమునకు వెళ్ళెను. 1

మూ. అథ స్యన్దనమారూఢో దివ్యస్రగనులేపనః,
అప్సరోగణముఖ్యేన సేవ్యమానస్తు గచ్ఛతి. 2

ప్ర. అ. అథ=పిమ్మట, దివ్యస్రగనులేపనః=దివ్యములైన మాలలు అనులేపనములు (శరీరమునకు పూసికొను సుగంధద్రవ్యములు) గల, ఒక పురుషుడు, అప్సరోగణముఖ్యేన=అప్సరఃస్త్రీలలో ముఖ్యమైనవారి గుంపుచేత, సేవ్యమానః=సేవింపబడుచు, స్యన్దనమ్=రథమును, ఆరూఢః=ఎక్కినవాడై, గచ్ఛతి=వెళ్లుచున్నాడు.

తా. అప్పుడు ఒక పురుషుడు దివ్యములైన మాలలు ధరించి, అనులేపనము

తా. అప్సరఃస్త్రీలు సేవించగా రథము నెక్కి వెళ్ళుచున్న ఇత డెవడు ? సిగ్గులేకుండా వెళ్ళుచున్నాడు. వచ్చిన భయ హేతువును గుర్తించకున్నాడు. 5

మూ. రావణేనైన ముక్తస్తు పర్వతో వాక్యమబ్రవీత్,
శృణు వత్స యథాతత్త్వం వక్ష్యే చాహం మహామతే. 6

ప్ర. అ. రావణేన = రావణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, పర్వతః = పర్వతుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహామతే = గొప్ప బుద్ధి గలవాడా ! వత్స = వత్సా ! శృణు = వినుము. అహమ్ = నేను, యథాతత్త్వమ్ = యథార్థముగా, వక్ష్యే = చెప్పగలను.

తా. పర్వతుడు రావణుని మాటలు విని ఇట్లనెను. గొప్ప బుద్ధి గల వత్సా ! వినుము; ఉన్నది ఉన్నట్లు చెప్పెదను. 6

మూ. అనేన నిర్జితా లోకా బ్రహ్మా చైవాభితోషితః,
ఏష గచ్ఛతి మోక్షాయ సుసుఖం స్థానముత్తమమ్. 7

ప్ర. అ. అనేన = వీనిచేత, లోకాః = లోకములు, నిర్జితాః = జయించబడినవి. బ్రహ్మా చైవ = బ్రహ్మకూడ, అభితోషితః = సంతోషింపచేయబడినాడు. ఏషః = ఇతడు, మోక్షాయ = మోక్షముకొరకు, సుసుఖమ్ = చాల సుఖకరమైన, ఉత్తమమ్ = ఉత్తమమైన, స్థానమ్ = స్థానమును గూర్చి, గచ్ఛతి = వెళ్ళుచున్నాడు.

తా. ఇతడు లోకాలను జయించినాడు అనగా ఏ లోకానికైనను వెళ్ళగలిగిన సామర్థ్యమును సంపాదించినాడు. బ్రహ్మదేవుణ్ణి సంతోషపెట్టినాడు. ఇప్పుడితడు మోక్షమునకై చాల సుఖకరమైన ఉత్తమస్థానమునకు వెళ్ళుచున్నాడు. 7

మూ. తపసా నిర్జితా యద్వద్భవతా రాక్షసాధిప,
ప్రయాతి పుణ్యకృత్తద్వత్సోమం పీత్వా న సంశయః. 8

ప్ర. అ. రాక్షసాధిప = రాక్షసరాజా ! భవతా = నీచేత, తపసా = తపస్సుచేత, యద్వత్ = ఏ విధముగా, నిర్జితాః = జయింపబడినవో, తద్వత్ = అట్లే, సోమమ్ = సోమమును, పీత్వా = త్రాగి, పుణ్యకృత్ = పుణ్యము చేసినవాడు, ప్రయాతి = వెళ్ళును. సంశయః = సంశయము, న = లేదు.

తా. దేవర్షీ ! గొప్ప కాంతితో ప్రకాశించుచున్న ఇతడు మనోహరముగా గానము, నృత్యమూ చేయుచున్న కింనరులతో ఎక్కడికి వెళ్ళుచున్నాడు ? 11

మూ. శ్రుత్వా చైనమువాచాథ పర్వతో మునిసత్తమః,
ఏష శూరో రణే యోద్ధా సంగ్రామే ష్వనివర్తకః. 12

ప్ర. అ. అథ = పిమ్మట, మునిసత్తమః = మునిశ్రేష్ఠుడైన, పర్వతః = పర్వతుడు, శ్రుత్వా = విని, ఏనమ్ = ఇతనిని గూర్చి, ఉవాచ = పలికెను. ఏషః = ఇతడు, రణే = యుద్ధమునందు, యోద్ధా = యుద్ధముచేయు, సంగ్రామేషు = యుద్ధములయందు, అనివర్తకః = వెనుకకు మరలని, శూరః = శూరుడు.

తా. మునిశ్రేష్ఠుడైన పర్వతుడు ఆ మాటలు విని ఇట్లు పలికెను "ఇతడు యుద్ధరంగములో యుద్ధము చేయు శూరుడు. యుద్ధములలో వెనుకకు తిరగని వాడు. 12

మూ. యుధ్యమానస్తథైవైష ప్రహారైర్జర్జరీకృతః,
కృతీ శూరో రణే జేతా స్వామ్యర్థే త్యక్తజీవితః. 13

ప్ర. అ. ఏషః = ఇతడు, యుధ్యమానః = యుద్ధముచేయుచు, తథైవ = అట్లే, ప్రహారైః = దెబ్బలచేత, జర్జరీకృతః = జర్జరము చేయబడినాడు. రణే = యుద్ధమునందు, జేతా = జయించువాడు, కృతీ = కృతకృత్యుడు, శూరః = శూరుడూ అయిన ఇతడు, స్వామ్యర్థే = ప్రభువుకొరకై, త్యక్తజీవితః = విడవబడిన జీవితము గలవాడు.

తా. ఇతడు యుద్ధము చేయుచుండగా ఇతని దేహము దెబ్బలచేత తూట్లు పడినది. యుద్ధములలో జయించువాడు, కృతకృత్యుడు శూరుడూ అయిన ఇతడు ప్రభువుకొరకై తన జీవితమును త్యజించినాడు. 13

మూ. సంగ్రామే నిహతోఽమిత్రైర్హత్వా చ సమరే బహూన్,
ఇన్ద్రస్యాతిథిరేవైష అథవా యత్ర గచ్ఛతి. 14

ప్ర. అ. సమరే = యుద్ధమునందు, బహూన్ = చాలమందిని, హత్వా చ = చంపి, సంగ్రామే = యుద్ధమునందు, అమిత్రైః = శత్రువులచేత, నిహతః =

చూడబడుచున్నాడో, ఏషః = ఇతడు, సువర్ణదః = సువర్ణదుడు అను, మహా రాజః = మహారాజు. మహాద్యుతిః = గొప్ప కాంతి గల, ఏషః = ఇతడు, శీఘ్రేణ = శీఘ్రమైన, యానేన = వాహనముచేత, గచ్ఛతి = వెళ్ళుచున్నాడు.

తా. రావణుని మాటలు విని పర్వతు డిట్లు చెప్పెను '—రాజా ! అప్సరఃస్త్రీ సముదాయముతో నిండిన, పూర్తిగా బంగారముతో చేసిన విమానమునందు కనబడు చున్న పూర్ణచంద్రుని వంటి ముఖముతో ఉన్న, విచిత్రములైన ఆభరణములు వస్త్రములు ధరించిన ఇతడు సువర్ణదుడు అను రాజు. గొప్ప తేజస్సు గల ఇతడు శీఘ్రమైన వాహనముపై వెళ్ళుచున్నాడు. 16, 17

మూ. పర్వతస్య వచః శ్రుత్వా రావణో వాక్యమబ్రవీత్. 18
ఏతే వై యాన్తి రాజానో బ్రూహి త్వమృషిసత్తమ,
కో హ్యత్ర యాచితో దద్యాద్యుద్ధాతిథ్యం మమాద్య వై.
తం మమాఖ్యాహి ధర్మజ్ఞ పితా త్వం మే హి ధర్మతః.

ప్ర. అ. పర్వతస్య = పర్వతునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఋషిసత్తమ = ఋషిశ్రేష్ఠుడా, త్వమ్ = నీవు, బ్రూహి = చెప్పుము. ఏతే = ఈ, రాజానః = రాజులు, యాన్తి వై = వెళ్ళుచున్నారు. అత్ర = వీరిలో, కః = ఎవడు, యాచితః = కోరబడినవాడై, అద్య = ఇప్పుడు, మమ = నాకు, యుద్ధాతిథ్యమ్ = యుద్ధమనే ఆతిథ్యమును, దద్యాత్ = ఇచ్చును ? తమ్ = అట్టివానిని గూర్చి, మమ = నాకు, ఆఖ్యాహి = చెప్పుము. ధర్మజ్ఞ = ధర్మము తెలిసినవాడా ! త్వమ్ = నీవు, మే = నాకు, ధర్మతః = ధర్మముచేత, పితా హి = తండ్రివి కదా ?

తా. పర్వతుని మాటలు విని రావణుడు ఇట్లు పలికెను -"ఓ ! ఋషి శ్రేష్ఠుడా ! నీవు చెప్పుము. ఈ రాజు లందరూ వెళ్ళుచున్నారు కదా; వీరిలో ఎవడు నేను కోరినచో నాకు ఇప్పుడు యుద్ధాతిథ్యము ఇచ్చును ? చెప్పుము. ధర్మములు తెలిసినవాడా ! నీవు నాకు తండ్రివంటివాడవు కదా ? 18, 19

మూ. ఏవముక్తః ప్రత్యువాచ రావణం పర్వతస్తదా. 20
స్వర్గార్థినో మహారాజ నైతే యుద్ధార్థినో నృపాః,
వక్ష్యామి తే మహాభాగ యస్తే యుద్ధం ప్రదాస్యతి. 21

మూ. సోఽహం యాస్యామి తత్రైవ యత్రాసౌ నరపుంగవః,
రావణస్య వచః శ్రుత్వా మునిర్వచనమబ్రవీత్. 24

ప్ర. అ. సః అహమ్ = నేను, అసౌ = ఈ, నరపుంగవః = నరశ్రేష్ఠుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో, తత్రైవ = అచటికే, యాస్యామి = వెళ్ళెదను. రావణస్య = రావణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, మునిః = ముని, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. "ఆ నరశ్రేష్ఠుడు ఎక్కడ ఉన్నాడో అక్కడికే వెళ్ళెదను." రావణుని మాటలు విని ఆ ముని ఇట్లు పలికెను. 24

మూ. యువనాశ్వసుతో రాజా మాంధాతా రాజసత్తమః,
సప్తద్వీపసముద్రాన్తాం జిత్వేహాభ్యాగమిష్యతి. 25

ప్ర. అ. యువనాశ్వసుతః = యువనాశ్వునికుమారుడు, రాజసత్తమః = రాజశ్రేష్ఠుడూ అయిన, మాంధాతా = మాంధాత అను, రాజా = రాజు, సప్తద్వీపసముద్రాన్తామ్ = సప్తద్వీపములు గల భూమిని, జిత్వా = జయించి, ఇహ = ఇచటికి, అభ్యాగమిష్యతి = రాగలడు.

తా. యువనాశ్వుని కుమారుడు, రాజులలో శ్రేష్ఠుడూ అయిన మాంధాత అను రాజు సప్తద్వీపములు గల భూమిని జయించి ఇక్కడికి రాగలడు. 25

మూ. అథాపశ్యన్మహాబాహుస్త్రైలోక్యే వరదర్పితః,
అయోధ్యాయాః పతిం వీరం మాంధాతారం నృపోత్తమమ్.
సప్తద్వీపాధిపం యాన్తం స్యన్దనేన విరాజతా,
కాఞ్చనేన విచిత్రేణ మాహేన్ద్రేణ భాస్వతా. 27

ప్ర. అ. అథ = అటుపిమ్మట, త్రైలోక్యే = మూడు లోకములయందు, వరదర్పితః = వరములచేత గర్వించిన, మహాబాహుః = గొప్ప బాహువులు గల రావణుడు, అయోధ్యాయాః = అయోధ్యయొక్క, పతిమ్ = ప్రభువు, వీరమ్ = వీరుడు, నృపోత్తమమ్ = రాజులలో శ్రేష్ఠుడు, సప్తద్వీపాధిపమ్ = ఏడు ద్వీపములకు ప్రభువు, విరాజతా = ప్రకాశించుచున్న, కాఞ్చనేన = బంగారువికారమైన, విచిత్రేణ = విచిత్రమైన, మాహేన్ద్రేణ = మహేంద్రుని రథమువంటి కాంతి గల,

ప్ర. అ. మాంధాతుః=మాంధాతయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రావణః=ఏ రావణుడు, వరుణస్య=వరుణునకు, కుబేరస్య = కుబేరునకు, యమస్యాపి= యమునకూ కూడ, న వివ్యథే = భయపడలేదో, అట్టి రావణుడు, మానుషాత్ = మనుష్యుడవైన, త్వత్తః = నీనుండి, భయమ్ = భయమును, కిం పునః ఆవిశేత్ =పొందునా?

తా. మాంధాత మాటలు విని రావణుడు ఇట్లు పలికెను-"వరుణునికి, కుబేరునికి, యమునికీ కూడ భయపడని రావణుడు మనుష్యమాత్రుడవైన నీకు భయపడునా ?" 30

మూ. ఏవముక్త్వా రాక్షసేన్ద్రః క్రోధాత్సంప్రజ్వలన్నివ, 31
ఆజ్ఞాపయామాస తదా రాక్షసాన్ యుద్ధదుర్మదాన్.

ప్ర. అ. రాక్షసేన్ద్రః = రావణుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, క్రోధాత్ = కోపమువలన, ప్రజ్వలన్నివ = మండుచున్నవాడువలె అయి, యుద్ధదుర్మదాన్ = యుద్ధమునందు చెడ్డ మదము గల, రాక్షసాన్ = రాక్షసులను, ఆజ్ఞాపయామాస = ఆజ్ఞాపించెను.

తా. ఆ రావణుడు ఇట్లు పలికి కోపముతో మండిపడుచు యుద్ధమునందు చెడ్డ మదము గల రాక్షసులతో ఇట్లనెను. 31

మూ. అథ క్రుద్ధాస్తు సచివా రావణస్య దురాత్మనః, 32
వవర్షుః శరజాలాని శూరా యుద్ధవిశారదాః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దురాత్మనః = దురాత్ముడైన, రావణస్య= రావణునియొక్క, యుద్ధవిశారదాః = యుద్ధమునందు నేర్పు గలవారు, శూరాః= శూరులూ అయిన, సచివాః = మంత్రులు, క్రుద్ధాః = కోపించినవారై, శరజాలాని = బాణసముదాయములను, వవర్షుః=వర్షించిరి.

తా. పిమ్మట యుద్ధములో సమర్థులైన, శూరులైన, దురాత్ముడైన రావణుని అమాత్యులు కోపముతో బాణముల సముదాయములను కురిపించిరి. 32

తా. పిమ్మట మాంధాత కోపించి, కుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్లు, అతనిని మహావేగము గల ఐదు తోమరములచేత భేదించెను. 36

మూ. తతో ముహుర్భ్రామయిత్వా ముద్గరం యమసంనిభమ్,
ప్రాహరత్సోఽతివేగేన రాక్షసస్య రథం ప్రతి. 37

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సః= అతడు, యమసంనిభమ్ = యమునితో సమానముగా, ముద్గరమ్ = ముద్గరమును, ముహుః = మాటిమాటికి, భ్రామయిత్వా = త్రిప్పి, రాక్షసస్య = రావణునియొక్క, రథం ప్రతి = రథమును గూర్చి, అతివేగేన = చాల వేగముతో, ప్రాహరత్ = కొట్టెను.

తా. పిమ్మట మాంధాత యముడు వలె ముద్గరమును అనేకపర్యాయములు త్రిప్పి రావణుని రథముమీదికి చాల వేగముతో విసిరెను. 37

మూ. స పపాత మహావేగో ముద్గరో వజ్రసంనిభః,
స తూర్ణం పాతితస్తేన రావణః శక్రకేతువత్. 38

ప్ర. అ. వజ్రసంనిభః=వజ్రముతో సమానమైన, సః ముద్గరః = ఆ ముద్గరము, మహావేగః = గొప్ప వేగము గలదై, పపాత = పడెను. తేన = దానిచేత, సః = ఆ, రావణః = రావణుడు, శక్రకేతువత్=ఇంద్రధ్వజము వలె, తూర్ణమ్= శీఘ్రముగా, పాతితః = పడగొట్టబడెను.

తా. వజ్రమువంటి ఆ ముద్గరము మహావేగముతో పడి శీఘ్రముగా రావణుని ఇంద్రధ్వజమును వలె పడగొట్టెను. 38

మూ. తదా స నృపతిః ప్రీత్యా హర్షోద్గతబలో బభౌ,
సకలేన్దుకలాః స్పృష్ట్వా యథామ్బు లవణామ్భసః. 39

ప్ర. అ. తదా = అప్పుడు, హర్షోద్గతబలః=సంతోషముచేత వృద్ధిచెందిన బలము గల, సః నృపతిః = ఆ రాజు. సకలేన్దుకలాః = పూర్ణచంద్రుని కళలను, స్పృష్ట్వా = స్పృశించి, లవణామ్భసః = లవణసముద్రముయొక్క, అమ్బు యథా=జలము వలె, ప్రీత్యా=ఆనందముతో, బభౌ=ప్రకాశించెను.

తా. అప్పు డా మాంధాత సంతోషముచేత బలము వృద్ధి చెందగా, పరి

మూ. లబ్ధసంజ్ఞో ముహూర్తేన అయోధ్యాధిపతి స్తదా,
దృష్ట్వా తం మన్త్రిభిః శత్రుం పూజ్యమానం నిశాచరైః,
జాతకోపో దురాధర్షశ్చన్ద్రార్కసదృశద్యుతిః,
మహతా శరవర్షేణ పాతయద్రాక్షసం బలమ్. 44

ప్ర. అ. దురాధర్షః = ఎదిరింప శక్యము కానివాడు, చన్ద్రార్కసదృశద్యుతిః=చంద్రసూర్యులతో సమానమైన కాంతి గలవాడు అయిన, అయోధ్యాధిపతిః=అయోధ్య ప్రభువైన మాంధాత, తదా=అప్పుడు, ముహూర్తేన=ముహూర్తకాలముచేత, లబ్ధసంజ్ఞః = పొందబడిన సంజ్ఞ గలవాడై, మన్త్రిభిః = మంత్రులైన, నిశాచరైః = రాక్షసులచేత, పూజ్యమానమ్=పూజింపబడుచున్న, తమ్=ఆతనిని, దృష్ట్వా = చూచి, జాతకోపః = పుట్టిన కోపము గలవాడై, రాక్షసమ్ = రాక్షస సంబంధమైన, బలమ్ = సైన్యమును, మహతా = గొప్ప, శరవర్షేణ = బాణ వర్షముచేత, పాతయత్ = పడగొట్టెను.

తా. చంద్రసూర్యుల వంటి కాంతి గల, ఎదిరింప శక్యము కాని మాంధాత ముహూర్తకాలములో తేరికొని, మంత్రులైన రాక్షసుల మన్ననలు పొందుచున్న ఆ రావణుని చూచి, చాల కోపించి, గొప్ప బాణవర్షముచేత రాక్షససైన్యమును పడగొట్టెను. 43, 44

మూ. చాపస్యైవ నినాదేన తస్య బాణరవేణ చ,
సంచచాల తతః సైన్యముద్ధూత ఇవ సాగరః. 45

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తస్య = వానియొక్క, చాపస్య=ధనస్సుయొక్క, నినాదేనైవ = ధ్వనిమాత్రముచేతనే, బాణరవేణ చ = బాణధ్వనిచేతను, సైన్యమ్ = సైన్యము, ఉద్ధూతః = ఎగరగొట్టబడిన, సాగరః ఇవ = సముద్రము వలె, సంచచాల = చలించెను.

తా. అప్పుడు ఆతని ధనుష్టంకారధ్వనిచేతను, బాణముల ధ్వనిచేతను ఆ సైన్యము ఎగురగొట్టబడిన సముద్రము వలె చలించెను. 45

మూ. తద్యుద్ధమభవద్ఘోరం నరరాక్షససంకులమ్,
అథావిష్టౌ మహాత్మానౌ నరరాక్షససత్తమౌ, 46
కార్ముకాసిధరౌ వీరౌ వీరాసనగతౌ తదా.

తా. (రావణుడు) ధనస్సుమీద రౌద్రాస్త్రమును సంధించి దానిని విడచెను. మాంధాత ఆగ్నేయాస్త్రముచే దానిని నివారించెను. 49

మూ. గాన్ధర్వేణ దశగ్రీవో వారుణేన చ రాజరాట్
గృహీత్వా స తు బ్రహ్మాస్త్రం సర్వభూతభయావహమ్.
వేదయామాస మాంధాతా దివ్యం పాశుపతం మహత్

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, గాన్ధర్వేణ = గాంధర్వాస్త్రముచేత, రాజరాట్ = రాజులరాజు, వారుణేన = వారుణాస్త్రముచేత (యుద్ధము చేసెను). సః = రావణుడు, సర్వభూతభయావహమ్ = సమస్తభూతములకు భయము కలిగించు, బ్రహ్మాస్త్రమ్ = బ్రహ్మాస్త్రమును, గృహీత్వా = గ్రహించి, వేదయామాస = తెలిపెను. మాంధాతా = మాంధాత, మహత్ = గొప్పదైన, దివ్యమ్ = దివ్యమైన, పాశుపతమ్ = పాశుపతాస్త్రమును ప్రయోగించెను.

తా. రావణుడు గాంధర్వాస్త్రమును ప్రయోగించగా మాంధాత దానిని వారుణాస్త్రముచేత కొట్టివేసెను. రావణుడు సకలభూతములకు భయమును కలిగించు బ్రహ్మాస్త్రమును ప్రయోగించగా మాంధాత గొప్పదైన, దివ్యమైన పాశుపతాస్త్రమును గ్రహించెను. 50

మూ. తదస్త్రం ఘోరరూపం తు త్రైలోక్య భయవర్ధనమ్ 51
దృష్ట్వా త్రస్తాని భూతాని స్థావరాణి చరాణి చ
వరదానాత్తు రుద్రస్య తపసాధిగతం మహత్. 52

ప్ర. అ. తపసా = తపస్సుచేత, రుద్రస్య = రుద్రునియొక్క, వరదానాత్ = వరము ఇచ్చుటవలన, అధిగతమ్ = పొందబడిన, మహత్ = గొప్పదైన, ఘోరరూపమ్ = భయంకరమైన రూపము గల, త్రైలోక్యభయవర్ధనమ్ = మూడు లోకముల భయమును వృద్ధిపొందించు, తత్ = ఆ, అస్త్రమ్ = అస్త్రమును, దృష్ట్వా = చూచి, స్థావరాణి = స్థావరములు, చరాణి చ = చరములు అయిన, భూతాని = భూతములు, త్రస్తాని = భయపడినవి.

తా. తపస్సు చేసి రుద్రుని వరముచేత పొందబడిన, భయంకరమైన రూపము గల, మూడు లోకములకు భయమును వృద్ధి పొందించు గొప్పదైన ఆ అస్త్రమును చూచి స్థావరములు, జంగమములు అయిన ప్రాణులు భయపడినవి.

రాక్షసులకు, ప్రీతిమ్ = స్నేహమును, కృత్వా = చేసి, సుసంహృష్టౌ = బాగా సంతోషించినవారై, యేన = ఏ, పథా = మార్గముచేత, ఆగతౌ = వచ్చినారో, తేనైవ = ఆ మార్గముచేతనే, సంప్రస్థితౌ = ప్రయాణమైరి.

తా. ఆ మునులు మాంధాతకు రావణునకూ మధ్య స్నేహము ఏర్పరచి, సంతోషించుచు వచ్చిన మార్గముననే వెళ్ళిపోయిరి. 55

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో తృతీయ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

ప్ర. అ. తతః = అంతకంటె, ఊర్ధ్వమ్ = పైన, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, మరుత్పథమ్ = వాయుమార్గమును, గత్వా = పొంది (వెళ్ళెను). తదేవ = అది, దశయోజనసాహస్రమ్ = పది వేల యోజనముల దూరమునం దున్నదిగా, పరిగణ్యతే = చెప్పబడును.

తా. అంతకంటె పైకి శ్రేష్ఠమైన, పదివేల యోజనముల దూరమునం దున్న వాయుమార్గమునకు వెళ్ళెను. 3

మూ. తత్ర సంనిహితా మేఘాస్త్రివిధాస్తత్ర నిత్యశః
ఆగ్నేయాః పక్షిణో బ్రాహ్మాస్త్రివిధా స్తత్ర తే స్థితాః. 4

ప్ర. అ. తత్ర = అక్కడ, నిత్యశః = ఎల్లప్పుడు, త్రివిధాః = మూడు విధములైన, మేఘాః = మేఘములు, సంనిహితాః = సంనిహితములై, స్థితాః = ఉన్నవి. తత్ర = అక్కడ, ఆగ్నేయాః = ఆగ్నేయములు, పక్షిణః = పక్షులు, బ్రాహ్మాః = బ్రాహ్మములు అని, త్రివిధాః = మూడు విధములైన, తే = ఆ మేఘములు, స్థితాః = ఉన్నవి.

తా. ఆ వాయుపథమునందు నిత్యము ఆగ్నేయములు, పక్షులు, బ్రాహ్మములు అను మూడు విధాలైన మేఘములు ఉండును. 4

మూ. అథ గత్వా తృతీయం తు వాయోః పన్థానముత్తమమ్,
నిత్యం యత్ర స్థితాః సిద్ధాశ్చారణాశ్చ మనస్వినః. 5

ప్ర. అ. అథ = పిమ్మట, ఉత్తమమ్ = ఉత్తమమైన, వాయోః పన్థానమ్ = వాయువుయొక్క మార్గమును, గత్వా = పొంది (వెళ్లెను). యత్ర = ఎక్కడ, సిద్ధాః = సిద్ధులు, మనస్వినః = ఆత్మాభిమానవంతులైన, చారణాశ్చ = చారణులూ, నిత్యమ్ = ఎల్లప్పుడూ, స్థితాః = ఉన్నారో.

తా. పిమ్మట, సిద్ధులు, మానవంతులైన చారణులు నిత్యమూ నివసించు ఉత్తమమైన మూడవ వాయుమార్గమును పొందెను. 5

మూ. దశైవ తు సహస్రాణి యోజనానాం తథైవ చ,
చతుర్థం వాయుమార్గం తు శీఘ్రం గత్వా పరంతప. 6
వసన్తి యత్ర నిత్యస్థా భూతాశ్చ సవినాయకాః.

తా. దానిపైన ఎనభైవేల యోజనాల దూరమునందు చంద్రుడున్న స్థానమును గూర్చి చెప్పెదను. 15

మూ. చన్ద్రమా స్తిష్ఠతే తత్ర నక్షత్రగ్రహసంయుతః, 16
శతం శతసహస్రాణి రశ్మయశ్చన్ద్రమణ్డలాత్,
ప్రకాశయ న్తి లోకాంస్తు సర్వసత్త్వసుఖావహాః. 17

ప్ర. అ. తత్ర = అక్కడ, నక్షత్రగ్రహసంయుతః = నక్షత్రములతోను గ్రహములతోను కూడినవాడై, చన్ద్రమాః = చంద్రుడు, తిష్ఠతే = ఉండును. చన్ద్రమణ్డలాత్ = చంద్రమండలమునుండి, సర్వసత్త్వసుఖావహాః = సకల ప్రాణులకు సుఖము కలిగించు, శతమ్ = నూరు, శతసహస్రాణి = లక్షలు, రశ్మయః = కిరణములు, లోకాన్ = లోకాలను, ప్రకాశయ న్తి = ప్రకాశింపచేయుచుండును.

తా. అక్కడ నక్షత్రాలతోను, గ్రహాలతోను కలిసి చంద్రుడు ఉండును. ఆ చంద్రమండలమునుండి బయల్వెడలిన నూరు లక్షల కిరణములు సకలప్రాణులకు భయమును కలిగించుచు లోకాలను ప్రకాశింపచేయుచుండును. 16, 17

మూ. తతో దృష్ట్వా దశగ్రీవం చన్ద్రమా నిర్దహన్నివ,
స తు శీతాగ్నినా శీఘ్రం ప్రాదహద్రావణం తదా. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః చన్ద్రమాః = ఆ చంద్రుడు, దశగ్రీవమ్ = పది కంఠములు గల, రావణమ్ = రావణుణ్ణి, నిర్దహన్నివ = కాల్చివేయుచున్నవాడువలె, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, శీఘ్రమ్ = శీఘ్రముగా, శీతాగ్నినా = చల్లదన మనే అగ్నిచేత, ప్రాదహత్ = కాల్చెను.

తా. అప్పుడు చంద్రుడు దశకంఠుడైన రావణుణ్ణి కాల్చివేయుచున్నట్లు చూచి, శీఘ్రముగా శీతాగ్నిచేత అతనిని కాల్చివేసెను. 18

మూ. నాసహం స్తస్య సచివాః శీతాగ్నిభయపీడితాః,
రావణం జయశబ్దేన ప్రహస్తోఽథైన మబ్రవీత్. 19

ప్ర. అ. తస్య = వానియొక్క, సచివాః = మంత్రులు, శీతాగ్ని భయపీడితాః = శీతాగ్నివలన భయముచేత పీడింపబడినవారై, నాసహన్ = సహించ

మూ. అథ బ్రహ్మ తదాగచ్ఛత్సోమలోకం త్వరాన్వితః. 22
దశగ్రీవ మహాబాహో సాక్షాద్విశ్రవసః సుత,
గచ్ఛ శీఘ్రమితః సౌమ్య మా చన్ద్రం పీడయస్వ వై. 23

ప్ర. అ. అథ = అటుపిమ్మట, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, త్వరాన్వితః = తొందరతో కూడినవాడై, తదా = అప్పుడు, సోమలోకమ్ = చంద్రలోకమును గూర్చి, అగచ్ఛత్ = వచ్చెను. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! సాక్షాత్ = సాక్షాత్తు, విశ్రవసః = విశ్రవసునియొక్క, సుత = కుమారుడా, సౌమ్య = సౌమ్యుడా! దశగ్రీవ = రావణా! ఇతః = ఇక్కడినుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్లుము. చన్ద్రమ్ = చంద్రుణ్ణి, మా పీడయస్వ వై = పీడించకుము.

తా. అప్పుడు బ్రహ్మదేవుడు తొందరగా చంద్రలోకమునకు వచ్చి ఇట్లు పలికెను.-"గొప్ప బాహువులు గలవాడా! సాక్షాత్తు విశ్రవసుని కుమారుడవు, సౌమ్యుడవు అయిన ఓ! రావణా! ఇక్కడినుండి వెంటనే వెళ్ళిపొమ్ము. చంద్రుణ్ణి పీడించకుము. 22,23

మూ. లోకస్య హితకామో వై ద్విజరాజో మహాద్యుతిః,
మన్త్రం చ సంప్రదాస్యామి ప్రాణాత్యయగతిర్యదా. 24
యస్త్వేతం సంస్మరేన్మన్త్రం నాసౌ మృత్యుమవాప్నుయాత్.

ప్ర. అ. మహాద్యుతిః = గొప్ప కాంతి గల, ద్విజరాజః = చంద్రుడు, లోకస్య = లోకమునకు, హితకామః = హితమునందు కోరికగలవాడు. మన్త్రం చ = మంత్రమును, సంప్రదాస్యామి = ఇచ్చెదను. యదా = ఎప్పుడు, ప్రాణాత్యయ గతిః = ప్రాణాపాయస్థితి ఉండునో అప్పుడు, యః = ఎవడు, ఏతత్ మన్త్రమ్ = ఈ మంత్రమును, సంస్మరేత్ = స్మరించునో, అసౌ = వీడు, మృత్యుమ్ = మృత్యువును, న అవాప్నుయాత్ = పొందడు.

తా. గొప్ప కాంతి గల ఈ చంద్రుడు లోకహితము చేయుటయందు ఆసక్తి కలవాడు. నీకు ఒక మంత్రము ఇచ్చెదను. ప్రాణాపాయస్థితిలో ఈ మంత్రమును జపించువాడు మరణించడు." 24

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, దశగ్రీవమ్ = రావణునిగూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను. రాక్షసాధిప = రాక్షసరాజా! ప్రాణాత్యయేషు = ప్రాణాపాయసమయములయందు, జప్తవ్యః = జపించదగినది. నిత్యమ్ = నిత్యమూ, న = కాదు.

తా. రావణుని మాటలు విని బ్రహ్మదేవు డిట్లు పలికెను - రావణా! ఈ మంత్రమును ప్రాణాపాయసమయములయందు మాత్రమే జపించవలెను; నిత్యమూ జపించకూడదు. 28

మూ. అక్షసూత్రం గృహీత్వా తు జపేన్మన్త్రమిమం శుభమ్,
జప్త్వా తు రాక్షసపతే త్వమజేయో భవిష్యసి,
అజప్త్వా రాక్షసపతే న తే సిద్ధిర్భవిష్యతి. 30

ప్ర. అ. శుభమ్ = మంగళప్రదమైన, ఇదం మన్త్రమ్ = ఈ మంత్రమును, అక్షసూత్రమ్ = జపమాలను, గృహీత్వా = గ్రహించి, జపేత్ = జపించవలెను. రాక్షసపతే = రాక్షసరాజా! జప్త్వా = జపించి, త్వమ్ = నీవు, అజేయః = జయింప శక్యముకానివాడవు, భవిష్యసి = కాగలవు. రాక్షసపతే = రాక్షసరాజా! అజప్త్వా = జపించకుండగా, తే = నీకు, సిద్ధిః = సిద్ధి, న భవిష్యతి = కలగదు.

తా. మంగళప్రదమైన ఈ మంత్రమును జపమాల (రుద్రాక్షమాల)తోనే జపించవలెను. రావణా! దీనిని జపించినచో నీకు సిద్ధి లభించును; జపించనిచో లభించదు. 29, 30

మూ. శృణు మన్త్రం ప్రవక్ష్యామి యేన రాక్షసపుంగవ,
మన్త్రస్య కీర్తనాదేవ ప్రాప్స్యసే సమరే జయమ్. 31

ప్ర. అ. రాక్షసపుంగవ = రాక్షసశ్రేష్ఠుడా! మన్త్రమ్ = మంత్రమును, ప్రవక్ష్యామి = చెప్పెదను, శృణు = వినుము. యేన = దేనిచేత, మన్త్రస్య = మంత్రముయొక్క, కీర్తనాదేవ = ఉచ్చారణమువల్లనే, సమరే = యుద్ధమునందు, జయమ్ = జయమును, ప్రాప్స్యసే = పొందగలవో.

తా. ఓ! రాక్షసశ్రేష్ఠుడా! మంత్రము చెప్పెదను వినుము. ఈ మంత్రమును ఉచ్చరించినంతమాత్రముననే నీకు యుద్ధములో జయము లభించగలదు.

గణముల ప్రభువు, లోకశంభుశ్చ = లోకముల సుఖమునకు కారణభూతుడవు, లోకపాలః = లోకములను పాలించువాడవు.

తా. గొప్ప భుజములు కలవాడా! నీవు పాపములను హరించువాడవు, దిక్కులు అంచులుగా కలవాడవు (అంతటా వ్యాపించినావు). యుగాంతమునందు దహింపచేయు అగ్నివి. గణముల నాయకుడవు. లోకములకు సుఖ మిచ్చువాడవు. లోకములను పాలించువాడవు. 34

మూ. మహాభాగో మహాశూలీ మహాదంష్ట్రీ మహేశ్వరః,
కాలశ్చ బలరూపీ చ నీలగ్రీవో మహోదరః. 35

ప్ర. అ. మహాభాగః = గొప్ప భాగ్యము కలవాడవు, మహాశూలీ = గొప్ప శూలము గలవాడవు, మహాదంష్ట్రీ = పెద్ద కోరలు కలవాడవు, మహేశ్వరః = మహేశ్వరుడవు, కాలః చ = కాలస్వరూపుడవు, బలరూపీ చ = బలరూపుడవు, నీలగ్రీవః = నల్లని కంఠము గలవాడవు, మహోదరః = పెద్ద ఉదరము (పొట్ట) కలవాడవు.

తా. నీవు మహాభాగ్యశాలివి, గొప్ప శూలము ధరించినవాడవు, పెద్ద కోరలు కలవాడవు, మహేశ్వరుడవు, కాలరూపుడవు, బలరూపుడవు, నల్లని కంఠము, పెద్ద ఉదరము కలవాడవు. 35

మూ. దేవాన్తగ స్తపో న్తశ్చ పశూనాం పతిరవ్యయః,
శూలపాణిర్వృషః కేతుర్నేతా గోప్తా హరో హరిః. 36

ప్ర. అ. దేవాన్తగః = దేవతల అంతమును పొందినవాడవు, తపోన్తశ్చ = తపస్సుయొక్క అంతమైనవాడవు, పశూనామ్ = జీవులకు, పతిః = ప్రభువు అయినవాడవు, అవ్యయః = నాశము లేనివాడవు, శూలపాణిః = శూలము హస్తమునందు కలవాడవు, వృషః = ధర్మస్వరూపుడవు, కేతుః = కేతువువంటివాడవు (లేదా వృషకేతుః = వృషభము కేతువునందు గలవాడవు), నేతా = నాయకుడవు, గోప్తా = రక్షకుడవు, హరః = హరుడవు, హరిః = విష్ణుస్వరూపుడవు.

తా. దేవతలందరూ నశించినా నిలచువాడవు, తపస్సుకు లక్ష్యమైన వాడవు, జీవులకు పతివి. నాశరహితుడవు. శూలము హస్తమునం దున్నవాడవు.

ప్ర. అ. మాననీయః చ = గౌరవింపదగినవాడవు, ఓంకారః = ఓంకార రూపుడవు, వరిష్ఠః = గొప్పవాడవు, సామవేదగః = సామవేదమును పొందిన వాడవు, మృత్యుః చ = మృత్యువు, మృత్యుదూతశ్చ = మృత్యుదూతవు, పారియాత్రః చ = సంగవర్జితుడవు, సువ్రతః = మంచి నియమములు కలవాడవు.

తా. నీవు మాననీయుడవు. ఓంకారము. గొప్పవాడవు. సామవేదప్రతిపాద్యుడవు. మృత్యువు; మృత్యుదూతవు, పరివ్రాజకుడవు, మంచి నియమములు కలవాడవు. 39

మూ. బ్రహ్మచారీ గృహావాసీ వీణాపణవతూణవాన్,
అమరో దర్శనీయశ్చ బాలసూర్యనిభ స్తథా. 40

ప్ర. అ. బ్రహ్మచారీ = బ్రహ్మచారివి, గృహావాసీ = గృహస్థుడవు, వీణాపణవతూణవాన్ = వీణ, పణవము, తూణము అను వాద్యములు కలవాడవు, అమరః = మరణరహితుడవు, దర్శనీయశ్చ = సుందరుడవు, తథా = మరియు, బాలసూర్యనిభః = బాలసూర్యునితో సమానుడవు.

తా. నీవు బ్రహ్మచారివి, గృహస్థుడవు. వీణ, పణవము, తూణము అను వాద్యములను ప్రయోగించువాడవు. మరణరహితుడవు, సౌందర్యవంతుడవు, బాలసూర్యునితో సమానుడవు. 40

మూ. శ్మశానవాసీ భగవానుమాపతిరనిన్దితః,
భగస్యాక్షినిపాతీ చ పూష్ణో దశననాశనః. 41

ప్ర. అ. శ్మశానవాసీ = శ్మశానమునందు నివసించువాడవు, భగవాన్ = భగవంతుడవు, ఉమాపతిః = ఉమాపతివి, అనిన్దితః = నిందింపబడనివాడవు, భగస్య = భగునియొక్క, అక్షినిపాతీ చ = నేత్రములను పడగొట్టినవాడవు, పూష్ణః = పూషయొక్క, దశననాశనః = దంతములను నశింపచేసినవాడవు.

తా. శ్మశానమునందు నివసించువాడవు, భగవంతుడవు, ఉమాపతివి, నిందింపబడనివాడవు, భగుని నేత్రములు పడగొట్టినవాడవు, పూషుని దంతాలు రాల్చిన వాడవు. 41

తా. నీవు భిక్షుకుడవు, భిక్షురూపధారివి, మూడు జటలు కలవాడవు, జటాధారివి. ఇంద్రుని హస్తము స్తంభింపచేసినవాడవు, వసువులను స్తంభింప చేసినవాడవు. 44

మూ. ఋతుర్ఋతుకరః కాలో మధుర్మధురలోచనః,
వానస్పత్యః శ్రీకరశ్చ నిత్యమాశ్రితపూజితః. 45

ప్ర. అ. ఋతుః = ఋతువు, ఋతుకరః = ఋతువులను చేయువాడవు, కాలః = కాలము, మధుః = వసంతము, మధురలోచనః = సుందరములైన నేత్రములు కలవాడవు, వానస్పత్యః = మహావృక్షములకు సంబంధించినవాడవు, శ్రీకరః చ = లక్ష్మీప్రదుడవు, నిత్యమ్ = నిత్యమూ, ఆశ్రితపూజితః = ఆశ్రయించిన వారిచేత పూజింపబడినవాడవు.

తా. ఋతుస్వరూపుడవు, ఋతువులను చేయువాడవు, కాలము, వసంత రూపుడవు. సుందరములైన నేత్రములు కలవాడవు, మహావృక్షములకు సంబంధించినవాడవు, ఐశ్వర్య మిచ్చువాడవు. నిత్యమూ ఆశ్రితులచేత పూజింపబడిన వాడవు. 45

మూ. జగద్ధాతా చ కర్తా చ పురుషః శాశ్వతో ధ్రువః,
ధర్మాధ్యక్షో విరూపాక్ష స్త్రివర్త్మా భూతభావనః. 46

ప్ర. అ. జగద్ధాతా చ = జగత్తును పోషించువాడవు, కర్తా చ = సృష్టించువాడవు, పురుషః = పురుషుడవు, శాశ్వతః = శాశ్వతుడవు, ధ్రువః = నిత్యుడవు. ధర్మాధ్యక్షః = ధర్మమునకు అధ్యక్షుడవు, విరూపాక్షః = బేసి కన్ను కలవాడవు, త్రివర్త్మా = మూడు మార్గములు కలవాడవు, భూతభావనః = భూతములను చూచువాడవు.

తా. జగత్తును పోషించువాడవు, జగత్తు సృజించువాడవు, పురుషుడవు (జీవుడవు), శాశ్వతుడవు, నిత్యుడవు, ధర్మసాక్షివి, మూడు కన్ను కలవాడవు, మూడు మార్గములు కలవాడవు (త్రిలోకసంచారివి), భూతములను చూచువాడవు.

మూ. త్రినేత్రో బహురూపశ్చ సూర్యాయుతసమప్రభః,
దేవదేవో౽తిదేవశ్చ చన్ద్రాఙ్కితజట స్తథా. 47

మూ. పుష్పదన్తో విభాగశ్చ ముఖ్యః సర్వహర స్తథా,
హరిశ్మశ్రుర్ధనుర్ధారీ భీమో భీమపరాక్రమః. 50

ప్ర. అ. పుష్పదన్తః = పుష్పదంతుడవు, విభాగః చ = విభాగము చేయువాడవు, ముఖ్యః = ముఖ్యుడవు, తథా = మరియు, సర్వహరః = సర్వమును హరించువాడవు. హరిశ్మశ్రుః = సింహము వంటి మీసములు కలవాడవు, ధనుర్ధారీ = ధనస్సు ధరించువాడవు, భీమః = భయంకరుడవు, భీమపరాక్రమః = భయంకరమైన పరాక్రమము కలవాడవు.

తా. నీవు పుష్పదంతుడవు, విభజించువాడవు, ముఖ్యుడవు, సర్వమును హరించువాడవు. పచ్చని మీసములు కలవాడవు. ధనస్సును ధరించువాడవు, భయంకరుడవు, భయంకరమైన పరాక్రమము కలవాడవు. 50

మూ. మయా ప్రోక్తమిదం పుణ్యం నామాష్టశతముత్తమమ్,
సర్వపాపహరం పుణ్యం శరణ్యం శరణార్థినామ్. 51
జప్తమేతద్దశగ్రీవ కుర్యాచ్ఛత్రువినాశనమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతుర్థః ప్రక్షిప్తః సర్గః.

ప్ర. అ. మయా = నాచేత, ప్రోక్తమ్ = చెప్పబడిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, పుణ్యమ్ = పుణ్యమైన, ఇదమ్ = ఈ, నామాష్టశతమ్ = నామముల నూట ఎనిమిది, సర్వపాపహరమ్ = సమస్తపాపములను హరించునది, పుణ్యమ్ = పవిత్రమైనది, శరణార్థినామ్ = శరణము కోరువారికి, శరణ్యమ్ = శరణు ఇచ్చునది, దశగ్రీవ = రావణా!, ఏతత్ = ఇది. జప్తమ్ = జపింపబడినదై, శత్రువినాశనమ్ = శత్రునాశనమును, కుర్యాత్ = చేయును.

తా. నేను చెప్పిన ఈ అష్టోత్తరశతనామస్తోత్రము పుణ్యప్రదము, ఉత్తమమైనది, సకలపాపములను తొలగించునది. పవిత్రము, శరణు కోరువారికి శరణు ఇచ్చునది. రావణా! దీనిని జపించినచో ఇది శత్రువినాశము చేయును. 51

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
నాల్గవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

కొంతకాలము పిమ్మట లోకములను ఏడ్పించు రావణుడు మంత్రులతో కలిసి పశ్చిమసముద్రమునకు వెళ్లెను. 2

మూ. ద్వీపస్థో దృశ్యతే తత్ర పురుషః పావకప్రభః, 3
మహాజామ్బూనదప్రఖ్య ఏక ఏవ వ్యవస్థితః.

ప్ర. అ. తత్ర = అక్కడ, పావకప్రభః = అగ్నివంటి కాంతి గల, మహాజామ్బూనదప్రఖ్యః = బంగారము వలె ఉన్న, ఏక ఏవ = ఒంటరిగానే, వ్యవస్థితః = ఉన్న, ద్వీపస్థః = ద్వీపమునందున్న, పురుషః = పురుషుడు, దృశ్యతే = కనబడుచున్నాడు.

తా. అక్కడ ద్వీపమునందు ఒంటరిగా ఉన్న అగ్ని వంటి కాంతి గల ఒక పురుషుడు కనబడెను. అతడు బంగారము వలె ఉండెను. 3

మూ. దృశ్యతే భీషణాకారో యుగాన్తానలసంనిభః, 4
దేవానామివ దేవేశో గ్రహాణామివ భాస్కరః,
శరభాణాం యథా సింహో హస్తిష్వైరావణో యథా, 5
పర్వతానాం యథా మేరుః పారిజాతశ్చ శాఖినామ్.

ప్ర. అ. భీషణాకారః = భయంకరమైన ఆకారము గల, యుగాన్తానిల సంనిభః = ప్రళయకాలాగ్నితో సమానుడైన అతడు, దేవానామ్ = దేవతలలో, దేవేశః ఇవ = ఇంద్రుడువలె, గ్రహాణామ్ = గ్రహములలో, భాస్కరః ఇవ = సూర్యుడు వలె, శరభాణామ్ = శరభమృగములలో, సింహః యథా = సింహము వలె, హస్తిషు = ఏనుగులలో, ఐరావతః యథా = ఐరావతము వలె, పర్వతానామ్ = పర్వతములలో, మేరుః యథా = మేరుపర్వతము వలె, శాఖినామ్ = వృక్షములలో, పారిజాతశ్చ యథా = పారిజాతము వలె, దృశ్యతే = చూడబడుచున్నాడు.

తా. భయంకరమైన ఆకారముతో ప్రళయకాలాగ్ని వలె ఉన్న అతడు దేవతలలో దేవేంద్రుడు వలె, గ్రహాలలో సూర్యుడు వలె, శరభమృగములలో సింహము వలె. ఏనుగులలో ఐరావతము వలె, పర్వతములలో మేరుపర్వతము వలె, వృక్షములలో పారిజాతము వలె కనబడుచుండెను. 4, 5

జ్వాలామాలాపరిక్షిప్తం కిఙ్కిణీజాలనిఃస్వనమ్,
మాలయా స్వర్ణపద్మానాం కణ్ఠదేశేఽవలమ్బయా. 12

ఋగ్వేదమివ శోభన్తం పద్మమాలావిభూషితమ్,
సోఽఞ్జనాచలసంకాశం కాఞ్చనాచలసంనిభమ్, 13
ప్రాహరద్రాక్షసపతిః శూలశక్త్యృష్టిపట్టిశైః.

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, సః = ఆ, రాక్షసపతిః = రావణుడు, వివిధైః = అనేకవిధములైన, నాదైః = ధ్వనులతో, గర్జన్ = గర్జించుచు, లమ్బహస్తమ్ = పొడవైన హస్తములు గలవాడు, భయానకమ్ = భయంకరుడు, దంష్ట్రిలమ్ = కోరలతో కూడినవాడు, వికటం చైవ = వికటముగా ఉన్నవాడు, కమ్బుగ్రీవమ్ = శంఖమువంటి కంఠముకలవాడు, మహోరసమ్ = గొప్ప వక్షఃస్థలము గలవాడు, మణ్డూకకుక్షిమ్ = కప్పకడుపు వంటి కడుపు కలవాడు, సింహాస్యమ్ = సింహము వంటి ముఖము కలవాడు, కైలాసశిఖరోపమమ్ = కైలాసశిఖరముతో సమానుడు, పద్మపాదతలమ్ = పద్మముల వంటి అరికాళ్ళు గలవాడు, భీమమ్ = భయంకరుడు, రక్తతాలుకరామ్బుజమ్ = ఎఱ్ఱని చెలివి, హస్తపద్మములు కలవాడు, మహానాదమ్ = గొప్ప ధ్వనికలవాడు, మహాకాయమ్ = పెద్ద దేహము కలవాడు, జవే = వేగమునందు, మనోనిలసమమ్ = మనస్సుతోను వాయువుతోను సమానుడు, భీమమ్ = భయంకరుడు, ఆబద్ధతుణీరమ్ = కట్టబడిన అంబుల పొదులు కలవాడు, సఘణ్టాబద్ధచామరమ్ = ఘంటలతో కూడినట్లు కట్టబడిన చామరములు కలవాడు, జ్వాలామాలాపరిక్షిప్తమ్ = జ్వాలల మాలలచేత చుట్టబడి ఉన్నవాడు, కిఙ్కిణీజాలనిఃస్వనమ్ = చిరుగుంటల సముదాయము ధ్వని కలవాడు, కణ్ఠదేశే = కంఠప్రదేశమునందు, అవలమ్బయా = వ్రేలాడుచున్న, స్వర్ణపద్మానామ్ = బంగారు పద్మములయొక్క, మాలయా = మాలచేత, ఋగ్వేదమివ = ఋగ్వేదమువలె, శోభన్తమ్ = శోభించుచున్నవాడు, పద్మమాలావిభూషితమ్ = పద్మమాలలచేత అలంకరించబడినవాడు, అఞ్జనాచలసంకాశమ్ = అంజనాచలముతో సమానుడు, కాఞ్చనాచలసంనిభమ్ = మేరుపర్వతముతో సమానుడు అయిన ఆ పురుషుణ్ణి, శూలశక్త్యృష్టిపట్టిశైః = శూలములతోను, శక్తులతోను, ఋష్టులతోను, పట్టిశములతోను, ప్రాహరత్ = కొట్టెను.

తా. రావణుడు అనేకవిధములుగా గర్జించుచు దీర్ఘములైన భుజములతో,

మూ. రావణస్య చ యో వేగః సర్వలోకభయంకరః, 16
తథా వేగసహస్రాణి సంశ్రితాని తమేవ హి.

ప్ర. అ. సర్వలోకభయంకరః = సకలలోకములకు భయంకరమైన, రావణస్య = రావణునియొక్క, యః వేగః = ఏ వేగము గలదో, తథా = అట్లు, వేగసహస్రాణి = వేగములయొక్క సహస్రములు, తమ్ = ఆ పురుషుణ్ణి, సంశ్రితాని ఏవ హి = ఆశ్రయించి ఉన్నవి కదా.

తా. రావణునిలో సకలలోకములకు భయము కలిగించు ఏ వేగము కలదో అట్టి వేలకొలది వేగములు ఆ పురుషుణ్ణి ఆశ్రయించి ఉన్నవి. 16

మూ. ధర్మస్తస్య తపశ్చైవ జగతః సిద్ధిహేతుకౌ, 17
ఊరూ హ్యాశ్రిత్య తస్థాతే మన్మథః శిశ్నమాశ్రితః.
విశ్వేదేవాః కటీభాగే మరుతో బస్తిపార్శ్వయోః. 18

ప్ర. అ. జగతః = జగత్తుయొక్క, సిద్ధిహేతుకౌ = సిద్ధికి హేతువులైన, ధర్మః = ధర్మము, తపశ్చైవ = తపస్సు, తస్య = వానియొక్క, ఊరూ = తొడలను, ఆశ్రిత్య = ఆశ్రయించి, తస్థాతే = ఉన్నవి. మన్మథః = మన్మథుడు, శిశ్నమ్ = శిశ్నమును, ఆశ్రితః = ఆశ్రయించినాడు. విశ్వేదేవాః = విశ్వేదేవతలు, కటీభాగే = కటిప్రదేశమునందు, మరుతః = మరుత్తులు, బస్తిపార్శ్వయోః = బస్తియందు, పార్శ్వములయందు ఉండెను.

తా. జగత్తు సిద్ధికి హేతువులైన ధర్మము, తపస్సు ఆ పురుషుని తొడలను ఆశ్రయించి ఉన్నవి. మన్మథుడు శిశ్నమును, విశ్వేదేవతలు కటిప్రదేశమును, మరుత్తులు బస్తిని పార్శ్వములను ఆశ్రయించి ఉండెను. 17,18

మూ. మధ్యేఽష్టౌ వసవస్తస్య సముద్రాః కుక్షితః స్థితాః,
పార్శ్వాదిషు దిశః సర్వాః సర్వసంధిషు మారుతః. 19

ప్ర. అ. తస్య = ఆతనియొక్క, మధ్యే = మధ్యప్రదేశమునందు, అష్టౌ = ఎనమండుగురు, వసవః = వసువులు, కుక్షితః = కుక్షియందు, సముద్రాః = సముద్రములు, స్థితాః = ఉన్నవి. పార్శ్వాదిషు = పార్శ్వాదిస్థానములయందు, సర్వాః =

తా. హిమవత్పర్వతము, హేమకూటము, మందరము, మేరుపర్వతమూ కూడా ఎముకలుగా అయి ఆ పురుషుణ్ణి ఆశ్రయించుకొని ఉండెను. 22

మూ. పాణిర్వజ్రోఽభవత్తస్య శరీరే ద్యౌరపి స్థితా,
కృకాటికాయాం సన్ధ్యా చ జలవాహాశ్చ యే ఘనాః. 23

ప్ర. అ. వజ్రః = వజ్రాయుధము, తస్య = వానియొక్క, పాణిః = హస్తముగా, అభవత్ = ఆయెను. శరీరే=శరీరమునందు, ద్యౌః అపి = ఆకాశముకూడ, స్థితా = ఉన్నది. కృకాటికాయామ్ = మెడ వెనుకభాగమునందు, సన్ధ్యా చ = సంధ్యా, జలవాహాః = జలమును మోసికొని వెళ్లు, యే = ఏ, ఘనాః = మేఘములున్నవో అవీ ఉండెను.

తా. వజ్రాయుధము ఆతని హస్తముగా ఆయెను. శరీరమునందు ఆకాశము, మెడ వెనుకభాగమునందు సంధ్యా, మేఘములూ ఉండెను. 23

మూ. బాహూ ధాతా విధాతా చ తథా విద్యాధరాదయః,
శేషశ్చ వాసుకిశ్చైవ విశాలాక్ష ఇరావతః. 24

కమ్బలాశ్వతరౌ చోభౌ కర్కోటకధనంజయౌ,
స చ ఘోరవిషో నాగ స్తక్షకః సోపతక్షకః. 25

కరజానాశ్రితాశ్చైవ విషవీర్యముముక్షవః,
అగ్నిరాస్యమభూత్తస్య స్కన్ధౌ రుద్రైరధిష్ఠితౌ. 26

ప్ర. అ. ధాతా = ధాత, విధాతా చ = విధాత, తథా=మరియు, విద్యాధరాదయః = విద్యాధరులు మొదలైనవారు, బాహూ = బాహువులను ఆశ్రయించి ఉండిరి శేషశ్చ = శేషుడు, వాసుకిః చైవ = వాసుకి, విశాలాక్షః = విశాలాక్షుడు, ఐరావతః = ఐరావతుడు, ఉభౌ = ఇద్దరైన, కమ్బలాశ్వతరౌ = కంబలుడు, అశ్వతరుడు, కర్కోటక ధనంజయౌ=కర్కోటకధనంజయులు, సోపతక్షకః = ఉపతక్షకునితో కూడిన, ఘోరవిషః = ఘోరమైన విషము గల, సః = ఆ, తక్షకః నాగః = తక్షకు డను నాగుడు, విషవీర్యమ్=విషముయొక్క వీర్యమును, ముముక్షవః = విడవదలచుకొన్నవారై, కరజాన్ = గోళ్ళను, ఆశ్రితాః చైవ = ఆశ్రయించిరి. అగ్నిః = అగ్ని, తస్య = ఆతనియొక్క, ఆస్యమ్ = ముఖముగా,

ప్ర. అ. వేదాఙ్గాని = వేదాంగములు, యజ్ఞాః చ = యజ్ఞములు, యాని = ఏ, తారారూపాణి = నక్షత్రరూపము లున్నవో అవీ, సువృత్తాని చ = మంచి వృత్తములు, వాక్యాని = వాక్యములు, తేజాంసి చ = తేజస్సులు, తపాంసి చ = తపస్సులు, ఏతాని = ఇవి, నరరూపస్య = నరరూపుడైన, తస్య = వానియొక్క, దేహాశ్రితాని వై = దేహమును ఆశ్రయించుకొని ఉన్నవి.

తా. వేదాంగములు, యజ్ఞములు, నక్షత్రములు, మంచి వృత్తములు, వాక్యములు, తేజస్సులు, తపస్సులు, ఆ పురుషుని దేహమును ఆశ్రయించుకొని ఉండెను. 29

మూ. తేన ముష్టిప్రహారేణ స్వల్పమాత్రేణ లీలయా, 30
పాణినా పీడితం రక్షో నిపపాత మహీతలే.

ప్ర. అ. తేన = అతనిచేత, స్వల్పమాత్రేణ = స్వల్పమైన, ముష్టిప్రహారేణ = గుద్దుచేత, పాణినా = హస్తముచేత, లీలయా = లీలతో, పీడితమ్ = పీడించబడిన, రక్షః = రాక్షసుడు, మహీతలే = నేలమీద, నిపపాత = పడెను.

తా. ఆ పురుషుడు లీలగా చెయ్యి ఎత్తి పిడికిలి బిగించి మెల్లగా కొట్టగానే ఆ రాక్షసుడు పడిపోయెను. 30

మూ. పతితం రాక్షసం జ్ఞాత్వా విద్రావ్య స నిశాచరాన్, 31
ఋగ్వేదప్రతిమః సోఽథ పద్మమాలావిభూషితః,
ప్రవివేశ చ పాతాలం నిజం పర్వతసంనిభః. 32

ప్ర. అ. పర్వతసంనిభః = పర్వతముతో సమానుడైన, పద్మమాలావిభూషితః = పద్మమాలలచేత అలంకరించబడిన, సః = ఆ, ఋగ్వేదప్రతిమః = ఋగ్వేదముతో సమానుడైన, సః = అతడు, రాక్షసమ్ = రావణుణ్ణి, పతితమ్ = పడినవానినిగా, జ్ఞాత్వా = తెలుసుకొని, నిశాచరాన్ = రాక్షసులను, విద్రావ్య = తరిమివేసి, నిజమ్ = తనసంబంధమైన, పాతాలమ్ = పాతాలమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పద్మమాలలు అలంకరించుకొని ఋగ్వేదము వలె ఉన్న, పర్వతము వంటి ఆకారము గల ఆ పురుషుడు రావణుడు పడిపోయినట్లు చూచి రాక్షసులను తరిమివేసి తన నివాసమైన పాతాళములోనికి వెళ్ళిపోయెను. 31, 32

తా. అప్పుడు దుర్మతియైన రావణుడు వేగముగా, గరుత్మంతుడు సర్పమును గ్రహించినట్లు ఖడ్గమును గ్రహించి, శీఘ్రముగా బిలద్వారము సమీపించి, భయము లేనివాడై ఆ ద్వారములోనికి ప్రవేశించెను. 35

మూ. స ప్రవిశ్య చ పశ్యద్వై నీలాఞ్జనచయోపమాన్, 36
కేయూరధారిణః శూరాన్ రక్తమాల్యానులేపనాన్,
వరహాటకరత్నాద్యైర్వివిధైశ్చ విభూషితాన్. 37

ప్ర. అ. సః=రావణుడు, ప్రవిశ్య=ప్రవేశించి, నీలాఞ్జనచయోపమాన్=నల్లని కాటుకరాసితో సమానులు, కేయూరధారిణః=బాహుపురులు ధరించినవారు, రక్తమాల్యానులేపనాన్ = ఎఱ్ఱని పుష్పమాలలు, అనులేపనములు కలవారు, వివిధైః = అనేకవిధములైన, వరహాటకరత్నాద్యైః = శ్రేష్ఠమైన బంగారము, రత్నములు మొదలైనవాటితో, విభూషితాన్ = అలంకరించబడినవారూ అయిన, శూరాన్ = శూరులను, పశ్యత్ వై = చూచెను.

తా. రావణుడు బిలములో ప్రవేశించి అక్కడ నల్లని కాటుకరాసులవంటి శూరులను చూచెను. వారు బాహుపురులు, బంగారము, రత్నములు అలంకరించుకొని ఎఱ్ఱని మాలలు ధరించి అనులేపనములు పూసికొని ఉండిరి. 36, 37

మూ. దృశ్యన్తే తత్ర నృత్యన్త్యస్తిస్రః కోట్యో మహాత్మనామ్,
నృత్యోత్సవా వీతభయా విమలాః పావకప్రభాః. 38

ప్ర. అ. తత్ర = అక్కడ, నృత్యోత్సవాః = నృత్యము ఉత్సవముగా గల, వీతభయాః = పోయిన భయము గల, విమలాః = నిర్మలములైన, పావకప్రభాః = అగ్నివంటి కాంతి గల, మహాత్మనామ్=మహాత్ములయొక్క, తిస్రః= మూడు, కోట్యః=కోటులు, నృత్యన్త్యః=నాట్యముచేయుచు దృశ్యన్తే=చూడబడుచున్నవి.

తా. అక్కడ నృత్యోత్సవము చేసికొనుచున్న, భయములేని, నిర్మలులైన అగ్ని వంటి కాంతి గల మూడు కోట్లమంది మహాత్ములు నృత్యము చేయుచు ఆతనికి కనబడిరి. 38

మూ. క్రీడతః పశ్యతే తాంస్తు రావణో భీమవిక్రమః,
ద్వారస్థో రావణస్తత్ర తాసు కోటిషు నిర్భయః. 39

ప్ర. అ. స్వయంభువా = బ్రహ్మదేవునిచేత, దత్తవరః = ఇవ్వబడిన వరములు గల అతడు, తతః=అక్కడినుండి, పాణ్డురేణ=తెల్లని, మహార్ఘేణ= గొప్ప విలువగల, శయనాసనవేశ్మనా = శయనములు, ఆసనములు ఉండు గృహము ద్వారా, శీఘ్రమ్ = శీఘ్రముగా, వినిర్యయౌ = బయల్వెడలెను, అథ= పిమ్మట, తత్ర=అక్కడ, శయనే=శయనమునందు, స్థితమ్=ఉన్న, పరమ్= ఉత్తముడైన, పురుషమ్ = పురుషుణ్ణి, అపశ్యత్ = చూచెను.

తా. బ్రహ్మనుండి వరములు పొందిన ఆ రావణుడు అక్కడినుండి గొప్పవిలువ గల తెల్లని శయనములు, ఆసనములు ఉన్న గృహము ద్వారా శీఘ్రముగా ముందుకు వెళ్ళి అక్కడ శయనముపైన ఉన్న ఒక ఉత్తమపురుషుణ్ణి చూచెను. 42

మూ. శేతే స పురుషస్తత్ర పావకేనావగుణ్ఠితః. 43
దివ్యస్రగనులేపా చ దివ్యాభరణభూషితా,
దివ్యామ్బరధరా సాధ్వీ త్రైలోక్యస్యైకభూషణమ్. 44

వాలవ్యజనహస్తా చ దేవీ తత్ర వ్యవస్థితా,
లక్ష్మీదేవీ సపద్మా వై భ్రాజతే లోకసున్దరీ. 45

ప్ర. అ. సః పురుషః=ఆ పురుషుడు, పావకేన=అగ్నిచేత, అవగుణ్ఠితః= కప్పబడినవాడై, తత్ర = అక్కడ, శేతే = శయనించి ఉన్నాడు, దివ్యస్రగనులేపా చ = దివ్యములైన మాలలు, అనులేపనము గల, దివ్యాభరణభూషితా = దివ్యములైన ఆభరణములచేత అలంకరించబడిన, దివ్యామ్బరధరా = దివ్యములైన వస్త్రములు ధరించిన, సాధ్వీ = పతివ్రతయైన, త్రైలోక్యస్య = మూడు లోకముల సముదాయమునకు, ఏకభూషణమ్ = ఒకే అలంకారమైన, దేవీ=దేవి, వాలవ్యజనహస్తా = వింజామర హస్తమునందు కలదై, తత్ర = అక్కడ, వ్యవస్థితా = నిలచినది. లోకసున్దరీ = లోకములలో సుందరియైన, లక్ష్మీదేవీ = లక్ష్మీదేవి, సపద్మా = పద్మములతో కూడినదై, భ్రాజతే = ప్రకాశించుచున్నది.

తా. ఆ పురుషుడు అగ్నిచేత కప్పబడినవాడై అక్కడ శయనించి ఉండెను. అక్కడ ఒక దేవి వింజామర చేతిలో గ్రహించి నిలబడి ఉండెను. పతివ్రత మూడు లోకములకు అలంకారమూ అయిన ఆమె దివ్యములైన మాలలు,

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సుప్తః = నిద్రించిన, మహాబాహుః = గొప్పబాహువులు గల. పావకేన = అగ్నిచేత, అవగుణ్ఠితః = కప్పబడిన, దేవః = ఆ దేవుడు, తమ్ = ఆతనిని, గ్రహీతుకామమ్ = గ్రహించుటకు కోరిక కల వానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, తదా = అప్పుడు, పటమ్ = వస్త్రమును, వ్యపవిధ్య = తొలగించి, తం రాక్షసాధిపమ్ = ఆ రావణుణ్ణి, దృష్ట్వా = చూచి, భృశమ్ = మిక్కిలి, ఉచ్చైః = గట్టిగా, జహాస = నవ్వెను.

తా. అప్పుడు అగ్నిచేత ఆవరింపబడి నిద్రించుచున్న మహాబాహువైన ఆ దేవుడు, రావణుడు ఆ సాధ్విని గ్రహించనున్నట్లు తెలిసికొని, కప్పుకొనిన వస్త్రమును తొలగించి, బిగ్గరగా నవ్వెను. 48, 49

మూ. తేజసా సహసా దీప్తో రావణో లోకరావణః,
కృత్తమూలో యథా శాఖీ నిపపాత మహీతలే. 50

ప్ర. అ. సహసా = వెంటనే, తేజసా = తేజస్సుచేత, దీప్తః = కాల్చబడిన, లోకరావణః = లోకములను ఏడ్పించు, రావణః = రావణుడు, కృత్తమూలః = ఛేదించబడిన మొదలు గల, శాఖీ యథా = వృక్షము వలె, మహీతలే = నేలమీద, నిపపాత = పడెను.

తా. లోకములను ఏడ్పించు ఆ రావణుడు ఆ తేజస్సుకు కాలిపోయినవాడై, మొదలు నరికిన చెట్టువలె వెంటనే నేలమీద పడెను. 50

మూ. పతితం రాక్షసం జ్ఞాత్వా వచనం చేదమబ్రవీత్,
ఉత్తిష్ఠ రాక్షసశ్రేష్ఠ మృత్యుస్తే నాద్య విద్యతే. 51

ప్ర. అ. రాక్షసమ్ = ఆ రాక్షసుణ్ణి, పతితమ్ = పడిపోయినవానినిగా, జ్ఞాత్వా = తెలుసుకొని, ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును కూడ, అబ్రవీత్ = పలికెను. రాక్షసశ్రేష్ఠ = ఓ! రాక్షసశ్రేష్ఠుడా! ఉత్తిష్ఠ = లెమ్ము, అద్య = ఇప్పుడు, తే = నీకు, మృత్యుః = మృత్యువు, న విద్యతే = లేదు.

తా. రావణుడు పడిపోయినట్లు చూచి ఆ పురుషుడు ఇట్లు పలికెను. "రాక్షసశ్రేష్ఠుడా లెమ్ము, నీకింకా ఇప్పుడు మరణము లేదు." 51

దేవా! త్వమ్ = నీవు, బ్రూహి = చెప్పుము. భవాన్ = నీవు, కుతః = ఎందువలన, భూత్వా = ఇట్లు అయి, వ్యవస్థితః = ఉన్నావు ?

తా. "పరాక్రమవంతుడవు, ప్రళయకాలాగ్నివంటివాడవు అయిన నీవు ఎవ్వరవు ? ఓ! దేవా! చెప్పుము నీవు ఇట్లు ఇక్కడ ఎందు కున్నావు ?" 54

మూ. ఏవముక్తస్తతో దేవో రావణేన దురాత్మనా, 55
ప్రత్యువాచ హసన్ దేవో మేఘగమ్భీరయా గిరా.

ప్ర. అ. దురాత్మనా = దుష్టబుద్ధి గల, రావణేన = రావణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దేవః = ప్రకాశించుచున్న, దేవః = ఆ దేవుడు, ప్రహసన్ = నవ్వుచు, మేఘగమ్భీరయా = మేఘము వలె గంభీరమైన, గిరా = వాక్కుతో, ప్రత్యువాచ = పలికెను.

తా. ఆ దేవుడు దురాత్ముడైన రావణుని మాటలు విని నవ్వుచు, మేఘ ధ్వని వలె గంభీరమైన వాక్కుతో ఇట్లు బదులు చెప్పెను. 55

మూ. కిం తే మయా దశగ్రీవ వధ్యోఽసి నచిరాన్మమ, 56
ఏవముక్తో దశగ్రీవః ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్.

ప్ర. అ. దశగ్రీవ = రావణా! తే = నీకు, మయా = నాచేత, కిమ్ = ఏమి ప్రయోజనము ? నచిరాత్ = అచిరకాలములో, మమ = నాకు. వధ్యః = చంప దగినవాడవు, అసి = అయిఉన్నావు. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దశ గ్రీవః = రావణుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. "రావణా! నేను ఎవరినైతే మాత్రము నీకెందుకు ? నిన్ను కొద్ది కాలములో నేను చంపనున్నాను". రావణుడు ఆ మాటలు విని అంజలి ఘటించి ఇట్లు పలికెను. 56

మూ. ప్రజాపతేస్తు వచనాన్నాహం మృత్యుపథం గతః,
న స జాతో జనిష్యో వా మమ తుల్యః సురేష్వపి. 57

ప్ర. అ. ప్రజాపతేః = బ్రహ్మదేవునియొక్క, వచనాత్ = వచనమువలన,

మూ. అథాపి చ భవేన్మృత్యు స్త్వద్ధస్తాన్నాన్యతః ప్రభో, 60
యశస్యం శ్లాఘనీయం చ త్వద్ధస్తాన్మరణం మమ.

ప్ర. అ. ప్రభో = ఓ! ప్రభూ ! మృత్యుః = మృత్యువు, అథాపి చ భవేత్ = కలిగినను, త్వద్ధస్తాత్ = నీ హస్తమువలననే, అన్యతః = మరొకనివలన, న = కలగకూడదు. త్వద్ధస్తాత్ = నీ హస్తమువలన, మరణమ్ = మరణము, మమ = నాకు, యశస్యమ్ = యశస్సును కలిగించునది. శ్లాఘనీయంచ = శ్లాఘించదగినది.

తా. ప్రభూ! నాకు మరణము వచ్చినను నీచేతనే రావచ్చును. నీవలన నాకు మరణము వచ్చినచో అది శ్లాఘింపదగినది, యశస్కరమూ కూడ అగును. 60

మూ. అథాస్య గాత్రే సంపశ్యద్రావణో భీమవిక్రమః, 61
తస్య దేవస్య సకలం త్రైలోక్యం సచరాచరమ్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, భీమవిక్రమః = భయంకరమైన పరాక్రమము గల, రావణః = రావణుడు, తస్య = ప్రసిద్ధుడైన, అస్య దేవస్య = ఈ దేవుని యొక్క, గాత్రే = శరీరమునందు, సకలమ్ = సమస్తమైన, సచరాచరమ్ = చరాచరములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడు లోకములను, సంపశ్యత్ = చూచెను.

తా. పిమ్మట భయంకరమైన పరాక్రమము గల రావణుడు ఆ దేవుని శరీరమునందు స్థావరజంగమాత్మకమైన మూడు లోకముల సముదాయమును చూచెను. 61

మూ. ఆదిత్యా మరుతః సాధ్యా వసవోఽథాశ్వినావపి, 62
రుద్రాశ్చ పితరశ్చైవ యమో వైశ్రవణస్తథా,
సముద్రా గిరయో నద్యో వేదా విద్యాస్త్రయోఽగ్నయః.

గ్రహాస్తారాగణా వ్యోమ సిద్ధా గన్ధర్వచారణాః,
మహర్షయో వేదవిదో గరుడోఽథ భుజఙ్గమాః. 64

యే చాన్యే దేవతాసంఘాః సంస్థితా దైత్యరాక్షసాః,
గాత్రేషు శయనస్థస్య దృశ్యన్తే సూక్ష్మమూర్తయః 65

ప్ర. అ. ఆదిత్యాః = పన్నెండుగురు ఆదిత్యులు, మరుతః = ఏడుగురు

తా. అప్పుడు ధర్మాత్ముడైన రాముడు మునిశ్రేష్ఠుడైన అగస్త్యుణ్ణి ఇట్లు ప్రశ్నించెను. "ద్వీపమునందున్న ఆ పురుషుడు ఎవడు? ఆ మూడు కోట్లమంది జనులు ఎవరు? దైత్యదానవుల దర్పము అడచిన, శయనించి ఉన్న ఆ పురుషుడు ఎవడు?". 66

మూ. రామస్య వచనం శ్రుత్వా హ్యగస్త్యో వాక్యమబ్రవీత్. 67
శ్రూయతామభిధాస్యామి దేవదేవః సనాతనః,
భగవాన్ కపిలో నామ ద్వీపస్థో నర ఉచ్యతే. 68

ప్ర. అ. రామస్య=రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా= విని, అగస్త్యః = అగస్త్యుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అభిధాస్యామి = చెప్పెదను. శ్రూయతామ్ = వినబడుగాక. ద్వీపస్థః = ద్వీపమునందున్న, నరః=నరుడు, దేవదేవః = దేవదేవుడు, సనాతనః=నిత్యుడు అయిన, భగవాన్ = భగవంతుడైన, కపిలః నామ = కపిలుడుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు".

తా. రాముని మాటలు విని అగస్త్యుడు ఇట్లనెను. "చెప్పెదను; వినుము. ద్వీపమునందున్న పురుషుడు దేవదేవుడు, సనాతనుడు అయిన భగవంతుడైన కపిలుడు" 67,68

మూ. యే తు నృత్యన్తి వై తత్ర సురాస్తే తస్య ధీమతః,
తుల్యతేజఃప్రభావాస్తే కపిలస్య నరస్య వై. 69

ప్ర. అ. తత్ర = అక్కడ, యే = ఎవరు, నృత్యన్తి = నాట్యముచేయుచున్నారో, తే = వారు, ధీమతః = బుద్ధిమంతుడైన; తస్య = ఆతనియొక్క; సురాః = దేవతలు. తే = వారు, నరస్య = నరుడైన కపిలునికి; తుల్యతేజః ప్రభావాః = తుల్యమైన తేజస్సు ప్రభావము గలవారు.

తా. అక్కడ నృత్యముచేయుచున్నవారు బుద్ధిమంతుడైన ఆతనికి సంబంధించిన దేవతలు; వాళ్ళు కపిలుడనే ఆ పురుషునితో సమానమైన తేజస్సు, ప్రభావమూ గలవారు. 69

బడిన సంజ్ఞ కలవాడై, తే=ఆ, సచివాః=మంత్రులు, యత్ర=ఎక్కడ, స్థితాః= ఉన్నారో, అక్కడికి, ఆజగామ=వచ్చెను.

తా. గొప్ప తేజస్సు గల ఆ రావణుడు చాల సేపటికి స్పృహ రాగా తన మంత్రులున్న చోటికి వచ్చెను. 72

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఐదవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

మూ. ఏవం పన్నగకన్యాశ్చ రాక్షసాసురమానుషీః,
యక్షదానవకన్యాశ్చ విమానే సోఽధ్యరోపయత్. 3

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సః = అతడు, పన్నగకన్యాః చ = నాగకన్యలను, రాక్షసాసురమానుషీః = రాక్షస-అసుర-మనుష్యస్త్రీలను, యక్షదానవకన్యాః చ = యక్షదానవకన్యలను, విమానే = విమానమునందు, అధ్యరోపయత్ = ఎక్కించెను.

తా. ఈ విధముగా అతడు నాగ-రాక్షస-అసుర-మనుష్య-యక్ష-దానవ కన్యలను విమానము మీద ఎక్కించుకుని తీసికొనిపోయెను. 3

మూ. తా హి సర్వాః సమం దుఃఖాన్ముముచుర్బాష్పజం జలమ్,
తుల్యమగ్న్యర్చిషాం తత్ర శోకాగ్నిభయసంభవమ్. 4

ప్ర. అ. తాః = ఆ స్త్రీలు, సర్వాః = అందరూ, తత్ర = అక్కడ, దుఃఖాత్ = దుఃఖమువలన, అగ్న్యర్చిషామ్ = అగ్నిజ్వాలలకు, తుల్యమ్ = సమానము, శోకాగ్నిభయసంభవమ్ = శోకాగ్నివలన భయమువలనా పుట్టిన, బాష్పాంబుజమ్ = కన్నీళ్ళవలన పుట్టిన, జలమ్ = జలమును, సమమ్ = సమముగా, ముముచుః = విడచిరి.

తా. ఆ కన్యలందరూ దుఃఖించుచు శోకాగ్నివలన భయమువలనా జనించిన, అగ్నిజ్వాలలతో సమానమైన కన్నీటిని సమముగా విడచిరి. 4

మూ. తాభిః సర్వానవద్యాభిర్నదీభిరివ సాగరః,
ఆపూరితం విమానం తద్ భయశోకాశివాశ్రుభిః. 5

ప్ర. అ. సర్వానవద్యాభిః = పూర్తిగా దోషరహితలైన, భయశోకాశివాశ్రుభిః = భయముచేత, శోకముచేత అమంగళప్రదమైన కన్నీళ్ళు గల, తాభిః = ఆ కన్యలచేత, తత్ = ఆ, విమానమ్ = విమానము, నదీభిః = నదులచేత, సాగరః ఇవ = సముద్రము వలె, ఆపూరితమ్ = నింపబడినది.

తా. భయముచేత శోకముచేత కన్నీళ్ళు కార్చుచున్న, ఎట్టి దోషములూ లేని ఆ కన్యలచేత, ఆ విమానము, నదులచేత సముద్రము వలె నింపబడెను. 5

మనోహరముగా ఉన్న, చక్కనినడుములు గల ఆ స్త్రీలు శోకదుఃఖములతో కలత చెంది ఉండిరి. 7, 8

మూ. తాసాం నిఃశ్వాసవాతేన సర్వతః సంప్రదీపితమ్, 9
అగ్నిహోత్రమివాభాతి సంనిరుద్ధాగ్ని పుష్పకమ్.

ప్ర. అ. తాసామ్ = ఆ స్త్రీలయొక్క, నిఃశ్వాసవాతేన = నిట్టూర్పుగాలిచేత, సర్వతః = అంతటా, సంప్రదీపితమ్ = మండింపచేయబడిన, పుష్పకమ్ = పుష్పకము, సంనిరుద్ధాగ్ని = దగ్గరగా చేర్చి నిరోధింపబడిన అగ్ని గల, అగ్నిహోత్ర మివ = అగ్నికుండము వలె, ఆభాతి = ప్రకాశించుచున్నది.

తా. వాళ్ళ నిట్టూర్పుల గాలులచేత అంతటా ప్రజ్వలింపచేయబడిన పుష్పకము నిరోధింపబడిన అగ్నులు గల అగ్నికుండము వలె ఉండెను. 9

మూ. దశగ్రీవవశం ప్రాప్తాస్తాస్తు శోకాకులాః స్త్రియః, 10
దీనవక్త్రేక్షణాః శ్యామా మృగ్యః సింహవశా ఇవ.

ప్ర. అ. దశగ్రీవవశమ్ = రావణుని వశమును, ప్రాప్తాః = పొందిన, శ్యామాః = యౌవనమధ్యమునందున్న, తాః స్త్రియః = ఆ స్త్రీలు, సింహవశాః = సింహమునకు లొంగిన, మృగ్యః ఇవ = ఆడ లేళ్ళు వలె, దీనవక్త్రేక్షణాః = దీనములైన ముఖములు, నేత్రములు కలవారై, శోకాకులాః = శోకముచే ఆకులలు అయిరి.

తా. రావణునికి చిక్కిన యౌవనమధ్యమునందున్న ఆ స్త్రీలు సింహ వశములో ఉన్న ఆడలేళ్ళ వలె దైన్యము చెందిన ముఖములతో నేత్రములతో శోకాక్రాంతలైరి. 10

మూ. కాచిచ్చిన్తయతీ తత్ర కిం ను మాం భక్షయిష్యతి, 11
కాచిద్దధ్యౌ సుదుఃఖార్తా అపి మాం మారయేదయమ్.

ప్ర. అ. తత్ర = వారిలో, కాచిత్ = ఒక స్త్రీ, మామ్ = నన్ను, కిం ను భక్షయిష్యతి = భక్షించునా అని, చిన్తయతీ = చింతించుచు ఉండెను. మామ్ = నన్ను, అయమ్ = ఇతడు, అపి మారయేత్ = చంపివేయునా అని, కా చిత్ =

ప్ర. అ. హా = అయ్యో! అహమ్ = నేను, తస్మాత్ = ఆ, భర్తుః వినా = భర్త లేకుండా, కథమ్ = ఎట్లు, కరిష్యామి = చేయుదును? మృత్యో=ఓ! మృత్యు దేవతా! త్వామ్=నిన్ను, ప్రసాదయామి=ప్రతిమాలుచున్నాను. దుఃఖభాగినీమ్= దుఃఖమును పొందిన, మామ్=నన్ను, నయ=తీసికొనిపొమ్ము. పురా=పూర్వము, దేహాన్తరే = మరియొక దేహమునందు, తత్ = ఆ, కిం ను = ఏ, దుష్కృతమ్ = పాపరూపమైన, కర్మ = కర్మ, కృతమ్ = చేయబడినదో కదా!

తా. ఆ భర్త లేకుండా నేనేమి చేయుదును? ఓ! మృత్యుదేవతా! నిన్ను ప్రతిమాలుకొనుచున్నాను. దుఃఖము అనుభవించవలసి ఉన్న నన్ను తీసికొని పొమ్ము. పూర్వజన్మలో నేనెట్టి పాపము చేసి ఉన్నానో కదా! 14,15

మూ. ఏవం స్మ దుఃఖితాః సర్వాః పతితాః శోకసాగరే,
న ఖల్విదానీం పశ్యామో దుఃఖస్యాస్యాన్తమాత్మనః. 16

ప్ర. అ. దుఃఖితాః = దుఃఖించుచున్న, సర్వాః = మే మందరమూ, శోక సాగరే = దుఃఖసముద్రమునందు, ఏవమ్ = ఈ విధముగా, పతితాః స్మ = పడి పోయినాము. ఇదానీమ్ = ఇప్పుడు, ఆత్మనః = మాయొక్క, అస్య దుఃఖస్య = ఈ దుఃఖమునకు, అన్తమ్ = అంతమును, న పశ్యామః ఖలు = చూచుటలేదు కదా!

తా. ఈ విధముగా దుఃఖము చెంది శోకసాగరములో పడిన మాకు ఈ దుఃఖ మునకు అంతము కనబడుటలేదు. 16

మూ. అహో ధిఙ్మానుషం లోకం నాస్తి ఖల్వధమః పరః,
యద్దుర్బలా బలవతా భర్తారో రావణేన నః. 17
సూర్యేణోదయతా కాలే నక్షత్రాణీవ నాశితాః.

ప్ర. అ. అహో=అయ్యో! మానుషం లోకమ్=మనుష్యలోకమునుగూర్చి, ధిక్ = నింద అగుగాక! పరః=దీనిని మించిన, అధమః = అధమలోకము, నాస్తి ఖలు = లేదు కదా! యత్ = ఎందువలన, దుర్బలాః = దుర్బలులైన, నః భర్తారః = మన భర్తలు, బలవతా = బలవంతుడైన, రావణేన = రావణునిచేత, కాలే=ప్రాతఃకాలమునందు, ఉదయతా = ఉదయించుచున్న, సూర్యేణ=సూర్యుని చేత, నక్షత్రాణీవ = నక్షత్రములు వలె, నాశితాః = నశింప చేయబడినారో!

క్రీడించుచున్నాడో, తస్మాత్ = ఆకారణమువలన, స్త్రీకృతేనైవ = స్త్రీ మూలము గానే, వధమ్ = వధను, ప్రాప్స్యతి వై = పొందగలడు.

తా. దుర్బుద్ధియైన ఈ రాక్షసాధముడు పరభార్యలయందు అభిలాష కలిగి ఉన్నాడు; అందువలన ఇతడు స్త్రీ మూలముననే మరణించగలడు. 20

మూ. సతీభిర్వరనారీభిరేవం వాక్యేఽభ్యుదీరితే, 21
నేదుర్దున్దుభయః ఖస్థాః పుష్పవృష్టిః పపాత హ.

ప్ర. అ. సతీభిః = పవిత్రలైన, వరనారీభిః = ఉత్తమస్త్రీలచేత, ఏవమ్ = ఇట్లు, వాక్యే = వాక్యము, అభ్యుదీరితే = పలకబడినదగుచుండగా, ఖస్థాః = ఆకాశము నందున్న, దున్దుభయః = దుందుభులు, నేదుః = ధ్వనిచేసినవి. పుష్పవృష్టిః చ = పుష్పవర్షముకూడ, పపాత = పడెను.

తా. పతివ్రతలైన ఆ ఉత్తమస్త్రీలు ఇట్లు పలకగానే ఆకాశమునందున్న దుందుభులు మ్రోగెను. పుష్పవర్షము కురిసెను. 21

మూ. శప్తః స్త్రీభిః స తు సమం హతౌజా ఇవ నిష్ప్రభః, 22
పతివ్రతాభిః సాధ్వీభిర్బభూవ విమనా ఇవ.

ప్ర. అ. పతివ్రతాభిః = పతివ్రతలు, సాధ్వీభిః = మంచివాళ్లు అయిన, స్త్రీభిః = స్త్రీలచేత, సమమ్ = ఒక్కమారుగా, శప్తః = శపించబడిన, సః తు = అతడైతే, హతౌజాః ఇవ = కొట్టబడిన తేజస్సు గలవాడు వలె, నిష్ప్రభః = కాంతి శూన్యుడుగాను, విమనాః ఇవ = వికారము చెందిన మనస్సుకలవాడు వలెను, బభూవ = ఆయెను.

తా. పతివ్రతలైన ఆ ఉత్తమస్త్రీలు కలిసి ఒక్కమారుగా ఈ విధముగా శపించగానే ఆ రావణుని తేజస్సు అణచివేయబడినట్లయి అతడు కాంతివిహీను డయ్యెను. ఆతని మనస్సు చెదిరిపోయినట్లు అయ్యెను. 22

మూ. ఏవం విలపితం తాసాం శృణ్వన్ రాక్షసపుంగవః, 23
ప్రవివేశ పురీం లఙ్కాం పూజ్యమానో నిశాచరైః.

ప్ర. అ. రాక్షసపుంగవః = ఆ రాక్షసశ్రేష్ఠుడు, తాసామ్ = వాళ్లయొక్క,

మూ. కృతాస్మి విధవా రాజం స్త్వయా బలవతా బలాత్,
ఏతే రాజం స్త్వయా వీర్యాద్దైత్యా వినిహతా రణే. 27
కాలకేయా ఇతి ఖ్యాతాః సహస్రాణి చతుర్దశ,

ప్ర. అ. రాజన్ = రాజా! బలవతా = బలవంతుడవైన, త్వయా = నీచేత, బలాత్ = బలాత్కారముగా, విధవా = విధవగా, కృతా = చేయబడినదానను, అస్మి = అయిఉన్నాను. రాజన్ = రాజా! కాలకేయాః ఇతి = కాలకేయులు అని, ఖ్యాతాః = ప్రసిద్ధులైన, ఏతే = ఈ, చతుర్దశ సహస్రాణి = పదునాలుగు వేల, దైత్యాః = దైత్యులు, రణే = యుద్ధమునందు, త్వయా = నీచేత, వీర్యాత్ = పరాక్రమమువలన, వినిహతాః = చంపబడిరి.

తా. రాజా! బలవంతుడవైన నీవు నాకు, బలాత్కారముగా వైధవ్యము కల్పించినావు. నీవు కాలకేయు లని ప్రసిద్ధి చెందిన పదునాలుగు వేలమంది దైత్యులను యుద్ధములో నీ పరాక్రమముచేత చంపివేసినావు. 27

మూ. ప్రాణేభ్యోఽపి గరీయాన్మే తత్ర భర్తా మహాబలః, 28
సోఽపి త్వయా హతస్తాత రిపుణా భ్రాతృగన్ధినా.

ప్ర. అ. తత్ర = వారిలో, ప్రాణేభ్యః అపి = ప్రాణములకంటె కూడ, గరీయాన్ = గొప్పవాడైన, మహాబలః = గొప్ప బలము గల, మే భర్తా = నా భర్త ఉండెను. తాత = తండ్రీ! సః అపి = అతడు కూడ, భ్రాతృగన్ధినా = సోదరుడను గంధము గల, రిపుణా = శత్రువైన, త్వయా = నీచేత, హతః = చంపబడినాడు.

తా. నాయనా! నా ప్రాణాలకంటె కూడ ప్రియుడైన బలవంతుడైన నా భర్త వారిలో ఉండెను. సోదరు డను పేరుతో నా శత్రువై నీవు ఆతనిని కూడ చంపివేసినావు. 28

మూ. త్వయాస్మి నిహతా రాజన్ స్వయమేవ హి బన్ధునా, 29
రాజన్వైధవ్యశబ్దం చ భోక్ష్యామి త్వత్కృతం హ్యహమ్.

ప్ర. అ. రాజన్ = రాజా! బన్ధునా = బంధువైన, త్వయా = నీచేత, స్వయమేవ = స్వయముగానే, నిహతా అస్మి హి = బాధించబడితిని కదా? రాజన్ = రాజా!

దానమానప్రసాదైః=దానముచేత, గౌరవముచేత, అనుగ్రహించుటచేత, యత్నతః =ప్రయత్నపూర్వకముగా, తోషయిష్యామి = సంతోష పెట్టెదను.

తా. చెల్లెలా! ఏడవకుము. నీకు ఏ విధముగానూ భయపడవలసిన పని లేదు. నీకు దాన-మాన-ప్రసాదములచేత ప్రయత్నపూర్వకముగా సంతోషము కలిగించెదను. 32

మూ. యుద్ధప్రమత్తో వ్యాక్షిప్తో జయాకాఙ్క్షీ క్షిపన్ శరాన్, 33
నాహమజ్ఞాసిషం యుధ్యన్ స్వాన్ పరాన్వాపి సంయుగే.

ప్ర. అ. యుద్ధప్రమత్తః = యుద్ధములో పొరబాటు పడినవాడను, వ్యాక్షిప్తః = మనస్సు చెదిరిన వాడనూ అయిన, అహమ్ = నేను, జయాకాఙ్క్షీ = జయమును కోరుచున్నవాడనై, శరాన్ = బాణములను, క్షిపన్ = విసరుచు, యుధ్యన్ = యుద్ధముచేయుచు, సంయుగే = యుద్ధమునందు, స్వాన్ = తన వాళ్ళను, పరానపి = ఇతరులనూ కూడ, నాజ్ఞాసిషమ్ = తెలిసికొనలేదు.

తా. యుద్ధములో జయమును కోరుచు బాణములను విడచుచు మనస్సు చెదిరి యుద్ధమునందు పొరబడిన నాకు తనవా రెవరో, ఇతరు లెవరో తెలియలేదు.

మూ. జామాతరం న జానే స్మ ప్రహరన్ యుద్ధదుర్మదః,
తేనాసౌ నిహతః సంఖ్యే మయా భర్తా తవ స్వసః.

ప్ర. అ. స్వసః = ఓ ! సోదరీ ! యుద్ధదుర్మదః = యుద్ధమునందు చెడ్డ మదముకలవాడనై, ప్రహరన్ = కొట్టుచున్న నేను, జామాతరమ్ = అల్లుణ్ణి, న జానే స్మ = గుర్తించలేదు. తేన = ఆ కారణముచేత, అసౌ = ఈ, తవ భర్తా = నీ భర్త, సంఖ్యే = యుద్ధమునందు, నిహతః = చంపబడినాడు.

తా. సోదరీ! యుద్ధమునందు దురావేశములో ఉన్న నేను కొట్టే సమయమునందు అల్లుణ్ణి గుర్తించలేదు. అందుచేతనే నీభర్తను యుద్ధములో చంపివేసితిని. 34

మూ. అస్మిన్ కాలే తు యత్ప్రాప్తం తత్కరిష్యామి తే హితమ్,
భ్రాతురైశ్వర్యయుక్తస్య ఖరస్య వస పార్శ్వతః.

మూ. ఏవముక్త్వా దశగ్రీవః సైన్యమస్యాదిదేశ హ, 40
చతుర్దశ సహస్రాణి రక్షసాం వీర్యశాలినామ్.

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, అస్య = వీనియొక్క, సైన్యమ్ = సైన్యమునుగా, వీర్యశాలినామ్ = పరాక్రమసంపన్నులైన, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ సహస్రాణి = పదునాలుగు వేలు, ఆదిదేశ హ = ఆజ్ఞాపించెను.

తా. రావణుడు ఇట్లు పలికి ఇతనికి సైన్యముగా ఉండవలసినదిగా పరాక్రమవంతులైన పదునాలుగువేలమంది రాక్షసులను ఆదేశించెను. 40

మూ. స తైః పరివృతః సర్వై రాక్షసైర్ఘోరదర్శనైః, 41
ఆగచ్ఛత ఖరః శీఘ్రం దణ్డకానకుతోభయః.

ప్ర. అ. సః ఖరః = ఆ ఖరుడు, ఘోరదర్శనైః = భయంకరమైన దర్శనము గల, తైః = ఆ, రాక్షసైః = రాక్షసులతో, సర్వైః = అందరితోను, పరివృతః = కూడినవాడై, అకుతోభయః = ఎటునుండీ భయము లేనివాడై, శీఘ్రమ్ = శీఘ్రముగా, దణ్డకాన్ = దండకారణ్యమును గూర్చి, ఆగచ్ఛత = వచ్చెను.

తా. ఆ ఖరుడు చూచువారికి భయము కలిగించు ఆ రాక్షసు లందరితో కూడి, ఏ మాత్రమూ భయము లేనివాడై శీఘ్రముగా దండకారణ్యమునకు వచ్చెను. 41

మూ. స తత్ర కారయామాస రాజ్యం నిహతకణ్టకమ్, 42
సా చ శూర్పణఖా తత్ర న్యవసద్దణ్డకే వనే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతుర్వింశః సర్గః.

ప్ర. అ. సః = అతడు, తత్ర = అక్కడ, నిహతకణ్టకమ్ = సంహరింపబడిన శత్రువులు గల, రాజ్యమ్ = రాజ్యమును, కారయామాస = ఏర్పాటుచేసెను. సా శూర్పణఖా చ = ఆ శూర్పణఖ కూడ, తత్ర = ఆ, దణ్డకే వనే = దండకావనమునందు, న్యవసత్ = నివసించెను.

# అథ పఞ్చవింశః సర్గః

[మేఘనాదుడు యజ్ఞములు చేసి సఫలత్వము పొందుట. విభీష ణుడు పరస్త్రీహరణము మంచిది కాదని రావణునకు బోధించుట. రావ ణుడు కుంభనసిని ఓదార్చి మధువుతో కలిసి దేవలోకమును ఆక్ర మించుటకై వెళ్ళుట.]

మూ. స తు దత్త్వా దశగ్రీవో బలం ఘోరం ఖరస్య తత్,
భగినీం స సమాశ్వాస్య హృష్టః స్వస్థతరోఽభవత్. 1

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, సః = ఆ, దశగ్రీవః = రావణుడు, ఖరస్య = ఖరునకు, తత్ = ఆ, ఘోరమ్ = భయంకరమైన, బలమ్ = సైన్యమును. దత్త్వా = ఇచ్చి, భగినీమ్ = సోదరిని, సమాశ్వాస్య = ఓదార్చి, హృష్టః = సంతోషించిన వాడై, స్వస్థతరః = మిక్కిలి స్వస్థుడు, అభవత్ = ఆయెను.

తా. రావణుడు ఖరునకు భయంకరమైన సైన్యము నిచ్చి, సోదరిని ఓదార్చి, సంతోషించుచు స్వస్థచిత్తు డయ్యెను. 1

మూ. తతో నికుమ్భిలా నామ లఙ్కోపవనముత్తమమ్,
తద్రాక్షసేన్ద్రో బలవాన్ ప్రవివేశ సహానుగః. 2

ప్ర. అ. నికుమ్భిలా నామ = నికుంభిల అను, ఉత్తమమ్ = ఉత్తమమైన, లఙ్కోపవనమ్ = లంకోద్యానము ఉండెను. తతః = అటుపిమ్మట, బలవాన్ = బలవంతుడైన, రాక్షసేన్ద్రః = రాక్షసరాజు, సహానుగః = అనుచరులతో కూడిన వాడై, తత్ = దానిని, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట బలవంతుడైన రావణుడు, అనుచరులతో కలిసి నికుంభిల అను ఉత్తమమైన లంక దగ్గర నున్న ఉద్యానమునకు వెళ్ళెను. 2

మూ. ఉశనా త్వబ్రవీత్తత్ర యజ్ఞసంపత్సమృద్ధయే,
రావణం రాక్షసశ్రేష్ఠం ద్విజశ్రేష్ఠో మహాతపాః. 6

ప్ర. అ. తత్ర = అక్కడ, ద్విజశ్రేష్ఠః = బ్రాహ్మణశ్రేష్ఠుడు, మహాతపాః = గొప్ప తపస్సు కలవాడూ అయిన, ఉశనా = శుక్రుడు, యజ్ఞసంపత్సమృద్ధయే = యజ్ఞసంపద సమృద్ధమగుటకు, రాక్షసశ్రేష్ఠమ్ = రాక్షసశ్రేష్ఠుడైన, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు ద్విజులలో శ్రేష్ఠుడు, గొప్ప తపస్సు కలవాడు అయిన శుక్రుడు యజ్ఞసిద్ధి పరిపూర్ణ మగుటకై రాక్షసశ్రేష్ఠుడైన రావణునితో ఇట్లుపలికెను. మౌనవ్రతము పాటించుచున్న యజమానుడైన మేఘనాదుడు మాటలాడినచో యజ్ఞము అసమృద్ధము (అసంపూర్ణము) అగును గాన శుక్రుడు సమాధానము చెప్పెను. 6

మూ. అహమాఖ్యామి తే రాజన్ శ్రూయతాం సర్వమేవ తత్,
యజ్ఞాస్తే సప్త పుత్రేణ ప్రాప్తాస్తు బహువిస్తరాః. 7

ప్ర. అ. రాజన్ = రాజా ! అహమ్ = నేను, తే = నీకు, ఆఖ్యామి = చెప్పెదను, తత్ = అది, సర్వమేవ = అంతా, శ్రూయతామ్ = వినబడుగాక. తే = నీయొక్క, పుత్రేణ = పుత్రునిచేత, బహువిస్తరాః = అతివిస్తృతములైన, సప్త = ఏడు, యజ్ఞాః = యజ్ఞములు, ప్రాప్తాః = పొందబడినవి.

తా. రాజా ! నేను నీకు ఆ విషయమంతా చెప్పెదను వినుము. నీ పుత్రుడు చాల పెద్దవైన ఏడు యజ్ఞాలు పూర్తిచేసినాడు. 7

మూ. అగ్నిష్టోమోఽశ్వమేధశ్చ యజ్ఞో బహుసువర్ణకః,
రాజసూయస్తథా యజ్ఞో గోమేధో వైష్ణవస్తథా. 8

ప్ర. అ. అగ్నిష్టోమః = అగ్నిష్టోమము, బహుసువర్ణకః = అధికమైన బంగారము గల, అశ్వమేధః యజ్ఞశ్చ = అశ్వమేధయజ్ఞము, తథా = మరియు, రాజసూయః యజ్ఞః = రాజసూయ మను యజ్ఞము, గోమేధః = గోమేధము, తథా = మరియు, వైష్ణవః = వైష్ణవయజ్ఞము చేయబడినవి.

తా. రాక్షసరాజా! యుద్ధములో ఈ మాయను ప్రయోగించినచో సురులు అసురులూ కూడ ఇతని సంచారమును తెలిసికొనజాలరు. 11

మూ. అక్షయావిషుధీ బాణైశ్చాపం చాపి సుదుర్జయమ్,
అస్త్రం చ బలవద్రాజన్ శత్రువిధ్వంసనం రణే. 12

ప్ర. అ. రాజన్ = రాజా! బాణైః = బాణములతో కూడిన, అక్షయౌ = అక్షయములైన, ఇషుధీ = అంబులపొదులను, సుదుర్జయమ్ = జయింప శక్యము కాని, చాపమ్ = ధనస్సును, రణే = యుద్ధమునందు, శత్రువిధ్వంసనమ్ = శత్రువులను నశింపచేయు, బలవత్ = బలము గల, అస్త్రం చ = అస్త్రమును, పొందెను.

తా. బాణములతో నిండిన అక్షయములైన అంబులపొదులను, జయింప శక్యము కాని ధనస్సును, యుద్ధములో శత్రువులను నశింపచేయు బలము గల అస్త్రమునూ కూడ పొందెను. 12

మూ. ఏతాన్ సర్వాన్ వరాన్ లబ్ధ్వా పుత్రస్తేఽయం దశానన,
అద్య యజ్ఞసమాప్తౌ చ త్వాం దిదృక్షన్ స్థితో హ్యయమ్.

ప్ర. అ. దశానన = రావణా! అయం తే పుత్రః = ఈ నీ పుత్రుడు, ఏతాన్ = ఈ, సర్వాన్ = సమస్తమైన, వరాన్ = వరములను, లబ్ధ్వా = పొంది, అద్య = ఇప్పుడు, యజ్ఞసమాప్తౌ = యజ్ఞసమాప్తి సమయమునందు, త్వామ్ = నిన్ను, దిదృక్షన్ = చూడదలచుచున్నవాడై, స్థితః = ఉన్నాడు.

తా. రావణా! నీ కుమారుడు ఈ వరము లన్నీ సంపాదించి, ఈనాడు, యజ్ఞసమాప్తి దివసమునందు, నిన్ను చూడవలె నను కోరికతో ఉన్నాడు. 13

మూ. తతోఽబ్రవీద్దశగ్రీవో న శోభనమిదం కృతమ్,
పూజితాః శత్రవో యస్మాద్ద్రవ్యైరిన్ద్రపురోగమాః. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దశగ్రీవః = రావణుడు, అబ్రవీత్ = పలికెను. కృతమ్ = చేయబడిన, ఇదమ్ = ఇది, శోభనమ్ = మంచిది, న = కాదు. యస్మాత్ = ఎందువలన, ఇన్ద్రపురోగమాః = ఇంద్రుడు మొదలైన, శత్రవః = శత్రువులు, ద్రవ్యైః = వస్తువులతో, పూజితాః = పూజించబడినారో.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు దేవదానవరాక్షసులలో రత్నములైన, సర్వ లక్షణ సంపన్నలైన ఆ స్త్రీలను చూచి, వాళ్ళ విషయమునందు రావణుని అభిప్రాయము తెలిసికొని ఇట్లు పలికెను. 17

మూ. ఈదృశైస్త్వం సమాచారైర్యశోర్థకులనాశనైః,
ధర్షణం ప్రాణినాం జ్ఞాత్వా స్వమతేన విచేష్టసే. 18

ప్ర. అ. త్వమ్ = నీవు, జ్ఞాత్వా = తెలిసి కూడ, యశోర్థకులనాశనైః = యశస్సును, ధనమును, కులమును నశింపచేయు, ఈదృశైః = ఇట్టి; సమాచారైః = ప్రవర్తనలచేత, స్వమతేన = తన ఇష్టముచేత, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, ధర్షణమ్ = పీడను, విచేష్టసే = చేయుచున్నావు.

తా. నీవు కీర్తిని, అర్థమును, కాలమునూ నశింపచేసే ఈ విధమైన ప్రవృత్తిని అవలంబించి, మంచిచెడ్డలు తెలిసి ఉండి కూడ ఇష్టము వచ్చినట్లు ప్రాణులను హింసించుచున్నావు. 18

మూ. జ్ఞాతీంస్తాన్ధర్షయిత్వేమాం స్త్వయానీతా వరాఙ్గనాః,
త్వామతిక్రమ్య మధునా రాజన్ కుమ్భీనసీ హృతా. 19

ప్ర. అ. రాజన్ = రాజా! తాన్ = ఆ. జ్ఞాతీన్ = జ్ఞాతులను, ధర్షయిత్వా = పీడించి, త్వయా = నీచేత, వరాఙ్గనాః = శ్రేష్ఠలైన స్త్రీలు, ఆనీతాః = తీసికొని రాబడినారు. త్వామ్ = నిన్ను, అతిక్రమ్య = అతిక్రమించి, మధునా = మధువుచేత, కుమ్భీనసీ = కుంభీనసి, హృతా = హరించబడినది.

తా. రాజా! నీవు వీరి బంధువులను పీడించి ఈ స్త్రీలను తీసికొనివచ్చినావు. మధువు నిన్ను లెక్కచేయక కుంభీనసిని హరించినాడు. 19

మూ. రావణస్త్వబ్రవీద్వాక్యం నావగచ్ఛామి కిం త్విదమ్,
కోఽయం యస్తు త్వయాఖ్యాతో మధురిత్యేవ నామతః.

ప్ర. అ. రావణః తు = రావణుడైతే, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఇదమ్ = ఇది, కిం తు = ఏమో, త్వయా = నీచేత, అఖ్యాతః = చెప్పబడిన, నామతః = పేరుచేత, మధురితి ఏవ = మధువు అను, అయమ్ = ఇతడు, కః = ఎవడో, నావగచ్ఛామి = తెలుసుకొనజాలకున్నాను.

మూ. మాతృష్వసురథాస్మాకం సా చ కన్యానలోద్భవా,
భవత్యస్మాకమేవైషా భ్రాతౄణాం ధర్మతః స్వసా. 24

ప్ర. అ. అథ = మరియు, అస్మాకమ్ = మనయొక్క, మాతృష్వసుః = తల్లి సోదరియొక్క, కన్యా = కన్యయైన, అనలోద్భవా = అనలనుండి పుట్టిన, సా = ఆ, ఏషా = ఈమె, భ్రాతౄణామ్ = సోదరులమైన, అస్మాకమ్ = మనకు, ధర్మతః = ధర్మమువలన, స్వసా ఏవ = సోదరియే, భవతి = అగును.

తా. మన తల్లి సోదరియైన అనల కుమార్తె యైన ఆ కుంభీనసి సోదరుల మైన మనకు అందరికీ వరసకు చెల్లెలు అగును. 24

మూ. సా హృతా మధునా రాజన్ రాక్షసేన బలీయసా,
యజ్ఞప్రవృత్తే పుత్రే తు మయి చాన్తర్జలోషితే. 25

ప్ర. అ. రాజన్ = రాజా ! పుత్రే = నీ పుత్రుడైన మేఘనాదుడు, యజ్ఞ ప్రవృత్తే = యజ్ఞమునందు ప్రవర్తించినవా డగుచుండగా, మయి చ = నేను, అన్తర్జలోషితే = నీటిలో నివసించి ఉండగా, సా = ఆమె, బలీయసా = బలవంతుడైన, రాక్షసేన = రాక్షసుడైన, మధునా = మధువుచేత, హృతా = హరించబడినది.

తా. రాజా ! మేఘనాదుడు యజ్ఞము చేయుచుండగా, నేను తపస్సు నిమిత్తము జలములో మునిగి ఉండగా బలవంతుడైన మదువు అను రాక్షసుడు ఆమెను హరించినాడు. 25

మూ కుమ్భకర్ణో మహారాజ నిద్రామనుభవత్యథ,
నిహత్య రాక్షసశ్రేష్ఠానమాత్యానిహ సంమతాన్. 26
ధర్షయిత్వా హృతా రాజన్ గుప్తాప్యన్తఃపురే తవ.

ప్ర. అ మహారాజ = మహారాజా ! కుమ్భకర్ణః = కుంభకర్ణుడు, నిద్రామ్ = నిద్రను, అనుభవతి = అనుభవించుచున్నాడు. అథ = అటుపిమ్మట, రాజన్ = రాజా! ఇహ = ఇక్కడ, సంమతాన్ = పూజింపబడిన, రాక్షసశ్రేష్ఠాన్ = రాక్షసశ్రేష్ఠులైన, అమాత్యాన్ = మంత్రులను, నిహత్య = చంపి, తవ = నీయొక్క, అన్తః పురే = అంతఃపురమునందు, గుప్తాపి = రక్షింపబడినదైనను ఆమె, ధర్షయిత్వా = బలాత్కరించి, హృతా = హరించబడినది.

చేయబడిన, దౌరాత్మ్యేన = దుష్టత్వముచేత, ఉద్ధూతః = కదల్చివేయబడినవాడై, తప్తాంబుః = కాచబడిన నీళ్ళు గల, సాగరః ఇవ = సముద్రము వలె ఆయెను.

తా. రాక్షసరాజైన ఆ రావణుడు విభీషణుని మాటలు విని, తాను చేసిన చెడ్డపనులచేత పీడింపబడి, మరుగుచున్న నీళ్ళు గల సముద్రము వలె అయెను. 29

మూ. తతోఽబ్రవీద్దశగ్రీవః క్రుద్ధః సంరక్తలోచనః, 30
కల్ప్యతాం మే రథః శీఘ్రం శూరాః సజ్జీభవన్తు నః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, క్రుద్ధః = కోపించిన, సంరక్తలోచనః = ఎఱ్ఱనైన నేత్రములు గల, దశగ్రీవః = రావణుడు, అబ్రవీత్ = పలికెను, మే = నాయొక్క, రథః = రథము, శీఘ్రమ్ = శీఘ్రముగా, కల్ప్యతామ్ = ఏర్పరుప బడుగాక; నః = మనయొక్క, శూరాః = శూరులు; సజ్జీభవన్తు = సిద్ధ మగుదురు గాక.

తా. అప్పుడు కోపముచేత ఎఱ్ఱనైన నేత్రములు గల రావణుడు ఇట్లు పలికెను. "శీఘ్రముగా నా రథమును సిద్ధము చేయుడు. మన శూరులు సిద్ధ మగుదురు గాక". 30

మూ. భ్రాతా మే కుమ్భకర్ణశ్చ యే చ ముఖ్యా నిశాచరాః, 31
వాహనాన్యధిరోహన్తు నానాప్రహరణాయుధాః.

ప్ర. అ. మే భ్రాతా = నా సోదరుడైన, కుమ్భకర్ణశ్చ = కుంభకర్ణుడు, ముఖ్యాః = ముఖ్యులైన, యే నిశాచరాః = ఏ రాక్షసు లున్నారో వాళ్ళు, నానా ప్రహరణాయుధాః = అనేకవిధములైన కొట్టుటకు ఉపయోగించే ఆయుధములు గలవారై, వాహనాని = వాహనములను, అధిరోహన్తు = ఎక్కెదరుగాక.

తా. నా సోదరుడైన కుంభకర్ణుడు, ప్రధానులైన రాక్షసులు వివిధములైన ఆయుధములు ధరించి వాహనములను ఎక్కెదరుగాక. 31

మూ. అద్య తం సమరే హత్వా మధుం రావణనిర్భయమ్, 32
సురలోకం గమిష్యామి యుద్ధాకాఙ్క్షీ సుహృద్వృతః.

ప్ర. అ. అద్య = ఇప్పుడు, రావణనిర్భయమ్ = రావణునినుండి భయము

యామ్ = లంకయందు, ధర్మమ్=ధర్మమును, ఆచరన్ =ఆచరించుచు ఉండెను. శేషాః=మిగిలిన, సర్వే = సమస్తమైన మహాభాగాః=మహానుభావులు, మధుపురం ప్రతి = మధుపురమును గూర్చి, యయుః = వెళ్ళిరి.

తా. ధర్మాత్ముడైన విభీషణుడు ధర్మము పాటించుచు లంకలోనే ఉండిపోయెను. మిగిలిన మహానుభావులైన రాక్షసులు మధువు నివసించు పురమునకు వెళ్ళిరి. 35

మూ. ఖరైరుష్ట్రైర్హయైర్దీప్తైః శింశుమారైర్మహోరగైః, 36
రాక్షసాః ప్రయయుః సర్వే కృత్వాకాశం నిరన్తరమ్.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, రాక్షసాః=రాక్షసులు, ఆకాశమ్ = ఆకాశమును, నిరన్తరమ్ = అవకాశము లేనిదానినిగా, కృత్వా = చేసి, ఖరైః = గాడిదలతోను, ఉష్ట్రైః = ఒంటెలతోను, హయైః = గుఱ్ఱములతోను, దీప్తైః = ప్రకాశించుచున్న, శింశుమారైః=శింశుమారములతోను, మహోరగైః=మహాసర్పములతోను, ప్రయయుః = వెళ్ళిరి.

తా. ఆ రాక్షసులందరూ ఆకాశమునందు అవకాశము లేకుండు నట్లు చేయుచు, గాడిదలు, ఒంటెలు, గుఱ్ఱములు, ప్రకాశించుచున్న శింశుమారములు (మొసళ్లు) మహాసర్పములు ఎక్కి వెళ్ళిరి. 36

మూ. దైత్యాశ్చ శతశస్తత్ర కృతవైరాశ్చ దైవతైః, 37
రావణం ప్రేక్ష్య గచ్ఛన్తమన్వగచ్ఛన్హి పృష్ఠతః.

ప్ర. అ. దైవతైః=దేవతలతో, కృతవైరాః = చేయబడిన వైరము గల, దైత్యాశ్చ = దైత్యులు కూడ, శతశః = వందలకొలది, తత్ర = అక్కడ, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్న, రావణమ్ = రావణుని, ప్రేక్ష్య = చూచి, పృష్ఠతః = వెనుకనే, అన్వగచ్ఛన్హి = అనుసరించినారు.

తా. దేవతలతో వైరము పెట్టుకొని ఉన్న వందలకొలది దైత్యులు కూడ, అక్కడ వెళ్ళుచున్న రావణుని చూచి అతని వెనుకనే వెళ్ళిరి. 37

మూ. స తు గత్వా మధుపురం ప్రవిశ్య చ దశాననః, 38
న దదర్శ మధుం తత్ర భగినీం తత్ర దృష్టవాన్.

ములు గలవాడా ! మానద=మానమును ఇచ్చువాడా ! రాజన్=రాజా ! త్వమ్= నీవు, మే = నాకు, ప్రసన్నః యది = ప్రసన్నుడవైనట్లయితే, అద్య = ఇప్పుడు, మమ=నాయొక్క, భర్తారమ్=భర్తను, హన్తుమ్=చంపుటకు, నార్హసి = తగవు.

తా. ఆమె ఇట్లు పలికెను - "మానమును సంరక్షించు మహాభుజుడవైన ఓ! రాజా ! నీవు నాయందు ప్రసన్నుడ వైనచో ఇప్పుడు నా భర్తను చంపకుము".

మూ. న హీదృశం భయం కించిత్ కులస్త్రీణామిహోచ్యతే, 42
భయానామపి సర్వేషాం వైధవ్యం వ్యసనం మహత్.

ప్ర. అ. కులస్త్రీణామ్ = కులస్త్రీలకు, ఈదృశమ్ = ఇట్టి, భయమ్= భయము, కించిత్ = ఏదీ, ఇహ = ఈ లోకమునందు, న ఉచ్యతే హి = చెప్ప బడదు కదా. వైధవ్యమ్=వైధవ్యము, సర్వేషామ్=సమస్తమైన, భయానామపి= భయములలో కూడ, మహత్ = గొప్ప, వ్యసనమ్ = వ్యసనము.

తా. "కులస్త్రీలకు ఈ లోకములో అన్ని భయములలోను వైధవ్యము అనేది గొప్ప వ్యసనము. ఇట్టి భయము మరొకటి లేదు అని అందురు కదా ?"

మూ. సత్యవాగ్భవ రాజేన్ద్ర మామవేక్షస్వ యాచతీమ్, 43
త్వయాప్యుక్తం మహాభాగ న భేతవ్యమితి స్వయమ్.

ప్ర. అ. రాజేన్ద్ర = ఓ రాజేంద్రా ! సత్యవాక్ = సత్యమైన వాక్కు గల వాడవు, భవ = అగుము. యాచతీమ్ = యాచించుచున్న, మామ్ = నన్ను, అవేక్షస్వ = చూడుము. మహాభాగ = మహాభాగ్యవంతుడా! న భేతవ్యమ్ ఇతి = భయపడవద్దు అని, స్వయమ్ = స్వయముగా, త్వయాపి = నీచేతనే, ఉక్తమ్= పలకబడినది.

తా. "ఓ ! రాజశ్రేష్ఠుడా ! బ్రతిమాలుచున్న నన్ను చూడుము. మహా భాగ్యవంతుడా ! "భయపడకుము" అని నీవే పలికినావుకదా ? నీ మాట నిలబెట్టు కొనుము". 43

మూ. రావణస్త్వ బ్రవీద్ధృష్టః స్వసారం తత్ర సంస్థితామ్, 44
క్వ చాసౌ తవ భర్తా వై మమ శీఘ్రం నివేద్యతామ్.

డైన, ఏషః = ఈ, దశగ్రీవః = రావణుడు, ప్రాప్తః = వచ్చినాడు. సురలోక జయాకాఙ్క్షీ = సురలోకముయొక్క జయమును కోరుచున్న ఇతడు, త్వామ్ = నిన్ను, సాహాయ్యే = సాహాయ్యమునందు, వృణోతి చ = కోరుచున్నాడు కూడ.

తా. "ఇదిగో మహాబలశాలియైన నా సోదరుడు రావణుడు వచ్చినాడు, సురలోకమును జయించగోరుచున్న ఇతడు నీ సాహాయ్యము కోరుచున్నాడు. 47

మూ. తదస్య త్వం సహాయార్థం సబన్ధుర్గచ్ఛ రాక్షస, 48
స్నిగ్ధస్య భజమానస్య యుక్తమర్థాయ కల్పితుమ్.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడా! తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, సబన్ధుః = బంధువులతో కూడినవాడవై, అస్య = ఈతనియొక్క, సహాయార్థమ్ = సహాయుడుగా ఉండుటకొరకు, గచ్ఛ = వెళ్లుము. భజమానస్య = సేవించుచున్న, స్నిగ్ధస్య = స్నేహముకలవానియొక్క, అర్థాయ = ప్రయోజనము కొరకు, కల్పితుమ్ = అగుటకు, యుక్తమ్ = యుక్తమైనది.

తా. అందువలన, ఓ! రాక్షసా! నీవు సపరివారముగా వెళ్ళి ఇతనికి సాహాయ్యము చేయుము. స్నేహము కలవారు కోరుచున్నప్పుడు వారికి ఉపకరించుట యుక్తము". 48

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా తథేత్యాహ మధుర్వచః, 49
దదర్శ రాక్షసశ్రేష్ఠం యథాన్యాయముపేత్య సః,
పూజయామాస ధర్మేణ రావణం రాక్షసాధిపమ్. 50

ప్ర. అ. మధుః = మధువు, తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తథేతి = అట్లే అని, ఆహ = పలికెను; సః = అతడు, ఉపేత్య = వచ్చి, యథాన్యాయమ్ = న్యాయానుసారముగా, రాక్షసశ్రేష్ఠమ్ = రాక్షసరాజును, దదర్శ = చూచెను. రాక్షసాధిపమ్ = రాక్షసప్రభువైన, రావణమ్ = రావణుణ్ణి, ధర్మేణ = ధర్మముచేత, పూజయామాస = పూజించెను.

తా. మధువు ఆమె మాటలు విని "అట్లే చేసెదను" అని పలికి, న్యాయానుసారముగా రావణునివద్దకు వచ్చి కలిసికొని, ఆ రాక్షసరాజును యథావిధిగా సత్కరించెను 49,50

# అథ షడ్వింశః సర్గః

[రావణుడు రంభను బలాత్కరించుట; నలకూబరుడు రావణుని శపించుట.]

మూ. స తు తత్ర దశగ్రీవః సహ సైన్యేన వీర్యవాన్,
అస్తం ప్రాప్తే దినకరే నివాసం సమరోచయత్. 1

ప్ర. అ. దినకరే = సూర్యుడు, అస్తమ్ = అస్తాద్రిని, ప్రాప్తే = పొందినవాడగుచుండగా, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః దశగ్రీవః = ఆ రావణుడు, సైన్యేన సహ = సైన్యముతో కూడ, తత్ర = అక్కడ, నివాసమ్ = నివాసమును, సమరోచయత్ = ఇష్టపడెను.

తా. సూర్యుడు అస్తమించగానే పరాక్రమవంతుడైన ఆ రావణుడు సైన్యముతో అక్కడ నివసించుటకు ఇచ్ఛయించెను. 1

మూ. ఉదితే విమలే చన్ద్రే తుల్యపర్వతవర్చసి,
ప్రసుప్తం సుమహత్సైన్యం నానాప్రహరణాయుధమ్. 2

ప్ర. అ. తుల్యపర్వతవర్చసి = సమానమైన కైలాసపర్వతకాంతి గల, విమలే = స్వచ్ఛుడైన, చన్ద్రే = చంద్రుడు, ఉదితే = ఉదయించినవాడగుచుండగా, నానాప్రహరణా యుధమ్ = అనేకవిధములైన, శత్రువులను కొట్టే ఆయుధములు గల, సుమహత్ = చాల పెద్దదైన, సైన్యమ్ = సైన్యము, ప్రసుప్తమ్ = నిద్రించినది.

తా. తాము విడిసిన కైలాసపర్వతము వంటి కాంతి గల నిర్మలమైన చంద్రబింబము ఉదయించగానే అనేక విధములైన ఆయుధములు ధరించిన ఆ గొప్ప సైన్యము నిద్రించినది. 2

మూ. రావణస్తు మహావీర్యో నిషణ్ణః శైలమూర్ధని,
స దదర్శ గుణాంస్తత్ర చన్ద్రపాదోపశోభితాన్. 3

రక్తాః = అనురాగవంతులైన, మధురకంఠినః = మధురమైన కంఠస్వరము గల, కింనరాః = కింనరులు, మదనేన = మన్మథునిచేత, అర్తాః = పీడింపబడినవారై, సమమ్ = తమ స్త్రీలతో కూడ, మనస్తుష్టివివర్ధనమ్ = మనస్సుకు ప్రీతిని వృద్ధి పొందించునట్లుగా, సంప్రజగుః = గానము చేసిరో.

తా. ఆ కైలాసపర్వతమునందున్న వనప్రాంతములు ప్రకాశించుచున్న కర్ణికారవనములతోను, కదంబ-వకుల వృక్షములతోను, వికసించిన పద్మలతల తోను, మందాకినీ జలములతోను, చంపక-అశోక-పుంనాగ-మందార-చూత-పాటల-లోధ్ర-ప్రియంగు-అర్జున-కేతక-తగర-నారికేల-ప్రియాల-పనసవృక్షములతోను, ఇంకా ఇతరవృక్షములతోను, ప్రకాశించుచుండెను. అట్టి వనప్రాంతములలో మధుర మైన కంఠస్వరము గల అనురాగవంతులైన కింనరులు మన్మథపీడితులై తమ ప్రియురాళ్ళతో కూడ మనస్సుకు ఆనందము కలుగునట్లుగా గానము చేయుచుండిరి.

మూ. విద్యాధరా మదక్షీబా మదరక్తాన్తలోచనాః,
యోషిద్భిః సహ సంక్రాన్తాశ్చిక్రీడుర్జహృషుశ్చ వై. 8

ప్ర. అ. విద్యాధరాః = విద్యాధరులు, మదక్షీబాః = మదముచేత మత్తులై, మదరక్తాన్తలోచనాః = మదముచేత ఎఱ్ఱనైన అంతములు గల నేత్రములు గలవారై, యోషిద్భిః సహ = స్త్రీలతో కూడ, సంక్రాన్తాః = కలిసినవారై, చిక్రీడుః = క్రీడించిరి. జహృషుః చ వై = సంతోషించిరి కూడ.

తా. విద్యాధరులు మదముచేత మత్తులై, మదముచేత ఎఱ్ఱనైన నేత్రాంత ములు కలవారై స్త్రీలను కలిసి క్రీడించిరి; ఆనందించిరి. 8

మూ. ఘణ్టానామివ సంనాదః శుశ్రువే మధురస్వనః,
అప్సరోగణసంఘానాం గాయతాం ధనదాలయే. 9

ప్ర. అ. ధనదాలయే = కుబేరుని గృహమునందు, గాయతామ్ = గానము చేయుచున్న, అప్సరోగణసంఘానామ్ = అప్సరః స్త్రీలగణములతో కూడిన సంఘ ములయొక్క, మధురస్వనః = మధురధ్వని, ఘణ్టానామివ = ఘంటల ధ్వని వలె, శుశ్రువే = వినబడెను.

తా. కుబేరుని భవనములో గానము చేయుచున్న అప్సరఃస్త్రీసంఘాల మధుర ధ్వని ఘంటానినాదము వలె వినబడెను. 9

ప్రవృత్తాయామ్ = ప్రారంభమైన దగుచుండగా, చన్ద్రస్య = చంద్రునియొక్క, ఉదయనేన చ = ఉదయించుటచేతను, కామస్య = కామమునకు, వశమ్ = వశమును, ఆగతః = పొందిన, మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, సః రావణః = ఆ రావణుడు, వినిఃశ్వస్య వినిఃశ్వస్య = నిట్టూర్చి నిట్టూర్చి, శశినమ్ = చంద్రుణ్ణి, సమవైక్షత = చూచెను.

తా. సంగీతము వినబడుచుండుటచేత, పుష్పసమృద్ధిచేత, వాయువు చల్లగా ఉండుటచేత, పర్వతసౌందర్యముచేత, రాత్రి ప్రారంభము కాగానే చంద్రుడు ఉదయించుటచేత మహాపరాక్రమవంతుడైన ఆ రావణుడు కామవశుడై మాటిమాటికి నిట్టూర్చుచు చంద్రుని వంక చూచుచుండెను. 12,13

మూ. ఏతస్మిన్నన్తరే తత్ర దివ్యాభరణభూషితా,
సర్వాప్సరోవరా రమ్భా పూర్ణచన్ద్రనిభాననా. 14

దివ్యచన్దనలిప్తాఙ్గీ మన్దారకృతమూర్ధజా,
దివ్యోత్సవకృతారమ్భా దివ్యపుష్పవిభూషితా. 15

చక్షుర్మనోహరం పీనం మేఖలాదామభూషితమ్
సముద్వహన్తీ జఘనం రతిప్రాభృతముత్తమమ్. 16

కృతైర్విశేషకైరార్ద్రైః షడర్తుకుసుమోద్భవైః
బభావన్యతమేవ శ్రీః కాన్తిశ్రీద్యుతికీర్తిభిః. 17

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యకాలములో, దివ్యాభరణభూషితా = దివ్యములైన అలంకారములచేత అలంకరింపబడినది, పూర్ణచన్ద్రనిభాననా = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గలది, దివ్యచన్దనలిప్తాఙ్గీ = దివ్యమైన చందనముచేత పూయబడిన శరీరము గలది, మన్దారకృతమూర్ధజా = మందార పుష్పములచేత అలంకరించబడిన కేశములు గలది, దివ్యోత్సవకృతారమ్భా = దివ్యమైన సురతోత్సవముకొరకై చేయబడిన ఆరంభము కలది, దివ్యపుష్పవిభూషితా = దివ్యములైన పుష్పములచేత అలంకరించబడినది, చక్షుర్మనోహరమ్ = నేత్రములను మనస్సును ఆకర్షించు, మేఖలాదామభూషితమ్ = వడ్డాణముచేత అలంకరించబడిన, ఉత్తమం రతిప్రాభృతమ్ = ఉత్తమమైన రతికి కానుక యైన,

గలవో, కరౌ = చేతులు, పల్లవకోమలౌ = చిగుళ్ళ వలె కోమలముగా ఉన్నవో అట్టి రంభ, సైన్యమధ్యేన = సైన్యముయొక్క మధ్యచేత, గచ్ఛన్తీ = వెళ్ళుచున్నదై, రావణేన = రావణునిచేత, ఉపలక్షితా = చూడబడినది.

తా. చంద్రుని వంటి ముఖము, ధనస్సువంటి అందమైన కనుబొమ్మలు, ఏనుగు తొండము వంటి తొడలు, చిగుళ్ళ వలె కోమలములైన హస్తములు గల ఆ రంభ నీటితో నిండిన మేఘము వంటి కాంతి గల నీలవస్త్రము మేలిముసుగు వేసికొని సైన్యమధ్యములో నడచి వెళ్లుచుండగా రావణుడు ఆమెను చూచెను. 18,19

మూ. తాం సముత్థాయ గచ్ఛన్తీం కామబాణవశం గతః,
కరే గృహీత్వా లజ్జన్తీం స్మయమానోఽభ్యభాషత. 20

ప్ర. అ. కామబాణవశమ్ = మన్మథబాణవశమును. గతః = పొందిన ఆ రావణుడు, సముత్థాయ = లేచి, గచ్ఛన్తీమ్ = వెళ్ళుచున్న, లజ్జన్తీమ్ = సిగ్గుపడుచున్న, తామ్ = ఆమెను, కరే = హస్తము నందు, గృహీత్వా = గ్రహించి, స్మయమానః = నవ్వుచు, అభ్యభాషత = పలికెను.

తా. మన్మథబాణములకు వశుడైపోయిన ఆ రావణుడు లేచి అట్లు వెళ్ళుచున్న, సిగ్గుపడుచున్న ఆ రంభ చేయి పట్టుకొని నవ్వుచు ఇట్లనెను. 20

మూ. క్వ గచ్ఛసి వరారోహే కాం సిద్ధిం భజసే స్వయమ్,
కస్యాభ్యుదయకాలోఽయం యస్త్వాం సముపభోక్ష్యతే.

ప్ర. అ. వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా ! క్వ = ఎక్కడికి, గచ్ఛసి = వెళ్ళుచున్నావు ? కామ్ = ఏ, సిద్ధిమ్ = భోగసిద్ధిని గూర్చి, స్వయమ్ = స్వయముగా, భజసే = పొందుచున్నావు (పొందించుచున్నావు)? త్వామ్ = నిన్ను, యః = ఎవడు, సముపభోక్ష్యతే = అనుభవించగలడో, అట్టి, కస్య = ఎవనికి, అయమ్ = ఇది, అభ్యుదయ కాలః = అభ్యుదయమునకు కాలము ?

తా. అందమైన కటిప్రదేశము గలదానా ! నీవు ఎక్కడికి వెళ్లుచున్నావు? నీవు స్వయముగా ఎవనికి భోగసిద్ధిని కూర్చుటకై వెళ్ళుచున్నావు ? ఇది నిన్ను అనుభవించనున్న ఎవనికి అభ్యుదయము కలిగే సమయము ? 21

మూ. మద్విశిష్టః పుమాన్ కోఽద్య శక్రో విష్ణురథాశ్వినౌ,
మామతీత్య హి యచ్చ త్వం యాసి భీరు న శోభనమ్. 25

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మద్విశిష్టః = నాకంటి శ్రేష్ఠుడైన, పుమాన్ = పురుషుడు, కః = ఎవడు ? శక్రః = ఇంద్రుడా ? విష్ణుః = విష్ణువా ? అథ = లేక, అశ్వినౌ = అశ్వినీ దేవతలా ? భీరు = భయస్వభావముగలదానా ! త్వమ్ = నీవు, మామ్ = నను, అతీత్య = దాటి, యాసి ఇతి యత్ = వెళ్లుచున్నావు అనునది ఏది కలదో, అది, న శోభనమ్ = మంచిదికాదు.

తా. ఇప్పుడు నాకంటె గొప్పవాడు ఎవడున్నాడు ? ఇంద్రుడా ! విష్ణువా లేక అశ్వినీదేవతలా ? ఓ ! భయస్వభావముగలదానా ! నీవు నన్ను దాటి వెళ్లుచున్నావు; ఇది మంచి పనికాదు. 25

మూ. విశ్రమ త్వం పృథుశ్రోణి శిలాతలమిదం శుభమ్,
త్రైలోక్యే యః ప్రభుశ్చైవ మదన్యో నైవ విద్యతే. 26

ప్ర. అ. పృథుశ్రోణి = పెద్ద కటిప్రదేశము కలదానా ! త్వమ్ = నీవు, విశ్రమ = విశ్రమించుము. ఇదమ్ = ఈ, శిలాతలమ్ = శిలాఫలకము, శుభమ్ = సుందరమైనది. యః = ఎవడు, ప్రభుః = సర్వసమర్థుడో అట్టి, మదన్యః = నాకంటె అన్యుడు, త్రైలోక్యే = మూడు లోకములందు, నైవ విద్యతే = లేడు.

తా. విశాలమైన కటిప్రదేశము గలదానా, సుందరమైన ఈ శిలాఫలకము మీద విశ్రమించుము. నేను తప్ప ఈ మూడులోకములలో ప్రభువైనవాడు ఎవ్వడూ లేడు. 26

మూ. తదేవం ప్రాఞ్జలిః ప్రహ్వో యాచతే త్వాం దశాననః,
భర్తుర్భర్తా విధాతా చ త్రైలోక్యస్య భజస్వ మామ్. 27

ప్ర. అ. తత్ = అందువలన, త్రైలోక్యస్య = మూడులోకముల సముదాయముయొక్క, భర్తుః = ప్రభువుకు, భర్తా = ప్రభువు, విధాతా చ = పాలకుడూ అయిన, దశాననః = రావణుడు, ప్రహ్వః = వంగినవాడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, త్వామ్ = నిన్ను, ఏవమ్ = ఇట్లు, యాచతే = యాచించుచున్నాడు. మామ్ = నన్ను, భజస్వ = పొందుము.

దృష్టమాత్రేణ = చూచినంత మాత్రముచేతనే, రోమహర్షమ్ = రోమాంచమును, అనుప్రాప్తామ్ = పొందిన, చరణాధోముఖీమ్ = పాదముల వైపు క్రిందికి ముఖము కలదై, స్థితామ్ = నిలచిన, తామ్ = ఆమెకు గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. తనను చూడగానే భయముచేత ఒడలు గగుర్పొడిచి తల వంచి పాదముల వైపు చూచుచు నిలచి ఉన్న ఆమెతో రావణుడిట్లు పలికెను. 30

మూ. సుతస్య యది మే భార్యా తతస్త్వం హి స్నుషా భవేః,
బాఢమిత్యేవ సా రమ్భా ప్రాహ రావణముత్తరమ్. 31

ప్ర. అ. త్వమ్ = నీవు, మే = నాయొక్క, సుతస్య = కుమారునియొక్క, భార్యా యది = భార్యవైనట్లయితే, తతః హి = అప్పుడు మాత్రమే, స్నుషా = కోడలివి, భవేః హి = అగుదువు. సా రమ్భా = ఆ రంభ, బాఢమ్ ఇత్యేవ = తప్పక కోడలినే అని, రావణమ్ = రావణుని గూర్చి, ఉత్తరమ్ = జవాబును, ప్రాహ = పలికెను.

తా. "నీవు నా పుత్రుని భార్యవైతే కదా నాకు కోడలివి అగుదువు". ఆ మాట విని రంభ "తప్పక కోడలినే"అని ఆతనికి బదులు చెప్పెను. 31

మూ. ధర్మతస్తే సుతస్యాహం భార్యా రాక్షసపుంగవ,
పుత్రః ప్రియతరః ప్రాణైర్భ్రాతుర్వైశ్రవణస్య తే. 32
విఖ్యాతస్త్రిషు లోకేషు నలకూబర ఇత్యయమ్.

ప్ర. అ. రాక్షసపుంగవ = రాక్షసశ్రేష్ఠుడా! అహమ్ = నేను, ధర్మతః = ధర్మమువలన, తే సుతస్య = నీ కుమారునియొక్క, భార్యా = భార్యను. తే భ్రాతుః = నీ సోదరుడైన, వైశ్రవణస్య = కుబేరునియొక్క, ప్రాణైః = ప్రాణములతో (కంటె), ప్రియతరః = ఎక్కువ ప్రియుడైన, పుత్రః = పుత్రుడైన, నలకూబరః ఇతి = నలకూబరుడు అను. అయమ్ = ఇతడు, త్రిషు లోకేషు = మూడు లోకములయందు, విఖ్యాతః = ప్రసిద్ధుడు.

తా. రాక్షసశ్రేష్ఠుడా! నేను ధర్మానుసారము నీ కుమారుడైనవాని భార్యను. నీ సోదరుడైన కుబేరునికి ప్రాణములకంటె కూడ ప్రియుడైన పుత్రుడైన నలకూబరుడు మూడు లోకములలో ప్రసిద్ధుడు. 32

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆతడు, సముత్సుకః = వేడుక గలవాడై, మామ్ = నన్ను, ప్రతీక్ష్య = ప్రతీక్షించి, తిష్ఠతి హి = ఉన్నాడు కదా? తత్ర = ఆ విషయమునందు, ఇహ = ఇక్కడ, తస్య = వానికి, విఘ్నమ్ = విఘ్నమును, కర్తుమ్ = చేయుటకు, నార్హసి = తగవు. మామ్ = నన్ను, ముఞ్చ = విడువుము.

తా. ధర్మాత్ముడైన ఆతడు ఆతురతతో నాకోసము ఎదురుచూచుచుండును. ఈ విషయమునందు ఆతనికి విఘ్నము చేయకుము. నన్ను విడిచిపెట్టుము. 36

మూ. సద్భిరాచరితం మార్గం గచ్ఛ రాక్షసపుంగవ, 37
మాననీయో మమ త్వం హి పాలనీయా తథాస్మి తే.

ప్ర. అ. రాక్షసపుంగవ = రాక్షసశ్రేష్ఠుడా! సద్భిః = సత్పురుషులచేత, ఆచరితమ్ = నడవబడిన, మార్గమ్ = మార్గమును, గచ్ఛ = పొందుము. త్వమ్ = నీవు, మమ = నాకు, మాననీయః హి = గౌరవింపదగినవాడవు కదా? తథా = ఆట్లే, తే = నీకు, పాలనీయా = పాలింపదగినదానను, అస్మి = అయి ఉన్నాను.

తా. రాక్షసశ్రేష్ఠుడా! సత్పురుషులు అనుసరించిన మార్గమును అనుసరించుము. నీవు నాకు గౌరవింపదగినవాడవు. నేను నీకు పాలింపదగినదానను. 37

మూ. ఏవముక్తో దశగ్రీవః ప్రత్యువాచ వినీతవత్, 38
స్నుషాస్మి యదవోచస్త్వమేకపత్నీష్వయం క్రమః.

ప్ర. అ. వినీతవత్ = వినయపూర్వకముగా, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, దశగ్రీవః = రావణుడు, ప్రత్యువాచ = తిరిగి పలికెను. స్నుషా అస్మి = కోడలను అయి ఉన్నాను అని, త్వమ్ = నీవు, యత్ = ఏ వాక్యమును, అవోచః = పలికితివో, ఏకపత్నీషు = ఒకనికే భార్యగా ఉన్నవారిలో, అయమ్ = ఈ, క్రమః = పద్ధతి.

తా. ఆమె వినయపూర్వకముగా పలికిన మాటలు విని రావణు డిట్లనెను- "నేను నీ కోడలిని" అని నీవు అన్నావే ఈ నియమము ఒక్కనికి మాత్రమే భార్యగా ఉండువాళ్ళ విషయమునందు మాత్రమే. 38

మూ. లులితాకులకేశాన్తా కరవేపితపల్లవా, 42
పవనేనావధూతేవ లతా కుసుమశాలినీ,
సా వేపమానా లజ్జన్తీ భీతా కరకృతాఞ్జలిః, 43
నలకూబరమాసాద్య పాదయోర్నిపపాత హ.

ప్ర. అ. లులితాకులకేశాన్తా=నలిపివేయబడిన వ్యాకులమైన కేశాగ్రములు కలది, కరవేపితపల్లవా=కదల్చబడిన చిగుళ్ళ వంటి హస్తములు కలది, పవనేన=వాయువుచేత, అవధూతా = కదల్చబడిన, కుసుమశాలినీ = పుష్పములతో ప్రకాశించుచున్న, లతేవ=లత వలె, వేపమానా=వణకిపోవుచున్నదీఅయిన, సా=ఆమె, లజ్జన్తీ = సిగ్గుపడుచున్నదై, కరకృతాఞ్జలిః = హస్తములచేత చేయబడిన దోసిలి కలదై, నలకూబరమ్=నలకూబరుణ్ణి, ఆసాద్య = పొంది, పాదయోః = పాదముల మీద, నిపపాత హ = పడెను.

తా. ఆమె జుట్టు నలిగి చిక్కుపడిపోయెను. చిగుళ్ళవంటి చేతులు వణకుచుండెను. ఆమె భయముతో గాలికి కదలుచున్న, పుష్పములతో నిండిన లత వలె వణకిపోవుచు, సిగ్గుతో అంజలి ఘటించి, నలకూబరుని దగ్గరకు వెళ్ళి ఆతని పాదములమీద వ్రాలెను. 42,43

మూ. తదవస్థాం చ తాం దృష్ట్వా మహాత్మా నలకూబరః, 44
అబ్రవీత్ కిమిదం భద్రే పాదయోః పతితాసి మే.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, నలకూబరః=నలకూబరుడు, తదవస్థామ్ = అట్టి అవస్థ గల, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, అబ్రవీత్ = పలికెను. భద్రే = మంగళప్రదురాలా! ఇదమ్=ఇది, కిమ్ = ఏమి? మే = నాయొక్క, పాదయోః = పాదములమీద, పతితా అసి = పడినావు ?

తా. మహాత్ముడైన నలకూబరుడు అట్టి అవస్థలో ఉన్న ఆమెను చూచి"ఓ! మంగళప్రదురాలా! ఇది ఏమి? నా కాళ్ళమీద పడుచున్నావేమి?"అని ప్రశ్నించెను.

మూ. సా వై నిఃశ్వసమానా తు వేపమానా కృతాఞ్జలిః, 45
తస్మై సర్వం యథాతత్త్వమాఖ్యాతుముపచక్రమే.

ప్ర. అ. సా తు = ఆమెయైతే, నిఃశ్వసమానా = నిట్టూర్చుచున్నదై; వేప

ప్ర. అ. దేవ = దేవా! మయా తు = నాచేతనైతే, సర్వమ్ = సమస్తమైన, యత్ = ఏది, సత్యమ్ = సత్యమో, సర్వమ్ = అది అంతా, తస్మై = వానికి, నివేదితమ్ = తెలుపబడినది. ప్రభో = ప్రభూ! అహమ్ = నేను, తే = నీకు! స్నుషా = కోడలిని, ఇతి = అని, మయా = నాచేత, యాచ్యమానః = ప్రార్థింపబడుచున్న వాడైనను, కామమోహాభిభూతాత్మా = కామముచేత, మోహముచేత ఆవరింపబడిన మనస్సు కలవాడై, మమ = నాయొక్క, తత్ = ఆ, వచః = వచనమును, నాశ్రౌషీత్ = వినలేదు.

తా. దేవా ! ఆతనికి సత్యమైన విషయమును అంతా తెలిపితిని. "ప్రభూ ! నేను నీ కోడలిని"అని ప్రార్థించుచున్నను కామమోహములు ఆవేశించిన మనస్సుతో ఆతడు నా మాటలు వినలేదు. 48,49

మూ. తత్సర్వం పృష్ఠతః కృత్వా బలాత్తేనాస్మి ధర్షితా,
ఏవం త్వమపరాధం మే క్షన్తుమర్హసి సువ్రత, 50
న హి తుల్యం బలం సౌమ్య స్త్రియాశ్చ పురుషస్య హి.

ప్ర. అ. తత్ = దానిని, సర్వమ్ = అంతనూ, పృష్ఠతః కృత్వా = వెనకకు నెట్టి, తేన = వానిచేత, బలాత్ = బలాత్కారమువలన, ధర్షితా అస్మి = అవమానింపబడితిని. సువ్రత = మంచి నియమములు కలవాడా ! ఏవమ్ = ఈ విధముగా జరిగిన, మే అపరాధమ్ = నా అపరాధమును, క్షన్తుమ్ = క్షమించుటకు, అర్హసి = తగి ఉన్నావు. సౌమ్య = సౌమ్యుడా ! స్త్రియాశ్చ = స్త్రీయొక్క, పురుషస్య = పురుషునియొక్క, బలమ్ = బలము, తుల్యమ్ = సమానము, న హి = కాదు కదా ?

తా. మంచి నియమములు గల ఓ ! సౌమ్యుడా ! ఆతడు నేను చెప్పిన దేదీ లెక్కచేయక బలాత్కారముగా నన్ను అవమానించినాడు. నీవు నా ఈ అపరాధమును క్షమించుము. స్త్రీబలము పురుషుని బలముతో సమానము కాదు కదా ? 50

మూ. ఏతచ్ఛ్రుత్వా తు సంక్రుద్ధస్తదా వైశ్రవణాత్మజః, 51
ధర్షణాం తాం పరాం శ్రుత్వా ధ్యానం సంప్రవివేశ హ.

ప్ర. అ. తదా = అప్పుడు, వైశ్రవణాత్మజః = కుబేరుని కుమారుడైన

వలన, ప్రధర్షితా = అవమానించబడితివో, తస్మాత్ = ఆ కారణమువలన, సః = అతడు, అకామామ్ = కామములేని, అన్యామ్ = మరియొక, యువతీమ్ = స్త్రీని, నోపయాస్యతి = పొందడు.

తా. మంగళప్రదురాలా ! అతడు కామము లేని నిన్ను బలాత్కరించి అవమానించినాడు గాన ఇటుపై అతడు కామము లేని మరియొక ఏ స్త్రీనీ కూడ పొందజాలడు. 54

మూ. యదా హ్యకామాం కామార్తో ధర్షయిష్యతి యోషితమ్, 55
మూర్ధా తు సప్తధా తస్య శకలీభవితా తదా.

ప్ర. అ. కామార్తః = కామపీడితుడైన అతడు, యదా = ఎప్పుడు, అకామామ్ = కామము లేని, యోషితమ్ = స్త్రీని, ధర్షయిష్యతి = అవమానించునో, తదా = అప్పుడు, తస్య = వానియొక్క, మూర్ధా = శిరస్సు, సప్తధా = ఏడు భాగములుగా, శకలీభవితా = ముక్కలు కాగలదు.

తా. కామార్తుడైన ఈ రావణుడు కామము లేని స్త్రీని ఎవ్వరినైన అవమానించినచో అప్పుడు ఈతని శిరస్సు ఏడు ముక్కలుగా బద్దలగును. 55

మూ. తస్మిన్నుదాహృతే శాపే జ్వలితాగ్నిసమప్రభే, 56
దేవదున్దుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా.

ప్ర. అ. జ్వలితాగ్నిసమప్రభే = ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన కాంతి గల, తస్మిన్ = ఆ, శాపే = శాపము, ఉదాహృతే = పలకబడిన దగుచుండగా, దేవదున్దుభయః = దేవతల దుందుభులు, నేదుః = మ్రోగినవి. ఖాత్ = ఆకాశమునుండి, పుష్పవృష్టిశ్చ = పుష్పవర్షము కూడ, చ్యుతా = జారినది.

తా అతడు ప్రజ్వలించుచున్న అగ్ని వలె తీవ్రమైన ఆ శాపవాక్యమును ఉచ్చరించగానే దేవదుందుభులు మ్రోగెను. ఆకాశమునుండి పుష్పవృష్టి కురిసెను.

మూ. పితామహముఖాశ్చైవ సర్వే దేవాః ప్రహర్షితాః, 57
జ్ఞాత్వా లోకగతిం సర్వాం తస్య మృత్యుం చ రక్షసః,
ఋషయః పితరశ్చైవ ప్రీతిమాపురనుత్తమామ్. 58

తా. రావణుడు అపహరించుకొని వచ్చిన పతివ్రతలైన స్త్రీ లందరు తమ మనస్సుకు ఆనందము కలిగించు, నలకూబరు డిచ్చిన శాపమును గూర్చి విని సంతోషించిరి. 60

"బాలానందని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
ఇరువదిఅరవ సర్గ సమాప్తము.

మూ. శ్రుత్వా తు రావణం ప్రాప్తమిన్ద్రశ్చలిత ఆసనాత్,
దేవానథాబ్రవీత్తత్ర సర్వానేవ సమాగతాన్. 3

ఆదిత్యాంశ్చ వసూన్ రుద్రాన్ సాధ్యాంశ్చ సమరుద్గణాన్,
సజ్జా భవత యుద్ధార్థం రావణస్య దురాత్మనః. 4

ప్ర. అ. రావణమ్ = రావణుణ్ణి, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, ఇన్ద్రః = ఇంద్రుడు, ఆసనాత్ = ఆసనమునుండి, చలితః = చలించినవాడై, అథ = అటుపిమ్మట, తత్ర = అక్కడ, సమాగతాన్ = వచ్చి ఉన్న, సర్వాన్ = సమస్తమైన, దేవాన్ = దేవతలను, ఆదిత్యాన్ చ = ఆదిత్యులను, వసూన్ = వసువులను, రుద్రాన్ = రుద్రులను, సమరుద్గణాన్ = మరుద్గణముతో కూడిన, సాధ్యాన్ చ = సాధ్యులను గూర్చి, అబ్రవీత్ = పలికెను. దురాత్మనః = దురాత్ముడైన, రావణస్య = రావణునియొక్క, యుద్ధార్థమ్ = యుద్ధముకొరకు, సజ్జాః = సన్నద్ధులు, భవత = అవండి

తా. రావణుడు వచ్చినట్లు విని ఇంద్రుడు ఆసనమునుండి చలించి, అక్కడికి వచ్చి ఉన్న దేవత లందరినీ, ఆదిత్యులనూ, వసువులను, రుద్రులను, సాధ్యులను, మరుత్తులను "దురాత్ముడైన రావణునితో యుద్ధానికి సిద్ధము అవండి" అని ఆజ్ఞాపించెను. 3, 4

మూ. ఏవముక్తాస్తు శక్రేణ దేవాః శక్రసమా యుధి,
సంనహ్య సుమహాసత్త్వా యుద్ధశ్రద్ధాసమన్వితాః. 5

ప్ర. అ. శక్రేణ = ఇంద్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, యుధి = యుద్ధమునందు, శక్రసమాః = ఇంద్రునితో సమానులైన, సుమహాసత్త్వాః = చాల గొప్ప బలము గల, దేవాః = దేవతలు, సంనహ్య = సిద్ధమై, యుద్ధశ్రద్ధాసమన్వితాః = యుద్ధమునందు శ్రద్ధతో కూడినవారు అయిరి.

తా. యుద్ధమునందు ఇంద్రునితో సమానులు, మహాబలవంతులు అయిన దేవతలు ఇంద్రుని మాటలు విని యుద్ధమునందు శ్రద్ధ గలవారై సిద్ధమైరి. 5

మూ. స తు దీనః పరిత్రస్తో మహేన్ద్రో రావణం ప్రతి,
విష్ణోః సమీపమాగత్య వాక్యమేతదువాచ హ. 6

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, త్వద్బలమ్ = నీ బలమును, సమవష్టభ్య = ఊతగా గొని, నముచిః = నముచి, వృత్రః = వృత్రాసురుడు, బలిః = బలి, నరకశమ్బరౌ = నరకుడు, శంబరుడు, మయా = నాచేత, యథా = ఎట్లు, దగ్ధాః = కాల్చివేయబడినారో; తథా = అట్లు, కురు = చేయుము.

తా. అందువలన, నీ బలమును ఊతగాగొని నేను ఏ విధముగా నముచి-వృత్ర-బలి-నరక-శంబరులను నశింపచేసితినో ఇతని విషయమునందు కూడ అట్లు చేయుము. 9

మూ. న హ్యాన్యో దేవదేవేశ త్వదృతే మధుసూదన,
గతిః పరాయణం చాపి త్రైలోక్యే సచరాచరే. 10

ప్ర. అ. దేవ = దేవా! దేవేశ = దేవతల ప్రభువైనవాడా! మధుసూదన = మధుసూదనా! సచరాచరే = చరాచరములతో కూడిన, త్రైలోక్యే = మూడు లోకములయందు, గతిః = గతి అయినవాడు, పరాయణం చాపి = శ్రేష్ఠమైన స్థానమైన వాడు, త్వదృతే = నీవు తప్ప, అన్యః = మరి యొకడు; న హి = లేడు కదా?

తా. ఓ! దేవా! ఓ! దేవేశా! ఓ! మధుసూదనా! జంగమస్థావరాత్మకమైన ఈ మూడులోకములలో నీవు తప్ప మరొక గతి, మరొక ఉత్తమస్థానము లేదు కదా? 10

మూ. త్వం హి నారాయణః శ్రీమాన్ పద్మనాభః సనాతనః,
త్వయేమే స్థాపితా లోకాః శక్రశ్చాహం సురేశ్వరః. 11

ప్ర. అ. త్వమ్ = నీవు, నారాయణః = జలము స్థానముగా గలవాడవు. శ్రీమాన్ = లక్ష్మి గలవాడవు. పద్మనాభః = పద్మము నాభియందు కలవాడవు. సనాతనః = అతిప్రాచీనుడవు. ఇమే లోకాః = ఈ లోకములు, త్వయా = నీచేత, స్థాపితాః = స్థాపింపబడినవి. అహం చ = నేను కూడ, సురేశ్వరః = దేవతల ప్రభువుగా స్థాపింపబడినాను.

తా. నీవు నారాయణుడవు. లక్ష్మీపతివి. పద్మనాభుడవు. సనాతనుడవు. నీవే ఈ లోకములను నిలబెట్టినావు. నన్ను దేవేంద్రుని చేసినావు. 11

మూ. న తావదేష దుష్టాత్మా శక్యో జేతుం సురాసురైః,
హన్తుం చాపి సమాసాద్య వరదానేన దుర్జయః. 15

ప్ర. అ. వరదానేన = వరదానముచేత, దుర్జయః = జయింప శక్యము కాని, దుష్టాత్మా = దుష్టాత్ముడైన, ఏషః = ఇతడు, సురాసురైః = సురులచేతను అసురులచేతనూ కూడ, సమాసాద్య = పొంది, జేతుమ్ = జయించుటకు, హన్తుం చాపి = చంపుటకు, న శక్యః తావత్ = శక్యమైనవాడు కాడు.

తా. వరదానముచేత జయింప శక్యము కాని దుష్టుడైన ఈతనిని సురాసురులు కూడ ఎదిరించి ఓడించజాలరు; చంపజాలరు. 15

మూ. సర్వథా సుమహత్కర్మ కరిష్యతి బలోత్కటః,
రాక్షసః పుత్రసహితో దృష్టమేతన్నిసర్గతః. 16

ప్ర. అ. బలోత్కటః = బలముచేత దృప్తుడైన, పుత్రసహితః = పుత్రునితో కూడిన, రాక్షసః = ఈ రాక్షసుడు, సర్వథా = అన్ని విధములా, సుమహత్ = చాల గొప్పదైన, కర్మ = పనిని, కరిష్యతి = చేయగలడు. ఏతత్ = ఇది, నిసర్గతః = స్వభావముచేత, దృష్టమ్ = చూడబడినది.

తా. బలముచేత దృప్తుడైన, పుత్రసహితుడైన ఈ రాక్షసుడు అన్ని విధములా గొప్ప పని చేయనున్నాడు. ప్రస్తుతస్థితిని పట్టి ఇట్లు కనబడుచున్నది. 16

మూ. యత్తు మాం త్వమభాషిష్ఠా యుధ్యస్వేతి సురేశ్వర,
నాహం తం ప్రతియోత్స్యామి రావణం రాక్షసం యుధి.

ప్ర. అ. సురేశ్వర = దేవేంద్రా! యుధ్యస్వ ఇతి = యుద్ధము చేయుము అని, మామ్ = నన్ను గూర్చి, యత్తు అభాషిష్ఠాః = ఏది పలికితివో (దానికి సమాధాన మేమనగా), రాక్షసమ్ = రాక్షసుడైన, తం రావణమ్ = ఆ రావణుణ్ణి; అహమ్ = నేను. యుధి = యుద్ధమునందు, న ప్రతియోత్స్యామి = ఎదిరించి యుద్ధము చేయను.

తా. దేవేంద్రా! "యుద్ధము చేయుము" అని నీవు నన్ను కోరినావు. కాని నేను యుద్ధరంగములో ఆ రావణుణ్ణి ఎదిరించి యుద్ధము చేయను. 17

ప్ర. అ. శచీపతే = శచీదేవికి పతివైన, దేవరాజ = దేవేంద్రా! ఏతత్ = ఈ, తత్త్వమ్ = యథార్థము, తే = నీకు, కథితమ్ = చెప్పబడినది. మహాబల = గొప్ప బలము గలవాడా! విగతత్రాసః = పోయిన భయము గలవాడవై, సురైః సార్థమ్ = దేవతలతో కూడినవాడవై, యుధ్యస్వ = యుద్ధము చేయుము.

తా. శచీపతి వైన దేవేంద్రా! నీకు ఈ యథార్థవిషయమును చెప్పినాను. మహాబలశాలీ! భయపడక, దేవతలతో కలిసి రావణునితో యుద్ధము చేయుము.

మూ. తతో రుద్రాః సహాదిత్యా వసవో మరుతోఽశ్వినౌ,
సంనద్ధా నిర్యయుస్తూర్ణం రాక్షసానభితః పురాత్. 22

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రుద్రాః = రుద్రులు, సహాదిత్యాః = ఆదిత్యులతో కూడిన, వసవః = వసువులు, మరుతః = మరుత్తులు, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, సంనద్ధాః = యుద్ధానికి సిద్ధమైనవారై, తూర్ణమ్ = శీఘ్రముగా, పురాత్ = పట్టణమునుండి, రాక్షసాన్ అభితః = రాక్షసులకు చుట్టూ, నిర్యయుః = బయలు దేరిరి.

తా. పిమ్మట రుద్రులు, ఆదిత్యులు, వసువులు, మరుత్తులు, అశ్వినీ దేవతలు యుద్ధసన్నద్ధులై వెంటనే నగరమునుండి రాక్షసులను చుట్టుటకై బయలు దేరిరి. 22

మూ. ఏతస్మిన్నన్తరే నాదః శుశ్రువే రజనీక్షయే,
తస్య రావణసైన్యస్య ప్రయుద్ధస్య సమన్తతః. 23

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యయందు, రజనీక్షయే = రాత్రి చివర, సమన్తతః = అంతటా, ప్రయుద్ధస్య = యుద్ధముచేయుచున్న, రావణ సైన్యస్య = రావణుని సైన్యముయొక్క, నాదః = ధ్వని, శుశ్రువే = వినబడెను.

తా. ఇంతలో రాత్రి గడచినపిమ్మట యుద్ధము చేయుచున్న రావణ సైన్యము ధ్వని నలుమూలలనుండి వినవచ్చెను. 23

మూ. తే ప్రయుద్ధా మహావీర్యా అన్యోన్యమభివీక్ష్య వై,
సఙ్గ్రామమేవాభిముఖా అభ్యవర్తన్త హృష్టవత్. 24

మారీచశ్చ ప్రహస్తశ్చ మహాపార్శ్వమహోదరౌ,
అకమ్పనో నికుమ్భశ్చ శుకః సారణ ఏవ చ. 28

సంహ్రాదో ధూమకేతుశ్చ మహాదంష్ట్రో ఘటోదరః,
జమ్బుమాలీ మహాహ్రాదో విరూపాక్షశ్చ రాక్షసః. 29

సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ దుర్ముఖో దూషణః ఖరః,
త్రిశిరాః కరవీరాక్షః సూర్యశత్రుశ్చ రాక్షసః, 30
మహాకాయోఽతికాయశ్చ దేవాన్తకనరాన్తకౌ.

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యకాలమునందు, రావణస్య = రావణునియొక్క, సచివాః = మంత్రులైన, శూరాః = శూరులు, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనము కలవారు అయిన, మారీచశ్చ = మారీచుడు, ప్రహస్తః చ = ప్రహస్తుడు, మహాపార్శ్వమహోదరౌ = మహాపార్శ్వమహోదరులు, అకమ్పనః = అకంపనుడు, నికుమ్భః చ = నికుంభుడు, శుకః = శుకుడు, సారణః ఏవ చ = సారణుడు. సంహ్రాదః = సంహ్రాదుడు, ధూమకేతుశ్చ = ధూమకేతువు, మహాదంష్ట్రః = మహాదంష్ట్రుడు, ఘటోదరః = ఘటోదరుడు, జమ్బుమాలీ = జంబుమాలి, మహాహ్రాదః = మహాహ్రాదుడు, రాక్షసః = రాక్షసుడైన, విరూపాక్షశ్చ = విరూపాక్షుడు, సుప్తఘ్నః = సుప్తఘ్నుడు, యజ్ఞకోపః చ = యజ్ఞకోపుడు, దుర్ముఖః = దుర్ముఖుడు, దూషణః = దూషణుడు, ఖరః = ఖరుడు, త్రిశిరాః = త్రిశిరస్సు, కరవీరాక్షః = కరవీరాక్షుడు, రాక్షసః = రాక్షసుడైన, సూర్యశత్రుః = సూర్యశత్రువు, మహాకాయః = మహాకాయుడు, అతికాయః చ = అతికాయుడు, దేవాన్తకనరాన్తకౌ = దేవాంతకనరాంతకులు అను, తే రాక్షసాః = ఆ రాక్షసులు, యుద్ధార్థమ్ = యుద్ధముకొరకు, సమవర్తన్త = వచ్చి చేరిరి.

తా. ఇంతలో శూరులు, చూచుటకు భయంకరులూ అయిన, రావణుని సచివులైన, మారీచ-ప్రహస్త-మహాపార్శ్వ-మహోదరులు, అకంపన-నికుంభ-శుక సారణులు, సంహ్రాద-ధూమకేతు-మహాదంష్ట్ర-ఘటోదర-జంబుమాలి-మహాహ్రాద విరూపాక్షులు, సుప్తఘ్న-యజ్ఞకోప-దుర్ముఖ-దూషణ-ఖరులు, త్రిశిరస్సు, కరవీరాక్ష-సూర్యశత్రు-మహాకాయ-అతికాయ-దేవాంతక-నరాంతకులు అను రాక్షసులు యుద్ధములో పాల్గొనిరి. 27-30

మూ. ఏతస్మిన్నన్తరే శూరో వసూనామష్టమో వసుః, 34
సావిత్ర ఇతి విఖ్యాతః ప్రవివేశ రణాజిరమ్.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యలో, సావిత్రః ఇతి = సావిత్రుడు అని, విఖ్యాతః = ప్రసిద్ధుడైన, శూరః = శూరుడైన, వసూనామ్ = వసువులలో, అష్టమః = ఎనిమిదవవాడైన, వసుః = వసువు, రణాజిరమ్ = యుద్ధభూమిని, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఇంతలో సావిత్రు డను పేరు గల శూరుడైన, వసువులలో ఎనిమిదవవాడైన వసువు యుద్ధభూమిలో ప్రవేశించెను. 34

మూ. సైన్యైః పరివృతో హృష్టైర్నానాప్రహరణోద్యతైః, 35
త్రాసయన్ శత్రుసైన్యాని ప్రవివేశ రణాజిరమ్.

ప్ర. అ. హృష్టైః = సంతోషించిన, నానాప్రహరణోద్యతైః = ఎత్తబడిన అనేకవిధములైన ఆయుధములు గల, సైన్యైః = సైన్యములతో, పరివృతః = కూడినవాడై, శత్రుసైన్యాని = శత్రుసైన్యములను, త్రాసయన్ = భయపెట్టుచు, రణాజిరమ్ = యుద్ధభూమిని, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఉత్సాహముతో అనేకవిధములైన ఆయుధములను ఎత్తిన సైన్యములతో కూడినవాడై సావిత్రుడు యుద్ధరంగములో ప్రవేశించెను. 35

మూ. తథాదిత్యౌ మహావీర్యౌ త్వష్టా పూషా చ తౌ సమమ్, 36
నిర్భయౌ సహ సైన్యేన తదా ప్రావిశతాం రణే.

ప్ర. అ. తథా = మరియు, మహావీర్యౌ = గొప్ప పరాక్రమము గల, తౌ = ఆ, త్వష్టా = త్వష్ట, పూషా చ = పూష అను, ఆదిత్యౌ = అదిత్యులు, నిర్భయౌ = భయము లేనివారై, సైన్యేన = సైన్యముతో, సమమ్ = ఒక్కమారుగా, రణే = యుద్ధమునందు, ప్రావిశతామ్ = ప్రవేశించిరి.

తా. గొప్ప పరాక్రమము గల త్వష్ట, పూష అను ఆదిత్యులు కూడ భయము లేనివారై, సైన్యముతో ఒక్కమారుగా రణరంగమును ప్రవేశించిరి. 36

మూ. ఏతస్మిన్నన్తరే రామ సుమాలీ నామ రాక్షసః,
నానాప్రహరణైః క్రుద్ధస్తత్సైన్యం సోఽభ్యవర్తత. 40

ప్ర. అ. రామ = రామా! ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యకాలములో, సుమాలీ నామ = సుమాలి అను, రాక్షసః = రాక్షసుడు, క్రుద్ధః = కోపించినవాడై, నానాప్రహరణైః = అనేకవిధములైన ఆయుధములతో, తత్ = ఆ, సైన్యమ్ = సైన్యమును, అభ్యవర్తత = సమీపించెను.

తా. రామా! ఇంతలో సుమాలి అను రాక్షసుడు కోపించి, అనేకవిధములైన ఆయుధములతో ఆ దేవతాసైన్యమును ప్రవేశించెను. 40

మూ. స దైవతబలం సర్వం నానాప్రహరణైః శితైః,
వ్యధ్వంసయత సంక్రుద్ధో వాయుర్జలధరం యథా. 41

ప్ర. అ. సః = అతడు, సంక్రుద్ధః = కోపించినవాడై, శితైః = వాడియైన, నానాప్రహరణైః = అనేకవిధములైన ఆయుధములతో, సర్వమ్ = సమస్తమైన, దైవతబలమ్ = దేవతల సైన్యమును, వాయుః = వాయువు, జలధరం యథా = మేఘమునువలె, వ్యధ్వంసయత్ = నశింపచేసెను.

తా. ఆతడు కోపించి, వాయువు మేఘమును వలె, దేవతాసైన్యము నంతను వాడిగా ఉన్న అనేకవిధములైన ఆయుధములతో నశింపచేసెను. 41

మూ. తే మహాబాణవర్షైశ్చ శూలప్రాసైః సుదారుణైః,
హన్యమానాః సురాః సర్వే న వ్యతిష్ఠన్త సంహతాః. 42

ప్ర. అ. మహాబాణవర్షైః చ = గొప్ప బాణవర్షములచేత, సుదారుణైః = చాల భయంకరములైన, శూలప్రాసైః = శూలములచేత, ప్రాసలచేత, హన్యమానాః = కొట్టబడుచున్న, తే = ఆ, సర్వే = సమస్తమైన, సురాః = దేవతలు, సంహతాః = కలిసినవారై, న వ్యతిష్ఠన్త = నిలబడజాలకపోయిరి.

తా. బాణవర్షములతోను, చాల భయంకరములైన శూలములతోను, ప్రాసలతోను ఆతడు కొట్టుచుండగా ఆ దేవతలందరూ ఒకచోట కలిసి నిలవజాలక పోయిరి. 42

మూ. తత స్తస్య మహాబాణై ర్వసునా సుమహాత్మనా,
నిహతః పన్నగరథః క్షణేన వినిపాతితః. 46

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమహాత్మనా = చాల గొప్పవాడైన, వసునా = వసువుచేత, తస్య = ఆ సుమాలియొక్క, పన్నగరథః = సర్పరూపమైన రథము, మహాబాణైః = గొప్ప బాణములచేత, నిహతః = కొట్టబడినదై, క్షణేన = క్షణకాలముచేత, వినిపాతితః = పడగొట్టబడినది.

తా. అప్పుడు మహాత్ముడైన వసువు గొప్ప బాణములు ప్రయోగించి ఆ ఆ సుమాలి వాహనమైన సర్పమును క్షణకాలములో క్రింద పడగొట్టెను. 46

మూ. హత్వా తు సంయుగే తస్య రథం బాణశతైశ్చితమ్,
గదాం తస్య వధార్థాయ వసుర్జగ్రాహ పాణినా. 47

ప్ర. అ. వసుః = వసువు, సంయుగే = యుద్ధమునందు, బాణశతైః = బాణములయొక్క శతములచేత, చితమ్ = వ్యాప్తమైన, తస్య రథమ్ = అతని రథమును, హత్వా = చంపి, తస్య = వానియొక్క, వధార్థాయ = వధకొరకు, పాణినా = హస్తముచేత, గదామ్ = గదను, జగ్రాహ = గ్రహించెను.

తా. వసువు వందలకొలది బాణములు ప్రయోగించి ఆ సుమాలి రథమును చంపి అతనిని చంపుటకై గదను చేతిలో తీసికొనెను. 47

మూ. తతః ప్రగృహ్య దీప్తాగ్రాం కాలదణ్డోపమాం గదామ్,
తాం మూర్ధ్ని పాతయామాస సావిత్రో వై సుమాలినః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సావిత్రః = సావిత్రుడు, దీప్తాగ్రామ్ = ప్రజ్వలించుచున్న అగ్రభాగము గల, కాలదణ్డోపమామ్ = యమదండముతో సమానమైన, గదామ్ = గదను, ప్రగృహ్య = గ్రహించి, తామ్ = దానిని, సుమాలినః = సుమాలియొక్క, మూర్ధ్ని = శిరస్సుమీద, పాతయామాస = పడవేసెను.

తా. సావిత్రుడు మండుచున్న అగ్రభాగము గల, యమదండముతో సమానమైన ఆ గదను సుమాలి శిరస్సుమీద పడవేసెను. 48

సహితాః=కలిసినవారై, పరస్పరమ్=పరస్పరమును, క్రోశమానాః=అరచుచున్న వారై, సమన్తతః = అన్ని వైపులా, వ్యద్రవన్ = పారిపోయిరి. వసునా = వసువుచేత, విద్రావ్యమాణాః = తరుమబడుచున్నవారై, రాక్షసాః = రాక్షసులు, నావతస్థిరే = నిలవలేదు.

తా. యుద్ధములో సుమాలి మరణించుట చూచి ఆ రాక్షసు లందరూ ఒకరి నొకరు పిలచుకొనుచు, కలిసి, నాలుగు వైపులకు పారిపోయిరి. ఆ వసువు తరిమివేయుచుండగా, రాక్షసులు నిలవజాలకపోయిరి. 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఇరువది ఏడవ సర్గ సమాప్తము.

ప్ర. అ. మహారథః = మహారథుడైన, సః = అతడు, అగ్నివర్ణేన = అగ్నివంటి వర్ణము గల, కామగేన = ఇచ్ఛ ప్రకారము నడుచు, రథేన = రథముతో, జ్వలన్ = మండుచున్న, అగ్నిః = అగ్ని, వనానీవ = వనములను వలె. తామ్ = ఆ, సేనామ్ = సేనను గూర్చి, అభిదుద్రావ = ఎదురుగా పరుగెత్తెను.

తా. అతడు అగ్నివంటి వర్ణము గల, తన ఇష్టము ప్రకారము నడిచే రథమును ఎక్కి, మండుచున్న అగ్ని వనముల వైపు శీఘ్రముగా వెళ్ళినట్లు ఆ దేవతాసైన్యముల వైపు శీఘ్రముగా వెళ్ళెను. 3

మూ. తతః ప్రవిశత స్తస్య వివిధాయుధధారిణః,
విదుద్రువుర్దిశః సర్వా దర్శనాదేవ దేవతాః. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రవిశతః = ప్రవేశించుచున్న, వివిధాయుధధారిణః = అనేకవిధములైన ఆయుధములను ధరించుచున్న, తస్య = వానియొక్క, దర్శనాదేవ = దర్శనమువల్లనే, సర్వాః = సమస్తమైన, దేవతాః = దేవతలు, దిశః = దిక్కులను గూర్చి, విదుద్రువుః = పారిపోయిరి.

తా. అప్పుడు అనేక విధములైన ఆయుధములు ధరించి ప్రవేశించుచున్న ఆతనిని చూడగానే దేవత లందరూ పారిపోయిరి. 4

మూ. న బభూవ తదా కశ్చిద్యుయుత్సోరస్య సంముఖే,
సర్వానావిద్ధ్య విత్రస్తాం స్తతః శక్రోఽబ్రవీత్సురాన్. 5

ప్ర. అ. తదా = అప్పుడు, యుయుత్సోః = యుద్ధముచేయదలచిన, అస్య = ఈతనియొక్క, సంముఖే = ఎదుట, కశ్చిత్ = ఎవ్వడును, న బభూవ = ఉండలేదు. తతః = అటుపిమ్మట, శక్రః = దేవేంద్రుడు, సర్వాన్ = సమస్తమైన, తాన్ = ఆ, సురాన్ = దేవతలను, ఆవిద్ధ్య = (మాటలతో) కొట్టి, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు యుద్ధము చేయుటకై వచ్చిన ఆ మేఘనాదుని ఎదుట ఎవ్వడూ లేకుండెను. అప్పుడు దేవేంద్రుడు ఆ దేవతల నందరినీ మాటలతో కొట్టి ఇట్లు పలికెను. 5

ప్ర. అ. తేషామ్ = ఆ, దేవరక్షసామ్ = దేవతలకు రాక్షసులకు, మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, పుత్రస్య చ = పుత్రునకు, రాక్షసేన్ద్రసుతస్య చ = రావణుని పుత్రునకు, సదృశమ్ = తగిన, యుద్ధమ్ = యుద్ధము, సమభవత్ = జరిగెను.

తా. ఆ దేవరాక్షసులకూ, జయంతమేఘనాదులకు మధ్య తగిన యుద్ధము జరిగెను. 9

మూ. తతో మాతలిపుత్రస్య గోముఖస్య స రావణిః,
సారథేః పాతయామాస శరాన్ కనకభూషణాన్. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః రావణిః = ఆ ఇంద్రజిత్తు, సారథేః = సారథియైన, మాతలిపుత్రస్య = మాతలి కుమారుడైన, గోముఖస్య = గోముఖునికి, కనకభూషణాన్ = బంగారము అలంకారముగా గల, శరాన్ = బాణములను, పాతయామాస = పడవేసెను.

తా. అప్పుడు ఆ మేఘనాదుడు జయంతుని సారథిగా ఉన్న, మాతలి పుత్రుడైన గోముఖునిపై బంగారముచేత అలంకరింపబడిన బాణములు కురిపించెను. 10

మూ. శచీసుతశ్చాపి తథా జయన్తస్తస్య సారథిమ్,
తం చాపి రావణిః క్రుద్ధః సమన్తాత్ప్రత్యవిధ్యత. 11

ప్ర. అ. తథా = అట్లే, శచీసుతః = శచీదేవి పుత్రుడైన, జయన్తః = జయంతుడు, తస్య = వానియొక్క, సారథిమ్ = సారథిని, క్రుద్ధః = కోపించిన, రావణిః చాపి = మేఘనాదుడు, తం చాపి = అతనినీ, సమన్తాత్ = అంతటా, ప్రత్యవిధ్యత = కొట్టెను.

తా. శచీపుత్రుడైన జయంతుడు మేఘనాదుని సారథిని కొట్టగా, మేఘనాదుడు కోపముతో జయంతుణ్ణి బాణాలతో వేధించెను. 11

మూ. స హి క్రోధసమావిష్టో బలీ విస్ఫారితేక్షణః,
రావణిః శక్రతనయం శరవర్షైరవాకిరత్. 12

శత్రుసైన్యములను, నిఘ్నతః = కొట్టుచుండగా, తతః = అటుపిమ్మట, లోకాః = లోకములు, ప్రవ్యథితాః = వ్యథ చెందినవి. మహత్ = గొప్ప, తమః = చీకటి, సంజజ్ఞే = పుట్టెను.

తా. ఆ మేఘనాదుడు శత్రుసైన్యములను సంహరించుచున్నప్పుడు లోకములన్నీ వ్యథ చెందినవి. దట్టమైన చీకటి అలముకొనెను. 15

మూ. తతస్తద్దైవతబలం సమన్తాత్తం శచీసుతమ్,
బహుప్రకారమస్వస్థమభవచ్ఛరపీడితమ్. 16

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తం శచీసుతం సమన్తాత్ = ఆ జయంతుని చుట్టూ ఉన్న, తత్ = ఆ, దైవతబలమ్ = దేవతాసైన్యము, శరపీడితమ్ = బాణముల చేత పీడింపబడినదై, బహుప్రకారమ్ = అనేకవిధముల, అస్వస్థమ్ = స్వాస్థ్యము లేనిది, అభవత్ = ఆయెను.

తా. అప్పుడు జయంతుని చుట్టూ ఉన్న ఆ దేవతాసైన్యము బాణములచేత పీడింపబడినదై అనేకవిధముల అస్వస్థము అయినది. 16

మూ. నాభ్యజానన్త చాన్యోన్యం రక్షో వా దేవతాథవా,
తత్ర తత్ర విపర్యస్తం సమన్తాత్పర్యధావత. 17

ప్ర. అ. రక్షో వా = రాక్షసుడా, అథవా = లేక, దేవతా = దేవతయా అని, పరస్పరమ్ = ఒకరిని నొకరు, నాభ్యజానన్త = గుర్తుపట్టలేదు. తత్ర తత్ర = ఆ యా ప్రదేశములయందు, విపర్యస్తమ్ = విపర్యాసమును చెందినదై, సమన్తాత్ = అన్నివైపులా, పర్యధావత = పరుగెత్తెను.

తా. ఆసైన్యములలోనివారు ఎవరు రాక్షసులో, ఎవరు దేవతలో గుర్తించజాలకపోయిరి. ఆ సైన్య మంతా ఇటు అటు తారుమారగుచు అన్ని వైపులా పరుగెత్తెను. 17

మూ. దేవా దేవాన్నిజఘ్నుస్తే రాక్షసా రాక్షసాంస్తథా,
సంమూఢాస్తమసా ఛన్నా వ్యద్రవన్నపరే తథా. 18

ప్ర. అ. తమసా = చీకటిచేత, ఛన్నాః = కప్పబడినవారై, సంమూఢాః

యొక్క, ప్రణాశమ్=కనబడకపోవుటను, జ్ఞాత్వా=తెలిసికొని, అప్రహృష్టాః=సంతోషము లేనివారై, వ్యథితాః=వ్యథచెందినవారై, సర్వాః=అందరూ కూడ, సంప్రదుద్రువుః=పారిపోయిరి.

తా. అప్పుడు జయంతుడు కనబడకపోవుటచే వ్యథ చెందిన దేవతలందరూ సంతోషవిహీనులై పారిపోయిరి. 21

మూ. రావణిస్త్వథ సంక్రుద్ధో బలైః పరివృతః స్వకైః,
అభ్యధావత దేవాంస్తాన్ ముమోచ చ మహాస్వనమ్. 22

ప్ర. అ. అథ=అటు పిమ్మట, రావణిః తు=మేఘనాదుడైతే, సంక్రుద్ధః=కోపించినవాడై, స్వకైః=తన సంబంధమైన, బలైః=సేనలతో, పరివృతః=కూడినవాడై, తాన్=ఆ, దేవాన్=దేవతలను గూర్చి, అభ్యధావత=పరుగెత్తెను. మహాస్వనమ్=గొప్ప ధ్వనిని, ముమోచ చ=విడచెను కూడ.

తా. అప్పుడు కోపించిన మేఘనాదుడు గొప్ప ధ్వని చేయుచు, తన సైన్యముతో దేవతలమీదికి పరుగెత్తెను. 22

మూ. దృష్ట్వా ప్రణాశం పుత్రస్య దైవతేషు చ విద్రుతమ్,
మాతలిం చాహ దేవేశో రథః సముపనీయతామ్. 23

ప్ర. అ. పుత్రస్య=కుమారునియొక్క, ప్రణాశమ్=కనబడపోవుటను, దైవతేషు=దేవతలయందు, విద్రుతం చ=పారిపోవుటను, దృష్ట్వా=చూచి, దేవేశః=దేవేంద్రుడు, మాతలిమ్=మాతలిని గూర్చి, ఆహ చ=పలికెను. రథః=రథము, సముపనీయతామ్=తీసికొని రాబడుగాక.

తా. పుత్రుడైన జయంతుడు కనబడకపోవుటను, దేవతలు పారిపోవుటను చూచి దేవేంద్రుడు మాతలిని "నా రథము తీసికొనిరమ్ము"అని ఆజ్ఞాపించెను. 23

మూ. స తు దివ్యో మహాభీమః సజ్జ ఏవ మహారథః,
ఉపస్థితో మాతలినా వాహ్యమానో మహాజవః. 24

ప్ర. అ. సజ్జః ఏవ=సిద్ధముగానే ఉన్న, మహాభీమః=చాల భయంకరమైన, దివ్యః=దివ్యమైన, మాతలినా=మాతలిచేత, వాహ్యమానః=తోలబడుచున్న,

అశ్విభ్యామ్ = అశ్వినీదేవతలతోను, వృతః = కూడినవాడై, నిర్యయౌ = బయలుదేరెను.

తా. దేవేంద్రుడు అనేకవిధములైన ఆయుధములు ధరించిన రుద్రులతోను, వసువులతోను, ఆదిత్యులతోను, అశ్వినీదేవతలతోను, మరుద్గణములతోను కలిసి బయలుదేరెను. 27

మూ. నిర్గచ్ఛతస్తు శక్రస్య పరుషః పవనో వవౌ,
భాస్కరో నిష్ప్రభశ్చైవ మహోల్కాశ్చ ప్రపేదిరే. 28

ప్ర. అ. శక్రస్య = దేవేంద్రుడు, నిర్గచ్ఛతః = బయలుదేరుచుండగా, పవనః = వాయువు, పరుషః = పరుషమై, వవౌ = వీచెను. భాస్కరః చైవ = సూర్యుడు కూడ, నిష్ప్రభః=కాంతివిహీను డయ్యెను. మహోల్కాః చ = గొప్ప ఉల్కలు, ప్రపేదిరే = పొందినవి.

తా. దేవేంద్రుడు బయలుదేరు సమయమునందు గాలి పరుషముగా వీచెను. సూర్యుని కాంతి తగ్గెను. పెద్ద ఉల్కలు (కొరవులవంటి నిప్పుముద్దలు) పడెను.

మూ. ఏతస్మిన్నన్తరే శూరో దశగ్రీవః ప్రతాపవాన్,
ఆరురోహ రథం దివ్యం నిర్మితం విశ్వకర్మణా. 29

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యకాలములో, శూరః = శూరుడు, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడూ అయిన, దశగ్రీవః=రావణుడు, విశ్వకర్మణా= విశ్వకర్మచేత, నిర్మితమ్ = నిర్మించబడిన, దివ్యమ్ = దివ్యమైన, రథమ్ = రథమును, ఆరురోహ = ఎక్కెను.

తా. ఇంతలో శూరుడు, ప్రతాపవంతుడూ అయిన రావణుడు విశ్వకర్మ నిర్మించిన దివ్యమైన రథము నెక్కెను. 29

మూ. పన్నగైః సుమహాకాయైర్వేష్టితం లోమహర్షణైః,
యేషాం నిఃశ్వాసవాతేన ప్రదీప్తమివ సంయుగే. 30

ప్ర. అ. సుమహాకాయైః = చాల పెద్ద శరీరములు గల, లోమహర్షణైః= రోమాంచమును కలిగించు, పన్నగైః=సర్పములచేత, వేష్టితమ్ = చుట్టుకొనబడిన

మివ = మేఘముల వలె, శస్త్రాణి=ఆయుధములను, వర్షతామ్ = వర్షించుచున్న, తేషామ్ = ఆ, సురాణామ్ = దేవతలకు, రాక్షసైః సహ = రాక్షసులతో కూడ, యుద్ధమ్= యుద్ధము, ప్రవృత్తమ్ = ప్రారంభమైనది.

తా. పిమ్మట మేఘముల వలె, యుద్ధములో శస్త్రములు వర్షించుచున్న దేవతలకు రాక్షసులతో యుద్ధము ప్రారంభ మయ్యెను. 33

మూ. కుమ్భకర్ణస్తు దుష్టాత్మా నానాప్రహరణోద్యతః,
నాజ్ఞాయత తదా రాజన్ యుద్ధం కేనాభ్యపద్యత. 34

ప్ర. అ. రాజన్ = రాజా ! నానాప్రహరణోద్యతః = ఎత్తబడిన అనేక విధములైన ఆయుధములు గల, దుష్టాత్మా = దుష్టబుద్ధియైన, కుమ్భకర్ణస్తు = కుంభకర్ణుడైతే, తదా = అప్పుడు, కేన = ఎవనితో, యుద్ధమ్ = యుద్ధమును, అభ్యవపద్యత = పొందెనో, నాజ్ఞాయత = తెలియబడలేదు.

తా. రామా! ఆ సమయమునందు అనేకవిధములైన ఆయుధములు ధరించిన దుష్టాత్ముడైన కుంభకర్ణుడు ఎవరితో యుద్ధము చేసినాడో తెలియలేదు. 34

మూ. దన్తైః పాదైర్భుజైర్హస్తైః శక్తితోమరముద్గరైః,
యేన తేనైవ సంక్రుద్ధస్తాడయామాస దేవతాః. 35

ప్ర. అ. సంక్రుద్ధః = కోపించిన ఆ కుంభకర్ణుడు, దన్తైః = దంతముల చేత, పాదైః=పాదములచేత, భుజైః=భుజములచేత, హస్తైః=చేతులచేత, శక్తితోమరముద్గరైః = శక్తి-తోమర-ముద్గరములచేత, యేన తేనైవ = ఏదో ఒకదానిచేత, దేవతాః = దేవతలను, తాడయామాస = కొట్టెను.

తా. కోపావేశముతో అతడు దంతాలచేత, పాదాలచేత, భుజాలచేత, హస్తాలచేత, శక్తులచేత, తోమరములచేత, ముద్గరములచేత, ఏది దొరికితే దాని చేత రాక్షసులను కొట్టెను. 35

మూ. స తు రుద్రైర్మహాఘోరైః సంగమ్యాథ నిశాచరం,
ప్రయుద్ధస్తైశ్చ సఙ్గ్రామే క్షతః శస్త్రైర్నిరన్తరమ్. 36

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ప్రయుద్ధః=బాగా యుద్ధము చేయుచున్న, సః నిశాచరః తు=ఆ రాక్షసుడు, సఙ్గ్రామే = యుద్ధమునందు, మహాఘోరైః =

బడినవారై, మహీతలే = నేలమీద, చేష్టన్తి స్మ = కొట్టుకొనుచున్నారు. అపరే = ఇతరులు, రణే = యుద్ధమునందు, వాహనేషు = వాహనములయందు, అవసక్తాః = తగుల్కొన్నవారై, స్థితాః ఏవ = అట్లే ఉండిపోయిరి.

తా. దెబ్బలు తిన్న కొందరు దేహాలు తెగిపోవుటచే నేలమీద పడి కాళ్ళు చేతులు కొట్టుకొనుచుండిరి. మరికొందరు వాహనాలపై తగుల్కొని అట్లే ఉండిపోయిరి. 39

మూ. రథాన్నాగాన్ ఖరానుష్ట్రాన్ పతగాంస్తురగాంస్తథా,
శింశుమారాన్వరాహాంశ్చ పిశాచవదనానపి. 40

తాన్ సమాలిఙ్గ్య బాహుభ్యాం విష్టబ్ధాః కేచిదుత్థితాః,
దేవైస్తు శస్త్రసంభిన్నా మమ్రిరే చ నిశాచరాః. 41

ప్ర అ. విష్టబ్ధాః = బిగిసికొనిపోయిన, కేచిత్ = కొందరు, నిశాచరాః = రాక్షసులు, రథాన్ = రథములను, నాగాన్ = ఏనుగులను, ఖరాన్ = గాడిదలను, ఉష్ట్రాన్ = ఒంటెలను, పన్నగాన్ = సర్పములను, తథా మరియు, తురగాన్ = గుఱ్ఱములను, శింశుమారాన్ = శింశుమారములను, వరాహాన్ చ = వరాహములను, పిశాచవదనానపి = పిశాచముల వంటి ముఖములు గల, తాన్ = ఆ జంతువులను, బాహుభ్యామ్ = చేతులచేత, సమాలిఙ్గ్య = కౌగలించుకొని, ఉత్థితాః = లేచినవారై, దేవైః = దేవతలచేత, శస్త్రసంభిన్నాః = ఆయుధములచేత బ్రద్దలుకొట్టబడినవారై, మమ్రిరే = మరణించిరి.

తా. దేహము బిగిసిపోయిన కొందరు రాక్షసులు బాహువులతో తమ ప్రక్క నున్న రథాలను, ఏనుగులను, గాడిదలను, ఒంటెలను, సర్పాలను, గుఱ్ఱములను, శింశుమారములను, వరాహములను పిశాచముఖములు గల జంతువులను, పట్టుకొని లేచుచుండగా వాళ్ళను దేవతలు ఆయుధాలచేత ఛేదించివేయుటచేత వాళ్లు మరణించిరి. 40,41

మూ. చిత్రకర్మ ఇవాభాతి సర్వేషాం రణసంప్లవః,
నిహతానాం ప్రసుప్తానాం రాక్షసానాం మహీతలే. 42

ప్ర. అ. నిహతానామ్ = చంపబడిన, మహీతలే = నేలమీద, ప్రసుప్తానామ్ =

గొట్టుటచూచి, కోపించి, పెరిగిపోవుచున్న ఆ దేవతాసైన్య సముద్రములో వెంటనే ప్రవేశించి, దేవతలను యుద్ధములో కొట్టుచు ఇంద్రునిమీదికి వెళ్ళెను. 44,45

మూ. ఆగాచ్ఛక్రో మహచ్చాపం విస్ఫార్య సుమహాస్వనమ్,
యస్య విస్ఫారఘోషేణ స్వనన్తి స్మ దిశో దశ. 46

ప్ర. అ. శక్రః=దేవేంద్రుడు, యస్య=దేనియొక్క, విస్ఫారఘోషేణ=చరచుటవలన కలిగిన ధ్వనిచేత, దశ=పది, దిశః=దిక్కులు, స్వనన్తి=ధ్వనిచేయుచున్నవో అట్టి, సుమహాస్వనమ్=చాల గొప్ప ధ్వని గల, మహత్=గొప్పదైన, చాపమ్=ధనస్సును, విస్ఫార్య=చరచి, అగాత్=ముందుకు వచ్చెను.

తా. దేవేంద్రుడు గొప్ప ధ్వని గల పెద్ద ధనస్సును చరచుచు ముందుకు వచ్చెను. దానిని చరచుటవలన కలిగిన ధ్వనికి పది దిక్కులూ మారుమ్రోగుచుండెను. 46

మూ. తద్వికృష్య మహచ్చాపమిన్ద్రో౽ రావణమూర్ధని,
పాతయామాస స శరాన్ పావకాదిత్యవర్చసః. 47

ప్ర. అ. సః=ఆ, ఇన్ద్రః=ఇంద్రుడు, మహత్=గొప్పదైన, తత్ చాపమ్=ఆ ధనస్సును, వికృష్య=లాగి, పావకాదిత్యవర్చసః=అగ్నివంటి సూర్యునివంటి కాంతి గల, శరాన్=బాణములను, రావణమూర్ధని=రావణుని శిరస్సుమీద, పాతయామాస=పడవేసెను.

తా. ఇంద్రుడు ఆ ధనస్సును లాగి, రావణుని శిరస్సుమీద, అగ్ని-సూర్యుల తేజస్సు వంటి తేజస్సు గల బాణములను ప్రయోగించెను. 47

మూ. తథైవ చ మహాబాహుర్దశగ్రీవో నిశాచరః,
శక్రం కార్ముకవిభ్రష్టైః శరవర్షైరవాకిరత్. 48

ప్ర. అ. తథైవ=అట్లే, మహాబాహుః=గొప్ప బాహువులు గల, నిశాచరః=రాక్షసుడైన, దశగ్రీవః చ=రావణుడు కూడ, కార్ముకవిభ్రష్టైః=ధనస్సునుండి జారిన, శరవర్షైః=బాణవర్షములచేత, శక్రమ్=ఇంద్రుణ్ణి, అవాకిరత్=చల్లెను.

# అథ ఏకోనత్రింశః సర్గః

[రావణుడు దేవతల సైన్యమునుండి బైటకు పోవుట. అతని పట్టుకొనుటకై దేవతలు ప్రయత్నించుట. ఇంతలో మేఘనాదుడు మాయా ప్రయోగముచేత ఇంద్రుణ్ణి బంధించి విజయవంతుడై సైన్యముతో లంకకు ప్రయాణ మగుట.]

మూ. తత స్తమసి సంజాతే సర్వే తే దేవరాక్షసాః,
అయుధ్యన్త బలోన్మత్తాః సూదయన్తః పరస్పరమ్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తమసి = చీకటి, సంజాతే = పుట్టినదగుచుండగా, సర్వే = సమస్తమైన, తే = ఆ, దేవరాక్షసాః = దేవతలు, రాక్షసులు, పరస్పరమ్ = పరస్పరమును, సూదయన్తః = నశింపచేసికొనుచు, బలోన్మత్తాః = బలముచేత మదించినవారై, అయుధ్యన్త = యుద్ధముచేసిరి.

తా. చీకటి ఆవరించిన ఆ సమయమునందు దేవతలు, రాక్షసులు బలముచేత ఉన్మత్తులై ఒకరి నొకరు చంపుకొనుచు యుద్ధము చేసిరి. 1

మూ. తతస్తు దేవసైన్యేన రాక్షసానాం బృహద్బలమ్,
దశాంశం స్థాపితం యుద్ధే శేషం నీతం యమక్షయమ్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దేవసైన్యేన = దేవతల సైన్యముచేత, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, బృహత్ = గొప్పదైన, బలమ్ = సైన్యము, దశాంశమ్ = పదవ వంతు మాత్రము, స్థాపితమ్ = ఉంచబడినది. శేషమ్ = మిగిలినది, యుద్ధే = యుద్ధమునందు, యమక్షయమ్ = యమలోకమును, నీతమ్ = పొందించబడినది.

తా. పెద్దదైన రాక్షససైన్యములో దేవతాసైన్యము యుద్ధమునందు పదవ వంతు మాత్రమే మిగిల్చి, మిగిలిన దానినంతనూ నశింపచేసెను. 2

మూ. క్రోధా త్సూతం చ దుర్ధర్షః స్యన్దనస్థమువాచ హ,
పరసైన్యస్య మధ్యేన యావదన్తో నయస్వ మామ్. 6

ప్ర. అ దుర్ధర్షః = ఎదిరింప శక్యముకానివాడైన అతడు, స్యన్దనస్థమ్ = రథమునందున్న, సూతమ్ = సారథిని గూర్చి, క్రోధాత్ = కోపమువలన, ఉవాచ హ = పలికెను. అన్తః యావత్ = (శత్రువుల) అంతము అయ్యే వరకు, మామ్ = నన్ను, పరసైన్యస్య = శత్రుసైన్యముయొక్క, మధ్యేన = మధ్యచేత, నయస్వ = తీసుకొని వెళ్ళుము.

తా. ఎదిరింప శక్యము కాని ఆ రావణుడు రథమునందున్న సారథితో ఇట్లు పలికెను. "శత్రువులు పూర్తిగా నశించేవరకు నన్ను వాళ్ళ మధ్య నుండి తీసుకొని వెళ్ళుము". 6

మూ. అద్యైవ త్రిదశాన్ సర్వాన్ విక్రమైః సమరే స్వయమ్,
నానాశస్త్రమహాసారైర్నయామి యమసాదనమ్. 7

ప్ర. అ. సమరే = యుద్ధమునందు, అద్యైవ = ఇప్పుడే, సర్వాన్ = సమస్తమైన, త్రిదశాన్ = దేవతలను, స్వయమ్ = స్వయముగా, విక్రమైః = పరాక్రమములచేత, నానాశస్త్రమహాసారైః = అనేకవిధములైన ఆయుధముల మహాప్రవాహములచేత, యమసాదనమ్ = యమలోకమును, నయామి = పొందించెదను.

తా. నేను ఇప్పుడే, స్వయముగా, దేవతల నందరినీ పరాక్రమముచేత అనేకవిధములైన ఆయుధములు నిరంతరముగా వర్షించి యమలోకమునకు పంపెదను. 7

మూ. అహమిన్ద్రం వధిష్యామి ధనదం వరుణం యమమ్,
త్రిదశాన్నిహత్యాశు స్వయం స్థాస్యామ్యథోపరి. 8

ప్ర. అ. అహమ్ = నేను, ఇన్ద్రమ్ = ఇంద్రుణ్ణి, ధనదమ్ = కుబేరుణ్ణి, వరుణమ్ = వరుణుణ్ణి, యమమ్ = యముణ్ణి, వధిష్యామి = చంపెదను. త్రిదశాన్ = దేవతలను, ఆశు = శీఘ్రముగా, వినిహత్య = చంపి, స్వయమ్ = తాను, అథ = పిమ్మట, ఉపరి = పైన, స్థాస్యామి = ఉండగలను.

మూ. తస్య తం నిశ్చయం జ్ఞాత్వా శక్రో దేవేశ్వర స్తదా,
రథస్థః సమరస్థ స్తాన్దేవాన్వాక్యమథాబ్రవీత్. 12

ప్ర. అ. తదా = అప్పుడు, దేవేశ్వరః = దేవతలప్రభువైన, శక్రః = ఇంద్రుడు, తస్య = వానియొక్క, తమ్ = ఆ, నిశ్చయమ్ = నిశ్చయమును, జ్ఞాత్వా = తెలిసికొని, సమరస్థః = యుద్ధమునందున్నవాడై, రథస్థః = రథమునందున్నవాడై, అథ = అటుపిమ్మట, దేవాన్ = దేవతలను గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు యుద్ధరంగములో రథమునందున్న దేవేంద్రుడు ఆ రావణుని నిశ్చయమును తెలిసికొని దేవతలతో ఇట్లు పలికెను. 12

మూ. దేవాః శృణుత మద్వాక్యం యత్తావన్మమ రోచతే,
జీవన్నేవ దశగ్రీవః సాధు రక్షో నిగృహ్యతామ్. 13

ప్ర. అ. దేవాః = దేవతలారా ! యత్ = ఏది, మమ = నాకు, రోచతే తావత్ = ఇష్టమగుచున్నదో, అట్టి, మద్వాక్యమ్ = నా వాక్యమును, శృణుత = వినండి. రక్షః = రాక్షసుడైన, దశగ్రీవః = రావణుడు, జీవన్నేవ = జీవించిఉండగానే, సాధు = బాగుగా, నిగృహ్యతామ్ = పట్టుకొనబడుగాక.

తా. దేవతలారా ! నాకు అభిమతమైన మాట చెప్పుచున్నాను. వినండి రావణుణ్ణి బ్రతికి ఉండగానే పట్టుకొనండి. 13

మూ. ఏష హ్యతిబలః సైన్యే రథేన పవనౌజసా,
గమిష్యతి ప్రవృద్ధోర్మిః సముద్ర ఇవ పర్వణి. 14

ప్ర. అ. అతిబలః = గొప్పబలము గల, ఏషః = ఇతడు, పర్వణి = పర్వదివసమునందు, ప్రవృద్ధోర్మిః = వృద్ధి చెందిన తరంగములు గల, సముద్రః ఇవ = సముద్రము వలె, పవనౌజసా = వాయువేగము గల, రథేన = రథేముతో, సైన్యే = సైన్యమునందు, గమిష్యతి = వెళ్ళగలడు.

తా. గొప్ప బలము గల ఇతడు, పర్వదినమునందు సముద్రము తరంగములతో పెరిగి విజృంభించినట్లు విజృంభించి, వాయువేగము వంటి వేగము గల రథముతో మన సైన్యమధ్యమునుండి వెళ్ళనున్నాడు. 14

తా. రామా ! పిమ్మట దేవేంద్రుడు రావణుణ్ణి విడిచి, మరొక ప్రదేశమున వెళ్ళి యుద్ధమునందు రాక్షసులకు భయము కలిగించుచు యుద్ధముచేసెను. 1

మూ. ఉత్తరేణ దశగ్రీవః ప్రవివేశానివర్తకః,
దక్షిణేన తు పార్శ్వేన ప్రవివేశ శతక్రతుః. 1

ప్ర. అ. దశగ్రీవః = రావణుడు, అనివర్తకః = వెనుకకు మరలనివా ఉత్తరేణ = ఉత్తరపార్శ్వముచేత, ప్రవివేశ = ప్రవేశించెను. శతక్రతుః తు = దే ద్రుడైతే, దక్షిణేన = దక్షిణపుదైన, పార్శ్వేన = పార్శ్వముచేత, ప్రవివేశ = ప్ర శించెను.

తా. రావణుడు వెనుకకు మరలకుండా ఉత్తరపార్శ్వమునుండి సైన్యము ప్రవేశించగా దేవేంద్రుడు దక్షిణపార్శ్వమునుండి ప్రవేశించెను.

మూ. తతః స యోజనశతం ప్రవిష్టో రాక్షసాధిపః,
దేవతానాం బలం సర్వం శరవర్షైరవాకిరత్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యోజనశతమ్ = యోజనముల శతము ప్రవిష్టః = ప్రవేశించిన, సః రాక్షసాధిపః = ఆ రావణుడు, సర్వమ్ = సమస్తమై దేవతానామ్ = దేవతలయొక్క, బలమ్ = సైన్యమును, శరవర్షైః = బాణవర్షమ చేత, అవాకిరత్ = చల్లెను.

తా. అప్పుడు నూరు యోజనముల దూరమువరకు సైన్యములోనికి దు కొనిపోయి రావణుడు దేవతాసైన్యముపై బాణవర్షము కురిపించెను.

మూ. తతః శక్రో నిరీక్ష్యాథ ప్రణష్టం తు స్వకం బలమ్,
న్యవర్తయదసంభ్రాన్తః సమావృత్య దశాననమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శక్రః = ఇంద్రుడు, స్వకమ్ = తన సంబ మైన, బలమ్ = సైన్యమును, ప్రణష్టమ్ = నశించినదానినిగా, నిరీక్ష్య = చూ అథ = అటుపిమ్మట, సమావృత్య = తిరిగి వచ్చి, అసంభ్రాన్తః = కంగారు వాడై, దశాననమ్ = రావణుణ్ణి, న్యవర్తయత్ = వెనుకకు మరలింపచేసెను.

మూ. స సర్వా దేవతా స్త్యక్త్వా శక్రమేవాభ్యధావత,
మహేన్ద్రశ్చ మహాతేజా నాపశ్యచ్చ సుతం రిపోః.

ప్ర. అ. సః = అతడు, సర్వాః = సమస్తమైన, దేవతాః = దేవతల
త్యక్త్వా = విడచి, శక్రమేవ = దేవేంద్రుణ్ణి గూర్చియే, అభ్యధావత=పరుగెత్తె
మహాతేజాః= గొప్ప తేజస్సు గల, మహేన్ద్రశ్చ = మహేంద్రుడు, రిపోః=శత్రు
యొక్క, సుతమ్ = కుమారుణ్ణి, నాపశ్యత్ చ = చూడలేదు.

తా. అతడు దేవత లందరినీ విడచి ఇంద్రునిమీదికే పరుగెత్తెను.
మహాతేజఃశాలియైన ఇంద్రునకు అతడు కనబడలేదు.

మూ. విముక్తకవచ స్తత్ర వధ్యమానోఽపి రావణిః,
త్రిదశైః సుమహావీర్యైర్న చకార చ కించన.

ప్ర. అ. తత్ర = అక్కడ, విముక్తకవచః = విడవబడిన కవచము
రావణిః = మేఘనాదుడు, మహావీర్యైః = గొప్ప పరాక్రమము గల, త్రిదశైః
దేవతలచేత, వధ్యమానః అపి=చంపబడుచున్నను, కించన = ఏమీ (భయవ
లేదా అపకారమును) న చకార = చేయలేదు.

తా. కవచము జారిపోయిన మేఘనాదుడు గొప్ప పరాక్రమము గల
తలు కొట్టుచున్నను వారి నేమీ చేయలేదు. లేదా భయపడలేదు.

మూ. స మాతలిం సమాయాన్తం తాడయిత్వా శరోత్తమైః,
మహేన్ద్రం శరవర్షేణ భూయ ఏవాభ్యవాకిరత్.

ప్ర. అ. సః = అతడు, సమాయాన్తమ్ = వచ్చుచున్న, మాతలిమ్
మాతలిని, శరోత్తమైః=శ్రేష్ఠములైన బాణములచేత, తాడయిత్వా=కొట్టి, భూ
ఏవ = మరల, మహేన్ద్రమ్ = మహేంద్రుణ్ణి, శరవర్షేణ = బాణవర్షముచేత,
వాకిరత్ = చల్లెను.

తా. అతడు వచ్చుచున్న మాతలిమీద ఉత్తమములైన బాణములు ప్ర
గించి, మరల దేవేంద్రునిమీద శరవర్షము కురిపించెను.

మూ. తత స్త్యక్త్వా రథం శక్రో విససర్జ చ సారథిమ్,
ఐరావతం సమారుహ్య మృగయామాస రావణిమ్.

మూ. తం తు దృష్ట్వా బలాత్తేన నీయమానం మహార
మహేన్ద్రమమరాః సర్వే కిం ను స్యాదిత్యచిన్త

ప్ర. అ. తేన = వానిచేత, మహారణాత్ = మహాయు
బలాత్ = బలాత్కారముగా, నీయమానమ్ = తీసికొనివెళ్ల
తమ్ = ఆ, మహేన్ద్రమ్ = మహేంద్రుణ్ణి, దృష్ట్వా = చూచి, సర్వే =
అమరాః = దేవతలు, కిం ను స్యాత్ ఇతి = ఏమి అగునో కదా అని, అచి
ఆలోచించిరి.

తా. ఆ యుద్ధరంగమునుండి మేఘనాదుడు మహేంద్రుణ్ణి బలాత
తీసికొనిపోవుటను చూచి దేవతలు "ఏ మగునో కదా?"అని అనుకొనిరి.

మూ. దృశ్యతే న స మాయావీ శక్రజిత్సమితింజయః,
విద్యావానపి యేనేన్ద్రో మాయయాపహృతో బల

ప్ర. అ. సమితింజయః=యుద్ధమునందు జయించు, మాయావీ=
యైన, సః శక్రజిత్ = ఆ ఇంద్రజిత్తు, న దృశ్యతే = కనబడుటలేదు.
ఎవనిచేత, విద్యావానపి = విద్యకలవాడైనను, ఇన్ద్రః = ఇంద్రుడు,
బలాత్కారముగా, అపహృతః = అపహరించబడినాడో.

తా. "అసురుల మాయలను జయించు విద్యలు ఉన్న ఇంద్రుణ్ణి
త్కారముగా తీసికొనిపోయిన, మాయావి, యుద్ధములలో జయము పొ
అయిన ఇంద్రజిత్తు కనబడుటలేదు"అని అనుకొనిరి.

మూ. ఏతస్మిన్నన్తరే క్రుద్ధాః సర్వే సురగణాస్తదా,
రావణం విముఖీకృత్య శరవర్షైరవాకిరన్.

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అంతరే = మధ్యకాలమునందు,
కోపించిన, సర్వే = సమస్తమైన, సురగణాః=దేవతాగణములు, తదా =
రావణమ్=రావణుణ్ణి, విముఖీకృత్య = విముఖునిగా చేసి, శరవర్షైః=బా
చేత, అవాకిరన్ = చల్లిరి.

తా. ఇంతలో దేవతాగణము లన్నీ కోపించి, అప్పుడు రావణుణ్ణి
నుండి విముఖు డగు నట్లు చేసి బాణవర్షములు కురిపించినవి.

మూ. అయం హి సురసైన్యస్య త్రైలోక్యస్య చ యః ప్ర
స గృహీతో దేవ బలాద్భగ్నదర్పాః సురాః కృతాః

ప్ర. అ. యః = ఎవడు, సురసైన్యస్య = సురులసైన్యమునకు, త్రై
చ = మూడు లోకములకు, ప్రభుః = ప్రభువో, సః = అట్టి, అయమ్
ఇంద్రుడు, దేవబలాత్ = పరమేశ్వరుని బలమువలన, గృహీతః = పట్టు
నాడు. సురాః = దేవతలు, భగ్నదర్పాః = భగ్నమైన దర్పము కలః
కృతాః = చేయబడినారు.

తా. దేవతాసైన్యమునకు, మూడు లోకాలకూ ప్రభువైన ఈ దేవే
పరమేశ్వరునివలన లభించిన బలముచేత బంధించినాను. దేవతల దర
భగ్నము చేసినాను.

మూ. యథేష్టం భుఙ్క్ష్వ లోకాంస్త్రీన్నిగృహ్యారాతిమోజసా,
వృథా కిం తే శ్రమేణేహ యుద్ధమద్య తు నిష్ఫలమ్

ప్ర. అ. అరాతిమ్ = శత్రువును, ఓజసా = తేజస్సుచేత, నిగృ
నిగ్రహించి, యథేష్టమ్ = ఇష్టమువచ్చినట్లు, త్రీన్ = మూడు, లోకాన్ =
లను, భుఙ్క్ష్వ = అనుభవింపుము. ఇహ = ఇక్కడ, వృథా = వ్యర్థముగా
నీయొక్క, శ్రమేణ = శ్రమచేత, కిమ్ = ఏమిప్రయోజనము ? అద్య = ఇ
యుద్ధం తు = యుద్ధమైతే, నిష్ఫలమ్ = వ్యర్థము.

తా. నీ శత్రువును తేజస్సుచేత నిగ్రహించి మూడు లోకాలను
వచ్చినట్లు అనుభవించుము. ఇప్పు డిక్కడ వ్యర్థమైన ఈ శ్రమ నీ కె
ఇప్పుడు యుద్ధమువలన ప్రయోజనము లేదు.

మూ. తతస్తే దేవతగణా నివృత్తా రణకర్మణః,
తచ్ఛ్రుత్వా రావణేర్వాక్యం శక్రహీనాః సురా గతా

ప్ర. అ. రావణేః = రావణపుత్రునియొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక
శ్రుత్వా = విని, దేవతగణాః = దేవతాగణములు, రణకర్మణః = యుద్ధకర్మ
నివృత్తాః = మరలిరి. సురాః = దేవతలు, శక్రహీనాః = ఇంద్రునితో శూన్యులై,

తగిన పరాక్రమములచేత నీవు నా వంశమును, కులమును వృద్ధి పొందించ
ఎందువలన అనగా నీవు సాటి లేని బలము గల ఈ ఇంద్రుణ్ణి, దేవ
జయించినావు.

మూ. నయ రథమధిరోప్య వాసవం
నగరమితో వ్రజ సేనయా వృత స్త్వమ్,
అహమపి తవ పృష్ఠతో ద్రుతం
సహ సచివై రనుయామి హృష్టవత్.

ప్ర. అ. వాసవమ్ = ఇంద్రుణ్ణి, రథమ్ = రథమును, అధిరోప్య = ఎక్కి
నయ = తీసికొనివెళ్లుము. త్వమ్ = నీవు, సేనయా = సేనతో, వృతః =
వాడవై, ఇతః = ఇక్కడినుండి, నగరమ్ = నగరమును గూర్చి, వ్రజ = వె
అహమపి = నేను కూడ, సచివైః సమమ్ = మంత్రులతో కూడ, హృష్టవ
సంతోషముగా, ద్రుతమ్ = శీఘ్రముగా, తవ = నీయొక్క, పృష్ఠతః = వె
అనుయామి = అనుసరించి వచ్చుచున్నాను.

తా. నీవు దేవేంద్రుణ్ణి రథమునందు ఎక్కించుకొని సేనాసమే
ఇక్కడినుండి నగరమునకు నడుపుము. నేను కూడా సంతోషపూర్వక
మంత్రులతో కలిసి వెంటనే నీ వెనుకనే వచ్చుచున్నాను.

మూ. అథ స బలవృతః సవాహన-
స్త్రిదశపతిం పరిగృహ్య రావణిః,
స్వభవనమధిగమ్య వీర్యవాన్
కృతసమరాన్ విససర్జ రాక్షసాన్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, వీర్యవాన్ = పరాక్రమవంతుడై న,
రావణిః = ఇంద్రజిత్తు, త్రిదశపతిమ్ = ఇంద్రుణ్ణి, పరిగృహ్య = గ్ర
బలవృతః = సైన్యముతో కూడినవాడై, సవాహనః = వాహనములతో కూడి

# అథ త్రింశః సర్గః

*[బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు వరము ఇచ్చి ఇంద్రుణ్ణి బంధన నుండి విడిపించుట. ఇంద్రుడు పూర్వము చేసిన పాపకృత్యము అతనికి గుర్తుచేసి వైష్ణవ యాగము చేయుటకు సంమతి ఇచ్చుట. య మును పూర్తిచేసి ఇంద్రుడు స్వర్గమునకు వెళ్లుట.]*

మూ. జితే మహేన్ద్రేఽతిబలే రావణస్య సుతేన వై,
ప్రజాపతిం పురస్కృత్య యయుర్లఙ్కాం సురాస్తదా.

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, సుతేన = కుమారునిచేత, అతిః = గొప్ప బలముగల, మహేన్ద్రే = మహేంద్రుడు, జితే = జయించబడినవాడ చుండగా, తదా = అప్పుడు, సురాః = దేవతలు, ప్రజాపతిమ్ = బ్రహ్మదేవు పురస్కృత్య = ముందు ఉంచుకొని, లఙ్కామ్ = లంకను గూర్చి, యయుః = వెళ్ళి

తా. అప్పుడు గొప్ప బలము గల దేవేంద్రుడు ఇంద్రజిత్తు చేత జయిం బడిన పిమ్మట దేవతలు బ్రహ్మదేవుణ్ణి ముందు ఉంచుకొని లంకకు వెళ్ళిరి.

మూ. తత్ర రావణమాసాద్య పుత్రభ్రాతృభిరావృతమ్,
అబ్రవీద్గగనే తిష్ఠన్ సామపూర్వం ప్రజాపతిః.

ప్ర. అ. ప్రజాపతిః = బ్రహ్మదేవుడు, తత్ర = అక్కడ, పుత్రభ్రాతృభిః పుత్రులచేత సోదరులచేత, ఆవృతమ్ = చుట్టబడిన, రావణమ్ = రావణు ఆసాద్య = సమీపించి, గగనే = ఆకాశమునందు, తిష్ఠన్ = నిలచినవాడై, సా పూర్వమ్ = బ్రతిమాలుట పూర్వమునందు కలుగునట్లు, అబ్రవీత్ = పలికెను.

తా. బ్రహ్మదేవుడు అక్కడ పుత్రులతోను సోదరులతోను కలిసి ఉన రావణునివద్దకు వెళ్ళి, ఆకాశమునందు నిలచి, సామపూర్వకముగా ఇ చెప్పెను.

తా. రావణా! అతిబలవంతుడు, వీర్యవంతుడు అయిన ఈ నీ కుమారుడు జగత్తులో "ఇంద్రజిత్తు" అని ప్రసిద్ధి పొందగలడు.

మూ. బలవాన్ దుర్జయ శ్చైవ భవిష్యత్యేవ రాక్షసః,
యం సమాశ్రిత్య తే రాజన్ స్థాపితాస్త్రిదశా వశే.

ప్ర. అ. యమ్=ఎవనిని, సమాశ్రిత్య=ఆశ్రయించి, త్రిదశాః=దేవత తే = నీయొక్క, వశే = వశమునందు, స్థాపితాః = ఉంచుకొనబడినారో అ రాక్షసః = ఈ రాక్షసుడు, బలవాన్ = బలవంతుడు, దుర్జయః చైవ = జయి శక్యము కానివాడు, భవిష్యత్యేవ = అగును.

తా. ఎవని సహాయముచేత నీవు దేవతలను వశములో ఉంచుకొంటి అట్టి ఈ రాక్షసుడు తప్పక మహాబలవంతుడుగాను, జయింప శక్యము కానివా గాను ఉండగలడు.

మూ. తన్ముచ్యతాం మహాబాహో మహేన్ద్రః పాకశాసనః,
కిం చాస్య మోక్షణార్థాయ ప్రయచ్ఛన్తు దివౌకసః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా, తత్ = ఆకారణ వలన, పాకశాసనః = పాకాసురునకు శాసకుడైన, మహేన్ద్రః = మహేంద్రు ముచ్యతామ్ = విడవబడుగాక. అస్య = ఈతనియొక్క, మోక్షణాయ = విడ కొరకు, దివౌకసః = దేవతలు, కిం చ = ఏమి, ప్రయచ్ఛన్తు = ఇవ్వవలెను.

తా. మహాబాహూ ! అందువలన పాకశాసనుడైన మహేంద్రుణ్ణి వి పెట్టుము. ఇతనిని విడిచిపెట్టినందుకు దేవతలు ఏమి ఇవ్వవలెను ?

మూ. అథాబ్రవీన్మహాతేజా ఇన్ద్రజిత్సమితింజయః,
అమరత్వమహం దేవ వృణే యద్యేష ముచ్యతే.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, సమి జయః = యుద్ధమును జయించు, ఇన్ద్రజిత్ = ఇంద్రజిత్తు, అబ్రవీత్ = పలి దేవ=దేవా! ఏషః=ఇతడు, ముచ్యతే యది=విడువబడినట్లయితే అహమ్=న అమరత్వమ్ = మరణము లేకుండుటను, వృణే = కోరుచున్నాను.

తా. అప్పుడు మహాతేజఃశాలీ, యుద్ధములలో జయించువాడూ అ

నెను - "ఈ భూలోకములో ఏ ప్రాణికీ కూడ ఎన్నటికీ మరణము లేకపోవుట అనేది లేదు కదా ?" 11

మూ. పక్షిణశ్చతుష్పదో వా భూతానాం వా మహౌజసామ్,
శ్రుత్వా పితామహే నోక్తమిన్ద్రజిత్ప్రభుణావ్యయమ్, 12
అథాబ్రవీత్స తత్రస్థం మేఘనాదో మహాబలః.

ప్ర. అ. పక్షిణః = పక్షికి గాని, చతుష్పదో వా = చతుష్పాజ్జంతువుక గాని, మహౌజసామ్ = గొప్ప తేజస్సు గల, భూతానాం వా = భూతములకు గాని (అమరత్వము లేదు). ఇన్ద్రజిత్ = ఇంద్రుణ్ణి జయించిన, మహాబలః = గొప్ప బలము గల, సః = ఆ, మేఘనాదః = మేఘనాదుడు, ప్రభుణా = ప్రభువైన పితామహేన = పితామహునిచేత, ఉక్తమ్ = పలకబడిన వాక్యమును, శ్రుత్వా = విని, అథ = అటుపిమ్మట, తత్రస్థమ్ = అక్కడ ఉన్న, అవ్యయమ్ = నా రహితుడైన ఆ బ్రహ్మదేవుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. "పక్షులకు గాని, చతుష్పాజ్జంతువులకు గాని, గొప్పతేజస్సు గల ఇతర భూతములకు గాని అమరత్వము లేదు". అప్పుడు ఇంద్రుణ్ణి జయించిన మహాబలశాలియైన మేఘనాదుడు, బ్రహ్మదేవుడు పలికిన ఆ మాటలు విని అక్క డనే ఉన్న వినాశరహితుడైన ఆ బ్రహ్మదేవునితో ఇట్లనెను. 1

మూ. శ్రూయతాం వా భవేత్సిద్ధిః శతక్రతువిమోక్షణే, 1
మమేష్టం నిత్యశో హవ్యైర్మన్త్రైః సంపూజ్య పావకమ్
సజ్గ్రామమవతర్తుం చ శత్రునిర్జయకాజ్క్షిణః, 1
అశ్వయుక్తో రథో మహ్యముత్తిష్ఠేత్తు విభావసోః.

ప్ర. అ. వా = లేక, శతక్రతువిమోక్షణే = ఇంద్రునియొక్క విడిపించుట యందు, సిద్ధిః = సిద్ధి, శ్రూయతామ్ = వినబడుగాక. మమ = నాయొక్క, ఇష్టమ్ = ఇష్టము (వినబడుగాక). శత్రునిర్జయకాజ్క్షిణః = శత్రువుల జయమును కోరుచున్న మమ = నాకు, నిత్యశః = ఎల్లప్పుడు, హవ్యైః = హవ్యములచేత, మన్త్రైః = మంత్రములచేత, పావకమ్ = అగ్నిని, సంపూజ్య = పూజించి, సజ్గ్రామమ్ = యుద్ధమును, అవతర్తుమ్ = ప్రవేశించుటకు, మహ్యమ్ = నాకొరకు, విభావసోః =

తా. దేవా ! ప్రతీ పురుషుడూ తపస్సు చేసి అమరత్వమును వరముగా కోరునుకదా ? నేనుమాత్రము నా పరాక్రమము చూపి అమరత్వమును సంపాదించ కోరుచున్నాను. 17

మూ. ఏవమస్త్వితి తం చాహ వాక్యం దేవః పితామహః,
ముక్తశ్చేన్ద్రజితా శక్రో గతాశ్చ త్రిదివం సురాః. 18

ప్ర. అ. దేవః = దేవుడైన, పితామహః = పితామహుడు, ఏవమ్ = ఇట్లే అస్తు = అగుగాక, ఇతి = అని, వాక్యమ్ = వాక్యమును, ఆహ = పలికెను. శక్రః = ఇంద్రుడు, ఇన్ద్రజితా = ఇంద్రజిత్తుచేత, ముక్తః = విడవబడినాడు. సురాశ్చ = దేవతలు కూడ, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, గతాః = వెళ్ళినారు.

తా. బ్రహ్మదేవుడు "అట్లే అగుగాక" అని పలికెను. ఇంద్రజిత్తు ఇంద్రుని విడచిపెట్టగా దేవత లందరు స్వర్గానికి వెళ్ళిరి. 1

మూ. ఏతస్మిన్నన్తరే రామ దీనో భ్రష్టామరద్యుతిః,
ఇన్ద్రశ్చిన్తాపరీతాత్మా ధ్యానతత్పరతాం గతః. 1

ప్ర. అ. రామ = రామా ! ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యకాలమునందు దీనః = దీనుడు, భ్రష్టామరద్యుతిః = భ్రష్టమైన దేవతాతేజస్సు కలవాడు అయి ఇన్ద్రః = ఇంద్రుడు. చిన్తాపరీతాత్మా = చింతతో కూడిన మనస్సు కలవాడై ధ్యానతత్పరతామ్ = ఆలోచనలో మునిగిపోవుటను, గతః = పొందినాడు.

తా. రామా! ఇంతలో ఇంద్రుడు దేవతల కుండవలసిన కాంతి తొలగి పోవుటచేత దీనుడై, చింతాక్రాంతుడై ఏదో ఆలోచనలో మునిగి ఉండెను.

మూ. తం తు దృష్ట్వా తథాభూతం ప్రాహ దేవః పితామహః
శతక్రతో కిము పురా కరోతి స్మ సుదుష్కృతమ్. 2

ప్ర. అ. తథాభూతమ్ = అట్లు ఉన్న, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి దేవః = ప్రభువైన, పితామహః = పితామహుడు, ప్రాహ = పలికెను. శతక్రతో దేవేంద్రా! పురా = పూర్వము, సుదుష్కృతమ్ = చాల చెడ్డ పనిని, కిము కరోతి స్మ = ఎందుకు చేసితివి ?

తా. నేను అప్పుడు ప్రజల ప్రతి అవయవమునందు ఏది యేది శ్రేష్ఠముగా ఉండునో దానిని తీసి వాటితో, ప్రజలలో విశేషముగా ఉండుటకై ఒక స్త్రీని నిర్మించితిని. 23

మూ. తతో మయా రూపగుణైరహల్యా స్త్రీ వినిర్మితా,
హలం నామేతి వైరూప్యం హల్యం తత్ప్రభవం భవేత్.

యస్యా న విద్యతే హల్యం తేనాహల్యేతి విశ్రుతా,
అహల్యేత్యేవ చ మయా తస్యా నామ ప్రకీర్తితమ్. 25

ప్ర. అ. తతః = పిమ్మట, మయా = నాచేత, రూపగుణైః = రూపముతోను, గుణములతోను, అహల్యా = అహల్య అయిన, స్త్రీ = స్త్రీ. వినిర్మితా = నిర్మించబడినది. హలం నామ = హలము అనగా, ఇహ = ఇక్కడ, వైరూప్యమ్ = విరూపముగా ఉండుట. తత్ప్రభవమ్ = ఆ హలమువలన (విరూపత్వమువలన) పుట్టినది, హల్యమ్ = హల్యముగా, భవేత్ = అగును. యస్యాః = ఏ స్త్రీకి, హల్యమ్ = హల్యము, న విద్యతే = లేదో ఆమె, తేన = ఆ కారణముచేత, అహల్యేతి = అహల్య అని, విశ్రుతా = ప్రసిద్ధి కెక్కినది. తస్యాః = ఆమెయొక్క, నామ = పేరు, మయా = నాచేత, అహల్యేత్యేవ = అహల్య అనియే, ప్రకీర్తితమ్ = చెప్పబడినది.

తా. అప్పుడు నేను రూపముతోను, గుణములతోను అహల్య అయిన స్త్రీని సృష్టించితిని. "హలము" అనగా రూపములో వికారము. అట్టి వికారమువలన కలిగినది హల్యము. అట్టి హల్యము లేని దానికి 'అహల్య' అని ప్రసిద్ధి. నేను ఆ స్త్రీకి కూడ 'అహల్య' అనియే పేరు పెట్టితిని. 24, 25

మూ. నిర్మితాయాం చ దేవేన్ద్ర తస్యాం నార్యాం సురర్షభ,
భవిష్యతీతి కస్యైషా మమ చిన్తా తతోఽభవత్. 26

ప్ర. అ. సురర్షభ = దేవతలలో శ్రేష్ఠుడా ! దేవేన్ద్ర = దేవేంద్రా! తస్యాం నార్యామ్ = ఆ స్త్రీ, నిర్మితాయామ్ = నిర్మించబడిన దగుచుండగా, తతః = అటు పిమ్మట, ఏషా = ఈమె, కస్య = ఎవనిది, భవిష్యతి = కాగలదు, ఇతి = అని, మమ = నాకు, చిన్తా = చింత, అభవత్ = ఆయెను.

తా. అప్పుడు ఆ మహామునిలో ఉన్న గొప్ప మానసికస్థైర్యమును చూచి, ఆతని తపఃసిద్ధిని కూడ గుర్తించి ఆమెను ఆతనికి భార్యనుగా ఇచ్చితిని. 29

మూ. స తయా సహ ధర్మాత్మా రమతే స్మ మహామతిః,
ఆసన్నిరాశా దేవాస్తు గౌతమే దత్తయా తయా. 30

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల, సః = ఆ, ధర్మాత్మా = ధర్మాత్ముడు, తయా సహ = ఆమెతో కూడ, రమతే = క్రీడించుచున్నాడు. గౌతమే = గౌతమునియందు, దత్తయా = ఇవ్వబడిన, తయా = ఆమెచేత, దేవాస్తు = దేవతలైతే, నిరాశాః = నిరాశులు, ఆసన్ = అయిరి.

తా. గొప్ప బుద్ధి గల, ధర్మాత్ముడైన ఆ గౌతముడు ఆమెతో ఆనందించుచుండెను. ఆమెను గౌతమునకు ఇచ్చివేయుటచేత దేవతలు నిరాశు లయిరి. 30

మూ. త్వం క్రుద్ధస్త్విహ కామాత్మా గత్వా తస్యాశ్రమం మునేః,
దృష్టవాంశ్చ తదా తాం స్త్రీం దీప్తామగ్నిశిఖామివ. 31

ప్ర. అ. కామాత్మా = కామస్వభావుడవైన, త్వం తు = నీవైతే, ఇహ = ఇక్కడ, క్రుద్ధః = కోపించినవాడవై, తస్య మునేః = ఆ మునీశ్వరునియొక్క ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, గత్వా = వెళ్ళి, తదా = అప్పుడు, దీప్తామ్ = మండుచున్న, అగ్నిశిఖామ్ ఇవ = అగ్నిశిఖ వలె ఉన్న, తాం స్త్రీమ్ = ఆ స్త్రీని దృష్టవాన్ చ = చూచినావు.

తా. కామముతో కూడిన మనస్సు గల నీవు కోపించి ఆ మునీశ్వరుని ఆశ్రమమునకు వెళ్ళి అప్పుడు మండుచున్న అగ్నిజ్వాల వలె ఉన్న ఆ అహల్యను చూచితివి. 31

మూ. సా త్వయా ధర్షితా తత్ర కామార్తేన సమన్యునా,
దృష్టస్త్వం స తదా తేన ఆశ్రమే పరమర్షిణా. 32

ప్ర. అ. కామార్తేన = కామపీడితుడవైన, సమన్యునా = కోపముతో కూడిన, త్వయా = నీచేత, సా = ఆమె, తత్ర = అక్కడ, ధర్షితా = ధర్షింపబడినది. తదా = అప్పుడు, సః త్వమ్ = అట్టి నీవు, ఆశ్రమే = ఆశ్రమమునందు తేన పరమర్షిణా = ఆ మహర్షిచేత, దృష్టః = చూడబడితివి.

తా. "ఓ ! దుర్బుద్ధీ! నీవు ఇక్కడ ప్రారంభించిన చెడు ప్రవర్తన ఇతర మనుష్యులలో కూడ పుట్టగలదు, సందేహము లేదు " 35

మూ. తత్రార్ధం తస్య యః కర్తా త్వయ్యర్ధం నిపతిష్యతి,
న చ తే స్థావరం స్థానం భవిష్యతి న సంశయః. 36

ప్ర. అ. తస్య = ఆ చెడ్డ పనికి, కర్తా = కర్త, యః = ఎవడో, తత్ర = వానియందు, అర్ధమ్ = సగము, త్వయి = నీయందు, అర్ధమ్ = సగము, నిపతిష్యతి = పడగలదు. తే = నీ యొక్క, స్థానమ్ = స్థానము, స్థావరమ్ = స్థిరము, న భవిష్యతి = కాదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. "ఇతర మానవులు ఇట్టి చెడ్డ పని చేసినప్పుడు చేసినవానికి సగము పాపము, నీకు సగము పాపము చెందుచుండును. నీ ఇంద్రపదవి స్థిరముగా ఉండదు, సందేహము లేదు." 36

మూ. యశ్చ యశ్చ సురేన్ద్రః స్యా ద్ధ్రువః స న భవిష్యతి,
ఏష శాపో మయా ముక్త ఇత్యసౌ త్వాం తదాబ్రవీత్. 37

ప్ర. అ. యః చ యః చ = ఎవ డెవడు, సురేన్ద్రః = ఇంద్రుడు, స్యాత్ = అగునో, సః = అతడు, ధ్రువః = స్థిరుడు, న భవిష్యతి = కాడు, ఏషః = ఈ, శాపః = శాపము, మయా = నాచేత, ముక్తః = ఇవ్వబడినది, ఇతి = అని, అసౌ = ఇతడు, తదా = అప్పుడు, త్వామ్ = నిన్ను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. "ఎవ్వడెవడు ఇంద్రపదవి అధిష్ఠించునో అతడు ఆ పదవిలో స్థిరముగా ఉండడు. నేను నీకు ఈ శాపమిచ్చుచున్నాను'' అని ఆతడప్పుడు నీతో అనెను.37

మూ. తాం తు భార్యాం సునిర్భర్త్స్య సోఽబ్రవీత్సుమహాతపాః,
దుర్వినీతే వినిధ్వంస మమాశ్రమసమీపతః. 38

ప్ర. అ. సుమహాతపాః = చాల గొప్ప తపస్సుగల, సః = అతడు, తామ్ = ఆ, భార్యామ్ = భార్యను, సునిర్భర్త్స్య = బాగా నిందించి, అబ్రవీత్ = పలికెను. దుర్వినీతే = చెడ్డ నడవడిక గలదానా ! మమ = నాయొక్క, ఆశ్రమసమీపతః = ఆశ్రమసమీపమునుండి, వినిధ్వంస = దూరముగా తొలగుము.

అప్పుడు, సా = ఆమె, మహర్షిమ్=మహర్షియైన, తం గౌతమమ్=ఆ గౌతముణ్ణి, ప్రసాదయామాస = అనుగ్రహింపచేసుకొనెను.

తా. అది మొదలు ప్రజలు చాలవరకు రూపసంపన్నులు అయిరి. అప్పుడు ఆ అహల్య ఆ గౌతమమహామునిని అనుగ్రహింపచేసికొనెను. 41

మూ. అజ్ఞానాద్ధర్షితా విప్ర త్వద్రూపేణ దివౌకసా,
న కామకారాద్విప్రర్షే ప్రసాదం కర్తుమర్హసి. 42

ప్ర. అ. విప్ర = బ్రాహ్మణుడా ! త్వద్రూపేణ = నీ రూపము గల, దివౌకసా = సురునిచేత, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, ధర్షితా = అవమానించబడితిని. కామకారాత్ = కోరి చేయుట వలన, న = కాదు. విప్రర్షే = బ్రహ్మర్షీ! ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. ఓ ! బ్రహ్మర్షీ! ఇంద్రుడు నీ రూపము ధరించి వచ్చి నాకు తెలియక పోవుటచే నన్ను అపమానించినాడు. ఇది నాకు తెలిసి జరగలేదు. అందుచేత అనుగ్రహించుము. 42

మూ. అహల్యయా త్వేవముక్తః ప్రత్యువాచ స గౌతమః,
ఉత్పత్స్యతి మహాతేజా ఇక్ష్వాకూణాం మహారథః. 43

రామో నామ శ్రుతో లోకే వనం చాప్యుపయాస్యతి,
బ్రాహ్మణార్థే మహాబాహుర్విష్ణుర్మానుషవిగ్రహః. 44

ప్ర. అ. అహల్యయా = అహల్యచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, సః గౌతమః = ఆ గౌతముడు, ప్రత్యువాచ = తిరిగి పలికెను. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశరాజులలో, మహాతేజాః = గొప్ప తేజస్సుగల, మహారథః = మహారథుడు, ఉత్పత్స్యతి = పుట్టగలడు. రామో నామ = రాముడు అను పేరు గలవాడుగా, లోకే = లోకమునందు, శ్రుతః = ప్రసిద్ధుడైన, మానుషవిగ్రహః = మనుష్యశరీరము గల, విష్ణుః=విష్ణువైన, మహాబాహుః=గొప్ప బాహువులు గల అతడు, బ్రాహ్మణార్థే = బ్రాహ్మణుని నిమిత్తమై, వనమ్= వనమును, ఉపయాస్యతి = పొందగలడు.

తా. ఆ బ్రహ్మర్షి ఇట్లు పలికి తన ఆశ్రమమునకు వెళ్ళిపోయెను. వేదవేత్తయైన ఆ గౌతముని భార్యయైన ఆ అహల్య చాల గొప్ప తపస్సు చేసెను. 47

మూ. శాపోత్సర్గాద్ధి తస్యేదం మునేః సర్వముపస్థితమ్,
తత్స్మర త్వం మహాబాహో దుష్కృతం యత్త్వయా కృతమ్,

ప్ర. అ. తస్య మునేః = ఆ మునీశ్వరునియొక్క, శాపోత్సర్గాత్ = శాపము ఇచ్చుటవలననే, ఇదమ్ = ఇది, సర్వమ్ = అంతా, ఉపస్థితమ్ = వచ్చినది. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా, యత్ = ఏ, దుష్కృతమ్ = దుష్ట కార్యము, త్వయా = నీ చేత, కృతమ్ = చేయబడినదో, తత్ = దానిని, స్మర = స్మరించుము.

తా. ఆ ముని శాపము ఇచ్చుటచేతనే నీకు ఈ ఆపద వచ్చి పడినది. ఓ! మహాబాహూ! నీవు పూర్వము చేసిన దుష్టకార్యమును గుర్తుకు తెచ్చుకొనుము. 48

మూ. తేన త్వం గ్రహణం శత్రోర్యాతో నాన్యేన వాసవ,
శీఘ్రం వై యజ యజ్ఞం త్వం వైష్ణవం సుసమాహితః.

ప్ర. అ. వాసవ = దేవేంద్రా! త్వమ్ = నీవు, తేన = ఆ దుష్కార్యముచేతనే, శత్రోః = శత్రువుయొక్క, గ్రహణమ్ = గ్రహణమును, యాతః = పొందినావు. అన్యేన = మరియొక కారణముచేత, న = కాదు. త్వమ్ = నీవు, సమాహితః = సావధానచిత్తుడవై, శీఘ్రమ్ = శీఘ్రముగా, వైష్ణవమ్ = విష్ణుదేవతాకమైన, యజ్ఞమ్ = యజ్ఞమును, యజ = యజించుము.

తా. ఇంద్రా! నీవు ఆ పాపము మూలముననే శత్రువుచేత బంధింపబడినావు. సావధానచిత్తుడవై వెంటనే వైష్ణవయజ్ఞమును (విష్ణుప్రీతికరమైన యజ్ఞమును) చేయుము. 49

మూ. పావితస్తేన యజ్ఞేన యాస్యసే త్రిదివం తతః,
పుత్రశ్చ తవ దేవేన్ద్ర న వినష్టో మహారణే. 50
నీతః సంనిహితశ్చైవ ఆర్యకేణ మహోదధౌ.

ప్ర. అ. తేన యజ్ఞేన = ఆ యజ్ఞము చేత, పావితః = పవిత్రింపబడినవాడవై,

ప్ర. అ. తదా = అప్పుడు, అగస్త్యవచనమ్ = అగస్త్యుని వచనమును, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, రామశ్చ = రాముడు, ఆశ్చర్యమ్ ఇతి = ఆశ్చర్యముఅని, అబ్రవీత్ = పలికెను. లక్ష్మణః చ = లక్ష్మణుడు, వానరాః చ = వానరులు, రాక్షసాః చ = రాక్షసులూ కూడ ఆశ్చర్యము అని పలికిరి.

తా. అగస్త్యుని వచనమును విని రాముడు, లక్ష్మణుడు, వానరులు, రాక్షసులూ కూడ "ఎంత ఆశ్చర్యము !" అని పలికిరి. 53

మూ. విభీషణస్తు రామస్య పార్శ్వస్థో వాక్యమబ్రవీత్. 54
ఆశ్చర్యం స్మారితోఽస్మ్యద్య యత్తద్దృష్టం పురాతనమ్.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, పార్శ్వస్థః = పార్శ్వమునందున్న, విభీషణః తు = విభీషణుడైతే, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. యత్ = ఏది, దృష్టమ్ = చూడబడినదో, పురాతనమ్ = ప్రాచీనమైన, తత్ = ఆ, ఆశ్చర్యమ్ = ఆశ్చర్యమును గూర్చి, అద్య = ఇప్పుడు, స్మారితః = స్మరింపచేయబడినవాడను, అస్మి = అయిఉన్నాను.

తా. రాముని ప్రక్కనే కూర్చొని ఉన్న విభీషణుడు - "పూర్వ మెన్నడో నేను చూచిన ఆశ్చర్యకరమైన విషయము నా కిపుడు జ్ఞాపకము చేయబడినది" అని పలికెను. 54

మూ. అగస్త్యం త్వబ్రవీద్రామః సత్యమేతచ్ఛ్రుతం చ మే. 55
ఏవం రామ సముద్భూతో రావణో లోకకణ్టకః,
సపుత్రో యేన సఙ్గ్రామే జితః శక్రః సురేశ్వరః. 56

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రింశః సర్గః.

ప్ర. అ. రామః = రాముడు, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఏతత్ = ఇది, సత్యమ్ = సత్యము. మే = నాకు, శ్రుతం చ = వినబడినది. రామ = రామా! యేన = ఎవనిచేత, సఙ్గ్రామే = యుద్ధమునందు, సపుత్రః = పుత్రసహితుడైన, సురేశ్వరః = దేవతలప్రభువైన, శక్రః = దేవేంద్రుడు, జితః =

# అథ ఏకత్రింశః సర్గః

*[రావణుడు మాహిష్మతికి వెళ్ళుట, అక్కడ కార్తవీర్యార్జునుని కానక మంత్రులతో కలిసి వింధ్యగిరిప్రాంతమునం దున్న నర్మదా నదిలో స్నానముచేసి శివుణ్ణి ఆరాధించుట].*

మూ. తతో రామో మహాతేజా విస్మయాత్ పునరేవ హి,
ఉవాచ ప్రణతో వాక్యమగస్త్యమృషిసత్తమమ్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, **మహాతేజాః** = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, ప్రణతః = నమస్కరించుచున్నవాడై, ఋషిసత్తమమ్ = ఋషులలో శ్రేష్ఠుడైన, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి గూర్చి, విస్మయాత్ = ఆశ్చర్యమువలన, **పునరేవ హి** = మరల, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

**తా.** అప్పుడు మహాతేజఃశాలియైన రాముడు నమస్కరించుచు, ఋషులలో శ్రేష్ఠుడైన అగస్త్యునితో ఆశ్చర్యపూర్వకముగ మరల ఇట్లు పలికెను. 1

**మూ.** భగవన్ రాక్షసః క్రూరో యదాప్రభృతి మేదినీమ్,
పర్యటత్కిం తదా లోకాః శూన్యా ఆసన్ ద్విజోత్తమ. 2

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! ద్విజోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుడా ! క్రూరః = క్రూరుడైన, రాక్షసః = రావణుడు, యదా ప్రభృతి = ఎప్పుడు మొదలు, **మేదినీమ్** = భూమిని, పర్యటత్ = పర్యటించెనో, తదా = అప్పుడు, లోకాః = **లోకములు**, శూన్యాః = శూన్యములుగా, ఆసన్ కిమ్ = ఉండినవా ?

**తా.** పూజ్యుడవైన ఓ! బ్రాహ్మణ శ్రేష్ఠుడా ! క్రూరుడైన రావణుడు సంచరించు కాలమునందు లోకములలో ఎవరూ శూరులే లేకపోయిరా ? 2

**మూ.** రాజా వా రాజమాత్రో వా కిం తదా నాత్ర కశ్చన,
ధర్షణం యత్ర న ప్రాప్తో రావణో రాక్షసేశ్వరః. 3

ప్ర. అ. పృథివీపతే = భూమికి ప్రభువైనవాడా ! పార్థివర్షభ = రాజులలో శ్రేష్ఠుడా! రామ = రామా! ఇత్యేవమ్ = ఈ విధముగా, పార్థివాన్ = రాజులను, బాధమానః = బాధించుచు, రావణః = రావణుడు, పృథివీమ్ = భూమిని, చచార = సంచరించెను.

తా. రాజులలో శ్రేష్ఠుడా ! మహారాజా! రామా! రావణుడు ఈ విధముగా రాజులను పీడించుచు భూమియందు సంచరించెను. 6

మూ తతో మాహిష్మతీం నామ పురీం స్వర్గపురీప్రభామ్,
సంప్రాప్తో యత్ర సాంనిధ్యం సదాసీద్వసురేతసః. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, స్వర్గపురీప్రభామ్ = స్వర్గలోకపత్తనముతో సమానమైన, మాహిష్మతీం నామ = మాహిష్మతి అను, పురీమ్ = పట్టణమును, సంప్రాప్తః = పొందినాడు, యత్ర = ఎక్కడ, సదా = ఎల్లప్పుడు, వసురేతసః = అగ్నియొక్క, సాంనిధ్యమ్ = సాంనిధ్యము, ఆసీత్ = ఉండెనో.

తా. అతడు అమరావతితో సమానమైన మాహిష్మతీపురమును చేరెను ఆ పురమునందు అగ్నిదేవుడు ఎల్లప్పుడు సంనిహితుడై ఉండెడివాడు. 7

మూ. తుల్య ఆసీన్నృపస్తస్య ప్రభావాద్వసురేతసః,
అర్జునో నామ యత్రాగ్నిః శరకుణ్డేశయః సదా. 8

ప్ర. అ. యత్ర = ఏ నగరమునందు, అగ్నిః = అగ్ని, సదా = ఎల్లప్పుడూ శరకుణ్డేశయః = (ఆభిచారిక క్రియలనిమిత్తము) రెల్లుగడ్డి ఆస్తరించిన కుండమునందు ఉండేవాడో, ఆ నగరమునందు, ప్రభావాత్ = ప్రభావమువలన, తస్య = ఆ వసురేతసః = అగ్నికి, తుల్యః = సమానుడైన, అర్జునో నామ = అర్జునుడు అను వాడు, ఆసీత్ = ఉండెను.

తా. శత్రుబాధానివృత్తికొరకై చేయు అభిచారప్రయోగముకోసమై ఆ నగరములో నిత్యము శరములు (రెల్లుగడ్డి) చుట్టూ కప్పిన అగ్నికుండములో అగ్ని ఉండేది. అట్టి ఆ నగరములో ఆ అగ్నితో సమానమైన ప్రభావము గల అర్జునుడు ఉండెడివాడు. 8

మూ. తమేవ దివసం సోఽథ హైహయాధిపతిర్బలీ,
అర్జునో నర్మదాం రన్తుం గతః స్త్రీభిః సహేశ్వరః. 9

మూ. మమాగమనమప్యగ్రే యుష్మాభిః సంనివేద్యతామ్,
ఇత్యేవం రావణేనోక్తాస్తేఽమాత్యాః సువిపశ్చితః, 12
అబ్రువన్ రాక్షసపతిమసాంనిధ్యం మహీపతేః.

ప్ర. అ. మమ = నాయొక్క, ఆగమనమపి = రాక కూడ, యుష్మాభిః = మీచేత, అగ్రే = ఆతని ఎదుట, సంనివేద్యతామ్ = తెలుపబడుగాక. ఇత్యేవమ్ = ఇట్లు, రావణేన = రావణునిచేత, ఉక్తాః = పలకబడిన, సువిపశ్చితః = గొప్ప విద్వాంసులైన, తే అమాత్యాః = ఆ మంత్రులు, మహీపతేః = రాజుయొక్క, అసాంనిధ్యమ్ = అక్కడ లేకపోవుటను, రాక్షసపతిమ్ = రావణుని గూర్చి. అబ్రువన్ = చెప్పిరి.

తా. "మీరు నేను వచ్చినట్లుగా ఆతనికి తెలుపుడు". రావణుని మాటలు విని మంచి పండితులైన ఆ అమాత్యులు రాజు అక్కడ లేడను విషయమును రావణునకు తెలిపిరి. 12

మూ. శ్రుత్వా విశ్రవసః పుత్రః పౌరాణామర్జునం గతమ్, 13
అపసృత్యాగతో విన్ధ్యం హిమవత్సంనిభం గిరిమ్.

ప్ర. అ. విశ్రవసః = విశ్రవస్సుయొక్క, పుత్రః = పుత్రుడు, అర్జునమ్ = అర్జునుణ్ణి, గతమ్ = వెళ్ళినవానినిగా, పౌరాణామ్ = పౌరులయొక్క మాటను, శ్రుత్వా = విని, అపసృత్య = అక్కడినుండి కదలి, హిమవత్సంనిభమ్ = హిమవత్పర్వతముతో సమానమైన, విన్ధ్యం గిరిమ్ = వింధ్యపర్వతమును గూర్చి, ఆగతః = వచ్చినాడు.

తా. అర్జునుడు ఎక్కడికో వెళ్ళినట్లు పౌరులవలన తెలిసికొని రావణుడు హిమవత్పర్వతముతో సమానమైన వింధ్యపర్వతమునకు వెళ్లెను. 13

మూ. స తమభ్రమివావిష్టముద్భ్రాన్తమివ మేదినీమ్, 14
అపశ్యద్రావణో విన్ధ్యమాలిఖన్తమివామ్బరమ్.
సహస్రశిఖరోపేతం సింహాధ్యుషితకన్దరమ్. 15

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, అభ్రమ్ = ఆకాశమును, ఆవిష్టమ్ = ప్రవేశించినది వలె ఉన్నది, మేదినీమ్ = భూమిని, ఉద్భ్రాన్తమ్ ఇవ = చుట్టుకొని పుట్టినది వలె ఉన్నది, అమ్బరమ్ = ఆకాశమును, ఆలిఖన్తమివ = ఒరయు

తా. ఆ వింధ్యపర్వతము ఎత్తైన ప్రదేశములనుండి వేగముగా క్రిందికి పడుచున్న జలములతో అట్టహాసము చేయుచున్నట్లు ఉండెను. దేవ-దానవ-గంధర్వులు అప్సరఃస్త్రీలతోను, కింనరులు తమ స్త్రీలతోను అక్కడ క్రీడించుచుండుటచే అది స్వర్గమువలె ఉండెను. చాల ఎత్తైన ఆ పర్వతము స్ఫటికము వంటి శుభ్రమైన జలముతో ప్రవహించుచున్న నదులతో, కదలుచున్న నాలుకలు గల పడగలతో నిలచిన ఆదిశేషుడువలె ఉండెను. పైకి లేచుచున్నట్లు కనబడుచు, అనేకగుహలతో నిండి ఉన్న ఆ పర్వతము హిమవత్పర్వతము వలె ఉండెను. అట్టి వింధ్యగిరిని చూచుచు రావణుడు నర్మదానది దగ్గరకు వెళ్లెను. 16-18

మూ. చలోపలజలాం పుణ్యాం పశ్చిమోదధిగామినీమ్, 19
మహిషైః సృమరైః సింహైః శార్దూలర్క్షగజోత్తమైః,
ఉష్ణాభితప్తైస్తృషితైః సంక్షోభితజలాశయామ్. 20

చక్రవాకైః సకారణ్డైః సహంసజలకుక్కుటైః,
సారసైశ్చ సదా మత్తైః కూజద్భిః సుసమావృతామ్. 21

ఫుల్లద్రుమకృతోత్తంసాం చక్రవాకయుగస్తనీమ్,
విస్తీర్ణపులినశ్రోణీం హంసావలిసుమేఖలామ్. 22

పుష్పరేణ్వనులిప్తాఙ్గీం జలఫేనామలాంశుకామ్,
జలావగాహసుస్పర్శాం ఫుల్లోత్పలశుభేక్షణామ్. 23

పుష్పకాదవరుహ్యాశు నర్మదాం సరితాం వరమ్,
ఇష్టామివ వరాం నారీ మవగాహ్య దశాననః. 24

స తస్యాః పులినే రమ్యే నానామునినిషేవితే,
ఉపోపవిష్టః సచివైః సార్ధం రాక్షసపుంగవః. 25

ప్ర. అ. చలోపలజలామ్=కదలుచున్న రాళ్లూ, జలమూ కలది, పుణ్యామ్=పవిత్రమైనదీ, పశ్చిమోదధిగామినీమ్=పశ్చిమసముద్రమును గూర్చి వెళ్లేదీ, ఉష్ణాభితప్తైః=వేడిచేత తపింపచేయబడిన, తృషితైః=దప్పికొన్న, మహిషైః=మహిషములచేత, సృమరైః=సృమరమృగములచేత, సింహైః=సింహములచేత,

రాగము పూసికొని, నీటినురుగు అనే తెల్లని వస్త్రము ధరించి, వికసించిన న
కలువలు అనే సుందరములైన నేత్రములతో ఆ నర్మద ఒక సుందరి వ
ఉండెను. నీటిలో ప్రవేశించుటచే సుఖకరమైన స్పర్శను కలిగించుచుండెను
ఇట్లు ఇష్టురాలైన స్త్రీ వలె ఉన్న నదులలో శ్రేష్ఠమైన ఆ నర్మదను చూచి
రావణుడు పుష్పకము నుండి దిగి, (యువతిని ఆశ్లేషించి నట్లు) ఆ నదిలో
ప్రవేశించెను. పిమ్మట ఆ రాక్షసశ్రేష్ఠుడు అనేకమునులచేత సేవింపబడిన దాని
ఇసుకతిన్నెపై మంత్రులతో కలిసి కూర్చుండెను. 19-25

మూ. ప్రఖ్యాయ నర్మదాం సోఽథ గఙ్గేయమితి రావణః,
నర్మదాదర్శనే హర్షమాప్తవాన్ స దశాననః, 26
ఉవాచ సచివాంస్తత్ర సలీలం శుకసారణౌ.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సః రావణః = ఆ రావణుడు, ఇయమ్ = ఇది, గఙ్గా = గంగ, ఇతి = అని, నర్మదామ్ = నర్మదను, ప్రఖ్యాయ = శ్లాఘించి నర్మదాదర్శనే = నర్మదయొక్క దర్శనమునందు, హర్షమ్ = సంతోషమును ఆప్తవాన్ = పొందినాడు. సః దశాననః = ఆ రావణుడు, తత్ర = అక్కడ, శుకసారణౌ = శుకసారణులను గూర్చి, సచివాన్ = మంత్రులను గూర్చి, సలీలమ్ = విలాసతో కూడినట్లుగా. ఉవాచ = పలికెను.

తా. పిమ్మట ఆ రావణుడు ఈ నదియే గంగ యని నర్మదను శ్లాఘించి, ఆ నదిని చూచినందుకు సంతోషించుచు, విలాసపూర్వకముగా మంత్రులతోను, శుకసారణులతోను ఇట్లు పలికెను.

మూ. ఏష రశ్మిసహస్రేణ జగత్కృత్వేవ కాఞ్చనమ్, 27
తీక్ష్ణతాపకరః సూర్యో నభసో మధ్యమాస్థితః,
మామాసీనం విదిత్వైవ చన్ద్రాయతి దివాకరః. 28

ప్ర. అ. ఏషః = ఈ, సూర్యః = సూర్యుడు, రశ్మిసహస్రేణ = కిరణముల యొక్క సహస్రముచేత. జగత్ = జగత్తును, కాఞ్చనమ్ ఇవ = బంగారము వికారమైనదానిని వలె, కృత్వా = చేసి, తీక్ష్ణతాపకరః = తీక్ష్ణమైన తాపమును చేయుచు, నభసః = ఆకాశముయొక్క, మధ్యమ్ = మధ్యమును, ఆస్థితః = అధిష్ఠించి

ప్ర. అ యుధి = యుద్ధమునందు, ఇన్ద్రసమైః = ఇంద్రునితో సమాః లైన, నృపైః = రాజులచేత, శస్త్రైః = ఆయుధములచేత, క్షతాః = కొట్టబడిః భవన్తః = మీరు, తత్ = ఆ కారణమువలన, చన్దనస్య = చందనముయొక్క రసేనేవ = రసముచేత వలె, రుధిరేణ = రక్తముచేత, సముక్షితాః = పూయబ నారు.

తా. ఇంద్రునితో సమానులైన రాజులు యుద్ధమునందు ఆయుధముల కొట్టుటచే మీరు (ఎట్టిని) చందనరసము వంటి రక్తముచేత పూయబడి ఉన్నార

మూ. తే యూయమవగాహధ్వం నర్మదాం శర్మదాం శుభామ్
సార్వభౌమముఖా మత్తా గఙ్గామివ మహాగజాః. 3

ప్ర. అ. తే = అట్టి, యూయమ్ = మీరు, సార్వభౌమముఖాః = సార భౌమము మొదలైన, మత్తాః = మదించిన, మహాగజాః = మహాగజములు, గఙ్గాః ఇవ = గంగను వలె, శర్మదామ్ = సుఖము నిచ్చు, శుభామ్ = మంగళకరమైన నర్మదామ్ = నర్మదను, అవగాహధ్వమ్ = ప్రవేశించుడు.

తా. అందుచేత మీరు సార్వభౌమము మొదలైన మదించిన దిగ్గజముః గంగలో ప్రవేశించినట్లు సుఖము నిచ్చే, పవిత్రమైన నర్మదలో దిగి స్నానవ చేయుడు. 3

మూ. అస్యాం స్నాత్వా మహానద్యాం పాప్మనో విప్రమోక్ష్యథ
అహమప్యద్య పులినే శరదిన్దుసమప్రభే, 3
పుష్పోపహారం శనకైః కరిష్యామి కపర్దినః.

ప్ర. అ. అస్యామ్ = ఈ, మహానద్యామ్ = మహానదిలో, స్నాత్వా = స్నానముచేసి, పాప్మనః = పాపమునుండి, విప్రమోక్ష్యథ = ముక్తులు అవండి అహమపి = నేను కూడ, అద్య = ఇప్పుడు, శరదిన్దుసమప్రభే = శరత్కాః చంద్రునితో సమానమైన కాంతి గల, పులినే = ఇసుకతిన్నెమీద, శనకైః = మెల్లగా, కపర్దినః = శివునకు, పుష్పోపహారమ్=పుష్పసమర్పణను, కరిష్యామి= చేయగలను.

తా. ఈ మహానదిలో స్నానము చేసి పాపవిముక్తులు అవండి, నేను కూః

తా. పిదప ఆ బలశాలులైన రాక్షసులు నర్మదలో స్నానము చేసి, పైకి లేచి వచ్చి రావణుని పూజకొరకై పుష్పములు తీసికొనివచ్చిరి. 36

మూ. నర్మదాపులినే హృద్యే శుభ్రాభ్రసదృశప్రభే, 37
రాక్షసైస్తు ముహూర్తేన కృతః పుష్పమయో గిరిః.

ప్ర. అ. శుభ్రాభ్రసదృశప్రభే = తెల్లని మేఘముతో సమానమైన కాంతి గల, హృద్యే = మనోహరమైన, నర్మదాపులినే = నర్మదానది ఇసుకతిన్నె మీద, ముహూర్తేన = ముహూర్తకాలముచేత, రాక్షసైః = రాక్షసులచేత, పుష్పమయః = పుష్పవికారమైన, గిరిః = పర్వతము, కృతః = నిర్మించబడినది.

తా. తెల్లని మేఘము వంటి కాంతి గల మనోహరమైన నర్మదానది ఇసుకతిన్నె మీద ఆ రాక్షసులు ముహూర్తకాలములో పుష్పముల పర్వతమును ఏర్పరచిరి. 37

మూ. పుష్పేషూపహృతేష్వేవం రావణో రాక్షసేశ్వరః, 38
అవతీర్ణో నదీం స్నాతుం గఙ్గామివ మహాగజః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, పుష్పేషు = పుష్పములు, ఉపహృతేషు = తీసికొనిరాబడిన వగుచుండగా, రాక్షసేశ్వరః = రాక్షసప్రభువైన, రావణః = రావణుడు, మహాగజః = గొప్ప గజము, గఙ్గామ్ ఇవ = గంగను వలె, స్నాతుమ్ = స్నానము చేయుటకు, నదీమ్ = నదిని, అవతీర్ణః = దిగినాడు.

తా. ఈ విధముగ పుష్పములు తీసికొనివచ్చిన పిమ్మట రాక్షసరాజైన రావణుడు, మహాగజము గంగలో ప్రవేశించినట్లు, స్నానము చేయుటకై నర్మదలో దిగెను. 38

మూ. తత్ర స్నాత్వా చ విధివజ్జప్త్వా జప్యమనుత్తమమ్, 39
నర్మదాసలిలాత్తస్మాదుత్తతార స రావణః.

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, తత్ర = దానియందు, స్నాత్వా = స్నానముచేసి, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, జప్యమ్ = జపించ దగిన మంత్రమును, విధివత్ = యథావిధిగా, జప్త్వా చ = జపించి, తస్మాత్ = ఆ, నర్మదాసలిలాత్ = నర్మదోదకమునుండి, ఉత్తతార = లేచెను.

కావేదిమధ్యే = ఇసుకతో ఏర్పరచిన వేదిక మధ్యయందు, స్థాప్య = ఉంచి, గన్ధై
చ = గంధములతోను, అమృతగన్ధిభిః = అమృతము వంటి సువాసన గల, లేద
నాశము లేని సువాసన గల, పుష్పైః = పుష్పములతోను, అర్చయామాస =
పూజించెను.

తా. రావణుడు ఆ బంగారులింగమును ఇసుకతో నిర్మించిన తిన్నె మధ
యందు నిలిపి, దానికి చందనాదిగంధములచేతా, అమృతగంధములైన పుష
ములచేతా పూజ చేసెను

వి. కైలాసముదగ్గర శివుని చేతిలో పరాభవము పొందినది మొదలు రా
ణుడు ప్రతినిత్యము శివపూజ చేసేవాడు. శివలింగమును ఎక్కడికి వెళ్ళినా అక
డికి తీసికొనివెళ్లేవాడు. సువర్ణలింగపూజ ఐశ్వర్యప్రదము (వ్యాఖ్యాతలు).

మూ. తతః సతామార్తిహరం పరం వరం
వరప్రదం చన్ద్రమయూఖభూషణమ్,
సమర్చయిత్వా స నిశాచరో జగౌ
ప్రసార్య హస్తాన్ ప్రణనర్త చాగ్రతః. 4

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకత్రింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = ఆ. నిశాచరః = రాక్షసుడ
సతామ్ = సత్పురుషులయొక్క, ఆర్తిహరమ్=పీడను తొలగించువాడు, పరమ్
సర్వోత్తముడు, వరమ్ = శ్రేష్ఠుడు, వరప్రదమ్ = వరములు ఇచ్చువాడు, చ
మయూఖభూషణమ్ = చంద్రకిరణములు భూషణములుగా కలవాడు అం
శివుణ్ణి, సమర్చయిత్వా = పూజించి, జగౌ = సామగానము చేసెను. అగ్రతః
ఎదుట, హస్తాన్ = హస్తములను, ప్రసార్య = చాపి, ప్రణనర్త చ = నృత్య
చేసెను కూడ.

తా. పిమ్మట రావణుడు, సత్పురుషుల పీడలను పోగొట్టువాడు, సర్వో
ముడు, శ్రేష్ఠుడు, వరములను ఇచ్చువాడూ చంద్రుణ్ణి శిరోభూషణముగా ధరిం

# అథ ద్వాత్రింశః సర్గః

*[కార్తవీర్యార్జునుడు భుజములచేత నర్మదాప్రవాహమును ని వేయగా రావణుడు శివలింగముపై పూజించిన పుష్పము లన్నీ కొట్టుక పోవుట. రావణాదులతో కార్తవీర్యార్జునుడు యుద్ధము చేయుట. ( ణుణ్ణి బంధించి ఆతడు తన నగరమునకు బయలుదేరి వెళ్ళుట.]*

మూ. నర్మదాపులినే యత్ర రాక్షసేన్ద్రః స దారుణః,
పుష్పోపహారం కురుతే తస్మాద్దేశాదదూరతః.

అర్జునో జయతాం శ్రేష్ఠో మాహిష్మత్యాః పతిః ప్ర
క్రీడతే సహ నారీభిర్నర్మదాతోయమాశ్రితః.

ప్ర. అ. దారుణః = భయంకరుడైన, సః రాక్షసేన్ద్రః = ఆ రాక్షస నర్మదాపులినే = నర్మదానది ఇసుకతిన్నెమీద, యత్ర = ఎచట, పుష్పోపహార పుష్పముల సమర్పణను, కురుతే = చేయుచున్నాడో, తస్మాత్ = ఆ, దేశా దేశమునుండి, అదూరతః = సమీపమునందు, జయతామ్ = జయించువా శ్రేష్ఠః = శ్రేష్ఠుడు, మాహిష్మత్యాః = మాహిష్మతీపురికి, పతిః = అధిపతి, ప్రభ సమర్థుడూ అయిన, అర్జునః = అర్జునుడు, నర్మదాతోయమ్ = నర్మదానదీ మును, ఆశ్రితః = ఆశ్రయించినవాడై, నారీభిః సహ = స్త్రీలతో కూడ, క్రీడ ఆడుకొనుచున్నాడు.

తా. భయంకరుడైన ఆ రావణుడు నర్మదానది ఇసుకతిన్నెమీద పుష లతో శివపూజ చేయుచున్న ప్రదేశమునకు సమీపమునందే, విజయవంతు శ్రేష్ఠుడు, మాహిష్మతీనగరప్రభువు, సమర్థుడూ అయిన అర్జునుడు నర్మదాన స్త్రీలతో కలిసి జలక్రీడలాడు చుండెను.

మూ. తాసాం మధ్యగతో రాజా రరాజ చ తదార్జునః,
కరేణూనాం సహస్రస్య మధ్యస్థ ఇవ కుఞ్జరః.

ప్ర. అ. సమీననక్రమకరః = మీనములతోను, నక్రములతోను, మ ములతోను కూడిన, స పుష్పకుశసంస్తరః = పుష్పములతోను, కుశాస్తరణమ తోను కూడిన, సః = ఆ, నర్మదామ్బసః = నర్మదాజలముయొక్క, వేగః = వేగ ప్రావృట్ కాలే ఇవ = వర్షాకాలమునందు వలె, ఆబభౌ = ప్రకాశించెను.

తా. ఆ నర్మదాజలప్రవాహములో మీనములు, నక్రములు, మకరము పుష్పములు, దర్భాస్తరణములు కొట్టుకొని పోవుచుండగా అది వర్షాకాల ప్రవాహము వలె ఉండెను.

మూ. స వేగః కార్తవీర్యేణ సంప్రేషిత ఇవామ్బసః,
పుష్పోపహారం సకలం రావణస్య జహార హ.

ప్ర. అ. కార్తవీర్యేణ = కార్తవీర్యునిచేత, సంప్రేషితః ఇవ = పంపి నది వలె, అమ్బసః = జలముయొక్క, సః వేగః = ఆ వేగము. రావణస్య = ణునియొక్క, సకలమ్ = సమస్తమైన, పుష్పోపహారమ్ = పుష్పపూజను, జ హ = హరించెను.

తా. కార్తవీర్యుడు పంపినాడా అన్నట్లు వచ్చిన జలప్రవాహములో ణుడు చేసిన పుష్పపూజ అంతా కొట్టుకొనిపోయెను.

మూ. రావణోఽర్ధసమాప్తం తముత్సృజ్య నియమం తదా,
నర్మదాం పశ్యతే కాన్తాం ప్రతికూలాం యథా ప్రియామ్

ప్ర. అ. తదా = అప్పుడు, రావణః = రావణుడు, అర్ధసమాప్తమ్ సగము పూర్తి అయిన, తం నియమమ్ = ఆ నియమమును, ఉత్సృజ్య = వి ప్రతికూలామ్ = ఎదురుగా ప్రవహించుచున్న, ప్రతికూలామ్ = ప్రతికూలురా ప్రియామ్ = ప్రియురాలైన, కాన్తామ్ ఇవ = స్త్రీ వలె ఉన్న, నర్మదామ్ = దను, పశ్యతే = చూచుచున్నాడు.

తా. అప్పుడు రావణుడు ఆ నియమమును మధ్యలో వదలివేసి, ప్రతి మైన ప్రియురాలు వలె ఉన్న, ఒడ్డుకు (ప్రవాహానికి) ఎదురుగా ప్రవహించు నర్మదను చూచెను.

ప్ర. అ. వీరౌ = వీరులైన, భ్రాతరౌ = సోదరులైన, తౌ శుకసారణౌ = శుకసారణులు, రావణసందిష్టౌ = రావణునిచేత ఆజ్ఞాపించబడినవారై, వ్యోమా రగతౌ = ఆకాశమధ్యమును పొందినవారై, పశ్చిమాముఖౌ = పశ్చిమదిక్కు ముఖము కలవారై, ప్రస్థితౌ = ప్రయాణమైరి.

తా. రావణునిచేత ఆజ్ఞాపించబడిన వీరులైన ఆ శుకసారణ సోదరు ఆకాశమధ్యమును పొంది పశ్చిమాభిముఖముగా వెళ్ళిరి. 1

మూ. అర్ధయోజనమాత్రం తు గత్వా తౌ రజనీచరౌ,
పశ్యేతాం పురుషం తోయే క్రీడన్తం సహయోషితమ్. 1

ప్ర. అ. తౌ రజనీచరౌ = ఆ రాక్షసులు, అర్ధయోజనమాత్రమ్ = అ యోజనము దూరము, గత్వా = వెళ్ళి, తోయే = ఉదకమునందు, క్రీడన్తమ్ = క్రీడించుచున్న, సహయోషితమ్ = స్త్రీలతో కూడిన, పురుషమ్ = పురుషుణ్ణి, ప తామ్ = చూచిరి.

తా. ఆ రాక్షసు లిద్దరూ అర్ధయోజనము దూరము వెళ్ళి, స్త్రీసమేతుడై జ క్రీడలు చేయుచున్న పురుషుణ్ణి చూచిరి. 1

మూ. బృహత్సాలప్రతీకాశం తోయవ్యాకులమూర్ధజమ్,
మదరక్తాన్తనయనం మదవ్యాకులచేతసమ్. 1

ప్ర. అ. బృహత్సాలప్రతీకాశమ్ = పెద్ద సాలవృక్షముతో సమానుడ తోయవ్యాకులమూర్ధజమ్ = ఉదకముచేత వ్యాకులములైన కేశములు కలవాడ మదరక్తాన్తనయనమ్ = మదముచేత ఎఱ్ఱగా ఉన్న నేత్రాంతములు గలవాడ మదవ్యాకులచేతసమ్ = మదముచేత వ్యాకులమైన చిత్తముకలవాడూ అయిన (పు షుణ్ణి చూచిరి).

తా. పెద్ద మద్దిచెట్టు వలె ఉన్న ఆ పురుషుని కేశములు నీటికి తడిసి చెద ఉండెను. నేత్రముల కొనలు మదముచేత ఎఱ్ఱగా ఉండెను. అతని మనస్సు మ ముచేత వ్యాకులముగా ఉండెను. 1

మూ. నదీం బాహుసహస్రేణ రున్ధన్తమరిమర్దనమ్,
గిరిం పాదసహస్రేణ రున్ధన్తమివ మేదినీమ్. 1

నర్మదను, రోధవత్ = ఆనకట్ట వలె, రుద్ధ్వా = అరికట్టి, యోషితః = స్త్రీల
క్రీడాపయతి = ఆడించుచున్నాడు.

తా. రాక్షసరాజా ! పెద్ద సాలవృక్షము వలె ఉన్న ఇతడెవడో ఆన
వలె నర్మదానదిని అడ్డగించి స్త్రీలను క్రీడింపచేయుచున్నాడు.

మూ. తేన బాహుసహస్రేణ సంనిరుద్ధజలా నదీ,
సాగరోద్గారసంకాశానుద్గారాన్ సృజతే ముహుః.

ప్ర. అ. తేన=ఆతనిచేత, బాహుసహస్రేణ=బాహువుల సహస్రముచే
సంనిరుద్ధజలా = అడ్డుకొనబడిన జలము గల, నదీ=నది, సాగరోద్గారసంకాశ
=సముద్రముయొక్క ఉద్గారముతో (నీటిని వ్యాపింపచేయుటతో) సమానములై
ఉద్గారాన్=ఉద్గారములను, ముహుః = మాటిమాటికి, సృజతే=సృష్టించుచున్న

తా. ఆతడు వేయి బాహువులతో నీటిని ఆపివేయుటచే ఈ నది సముద్ర
ఎదురుతన్ని నీరు వ్యాపింవచేయు నట్లు నీటిని వ్యాపింపచేయుచున్నది.

మూ. ఇత్యేవం భాషమాణౌ తౌ నిశమ్య శుకసారణౌ,
రావణోఽర్జున ఇత్యుక్త్వా స యయౌ యుద్ధలాలసః.

ప్ర. అ. ఇత్యేవమ్ = ఇట్లు, భాషమాణౌ = మాటలాడుచున్న, తౌ =
శుకసారణౌ = శుకసారణులను, నిశమ్య = విని, సః రావణః = ఆ రావణు
అర్జునః ఇతి = అర్జునుడు అని, ఉక్త్వా = పలికి, యుద్ధలాలసః = యుద్ధాసక్తు
యయౌ = వెళ్ళెను.

తా. శుకసారణుల మాటలు విన్న రావణుడు "ఇతడే అర్జునుడు"
అనుచు, యుద్ధముకొరకై ఆసక్తితో వెళ్ళెను.

మూ. అర్జునాభిముఖే తస్మిన్ రావణే రాక్షసాధిపే,
చణ్డః ప్రభాతి పవనః సనాదః సరజాస్తథా.

ప్ర. అ. రాక్షసాధిపే = రాక్షసరాజైన, తస్మిన్=ఆ, రావణే=రావణు
అర్జునాభిముఖే = అర్జునునకు అభిముఖు డగుచుండగా, సనాదః = ధ్వనితో కూడి
తథా = మరియు, సరజాః = పరాగముతో కూడిన, చణ్డః = తీవ్రమైన, పవనః
వాయువు, ప్రభాతి = వీచుచున్నది.

స్త్రీలచేత చుట్టువారుకొనబడిన, నరేన్ద్రమ్ = రాజైన, అర్జునమ్ = అర్జునుణ్ణి, = అక్కడ, పశ్యతే = చూచెను.

తా. అప్పుడు రావణుడు చుట్టూ ఆడఏనుగు లున్న ఏనుగ వలె
స్త్రీలు ఉన్న కార్తవీర్యార్జునుణ్ణి చూచెను.

మూ. స రోషాద్రక్తనయనో రాక్షసేన్ద్రో బలోద్ధతః,
ఇత్యేవమర్జునామాత్యానాహ గమ్భీరయా గిరా.

ప్ర. అ. రోషాత్ = కోపమువలన, రక్తనయనః = ఎఱ్ఱనైన నేత్ర
గల, బలోద్ధతః = బలముచేత గర్వించి ఉన్న, సః రాక్షసేన్ద్రః = ఆ రావ
అర్జునామాత్యాన్ = అర్జునుని అమాత్యులను గూర్చి, గమ్భీరయా = గంభీర
గిరా = వాక్కుతో, ఇత్యేవమ్ = ఇట్లు, ఆహ = పలికెను.

తా. బలముచేత దృప్తుడై రోషముచేత ఎఱ్ఱబడిన నేత్రములతో ఆ
ణుడు గంభీరమైన వాక్కుతో అర్జునుని అమాత్యులతో ఇట్లు పలికెను.

మూ. అమాత్యాః క్షిప్రమాఖ్యాత హైహయస్య నృపస్య వై,
యుద్ధార్థం సమనుప్రాప్తో రావణో నామ నామతః.

ప్ర. అ. అమాత్యాః = మంత్రులారా! హైహయస్య = హేహాయవం
నందు పుట్టిన, నృపస్య = రాజునకు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆఖ్యాత
చెప్పండి. నామతః = పేరువలన, రావణో నామ = రావణు డని ప్రసిద్ధి పొ
వాడు, యుద్ధార్థమ్ = యుద్ధముకొరకు, సమనుప్రాప్తః = వచ్చినాడు.

తా. అమాత్యులారా! "రావణుడు యుద్ధము చేయుటకై వచ్చినాడు'
వెంటనే కార్తవీర్యార్జునునకు చెప్పండి.

మూ. రావణస్య వచః శ్రుత్వా మన్త్రిణోఽథార్జునస్య తే,
ఉత్తస్థుః సాయుధాస్తం చ రావణం వాక్యమబ్రువన్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తే = ఆ, అర్జునస్య మన్త్రిణః = అర్జ
మంత్రులు, రావణస్య = రావణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా =
సాయుధాః = ఆయుధములతో కూడినవారై, ఉత్తస్థుః = లేచిరి. రావణమ్ =
ణుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి.

తా. నాయనా! రావణా! ఇప్పుడు ఓపిక పట్టుము. ఈ రాత్రి అ
నీకు అసక్తి ఉన్నచో రేపు అర్జునునితో యుద్ధము చేయుము.

మూ. యది వాపి త్వరా తుభ్యం యుద్ధతృష్ణాసమావృత,
నిపాత్యాస్మాన్ రణే యుద్ధమార్జునేనోపయాస్యసి.

ప్ర. అ. యుద్ధతృష్ణాసమావృత = యుద్ధమునందు ఆసక్తితో
వాడా! తుభ్యమ్ = నీకు, త్వరా యది వాపి = తొందర ఉన్నచో, ర
యుద్ధమునందు, అస్మాన్ = మమ్ములను, నిపాత్య = పడగొట్టి, అర్జునే
అర్జునినుతో, యుద్ధమ్ = యుద్ధమును, ఉపయాస్యసి = పొందగలవు.

తా. యుద్ధమునందు అత్యాసక్తి కలవాడా! నీకు తొందరగా ఉ
నీవు ముందు యుద్ధములో మమ్ములను పడగొట్టి తరవాత అర్జునునితో యు
చేయవచ్చును.

మూ. తతస్తై రావణామాత్యైరమాత్యాస్తే నృపస్య తు,
సూదితాశ్చాపి తే యుద్ధే భక్షితాశ్చ బుభుక్షితైః

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తైః = ఆ, రావణామాత్యైః = రా
అమాత్యులచేత, నృపస్య = రాజుయొక్క, తే = ఆ, అమాత్యాః = అమాత
యుద్ధే = యుద్ధమునందు, సూదితాః చ అపి = చంపబడినారు. బుభుక్షితై
ఆకలిగొన్న, తైః = వారిచేత, భక్షితాః చ = భక్షింపబడిరి.

తా. పిమ్మట రావణుని అమాత్యులు యుద్ధములో రాజామాత్యులను
ఆకలికొని ఉన్న వాళ్ళు వాళ్ళని భక్షించివేసిరి.

మూ. తతో హలహలాశబ్దో నర్మదాతీరగో బభౌ,
అర్జునస్యానుయాత్రాణాం రావణస్య చ మన్త్రిణామ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అర్జునస్య = అర్జునునియొక్క,
యాత్రాణామ్ = అనుచరులయొక్క, రావణస్య = రావణునియొక్క, మన్త్రిణా
= మంత్రులయొక్కా, నర్మదాతీరగః = నర్మదాతీరమును పొందిన, హలః
శబ్దః = హలహలాశబ్దము, బభౌ = ప్రకాశించెను.

తా. రావణుని అమాత్యులైన ప్రహస్త-శుక-సారణులు కోపించి తేజస్సుతో కార్తవీర్యార్జునుని సైన్యమును సంహరించిరి.

మూ. అర్జునాయ తు తత్కర్మ రావణస్య సమన్త్రిణః,
క్రీడమానాయ కథితం పురుషైర్భయవిహ్వలైః.

ప్ర. అ. భయవిహ్వలైః = భయముచేత వ్యాకులులైన, పురుషైః = షులచేత, సమన్త్రిణః = మంత్రులతో కూడిన, రావణస్య = రావణునియొ తత్ = ఆ, కర్మ = పని, క్రీడమానాయ = క్రీడించుచున్న, అర్జునాయ = అ నకు, కథితమ్ = చెప్పబడినది.

తా. భయభ్రాంతులైన కొందరు పురుషులు వెళ్ళి మంత్రిసహితుడై ణుడు చేసిన ఆ పని గూర్చి క్రీడించుచున్న కార్తవీర్యార్జునునకు తెలిపిరి.

మూ. శ్రుత్వా న భేతవ్యమితి స్త్రీజనం స తదార్జునః,
ఉత్తతార జలాత్తస్మాద్గఙ్గాతోయాదివాఞ్జనః.

ప్ర. అ. తదా = అప్పుడు, సః అర్జునః = ఆ అర్జునుడు, శ్రుత్వా = న భేతవ్యమ్ ఇతి = భయపడదగినది కాదు అని, స్త్రీజనమ్ = స్త్రీజనమును గు (పలికి), గఙ్గాతోయాత్ = గంగోదకమునుండి, అఞ్జనః ఇవ = అంజన గజము వలె, తస్మాత్ జలాత్ = ఆ జలమునుండి, ఉత్తతార = పైకి లేచెను.

తా. అప్పుడా అర్జునుడు "భయపడకుడు" అని ఆ స్త్రీలతో చెప్పి గ జలమునుండి అంజన మను దిగ్గజము లేచినట్లు ఆ జలమునుండి పైకి లేచెను.

మూ. క్రోధదూషితనేత్రస్తు స తదార్జునపావకః,
ప్రజజ్వాల మహాఘోరో యుగాన్త ఇవ పావకః.

ప్ర. అ. తదా = అప్పుడు, క్రోధదూషితనేత్రః = క్రోధముచేత, దూషి బడిన నేత్రములు గల, సః అర్జునపావకః = ఆ కార్తవీర్యార్జును డనే అగ్ని, మ ఘోరః = చాల ఘోరమైన, యుగాన్తే = ప్రళయకాలమునందలి, పావకః ఇవ అగ్ని వలె, ప్రజజ్వాల = ప్రజ్వలించెను.

తా. అప్పుడు క్రోధముచేత ఎఱ్ఱబడిన నేత్రములు గల కార్తవీర్యార్జు డనే అగ్ని మహాభయంకరమైన ప్రలయకాలాగ్ని వలె మండిపడెను.

మూ. సతూర్ణతరమాదాయ వరహేమాఙ్గదో గదామ్, 4
అభిదుద్రావ రక్షాంసి తమాంసీవ దివాకరః.

మూ. తతోఽస్య ముసలం ఘోరం లోహబద్ధం మదోద్ధతః, 4
ప్రహస్తః ప్రేషయన్ క్రుద్ధో రరాస చ యథాన్తకః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మదోద్ధతః = మదముచేత ఉద్ధతుడై, ప్రహస్తః = ప్రహస్తుడు, లోహబద్ధమ్ = లోహముచేత బిగించబడిన, ఘోరమ్ = భయంకరమైన, ముసలమ్ = ముసలమును, ప్రేషయన్ = పంపుచు, క్రుద్ధః = కోపించినవాడై, అన్తకః యథా = యముడు వలె, రరాస చ = ధ్వనిచేసె కూడ

తా. మదముచేత మితిమీరి ఉన్న ఆ ప్రహస్తుడు కోపించి, ఇనుముచే బిగించిన, భయంకరమైన ముసలమును ఆతనిపై ప్రయోగించుచు యముడు వ అరచెను. 4

మూ. తస్యాగ్రే ముసలస్యాగ్నిరశోకాపీడసంనిభః, 4
ప్రహస్తకరముక్తస్య బభూవ ప్రదహన్నివ.

ప్ర. అ. ప్రహస్తకరముక్తస్య = ప్రహస్తుని హస్తముచేత విడువబడి తస్య ముసలస్య = ఆ ముసలముయొక్క, అగ్రే = అగ్రమునందు, ప్రదహన్నివ = దహించుచున్నదా అన్నట్లున్న, అశోకాపీడసంనిభః = అశోకపుష్పగుచ్ఛముల సమానమైన, అగ్నిః = అగ్ని, బభూవ = పుట్టెను.

తా. ప్రహస్తుడు విడచిన ఆ ముసలము చివర అశోకపుష్పముల గు వలె ఎఱ్ఱగా ఉన్న, దహించుచున్న అగ్ని పుట్టెను. 4

మూ. ఆధావమానం ముసలం కార్తవీర్యస్తదార్జునః. 4
నిపుణం వఞ్చయామాస గదయా గతవిక్లబః.

ప్ర. అ. తదా = అప్పుడు, కార్తవీర్యః అర్జునః = కార్తవీర్యార్జునుడ ఆధావమానమ్ = శీఘ్రముగా వచ్చి పడుచున్న, ముసలమ్ = ముసలమును, గ విక్లబః = పోయిన దిగులు కలవాడై, గదయా = గదచేత, నిపుణమ్ = నేర్పుగ వఞ్చయామాస = తప్పించుకొనెను.

తా. అప్పుడు కార్తవీర్యార్జునుడు ఏ మాత్రము దిగులు చెందక, శీఘ్ర ముగా వచ్చి మీద పడుచున్న ముసలమును, గదతో నేర్పుగా తప్పించుకొనెను.

మూ. అపక్రాన్తేష్వమాత్యేషు ప్రహస్తే చ నిపాతితే, 49
రావణోఽభ్యద్రవత్తూర్ణమర్జునం నృపసత్తమమ్.

ప్ర. అ. అమాత్యేషు = అమాత్యులు, అపక్రాన్తేషు = తొలగిపోయిన వారగుచుండగా, ప్రహస్తే = ప్రహస్తుడు, నిపాతితే చ = పడగొట్టబడినవాడగు చుండగా, రావణః = రావణుడు, నృపసత్తమమ్ = రాజశ్రేష్ఠుడైన, అర్జునమ్ = అర్జునుణ్ణి గూర్చి, అభ్యద్రవత్ = శీఘ్రముగా వెళ్ళెను.

తా. ప్రహస్తుడు పడిపోయిన పిమ్మట అమాత్యులు పారిపోగా రావణుడు రాజశ్రేష్ఠుడైన కార్తవీర్యార్జునునిమీదికి శీఘ్రముగా వెళ్ళెను. 49

మూ. సహస్రబాహోస్తద్యుద్ధం వింశద్బాహోశ్చ దారుణమ్, 50
నృపరాక్షసయోస్తత్ర ఆరబ్ధం రోమహర్షణమ్.

ప్ర. అ. సహస్రబాహోః = వేయి బాహువులు కలవానికి, వింశద్బాహోః చ = ఇరవై బాహువులు కలవానికి, నృపరాక్షసయోః = రాజ-రాక్షసులిద్దరికీ, తత్ర = అక్కడ, దారుణమ్ = భయంకరము, రోమహర్షణమ్ = రోమాంచము కలిగించేదీ అయిన, తత్ = ఆ, యుద్ధమ్ = యుద్ధము, ఆరబ్ధమ్ = ప్రారంభమైనది.

తా. అక్కడ వేయి బాహువులున్న కార్తవీర్యార్జునునికీ ఇరవై బాహువులున్న రావణునికీ మధ్య భయంకరమూ, ఆశ్చర్యజనకమూ అయిన యుద్ధము ప్రారంభ మయ్యెను.

మూ. సాగరావివ సంక్షుబ్ధౌ చలమూలావివాచలౌ, 51
తేజోయుక్తావివాదిత్యౌ ప్రదహన్తావివానలౌ.
బలోద్ధతౌ యథా నాగౌ వాసితార్థే యథా వృషౌ. 52

మేఘావివ వినర్దన్తౌ సింహావివ బలోత్కటౌ,
రుద్రకాలావివ క్రుద్ధౌ తౌ తదా రాక్షసార్జునౌ 53
పరస్పరం గదాం గృహ్య తాడయామాసతుర్భృశమ్.

ప్ర. అ. సంక్షుబ్ధౌ = క్షోభచెందిన, సాగరౌ ఇవ = రెండు సముద్రములు

ప్ర. అ. అథ = పిమ్మట, అశనిరవేభ్యః = పిడుగుల ధ్వనుల
యథా = ఎట్లు, ప్రతిశ్రుతిః = ప్రతిధ్వని, జాయతే = పుట్టునో, తథా =
తయోః = వారియొక్క, గదాపోథైః = గదల కుమ్ములాటలచేత, సర్వా
సమస్తమైన, దిశః = దిక్కులు, ప్రతిశ్రుతాః = ప్రతిధ్వనించినవి.

తా. ఉరుములవలన ప్రతిధ్వనులు పుట్టినట్లు వారిద్దరి గదల కు
లాటలచేత అన్ని దిక్కులూ ప్రతిధ్వనించినవి.

మూ. అర్జునస్య గదా సా తు పాత్యమానాహితోరసి,
కాఞ్చనాభం నభశ్చక్రే విద్యుత్సౌదామనీ యథా.

ప్ర. అ. అహితోరసి = శత్రువుయొక్క వక్షఃస్థలముమీద, పాత్యమా
పడవేయబడుచున్న, సా = ఆ, అర్జునస్య గదా తు = అర్జునుని గద
విద్యుత్ = బాగా ప్రకాశించుచున్న, సౌదామనీ యథా = మెరుపు వలె, నభ
ఆకాశమును, కాఞ్చనాభమ్ = బంగారు కాంతి గలదానినిగా, చక్రే = చే

తా. శత్రువు వక్షఃస్థలముమీద పడవేయబడిన అర్జునుని గద,
ప్రకాశించుచున్న మెరుపు వలె, ఆకాశమును బంగారు రంగు గలదానిని చే

మూ. తథైవ రావణేనాపి పాత్యమానా ముహుర్ముహుః,
అర్జునోరసి నిర్భాతి గదోల్కేవ మహాగిరౌ.

ప్ర. అ. తథైవ = అట్లే, రావణేనాపి = రావణునిచేత, ముహుర్ముహు
మాటిమాటికి, అర్జునోరసి = అర్జునుని వక్షఃస్థలముమీద, పాత్యమానా = పడ
బడుచున్న, గదా = గద, మహాగిరౌ = గొప్ప పర్వతముమీద, ఉల్కేవ = ఉ
(అగ్నిపిండము) వలె, నిర్భాతి = ప్రకాశించుచున్నది.

తా. అట్లే రావణుడు మాటి మాటికి అర్జునుని వక్షస్థలముమీద వేసి
చున్న గద మహాపర్వతముమీద పడుచున్న ఉల్క వలె ప్రకాశించెను.

మూ. నార్జునః ఖేదమాయాతి న రాక్షసగణేశ్వరః,
సమమాసీత్తయోర్యుద్ధం యథా పూర్వం బలీన్ద్రయోః

ప్ర. అ. అర్జునః = అర్జునుడు, ఖేదమ్ = అలసటను, నాయాతి = పొం

ప్ర. అ. సా = ఆ, గదా = గద, వరదానకృతత్రాణే = వరదాన
చేయబడిన రక్షణ గల, రావణోరసి = రావణుని వక్షఃస్థలముమీద, దుర్బ
దుర్బలము వలె అయి, యథావేగమ్ = వేగానుసారముగా, క్షితౌ = నేల
ద్విధా భూతా = రెండుగా అయి, అపతత్ = పడెను.

తా. ఆ గద వరదానముచేత రక్షింపబడుచున్న ఆ రావణుని వక్షఃస్థ
మీద బలహీనము వలె అయి, పడినవేగానికి రెండు ముక్కలై నేలమీద ప

మూ. స త్వర్జునప్రయుక్తేన గదాఘాతేన రావణః,
అపాసర్పద్ధనుర్మాత్రం నిషసాద చ నిష్టనన్.

ప్ర. అ. సః రావణః తు = ఆ రావణుడైతే, అర్జునప్రయుక్తేన = అర్జ
చేత ప్రయోగించబడిన, గదాఘాతేన = గదాప్రహారముచేత, ధనుర్మాత్రం
ధనస్సంత దూరము, అపాసర్పత్ = తొలగెను. నిష్టనన్ = అరచుచు, నిష
చ = కూర్చుండెను.

తా. అర్జునుడు ప్రయోగించిన ఆ గద దెబ్బకు రావణుడు బ
దూరము వెనుకకు పోయి అరచుచు క్రింద పడిపోయెను.

మూ. స విహ్వలం తదాలక్ష్య దశగ్రీవం తతోఽర్జునః,
సహసోత్పత్య జగ్రాహ గరుత్మానివ పన్నగమ్.

ప్ర. అ. తదా = అప్పుడు, సః అర్జునః = ఆ అర్జునుడు, విహ్వలమ్
వ్యాకులుడైన, దశగ్రీవమ్ = రావణుణ్ణి, ఆలక్ష్య = చూచి, తతః = అటుపివ
సహసా = వెంటనే, ఉత్పత్య = వానిపైకి ఎగిరి, గరుత్మాన్ = గరుత్మంత
పన్నగమ్ ఇవ = సర్పమును వలె, జగ్రాహ = పట్టుకొనెను.

తా. కార్తవీర్యార్జునుడు అప్పుడు రావణుడు వ్యాకులుడై ఉండుట చ
వెంటనే ఎగిరి మీదపడి, గరుత్మంతుడు సర్పమును పట్టినట్లు వానిని పట్టుకొ

మూ. స తు బాహుసహస్రేణ బలాద్గృహ్య దశాననమ్,
బబన్ధ బలవాన్ రాజా బలిం నారాయణో యథా.

ప్ర. అ. బలవాన్ = బలవంతుడైన, సః = ఆ, రాజా తు = రాజ

చూచి, క్రుద్ధః = కోపించినవాడై, సహసా = శీఘ్రముగా, హైహయమ్ = 
ర్యార్జునుణ్ణి గూర్చి, అభిదుద్రావ = శీఘ్రముగా పరుగెత్తెను.

తా. ప్రహస్తుడు తెప్పరిల్లి రావణుడు బంధింపబడి ఉండుటచూచి 
కోపముతో కార్తవీర్యార్జును మీదికి వెళ్లెను.

మూ. నక్తంచరణాం వేగస్తు తేషా మాపతతాం బభౌ,
ఉద్భూత ఆతపాపాయే పయోదానామివామ్బుధౌ.

ప్ర. అ. ఆపతతామ్ = వచ్చి పడుచున్న, తేషామ్ = ఆ, నక్త
ణామ్ = రాక్షసులయొక్క, వేగస్తు = వేగమైతే, ఆతపాపాయే = వర్షాకాలము
అమ్బుధౌ = సముద్రమునందు, ఉద్భూతః = పుట్టిన, పయోదానామ్ ఇవ = మే
లయొక్క వేగము వలె, బభౌ = ప్రకాశించెను.

తా. వచ్చిపడుచున్న ఆ రాక్షసుల వేగము వర్షాకాలమునందు స
ములో ఏర్పడిన మేఘముల వేగము వలె ఉండెను.

మూ. ముఞ్చ ముఞ్చేతి భాషన్తస్తిష్ఠ తిష్ఠేతి చాసకృత్,
ముసలాని చ శూలాని సోత్ససర్జ తదా రణే.

ప్ర. అ. ముఞ్చ ముఞ్చ = విడువుము, విడువుము, తిష్ఠ తిష్ఠ = నిలు
నిలువుము, ఇతి = అని, అసకృత్ = మాటిమాటికి, భాషన్తః = పలుకుచు,
సులు వచ్చిరి). తదా = అప్పుడు, సః = ప్రహస్తుడు, రణే = యుద్ధమునందు,
లాని చ = ముసలములను, శూలాని = శూలములను, ఉత్ససర్జ = విడచెను.

తా. "విడువుము విడువుము, ఆగుము ఆగుము" అని మాటిమాటికి
చుచు రాక్షసులు వచ్చిరి. ప్రహస్తుడు అప్పుడు యుద్ధమునందు ముసల
శూలములు కురిపించెను.

మూ. అప్రాప్తాన్యేవ తాన్యాశు అసంభ్రాన్తస్తదార్జునః,
ఆయుధాన్యమరారీణాం జగ్రాహారినిషూదనః.

ప్ర. అ. తదా = అప్పుడు, అరినిషూదనః = శత్రువినాశకుడైన, 
= అర్జునుడు, అమరారీణామ్ = దేవతాశత్రువులయొక్క, తాని ఆయుధాని

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పురుహూతసంనిభః = ఇంద్రునితో నుడైన, సః అర్జునః = ఆ అర్జునుడు, సపౌరైః = పౌరులతో కూడిన, ద్విః బ్రాహ్మణులచేత, కుసుమాక్షతోత్కరైః = పుష్పములయొక్క, అక్షతలం సముదాయములచేత, కీర్యమాణః = చల్లబడుచున్నవాడై, బలిమ్ = నిగృహ్య = నిగ్రహించి, సహస్రలోచనః ఇవ = ఇంద్రుడు వలె, స్వామ్ సంబంధమైన, తాం పురీమ్ = ఆ పట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట దేవేంద్రునితో సమానమైన ఆ కార్తవీర్యార్జునుడు నిగ్రహించి దేవేంద్రుడు వలె బ్రాహ్మణులు, పౌరులు, పుష్పములు, అః చల్లుచుండగా తన నగరములో ప్రవేశించెను.

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాం

ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

ప్ర. అ. వాయుతుల్యగతిః = వాయువుతో సమానమైన గమనము గ
సః ద్విజః = ఆ బ్రాహ్మణుడు, వాయుమార్గమ్ = వాయుమార్గమును, ఆస్థాయ
అధిష్ఠించి, మనఃసంపాతవిక్రమః = మనోగమనమువంటి గమనము కలవాడై
మాహిష్మతీం పురీమ్=మాహిష్మతీనగరమును, ప్రాప్తః = పొందినాడు.

తా. వాయువుతో సమానమైన గమనము గల ఆ పులస్త్యుడు వా
మార్గమునందు ప్రయాణము చేసి, మనోవేగములో మాహిష్మతీనగరము
చేరెను.

మూ. సోఽమరావతిసంకాశాం హృష్టపుష్టజనావృతామ్,
ప్రవివేశ పురీం బ్రహ్మ ఇన్ద్రస్యేవామరావతీమ్.

ప్ర. అ. సః = అతడు, అమరావతిసంకాశామ్ = అమరావతితో సమా
మైన, హృష్టపుష్టజనావృతామ్ = సంతోషించుచున్న బలిసిన జనులతో కూడి
పురీమ్ = ఆ పట్టణమును, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, ఇన్ద్రస్య=ఇంద్రునియొక్క
అమరావతీమ్ ఇవ = అమరావతిని వలె, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. బ్రహ్మదేవుడు ఇంద్రుని అమరావతిలో ప్రవేశించినట్లు ఆ పులస్త్యు
అమరావతితో సమానమై, బలిసి సంతోషముతో ఉన్న జనులతో నిండిన మా
ష్మతీపురమును ప్రవేశించెను.

మూ. పాదచారమివాదిత్యం నిష్పతన్తం సుదుర్దృశమ్,
తతస్తే ప్రత్యభిజ్ఞాయ అర్జునాయ న్యవేదయన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే = ఆ జనులు, పాదచారమ్ = పాద
లతో నడచుచున్న, ఆదిత్యమివ = సూర్యుడు వలె ఉన్న, నిష్పతన్తమ్ = వచ
చున్న, సుదుర్దృశమ్ = మిక్కిలి చూచుటకు శక్యముకాకుండ ఉన్న అతని
ప్రత్యభిజ్ఞాయ = గుర్తించి, అర్జునాయ = అర్జునునికొరకు, న్యవేదయన్ =
తెలిపిరి.

తా. అప్పుడు అక్కడి జనులు కాలినడకతో వచ్చుచున్న సూర్యుడు వ
ఉన్న, వచ్చుచున్న, చూచుటకు శక్యముకాకుండా ఉన్న ఆ పులస్త్యుణ్ణి చూ
గుర్తించి, అర్జునునకు తెలిపిరి.

మూ. స తస్య మధుపర్కం గాం పాద్యమర్ఘ్యం నివేద్య
పులస్త్యమాహ రాజేన్ద్రో హర్షగద్గదయా గిరా.

ప్ర. అ. సః రాజేన్ద్రః = ఆ రాజశ్రేష్ఠుడు, తస్య = ఆతనికి, మధుపర
మధుపర్కమును, గామ్ = గోవును, పాద్యమ్ = పాద్యమును, అర్ఘ్యం చ
మును, నివేద్య = సమర్పించి, హర్షగద్గదయా = సంతోషముతో గద్గ
గిరా = వాక్కుతో, పులస్త్యమ్ = పులస్త్యుణ్ణి గూర్చి, ఆహ = పలికెను

తా. ఆ రాజేంద్రుడు ఆ పులస్త్యునకు మధుపర్కము, గోవు, పా
అర్ఘ్యము సమర్పించి సంతోషముతో గద్గదమైన వాక్కుతో ఆతనితో ఇట్ల

మూ. అద్యైవమమరావత్యా తుల్యా మాహిష్మతీ కృతా
అద్యాహం తు ద్విజేన్ద్ర త్వాం యస్మాత్పశ్యామి దుర్

ప్ర. అ. ద్విజేన్ద్ర = బ్రాహ్మణశ్రేష్ఠుడా ! యస్మాత్ = ఏ కారణ
అద్య = ఇప్పుడు, అహమ్ = నేను, దుర్దృశమ్ = చూడ శక్యము కాని,
నిన్ను, పశ్యామి = చూచుచున్నానో, అందువలన, అద్య = ఇప్పుడు,
ఈ విధముగా, మాహిష్మతీ = మాహిష్మతీనగరము, అమరావత్యా = అమ
తుల్యా = సమానమైనదిగా, కృతా = చేయబడినది.

తా. ఓ! బ్రాహ్మణశ్రేష్ఠుడా ! నేడు నేను చూచుటకు శక్యముకా
చూడగలుగుచున్నాను. అందుచే నేడు ఈ మాహిష్మతీనగరము అమ
సమానమైనదిగా చేయబడినది.

మూ. అద్య మే కుశలం దేవ అద్య మే కుశలం వ్రతం
అద్య మే సఫలం జన్మ అద్య మే సఫలం తపః,
యత్తే దేవగణైర్వన్ద్యౌ వన్దేఽహం చరణౌ తవ.

ప్ర. అ. దేవ = ఓ! దేవా ! అద్య = నేడు, మే = నాకు, కు
క్షేమము. అద్య = నేడు, మే = నాయొక్క, వ్రతమ్ = వ్రతము, కు
కుశలమైనది. అద్య = నేడు, మే జన్మ = నా జన్మ, సఫలమ్ = స
అద్య = నేడు, మే తపః = నా తపస్సు, సఫలమ్ = సఫలమైనది.
కారణమువలన , తే = నీయొక్క, దేవగణైః = దేవతాగణములచేత,

ప్ర. అ. అమ్బుజపత్రాక్ష = పద్మపత్రములవంటి నేత్రములు కలవా పూర్ణచంద్రనిభానన = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గలవాడా! న = రాజా! యేన = ఏ నీచేత, దశగ్రీవః = రావణుడు, జితః = జయించబడిన తే = అట్టి నీయొక్క, బలమ్ = బలము, అతులమ్ = సాటిలేనిది.

తా. పద్మపత్రముల వంటి నేత్రములు, పూర్ణచంద్రుని వంటి ముఖ గల ఓ! రాజా! రావణుణ్ణికూడ జయించిన నీ బలము సాటి లేనిది.

మూ. భయాద్యస్యోపతిష్ఠేతాం నిష్పన్దౌ సాగరానిలౌ,
సోఽయం మృధే త్వయా బద్ధః పౌత్రో మే రణదుర్జ

ప్ర. అ. యస్య = ఎవనియొక్క, భయాత్ = భయమువలన, నిష్ప చలించనివై, సాగరానిలౌ = సముద్రమూ వాయువూ, ఉపతిష్ఠేతామ్ = చేయునో, సః = అట్టి, రణదుర్జయః = రణమునందు జయింప శక్యము అయమ్ = ఈ, మే పౌత్రః = నా పౌత్రుడు, త్వయా = నీచేత. మృధే = యు నందు, జితః = జయింపబడినాడు.

తా. సముద్రమూ వాయువూ కూడ ఎవనికి భయపడి, నిశ్చలములై చేయుచుండునో, అట్టి, యుద్ధములో జయింప శక్యము కాని నా పౌత్రుణ్ణి యుద్ధములో జయించినావు.

మూ. పుత్రకస్య యశః పీతం నామ విశ్రావితం త్వయా,
మద్వాక్యాద్యాచ్యమానోఽద్య ముఞ్చ వత్స దశానన

ప్ర. అ. వత్స = నాయనా! పుత్రకస్య = నా పిల్లవానియొక్క, య కీర్తి, పీతమ్ = త్రాగివేయబడినది. త్వయా = నీచేత, నామ = పేరు, విశ్రావిత ప్రసిద్ధము చేయబడినది. అద్య = ఇప్పుడు, యాచ్యమానః = యాచింపబడు నీవు, మద్వాక్యాత్ = నా మాటవలన, దశాననమ్ = రావణుణ్ణి, ముఞ విడువుము.

తా. నాయనా! నీవు నా మనుమని కీర్తిని త్రాగివేసి 'రావణవిజేత' పేరు చాటుకొనినావు. నేను యాచించుచున్నాను. నా మాట విని రావణుణ్ణి పెట్టుము.

ప్రతాపవాన్=ప్రతాపవంతుడైన, రాక్షసేన్ద్రః=రావణుడు, కృతాతిథ్యః=
చేత చేయబడిన అతిథ్యము కలవాడై, పరిష్వక్తః=కౌగలించుకొనబడినవా
స్త్యేనాపి = పులస్త్యునిచేత కూడ, సంత్యక్తః = విడువబడెను.

తా. జయింపబడుటచే సిగ్గుపడుచున్న ప్రతాపవంతుడైన రా
అర్జునుడు ఆతిథ్యము చేసి, కౌగలించుకొని పంపివేసెను. పులస్త్యు
లంకకు వెళ్లుటకై అనుమతి ఇచ్చెను.

మూ. పితామహసుతశ్చాపి పులస్త్యో మునిపుంగవః,
మోచయిత్వా దశగ్రీవం బ్రహ్మలోకం జగామ ప

ప్ర. అ. పితామహసుతః=బ్రహ్మదేవుని కుమారుడైన, మునిపు
మునిశ్రేష్ఠుడైన, పులస్త్యః = పులస్త్యుడు, దశగ్రీవమ్=రావణుణ్ణి, మోచ
విడిపించి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమునుగూర్చి, జగామ హ = వెళ్లెన

తా. బ్రహ్మదేవుని కుమారుడు, మునిశ్రేష్ఠుడూ అయిన పులస్త్యుడు ర
విడిపించి బ్రహ్మలోకమునకు వెళ్ళి పోయెను.

మూ. ఏవం స రావణః ప్రాప్తః కార్తవీర్యాత్ప్రధర్షణమ్,
పులస్త్యవచనాచ్చాపి పునర్ముక్తో మహాబలః.

ప్ర. అ. మహాబలః=గొప్ప బలము గల, సః=ఆ, రావణః=రా
ఏవమ్ = ఈ విధముగా, కార్తవీర్యాత్=కార్తవీర్యునివలన, ప్రధర్షణమ్=అ
మును, ప్రాప్తః = పొందినాడు. పులస్త్యవచనాత్ = పులస్త్యునివచనమ
పునః = మరల, ముక్తః చ అపి = విడువబడినాడు.

తా. మహాబలశాలియైన ఆ రావణుడు ఈ విధముగ కార్తవీర్యు
అవమానమును పొందెను. పులస్త్యుని మాటలవలన మరల విడువబడెను.

మూ. ఏవం బలిభ్యో బలినః సన్తి రాఘవనన్దన,
నావజ్ఞా హి పరే కార్యా య ఇచ్ఛేచ్ఛ్రియ ఆత్మనః.

ప్ర. అ. రాఘవనన్దన = రామా! ఏవమ్ = ఈ విధముగా, బలిభ్
బలవంతులకంటె, బలినః = బలవంతులు, సన్తి = ఉన్నారు. యః =

# అథ చతుస్త్రింశః సర్గః

[రావణుడు వాలినుండి పరాభవము పొంది ఆతనితో
చేసుకొనుట.]

మూ. అర్జునేన విముక్తస్తు రావణో రాక్షసాధిపః,
చచార పృథివీం సర్వామనిర్విణ్ణస్తథా కృతః.

ప్ర. అ. అర్జునేన=అర్జునుని చేత, విముక్తః=విడువబడిన, రాక్షసాధి
రాక్షసరాజైన, రావణః తు = రావణుడైతే, తథా = అట్లు, కృతః = చేయ
వాడై, అనిర్విణ్ణః = దిగులు చెందనివాడై, సర్వామ్ = సమస్తమైన, పృథివీ
భూమిని, చచార = సంచరించెను.

తా. అర్జునుని చేత విడవబడిన రాక్షసప్రభువైన రావణుడు, అట్లు నిర
డుగా చేయబడి, దిగులు లేక భూమిమీద అంతటా సంచరించెను.

మూ. రాక్షసం వా మనుష్యం వా శృణుతే యం బలాధికమ్
రావణస్తం సమాసాద్య యుద్ధే హ్వాయతి దర్పితః.

ప్ర. అ. దర్పితః = గర్వించిన, రావణః = రావణుడు, రాక్షసం =
రాక్షసుణ్ణి అయినా, మనుష్యం వా = మనుష్యుణ్ణి అయినా, యమ్ = ఎ
బలాధికమ్ = బలముచేత అధికుణ్ణిగా, శృణుతే=వినునో, తమ్ = వానిని,
సాద్య = పొంది, యుద్ధే = యుద్ధమునందు, హ్వాయతి = పిలచును.

తా. దృప్తుడైన రావణుడు రాక్షసుడైనా, మనుష్యుడైనా ఎవడు గొప్ప బ
కలవాడు అని వినునో ఆతనివద్దకు వెళ్ళి యుద్ధమునకు పిలచుచుండెడివాడు.

మూ. తతః కదాచిత్ కిష్కిన్ధాం నగరీం వాలిపాలితామ్,
గత్వాహ్వాయతి యుద్ధాయ వాలినం హేమమాలినమ్.

ద్రేభ్యః అపి=సముద్రములనుండి కూడ, సంధ్యామ్ = సంధ్యను, ఉపాస్య= సించి, ఇదం ముహూర్తమ్= ఈ ముహూర్తమునందే, ఆయాతి = వచ్చుచున ముహూర్తకమ్ = ముహూర్తకాలము, తిష్ఠ = నిలువుము.

తా. రావణా! వాలి నాలుగు సముద్రములవద్దా సంధ్యోపాసన చేసి ముహూర్తకాలమునందే రాగలడు. ముహూర్తకాలము నిలబడుము.

మూ. ఏతానస్థిచయాన్ పశ్య య ఏతే శఙ్ఖపాణ్డురాః,
యుద్ధార్థినామిమే రాజన్వానరాధిపతేజసా.

ప్ర. అ. యే = ఏ, ఏతే = ఇవి, శఙ్ఖపాణ్డురాః = శంఖములవలె నున్నవో, ఏతాన్ = ఈ, అస్థిచయాన్ = ఎముకల సముదాయములను, పశ్య చూడుము, రాజన్ = రాజా! ఇమే = ఇవి, వానరాధిపతేజసా = వాలి తేజస (మరణించిన), యుద్ధార్థినామ్ = యుద్ధమును కోరి వచ్చినవారికి సంబంధిం

తా. ఇక్కడ పడి ఉన్న శంఖములవలె తెల్లగా ఉన్న ఎముకల గు చూడుము. ఇవి యుద్ధమును కోరి వచ్చి వాలి తేజస్సుచేత మరణించిన ఎముకలు.

మూ. యద్వామృతరసః పీతస్త్వయా రావణ రాక్షస,
తదా వాలినమాసాద్య తదన్తం తవ జీవితమ్.

ప్ర. అ. రాక్షస = రాక్షసుడవైన, రావణ = రావణా! త్వయా = నీ అమృతరసః = అమృతరసము, యద్వా పీతః = త్రాగబడినను, తదా = అ నను, తవ జీవితమ్ = నీ జీవితము, వాలినమ్ = వాలిని, ఆసాద్య = పొ తదన్తమ్ = అదే అంతమునందు గలది.

తా. రాక్షసుడవైన రావణా! నీవు అమృతరసము త్రాగి ఉన్నా క నీవు వాలిని సమీపించితివా-నీజీవితము అంతటితో ఆఖరు.

మూ. పశ్యేదానీం జగచ్చిత్రమిమం విశ్రవసః సుత,
ఇదం ముహూర్తం తిష్ఠస్వ దుర్లభం తే భవిష్యతి.

ప్ర. అ. విశ్రవసః సుత = విశ్రవసుని కుమారుడా! ఇదానీమ్ = ఇప్పు

పుష్పకాదవరుహ్యాథ రావణోఽఞ్జనసంనిభః,
గ్రహీతుం వాలినం తూర్ణం నిఃశబ్దపదమవ్రజత్. 13

ప్ర. అ. రావణః = రావణుడు, తత్ర = అక్కడ, హేమగిరిప్రఖ్యమ్ = మేరుపర్వతముతో సమానుడు, తరుణార్కనిభాననమ్ = లేతసూర్యుని వంటి ముఖముగలవాడు, సంధ్యోపాసనతత్పరమ్ = సంధ్యోపాసనయందు ఆసక్తుడూ అయిన, వాలినమ్=వాలిని, దృష్ట్వా=చూచి, అథ=అటుపిమ్మట, అఞ్జనసంనిభః = కాటుకతో సమానుడైన, రావణః = రావణుడు, పుష్పకాత్=పుష్పకమునుండి, అవరుహ్య = దిగి, వాలినమ్ = వాలిని, గ్రహీతుమ్ = గ్రహించుటకు, తూర్ణమ్= శీఘ్రముగా, నిఃశబ్దపదమ్ = శబ్దములేని అడుగులు కలుగునట్లుగా, అవ్రజత్ = వెళ్లెను.

తా. రావణుడు అక్కడ సంధ్యోపాసన చేయుచున్న వాలిని చూచెను. అతడు మేరుపర్వతము వలె ఉండెను. ఆతని ముఖము లేత సూర్యునివలె ఉండెను. పిమ్మట కాటుక వంటి శరీరచ్ఛాయ గల ఆ రావణుడు పుష్పకమునుండి దిగి వాలిని పట్టుకొనుటకై అడుగుల చప్పుడు కాకుండగా, శీఘ్రముగా వెళ్లెను. 12,13

మూ. యదృచ్ఛయా తదా దృష్టో వాలినాపి స రావణః,
పాపాభిప్రాయకం దృష్ట్వా చకార న తు సంభ్రమమ్. 14

ప్ర. అ. సః రావణః=ఆ రావణుడు, తదా = అప్పుడు, యదృచ్ఛయా= దైవవశముచేత, వాలినాపి=వాలిచేత కూడా, దృష్టః=చూడబడినాడు. తు=కాని, పాపాభిప్రాయకమ్ = చెడ్డ అభిప్రాయము కలవానినిగా, దృష్ట్వా=చూచి, సంభ్రమమ్ = తొందరను, న చకార = చేయలేదు.

తా. అప్పుడు వాలి కూడ రావణుణ్ణి దైవవశముచేత చూచెను. కాని అతడు వాని చెడ్డ అభిప్రాయమును తెలిసికొని కూడ కంగారుపడలేదు. 14

మూ. శశమాలక్ష్య సింహో వా పన్నగం గరుడో యథా,
న చిన్తయతి తం వాలీ రావణం పాపనిశ్చయమ్. 15

ప్ర. అ. శశమ్ = చెవులపిల్లిని, ఆలక్ష్య=చూచి, సింహో వా = సింహము వలె, పన్నగమ్=సర్పమును చూచి, గరుడో యథా=గరుత్మంతుడు వలె, వాలీ=

ప్ర. అ. ఇత్యేవమ్ = ఇట్లు, మతిమ్ = బుద్ధిని, ఆస్థాయ = అవలంబించి, వాలీ = వాలి, మౌనమ్ = మౌనమును, ఉపాస్థితః = ఆశ్రయించినవాడై, నైగమాన్ = వేదములకు సంబంధించిన, మన్త్రాన్ = మంత్రములను, జపన్ = జపించుచు, పర్వతరాడివ = పర్వతరాజు వలె, తస్థౌ = ఉండెను.

తా. వాలి ఈ విధముగా ఆలోచించి, ఏమీ మాటలాడక, వేదమంత్రములు జపించుచు, పర్వతరాజువలె కదలకుండా ఉండెను. 18

మూ. తావన్యోన్యం జిఘృక్షన్తౌ హరిరాక్షసపార్థివౌ,
ప్రయత్నవన్తౌ తత్కర్మ ఈహతుర్బలదర్పితౌ. 19

ప్ర అ. అన్యోన్యమ్ = పరస్పరమును, జిఘృక్షన్తౌ = గ్రహింపదలచుచున్న, బలదర్పితౌ = బలముచేత దృప్తులైన, తౌ = ఆ, హరిరాక్షసపార్థివౌ = వానరరాక్షసరాజులు, ప్రయత్నవన్తౌ = ప్రయత్నము కలవారై, తత్ = ఆ, కర్మ = పనిని, ఈహతుః = కోరిరి.

తా. ఒకరి నొకరు పట్టుకొనగోరుచున్న, బలముచేత దృప్తులైన ఆ వాలి రావణులు ఆ పని సాధించుటకై ప్రయత్నము చేసిరి. 19

మూ. హస్తగ్రాహం తు తం మత్వా పాదశబ్దేన రావణమ్,
పరాఙ్ముఖోఽపి జగ్రాహ వాలీ సర్పమివాణ్డజః. 20

ప్ర. అ. వాలీ = వాలి, పరాఙ్ముఖోఽపి = పరాఙ్ముఖుడైనను, పాదశబ్దేన = అడుగుల చప్పుడుచేత, తం రావణమ్ = ఆ రావణుణ్ణి, హస్తగ్రాహమ్ = చేతికి దొరికేవానినిగా, మత్వా = తెలిసికొని, అణ్డజః = పక్షి, సర్పమివ = సర్పమును వలె, జగ్రాహ = పట్టుకొనెను.

తా. వాలి అటు వైపు తిరిగి ఉన్నా కూడ అడుగుల చప్పుడును పట్టి ఆ రావణుడు చేతికి అందేటట్లు ఉన్నా డని గ్రహించి పక్షి సర్పమును పట్టుకొని నట్లు అతనిని పట్టుకొనెను. 20

మూ. గ్రహీతుకామం తం గృహ్య రక్షసామీశ్వరం హరిః,
ఖముత్పపాత వేగేన కృత్వా కక్షావలమ్బినమ్. 21

సముదాయములచేత, అన్వీయమానః = అనుసరించబడుచున్న, అమ్బరస్థః = ఆకాశమునందున్న, అంశుమానివ = సూర్యుడు వలె, భ్రాజతే = ప్రకాశించుచున్నాడు.

తా. ఆ రాక్షసులు వెంబడించుచుండగా ఆకాశమధ్యమునందు ఉన్న ఆ వాలి, మేఘములచేత వెంబడింపబడిన, ఆకాశమునందున్న సూర్యుడు వలె ప్రకాశించెను. 24

మూ. తేఽశక్నువన్తః సంప్రాప్తుం వాలినం రాక్షసోత్తమాః,
తస్య బాహూరువేగేన పరిశ్రాన్తా వ్యవస్థితాః. 25

ప్ర. అ. తే రాక్షసోత్తమాః = ఆ రాక్షసశ్రేష్ఠులు, వాలినమ్ = వాలిని, సంప్రాప్తుమ్ = పొందుటకు, అశక్నువన్తః = సమర్థులు కానివారై, తస్య = ఆతనియొక్క, బాహూరువేగేన = బాహువులయొక్క ఊరువులయొక్క వేగముచేత, పరిశ్రాన్తాః = అలసినవారై, వ్యవస్థితాః = ఆగిపోయిరి.

తా. ఆ రాక్షసశ్రేష్ఠులు వాలిని చేరజాలక ఆతని బాహువుల, తొడల వేగముచేత అలసిపోయినవారై ఆగిపోయిరి. 25

మూ. వాలిమార్గాదపాక్రామన్ పర్వతేన్ద్రాఽపి గచ్ఛతః,
కింపునర్జీవనప్రేప్సుర్బిభ్రద్వై మాంసశోణితమ్. 26

ప్ర. అ. గచ్ఛతః = వెళ్ళుచున్న, వాలిమార్గాత్ = వాలియొక్క మార్గమునుండి, పర్వతేన్ద్రాఽపి = పెద్ద పర్వతములు కూడ, అపాక్రామన్ = దూరముగా తొలగిపోయినవి. మాంసశోణితమ్ = మాంసమును రక్తమును, బిభ్రత్ = ధరించుచున్న, జీవనప్రేప్సుః = జీవనమును పొందదలచినవాడు, కిం పునః = చెప్పనేల ?

తా. వాలి వెళ్ళుచుండగా ఆతని మార్గమునుండి పెద్ద పర్వతములు కూడ తప్పుకొన్నవి. మాంసశోణితములు ఉన్న, ప్రాణములపై తీపి ఉన్నవాని మాట చెప్పవలెనా ? 26

మూ. అపక్షిగణసంపాతాన్వానరేన్ద్రో మహాజవః,
క్రమశః సాగరాన్సర్వాన్ సంధ్యాకాలమవన్దత. 27

చాల వేల యోజనములను, వహమానః = మోయుచు (లేదా ఎగురుచు), శత్రుణా సహ = శత్రువుతో కూడ, వాయువచ్ఛ = వాయువు వలె, మనోవచ్ఛ = మనస్సు వలె, జగామ = వెళ్లెను.

తా. వాలి ఈ విధముగా శత్రువుతో కూడ ఎగురుచు ఎన్నో వేల యోజనముల దూరము వాయువు వలె, మనస్సు వలె వెళ్లెను. 30

మూ. ఉత్తరే సాగరే సంధ్యాముపాసిత్వా దశాననమ్,
వహమానోఽగమద్వాలీ పూర్వం వై స మహోదధిమ్.

ప్ర. అ. సః వాలీ = ఆ వాలి, ఉత్తరే సాగరే = ఉత్తరసముద్రమునందు, సంధ్యామ్ = సంధ్యను, ఉపాసిత్వా = ఉపాసించి, దశాననమ్ = రావణుణ్ణి, వహమానః = మోయుచు, పూర్వమ్ = తూర్పుదైన, మహోదధిమ్ = మహాసముద్రమును గూర్చి, అగమత్ = వెళ్ళెను.

తా. వాలి ఉత్తరసముద్రమునందు సంధ్యోపాసన చేసి రావణుణ్ణి మోసికొనుచూ తూర్పు సముద్రమునకు వెళ్ళెను. 31

మూ. తత్రాపి సంధ్యామన్వాస్య వాసవిః స హరీశ్వరః,
కిష్కిన్ధామభితో గృహ్య రావణం పునరాగమత్. 32

ప్ర. అ. వాసవిః = ఇంద్రుని కుమారుడైన, సః హరీశ్వరః = ఆ వాలి, తత్రాపి = అక్కడ కూడ, సంధ్యామ్ = సంధ్యను, అన్వాస్య = ఉపాసించి, రావణమ్ = రావణుణ్ణి, గృహ్య = గ్రహించి, పునః = తిరిగి, కిష్కిన్ధామ్ అభితః = కిష్కింధను గూర్చి, ఆగమత్ = వచ్చెను.

తా. ఇంద్రుని పుత్రుడైన ఆ వాలి అక్కడ కూడ సంధ్యోపాసన చేసి రావణుణ్ణి తీసికొని కిష్కింధవైపు వెళ్లెను. 32

మూ. చతుర్ష్వపి సముద్రేషు సంధ్యామన్వాస్య వానరః,
రావణోద్వహనశ్రాన్తః కిష్కిన్ధోపవనేఽపతత్. 33

ప్ర. అ. వానరః = వాలి, చతుర్షు = నాలుగు, సముద్రేషు అపి = సముద్రములయందూ కూడ, సంధ్యామ్ = సంధ్యను, అన్వాస్య = ఉపాసించి, రావణోద్వ

అయి ఉన్నాను, యుద్ధేప్సుః = యుద్ధము పొందదలచినవాడనై, ఇహ = ఇక్కడికి, సంప్రాప్తః = వచ్చినాను, సః = అట్టి నేను, త్వయా = నీచేత, ఆసాదితః = పీడింపబడితిని.

**తా.** మహేంద్రునివంటి వానరేంద్రా! నేను రాక్షసరాజునైన రావణుడను. యుద్ధముకొరకై ఇక్కడికి వచ్చినాను. అట్టి నన్ను నీ వీ విధముగా పీడించితివి. 36

మూ. అహో బలమహో వీర్య మహో గామ్భీర్యమేవ చ,
యేనాహం పశువద్గృహ్య భ్రామితశ్చతురోఽర్ణవాన్. 37

ప్ర. అ. బలమ్ = బలము, అహో = ఎంత ఆశ్చర్యకరమైనది? వీర్యమ్ = వీర్యము, అహో = ఎంత ఆశ్చర్యకరమైనది! గామ్భీర్యమ ఏవ చ = గాంభీర్యము కూడ, అహో = ఎంత ఆశ్చర్యకరము! యేన = ఏ నీచేత, అహమ్ = నేను, పశువత్ = పశువు వలె, గృహ్య = గ్రహించి, చతురః = నాలుగు, అర్ణవాన్ = సముద్రములను, భ్రామితః = త్రిప్పబడితినో.

**తా.** నీవు నన్ను పశువును వలె పట్టి నాలుగు సముద్రములు త్రిప్పించినావు. ఏమి బలము! ఏమి పరాక్రమము! ఏమి గాంభీర్యము! 37

మూ. ఏవమశ్రాన్తవద్వీర శీఘ్రమేవ మహార్ణవాన్,
మాం చైవోద్వహమానస్తు కోఽన్యో వీరః క్రమిష్యతి. 38

ప్ర. అ. వీర = వీరుడా! ఏవమ్ = ఈ విధముగా, అశ్రాన్తవత్ = అలసట లేకుండగా, అన్యః = ఇతరుడైన, కః వీరః = ఏ వీరుడు, మాం చైవ = నన్ను కూడ, ఉద్వహమానః = మోయుచు, శీఘ్రమేవ = శీఘ్రముగా, మహార్ణవాన్ = మహాసముద్రములను, క్రమిష్యతి = దాటగలడు?

**తా.** వీరుడా! ఈ విధముగా అలసట లేకుండ, నన్ను కూడ మోయుచు మరొక ఏ వీరుడు శీఘ్రముగా మహాసముద్రములకు వెళ్ళగలడు? 38

మూ. త్రయాణామేవ భూతానాం గతిరేషా ప్లవంగమ,
మనోనిలసుపర్ణానాం తవ చాత్ర న సంశయః. 39

ఉభౌ = ఇద్దరూ, అగ్నిమ్ = అగ్నిని, ప్రజ్వాలయిత్వా = మండింపచేసి, పరస రమ్ = పరస్పరము, పరిష్వజ్య = కౌగలించుకొని, భ్రాతృత్వమ్ = భ్రాతృత మును, ఉపసంపన్నౌ = పొందిరి.

తా. పిమ్మట ఆ వాలిరావణులు అగ్నిని రగిల్చి, పరస్పరము కౌగలిం కొని భ్రాతృత్వమును (సోదరస్నేహమును) పొందిరి. 4

మూ. అన్యోన్యం లమ్బితకరౌ తతస్తౌ హరిరాక్షసౌ,
కిష్కిన్ధాం విశతుర్హృష్టౌ సింహౌ గిరిగుహామివ. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తౌ = ఆ, హరిరాక్షసౌ = వానరరాక్షసుల అన్యోన్యమ్ = పరస్పరము, లమ్బితకరౌ = పట్టుకొనబడిన హస్తములు గలవారై హృష్టౌ = సంతోషించినవారై, సింహౌ = సింహములు, గిరిగుహామివ = పర్వ గుహను వలె, కిష్కిన్ధామ్ = కిష్కింధను, విశతుః = ప్రవేశించిరి.

తా. పిమ్మట ఆ వాలిరావణులు పరస్పరము చేతులు కలిపి సంతోషించు రెండు సింహములు పర్వతగుహలో ప్రవేశించినట్లు కిష్కింధలో ప్రవేశించిరి. 4

మూ. స తత్ర మాసముషితః సుగ్రీవ ఇవ రావణః,
అమాత్యైరాగతైర్నీతస్త్రైలోక్యోత్సాదనార్థిభిః. 4

ప్ర. అ. సః రావణః = ఆ రావణుడు, తత్ర = అక్కడ, సుగ్రీవః ఇవ = సుగ్రీవుడు వలె, మాసమ్ = మాసమును, ఉషిత్వా = నివసించి, ఆగతైః = వచ్చిన, త్రైలోక్యోత్సాదనార్థిభిః = మూడు లోకములను పీడించుటకు కోరుచున్న అమాత్యైః = అమాత్యులచేత, నీతః = తీసికొని వెళ్ళబడినాడు

తా. ఆ రావణుడు అక్కడ సుగ్రీవుడు వలె (సోదరుడు వలె) ఒ మాసము ఉండెను. ఇంతలో మూడు లోకములను పీడింపవలె నని కోరిక గ అమాత్యులు వచ్చి అతనిని తీసికొని వెళ్ళిరి. 4

మూ. ఏవమేతత్పురావృత్తం వాలినా రావణః ప్రభో,
ధర్షితశ్చ వృతశ్చాపి భ్రాతా పావకసంనిధౌ. 4

ప్ర అ. ప్రభో = ప్రభువైన రామా! ఏవమ్ = ఇట్లు, ఏతత్ = ఇది పురా = పూర్వము, వృత్తమ్ = జరిగినది. రావణః = రావణుడు, వాలినా = వా

# అథ పఞ్చత్రింశః సర్గః

[రావణుడు ప్రశ్నించగా అగస్త్యుడు హనుమంతుని జన్మపరాక్రమాదులను వర్ణించి చెప్పుట].

మూ. అపృచ్ఛత తదా రామో దక్షిణాశాశ్రయం మునిమ్,
ప్రాఞ్జలిర్వినయోపేత ఇదమాహ వచోఽర్థవత్. 1

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, దక్షిణాశాశ్రయమ్ = దక్షిణ దిక్కు ఆశ్రయముగా గల, మునిమ్ = మునిని, అపృచ్ఛత్ = అడిగెను. ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, వినయోపేతః = వినయముతో కూడినవాడై, అర్థవత్ = అర్థము గల, ఇదం వచః = ఈ వచనమును, ఆహ = పలికెను.

తా. అప్పుడు రాముడు అగస్త్యుణ్ణి ప్రశ్నించెను. వినయవంతుడై అంజలి ఘటించి అర్థయుక్తమైన వచనమును ఇట్లు పలికెను. 1

మూ. అతులం బలమేతద్వై వాలినో రావణస్య చ,
న త్వేతాభ్యాం హనుమతా సమం త్వితి మతిర్మమ. 2

ప్ర. అ. వాలినః = వాలియొక్క, రావణస్య చ = రావణునియొక్క, ఏతత్ = ఈ, బలమ్ = జలము, అతులమ్ = సాటి లేనిది. తు = కాని, ఏతాభ్యామ్ = వీరిద్దరియొక్క బలము, హనుమతా = హనుమంతునితో, న సమమ్ = సమానమైనది కాదు, ఇతి = అని, మమ = నాయొక్క, మతిః = బుద్ధి.

తా. వాలి బలము, రావణుని బలము సాటిలేనిదే. కాని వీళ్ళిద్దరి బలమూ హనుమంతుని బలముతో సమానము కాదని నా అభిప్రాయము. 2

మూ. శౌర్యం దాక్ష్యం బలం ధైర్యం ప్రాజ్ఞతా నయసాధనమ్,
విక్రమశ్చ ప్రభావశ్చ హనూమతి కృతాలయాః. 3

ప్ర. అ. సేనాగ్రగాః = సేనకు ముందు నడచివచ్చిన, మన్త్రిసుతాః = మంత్రుల కుమారులు, కింకరాః = కింకరులు, రావణాత్మజః = రావణుని కుమారుడైన అక్షుడు, ఏతే = వీరు, తత్ర = అక్కడ, ఏకేన = ఒక్క, హనుమతా = హనుమంతుని చేత, వినిపాతితాః = పడగొట్టబడినారు.

తా. అక్కడ ఒక్క హనుమంతుడు సేనానాయకులైన మంత్రికుమారులను, కింకరులను, అక్షకుమారుని చంపినాడు. 6

మూ. భూయో బన్ధాద్విముక్తేన భాషయిత్వా దశాననమ్,
లఙ్కా భస్మీకృతా యేన పావకేనేవ మేదినీ. 7

ప్ర. అ. భూయః = మరల, బన్ధాత్ = బంధమునుండి, విముక్తేన = విడవబడిన, యేన = ఎవనిచేత, దశాననమ్ = రావణునిగూర్చి, ఆభాష్య = పలికి, మేదినీ = భూమి, పావకేనేవ = అగ్నిచేత వలె, లఙ్కా = లంక, భస్మీకృతా = భస్మముచేయబడినదో.

తా. బంధమునుండి విముక్తుడై ఇతడు మరల రావణునితో మాటలాడి, అగ్ని భూమిని భస్మము చేసినట్లు లంకను భస్మముచేసెను. 7

మూ. న కాలస్య న శక్రస్య న విష్ణోర్విత్తపస్య చ,
కర్మాణి తాని శ్రూయన్తే యాని యుద్ధే హనూమతః. 8

ప్ర. అ. యుద్ధే = యుద్ధమునందు, హనూమతః = హనుమంతుని యొక్క, యాని = ఏ, కర్మాణి = పనులు, శ్రూయన్తే = వినబడుచున్నవో, తాని = అవి, కాలస్య = యమునివి, న = వినబడుటలేదు. శక్రస్య = ఇంద్రునివి, న = వినబడుటలేదు. విష్ణోః = విష్ణువుయొక్క కర్మలు, న = వినబడుటలేదు. విత్తపస్య చ = కుబేరునివి మాడ, న = వినబడుటలేదు.

తా. యుద్ధములో హనుమంతుడు ఎట్టి పనులు చేసెనో అట్టి పనులు యముడు గాని, ఇంద్రుడు గాని, విష్ణువు గాని, కుబేరుడు కాని చేసినట్లు వినబడుటలేదు. 8

మూ. ఏతస్య బాహువీర్యేణ లఙ్కా సీతా చ లక్ష్మణః,
ప్రాప్తా మయా జయశ్చైవ రాజ్యం మిత్రాణి బాన్ధవాః. 9

ప్ర. అ హనుమాన్ = హనుమంతుడు, ఆత్మనః = తనయొక్క, బలమ్ = బలమును, న హి వేదితవాన్ = తెలిసికొనలేదు అని, మన్యే = తలచుచున్నాను యత్ = ఎందువలన, ఆత్మనః = తనకు, జీవితేష్టమ్ = జీవితము వలె ఇష్టుడైన వానరాధిపమ్ = సుగ్రీవుణ్ణి, క్లిశ్యన్తమ్ = బాధపడుచుండగా, దృష్టవాన్ = చూచినాడో.

తా. హనుమంతుడు తన జీవితముతో సమానముగా ఇష్టుడైన సుగ్రీవుడు బాధపడుచుండగా చూచుచు ఊరుకొన్నాడనగా-అతనికి తన బలము ఎంతటిదో తెలియలేదు అని నేను అనుకొనుచున్నాను. 1

మూ. ఏతన్మే భగవన్సర్వం హనూమతి మహామునే,
విస్తరేణ యథాతత్త్వం కథయామరపూజిత. 1

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! అమరపూజిత = దేవతలచేత పూజింపబడినవాడా! మహామునే = మహామునీ! హనూమతి = హనుమంతుని విషయమునందు ఏతత్ = దీనిని, సర్వమ్ = సమస్తమును, యథాతత్త్వమ్ = యథార్థముగా, విస్తరేణ = విస్తారముగా, మే = నాకు, కథయ = చెప్పుము.

తా. పూజ్యుడా! దేవతలచేత పూజింపబడువాడా! మహామునీ! హనుమంతునికి సంబంధించిన ఈ విషయము నంతనూ నాకు సవిస్తరముగా, ఉన్నది ఉన్నట్లు చెప్పుము. 13

మూ. రాఘవస్య వచః శ్రుత్వా హేతుయుక్తమృషిస్తతః,
హనూమతః సమక్షం తమిదం వచన మబ్రవీత్. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఋషిః = ఋషి, రాఘవస్య = రాముని యొక్క, హేతుయుక్తమ్ = హేతువులతో కూడిన, వచః = వచనమును, శ్రుత్వా = విని, హనూమతః = హనుమంతునియొక్క, సమక్షమ్ = ఎదుటనే, తమ్ = ఆ రాముణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు అగస్త్యుడు హేతుయుక్తమైన రాముని మాట విని హనుమంతుని ఎదుటనే ఇట్లు పలికెను. 14

మూ. సత్యమేతద్రఘుశ్రేష్ఠ యద్బ్రవీషి హనూమతి,
న బలే విద్యతే తుల్యో న గతౌ న మతౌ పరః. 15

మూ. యది వాస్తి త్వభిప్రాయః సంశ్రోతుం తవ రాఘవ,
సమాధాయ మతిం రామ నిశామయ వదామ్యహమ్. 18

ప్ర. అ. రాఘవ = రఘువంశమునందు పుట్టినవాడా! రామ = రామా! సంశ్రోతుమ్ = వినుటకు, తవ = నీకు, అభిప్రాయః = అభిప్రాయము, అస్తి యది వా = ఉన్నచో, మతిమ్ = బుద్ధిని, సమాధాయ = సావధానము చేసికొని, నిశామయ = వినుము. అహమ్ = నేను, వదామి = చెప్పుచున్నాను.

తా. రామా! నీకు వినవలె నని కోరిక ఉన్నచో సావధానచిత్తముతో వినుము; చెప్పెదను. 18

మూ. సూర్యదత్తవరస్వర్ణః సుమేరుర్నామ పర్వతః,
యత్ర రాజ్యం ప్రశాస్త్యస్య కేసరీ నామ వై పితా. 19

ప్ర. అ. సూర్యదత్తవరస్వర్ణః = సూర్యునిచేత ఇవ్వబడిన వరముచేత బంగారువికారమైన, సుమేరుః నామ = సుమేరువు అను, పర్వతః = పర్వతమున్నది, యత్ర = ఎక్కడ, అస్య = ఈతనియొక్క, పితా = తండ్రియైన, కేసరీ నామ = కేసరి అను నతడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రశాస్తి = పాలించుచున్నాడో!

తా. సూర్యు డిచ్చిన వరముచేత సువర్ణమయమైన మేరు పర్వత మున్నది. అక్కడ ఈ హనుమంతుని తండ్రియైన కేసరి రాజ్యమును పాలించుచున్నాడు. 19

మూ. తస్య భార్యా బభూవేష్టా హ్యఞ్జనేతి పరిశ్రుతా,
జనయామాస తస్యాం వై వాయురాత్మజముత్తమమ్. 20

ప్ర. అ. అఞ్జనా ఇతి = ఆంజన అని, పరిశ్రుతా = ప్రసిద్ధురాలైన, తస్య = అతనియొక్క, ఇష్టా = ఇష్టురాలైన, భార్యా = భార్య, బభూవ = ఉండెను. తస్యామ్ = అమెయందు, వాయుః = వాయువు, ఉత్తమమ్ = ఉత్తముడైన, ఆత్మజమ్ = కుమారుణ్ణి, జనయామాస వై = పుట్టించెను.

తా. ఆతనికి అంజన అను పేరుతో ప్రసిద్ధి చెందిన ఇష్టురాలైన భార్య ఉండెను. ఆమెయందు వాయుదేవుడు ఉత్తముడైన పుత్రుణ్ణి పుట్టించెను. 20

తా. అప్పుడు ఆ శిశువునకు జపాపుష్పముల ప్రోగువలె ఉన్న ఉదయించు చున్న సూర్యుడు కనబడెను. అది ఫల మనుకొని దానియందు ఆసక్తిచేత ఆ శిశువు సూర్యుని దగ్గరకు ఎగిరెను. 23

మూ. బాలార్కాభిముఖో బాలో బాలార్క ఇవ మూర్తిమాన్,
గ్రహీతుకామో బాలార్కం ప్లవతేఽమ్బరమధ్యగః. 24

ప్ర. అ. మూర్తిమాన్ = మూర్తిగల, బాలార్కః ఇవ = బాలసూర్యుడు వలె ఉన్న, బాలః = ఆ బాలుడు, బాలార్కమ్ = బాలార్కుణ్ణి, గ్రహీతుకామః = గ్రహించుటకు కోరికగలవాడై, అమ్బరమధ్యగః = ఆకాశమధ్యమును పొందిన వాడై, బాలార్కాభిముఖః = బాలసూర్యునికి అభిముఖుడై, ప్లవతే = ఎగురుచున్నాడు.

తా. రెండవ బాలసూర్యుడు వలె ఉన్న ఆ బాలుడు బాలార్కుణ్ణి గ్రహించు కోరికతో, బాలార్కునికి అభిముఖుడై అకాశమధ్యమునందు ఎగిరెను. 24

మూ. ఏతస్మిన్ ప్లవమానే తు శిశుభావే హనూమతి,
దేవదానవయక్షాణాం విస్మయః సుమహానభూత్. 25

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, హనూమతి = హనుమంతుడు, శిశుభావే = శైశవమునందు, ప్లవమానే = ఎగురుచుండగా, దేవదానవయక్షాణామ్ = దేవతలకు, దానవులకు, యక్షులకు, సుమహాన్ = చాల గొప్పదైన, విస్మయః = ఆశ్చర్యము, అభూత్ = ఆయెను.

తా. హనుమంతుడు ఈవిధముగా శైశవమునందు ఎగురుచుండగా దేవ-దానవ-యక్షులు చాల ఆశ్చర్యము చెందిరి 25

మూ. నాప్యేవం వేగవాన్ వాయుర్గరుడో న మనస్తథా,
యథాయం వాయుపుత్రస్తు క్రమతేఽమ్బరముత్తమమ్.

ప్ర. అ. అయమ్ = ఈ, వాయుపుత్రః తు = వాయుపుత్రుడు, ఉత్తమమ్ = చాల ఎత్తైన, అమ్బరమ్ = ఆకాశమును, యథా = ఎట్లు, క్రమతే = ఆక్రమించు చున్నాడో, ఏవమ్ = ఇట్లు, వాయుః అపి = వాయువు కూడ, వేగవాన్ = వేగము గలవాడు, న = కాడు. గరుడః = గరుత్మంతుడు, న = కాడు. తథా = మరియు, మనః = మనస్సు, న = కాదు.

క్రామన్ = ఆక్రమించుచు, అమ్బరమ్ = ఆకాశమును, గతః = పొందినవాడై, భాస్కరాభ్యాశమ్ = సూర్యుని సమీపమును, ఆగతః = పొందినాడు.

తా. ఆ శిశువు తండ్రియైన వాయువు బలమువలనా, బాల్యమువలనా, కొన్నివేల యోజనముల దూరమును ఆక్రమించుచు, ఆకాశములో సూర్యునిదగ్గరకు వెళ్లెను. 29

మూ. శిశురేష త్వదోషజ్ఞ ఇతి మత్వా దివాకరః,
కార్యం చాస్మిన్ సమాయత్తమిత్యేవం న దదాహ సః.

ప్ర. అ. శిశుః = శిశువైన, ఏషః = ఇతడు, అదోషజ్ఞః = దోషములు తెలియనివాడు, ఇతి = అనీ, అస్మిన్ = దీనియందు, కార్యం చ = దేవకార్యము కూడ, సమాయత్తమ్ = ఆధారపడి ఉన్నది, ఇత్యేవమ్ = ఇట్లు, మత్వా = తలచి, సః దివాకరః = ఆ సూర్యుడు, న దదాహ = కాల్చలేదు.

తా. "ఇతడు శిశువు; తప్పొప్పులు తెలియనివాడు. ఇతడు దేవతాకార్యము కూడ చేయవలసి ఉన్నది". అని ఆలోచించి సూర్యుడు అతనిని కాల్చలేదు. 30

మూ. యమేవ దివసం హ్యేష గ్రహీతుం భాస్కరం ప్లుతః,
తమేవ దివసం రాహుర్జిఘృక్షతి దివాకరమ్. 31

ప్ర. అ. ఏషః = ఇతడు, యమ్ ఏవ = ఏ, దివసమ్ = దివసమును, భాస్కరమ్ = సూర్యుణ్ణి, గ్రహీతుమ్ = గ్రహించుటకు, ప్లుతః = ఎగిరినాడో, తం దివసమ్ ఏవ = ఆ రోజునే, రాహుః = రాహువు, దివాకరమ్ = సూర్యుణ్ణి, జిఘృక్షతి = గ్రహించ దలచుచున్నాడు.

తా. ఈ హనుమంతుడు సూర్యునిదగ్గరకు ఎగిరిన దివసమునందే రాహువు సూర్యుణ్ణి పట్టుకొనుటకు వచ్చెను. 31

మూ. అనేన చ పరామృష్టో రాహుః సూర్యరథోపరి,
అపక్రాన్తస్తతస్త్రస్తో రాహుశ్చన్ద్రార్కమర్దనః. 32

ప్ర. అ. సూర్యరథోపరి = సూర్యుని రథము పైభాగమునందు, రాహుః = రాహువు, అనేన = ఇతనిచేత, పరామృష్టః = స్పృశించబడెను. చన్ద్రార్క

సూర్యమ్=సూర్యుణ్ణి, జిఘృక్షుః=పట్టుకొన దలచినవాడనై, ఆగతః=వచ్చినాను. అథ = అనంతరము, అన్యః = మరియొక, రాహుః = రాహువు, ఆసాద్య = సమీపించి, సహసా = వెంటనే, రవిమ్ = సూర్యుణ్ణి, జగ్రాహ = పట్టుకొనెను.

తా. ఈ రోజున పర్వకాలమునందు సూర్యుణ్ణి పట్టుకొనుటకై నేను వచ్చుసరికి మరొకడు సూర్యుణ్ణి పట్టుకొనినాడు. 35

మూ. స రాహోర్వచనం శ్రుత్వా వాసవః సంభ్రమాన్వితః,
ఉత్పపాతాసనం హిత్వా ఉద్వహన్ కాఞ్చనీం స్రజమ్.

ప్ర. అ. సః వాసవః = ఆ ఇంద్రుడు, రాహోః = రాహువుయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సంభ్రమాన్వితః=తొందరతో కూడినవాడై, కాఞ్చనీమ్=బంగారు, స్రజమ్ = మాలికను, ఉద్వహన్ = ధరించి, ఆసనమ్ = ఆసనమును, హిత్వా = విడచి, ఉత్పపాత = లేచెను.

తా. ఆ మాటలు విని ఇంద్రుడు తొందరపడుచు, బంగారుమాల ధరించి ఆసనమును విడచి వెంటనే లేచెను. 36

మూ. తతః కైలాసకూటాభం చతుర్దన్తం మదస్రవమ్,
శృఙ్గారధారిణం ప్రాంశుం స్వర్ణఘణ్టాట్టహాసినమ్. 37
ఇన్ద్రః కరీన్ద్రమారుహ్య రాహుం కృత్వా పురఃసరమ్,
ప్రాయాద్యత్రాభవత్సూర్యః సహానేన హనూమతా. 38

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఇన్ద్రః = ఇంద్రుడు, కైలాసకూటాభమ్= కైలాసశిఖరము వంటి కాంతిగల, చతుర్దన్తమ్ = నాలుగు దంతములు గల, మదస్రవమ్ = మదమును స్రవించుచున్న, శృఙ్గారధారిణమ్=అలంకారమును ధరించుచున్న, ప్రాంశుమ్ = ఎత్తైన, స్వర్ణఘణ్టాట్టహాసినమ్ = బంగారు ఘంటల అట్టహాసము (పెద్దనవ్వు) గల, కరీన్ద్రమ్ = గజేంద్రమును, ఆరుహ్య = ఎక్కి, రాహుమ్ = రాహువును, పురఃసరమ్=ముందు నడచువానినిగా, కృత్వా=చేసి, సూర్యః=సూర్యుడు, అనేన=ఈ, హనూమతా సహ=హనుమంతునితో కూడ, యత్ర=ఎక్కడ, అభవత్ = ఉండెనో అక్కడికి, ప్రాయాత్=వెళ్లెను.

తా. పిమ్మట ఇంద్రుడు కైలాసశిఖరము వంటి కాంతి గల నాలుగు

(రాహువు), పరాఙ్ముఖః = వెనుకకు ముఖము గలవాడై, పరావృత్తః=వెనుకకు తిరిగినాడు.

తా. సూర్యుణ్ణి విడచి ఆ విధముగా తనమీదికి పరుగెత్తి వచ్చుచున్న హనుమంతుణ్ణి చూచి రాహువు ముఖము వెనుకకు చేసి, వెనుకకు మరలెను. 41

మూ. ఇన్ద్రమాశంసమానస్తు త్రాతారం సింహికాసుతః,
ఇన్ద్ర ఇన్ద్రేతి సంత్రాసాన్ముహుర్ముహురభాషత. 42

ప్ర. అ. సింహికాసుతః = రాహువు, ఇన్ద్రమ్ = ఇంద్రుణ్ణి, త్రాతారమ్= రక్షకుణ్ణిగా, ఆశంసమానః = కోరుచు, సంత్రాసాత్ =భయమువలన, ఇన్ద్ర ఇన్ద్ర ఇతి=ఇంద్రా, ఇంద్రా అని, ముహుర్ముహుః=మాటిమాటికి, అభాషత=పలికెను.

తా. రాహువు తనను ఇంద్రుడు రక్షించవలె నని కోరుచు, భయముతో ఇంద్రా ! ఇంద్రా ! అని మాటిమాటికి అరచెను. 42

మూ. రాహోర్విక్రోశమానస్య ప్రాగేవాలక్షితం స్వరమ్,
శ్రుత్వేన్ద్రోవాచ మా భైషీరహమేనం నిషూదయే. 43

ప్ర. అ. ఆక్రోశమానస్య = అరచుచున్న, రాహోః = రాహువుయొక్క, ప్రాగేవ = పూర్వమే, ఆలక్షితమ్ = గుర్తించబడిన, స్వరమ్ = స్వరమును, శ్రుత్వా = విని, ఇన్ద్రః=ఇంద్రుడు, మా భైషీః=భయపడకుము. అహమ్=నేను, ఏనమ్ = వీనిని, నిషూదయే = సంహరించెదను అని, ఉవాచ = పలికెను.

తా. రాహువు అరచుచుండగా ఇంద్రుడు పూర్వపరిచితమైన ఆతని స్వరమును గుర్తించి, "భయపడకుము; నేను ఈతనిని సంహరించెదను"అని పలికెను. 43

మూ. ఐరావతం తతో దృష్ట్వా మహత్తదిదమిత్యపి,
ఫలం మత్వా హస్తిరాజమభిదుద్రావ మారుతిః. 44

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మారుతిః=హనుమంతుడు, ఐరావతమ్= ఐరావతమును, దృష్ట్వా = చూచి, ఇదమపి = ఇది కూడ, మహత్ = గొప్ప, ఫలమ్ = ఫలము, ఇతి = అని, మత్వా = తలచి, హస్తిరాజమ్ = ఆ గజరాజును గూర్చి, అభిదుద్రావ = పరుగెత్తెను.

తా. అప్పుడు ఇతడు ఇంద్రుని వజ్రము దెబ్బకు పర్వతముమీద పడిపోయెను. పడిపోయినప్పుడు ఇతని ఎడమ దౌడ విఱిగెను. 47

మూ. తస్మింస్తు పతితే చాపి వజ్రతాడనవిహ్వలే,
చుక్రోధేన్ద్రాయ పవనః ప్రజానామహితాయ సః. 48

ప్ర. అ. తస్మిన్ = అతడు, వజ్రతాడనవిహ్వలే = వజ్రముచేత కొట్టుటచేత వ్యాకులుడై, పతితే చాపి = పడిపోయినవాడగుచుండగా, సః = ఆ, పవనః = వాయువు, ప్రజానామ్ = ప్రజలయొక్క, అహితాయ = అహితముకొరకు, ఇన్ద్రాయ = ఇంద్రునికొరకు, చుక్రోధ = కోపించెను.

తా. వజ్రము దెబ్బ తగిలి వ్యాకులుడైన హనుమంతుడు పడిపోగానే వాయువు ప్రజలకు కష్టము కలుగు విధముగ ఇంద్రునిమీద కోపించెను. 48

మూ. ప్రచారం స తు సంగృహ్య ప్రజాస్వన్తర్గతః ప్రభుః,
గుహాం ప్రవిష్టః స్వసుతం శిశుమాదాయ మారుతః. 49

ప్ర. అ. ప్రజాసు = ప్రజలలో, అన్తర్గతః = అంతర్గతుడైన, ప్రభుః = సమర్థుడైన, సః మారుతః = ఆ వాయువు, ప్రచారమ్ = సంచారమును, సంగృహ్య = సంగ్రహించి, శిశుమ్ = శిశువైన, స్వసుతమ్ = తన కుమారుణ్ణి, ఆదాయ = గ్రహించి, గుహామ్ = గుహను, ప్రవిష్టః = ప్రవేశించినాడు.

తా. ప్రజలలోపల నివసించు సర్వసమర్థుడైన ఆ వాయువు, తన సంచారమును ఆపివేసి, శిశువైన తన కుమారుణ్ణి తీసికొని ఒక గుహలో ప్రవేశించెను. 49

మూ. విణ్మూత్రాశయమావృత్య ప్రజానాం పరమార్తికృత్,
రురోధ సర్వభూతాని యథా వర్షాణి వాసవః. 50

ప్ర. అ. ప్రజానామ్ = ప్రజలయొక్క, విణ్మూత్రాశయమ్ = మలమూత్రస్థానమును, ఆవృత్య = అడ్డగించి, పరమార్తికృత్ = గొప్ప పీడను చేయుచున్నవాడై, వాసవః = ఇంద్రుడు, వర్షాణి యథా = వర్షములను వలె, సర్వభూతాని = సకలప్రాణులను, రురోధ = కదలజాలకుండునట్లు చేసెను.

తా. ప్రజల మలమూత్రస్థానములను అడ్డగించి, గొప్ప బాధ కలిగించుచు సకలభూతములను, ఇంద్రుడు వర్షములను నిరోధించి నట్లు నిరోధించెను. 50

తా. పిమ్మట గంధర్వులు, దేవతలు, అసురులు, మనుష్యులు దుఃఖా క్రాంతులై, సుఖమును కోరుచు బ్రహ్మదేవునివద్దకు వెళ్ళిరి. 53

మూ. ఊచుః ప్రాఞ్జలయో దేవా మహోదరనిభోదరాః,
త్వయా తు భగవన్ సృష్టాః ప్రజానాథ చతుర్విధాః. 54

ప్ర. అ. మహోదరనిభోదరాః = మహోదరునితో సమానమైన పెద్ద ఉదరములు గల, దేవాః = దేవతలు, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్లు గలవారై, ఊచుః = పలికిరి. భగవన్ = భగవంతుడా! ప్రజానాథ = ప్రజాపతీ! త్వయా తు = నీచేతనే, చతుర్విధాః = నాలుగు విధములైన మేము, సృష్టాః = సృజింపబడితిమి.

తా. మహోదరుడు వలె పెద్ద పొట్టలు గల ఆ దేవతలు ఇట్లు పలికిరి- "పూజ్యుడవైన బ్రహ్మదేవా! నాలుగు విధములైన ప్రజలను నీవే సృజించితివి. 54

మూ. త్వయా దత్తోఽయమస్మాకమాయుషః పవనః పతిః,
సోఽస్మాన్ ప్రాణేశ్వరో భూత్వా కస్మాదేషోఽద్య సత్తమ,
రురోధ దుఃఖం జనయన్నన్తఃపుర ఇవ స్త్రియః,
తస్మాత్త్వాం శరణం ప్రాప్తా వాయునోపహతా వయమ్.
వాయుసంరోధజం దుఃఖమిదం నో నుద దుఃఖహన్.

ప్ర. అ. అయమ్ = ఈ, పవనః = వాయువు, అస్మాకమ్ = మాయొక్క, ఆయుషః = ఆయుర్దాయముయొక్క, పతిః = ప్రభువుగా, దత్తః = ఇవ్వబడినాడు. సత్తమ = చాల శ్రేష్ఠుడా! సః ఏషః = అట్టి ఈ వాయువు, ప్రాణేశ్వరః = ప్రాణములకు అధిపతిగా, భూత్వా = అయి ఉండి, కస్మాత్ = ఎందువలన, అద్య = ఇప్పుడు, దుఃఖమ్ = దుఃఖమును, జనయన్ = కలిగించుచు, అన్తఃపురే = అంతఃపురమునందు, స్త్రియః ఇవ = స్త్రీలను వలె, అస్మాన్ = మమ్ములను, రురోధ = నిరోధించెను? తస్మాత్ = ఆ కారణమువలన, వాయునా = వాయువుచేత, ఉపహతాః = కొట్టబడిన, వయమ్ = మేము, త్వామ్ = నిన్ను, శరణం ప్రాప్తాః = శరణు జొచ్చినాము. దుఃఖహన్ = దుఃఖములను తొలగించువాడా! నః = మాయొక్క, వాయుసంరోధజమ్ = వాయు నిరోధమువలన కలిగిన, ఇదం దుఃఖమ్ = ఈ దుఃఖమును, నుద = పోగొట్టుము.

ప్రభువైన, ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, రాహోః = రాహువుయొక్క, వచనమ్ = వచనమును, ఆస్థాయ = అవలంబించి, అద్య = ఇప్పుడు, నిపాతితః = పడగొట్టబడినాడు. తతః = ఆ కారణమువలన, సః అనిలః = ఆ వాయువు, కుపితః = కోపించినాడు.

తా. రాహువు మాటలు విని దేవతల ప్రభువైన ఇంద్రుడు నేడు, వాయుదేవుని పుత్రుని పడగొట్టినాడు. అందుచేత అతడు కోపించినాడు. 59

మూ. అశరీరః శరీరేషు వాయుశ్చరతి పాలయన్, 60
శరీరం హి వినా వాయుం సమతాం యాతి దారుభిః.

ప్ర. అ. వాయుః = వాయువు, అశరీరః = శరీరము లేనివాడై, పాలయన్ = పాలించుచు, శరీరేషు = శరీరములయందు, చరతి = సంచరించుచున్నాడు. వాయుం వినా = వాయువు లేకుండగా, శరీరమ్ = శరీరము, దారుభిః = కట్టెలతో, సమతామ్ = సమత్వమును, యాతి = పొందును.

తా. శరీరము లేని వాయువు శరీరమును పాలించుచు దానిలో సంచరించుచుండును. వాయువు లేనిచో శరీరము కట్టెవలె అయిపోవును. 60

మూ. వాయుః ప్రాణః సుఖం వాయుర్వాయుః సర్వమిదం జగత్,
వాయునా సంపరిత్యక్తం న సుఖం విన్దతే జగత్.

ప్ర. అ. వాయుః = వాయువే, ప్రాణః = ప్రాణము. వాయుః = వాయువే, సుఖమ్ = సుఖము. వాయుః = వాయువే, సర్వమ్ = సమస్తమైన, ఇదం జగత్ = ఈ జగత్తు. వాయునా = వాయువుచేత, సంపరిత్యక్తమ్ = విడవబడిన, జగత్ = జగత్తు, సుఖమ్ = సుఖమును, న విన్దతే = పొందదు.

తా. వాయువే ప్రాణము. వాయువే సుఖము. ఈ సమస్తజగత్తూ వాయువే. వాయువు విడిచివేసినచో జగత్తుకు సుఖ ముండదు. 61

మూ. అద్యైవ చ పరిత్యక్తం వాయునా జగదాయుషా, 62
అద్యైవ తే నిరుచ్ఛ్వాసాః కాష్ఠకుడ్యోపమాః స్థితాః.

ప్ర. అ. జగత్ = జగత్తు, ఆయుషా = ఆయుర్దాయమైన, వాయునా = వాయువుచేత, అద్యైవ = ఇప్పుడే, పరిత్యక్తమ్ = విడవబడినది. అద్యైవ = ఇప్పుడే,

ప్రజలందరితోని కలిసి, మహేంద్రునిచేత కొట్టబడిన తన కుమారుణ్ణి తీసికొనివెళ్లి వాయువు ఉన్నచోటికి వెళ్ళెను. 64

మూ. తతోఽర్క వైశ్వానరకాఞ్చనప్రభం
సుతం తదోత్సఙ్గగతం సదాగతేః,
చతుర్ముఖో వీక్ష్య కృపామథాకరో
త్సదేవగన్ధర్వఋషియక్షరాక్షసైః. 65

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చత్రింశః సర్గః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, దేవగన్ధర్వఋషియక్షరాక్షసైః = దేవగంధర్వఋషియక్షరాక్షసులతో కూడిన, సః చతుర్ముఖః = ఆ బ్రహ్మదేవుడు, సదాగతేః = వాయువుయొక్క, ఉత్సఙ్గగతమ్ = ఒడిలో ఉన్న, అర్కవైశ్వానరకాఞ్చనప్రభమ్ = సూర్య-అగ్ని-సువర్ణముల కాంతి వంటి కాంతి గల, సుతమ్ = కుమారుణ్ణి, వీక్ష్య = చూచి, తదా = అప్పుడు, కృపామ్ = కృపను, అకరోత్ = చేసెను.

తా. పిమ్మట దేవ-గంధర్వ-ఋషి - యక్ష-రాక్షసులతో కలసి వెళ్ళిన బ్రహ్మదేవుడు వాయువు ఒడిలో ఉన్న. సూర్యాగ్నిసువర్ణముల కాంతి వంటి కాంతి గల అతని కుమారుణ్ణి చూచి జాలిపడెను. 65

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
ముప్పదియైదవ సర్గ సమాప్తము.

మూ తం తు వేదవిదా తేన లమ్బాభరణశోభినా,
వాయుముత్థాప్య హస్తేన శిశుం తం పరిమృష్టవాన్. ౩

ప్ర. అ. వేదవిదా = వేదములను ఎరిగిన, లమ్బాభరణశోభినా = వ్రేలాడుచున్న ఆభరణములతో ప్రకాశించుచున్న, తేన హస్తేన = ఆ హస్తముతో, తం వాయుమ్ = ఆ వాయువును, ఉత్థాప్య = లేవదీసి, తం శిశుమ్ = ఆ శిశువును పరిమృష్టవాన్ = స్పృశించినాడు.

తా. బ్రహ్మదేవుడు వేదములను ఎరిగిన, వ్రేలాడుచున్న ఆభరణములతో ప్రకాశించుచున్న హస్తముతో ఆ వాయువును పైకి లేవదీసి ఆ శిశువును స్పృశించెను. ౩

మూ. స్పృష్టమాత్రస్తతః సోఽయం సలీలం పద్మజన్మనా,
జలసిక్తం యథా సస్యం పునర్జీవితమాప్తవాన్. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పద్మజన్మనా = బ్రహ్మదేవునిచేత, సలీలమ్ = విలాసపూర్వకముగా, స్పృష్టమాత్రః = స్పృశించబడిన, సః అయమ్ = అట్టి ఈ శిశువు, జలసిక్తమ్ = నీటితో తడపబడిన, సస్యం యథా = సస్యము వలె, పునః = మరల, జీవితమ్ = జీవితమును, ఆప్తవాన్ = పొందినాడు.

తా. బ్రహ్మదేవుడు విలాసపూర్వకముగా స్పృశించగానే ఆ శిశువు నీరు చల్లిన సస్యము వలె మరల జీవితమును పొందెను. 4

మూ. ప్రాణవన్తమిమం దృష్ట్వా ప్రాణో గన్ధవహో ముదా,
చచార సర్వభూతేషు సంనిరుద్ధం యథా పురా. ౫

ప్ర. అ. ప్రాణః = ప్రాణస్వరూపుడైన, గన్ధవహః = వాయువు, ప్రాణవన్తమ్ = ప్రాణముగల, ఇమమ్ = ఈ శిశువును, దృష్ట్వా = చూచి, ముదా = సంతోషముతో, యథాపురా = పూర్వమునందు వలె, సంనిరుద్ధమ్ = శరీరములో నిరోధింపబడునట్లుగా, సర్వభూతేషు = సమస్త ప్రాణులయందు, చచార = సంచరించెను.

తా. ప్రాణస్వరూపుడైన వాయువు ఆ శిశువునకు ప్రాణము వచ్చుట చూచి

లారా! మహేశ్వరధనేశ్వరౌ = మహేశ్వర కుబేరులారా! జానతామ్ అపి = తెలిసినవారే అయినను, వః = మీకు, సర్వమ్ = సమస్తమును, వక్ష్యామి = చెప్పెదను. హితమ్ = హితము, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. ఓ! మహేంద్ర-అగ్ని-వరుణ-మహేశ్వర-కుబేరులారా! మీ కందరికీ ఈ విషయము తెలిసినదే అయినను చెప్పుచున్నాను. నేను చెప్పు హితమును వినండి. 8

మూ. అనేన శిశునా కార్యం కర్తవ్యం వో భవిష్యతి,
తద్దదధ్వం వరాన్ సర్వే మారుతస్యాస్య తుష్టయే. 9

ప్ర. అ. అనేన శిశునా = ఈ శిశువు చేత, వః = మీయొక్క, కార్యమ్ = కార్యము, కర్తవ్యమ్ = చేయదగినది, భవిష్యతి = కాగలదు, తత్ = ఆ కారణమువలన, సర్వే = అందరూ, అస్య = ఈ, మారుతస్య = వాయువుయొక్క, తుష్టయే = సంతోషముకొరకు, వరాన్ = వరములను, దదధ్వమ్ = ఇవ్వండి.

తా. ఈ శిశువు ముమ్ముందు మీ కార్యమును సాధించవలసింది ఉన్నది. అందువలనా, ఈ వాయుదేవుని సంతోషముకొరకు మీరందరూ ఇతనికి వరములను ఇవ్వండి. 9

మూ. తతః సహస్రనయనః ప్రీతియుక్తః శుభాననః,
కుశేశయమయీం మాలాముత్క్షిప్యేదం వచోఽబ్రవీత్. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శుభాననః = శుభమైన ముఖము గల, సహస్రనయనః = ఇంద్రుడు, ప్రీతియుక్తః = ప్రేమతో కూడినవాడై, కుశేశయమయీమ్ = బంగారు పద్మముల వికారమైన, మాలామ్ = మాలను, ఉత్క్షిప్య = ఎత్తి, ఇదం వచః = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట మంగళకరమైన ముఖముగల దేవేంద్రుడు ఆనందముతో బంగారు పద్మముల మాలను పైకి చూపి (ఇచ్చి) ఇట్లు పలికెను. 10

మూ. మత్కరోత్సృష్టవజ్రేణ హనురస్య యథా హతః,
నామ్నా వై కపిశార్దూలో భవితా హనుమానితి. 11

ప్ర. అ. శాస్త్రాణి = శాస్త్రములను, అధ్యేతుమ్ = చదువుటకొరకు, అస్య = వీనికి, యదా = ఎప్పుడు, శక్తిః = శక్తి, భవిష్యతి = కాగలదో, తదా = అప్పుడు, అస్య = వీనికి, శాస్త్రమ్ = శాస్త్రమును, దాస్యామి = ఇవ్వగలను, యేన = దేనిచేత, వాగ్మీ = ఉత్తమవాక్కు గలవాడు, భవిష్యతి = కాగలడో. శాస్త్రదర్శనే = శాస్త్రజ్ఞానమునందు, అస్య = ఇతనికి, సదృశః = సమానుడు, కశ్చిత్ = ఒక్కడూ కూడ, న భవితా చ = ఉండడు.

తా. శాస్త్రాధ్యయనము చేసే శక్తి వచ్చినపుడు ఇతనికి నేను శాస్త్రము నేర్పెదను. దానిచేత ఇతడు మాటలలో నేర్పరి కాగలడు. శాస్త్రజ్ఞానములో ఇతనిని పోలినవాడు ఉండడు. 14

మూ. వరుణశ్చ వరం ప్రాదాన్నాస్య మృత్యుర్భవిష్యతి,
వర్షాయుతశతేనాపి మత్పాశాదుదకాదపి. 15

ప్ర. అ. వరుణః చ = వరుణుడు కూడ, వరమ్ = వరమును, ప్రాదాత్ = ఇచ్చెను. వర్షాయుతశతేనాపి = నూరు ఆయుతముల సంవత్సరములచేత కూడ, మత్పాశాత్ = నా పాశమువలనా, ఉదకాదపి = ఉదకమువలనా, అస్య = ఇతనికి మృత్యుః = మృత్యువు, న భవిష్యతి = కలుగదు.

తా. పది లక్షల సంవత్సరాలకు కూడ నా పాశముచేత గాని, జలముచేత గాని ఇతనికి మృత్యువు కలగదు. 15

మూ. యమో దణ్డాదవధ్యత్వ మరోగత్వం చ దత్తవాన్,
వరం దదామి సంతుష్ట అవిషాదం చ సంయుగే. 16

ప్ర. అ. యమః = యముడు, దణ్డాత్ = దండమువలన, అవధ్యత్వమ్ = చంప శక్యము కాక పోవుటను, అరోగత్వం చ = రోగము లేకపోవుటను, దత్తవాన్ = ఇచ్చినాడు. సంతుష్టః = సంతోషించిన నేను, సంయుగే = యుద్ధమునందు, అవిషాదం చ = దిగులుపాటు లేకపోవుటను కూడ, వరమ్ = వరమును, దదామి = ఇచ్చుచున్నాను.

తా. యముడు సంతోషించి తన దండము వలన చావు లేకపోవుటను, రోగము కలుగకపోవుటను, యుద్ధములో దిగులుచెందకుండుటను వరముగా ఇచ్చెను. 16

మూ. మత్కృతాని చ శస్త్రాణి యాని దివ్యాని తాని చ,
తైరవధ్యత్వమాపన్నశ్చిరజీవీ భవిష్యతి. 20

దీర్ఘాయుశ్చ మహాత్మా చ బ్రహ్మా తం ప్రాబ్రవీద్వచః,
సర్వేషాం బ్రహ్మదణ్డానామవధ్యత్వం భవిష్యతి. 21

ప్ర. అ. మత్కృతాని = నాచేత తయారుచేయబడిన, యాని = ఏ, శస్త్రాణి = ఆయుధములు గలవో, తాని = ప్రసిద్ధములైన, యాని = ఏ, దివ్యాని దివ్యములైన శస్త్రము లున్నవో, తైః = వాటిచేత, అవధ్యత్వమ్ = వధింప శక్యము కాకపోవుటను, ఆపన్నః = పొందినవాడై, చిరజీవీ = చిరకాలము జీవించువాడు, దీర్ఘాయుః చ = దీర్ఘాయుర్దాయము కలవాడూ, భవిష్యతి = కాగలడు. మహాత్మా = మహాత్ముడైన, బ్రహ్మా = బ్రహ్మ, తమ్ = అతనిని గూర్చి, వచః = వచనమును, ప్రాబ్రవీత్ = పలికెను. సర్వేషాం = సమస్తమైన, బ్రహ్మదణ్డానామ్ = బ్రహ్మ దండములకు, అవధ్యత్వమ్ = వధ్యుడు కాకపోవుట, భవిష్యతి = కాగలదు.

తా. "నేను తయారుచేసిన అస్త్రములచేత గాని, ఇతరములైన దివ్యాస్త్రముల చేతగాని చంప శక్యము కానివాడై ఇతడు దీర్ఘాయుర్దాయవంతుడై చిరకాలము జీవించగలడు". మహాత్ముడైన బ్రహ్మదేవుడు కూడ-"ఇతడు ఏ బ్రహ్మదండముల చేతను చంపబడడు"అని పలికెను. 20,21

మూ. తతః సురాణాం తు వరైర్దృష్ట్వా హ్యేనమలంకృతమ్,
చతుర్ముఖస్తుష్టమనా వాయుమాహ జగద్గురుః. 22

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సురాణామ్ = దేవతలయొక్క, వరైః = వరములచేత, అలంకృతమ్ = అలంకరించబడిన, ఏనమ్ = ఇతనిని, దృష్ట్వా = చూచి, జగద్గురుః = జగద్గురువైన, చతుర్ముఖః = బ్రహ్మదేవుడు, తుష్టమనాః = సంతోషించిన మనస్సు కలవాడై, వాయుమ్ = వాయువును గూర్చి, ఆహ = పలికెను.

తా. అప్పుడు దేవతలు ఇచ్చిన వరములచేత అలంకరించబడిన ఇతనిని చూచి జగత్తునకు అంతకూ పూజ్యుడైన బ్రహ్మదేవుడు మనస్సులో సంతోషించి వాయువుతో ఇట్లు పలికెను. 22

మూ. ఏవముక్త్వా తమామన్త్ర్య మారుతం త్వమరైః సహ,
యథాగతం యయుః సర్వే పితామహపురోగమాః. 26

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తం మారుతమ్ = ఆ వాయువును, ఆమన్త్ర్య = ఆమంత్రించి, పితామహపురోగమాః = బ్రహ్మదేవుడు మొదలైన, సర్వే = అందరూ, అమరైః సహ = దేవతలతో కూడ, యథాగతమ్ = వచ్చిన విధముగానే, యయుః = వెళ్ళిరి.

తా. బ్రహ్మదేవుడు మొదలైన వారందరూ వాయువుతో ఇట్లు పలికి, అతని అనుమతి తీసికొని (వెళ్లెదము అని చెప్పి), వచ్చిన విధముగ వెళ్ళిరి. 26

మూ. సోఽపి గన్ధవహః పుత్రం ప్రగృహ్య గృహమానయత్,
అఞ్జనాయాస్తమాఖ్యాయ వరదత్తం వినిర్గతః. 27

ప్ర. అ. సః గన్ధవహః అపి = ఆ వాయువు కూడ, పుత్రమ్ = పుత్రుణ్ణి, ప్రగృహ్య = గ్రహించి, గృహమ్ = గృహమును గూర్చి, ఆనయత్ = తీసికొనివచ్చెను. అఞ్జనాయాః = అంజనకు, తమ్ = వానిని, వరదత్తమ్ = ఇవ్వబడిన వరములు కలవానినిగా, ఆఖ్యాయ = చెప్పి, వినిర్గతః = వెళ్ళిపోయినాడు.

తా. వాయువు ఆ పుత్రుణ్ణి ఇంటికి తీసికొని వెళ్ళి, ఆతనికి వరములు లభించిన విషయమును అంజనకు తెలిపి వెళ్ళిపోయెను. 27

మూ. ప్రాప్య రామ వరానేష వరదానబలాన్వితః,
జవేనాత్మని సంస్థేన సోఽసౌ పూర్ణ ఇవార్ణవః. 28

ప్ర. అ. రామ = రామా ! ఏషః = ఇతడు, వరాన్ = వరములను, ప్రాప్య = పొంది, వరదానబలాన్వితః = వరదానముతోను బలముతోను కూడినవాడై, ఆత్మని = తనయందు, సంస్థేన = ఉన్న, జవేన = వేగముతో, సః అసౌ = అట్టి ఇతడు, అర్ణవః ఇవ = సముద్రము వలె, పూర్ణః = నిండినవాడుగా (ఆయెను).

తా. రామా! ఇతడు వరములు పొంది, వరదానమువలన కలిగిన బలముతోను, సహజబలముతోను కూడినవాడై, సముద్రము వలె తనలో ఉన్న వేగముతో నిండి ఉండెను. 28

మూ. జానన్త ఋషయః సర్వే సహన్తే తస్య శక్తితః,
తథా కేసరిణా త్వేష వాయునా త్వఞ్జనీసుతః. 32
ప్రతిషిద్ధోఽపి మర్యాదాం లఙ్ఘయత్యేవ వానరః.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, ఋషయః = ఋషులు, శక్తితః = శక్తి వలన, తస్య = ఆతనికి (ఆతనిని), జానన్తః = ఎరిగినవారై, సహన్తే = సహించుచున్నారు. తథా = అట్లు, ఏషః = ఈ, వానరః = వానరుడైన, అఞ్జనీసుతః = హనుమంతుడు, కేసరిణా = కేసరిచేతను, వాయునా = వాయువుచేతను, ప్రతిషిద్ధోఽపి = నిషేధించబడినను, మర్యాదామ్ = కట్టుబాటును, లఙ్ఘయత్యేవ = లంఘించుచునే ఉన్నాడు.

తా. ఆతని శక్తిని గూర్చి తెలిసిన ఋషు లందరూ సహించుచుండిరి. కేసరీ, వాయుపూ నిషేధించినా కూడ ఈ అంజనాకుమారుడైన హనుమంతుడు బాలు డగుటచేత కట్టుబాట్లను అతిక్రమించెను. 32

మూ. తతో మహర్షయః క్రుద్ధా భృగ్వఙ్గిరసవంశజాః, 33
శేపురేనం రఘుశ్రేష్ఠ నాతిక్రుద్ధాతిమన్యవః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భృగ్వఙ్గిరసవంశజాః = భృగుఅంగిరసుల వంశములయందు పుట్టిన, మహర్షయః = మహర్షులు. క్రుద్ధాః = కోపించిరి. రఘుశ్రేష్ఠ = రామా ! నాతిక్రుద్ధాతిమన్యవః = ఎక్కువగా కోపించనివారు, ఎక్కువ పగ లేనివారు అయిన ఆ ఋషులు, ఏనమ్ = ఇతనిని, శేపుః = శపించిరి.

తా. అప్పుడు భృగ్వంగిరసవంశీయులైన ఆ ఋషులు కోపించిరి. రామా ! కాని వారు ఎక్కువ కోపము గాని, పగ గాని లేనివారై ఇతనిని శపించిరి. 33

మూ. బాధసే యత్సమాశ్రిత్య బలమస్మాన్ ప్లవంగమ, 34
తద్దీర్ఘకాలం వేత్తాసి నాస్మాకం శాపమోహితః,
యదా తే స్మార్యతే కీర్తిస్తదా తే వర్ధతే బలమ్. 35

ప్ర. అ. ప్లవంగమ = వానరా ! యత్ = ఏ, బలమ్ = బలమును, సమాశ్రిత్య = ఆశ్రయించి, అస్మాన్ = మమ్ములను, బాధసే = బాధించుచున్నావో,

మూ. స తు రాజ్యం చిరం కృత్వా వానరాణాం మహేశ్వరః,
తత స్త్వృక్షరజా నామ కాలధర్మేణ యోజితః. 38

ప్ర. అ. ఋక్షరజా నామ = ఋక్షరజస్సు అను పేరు గల, సః = ఆ, వానరాణామ్ = వానరులయొక్క, మహేశ్వరః = మహాప్రభువు, చిరమ్ = చిర కాలము, రాజ్యమ్ = రాజ్యమును, కృత్వా = చేసి, తతః = అటుపిమ్మట, కాల ధర్మేణ = మృత్యువుచేత, యోజితః = కూర్చబడినాడు.

తా. వానరరాజైన ఆ ఋక్షరజస్సు చాల కాలము రాజ్యము చేసి మర ణించినాడు. 38

మూ. తస్మిన్న స్తమితే చాథ మన్త్రిభిర్మన్త్రకోవిదైః,
పిత్ర్యే పదే కృతో వాలీ సుగ్రీవో వాలినః పదే. 39

ప్ర. అ. తస్మిన్ = అతడు, అస్తమితే = మరణించినవాడగుచుండగా, అథ = అటుపిమ్మట, మన్త్రకోవిదైః = ఆలోచనల ఎరిగిన, మన్త్రిభిః = మంత్రుల చేత, వాలీ = వాలి, పిత్ర్యే = తండ్రికి సంబంధించిన, పదే = స్థానమునందు, కృతః = చేయబడెను. (ఉంచబడెను). సుగ్రీవః = సుగ్రీవుడు, వాలినః = వాలి యొక్క, పదే = స్థానమునందు, చేయబడెను.

తా. ఆతని మరణానంతరము ఆలోచనలో సమర్థులైన మంత్రులు తండ్రి స్థానములో వాలిని రాజుగాను, వాలిస్థానములో సుగ్రీవుణ్ణి యువరాజునుగాను చేసిరి. 39

మూ. సుగ్రీవేణ సమం తస్య అద్వైధం ఛిద్రవర్జితమ్,
ఆబాల్యం సఖ్యమభవదనిలస్యాగ్నినా యథా. 40

ప్ర. అ. తస్య = ఆ వాలికి, ఆబాల్యమ్ = బాల్యమునుండీ, సుగ్రీవేణ సమమ్ = సుగ్రీవునితో కూడ, అద్వైధమ్ = భేదభావము లేని, ఛిద్రవర్జితమ్ = ఛిద్రములు లేని, సఖ్యమ్ = స్నేహము, అనలస్య = వాయువునకు, అగ్నినా యథా = అగ్నితో వలె, అభవత్ = ఆయెను.

తా. బాల్యమునుండీ కూడ వాలికి సుగ్రీవునితో, వాయువునకు అగ్నితో వలె, భేదభావము కాని, కపటము కాని లేని స్నేహము ఉండెను. 40

వాలిసుగ్రీవులయుద్ధమునందు, సుగ్రీవునితో నిలచిపోయినాడు ; యుద్ధము చేయ లేదు. 43

మూ. పరాక్రమోత్సాహమతిప్రతాప
సౌశీల్యమాధుర్యనయానయైశ్చ,
గామ్భీర్యచాతుర్యసువీర్యధైర్యై
ర్హనూమతః కోఽప్యధికోఽస్తి లోకే. 44

ప్ర. అ. పరాక్రమోత్సాహమతిప్రతాపసౌశీల్యమాధుర్యనయానయైః చ= పరాక్రమము, ఉత్సాహము, బుద్ధి, ప్రతాపము, మంచిస్వభావము, మధురత్వము (మంచితనము), నీతి, అనీతుల జ్ఞానము-వీటిచేత, గామ్భీర్యచాతుర్యసువీర్య ధైర్యైః = గాంభీర్యము, నేర్పు, గొప్పపరాక్రమము, ధైర్యము-వీటిచేత, లోకే = లోకమునందు, హనూమతః = హనుమంతునికంటె, అధికః = అధికుడు, కోఽపి =ఎవడైనా, అస్తి = ఉన్నాడా ?

తా. పరాక్రమము, ఉత్సాహము, బుద్ధి, ప్రతాపము, మంచి స్వభావము, మాధుర్యము, ఏది నీతి, ఏది కాదు అనే జ్ఞానము, గాంభీర్యము, నేర్పు, గొప్ప బలము, ధైర్యము అనే గుణములచేత హనుమంతునికంటె గొప్పవాడు, ఈ లోకములో, ఎవడైనా ఉన్నాడా ? 44

మూ. అసౌ పునర్వ్యాకరణం గ్రహీష్యన్
సూర్యోన్ముఖః ప్రష్టుమనాః కపీన్ద్రః,
ఉద్యద్గిరేర స్తగిరిం జగామ
గ్రన్థం మహద్ధారయన్నప్రమేయః. 45

ప్ర. అ. అప్రమేయః=ఇంతటివాడని చెప్ప శక్యము కాని, అసౌ = ఈ, కపీన్ద్రః=హనుమంతుడు, వ్యాకరణమ్=వ్యాకరణమును, గ్రహీష్యన్=గ్రహించ దలచినవాడై, సూర్యోన్ముఖః = సూర్యాభిముఖుడై, ప్రష్టుమనాః = అడుగుటకు మనస్సు కలవాడై, మహత్ = గొప్పదైన, గ్రన్థమ్ = గ్రంథమును, ధారయన్ = ధరించుచు, ఉద్యద్గిరేః=ఉదయాద్రి నుండి, అస్తగిరిమ్=అస్తాద్రిని గూర్చి, జగామ =వెళ్ళెను.

తా. అప్రమేయుడైన ఈ హనుమంతుడు వ్యాకరణమును అభ్యసించుటకై

వ్యాఖ్యాతలు 'సంగ్రహ' గ్రంథాన్ని గూర్చి వినలేదు కాబోలు, అందుచేత 'సంగ్రహ' శబ్దానికి ప్రకరణాదికము అని అర్థము వ్రాసినారు. ఈ శ్లోకం ప్రాచ్య ప్రతిలో లేదు. 46

మూ. సర్వాసు విద్యాసు తపోవిధానే
ప్రస్పర్ధతేఽయం హి గురుం సురాణామ్,
సోఽయం నవవ్యాకరణార్థవేత్తా
బ్రహ్మా భవిష్యత్యపి తే ప్రసాదాత్. 47

ప్ర. అ. అయమ్ = ఇతడు, సర్వాసు = సమస్తములైన, విద్యాసు = విద్యలయందు, తపోవిధానే = తపశ్చరణమునందు, సురాణాం గురుమ్ = బృహస్పతిని, ప్రస్పర్ధతే = పోటీపడుచున్నాడు. నవవ్యాకరణార్థవేత్తా = తొమ్మిది వ్యాకరణముల అర్థము తెలిసిన, సః అయమ్ = అట్టి ఇతడు, తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, బ్రహ్మా = బ్రహ్మగా, భవిష్యతి = కాగలడు.

తా. ఇతడు సకలవిద్యలలోను, తపశ్చర్యలోను బృహస్పతితో పోటీ చేయుచున్నాడు. తొమ్మిది వ్యాకరణములు ఎరిగిన ఇతడు నీ అనుగ్రహమువలన (రాబోవు కల్పములో) బ్రహ్మదేవుడు కాగలడు.

వి. ప్రాచ్యప్రతులు మొదలైనవాటిలో ఈ శ్లోకము లేదు. 47

మూ. ప్రవివిక్షోరివ సాగరస్య
లోకాన్ దిధక్షోరివ పావకస్య,
లోకక్షయే ష్వేవ యథాన్తకస్య
హనూమతః స్థాస్యతి కః పురస్తాత్. 48

ప్ర. అ. ప్రవివిక్షోః = ప్రవేశింపదలచిన, సాగరస్య ఇవ = సముద్రము యొక్క వలె, లోకాన్ = లోకములను, దిధక్షోః = కాల్చదలచిన, పావకస్య ఇవ = అగ్నియొక్క వలె, లోకక్షయేషు ఏవ = ప్రళయకాలములయందు, అన్తకస్య యథా = యమునియొక్క వలె, హనూమతః = హనుమంతునియొక్క, పురస్తాత్ = ఎదుట, కః = ఎవడు, స్థాస్యతి = ఉండగలడు.

తా. భూమిని ముంచెత్తదలచిన సముద్రానికి వలె, లోకాలను కాల్చివేయ

జ్యోతిముఖ-నలు లనే ఈ భల్లూకములను, వానరనాయకులను నీకొరకే దేవతలు సృష్టించినారు. 50

మూ. తదేతత్కథితం సర్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి,
హనూమతో బాలభావే కర్మైతత్కథితం మయా. 51

ప్ర. అ. త్వమ్ = నీవు, మామ్ = నన్ను, యత్ = దేనిని, పరిపృచ్ఛసి = అడుగుచున్నావో, తత్ = అట్టి, ఏతత్ సర్వమ్ = ఇది అంతా, కథితమ్= చెప్పబడినది. హనూమతః = హనుమంతునియొక్క, బాలభావే = బాల్యమునందు, ఏతత్ = ఈ, కర్మ = పని, మయా = నాచేత, కథితమ్=చెప్పబడినది.

తా. నీవు ప్రశ్నించిన విషయము లన్నీ చెప్పినాను. బాల్యములో హనుమంతుడు చేసిన పనికూడ చెప్పినాను. 51

మూ. శ్రుత్వాగస్త్యస్య కథితం రామః సౌమిత్రిరేవ చ,
విస్మయం పరమం జగ్ముర్వానరా రాక్షసైః సహ. 52

ప్ర. అ. రామః = రాముడు, సౌమిత్రిః ఏవ చ = లక్ష్మణుడు, రాక్షసైః సహ = రాక్షసులతో కూడ, వానరాః = వానరులు, అగస్త్యస్య = అగస్త్యుని యొక్క, కథితమ్ = చెప్పుటను, శ్రుత్వా = విని, పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, జగ్ముః = పొందిరి.

తా. అగస్త్యుడు చెప్పిన వృత్తాంతమును విని రాముడు, లక్ష్మణుడు, వానరులు, రాక్షసులు చాల ఆశ్చర్యము పొందిరి. 52

మూ. అగస్త్యస్త్వబ్రవీద్రామం సర్వమేతచ్ఛ్రుతం త్వయా,
దృష్టః సంభాషితశ్చాసి రామ గచ్ఛామహే వయమ్. 53

ప్ర. అ. అగస్త్యః తు = అగస్త్యుడు, రామమ్ = రాముణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను, రామ = రామా ! ఏతత్=ఇది, సర్వమ్=సమస్తమూ, త్వయా = నీచేత, శ్రుతమ్ = వినబడినది. దృష్టః = చూడబడినవాడవు, సంభాషితః = మాటలాడబడినవాడవు, అసి=అయితివి. వయమ్ = మేము, గచ్ఛామహే=వెళ్ళుచున్నాము.

తా. అగస్త్యుడు రామునితో-''రామా ! ఈ కథ అంతా విన్నావు కదా.

తా. "నేను విజ్ఞాపన చేయవలసినది ఒక టున్నది, కోరికతో నేను చెప్పు చున్న దానిని మీరు నా కోసమై దయతో చేయవలెను." 56

మూ. పౌరజానపదాన్ స్థాప్య స్వకార్యేష్వహమాగతః,
క్రతూనహం కరిష్యామి ప్రభావాద్భవతాం సతామ్. 57

ప్ర. అ. పౌరజానపదాన్ = పౌరులను, జానపదులను, స్వకార్యేషు = తమ కర్తవ్యములయందు, స్థాప్య = ఉంచి, ఆగతః = వచ్చిన, అహమ్ = నేను, సతామ్ = సత్పురుషులైన, భవతామ్ = మీయొక్క, ప్రభావాత్ = ప్రభావము వలన, క్రతూన్ = యజ్ఞములను, కరిష్యామి = చేయగలను.

తా. "నేను పౌరులను, జానపదులను వారి వారి కార్యములందు నియమించి వచ్చి సత్పురుషులైన మీ ప్రభావమువలన క్రతువులు చేసెదను". 57

మూ. సదస్యా మమ యజ్ఞేషు భవన్తో నిత్యమేవ తు,
భవిష్యథ మహావీర్యా మమానుగ్రహకాఙ్క్షిణః. 58

ప్ర. అ. మహావీర్యాః = గొప్ప తపోబలము గల, భవన్తః = మీరు, మమ = నాయొక్క, యజ్ఞేషు = యజ్ఞములయందు, సదస్యాః = సదస్యులై (సభ్యులై). నిత్యమ్ ఏవ తు = ఎల్లప్పుడూ, మమ = నాయొక్క, అనుగ్రహ కాఙ్క్షిణః = అనుగ్రహమును కోరుచున్నవారు, భవిష్యథ = కాగలరు.

తా. "తపోబలసంపన్నులైన మీరు, నాపై నిత్యము అనుగ్రహము చూపుచు, నేను చేయబోవు యజ్ఞములయందు సభ్యులుగా ఉందురుగాక". 58

మూ. అహం యుష్మాన్ సమాశ్రిత్య తపోనిర్ధూతకల్మషాన్,
అనుగృహీతః పితృభిర్భవిష్యామి సునిర్వృతః. 59

ప్ర. అ. అహమ్ = నేను, తపోనిర్ధూతకల్మషాన్ = తపస్సుచేత కడిగి వేయబడిన పాపములు గల, యుష్మాన్ = మిమ్ములను, సమాశ్రిత్య = ఆశ్రయించి, పితృభిః = పితృదేవతలచేత, అనుగృహీతః = అనుగ్రహింపబడినవాడనై, సునిర్వృతః = చాల సంతోషించినవాడను, భవిష్యామి = కాగలను.

తా. "నేను తపస్సుచేత అన్ని పాపములను తొలగించుకొనిన మిమ్ములను ఆశ్రయించి, పితృదేవతల అనుగ్రహము పొంది సంతోషముతో ఉండగలను."

డైన రాముడు, నృపవానరాన్ = రాజులను వానరులను, విసృజ్య = విడచి, విధివత్ = యథావిధిగా, సంధ్యామ్ = సంధ్యను, ఉపాస్య = సేవించి. రజన్యామ్ = రాత్రి, ప్రవృత్తాయామ్ = ప్రారంభ మైనదగుచుండగా, అన్తఃపురచరః = అంతఃపురమునందు సంచరించేవాడు, అభవత్ = ఆయెను.

తా. రాముడు ఆశ్చర్యముతో కొంతసేపు ఆ విషయములను గూర్చియే ఆలోచించెను. ఇంతలో సూర్యుడు అస్తాద్రికి వెళ్ళెను. అప్పుడు రాముడు రాజులను, వానరులను వారి వారి విడిదులకు పంపివేసి, యథావిధిగా సంధ్యోపాసన చేసి, రాత్రి కాగానే అంతఃపురములో ప్రవేశించెను. 62

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ముప్పైఆరవ సర్గ సమాప్తము.

ప్ర. అ. రక్తకణ్ఠినః = మధురమైన కంఠస్వరము గలవారు, శిక్షితాః = బాగుగా నేర్పబడిన, కింనరాః ఇవ = కింనరులవలె ఉన్న, తే సర్వే = వాళ్ళందరూ, సంప్రహర్షిణః = సంతోషముగలవారై, వీరమ్ = వీరుడైన, నృపతిమ్ = రాజును, యథావత్ = యథావిధిగా, తుష్టువుః = స్తుతించిరి.

తా. సుశిక్షితులైన కింనరుల వలె మధురకంఠధ్వని గల వాళ్ళందరూ సంతోషవంతులై వీరుడైన రాజును యథావిధిగా స్తుతించిరి 3

మూ. వీర సౌమ్య ప్రబుధ్యస్వ కౌసల్యాప్రీతివర్ధన,
జగద్ధి సర్వం స్వపితి త్వయి సుప్తే నరాధిప. 4

ప్ర. అ. వీర = వీరుడా! సౌమ్య = సౌమ్యుడా! కౌసల్యాప్రీతివర్ధన = కౌసల్యకు సంతోషమును వృద్ధిపొందించువాడా! ప్రబుధ్యస్వ = మేల్కొనుము. నరాధిప = రాజా! త్వయి = నీవు, సుప్తే = నిద్రపోవుచుండగా, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, స్వపితి హి = నిద్రపోవును కదా ?

తా. కౌసల్యకు ఆనందమును వృద్ధిపొందించు, వీరుడవు, సౌమ్యుడవు అయిన రామా! మేల్కొనుము. రాజా ! నీవు నిద్రపోవుచున్నచో జగత్తు అంతా నిద్రపోవునుగదా? 4

మూ. విక్రమస్తే యథా విష్ణో రూపం చైవాశ్వినోరివ,
బుద్ధ్యా బృహస్పతేస్తుల్యః ప్రజాపతిసమో హ్యసి. 5

ప్ర. అ. తే = నీయొక్క, విక్రమః = పరాక్రమము, విష్ణోః యథా = విష్ణువుయొక్క విక్రమము వంటిది. రూపం చ = రూపము, అశ్వినోరివ = అశ్వినీదేవతల రూపమువంటిది. బుద్ధ్యా = బుద్ధిచేత, బృహస్పతేః = బృహస్పతికి, తుల్యః = సమానుడవు. ప్రజాపతిసమః = ప్రజాపతితో సమానుడవు, అసి హి = అయి ఉన్నావు కదా ?

తా. నీ పరాక్రమము విష్ణువుపరాక్రమము వంటిది. రూపము అశ్వినీదేవతల రూపము వంటిది. నీవు బుద్ధిచేత బృహస్పతితో సమానుడవు, ప్రజాపతివంటివాడవు.

మూ. క్షమా తే పృథివీతుల్యా తేజసా భాస్కరోపమః,
వేగస్తే వాయునా తుల్యో గామ్భీర్యముదధేరివ. 6

మూ. శ్రీశ్చ ధర్మశ్చ కాకుత్స్థ త్వయి నిత్యం ప్రతిష్ఠితౌ,
ఏతాశ్చాన్యాశ్చ మధురా వన్దిభిః పరికీర్తితాః. 9

ప్ర. అ. కాకుత్స్థ = రామా! శ్రీశ్చ = లక్ష్మి, ధర్మశ్చ = ధర్మమూ, త్వయ = నీయందు, నిత్యమ్ = నిత్యమూ, ప్రతిష్ఠితౌ = స్థిరముగా ఉన్నవి. వన్దిభిః = వందులచేత, ఏతాశ్చ = ఇవీ, మదురాః = మధురములైన, అన్యాశ్చ = ఇతరస్తుతులూ, పరికీర్తితాః = పలకబడినవి.

తా. "రామా! నీయందు లక్ష్మి, ధర్మము స్థిరముగా నిలచి ఉన్నవి". వందులు ఈ స్తుతులను, మధురములైన మరి కొన్ని స్తుతులను చేసిరి. 9

మూ. సూతాశ్చ సంస్తవైర్దివ్యైర్బోధయన్తి స్మ రాఘవమ్,
స్తుతిభిః స్తూయమానాభిః ప్రత్యబుధ్యత రాఘవః. 10

ప్ర. అ. సూతాః చ = సూతులు కూడ, దివ్యైః = ఉత్తమములైన, సంస్తవైః = స్తుతులతో, రాఘవమ్ = రాముణ్ణి, బోధయన్తి స్మ = మేల్కొలిపిరి. రాఘవః = రాముడు, స్తూయమానాభిః = స్తుతింపబడుచున్న, స్తుతిభిః = స్తుతుల చేత, ప్రత్యబుధ్యత = మేల్కొనెను.

తా. సూతులు కూడ ఉత్తమములైన స్తుతులతో రాముణ్ణి మేల్కొలిపిరి. రాముడు ఈ విధముగ వందిసూతాదులు చేసిన స్తుతులకు మేల్కొనెను. 10

మూ. స తద్విహాయ శయనం పాణ్డురాచ్ఛాదనాస్తృతమ్,
ఉత్తస్థౌ నాగశయనాద్ధరిర్నారాయణో యథా. 11

ప్ర. అ. సః = అతడు, పాణ్డురాచ్ఛాదనాస్తృతమ్ = తెల్లని ఆచ్ఛాదనము చేత కప్పబడిన, తత్ = ఆ, శయనమ్ = శయనమును, విహాయ = విడచి, నాగ శయనాత్ = ఆదిశేషశయనమునుండి, హరిః = పాపములను హరించు, నారాయణః యథా = విష్ణువు వలె, ఉత్తస్థౌ = లేచెను.

తా. రాముడు తెల్లని ఆచ్ఛాదనవస్త్రముచేత కప్పబడిన ఆ శయనమును విడచి ఆదిశేషశయనమునుండి సర్వపాపహరుడైన నారాయణుడు లేచినట్లు లేచెను. 11

తా. రాముడు అక్కడ దేవతలను, పితృదేవతలను, బ్రాహ్మణులను యథా విధిగా పూజించి, జనులతో కలిసి బైట నున్న వాకిలి దాటి వచ్చెను. 14

మూ. ఉపతస్థుర్మహాత్మానో మన్త్రిణః సపురోహితాః,
వసిష్ఠప్రముఖాః సర్వే దీప్యమానా ఇవాగ్నయః. 15

ప్ర. అ. సపురోహితాః = పురోహితులతో కూడిన, మహాత్మానః = మహాత్ములైన, మన్త్రిణః = మంత్రులు, దీప్యమానాః = ప్రజ్వలించుచున్న, అగ్నయః ఇవ = అగ్నులు వలె ఉన్న, సర్వే = మసస్తమైన, వసిష్ఠప్రముఖాః = వసిష్ఠుడు మొదలైనవారు, ఉపతస్థుః = సమీపించిరి.

తా. పురోహితులు, మహాత్ములైన మంత్రులు, ప్రజ్వలించుచున్న అగ్నుల వలె ఉన్న వసిష్ఠాదులు ఆదరపూర్వకముగా ఆతని దగ్గరకు చేరిరి. 15

మూ. క్షత్రియాశ్చ మహాత్మానో నానాజనపదేశ్వరాః,
రామస్యోపావిశన్ పార్శ్వే శక్రస్యేవ యథామరాః. 16

ప్ర. అ. నానాజనపదేశ్వరాః = అనేకదేశముల ప్రభువులైన, మహాత్మానః = మహాత్ములైన, క్షత్రియాః చ = క్షత్రియులు కూడ, శక్రస్య = ఇంద్రుని పార్శ్వమునందు, అమరాః ఇవ = దేవతలు వలె, రామస్య = రామునియొక్క, పార్శ్వే = పార్శ్వమునందు, ఉపావిశన్ = కూర్చుండిరి.

తా. అనేకదేశముల ప్రభువులైన మహాత్ములైన క్షత్రియులు కూడ, ఇంద్రుని ప్రక్క దేవతలు కూర్చున్నట్లు రాముని ప్రక్క కూర్చుండిరి. 16

మూ. భరతో లక్ష్మణశ్చాత్ర శత్రుఘ్నశ్చ మహాయశాః,
ఉపాసాంచక్రిరే హృష్టా వేదాస్త్రయ ఇవాధ్వరమ్. 17

ప్ర. అ. అత్ర = ఇచట, భరతః = భరతుడు, లక్ష్మణః చ = లక్ష్మణుడు, మహాయశాః = గొప్ప కీర్తిగల, శత్రుఘ్నః చ = శత్రుఘ్నుడు, హృష్టాః = సంతోషించినవారై, త్రయః = మూడు, వేదాః = వేదములు, అధ్వరమ్ ఇవ = యజ్ఞమును వలె, ఉపాసాంచక్రిరే = ఉపాసించిరి.

తా. అక్కడ భరతుడు, లక్ష్మణుడు, గొప్ప కీర్తి గల శత్రుఘ్నుడు మూడు వేదములు యజ్ఞమును ఉపాసించినట్లు రాముణ్ణి ఉపాసించిరి. 17

మూ. తథా నిగమవృద్ధాశ్చ కులీనా యే చ మానవాః,
శిరసా వన్ద్య రాజానముపాసన్తే విచక్షణాః. 21

ప్ర. అ. తథా = మరియు, నిగమవృద్ధాః చ = ఆ యా సంఘములలో పెద్దలు, కులీనాః = సత్కులములందు పుట్టిన, యే = ఏ, మానవాః = మానవులు గలరో, విచక్షణాః = నేర్పు గల, తే = వారు, రాజానమ్ = రాజును, శిరసా = శిరస్సుచేత, వన్ద్య = నమస్కరించి, ఉపాసన్తే = ఉపాసించుచుండిరి.

తా. ఆ యా సంఘముల పెద్దలు, నేర్పు గల, సత్కులప్రసూతులైన మానవులు రామునకు శిరస్సు వంచి నమస్కరించి ఉపాసించుచుండిరి. 21

మూ. తథా పరివృతో రాజా శ్రీమద్భిరృషిభిర్వరైః,
రాజభిశ్చ మహావీర్యైర్వానరైశ్చ సరాక్షసైః. 22
యథా దేవేశ్వరో నిత్యమృషిభిః సముపాస్యతే,
అధికస్తేన రూపేణ సహస్రాక్షాద్విరోచతే. 23

ప్ర. అ దేవేశ్వరః = దేవేంద్రుడు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, ఋషిభిః = ఋషులచేత, యథా = ఎట్లు, సముపాస్యతే = ఉపాసించబడునో, తథా = అట్లే, రాజా = రాముడు, శ్రీమద్భిః = శ్రీమంతులు, వరైః = శ్రేష్ఠులూ అయిన, ఋషిభిః = ఋషులతోను, మహావీర్యైః = గొప్ప పరాక్రమము గల, రాజభిః చ = రాజులతోను, సరాక్షసైః = రాక్షసులతో కూడిన, వానరైః చ = వానరులతోను, పరివృతః = కూడి ఉండెను. తేన = ఆ, రూపేణ = రూపముచేత, సాక్షాత్ = సాక్షాత్తూ, సహస్రాక్షాత్ = ఇంద్రునికంటె, అధికః = అధికుడై, విరోచతే = ప్రకాశించుచుండెను.

తా. దేవేంద్రుని చుట్టూ ఎల్లప్పుడూ ఋషులు ఉన్నట్లు రాముని చుట్టూ తేజోవంతులూ, ఉత్తములూ అయిన ఋషులూ, గొప్ప పరాక్రమము గల రాజులూ, వానరులూ, రాక్షసులూ కూర్చుండి ఉండిరి. కాని రూపసంపదచేత రాముడు దేవేంద్రునికంటె అధికముగా ప్రకాశించుచుండెను. 22, 23

మూ. తేషాం సముపవిష్టానాం తాస్తాః సుమధురాః కథాః,
కథ్యన్తే ధర్మసంయుక్తాః పురాణజ్ఞైర్మహాత్మభిః. 24

# ప్రక్షిప్తః సర్గః ప్రథమః

*[బ్రహ్మదేవుని కన్నీటినుండి ఋక్షరజస్సు అను వానరుడు పుట్టుట. ఒక సరస్సులో మునగగానే అతడు స్త్రీ అగుట. ఆమెను చూచి మోహించిన ఇంద్రసూర్యుల ద్వారా వాలిసుగ్రీవులు పుట్టుట. ఋక్షరజస్సును బ్రహ్మదేవుడు కిష్కింధలో వానరరాజుగా చేయుట].*

మూ. ఏతచ్ఛ్రుత్వా తు నిఖిలం రాఘవోఽగస్త్యమబ్రవీత్,
యఏషర్క్షరజా నామ వాలిసుగ్రీవయోః పితా. 1
జననీ కా చ భవనం సా త్వయా పరికీర్తితా,
వాలిసుగ్రీవయోశ్చాపి నామనీ కేన హేతునా. 2
ఏతద్బ్రహ్మన్ సమాచక్ష్వ కౌతూహలమిదం హి నః.

ప్ర. అ. రాఘవః=రాముడు, ఏతత్ = దీనిని, నిఖిలమ్=సమస్తమునూ, శ్రుత్వా = విని, అగస్త్యమ్ = అగస్త్యుని గూర్చి, అబ్రవీత్=పలికెను. ఋక్షరజా నామ = ఋక్షరజస్సు అను, యః ఏషః = ఏ ఇతడు గలడో, అతడు, వాలిసుగ్రీవయోః = వాలిసుగ్రీవుల, పితా = తండ్రి. భవనమ్ = వాళ్ళ ఉత్పత్తిస్థానమైన, జననీ=తల్లి, కా = ఎవతె, త్వయా = నీచేత, పరికీర్తితా = చెప్పబడినది ? వాలిసుగ్రీవయోః = వాలిసుగ్రీవుల, నామనీ = పేర్లు, కేన హేతునా = ఏ హేతువుచేత ? బ్రహ్మన్ = ఓ! బ్రాహ్మణుడా ! ఏతత్=దీనిని, సమాచక్ష్వ = చెప్పుము; నః = మాకు, ఇదమ్ = ఇది, కౌతూహలం హి = వేడుక గదా !

తా. రాముడు ఇదంతా విని అగస్త్యునితో ఇట్లు పలికెను - "ఋక్షరజస్సు అను నతడు వాలిసుగ్రీవుల తండ్రి కదా ? వీళ్ళ తల్లి ఎవరని నీవు చెప్పినావు? వాలిసుగ్రీవులకు ఆ పేర్లు ఎందుకు వచ్చినవి ? ఈ విషయమును చెప్పుము. మాకు చాల విన వేడుకగా ఉన్నది". 1, 2

తా. శాస్త్రోక్తప్రకారము న్యాయానుసారముగా పూజింపబడి సుఖముగా కూర్చొని ఉన్న ఆతనిని నేను వేడుకచేత అడుగగా ఆతడు "మహర్షీ! వినుము" అని ఉపక్రమించి ఈ కథను చెప్పెను. 5, 6

మూ. మేరుర్నగవరః శ్రీమాన్ జామ్బూనదమయః శుభః,
తస్య యన్మధ్యమం శృఙ్గం సర్వదైవతపూజితమ్. 7

తస్మిన్ దివ్యా సభా రమ్యా బ్రహ్మణః శతయోజనా,
తస్యామాస్తే సదా దేవః పద్మయోనిశ్చతుర్ముఖః. 8

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తము, జామ్బూనదమయః = సువర్ణ మయము, శుభః = సుందరమూ అయిన, నగధరః = పర్వతశ్రేష్ఠమైన, మేరుః = మేరుపర్వత మున్నది. తస్య = దానియొక్క, సర్వదైవతపూజితమ్ = సమస్త దేవతలచేతా పూజింపబడిన, యత్ = ఏ, మధ్యమం శృఙ్గమ్ = మధ్యమశిఖరము గలదో, తస్మిన్ = దానిమీద, బ్రహ్మణః = బ్రహ్మదేవునియొక్క, శతయోజనా = నూరు యోజనముల విస్తారము గల, రమ్యా = సుందరమైన, దివ్యా = దివ్యమైన, సభా = సభ ఉన్నది. పద్మయోనిః = పద్మము ఉత్పత్తిస్థానముగా గల, చతుర్ముఖః = నాలుగు ముఖములు గల, దేవః = బ్రహ్మదేవుడు, సదా = ఎల్లప్పుడూ, తస్యామ్ = దానియందు, ఆస్తే = ఉన్నాడు.

తా. బంగారము వికారమైన, శోభాయుక్తము, మంగళప్రదమూ, పర్వతశ్రేష్ఠమూ అయిన మేరువర్వత మున్నది. దాని మధ్యమశిఖరము దేవతలందరిచేత పూజింపబడునది. దానిమీద నూరుయోజనముల విస్తారము గల బ్రహ్మదేవుని రమ్యమైన దివ్యసభ ఉన్నది. పద్మమునుండి పుట్టిన, చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు నిత్యమూ ఆ సభలో ఉండును. 7, 8

మూ. యోగమభ్యస్యతస్తస్య నేత్రాభ్యాం యదసుస్రువత్,
తద్గృహీతం భగవతా పాణినా చర్చితం తు తత్. 9

ప్ర. అ. యోగమ్ = యోగమును, అభ్యస్యతః = అభ్యసించుచున్న, తస్య = ఆ బ్రహ్మదేవునియొక్క, నేత్రాభ్యామ్ = నేత్రములనుండి, యత్ = ఏది, అసుస్రువత్ = స్రవించెనో, తత్ = అది, భగవతా = భగవంతునిచేత, గృహీతమ్ =

సురైః = దేవతలచేత, అధ్యుషితమ్ = అధిష్ఠించబడిన, సువిస్తీర్ణమ్ = చాల విశాలమైన, శైలమ్ = పర్వతమును, పశ్య = చూడుము. తస్మిన్ = ఆ, రమ్యే = రమ్యమైన, గిరివరే = పర్వతశ్రేష్ఠమునందు, బహుమూలఫలాశనః = అనేకమూలఫలములను తినుచున్నవాడవై, నిత్యమ్ = ఎల్లప్పుడూ, మమ = నాయొక్క, అన్తికచరః = సమీపమునందు సంచరించువాడవు, భవ = అగుము. త్వమ్ = నీవు, కంచిత్ కాలమ్ = కొంత కాలము, ఇహ = ఇక్కడ, ఆస్వ = ఉండుము. తతః = అటుపిమ్మట, శ్రేయః = శ్రేయస్సు, భవిష్యతి = కాగలదు.

తా. ఓ! వానరశ్రేష్ఠుడా! ఎల్లప్పుడూ దేవతలచే అధిష్ఠింపబడిన అతివిశాలమైన ఈ పర్వతమును చూడుము. రమ్యమైన ఆ పర్వతముమీద లభించు అనేకములైన ఫలములు, మూలములు భుజించుచు నిత్యమూ నాదగ్గర సంచరించుచుండుము. కొంతకాలము ఇక్కడే ఉండుము. తరవాత నీకు శ్రేయస్సు కలుగును. 12, 13

మూ. ఏవముక్తః స చైతేన బ్రహ్మణా వానరోత్తమః,
ప్రణమ్య శిరసా పాదౌ దేవదేవస్య రాఘవ. 14

ఉక్తవాన్ లోకకర్తారమాదిదేవం జగత్పతిమ్,
యథాజ్ఞాపయసే దేవ స్థితోఽహం తవ శాసనే. 15

ప్ర. అ. రాఘవ = రామా! ఏతేన = ఈ, బ్రహ్మణా = బ్రహ్మచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః వానరోత్తమః = ఆ వానరోత్తముడు, దేవదేవస్య = ఆ దేవదేవునియొక్క, పాదౌ = పాదములను, శిరసా = శిరస్సుచేత, ప్రణమ్య = నమస్కరించి, లోకకర్తారమ్ = లోకముల కర్తయైన, జగత్పతిమ్ = జగత్తుకు ప్రభువైన, ఆదిదేవమ్ = ఆదిదేవుడైన ఆ బ్రహ్మను గూర్చి, ఉక్తవాన్ = పలికినాడు. దేవ = దేవా! యథా = ఎట్లు, ఆజ్ఞాపయసే = ఆజ్ఞాపించుచున్నావో అట్లు, తవ = నీయొక్క, శాసనే = శాసనమునందు, అహమ్ = నేను, స్థితః = ఉన్నాను.

తా. రామా! బ్రహ్మదేవుని మాటలు విని ఆ వానరోత్తముడు దేవదేవుని పాదములకు శిరస్సు వంచి నమస్కరించి, జగత్తును సృజించిన, జగత్తుకు ప్రభు

ములను, ఫలాని చ=ఫలములను, గృహీత్వా = గ్రహించి, దేవదేవస్య=దేవతల దేవతయైన, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, పాదమూలే = పాదముల మూలము నందు, న్యవేదయత్ = నివేదించెను.

తా. ఉత్తమములైన పుష్పములు, ఫలములు తీసికొని వెళ్ళి దేవదేవుడైన బ్రహ్మదేవుని పాదాలవద్ద సమర్పించుచుండెడివాడు. 18

మూ. ఏవం తస్య గతః కాలో బహు పర్యటతో గిరిమ్, 19
కస్య చిత్త్వథ కాలస్య సమతీతస్య రాఘవ,
ఋక్షరాడ్వానరశ్రేష్ఠస్తృషయా పరిపీడితః, 20

ప్ర. అ. రాఘవ=రామా! తస్య=అతడు, బహు=అధికముగా, గిరిమ్= పర్వతమును, పర్యటతః = సంచరించుచుండగా, కాలః=కాలము, గతః = గడచి నది. అథ = అటు పిమ్మట, కస్య చిత్=ఒకానొక (కొంత), కాలస్య = కాలము, సమతీతస్య=గడచినదగుచుండగా, ఋక్షరాడ్=ఋక్షముల రాజు, వానరశ్రేష్ఠః= వానరశ్రేష్ఠుడూ అయిన అతడు, తృషయా = దప్పికచేత, పరిపీడితః = పీడింప బడెను.

తా. ఈ విధముగా అతడు అత్యధికముగా పర్వతముమీద తిరుగుచుండగా కాలము గడచుచుండెను. రామా! కొంత కాలము గడచిన పిమ్మట, ఒకనాడు భల్లూకములకు కూడ ప్రభువైన ఆ వానరశ్రేష్ఠుడు దప్పికచేత పీడింపబడెను.

మూ. ఉత్తరం మేరుశిఖరం గతస్తత్ర చ దృష్టవాన్,
నానావిహగసంఘుష్టం ప్రసన్నసలిలం సరః. 21

ప్ర. అ. ఉత్తరమ్ = ఉత్తరమున నున్న, మేరుశిఖరమ్ = మేరుపర్వత శిఖరమును గూర్చి, గతః=వెళ్ళినవాడై, తత్ర=అక్కడ నానావిహగసంఘుష్టమ్ =అనేకవిధములైన పక్షులచేత ధ్వనిచేయించబడిన, ప్రసన్నసలిలమ్ = ప్రసన్న మైన ఉదకము గల, సరః = సరస్సును, దృష్టవాన్ = చూచినాడు.

తా. అతడు మేరుపర్వతమునందలి ఉత్తరశిఖరమునకు వెళ్ళి అక్కడ అనేకవిధములైన పక్షులచేత ధ్వనింపచేయబడుచున్న, నిర్మలమైన ఉదకము గల సరస్సును చూచెను. 21

ప్ర. అ. సః వానరసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, ఏవమ్ = ఇట్లు, మనసా = మనస్సుచేత, సంచిన్త్య = ఆలోచించి, వానరచాపలాత్ = వానరచపలత్వమువలన, ఆప్లుత్య = ఎగిరి, తస్మిన్ = ఆ, హ్రదే = మడుగునందు, అపతత్ = పడెను.

తా. ఆ వానరశ్రేష్ఠుడు ఈ విధముగా ఆలోచించి, వానరసహజమైన చాపలముచేత ఎగిరి ఆ మడుగులలోనికి దుమికెను. 25

మూ. ఉత్ప్లుత్య తస్మాత్స హ్రదాదుత్థితః ప్లవగః పునః,
తస్మిన్నేవ క్షణే రామ స్త్రీత్వం ప్రాప స వానరః. 26

ప్ర. అ. సః ప్లవగః = ఆ వానరుడు, తస్మాత్ = ఆ, హ్రదాత్ = హ్రదమునుండి, ఉత్ప్లుత్య = ఎగిరి, పునః = మరల, ఉత్థితః = లేచినాడు. రామ = రామా! సః వానరః = ఆ వానరుడు, తస్మిన్ క్షణే ఏవ = ఆ క్షణమునందే, స్త్రీత్వమ్ = స్త్రీత్వమును, ప్రాప = పొందెను.

తా. ఆ వానరుడు ఆ హ్రదమునుండి ఎగిరి మరల పైకి లేచెను. రామా! ఆ క్షణమునందే ఆ వానరుడు స్త్రీగా మారిపోయెను. 26

మూ. మనోజ్ఞరూపా సా నారీ లావణ్యలలితా శుభా,
విస్తీర్ణజఘనా సుభ్రూర్నీలకున్తలమూర్ధజా. 27
ముగ్ధసస్మితవక్త్రా చ పీనస్తనతటా శుభా,
హ్రదతీరే చ సా భాతి ఋజుయష్టిర్లతా యథా. 28

ప్ర. అ. సా నారీ = ఆ స్త్రీ, మనోజ్ఞరూపా = మనోహరమైన రూపము గలది, లావణ్యలలితా = లావణ్యముచేత సుందరమైనది, శుభా = మంగళప్రదురాలు, విస్తీర్ణజఘనా = విశాలమైన జఘనము కలది, సుభ్రూః = అందమైన కనుబొమ్మలు గలది, నీలకున్తలమూర్ధజా = నల్లని ముంగురులు కేశములూ గలది, ముగ్ధసస్మితవక్త్రా చ = సుందరమైన, చిరునవ్వుతో కూడిన ముఖము గలది, పీనస్తనతటా = బలిసిన స్తనప్రదేశము గలది, శుభా = సుందరి. సా = ఆమె, హ్రదతీరే = హ్రదముతీరమునందు, ఋజుయష్టిః = ఋజువైన దండము గల, లతా యథా = లత వలె భాతి = ప్రకాశించుచున్నది.

యొక్క, పాదౌ = పాదములను, ఉపాస్య = సేవించి, తేన పథా = ఆ మార్గము చేత, నివృత్తః వై = మరలినాడు.

తా. ఇంతలో దేవేంద్రుడు బ్రహ్మదేవుని పాదములను సేవించి ఆ మార్గముననే తిరిగి వెళ్ళుచుండెను. 31

మూ. తస్యామపి చ వేళాయా మాదిత్యోఽపి పరిభ్రమన్,
తస్మిన్నేవ పదే సోఽభూద్యస్మిన్సా తనుమధ్యమా. 32

ప్ర. అ. తస్యామ్ = ఆ, వేళాయామ్ = సమయమునందు, పరిభ్రమన్ = సంచరించుచున్న, ఆదిత్యః = సూర్యుడు, సా = ఆ, తనుమధ్యమా = సన్నని నడుము గల స్త్రీ, యత్ర = ఎక్కడ ఉండునో, తస్మిన్ = ఆ, పదే ఏవ = స్థానమునందే, అభూత్ = ఉండెను.

తా. ఆ సమయమునందు సంచరించుచున్న సూర్యుడు ఆ స్త్రీ ఏ ప్రదేశమునందు ఉండెనో ఆ స్థానమునందే ఉండెను. 32

మూ. యుగపత్సా తదా దృష్టా దేవాభ్యాం సురసున్దరీ,
కన్దర్పవశగౌ తౌ తు దృష్ట్వా తాం సంబభూవతుః. 33

ప్ర. అ. సా = ఆ, సురసున్దరీ = దేవతాస్త్రీ, దేవాభ్యామ్ = ఆ దేవతలిద్దరి చేత, యుగపత్ = ఒక్కమారుగ, దృష్టా = చూడబడినది. తౌ = వారిద్దరూ, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, కన్దర్పవశగౌ = మన్మథవశులు, సంబభూవతుః = అయిరి.

తా. ఆ దేవతాస్త్రీని వారిద్దరూ ఒకే సమయమునందు చూచిరి. ఆమెను చూచి వారు మన్మథునకు వశులైరి. 33

మూ. తతః క్షుభితసర్వాఙ్గౌ సురేన్ద్రౌ పన్నగావివ,
తద్రూపమద్భుతం దృష్ట్వా త్యాజితౌ ధైర్యమాత్మనః 34

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పన్నగౌ ఇవ = సర్పముల వలె, క్షుభిత సర్వాఙ్గౌ = క్షోభింపచేయబడిన సకలశరీరములు గల, సురేన్ద్రౌ = ఆ దేవతా నాయకులు, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, తద్రూపమ్ = ఆమె రూపమును,

అతడు, వాలీ నామ = వాలి అను పేరు కలవాడు, బభూవ = ఆయెను. కన్దర్ప వశవర్తినా = మన్మథునకు వశుడైన, విధానమ్ = తన కర్తవ్యమును, అనువర్తతా = అనుసరించుచున్న, భాస్కరేణాపి = సూర్యునిచేతకూడ, తస్యామ్ = ఆమె యందు, గ్రీవాయామ్ = కంఠమునందు, బీజమ్ = బీజము, నిషిక్తమ్ = తడపబడినది.

తా. ఆ రేతస్సు వాలమునందు పడుటచేత అతడు వాలి అయ్యెను. తన కర్తవ్యమును ఆచరించుచున్న సూర్యుడు మన్మథ వశంవదుడై ఆమె కంఠము మీద రేతస్సును ఉంచెను. 37

మూ. తేనాపి సా వరతనుర్నోక్తా కించిద్వచః శుభమ్, 38
నివృత్తమదనశ్చాథ సూర్యోఽపి సమపద్యత,
గ్రీవాయాం పతితం బీజం సుగ్రీవః సమజాయత. 39

ప్ర. అ. సా = ఆ, వరతనుః = శ్రేష్ఠమైన శరీరము గల స్త్రీ, తేనాపి = వానిచేతకూడ, శుభమ్ = శుభమైన, కించిత్ వచః = ఏ మాటా కూడ, న ఉక్తా = చెప్పబడలేదు. అథ = పిమ్మట, సూర్యః అపి = సూర్యుడు కూడ, నివృత్తమదనః = తొలగిన మన్మథుడు కలవాడు, సమపద్యత = ఆయెను. గ్రీవాయామ్ = కంఠము నందు, పతితమ్ = పడిన, బీజమ్ = బీజము, సుగ్రీవః = సుగ్రీవుడుగా, సమ జాయత = ఆయెను.

తా. ఆ సూర్యుడు ఆమెతో ఒక మాట కూడ మాట్లాడలేదు. అతనినుండి మన్మథుడు దూరమాయెను. కంఠము మీద పడిన ఆ రేతస్సు సుగ్రీవు డయ్యెను. 38, 39

మూ. ఏవముత్పాదితౌ వీరౌ వానరేన్ద్రౌ మహాబలౌ,
దత్త్వా తు కాఞ్చనీం మాలాం వానరేన్ద్రస్య వాలినః, 40
అక్షయ్యాం గుణసంపూర్ణాం శక్రస్తు త్రిదివం యయౌ.

ప్ర. అ. వీరౌ = వీరులైన, మహాబలౌ = గొప్ప బలము గల, వానరేన్ద్రౌ = వానరనాయకులు, ఏవమ్ = ఈ విధముగా, ఉత్పాదితౌ = పుట్టించబడినారు. శక్రస్తు = దేవేంద్రుడు, వానరేన్ద్రస్య = వానరనాయకుడైన, వాలినః = వాలికి, కాఞ్చనీమ్ = బంగారము వికారమైన, అక్షయ్యామ్ = నాశము లేని, గుణ సంపూర్ణామ్ = మంచి గుణములతో నిండిన, మాలామ్ = మాలను, దత్త్వా తు = ఇచ్చి, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, యయౌ = వెళ్లెను.

తదా = అప్పుడు, తేన = అతనిచేత, అమృతకల్పాని = అమృతముతో సమానములైన, మధూని = తేనెలను, పాయితౌ = త్రాగించబడిరి.

తా. అతడు వానరుడుగా మారి, పచ్చని కళ్ళు గల,బలవంతులు, స్వేచ్ఛా రూపము గలవారు వానరశ్రేష్ఠులూ అయిన తన పుత్రులైన ఆ వానరులను చూచెను. అప్పుడు అతడు వారిద్దరికీ అమృతమువంటి తేనెలు త్రాగించెను. 43, 44

మూ. గృహ్యర్క్షరజాస్తౌ తు బ్రహ్మణోఽన్తిక మాగమత్,
దృష్ట్వర్క్షరజసం పుత్రం బ్రహ్మలోకపితామహః, 45
బహుశః సాన్త్వయామాస పుత్రాభ్యాం సహితం హరిమ్.

ప్ర. అ. ఋక్షరజాః = ఋక్షరజస్సు, తౌ = వాళ్ళిద్దరినీ, గృహ్య = గ్రహించి, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, అన్తికమ్ = సమీపమును, ఆగమత్ = పొందెను. లోకపితామహః = లోకములకు పితామహుడైన, బ్రహ్మా = బ్రహ్మ, పుత్రమ్ = పుత్రుడైన, ఋక్షరజసమ్ = ఋక్షరజస్సును, దృష్ట్వా = చూచి, పుత్రాభ్యామ్ = పుత్రులతో, సహితమ్ = కూడిన, హరిమ్ = ఆ వానరుణ్ణి, బహుశః = అనేక విధములుగా, సాన్త్వయామాస = ఓదార్చెను.

తా. ఋక్షరజస్సు వారిద్దరినీ తీసికొని బ్రహ్మదగ్గరకు వచ్చెను. లోకములకు పితామహుడైన బ్రహ్మదేవుడు పుత్రుడైన ఋక్షరజస్సును చూచి, పుత్రులతో కూడిన అతనిని అనేక విధముల ఓదార్చెను. 45

మూ. సాన్త్వయిత్వా తతః పశ్చాద్దేవదూతమథాదిశత్, 46
గచ్ఛ మద్వచనాద్దూత కిష్కిన్ధాం నామ వై శుభామ్.
సా హ్యస్య గుణసంపన్నా మహతీ చ పురీ శుభా. 47

ప్ర. అ. సాన్త్వయిత్వా = ఓదార్చి, తతః పశ్చాత్ = అటు పిమ్మట, అథ = అనంతరము, దేవదూతమ్ = దేవదూతను, ఆదిశత్ = ఆజ్ఞాపించెను. దూత = దూతా! మద్వచనాత్ = నా మాటవలన, శుభామ్ = శుభమైన, కిష్కిన్ధాం నామ = కిష్కింధ అను నగరమును గూర్చి, గచ్ఛ = వెళ్లుము. గుణసంపన్నా = మంచి గుణములతో నిండిన, మహతీ = గొప్పదైన, శుభా = మంగళప్రదమైన, సా పురీ = ఆ పట్టణము, అస్య హి = ఈతనిది కదా ?

తా. ఓదార్చి పిమ్మట బ్రహ్మదేవుడు దేవదూతతో ఇట్లు పలికెను."దూతా!

= వానరశ్రేష్ఠుడైన ఋక్షరజసమ్=ఋక్షరజస్సును, దృష్ట్వా=చూచి (చూపించి), యూథపాలాన్ = గుంపుల పాలకులను, అన్యాన్ = ఇతరులైన, యాన్ చ = ఏ, ప్రాకృతాన్ = ప్రాకృతులైన, హరీన్ = వానరులను, సమాహ్వాయ = పిలచి, జనసంది = జనుల సభయందు, సర్వేషామ్ = సమస్తమైన, తేషామ్= వాళ్ళకు, మదీయమ్= నా సంబంధమైన అభిప్రాయమును, సంభావ్య = తెలిపి, మహదాసనే = గొప్ప ఆసనమునందు, ఆరోప్య = ఎక్కించి, రాజానమ్ = రాజునుగా, అభిషేచయ = అభిషిక్తుని చేయుము.

తా. అక్కడ పుత్రసహితుడైన వానరశ్రేష్ఠుడైన ఋక్షరజస్సును చూపి, వానరయూథనాయకులను, సామాన్యవానరులను పిలచి, జనుల సభలో అందరికి నా అభిప్రాయమును తెలిపి, ఇతనిని సింహాసనముమీద కూర్చుండబెట్టి రాజునుగా అభిషిక్తుని చేయుము. 50,51

మూ. దృష్టమాత్రాశ్చ తే సర్వే వానరేణ చ ధీమతా,
అస్యర్క్షరజసో నిత్యం భవిష్యన్తి వశానుగాః. 52

ప్ర. అ. తే సర్వే= వాళ్ళందరూ, ధీమతా=బుద్ధిమంతుడైన, వానరేణ= వానరునిచేత, దృష్టమాత్రాః చ=చూడబడగానే, నిత్యమ్ = ఎల్లప్పుడూ, అస్య= ఈ, ఋక్షరజసః = ఋక్షరజస్సుకు, వశానుగాః = వశమునందున్నవారు, భవిష్యన్తి = కాగలరు.

తా. ధీమంతుడైన ఈ ఋక్షరజస్సు చూడగానే వాళ్ళందరూ ఈతనికి నిత్యమూ వశులై ఉండగలరు. 52

మూ. ఇత్యేవముక్తే వచనే బ్రహ్మణా తం హరీశ్వరమ్,
పురతః కృత్య దూతోఽసౌ ప్రయయౌ తాం పురీం శుభామ్.

ప్ర. అ. బ్రహ్మణా = బ్రహ్మచేత, ఇత్యేవమ్=ఇట్లు, ఉక్తే = పలకబడిన దగుచుండగా, అసౌ = ఆ, దూతః = దూత, తమ్ = ఆ, హరీశ్వరమ్ = వానర నాయకుణ్ణి, పురతఃకృత్య = ముందు ఉంచుకొని, శుభామ్ = సుందరమైన, తాం పురీమ్ = ఆ పట్టణమును గూర్చి, ప్రయయౌ = వెళ్లెను.

తా. ఆతడు సంతోషించిన మనస్సుతో ఏడు ద్వీపములు, సముద్రములూ గల భూమిమీద ఉన్న వానరు లందరినీ ఆజ్ఞాపించెను. (పాలించెను). 56

మూ. వాలిసుగ్రీవయోరేవమేష చర్క్షరజాః పితా,
జననీ చైష తు హరిరిత్యేతద్భద్రమస్తు తే. 57

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఏషః = ఈ, ఋక్షరజాః = ఋక్షరజస్సు, వాలిసుగ్రీవయోః = వాలిసుగ్రీవులకు, పితా = తండ్రి. ఏషః = ఈ, హరిః = వానరుడే, జననీ చ = తల్లి కూడ. ఇత్యేతత్ = అనునది చెప్పబడినది. తే = నీకు, భద్రమ్ = క్షేమము. అస్తు = అగుగాక.

తా. ఈ విధముగా ఈ ఋక్షరజస్సు వాలిసుగ్రీవులకు తండ్రి. ఇతడే తల్లి కూడ. ఈ విషయము నీకు చెప్పితిని. నీకు క్షేమ మగుగాక. 57

మూ. యశ్చైతచ్ఛ్రావయేద్విద్వాన్యశ్చైతచ్ఛృణుయాన్నరః,
సిధ్యన్తి తస్య కార్యార్థా మనసో హర్షవర్ధనాః. 58

ప్ర. అ. యః = ఏ, విద్వాన్ = విద్వాంసుడు, ఏతత్ = దీనిని, శ్రావయేత్ = వినిపించునో, యః = ఏ, నరః = మనుష్యుడు, ఏతత్ = దీనిని, శృణుయాత్ = వినునో, తస్య = వానియొక్క, మనసః = మనస్సునకు, హర్షవర్ధనాః = సంతోషమును వృద్ధి పొందించు, కార్యార్థాః = కార్యములు, ప్రయోజనములు, సిధ్యన్తి = సిద్ధించును.

తా. ఏ విద్వాంసుడు ఈ కథను వినిపించునో, ఎవడు దీనిని వినునో వాళ్ల మనస్సుకు ఆనందమును వృద్ధిపొందించు కార్యములు సిద్ధించును. 58

మూ. ఏతచ్చ సర్వం కథితం మయా విభో
ప్రవిస్తరేణేహ యథార్థతస్తత్,
ఉత్పత్తిరేషా రజనీచరాణా
ముక్తా తథైవేహ హరీశ్వరాణామ్. 59

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ప్రక్షిప్తః సర్గః ప్రథమః.

## ప్రక్షిప్తః సర్గః ద్వితీయః

[రావణుడు సనత్కుమారునినుండి శ్రీ మహావిష్ణువునకు గల మాహాత్మ్యము తెలిసికొని అతని చేతిలో మరణము తన కెట్లు లభించునా అని ఆలోచించుట].

మూ. ఏతాం శ్రుత్వా కథాం దివ్యాం పౌరాణీం రాఘవస్తదా,
భ్రాతృభిః సహితో వీరో విస్మయం పరమం యయౌ. 1

ప్ర.అ తదా = అప్పుడు, భ్రాతృభిః = సోదరులతో, సహితః = కూడిన, వీరః = వీరుడైన, రాఘవః = రాముడు, దివ్యామ్ = దివ్యమైన, పౌరాణీమ్ = పురాణమునకు సంబంధించిన, ఏతాం కథామ్ = ఈ కథను, శ్రుత్వా = విని,పరమమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, యయౌ = పొందెను.

తా. సోదరులతో కూడిన వీరుడైన రాముడు దివ్యమైన పురాతనమైన ఈ కథను విని గొప్ప ఆశ్చర్యమును పొందెను.

మూ. రాఘవోఽథ ఋషేర్వాక్యం శ్రుత్వా వచన మబ్రవీత్,
కథేయం మహతీ పుణ్యా త్వత్ప్రసాదాచ్ఛ్రుతా మయా. 2

ప్ర. అ. రాఘవః=రాముడు, ఋషేః = ఋషియొక్క, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, అథ = అటుపిమ్మట. వచనమ్ = వచనమును, అబ్రవీత్ =పలికెను. త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, పుణ్యా = పుణ్యమైన, మహతీ = గొప్పదైన, ఇయం కథా = ఈ కథ, మయా=నాచేత, శ్రుతా = వినబడినది.

తా. రాముడు అగస్త్యుని మాటలు విని ఇట్లు పలికెను. నీ అనుగ్రహము వలన పుణ్యప్రదమైన ఈ గొప్ప కథను విన్నాను. 2

మూ. అథాపరాం కథాం దివ్యాం శృణు రాజన్ సనాతనీమ్
యదర్థం రామ వైదేహీ రావణేన పురా హృతా. 6
తత్తేఽహం సంప్రవక్ష్యామి సమాధిం శ్రవణే కురు.

ప్ర.అ. రాజన్ = రాజా! అథ = మరియు, అపరామ్ = మరియొక, దివ్యామ్ = దివ్యమైన, సనాతనీమ్ = ప్రాచీనమైన, కథామ్ = కథను, శృణు = వినుము. రామ = రామా! పురా = పూర్వము, రావణేన = రావణునిచేత, వైదేహీ = సీత, యదర్థమ్ = ఎందునిమిత్తము, హృతా = హరింపబడినదో, తత్ = దానిని, అహమ్ = నేను, తే = నీకు, సంప్రవక్ష్యామి = చెప్పెదను. శ్రవణే = వినుటయందు, సమాధిమ్ = ఏకాగ్రతను, కురు = చేయుము.

తా. రామా! ప్రాచీనమైన మరొక దివ్యమైన కథ చెప్పెదను; వినుము. పూర్వము రావణుడు సీతను ఎందుకు హరించినాడో చెప్పెదను. సావధానచిత్తముతో వినుము. 6

మూ. పురా కృతయుగే రామ ప్రజాపతిసుతం ప్రభుమ్ 7
సనత్కుమారమాసీనం రావణో రాక్షసాధిపః

ప్ర. అ. రామ = రామా! పురా = పూర్వము, కృతయుగే = కృతయుగమునందు, రాక్షసాధిపః = రాక్షసప్రభువైన, రావణః = రావణుడు, ప్రజాపతిసుతమ్ = బ్రహ్మపుత్రుడు, ప్రభుమ్ = సమర్థుడు అయిన, ఆసీనమ్ = కూర్చొని ఉన్న, సనత్కుమారమ్ = సనత్కుమారుణ్ణి (చూచెను.)

తా. రామా! పూర్వము కృతయుగమునందు రాక్షసరాజైన రావణుడు, బ్రహ్మదేవుని పుత్రుడూ, సర్వథాసమర్థుడూ అయిన సనత్కుమారుడు ఒక చోట కూర్చొని ఉండగా చూచెను. 7

మూ. వపుషా సూర్యసంకాశం జ్వలన్తమివ తేజసా, 8
వినయావనతో భూత్వా హ్యభివాద్య కృతాఞ్జలిః,
ఉక్తవాన్ రావణో రామ తమృషిం సత్యవాదినమ్. 9

ప్ర. అ. రామ = రామా! రావణః = రావణుడు, వపుషా = దేహముచేత,

మూ. విదిత్వా హృద్గతం తస్య ధ్యానదృష్టిర్మహాయశాః,
ఉవాచ రావణం ప్రేమ్ణా శ్రూయతామితి పుత్రక. 12

ప్ర. అ. ధ్యానదృష్టిః=ధ్యానదృష్టి గల, మహాయశాః = గొప్ప కీర్తి గల సనత్కుమారుడు. తస్య = వానియొక్క, హృద్గతమ్ = మనస్సులో ఉన్న అభిప్రాయమును, విదిత్వా=తెలుసుకొని, రావణమ్= రావణునిగూర్చి, పుత్రక= పుత్రా! శ్రూయతామ్ = వినబడుగాక, ఇతి = అని, ప్రేమ్ణా = ప్రేమతో, ఉవాచ = పలికెను.

తా. ధ్యానదృష్టి గల మహాయశశ్శాలియైన ఆ సనత్కుమారుడు రావణుని మనస్సులో ఉన్న అభిప్రాయమును తెలుసుకొని "నాయనా ! వినుము" అని ఇట్లు చెప్పెను. 12

మూ. యో వై భర్తా జగత్కృత్స్నం యస్యోత్పత్తిం న విద్మహే,
సురాసురైర్నతో నిత్యం హరిర్నారాయణః ప్రభుః. 13

యస్య నాభ్యుద్గతో బ్రహ్మా విశ్వస్య జగతః పతిః,
యేన సర్వమిదం సృష్టం విశ్వం స్థావరజఙ్గమమ్. 14

తం సమాశ్రిత్య విబుధా విధినా హరిమధ్వరే
పిబన్తి హ్యమృతం చైవ మానితాశ్చ యజన్తి తమ్. 15

ప్ర. అ. యః= ఎవడు, కృత్స్నమ్= సమస్తమైన, జగత్=జగత్తును, భర్తా= భరించువాడో, యస్య = ఎవనియొక్క, ఉత్పత్తిమ్ = పుట్టుకను, న విద్మహే= ఎరుగమో, హరిః = సర్వపాపములను హరించువాడు, నారాయణః = జలము నివాసస్థానముగా గలవాడు, ప్రభుః= సమర్థుడు అయిన ఎవడు, నిత్యమ్ = నిత్యమూ, సురాసురైః = సురులచేతను, అసురులచేతను, నతః = నమస్కరించబడుచున్నాడో, విశ్వస్య= సమస్తమైన, జగతః= జగత్తుకు, పతిః= ప్రభువైన, బ్రహ్మా= బ్రహ్మ, యస్య= ఎవనియొక్క, నాభ్యుద్భవః= నాభినుండి పుట్టినాడో, యేన = ఎవనిచేత, స్థావరజఙ్గమమ్=స్థావరజంగమాత్మకమైన, ఇదమ్= ఈ, విశ్వమ్=ప్రపంచము, సృష్టమ్=సృజింపబడినదో, తమ్= ఆ, హరిమ్ = విష్ణువును, సమాశ్రిత్య = ఆశ్రయించి, విబుధాః = దేవతలు

సదా = ఎల్లప్పుడూ, సర్వైః = అందరిచేతా, సః = ఆతడు, పూజ్యతే = పూజింపబడుచున్నాడు.

తా. దైత్యదానవ రాక్షసులను, దేవతల శత్రువులైన ఇతరులను అందరినీ శ్రీమహావిష్ణువు యుద్ధములో జయించుచుండును. అందరూ పూజించుచున్నది ఈతనినే. 17

మూ. శ్రుత్వా మహర్షేస్తద్వాక్యం రావణో రాక్షసాధిపః,
ఉవాచ ప్రణతో భూత్వా పునరేవ మహామునిమ్. 18

ప్ర. అ. రాక్షసాధిపః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, మహర్షేః = మహర్షియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రణతః = వంగినవాడు, భూత్వా = అయి, పునః ఏవ = మరల, మహామునిమ్ = మహామునిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాక్షసరాజైన రావణుడు మహర్షి పలికిన ఆ మాటలు విని, మరల వినయపూర్వకముగ అతనితో ఇట్లనెను. 18

మూ. దైత్యదానవరక్షాంసి యే హతాః సమరేఽరయః,
కాం గతిం ప్రతిపద్యన్తే కాం చ తే హరిణా హతాః. 19

ప్ర. అ. అరయః = శత్రువులైన, యే = ఏ, సమరే = యుద్ధమునందు, హతాః = చంపబడిన, దైత్యదానవరక్షాంసి = దైత్యులు, దానవులు, రాక్షసులూ ఉన్నారో, వారు, కామ్ = ఏ, గతిమ్ = గతిని, ప్రతిపద్యన్తే = పొందుదురు ? హరిణా = విష్ణువుచేత, హతాః = చంపబడినవారు, కాం గతిమ్ = ఏ గతిని, ప్రతిపద్యన్తే = పొందుదురు.

తా. యుద్ధములో చంపబడిన శత్రువులైన దైత్యదానవరాక్షసులకు ఏ గతి వచ్చును ! విష్ణుమూర్తిచేత చంపబడిన వారికి ఏ గతి కలుగును ? 19

మూ. రావణస్య వచః శ్రుత్వా ప్రత్యువాచ మహామునిః,
దైవతైర్నిహతా నిత్యం ప్రాప్నువన్తి దివః స్థలమ్. 20

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా =

మరణించిన రాజు లందరూ ఆ విష్ణువు స్థానమైన వైకుంఠమునకే వెళ్ళుదురు. శ్రీ మహావిష్ణువు కోపము కూడ వరముతో సమానము 22

మూ. శ్రుత్వా తత స్తద్వచనం నిశాచరః
సనత్కుమారస్య ముఖాద్వినిర్గతమ్.
తథా ప్రహృష్టః స బభూవ విస్మితః
కథం ను యాస్యామి హరిం మహాహవే. 23

ఇత్యార్షే శ్రీ మద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ప్రక్షిప్తః సర్గః ద్వితీయః.

ప్ర. అ. సః = ఆ, నిశాచరః = రావణుడు, తతః = పిమ్మట, సనత్కుమారస్య = సనత్కుమారునియొక్క, ముఖాత్ = ముఖమునుండి, వినిర్గతమ్ = బయల్వెడలిన, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తథా = అట్లు, ప్రహృష్టః = సంతోషించినవాడై, విస్మితః = ఆశ్చర్యము చెందినవాడు, బభూవ = ఆయెను. మహాహవే = మహాయుద్ధమునందు, హరిమ్ = విష్ణువును గూర్చి, కథం ను = ఎట్లు, యాస్యామి = వెళ్ళుదును (అని ఆలోచించెను).

తా. ఆ రావణుడు సనత్కుమారుని మాటలు విని, సంతోషము, ఆశ్చర్యము కూడ పొంది, నేను హరిని యుద్ధములో ఎదిరించుట ఎట్లు సిద్ధించును? " అని ఆలోచించెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో రెండవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః=అతడు, ఏవమ్=ఇట్లు, శ్రుత్వా=విని, తమ్ = ఆ, ఋషిమ్=ఋషిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. తస్య = ఆ విష్ణువుయొక్క, లక్షణమ్=లక్షణము, కీదృశమ్=ఎట్టిది? సర్వమ్ = సమస్తమును, అశేషతః = పూర్తిగా, బ్రూహి = చెప్పుము.

తా. రావణుడు ఆ మాటలు విని ఆ ఋషితో మరల ఇట్లు పలికెను. ఆ మహావిష్ణువు లక్షణము లేవో పూర్తిగా చెప్పుము. 3

మూ. రాక్షసేశవచః శ్రుత్వా స మునిః ప్రత్యభాషత,
శ్రూయతాం సర్వమాఖ్యాస్యే తవ రాక్షసపుంగవ. 4

ప్ర. అ. రాక్షసేశవచః = రాక్షసరాజు వచనమును, శ్రుత్వా=విని, సః మునిః=ఆ ముని, ప్రత్యభాషత = తిరిగి పలికెను. రాక్షసపుంగవ = రాక్షస శ్రేష్ఠుడా! సర్వమ్ = సమస్తమునూ, తవ=నీకు, ఆఖ్యాస్యే=చెప్పగలను. శ్రూయతామ్ = వినబడుగాక.

తా. రావణుని మాటలు విని ఆ ముని మరల ఇట్లనెను. రాక్షసశ్రేష్ఠుడా! నీకు అంతా చెప్పెదను వినుము. 4

మూ. స హి సర్వగతో దేవః సూక్ష్మో ఒవ్యక్తః సనాతనః,
తేన సర్వ మిదం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్. 5

ప్ర. అ. సః దేవః=ఆ దేవుడు, సర్వగతః హి=అంతటా ఉన్నవాడు కదా. సూక్ష్మః=సూక్ష్మమైనవాడు. అవ్యక్తః = వ్యక్తుడు కానివాడు. సనాతనః = అతి పురాతనుడు. సచరాచరమ్ = జంగమస్థావరాత్మకమైన, ఇదమ్ = ఈ, త్రైలోక్యమ్=మూడులోకముల సముదాయము, సర్వమ్ = సమస్తమూ, తేన = వానిచేత, వ్యాప్తమ్ = వ్యాపింపబడినది.

తా. ఆ శ్రీమహావిష్ణువు అంతటా ఉన్నాడు. సూక్ష్ముడు. స్పష్టముగా ఇంద్రియములకు గోచరుడు కానివాడు. అతిప్రాచీనుడు. స్థావరజంగమాత్మకములైన ఈ మూడు లోకములను అతడు వ్యాపించి ఉన్నాడు. 5

మూ. స భూమౌ దివి పాతాలే పర్వతేషు వనేషు చ,
స్థావరేషు చ సర్వేషు నదీషు నగరీషు చ. 6

మూ. విద్యోతతి జ్వలతి భాతి లోకాన్
సృజత్యయం సంహరతి ప్రశాస్తి,
క్రీడాం కరోత్యవ్యయలోకనాథో
విష్ణుః పురాణో భవనాశకైకః. 9

ప్ర. అ. అవ్యయలోకనాథః=వినాశరహితుడైన లోకప్రభువైన,పురాణః=ప్రాచీనుడైన, భవనాశకైకః= సంసారమును నశింపచేయు ఏకైక దేవుడైన, విష్ణుః=విష్ణువు, విద్యోతతి=ప్రకాశింపజేయుచున్నాడు. జ్వలతి=మండుచున్నాడు. భాతి=ప్రకాశించుచున్నాడు. అయమ్=ఇతడే, లోకాన్=లోకములను, సృజతి=సృజించుచున్నాడు. ప్రశాస్తి = రక్షించుచున్నాడు, సంహరతి = సంహరించుచున్నాడు. క్రీడామ్=క్రీడను, కరోతి=చేయుచున్నాడు.

తా. వినాశము లేని లోకప్రభువైన, అతిప్రాచీనుడైన ఈ విష్ణువు ఒక్కడే సంసారదుఃఖమును నశింపజేయగలవాడు. అన్నింటినీ ప్రకాశింపచేయును. లోకములను సృజించి, రక్షించి, సంహరించుచుండును. ఈ విధముగా క్రీడించుచుండును. 9

మూ. అథవా బహునానేవ కిముక్తేన దశానన.
తేన సర్వమిదం వ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్. 10

ప్ర. అ. దశానన= రావణా! అథవా= లేదా, ఉక్తేన = చెప్పబడిన, బహునా = అధికమైన, అనేన = దీనిచేత, కిమ్=ఏమి ప్రయోజనము? సచరాచరమ్=జంగమస్థావరములతో కూడిన, ఇదమ్ = ఈ, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము. తేన=వానిచేత, వ్యాప్తమ్=వ్యాపించబడినది.

తా. రావణా! లేదా-ఇదంతా చెప్పి ఏమి ప్రయోజనము? ఒక్క మాటలో చెప్పవలెననగా జంగమస్థావరాత్మకమైన ఈ మూడు లోకములను ఈ విష్ణువు వ్యాపించి ఉన్నాడు. 10

మూ. నీలోత్పలదలశ్యామః కిఞ్జల్కారుణవాససా,
ప్రావృట్కాలే యథా వ్యోమ్ని సతడిత్తోయదో యథా. 11

ప్ర. అ. కిఞ్జల్కారుణవాససా = కింజల్కముల వలె ఎఱ్ఱనైన వస్త్రముతో కూడిన, నీలోత్పలదలశ్యామః = నల్లకలువల రేకుల వలె శ్యామవర్ణము గల అతడు, యథా=ఎట్లుండును అనగా, ప్రావృట్కాలే=వర్షకాలమునందు, వ్యోమ్ని

ప్ర. అ. సః = అతడు, సురైః = దేవతలచేత, ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యః = శక్యమైన వాడు కాడు అసురైః = అసురులచేత, న = కాదు. పన్నగైః చ = సర్పములచేత, న = కాదు. యస్య = ఎవనికి, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురుతే = చేయునో, సః = అతడు, తమ్ = అతనిని, ద్రష్టుమ్ = చూచుటకు, అర్హతి = తగి ఉన్నాడు.

తా. ఆతనిని దేవతలు గాని, అసురులు గాని, పన్నగులు గాని, చూడజాలరు. అతడు ఎవరిని అనుగ్రహించునో వారుమాత్రమే చూడగలరు. 14

మూ. న హి యజ్ఞఫలైస్తాత న తపోభిస్తు సంచితైః,
శక్యతే భగవాన్ ద్రష్టుం న దానేన న చేజ్యయా. 15

ప్ర. అ. తాత = తండ్రీ! భగవాన్ = భగవంతుడు, యజ్ఞఫలైః = యజ్ఞముల ఫలములచేత, ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యతే హి = శక్యము కాదు కదా. సంచితైః = సంపాదించబడిన, తపోభిః = తపస్సులచేత, న = శక్యముకాదు. దానేన = దానములచేత, న = కాదు. ఇజ్యయా చ = యాగముచేత కూడ, న = కాదు.

తా. నాయనా! ఆ భగవంతుణ్ణి యజ్ఞఫలములచేత గాని, బాగా చేసిన తపస్సులచేత గాని, దానముచేత గాని, యాగముచేత గాని చూడ శక్యము కాదు. 15

మూ. తద్భక్తైస్తద్గతప్రాణైస్తచ్చిత్తైస్తత్పరాయణైః,
శక్యతే భగవాన్ ద్రష్టుం జ్ఞాననిర్దగ్ధకిల్బిషైః. 16

ప్ర. అ. తద్గతప్రాణైః = ఆతనినే పొందిన ప్రాణములు గల, తచ్చిత్తైః = అతనియందే చిత్తము గల, తత్పరాయణైః = ఆతనియందే ఆసక్తి గల, జ్ఞాననిర్దగ్ధకిల్బిషైః = జ్ఞానముచేత కాల్చివేయబడిన పాపములు గల, తద్భక్తైః = అతని భక్తులచేతనే, భగవాన్ = భగవంతుడు, ద్రష్టుమ్ = చూచుటకు, శక్యతే = శక్య మగుచున్నాడు.

తా. ప్రాణములను ఆ భగవంతునికే సమర్పించి, చిత్తములను అతనియందే

నున్నాడో, తస్య = అతనికి, మహాతేజాః = గొప్పతేజస్సు గల, రామో నామ = రాము డను, సూనుః = కుమారుడు, భవిష్యతి = పుట్టగలడు. మహాతేజాః = గొప్ప తేజస్సు గల అతడు, మహాబుద్ధిః = గొప్ప బుద్ధి గలవాడు. మహాబలపరాక్రమః = గొప్ప బలపరాక్రమములు గలవాడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు. మహాసత్త్వః = గొప్ప ధైర్యము గలవాడు, క్షమయా = ఓర్పుచేత, పృథివీసమః = భూమితో సమానుడు.

తా. భూలోకములో ఇక్ష్వాకువంశమునందు దశరథమహారాజు పుట్టగలడు. అతనికి మహాఃతేజశాలియైన రాము డను పుత్రుడు జనించును. గొప్ప బుద్ధి, బలము, పరాక్రమము, ధైర్యము గల ఆ మహాబాహువు ఓర్పుచేత భూమితో సమానుడుగా ఉండును. 19, 20

మూ. ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యః సమరే శత్రుభిస్తదా,
భవితా హి తదా రామో నరో నారాయణః ప్రభుః. 21

ప్ర. అ. తదా = అప్పుడు, ప్రభుః = ప్రభువైన, నారాయణః = నారాయణుడు, సమరేః = యుద్ధమునందు, ఆదిత్యః ఇవ = సూర్యుడు వలె, దుష్ప్రేక్ష్యః = చూడశక్యముకాని, నరః = నరుడైన, రామః = రాముడుగా, భవితా హి = పుట్టగలడు.

తా. అప్పుడు ప్రభువైన నారాయణుడు యుద్ధరంగంలో శత్రువులకు సూర్యుడు వలె చూడశక్యముగాని రాముడుగా నరరూపమున అవతరించగలడు. 21

మూ. పితుర్నియోగాత్స విభుర్దణ్డకే వివిధే వనే,
విచరిష్యతి ధర్మాత్మా భ్రాత్రా సహ మహామనాః. 22

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు, మహామనాః = గొప్ప మనస్సు కలవాడూ అయిన, సః = ఆ, విభుః = ప్రభువు, పితుః = తండ్రియొక్క, నియోగాత్ = ఆజ్ఞవలన, వివిధే = అనేకవిధములైన, దణ్డకే వనే = దండకవనమునందు, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, విచరిష్యతి = సంచరించగలడు.

తా. ధర్మాత్ముడు, గొప్ప మనస్సు గలవాడు అయిన రామప్రభువు

కూడిన ఆ సీత, సహస్రాంశోః = సూర్యునియొక్క, రశ్మిరివ = కిరణము వలె, ఏకా = ఒక, మూర్తిరివ = మూర్తివలె, స్థితా = ఉన్నది.

తా. మంచి శీలము, ఆచారము, సద్గుణములూ గల ఆ సీత గొప్ప ధైర్యము గలదై, సూర్యుని కిరణము వలె, ఆ కిరణముయొక్క మరొక మూర్తి వలె ఉన్నది. (ఉండగలదు). 25

మూ. ఏవం తే సర్వమాఖ్యాతం మయా రావణ విస్తరాత్,
మహతో దేవదేవస్య శాశ్వతస్యావ్యయస్య చ. 26

ప్ర. అ. రావణ = రావణా! ఏవమ్ = ఈ విధముగా, మయా = నాచేత, తే = నీకు, సర్వమ్ = అంతా, విస్తరాత్ = విస్తరమువలన, మహతః = గొప్ప వాడు, శాశ్వతస్య = నిత్యుడు, అవ్యయస్య చ = నాశరహితుడూ అయిన, దేవ దేవస్య = దేవదేవునియొక్క ప్రభావాదికము, కథితమ్ = చెప్పబడినది.

తా. రావణా! ఈ విధముగా నీకు, నేను, సర్వోత్తముడు, నిత్యుడు, వినాశరహితుడు, దేవదేవుడూ అయిన శ్రీమహావిష్ణువు ప్రభావమును సవిస్తరముగా చెప్పినాను. 26

మూ. ఏవం శ్రుత్వా మహాబాహూ రాక్షసేన్ద్రః ప్రతాపవాన్,
త్వయా సహ విరోధేచ్ఛుశ్చిన్తయామాస రాఘవ. 27

ప్ర. అ. రాఘవ = రామా! మహాబాహుః = గొప్ప బాహువులు గల, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడైన, రాక్షసేన్ద్రః = రాక్షసరాజు, ఏవమ్ = ఇట్లు, శ్రుత్వా = విని, త్వయా సహ = నీతో కూడ, విరోధేచ్ఛుః = విరోధమును కోరు చున్నవాడై, చిన్తయామాస = ఆలోచించెను.

తా. రామా! మహాబాహువు, ప్రతాపవంతుడూ అయిన రావణుడు ఈ విషయము విని, నీతో వైరము పెట్టుకొనవలె నని కోరుచు మనస్సులో ఆలోచించెను. 27

మూ. సనత్కుమారాత్తద్వాక్యం చిన్తయానో ముహుర్ముహుః,
రావణో ముముదే శ్రీమాన్ యుద్ధార్థం విచచార హ. 28

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, రావణః = రావణుడు, సనత్కుమా

తా. అప్పుడు ఆ వాక్యములు విన్న రాముడు సంతోషించుచు, ఆశ్చర్యము చేత వికసించిన నేత్రములు గలవాడై "ప్రాచీనకథను చెప్పుము"అని మరల జ్ఞానవంతులలో శ్రేష్ఠుడైన ఆ అగస్త్యమునిని కోరెను. 30

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో మూడవ ప్రక్షిప్తసర్గ సమాప్తము.

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల అగస్త్యుడు, ప్రీతాత్మా = సంతోషించిన మనస్సు గలవాడై, యథాఖ్యానమ్ = తనకు ఇతరులు చెప్పినవిధముగా, శ్రుతం చైవ = తనచేత వినబడిన కథను, యథావృత్తమ్ = జరిగిన విధముగా, యథా తథా = ఉన్నదున్నట్లు, రాఘవాయ = రామునకు, కథయామాస = చెప్పెను.

తా. మహాబుద్ధిశాలియైన అగస్త్యుడు సంతోషించిన మనస్సుతో ఆ కథను తనకు ఇతరులు ఎట్లు చెప్పిరో, తాను ఎట్లు వినెనో అట్లే, జరిగినది జరిగినట్లు రామునకు చెప్పెను. 3

మూ. ఏతదర్థం మహాబాహో రావణేన దురాత్మనా,
సుతా జనకరాజస్య హృతా రామ మహామతే. 4

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! మహామతే = గొప్ప బుద్ధి గలవాడా! రామ = రామా! దురాత్మనా = దుర్బుద్ధియైన, రావణేన = రావణునిచేత, ఏతదర్థమ్ = ఇందునిమిత్తమే, జనకరాజస్య సుతా = సీత, హృతా = హరించబడినది.

తా. గొప్ప బుద్ధి గల, మంచి బాహుబలము గల రామా! దురాత్ముడైన రావణుడు అందుకొరకే సీతను హరించినాడు. 4

మూ. ఏతాం కథాం మహాబాహో నారదః సుమహాయశాః,
కథయామాస దుర్ధర్ష మేరౌ గిరివరోత్తమే. 5

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులుగలవాడా! దుర్ధర్ష = ఎదిరింప శక్యము కానివాడా! ఏతాం కథామ్ = ఈ కథను, సుమహాయశాః = చాల గొప్ప కీర్తి గల, నారదః = నారదుడు, గిరివరోత్తమే = శ్రేష్ఠపర్వతములలో ఉత్తమమైన, మేరౌ = మేరుపర్వతముమీద, కథయామాస = చెప్పెను.

తా. ఓ! మహాబాహూ! జయింప శక్యముకాని ఓ! రామా! ఈ కథను గొప్ప కీర్తి గల నారదుడు పర్వతములలో ఉత్తమమైన మేరుపర్వతముమీద చెప్పినాడు.

మూ. దేవగన్ధర్వసిద్ధానామృషీణాం చ మహాత్మనామ్,
కథాశేషం పునః సోఽథ కథయామాస రాఘవ, 6
నారదః సుమహాతేజాః ప్రహసన్నివ మానద.

అపి = వినునో, సః = అతడు, పుత్రపౌత్రవాన్ = పుత్రపౌత్రులుకలవాడై, స్వర్గలోకే = స్వర్గలోకమునందు, మహీయతే = పూజింపబడును.

తా. రామా! ఆ ఋష్యాదులు ఇట్లనిరి-"ఎవడు ఈ కథను భక్తిపూర్వకముగా వినిపించునో, ఎవడు వినునో ఆ ఇద్దరూ పుత్రపౌత్రాదిసుఖ మనుభవించి స్వర్గములో పూజింపబడుదురు." 9

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో నాల్గవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

ప్ర. అ. పృథివీపతే=ఓ! రాజా! ఏవమ్ = ఇట్లు, సర్వామ్=సమస్తమైన, పృథివీమ్ = భూమిని, పర్యటన్ = సంచరించుచున్న, రావణః = రావణుడు, అథ = అటుపిమ్మట, బ్రహ్మలోకాత్ = బ్రహ్మలోకమునుండి, నివర్తన్తమ్ = మరలి వచ్చుచున్న, మేరుపృష్ఠస్థమ్ = మేరుపర్వతము పైభాగమునందున్న, వ్రజన్తమ్=వెళ్లుచున్న, అపరమ్ = మరి యొక, అంశుమన్తమ్ ఇవ=సూర్యుడు వలె ఉన్న, నారదమ్ = నారదుణ్ణి, సమాసాద్య = సమీపించి, ప్రీతాత్మా = సంతోషించిన మనస్సు గలవాడై, తమ్=అతనిని, అభిసృత్య=చేరి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, అభివాద్య = నమస్కరించి, తదా = అప్పుడు, రావణః=ఆ లోకరావణుడు, హృష్టమనసా=సంతోషించిన మనస్సుతో, ఉవాచ = పలికెను.

తా. రామా! ఈ విధముగా భూమిపై చరించుచున్న రావణుడు ఒకనాడు బ్రహ్మలోకమునుండి తిరిగి వచ్చుచున్న నారదుణ్ణి చూచెను. వెళ్ళుచున్న అతడు మేరుపర్వతము పైభాగమునందు రెండవ సూర్యుడు వలె ప్రకాశించుచుండెను. రావణుడు మనస్సులో సంతోషించుచు ఆతనిని సమీపించి, అంజలి ఘటించి నమస్కరించి ఇట్లు పలికెను. 3,4

మూ. ఆ బ్రహ్మభువనం లోకాస్త్వయా దృష్టాహ్యనేకశః, 5
కస్మిన్ లోకే మహాభాగ మానవా బలవత్తరాః,
యోద్ధుమిచ్ఛామి తైః సార్ధం యథాకామం యథాసుఖమ్.

ప్ర. అ. మహాభాగ = మహాభాగ్యవంతుడా! ఆ బ్రహ్మభువనమ్ = బ్రహ్మలోకమువరకు, లోకాః = లోకములు, త్వయా = నీ చేత, అనేకశః = అనేక పర్యాయములు, దృష్టాః హి = చూడబడినవికదా. కస్మిన్=ఏ, లోకే = లోకమునందు, మానవాః=మానవులు, బలవత్తరాః=అధికబలము కలవారు? తైః సార్ధమ్ = వాళ్ళతో, యథాకామమ్ = ఇచ్ఛానుసారముగా, యథాసుఖమ్ = సుఖముగా, యోద్ధుమ్ = యుద్ధముచేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. మహాభాగ్యశాలి వైన నారదా! బ్రహ్మలోకమువరకూ ఉన్న అన్ని లోకములను నీవు అనేక పర్యాయములు చూచి ఉన్నావు. ఏ లోకములోని మానవులు అధికబలవంతులు? ఇచ్ఛానుసారము వాళ్ళతో సుఖముగా యుద్ధము చేయ గోరుచున్నాను. 5,6

తా. రాక్షసరాజా! బలమూ, పరాక్రమమూ రెండూ సమముగా ఉన్న ఎట్టివారు కావలె నని కోరుచున్నావో అట్టి మానవులను నేను శ్వేతద్వీపములో చూచినాను. పెద్ద దేహప్రమాణము, పెద్ద పరిఘల (కోటగడియలు) వంటి బాహువులూ గల ఆ మానవులు చాల ధైర్యమున్నవారు. 9

మూ. నారదస్య వచః శ్రుత్వా రావణః ప్రత్యువాచ హ, 10
కథం నారద జాయన్తే తస్మిన్ ద్వీపే మహాబలాః,
శ్వేతద్వీపే కథం వాసః ప్రాప్తస్తైస్తు మహాత్మభిః. 11

ప్ర. అ. నారదస్య = నారదుని యొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. నారద = నారదుడా! తస్మిన్ = ఆ, ద్వీపే = ద్వీపమునందు, మహాబలాః = గొప్పబలము గలవారు, కథమ్ = ఎట్లు, జాయన్తే = పుట్టుదురు? తైః = ఆ, మహాత్మభిః = మహాత్ములచేత, శ్వేతద్వీపే = శ్వేతద్వీపమునందు, వాసః = నివాసము, కథమ్ = ఎట్లు, ప్రాప్తః = పొందబడినది.

తా. నారదుని మాటలు విని రావణుడు మరల ఇట్లడిగెను. ''నారదా! మహాబలశాలులు ఆ ద్వీపమునందు ఎట్లు పుట్టుదురు? ఆ మహాత్ములకు శ్వేతద్వీపమునందు నివాసము ఎట్లు లభించినది? 10, 11

మూ. ఏతన్మే సర్వమాఖ్యాహి ప్రభో నారద తత్త్వతః,
త్వయా దృష్టం జగత్సర్వం హస్తామలకవత్సదా. 12

ప్ర. అ. ప్రభో = సమర్థుడవైన, నారద = నారదా! మే = నాకు, ఏతత్ = = దీనిని, సర్వమ్ = సమస్తమునూ, తత్త్వతః = యథార్థముగా, ఆఖ్యాహి = చెప్పుము. త్వయా = నాచేత, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, సదా = ఎల్లప్పుడూ, హస్తామలకవత్ = చేతిలోని ఉసిరికాయ వలె, దృష్టమ్ = చూడబడినది.

తా. సమర్థుడవైన ఓ నారదా! నాకు ఈ విషయము నంతనూ యథార్థముగా చెప్పుము. నీవు ప్రపంచకము నంతను సర్వదా అరచేతిలోని ఉసిరికాయ వలె చూచుచుందువు కదా. 12

మూ. యే హతా లోకనాథేన శార్ఙ్గమానమ్య సంయుగే,
చక్రాయుధేన దేవేన తేషాం వాసస్త్రివిష్టపే. 16

ప్ర. అ. లోకనాథేన = లోకముల నాథుడైన, దేవేన = దేవునిచేత, యే = ఎవరు, సంయుగే = యుద్ధమునందు, శార్ఙ్గమ్ = శార్ఙ్గ ధనస్సును, అనమ్య = వంచిగాని, చక్రాయుధేన = చక్రాయుధముచేత గాని, హతాః = చంపబడి నారో, తేషామ్ = వారికి, త్రివిష్టపే = స్వర్గమునందు, వాసః = నివాసము.

తా. లోకముల ప్రభు వైన ఆ నారాయణుడు శార్ఙ్గమును వంచి గాని, చక్రాయుధము ప్రయోగించి గాని ఎవరిని చంపునో వారికి స్వర్గమునందే నివాసము లభించును. 16

మూ. న హి యజ్ఞఫలైస్తాత న తపోభిర్న సంయమైః,
న చ దానఫలైర్ముఖ్యైః స లోకః ప్రాప్యతే సుఖమ్. 17

ప్ర. అ. తాత = నాయనా! సః లోకః = ఆ లోకము, యజ్ఞఫలైః = యజ్ఞముల ఫలములచేత, సుఖమ్ = అనాయాసముగా, న ప్రాప్యతే = పొంద బడదు, తపోభిః = తపస్సులచేత, న = పొందబడదు. సంయమైః = నియమముల చేత, న = పొందబడదు. ముఖ్యైః = ముఖ్యములైన, దానఫలైః = దానఫలముల చేత, న చ = పొందబడదు.

తా. నాయనా! ఆ లోకమును యజ్ఞములచేత గాని, తపస్సులచేత గాని, నియమములచేత గాని, ముఖ్యములైన దానములచేత గాని ఎవ్వరూ అనాయాస ముగా పొందజాలరు. 17

మూ. నారదస్య వచః శ్రుత్వా దశగ్రీవః సువిస్మితః,
ధ్యాత్వా తు సుచిరం కాలం తేన యోత్స్యామి సంయుగే,
ఆపృచ్ఛ్య నారదం ప్రాయాచ్ఛ్వేతద్వీపాయ రావణః.

ప్ర. అ. దశగ్రీవః = పది కంఠములు గల, రావణః = రావణుడు, నార దస్య = నారదునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, సువిస్మితః = చాల ఆశ్చర్యపడినవాడై, సంయుగే = యుద్ధమునందు, తేన = ఆ నారాయణు నితో, యోత్స్యామి = యుద్ధము చేసెదను అని, సుచిరమ్ కాలమ్ = చాలా సేపు,

మూ. గతే తు నారదే తత్ర రావణోఽపి మహాయశాః,
ప్రాప శ్వేతం మహాద్వీపం దుర్లభం యత్సురైరపి 22

ప్ర. అ. నారదే=నారదుడు, తత్ర = అచటికి, గతే = వెళ్ళినవాడగుచుండగా, మహాయశాః = గొప్ప కీర్తి గల, రావణః అపి = రావణుడు కూడ, యత్ = ఏది, సురైరపి = దేవతలచేత కూడ, దుర్లభమ్ = పొంద శక్యము కానిదో అట్టి, శ్వేతమహాద్వీపమ్ = శ్వేతద్వీపమును, ప్రాప = పొందెను.

తా. నారదుడు ఆచటికి వెళ్ళిన తరవాత గొప్ప కీర్తి గల రావణుడు కూడ దేవతలకుకూడ పొంద శక్యము కాని ఆ శ్వేతద్వీపమును చేరుకొనెను. 22

మూ. తేజసా తస్య ద్వీపస్య రావణస్య బలీయసః,
తత్తస్య పుష్పకం యానం వాతవేగసమాహతమ్. 23
అవస్థాతుం న శక్నోతి వాతాహత ఇవామ్బుదః.

ప్ర. అ. తస్య ద్వీపస్య = ఆ ద్వీపముయొక్క, తేజసా = తేజస్సుచేత, బలీయసః = బలవంతుడైన, తస్య రావణస్య = ఆ రావణునియొక్క, యానమ్ = వాహనమైన, తత్ పుష్పకమ్ = ఆ పుష్పకము, వాతవేగసమాహతమ్ = గాలి యొక్క వేగముచేత కొట్టబడినదై, వాతాహతః = గాలిచేతకొట్టబడిన, అమ్బుదః ఇవ = మేఘము వలె, అవస్థాతుమ్ = నిలచుటకు, న శక్నోతి = సమర్థము కాలేదు.

తా. బలవంతుడైన ఆ రావణుని వాహనమైన పుష్పకము, ఆ ద్వీపము తేజస్సుచేత, వాయువేగముచేత కొట్టబడినదై, గాలిచేత ఎగురగొట్టబడిన మేఘము వలె నిలబడ లేకపోయెను. 23

మూ. సచివా రాక్షసేన్ద్రస్య ద్వీపమాసాద్య దుర్దృశమ్, 24
అబ్రువన్ రావణం భీతా రాక్షసా జాతసాధ్వసాః.

ప్ర.అ. రాక్షసేన్ద్రస్య=రావణునియొక్క, సచివాః=మంత్రులైన, రాక్షసాః = రాక్షసులు, దుర్దృశమ్ = చూడశక్యము కాని, ద్వీపమ్=ద్వీపమును, ఆసాద్య = పొంది, భీతాః=భయపడినవారై, జాతసాధ్వసాః = పుట్టిన కంపము గలవారై, రావణమ్ = రావణుని గూర్చి, అబ్రువన్ = పలికిరి.

ప్ర. అ. రామ = రామా! పుష్పకం తు = పుష్పకమైతే, గతమ్ = వెళ్ళిపోయినది. సర్వరాక్షసవర్జితః = సమస్తరాక్షసులచేత విడువబడిన, రాక్షసాధిపః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, మహాభీమమ్ = చాలా భయంకరమైన, రూపమ్ = రూపమును, కృత్వా = చేసి, తదా = అప్పుడు, తస్మిన్ = ఆ, శ్వేతద్వీపే = శ్వేతద్వీపమునందు, ప్రవివేశ = ప్రవేశించెను. తత్ర = అక్కడ, ప్రవిశన్ ఏవ = ప్రవేశించుచుండగానే, సః రావణః = ఆ రావణుడు, ఆశు = శీఘ్రముగా, నారీభిః = స్త్రీలచేత, ఉపలక్షితః = చూడబడినాడు.

తా. రామా! పుష్పకము వెళ్ళిపోయినది. రాక్షసు లెవ్వరూ దగ్గర లేని ఆ రావణుడు చాలా భయంకరమైన రూపము ధరించి అప్పుడు ఆ శ్వేతద్వీపములో ప్రవేశించెను. అతడు అక్కడ ప్రవేశించిన వెంటనే ఆతనిని అక్కడ ఉన్న స్త్రీలు చూచిరి. 28, 29

మూ. ఏకయా స స్మితం కృత్వా హస్తే గృహ్య దశాననః,
పృష్టశ్చాగమనం బ్రూహి కిమర్థమిహ చాగతః, 30
కో వా త్వం కస్య వా పుత్రః కేన వా ప్రహితో వద.

ప్ర. అ. ఏకయా = ఒక స్త్రీచేత, స్మితమ్ = చిరునవ్వును, కృత్వా = చేసి, హస్తే = హస్తమునందు, గృహ్య = గ్రహించి, సః దశాననః = ఆ రావణుడు, ఆగమనమ్ = ఆగమనమును గూర్చి, పృష్టః = అడగబడినాడు; బ్రూహి = చెప్పుము, కిమర్థమ్ = ఎందుకు, ఇహ = ఇక్కడికి, ఆగతః = వచ్చినావు? త్వమ్ = నీవు, కః వా = ఎవడవు? కస్య వా = ఎవనియొక్క, పుత్రః = పుత్రుడవు? కేన వా = ఎవనిచేత, ప్రహితః = పంపబడినావు? వద = చెప్పుము.

తా. ఒక స్త్రీ చిరునవ్వు నవ్వుచు వానిని చేతితో పట్టి లేవదీసి "నీవు ఎందుకు వచ్చినావు? నీవు ఎవ్వడవు? ఎవని పుత్రుడవు? ఎవరు పంపినారు? చెప్పుము" అని అతని రాకను గూర్చి ప్రశ్నించెను. 30

మూ. ఇత్యుక్తో రావణో రాజన్ క్రుద్ధో వచనమబ్రవీత్. 31
అహం విశ్వవసః పుత్రో రావణో నామ రాక్షసః,
యుద్ధార్థమిహ సంప్రాప్తో న చ పశ్యామి కం చన. 32

ప్ర.అ. రాజన్ = రాజా! ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడిన, రావణః =

ప్ర అ. అన్యామ్ = మరియొక, సఖీమ్ = సఖురాలిని, సమాహూయ = పిలచి, త్వమ్ = నీవు, ధృతమ్ = పట్టుకొనబడిన, దశాస్యమ్ = పదిముఖములు గల, వింశతిభుజమ్ = ఇరువది భుజములు గల, కృష్ణాఞ్జన సమప్రభమ్ = నల్లని కాటుకతో సమానమైన కాంతి గల, కీటకమ్ = పురుగును, పశ్య = చూడుము అని చెప్పెను.

తా. ఆమె మరొక సఖురాలిని పిలిచి "పది ముఖాలు, ఇరవై చేతులూ ఉన్న కాటుక రంగు పురుగును పట్టుకొన్నాను, చూడుము" అని చెప్పెను. 35

మూ. హస్తాద్ధస్తం స చ క్షిప్తో భ్రామ్యతే శ్రమలాలసః,
భ్రామ్యమాణేన బలినా రాక్షసేన విపశ్చితా, 36

పాణావేకాథ సందష్టా రోషేణ వనితా శుభా,
ముక్తస్తయాశుభః కీటో ధున్వన్త్యా హస్తవేదనాత్. 37

ప్ర. అ. సః = అతడు, హస్తాత్ = ఒకరి చేతి నుండి, హస్తమ్ = మరియొకరి చేతిని గూర్చి, క్షిప్తః = విసరబడినవాడై, శ్రమలాలసః = శ్రమవ్యాకులుడై, భ్రామ్యతే = తిరుగుచున్నాడు. అథ = పిమ్మట, భ్రామ్యమాణేన = త్రిప్పబడుచున్న, బలినా = బలవంతుడైన, విపశ్చితా = బుద్ధిమంతుడైన, రాక్షసేన = రాక్షసుని చేత, రోషేణ = కోపముతో, ఏకా = ఒక, శుభా = సుందరియైన, వనితా = స్త్రీ, సందష్టా = కరవబడినది. హస్తవేదనాత్ = చేతియందు నొప్పివలన, ధున్వన్త్యా = దులుపుచున్న, తయా = ఆమెచేత, అశుభః = అమంగళకరమైన, కీటః = పురుగు, ముక్తః = విడవబడినది.

తా. ఒక స్త్రీ చేతినుండి మరొక స్త్రీ చేతిలోనికి విసరుటచే అలసిపోయిన బలవంతుడు, తెలివిగలవాడు అయిన ఆ రావణుడు ఆ విధముగా కొంతసేపు జరిగిన పిమ్మట కోపముతో ఒక స్త్రీ చెయ్యి కరచెను. అపుడు ఆమె చేతియందు నొప్పిచేత దులిపి ఆ అశుభమైన పురుగును క్రింద పడవేసెను. 36, 37

మూ. గృహీత్వాన్యా తు రక్షేన్ద్రముత్పపాత విహాయసా,
తతస్తామపి సంక్రుద్ధో విదదార నఖైర్భృశమ్. 38

ప్ర. అ. అన్యా తు = మరియొక స్త్రీ యైతే. రక్షేన్ద్రమ్ = ఆ రాక్షస రాజును, గృహీత్వా = పట్టుకొని, విహాయసా = ఆకాశముచేత, ఉత్పపాత =

స్త్రీభిః = స్త్రీలచేత, ఆశు = శీఘ్రముగా, విగృహ్య = పట్టుకొని, తత స్తతః = అటు ఇటు, భ్రామితః చ = త్రిప్పబడినాడు.

తా. రామా! ఈ విధముగా శ్వేతద్వీపములో నివసించు స్త్రీలు ఆ రావణుణ్ణి పట్టుకొని ఇటు అటూ విసిరివేసిరి. 41

మూ. నారదోఽపి మహాతేజా రావణం ప్రాప్య ధర్షితమ్,
విస్మయం పరమం కృత్వా ప్రజహాస ననర్త చ. 42

ప్ర. అ. మహాతేజాః = గొప్పతేజస్సు గల, నారదః అపి = నారదుడు కూడ, ధర్షితమ్ = అవమానింపబడిన, రావణమ్ = రావణుణ్ణి, ప్రాప్య = పొంది, పరమమ్ = గొప్ప. విస్మయమ్ = ఆశ్చర్యమును, కృత్వా = చేసి, ప్రజహాస = బిగ్గరగా నవ్వెను. ననర్త చ = నాట్యము చేసెను కూడ.

తా. గొప్ప తేజస్సు గల నారదుడు అవమానింపబడిన రావణుని వద్దకు వెళ్ళి, చాలా ఆశ్చర్యము ప్రకటించుచు బిగ్గరగా నవ్వి నృత్యము చేసెను. 42

మూ. ఏతదర్థం మహాబాహో రావణేన దురాత్మనా,
విజ్ఞాయాపహృతా సీతా త్వత్తో మరణకాఙ్క్షయా. 43

ప్ర.అ. మహాబాహో = గొప్పబాహువులు గలవాడా! ఏతదర్థమ్ = ఇందు నిమిత్తమే, దురాత్మనా = దుష్టబుద్ధిగల, రావణేన = రావణునిచేత, త్వత్తః = నీనుండి, మరణకాఙ్క్షయా = మరణమునందు కోరికచేత, విజ్ఞాయ = తెలిసియే, సీతా = సీత, అపహృతా = అపహరించబడినది.

తా. ఓ మహాబాహూ! దురాత్ముడైన రావణుడు ఇందువలననే, నీనుండి మరణము పొందవలె నను కోరికతో సీతను కావలె నని అపహరించినాడు. 43

మూ. భవాన్నారాయణో విష్ణుః శఙ్ఖచక్రగదాధరః,
శార్ఙ్గపద్మాయుధో వజ్రీ సర్వదేవనమస్కృతః. 44
శ్రీవత్సాఙ్కో హృషీకేశః సర్వదేవాభిపూజితః,
పద్మనాభో మహాయోగీ భక్తానామభయప్రదః. 45

ప్ర. అ. భవాన్ = నీవు, నారాయణః = జలము స్థానముగా గల, శఙ్ఖ

= ఎక్కువ రహస్యమైనవాడవుకదా ? పితామహః = బ్రహ్మదేవుడు, ఏవమ్ = ఇట్లు, ఆహ హి = చెప్పినాడు కదా !

తా. మహాభాగ్యవంతుడైన రామా ! మోహము చెందకుము. నిన్ను గూర్చి స్వయముగనే తెలిసికొనుము. నీవు రహస్యములలో పరమరహస్యము అని బ్రహ్మదేవుడే చెప్పినాడు కదా ? 47

మూ. త్రిగుణశ్చ త్రివేదీ చ త్రిధామా త్రిపదాత్మకః,
త్రికాలకర్మా త్రైవిద్యస్త్రిదశారిప్రమర్దన. 48

ప్ర. అ. త్రిదశారిప్రమర్దన = దేవశత్రువులను మర్దించినవాడా ! (నీవు) త్రిగుణః చ = సత్త్వరజస్తమోగుణములు కలవాడవు. త్రివేదీ చ = మూడు కాలములను ఎరిగినవాడవు. త్రిధామా = మూడు స్థానములు కలవాడవు. త్రిపదాత్మకః = మూడు పదములచేత గ్రహించినవాడవు. త్రికాలకర్మా = మూడు కాలములందు కర్మలు చేయువాడవు. త్రైవిద్యః = మూడు విద్యలకు (వేదములకు) సంబంధించినవాడవు.

తా. ఓ ! రాక్షససంహారకా ! నీవు మూడు గుణములను నియమించువాడవు. మూడు కాలములు (భూత - వర్తమాన - భవిష్యత్తులు) తెలిసినవాడవు. మూడు అడుగులచేత బలిరాజ్యము నంతనూ హరించినవాడవు. (లేదా "ఓం తత్ సత్" అను మూడు పదములచేత చెప్పబడువాడవు). మూడు కాలములందు జరుగు పనులు నడిపించువాడవు. మూడు వేదములచేత ప్రతిపాదించబడువాడవు. 48

మూ. త్వయాక్రాన్తాస్త్రయో లోకాః పురాణైర్విక్రమైస్త్రిభిః,
త్వం మహేన్ద్రానుజః శ్రీమాన్ బలిబన్ధనకారణాత్. 49

అదిత్యా గర్భసంభూతో విష్ణుస్త్వం హి సనాతనః,
లోకాననుగ్రహీతుం వై ప్రవిష్టో మానుషీం తనుమ్. 50

ప్ర. అ. త్వయా = నీచేత, త్రయః = మూడు, లోకాః = లోకములు, పురాణైః = ప్రాచీనములైన, త్రిభిః = మూడు, విక్రమైః = పాదవిన్యాసములచేత, ఆక్రాన్తాః = ఆక్రమించబడినవి. త్వమ్ = నీవు, బలిబన్ధనకారణాత్ = బలిని

మూ. సీతాలక్ష్మీర్మహాభాగా సంభూతా వసుధాతలాత్,
త్వదర్థమిహ చోత్పన్నా జనకస్య గృహే ప్రభో. 53

ప్ర. అ. మహాభాగా = మహాభాగ్యవంతురాలైన, లక్ష్మీః = లక్ష్మి, వసుధాతలాత్ = భూమినుండి, సీతా = సీతగా, సంభూతా = పుట్టినది ప్రభో = ఓ! ప్రభూ! త్వదర్థమ్ = నీకొరకే, ఇహ = ఇక్కడ, జనకస్య = జనకునియొక్క, గృహే = గృహమునందు, ఉత్పన్నా = పుట్టినది.

తా. మహాభాగ్యవంతురాలైన లక్ష్మీదేవి భూతలమునుండి సీతగా ఆవిర్భవించినది. ఓ! ప్రభూ! ఈమె నీకోసమే జనకుని గృహములో జన్మించినది. 53

మూ. లఙ్కామానీయ యత్నేన మాతేవ పరిరక్షితా,
ఏవమేతత్సమాఖ్యాతం తవ రామ మహాయశః. 54

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తిగలవాడా! రామ = రామా! లఙ్కామ్ = లంకను గూర్చి, ఆనీయ = తీసికొనివచ్చి, యత్నేన = ప్రయత్నముచేత, మాతేవ = తల్లి వలె, పరిరక్షితా = రక్షించబడినది. ఏవమ్ = ఈ విధముగా, ఏతత్ = ఇది, తవ = నీకు, సమాఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. గొప్ప కీర్తి గల రామా! రావణుడు సీతను లంకకు తీసికొనివచ్చి తల్లిని వలె ప్రయత్నపూర్వకముగ రక్షించినాడు. ఈ విషయము నంతనూ ఈ విధముగ నీకు చెప్పినాను. 54

మూ. మమాపి నారదేనోక్తమృషిణా దీర్ఘజీవినా,
యథా సనత్కుమారేణ వ్యాఖ్యాతం తస్య రక్షసః, 55
తేనాపి చ తదేవాశు కృతం సర్వమశేషతః.

ప్ర. అ. మమాపి = నాకు కూడ, దీర్ఘజీవినా = దీర్ఘకాలము జీవించు, ఋషిణా = ఋషియైన, నారదేన = నారదునిచేత, ఉక్తమ్ = చెప్పబడినది. సనత్కుమారేణ = సనత్కుమారునిచేత, తస్య రక్షసః = ఆ రాక్షసునకు, యథా = ఎట్లు, వ్యాఖ్యాతమ్ = చెప్పబడినదో, తేనాపి = వానిచేత కూడ, తదేవ = అదే, ఆశు = శీఘ్రముగా. సర్వమ్ = సమస్తమూ, అశేషతః = పూర్తిగా, కృతమ్ = చేయబడినది.

అమాత్యులతో కూడిన, రాజానః చ = రాజులు, యే = ఏ, అన్యే అపి = ఇతరులు, సమాగతాః = వచ్చినారో, వారు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, క్షత్రియాః = క్షత్రియులు, వైశ్యాః = వైశ్యులు, ధర్మసమన్వితాః = ధర్మముతో కూడిన, శూద్రాః = శూద్రులు, సర్వే చ = అందరూ, ఉత్ఫుల్లనయనాః = వికసించిన నేత్రములు కలవారైరి. సర్వే = అందరూ, హర్షసమన్వితాః = సంతోషముతో కూడినవారైరి. అత్యన్తహర్షితాః = మిక్కిలి సంతోషించుచు, భృశమ్ = మిక్కిలి, రామమ్ ఏవ = రాముణ్ణే, అనుపశ్యన్తి = చూచుచుండిరి.

తా. సుగ్రీవాదివానరులు, విభీషణాది రాక్షసులు, రాజులు, వారి అమాత్యులు, అక్కడికి చేరిన ఇతరులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, ధార్మికులైన శూద్రులు, అందరూ కూడ ఆనందపరవశులు అయిరి. వికసించిన నేత్రములతో అందరూ రామునివైపే చూచుచుండిరి. 58-60



మూ. తతోఽగస్త్యో మహాతేజా రాఘవం చేదమబ్రవీత్,
దృష్టాః సభాజితాశ్చాపి రామ యాస్యామహే వయమ్. 61
ఏవముక్త్వా గతాః సర్వే పూజితాస్తే యథాగతమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ప్రక్షిప్తః సర్గః పంచమః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, అగస్త్యః = అగస్త్యుడు, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ పలికెను. రామ = రామా! వయమ్ = మేము, దృష్టాః = చూడబడినాము, సభాజితాః చ అపి = గౌరవించబడినాము కూడ, యాస్యామహే = వెళ్లెదము. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సర్వే = వారందరూ, పూజితాః = పూజింపబడినవారై, యథాగతమ్ = వచ్చినట్లుగానే, గతాః = వెళ్ళినారు.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల అగస్త్యుడు రామునితో-"రామా! మాకు దర్శన మిచ్చి మమ్ములను గౌరవించినావు. ఇక మేము వెళ్ళెదము"అని పలికెను. ఇట్లు పలికి అందరూ పూజింపబడినవారై వచ్చినట్లుగానే తిరిగి వెళ్ళిరి. 61

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
ఐదవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

శ్రీరామాయ నమః

శ్రీ మద్వాల్మీకి మహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# ఉత్తరకాండము

## (రెండవ సంపుటము)

ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన
బాలానందినీ వ్యాఖ్యతో కూడినది

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు
హైదరాబాదు
1995

# ముందుమాట

జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్య
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి
ఆర్ష విజ్ఞాన ట్రస్టు స్థాపకాధ్యక్షులు.

శ్రీరామసదనం
జూబ్లీహిల్స్,
హైదరాబాదు-500 034.

ఈ ఉత్తరకాండ ప్రచురణతో ఆర్ష విజ్ఞాన సంస్థవారు తలపెట్టిన సారస్వత యజ్ఞము పూర్తి అయినది. రామాయణమునకు సీతాచరితము, పౌలస్త్యవధము అని మరి రెండు పేర్లుకూడ ఉన్నవి. ఈ కాండయందు రావణుని పరాక్రమము, అతడు సాధించిన విజయపరంపరలు సుదీర్ఘంగా వర్ణించబడినవి.

ఈ కాండ అధ్యయనమువలన రెండు విషయములు స్థూలముగా మన హృదయమున నెలకొనును. అందొకటి రావణుని స్వభావమువల్ల తెలియదగినది.

హనుమంతుడు మొట్టమొదట రావణుని చూడగానే-

"అహో రూప మహో ధైర్యమహో సత్త్వమహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా."

(సుందర. 49-17)

"ఆహా ! ఏమి ఈ రావణుని రూపము ! ఏమి ధైర్యము ! ఏమి బలము ! ఏమి కాంతి ! ఏమి సర్వలక్షణసంపన్నత్వము ! బలవత్తరమైన అధర్మప్రవర్తన లేనిచో ఇంద్రునితో సహా దేవలోకాని కంతటికీ ప్రభువై ఉండేవాడు." అని భావించాడు.

రాముడు కూడా అతనిని మొదట చూచినపుడు-

"అహో ! దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః,
ఆదిత్య ఇవ దుష్ప్రేక్షో రశ్మిభిర్భాతి రావణః."

(యుద్ధ. 59-26)

"ఆహా ! ఈ రాక్షసరాజగు రావణుడు దివ్యతేజముతో వెలుగుచున్నాడు. మహాప్రతాపుడుగ నున్నాడు. ఆశ్చర్యము ! ఇతడు తేజమున సూర్యునివలె చూడ శక్యముకాక వెలుగుచున్నాడు."

చివరిసారి రావణుడు సర్వసన్నద్ధుడై వచ్చినపుడు ఇతనిని జయించగలనా? అని రాముడు చింతించగా అగస్త్యుడు వచ్చి ఆదిత్యహృదయము ఉపదేశించెను.

విభీషణుడు కూడా రావణవధను పురస్కరించుకొని.

గతః సేతుః సునీతానాం గతో ధర్మస్య విగ్రహః,
గతః సత్త్వస్య సంక్షేపః ప్రస్తావానాం గతి ర్గతా.
యుద్ధ. 112-6

సమస్తనీతులు తెలిసినవాడు నశించెను. ధర్మముయొక్క ఆకారమే అనదగినవాడు నశించెను. సమస్తలోకములందు అందరికన్న బలవంతు డనదగినవాడు మృతినొందెను. అందరికిని స్తోత్రపాత్రమైనవాడు పడిపోయెను.' అని అనెను.

ఈ సీతాపహరణ మహాపాపకార్యమువల్ల ఇతనికి దుర్గతి పట్టెను. అతని భార్య మందోదరి తీవ్రముగా విలపించెను. 'నీవు ఇంద్రియములను జయించి, ముల్లోకములు జయించితివి. ఇపుడు ఇంద్రియములకు లోబడుటచే హతుడ వైతి' వని చింతించెను. పరస్త్రీయైన సీతవిషయమున మోహము పొందితివి. నీచమైన స్త్రీచౌర్యము చేసితివి. అదే నీ ఈ గతికి కారణమని విలపించెను.

శ్రీరాముడు లంకపై దండెత్తి వచ్చినపుడు రాముని తల కల్పించి, దానిని ధనుఃసహితముగా విద్యుజ్జిహ్వునిచే తెప్పించి, రాముడు మరణించెనని ఘోరమైన అసత్యముపలికి సీతను వశపరచుకొన చూచెను. రావణుడు వేదాధ్యయనమునందు గొప్ప నిష్ణాతుడు. అతని పాఠక్రమము ఈనాటికి దేశమున అనుసరింతురు. ధర్మము, సత్యము ఉల్లంఘించిన వారికి వేదాధ్యయనము నిష్ప్రయోజనము. కావున ఈ కాండ అధ్యయనము వలన రామునివలె ప్రవర్తించవలెను కాని రావణునివలె కాదని రూఢిగా తెలియును.

శ్రీరాముడు ఆదర్శపురుషుడే కాక ఆదర్శపరిపాలకుడుగా కూడ ఈ మహాకావ్యమున రూపొందెను. ఈ రాజధర్మము సామాన్య మానవధర్మమునకు పైస్థాయి

లోను ఒక్కొక్కసారి విభిన్నముగాకూడ ఉండును. శ్రీరాముడు ఈ విషయమై విశ్వామిత్రునిద్వారా ఉపదేశము పొంది, దానిని శిరసావహించెను. తాటక స్త్రీకదా అని సంహరింప సందేహించునపుడు

> నృశంసమనృశంసం వా ప్రజారక్షణకారణాత్,
> పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా.
>
> బాల. 25-17

ధర్మాత్ముడైన రాజు, ప్రజారక్షణము కొరకై చేపట్టు కార్యము, క్రూరమైనను కాకపోయినను, పాపమైనను దోషములతో కూడినదైనను చేయదగినదే.

వాల్మీకి హృదయ మెఱిగిన భవభూతి మహాకవి పై శ్లోకమునకు నిజమైన వ్యాఖ్యాన మనదగునట్లు తన ఉత్తరరామచరితనాటకమున రామునిద్వారా తన ప్రజాపరిపాలనాదక్షతను, ప్రజాసంరక్షణను తెల్పు శపథపూర్వకమైన ఈ క్రింది వాక్యమును పలికించెను–

> స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీమపి,
> ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా.

స్నేహమును, దయను, సౌఖ్యమును చివరకు జానకిని కూడ ప్రజారాధనకై విడిచిపెట్టుచు కూడ నే నెంతమాత్రము బాధపడను.

వినికిడిగా తెలిసిన కథను పురస్కరించుకొని రాముని విమర్శించక మూలము సమగ్రముగా అధ్యయనము చేసిన సత్యము విదితమగును. ప్రాణము కన్న అధికమైన భార్యను కోల్పోయి రాముడు సుదీర్ఘకాలము ఉపాసనరూపముగా రాజ్యము చేసెను. (రామో రాజ్య ముపాసిత్వా) కాలమే ఆయన సద్గుణమునకు తీర్పు నిచ్చినది.

'శ్రీమద్విఖ్యాతిలతాక్రామితరోదోంతరాళ' అని తెలుగుకవి పోతనామాత్యుడు ఆయన కీర్తిలత మూడు లోకములలో వ్యాపించినదని ప్రశంసించెను.

ఉత్తరకాండ మిగతాభాగమునకు వ్యాఖ్యానమని పండితాభిప్రాయము. ముముక్షువు లీ కాండను కూడ చదువు ఆచారము కలదు. అర్ష విజ్ఞాన ట్రస్టువారు కోరగానే ఈ ఉత్తరకాండమునకు కూడా తమ దివ్యమైన బాలానందినీ వ్యాఖ్యను

సమకూర్చిన ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తాము కృతకృత్యులై ఈ సంస్థ సభ్యులను ధన్యజీవులను చేసిరి. ఆయన దీర్ఘతరమైన తన శ్రమకు ఆర్థికంగా ఏ విధమైన ప్రతిఫలమును అంగీకరింపని సౌజన్యశీలుడు. గ్రంథము చివర ఆయన రచించిన–

'దేవతానుగ్రహః పిత్రోస్తప శ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రంథజాతస్య కరణం కేవలం వయమ్."

తను రచించిన కృతులకు దేవతానుగ్రహము, మాతృ–పితృపాదుల తపస్సు ఆచార్యుల కృపా కారణమని, తాను కేవలము ఉపకరణమని తెలిపిన వారి వాక్యము వారికి ఆర్షసంప్రదాయమునందు కల విశ్వాసమును వేనోళ్ళ చాటుచున్నది. పరాత్పరుడు వీరికి సర్వశ్రేయస్సులు సమకూర్చుగాక.

ఈ గ్రంథరాజముల ముద్రణమునకు సహాయపడిన వదాన్యులందరికి ఈ ఆర్ష విజ్ఞాన సంస్థ పక్షమున కృతజ్ఞతా పూర్వక వందనములు.

యువ విజయదశమి

పమిడిఘంటం కోదండరామయ్య

# విషయసూచిక

| సర్గసంఖ్య | విషయము | పుట |
|---|---|---|

---

T R. కృష్ణాచార్య సంపాదకులుగా, T.R. వెంకోబాచార్య ప్రకాశకులుగా, హిందీ ప్రచార్ ప్రెస్, మద్రాసువారు ముద్రాపకులుగా 1930 లో ప్రచురింపబడిన శ్రీమద్రామాయణం ఉత్తరకాండ ప్రతిలో ఈ క్రింది శ్లోకం అధికంగా కనిపిస్తున్నది–

భూతాని దేవతాబుద్ధ్యా దేవతాగురుబుద్ధితః,
గురూంశ్చ పరమాత్మేతి నిత్యం పశ్యతి ధర్మపః.

ఉత్తరకాండ స. 48. శ్లో. 16



భద్రాచల శ్రీ సీతారామలక్ష్మణులు

వామాంకస్థితజానకీ పరిలసత్కోదండదండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే,
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తం భజే.

శ్రీః

ఓం స్వస్తి శ్రీ గణేశాయ నమః

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః

'బాలానందినీ' సహితమగు

# శ్రీమద్రామాయణము - ఉత్తరకాండము

(రెండవ సంపుటము)

## అష్టాత్రింశః సర్గః

*[రాముడు చేసిన సత్కారములు అందుకొని జనకాదులు తమ తమ దేశములకు వెళ్లుట.]*

మూ. ఏవమాస్తే మహాబాహురహన్యహని రాఘవః,
ప్రశాసన్ సర్వకార్యాణి పౌరజానపదేషు చ. 1

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, రాఘవః = రాముడు, అహని అహని = ప్రతి దివసమునందూ, పౌరజానపదేషు = పౌరులయందు జానపదులయందు, సర్వకార్యాణి = సమస్తకార్యములను, ఏవమ్ = ఈ విధముగా, ప్రశాసన్ = శాసించుచు, ఆస్తే = ఉన్నాడు.

తా. మహాబాహువైన రాముడు ఈ విధముగా ప్రతిదివసమునందు పౌరజానపదులను వారి వారి కర్తవ్యములయందు నియమించుచు ఉండెను. 1

మూ. తతః కతిపయాహస్సు వైదేహం మిథిలాధిపమ్,
రాఘవః ప్రాఞ్జలిర్భూత్వా వాక్యమేతదువాచ హ. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కతిపయాహస్సు = కొన్ని రోజులలో, రాఘవః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, మిథిలాధిపమ్ = మిథిలానగరప్రభువైన, వైదేహమ్ = జనకుని గూర్చి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. కొన్ని రోజులు గడచిన పిమ్మట రాముడు అంజలి ఘటించి మిథిలాధిపతి యైన జనకునితో ఇట్లు పలికెను. 2

మూ. భవాన్ హి గతిరవ్యగ్రా భవతా పాలితా వయమ్,
భవతస్తేజసోగ్రేణ రావణో నిహతో మయా. 3

ప్ర. అ. భవాన్ = నీవు, అవ్యగ్రా = అచంచలమైన, గతిః = గతివి వయమ్ = మేము, భవతా = నీచేతనే, పాలితాః = పాలించబడినాము. భవతః = నీయొక్క, ఉగ్రేణ = ఉగ్రమైన, తేజసా = తేజస్సుచేత, మయా = నాచేత, రావణః = రావణుడు, నిహతః = చంపబడినాడు.

తా. నీవే మాకు అచంచలమైన ఆశ్రయము. నీచేతనే మేము పాలించబడినాము. ఉగ్రమైన నీ తేజస్సుచేతనే నేను రావణుణ్ణి చంపగలిగితిని. 3

మూ. ఇక్ష్వాకూణాం చ సర్వేషాం మైథిలానాం చ సర్వశః,
అతులాః ప్రీతయో రాజన్ సంబన్ధకపురోగమాః. 4

ప్ర. అ. రాజన్ = రాజా! సర్వేషామ్ = సమస్తమైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయులకు, మైథిలానాం చ = మిథిలానగరరాజులకు, సర్వశః = అన్ని ప్రకారములచేతనూ కూడ, సంబన్ధపురోగమాః = సంబంధము మొదలైన, అతులాః = సాటిలేని, ప్రీతయః = ప్రేమలు ఉన్నవి.

తా. రాజా! ఇక్ష్వాకువంశీయులకూ మిథిలారాజులకు మధ్య అన్ని ప్రకారములచేతను వియ్యము మొదలైన ప్రేమలు సాటిలేనివిగా ఉన్నవి. 4

మూ. తద్భవాన్ స్వపురం యాతు రత్నాన్యాదాయ పార్థివ,
భరతశ్చ సహాయార్థం పృష్ఠతశ్చానుయాస్యతి. 5

ప్ర. అ. పార్థివ = రాజా! తత్ = ఆ కారణమువలన, భవాన్ = నీవు,

రత్నాని=రత్నములను, ఆదాయ=గ్రహించి, స్వపురమ్=నీ పురమును గూర్చి, యాతు = వెళ్లెదవు గాక. భరతః చ = భరతుడు కూడ, సహాయార్థమ్ = సహాయముకొరకై, పృష్ఠతః = వెనుక, అనుయాస్యతి = అనుసరించి రాగలడు.

తా. అందువలన ఓ రాజా! నేను బహూకరించు రత్నములు స్వీకరించి నీవు నీ నగరమునకు వెళ్ళుము. నీకు సహాయుడుగా భరతుడు నీ వెనుకనే రాగలడు. 5

మూ. స తథేతి తతః కృత్వా రాఘవం వాక్యమబ్రవీత్,
ప్రీతోఽస్మి భవతో రాజన్ దర్శనేన నయేన చ. 6

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = అతడు, తథా ఇతి = అట్లే అని, కృత్వా = చేసి, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రాజన్ = రాజా! భవతః = నీయొక్క, దర్శనేన = దర్శనముచేత, నయేన చ = నీతిచేత, ప్రీతః అస్మి = సంతోషించినవాడను అయితిని.

తా. జనకుడు 'అట్లే' అని ప్రయాణమై రామునితో ఇట్లనెను. "రాజా! నీ దర్శనము చేతా, నీతిచేతా చాలా సంతోషించినాను". 6

మూ. యాన్యేతాని తు రత్నాని మదర్థం సంచితాని వై,
దుహితౄస్తాన్యహం రాజన్ సర్వాణ్యేవ దదామి వై. 7

ప్ర. అ. రాజన్ = రాజా! ఏతాని = ఈ, యాని రత్నాని = ఏ రత్నములు, మదర్థమ్ = నాకొరకై, సంచితాని వై = ప్రోగుచేయబడినవో, తాని = వాటిని, సర్వాణి = అన్నింటినీ, అహమ్ = నేను, దుహితౄః = కుమార్తెలిద్దరికీ, దదామి వై = ఇచ్చుచున్నాను.

తా. రాజా! నీవు నాకోసమై ఇచ్చిన ఈ రత్నములను (శ్రేష్ఠములైన వస్తువులు, మణులు మొదలైనవాటిని) అన్నింటినీ నా ఇద్దరు కుమార్తెలకు ఇచ్చుచున్నాను. 7

మూ. ఏవముక్త్వా తు కాకుత్స్థం జనకో హృష్టమానసః,
ప్రయయౌ మిథిలాం శ్రీమాంస్తమనుజ్ఞాయ రాఘవమ్. 8

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తుడైన, జనకః = జనకుడు, కాకుత్స్థమ్ = రాముణ్ణి గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, హృష్టమానసః = సంతోషించిన మనస్సు కలవాడై, తం రాఘవమ్ = ఆ రాముణ్ణి, అనుజ్ఞాయ = అనుజ్ఞ ఇచ్చి, మిథిలామ్ = మిథిలను గూర్చి, ప్రయయౌ = వెళ్లెను.

తా. శ్రీమంతుడైన జనకుడు రామునితో ఇట్లు పలికి, సంతోషించిన మనస్సుతో రామునకు అనుజ్ఞ ఇచ్చి మిథిలకు వెళ్లెను. 8

మూ. తతః ప్రయాతే జనకే కేకయం మాతులం ప్రభుమ్,
రాఘవః ప్రాఞ్జలిర్భూత్వా వినయాద్వాక్యమబ్రవీత్. 9

ప్ర. అ. తతః = అటుపిమ్మట, జనకే = జనకుడు, ప్రయాతే = వెళ్ళినవాడగుచుండగా, రాఘవః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, ప్రభుమ్ = ప్రభువు, మాతులమ్ = మేనమామ అయిన, కేకయమ్ = కేకయదేశరాజును గూర్చి, వినయాత్ = వినయమువలన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. జనకుడు వెళ్ళిపోయిన పిమ్మట రాముడు అంజలి ఘటించి మేనమామయైన కేకయరాజుతో (యుధాజిత్తుతో) వినయపూర్వకముగా ఇట్లు పలికెను. 9

మూ. ఇదం రాజ్యమహం చైవ భరతశ్చ సలక్ష్మణః,
ఆయత్తాస్త్వం హి నో రాజన్ గతిశ్చ పురుషర్షభ. 10

ప్ర. అ. పురుషర్షభ = పురుషులలో శ్రేష్ఠుడా! రాజన్ = రాజా! ఇదమ్ = ఈ, రాజ్యమ్ = రాజ్యమూ, అహం చైవ = నేనూ, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, భరతః చ = భరతుడు, ఆయత్తాః = నీయందు ఆధీనమైనవారము. త్వమ్ = నీవు, నః = మాకు, గతిః చ = గతివి కూడ.

తా. పురుషశ్రేష్ఠుడవైన ఓ! రాజా! ఈ రాజ్యము, నేను, భరతుడు లక్ష్మణుడూ కూడ నీమీద ఆధారపడినవాళ్లము. నీవే మాకు గతివి. 10

మూ. రాజా హి వృద్ధః సంతాపం త్వదర్థముపయాస్యతి,
తస్మాద్గమనమద్యైవ రోచయే తవ పార్థివ. 11

ప్ర. అ. వృద్ధః = వృద్ధుడైన, రాజా = రాజు. త్వదర్థమ్ = నీ నిమిత్తము, సంతాపమ్ = దుఃఖమును, ఉపయాస్యతి = పొందగలడు, తస్మాత్ = ఆ కారణము వలన, పార్థివ = రాజా! అద్యైవ = నేడే, తవ = నీయొక్క, గమనమ్ = గమనమును, రోచయే = ఇష్టపడుచున్నాను.

తా. రాజా! వృద్ధుడైన రాజు నీనిమిత్తము తాపము చెందుచుండును. అందువలన నీవు నేడే బయలుదేరి వెళ్ళుట మంచిదని నా అభిప్రాయము. 11

మూ. లక్ష్మణేనానుయాత్రేణ పృష్ఠతోఽనుగమిష్యతే,
ధనమాదాయ బహులం రత్నాని వివిధాని చ. 12

ప్ర. అ. బహులమ్ = అధికమైన, ధనమ్ = ధనమును, వివిధాని = అనేకవిధములైన, రత్నాని చ = రత్నములను, ఆదాయ = తీసికొని, అనుయాత్రేణ = కూడావచ్చి, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, అనుగమిష్యతే = అనుసరించి గమనము చేయబడును.

తా. అధికమైన ధనము అనేకవిధములైన రత్నములూ తీసికొని లక్ష్మణుడు నీ వెనుక రాగలడు. 12

మూ. యుధాజిత్తు తథేత్యాహ గమనం ప్రతి రాఘవమ్,
రత్నాని చ ధనం చైవ త్వయ్యేవాక్షయ్యమస్త్వితి. 13

ప్ర. అ. యుధాజిత్తు = యుధాజిత్తైతే, గమనం పతి = గమనమును గూర్చి, రాఘవమ్ = రాముణ్ణి, తథేతి = అట్లే అని, అహ = పలికెను. రత్నాని = రత్నములు, అక్షయ్యమ్ = అక్షయమైన, ధనం చైవ = ధనమూ, త్వయ్యేవ = నీయందే, అస్తు = ఉండుగాక, ఇతి = అని పలికెను.

తా. యుధాజిత్తు గమనమును గూర్చి అంగీకరించి, "రత్నములు అక్షయమైన ఈ ధనము కూడ నీవద్దనే ఉండుగాక" అని పలికెను. 13

మూ. ప్రదక్షిణం చ రాజానం కృత్వా కేకయవర్ధనః,
రామేణ చ కృతః పూర్వమభివాద్య ప్రదక్షిణమ్. 14

ప్ర. అ. పూర్వమ్ = ముందుగా, రామేణ = రామునిచేత, అభివాద్య =

నమస్కరించి, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణము, కృతః = చేయబడిన, కేకయవర్ధనః = కేకయదేశమును వృద్ధిపొందించు యుధాజిత్తు, రాజానమ్ = రాముణ్ణి, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి బయలుదేరెను.

తా. ముందుగా రాముడు యుధాజిత్తునకు ప్రదక్షిణనమస్కారాలు చేసెను. పిమ్మట యుధాజిత్తు రామునకు ప్రదక్షిణముచేసి (బయలుదేరెను.) 14

మూ. లక్ష్మణేన సహాయేన ప్రయాతః కేకయేశ్వరః,
హతేఽసురే యథా వృత్రే విష్ణునా సహ వాసవః. 15

ప్ర. అ. వృత్రే అసురే = వృత్రాసురుడు, హతే = చంపబడినవాడగుచుండగా, విష్ణునా సహ = విష్ణువుతో కూడ, వాసవః యథా = దేవేంద్రుడు వలె, కేకయేశ్వరః = కేకయదేశరాజు, సహాయేన = సహాయుడైన, లక్ష్మణేన = లక్ష్మణునితో కూడ, ప్రయాతః = వెళ్ళినాడు.

తా. వృత్రసంహారానంతరము దేవేంద్రుడు విష్ణువుతో కలిసి వెళ్ళినట్లు సహాయుడుగా వచ్చిన లక్ష్మణునితో కలిసి కేకయదేశరాజు వెళ్లెను. 15

మూ. తం విసృజ్య తతో రామో వయస్య మకుతోభయమ్,
ప్రతర్దనం కాశిపతిం పరిష్వజ్యేదమబ్రవీత్. 16

ప్ర. అ. రామః = రాముడు, తమ్ = అతనిని, విసృజ్య = పంపివేసి, తతః = అటుపిమ్మట, వయస్యమ్ = తన మిత్రుడు, అకుతోభయమ్ = ఎవరికీ భయపడనివాడు, కాశిపతిమ్ = కాశీరాజు అయిన, ప్రతర్దనమ్ = ప్రతర్దనుణ్ణి. పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ వాక్యము, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు యుధాజిత్తును పంపివేసిన పిమ్మట, తన మిత్రుడూ, ఎవరికీ భయపడనివాడూ అయిన కాశిరాజైన ప్రతర్దనుణ్ణి కౌగలించుకొని ఇట్లు పలికెను. 16

మూ. దర్శితా భవతా ప్రీతిర్దర్శితం సౌహృదం పరమ్,
ఉద్యోగశ్చ త్వయా రాజన్ భరతేన కృతః సహ. 17

ప్ర. అ. రాజన్ = రాజా! భవతా = నీచేత, ప్రీతిః = ప్రేమ, దర్శితా =

చూపబడినది. పరమ్ = అధికమైన, సౌహృదమ్ = స్నేహము, దర్శితమ్ = చూపబడినది. త్వయా = నీచేత, భరతేన సహ=భరతునితో కూడ, ఉద్యోగః చ = ప్రయత్నము కూడ, కృతః = చేయబడినది.

తా. రాజా! నీవు ప్రేమను, గొప్ప స్నేహమును చూపినావు. భరతుతోని కలిసి రాజ్యపాలనాది కార్యములను నిర్వహించినావు. 17

మూ. తద్భవానద్య కాశేయ పురీం వారాణసీం వ్రజ,
రమణీయాం త్వయా గుప్తాం సుప్రాకారాం సుతోరణామ్.

ప్ర. అ. కాశేయ = కాశీరాజా! తత్ = ఆ కారణమువలన, అద్య = ఇప్పుడు, త్వయా = నీచేత, గుప్తామ్ = రక్షించబడినది, సుప్రాకారామ్ = మంచి ప్రాకారములు గలది, సుతోరణామ్ = మంచి ముఖద్వారములు గలదీ, రమణీయామ్ = సుందరమూ అయిన, వారాణసీం పురీమ్ = వారాణసిని గూర్చి, వ్రజ= వెళ్ళుము.

తా. ఓ కాశిరాజా! అందువలన నీవిపుడు నీచేత రక్షింపబడుచున్న మంచి ప్రాకారములు, ముఖద్వారములూ ఉన్న సుందరమైన వారాణసికి వెళ్లుము. 18

మూ. ఏతావదుక్త్వా చోత్థాయ కాకుత్థ్సః పరమాసనాత్,
పర్యష్వజత ధర్మాత్మా నిరన్తరమురోగతమ్. 19

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, కాకుత్థ్సః = రాముడు, ఏతావత్ = ఇంత మాత్రము, ఉక్త్వా=పలికి, పరమాసనాత్=సింహాసనమునుండి, ఉత్థాయ= లేచి, ఉరోగతమ్ = వక్షస్థలము దగ్గర ఉన్న అతనిని, నిరన్తరమ్ = గాఢముగా పర్యష్వజత = కౌగలించుకొనెను.

తా. ధర్మాత్ముడైన రాముడు ఇట్లు పలికి సింహాసనమునుండి లేచి అతనిని గాఢముగా కౌగలించుకొనెను. 19

మూ. విసర్జయామాస తదా కౌసల్యాప్రీతివర్ధనః,
రాఘవేణ కృతానుజ్ఞః కాశీయో హ్యకుతోభయః, 20
వారాణసీం యయౌ తూర్ణం రాఘవేణ విసర్జితః.

ప్ర. అ. తదా=అప్పుడు, కౌసల్యాప్రీతివర్ధనః=కౌసల్యయొక్క ఆనందమును వృద్ధి పొందించు రాముడు, విసర్జయామాస = వెళ్ళుటకు అనుజ్ఞ ఇచ్చెను.

రాఘవేణ = రామునిచేత, కృతానుజ్ఞః = చేయబడిన అనుజ్ఞ గల, అకుతోభయః = ఎటునుండి భయము లేని, కాశిరాజః = కాశిరాజు, రాఘవేణ = రామునిచేత, విసర్జితః = పంపబడిన వాడై, తూర్ణమ్ = శీఘ్రముగా, వారాణసీమ్ = వారాణసిని గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. అప్పుడు రాముడు ఆతనిని పంపివేసెను. రాముని అనుజ్ఞ పొంది, ఎవరికీ భయపడని ఆ కాశీరాజు, రాముడు పంపుటచే శీఘ్రముగా వారాణసికి వెళ్లెను. 20

మూ. విసృజ్య తం కాశిపతిం త్రిశతం పృథివీపతీన్, 21
ప్రహసన్ రాఘవో వాక్యమువాచ మధురాక్షరమ్.

ప్ర. అ. రాఘవః = రాముడు, తమ్ = ఆ, కాశిపతిమ్ = కాశీరాజును, విసృజ్య = పంపివేసి, ప్రహసన్ = నవ్వుచు, త్రిశతమ్ = మూడువందల, పృథివీపతీన్ = రాజులను గూర్చి, మధురాక్షరమ్ = మధురమైన అక్షరములు గల, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఆ కాశిరాజును పంపివేసిన తరువాత మూడు వందలమంది రాజులను కలిసికొని నవ్వుచు మధురమైన మాటలతో ఇట్లు పలికెను. 21

మూ. భవతాం ప్రీతిరవ్యగ్రా తేజసా పరిరక్షితా, 22
ధర్మశ్చ నియతో నిత్యం సత్యం చ భవతాం సదా.

ప్ర. అ. భవతామ్ = మీయొక్క, తేజసా = తేజస్సుచేత, అవ్యగ్రా = ఒడుదుడుకులు లేని, ప్రీతిః = ప్రేమ, పరిరక్షితా = రక్షింపబడినది. భవతామ్ = మీయొక్క, ధర్మః చ = ధర్మము కూడ, నిత్యమ్ = నిత్యమూ, నియతః = స్థిరమైనది. సత్యం చ = సత్యము కూడ, సదా = ఎల్లప్పుడూ స్థిరమైనది.

తా. మీ తేజస్సుచేత స్నేహమునకు ఎట్టి ఒడుదుడుకులూ లేకుండ రక్షింపబడినది. మీలో ధర్మమూ, సత్యమూ కూడా నిత్యము స్థిరముగా ఉన్నవి. 22

మూ. యుష్మాకం చానుభావేన తేజసా చ మహాత్మనామ్, 23
హతో దురాత్మా దుర్బుద్ధీ రావణో రాక్షసాధమః.

ప్ర. అ. మహాత్మనామ్ = మహాత్ములైన, యుష్మాకమ్ = మీయొక్క, తేజసా = తేజస్సుచేత, అనుభావేన = సామర్థ్యముచేత, దురాత్మా = దురాత్ముడూ, దుర్బుద్ధిః = చెడ్డ బుద్ధిగలవాడు, రాక్షసాధమః = రాక్షసాధముడూ అయిన, రావణః = రావణుడు, హతః = చంపబడినాడు.

తా. మహాత్ములైన మీ ప్రభావముచేత, తేజస్సుచేతా దురాత్ముడూ, దుర్బుద్ధికలవాడు, రాక్షసాధముడూ అయిన రావణుడు చంపబడినాడు. 23

మూ హేతుమాత్రమహం తత్ర భవతాం తేజసా హతః, 24
రావణః సగణో యుద్ధే సపుత్రామాత్యబాన్ధవః.

ప్ర. అ. అహమ్ = నేను, తత్ర = ఆ చంపుటయందు, హేతుమాత్రమ్ = కేవలము హేతువుమాత్రమే. సగణః = గణములతో కూడిన, సపుత్రామాత్యబాన్ధవః = పుత్రులతోను, అమాత్యులతోను, బంధువులతోనూ కూడిన, రావణః = రావణుడు, యుద్ధే = యుద్ధమునందు, భవతామ్ = మీయొక్క, తేజసా = తేజస్సుచేత, హతః = చంపబడినాడు.

తా. రావణుడు, వాని సైన్యము, వాని పుత్రులు, అమాత్యులు బంధువులు యుద్ధములో మీ తేజస్సుచేతనే చంపబడినారు. నేను కేవలం నిమిత్తము మాత్రమే. 24

మూ. భవన్తశ్చ సమానీతా భరతేన మహాత్మనా, 25
శ్రుత్వా జనకరాజస్య కాననాత్తనయాం హృతామ్.

ప్ర. అ. జనకరాజస్య = జనకునియొక్క, తనయామ్ = కుమార్తెను, కాననాత్ = అడవినుండి, హృతామ్ = హరించబడినదానినిగా, శ్రుత్వా = విని, మహాత్మనా = మహాత్ముడైన, భరతేన = భరతునిచేత, భవన్తః = మీరు, సమానీతాః = తీసికొనిరాబడినారు.

తా. అరణ్యమునుండి సీత అపహరించబడి నట్లు విని మహాత్ముడైన భరతుడు మిమ్ములను అందరినీ పిలిపించినాడు. 25

మూ. ఉద్యుక్తానాం చ సర్వేషాం పార్థివానాం మహాత్మనామ్, 26
కాలోఽప్యతీతః సుమహాన్ గమనం రోచయామ్యతః.

ప్ర. అ. ఉద్యుక్తానామ్ = యుద్ధసంనద్ధులైన, సర్వేషామ్ = సమస్తమైన, మహాత్మనామ్ = మహాత్ము లైన, పార్థివానామ్ = రాజులకు, సుమహాన్ = చాల గొప్పదైన, కాలః అపి = కాలము కూడ, అతీతః = గడచినది. అతః = అందు వలన, గమనమ్ = వెళ్ళుటను, రోచయామి = ఇష్టపడుచున్నాను.

తా. యుద్ధోద్యుక్తులై మీరందరూ వచ్చి చాల కాలము గడచిపోయినది. అందుచేత మీరందరూ తిరిగి వెళ్ళుట మంచి దని అనుకొనుచున్నాను. 26

మూ. ప్రత్యూచుస్తం చ రాజానో హర్షేణ మహతా వృతాః, 27
దిష్ట్యా త్వం విజయీ రామ రాజ్యం చాపి ప్రతిష్ఠితమ్,
దిష్ట్యా ప్రత్యాహృతా సీతా దిష్ట్యా శత్రుః పరాజితః. 28

ప్ర. అ. రాజానః=రాజులు, మహతా=గొప్ప, హర్షేణ=సంతోషముతో, వృతాః = కూడినవారై, ప్రత్యూచుః = తిరిగి పలికిరి. రామ = రామా! దిష్ట్యా = అదృష్టవశముచేత, త్వమ్ = నీవు, విజయీ = విజయముగలవాడవు. రాజ్యం చాపి = రాజ్యము కూడ, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠింపచేయబడినది. దిష్ట్యా = అదృష్ట వశముచేత, సీతా = సీత, ప్రత్యాహృతా = తిరిగి తీసికొనిరాబడినది. దిష్ట్యా = అదృష్టవశముచేత, శత్రుః = శత్రువు, పరాజితః = ఓడించబడినాడు.

తా. ఆ రాజులు చాల సంతోషించుచు ఇట్లు బదులు చెప్పిరి - "రామా! అదృష్టవశముచేత నీవు విజయము పొందినావు. రాజ్యమును నిలిపినావు. అదృష్ట వశముచేత శత్రువును ఓడించి సీతను తిరిగి తీసికొనివచ్చినావు. 27, 28

మూ. ఏష నః పరమః కామ ఏషా నః ప్రీతిరుత్తమా,
యత్త్వాం విజయినం రామ పశ్యామో హతశాత్రవమ్. 29

ప్ర. అ. రామ = రామా! విజయినమ్ = విజయవంతుడవైన, హతశాత్ర వమ్ = చంపబడిన శత్రువులు గల, త్వామ్ = నిన్ను, యత్ పశ్యామః = చూచు చున్నా మనేది ఏది కలదో, ఏషః = ఇది, నః = మాయొక్క, పరమః = గొప్ప, కామః = కోరిక. నః = మాయొక్క, ఉత్తమా = ఉత్తమమైన, ప్రీతిః = ఆనందము.

తా. రామా! శత్రువులను సంహరించి విజయవంతుడవైన నిన్ను చూడ గలుగుచున్నాము. ఇదియే మా గొప్ప కోరిక. ఇదియే మా గొప్ప సంతోషము.

మూ. ఏతత్త్వయ్యుపపన్నం చ య దస్మాం స్త్వం ప్రశంససే,
ప్రశంసార్హ న జానీమః ప్రశంసాం వక్తుమీదృశీమ్. 30

ప్ర. అ. ప్రశంసార్హ=ప్రశంసకు తగినవాడా! త్వమ్=నీవు, అస్మాన్=మమ్ములను, ప్రశంససే ఇతి యత్=ప్రశంసించుచున్నావు అనునది ఏది గలదో, ఏతత్ = ఇది, త్వయి = నీయందు, ఉపపన్నం చ=తగి ఉన్నది. ఈదృశీమ్=ఇట్టి, ప్రశంసామ్ = ప్రశంసను, వక్తుమ్ = చెప్పుటకు, న జానీమః= మేము ఎరుగము.

తా. ప్రశంసలకు తగిన రామా! నీవు మమ్ములను ప్రశంసించుచున్నావు. ఇది నీకే తగును. ఇట్టి ప్రశంసలను పలుకుట మేమెరుగము. 30

మూ. ఆపృచ్ఛామో గమిష్యామో హృదిస్థో నః సదా భవాన్,
వర్తామహే మహాబాహో ప్రీత్యాత్ర మహతా వృతాః, 31
భవేచ్చ తే మహారాజ ప్రీతిరస్మాసు సర్వదా.

ప్ర. అ. ఆపృచ్ఛామః=అనుజ్ఞ వేడుచున్నాము. గమిష్యామః=వెళ్ళెదము. భవాన్ = నీవు, సదా = ఎల్లప్పుడూ, నః = మాకు, హృదిస్థః = హృదయములో ఉన్నవాడవు. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! మహతా = గొప్ప, ప్రీత్యా = ప్రేమతో, వృతాః = కూడినవారమై, అత్ర = ఇక్కడ, వర్తామహే = ఉంటున్నాము. మహారాజ = మహారాజా! అస్మాసు = మాయందు, సర్వదా = ఎల్లప్పుడూ, ప్రీతిః = ప్రేమ, తే = నీకు, భవేత్ చ = ఉండుగాక!

తా. ఓ! మహాబాహూ! మేము సెలవుతీసికొని వెళ్ళుచున్నాము. నీవు ఎల్లప్పుడూ మా హృదయములలో ఉన్నావు. మేము గొప్ప ప్రేమతో ఇక్కడ ఉంటిమి. మహారాజా! నీకు ఎల్లప్పుడూ మాయందు స్నేహభావము ఉండుగాక.

మూ. బాఢమిత్యేవ రాజానో హర్షేణ పరమాన్వితాః, 32
ఊచుః ప్రాఞ్జలయః సర్వే రాఘవం గమనోత్సుకాః,
పూజితాస్తే చ రామేణ జగ్ముర్దేశాన్ స్వకాన్ స్వకాన్. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టాత్రింశః సర్గః.

ప్ర. అ. బాఢమ్ = తప్పక, ఇత్యేవ = అని, (రామునిచే పలకబడినవారై) హర్షేణ=సంతోషముతో, పరమాన్వితాః = మిక్కిలి కూడిన, సర్వే=సమస్తమైన, రాజానః = రాజులు, గమనోత్సుకాః = వెళ్ళుటయందు ఆసక్తి గలవారై, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్ళు గలవారై, ఊచుః = పలికిరి. తే = వారు, రామేణ= రామునిచేత, పూజితాః = పూజించబడినవారై, స్వకాన్ స్వకాన్ = తమ తమ, దేశాన్ = దేశములను గూర్చి, జగ్మః = వెళ్ళిరి.

తా. "తప్పక అట్లే''అని రాముడు పలుకగా ఆ రాజులందరూ చాల సంతోషించుచు, వెళ్ళుటకు సిద్ధమైనవారై, దోసిళ్ళు కట్టి రామునితో వెళ్లెద మని చెప్పి, ఆతనిచే పూజింపబడినవారై తమ తమ దేశములకు వెళ్ళిరి. 32

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ముప్పది ఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనచత్వారింశః సర్గః

*[రాజులు రామునకు కానుకలు పంపుట, రాముడు వాటిని స్వీకరించి తన మిత్రులైన వానరాదులకు ఇచ్చుట. వానరాదులు అక్కడ సుఖముగా ఉండుట].*

మూ. తే ప్రయాతా మహాత్మానః పార్థివాస్తే ప్రహృష్టవత్,
గజవాజిసహస్రౌఘైః కమ్పయన్తో వసుంధరామ్. 1

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, తే = ఆ, పార్థివాః = రాజులు, ప్రహృష్టవత్ = సంతోషించినవారై, గజవాజిసహస్రౌఘైః = గజములయొక్క, గుఱ్ఱములయొక్క సహస్రముల సముదాయములచేత, వసున్ధరామ్ = భూమిని, కమ్పయన్తః = కంపింపచేయుచు, ప్రయాతాః = వెళ్ళిరి.

తా. మహాత్ములైన ఆ రాజులు సంతోషించి, వేలకొలది ఏనుగుల, గుఱ్ఱముల సముదాయములచేత భూమిని కంపింపచేయుచు వెళ్ళిరి. 1

మూ. అక్షౌహిణ్యో హి తత్రాసన్ రాఘవాయ సముద్యతాః,
భరతస్యాజ్ఞయానేకాః ప్రహృష్టబలవాహనాః. 2

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, అజ్ఞయా = ఆజ్ఞచేత, ప్రహృష్టబలవాహనాః = సంతోషించిన సైన్యములు, వాహనములూ గల, అక్షౌహిణ్యః = అక్షౌహిణులు, రాఘవాయ = రామునికొరకు, సముద్యతాః = సన్నద్ధమైనవై, తత్ర = అక్కడ, ఆసన్ హి = ఉండెను కదా ?

తా. రామునికి సహాయముగా వెళ్ళుటకై, భరతుని ఆజ్ఞచేత ఉత్సాహముతో కూడిన సైన్యములు, వాహనములూ గల అక్షౌహిణులు అక్కడ ఉండెను. 2

మూ. ఊచుస్తే చ మహీపాలా బలదర్పసమన్వితాః,
న రామ రావణం యుద్ధే పశ్యామః పురతః స్థితమ్. 3

ప్ర. అ. బలదర్పసమన్వితాః = బలగర్వముతో కూడిన, తే = ఆ, మహీపాలాః = రాజులు, ఊచుః = ఇట్లనిరి, రామ = రామా! యుద్ధే = యుద్ధము నందు, పురతః = ఎదుట, స్థితమ్ = నిలచిన, రావణమ్ = రావణుణ్ణి, న పశ్యామః = చూడలేదు.

తా. బలగర్వముతో ఆ రాజులు ఇట్లనిరి-"రామా! యుద్ధములో రావణుడు మా ఎదుట నిలచి ఉండగా కనబడలేదు. (కనబడినచో ఏమి చేసి ఉండేవారమో!)"

మూ. భరతేన వయం పశ్చాత్సమానీతా నిరర్థకమ్,
హతా హి రాక్షసాః క్షిప్రం పార్థివైః స్యుర్న సంశయః. 4

ప్ర. అ. భరతేన = భరతునిచేత, వయమ్ = మేము, నిరర్థకమ్ = వ్యర్థముగా. పశ్చాత్ = తరవాత, సమానీతాః = తీసికొనిరాబడినాము. పార్థివైః = రాజులచేత, రాక్షసాః = రాక్షసులు, క్షిప్రమ్ = శీఘ్రముగా, హతాః స్యుః = చంపబడి ఉందురు. సంశయః = సంశయము, న = లేదు.

తా. భరతుడు మమ్ములను పని అంతా అయిపోయినతరవాత వ్యర్థముగా తీసికొని వచ్చినాడు. ముందు వచ్చినచో రాజులు నిఃసంశయముగా, రాక్షసులను వెంటనే చంపి ఉండేవారు. 4

మూ. రామస్య బాహువీర్యేణ రక్షితా లక్ష్మణస్య చ,
సుఖం పారే సముద్రస్య యుధ్యేమ విగతజ్వరాః. 5

ప్ర. అ. రామస్య = రామునియొక్క, లక్ష్మణస్యచ = లక్ష్మణునియొక్క, బాహువీర్యేణ = బాహుపరాక్రమముచేత, రక్షితాః = రక్షించబడిన మేము, సముద్రస్య పారే = సముద్రము అవతలి ఒడ్డున, విగతజ్వరాః = పోయిన భయము గలవారమై, యుధ్యేమ = యుద్ధము చేసి ఉండేవారము.

తా. రామలక్ష్మణుల బాహుపరాక్రమముచేత రక్షింపబడుచు, ఏ భయమూ లేకుండగా సముద్రము ఆవలి ఒడ్డున సుఖముగా యుద్ధముచేసి ఉండేవారము. 5

మూ. ఏతాశ్చాన్యాశ్చ రాజానః కథాస్తత్ర సహస్రశః,
కథయన్తః స్వరాజ్యాని జగ్ముర్హర్షసమన్వితాః. 6

ప్ర. అ. సహస్రశః = వేలకొలది, రాజానః = రాజులు, తత్ర = అక్కడ, ఏతాః = ఈ, అన్యాః చ = ఇతరములూ అయిన, కథాః = కథలను, కథయన్తః = చెప్పుచూ, హర్షసమన్వితాః = సంతోషముతో కూడినవారై, స్వరాజ్యాని = తమ రాజ్యములను గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. వేలకొలది రాజులు ఈ కథలను, మరి ఇతరకథలను చెప్పుకొనుచు సంతోషముతో తమ తమ రాజ్యములకు వెళ్ళిరి. 6

మూ. స్వాని రాజ్యాని ముఖ్యాని ఋద్ధాని ముదితాని చ,
సమృద్ధధనధాన్యాని పూర్ణాని వసుమన్తి చ. 7

యథాపురాణి తే గత్వా రత్నాని వివిధాన్యథ,
రామస్య ప్రియకామార్థముపహారం నృపా దదుః. 8

ప్ర. అ. ముఖ్యాని = ప్రసిద్ధములు, ఋద్ధాని = ఐశ్వర్యసంపన్నములు, ముదితాని = సంతోషించినవి, సమృద్ధధనధాన్యాని = ధనధాన్యసమృద్ధములు, పూర్ణాని = నిండినవి, వసుమన్తి చ = ధనము కలవీ అయిన, యథాపురాణి = పూర్వము వలెనే ఉన్న, స్వాని రాజ్యాని = తమ రాజ్యములను గూర్చి, గత్వా = వెళ్ళి, తే నృపాః = ఆ రాజులు, అథ = అటుపిమ్మట, రామస్య = రామునియొక్క, ప్రియకామార్థమ్ = ప్రియకామములకొరకు, వివిధాని = అనేకవిధములైన, రత్నాని = రత్నములను, ఉపహారమ్ = కానుకనుగా, దదుః = ఇచ్చిరి.

తా. ఆ రాజులు ప్రసిద్ధములు, సమృద్ధములు, ఆనందభరితములు, ధన ధాన్య సమృద్ధములు, పరిపూర్ణములు, ధనము గలవి అయిన, తాము విడిచి వచ్చినప్పుడు ఎట్లు ఉండెనో అట్లే ఉన్న తమ రాజ్యములకు వెళ్ళి రామునికి ప్రియము చేయుటకై అనేకవిధములైన రత్నములను కానుకగా పంపిరి. 7,8

మూ. అశ్వాన్యానాని రత్నాని హస్తినశ్చ మదోత్కటాన్,
చన్దనాని చ ముఖ్యాని దివ్యాన్యాభరణాని చ. 9

మణిముక్తాప్రవాలాంస్తు దాస్యో రూపసమన్వితాః,
అజావికం చ వివిధం రథాంస్తు వివిధాన్ బహూన్. 10

ప్ర. అ. అశ్వాన్ = గుఱ్ఱములను, యానాని = వాహనములను, రత్నాని = రత్నములను, మదోత్కటాన్ = మదముచేత తీవ్రముగా ఉన్న, హస్తినః చ = ఏనుగులను, ముఖ్యాని = శ్రేష్ఠములైన, చన్దనాని చ = చందనములను, దివ్యాని = దివ్యములైన, ఆభరణాని చ = అలంకారములను, మణిముక్తాప్రవాలాన్ తు = మణులను, ముత్యములను, పొగడములను, రూపసమన్వితాః = రూపముతో కూడిన, దాస్యః = దాసీలను, వివిధమ్ = అనేకవిధములైన, అజావికం చ = మేకలను, గొఱ్ఱెలను, వివిధాన్ = అనేకవిధములైన, బహూన్ = అనేకములైన, రథాన్ తు = రథములను పంపిరి.

తా. గుఱ్ఱములు, వాహనములు, రత్నములు, మదముచేత తీవ్రముగా ఉన్న ఏనుగులు, ముఖ్యములైన చందనములు, దివ్యములైన అలంకారములు, మణులు, ముత్యములు, పొగడములు, రూపవతులైన దాసీలు, అనేకవిధములైన మేకల గొఱ్ఱెల మందలు, చాలా రకములైన అనేకరథములు పంపిరి. 9,10

మూ. భరతో లక్ష్మణశ్చైవ శత్రుఘ్నశ్చ మహాబలః,
ఆదాయ తాని రత్నాని స్వాం పురీం పునరాగతాః. 11

ప్ర. అ. భరతః = భరతుడు, లక్ష్మణః చైవ = లక్ష్మణుడు, మహాబలః = గొప్ప బలము గల, శత్రుఘ్నః చ = శత్రుఘ్నుడూ, తాని రత్నాని = ఆ రత్నములను, అదాయ = తీసికొని, స్వామ్ = తమ సంబంధమైన, పురీమ్ = పట్టణమును గూర్చి, పునః = మరల, ఆగతాః = వచ్చినారు.

తా. భరతలక్ష్మణశత్రుఘ్నులు ఆ రత్నములను తీసికొని తమ నగరమునకు తిరిగి వచ్చిరి. 11

మూ. ఆగమ్య చ పురీం రమ్యామయోధ్యాం పురుషర్షభాః,
తాని రత్నాని చిత్రాణి రామాయ సముపానయన్. 12

ప్ర. అ. పురుషర్షభాః = ఆ పురుషశ్రేష్ఠులు, రమ్యామ్ = సుందరమైన, అయోధ్యాం పురీమ్ = అయోధ్యాపురమును గూర్చి, ఆగమ్య = వచ్చి, చిత్రాణి = చిత్రములైన, తాని రత్నాని = ఆ రత్నములను, రామాయ = రామునికొరకు, సముపానయన్ = సమర్పించిరి.

మూ. హనూమన్తం చ నృపతిరిక్ష్వాకూణాం మహారథః,
అఙ్గదం చ మహాబాహుమఙ్కమారోప్య వీర్యవాన్ 16
రామః కమలపత్రాక్షః సుగ్రీవమిదమబ్రవీత్.

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకు వంశీయుల, నృపతిః = రాజూ, మహారథః = మహారథుడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు, కమలపత్రాక్షః = పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు అయిన, రామః = రాముడు, హనూమన్తం చ = హనుమంతుణ్ణి, మహాబాహుమ్ = గొప్పబాహువులు గల, అఙ్గదం చ = అంగదుణ్ణి, అఙ్కమ్ = తొడను ఆరోప్య = అధిష్ఠింపజేసి, సుగ్రీవమ్ = సుగ్రీవుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఇక్ష్వాకువంశరాజు, మహారథుడు, వీర్యవంతుడు, కమలపత్రాక్షుడు అయిన రాముడు హనుమంతుణ్ణి మహాబాహువైన అంగదుణ్ణి ఒడిలో కూర్చుండబెట్టుకొని (దగ్గరకు చేరదీసి) సుగ్రీవునితో ఇట్లు పలికెను. 15, 16

మూ. అంగదస్తే సుపుత్రోఽయం మన్త్రీ చాప్యనిలాత్మజః, 17
సుగ్రీవమన్త్రితే యుక్తౌ మమ చాపి హితేరతౌ,
అర్హతో వివిధాం పూజాం త్వత్కృతే వై హరీశ్వర. 18

ప్ర. అ. హరీశ్వర = వానరరాజా! అయమ్ = ఈ, అఙ్గదః = అంగదుడు, తే = నీయొక్క, సుపుత్రః = సుపుత్రుడు, అనిలాత్మజః = హనుమంతుడు మన్త్రీ చాపి = మంత్రి, సుగ్రీవమన్త్రితే = సుగ్రీవుని ఆలోచనలో, యుక్తౌ = సంబంధించి వున్నవారు, మమ చాపి = నాయొక్క కూడ, హితే = హితమునందు, రతౌ = ఆసక్తులూ అయిన వీరిద్దరూ, త్వత్కృతే = నీ నిమిత్తమై, వివిధామ్ = అనేకవిధములైన, పూజామ్ = పూజను, అర్హతః = తగి ఉన్నారు.

తా. వానరరాజా! ఈ అంగదుడు నీ సుపుత్రుడు. ఈ హనుమంతుడు నీ మంత్రి. నీ ఆలోచనల ప్రకారము ప్రవర్తించు వీరిద్దరూ నా హితమును కూడ కోరువారు. నిన్ను పట్టి వీళ్ళు అనేక విధములైన సత్కారములు పొందతగినవారు. 17,18

మూ. ఇత్యుక్త్వా వ్యపముచ్యాఙ్గాద్భూషణాని మహాయశాః,
స బబన్ధ మహార్హాణి తదాఙ్గదహనూమతోః. 19

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తిగల, సః = ఆ రాముడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అఙ్గాత్ = తన శరీరమునుండి, మహార్హాణి = గొప్ప విలువ గల, భూషణాని = అలంకారములను, అపముచ్య = తీసి, తదా = అప్పుడు, అఙ్గదహనూమతోః = అంగదహనుమంతులకు, బబన్ధ = కట్టెను.

తా॥ గొప్పకీర్తిగల రాముడు ఇట్లు పలికి, తనశరీరము నుండి అమూల్యము మైన ఆభరణములు తీసి అంగదహనుమంతులకు కట్టెను. 19

మూ. ఆభాష్య చ మహావీర్యాన్ రాఘవో యూథపర్షభాన్,
నీలం నలం కేసరిణం కుముదం గన్ధమాదనమ్. 20

సుషేణం పనసం వీరం మైన్దం ద్వివిదమేవ చ,
జామ్బవన్తం గవాక్షం చ వినతం ధూమ్రమేవ చ.

వలీముఖం ప్రజఙ్ఘం చ సంనాదం చ మహాబలమ్,
దరీముఖం దధిముఖమిన్ద్రజానుం చ యూథపమ్. 22

మధురం శ్లక్ష్ణయా వాచా నేత్రాభ్యామాపిబన్నివ,
సుహృదో మే భవన్తశ్చ శరీరం భ్రాతరస్తథా. 23

యుష్మాభిరుద్ధృతశ్చాహం వ్యసనాత్కాననౌకసః,
ధన్యో రాజా చ సుగ్రీవో భవద్భిః సుహృదాం వరైః. 24

ఏవముక్త్వా దదౌ తేభ్యో భూషణాని యథార్హతః,
వజ్రాణి చ మహార్హాణి సస్వజే చ నరర్షభః. 25

ప్ర. అ. నరర్షభః = నరులలో శ్రేష్ఠుడైన, రాఘవః = రాముడు, మహావీర్యాన్ = గొప్ప పరాక్రమము గల, యూథపర్షభాన్ = వానరయూథ నాయకులలో శ్రేష్ఠులైన, నీలమ్ = నీలుణ్ణి, నలమ్ = నలుణ్ణి, కేసరిణమ్ = కేసరిని, కుముదమ్ = కుముదుణ్ణి, గన్ధమాదనమ్ = గంధమాదనుణ్ణి, సుషేణమ్ = సుషేణుణ్ణి, వీరమ్ = వీరుడైన, పనసమ్ = పనసుణ్ణి, మైన్దమ్ = మైందుణ్ణి, ద్వివిదమేవ చ = ద్వివిదుణ్ణి, జామ్బవన్తమ్ = జాంబవంతుణ్ణి, గవాక్షమ్ = గవాక్షుణ్ణి, వినతమ్ = వినతుణ్ణి, ధూమ్రమ్ ఏవ చ = ధూమ్రుణ్ణి వలీముఖమ్ = వలీముఖుణ్ణి,

(లేదా వానరుడైన) ప్రజఙ్ఘం చ = ప్రజంఘుణ్ణి, మహాబలమ్ = గొప్ప బలము గల, సంనాదం చ = సంనాదుణ్ణి, దరీముఖమ్ = దరీముఖుణ్ణి, యూథపమ్ = వానర యూథనాయకుడైన, ఇన్ద్రజానుమ్ = ఇంద్రజానుణ్ణి, ఆభాష్య = పలకరించి, నేత్రాభ్యామ్ = నేత్రములతో, ఆపిబన్నివ = త్రాగుచున్నాడా అన్నట్లు చూచుచు, శ్లక్ష్ణయా = మృదువైన, వాచా = వాక్కుతో, మధురమ్ = మధురముగా, కాన నౌకసః వానరులారా! భవన్తః = మీరు, మే = నాకు, సుహృదః = మిత్రులు. శరీరమ్ = శరీరము. తథా = మరియు, భ్రాతరః = సోదరులు. యుష్మాభిః = మీచేత, అహమ్ = నేను, వ్యసనాత్ = వ్యసనమునుండి, ఉద్ధృతః = ఉద్ధరించబడినాను. సుహృదామ్ = స్నేహితులతో, వరైః = శ్రేష్ఠులైన, భవద్భిః = మీచేత, రాజా = రాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు, ధన్యః = ధన్యుడు. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి తేభ్యః = వాళ్లకు, యథార్హతః = అర్హతానుసారముగా, భూషణాని = భూషణము లను, మహార్హాణి = గొప్ప విలువ గల, వజ్రాణి = వజ్రములను, దదౌ = ఇచ్చెను. సస్వజే చ = కౌగిలించుకొనెను కూడ.

తా. నరులలో శ్రేష్ఠుడైన రాముడు గొప్ప పరాక్రమము గలవారు, వానర యూథనాయకులు అయిన నీల-నల- కేసరి-కుముద- గంధమాదన-సుషేణ- పనస-మైంద - ద్వివిద - జాంబవంతులను, గవాక్ష-వినత-ధూమ్ర- వలీముఖ- ప్రజంఘ-సంనాద-మహాబల-దరీముఖ-దధిముఖ, ఇంద్రజానులను వేరువేరుగా పలకరించి, నేత్రములతో త్రాగుచున్నాడా అన్నట్లు చూచుచు- "ఓ! వానరులారా! మీరు నాకు మిత్రులు; నా దేహమువంటివారు; నా సోదరులు; మీరే నన్ను ఆపద నుండి ఉద్ధరించినారు; మీరు ఉత్తమమిత్రులుగా ఉన్న సుగ్రీవుడు ధన్యుడు" అని మధురముగా మృదువైన మాటలు పలికి తగు విధముగా అలంకారములు, అమూల్యములైన వజ్రములు బహూకరించి కౌగలించుకొనెను. 20-25

మూ. తే పిబన్తః సుగన్ధీని మధూని మధు పిఙ్గలాః।
మాంసాని చ సుమృష్టాని మూలాని చ ఫలాని చ. 26

ప్ర. అ. తే = ఆ, మధుపిఙ్గలాః = వానరులు, సుగన్ధీని = చాలా మంచి వాసన గల, మధూని = తేనెలను, పిబన్తః = త్రాగుచున్నవారై, సుమృష్టాని = చాల పరి శుద్ధమైన, మాంసాని = మాంసములను, మూలాని చ = మూలములను, ఫలాని చ = ఫలములను, తినుచుండిరి.

తా. ఆ వానరులు మంచి వాసన గల మధువులను త్రాగుచు పరిశుద్ధము లైన మాంసములను, మూలములను, ఫలములను తినుచు నివసించిరి.

వి. వానరులు మాంసం తినడం ఈ ఉత్తరకాండరచయిత మాత్రమే చెప్పినాడు. 26

మూ. ఏవం తేషాం నివసతాం మాసః సాగ్రో యయౌ తదా,
ముహూర్తమివ తే సర్వే రామభక్త్యా చ మేనిరే. 27

ప్ర. అ. తేషామ్ = ఆ వానరులు, ఏవమ్ = ఇట్లు, నివసతామ్ = నివసించుచుండగా, తదా = అప్పుడు, సాగ్రః = కొంచెము అధికమైన, మాసః = మాసము, యయౌ = గడచెను. తే సర్వే = వాళ్ళందరూ, రామభక్త్యా = రామభక్తిచేత, ముహూర్తమివ = ముహూర్తకాలమును వలె, మేనిరే = తలచిరి.

తా. ఆ వానరులు ఈ విధముగ నివసించుచుండగా కొంచెము అధికమైన మాసము గడచెను. కాని రామభక్తి గల వాళ్ళకు మాత్రము ఆ కాలము ముహూర్తము వలె ఉండెను. 27

మూ. రామోఽపి రేమే తైః సార్ధం వానరైః కామరూపిభిః,
రాక్షసైశ్చ మహావీర్యైర్ఋక్షైశ్చైవ మహాబలైః. 28

ప్ర. అ. రామః = రాముడు కూడ, కామరూపిభిః = స్వేచ్ఛారూపము గల, తైః = ఆ, వానరైః సార్ధమ్ = వానరులతోను, మహావీర్యైః = గొప్ప పరాక్రమము గల, రాక్షసైః చ = రాక్షసులతోను, మహాబలైః = గొప్ప బలము గల, ఋక్షైః చ ఏవ = భల్లూకములతోను, రేమే = క్రీడించెను.

తా. రాముడు కూడ స్వేచ్ఛారూపధారులైన ఆ వానరులతోను, గొప్ప పరాక్రమము గల రాక్షసులతోను, గొప్ప బలము గల భల్లూకములతోను సుఖముగా కాలము గడపెను. 28

మూ. ఏవం తేషాం యయౌ మాసో ద్వితీయః శిశిరః సుఖమ్,
వానరాణాం ప్రహృష్టానాం రాక్షసానాం చ సర్వశః. 29

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సర్వశః = అన్ని ప్రకారములచేతా,

ప్రహృష్టానామ్ = సంతోషించిన, తేషామ్ = ఆ, వానరాణామ్ = వానరులకు, రాక్షసానాం చ = రాక్షసులకు, ద్వితీయః = రెండవ, శిశిరః మాసః = శిశిరమాసము, సుఖమ్ = సుఖముగా, యయౌ = వెళ్లెను.

తా. అన్ని విధాలా సంతోషముతో ఉన్న వానరులకు, రాక్షసులకు ఈ విధముగ రెండవదైన శిశిరర్తువుకు సంబంధించిన మాసము సుఖముగా గడచెను.

మూ. ఇక్ష్వాకునగరే రమ్యే పరాం ప్రీతిముపాసతామ్,
రామస్య ప్రీతికరణైః కాలస్తేషాం యయౌ సుఖమ్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. రమ్యే = సుందరమైన, ఇక్ష్వాకునగరే = అయోధ్యయందు, పరామ్ = గొప్ప, ప్రీతిమ్ = ఆనందమును, ఉపాసతామ్ = పొందుచున్న, తేషామ్ = వారికి, రామస్య = రామునియొక్క, ప్రీతికరణైః = ప్రేమతో చేసిన పనులచేత, కాలః = కాలము, సుఖమ్ = సుఖముగా, యయౌ = వెళ్లెను.

తా. రమ్యమైన ఆ అయోధ్యానగరమునందు గొప్ప ఆనందమును అనుభవించుచున్న ఆ వానరాదులకు కాలము, రాముడు ప్రేమపూర్వకముగ చూపు ఆదరాదులచే సుఖముగా గడచెను. 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానములో ఉత్తరకాండలో
ముప్పదితొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ చత్వారింశః సర్గః

[రాముడు సుగ్రీవాదివానరులను, విభీషణాదిరాక్షసులను సన్మానించి వారి వారి దేశములకు పంపుట.]

మూ. తథా స్మ తేషాం వసతామృక్షవానరరక్షసామ్,
రాఘవస్తు మహాతేజాః సుగ్రీవమిదమబ్రవీత్. 1

ప్ర. అ. తేషామ్ = ఆ, ఋక్షవానరరక్షసామ్ = భల్లూకవానరరాక్షసులు, తథా = అట్లు, వసతామ్ = నివసించుచుండగా, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రాఘవః తు = రాముడు, సుగ్రీవమ్ = సుగ్రీవుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ భల్లూకవానరరాక్షసులు ఆ విధముగ నివసించుచుండగా, గొప్ప తేజస్సు గల రాముడు సుగ్రీవునితో ఇట్లు పలికెను. 1

మూ. గమ్యతాం సౌమ్య కిష్కిన్ధాం దురాధర్షాం సురాసురైః,
పాలయస్వ సహామాత్యై రాజ్యం నిహతకణ్టకమ్. 2

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! సురాసురైః = సురులచేతను, అసురులచేతను, దురాధర్షామ్ = ఎదిరింప శక్యము కాని, కిష్కిన్ధామ్ = కిష్కింధను గూర్చి, గమ్యతామ్ = వెళ్లదవుగాక. అమాత్యైః సహ = మంత్రులతో కూడ, నిహతకణ్టకమ్ = తొలగించబడిన శత్రుబాధ గల, రాజ్యమ్ = రాజ్యమును, పాలయస్వ = పాలించుము.

తా. సౌమ్యుడా! సురాసురులు కూడ ఎదిరించ జాలని కిష్కింధకు వెళ్ళి, అమాత్యసహితుడవై తొలగింపబడిన శత్రుబాధ గల రాజ్యమును పాలించుము. 2

మూ. అఙ్గదం చ మహాబాహో ప్రీత్యా పరమయా యుతః,
పశ్య త్వం హనుమన్తం చ నలం చ సుమహాబలమ్. 3

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! త్వమ్ = నీవు, పరమయా = గొప్పదైన, ప్రీత్యా = ప్రేమతో, యుతః = కూడినవాడవై, అఙ్గదం చ = అంగదుణ్ణి, హనుమన్తం చ = హనుమంతుణ్ణి, సుమహాబలమ్ = చాల గొప్ప బలము గల, నలం చ = నలుణ్ణి, పశ్య = చూడుము.

తా. ఓ! మహాబాహూ! అంగదుణ్ణి, హనుమంతుణ్ణి, మహాబలశాలియైన నలుణ్ణి ప్రేమతో చూచుకొనుము. 3

మూ. సుషేణం శ్వశురం వీరం తారం చ బలినాం వరమ్,
కుముదం చైవ దుర్ధర్షం నీలం చైవ మహాబలమ్. 4

వీరం శతబలిం చైవ మైన్దం ద్వివిదమేవ చ,
గజం గవాక్షం గవయం శరభం చ మహాబలమ్. 5

ఋక్షరాజం దురాధర్షం జామ్బవన్తం మహాబలమ్,
పశ్య ప్రీతిసమాయుక్తో గన్ధమాదనమేవ చ. 6

ప్ర. అ. శ్వశురమ్ = నీ మామయైన, సుషేణమ్ = సుషేణుణ్ణి, వీరమ్ = వీరుడైన, తారం చ = తారుణ్ణి, బలినామ్ = బలవంతులలో, వరమ్ = శ్రేష్ఠుడైన, కుముదం చైవ = కుముదుణ్ణి, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని, మహాబలమ్ = గొప్ప బలము గల, నీలం చైవ = నీలుణ్ణి, వీరమ్ = వీరుడైన, శతబలిం చైవ = శతబలిని, మైన్దమ్ = మైందుణ్ణి, ద్వివిదమేవ చ = ద్వివిదుణ్ణి, గవయమ్ = గవయుణ్ణి, మహాబలమ్ = గొప్ప బలము గల, శరభం చ = శరభుణ్ణి, ఋక్షరాజమ్ = భల్లూకముల రాజైన, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని, మహాబలమ్ = గొప్ప బలము గల, జామ్బవన్తమ్ = జాంబవంతుణ్ణి, గన్ధమాదనమేవ చ = గంధమాదనుణ్ణి, ప్రీతిసమాయుక్తః = ప్రేమతో కూడినవాడవై, పశ్య = చూడుము.

తా. నీ మామయైన సుషేణుణ్ణి, తార-కుముద-నీల-శతబలి - మైంద - ద్వివిద-గజ-గవాక్ష-గవయ-శరభులను, ఎదిరింప శక్యము కాని, మహాబలశాలియైన భల్లూకరాజు జాంబవంతుణ్ణి గంధమాదనుణ్ణి ప్రేమతో చూచుకొనుము. 4-6

మూ. ఋషభం చ సువిక్రాన్తం ప్లవంగం చ సుపాటలమ్,
కేసరిం శరభం శుమ్భం శఙ్ఖచూడం మహాబలమ్. 7

యే చేమే సుమహాత్మానో మదర్థే త్యక్తజీవితాః,
పశ్య త్వం ప్రీతిసంయుక్తో మా చైషాం విప్రియం కృథాః.

ప్ర. అ. సువిక్రాన్తమ్ = మంచి పరాక్రమము గల, ఋషభం చ = ఋషభుణ్ణి, సుపాటలమ్ = సుపాటలు డను, ప్లవంగం చ = వానరుణ్ణి, కేసరిమ్ = కేసరిని, శరభమ్ = శరభుణ్ణి, శుమ్భమ్ = శుంభుణ్ణి మహాబలమ్ = గొప్ప బలము గల, శఙ్ఖచూడమ్ = శంఖచూడుణ్ణి. మదర్థే = నానిమిత్తమై, త్యక్తజీవితాః = విడువబడిన ప్రాణములు గల (ప్రాణములు త్యజించుటకు సిద్ధపడిన), యే = ఏ, ఇమే = ఈ, సుమహాత్మానః = గొప్ప మహాత్ము లున్నారో వారినీ, త్వమ్ = నీవు, ప్రీతిసంయుక్తః = ప్రేమతో కూడినవాడవై, పశ్య = చూడుము. ఏషామ్ = వీళ్లకు, విప్రియమ్ = అప్రియమును, మా చ కృథాః = చేయకుము.

తా. విక్రమవంతుడైన ఋషభుణ్ణి, సుపాటల-కేసరి-శరభ-శంఖచూడులను, నాకోసమై ప్రాణాలకు తెగించిన మహాత్ముల నందరినీ ప్రేమతో చూచుకొనుము. వీళ్ళకు అప్రియము చేయకుము. 7,8

మూ. ఏవముక్త్వా చ సుగ్రీవమాశ్లిష్య చ పునః పునః,
విభీషణమువాచాథ రామో మధురయా గిరా. 9

ప్ర. అ. రామః = రాముడు, సుగ్రీవమ్ = సుగ్రీవుణ్ణి గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి. పునః పునః = మాటిమాటికి, ఆశ్లిష్య చ = కౌగిలించుకొని, అథ = అటుపిమ్మట, విభీషణమ్ = విభీషణుణ్ణి గూర్చి, మధురయా = మధురమైన, గిరా = వాక్కుతో, ఉవాచ = పలికెను.

తా. రాముడు సుగ్రీవునితో ఇట్లు పలికి, మాటిమాటికి కౌగలించుకొని, పిమ్మట విభీషణునితో మధురముగా ఇట్లు పలికెను. 9

మూ. లఙ్కాం ప్రశాధి ధర్మేణ ధర్మజ్ఞస్త్వం మతో మమ,
పురస్య రాక్షసానాం చ భ్రాతుర్వైశ్రవణస్య చ. 10

ప్ర. అ. లఙ్కామ్ = లంకను, ధర్మేణ = ధర్మముచేత, ప్రశాధి = పరిపాలించుము. త్వమ్ = నీవు, ధర్మజ్ఞః = ధర్మమును ఎరిగినవాడవుగా, పురస్య =

= పట్టణమునకు, రాక్షసానాం చ = రాక్షసులకు, భ్రాతుః = సోదరుడైన, వైశ్రవణస్య చ = కుబేరునకు, మమ = నాకు, మతః = అంగీకరింపబడినవాడవు.

తా. లంకను ధర్మమును అనుసరించి పాలించుము. నీవు ధర్మము తెలిసినవాడవు అని నేను, నీ పట్టణములోని ప్రజలు, రాక్షసులు, నీ సోదరుడైన కుబేరుడు నమ్ముచున్నాము. 10

మూ. మా చ బుద్ధిమధర్మే త్వం కుర్యా రాజన్ కదాచన,
బుద్ధిమన్తో హి రాజానో ధ్రువమశ్నన్తి మేదినీమ్. 11

ప్ర. అ. రాజన్ = రాజా! త్వమ్ = నీవు, కదాచన = ఎప్పుడూ కూడ, అధర్మే = అధర్మమునందు, బుద్ధిమ్ = బుద్ధిని, మా చ కురు = చేయకుము, బుద్ధిమన్తః = బుద్ధిమంతులైన, రాజానః = రాజులు, ధ్రువమ్ = తప్పక, మేదినీమ్ = భూమిని, అశ్నన్తి = అనుభవింతురు.

తా. రాజా! నీవు ఎన్నడూ కూడా నీ బుద్ధిని అధర్మముమీద ఉంచకుము. మంచి బుద్ధిగల రాజులే తప్పక భూమిని అనుభవింతురు. 11

మూ. అహం చ నిత్యశో రాజన్ సుగ్రీవసహితస్త్వయా,
స్మర్తవ్యః పరయా ప్రీత్యా గచ్ఛ త్వం విగతజ్వరః. 12

ప్ర. అ. రాజన్ = రాజా! సుగ్రీవసహితః=సుగ్రీవునితో కూడిన, అహం చ = నేను, త్వయా = నీచేత, నిత్యశః = నిత్యమూ, పరయా = గొప్ప, ప్రీత్యా = ప్రేమతో, స్మర్తవ్యః = స్మరించదగినవాడను. త్వమ్ = నీవు, విగతజ్వరః= పోయిన బాధలు కలవాడవై, గచ్ఛ = వెళ్లుము.

తా. రాజా! నీవు నిత్యము సుగ్రీవుణ్ణి నన్నూ స్నేహపూర్వకముగా, జ్ఞాపకము ఉంచుకొనుము. ఏ బాధలూ లేనివాడవై వెళ్ళుము. 12

మూ. రామస్య భాషితం శ్రుత్వా ఋక్షవానరరాక్షసాః,
సాధు సాధ్వితి కాకుత్స్థం ప్రశశంసుః పునః పునః. 13

ప్ర. అ. ఋక్షవానరరాక్షసాః = భల్లూకములు, వానరులు, రాక్షసులు, రామస్య = రాముని యొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, సాధు సాధు

ఇతి = బాగు బాగు అని, పునః పునః = మాటిమాటికి, కాకుత్థ్సమ్ = రాముణ్ణి, ప్రశశంసుః = ప్రశంసించిరి.

తా. రాముని మాటలు విని ఋక్ష-వానర-రాక్షసులు "బాగు బాగు" అని మాటిమాటికీ ఆ రాముణ్ణి ప్రశంసించిరి. 13

మూ. తవ బుద్ధిర్మహాబాహో వీర్య మద్భుతమేవ చ,
మాధుర్యం పరమం రామ స్వయంభోరివ నిత్యదా. 14

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! రామ = రామా! స్వయంభోః ఇవ = బ్రహ్మదేవునియొక్క వలె, తవ = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, వీర్యమ్=పరాక్రమము, పరమమ్=గొప్ప, మాధుర్యమ్=మాధుర్యము, నిత్యదా = నిత్యము ఉండునవి.

తా. మహాబాహో! రామా! నీ బుద్ధి, అద్భుతమైన వీర్యము, గొప్ప మాధుర్యము ఇవి, బ్రహ్మయొక్క బుద్ధ్యాదుల వలె స్థిరమైనవి. 14

మూ. తేషామేవం బ్రువాణానాం వానరాణాం చ రక్షసామ్,
హనూమాన్ ప్రణతో భూత్వా రాఘవం వాక్యమబ్రవీత్.

ప్ర. అ. తేషామ్ = ఆ, వానరాణామ్ = వానరులు, రక్షసాం చ = రాక్షసులూ, ఏవమ్ = ఇట్లు, బ్రువాణానామ్ = పలుకుచుండగా, హనూమాన్ = హనుమంతుడు, ప్రణతః = వంగినవాడు, భూత్వా = అయి, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ వానరులు, రాక్షసులు ఇట్లు పలుకుచుండగా హనుమంతుడు వంగి నమస్కరించుచు రామునితో ఇట్లనెను. 15

మూ. స్నేహో మే పరమో రాజంస్త్వయి తిష్ఠతు నిత్యదా,
భక్తిశ్చ నియతా వీర భావో నాన్యత్ర గచ్ఛతు. 16

ప్ర. అ. రాజన్ = రాజా! మే = నాకు, త్వయి = నీయందు, పరమః = గొప్ప, స్నేహః = స్నేహము, నిత్యదా = ఎల్లప్పుడూ, తిష్ఠతు = ఉండుగాక, వీర = వీరుడా! భక్తిః చ = భక్తి కూడా, నియతా = స్థిరమైనది (ఉండుగాక). భావః = నా భావము, అన్యత్ర = మరియొకచోటికు, న గచ్ఛతు = వెళ్ళకుండు గాక.

తా. రాజా! నాకు నీపై నిత్యమూ గొప్ప స్నేహము. స్థిరమైన భక్తి ఉండుగాక. నా భావము మరొకవైపు ఎటూ వెళ్ళకుండుగాక. 16

మూ. యావద్రామకథా వీర చరిష్యతి మహీతలే,
తావచ్ఛరీరే వత్స్యన్తి మమ ప్రాణా న సంశయః. 17

ప్ర. అ. వీర = వీరుడా! రామకథా = రామకథ, యావత్ = ఎంతవరకు, మహీతలే = భూతలమునందు, చరిష్యతి = వ్యాపించునో, తావత్ = అంతవరకు, మమ = నాయొక్క, ప్రాణాః = ప్రాణములు, శరీరే = శరీరమునందు, వత్స్యన్తి = నివసించగలవు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఓః వీరుడా! ఈ భూలోకములో నీ చరిత్ర వ్యాప్తిలో ఉండువరకు నా శరీరములో ప్రాణములు ఉండగలవు. సందేహము లేదు. 17

మూ. యచ్చైతచ్చరితం దివ్యం కథా తే రఘునన్దన,
తన్మమాప్సరసో రామ శ్రావయేయుర్నరర్షభ. 18

ప్ర. అ. రఘునన్దన = రఘువంశమును ఆనందింపచేయువాడా! నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా! రామ = రామా! తే = నీయొక్క, యత్ = ఏ, దివ్యమ్ = దివ్యమైన, చరితమ్ = చరిత్ర ఉన్నదో, కథా = కథ ఉన్నదో, తత్ = దానిని, అప్సరసః = అప్సరః స్త్రీలు, మమ = నాకు, శ్రావయేయుః = వినిపించుచుందురు గాక.

తా. ఓ రఘునందనా! నరశ్రేష్ఠా! రామా! దివ్యమైన నీ చరితమును, కథను అప్సరఃస్త్రీలు నాకు వినిపించుచుందురు గాక. 18

మూ. తచ్ఛ్రుత్వాహం తతో వీర తవ చర్యామృతం ప్రభో,
ఉత్కణ్ఠాం తాం హరిష్యామి మేఘలేఖామివానిలః. 19

ప్ర. అ. వీర = వీరుడా, ప్రభో = ప్రభూ! తవ = నీయొక్క, తత్ = ఆ, చర్యామృతమ్ = చరిత్రామృతమును, శ్రుత్వా = విని, తతః = పిమ్మట, అనిలః = వాయువు, మేఘలేఖామ్ ఇవ = మేఘపంక్తిని వలె, తామ్ = ఆ, ఉత్కణ్ఠామ్ = బెంగను, హరిష్యామి = తొలగించుకొనెదను.

తా. ఓ! ప్రభూ! మహావీరా! నేను నీ చరితామృతమును విని దానిచేత నా బెంగను గాలి మేఘపంక్తిని ఛెల్లాచెదరు చేసినట్లు, తొలగించుకొనెదను. 19

మూ. ఏవం బ్రువాణం రామస్తు హనూమన్తం వరాసనాత్,
ఉత్థాయ సస్వజే స్నేహాద్వాక్యమేతదువాచ హ. 20

ప్ర. అ. రామః తు = రాముడైతే, వరాసనాత్ = సింహాసనమునుండి, ఉత్థాయ = లేచి, ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, హనూమన్తమ్ = హనుమంతుణ్ణి, సస్వజే = కౌగిలించుకొనెను. స్నేహాత్ = స్నేహమువలన, ఏతత్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. హనుమంతుడు ఇట్లు అనుచుండగా రాముడు సింహాసనమునుండి లేచి అతనిని కౌగిలించుకొని స్నేహపూర్వకముగా ఇట్లు పలికెను. 20

మూ. ఏవమేతత్కపిశ్రేష్ఠ భవితా నాత్ర సంశయః,
చరిష్యతి కథా యావదేషా లోకే చ మామికా. 21

తావత్తే భవితా కీర్తిః శరీరేఽప్యసవస్తథా,
లోకా హి యావత్ స్థాస్యన్తి తావత్ స్థాసన్తి మే కథాః.

ప్ర. అ. కపిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠుడా! ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, భవితా = కాగలదు. అత్ర = దీనియందు, సంశయః = సంశయము, న = లేదు. మామికా = నాసంబంధమైన, ఏషా కథా = ఈ కథ, యావత్ = ఎంతవరకు, లోకే = లోకమునందు, చరిష్యతి = సంచరించగలదో, తావత్ = అంతవరకు, తే = నీయొక్క, కీర్తిః = కీర్తి, భవితా = ఉండగలదు. తథా = మరియు, శరీరే = శరీరమునందు, అసవః అపి = ప్రాణములు కూడ ఉండగలవు. లోకాః = లోకములు యావత్ = ఎంతవరకు, స్థాస్యన్తి = ఉండగలవో, తావత్ = అంతవరకు, మే కథాః = నా కథలు, స్థాస్యన్తి = ఉండగలవు.

తా. వానరశ్రేష్ఠా! నీవు కోరిన విధముగ జరుగగలదు. సంశయము లేదు. నా కథ లోకములో ఎంతవరకు ప్రచారములో ఉండునో అంతవరకు నీ కీర్తి స్థిరముగ ఉండగలదు. నీ శరీరములో ప్రాణములు ఉండగలవు. ఈ లోకము లున్నంతవరకు నా కథ ఉండగలదు. 21, 22

మూ. ఏకైకస్యోపకారస్య ప్రాణాన్ దాస్యామి తే కపే,
శేషస్యేహోపకారాణాం భవామ ఋణినో వయమ్. 23

ప్ర. అ. కపే = హనుమంతుడా! ఏకైకస్య = ఒక్కొక్క, ఉపకారస్య = ఉపకారమునకు, తే = నీకు, ప్రాణాన్ = ప్రాణములను, దాస్యామి = ఇచ్చెదను. ఉపకారాణామ్ = ఉపకారములలో, శేషస్య = మిగిలిదానికి, వయమ్ = మేము, ఋణినః = ఋణము గలవారము, భవామ = అయి ఉందుము.

తా. హనుమంతుడా! నీవు చేసిన ఒక్కొక్క ఉపకారానికి నేను నా ప్రాణములను ఇచ్చెదను. కాని మిగిలిన ఉపకారాలకు నీకు ఋణపడియే ఉందును. 23

మూ. మదఙ్గే జీర్ణతాం యాతు యత్త్వయోపకృతం కపే,
నరః ప్రత్యుపకారాణామాపత్స్వాయాతి పాత్రతామ్. 24

ప్ర. అ. కపే = హనుమంతుడా! త్వయా = నీచేత, యత్ = ఏది, ఉపకృతమ్ = ఉపకారము చేయబడినదో అది, మదఙ్గే = నాశరీరమునందే, జీర్ణతామ్ = జీర్ణత్వమును, యాతు = పొందుగాక. నరః = నరుడు, ఆపత్సు = ఆపత్సమయములందు, ప్రత్యుపకారాణామ్ = ప్రత్యుపకారములకు, పాత్రతామ్ = పాత్రత్వమును, ఆయాతి = పొందును.

తా. హనుమంతుడా! నీవు నాకు చేసిన ఉపకారము నా శరీరమునందే జీర్ణమైపోవుగాక. నరుడు ఆపదలు వచ్చినప్పుడే ప్రత్యుపకారమునకు తగినవాడగును. అందుచేత నీకు ఏనాటికైన ప్రత్యుపకారము చేసి నీ ఋణము తీర్చుకొనెదను అని నేను అనను అని భావము. 24

మూ. తతోఽస్య హారం చన్ద్రాభం ముచ్య కణ్ఠాత్స రాఘవః,
వైదూర్యతరలం కణ్ఠే బబన్ధ చ హనూమతః. 25

ప్ర అ తతః = అటుపిమ్మట, సః రాఘవః = ఆ రాముడు, కణ్ఠాత్ = తన కంఠమునుండి, చన్ద్రాభమ్ = చంద్రునివంటి కాంతిగల, వైదూర్యతరలమ్ = వైదూర్యము మధ్యమణిగా గల, హారమ్ = హారమును, ముచ్య = తీసి, అస్య హనూమతః = ఈ హనుమంతునియొక్క, కణ్ఠే = కంఠమునందు, బబన్ధ = కట్టెను.

తా. పిమ్మట రాముడు తన కంఠమునుండి చంద్రుని వంటి కాంతి గల వైదూర్యము మధ్యమణిగా ఉన్న హారమును తీసి హనుమంతుని మెడలో కట్టెను. 25

మూ. తేనోరపి నిబద్ధేన హారేణ మహతా కపిః,
రరాజ హేమశైలేన్ద్రశ్చన్ద్రేణాక్రాన్తమస్తకః. 26

ప్ర. అ. ఉరసి = వక్షఃస్థలమునందు, నిబద్ధేన = కట్టబడిన, మహతా = గొప్పదైన, తేన హారేన = ఆ హారముతో, కపిః=హనుమంతుడు, చన్ద్రేణ = చంద్రునిచేత, ఆక్రాన్తమస్తకః = ఆక్రమించబడిన శిఖరము గల, హేమశైలేన్ద్రః = మేరుపర్వతము వలె, రరాజ = ప్రకాశించెను.

తా. వక్షఃస్థలముపై కట్టిన ఆ గొప్ప హారముతో హనుమంతుడు శిఖరము మీద చంద్రుడు ఉన్న మేరుపర్వతము వలె ప్రకాశించెను. 26

మూ. శ్రుత్వా తు రాఘవస్యైతదుత్థాయోత్థాయ వానరాః,
ప్రణమ్య శిరసా పాదౌ నిర్జగ్ముస్తే మహాబలాః. 27

ప్ర. అ. మహాబలాః = గొప్ప బలము గల, తే = ఆ, వానరాః = వానరులు, రాఘవస్య = రామునియొక్క, ఏతత్ = ఈ వాక్యమును, శ్రుత్వా తు = విని, ఉత్థాయ ఉత్థాయ = లేచి లేచి, శిరసా = శిరస్సుచేత, పాదౌ=పాదములను, ప్రణమ్య = నమస్కరించి, నిర్జగ్ముః = బయల్వెడలిరి.

తా. గొప్ప బలము గల ఆ వానరులు రాముని (మాటలు) విని లేచి లేచి శిరస్సుచేత అతని పాదములకు నమస్కరించి బయలుదేరిరి. 27

మూ. సుగ్రీవః స చ రామేణ నిరన్తరమురోగతః,
విభీషణశ్చ ధర్మాత్మా సర్వే తే బాష్పవిక్లవాః. 28

ప్ర. అ. రామేణ = రామునితో, నిరన్తరమ్ = గాఢముగా, ఉరోగతః = వక్షఃస్థలమును పొందిన, సః=ఆ, సుగ్రీవః=సుగ్రీవుడు, ధర్మాత్మా=ధర్మాత్ముడైన, విభీషణః చ = విభీషణుడూ, తే = వారు, సర్వే = అందరూ, బాష్పవిక్లవాః = కన్నీటిచేత వ్యాకులులు అయిరి.

తా. రాముణ్ణి గాఢముగా ఆలింగనము చేసికొనిన సుగ్రీవుడు, ధర్మాత్ముడైన విభీషణుడు అందరూ కూడ కన్నీటితో వ్యాకులత్వము చెందిరి. 29

మూ. సర్వే చ తే బాష్పకలాః సాశ్రునేత్రా విచేతసః,
సంమూఢా ఇవ దుఃఖేన త్యజన్తో రాఘవం తదా. 29

ప్ర. అ. తదా = అప్పుడు. రాఘవమ్ = రాముణ్ణి, త్యజన్తః = విడిచిపెట్టుచున్న, తే సర్వే = వాళ్లందరూ, బాష్పకలాః = కన్నీటిచేత అవ్యక్తముగా మాటలాడుచున్నవారై, సాశ్రునేత్రాః = కన్నీళ్ళతో కూడిన నేత్రములు కలవారై, విచేతసః = ఆలోచనలు లేని వారై, దుఃఖేన = దుఃఖముచేత, సంమూఢాః ఇవ = ఏమీ తోచనివారు వలె అయిరి.

తా. అప్పుడు రాముణ్ణి విడచుచున్న వాళ్ళందరూ డగ్గుత్తికచేత అస్పష్టముగా మాటలాడుచు. కన్నీళ్ళతో నిండిన నేత్రములతో మనస్సులు పనిచేయక దుఃఖముచేత ఏమి తోచని స్థితిలో ఉండిరి. 29

మూ. కృతప్రసాదాస్తేనైవం రాఘవేణ మహాత్మనా,
జగ్ముః స్వం స్వం గృహం సర్వే దేహీ దేహమివ త్యజన్.

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, తేన రాఘవేణ = ఆ రామునిచేత ఏవమ్ = ఇట్లు, కృతప్రసాదాః = చేయబడిన అనుగ్రహము గల, సర్వే = ఆ వానరాదులు అందరూ, దేహమ్ = దేహమును, త్యజన్ = విడచుచున్న, దేహీ = ఇవ = జీవుడు వలె, స్వం స్వం గృహమ్ = తన తన గృహమును గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. మహాత్ముడైన రాముని అనుగ్రహమును ఈ విధముగ పొందిన ఆ వానరరాక్షసాదు లందరూ, దేహమును విడచిపోవుచున్న జీవుడు వలె తమ తమ గృహములకు వెళ్ళిరి. 30

మూ. తతస్తు తే రాక్షసఋక్షవానరాః
ప్రణమ్య రామం రఘువంశవర్ధనమ్,
వియోగజాశ్రుప్రతిపూర్ణలోచనాః,
ప్రతిప్రయాతాస్తు యథానివాసినః. 31

## ఇత్యార్షే శ్రీ మద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
## చత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే = ఆ, రాక్షసఋక్షవానరాః = రాక్షస భల్లూక వానరులు, రఘువంశవర్ధనమ్ = రఘువంశమును వృద్ధిపొందించిన, రామమ్ = రాముణ్ణి, ప్రణమ్య = నమస్కరించి, వియోగజాశ్రుప్రతిపూర్ణలోచనాః = వియోగమువల్ల కలిగిన కన్నీళ్ళతో నిండిన నేత్రములు గలవారై, వివాసినః యథా = ప్రవాసమునకు పోవుచున్నవారు వలె, ప్రతిప్రయాతాః తు = తిరిగి వెళ్ళిరి.

తా. అప్పుడు ఆ రాక్షస - భల్లూక - వానరులు రఘువంశమును వృద్ధి పొందించువాడైన రామునికి నమస్కరించి వియోగదుఃఖముచే కలిగిన కన్నీళ్ళతో నిండిన నేత్రములతో, ప్రవాసమునకు వెళ్ళుచున్నవారు వలె, తమ గృహములకు తిరిగి వెళ్ళిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో నలుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకచత్వారింశః సర్గః

[కుబేరుడు పంపగా పుష్పకము రాముని వద్దకు వచ్చుట, రాముడు దానిని పూజించి మరల పంపివేయుట. భరతుడు రామరాజ్యములోని అద్భుత ప్రభావములను వర్ణించి చెప్పుట.]

మూ. విసృజ్య చ మహాబాహుర్‌ఋక్షవానరరాక్షసాన్,
ప్రాతృభిః సహితో రామః ప్రముమోద సుఖం సుఖీ. 1

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, రామః = రాముడు, ఋక్షవానరరాక్షసాన్ = భల్లూకవానరరాక్షసులను, విసృజ్య = పంపివేసి, భ్రాతృభిః = సోదరులతో, సహితః = కూడినవాడై, సుఖీ = సుఖవంతుడై, సుఖమ్ = సుఖముగా, ప్రముమోద = సంతోషించెను.

తా. బాహుబలశాలియైన రాముడు భల్లూక-వానర-రాక్షసులను పంపివేసి, సోదరులతో సుఖవంతుడై సుఖముగా ఆనందించెను. 1

మూ. అథాపరాహ్ణసమయే భ్రాతృభిః సహ రాఘవః,
శుశ్రావ మధురాం వాణీమన్తరిక్షాన్మహాప్రభుః. 2

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మహాప్రభుః = మహాప్రభువైన, రాఘవః = రాముడు, అపరాహ్ణసమయే = అపరాహ్ణ సమయమునందు, అన్తరిక్షాత్ = ఆకాశమునుండి, మధురామ్ = మధురమైన, వాణీమ్ = వాక్కును, భ్రాతృభిః సహ = సోదరులతో కూడ, శుశ్రావ = వినెను.

తా. మహాప్రభువైన రాముడు సోదరులతో కూర్చుని ఉండగా అపరాహ్ణ సమయమునందు ఆకాశమునుండి మధురమైన వాక్కు వినబడెను. 2

మూ. సౌమ్య రామ నిరీక్షస్వ సౌమ్యేన వదనేన మామ్,
కుబేరభవనాత్ప్రాప్తం విద్ధి మాం పుష్పకం ప్రభో. 3

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడవైన, రామ = రామా ! మామ్ = నన్ను, సౌమ్యేన = సౌమ్యమైన, వదనేన = ముఖముతో, నిరీక్షస్వ = చూడుము. ప్రభో = ఓ ! ప్రభూ ! మామ్ = నన్ను, కుబేరభవనాత్ = కుబేరుని భవనమునుండి, ప్రాప్తమ్ = వచ్చిన, పుష్పకమ్ = పుష్పకమునుగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. సౌమ్యుడా ! రామా ! నన్ను అనుగ్రహపూర్వకముగా చూడుము. ఓ! ప్రభూ ! నేను కుబేరుని భవనమునుండి వచ్చిన పుష్పకమును అని తెలుసుకొనుము. 3

మూ. తవ శాసనమాజ్ఞాయ గతోఽస్మి భవనం ప్రతి,
ఉపస్థాతుం నరశ్రేష్ఠ స చ మాం ప్రత్యభాషత. 4

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! తవ = నీయొక్క, శాసనమ్ = ఆజ్ఞను, ఆజ్ఞాయ = తెలిసికొని, భవనం ప్రతి = కుబేరభవనమును గూర్చి, ఉపస్థాతుమ్ = కుబేరుణ్ణి సేవించుటకొరకు, గతః అస్మి = వెళ్ళితిని. సః చ = ఆ కుబేరుడు కూడ, మామ్ = నన్నుగూర్చి, ప్రత్యభాషత = పలికెను.

తా. నరులలో శ్రేష్ఠుడవైన రామా ! నీ ఆజ్ఞ ప్రకారము కుబేరుని సేవించుటకై ఆతని భవనమునకు వెళ్ళితిని. అతడు నాతో ఇట్లు పలికెను. 4

మూ. నిర్జితస్త్వం నరేన్ద్రేణ రాఘవేణ మహాత్మనా,
నిహత్య యుధి దుర్ధర్షం రావణం రాక్షసేశ్వరమ్. 5

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, నరేన్ద్రేణ = రాజైన, రాఘవేణ = రామునిచేత, దుర్ధర్షమ్ = ఎదిరింప శక్యము కాని. రాక్షసేశ్వరమ్ = రాక్షసరాజైన, రావణమ్ = రావణుణ్ణి, యుధి = యుద్ధమునందు, నిహత్య = చంపి, త్వమ్ = నీవు, నిర్జితః = జయింపబడినావు.

తా. మహాత్ముడైన రాజైన రాముడు రాక్షసరాజైన, ఎదిరింప శక్యముకాని రావణుణ్ణి యుద్ధములో చంపి నిన్ను జయించుకొనినాడు. 5

మూ. మమాపి పరమా ప్రీతిర్హతే తస్మిన్ దురాత్మని,
రావణే సగణే చైవ సపుత్రే సహబాన్ధవే. 6

ప్ర. అ. దురాత్మని = దుష్టబుద్ధి గల, సగణే = గణములతో కూడిన, సపుత్రే = పుత్రులతో కూడిన, సహబాన్ధవే = బంధువులతో కూడిన, తస్మిన్ రావణే = ఆ రావణుడు, హతే = చంపబడినవాడగుచుండగా, మమాపి = నాకు కూడ, పరమా = గొప్ప, ప్రీతిః = సంతోషము.

తా. దురాత్ముడైన ఆ రావణుడు, ఆతని పరివారము, పుత్రులు, బంధువులు చంపబడుటచే నేను కూడ సంతోషించుచున్నాను. 6

మూ. స త్వం రామేణ లఙ్కాయాం నిర్జితః పరమాత్మనా,
వహ సౌమ్య తమేవ త్వమహమాజ్ఞాపయామి తే. 7

ప్ర. అ. సః = అట్టి, త్వమ్ = నీవు, పరమాత్మనా = పరమాత్ముడైన, రామేణ = రాముని చేత, లఙ్కాయామ్ = లంకయందు, నిర్జితః = జయింపబడినావు. సౌమ్య = ఓ! సౌమ్యా! త్వమ్ = నీవు, తమేవ = ఆ రాముణ్ణే, వహ = మోయుము. అహమ్ = నేను, తే = నీకు, అజ్ఞాపయామి = ఆజ్ఞాపించుచున్నాను.

తా. పరమాత్ముడైన రాముడు లంకలో నిన్ను జయించుకొనినాడు. అందు వలన, ఓ సౌమ్యా! నీవు ఆ రాముణ్ణే మోయుము. నేను నిన్ను ఆజ్ఞాపించుచున్నాను.

మూ. పరమో హ్యేష మే కామో యత్త్వం రాఘవనన్దనమ్,
వహేర్లోకస్య సంయానం గచ్ఛస్వ విగతజ్వరః. 8

ప్ర. అ. ఏషః = ఇది. మే = నాయొక్క, పరమః = గొప్పదైన, కామః = కోరిక, యత్ = ఏమనగా, త్వమ్ = నీవు, లోకస్య = లోకమునకు, సంయానమ్ = నడిపించువాడైన, రాఘవనన్దనమ్ = రాముణ్ణి, వహేః = మోయుదువు. విగతజ్వరః = పోయిన మనస్తాపము గలవాడవై, గచ్ఛస్వ = వెళ్లుము.

తా. నీవు లోకములను అన్నింటినీ నడిపించే ఆ రాముణ్ణి మోయవలె నని నా కోరిక. అందుచేత ఏమాత్రము మనస్తాపము లేక వెళ్ళుము. 8

మూ. సోఽహం శాసనమాజ్ఞాయ ధనదస్య మహాత్మనః,
త్వత్సకాశమనుప్రాప్తో నిర్విశఙ్కః ప్రతీచ్ఛ మామ్. 9

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, మహాత్మనః = మహాత్ముడైన, ధనదస్య =

కుబేరునియొక్క, శాసనమ్ = ఆజ్ఞను, ఆజ్ఞాయ = తెలుసుకొని, త్వత్సకాశమ్= నీ సమీపమును గూర్చి, అనుప్రాప్తః=వచ్చినాను. నిర్విశఙ్కః=శంక లేనివాడవై, మామ్ = నన్ను, ప్రతీచ్ఛ = స్వీకరించుము.

తా. నేను మహాత్ముడైన కుబేరుని ఆజ్ఞను అనుసరించి నీవద్దకు వచ్చినాను. ఏ మాత్రము సందేహము లేనివాడవై నన్ను స్వీకరించుము. 9

మూ. అధృష్యః సర్వభూతానాం సర్వేషాం ధనదాజ్ఞయా,
చరామ్యహం ప్రభావేణ తవాజ్ఞాం పరిపాలయన్. 10

ప్ర. అ. ధనదాజ్ఞయా=కుబేరుని ఆజ్ఞచేత, సర్వేషామ్=అందరికి, సర్వభూతానామ్ = సమస్తభూతములకు, అధృష్యః = ఎదిరింప శక్యముకానివాడను. తవ=నీయొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, పరిపాలయన్ = పాలించుచు, అహమ్ = నేను, ప్రభావేణ = ప్రభావముచేత, చరామి = సంచరించుచున్నాను.

తా. కుబేరుని ఆజ్ఞచేత ఏ భూతములూ కూడ నన్ను ఎదిరించజాలవు. నేను ఇపుడు నీ ఆజ్ఞను అనుసరించి ప్రభావముతో సంచరించగలను. 10

మూ. ఏవముక్తస్తదా రామః పుష్పకేణ మహాబలః,
ఉవాచ పుష్పకం దృష్ట్వా విమానం పునరాగతమ్. 11

ప్ర. అ. తదా = అప్పుడు, పుష్పకేణ = పుష్పకముచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాబలః=గొప్ప బలము గల, రామః = రాముడు, పునరాగతమ్=తిరిగి వచ్చిన, పుష్పకం విమానమ్=ఆ పుష్పకవిమానమును, దృష్ట్వా= చూచి, ఉవాచ = పలికెను.

తా. మహాబలశాలియైన రాముడు మరల వచ్చిన ఆ పుష్పకవిమానము పలికిన మాటలు విని దానిని చూచి ఇట్లనెను. 11

మూ. యద్యేవం స్వాగతం తేఽస్తు విమానవర పుష్పక,
ఆనుకూల్యాద్ధనేశస్య వృత్తదోషో న నో భవేత్. 12

ప్ర. అ. విమానవర = విమానములలో శ్రేష్ఠమైన, పుష్పక=పుష్పకమా! ఏవం యది = ఇట్లు అయినచో, తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము, అస్తు =

అగుగాక, ధనేశస్య = కుబేరుడు, అనుకూల్యాత్ = అనుకూలుడుగా ఉండుటవలన, నః = మాకు, వృత్తదోషః = చరిత్రదోషము, న భవేత్ = కాదు.

తా. విమానశ్రేష్ఠమైన ఓ! పుష్పకమా! అట్లైనచో నీకు స్వాగత మగుగాక. కుబేరుడు అంగీకరించినాడు గాన మేము నిన్ను ఉపయోగించుకొన్నను మా నడవడికలో తప్పుఉండదు. 12

మూ. లాజైశ్చైవ తథా పుష్పైర్ధూపైశ్చైవ సుగన్ధిభిః,
పూజయిత్వా మహాబాహూ రాఘవః పుష్పకం తదా. 13
గమ్యతామితి చోవాచ ఆగచ్ఛ త్వం స్మరే యదా.

ప్ర.అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, రాఘవః = రాముడు, తదా = అప్పుడు, పుష్పకమ్ = పుష్పకమును, లాజైః చ ఏవ = పేలాలతోను, తథా = మరియు, పుష్పైః = పువ్వులతోను, ధూపైః చ ఏవ = ధూపములతోను, సుగన్ధిభిః = మంచి వాసన గల వస్తువులతోను, పూజయిత్వా = పూజించి, గమ్యతామ్ = వెళ్లెదవుగాక, ఇతి చ = అని, ఉవాచ = పలికెను. యదా = ఎప్పుడు, స్మరే = స్మరింతునో అప్పుడు, త్వమ్ = నీవు, ఆగచ్ఛ = రమ్ము.

తా. అప్పుడు మహాబాహువైన రాముడు ఆ పుష్పకమును లాజలతోను, పువ్వులతోను ధూపములతోను, సువాసనద్రవ్యములతోను పూజించి "నీవు వెళ్లుము" అని పలికెను. "నేను ఎప్పుడు స్మరింతునో అప్పుడు రమ్ము". 13

మూ. సిద్ధానాం చ గతౌ సౌమ్య మా విషాదేన యోజయ. 14
ప్రతిఘాతశ్చ తే మా భూద్యథేష్టం గచ్ఛతో దిశః.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యా! సిద్ధానామ్ = సిద్ధులయొక్క, గతౌ = గమనమునందు, విషాదేన = దుఃఖముతో, మా యోజయ = కూర్చకుము. యథేష్టమ్ = ఇష్టము ప్రకారము, దిశః = దిక్కులను గూర్చి, గచ్ఛతః = వెళ్ళుచున్న, తే = నీకు, ప్రతిఘాతః చ = అడ్డు కూడ, మా భూత్ = లేకుండుగాక.

తా. సౌమ్యా! సిద్ధుల సంచారమునందు అడ్డము తగలకుము. యథేష్టముగా దిక్కులందు సంచరించుచున్న నీకు ఏ అడ్డూ లేకుండు గాక. 14

మూ. ఏవమస్త్వితి రామేణ పూజయిత్వా విసర్జితమ్, 15
అభిప్రేతాం దిశం తస్మాత్ప్రాయాత్తత్పుష్పకం తదా.

ప్ర. అ ఏవమ్ = ఇట్లు, అస్తు=అగుగాక, ఇతి=అని, రామేణ = రాముని చేత, పూజయిత్వా=పూజించి, విసర్జితమ్ = విడవబడిన, పుష్పకమ్=పుష్పకము, తదా = అప్పుడు, తస్మాత్=ఆ ప్రదేశమునుండి, అభిప్రేతామ్=తనకు ఇష్టమైన, దిశమ్ = దిక్కునుగూర్చి, ప్రాయాత్ = వెళ్లెను.

తా. రామునిచేత పూజించి విడువబడిన ఆ పుష్పకము "అట్లే అగుగాక" అని పలికి ఆ ప్రదేశమునుండి తన కిష్టమైన దిక్కునకు వెళ్లెను. 15

మూ. ఏవమన్తర్హితే తస్మిన్ పుష్పకే సుకృతాత్మని, 16
భరతః ప్రాఞ్జలిర్వాక్యమువాచ రఘునన్దనమ్.

ప్ర. అ. సుకృతాత్మని = పుణ్యస్వరూపము గల, తస్మిన్ పుష్పకే = ఆ పుష్పకము, ఏవమ్ = ఇట్లు, అన్తర్హితే = అంతర్ధానము చెందిన దగుచుండగా, భరతః=భరతుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలికలవాడై, రఘునన్దనమ్=రాముని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పుణ్యస్వరూపమైన ఆ పుష్పకము అంతర్ధానము చెందిన పిమ్మట భరతుడు అంజలి ఘటించి రామునితో ఇట్లు పలికెను. 16

మూ. విబుధాత్మని దృశ్యన్తే త్వయి వీర ప్రశాసతి, 17
అమానుషాణి సత్త్వాని వ్యాహృతాని ముహుర్ముహుః.

ప్ర. అ. వీర = వీరుడా! విబుధాత్మని=దేవతాస్వరూపుడవైన, త్వయి= నీవు, ప్రశాసతి=పాలించుచుండగా, అమానుషాణి=మనుష్యభిన్నమైన, సత్త్వాని= ప్రాణులు, ముహుః ముహుః = మాటిమాటికి, వ్యాహృతాని = పలుకుచున్నవిగా, దృశ్యన్తే = కనబడుచున్నవి.

తా. ఓ! వీరుడా! దేవతాస్వరూపుడవైన నీవు పరిపాలించుచుండగా మనుష్యభిన్నములైన ప్రాణులు కూడ మాటిమాటికి మాటలాడుచు కనబడు చున్నవి. 17

మూ. అనామయశ్చ మర్త్యానాం సాగ్రో మాసో గతో హ్యయమ్,
జీర్ణానామపి సత్త్వానాం మృత్యుర్నాయాతి రాఘవ.

ప్ర. అ. రాఘవ = రామా ! అయమ్ = ఈ, సాగ్రః = అగ్రముతో కూడిన, మాసః = మాసము, గతః హి = గడచినది కదా. మర్త్యానామ్ = మర్త్యులకు, అనామయః చ = రోగాభావము కూడ. జీర్ణానామ్ = ముసలివై పోయిన, సత్త్వానామ్ అపి = ప్రాణులకు కూడ, మృత్యుః = మృత్యువు, న ఆయాతి = వచ్చుటలేదు.

తా. రామా ! నీవు రాజ్యమునకు వచ్చి ఒక మాసము కంటె కొంచెము ఎక్కువ అయినది. మర్త్యులలో అనారోగ్యము లేదు. జీర్ణమైపోయిన (ముసలి) ప్రాణులకు కూడ మృత్యువు వచ్చుటలేదు. 18

మూ. అరోగప్రసవా నార్యో వపుష్మన్తో హి మానవాః, 19
హర్షశ్చాభ్యధికో రాజన్ జనస్య పురవాసినః.

ప్ర. అ. రాజన్ = రాజా ! నార్యః = స్త్రీలు, అరోగప్రసవాః = రోగములు లేని సంతానము కలవారు. మానవాః = మానవులు, వపుష్మన్తః = మంచి శరీరములు గలవారు. పురవాసినః = నగరమునందున్న, జనస్య = జనమునకు, హర్షః చ = సంతోషము కూడ, అభ్యధికః = అధికమైనది.

తా. రాజా ! స్త్రీలు రోగములు లేని సంతానమును కనుచున్నారు. పురుషులు శరీరసౌష్ఠవముతో ఉన్నారు. పురమునందు నివసించుచున్న జనులు చాల సంతోషముతో ఉన్నారు. 19

మూ. కాలే వర్షతి పర్జన్యః పాతయన్నమృతం పయః, 20
వాతాశ్చాపి ప్రవాన్త్యేతే స్పర్శయుక్తాః సుఖాః శివాః.

ప్ర. అ. పర్జన్యః = మేఘము, అమృతమ్ = అమృతమువంటి, పయః = ఉదకమును, పాతయన్ = కురియుచు, కాలే = తగిన కాలమునందు, వర్షతి = వర్షించుచున్నది. ఏతే = ఈ, వాతాః = వాయువులు, స్పర్శయుక్తాః = మంచి స్పర్శతో కూడినవై, సుఖాః = సుఖాకరములై, శివాః = మంగళప్రదములై, ప్రవాన్తి = వీచుచున్నవి.

తా. మేఘము యుక్తకాలమునందు అమృతము వంటి ఉదకమును వర్షించుచున్నది. వాయువులు కూడ స్పర్శకు సుఖకరములై మంగళప్రదములై వీచుచున్నవి. 20

మూ. ఈదృశో నశ్చిరం రాజా భవేదితి నరేశ్వర, 21
కథయన్తి పురే రాజన్ పౌరా జానపదాస్తథా.

ప్ర. అ. నరేశ్వర = నరులకు ప్రభువైన, రాజన్ = రాజా ! నః = మాకు, ఈదృశః = ఇట్టి, రాజా = రాజు, చిరమ్ = చిరకాలము, భవేత్ = ఉండుగాక, ఇతి = అని, పురే = పట్టణమునందున్న, పౌరాః = పౌరులు, తథా = మరియు, జానపదాః = జానపదులు, కథయన్తి = చెప్పుచున్నారు.

తా. నరులకు ప్రభువైన ఓ ! రాజా ! మాకు చిరకాలము ఇట్టి రాజు ఉండుగాక అని పురములో నివసించువారు, గ్రామనివాసులైన ప్రజలూ కూడ అనుచున్నారు. 21

మూ. ఏతా వాచః సుమధురా భరతేన సమీరితాః,
శ్రుత్వా రామో ముదా యుక్తో బభూవ నృపసత్తమః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. భరతేన = భరతునిచేత, సమీరితాః = పలకబడిన, ఏతాః = ఈ, సుమధురాః = చాల మధురములైన, వాచః = వాక్కులను, శ్రుత్వా = విని, నృపసత్తమః = రాజశ్రేష్ఠుడైన, రామః = రాముడు, ముదా = సంతోషముతో, యుక్తః = కూడినవాడు, బభూవ = అయెను.

తా. భరతుడు పలికిన మధురములైన ఈ మాటలు విని రాజశ్రేష్ఠుడైన రాముడు చాల సంతోషించెను. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నలుబది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

*[సీతారాములు అశోకవాటికలో విహరించుట. గర్భవతియైన సీతకు తపోవనమును చూడవలె నను కోరిక ఉదయించుట. రాముడు ఆ కోరిక తీర్చెద నని మాట ఇచ్చుట.]*

మూ. స విసృజ్య తతో రామః పుష్పకం హేమభూషితమ్,
ప్రవివేశ మహాబాహురశోకవనికాం ముదా. 1

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, సః రామః=ఆ రాముడు, హేమభూషితమ్= బంగారముచేత అలంకరించబడిన, పుష్పకమ్=పుష్పకమును, విసృజ్య= పంపివేసి, తతః= అటుపిమ్మట, ముదా= సంతోషముతో, అశోక వనికామ్= అశోకవనమును, ప్రవివేశ= ప్రవేశించెను.

తా. మహాబాహువైన ఆ రాముడు బంగారముచేత అలంకరింపబడిన పుష్పకమును పంపివేసి సంతోషముతో అశోకవనములో ప్రవేశించెను. 1

మూ. చన్దనాగురుచూతైశ్చ తుఙ్గకాలేయకైరపి,
దేవదారువనైశ్చాపి సమన్తాదుపశోభితామ్. 2

ప్ర. అ. చన్దనాగురుచూతైః చ = చందన-అగురు-చూతవృక్షములచేతను, తుఙ్గకాలేయకైః అపి= పునాగవృక్షములచేతను, రక్తచందనవృక్షములచేతను, దేవదారువనైః చ అపి= దేవదారువృక్షములచేతను, సమన్తాత్ = చుట్టూ, ఉప శోభితామ్= ప్రకాశింపచేయబడిన (అశోకవనమును ప్రవేశించెను).

తా. ఆ అశోకవనము చుట్టూ చందన-అగురు-చూత-పునాగ-రక్తచందన దేవదారు వృక్షములు ఉండి దాని శోభను ఇనుమడింపచేయుచుండెను. 2

మూ. చమ్పకాశోకపుంనాగ మధూకపనసాసనైః,
శోభితాం పారిజాతైశ్చ విధూమజ్వలనప్రభైః. 3

ప్ర. అ. చమ్పకాశోక పుంనాగ మధూకపనసాసనైః=చంపక (సంపంగి) అశోక-పుంనాగ-మధూక (ఇప్ప)-పనస-అసనవృక్షములచేతను, విధూమజ్వలన ప్రభైః = ధూమము లేని అగ్ని వంటి కాంతి గల, పారిజాతైః చ = పారిజాత వృక్షములచేతను, శోభితామ్ = ప్రకాశింపచేయబడిన (అశోకవనమును ప్రవేశించెను.)

తా. ఆ అశోకవనమును చంపక-అశోక-పుంనాగ- మధూక-పనస- అసన వృక్షములు, ధూమము లేని అగ్ని వంటి కాంతి గల పారిజాతవృక్షములు ప్రకాశ వంతము చేయుచుండెను. 3

మూ. లోధ్రనీపార్జునైర్నాగైః సప్తపర్ణాతిముక్తకైః,
మన్దారకదలీగుల్మలతాజాలసమాకులామ్. 4

ప్ర. అ. లోధ్రనీపార్జునైః = లోధ్ర-నీప-అర్జున (మద్ది) వృక్షములతోను, నాగైః = నాగవృక్షములతోను, సప్తపర్ణాతిముక్తకైః = ఏడాకుల అరటిచెట్లతోను, బండిగురివెంద పొదలతోను, మన్దారకదలీగుల్మలతాజాలసమాకులామ్ = మందార వృక్షములతోను, అరటి తోపులతోను, లతలతోను వ్యాకులమైన (అశోకవనమును ప్రవేశించెను).

తా. ఆ అశోకవనము లోధ్ర-నీప-అర్జున వృక్షములతోను, నాగవృక్షముల తోను, ఏడాకుల అరటిచెట్లతోను, బండిగురివెంద తీగలతోను, మందారవృక్షముల తోను, అరటి తోపులతోను, తీగల తోను వ్యాకులమై ఉండెను. 4

మూ. ప్రియఙ్గుభిః కదమ్బైశ్చ తథా చ వకులైరపి,
జమ్బూభిర్దాడిమైశ్చైవ కోవిదారైశ్చ శోభితామ్. 5

ప్ర. అ. ప్రియఙ్గుభిః = ప్రియంగువులచేత, కదమ్బైః చ = కదంబ వృక్షములచేత, తథా చ = మరియు, వకులైః అపి = వకులవృక్షములచేతను, జమ్బూభిః=నేరేడుచెట్లచేత, దాడిమైః చ ఏవ=దాడిమవృక్షములచేత, కోవిదారైః చ ఏవ = కోవిదారవృక్షములచేత, శోభితామ్ = ప్రకాశింపచేయబడిన (అశోకవని కను ప్రవేశించెను).

తా. ఆ అశోకవనము ప్రియంగు-కదంబ-వకుల-జంబూ-కోవిదార వృక్షములతో శోభించుచుండెను. 5

మూ. సర్వదాకుసుమై రమ్యైః ఫలవద్భిర్మనోరమైః,
దివ్యగన్ధరసోపేతై స్తరుణాఙ్కురపల్లవైః. 6

ప్ర. అ. సర్వదాకుసుమైః = ఎల్లప్పుడూ పుష్పములు గల, రమ్యైః = సుందరములైన, ఫలవద్భిః = ఫలములు గల, మనోరమైః = మనోహరములైన, దివ్యగన్ధరసోపేతైః = దివ్యములైన గంధరసములతో కూడిన, తరుణాఙ్కురపల్లవైః = లేత అంకురములు, చిగుళ్ళు గల (వృక్షములతో ప్రకాశించుచున్న....)

తా. ఆ అశోకవనములోని వృక్షములు ఎల్లప్పుడు పుష్పములతో, ఫలములతో నిండి మనోహరములై ఉండెను. దివ్యమైన రసము, గంధమూ గల అవి లేత అంకురములతోను, చిగుళ్ళతోను నిండి ఉండెను. 6

మూ. తథైవ తరుభిర్దివ్యైః శిల్పిభిః పరికల్పితైః,
చారుపల్లవపుష్పాఢ్యైర్మత్తభ్రమరసంకులైః.

ప్ర. అ. తథా ఏవ = మరియు, శిల్పిభిః = శిల్పులచేత, పరికల్పితైః = చక్కగా ఏర్పరుపబడిన, చారుపల్లవపుష్పాఢ్యైః = అందమైన చిగుళ్ళతోను పుష్పములతోను నిండిన, మత్తభ్రమరసంకులైః = మదించిన తుమ్మెదలతో వ్యాకులములైన, దివ్యైః = దివ్యములైన, తరుభిః = వృక్షములచేత (ప్రకాశింపచేయబడిన....)

తా. అక్కడ ఉన్న దివ్యములైన చెట్లను శిల్పులు (ఉద్యానసంరక్షకులు) చూచుటకు అందముగా ఉండునట్లు కొమ్మలు మొదలైనవి కత్తిరించి ఏర్పరిచిరి. అవి అందమైన చిగుళ్ళతోను, పుష్పములతోను నిండి మదించిన తుమ్మెదలతో వ్యాకులములై ఉండెను. 7

మూ. కోకిలై ర్భృఙ్గరాజైశ్చ నానావర్ణైశ్చ పక్షిభిః,
శోభితాం శతశశ్చిత్రాం చూతవృక్షావతంసకైః. 8

ప్ర. అ. కోకిలైః = కోకిలలచేత, భృఙ్గరాజైః చ = శ్రేష్ఠములైన తుమ్మెదలచేత, నానావర్ణైః = అనేకవర్ణములు గల, పక్షిభిః చ = పక్షులచేతను, శోభితామ్

= ప్రకాశింపచేయబడినది, శతశః = వందలకొలది, చూతవృక్షావతంసకైః = చూతవృక్షముల శిరోభూషణములైన పూవుల గుత్తులచేత, చిత్రామ్ = చిత్రవర్ణమూ (అయిన అశోకవనికను ...)

తా. ఆ అశోకవనము కోకిలలతోను, శ్రేష్ఠములైన తుమ్మెదలతోను, అనేక వర్ణములు గల పక్షులతోను, శోభించుచుండెను. వందలకొలది చూతవృక్షములు అగ్రభాగములందున్న పూలగుత్తులతో చిత్రవర్ణముగా ఉండెను. 8

మూ. శాతకుమ్భనిభాః కేచిత్కేచిదగ్నిశిఖోపమాః,
నీలాఞ్జననిభాశ్చాన్యే భాన్తి తత్ర స్మ పాదపాః. 9

ప్ర. అ. తత్ర = అక్కడ, కేచిత్ = కొన్ని, పాదపాః = వృక్షములు, శాతకుమ్భనిభాః = బంగారముతో సమానములుగాను, కేచిత్ = కొన్ని, అగ్నిశిఖోపమాః = అగ్నిజ్వాలలతో సమానములుగాను, అన్యే = మరికొన్ని, నీలాఞ్జననిభాః = నల్లని కాటుకతో సమానముగాను, భాన్తి స్మ = ప్రకాశించుచుండెను.

తా. అక్కడ కొన్ని చెట్లు బంగారముతో సమానముగాను, మరికొన్ని అగ్నిజ్వాలలతో సమానములుగాను, ఇంకను కొన్ని నల్లని కాటుకతో సమానముగాను ప్రకాశించుచుండెను. 9

మూ. సురభీణి చ పుష్పాణి మాల్యాని వివిధాని చ,
దీర్ఘికా వివిధాకారాః పూర్ణాః పరమవారిణా. 10

ప్ర. అ. పుష్పాణి = పుష్పములు, వివిధాని = అనేకవిధములైన, మాల్యాని = మాలలు, సురభీణి = పరిమళించుచున్నవి. వివిధాకారాః = అనేకవిధములైన ఆకారములు గల. దీర్ఘికాః = దిగుడుబావులు, పరమవారిణా = శ్రేష్ఠమైన ఉదకముతో, పూర్ణాః = నిండినవి.

తా. అక్కడ పరిమళించుచున్న పుష్పములు, అనేకవిధములైన మాలికలు, మంచి ఉదకముతో నిండిన, అనేక ఆకారములు గల దిగుడుబావులూ ఉన్నవి.

మూ. మాణిక్యకృతసోపానాః స్ఫాటికాన్తరకుట్టిమాః,
ఫుల్లపద్మోత్పలవనాశ్చక్రవాకోపశోభితాః, 11

దాత్యూహశుకసంఘుష్టా హంససారసనాదితాః,
తరుభిః పుష్పశబలైస్తీరజైరుపశోభితాః, 12
ప్రాకారైర్వివిధాకారైః శోభితాశ్చ శిలాతలైః.

ప్ర. అ. మాణిక్యకృతసోపానాః = మాణిక్యములతో నిర్మింపబడిన మెట్లు గల, స్ఫాటికాన్తరకుట్టిమాః = స్ఫటికమాణిక్యవికారమైన లోపలి చపటాలు గల, ఫుల్లపద్మోత్పలవనాః = వికసించిన పద్మవనములు, ఉత్పలవనములూ గల, చక్రవాకోపశోభితాః = చక్రవాకపక్షులచేత అలంకరింపబడిన, దాత్యూహశుకసంఘుష్టాః = నీటికాకులచేతను, చిలుకలచేతను ధ్వనింపచేయబడిన, హంససారసనాదితాః = హంసలచేతను సారసపక్షులచేతను ధ్వనింపచేయబడిన, పుష్పశబలైః = పువ్వులతో విచిత్రవర్ణములుగా ఉన్న, తీరజైః = తీరమునందు మొలచిన, తరుభిః = వృక్షములచేత, ఉపశోభితాః = శోభింపచేయబడిన, వివిధాకారైః = అనేక విధములైన ఆకారములు గల, ప్రాకారైః = ప్రాకారములచేతను, శిలాతలైః = శిలాఫలకములచేతను, శోభితాః చ = శోభింపచేయబడిన (దిగుడుబావు లున్నవి).

తా. ఆ దిగుడుబావుల మెట్లు మాణిక్యములతో నిర్మించిరి. వాటి మధ్య ఉన్న చపటాలు స్ఫటికమాణిక్యములతో నిర్మించిరి. వికసించిన పద్మముల సముదాయము, కలవలు, చక్రవాకపక్షులు వాటిని శోభింపచేయుచుండెను. అవి నీటికాకులు, చిలుకలు, హంసలు, సారసపక్షులు చేయు ధ్వనులతో మారుమ్రోగుచుండెను. తీరములమీద ఉన్న, పువ్వులతో విచిత్రవర్ణములైన వృక్షములు వాటి శోభను పెంచుచుండెను. వాటికి అనేక ఆకారములలో ప్రాకారములు, చుట్టూ శిలాఫలకములు ఉండెను. 11,12

మూ. తత్రైవ చ వనోద్దేశే వైదూర్యమణిసంనిభైః, 13
శాద్వలైః పరమోపేతాం పుష్పితద్రుమకాననామ్.

ప్ర. అ. తత్ర = ఆ, వనోద్దేశే ఏవ = వనప్రాంతమునందే, వైదూర్యమణిసంనిభైః = వైదూర్యమాణిక్యతుల్యములైన, శాద్వలైః = పచ్చికబీడులతో, పరమోపేతామ్ = అధికముగా కూడిన, పుష్పితద్రుమకాననామ్ = పుష్పించిన వృక్షములు గల వనములుగలది అయిన (అశోకవనిని ప్రవేశించెను.)

తా. అక్కడ అశోకవనసమీపమునందు వైదూర్య మణుల వంటి పచ్చిక

వీడులు ఉండెను. సమీపమునందున్న వనములు పుష్పించిన వృక్షములతో నిండి యుండెను. 13

మూ. తత్ర సంఘర్షజాతానాం వృక్షాణాం పుష్పశాలినామ్, 14
ప్రస్తరాః పుష్పశబలా నభస్తారాగణైరివ.

ప్ర. అ. తత్ర = అక్కడ, ప్రస్తరాః = శిలాఫలకములు, సంఘర్షజాతానామ్ = పోటీపడి పుట్టిన, పుష్పశాలినామ్ = పుష్పములతో ప్రకాశించుచున్న, వృక్షాణామ్=వృక్షములయొక్క, పుష్పశబలాః=పుష్పములచేత విచిత్రవర్ణములై, తారాగణైః = నక్షత్రములగణములచేత, నభః ఇవ = ఆకాశము వలె ఉండెను.

తా. అక్కడ పోటీ పడి పెరుగుచున్నవా అన్నట్లు పెద్దవిగా పెరిగిన, పుష్పములతో నిండిన వృక్షముల పుష్పములు రాలి విచిత్రవర్ణములుగా ఉన్న శిలాఫలకములు నక్షత్రగణములతో కూడిన ఆకాశము వలె ఉండెను. 14

మూ. నన్దనం హి యథేన్ద్రస్య బ్రాహ్మం చైత్రరథం యథా, 15
తథాభూతం హి రామస్య కాననం సన్నివేశనమ్.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, సన్నివేశనమ్ = చక్కని ఏర్పాట్లు గల, కాననమ్ = ఉద్యానము, ఇన్ద్రస్య=ఇంద్రునియొక్క, నన్దనమ్=నందనము, యథా = ఎట్లో, బ్రాహ్మమ్=బ్రహ్మనిర్మితమైన, చైత్రరథమ్ = చైత్రరథ మను ఉద్యానము, యథా = ఎట్లో, తథాభూతం హి = ఆ విధముగా ఉన్నది కదా?

తా. చక్కగా ఏర్పరుపబడిన ఆ రాముని ఉద్యానము ఇంద్రుని నందనోద్యానము వలె, బ్రహ్మ నిర్మించిన చైత్రరథోద్యానము వలె ఉండెను. 15

మూ. బహ్వాసనగృహోపేతాం లతాసనసమావృతామ్, 16
అశోకవనికాం స్ఫీతాం ప్రవిశ్య రఘునన్దనః.
ఆసనే తు శుభాకారే పుష్పప్రకరభూషితే, 17
కుథాస్తరణసంస్తీర్ణే రామః సంనిషసాద హ.

ప్ర అ. రఘునన్దనః = రఘువంశరాజులను ఆనందింపచేయు, రామః = రాముడు, బహ్వాసనగృహోపేతామ్ = అనేకములైన ఆసనములు గల గృహము

లతో కూడిన, లతాసనసమావృతామ్=లతాగృహములతో వ్యాప్తమైన, స్ఫీతామ్= విశాలమైన, అశోకవనికామ్=అశోకవనమును, ప్రవిశ్య = ప్రవేశించి, శుభాకారే= శుభమైన ఆకారము గల, పుష్పప్రకరభూషితే=పుష్పసముదాయముచేత అలంకరించబడిన, కుథాస్తరణసంస్తీర్ణే = తివాచీచేత పరవబడిన, ఆసనే=ఆసనముమీద, సంనిషసాద = కూర్చుండెను.

తా. రఘువంశీయులకు ఆనందమును చేయు రాముడు అనేకవిధములైన ఆసనములున్న గృహములూ, అక్కడక్కడ లతాగృహములూ ఉన్న విశాలమైన ఆ అశోకవనములో ప్రవేశించి తివాచీ పరచిన, పుష్పసముదాయముచేత అలంకృతమైన, అందమైన ఆకారము గల ఆసనముమీద కూర్చుండెను. 16,17

మూ. సీతామాదాయ హస్తేన మధు మైరేయకం శుచి, 18
పాయయామాస కాకుత్స్థః శచీమివ పురన్దరః.

ప్ర. అ. కాకుత్స్థః= రాముడు, శుచి = పరిశుద్ధమైన, మైరేయకమ్ = పెద్దఉసిరి బెల్లము మొదలైనవాటితో తయారుచేయబడిన, మధు = మధువును, హస్తేన = హస్తముచేత, ఆదాయ = గ్రహించి, పురన్దరః = దేవేంద్రుడు, శచీమివ = శచీదేవిని వలె, సీతామ్ = సీతను, పాయయామాస = త్రాగించెను.

తా॥ రాముడు పరిశుద్ధమైన మైరేయక మను మద్యమును చేతితో తీసికుని, ఇంద్రుడు శచీదేవికి త్రాగించినట్లు సీతకు త్రాగించెను. 18

మూ. మాంసాని చ సుమృష్టాని ఫలాని వివిధాని చ, 19
రామస్యాభ్యవహారార్థం కింకరాస్తూర్ణమాహరన్.

ప్ర. అ. కింకరాః = కింకరులు, సుమృష్టాని = బాగా శుద్ధిచేయబడిన, మాంసాని = మాంసములను, వివిధాని = అనేకవిధములైన, ఫలాని చ = ఫలములను, రామస్య = రాముని యొక్క, అభ్యవహారార్థమ్ = తినుటకొరకు, తూర్ణమ్= శీఘ్రముగా, ఆహరన్ = తీసికొనివచ్చిరి.

తా. రాముడు భుజించుటకై కింకరులు బాగా శుద్ధి చేసిన మాంసములను, అనేకవిధములైన ఫలములను శీఘ్రముగా తీసికొని వచ్చిరి. 19

మూ. ఉపానృత్యంశ్చ రాజానం నృత్యగీతవిశారదాః, 20
అప్సరోరగసంఘాశ్చ కింనరీపరివారితాః.

ప్ర. అ. నృత్యగీతవిశారదాః = నృత్యమునందు సంగీతమునందు నేర్పు గల, కింనరీపరివారితాః = కింనరస్త్రీలచేత చుట్టబడిన, అపరోప్సరగసంఘాః చ = అప్సరఃస్త్రీల, ఉరగుల సంఘములు, రాజానమ్ = ఆ రాజును, ఉపానృత్యన్ = సమీపమునందు నృత్యము చేసిరి.

తా. కింనరస్త్రీలతో కూడిన, నృత్యసంగీతములయందు నేర్పు గల అప్సరః స్త్రీలు, ఉరగస్త్రీలు రాముని దగ్గర నృత్యములు చేసిరి. 20

మూ. దక్షిణా రూపవత్యశ్చ స్త్రియః పానవశం గతాః, 21
ఉపానృత్యన్త కాకుత్థ్సం నృత్యగీతవిశారదాః.

ప్ర. అ. దక్షిణాః = నేర్పుగలవారు, రూపవత్యః చ = రూపవతులు, పానవశమ్ = పానమునకు వశమును, గతాః = పొందిన, నృత్యగీతవిశారదాః = నృత్యగీతములయందు నేర్పు గల, స్త్రియః = స్త్రీలు, కాకుత్థ్సమ్ ఉపానృత్యన్త = రాముని దగ్గర నృత్యములు చేసిరి.

తా. మంచి నేర్పు గల, సౌందర్యవతులైన, నృత్యగీతములలో ప్రావీణ్యము గల, స్త్రీలు పానమునకు వశలై రాముని దగ్గర నృత్యము చేసిరి. 21

మూ. మనోభిరామా రామాస్తా రామో రమయతాం వరః. 22
రమయామాస ధర్మాత్మా నిత్యం పరమభూషితాః.

ప్ర. అ. రమయతామ్ = ఆనందింపచేయువారిలో, వరః = శ్రేష్ఠుడు, ధర్మాత్మా = ధర్మాత్ముడు అయిన, రామః = రాముడు, మనోభిరామాః = మనస్సుకు ఆనందము కలిగించు, పరమభూషితాః = బాగా అలంకరించబడిన, తాః రామాః = ఆ స్త్రీలను, నిత్యమ్ = నిత్యమూ, రమయామాస = క్రీడింపచేసెను.

తా. ఆనందింపచేయువారిలో శ్రేష్ఠుడూ, ధర్మాత్ముడూ అయిన రాముడు మనస్సు ఆకర్షించు, బాగా అలంకరించుకొనిన ఆ స్త్రీలను నిత్యము క్రీడింప చేసెను.

వి. ఈశ్లోకం ప్రాచ్యప్రతిలో లేదు. 22

మూ. స తయా సీతయా సార్ధమాసీనో విరరాజ హ, 23
అరున్ధత్యా ఇవాసీనో వసిష్ఠ ఇవ తేజసా.

ప. అ. తయా = ఆ, సీతయా సార్ధమ్ = సీతతో కూడ, ఆసీనః = కూర్చున్న, సః = ఆ రాముడు, అరున్ధత్యా సహ = అరుంధతితో కూడ, ఆసీనః = కూర్చున్న, వసిష్ఠః ఇవ = వసిష్ఠుడు వలె, తేజసా = తేజస్సుతో, విరరాజ హ = ప్రకాశించెను.

తా. ఆ సీతతో కూడ కూర్చున్న రాముడు, తేజస్సుచేత, అరుంధతితో కూర్చున్న వసిష్ఠుడు వలె ప్రకాశించెను. 23

మూ. ఏవం రామో ముదా యుక్తః సీతాం సురసుతోపమామ్,
రమయామాస వైదేహీమహన్యహని దేవవత్.

ప్ర. అ. రామః = రాముడు, ముదా = సంతోషముతో, యుక్తః = కూడినవాడై, సురసుతోపమామ్ = దేవతాకన్యతో సమానురాలైన, వైదేహీమ్ = విదేహరాజకుమారియైన, సీతామ్ = సీతను, దేవవత్ = దేవతాపురుషుడు వలె, అహన్యహని = ప్రతిదినమునందు, రమయామాస = క్రీడింపచేసెను.

తా. రాముడు ఈ విధముగా సంతోషముతో కూడినవాడై, దేవకన్యతో సమానురాలైన, విదేహరాజకన్య అయిన సీతను ప్రతిదినమునందు, దేవతాపురుషుడు వలె ఆనందింపచేసెను. 24

మూ. తథా తయోర్విహరతోః సీతారాఘవయోశ్చిరమ్, 25
అత్యక్రామచ్ఛుభః కాలః శైశిరో భోగదః సదా.

ప్ర. అ. తథా = అట్లు, చిరమ్ = చిరకాలము, విహరతోః = విహరించుచున్న, తయోః = ఆ, సీతారాఘవయోః = సీతారాములకు, సదా = ఎల్లప్పుడూ, భోగదః = భోగమును ఇచ్చు, శుభః = శుభమైన, శైశిరః కాలః = శిశిరర్తువుకు సంబంధించిన కాలము, అత్యక్రామత్ = గడచెను.

తా. సీతారాములు చిరకాలము ఈ విధముగా భోగములను అనుభవించుచుండగా ఎల్లప్పుడూ భోగమును అనుభవించుటకు అనువైన, రమ్యమైన శిశిరకాలము గడచెను. 25

మూ. దశ వర్షసహస్రాణి గతాని సుమహాత్మనోః, 26
ప్రాప్తయోర్వివిధాన్ భోగానతీతః శిశిరాగమః.

ప్ర. అ. సుమహాత్మనోః = చాల గొప్ప మనస్సులు గల వారిద్దరికీ, దశ వర్షసహస్రాణి = పది వేల సంవత్సరములు, గతాని = గడచినవి. వివిధాన్ = అనేకవిధములైన, భోగాన్ = భోగములను, ప్రాప్తయోః = పొందిన వారిద్దరికీ, శిశిరాగమః = శిశిరర్తువు, గతః = గడచినది.

తా. ఆ మహాత్ములిద్దరికీ పది వేల సంవత్సరములు గడచెను. వారిరువురూ, అనేకవిధములైన భోగములను అనుభవించుచుండగా శిశిరర్తువు గడచెను.

వి. పై రెండు శ్లోకాలకు బదులు ప్రాచ్యపాఠములో—

"తథా చ రమమాణస్య తస్యాథ శిశిరాగమః
వ్యతీతః పూరుషేన్ద్రస్య రాఘవస్య మహాత్మనః"

అను ఒక్క శ్లోకము మాత్రమే ఉన్నది. 26

మూ. పూర్వాహ్ణే ధర్మకార్యాణి కృత్వా ధర్మేణ ధర్మవిత్,
శేషం దివసభాగార్ధమన్తఃపురగతోఽనయత్. 27

ప్ర. అ. ధర్మవిత్=ధర్మవేత్త అయిన రాముడు, పూర్వాహ్ణే=పూర్వాహ్ణమునందు, ధర్మేణ=ధర్మముచేత, ధర్మకార్యాణి = ధర్మకార్యములను, కృత్వా= చేసి, శేషమ్ = మిగిలిన, దివసబాగార్ధమ్ = పగటిబాగములో సగమును, అన్తః పురగతః = అంతఃపురములో ఉన్నవాడుగా, అనయత్ = గడపెను.

తా. ధర్మము లన్నీ తెలిసిన రాముడు పూర్వాహ్ణమునందు ధర్మానుసారముగా చేయవలసిన ధర్మకార్యము లన్నీ పూర్తిచేసికొని అపరాహ్ణమును అంతఃపురములో గడుపుచుండెడివాడు. 27

మూ. సీతాపి దేవకార్యాణి కృత్వా పౌర్వాహ్ణికాని వై,
శ్వశ్రూణామకరోత్పూజాం సర్వాసామవిశేషతః. 28

ప్ర. అ. సీతాపి=సీత కూడ, పౌర్వాహ్ణికాని = పూర్వాహ్ణమునకు సంబంధించిన, దేవకార్యాణి = దేవకార్యములను, కృత్వా = చేసి, సర్వాసామ్ = సమస్తమైన, శ్వశ్రూణామ్ = అత్తగార్ల యొక్క, పూజామ్ = పూజను, అవిశేషతః = భేదము లేకుండా, అకరోత్ = చేసెను.

తా. సీత కూడ పూర్వాహ్ణమునందు చేయవలసిన దేవతాపూజాదులు చేసి కొని అందరు అత్తలకు, ఏమీ భేదభావము లేకుండా, సేవ చేసెడిది. 28

మూ. అభ్యాగచ్ఛత్తతో రామం విచిత్రాభరణామ్బరా,
త్రివిష్టపే సహస్రాక్షముపవిష్టం యథా శచీ. 29

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విచిత్రాభరణామ్బరా = విచిత్రములైన ఆభరణములు, వస్త్రములూ కలదై, త్రివిష్టపే = స్వర్గమునందు, ఉపవిష్టమ్ = కూర్చుని ఉన్న, సహస్రాక్షమ్ = ఇంద్రుణ్ణి, శచీ యథా = శచీదేవి వలె, రామమ్ = రాముణ్ణి, అభ్యాగచ్ఛత్ = సమీపించెడిది.

తా. పిమ్మట ఆమె విచిత్రములైన ఆభరణములు, వస్త్రములు ధరించి, స్వర్గములో కూర్చుని ఉన్న ఇంద్రుణ్ణి శచీదేవి సమీపించినట్లు రాముని దగ్గరకు వెళ్ళుచుండెడిది. 29

మూ. దృష్ట్వా తు రాఘవః పత్నీం కల్యాణేన సమన్వితామ్,
ప్రహర్షమతులం లేభే సాధు సాధ్వితి చాబ్రవీత్. 30

ప్ర. అ. రాఘవః = రాముడు. కల్యాణేన = మంగళకరమైన వేషముతో, సమన్వితామ్ = కూడిన, పత్నీమ్ = భార్యను, దృష్ట్వా = చూచి, అతులమ్ = సాటిలేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను. సాధు సాధు ఇతి = బాగు బాగు అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. మంగళకరమైన వేషము ధరించి వచ్చిన సీతను చూచి రాముడు చాల సంతోషించి "బాగు బాగు"అని అభినందించెను. 30

మూ. అబ్రవీచ్చ వరారోహాం సీతాం సురసుతోపమామ్,
అపత్యలాభో వైదేహి త్వయా మే సముపస్థితః. 31

ప్ర. అ. సురసుతోపమామ్ = దేవతాకన్యతో సమానురాలైన, వరారోహామ్ = శ్రేష్ఠమైన కటిప్రదేశము గల సీతామ్ = సీతను గూర్చి, అబ్రవీత్ చ = పలికెను కూడ; వైదేహి = సీతా! త్వయి = నీయందు, మే = నాకు, అపత్యలాభః = సంతాన లాభము, సముపస్థితః = సమీపించినది.

తా. దేవతాస్త్రీతో సమానురాలైన, ఉత్తమమైన కటిప్రదేశము గల సీతతో ఇట్లనెను-"ఓ ! సీతా ! నీవలన నాకు సంతానప్రాప్తి అచిరకాలములో కలుగ నున్నది." 31

మూ. కిమిచ్ఛసి వరారోహే కామః కః క్రియతాం తవ,
స్మితం కృత్వా తు వైదేహీ రామం వాక్యమథాబ్రవీత్. 32

ప్ర. అ. వరారోహే=శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా! కిమ్ = దేనిని, ఇచ్ఛసి = కోరుచున్నావు? తవ = నీకు, కః=ఏ, కామః = కోరిక, క్రియతామ్= చేయబడుగాక? అథ = అటుపిమ్మట, వైదేహీ = సీత, స్మితమ్ = చిరునవ్వును, కృత్వా = చేసి, రామమ్ = రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా. ఓ! సీతా! నీకు ఏమి కోరిక ఉన్నది. నేను నీ ఏ కోరిక తీర్చవలెను?" అప్పుడు సీత చిరునవ్వు నవ్వి రామునితో ఇట్లు పలికెను. 32

మూ. తపోవనాని పుణ్యాని ద్రష్టుమిచ్ఛామి రాఘవ,
గఙ్గాతీరోపవిష్టానామృషీణాముగ్రతేజసామ్, 33
ఫలమూలాశినాం దేవ పాదమూలేషు వర్తితుమ్.

ప్ర. అ. రాఘవ = రామా! పుణ్యాని = పవిత్రములైన, తపోవనాని = తపోవనములను, ద్రష్టుమ్=చూచుటకు, గఙ్గాతీరోపవిష్టానామ్=గంగాతీరమునందు కూర్చుని ఉన్న, ఉగ్రతేజసామ్ = ఉగ్రమైన తేజస్సు గల, ఫలమూలాశినామ్ = ఫలమూలములను భక్షించు, ఋషీణామ్=ఋషులయొక్క, పాదమూలేషు = పాద మూలములయందు, వర్తితుమ్ = ఉండుటకూ, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. రామా! పవిత్రములైన తపోవనములు చూడవలె ననీ, గంగాతీరము నందు నివసించువారు, ఫలమూలములను మాత్రమే భక్షించువారు, ఉగ్రమైన తేజస్సు కలవారూ అయిన ఋషుల పాదాల దగ్గర ఉండవలె ననీ నాకు కోరిక ఉన్నది. 33

మూ. ఏష మే పరమః కామో యన్మూలఫలభోజినామ్, 34
అప్యేకరాత్రిం కాకుత్స్థ నివసేయం తపోవనే.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! ఏషః = ఇది, మే = నాయొక్క, పరమః=

గొప్ప, కామః = కోరిక, యత్ = ఏమనగా, ఏకరాత్రిమ్ = ఒక్క రాత్రి అయినా, మూలఫలభోజినామ్ = మూలఫలములను భుజించు మునులయొక్క, తపోవనే = తపోవనమునందు, వసేయమ్ = నివసింతును.

తా. రామా ! మూలఫలములు భుజించు మునీశ్వరుల ఆశ్రమమునందు ఒక్క రాత్రి అయినా నివసించవలెను అనేదే నా కోరిక. 34

మూ. తథేతి చ ప్రతిజ్ఞాతం రామేణాక్లిష్టకర్మణా, 35
విశ్రబ్ధా భవ వైదేహి శ్వో గమిష్యస్యసంశయమ్.

ప్ర. అ. వైదేహి = సీతా, తథా = అట్లే; అసంశయమ్ = నిఃసంశయముగా, శ్వః = రేపు, గమిష్యసి = వెళ్ళగలవు. విశ్రబ్ధా = నమ్మకము కలదానవు, భవ = అగుము; ఇతి = అని, అక్లిష్టకర్మణా = క్లేశములు లేకుండ కర్మలు చేయు, రామేణ = రామునిచేత, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినది.

తా. "సీతా! అట్లే, రేపు తప్పక వెళ్లెదవు. నమ్మకముతో ఉండుము"అని క్లేశము లేకుండ పనులు చేయు రాముడు మాట ఇచ్చెను. 35

మూ. ఏవముక్త్వా తు కాకుత్స్థో మైథిలీం జనకాత్మజామ్,
మధ్యకక్షాన్తరం రామో నిర్జగామ సుహృద్వృతః. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థః = కకుత్స్థవంశసంజాతుడైన, రామః = రాముడు, జనకాత్మజామ్ = జనకుని కుమార్తెయైన, మైథిలీమ్ = సీతను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సుహృద్వృతః = స్నేహితులతో కూడినవాడై, మధ్యకక్షాన్తరమ్ = మధ్యనున్న మరొక కక్ష(హాలు)ను గూర్చి, నిర్జగామ = బయలుదేరి వెళ్లెను.

తా. రాముడు సీతతో ఇట్లు పలికి స్నేహితులతో కలిసి ప్రాసాదమధ్యమునం దున్న మరొక కక్షకు వెళ్లెను. 36

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో నలబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిచత్వారింశః సర్గః

[భద్రుడు సీతను గూర్చిన లోకాపవాదమును రామునకు తెలుపుట].

మూ. తత్రోపవిష్టం రాజానముపాసన్తే విచక్షణాః,
కథానాం బహురూపాణాం హాస్యకారాః సమన్తతః. 1

ప్ర. అ. తత్ర = అక్కడ, ఉపవిష్టమ్ = కూర్చుని ఉన్న, రాజానమ్ = రాజును, బహురూపాణామ్ = అనేకవిధములైన, కథానామ్ = కథలకు (లో), విచక్షణాః = నేర్పు గల, హాస్యకారాః = హాస్యము చేయువాళ్ళు, సమన్తతః = చుట్టూ, ఉపాసన్తే = సేవించుచున్నారు.

తా. రాజు అక్కడ కూర్చుని ఉండగా అనేకవిధాలైన కథలలో నేర్పరులైన హాస్యము కలుగునట్లు మాట్లాడేవాళ్ళు అతని చుట్టూ కూర్చుండి సేవించుచుండిరి. 1

మూ. విజయో మధుమత్తశ్చ కాశ్యపో మఙ్గలః కులః,
సురాజిః కాలియో భద్రో దన్తవక్త్రః సుమాగధః. 2

ఏతే కథా బహువిధాః పరిహాససమన్వితాః,
కథయన్తి స్మ సంహృష్టా రాఘవస్య మహాత్మనః. 3

ప్ర. అ. విజయః = విజయుడు, మధుమత్తః చ = మధుమత్తుడు, కాశ్యపః = కాశ్యపుడు, మఙ్గలః = మంగలుడు, కులః = కులుడు, సురాజిః = సురాజి, కాలియః = కాలియుడు, దన్తవక్త్రః = దంతవక్త్రుడు, సుమాగధః = సుమాగధుడు, ఏతే = వీరు, పరిహాససమన్వితాః = పరిహాసముతో కూడిన, బహువిధాః = అనేకవిధములైన, కథాః = కథలను, మహాత్మనః = మహాత్ముడైన, రాఘవస్య = రామునకు, సంహృష్టాః = సంతోషించుచు, కథయన్తి స్మ = చెప్పుచుండిరి.

తా. విజయుడు, మధుమత్తుడు, కాశ్యపుడు, మంగలుడు, కులుడు, సురాజి,

కాలియుడు, భద్రుడు, దంతవక్త్రుడు, సుమాగధుడు, వీరందరూ మంచి ఉత్సాహముతో మహాత్ముడైన రామునితో పరిహాసపూర్వకములైన మాటలు చెప్పుచుండిరి.

మూ. తతః కథాయాం కస్యాం చిద్రాఘవః సమభాషత,
కాః కథా నగరే భద్ర వర్తన్తే విషయేషు చ. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కస్యాం చిత్ = ఒకానొక, కథాయామ్ = కథయందు, రాఘవః = రాముడు, సమభాషత = పలికెను. భద్ర = భద్రుడా! నగరే = నగరమునందు, విషయేషు చ = దేశములయందు, కాః కథాః = ఏ కథలు (ఎట్టి సంభాషణలు-కబుర్లు), వర్తన్తే = జరుగుచున్నవి.

తా. అపుడు మాటల సందర్భములో రాముడు ఇట్లు అడిగెను-"భద్రుడా! నగరములోను, దేశములోను ప్రజలు ఏమేమి చెప్పుకొనుచున్నారు?" 4

మూ. మమాశ్రితాని కాన్యాహుః పౌరజానపదా జనాః,
కిం చ సీతాం సమాశ్రిత్య భరతం కిం చ లక్ష్మణమ్. 5

ప్ర. అ. పౌరజానపదాః = పురములకు, గ్రామాలకు సంబంధించిన, జనాః = జనులు, మమ = నాకు, ఆశ్రితాని = సంబంధించిన, కాని = వేటిని, ఆహుః = చెప్పుకొనుచున్నారు? సీతామ్ = సీతను, సమాశ్రిత్య = సంబంధించి, కిం చ = ఏమి చెప్పుకొనుచున్నారు? భరతమ్ = భరతుణ్ణి, లక్ష్మణం చ = లక్షణుణ్ణి గూర్చి, కిమ్ = ఏమి చెప్పుకొనుచున్నారు?

తా. పురములలోను, గ్రామాలలోను నివసించు జనులు నన్ను గూర్చి, సీతను గూర్చి, భరతుణ్ణి గూర్చి, లక్ష్మణుణ్ణి గూర్చి ఏమి చెప్పుకొనుచున్నారు?

మూ. కిం ను శత్రుఘ్నముద్దిశ్య కైకేయీం కిం ను మాతరమ్,
వక్తవ్యతాం చ రాజానో నవే రాజ్యే ప్రజన్తి హి. 6

ప్ర. అ. శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి, ఉద్దిశ్య = గూర్చి, కిం ను = ఏమి చెప్పుకొనుచున్నారు? మాతరమ్ = తల్లియైన, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, కిం ను = ఏమి చెప్పుకొనుచున్నారు? రాజ్యే = రాజ్యము, నవే = క్రొత్తది అగుచుండగా, రాజానః = రాజులు, వక్తవ్యతామ్ = ఏమేమో చెప్పుకొనదగియుండుటను, ప్రజన్తి హి = పొందుదురు కదా?

తా. శత్రుఘ్నుణ్ణి గూర్చి, మా తల్లి కైకేయిని గూర్చి ఏమి చెప్పుకొను చున్నారు? రాజ్యానికి క్రొత్తగా వచ్చిన రాజును గూర్చి ప్రజలు ఏమెమో చెప్పు కొనుచుందురు కదా?

వి. ఉత్తరార్ధము ప్రాచ్యప్రతిలో లేదు. 6

మూ. ఏవముక్తే తు రామేణ భద్రః ప్రాఞ్జలిరబ్రవీత్,
శుభాశుభాః కథా రాజన్ వర్తన్తే పురవాసినామ్. 7

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = పలకబడినదగు చుండగా, భద్రః = భద్రుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, అబ్రవీత్ = పలికెను, రాజన్ = రాజా! పురవాసినామ్ = పౌరులయొక్క, శుభాశుభాః = శుభ ములు, అశుభములూ అయిన, కథాః = కథలు, వర్తన్తే = జరుగుచున్నవి.

తా. రాముని మాటలు విని భద్రుడు నమస్కరించి ఇట్లు చెప్పెను. రాజా! పౌరులు మంచిగాను చెడ్డగాను కూడ చెప్పుకొనుచున్నారు.

వి. స్థితాః శుభాః అను దాక్షిణాత్యపాఠానికి బదులు "శుభాశుభాః" ప్రాచ్య పాఠము గ్రహింపబడినది.

మూ. అయం తు విజయః సౌమ్య దశగ్రీవవధార్జితః,
భూయిష్ఠం స్వపురే పౌరైః కథ్యతే పురుషర్షభ. 8

ప్ర. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! సౌమ్య = సౌమ్యుడా! దశగ్రీవవధార్జితః = రావణుని వధద్వారా సంపాదించబడిన, అయం విజయః తు = ఈ విజయమైతే, స్వపురే = మన పట్టణములో, పౌరైః = పౌరులచేత, భూయిష్ఠమ్ = అధికముగా, కథ్యతే = చెప్పబడుచున్నది.

తా. సౌమ్యుడవు, పురుషశ్రేష్ఠుడవూ అయిన ఓ! రాజా! మన పురము లోని ప్రజలు రావణుని వధకు సంబంధించిన ఈ విజయమును గూర్చి ఎక్కువగా మాటలాడుకొనుచున్నారు. 8

మూ. ఏవముక్తస్తు భద్రేణ రాఘవో వాక్యమబ్రవీత్,
కథయస్వ యథాతత్త్వం సర్వం నిరవశేషతః. 9

ప్ర. అ. భద్రేణ = భద్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, రాఘవః = రాముడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. యథాతత్త్వమ్ = యథార్థముగా, సర్వమ్ = సమస్తమునూ, నిరవశేషతః = శేషము లేకుండగా, కథయస్వ = చెప్పుము.

తా. భద్రుని మాటలు విని రాము డిట్లు పలికెను-"ఉన్నది ఉన్నట్లుగా పూర్తిగా, అంతా చెప్పుము".

మూ. శుభాశుభాని వాక్యాని కాన్యాహుః పురవాసినః,
శ్రుత్వేదానీం శుభం కుర్యాం న కుర్యామశుభాని చ. 10

ప్ర. అ. పురవాసినః = పురమునందు నివసించువారు, కాని = ఏ, శుభాశుభాని = శుభాశుభములైన, వాక్యాని = వాక్యములను, ఆహుః = పలుకుచున్నారు? ఇదానీమ్ = ఇప్పుడు, శ్రుత్వా = విని, శుభమ్ = శుభమును, కుర్యామ్ = చేయుదును. అశుభాని = అశుభములను, న కుర్యాం చ = చేయను.

తా. పురమునందు నివసించువారు మంచిగాను, చెడ్డగాను ఏమి చెప్పుకొనుచున్నారు? వారు చెప్పుకొనేది విని నేనిపుడు మంచి కార్యములనే చేయుటకు, చెడ్డపనులు చేయకుండుటకు వీలుకలుగును. 10

మూ. కథయస్వ చ విస్రబ్ధో నిర్భయం విగతజ్వరః,
కథయన్తి యథా పౌరాః పురే జనపదేషు చ. 11

ప్ర. అ. పురే=పట్టణమునందు, జనపదేషు చ=గ్రామములయందు, పౌరాః = పౌరులు, యథా = ఎట్లు, కథయన్తి = చెప్పుకొనుచున్నారో, విస్రబ్ధః = విశ్వాసము కలవాడవై, నిర్భయమ్ = నిర్భయముగా, విగతజ్వరః = పోయిన మనోవ్యథ కలవాడవై, కథయస్వ = చెప్పుము.

తా. పట్టణములలోను, గ్రామాలలోను ఉన్న జనులు ఏమి చెప్పుకొనుచున్నారో నీవు విశ్వాసముతో నిర్భయముగా, ఏ మాత్రమూ సంకోచము లేకుండా చెప్పుము. 11

మూ. రాఘవేణైవముక్తస్తు భద్రః సురుచిరం వచః,
ప్రత్యువాచ మహాబాహుం ప్రాఞ్జలిః సుసమాహితః. 12

ప్ర. అ రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, సురుచిరమ్ = చాల మంచి, వచః = వచనమును, ఉక్తః = పలకబడిన, భద్రః = భద్రుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, సుసమాహితః = బాగా సావధానచిత్తుడై, మహా బాహుమ్ = గొప్ప బాహువులు గల రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రాముడీ విధముగా పలికిన ఆ మంచి మాటలు విని భద్రుడు అంజలి ఘటించి, సావధానచిత్తుడై ఆ మహాబాహువైన రామునితో ఇట్లు చెప్పెను. 12

మూ. శృణు రాజన్యథా పౌరాః కథయన్తి శుభాశుభామ్,
చత్వరాపణరథ్యాసు వనేషూపవనేషు చ. 13

ప్ర. అ. రాజన్ = రాజా! పౌరాః = పౌరులు, చత్వరాపణరథ్యాసు = నాలుగు వీథుల మొగలయందు, బజారులలోను, వీథులలోను, వనేషు = వనములలోను, ఉప వనేషు చ = ఉద్యానములలోను, యథా = ఎట్లు, శుభాశుభమ్ = మంచిగాను, చెడ్డగాను, కథయన్తి = చెప్పుకొనుచున్నారో, శృణు = వినుము

తా. రాజా! పౌరులు నాలుగు వీథుల మొగలలోను, వీథులలోను, వనముల లోను, ఉద్యానములలోను కలిసి మంచిగాను చెడ్డగాను ఏమి చెప్పుకొనుచున్నారో వినుము. 13

మూ. దుష్కరం కృతవాన్ రామః సముద్రే సేతుబన్ధనమ్,
అశ్రుతం పూర్వకైః కైశ్చిద్దేవైరపి సదానవైః. 14

ప్ర. అ. రామః = రాముడు, పూర్వకైః = పూర్వీకులైన, కైః చిత్ = ఎవరిచేతనూ, సదానవైః = దానవులతో కూడిన, దేవైః = దేవతలచేతనూ, అశ్రు తమ్ = వినబడని, దుష్కరమ్ = చేయ శక్యము కాని, సముద్రే = సముద్రము నందు, సేతుబన్ధనమ్ = సేతుబంధనమును, కృతవాన్ = చేసినాడు.

తా. రాముడు సముద్రముమీద ఎవ్వరూ చేయజాలని సేతుబంధనము చేసినాడు. ఇట్టి దానిని పూర్వీకు లెవ్వరూ గాని, దేవతలు గాని, దానవులు గాని విని ఉండరు 14

మూ. రావణశ్చ దురాధర్షో హతః సబలవాహనః,
వానరాశ్చ వశం నీతా ఋక్షాశ్చ సహ రాక్షసైః. 15

ప్ర. అ. దురాధర్షః = ఎదిరింప శక్యము కాని, సబలవాహనః = సైన్యవాహనములతో కూడిన, రావణః చ = రావణుడు కూడ, హతః = చంపబడినాడు, రాక్షసైః సహ=రాక్షసులతో కూడ, వానరాః చ=వానరులు, ఋక్షాశ్చ= భల్లూకములు, వశమ్ = వశమును, నీతాః = పొందించబడినారు.

తా. ఎదిరింప శక్యము కాని సేనావాహనసహితుడైన రావణుణ్ణి చంపినాడు. వానరులను, భల్లూకములను, రాక్షసులనూ కూడ వశము చేసికొనినాడు.

మూ. హత్వా చ రావణం సంఖ్యే సీతామాహృత్య రాఘవః,
అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ పునరానయత్. 16

ప్ర. అ. రాఘవః = రాముడు, సంఖ్యే = యుద్ధమునందు, రావణమ్ = రావణుణ్ణి, హత్వా = చంపి, సీతామ్ = సీతను, ఆహృత్య = తీసికొనివచ్చి, అమర్షమ్ = కోపమును, పృష్ఠతః = వెనుకకు, కృత్వా = చేసి, పునః = తిరిగి, స్వవేశ్మ = తన గృహమును, ఆనయత్ = పొందించెను.

తా. రాముడు యుద్ధమునందు రావణుణ్ణి చంపి, సీతను తీసికొని, రావణస్పర్శవలన కలిగిన కోపమును లెక్కచేయక (విడచి) ఆమెను మరల తన ఇంటికి చేర్చినాడు. 16

మూ. కీదృశం హృదయే తస్య సీతాసంగమజం సుఖమ్,
అఙ్కమారోప్య తు పురీం రావణేన బలాద్ధృతామ్. 17
లఙ్కామపి పురీం నీతామశోకవనికాం గతామ్,
రక్షసాం వశమాపన్నాం కథం రామో న కుత్సతే. 18

ప్ర. అ. తస్య = ఆ రామునియొక్క, హృదయే = హృదయమునందు, సీతాసంగమజమ్=సీతాసంగమమువలన కలిగిన, సుఖమ్=సుఖము, కీదృశమ్= ఎట్టిది ? పురా=పూర్వము, రావణేన=రావణునిచేత, బలాత్=బలాత్కారముగా, అఙ్కమ్ = ఒడిని, ఆరోప్య = అధిష్ఠింపచేసి, హృతామ్=హరింపబడిన, లఙ్కాం పురీమపి = లంకాపట్టణమును గూర్చి కూడ, నీతామ్ = తీసికొనివెళ్ళబడిన, అశోకవనికామ్ = అశోకవనమును, గతామ్ = పొందిన, రక్షసామ్ = రాక్షసుల యొక్క, వశమ్ = వశమును, ఆపన్నామ్ = పొందిన ఆ సీతను, రామః = రాముడు, కథమ్ = ఎట్లు, న కుత్సతే = ఏవగించుకొనుటలేదు ?

తా. ఆతని హృదయమునందు సీతాసమాగమమువలన ఏమి సుఖముకలుగునో! రావణుడు బలాత్కారముగా ఒడిలో కూర్చుండబెట్టుకొని హరించి, లంకకు తీసికొనిపోయి, అశోకవనమును చేర్చగా రాక్షసుల వశురాలైపోయిన ఆ సీతను గూర్చి రాముడు ఏవగించుకొనకుండగా ఎట్లుండకలుగుచున్నాడో! 17, 18

మూ. అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి,
యథా హి కురుతే రాజా ప్రజా తమనువర్తతే. 19

ప్ర. అ. అస్మాకమ్ = మనయొక్క, దారేష్వపి = భార్యల విషయమునందు కూడ, సహనీయమ్ = సహింపదగినది, భవిష్యతి = కాగలదు; రాజా = రాజు, యథా = ఎట్లు, కురుతే = చేయునో, ప్రజా = ప్రజ, తమ్ = వానిని, అనువర్తతే హి = అనుసరించునుకదా ?

తా. మన భార్యల విషయమునందు కూడ మనము సహించవలసి ఉండును. రాజు ఎట్లు చేయునో ప్రజలు కూడ అట్లే ఆతనిని అనుసరించి ప్రవర్తించుచుందురు కదా ? 19

మూ. ఏవం బహువిధా వాచో వదన్తి పురవాసినః,
నగరేషు చ సర్వేషు రాజన్ జనపదేషు చ. 20

ప్ర. అ. రాజన్ = రాజా ! సర్వేషు = సమస్తమైన, నగరేషు = నగరములయందు, జనపదేషు చ = గ్రామములయందు, పురవాసినః = పౌరులు, ఏవమ్ = ఈ విధముగా, బహువిధాః = అనేకవిధములైన, వాచః = వాక్కులను, వదన్తి = పలుకుచున్నారు.

తా. రాజా! అన్ని నగరాలలోను, గ్రామాలలోను పౌరులు ఈ విధముగా అనేకవిధములైన మాటలు చెప్పుకొనుచున్నారు. 20

మూ. తస్యైవం భాషితం శ్రుత్వా రాఘవః పరమార్తవత్,
ఉవాచ సుహృదః సర్వాన్ కథమేతద్వదన్తు మామ్. 21

ప్ర. అ. తస్య = వానియొక్క, ఏవమ్ = ఇట్లు, భాషితమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, రాఘవః = రాముడు, పరమార్తవత్ = చాల దుఃఖితుడై, సర్వాన్ =

సమస్తమైన, సుహృదః = స్నేహితులను గూర్చి, ఏతత్ = ఇది, కథమ్ = ఎట్లు ? మామ్ = నన్ను గూర్చి, వదన్తు = చెప్పెదరు గాక అని, ఉవాచ = పలికెను.

తా. రాముడు అతడు చెప్పిన మాటలు విని, చాల దుఃఖితుడై "ఇది ఎట్లు ? నాకు చెప్పుడు" అని అక్కడ నున్న మిత్రుల నందరినీ అడిగెను. 21

మూ. సర్వే తు శిరసా భూమావభివాద్య ప్రణమ్య చ,
ప్రత్యూచూ రాఘవం దీనమేవమేతన్న సంశయః. 22

ప్ర. అ. సర్వే తు = వాళ్ళందరూ అయితే, శిరసా = శిరస్సుచేత, భూమౌ = భూమిమీద, అభివాద్య = నమస్కరించి, ప్రణమ్య చ = వంగి, దీనమ్ = దీనుడైన, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ప్రత్యూచుః = తిరిగి పలికిరి. ఏతత్ = ఇది. ఏవమ్ = ఇట్లే, సంశయః = సంశయము, న = లేదు.

తా. వాళ్ళందరూ శిరస్సులతో భూమిని స్పృశించి నమస్కరించి, నమ్రులై "ఇతడు చెప్పినది నిజమే; అసత్యము కాదు"అని రామునికి బదులు చెప్పిరి. 22

మూ. శ్రుత్వా తు వాక్యం కాకుత్స్థః సర్వేషాం సముదీరితమ్,
విసర్జయామాస తదా వయస్యాన్ శత్రుసూదనః. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. శత్రుసూదనః = శత్రుసంహారకుడైన, కాకుత్స్థః = రాముడు, సముదీరితమ్ = పలకబడిన, సర్వేషామ్ = అందరియొక్క, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, వయస్యాన్ = స్నేహితులను, విసర్జయామాస = విడచెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు అప్పుడు వాళ్ళందరూ చెప్పిన మాటలు విని ఆ స్నేహితుల నందరినీ పంపివేసెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానములో ఉత్తరకాండలో
నలుబదిమూడవ సర్గ సమాప్తము.

కర్తా = కర్తయైన, భగవాన్ = భగవంతుడైన; వాల్మీకిః = వాల్మీకి, యజ్ఞసంవిధమ్ = యజ్ఞసమీపమును గూర్చి, సంప్రాప్తః = వచ్చినాడు.

తా. ఇట్లు ప్రశ్నించుచున్న రామునితో ఆ మునికుమారులు ఇట్లు పలికిరి. "ఈ కావ్యమును రచించిన భగవంతుడైన వాల్మీకి యజ్ఞసమీపమునకు వచ్చి ఉన్నాడు. 25

మూ. యేనేదం చరితం తుభ్యమశేషం సంప్రదర్శితమ్,
సంనిబద్ధం హి శ్లోకానాం చతుర్వింశత్సహస్రకమ్. 26

ప్ర. అ. యేన = ఏకావ్యముచేత, తుభ్యమ్ = నీయొక్క, అశేషమ్ = సమస్తమైన, చరితమ్ = చరితము, సంప్రదర్శితమ్ = చూపబడినదో ఆ కావ్యము, శ్లోకానామ్ = శ్లోకములయొక్క, చతుర్వింశత్సహస్రకమ్ = ఇరవైనాలుగు వేలుగా, సంనిబద్ధం హి = రచింపబడినది.

తా. నీ చరిత్రమును పూర్తిగా వర్ణించిన ఈ కావ్యము ఇరవైనాలుగు వేల శ్లోకాలలో రచింపబడినది. 26

మూ. ఉపాఖ్యానశతం చైవ భార్గవేణ తపస్వినా,
ఆదిప్రభృతి వై రాజన్ పఞ్చసర్గశతాని చ, 27
కాణ్డాని షట్ కృతానీహ సోత్తరాణి మహాత్మనా.

ప్ర. అ. రాజన్ = రాజా! ఉపాఖ్యానశతంచైవ = వందఉపాఖ్యానములు, ఆదిప్రభృతి = మొదటిది మొదలు, పఞ్చ = ఐదు, సర్గశతాని = సర్గల శతములు, సోత్తరాణి = ఉత్తరకాండతో కూడిన, షట్ = ఆరు, కాణ్డాని = కాండములు, ఇహ = దీనియందు, మహాత్మనా = మహాత్ముడైన, తపస్వినా = తపస్సుగల, భార్గవేణ = వాల్మీకిచేత, కృతాని = చేయబడినవి.

తా. రాజా! మహాత్ముడైన, తపఃశాలియైన వాల్మీకిమహాముని నూరు ఉపాఖ్యానములను, మొదటి సర్గ మొదలు ఐదువందల సర్గలను, ఉత్తరకాండతోకూడిన ఆరు కాండలను ఈ కావ్యములో రచించెను. 27

మూ. కృతాని గురుణాస్మాకమృషిణా చరితం తవ, 28
ప్రతిష్ఠా జీవితం యావత్తావత్సర్వస్య వర్తతే.

ప్ర. అ. ద్వాఃస్థః = ద్వారపాలకుడు, రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, మూర్ధ్ని = శిరస్సునందు, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, గృహమ్ = గృహమును గూర్చి, గత్వా = వెళ్ళి, అనివారితః = నివారించబడనివాడై, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ద్వారపాలకుడు రాముని మాటలు విని, శిరస్సుపై అంజలి ఘటించి నమస్కరించి లక్ష్మణుని ఇంటికి వెళ్ళి, ఎవ్వరిచేత అడ్డుకొనబడనివాడై లోనికి ప్రవేశించెను. 3

మూ. ఉవాచ సుమహాత్మానం వర్ధయిత్వా కృతాఞ్జలిః,
ద్రష్టుమిచ్ఛతి రాజా త్వాం గమ్యతాం తత్ర మా చిరమ్.

ప్ర. అ. మహాత్మానమ్ = మహాత్ముడైన లక్ష్మణుణ్ణి, వర్ధయిత్వా = వృద్ధిపొందించి (అభినందించి), కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, ఉవాచ = పలికెను. రాజా = రాజు, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. తత్ర = అక్కడికి, గమ్యతామ్ = వెళ్లెదవుగాక, చిరం మా = ఆలస్యము వద్దు.

తా. దోసిలి కట్టి ఆ మహాత్ముడైన లక్ష్మణుణ్ణి "జయ విజయీ భవ" అను మాటలచేత అభినందించి "రాజు నిన్ను చూడదలచుకున్నాడు. ఆలస్యము చేయక శీఘ్రముగా వెళ్లుము" అని చెప్పెను. 4

మూ. బాఢమిత్యేవ సౌమిత్రిః శ్రుత్వా రాఘవశాసనమ్,
ప్రాద్రవద్రథమారుహ్య రాఘవస్య నివేశనమ్. 5

ప్ర. అ. సౌమిత్రిః = లక్ష్మణుడు, రాఘవశాసనమ్ = రాముని ఆజ్ఞను, శ్రుత్వా = విని, బాఢమ్ ఇత్యేవ = తప్పక అని పలికి, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి, రాఘవస్య = రామునియొక్క, నివేశనమ్ = గృహమును గూర్చి, ప్రాద్రవత్ = శీఘ్రముగా వెళ్లెను.

తా. లక్ష్మణుడు రాముని ఆజ్ఞ విని "తప్పక అట్లే వెళ్ళెదను" అని పలికి రథ మెక్కి శీఘ్రముగా రాముని ఇంటికి వెళ్ళెను. 5

మూ. ప్రయాన్తం లక్ష్మణం దృష్ట్వా ద్వాఃస్థో భరతమన్తికాత్,
ఉవాచ భరతం తత్ర వర్ధయిత్వా కృతాఞ్జలిః. 6
వినయావనతో భూత్వా రాజా త్వాం ద్రష్టుమిచ్ఛతి

ప్ర. అ. ద్వాఃస్థః = ద్వారపాలకుడు, ప్రయాన్తమ్ = వెళ్ళుచున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, దృష్ట్వా = చూచి, భరతమ్ అన్తికాత్ = భరతుని దగ్గరకు వెళ్ళి, తత్ర = అక్కడ, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, భరతమ్ = భరతుణ్ణి, వర్ధయిత్వా = అభినందించి, వినయావనతః = వినయముతో వంగినవాడు, భూత్వా = అయి, రాజా = రాజు, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు అని, ఉవాచ = పలికెను.

తా. ఆ ద్వారపాలకుడు, లక్ష్మణుడు వెళ్ళుచున్నట్లు చూచి, భరతుని వద్దకు వెళ్ళి, అంజలి ఘటించి అభినందించి, వినయముతో నమ్రుడై - "రాజు నిన్ను చూడ గోరుచున్నాడు"అని చెప్పెను. 6

మూ. భరతస్తు వచః శ్రుత్వా ద్వాఃస్థాద్రామసమీరితమ్, 7
ఉత్పపాతాసనాత్తూర్ణం పద్భ్యామేవ యయౌ బలీ.

ప్ర. అ. బలీ = బలశాలియైన, భరతః తు = భరతుడైతే, ద్వాఃస్థాత్ = ద్వారపాలకునినుండి, రామసమీరితమ్ = రామునిచేత పలకబడిన, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆసనాత్ = ఆసనమునుండి, ఉత్పపాత = ఎగిరి లేచెను, పద్భ్యామ్ ఏవ = పాదములచేతనే, యయౌ = వెళ్లెను.

తా. బలవంతుడైన భరతుడు ద్వారపాలకుడు చెప్పిన రాముని ఆజ్ఞను విని వెంటనే ఆసనమునుండి లేచి కాలినడకనే వెళ్లెను. 7

మూ. దృష్ట్వా ప్రయాన్తం భరతం త్వరమాణః కృతాఞ్జలిః, 8
శత్రుఘ్నభవనం గత్వా తతో వాక్యమువాచ హ.

ప్ర. అ. భరతమ్ = భరతుణ్ణి, ప్రయాన్తమ్ = వెళ్ళుచున్నవానినిగా, దృష్ట్వా = చూచి, త్వరమాణః = తొందరపడుచు, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, తతః = అటుపిమ్మట, శత్రుఘ్నభవనమ్ = శత్రుఘ్నుని గృహమును గూర్చి, గత్వా = వెళ్ళి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. భరతుడు వెళ్ళుచున్నట్లు చూచి ద్వారపాలకుడు తొందరపడుచు శత్రుఘ్నుని గృహమునకు వెళ్ళి అంజలి ఘటించి నమస్కరించి ఇట్లు పలికెను.

మూ. ఏహ్యాగచ్ఛ రఘుశ్రేష్ఠ రాజా త్వాం ద్రష్టుమిచ్ఛతి, 9
గతో హి లక్ష్మణః పూర్వం భరతశ్చ మహాయశాః.

ప్ర. అ. రఘుశ్రేష్ఠ = రఘువంశరాజులలో శ్రేష్ఠుడా! ఏహి = రమ్ము, ఆగచ్ఛ = రమ్ము. రాజా = రాజు, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. లక్ష్మణః = లక్ష్మణుడు, పూర్వమ్ = ముందుగా, గతః హి = వెళ్ళినాడు కదా. మహాయశాః = గొప్ప కీర్తి గల, భరతః చ = భరతుడు కూడ వెళ్ళినాడు.

తా. ఓ! రఘుశ్రేష్ఠా! రమ్ము రమ్ము. రాజు నిన్ను చూడవలెనని అనుకొనుచున్నాడు. లక్ష్మణుడు, గొప్ప కీర్తి గల భరతుడు ముందుగానే వెళ్ళినారు.

మూ. శ్రుత్వా తు వచనం తస్య శత్రుఘ్నః పరమాసనాత్,
శిరసా వన్ద్య ధరణీం ప్రయయౌ యత్ర రాఘవః.

ప్ర. అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తస్య = వానియొక్క, వచనమ్ = మాటను, శ్రుత్వా = విని, పరమాసనాత్ = శ్రేష్ఠమైన ఆసనమునుండి, ధరణీమ్ = భూమిని పొంది, శిరసా = శిరస్సుచేత, వన్ద్య = నమస్కరించి, రాఘవః = రాముడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో అక్కడికి, ప్రయయౌ = వెళ్లెను.

తా. శత్రుఘ్నుడు అతని మాటలు విని, శ్రేష్ఠమైన ఆసనమునుండి నేల మీదికి, రాముడున్న వైపుకు నమస్కరించి రాముని దగ్గరకు వెళ్ళెను. 10

మూ. ద్వాఃస్థస్త్వాగత్య రామాయ సర్వానేవ కృతాఞ్జలిః, 11
నివేదయామాస తదా భ్రాతౄన్ స్వాన్ సముపస్థితాన్.

ప్ర. అ. ద్వాఃస్థః తు = ద్వారపాలకుడైతే, ఆగత్య = వచ్చి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, తదా = అప్పుడు, రామాయ = రామునకు, స్వాన్ = తనసంబంధమైన, సర్వానేవ = సమస్తమైన, భ్రాతౄన్ = సోదరులను, ఉపస్థితాన్ = వచ్చినవారినిగా, నివేదయామాస = తెలిపెను.

తా. అప్పుడు ద్వారపాలకుడు వచ్చి, చేతులు జోడించి నమస్కరించి సోదరు లందరూ వచ్చినట్లు రామునకు తెలిపెను. 11

మూ. కుమారానాగతాన్ శ్రుత్వా చిన్తావ్యాకులితేన్ద్రియః, 12
అవాఙ్ముఖో దీనమనా ద్వాఃస్థం వచనమబ్రవీత్.

ప్ర. అ. కుమారాన్ = రాజకుమారులను, ఆగతాన్ = వచ్చినవారినిగా, శ్రుత్వా = విని, చిన్తావ్యాకులితేన్ద్రియః = చింతచేత వ్యాకులముగా చేయబడిన ఇంద్రియములు కలవాడై, అవాఙ్ముఖః = క్రిందికి వంచబడిన ముఖము గలవాడై, దీనమనాః = దీనమైన మనస్సు గలవాడై, ద్వాఃస్థమ్ = ద్వారపాలకుణ్ణి గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. సోదరులు వచ్చినట్లు విని రాముడు చింతచేత వ్యాకులములైన ఇంద్రియములు కలవాడై, తల క్రిందికి వంచి, దీనమైన మనస్సుతో, ద్వారపాలకునితో ఇట్లు పలికెను. 12

మూ. ప్రవేశయ కుమారాంస్త్వం మత్సమీపం త్వరాన్వితః, 13
ఏతేషు జీవితం మహ్యమేతే ప్రాణాః ప్రియా మమ.

ప్ర. అ. త్వమ్ = నీవు, కుమారాన్ = సోదరులను, త్వరాన్వితః = తొందరతో కూడినవాడవై, మత్సమీపమ్ = నా సమీపమును, ప్రవేశయ = ప్రవేశపెట్టుము. మహ్యమ్ = నాకొరకు, జీవితమ్ = జీవితము, ఏతేషు = వీళ్ళయందే ఏతే = వీళ్ళు, మమ = నాకు, ప్రియాః = ఇష్టమైన, ప్రాణాః = ప్రాణములు.

తా. నీవు వెంటనే సోదరులను నా దగ్గరకు తీసికొని రమ్ము. నా జీవితము వీళ్ళమీద ఆధారపడి ఉన్నది. వీళ్లే నా ప్రియమైన ప్రాణములు. 13

మూ. ఆజ్ఞప్తాస్తు నరేన్ద్రేణ కుమారాః శుక్రతేజసః, 14
ప్రహ్వాః ప్రాఞ్జలయో భూత్వా వివిశుస్తే సమాహితాః.

ప్ర. అ. నరేన్ద్రేణ = రాజుచేత, ఆజ్ఞప్తాః = ఆజ్ఞాపించబడిన, శుక్రతేజసః = శుక్రుని వంటి తేజస్సు గల, తే = ఆ, కుమారాః = రాజకుమారులు,

ప్రహ్వాః = వంగినవారై, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్ళు గలవారు, భూత్వా = అయి, సమాహితాః = సావధానచిత్తులై, వివిశుః = ప్రవేశించిరి.

తా. రాజు ఆజ్ఞ పొంది శుక్రునివంటి తేజస్సు గల ఆ రాజకుమారులు నమ్రులై, అంజలులు ఘటించి, సావధానచిత్తులై లోపల ప్రవేశించిరి. 14

మూ. తే తు దృష్ట్వా ముఖం తస్య సగ్రహం శశినం యథా, 15
సంధ్యాగతమివాదిత్యం ప్రభయా పరివర్జితమ్,
బాష్పపూర్ణే చ నయనే దృష్ట్వా రామస్య ధీమతః 16
హతశోభం యథా పద్మం ముఖం వీక్ష్య చ తస్య తే
తతోఽభివాద్య త్వరితాః పాదౌ రామస్య మూర్ధభిః 17
తస్థుః సమాహితాః సర్వే రామస్త్వశ్రూణ్యవర్తయత్.

ప్ర. అ. తే తు = వారైతే, ధీమతః = బుద్ధిమంతుడైన, తస్య రామస్య = ఆ రామునియొక్క, సగ్రహమ్ = గ్రహముతో కూడిన, శశినం యథా = చంద్రుడు వలె ఉన్న, సంధ్యాగతమ్ = సంధ్యాసమయమునందున్న, ఆదిత్యమ్ ఇవ = సూర్యుడు వలె, ప్రభయా = కాంతితో, పరివర్జితమ్ = శూన్యమైన, ముఖమ్ = ముఖమును, దృష్ట్వా = చూచి, బాష్పపూర్ణే = కన్నీళ్ళతో నిండిన, నయనే = నేత్రములను, దృష్ట్వా = చూచి, హతశోభమ్ = తొలగింప చేయబడిన శోభ గల, పద్మం యథా = పద్మము వలె ఉన్న, తస్య = ఆతనియొక్క, ముఖమ్ = ముఖమును, వీక్ష్య = చూచి, తతః = అటుపిమ్మట, త్వరితాః = తొందరపడుచున్న వారై, రామస్య = రామునియొక్క, పాదౌ = పాదములను, మూర్ధభిః = శిరస్సులతో, అభివాద్య = నమస్కరించి, తే సర్వే = వాళ్ళందరూ, సమాహితాః = సావధానచిత్తులై, తస్థుః = నిలచిరి. రామః తు = రాముడు, అశ్రూణి = కన్నీళ్ళను, అవర్తయత్ = ప్రవర్తింపచేసెను.

తా. ఆ సమయమునందు బుద్ధిమంతుడైన ఆ రాముని ముఖము రాహువు ఆక్రమించిన చంద్రబింబము వలె, సంధ్యాసమయమునందలి సూర్యబింబము వలె, శోభావిహీనమైన పద్మము వలె, కాంతి లేక ఉండెను. నేత్రములు కన్నీళ్లతో నిండి ఉండెను. ఆ లక్ష్మణాదులు ఇట్టి స్థితిలో ఉన్న రాముణ్ణి చూచి తొందరగా వెళ్ళి శిరస్సులతో పాదాభివందనము చేసి, సావధానచిత్తులై నిలబడిరి. రాముడు కన్నీళ్ళు కార్చెను. 15-17

మూ. తాన్ పరిష్వజ్య బాహుభ్యాముత్థాప్య చ మహాబలః, 18
ఆసనేష్వాసతేత్యుక్త్వా తతో వాక్యం జగాద హ.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల రాముడు, తాన్ = వాళ్ళను, ఉత్థాప్య = లేవదీసి, బాహుభ్యామ్ = బాహువులచేత, పరిష్వజ్య = కౌగలించుకొని, ఆసనేషు = ఆసనములమీద, ఆసత = కూర్చొనుడు, ఇతి = అని, ఉక్త్వా = పలికి, తతః = అటుపిమ్మట, వాక్యమ్ = వాక్యమును, జగాద హ = పలికెను.

తా. గొప్ప బలము గల రాముడు వాళ్ళను లేవదీసి, బాహువులతో కౌగలించుకొని, ఆసనములమీద కూర్చొనుడు అని చెప్పి తరవాత ఇట్లు పలికెను.

మూ. భవన్తో మమ సర్వస్వం భవన్తో మమ జీవితమ్, 19
భవద్భిశ్చ కృతం రాజ్యం పాలయామి నరేశ్వరాః.

ప్ర. అ. నరేశ్వరాః = నరుల ప్రభువులారా! భవన్తః = మీరు, మమ = నాయొక్క, సర్వస్వమ్ = సర్వస్వము. భవన్తః = మీరు, మమ = నాయొక్క, జీవితమ్ = జీవితము, భవద్భిః = మీచేత, కృతమ్ = చేయబడిన, రాజ్యమ్ = రాజ్యమును, పాలయామి = పాలించుచున్నాను.

తా. ఓ! రాజులారా! మీరే నా సర్వస్వము. మీరే నా జీవితము. రక్షణాదుల ద్వారా మీరు సంపాదించి ఇచ్చిన రాజ్యమునే నేను పాలించుచున్నాను.

మూ. భవన్తః కృతశాస్త్రార్థా బుద్ధ్యా చ పరినిష్ఠితాః, 20
సంభూయ చ మదర్థోఽయ మన్వేష్టవ్యో నరేశ్వరాః.

ప్ర. అ. నరేశ్వరాః = రాజులారా! భవన్తః = మీరు, కృతశాస్త్రార్థాః = చేయబడిన శాస్త్రార్థములు కలవారు, బుద్ధ్యా = బుద్ధితో, పరినిష్ఠితాః చ = స్థిరమైనవారు (కూడినవారు). అయమ్ = ఈ, మదర్థః = నా కార్యము, సంభూయ = కలసి, అన్వేష్టవ్యః = అన్వేషించదగినది.

తా. ఓ! రాజులారా! మీరు శాస్త్రవిషయములు తెలిసినవారు, మంచి బుద్ధి గలవారు, మీరందరూ కలిసి నా కార్యమును నిర్ణయించవలెను. 20

మూ. తథా వదతి కాకుత్స్థే అవధానపరాయణాః. 21
ఉద్విగ్నమనసః సర్వే కిం ను రాజాభిధాస్యతి.

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, తథా = అట్లు, వదతి = పలుకుచుండగా, అవధానపరాయణాః = ఆలోచనాపరాయణులై, సర్వే = వారందరూ, రాజా = రాజు, కిమ్ = ఏమి, అభిధాస్యతి ను = చెప్పునో అని, ఉద్విగ్నమనసః = దిగులు చెందిన వారైరి.

తా. రాముడు ఆ విధముగా మాటలాడుచుండగా లక్ష్మణభరతశత్రుఘ్నులు ఆలోచనలో మునిగి "రాజు ఇప్పుడు ఏమి చెప్పనున్నాడో కదా!" అని మనస్సులో దిగులు చెందిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో నలభైనాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చచత్వారింశః సర్గః

[సీత విషయమున వచ్చిన లోకాపవాదమును గూర్చి సోదరులకు తెలిపి రాముడు సీతను అరణ్యములో విడిచి రమ్మని లక్ష్మణుని ఆదేశించుట.]

మూ. తేషాం సముపవిష్టానాం సర్వేషాం దీనచేతసామ్,
ఉవాచ వాక్యం కాకుత్స్థో ముఖేన పరిశుష్యతా. 1

ప్ర. అ. దీనచేతసామ్ = దీనమైన మనస్సు గల, తేషాం సర్వేషామ్ = వారందరూ, సముపవిష్టానామ్ = కూర్చున్నవారగుచుండగా, కాకుత్స్థః = రాముడు, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మనస్సులలో దైన్యము వహించి లక్ష్మణాదులు కూర్చున్న పిమ్మట రాముడు వాడిపోయిన ముఖముతో ఇట్లు పలికెను. 1

మూ. సర్వే శృణుత భద్రం వో మా కురుధ్వం మనోఽన్యథా,
పౌరాణాం మమ సీతాయాం యాదృశీ వర్తతే కథా. 2

ప్ర. అ. మమ = నా విషయమునందు, సీతాయామ్ = సీతయందు, పౌరాణామ్ = పౌరులయొక్క, కథా = చెప్పుకొనుట, యాదృశీ = ఏ విధముగా ఉన్నదో, సర్వే = మీరందరూ, శృణుత = వినండి. వః = మీకు, భద్రమ్ = మంగళ మగుగాక. మనః = మనస్సును, అన్యథా = మరొక విధముగా, మా కురుధ్వమ్ = చేయకుడు.

తా. మీకందరికీ క్షేమ మగుగాక. నా విషయమునందు, సీత విషయమునందు పౌరులు ఏమి చెప్పుకొనుచున్నారో వినండి. నా అభిప్రాయమునకు విరుద్ధముగా ఆలోచించకండి. 2

మూ. పౌరాపవాదః సుమహాంస్తథా జనపదస్య చ,
వర్తతే మయి బీభత్సా సా మే మర్మాణి కృన్తతి. 3

ప్ర. అ. సుమహాన్ = చాల గొప్పదైన, పౌరాపవాదః = పౌరుల అపవాదము, తథా = మరియు, జనపదస్య చ = గ్రామములయొక్క అపవాదము వచ్చినది. మయి = నా విషయమునందు, బీభత్సా = నింద, వర్తతే = ప్రవర్తించుచున్నది. సా = అది, మే = నాయొక్క, మర్మాణి = మర్మస్థానములను, కృన్తతి = ఛేదించుచున్నది.

తా. పౌరులలోను, జానపదులలోను చాల గొప్ప అపవాదు బయలుదేరినది. నా విషయమున నింద ప్రచారములో ఉన్నది. అది నా మర్మస్థానములను ఛేదించివేయుచున్నది. 3

మూ. అహం కిల కులే జాత ఇక్ష్వాకూణాం మహాత్మనామ్,
సీతాపి సత్కులే జాతా జనకానాం మహాత్మనామ్. 4

ప్ర. అ. అహమ్ = నేను, మహాత్మనామ్ = మహాత్ములైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశ రాజుల, కులే = కులమునందు, జాతః కిల = పుట్టితిని కదా. సీతాపి = సీతకూడ, మహాత్మనామ్ = మహాత్ములైన, జనకానామ్ = జనకరాజుల, సత్కులే = సత్కులమునందు, జాతా = పుట్టినది.

తా. నేను మహాత్ములైన ఇక్ష్వాకువంశీయుల కులములో పుట్టినాను కదా? సీత కూడ మహాత్ములైన జనకరాజుల వంశములో పుట్టినది. 4

మూ. జానాసి త్వం యథా సౌమ్య దణ్డకే విజనే వనే,
రావణేన హృతా సీతా స చ విధ్వంసితో మయా. 5

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! విజనే = జనశూన్యమైన, దణ్డకే వనే = దండకావనమునందు, సీతా = సీత, రావణేన = రావణునిచేత, యథా = ఎట్లు, హృతా = హరించ బడినదో, సః చ = అతడు, మయా = నాచేత, విధ్వంసితః = నశింపచేయబడినాడో, త్వమ్ = నీవు, జానాసి = ఎరుగుదువు కదా!

తా. సౌమ్యుడవైన లక్ష్మణా! నిర్జనమైన దండకారణ్యమునుండి రావణుడు

సీతను ఎట్లు హరించినాడో, నేను ఆతనిని ఎట్లు నశింపచేసినానో నీకు తెలియును కదా? 5

మూ. తత్ర మే బుద్ధి రుత్పన్నా జనకస్య సుతాం ప్రతి,
అత్రోషితామిమాం సీతామానయేయం కథం పురీమ్. 6

ప్ర. అ. తత్ర = అక్కడ, మే = నాకు. జనకస్య సుతాం ప్రతి = సీతను గూర్చి, బుద్ధిః = బుద్ధి, ఉత్పన్నా = పుట్టినది. అత్ర = ఇక్కడ, ఉషితామ్ = ఉన్న, ఇమామ్ = ఈ, సీతామ్ = సీతను, పురీమ్ = పట్టణమును గూర్చి, కథమ్ = ఎట్లు, నయేయమ్ = తీసికొనివెళ్ళుదును.

తా. "ఈ లంకా పట్టణములో ఉన్న సీతను అయోధ్యకు ఎలా తీసికొని వెళ్ళగలను" అని నాకు ఆ సమయమునందు సీత విషయమున ఆలోచన కలిగినది. 6

మూ. ప్రత్యయార్థం తతః సీతా వివేశ జ్వలనం తదా,
ప్రత్యక్షం తవ సౌమిత్రే దేవానాం హవ్యవాహనః. 7
అపాపాం మైథిలీం ప్రాహ వాయుశ్చాకాశగోచరః.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! తతః = అటు పిమ్మట, సీతా = సీత, తదా = అప్పుడు, ప్రత్యయార్థమ్ = నమ్మకముకొరకు, తవ ప్రత్యక్షమ్ = నీ ఎదురుగానే, జ్వలనమ్ = అగ్నిని, వివేశ = ప్రవేశించినది. దేవానామ్ = దేవతలలో, హవ్యవాహనః = అగ్ని, మైథిలీమ్ = సీతను, అపాపామ్ = పాపము లేని దానినిగా, ప్రాహ = చెప్పినాడు. ఆకాశగోచరః = ఆకాశమునందు సంచరించు, వాయుశ్చ = వాయువు కూడ చెప్పినాడు.

తా. లక్ష్మణా! అప్పుడు సీత నమ్మకము కలిగించుటకొరకు నీ ఎదుటనే అగ్నిలో ప్రవేశించినది కదా? దేవతలలో అగ్ని దేవుడూ, ఆకాశములో సంచరించే వాయువు కూడ ఆమె పాప రహితురా లని చెప్పినారు కదా? 7

మూ. చన్ద్రాదిత్యౌ చ శంసేతే సురాణాం సంనిధౌ పురా, 8
ఋషీణాం చైవ సర్వేషామపాపాం జనకాత్మజామ్.

ప్ర. అ. పురా = పూర్వము, సురాణామ్ = దేవతలయొక్క, సర్వేషామ్ =

సమస్తమైన, ఋషీణాం చైవ = ఋషులయొక్క, సంనిధౌ = సంనిధియందు, చన్ద్రాదిత్యౌ = చంద్రసూర్యులు కూడ, జనకాత్మజామ్ = సీతను, అపాపామ్ = పాపములేనిదానినిగ, శంసేతే = చెప్పినారు.

తా. పూర్వము దేవతల సంనిధిలోను, అందరు ఋషీశ్వరుల సంనిధిలోను సూర్యచంద్రులు కూడ సీత పాపము లేనిది అని చెప్పినారు కదా ? 8

మూ. ఏవం శుద్ధసమాచారా దేవగన్ధర్వసంనిధౌ, 9
లఙ్కాద్వీపే మహేన్ద్రేణ మమ హస్తే నివేశితా.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, శుద్ధసమాచారా = పరిశుద్ధమైన ప్రవర్తన గల సీత, లఙ్కాద్వీపే = లంకద్వీపమునందు, మహేన్ద్రేణ = మహేంద్రునిచేత, మమ = నాయొక్క, హస్తే = హస్తమునందు, నివేశితా = ఉంచబడినది.

తా. ఈ విధముగ పరిశుద్ధమైన చరిత్ర గల సీతను, దేవతల, గంధర్వుల సంనిధిలో దేవేంద్రుడు నా చేతిలో ఉంచినాడు. 9

మూ. అన్తరాత్మా చ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్, 10
తతో గృహీత్వా వైదేహీమయోధ్యామహమాగతః.

ప్ర. అ. యశస్వినీమ్ = కీర్తి గల, సీతామ్ = సీతను, శుద్ధామ్ = పరిశుద్ధురాలినిగా, మే = నాయొక్క, అన్తరాత్మా చ = అంతరాత్మ కూడ, వేత్తి = తెలిసికొని ఉన్నది. తతః = ఆ కారణము వలన, వైదేహీమ్ = సీతను, గృహీత్వా = తీసికొని, అహమ్ = నేను, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ఆగతః = వచ్చినాను.

తా. కీర్తిమంతురాలైన సీత పరిశుద్ధురాలని నా అంతరాత్మకు కూడా తెలియును. అందువలననే నేను సీతను తీసికొని అయోధ్యకు వచ్చినాను. 10

మూ. అయం తు మే మహాన్వాదః శోకశ్చ హృది వర్తతే, 11
పౌరాపవాదః సుమహాంస్తథా జనపదస్య చ.

ప్ర. అ. "(అయం మహానధర్మో మే'' అను ప్రాచ్యపాఠము బాగున్నది). అయమ్ = ఈ, మహాన్ = గొప్ప, అధర్మః = అధర్మము, శోకః చ = శోకము,

మే = నా యొక్క, హృది = హృదయమునందు, వర్తతే = ఉన్నది. సుమహాన్ = చాల గొప్పదైన, పౌరాపవాదః = పౌరుల అపవాదము, తథా = మరియు, జనపదస్య చ = గ్రామముయొక్క అపవాదము కూడ ఉన్నది.

తా. నా హృదయములో ఈ గొప్ప అధర్మచింతా, శోకము కూడ ఉన్నవి. చాల గొప్పదైన పౌరుల అపవాదము, గ్రామప్రజల అపవాదము వచ్చినవి. 11

మూ. అకీర్తిర్యస్య గీయేత లోకే భూతస్య కస్యచిత్, 12
పతత్యేవాధమాన్ లోకాన్యావచ్ఛబ్దః ప్రకీర్త్యతే.

ప్ర. అ. యస్య కస్య చిత్ = ఏ ఒక్క, భూతస్య = నరునియొక్క, అకీర్తిః = అపకీర్తి, లోకే = లోకమునందు, గీయతే = గానము చేయబడునో, అతడు, శబ్దః = ఆ చెడ్డమాట, యావత్ = ఎంతవరకు, ప్రకీర్త్యతే=చెప్పబడునో అంతవరకు, అధమాన్ = అధమములైన, లోకాన్ = లోకములను గూర్చి, పతతి ఏవ = పడును.

తా. ఈ లోకములో ఎవని అపకీర్తి వ్యాపించి ఉండునో అతడు ఆ చెడ్డ మాట వ్యాప్తిలో ఉన్నంతవరకు నరకములో పడి ఉండును. 12

మూ. అకీర్తిర్నిన్ద్యతే దేవైః కీర్తిర్లోకేషు పూజ్యతే, 13
కీర్త్యర్థం తు సమారమ్భః సర్వేషాం సుమహాత్మనామ్.

ప్ర. అ. అకీర్తిః = అపకీర్తి, దేవైః = దేవతలచేత, నిన్ద్యతే=నిందింపబడును. కీర్తిః = కీర్తి, లోకేషు = లోకములందు, పూజ్యతే = పూజింపబడును. సర్వేషామ్ = సమస్తమైన, సుమహాత్మనామ్ = మహాత్ములయొక్క, సమారమ్భః = ప్రయత్నము, కీర్త్యర్థం తు = కీర్తికొరకు.

తా. అపకీర్తిని దేవతలు నిందింతురు. కీర్తిని లోకములో అందరూ పూజింతురు. మహాత్ములందరూ చేయు ప్రయత్నము కీర్తికొరకే. 13

మూ. అప్యహం జీవితం జహ్యాం యుష్మాన్వా పురుషర్షభాః, 14
అపవాదభయాద్భీతః కిం పునర్జనకాత్మజామ్.

ప్ర. అ. పురుషర్షభాః = పురుషశ్రేష్ఠులారా! అపవాదభయాత్ = అపవాద భయమునుండి, భీతః = భయపడిన, అహమ్ = నేను, జీవితమ్ = జీవితమును కాని, యుష్మాన్ వా = మిమ్ములను కాని, జహ్యామ్ = విడతును. జనకాత్మజామ్ = సీతను, కిం పునః = చెప్పనేల ?

తా. పురుషశ్రేష్ఠులారా! అపవాదుకు భయపడిన నేను నా జీవితమునైనా, మిమ్ములనైనా కూడా విడిచివేసెదను. సీత మాట చెప్పవలెనా ? 14

మూ. తస్మాద్భవన్తః పశ్యన్తు పతితం శోకసాగరే, 15
న హి పశ్యామ్యహం భూతం కించిద్దుఃఖమతోఽధికమ్.

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, భవన్తః = మీరు, శోకసాగరే = శోకసముద్రమునందు, పతితమ్ = పడిన నన్ను, పశ్యన్తు = చూచెదరుగాక. అహమ్ = నేను, అతః = దీనికంటె, అధికమ్ = అధికమైన, భూతమ్ = సంభవించిన, దుఃఖమ్ = దుఃఖమును, కించిత్ = దేనినీ, న పశ్యామి హి = చూడను కదా ?

తా. ఈ విధముగా నేను ఎట్లు శోకసముద్రములో పడినానో చూడుడు. ఇంతకంటె అధికమైన దుఃఖమేదీ వచ్చినట్లు నాకు కనబడుటలేదు. 15

మూ. శ్వస్త్వం ప్రభాతే సౌమిత్రే సుమన్త్రాధిష్ఠితం రథమ్, 16
ఆరుహ్య సీతామారోప్య విషయాన్తే సముత్సృజ.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! త్వమ్ = నీవు, శ్వః ప్రభాతే = రేపు ఉదయమునందు, సుమన్త్రాధిష్ఠితమ్ = సుమంత్రునిచేత అధిష్ఠింపబడిన, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి, సీతామ్ = సీతను, ఆరోప్య = ఎక్కించి, విషయాన్తే = దేశము చివర, సముత్సృజ = విడిచిపెట్టుము.

తా. లక్ష్మణా! రేపు ప్రాతఃకాలమునందు నీవు సుమంత్రుడు నడుపు రథము నెక్కి, సీతను ఎక్కించి ఆమెను దేశము చివర విడువుము. 16

మూ. గఙ్గాయాస్తు పరే పారే వాల్మీకేస్తు మహాత్మనః, 17
ఆశ్రమో దివ్యసంకాశ స్తమసాతీరమాశ్రితః.

తత్రైతాం విజనే దేశే విసృజ్య రఘునన్దన, 18
శీఘ్రమాగచ్ఛ భద్రం తే కురుష్వ వచనం మమ.

ప్ర. అ. రఘునన్దన=లక్ష్మణా! గఙ్గాయాః=గంగయొక్క, పరే పారే= అవతలి ఒడ్డున, మహాత్మనః=మహాత్ముడైన, వాల్మీకేః = వాల్మీకియొక్క, దివ్య సంకాశః = దివ్యమైన ఆశ్రమముతో సమానమైన, ఆశ్రమః = ఆశ్రమము, తమసాతీరమ్=తమసానదీతీరమును, ఆశ్రితః=ఆశ్రయించి ఉన్నది. తత్ర=అక్కడ, విజనే = జనము లేని, దేశే=దేశమునందు, ఏతామ్ = ఈమెను, విసృజ్య=విడచి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆగచ్ఛ = రమ్ము. తే = నీకు, భద్రమ్ = మంగళ మగు గాక. మమ = నాయొక్క, వచనమ్ = వచనమును, కురుష్వ = చేయుము.

తా. లక్ష్మణా! గంగకు అవతలి ఒడ్డున, తమసాతీరమును అనుకొని మహాత్ముడైన వాల్మీకి ఆశ్రమము ఉన్నది. ఇది దేవలోకములోని ఆశ్రమముతో సమానమైనది. సీతను అక్కడ విజనప్రదేశమునందు విడచి శీఘ్రముగా రమ్ము. నీకు భద్ర మగుగాక. నేను చెప్పినట్లు చేయుము. 17,18

మూ. న చాస్మి ప్రతివక్తవ్యః సీతాం ప్రతి కథం చన, 19
తస్మాత్త్వం గచ్ఛ సౌమిత్రే నాత్ర కార్యా విచారణా.

ప్ర. అ. సీతాం ప్రతి = సీతను గూర్చి, కథం చన = ఏ విధముగానూ కూడ, ప్రతివక్తవ్యః=ఎదురు చెప్పదగినవాడను, న చ అస్మి=కాను. సౌమిత్రే= లక్ష్మణా! తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, గచ్ఛ = వెళ్ళుము. అత్ర = ఈ విషయమునందు, విచారణా = ఆలోచన, న కార్యా = చేయదగినది కాదు.

తా. సీత విషయములో ఏ విధముగానూ కూడ నాకు అడ్డు చెప్పకూడదు. అందువలన, లక్ష్మణా! వెళ్ళుము. ఈ విషయములో మరొక ఆలోచన ఏమీ చేయవద్దు. 19

మూ. అప్రీతిర్హి పరా మహ్యం భవేత్తు ప్రతివారితే, 20
శాపితా హి మయా యూయం పాదాభ్యాం జీవితేన చ.

ప్ర. అ. ప్రతివారితే = అడ్డుకొనబడినదగుచుండగా, మహ్యమ్ = నాకు,

పరా=గొప్ప, అప్రీతిః=అసంతోషము, భవేత్ తు హి=అగును కదా. యూయమ్ = మీరు, మయా = నాచేత, పాదాభ్యామ్ = పాదములచేత, జీవితేన చ = నా జీవితముచేతా, శాపితాః హి = ఒట్టుపెట్టబడినారు.

తా. దీనికి అడ్డు చెప్పినచో నాకు చాల అసంతోషము కలుగును. నా పాదాల మీద, జీవితముమీద ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 20

మూ. యే మాం వాక్యాన్తరే బ్రూయురనునేతుం కథం చన, 21
అహితా నామ తే నిత్యం మదభీష్టవిఘాతనాత్.

ప్ర. అ. యే = ఎవరు, మామ్ = నన్ను, వాక్యాన్తరే = వాక్యమధ్యము నందు, కథం చన=ఏ విధముగానైనా, అనునేతుమ్=బ్రతిమాలుటకు, బ్రూయుః =మాటలాడుదురో, తే=వారు, మదభీష్టవిఘాతనాత్=నా ఇష్టమునకు విఘాతము కలిగించుటవలన, నిత్యమ్ = ఎల్లప్పుడూ, అహితాః నామ = అహితులు అగుదురు.

తా. నా మాటకు అడ్డు వచ్చి మధ్యలో బ్రతిమాలుటకు మాట్లాడేవారు నా ఇష్టమునకు అడ్డము తగులుటచే ఎప్పటికీ నా అహితులుగా పరిగణింపబడుదురు. 21

మూ. మానయన్తు భవన్తో మాం యది మచ్ఛాసనే స్థితాః, 22
ఇతోఽద్య నీయతాం సీతా కురుష్వ వచనం మమ.

ప్ర. అ. భవన్తః=మీరు, మచ్ఛాసనే = నా ఆజ్ఞయందు, స్థితాః యది = ఉన్నట్లయితే, మామ్ = నన్ను, మానయన్తు = మన్నించెదరుగాక. అద్య = ఇప్పుడు, సీతా = సీత, ఇతః = ఇక్కడినుండి, నీయతామ్ = తీసికొనివెళ్ళబడుగాక. మమ = నాయొక్క, వచనమ్ = వచనమును, కురుష్వ = చేయుము.

తా. మీరు నా ఆజ్ఞలో ఉన్నవారైతే నా మాట మన్నించుడు. సీతను ఇప్పుడు ఇక్కడినుండి తీసికొని పోవలెను. నా మాట ప్రకారము చేయుము. 22

మూ. పూర్వముక్తోఽహమనయా గఙ్గాతీరేఽహమాశ్రమాన్, 23
పశ్యేయమితి తస్యాచ్ఛ కామః సంవర్త్యతామయమ్.

ప్ర. అ. అహమ్=నేను, గఙ్గాతీరే=గంగాతీరమునందున్న, ఆశ్రమాన్= ఆశ్రమములను, పశ్యేయమ్ = చూచెదనుగాక, ఇతి = అని, అహమ్ = నేను,

అనయా = ఈమెచేత, పూర్వమ్ = పూర్వము, ఉక్తః = పలకబడితిని, తస్యాః = ఆమెయొక్క, అయమ్ = ఈ, కామః చ = కోరిక కూడ, సంవర్త్యతామ్ = తీర్చబడుగాక.

తా. "నాకు గంగాతీరమునందున్న ఆశ్రమములను చూడవలె నని ఉన్నది" అని ఈమె వెనుక నాతో చెప్పి ఉన్నది. ఈమె కోరిక కూడ తీర్చబడుగాక. 23

మూ. ఏవముక్త్వా తు కాకుత్స్థో బాష్పేణ పిహితేక్షణః, 24
ప్రవివేశ స ధర్మాత్మా భ్రాతృభిః పరివారితః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చచత్వారింశః సర్గః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, భ్రాతృభిః = సోదరులచేత, పరివారితః = చుట్టబడిన, సః = ఆ, కాకుత్స్థః = రాముడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, బాష్పేణ = కన్నీటిచేత, పిహితేక్షణః = కప్పబడిన నేత్రములు కలవాడై, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. సోదరులతో కూడి ఉన్న ధర్మాత్ముడైన ఆ రాముడు ఇట్లు పలుకుచుండగా కన్నీరు అతని కండ్లను కప్పివేసెను. అతడు సోదరులను పంపివేసి తన ఇంటిలో ప్రవేశించెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నలభైఐదవ సర్గ సమాప్తము.

# అథ షట్చత్వారింశః సర్గః

*[లక్ష్మణుడు సీతను రథమునందు కూర్చుండబెట్టి ఆమెను వనములో విడచుటకై బయలుదేరి గంగాతీరము చేరుట.]*

మూ. తతో రజన్యాం వ్యుష్టాయాం లక్ష్మణో దీనచేతనః,
సుమన్త్రమబ్రవీద్వాక్యం ముఖేన పరిశుష్యతా. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రజన్యామ్ = రాత్రి, వ్యుష్టాయామ్ = తెల్లవారిన దగుచుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, దీనచేతనః = దీనమైన మనస్సు గలవాడై, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, సుమన్త్రమ్ = సుమంత్రుణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాత్రి తెల్లవారినది. మనస్సులో చాల దైన్యముతో ఉన్న లక్ష్మణుడు, వాడిపోయిన ముఖముతో సుమంత్రునితో ఇట్లు పలికెను. 1

మూ. సారథే తురగాన్ శీఘ్రాన్యోజయస్వ రథోత్తమే,
స్వాస్తీర్ణం రాజవచనాత్సీతాయాశ్చాసనం కురు. 2

ప్ర. అ. సారథే = ఓ! సారథీ, రథోత్తమే = ఉత్తమమైన రథమునందు, శీఘ్రాన్ = శీఘ్రముగా నడచు, తురగాన్ = గుఱ్ఱములను, యోజయస్వ = కూర్చుము. రాజవచనాత్ = రాజాజ్ఞవలన, సీతాయాః = సీతకు, స్వాస్తీర్ణమ్ = బాగుగా పరచబడిన, ఆసనం చ = ఆసనమును కూడ, కురు = చేయుము.

తా. సారథీ! శ్రేష్ఠమైన రథానికి వేగము గల గుఱ్ఱాలను కట్టి సీతకొరకై మెత్తని, అందమైన వస్త్రాదులు పరచిన ఆసనము తయారుచేయుము. ఇది రాజాజ్ఞ. 2

మూ. సీతా హి రామవచనాదాశ్రమం పుణ్యకర్మణామ్,
మయా నేయా మహర్షీణాం శీఘ్రమానీయతాం రథః. 3

ప్ర. అ. రామవచనాత్ = రాముని ఆజ్ఞవలన, సీతా = సీత, మయా = నాచేత, పుణ్యకర్మణామ్ = పుణ్యమైన కర్మ గల, మహర్షీణామ్ = మహర్షుల యొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, నేయా = తీసికొనివెళ్ళదగినది. రథః = రథము, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆనీయతామ్ = తీసికొనిరాబడుగాక.

తా. రాముని ఆజ్ఞ ప్రకారము నేను సీతను పుణ్యాత్ములైన మహర్షుల ఆశ్రమానికి తీసికొని వెళ్ళవలెను. రథమును శీఘ్రముగా తీసికొనిరమ్ము. 3

మూ. సుమన్త్రస్తు తథేత్యుక్త్వా యుక్తం పరమవాజిభిః,
రథం సురుచిరప్రఖ్యం స్వాస్తీర్ణం సుఖశయ్యయా. 4

ఆనీయోవాచ సౌమిత్రిం మిత్రాణాం మానవర్ధనమ్,
రథో௨యం సమనుప్రాప్తో యత్కార్యం క్రియతాం ప్రభో.

ప్ర. అ. సుమన్త్రః తు = సుమంత్రుడైతే, తథా ఇతి = అట్లే అని, ఉక్త్వా = పలికి, పరమవాజిభిః = ఉత్తమములైన గుఱ్ఱములచేత, యుక్తమ్ = కట్టబడిన, సురుచిరప్రఖ్యమ్ = చాల అందమైన శోభ గల, సుఖశయ్యయా = సుఖకరమైన పరుపుచేత, స్వాస్తీర్ణమ్ = చక్కగా పరవబడిన, రథమ్ = రథమును, ఆనీయ = తీసికొని వచ్చి, మిత్రాణామ్ = మిత్రులయొక్క, మానవర్ధనమ్ = గౌరవమును పెంచు, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను. ప్రభో = ఓ! ప్రభూ! అయం రథః = ఈ రథము, సమనుప్రాప్తః = వచ్చినది; యత్ = ఏది, కార్యమ్ = చేయదగినదో అది, క్రియతామ్ = చేయబడుగాక.

తా. సుమంత్రుడు "అట్లే చేసెదను" అని పలికి, ఉత్తమములైన గుఱ్ఱములు కట్టిన, సుఖకరమైన చక్కని పరుపు పరచిన, మంచి కాంతి గల రథమును తీసికొనివచ్చి, ప్రభూ! ఇదిగో, రథము వచ్చినది ఏమి చేయవలెనో ఆ పని చేయుము" అని మిత్రుల గౌరవమును వృద్ధి పొందించు లక్ష్మణునితో పలికెను. 4,5

మూ. ఏవముక్తః సుమన్త్రేణ రాజవేశ్మని లక్ష్మణః,
ప్రవిశ్య సీతామాసాద్య వ్యాజహార నరర్షభః. 6

ప్ర. అ. సుమన్త్రేణ = సుమంత్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః =

పలకబడిన, నరర్షభః = నరులలో శ్రేష్ఠుడైన, లక్ష్మణః=లక్ష్మణుడు, రాజవేశ్మని = రాజగృహములో, ప్రవిశ్య = ప్రవేశించి, సీతామ్ = సీతను, ఆసాద్య = సమీపించి, వ్యాజహార = పలికెను.

తా. మానవులలో శ్రేష్ఠుడైన లక్ష్మణుడు సుమంత్రుని మాటలు విని, రాజప్రసాదములో ప్రవేశించి సీత దగ్గరకు వెళ్ళి ఇట్లు పలికెను. 6

మూ. త్వయా కిలైష నృపతిర్వరం వై యాచితః ప్రభుః,
నృపేణ చ ప్రతిజ్ఞాతమాజ్ఞప్తశ్చాశ్రమం ప్రతి. 7

ప్ర. అ. ప్రభుః = ప్రభువైన, ఏషః = ఈ, నృపతిః = రాజు, త్వయా = నీచేత, వరమ్ = వరమును, యాచితః కిల=యాచింపబడినాడట. నృపేణ చ= రాజుచేత కూడ, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినదట. ఆశ్రమం ప్రతి=ఆశ్రమమును గూర్చి, ఆజ్ఞప్తః = ఆజ్ఞాపించబడితిని.

తా. నీవు ప్రభువైన రాజును వరమును కోరినావట. రాజు కూడ అట్లే ఇచ్చెద నని ప్రతిజ్ఞ చేసినా డట. అందుచేత నిన్ను ఆశ్రమమునకు తీసికొనివెళ్ళ వలసినదిగా నన్నాజ్ఞాపించినాడు. 7

మూ. గఙ్గాతీరే మయా దేవి ఋషీణామాశ్రమాన్ శుభాన్,
శీఘ్రం గత్వా తు వైదేహి శాసనాత్పార్థివస్య నః, 8
అరణ్యే మునిభిర్జుష్టే అపనేయా భవిష్యసి.

ప్ర. అ. దేవి = దేవీ ! వైదేహి = సీతా ! నః=మనయొక్క, పార్థివస్య= రాజుయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, మయా = నాచేత, గఙ్గాతీరే = గంగానదీ తీరమునందు, శుభాన్ = పవిత్రములైన, ఆశ్రమాన్ = ఆశ్రమములను గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గత్వా = వెళ్ళి, మునిభిః = మునులచేత, జుష్టే = పొందబడిన, అరణ్యే = అరణ్యమునందు, అపనేయా = పొందింపదగినదానవు, భవిష్యసి = కాగలవు.

తా. ఓ ! సీతాదేవీ ! మన రాజుగారి ఆజ్ఞప్రకారము నేను గంగాతీరమునందున్న పవిత్రములైన ఋష్యాశ్రమములకు శీఘ్రముగా నిన్ను తీసికొనివెళ్ళి అక్కడ మునులు నివసించు అరణ్యమును చేర్చవలసి ఉన్నది. 8

మూ. ఏవముక్తా తు వైదేహీ లక్ష్మణేన మహాత్మనా, 9
ప్రహర్షమతులం లేభే గమనం చాప్యరోచయత్.

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన, వైదేహీ = సీత, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను. గమనం చ అపి = గమనమును గూర్చి, అరోచయత్ = ఇష్టపడెను.

తా. సీత మహాత్ముడైన లక్ష్మణుని మాటలు విని చాల సంతోషించి వెళ్ళుటకు సిద్ధమయ్యెను. 9

మూ. వాసాంసి చ మహార్హాణి రత్నాని వివిధాని చ, 10
గృహీత్వా తాని వైదేహీ గమనాయోపచక్రమే.

ప్ర. అ. వైదేహీ = సీత, మహార్హాణి = గొప్ప విలువ గల, వాసాంసి = వస్త్రములను, వివిధాని = అనేకవిధములైన, రత్నాని చ = రత్నములను, గృహీత్వా = గ్రహించి, గమనాయ = వెళ్ళుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. సీత చాల విలువ గల వస్త్రములు, అనేకవిధములైన రత్నాలు తీసికొని వెళ్ళుటకు సిద్ధ మయ్యెను. 10

మూ. ఇమాని మునిపత్నీనాం దాస్యామ్యాభరణాన్యహమ్, 11
వస్త్రాణి చ మహార్హాణి ధనాని వివిధాని చ.

ప్ర. అ. అహమ్ = నేను, ఇమాని = ఈ, ఆభరణాని = ఆభరణములను, మహార్హాణి = గొప్పవిలువగల, వస్త్రాణి = వస్త్రములను, వివిధాని = అనేకవిధములైన, ధనాని చ = ధనములను, మునిపత్నీనామ్ = మునిభార్యలకు, దాస్యామి = ఇవ్వగలను.

తా. "నేను ఈ ఆభరణములు, చాల విలువైన వస్త్రాలు, అనేకవిధములైన ధనాలూ కూడ మునిభార్యలకు ఇచ్చెదను" అని సీత చెప్పెను. 11

మూ. సౌమిత్రిస్తు తథేత్యుక్త్వా రథమారోప్య మైథిలీమ్, 12
ప్రయయౌ శీఘ్రతురగం రామస్యాజ్ఞామనుస్మరన్.

ప్ర. అ. సౌమిత్రిః తు = లక్ష్మణుడైతే, తథేతి = అట్లే అని, ఉక్త్వా = పలికి, మైథిలీమ్ = సీతను, శీఘ్రతురగమ్ = వేగము గల గుఱ్ఱములు గల, రథమ్ = రథమును, ఆరోప్య = ఎక్కించి, రామస్య = రామునియొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, అనుస్మరన్ = స్మరించుచు, ప్రయయౌ = వెళ్లెను.

తా. లక్ష్మణుడు "సరే! అట్లే చేయుము" అని పలికి సీతను వేగము గల గుఱ్ఱములు కట్టిన రథమును ఎక్కించి, రాముని ఆజ్ఞను స్మరించుచు తీసికొని వెళ్లెను. 12

మూ. అబ్రవీచ్చ తదా సీతా లక్ష్మణం లక్ష్మివర్ధనమ్, 13
అశుభాని బహూన్యేవ పశ్యామి రఘునన్దన.

ప్ర. అ. తదా = అప్పుడు, సీతా = సీత, లక్ష్మివర్ధనమ్ = లక్ష్మిని వృద్ధి పొందించు, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, అబ్రవీత్ చ = పలికెను. రఘునన్దన = లక్ష్మణా! బహూని = అనేకములైన, అశుభాని = అశుభములను, పశ్యామి = చూచుచున్నాను.

తా. అప్పుడు సీత లక్ష్మిని వృద్ధి పొందించు లక్ష్మణునితో ఇట్లు పలికెను. "లక్ష్మణా! నాకు చాల అశుభములు (అపశకునములు) కనబడుచున్నవి. 13

మూ. నయనం మే స్ఫురత్యద్య గాత్రోత్కమ్పశ్చ జాయతే, 14
హృదయం చైవ సౌమిత్రే అస్వస్థమివ లక్షయే.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! అద్య = ఇప్పుడు, మే = నాయొక్క, నయనమ్ = నేత్రము, స్ఫురతి = అదురుచున్నది. గాత్రోత్కమ్పః చ = శరీరము వణకుకూడ, జాయతే = కలుగుచున్నది. హృదయం చైవ = హృదయమును కూడ, అస్వస్థమ్ ఇవ = అస్వస్థముగా ఉన్నదానిని వలె, లక్షయే = ఊహించుచున్నాను.

తా. లక్ష్మణా! ఇప్పుడు నా (కుడి) కన్ను అదరుచున్నది. శరీరము వణకుచున్నది. నా హృదయము కూడ అస్వస్థముగా ఉన్నట్లు కనబడుచున్నది.

మూ. ఔత్సుక్యం పరమం చాపి అధృతిశ్చ పరా మమ, 15
శూన్యామేవ చ పశ్యామి పృథివీం పృథులోచన

ప్ర. అ. పృథులోచన = పెద్ద నేత్రములు గలవాడా ! మమ = నాయొక్క, ఔత్సుక్యమ్ = బెంగ, పరమం చ అపి = అధికముగా ఉన్నది. అధృతిః చ = అధైర్యము కూడ, పరా = అధికమైనది. పృథివీమ్ = భూమిని, శూన్యామ్ ఏవ చ = శూన్యమైనదానినిగా, పశ్యామి = చూచుచున్నాను.

తా. విశాలనేత్రములు గల ఓ ! లక్ష్మణా ! నాకేమో చాల బెంగగా ఉన్నది. అధైర్యము అధికముగా ఉన్నది. ఈ భూమి అంతా శూన్యముగా ఉన్నట్లు కనబడుచున్నది. 15

మూ. అపి స్వస్తి భవేత్తస్య భ్రాతుస్తే భ్రాతృవత్సల, 16
శ్వశ్రూణాం చైవ మే వీర సర్వాసామవిశేషతః.

ప్ర. అ. భ్రాతృవత్సల = సోదరునియందు ప్రేమ కలవాడా ! వీర = వీరుడా ! తే = నీయొక్క, తస్య భ్రాతుః = ఆ సోదరునికి, అవిశేషతః = భేదము లేకుండా, సర్వాసామ్ = సమస్తమైన, శ్వశ్రూణాం చ = అత్తలకు, స్వస్తి = క్షేమము, అపి భవేత్ = అగును కదా !

తా. సోదరునియందు ప్రేమ గల ఓ ! వీరుడా ! నీ సోదరుడైన రామునకు అత్తగార్లందరికీ క్షేమము కలుగును కదా ! 16

మూ. పురే జనపదే చైవ కుశలం ప్రాణినామపి, 17
ఇత్యఞ్జలికృతా సీతా దేవతా అభ్యయాచత.

ప్ర. అ. పురే = పట్టణమునందు, జనపదే చాపి = గ్రామమునందు, ప్రాణినామ్ అపి = అన్ని ప్రాణులకూ కూడ, కుశలమ్ = క్షేమము కలుగునా ? ఇతి = ఇట్లు, సీతా = సీత, అఞ్జలికృతా = చేయబడిన దోసిలి కలదై, దేవతాః = దేవతలను, అభ్యయాచత = ప్రార్థించెను.

తా. "పట్టణములందు గ్రామాలలోను ప్రజలు. ఇతర ప్రాణులు సుఖముగా ఉందురా!" ఇట్లు పలుకుచు సీత దేవతలకు నమస్కారము చేసెను. 17

మూ. లక్ష్మణోఽర్థం తతః శ్రుత్వా శిరసా వన్ద్య మైథిలీమ్, 18
శివమిత్యబ్రవీద్ధృష్టో హృదయేన విశుష్యతా.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, అర్థమ్ = ఆ విషయమును, శ్రుత్వా = విని, మైథిలీమ్ = సీతను, శిరసా = శిరస్సుతో, వన్ద్య= నమస్కరించి, హృష్టః = పైకి సంతోషించుచున్నవాడై, విశుష్యతా = శోషించు చున్న, హృదయేన=హృదయముతో, శివమ్ ఇతి=మంగళము అని, అబ్రవీత్= పలికెను.

తా. పిమ్మట లక్ష్మణుడు ఆమె చెప్పు విషయమును గ్రహించి, సీతకు తల వంచి నమస్కరించి, హృదయము శుష్కించుచుండగా, పైకి సంతోషము కనబరచుచు "అంతా మంగళప్రదముగా ఉండును" అని పలికెను. 18

మూ. తతో వాసముపాగమ్య గోమతీతీర ఆశ్రమే, 19
ప్రభాతే పునరుత్థాయ సౌమిత్రిః సూతమబ్రవీత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గోమతీతీరే = గోమతీనదీతీరమునందు, ఆశ్రమే = ఆశ్రమమునందు, వాసమ్ = నివాసమును, ఉపాగమ్య = పొంది, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, పునః = మరల, ఉత్థాయ = లేచి, సౌమిత్రిః = లక్ష్మణుడు, సూతమ్ = సారథిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట లక్ష్మణుడు గోమతీతీరమునందున్న ఆశ్రమములో విడిది చేసి, ప్రాతఃకాలమునందు మరల లేచి సారథితో ఇట్లనెను. 19

మూ. యోజయస్వ రథం శీఘ్రమద్య భాగీరథీజలమ్, 20
శిరసా ధారయిష్యామి త్రియమ్బక ఇవౌజసా.

ప్ర. అ. శీఘ్రమ్ = శీఘ్రముగా, రథమ్ = రథమును, యోజయస్వ = కూర్చుము. అద్య = ఇప్పుడు, భాగీరథీజలమ్ = గంగాజలమును, ఓజసా = తేజస్సుతో, త్రియమ్బకః ఇవ = శివుడు వలె, శిరసా = శిరస్సుచేత, ధారయిష్యామి = ధరించెదను.

తా. శీఘ్రముగా రథమును సిద్ధము చేయుము. ఇప్పుడా గంగాజలమును, ఈశ్వరుడు శక్తిచేత శిరస్సుమీద ధరించినట్లు, నా శిరస్సుమీద ధరించెదను.

వి. దీనిని పట్టి రుద్రుడు కూడ గంగను స్నానంకోసమే ధరించినాడని

తెలియుచున్నది అని గోవిందరాజు ఊహ. "దృష్టాన్తో రుద్రోఽపి స్నానార్థమేవ గఙ్గాం దధారేతి గమ్యతే". 20

మూ. సోఽశ్వాన్విచారయిత్వా తు రథే యుక్తాన్మనోజవాన్,
ఆరోహస్వేతి వైదేహీం సూతః ప్రాఞ్జలిరబ్రవీత్.

ప్ర. అ. సః సూతః = ఆ సారథి, రథే = రథమునందు, యుక్తాన్ = కట్టబడిన, మనోజవాన్ = మనస్సువంటి వేగము గల, అశ్వాన్ = గుఱ్ఱములను, విచారయిత్వా = నడిపి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఆరోహస్వ = ఎక్కుము, ఇతి = అని, వైదేహీమ్ = సీతను గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. సారథి మనోవేగము గల అశ్వములను రథమునకు కట్టి, వాటిని నడిపి తీసికొని వచ్చి, అంజలి ఘటించి సీతతో "ఎక్కుము" అని పలికెను. 21

మూ. సా తు సూతస్య వచనాదారురోహ రథోత్తమమ్, 22
సీతా సౌమిత్రిణా సార్ధం సుమన్త్రేణ చ ధీమతా.

ప్ర. అ. సా సీతా తు = ఆ సీత, సూతస్య = సారథియొక్క, వచనాత్ = మాటవలన, సౌమిత్రిణా సార్ధమ్ = లక్ష్మణునితో కూడ, ధీమతా = బుద్ధిమంతుడైన, సుమన్త్రేణ చ = సుమంత్రునితో కూడ, రథోత్తమమ్ = ఆ రథశ్రేష్ఠమును, ఆరురోహ = ఎక్కెను.

తా. సారథి మాట విని సీత రథమును ఎక్కెను. లక్ష్మణుడు, ధీమంతుడైన సుమంత్రుడూ కూడ ఎక్కిరి. 22

మూ. ఆససాద విశాలాక్షీ గఙ్గాం పాపవినాశినీమ్, 23
అథార్ధదివసం గత్వా భాగీరథ్యా జలాశయమ్,
నిరీక్ష్య లక్ష్మణో దీనః ప్రరురోద మహాస్వనః. 24

ప్ర. అ. విశాలాక్షీ = విశాలములైన నేత్రములు గల సీత, పాపవినాశినీమ్ = పాపములను నశింపచేయు, గఙ్గామ్ = గంగానదిని, ఆససాద = సమీపించెను. అథ = పిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, అర్ధదివసమ్ = పగటి సగము కాలమును, భాగీరథ్యాః = గంగయొక్క, జలాశయమ్ = జలస్థానమును గూర్చి,

గత్వా = వెళ్ళి, దీనః = దీనుడై, నిరీక్ష్య = చూచి, మహాస్వనః = గొప్ప ధ్వని కలవాడై, ప్రరురోద = ఏడ్చెను.

తా. విశాలాక్షియైన సీత పాపములను నశింపచేయు గంగను సమీపించెను. దివసములో సగముకాలము ప్రయాణము చేసిన లక్ష్మణుడు గంగాజలమును చూచి దీనుడై బిగ్గరగా ఏడ్చెను. 23,24

మూ. సీతా తు పరమత్రస్తా దృష్ట్వా లక్ష్మణమాతురమ్,
ఉవాచ వాక్యం ధర్మజ్ఞా కిమిదం రుద్యతే త్వయా. 25

ప్ర. అ. ధర్మజ్ఞా = ధర్మజ్ఞురాలైన, సీతా తు = సీత యైతే, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ఆతురమ్ = దుఃఖితుణ్ణిగా, దృష్ట్వా = చూచి, పరమత్రస్తా = చాల భయపడినదై, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను. త్వయా = నీచేత, రుద్యతే = రోదనము చేయబడుచున్నది; ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి ?

తా. ధర్మములు తెలిసిన సీత లక్ష్మణుడు దుఃఖించుటను చూచి చాల భయపడి ఇట్లు పలికెను- "నీవు ఏడ్చుచున్నావు; ఇది ఏమి ?". 25

మూ. జాహ్నవీతీరమాసాద్య చిరాభిలషితం మమ,
హర్షకాలే కిమర్థం మాం విషాదయసి లక్ష్మణ. 26

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! మమ = నాకు, చిరాభిలషితమ్ = చాల కాలమునుండి కోరబడిన, జాహ్నవీతీరమ్ = గంగాతీరమును, ఆసాద్య = పొంది, హర్షకాలే = సంతోషసమయమునందు, మామ్ = నన్ను, కిమర్థమ్ = ఎందుకు, విషాదయసి = దుఃఖింపచేయుచున్నావు ?

తా. లక్ష్మణా ! నేను చాలా కాలమునుండి కోరుకొనుచున్న గంగాతీరమును సమీపించిన తరువాత సంతోషించవలసిన సమయమునందు నాకు దిగులు కలిగించుచున్నా వేమి ? 26

మూ. నిత్యం త్వం రామపార్శ్వేషు వర్తసే పురుషర్షభ,
కచ్చిద్వినాకృతస్తేన ద్విరాత్రం శోకమాగతః. 27

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! త్వమ్ = నీవు, నిత్యమ్ =

=మహర్షులయొక్క, అభివాదనమ్ = నమస్కారమును, కృత్వా=చేసి, తత్ర = అక్కడ, ఏకామ్ = ఒక, నిశామ్ = రాత్రిని, ఉష్య = ఉండి, పునః = మరల, తాం పురీమ్ = పట్టణమును గూర్చి, యాస్యామః = వెళ్లెదము.

తా. అటుపైన తగు విధముగా మహర్షుల అభివాదనము చేసి, అక్కడ ఒక రాత్రి ఉండి మరల నగరమునకు వెళ్ళెదము. 30

మూ. మమాపి పద్మపత్రాక్షం సింహోరస్కం కృశోదరమ్,
త్వరతే హి మనో ద్రష్టుం రామం రమయతాం వరమ్.

ప్ర. అ. పద్మపత్రాక్షమ్ = పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, సింహోరస్కమ్ = సింహమువంటి వక్షఃస్థలము కలవాడు, కృశోదరమ్ = కృశమైన ఉదరము గలవాడు, రమయతామ్ = ఆనందింపచేయువారిలో, వరమ్ = శ్రేష్ఠుడూ అయిన, రామమ్ = రాముణ్ణి, ద్రష్టుమ్=చూచుటకు, మమ=నాయొక్క, మనః అపి = మనస్సు కూడ, త్వరతే హి = తొందరపడుచున్నది కదా ?

తా. పద్మపత్రముల వంటి నేత్రములు, సింహము వంటి వక్షఃస్థలము, సన్నని నడుమూ గల, ఆనందింపచేసేవాళ్ళలో శ్రేష్ఠుడైన రాముణ్ణి చూడవలెనని నా మనస్సు కూడ తొందరపడుచున్నది. 31

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా ప్రమృజ్య నయనే శుభే,
నావికానాహ్వయామాస లక్ష్మణః పరవీరహా. 32

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, పరవీరహా = శత్రువీరులను సంహరించు, లక్ష్మణః=లక్ష్మణుడు, శుభే = మంగళప్రదములైన, నయనే = నేత్రములను, ప్రమృజ్య = తుడుచుకొని, నావికాన్ = నావ నడుపువాళ్ళను, ఆహ్వయామాస = పిలచెను.

తా. శత్రువీరులను సంహరించు లక్ష్మణుడు ఆమె మాటలు విని, సుందరములైన నేత్రములు తుడుచుకొని, నావ నడిపేవాళ్లను పిలచెను. 32

మూ. ఇయం చ సజ్జా నౌశ్చేతి దాశాః ప్రాఞ్జలయోఽబ్రువన్,
తితీర్షుర్లక్ష్మణో గఙ్గాం శుభాం నావముపారుహత్, 33
గఙ్గాం సంతారయామాస లక్ష్మణస్తాం సమాహితః.

## ఇత్యార్షే శ్రీ మద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. ఇయమ్ = ఈ, నౌః = నావ, సజ్జా ఇతి = సిద్ధముగా ఉన్నది అని, దాశాః = పల్లెవారు, ప్రాఞ్జలయః = కట్టబడిన దోసిళ్ళు కలవారై, అబ్రువన్ = పలికిరి. లక్ష్మణః = లక్ష్మణుడు, గఙ్గామ్ = గంగను, తితీర్షుః = దాటదలచినవాడై, శుభామ్ = సుందరమైన, నావమ్ = నావను, ఉపారుహత్ = ఎక్కెను. లక్ష్మణః = లక్ష్మణుడు, సమాహితః = సావధానచిత్తుడై, తామ్ = సీతను, గఙ్గామ్ = గంగను, తారయామాస = దాటించెను.

తా. "ఇదిగో నావ సిద్ధముగా ఉన్నది" అని నావికులు సవినయముగా చెప్పిరి. గంగను దాటదలచిన లక్ష్మణుడు సుందరమైన ఆ నావలోనికి ఎక్కి సీతను కూడ చాల జాగరూకతతో గంగను దాటించెను. 32,33

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు, ఉత్తరకాండలో నలభైఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తచత్వారింశః సర్గః

[*సీతను గంగానది దాటించిన పిమ్మట లక్ష్మణుడు ఆమెకు పరిత్యాగమును గూర్చి చెప్పుట*].

మూ. అథ నావం సువిస్తీర్ణాం నైషాదీం రాఘవానుజః,
ఆరురోహ సమాయుక్తాం పూర్వమారోప్య మైథిలీమ్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట. రాఘవానుజః = లక్ష్మణుడు, సువిస్తీర్ణామ్ = చాల విశాలమైన, సమాయుక్తామ్ = సిద్ధము చేయబడిన, నైషాదీమ్ = నిషాదుని చేత తీసికొనిరాబడిన, నావమ్ = నావను, పూర్వమ్ = ముందుగా, మైథిలీమ్ = సీతను, ఆరోప్య = ఎక్కించి, ఆరురోహ = ఎక్కెను.

తా. పిమ్మట లక్ష్మణుడు నిషాదుడు తీసికొనివచ్చిన, విశాలమైన, సిద్ధము చేయబడిన నావపై సీతను ముందుగా ఎక్కించి పిదప తాను ఎక్కెను.

మూ. సుమన్త్రం చైవ సరథం స్థీయతామితి లక్ష్మణః,
ఉవాచ శోకసంతప్తః ప్రయాహీతి చ నావికమ్. 2

ప్ర. అ. శోకసంతప్తః = శోకముచేత తపింపచేయబడిన, లక్ష్మణః = లక్ష్మణుడు, సరథమ్ = రథముతో కూడిన, సుమన్త్రమ్ = సుమంత్రుణ్ణి, స్థీయతామ్ ఇతి = ఉండుము అని, నావికమ్ = నావవానిని, ప్రయాహీతి చ = నడువుము అని, ఉవాచ = పలికెను.

తా. దుఃఖాక్రాంతుడైన లక్ష్మణుడు "నువ్వు రథముతో ఇక్కడనే ఉండుము" అని సుమంత్రునితో చెప్పి, "నడిపింపుము" అని నావవానితో పలికెను.

మూ. తతస్తీరముపాగమ్య భాగీరథ్యాః స లక్ష్మణః,
ఉవాచ మైథిలీం వాక్యం ప్రాఞ్జలిర్బాష్పసంవృతః. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, భాగీరథ్యాః = గంగయొక్క, తీరమ్ = తీరమును, ఉపాగమ్య = పొంది, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, బాష్పసంవృతః = కన్నీటితో కూడినవాడై, మైథిలీమ్ = సీతను గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అప్పుడు లక్ష్మణుడు గంగాతీరమున చేరిన పిమ్మట అంజలి ఘటించి, కన్నీళ్ళు కార్చుచు సీతతో ఇట్లు పలికెను. 3

మూ. హృద్గతం మే మహచ్ఛల్యం యస్మాదార్యేణ ధీమతా,
అస్మిన్నిమిత్తే వైదేహి లోకస్య వచనీకృతః. 4

ప్ర. అ. వైదేహి = సీతాదేవీ ! ధీమతా = బుద్ధిమంతుడైన, ఆర్యేణ = అన్నగారిచేత, యస్మాత్ = ఏ కారణమువలన, అస్మిన్ = ఈ, నిమిత్తే = నిమిత్తమునందు (కార్యమునందు), లోకస్య = లోకమునకు, వచనీకృతః = నిందార్హుడను చేయబడినానో, అందువలన, మహత్ = గొప్ప, శల్యమ్ = శల్యము, మే = నాయొక్క, హృద్గతమ్ = హృదయములో ఉన్నది.

తా. సీతాదేవీ ! బుద్ధిశాలియైన మా అన్నగారు నన్ను ఈ విషయములో లోకాల నిందకు పాలైయేటట్లు చేసినాడు. ఇది నా హృదయములో గొప్ప శల్యముగా ఏర్పడినది. 4

మూ. శ్రేయో హి మరణం మేఽద్య మృత్యుర్వ్యాయత్పరంభవేత్,
న చాస్మిన్నీదృశే కార్యే నియోజ్యో లోకనిన్దితే. 5

ప్ర. అ. ('మృత్యుర్వా'కు బదులు 'మృత్యోర్వా' అన్న పాఠము ఉన్నచో బాగుండును.) అద్య = ఇప్పుడు, మే = నాకు, మరణమ్ = మరణము, శ్రేయః హి = శ్రేయస్కరము. మృత్యోః = మృత్యువుకంటె, యత్ = ఏది, అధికమ్ = అధికముగా, భవేత్ = అగునో, (తత్)వా = అదైనా, శ్రేయస్కరము అగును. ఈదృశే = ఇట్టి, లోకనిన్దితే = లోకమునందు నిందింపబడిన, అస్మిన్ = ఈ, కార్యే = కార్యమునందు, నియోజ్యః = నియమింపదగినవాడను, న చ = కాను.

తా. ఈ విధమైన లోకనిందితమైన కార్యమునందు నియోగింపబడుటకంటె నాకు మరణమో, అంతకంటె గొప్పది ఏదైనా ఉన్నచో అదో శ్రేయస్కరము అయి ఉండెడిది. 5

మూ. ప్రసీద చ న మే పాపం కర్తుమర్హసి శోభనే,
ఇత్యఞ్జలికృతో భూమౌ నిపపాత సలక్ష్మణః. 6

ప్ర. అ. శోభనే = మంగళప్రదురాలా ! ప్రసీద = అనుగ్రహించుము. మే = నాకు, పాపమ్ = పాపమును, కర్తుమ్ = చేయుటకు (ఆరోపించుటకు), నార్హసి = తగవు. ఇతి = ఇట్లు, లక్ష్మణః=లక్ష్మణుడు, అఞ్జలికృతః = కట్టబడిన దోసిలి కలవాడై, భూమౌ = నేలమీద, నిపపాత = పడెను.

తా. మంగళప్రదురాలా ! నా విషయమున దోషమును ఊహించకుము. (నేను దోషిని కాదు)అని పలుకుచు లక్ష్మణుడు అంజలి ఘటించి నమస్కరించుచు భూమిమీద పడెను. 6

మూ. రుదన్తం ప్రాఞ్జలిం దృష్ట్వా కాఙ్క్షన్తం మృత్యుమాత్మనః,
మైథిలీ భృశసంవిగ్నా లక్ష్మణం వాక్యమబ్రవీత్. 7

ప్ర. అ. రుదన్తమ్ = ఏడ్చుచున్నవాడు, ప్రాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలి కలవాడు, ఆత్మనః = తనకు, మృత్యుమ్ = మృత్యువును, కాఙ్క్షన్తమ్=కోరుచున్నవాడూ అయిన, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, దృష్ట్వా = చూచి, మైథిలీ=సీత, భృశసంవిగ్నా = చాల దిగులు చెందినదై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. చేతులు జోడించి ఏడ్చుచు తనకు మృత్యువు వచ్చిన బాగుండు నని కోరుకొనుచున్న ఆ లక్ష్మణుని చూచి సీత చాల దిగులు చెంది ఇట్లు పలికెను. 7

మూ. కిమిదం నావగచ్ఛామి బ్రూహి తత్త్వేన లక్ష్మణ,
పశ్యామి త్వాం న చ స్వస్థమపి క్షేమం మహీపతేః. 8

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా ! ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి ? తత్త్వేన= యథార్థముచేత, బ్రూహి = చెప్పుము. త్వామ్ = నిన్ను, స్వస్థమ్ = స్వస్థుణ్ణిగా, న చ పశ్యామి = చూడను కూడ; మహీపతేః=రాజునకు, అపి క్షేమమ్= క్షేమమే కదా ?

తా. లక్ష్మణా ! ఇదేమో నాకు అర్థము అగుటలేదు. అసలు విషయ మేమో చెప్పుము. నువ్వు స్వస్థుడవుగా ఉన్నట్లు కూడ కనబడుటలేదు. రాజునకు క్షేమమే కద ? 8

మూ. శాపితోఽసి నరేన్ద్రేణ యత్త్వం సంతాపమాగతః,
తద్బ్రూయాః సంనిధౌ మహ్యమహమాజ్ఞాపయామి తే. 9

ప్ర. అ. నరేన్ద్రేణ = రాజుచేత, శాపితః = ఒట్టుపెట్టబడినవాడవు, అసి = అయి ఉన్నావు. త్వమ్ = నీవు, యత్ = ఎందువలన, సంతాపమ్ = దుఃఖమును, ఆగతః = పొందినావో, తత్ = దానిని, సంనిధౌ = నా సంనిధియందు, మహ్యమ్ = నాకొరకు, బ్రూయాః = చెప్పుము, తే = నీకు, ఆజ్ఞాపయామి = ఆజ్ఞాపించుచున్నాను.

తా. రాజుమీద ఒట్టు పెట్టి అడుగుచున్నాను. నీకు ఇంత దుఃఖము ఎందుకు కలిగినదో చెప్పుము. నిన్ను ఆజ్ఞాపించుచున్నాను. 9

మూ. వైదేహ్యా చోద్యమానస్తు లక్ష్మణో దీనచేతనః,
అవాఙ్ముఖో బాష్పగలో వాక్యమేతదువాచ హ. 10

ప్ర. అ. వైదేహ్యా = సీతచేత, చోద్యమానః = ప్రేరేపింపబడుచున్న, లక్ష్మణః = లక్ష్మణుడు, దీనచేతనః = దీనమైన మనస్సు కలవాడై, అవాఙ్ముఖః = క్రిందికి ముఖము కలవాడై, బాష్పగలః = కన్నీరు కంఠమునందు కలవాడై, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. సీత ఈ విధముగా ప్రేరేపించగా లక్ష్మణుడు దైన్యముతో నిండిన మనస్సుతో తల వంచుకొని, డగ్గుత్తికతో ఇట్లు పలికెను. 10

మూ. శ్రుత్వా పరిషదో మధ్యే హ్యపవాదం సుదారుణమ్,
పురే జనపదే చైవ త్వత్కృతే జనకాత్మజే, 11
రామః సంతప్తహృదయో మాం నివేద్య గృహం గతః.

ప్ర. అ. జనకాత్మజే = సీతా! రామః = రాముడు, పరిషదః = పరిషత్తుయొక్క, మధ్యే = మధ్యయందు, పురే = పురమునందు, జనపదే చైవ = గ్రామమునందు, త్వత్కృతే = నీకొరకై (నీ విషయమునందు), సుదారుణమ్ = చాల దారుణమైన, అపవాదమ్ = అపవాదమును, శ్రుత్వా = విని, సంతప్తహృదయః = తపింపచేయబడిన హృదయము కలవాడై, మామ్ = నన్ను గూర్చి, నివేద్య = తెలిపి, గృహమ్ = గృహమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. దేవీ! అట్టి నిర్దోషురాలవైన నిన్ను పౌరుల అపవాదమునుండి భయపడిన రాజు నా సంనిధిలో (నా ద్వారా) విడచినాడు. నీవు మరొక విధముగా అనుకొనకుము. నిన్ను రాజాజ్ఞానుసారము ఆశ్రమప్రాంతాలలో విడువలసి ఉన్నది. నీవు కూడ అట్లే కోరుకొన్నావట కదా ? 13,14.

మూ. తదేతజ్జాహ్నవీతీరే బ్రహ్మర్షీణాం తపోవనమ్, 15
పుణ్యం చ రమణీయం చ మా విషాదం కృథాః శుభే.

ప్ర. అ. జాహ్నవీతీరే = గంగాతీరమువందు, తత్ ఏతత్ = అట్టి ఇది, పుణ్యమ్ = పుణ్యమూ, రమణీయం చ = సుందరమూ అయిన, తపోవనమ్ = తపోవనము. శుభే = మంగళప్రదురాలా, విషాదమ్ = దుఃఖమును, మా కృథాః = చేయకుము.

తా. గంగాతీరమునందు అదే ఆ కనపడుచున్నది పుణ్యము, సుందరమూ అయిన బ్రహ్మర్షుల తపోవనము. ఓ! మంగళప్రదురాలా! దుఃఖము చెందకుము.

మూ. రాజ్ఞో దశరథస్యైవ పితుర్మే మునిపుంగవః, 16
సఖా పరమకో విప్రో వాల్మీకిః సుమహాయశాః.

ప్ర. అ. మునిపుంగవః = మునిశ్రేష్ఠుడు, మే పితుః = నా తండ్రియైన, రాజ్ఞః దశరథస్య = రాజైన దశరథునియొక్క, పరమకః = గొప్ప, సఖా = స్నేహితుడు, సుమహాయశాః = చాలా గొప్ప కీర్తి గలవాడు అయిన, వాల్మీకిః = వాల్మీకి అను, విప్రః = బ్రాహ్మణుడు (ఉన్నాడు).

తా. మా తండ్రియైన దశరథమహారాజుకు పరమమిత్రుడు, మునిశ్రేష్ఠుడూ, గొప్ప కీర్తి గలవాడూ అయిన వాల్మీకి ఇక్కడనే ఉన్నాడు. 16

మూ. పాదచ్ఛాయాముపాగమ్య సుఖమస్య మహాత్మనః, 17
ఉపవాసపరైకాగ్రా వస త్వం జనకాత్మజే,
పతివ్రతాత్వమాస్థాయ రామం కృత్వా సదా హృది, 18
శ్రేయస్తే పరమం దేవి తథా కృత్వా భవిష్యతి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తచత్వారింశః సర్గః.

ప్ర. అ. జనకాత్మజే = సీతాదేవీ! మహాత్మనః = మహాత్ముడైన, అస్య = ఇతనియొక్క, పాదచ్ఛాయామ్ = పాదముల నీడను, ఉపాగమ్య = పొంది, త్వమ్ = నీవు, ఉపవాసపరా = ఉపవాసమునందు ఆసక్తురాలవై, (పతివ్రతలకు తగిన భోజనమునందు ఆసక్తి గలదానవై), ఏకాగ్రా = ఏకాగ్రచిత్తముగలదానవై, రామమ్ = రాముణ్ణి, సదా = ఎల్లప్పుడూ, హృది = హృదయమునందు, కృత్వా = ఉంచు కొని, పతివ్రతాత్వమ్ = పతివ్రతాత్వమును, ఆస్థాయ = అవలంబించి, వస = నివసించుము. దేవి = ఓ దేవీ! తథా = అట్లు, కృత్వా = చేసి, తే = నీకు, పరమమ్ = గొప్ప, శ్రేయః = శ్రేయస్సు, భవిష్యతి = కాగలదు.

తా. ఓ! సీతాదేవీ! ఆ మహాత్ముని పాదముల చెంతకు చేరి, పతివ్రతా ధర్మములను ఆచరించుచు నిత్యమూ రాముణ్ణే హృదయమునందు స్మరించుచు నియమపూర్వక మగు ఆహారము భుజించుచు ఇక్కడ నివసించుము. అట్లు చేసి నచో నీకు శ్రేయస్సు కాగలదు. 17, 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నలభైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టచత్వారింశః సర్గః

*[సీత దుఃఖావిష్టురాలై రామునకు సందేశము పంపుట. లక్ష్మణుడు వెళ్ళిపోవుట. సీత విలపించుట].*

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా దారుణం జనకాత్మజా,
పరం విషాదమాగమ్య వైదేహీ నిపపాత హ. 1

ప్ర. అ. జనకాత్మజా = జనకుని కుమార్తె యైన, వైదేహీ = సీత, దారుణమ్ = దారుణమైన, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, పరమ్ = గొప్ప, విషాదమ్ = దుఃఖమును, ఆగమ్య = పొంది, నిపపాత హ = క్రింద పడిపోయెను.

తా. దారుణమైన లక్ష్మణుని మాటలు విని సీత చాల దుఃఖమును పొంది మూర్ఛిల్లి నేలపై పడిపోయెను. 1

మూ. సా ముహూర్తమివాసంజ్ఞా బాష్పపర్యాకులేక్షణా,
లక్ష్మణం దీనయా వాచా ఉవాచ జనకాత్మజా. 2

ప్ర. అ. ముహూర్తమివ = క్షణకాలము, అసంజ్ఞా = సంజ్ఞలేకుండా ఉండిన, సా జనకాత్మజా = ఆ సీత, బాష్పపర్యాకులేక్షణా = కన్నీళ్ళతో వ్యాకులములైన నేత్రములు గలదై, దీనయా = దీనమైన, వాచా = వాక్కుతో, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. క్షణకాలము స్పృహ తప్పి పడిపోయిన ఆ సీత నేత్రములు కన్నీళ్ళతో నిండగా దీనముగా లక్ష్మణునితో ఇట్లు పలికెను. 2

మూ. మామికేయం తనుర్నూనం సృష్టా దుఃఖాయ లక్ష్మణ,
ధాత్రా యస్యాస్తథా మేఽద్య దుఃఖమూర్తిః ప్రదృశ్యతే.

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! యస్యాః=ఏ, మే = నాకు, దుఃఖమూర్తిః = దుఃఖముల మూర్తియే, అద్య = ఇప్పుడు, ప్రదృశ్యతే = చూడబడుచున్నదో, (కనబడుచున్నదో), మామికా=నా సంబంధమైన, ఇయం తనుః=ఈ శరీరము, నూనమ్ = నిశ్చయముగా, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, దుఃఖాయ = దుఃఖముకొరకే, సృష్టా = సృజించబడినది.

తా. లక్ష్మణా! బ్రహ్మదేవుడు నిజముగా నా దేహమును దుఃఖము అనుభవించుటకే సృష్టించినాడు. అందుచేతనే నేను ఇప్పుడు మూర్తీభవించిన దుఃఖమును చూచుచున్నాను. 3

మూ. కిం ను పాపం కృతం పూర్వం కో ను దారైర్వియోజితః,
యాహం శుద్ధసమాచారా త్యక్తా నృపతినా సతీ. 4

ప్ర. అ. శుద్ధసమాచారా = పరిశుద్ధమైన ఆచారము గల, సతీ = పతివ్రతనైన, యా అహమ్ = ఏ నేను, నృపతినా = రాజుచేత, త్యక్తా = విడువబడితినో అట్టి నాచేత, పూర్వమ్ = పూర్వము, కిం పాపమ్ = ఏమి పాపము, కృతం ను= చేయబడినదో? దారైః = భార్యతో, కః = ఎవడు, వియోజితః ను = దూరము చేయబడినాడో.

తా. పరిశుద్ధమైన నడవడిక గల పతివ్రతనైన నన్ను రాజు విడచివేయుచున్నాడు. పూర్వము నేను ఏమి పాపము చేసినానో! ఎవరికి భార్యావియోగము కలిగించినానో! 4

మూ. పురాహమాశ్రమే వాసం రామపాదానువర్తినీ,
అనురుధ్యామి సౌమిత్రే దుఃఖే చ పరివర్తినీ. 5

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! అహమ్ = నేను, పురా = పూర్వము, దుఃఖే = దుఃఖమునందు, పరివర్తినీ = ఉన్నదాననైనను. రామపాదానువర్తినీ = = రాముని పాదములను అనుసరించుదాననై, ఆశ్రమే = ఆశ్రమమునందు వాసమ్ = నివాసమును, అనురుధ్యామి = అనుసరించితిని.

తా. లక్ష్మణా! పూర్వము నేను ఎన్ని కష్టములలో ఉన్నను రాముని పాదములను ఆశ్రయించి ఆశ్రమములో నివసించితిని. 5

మూ. సా కథం హ్యాశ్రమే సౌమ్య వత్స్యామి విజనీకృతా,
ఆఖ్యాస్యామి చ కస్యాహం దుఃఖం దుఃఖపరాయణా. 6

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! సా = అట్టి, అహమ్ = నేను, విజనీకృతా జనులు లేకుండ చేయబడినదాననై, ఆశ్రమే = ఆశ్రమములో, కథమ్ = ఎట్లు, వత్స్యామి = నివసింతును? దుఃఖపరాయణా = దుఃఖమునకు అధీనురాలనైన నేను, దుఃఖమ్ = నా దుఃఖమును, కస్య = ఎవనికి, ఆఖ్యాస్యామి = చెప్పుకొందును.

తా. సౌమ్యుడా! బంధుజనులకు దూరము చేయబడిన నేను ఆశ్రమములో ఎట్లు నివసించగలను? దుఃఖముతో నిండిన నేను నా కష్టములు ఎవరికి చెప్పుకొందును? 6

మూ. కిం ను వక్ష్యామి మునిషు కర్మ చాసత్కృతం ప్రభో,
కస్మిన్ వా కారణే త్యక్తా రాఘవేణ మహాత్మనా. 7

ప్ర. అ. ప్రభో = ఓ ప్రభూ! కిం ను = ఏ, అసత్ = చెడ్డ, కర్మ = పనిని, కృతమ్ = చేయబడిన దానినిగా, మునిషు = మునులయందు (కు), వక్ష్యామి = చెప్పుదును, మహాత్మనా = మహాత్ముడైన, రాఘవేణ = రామునిచేత, కస్మిన్ వా = ఏ, కారణే = కారణమునందు, త్యక్తా = విడవబడినదాననో చెప్పుదును?

తా. ప్రభూ! లక్ష్మణా! నేను ఏమి తప్పు పని చేసితినని మునులకు చెప్పుదును. నన్ను మహాత్ముడైన రాముడు ఏ కారణముచేత విడచినాడని చెప్పుదును? 7

మూ. న ఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే,
త్యజేయం రాజవంశస్తు భర్తుర్మే పరిహాస్యతే. 8

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! అద్యైవ = ఇప్పుడే, జాహ్నవీజలే = గంగాజలమునందు, జీవితమ్ = ప్రాణమును, న ఖలు త్యజేయమ్ = విడువను. మే భర్తుః = నా భర్త యొక్క, వంశః = వంశము, పరిహాస్యతే తు = నష్టము కాగలదు కదా?

తా. లక్ష్మణా! నేనిప్పుడే గంగాజలములో ప్రాణాలను విడువను. ఎందు

చేతననగా (నా గర్భము కూడ నశించినచో) నా భర్త వంశము విచ్ఛిన్నమై పోవును. 8

మూ. యథాజ్ఞం కురు సౌమిత్రే త్యజ్య మాం దుఃఖభాగినీమ్,
నిదేశే స్థీయతాం రాజ్ఞః శృణు చేదం వచో మమ. 9

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! యథాజ్ఞమ్ = ఆజ్ఞానుసారముగా, కురు = చేయుము. దుఃఖభాగినీమ్ = దుఃఖమును అనుభవించవలసిన, మామ్ = నన్ను, త్యజ్య = విడచి, రాజ్ఞః = రాజుయొక్క, నిదేశే = ఆజ్ఞయందు, స్థీయతామ్ = ఉండెదవుగాక. మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, వచః చ = వచనమును కూడ శృణు = వినుము.

తా. లక్ష్మణా! రాజాజ్ఞప్రకారము చేయుము. దుఃఖమును అనుభవించవలసిన నన్ను విడచి రాజాజ్ఞను ఆచరించుము. నేను చెప్పు ఈ మాటలు కూడా వినుము. 9

మూ. శ్వశ్రూణామవిశేషేణ ప్రాఞ్జలిప్రగ్రహేణ చ,
శిరసా వన్ద్య చరణౌ కుశలం బ్రూహి పార్థివమ్. 10

ప్ర. అ. శ్వశ్రూణామ్ = అత్తగార్లకు, అవిశేషేణ = విశేషము లేకుండ, ప్రాఞ్జలిప్రగ్రహేణ చ = దోసిలి కట్టుటచేత, శిరసా = శిరస్సుతో, చరణౌ = పాదాలను, వన్ద్య = నమస్కరించి, పార్థివమ్ = రాజును, కుశలమ్ = కుశలమును, బ్రూహి = పలుకుము.

తా. అత్తగార్లందరికీ భేదమేమీ లేకుండా చేతులు జోడించి, పాదములు స్పృశించి నమస్కరించి నట్లు చెప్పవలెను. రాజును కుశల మడిగి నట్లు చెప్పుము.

మూ. శిరసాభినతో బ్రూయాః సర్వాసామేవ లక్ష్మణ,
వక్తవ్యశ్చాపి నృపతిర్ధర్మేషు సుసమాహితః. 11

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! సర్వాసామ్ ఏవ = అత్త లందరికీ, శిరసా = శిరస్సుతో, అభినతః = వంగినవాడవై, బ్రూయాః = చెప్పుము. ధర్మేషు = ధర్మములయందు, సుసమాహితః = బాగా సావధానచిత్తుడైన, నృపతిః చ అపి = రాజు కూడ, వక్తవ్యః = చెప్పదగినవాడు.

తా. లక్ష్మణా! అత్తలందరికి శిరస్సుతో నమస్కరించి నా విషయము చెప్పుము. ధర్మములయందు చాల శ్రద్ధ గల రాజుతో కూడ ఇట్లు చెప్పుము. 11

మూ. జానాసి చ యథా శుద్ధా సీతా తత్త్వేన రాఘవ,
భక్త్యా చ పరయా యుక్తా హితా చ తవ నిత్యశః. 12

ప్ర. అ. రాఘవ = రామా! సీతా = సీత, తత్త్వేన = యాథార్థ్యముచేత, యథా = ఎట్లు, శుద్ధా = పరిశుద్ధురాలో, పరమయా = గొప్ప, భక్త్యా = భక్తితో, యుక్తా చ = కూడినదో, నిత్యశః = నిత్యము, తవ = నీకు, హితా చ = హితురాలో, జానాసి = ఎరుగుదువు.

తా. రామా! సీత పరిశుద్ధురాలు; గొప్ప భక్తి గలది; నిత్యము నీ హితమును కోరునది అను విషయము నీకు తెలియును. 12

మూ. అహం త్యక్తా త్వయా వీర అయశోభీరుణా జనే,
యచ్చ తే వచనీయం స్యాదపవాదసముత్థితమ్, 13
మయా చ పరిహర్తవ్యం త్వం హి మే పరమా గతిః.

ప్ర. అ. వీర = వీరుడా! జనే = జనమునందు, అయశోభీరుణా = అపకీర్తి వలన భయపడిన, త్వయా = నీచేత, అహమ్ = నేను, త్యక్తా = విడవబడితిని. అపవాదసముత్థితమ్ = లోకాపవాదమువలన కలిగిన, తే = నీయొక్క, యత్ = ఏ, వచనీయమ్ = నింద గలదో అది, మయా = నాచేత, పరిహర్తవ్యమ్ = పరిహరించదగినది. త్వమ్ = నీవే, మే = నాయొక్క, పరమా = గొప్ప, గతిః = గతివి కదా.

తా. వీరుడా! ప్రజలలో వచ్చిన అపకీర్తినుండి భయపడి నీవు నన్ను త్యజించినావు. లోకాపవాదవలన నీకు కలిగిన ఈ నిందను నేను తొలగించవలెను. నీవే నా ఉత్తమగతివి కదా? 13

మూ. వక్తవ్యశ్చేతి నృపతిర్ధర్మేణ సుసమాహితః, 14
యథా భ్రాతృషు వర్తేథాస్తథా పౌరేషు నిత్యదా.

ప్ర. అ. ధర్మేణ = ధర్మముచేత, సుసమాహితః = చాల సావధానచిత్తు

డైన, నృపతిః = రాజు, ఇతి = ఇట్లు, వక్తవ్యః చ = చెప్పదగినవాడు. భ్రాతృషు = సోదరుల విషయమునందు, యథా = ఎట్లు, వర్తేథాః = ప్రవర్తింతువో, పౌరేషు = పౌరులవిషయమునందు, నిత్యదా = ఎల్లప్పుడూ, తథా = అట్లే ప్రవర్తించెదవు గాక.

తా. ధర్మము విషయమున సావధానచిత్తుడైన రాజుతో ఇట్లు చెప్పుము. నీవు పౌరులను నిత్యము సోదరులను చూచుకొన్నట్లు చూచుకొనుము. 14

మూ. పరమో హ్యేష ధర్మస్తే తస్మాత్కీర్తిరనుత్తమా, 15
యత్తు పౌరజనే రాజన్ ధర్మేణ సమవాప్నుయాత్.

ప్ర. అ. ఏషః = ఇది, తే = నీయొక్క, పరమః = గొప్ప, ధర్మః హి = ధర్మము కదా ? రాజన్ = రాజా ! పౌరజానపదే = పౌరజానపదుల విషయమున, ధర్మేణ = ధర్మముచేత, యత్ = దేనిని, సమవాప్నుయాత్ = పొందునో, తస్మాత్ = దానివలన, అనుత్తమా = చాల గొప్పదైన, కీర్తిః = కీర్తి కలుగును.

తా. ఇది (పౌరులను సోదరులను వలె చూచుకొనుట) నీకు గొప్ప ధర్మము. రాజా! పౌరజానపదుల విషయమునందు ధర్మప్రవృత్తిచే లభించు పుణ్యమువలన అత్యధికమైన కీర్తి లభించును కదా? 15

మూ. అహం తు నానుశోచామి స్వశరీరం నరర్షభ, 16
యథాపవాదః పౌరాణాం తథైవ రఘునన్దన.

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా! అహం తు = నేనైతే, స్వశరీరమ్ = నా శరీరమునుగూర్చి, న అనుశోచామి = విచారించను. రఘునన్దన = రామా ! పౌరాణామ్ = పౌరులయొక్క, అపవాదః = అపవాద, యథా = ఎట్లున్నదో, తథైవ = అట్లే.

తా. నరశ్రేష్ఠుడవైన రామా! నేను నా శరీరమును గూర్చి విచారించుటలేదు. పౌరుల అపవాదము ఎట్లున్నదో దానిని పట్టియే నేను ప్రవర్తించెదను; అనగా నీకు దూరముగా ఉండుటకు సిద్ధముగా ఉన్నాను. 16

మూ. పతిర్హి దేవతా నార్యాః పతిర్బన్ధుః పతిర్గురుః, 17
ప్రాణైరపి ప్రియం తస్మాద్భర్తుః కార్యం విశేషతః.

ప్ర. అ. నార్యాః = స్త్రీకి, పతిః = భర్త, దేవతా హి = దేవత కదా? పతిః = భర్తయే, బన్ధుః = బంధువు, పతిః = భర్తయే, గురుః = గురువు. తస్మాత్ = ఆ కారణమువలన, భర్తుః = భర్తకు, ప్రియమ్ = ప్రియమైనది, విశేషతః = విశేషముగా, ప్రాణైః అపి = ప్రాణములచేత కూడ, కార్యమ్ = చేయదగినది.

తా. స్త్రీకి భర్తయే దేవత; భర్తయే బంధువు, భర్తయే గురువు. అందువలన భర్తకు ఇష్టమైన కార్యమును విశేషించి ప్రాణాలు అర్పించియైనా చేయవలెను. 17

మూ. ఇతి మద్వచనాద్రామో వక్తవ్యో మమ సంగ్రహః, 18
నిరీక్ష్య మాద్య గచ్ఛ త్వమృతుకాలాతివర్తినీమ్.

ప్ర. అ. ఇతి = ఇట్లు, మద్వచనాత్ = నా మాటవలన, రామః = రాముడు, వక్తవ్యః = చెప్పదగినవాడు. (ఇది) మమ = నాయొక్క, సంగ్రహః = సంక్షిప్త వచనము. అద్య = ఇప్పుడు, ఋతుకాలాతివర్తినీమ్ = గర్భవతినైన, మా = నన్ను, నిరీక్ష్య = చూచి, త్వమ్ = నీవు, గచ్ఛ = వెళ్ళుము.

తా. నా మాటగా రామునితో ఇట్లు చెప్పుము. ఇదే నేను చెప్పదలచిన మాటల సంగ్రహము. నేను గర్భవతినై ఉన్నాను అను విషయమును చూచి వెళ్ళుము.

వి. మరల లోకాపవాదము కలుగకుండుటకై సీత లక్ష్మణుణ్ణి సాక్షిగా చూపుటకై ఇట్లు అన్నదని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. నిజానికి ఇది అనుచితమైన వాక్యము. అందుచేతనే ఈ శ్లోకంలోని ఉత్తరార్ధము, 21, 22 శ్లోకాలూ ప్రాచ్యప్రతిలో లేవు. 18

మూ. ఏవం బ్రువన్త్యాం సీతాయాం లక్ష్మణో దీనచేతనః, 19
శిరసా వన్ద్య ధరణీం వ్యాహర్తుం న శశాక హ.

ప్ర. అ. సీతాయామ్ = సీత, ఏవమ్ = ఈ విధముగా, బ్రువన్త్యామ్ = పలుకుచున్నదగుచుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, దీనచేతనః = దీనమైన మనస్సు గలవాడై, ధరణీమ్ = భూమిని, శిరసా = శిరస్సుతో, వన్ద్య = నమస్కరించి, వ్యాహర్తుమ్ = పలుకుటకు, న శశాక హ = సమర్థుడు కాలేదు.

తా. సీత ఇట్లు పలుకుచున్నప్పుడు లక్ష్మణుడు దైన్యముతో నిండిన

మనస్సుతో, సీత నిలచిన భూమికి శిరస్సుతో నమస్కరించి, ఏమీ మాటలాడలేక పోయెను. 19

మూ. ప్రదక్షిణం చ తాం కృత్వా రుదన్నేవ మహాస్వనః, 20
ధ్యాత్వా ముహూర్తం తామాహ కిం మాం వక్ష్యసి శోభనే.

ప్ర. అ. మహాస్వనః = గొప్ప ధ్వని కలవాడై, రుదన్నేవ = ఏడ్చుచునే, తామ్ = ఆమెను, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, ముహూర్తమ్ = ముహూర్తకాలము, ధ్యాత్వా = ఆలోచించి, తామ్ = ఆమెను గూర్చి, ఆహ = పలికెను. శోభనే = మంగళప్రదురాలా, మామ్ = నన్ను గూర్చి, కిమ్ = ఏమి, వక్ష్యసి = చెప్పెదవు ?

తా. అతడు బిగ్గరగా ఏడ్చుచు ఆమెకు ప్రదక్షిణము చేసి, ముహూర్త కాలము ఆలోచించి, ఆమెతో ఇట్లనెను- "మంగళప్రదురాలా! నీవు నాతో ఏమనుచున్నావు ?" 20

మూ. దృష్టపూర్వం న తే రూపం పాదౌ దృష్టౌ తవానఘే, 21
కథమత్ర హి పశ్యామి రామేణ రహితాం వనే,
ఇత్యుక్త్వా తాం నమస్కృత్య పునర్నావముపారుహత్.

ప్ర. అ. అనఘే = దోషము లేనిదానా ! తే = నీయొక్క, రూపమ్ = రూపము, న దృష్టపూర్వమ్ = పూర్వము చూడబడలేదు. పాదౌ = పాదములు (మాత్రము) దృష్టౌ = చూడబడినవి, అత్ర = ఈ, వనే = వనమునందు, రామేణ = రామునితో, రహితామ్ = శూన్యురాలవైన నిన్ను, కథమ్ = ఎట్లు, పశ్యామి = చూచెదను. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, తామ్ = ఆమెను, నమస్కృత్య = నమస్కరించి, పునః = మరల, నావమ్=నావను, ఉపారుహత్ = ఎక్కెను.

తా. "దోషములేనిదానా ! నీ రూపమును పూర్వము నేనెన్నడూ చూడలేదు. పాదాలు మాత్రమే చూచితిని. ఇక్కడ ఈ వనమునందు, రాముడు దగ్గర లేని నిన్ను నేనెట్లు చూచెదను ?" ఇట్లు పలికి, ఆమెకు నమస్కరించి మరల నావ ఎక్కెను. 21, 22

మూ. ఆరురోహ పునర్నావం నావికం చాభ్యచోదయత్,
స గత్వా చోత్తరం తీరం శోకభారసమన్వితః, 23
సంమూఢ ఇవ దుఃఖేన రథమధ్యారుహద్ద్రుతమ్.

ప్ర. అ. పునః = తిరిగి, నావమ్ = నావను, ఆరురోహ = ఎక్కెను. నావికమ్ = నావికుణ్ణి, అభ్యచోదయత్ చ = ప్రేరేపించెను కూడ. శోకభార సమన్వితః = దుఃఖభారముతో కూడిన, దుఃఖేన = దుఃఖముచేత, సమూఢః ఇవ = మూడుడు వలె ఉన్న, సః = అతడు, ఉత్తరం తీరమ్ = ఉత్తరమువైపు తీరమును, గత్వా = పొంది, ద్రుతమ్ = శీఘ్రముగా, రథమ్ = రథమును, అధ్యారుహత్ = ఎక్కెను.

తా. శోకభావముతో క్రుంగి, దుఃఖముచేత ఏమీ తోచని స్థితిలో ఉన్న ఆ లక్ష్మణుడు గంగ ఆవలి ఒడ్డు చేరి శీఘ్రముగా రథము నెక్కెను. 23

మూ. ముహుర్ముహుః పరావృత్య దృష్ట్వా సీతామనాథవత్,
చేష్టన్తీం పరతీరస్థాం లక్ష్మణః ప్రయయావథ.

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, పరతీరస్థామ్ = మరొక ఒడ్డున ఉన్న, అనాథవత్ = అనాథురాలి వలె, చేష్టన్తీం = దొరలుచున్న, సీతామ్ = సీతను, పరావృత్య = వెనుకకు తిరిగి, ముహుః ముహుః = మాటిమాటికి, దృష్ట్వా = చూచి, అథ = అటుపిమ్మట, ప్రయయౌ = వెళ్లెను.

తా. రెండవ ఒడ్డున అనాథురాలు వలె దుఃఖముతో పొరలుచున్న సీతను మాటిమాటికి వెనుకకు తిరిగి చూచుచు లక్ష్మణుడు వెళ్లెను. 24

మూ. దూరస్థం రథమాలోక్య లక్ష్మణం చ ముహుర్ముహుః, 25
నిరీక్షమాణాం తూద్విగ్నాం సీతాం శోకః సమావిశత్.

ప్ర. అ. దూరస్థమ్ = దూరమునందున్న, రథమ్ = రథమును, లక్ష్మణం చ = లక్ష్మణుణ్ణీ, ముహుః ముహుః = మాటిమాటికి, ఆలోక్య = చూచి, నిరీక్షమాణామ్ = ఆలోచించుచున్న, ఉద్విగ్నామ్ = దిగులుచెందిన, సీతామ్ = సీతను, శోకః = శోకము, సమావిశత్ = ఆవహించెను.

తా. దూరముగా ఉన్న రథమును, లక్ష్మణుణ్ణి మాటిమాటికీ చూచి ఆలోచించుచు దిగులుచెందిన ఆ సీతను శోకము ఆవహించెను. 25

మూ. సా దుఃఖభారావనతా యశస్వినీ
యశోధరా నాథమపశ్యతీ సతీ,
రురోద సా బర్హిణనాదితే వనే
మహాస్వనం దుఃఖపరాయణా సతీ. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టాచత్వారింశః సర్గః.

ప్ర. అ. దుఃఖభారావనతా = దుఃఖభారముచేత క్రుంగిపోయినది, యశస్వినీ = కీర్తి గలది, యశోధరా = యశస్సును ధరించినది, నాథమ్ = భర్తను, అపశ్యతీ = చూడనిది, సతీ = పతివ్రతా అయిన, సా = ప్రసిద్ధురాలైన, సా = ఆ సీత, దుఃఖపరాయణా సతీ = దుఃఖమునకు లొంగిపోయినదై, బర్హిణనాదితే = నెమళ్ళచేత ధ్వనిచేయించబడిన, వనే = వనమునందు, మహాస్వనమ్ = గొప్ప ధ్వని కలుగునట్లుగా, రురోద = ఏడ్చెను.

తా. కీర్తిమంతురాలైన ఆ సీత దుఃఖభారముచేత క్రుంగిపోయెను. కీర్తిని ధరించిన ఆమెకు నాథుడు కనబడకపోవుటచే దుఃఖావిష్టురాలై, నెమళ్ళ ధ్వనులతో నిండిన ఆ వనమునందు బిగ్గరగా ఏడ్చెను. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో నలభైఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనపఞ్చాశః సర్గః

[వాల్మీకి మునికుమారులద్వారా సీతను గూర్చి విని అక్కడికి వచ్చి, సీతను ఓదార్చి ఆమెను తన ఆశ్రమములోనికి తీసికొని వెళ్ళుట]

మూ. సీతాం చ రుదతీం దృష్ట్వా తే తత్ర మునిదారకాః,
ప్రాద్రవన్ యత్ర భగవానాస్తే వాల్మీకిరుగ్రధీః. 1

ప్ర. అ. తత్ర = అక్కడ, తే మునిదారకాః = ఆ మునికుమారులు, రుదతీమ్ = ఏడ్చుచున్న, సీతామ్ = సీతను, దృష్ట్వా = చూచి, భగవాన్ = పూజ్యుడైన, ఉగ్రధీః = గొప్ప బుద్ధి గల, వాల్మీకిః=వాల్మీకి, యత్ర=ఎక్కడ, ఆస్తే = ఉన్నాడో అక్కడికి, ప్రాద్రవన్ = పరుగెత్తి వెళ్ళిరి.

తా. మునికుమారులు, అక్కడ ఏడ్చుచున్న సీతను చూచి, పూజ్యుడు, గొప్పబుద్ధి గలవాడు అయిన వాల్మీకి దగ్గరికి పరుగెత్తి వెళ్ళిరి. 1

మూ. అభివాద్య మునేః పాదౌ మునిపుత్రా మహర్షయే,
సర్వే నివేదయామాసుస్తస్యాస్తు రుదితస్వనమ్. 2

ప్ర. అ. సర్వే = సమస్తమైన, మునిపుత్రాః = మునిపుత్రులు, మునేః = మునియొక్క, పాదౌ = పాదములను, అభివాద్య = నమస్కరించి, తస్యాః = సీతయొక్క, రుదితస్వనమ్ = ఏడ్పుయొక్క ధ్వనిని గూర్చి, మహర్షయే = ఆ మహర్షికి, నివేదయామాసుః = తెలిపిరి.

తా. ఆ మునిపుత్రు లందరూ వాల్మీకి పాదములకు నమస్కరించి ఆతనికి సీత ఏడ్పును గూర్చి తెలిపిరి. 2

మూ. అదృష్టపూర్వా భగవాన్ కస్యాప్యేషా మహాత్మనః,
పత్నీ శ్రీరివ సంమోహాద్విరౌతి భృశమాకులా. 3

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! కస్యాపి = ఎవరో, మహాత్మనః = మహాత్మునియొక్క, పత్నీ = భార్యఅయిన, శ్రీరివ = లక్ష్మి వలె ఉన్న, అదృష్ట పూర్వా = పూర్వము చూడబడని, ఏషా = ఈమె, సంమోహాత్ = మోహము వలన, భృశమ్ = మిక్కిలి, ఆకులా = వ్యాకులురాలై, విరౌతి = ఏడ్చుచున్నది.

తా. పూజ్యుడా! ఎవరో మహానుభావుని భార్య అయిన లక్ష్మీదేవి వలె ఉన్న, పూర్వ మెన్నడూ చూడబడని ఈమె చాల వ్యాకులురాలై మోహమువలన ఏడ్చుచున్నది. 3

మూ. భగవన్ సాధు పశ్యేస్త్వం దేవతామివ ఖాచ్చ్యుతామ్,
నద్యాస్తు తీరే భగవన్ వరస్త్రీ కాపి దుఃఖితా. 4

దృష్టాస్మాభిః ప్రరుదితా దృఢం శోకపరాయణా,
అనర్హా దుఃఖశోకాభ్యామేకా దీనా అనాథవత్. 5

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! నద్యాః = నదియొక్క, తీరే = తీరము నందు, దుఃఖితా = దుఃఖితురాలైనది, ప్రరుదతీ = ఏడ్చుచున్నది, దృఢమ్ = మిక్కిలి, శోకపరాయణా = శోకమునకు అధీనురాలైనది, దుఃఖశోకాభ్యామ్ = దుఃఖశోకములచేత, అనర్హా = తగనిది, ఏకా = ఒంటరిది, దీనా = దీనురాలు, అనాథవత్ = నాథుడు లేనివది వలె ఉన్న, కాపి = ఒకానొక, వరస్త్రీ = శ్రేష్ఠ రాలైన స్త్రీ, అస్మాభిః = మాచేత, దృష్టా = చూడబడినది. భగవన్ = పూజ్యుడా! ఖాత్ = ఆకాశమునుండి, చ్యుతామ్ = జారిన, దేవతామ్ ఇవ = దేవత వలె ఉన్న ఈమెను, త్వమ్ = నీవు, సాధు = బాగుగా, పశ్యేః = చూచెదవుగాక.

తా. ఓ! పూజ్యుడా! నదీతీరమునందు మేము ఒక దుఃఖించుచున్న ఉత్తమ స్త్రీని చూచినాము. ఆమె అధికమైన దుఃఖావేశముతో బిగ్గరగా ఏడ్చుచున్నది. దుఃఖశోకములకు తగని ఆమె అనాథ వలె ఒంటరిగా దీనురాలై ఉన్నది. ఆకాశమునుండి పడిన దేవత వలె ఉన్న ఆమెను చూడుము. 4, 5

మూ. న హ్యేనాం మానుషీం విద్మః సత్క్రియాస్యాః ప్రయుజ్యతామ్,
ఆశ్రమస్యావిదూరే చ త్వామియం శరణం గతా. 6
త్రాతారమిచ్ఛతీ సాధ్వీ భగవంస్త్రాతుమర్హసి.

ప్ర. అ. ఏనామ్ = ఈమెను, మానుషీమ్ = మనుష్యస్త్రీనిగా, న విద్మః = అనుకొనము. అస్యాః = ఈమెయొక్క, సత్క్రియా = సత్కారము, ప్రయుజ్యతామ్ = చేయబడుగాక. ఇయమ్ = ఈమె, ఆశ్రమస్య = ఆశ్రమముయొక్క, అవిదూరే = సమీపమునందు, త్వామ్ = నిన్ను, శరణం గతా = శరణము పొందినది. భగవన్ = పూజ్యుడా! సాధ్వీ = ఉత్తమురాలైన ఈమె, త్రాతారమ్ = రక్షకుణ్ణి, ఇచ్ఛతీ = కోరుచున్నది. త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. ఓ! పూజ్యుడా! ఈమె మనుష్యస్త్రీ అని అనుకొనము. ఈమెకు సత్కారము చేయుము. ఈమె ఆశ్రమసమీపమునకు వచ్చి నిన్ను శరణుజొచ్చినది. రక్షకుణ్ణి కోరుచున్నది. నీవు ఈమెను రక్షించుము. 6

మూ. తేషాం తు వచనం శ్రుత్వా బుద్ధ్యా నిశ్చిత్య ధర్మవిత్. 7
తపసా లబ్ధచక్షుష్మాన్ ప్రాద్రవద్యత్ర మైథిలీ,
తం ప్రయాన్తమభిప్రేక్ష్య శిష్యా హ్యేనం మహామతిమ్. 8

ప్ర. అ. తపసా = తపస్సుచేత, లబ్ధచక్షుష్మాన్ = పొందబడిన నేత్రములు గల, ధర్మవిత్ = ధర్మములు ఎరిగిన వాల్మీకి, తేషామ్ = వాళ్ళయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, బుద్ధ్యా = బుద్ధిచేత, నిశ్చిత్య = నిశ్చయించి, మైథిలీ = సీత, యత్ర = ఎక్కడ ఉన్నదో అక్కడికి, ప్రాద్రవత్ = శీఘ్రముగా వెళ్ళెను. ప్రయాన్తమ్ = వెళ్ళుచున్న, తమ్ = అతనిని, అభిప్రేక్ష్య = చూచి, శిష్యాః = శిష్యులు, మహామతిమ్ = గొప్ప బుద్ధి గల, ఏనమ్ = ఈతనిని, (అనుసరించి పరుగెత్తిరి).

తా. తపస్సుచేత దివ్యదృష్టి సంపాదించిన ధర్మములు తెలిసిన ఆ వాల్మీకి వాళ్ళ మాటలు విని బుద్ధిచేత ఒక నిర్ణయము చేసికొని, సీత ఉన్నచోటికి శీఘ్రముగా వెళ్ళెను. ఆ వాల్మీకి వెంట ఆయన శిష్యులుకూడ శీఘ్రముగా వెళ్ళిరి. 7, 8

మూ. తం తు దేశమభిప్రేత్య కించిత్ పద్భ్యాం మహామతిః,
అర్ఘ్యమాదాయ రుచిరం జాహ్నవీతీరమాగమత్, 9
దదర్శ రాఘవస్యేష్టాం సీతాం పత్నీమనాథవత్.

లేనిదానవని నేను ఎరుగుదును. ఇప్పుడు నీవు నాదగ్గర ఉన్నావు. నిర్భయముగా ఉండుము. 14

మూ. ఆశ్రమస్యావిదూరే మే తాపస్యస్తపసి స్థితాః, 15
తాస్త్వాం వత్సే యథా వత్సం పాలయిష్యన్తి నిత్యశః.

ప్ర. అ. వత్సే ! = ఓ వత్సా ! మే = నాయొక్క, ఆశ్రమస్య=ఆశ్రమమునకు, అవిదూరే = సమీపమునందు, తాపస్యః = తాపసస్త్రీలు, తపసి = తపస్సునందు, స్థితాః = ఉన్నారు. తాః=ఆ తాపసస్త్రీలు, త్వామ్ = నిన్ను, వత్సం యథా = లేగదూడను వలె, నిత్యశః = ఎల్లప్పుడూ, పాలయిష్యన్తి = పాలించగలరు.

తా. అమ్మా ! నా ఆశ్రమానికి దగ్గరనే కొందరు స్త్రీలు తపస్సు చేసికొనుచున్నారు. ఆ తాపసస్త్రీలు నిన్ను, గోవు తన లేగదూడను పాలించినట్లు, నిత్యమూ పాలించగలరు. 15

మూ. ఇదమర్ఘ్యం ప్రతీచ్ఛ త్వం విస్రబ్ధా విగతజ్వరా, 16
యథా స్వగృహమభ్యేత్య విషాదం చైవ మా కృథాః.

ప్ర. అ. త్వమ్ = నీవు, ఇదమ్ = ఈ, అర్ఘ్యమ్=అర్ఘ్యమును, ప్రతీచ్ఛ= స్వీకరించుము. విస్రబ్ధా = నమ్మకము గలదానవై, విగతజ్వరా = పోయిన మనస్తాపము కలదానవై, స్వగృహం యథా = స్వగృహమును వలె, అభ్యేత్య = పొంది, విషాదమ్ = దుఃఖమును, మా చ ఏవ కృథాః = చేయకుము.

తా. ఈ అర్ఘ్యమును స్వీకరించుము. మనోవ్యథను విడచి, పూర్తి నమ్మకముతో నీ స్వగృహమునకు వచ్చినట్లు వచ్చి ఉండుము. దుఃఖించకుము. 16

మూ. శ్రుత్వా తు భాషితం సీతా మునేః పరమమద్భుతమ్, 17
శిరసా వన్ద్య చరణౌ తథేత్యాహ కృతాఞ్జలిః.

ప్ర. అ. సీతా = సీత, మునేః = మునియొక్క, పరమమ్ = మిక్కిలి, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, శిరసా= శిరస్సుచేత, చరణౌ = పాదాలను, వన్ద్య = నమస్కరించి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలదై, తథేతి = అట్లే అని, ఆహ = పలికెను.

తా. సీత చాల ఆశ్చర్యకరములైన ఆ వాల్మీకి మాటలు విని, శిరస్సుచేత అతని పాదాలకు నమస్కరించి, దోసిలి కట్టి "అట్లే చేసెదను" అని పలికెను.

మూ. తం ప్రయాన్తం మునిం సీతా ప్రాఞ్జలిః పృష్ఠతోఽన్వగాత్,
తం దృష్ట్వా మునిమాయాన్తం వైదేహ్యా మునిపత్నయః,
ఉపాజగ్ముర్ముదా యుక్తా వచనం చేదమబ్రువన్. 19

ప్ర. అ. ప్రయాన్తమ్ = నడచుచున్న, తం మునిమ్ = ఆ మునిని, సీతా = సీత, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలదై, పృష్ఠతః = వెనుకనే, అన్వగాత్ = అనుసరించి వెళ్లెను. వైదేహ్యా = సీతతో కూడ, ఆయాన్తమ్ = వచ్చుచున్న, తం మునిమ్ = ఆ మునిని, దృష్ట్వా = చూచి, మునిపత్నయః = మునుల భార్యలు, ముదా = సంతోషముతో, యుక్తాః = కూడినవారై, ఉపాజగ్ముః = సమీపించిరి. ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును కూడ, అబ్రువన్ = పలికిరి.

తా. ముందు నడచుచున్న ఆ ముని వెనుకనే సీత అంజలి ఘటించి నడచి వెళ్ళెను. సీతను తీసికొని వచ్చుచున్న ఆ వాల్మీకిని మునిపత్నులు చూచి, సంతోషముతో ఆయన దగ్గరకు వచ్చి ఇట్లు పలికిరి. 18, 19

మూ. స్వాగతం తే మునిశ్రేష్ఠ చిరస్యాగమనం చ తే,
అభివాదయామస్త్వాం సర్వా ఉచ్యతాం కిం చ కుర్మహే.

ప్ర. అ. మునిశ్రేష్ఠ = మునిశ్రేష్ఠా! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము. తే = నీయొక్క, ఆగమనమ్ = ఆగమనము, చిరస్య = చిరకాలమునకు జరిగినది. సర్వాః = మేమందరమూ, త్వామ్ = నిన్ను, అభివాదయామః = నమస్కరించుచున్నాము. కిం కుర్మహే = ఏమి చేయుదుము ? ఉచ్యతామ్ = చెప్పబడుగాక.

తా. మునిశ్రేష్ఠా! నీకు స్వాగతము. నీవు చాలకాలము తరువాత వచ్చినావు. నీకు అభివాదనము చేయుచున్నాము. ఏమి చేయవలెనో చెప్పుము. 20

మూ. తాసాం తద్వచనం శ్రుత్వా వాల్మీకిరిదమబ్రవీత్,
సీతేయం సమనుప్రాప్తా పత్నీ రామస్య ధీమతః. 21

ప్ర. అ. తాసామ్ = ఆ స్త్రీలయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, వాల్మీకిః = వాల్మీకి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను,

ధీమతః = బుద్ధిమంతుడైన, రామస్య = రాముని యొక్క, పత్నీ = భార్య అయిన. ఇయమ్ = ఈ, సీతా = సీత, సమనుప్రాప్తా = వచ్చినది.

తా. ఆ స్త్రీల మాటలు విని వాల్మీకి ఇట్లు పలికెను-"బుద్ధిమంతుడైన రాముని భార్యయైన సీత ఇక్కడికి వచ్చినది". 21

మూ. స్నుషా దశరథస్యైషా జనకస్య సుతా సతీ,
అపాపా పతినా త్యక్తా పరిపాల్యా మయా సదా. 22

ప్ర. అ. దశరథస్య=దశరథుని యొక్క, స్నుషా = కోడలు, జనకస్య= జనకుని యొక్క, సుతా = కూతురు, సతీ = పతివ్రత, అపాపా = పాపము లేనిదీ అయిన, ఏషా = ఈమె, పతినా = భర్తచేత, త్యక్తా = విడువబడినది. మయా = నాచేత, సదా = ఎల్లప్పుడూ, పరిపాల్యా = పాలింపదగినది.

తా. ఈమె దశరథుని కోడలు; జనకుని కూతురు; పతివ్రత. ఏ పాపమూ లేని ఈమెను భర్త పరిత్యజించినాడు. అందుచే నేను ఈమెను నిత్యము పాలించవలెను. 22

మూ. ఇమాం భవత్యః పశ్యన్తు స్నేహేన పరమేణ హి,
గౌరవాన్మమ వాక్యాచ్చ పూజ్యా వోఽస్తు విశేషతః. 23

ప్ర. అ. భవత్యః = మీరు, ఇమామ్ = ఈమెను, పరమేణ = గొప్ప, స్నేహేన= స్నేహముతో, పశ్యన్తు=చూచెదరుగాక. గౌరవాత్ =గౌరవమువలన, మమ = నా యొక్క, వాక్యాచ్చ = వాక్యమువలన, విశేషతః = విశేషముగ, వః= మీకు, పూజ్యా = పూజించదగినది, అస్తు = అగుగాక.

తా. మీరు ఈమెను గొప్ప స్నేహముతో చూచెదరుగాక. ఈమె కుటుంబమునందు గౌరవభావమువలన నా మాటవలన మీరు ఈమెను విశేషించి పూజింతురుగాక. 23

మూ. ముహుర్మహుశ్చ వైదేహీం పరిదాయ మహాయశాః,
స్వమాశ్రమం శిష్యవృతః పునరాయాన్మహాతపాః. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనపఞ్చాశః సర్గః.

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల. మహాతపాః = గొప్ప తపస్సు గల ఆ వాల్మీకి. వైదేహీమ్ = సీతను, ముహుః ముహుః చ = మాటిమాటికి, పరిదాయ = అప్పచెప్పి, శిష్యవృతః = శిష్యులతో కూడినవాడై, స్వమ్ = తన సంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, పునః = మరల, ఆయాత్ = వచ్చెను.

తా. గొప్ప కీర్తి, తపస్సు గల ఆ వాల్మీకి సీతను మాటిమాటికి వారికి, అప్పగించి, శిష్యులతో కలిసి తన ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నలభైతొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చాశః సర్గః

[లక్ష్మణసుమంత్రుల సంభాషణము]

మూ. దృష్ట్వా తు మైథిలీం సీతామాశ్రమే సంప్రవేశితామ్,
సంతాపమగమద్ఘోరం లక్ష్మణో దీనచేతనః. 1

ప్ర. అ. మైథిలీమ్ = మిథిలారాజకుమారియైన, సీతామ్ = సీతను, ఆశ్రమే = ఆశ్రమమునందు, సంప్రవేశితామ్ = ప్రవేశ పెట్టబడిన దానినిగా, దృష్ట్వా = చూచి, లక్ష్మణః = లక్ష్మణుడు, దీనచేతనః = దీనమైన బుద్ధి గలవాడై, ఘోరమ్ = భయంకరమైన, సంతాపమ్ = సంతాపమును, అగమత్ = పొందెను.

తా. సీత ఆశ్రమములో ప్రవేశించుట చూచి లక్ష్మణుడు మనస్సులో గొప్ప దైన్యము చెంది చాల సంతాపమును పొందెను. 1

మూ. అబ్రవీచ్చ మహాతేజాః సుమన్త్రం మన్త్రిసారథిమ్,
సీతాసంతాపజం దుఃఖం పశ్య రామస్య సారథే. 2

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల లక్ష్మణుడు, మన్త్రిసారథిమ్ = ఆలోచనలలో సారథి అయిన, సుమన్త్రమ్ = సుమంత్రుణ్ణి గూర్చి, అబ్రవీత్ చ = పలికెను. సారథే = సారథీ, రామస్య = రాముని యొక్క, సీతాసంతాపజమ్ = సీతావియోగసంతాపమువలన కలిగిన, దుఃఖమ్ = దుఃఖమును, పశ్య = చూడుము.

తా. గొప్ప తేజస్సు గల ఆ లక్ష్మణుడు ఆలోచనలో సారథి అయిన సుమంత్రునితో ఇట్లనెను-"సారథీ! రామునకు సీతావియోగమువలన ఎంతటి దుఃఖము కలిగినదో చూడుము". 2

మూ. తతో దుఃఖతరం కిం ను రాఘవస్య భవిష్యతి,
పత్నీం శుద్ధసమాచారాం విసృజ్య జనకాత్మజామ్. 3

ప్ర. అ. శుద్ధసమాచారామ్ = పరిశుద్ధమైన ఆచారముగల, పత్నీమ్ = భార్య అయిన, జనకాత్మజామ్ = సీతను, విసృజ్య = విడచి, రాఘవస్య = రామునకు, తతః = దానికంటె, దుఃఖతరమ్ = ఎక్కువ దుఃఖము కలిగించేది, కిం ను = ఏది, భవిష్యతి = కాగలదు.

తా. పరిశుద్ధమైన చరిత్ర గల భార్యయైన సీతను విడచిన రామునకు ఇంతకంటె అధికమైన దుఃఖము మరొకటి ఏదైన ఉండునా? 3

మూ. వ్యక్తం దైవాదహం మన్యే రాఘవస్య వినాభవమ్,
వైదేహ్యా సారథే నిత్యం దైవం హి దురతిక్రమమ్. 4

ప్ర అ. సారథే = సారథీ, రాఘవస్య = రామునియొక్క, వైదేహ్యా = సీతతో, వినాభవమ్ = వియోగమును, అహమ్ = నేను, వ్యక్తమ్ = స్పష్టముగా, దైవాత్ = దైవమువలన కలిగినదానినిగా, మన్యే = తలచుచున్నాను. నిత్యమ్ = నిత్యమూ, దైవమ్ = దైవము, దురతిక్రమం హి = దాట శక్యము కానిది కదా?

తా. సారథీ! రామునకు ఈ సీతావియోగము తప్పక దైవమువలననే కలిగినదని తలచెదను. దైవము ఏనాటికైనా దాట శక్యము కాదు కదా? 4

మూ. యో హి దేవాన్ సగన్ధర్వానసురాన్ సహరాక్షసైః,
నిహన్యాద్రాఘవః క్రుద్ధః స దైవమనువర్తతే. 5

ప్ర. అ. యః రాఘవః = ఏ రాముడు, క్రుద్ధః = కోపించినవాడై, సగన్ధర్వాన్ = గంధర్వులతో కూడిన, దేవాన్ = దేవతలను, సహరాక్షసైః = రాక్షసులతో కూడిన, అసురాన్ = అసురులను, నిహన్యాత్ = చంపునో, సః = అట్టి రాముడు, దైవమ్ = దైవమును, అనువర్తతే = అనుసరించుచున్నాడు.

తా. ఏ రాముడు కోపము వచ్చినచో గంధర్వులను, దేవతలను, అసురులను, రాక్షసులను సంహరించగలడో అట్టి రాముడు దైవమునకు కట్టుబడి ఉన్నాడు! 5

మూ. పురా రామః పితుర్వాక్యాద్దణ్డకే విజనే వనే,
ఉషితో నవ వర్షాణి పఞ్చ చైవ మహావనే. 6

ప్ర. అ. పురా = పూర్వము, రామః = రాముడు, పితుః = తండ్రియొక్క, వాక్యాత్ = వాక్యమువలన, విజనే వనే = జనశూన్యవనమైన, దణ్డకే = దండకమను, మహావనే = మహావనమునందు, నవ పఞ్చ చ = పద్నాలుగు, వర్షాణి = సంవత్సరములను, ఉషితః = నివసించినాడు.

తా. పూర్వము రాముడు తండ్రి మాటవలన విజనమైన దండకవనమునందు పదునాలుగు సంవత్సరములు నివసించినాడు. 6

మూ. తతో దుఃఖతరం భూయః సీతాయా విప్రవాసనమ్,
పౌరాణాం వచనం శ్రుత్వా నృశంసం ప్రతిభాతి మే. 7

ప్ర. అ. పౌరాణామ్ = పౌరులయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, భూయః = మరల, సీతాప్రవాసనమ్ = సీతను ప్రవాసము చేయించుట, తతః = దానికంటె, దుఃఖతరమ్ = చాల దుఃఖకరముగాను, నృశంసమ్ = క్రూరముగాను, మే = నాకు, ప్రతిభాతి = తోచుచున్నది.

తా. పౌరుల మాటలు విని సీతను దూరము పంపివేయుట దానికంటె ఎక్కువ దుఃఖకరము, క్రూరమూ అని నాకు తోచుచున్నది. 7

మూ. కో ను ధర్మాశ్రయః సూత కర్మణ్యస్మిన్ యశోహరే,
మైథిలీం సమనుప్రాప్తః పౌరైర్హీనార్థవాదిభిః. 8

ప్ర. అ. సూత = సారథీ! మైథిలీమ్ = సీతను గూర్చి, హీనార్థవాదిభిః = చెడ్డ విషయము పలికిన, పౌరైః = పౌరులచేత, యశోహరే = యశస్సును హరించు, అస్మిన్ కర్మణి = ఈ కర్మయందు, కః ను = ఏమి. ధర్మాశ్రయః = ధర్మముయొక్క ఆశ్రయము, సమనుప్రాప్తః = పొందబడినది. 8

తా. సారథీ ! సీత విషయములో చెడ్డ మాటలు పలికిన పౌరులకు కీర్తిని హరించు ఈ కర్మవలన ఏమి ధర్మము లభించినది ?

మూ. ఏతా వాచో బహువిధాః శ్రుత్వా లక్ష్మణభాషితాః,
సుమన్త్రః శ్రద్ధయా ప్రాజ్ఞో వాక్యమేతదువాచ హ. 9

ప్ర. అ. లక్ష్మణభాషితాః = లక్ష్మణునిచేత పలకబడిన, బహువిధాః =

అనేకవిధములైన, ఏతాః = ఈ, వాచః = వాక్కులను, శ్రుత్వా = విని, ప్రాజ్ఞః = బుద్ధిమంతుడైన, సుమన్త్రః = సుమంత్రుడు, శ్రద్ధయా = శ్రద్ధతో, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. లక్ష్మణుడు పలికిన అనేకవిధములైన ఈ మాటలు విని బుద్ధిమంతుడైన సుమంత్రుడు శ్రద్ధతో ఇట్లు పలికెను. 9

మూ. న సంతాపస్త్వయా కార్యః సౌమిత్రే మైథిలీం ప్రతి,
దృష్టమేతత్పురా విప్రైః పితుస్తే లక్ష్మణాగ్రతః. 10

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! మైథిలీం ప్రతి = సీతను గూర్చి, త్వయా = నీచేత, సంతాపః = దుఃఖము, న కార్యః = చేయదగినదికాదు. లక్ష్మణ = లక్ష్మణా ! పురా = పూర్వము, తే పితుః = నీ తండ్రియొక్క, అగ్రతః = ఎదుట, విప్రైః = బ్రాహ్మణులచేత, ఏతత్ = ఇది, దృష్టమ్ = చూడబడినది.

తా. లక్ష్మణా ! సీత విషయమున నీవు దుఃఖించకుము. పూర్వము నీ తండ్రి సమక్షమున బ్రాహ్మణులు ఈ విషయమును గూర్చి ముచ్చటించి ఉన్నారు.

మూ. భవిష్యతి దృఢం రామో దుఃఖప్రాయోఽప్యసౌఖ్యభాక్,
ప్రాప్స్యతే చ మహాబాహుర్విప్రయోగం ప్రియైర్ధ్రువమ్.

ప్ర. అ. రామః = రాముడు, దృఢమ్ = తప్పక, దుఃఖప్రాయః = ఎక్కువ దుఃఖము గలవాడు, అసౌఖ్యభాక్ అపి = అసౌఖ్యమును పొందేవాడూ, భవిష్యతి = కాగలడు. మహాబాహుః = గొప్ప బాహువులు గల రాముడు, ధ్రువమ్ = తప్పక, ప్రియైః = ఇష్టులతో, విప్రయోగమ్ = వియోగమును, ప్రాప్స్యతే చ = పొందగలడు కూడ.

తా. రాముడు తప్పక ఎక్కువ దుఃఖములు కలవాడు, కష్టములు అనుభవించేవాడు అగును. మహాబాహువైన ఇతడు తప్పక ఇష్టజనుల వియోగమును పొందును. 11

మూ. త్వాం చైవ మైథిలీం చైవ శత్రుఘ్నభరతౌ తథా,
స త్యజిష్యతి ధర్మాత్మా కాలేన మహతా మహాన్. 12

ప్ర. అ. మహాన్ = గొప్పవాడు, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, సః = ఆ రాముడు, మహతా = గొప్ప, కాలేన = కాలముచేత, త్వాం చైవ = నిన్ను, మైథిలీం చైవ = సీతను, తథా = మరియు, శత్రుఘ్నభరతౌ = శత్రుఘ్నభరతులను, త్యజిష్యతి = త్యజించగలడు.

తా. మహాత్ముడు, ధర్మాత్ముడూ అయిన రాముడు చాల కాలము తరువాత నిన్ను, సీతను, భరతశత్రుఘ్నులను కూడ విడచివేయు నని వారు చెప్పిరి. 12

మూ. ఇదం త్వయి న వక్తవ్యం సౌమిత్రే భరతేఽపి వా,
రాజ్ఞే వో వ్యాహృతే వాక్యే దుర్వాసా యదువాచ హ. 13

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! వః = మీయొక్క, రాజ్ఞే = రాజునకు, వ్యాహృతే = పలకబడిన, వాక్యే = వాక్యమునందు, దుర్వాసాః = దుర్వాసుడు, యత్ = దేనిని, ఉవాచ హ = పలికెనో, ఇదమ్ = ఇది, త్వయి = నీయందు గాని, భరతేఽపి వా = భరతునియందు గాని, న వక్తవ్యమ్ = చెప్పదగినది కాదు.

తా. లక్ష్మణా ! మీ రాజైన (తండ్రియైన) దశరథమహారాజుతో దుర్వాసుడు పలికిన మాటలలో చెప్పిన విషయము నీకు గాని. భరతునకు గాని చెప్పదగినది కాదు. 13

మూ. మహాజనసమీపే చ మమ చైవ నరర్షభ,
ఋషిణా వ్యాహృతం వాక్యం వసిష్ఠస్య చ సంనిధౌ. 14

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా ! ఋషిణా = దుర్వాసర్షిచేత, వాక్యమ్ = వాక్యము, మహాజనసమీపే చ = గొప్పవాడైన దశరథుని సమీపమునందు, మమ చైవ = నా సమీపమునందు, వసిష్ఠస్య చ = వసిష్ఠునియొక్క, సంనిధౌ = సంనిధియందు, వ్యాహృతమ్ = పలకబడినది.

తా. నరులలో శ్రేష్ఠుడవైన లక్ష్మణా ! దుర్వాసుడు నేను, దశరథమహారాజు, వసిష్ఠుడు ఉండగా మా ఎదుట చెప్పినాడు. 14

మూ. ఋషేస్తు వచనం శ్రుత్వా మామాహ పురుషర్షభః,
సూత న క్వచిదేవం తే వక్తవ్యం జనసంనిధౌ. 15

ప్ర. అ. ఋషేః = ఆ ఋషియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన దశరథుడు, మామ్ = నన్ను గూర్చి, ఆహ = పలికినాడు. సూత = సారథీ ! ఏవమ్ = ఈ విధముగా, తే = నీకు (నీచేత), క్వచిత్ = ఎక్కడనూ, జనసంనిధౌ = జనుల సంనిధియందు, న వక్తవ్యమ్ = చెప్పదగినది కాదు.

తా. దుర్వాసర్షి మాటలు విని దశరథుడు నాతో- "సుమంత్రా ! ఈ విషయమును ఎక్కడా కూడ జనుల సముదాయములో చెప్పకూడదు" అని పలికినాడు. 15

మూ. తస్యాహం లోకపాలస్య వాక్యం తత్సుసమాహితః,
నైవ జాత్వనృతం కుర్యామితి మే సౌమ్య దర్శనమ్. 16

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! అహమ్ = నేను, సుసమాహితః = మిక్కిలి సావధానచిత్తుడనై, తస్య = ఆ, లోకపాలస్య = రాజుయొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, జాతు = ఎన్నడూ కూడ, అనృతమ్ = అసత్యమునుగా, నైవ కుర్యామ్ = చెయ్యను, ఇతి = అని, మే = నాయొక్క, దర్శనమ్ = ఆలోచన.

తా. ఓ ! సౌమ్యుడా ! నేను చాల జాగరూకత వహించి దశరథమహారాజు చెప్పిన మాటను ఎన్నడూ అసత్యము చేయకూడ దని నా అభిప్రాయము.

మూ. సర్వథైవ న వక్తవ్యం మయా సౌమ్య తవాగ్రతః,
యది తే శ్రవణే శ్రద్ధా శ్రూయతాం రఘునన్దన. 17

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! రఘునన్దన = లక్ష్మణా ! మయా = నాచేత, తవ = నీయొక్క, అగ్రతః = ఎదట, సర్వథైవ = అన్ని విధములా, న వక్తవ్యమ్ = చెప్పదగినది కాదు. తే = నీకు, శ్రవణే = వినుటయందు, శ్రద్ధా యది = శ్రద్ధ ఉన్నట్లయితే, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. సౌమ్యుడవైన లక్ష్మణా! నేను నీ ఎదుట ఈ విషయమును చెప్పనే కూడదు. కాని నీకు వినవలెనను శ్రద్ధ ఉన్నచో వినుము. 17

మూ. యద్యప్యహం నరేన్ద్రేణ రహస్యం శ్రావితః పురా,
తథాప్యుదాహరిష్యామి దైవం హి దురతిక్రమమ్. 18

యేనేదమీదృశం ప్రాప్తం దుఃఖం శోకసమన్వితమ్,
న త్వయా భరతే వాచ్యం శత్రుఘ్నస్యాపి సంనిధౌ. 19

ప్ర. అ. పురా=పూర్వము, నరేన్ద్రేణ = రాజుచేత, అహమ్ = నేను, రహస్యమ్=రహస్యము అని, శ్రావితః యద్యపి=చెప్పబడినను, తథాపి= అట్లయినను, ఉదాహరిష్యామి=చెప్పెదను. దైవమ్=దైవము, దురతిక్రమం హి = దాట శక్యము కానిది కదా? యేన=దేనిచేత, ఈదృశమ్ = ఇట్టి, శోక సమన్వితమ్=శోకముతో కూడిన, దుఃఖమ్=దుఃఖము, ప్రాప్తమ్=వచ్చినదో, త్వయా=నీచేత, భరతే=భరతునియందు, శత్రుఘ్నస్య=శత్రుఘ్నునియొక్క, సంనిధౌ చ=సంనిధియందు, న వాచ్యమ్=చెప్పదగినది కాదు.

తా. పూర్వము దశరథుడు ఈ విషయము రహస్యము అని చెప్పి ఉన్నా కూడ నేను నీకు చెప్పెదను. ఏ దైవముచేత ఇట్టి శోకముతో కూడిన దుఃఖము కలిగినదో ఆ దైవము దాట శక్యము కాదు కదా? నీవు భరతునకు గాని శత్రుఘ్ననకు గాని చెప్పకూడదు. (శోకము అనగా తలచి తలచి ఏడవడం. దుఃఖం అనగా అనుభవిస్తూన్న కష్టం. సాధారణంగా ఈ పదాలను పర్యాయపదాలుగానే వాడినా ఒకే చోట రెండు పదాలూ ప్రయోగించినప్పుడు ఈ భేదం గుర్తించాలి).

మూ. తచ్ఛ్రుత్వా భాషితం తస్య గమ్భీరార్థపదం మహత్,
తథ్యం బ్రూహీతి సౌమిత్రిః సూతం తం వాక్యమబ్రవీత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తస్య=సుమంత్రునియొక్క, గమ్భీరార్థపదమ్ = గంభీరమైన అర్థము పదములూ గల, తత్=ఆ, మహత్=గొప్ప, భాషితమ్ = మాటను, శ్రుత్వా=విని, సౌమిత్రిః=లక్ష్మణుడు, తథ్యమ్=సత్యమును, బ్రూహి=

చెప్పుము, ఇతి = అని, తం సూతమ్ = ఆ సారథిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. లక్ష్మణుడు గంభీరమైన అర్థము పదములూ గల సుమంత్రుని ఆ గొప్ప మాటలు విని "సత్యము చెప్పుము" అని ఆతనితో పలికెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకపఞ్చాశః సర్గః

[సుమంత్రుడు తాను దుర్వాసుని ద్వారా విన్న భృగుశాప వృత్తాంతమును, కొంచెము రాబోవు కథను లక్ష్మణునికి చెప్పి ఆతనిని ఓదార్చుట.]

మూ. తథా సంచోదితః సూతో లక్ష్మణేన మహాత్మనా,
తద్వాక్యమృషిణా ప్రోక్తం వ్యాహర్తుముపచక్రమే. 1

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, తథా = అట్లు, సంచోదితః = ప్రేరేపించబడిన, సూతః = సారథి, ఋషిణా = దుర్వాసునిచేత, ప్రోక్తమ్ = పలకబడిన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, వ్యాహర్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. మహాత్ముడైన లక్ష్మణుడు అట్లు ప్రేరేపించగా సుమంత్రుడు దుర్వాసుడు చెప్పిన మాటలు చెప్పుటకు ఉపక్రమించెను. 1

మూ. పురా నామ్నా హి దుర్వాసా అత్రేః పుత్రో మహామునిః,
వసిష్ఠస్యాశ్రమే పుణ్యే వార్షిక్యం సమువాస హ. 2

ప్ర. అ. పురా = పూర్వము, నామ్నా = పేరుచేత, దుర్వాసాః = దుర్వాసుడైన, అత్రేః = అత్రియొక్క, పుత్రః = పుత్రుడైన, మహామునిః = మహాముని, పుణ్యే = పవిత్రమైన, వసిష్ఠస్య ఆశ్రమే = వసిష్ఠుని ఆశ్రమమునందు, వార్షిక్యమ్ = వర్షకాలసంబంధమైన చాతుర్మాస్యమును, ఉవాస హ = నివసించెను.

తా. పూర్వము అత్రి పుత్రుడైన దుర్వాసమహాముని పవిత్రమైన వసిష్ఠాశ్రమమునందు చాతుర్మాస్యమునకై నివసించెను. 2

మూ. తమాశ్రమం మహాతేజాః పితా తే సుమహాయశాః,
పురోహితం మహాత్మానం దిదృక్షురగమత్స్వయమ్. 3

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సుమహాయశాః = చాల గొప్ప కీర్తి గల, తే పితా = నీ తండ్రి, మహాత్మానమ్ = మహాత్ముడైన, పురోహితమ్ = పురోహితుణ్ణి, దిదృక్షుః = చూడ దలచినవాడై, స్వయమ్ = స్వయముగా, తమ్ ఆశ్రమమ్ = ఆ ఆశ్రమమును గూర్చి, అగమత్ = వెళ్ళెను.

తా. గొప్ప తేజస్సూ, యశస్సూ గల నీ తండ్రి పురోహితుడైన వసిష్ఠుని చూచుటకై స్వయముగా ఆ ఆశ్రమమునకు వెళ్లెను. 3

మూ. స దృష్ట్వా సూర్యసంకాశం జ్వలన్తమివ తేజసా,
ఉపవిష్టం వసిష్ఠస్య సవ్యపార్శ్వే మహామునిమ్, 4
తౌ మునీ తాపసశ్రేష్ఠౌ వినీతో హ్యభ్యవాదయత్.

ప్ర. అ. సః = అతడు, సూర్యసంకాశమ్ = సూర్యునితో సమానుడు, తేజసా = తేజస్సుతో, జ్వలన్తమివ = మండుచున్నట్లున్నవాడూ, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, సవ్యపార్శ్వే = కుడి ప్రక్కన, ఉపవిష్టమ్ = కూర్చొని ఉన్నవాడూ అయిన, మహామునిమ్ = ఆ మహామునిని, దృష్ట్వా = చూచి, తాపసశ్రేష్ఠౌ = తాపసులలో శ్రేష్ఠులైన, తౌ మునీ = ఆ మును లిద్దరినీ, వినీతః = వినయవంతుడై, అభ్యవాదయత్ = నమస్కరించెను.

తా. సూర్యునితో సమానుడైన దూర్వాసుడు తేజస్సుతో మండుచున్నట్లుండెను. ఆ మహాముని వసిష్ఠుని కుడి ప్రక్కన కూర్చొని ఉండెను. దశరథుడు ఆ మునిని చూచి, మునులలో శ్రేష్ఠులైన వారిద్దరికీ, సవినయముగా నమస్కరించెను.

మూ. స తాభ్యాం పూజితో రాజా స్వాగతేనాసనేన చ, 5
పాద్యేన ఫలమూలైశ్చ ఉవాస మునిభిః సహ.

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, తాభ్యామ్ = వారిద్దరిచేత, స్వాగతేన = స్వాగతముచేత, ఆసనేన చ = ఆసనముచేత, పాద్యేన = పాద్యముచేత, ఫలమూలైశ్చ = ఫలమూలములచేత, పూజితః = పూజింపబడినవాడై, మునిభిః సహ = మునులతో కూడ, ఉవాస = నివసించెను.

తా. ఆ మునులిద్దరూ దశరథమహారాజును స్వాగతము, ఆసనము,

పాద్యము, కందమూలములు ఇచ్చి ఆదరించిరి. అతడు మునులతో కలిసి కొంత సేపు అక్కడ ఉండెను. 5

మూ. తేషాం తత్రోపవిష్టానాం తాస్తాః సుమధురాః కథాః, 6
బభూవుః పరమర్షీణాం మధ్యాదిత్యగతేఽహని.

ప్ర. అ. ("తదా మధ్యగతేఽహని"అను ప్రాచ్యపాఠము బాగున్నది.) తత్ర = అక్కడ, ఉపవిష్టానామ్ = కూర్చొని ఉన్న, తేషామ్ = ఆ, పరమర్షీణామ్ = మహర్షులకు, తదా = అప్పుడు, అహని = పగటిభాగము, మధ్యగతే = మధ్యను పొందిన దగుచుండగా, సుమధురాః = చాల మధురములైన, తాః తాః = ఆ యా, కథాః = కథలు, బభూవుః = అయినవి.

తా. అక్కడ కూర్చొని ఉన్న ఆ మహర్షులు మధ్యాహ్నసమయమునందు చాల మధురములైన ఆ యా కథలు (మాటలు) చెప్పుకొనిరి. 6

మూ. తతః కథాయాం కస్యాంచిత్ప్రాఞ్జలిః ప్రగ్రహో నృపః, 7
ఉవాచ తం మహాత్మానమత్రేః పుత్రం తపోధనమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కస్యాం చిత్ = ఒకానొక, కథాయామ్ = కథయందు (ప్రసంగమునందు), ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలిగల, ప్రగ్రహః = నిగ్రహవంతుడైన, నృపః = రాజు, మహాత్మానమ్ = మహాత్ముడైన, అత్రేఃపుత్రమ్ = అత్రి కుమారుడైన, తం తపోధనమ్ = ఆ మునిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట ఒక ప్రసంగములో వినయవంతుడైన రాజు అంజలి ఘటించి అత్రిపుత్రుడైన మహాత్ముడైన ఆ దూర్వాసునితో ఇట్లనెను. 7

మూ. భగవన్ కింప్రమాణేన మమ వంశో భవిష్యతి, 8
కిమాయుశ్చ హి మే రామః పుత్రాశ్చాన్యే కిమాయుషః.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! మమ = నాయొక్క, వంశః = వంశము, కింప్రమాణేన = ఎంత ప్రమాణముచేత, భవిష్యతి = ఉండగలదు ? మే రామః = నా రాముడు, కిమాయుః చ = ఎంత ఆయుర్దాయము కలవాడు ? అన్యే పుత్రాః చ = ఇతరపుత్రులు కూడ, కిమాయుషః = ఎంత ఆయుర్దాయము కలవారు ?

తా. పూజ్యుడా ! నా వంశము ఎంతకాలము ఉండును ? నా రాముని ఆయుర్దాయ మెంత? నా ఇతరపుత్రుల ఆయుర్దాయ మెంత ? 8

మూ. రామస్య చ సుతా యే స్యుస్తేషామాయుః కియద్భవేత్, 9
కామ్యయా భగవన్ బ్రూహి వంశస్యాస్య గతిం మమ.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, యే = ఏ, సుతాః = పుత్రులు, స్యుః = ఉందురో, తేషామ్ = వాళ్ళయొక్క, ఆయుః = ఆయుర్దాయము, కియత్ = ఎంత, భవేత్ = ఉండును ? భగవన్ = పూజ్యుడా ! మమ = నాయొక్క, అస్య = ఈ, వంశస్య = వంశముయొక్క, గతిమ్ = గతిని గూర్చి, కామ్యయా = ఇచ్ఛచేత, బ్రూహి = చెప్పుము.

తా. పూజ్యుడా ! రామునకు పుట్టబోవు పుత్రుల ఆయుర్దాయము ఎంత ఉండును ? నా వంశము గతిని గూర్చి ఇచ్ఛానుసారము (నీకు చెప్పవలె నని ఉన్నచో) చెప్పుము. 9

మూ. తచ్ఛ్రుత్వా వ్యాహృతం వాక్యం రాజ్ఞో దశరథస్య తు,
దుర్వాసాః సుమహాతేజా వ్యాహర్తుముపచక్రమే.

ప్ర. అ. రాజ్ఞః = రాజైన, దశరథస్య = దశరథునియొక్క, తత్ = ఆ, వ్యాహృతమ్ = పలకబడిన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, సుమహాతేజాః = చాల గొప్ప తేజస్సు గల, దుర్వాసాః = దుర్వాసుడు, వ్యాహర్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. దశరథమహారాజు పలికిన మాటలు విని గొప్ప తేజస్సు గల దుర్వాసుడు చెప్పుటకు ఉపక్రమించెను. 10

మూ. శృణు రాజన్ పురావృత్తం తదా దేవాసురే యుధి, 11
దైత్యాః సురైర్భర్త్స్యమానా భృగుపత్నీం సమాశ్రితాః.
తయా దత్తాభయాస్తత్ర న్యవసన్నభయాస్తదా. 12

ప్ర. అ. రాజన్ = రాజా ! పురా = పూర్వము వృత్తమ్ = జరిగినదానిని, శృణు = వినుము. తదా = అప్పుడు, దేవాసురే యుధి = దేవాసురయుద్ధమునందు,

సురైః = దేవతలచేత, భర్త్స్యమానాః = భయపెట్టబడుచున్న, దైత్యాః = దైత్యులు, భృగుపత్నీమ్ = భృగుమహర్షి భార్యను, సమాశ్రితాః = ఆశ్రయించినారు. తయా = ఆమెచేత, దత్తాభయాః = ఇవ్వబడిన అభయము కలవారై, తదా = అప్పుడు, అభయాః = భయములేనివారై, తత్ర = అక్కడ, న్యవసన్ = నివసించిరి.

తా. రాజా! పూర్వము జరిగిన కథను వినుము. దేవాసురయుద్ధమునందు దేవతలు పీడించగా అసురులు భృగుమహర్షి భార్యను ఆశ్రయించిరి. ఆమె వాళ్లకు అభయ మిచ్చెను. అప్పుడు వాళ్లు భయము లేకుండ నివసించిరి. 11,12

మూ. తయా పరిగృహీతాంస్తాన్ దృష్ట్వా క్రుద్ధః సురేశ్వరః,
చక్రేణ శితధారేణ భృగుపత్న్యాః శిరోఽహరత్. 13

ప్ర. అ. తయా = ఆమెచేత, తాన్ = అసురులను, పరిగృహీతాన్ = గ్రహింపబడినవారినిగా, దృష్ట్వా = చూచి, సురేశ్వరః = విష్ణువు, క్రుద్ధః = కోపించినవాడై, శితధారేణ = వాడియైన అంచు గల, చక్రేణ = చక్రముచేత, భృగుపత్న్యాః = భృగుమహర్షి భార్యయొక్క, శిరః = శిరస్సును, అహరత్ = హరించెను.

తా. ఆ అసురులను ఆమె ఆ విధముగా చేరదీయుట చూచి కోపించిన విష్ణువు వాడియైన అంచుగల చక్రముతో భృగుమహర్షి భార్య తల నరికివేసెను.

మూ. తతస్తాం నిహతాం దృష్ట్వా పత్నీం భృగుకులోద్వహః,
శశాప సహసా క్రుద్ధో విష్ణుం రిపుకులార్దనమ్. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భృగుకులోద్వహః = భృగువుయొక్క కులమును ఉద్ధరించిన భృగుమహర్షి, పత్నీమ్ = భార్యను, నిహతామ్ = చంపబడిన దానినిగా, దృష్ట్వా = చూచి, క్రుద్ధః = కోపించి, సహసా = వెంటనే, రిపుకులార్దనమ్ = శత్రుకులమును పీడించువాడైన, విష్ణుమ్ = విష్ణువును, శశాప = శపించెను.

తా. భృగుమహర్షి తన భార్యను విష్ణువు చంపివేయుట చూచి, వెంటనే కోపించి శత్రుసంహారకుడైన ఆ విష్ణువును శపించెను. 14

మూ. యస్మాదవధ్యాం మే పత్నీమవధీః క్రోధమూర్ఛితః,
తస్మాత్త్వం మానుషే లోకే జనిష్యసి జనార్దన. 15
తత్ర పత్నీవియోగం త్వం ప్రాప్స్యసే బహువార్షికమ్.

ప్ర. అ. జనార్దన = విష్ణూ! త్వమ్ = నీవు, క్రోధమూర్ఛితః = క్రోధావిష్టుడవై, అవధ్యామ్ = చంపదగని, మే పత్నీమ్ = నా భార్యను, యస్మాత్ = ఏ కారణము వలన, అవధీః = చంపితివో, తస్మాత్ = ఆ కారణమువలన, మానుషే లోకే = మనుష్యలోకమునందు, జనిష్యసి = పుట్టగలవు. తత్ర = అక్కడ, బహువార్షికమ్ = అనేకసంవత్సరములకు సంబంధించిన, పత్నీవియోగమ్ = భార్యావియోగమును, ప్రాప్స్యసే = పొందగలవు.

తా. జనార్దనా! నీవు కోపావేశముతో, చంపకూడని నా భార్యను చంపినావు. అందువలన మనుష్యలోకములో పుట్టి చాల సంవత్సరములు భార్యావియోగము పొందెదవు. 15

మూ. శాపాభిహతచేతాస్తు స్వాత్మనా భావితోఽభవత్, 16
అర్చయామాస తం దేవం భృగుః శాపేన పీడితః.

ప్ర. అ. శాపాభిహతచేతాః = శాపముచేత (ఇట్లు విష్ణువుకు శాప మిచ్చుటచేత) కొట్టబడిన మనస్సుగలవాడై, స్వాత్మనా = తన ఆత్మచేత, భావితః = భావన చేయబడినవాడు, అభవత్ = ఆయెను. భృగుః = భృగువు, శాపేన = శాపముచేత, పీడితః = పీడింపబడినవాడై, తం దేవమ్ = ఆ దేవుణ్ణి, అర్చయామాస = పూజించెను.

తా. ఆ భృగువు విష్ణువునకు శాప మిచ్చుటచేత వికారము చెందిన మనస్సు గలవాడై తన ఆత్మతో తనను ధ్యానించుకొని, ఆ శాపముచేత పీడితుడై (పశ్చాత్తాపము చెంది) విష్ణువును పూజించెను. 16

మూ. తపసారాధితో దేవో హ్యబ్రవీద్భక్తవత్సలః, 17
లోకానాం సంప్రియార్థం తు తం శాపం గృహ్యముక్తవాన్.

ప్ర. అ. తపసా = తపస్సుచేత, ఆరాధితః = ఆరాధించబడిన, భక్తవత్సలః = భక్తులయందు దయ గల, దేవః = విష్ణువు, అబ్రవీత్ = పలికెను. లోకానామ్ = లోకములయొక్క, సంప్రియార్థమ్ = ప్రియముకొరకై, తం శాపమ్ = ఆ శాపమును, గృహ్యమ్ = గ్రహించదగినదానినిగా, ఉక్తవాన్ = చెప్పినాడు.

తా. తపస్సుచేత ఆరాధించబడిన భక్తవత్సలుడైన విష్ణువు-"లోకముల హితముచేయుటకై ఈ శాపము నాకు గ్రాహ్యమే"అని పలికెను. 17

మూ. ఇతి శప్తో మహాతేజా భృగుణా పూర్వజన్మని, 18
ఇహాగతో హి పుత్రత్వం తవ పార్థివసత్తమ.

ప్ర. అ. పార్థివసత్తమ = రాజోత్తమా ! భృగుణా = భృగుమహర్షిచేత, పూర్వజన్మని = పూర్వజన్మయందు, ఇతి = ఇట్లు, శప్తః = శపించబడిన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల విష్ణువు, ఇహ = ఈ జన్మలో (ఇక్కడ), తవ = నీకు, పుత్రత్వమ్ = పుత్రత్వమును, ఆగతః హి = పొందినాడు.

తా. రాజోత్తమా ! పూర్వజన్మలో ఈ విధముగా శపింపబడిన గొప్ప తేజస్సు గల ఆ విష్ణువు ఇప్పుడు నీ పుత్రుడుగా అయినాడు. 18

మూ. రామ ఇత్యభివిఖ్యాతస్త్రిషు లోకేషు మానద, 19
తత్ఫలం ప్రాప్స్యతే చాపి భృగుశాపకృతం మహత్.

ప్ర. అ. మానద = గౌరవమును ఇచ్చువాడా ! త్రిషు లోకేషు = మూడు లోకములయందు, రామః ఇతి = రాముడు అని, అభివిఖ్యాతః = ప్రసిద్ధుడైన అతడు, భృగుశాపకృతమ్ = భృగుమహర్షియొక్క శాపముచేత చేయబడిన, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, ఫలమ్ = ఫలమును, ప్రాప్స్యతే = పొందగలడు.

తా. గౌరవమును రక్షించు దశరథమహారాజా! రాము డను పేరుతో మూడు లోకాలలో ప్రసిదుడైన ఆ విష్ణువు (నీ పుత్రుడు) భృగుశాపఫలము కూడ అనుభవించ గలడు.

వి. మహావిష్ణువు భృగుమహర్షి భార్యను సంహరించినట్లు, ఆయనను భృగువు శపించినట్లు, ఈ వృత్తాంతము ప్రాచ్యపాఠములో లేదు. శ్రీమహావిష్ణువుకు శాప మనగా ఏమిటి ? 19

మూ. అయోధ్యాయాః పతీ రామో దీర్ఘకాలం భవిష్యతి, 20
సుఖినశ్చ సమృద్ధాశ్చ భవిష్యన్త్యస్య యేఽనుగాః.

ప్ర. అ. రామః = రాముడు, దీర్ఘకాలమ్ = చాలకాలము, అయోధ్యాయాః = అయోధ్యకు, పతిః = ప్రభువుగా, భవిష్యతి = కాగలడు. అస్య = ఈ రాముని యొక్క, యే = ఏ, అనుగాః = అనుచరులు ఉందురో వారు, సుఖినః = సుఖవంతులు, సమృద్ధాః చ = సమృద్ధి కలవారు, భవిష్యన్తి = కాగలరు.

తా. రాముడు చాల కాలము అయోధ్యాధిపతిగా ఉండగలడు. ఈతని అనుచరులు కూడ సుఖసమృద్ధులతో తులతూగగలరు. 20

మూ. దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ, 21
రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి.

ప్ర. అ. రామః = రాముడు, దశ = పది, వర్షసహస్రాణి = సంవత్సరముల సహస్రములు, దశ = పది, వర్షశతాని చ = సంవత్సరముల శతములను, రాజ్యమ్ = రాజ్యమును, ఉపాసిత్వా = ఉపాసించి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, గమిష్యతి = వెళ్ళగలడు.

తా. రాముడు పదకొండువేల సంవత్సరముల కాలము రాజ్యము పాలించి బ్రహ్మలోకమునకు వెళ్లును. 21

మూ. సమృద్ధైశ్చాశ్వమేధైశ్చ ఇష్ట్వా పరమదుర్జయః, 22
రాజవంశాంశ్చ బహుశో బహూన్ సంస్థాపయిష్యతి.

ప్ర. అ. పరమదుర్జయః = మిక్కిలి జయింప శక్యము కాని ఇతడు, సమృద్ధైః=సమృద్ధములైన, అశ్వమేధైః=అశ్వమేధములచేత, ఇష్ట్వా=యాగము చేసి, బహుశః = అనేక పర్యాయములు, బహూన్ = అనేకములైన, రాజవంశాన్ చ = రాజవంశములను కూడ, స్థాపయిష్యతి = స్థాపించగలడు.

తా. ఏ మాత్రమూ జయింప శక్యము కాని రాముడు దానాదులతో సమృద్ధములైన యాగాలనూ, అశ్వమేధయాగమునూ చేసి, అనేకపర్యాయములు అనేక రాజవంశములను నిలబెట్టగలడు. 22

మూ. ద్వౌ పుత్రౌ తు భవిష్యేతే సీతాయాం రాఘవస్య తు, 23
స సర్వమఖిలం రాజ్ఞో వంశస్యాహ గతాగతమ్,
ఆఖ్యాయ సుమహాతేజాస్తూష్ణీమాసీన్మహామునిః. 24

ప్ర. అ. రాఘవస్య=రామునకు, సీతాయామ్=సీతయందు, ద్వౌ పుత్రౌ= ఇద్దరు పుత్రులు, భవిష్యేతే=పుట్టగలరు. సః మహామునిః=ఆ మహాముని, రాజ్ఞః = రాజుయొక్క, వంశస్య = వంశముయొక్క, సర్వమ్ = సమస్తమైన, గతా

గతమ్=గడచినదానిని రాబోవుదానిని, సర్వమ్= అంతను, అఖిలమ్=పూర్తిగా, ఆహ=చెప్పెను. సుమహాతేజాః=చాల గొప్ప తేజస్సు గల అతడు, ఆఖ్యాయ= చెప్పి, తూష్ణీమ్ = మౌనముగా, ఆసీత్ = ఉండెను.

తా. "రామునకు సీతయందు ఇద్దరు పుత్రులు కలుగుదురు" మహాతేజః శాలియైన ఆ దూర్వాసుడు రాజు వంశమునకు సంబంధించిన గడచినదానిని, రాబోవుదానిని పూర్తిగా చెప్పి ఊరకుండెను. 23,24

మూ. తూష్ణీంభూతే తదా తస్మిన్ రాజా దశరథో మునౌ,
అభివాద్య మహాత్మానౌ పునరాయాత్పురోత్తమమ్. 25

ప్ర. అ. తదా = అప్పుడు, తస్మిన్ మునౌ = ఆ ముని, తూష్ణీంభూతే = మౌనముగా ఉండగా, రాజా = రాజైన, దశరథః = దశరథుడు, మహాత్మానౌ = ఆ మహాత్ములను, అభివాద్య = నమస్కరించి, పునః=తిరిగి, పురోత్తమమ్=శ్రేష్ఠమైన నగరమును గూర్చి, ఆయాత్ = వచ్చెను.

తా. ఆ ముని మౌనము వహించగా దశరథమహారాజు మహాత్ములైన ఆ వసిష్ఠదూర్వాసులకు నమస్కరించి తన నగరమునకు తిరిగి వచ్చెను. 25

మూ. ఏతద్వచో మయా తత్ర మునినా వ్యాహృతం పురా,
శ్రుతం హృది చ నిక్షిప్తం నాన్యథా తద్భవిష్యతి. 26

ప్ర. అ. తత్ర = అక్కడ, పురా = పూర్వము, మునినా = మునిచేత, వ్యాహృతమ్ = పలకబడిన, ఏతత్ = ఈ, వచః = వచనము, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది. హృది = హృదయమునందు, నిక్షిప్తం చ = ఉంచుకొనబడినది. తత్ = అది, అన్యథా = మరియొక విధముగ, న భవిష్యతి = కాదు.

తా. పూర్వము అక్కడ ముని పలికిన మాటలు విని నేను వాటిని మనస్సులోనే ఉంచుకొంటిని. అది మరొక విధముగా కాజాలదు. 26

మూ. సీతాయాశ్చ తతః పుత్రావభిషేక్ష్యతి రాఘవః,
అన్యత్ర న త్వయోధ్యాయాం మునేస్తు వచనం యథా. 27

ప్ర. అ. రాఘవః = రాముడు, తతః = అటుపిమ్మట, సీతాయాః = సీత

యొక్క, పుత్రౌ = పుత్రులను, మునేః = మునియొక్క, వచనమ్ = వచనము, యథా = ఎట్లో, ఆ విధముగ, అన్యత్ర = మరియొక చోట, అభిషేక్ష్యతి = అభిషేకించగలడు; అయోధ్యాయాం తు = అయోధ్యలో అయితే, న = కాదు.

తా. పిమ్మట రాముడు సీతాపుత్రులను అయోధ్యలో కాక మరొక చోట అభిషిక్తులను చేయగలడు; ఇది ముని చెప్పిన విషయము. 27

మూ. ఏవంగతే న సంతాపం కర్తుమర్హసి రాఘవ,
సీతార్థే రాఘవార్థే వా దృఢో భవ నరోత్తమ. 28

ప్ర. అ. నరోత్తమ = నరులలో ఉత్తముడా ! రాఘవ = లక్ష్మణా ! ఏవం గతే = ఇది ఇలా ఉండగా, సీతార్థే = సీతకొరకు గాని, రాఘవార్థే వా = రాముని కొరకు గాని, సంతాపమ్ = దుఃఖమును, కర్తుమ్ = చేయుటకు, న అర్హసి = తగవు. దృఢః = దృఢుడవై, భవ = ఉండుము.

తా. నరోత్తముడవైన లక్ష్మణా! ఇట్టి స్థితిలో నీవు రాముని విషయమునందు గాని సీతవిషయమునందు గాని దుఃఖించకుము. ధైర్యముగా ఉండుము. 28

మూ. శ్రుత్వా తు వ్యాహృతం వాక్యం సూతస్య పరమాద్భుతమ్,
ప్రహర్షమతులం లేభే సాధు సాధ్వితి చాబ్రవీత్. 29

ప్ర. అ. వ్యాహృతమ్ = పలకబడిన, సూతస్య = సారథియొక్క, పరమాద్భుతమ్ = చాల ఆశ్చర్యకరమైన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా తు = విని, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను. సాధు సాధు ఇతి = బాగు బాగు అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. సుమంత్రుడు పలికిన చాల ఆశ్చర్యకరములైన మాటలు విని లక్ష్మణుడు చాల సంతోషించెను. "బాగు బాగు"అని మెచ్చుకొనెను. 29

మూ. తతః సంవదతోరేవం సూతలక్ష్మణయోః పథి,
అస్తమర్కే గతే వాసం కేశిన్యాం తావథోషతుః. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సూతలక్ష్మణయోః=సారథీ, లక్ష్మణుడూ, పథి=మార్గమునందు, ఏవమ్ = ఇట్లు, సంవదతోః = మాట్లాడుకొనుచుండగా, తతః = అటుపిమ్మట, అర్కే = సూర్యుడు, అస్తం గతే=అస్తాద్రిని పొందినవాడగుచుండగా, తౌ = వారిద్దరూ, అథ = పిమ్మట, కేశిన్యామ్ = కేశినీ నదీతీరమునందు, వాసమ్ = నివాసమును, ఊషతుః = ఉండిరి.

తా. ఆ సుమంత్రలక్ష్మణులు మార్గమునందు ఈ విధముగా మాటలాడుకొనుచుండగా అంతలో సూర్యుడు అస్తమించెను. అప్పుడు వారు కేశినీనదీతీరమునందు నివసించిరి. 30

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో యాభై ఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

[అయోధ్యలో రాజభవనములో ప్రవేశించిన లక్ష్మణుడు దుఃఖించుచున్న రాముణ్ణి ఓదార్చుట]

మూ. తత్ర తాం రజనీముష్య కేశిన్యాం రఘునన్దనః,
ప్రభాతే పునరుత్థాయ లక్ష్మణః ప్రయయౌ తదా. 1

ప్ర. అ. రఘునన్దనః = రఘువంశమునకు ఆనందకరుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, తత్ర = అక్కడ, కేశిన్యామ్ = కేశినీనదీతీరమునందు, తాం రజనీమ్ = ఆ రాత్రి, ఉష్య = ఉండి, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, ఉత్థాయ = లేచి, తదా = అప్పుడు, పునః = మరల, ప్రయయౌ = వెళ్ళెను.

తా. రఘువంశానందకరుడైన లక్ష్మణుడు ఆ రాత్రికి ఆ కేశినీనదీతీరమునందు ఉండి మరునాడు ఉదయముననే లేచి మరల ప్రయాణమయ్యెను. 1

మూ. తతోఽర్ధదివసే ప్రాప్తే ప్రవివేశ మహారథః,
అయోధ్యాం రత్నసంపూర్ణాం హృష్టపుష్టజనావృతామ్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అర్ధదివసే = మధ్యాహ్నము, ప్రాప్తే = వచ్చినదగుచుండగా, మహారథః = మహారథుడైన లక్ష్మణుడు, రత్నసంపూర్ణామ్ = రత్నములతో నిండిన, హృష్టపుష్టజనావృతామ్ = సంతోషించిన పరిపుష్టులైన జనులతో కూడిన, అయోధ్యామ్ = అయోధ్యను, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మహారథుడైన లక్ష్మణుడు మధ్యాహ్నసమయానికి, శ్రేష్ఠములైన వస్తువులతో నిండి సంతోషించిన బాగా పరిపుష్టులైన జనులు నివసించుచున్న అయోధ్యానగరములో ప్రవేశించెను. 2

మూ. సౌమిత్రిస్తు పరం దైన్యం జగామ సుమహామతిః,
రామపాదౌ సమాసాద్య వక్ష్యామి కిమహం గతః. 3

ప్ర. అ. సుమహామతిః = చాల గొప్ప బుద్ధి గల, సౌమిత్రిః తు=లక్ష్మణు డైతే, గతః = వెళ్ళిన, అహమ్ = నేను, రామపాదౌ=రాముని పాదములను, సమాసాద్య = పొంది, కిమ్ = ఏమి, వక్ష్యామి=చెప్పెదను అని, పరమ్ = అధికమైన, దైన్యమ్ = దైన్యమును, జగామ = పొందెను.

తా. గొప్ప బుద్ధి గల ఆ లక్ష్మణుడు "వెళ్ళి రాముని పాదాల చెంత చేరిన నేను ఆయనకు ఏమని చెప్పవలెను"అను ఆలోచనతో చాల దైన్యమును పొందెను.

మూ. తస్యైవం చిన్తయానస్య భవనం శశిసంనిభమ్,
రామస్య పరమోదారం పురస్తాత్సమదృశ్యత. 4

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, చిన్తయానస్య = ఆలోచించుచున్న, తస్య = ఆతనికి, రామస్య = రామునియొక్క, పరమోదారమ్ = చాల గొప్పదైన, శశిసంనిభమ్ = చంద్రునితో సమానమైన, భవనమ్ = భవనము, పురస్తాత్ = ఎదుట, సమదృశ్యత = చూడబడెను.

తా. ఆతడు ఆ విధముగా ఆలోచించుచుండగా, చంద్రుడు వలె తెల్లగా ఉన్న చాల అద్భుతమైన రాముని భవనము ఆతని ఎదుట కనబడెను. 4

మూ. రాజ్ఞస్తు భవనద్వారి సోఽవతీర్య నరోత్తమః,
అవాఙ్ముఖో దీనమనాః ప్రవివేశానివారితః. 5

ప్ర. అ. నరోత్తమః = నరులలో ఉత్తముడైన, సః = లక్ష్మణుడు, రాజ్ఞః = రాజుయొక్క, భవనద్వారి = గృహద్వారమునందు, అవతీర్య = దిగి, అవాఙ్ముఖః = క్రిందికి ముఖము గలవాడై, దీనమనాః = దీనమైన మనస్సు గలవాడై, అనివారితః = నివారింపబడనివాడై, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన ఆ లక్ష్మణుడు రాజభవనద్వారమువద్ద దిగి, దీనమైన మనస్సుతో, తల వంచుకొని, లోపల ప్రవేశించెను. ఆతనిని ఎవరూ అడ్డు పెట్టలేదు. 5

మూ. స దృష్ట్వా రాఘవం దీనమాసీనం పరమాసనే,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యాం దదర్శాగ్రజమగ్రతః. 6

జగ్రాహ చరణౌ తస్య లక్ష్మణో దీనచేతనః,
ఉవాచ దీనయా వాచా ప్రాఞ్జలిః సుసమాహితః. 7

ప్ర. అ. ("దదర్శాగ్రజమగ్రతః" కు బదులు "దహన్తమివ మేదినీమ్"అను ప్రాచ్యపాఠము బాగున్నది. "దృష్ట్వా దదర్శ"అనుదానికి అర్థము సరిగా ఉండదు) సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, పరమాసనే = శ్రేష్ఠమైన ఆసనమునందు, ఆసీనమ్ = కూర్చొని ఉన్న, అశ్రుపూర్ణాభ్యామ్ = కన్నీళ్ళతో నిండిన, నేత్రాభ్యామ్ = నేత్రములతో, మేదినీమ్ = భూమిని, దహన్తమ్ ఇవ = కాల్చివేయుచున్నాడా అన్నట్లున్న, దీనమ్ = దీనుడైన, రాఘవమ్ = రాముణ్ణి, అగ్రతః = ఎదుట, దృష్ట్వా = చూచి, దీనచేతనః = దీనమైన మనస్సు గలవాడై, తస్య = అతనియొక్క, చరణౌ = పాదములను, జగ్రాహ = గ్రహించెను, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, సుసమాహితః = బాగా సావధానచిత్తుడై, దీనయా = దీనమైన, వాచా = వాక్కుతో, ఉవాచ = పలికెను.

తా. రాముడు దీనుడై, కన్నీళ్ళతో నిండిన కండ్లతో భూమిని కాల్చివేయుచున్నాడా అన్నట్లు, ఉత్తమమైన ఆసనముమీద కూర్చుండి ఉండెను. లక్ష్మణుడు అట్టి రాముణ్ణి చూచి, దీనమైన మనస్సుతో ఆతని పాదములు పట్టుకుని, సావధానచిత్తుడై, అంజలి ఘటించి దైన్యముతో కూడిన మాటలతో ఇట్లు పలికెను. 6,7

మూ. ఆర్యస్యాజ్ఞాం పురస్కృత్య విసృజ్య జనకాత్మజామ్,
గఙ్గాతీరే యథోద్దిష్టే వాల్మీకేరాశ్రమే శుభే. 8
తత్ర తాం చ శుభాచారామాశ్రమాన్తే యశస్వినీమ్,
పునరప్యాగతో వీర పాదమూలముపాసితుమ్. 9

ప్ర. అ. వీర = వీరుడా! ఆర్యస్య = పూజ్యుడవైన నీయొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, పురస్కృత్య = పురస్కరించుకొని, యథోద్దిష్టే = చెప్పబడిన విధముగా ఉన్న, గఙ్గాతీరే = గంగాతీరమునందు, శుభే = శుభమైన, వాల్మీకేః ఆశ్రమే = ఆ వాల్మీకియొక్క ఆశ్రమమునందు (ప్రవేశించి), తత్ర = అక్కడ, ఆశ్రమాన్తే = ఆశ్రమప్రాంతమునందు, శుభాచారామ్ = పవిత్రమైన ఆచారము గల, యశస్వినీమ్ = కీర్తి గల, తామ్ = ఆ, జనకాత్మజామ్ = సీతను, విసృజ్య = విడచి, ఉపాసితుమ్ = సేవించుటకు, పునరపి = మరల, పాదమూలమ్ = నీ పాదమూలమును గూర్చి, 'ఆగతః = వచ్చినాను'.

తా. వీరుడా! పూజ్యుడవైన నీ ఆజ్ఞ ప్రకారము సీతను నీవు చెప్పిన గంగా తీరమునం దున్న పవిత్రమైన వాల్మీక్యాశ్రమమునకు తీసికొనివెళ్ళి పవిత్రమైన నడవడిక గల, కీర్తిమంతురాలైన ఆ జానకిని అక్కడ ఆశ్రమ ప్రాంతమునందు విడచి, నీ సేవకై మరల నీ పాదాల చెంతకు వచ్చినాను. 8,9

మూ. మా శుచః పురుషవ్యాఘ్ర కాలస్య గతిరీదృశీ,
త్వద్విధా న హి శోచన్తి బుద్ధిమన్తో మనస్వినః. 10

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! మా శుచః = దుఃఖించకుము. కాలస్య = కాలముయొక్క, గతిః = గతి, ఈదృశీ = ఇట్టిది. త్వద్విధాః = నీవంటి, బుద్ధిమన్తః = బుద్ధిమంతులైన, మనస్వినః = ఆత్మాభిమానవంతులు, న శోచన్తి హి = దుఃఖించరు కదా?

తా. పురుషశ్రేష్ఠుడా! దుఃఖించకుము. కాలగతి ఇలాంటిది. నీవంటి బుద్ధిమంతులైన ఆత్మాభిమానవంతులు దుఃఖించరు కదా? 10

మూ. సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్. 11

ప్ర. అ. సర్వే = సమస్తమైన, నిచయాః = ప్రోగుచేయుటలు, క్షయాన్తాః = క్షయము అంతమునందు గలవి. సముచ్ఛ్రియాః = ఉన్నతత్వములు, పతనాన్తాః = పతనము అంతమునందు గలవి. సంయోగాః = సంయోగములు, విప్రయోగాన్తాః = వియోగము అంతమునందు గలవి. జీవితమ్ = జీవితము, మరణాన్తమ్ = మరణమే అంతముగా గలది.

తా. కూడబెట్టిన వన్నీ చివరికి నశించవలసినదే. ఎంత ఉన్నతి లభించినా చివరికి క్రింద పడవలసినదే. కలయికలు చివరికి వియోగమునందే ముగియును. ఎంతకాలము జీవించినా చివరికి మరణించవలసినదే. 11

మూ. తస్మాత్పుత్రేషు దారేషు మిత్రేషు చ ధనేషు చ,
నాతిప్రసఙ్గః కర్తవ్యో విప్రయోగో హి ధ్రువః. 12

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, పుత్రేషు = పుత్రులయందు, దారేషు = భార్యయందు, మిత్రేషు = మిత్రులయందు, ధనేషు చ = ధనములయందు,

అతిప్రసంగః=ఎక్కువ ఆసక్తి, న కర్తవ్యః=చేయదగినది కాదు తైః=వాటితో విప్రయోగః = దూర మగుట, ధ్రువః హి = నిశ్చితము కదా?

తా. అందువలన పుత్రులవిషయమునందు, భార్య విషయమునందు మిత్రుల విషయమునందు, ధనముల యందు, ఎక్కువ సంగము చూపకూడదు. వీటితో వియోగము ఏనాటికైనా తప్పదు. 12

మూ. శక్తస్త్వమాత్మనాత్మానం వినేతుం మనసా మనః,
లోకాన్ సర్వాంశ్చ కాకుత్స్థ కిం పునః శోకమాత్మనః.

ప్ర. అ. కాకుత్థ్స= రామా ! త్వమ్ = నీవు, ఆత్మనా = తనచేత, ఆత్మానమ్ = తనను, మనసా=మనస్సుచేత, మనః=మనస్సును, సర్వాన్=సమస్తమైన, లోకాన్ చ=లోకములను, వినేతుమ్=అదుపులో ఉంచుటకు, శక్తః=సమర్థుడవు. ఆత్మనః = నీయొక్క, శోకమ్ = శోకమును, కిం పునః = చెప్పనేల!

తా. రామా ! నీవు తనచే తాను అదుపులో ఉంచుకొనగలవు. మనస్సును మనస్సుచేత నిగ్రహించుకొనగలవు. సమస్తలోకములనూ కూడ నిగ్రహించగలవు. నీ శోకమును అణచుకొనగల వను మాట చెప్పవలెనా ? 13

మూ. నేదృశేషు విముహ్యన్తి త్వద్విధాః పురుషర్షభాః,
అపవాదః స కిల తే పునరేష్యతి రాఘవ. 14

ప్ర. అ. రాఘవ= రామా ! త్వద్విధాః = నీవంటి, పురుషర్షభాః=పురుషశ్రేష్ఠులు, ఈదృశేషు = ఇలాంటివాటియందు, న విముహ్యన్తి= మోహము చెందరు. సః అపవాదః=ఆ అపవాద, తే=నీకు, పునః=మరల, ఏష్యతి కిల=రాగలదు కదా?

తా. రామా ! నీవంటి పురుషశ్రేష్ఠులు ఇలాంటి విషయముల యందు మోహము చెందరు. నీవు ఇట్లు ఉన్నచో మళ్ళీ ఆ అపవాద వచ్చును. పరగృహములో ఉన్న భార్యను విడిచి పెట్టిన రాముడు ఆమెను గూర్చియే విచారించుచు స్వకర్తవ్యములు మరచినాడు అను అపవాద వచ్చును అని భావము. 14

మూ. యదర్థం మైథిలీ త్యక్తా అపవాదభయాన్నృప,
సోఽపవాదః పురే రాజన్ భవిష్యతి న సంశయః. 15

ప్ర. అ. నృప = మానవులను పాలించువాడా ! మైథిలీ = సీత, యదర్థమ్ = దేనినిమిత్తమై, అపవాదభయాత్ = అపవాదభయమువలన, త్యక్తా = విడవబడినదో, రాజన్ = రాజా ! సః = ఆ, అపవాదః = అపవాద, పురే=పట్టణమునందు, భవిష్యతి = కాగలదు; సంశయః = సంశయము, న = లేదు.

తా. రాజా ! ఏ అపవాదభయమువలన సీతను విడచినావో అదే అపవాద మరొకరూపమున నీవు స్వకర్తవ్యవిముఖుడవై ఉన్నావు అని పురములో కలుగును. సంశయము లేదు. 15

మూ. స త్వం పురుషశార్దూల ధైర్యేణ సుసమాహితః,
త్యజేమాం దుర్బలాం బుద్ధిం సంతాపం మా కురుష్వ హ.

ప్ర. అ. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడా ! సః త్వమ్ = అట్టి నీవు, ధైర్యేణ = ధైర్యముతో, సుసమాహితః = బాగా సావధానచిత్తుడవై, దుర్బలామ్ = దుర్బలమైన, ఇమామ్ = ఈ, బుద్ధిమ్ = బుద్ధిని, త్యజ = విడువుము. సంతాపమ్ = సంతాపమును, మా కురుష్వ హ = చేయకుము.

తా. ఓ ! పురుషశ్రేష్ఠుడా ! అట్టి నీవు ధైర్యముచేత సావధానచిత్తుడవై దుర్బలమైన ఈ బుద్ధిని విడిచిపెట్టుము. సంతాపము చెందకుము. 16

మూ. ఏవముక్తః స కాకుత్స్థో లక్ష్మణేన మహాత్మనా,
ఉవాచ పరయా ప్రీత్యా సౌమిత్రిం మిత్రవత్సలః. 17

ప్ర. అ. మహాత్మనా=మహాత్ముడైన, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, ఏవమ్= ఇట్లు, ఉక్తః = చెప్పబడిన, మిత్రవత్సలః = మిత్రులయందు ప్రేమ గల, సః కాకుత్స్థః = ఆ రాముడు, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, పరమయా = గొప్పదైన, ప్రీత్యా = ప్రేమతో, ఉవాచ = పలికెను.

తా. మహాత్ముడైన లక్ష్మణుని మాటలు విని మిత్రులయందు ప్రేమ గల రాముడు గొప్ప సంతోషముతో ఇట్లు పలికెను. 17

మూ. ఏవమేతన్నరశ్రేష్ఠ యథా వదసి లక్ష్మణ,
పరితోషశ్చ మే వీర మమ కార్యానుశాసనే. 18

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడవైన, లక్ష్మణ = లక్ష్మణా ! యథా = ఎట్లు, వదసి = చెప్పుచున్నావో, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లే. వీర = వీరుడా ! మమ = నాయొక్క, కార్యానుశాసనే = కర్తవ్యమును గూర్చి శాసించుట యందు, మే = నాకు, పరితోషః చ = సంతోషము కూడ గలిగినది.

తా. నరశ్రేష్ఠుడవైన లక్ష్మణా ! నీవు చెప్పినది సత్యము. వీరుడా ! నీవు నా కర్తవ్యమును గూర్చి శాసించినందుకు సంతోషము కలిగినది. 18

మూ. నివృత్తిశ్చాగతా సౌమ్య సంతాపశ్చ నిరాకృతః,
భవద్వాక్యైః సురుచిరైరనునీతోఽస్మి లక్ష్మణ. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్విపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! లక్ష్మణ = లక్ష్మణా ! నివృత్తిః = దుఃఖ నివృత్తి, ఆగతా = వచ్చినది. సంతాపః చ = సంతాపము, నిరాకృతః = దూరము చేయబడినది. సురుచిరైః = మిక్కిలి అందమైన, భవద్వాక్యైః = నీ వాక్యముల చేత, అనునీతః = బతిమాలుకొనబడినవాడను (బోధింపబడినవాడను), అస్మి = అయినాను.

తా. సౌమ్యా ! లక్ష్మణా ! దుఃఖము నివర్తించినది. నేను సంతాపమును విదిలివేసినాను. చాల అందమైన నీ మాటలచేత నేను బోధింపబడితిని. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
ఏబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిపఞ్చాశః సర్గః

*[పనిమీద వచ్చినవారిని ఉపేక్షించుటచేత నృగమహారాజుకు వచ్చిన శాపమును గూర్చిన కథ చెప్పి రాముడు కార్యార్థులను నిరీక్షించవలెను అని లక్ష్మణుణ్ణి ఆదేశించుట.]*

మూ. లక్ష్మణస్య తు తద్వాక్యం నిశమ్య పరమాద్భుతమ్,
సుప్రీతశ్చాభవద్రామో వాక్యమేతదువాచ హ. 1

ప్ర. అ. రామః = రాముడు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, పరమాద్భుతమ్ = చాల ఆశ్చర్యకరమైన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, నిశమ్య = విని, సుప్రీతః = చాల సంతోషించినవాడు, ఆసీత్ = ఆయెను. ఏతత్ = ఈ, వాక్యం చ = వాక్యమును కూడ, ఉవాచ హ = పలికెను.

తా. రాముడు చాల అద్భుతమైన లక్ష్మణుని వాక్యమును విని చాల సంతోషించి ఇట్లు పలికెను. 1

మూ. దుర్లభస్త్వీదృశో బన్ధురస్మిన్ కాలే విశేషతః,
యాదృశస్త్వం మహాబుద్ధిర్మమ సౌమ్య మనోనుగః. 2

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మహాబుద్ధిః = గొప్ప బుద్ధి గల, మనోనుగః = (నా) మనస్సును అనుసరించి ప్రవర్తించు. త్వమ్ = నీవు, మమ = నాకు, యాదృశః = ఎట్టివాడవో, ఈదృశః = ఇట్టి, బన్ధుః = బంధువు, దుర్లభః = దుర్లభుడు. అస్మిన్ = ఈ, కాలే = కాలమునందు, విశేషతః = విశేషించి దుర్లభుడు.

తా. సౌమ్యుడా ! మహాబుద్ధివి, నా మనస్సుకు అనుగుణముగా ప్రవర్తించువాడవూ అయిన నీవు నాకెట్టి బంధువుగా ఉన్నావో అట్టి బంధువు లభించుట చాలా కష్టము. విశేషించి ఈ కాలములో ఇంకనూ కష్టము. 2

మూ. యచ్చ మే హృదయే కించిద్వర్తతే శుభలక్షణ,
తన్నిశామయ చ శ్రుత్వా కురుష్వ వచనం మమ. 3

ప్ర. అ. శుభలక్షణ=శుభములైన లక్షణములు కలవాడా! మే=నాయొక్క, హృదయే= హృదయమునందు, యత్ = ఏది, వర్తతే= ఉన్నదో, తత్ = దానిని, నిశామయ = వినుము. శ్రుత్వా= విని, మమ = నాయొక్క, వచనమ్= వచనమును, కురుష్వ = చేయుము.

తా. శుభలక్షణములు కలవాడా! నా మనస్సులో ఉన్న మాట చెప్పెదను వినుము; విని దాని ప్రకారము చేయుము. 3

మూ. చత్వారో దివసాః సౌమ్య కార్యం పౌరజనస్య చ,
అకుర్వాణస్య సౌమిత్రే తన్మే మర్మాణి కృన్తతి. 4

ప్ర. అ. సౌమ్య= సౌమ్యుడా! సౌమిత్రే= లక్ష్మణా! పౌరజనస్య= పౌరజనులయొక్క, కార్యమ్= కార్యమును, అకుర్వాణస్య= చేయని నాకు, చత్వారః=నాలుగు, దివసాః=రోజులు గడచినవి. తత్=అది, మే=నాయొక్క, మర్మాణి = మర్మములను, కృన్తతి = భేదించుచున్నది.

తా. సౌమ్యా! లక్ష్మణా! నేను పౌరుల పనులు చూచి నాలుగు రోజులు అయినది. అది నా మర్మమును భేదించుచున్నది. (నా అంతరాత్మ అందుకు చాల బాధపడుచున్నది). 4

మూ. ఆహూయన్తాం ప్రకృతయః పురోధా మన్త్రిణస్తథా,
కార్యార్థినశ్చ పురుషాః స్త్రియో వా పురుషర్షభ. 5

ప్ర. అ. పురుషర్షభ= పురుషశ్రేష్ఠుడా! ప్రకృతయః = ప్రకృతులు, పురోధాః = పురోహితుడు, తథా=మరియు, మన్త్రిణః=మంత్రులు, కార్యార్థినః= కార్యార్థులైన, పురుషాః= పురుషులు గాని, స్త్రియో వా = స్త్రీలు గాని, ఆహూయన్తామ్ = పిలవబడెదరుగాక.

తా. పురుషశ్రేష్ఠుడా! వ్యవహారము ఉన్న పురుషులను, స్త్రీలను, (ఎవరి ఎదుట ఆ వ్యవహారము నిర్ణయించవలెనో) ఆ ప్రకృతులను, పురోహితుని, మంత్రులను పిలిపించుము. 5

మూ. పౌరకార్యాణి యో రాజా న కరోతి దినే దినే,
సంవృతే నరకే ఘోరే పతితో నాత్ర సంశయః. 6

ప్ర. అ. యః రాజా = ఏ రాజు, దినే దినే = ప్రతిదినమునందు, పౌర కార్యాణి = పౌరుల పనులను, న కరోతి = చేయడో, అతడు, సంవృతే = కప్పబడిన, ఘోరే = ఘోరమైన, నరకే = నరకమునందు, పతితః = పడినాడు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ప్రతిదినమూ పౌరుల కార్యాలు చూడని రాజు గాలి, వెలుతురూ లేకుండే టట్లు కప్పివేయబడిన ఘోరనరకములో పడినట్లే; సందేహము లేదు.

మూ. శ్రూయతే హి పురా రాజా నృగో నామ మహాయశాః,
బభూవ పృథివీపాలో బ్రహ్మణ్యః సత్యవాక్ శుచిః. 7

ప్ర. అ. పురా = పూర్వము, మహాయశాః = గొప్ప కీర్తి గల, పృథివీ పాలః = భూమిని పాలించు, బ్రహ్మణ్యః = బ్రాహ్మణభక్తుడైన, సత్యవాక్ = సత్యమైన వాక్కు గల, శుచిః = మనోవాక్కాయశుద్ధుడైన, నృగో నామ = నృగు డను, రాజా = రాజు, బభూవ = ఉండెను. శ్రూయతే హి = ఇట్లు వినబడుచున్నది కదా.

తా. పూర్వము గొప్ప కీర్తి గల నృగు డనే రాజు ఉండె నని వినుచున్నాము. భూమిని చక్కగ పాలించే అతడు బ్రాహ్మణభక్తుడు; సత్యమే పలుకువాడు. పరిశుద్ధుడు. 7

మూ. స కదాచిద్గవాం కోటీః సవత్సాః స్వర్ణభూషితాః,
నృదేవో భూమిదేవేభ్యః పుష్కరేషు దదౌ నృపః. 8

ప్ర. అ. నృదేవః = నరుల దేవుడైన, సః నృపః = ఆ రాజు, పుష్కరేషు = పుష్కరములయందు, కదాచిత్ = ఒకప్పుడు, సవత్సాః = లేగదూడ్లతో కూడిన, స్వర్ణభూషితాః = బంగారముచేత అలంకరించబడిన, గవామ్ = గోవులయొక్క, కోటీః = కోట్లను, భూమిదేవేభ్యః = బ్రాహ్మణులకు, దదౌ = ఇచ్చెను.

తా. ఒకప్పుడు ఆ రాజు పుష్కరములయందు, లేగదూడలతో కూడిన, బంగారముచేత అలంకరించిన కోట్లకొలది ఆవులను బ్రాహ్మణులకు దానము చేసెను. 8

మూ. తతః సఙ్గాద్గతా ధేనుః సవత్సా స్పర్శితానఘ,
బ్రాహ్మణస్యాహితాగ్నేస్తు దరిద్రస్యోఞ్ఛవర్తినః. 9

ప్ర. అ. తతః = అపుడు, అనఘ = దోషములులేనివాడా ! ఆహితాగ్నేః = ఆహితాగ్ని, దరిద్రస్య = దరిద్రుడు, ఉఞ్ఛవర్తినః = ఉంఛవృత్తి చేసికొనువాడు అయిన, బ్రాహ్మణస్య = ఒక బ్రాహ్మణునియొక్క, సవత్సా = లేగదూడతో కూడిన, ధేనుః = ఆవు, సఙ్గాత్ = కలిసిపోవుటవలన, గతా = వెళ్ళిపోయినది.

తా. ఆహితాగ్ని, దరిద్రుడు, ఉంఛవృత్తితో (చేలలో రాలిన ధాన్యపు గింజలు ఏరికొని జీవించుట) జీవించు ఒక బ్రాహ్మణుని గోవు, దాని లేగదూడ ఆ ఆవులతో కలిసి (దానముచేసినవాటితో) వెళ్ళి పోయినవి. 9

మూ. స నష్టాం గాం క్షుధార్తో వై అన్విష్యంస్తత్ర తత్ర హ,
నాపశ్యత్సర్వరాష్ట్రేషు సంవత్సరగణాన్ బహూన్. 10

ప్ర. అ. క్షుధా = ఆకలిచేత, ఆర్తః = పీడితుడైన, సః = ఆతడు, నష్టామ్ = నష్టమైన, గామ్ = గోవును, సర్వరాష్ట్రేషు = అన్ని రాష్ట్రములయందు, తత్ర తత్ర = అక్కడక్కడ, బహూన్ = అనేకములైన, సంవత్సరగణాన్ = సంవత్సర సముదాయములను, అన్విష్యన్ = వెదకుచు, నాపశ్యత్ = చూడలేదు.

తా. ఆకలితో బాధపడుచున్న ఆ బ్రాహ్మణుడు కనబడకుండా పోయిన ఆ ఆవుకొరకై అన్ని రాష్ట్రములలోను అక్కడక్కడ అనేకసంవత్సరములపాటు వెదకెను. కాని అది కనబడలేదు. 10

మూ. తతః కనఖలం గత్వా జీర్ణవత్సాం నిరామయామ్,
దదృశే తాం స్వికాం ధేనుం బ్రాహ్మణస్య నివేశనే. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కనఖలమ్ = కనఖల మను ప్రదేశమును గూర్చి, గత్వా = వెళ్ళి, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునియొక్క, నివేశనే = గృహము నందు, జీర్ణవత్సామ్ = దుర్బలమైన దూడ గల, నిరామయామ్ = రోగములు లేని, స్వికామ్ = తన సంబంధమైన, తామ్ = ఆ, ధేనుమ్ = ధేనువును, దదృశే = చూచెను.

తా. పిమ్మట అతడు కనఖల మను ప్రదేశమునకు వెళ్ళి అక్కడ ఒక

బ్రాహ్మణుని ఇంటిలో ఆరోగ్యముగా ఉన్న తన ధేనువును చూచెను. దాని దూడ మాత్రము దుర్బలముగా ఉండెను. 11

మూ. అథ తాం నామధేయేన స్వకేనోవాచ బ్రాహ్మణః,
ఆగచ్ఛ శబలేత్యేవం సా తు శుశ్రావ గౌః స్వరమ్. 12

ప్ర. అ. అథ = అటుపిమ్మట, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, తామ్ = ఆ ఆవును, స్వకేన = తన సంబంధమైన, నామధేయేన = పేరుతో, శబలే = శబలా! ఆగచ్ఛ = రమ్ము, ఇత్యేవమ్ = అని, ఉవాచ = పలికెను. సా = ఆ, గౌః తు = గోవు అయితే, స్వరమ్ = స్వరమును, శుశ్రావ = వినెను.

తా. పిమ్మట ఆ బ్రాహ్మణుడు "శబలా! రమ్ము"అని ఆ ఆవును పేరు పెట్టి పిలచెను. అప్పుడు ఆ గోవు ఆ స్వరమును వినెను. 12

మూ. తస్య తం స్వరమాజ్ఞాయ క్షుధార్తస్య ద్విజస్య వై,
అన్వగాత్పృష్ఠతః సా గౌర్గచ్ఛన్తం పావకోపమమ్. 13

ప్ర. అ. క్షుధార్తస్య = ఆకలిచేత పీడితుడైన, తస్య ద్విజస్య = ఆ బ్రాహ్మణునియొక్క, తం స్వరమ్ = ఆ స్వరమును, ఆజ్ఞాయ = గుర్తుపట్టి, సా గౌః = ఆ గోవు, గచ్ఛన్తమ్ = నడచుచున్న, పావకోపమమ్ = అగ్నితో సమానుడైన అతనిని, పృష్ఠతః = వెనుకనే, అన్వగచ్ఛత్ = అనుసరించి వెళ్లెను.

తా. క్షుధార్తుడైన ఆ బ్రాహ్మణుని స్వరమును గుర్తుపట్టి ఆ గోవు అగ్నితో సమానుడైన అతడు ముందు నడచుచుండగా అతని వెనుకనే వెళ్లెను. (క్షుధార్తుడు అనేది ఆ బ్రాహ్మణుని పేరుకూడ కావచ్చును). 13

మూ. యోఽపి పాలయతే విప్రః సోఽపి గామన్వగాద్ద్రుతమ్,
గత్వా చ తమృషిం చష్టే మమ గౌరితి సత్వరమ్. 14

ప్ర. అ. యః విప్రః = ఏ బ్రాహ్మణుడు, పాలయతే = పాలించుచున్నాడో-సః అపి = అతడు కూడ, ద్రుతమ్ = శీఘ్రముగా, గామ్ = గోవును, అన్వగాత్ = అనుసరించి వెళ్ళెను సత్వరమ్ = శీఘ్రముగా, గత్వా చ = వెళ్ళి, మమ గౌః = ఇది నా గోవు, ఇతి = అని, తమ్ = ఆ, ఋషిమ్ = ఋషిని గూర్చి, చష్టే = చెప్పెను.

తా. ఆ గోవును పాలించుచున్న బ్రాహ్మణుడు కూడ శీఘ్రముగా గోవు వెంట వెళ్ళెను. తొందరగా వెళ్ళి ఆ ఋషితో "ఇది నా గోవు" అని పలికెను. 14

మూ. స్పర్శితా రాజసింహేన మమ దత్తా నృగేణ హ,
తయోర్బ్రాహ్మణయోర్వాదో మహానాసీద్విపశ్చితోః. 15

ప్ర. అ. రాజసింహేన = రాజశ్రేష్ఠుడైన, నృగేణ = నృగునిచేత, స్పర్శితా = స్పృశించబడినది. మమ = నాకు, దత్తా = ఇవ్వబడినది. విపశ్చితోః = విద్వాంసులైన, తయోః = ఆ, బ్రాహ్మణయోః = బ్రాహ్మణులకు, మహాన్ = గొప్ప, వివాదః = కలహము, ఆసీత్ = ఆయెను.

తా. "నృగమహారాజు ఈ గోవును స్పృశించి నాకు ఇచ్చినాడు" అని చెప్పెను. పండితులైన ఆ బ్రాహ్మణు లిద్దరికీ పెద్ద కలహము జరిగెను. 15

మూ. వివదన్తౌ తతోఽన్యోన్యం దాతారమభిజగ్మతుః,
తౌ రాజభవనద్వారి న ప్రాప్తౌ నృగశాసనమ్. 16

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అన్యోన్యమ్ = పరస్పరము, వివదన్తౌ = కలహించుకొనుచున్న, తౌ = వారు, దాతారమ్ = దాతను గూర్చి, అభిజగ్మతుః = వెళ్ళిరి. రాజభవనద్వారి = రాజగృహద్వారమునందు, నృగశాసనమ్ = నృగమహారాజు శాసనమును, న ప్రాప్తౌ = పొందలేదు.

తా. వాళ్ళిద్దరూ పరస్పరమూ కలహించుకొనుచు దానము చేసిన నృగుని దగ్గరికి వెళ్ళిరి. కాని రాజభవనద్వారమునందు వారికి నృగుని అనుమతి లభించలేదు. 16

మూ. అహోరాత్రాణ్యనేకాని వసన్తౌ క్రోధమీయతుః,
ఊచతుశ్చ మహాత్మానౌ తావుభౌ ద్విజసత్తమౌ, 17
క్రుద్ధౌ పరమసంతప్తౌ వాక్యం ఘోరాభిసంహితమ్.

ప్ర. అ. మహాత్మానౌ = మహాత్ములైన, ఉభౌ = ఇద్దరు, తౌ ద్విజసత్తమౌ = ఆ బ్రాహ్మణోత్తములు, అనేకాని = అనేకములైన, అహోరాత్రాణి = అహోరాత్రములను, వసన్తౌ = నివసించుచున్నవారై, క్రోధమ్ = క్రోధమును, ఈయతుః

= పొందిరి. పరమసంతప్తౌ = మిక్కిలి బాధపడిన, క్రుద్ధౌ = కోపించిన ఆ బ్రాహ్మణులు, ఘోరాభిసంహితమ్ = ఘోరమైన అర్థము గల, వాక్యమ్ = వాక్యమును, ఊచతుః = పలికిరి.

తా. మహాత్ములైన ఆ బ్రాహ్మణోత్తము లిద్దరూ చాల రాత్రింబవళ్లు అక్కడ ఉండిరి. చివరికి కోపించిరి. చాల బాధపడిన వారిద్దరూ కోపించి ఘోరమైన తాత్పర్యము గల వాక్యము పలికిరి. 17

మూ. అర్థినాం కార్యసిద్ధ్యర్థం యస్మాత్త్వం నైషి దర్శనమ్, 18
అదృశ్యః సర్వభూతానాం కృకలాసో భవిష్యసి.

ప్ర. అ. త్వమ్ = నీవు, అర్థినామ్ = కార్యార్థుల, కార్యసిద్ధ్యర్థమ్ = కార్యసిద్ధికొరకు, యస్మాత్ = ఏకారణమువలన, దర్శనమ్ = దర్శనమును, నైషి = పొందుటలేదో, అందువలన, సర్వభూతానామ్ = సమస్తప్రాణులకూ, అదృశ్యః = కనబడని, కృకలాసః = తొండగా, భవిష్యసి = కాగలవు.

తా. కార్యార్థులై వచ్చినవారికి నీవు దర్శనము ఇచ్చుటలేదు. అందువలన నీవు ఏ ప్రాణులకూ కనబడని తొండవుగా అయ్యెదవుగాక. 18

మూ. బహువర్షసహస్రాణి బహువర్షశతాని చ, 19
శ్వభ్రే త్వం కృకలీభూతో దీర్ఘకాలం నివత్స్యసి.

ప్ర. అ. త్వమ్ = నీవు, బహువర్షసహస్రాణి = చాలా వేల సంవత్సరములను, బహువర్షశతాని చ = చాలా వందల సంవత్సరములను, కృకలీభూతః = తొండవై, దీర్ఘకాలమ్ = దీర్ఘాకాలము, శ్వభ్రే = గోతిలో, నివత్స్యసి = నివసించగలవు.

తా. నీవు తొండవుగా అయి కొన్ని వేల సంవత్సరాలు, కొన్ని వందల సంవత్సరాలు దీర్ఘకాలము, గోతిలో పడి ఉండగలవు. 19

మూ. ఉత్పత్స్యతే హి లోకేఽస్మిన్ యదూనాం కీర్తివర్ధనః, 20
వాసుదేవ ఇతి ఖ్యాతో విష్ణుః పురుషవిగ్రహః.

ప్ర. అ. విష్ణుః = విష్ణువు, యదూనామ్ = యాదవులయొక్క, కీర్తివర్ధనః

= కీర్తిని వృద్ధిపొందించుచు, వాసుదేవః ఇతి = వాసుదేవుడు అని, ఖ్యాతః = ప్రసిద్ధుడై, పురుషవిగ్రహః = మానవరూపుడై, అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు, ఉత్పత్స్యతే = పుట్టగలడు.

తా. విష్ణువు యాదవుల కీర్తిని వృద్ధిపొందించుచు, వాసుదేవు డను పేరుతో మానవుడై ఈ లోకములో పుట్టగలడు. 21

మూ. స తే మోక్షయితా శాపాద్రాజంస్తస్మాద్భవిష్యతి, 21
కృతా చ తేన కాలేన నిష్కృతిస్తే భవిష్యతి.

ప్ర. అ. రాజన్ = రాజా, సః = అతడు, తస్మాత్ = ఆ, శాపాత్ = = శాపమునుండి, తే = నీకు, మోక్షయితా = విడిపించేవాడు, భవిష్యతి = కాగలడు. తేన కాలేన = ఆ కాలముచేత, తే = నీకు, నిష్కృతిః = ప్రాయశ్చిత్తము కృతా = చేయబడినది, భవిష్యతి = కాగలదు.

తా. రాజా! అతడు నిన్ను ఈ శాపమునుండి విడిపించగలడు. ఆ కాలానికి నీకు ప్రాయశ్చిత్తము పూర్తి అగును. 21

మూ. భారావతరణార్థం హి నరనారాయణావుభౌ, 22
ఉత్పత్స్యేతే మహావీర్యౌ కలౌ యుగ ఉపస్థితే.

ప్ర. అ. కలౌ యుగే = కలియుగము, ఉపస్థితే = సమీపించిన దగుచుండగా, మహావీర్యౌ = గొప్ప పరాక్రమము గల, నరనారాయణౌ = నరనారాయణులు, ఉభౌ = ఇద్దరూ, భారావతరణార్థమ్ = భూభారమును తొలగించుటకు, ఉత్పత్స్యేతే = పుట్టగలరు.

తా. కలియుగము దగ్గరపడినప్పుడు భూభారమును తొలగించుటకై గొప్ప పరాక్రమము గల నరనారాయణులు భూలోకములో పుట్టగలరు. 22

మూ. ఏవం తౌ శాపముత్సృజ్య బ్రాహ్మణౌ విగతజ్వరౌ, 20
తాం గాం హి దుర్బలాం వృద్ధాం దదతుర్బ్రాహ్మణాయ వై.

ప్ర. అ. తౌ = ఆ, బ్రాహ్మణౌ = బ్రాహ్మణులు, ఏవమ్ = ఇట్లు, శాపమ్ = శాపమును, ఉత్సృజ్య = విడచి, విగతజ్వరౌ = పోయిన కోపావేశము గల

తా. అందువలన, పనులున్నవారు వెంటనే నా దర్శనమును పొందుదురు గాక. రాజు బాగా నిర్వహించిన కార్యము ఫలమును పొందును కదా? లక్ష్మణా! అందువలన నీవు వెళ్ళి కార్యార్థులై ఎవరైన వచ్చినారా చూడుము. 25, 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఏభైమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపఞ్చాశః సర్గః

[నృగమహారాజు తన పుత్రునకు రాజ్యమిచ్చివేసి భూమిలో అందమైన గొయ్యి త్రవ్వించుకొని శాపమును అనుభవించుట].

మూ. రామస్య భాషితం శ్రుత్వా లక్ష్మణః పరమార్థవిత్,
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం రాఘవం దీప్తతేజసమ్. 1

ప్ర. అ. రామస్య = రామునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, పరమార్థవిత్ = పరమార్థమును ఎఱిగిన, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రాఞ్జలిః = ఎత్తబడిన దోసిలికలవాడై, దీప్తతేజసమ్ = ప్రకాశించుచున్న తేజస్సు గల, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పరమార్థమును ఎఱిగిన లక్ష్మణుడు రాముని మాటలు విని, అంజలి ఘటించి తేజస్సుతో ప్రకాశించుచున్న రామునితో ఇట్లనెను. 1

మూ. అల్పాపరాధే కాకుత్స్థ ద్విజాభ్యాం శాప ఈదృశః,
మహాన్నృగస్య రాజర్షేర్యమదణ్డ ఇవాపరః. 2

ప్ర. అ. కాకుత్స్థ = రామా! అల్పాపరాధే = అల్పమైన అపరాధమునందు, ద్విజాభ్యామ్ = బ్రాహ్మణులచేత, ఈదృశః = ఇట్టి, అపరః = మరియొక, యమదణ్డః ఇవ = యమదండము వంటి, మహాన్ = గొప్ప, శాపః = శాపము, రాజర్షేః = రాజర్షియైన, నృగస్య = నృగునకు ఇవ్వబడినది.

తా. రామా! ఆ బ్రాహ్మణులు ఇంత చిన్న అపరాధానికి రాజర్షియైన నృగమహారాజునకు యమదండమువంటి ఇంత గొప్ప శాపము ఇచ్చినారు కదా? 2

మూ. శ్రుత్వా తు పాపసంయుక్తమాత్మానం పురుషర్షభ,
కిముమవాచ నృగో రాజా ద్విజౌ క్రోధసమన్వితౌ. 3

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! నృగః రాజా = నృగమహారాజు, ఆత్మానామ్ = తనను, పాపసంయుక్తమ్ = పాపముతో కూడినవానినిగా, శ్రుత్వా = విని, క్రోధసమన్వితౌ = క్రోధముతో కూడిన, ద్విజౌ = ఆ బ్రాహ్మణులను గూర్చి, కిమ్ = ఏమి, ఉవాచ = పలికెను.

తా. పురుషశ్రేష్ఠా! నృగమహారాజు తనకు శాపము తగిలి నట్లు తెలిసిన పిమ్మట కోపించిన ఆ ఇద్దరి బ్రాహ్మణులతో ఏమనెను?

మూ. లక్ష్మణేనైవముక్తస్తు రాఘవః పునరబ్రవీత్,
శృణు సౌమ్య యథా పూర్వం స రాజా శాపవిక్షతః. 4

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, రాఘవః = రాముడు, పునః = మరల, అబ్రవీత్ = పలికెను. సౌమ్య = సౌమ్యుడా! పూర్వమ్ = పూర్వము, సః రాజా = ఆ రాజు, యథా = ఎట్లు, శాపవిక్షతః = శాపముచేత పీడింపబడినాడో, శృణు = వినుము.

తా. లక్ష్మణుని మాటలు విని రాముడు మరల పలికెను. "సౌమ్యుడా! పూర్వము ఆ రాజు ఏ విధముగ శాపముచేత బాధపడెనో వినుము. 4

మూ. అథాధ్వని గతౌ విప్రౌ విజ్ఞాయ స నృపస్తదా,
ఆహూయ మన్త్రిణః సర్వాన్నైగమాన్ సపురోధసః. 5

తానువాచ నృగో రాజా సర్వాశ్చ ప్రకృతీస్తథా,
దుఃఖేన సుసమావిష్టః శ్రూయతాం మే సమాహితైః. 6

ప్ర. అ. అథ = అటుపిమ్మట, నృపః = నరులను పాలించు, సః = ఆ, నృగః రాజా = నృగమహారాజు, విప్రౌ = బ్రాహ్మణులను, అధ్వని = మార్గమునందు, గతౌ = వెళ్ళిన వారినిగా, విజ్ఞాయ = తెలిసికొని, తదా = అప్పుడు, మన్త్రిణః = మంత్రులను, సర్వాన్ = సమస్తమైన, సపురోధసః = పురోహితునితో కూడిన, నైగమాన్ = ఆ యా సంఘముల పెద్దలను, ఆహూయ = పిలచి, తాన్ = వాళ్ళను గూర్చి, తథా = మరియు, సర్వాః = సమస్తమైన, ప్రకృతీః = ప్రకృతులను గూర్చి, దుఃఖేన = దుఃఖముతో, సుసమావిష్టః = కూడినవాడై, ఉవాచ = పలికెను. సమాహితైః = సావధానచిత్తులైన మీచేత, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. పిమ్మట ఆ నృగమహారాజు ఆ బ్రాహ్మణు లిద్దరూ వెళ్ళిపోయినట్లు తెలిసికొని చాల దుఃఖించుచు మంత్రులను, ఆ యా గణముల ముఖ్యులను పురోహితుణ్ణి పిలిపించి, వాళ్ళతోను, మిగిలిన ప్రకృతు లందరితోను ఇట్లు పలికెను. మీరు సావధానచిత్తులై వినుడు. 6

మూ. నారదః పర్వతశ్చైవ మమ దత్త్వా మహద్భయమ్,
గతౌ త్రిభువనం భద్రౌ వాయుభూతావనిన్దితౌ. 7

ప్ర. అ. భద్రౌ = మంగళప్రదులైన, అనిన్దితౌ = నిందింపబడని, నారదః = నారదుడు, పర్వతః చైవ = పర్వతుడు, మమ = నాకు, మహత్ = గొప్ప, భయమ్ = భయమును, దత్త్వా = ఇచ్చి, వాయుభూతౌ = వాయువువంటివారై, త్రిభువనమ్ = మూడులోకములకు, గతౌ = వెళ్ళినారు.

తా. మంగళప్రదులు, నిందావిహీనులూ అయిన, నారదుడు, (అతని మిత్రుడు) పర్వతుడూ నాకు చాల భయంకరమైన విషయము చెప్పి వాయువేగముతో త్రిలోకములకు వెళ్ళిరి.

వి. ఈ శ్లోకం అన్వయం సరిగాలేదు. ఉన్నదానికి అర్థం చెప్పాలి కదా అని అర్థం వ్రాయడం జరిగింది. ఆ వచ్చిన ఇద్దరి బ్రాహ్మణుల పేర్లు నారద పర్వతులని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసినారు. అయితే వాళ్ళు త్రిభువనాలకి వెళ్లడం ఏమిటి? నారదుడు వలెనే ఆయన మిత్రుడు పర్వతుడు అనే దేవర్షి ఉన్నా డనీ వీళ్ళిద్దరూ త్రిలోకసంచారం చేస్తూ ఉంటా రనీ పురాణాలలో కథలు ఉన్నాయి. అయితే ఇక్కడ ప్రాచ్య పాఠం బాగున్నది.

"నారదప్రతిమావేతౌ మమ దత్త్వా మహద్భయమ్,
ఉభౌ యాతౌ ద్విజశ్రేష్ఠౌ దేవభూతౌ మహామునీ"

"నారదుని వంటి, దేవతాసదృశులైన ఈ ఇద్దరు బ్రాహ్మణులు నాకు చాలా గొప్ప భయము కలిగించి (శాపమిచ్చి) వెళ్ళిపోయినారు" అని దీని భావం. 7

మూ. కుమారోఽయం వసుర్నామ స చేహాద్యాభిషిచ్యతామ్,
శ్వభ్రం యత్సుఖసంస్పర్శం క్రియతాం శిల్పిభిర్మమ. 8

ప్ర. అ. అయమ్ = ఈ, వసుః నామ = వసువు అను పేరు గల, కుమారః

=నా కుమారు డున్నాడు. సః చ = అతడు, అద్య = ఇప్పుడు, ఇహ = ఇక్కడ
అభిషిచ్యతామ్ = అభిషేకించబడుగాక, శిల్పిభిః = శిల్పులచేత, మమ = నాకు,
యత్ = ఏది, సుఖసంస్పర్శమ్ = సుఖమైన స్పర్శ గలదో అట్టి, శ్వభ్రం =
గొయ్యి, క్రియతామ్ = నిర్మించబడుగాక.

తా. నా కుమారుడైన ఈ వసువును రాజ్యాభిషిక్తుణ్ణి చేయుడు. నా కోసమై
శిల్పులచేత స్పర్శసుఖకరముగా ఉండే గొయ్యి నిర్మించబడుగాక. 8

మూ. యత్రాహం సంక్షయిష్యామి శాపం బ్రాహ్మణనిఃసృతమ్,
వర్షఘ్నమేకం శ్వభ్రం తు హిమఘ్నమపరం తథా, 9
గ్రీష్మఘ్నం తు సుఖస్పర్శమేకం కుర్వన్తు శిల్పినః.

ప్ర. అ. అహమ్=నేను, యత్ర = దేనియందు, బ్రాహ్మణనిఃసృతమ్ =
బ్రాహ్మణులవలన వచ్చిన, శాపమ్ = శాపమును, సంక్షయిష్యామి = క్షీణింపచేసు
కొందునో అట్టి, వర్షఘ్నమ్ = వర్షములను అడ్డుకొను, ఏకం శ్వభ్రం తు = ఒక
గోతిని, తథా = మరియు, హిమఘ్నమ్ = మంచును తొలగించు, అపరమ్ =
మరొకదానిని, గ్రీష్మఘ్నమ్ = వేడిని అడ్డుకొను, సుఖస్పర్శమ్=సుఖమైన స్పర్శ
గల, ఏకమ్ = ఒక గోతిని, శిల్పినః = శిల్పులు, కుర్వన్తు = నిర్మింతురుగాక.

తా. శిల్పులు వర్షబాధ ఉండని ఒక గోతిని, చలివలన బాధ ఉండని
మరొక గోతిని, వేడిబాధ లేక స్పర్శసుఖము నిచ్చు వేరొక గోతిని నిర్మింతురు
గాక. నేను వాటిలో నివసించి బ్రాహ్మణులవలన వచ్చిన శాపమును క్షీణింప
చేసికొందును. 9

మూ. ఫలవన్తశ్చ యే వృక్షాః పుష్పవత్యశ్చ యా లతాః, 10
విరోప్యన్తాం బహువిధాశ్ఛాయావన్తశ్చ గుల్మినః.

ప్ర. అ. ఫలవన్తః = పండ్లుగల, యే = ఏ, వృక్షాః=వృక్షము లున్నవో,
పుష్పవత్యః = పుష్పములు గల, యాః=ఏ, లతాః=లతలు గలవో అవి. ఛాయా
వన్తః=నీడగల, గుల్మినః=పొదలు గల, వివిధాః=అనేకవిధములైన మొక్కలు,
విరోప్యన్తామ్ = నాటబడుగాక.

తా. ఆ గోతుల దగ్గర ఫలవృక్షములను, పుష్పములతో నిండిన లతలను
నీడ నిచ్చే పొదలుగా పెరిగే మొక్కలను నాటించవలెను. 10

మూ. క్రియతాం రమణీయం చ శ్వభ్రాణాం సర్వతో దిశమ్,
సుఖమత్ర వసిష్యామి యావత్కాలస్య పర్యయః.

ప్ర. అ. శ్వభ్రాణామ్ = గోతులకు, సర్వతోదిశమ్ = అన్ని వైపులా, రమణీయమ్ = సుందరముగా, క్రియతామ్ = చేయబడుగాక, కాలస్య = కాలము యొక్క, పర్యయః = గడచుట, యావత్ = ఎంతవరకు (ఎప్పటికి) జరుగునో, అంతవరకు, అత్ర = ఇక్కడ, సుఖమ్ = సుఖముగా, వసిష్యామి = నివసించెదను.

తా. గోతులకు అన్ని వైపులా సుందరముగా ఉండు నట్లు చేయవలెను. శాపకాలము గడచేవరకు నేను అక్కడ నివసించెదను. 11

మూ. పుష్పాణి చ సుగన్ధీని క్రియన్తాం తేషు నిత్యశః, 12
పరివార్య యథా మే స్యురధ్యర్థం యోజనం తథా.

ప్ర. అ. అధ్యర్ధమ్ = అర్థము అధికముగా గల, యోజనమ్ = యోజనమును, మే = నాకు, పరివార్య = చుట్టి, యథా = ఎట్లు, స్యుః = ఉండునో, తథా = అట్లు, తేషు = ఆ ప్రాంతములయందు, సుగన్ధీని = మంచి సువాసన గల, పుష్పాణి = పుష్పములు, నిత్యశః = ఎల్లప్పుడు, క్రియన్తామ్ = చేయబడు గాక.

తా. నా నివాసమునకు చుట్టూ ఒకటిన్నర యోజనముల దూరము నిత్యము సుగంధపుష్పములు ఉండునట్లు ఏర్పాటు చేయవలెను. 12

మూ. ఏవం కృత్వా విధానం స సంనివేశ్య వసుం తథా. 13
ధర్మనిత్యః ప్రజాః పుత్ర క్షత్రధర్మేణ పాలయ,
ప్రత్యక్షం తే యథా శాపో ద్విజాభ్యాం మయి పాలితః,
నరశ్రేష్ఠ సరోషాభ్యామపరాధేఽపి తాదృశే.

ప్ర. అ. సః = నృగమహారాజు, ఏవమ్ = ఇట్లు, విధానమ్ = ఏర్పాటును, కృత్వా = చేసి, తదా = అప్పుడు, వసుమ్ = వసువును, సంనివేశ్య = రాజ్యమునందు నిలిపి (ఇట్లు పలికెను). పుత్ర = పుత్రా! ధర్మనిత్యః = ధర్మమునందు స్థిరుడవై, ప్రజాః = ప్రజలను, క్షత్రధర్మేణ = క్షత్రియధర్మముచేత, పాలయ =

పాలించుము, నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! తాదృశే = అట్టి, అపరాధేఽపి = = అపరాధమునందు కూడ, సరోషాభ్యామ్ = కోపముతో కూడిన, ద్విజాభ్యామ్ = బ్రాహ్మణులచేత, మయి = నాయందు, యథా = ఎట్లు, శాపః = శాపము, పాతితః = పడవేయబడినదో, తే = నీకు, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షమే.

తా. ఆ నృగమహారాజు ఈ విధానముగా ఏర్పాట్లు చేసికొని పుత్రుణ్ణి రాజ్యాభిషిక్తుని చేసి అతని కిట్లు ఉపదేశించెను. "పుత్రా! ధర్మమునందు స్థిరుడవై క్షత్రియధర్మానుసారము ప్రజలను పాలించుము. అలాంటి చిన్న అపరాధానికి కూడా కోపించిన ఆ ఇద్దరు బ్రాహ్మణులూ నాకు ఎట్లు శాప మిచ్చినారో నీవే చూచినావు కదా! 13, 14

మూ. మా కృథాస్త్వనుసంతాపం మత్కృతే హి నరర్షభ, 15
కృతాన్తః కుశలః పుత్ర యేనాస్మి వ్యసనీకృతః.

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా! మత్కృతే = నా నిమిత్తమై, అనుసంతాపమ్ = మనస్తాపమును, మా కృథాః = చేయకుము. పుత్ర = పుత్రా! యేన = ఏ దైవముచేత, వ్యసనీ = వ్యసనముకలవాడనుగా, కృతః అస్మి = చేయబడితినో అట్టి, కృతాన్తః = దైవము, కుశలః = సమర్థమైనది.

తా. "నరశ్రేష్ఠా! నా నిమిత్తమై మనస్సులో బాధపడకుము పుత్రా! దైవము (సామర్థ్యము) చాల గొప్పది. ఆ దైవమే నాకీ కష్టము తెచ్చిపెట్టినది".

మూ. ప్రాప్తవ్యాన్యేవ ప్రాప్నోతి గన్తవ్యాన్యేవ గచ్ఛతి, 16
లబ్ధవ్యాన్యేవ లభతే దుఃఖాని చ సుఖాని చ,
పూర్వే జాత్యన్తరే వత్స మా విషాదం కురుష్వ హ. 17

ప్ర. అ. వత్స = వత్సా! పూర్వే = పూర్వమునందలి, జాత్యన్తరే = జన్మాంతరమునందు, (చేసిన కర్మను బట్టి) ప్రాప్తవ్యాన్యేవ = పొందతగినవాటినే, ప్రాప్నోతి = పొందును. గన్తవ్యాన్యేవ = వెళ్ళదగిన స్థానములను గూర్చియే, గచ్ఛతి = వెళ్ళును. లబ్ధవ్యాన్యేవ = పొందతగినవే అయిన, దుఃఖాని చ = దుఃఖములను, సుఖాని చ = సుఖములను, లభతే = పొందును. విషాదమ్ = దుఃఖమును, మా కురుష్వ హ = చేయకుము.

తా. "వత్సా! ప్రతి ఒక్కడూ కూడ పూర్వజన్మలో చేసిన కర్మల ననుసరించి పొందదగిన ధనాదులను పొందును. వెళ్ళవలసిన స్థానములకు వెళ్ళును. రావలసిన దుఃఖములను గాని సుఖములను గాని అనుభవించును. అందుచేత నా కోసమై దుఃఖించకుము." 16, 17

మూ. ఏవముక్త్వా నృగస్తత్ర సుతం రాజా మహాయశాః,
శ్వభ్రం జగామ సుకృతం వాసాయ పురుషర్షభ. 18

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజా = రాజైన, నృపః = నృగమహారాజు, తత్ర = అక్కడ, సుతమ్ = కుమారుణ్ణి గూర్చి. ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా=పలికి, సుకృతమ్ = బాగా నిర్మించబడిన, శ్వభ్రమ్ = గోతిని గూర్చి, వాసాయ = నివాసముకొరకు, జగామ = వెళ్ళెను.

తా. లక్ష్మణా! మహాకీర్తిశాలియైన ఆ నృగమహారాజు పుత్రున కిట్లు బోధించి, చక్కగా ఏర్పరుపబడిన గోతిలో నివసించుటకై వెళ్ళిపోయెను. 18

మూ. ఏవం ప్రవిశ్యైవ నృపస్తదానీం
శ్వభ్రం మహారత్నవిభూషితం తత్,
సంపాదయామాస తదా మహాత్మా
శాపం ద్విజాభ్యాం హి రుషా విముక్తమ్. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతుఃపఞ్చాశః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, నృపః = రాజు, తదానీమ్ = అప్పుడు, రత్నవిభూషితమ్ = రత్నములచేత అలంకరించబడిన, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, శ్వభ్రమ్=గోతిని, ఏవమ్ = ఈ విధముగా, ప్రవిశ్యైవ ప్రవేశించి, తదా = అప్పుడు, ద్విజాభ్యామ్ = బ్రాహ్మణులచేత, రుషా = కోపముతో, విముక్తమ్ = విడువబడిన, (ఇవ్వబడిన), శాపమ్ = శాపమును, సంపాదయామాస = సంపాదించెను. (అనుభవించుట ప్రారంభించెను).

తా. మహాత్ముడైన ఆ నృగమహారాజు రత్నములచేత అలంకరించబడిన ఆ పెద్ద గోతిలో ప్రవేశించి, ఆ ఇద్దరు బ్రాహ్మణుల కోపముతో ఇచ్చిన శాపమును అనుభవించుట ప్రారంభించెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఏబది నాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చపఞ్చాశః సర్గః

[నిమిచక్రవర్తి వసిష్ఠుడు ఒకరి నొకరు శపించుకొని దేహములు త్యజించుట.]

మూ. ఏష తే నృగశాపస్య విస్తరోఽభిహితో మయా,
యద్యస్తి శ్రవణే శ్రద్ధా శృణుష్వేహాపరాం కథామ్. 1

ప్ర. అ. నృగశాపస్య = నృగమహారాజు శాపముయొక్క, ఏషః = ఈ, విస్తరః = విస్తరము, మయా = నాచేత, తే = నీకు, అభిహితః = చెప్పబడినది. శ్రవణే = వినుటయందు, శ్రద్ధా = శ్రద్ధ, అస్తి యది = ఉన్నట్లయితే, ఇహ = ఇక్కడ, అపరామ్ = మరియొక, కథామ్ = కథను, శృణుష్వ = వినుము.

తా. లక్ష్మణా! నృగశాపమును గూర్చిన విశేషములు చెప్పినాను. నీకు శ్రద్ధ ఉన్నచో మరొక కథ చెప్పెదను; వినుము. 1

మూ. ఏవముక్తస్తు రామేణ సౌమిత్రిః పునరబ్రవీత్,
తృప్తిరాశ్చర్యభూతానాం కథానాం నాస్తి మే నృప. 2

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సౌమిత్రిః = లక్ష్మణుడు, పునః = మరల, అబ్రవీత్ = పలికెను. నృప = రాజా! ఆశ్చర్యభూతానామ్ = ఆశ్చర్యములైన, కథానామ్ = కథల విషయమునందు, మే = నాకు, తృప్తిః = తృప్తి, నాస్తి = = లేదు.

తా. లక్ష్మణుడు రాముని మాటలు విని మరల ఇట్లు పలికెను-"రాజా! ఆశ్చర్యకరములైన కథలు వినుటలో నాకు సంతృప్తి లేదు". 2

మూ. లక్ష్మణేనైవముక్తస్తు రామ ఇక్ష్వాకునన్దనః,
కథాం పరమధర్మిష్ఠాం వ్యాహర్తుముపచక్రమే. 3

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ఇక్ష్వాకునన్దనః = ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడైన, రామః = రాముడు, పరమధర్మిష్ఠామ్ = చాల ధర్మయుక్తమైన, కథామ్ = కథను, వ్యాహర్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. లక్ష్మణు డిట్లు అనగా, ఇక్ష్వాకుకులమునకు ఆనందకరుడైన రాముడు చాల ధర్మసంమతమైన ఒక కథ చెప్పుటకు ఉపక్రమించెను. 3

మూ. ఆసీద్రాజా నిమిర్నామ ఇక్ష్వాకూణాం మహాత్మనామ్,
పుత్రో ద్వాదశమో వీర్యే ధర్మే చ పరినిష్ఠితః. 4

ప్ర. అ. మహాత్మనామ్ = మహాత్ములైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకుపుత్రులలో, ద్వాదశమః = పండ్రెండవ, పుత్రః = పుత్రుడైన, వీర్యే = పరాక్రమమునందు, ధర్మే చ = ధర్మమునందు, పరినిష్ఠితః = స్థిరుడైన, నిమిః నామ = నిమి అను, రాజా = రాజు, ఆసీత్ = ఉండెను.

తా. మహాత్ములైన ఇక్ష్వాకుపుత్రులలో పండ్రెండవవాడు, పరాక్రమమునందు, ధర్మమునందూ స్థిరుడూ అయిన నిమి అను రాజు ఉండెను. 4

మూ. స రాజా వీర్యసంపన్నః పురం దేవపురోపమమ్,
నివేశయామాస తదా అభ్యాశే గౌతమస్య తు. 5

ప్ర. అ. వీర్యసంపన్నః = పరాక్రమసంపన్నుడైన, సః రాజా = ఆ రాజు, తదా = అప్పుడు, గౌతమస్య = గౌతమునియొక్క, అభ్యాశే = సమీపమునందు, దేవపురోపమమ్ = దేవతల పట్టణముతో సమానమైన, పురమ్ = పట్టణమును, నివేశయామాస = నిర్మింపచేసెను.

తా. గొప్ప పరాక్రమము గల ఆ రాజు గౌతమాశ్రమముదగ్గర దేవతాపురమైన అమరావతితో సమానమైన నగరమును నిర్మింపచేసెను. 5

మూ. పురస్య సుకృతం నామ వైజయన్తమితి శ్రుతమ్,
నివేశం యత్ర రాజర్షిర్నిమిశ్చక్రే మహాయశాః. 6

ప్ర. అ. పురస్య = ఆ పట్టణమునకు, వైజయన్తమ్ ఇతి = వైజయంతము

అని, శ్రుతమ్ = ప్రసిద్ధమైన, నామ = పేరు, సుకృతమ్ = బాగుగా చేయబడినది. యత్ర = ఎక్కడ, మహాయశాః = గొప్ప కీర్తి గల, రాజర్షిః = రాజర్షియైన, నిమిః = నిమి, నివేశమ్ = నివాసమును, చక్రే = చేసెనో.

తా. ఆ పట్టణమునకు వైజయంతము అను ప్రసిద్ధమైన చక్కని పేరు పెట్టిరి. మహాయశఃశాలీ, రాజర్షి అయిన నిమి ఆ నగరములో నివాస మేర్పరచుకొనెను. 6

మూ. తస్య బుద్ధిః సముత్పన్నా నివేశ్య సుమహాపురమ్,
యజేయం దీర్ఘసత్రేణ పితుః ప్రహ్లాదయన్మనః. 7

ప్ర. అ. తస్య=అతనికి, సుమహాపురమ్=చాల గొప్పదైన ఆ పురమును, నివేశ్య = నిర్మించి, బుద్ధిః=బుద్ధి, ఉత్పన్నా = పుట్టినది. పితుః=తండ్రియొక్క, మనః = మనస్సును, ప్రహ్లాదయన్=సంతోషపెట్టుచు, దీర్ఘసత్రేణ = దీర్ఘసత్రము చేత, యజేయమ్ = యాగముచేయుదును.

తా. ఆ మహాపురమును నిర్మించిన పిదప ఆతనికి-"తండ్రిగారి మనస్సుకు ఆనందము కలిగించుచు ఒక దీర్ఘసత్రము (కొన్ని సంవత్సరములపాటు చేయవలసిన యజ్ఞము) చేసెదను"అను బుద్ధి కలిగెను. 7

మూ. తతః పితరమామన్త్ర్య ఇక్ష్వాకుం హి మనోః సుతమ్,
వసిష్ఠం వరయామాస పూర్వం బ్రహర్షిసత్తమమ్. 8

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మనోః = మనువుయొక్క, సుతమ్ = పుత్రుడైన, పితరమ్=తనతండ్రియైన, ఇక్ష్వాకుమ్ = ఇక్ష్వాకువును, ఆమన్త్ర్య= ఆహ్వానించి, పూర్వమ్ = ముందుగా, బ్రహ్మర్షిసత్తమమ్ = బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైన, వసిష్ఠమ్ = వసిష్ఠుణ్ణి, వరయామాస = (ఋత్విక్కుగా) వరించెను.

తా. పిమ్మట అతడు తన తండ్రి, మనుచక్రవర్తి కుమారుడూ అయిన ఇక్ష్వాకువును ఆహ్వానించి, ముందుగా బ్రహ్మర్షులలో ఉత్తముడైన వసిష్ఠుణ్ణి ఋత్విక్కుగా వరించెను 8

మూ. అనన్తరం స రాజర్షిర్నిమిరిక్ష్వాకునన్దనః,
అత్రిమఙ్గిరసం చైవ భృగుం చైవ తపోనిధిమ్ 9

ప్ర. అ. అనన్తరమ్ = అనంతరము, సః రాజర్షిః = ఆ రాజర్షియైన, ఇక్ష్వాకునన్దనః = ఇక్ష్వాకుపుత్రుడైన, నిమిః = నిమి, అత్రిమ్ = అత్రినీ, అఙ్గిరసం చైవ = అంగిరసుణ్ణి, తపోనిధిమ్ = తపస్సుకు నిధి యైన, భృగుం చైవ = భృగువునూ వరించెను.

తా. పిదప ఇక్ష్వాకుపుత్రుడు రాజర్షి అయిన నిమి అత్రిని, అంగిరసుని, తపోనిధియైన భృగువునూ కూడ వరించెను. 9

మూ. తమువాచ వసిష్ఠస్తు నిమిం రాజర్షిసత్తమమ్,
వృతోఽహం పూర్వమిన్ద్రేణ అన్తరం ప్రతిపాలయ. 10

ప్ర. అ. వసిష్ఠస్తు = వసిష్ఠుడైతే, రాజర్షిసత్తమమ్ = రాజర్షులలో ఉత్తముడైన, నిమిమ్ = నిమిని గూర్చి, ఉవాచ = పలికెను. అహమ్ = నేను, పూర్వమ్ = ముందుగా, ఇన్ద్రేణ = ఇంద్రునిచేత, వృతః = వరింపబడితిని, అన్తరమ్ = అవకాశమును, ప్రతిపాలయ = నిరీక్షించుము.

తా. వసిష్ఠుడు రాజర్షులలో శ్రేష్ఠుడైన ఆ నిమితో-"నన్ను ముందుగా ఇంద్రుడు వరించి ఉన్నాడు; సమయానికై వేచి ఉండుము"అని పలికెను. 10

మూ. అనన్తరం మహావిప్రో గౌతమః పర్యపూరయత్,
వసిష్ఠోఽపి మహాతేజా ఇన్ద్రయజ్ఞమథాకరోత్. 11

ప్ర. అ. అనన్తరమ్ = అనంతరమునందు, మహావిప్రః = గొప్ప బ్రాహ్మణుడైన, గౌతమః = గౌతముడు, పర్యపూరయత్ = పూరించెను. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, వసిష్ఠః అపి = వసిష్ఠుడు, అథ = అటుపిమ్మట, ఇన్ద్రయజ్ఞమ్ = ఇంద్రుని యజ్ఞమును, అకరోత్ = చేసెను.

తా. పిదప గొప్ప బ్రాహ్మణుడైన గౌతముడు (వసిష్ఠుని స్థానమును) పూరించెను. గొప్పతేజస్సు గల వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞమును చేసెను. 11

మూ. నిమిస్తు రాజా విప్రాంస్తాన్ సమానీయ నరాధిపః,
అయజద్ధిమవత్పార్శ్వే స్వపురస్య సమీపతః. 12
పఞ్చ వర్షసహస్రాణి రాజా దీక్షామథాకరోత్.

ప్ర. అ. రాజా = రాజైన, నరాధిపః = నరుల ప్రభువైన, నిమిః తు = నిమి అయితే, తాన్ = ఆ, విప్రాన్ = బ్రాహ్మణులను, సమానీయ = తీసికొనివచ్చి, హిమవత్పార్శ్వే = హిమవత్పర్వతము ప్రక్కన, స్వపురస్య = తన పురముయొక్క, సమీపతః = సమీపమునందు, అయజత్ = యాగము చేసెను. అథ = అటుపిమ్మట, రాజా = రాజు, పఞ్చవర్షసహస్రాణి = ఐదువేల సంవత్సరములు, దీక్షామ్ = దీక్షను, అకరోత్ = చేసెను.

తా. నిమిమహారాజు, ఆ బ్రాహ్మణులను తీసికొని వచ్చి హిమవత్పర్వతము ప్రక్క, తన పురము దగ్గర యజ్ఞము చేసెను. ఆ రాజు ఐదు వేల సంవత్సరములు ఆ యజ్ఞదీక్ష జరిపించెను. 12.

మూ. ఇన్ద్రియజ్ఞావసానే తు వసిష్ఠో భగవాన్ ఋషిః, 13.
సకాశమాగతో రాజ్ఞో హౌత్రం కర్తుమనిన్దితః.

ప్ర. అ. ఇన్ద్రియజ్ఞావసానే = ఇంద్రుని యజ్ఞముయొక్క అంతమునందు, భగవాన్ = పూజ్యుడైన, అనిన్దితః = నిందింపబడని, వసిష్ఠః ఋషిః = వసిష్ఠ మహర్షి, హౌత్రమ్ = హౌత్రమును, కర్తుమ్ = చేయుటకు, రాజ్ఞః = రాజుయొక్క, సకాశమ్ = సమీపమును, ఆగతః = వచ్చినాడు.

తా. ఇంద్రుని యజ్ఞము పూర్తియైన పిమ్మట పూజ్యుడూ, దోషరహితుడూ అయిన వసిష్ఠమహర్షి హోత అను ఋత్విక్కుగా ఉండుటకు రాజుదగ్గరికి వచ్చెను.

మూ. తదన్తరమథాపశ్యద్గౌతమేనాభిపూరితమ్, 14.
కోపేన మహతావిష్టో వసిష్ఠో బ్రహ్మణః సుతః,
స రాజ్ఞో దర్శనాకాఙ్క్షీ ముహూర్తం సముపావిశత్. 15.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తత్ అన్తరమ్ = ఆ అవకాశమును, గౌతమేన = గౌతమునిచేత, అభిపూరితమ్ = నింపబడినదానినిగా, అపశ్యత్ = చూచెను. బ్రహ్మణః = బ్రహ్మయొక్క, సుతః = కుమారుడైన, సః వసిష్ఠః = ఆ వసిష్ఠుడు, మహతా = గొప్ప, కోపేన = కోపముతో, ఆవిష్టః = కూడినవాడై, రాజ్ఞః = రాజుయొక్క, దర్శనాకాఙ్క్షీ = దర్శనమును కోరుచున్నవాడై, ముహూర్తమ్ = ముహూర్తకాలము, సముపావిశత్ = కూర్చుండెను.

తా. పిమ్మట అతడు తన స్థానమును గౌతముడు పూరించినట్లు చూచెను. అప్పుడు బ్రహ్మపుత్రుడైన ఆ వసిష్ఠుడు క్రోధావిష్టుడై రాజును చూచుటకై ముహూర్త కాలము కూర్చుండెను. 14,15

మూ. తస్మిన్నహని రాజర్షిర్నిద్రయాపహృతో భృశమ్,
తతో మన్యుర్వసిష్ఠస్య ప్రాదురాసీన్మహాత్మనః, 16
అదర్శనేన రాజర్షేర్వ్యాహర్తుముపచక్రమే.

ప్ర. అ. తస్మిన్ = ఆ, అహని = దివసమునందు, రాజర్షిః = రాజర్షి, భృశమ్ = మిక్కిలి, నిద్రయా = నిద్రచేత, అపహృతః = అపహరింపబడెను. తతః = అటుపిమ్మట, రాజర్షేః = రాజర్షియొక్క, అదర్శనేన = కనబడకపోవుట చేత, మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠునకు, మన్యుః = కోపము, ప్రాదురాసీత్ = పుట్టెను. వ్యాహర్తుమ్ = పలుకుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. ఆ రోజున ఆ రాజర్షికి చాల నిద్ర వచ్చెను. ఆ రాజర్షి కనబడకపోవుట చేత మహాత్ముడైన వసిష్ఠునకు కోపము వచ్చెను. అత డిట్లు పలికెను. 16

మూ. యస్మాత్త్వమన్యం వృతవాన్ మామవజ్ఞాయ పార్థివ, 17
చేతనేన వినా భూతో దేహస్తవ భవిష్యతి.

ప్ర. అ. పార్థివ = రాజా! యస్మాత్ = ఎందువలన, మామ్ = నన్ను, అవజ్ఞాయ = అవమానముచేసి, త్వమ్ = నీవు, అన్యమ్ = మరిఒకనిని, వృతవాన్ = వరించినవాడవు, అసి = అయినావో, అందువలన, తవ దేహః = నీ దేహము, చేతనేన వినాభూతః = చైతన్యము లేనిదిగా, భవిష్యతి = కాగలదు.

తా. రాజా! నీవు నన్ను అవమానము చేసి మరొకనిని వరించినావు; అందువలన నీ దేహము చైతన్యము లేనిది అగుగాక. 17

మూ. తతః ప్రబుద్ధో రాజా తు శ్రుత్వా శాపముదాహృతమ్, 18
బ్రహ్మయోనిమథోవాచ సంరమ్భాత్ క్రోధమూర్ఛితః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాజా తు = రాజైతే, ప్రబుద్ధః = నిద్రనుండి

లేచినవాడై, ఉదాహృతమ్ = పలకబడిన, శాపమ్ = శాపమును, శ్రుత్వా = విని, క్రోధమూర్ఛితః = క్రోధావిష్టుడై, అథ = అటుపిమ్మట, సంరమ్భాత్ = తొందర వలన, బ్రహ్మయోనిమ్ = బ్రహ్మపుత్రుణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిదప మేల్కొనిన రాజు ఆ శాపవాక్యమును విని క్రోధావిష్టుడై బ్రహ్మపుత్రుడైన వసిష్ఠునితో ఇట్లు పలికెను. 18

మూ. అజానతః శయానస్య క్రోధేన కలుషీకృతః, 19
ఉక్తవాన్మమ శాపాగ్నిం యమదణ్డమివాపరమ్.

ప్ర. అ. క్రోధేన = కోపముచేత, కలుషీకృతః = కలుషముగా చేయబడినవాడవై, శయానస్య = నిద్రపోవుచున్న, అజానతః = ఏమీ తెలియని, మమ = నాకు, అపరమ్ = మరియొక, యమదణ్డమ్ ఇవ = యమదండము వంటి, శాపాగ్నిమ్ = శాపాగ్నిని, ఉక్తవాన్ = పలికినావు.

తా. నేను స్పృహలేకుండా నిద్రపోవుచున్నప్పుడు నీవు కోపావేశముతో రెండవ యమదండము వంటి శాపాగ్నిని ప్రయోగించినావు. 19

మూ. తస్మాత్తవాపి బ్రహ్మర్షే చేతనేన వినాకృతః, 20
దేహః స రుచిరప్రఖ్యో భవిష్యతి న సంశయః.

ప్ర. అ. బ్రహ్మర్షే != బ్రహ్మర్షీ ! తస్మాత్ = ఆ కారణమువలన, తవ = నీయొక్క, రుచిరప్రఖ్యః = అందమైన కాంతి గల, సః దేహః అపి = దేహము కూడ, చేతనేన వినాకృతః = చైతన్యము లేనిది, భవిష్యతి = కాగలదు; సంశయః = సంశయము, న = లేదు.

తా. బ్రహ్మర్షీ! ఆ కారణముచేత మంచి కాంతి గల నీ దేహము కూడ చైతన్యరహితము కాగలదు; సందేహము లేదు. 20

మూ. ఇతి రోషవశాదుభౌ తదానీ
మన్యోన్యం శపితౌ నృపద్విజేన్ద్రౌ,
సహసైవ బభూవతుర్విదేహౌ
తత్తుల్యాధిగతప్రభావవన్తౌ. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చపఞ్చాశః సర్గః.

ప్ర. అ. ఇతి = ఇట్లు, రోషవశాత్ = కోపవశమువలన, అన్యోన్యమ్ = పరస్పరము, శపితౌ = శపించబడిన, తత్తుల్యాధిగతప్రభావవన్తౌ = వారితో సమానమైనదిగా తెలియబడిన ప్రభావము గల, నృపద్విజేన్ద్రౌ = రాజబ్రాహ్మణులు, ఉభౌ = ఇద్దరూ, తదానీమ్ = అప్పుడు, సహసైవ = వెంటనే, విదేహౌ = దేహములు లేనివారుగా, బభూవతుః = అయిరి.

తా. ప్రభావముచేత ఒకరితో ఒకరు సమానులని ప్రసిద్ధులైన ఆ నిమి వసిష్ఠులు రోషావేశముచేత ఈ విధముగా ఒకరి నొకరు శపించుకొని అప్పుడు వెంటనే దేహములు లేనివారు అయిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో యాభై యైదవ సర్గ సమాప్తము.

## అథ షట్పఞ్చాశః సర్గః

*[బ్రహ్మదేవుడు చెప్పగా వసిష్ఠుడు వరుణుని రేతస్సులో ప్రవేశించుట, వరుణుడు ఊర్వశి సమీపమున ఒక కలశలో తన రేతస్సును ఉంచుట. మిత్రుని శాపముచేత ఊర్వశి భూలోకములో పురూరవుని దగ్గర ఉండి పుత్రుణ్ణి కనుట]*

మూ. రామస్య భాషితం శ్రుత్వా లక్ష్మణః పరవీరహా,
ఉవాచ ప్రాఞ్జలిర్భూత్వా రాఘవం దీప్తతేజసమ్. 1

ప్ర. అ. పరవీరహా = శత్రువీరులను చంపు, లక్ష్మణః = లక్ష్మణుడు, రామస్య = రామునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, దీప్తతేజసమ్ = ప్రకాశించుచున్న తేజస్సు గల, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు రాముని మాటలు విని, అంజలి ఘటించి ప్రకాశించుచున్న తేజస్సు గల రామునితో ఇట్లనెను. 1

మూ. నిక్షిప్య దేహౌ కాకుత్స్థ కథం తౌ ద్విజపార్థివౌ,
పునర్దేహేన సంయోగం జగ్మతుర్దేవసంమతౌ. 2

ప్ర. అ. కాకుత్స్థ=రామా! తౌ=ఆ, దేవసంమతౌ=దేవతలకు ఇష్టులైన, ద్విజపార్థివౌ=బ్రాహ్మణరాజులు, దేహౌ=దేహములను, నిక్షిప్య = ఉంచి, పునః= మరల, దేహేన = దేహముతో, సంయోగమ్ = సంబంధమును, కథమ్ = ఎట్లు, జగ్మతుః = పొందిరి.

తా. రామా! దేవతలకు కూడ పూజ్యులైన ఆ వసిష్ఠనిమిచక్రవర్తులు దేహాలను విడిచివేసిన పిమ్మట మరల దేహములను ఎట్లు పొందిరి? 2

మూ. లక్ష్మణేనైవముక్తస్తు రామ ఇక్ష్వాకునన్దనః,
ప్రత్యువాచ మహాతేజా లక్ష్మణం పురుషర్షభః. 3

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణుని చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, ఇక్ష్వాకునన్దనః = ఇక్ష్వాకువంశమునకు ఆనందమును కలిగించు, పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. లక్ష్మణుని మాటలు విని ఇక్ష్వాకువంశమునకు ఆనందకరుడు, గొప్ప తేజస్సు కలవాడు, పురుషశ్రేష్ఠుడూ అయిన రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికెను.

మూ. తౌ పరస్పరశాపేన దేహముత్సృజ్య ధార్మికౌ,
అభూతాం నృపవిప్రర్షీ వాయుభూతౌ తపోధనౌ. 4

ప్ర. అ. ధార్మికౌ = ధార్మికులైన, తౌ = ఆ, నృపవిప్రర్షీ = రాజబ్రహ్మర్షులు, పరస్పరశాపేన = పరస్పరశాపము చేత, దేహమ్ = దేహమును, ఉత్సృజ్య = విడచి, వాయుభూతౌ = వాయువుగా అయిన, తపోధనౌ = మునులుగా, అభూతామ్ = అయిరి.

తా. ధార్మికులైన ఆ రాజర్షిబ్రహ్మర్షులు పరస్పరశాపముచేత దేహమును విడచి వాయురూపములో ఉన్న మునులుగా అయిరి. 4

మూ. అశరీరః శరీరస్య కృతేఽన్యస్య మహామునిః,
వసిష్ఠస్తు మహాతేజా జగామ పితురన్తికమ్. 5

ప్ర. అ. అశరీరః = శరీరము లేని, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహామునిః = మహామునియైన, వసిష్ఠః తు = వసిష్ఠుడైతే, అన్యస్య = మరియొక, శరీరస్య కృతే = శరీరముకొరకై, పితుః = తండ్రియొక్క, అన్తికమ్ = సమీపమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. శరీరము లేని మహాతేజఃశాలియైన వసిష్ఠమహాముని మరి యొక శరీరముకొరకై తండ్రి దగ్గరకు వెళ్లెను. 5

మూ. సోఽభివాద్య తతః పాదౌ దేవదేవస్య ధర్మవిత్,
పితామహమథోవాచ వాయుభూత ఇదం వచః. 6

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మములను ఎరిగిన, వాయుభూతః = వాయువుగా అయిన, సః = ఆ వసిష్ఠుడు, తతః = అటుపిమ్మట, దేవదేవస్య = ఆ దేవదేవుని యొక్క, పాదౌ = పాదములను, అభివాద్య = సమస్కరించి, అథ = అటుపిమ్మట, పితామహమ్ = బ్రహ్మదేవుని గూర్చి, ఇదమ్ = ఈ, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. వాయువుగా అయిన, ధర్మము నెరిగిన ఆ వసిష్ఠుడు ఆ దేవదేవుని పాదాలకు నమస్కరించి ఆ బ్రహ్మదేవునితో ఇట్లు పలికెను. 6

మూ. భగవన్నిమిశాపేన విదేహత్వముపాగమమ్.
దేవదేవ మహాదేవ వాయుభూతోఽహమబ్జజ. 7

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! దేవదేవ = దేవతలకు దేవుడా! మహాదేవ = మహాదేవా! అబ్జజ = బ్రహ్మదేవుడా! అహమ్ = నేను, నిమిశాపేన = నిమియొక్క శాపముచేత, విదేహత్వమ్ = దేహము లేకపోవుటను, ఉపాగమమ్ = పొందితిని. వాయుభూతః = వాయువుగా అయిపోయితిని.

తా. పూజ్యుడా! దేవదేవా! మహాదేవా! బ్రహ్మదేవా! నేను నిమి ఇచ్చిన శాపమువలన దేహమును కోల్పోయి వాయురూపుడను అయిపోయినాను. 7

మూ. సర్వేషాం దేహహీనానాం మహద్దుఃఖం భవిష్యతి,
లుప్యన్తే సర్వకార్యాణి హీనదేహస్య వై ప్రభో. 8

ప్ర. అ. ప్రభో = ప్రభూ! దేహహీనానామ్ = దేహము లేని, సర్వేషామ్ = అందరికీ, మహత్ = గొప్ప, దుఃఖమ్ = దుఃఖము, భవిష్యతి = అగును, హీనదేహస్య = దేహహీనునియొక్క, సర్వకార్యాణి = సమస్త కార్యములూ, లుప్యన్తే = లోపించును.

తా. ప్రభూ! దేహము లేని అందరికీ చాల దుఃఖము కలుగును. దేహము లేనివాని అన్ని పనులూ లోపించును. 8

మూ. దేహస్యాన్యస్య సద్భావే ప్రసాదం కర్తుమర్హసి,
తమువాచ తతో బ్రహ్మా స్వయంభూరమితప్రభః. 9

ప్ర. అ. అన్యస్య=మరియొక, దేహస్య=దేహముయొక్క, సద్భావే= ఉండుటయందు, ప్రసాదమ్=అనుగ్రహమును, కర్తుమ్=చేయుటకు, అర్హసి= తగిఉన్నావు. తతః=అటుపిమ్మట, స్వయంభూః = స్వయముగా పుట్టిన, అమిత ప్రభః = సాటిలేని కాంతి గల, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, తమ్=అతనిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. "నాకు మరొక దేహము ఉండునట్లు అనుగ్రహించుము." అప్పుడు స్వయముగ పుట్టినవాడు, సాటి లేని కాంతి గలవాడూ అయిన బ్రహ్మదేవుడు ఆతనితో ఇట్లనెను. 9

మూ. మిత్రావరుణజం తేజ ఆవిశ త్వం మహాయశః,
అయోనిజస్త్వం భవితా తత్రాపి ద్విజసత్తమ, 10
ధర్మేణ మహతా యుక్తః పునరేష్యసి మే వశమ్.

ప్ర. అ. మహాయశః= గొప్ప కీర్తి గలవాడా! త్వమ్ = నీవు, మిత్రా వరుణజమ్ = మిత్రావరుణులవలన పుట్టిన, తేజః= తేజస్సును, ఆవిశ = ప్రవేశించుము. ద్విజసత్తమ = ఓ! బ్రాహ్మణశ్రేష్ఠుడా! తత్రాపి=అక్కడ కూడ, త్వమ్ = నీవు, అయోనిజః = గర్భమునుండి పుట్టనివాడవు, భవితా=కాగలవు. మహతా = గొప్ప, ధర్మేణ = ధర్మముతో, యుక్తః = కూడినవాడవై, పునః = మరల, మే = నాయొక్క, వశమ్ = వశమును, ఏష్యసి = పొందగలవు.

తా. గొప్ప కీర్తి గలవాడా! నీవు మిత్రావరుణులవలన కలిగిన తేజస్సులో ప్రవేశించుము. నీవు అక్కడకూడ అయోనిజుడవు అయ్యెదవు. ద్విజశ్రేష్ఠుడా! గొప్ప ధర్మముతో కూడినవాడవై మరల నాకు వశుడవు అగుదువు (నావద్దకు వచ్చెదవు). 10

మూ. ఏవముక్తస్తు దేవేన అభివాద్య ప్రదక్షిణమ్, 11
కృత్వా పితామహం తూర్ణం ప్రయయౌ వరుణాలయమ్.

ప్ర. అ. దేవేన = బ్రహ్మదేవునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన వసిష్ఠుడు, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, అభివాద్య = నమస్కరించి, తూర్ణమ్ = శీఘ్రముగా, వరుణాలయమ్ = వరుణుని స్థానమును గూర్చి, ప్రయయౌ = వెళ్లెను.

తా. వసిష్ఠుడు బ్రహ్మదేవుని మాటలు విని ఆయనకు ప్రదక్షిణనమస్కారములు చేసి శీఘ్రముగా వరుణుని నివాసమునకు వెళ్లెను. 11

మూ. తమేవ కాలం మిత్రోఽపి వరుణత్వమకారయత్, 12
క్షీరోదేన సహోపేతః పూజ్యమానః సురేశ్వరైః.

ప్ర. అ. తం కాలమ్ ఏవ=ఆ కాలమునే (నందే), మిత్రోఽపి=మిత్రుడు కూడ, క్షీరోదేన సహ = క్షీరసముద్రముతో, ఉపేతః = కూడినవాడై, సురేశ్వరైః = దేవతానాయకులచేత, పూజ్యమానః = పూజింపబడుచు, వరుణత్వమ్ = వరుణత్వమును (వరుణుడు చేయవలసిన కార్యమును), అకారయత్ = చేసెను.

తా. అదే సమయమునందు మిత్రుడు కూడ క్షీరసముద్రమునందు ఉండి, దేవతలు పూజించుచుండగా వరుణత్వమును చేయుచుండెను. 12

మూ. ఏతస్మిన్నేవ కాలే తు ఊర్వశీ పరమాప్సరాః, 13
యదృచ్ఛయా తముద్దేశమాగతా సఖిభిర్వృతా.

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, కాలే ఏవ = కాలమునందే, ఉర్వశీ నామ = ఉర్వశి అను పేరు గల, పరమాప్సరాః = గొప్ప అప్సరఃస్త్రీ, సఖిభిః = సఖురాళ్ళతో, వృతా = కూడినదై, యదృచ్ఛయా = దైవవశముచేత, తమ్ = ఆ, ఉద్దేశమ్ = ప్రదేశమును గూర్చి, ఆగతా = వచ్చినది.

తా. ఆ సమయమునందే ఊర్వశి అను అప్సరఃస్త్రీ సఖురాళ్ళతో కలిసి దైవవశముచేత, ఆ ప్రదేశమునకు వచ్చెను. 13

మూ. తాం దృష్ట్వా రూపసంపన్నాం క్రీడన్తీం వరుణాలయే, 14
తదావిశత్పరో హర్షో వరుణం చోర్వశీకృతే.

ప్ర. అ. రూపసంపన్నామ్ = మంచి రూపముతో కూడిన, వరుణాలయే = వరుణుని స్థానమునందు, క్రీడన్తీమ్ = క్రీడించుచున్న, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, ఊర్వశీకృతే = ఊర్వశి నిమిత్తమై, వరుణమ్ = వరుణుణ్ణి, పరః = గొప్ప, హర్షః = సంతోషము, ఆవిశత్ = ఆవేశించెను.

తా. వరుణుని స్థానమునందు క్రీడించుచున్న, సౌందర్యవతియైన ఆ

ఊర్వశిని చూడగానే వరుణునకు ఆమె విషయమునందు గొప్ప సంతోషము కలిగెను. 14

మూ. స తాం పద్మపలాశాక్షీం పూర్ణచన్ద్రనిభాననామ్, 15
వరుణో వరయామాస మైథునాయాప్సరోవరామ్.

ప్ర. అ. సః వరుణః = ఆ వరుణుడు, పద్మపలాశాక్షీమ్ = పద్మపత్రముల వంటి నేత్రములు గల, పూర్ణచన్ద్రనిభాననామ్ = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల, తామ్ = ఆ, అప్సరోవరామ్ = శ్రేష్ఠమైన అప్సరసను, మైథునాయ = మైథునముకొరకు, వరయామాస = కోరెను.

తా. ఆ వరుణుడు పద్మపత్రములవంటి నేత్రములు, పూర్ణచంద్రుని వంటి ముఖమూ గల ఆ అప్సరసలలో శ్రేష్ఠురాలైన ఊర్వశిని మైథునముకొరకు వరించెను. 15

మూ. ప్రత్యువాచ తతః సా తు వరుణం ప్రాఞ్జలిః స్థితా, 16
మిత్రేణాహం వృతా సాక్షాత్పూర్వమేవ సురేశ్వర.

ప్ర. అ. సా తు = ఆమెయైతే, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలదై, స్థితా = నిలచినదై, వరుణమ్ = వరుణుణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. సురేశ్వర = ఓ! దేవతాప్రభూ! అహమ్ = నేను, సాక్షాత్ = ప్రత్యక్షముగా, మిత్రేణ = మిత్రునిచేత, పూర్వమేవ = ముందుగానే, వృతా = కోరబడితిని.

తా. ఆమె అంజలి ఘటించి నిలచి వరుణునితో ఇట్లనెను- "దేవతల ప్రభూ! ముందుగా మిత్రుడు నన్ను ప్రత్యక్షముగా వరించి ఉన్నాడు". 16

మూ. వరుణ స్త్వబ్రవీద్వాక్యం కన్దర్పశరపీడితః, 17
ఇదం తేజః సముత్స్రక్ష్యే కుమ్భేఽస్మిన్ దేవనిర్మితే.

ప్ర. అ. కన్దర్పశరపీడితః = మన్మథుని బాణములచేత పీడింపబడిన, వరుణః తు = వరుణుడైతే, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ఇదమ్ = ఈ, తేజః = తేజస్సును, అస్మిన్ = ఈ, దేవనిర్మితే = బ్రహ్మదేవునిచేత నిర్మించబడిన, కుమ్భే = కుంభమునందు, సముత్స్రక్ష్యే = విడచెదను.

తా. మన్మథశరములచేత పీడింపబడిన వరుణు డిట్లు పలికెను. "బ్రహ్మ దేవుడు నిర్మించిన ఈ కుంభమునందు ఈ తేజస్సును విడచెదను.'' 17

మూ. భావముత్సృజ సుశ్రోణి మయి త్వం వరవర్ణిని, 18
కృతకామో భవిష్యామి యది నేచ్ఛసి సంగమమ్.

ప్ర. అ. ("ఏవముత్సృజ్య సుశ్రోణి త్వయ్యహం వరవర్ణిని" అను దానికి బదులుగా పైవిధముగా ప్రాచ్యపాఠము గ్రహింపబడినది). సుశ్రోణి = అందమైన పిరుదులు గలదానా! వరవర్ణిని = మంచి వర్ణము గలదానా, త్వమ్ = నీవు, మయి = నాయందు, భావమ్ = భావమును (అనురాగమును), ఉత్సృజ = ప్రవర్తింప చేయుము సంగమమ్ = సంగమమును, నేచ్ఛసి యది = ఇచ్ఛయింపకపోయినను, కృతకామః = చేయబడిన కామము కలవాడను, భవిష్యామి = కాగలను.

తా. అందమైన కటిప్రదేశము, మంచి వర్ణమూ గలదానా! నాతో సంగమునకు ఇష్టపడకపోయిననూ నాపై అనురాగము చూపుము. నా కోరిక తీరును. 18

మూ. తస్య తల్లోకనాథస్య వరుణస్య సుభాషితమ్, 19
ఉర్వశీ పరమప్రీతా శ్రుత్వా వాక్యమువాచ హ.

ప్ర. అ. ఉర్వశీ = ఊర్వశి. లోకనాథస్య = లోకపాలుడైన, తస్య వరుణస్య = ఆ వరుణునియొక్క, తత్ సుభాషితమ్ = ఆ మంచి మాటను, శ్రుత్వా = విని, పరమప్రీతా = చాల సంతోషించినదై, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. లోకపాలుడైన వరుణుని ఆ మాటలు విని ఊర్వశి చాల సంతోషించి ఇట్లు పలికెను. 19

మూ. కామమేతద్భవత్వేవం హృదయం మే త్వయి స్థితమ్, 20
భావశ్చాప్యధికం తుభ్యం దేహో మిత్రస్య తు ప్రభో.

ప్ర. అ. ప్రభో = ప్రభూ! కామమ్ = తప్పక, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, భవతు = అగుగాక. మే = నాయొక్క, హృదయమ్ = హృదయము, త్వయి = నీయందు, స్థితమ్ = ఉన్నది. భావః చ = భావము కూడ, అధికమ్ = అధికముగా, తుభ్యమ్ = నీకొరకే. దేహః తు = దేహమైతే, మిత్రస్య = మిత్రునికి.

తా. ప్రభూ! తప్పక ఇది ఇట్లే అగుగాక. నా హృదయము నీమీదనే ఉన్నది. భావము కూడ అధికముగా నీకే. నా దేహముమాత్రమే మిత్రునకివ్వ బడినది. 20

మూ. ఉర్వశ్యా ఏవముక్తస్తు రేత స్తన్మహదద్భుతమ్, 21
జ్వలదగ్నిసమప్రఖ్యం తస్మిన్ కుమ్భే న్యవాసృజత్.

ప్ర. అ. ఉర్వశ్యా = ఉర్వశిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన వాడై, తత్ = ఆ, మహత్ = గొప్ప, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, జ్వలదగ్ని సమప్రఖ్యమ్ = ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైన కాంతి గల, రేతః = రేతస్సును, తస్మిన్ = ఆ, కుమ్భే = కుంభమునందు, న్యవాసృజత్ = విడచెను.

తా. వరుణుడు ఉర్వశి మాటలు విని చాల ఆశ్చర్యకరముగా ఉన్న, ప్రజ్వ లించుచున్న అగ్నితో సమానమైన కాంతి గల రేతస్సు ఆ కుంభములో విడచెను.

మూ. ఉర్వశీ త్వగమత్తత్ర మిత్రో వై యత్ర దేవతా, 22
తాం తు మిత్రః సుసంక్రుద్ధ ఉర్వశీమిదమబ్రవీత్.

ప్ర. అ. ఉర్వశీ తు = ఉర్వశియైతే, దేవతా = దేవతయైన, మిత్రః = మిత్రుడు, యత్ర = ఎక్కడ ఉండెనో, తత్ర = అక్కడికి, అగమత్ = వెళ్ళెను. మిత్రః తు = మిత్రుడైతే, సుసంక్రుద్ధః = చాల కోపించినవాడై, తామ్ = ఆ, ఉర్వ శీమ్ = ఉర్వశిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఉర్వశి దేవతయైన మిత్రుడున్న చోటికి వెళ్ళెను. కాని మిత్రుడు చాల కోపించి ఆ ఉర్వశితో ఇట్లనెను. 22

మూ. మయాభిమన్త్రితా పూర్వం కిమర్థమవిశఙ్కితా, 23
భావేనాన్యం వృతవతీ పురుషం దుష్టచారిణీ.

ప్ర. అ. మయా = నాచేత, పూర్వమ్ = ముందుగా, అభిమన్త్రితా = పిలవ బడిన, దుష్టచారిణీ = దుష్టముగా ప్రవర్తించు నీవు, కిమర్థమ్ = ఎందువలన, అవి శఙ్కితా = శంక లేనిదానవై, భావేన = భావముచేత, అన్యమ్ = మరియొక, పురు షమ్ = పురుషుణ్ణి, వృతవతీ = వరించినావు?

తా. నిన్ను నేను ముందుగా పిలచితిని కదా; దుష్టముగా ప్రవర్తించు నీవు ఏమాత్రము సందేహము లేక భావముచేత మరొక పురుషుణ్ణి ఎందుకు వరించినావు?

మూ. అనేన దుష్కృతేన త్వం మత్క్రోధకలుషీకృతా, 24
మనుష్యలోకమాస్థాయ కంచిత్కాలం నివత్స్యసి.

ప్ర. అ. మత్క్రోధకలుషీకృతా=నా క్రోధముచేత కలుషము చేయబడిన, త్వమ్ = నీవు, అనేన = ఈ, దుష్కృతేన = పాపముచేత, మనుష్యలోకమ్ = మనుష్యలోకమును, ఆస్థాయ=అధిష్ఠించి, కంచిత్ కాలమ్ = కొంత కాలము, నివత్స్యసి = నివసించగలవు.

తా. ఈ చెడ్డ పని చేసినందుకు నా కోపముచేత బాధింపబడిన నీవు మనుష్య లోకమునకు వెళ్ళి అక్కడ కొంత కాలము నివసించగలవు. 24

మూ. బుధస్య పుత్రో రాజర్షిః కాశిరాజః పురూరవాః, 25
తమభ్యాగచ్ఛ దుర్బుద్ధే స తే భర్తా భవిష్యతి.

ప్ర. అ. బుధస్య=బుధునియొక్క, పుత్రః = పుత్రుడు, రాజర్షిః=రాజర్షి, కాశిరాజః = కాశిరాజు అయిన, పురూరవాః = పురూరవు డున్నాడు. దుర్బుద్ధే = ఓ! చెడ్డ బుద్ధి గలదానా! తమ్ = వానిని, అభ్యాగచ్ఛ=పొందుము, సః = అతడు, తే = నీకు, భర్తా = భర్త, భవిష్యతి = కాగలడు.

తా. బుధుని పుత్రుడు, కాశిరాజు అయిన పురూరవు డను రాజర్షి ఉన్నాడు. ఓ! దుర్బుద్ధీ! అతనివద్దకు వెళ్లుము, అతడు నీకు భర్త కాగలడు. 25

మూ. తతః సా శాపదోషేణ పురూరవసమభ్యగాత్, 26
ప్రతిష్ఠానే పురవరే బుధస్యాత్మజమౌరసమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సా = ఆమె, శాపదోషేణ=శాపదోషము చేత, ప్రతిష్ఠానే = ప్రతిష్ఠాన మను, పురవరే = పురశ్రేష్ఠమునందు, బుధస్య = బుధునియొక్క, ఔరసమ్ ఆత్మజమ్=ఔరసపుత్రుడైన, పురూరవసమ్ = పురూరవస్సును గూర్చి, అభ్యగాత్ = వెళ్ళెను.

తా. పిమ్మట ఆమె శాపదోషముచేత ప్రతిష్ఠాన మను నగరములో ఉన్న, బుధుని ఔరసపుత్రుడైన పురూరవసుణ్ణి పొందెను. 26

మూ. తస్య జజ్ఞే తతః శ్రీమానాయుః పుత్రో మహాబలః, 27
నహుషో యస్య పుత్రస్తు బభూవేన్ద్రసమద్యుతిః.

ప్ర. అ. తస్య = ఆతనికి, తతః = ఆమెవల్ల, శ్రీమాన్ = శ్రీమంతుడు, మహాబలః = గొప్ప బలము కలవాడు అయిన, ఆయుః = ఆయువు అను, పుత్రః = పుత్రుడు, జజ్ఞే = పుట్టెను. ఇన్ద్రసమద్యుతిః = ఇంద్రునితో సమానమైన కాంతి గల, నహుషః = నహుషుడు, యస్య = ఎవని యొక్క, పుత్రః = పుత్రుడుగా, బభూవ = అయెనో.

తా. ఆ పురూరువునకు ఊర్వశియందు గొప్ప బలము గల శ్రీమంతుడైన ఆయువు అను పుత్రుడు కలిగెను. ఇంద్రునితో సమానమైన కాంతి గల నహుషుడు ఆతని పుత్రుడు. 27

మూ. వజ్రముత్సృజ్య వృత్రాయ భ్రాన్తేఽథ త్రిదివేశ్వరే, 28
శతం వర్షసహస్రాణి యేనేన్ద్రత్వం ప్రశాసితమ్.

ప్ర. అ. వృత్రాయ = వృత్రునకు, వజ్రమ్ = వజ్రమును, ఉత్సృజ్య = విడచి, అథ = అటుపిమ్మట, త్రిదశేశ్వరే = ఇంద్రుడు, భ్రాన్తే = తిరుగుచుండగా, యేన = ఎవనిచేత, శతమ్ = నూరు, వర్షసహస్రాణి = సంవత్సరముల సహస్రములను, ఇన్ద్రత్వమ్ = ఇంద్రత్వము. ప్రశాసితమ్ = శాసింపబడినదో.

తా. ఇంద్రుడు వజ్రముచేత వృత్రుణ్ణి సంహరించిన పిదప తిరుగుచుండగా నహుషుడు లక్ష సంవత్సరముల కాలము ఇంద్రుడై పాలించెను. 28

మూ. సా తేన శాపేన జగామ భూమిం
తదోర్వశీ చారుదతీ సునేత్రా,
బహూని వర్షాణ్యవసచ్చ సుభ్రూః
శాపక్షయాదిన్ద్రసరో యయౌ చ. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షట్పఞ్చాశః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, చారుదతీ = అందమైన దంతములు కలది,

సునేత్రా = మంచి నేత్రములు కలది అయిన, సా ఉర్వశీ=ఆ ఉర్వశి, శాపేన = శాపముచేత, భూమిమ్ = భూమిని గూర్చి, జగామ = వెళ్ళెను. సుభ్రూః = అందమైన కనుబొమ్మలు గల ఆమె, బహూని = అనేకమైన, వర్షాణి = సంవత్సరములను, అవసచ్చ = నివసించెను. శాపక్షయాత్ = శాపము క్షీణించుటవలన, ఇన్ద్ర సదః = ఇంద్రుని సభను గూర్చి, యయౌ చ = వెళ్ళెను కూడ.

తా. అందమైన దంతములు, నేత్రములూ, కనుబొమ్మలూ గల ఆ ఊర్వశి శాపముచేత భూలోకమునకు వెళ్ళి చాల సంవత్సరములు అక్కడ ఉండి, శాప కాలము పూర్తి అవగానే ఇంద్రుని సభకు తిరిగి వెళ్ళెను. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో యాభై ఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తపఞ్చాశః సర్గః

[వసిష్ఠుడు క్రొత్త దేహమును పొందుట. నిమి ప్రాణుల నేత్రములమీద నివసించుట].

మూ. తాం శ్రుత్వా దివ్యసంకాశాం కథామద్భుతదర్శనామ్,
లక్ష్మణః పరమప్రీతో రాఘవం వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. దివ్యసంకాశామ్ = దివ్యమైనదానితో సమానమైన, అద్భుతదర్శనామ్ = అద్భుతమైన దర్శనముగల, తాం కథామ్ = ఆ కథను, శ్రుత్వా = విని, లక్ష్మణః = లక్ష్మణుడు, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దివ్యమైన, అద్భుతమైన ఆ కథను విని లక్ష్మణుడు చాల సంతోషించి రామునితో ఇట్లనెను. 1

మూ. నిక్షిప్తదేహౌ కాకుత్స్థ కథం తౌ ద్విజపార్థివౌ,
పునర్దేహేన సంయోగం జగ్మతుర్దేవసంమతౌ. 2

ప్ర. అ. తా. 56వ సర్గ, 2 వ శ్లోకం చూడుడు. 2

మూ. తస్య తద్భాషితం శ్రుత్వా రామః సత్యపరాక్రమః,
తాం కథాం కథయామాస వసిష్ఠస్య మహాత్మనః. 3

ప్ర. అ. తస్య = ఆతనియొక్క, తత్ = ఆ, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, సత్యపరాక్రమః = సత్యమైన పరాక్రమము గల, రామః = రాముడు, మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠుని యొక్క, తాం కథామ్ = ఆ కథను, కథయామాస = చెప్పెను.

తా. లక్ష్మణుని మాటలు విని సత్యమైన పరాక్రమము గల రాముడు మహాత్ముడైన వసిష్ఠుని ఆ కథను చెప్పెను. 3

మూ. యః స కుమ్భో రఘుశ్రేష్ఠ తేజఃపూర్ణో మహాత్మనః,
తస్మింస్తేజోమయౌ విప్రౌ సంభూతావృషిసత్తమౌ. 4

ప్ర. అ. రఘుశ్రేష్ఠ = లక్ష్మణా ! మహాత్మనః = మహాత్ముని యొక్క, తేజఃపూర్ణః = తేజస్సుతో నిండిన, యః = ఏ, సః = ఆ, కుమ్భః = కుంభమున్నదో, తస్మిన్ = దానియందు, తేజోమయౌ = తేజఃస్వరూపులైన, ఋషిసత్తమౌ = ఋషిశ్రేష్ఠులైన, విప్రౌ = ఇద్దరు బ్రాహ్మణులు, సంభూతౌ = పుట్టిరి.

తా. లక్ష్మణా ! మహాత్ముడైన ఆ వరుణుని తేజస్సు నింపిన ఆ కుంభమునందు తేజఃస్వరూపులు, ఋషిశ్రేష్ఠులూ అయిన ఇద్దరు బ్రాహ్మణులు పుట్టిరి. 4

మూ. పూర్వం సమభవత్తత్ర అగస్త్యో భగవాన్ ఋషిః,
నాహం సుతస్తవేత్యుక్త్వా మిత్రం తస్మాదపాక్రమత్. 5

ప్ర. అ. పూర్వమ్ = ముందుగా, తత్ర = అక్కడ, భగవాన్ = భగవంతుడైన, అగస్త్యః ఋషిః = అగస్త్యఋషి, సమభవత్ = పుట్టెను. అహమ్ = నేను, తవ సుతః = నీ కుమారుడను, న = కాను. ఇతి = ఇట్లు, మిత్రమ్ = మిత్రుణ్ణి గూర్చి, ఉక్త్వా = పలికి, తస్మాత్ = దానినుండి, అపాక్రమత్ = వెళ్ళిపోయెను.

తా. ముందుగా భగవంతుడైన అగస్త్యమహాముని జన్మించెను. "నేను నీ పుత్రుడను కాను" అని మిత్రునితో చెప్పి అతడు అక్కడినుండి వెళ్ళిపోయెను. రాబోయే శ్లోకాన్ని పట్టి ఆ కుంభమునందు వరుణతేజస్సు కూడ ఉండుటచేత అగస్త్యవసిష్ఠులు మిత్రవరుణుల ఇద్దరి పుత్రులు కాని ఒకరి పుత్రులు కారని భావము అని వ్యాఖ్యాతలు వ్రాసిరి. 5

మూ. తద్ధి తేజస్తు మిత్రస్య ఉర్వశ్యాః పూర్వమాహితమ్,
తస్మిన్ సమభవత్కుమ్భే తత్తేజో యత్ర వారుణమ్. 6

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, మిత్రస్య = మిత్రునియొక్క, తత్ = ఆ, తేజః = తేజస్సు, ఉర్వశ్యాః = ఊర్వశిని నిమిత్తముగా చేసికొని, ఆహితమ్ = ఉంచబడినది. యత్ర = దేనియందు, వారుణమ్ = వరుణిని సంబంధమైన, తత్ = ఆ, తేజః = తేజస్సు ఉన్నదో, తస్మిన్ కుమ్భే = ఆ కుంభమునందు, సమభవత్ = పుట్టెను.

తా. ఊర్వశి నిమిత్తముగా స్ఖలితమైన మిత్రుని తేజస్సు పూర్వము ఆ కుంభమునందు ఉంచబడినది. తరువాత వరుణుని తేజస్సు ఉంచబడినది. ఆ కుంభమునుండియే అగస్త్యుడు పుట్టెను. 6

మూ. కస్య చిత్త్వథ కాలస్య మిత్రావరుణసంభవః,
వసిష్ఠస్తేజసా యుక్తో జజ్ఞే ఇక్ష్వాకుదైవతమ్. 7

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కస్యచిత్ కాలస్య = కొంత కాలమునకు, మిత్రావరుణసంభవః = మిత్రావరుణులవలన పుట్టుక గల, తేజసా = తేజస్సుతో, యుక్తః = కూడిన, ఇక్ష్వాకుదైవతమ్ = ఇక్ష్వాకువంశీయుల దేవతయైన, వసిష్ఠః = వసిష్ఠుడు, జజ్ఞే = పుట్టెను.

తా. పిమ్మట కొంతకాలానికి మిత్రావరుణులు కారణముగా గల, తేజఃశాలియైన ఇక్ష్వాకువంశీయుల దేవతయైన వసిష్ఠుడు పుట్టెను. 7

మూ. తమిక్ష్వాకుర్మహాతేజా జాతమాత్రమనిన్దితమ్,
వవ్రే పురోధసం సౌమ్య వంశస్యాస్య హితాయ నః. 8

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! అనిన్దితమ్ = నిందింపబడని, తమ్ = ఆతనిని, జాతమాత్రమ్ = పుట్టినవెంటనే, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ఇక్ష్వాకుః = ఇక్ష్వాకువు, నః అస్య వంశస్య = మన ఈ వంశముయొక్క, హితాయ = హితముకొరకు, పురోధసమ్ = పురోహితుణ్ణిగా, వవ్రే = వరించెను.

తా. సౌమ్యుడా! దోషరహితుడైన ఆ వసిష్ఠుడు పుట్టిన వెంటనే గొప్ప తేజస్సు గల ఇక్ష్వాకువు మన వంశము హితముకొరకు పురోహితుణ్ణిగా వరించెను.

మూ. ఏవం త్వపూర్వదేహస్య వసిష్ఠస్య మహాత్మనః,
కథితో నిర్గమః సౌమ్య నిమేః శృణు యథాభవత్. 9

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! ఏవమ్ = ఈ విధముగా, మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, అపూర్వదేహస్య = నూతనదేహముయొక్క, నిర్గమః = బైటకు వచ్చుట (పుట్టుక), కథితః = చెప్పబడినది. నిమేః = నిమికి, యథా = ఎట్లు, అభవత్ = అయెనో, శృణు = వినుము.

తా. సౌమ్యా! మహాత్ముడైన వసిష్ఠుని నూతనదేహము ఎట్లు పుట్టినదో చెప్పినాను. నిమి విషయము చెప్పెదను వినుము. 9

మూ. దృష్ట్వా విదేహం రాజానమృషయః సర్వ ఏవ తే,
తం తతో యోజయామాసుర్యాగదీక్షాం మనీషిణః. 10

ప్ర. అ. మనీషిణః = బుద్ధిమంతులైన, సర్వే ఏవ = సమస్తమైన, తే ఋషయః = ఆ ఋషులు, రాజానమ్ = రాజును, విదేహమ్ = దేహములేనివానినిగా, దృష్ట్వా = చూచి, తే = వారు, తమ్ = ఆతనిని, యజ్ఞదీక్షామ్ = యజ్ఞదీక్షను, యోజయామాసుః = కూర్పించిరి.

తా. బుద్ధిమంతులైన ఆ ఋషీశ్వరు లందరూ ఆ రాజు దేహము లేనివాడయి నాడని చూచి ఆతనికి యోగదీక్ష ఇచ్చిరి. 10

మూ. తం చ దేహం నరేన్ద్రస్య రక్షన్తి స్మ ద్విజోత్తమాః,
గన్ధైర్మాల్యైశ్చ వస్త్రైశ్చ పౌరభృత్యసమన్వితాః. 11

ప్ర. అ. ద్విజోత్తమాః = ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు, పౌరభృత్యసమన్వితాః = పౌరులతోను, భృత్యులతోను కూడినవారై, నరేన్ద్రస్య = రాజుయొక్క, తం దేహమ్ = ఆ దేహమును, గన్ధైః = గంధములచేత, మాల్యైః = మాలలచేత, వస్త్రైః చ = వస్త్రములచేత, రక్షన్తి స్మ = రక్షించిరి.

తా. ఆ బ్రాహ్మణోత్తములు పౌరులతోను, భృత్యులతోను కలిసి, ఆ రాజు దేహమును సుగంధద్రవ్యములచేత, మాలలచేత, వస్త్రములచేత రక్షించిరి. 11

మూ. తతో యజ్ఞే సమాప్తే తు భృగుస్తత్రేదమబ్రవీత్,
ఆనయిష్యామి తే చేతస్తుష్టోఽస్మి తవ పార్థివ. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యజ్ఞే = యజ్ఞము, సమాప్తే = సమాప్తమైన దగుచుండగా, తత్ర = ఆక్కడ, భృగుః = భృగువు, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. పార్థివ = రాజా! తవ = నీ విషయమున, తుష్టః అస్మి = సంతోషించితిని. తే = నీయొక్క, చేతః = చిత్తమును, ఆనయిష్యామి = తీసికొనివచ్చెదను.

తా. పిమ్మట యజ్ఞము సమాప్తమైనది. అక్కడ భృగువు ఇట్లు పలికెను. రాజా ! నీ విషయమున సంతోషించినాను. నీ మనస్సును మరల ఈ దేహములోనికి తీసికొనివచ్చెదను.

వి. ఆత్మ ఆకాశం వలె సర్వత్రా వ్యాపించి ఉండునది. అందుచేత ఒక దేహంలోనికి ఆత్మ రావడం గాని, దేహాన్ని విడిచిపోవడం గాని లేదు. ఇంద్రియాదులతో కూడిన మనస్సే (అంతఃకరణమే) ఒక దేహంలో ప్రవేశిస్తూంటుంది. కొంత కాలానికి దానిని విడిచివేస్తూ ఉంటుంది. ఒక పాత్రని ఒక చోటునుండి మరొకచోటికి తీసికొని వెళ్ళేటప్పుడు వెళ్ళేది ఆ పాత్రే కాని ఆకాశం ఎక్కడికీ వెళ్ళడం లేదు. అల్లే అంతఃకరణం ఎక్కడెక్కడికి ప్రయాణం చేసినా అక్కడల్లా ఆత్మ ఉంటూనే ఉంది. ఆత్మకి కదలిక లేదు. ఇది అద్వైతవేదాంతులు చెప్పే పద్ధతి. ఈ సిద్ధాంతం ప్రకారం చిత్తాన్ని దేహంలో ప్రవేశపెట్టడం అనగా ఈ దేహాన్ని విడిచిపెట్టి పోయిన చిత్తాన్ని వెనుకకు తీసికొని రావడం అని అర్థం. ఇతరదార్శనికుల అభిప్రాయం ప్రకారం జీవుడు వేరుగా ఉంటాడు. ఒక దేహంలో కొంతకాలం ఉండి, దాన్ని విడచి మరొక దేహంలోకి వెడుతుంటాడు. అందుచేత ఇక్కడ చిత్తాన్ని దేహంలో ప్రవేశపెట్టడం అనగా ఈ దేహాన్ని విడిచి వెళ్ళిపోయిన జీవుణ్ణి (ఇక్కడ చిత్తం అనగా జీవుడు) మరల తీసికొని రావడం అని అర్థం. ఈ శ్లోకం ప్రాచ్యప్రతిలో లేదు. 12

మూ. సుప్రీతాశ్చ సురాః సర్వే నిమేశ్చేత స్తదాబ్రువన్,
వరం వరయ రాజర్షే క్వ తే చేతో నిరూప్యతామ్. 13

ప్ర. అ. తదా = అప్పుడు, సుప్రీతాః = బాగా సంతోషించిన, సర్వే = సమస్తమైన, సురాః = దేవతలు, నిమేః = నిమియొక్క, చేతః = చిత్తమును గూర్చి, అబ్రువన్ = పలికిరి. రాజర్షే = రాజర్షీ ! వరమ్ = వరమును, వరయ = కోరుకొనుము. తే = నీయొక్క, చేతః = చిత్తము, క్వ = ఎక్కడ, నిరూప్యతామ్ = ఉంచబడుగాక.

తా. అప్పుడు దేవత లందరు చాల సంతోషించి నిమి చిత్తముతో ఇట్లనిరి- "రాజర్షీ ! మేము చాల సంతోషించినాము. వరమును కోరుకొనుము. నీ చిత్తమును ఎక్కడ ఉంచవలెనో చెప్పుము." 13

మూ. ఏవముక్తః సురైః సర్వైర్నిమేశ్చేత స్తదాబ్రవీత్,
నేత్రేషు సర్వభూతానాం వసేయం సురసత్తమాః. 14

ప్ర. అ. సర్వైః = సమస్తమైన, సురైః = దేవతలచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, నిమేః = నిమియొక్క, చేతః = చిత్తము, తదా = అప్పుడు, అబ్రవీత్ = పలికెను. సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులారా ! సర్వభూతానామ్ = సమస్తప్రాణులయొక్క, నేత్రేషు = నేత్రములయందు, వసేయమ్ = నివసించెదను గాక.

తా. ఆ దేవతల మాటలు విని నిమి చిత్తము- "దేవతాశ్రేష్ఠులారా ! నేను సకలప్రాణుల నేత్రములమీద నివసించెదను గాక" అని పలికెను. 14

మూ. బాఢమిత్యేవ విబుధా నిమేశ్చేత స్తదాబ్రువన్,
నేత్రేషు సర్వభూతానాం వాయుభూతశ్చరిష్యసి. 15

ప్ర. అ. తదా = అప్పుడు, విబుధాః = దేవతలు, బాఢమ్ = తప్పక అట్లే, ఇతి ఏవ = అని, నిమేః = నిమియొక్క, చేతః = చిత్తమును గూర్చి, అబ్రువన్ = పలికిరి. వాయుభూతః = వాయువుగా అయి, సర్వభూతానామ్ = సకలప్రాణుల యొక్క, నేత్రేషు = నేత్రములమీద, చరిష్యసి = సంచరించగలవు.

తా. అప్పుడు దేవత లందరూ ''తప్పక అట్లే, నీవు వాయురూపములో ఉండి సమస్తప్రాణుల నేత్రములమీద నివసించెదవు'' అని నిమి చిత్తముతో చెప్పిరి.

వి. పై శ్లోకాలలోని 'చిత్త' శబ్దమునకు బదులుగా ప్రాచ్యప్రతిలో 'ఆత్మ' శబ్దము ఉన్నది. అప్పుడు అర్థము స్పష్టముగా కుదురును. 15

మూ. త్వత్కృతే చ నిమిష్యన్తి చక్షూంషి పృథివీపతే,
వాయుభూతేన చరతా విశ్రమార్థం ముహుర్ముహుః. 16

ప్ర. అ. పృథివీపతే = రాజా ! వాయుభూతేన = వాయువుగా అయి, చరతా = (నీవు) సంచరించుచుండగా, త్వత్కృతే చ = నీ నిమిత్తమే (నీ మూలముననే), ముహుః ముహుః = మాటిమాటికి, విశ్రమార్థమ్ = విశ్రాన్తికొరకు, చక్షూంషి = నేత్రములను, నిమిష్యన్తి = మూయగలరు.

తా. రాజా ! నీవు వాయురూపముతో సంచరించుచుండగా, ప్రాణు లన్నీ విశ్రాంతికొరకై మాటి మాటికి నీ మూలముననే నేత్రములు మూసికొనుచుండును.

వి. నీవు విశ్రాంతిసుఖమును ఇవ్వగల వని భావమై ఉండును. 'నిమేషం' అనగా 'కనురెప్పపాటు'అని అర్థం. ఈ రాజు పేరు 'నిమి'. ఈ సంబంధాన్ని పట్టి ఈ కథ వచ్చి ఉంటుంది. 16

మూ. ఏవముక్త్వా తు విబుధాః సర్వే జగ్ముర్యథాగతమ్,
ఋషయోఽపి మహాత్మానో నిమేర్దేహం సమాహరన్. 17

ప్ర. అ. సర్వే=సమస్తమైన, విబుధాః = దేవతలు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా =పలికి. యథాగతమ్=వచ్చినట్లుగానే, జగ్ముః=వెళ్ళిరి. మహాత్మానః=మహాత్ములైన, ఋషయః అపి = ఋషులు కూడ, నిమేః = నిమియొక్క, దేహమ్ = దేహమును, సమాహరన్ = తీసికొని వచ్చిరి.

తా. ఇట్లు పలికి దేవత లందరూ వచ్చిన దోవనే వెళ్ళిపోయిరి. మహాత్ములైన ఋషులు ఆ నిమి దేహమును తీసికొని వచ్చిరి. 17

మూ. అరణిం తత్ర నిక్షిప్య మథనం చక్రురోజసా,
మన్త్రహోమైర్మహాత్మానః పుత్రహేతోర్నిమేస్తదా. 18

ప్ర. అ. తదా = అప్పుడు, మహాత్మానః = మహాత్ములైన ఋషులు, నిమేః = నిమియొక్క, పుత్రహేతోః = పుత్రునికొరకై, తత్ర = ఆ దేహమునందు, అరణిమ్ = అరణిని, నిక్షిప్య=ఉంచి, మన్త్రహోమైః = మంత్రములతోను హోమములతోను, ఓజసా = బలముతో, మథనమ్ = మథనమును, చక్రుః=చేసిరి.

తా. మహాత్ములైన ఆ ఋషులు అప్పుడు నిమికి కుమారుని పుట్టించుటకై ఆ దేహముమీద అరణిని (యజ్ఞాలకై అగ్నిని పుట్టించడానికి ఉపయోగించే కర్రలకు అరణి అని పేరు) ఉంచి మంత్రములు పఠించుచు, హోమాలు చేయుచు బలముగా మథించిరి. 18

మూ. అరణ్యాం మథ్యమానాయాం ప్రాదుర్భూతో మహాతపాః,
మథనాన్మిథిరిత్యాహుర్జననాజ్జనకోఽభవత్. 19

ప్ర. అ. అరణ్యామ్ = అరణి, మథ్యమానాయామ్ = మథింపబడుచున్న దగుచుండగా, మహాతపాః = గొప్ప తపస్సు గల పురుషుడు, ప్రాదుర్భూతః = పుట్టినాడు. మథనాత్ = మథించుటవలన, మిథిః ఇతి = మిథి అని, ఆహుః = చెప్పుదురు. జననాత్ = పుట్టుటవలన, జనకః = జనకుడు, అభవత్ = ఆయెను.

తా. అరణిని మథించగా గొప్ప తపస్సు గల పురుషుడు ఆవిర్భవించెను. మథించుటచేత పుట్టుటచేత "మిథి' అనీ, జనించుటచేత "జనకుడు" అని ఆతనికి పేరు వచ్చెను. 19

మూ. యస్మాద్విదేహాత్సంభూతో వైదేహస్తు తతః స్మృతః,
ఏవం విదేహరాజశ్చ జనకః పూర్వకోఽభవత్,
మిథిర్నామ మహాతేజాస్తేనాయం మైథిలోఽభవత్. 20

ప్ర. అ. యస్మాత్ = ఏ కారణమువలన, విదేహాత్ = దేహము లేనివాని నుండి, సంభూతః = పుట్టినదో, తతః = ఆ కారణమువలన, వైదేహః = వైదేహుడు అని, స్మృతః = చెప్పబడినాడు. ఏవమ్ = ఈ విధముగా, పూర్వకః = ఆ ప్రాచీన పురుషుడు, విదేహరాజః = విదేహరాజు గాను, జనకః చ = జనకుడు గాను, అభవత్ = ఆయెను. (మిథిర్నామ మహావీర్యో యేన సా మిథిలాభవత్"అను ప్రాచ్య పాఠము బాగున్నది). మహావీర్యః = గొప్పపరాక్రమము గల అతడు, మిథిః నామ = మిథి అను ప్రసిద్ధి గలవాడు. యేన = దేనిచేత, మిథిలా = మిథిలానగరము, అభవత్ = ఆయెనో).

తా. దేహములేని నిమినుండి పుట్టుటచేత ఆ పూర్వపురుషునకు 'విదేహరాజు' 'జనకుడు' అను పేర్లు వచ్చెను. గొప్ప పరాక్రమము గల ఆతనికి ఉన్న 'మిథి'అను ప్రసిద్ధిని పట్టి ఆ 'మిథిలా'నగరమైనది. 20

మూ. ఇతి సర్వమశేషతో మయా
కథితం సంభవకారణం తు సౌమ్య,
నృపపుంగవశాపజం ద్విజస్య
ద్విజశాపాచ్చ యదద్భుతం నృపస్య. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా! నృపపుంగవశాపజమ్=రాజశ్రేష్ఠుని శాపము వలన కలిగిన, ద్విజస్య=బ్రాహ్మణునియొక్క, ద్విజశాపాత్=బ్రాహ్మణుని శాపమువలన, నృపస్య=రాజుయొక్క, యత్=ఏ, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, సంభవకారణమ్=పుట్టుకకు కారణ మున్నదో అది, సర్వమ్=సమస్తమూ, అశేషతః=శేషము లేకుండగా, మయా=నాచేత, ఇతి=ఇట్లు, కథితమ్=చెప్పబడినది.

తా. సౌమ్యుడా! నిమిచక్రవర్తి శాపమువలన వసిష్ఠునకు, వసిష్ఠుని శాపమువలన నిమిచక్రవర్తికి ఎట్లు జన్మలు వచ్చినవో ఆశ్చర్యకరమైన ఈ కథను నేను పూర్తిగా నీకు చెప్పినాను. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో యాభైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టపఞ్చాశః సర్గః

[శుక్రాచార్యుడు యయాతిని శపించుట.]

మూ. ఏవం బ్రువతి రామే తు లక్ష్మణః పరవీరహా,
ప్రత్యువాచ మహాత్మానం జ్వలన్తమివ తేజసా. 1

ప్ర. అ. రామే = రాముడు, ఏవమ్ = ఇట్లు, బ్రువతి = పలుకుచుండగా, పరవీరహా = శత్రువీరులను సంహరించు, లక్ష్మణః = లక్ష్మణుడు, తేజసా = తేజస్సుతో, జ్వలన్తమ్ ఇవ = మండుచున్నట్లు ఉన్న, మహాత్మానమ్ = మహాత్ముడైన రాముణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రాముని మాటలు విని శత్రువీరసంహారకుడైన లక్ష్మణుడు తేజస్సుతో మండుచున్నాడా అన్నట్లు ఉన్న ఆ మహాత్మునితో ఇట్లు పలికెను. 1

మూ. మహదద్భుతమాశ్చర్యం విదేహస్య పురాతనమ్,
నిర్వృత్తం రాజశార్దూల వసిష్ఠస్య మునేశ్చ హ. 2

ప్ర. అ. రాజశార్దూల = రాజశ్రేష్ఠుడా! విదేహస్య = దేహములేని, వసిష్ఠస్య మునేః = వసిష్ఠమహర్షియొక్క, పురాతనమ్ = ప్రాచీనమైన, నిర్వృత్తమ్ = జరిగిన వృత్తాంతము, మహత్ = గొప్ప, అద్భుతమ్ = అద్భుతము, ఆశ్చర్యం హ = ఆశ్చర్యము.

తా. రాజశ్రేష్ఠా! దేహము లేని వసిష్ఠునికి సంబంధించిన పూర్వము జరిగిన ఈ వృత్తాంతము చాల అద్భుతము; ఆశ్చర్యకరము. 2

మూ. నిమిస్తు క్షత్రియః శూరో విశేషేణ చ దీక్షితః,
న క్షమం కృతవాన్ రాజా వసిష్ఠస్య మహాత్మనః. 3

ప్ర. అ. క్షత్రియః = క్షత్రియుడు, శూరః = శూరుడు, విశేషేణ = విశేషము

చేత, దీక్షితః చ = దీక్షితుడూ అయిన, రాజా=రాజైన, నిమిః తు=నిమి అయితే, మహాత్మనః = మహాత్ముడైన, వసిష్ఠస్య = వసిష్ఠునకు, క్షమమ్ = తగు విధముగా, న కృతవాన్ = చేయలేదు.

తా. కాని శూరుడైన క్షత్రియుడు విశేషించి దీక్షలో ఉన్నవాడూ అయిన నిమిచక్రవర్తి మహాత్ముడైన వసిష్ఠుని విషయమున తగు విధముగా ప్రవర్తించ లేదు. 3

మూ. ఏవముక్తస్తు తేనాయం రామః క్షత్రియపుంగవః,
ఉవాచ లక్ష్మణం వాక్యం సర్వశాస్త్రవిశారదమ్. 4

ప్ర. అ. తేన = లక్ష్మణుని చేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, క్షత్రియపుంగవః = క్షత్రియశ్రేష్ఠుడైన, రామః = రాముడు, సర్వశాస్త్రవిశారదమ్ = సకల శాస్త్రములయందు నేర్పు గల, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. క్షత్రియులలో శ్రేష్ఠుడైన రాముడు లక్ష్మణుని మాటలు విని సకల శాస్త్రములయందు నేర్పు గల ఆ లక్ష్మణునితో ఇట్లు పలికెను. 4

మూ. రామో రమయతాం శ్రేష్ఠో భ్రాతరం దీప్తతేజసమ్,
న సర్వత్ర క్షమా వీర పురుషేషూపలక్ష్యతే. 5

ప్ర. అ. రమయతామ్ = ఆనందింపచేయువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, దీప్తతేజసమ్=ప్రజ్వరిల్లుచున్న తేజస్సు గల, భ్రాతరమ్ = సోదరుని గూర్చి పలికెను. వీర = వీరుడా ! పురుషేషు = పురుషులలో, సర్వత్ర = అందరియందూ, క్షమా = ఓర్పు, న ఉపలక్ష్యతే = చూడబడుటలేదు.

తా. ఆనందింపచేయువారిలో శ్రేష్ఠుడైన రాముడు సోదరునితో ఇట్లనెను. ఓ ! వీరుడా ! పురుషు లందరిలోను ఓర్పు కనబడదు. 5

మూ. సౌమిత్రే దుఃసహో రోషో యథా క్షాన్తో యయాతినా,
సత్త్వానుగం పురస్కృత్య తన్నిబోధ సమాహితః. 6

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా ! యయాతినా = యయాతిచేత, సత్త్వా

నుగమ్ = సత్త్వగుణమును అనుసరించు మార్గమును, పురస్కృత్య = పురస్కరించుకొని, దుఃసహః = సహింప శక్యము కాని, రోషః = కోపము, యథా = ఎట్లు, క్షాన్తః = సహించబడినదో, తత్ = దానిని, సమాహితః = సావధానచిత్తుడవై, నిబోధ = తెలిసికొనుము.

తా. లక్ష్మణా! యయాతి సత్త్వగుణానుసారియైన మార్గమును అనుసరించి సహింప శక్యము కాని రోషమును ఎట్లు సహించినాడో సావధానచిత్తుడవై తెలిసికొనుము. 6

మూ. నహుషస్య సుతో రాజా యయాతిః పౌరవర్ధనః,
తస్య భార్యాద్వయం సౌమ్య రూపేణాప్రతిమం భువి. 7

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! నహుషస్య=నహుషునియొక్క, సుతః= కుమారుడు, పౌరవర్ధనః = పౌరులను వృద్ధి పొందించువాడూ అయిన, యయాతిః = యయాతి ఉండెను. తస్య = ఆతనికి, రూపేణ = రూపముచేత, భువి = భూలోకమునందు, అప్రతిమమ్ = సాటిలేని, భార్యాద్వయమ్ = భార్యాద్వయమున్నది.

తా. సౌమ్యుడా! నహుషుని పుత్రుడు, పౌరులను చక్కగా పాలించువాడు అయిన యయాతి అనే రాజు ఉండెను. ఆతనికి భూలోకములో సాటిలేని రూపము గల ఇద్దరు భార్యలు ఉండిరి. 7

మూ. ఏకా తు తస్య రాజర్షేర్నాహుషస్య పురస్కృతా,
శర్మిష్ఠా నామ దైతేయీ దుహితా వృషపర్వణః. 8

ప్ర. అ. వృషపర్వణః=వృషపర్వునియొక్క, దుహితా=కుమార్తెయైన, దైతేయీ=దైత్యస్త్రీ అయిన, శర్మిష్ఠా నామ=శర్మిష్ఠ అను పేరు గల, ఏకా తు= ఒకతె అయితే, రాజర్షేః = రాజర్షియైన, తస్య = ఆ, నాహుషస్య = నహుషపుత్రునకు, పురస్కృతా = గౌరవింపబడినది.

తా. వృషపర్వుని కుమార్తె అయిన శర్మిష్ఠ అనే ఒక దైత్యస్త్రీ రాజర్షియైన ఆ యయాతికి చాల ప్రేమపాత్రురాలై ఉండెను. 8

మూ. సుతా తూశనసః పత్నీ యయాతేః పురుషర్షభ,
న తు సా దయితా రాజ్ఞో దేవయానీ సుమధ్యమా. 9

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! ఉశనసః = శుక్రాచార్యునియొక్క, సుతా = కుమార్తెయైన, సుమధ్యమా = మంచి నడుము గల, దేవయానీ = దేవయాని, యయాతేః = యయాతియొక్క, పత్నీ = భార్య. సా తు = ఆమె యైతే, రాజ్ఞః = రాజునకు, దయితా = ఇష్టురాలు, న = కాదు.

తా. పురుషశ్రేష్ఠుడా ! శుక్రాచార్యుని పుత్రిక యైన దేవయాని యయాతికి రెండవ భార్య. కాని ఆమె ఆ రాజుకు ఇష్టురాలు కాదు. 9

మూ. తయోః పుత్రౌ తు సంభూతౌ రూపవన్తౌ సమాహితౌ,
శర్మిష్ఠాజనయత్పూరుం దేవయానీ యదుం తదా. 10

ప్ర. అ. తయోః = వారిద్దరికీ, రూపవన్తౌ = రూపము గల, సమాహితౌ = సమాహితమైన, (నిలకడగల) చిత్తము గల, పుత్రౌ = పుత్రులు, సంభూతౌ = పుట్టిరి. తదా = అప్పుడు, శర్మిష్ఠా = శర్మిష్ఠ, పూరుమ్ = పూరువును, అజనయత్ = కనెను. దేవయానీ = దేవయాని, యదుమ్ = యదువును కనెను.

తా. ఆ భార్య లిద్దరికీ రూపవంతులు, సుగుణవంతులూ అయిన ఇద్దరు కుమారులు జనించిరి. శర్మిష్ఠ పూరువును, దేవయాని యదువును కనెను. 10

మూ. పూరుస్తు దయితో రాజ్ఞో గుణైర్మాతృకృతేన చ,
తతో దుఃఖసమావిష్టో యదుర్మాతరమబ్రవీత్. 11

ప్ర. అ. పూరుస్తు = పూరువైతే, గుణైః = గుణములచేతను, మాతృకృతేన చ = తల్లి కారణముచేతను, రాజ్ఞః = రాజునకు, దయితః = ఇష్టుడు. తతః = ఆ కారణమువలన, దుఃఖసమావిష్టః = దుఃఖముతో కూడిన, యదుః = యదువు, మాతరమ్ = తల్లిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పూరువు తన సద్గుణములచేతా, తల్లిని పట్టీ కూడ తండ్రికి చాల ఇష్టుడయ్యెను. అందువలన యదువు దుఃఖావిష్టుడై తల్లితో ఇట్లు పలికెను. 11

మూ. భార్గవస్య కులే జాతా దేవస్యాక్లిష్టకర్మణః,
సహసే హృద్గతం దుఃఖమవమానం చ దుఃసహమ్. 12

ప్ర. అ. దేవస్య = దేవుడు, అక్లిష్టకర్మణః = శ్రమలేని పనులు గల, భార్గవస్య = శుక్రాచార్యునియొక్క, కులే = కులమునందు, జాతా = పుట్టిన నీవు, హృద్గతమ్ = హృదయములో ఉన్న, దుఃఖమ్ = దుఃఖమును, దుఃసహమ్ = సహింపశక్యముకాని, అవమానం చ = అవమానమునూ, సహసే = సహించుచున్నావు!

తా. నీవు! దేవతాస్వరూపుడు, అనాయాసముగ కర్మలు సాధించగల వాడూ అయిన శుక్రాచార్యుని కులమందు పుట్టి ఈ విధముగా హృదయములో ఉన్న దుఃఖమునూ, సహింప శక్యము కాని అవమానమునూ సహించుచున్నావు! 12

మూ. ఆవాం చ సహితౌ దేవి ప్రవిశావ హుతాశనమ్,
రాజా తు రమతాం సార్ధం దైత్యపుత్ర్యా బహూః క్షపాః. 13

ప్ర. అ. దేవి = దేవీ! ఆవామ్ = మన మిద్దరమూ, సహితౌ = కలిసిన వాళ్ళమై, హుతాశనమ్ = అగ్నిని, ప్రవిశావ = ప్రవేశించెదము. రాజా తు = రాజైతే, దైత్యపుత్ర్యా సార్ధమ్ = దైత్యుని కుమార్తెతో కూడ, బహుః క్షపాః = చాల రాత్రులు, రమతామ్ = క్రీడించుగాక.

తా. దేవీ! మన మిద్దరమూ కలిసి అగ్నిలో ప్రవేశించెదము. రాజును శర్మిష్ఠతో కలిసి అనేకరాత్రులు రమించ నిమ్ము. 13

మూ. యది వా సహనీయం తే మామనుజ్ఞాతుమర్హసి,
క్షమ త్వం న క్షమిష్యేఽహం మరిష్యామి న సంశయః.

ప్ర. అ. తే = నీకు, సహనీయం యది వా = సహించదగినదైతే, మామ్ = నన్ను, అనుజ్ఞాతుమ్ = అనుమతించుటకు, అర్హసి = తగి ఉన్నావు. త్వమ్ = నీవు, క్షమ = ఓర్చుకొనుము. అహమ్ = నేను, న క్షమిష్యే = ఓర్చుకొనను. మరిష్యామి = మరణించెదను. సంశయః = సంశయము, న = లేదు.

తా. నీవు సహించకలిగినచో నాకు అనుమతి ఇమ్ము. నీవు ఓర్పు వహించుము. నేను మాత్రము ఓర్పు వహించజాలను; మరణించెదను. సందేహము లేదు.

మూ. పుత్రస్య భాషితం శ్రుత్వా పరమార్తస్య రోదతః,
దేవయానీ తు సంక్రుద్ధా సస్మార పితరం తదా. 15

ప్ర. అ. దేవయానీ తు = దేవయాని యైతే, పరమార్తస్య = మిక్కిలి దుఃఖితుడైన, రోదతః = ఏడ్చుచున్న, పుత్రస్య = పుత్రునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, సంక్రుద్ధా = కోపించినదై, తదా = అప్పుడు, పితరమ్ = తండ్రిని, సస్మార = స్మరించెను.

తా. అప్పుడు, చాల దుఃఖించుచు ఏడ్చుచున్న పుత్రుని మాటలు విని దేవయాని చాల కోపించి తండ్రిని స్మరించెను. 15

మూ. ఇఙ్గితం తదభిజ్ఞాయ దుహితుర్భార్గవస్తదా,
ఆగతస్త్వరితం తత్ర దేవయానీ స్మ యత్ర సా. 16

ప్ర. అ. తదా = అప్పుడు, భార్గవః = శుక్రుడు, దుహితుః = కుమార్తెయొక్క, తత్ = ఆ, ఇఙ్గితమ్ = మనస్సులోని అభిప్రాయమును, అభిజ్ఞాయ = తెలుసుకొని, సా దేవయానీ = ఆ దేవయాని, యత్ర = ఎక్కడ ఉన్నదో, తత్ర = అక్కడికి, త్వరితమ్ = శీఘ్రముగా, ఆగతః = వచ్చినాడు.

తా. అప్పుడు శుక్రాచార్యులు కుమార్తె మనస్సులోని అభిప్రాయమును తెలిసికొని, వెంటనే ఆమె ఉన్న చోటికి వచ్చెను. 16

మూ. దృష్ట్వా చాప్రకృతిస్థాం తామప్రహృష్టామచేతనామ్,
పితా దుహితరం వాక్యం కిమేతదితి చాబ్రవీత్. 17

ప్ర. అ. అప్రకృతిస్థామ్ = స్వస్థురాలుగా లేని, అప్రహృష్టామ్ = సంతోషించని, అచేతనామ్ = ఆలోచనలేని, తామ్ = ఆ, దుహితరమ్ = కుమార్తెను, దృష్ట్వా = చూచి, పితా = తండ్రి, ఏతత్ = ఇది, కిమ్ = ఏమి, ఇతి చ = అని, అబ్రవీత్ = పలికెను.

తా. సంతోషము లేక. ఆలోచనాశక్తి ఉడిగి అస్వస్థురాలుగా ఉన్న కూతురును చూచి తండ్రి "ఇది ఏమి?" అని అడిగెను. 17

మూ. పృచ్ఛన్తమసకృత్తం వై భార్గవం దీప్తచేతసమ్,
దేవయానీ తు సంక్రుద్ధా పితరం వాక్యమబ్రవీత్. 18

ప్ర. అ. అసకృత్ = మాటిమాటికి, పృచ్ఛన్తం = అడుగుచున్న, దీప్తచేతసమ్=మండుచున్న మనస్సు గల, పితరమ్=తండ్రియైన, తం భార్గవమ్ = ఆ శుక్రాచార్యుని గూర్చి, సంక్రుద్ధా=కోపించిన, దేవయానీ = దేవయాని, వాక్యం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మాటిమాటికి అడుగుచున్న, మనస్సులో మండిపడుచున్న తండ్రియైన ఆ శుక్రాచార్యునితో దేవయాని కోపముతో ఇట్లు పలికెను. 18

మూ. అహమగ్నిం విషం తీక్ష్ణమపో వా మునిసత్తమ,
భక్షయిష్యే ప్రవేక్ష్యే వా న తు శక్ష్యామి జీవితుమ్. 19

ప్ర. అ. మునిసత్తమ = మునిశ్రేష్ఠా! అహమ్=నేను, అగ్నిమ్ = అగ్నిని కాని, అపః వా = జలమును కాని, ప్రవేక్ష్యే = ప్రవేశించెదను. తీక్ష్ణమ్ = తీక్ష్ణమైన, విషం వా = విషమునైనా, భక్షయిష్యే = భక్షించెదను. తు=కాని, జీవితుమ్ = జీవించుటకు, న శక్ష్యామి = సమర్థురాలను కాను.

తా. ఓ! మునీశ్వరా! నేను అగ్నిలో గాని, ఉదకములో గాని పడెదను. లేదా తీక్ష్ణమైన విషమును తినెదను; కాని జీవించజాలను. 19

మూ. న మాం త్వమవజానీషే దుఃఖితామవమానితామ్,
వృక్షస్యావజ్ఞయా బ్రహ్మంశ్ఛిద్యన్తే వృక్షజీవినః. 20

ప్ర. అ. త్వమ్=నీవు, మామ్=నన్ను, దుఃఖితామ్=దుఃఖితురాలనుగాను, అవమానితామ్=అవమానించబడినదాననుగాను, న అవజానీషే = తెలుసుకొనుట లేదు. బ్రహ్మన్ = ఓ! బ్రాహ్మణా! వృక్షస్య = వృక్షముయొక్క, అవజ్ఞయా = అనాదరముచేత, వృక్షజీవినః=వృక్షమును ఆధారముగా చేసికొని జీవించే ప్రాణులు, ఛిద్యన్తే = ఛేదింపబడును (పీడింపబడును).

తా. నేను దుఃఖించుచున్నట్లు, అవమానింపబడినట్లు నీవు తెలుసుకొనుట లేదు. బ్రాహ్మణా! చెట్టును అవమానించుటచే ఆ చెట్టును ఆశ్రయించి జీవించు ప్రాణులకు బాధ కలుగును. 20

మూ. అవజ్ఞయా చ రాజర్షిః పరిభూయ చ భార్గవ,
మయ్యవజ్ఞాం ప్రయుఙ్క్తే హి న చ మాం బహుమన్యతే.

ప్ర. అ. భార్గవ=శుక్రాచార్యా ! రాజర్షిః=రాజర్షి, అవజ్ఞయా = నీయందు అనాదరముచేత, పరిభూయ = తిరస్కరించి, మయి = నాయందు, అవజ్ఞామ్ = అనాదరమును, ప్రయుఙ్క్తే = ప్రయోగించుచున్నాడు. మామ్ = నన్ను, న బహుమన్యతే చ = గౌరవించుటలేదు కూడ.

తా. శుక్రాచార్యా ! ఈ రాజర్షి నీయందు అనాదరముచేత నిన్ను తిరస్కరించి నాయందు కూడ అనాదరము చూపుచున్నాడు. నన్ను గౌరవించుటలేదు.

మూ. తస్యాస్తద్వచనం శ్రుత్వా శోకేనాభిపరిప్లుతః,
వ్యాహర్తుముపచక్రామ భార్గవో నహుషాత్మజమ్. 22

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, భార్గవః = శుక్రుడు, శోకేన=శోకముతో, అభిపరిప్లుతః = నిండినవాడై, నహుషాత్మజమ్ = యయాతిని గూర్చి, వ్యాహర్తుమ్ = పలుకుటకు, ఉపచక్రామ = ఉపక్రమించెను.

తా. శుక్రాచార్యుడు ఆమె మాటలు విని కోపావిష్టుడై యయాతిని గూర్చి ఇట్లనెను. 22

మూ. యస్మాన్మామవజానీషే నాహుష త్వం దురాత్మవాన్,
వయసా జరయా జీర్ణః శైథిల్యముపయాస్యసి. 23

ప్ర. అ. నాహుష = నహుషపుత్రుడా! త్వమ్ = నీవు, దురాత్మవాన్ = చెడ్డ బుద్ధి కలవాడవై, యస్మాత్ = ఎందువలన, మామ్ = నన్ను, అవజానీషే= అవమానించుచున్నావో, జరయా వయసా = ముసలితనముచేత, జీర్ణః=జీర్ణుడవై, శైథిల్యమ్ = శిథిలత్వమును, ఉపయాస్యసి = పొందగలవు.

తా. ఓ ! యయాతీ ! దుర్బుద్ధివైన నీవు నన్ను అవమానించుచున్నావు. అందుచే ముసలితనముచేత జీర్ణుడవై శిథిలత్వమును పొందగలవు. 23

మూ. ఏవముక్త్వా దుహితరం సమాశ్వాస్య స భార్గవః,
పునర్జగామ బ్రహ్మర్షిర్భవనం స్వం మహాయశాః. 24

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, బ్రహ్మర్షిః = బ్రహ్మర్షియైన, సః భార్గవః = ఆ శుక్రుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, దుహితరమ్ = కుమార్తెను, సమాశ్వాస్య = ఓదార్చి, పునః = తిరిగి, స్వభవనమ్ = తన భవనమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. గొప్ప కీర్తి గల బ్రహ్మర్షి యైన ఆ శుక్రుడు ఇట్లు శపించి, కుమార్తెను ఓదార్చి, మరల తన ఇంటికి వెళ్ళిపోయెను. 24

మూ. స ఏవముక్త్వా ద్విజపుంగవాగ్ర్యః
సుతాం సమాశ్వాస్య చ దేవయానీమ్,
పునర్యయౌ సూర్యసమానతేజా
దత్త్వా చ శాపం నహుషాత్మజాయ. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టపఞ్చాశః సర్గః.

ప్ర. అ. సూర్యసమానతేజాః = సూర్యునితో సమానమైన తేజస్సు గల, ద్విజపుంగవాగ్ర్యః = బ్రాహ్మణశ్రేష్ఠులలో మొదటివాడైన, సః = ఆ శుక్రుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, సుతామ్=కుమార్తెయైన, దేవయానీమ్=దేవయానిని, సమాశ్వాస్య = ఓదార్చి, నహుషాత్మజాయ=యయాతికి, శాపం చ = శాపమును కూడ, దత్త్వా = ఇచ్చి, పునః = తిరిగి, యయౌ = వెళ్లెను.

తా. సూర్యునితో సమానమైన తేజస్సు గల, బ్రాహ్మణోత్తములలో మొదటివాడైన ఆ శుక్రాచార్యులు, ఇట్లు పలికి, కుమార్తెయైన దేవయానిని ఓదార్చి, యయాతికి శాప మిచ్చి, మరల వెళ్ళిపోయెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో యాభైఎనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనషష్టితమః సర్గః

*[యయాతి పుత్రుడైన పూరువునకు తన వార్ధక్యము నిచ్చి అతని యౌవనమును తీసికొనుట. భోగము లనుభవించి తృప్తుడైన పిమ్మట ఆతడు చాలకాలానికి అతని యౌవనమును తిరిగి ఇచ్చివేయుట. పూరువును రాజ్యమునందు అభిషేకించుట. యదువును శపించుట].*

మూ. శ్రుత్వా తూశనసం క్రుద్ధం తదార్తో నహుషాత్మజః,
జరాం పరమికాం ప్రాప్య యదుం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. ఉశనసమ్ = శుక్రాచార్యుణ్ణి, క్రుద్ధమ్ = కోపించినవానినిగా, శ్రుత్వా = విని, నహుషాత్మజః = యయాతి, తదా = అప్పుడు, ఆర్తః = దుఃఖితుడై, పరమికామ్ = గొప్ప, జరామ్ = ముసలితనమును, ప్రాప్య = పొంది, యదుమ్ = యదువును గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. అప్పుడు యయాతి శుక్రాచార్యుడు కోపించినట్లు తెలిసికొని చాలా దుఃఖితుడై, చాల ముసలివాడై, యదువుతో ఇట్లు పలికెను. 1

మూ. యదో త్వమసి ధర్మజ్ఞో మదర్థం ప్రతిగృహ్యతామ్,
జరా పరమికా పుత్ర భోగై రంస్యే మహాయశః. 2

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గలవాడా! పుత్ర = పుత్రా! యదో = యదూ! త్వమ్ = నీవు, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడవు, అసి = అయి ఉన్నావు. మదర్థమ్ = నాకొరకై, పరమికా = గొప్పదైన, జరా = ముసలితనము, ప్రతిగృహ్యతామ్ = స్వీకరించబడుగాక. భోగైః = భోగములతో, రంస్యే = క్రీడించెదను.

తా. గొప్ప కీర్తి గల పుత్రా! యదూ! నాకు సాహాయ్యము చేయుటకై

ఈ అధికమైన ముసలితనమును నీవు తీసికొనుము. నేను భోగములు అనుభవించెదను. 2

మూ. న తావత్కృతకృత్యోఽస్మి విషయేషు నరర్షభ,
అనుభూయ తదా కామం తతః ప్రాప్స్యామ్యహం జరామ్.

ప్ర. అ. నరర్షభ = పురుషశ్రేష్ఠుడా! విషయేషు = భోగములయందు, కృతకృత్యః = కృతకృత్యుడను (తృప్తి చెందినవాడను), న తావత్ అస్మి = కాలేదు. తదా = అప్పుడు, కామమ్ = కామమును, అనుభూయ = అనుభవించి, తతః = అటుపిమ్మట, అహమ్ = నేను, జరామ్ = ముసలితనమును, ప్రాప్స్యామి = పొందెదను.

తా. పురుషశ్రేష్ఠుడా! నాకు భోగాలయందు తృప్తి కలుగలేదు. కామములను అనుభవించి పిమ్మట మరల ముసలితనమును తీసికొనెదను. 3

మూ. యదుస్తద్వచనం శ్రుత్వా ప్రత్యువాచ నరర్షభమ్,
పుత్రస్తే దయితః పూరుః ప్రతిగృహ్ణాతు వై జరామ్. 4

ప్ర. అ. యదుః = యదువు, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, నరర్షభమ్ = మనుష్యశ్రేష్ఠుణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. తే = నీకు, దయితః = ఇష్టుడైన, పుత్రః = పుత్రుడైన, పూరుః = పూరువు, జరామ్ = ముసలితనమును, ప్రతిగృహ్ణాతు వై = తీసికొనుగాక.

తా. ఆ మాట విని యదువు రాజుతో ఇట్లు పలికెను. "నీ ప్రియపుత్రుడైన పూరువు నీ ముసలితనమును తీసికొనుగాక". 4

మూ. బహిష్కృతోఽహమర్థేషు సంనికర్షాచ్చ పార్థివ,
ప్రతిగృహ్ణాతు వై రాజన్యైః సహాశ్నాసి భోజనమ్. 5

ప్ర. అ. పార్థివ = రాజా! అహమ్ = నేను, అర్థేషు = కార్యములయందు, సంనికర్షాత్ చ = సామీప్యమునుండీ, బహిష్కృతః = బహిష్కరించబడితిని, రాజన్ = రాజా! యైః సహ = ఎవరితో కూడి, భోజనమ్ = భోజనమును, అశ్నాసి = తినుచున్నావో అతడు, ప్రతిగృహ్ణాతు వై = తీసికొను గాక.

తా. రాజా! నన్ను రాజకార్యములనుండి, సామీప్యమునుండి దూరముగా ఉంచినావు. రాజా! ఎవరితో కలిసి భోజనము చేయుచున్నావో అతడే నీ ముసలితనమును తీసుకొనుగాక. 5

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజా పూరుమథాబ్రవీత్,
ఇయం జరా మహాబాహో మదర్థం ప్రతిగృహ్యతామ్. 6

ప్ర. అ. తస్య = వానియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అథ = అటుపిమ్మట, రాజా = రాజు, పూరుమ్ = పూరువును గూర్చి, అబ్రవీత్ = పలికెను. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! ఇయం జరా = ఈ ముసలితనము, మదర్థమ్ = నా కొరకై, ప్రతిగృహ్యతామ్= ప్రతిగ్రహింపబడుగాక.

తా. రాజు వాని మాటలు విని పిదప పూరువుతో "ఓ మహాబాహూ! నాకు ఉపకారము జరుగుటకై ఈ ముసలితనము నీపైకి తీసికొనుము" అని పలికెను. 6

మూ. నాహుషేణైవముక్తస్తు పూరుః ప్రాఞ్జలిరబ్రవీత్,
ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి శాసనేఽస్మి తవ స్థితః. 7

ప్ర. అ. నాహుషేణ = నహుషుని పుత్రునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, పూరుః = పూరువు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, అబ్రవీత్ = పలికెను. ధన్యః = ధన్యుడను, అస్మి = అయినాను. అనుగృహీతః = అనుగ్రహించబడినవాడను, అస్మి = అయి ఉన్నాను. తవ = నీయొక్క, శాసనే = శాసనమునందు, స్థితః = ఉన్నాను.

తా. యయాతి మాటలు విని పూరువు అంజలి ఘటించి- "ధన్యుడనైతిని, అనుగ్రహింపబడితిని, నీ ఆజ్ఞను అనుసరించుచున్నాను" అని పలికెను. 7

మూ. పూరోర్వచనమాజ్ఞాయ నాహుషః పరయా ముదా,
ప్రహర్షమతులం లేభే జరాం సంక్రామయచ్చ తామ్. 8

ప్ర. అ. పూరోః = పూరువుయొక్క, వచనమ్ = వచనమును, ఆజ్ఞాయ = తెలిసికొని, నాహుషః = యయాతి, పరమయా = గొప్ప, ముదా = సంతోషముతో,

తామ్ = ఆ, జరామ్ = ముసలితనమును, సంక్రామయత్ = సంక్రమింపచేసెను. అతులమ్ = సాటిలేని, ప్రహర్షమ్ = ఆనందమును, లేభే = పొందెను.

తా. యయాతి పూరువు పలికిన మాటలు విని గొప్ప ఆనందముతో తన ముసలితనమును అతనికి సంక్రమింపజేసి చాల సంతోషించెను. 8

మూ. తతః స రాజా తరుణః ప్రాప్య యజ్ఞాన్ సహస్రశః,
బహువర్షసహస్రాణి పాలయామాస మేదినీమ్. 9

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తరుణః = యువకుడైన, సః రాజా = ఆ రాజు, సహస్రశః = వేలకొలది, యజ్ఞాన్ = యజ్ఞములను, ప్రాప్య = పొంది, బహువర్షసహస్రాణి = చాల వేల సంవత్సరములను, మేదినీమ్ = భూమిని, పాలయామాస = పాలించెను.

తా. పిమ్మట యువకుడైన ఆ రాజు వేలకొలది యజ్ఞములు చేసి చాలా వేల సంవత్సరములు రాజ్యము చేసెను. 9

మూ. అథ దీర్ఘస్య కాలస్య రాజా పూరుమథాబ్రవీత్,
ఆనయస్వ జరాం పుత్ర న్యాసం నిర్యాతయస్వ మే. 10

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దీర్ఘస్య = దీర్ఘమైన, కాలస్య అథ = కాలమునకు తరవాత, పూరుమ్ = పూరువును గూర్చి, అబ్రవీత్ = పలికెను. పుత్ర = పుత్రా! జరామ్ = ముసలితనమును, ఆనయస్వ = తీసికొనిరమ్ము (తెమ్ము); మే = నాయొక్క, న్యాసమ్ = న్యాసమును (దాచడానికి ఇచ్చిన వస్తువు న్యాసము), నిర్యాతయస్వ = తిరిగి ఇచ్చివేయుము.

తా. పిమ్మట చాల కాలానికి రాజు పూరువుతో ఇట్లనెను. "పుత్రా! ముసలితనమును తెమ్ము; నా న్యాసమును తిరిగి ఇచ్చివేయుము. 10

మూ. న్యాసభూతా మయా పుత్ర త్వయి సంక్రామితా జరా,
తస్మాత్ప్రతిగ్రహీష్యామి తాం జరాం మా వ్యథాం కృథాః.

ప్ర. అ. పుత్ర = పుత్రుడా! మయా = నాచేత, జరా = ముసలితనము, త్వయి = నీయందు, న్యాసభూతా = న్యాసముగా, సంక్రామితా = సంక్రమింప

చేయబడినది, తస్మాత్ = ఆ కారణమువలన, తాం జరామ్ = ఆ ముసలితనమును, ప్రతిగ్రహీష్యామి=తిరిగి తీసికొనెదను. వ్యథామ్ = వ్యథను, మా కృథాః = = చేయకుము (చెందకుము).

తా. నాయనా! నేను ముసలితనమును న్యాసమునుగా నీపై సంక్రమింప చేసితిని. అందువలన దానిని మరల తీసికొనెదను; వ్యథ చెందకుము. 11

మూ. ప్రీతశ్చాస్మి మహాబాహో శాసనస్య ప్రతిగ్రహాత్,
త్వాం చాహమభిషేక్ష్యామి ప్రీతియుక్తో నరాధిపమ్. 12

ప్ర. అ. మహాబాహో = మహాబాహూ! శాసనస్య = శాసనముయొక్క, ప్రతిగ్రహాత్ = అంగీకరించుటవలన, ప్రీతః చ = సంతోషించినవాడను, అస్మి= అయినాను. ప్రీతియుక్తః = సంతోషముతో కూడిన నేను, త్వామ్ = నిన్ను, నరాధిపమ్ = రాజునుగా, అభిషేక్ష్యామి = అభిషేకించెదను.

తా. మహాబాహూ! నా ఆజ్ఞను అంగీకరించినందుకు సంతోషించినాను. నేను సంతోషపూర్వకముగా నిన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేసెదను. 12

మూ. ఏవముక్త్వా సుతం పూరుం యయాతిర్నహుషాత్మజః,
దేవయానీసుతం క్రుద్ధో రాజా వాక్యమువాచ హ. 13

ప్ర. అ. నహుషాత్మజః=నహుషుని కుమారుడు, రాజా=రాజు అయిన, యయాతిః = యయాతి, సుతమ్ = కుమారుడైన, పూరుమ్ = పూరువును గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = చెప్పి, దేవయానీసుతమ్ = దేవయాని కుమారుడైన యదువును గూర్చి, క్రుద్ధః=కోపించినవాడై, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. నహుషుని పుత్రుడైన యయాతిమహారాజు పుత్రుడైన పూరువుతో ఇట్లు పలికి యదువుతో కోపించి ఇట్లు పలికెను. 13

మూ. రాక్షసస్త్వం మయా జాతః క్షత్రరూపో దురాత్మవాన్,
ప్రతిహంసి మమాజ్ఞాం త్వం ప్రజార్థే విఫలో భవ. 14

ప్ర. అ. దురాత్మవాన్ = దుష్టబుద్ధి గల, త్వమ్ = నీవు, క్షత్రరూపః=

క్షత్రియరూపము గల, రాక్షసః = రాక్షసుడవు, మయా = నాచేత, జాతః = పుట్టినావు, త్వమ్ = నీవు, మమ = నాయొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, ప్రతిహంసి = కొట్టివేయుచున్నావు. ప్రజార్థే = సత్సంతానము విషయమై, విఫలః = వ్యర్థుడవు, భవ = అగుము.

తా. దుర్బుద్ధివైన నీవు క్షత్రియరూపములో ఉన్న రాక్షసుడవు. నా ఆజ్ఞను ధిక్కరించినావు. అందువలన నీకు సత్సంతానము లేకపోవుగాక. 14

మూ. పితరం గురుభూతం త్వం య స్మాత్త్వమవమన్యసే,
రాక్షసాన్ యాతుధానాంస్త్వం జనయిష్యసి దారుణాన్. 15

ప్ర. అ. త్వమ్ = నీవు, గురుభూతమ్ = గురువైన, పితరమ్ = తండ్రిని, యస్మాత్ = ఏ కారణమువలన, అవమన్యసే = అవమానించుచున్నావో, తస్మాత్ = అందువలన, త్వమ్ = నీవు, దారుణాన్ = భయంకరులైన రాక్షసులను, యాతుధానాన్ = పిశాచములను, జనయిష్యసి = పుట్టించగలవు.

తా. నీవు పూజ్యుడనైన తండ్రినైన నన్ను అవమానించితివి గాన నీకు క్రూరులైన రాక్షసులు, పిశాచములు పుత్రులుగా పుట్టెదరు. 15

మూ. న తు సోమకులోత్పన్నే వంశే స్థాస్యసి దుర్మతే,
వంశోఽపి భవతస్తుల్యో దుర్వినీతో భవిష్యతి. 16

ప్ర. అ. దుర్మతే = దుష్టబుద్ధి గలవాడా! సోమకులోత్పన్నే = చంద్రకులమునందు పుట్టిన, వంశే = వంశమునందు, న స్థాస్యసి = ఉండవు. భవతః = నీయొక్క, వంశోఽపి = వంశముకూడ, తుల్యః = నీతో సమానమైనదై, దుర్వినీతః = చెడ్డది, భవిష్యతి = కాగలదు.

తా. ఓ! దుర్మతీ! నీవు ఈ చంద్రవంశములో ఉండవు. నీ వంశము కూడ నీతో సమానమై చెడ్డది కాగలదు. 16

మూ. తమేవముక్త్వా రాజర్షిః పూరుం రాజ్యవివర్ధనమ్,
అభిషేకేణ సంపూజ్య ఆశ్రమం ప్రవివేశ హ. 17

ప్ర. అ. రాజర్షిః = ఆ రాజర్షి, తమ్ = అతనిని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, రాజ్యవివర్ధనమ్ = రాజ్యమును వృద్ధి పొందించు, పూరుమ్ = పూరువును, అభిషేకేణ = అభిషేకముచేత, సంపూజ్య = ఆదరించి, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ప్రవివేశ హ = ప్రవేశించెను.

తా. రాజర్షియైన ఆ యయాతి యదువును ఇట్లు శపించి రాజ్యమును వృద్ధిపొందించు పూరువును రాజ్యాభిక్తుని చేసి ఆదరించి, ఆశ్రమములో ప్రవేశించెను. (వానప్రస్థాశ్రమము స్వీకరించెను). 17

మూ. తతః కాలేన మహతా దిష్టాన్తముపజగ్మివాన్,
త్రిదివం స గతో రాజా యయాతిర్నహుషాత్మజః. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నహుషాత్మజః = నహుషుని కుమారుడైన యయాతిః రాజా = యయాతిమహారాజు, మహతా కాలేన = చాల కాలముచేత, దిష్టాన్తమ్ = మరణమును, ఉపజగ్మివాన్ = పొందినవాడై, త్రిదివమ్=స్వర్గమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. తరువాత చాలకాలానికి మరణించిన యయాతిమహారాజు స్వర్గమునకు వెళ్ళెను. 18

మూ. పూరుశ్చకార తద్రాజ్యం ధర్మేణ మహతా వృతః,
ప్రతిష్ఠానే పురవరే కాశిరాజ్యే మహాయశాః. 19

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, పూరుః = పూరువు, మహతా = గొప్ప, ధర్మేణ = ధర్మముతో, వృతః = కూడినవాడై. కాశిరాజ్యే = కాశిరాజ్యమునందు మహతా = గొప్ప, ధర్మేణ = ధర్మముతో, వృతః = కూడినవాడై, ప్రతిష్ఠానే = ప్రతిష్ఠాన మను, పురవరే = శ్రేష్ఠమైన పట్టణమునందు, రాజ్యమ్ = రాజ్యమును, చకార = చేసెను.

తా. గొప్ప కీర్తి గల పూరువు కాశిరాజ్యములో ప్రతిష్ఠాన మను ఉత్తమమైన పురమునందు పూర్తిగా ధర్మమార్గము అవలంబించి రాజ్యము చేసెను. 19

మూ. యదుస్తు జనయామాస యాతుధానాన్ సహస్రశః,
పురే క్రౌఞ్చవనే దుర్గే రాజవంశబహిష్కృతః. 20

ప్ర. అ. రాజవంశబహిష్కృతః=రాజవంశమునుండి బహిష్కరించబడిన, యదుః తు = యదువైతే, దుర్గే = ప్రవేశింప శక్యము కాని, క్రౌఞ్చవనే = క్రౌంచవనమునందు, పురే = పట్టణమునందు, సహస్రశః = వేలకొలది, యాతుధానాన్ = రాక్షసులను, జనయామాస = పుట్టించెను.

తా. రాజవంశమునుండి బహిష్కరింపబడిన యదువు ప్రవేశింప శక్యము కాని క్రౌంచవనమునందు, పురములో వేలకొలది రాక్షసులను పుట్టించెను. 20

మూ. ఏష తూశనసా ముక్తః శాపోత్సర్గో యయాతినా,
దారితః క్షత్రధర్మేణ యం నిమిశ్చక్షమే న చ. 21

ప్ర. అ. ఉశనసా = శుక్రాచార్యునిచేత, ముక్తః = విడవబడిన (ఇవ్వబడిన), ఏషః = ఈ, శాపోత్సర్గః = శాపదానము, యయాతినా = యయాతిచేత, క్షత్రధర్మేణ = క్షత్రియధర్మముచేత, దారితః = ధరించబడినది. యమ్ = దేనిని, నిమిః = నిమి, న చ చక్షమే = క్షమించలేదో.

తా. ఈ విధముగా యయాతి క్షత్రియధర్మమును పాటించుచు శుక్రాచార్యుడిచ్చిన శాపమును సహించెను. అట్టి శాపముచే నిమి సహించలేదు. 21

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం దర్శనం సర్వకార్యిణామ్,
అనువర్తామహే సౌమ్య దోషో న స్యాద్యథా నృగే. 22

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! ఏతత్ = ఇది, సర్వమ్ = అంతా, ఆఖ్యాతమ్ = చెప్పబడినది. సర్వకార్యిణామ్ = అందరు కార్యవంతులయొక్క, దర్శనమ్ = దర్శనమును, అనువర్తామహే = అనుసరించెదము. నృగే యథా = నృగునియందు వలె, దోషః = దోషము, న స్యాత్ = లేకుండుగాక.

తా. సౌమ్యా! నీకు ఈ కథ అంతా చెప్పినాను. పనులున్నవారి నందరినీ చూచెదము. అట్లు చేయకపోవుటచేత నృగమహారాజునకు కలిగినట్లు దోషము కలుగకుండు గాక. 22

మూ. ఇతి కథయతి రామే చన్ద్రతుల్యాననే చ
ప్రవిరలతరతారం వ్యోమ జజ్ఞే తదానీమ్,
అరుణకిరణరక్తా దిగ్బభౌ చైవ పూర్వా
కుసుమరసవిరక్తం వస్త్రమాగుణ్ఠితేవ. 23

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే ఏకోనషష్టితమః సర్గః.

ప్ర. అ. చన్ద్రతుల్యాననే = చంద్రునితో సమానమైన ముఖము గల, రామే = రాముడు, ఇతి = ఇట్లు, కథయతి = చెప్పుచుండగా, తదానీమ్ = అప్పుడు, వ్యోమ = ఆకాశము, ప్రవిరలతారమ్ = చాల విరళమైన నక్షత్రములు కలది, జజ్ఞే = అయ్యెను. పూర్వా దిక్ = తూర్పు దిక్కు, కుసుమర సవిరక్తమ్ = పుష్పరసముచేత ఎఱ్ఱనైన, వస్త్రమ్ = వస్త్రమును, అగుణ్ఠితేవ = కప్పుకొన్నది వలె, అరుణకిరణరక్తా = సూర్యుని కిరణములచేత ఎఱ్ఱనైనదై, బభౌ = ప్రకాశించెను.

తా. చంద్రునితో సమానమైన ముఖము గల రాముడు ఇట్లు పలుకుచుండగానే ఆకాశము మీద నక్షత్రములు పల్చబడెను. సూర్యకిరణములచేత ఎఱ్ఱనైన తూర్పుదిక్కు పుష్పరసముచేత ఎఱ్ఱనైన వస్త్రమును కప్పుకొన్నదా అన్నట్లు ప్రకాశించెను. 23

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో యాభైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ ప్రక్షిప్తః సర్గః ప్రథమః

(ఇటుపైన వచ్చే మూడుసర్గలు ప్రక్షిప్తసర్గలు, వ్యాఖ్యాతలు వ్యాఖ్యానము వ్రాయలేదు).

[*కార్యార్థియై కుక్క ఒకటి రాముని భవనము ద్వారమునకు వచ్చుట. దానిని రాజసభలోనికి తీసికొనిరమ్మని రాముడు లక్ష్మణుణ్ణి ఆదేశించుట*].

మూ. తతః ప్రభాతే విమలే కృత్వా పౌర్వాహ్ణికీం క్రియామ్,
ధర్మాసనగతో రాజా రామో రాజీవలోచనః. 1

రాజధర్మానవేక్షన్వై బ్రాహ్మణైర్నైగమైః సహ,
పురోధసా వసిష్ఠేన ఋషిణా కశ్యపేన చ. 2

ప్ర అ. తతః = అటుపిమ్మట, విమలే = స్వచ్ఛమైన, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు గల, రాజా = రాజైన, రామః = రాముడు, పౌర్వాహ్ణికీమ్ = పూర్వాహ్ణమునకు సంబంధించిన, క్రియామ్ = క్రియను, బ్రాహ్మణైః = బ్రాహ్మణులతోను, నైగమైః సహ = ఆ యా సంఘాల ముఖ్యులతోను, పురోధసా = పురోహితుడైన, వసిష్ఠేన = వసిష్ఠునితోను, ఋషిణా = ఋషియైన, కశ్యపేన చ = కశ్యపునితోను, రాజధర్మాన్ = రాజధర్మములను, అవేక్షన్ వై = చూచుచు, ధర్మాసనగతః = ధర్మాసనము పొందెను.

తా. పిమ్మట తెల్లవారెను. పద్మపత్రముల వంటి నేత్రములు గల రాజైన రాముడు పూర్వాహ్ణమునందు చేయవలసిన కృత్యము లన్నీ చేసికొని బ్రాహ్మణులతోను, ఆ యా సంఘముల ముఖ్యులతోను, పురోహితుడైన వసిష్ఠునితోను, కశ్యప ఋషితోను కలిసి, రాజ్యవ్యవహారములను పరిశీలించుటకై ధర్మాసనమునందు ఉండెను. 1, 2

మూ. మన్త్రిభిర్వ్యవహారజ్ఞైస్తథాన్యైర్ధర్మపాఠకైః,
నీతిజ్ఞైరథ సభ్యైశ్చ రాజభిః సా సభా వృతా. 3

సభా యథా మహేన్ద్రస్య యమస్య వరుణస్య చ,
శుశుభే రాజసింహస్య రామస్యాక్లిష్టకర్మణః. 4

ప్ర. అ. అక్లిష్టకర్మణః=క్లేశము లేకుండా కర్మలుచేయు, రాజసింహస్య = ఆ రాజశ్రేష్ఠుడైన, రామస్య = రామునియొక్క, సా = ఆ, సభా = సభ, వ్యవహారజ్ఞైః=పాలనావ్యవహారమును ఎరిగిన, మన్త్రిభిః=మంత్రులతోను, అన్యైః = ఇతరులైన, ధర్మపాఠకైః = ధర్మశాస్త్రములు చదివినవారితోను, అథ = మరియు, నీతిజ్ఞైః = నీతిని ఎరిగిన, సభ్యైః చ = సభ్యులతోను, రాజభిః=రాజుల తోను, మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, సభా యథా = సభ వలె, యమస్య = యముని సభ వలె, వరుణస్య చ = వరుణుని సభ వలె, శుశుభే = ప్రకాశించెను.

తా. రాజులలో శ్రేష్ఠుడు శ్రమ లేకుండా పనులు సాధించువాడు అయిన ఆ రాముని సభ వ్యవహారజ్ఞానమున్న మంత్రులతోను, ధర్మశాస్త్రాధ్యయనము చేసిన ఇతరులతోను, నీతిని ఎరిగిన సభ్యులతోను, రాజులతోను, మహేంద్రుని సభ వలె, యముని సభ వలె, వరుణుని సభ వలె ప్రకాశించెను. 3, 4

మూ. అథ రామోఽబ్రవీత్తత్ర లక్ష్మణం శుభలక్షణమ్,
నిర్గచ్ఛ త్వం మహాబాహో సుమిత్రానన్దవర్ధన, 5
కార్యార్థినశ్చ సౌమిత్రే వ్యాహర్తుం త్వముపక్రమ.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామః = రాముడు, శుభలక్షణమ్ = శుభమైన లక్షణములు గల, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! సుమిత్రానన్దవర్ధన=సుమిత్రయొక్క ఆనందమును వృద్ధిపొందించువాడా! సౌమిత్రే = లక్ష్మణా, త్వమ్ = నీవు, నిర్గచ్ఛ = బైటకు వెళ్ళుము. త్వమ్ = నీవు, కార్యార్థినః = కార్యమును కోరువారినిగూర్చి, వ్యాహర్తుమ్ = మాటలాడుటకు, ఉపక్రమ = ఉపక్రమించుము.

తా. పిమ్మట రాముడు శుభలక్షణములు గల లక్ష్మణునితో ఇట్లు పలికెను. మహాబాహూ! సుమిత్ర ఆనందమును వృద్ధి పొందించువాడా! లక్ష్మణా! నీవు బైటకు వెళ్ళి కార్యార్థులు ఉన్నచో వారితో మాటలాడుటకు ప్రారంభించుము.

మూ. రామస్య భాషితం శ్రుత్వా లక్ష్మణః శుభలక్షణః, 6
ద్వారదేశముపాగమ్య కార్యిణశ్చాహ్వయత్ స్వయమ్.

ప్ర. అ. శుభలక్షణః = శుభలక్షణములు గల, లక్ష్మణః = లక్ష్మణుడు, రామస్య = రాముని యొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, ద్వారదేశమ్ = ద్వారప్రదేశమును, ఉపాగమ్య = పొంది, స్వయమ్ = స్వయముగా, కార్యిణః = వ్యవహారము ఉన్నవారిని, ఆహ్వయత్ = పిలచెను.

తా. శుభలక్షణములు గల లక్ష్మణుడు రాముని మాటలు విని ద్వారము దగ్గరకు వచ్చి స్వయముగా వ్యవహారము ఉన్నవాళ్ళను పిలచెను. 6

మూ. న కశ్చిదబ్రవీత్తత్ర మమ కార్యమిహాద్య వై, 7
నాధయో వ్యాధయశ్చైవ రామే రాజ్యం ప్రశాసతి,
పక్వసస్యా వసుమతీ సర్వౌషధిసమన్వితా. 8

ప్ర. అ. అద్య = ఇప్పుడు, ఇహ = ఇక్కడ, మమ = నాకు, కార్యమ్ = కార్యము, అస్తి వై = ఉన్నది అని, తత్ర = అక్కడ, కశ్చిత్ = ఎవ్వడూ కూడ, న అబ్రవీత్ = పలకలేదు. రామే = రాముడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రశాసతి = శాసించుచుండగా, ఆధయః = మనోబాధలు, వ్యాధయః = రోగములు, న = లేవు. వసుమతీ = భూమి, పక్వసస్యా = పక్వమైన సస్యములు గలది, సర్వౌషధిసమన్వితా = సమస్తములైన ఓషధులతో కూడినది అయి ఉండెను.

తా. "ఇప్పుడు నాకు ఇక్కడ ఈ వ్యవహారము ఉన్నది" అని అక్కడ ఎవ్వరూ చెప్పలేదు. ఎందుచేత ననగా రాముడు రాజ్యము పాలించుచుండగా ప్రజలకు మనోవ్యథలు గాని, రోగములు గాని లేకుండెను. భూమి పక్వములైన సస్యములతో నిండి సమస్తములైన ఓషధులతో సమృద్ధముగా ఉండెను. 7, 8

మూ. న బాలో మ్రియతే తత్ర న యువా న చ మధ్యమః,
ధర్మేణ శాసితం సర్వం న చ బాధా విధీయతే. 9

ప్ర. అ. తత్ర=అక్కడ, బాలః=బాలుడు, న మ్రియతే = మరణించుట లేదు. యువా = యువకుడు, న = మరణించుటలేదు. మధ్యమః చ = మధ్యమ వయస్కుడు కూడ, న = మరణించుటలేదు, సర్వమ్ = సమస్తమూ, ధర్మేణ= ధర్మముచేత, శాసితమ్ = శాసించబడినది. బాధా = బాధ, న విధీయతే = చేయ బడలేదు.

తా. అక్కడ బాలుడు కాని, యువకుడు గాని, మధ్యవయస్కుడు గాని మరణించెడివాడు కాడు. అంతా ధర్మానుసారము పాలింపబడుచుండెను. ఎవరికీ బాధ కలిగింపబడలేదు. 9

మూ. దృశ్యతే న చ కార్యార్థీ రామే రాజ్యం ప్రశాసతి,
లక్ష్మణః ప్రాఞ్జలిర్భూత్వా రామాయైవం న్యవేదయత్.

ప్ర. అ. రామే = రాముడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రశాసతి = శాసించు చుండగా, కార్యార్థీ = కార్యార్థి, న చ దృశ్యతే = చూడబడడు. లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రాఞ్జలిః = కట్టబడినదోసిలి కలవాడు, భూత్వా = అయి, రామాయ = రామునకు, ఏవమ్ = ఇట్లు, న్యవేదయత్ = తెలిపెను.

తా. రాముడు రాజ్యమును పాలించుచుండగా వ్యవహారము కొరకై వచ్చే వాడు ఎవడూ కూడ లేకుండెను. లక్ష్మణుడు అంజలి ఘటించి రామునకు ఈ విషయము చెప్పెను. 10

మూ. అథ రామః ప్రసన్నాత్మా సౌమిత్రిమిదమబ్రవీత్,
భూయ ఏవ తు గచ్ఛ త్వం కార్యిణః ప్రవిచారయ. 11

ప్ర. అ. అథ=అటుపిమ్మట, రామః=రాముడు, ప్రసన్నాత్మా=ప్రసన్న మైన మనస్సు గలవాడై, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్య మును, అబ్రవీత్ = పలికెను. త్వమ్ = నీవు, భూయః ఏవ = మరల, గచ్ఛ = వెళ్ళుము. కార్యిణః = కార్యమున్నవారిని గూర్చి. ప్రవిచారయ = విచారించుము.

తా. రాముడు సంతోషించి లక్ష్మణునితో- "మరల వెళ్ళి నీవు కార్యాపేక్ష ఉన్నవారెవరైనా ఉన్నారా చూచి రమ్ము" అని ఆదేశించెను. 11

మూ. ఏతచ్ఛ్రుత్వా తు వచనం సారమేయస్య లక్ష్మణః,
రాఘవాయ తదాఖ్యాతుం ప్రవివేశాలయం శుభమ్. 18

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, సారమేయస్య = కుక్కయొక్క, ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, రాఘవాయ = రామునకు, తత్ = దానిని, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, శుభమ్ = మంగళకరమైన, ఆలయమ్ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. లక్ష్మణుడు కుక్కమాటలు విని ఈ విషయమును రామునకు తెలుపుటకై సుందరమైన గృహములోనికి వెళ్ళెను. 18

మూ. నివేద్య రామస్య పునర్నిర్జగామ నృపాలయాత్,
వక్తవ్యం యది తే కించిత్ తత్త్వం బ్రూహి నృపాయ వై.

ప్ర. అ. రామస్య = రామునకు, నివేద్య = తెలిపి, పునః = తిరిగి, నృపాలయాత్ = రాజగృహమునుండి, నిర్జగామ = బైటకువచ్చెను. తే = నీకు, కించిత్ = ఏమైన, వక్తవ్యం యది = చెప్పదగినది ఉన్నట్లయితే, తత్ = దానిని, నృపాయ = రాజుకు, బ్రూహి వై = చెప్పుము.

తా. రామునికి తెలిపి మరల రాజభవనమునుండి బైటకు వచ్చి "నీకేమైన చెప్పవలసినది ఉన్నచో రాజుకు చెప్పుము" అని ఆ శునకముతో అనెను. 19

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా సారమేయోఽభ్యభాషత,
దేవాగారే నృపాగారే ద్విజవేశ్మసు వై తథా. 20

వహ్నిః శతక్రతుశ్చైవ సూర్యో వాయుశ్చ తిష్ఠతి,
నాత్ర యోగ్యాస్తు సౌమిత్రే యోనీనామధమా వయమ్. 21

ప్ర. అ. లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, సారమేయః = కుక్క, అభ్యభాషత = పలికెను. సౌమిత్రే = లక్ష్మణా! దేవాగారే = దేవాలయమునందు, నృపాగారే = రాజభవనమునందు, తథా = మరియు, ద్విజవేశ్మసు = ద్విజులగృహములయందు, వహ్నిః = అగ్ని, తిష్ఠతి = ఉండును. శతక్రతుః చ ఏవ = ఇంద్రుడు, సూర్యః = సూర్యుడు, వాయుః చ =

వాయువూ కూడ ఉందురు. యోనీనామ్ = యోనులలో, అధమాః = అధముల మైన, వయమ్ = మేము, అత్ర = ఈ గృహములలో (ప్రవేశించుటకు), న యోగ్యాః = యోగ్యులము కాదు.

తా. లక్ష్మణుని మాటలు విని ఆ శునకము ఇట్లు పలికెను. "లక్ష్మణా! దేవతాగృహమునందు, ద్విజుల గృహములలోను అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, వాయువూ ఉందురు. అధమయోనులమైన మేము ఆ గృహములలో ప్రవేశించుటకు యోగ్యులము కాదు. 20, 21

మూ. ప్రవేష్టుం నాత్ర శక్ష్యామి ధర్మో విగ్రహవాన్ నృపః,
సత్యవాదీ రణపటుః సర్వసత్త్వహితే రతః. 22

ప్ర. అ. అత్ర = ఈ గృహమునందు, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాను. నృపః = రాజు, విగ్రవాన్ = రూపము గల, ధర్మః = ధర్మము, సత్యకారీ = సత్యము పలుకువాడు, రణపటుః = యుద్ధములందు సమర్థుడు, సర్వసత్త్వహితే = సమస్తప్రాణుల హితమునందు, రతః = ఆసక్తుడు.

తా. నేను ఈ భవనము ప్రవేశింపజాలను. రాజు మూర్తీభవించిన ధర్మము. సత్యమే పలుకును. రణరంగములందు సమర్థుడు. సకలప్రాణుల హితమునందు ఆసక్తి కలవాడు. 22

మూ. షాడ్గుణ్యస్య పదం వేత్తి నీతికర్తా స రాఘవః,
సర్వజ్ఞః సర్వదర్శీ చ రామో రమయతాం వరః. 23

ప్ర. అ. రాఘవః = రఘువంశసంజాతుడు, రమయతామ్ = ఆనందింప చేసేవారిలో, వరః = శ్రేష్ఠుడూ ఆయిన, రామః = రాముడు, షాడ్గుణ్యస్య = ఆరు గుణములయొక్క, పదమ్ = స్థానమును, వేత్తి = ఎరుగును. నీతికర్తా = నీతిని నిర్మించువాడు. సర్వజ్ఞః = అన్ని తెలిసినవాడు. సర్వదర్శీ చ = అన్నీ చూచే వాడు.

తా. రఘువంశసంజాతుడు, ఆనందింపచేసేవారిలో శ్రేష్ఠుడూ అయిన రాముడు సంధి-విగ్రహ-యాన-ఆసన-ద్వైధీభావ-సమాశ్రయణములను ఆరు గుణ ముల ప్రయోగము తెలిసినవాడు. నీతిమార్గమును చూపువాడు అన్నీ తెలిసినవాడు. అన్నీ చూడగలిగినవాడు. 23

మూ. స సోమః స చ మృత్యుశ్చ స యమో ధనదస్తథా,
వహ్నిః శతక్రతుశ్చైవ సూర్యో వై వరుణస్తథా. 24

ప్ర. అ. సః = అతడు, సోమః = చంద్రుడు, సః = అతడు, మృత్యుః చ = మృత్యువు, సః = అతడు, యమః = యముడు, తథా=మరియు, ధనదః = కుబేరుడు, వహ్నిః = అగ్ని దేవుడు, శతక్రతుః చైవ = ఇంద్రుడు, సూర్యః వై = సూర్యుడు, తథా = మరియు, వరుణః = వరుణుడు.

తా. ఆ రాముడే చంద్రుడు, మృత్యువు, యముడు, కుబేరుడు, అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, వరుణుడు. 24

మూ. తస్య త్వం బ్రూహి సౌమిత్రే ప్రజాపాలః స రాఘవః,
అనాజ్ఞప్తస్తు సౌమిత్రే ప్రవేష్టుం నేచ్ఛయామ్యహమ్. 25

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! త్వమ్ = నీవు, తస్య = ఆ రామునకు, బ్రూహి = చెప్పుము. సః రాఘవః=అ రాముడే, ప్రజాపాలః=ప్రజలను పాలించువాడు. సౌమిత్రే = లక్ష్మణా! అహమ్ = నేను, అనాజ్ఞప్తః తు = ఆజ్ఞాపించబడనివాడనై, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, న ఇచ్ఛయామి = ఇచ్ఛయించను.

తా. లక్ష్మణా! ఆ రామునితో చెప్పుము. ఆ రాముడే ప్రజాపాలకుడు. లక్ష్మణా! నేను రాముని ఆజ్ఞ లేకుండా లోపలికి వచ్చుటకు ఇష్టపడను. 25

మూ. ఆనృశంస్యాన్మహాభాగః ప్రవివేశ మహాద్యుతిః,
నృపాలయం ప్రవిశ్యాథ లక్ష్మణో వాక్యమబ్రవీత్. 26

ప్ర. అ. మహాభాగః = గొప్ప భాగ్యము గల, మహాద్యుతిః = గొప్ప కాంతి గల ఆ లక్ష్మణుడు, ఆనృశంస్యాత్ = మంచితనమువలన, ప్రవివేశ = ప్రవేశించెను. లక్ష్మణః = లక్ష్మణుడు, నృపాలయమ్ = రాజభవనమును, ప్రవిశ్య = ప్రవేశించి, అథ = అటుపిమ్మట, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. మహాభాగ్యవంతుడు, మహాతేజఃశాలీ అయిన లక్ష్మణుడు మంచితనముచేత విసిగికొనక మరల రాజభవనములో ప్రవేశించి ఇట్లు పలికెను. 26

మూ. శ్రూయతాం మమ విజ్ఞాప్యం కౌసలానన్దవర్ధన,
యన్మయోక్తం మహాబాహో తవ శాసనజం విభో. 27
శ్వా వై తే తిష్ఠతే ద్వారి కార్యార్థీ సముపాగతః.

ప్ర. అ. కౌసల్యానన్దవర్ధన = కౌసల్యయొక్క ఆనందమును వృద్ధిపొందించువాడా! మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! విభో = ప్రభూ! తవ = నీయొక్క, శాసనజమ్ = ఆజ్ఞ వల్ల కలిగిన, యత్ = ఏది, మయా = నాచేత, ఉక్తమ్ = చెప్పబడినదో, విజ్ఞాప్యమ్ = విజ్ఞాపన చేయవలసిన అది, శ్రూయతామ్ = వినబడుగాక. శ్వా = కుక్క, కార్యార్థీ = కార్యార్థియై, సముపాగతః = వచ్చినది, ద్వారి = ద్వారమునందు, తిష్ఠతే = నిలచిఉన్నది.

తా. కౌసల్యకు ఆనందమును వృద్ధిపొందించువాడా! మహాబాహూ! ప్రభూ! నీ ఆజ్ఞవలన ఏర్పడిన విజ్ఞాపింపదగిన అంశ మొకటి ఉన్నది; వినుము. ఒక శునకము కార్యార్థియై వచ్చినది. ద్వారమువద్ద నిలచి ఉన్నది. 27

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా రామో వచనమబ్రవీత్,
సంప్రవేశయ వై క్షిప్రం కార్యార్థీ యోఽత్ర తిష్ఠతి. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ప్రక్షిప్తః సర్గః ప్రథమః.

ప్ర. అ. లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, రామః = రాముడు, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను. కార్యార్థీ = కార్యమును అర్థించుచున్నదై, యః = ఏ శునకము, అత్ర = ఇక్కడ, తిష్ఠతి = ఉన్నదో దానిని, క్షిప్రమ్ = శీఘ్రముగా, సంప్రవేశయ వై = ప్రవేశ పెట్టుము.

తా. లక్ష్మణుని మాటలు విని రాముడు- "కార్యార్థియై వచ్చిఉన్న దానిని వెంటనే ప్రవేశపెట్టుము" అని లక్ష్మణునితో పలికెను. 28

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో ప్రక్షిప్తసర్గలలో మొదటిసర్గ సమాప్తము.

# అథ ప్రక్షిప్తః సర్గః ద్వితీయః

*[శునకము విషయమున రామడు న్యాయనిర్ణయము చేయుట. దాని అభిప్రాయము ప్రకారము రాముడు దానిని కొట్టిన బ్రాహ్మణునకు మఠాధిపత్యమిచ్చుట. శునకము మఠాధిపత్యములో ఉన్న దోషాలు వర్ణించి చెప్పుట.]*

మూ. శ్రుత్వా రామస్య వచనం లక్ష్మణస్త్వరితస్తదా,
శ్వానమాహూయ మతిమాన్ రాఘవాయ న్యవేదయత్. 1

ప్ర. అ. రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, మతిమాన్ = బుద్ధిమంతుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, త్వరితః = తొందరపడుచున్నవాడై, శ్వానమ్ = శునకమును, ఆహూయ = పిలచి, రాఘవాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. రాముని మాటలు విని బుద్ధిమంతుడైన లక్ష్మణుడు తొందరగా ఆ శునకమును పిలుచుకొని వెళ్ళి రామునకు చూపెను. 1

మూ. దృష్ట్వా సమాగతం శ్వానం రామో వచనమబ్రవీత్,
వివక్షితార్థం మే బ్రూహి సారమేయ న తే భయమ్. 2

ప్ర. అ. సమాగతమ్ = వచ్చిన, శ్వానమ్ = శునకమును, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను, సారమేయ = శునకమా! వివక్షితార్థమ్ = చెప్పదలచిన విషయమును, మే = నాకు, బ్రూహి = చెప్పుము. తే = నీకు, భయమ్ = భయము, న = లేదు.

తా. వచ్చిన ఆ శునకమును చూచి రాముడు దానితో- "ఓ శునకమా! నీవు చెప్పదలచుకున్న విషయమును చెప్పుము- నీకేమీ భయము లేదు" అని పలికెను. 2

మూ. అథాపశ్యత తత్రస్థం రామం శ్వా భిన్నమస్తకః,
తతో దృష్ట్వా స రాజానం సారమేయోఽబ్రవీదిదమ్. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, భిన్నమస్తకః = బ్రద్దలుకొట్టబడిన తల గల, శ్వా = ఆ కుక్క, తత్రస్థమ్ = అక్కడ నున్న, రామమ్ = రాముణ్ణి, అపశ్యత = చూచెను తతః = అటుపిమ్మట, సః సారమేయః = ఆ శునకము, రాజానమ్ = రాజును, దృష్ట్వా=చూచి, వచః = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. తల బ్రద్దలై ఉన్న ఆ శునకము అక్కడ ఉన్న రాముణ్ణి చూచెను. ఆ రాజును చూచి ఆ శునకము ఇట్లనెను. 3

మూ. రాజైవ కర్తా భూతానాం రాజా చైవ వినాయకః,
రాజా సుప్తేషు జాగర్తి రాజా పాలయతి ప్రజాః. 4

ప్ర. అ. రాజైవ = రాజే, భూతానామ్ = ప్రాణులకు, కర్తా = సృజించువాడు, రాజా చ ఏవ=రాజే, వినాయకః=గొప్ప నాయకుడు, సుప్తేషు=అందరూ నిద్రపోవుచుండగా, రాజా = రాజు, జాగర్తి = జాగరూకుడై ఉండును. రాజా = రాజే, ప్రజాః = ప్రజలను, పాలయతి = పాలించును.

తా. సకలభూతముల సృష్టికి హేతువు రాజు. రాజే గొప్ప నాయకుడు. అందరూ నిద్రపోవుచుండగా రాజు మేల్కొని ఉండును. రాజే ప్రజలను పాలించును. 4

మూ. నీత్యా సునీతయా రాజా ధర్మం రక్షతి రక్షితా,
యదా న పాలయేద్రాజా క్షిప్రం నశ్యన్తి వై ప్రజాః. 5

ప్ర. అ. రక్షితా = రక్షకుడైన, రాజా = రాజు, సునీతయా = బాగుగా నడపబడిన, నీత్యా = నీతిచేత, ధర్మమ్ = ధర్మమును, రక్షతి = రక్షించును. యదా = ఎప్పుడు, రాజా = రాజు, న పాలయేత్ = పాలించడో అప్పుడు, ప్రజాః = ప్రజలు, క్షిప్రమ్ = శీఘ్రముగా, నశ్యన్తి వై = నశింతురు.

తా. రక్షకుడైన రాజే బాగుగా నడపబడిన నీతిచేత ధర్మమును రక్షించును. రాజు పాలించనిచో ప్రజలు శీఘ్రముగా నశింతురు. 5

మూ. రాజా కర్తా చ గోప్తా చ సర్వస్య జగతః పితా,
రాజా కాలో యుగం చైవ రాజా సర్వమిదం జగత్. 6

ప్ర. అ. రాజా = రాజే, కర్తా = కర్త; గోప్తా చ = రక్షకుడు, సర్వస్య = సమస్తమైన, జగతః = జగత్తుకు, పితా = తండ్రి. రాజా = రాజే, కాలః = కాలము, యుగం చైవ = యుగము. రాజా = రాజే, సర్వమ్ = సమస్తమైన, ఇదమ్ = ఈ, జగత్ = జగత్తు.

తా. రాజే కర్త. రాజే రక్షకుడు. రాజే జగత్తుకు అంతకీ తండ్రి. రాజే కాలము, యుగమూ కూడ. ఈ సర్వజగత్తూ రాజే. 6

మూ. ధారణాద్ధర్మమిత్యాహుర్ధర్మేణ విధృతాః ప్రజాః,
యస్మాద్ధారయతే సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 7

ప్ర. అ. ధారణాత్ = ధరించుటవలన, ధర్మమ్ ఇతి = ధర్మము అని, ఆహుః = చెప్పుదురు. ధర్మేణ = ధర్మముచేత, ప్రజాః = ప్రజలు, విధృతాః = ధరించబడినారు. సచరాచరమ్ = జంగమస్థావరములతో కూడిన, సర్వమ్ = సమస్తమైన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయమును, యస్మాత్ = ఎందువలన, ధారయతే = ధరించుచున్నదో అందువలన 'ధర్మము'.

తా. ధరించునది కావున ధర్మ మని అందురు. ధర్మమే ప్రజలను నిలబెట్టును. స్థావరజంగమాత్మకమైన మూడు లోకాలను నిలబెట్టేది ధర్మమే. 7

మూ. దారణాద్విద్విషాం చైవ ధర్మేణారఞ్జయన్ ప్రజాః,
తస్మాద్ధారణమిత్యుక్తం స ధర్మ ఇతి నిశ్చయః. 8

ప్ర. అ. విద్విషామ్ = శత్రువులయొక్క, దారణాత్ చ ఏవ = అదుపులో పెట్టుటవలన కూడ ఇది ధర్మము. ధర్మేణ = ధర్మముచేత, ప్రజాః = ప్రజలను, అరఞ్జయన్ = రంజింపచేసిరి. తస్మాత్ = ఆ కారణమువలన, ధారణమ్ ఇతి = ధరించునది అని, ఉక్తమ్ = చెప్పబడినది. సః = అదే, ధర్మః ఇతి = ధర్మము అని, నిశ్చయః = నిశ్చయము.

తా. శత్రువులను అదుపులో ఉంచుటచేత కూడ ఇది ధర్మము. ధర్మము

చేతనే రాజులు ప్రజలను రంజింపచేసిరి. అందుచేత ఇది ధరింపచేయునది అని చెప్పబడినది. అదే ధర్మము అని నిశ్చయము. 8.

మూ. ఏష రాజన్ పరో ధర్మః ఫలవాన్ ప్రేత్య రాఘవ,
న హి ధర్మాద్ భవేత్కించిద్దుష్ప్రాపమితి మే మతిః. 9

ప్ర. అ. రాజన్ = రాజా! రాఘవ = రామా! ఏషః = ఈ, పరః = శ్రేష్ఠమైన, ధర్మః = ధర్మమే, ప్రేత్య = మరణించి, ఫలవాన్ = ఫలము గలది. ధర్మాత్ = ధర్మమువలన, దుష్ప్రాపమ్ = పొంద శక్యము కానిది, కించిత్ = ఏదీ, న హి = లేదు, ఇతి = అని, మే = నాయొక్క. మతిః = బుద్ధి.

తా. రాజా! రామా! మరణానంతరము కూడ ఫలము నిచ్చునది ఈ ఉత్తమమైన ధర్మమే. ధర్మమువలన లభించనిది ఏదీ ఉండ దని నా అభిప్రాయము. 9

మూ. దానం దయా సతాం పూజా వ్యవహారేషు చార్జవమ్,
ఏష రామ పరో ధర్మో రక్షణాత్ ప్రేత్య చేహ చ. 10

ప్ర. అ. రామ = రామా! దానమ్=దానము, దయా = దయ, సతామ్= సత్పురుషులయొక్క, పూజా = పూజ, వ్యవహారేషు = వ్యవహారములయందు, ఆర్జవమ్ = ఋజుత్వము, ఏషః = ఇదే, ప్రేత్య చ=మరణించిన పిమ్మట, ఇహ చ = ఈ లోకమునందూ, రక్షణాత్ = రక్షించుటవలన, పరః = గొప్పదైన, ధర్మః = ధర్మము.

తా రామా! దానము, దయ, సత్పురుషులను పూజించుట, వ్యవహారములలో ఋజుత్వము, ఇవి మరణానంతరము, ఇహలోకములోనూ కూడ రక్షించుటవలన "ధర్మము". 10

మూ. త్వం ప్రమాణం ప్రమాణానామసి రాఘవ సువ్రత,
విదితశ్చైవ తే ధర్మః సద్భిరాచరితస్తు వై. 11

ప్ర. అ. సువ్రత = మంచి నియమములు గలవాడా! రాఘవ = రామా! త్వమ్ = నీవు, ప్రమాణానామ్ = ప్రమాణములకు, ప్రమాణమ్ = ప్రమాణముగా, అసి = అయి ఉన్నావు. సద్భిః = సత్పురుషులచేత, ఆచరితః = ఆచరించబడిన, ధర్మః = ధర్మము, తే = నీకు, విదితః చ వై = తెలియబడినదే.

తా. ఉత్తమనియమపాలకుడవైన రామా! నీవు ప్రమాణాలకు ప్రమాణము. సత్పురుషులచేత ఆచరింపబడిన ధర్మము నీకు బాగా తెలిసినదే. 11

మూ. ధర్మాణాం త్వం పరం ధామ గుణానాం సాగరోపమః,
అజ్ఞానాచ్చ మయా రాజన్నుక్తస్త్వం రాజసత్తమ. 12
ప్రసాదయామి శిరసా న త్వం క్రోధమిహార్హసి.

ప్ర. అ. రాజన్ = రాజా! త్వమ్ = నీవు, ధర్మాణామ్ = ధర్మములయొక్క, పరమ్ = గొప్ప, ధామ = స్థానము. గుణానామ్ = గుణములకు, సాగరోపమః = సాగరముతో సమానుడవు. రాజసత్తమ = రాజశ్రేష్ఠా, మయా = నాచేత, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, ఉక్తః = చెప్పబడినావు. శిరసా = శిరస్సుచేత, ప్రసాదయామి = అనుగ్రహింపచేసుకొనుచున్నాను. త్వమ్ = నీవు, ఇహ = ఇక్కడ, క్రోధమ్ = క్రోధమును, కర్తుమ్ = చేయుటకు, న అర్హసి = తగవు.

తా. రాజులలో శ్రేష్ఠుడవైన రాజా! నీవు ధర్మాలకు ఉత్తమస్థానము. గుణములకు సముద్రము వంటివాడవు. అజ్ఞానమువలన నేను నీముందు ధర్మమును గూర్చి మాటలాడుచున్నాను. శిరస్సు వంచి నమస్కరించుచున్నాను. ఈ విషయమున కోపము చేయకుము. 12

మూ. శునః స వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్, 13
కిం తే కార్యం కరోమ్యద్య బ్రూహి విశ్రబ్ధ మా చిరమ్.

ప్ర. అ. శునః = శునకముయొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సః రాఘవః = ఆ రాముడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అద్య = ఇప్పుడు, తే = నీకు, కిమ్ = ఏమి, కార్యమ్ = కార్యమును, కరోమి = చేయుదును? విశ్రబ్ధః = నమ్మకము కలదానవై, బ్రూహి = చెప్పుము. చిరమ్ = చిరకాలము, మా = వద్దు.

తా. శునకము మాటలు విని రాముడు-"నీకు నేను ఇప్పుడు ఏమి చేయవలెనో నిర్భయముగా చెప్పుము; ఆలస్యము చేయవద్దు" అని దానితో పలికెను.

మూ. రామస్య వచనం శ్రుత్వా సారమేయోఽబ్రవీదిదమ్, 14
ధర్మేణ రాష్ట్రం విన్దేత ధర్మేణైవానుపాలయేత్.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సారమేయః = శునకము, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ధర్మేణ = ధర్మముచేత, రాష్ట్రమ్ = రాష్ట్రమును, విన్దేత = పొందవలెను. ధర్మేణైవ = ధర్మముచేతనే, అనుపాలయేత్ = పాలించవలెను.

తా. రాముని మాటలు విని శునకము ఇట్లు పలికెను - "ధర్మముచేతనే రాష్ట్రమును పొందవలెను. ధర్మముచేతనే దానిని పాలించవలెను". 14

మూ. ధర్మాచ్ఛరణ్యతాం యాతి రాజా సర్వభయాపహః,
ఇదం విజ్ఞాయ యత్ కృత్యం శ్రూయతాం మమ రాఘవ.

ప్ర. అ. ధర్మాత్ = ధర్మమువలన, సర్వభయాపహః = అన్ని భయములనూ తొలగించు, రాజా = రాజు, శరణ్యతామ్ = శరణుపొంద యోగ్యుడగుటను, యాతి = పొందును. రాఘవ = రామా! ఇదమ్ = దీనిని, విజ్ఞాయ = తెలిసికొని, మమ = నాకు, యత్ = ఏది, కృత్యమ్ = చేయదగినదో, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. రామా! ధర్మమువలన సకలభయములను తొలగించు రాజు రక్షకుడు అగును. ఈ విషయమును తెలిసికొని నాకొరకై ఏమి చేయవలెనో వినుము.

మూ. భిక్షుః సర్వార్థసిద్ధశ్చ బ్రాహ్మణావసథే వసన్, 16
తేన దత్తః ప్రహారో మే నిష్కారణమనాగసః.

ప్ర. అ. బ్రాహ్మణావసథే = బ్రాహ్మణులుండు ప్రదేశమునందు, వసన్ = నివసించుచున్న, సర్వార్థసిద్ధః = సర్వార్థసిద్ధుడను, భిక్షుః = సంన్యాసి ఉన్నాడు. తేన = వానిచేత, నిష్కారణమ్ = కారణము లేకుండగా, అనాగసః = అపరాధము లేని, మే = నాకు, ప్రహారః = దెబ్బ, దత్తః = ఇవ్వబడినది.

తా. బ్రాహ్మణులు నివసించు ప్రదేశమునందు నివసించే సర్వార్థసిద్ధుడనే సంన్యాసి ఏ కారణము లేకుండగా, అపరాధ మేమీ లేని నన్ను కొట్టినాడు. 16

మూ. ఏతచ్ఛ్రుత్వా తు రామేణ ద్వాఃస్థః సంప్రేషితస్తదా, 17
ఆనీతశ్చ ద్విజస్తేన సర్వశాస్త్రార్థకోవిదః.

ప్ర. అ. తదా = అప్పుడు, రామేణ = రామునిచేత, ఏతత్ = దీనిని,

మూ. క్రోధః ప్రాణహరః శత్రుః క్రోధో మిత్రముఖో రిపుః,
క్రోధో హ్యాసిర్మహాతీక్ష్ణః సర్వం క్రోధోఽపకర్షతి. 21

ప్ర. అ. క్రోధః = కోపము, ప్రాణహరః = ప్రాణములను హరించు, శత్రుః = శత్రువు. క్రోధః = కోపము, మిత్రముఖః = మిత్రుని ముఖము గల, రిపుః = శత్రువు. క్రోధః = కోపము, మహాతీక్ష్ణః = చాల వాడియైన, అసిః హి = కత్తి. క్రోధః = కోపము, సర్వమ్ = అంతనూ, అపకర్షతి = క్రిందికి లాగివేయును.

తా. కోపము ప్రాణాలను హరించే శత్రువు. కోపము మిత్రుడు వలె కనబడు శత్రువు. కోపము చాల వాడియైన కత్తి. కోపము సమస్తమునూ నశింపచేయును. 21

మూ. తపతే యజతే చైవ యచ్చ దానం ప్రయచ్ఛతి,
క్రోధేన సర్వం హరతి తస్మాత్ క్రోధం విసర్జయేత్. 22

ప్ర. అ. యత్ తపతే = తపస్సు చేయుచున్నా డనునది ఏది గలదో, యత్ యజతే చైవ = యాగము చేయుచున్నా డనునది ఏది గలదో, దానమ్ = దానమును, యత్ ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నా డనునది ఏది గలదో, క్రోధేన = కోపముచేత, సర్వమ్ = సమస్తమునూ, హరతి = హరించును. తస్మాత్ = ఆ కారణమువలన, క్రోధమ్ = కోపమును, విసర్జయేత్ = విడువవలెను.

తా. తపస్సు చేసినా, యజ్ఞాలు చేసినా, దానాలు ఇచ్చినా వాటి నన్నింటినీ కోపముచేత నశింపచేసికొనును. అందువలన కోపమును విడువవలెను. 22

మూ. ఇన్ద్రియాణాం ప్రదుష్టానాం హయానామివ ధావతామ్,
కుర్వీత ధృత్యా సారథ్యం సంహృత్యేన్ద్రియగోచరమ్. 23

ప్ర. అ. ఇన్ద్రియగోచరమ్ = ఇంద్రియములకు గోచరమైన విషయములను, సంహృత్య = ఉపసంహరించి, ప్రదుష్టానామ్ = దుష్టములైన, హయానామివ = గుఱ్ఱములు వలె, ధావతామ్ = పరుగెత్తుచున్న, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములకు, ధృత్యా = ధైర్యముతో, సారథ్యమ్ = సారథ్యమును, కుర్వీత = చేయవలెను.

తా. ఇంద్రియములకు గోచరములైన భోగ్యవిషయములను వాటినుండి దూరము చేసి, దుష్టములైన అశ్వముల వలె పరుగెత్తుచున్న ఇంద్రియములకు ధైర్యముతో (మనఃస్థైర్యముతో) సారథ్యము చేయవలెను. 23

మూ. మనసా కర్మణా వాచా చక్షుషా చ సమాచరేత్,
శ్రేయో లోకస్య చరతో న ద్వేష్టి చ న లిప్యతే. 24

ప్ర. అ. మనసా=మనస్సుచేతను, కర్మణా = కర్మచేతను, వాచా=మాట చేతను, చక్షుషా చ = చూపుచేతను, చరతః = కదలుచున్న, లోకస్య = లోకమునకు, శ్రేయః=శ్రేయస్సును, సమాచరేత్=చేయవలెను. న ద్వేష్టి=ద్వేషించడు, న లిప్యతే = లిప్తుడుకాడు.

తా. మనస్సు చేత, కర్మచేత, వాక్కుచేత, చూపుచేత, తన ఎదుట నడచుచున్న (వ్యవహరించుచున్న) లోకమునకు శ్రేయస్సు చేయవలెను. అట్టివాడు ఎవరినీ ద్వేషించడు. పాపపుణ్యాదులు ఆతనికి అంటవు. 24

మూ. న తత్కుర్యాదసి స్తీక్ష్ణః సర్పో వా వ్యాహతః పదా,
అరిర్వా నిత్యసంక్రుద్ధో యథాత్మా దురనుష్ఠితః. 25

ప్ర. అ. దురనుష్ఠితః= చెడ్డగా ఉండేటట్లు చేయబడిన (సరిగా అదుపులో ఉంచుకొనబడని), ఆత్మా=మనస్సు, యథా=ఎట్లు(ఎంత అపకారము) చేయునో, తత్ = దానిని, తీక్ష్ణః = వాడియైన, అసిః = కత్తిగాని, పదా = పాదముచేత, వ్యాహతః = కొట్టబడిన, సర్పో వా = సర్పము గాని, నిత్యసంక్రుద్ధః = నిత్యము కోపముతో ఉన్న, అరిః వా = శత్రువు గాని, న కుర్యాత్ = చేయజాలకుండును.

తా. అదుపులో ఉంచుకొనని మనస్సు ఎంత అపకారము చేయునో అంత అపకారమును వాడియైన కత్తి గాని, కాలితో త్రొక్కిన సర్పము గాని, నిత్యమూ కోపముతో ఉన్న శత్రువు గాని చేయజాలరు. 25

మూ. వినీతవినయస్యాపి ప్రకృతిర్న విధీయతే,
ప్రకృతిం గూహమానస్య నిశ్చయేన కృతిర్ధ్రువా. 26

ప్ర. అ. వినీతవినయస్యాపి=నేర్పబడిన వినయము కలవాడైనను, ప్రకృతిమ్ = సహజమైన స్వభావమును, గూహమానస్య = కప్పుచున్నవానికి, ప్రకృతిః

= సహజస్వభావము, న విధీయతే = విధింపబడదు (మార్చబడదు). నిశ్చయేన = నిశ్చయముచేత, కృతిః = చేయుట, ధ్రువా = స్థిరమైనది.

తా. తన సహజమైన స్వభావమును కప్పిపెట్టుకొనువానికి ఎంత వినయము నేర్పినా ఆ ప్రకృతి (సహజస్వభావము) మారదు. నిశ్చయముగా ప్రకృత్యనుసారము పనులు చేయుట తప్పదు.

వి. శ్లోకార్థం అంత స్పష్టంగా లేదు. "నిశ్చయేన కృతిర్ధ్రువా''కు బదులు ''నిశ్చయః ప్రకృతిర్ధ్రువా"అని ప్రాచ్యపాఠంలో ఉన్నది. ''ప్రకృతియే స్థిరమైనది. ఇది నిశ్చయము" అని దాని అర్థము. భావం సమానమే. 26

మూ. ఏవముక్తః స విప్రో వై రామేణాక్లిష్టకర్మణా,
ద్విజః సర్వార్థసిద్ధస్తు అబ్రవీద్రామసంనిధౌ. 27

ప్ర. అ. అక్లిష్టకర్మణా = శ్రమ లేని పనులు గల, రామేణ = రాముని చేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః = ఆ, ద్విజః=ద్విజాతియైన, విప్రః = బ్రాహ్మణుడైన, సర్వార్థసిద్ధః తు = సర్వార్థసిద్ధుడు; రామసంనిధౌ = రాముని సంనిధియందు, అబ్రవీత్ = పలికెను.

తా. శ్రమపడకుండ పనులు చేయు రాముని మాటలు విని, బ్రాహ్మణుడైన ఆ సర్వార్థసిద్ధుడు రాముని సంనిధిలో ఇట్లు పలికెను. 27

మూ. మయా దత్తప్రహారోఽయం క్రోధేనావిష్టచేతసా,
భిక్షార్థమటమానేన కాలే విగతభైక్షకే. 28

ప్ర. అ. భిక్షార్థమ్ = భిక్షకొరకు, అటమానేన = తిరుగుచున్న, విగతభైక్షకే = పోయిన భిక్ష గల (భిక్ష లభించని), కాలే = కాలమునందు, క్రోధేన= కోపముతో, ఆవిష్టచేతసా = ఆవేశించబడిన చిత్తము గల, మయా = నాచేత, అయమ్ = ఇది, దత్తప్రహారః = ఇవ్వబడిన ప్రహారము కలది.

తా. నేను భిక్షకోసమై తిరుగుచుండగా భిక్ష దొరకలేదు. ఆ సమయమున కోపావేశములో ఉన్న నేను ఈ శునకమును కొట్టితిని. 28

మూ. రథ్యాస్థిత స్త్వయం శ్వా వై గచ్ఛ గచ్ఛేతి భాషితః,
అథ స్వైరేణ గచ్ఛంస్తు రథ్యాన్తే విషమం స్థితః. 29

ప్ర. అ. రథ్యాస్థితః = వీథిలో ఉన్న, అయమ్ = ఈ, శ్వా = కుక్క, గచ్ఛ గచ్ఛ ఇతి = పొమ్ము పొమ్ము అని, భాషితః = పలకబడినది. అథ = అటు పిమ్మట, స్వైరేణ = స్వేచ్ఛగా, గచ్ఛన్ తు = వెళ్ళుచు, రథ్యాన్తే = వీథి చివర, విషమమ్ = అడ్డముగా, స్థితః = నిలచినది.

తా. వీథిలో ఉన్న ఈ కుక్కను "వెళ్ళుము, వెళ్ళుము" అని తోలితిని. అయినను ఇది స్వేచ్ఛగా నడచుచు వీథి చివర అడ్డముగా నిలచినది. 29

మూ. క్రోధేన క్షుధయావిష్టస్తతో దత్తోఽస్య రాఘవ,
ప్రహారో రాజరాజేన్ద్ర శాధి మామపరాధినమ్. 30

ప్ర. అ. రాజరాజేన్ద్ర = రాజరాజులకు ప్రభువైన, రాఘవ = రామా ! క్రోధేన = కోపముతోను, క్షుధయా = ఆకలితోను, ఆవిష్టః = ఆవేశింపబడి ఉంటిని. తతః = పిమ్మట (అందువలన), అస్య = దీనికి, ప్రహారః = దెబ్బ, దత్తః = ఇవ్వబడినది. అపరాధినమ్ = అపరాధినైన, మామ్ = నన్ను, శాధి = శిక్షించుము.

తా. రాజరాజేంద్రా ! రామా ! ఆ సమయములో ఆకలితో క్రోధావేశములో ఉన్న నేను దానిని కొట్టితిని. అపరాధము చేసిన నన్ను శిక్షింపుము. 30

మూ. త్వయా శస్తస్య రాజేన్ద్ర నాస్తి మే నరకాద్భయమ్,
అథ రామేణ సంపృష్టాః సర్వ ఏవ సభాసదః. 31

ప్ర. అ. రాజేన్ద్ర = రాజేంద్రా ! త్వయా = నీచేత, శస్తస్య = శిక్షింపబడిన, మే = నాకు, నరకాత్ = నరకమువలన, భయమ్ = భయము, నాస్తి = లేదు. అథ = అటుపిమ్మట, రామేణ = రామునిచేత, సర్వే ఏవ = సమస్తమైన, సభాసదః = సభాసదులు, సంపృష్టాః = అడగబడినారు.

తా. "రాజేంద్రా ! నీవు శిక్షించినచో నాకింక నరకభయము ఉండదు." పిమ్మట రాముడు సభలో ఉన్నవారినందరినీ ఇట్లు అడిగెను. 31

మూ. కిం కార్యమస్య వై బ్రూత దణ్డో వై కోఽస్య పాత్యతామ్,
సమ్యక్ ప్రణిహితే దణ్డే ప్రజా భవతి రక్షితా. 32

ప్ర. అ. కిమ్ = ఏమి, కార్యమ్ = చేయదగినది ? అస్య = వీనికి, కః

దణ్డః = ఏమి దండనము, పాత్యతాం వై = పడవేయ(ఇవ్వ) బడుగాక ? దణ్డే = దండము, సమ్యక్ = బాగుగా, ప్రణిహితే = చేయబడిన దగుచుండగా, ప్రజా = ప్రజ, రక్షితా = రక్షింపబడినది, భవతి = అగును. బ్రూత = చెప్పండి ?

తా. ఇప్పు డేమి చేయవలెను? ఇతనికి ఎట్టి శిక్ష ఇవ్వవలెనో చెప్పండి. సరిగా శిక్ష ఇచ్చినపుడే ప్రజలు రక్షింపబడుదురు. 32

మూ. భృగ్వఙ్గిరసకుత్సాద్యా వసిష్ఠశ్చ సకాశ్యపః,
ధర్మపాఠకముఖ్యాశ్చ సచివా నైగమా స్తథా, 33
ఏతే చాన్యే చ బహవః పణ్డితా స్తత్ర సంగతాః,
అవధ్యో బ్రాహ్మణో దణ్డైరితి శాస్త్రవిదో విదుః, 34
బ్రువతే రాఘవం సర్వే రాజధర్మేషు నిష్ఠితాః.

ప్ర. అ. భృగ్వఙ్గిరసకుత్సాద్యాః = భృగువు, అంగిరసుడు, కుత్సుడు మొదలైనవారు, సకాశ్యపః = కాశ్యపునితో కూడిన, వసిష్ఠః చ = వసిష్ఠుడు, ధర్మ పాఠకముఖ్యాః చ = ధర్మశాస్త్రములు చదివినవారిలో ముఖ్యులు, సచివాః = మంత్రులు, తథా = మరియు, నైగమాః = నైగములు, ఏతే = వీరు, తత్ర = అక్కడ, సంగతాః = కలిసిన, రాజధర్మేషు = రాజధర్మములయందు, నిష్ఠితాః = నిష్ఠ గల, బహవః = అనేకులు, అన్యే = ఇతరులైన, పణ్డితాః చ = పండితులూ, సర్వే = అందరూ, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, దణ్డైః = దండనములచేత, అవధ్యః = చంపదగనివాడు (పీడింపదగనివాడు), ఇతి = అని, శాస్త్రవిదః = శాస్త్రవేత్తలు, విదుః = తెలుసుకొనుచున్నారు అని, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, బ్రువతే = చెప్పుచున్నారు (చెప్పిరి).

తా. భృగు-అంగిరస-కుత్స- వసిష్ఠ- కాశ్యపాదులు, ధర్మశాస్త్రాధ్యయనము చేసినవారిలో ప్రముఖులు, మంత్రులు, ఆ యా సంఘముల ముఖ్యులు, ధర్మశాస్త్రములలో నిష్ణాతులైన, అక్కడ కలిసిన ఇంకా ఎందరో పండితులూ రామునితో "బ్రాహ్మణుణ్ణి దండించకూడదు అని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు"అని పలికిరి.

మూ. అథ తే మునయః సర్వే రామమేవాబ్రువం స్తదా, 35
రాజా శాస్తా హి సర్వస్య త్వం విశేషేణ రాఘవ,
త్రైలోక్యస్య భవాన్ శాస్తా దేవో విష్ణుః సనాతనః. 36

ప్ర. అ. అథ = అటుపిమ్మట, తే మునయః = ఆ మునులు, సర్వే = అందరూ, తదా = అప్పుడు, రామమ్ ఏవ = రాముణ్ణి గూర్చి, అబ్రువన్ = పలికిరి. రాఘవ = రామా ! రాజా = రాజు, సర్వస్య = అందరికీ, శాస్తా హి = శిక్షకుడు కదా ? త్వమ్ = నీవు, విశేషేణ = విశేషము చేత శిక్షకుడవు. సనాతనః = ప్రాచీనుడైన, దేవః = దేవుడవైన, విష్ణుః = విష్ణువైన, భవాన్ = నీవు, త్రైలోక్యస్య = మూడులోకాలసముదాయమునకు, శాస్తా = శిక్షకుడవు.

తా. పిమ్మట ఆ మును లందరూ అప్పుడు రామునితో-"రామా ! అందరినీ శిక్షించువాడు రాజే కదా ? విశేషించి నీవు శాసకుడవు. సనాతనుడైన విష్ణువైన నీవు మూడు లోకాలను శాసించువాడవు''అని పలికిరి. 35,36

మూ. ఏవముక్తే తు తైః సర్వైః శ్వా వై వచనమబ్రవీత్,
యది తుష్టోఽసి మే రామ యది దేయో వరో మమ, 37

ప్రతిజ్ఞాతం త్వయా వీర కిం కరోమీతి విశ్రుతమ్,
ప్రయచ్ఛ బ్రాహ్మణస్యాస్య కౌలపత్యం నరాధిప, 38
కాలఞ్జరే మహారాజ కౌలపత్యం ప్రదీయతామ్.

ప్ర. అ. తైః సర్వైః = వారందరిచేతా, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = పలకబడగా, శ్వా = శునకము, వచనమ్ = వచనమును, అబ్రవీత్ వై = పలికెను. రామ = రామా ! మే = నా విషయమునందు, తుష్టః అసి యది = నీవు సంతోషించినట్లయితే, మమ = నాకు, వరః = వరము, దేయః యది = ఇవ్వదగినదైతే, (చెప్పెదను). వీర = వీరుడా, కిమ్ = ఏమి, కరోమి = చేయుదును. ఇతి = అని, త్వయా = నీచేత, విశ్రుతమ్ = బిగ్గరగా వినబడునట్లు, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినది. నరాధిప = రాజా ! అస్య బ్రాహ్మణస్య = ఈ బ్రాహ్మణునకు, కౌలపత్యమ్ = కులపతిత్వమును (దేవాలయ మఠాద్యాధిపత్యమును), ప్రయచ్ఛ = ఇమ్ము. మహారాజ = మహారాజా ! కాలఞ్జరే = కాలంజరక్షేత్రమునందు, కౌలపత్యమ్ = కులపతిత్వము, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక.

తా. వారందరు ఇట్లు చెప్పిన పిమ్మట శునకము ఇట్లు పలికెను- "రామా ! నీవు నా విషయమున అనుగ్రహించినట్లయితే, నాకు వరము ఇవ్వదలచినట్లయితే చెప్పెదను వినుము. వీరుడా ! "నీకు ఏమి చేయుదును ?" అని నీవు ప్రతిజ్ఞా

పూర్వకముగా అందరిలోనూ అడిగితివి కదా ? రాజా! ఈ బ్రాహ్మణునకు కుల పతిత్వమును ఇమ్ము. మహారాజా! కాలంజర క్షేత్రములో కులపతిత్వమును ఇమ్ము.'' 37,38

మూ. ఏతచ్ఛ్రుత్వా తు రామేణ కౌలపత్యేఽభిషేచితః, 39
ప్రయయౌ బ్రాహ్మణో హృష్టో గజస్కన్ధేన సోఽర్చితః.

ప్ర. అ. ఏతత్=దీనిని, శ్రుత్వా=విని, రామేణ=రామునిచేత, బ్రాహ్మణః =బ్రాహ్మణుడు, కౌలపత్యే=కులపతిత్వమునందు, అభిషేచితః=అభిషేకింప బడి, హృష్టః=సంతోషించినవాడై, ప్రయయౌ=వెళ్ళెను. సః=అతడు, గజ స్కన్ధేన=ఏనుగు మూపుచేత (మూపు ఎక్కించి), అర్చితః=సన్మానింపబడినాడు. (అతడు శిక్ష పొందడానికి బదులు పదవి పొందుట అనేది ఏనుగుమీద ఊరే గించడం వంటిది అని భావము). 39

తా. రాముడు దీనిని విని బ్రాహ్మణుని కులపతిని చేయగా అతడు సంతో షించినవాడై వెళ్లెను. ఇట్లతడు ఏనుగు నెక్కించినంతగా గౌరవింపబడెను.

మూ. అథ తే రామసచివాః స్మయమానా వచోఽబ్రువన్, 40
వరోయం దత్త ఏతస్య నాయం శాపో మహాద్యుతే.

ప్ర. అ. అథ=అటు పిమ్మట, తే=ఆ, రామసచివాః=రాముని మంత్రులు, స్మయమానాః=ఆశ్చర్యపడుచు, అబ్రువన్=పలికిరి. మహాద్యుతే=గొప్ప కాంతి కలవాడా! ఏతస్య=వీనికి, ఏషః=ఇది, వరః దత్తః=వరము ఇవ్వ బడినది. అయమ్=ఇది. శాపః=శాపము(దండనము), న=కాదు.

తా. అప్పుడు రాముని మంత్రులు ఆశ్చర్యపడుచు - "గొప్ప కాంతి గల రామా! ఇది ఈతనికి వర మిచ్చినట్లయినది; దండనము కాదు" అనిరి. 40

మూ. ఏవముక్తస్తు సచివై రామో వచనమబ్రవీత్, 41
న యూయం గతితత్త్వజ్ఞాః శ్వా వై జానాతి కారణమ్.

ప్ర. అ. సచివైః=మంత్రులచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః=పలకబడిన, రామః=రాముడు, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను. యూయమ్=

మీరు, గతితత్త్వజ్ఞాః = గతియొక్క తత్త్వమును ఎరిగినవారు, న = కారు. శ్వా = శునకము, కారణమ్ = కారణమును, జానాతి = ఎరుగును.

తా. రాముడు మంత్రుల మాటలు విని వారితో-"మీకు దీనిలోని రహస్యము తెలియదు; ఇందుకు కారణము ఈ శునకమునకు తెలియును"అని పలికెను. 44

మూ. అథ పృష్టస్తు రామేణ సారమేయోఽబ్రవీదిదమ్, 42
అహం కులపతిస్తత్ర ఆసం శిష్టాన్నభోజనః,
దేవద్విజాతిపూజాయాం దాసీదాసేషు రాఘవ, 43

సంవిభాగీ శుభరతిర్దేవద్రవ్యస్య రక్షితా,
వినీతః శీలసంపన్నః సర్వభూతహితే రతః. 44
సోఽహం ప్రాప్త ఇమాం ఘోరామవస్థామధమాం గతిమ్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామేణ = రామునిచేత, పృష్టః = అడగబడిన, సారమేయః = శునకము, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రాఘవ = రామా ! అహమ్ = నేను, తత్ర = అక్కడ, కులపతిః = కులపతిగా, ఆసమ్ = ఉంటిని. దేవద్విజాతిపూజాయామ్ = దేవతలయొక్క, బ్రాహ్మణులయొక్క పూజయందు, శిష్టాన్నభోజనః = మిగిలిన అన్నమును భుజించువాడు, దాసీదాసేషు = దాసీదాసులయందు, సంవిభాగీ = ధనాదికమును పంచి ఇచ్చేవాడు, శుభరతిః = శుభములయందు ఆసక్తి కలవాడు, దేవద్రవ్యస్య = దేవతాద్రవ్యమునకు, రక్షితా = రక్షకుడు, వినీతః = వినయసంపన్నుడు, శీలసంపన్నః = మంచి శీలము కలవాడు, సర్వభూతహితే = సకలభూతముల హితమునందు, రతః = ఆసక్తుడు అయిన, సః అహమ్ = అట్టి నేను, ఘోరామ్ = ఘోరమైన, ఇమామ్ = ఈ, అవస్థామ్ = అవస్థను, అధమామ్ = అధమమైన, గతిమ్ = గతిని, ప్రాప్తః = పొందినాను.

తా. రాముడు అడుగగా ఆ శునకము ఇట్లు చెప్పెను- "రామా ! నేను అక్కడ కులపతిగా ఉంటిని. దేవతాబ్రాహ్మణుల పూజ జరిగిన పిమ్మట మిగిలిన దానిని మాత్రమే తినుచుండేవాడను. దాసీదాసులకు అన్నాదులు ఇచ్చుచు, శుభమైన బుద్ధితో దేవతాద్రవ్యమును రక్షించుచుంటిని. శీలవినయసంపన్నుడనై

సమస్త ప్రాణులయందూ కూడ దయ కలవాడనై ఉండెడివాడను. అట్టి నాకే ఈ ఘోరమైన ఇట్టి అవస్థా, అధమగతీ వచ్చినవి." 42-44

మూ. ఏవం క్రోధాన్వితో విప్రస్త్యక్తధర్మాహితే రతః, 45
క్రుద్ధో నృశంసః పరుష అవిద్వాంశ్చాప్యధార్మికః,
కులాని పాతయత్యేవ సప్త సప్త చ రాఘవ. 46

ప్ర. అ. రాఘవ = రామా! ఏవమ్ = ఈ విధముగా, క్రోధాన్వితః = క్రోధముతో కూడిన, త్యక్తధర్మా = విడవబడిన ధర్మము గల, అహితే = అహితమునందు, రతః = ఆసక్తుడైన, క్రుద్ధః = కోపించిన, నృశంసః = క్రూరుడైన, పరుషః = కఠినుడైన, అవిద్వాన్ చ = అవిద్వాంసుడైన, అధార్మికః = అధార్మికుడైన, విప్రః = బ్రాహ్మణుడు, సప్త సప్త చ = ఏడేసి ఏడేసి, కులాని = కులములను, పాతయత్యేవ = పతితము లగునట్లు చేయును.

తా. (అంత పవిత్రజీవితము గడపిన నాకే ఈ కులపతిత్వము మూలమున ఇట్టి గతి పట్టినదనగా) కోపస్వభావుడు, ధర్మమును పరిత్యజించినవాడు, **అహితము** చేయుటయందు ఆసక్తి కలవాడు, క్రుద్ధుడు, క్రూరుడు, కఠినుడు, అవిద్వాంసుడు, అధార్మికుడు అయిన ఈ బ్రాహ్మణుడు (కులపతిత్వమును వహించి) వెనుకటి తరాలను ఏడింటిని, రాబోవు తరాలు ఏడింటిని పతితములుగా చేయును. 45,46

మూ. తస్మాత్సర్వాస్వవస్థాసు కౌలపత్యం న కారయేత్,
యమిచ్ఛేన్నరకం నేతుం సపుత్రపశుబాన్ధవమ్, 47
దేవేష్వధిష్ఠితం కుర్యాద్ గోషు చ బ్రాహ్మణేషు చ.

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, సర్వాసు = అన్ని, అవస్థాసు = అవస్థలయందూ కూడ, కౌలపత్యమ్ = కులపతిత్వమును, న కారయేత్ = చేయకూడదు. యమ్ = ఎవనిని, సపుత్రపశుబాన్ధవమ్ = పుత్రపశుబంధుసహితముగా, నరకమ్ = నరకమును గూర్చి, నేతుమ్ = తీసికొనిపోవుటకు (పొందించుటకు), ఇచ్ఛేత్ = ఇచ్ఛయించునో, వానిని, దేవేషు = దేవతలయందు, గోషు చ = గోవులయందు, బ్రాహ్మణేషు చ = బ్రాహ్మణులయందు, అధిష్ఠితమ్ = అధికారము గలవానినిగా, కుర్యాత్ = చేయవలెను.

తా. అందువలన ఎట్టి పరిస్థితులలోనూ కూడ కులపతిత్వమును చేయ కూడదు. ఎవనిని పుత్ర-పశు-బంధుసహితముగా నరకమునకు పంపవలె నని కోరిక ఉండునో వానికి దేవతలమీద (దేవాలయాలమీద) గోవులమీద, బ్రాహ్మణుల మీద అధికార మివ్వవలెను. 47

మూ. బ్రహ్మస్వం దేవతాద్రవ్యం స్త్రీణాం బాలధనం చ యత్,
దత్తం హరతి యో భూయ ఇష్టైః సహ వినశ్యతి.

ప్ర. అ. యః=ఎవడు, దత్తమ్= ఇవ్వబడిన, బ్రహ్మస్వమ్=బ్రాహ్మణ ధనమును, దేవతాద్రవ్యమ్ = దేవతాద్రవ్యమును, స్త్రీణామ్ = స్త్రీలధనమును, యత్ = ఏ, బాలధనమ్ = బాలుల ధన మున్నదో, దానినీ, భూయః = మరల, హరతి = హరించునో, అతడు, ఇష్టైః సహ = ఇష్టులతో కూడ, వినశ్యతి = నశించును.

తా. ఎవడు తానే ఇచ్చిన లేదా తన దగ్గర రక్షణార్థమై ఉంచిన, బ్రాహ్మణ ధనమును, దేవతాధనమును, స్త్రీధనమును, బాలధనమును హరించునో అతడు ఇష్టులతో కూడ నశించును. 48

మూ. బ్రాహ్మణద్రవ్యమాదత్తే దేవానాం చైవ రాఘవ, 49
సద్యః పతతి ఘోరే వై నరకేఽవీచిసంజ్ఞకే.

ప్ర. అ. రాఘవ = రామా ! (ఎవడు), బ్రాహ్మణద్రవ్యమ్ = బ్రాహ్మణ ద్రవ్యమును, దేవానాం చైవ=దేవతలయొక్క ద్రవ్యమును, ఆదత్తే=గ్రహించునో అతడు, సద్యః = వెంటనే, ఘోరే = ఘోరమైన, అవీచిసంజ్ఞకే = అవీచి అను పేరు గల, నరకే = నరకమునందు, పతతి = పడును.

తా. రామా! బ్రాహ్మణద్రవ్యమును, దేవతాద్రవ్యమును అపహరించిన వాడు వెంటనే అవీచి అనే నరకమునందు పడును. 49

మూ. మనసాపి హి దేవస్వం బ్రహ్మస్వం చ హరేత్తు యః, 50
నిరయాన్నిరయం నిత్యం పతత్యేవ నరాధమః.

ప్ర. అ. యః = ఎవడు, మనసాపి = మనస్సుచేత నైనా, దేవస్వమ్ = దేవతాధనమును, బ్రహ్మస్వం చ=బ్రాహ్మణధనమును, హరేత్ తు=హరించునో,

నరాధమః = అట్టి నరాధముడు, నిత్యమ్ = నిత్యమూ, నిరయాత్ = నరకమునుండి, నిరయమ్ = మరొక నరకమును (నందు), పతత్యేవ = పడుచునే ఉండును.

తా. దేవతల ధనమునూ, బ్రాహ్మణధనమునూ మనస్సుచేతనైనా ఎవడు కోరుకొనునో ఆ నరాధముడు నిత్యము నరకములో పడును. 50

మూ. తచ్ఛ్రుత్వా వచనం రామో విస్మయోత్ఫుల్లలోచనః, 51
శ్వాప్యగచ్ఛన్మహాతేజా యత ఏవాగతస్తతః.

ప్ర. అ. రామః = రాముడు, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, విస్మయోత్ఫుల్లలోచనః = ఆశ్చర్యముచేత వికసించిన నేత్రములు కలవాడాయెను; మహాతేజాః = గొప్ప తేజస్సు గల, శ్వాపి = శునకముకూడ, యతః ఏవ = ఎక్కడినుండి, ఆగతః = వచ్చినదో, తతః = అటువైపు, అగచ్ఛత్ = వెళ్లెను.

తా. ఆ మాటలు విని రాముని నేత్రములు ఆశ్చర్యముతో వికసించెను. ఆ శునకము కూడ వచ్చినచోటికే వెళ్ళిపోయెను. 51

మూ. మనస్వీ పూర్వజాతిజ్ఞో జాతిమాత్రోపదూషితః,
వారాణస్యాం మహాభాగః ప్రాయం చోపవివేశ హ. 52

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ప్రక్షిప్తసర్గః ద్వితీయః.

ప్ర. అ. మనస్వీ = ఆత్మాభిమానముకలది, పూర్వజాతిజ్ఞః = పూర్వజన్మను ఎరిగినదీ అయిన, జాతిమాత్రోపదూషితః = కేవలము జాతిచేతనే దూషితమైన, మహాభాగః = గొప్ప భాగ్యము గల ఆ శునకము, వారాణస్యామ్ = వారాణసిలో, ప్రాయమ్ ఉపవివేశ హ = ప్రాయోపవేశము చేసెను.

తా. ఆత్మాభిమానము గలది, పూర్వజన్మజ్ఞానము గలది, జాతిమాత్రము చేతనే దూషింపబడినది (నీచముగా పరిగణింపబడుచున్నది) అయిన, గొప్ప భాగ్యము గల ఆ శునకము వారాణసిలో ప్రాయోపవేశము చేసి ప్రాణములు విడచెను. 52

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో రెండవ ప్రక్షిప్తసర్గ సమాప్తము.

# అథ తృతీయః ప్రక్షిప్తసర్గః

## [గ్రద్ద గుడ్లగూబల వివాదము.]

మూ. అథ తస్మిన్వనోద్దేశే రమ్యే పాదపశోభితే,
నదీకీర్ణే గిరివరే కోకిలానేకకూజితే. 1

సింహవ్యాఘ్రసమాకీర్ణే నానాద్విజగణావృతే,
గృధ్రోలూకౌ ప్రవసతో బహువర్షగణానపి. 2

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రమ్యే = సుందరమైన, పాదపశోభితే = వృక్షములచేత ప్రకాశింపచేయబడిన, నదీకీర్ణే = నదిచేత వ్యాప్తమైన, వనోద్దేశే = వనమునందు, కోకిలానేకకూజితే = అనేకములైన కోకిలలచేత ధ్వనింపచేయబడు చున్న, సింహవ్యాఘ్రసమాకీర్ణే = సింహములతోను వ్యాఘ్రములతోను నిండిన, నానాద్విజగణావృతే = అనేకవిధములైన పక్షిసముదాయములతో కూడిన, గిరివరే = పర్వతశ్రేష్ఠముపైన, బహువర్షగణాన్ అపి = అనేకసంవత్సరముల సముదాయ ములను, గృధ్రోలూకౌ = గ్రద్ద గుడ్లగూబ, ప్రవసతః = నివసించుచున్నవి.

తా. వృక్షములతో ప్రకాశించుచున్న, నదిచేత వ్యాప్తమైన ఆ వనమునందు అనేక కోకిలలచేత ధ్వనింపచేయబడిన, సింహములతోను పెద్దపులులతోను వ్యాప్తమైన, అనేకవిధములైన పక్షులగుంపులతో నిండిన పర్వతశ్రేష్ఠముమీద అనేక సంవత్సరముల (సముదాయముల) నుండి ఒక గ్రద్ద, ఒక గుడ్లగూబ నివసించుచుండెను. 1,2

మూ. అథోలూకస్య భవనం గృధ్రః పాపవినిశ్చయః,
మమేదమితి కృత్వాసౌ కలహం తేన చాకరోత్. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, పాపవినిశ్చయః = పాపబుద్ధి గల, అసౌ = ఈ, గృధ్రః = గ్రద్ద, ఉలూకస్య = ఉలూకముయొక్క, భవనమ్ = భవనమును

ఇదమ్ = ఇది, మమ = నాది, ఇతి = అని, కృత్వా = చేసి (అని), తేన = దానితో, కలహమ్ = కలహమును, అకరోత్ = చేసెను.

తా. పాపబుద్ధిగల ఆ గ్రద్ద, గుడ్లగూబ ఇంటిని గూర్చి ఇది నాది అని చెప్పుచు కలహము ప్రారంభించెను. 3

మూ. రాజా సర్వస్య లోకస్య రామో రాజీవలోచనః,
తం ప్రపద్యావహే శీఘ్రం యస్యైతద్భవనం భవేత్. 4

ప్ర. అ. రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు గల, రామః = రాముడు, సర్వస్య = సమస్తమైన, లోకస్య = లోకమునకు, రాజా = రాజు. ఏతత్ = ఇది, యస్య = ఎవనియొక్క, భవనమ్ = భవనము, భవేత్ = అగునో తమ్ = ఆ రాముణ్ణి, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రపద్యామహే = పొందెదము.

తా. పద్మనేత్రుడైన రాముడు సమస్తలోకమునకు రాజు. ఈ ఇల్లు ఎవరిదో తెల్పుకొనుటకు ఆ రామునివద్దకు వెళ్లెదము. 4

మూ. ఇతి కృత్వా మతిం తాం తు నిశ్చయార్థం సునిశ్చితామ్,
గృధ్రోలూకౌ ప్రపద్యేతాం కోపావిష్టౌ హ్యమర్షితౌ. 5

ప్ర. అ. ఇతి = ఇట్లు. నిశ్చయార్థమ్ = నిర్ణయము కొరకు, సునిశ్చితామ్ = బాగా నిశ్చయమైన, తామ్ = ఆ, మతిమ్ = బుద్ధిని. కృత్వా = చేసి, కోపావిష్టౌ = కోపావిష్టములైన, అమర్షితౌ = అమర్షములతో కూడిన, గృధ్రోలూకౌ = గృధ్రోలూకములు, ప్రపద్యేతామ్ = (రాముణ్ణి) చేరినవి.

తా. కోపావిష్టములైన ఆ గృధ్రోలూకములు, అమర్షముతో ఈ విధముగ నిశ్చయించుకొని నిర్ణయముకొరకై రామునివద్దకు వెళ్లినవి. 5

మూ. రామం ప్రపద్య తౌ శీఘ్రం కలివ్యాకులచేతసౌ,
తౌ పరస్పరవిద్వేషాత్ స్పృశతుశ్చరణౌ తదా. 6

ప్ర. అ. కలివ్యాకులచేతసౌ = కలహముచేత వ్యాకులమైన చిత్తము గల, తౌ = అవి, శీఘ్రమ్ = శీఘ్రముగా, పరస్పరవిద్వేషాత్ = పరస్పరద్వేషమువలన, రామమ్ = రాముణ్ణి, ప్రపద్య = పొంది, తదా = అప్పుడు, తౌ = ఆ, చరణౌ = పాదములను, స్పృశతుః = స్పృశించినవి.

తా. కలహముచేత వ్యాకులమైన చిత్తములు గల ఆ గృధ్రోలూకములు అప్పుడు పరస్పరద్వేషముతో శీఘ్రముగా రామునివద్దకు వెళ్ళి అతని పాదములు స్పృశించి నమస్కరించినవి. 6

మూ. అథ దృష్ట్వా నరేన్ద్రం తం గృధ్రో వచనమబ్రవీత్,
సురాణామసురాణాం చ ప్రధానస్త్వం మతో మమ. 7

ప్ర. అ. అథ = పిమ్మట, గృధ్రః = గ్రద్ధ, తమ్ = ఆ, నరేన్ద్రమ్ = రాజును, దృష్ట్వా = చూచి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను. త్వమ్ = నీవు, సురాణామ్ = సురులలోను, అసురాణాం చ = అసురులలోను, ప్రధానః = ప్రధానుడవుగా, మమ = నాకు, మతః = ఇష్టుడవు.

తా. పిమ్మట ఆ గృధ్రము రాజును చూచి నీవు సురాసురులలో ప్రధానుడవు అని నా నమ్మకము. 7

మూ. బృహస్పతేశ్చ శుక్రాచ్చ విశిష్టోఽసి మహాద్యుతే,
పరావరజ్ఞో భూతానాం కాన్త్యా చన్ద్ర ఇవాపరః. 8

ప్ర. అ. మహాద్యుతే = గొప్ప కాంతి గలవాడా! బృహస్పతేః చ = బృహస్పతికంటె, శుక్రాచ్చ = శుక్రునికంటె, విశిష్టః = గొప్పవాడవు, అసి = అయిఉన్నావు. భూతానామ్ = ప్రాణులయొక్క, పరావరజ్ఞః = తారతమ్యములు ఎరిగినవాడవు. కాన్త్యా = కాంతిచేత, అపరః = మరియొక, చన్ద్రః = చంద్రుడు వంటివాడవు.

తా. గొప్ప కాంతి గలవాడా! నీవు బృహస్పతికంటె, శుక్రాచార్యునికంటె గొప్పవాడవు. ప్రాణులలో తారతమ్యము తెలిసినవాడవు. కాంతిచేత మరియొక చంద్రునివంటివాడవు. 8

మూ. దుర్నిరీక్ష్యో యథా సూర్యో హిమవాంశ్చైవ గౌరవే,
సాగరశ్చైవ గామ్భీర్యే లోకపాలో యమో హ్యసి. 9

ప్ర. అ. సూర్యః యథా = సూర్యుడు వలె, దుర్నిరీక్ష్యః = చూడ శక్యము కానివాడవు. గౌరవే = గౌరవమునందు, హిమవాన్ చైవ = హిమవంతుడవు,

గామ్భీర్యే = గాంభీర్యమునందు, సాగరః చ ఏవ = సముద్రుడవు. లోకపాలః = లోకపాలుడైన, యమః = యముడవుగా, అసి = అయిఉన్నావు.

తా. సూర్యుడు వలె నీవు చూడశక్యము కానివాడవు. గౌరవమునందు హిమవంతుడవు. గాంభీర్యములో సముద్రుడవు. లోకపాలుడవైన యముడవు. 9

మూ. క్షాన్త్యా ధరణ్యా తుల్యోఽసి శీఘ్రత్వే హ్యనిలోపమః,
గురుస్త్వం సర్వసంపన్నః కీర్తియుక్తశ్చ రాఘవ. 10

ప్ర. అ. రాఘవ=రామా! త్వమ్ = నీవు, కాన్త్యా=కాంతిచేత, ధరణ్యా= భూమితో, తుల్యః = సమానుడవు, అసి=అయి ఉన్నావు. శీఘ్రత్వే=శీఘ్రత్వము నందు, అనిలోపమః = వాయువుతో సమానుడవు, గురుః = పూజ్యుడవు, సర్వ సంపన్నః = సర్వసమృద్ధి కలవాడవు, కీర్తియుక్తః చ = కీర్తితో కూడినవాడవు.

తా. రామా! నీవు ఓర్పుచేత భూమితో సమానుడవు. శ్రీఘ్రత్వములో వాయువుతో సమానుడవు. పూజ్యుడవు. అన్ని సంపదలూ ఉన్నవాడవు. కీర్తి గలవాడవు. 10

మూ. అమర్షీ దుర్జయో జేతా సర్వాస్త్రవిధిపారగః,
శృణుష్వ మమ వై రామ విజ్ఞాప్యం నరపుఙ్గవ. 11

ప్ర. అ. అమర్షీ = పట్టుదలకలవాడవు. దుర్జయః = జయింప శక్యము కానివాడవు. జేతా = జయించువాడవు. సర్వాస్త్రవిధిపారగః = సమస్తమైన అస్త్ర ప్రయోగముల అంతమును పొందినవాడవు. నరపుఙ్గవ = నరులలో శ్రేష్ఠుడా! రామ = రామా! మమ = నాయొక్క, విజ్ఞాప్యమ్ = విజ్ఞాపించవలసిన విషయ మును, శృణుష్వ = వినుము.

తా. పట్టుదలగలవాడవు. జయింపశక్యము కానివాడవు. జయించువాడవు. సకలాస్త్రముల విధానము తెలిసినవాడవు. నరశ్రేష్ఠుడవైన రామా! నేను విజ్ఞాపన చేయునది వినుము. 11

మూ. మమాలయం పూర్వకృతం బాహువీర్యేణ రాఘవ,
ఉలూకో హరతే రాజంస్తత్ర త్వం త్రాతుమర్హసి. 12

ప్ర. అ. రాజన్ = రాజా! రాఘవ = రామా! పూర్వకృతమ్ = పూర్వము నిర్మించబడిన, మమ = నాయొక్క, ఆలయమ్ = గృహమును, ఉలూకః = ఉలూకము, బాహువీర్యేణ = బాహుబలముచేత, హరతి = హరించుచున్నది, తత్ర = ఆ విషయమునందు, త్వమ్=నీవు, త్రాతుమ్=రక్షించుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. మహారాజా! రామా! నేను పూర్వము నిర్మించుకొన్న గృహమును ఈ ఉలూకము బాహుబలముచేత హరించుచున్నది. ఆ విషయమున నీవు రక్షించవలయును. 12

మూ. ఏవముక్తే తు గృధ్రేణ ఉలూకో వాక్యమబ్రవీత్,
సోమాచ్ఛతక్రతోః సూర్యాద్ధనదాద్యా యమాత్తథా. 13

జాయతే వై నృపో రామ కించిద్భవతి మానుషః,
త్వం తు సర్వమయో దేవో నారాయణ ఇవాపరః. 14

ప్ర. అ. గృధ్రేణ = గ్రద్దచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = చెప్పబడగా, ఉలూకః = ఉలూకము, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రామ = రామా! నృపః = రాజు, సోమాత్ = చంద్రునివలన, శతక్రతోః=ఇంద్రునివలన, సూర్యాత్ = సూర్యునివలన, ధనదాత్ = కుబేరునివలన, తథా = మరియు, యమాత్ = యమునివలన, జాయతే = పుట్టును. కించిత్ = కొంచెము, మానుషః =మనుష్యుడుగా, భవతి = ఉండును. త్వం తు = నీవైతే, అపరః = మరియొక, దేవః = దేవుడైన, నారాయణః ఇవ = నారాయణుడు వలె, సర్వమయః = సకల దేవతాస్వరూపుడవు.

తా. గ్రద్ద ఇట్లు చెప్పిన తరవాత ఉలూకము ఇట్లు పలికెను. "రామా! రాజు చంద్ర–ఇంద్ర–సూర్య–కుబేర–యములవలన పుట్టును. మనుష్యాంశ కొంచెము మాత్రమే ఉండును. కాని నీవు మాత్రము రెండవ నారాయణుడు వలె సకల దేవస్వరూపుడవు. 13, 14

మూ. యా చ తే సౌమ్యతా రాజన్ సమ్యక్ప్రణిహితా విభో,
సమం చరసి చాన్విష్య తేన సోమాంశకో భవాన్. 15

ప్ర. అ. రాజన్ = రాజా! విభో = ప్రభూ! తే = నీయొక్క, యా =

ఏ, సౌమ్యతా = సౌమ్యత్వమున్నదో అది, సమ్యక్ = బాగుగా, ప్రణిహితా = ఉంచబడినది. అన్విష్య = బాగుగా పరిశీలించి, సమమ్ = సమముగా, చరసి = ప్రవర్తించుచున్నావు. తేన = ఆ కారణముచేత, భవాన్ = నీవు, సోమాంశకః = సోమాంశ ఉన్నవాడవు.

తా. రామా! నీవు నీ సౌమ్యత్వమును బాగుగా పరిశీలించి సమముగా ప్రవర్తింపచేయుదువు. అందువలన నీలో సోమాంశ ఉన్నది. 15

మూ. క్రోధే దణ్డే ప్రజానాథ దానే పాపభయాపహః,
దాతా హర్తాసి గోప్తాసి తేనేన్ద్ర ఇవ నో భవాన్. 16

ప్ర. అ. క్రోధే = కోపమునందు, దణ్డే = దండమునందు, దానే = దానమునందు, పాపభయాపహః = పాపభయమును పోగొట్టినవాడవు. ప్రజానాథ = ప్రజల నాథుడా! తేన = ఆ కారణముచేత, భవాన్ = నీవు, నః = మాకు, ఇన్ద్రః ఇవ = ఇంద్రుడు వలె, దాతా = దాతవు, హర్తా = హరించువాడవు, అసి = అయి ఉన్నావు. గోప్తా = రక్షకుడవు, అసి = అయి ఉన్నావు.

తా. ప్రజల నాథుడవైన రామా! నీవు క్రోధమునందు. దండమునందు, దానమునందు, పాపభయమును పోగొట్టి ఇంద్రుడు వలె దాతవు, హర్తవు, రక్షకుడవు అయి ఉన్నావు. 16

మూ. అధృష్యః సర్వభూతేషు తేజసా చానలోపమః,
అభీక్ష్ణం తపసే లోకాంస్తేన భాస్కరసంనిభః. 17

ప్ర. అ. సర్వభూతేషు = సకలభూతములయందు, అధృష్యః = ఎదిరింప శక్యము కానివాడవై, తేజసా = తేజస్సుచేత, అనలోపమః = అగ్నితో సమానుడవై, లోకాన్ = లోకములను, అభీక్ష్ణమ్ = మిక్కిలి, తపసే = తపింపచేయుచున్నావు. తేన = ఆ కారణముచేత, భాస్కరసంనిభః = సూర్యునితో సమానుడవు.

తా. సకలభూతముల చేతను ఎదిరింప శక్యముకానివాడవై అగ్నితో సమానమైన తేజస్సుతో లోకములను మిక్కిలి తపింపచేయుచున్నావు. అందువలన సూర్యునితో సమానుడవు. 17

మూ. సాక్షాద్విత్తేశతుల్యోఽసి అథవా ధనదాధికః,
విత్తేశస్యేవ పద్మా శ్రీర్నిత్యం తే రాజసత్తమ. 18

ప్ర. అ. రాజసత్తమ = రాజశ్రేష్ఠా! సాక్షాత్ = సాక్షాత్తు, విత్తేశతుల్యః = కుబేరునితో సమానుడవు, అసి = అయి ఉన్నావు. అథవా = లేదా, ధనదాధికః = కుబేరునికంటె అధికుడవు. విత్తేశస్య = కుబేరునకు, పద్మా ఇవ = పద్మము వలె, శ్రీః = లక్ష్మి, తే = నీకు, నిత్యమ్ = నిత్యమూ ఉన్నది.

తా. రాజశ్రేష్ఠా! నీవు సాక్షాత్తు కుబేరునితో సమానుడవు. లేదా నీవు కుబేరునికంటె అధికుడవు. కుబేరుని దగ్గర పద్మ ఉన్నట్లు లక్ష్మి నీదగ్గర నిత్యమూ ఉండును. 18

మూ. ధనదస్య తు కార్యేణ ధనదస్తేన నో భవాన్,
సమః సర్వేషు భూతేషు స్థావరేషు చరేషు చ. 19

ప్ర. అ. ధనదస్య = కుబేరునియొక్క, తేన = ఆ, కార్యేణ = కార్యము చేత, భవాన్ = నీవు, నః = మాకు, ధనదః = కుబేరుడవు. స్థావరేషు = స్థావరములు, చరేషు = జంగమములు అయిన, సర్వేషు = సమస్తమైన, భూతేషు = భూతముల యందు, సమః = సముడవు.

తా. కుబేరుడు చేయు పని నీవు చేయుటచే మాకు నీవే కుబేరుడవు. నీవు స్థావరములు, జంగమములు అయిన అన్ని భూతములయందు సముడవు. 19

మూ. శత్రౌ మిత్రే చ తే దృష్టిః సమతాం యాతి రాఘవ,
ధర్మేణ శాసనం నిత్యం వ్యవహారే విధిక్రమాత్. 20

ప్ర. అ. రాఘవ = రామా! తే దృష్టిః = నీ దృష్టి, శత్రే = శత్రువునందు, మిత్రే చ = మిత్రునియందు, సమతామ్ = సమత్వమును, యాతి = పొందుచున్నది. వ్యవహారే = వ్యవహారమునందు, విధిక్రమాత్ = విధిక్రమమువలన, ధర్మేణ = ధర్మముచేత, శాసనమ్ = శాసనము, నిత్యమ్ = నిత్యము.

తా. రామా! నీ దృష్టి శత్రువునందు, మిత్రునియందు కూడా సమముగా ఉండును. వ్యవహారములయందు విధ్యనుసారముగా నిత్యమూ ధర్మముచేత శాసనము చేయుదువు. 20

మూ. యస్య రుష్యసి వై రామ తస్య మృత్యుర్విధావతి,
గీయసే తేన వై రామ యమ ఇత్యభివిక్రమః. 21

ప్ర. అ. రామ=రామా! యస్య=ఎవనికి, రుష్యసి=కోపింతువో, తస్య=వానికి, మృత్యుః=మృత్యువు, విధావతి = పరుగెత్తుకొనివచ్చును. రామ=రామా! అభివిక్రమః=గొప్ప పరాక్రమము గల నీవు, తేన=వానిచేత, యమః ఇతి=యముడు అని, గీయసే= చెప్పబడుచున్నావు.

తా. రామా! నీవు ఎవనిమీద కోపింతువో వాని దగ్గరకు మృత్యువు పరుగెత్తి వెళ్ళును. అతడు మహాపరాక్రమవంతుడవైన నిన్ను "యముడు" అని అనును. 21

మూ. యశ్చైష మానుషో భావో భవతో నృపసత్తమ,
ఆనృశంస్యపరో రాజన్ సత్త్వేషు క్షమయాన్వితః. 22

ప్ర. అ. రాజన్ = రాజా! నృపసత్తమ = రాజులలో శ్రేష్ఠుడా! భవతః = నీయొక్క, ఏషః = ఈ, మానుషః భావః = మనుష్యత్వ మున్నదో అది, ఆనృశంస్యపరః = క్రూరత్వము లేకపోవుటయందు ఆసక్తి కలది. సత్త్వేషు = ప్రాణుల యందు, క్షమయా = ఓర్పుతో, అన్వితః = కూడినది.

తా. రాజులలో శ్రేష్ఠుడవైన రాజా! నీ మానవత్వము క్రౌర్యము లేక సకలప్రాణుల యందు ఓర్పుతో కూడినది. 22

మూ. దుర్బలస్య త్వనాథస్య రాజా భవతి వై బలమ్,
అచక్షుషోత్తమం చక్షురగతేః స గతిర్భవాన్. 23

ప్ర. అ. అనాథస్య = నాథుడు లేని, దుర్బలస్య = దుర్బలునకు, రాజా= రాజు, బలమ్=బలముగా, భవతి = అగుచున్నాడు. సః భవాన్ = అట్టి నీవు, అచక్షుషః = నేత్రములు లేనివానికి, ఉత్తమం చక్షుః=ఉత్తమమైన నేత్రము. అగతేః = గతి లేనివానికి, గతిః = గతివి.

తా. నాథుడు లేని దుర్బలునకు రాజే బలము. అట్టి నీవు కన్ను లేనివానికి కన్ను; గతి లేనివానికి గతివి. 23

మూ. అస్మాకమపి నాథస్త్వం శ్రూయతాం మమ ధార్మిక,
మమాలయం ప్రవిష్టస్తు గృధ్రో మాం బాధతే నృప,
త్వం హి దేవమనుష్యేషు శాస్తా వై నరపుంగవః.

ప్ర. అ. త్వమ్ = నీవు, అస్మాకమపి = మాకు కూడ, నాథః = నాథుడవు. ధార్మిక = ధార్మికుడా! మమ = నాకు, శ్రూయతామ్ = వినబడుగాక. నృప = రాజా! గృధ్రః = ఈ గ్రద్ద, మమ = నాయొక్క, ఆలయమ్ = గృహమును, ప్రవిష్టః = ప్రవేశించినదై, బాధతే = బాధించుచున్నది, నరపుంగవ = నరశ్రేష్ఠుడా! దేవ = ప్రభూ! త్వమ్ = నీవే, మనుష్యేషు = మనుష్యులలో, శాస్తా వై హి = శిక్షకుడవు కదా?

తా. నీవు మాకు కూడ రక్షకుడవు. ధార్మికుడా! నా మాట వినుము. రాజా! ఈ గ్రద్ద నా ఇంటిలో ప్రవేశించి బాధించుచున్నది. నరశ్రేష్ఠుడవైన దేవా! నీవే మానవులలో శిక్షకుడవు కదా? 24

మూ. ఏతచ్ఛ్రుత్వా తు వై రామః సచివానాహ్వయత్స్వయమ్,
ధృష్టిర్జయన్తో విజయః సిద్ధార్థో రాష్ట్రవర్ధనః,
అశోకో ధర్మపాలశ్చ సుమన్త్రశ్చ మహాబలః. 26

ఏతే రామస్య సచివా రాజ్ఞో దశరథస్య చ,
నీతియుక్తా మహాత్మానః సర్వశాస్త్రవిశారదాః, 27
హ్రీమన్తశ్చ కులీనాశ్చ నయే మన్త్రే చ కోవిదాః.

ప్ర. అ. రామః = రాముడు, ఏతత్ = దీనిని, శ్రుత్వా = విని, స్వయమ్ = స్వయముగా, సచివాన్ = మంత్రులను, ఆహ్వయత్ = పిలచెను. నీతియుక్తాః = = నీతితో కూడినవారు. మహాత్మానః = మహాత్ములు, సర్వశాస్త్రవిశారదాః = సకలశాస్త్రములయందు నేర్పు గలవారు, హ్రీమన్తః = సిగ్గుగలవారు. కులీనాః = చ = మంచి కులమునందు పుట్టినవారు, నయే = నీతియందు, మన్త్రే చ = మంత్రమునందు. కోవిదాః = పండితులు అయిన, ధృష్టిః = ధృష్టి, జయన్తః = జయంతుడు, విజయః = విజయుడు, సిద్ధార్థః = సిద్ధార్థుడు, రాష్ట్రవర్ధనః = రాష్ట్రవర్ధనుడు, అశోకః = అశోకుడు, ధర్మపాలః చ = ధర్మపాలుడు, మహా

బలః=గొప్ప బలము గల, సుమన్త్రః చ = సుమంత్రుడు, ఏతే=వీరు, రామస్య= రామునియొక్క, దశరథస్య రాజ్ఞః చ = దశరథమహారాజుయొక్క, సచివాః = మంత్రులు.

తా. రాముడు ఇది విని మంత్రులను స్వయముగా పిలచెను. ధృష్టి, జయంతుడు. విజయుడు, సిద్ధార్థుడు, రాష్ట్రవర్ధనుడు, అశోకుడు, ధర్మపాలుడు, గొప్పబుద్ధిబలము గల సుమంత్రుడు- వీరు దశరథునికి, రామునికి కూడ మంత్రులు. ఈ మహాత్ములందరూ నీతిమంతులు, సకలశాస్త్రవిశారదులు. సిగ్గు గలవారు, సత్కులములయందు పుట్టినవారు. నీతియందు, ఆలోచనలయందు పండితులు. 25-27

మూ. తానాహూయ చ ధర్మాత్మా పుష్పకాదవతీర్య చ, 28
గృధ్రోలూకవివాదం తం పృచ్ఛతి స్మ రఘూత్తమః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రఘూత్తమః = రాముడు, తాన్ = వాళ్ళను, ఆహూయ = పిలచి, పుష్పకాత్ = పుష్పకమునుండి, అవతీర్య చ = = దిగి, తమ్ = ఆ, గృధ్రోలూకవివాదమ్=గృధ్రోలూకముల తగవును గూర్చి, పృచ్ఛతి స్మ = అడిగెను.

తా. ధర్మాత్ముడైన రాముడు వారిని పిలచి పుష్పకమునుండి దిగి ఆ గృధ్రోలూకముల తగవును గూర్చి వాటిని ప్రశ్నించెను. 28

మూ. కతి వర్షాణి వై గృధ్ర తవేదం నిలయం కృతమ్, 29
ఏతన్మే కారణం బ్రూహి యది జానాసి తత్త్వతః,
ఏతచ్ఛ్రుత్వా తు వై గృధ్రో భాషతే రాఘవం స తమ్.

ప్ర. అ. గృధ్ర = గృధ్రమా! ఏతత్ = ఈ, నిలయమ్ = గృహము, తవ = నీకు, కతి వర్షాణి = ఎన్ని సంవత్సరములు, కృతమ్ = చేయబడినది? తత్త్వతః = యథార్థముగా, జానాసి యది = ఎరిగి ఉన్నట్లయితే, ఏతత్ = ఈ, కారణమ్ = కారణమును, మే = నాకు, బ్రూహి=చెప్పుము. ఏతత్=దీనిని, శ్రుత్వా తు=విని, సః=ఆ, గృధ్రః=గ్రద్ద, తం రాఘవమ్=ఆ రాముణ్ణి గూర్చి, భాషతే వై=పలికెను.

తా. "గృధ్రమా! నీవు ఈ గృహమును నిర్మించుకొని ఎన్నాళ్ళయినది? తెలిసినట్లయితే యథార్థముగా ఈ కారణమును చెప్పుము." ఈ మాటలు విని ఆ గ్రద్ద రామునితో ఇట్లు పలికెను. 29, 30

మూ. ఇయం వసుమతీ రామ మనుష్యైః పరితో యదా,
ఉత్థితైరావృతా సర్వా తదా ప్రభృతి మే గృహమ్. 31

ప్ర. అ. రామ = రామా! ఇయమ్ = ఈ, సర్వా=సమస్తమైన, వసుమతీ =భూమి, యదా=ఎప్పుడు, ఉత్థితైః=లేచిన (పుట్టిన), మనుష్యైః=మనుష్యులతో పరితః=అంతటా, ఆవృతా=కప్పబడినదో, తదాప్రభృతి=అదిమొదలు, మే= నాయొక్క, గృహమ్=గృహము.

తా. రామా! ఈ భూమి అంతా ఉద్భవించిన మానవులచేత ఏనాడు కప్ప బడినదో ఆనాటినుండి ఇది నా గృహముగా ఉన్నది. 31

మూ. ఉలూకశ్చాబ్రవీద్రామం పాదపైరుపశోభితా,
యదేయం పృథివీ రాజంస్తదా ప్రభృతి మే గృహమ్. 32
ఏతచ్ఛ్రుత్వా తు వై రామః సభాసదమువాచ హ.

ప్ర. అ. ఉలూకః చ = గుడ్లగూబ కూడ, రామమ్=రాముణ్ణి గూర్చి, అబ్రవీత్=పలికెను. రాజన్=రాజా! ఇయం పృథివీ=ఈ భూమి, యదా= ఎప్పుడు, పాదపైః=వృక్షములచేత, ఉపశోభితా = ప్రకాశింపచేయబడినదో, తదా ప్రభృతి=అది మొదలు, మే= నాయొక్క, గృహమ్=గృహము. రామః= రాముడు, ఏతత్=దీనిని, శ్రుత్వా=విని, సభాసదమ్=సభాసదులను గూర్చి, ఉవాచ హ వై =పలికెను.

తా. అప్పుడు గుడ్లగూబ రామునితో- "రాజా! ఈ భూమి వృక్షములతో ఎప్పటినుండి ప్రకాశించుచున్నదో అప్పటినుండి ఇది నా గృహము" అని పలికెను. రాముడు ఈ మాటలు విని సభాసదులతో ఇట్లనెను. 32

మూ. న సా సభా యత్ర న సన్తి వృద్ధా
వృద్ధా న తే యే న వదన్తి ధర్మమ్,
నాసౌ ధర్మో యత్ర న సత్యమస్తి
న తత్సత్యం యచ్ఛలేనానువిద్ధమ్. 33

ప్ర. అ. యత్ర=ఎక్కడ, వృద్ధాః=వృద్ధులు, న సన్తి=లేరో, సా= అది, సభా=సభ, న=కాదు. యే=ఎవరు, ధర్మమ్=ధర్మమును, న వదన్తి= పలకరో, తే = వారు, వృద్ధాః = వృద్ధులు, న = కారు. యత్ర = దేనియందు సత్యమ్=సత్యము, నాస్తి=లేదో, అసౌ=ఇది, ధర్మః=ధర్మము, న=కాదు. యత్=ఏది, ఛలేన=కపటముతో, అనువిద్ధమ్=కూడినదో, తత్=అది, సత్యమ్ =సత్యము, న=కాదు.

తా. వృద్ధులు లేనిది సభ కాదు. ధర్మమును చెప్పనివారు వృద్ధులు కారు. సత్యము లేనిది ధర్మము కాదు. కపటముతో కూడినది సత్యము కాదు. 33

మూ. యే తు సభ్యా సదా జ్ఞాత్వా తూష్ణీం ధ్యాయన్త ఆసతే,
యథాప్రాప్తం న బ్రువతే తే సర్వేఽనృతవాదినః. 34

ప్ర. అ. యే= ఏ, సభ్యాః = సభ్యులు, జ్ఞాత్వా= తెలిసికొని కూడ, ధ్యాయన్తః= ఆలోచించుచున్నవారై (చూచుచున్నవారై), సదా= ఎల్లప్పుడూ, తూష్ణీమ్ ఆసతే= మౌనముగా కూర్చుందురో, యథాప్రాప్తమ్= తగువిధముగా, న బ్రువతే= మాటలాడరో, తే సర్వే= వాళ్ళందరూ, అనృతవాదినః=అసత్యము చెప్పువారు.

తా. ఏ సభ్యులు తెలిసి ఉండి కూడ మాటలాడకుండగా చూచుచు కూర్చుందురో, చెప్పవలసిన మాట చెప్పరో, వాళ్ళందరూ అసత్యము పలుకు వారే. 34

మూ. జానన్న చాబ్రవీత్ప్రశ్నాన్ కామాత్క్రోధాద్భయాత్తథా,
సహస్రం వారుణాన్ పాశానాత్మని ప్రతిముఞ్చతి. 35

ప్ర. అ. జానన్= ఎరిగినవాడైనను, ఎవడు, కామాత్= కామమువలన, క్రోధాత్= కోపమువలన, తథా= మరియు, భయాత్=భయమువలన, ప్రశ్నాన్ = ప్రశ్నలను, న చ అబ్రవీత్= చెప్పలేదో అతడు, సహస్రమ్= వెయ్యి, వారుణాన్= వరుణుని సంబంధమైన, పాశాన్= పాశములను, ఆత్మని= తనయందు ప్రతిముఞ్చతి= తగల్చుకొనుచున్నాడు.

తా. కామమువలన గాని, క్రోధమువలన గాని, భయమువలన గాని

ఎవడు తెలిసి ఉండి కూడ ప్రశ్నలకు సమాధానములు చెప్పడో వాడు వెయ్యి వరుణపాశములను తనకు తగల్చుకొనుచున్నాడు. 35

మూ. తేషాం సంవత్సరే పూర్ణే పాశ ఏకః ప్రముచ్యతే,
తస్మాత్సత్యేన వక్తవ్యం జానతా సత్యమఞ్జసా. 36

ప్ర. అ. సంవత్సరే = సంవత్సరము, పూర్ణే = నిండినదగుచుండగా, తేషామ్ = ఆ పాశములలో, ఏకః పాశః = ఒక పాశము, ప్రముచ్యతే = విడచును. తస్మాత్ = ఆ కారణమువలన, సత్యమ్ = సత్యమును. జానతా = ఎరిగినవానిచేత, అఞ్జసా = చక్కగా, సత్యేన = సత్యముచేత, వక్తవ్యమ్ = చెప్పబడవలెను.

తా. ఆ వెయ్యి పాశాలలో ఒక పాశము ఒక సంవత్సరము గడచిన తరువాత విడచును. అందుచే సత్యము తెలిసినవాడు చక్కగా సత్యమే చెప్పవలెను.

మూ. ఏతచ్ఛ్రుత్వా తు సచివా రామమేవాబ్రువంస్తదా,
ఉలూకః శోభతే రాజన్న తు గృధ్రో మహామతే. 37

ప్ర. అ. ఏతత్ = దీనిని, శ్రుత్వా = విని, సచివాః = మంత్రులు, రామమ్ ఏవ = రాముణ్ణి గూర్చి, తదా = అప్పుడు, అబ్రువన్ = పలికిరి. రాజన్ = రాజా! మహామతే = గొప్ప బుద్ధి గలవాడా! ఉలూకః = ఉలూకము, శోభతే = ప్రకాశించుచున్నది; గృధ్రః తు = గృధ్రమైతే, న = కాదు.

తా. ఈ మాట విని మంత్రులు రామునితో ఇట్లు పలికిరి-"గొప్ప బుద్ధి గల రామా! ఈ ఉలూకము మంచిది వలె కనబడుచున్నది; గృధ్రము కాదు". 37

మూ. త్వం ప్రమాణం మహారాజ రాజా హి పరమా గతిః,
రాజమూలాః ప్రజాః సర్వా రాజా ధర్మః సనాతనః. 38

ప్ర. అ. మహారాజ = మహారాజా! త్వమ్ = నీవు, ప్రమాణమ్ = ప్రమాణము. రాజా = రాజు, పరమా = గొప్ప, గతిః హి = గతి కదా? సర్వాః = సమస్తమైన, ప్రజాః = ప్రజలు, రాజమూలాః = రాజే మూలముగా గలవారు. రాజధర్మః = రాజధర్మము, సనాతనః = చాల ప్రాచీన మైనది.

తా. మహారాజా! నీవే నిర్ణయము చేయవలెను. రాజే పరమగతి కదా? ప్రజ లందరికి రాజే మూలము. రాజధర్మము చాల ప్రాచీన మైనది. 38

మూ. శాస్తా నృణాం నృపో యేషాం తే న గచ్ఛన్తి దుర్గతిమ్,
వైవస్వతేన ముక్తాస్తు భవన్తి పురుషోత్తమాః. 39

ప్ర. అ. యేషామ్ = ఏ, నృణామ్ = నరులకు, నృపః = రాజు, శాస్తా= శిక్షకుడో, తే = వాళ్లు, దుర్గతిమ్=దుర్గతిని, న గచ్ఛన్తి=పొందరు. వైవస్వతేన= యమునిచేత, ముక్తాః = విడవబడినవారై, పురుషోత్తమాః = పురుషోత్తములుగా, భవన్తి = అగుదురు.

తా. ఏ మానవులకు రాజు శిక్షకుడుగా ఉండునో వాళ్లు దుర్గతి పొందరు. యమునిచేత విడవబడినవారై పురుషోత్తము లగుదురు. 39

మూ. సచివానాం వచః శ్రుత్వా రామో వచనమబ్రవీత్,
శ్రూయతామభిధాస్యామి పురాణే యదుదాహృతమ్. 40

ప్ర. అ. సచివానామ్=మంత్రులయొక్క, వచః=వచనమును, శ్రుత్వా= విని, రామః = రాముడు, వచనమ్=వచనమును, అబ్రవీత్ = పలికెను. పురాణే= పురాణమునందు, యత్ = ఏది, ఉదాహృతమ్ = చెప్పబడినదో, అభిధాస్యామి = చెప్పెదను; శ్రూయతామ్ = వినబడుగాక.

తా. మంత్రుల మాట విని రాముడు ఇట్లు పలికెను-"పురాణమునందు చెప్పిన విషయమును చెప్పెదను వినుము". 40

మూ. ద్యౌః సచన్ద్రార్కనక్షత్రా సపర్వతమహావనా,
సలిలార్ణవసంపూర్ణం త్రైలోక్యం సచరాచరమ్. 41

ప్ర. అ. సచన్ద్రార్కనక్షత్రా = చంద్రసూర్యనక్షత్రములతో కూడిన, సపర్వతమహావనా = పర్వతములతోను మహావనములతోను కూడిన, ద్యౌః = ఆకాశము, సచరాచరమ్=చరాచరములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, సలిలార్ణవసంపూర్ణమ్ = సముద్రోదకముతో నిండినది.

తా. చంద్ర-సూర్య-నక్షత్ర-పర్వత-మహారణ్యములతో కూడిన ఆకాశము, స్థావరజంగమములతో కూడిన మూడు లోకములూ కూడ సముద్రోదకముతో నిండిపోయెను. 41

మూ. ఏక ఏవ తదా హ్యాసీత్సుప్తో మేరురివాపరః,
పురా భూః సహ లక్ష్మ్యా చ విష్ణోర్జఠరమావిశత్. 42

ప్ర. అ. తదా = అప్పుడు, ఏక ఏవ = ఒక్కటిగానే ఉండి, అపరః = మరియొక, మేరుః ఇవ = మేరుపర్వతము వలె, సుప్తః = నిద్రించుచున్నది, ఆసీత్ = ఆయెను. పురా = పూర్వము, భూః = భూమి, లక్ష్మ్యా చ సహ = లక్ష్మితో కూడ, విష్ణోః = విష్ణువుయొక్క, జఠరమ్ = జఠరమును, ఆవిశత్ = ప్రవేశించెను.

తా. అప్పుడు ప్రపంచకము అంతా ఒక్కటిగా అయిపోయి రెండవ మేరుపర్వతము వలె నిద్రపోవుచుండెను (నిశ్చలముగా ఉండెను). పూర్వము భూమి లక్ష్మితో కలసి విష్ణువు జఠరములో ప్రవేశించెను. 42

మూ. తాం నిగృహ్య మహాతేజాః ప్రవిశ్య సలిలార్ణవమ్,
సుష్వాప దేవో భూతాత్మా బహూన్వర్షగణానపి. 43

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, భూతాత్మా = సకలభూత స్వరూపుడైన, దేవః = విష్ణువు, తామ్ = లక్ష్మిసహితయైన ఆ భూమిని, నిగృహ్య = పొట్టలో ఉంచుకొని, సలిలార్ణవమ్ = సముద్రోదకమును, ప్రవిశ్య = ప్రవేశించి, బహూన్ = అనేకమైన, వర్షగణాన్ = సంవత్సరముల సముదాయములను, సుష్వాప = నిద్రించెను.

తా. గొప్ప తేజస్సు గల, సకలభూతస్వరూపుడైన ఆ విష్ణువు ఆమెను గ్రహించి, సముద్రోదకములో ప్రవేశించి అనేకసంవత్సరసముదాయములపాటు నిద్రించెను. 43

మూ. విష్ణౌ సుప్తే తదా బ్రహ్మా వివేశ జఠరం తతః,
రుద్ధస్రోతం తు తం జ్ఞాత్వా మహాయోగీ సమావిశత్. 44

ప్ర. అ. తదా = అప్పుడు, విష్ణౌ = విష్ణువు, సుప్తే = నిద్రించుచుండగా, తతః = పిమ్మట, బ్రహ్మా = బ్రహ్మ, జఠరమ్ = జఠరమును, వివేశ = ప్రవేశించెను. తమ్ = ఆ విష్ణువును, రుద్ధస్రోతమ్ = నిరోధించబడిన జలప్రవాహము గలవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, మహాయోగీ = మహాయోగి, తమ్ = ఆ విష్ణువును, సమావిశత్ = ప్రవేశించెను.

తా. విష్ణువు నిద్రించి ఉండగా అప్పుడు బ్రహ్మదేవుడు అతని జఠరములో ప్రవేశించెను. ఆ విష్ణువు జలప్రవాహమును నిరోధించినట్లు చూచి మహాయోగియైన బ్రహ్మదేవుడు అతని జఠరములో ప్రవేశించెను. 44

మూ. నాభ్యాం విష్ణోః సముత్పన్నే పద్మే హేమవిభూషితే,
స తు నిర్గమ్య వై బ్రహ్మా యోగీ భూత్వా మహాప్రభుః.

ప్ర. అ. విష్ణోః=విష్ణువుయొక్క, నాభ్యామ్=నాభియందు, సముత్పన్నే= పుట్టిన, హేమవిభూషితే = బంగారముచేత అలంకరించబడిన, పద్మే = పద్మము నందు, మహాప్రభుః = గొప్ప ప్రభువైన, సః=ఆ, బ్రహ్మా = బ్రహ్మ, నిర్గమ్య= బయల్వెడలి, యోగీ = యోగము కలవాడు, భూత్వా = అయి (ఆలోచించెను).

తా. విష్ణువు నాభియందు బంగారు పద్మము పుట్టగా దానినుండి మహా ప్రభువైన బ్రహ్మదేవుడు బైటకు వచ్చి యోగి అయి ఆలోచించెను. 45

మూ. సిసృక్షుః పృథివీం వాయుం పర్వతాన్ సమహీరుహాన్,
తదనన్తరే ప్రజాః సర్వాః సమనుష్యసరీసృపాః, 46
జరాయుజాణ్డజాః సర్వాః స ససర్జ మహాతపాః.

ప్ర. అ. పృథివీమ్=భూమిని, వాయుమ్=వాయువును, సమహీరుహాన్= వృక్షములతోకూడిన, పర్వతాన్ = పర్వతములను, సిసృక్షుః=సృష్టి చేయదలచిన వాడై, తదనన్తరే = అంతకు ముందు, సమనుష్యసరీసృపాః = మనుష్యులతోను పాములు మొదలైన పాకే జంతువులతోను కూడిన, జరాయుజాణ్డజాః = మావివల్ల పుట్టిన వాటిని, గ్రుడ్లనుండి పుట్టినవాటిని, సర్వాః=అన్నింటిని, సర్వాః ప్రజాః= అన్ని ప్రజలను, మహాతపాః = గొప్ప తపస్సు గల ఆ బ్రహ్మ, ససర్జ = సృష్టించెను.

తా. గొప్ప తపస్సు గల బ్రహ్మదేవుడు భూమిని, వాయువును, పర్వతములను, వృక్షములను సృష్టించ దలచినవాడై అంతలో అందరు ప్రజలను (సృష్టింపబడినది ప్రతీదీ ప్రజయే) మనుష్యులను, సర్పములను, జరాయుజములను, అండజములను సృష్టించెను. 46

మూ. తత్ర శ్రోత్రమలోత్పన్నః కైటభో మధునా సహ. 47
దానవౌ తౌ మహావీర్యౌ ఘోరరూపౌ దురాసదౌ,
దృష్ట్వా ప్రజాపతిం తత్ర క్రోధావిష్టౌ బభూవతుః. 48

ప్ర. అ. తత్ర = అక్కడ, మధునా సహ = మధువుతో కూడ, కైటభః = కైటభుడు, శ్రోత్రమలోత్పన్నః = చెవుల మలమునుండి పుట్టినాడు. మహావీర్యౌ = గొప్ప పరాక్రమము గల, ఘోరరూపౌ = ఘోరమైన రూపము గల, దురాసదౌ = ఎదిరింప శక్యము కాని, తౌ దానవౌ = ఆ దానవులు, తత్ర = అక్కడ, ప్రజాపతిమ్ = బ్రహ్మను, దృష్ట్వా = చూచి, క్రోధావిష్టౌ = క్రోధావిష్టులు, బభూవతుః = అయిరి.

తా. అక్కడ చెవి గులిమినుండి కైటభుడు, మధువు పుట్టిరి. మహావీర్యవంతులు, ఘోరమైన రూపము గలవారు, ఎదిరింప శక్యము కానివారూ అయిన ఆ దానవులు అక్కడ బ్రహ్మదేవుణ్ణి చూచి కోపావేశమును పొందిరి. 47,48

మూ. వేగేన మహతా తత్ర స్వయంభువమధావతామ్,
దృష్ట్వా స్వయంభువా ముక్తో రావో వై వికృతస్తదా. 49

ప్ర. అ. తత్ర = అక్కడ, మహతా = గొప్ప, వేగేన = వేగముతో, స్వయంభువమ్ = బ్రహ్మను గూర్చి, అధావతామ్ = పరుగెత్తిరి. దృష్ట్వా = చూచి, స్వయమ్భువా = బ్రహ్మచేత, తదా = అప్పుడు, వికృతః = వికృతమైన, రావః = ధ్వని, ముక్తః = విడవబడినది.

తా. వాళ్ళిద్దరూ గొప్ప వేగముతో బ్రహ్మమీదికి రాగా అతడు వికృతముగా అరచెను. 49

మూ. తేన శబ్దేన సంప్రాప్తో హరో వై హరిణా సహ,
అథ చక్రప్రహారేణ సూదితౌ మధుకైటభౌ. 50

ప్ర. అ. తేన = ఆ, శబ్దేన = శబ్దముచేత, హరః = శివుడు, హరిణా సహ = విష్ణువుతో కూడా, సంప్రాప్తః = వచ్చినాడు. అథ = అటుపిమ్మట, మధుకైటభౌ = మధుకైటభులు, చక్రప్రహారేణ = చక్రప్రహారముచేత, సూదితౌ = చంపబడిరి.

తా. ఆ శబ్దము వినగానే శివుడు, విష్ణువు అక్కడికి వచ్చిరి. పిమ్మట చక్రముచేత ఆ మధుకైటభులు చంపబడిరి. 50

మూ. మేదసా ప్లావితా సర్వా పృథివీ చ సమన్తతః,
భూయో విశోధితా తేన హరిణా లోకధారిణా. 51

ప్ర. అ. సర్వా = సమస్తమైన, పృథివీ చ = భూమి, సమన్తతః = అంతటా, మేదసా = కొవ్వుచేత, అప్లావితా = ముంచెత్తబడినది. భూయః = మరల లోకధారిణా = లోకములను పోషించు, తేన హరిణా = ఆ విష్ణువుచేత, విశోధితా = పరిశుభ్రముచేయబడినది.

తా. వాళ్ళ కొవ్వుతో భూమి అంతా అన్నివైపులా నిండిపోయెను. అప్పుడు లోకములను పోషించు విష్ణువు ఆ భూమిని మరల పరిశోధించెను. 51

మూ. శుద్ధాం వై మేదినీం తాం తు వృక్షైః సర్వైరపూరయత్,
ఓషధ్యః సర్వసస్యాని నిష్పద్యన్త పృథగ్విధాః. 52

ప్ర. అ. శుద్ధామ్ = పరిశుద్ధమైన, తామ్ = ఆ. మేదినీమ్ = భూమిని. సర్వైః = సమస్తమైన, వృక్షైః = వృక్షములచేత, అపూరయత్ = నింపెను. పృథగ్విధాః = వేరువేరు విధములైన, ఓషధ్యః = ఓషధులు, సర్వసస్యాని = సమస్తసస్యములు, నిష్పద్యన్త = పుట్టినవి.

తా. పరిశుద్ధమైన ఆ భూమిని అన్ని వృక్షములతోను నింపెను. అనేక విధములైన ఓషధులు, సమస్తసస్యములూ కూడ మొలచినవి. 52

మూ. మేదోగన్ధా తు ధరణీ మేదినీత్యభిసంజ్ఞితా,
తస్మాన్న గృధ్రస్య గృహముత్యూకస్యేతి మే మతిః. 53

ప్ర. అ. మేదోగన్ధా = కొవ్వు వాసన గల, ధరణీ = భూమి, మేదినీతి = "మేదిని" అని, అభిసంజ్ఞితా = పేరు కలదైనది. తస్మాత్ = ఆ కారణమువలన, గృధ్రస్య = గ్రద్దయొక్క, గృహమ్ = గృహము, న = కాదు; ఉలూకస్య = గుడ్లగూబయొక్క గృహము, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = బుద్ధి

తా. కొవ్వు (మేదస్సు) వాసనచే భూమికి 'మేదిని'అను పేరు వచ్చినది. అందుచే ఇల్లు గ్రద్దది కాదు, గుడ్లగూబదే అని నా అభిప్రాయము.

వి. భూమిమీద మనుష్యసృష్టి అయినప్పటినుంచీ అది నా ఇల్లుగా ఉన్నది అని గ్రద్ద చెప్పినది. చెట్లు పుట్టినప్పటినుంచీ అది నా ఇల్లుగా ఉన్న దని గుడ్లగూబ చెప్పినది. కాని ఇప్పుడు చెప్పిన సృష్టిక్రమము ప్రకారము చెట్లకంటె ముందు మనుష్యులు సృష్టింపబడినారు. చెట్లు తరవాత వచ్చినవి. చెట్లు లేనిదే ఈ పక్షులు గూళ్ళు కట్టుకొనజాలవు గాన మనుష్యసృష్టినుండే ఆ యిల్లు నాదే అని చెప్పిన గ్రద్ద మాట అసత్య మని బహుళా తీర్పు చెప్పినట్లు ఊహించుకొనవలెను. 53

మూ. తస్మాద్గృధ్రస్తు దణ్డ్యో వై పాపో హర్తా పరాలయమ్,
పీడాం కరోతి పాపాత్మా దుర్వినీతో మహానయమ్. 54

ప్ర అ. తస్మాత్ = ఆ కారణమువలన, పాపః = పాపముచేసినది, పరాలయమ్=పరులగృహమును, హర్తా=హరించునదీ అయిన, గృధ్రః తు=గ్రద్దయే, దణ్డనీయః = దండింపదగినది. మహాన్ దుర్వినీతః = గొప్ప దుర్వినయము గల, అయమ్ = ఈ, పాపాత్మా = పాపబుద్ధి, పీడామ్ = పీడను, కరోతి = చేయుచున్నది.

తా. అందుచేత పరగృహమును అపహరించిన, పాపము చేసిన ఈ గ్రద్ద దండింపదగినది. చాల దుష్టబుద్ధి గల, పాపమును ఆచరించుచున్న ఇది ఉలూకమును పీడించుచున్నది. 54

మూ. అథాశరీరిణీ వాణీ అన్తరిక్షాత్ప్రబోధినీ,
మా వధీ రామ గృధ్రం త్వం పూర్వదగ్ధం తపోబలాత్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ప్రబోధినీ=బోధించుచున్న, అశరీరిణీ = శరీరములేని, వాణీ = వాణి, అన్తరిక్షాత్ = ఆకాశమునుండి(వినవచ్చినది). రామ = రామా! తపోబలాత్ = తపోబలమువలన, పూర్వదగ్ధమ్ = పూర్వమే కాల్చబడిన, గృధ్రమ్ = ఈ గ్రద్దను, మా వధీః = చంపకుము.

తా. ఇంతలో ఆకాశమునుండి బోధించు అశరీరవాక్కు వెలువడినది- "రామా! తపోబలముచేత పూర్వమే కాల్చబడి (పీడింపబడి)ఉన్న ఈ గ్రద్దను చంపకుము." 55

మూ. కాలగౌతమదగ్ధోఽయం ప్రజానాథో నరేశ్వర,
బ్రహ్మదత్తేతి నామ్నైష శూరః సత్యవ్రతః శుచిః. 56

ప్ర. అ. నరేశ్వర = రాజా ! అయమ్ = ఇతడు, కాలగౌతమదగ్ధః = కాలగౌతమునిచేత పీడితుడైన, ప్రజానాథః = రాజు. నామ్నా = పేరుచేత, బ్రహ్మదత్తేతి = బ్రహ్మదత్తుడు అను, ఏషః = ఇతడు, శూరః = శూరుడు; సత్యవ్రతః = సత్యమైన వ్రతము గలవాడు, లేదా సత్యనిష్ఠ గలవాడు. శుచిః = పరిశుద్ధుడు.

తా. రాజా ! ఇతడు కాలగౌతమునిచేత పీడింపబడిన రాజు. ఇతని పేరు బ్రహ్మదత్తుడు. ఇతడు శూరుడు; సత్యవ్రతుడు; పరిశుద్ధుడు. 56

మూ. గృహం తస్యాగతో విప్రో భోజనం ప్రత్యమార్గత,
సాగ్రం వర్షశతం చైవ భోక్తవ్యం నృపసత్తమ. 57

ప్ర. అ. తస్య = వానియొక్క, గృహం ప్రతి = గృహమును గూర్చి, ఆగతః = వచ్చిన, విప్రః = బ్రాహ్మణుడు, భోజనమ్ = భోజనమును, ప్రత్యమార్గత = అన్వేషించెను(కోరెను). నృపసత్తమ = రాజా ! సాగ్రమ్ = కొంచెము అధికమైన, వర్షశతం చ ఏవ = నూరు సంవత్సరములను, భోక్తవ్యమ్ = తినవలెను.

తా. ఒక బ్రాహ్మణుడు ఇతని గృహమునకు వచ్చి "రాజా నాకు కొంచెము ఎక్కువగా నూరు సంవత్సరములు భోజనము కావలెను" అని కోరెను. 57

మూ. బ్రహ్మదత్తః స వై తస్య పాద్యమర్ఘ్యం స్వయం నృపః,
హార్దం చైవాకరోత్తస్య భోజనార్థం మహాద్యుతేః. 58

ప్ర. అ. నృపః = రాజైన, సః బ్రహ్మదత్తః = ఆ బ్రహ్మదత్తుడు, మహాద్యుతేః = గొప్ప కాంతి గల, తస్య = అతనికి, స్వయమ్ = స్వయముగా, పాద్యమ్ = పాద్యమును, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, భోజనార్థమ్ = భోజనముకొరకు, హార్దమ్ = స్నేహమును, అకరోత్ = చేసెను.

తా. బ్రహ్మదత్తమహారాజు గొప్ప కాంతి గల అతనికి స్వయముగా పాద్యమును, అర్ఘ్యమును, భోజనముకొరకై స్నేహపూర్వకమైన ఏర్పాట్లను చేసెను.

మూ. మాంసమత్స్యాభవంస్తత్ర ఆహారే తు మహాత్మనః,
అథ క్రుద్ధేన మునినా శాపో దత్తోఽస్య దారుణః. 59

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన అతని యొక్క, తత్ర = ఆ, ఆహారే = ఆహారమునందు, మాంసమత్స్యైః = మాంసము మత్స్యములు, అభవన్ = ఉండెను. అథ = అటుపిమ్మట, క్రుద్ధేన = కోపించిన, మునినా = మునిచేత, అస్య = ఇతనికి, దారుణః = దారుణమైన, శాపః = శాపము, దత్తః = ఇవ్వబడినది.

తా. ఆ మహాత్మునకిచ్చిన ఆహారములో మాంసము మత్స్యములు ఉండెను. అప్పుడు ఆ ముని కోపించి ఇతనికి దారుణమైన శాపము నిచ్చెను. 59

మూ. గృధ్ర స్త్వం భవ వై రాజన్మామైనం హ్యథ సోఽబ్రవీత్,
ప్రసాదం కురు ధర్మజ్ఞ అజ్ఞానాన్మే మహావ్రత, 60
శాపస్యాన్తం మహాభాగ క్రియతాం వై మమానఘ.

ప్ర. అ. రాజన్ = రాజా ! త్వమ్ = నీవు, గృధ్రః = గ్రద్దవుగా, భవ = అగుము అథ = అటుపిమ్మట, సః = ఆ రాజు, ఏనమ్ = ఇతనిని గూర్చి, అబ్రవీత్ = పలికెను. మా మా = వద్దు వద్దు, మహావ్రత = గొప్ప వ్రతములు కలవాడా ! ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా ! మే = నాయొక్క, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, (అజ్ఞానము విషయమున), ప్రసాదమ్ = అనుగ్రహమును, కురు = చేయుము మహాభాగ = మహాభాగ్యవంతుడా ! అనఘ = దోషములు లేనివాడా! మమ = నాయొక్క, శాపస్య = శాపమునకు, అన్తమ్ = అంతము, క్రియతాం వై = చేయబడుగాక.

తా. "రాజా ! నీవు గ్రద్దవు అయ్యెదవుగాక." అప్పుడు ఆ రాజు మునితో ఇట్లనెను. "ఇట్లు అనకుము, అనకుము. ధర్మములు తెలిసినవాడా ! గొప్ప నియమములు కలవాడా ! నా అజ్ఞానమువలన కలిగిన అపరాధమును క్షమించి అనుగ్రహించుము మహాభాగ్యవంతుడా ! దోషరహితుడా ! శాపమునకు అంతమును చేయుము." 60

మూ. తదజ్ఞానకృతం మత్వా రాజానం మునిరబ్రవీత్, 61
ఉత్పత్స్యతి కులే రాజ్ఞాం రామో నామ మహాయశాః,
ఇక్ష్వాకూణాం మహాభాగో రాజా రాజీవలోచనః, 62
తేన స్పృష్టో విపాప స్త్వం భవితా నరపుంగవ.

ప్ర. అ. తత్ = దానిని, అజ్ఞానమ్ ఇతి = అజ్ఞానము అని, జ్ఞాత్వా = తెలుసుకొని, మునిః = ముని, రాజానమ్ = రాజును గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయులైన, రాజ్ఞామ్ = రాజులయొక్క, కులే = కులమునందు, రామో నామ = రాము డను పేరు గల, మహాభాగః = మహాభాగ్యవంతుడైన, రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు గల, రాజా = రాజు, ఉత్పత్స్యతి = పుట్టగలడు. నరపుంగవ = నరశ్రేష్ఠుడా ! తేన = అతనిచేత, స్పృష్టః = స్పృశింపబడినవాడవై, త్వమ్ = నీవు, విపాపః = పాపములు లేనివాడవు, భవితా = కాగలవు.

తా. అది అజ్ఞానముచేతనే చేసినట్లు తెలిసికొని ఆ ముని రాజుతో ఇట్లు పలికెను— "ఇక్ష్వాకువంశీయులైన రాజుల కులమునందు రాము డను, పద్మపత్ర విశాలనేత్రుడైన రాజు పుట్టగలడు. ఓ! నరశ్రేష్ఠుడా ! అతడు స్పృశించగా నీ పాపము లన్నీ తొలగిపోవును." 61, 62

మూ. స్పృష్టో రామేణ తచ్ఛ్రుత్వా నరేన్ద్రః పృథివీపతిః, 63
గృధ్రత్వం త్యక్తవాన్ రాజా దివ్యగన్ధానులేపనః,
పురుషో దివ్యరూపోఽభూదువాచేదం చ రాఘవమ్. 64

ప్ర. అ. తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, రామేణ = రామునిచేత, స్పృష్టః = స్పృశించబడిన, నరేన్ద్రః = నరుల ప్రభువైన, పృథివీపతిః = భూమికి అధిపతియైన, రాజా = ఆ రాజు, గృధ్రత్వమ్ = గృధ్రత్వమును, త్యక్తవాన్ = విడచినాడు. దివ్యగన్ధానులేపనః = దివ్యములైన గంధములు మైపూతగా గల, దివ్యరూపః = దివ్యమైన రూపము గల, పురుషః = పురుషుడుగా, అభూత్ = ఆయెను. రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఆ మాటలు విని స్పృశించగా, నరుల ప్రభువు, భూమికి అధిపతీ అయిన ఆ రాజు గ్రద్ధరూపమును విడచి దివ్యగంధములను పూసుకొన్న, దివ్యరూపము గల పురుషుడుగా అయి రామునితో ఇట్లు పలికెను. 63, 64

మూ. సాధు రాఘవ ధర్మజ్ఞ త్వత్ప్రసాదాదహం విభో,
విముక్తో నరకాద్ఘోరాత్పాపస్యాన్తః కృతస్త్వయా. 65

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే ప్రక్షిప్తః సర్గఃతృతీయః.

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు ఎరిగినవాడా ! రామ = రామా ! సాధు= బాగు, విభో = ప్రభూ ! త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, అహమ్=నేను, ఘోరాత్ = ఘోరమైన, నరకాత్ = నరకమునుండి, విముక్తః = విడువబడితిని. త్వయా = నీచేత, శాపస్య = శాపమునకు, అన్తః = అంతము, కృతః = చేయబడినది.

తా. ధర్మముల నెరిగిన రామా ! బాగు బాగు. ప్రభూ ! నీ అనుగ్రహము వలన నేను ఘోరమైన నరకిమునుండి విముక్తుడను అయితిని. నీవు నా శాపానికి అంతము చేసినావు. 65

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో మూడవ ప్రక్షిప్త సర్గ సమాప్తము.

# అథ షష్టితమః సర్గః

[రాముని సభకు ఋషులు వచ్చుట. రాముడు వారిని సత్కరించి వారి అభీష్టమును పూరించుటకై ప్రతిజ్ఞ చేయుట. ఆ ఋషులు రాముణ్ణి ప్రశంసించుట.]

మూ. తయోః సంవదతోరేవం రామలక్ష్మణయోస్తదా,
వాసన్తికీ నిశా ప్రాప్తా న శీతా న చ ఘర్మదా. 1

ప్ర. అ. తయోః = ఆ, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులు, ఏవమ్ = ఇట్లు, సంవదతోః = మాటలాడుకొనుచుండగా, న శీతా = చల్లనిది కాని, న చ ఘర్మదా = వేడిని ఇవ్వని, వాసన్తికీ = వసంతఋతువుకు సంబంధించిన, నిశా = రాత్రి, ప్రాప్తా = వచ్చినది.

తా. రామలక్ష్మణులు ఈ విధముగా మాటలాడుకొనుచుండగా ఎక్కువ చల్లగా కాని, ఎక్కువ వేడిగా కాని ఉండని వసంతఋతువుకు సంబంధించిన రాత్రి వచ్చినది. 1

మూ. తతః ప్రభాతే విమలే కృతపూర్వాహ్ణికక్రియః,
అభిచక్రామ కాకుత్స్థో దర్శనం పౌరకార్యవిత్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విమలే = స్వచ్ఛమైన, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, కృతపూర్వాహ్ణికక్రియః = చేయబడిన పూర్వాహ్ణమునకు సంబంధించిన కృత్యములు గల, పౌరకార్యవిత్ = పౌరకార్యములను ఎరిగిన, కాకుత్స్థః = రాముడు, దర్శనమ్ = ప్రజలకు దర్శనమిచ్చే భవనమును గూర్చి, అభిచక్రామ = వచ్చెను.

తా. పిమ్మట తెల్లవారగానే పూర్వాహ్ణకృత్యము లన్నీ పూర్తిచేసికొని రాముడు పౌరుల కార్యములు పరీక్షించుటకై(వినుటకై) దర్శనగృహమును చేరెను.

మూ. తతః సుమన్త్రిస్త్వాగమ్య రాఘవం వాక్యమబ్రవీత్,
ఏతే ప్రతిహతా రాజన్ ద్వారి తిష్ఠన్తి తాపసాః. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమన్త్రిః తు = సుమంత్రుడు, ఆగమ్య = వచ్చి, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. రాజన్ = రాజా! ఏతే తాపసాః = ఈ మునులు, ప్రతిహతాః = అడ్డుకొనబడినవారై, ద్వారి = ద్వారమునందు, తిష్ఠన్తి = నిలచినారు.

తా. అప్పుడు సుమంత్రుడు వచ్చి రామునితో ఇట్లు పలికెను-"రాజా! ఈ మునులు ద్వారము దగ్గర ఆపివేయబడినారు; అక్కడ నిలచి ఉన్నారు". 3

మూ. భార్గవం చ్యవనం చైవ పురస్కృత్య మహర్షయః,
దర్శనం తే మహారాజ చోదయన్తి కృతత్వరాః. 4

ప్ర. అ. మహారాజ = మహారాజా! మహర్షయః = మహర్షులు, భార్గపమ్ = భార్గవుణ్ణి, చ్యవనం చైవ = చ్యవనుణ్ణీ, పురస్కృత్య = పురస్కరించుకొని, కృతత్వరాః = చేయబడిన తొందర గలవారై, తే దర్శనమ్ = నీ దర్శనమును గూర్చి, చోదయన్తి = ప్రేరేపించుచున్నారు.

తా. మహారాజా! భార్గవుణ్ణి, చ్యవనుణ్ణీ ముందు ఉంచుకొని వచ్చిన ఆ మహర్షులు నీ దర్శనముకొరకు తొందరపడుచు ద్వారపాలాదులను ప్రేరేపించుచున్నారు. 4

మూ. ప్రీయమాణా నరవ్యాఘ్ర యమునాతీరవాసినః,
తస్య తద్వచనం శ్రుత్వా రామః ప్రోవాచ ధర్మవిత్ 5
ప్రవేశ్యన్తాం మహాభాగా భార్గవప్రముఖా ద్విజాః.

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరశ్రేష్ఠుడా! ప్రీయమాణాః = సంతోషపెట్టబడుచున్న, యమునాతీరవాసినః = యమునాతీరమునందున్న (ఆ ఋషులు వచ్చి ఉన్నారు). తస్య = అతనియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, ధర్మవిత్ = ధర్మవేత్త అయిన, రామః = రాముడు, ప్రోవాచ = పలికెను. మహాభాగాః = మహాభాగ్యవంతులైన, భార్గవప్రముఖాః = భార్గవుడు మొదలైన, ద్విజాః = బ్రాహ్మణులు, ప్రవేశ్యన్తామ్ = ప్రవేశపెట్టబడుదురుగాక.

తా. "నరశ్రేష్ఠుడా! యమునాతీరవాసులైన ఆ ఋషులు సంతోషముతో కనబడుచున్నారు". ధర్మవేత్తయైన రాముడు ఆ సుమంత్రుని మాటలు విని-"భార్గవుడు మొదలైన మహాభాగ్యవంతులైన ఆ బ్రాహ్మణులను ప్రవేశపెట్టుము"అని పలికెను. 5

మూ. రాజ్ఞస్త్వాజ్ఞాం పురస్కృత్య ద్వాస్థో మూర్ధ్నా కృతాఞ్జలిః,
ప్రవేశయామాస తదా తాపసాన్ సుదురాసదాన్. 6

ప్ర. అ. రాజ్ఞః=రాజుయొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, పురస్కృత్య=పురస్కరించుకొని, ద్వాస్థః = ద్వారపాలకుడు, మూర్ధ్నా = శిరస్సుచేత, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, తదా = అప్పుడు, సుదురాసదాన్ = సమీపింప శక్యము కాని, తాపసాన్ = ఆ మునులను, ప్రవేశయామాస = ప్రవేశ పెట్టెను.

తా. ద్వారపాలకుడు తల వంచి నమస్కారము చేసి రాజాజ్ఞానుసారము సమీపింప శక్యము కాని తేజస్సు గల ఆ మునులను ప్రవేశపెట్టెను. 6

మూ. శతం సమధికం తత్ర దీప్యమానం స్వతేజసా, 7
ప్రవిష్టం రాజభవనం తాపసానాం మహాత్మనామ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, స్వతేజసా = తన తేజస్సుచేత, దీప్యమానమ్ = ప్రజ్వరిల్లుచున్న, మహాత్మనామ్ = మహాత్ములైన, తాపసానామ్ = మునుల యొక్క, సమధికమ్ = కొంచెము ఎక్కువ అయిన, శతమ్ = శతము, రాజభవనమ్ = రాజభవనమును, ప్రవిష్టమ్ = ప్రవేశించినది.

తా. అప్పుడు తమ తేజస్సుతో ప్రకాశించుచున్న మహాత్ములైన వందమంది మునీశ్వరులు రాజభవనములో ప్రవేశించిరి. 7

మూ. తే ద్విజాః పూర్ణకలశైః సర్వతీర్థాంబుసత్కృతైః, 8
గృహీత్వా ఫలమూలం చ రామస్యాభ్యాహరన్ బహు.

ప్ర. అ. తే ద్విజాః=ఆ బ్రాహ్మణులు, సత్కృతైః = అలంకరించబడిన, పూర్ణకలశైః = పూర్ణకలశలతో, సర్వతీర్థాంబు = సకలతీర్థముల ఉదకమును, గృహీత్వా = గ్రహించి, రామస్య = రామునకు, బహు = అధికమైన, ఫలమూలం చ = ఫలమూలములను కూడ, అభ్యాహరన్ = తీసికొని వచ్చి ఇచ్చిరి.

మూ. ఉపవిష్టాన్ ఋషీంస్తత్ర దృష్ట్వా పరపురంజయః, 12
ప్రయతః ప్రాఞ్జలిర్భూత్వా రాఘవో వాక్యమబ్రవీత్.

ప్ర. అ. పరపురంజయః = శత్రుపురములను జయించు, రాఘవః = రాముడు, తత్ర = అక్కడ, ఉపవిష్టాన్ = కూర్చున్న, ఋషీన్ = ఋషులను, దృష్ట్వా = చూచి, ప్రయతః = నియమవంతుడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శత్రుపురములను జయించు రాముడు అక్కడ కూర్చున్న మునులను చూచి, నియమము పాటించుచు, అంజలి ఘటించి ఇట్లు పలికెను. 12

మూ. కిమాగమనకార్యం వః కిం కరోమి సమాహితః, 13
ఆజ్ఞాప్యోఽహం మహర్షీణాం సర్వకామకరః సుఖమ్.

ప్ర. అ. వః = మీయొక్క, ఆగమనకార్యమ్ = వచ్చుటకు కార్యము, కిమ్ = ఏమి ? సమాహితః = సావధానచిత్తుడనై, కిమ్ = ఏమి, కరోమి = చేయుదును ? సర్వకామకరః = సమస్తమైన కోరిన పనులు చేయు, అహమ్ = నేను, మహర్షీణామ్ = మహర్షులకు, సుఖమ్ = సుఖముగా, ఆజ్ఞాప్యః = ఆజ్ఞాపించదగినవాడను.

తా. మీరు వచ్చిన పని ఏమి? సావధానచిత్తముతో నేను మీకు ఏమి చేయవలెను ? కోరిన పనులు చేయగలను. నన్ను మహర్షులు నిస్సంకోచముగా ఆజ్ఞాపించవచ్చును. 13

మూ. ఇదం రాజ్యం చ సకలం జీవితం చ హృది స్థితమ్ 14
సర్వమేతద్ద్విజార్థం మే సత్యమేతద్ బ్రవీమి వః.

ప్ర. అ. మే = నాయొక్క, ఇదమ్ = ఈ, సకలమ్ = సమస్తమైన, రాజ్యమ్ = రాజ్యము, హృది స్థితమ్ = హృదయమునందున్న, జీవితమ్ = జీవితము, ఏతత్ = ఇది, సర్వమ్ = అంతా కూడ, ద్విజార్థమ్ = బ్రహ్మణులకొరకే. వః = మీకు, సత్యమ్ = సత్యముగా, ఏతత్ = దీనిని, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. ఈ నా సమస్తరాజ్యము, హృదయమునందున్న జీవితము, సర్వమూ కూడ ద్విజులకొరకే. మీకు ఇది సత్యముగా చెప్పుచున్నాను. 14

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సాధుకారో మహానభూత్, 15
ఋషీణాముగ్రతపసాం యమునాతీరవాసినామ్,
ఊచుశ్చైవ మహాత్మానో హర్షేణ మహతా వృతాః. 16

ప్ర. అ. తస్య = రామునియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, యమునాతీరవాసినామ్ = యమునాతీరమునందు నివసించుచున్న, ఉగ్రతపసామ్ = ఉగ్రమైన తపస్సు గల, ఋషీణామ్ = ఋషులయొక్క, మహాన్ = గొప్ప, సాధుకారః = "సాధు" శబ్దము, అభూత్ = అయెను. మహాత్మానః = ఆ మహాత్ములు, మహతా = గొప్ప, హర్షేణ = సంతోషముతో, వృతాః = కూడినవారై, ఊచుః చ = పలికిరి కూడ.

తా. రాముని మాటలు విని యమునాతీరవాసులైన, ఉగ్రతపస్సు గల ఆ మునులు పెద్దగా "బాగు బాగు"అనిరి. ఆ మహాత్ములు గొప్ప సంతోషముతో ఇట్లు పలికిరి. 15,16

మూ. ఉపపన్నం నరశ్రేష్ఠ తవైవ భువి నాన్యతః,
బహవః పార్థివా రాజన్నతిక్రాన్తా మహాబలాః, 17
కార్యస్య గౌరవం మత్వా ప్రతిజ్ఞాం నాభ్యరోచయన్.

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడవైన రామా! భువి = ఈ భూమియందు, తవైవ = నీకే, ఉపపన్నమ్ = యుక్తమైనది. అన్యతః = ఇతరులకు, న = కాదు. రాజన్ = రాజా! మహాబలాః = గొప్ప బలము గల, బహవః = చాలమంది, పార్థివాః = రాజులు, అతిక్రాన్తాః = గడచినారు. కార్యస్య = కార్యముయొక్క, గౌరవమ్ = గురుత్వమును, మత్వా = తలచి, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, నాభ్యరోచయన్ = ఇష్టపడలేదు.

తా. రామా! ఇట్లు పలుకుట ఈ భూలోకములో నీకే తగి యున్నది; మరెవ్వరికీ కాదు. రాజా! పూర్వము మహాబలశాలులైన ఎందరో రాజులు ఉండెడివారు. కాని వారెవరూ అకగబోయే కార్యము ఎంత గొప్పదో అని ఆలోచించి ముందు ప్రతిజ్ఞ చేసేవారు కాదు. 17

మూ. త్వయా పునర్బ్రాహ్మణగౌరవాదియం
కృతా ప్రతిజ్ఞా హ్యనవేక్ష్య కారణమ్,

తతశ్చ కర్తా హ్యసి నాస్తి సంశయో
మహాభయాత్త్రాతుమృషీం స్త్వమర్హసి. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షష్టితమః సర్గః.

ప్ర. అ. త్వయా పునః = నీచేతనైతే, కారణమ్ = కారణమును, అనవేక్ష్య = చూడకుండగా, బ్రాహ్మణగౌరవాత్ = బ్రాహ్మణులయందు గౌరవముచేత, ఇయం ప్రతిజ్ఞా = ఈ ప్రతిజ్ఞ, కృతా = చేయబడినది. తతః = అందువలన, కర్తా = చేయువాడవు, అసి హి = అయి ఉన్నావు. సంశయః = సంశయము, నాస్తి = లేదు. ఋషీన్ = ఋషులను, మహాభయాత్ = గొప్పభయమునుండి, త్రాతుమ్ = రక్షించుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. నీవు మాత్రము వచ్చిన పని ఏదో తెలుసుకొనకుండగానే, బ్రాహ్మణులపై నీకున్న గౌరవముచేత ప్రతిజ్ఞ చేసినావు. అందువలన తప్పక ఈ పని చేయగలవు. ఋషులను మహాభయమునుండి రక్షింపుము.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
అరవైయవ సర్గ సమాప్తము.

## అథ ఏకషష్టితమః సర్గః

[మునులు రామునకు మధువు సంపాదించిన వరమును లవణా సురుని బలమును, అతడు చేయుచున్న ఉపద్రవమునూ గూర్చి చెప్పి అతనివలన తమకు కలిగిన భయమును తొలగింపు మని రాముణ్ణి వేడుట].

మూ. బ్రువద్భిరేవమృషిభిః కాకుత్థ్సో వాక్య మబ్రవీత్,
కిం కార్యం బ్రూత మునయో భయం తావదపైతు వః. 1

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువద్భిః = పలుకుచున్న, ఋషిభిః = ఋషులతో, కాకుత్థ్సః = రాముడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మునయః = మునులారా! కార్యమ్ = కార్యము, కిమ్ = ఏమి ? బ్రూత = చెప్పండి, వః = మీయొక్క, భయమ్ = భయము, అపైతు తావత్ = తొలగుగాక !

తా. ఋషుల మాటలు విని రాముడు-"మునులారా! ఏమి పని మీద వచ్చినారు? మీ భయము తొలగిపోవుగాక"అని పలికెను. 1

మూ. తథా బ్రువతి కాకుత్థ్సే భార్గవో వాక్యమబ్రవీత్,
భయానాం శృణు యన్మూలం దేశస్య చ నరేశ్వర. 2

ప్ర. అ. కాకుత్థ్సే = రాముడు, తథా = అట్లు, బ్రువతి = పలుకుచుండగా, భార్గవః = భార్గవుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. నరేశ్వర = రాజా! దేశస్య = దేశముయొక్క, భయానామ్ = భయములకు, యత్ = ఏది, మూలమ్ = మూలమో, శృణు = వినుము.

తా. రాముని మాటలు విని భార్గవు డిట్లు పలికెను-"రాజా ! దేశమునకు భయకారణ మేమో వినుము". 2

మూ. పురా కృతయుగే రాజన్ దైతేయః సుమహామతిః,
లోలాపుత్రోఽభవజ్జ్యేష్ఠో మధుర్నామ మహాసురః. 3

ప్ర. అ. రాజన్ = రాజా ! పురా = పూర్వము, కృతయుగే = కృతయుగమునందు, సుమహామతిః = చాలా గొప్ప బుద్ధి కలవాడు, దైతేయః = దైత్యుడు,

జ్యేష్ఠః = పెద్ద, లోలాపుత్రః = లోలాపుత్రుడూ అయిన, మధుః నామ = మధువు అను పేరు గల, మహాసురః = గొప్ప అసురుడు, అభవత్ = ఉండెను.

తా. రాజా! పూర్వము కృతయుగమునందు చాల గొప్ప బుద్ధి గలవాడూ లోల జ్యేష్ఠపుత్రుడు, దైత్యుడు అయిన మధువు అను మహాసురుడు ఉండెను. 3

మూ. బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ బుద్ధ్యా చ పరినిష్ఠితః,
సురైశ్చ పరమోదారైః ప్రీతిస్తస్యాతులాభవత్. 4

ప్ర. అ. బ్రహ్మణ్యః చ = బ్రాహ్మణపూజకుడు, శరణ్యః చ = రక్షకుడు, బుద్ధ్యా = బుద్ధితో, పరినిష్ఠితః = కూడినవాడూ (అయిన మధువు ఉండెను). తస్య = అతనికి, పరమోదారైః = మిక్కిలి ఉదారులైన, సురైః = దేవతలతో, అతులా = సాటిలేని, ప్రీతి = ప్రేమ, అభవత్ = ఆయెను.

తా. ఆ మధువు బ్రాహ్మణపూజకుడు, రక్షకుడు, సద్బుద్ధికలవాడు. ఆతనికి ఉత్తమస్వభావవంతులైన దేవతలతో మంచి స్నేహ ముండెను. 4

మూ. స మధుర్వీర్యసంపన్నో ధర్మే చ సుసమాహితః,
బహుమానాచ్చ రుద్రేణ దత్తస్తస్యాద్భుతో వరః. 5

ప్ర. అ. సః = ఆ, మధుః = మధువు. వీర్యసంపన్నః = వీర్యవంతుడు, ధర్మే చ = ధర్మమునందు, సుసమాహితః = బాగుగా సావధానచిత్తుడు, రుద్రేణ = రుద్రునిచేత, బహుమానాత్ = గౌరవమువలన, తస్య = వానికి, అద్భుతః = ఆశ్చర్యకరమైన, వరః = వరము, దత్తః = ఇవ్వబడినది.

తా. ఆ మధువు మంచి పరాక్రమము గలవాడు. ధర్మమునందు స్థిరమైన చిత్తము గలవాడు. రుద్రుడు గౌరవభావముతో అతనికి ఒక ఆశ్చర్యకరమైన వరమును ఇచ్చెను. 5

మూ. శూలం శూలాద్వినిష్కృష్య మహావీర్యం మహాప్రభమ్.
దదౌ మహాత్మా సుప్రీతో వాక్యం చైతదువాచ హ. 6

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన రుద్రుడు, శూలాత్ = శూలమునుండి, మహావీర్యమ్ = గొప్ప పరాక్రమము గల, మహాప్రభమ్ = గొప్ప కాంతి గల, శూలమ్ = శూలమును, వినిష్కృష్య = పైకి లాగి, సుప్రీతః = చాల సంతోషించిన

వాడై, దదౌ = ఇచ్చెను. ఏతత్ = ఈ, వాక్యం చ = వాక్యమును కూడ, ఉవాచ హ = పలికెను.

తా. మహాత్ముడైన రుద్రుడు తన శూలమునుండి గొప్పశక్తి, కాంతీ గల మరొక శూలమును పైకి తీసి అతని కిచ్చి ఇట్లు పలికెను. 6

మూ. త్వయాయమతులో ధర్మో మత్ప్రసాదకరః కృతః,
ప్రీత్యా పరమయా యుక్తో దదామ్యాయుధముత్తమమ్. 7

ప్ర. అ. త్వయా = నీచేత, అయమ్ = ఈ, మత్ప్రసాదకరః = నాకు సంతోషమును కలిగించు, అతులః = సాటిలేని, ధర్మః = ధర్మము, కృతః = చేయబడినది. పరమయా = గొప్ప, ప్రీత్యా = ప్రేమతో, యుక్తః = కూడిన నేను, ఉత్తమమ్ = గొప్పదైన, ఆయుధమ్ = ఆయుధమును, దదామి = ఇచ్చుచున్నాను.

తా. నీవు నాకు ఆనందమును కలిగించు సాటి లేని ధర్మము ఆచరించితివి. గొప్ప ప్రీతితో నీకు ఉత్తమమైన ఆయుధమును ఇచ్చుచున్నాను. 7

మూ. యావత్సురైశ్చ విప్రైశ్చ న విరుద్ధ్యేర్మహాసుర,
తావచ్ఛూలం తవేదం స్యాదన్యథా నాశమేష్యతి. 8

ప్ర. అ. మహాసుర = ఓ! మహాసురుడా! యావత్ = ఎంతవరకు, సురైః చ = దేవతలతోను, విప్రైః చ = బ్రాహ్మణులతోను, న విరుద్ధ్యేః = విరోధము చేయవో, తావత్ = అంతవరకు, ఇదం శూలమ్ = ఈ శూలము, తవ = నీదిగా, స్యాత్ = ఉండును. అన్యథా = అట్లు కానిచో, నాశమ్ = నాశమును, యాస్యతి = పొందగలదు.

తా. ఓ! మహాసురా! నీవు ఎంతవరకు దేవతలవిషయమునందు, బ్రాహ్మణుల విషయమునందు ద్వేషము వహింపవో అంతవరకు ఇది నీదిగా ఉండగలదు. అట్లు కానిచో ఇది అదృశ్య మయిపోవును. 8

మూ. యశ్చ త్వామభియుఞ్జీత యుద్ధాయ విగతజ్వరః,
తం శూలో భస్మసాత్ కృత్వా పునరేష్యతి తే కరమ్. 9

ప్ర. అ. యః = ఎవడు, విగతజ్వరః = పోయిన పీడ గలవాడై, యుద్ధాయ = యుద్ధముకొరకు, త్వామ్ = నిన్ను, అభియుఞ్జీత = ఎదుర్కొనునో, తమ్ = వానిని, శూలః = శూలము, భస్మసాత్ కృత్వా = భస్మముగా చేసి, పునః = మరల, తే = నీయొక్క, కరమ్ = హస్తమును గూర్చి, ఏష్యతి= రాగలదు.

తా. నిన్ను ఎవడు నిర్భయుడై యుద్ధములో ఎదిరించుటకు వచ్చునో వానిని ఈ శూలము భస్మము చేసి మరల నీ చేతిలోనికి వచ్చును. 9

మూ. ఏవం రుద్రాద్వరం లబ్ధ్వా భూయ ఏవ మహాసురః,
ప్రణిపత్య మహాదేవం వాక్యమేతదువాచ హ. 10

ప్ర అ. ఏవమ్ = ఇట్లు, రుద్రాత్ = రుద్రునినుండి, వరమ్ = వరమును లబ్ధ్వా = పొంది, మహాసురః = ఆ మహాసురుడు, మహాదేవమ్ = పరమశివుణ్ణి, భూయః ఏవ = మరల, ప్రణిపత్య = నమస్కరించి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ మధువు రుద్రునినుండి ఈ విధముగా వరమును పొంది మరల ఆతనికి నమస్కరించి ఇట్లు పలికెను. 10

మూ. భగవన్మమ వంశస్య శూలమేతదనుత్తమమ్,
భవేత్తు సతతం దేవ సురాణామీశ్వరో హ్యసి. 11

ప్ర. అ. భగవన్ = భగవంతుడా! అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, ఏతత్ = ఈ, శూలమ్ = శూలము, సతతమ్ = ఎల్లప్పుడూ, మమ వంశస్య = నా వంశమునకు, భవేత్ తు = ఉండుగాక, సురాణామ్ = దేవతలయొక్క, ఈశ్వరః = ప్రభువు, అసి హి = అయి ఉన్నావు కదా.

తా. భగవంతుడా! శ్రేష్ఠమైన ఈ శూలము నిత్యమూ నా వంశమునకు చెందినదై ఉండుగాక. నీవు దేవతల ప్రభువు కదా (ఈ వరము నిమ్ము). 11

మూ. తం బ్రువాణం మధుం దేవః సర్వభూతపతిః శివః,
ప్రత్యువాచ మహాదేవో నైతదేవం భవిష్యతి. 12

ప్ర. అ. సర్వభూతపతిః = సకలప్రాణులకు అధిపతియైన, దేవః = దేవుడైన, శివః = శివుడైన, మహాదేవః = మహాదేవుడు, ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న, తం మధుమ్ = ఆ మధువును గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, న భవిష్యతి = కాదు.

తా. సకలప్రాణులకు ప్రభువు, దేవుడు, మంగళప్రదుడు అయిన మహాదేవుడు ఇట్లు పలుకుచున్న ఆ మధువుతో ఇట్లనెను. "ఇది ఇట్లు జరుగదు". 12

మూ. మా భూత్తే విఫలా వాణీ మత్ప్రసాదకృతా శుభా,
భవతః పుత్రమేకం తు శూలమేతద్భజిష్యతే. 13

ప్ర. అ. మత్ప్రసాదకృతా = నా అనుగ్రహముచేత చేయబడిన, శుభా = శుభమైన, తే వాణీ = నీ వాక్కు, విఫలా = వ్యర్థము, మా భూత్ = కాకపోవుగాక. ఏతత్ శూలమ్ = ఈ శూలము, భవతః = నీయొక్క, ఏకమ్ = ఒక్క, పుత్రమ్ = పుత్రుణ్ణి, భజిష్యతే = పొందగలదు.

తా. నా అనుగ్రహముచేత వెలువడిన నీ శుభమైన వాక్కు వ్యర్థము కాకుండు గాక; అందుచేత ఈ శూలము నీ కుమారుడు ఒక్కని దగ్గర మాత్రము ఉండగలదు. 13

మూ. యావత్కరస్థః శూలోఽయం భవిష్యతి సుతస్య తే,
అవధ్యః సర్వభూతానాం శూలహస్తో భవిష్యతి. 14

ప్ర. అ. అయమ్ = ఈ, శూలః = శూలము, తే సుతస్య = నీ కుమారుని యొక్క, కరస్థః = కరమునందు ఉన్నది, యావత్ భవిష్యతి = ఎంతవరకు కాగలదో అంతవరకు, శూలహస్తః = శూలము హస్తమునందు గల అతడు, సర్వభూతానామ్ = సకలభూతములకు, అవధ్యః = చంపశక్యము కానివాడు, భవిష్యతి = కాగలడు.

తా. ఈ శూలము ఎంతవరకు నీ కుమారుని చేతిలో ఉండునో అంతవరకు అతనిని ఎవ్వరూ కూడ చంపజాలరు. 14

మూ. ఏవం మధుర్వరం లబ్ధ్వా దేవాత్సుమహదద్భుతమ్,
భవనం సోఽసురశ్రేష్ఠః కారయామాస సుప్రభమ్. 15

ప్ర. అ. అసురశ్రేష్ఠః = అసురులలో శ్రేష్ఠుడైన, మధుః = మధువు, ఏవమ్ = ఇట్లు, దేవాత్ = పరమేశ్వరునివలన, సుమహత్ = చాల గొప్పదైన, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, వరమ్ = వరమును, లబ్ధ్వా = పొంది, సుప్రభమ్ = మంచి కాంతి గల, భవనమ్ = భవనమును, కారయామాస = చేయించెను.

తా. అసురులలో శ్రేష్ఠుడైన ఆ మధువు ఈ విధముగా మహాదేవునినుండి అద్భుతమైన చాల గొప్ప వరమును పొంది, మంచి కాంతి గల ఒక భవనమును నిర్మింపచేసెను. 15

మూ. తస్య పత్నీ మహాభాగా ప్రియా కుమ్భీనసీతి యా,
విశ్వావసోరపత్యం సా హ్యనలాయాం మహాప్రభా. 16

ప్ర. అ. యా = ఎవ్వతె, అనలాయామ్ = అనలయందు, విశ్వావసోః = విశ్వావసువుయొక్క, అపత్యమ్ = సంతానమో, సా = ఆ, మహాప్రభా = గొప్ప కాంతి గల, కుమ్భీనసీ ఇతి = కుంభీనసి అను, మహాభాగా = మహాభాగ్యవంతురాలు, తస్య = అతనియొక్క, పత్నీ = భార్య.

తా. విశ్వావసువునకు అనలయందు జనించిన గొప్ప కాంతి గల కుంభీనసి అను మహాభాగ్యవంతురాలు ఆ మధువు భార్య. 16

మూ. తస్యాః పుత్రో మహావీర్యో లవణో రామ దారుణః,
బాల్యాత్ప్రభృతి దుష్టాత్మా పాపాన్యేవ సమాచరత్. 17

ప్ర. అ. మహావీర్యః = గొప్ప పరాక్రమము గల, దారుణః = భయంకరుడైన, లవణో నామ = లవణుడు అనువాడు, తస్యాః = ఆమెయొక్క, పుత్రః = పుత్రుడు, దుష్టాత్మా = దుష్టాత్ముడైన అతడు, బాల్యాత్ ప్రభృతి = బాల్యమునుండి కూడ, పాపాన్యేవ = పాపములనే, సమాచరత్ = చేసెను.

తా. ఆ కుంభీనసికి గొప్ప పరాక్రమము గల, భయంకరుడైన లవణుడను పుత్రుడు పుట్టెను. దుష్టబుద్ధియైన అతడు బాల్యమునుండీ కూడ పాపకార్యములనే చేసెను. 17

మూ. తం పుత్రం దుర్వినీతం తు దృష్ట్వా క్రోధసమన్వితః,
మధుః స శోకమాపేదే న చైనం కించిదబ్రవీత్. 18

ప్ర అ. మధుః = మధువు, దుర్వినీతమ్ = వినయవిహీనుడైన, తం పుత్రమ్ = ఆ పుత్రుణ్ణి, దృష్ట్వా = చూచి, క్రోధసమన్వితః = కోపముతో కూడిన వాడై, శోకమ్ = దుఃఖమును, ఆపేదే = పొందెను. ఏనమ్ = వీనిని గూర్చి, కించిత్ = ఏమీ కూడ, న అబ్రవీత్ = పలకలేదు.

తా. దుష్టస్వభావము గల ఆ పుత్రుణ్ణి చూచి మధువుకు కోపము, దుఃఖమూ గూడ కలిగెను కాని అతడు వానిని ఏమీ అనలేదు. 18

మూ. స విహాయ ఇమం లోకం ప్రవిష్టో వరుణాలయమ్,
శూలం నివేశ్య లవణే వరం తస్మై న్యవేదయత్. 19

ప్ర. అ. సః = అతడు, ఇమం లోకమ్ = ఈ లోకమును, విహాయ = విడచి, వరుణాలయమ్ = వరుణలోకమును, ప్రవిష్టః = ప్రవేశించెను. లవణే = లవణునియందు, శూలమ్ = శూలమును, నివేశ్య = ఉంచి, తస్మై = వానికి, వరమ్ = వరమును, న్యవేదయత్ = తెలిపెను.

తా. అతడు శూలమును లవణునకు అప్పచెప్పి, దానిని గూర్చిన వరమును కూడ అతనికి తెలిపి ఈ లోకమును విడచి వరుణలోకమునకు వెళ్ళిపోయెను. 19

మూ. స ప్రభావేణ శూలస్య దౌరాత్మ్యేనాత్మనస్తథా,
సంతాపయతి లోకాంస్త్రీన్ విశేషేణ చ తాపసాన్. 20

ప్ర. అ. సః = అతడు, శూలస్య = శూలముయొక్క, ప్రభావేణ = ప్రభావముచేతను, తథా = మరియు, ఆత్మనః = తనయొక్క, దౌరాత్మ్యేన చ = దుష్టత్వముచేతను, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, సంతాపయతి = పీడించుచున్నాడు.

తా. అతడు సహజముగా దుష్టుడగుటచేతను, ఆ శూలము ప్రభావముచేతను మూడు లోకములను కూడ పీడించుచున్నాడు. విశేషించి మునులను పీడించుచున్నాడు. 20

మూ. ఏవంప్రభావో లవణః శూలం చైవ తథావిధమ్,
శ్రుత్వా ప్రమాణం కాకుత్స్థ త్వం హి నః పరమా గతిః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! లవణః = లవణుడు, ఏవంప్రభావః = ఇట్టి ప్రభావము కలవాడు, శూలం చైవ = శూలము కూడ, తథావిధమ్ = అట్టిది. శ్రుత్వా = విని, త్వమ్ = నీవే, ప్రమాణమ్ = ప్రమాణము. నః = మాకు, పరమా గతిః హి = గొప్ప గతివి కదా?

తా. రామా! లవణుని ప్రభావము ఇట్టిది. శూలము కూడా ఆలాంటిది. ఈ విషయమున నీదే తుది నిర్ణయము. నీవే మాకు దిక్కు కదా? 21

మూ. బహవః పార్థివా రామ భయార్తైర్ఋషిభిః పురా,
అభయం యాచితా వీర త్రాతారం న చ విద్మహే. 22

ప్ర. అ. వీర = వీరుడా! రామ = రామా! పురా = పూర్వము, భయార్తైః = భయపీడితులైన. ఋషిభిః = ఋషులచేత, బహవః = చాలామంది, పార్థివాః = రాజులు, అభయమ్ = అభయమును, యాచితాః = యాచింపబడినవారు. త్రాతారమ్ = రక్షించేవాణ్ణి (మేము), న చ విద్మహే = పొందుటలేదు.

తా. వీరుడవైన రామా! భయపీడితులైన ఋషులు పూర్వము చాలామంది రాజులదగ్గరకు వెళ్ళి అభయము యాచించినారు. కాని మాకు ఒక్క రక్షకుడు కూడా లభించలేదు. 22

మూ. తే వయం రావణం శ్రుత్వా హతం సబలవాహనమ్,
త్రాతారం విద్మహే తాత నాన్యం భువి నరాధిపమ్. 23
తత్పరిత్రాతుమిచ్ఛామో లవణాద్భయపీడితాన్.

ప్ర. అ. తాత = తండ్రీ! తే వయమ్ = అట్టి మేము, సబలవాహనమ్ = సైన్యవాహనములతో కూడిన, రావణమ్ = రావణుణ్ణి. హతమ్ = చంపబడినవానినిగా, శ్రుత్వా = విని, భువి = భూమియందు, అన్యమ్ = మరియొక, నరాధిపమ్ = రాజును, త్రాతారమ్ = రక్షకుణ్ణిగా, న విద్మహే = ఎరుగము. తత్ = ఆ కారణమువలన, లవణాత్ = లవణునినుండి, భయపీడితాన్ = భయపీడితులమైన మమ్ములను, త్రాతుమ్ = రక్షించుటకు, ఇచ్ఛామః = కోరుచున్నాము.

తా. తండ్రీ! నీవు సైన్యవాహనాదులతో సహా రావణుణ్ణి సంహరించి నట్లు విన్నాము. ఈ భూలోకములో రక్షకుడైన మరొక రాజు ఎవ్వడూ కనబడుటలేదు.

అందువలన లవణాసురునినుండి భయముచేత పీడితులమైన మమ్ము రక్షించవలె నని కోరుచున్నాము. 23

మూ. ఇతి రామ నివేదితం తు తే
భయజం కారణముత్థితం చ యత్,
వినివారయితుం భవాన్ క్షమః
కురు తం కామమహీనవిక్రమ. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకషష్టితమః సర్గః.

ప్ర. అ. రామ = రామా! ఇతి = ఈ విధముగా, భయజమ్ = భయము వలన కలిగిన, యత్ = ఏ, కారణమ్ = కారణము, ఉత్థితమ్ = బయల్వెడలినదో (ఏర్పడినదో) అది, తే = నీకు, నివేదితమ్ = తెలుపబడినది. భవాన్ = నీవు, వినివారయితుమ్ = నివారించుటకు, క్షమః = సమర్థుడవు. అహీనవిక్రమ = గొప్ప పరాక్రమము గలవాడా! తమ్ = ఆ, కామమ్ = కోరికను, కురు = చేయుము.

తా. రామా! భయమునకు కారణమును నీకు తెలిపినాము. దీనిని నివారించుటకు నీవే సమర్థుడవు. గొప్ప పరాక్రమము కలవాడా! ఈ కోరిక తీర్చుము.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో అరవై ఒకటవసర్గ సమాప్తము.

# అథ ద్విషష్టితమః సర్గః

*[లవణాసురుని ఆహారాదుల విషయమున రాముడు మునులను ప్రశ్నించుట. వానిని చంపుటకై శత్రుఘ్నుని ఉత్సాహము తెలిసికొని అతనిని ఆ కార్యమునకై ఆజ్ఞాపించుట].*

మూ. తథోక్తే తానృషీన్ రామః ప్రత్యువాచ కృతాఞ్జలిః,
కిమాహారః కిమాచారో లవణః క్వ చ వర్తతే. 1

ప్ర. అ. తథా = అట్లు, ఉక్తే = చెప్పబడగా, రామః = రాముడు, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, తాన్ = ఆ, ఋషీన్ = ఋషులను గూర్చి, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. లవణః=లవణుడు, కిమాహారః = ఏమి ఆహారము కలవాడు? కిమాచారః = ఎట్టి ప్రవర్తన కలవాడు, క్వ చ = ఎక్కడ, వర్తతే = ఉంటున్నాడు.

తా. రాముడు ఋషుల మాటలు విని, వారికి నమస్కరించుచు- "ఆ లవణాసురుడు ఎట్టి ఆహారము తినును? ఏవిధముగా ప్రవర్తించుచుండును?" అని ప్రశ్నించెను. 1

మూ. రాఘవస్య వచః శ్రుత్వా ఋషయః సర్వ ఏవ తే,
తతో నివేదయామాసుర్లవణో వవృధే యథా. 2

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, తే = ఆ, సర్వే ఏవ = సమస్తమైన, ఋషయః = ఋషులు, తతః = అటుపిమ్మట, లవణః = లవణుడు, యథా = ఎట్లు, వవృధే = వృద్ధి పొందెనో, నివేదయామాసుః = తెలిపిరి.

తా. రాముని మాటలు విని ఆ ఋషు లందరూ ఆ లవణుడు ఎట్లు వృద్ధి పొందెనో తెలిపిరి. 2

మూ. ఆహారః సర్వసత్త్వాని విశేషేణ చ తాపసాః,
ఆచారో రౌద్రతా నిత్యం వాసో మధువనే తథా. 3

ప్ర. అ. సర్వసత్త్వాని = సమస్తప్రాణులూ కూడ, ఆహారః = ఆహారము, విశేషేణ = విశేషించి, తాపసాః = మునులు. నిత్యమ్ = నిత్యమూ, రౌద్రతా = క్రూరత్వము, ఆచారః = ఆచారము, తథా = మరియు, మధువనే = మధువనమునందు, వాసః = నివాసము.

తా. అన్ని ప్రాణులూ కూడ వాని ఆహారమే; విశేషించి మునులు వాని ఆహారము. నిత్యమూ క్రూరముగా ఉండుట వాని ఆచారము. మధువనములో వాని నివాసము. 3

మూ. హత్వా బహుసహస్రాణి సింహవ్యాఘ్రమృగాణ్డజాన్,
మానుషాంశ్చైవ కురుతే నిత్యమాహారమాహ్నికమ్. 4

ప్ర. అ. బహుసహస్రాణి = ఎన్నో వేల, సింహవ్యాఘ్రమృగాణ్డజాన్ = సింహములను, వ్యాఘ్రములను, లేళ్ళను, పక్షులను, మానుషాన్ చ ఏవ = మనుష్యులను, హత్వా = చంపి, నిత్యమ్ = నిత్యమూ, అహ్నికమ్ = పగటికి సంబంధించిన, ఆహారమ్ = ఆహారమును. కురుతే = చేయును.

తా. కొన్నివేల సింహములను, పెద్దపులులను, లేళ్ళను, పక్షులను, మనుష్యులను చంపి నిత్యము పగలు భోజనము చేయుచుండును. 4

మూ. తతోఽన్తరాణి సత్త్వాని ఖాదతే స మహాబలః,
సంహారే సమనుప్రాప్తే వ్యాదితాస్య ఇవాన్తకః. 5

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, సః = అతడు, సంహారే = ప్రళయము, సమనుప్రాప్తే = వచ్చిన దగుచుండగా, వ్యాదితాస్యః = తెరవబడిన ముఖము గల, అన్తకః=ఇవ యతుముడు వలె తతః = పూర్వము చెప్పిన వాటి కంటె, అన్తరాణి = భిన్నమైన. సత్త్వాని = ప్రాణులను, ఖాదతే = తినును.

తా. ప్రళయకాలమునందు నోరు తెరచుకొనిన మృత్యుదేవత వలె మహాబలశాలియైన ఆ లవణుడు, రాత్రులందు ఇతర మృగములను తినుచుండును. 5

మూ. తచ్ఛ్రుత్వా రాఘవో వాక్యమువాచ స మహామునీన్,
ఘాతయిష్యామి తద్రక్షో వ్యపగచ్ఛతు వో భయమ్. 6

ప్ర. అ. సః = ఆ, రాఘవః = రాముడు. తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, మహామునీన్ = మహామునులను గూర్చి, ఉవాచ = పలికెను. తత్ = ఆ, రక్షః = రాక్షసుణ్ణి. ఘాతయిష్యామి = చంపెదను. వః = మీయొక్క, భయమ్ = భయము, వ్యపగచ్ఛతు = తొలగుగాక.

తా. రాముడు ఆ మాటలు విని ఆ మునులతో- "ఆ రాక్షసుణ్ణి చంపించెదను. మీరు భయమును విడిచిపెట్టుడు" అని పలికెను. 6

మూ. ప్రతిజ్ఞాయ తదా తేషాం మునీనాముగ్రతేజసామ్,
స భ్రాతౄన్ సహితాన్ సర్వానువాచ రఘునన్దనః. 7

ప్ర. అ. సః రఘునన్దనః = ఆ రాముడు, ఉగ్రతేజసామ్ = ఉగ్రమైన తేజస్సుగల, తేషామ్ = ఆ, మునీనామ్ = మునులకు, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, తదా = అప్పుడు, సహితాన్ = అక్కడనే కలిసి ఉన్న, సర్వాన్ = సమస్తమైన, భ్రాతౄన్ = సోదరులను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఉగ్రమైన తేజస్సుగల ఆ మునులకు ఈ విధముగ ప్రతిజ్ఞ చేసి అక్కడనే ఉన్న సోదరులతో ఇట్లు పలికెను. 7

మూ. కో హన్తా లవణం వీరః కస్యాంశః స విధీయతామ్,
భరతస్య మహాబాహోః శత్రుఘ్నస్య చ ధీమతః. 8

ప్ర. అ. కః వీరః = ఏ వీరుడు, లవణమ్ = లవణుని, హన్తా = చంపగలడు? సః = అతడు, కస్య = ఎవనియొక్క, అంశః = అంశగా, విధీయతామ్ = చేయబడుగాక! మహాబాహోః = గొప్ప బాహువులు గల, భరతస్య = భరతునికా, ధీమతః = బుద్ధిమంతుడైన, శత్రుఘ్నస్య చ = శత్రుఘ్ననికా?

తా. లవణుణ్ణి ఏ వీరుడు చంపగలడు? వానిని మహాబాహువైన భరతుని వాటాగా చేయవలెనా, ధీమంతుడైన శత్రుఘ్నుని వాటాగా చేయవలెనా? 8

మూ. రాఘవేణైవముక్తస్తు భరతో వాక్యమబ్రవీత్,
అహమేనం వధిష్యామి మమాంశః స విధీయతామ్. 9

ప్ర. అ. రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, భరతః = భరతుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. అహమ్ = నేను, ఏనమ్ = వీనిని, వధిష్యామి = చంపెదను. సః = అతడు, మమ = నా యొక్క, అంశః = అంశముగా, విధీయతామ్ = చేయబడుగాక.

తా. రాముని మాటలు విని భరతుడు "నేను వానిని చంపెదను. వానిని నా భాగముగా చేయుము" అని పలికెను. 9

మూ. భరతస్య వచః శ్రుత్వా ధైర్యశౌర్యసమన్వితమ్,
లక్ష్మణావరజస్తస్థౌ హిత్వా సౌవర్ణమాసనమ్. 10

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, ధైర్యశౌర్యసమన్వితమ్ = ధైర్యశౌర్యములతో కూడిన, వచః = వచనమును, శ్రుత్వా = విని, లక్ష్మణావరజః = లక్ష్మణుని తమ్ముడు, సౌవర్ణమ్ = బంగారము వికారమైన, ఆసనమ్ = ఆసనమును, హిత్వా = విడచి, తస్థౌ = నిలబడెను.

తా. భరతుడు పలికిన ధైర్యశౌర్యాలతో కూడిన ఆ మాట విని శత్రుఘ్నుడు తాను కూర్చున్న బంగారు ఆసనమునుండి లేచి నిలబడెను. 10

మూ. శత్రుఘ్నస్త్వబ్రవీద్వాక్యం ప్రణిపత్య నరాధిపమ్,
కృతకర్మా మహాబాహుర్మధ్యమో రఘునన్దనః. 11

ప్ర. అ. శత్రుఘ్నః తు = శత్రుఘ్నుడైతే, నరాధిపమ్ = రాజును, ప్రణిపత్య = నమస్కరించి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహాబాహుః = గొప్ప బాహువులు గల, మధ్యమః = మధ్యముడైన, రఘునన్దనః = రఘువంశ రాజులను ఆనందపరచువాడు, కృతకర్మా = చేయబడిన కర్మ గలవాడు.

తా. శత్రుఘ్నుడు నమస్కరించుచు రాజుతో ఇట్లు పలికెను. "మహాబాహువైన భరతుడు గొప్ప కార్యమును ఇంతకు పూర్వమే చేసినాడు". 11

మూ. ఆర్యేణ హి పురా శూన్యా త్వయోధ్యా పరిపాలితా,
సంతాపం హృదయే కృత్వా హ్యార్యస్యాగమనం ప్రతి. 12

ప్ర. అ. పురా = పూర్వము, ఆర్యేణ = పూజ్యుడవైన నీతో, శూన్యా =

శూన్యమైన, అయోధ్యా = అయోధ్య, ఆర్యస్య = ఆర్యుడవైన నీయొక్క, ఆగమనం ప్రతి = ఆగమనమును గూర్చి, సంతాపమ్ = తాపమును, హృదయే = హృదయమునందు, కృత్వా = చేసికొని, పరిపాలితా హి = పాలింపబడినది కదా.

తా. పూర్వము ఇతడు నీవు లేని అయోధ్యను నీ రాకను గూర్చి మనస్సులో పరితపించుచు రక్షించినాడు కదా. 12

మూ. దుఃఖాని చ బహూనీహ అనుభూతాని పార్థివ,
శయానో దుఃఖశయ్యాసు నన్దిగ్రామే మహాయశాః. 12

ఫలమూలాశనో భూత్వా జటీ చీరధరస్తథా,
అనుభూయేదృశం దుఃఖమేష రాఘవనన్దనః. 13
ప్రేష్యే మయి స్థితే రాజన్న భూయః క్లేశమాప్నుయాత్.

ప్ర. అ. పార్థివ = రాజా! ఇహ = ఇక్కడ, బహూని = అనేకమైన, దుఃఖాని చ = దుఃఖములు కూడ, అనుభూతాని = అనుభవించబడినవి. రాజన్ = రాజా! నన్దిగ్రామే = నందిగ్రామమునందు, ఫలమూలాశనః = ఫలమూలములను భుజించువాడు, భూత్వా = అయి, జటీ = జటాధారియై, తథా = మరియు, చీరధరః = నారబట్టలు ధరించినవాడై, దుఃఖశయ్యాసు = దుఃఖకరములైన శయ్యల మీద, శయానః = శయనించిన, మహాయశాః = గొప్ప కీర్తి గల, ఏషః = ఈ, రాఘవనన్దనః = భరతుడు, ఈదృశమ్ = ఇట్టి, దుఃఖమ్ = దుఃఖమును, అనుభూయ = అనుభవించి, ప్రేష్యే = పంపదగిన, మయి = నేను, స్థితే = ఉండగా, భూయః = మరల, క్లేశమ్ = క్లేశమును, నాప్నుయాత్ = పొందకుండుగాక.

తా. రాజా! ఇతడు అనేక దుఃఖములు అనుభవించినాడు. గొప్ప కీర్తి గల ఈ భరతుడు నందిగ్రామములో ఫలములు, దుంపలు తినుచు జటలను నారబట్టలను ధరించి దుఃఖకరములైన శయ్యలమీద శయనించినాడు. ఇట్టి దుఃఖములను అనుభవించిన ఇతడు పంపదగిన నేను ఉండగా మరల క్లేశమును పొందకుండుగాక. 13, 14

మూ. తథా బ్రువతి శత్రుఘ్నే రాఘవః పునరబ్రవీత్. 15
ఏవం భవతు కాకుత్స్థ క్రియతాం మమ శాసనమ్.

ప్ర అ. శత్రుఘ్నే = శత్రుఘ్నుడు, తథా = అట్లు, బ్రువతి = పలుకుచుండగా, రాఘవః = రాముడు, పునః=మరల, అబ్రవీత్ = పలికెను. కాకుత్స్థ= శత్రుఘ్నా! ఏవమ్ = ఇట్లు, భవతు = అగుగాక. మమ = నాయొక్క, శాసనమ్ = ఆజ్ఞ, క్రియతామ్ = చేయబడుగాక.

తా. శత్రుఘ్నుని మాటలు విని రాముడు ఇట్లు పలికెను. "శత్రుఘ్నా! ఇట్లే అగుగాక. నా ఆజ్ఞ ప్రకారము చేయుము". 15

మూ. రాజ్యే త్వామభిషేక్ష్యామి మధోస్తు నగరే శుభే, 16
నివేశయ మహాబాహో భరతం యద్యవేక్షసే,
శూరస్త్వం కృతవిద్యశ్చ సమర్థశ్చ నివేశనే. 17

ప్ర. అ. శుభే=మంగళకరమైన, మధోః నగరే=మధుపుయొక్క నగరమునందు, రాజ్యే = రాజ్యమునందు, త్వామ్ = నిన్ను, అభిషేక్ష్యామి = అభిషేకించెదను. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! భరతమ్ = భరతుణ్ణి, అవేక్షసే యది = (శ్రమపెట్టదగనివానినిగా) చూచినట్లయితే, నివేశయ = నీవు రాజ్యమును ఏర్పరచుము. త్వమ్ = నీవు, శూరః చ = శూరుడవు, కృతవిద్యః చ =చేయబడిన విద్యలు కలవాడవు. నివేశనే = రాజ్యమును ఏర్పరచుటయందు, సమర్థః చ = సమర్థుడవు.

తా. నిన్ను మంగళకరమైన మధువు నగరమునందు రాజ్యాభిషిక్తుణ్ణి చేసెదను. మహాబాహూ! భరతుణ్ణి శ్రమ పెట్టకూడ దని నీవు భావించినవో నీవు రాజ్యమును ఏర్పరచుము. నీవు శూరుడవు విద్యలు నేర్చినవాడవు. రాజ్యమును ఏర్పరుచుటలో కూడ సమర్థుడవు. 16, 17

మూ. నగరం యమునాజుష్టం తథా జనపదాన్ శుభాన్,
యో హి వంశం సముత్పాట్య పార్థివస్య నివేశనే. 18
న విధత్తే నృపం తత్ర నరకం స హి గచ్ఛతి.

ప్ర. అ. యమునాజుష్టమ్ = యమునతో కూడిన, నగరమ్=నగరమును,

తథా = మరియు, శుభాన్ = మంగళకరమైన, జనపదాన్ = జనపదములను (ఏర్పరుచుము). యః = ఎవడు, వంశమ్=వంశమును, సముత్పాట్య= పెకిలించి వేసి, పార్థివస్య = ఆ రాజుయొక్క, తత్ర = అ, నివేశనే=రాజ్యనివేశనమునందు, నృపమ్ = మరొక రాజును, న విధత్తే = నిలపడో, సః = అతడు, నరకమ్ = నరకమును గూర్చి, గచ్ఛతి హి = వెళ్లును కదా!

తా. యమునానదీతీరమునందు నగరమును, సుందరమైన జనపదములను ఏర్పరుపుము. ఒక రాజవంశమును నిర్మూలించి ఆ స్థానమునందు మరొకరిని నియమించనివాడు నరకమునకు వెళ్లును. 18

మూ. స తం హత్వా మధుసుతం లవణం పాపనిశ్చయమ్, 19
రాజ్యం ప్రశాధి ధర్మేణ వాక్యం మే యద్యవేక్షసే.

ప్ర. అ. సః త్వమ్ = అట్టి నీవు, మధుసుతమ్ = మధువు కుమారుడైన, పాపనిశ్చయమ్ = పాపబుద్ధి గల, తం లవణమ్ = ఆ లవణుణ్ణి, హత్వా=చంపి, మే వాక్యమ్ = నా మాటను, అవేక్షసే యది = మన్నించినట్లయితే, రాజ్యమ్ = రాజ్యమును, ధర్మేణ = ధర్మముచేత, ప్రశాధి = రక్షించుము.

తా. నీవు నా మాట మన్నించినట్లయితే దుష్టబుద్ధి గల మధుపుత్రుడైన ఆ లవణుణ్ణి చంపి ధర్మానుసారముగా రాజ్యము పాలించుము. 19

మూ. ఉత్తరం న చ వక్తవ్యం శూరవాక్యాన్తరే మమ, 20
బాలేన పూర్వజస్యాజ్ఞా కర్తవ్యా నాత్ర సంశయః.

ప్ర. అ. శూర = శూరుడా! మమ = నాయొక్క, వాక్యాన్తరే = మాటల మధ్య, ఉత్తరమ్=ప్రత్యుత్తరము, న చ వక్తవ్యమ్=చెప్పదగినది కాదు. బాలేన= చిన్నవానిచేత, పూర్వజస్య = అన్నగారియొక్క, ఆజ్ఞా = ఆజ్ఞ, కర్తవ్యా = చేయదగినది. అత్ర = ఈ విషయమునందు, సంశయః = సంశయము, న = లేదు.

తా. ఓ! శూరుడా! నా మాటల మధ్య నీవు మరేమీ చెప్పవద్దు. చిన్నవాడు అన్నగారి ఆజ్ఞ ఆచరించవలెను. ఈ విషయములో సందేహము లేదు. 20

మూ. అభిషేకం చ కాకుత్స్థ ప్రతీచ్ఛస్వ మయోద్యతమ్, 21
వసిష్ఠప్రముఖైర్విప్రైర్విధిమన్త్రపురస్కృతమ్.

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే ద్విషష్టితమః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ = శత్రుఘ్నా! మయా = నాచేత, ఉద్యతమ్ = సంకల్పించబడిన, విధిమన్త్రపురస్కృతమ్ = శాస్త్రముచేతను, మంత్రములచేత పురస్కృతమైన, వసిష్ఠప్రముఖైః = వసిష్ఠుడు మొదలైన, విప్రైః = బ్రాహ్మణులచేత చేయబడిన, అభిషేకం చ = అభిషేకము కూడ, ప్రతీచ్ఛస్వ = స్వీకరించుము.

తా. శత్రుఘ్నా! నేను సంకల్పించిన వసిష్ఠాదిబ్రాహ్మణులు యథాశాస్త్రముగా, మతపూర్వకముగా చేయబోవు అభిషేకమును పొందుము. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో అరవై రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిషష్టితమః సర్గః

[రాముడు శత్రుఘ్నుణ్ణి మధురారాజ్యామునందు అభిషిక్తుని చేసి లవణుని శూలమునుండి ఆత్మరక్ష చేసికొను ఉపాయమును చెప్పుట].

మూ. ఏవముక్తస్తు రామేణ పరాం వ్రీడాముపాగమత్,
శత్రుఘ్నో వీర్యసంపన్నో మన్దం మన్దమువాచ హ. 1

ప్ర. అ. వీర్యసంపన్నః = పరాక్రమసంపన్నుడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడినవాడై, పరామ్ = గొప్ప, వ్రీడామ్ = సిగ్గును, ఉపాగమత్ = పొందెను. మన్దం మన్దమ్= మెల్ల మెల్లగా, ఉవాచ హ = పలికెను.

తా. రాముని మాటలు విని పరాక్రమసంపన్నుడైన శత్రుఘ్నుడు చాల సిగ్గుపడుచు మెల్లమెల్లగా ఇట్లు పలికెను. 1

మూ. అధర్మం విద్మ కాకుత్స్థ అస్మిన్నర్థే నరేశ్వర,
కథం తిష్ఠత్సు జ్యేష్ఠేషు కనీయానభిషిచ్యతే. 2

ప్ర. అ. కాకుత్స్థ = రామా! నరేశ్వర = రాజా! అస్మిన్ = ఈ, అర్థే = విషయమునందు, అధర్మమ్ = అధర్మమును, విద్మ = తెలిసికొనుచున్నాము. జ్యేష్ఠేషు = పెద్దవాళ్ళు, తిష్ఠత్సు = ఉండగా, కనీయాన్ = చిన్నవాడు, కథమ్= ఎట్లు, అభిషిచ్యతే = అభిషేకించబడును?

తా. మహారాజా! రామా! ఈ విషయము అధర్మమని భావించుచున్నాను. పెద్దవాళ్లు ఉండగా చిన్నవానికి అభిషేకము ఎట్లు జరుగును? 2

మూ. అవశ్యం కరణీయం చ శాసనం పురుషర్షభ,
తవ చైవ మహాభాగ శాసనం దురతిక్రమమ్. 3

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! శాసనమ్ = ఆజ్ఞ, అవశ్యమ్ = తప్పక, కరణీయం చ = చేయదగినది. మహాభాగ = మహాభాగ్యవంతుడా! తవ = నీయొక్క, శాసనం చ ఏవ = శాసనము, దురతిక్రమమ్ = అతిక్రమింప శక్యము కానిది.

తా. పురుషశ్రేష్ఠా! ఆజ్ఞను తప్పక పాటించవలెను. మహాభాగ్యవంతుడా! నీ శాసనము తప్పక ఆచరింప దగినది. 3

మూ. త్వత్తో మయా శ్రుతం వీర శ్రుతిభ్యశ్చ మయా శ్రుతమ్,
నోత్తరం హి మయా వీర మధ్యమే ప్రతిజానతి. 4

ప్ర. అ. వీర = వీరుడా! త్వత్తః = నీనుండి, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది. శ్రుతిభ్యః చ = శ్రుతులనుండి కూడ, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది. మధ్యమే = భరతుడు, ప్రతిజానతి = ప్రతిజ్ఞ చేయుచుండగా, మయా = నాచేత, ఉత్తరమ్ = ప్రత్యుత్తరము, న వాచ్యమ్ = చెప్పదగినది కాదు.

తా. ఓ! వీరుడా! నీవు చెప్పగా విని ఉన్నాను; శ్రుతులనుండి విని ఉన్నాను; మధ్యముడైన భరతుడు ప్రతిజ్ఞ చేయుచున్నప్పుడు (లవణాసురుణ్ణి చంపెద నని అనుచున్నప్పుడు) నేను మాటలాడుట యుక్తము కాదు. 4

మూ. వ్యాహృతం దుర్వచో ఘోరం హన్తాస్మి లవణం మృధే,
తస్యైవ మే దురుక్తస్య దుర్గతిః పురుషర్షభ. 5

ప్ర. అ. మృధే = యుద్ధమునందు, లవణమ్ = లవణాసురుణ్ణి, హన్తాస్మి = చంపగలను అని, ఘోరమ్ = ఘోరమైన, దుర్వచః = దుష్టమైనవచనము, వ్యాహృతమ్ = పలకబడినది. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! తస్య = ఆ, మే దురుక్తస్య ఏవ = నా చెడ్డమాటకే, దుర్గతిః = ఈ దుర్గతి కలిగినది.

తా. పురుషశ్రేష్ఠుడా! భరతుడు మాటలాడిన పిమ్మట "నేను లవణాసురుణ్ణి చంపెదను"అని నేను ఘోరమైన చెడ్డ మాట పలికినాను. ఆ చెడ్డమాటకు ఫలితముగా ఈ దుర్గతి (అన్నలకంటె ముందు రాజ్యాభిషిక్తుడు అగుట అనే పాపము చేయవలసిన దుఃస్థితి) వచ్చినది. 5

మూ. ఉత్తరం న హి వక్తవ్యం జ్యేష్ఠేనాభిహితే పునః,
అధర్మసహితం చైవ పరలోకవివర్జితమ్. 6

ప్ర. అ. జ్యేష్ఠేన = పెద్దవానిచేత, అభిహితే = చెప్పబడినదగుచుండగా, పునః = మరల, అధర్మసహితం చ ఏవ = అధర్మముతో కూడిన, పరలోకవివర్జితమ్ = పరలోకశూన్యమైన, ఉత్తరమ్ = ప్రత్యుత్తరము, న వక్తవ్యం హి = చెప్పదగినది కాదు కదా.

తా. పెద్దవాడు మాటలాడిన పిమ్మట అధర్మసహితము, పరలోకమునకు విరుద్ధమూ అయే రీతిలో ఎదురు చెప్పగూడదుకదా ? 6

మూ. సోఽహం ద్వితీయం కాకుత్స్థ న వక్ష్యామి తవోత్తరమ్,
మా ద్వితీయేన దణ్డో వై నిపతేన్మయి మానద. 7

ప్ర అ. కాకుత్స్థ = రామా ! సః అహమ్ = అట్టి నేను, తవ = నీకు, ద్వితీయమ్ = రెండవ, ఉత్తరమ్ = ఉత్తరమును, న వక్ష్యామి = చెప్పను, మానద = గౌరవమును ఇచ్చువాడా ! ద్వితీయేన = రెండవదానిచేత, మయి = నాయందు, దణ్డః = దండనము, మా నిపతేత్ = పడకుండుగాక.

తా. రామా ! (భరతుని మాటకు ఎదురు చెప్పుటచేతనే ఈ శిక్ష లభించినది). అందుచేత మళ్ళీ నీకు కూడ ఎదురు చెప్పి మరొక శిక్షకు పాత్రుడను కాకుందును గాక. 7

మూ. కామకారో హ్యహం రాజంస్తవాస్మి పురుషర్షభ,
అధర్మం జహి కాకుత్స్థ మత్కృతే రఘునన్దన. 8

ప్ర అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! రాజన్ = రాజా! అహమ్ = నేను, తవ = నీయొక్క, కామకారః = ఇచ్ఛ ప్రకారము చేసేవాడను, అస్మి హి = అయి ఉన్నాను కదా ? కాకుత్స్థ = కాకుత్స్థవంశమునందు పుట్టినవాడా ! రఘునన్దన = రామా! మత్కృతే = నా నిమిత్తమై, అధర్మమ్ = అధర్మమును, జహి = చంపుము (తొలగింపుము).

తా. పురుషశ్రేష్ఠుడవైన రాజా! నేను నీ ఇచ్ఛ ప్రకారము చేసెదను. రామా! నీవు నా నిమిత్తమై అధర్మమును తొలగింపుము. (చిన్నవాడను అయి ఉండి

రాజ్యాభిషిక్తుడను అగుట అనే నేను చేయు అధర్మము నాకు తగలకుండా చేయుము అని భావము). 8

మూ. ఏవముక్తే తు శూరేణ శత్రుఘ్నేన మహాత్మనా,
ఉవాచ రామః సంహృష్టో భరతం లక్ష్మణం తథా. 9

ప్ర. అ. శూరేణ = శూరుడైన, మహాత్మనా = మహాత్ముడైన, శత్రుఘ్నేన = శత్రుఘ్నునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తే = చెప్పబడగా, రామః = రాముడు, సంహృష్టః = సంతోషించినవాడై, భరతమ్ = భరతుని గూర్చి, తథా = మరియు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. శూరుడు, మహాత్ముడూ అయిన శత్రుఘ్నుని మాటలు విని రాముడు సంతోషించి, భరతునితోను, లక్ష్మణునితోను ఇట్లు పలికెను. 9

మూ. సంభారానభిషేకస్య ఆనయధ్వం సమాహితాః,
అద్యైవ పురుషవ్యాఘ్రమభిషేక్ష్యామి రాఘవమ్. 10

ప్ర. అ. సమాహితాః = సావధానచిత్తులై, అభిషేకస్య = అభిషేకము యొక్క, సంభారాన్ = సంభారములను, ఆనయధ్వమ్ = తీసికొనిరండి. అద్యైవ = ఇప్పుడే, పురుషవ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠుడైన, రాఘవమ్ = శత్రుఘ్నుణ్ణి, అభిషేక్ష్యామి = అభిషేకించెదను.

తా. సావధానచిత్తులై అభిషేకసంభారములను తీసికొనిరండి. పురుషశ్రేష్ఠుడైన శత్రుఘ్నునకు ఇప్పుడే రాజ్యాభిషేకము చేసెదను. 10

మూ. పురోధసం చ కాకుత్స్థ నైగమాన్ ఋత్విజస్తథా,
మన్త్రిణశ్చైవ తాన్ సర్వానానయధ్వం మమాజ్ఞయా.

ప్ర. అ. కాకుత్స్థ = భరతా ! పురోధసమ్ = పురోహితుణ్ణి, నైగమాన్ = నైగములను, తథా = మరియు, ఋత్విజః = ఋత్విక్కులను, తాన్ సర్వాన్ = వారి నందరినీ, మమ = నాయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, ఆనయధ్వమ్ = తీసికొనిరండి.

తా. భరతా! పురోహితుణ్ణి, ఆయా సంఘాల ప్రముఖులను ఋత్విక్కులను వీరి నందరినీ నా ఆజ్ఞచేత తీసికొనిరండి. 11

మూ. రాజ్ఞః శాసనమాజ్ఞాయ తథా కుర్వన్ మహారథాః,
అభిషేకసమారమ్భం పురస్కృత్య పురోధసమ్. 12

ప్ర. అ. మహారథాః = మహారథులు, రాజ్ఞః = రాజుయొక్క, శాసనమ్ = ఆజ్ఞను, ఆజ్ఞాయ = తెలిసికొని, పురోధసమ్ = పురోహితుణ్ణి, పురస్కృత్య = పురస్కరించుకొని, అభిషేకసమారమ్భమ్ = అభిషేకము ఏర్పాటును, తథా = చెప్పిన విధముగ, అకుర్వన్ = చేసిరి.

తా. మహారథులు రాజు శాసనమును తెలిసికొని, పురోహితుణ్ణి ముందు ఉంచుకొని ఆ విధముగ అభిషేకము ఏర్పాట్లు చేసిరి. 12

మూ. ప్రవిష్టా రాజభవనం రాజానో బ్రాహ్మణా స్తథా,
తతోఽభిషేకో వవృధే శత్రుఘ్నస్య మహాత్మనః. 13

ప్ర. అ. రాజానః = రాజులు, తథా = మరియు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, రాజభవనమ్ = రాజభవనమును, ప్రవిష్టాః = ప్రవేశించినారు. తతః = అటుపిమ్మట, మహాత్మనః = మహాత్ముడైన, శత్రుఘ్నస్య = శత్రుఘ్నునియొక్క, అభిషేకః = అభిషేకము, వవృధే = వృద్ధిపొందెను.

తా. రాజులూ, బ్రాహ్మణులూ రాజభవనములో ప్రవేశించిరి. పిమ్మట మహాత్ముడైన శత్రుఘ్నుని అభిషేకము వైభవముతో జరిగెను. 13

మూ. సంప్రహర్షకరః శ్రీమాన్ రాఘవస్య పురస్య చ,
అభిషిక్తస్తు కాకుత్స్థో బభౌ చాదిత్యసంనిభః, 14
అభిషిక్తః పురా స్కన్దః సేన్ద్రైరివ మరుద్గణైః.

ప్ర. అ. అభిషిక్తః తు = అభిషిక్తుడైన, శ్రీమాన్ = శోభాయుక్తుడైన, కాకుత్స్థః = శత్రుఘ్నుడు,, రాఘవస్య = రామునకు, పురస్య చ = పురమునకు, సంప్రహర్షకరః = ఆనందమునుకలిగించుచు, పురా = పూర్వము, సేన్ద్రైః = ఇంద్రునితోకూడిన, మరుద్గణైః = దేవతాగణముంచేత, అభిషిక్తః = అభిషిక్తుడైన, స్కన్దః ఇవ = కుమారస్వామివలె, ఆదిత్యసంనిభః = సూర్యునితోసమానుడై, బభౌ = ప్రకాశించెను.

తా. శ్రీమంతుడైన శత్రుఘ్నుడు రాజ్యాభిషిక్తుడై, రామునకూ, పురజనులకు కూడ ఇంద్రాదిదేవతలచేత అభిషిక్తుడైన కుమారస్వామివలె, ఆనందము కలిగించుచు, సూర్యుడు వలె ప్రకాశించెను. 14

మూ. అభిషిక్తే తు శత్రుఘ్నే రామేణాక్లిష్టకర్మణా, 15
పౌరాః ప్రముదితాశ్చాసన్ బ్రాహ్మణాశ్చ బహుశ్రుతాః.

ప్ర. అ. శత్రుఘ్నే = శత్రుఘ్నుడు, అక్లిష్టకర్మణా = అనాయాసముగా పనులు చేయు, రామేణ = రామునిచేత, అభిషిక్తే తు = అభిషేకించబడగా, పౌరాః = పౌరులు, బహుశ్రుతాః = చాల విద్యావంతులైన, బ్రాహ్మణాః చ = బ్రాహ్మణులూ, ప్రముదితాః = సంతోషించినవారు, ఆసన్ = అయిరి.

తా. శ్రమపడకుండగా కార్యములు నిర్వహించు రాముడు శత్రుఘ్నుణ్ణి రాజ్యాభిషిక్తుని చేయగా, పౌరులు అధికవిద్యావంతులైన బ్రాహ్మణులూ కూడ సంతోషించిరి. 15

మూ. కౌసల్యా చ సుమిత్రా చ మఙ్గలం కేకయీ తథా, 16
చక్రుస్తా రాజభవనే యాశ్చాన్యా రాజయోషితః.

ప్ర. అ. కౌసల్య చ = కౌసల్య, సుమిత్రా చ = సుమిత్ర, తథా = మరియు. కేకయీ = కైకేయి, రాజభవనే = రాజభవనమునందు, అన్యాః = ఇతరలైన, యాః = ఏ, రాజయోషితః = రాజస్త్రీలు గలరో, తాః చ = వాళ్ళూ, మఙ్గలమ్ = మంగళమును, చక్రుః = చేసిరి.

తా. కౌసల్య, సుమిత్ర, కైకేయి రాజభవనములో ఉన్న ఇతరరాజభార్యలూ కూడా అతనికి మంగళము చేసిరి. 16

మూ. ఋషయశ్చ మహాత్మానో యమునాతీరవాసినః, 17
హతం లవణమాశంసుః శత్రుఘ్నస్యాభిషేచనాత్.

ప్ర. అ. యమునాతీరవాసినః = యమునాతీరమునందు, నివసించుచున్న, మహాత్మానః = మహాత్ములైన, ఋషయశ్చ = ఋషులుకూడ, శత్రుఘ్నస్య = శత్రుఘ్నునియొక్క. అభిషేచనాత్ = అభిషేకించుటవలన, లవణమ్ = లవణాసురుణ్ణి, హతమ్ = చంపబడిన వానినిగా, ఆశంసుః = తలచిరి.

తా. శత్రుఘ్నుడు రాజ్యాభిషిక్తుడు కాగానే యమునాతీరవాసులైన మహర్షులు "లవణుడు ఇక చచ్చినట్లే" అని అనుకొనిరి. 17

మూ. తతోఽభిషిక్తం శత్రుఘ్నమఙ్కమారోప్య రాఘవః, 18
ఉవాచ మధురాం వాణీం తేజస్తస్యాభిపూరయన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రాఘవః = రాముడు, అభిషిక్తమ్ = అభిషిక్తుడైన, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి, అఙ్కమ్ = అంకమును, ఆరోప్య = అధిష్ఠింపచేసి, తస్య = వానియొక్క, తేజః = తేజస్సును, అభిపూరయన్ = నింపుచు, మధురామ్ = మధురమైన, వాణీమ్ = వాక్కును, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట రాముడు రాజ్యాభిషిక్తుడైన శత్రుఘ్నుణ్ణి ఒడిలో కూర్చుండబెట్టుకొని అతని తేజస్సు పెంచుచు మధురమైన వాక్కును పలికెను. 18

మూ. అయం శరస్త్వమోఘస్తే దివ్యః పరపురంజయః, 19
అనేన లవణం సౌమ్య హన్తాసి రఘునన్దన.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! రఘునన్దన = శత్రుఘ్నుడా! తే = నీకు, (ఇవ్వబడుచున్న), అయమ్ = ఈ, పరంపురంజయః = శత్రుపురములను జయించు, దివ్యః = దివ్యమైన, శరః = శరము, అమోఘః = వ్యర్థముకానిది. అనేన = దీనిచేత, లవణమ్ = లవణాసురుణ్ణి, హన్తాసి = చంపగలవు.

తా. సౌమ్యుడవైన శత్రుఘ్నా! దివ్యము, శత్రుపురవినాశకము అయిన ఈ బాణమును నీకిచ్చుచున్నాను. ఇది అమోఘమైనది. దీనితో లవణాసురుణ్ణి చంపగలవు. 19

మూ. సృష్టః శరోఽయం కాకుత్స్థ యదా శేతే మహార్ణవే, 20
స్వయంభూరజితో దివ్యో యం నాపశ్యన్ సురాసురాః.

ప్ర. అ. కాకుత్స్థ = శత్రుఘ్నా! స్వయంభూః = స్వయముగా ఆవిర్భవించిన, అజితః = శ్రీమహావిష్ణువు, యదా = ఎప్పుడు, మహార్ణవే = మహాసముద్రమునందు, శేతే = నిద్రించుచుండెనో అప్పుడు, అయమ్ = ఈ, దివ్యః = దివ్యమైన, శరః = శరము, సృష్టః = సృజించబడినది. యమ్ = దేనిని, సురాసురాః = సురాసురులు, నాపశ్యన్ = చూడలేదో.

తా. స్వయముగా ఆవిర్భవించిన శ్రీ మహావిష్ణువు మహాసముద్రములో శయనించి ఉన్నప్పుడు ఈ దివ్యమైన శరము సృష్టించబడినది. దీనిని సురులు గాని అసురులు గాని చూడలేదు. 20

మూ. అదృశ్యః సర్వభూతానాం తేనాయం హి శరోత్తమః, 21
సృష్టః క్రోధాభిభూతేన వినాశార్థం దురాత్మనోః,
మధుకైటభయోర్వీర విఘాతే సర్వరక్షసామ్.

ప్ర. అ. వీర = వీరుడా! తేన = ఆ కారణముచేత, అయమ్ = ఈ, శరోత్తమః = శ్రేష్ఠమైన బాణము, సర్వభూతానామ్ = సకలభూతములకూ కూడ, అదృశ్యః = కనబడనిది. క్రోధాభిభూతేన = కోపముతో నిండిన విష్ణువుచేత, దురాత్మనోః = చెడ్డ బుద్ధిగల, మధుకైటభయోః = మధుకైటభుల, వినాశార్థమ్ = వినాశముకొరకు, సర్వరక్షసామ్ = సకలరాక్షసులయొక్క, విఘాతే = నాశనమునందు, సృష్టః = సృష్టించబడినది.

తా. వీరుడా! ఆ కారణముచేత ఈ బాణము ఏ ప్రాణికీ కూడ కనబడదు. క్రోధావిష్టుడైన విష్ణువు దురాత్ముడైన మధుకైటభులను చంపుటకు, సకలరాక్షసులను నశింపచేయుటకు ఈ శరమును సృజించినాడు. 21

మూ. స్రష్టుకామేన లోకాంస్త్రీం స్తౌ చానేన హతౌ యుధి, 22
తౌ హత్వా జనభోగార్థే కైటభం తు మధుం తదా,
అనేన శరముఖ్యేన తతో లోకాంశ్చకార సః. 23

ప్ర. అ. త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, స్రష్టుకామేన = సృజించుటకు కోరికగల విష్ణువుచేత, అనేన = ఈబాణముచేత, తౌ = వాళ్ళిద్దరూ, యుధి = యుద్ధమునందు, హతౌ = చంపబడిరి. సః = ఆ విష్ణువు, అనేన = ఈ శరముఖ్యేన = ముఖ్యమైన శరముచేత, కైటభమ్ = కైటభుని, తథా = మరియు, మధుమ్ = మధువునూ, తౌ = వారిద్దరినీ, హత్వా = చంపి, తతః = అటుపిమ్మట, జనభోగార్థే = జనముయొక్క భోగము కొరకు, లోకాన్ = లోకములను, చకార = చేసెను.

తా. మూడు లోకములను సృష్టింపదలచిన ఆ విష్ణువు దీనిచేత యుద్ధము

నందు వాళ్ళిద్దరినీ చంపివేసెను. శ్రీమహావిష్ణువు మధుకైటభులను ఈ శ్రేష్ఠమైన బాణముచేత సంహరించి ప్రాణుల భోగముకొరకై లోకములను సృష్టించెను.

మూ. నాయం మయా శరః పూర్వం రావణస్య వధార్థినా,
ముక్తః శత్రుఘ్న భూతానాం మహాన్ త్రాసో భవేదితి. 24

ప్ర. అ. శత్రుఘ్న = శత్రుఘ్నా! పూర్వమ్ = పూర్వము, రావణస్య = రావణునియొక్క, వధార్థినా = వధను కోరిన, మయా = నాచేత, అయం శరః = ఈ బాణము, భూతానామ్ = ప్రాణులయొక్క, మహాన్ = గొప్ప, త్రాసః = త్రాసము, భవేత్ ఇతి = అగును అని, న ముక్తః = విడవబడలేదు.

తా. శత్రుఘ్నా! రావణుని చంపదలచిన నేను పూర్వము చాలమంది ప్రాణులకు నాశము కలుగు నను భయముచేత ఈ బాణమును ప్రయోగించలేదు.

మూ. యచ్చ తస్య మహచ్ఛూలం త్ర్యమ్బకేణ మహాత్మనా,
దత్తం శత్రువినాశాయ మధోరాయుధముత్తమమ్. 25

స తం నిక్షిప్య భవనే పూజ్యమానం పునః పునః,
దిశః సర్వాః సమాసాద్య ప్రాప్నోత్యాహారముత్తమమ్. 26

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, త్ర్యమ్బకేణ = శివునిచేత, యత్ = ఏ, మహత్ = గొప్పదైన, శూలమ్ = శూలము, తస్య మధోః = ఆ మధువునకు, శత్రువినాశాయ = శత్రునాశముకొరకు, ఉత్తమమ్ = ఉత్తమమైన, ఆయుధమ్ = ఆయుధముగా, దత్తమ్ = ఇవ్వబడినదో, పునః పునః = మాటిమాటికి, పూజ్యమానమ్ = పూజించబడుచున్న, తమ్ = దానిని, భవనే = గృహములో నిక్షిప్య = ఉంచి, సః = ఆ లవణుడు, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, సమాసాద్య = పొంది, ఉత్తమమ్ = ఉత్తమమైన, ఆహారమ్ = ఆహారమును, ప్రాప్నోతి పొందుచుండును.

తా. మహాత్ముడైన మహేశ్వరుడు శత్రువినాశముకొరకై మధువుకు ఉత్తమమైన ఆయుధముగా ఇచ్చిన ఆ గొప్ప శూలమునకు లవణుడు మాటిమాటికి పూజలు చేయుచుండును. దానిని ఇంటిలోనే ఉంచి ఉత్తమమైన ఆహారము సంపాదించుటకై అన్ని దిక్కులకు పోవుచుండును. 25, 26

మూ. యదా తు యుద్ధమాకాఙ్క్షన్ కశ్చిదేనం సమాహ్వయేత్,
తదా శూలం గృహీత్వా తం భస్మ రక్షః కరోతి హి. 27

ప్ర. అ. కశ్చిత్ = ఎవడైనా, యుద్ధమ్ = యుద్ధమును, ఆకాఙ్క్షన్ = కోరుచు, యదా = ఎప్పుడు, ఏనమ్ = వీనిని, సమాహ్వయేత్ = పిలచునో, తదా = అప్పుడు, రక్షః = ఆ రాక్షసుడు, శూలమ్ = శూలమును, గృహీత్వా = గ్రహించి, తమ్ = వానిని, భస్మ = భస్మగా, కరోతి హి = చేయుచుండును.

తా. ఎవ్వడైనా వచ్చి యుద్ధానికి పిలచినపుడు ఈ లవణుడు ఆ శూలమును గ్రహించి వానిని భస్మముచేయుచుండును. 27

మూ. స త్వం పురుషశార్దూల తమాయుధవినాకృతమ్,
అప్రవిష్టం పురం పూర్వం ద్వారి తిష్ఠ ధృతాయుధః. 28

ప్ర. అ. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడా! సః త్వమ్ = అట్టి నీవు, ధృతాయుధః = ధరించబడిన ఆయుధములు కలవాడవై, పురమ్ = పట్టణమును, అప్రవిష్టమ్ = ప్రవేశించని, ఆయుధవినాకృతమ్ = ఆయుదము లేకుండ ఉన్న, తమ్ = వానినిగూర్చి, పూర్వమ్ = ముందుగానే, ద్వారి = ద్వారమునందు, తిష్ఠ = నిలచి ఉండుము.

తా. పురుషశ్రేష్ఠుడవైన శత్రుఘ్నా! నీవు ఆయుధములు ధరించి, ఆయుధము చేతిలో లేని ఆ లవణుడు పురములో ప్రవేశించుటకు పూర్వమే ఆతని కొరకై ద్వారమువద్ద వేచి ఉండుము. 28

మూ. అప్రవిష్టం చ భవనం యుద్ధాయ పురుషర్షభ,
ఆహ్వయేథా మహాబాహో తతో హన్తాసి రాక్షసమ్. 29

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! భవనమ్ = భవనమును, అప్రవిష్టమ్ = ప్రవేశించని, రాక్షసమ్ = రాక్షసుణ్ణి, యుద్ధాయ = యుద్ధముకొరకు, ఆహ్వయేథాః = ఆహ్వానించుము. తతః = అటుపిమ్మట, హన్తాసి = చంపగలవు.

తా. పురుషశ్రేష్ఠా! మహాబాహూ! అతడు భవనములో ప్రవేశించుటకు ముందుగానే నీవు వానిని యుద్ధానికి పిలువుము. అప్పుడు వానిని చంపగలవు. 29

మూ. అన్యథా క్రియమాణే తు అవధ్యః స భవిష్యతి,
యది త్వేవం కృతం వీర వినాశముపయాస్యతి. 30

ప్ర. అ. వీర=వీరుడా! అన్యథా=మరియొక విధముగా, క్రియమాణే తు =చేయబడినట్లయితే, సః=అతడు, అవధ్యః=చంప శక్యము కానివాడు, భవిష్యతి =కాగలడు. ఏవమ్=ఇట్లు, కృతం యది=చేయబడినట్లయితే, వినాశమ్= వినాశమును, ఉపయాస్యతి=పొందగలడు.

తా. వీరుడా! మరొక విధముగా చేసినచో అతడు చంపశక్యము కానివాడగును. ఇట్లు చేసినచో నశించగలడు. 30

మూ. ఏతత్తే సర్వమాఖ్యాతం శూలస్య చ విపర్యయః,
శ్రీమతః శితికణ్ఠస్య కృత్యం హి దురతిక్రమమ్. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రిషష్టితమః సర్గః.

ప్ర. అ. ఏతత్ = ఇది, సర్వమ్=అంతా, తే = నీకు, ఆఖ్యాతమ్=చెప్పబడినది. శూలస్య=శూలముయొక్క, విపర్యయః అపి = పరిహారము కూడ చెప్పబడినది. శ్రీమతః = శ్రీమంతుడైన, శితికణ్ఠస్య= శివునియొక్క, కృత్యమ్ = కృత్యము, దురతిక్రమం హి = అతిక్రమింప శక్యము కానిది కదా?

తా. నీకు ఈ విషయ మంతా చెప్పినాను. శూలమును ఎట్లు పరిహరించవలెనో కూడ చెప్పినాను. శ్రీమంతుడైన ఈశ్వరుని కృత్యము (ఆజ్ఞ) దాట శక్యము కాదు కదా? 31

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో అరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుఃషష్టితమః సర్గః

[రాముని ఆజ్ఞచేత శత్రుఘ్నుడు ముందుగా సైన్యమును పంపి ఒక మాసము తరవాత మధురకు ప్రయాణమై వెళ్లుట.]

మూ. ఏవముక్త్వా చ కాకుత్థ్సం ప్రశస్య చ పునః పునః,
పునరేవాపరం వాక్యమువాచ రఘునన్దనః. 1

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, కాకుత్థ్సమ్ = శత్రుఘ్నుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, పునః పునః = మాటిమాటికి, ప్రశస్య చ = ప్రశంసించి, పునః ఏవ = మరల, అపరమ్ = మరి యొక, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు శత్రుఘ్నునితో ఇట్లు పలికి, మాటి మాటికి ప్రశంసించి, మరల మరొక మాట చెప్పెను. 1

మూ. ఇమాన్యశ్వసహస్రాణి చత్వారి పురుషర్షభ,
రథానాం ద్వే సహస్రే చ గజానాం శతముత్తమమ్. 2

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! ఇమాని = ఈ, చత్వారి = నాలుగు, అశ్వసహస్రాణి = అశ్వముల సహస్రములు, రథానామ్ = రథములయొక్క, ద్వే = రెండు, సహస్రే చ = సహస్రములు, గజానామ్ = గజములయొక్క, ఉత్తమమ్ = ఉత్తమమైన, శతమ్ = శతము.

తా. పురుషశ్రేష్ఠుడా! ఇవిగో నాలుగు వేల గుఱ్ఱాలు, రెండు వేల రథాలు, ఒక వంద ఏనుగులు. 2

మూ. అన్తరాపణవీథ్యశ్చ నానాపణ్యోపశోభితాః,
అనుగచ్ఛన్తు కాకుత్థ్సం తథైవ నటనర్తకాః. 3

ప్ర. అ. తథైవ = మరియు, నానాపణ్యోపశోభితాః = అనేకమైన (అమ్మ కకు చూపబడిన) వస్తువులతో ప్రకాశింపచేయబడిన, అన్తరాపణవీథ్యః చ = బజారువీధుల మధ్యయందు, నటనర్తకాః = నటులు, నర్తకులు, కాకుత్స్థమ్ = శత్రుఘ్నుని, అనుగచ్ఛన్తు = అనుసరించి వెళ్లెదరుగాక.

తా. అమ్మ జూపిన అనేకవస్తువులతో ప్రకాశించుచున్న ఆపణముల వీధుల మధ్యలో నటులు నర్తకులు శత్రుఘ్నుని వెనుక వెళ్లెదరుగాక. 3

మూ. హిరణ్యస్య సువర్ణస్య నియుతం పురుషర్షభ,
ఆదాయ గచ్ఛ శత్రుఘ్న పర్యాప్తధనవాహనః. 4

ప్ర. అ. శత్రుఘ్న = శత్రుఘ్నా! పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! పర్యాప్త ధనవాహనః = సరిపడిన ధనమూ వాహనములూ గలవాడవై, సువర్ణస్య = మంచి వర్ణము గల, హిరణ్యస్య = బంగారముయొక్క, నియుతమ్ = నియుతమును, ఆదాయ = గ్రహించి, గచ్ఛ = వెళ్లుము.

తా. పురుషశ్రేష్ఠుడవైన శత్రుఘ్నా! సరిపడునంత ధనముతో వాహనములతో కూడిన నీవు మంచి బంగారు నాణెములు లక్ష (లేదా పదిలక్షలు) తీసికొని వెళ్లుము. 4

మూ. బలం చ సుభృతం వీర హృష్టతుష్టమనుద్ధతమ్,
సంభాషాసంప్రదానేన రఞ్జయస్వ నరోత్తమ. 5

ప్ర. అ. వీర = వీరుడా! నరోత్తమ = నరశ్రేష్ఠుడా! సుభృతమ్ = బాగా పోషింపబడిన, హృష్టతుష్టమ్ = ఉత్సాహముగలదై సంతోషించుచున్న, బలం చ = సైన్యమును, సంభాషాసంప్రదానేన = బాగుగా మాటలాడుటను ఇచ్చుటచేత, రఞ్జయస్వ = సంతోషపెట్టుము.

తా. వీరుడవు, నరశ్రేష్ఠుడవు అయిన శత్రుఘ్నా! సైన్యమును బాగుగా పోషించుచు మంచి ఉత్సాహముతోను, సంతోషముతోను ఉండునట్లు చేయుచు, మంచి మాటలతో రజింపచేయుచుండుము. 5

మూ. న హ్యర్థాస్తత్ర తిష్ఠన్తి న దారా న చ బాన్ధవాః,
సుప్రీతో భృత్యవర్గస్తు యత్ర తిష్ఠతి రాఘవ. 6

ప్ర. అ. రాఘవ = శత్రుఘ్న ! సుప్రీతః = బాగా సంతోషించిన, భృత్య వర్గః = భృత్యుల సముదాయము, యత్ర = ఏ ఆపత్సమయమునందు, తిష్ఠతి = నిలచునో, తత్ర = అక్కడ, అర్థాః = ధనములు, న తిష్ఠన్తి = నిలబడవు. దారాః = భార్యలు, న = నిలబడరు, బాన్ధవాః చ = బంధువులు కూడ నిలబడరు.

తా. బాగా సంతోషపెట్టబడిన సైనికాదులు ఎట్టి ఆపత్సమయాదులలో అండగా నిలచెదరో అట్టి సమయాలలో ధనములు గాని, భార్యలు గాని, బంధువులు గాని నిలబడరు. 6

మూ. అతో హృష్టజనాకీర్ణాం ప్రస్థాప్య మహతీం చమూమ్,
ఏక ఏవ ధనుష్పాణిర్గచ్ఛ త్వం మధునో వనమ్. 7

ప్ర. అ. అతః = అందువలన, హృష్టజనాకీర్ణామ్ = సంతోషించిన జనులతో కూడిన, మహతీమ్ = గొప్పదైన, చమూమ్ = సైన్యమును, ప్రస్థాప్య = ప్రయాణము చేయించి, త్వమ్ = నీవు, ఏకః ఏవ = ఒక్కడవే, ధనుష్పాణిః = ధనస్సు హస్తము నందు గలవాడవై, మధునః = మధువుయొక్క, వనమ్ = వనమునుగూర్చి, గచ్ఛ = వెళ్లుము.

తా. అందువలన ఉత్సాహవంతులైన భటులతో నిండిన పెద్ద సైన్యమును బయలుదేరతీసి, నీవు ఒక్కడవే ధనస్సు హస్తమునందు ధరించి మధువు వనమునకు వెళ్లుము. 7

మూ. యథా త్వాం న ప్రజానాతి గచ్ఛన్తం యుద్ధకాఙ్క్షిణమ్,
లవణస్తు మధోః పుత్రస్తథా గచ్ఛేరశఙ్కితమ్. 8

ప్ర. అ. మధోః = మధువుయొక్క, పుత్రః = పుత్రుడైన, లవణః = లవణుడు, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న, త్వామ్ = నిన్ను, యుద్ధకాఙ్క్షిణమ్ = యుద్ధమును కోరుచున్నవానినిగా, యథా = ఎట్లు, న ప్రజానాతి = ఎరుగడో, తథా = ఆ విధముగా, అశఙ్కితమ్ = శంకింపబడకుండునట్లు, గచ్ఛేః = వెళ్లుము.

తా. మధువు పుత్రుడైన లవణునకు నీవు యుద్ధానికి వచ్చుచున్నట్లు తెలియకుండు నట్లు, వానికి శంక కలిగించకుండగా (లేదా) నిర్భయముగా వెళ్లుము. 8

మూ. న తస్య మృత్యురన్యోఽస్తి కశ్చిద్ధి పురుషర్షభ,
దర్శనం యోఽభిగచ్ఛేత స వధ్యో లవణేన హి. 9

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! తస్య = వానికి, అన్యః = మరి యొక, మృత్యుః = మృత్యువు, కశ్చిత్ = ఏదీ కూడ, నాస్తి = లేదు. యః = ఎవడు; దర్శనమ్ = దర్శనమును, అభిగచ్ఛేత = పొందునో, సః = అతడు, లవణేన = లవణునిచేత, వధ్యః హి = చంపదగినవాడు కదా?

తా. పురుషశ్రేష్ఠుడా! వానికి శంక కలగకుండా వెళ్ళి అడ్డగించి యుద్ధము చేయుటతప్ప మరొక మృత్యుపాయము లేదు. అట్లు కాక అతని దృష్టిలో పడిన వానిని అతడు చంపివేయును. 9

మూ. స గ్రీష్మ అపయాతే తు వర్షారాత్ర ఉపాగతే,
హన్యాస్త్వం లవణం సౌమ్య స హి కాలోఽస్య దుర్మతే.

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! సః త్వమ్ = అట్టి నీవు, గ్రీష్మే = గ్రీష్మము, అపయాతే = గడచినదగుచుండగా, వర్షరాత్రే = వర్షాకాలరాత్రి, ఉపాగతే = వచ్చిన దగుచుండగా, లవణమ్ = లవణుణ్ణి, హన్యాః = చంపెదవు గాక. సః = అది, దుర్మతేః = దుర్మతియైన, అస్య = వీనికి, కాలః = కాలము.

తా. సౌమ్యుడా! గ్రీష్మము గడచి వర్షాకాలము ప్రారంభము కాగానే నీవు లవణాసురుణ్ణి చంపుము; ఆ దుర్మతిని చంపుటకు తగిన కాలము అదే. 10

మూ. మహర్షీంస్తు పురస్కృత్య ప్రయాన్తు తవ సైనికాః,
యథా గ్రీష్మావశేషేణ తరేయుర్జాహ్నవీజలమ్. 11

ప్ర. అ. తవ = నీయొక్క, సైనికాః = సైనికులు, మహర్షీన్ = మహర్షులను, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, యథా = ఎట్లు, గ్రీష్మావశేషేణ = గ్రీష్మముయొక్క కొంచెము మిగులుటచేత, జాహ్నవీజలమ్ = గంగాజలమును, తరేయుః = దాటెదరో, ఆ విధముగ, ప్రయాన్తు = వెళ్లెదరుగాక.

తా. నీ సైనికులు గ్రీష్మము కొంచెము మిగిలి ఉన్న దనగా గంగాజలమును దాటేటట్లు మహర్షులను ముందు ఉంచుకొని వెళ్లెదరు గాక. 11

మూ. తత్ర స్థాప్య బలం సర్వం నదీతీరే సమాహితః,
అగ్రతో ధనుషా సార్ధం గచ్ఛ త్వం లఘువిక్రమః. 12

ప్ర. అ. సర్వమ్ = సమస్తమైన, బలమ్ = సైన్యమును, తత్ర = అక్కడ, నదీతీరే = నదీతీరమునందు, స్థాప్య = నిలిపి, సమాహితః = సావధానచిత్తుడవై, లఘువిక్రమః = శీఘ్రగమనము గలవాడవై, ధనుషా సార్ధమ్ = ధనస్సుతో, అగ్రతః = ముందుకు, వ్రజ = వెళ్ళుము.

తా. సైన్యము నంతను అక్కడ నదీతీరమునందు నిలిపి, సావధానచిత్తుడవై ధనస్సు ధరించి శీఘ్రముగా ముందుకు వెళ్ళుము. 12

మూ. ఏవముక్తస్తు రామేణ శత్రుఘ్నస్తాన్ మహాబలాన్,
సేనాముఖ్యాన్ సమానీయ తతో వాక్యమువాచ హ. 13

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తాన్ = ఆ, మహాబలాన్ = గొప్ప బలము గల, సేనాముఖ్యాన్ = సేనలోని నాయకులను, సమానీయ = రప్పించి, తతః = అటు పిమ్మట, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. శత్రుఘ్నుడు రాముని మాటలు విని, మహాబలవంతులైన సేనానాయకులను పిలిపించి ఇట్లనెను. 13

మూ. ఏతే వో గణితావాసా యత్ర తత్ర నివత్స్యథ,
స్థాతవ్యం చావిరోధేన యథా బాధా న కస్య చిత్. 14

ప్ర. అ. యత్ర యత్ర = ఎక్కడెక్కడ, నివత్స్యథ = నివసించగలరో, ఏతే = ఈ, వః = మీయొక్క, వాసాః = నివాసస్థానములు, గణితాః = లెక్కపెట్టబడినవి. కస్యచిత్ = ఎవనికి కూడ, బాధా = బాధ, యథా = ఎట్లు, న భవేత్ = కాదో అట్లు, అవిరోధేన = విరోధము లేకుండగా, స్థాతవ్యమ్ = ఉండవలెను.

తా. మీరు ఎక్కడెక్కడ విడిది చేయవలెనో ఆ ప్రదేశము నిర్ణయించబడినది; ఇవిగో అక్కడ ఎవరికి బాధ కలగకుండగా, పరస్పరవిరోధము లేకుండగా నివసించవలెను. 14

మూ. తథా తాంస్తు సమాజ్ఞాప్య ప్రస్థాప్య చ మహద్బలమ్,
కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీం చాభ్యవాదయత్.

ప్ర. అ. తాన్ = వాళ్ళను, తథా = అట్లు, సమాజ్ఞాప్య = ఆజ్ఞాపించి, మహత్ = గొప్ప, బలమ్ = సైన్యమును, ప్రస్థాప్య = బయలుదేరజేసి, కౌసల్యాం చ = కౌసల్యను, సుమిత్రాం చ = సుమిత్రను, కైకేయీం చ = కైకేయిని, అభ్యవాదయత్ = నమస్కరించెను

తా. సైన్యాధ్యక్షులకు ఆ విధముగా ఆజ్ఞ ఇచ్చి, గొప్ప సైన్యమును బయలుదేరజేసి, కౌసల్యా-సుమిత్రా-కైకేయిలకు నమస్కరించెను. 15

మూ. రామం ప్రదక్షిణీకృత్య శిరసాభిప్రణమ్య చ,
లక్ష్మణం భరతం చైవ ప్రణిపత్య కృతాఞ్జలిః, 16
పురోహితం వసిష్ఠం చ శత్రుఘ్నః ప్రయతాత్మవాన్.

ప్ర అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, ప్రయతాత్మవాన్ = నిగ్రహించుకొనబడిన మనస్సు కలవాడై, రామమ్ = రాముణ్ణి, ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణము చేసి, శిరసా = శిరస్సుచేత, అభిప్రణమ్య చ = నమస్కరించి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలికలవాడై, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, భరతం చైవ = భరతుణ్ణి, ప్రణిపత్య = నమస్కరించి, పురోహితమ్ = పురోహితుడైన, వసిష్ఠం చ = వసిష్ఠుణ్ణి కూడ నమస్కరించి బయలుదేరెను

తా. పరిశుద్ధమైన మనస్సు గల శత్రుఘ్నుడు రామునకు ప్రదక్షిణముచేసి శిరస్సు వంచి నమస్కరించి, లక్ష్మణభరతులకు అంజలి ఘటించి నమస్కరించి పురోహితుడైన వసిష్ఠునకు నమస్కరించి బయలుదేరెను. 16

మూ. రామేణ చాభ్యనుజ్ఞాతః శత్రుఘ్నః శత్రుతాపనః, 17
ప్రదక్షిణమథో కృత్వా నిర్జగామ మహాబలః.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలముగలవాడు, శత్రుతాపనః = శత్రువులను పీడించువాడు అయిన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, రామేణ = రామునిచేత, అభ్యనుజ్ఞాతః = అనుమతించబడినవాడై, అథో = అటుపిమ్మట, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, నిర్జగామ = బయల్వెడలెను.

తా. గొప్ప బలము గల శత్రుసంహారకుడైన శత్రుఘ్నుడు రాముని అనుజ్ఞపొంది ఆతనికి ప్రదక్షిణము చేసి బయలుదేరెను. 17

మూ. నిర్యాప్య సేనామథ సోఽగ్రతస్తదా
గజేన్ద్రవాజిప్రవరౌఘసంకులమ్,
ఉపాస్యమానః స నరేన్ద్రపార్శ్వతః
ప్రతిప్రయాతో రఘువంశవర్ధనః. 18

ఇత్యార్షే శ్రీ మద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతుఃషష్టితమః సర్గః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సః = ఆ, రఘునన్దనః = శత్రుఘ్నుడు, తదా = అప్పుడు, గజేన్ద్రవాజిప్రవరౌఘసంకులామ్ = ఏనుగులతోను, శ్రేష్ఠములైన గుఱ్ఱములతోను నిండిన, సేనామ్ = సేనను, అగ్రతః = ముందు, నిర్యాప్య = బయలుదేరజేసి, ఉపాస్యమానః = సేవించబడుచు, నరేన్ద్రపార్శ్వతః = రాజసమీపమునుండి, ప్రతిప్రయాతః = వెళ్ళెను.

తా. అప్పుడు శత్రుఘ్నుడు ఏనుగులతోను, శ్రేష్ఠములైన అశ్వములతోను నిండిన సేనను ముందు పంపివేసి, అనుచరులు సేవింపగా, రాజు దగ్గరనుండి బయలుదేరెను. 18

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో అరవైనాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చషష్టితమః సర్గః

[వాల్మీకి శత్రుఘ్నునకు సౌదాసుడైన కల్మాషపాదుని కథ చెప్పుట].

మూ. ప్రస్థాప్య చ బలం సర్వం మాసమాత్రోషితః పథి,
ఏక ఏవాశు శత్రుఘ్నో జగామ త్వరితం తదా. 1

ప్ర. అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, సర్వమ్ = సమస్తమైన, బలమ్ = సైన్యమును, ప్రస్థాప్య = బయలుదేరదీసి, పథి = మార్గమునందు, మాసమాత్రోషితః = మాసముమాత్రము ఉన్నవాడై, తదా = అప్పుడు, ఏక ఏవ = ఒక్కడే, ఆశు = శీఘ్రముగా, త్వరితమ్ = తొందరగా, జగామ = వెళ్లెను.

తా. శత్రుఘ్నుడు సైన్యము నంతను బయలుదేరదీసి మార్గమునందు ఒక్క మాసము మాత్రమే ఉన్నవాడై అప్పుడు తానొక్కడే తొందరగా ముందుకు వెళ్ళెను. 1

మూ. ద్విరాత్రమన్తరే శూర ఉష్య రాఘవనన్దనః,
వాల్మీకేరాశ్రమం పుణ్యమగచ్ఛద్వాసముత్తమమ్. 2

ప్ర. అ. రాఘవనన్దనః = శత్రుఘ్నుడు, అన్తరే = మధ్యయందు, ద్విరాత్రమ్ = రెండు రోజులు, ఉష్య = ఉండి, ఉత్తమమ్ = ఉత్తమమైన, వాసమ్ = నివాసమైన, పుణ్యమ్ = పవిత్రమైన, వాల్మీకేః ఆశ్రమమ్ = వాల్మీకి ఆశ్రమమును గూర్చి, అగచ్ఛత్ = వెళ్ళెను.

తా. శత్రుఘ్నుడు మార్గమధ్యమునందు రెండు రోజులు గడిపి ఉత్తమ నివాసమైన, పవిత్రమైన వాల్మీక్యాశ్రమమును చేరెను. 2

మూ. సోఽభివాద్య మహాత్మానం వాల్మీకిం మునిసత్తమమ్,
కృతాఞ్జలిరథో భూత్వా వాక్యమేతదువాచ హ. 3.

ప్ర. అ. సః = ఆతడు, మహాత్మానమ్ = మహాత్ముడు, మునిసత్తమమ్ = మునులలో శ్రేష్ఠుడూ అయిన, వాల్మీకిమ్ = వాల్మీకిని, అభివాద్య=నమస్కరించి, అథో = అటుపిమ్మట, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆతడు మునిశ్రేష్ఠుడూ, మహాత్ముడూ అయిన వాల్మీకికి నమస్కరించి అంజలి ఘటించి ఇట్లు పలికెను. 3

మూ. భగవన్వస్తుమిచ్ఛామి గురోః కార్యాదిహాగతః,
శ్వః ప్రభాతే గమిష్యామి ప్రతీచీం దారుణామ్ దిశమ్. 4

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! గురోః = అన్నగారియొక్క, కార్యాత్ = పనివలన, ఆగతః = వచ్చిన నేను, ఇహ = ఇక్కడ, వస్తుమ్ = నివసించుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, దారుణామ్ = భయంకరమైన, ప్రతీచీం దిశమ్ = పశ్చిమదిక్కును గూర్చి, గమిష్యామి = వెళ్ళెదను.

తా. పూజ్యుడా! అన్నగారి పనిమీద వచ్చిన నేను ఇక్కడ నివసించగోరుచున్నాను. రేపు ప్రాతఃకాలమునందు భయంకరమైన పశ్చిమదిక్కు వైపు వెళ్ళెదను. 4

మూ. శత్రుఘ్నస్య వచః శ్రుత్వా ప్రహస్య మునిపుంగవః,
ప్రత్యువాచ మహాత్మానం స్వాగతం తే మహాయశః. 5

ప్ర. అ. మునిపుంగవః = మునిశ్రేష్ఠుడు, శత్రుఘ్నస్య = శత్రుఘ్నని యొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, మహాత్మానమ్=మహాత్ముడైన ఆతనిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. మహాయశః = గొప్ప కీర్తి గలవాడా! తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము.

తా. మునిశ్రేష్ఠుడైన వాల్మీకి శత్రుఘ్నుని మాటలు విని ఆ మహాత్మునితో ఇట్లు పలికెను. "గొప్పకీర్తి గలవాడా! నీకు స్వాగతము". 5

మూ. స్వమాశ్రమమిదం సౌమ్య రాఘవాణాం కులస్య వై,
ఆసనం పాద్యమర్ఘ్యం చ నిర్విశఙ్కః ప్రతీచ్ఛ మే. 6

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! ఇదమ్ = ఇది, రాఘవాణామ్ = రఘువంశమునకు చెందినవారియొక్క, కులస్య = కులముయొక్క, స్వమ్ = తమదైన, ఆశ్రమమ్ = ఆశ్రమము, ఆసనమ్ = ఆసనమును, పాద్యమ్ = పాద్యమును, అర్ఘ్యం చ = అర్ఘ్యమును, నిర్విశఙ్కః = శంక లేనివాడవై, మే = నానుండి, ప్రతీచ్ఛ = గ్రహించుము.

తా. ఓ! సౌమ్యుడా! ఇది రఘువంశమువారి స్వాశ్రమము వంటిది. నేను ఇచ్చుచున్న ఆసనమును, పాద్యమును, అర్ఘ్యమును నిఃసందేహముగా స్వీకరింపుము. 6

మూ. ప్రతిగృహ్య తదా పూజాం ఫలమూలం చ భోజనమ్,
భక్షయామాస కాకుత్స్థస్తృప్తిం చ పరమాం గతః. 7

ప్ర. అ. తదా=అప్పుడు. కాకుత్స్థః = శత్రుఘ్నుడు, పూజామ్=పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, ఫలమూలమ్ = ఫలమూలరూపమైన, భోజనమ్ = భోజనమును, భక్షయామాస = భక్షించెను. పరమామ్ = గొప్ప, తృప్తిం చ = తృప్తిని, గతః = పొందెను.

తా. అప్పుడు శత్రుఘ్నుడు ఆ పూజలు స్వీకరించి ఫలమూలములను భుజించి బాగా తృప్తి చెందెను. 7

మూ. స భుక్త్వా ఫలమూలం చ మహర్షిం తమువాచ హ,
ఇయం యజ్ఞవిభూతిస్తే కస్యాశ్రమసమీపతః. 8

ప్ర. అ. సః = అతడు, ఫలమూలం చ = ఫలమూలములను, భుక్త్వా = భుజించి, తమ్ = ఆ, మహర్షిమ్=మహర్షిని గూర్చి, ఉవాచ హ = పలికెను. తే= నీయొక్క, ఆశ్రమసమీపతః = ఆశ్రమసమీపమునందు, ఇయమ్ = ఈ, యజ్ఞవిభూతిః = యజ్ఞసమృద్ధి, కస్య = ఎవనిది?

తా. అతడు ఫలమూలములను భక్షించి ఆ మహర్షిని "నీ ఆశ్రమసమీపమునందు ఈ యజ్ఞసమృద్ధి ఎవరిది?" అని ప్రశ్నించెను. 8

మూ. తత్తస్య భాషితం శ్రుత్వా వాల్మీకిర్వాక్యమబ్రవీత్,
శత్రుఘ్న శృణు యస్యేదం బభూవాయతనం పురా. 9

ప్ర. అ. తస్య = అతనియొక్క, తత్ = ఆ, భాషితమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, వాల్మీకిః = వాల్మీకి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. శత్రుఘ్న = శత్రుఘ్నుడా? పురా = పూర్వము, ఇదమ్ = ఇది, యస్య = ఎవని యొక్క, ఆయతనమ్ = నివాసముగా, అభూత్ = ఉండెనో, శృణు = వినుము.

తా. వాల్మీకి అతని మాటలు విని ఇట్లు పలికెను. "శత్రుఘ్నా! ఇది పూర్వము ఎవరి నివాసముగా ఉండెనో చెప్పెదను; వినుము. 9

మూ. యుష్మాకం పూర్వకో రాజా సుదాసస్తస్య భూపతేః,
పుత్రో మిత్రసహో నామ వీర్యవానతిధార్మికః. 10

ప్ర. అ సుదాసః = సుదాసుడు, యుష్మాకమ్ = మీయొక్క, పూర్వకః = పూర్వికుడైన, రాజా = రాజు. తస్య = అతనికి, వీర్యవాన్ = పరాక్రమవంతుడు, అతిధార్మికః = చాల ధార్మికుడూ అయిన, మిత్రసహః నామ = మిత్రసహు డను, పుత్రః = పుత్రుడు ఉండెను.

తా. సుదాసు డను మీ పూర్వికుడైన రాజు ఉండెను. ఆతని కుమారుడు మిత్రసహుడు. అతడు పరాక్రమశాలి, చాల ధార్మికుడు. 10

మూ. స బాల ఏవ సౌదాసో మృగయా ముపచక్రమే,
చఞ్చూర్యమాణం దదృశే స శూరో రాక్షసద్వయమ్. 11

ప్ర. అ. సః సౌదాసః = ఆ సౌదాసుడు, బాలః ఏవ = బాలుడుగా ఉండగానే, మృగయామ్ = వేటను, ఉపచక్రమే = ఉపక్రమించెను. శూరః = శూరుడైన, సః = అతడు, చఞ్చూర్యమాణమ్ = అధికముగా సంచరించుచున్న, రాక్షసద్వయమ్ = రాక్షసుల ద్వయమును, దదృశే = చూచెను.

తా. ఆ సౌదాసుడు (సుదాసుని పుత్రుడైన మిత్రసహుడు) బాల్యము నుండియే వేటాడుటకు వెళ్ళుచుండెను. శూరుడైన అతడు అధికముగా సంచరించు చున్న ఇద్దరు రాక్షసులను చూచెను. 11

మూ. శార్దూలరూపిణౌ ఘోరౌ మృగాన్ బహుసహస్రశః,
భక్షమాణావసంతుష్టౌ పర్యాప్తిం నైవ జగ్మతుః. 12

ప్ర. అ. శార్దూలరూపిణౌ = పెద్దపులి రూపము గల, ఘోరౌ = క్రూరులైన ఆ రాక్షసులు, బహుసహస్రశః = ఎన్నో వేలకొలది, మృగాన్ = మృగములను, భక్షమాణౌ = భక్షించుచున్నవారై, అసంతుష్టౌ = తృప్తిచెందనివారై, పర్యాప్తిమ్ = 'చాలు'అను బుద్ధిని, నైవ జగ్మతుః = పొందలేదు.

తా. ఆ భయంకరులైన రాక్షసులిద్దరూ పెద్దపులుల రూపములు ధరించి ఎన్నో వేల మృగాలను భక్షించినను తృప్తి చెందక, "చాలును"అను మాట లేక ఉండిరి. 12

మూ. స తు తౌ రాక్షసౌ దృష్ట్వా నిర్మృగం చ వనం కృతమ్,
క్రోధేన మహతావిష్టో జఘానైకం మహేషుణా. 13

ప్ర. అ. సః = అతడు, తౌ రాక్షసౌ = ఆ రాక్షసులను, నిర్మృగమ్ = మృగములు లేనిదిగా, కృతమ్ = చేయబడిన, వనం చ = వనమును, దృష్ట్వా = చూచి, మహతా = గొప్పదైన, క్రోధేన = క్రోధముతో, ఆవిష్టః = కూడినవాడై, ఏకమ్ = ఒకనిని, మహేషుణా = గొప్ప బాణముచేత, జఘాన = చంపెను.

తా. ఆ రాక్షసు లిద్దరూ వనములో మృగములు లేకుండా చేయుట చూచి క్రోధావిష్టుడైన ఆ సౌదాసుడు గొప్ప బాణముతో ఒక రాక్షసుణ్ణి చంపెను. 13

మూ. వినిపాత్య తమేకం తు సౌదాసః పురుషర్షభః,
విజ్వరో విగతామర్షో హతం రక్షో హ్యుదైక్షత. 14

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, సౌదాసః = సౌదాసుడు, తమ్ = ఆ, ఏకమ్ = ఒక రాక్షసుణ్ణి, వినిపాత్య = పడగొట్టి, విజ్వరః = బాధ లేనివాడై, విగతామర్షః = పోయిన కోపము గలవాడై, హతమ్ = చంపబడిన, రక్షః = రాక్షసుణ్ణి, ఉదైక్షత = చూచెను.

తా. పురుషశ్రేష్ఠుడైన సౌదాసుడు ఒక రాక్షసుణ్ణి చంపి, మనస్తాపమును, కోపమును విడచి, చచ్చిన ఆ రాక్షసుణ్ణి చూచెను. 14

మూ. నిరీక్షమాణం తం దృష్ట్వా సహాయం తస్య రక్షసః,
సంతాపమకరోద్ఘోరం సౌదాసం చేదమబ్రవీత్. 15

ప్ర. అ. తస్య = ఆ, రక్షసః = రాక్షసునియొక్క, సహాయమ్ = సహాయుడైన రాక్షసుడు, నిరీక్షమాణమ్ = చూచుచున్న, తమ్ = ఆతనిని, దృష్ట్వా = చూచి, ఘోరమ్ = ఘోరమైన, సంతాపమ్ = విచారమును, అకరోత్ = చేసెను. సౌదాసం చ = సౌదాసుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. చనిపోయిన రాక్షసుని మిత్రుడైన రాక్షసుడు ఆ విధముగా చూచుచున్న సౌదాసుని చూచి చాల విచారించుచు ఇట్లు పలికెను. 15

మూ. యస్మాదనపరాధం తం సహాయం మమ జఘ్నివాన్,
తస్మాత్త్వాపి పాపిష్ఠ ప్రదాస్యామి ప్రతిక్రియామ్. 16

ప్ర. అ. పాపిష్ఠ = పాపిష్ఠుడా! మమ = నాయొక్క, సహాయమ్ = సహాయుడైన, అనపరాధమ్ = అపరాధము లేని, తమ్ = వానిని, యస్మాత్ = ఏ కారణమువలన, జఘ్నివాన్ = చంపినావో, తస్మాత్ = ఆ కారణమువలన, త్వాపి = నీకు కూడ, ప్రతిక్రియామ్ = ప్రతిక్రియను, దాస్యామి = ఇచ్చెదను.

తా. పాపిష్ఠుడా! అపరాధము లేని నా మిత్రుణ్ణి చంపినావు. అందువలన నేను నీకు ప్రతిక్రియ చేసెదను. 16

మూ. ఏవముక్త్వా తు తద్రక్షస్తత్రైవాన్తరధీయత,
కాలపర్యాయయోగేన రాజా మిత్రసహోఽభవత్. 17

ప్ర. అ. తత్ రక్షః = ఆ రాక్షసుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తత్రైవ = అక్కడనే, అన్తరధీయత = అంతర్ధానము చెందెను. కాలపర్యాయయోగేన = కాలక్రమసంబంధముచేత, మిత్రసహః = మిత్రసహుడు, రాజా = రాజుగా, అభవత్ = అయెను.

తా. ఆ రాక్షసుడు ఇట్లు పలికి అక్కడనే అంతర్ధానము చెందెను. కాలక్రమమున మిత్రసహుడు రాజయ్యెను. 17

మూ. రాజాపి యజతే యజ్ఞమస్యాశ్రమసమీపతః,
అశ్వమేధం మహాయజ్ఞం తం వసిష్ఠోఽభ్యపాలయత్. 18

ప్ర. అ. రాజాపి = రాజు, అస్య = ఈ, ఆశ్రమసమీపతః = ఆశ్రమము

యొక్క సమీపమునందు, యజ్ఞమ్ = యజ్ఞమును, యజతే = చేసెను. తమ్ = ఆ, అశ్వమేధం మహాయజ్ఞమ్ = అశ్వమేధమహాయజ్ఞమును, వసిష్ఠః = వసిష్ఠుడు, అభ్యపాలయత్ = పాలించెను.

తా. ఆ రాజు ఈ ఆశ్రమము సమీపమునందు అశ్వమేధమహాయజ్ఞమును చేసెను. ఆ యజ్ఞమును వసిష్ఠుడు పరిపాలించెను. 18

మూ. తత్ర యజ్ఞో మహానాసీద్బహువర్షగణాయుతః,
సమృద్ధః పరయా లక్ష్మ్యా దేవయజ్ఞసమోఽభవత్. 19

ప్ర. అ. తత్ర = అక్కడ, బహువర్షగణాయుతః = అనేక సంవత్సరముల సముదాయముతో కూడిన, మహాన్ = గొప్ప, యజ్ఞః = యజ్ఞము, ఆసీత్ = జరిగెను. పరయా = గొప్ప, లక్ష్మ్యా = లక్ష్మితో, సమృద్ధః = సమృద్ధమైన ఆ యజ్ఞము, దేవయజ్ఞసమః = దేవయజ్ఞముతో సమానమైనదిగా, అభవత్ = ఉండెను.

తా. అక్కడ ఆ మహాయజ్ఞము అనేకసంవత్సరముల పాటు జరిగెను. గొప్ప శోభతో నడచిన ఆ యజ్ఞము దేవయజ్ఞము వలె ఉండెను. 19

మూ. అథావసానే యజ్ఞస్య పూర్వవైరమనుస్మరన్,
వసిష్ఠరూపీ రాజానమితి హోవాచ రాక్షసః. 20

ప్ర. అ. అథ = అటుపిమ్మట, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, అవసానే = అంతమునందు, రాక్షసః = రాక్షసుడు, పూర్వవైరమ్ = పూర్వవైరమును, అనుస్మరన్ = స్మరించుచు, వసిష్ఠరూపీ = వసిష్ఠరూపము కలవాడై, రాజానమ్ = రాజును గూర్చి, ఇతి = ఇట్లు, ఉవాచ హ = పలికెను.

తా. యజ్ఞము పూర్తియైన పిమ్మట ఆ రాక్షసుడు వెనుకటి వైరమును స్మరించుచు, వసిష్ఠుని రూపము ధరించి రాజుతో ఇట్లు పలికెను. 20

మూ. అద్య యజ్ఞస్య జాతోఽన్తః సామిషం భోజనం మమ,
దీయతామిహ శీఘ్రం వై నాత్ర కార్యా విచారణా. 21

ప్ర. అ. అద్య = నేడు, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, అన్తః = అంతము, జాతః = అయినది. మమ = నాకు, సామిషమ్ = మాంసముతో కూడిన, భోజ

నమ్ = భోజనము, ఇహ = ఇక్కడ, శీఘ్రమ్ = శీఘ్రముగా, దీయతామ్ = ఇవ్వ బడుగాక. అత్ర = దీని విషయమున, విచారణా = ఆలోచన, న కార్యా = చేయ దగినదికాదు.

తా. నేడు యజ్ఞము పూర్తి అయినది. నాకు శీఘ్రముగా మాంసముతో కూడిన భోజనమును పెట్టుము. ఈ విషయమున ఆలోచించవద్దు. 21

మూ. తచ్ఛ్రుత్వా వ్యాహృతం వాక్యం రక్షసా బ్రహ్మరూపిణా,
సూదాన్ సంస్కారకుశలానువాచ పృథివీపతిః. 22

ప్ర. అ. బ్రహ్మరూపిణా = బ్రాహ్మణరూపము గల, రక్షసా = రాక్షసుని చేత, వ్యాహృతమ్ = పలకబడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, పృథివీపతిః = రాజు, సంస్కారకుశలాన్ = వంటలో నేర్పరులైన, సూదాన్ = వంటవారిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. వసిష్ఠరూపములో ఉన్న రాక్షసుని మాటలు విని రాజు వంటలో నేర్పు గల వంటవాళ్ళతో ఇట్లు పలికెను. 22

మూ. హవిష్యం సామిషం స్వాదు యథా భవతి భోజనమ్,
తథా కురుత శీఘ్రం వై పరితుష్యేద్యథా గురుః. 23

ప్ర. అ. హవిష్యమ్ = హవిస్సుగా ఉపయోగించేది, సామిషమ్ = మాంస ముతో కూడినది అయిన, భోజనమ్ = భోజనము, యథా = ఎట్లు, స్వాదు = రుచి యైనది, భవతి = అగునో, గురుః = గురువు, యథా = ఎట్లు, పరితుష్యేత్ = సంతోషించునో, తథా = అట్లు, శీఘ్రమ్ = శీఘ్రముగా, కురుత వై = చెయ్యండి.

తా. హవిస్సుగా ఉపయోగింపదగిన మాంసముతో కూడిన భోజనము మధురముగా ఉండేటట్లు గురువుకు సంతోషము కలిగే టట్లు శీఘ్రముగా తయారు చేయుడు. 23

మూ. శాసనాత్పార్థివేన్ద్రస్య సూదః సంభ్రాన్తమానసః,
తచ్చ రక్షః పునస్తత్ర సూదవేషమథాకరోత్. 24

ప్ర. అ. పార్థివేన్ద్రస్య = రాజుయొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, సూదః =

వంటవాడు, సంభ్రాన్తమానసః = సంభ్రమము (కంగారు) చెందిన మనస్సుకలవా డయ్యెను. తత్ = ఆ, రక్షః పునః = రాక్షసుడైతే, అథ = అటుపిమ్మట, తత్ర = అక్కడ, సూదవేషమ్ = వంటవాని వేషమును, అకరోత్ = చేసెను.

తా. రాజు ఆజ్ఞ విని వసిష్ఠుడు మాంసాహారము తినుటయా అని వంట వాడు కంగారుపడెను. అప్పుడా రాక్షసుడు వంటవాని రూపము ధరించెను. 24

మూ. స మానుషమథో మాంసం పార్థివాయ న్యవేదయత్,
ఇదం స్వాదు హవిష్యం చ సామిషం చాన్నమాహృతమ్.

ప్ర. అ. సః = అతడు, అథో = అటుపిమ్మట, స్వాదు = మధురమైన, హవిష్యమ్ = హవిస్సుగా ఉపయోగించు, సామిషమ్ = మాంసముతో కూడిన, ఇదమ్ = ఈ, అన్నమ్ = అన్నము, ఆహృతమ్ = తీసికొనిరాబడినది అని, మానుషం మాంసమ్ = మనుష్యమాంసమును, పార్థివాయ = రాజునకు, న్యవేద యత్ = తెలిపెను.

తా. "మధురము, హవిస్సుగా ఉపయోగించేదీ, మాంసయుక్తమూ అయిన అన్న మిదిగో" అని అతడు రాజుకు మనుష్యమాంసమును చూపెను. 25

మూ. స భోజనం వసిష్ఠాయ పత్న్యా సార్ధముపాహరత్,
మదయన్త్యా నరశ్రేష్ఠ సామిషం రక్షసాహృతమ్. 26

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! పత్న్యా = భార్యయైన, మదయన్త్యా సార్ధమ్ = మదయంతితో కూడ, సః = ఆ రాజు, రక్షసా = రాక్షసునిచేత, ఆహృ తమ్ = తీసికొనిరాబడిన, సామిషమ్ = మాంసముతో కూడిన, భోజనమ్ = భోజ నమును, వసిష్ఠాయ = వసిష్ఠునికొరకు, ఉపాహరత్ = తీసికొని వచ్చెను.

తా. శత్రుఘ్నా! ఆ రాజు భార్యయైన మదయంతితో కలిసి వెళ్ళి, రాక్ షుడు తీసికొని వచ్చిన ఆ మాంససహితమైన భోజనమును వసిష్ఠునకు సమర్పించెను.

మూ. జ్ఞాత్వా తదామిషం విప్రో మానుషం భోజనాగతమ్,
క్రోధేన మహతావిష్టో వ్యాహర్తుముపచక్రమే. 27

ప్ర. అ. విప్రః = వసిష్ఠుడు, భోజనాగతమ్ = భోజనముతో వచ్చిన,

తత్ = ఆ, మానుషం మాంసమ్ = మనుష్యమాంసమును, జ్ఞాత్వా = తెలిసికొని, మహతా = గొప్ప, క్రోధేన = కోపముతో, ఆవిష్టః = కూడినవాడై, వ్యాహర్తుమ్ = పలుకుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. వసిష్ఠుడు భోజనములో మనుష్యమాంస మున్నట్లు తెలిసికొని చాల కోపముతో ఇట్లు పలికెను. 27

మూ. యస్మాత్త్వం భోజనం రాజన్ మమైతద్దాతుమిచ్ఛసి,
తస్మాద్భోజనమేతత్తే భవిష్యతి న సంశయః. 28

ప్ర. అ. రాజన్ = రాజా! త్వమ్ = నీవు, యస్మాత్ = ఏ కారణమువలన, మమ = నాకు, ఈదృశమ్ = ఇట్టి, భోజనమ్ = భోజనమును, దాతుమ్ = ఇచ్చుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో, తస్మాత్ = ఆ కారణమువలన, తే = నీకు, ఏతత్ = ఇది, భోజనమ్ = భోజనముగా, భవిష్యతి = కాగలదు, సంశయః = సంశయము, న = లేదు.

తా. రాజా! నీవు నాకు ఈ భోజనము ఇవ్వవలె నని కోరుచున్నావు గాన నీకు ఇదే భోజనము కాగలదు. సందేహము లేదు. 28

మూ. తతః క్రుద్ధస్తు సౌదాసస్తోయం జగ్రాహ పాణినా,
వసిష్ఠం శప్తుమారేభే భార్యా చైనమవారయత్. 29

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అయం సౌదాసః తు = ఈ సౌదాసుడైతే, క్రుద్ధః = కోపించినవాడై, పాణినా = హస్తముచేత, తోయమ్ = ఉదకమును, జగ్రాహ = గ్రహించెను. వసిష్ఠమ్ = వసిష్ఠుణ్ణి, శప్తుమ్ = శపించుటకు, ఆరేభే = ప్రారంభించెను. ఏనమ్ = ఇతనిని, భార్యా చ = భార్య, అవారయత్ = నివారించెను.

తా. అప్పుడు సౌదాసుడు క్రోధముతో చేతిలో జలము తీసికొని వసిష్ఠుణ్ణి శపించుటకు ఉద్యమించగా భార్య అతనిని నివారించెను. 29

మూ. రాజన్ ప్రభుర్యతోఽస్మాకం వసిష్ఠో భగవాన్ ఋషిః,
ప్రతిశప్తుం న శక్తస్త్వం దేవతుల్యం పురోధసమ్. 30

ప్ర. అ. రాజన్ = రాజా! భగవాన్ = పూజ్యుడైన, ఋషిః = ఋషి యైన,

వసిష్ఠః = వసిష్ఠుడు, యతః = ఏ కారణమువలన, అస్మాకమ్ = మనకు, ప్రభుః = ప్రభువో, దేవతుల్యమ్ = దేవతాసమానుడైన, పురోధసమ్ = పురోహితుణ్ణి, ప్రతిశప్తుమ్ = తిరిగి శపించుటకు, త్వమ్ = నీవు, న శక్తః = సమర్థుడవు కావు.

తా. రాజా! పూజ్యుడైన వసిష్ఠమహర్షి మన ప్రభువు. అందువలన దేవతా సమానుడైన మన పురోహితుణ్ణి తిరిగి శపించకూడదు. 30

మూ. తతః క్రోధమయం తోయం తేజోబలసమన్వితమ్,
వ్యసర్జయత ధర్మాత్మా తతః పాదౌ సిషేచ చ. 31

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధర్మాత్మా = ఆ ధర్మాత్ముడు, తేజోబల సమన్వితమ్ = తేజస్సుతోను బలముతోను కూడిన, క్రోధమయమ్ = క్రోధవికారమైన, తోయమ్ = ఉదకమును, వ్యసర్జయత = విడచెను. తతః = పిమ్మట, పాదౌ = పాదములను, సిషేచ చ = తడిపెను.

తా. అప్పుడు ధర్మాత్ముడయిన ఆ రాజు క్రోధముతో నిండిన తేజో బలములతో కూడిన ఆ జలమును క్రిందకు విడచి తన పాదములు తడిపెను. 31

మూ. తేనాస్య రాజ్ఞస్తౌ పాదౌ తదా కల్మాషతాం గతౌ,
తదాప్రభృతి రాజాసౌ సౌదాసః సుమహాయశాః, 32
కల్మాషపాదః సంవృత్తః ఖ్యాతశ్చైవ తథా నృపః.

ప్ర. అ. తేన = ఆ కారణముచేత, తదా = అప్పుడు, అస్య రాజ్ఞః = ఈ రాజుయొక్క, తౌ పాదౌ = ఆ పాదములు, కల్మాషతామ్ = నీలత్వమును, గతౌ = పొందినవి. తదా ప్రభృతి = అది మొదలు, సుమహాయశాః = చాల గొప్ప కీర్తి గల, రాజా = రాజైన, అసౌ సౌదాసః = ఈ సౌదాసుడు, కల్మాషపాదః = కల్మాషపాదుడుగా, సంవృత్తః = అయినాడు. నృపః = ఆ రాజు, తథా = అట్లు, ఖ్యాతః చ ఏవ = ప్రసిద్ధుడైనాడు.

తా. అప్పుడు అట్లు చేయుటచే ఆ రాజు పాదములు నల్లగా అయినవి. అది మొదలు గొప్ప కీర్తి గల ఆ సౌదాసమహారాజు కల్మాషపాదుడు (పాదాలలో నలుపు ఉన్నవాడు) అయెను. ఆ రాజు ఆ పేరుతోనే ప్రసిద్ధ దయ్యెను. 32

మూ. స రాజా సహ పత్న్యా వై ప్రణిపత్య ముహుర్ముహుః,
పునర్వసిష్ఠం ప్రోవాచ యదుక్తం బ్రహ్మరూపిణా.

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, పత్న్యా సహ = భార్యతో కూడ, ముహుః ముహుః = మాటి మాటికి, ప్రణిపత్య = నమస్కరించి, బ్రహ్మరూపిణా = వసిష్ఠరూపముగల, రక్షసా = రాక్షసునిచేత, యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడెనో, దానిని, వసిష్ఠమ్ = వసిష్ఠుని గూర్చి, పునః = మరల, ప్రోవాచ = పలికెను.

తా. ఆ రాజూ, భార్యా వసిష్ఠునకు మాటిమాటికి నమస్కరించి వసిష్ఠ రూపమును ధరించిన ఆ రాక్షసుడు చెప్పిన మాటలు ఆయనకు తెలిపిరి. 33

మూ. తచ్ఛ్రుత్వా పార్థివేన్ద్రస్య రక్షసా వికృతం చ తత్, 34
పునః ప్రోవాచ రాజానం వసిష్ఠః పురుషర్షభమ్.

ప్ర. అ. పార్థివేన్ద్రస్య = ఆ రాజేంద్రునియొక్క, తత్ = ఆ వాక్యమును శ్రుత్వా = విని, రక్షసా = రాక్షసునిచేత, వికృతమ్ = చెడ్డగా చేయబడిన, తత్ = ఆ పనిని (తెలిసికొని), వసిష్ఠః = వసిష్ఠుడు, పురుషర్షభమ్ = పురుషశ్రేష్ఠుడైన, రాజానమ్ = రాజును గూర్చి, పునః = మరల, ప్రోవాచ = పలికెను.

తా. వసిష్ఠుడు ఆ రాజు మాటలు విని, రాక్షసుడు చేసిన మోసమును తెలిసికొని పురుషశ్రేష్ఠుడైన ఆ రాజుతో మరల ఇట్లు పలికెను. 34

మూ. మయా రోషపరీతేన యదిదం వ్యాహృతం వచః, 35
నైతచ్ఛక్యం వృథా కర్తుం ప్రదాస్యామి చ తే వరమ్.

ప్ర. అ. రోషపరీతేన = రోషముతో కూడిన, మయా = నాచేత, యత్ = ఏ, ఇదమ్ = ఈ, వచః = వచనము, వ్యాహృతమ్ = పలకబడినదో, ఏతత్ = ఇది, వృథా = వ్యర్థమైనదిగా, కర్తుమ్ = చేయుటకు, న శక్యమ్ = శక్యము కాదు తే = నీకు, వరం చ = వరమును, ప్రదాస్యామి = ఇచ్చెదను.

తా. రోషముతో నిండిన మనస్సుతో నేను పలికిన మాటను మరొక విధముగా చేయుట శక్యముకాదు. కాని నీకొక వరమును ఇచ్చెదను. 35

మూ. కాలో ద్వాదశవర్షాణి శాపస్యాన్తో భవిష్యతి, 36
మత్ప్రసాదాచ్చ రాజేన్ద్ర అతీతం న స్మరిష్యసి.

ప్ర. అ. ద్వాదశవర్షాణి = పంద్రెండు సంవత్సరములు, కాలః = కాలము, శాపస్య = శాపముయొక్క, అన్తః = అంతము, భవిష్యతి = కాగలదు రాజేన్ద్ర = రాజేంద్రా! మత్ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, అతీతమ్ = గడచినదానిని, న స్మరిష్యసి = స్మరించవు.

తా. రాజేంద్రా! పన్నెండు సంవత్సరముల కాలము గడవగానే శాపాంతము అగును. నా అనుగ్రహమువలన నీకు, ఆ కాలములో చేసిన అభక్ష్యభక్షణాదికము స్మరణ ఉండదు. 36

మూ. ఏవం స రాజా తం శాపముపభుజ్యారిసూదనః,
ప్రతిలేభే పునా రాజ్యం ప్రజాశ్చైవాన్వపాలయత్. 37

ప్ర. అ. అరిసూదనః = శత్రుసంహారకుడైన, సః రాజా = ఆ రాజు, ఏవమ్ = ఈ విధముగా, తం శాపమ్ = ఆ శాపమును, ఉపభుజ్య = అనుభవించి, పునః = మరల, రాజ్యమ్ = రాజ్యమును, ప్రతిలేభే = పొందెను. ప్రజాః చ ఏవ = ప్రజలను, అన్వపాలయత్ = పాలించెను.

తా. శత్రుసంహారకుడైన ఆ రాజు ఆ శాపమును ఈ విధముగా అనుభవించి, మరల రాజ్యమును పొంది ప్రజలను పాలించెను 37

మూ. తస్య కల్మాషపాదస్య యజ్ఞస్యాయతనం శుభమ్,
ఆశ్రమస్య సమీపేఽస్య యన్మాం పృచ్ఛసి రాఘవ. 38

ప్ర. అ. రాఘవ = శత్రుఘ్నా! మామ్ = నన్ను, యత్ = దేనిని గూర్చి, పృచ్ఛసి = అడుగుచున్నావో అది, అస్య = ఈ, ఆశ్రమస్య = ఆశ్రమముయొక్క, సమీపే = సమీపమునందు, కల్మాషపాదస్య = కల్మాషపాదునియొక్క, యజ్ఞస్య = యజ్ఞముయొక్క, శుభమ్ = పవిత్రమైన, ఆయతనమ్ = స్థానము.

తా. శత్రుఘ్నా! నీవు అడుగుచున్న ఈ ఆశ్రమసమీపస్థానము కల్మాషపాదుడు యజ్ఞము చేసిన పవిత్రస్థానము. 38

మూ. తస్య తాం పార్థివేన్ద్రస్య కథాం శ్రుత్వా సుదారుణామ్,
వివేశ పర్ణశాలాయాం మహర్షిమభివాద్య చ. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చషష్టితమః సర్గః.

ప్ర. అ. తస్య పార్థివేన్ద్రస్య = ఆ రాజేంద్రునియొక్క, సుదారుణామ్ = చాల దారుణమైన, తాం కథామ్ = ఆ కథను, శ్రుత్వా = విని, మహర్షిమ్ = మహర్షిని, అభివాద్య = నమస్కరించి, పర్ణశాలాయామ్ = పర్ణశాలయందు, వివేశ = ప్రవేశించెను.

తా. శత్రుఘ్నుడు చాల దారుణమైన ఆ సౌదాసుని కథ విని, మహర్షికి అభివాదనము చేసి పర్ణశాలలో ప్రవేశించెను. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
అరవై అయిదవ సర్గ సమాప్తము.

# అథ షట్ షష్టితమః సర్గః

*[సీత ఇద్దరు పుత్రులను కనుట. వాల్మీకి ఆ శిశువులకు రక్షణము ఏర్పరచుట. ఈ విషయము విని శత్రుఘ్నుడు సంతోషించి, అక్కడి నుండి బయలుదేరి యమునాతటమునకు వెళ్లుట.]*

మూ. యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్. 1

ప్ర. అ. శత్రుఘ్నః=శత్రుఘ్నుడు, యామ్ ఏవ = ఏ, రాత్రిమ్=రాత్రిని (యందు), పర్ణశాలామ్ = పర్ణశాలను, సమావిశత్ = ప్రవేశించెనో, తామ్ = ఆ, రాత్రిమ్ ఏవ = రాత్రియందే, సీతాపి = సీత కూడ, దారకద్వయమ్ = ఇద్దరు పుత్రులను, ప్రసూతా = కనినది.

తా. శత్రుఘ్నుడు పర్ణశాలలో ప్రవేశించిన రాత్రియందే సీత ఇద్దరు పుత్రులను కనెను. 1

మూ. తతోఽర్ధరాత్రసమయే బాలకా మునిదారకాః,
వాల్మీకేః ప్రియమాచఖ్యుః సీతాయాః ప్రసవం శుభమ్. 2

ప్ర. అ. తతః = ఆటుపిమ్మట, అర్ధరాత్రసమయే=అర్ధరాత్రి సమయమునందు, మునిదారకాః = మునిపుత్రులైన, బాలకాః = బాలకులు, శుభమ్ = శుభమైన, సీతాయాః = సీతయొక్క, ప్రసవమ్=ప్రసవమును, వాల్మీకేః = వాల్మీకికి, ప్రియమ్ = ప్రియమునుగా, ఆచఖ్యుః = చెప్పిరి.

తా. మునికుమారులు అర్ధరాత్రిసమయమునందు వచ్చి సీత ప్రసవించినదను శుభమైన ప్రియవార్తను వాల్మీకికి చెప్పిరి. 2

మూ. భగవన్ రామపత్నీ సా ప్రసూతా దారకద్వయమ్,
తతో రక్షాం మహాతేజః కురు భూతవినాశినీమ్. 3

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! సా = ఆ, రామపత్నీ = రామభార్య, దారకద్వయమ్ = ఇద్దరుపిల్లలను, ప్రసూతా = కనినది. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా ! తతః = ఆ కారణమువలన, భూతవినాశినీమ్ = భూతములను నశింపచేయు, రక్షామ్ = రక్షను, కురు = చేయుము.

తా. పూజ్యుడా ! రాముని భార్య ఇద్దరు పిల్లలను కన్నది. గొప్ప తేజస్సు గలవాడా! అందువలన భూతబాధానివారకమైన రక్షావిధానము చేయుము. 3

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా మహర్షిః సముపాగమత్,
బాలచన్ద్రప్రతీకాశౌ దేవపుత్రౌ మహౌజసౌ. 4

ప్ర. అ. మహర్షిః = మహర్షి, తేషామ్ = వాళ్ళయొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, బాలచన్ద్రప్రతీకాశౌ=బాలచంద్రునితో సమానులైన, మహౌజసౌ = గొప్ప తేజస్సు గల, దేవపుత్రౌ=దేవపుత్రులవంటి ఆ బాలులను, సముపాగమత్ = చేరెను.

తా. వాల్మీకి వాళ్ళ మాటలు విని బాలచంద్రుల వంటి, గొప్ప కాంతి గల, దేవపుత్రులతో సమానులైన ఆ పిల్లలవద్దకు వచ్చెను. 4

మూ. జగామ తత్ర హృష్టాత్మా దదర్శ చ కుమారకౌ,
భూతఘ్నీం చాకరోత్తాభ్యాం రక్షాం రక్షోవినాశినీమ్. 5

ప్ర. అ. హృష్టాత్మా=సంతోషించిన మనస్సు కలవాడై, తత్ర=అక్కడికి, జగామ = వెళ్లెను. కుమారకౌ = బాలులను, దదర్శ చ = చూచెను. తాభ్యామ్ = వాళ్ళిద్దరికీ, భూతఘ్నీమ్ = భూతములను నశింపచేయు, రక్షోవినాశనీమ్=రాక్షసులను నశింపచేయు, రక్షామ్ = రక్షను, అకరోత్ చ = చేసెను కూడ.

తా. సంతోషించిన మనస్సుతో అక్కడికి వెళ్ళి, ఆ పిల్లలను చూచి, వాళ్లకు భూతములను, రాక్షసులనూ నశింపచేయు రక్షను చేసెను. 5

మూ. కుశముష్టిముపాదాయ లవం చైవ తు స ద్విజః,
వాల్మీకిః ప్రదదౌ తాభ్యాం రక్షాం భూతవినాశనీమ్. 6

ప్ర. అ. ద్విజః = ద్విజుడైన, సః వాల్మీకిః = ఆ వాల్మీకి, కుశముష్టిమ్ =

కుశముష్టిని, ఉపాదాయ = గ్రహించి, లవం చైవ తు = లవమును కూడ గ్రహించి, తాభ్యామ్ = వారిద్దరికీ, భూతవినాశనమ్ = భూతములను నశింపచేయు, రక్షామ్ = రక్షను, ప్రదదౌ = ఇచ్చెను.

తా. వాల్మీకి కుశముష్టిని, లవమును గ్రహించి ఆ శిశువుల కిద్దరికీ భూతములను నశింపచేయు రక్షను చేసెను.

వి. వ్రేళ్ళతో తుంపిన కుశల అగ్రభాగమునకు "కుశముష్టి" అని వాటి మొదళ్లున్న భాగమునకు "లవము" అని పేర్లు. వీటిని అభిమంత్రించి ఇవ్వగా వృద్ధ స్త్రీలు వాటితో శిశువుల శరీరముల సంమార్జనము (తుడుచుట) చేయుదురు. అట్లు చేయించె నని భావము. 6

మూ. యస్తయోః పూర్వజో జాతః స కుశైర్మన్త్రసత్కృతైః,
నిర్మార్జనీయస్తు తదా కుశ ఇత్యస్య నామ తత్. 7

ప్ర. అ. తయోః = వారిలో, యః = ఎవడు, పూర్వజః = ముందు పుట్టినవాడుగా, జాతః = పుట్టినాడో, సః = అతడు, మన్త్రసత్కృతైః = మంత్రములచేత సత్కరించబడిన. కుశైః = కుశలచేత, తదా = అప్పుడు, నిర్మార్జనీయః = నిర్మార్జనము చేయదగినవాడు. తత్ = ఆ కారణమువలన, అస్య = వీనికి, కుశః ఇతి = కుశుడు అని, నామ = పేరు.

తా. వారిలో ముందు పుట్టినవానికి మంత్రముచేత సంస్కరించిన కుశలతో (కుశముష్టితో-అనగా పిడికెడు కుశలతో) సంమార్జనము చేయవలెను. అందుచేత ఆతని పేరు 'కుశుడు'. 7

మూ. యశ్చాపరో భవేత్తాభ్యాం లవేన సుసమాహితః,
నిర్మార్జనీయో వృద్ధాభిర్లవేతి చ స నామతః. 8

ప్ర. అ. తాభ్యామ్ = వారిచేత (వారిలో), యః = ఏ, అపరః = రెండవవాడు, భవేత్ = ఉండునో అతడు, సుసమాహితః = బాగసావధానచిత్తుడుగా, వృద్ధాభిః = వృద్ధస్త్రీలచేత, నిర్మార్జనీయః = తుడవదగినవాడు. సః = అతడు, నామతః = పేరువలన, లవేతి చ = 'లవుడు' అని అగును.

తా. వారిలో రెండవవానిని సావధానచిత్తుడుగా ఉండునట్లు చేయుచు, వృద్ధస్త్రీలు లవముచేత తుడవవలెను. వాని పేరు "లవుడు" అసి అగును. 8

మూ. ఏవం కుశలవౌ నామ్నా తావుభౌ యమజాతకౌ,
మత్కృతాభ్యాం చ నామభ్యాం ఖ్యాతియుక్తౌ భవిష్యతః.

ప్ర. అ. తౌ = ఆ, ఉభౌ = ఇద్దరు, యమజాతకౌ = కవలలు, ఏవమ్ = ఈ విధముగా, నామ్నా = పేరుచేత, కుశలవౌ = కుశలవులు, మత్కృతాభ్యామ్ = నాచేత చేయబడిన, నామభ్యామ్ = పేర్లచేత, ఖ్యాతియుక్తౌ = కీర్తి కలవారు, భవిష్యతః = కాగలరు.

తా. ఈ విధముగా ఈ కవలలు ఇద్దరూ నేను పెట్టిన కుశలవు లను పేర్లతో ప్రసిద్ధులు అగుదురు. 9

మూ. తాం రక్షాం జగృహుస్తాశ్చ మునిహస్తాత్సమాహితాః,
అకుర్వంశ్చ తతో రక్షాం తయోర్విగతకల్మషాః. 10

ప్ర. అ. తాః చ = ఆ వృద్ధస్త్రీలు, సమాహితాః=సావధానచిత్తలై, ముని హస్తాత్ = మునియొక్క హస్తమునుండి, తాం రక్షామ్=ఆ రక్షను, జగృహుః= గ్రహించిరి. విగతకల్మషాః = పోయిన పాపము గల ఆ స్త్రీలు, తతః = అటు పిమ్మట, తయోః = ఆ శిశువులకు, రక్షామ్ = రక్షను, అకుర్వన్ = చేసిరి.

తా. పుణ్యవతులైన ఆ వృద్ధస్త్రీలు ఆ రక్షను మునిచేతుల నుండి శ్రద్ధా పూర్వకముగా తీసికొని ఆ శిశువులకు రక్ష చేసిరి. 10

మూ. తథా తాం క్రియమాణాం చ వృద్ధాభిర్గోత్రనామ చ,
సంకీర్తనం చ రామస్య సీతాయాః ప్రసవే శుభౌ. 11

అర్ధరాత్రే తు శత్రుఘ్నః శుశ్రావ సమహత్ప్రియమ్,
పర్ణశాలాం తతో గత్వా మాతర్దిష్ట్యేతి చాబ్రవీత్. 12

ప్ర. అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తథా = ఆ విధముగా, వృద్ధాభిః= వృద్ధస్త్రీలచేత, క్రియమాణామ్ = చేయబడుచున్న, తామ్=ఆ రక్షను, గోత్రనామ చ = గోత్రము పేరును, రామస్య = రామునియొక్క, సంకీర్తనమ్ = పేరు చెప్పుటను, సీతాయాః = సీతయొక్క, శుభే=మంగళకరములైన, ప్రసవే=సంతానము లను, సుమహత్ = చాలగొప్పదైన, ప్రియమ్ = ప్రియమును, అర్ధరాత్రే=అర్ధ

రాత్రమునందు, శుశ్రావ = వినెను. తతః = పిమ్మట, పర్ణశాలామ్ = పర్ణశాలను, గత్వా = పొంది, మాతః = తల్లీ, దిష్ట్యా = అదృష్టవశముచేత, ఇతి చ = అని కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ వృద్ధస్త్రీలు ఆ విధముగా రక్ష చేయుటను, వాళ్లు తన గోత్రము, రాముని పేరు చెప్పుకొనుటను, సీత ఇద్దరు శిశువులను కన్నది అను మాటను అత్యంతప్రియమైన దీని నంతను అర్ధరాత్రియందు వినెను. పర్ణశాలకు వెళ్ళి "తల్లీ అదృష్టవశము చేత సుఖముగా ఉన్నావు" అనెను.

వి. రాముడు త్యజించిన సీతను ఇతడు చూచుట యుక్తము కాదు. అందు చేత ఇదంతా విని పర్ణశాలలోనే ఉండి మనస్సులోనే శత్రుఘ్ను డిట్లు అను కొన్నాడు అని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. పాఠము పై విధముగా ఉన్న పక్షాన మేము చెప్పిన అర్థమే యుక్తముగా ఉండును. కాని ఈ బాధ ఏమీ లేకుండా ప్రాచ్యపాఠం- "పర్ణశాలాం గతో రాత్రౌ దిష్ట్యా దిష్ట్యేతి చాబ్రవీత్" అని ఉన్నది. 12

మూ. తదా తస్య ప్రహృష్టస్య శత్రుఘ్నస్య మహాత్మనః,
వ్యతీతా వార్షికీ రాత్రిః శ్రావణీ లఘువిక్రమా. 13

ప్ర. అ. తదా = అప్పుడు, ప్రహృష్టస్య = సంతోషించిన, మహాత్మనః = మహాత్ముడైన, తస్య శత్రుఘ్నస్య = ఆ శత్రుఘ్నునియొక్క, లఘువిక్రమా = శీఘ్రగమనము గల, వార్షికీ = వర్షకాలసంబంధమైన, శ్రావణీ = శ్రావణసంబంధ మైన, రాత్రిః = రాత్రి, వ్యతీతా = గడచినది.

తా. అప్పుడు సంతోషించిన ఆ మహాత్ముడైన శత్రుఘ్ననకు వర్షాకాల సంబంధమైన ఆ శ్రావణరాత్రి తొందరగా గడచిపోయెను. 13

మూ. ప్రభాతే సుమహావీర్యః కృత్వా పౌర్వాహ్ణికీం క్రియామ్,
మునిం ప్రాఞ్జలిరామన్త్ర్య యయౌ పశ్చాన్ముఖః పునః.

ప్ర. అ. సుమహావీర్యః=చాల గొప్ప పరాక్రమము గల అతడు, ప్రభాతే =ప్రాతఃకాలమునందు, పౌర్వాహ్ణికీమ్=పూర్వాహ్ణమునకు సంబంధించిన, క్రియామ్ = క్రియను, కృత్వా=చేసికొని, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, మునిమ్

= మునీశ్వరుణ్ణి, ఆమన్త్ర్య = అనుమతింపచేసి, పునః = మరల, పశ్చాన్ముఖః = పశ్చిమాభిముఖుడై, యయౌ = వెళ్ళెను.

తా. మహాపరాక్రమశాలియైన శత్రుఘ్నుడు ప్రాతఃకాలమునందు పూర్వాహ్ణ క్రియలు చేసికొని అంజలి ఘటించి మునివద్ద సెలవు తీసికొని మరల పశ్చిమాభిముఖుడై వెళ్ళెను. 14

మూ. స గత్వా యమునాతీరం సప్తరాత్రోషితః పథి,
ఋషీణాం పుణ్యకీర్తీనామాశ్రమే వాసమభ్యయాత్. 15

ప్ర. అ. పథి = మార్గమునందు, సప్తరాత్రోషితః = ఏడురోజులు ఉన్న, సః = అతడు, యమునాతీరమ్ = యమునాతీరమును గూర్చి, గత్వా = వెళ్ళి, పుణ్యకీర్తీనామ్ = పుణ్య కీర్తి గల, ఋషీణామ్ = ఋషులయొక్క, ఆశ్రమే = ఆశ్రమమునందు, వాసమ్ = నివాసమును, అభ్యయాత్ = పొందెను.

తా. శత్రుఘ్నుడు మార్గమునందు ఏడు దివసములు (ఉండ) ప్రయాణము చేసి యమునాతీరము చేరి, పుణ్యకీర్తి గల ఋషీశ్వరుల ఆశ్రమమునందు నివాసము చేసెను. 15

మూ. స తత్ర మునిభిః సార్ధం భార్గవప్రముఖై ర్నృపః,
కథాభిరభిరూపాభిర్వాసం చక్రే మహాయశాః. 16

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః నృపః = ఆ రాజు, తత్ర = అక్కడ, భార్గవప్రముఖైః = చ్యవనుడు మొదలైన, మునిభిః సార్ధమ్ = మునులతో కూడ, అనురూపాభిః = తగిన, కథాభిః = కథలతో, వాసమ్ = నివాసమును, చక్రే = చేసెను.

తా. గొప్ప కీర్తి గల ఆ శత్రుఘ్నుడు చ్యవనుడు మొదలైన మునులతో తగు విధములైన సంభాషణలు చేయుచు నివసించెను. 16

మూ. స కాఞ్చనాద్యైర్మునిభిః సమేతై
రఘుప్రవీరో రజనీం తదానీమ్,
కథాప్రకారై ర్బహుభిర్మహాత్మా
విరామయామాస నరేన్ద్రసూనుః. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షట్షష్టితమః సర్గః.

ప్ర అ. నరేన్ద్రసూనుః = రాజకుమారుడైన, మహాత్మా = మహాత్ముడైన, సః రఘుప్రవీరః = ఆ శత్రుఘ్నుడు, సమేతైః = కలసిన, కాఞ్చనాద్యైః = కాంచనుడు మొదలుగా గల, మునిభిః = మునులతో, బహుభిః = అనేకమైన, కథా ప్రకారైః = కథల ప్రకారములతో, రజనీమ్ = రాత్రిని, విరామయామాస = గడపెను.

తా. మహాత్ముడైన ఆ రాజకుమారుడైన శత్రుఘ్నుడు అక్కడ కలిసి ఉన్న కాంచనాదిమునులతో అనేకవిధములైన సంభాషణలు చేయుచు ఆ రాత్రిని గడపెను. 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
అరవైయారవ సర్గ సమాప్తము.

# అథ సప్తషష్టితమః సర్గః

*[చ్యవనుడు శత్రుఘ్నునకు లవణాసురుని శూలమునకు గల శక్తిని చెప్పుచు పూర్వము జరిగిన మాంధాతవధను గూర్చి తెలుపుట.]*

మూ. అథ రాత్ర్యాం ప్రవృత్తాయాం శత్రుఘ్నో భృగునన్దనమ్,
పప్రచ్ఛ చ్యవనం విప్రం లవణస్య యథాబలమ్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రాత్ర్యామ్ = రాత్రి, ప్రవృత్తాయామ్ = ప్రారంభమయినదగుచుండగా, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, భృగునన్దనమ్ = భృగుమహర్షి కుమారుడు, విప్రమ్ = బ్రాహ్మణుడూ అయిన, చ్యవనమ్ = చ్యవనుణ్ణి, లవణస్య = లవణునియొక్క, బలమ్ = బలము, యథా = ఎట్లున్నదో, పప్రచ్ఛ = అడిగెను.

తా. రాత్రి ప్రారంభమైన పిమ్మట శత్రుఘ్నుడు, భృగువు కుమారుడు, బ్రాహ్మణుడూ అయిన చ్యవనుణ్ణి, లవణుని బలము ఎట్టిది అని ప్రశ్నించెను. 1

మూ. శూలస్య చ బలం బ్రహ్మన్ కే చ పూర్వం వినాశితాః,
అనేన శూలముఖ్యేన ద్వన్ద్వయుద్ధముపాగతాః. 2

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ! బ్రాహ్మణుడా! శూలస్య = శూలముయొక్క, బలమ్ = బలము ఎట్టిది? పూర్వమ్ = పూర్వము, ద్వన్ద్వయుద్ధమ్ = ద్వంద్వయుద్ధమును, ఉపాగతాః = పొందిన, కే = ఎవరు, అనేన = ఈ, శూలముఖ్యేన = ముఖ్యమైన శూలముచేత, వినాశితాః = నశింపచేయబడినారు ?

తా. మునీంద్రా! శూలము బలము ఎట్టిది ? పూర్వము ఆతనితో ద్వంద్వయుద్ధమునకు తలపడిన ఎవరెవరిని అతడు ఈ గొప్ప శూలముతో చంపినాడు?

మూ. తస్య తద్వచనం శ్రుత్వా శత్రుఘ్నస్య మహాత్మనః,
ప్రత్యువాచ మహాతేజాశ్చ్యవనో రఘునన్దనమ్. 3

ప్ర. అ మహాత్మనః = మహాత్ముడైన, తస్య శత్రుఘ్నస్య = ఆ శత్రుఘ్నునియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, చ్యవనః = చ్యవనుడు, రఘునన్దనమ్ = శత్రుఘ్నుణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మహాత్ముడైన ఆ శత్రుఘ్నుని మాటలు విని గొప్ప తేజస్సు గల చ్యవనుడు ఇట్లు బదులు చెప్పెను. 3

మూ. అసంఖ్యేయాని కర్మాణి యాన్యస్య రఘునన్దన,
ఇక్ష్వాకువంశప్రభవే యద్వృత్తం తచ్ఛృణుష్వ మే. 4

ప్ర. అ. రఘునన్దన = శత్రుఘ్నా, అస్య = వీనియొక్క, యాని = ఏ, కర్మాణి = కర్మలు గలవో అవి, అసంఖ్యేయాని = లెక్కపెట్ట శక్యము కానివి. ఇక్ష్వాకువంశప్రభవే = ఇక్ష్వాకువంశమునందు పుట్టినవాని విషయమునందు, యత్ = ఏది, వృత్తమ్ = జరిగినదో, తత్ = దానిని, మే = నానుండి, శృణుష్వ = వినుము.

తా. శత్రుఘ్నుడా ! ఇతడు చేసిన పనులు లెక్కింప శక్యము కానివి. ఇక్ష్వాకువంశమునకు చెందిన ఒక రాజు విషయమున జరిగిన వృత్తాంతమును వినుము. 4

మూ. అయోధ్యాయాం పురా రాజా యువనాశ్వసుతో బలీ,
మాంధాతా ఇతి విఖ్యాతస్త్రిషు లోకేషు వీర్యవాన్. 5

ప్ర. అ. పురా = పూర్వము, అయోధ్యాయామ్ = అయోధ్యయందు, యువనాశ్వసుతః = యువనాశ్వుని కుమారుడు, బలీ = బలవంతుడు, త్రిషు లోకేషు = మూడు లోకములందూ, విఖ్యాతః = ప్రసిద్ధుడూ, వీర్యవాన్ = పరాక్రమవంతుడూ అయిన, మాంధాతా ఇతి = మాంధాత అను, రాజా = రాజు, ఉండెడివాడు.

తా. పూర్వము అయోధ్యలో యువనాశ్వుని పుత్రుడైన మహాబలపరాక్రములు గల మూడు లోకములలోను ప్రసిద్ధుడైన మాంధాత అనే రాజు ఉండేవాడు.

మూ. స కృత్వా పృథివీం కృత్స్నాం శాసనే పృథివీపతిః,
సురలోకమితో జేతుముద్యోగమకరోన్నృపః. 6

ప్ర. అ. పృథివీపతిః = భూమండలమునకు ప్రభువైన, సః నృపః = ఆ రాజు, కృత్స్నమ్ = సమస్తమైన, పృథివీమ్ = భూమిని, శాసనే = శాసనమునందు, కృత్వా = చేసి, ఇతః = ఇక్కడినుండి, సురలోకమ్ = స్వర్గలోకమును, జేతుమ్ = జయించుటకు, ఉద్యోగమ్ = ప్రయత్నమును, అకరోత్ = చేసెను.

తా. భూమండలాధిపతియైన ఆ రాజు భూమినంతనూ తన శాసనములోనికి తీసికొనివచ్చి ఇక్కడినుండి దేవలోకమును జయించుటకు ప్రయత్నము చేసెను.

మూ. ఇన్ద్రస్య చ భయం తీవ్రం సురాణాం చ మహాత్మనామ్,
మాంధాతరి కృతోద్యోగే దేవలోకజిగీషయా. 7

ప్ర. అ. మాంధాతరి = మాంధాత, దేవలోకజిగీషయా = దేవలోకమును జయించవలె నను ఇచ్ఛచేత, కృతోద్యోగే = చేయబడిన ప్రయత్నము కలవాడగు చుండగా, ఇన్ద్రస్య చ = ఇంద్రునకు, మహాత్మనామ్ = మహాత్ములైన, సురాణాం చ = దేవతలకూ, తీవ్రమ్ = తీవ్రమైన. భయమ్ = భయము కలిగెను.

తా. మాంధాత దేవలోకమును జయించవలె ననే ఇచ్ఛతో ప్రయత్నము ప్రారంభించగానే ఇంద్రునికీ, మహాత్ములైన దేవతలకీ కూడ తీవ్రమైన భయము కలిగెను. 7

మూ. అర్ధాసనేన శక్రస్య రాజ్యార్ధేన చ పార్థివః,
ఛన్ద్యమానః సురగణైః ప్రతిజ్ఞామధ్యరోహత. 8

ప్ర. అ. పార్థివః = ఆ రాజు, శక్రస్య = ఇంద్రునియొక్క, అర్ధాసనేన = అర్ధాసనముచేతను, రాజ్యార్ధేన చ = రాజ్యముయొక్క అర్ధముచేతను. సురగణైః = దేవగణములచేత, ఛన్ద్యమానః = బ్రతిమాలుకొనబడుచున్నను, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, అధ్యరోహత = అధిష్ఠించి ఉండెను.

తా. దేవేంద్రునితో అర్ధాసనము, రాజ్యములో సగమూ ఇచ్చెద మని సురగణాలు బ్రతిమాలినను అతడు తన ప్రతిజ్ఞను ఎక్కియే ఉండెను (వదలలేదు).

మూ. తస్య పాపమభిప్రాయం విదిత్వా పాకశాసనః,
సాన్త్వపూర్వమిదం వాక్యమువాచ యువనాశ్వజమ్. 9

ప్ర. అ. పాకశాసనః = ఇంద్రుడు, తస్య = వానియొక్క, పాపమ్ = పాపమైన, అభిప్రాయమ్ = అభిప్రాయమును, విదిత్వా = తెలిసికొని, యువనాశ్వజమ్ = మాంధాతను గూర్చి, సాన్త్వపూర్వమ్ = బ్రతిమాలుకొనుట పూర్వమునందు కలుగునట్లుగా, ఇదమ్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఇంద్రుడు ఆతని చెడ్డ ఆలోచనను తెలిసికొని బ్రతిమాలుచు ఆతనితో ఇట్లనెను. 9

మూ. రాజా త్వం మానుషే లోకే న తావత్పురుషర్షభ,
అకృత్వా పృథివీం వశ్యాం దేవరాజ్యమిహేచ్ఛసి. 10

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! త్వమ్ = నీవు, మానుషే లోకే = మనుష్యలోకమునందే, రాజా = రాజువు, న తావత్ = కావు. పృథివీమ్ = భూమిని, వశ్యామ్ = వశ్యమైనదానినిగా, అకృత్వా = చేయకుండగా, ఇహ = ఇక్కడ, దేవరాజ్యమ్ = దేవరాజ్యమును, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. పురుషశ్రేష్ఠుడా! నీవు మనుష్యలోకములోనే రాజువు కావు. భూలోకమును అంతనూ వశము చేసికొనకుండగానే స్వర్గరాజ్యమును కోరుచున్నావు! 10

మూ. యది వీర సమగ్రా తే మేదినీ నిఖిలా వశే,
దేవరాజ్యం కురుష్వేహ సభృత్యబలవాహనః. 11

ప్ర. అ. వీర = వీరుడా! నిఖిలా = పూర్తియైన; సమగ్రా = సమస్తమైన, మేదినీ = భూమి, తే = నీకు, వశే యది = వశమునందున్నట్లయితే, ఇహ = ఇక్కడ, సభృత్యబలవాహనః = భృత్యులతోను, సైన్యముతోను వాహనములతోను కూడినవాడవై, దేవరాజ్యమ్ = దేవరాజ్యమును, కురుష్వ = చేయుము.

తా. ఓ! వీరుడా! ఈ భూమి అంతా పూర్తిగా నీ ఆధీనములో ఉన్నట్లయితే నీవు భృత్యులతోను, సైన్యములతోను, వాహనములతోను వచ్చి ఇక్కడ దేవరాజ్యము చేయుము. 11

మూ. ఇన్ద్రమేవం బ్రువాణం తం మాంధాతా వాక్యమబ్రవీత్,
క్వ మే శక్ర ప్రతిహతం శాసనం పృథివీతలే. 12

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, ఇన్ద్రమ్=ఇంద్రుణ్ణి గూర్చి, మాంధాతా = మాంధాత, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. శక్ర = ఇంద్రా! మే = నాయొక్క, శాసనమ్ = శాసనము, పృథివీతలే = భూమియందు, క్వ = ఎక్కడ, ప్రతిహతమ్ = అడ్డుకొనబడినది ?

తా. ఇంద్రుని మాటలు విని మాంధాత-"ఇంద్రా! నా ఆజ్ఞ భూలోకములో ఎక్కడ చెల్లుటలేదు"అని ప్రశ్నించెను. 12

మూ. తమువాచ సహస్రాక్షో లవణో నామ రాక్షసః,
మధుపుత్రో మధువనే తే నాజ్ఞాం కురుతేఽనఘ. 13

ప్ర. అ. సహస్రాక్షః=ఇంద్రుడు,తమ్=వానినిగూర్చి, ఉవాచ=పలికెను. అనఘ = దోషములు లేనివాడా! మధుపుత్రః=మధువుయొక్క పుత్రుడైన, లవణో నామ = లవణు డను పేరు గల, రాక్షసః = రాక్షసుడు, మధువనే = మధువనమునందు, తే = నీయొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, న కురుతే = చేయుటలేదు.

తా. ఇంద్రుడు మాంధాతతో-"దోషములు లేనివాడా! మధువనములో నివసించుచున్న, మధువు కుమారుడైన లవణుడను రాక్షసుడు నీ ఆజ్ఞను చేయుటలేదు" అని చెప్పెను. 13

మూ. తచ్ఛ్రుత్వా విప్రియం ఘోరం సహస్రాక్షేణ భాషితమ్,
వ్రీడితోఽవాఙ్ముఖో రాజా వ్యాహర్తుం న శశాక హ. 14

ప్ర. అ. సహస్రాక్షేణ = ఇంద్రునిచేత, భాషితమ్=పలకబడిన, తత్ = ఆ, ఘోరమ్ = ఘోరమైన, విప్రియమ్ = అప్రియమైన విషయమును, శ్రుత్వా = విని, రాజా = రాజు, వ్రీడితః = సిగ్గు చెందినవాడై, అవాఙ్ముఖః = క్రిందికి ముఖము కలవాడై, వ్యాహర్తుమ్=పలుకుటకు, న శశాక హ=సమర్థుడు కాలేదు.

తా. దేవేంద్రుడు తెలిపిన ఘోరమైన ఆ అప్రియమైన విషయమును విని మాంధాత సిగ్గు చెంది తల వంచుకొనెను. ఏమీ జవాబు చెప్పజాలకపోయెను. 14

మూ. ఆమన్త్ర్య తు సహస్రాక్షం ప్రాయాత్ కించిదవాఙ్ముఖః,
పునరేవాగమచ్ఛ్రీమానిమం లోకం నరేశ్వరః. 15

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, నరేశ్వరః = ఆ రాజు, సహస్రాక్షమ్ = ఇంద్రుణ్ణి, ఆమన్త్ర్య = అనుజ్ఞ అడిగి, కించిత్ = కొంచెము, అవాఙ్ముఖః = క్రిందికి ముఖము గలవాడై, పునః ఏవ = మరల. ఇమమ్ = ఈ, లోకమ్ = లోకమును గూర్చి, ఆగమత్ = వచ్చెను.

తా. శ్రీమంతుడైన ఆ రాజు ఇంద్రుని వద్ద సెలవు గైకొని, కొంచెము తల వంచుకొని మరల ఈ లోకమునకు వచ్చెను. 15

మూ. స కృత్వా హృదయేఽమర్షం సభృత్యబలవాహనః,
ఆజగామ మధోః పుత్రం వశే కర్తుమరిందమః. 16

ప్ర. అ. అరిందమః = శత్రుసంహారకుడైన, సః = అతడు, హృదయే = హృదయమునందు, అమర్షమ్ = కోపమును, కృత్వా = చేసి, మధోః = మధువు యొక్క, పుత్రమ్ = పుత్రుణ్ణి, వశే = వశమునందు, కర్తుమ్ = చేయుటకు, సభృత్య బలవాహనః = భృత్యసైన్యవాహనములతో కూడినవాడై, ఆజగామ = వచ్చెను.

తా. శత్రుసంహారకుడైన మాంధాత మనస్సులో కోపము ఉంచుకొని లవణాసురుణ్ణి తన వశములో ఉంచుకొనుటకై భృత్య–సైన్య–వాహనములతో కలిసి వచ్చెను. 16

మూ. స కాఙ్క్షమాణో లవణం యుద్ధాయ పురుషర్షభః,
దూతం సంప్రేషయామాస సకాశం లవణస్య హి. 17

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, సః = అతడు, యుద్ధాయ = యుద్ధముకొరకు, లవణమ్ = లవణుణ్ణి, కాఙ్క్షమాణః = కోరుచు, లవణస్య సమీపమ్ = లవణుని సమీపమును గూర్చి, దూతమ్ = దూతను, సంప్రేషయామాస = పంపెను.

తా. పురుషశ్రేష్ఠుడైన మాంధాత లవణునితో యుద్ధమును కోరుచు ఆతని వద్దకు దూతను పంపెను. 17

మూ. స గత్వా విప్రియాణ్యాహ బహూని మధునః సుతమ్,
వదన్తమేవం తం దూతం భక్షయామాస రాక్షసః. 18

ప్ర. అ. సః = ఆ దూత, మధునః సుతమ్ = లవణాసురుణ్ణి గూర్చి, గత్వా = వెళ్ళి, బహూని = అనేకమైన, వి(ప్రియాణి = అ(ప్రియములైన మాటలు, ఆహ = పలికెను. ఏవమ్ = ఇట్లు, వదన్తమ్ = పలుకుచున్న, తం దూతమ్ = ఆ దూతను, రాక్షసః = రాక్షసుడు, భక్షయామాస = భక్షించెను.

తా. అతడు లవణాసురునివద్దకు వెళ్ళి చాలా అ(ప్రియవాక్యములు పలికెను. అతడు అట్లు పలుకుచుండగా రాక్షసుడు వానిని భక్షించివేసెను. 18

మూ. చిరాయమాణే దూతే తు రాజా క్రోధసమన్వితః,
అర్దయామాస త(ద్రక్షః శరవృష్ట్యా సమన్తతః. 19

ప్ర. అ. దూతే = దూత, చిరాయమాణే = ఆలస్యము చేయుచుండగా, రాజా = రాజు, క్రోధసమన్వితః = క్రోధముతో కూడినవాడై, సమన్తతః = నలువైపులా, శరవృష్ట్యా = బాణవర్షముచేత, తత్ = ఆ, రక్షః = రాక్షసుణ్ణి, అర్దయామాస = పీడించెను.

తా. ఆ దూత ఆలస్యము చేయుచుండగా మాంధాత కోపముతో ఆ రాక్షసుణ్ణి అన్నివైపులా బాణవర్షముచేత వర్షించెను. 19

మూ. తతః ప్రహస్య త(ద్రక్షః శూలం జగ్రాహ పాణినా,
వధాయ సానుబన్ధస్య ముమోచాయుధముత్తమమ్. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తత్ రక్షః = ఆ రాక్షసుడు, ప్రహస్య = నవ్వి, పాణినా = హస్తముతో, శూలమ్ = శూలమును, జగ్రాహ = గ్రహించెను. సానుబన్ధస్య = పరివారముతో కూడిన అతనియొక్క, వధాయ = వధకొరకు, ఉత్తమమ్ = ఉత్తమమైన, ఆయుధమ్ = ఆయుధమును, ముమోచ = విడచెను.

తా. ఆ రాక్షసుడు నవ్వి, శూలమును హస్తముతో గ్రహించి, ఆ రాజునూ, అతని పరివారమునూ కూడ చంపుటకై ఆ ఉత్తమమైన ఆయుధమును విడచెను. 20

మూ. తచ్ఛూలం దీప్యమానం తు సభృత్యబలవాహనమ్,
భస్మీకృత్వా నృపం భూమౌ లవణస్యాగమత్కరమ్. 21

ప్ర. అ. దీప్యమానమ్=ప్రజ్వలించుచున్న, తత్ శూలమ్ = ఆ శూలము, సభృత్యబలవాహనమ్=భృత్య-సైన్య-వాహనములతో కూడిన, నృపమ్=రాజును, భూమౌ = భూమియందు, భస్మ కృత్వా = భస్మము చేసి, లవణస్య = లవణుని యొక్క, కరమ్ = హస్తమును, అగమత్ = పొందెను.

తా. ప్రజ్వలించుచున్న ఆ శూలము ఆ రాజునూ, ఆతని భృత్య-సైన్య వాహనములనూ నేలమీద భస్మము చేసి లవణుని చేతిలోనికి చేరెను. 21

మూ. ఏవం స రాజా సుమహాన్ హతః సబలవాహనః,
శూలస్య తు బలం సౌమ్య అప్రమేయమనుత్తమమ్. 22

ప్ర. అ. సుమహాన్ = చాలా గొప్పవాడైన, సః రాజా = ఆ రాజు, ఏవమ్ = ఈ విధముగా, సబలవాహనః = సైన్యవాహనములతో కూడినవాడై, హతః = చంపబడెను. సౌమ్య = సౌమ్యుడా! శూలస్య=శూలముయొక్క, బలమ్=బలము, అప్రమేయమ్ = సాటి లేనిది, అనుత్తమమ్ = చాలా గొప్పది.

తా. చాల గొప్పవాడైన ఆ మాంధాత ఆతని సైన్యవాహనములూ కూడ ఈ విధముగా చంపబడినవి. సౌమ్యుడా! శూలమున కున్న శక్తి చాల గొప్పది. ఊహింప శక్యము కానిది. 22

మూ. శ్వః ప్రభాతే తు లవణం వధిష్యసి న సంశయః,
అగృహీతాయుధం క్షిప్రం ధ్రువో హి విజయస్తవ. 23

ప్ర. అ. శ్వః=రేపు, ప్రభాతే=ప్రాతఃకాలమునందు, అగృహీతాయుధమ్ =గ్రహింపబడని ఆయుధము గల, లవణమ్ = లవణుణ్ణి, క్షిప్రమ్ = శీఘ్రముగా, వధిష్యసి = చంపగలవు. సంశయః = సంశయము, న = లేదు. తవ = నీ యొక్క, విజయః = విజయము, ధ్రువః హి = నిశ్చితము కదా?

తా. రేపు ప్రాతఃకాలమునందు నీవు శూలాయుధము లేని ఆతనిని శీఘ్రముగా చంపగలవు. సందేహము లేదు. నీకు జయము నిశ్చితము. 23

మూ. లోకానాం స్వస్తి చైవం స్యాత్ కృతే కర్మణి చ త్వయా,
ఏతత్తే సర్వమాఖ్యాతం లవణస్య దురాత్మనః. 24

ప్ర. అ. త్వయా = నీచేత, కర్మణి = ఈ పని, ఏవమ్ = ఇట్లు. కృతే = చేయబడినదగుచుండగా, లోకానామ్ = లోకములకు, స్వస్తి = క్షేమము, స్యాత్ = అగును. దురాత్మనః = దురాత్ముడైన, లవణస్య = లవణునియొక్క, ఏతత్ = ఈ, సర్వమ్ = సమస్తమూ, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. నీవు ఈ పని ఈ విధముగా నెరవేర్చినచో లోకములకు క్షేమము అగును. దురాత్ముడైన లవణునికి సంబంధించిన ఈ విషయ మంతా నీకు చెప్పబడినది. 24

మూ. శూలస్య చ బలం ఘోరమప్రమేయం నరర్షభ,
వినాశశ్చైవ మాన్ధాతుర్యత్నేనాభూచ్చ పార్థివ. 25

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా! శూలస్య = శూలముయొక్క, బలమ్ = బలము, ఘోరమ్ = ఘోరమైనది. అప్రమేయం చ = ఊహింప శక్యము కానిది. పార్థివ = రాజా! మాంధాతుః = మాంధాతయొక్క, వినాశః చ ఏవ = = వినాశము, యత్నేన = (ఇంద్రుని) ప్రయత్నము చేత, అభూత్ = ఆయెను.

తా. నరశ్రేష్ఠుడా! శూలమున కున్న బలము ఘోరమైనది; ఊహింప శక్యముకానిది. ఇంద్రుని ప్రయత్నముచేత ఈ శూలము ద్వారా మాంధాత నశించినాడు. 25

మూ. త్వం శ్వః ప్రభాతే లవణం మహాత్మన్
వధిష్యసే నాత్ర తు సంశయో మే,
శూలం వినా నిర్గతమామిషార్థే
ధ్రువో జయస్తే భవితా నరేన్ద్ర. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తషష్టితమః సర్గః.

ప్ర. అ. మహాత్మన్ = ఓ! మహాత్మా! శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతః కాలమునందు, ఆమిషార్థే = మాంసముకొరకై, శూలం వినా = శూలము లేకుండా, నిర్గతమ్ = బయలుదేరిన, లవణమ్ = లవణాసురుణ్ణి, వధిష్యసే = చంపగలవు. అత్ర = ఈ విషయమునందు, మే = నాకు, సంశయః = సంశయము, న = లేదు.

నరేన్ద్ర = రాజా! తే = నీకు, ధ్రువః = నిశ్చితమైన, విజయః = విజయము, భవితా = కలుగగలదు.

తా. ఓ మహాత్మా! రాజా! రేపు ప్రాతఃకాలమునందు మాంసము నిమిత్తము శూలము లేకుండగా బయల్వెడలిన లవణాసురుణ్ణి చంపగలవు. నాకీ విషయము నందు సందేహము లేదు. నీకు తప్పక విజయము లభించగలదు. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో అరవైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టషష్టితమః సర్గః

[లవణాసురుడు ఆహారముకొరకై బయలుదేరుట. శత్రుఘ్నుడు మధురాపురద్వారమునందు నిలచి ఉండుట. తిరిగి వచ్చిన లవణునితో ఆతని సంభాషణము].

మూ. కథాం కథయతాం తేషాం జయం చాకాఙ్క్షతాం శుభమ్,
వ్యతీతా రజనీ శీఘ్రం శత్రుఘ్నస్య మహాత్మనః. 1

ప్ర. అ. తేషామ్ = ఆ మునులు, కథామ్ = కథను, కథయతామ్ = చెప్పుచుండగా, శుభమ్ = శుభమును, జయం చ = జయమును, ఆకాఙ్క్షతామ్ = కోరుచుండగా, మహాత్మనః = మహాత్ముడైన, శత్రుఘ్నస్య = శత్రుఘ్నునకు, రజనీ = రాత్రి, శీఘ్రమ్ = శీఘ్రముగా, వ్యతీతా = గడచినది.

తా. ఆ మునులు ఆ కథను చెప్పుచు జయమును, శుభమునూ కోరుచుండగా మహాత్ముడైన శత్రుఘ్నునకు రాత్రి శీఘ్రముగా గడచిపోయినది. 1

మూ. తతః ప్రభాతే విమలే తస్మిన్ కాలే స రాక్షసః,
నిర్గతస్తు పురాద్వీరో భక్ష్యాహారప్రచోదితః. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రభాతే = తెల్లవారిన, విమలే = నిర్మలమైన, తస్మిన్ కాలే = ఆ కాలమునందు, వీరః = వీరుడైన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, భక్ష్యాహారప్రచోదితః = తినదగిన ఆహారముచేత, లేదా భక్ష్యము తీసికొనుటకై ప్రేరితుడై, పురాత్ = పట్టణమునుండి, నిర్గతః = బయలుదేరినాడు.

తా. ఇంతలో తెల్లవారెను. నిర్మలమైన ఆ కాలమునందు వీరుడైన ఆ రాక్షసుడు భక్షింపదగిన ఆహారముచేత ప్రేరితుడై (ఆహారమును సంపాదించుటకై) పట్టణమునుండి బైటకు వెళ్ళెను. 2

మూ. ఏతస్మిన్నన్తరే వీరః శత్రుఘ్నో యమునాం నదీమ్,
తీర్త్వా మధుపురద్వారి ధనుష్పాణిరతిష్ఠత. 3

ప్ర. అ. ఏతస్మిన్ = ఈ, అన్తరే = మధ్యకాలములో, వీరః = వీరుడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, యమునాం నదీమ్ = యమునానదిని, తీర్త్వా = దాటి, ధనుష్పాణిః = ధనస్సు హస్తమునందు కలవాడై, మధుపురద్వారి = మధుపుర ద్వారమునందు, అతిష్ఠత = నిలచెను.

తా. ఈ మధ్యసమయములో వీరుడైన శత్రుఘ్నుడు యమునానదిని దాటి ధనస్సు ధరించి, మధుపురద్వారమునందు నిలచెను. 3

మూ. తతోఽర్ధదివసే ప్రాప్తే క్రూరకర్మా స రాక్షసః,
ఆగచ్ఛత్ బహుసాహస్రం ప్రాణినాం భారముద్వహన్. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అర్ధదివసే = దివసార్ధము, ప్రాప్తే = వచ్చినదగుచుండగా, క్రూరకర్మా = క్రూరమైన కర్మ గల, సః రాక్షసః = ఆ రాక్షసుడు, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, బహుసాహస్రమ్ = అనేక సహస్ర ముల రూపములో ఉన్న, భారమ్ = భారమును, ఉద్వహన్ = మోయుచు, ఆగచ్ఛత్ = వచ్చెను.

తా. పిమ్మట మధ్యాహ్నసమయమున క్రూరకర్మలు చేయు ఆ రాక్షసుడు కొన్నివేల ప్రాణుల భారము మోయుచు ఆచటికి వచ్చెను. 4

మూ. తతో దదర్శ శత్రుఘ్నం స్థితం ద్వారి ధృతాయుధమ్,
తమువాచ తతో రక్షః కిమనేన కరిష్యసి. 5

ప్ర. అ. తతః = పమ్మట, రక్షః = రాక్షసుడు, ద్వారి స్థితమ్ = ద్వారము నందు నిలచిన, ధృతాయుధమ్ = ధరించబడిన ఆయుధము గల, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి, దదర్శ = చూచెను. తతః = పిమ్మట, తమ్ = వానిని గూర్చి, ఉవాచ = పలికెను. అనేన = దీనితో, కిం కరిష్యసి = ఏమి చేసెదవు?

తా. పిమ్మట ఆ రాక్షసుడు ద్వారమునందు ఆయుధము ధరించి నిలచిన శత్రుఘ్నుణ్ణి చూచి "దీనితో ఏమి చేసెదవు?" అని అతనిని అడిగెను. 5

మూ. ఈదృశానాం సహస్రాణి సాయుధానాం నరాధమ,
భక్షితాని మయా రోషాత్ కాలేనానుగతో హ్యసి. 6

ప్ర. అ. నరాధమ = ఓ! నరాధమా! సాయుధానామ్ = ఆయుధములతో కూడిన. ఈదృశానామ్ = ఇట్టివాళ్ళయొక్క, సహస్రాణి = సహస్రములు, మయా = నాచేత, రోషాత్ = కోపమువలన, భక్షితాని = భక్షింపబడినవి. కాలేన = కాలము చేత, అనుగతః = అనుసరించబడినవాడవు, అసి హి = అయి ఉన్నావు కదా?

తా. ఓ! నరాధమా! ఆయుధాలు ధరించిన నీవంటివాళ్ళను కొన్ని వేల మందిని నేను కోపముతో భక్షించి ఉన్నాను. నీవు కాలము ప్రేరేపింపగా వచ్చి నట్లున్నావు! 6

మూ. ఆహారశ్చాప్యసంపూర్ణో మమాయం పురుషాధమ,
స్వయం ప్రవిష్టోఽద్య ముఖం కథమాసాద్య దుర్మతే. 7

ప్ర. అ. పురుషాధమ = ఓ! పురుషాధమా! మమ = నాయొక్క, అయమ్ = ఈ, ఆహారః చ = ఆహారము కూడ, అసంపూర్ణః = చాలదు. దుర్మతే = దుర్మతీ! అద్య = ఇప్పుడు, ఆసాద్య = దగ్గరకు వచ్చి, స్వయమ్ = స్వయము గానే, ముఖమ్ = ముఖమును, కథమ్ = ఎట్లు, ప్రవిష్టః = ప్రవేశించితివి?

తా. దుర్మతీ! ఈ ఆహారము నాకు చాలినంతగా లేదు. ఓ పురుషాధమా! నా దగ్గరకు వచ్చి ఇప్పుడు స్వయముగానే వచ్చి నా ముఖములో ప్రవేశించు చున్నావు కదా! 7

మూ. తస్యైవం భాషమాణస్య హసతశ్చ ముహుర్ముహుః,
శత్రుఘ్నో వీర్యసంపన్నో రోషాదశ్రూణ్యవాసృజత్. 8

ప్ర. అ. తస్య = అతడు, ఏవమ్ = ఇట్లు, భాషమాణస్య = మాటలాడు చుండగా, ముహుః ముహుః = మాటిమాటికి, హసతః చ = నవ్వుచుండగా, వీర్య సంపన్నః = పరాక్రమసంపన్నుడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, రోషాత్ = కోపమువలన. అశ్రూణి = కన్నీళ్ళను, అవాసృజత్ = ప్రవర్తింపచేసెను.

తా. లవణుడు ఈ విధముగా మాటలాడుచు మాటిమాటికి నవ్వుచుండగా మహాపరాక్రమవంతుడైన శత్రుఘ్నుడు కోపముతో కన్నీళ్ళను రాల్చెను. 8

మూ. తస్య రోషాభిభూతస్య శత్రుఘ్నస్య మహాత్మనః,
తేజోమయా మరీచ్యస్తు సర్వగాత్రైర్వినిష్పతన్. 9

ప్ర. అ. రోషాభిభూతస్య = రోషముచేత ఆక్రమించబడిన, మహాత్మనః = మహాత్ముడైన, తస్య శత్రుఘ్నస్య = ఆ శత్రుఘ్నునియొక్క, సర్వగాత్రైః = అన్ని అవయవములనుండి, తేజోమయాః = తేజోవికారములైన, మరీచ్యః తు = కిరణములు, వినిష్పతన్ = ప్రసరించినవి.

తా. రోషావేశములో ఉన్న మహాత్ముడైన ఆ శత్రుఘ్నుని సమస్తములైన అవయవములనుండి తేజోమయములైన కిరణములు ప్రసరించినవి. 9

మూ. ఉవాచ చ సుసంక్రుద్ధః శత్రుఘ్నః స నిశాచరమ్,
యోద్ధుమిచ్ఛామి దుర్బుద్ధే ద్వన్ద్వయుద్ధం త్వయా సహ.

ప్ర. అ. సుసంక్రుద్ధః = మిక్కిలి కోపించిన, సః శత్రుఘ్నః = ఆ శత్రుఘ్నుడు, నిశాచరమ్ = రాక్షసుణ్ణి గూర్చి, ఉవాచ చ = పలికెను, దుర్బుద్ధే = ఓ! దుర్బుద్ధీ! త్వయా సహ = నీతో కూడ, ద్వన్ద్వయుద్ధమ్ = ద్వంద్వయుద్ధమును, యోద్ధుమ్ = (యుద్ధము) చేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. చాల కోపించిన శత్రుఘ్నుడు ఆ రాక్షసునితో ఇట్లు పలికెను - "ఓ! దుర్బుద్ధీ! నీతో ద్వంద్వయుద్ధము చేయవలె నని కోరుచున్నాను. 10

మూ. పుత్రో దశరథస్యాహం భ్రాతా రామస్య ధీమతః,
శత్రుఘ్నో నామ శత్రుఘ్నో వధాకాఙ్క్షీ తవాగతః. 11

ప్ర. అ. అహమ్ = నేను, దశరథస్య = దశరథునియొక్క, పుత్రః = పుత్రుడను. ధీమతః = బుద్ధిమంతుడైన, రామస్య = రామునియొక్క, భ్రాతా = సోదరుడను. శత్రుఘ్నో నామ = శత్రుఘ్ను డను పేరు గలవాడను. శత్రుఘ్నః = శత్రువులను చంపువాడను. తవ = నీయొక్క, వధాకాఙ్క్షీ = వధను కోరుచు, ఆగతః = వచ్చినాను.

తా. నేను దశరథుని పుత్రుడను, బుద్ధిమంతుడైన రాముని సోదరుడను, శత్రువులను సంహరించు నా పేరు శత్రుఘ్నుడు. నిన్ను చంపుటకై ఇక్కడికి వచ్చినాను. 11

మూ. తస్య మే యుద్ధకామస్య యుద్ధమద్య ప్రదీయతామ్,
శత్రుస్త్వం సర్వభూతానాం న మే జీవన్ గమిష్యసి. 12

ప్ర. అ. యుద్ధకామస్య = యుద్ధమునందు కోరిక గల, తస్య మే = అట్టి నాకు, అద్య = ఇప్పుడు, యుద్ధమ్ = యుద్ధము, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక, సర్వభూతానామ్ = సమస్త ప్రాణులకూ కూడ, శత్రుః = శత్రువైన నీవు, జీవన్ = జీవించినవాడవై, మే = నానుండి, న గమిష్యసి = వెళ్ళవు.

తా. యుద్ధమును కోరుచున్న అట్టి నాకు ఇప్పుడు యుద్ధమును ఇమ్ము. సమస్తప్రాణులకూ కూడ శత్రువైన నీవు ప్రాణాలతో నానుండి బైటపడజాలవు.12

మూ. తస్మింస్తథా బ్రువాణే తు రాక్షసః ప్రహసన్నివ,
ప్రత్యువాచ నరశ్రేష్ఠం దిష్ట్యా ప్రాప్తోఽసి దుర్మతే. 13

ప్ర. అ. తస్మిన్ = అతడు, తథా = అట్లు, బ్రువాణే = పలుకుచుండగా, రాక్షసః తు = రాక్షసుడైతే, ప్రహసన్నివ = నవ్వుచు, నరశ్రేష్ఠమ్ = నరశ్రేష్ఠుణ్ణి గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. దుర్మతే = దుర్మతీ! దిష్ట్యా = దైవవశము చేత, ప్రాప్తః అసి = వచ్చినావు

తా. శత్రుఘ్నుని మాటలు విని రాక్షసుడు పరిహాసపూర్వకముగా ఇట్లు పలికెను. "ఓ! దుర్మతీ! దైవవశముచేత వచ్చినావు". 13

మూ. మమ మాతృష్వసుర్భ్రాతా రావణో నామ రాక్షసః,
హతో రామేణ దుర్బుద్ధే స్త్రీహేతోః పురుషాధమ. 14

ప్ర. అ. దుర్బుద్ధే = చెడ్డ బుద్ధి కలవాడా! పురుషాధమ = పురుషులలో అధముడా, మమ = నాయొక్క, మాతృష్వసుః = తల్లి సోదరియొక్క, భ్రాతా = సోదరుడైన, రావణో నామ = రావణు డను, రాక్షసః = రాక్షసుడు, స్త్రీహేతోః = స్త్రీనిమిత్తమున, రామేణ = రామునిచేత, హతః = చంపబడినాడు.

తా. ఓ! దుర్బుద్ధీ! పురుషాధమా! నా తల్లి సోదరికి సోదరుడైన రావణు డను రాక్షసుణ్ణి రాముడు స్త్రీనిమిత్తమై చంపినాడు. 14

మూ. తచ్చ సర్వం మయా క్షాన్తం రావణస్య కులక్షయమ్,
అవజ్ఞాం పురతః కృత్వా మయా యూయం విశేషతః. 15

ప్ర అ. రావణస్య = రావణుని యొక్క, తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, కులక్షయమ్ = కులక్షయము, మయా = నాచేత, క్షాన్తమ్ = క్షమింపబడినది. అవజ్ఞామ్ = అనాదరమును, పురతః కృత్వా = ముందు ఉంచుకొని, యూయమ్ = మీరు, విశేషతః = విశేషించి, మయా = నాచేత క్షమించబడినారు.

తా. నేను ఆ రావణకులవినాశమును క్షమించితిని. ప్రధానముగా కేవలము అనాదరభావమునే పురస్కరించుకొని మిమ్ములనందరినీ క్షమించినాను. 15

మూ. నిహతాశ్చ హి మే సర్వే పరిభూతాస్తృణం యథా,
భూతాశ్చైవ భవిష్యాశ్చ యూయం చ పురుషాధమాః. 16

ప్ర. అ. మే = నాకు, నిహతాః = చంపబడినవారు, భూతాః చ ఏవ = పూర్వము ఉన్నవాళ్ళు, భవిష్యాః చ = రాబోవువారు అయిన, పురుషాధమాః = పురుషాధములు, యూయం చ = మీరూ, సర్వే = అందరూ, తృణం యథా = గడ్డిపరక వలె, పరిభూతాః = తిరస్కరింపబడినారు.

తా. నేను చాలమందిని చంపివేసితిని. పురుషాధములైన పూర్వము ఉన్నవాళ్ళను, రాబోవువాళ్ళనూ, మిమ్ములనూ గడ్డిపరక వలె అనాదరము చేసితిని.

మూ. తస్య తే యుద్ధకామస్య యుద్ధం దాస్యామి దుర్మతే,
తిష్ఠ త్వం చ ముహూర్తం తు యావదాయుధమానయే.

ప్ర. అ. దుర్మతే = ఓ! దుర్మతీ! యుద్ధకామస్య = యుద్ధమునందు కోరిక గల, తస్య తే = అట్టి నీకు, యుద్ధమ్ = యుద్ధమును, దాస్యామి = ఇచ్చెదను. యావత్ = ఎంతలో, ఆయుధమ్ = ఆయుధమును, ఆనయే = తీసికొనివచ్చెదనో అంతవరకు, త్వమ్ = నీవు, ముహూర్తమ్ = ముహూర్తకాలము, తిష్ఠ = ఉండుము.

తా. దుర్మతీ! యుద్ధమును కోరుచున్న నీకు యుద్ధము నిచ్చెదను. నేను ఆయుధమును తెచ్చుకొనునంతవరకు క్షణకాలము ఆగుము. 17

మూ. ఈప్సితం యాదృశం తుభ్యం సజ్జయే యావదాయుధమ్,
తమువాచాశు శత్రుఘ్నః క్వ మే జీవన్ గమిష్యసి. 18

ప్ర. అ. తుభ్యమ్ = నీకొరకు, యాదృశమ్ = ఎట్టిది, ఈప్సితమ్ = ఇష్ట

మైనదో, ఆయుధమ్ = అట్టి ఆయుధమును, యావత్ సజ్జయే = సిద్ధముచేసెదను. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, ఆశు = శీఘ్రముగా, తమ్ = అతనిని గూర్చి, ఉవాచ = పలికెను. మే = నానుండి, జీవన్ = జీవించుచు, క్వ = ఎక్కడికి, గమిష్యసి = వెళ్ళెదవు ?

తా. "నీకు తగిన ఆయుధమును సిద్ధముచేసికొనువరకు ఆగుము." వెంటనే శత్రుఘ్నుడు ఆతనితో ఇట్లనెను - "నేను ఉండగా ప్రాణాలతో ఎక్కడికి వెళ్ళెదవు ?" 18

మూ. స్వయమేవాగతః శత్రుర్న మోక్తవ్యః కృతాత్మనా,
యో హి విక్లవయా బుద్ధ్యా ప్రసరం శత్రవే దిశేత్, 19
స హతో మన్దబుద్ధిః స్యాద్యథా కాపురుషస్తథా.

ప్ర. అ. కృతాత్మనా = బుద్ధిమంతునిచేత, స్వయమేవ = స్వయముగానే, ఆగతః = వచ్చిన, శత్రుః = శత్రువు, న మోక్తవ్యః = విడవదగినవాడు కాదు. యః = ఎవడు, విక్లవయా = వ్యాకులమైన, బుద్ధ్యా = బుద్ధితో, శత్రవే = శత్రువునకు, ప్రసరమ్ = అవకాశమును, దిశేత్ = ఇచ్చునో, సః = ఆ, మన్దబుద్ధిః = మూఢుడు, కాపురుషః = నీచపురుషుడు, యథా = ఎట్లో, తథా = అట్లు, హతః = చంపబడినవాడు, స్యాత్ = అగును.

తా. స్వయముగా వచ్చిన శత్రువును బుద్ధిమంతుడు విడువగూడదు. తెలివితక్కువతనముచేత శత్రువుకు అవకాశమును ఇచ్చు మందబుద్ధి నీచుడువలె చంపివేయబడును. 19

మూ. తస్మాత్సుదృష్టం కురు జీవలోకం
శరైః శితైస్త్వాం వివిధైర్నయామి,
యమస్య గేహాభిముఖం హి పాపం
రిపుం త్రిలోకస్య చ రాఘవస్య. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఉష్టషష్టితమః సర్గః.

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, జీవలోకమ్ = ప్రాణిలోకమును,

సుదృష్టమ్ = బాగా చూడబడినదానినిగా, కురు = చేయుము. త్రిలోకస్య=మూడు లోకాలకు, రాఘవస్య చ=రామునకు, రిపుమ్ = శత్రువైన, పాపమ్=పాపాత్ముడవైన, త్వామ్ = నిన్ను, శితైః = వాడియైన, వివిధైః = అనేకవిధములైన, శరైః= బాణములచేత, యమస్య = యమునియొక్క, గేహాభిముఖమ్ = గృహమునకు అభిముఖుణ్ణిగా, నయామి = తీసికొనివెళ్ళెదను.

తా. మూడు లోకాలకు, రామునికీ కూడ శత్రువు, పాపాత్ముడవూ అయిన నిన్ను అనేకవిధములైన వాడియైన బాణాలచేత యమలోకమువైపు పంపెదను. అందుచేత చివరిసారిగా ఈ జీవలోకమును చూచుకొనుము. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో అరవైఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనసప్తతితమః సర్గః

[శత్రుఘ్నలవణాసురుల యుద్ధము. లవణుని సంహారము.]

మూ. తచ్ఛ్రుత్వా భాషితం తస్య శత్రుఘ్నస్య మహాత్మనః,
క్రోధమాహారయత్తీవ్రం తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య శత్రుఘ్నస్య = ఆ శత్రుఘ్నునియొక్క, తత్ భాషితమ్ = ఆ మాటను, శ్రుత్వా = విని, తీవ్రమ్ = తీవ్రమైన, క్రోధమ్ = క్రోధమును, ఆహారయత్ = తెప్పించుకొనెను, తిష్ఠ తిష్ఠ ఇతి = నిలువుము నిలువుము అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. లవణుడు మహాత్ముడైన శత్రుఘ్నుని మాటలు విని చాల కోపముతో "నిలువుము, నిలువుము"అని పలికెను. 1

మూ. పాణౌ పాణిం స నిష్పిష్య దన్తాన్ కటకటాయ్య చ,
లవణో రఘుశార్దూల మాహ్వయామాస చాసకృత్. 2

ప్ర అ. సః = ఆ, లవణః = లవణుడు, పాణౌ = హస్తమునందు, పాణిమ్ = హస్తమును, నిష్పిష్య = గట్టిగా నలిపి, దన్తాన్ = దంతములను, కటకటాయ్య చ = కటకటలాడించి, అసకృత్ = మాటిమాటికి, రఘుశార్దూలమ్ = రఘువంశీయులలో శ్రేష్ఠుడైన శత్రుఘ్నుణ్ణి ఆహ్వయత్ = పిలచెను.

తా. ఆ లవణుడు అరచేతితో అరచేతిని గట్టిగా నలుపుచు, పళ్ళు పటపటలాడించుచు, మాటిమాటికి శత్రుఘ్నుణ్ణి యుద్ధానికి ఆహ్వానించెను. 2

మూ. తం బ్రువాణం తథా వాక్యం లవణం ఘోరదర్శనమ్,
శత్రుఘ్నో దేవశత్రుఘ్న ఇదం వచనమబ్రవీత్. 3

ప్ర. అ. తథా = అట్లు, వాక్యమ్ = వాక్యమును, బ్రువాణమ్ = పలుకు

చున్న, ఘోరదర్శనమ్ = ఘోరమైన దర్శనము గల, తం లవణమ్ = ఆ లవ ణుని గూర్చి, దేవశత్రుఘ్నః = రాక్షసులను సంహరించు, శత్రుఘ్నః = శత్రు ఘ్నుడు, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా పలుకుచున్న, చూచుటకు భయంకరుడుగా ఉన్న ఆ లవ ణునితో రాక్షససంహారకుడైన శత్రుఘ్నుడు ఇట్లు పలికెను. 3

మూ. శత్రుఘ్నో న తదా జాతో యదాన్యే నిర్జితా స్త్వయా,
తదద్య బాణాభిహతో వ్రజ త్వం యమసాదనమ్. 4

ప్ర. అ. త్వయా = నీచేత, యదా = ఎప్పుడు, అన్యే = ఇతరులు, నిర్జితాః = జయింపబడినారో, తదా = అప్పుడు, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, న జాతః = పుట్టలేదు. తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, అద్య = ఇప్పుడు, బాణాభిహతః = బాణములచేత కొట్టబడినవాడవై, యమసాదనమ్ = యమలోక మును గూర్చి, వ్రజ = వెళ్ళుము.

తా. నీవు ఇతరులను జయించిననాటికి శత్రుఘ్నుడు పుట్టలేదు. అందు చేత బాణాల దెబ్బలు తిని యమలోకమునకు వెళ్ళుము. 4

మూ. ఋషయోఽప్యద్య పాపాత్మన్ మయా త్వాం నిహతం రణే,
పశ్యన్తు విప్రా విద్వాంస స్త్రిదశా ఇవ రావణమ్. 5

ప్ర. అ. పాపాత్మన్ = పాపాత్ముడా ! అద్య = ఇప్పుడు, మయా = నాచేత, రణే = యుద్ధమునందు, నిహతమ్ = చంపబడిన, త్వామ్ = నిన్ను, ఋషయః అపి = ఋషులూ, విప్రాః = బ్రాహ్మణులూ, విద్వాంసః = పండితులు, రావణమ్ = రావణుణ్ణి, త్రిదశాః ఇవ = దేవతలు వలె, పశ్యన్తు = చూచెదరుగాక.

తా. పాపాత్ముడా ! యుద్ధమునందు నాచేత చంపబడిన నిన్ను, రాముని చేత చంపబడిన రావణుణ్ణి దేవతలు చూచినట్లు ఋషులు, బ్రాహ్మణులు, విద్వాం సులు చూచెదరుగాక. 5

మూ. త్వయి మద్బాణనిర్దగ్ధే పతితేఽద్య నిశాచరే,
పురే జనపదే చాపి క్షేమమేవ భవిష్యతి. 6

ప్ర. అ నిశాచరే = రాక్షసుడవైన, త్వయి = నీవు, మద్బాణనిర్దగ్ధే = నా బాణముచేత కాల్చబడినవాడవై, అద్య = ఇప్పుడు, పతితే = పడినవాడవగుచుండగా, పురే = పురమునందు, జనపదే చాపి = జనపదమునందు కూడ, క్షేమమ్, ఏవ = క్షేమమే, భవిష్యతి = కాగలదు.

తా. నిశాచరుడవైన నీవు ఇప్పుడు నా బాణములచే దహింపబడి నేలమీద కూలగా పురమునందు, జనపదమునందు కూడ క్షేమమే కలుగును. 6

మూ. అద్య మద్బాహునిష్క్రాన్తః శరో వజ్రనిభాననః,
ప్రవేక్ష్యతే తే హృదయం పద్మమంశురివార్కజః. 7

ప్ర. అ. అద్య = ఇప్పుడు, మద్బాహునిష్క్రాన్తః = నా బాహువునుండి బయల్వెడలిన, వజ్రనిభాననః = వజ్రమువంటి ముఖము గల, శరః = బాణము, అర్కజః = సూర్యునినుండి బయల్వెడలిన, అంశుః = కిరణము, పద్మమ్ ఇవ = పద్మమును వలె, తే హృదయమ్ = నీ హృదయమును, ప్రవేక్ష్యతే = ప్రవేశించగలదు.

తా. నా బాహువునుండి బయల్వెడలిన వజ్రము వంటి అగ్రభాగము గల బాణము, సూర్యునినుండి బయల్వెడలిన కిరణము పద్మములో ప్రవేశించి నట్లు, నీ హృదయములో ప్రవేశించును. 7

మూ. ఏవముక్తో మహావృక్షం లవణః క్రోధమూర్ఛితః,
శత్రుఘ్నోరసి చిక్షేప స చ తం శతధాచ్ఛినత్. 8

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, లవణః = లవణుడు, క్రోధమూర్ఛితః = కోపావిష్టుడై, మహావృక్షమ్ = మహావృక్షమును, శత్రుఘ్నోరసి = శత్రుఘ్నుని వక్షఃస్థలమునందు, చిక్షేప = విసిరెను. సః చ = అతడు, తమ్ = దానిని, శతధా = నూరు ముక్కలుగా, అచ్ఛినత్ = ఛేదించెను.

తా. లవణుడు ఆ మాటలు విని కోపావిష్టుడై ఒక పెద్దచెట్టును శత్రుఘ్నుని వక్షఃస్థలముమీద పడవేసెను. అతడు దానిని నూరుముక్కలుగా ఛేదించెను. 8

మూ. తద్దృష్ట్వా విఫలం కర్మ రాక్షసః పునరేవ తు,
పాదపాన్ సుబహూన్ గృహ్య శత్రుఘ్నాయా సృజద్బలీ. 9

ప్ర. అ. బలీ = బలవంతుడైన, రాక్షసః = రాక్షసుడు, తత్ కర్మ = ఆ పనిని, విఫలమ్ = విఫలమైనదానినిగా, దృష్ట్వా = చూచి, సుబహూన్ = చాల అధికమైన, పాదపాన్ = వృక్షములను, గృహ్యా = గ్రహించి, శత్రుఘ్నాయ = శత్రుఘ్నుని కొరకు, అసృజత్ = విడచెను.

తా బలవంతుడైన ఆ రాక్షసుడు ఆ కర్మ వ్యర్థ మగుట చూచి, మరల అనేకవృక్షములను గ్రహించి శత్రుఘ్నునిమీదికి విసిరెను. 9

మూ. శత్రుఘ్నశ్చాపి తేజస్వీ వృక్షానాపతతో బహూన్,
త్రిభిశ్చతుర్భి రేకైకం చిచ్ఛేద నతపర్వభిః. 10

ప్ర. అ. తేజస్వీ = తేజస్సు కల, శత్రుఘ్నః చ అపి = శత్రుఘ్నుడు కూడ, ఆపతతః=వచ్చి మీదపడుచున్న, బహూన్=అనేకమైన, వృక్షాన్=వృక్షములను, ఏకైకమ్ = ఒక్కొక్కదానిని, త్రిభిః = మూడింటి చేతను, చతుర్భిః = నాల్గింటిచేతను; నతపర్వభిః = వంగిన కణుపులు గల బాణములచేత, చిచ్ఛేద= ఛేదించెను.

తా. తేజస్సు గల శత్రుఘ్నుడు కూడ వచ్చి మీద పడుచున్న అనేకములైన ఆ చెట్లను, ఒక్కొక్క దానిని మూడు బాణాలచేత, నాలుగు బాణాలచేత ఛేదించెను. 10

మూ. తతో బాణమయం వర్షం వ్యసృజద్రాక్షసోపరి,
శత్రుఘ్నో వీర్యసంపన్నో వివ్యథే న స రాక్షసః. 11

ప్ర అ. తతః = అటుపిమ్మట, వీర్యసంపన్నః = పరాక్రమసంపన్నుడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, రాక్షసోపరి = రాక్షసునిమీద, బాణమయమ్ = బాణమయమైన, వర్షమ్=వర్షమును, వ్యసృజత్ = విడచెను. సః రాక్షసః=రాక్షసుడు, న విద్యథే = వ్యథ చెందలేదు.

తా. పరాక్రమసంపన్నుడైన శత్రుఘ్నుడు రాక్షసుని మీద బాణవర్షమును కురిపించెను. కాని ఆ రాక్షసుడు ఏమాత్రము వ్యధ చెందలేదు. 11

మూ. తతః ప్రహస్య లవణో వృక్షముద్యమ్య వీర్యవాన్,
శిరస్యభ్యహనచ్ఛూరం స్రస్తాఙ్గః స ముమోహ వై. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వీర్యవాన్ = వీర్యవంతుడైన, లవణః = లవణుడు, ప్రహస్య = నవ్వి, వృక్షమ్ = వృక్షమును, ఉద్యమ్య = ఎత్తి, శూరమ్ = శూరుడైన శత్రుఘ్నుణ్ణి, శిరసి = తలమీద, అభ్యహనత్ = కొట్టెను. సః = అతడు, ప్రస్రస్తాఙ్గః = జారిపోయిన అవయవములు కలవాడై, ముమోహ వై = మోహము చెందెను.

తా పిమ్మట పరాక్రమవంతుడైన లవణుడు అట్టహాసము చేయుచు చెట్టు ఎత్తి శత్రుఘ్నుని తలమీద కొట్టెను. అప్పుడు అతడు అవయవములు జారవిడచి మోహము చెందెను. 12

మూ. తస్మిన్నిపతితే వీరే హాహాకారో మహానభూత్,
ఋషీణాం దేవసంఘానాం గన్ధర్వాప్సరసాం తథా. 13

ప్ర. అ. వీరే = వీరుడైన, తస్మిన్ = అతడు, నిపతితే = పడినవాడగుచుండగా, ఋషీణామ్ = ఋషులయొక్క, దేవసంఘానామ్ = దేవతాసంఘముల యొక్క, తథా = మరియు, గన్ధర్వాప్సరసామ్ = గంధర్వులయొక్క, అప్సరసల యొక్క, మహాన్ = గొప్ప, హాహాకారః = హాహాకారము, అభూత్ = అయెను.

తా. వీరుడైన ఆ శత్రుఘ్నుడు పడిపోగానే ఋషులు, దేవసంఘములు, గంధర్వులు, అప్సరసలు హాహాకారము చేసిరి. 13

మూ. తమవజ్ఞాయ తు హతం శత్రుఘ్నం భువి పాతితమ్,
రక్షో లబ్ధాన్తరమపి న వివేశ స్వమాలయమ్.

ప్ర. అ. రక్షః = రాక్షసుడు, హతమ్ = కొట్టబడిన, భువి = నేలమీద, పాతితమ్ = పడగొట్టబడిన, తం శత్రుఘ్నమ్ = ఆ శత్రుఘ్నుణ్ణి, అవజ్ఞాయ = అనాదరము చేసి, లబ్ధాన్తరమ్ అపి = పొందబడిన అవకాశము కలవాడైనను, స్వమ్ = తన సంబంధమైన, ఆలయమ్ = గృహమును, న వివేశ = ప్రవేశించ లేదు.

తా. దెబ్బతిని నేలమీద పడిపోయిన ఆ శత్రుఘ్నుని విషయమున అనాదరభావముచేత, ఇంటిలోనికి వెళ్ళుటకు అవకాశము దొరికినను ఆ రాక్షసుడు వెళ్ళలేదు. 14

మూ. నాపి శూలం ప్రజగ్రాహ తం దృష్ట్వా భువి పాతితమ్,
తతో హత ఇతి జ్ఞాత్వా తాన్ భక్షాన్ సముదావహత్. 15

ప్ర. అ. భువి = నేలమీద, పాతితమ్ = పడగొట్టబడిన, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, శూలమ్ = శూలమును, న ప్రజగ్రాహ అపి = గ్రహించలేదు. తతః = అటు పిమ్మట, హతః ఇతి = చంపబడినాడు అని, జ్ఞాత్వా = తెలిసికొని, తాన్ = ఆ, భక్షాన్ = తినవలసిన మృగాదులను, సముదావహత్ = పైకి ఎత్తికొనెను.

తా. అతడు నేలమీద పడిపోయినట్లు చూచి కూడ ఆ రాక్షసుడు శూలమును తీసికొనలేదు. అతడు మరణించినా డని అనుకొని ఆహారముకొరకై తెచ్చిన ఆ మృగాదులను పైకి ఎత్తికొనెను. 15

మూ. ముహూర్తాల్లబ్ధసంజ్ఞస్తు పునస్తస్థౌ ధృతాయుధః,
శత్రుఘ్నో వై పురద్వారి ఋషిభిః సంప్రపూజితః. 16

ప్ర. అ. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, ముహూర్తాత్ = ముహూర్తకాలము వలన, లబ్ధసంజ్ఞః = పొందబడిన సంజ్ఞ కలవాడై, ఋషిభిః = ఋషులచేత, సంప్రపూజితః = పూజింపబడినవాడై, పునః = మరల, ధృతాయుధః = ధరించబడిన ఆయుధము కలవాడై, పురద్వారి = పట్టణద్వారమునందు, తస్థౌ = నిలబడెను.

తా. శత్రుఘ్నుడు ముహూర్తకాలములో స్పృహ పొంది, ఋషులచేత పూజింపబడుచు, ఆయుధములు ధరించి మరల పురద్వారమునందు నిలబడెను. 16

మూ. తతో దివ్యమమోఘం తం జగ్రాహ శరముత్తమమ్,
జ్వలన్తం తేజసా ఘోరం పూరయన్తం దిశో దశ. 17

వజ్రాననం వజ్రవేగం మేరుమన్దరసంనిభమ్,
నతం పర్వసు సర్వేషు సంయుగేష్వపరాజితమ్. 18

అసృక్చన్దనదిగ్ధాఙ్గం చారుపత్రం పతత్రిణమ్,
దానవేన్ద్రాచలేన్ద్రాణామసురాణాం చ దారణమ్. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దివ్యమ్ = దివ్యమూ, అమోఘమ్ = వ్యర్థము కానిది, ఘోరమ్ = భయంకరము, తేజసా = తేజస్సుతో, జ్వలన్తమ్ =

మండుచున్నది, దశ దిశః = పది దిక్కులను, పూరయన్తమ్ = నింపుచున్నది, వజ్రాననమ్ = వజ్రమువంటి అగ్రభాగము గలది, వజ్రవేగమ్ = పిడుగు వంటి వేగము గలది, మేరుమన్దరసంనిభమ్ = మేరుమందరపర్వతములతో సమానము, సర్వేషు = సమస్తమైన, పర్వసు = కణుపులయందు, అపరాజితమ్ = ఓడింపబడనిది, అసృక్చన్దనదిగ్ధాఙ్గమ్ = రక్తమనే చందనముచేత పూయబడిన శరీరము గలది, చారుపత్రమ్ = అందమైన రెక్కలు గలది, పతత్త్రిణమ్ = పక్షివలె ప్రయాణము చేయునది, దానవేన్ద్రాచలేన్ద్రాణామ్ = దానవేంద్రులకు పర్వతములకు, అసురాణాం చ = రాక్షసులకు, దారణమ్ = చీల్చివేయునది అయిన, ఉత్తమమ్ = ఉత్తమమైన, తం శరమ్ = ఆ బాణమును, జగ్రాహ = గ్రహించెను.

తా. పిమ్మట శత్రుఘ్నుడు దివ్యమూ, అమోఘమూ అయిన ఆ ఉత్తమమైన శరమును బైటకు తీసెను. తేజస్సుతో మండుచున్న భయంకరమైన ఆ బాణము తేజస్సుతో పది దిక్కులను నింపుచుండెను. వజ్రమువంటి వేగము, పిడుగు వంటి వేగము గల, మేరుమందరపర్వతములతో సమానమైన ఆ శరము అన్ని కణుపులయందూ కూడ వంగి ఉండెను. యుద్ధములలో ఎన్నడూ ఓటమి ఎరగని ఆ బాణము రక్త మనే చందనముచే పూయబడి, అందమైన రెక్కలతో పక్షి వలె ఉండెను. ఇది దానవనాయకులను, పర్వతములను, అసురులను కూడ చీల్చివేసినది. 17-19

మూ. తం దీప్తమివ కాలాగ్నిం యుగాన్తే సముపస్థితమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని పరిత్రాసముపాగమన్. 20

ప్ర. అ. యుగాన్తే = ప్రలయకాలమునందు, సముపస్థితమ్ = వచ్చిన, దీప్తమ్ = ప్రజ్వలించుచున్న, కాలాగ్నిమ్ ఇవ = ప్రలయకాలాగ్ని వలె ఉన్న, తమ్ = దానిని, దృష్ట్వా = చూచి, సర్వాణి = సమస్తమైన, భూతాని = భూతములు, పరిత్రాసమ్ = భయమును, ఉపాగమన్ = పొందినవి.

తా. హటాత్తుగా వచ్చిన ప్రలయకాలాగ్ని వలె మండుచున్న ఆ బాణమును చూచి అన్ని ప్రాణులు భయపడినవి. 20

మూ. సదేవాసురగన్ధర్వం మునిభిః సాప్సరోగణమ్,
జగద్ధి సర్వమస్వస్థం పితామహముపస్థితమ్. 21

ప్ర. అ సదేవాసురగన్ధర్వమ్ = దేవ-అసుర-గంధర్వులతో కూడిన, సాప్సరోగణమ్ = అప్సరఃస్త్రీగణములతో కూడిన, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, అస్వస్థమ్ = అస్వస్థమై, మునిభిః = మునులతో, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి, ఉపస్థితమ్ = పొందినది.

తా. అపుడు జగత్తు అంతా అస్వస్థమై బ్రహ్మదేవునివద్దకు వెళ్లెను. దేవతలు, అసురులు, గంధర్వులు, మునులు, అప్సరఃస్త్రీలు అందరూ కూడ భయము చెందిరి. 21

మూ. ఊచుశ్చ దేవదేవేశం వరదం ప్రపితామహమ్,
దేవానాం భయసంమోహో లోకానాం సంక్షయం ప్రతి.

ప్ర. అ. లోకానామ్ = లోకములయొక్క, సంక్షయం ప్రతి = వినాశమును గూర్చి, దేవానామ్ = దేవతలకు. భయసంమోహః = భయము సంమోహము కలిగెను. దేవదేవేశమ్ = దేవదేవుడు ప్రభువు అయిన, వరదమ్ = వరముల నిచ్చు, ప్రపితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి గూర్చి, ఊచుః చ = పలికిరి.

తా. లోకములు నశించునేమో అని దేవతలకు భయము, మోహము కలిగెను. దేవదేవుడు, సర్వసమర్థుడు, వరములను ఇచ్చువాడూ అయిన బ్రహ్మదేవునితో ఇట్లు పలికిరి. 22

మూ. కచ్చిల్లోకక్షయో దేవ సంప్రాప్తో వా యుగక్షయః,
నేదృశం దృష్టపూర్వం చ న శ్రుతం ప్రపితామహ. 23

ప్ర. అ. ప్రపితామహ = ప్రపితామహా! లోకక్షయః = లోకనాశము గాని, యుగక్షయః వా = ప్రలయము గాని, సంప్రాప్తః కచ్చిత్ = వచ్చినదా? ఈదృశమ్ = ఇట్టిది, దృష్టపూర్వమ్ = పూర్వము చూడబడినది, న = కాదు. న శ్రుతమ్ = వినబడలేదు.

తా. పితామహా! లోకవినాశము గాని మహాప్రళయము గాని వచ్చినదా? ఇట్టిదానిని పూర్వ మెన్నడూ చూడలేదు, వినలేదు. 23

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా బ్రహ్మా లోకపితామహః,
భయకారణమాచష్ట దేవానామభయంకరః. 24

ప్ర. అ. తేషామ్=వారియొక్క, తత్ వచనమ్=ఆ వచనమును, శ్రుత్వా = విని, లోకపితామహః=లోకములకు పితామహుడైన, అభయంకరః = అభయమును ఇచ్చు, బ్రహ్మా = బ్రహ్మ, దేవానామ్ = దేవతలకు, భయకారణమ్ = ఆ భయకారణమును, ఆచష్ట = చెప్పెను.

తా. లోకములకు పితామహుడు, అభయప్రదుడూ అయిన బ్రహ్మదేవుడు వాళ్ళ మాటలు విని ఈ భయమునకు ఏది కారణమో దేవతలకు చెప్పెను. 24

మూ. ఉవాచ మధురాం వాణీం శృణుధ్వం సర్వదేవతాః,
వధాయ లవణస్యాజౌ శరః శత్రుఘ్నధారితః. 25

ప్ర. అ. మధురామ్ = మధురమైన, వాణీమ్ = వాక్కును, ఉవాచ = పలికెను. సర్వదేవతాః = సమస్తదేవతలారా! శృణుధ్వమ్=వినండి. లవణస్య = లవణునియొక్క, వధాయ = వధకొరకు, ఆజౌ = యుద్ధమునందు, శరః = బాణము, శత్రుఘ్నధారితః = శత్రుఘ్నునిచేత ధరించబడినది.

తా. మధురమైన వాక్కును పలికెను-"సకలదేవతలారా! వినండి. లవణుని చంపుటకై శత్రుఘ్నుడు యుద్ధములో బాణమును ధరించినాడు". 25

మూ. తేజసా తస్య సంమూఢాః సర్వే స్మః సురసత్తమాః,
ఏష పూర్వస్య దేవస్య లోకకర్తుః సనాతనః, 26
శరస్తేజోమయో వత్సా యేన వై భయమాగతమ్.

ప్ర. అ. సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులారా! సర్వే = మన మందరమూ, తస్య = దానియొక్క, తేజసా = తేజస్సుచేత, సంమూఢాః = మూఢులమైతిమి. వత్సాః = వత్సలారా! సనాతనః=ప్రాచీనమైన, ఏషః = ఇది, లోకకర్తుః = లోకముల నిర్మాత అయిన, పూర్వస్య = సనాతనుడైన, దేవస్య = దేవునియొక్క, తేజోమయః = తేజఃస్వరూపమైన, శరః = బాణము, యేన = దేనిచేత, భయమ్= భయము, ఆగతమ్ = వచ్చినదో.

తా. దేవతాశ్రేష్ఠులారా! మనము అందరమూ దీని తేజస్సుచేత ఏమీ తోచకుండ ఉన్నాము. వత్సలారా! అతిసనాతనమైన ఈ బాణము తేజఃస్వరూపమైనది.

లోకములను సృజించిన పురాణపురుషోత్తముడైన మహావిష్ణువు బాణము. దీనిచేతనే భయము ఏర్పడినది. 26

మూ. ఏష వై కైటభస్యార్థే మధునశ్చ మహాశరః, 27
సృష్టో మహాత్మనా తేన వధార్థే దైత్యయోస్తయోః.

ప్ర. అ. ఏషః మహాశరః = ఈ గొప్ప బాణము, కైటభస్య అర్థే = కైటభుని కొరకు, మధునః చ = మధువుకొరకు, తయోః దైత్యయోః = ఆ దైత్యుల యొక్క, వధార్థే = వధకొరకై, తేన మహాత్మనా = ఆ మహాత్మునిచేత, సృష్టః = సృజింపబడినది.

తా. మహాత్ముడైన ఆ శ్రీమహావిష్ణువు మధుకైటభు లను ఇద్దరు దానవులను వధించుటకై ఈ గొప్ప బాణమును సృజించినాడు. 27

మూ. ఏక ఏవ ప్రజానాతి విష్ణుస్తేజోమయం శరమ్, 28
ఏషా ఏవ తనుః పూర్వా విష్ణోస్తస్య మహాత్మనః.

ప్ర. అ. తేజోమయమ్ = తేజోవికారమైన, శరమ్ = ఈ శరమును గూర్చి, ఏకః = ఒక్క, విష్ణుః ఏవ = విష్ణువు మాత్రమే, ప్రజానాతి = ఎరుగును. ఏషా = ఇది, మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ, విష్ణోః ఏవ = విష్ణువుయొక్కయే, పూర్వా = ప్రాచీనమైన, తనుః = శరీరము.

తా. తేజోమయమైన ఈ శరమును గూర్చి పూర్తిగా తెలిసినవాడు ఆ విష్ణువు ఒక్కడే. ఇది మహాత్ముడైన ఆ విష్ణువుయొక్క ప్రాచీనమైన రూపమే. 28

మూ. ఇతో గచ్ఛత పశ్యధ్వం వధ్యమానం మహాత్మనా, 29
రామానుజేన వీరేణ లవణం రాక్షసోత్తమమ్

ప్ర. అ. ఇతః = ఇక్కడినుండి, గచ్ఛత = వెళ్ళండి. మహాత్మనా = మహాత్ముడైన, వీరేణ = వీరుడైన, రామానుజేన = శత్రుఘ్నునిచేత. వధ్యమానమ్ = చంపబడుచున్న, రాక్షసోత్తమమ్ = రాక్షసులలో ఉత్తముడైన, లవణమ్ = లవణుణ్ణి, పశ్యధ్వమ్ = చూడండి.

తా. ఇక్కడినుంచి వెళ్ళి మహాత్ముడూ వీరుడూ అయిన శత్రుఘ్నునిచేత చంపబడుచున్న రాక్షసోత్తముడైన లవణాసురుణ్ణి చూడండి. 29

మూ. తస్య తే దేవదేవస్య నిశమ్య వచనం సురాః, 30
ఆజగ్ముర్యత్ర యుద్ధ్యేతే శత్రుఘ్నలవణావుభౌ

ప్ర. అ. తే సురాః = ఆ దేవతలు, తస్య దేవదేవస్య = ఆ బ్రహ్మదేవుని యొక్క, వచనమ్ = వచనమును, నిశమ్య = విని, శత్రుఘ్నలవణౌ = శత్రుఘ్న లవణులు, ఉభౌ = ఇద్దరూ, యత్ర = ఎక్కడ, యుద్ధ్యేతే = యుద్ధము చేయు చున్నారో అచటికి. ఆజగ్ముః = వచ్చిరి.

తా. దేవతలు బ్రహ్మదేవుని మాటలు విని శత్రుఘ్నలవణులు యుద్ధము చేయుచున్న ప్రదేశమునకు వచ్చిరి. 30

మూ. తం శరం దివ్యసంకాశం శత్రుఘ్నకరధారితమ్, 31
దదృశుః సర్వభూతాని యుగాన్తాగ్నిమివోదితమ్.

ప్ర. అ. సర్వభూతాని=సమస్తభూతములు, దివ్యసంకాశమ్ = దివ్యమైన, శత్రుఘ్నకరధారితమ్ = శత్రుఘ్నుని కరమునందు ధరించబడిన, ఉదితమ్ = బయలుదేరిన, యుగాన్తాగ్నిమ్ ఇవ = ప్రలయకాలాగ్ని వలె ఉన్న, తం శరమ్ = ఆ శరమును, దదృశుః = చూచినవి.

తా. బయలుదేరిన ప్రలయకాలాగ్ని వలె ఉన్న, శత్రుఘ్నుని చేతిలోని ఆ దివ్యమైన శరమును అన్ని భూతములు చూచెను. 31

మూ. ఆకాశమావృతం దృష్ట్వా దేవైర్హి రఘునన్దనః, 32
సింహనాదం భృశం కృత్వా దదర్శ లవణం పునః.

ప్ర. అ. రఘునన్దనః=శత్రుఘ్నుడు, దేవైః = దేవతలచేత, ఆవృతమ్= కప్పబడిన, ఆకాశమ్ = ఆకాశమును, దృష్ట్వా = చూచి, భృశమ్ = మిక్కిలి, సింహనాదమ్ = సింహనాదమును, కృత్వా = చేసి, పునః = మరల, లవణమ్ = లవణాసురుణ్ణి, దదర్శ = చూచెను.

తా. శత్రుఘ్నుడు ఆకాశము నంతా దేవతలు ఆవరించి ఉండుట చూచి, బిగ్గరగా సింహనాదము చేసి, మరల లవణుని వైపు చూచెను. 32

మూ. ఆహూతశ్చ పునస్తేన శత్రుఘ్నేన మహాత్మనా, 33
లవణః క్రోధసంయుక్తో యుద్ధాయ సముపస్థితః.

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, తేన శత్రుఘ్నేన = ఆ శత్రుఘ్నునిచేత, పునః = మరల, ఆహూతః = పిలవబడిన, లవణః = లవణుడు, క్రోధసంయుక్తః = క్రోధముతో కూడనవాడై, యుద్ధాయ = యుద్ధముకొరకు, సముపస్థితః = వచ్చినాడు.

తా. మహాత్ముడైన శత్రుఘ్నునిచేత మరల యుద్ధానికై పిలవబడిన లవణుడు కోపముతో కూడినవాడై యుద్ధమునకు వచ్చెను. 33

మూ. ఆకర్ణాత్స వికృష్యాథ తద్ధనుర్ధన్వినాం వరః, 34
స ముమోచ మహాబాణం లవణస్య మహోరసి.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ధన్వినామ్ = ధనుర్ధరులలో, వరః = శ్రేష్ఠుడైన, సః = ప్రసిద్ధుడైన, సః = అతడు, తత్ ధనుః = ఆ ధనస్సును, ఆకర్ణాత్ = చెవివరకు, ఆకృష్య = లాగి, మహాబాణమ్ = గొప్పబాణమును, లవణస్య = లవణునియొక్క, మహోరసి = గొప్ప వక్షఃస్థలమునందు, ముమోచ = విడచెను.

తా. పిమ్మట ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన ఆ శత్రుఘ్నుడు ధనస్సును ఆకర్ణాంతము లాగి ఆ గొప్ప బాణమును లవణుని విశాలవక్షఃస్థలముమీద విడచెను.

మూ. ఉరస్తస్య విదార్యాశు ప్రవివేశ రసాతలమ్, 35
గత్వా రసాతలం దివ్యః శరో విబుధపూజితః,
పునరేవాగమత్తూర్ణమిక్ష్వాకుకులనన్దనమ్. 36

ప్ర. అ. విబుధపూజితః = దేవతలచేత పూజింపబడిన, దివ్యః శరః = దివ్యమైన ఆ బాణము, ఆశు = శీఘ్రముగా, తస్య = వానియొక్క, ఉరః = వక్షఃస్థలమును, విదార్య = చీల్చి, రసాతలమ్ = పాతాలమును, ప్రవివేశ = ప్రవేశించెను. రసాతలమ్ = రసాతలమును గూర్చి, గత్వా = వెళ్ళి, పునః ఏవ = మరల, తూర్ణమ్ = శీఘ్రముగా, ఇక్ష్వాకుకులనన్దనమ్ = శత్రుఘ్నుని గూర్చి, ఆగమత్ = వచ్చెను.

తా. దేవతలచేత పూజింపబడిన ఆ దివ్యమైన శరము వాని వక్షఃస్థలమును చీల్చి, రసాతలములో ప్రవేశించి మరల శీఘ్రముగా శత్రుఘ్నుని చేరెను. 35,36

మూ. శత్రుఘ్నశరనిర్భిన్నో లవణః స నిశాచరః,
పపాత సహసా భూమౌ వజ్రాహత ఇవాచలః. 37

ప్ర. అ. నిశాచరః = రాక్షసుడైన, సః లవణః = ఆ లవణుడు, శత్రుఘ్న శరనిర్భిన్నః = శత్రుఘ్నుని శరముచేత బ్రద్దలుకొట్టబడినవాడై, వజ్రాహతః = వజ్రముచేత కొట్టబడిన, అచలః ఇవ = పర్వతము వలె, సహసా = వెంటనే, భూమౌ = నేలమీద, పపాత = పడెను.

తా. శత్రుఘ్నుని బాణముచేత బ్రద్దలైపోయిన ఆ లవణాసురుడు వజ్రముచేత కొట్టబడిన పర్వతము వలె నేలపై కూలెను. 37

మూ. తచ్చ శూలం మహద్దివ్యం హతే లవణరాక్షసే,
పశ్యతాం సర్వదేవానాం రుద్రస్య వశమన్వగాత్. 38

ప్ర. అ. లవణరాక్షసే = లవణాసురుడు, హతే = చంపబడినవాడగుచుండగా, దివ్యమ్ = దివ్యమైన, మహత్ = గొప్పదైన, తత్ = ఆ, శూలమ్ = శూలము, సర్వదేవానామ్ = సమస్తదేవతలు, పశ్యతామ్ = చూచుచుండగా, రుద్రస్య = రుద్రునియొక్క, వశమ్ = వశమును, అన్వగాత్ = పొందెను.

తా. లవణాసురుడు మరణించగానే దివ్యమైన ఆ గొప్ప శూలము, సకల దేవతలు చూచుచుండగా రుద్రునికి వశ మయ్యెను. 38

మూ. ఏకేషుపాతేన భయం నిపాత్య
లోకత్రయస్యాస్య రఘుప్రవీరః,
వినిర్బభావుత్తమచాపబాణ
స్తమః ప్రణుద్యేవ సహస్రరశ్మిః. 39

ప్ర. అ. ఉత్తమచాపబాణః = ఉత్తమములైన ధనస్సూ బాణములూ గల, రఘుప్రవీరః = శత్రుఘ్నుడు, ఏకేషుపాతేన = ఒక్క బాణముయొక్క పాతముచేత, అస్య లోకస్య = ఈ లోకముయొక్క, భయమ్ = భయమును, నిపాత్య = పడగొట్టి, తమః = చీకటిని, ప్రణుద్య = తొలగించి, సహస్రరశ్మిః ఇవ = సూర్యుడు వలె, వినిర్బభౌ = ప్రకాశించెను.

తా. ఉత్తమములైన ధనుర్బాణములు గల శత్రుఘ్నుడు ఒక బాణమును ప్రయోగించుటచే మూడు లోకముల భయమును తొలగించి చీకటిని తొలగించిన సూర్యుడు వలె ప్రకాశించెను. 39

మూ. తతో హి దేవా ఋషిపన్నగాశ్చ
ప్రపూజిరే హ్యప్సరసశ్చ సర్వాః,
దిష్ట్యా జయో దాశరథేరవాప్త
స్త్యక్త్వా భయం సర్ప ఇవ ప్రశాన్తః. 40

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనసప్తతితమః సర్గః.

ప్ర. అ. "దిష్ట్యా జయో దాశరథే తవాద్య
దిష్ట్యా చ లోకాః సకలాః ప్రసన్నాః"

అను ప్రాచ్యపాఠము బాగున్నది. తతః = అటుపిమ్మట, దేవాః = దేవతలు, ఋషి పన్నగాః = ఋషుల పన్నగులు, సర్వాః=సమస్తమైన, అప్సరసః చ = అప్సరః స్త్రీలు, దాశరథే = శత్రుఘ్నా ! అద్య = ఇప్పుడు, దిష్ట్యా = అదృష్టవశముచేత, తవ = నీకు, జయః=జయము లభించినది. దిష్ట్యా = అదృష్టవశముచేత, సకలాః = సమస్తమైన, లోకాః = లోకములు, ప్రసన్నాః = ప్రసన్నమైనవి అని, ప్రపూజిరే = పూజించిరి.

తా. అప్పుడు దేవతలు, ఋషులు, పన్నగములు, అప్సరస లందరు– "శత్రుఘ్నా ! అదృష్టవశముచేత ఇప్పుడు జయము పొందినావు; అదృష్టవశము చేత అన్ని లోకాలూ కూడ ప్రసన్నము లైనవి" అని పలుకుచు శత్రుఘ్నుణ్ణి పూజించిరి. 40

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో అరవైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ సప్తతితమః సర్గః

[శత్రుఘ్నుడు దేవతలనుండి వరములను పొందుట. మధుపురిని నిర్మించి పిదప రామునివద్దకు వెళ్ళవలె నని అతడు సంకల్పించుట].

మూ. హతే తు లవణే దేవాః సేన్ద్రాః సాగ్నిపురోగమాః,
ఊచుః సుమధురాం వాణీం శత్రుఘ్నం శత్రుతాపనమ్. 1

ప్ర. అ. లవణే=లవణుడు, హతే = చంపబడినవాడగుచుండగా, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, సాగ్నిపురోగమాః = అగ్ని ముందు ఉన్నవాడుగా గల, దేవాః = దేవతలు, శత్రుతాపనమ్ = శత్రువులను పీడించు, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని గూర్చి, సుమధురామ్ = చాల మధురమైన, వాణీమ్ = వాక్కును, ఊచుః = పలికిరి.

తా. లవణుడు చంపబడిన పిమ్మట ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలు శత్రుసంహారకుడైన శత్రుఘ్నునితో చాల మదురమైన వాక్యమును పలికిరి. 1

మూ. దిష్ట్యా తే విజయో వత్స దిష్ట్యా లవణరాక్షసః,
హతః పురుషశార్దూల వరం వరయ సువ్రత. 2

ప్ర. అ. వత్స=వత్సా! దిష్ట్యా=అదృష్టవశముచేత. తే=నీకు, విజయః = విజయము లభించినది. దిష్ట్యా = అదృష్టవశముచేత, లవణరాక్షసః = లవణాసురుడు, హతః = చంపబడినాడు. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడా! సువ్రత= మంచి నియమములు కలవాడా! వరమ్ = వరమును, వరయ = కోరుకొనుము.

తా. వత్సా! అదృష్టవశముచేత నీవు విజయవంతుడవు అయినావు. అదృష్టవశముచేత లవణుడు చంపబడినాడు. పురుషశ్రేష్ఠుడా! మంచి నియమములు కలవాడా! వరము కోరుకొనుము. 2

మూ. వరదాస్తు మహాబాహో సర్వ ఏవ సమాగతాః,
విజయాకాఙ్క్షిణస్తుభ్యమమోఘం దర్శనం హి నః. 3

ప్ర. అ. మహాబాహో=మహాబాహూ! తుభ్యమ్=నీకొరకు, విజయకాఙ్క్షిణః = విజయమును కోరిన, సర్వే ఏవ = మేమందరమూ, వరదాః = వరమును ఇచ్చువారమై, సమాగతాః=వచ్చినాము. నః=మాయొక్క, దర్శనమ్=దర్శనము, అమోఘం హి = వ్యర్థము కానిది కదా?

తా. మహాబాహూ! నీకు విజయము రావలె నను కోరిక గల మేము అందరమూ నీకు వరములను ఇచ్చుటకై వచ్చినాము. మా దర్శనము వ్యర్థముకాదు కదా? 3

మూ. దేవానాం భాషితం శ్రుత్వా శూరో మూర్ధ్ని కృతాఞ్జలిః,
ప్రత్యువాచ మహాబాహుః శత్రుఘ్నః ప్రయతాత్మవాన్. 4

ప్ర. అ. శూరః = శూరుడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, ప్రయతాత్మవాన్ = నిగ్రహించబడిన మనస్సు కలవాడూ అయిన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, దేవానామ్ = దేవతలయొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, మూర్ధ్ని = శిరస్సుపైన, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. శూరుడు, మహాబాహువు, మనోనిగ్రహవంతుడూ అయిన శత్రుఘ్నుడు దేవతల మాటలు విని శిరస్సుపై అంజలి ఘటించి ఇట్లనెను. 4

మూ. ఇయం మధుపురీ రమ్యా మధురా దేవనిర్మితా,
నివేశం ప్రాప్నుయాచ్ఛీఘ్రమేష మేఽస్తు వరః పరః. 5

ప్ర. అ. ఇయమ్ = ఈ, రమ్యా = సుందరమైన, మధురా = మధురమైన, మధుపురీ = మధుపురి, దేవనిర్మితా = దేవతలచేత నిర్మితమై, శీఘ్రమ్ = శీఘ్రముగా, నివేశమ్ = స్థితిని (రాజధానీత్వమును), ప్రాప్నుయాత్ = పొందుగాక. ఏషః = ఇది, మే = నాయొక్క, పరః = గొప్ప, వరః = వరము, అస్తు = అగుగాక.

తా. రమ్యమూ, మధురమూ అయిన ఈ మధుపురి దేవతానిర్మితమై శీఘ్రముగా రాజధాని అగుగాక. ఇదియే నా ప్రధానమైన వరము. 5

మూ. తం దేవాః ప్రీతమనసో బాఢమిత్యేవ రాఘవమ్,
భవిష్యతి పురీ రమ్యా శూరసేనా న సంశయః. 6

ప్ర. అ. దేవాః = దేవతలు, ప్రీతమనసః = సంతోషించిన మనస్సు కలవారై, పురీ = పట్టణము, శూరసేనా = శూరులైన సైనికులు గలది, రమ్యా = సుందరము, బాఢమ్ = తప్పక, భవిష్యతి = కాగలదు. సంశయః = సంశయము, న = లేదు, ఇత్యేవ = అని, తం రాఘవమ్ = ఆ శత్రుఘ్నుని గూర్చి పలికిరి.

తా. ఆ దేవతలు మనస్సులో సంతోషించి శత్రుఘ్నునితో- "ఈ మధుపురి నిఃసంశయముగా రమ్యముగా శూరులైన సైనికులతో నిండి ఉండును" అని పలికిరి. 6

మూ. తే తథోక్త్వా మహాత్మానో దివమారురుహుస్తదా,
శత్రుఘ్నోఽపి మహాతేజాస్తాం సేనాం సముపానయత్. 7

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, తే = ఆ దేవతలు, తథా = అట్లు, ఉక్త్వా = పలికి, తదా = అప్పుడు, దివమ్ = స్వర్గమును, ఆరురుహుః = ఎక్కిరి. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, శత్రుఘ్నోఽపి = శత్రుఘ్నుడు కూడ, తామ్ = ఆ, సేనామ్ = సేనను, సముపానయత్ = తీసికొని వచ్చెను.

తా. మహాత్ములైన ఆ దేవతలు అట్లు పలికి స్వర్గలోకమునకు వెళ్ళిపోయిరి. గొప్ప తేజస్సు గల శత్రుఘ్నుడు కూడ ఆ సైన్యమును తీసికొని వచ్చెను. 7

మూ. సా సేనా శీఘ్రమాగచ్ఛచ్ఛ్రుత్వా శత్రుఘ్నశాసనమ్,
నివేశనం చ శత్రుఘ్నః శ్రావణేన సమారభత్. 8

ప్ర. అ. సా సేనా = ఆ సేన, శత్రుఘ్నశాసనమ్ = శత్రుఘ్నుని శాసనమును, శ్రుత్వా = విని, శీఘ్రమ్ = శీఘ్రముగా, అగచ్ఛత్ = వచ్చెను. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, శ్రావణేన = శ్రావణమాసముచేత, నివేశనమ్ = పురమును నెలకొల్పుటను, సమారభత్ = ప్రారంభించెను.

తా. ఆ సేన శత్రుఘ్నుని శాసనమును విని శీఘ్రముగా వచ్చెను. శత్రుఘ్నుడు, శ్రావణమాసమునందు నగరస్థాపనము ప్రారంభించెను. 8

మూ. సా పురీ దివ్యసంకాశా వర్షే ద్వాదశమే శుభే,
నివిష్టా శూరసేనానాం విషయశ్చాకుతోభయః. 9

ప్ర. అ. శుభే = శుభమైన, ద్వాదశమే వర్షే = పండ్రెండవ సంవత్సరమునందు, సా పురీ = ఆ పట్టణము, దివ్యసంకాశా = దివ్యపురితో సమానమై, శూరసేనానామ్ = శూరులైన సేనలకు సంబంధించినదై, నివిష్టా = స్థాపించబడినది. విషయః చ = దేశము కూడ, అకుతోభయః = ఎక్కడినుండి భయము లేనిదిగా చేయబడినది.

తా. శుభమైన పండ్రెండవ సంవత్సరమునందు శూరులైన సైనికులతో కూడిన ఆ నగరము దివ్యనగరము వలె నిర్మింపబడెను. దేశము కూడ ఏ వైపు నుండీ భయము లేకుండ ఉండెను. 9

మూ. క్షేత్రాణి సస్యయుక్తాని కాలే వర్షతి వాసవః,
అరోగవీరపురుషా శత్రుఘ్నభుజపాలితా. 10

అర్ధచన్ద్రప్రతీకాశా యమునాతీరశోభితా,
శోభితా గృహముఖ్యైశ్చ చత్వరాపణవీథికైః. 11
చాతుర్వర్ణ్యసమాయుక్తా నానావాణిజ్యశోభితా.

ప్ర. అ. క్షేత్రాణి = పొలములు, సస్యయుక్తాని = సస్యములతో కూడినవి. వాసవః = ఇంద్రుడు, కాలే = కాలమునందు, వర్షతి = వర్షించుచున్నాడు. శత్రుఘ్న భుజపాలితా = శత్రుఘ్నుని భుజములచేత పాలింపబడిన ఆ నగరము, అరోగవీర పురుషా = రోగములు లేని వీరులైన పురుషులు గలది. అర్ధచన్ద్రప్రతీకాశా = అర్ధ చంద్రునితో సమానము. యమునాతీరశోభితా = యమునాతీరమునందు శోభించు చున్నది. గృహముఖ్యైః చ = ఉత్తమములైన గృహములచేత, చత్వరాపణ వీథికైః = ముంగిళ్ళచేత, బజారులచేత, వీథులచేత, శోభితా = ప్రకాశింపచేయ బడినది. చాతుర్వర్ణ్యసమాయుక్తా = నాలుగు వర్ణములవారితో కూడినది. నానా వాణిజ్యశోభితా = అనేకవిధములైన వర్తకవ్యాపారములచేత శోభింపచేయబడినది.

తా. పొలములు సస్యములతో నిండి ఉండెను. ఇంద్రుడు కాలమునందు వర్షించుచుండెను. యమునాతీరమునందు అర్ధచంద్రాకారములో నిర్మించిన, శత్రుఘ్నుడు పాలించుచున్న ఆ నగరములోని పురుషులు రోగము లేవీ లేనివారై వీరులుగా ఉండిరి. దానియందు నాలుగు వర్ణముల వారు నివసించుచుండిరి. ఉత్తమములైన గృహములతోను, ముంగిళ్ళతోను (లేదా చతుష్పథములతోను) బజారువీథులతోను, అనేకవిధములైన వర్తకవ్యాపారములతోను శోభించుచుండెను. 10, 11

మూ. యచ్చ తేన పురా శుభ్రం లవణేన కృతమ్ మహత్, 12
తచ్ఛోభయతి శత్రుఘ్నో నానావర్ణోపశోభితమ్.

ప్ర. అ. పురా = పూర్వము, లవణేన = లవణునిచేత, యత్ = ఏ, మహత్ = గొప్ప భవనము, శుభ్రమ్ = తెల్లనిదిగా, కృతమ్ = చేయబడినదో, తత్ = దానిని, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, నానావర్ణోపశోభితమ్ = అనేకవిధములైన రంగులచేత శోభింపబడినదానినిగా, శోభయతి = శోభింపచేసెను.

తా. పూర్వము లవణాసురుడు తెల్లగా చేసిన మహాభవనమును శత్రుఘ్నుడు అనేకములైన వర్ణములతో అందముగా ఉండునట్లు చేసెను. 12

మూ. ఆరామైశ్చ విహారైశ్చ శోభమానాం సమన్తతః, 13
శోభితాం శోభనీయైశ్చ తథాన్యైర్దైవమానుషైః.

తాం పురీం దివ్యసంకాశాం నానాపణ్యోపశోభితామ్. 14
నానాదేశాగతైశ్చాపి వణిగ్భిరుపశోభితామ్,
తాం సమృద్ధాం సమృద్ధార్థః శత్రుఘ్నో భరతానుజః. 15
నిరీక్ష్య పరమప్రీతః పరం హర్షముపాగమత్.

ప్ర. అ. సమన్తతః = అన్ని వైపులా, ఆరామైః చ = ఉద్యానములతోను, విహారైః చ = విహరించు క్రీడాస్థానములతోను, శోభమానామ్ = ప్రకాశించుచున్న, తథా = మరియు, దైవమానుషైః = దేవతలకు మనుష్యులకు సంబంధించిన, అన్యైః = ఇతరములైన, శోభనీయైః = శోభార్హములైన అలంకరణములచేత, శోభితామ్ = శోభింపచేయబడిన, దివ్యసంకాశామ్ = దేవతాపురముతో సమానమైన,

నానాపణ్యోపశోభితామ్ = అనేకవిధములైన పణ్యములతో (అమ్మకటకు చూపిన వస్తువులతో) ప్రకాశించుచున్న, నానాదేశాగతైః = అనేక దేశములనుండి వచ్చిన, వణిగ్భిః = వర్తకులచేత, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడిన, తామ్ = ప్రసిద్ధమైన, సమృద్ధామ్ = సమృద్ధమైన, తామ్ = ఆ, పురీమ్ = పట్టణమును, నిరీక్ష్య = చూచి, సమృద్ధార్థః = సమృద్ధమైన (సఫలమైన) కార్యము గల, భరతానుజః = = భరతుని తమ్ముడైన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, పరమ్ = గొప్ప, హర్షమ్ = ఆనందమును, ఉపాగమత్ = పొందెను.

తా. తాను వచ్చిన పని సఫలము చేసికొనిన, భరతానుజుడైన ఆ శత్రుఘ్నుడు, సకలైశ్వర్యసమృద్ధమై ఉన్న ఆ నగరమును చూచి చాల సంతోషించెను. ఆ నగరము చుట్టూ ఉద్యానములు, క్రీడాస్థానములు ఉండెను. దేవతలకు, మనుష్యులకు సంబంధించిన అనేక అలంకరణములు చేయబడెను. అన్ని దిక్కుల నుండి వచ్చిన వర్తకులతో నిండిన ఆ నగరము అనేకపణ్యవస్తువులతో ప్రకాశించుచుండెను. దేవతానగరము వలె ఉండెను. 13-15

మూ. తస్య బుద్ధిః సముత్పన్నా నివేశ్య మధురాం పురీమ్, 16
రామపాదౌ నిరీక్షేఽహం వర్షే ద్వాదశ ఆగతే.

ప్ర. అ. మధురాం పురీమ్ = మధురాపురిని, నివేశ్య = నిర్మించి, ద్వాదశే వర్షే = పన్నెండవ సంవత్సరము, ఆగతే = వచ్చిన దగుచుండగా, తస్య = ఆతనికి, అహమ్ = నేను, రామపాదౌ = రాముని పాదములను, నిరీక్షే = చూచెదను అని, బుద్ధిః = బుద్ధి, సముత్పన్నా = పుట్టినది.

తా. ఆ మధురాపురిని ఏర్పరచిన పిమ్మట పన్నెండవ సంవత్సరము వచ్చిన తరువాత శత్రుఘ్నునకు రామపాదదర్శనము చేసికొనవలె నని బుద్ధి పుట్టెను. 16

మూ. తతః స తామమరపురోపమాం పురీం
నివేశ్య వై వివిధజనాభిసంవృతామ్,
నరాధిపో రఘుపతిపాదదర్శనే
దధే మతిం రఘుకులవంశవర్ధనః. 17

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే సప్తతితమః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నరాధిపః = రాజైన, సః = ఆ, రఘుకుల వంశవర్ధనః = శత్రుఘ్నుడు, వివిధజనాభిసంవృతామ్ = అనేకులైన జనులతో నిండిన, అమరపురోపమామ్ = అమరావతితో సమానమైన, తాం పురీమ్ = ఆ పురిని, నివేశ్య వై = నిలిపి, రఘుపతిపాదదర్శనే = రాముని పాదములను చూచుట యందు, మతిమ్ = బుద్ధిని, దధే = ధరించెను.

తా. రాజైన ఆ శత్రుఘ్నుడు అమరావతి వంటి, అనేకవిధములైన జనులతో నిండిన ఆ మధుపురిని నెలకొల్పి రాముని పాదముల దర్శనము చేసికొనవలె నని సంకల్పించెను. 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో డెబ్బదవ సర్గ సమాప్తము.

# అథ ఏకసప్తతితమః సర్గః

[స్వల్పమైన సైన్యము తీసికొని శత్రుఘ్నుడు అయోధ్యకు బయలుదేరుట. మార్గమధ్యములో వాల్మీక్యాశ్రమమునందు శ్రీరామ చరితగానమును విని వారందరు ఆశ్చర్యమును చెందుట].

మూ. తతో ద్వాదశమే వర్షే శత్రుఘ్నో రామపాలితామ్,
అయోధ్యాం చకమే గన్తుమల్పభృత్యబలానుగః. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ద్వాదశమే = పన్నెండవ, వర్షే = సంవత్సరమునందు, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, అల్పభృత్యబలానుగః = అల్పమైన భృత్యులు, సైన్యము అనుచరులుగా గలవాడై, రామపాలితామ్ = రామునిచేత పాలింపబడిన, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, గన్తుమ్ = వెళ్ళుటకు, చకమే = కోరెను.

తా. పండ్రెండవ సంవత్సరములో శత్రుఘ్నుడు చాల స్వల్పమైన భృత్యగణము, సైన్యము వెంటరాగా రాముడు పాలించుచున్న అయోధ్యకు వెళ్ళుటకు నిశ్చయించెను. 1

మూ. తతో మన్త్రిపురోగాంశ్చ బలముఖ్యాన్నివర్త్య చ,
జగామ హయముఖ్యైశ్చ రథానాం చ శతేన చ. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మన్త్రిపురోగాన్ = మంత్రులు మొదలైన వాళ్ళను, బలముఖ్యాన్ చ = సేనానాయకులను, నివర్త్య = వెనుకకుమరలించి, హయముఖ్యైః చ = శ్రేష్ఠములైన గుఱ్ఱములతోను, రథానామ్ = రథములయొక్క, శతేన = శతములతోను, సః = అతడు, జగామ = వెళ్ళెను.

తా. అతడు మంత్రులు మొదలైనవారిని, సేనానాయకులను వెనుకకు పంపివేసి కొన్ని శ్రేష్ఠములైన అశ్వములతోను, వంద రథములతోను వెళ్ళెను. 2

మూ. స గత్వా గణితాన్ వాసాన్ సప్తాష్టౌ రఘునన్దనః,
వాల్మీక్యాశ్రమమాసాద్య వాసం చక్రే మహాయశాః. 3

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, సః రఘునన్దనః = ఆ శత్రుఘ్నుడు, గణితాన్ = లెక్కపెట్టబడిన (ముందుగానే నిర్ణయింపబడిన), సప్త అష్టౌ = ఏడెనిమిది, వాసాన్ = నివాసములను, గత్వా = వెళ్ళి, వాల్మీక్యాశ్రమమ్ = వాల్మీక్యాశ్రమమును, ఆసాద్య = చేరి, వాసమ్ = నివాసమును, చక్రే = చేసెను.

తా. గొప్ప కీర్తి గల ఆ శత్రుఘ్నుడు నిర్ణయించుకొనిన ప్రకారము ఏడెనిమిది నివాసములు (మకాములు) చేసి, వాల్మీకి ఆశ్రమము చేరి అక్కడ విడిసెను. 3

మూ. సోఽభివాద్య తతః పాదౌ వాల్మీకేః పురుషర్షభః,
పాద్యమర్ఘ్యం తథాతిథ్యం జగ్రాహ మునిహస్తతః. 4

ప్ర. అ. సః = ఆ, పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడు, తతః = అటుపిమ్మట, వాల్మీకేః = వాల్మీకియొక్క, పాదౌ = పాదములను, అభివాద్య = నమస్కరించి, మునిహస్తతః = మునియొక్క హస్తమునుండి, పాద్యమ్ = పాద్యమును, అర్ఘ్యమ్ = అర్ఘ్యమును, తథా = మరియు, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, జగ్రాహ = గ్రహించెను.

తా. పురుషశ్రేష్ఠుడైన ఆ శత్రుఘ్నుడు వాల్మీకికి అభివాదనము చేసి, ఆతడిచ్చిన పాద్యమును, అర్ఘ్యమును, ఆతిథ్యమును స్వీకరించెను. 4

మూ. బహురూపాః సుమధురాః కథాస్తత్ర సహస్రశః,
కథయామాస స మునిః శత్రుఘ్నాయ మహాత్మనే. 5

ప్ర. అ. సః మునిః = ఆ మునీశ్వరుడు, మహాత్మనే = మహాత్ముడైన, శత్రుఘ్నాయ = శత్రుఘ్నునకు, బహురూపాః = అనేకరూపములు గల, సుమధురాః = చాల మధురములైన, కథాః = కథలను, తత్ర = అక్కడ, సహస్రశః వేలకొలది, కథయామాస = చెప్పెను.

తా. అక్కడ ఆ మునీశ్వరుడు మహాత్ముడైన శత్రుఘ్నునకు అనేకవిధములైన, మధురములైన, వేలకొలది కథలు చెప్పెను. 5

మూ. ఉవాచ చ మునిర్వాక్యం లవణస్య వధాశ్రితమ్,
సుదుష్కరం కృతం కర్మ లవణం నిఘ్నతా త్వయా. 6

ప్ర. అ. మునిః = మునీశ్వరుడు, లవణస్య = లవణునియొక్క, వధాశ్రితమ్ = వధకు సంబంధించిన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను. లవణమ్ = లవణుణ్ణి, నిఘ్నతా = చంపిన, త్వయా = నీచేత, సుదుష్కరమ్ = మిక్కిలి చేయ శక్యము కాని, కర్మ = పని, కృతమ్ = చేయబడినది.

తా. వాల్మీకి లవణుని వధకు సంబంధించి ఇట్లు పలికెను-"నీవు లవణాసురుణ్ణి చంపి చాల చేయ శక్యము కాని పని చేసినావు". 6

మూ. బహవః పార్థివాః సౌమ్య హతాః సబలవాహనాః,
లవణేన మహాబాహో యుధ్యమానా మహాబలాః. 7

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! లవణేన = లవణునిచేత, యుధ్యమానాః = యుద్ధము చేయుచున్న, మహాబలాః = గొప్ప బలము గల, సబలవాహనాః = సైన్యముతోను, వాహనములతోను కూడిన, బహవః = చాలమంది, పార్థివాః = రాజులు, హతాః = చంపబడిరి.

తా. మహాబాహూ! సౌమ్యుడవైన శత్రుఘ్నా! లవణుడు తనతో యుద్ధము చేసిన గొప్ప బలము గల ఎందరో రాజులను వారి సైన్యవాహనాదులతో సహా చంపివేసినాడు. 7

మూ. స త్వయా నిహతః పాపో లీలయా పురుషర్షభ,
జగతశ్చ భయం తత్ర ప్రశాన్తం తవ తేజసా. 8

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! పాపః = పాపాత్ముడైన, సః = అతడు, త్వయా = నీచేత, లీలయా = అనాయాసముగా, నిహతః = చంపబడినాడు. తవ = నీయొక్క, తేజసా = తేజస్సుచేత, తత్ర = వాని విషయమునందు, జగతః = జగత్తుయొక్క, భయం చ = భయము కూడ, ప్రశాన్తమ్ = శాంతించినది.

తా. పురుషశ్రేష్ఠుడా! అట్టి పాపాత్ముణ్ణి నీవు అనాయాసముగా చంపివేసినావు. నీ తేజస్సుచేత వానివలన జగత్తుకు భయము శాంతించినది. 8

మూ. రావణస్య వధో ఘోరో యత్నేన మహతా కృతః,
ఇదం చ సుమహత్కర్మ త్వయా కృతమయత్నతః. 9

ప్ర. అ. రావణస్య = రావణునియొక్క, ఘోరః = ఘోరమైన, వధః = వధ, మహతా = గొప్ప, యత్నేన = ప్రయత్నముచేత, కృతః = చేయబడినది. ఇదమ్ = ఈ, సుమహత్ = చాల గొప్పదైన, కర్మ = పని, త్వయా = నీచేత, అయత్నతః = ప్రయత్నము లేకుండగా, కృతమ్ = చేయబడినది.

తా. ఘోరమైన రావణవధ గొప్ప ప్రయత్నముచేత చేయబడినది. కాని చాల గొప్పదైన ఈ పనిని నీవు అనాయాసముగ చేసినావు. 9

మూ. ప్రీతిశ్చాస్మిన్ పరా జాతా దేవానాం లవణే హతే,
భూతానాం చైవ సర్వేషాం జగతశ్చ ప్రియం కృతమ్. 10

ప్ర. అ. అస్మిన్ = ఈ, లవణే = లవణుడు, హతే = చంపబడినవాడగుచుండగా, దేవానామ్ = దేవతలకు, సర్వేషామ్=సమస్తమైన, భూతానాం చఏవ= భూతములకుకూడ, పరా= గొప్ప, ప్రీతిః=సంతోషము, జాతా=కలిగినది. జగతః = జగత్తునకు, ప్రియం చ = ప్రియము కూడ, కృతమ్ = చేయబడినది.

తా. ఈ లవణుడు చంపబడుటచే దేవతలకు, భూతములకు గొప్ప సంతోషము కలిగినది. జగత్తుకు ప్రియము జరిగినది. 10

మూ. తచ్చ యుద్ధం మయా దృష్టం యథావత్ పురుషర్షభ,
సభాయాం వాసవస్యాథ ఉపవిష్టేన రాఘవ. 11

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! రాఘవ = శత్రుఘ్నా, అథ = అటుపిమ్మట, వాసవస్య = ఇంద్రునియొక్క, సభాయామ్ = సభయందు, ఉపవిష్టేన = కూర్చున్న, మయా = నాచేత, తత్ = ఆ, యుద్ధమ్ = యుద్ధము, యథావత్ = యథార్థముగా, దృష్టమ్ = చూడబడినది.

తా. పురుషశ్రేష్ఠుడవైన శత్రుఘ్నా! ఆ యుద్ధమును పూర్తిగా నేను ఇంద్రుని సభలో కూర్చుండి చూచితిని. 11

మూ. మమాపి పరమా ప్రీతిర్హృది శత్రుఘ్న వర్తతే,
ఉపాఘ్రాస్యామి తే మూర్ధ్ని స్నేహస్యైషా పరా గతిః. 12

ప్ర. అ. శత్రుఘ్న = శత్రుఘ్నా ! మమాపి = నాకు కూడ, హృది = హృదయమునందు, పరమా = గొప్ప, ప్రీతిః = సంతోషము, వర్తతే = ఉన్నది. తే = నీయొక్క, మూర్ధ్ని = శిరస్సునందు, ఉపాఘ్రాస్యామి = వాసనచూచెదను. ఏషా = ఇది, స్నేహస్య = స్నేహముయొక్క, పరా = గొప్పదైన, గతిః = గతి.

తా. శత్రుఘ్నా! నీ విషయమునందు నాకు కూడ గొప్ప సంతోషము కలిగినది. నీ శిరస్సును వాసన చూచెదను. ఇది ప్రేమకు అత్యుత్తమమైన లక్షణము. 12

మూ. ఇత్యుక్త్వా మూర్ధ్ని శత్రుఘ్నముపాఘ్రాయ మహామతిః,
ఆతిథ్యమకరోత్తస్య యే చ తస్య పదానుగాః. 13

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల వాల్మీకి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి, మూర్ధ్ని = శిరస్సుపై, ఉపాఘ్రాయ = వాసనచూచి, తస్య = ఆతనికి, తస్య = ఆతని, పదానుగాః = అనుచరులు, యే = ఎవరున్నారో వారికీ, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, అకరోత్ = చేసెను.

తా. గొప్ప బుద్ధి గల ఆ వాల్మీకి ఇట్లు పలికి, శత్రుఘ్నుణ్ణి శిరస్సుపై మూర్కొని, ఆతనికి, ఆతని అనుచరులకు ఆతిథ్యము చేసెను. 13

మూ. స భుక్తవాన్ నరశ్రేష్ఠో గీతమాధుర్యముత్తమమ్,
శుశ్రావ రామచరితం తస్మిన్ కాలే యథాకృతమ్. 14

ప్ర. అ. భుక్తవాన్ = భోజనము చేసిన, సః = ఆ, నరశ్రేష్ఠః = నరశ్రేష్ఠుడు, ఉత్తమమ్ = ఉత్తమమైన, గీతమాధుర్యమ్ = గీతమాధుర్యమును. తస్మిన్ = ఆ, కాలే = కాలమునందు, యథా = ఎట్లు, కృతమ్ = చేయబడినదో ఆ విధముగా, రామచరితమ్ = రాముని చరితమును, శుశ్రావ = వినెను.

తా. భోజనము చేసి కూర్చున్న శత్రుఘ్నుడు ఉత్తమమైన గీతమాధుర్యము గల రాముని చరితమును ఆ సమయమున రచించబడిన విధముగా వినెను. 14

మూ. తన్త్రీలయసమాయుక్తం త్రిస్థానకరణాన్వితమ్,
సంస్కృతం లక్షణోపేతం సమతాలసమన్వితమ్. 15
శుశ్రావ రామచరితం తస్మిన్ కాలే పురా కృతమ్,

ప్ర. అ. తన్త్రీలయసమాయుక్తమ్ = వీణాతంత్రుల లయతో కూడిన, త్రిస్థానకరణాన్వితమ్ = వక్షఃస్థలము. కంఠము, శిరస్సు అను మూడు స్థానముల యందు, మధ్యము, మంద్రము, తారము అను మూడు కరణములతో కూడినదీ, సంస్కృతమ్ = సంస్కరించబడినదీ, లక్షణోపేతమ్=సంగీతశాస్త్రాదిలక్షణములతో కూడినది, సమతాలసమన్వితమ్ = సమమైన తాలముతో కూడినది, తస్మిన్ కాలే = ఆ కాలమునందు, పురా = పూర్వము, కృతమ్ = చేయబడినదీ అయిన, రామచరితమ్ = రామచరితమును, శుశ్రావ = వినెను.

తా. ఆ కాలమునందు పూర్వము రచింపబడిన రామచరితమును వినెను. అది వీణాతంత్రుల లయమునకు అనుగుణముగా ఉండెను. మూడు స్థానములందు మూడు కరణములతో కూడి, సంస్కృతమై, సంగీతశాస్త్రాదిలక్షణములతో ఉండెను.

మూ. తాన్యక్షరాణి సత్యాని యథావృత్తాని పూర్వశః, 16
శ్రుత్వా పురుషశార్దూలో విసంజ్ఞో బాష్పలోచనః,
స ముహూర్తమివాసంజ్ఞో వినిఃశ్వస్య ముహుర్ముహుః. 17
తస్మిన్ గీతే యథావృత్తం వర్తమానమివాశృణోత్.

ప్ర. అ. పురుషశార్దూలః = పురుషశ్రేష్ఠుడు, పూర్వశః = పూర్వము, యథా వృత్తాని = జరిగినవి జరిగినట్లున్న, సత్యాని=సత్యములైన, తాని అక్షరాణి = ఆ అక్షరములను, శ్రుత్వా = విని, విసంజ్ఞః = సంజ్ఞ లేనివాడై, బాష్పలోచనః = కన్నీళ్ల నేత్రములందు కలవాడయ్యెను. సః = అతడు, ముహూర్తమ్ ఇవ = ముహూర్తకాలము, అసంజ్ఞః = సంజ్ఞ లేనివాడై. ముహుః ముహుః = మాటిమాటికి, వినిఃశ్వస్య=నిట్టూర్చి, తస్మిన్ గీతే = ఆ గీతమునందు, యథావృత్తమ్=జరిగిన కథను, వర్తమానమ్ ఇవ = జరుగుచున్నదానిని వలె, అశృణోత్ = వినెను.

తా. పూర్వము ఎట్లు జరిగెనో అట్లు సత్యములైన ఆ అక్షరములు (మాటలు) విని, పురుషశ్రేష్ఠుడైన శత్రుఘ్నుడు కన్నీళ్ళు కార్చుచు సంజ్ఞ కోల్పోయెను. అతడు ముహూర్తకాలముపాటు స్పృహ కోల్పోయినవాడై, మాటిమాటికి నిట్టూర్చుచు, జరిగిన కథనంతను ఆ గీతములో అప్పుడు జరుగుచున్నట్లుగా వినెను. 16,17

మూ. పదానుగాశ్చ యే రాజ్ఞస్తాం శ్రుత్వా గీతిసంపదమ్, 18
అవాఙ్ముఖాశ్చ దీనాశ్చ హ్యాశ్చర్యమితి చాబ్రువన్.

ప్ర. అ. రాజ్ఞః = రాజుయొక్క, యే = ఏ, పదానుగాః = అనుచరులు ఉన్నారో వాళ్ళు, తామ్ = ఆ, గీతిసంపదమ్ = గానసంపదను, శ్రుత్వా = విని, అవాఙ్ముఖాః చ = క్రిందికి ముఖములు కలవారై, దీనాః చ = దీనులై, ఆశ్చర్యమ్ ఇతి = ఆశ్చర్యము అని, అబ్రువన్ = పలికిరి.

తా. రాజు అనుచరులు గూడ ఆ గీతిసంపదను విని, తలలు క్రిందికి వంచి, దీనులై "ఎంత ఆశ్చర్యము"అనిరి. 18

మూ. పరస్పరం చ యే తత్ర సైనికాః సంబభాషిరే, 19
కిమిదం క్వ చ వర్తామః కిమేతత్స్వప్నదర్శనమ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, యే = ఏ, సైనికాః = సైనికులు గలరో, వాళ్ళు, పరస్పరమ్ = పరస్పరము, సంబభాషిరే = మాటలాడుకొనిరి. ఇదమ్ = ఇది, కిమ్ = ఏమిటి? క్వ చ = ఎక్కడ, వర్తామః = ఉన్నాము? ఏతత్ = ఇది, స్వప్న దర్శనం కిమ్ = స్వప్నదర్శనమా?

తా. అక్కడ నున్న సైనికులు పరస్పరము ఇట్లు మాటలాడుకొనిరి. "ఇది ఏమిటి? మనము ఎక్కడ ఉన్నాము? స్వప్నము చూచుచున్నామా?" 19

మూ. అర్థో యో నః పురా దృష్టస్తమాశ్రమపదే పునః, 20
శృణుమః కిమిదం స్వప్నో గీతబన్ధనముత్తమమ్.

ప్ర. అ. యః = ఏ, అర్థః = విషయము, పురా = పూర్వము, నః = మనకు, దృష్టః = చూడబడినదో, తమ్ = దానినే, ఆశ్రమపదే = ఆశ్రమస్థానము నందు, పునః = మరల, శృణుమః = వినుచున్నాము, ఇదమ్ = ఇది, స్వప్నః కిమ్ = స్వప్నమా; ఉత్తమమ్ = ఉత్తమమైన, గీతిబన్ధనమ్ = సంగీతబంధనమా?

"పూర్వము మనము ప్రత్యక్షముగా చూచిన విషయమునే మరల ఈ ఆశ్రమములో వినుచున్నాము, ఇది స్వప్నమా? లేక ఉత్తమమైన సంగీతరచనయా?"

మూ. విస్మయం తే పరం గత్వా శత్రుఘ్నమిదమబ్రువన్, 21
సాధు పృచ్ఛ నరశ్రేష్ఠ వాల్మీకిం మునిపుఙ్గవమ్.

ప్ర. అ. తే = వాళ్ళు, పరమ్ = గొప్ప, విస్మయమ్ = ఆశ్చర్యమును, గత్వా = పొంది, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రువన్ = పలికిరి. నరశ్రేష్ఠ = నరశ్రేష్ఠుడా! సాధు = బాగుగా, మునిపుఙ్గవమ్ = మునిశ్రేష్ఠుడైన, వాల్మీకిమ్ = వాల్మీకిని, పృచ్ఛ = అడుగుము.

తా. వారు చాల ఆశ్చర్యము చెంది శత్రుఘ్నునితో "ఓ! నరశ్రేష్ఠుడా! నీవు మునిశ్రేష్ఠుడైన వాల్మీకిని బాగుగా (స్పష్టముగా) అడుగుము" అని పలికిరి. 21

మూ. శత్రుఘ్నస్త్వబ్రవీత్సర్వాన్ కౌతూహలసమన్వితాన్, 22
సైనికా న క్షమోఽస్మాకం పరిప్రష్టుమిహేదృశః.

ప్ర. అ. శత్రుఘ్నః తు = శత్రుఘ్నుడైతే, కౌతూహలసమన్వితాన్ = వేడుకతో కూడిన, సైనికాన్ = సైనికులను, సర్వాన్ = అందరినీ గూర్చి, అబ్రవీత్ = పలికెను. ఇహ = ఇక్కడ, ఈదృశః = ఇట్టివిషయము, పరిప్రష్టుమ్ = అడుగుటకు, అస్మాకమ్ = మనకు, అక్షమః = తగనిది.

తా. కుతూహలముతో కూడిన ఆ సైనికు లందరితో శత్రుఘ్ను డిట్లు పలికెను-"మనము ఇక్కడ ఇలాంటి విషయములను గూర్చి అడగకూడదు". 22

మూ. ఆశ్చర్యాణి బహూనీహ భవన్త్యస్యాశ్రమే మునేః, 23
న తు కౌతూహలాద్యుక్తమన్వేష్టుం తం మహామునిమ్.

ప్ర. అ. ఇహ = ఇక్కడ, మునేః = మునియొక్క, ఆశ్రమే = ఆశ్రమమునందు, బహూని = అనేకమైన, ఆశ్చర్యాణి = ఆశ్చర్యములు, భవన్తి = జరుగుచుండును, తు = కాని, కౌతూహలాత్ = వేడుకవలన, తమ్ = ఆ, మహామునిమ్ = మహామునిని, అన్వేష్టుమ్ = ప్రశ్నించుటకు, నయుక్తమ్ = యుక్తము కాదు.

తా. ఈ ముని ఆశ్రమములో అనేకములైన ఆశ్చర్యకరములైన విషయములు జరుగుచుండును. కాని మనము కౌతూహలముతో ఈ మహామునిని ప్రశ్నించుట యుక్తము కాదు. 23

మూ. ఏవం తద్వాక్యముక్త్వా తు సైనికాన్ రఘునన్దనః, 24
అభివాద్య మహర్షిం తం స్వం నివేశం యయౌ తదా.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకసప్తతితమః సర్గః.

ప్ర. అ. రఘునన్దనః = శత్రుఘ్నుడు, ఏవమ్ = ఇట్లు, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, సైనికాన్ = సైనికులను గూర్చి, ఉక్త్వా = పలికి, తం మహర్షిమ్ = ఆ మహర్షిని, అభివాద్య = నమస్కరించి, తదా = అప్పుడు, స్వమ్ = తన సంబంధమైన, నివేశమ్ = శయనస్థానమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. శత్రుఘ్నుడు సైనికులతో ఇట్లు పలికి, ఆ మహర్షికి నమస్కరించి, అప్పుడు తన శయనస్థానమునకు వెళ్లెను. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో డెబ్బైఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విసప్తతితమః సర్గః

*[శత్రుఘ్నుడు వాల్మీకి అనుజ్ఞ పొంది అయోధ్యకు వెళ్ళి రామాదులతో కలిసి అక్కడ ఏడు రోజులు ఉండి మరల మధురకు బయలుదేరి వెళ్ళుట.]*

మూ. తం శయానం నరవ్యాఘ్రం నిద్రా నాభ్యాగమత్తదా,
చిన్తయానమనేకార్థం రామగీతమనుత్తమమ్. 1

ప్ర. అ. తదా = అప్పుడు, అనేకార్థమ్ = అనేకములైన అర్థములు గల, అనుత్తమమ్ = చాల శ్రేష్ఠమైన, రామగీతమ్ = రాముని గీతమును గూర్చి, చిన్తయానమ్ = చింతించుచున్న, శయానమ్ = శయనించిన, తం నరవ్యాఘ్రమ్ = ఆ నరశ్రేష్ఠుణ్ణి, నిద్రా = నిద్ర, నాభ్యగమత్ = చేరలేదు.

తా. అనేకములైన అర్థములు గల రామునికి సంబంధించిన గీతమును గూర్చి ఆలోచించుచు శయనించిన ఆ శత్రుఘ్నునికి అప్పుడు నిద్ర రాలేదు. 1

మూ. తస్య శబ్దం సుమధురం తన్త్రీలయసమన్వితమ్,
శ్రుత్వా రాత్రిర్జగామాశు శత్రుఘ్నస్య మహాత్మనః. 2

ప్ర. అ. సుమధురమ్ = చాల మదురమైన, తన్త్రీలయసమన్వితమ్ = వీణాతంత్రుల లయతో కూడిన, తస్య = ఆ రామచరితముయొక్క, శబ్దమ్ = శబ్దమును, శ్రుత్వా = విని, మహాత్మనః = మహాత్ముడైన, శత్రుఘ్నస్య = శత్రుఘ్నునకు, రాత్రిః = రాత్రి, ఆశు = శీఘ్రముగా, జగామ = గడచెను.

తా. చాల మధురము, వీణాతంత్రుల లయకు సరిపడునది అయిన ఆ రామచరితగీతధ్వనిని వినుచుండగా శత్రుఘ్నునకు రాత్రి శీఘ్రముగా గడచిపోయెను. 2

మూ. తస్యాం రజన్యాం వ్యుష్టాయాం కృత్వా పౌర్వాహ్ణికక్రమమ్,
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం శత్రుఘ్నో మునిపుంగవమ్. 3

ప్ర. అ. తస్యామ్ = ఆ, రజన్యామ్ = రాత్రి, వ్యుష్టాయామ్ = తెల్లవారిన దగుచుండగా, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, పౌర్వాహ్ణికక్రమమ్ = పూర్వాహ్ణము నకు సంబంధించిన కార్యక్రమమును, కృత్వా = చేసికొని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, మునిపుంగవమ్ = మునిశ్రేష్ఠుణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ రాత్రి తెల్లవారిన పిదప శత్రుఘ్నుడు పూర్వాహ్ణకార్యక్రమమును పూర్తిచేసికొని, అంజలి ఘటించి వాల్మీకితో ఇట్లనెను. 3

మూ. భగవన్ ద్రష్టుమిచ్ఛామి రాఘవం రఘునన్దనమ్,
త్వయానుజ్ఞాతమిచ్ఛామి సహైభిః సంశితవ్రతైః. 4

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! రఘునన్దనమ్ = రఘువంశీయులకు ఆనంద కరుడైన, రాఘవమ్ = రాముణ్ణి, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. సంశితవ్రతైః = తీవ్రమైన నియమములు గల, ఏభిః సహ = ఈ మునులతో కూడ, త్వయా = నీచేత, అనుజ్ఞాతమ్ = అనుజ్ఞను, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. పూజ్యుడా! రఘువంశీయులకు ఆనందకరుడైన రాముణ్ణి చూడవలె నని కోరుచున్నాను. గొప్ప తపోనియమము గల ఈ మునుల అనుజ్ఞను నీ అనుజ్ఞను కోరుచున్నాను. 4

మూ. ఇత్యేవం వాదినం తం తు శత్రుఘ్నం శత్రుసూదనమ్,
వాల్మీకిః సంపరిష్వజ్య విససర్జ స రాఘవమ్. 5

ప్ర. అ. సః వాల్మీకిః = ఆ వాల్మీకి, ఇత్యేవమ్ = ఇట్లు, వాదినమ్ = పలుకు చున్న, శత్రుసూదనమ్ = శత్రుసంహారకుడైన, తమ్ = ఆ, శత్రుఘ్నమ్ = శత్రు ఘ్నుణ్ణి, సంపరిష్వజ్య = కౌగలించుకొని, రాఘవమ్ = ఆ శత్రుఘ్నుణ్ణి, విససర్జ = విడచెను.

తా. వాల్మీకి శత్రుసంహారకుడైన ఆ శత్రుఘ్నుని మాటలు విని ఆతనిని కౌగలించుకొని, వెళ్లుటకు అనుమతి ఇచ్చెను. 5

మూ. సోఽభివాద్య మునిశ్రేష్ఠం రథమారుహ్య సుప్రభమ్,
అయోధ్యామగమత్తూర్ణం రాఘవోత్సుకదర్శనః. 6

ప్ర. అ. సః = అతడు, మునిశ్రేష్ఠమ్ = ఆ మునిశ్రేష్ఠుని, అభివాద్య = నమస్కరించి, సుప్రభమ్ = మంచి కాంతి గల, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి, రాఘవోత్సుకదర్శనః = రాముని చూచుటయందు వేడుక గలవాడై, తూర్ణమ్ = శీఘ్రముగా, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, అగమత్ = వెళ్ళెను.

తా. శత్రుఘ్నుడు వాల్మీకికి నమస్కరించి, మంచి కాంతి గల రథము నెక్కి, రాముని దర్శనమునకై ఆతురతతో శీఘ్రముగా అయోధ్యకు వెళ్లెను. 6

మూ. స ప్రవిష్టః పురీం రమ్యాం శ్రీమానిక్ష్వాకునన్దనః,
ప్రవివేశ మహాబాహుర్యత్ర రామో మహాద్యుతిః. 7

ప్ర. అ. ఇక్ష్వాకుకులనన్దనః = ఇక్ష్వాకుకులమునకు ఆనందకరుడైన, మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః = ఆ శత్రుఘ్నుడు, రమ్యామ్ = సుందరమైన, పురీమ్ = పట్టణమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడై, మహాద్యుతిః = గొప్పకాంతి గల, రామః = రాముడు, యత్ర = ఎక్కడ ఉండెనో, అక్కడికి, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఇక్ష్వాకువంశమునకు ఆనందమును కలిగించు, మహాబాహువైన ఆ శత్రుఘ్నుడు రమ్యమైన ఆ అయోధ్యకు వెళ్ళి గొప్ప కాంతి గల రాముడు ఉన్న భవనమునకు వెళ్లెను. 7

మూ. స రామం మన్త్రిమధ్యస్థం పూర్ణచన్ద్రనిభాననమ్,
పశ్యన్నమరమధ్యస్థం సహస్రనయనం యథా. 8

ప్ర. అ. సః = అతడు, మన్త్రిమధ్యస్థమ్ = మంత్రుల మధ్యయందున్న, పూర్ణచన్ద్రనిభాననమ్ = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల, అమరమధ్యస్థమ్ = దేవతల మధ్యయందున్న, సహస్రనయనం యథా = ఇంద్రుడువలె ఉన్న, రామమ్ = రాముణ్ణి, పశ్యన్ = చూచుచు, (ప్రవేశించెను).

తా. అతడు పూర్ణచంద్రుని వంటి ముఖము గల, మంత్రిమధ్యయందు,

దేవతలమధ్యయందున్న ఇంద్రుడు వలె ఉన్న రాముణ్ణి చూచుచు ప్రవేశించెను. 8

మూ. సోఽభివాద్య మహాత్మానం జ్వలన్తమివ తేజసా,
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం రామం సత్యపరాక్రమమ్. 9

ప్ర. అ. సః = అతడు, తేజసా = తేజస్సుచేత, జ్వలన్తమివ = ప్రజ్వలించుచున్నట్లు ఉన్న, సత్యపరాక్రమమ్=సత్యమైన పరాక్రమము గల, మహాత్మానమ్=మహాత్ముడైన, రామమ్=రాముణ్ణి, అభివాద్య=నమస్కరించి, ప్రాఞ్జలిః= ఎత్తబడిన దోసిలి కలవాడై, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. శత్రుఘ్నుడు తేజస్సుతో ప్రజ్వలించుచున్నట్లున్న, సత్యమైన పరాక్రమము గల రామునికి నమస్కరించి అంజలి ఘటించి ఇట్లు పలికెను. 9

మూ. యదాజ్ఞప్తం మహారాజ సర్వం తత్ కృతవానహమ్,
హతః స లవణః పాపః పురీ చాస్య నివేశితా. 10

ప్ర. అ. మహారాజ=మహారాజా! యత్ = ఏది, ఆజ్ఞప్తమ్ = ఆజ్ఞాపించబడినదో, తత్=దానిని, సర్వమ్ = సమస్తమునూ, అహమ్=నేను, కృతవాన్= చేసినాను. పాపః = పాపాత్ముడైన, సః లవణః = ఆ లవణుడు, హతః = చంపబడినాడు. అస్య=వీనియొక్క, పురీ చ = పట్టణము కూడ, నివేశితా=నెలకొల్పబడినది.

తా. మహారాజా! నీవు ఆజ్ఞాపించిన విధముగ అంతా చేసినాను. పాపాత్ముడైన లవణుణ్ణి సంహరించి ఆతని పురమును నిర్మించితిని. 10

మూ. ద్వాదశైతే గతా వర్షాస్త్వాం వినా రఘునన్దన,
నోత్సహేయమహం వస్తుం త్వయా విరహితో నృప. 11

ప్ర. అ. రఘునన్దన = రామా! త్వాం వినా = నీవు లేకుండగా, ఏతే = ఈ, ద్వాదశ వర్షాః = పన్నెండు సంవత్సరములు, గతాః = గడచినవి. నృప = రాజా! అహమ్ = నేను, త్వయా వినా = నీవు లేకుండ, వస్తుమ్ = నివసించుటకు, న ఉత్సహే = ఉత్సాహవంతుడను కాను (ఇచ్ఛయించను.)

తా. రామా! నీవు లేకుండగా ఈ పన్నెండు సంవత్సరములు గడచినవి. రాజా! నీవు లేకుండ నేను అక్కడ నివసించుటకు ఇచ్ఛగించను. 11

మూ. స మే ప్రసాదం కాకుత్స్థ కురుష్వామితవిక్రమ,
మాతృహీనో యథా వత్సో న చిరం ప్రవసామ్యహమ్. 12

ప్ర. అ. అమితవిక్రమ = అపరిమితమైన పరాక్రమముగల, కాకుత్స్థ = రామా! సః = అట్టి నీవు, మే = నాకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురుష్వ = చేయుము. మాతృహీనః = తల్లి లేని, వత్సః యథా = లేగదూడ వలె, అహమ్ = నేను, చిరమ్ = చిరకాలము, న ప్రవసామి = దూరముగా ఉండజాలను.

తా. అపరిమితమైన పరాక్రమము గల రామా! నీవు నా విషయమున అనుగ్రహింపుము. తల్లి లేని లేగదూడ వలె నేను చాలకాలము దూరముగా ఉండజాలను. 12

మూ. ఏవం బ్రువాణం కాకుత్స్థః పరిష్వజ్యేదమబ్రవీత్,
మా విషాదం కృథాః శూర నైతత్ క్షత్రియచేష్టితమ్. 13

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బ్రువాణమ్ = పలుకుచున్న శత్రుఘ్నుణ్ణి, కాకుత్స్థః = రాముడు, పరిష్వజ్య = కౌగలించుకొని, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. శూర = శూరుడా! విషాదమ్ = దుఃఖమును, మా కృథాః = చేయకుము. ఏతత్ = ఇది, క్షత్రియచేష్టితమ్ = క్షత్రియుడు చేయవలసిన పని, న = కాదు.

తా. ఇట్లు మాట్లాడుచున్న శత్రుఘ్నుణ్ణి రాముడు కౌగలించుకొని ఇట్లు పలికెను-"శూరుడా! విషాదము చెందకుము, ఇది క్షత్రియులు చేయవలసినది కాదు". 13

మూ. నావసీదన్తి రాజానో విప్రవాసేన రాఘవ,
ప్రజా హి పరిపాల్యా హి క్షత్రధర్మేణ రాఘవ. 14

ప్ర. అ. రాఘవ = శత్రుఘ్నుడా! రాజానః = రాజులు, విప్రవాసేన = ప్రవాసముచేత, నావసీదన్తి = దిగులు చెందరు. రాఘవ = రాఘవా! ప్రజాః = ప్రజలు, క్షత్రధర్మేణ = క్షత్రియధర్మముచేత, పరిపాల్యాః హి = పాలించదగినవారు కదా?

తా. "శత్రుఘ్నుడా ! ప్రవాసముచేత రాజులు దిగులుచెందరు. ప్రజలను క్షత్రియధర్మానుసారముగా పాలించవలెను కదా?" 14

మూ. కాలే కాలే తు మాం వీర అయోధ్యామవలోకితుమ్,
ఆగచ్ఛ త్వం నరశ్రేష్ఠ గన్తాసి చ పురం తవ. 15

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! వీర = వీరుడా! కాలే కాలే = ఆయా సమయములయందు, మామ్ = నన్ను, అవలోకితుమ్ = చూచుటకు, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, త్వమ్ = నీవు, ఆగచ్ఛ = రమ్ము. తవ = నీ యొక్క, పురమ్ = పట్టణమును గూర్చి, గన్తాసి = వెళ్ళగలవు.

తా. "నరులలో శ్రేష్ఠుడవైన వీరుడా! అప్పుడప్పుడు నన్ను చూచుటకై అయోధ్యకు వచ్చుచుండుము తిరిగి నీ పట్టణమునకు వెళ్ళవచ్చును." 15

మూ. మమాపి త్వం సుదయితః ప్రాణైరపి న సంశయః,
అవశ్యం కరణీయం చ రాజ్యస్య పరిపాలనమ్. 16

ప్ర. అ. త్వమ్ = నీవు, మమాపి = నాకు కూడ, ప్రాణైః అపి = ప్రాణాల చేత కూడ, సుదయితః = చాల ఇష్టుడవు. సంశయః = సంశయము, న = లేదు. రాజ్య స్య = రాజ్యముయొక్క, పరిపాలనమ్ = పరిపాలనము, అవశ్యమ్ = తప్పక, కరణీయం చ = చేయదగినది.

తా. "నీవు నాకు కూడ ప్రాణములకంటె కూడ ఇష్టుడవు, సంశయము లేదు రాజ్యపాలనము తప్పక చేయదగినది కదా?" 16

మూ. తస్మాత్త్వం వస కాకుత్స్థ సప్తరాత్రం మయా సహ,
ఊర్ధ్వం గన్తాసి మధురాం సభృత్యబలవాహనః. 17

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, కాకుత్స్థ = శత్రుఘ్నుడా ! త్వమ్ = నీవు, మయా సహ = నాతో కూడ, ఇహ = ఇక్కడ, సప్తరాత్రమ్ = ఏడు రోజులు, వస = నివసించుము. ఊర్ధ్వమ్ = అటుపైన, సభృత్యబలవాహనః = భృత్యులతోను, సైన్యముతోను, వాహనములతోను కూడినవాడవై, మధురామ్ = మధురను గూర్చి, గన్తాసి = వెళ్ళగలవు.

తా. "శత్రుఘ్నా, అందువలన నీవు నా దగ్గర ఒక వారము రోజులు ఉండుము. తరవాత నీ భృత్యులతోను, సైన్యముతోను, వాహనములతోను కలిసి మదురకు వెళ్ళగలవు." 17

మూ. రామస్యైతద్వచః శ్రుత్వా ధర్మయుక్తం మనోనుగమ్,
శత్రుఘ్నో దీనయా వాచా బాఢమిత్యేవ చాబ్రవీత్.18

ప్ర. అ రామస్య = రామునియొక్క, ధర్మయుక్తమ్ = ధర్మముతో కూడిన, మనోనుగమ్ = మనస్సుకు అనుకూలముగా ఉన్న, ఏతత్ వచః = ఈ వచనమును, శ్రుత్వా = విని, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, దీనయా = దీనమైన, వాచా = వాక్కుతో, బాఢమ్ ఇత్యేవ చ = తప్పక అట్లే అని, అబ్రవీత్ = పలికెను.

తా. శత్రుఘ్నుడు ధర్మసంమతములు మనోహరములూ అయిన రాముని మాటలు విని దీనమైన వాక్కుతో "తప్పక అట్లే చేసెదను" అని పలికెను. 18

మూ. సప్తరాత్రం చ కాకుత్స్థో రాఘవస్య యథాజ్ఞయా,
ఉష్య తత్ర మహేష్వాసో గమనాయోపచక్రమే. 19

ప్ర. అ. మహేష్వాసః = గొప్ప ధనస్సు గల, కాకుత్స్థః = శత్రుఘ్నుడు, రాఘువస్య = రామునియొక్క, యథాజ్ఞయా = అజ్ఞానుసారముగా, సప్తరాత్రమ్ = ఒక వారము, తత్ర = అక్కడ, ఉష్య = ఉండి, గమనాయ = వెళ్ళుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. మహాధనుర్ధరుడైన శత్రుఘ్నుడు రాముని ఆజ్ఞ ప్రకారము ఒకవారము అక్కడ ఉండి వెళ్ళుటకు ప్రయాణ మయ్యెను. 19

మూ. ఆమన్త్ర్య తు మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
భరతం లక్ష్మణం చైవ మహారథముపారుహత్. 20

ప్ర. అ. మహాత్మానమ్ = మహాత్ముడు, సత్యపరాక్రమమ్ = సత్యమైన పరాక్రమము కలవాడు అయిన, రామమ్ = రాముణ్ణి, భరతమ్ = భరతుణ్ణి, లక్ష్మణం చ ఏవ = లక్ష్మణుణ్ణి, ఆమన్త్ర్య = అనుమతింపచేసి, మహారథమ్ = గొప్ప రథమును, ఉపారుహత్ = ఎక్కెను.

తా. మహాత్ముడైన, సత్యమైన పరాక్రమము గల రామునివద్ద భరతుని వద్ద, లక్ష్మణుని వద్ద సెలవు తీసికొని మహారథమును ఎక్కెను. 20

మూ. స దూరానుగతో వీరో లక్ష్మణేన మహాత్మనా,
భరతేన చ శత్రుఘ్నో జగామాశు పురీం తదా. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్విసప్తతితమః సర్గః.

ప్ర అ. వీరః=వీరుడైన, సః శత్రుఘ్నః=ఆ శత్రుఘ్నుడు, మహాత్మనా = మహాత్ముడైన, లక్ష్మణేన=లక్ష్మణుని చేత, భరతేన=భరతునిచేత, దూరానుగతః = దూరము అనుసరించ బడినవాడై, తదా = అప్పుడు, ఆశు=శీఘ్రముగా, పురమ్ = పట్టణమును గూర్చి, జగామ=వెళ్ళెను.

తా. అప్పుడు మహాత్ముడైన లక్ష్మణుడు, భరతుడు చాల దూరము వచ్చి సాగనంపగా వీరుడైన ఆ శత్రుఘ్నుడు, శీఘ్రముగా తన నగరమునకు వెళ్ళెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బది రెండవ సర్గ సమాప్తము.

# అథ త్రిసప్తతితమః సర్గః

[ఒకనొక బ్రాహ్మణుడు మరణించిన బాలుడైన పుత్రుణ్ణి తీసికొని రాజద్వారము వద్దకు వచ్చి విలపించుట].

మూ. ప్రస్థాప్య స తు శత్రుఘ్నం భ్రాతృభ్యాం సహ రాఘవః,
ప్రముమోద సుఖీ రాజ్యం ధర్మేణ పరిపాలయన్. 1

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, శత్రుఘ్నమ్ శత్రుఘ్నుణ్ణి, ప్రస్థాప్య = పంపి, రాజ్యమ్ = రాజ్యమును, ధర్మేణ = ధర్మముచేత, పరిపాలయన్ = పాలించుచు, సుఖీ = సుఖవంతుడై, భ్రాతృభ్యాం సహ = ఇద్దరు సోదరులతో కూడ, ప్రముమోద = సంతోషించెను.

తా. రాముడు శత్రుఘ్నుణ్ణి పంపివేసి రాజ్యమును ధర్మముతో పరిపాలించుచు, సుఖవంతుడై లక్ష్మణ భరతులతో కూడ సంతోషముగా ఉండెను. 1

మూ. తతః కతిపయాహస్సు వృద్ధో జానపదో ద్విజః,
మృతం బాలముపాదాయ రాజద్వారముపాగమత్. 2

ప్ర. అ. తతః = అటు పిమ్మట, కతిపయాహస్సు = కొన్ని రోజులలో, వృద్ధః = వృద్ధుడైన, జానపదః = పల్లెకు సంబంధించిన, ద్విజః = బ్రాహ్మణుడు, మృతమ్ = మరణించిన, బాలమ్ = బాలుణ్ణి, ఉపాదాయ = గ్రహించి, రాజద్వారమ్ = రాజద్వారమును, ఉపాగమత్ = పొందెను.

తా. పిమ్మట కొన్నాళ్ళకు పల్లెటూరుకు చెందిన ఒక వృద్ధ బ్రాహ్మణుడు మరణించిన బాలుణ్ణి తీసికొని రాజద్వారము వద్దకు వచ్చెను. 2

మూ. రుదన్ బహువిధా వాచః స్నేహదుఃఖసమన్వితః,
అసకృత్ పుత్ర పుత్రేతి వాక్యమేతదువాచ హ. 3

ప్ర. అ. రుదన్ = ఏడ్చుచు, స్నేహదుఃఖసమన్వితః = పుత్ర ప్రేమతోను దుఃఖముతోను కూడినవాడై, పుత్ర పుత్ర ఇతి = పుత్రా పుత్రా అని, అసకృత్ = = మాటిమాటికి, బహువిధాః = అనేకవిధములైన, వాచః = వాక్కులను, (పలుకుచు), ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ బ్రాహ్మణుడు పుత్రప్రేమతోను, దుఃఖముతోను "పుత్రా! పుత్రా!" అని మాటి మాటికి అనేక విధములైన మాటలతో ఏడ్చుచు ఇట్లు పలికెను. 3

మూ. కిం ను మే దుష్కృతం కర్మ పురా దేహాన్తరే కృతమ్,
యదహం పుత్రమేకం తు పశ్యామి నిధనం గతమ్. 4

అప్రాప్తయౌవనం బాలం పఞ్చవర్షసహస్రకమ్,
అకాలే కాలమాపన్నం మమ దుఃఖాయ పుత్రక. 5

ప్ర. అ. పుత్రక = పుత్రా! పురా = పూర్వమునందు, దేహాన్తరే = మరొక దేహమునందు, మే = నాకు, కిమ్ = ఏ, దుష్కృతం కర్మ = పాపరూపమైన కర్మ, కృతమ్ = చేయబడినదో, యత్ = దేనివలన, అహమ్ = నేను, అప్రాప్త యౌవనమ్ = పొందబడని యౌవనము గలవాడు, పఞ్చవర్షసహస్రకమ్ = ఐదు వేల వర్షముల వయస్సు గలవాడు, మమ = నాయొక్క, దుఃఖాయ = దుఃఖము కొరకు, అకాలే = అకాలమునందు, కాలమ్ = మృత్యువును, ఆపన్నమ్ = పొందినవాడు, నిధనం గతమ్ = మరణించినవాడూ, బాలమ్ = బాలుడూ అయిన, ఏకం పుత్రమ్ = ఒక్క పుత్రుణ్ణి, పశ్యామి = చూచుచున్నానో.

తా. పుత్రా! నేను పూర్వజన్మలో ఎంత పాపము చేసితినో కదా! ఐదు వేల వర్షముల వయస్సునందు. యౌవనము పొందుటకు పూర్వమే నాకు దుఃఖము కలుగుటకై, అకాలమునందు మృత్యువు వాత పడి మరణించిన, బాలుడైన ఏకైక పుత్రుణ్ణి చూడవలసి వచ్చినది.

వి. "పఞ్చవర్ష సహస్రకమ్" అన్నప్పుడు "వర్ష" శబ్దానికి "సహస్ర సంవత్సరం సత్రముపాసీత" ఇత్యాది వాక్యములందు వలె దివసము అని అర్థమనీ, అందుచేత కొందరి ప్రకారము దీనికి పదహారు సంవత్సరముల వయస్సు కలవాడు అనీ మరికొందరి ప్రకారము కొంచెము తక్కువ పద్నాలుగు సంవత్సరముల వయస్సు కలవాడు అనీ అర్థ మని తిలకవ్యాఖ్య. 4,5

మూ. అల్పైరహోభిర్నిధనం గమిష్యామి న సంశయః,
అహం చ జననీ చైవ తవ శోకేన పుత్రక. 6

ప్ర. అ. పుత్రక = పుత్రా! అల్పైః = అల్పములైన, అహోభిః=దినముల చేతనే, నిధనమ్ = మరణమును, గమిష్యామి = పొందగలను. సంశయః = సంశయము, న=లేదు, తవ శోకేన=నీ శోకముచేత,అహం చ=నేను, జననీ చైవ = నీ తల్లి కూడ మరణించగలము.

తా. పుత్రా! కొద్ది రోజులలోనే నేను మరణించెదను; సందేహము లేదు. నిన్ను గురించిన శోకముచేత, నేనూ, నీ తల్లి కూడ మరణించెదము. 6

మూ. నస్మరామ్యనృతం హ్యుక్తం న చ హింసాం స్మరామ్యహమ్,
సర్వేషాం ప్రాణినాం పాపం న స్మరామి కదాచన. 7

ప్ర. అ. అహమ్ = నేను, ఉక్తమ్ = పలకబడిన, అనృతమ్ = అసత్యమును గూర్చి, నస్మరామి = స్మరించను. హింసాం చ = హింసను కూడ, న స్మరామి = స్మరించను. కదాచన=ఎన్నడూ, సర్వేషామ్ = అన్ని, ప్రాణినామ్= ప్రాణులకూ కూడ, పాపమ్ = పాపమును, న స్మరామి = స్మరించను.

తా. నేను ఏనాడైనా అసత్యము పలికినట్లు కాని, హింస చేసినట్లు గాని, ఏ ప్రాణులవిషయమునందైనను పాపము ఆచరించినట్లు గాని నాకు జ్ఞాపకము లేదు. 7

మూ. కేనాద్య దుష్కృతేనాయం బాల ఏవ మమాత్మజః,
అకృత్వా పితృకార్యాణి గతో వైవస్వతం క్షయమ్. 8

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అయమ్=ఈ, మమ ఆత్మజః=నా కుమారుడు, బాలః ఏవ = బాలుడుగానే, పితృకార్యాణి = పితృకార్యములను, అకృత్వా = చేయకుండగా, కేన దుష్కృతేన = ఏ పాపముచేత, వైవస్వతక్షయమ్ = యమలోకమును గూర్చి, గతః = వెళ్లినాడు?

తా. నా పుత్రుడు తలిదండ్రులకు చేయవలసిన సేవాదులు, శ్రాద్ధాదులు చేయక మునుపే, బాలుడుగానే, ఏ పాపముచేత యమలోకమునకు వెళ్లినాడో కదా! 8

మూ. నేదృశం దృష్టపూర్వం మే శ్రుతం వా ఘోరదర్శనమ్,
మృత్యురప్రాప్తకాలానాం రామస్య విషయే యథా. 9

ప్ర. అ. రామస్య = రామునియొక్క, విషయే = దేశమునందు, అప్రాప్తకాలానామ్ = కాలము రానివారికే, యథా = ఎట్లు, మృత్యుః = మృత్యువు వచ్చినదో, ఈదృశమ్ = ఇట్టి, ఘోరదర్శనమ్ = ఘోరదర్శనము, న దృష్టపూర్వమ్ = పూర్వము చూడబడలేదు. న శ్రుతం వా = వినబడలేదు.

తా. రాముని దేశములో కాలము రానివారికే ఈ విధముగా మృత్యువు వచ్చుచున్నది. ఇట్టి ఘోరము పూర్వ మెన్నడూ నేను చూడలేదు, వినలేదు. 9

మూ. రామస్య దుష్కృతం కించిన్మహదస్తి న సంశయః,
యథా హి విషయస్థానాం బాలానాం మృత్యురాగతః. 10

ప్ర. అ. రామస్య = రామునియొక్క, కించిత్ = ఒకానొక, మహత్ = గొప్పదైన, దుష్కృతమ్ = పాపము, అస్తి = ఉన్నది; సంశయః = సంశయము, న = లేదు. యథా = ఎట్లు, విషయస్థానామ్ = దేశములో ఉన్న, బాలానామ్ = బాలులకు, మృత్యుః = మృత్యువు, ఆగతః = వచ్చినదో.

తా. దేశములో ఉన్న బాలులకు అకాలమరణము సంప్రాప్తించుచున్నదనగా తప్పక రాముని గొప్ప పాప మేదో ఉండి ఉండును. 10

మూ. న హ్యన్యవిషయస్థానాం బాలానాం మృత్యుతో భయమ్,
స రాజన్ జీవయస్వైనం బాలం మృత్యువశం గతమ్.

ప్ర. అ. అన్యవిషయస్థానామ్ = ఇతరదేశములం దున్న, బాలానామ్ = బాలులకు, మృత్యుతః = మృత్యువువలన, భయమ్ = భయము, న హి = లేదు కదా? రాజన్ = రాజా! సః = అట్టి నీవు, మృత్యువశమ్ = మృత్యువశమును, గతమ్ = పొందిన, ఏనం బాలమ్ = ఈ బాలుణ్ణి, జీవయస్వ = జీవింపచేయుము.

తా. ఇతరదేశాలలో ఉన్న బాలులకు మృత్యుభయము లేదు కదా? అందువలన, రాజా! మరణించిన ఈ బాలుణ్ణి బ్రతికించుము. 11

మూ. రాజద్వారి మరిష్యామి పత్న్యా సార్ధమనాథవత్,
బ్రహ్మహత్యాం తతో రామ సముపేత్య సుఖీ భవ. 12

ప్ర. అ. పత్న్యా సార్ధమ్=భార్యతో కూడ, రాజద్వారి = రాజద్వారమునందు, అనాథవత్=అనాథుడు వలె, మరిష్యామి=మరణించెదను. రామ=రామా! తతః = అటుపిమ్మట, బ్రహ్మహత్యామ్ = బ్రహ్మహత్యాపాపమును, సమేత్య = పొంది, సుఖీ = సుఖవంతుడవు, భవ = అగుము.

తా. నేను, నా భార్యా కూడ అనాథులము వలె రాజద్వారమునందు మరణించెదము. రామా! పిమ్మట నీవు బ్రహ్మహత్యాపాపముతో సుఖముగా ఉండుము.

మూ. భ్రాతృభిః సహితో రాజన్ దీర్ఘమాయురవాప్స్యసి,
ఉషితాః స్మ సుఖం రాజ్యే తవాస్మిన్ సుమహాబల. 13

ప్ర. అ. రాజన్ = రాజా! భ్రాతృభిః = సోదరులతో, సహితః = కూడినవాడవై, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుః = ఆయుర్దాయమును, అవాప్స్యసి = పొందగలవు. సుమహాబల=చాల గొప్ప బలము గలవాడా! తవ = నీయొక్క, అస్మిన్ రాజ్యే = ఈ రాజ్యమునందు, సుఖమ్ = సుఖముగా, ఉషితాః స్మ = ఉన్నాము.

తా. రాజా! సోదరులతో నీవు చాల కాలము జీవించుము. గొప్ప బలము కలవాడా! నీ ఈ రాజ్యములో ఎంతో సుఖముగా ఉన్నాము. 13

మూ. ఇదం తు పతితం తస్మాత్తవ రామ వశే స్థితాః,
కాలస్య వశమాపన్నాః స్వల్పం హి న హి నః సుఖమ్.

ప్ర. అ. రామ = రామా! ఇదం తు=ఇదియైతే, పతితమ్=వచ్చి పడినది. తస్మాత్=ఆ కారణమువలన, తవ వశే= నీ వశమునందు, స్థితాః=ఉన్న మేము, కాలస్య వశమ్=కాలవశమును, ఆపన్నాః=పొందినాము. నః=మాకు, స్వల్పమ్= స్వల్పమైన, సుఖమ్ = సుఖము కూడ, న హి = లేదు కదా?

వి. పదమూడవ శ్లోకానికి-"ఇంతవరకూ నీ రాజ్యంలో సుఖముగా ఉన్నాము; అందుచేత సోదరులతో దీర్ఘాయుర్దాయవంతుడవై వర్ధిల్లుము" అని భావ మని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ఈ ఘట్టంలో దీనికి అధిక్షేపణాపరముగానే భావము

చెప్పడం యుక్తంగా ఉంటుంది. "ఇలాంటి పుణ్యం చేసిన నీవు చాలా కాలం వర్ధిల్లు తావులే! ఆహా! నీ రాజ్యంలో మేము ఎంత సుఖంగా ఉన్నాము!" అని భావం చెపితే బాగుంటుంది. ఈ ఘట్టంలో ప్రాచ్యపాఠంలోని శ్లోకాలు బాగున్నాయి.

"బ్రహ్మహత్యాం తతో రామః సముపేత్య సుఖీ భవేత్,
భ్రాతృభిః సహితో రాజా దీర్ఘమాయురవాప్నుయాత్.
ఉషితాః స్మ సుఖం రాజ్యే రాజ్ఞో దశరథస్య హ,
రామస్య విషయస్థానాం నాస్త్యల్పమపి నః సుఖమ్".

మూ. సంప్రత్యనాథో విషయ ఇక్ష్వాకూణాం మహాత్మనామ్,
రామం నాథమిహాసాద్య బాలాన్తకరణం ధ్రువమ్. 15

ప్ర. అ. బాలాన్తకరణమ్=బాలులకు మరణమును కలిగించు, రామమ్=రాముణ్ణి, నాథమ్ = నాథుణ్ణిగా, ఆసాద్య = పొంది, ఇహ = ఇక్కడ, మహాత్మనామ్ = మహాత్ములైన, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకురాజులయొక్క, విషయః = దేశము, సంప్రతి = ఇప్పుడు, అనాథః = నాథుడు లేనిది అయినది. ధ్రువమ్ = నిశ్చయము.

తా. బాలుల మరణానికి హేతువైన రాముడు ఇప్పుడు నాథుడుగా వచ్చిన తరవాత, ఇక్ష్వాకురాజులు పాలించిన ఈ దేశము నాథుడు లేనిది అయినది. 15

మూ. రాజదోషైర్విపద్యన్తే ప్రజా హ్యవిధిపాలితాః,
అసద్వృత్తే హి నృపతావకాలే మ్రియతే జనః. 16

ప్ర. అ. అవిధిపాలితాః = శాస్త్రవిరుద్ధముగా పాలింపబడిన, ప్రజాః = ప్రజలు, రాజదోషైః = రాజుయొక్క దోషములచేత, విపద్యన్తే = ఆపదలు చెందుదురు. నృపతౌ=రాజు, అసద్వృత్తే = చెడ్డ నడవడిక కలవాడగుచుండగా, జనః = జనము, అకాలే = అకాలమునందు, మ్రియతే, హి = మరణించును కదా.

తా. శాస్త్రవిరుద్ధమైన రీతిలో పాలింపబడిన ప్రజలు రాజు చేసిన దోషాలకు ఆపదలు చెందుదురు. రాజు చరిత్ర మంచిది కానిచో జనులు అకాలమరణము చెందుదురు. 16

మూ. యద్వా పురేష్వయుక్తాని జనా జనపదేషు చ,
కుర్వతే న చ రక్షాస్తి తదా కాలకృతం భయమ్. 17

ప్ర. అ. యద్వా = లేదా, పురేషు = పట్టణములయందు, జనపదేషు చ = గ్రామములయందు, జనాః = జనులు, అయుక్తాని = అయుక్తకార్యములను, కుర్వతే = చేయుచుందురు; రక్షా = రక్షణము, న చ అస్తి = ఉండదు: తదా = అప్పుడు కూడ, కాలకృతమ్ = మృత్యువుచేత చేయబడిన, భయమ్ = భయము కలుగును.

తా. లేదా-పురములందు, గ్రామములందు నివసించు జనులు అయుక్త కార్యములు చేయుచున్నప్పుడు, రక్షణము లేనప్పుడు కూడ జనులకు మృత్యు భయము కలుగుచుండును. 17

మూ. సువ్యక్తం రాజదోషో హి భవిష్యతి న సంశయః,
పురే జనపదే చైవ తతో బాలవధో హ్యయమ్. 18

ప్ర. అ. సువ్యక్తమ్ = సుస్పష్టముగా, రాజదోషః = రాజదోషమే, భవిష్యతి = అయి ఉండును. సంశయః = సంశయము, న = లేదు. తతః = అందువలననే, పురే = పురమునందు, జనపదే చైవ = జనపదమునందు, అయమ్ = ఈ బాలవధః = బాలుల మరణము.

తా. ఇది తప్పక రాజదోషమే. సందేహము లేదు. అందుచేతనే పురముల లోను, గ్రామాలలోను బాలులు మరణించుచున్నారు. 18

మూ. ఏవం బహువిధైర్వాక్యైరుపరుధ్య ముహుర్ముహుః,
రాజానం దుఃఖసంతప్తః సుతం తముపగూహతి. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రిసప్తతితమః సర్గః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, బహువిధైః = అనేకవిధములైన, వాక్యైః = వాక్యములతో, ముహుః ముహుః = మాటిమాటికి, రాజానమ్ = రాజును, ఉపరుధ్య =

నిర్బంధించి, దుఃఖసంతప్తః = దుఃఖపీడితుడై, తం సుతమ్ = ఆ పుత్రుణ్ణి, ఉప గూహతి = కౌగలించుకొనుచున్నాడు.

తా. ఇట్లు ఆ బ్రాహ్మణుడు అనేకవిధములైన మాటలచేత రాజును మాటి మాటికి నిర్బంధించుచు దుఃఖపీడితుడై ఆ పుత్రుణ్ణి కౌగలించుకొనుచుండెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బైమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుః సప్తతితమః సర్గః

*[తపస్సు చేయుచున్న శూద్రుడు అధర్మముచేయుటయే బ్రాహ్మణ పుత్రుని మరణమునకు హేతువు అని నారదుడు రామునకు తెలుపుట].*

మూ. తథా తు కరుణం తస్య ద్విజస్య పరిదేవనమ్,
శుశ్రావ రాఘవః సర్వం దుఃఖశోకసమన్వితమ్. 1

ప్ర. అ. రాఘవః = రాముడు, దుఃఖశోకసమన్వితమ్=దుఃఖశోకములతో కూడిన, కరుణమ్ = దీనమైన, సర్వమ్ = సమస్తమైన, ద్విజస్య = బ్రాహ్మణుని యొక్క, తథా = అట్లు, పరిదేవనమ్ = విలాపమును, శుశ్రావ = వినెను.

తా. రాముడు దుఃఖముతోను, శోకముతోను కూడిన ఆ బ్రాహ్మణుడు చేసిన దీనమైన ఆ విలాపమునంతనూ వినెను 1

మూ. స దుఃఖేన చ సంతప్తో మన్త్రిణస్తానుపాహ్వాయత్,
వసిష్ఠం వామదేవం చ భ్రాతౄంశ్చ సహ నైగమాన్. 2

ప్ర. అ. సః = రాముడు, దుఃఖేన = దుఃఖముచేత, సంతప్తః = పీడితుడై, తాన్ = ఆ, మన్త్రిణః=మంత్రులనూ, వసిష్ఠమ్=వసిష్ఠుని, వామదేవం చ=వామదేవునీ, సహనైగమాన్ = ఆ యా గణప్రముఖులతో కూడిన, భ్రాతౄన్ చ = సోదరులను, ఆహ్వయత్ = పిలచెను.

తా. ఆ రాముడు దుఃఖముతో కూడినవాడై, మంత్రులను, వసిష్ఠవామదేవులను, సోదరులను, ఆ యా గణప్రముఖులను పిలిపించెను. 2

మూ. తతో ద్విజా వసిష్ఠేన సార్ధమష్టౌ ప్రవేశితాః,
రాజానం దేవసంకాశం వర్ధస్వేతి తతోఽబ్రువన్. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వసిష్ఠేన సార్ధమ్ = వసిష్ఠునితో కూడ,

ప్రవేశితాః = ప్రవేశపెట్టబడిన, అష్టౌ = ఎనమండుగురు, ద్విజాః = బ్రాహ్మణులు, తతః = అటుపిమ్మట, దేవసంకాశమ్ = దేవతలతో సమానుడైన, రాజానమ్ = రాజును గూర్చి, వర్ధస్వ = వృద్ధిపొందుము, ఇతి = అని, అబ్రువన్ = పలికిరి.

తా. పిమ్మట వసిష్ఠునితో కలిసి ప్రవేశపెట్టబడిన ఎనమండుగురు బ్రాహ్మణులు దేవతుల్యుడైన రాజును "విజయీ భవ" అని పలికి ఆశీర్వదించిరి. 3

మూ. మార్కణ్డేయోఽథ మౌద్గల్యో వామదేవశ్చ కాశ్యపః,
కాత్యాయనోఽథ జాబాలిర్గౌతమో నారద స్తథా, 4
ఏతే ద్విజర్షభాః సర్వే ఆసనేషూపవేశితాః.

ప్ర. అ. మార్కణ్డేయః = మార్కండేయుడు, అథ = పిమ్మట, మౌద్గల్యః = మౌద్గల్యుడు, వామదేవశ్చ = వామదేవుడు, కాశ్యపః = కాశ్యపుడు, కాత్యాయనః = కాత్యాయనుడు, అథ = మరియు, జాబాలిః = జాబాలి, గౌతమః = గౌతముడు, తథా = మరియు, నారదః = నారదుడు, ఏతే = ఈ, సర్వే = సమస్తమైన, ద్విజర్షభాః = బ్రాహ్మణశ్రేష్ఠులు, ఆసనేషు = ఆసనములయందు, ఉపవేశితాః = కూర్చుండబెట్టబడిరి.

తా. మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, జాబాలి, గౌతముడు, నారదుడు ఈ బ్రాహ్మణోత్తము లందరూ ఆసనములమీద కూర్చుండబెట్టబడిరి. 4

మూ. మహర్షీన్ సమనుప్రాప్తానభివాద్య కృతాఞ్జలిః, 5
మన్త్రిణో నైగమాశ్చైవ యథార్హమనుకూలితాః.

ప్ర. అ. సమనుప్రాప్తాన్ = వచ్చిన, మహర్షీన్ = మహర్షులను, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, అభివాద్య = నమస్కరించి(ఆదరించెను). మన్త్రిణః = మంత్రులూ, నైగమాః చ ఏవ = నైగములు, యథార్హమ్ = తగు విధముగా, అనుకూలితాః = అనుకూలులుగా చేసికొనబడినారు.

తా. వచ్చిన మహర్షులకు రాముడు అంజలి ఘటించి నమస్కరించెను. మంత్రులను, నైగములను తగు విధముగా అనుకూలము చేసికొనెను.

మూ. తేషాం సముపవిష్టానాం సర్వేషాం దీప్తతేజసామ్, 6
రాఘవః సర్వమాచష్టే ద్విజోఽయముపరోధతి.

ప్ర. అ. సముపవిష్టానామ్=కూర్చున్న, దీప్తతేజసామ్ = ప్రకాశించుచున్న తేజస్సు గల, తేషామ్ = ఆ, సర్వేషామ్ = అందరికి, రాఘవః = రాముడు, అయమ్ = ఈ, ద్విజః = బ్రాహ్మణుడు, ఉపరోధతి = నిర్బంధించుచున్నాడు అని, సర్వమ్ = సమస్తమునూ, ఆచష్టే = చెప్పెను.

తా. తేజస్సుతో ప్రకాశించుచున్న వారందరూ కూర్చున్న పిమ్మట రాముడు "ఈ బ్రాహ్మణుడు మొండి పట్టు పట్టుచున్నాడు"అని ఆ విషయ మంతా చెప్పెను.

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజ్ఞో దీనస్య నారదః, 7
ప్రత్యువాచ శుభం వాక్యమృషీణాం సంనిధౌ స్వయమ్.

ప్ర. అ. దీనస్య = దీనుడైన, తస్య రాజ్ఞః=ఆ రాజుయొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, నారదః = నారదుడు, ఋషీణామ్ = ఋషులయొక్క, సంనిధౌ = సంనిధియందు, స్వయమ్=స్వయముగా, శుభమ్= శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = బదులు చెప్పెను.

తా. దీనుడైన రాజు మాటలు విని ఆ ఋషుల సమక్షమునందు నారదుడు శుభమైన కాక్యము పలికెను. 7

మూ. శృణు రాజన్ యథాకాలే ప్రాప్తో బాలస్య సంక్షయః, 8
శ్రుత్వా కర్తవ్యతాం రాజన్ కురుష్వ రఘునన్దన.

ప్ర. అ. రాజన్=రాజా! బాలస్య=బాలునియొక్క, సంక్షయః=మరణము, అకాలే = అకాలమునందు, యథా = ఎట్లు, ప్రాప్తః = వచ్చినదో, శృణు = వినుము. రాజన్ = రాజా! రఘునన్దన = రామా! శ్రుత్వా = విని, కర్తవ్యతామ్= చేయదగినదానిని, కురుష్వ = చేయుము.

తా. రాజా! బాలునకు అకాలమరణము ఎట్లు ప్రాప్తించినదో వినుము. రామా! విని ఏమి చేయవలెనో చేయుము. 8

మూ. పురా కృతయుగే రాజన్ బ్రాహ్మణా వై తపస్వినః, 9
అబ్రాహ్మణస్తదా రాజన్న తపస్వీ కథంచన,

ప్ర. అ. రాజన్=రాజా! పురా = పూర్వము, కృతయుగే=కృతయుగమునందు, బ్రాహ్మణాః వై=బ్రాహ్మణులే, తపస్వినః=తపస్సుచేయువారు. రాజన్=రాజా! తదా = అప్పుడు, అబ్రాహ్మణః = బ్రాహ్మణభిన్నుడు, కథంచన = ఏ విధముగానూ కూడ, తపస్వీ = తపస్సుకలవాడుగా, న = లేడు.

తా. రాజా! పూర్వము కృతయుగములో బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేసుకొనేవారు. బ్రాహ్మణులు కానివారు ఏ విధముగానూ కూడ తపస్సు చేసికొనే వారు కారు. 9

మూ. తస్మిన్ యుగే ప్రజ్వలితే బ్రహ్మభూతే త్వనావృతే, 10
అమృత్యవ స్తదా సర్వే జజ్ఞిరే దీర్ఘదర్శినః.

ప్ర. అ. ప్రజ్వలితే = ప్రకాశించుచున్న, బ్రహ్మభూతే = బ్రహ్మమయమైన. అనావృతే = అజ్ఞానావరణము లేని, తస్మిన్ యుగే = ఆ యుగమునందు, సర్వే=అందరూ, అమృత్యవః=మృత్యువు లేనివారుగాను, దీర్ఘదర్శినః=దీర్ఘదృష్టి గలవారుగాను, జజ్ఞిరే = అయిరి.

తా. ఆ యుగము అజ్ఞానావరణము లేక బ్రహ్మమయమై ప్రకాశించుచుండెను. అప్పుడు అందరు మృత్యువు లేనివారై త్రికాలజ్ఞానము కలవారై ఉండిరి.

ప్రాచ్యపాఠంలో పై రెండు శ్లోకాలు ఈ విధంగా ఉన్నాయి:-

"పురా కృతయుగే రామ బ్రహ్మ సర్వమనుత్తమమ్,
అబ్రాహ్మణో న వై కశ్చిదతపాశ్చ న విద్యతే".

"తస్మిన్ యుగే ప్రజ్వలితే బ్రహ్మభూతే హ్యనాపది,
అమృత్యవో ద్విజాః సర్వే జాయన్తే విగతామయాః".

రామా! పూర్వము కృతయుగములో సర్వమూ బ్రహ్మమయమై అత్యుత్తమ స్థితిలో ఉండెడిది. అబ్రాహ్మణుడు గాని, తపస్సులేనివాడు గాని ఎవ్వడూ ఉండెడివాడు కాదు". "ఈ బ్రహ్మమయ మైన ఆపదలు లేని ఆ యుగము దేదీప్యమానముగా ప్రకాశించుచున్నప్పుడు ద్విజు లందరు (అందరూ ద్విజులే) మృత్యువు (అకాలమృత్యువు) లేనివారై రోగములు లేనివారై ఉండిరి.

మూ. తతస్త్రేతాయుగం నామ మానవానాం వపుష్మతామ్, 11
క్షత్రియా యత్ర జాయన్తే పూర్వేణ తపసాన్వితాః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వపుష్మతామ్ = దృఢదేహముగల, మానవానామ్ = మనువంశసంజాతులయొక్క, త్రేతాయుగం నామ = త్రేతాయుగ మనునది వచ్చినది. యత్ర = దేనియందు, క్షత్రియాః = క్షత్రియులు, పూర్వేణ = వెనుకటి బ్రాహ్మణునితోకూడ, తపసా = తపస్సుతో అన్వితాః = కూడినవారు.

తా. తరువాత వచ్చిన దృఢశరీరములు గల మనువంశీయులకు చెందిన త్రేతాయుగములో క్షత్రియులు కూడా బ్రాహ్మణులతో పాటు తపస్సుకలవారు అగుదురు. 11

మూ. వీర్యేణ తపసా చైవ తేఽధికాః పూర్వజన్మని, 12
మానవా యే మహాత్మానస్తత్ర త్రేతాయుగే యుగే.

ప్ర. అ. పూర్వజన్మని = కృతయుగజన్మయందు, తే = బ్రాహ్మణులు, వీర్యేణ = పరాక్రమముచేత, తపసా చైవ = తపస్సుచేతా, అధికాః = అధికులు. త్రేతాయుగే = త్రేతాయుగ మను, తత్ర = ఆ, యుగే = యుగమునందు, యే = ఎవరు, మానవాః = మనువంశమునందు పుట్టినారో వారు, మహాత్మానః = మహాత్ములు.

తా. కృతయుగమునందు వీర్యముచేతా, తపస్సుచేతా కూడ బ్రాహ్మణులు అధికులు. త్రేతాయుగములో మనువంశమునందు పుట్టిన క్షత్రియులు తపోవీర్యములచేత మహాత్ములు. కృతయుగములో బ్రాహ్మణులు మాత్రమే నిత్యనైమిత్తికాదికర్మలే కాక కాయక్లేశరూపమైన తపస్సు కూడ చేసేవారు. అందుచే వాళ్లే సర్వాధికులు. త్రేతాయుగము వచ్చుసరికి క్షత్రియులు కూడ తపస్సు చేసేవారు. అందుచేత వారు కూడ మహాత్ములే కాని వీరు కృతయుగబ్రాహ్మణుల కంటె తక్కువవారు. 12

మూ. బ్రహ్మ క్షత్రం చ తత్సర్వం యత్పూర్వమవరం చ యత్,
యుగయోరుభయోరాసీత్సమవీర్యసమన్వితమ్.

ప్ర. అ. ఉభయోః = రెండు, యుగయోః = కృతత్రేతాయుగములలో,

యత్ = ఏ, బ్రహ్మ = బ్రాహ్మణజాతి, పూర్వమ్ = కృతయుగములో ఆధిక్యము కలదై ఉండెడిదో, యత్ = ఏ, క్షత్రమ్ = క్షత్రియజాతి, అవరం చ = కృత యుగములో తక్కువదిగా ఉండెడిదో, తత్ = అది, సర్వమ్ = అంతా (బ్రాహ్మణ క్షత్రియ జాతిద్వయము) సమవీర్యసమన్వితమ్ = సమానమైన వీర్యముతో కూడినది, ఆసీత్ = అయెను.

తా. కృతయుగములో బ్రాహ్మణజాతి తపోవీర్యములచేత అధికముగా ఉండెడిది. అప్పుడు క్షత్రియజాతి తక్కువగా ఉండెడిది. త్రేతాయుగములో క్షత్రియజాతికి కూడ తపస్సు ఉండుటచేత అపుడు ఈ రెండు జాతులూ తపోవీర్య ములచేత సమానములైనవి. త్రేతాయుగబ్రాహ్మణజాతి కూడ కృతయుగ బ్రాహ్మణ జాతికంటె న్యూనమే. 13

మూ. అపశ్యన్తస్తు తే సర్వే విశేషమధికం తతః, 14
స్థాపనం చక్రిరే తత్ర చాతుర్వర్ణ్యస్య సంమతమ్.

ప్ర. అ. తే సర్వే = ఆ శాస్త్రనిర్మాతలందరూ, తతః = అటుపైన, అధికమ్ = అధికమైన, విశేషమ్ = భేదమును, అపశ్యన్తః = చూడనివారై, తత్ర = అక్కడ, సంమతమ్ = అందరికీ ఇష్టమైన, చాతుర్వర్ణ్యస్య = నాలుగు వర్ణములయొక్క, స్థాపనమ్ = స్థాపనమును, చక్రిరే = చేసిరి.

తా. అప్పుడు శాస్త్రనిర్మాతలు బ్రాహ్మణక్షత్రియులలో భేదము అధిక ముగా లేకపోవుటచేత అందరికీ సంమతమైన చాతుర్వర్ణ్యమును ఏర్పాటు చేసిరి.

మూ. తస్మిన్ యుగే ప్రజ్వలితే ధర్మభూతే హ్యనావృతే. 15
అధర్మః పాదమేకం తు పాతయత్ పృథివీతలే,
అధర్మేణ తు సంయుక్తస్తేజోమన్దం భవిష్యతి. 16

ప్ర. అ. ("అధర్మేణ తు సంయుక్తాస్తేజోమన్దాస్తదా హి తే" అను ప్రాచ్య పాఠము బాగున్నది). ధర్మభూతే = ధర్మప్రచురమైన, అనావృతే = అధర్మావరణము లేని, తస్మిన్ = ఆ, యుగే = యుగము, ప్రజ్వలితే = ప్రకాశించుచుండగా, అధర్మః = అధర్మము, ఏకం పాదమ్ = ఒక పాదమును, పృథివీతలే = భూమి మీద, పాతయత్ = ఉంచెను. అధర్మేణ = అధర్మముతో, సంయుక్తాః = కూడిన,

తే = వాళ్లు, తదా = అప్పుడు, తేజోమన్దాః హి = తేజస్సుచేత మందులుగా అయిరి కదా?

తా. ధర్మప్రచురమై అధర్మావరణము లేని ఆ త్రేతాయుగము ప్రకాశించుచుండగా భూమిమీద అధర్మము ఒక పాదమును ఉంచెను. అప్పుడు అధర్మ సంబంధముచే వాళ్ళ తేజస్సు కొంచెము తగ్గినది. 15,16

మూ. ఆమిషం యచ్చ పూర్వేషాం రాజసం చ మలం భృశమ్,
అనృతం నామ తద్భూతం క్షిప్తేన పృథివీతలే. 17

ప్ర. అ. పృథివీతలే = భూమిమీద, క్షిప్తేన = ఉంచబడిన అధర్మపాదము చేత, పూర్వేషామ్ = పూర్వికులకు, యత్ = ఏది, ఆమిషమ్ = మాంసము వంటిదో, రాజసమ్ = రజోగుణప్రధానమైన, మలమ్ = మలము వంటిదో, తత్ = ఆ, అనృతమ్ = కృష్యాదికముగా, భృశమ్ = మిక్కిలి, భూతమ్ = అయినది.

తా. భూమిమీద అధర్మపాదము ప్రసరించుటచేత అంతకు పూర్వము ఏ కృష్యాదికమును మాంసమును వలె, రజోగుణజన్యమైన మలమును వలె పూర్వులు పరిహరించిరో అట్టి అనృతము (కృష్యాదికము) అధికముగా ప్రచారములోనికి వచ్చెను. 17

మూ. అనృతం పాతయిత్వా తు పాదమేకమధర్మతః,
తతః ప్రాదుష్కృతం పూర్వమాయుషః పరినిష్ఠితమ్. 18

ప్ర. అ. ఏకమ్ = ఒక, పాదమ్ = పాదమును, అనృతమ్ = అనృతమును, పాతయిత్వా = ప్రవర్తింపచేసి, తతః = అటుపిమ్మట, అధర్మతః = అధర్మముచేత, పూర్వమ్ = పూర్వమైన, ఆయుషః = ఆయుర్దాయముయొక్క, పరినిష్ఠితమ్ = పరిమాణము, ప్రాదుష్కృతమ్ = తగ్గించబడినది.

తా. అధర్మము ఒక పాదము అనృతమును ప్రవర్తింపజేసి పిదప పూర్వము (కృతయుగములో) ఉన్న ఆయుర్దాయప్రమాణమును కూడ తగ్గించినది. 18

మూ. పాతితే త్వనృతే తస్మిన్నధర్మేణ మహీతలే,
శుభాన్యేవాచరల్లోకః సత్యధర్మపరాయణః. 19

ప్ర. అ. అధర్మేణ = అధర్మముచేత, మహీతలే=భూమిమీద, తస్మిన్ అనృతే = ఆ అనృతము, పాతితే=పడవేయబడినదగుచుండగా, లోకః=లోకము, సత్యధర్మపరాయణః = సత్యధర్మపరమై, శుభాన్యేవ = మంచి కార్యములనే, ఆచరత్ = చేసెను.

తా. అధర్మము భూమిమీద అనృతమును ప్రసరింపచేసినను లోకము సత్య ధర్మములందు ఆసక్తి కలదై శుభకర్మలను మాత్రమే చేసెను. 19

మూ. త్రేతాయుగే చ వర్తన్తే బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే.
తపోఽతప్యన్త తే సర్వే శుశ్రూషామపరే జనాః. 20

ప్ర. అ. త్రేతాయుగే = త్రేతాయుగమునందు, యే = ఏ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, క్షత్రియాః చ = క్షత్రియులు, వర్తన్తే = ఉన్నారో, తే సర్వే = వాళ్లందరూ, తపః=తపస్సును, అతప్యన్త=చేసిరి. అపరే జనాః = ఇతరజనులు, శుశ్రూషామ్ = శుశ్రూషను చేసిరి.

తా త్రేతాయుగములో బ్రాహ్మణులూ క్షత్రియులూ కూడ తపస్సు చేసిరి. ఇతరజనులు మాత్రము వాళ్ల శుశ్రూష చేసిరి. 20

మూ. స ధర్మః పరమస్తేషాం వైశ్యశూద్రం తదాగమత్,
పూజాం చ సర్వవర్ణానాం శూద్రాశ్చక్రుర్విశేషతః. 21

ప్ర. అ. తదా = అప్పుడు, సః=అది, పరమః=గొప్ప, ధర్మః=ధర్మముగా, తేషామ్ = వారిలో, వైశ్యశూద్రమ్ = వైశ్యశూద్రులను, అగమత్ = పొందెను. శూద్రాః = శూద్రులు, విశేషతః = విశేషించి, సర్వవర్ణానామ్ = సమస్తవర్ణముల యొక్క, పూజామ్ = పూజను, చక్రుః = చేసిరి.

తా. వారిలో శుశ్రూషారూపమైన ధర్మము వైశ్యశూద్రుల పరమధర్మముగా ఏర్పడెను. విశేషించి శూద్రులు సమస్తవర్ణముల పూజను చేసిరి. 21

మూ. ఏతస్మిన్నన్తరే తేషామధర్మే చానృతే చ హ,
తతః పూర్వే పునర్హ్రాసమగమన్నృపసత్తమ. 22

ప్ర. అ. నృపసత్తమ=రాజశ్రేష్ఠుడా ! తేషామ్=వైశ్యశూద్రులకు, అధర్మే

చ = అధర్మము అనృతే చ = అనృతము ఏర్పడగా, ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యయందు, తతః = పిమ్మట, పూర్వే = మొదటివారు, హ్రాసమ్ = తేజస్సు మొదలైనవాటియొక్క హ్రాసమును, అగమన్ = పొందిరి.

తా. ఓ! రాజశ్రేష్ఠుడా ! వైశ్యశూద్రులకు అధర్మము అనృతము సంక్రమించిన పిదప ఈ మధ్యకాలములో అనగా (త్రేతాద్వాపరసంధికాలములో అని వ్యాఖ్యాతలు) వెనుకటివారికి, అనగా బ్రాహ్మణక్షత్రియులకు, కూడ తేజోహ్రాసము కలిగెను. 22

మూ. తతః పాదమధర్మస్య ద్వితీయమవతారయత,
తతో ద్వాపరసంజ్ఞా సా యుగస్య సమజాయత. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అధర్మస్య = అధర్మముయొక్క, ద్వితీయమ్ = రెండవ, పాదమ్ = పాదము, అవతారయత్ = దిగెను. తతః = అందువలన, యుగస్య = ఆ యుగమునకు, ద్వాపరసంజ్ఞా = ద్వాపరసంజ్ఞ, సమజాయత = కలిగెను.

తా. పిదప రెండవ అధర్మపాదము భూమిమీద దిగెను. అందువలన ఆ యుగమునకు "ద్వాపరము" అను పేరు వచ్చెను. 23

మూ. తస్మిన్ ద్వాపరసంజ్ఞే తు వర్తమానే యుగే నృప,
అధర్మశ్చానృతం చైవ వవృధే పురుషర్షభ. 24

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! నృప = రాజా! ద్వాపరసంజ్ఞే = ద్వాపర మను పేరు గల, తస్మిన్ = ఆ యుగము, వర్తమానే = జరుగుచుండగా, అధర్మః చ = అధర్మము, అనృతం చైవ = అనృతము, వవృధే = వృద్ధిపొందును.

తా. పురుషశ్రేష్ఠుడ వైన రాజా ! ద్వాపర మను పేరు గల ఆ యుగము జరుగుచున్నప్పుడు అధర్మము, అనృతము వృద్ధిపొందెను (పొందును). 24

మూ. అస్మిన్ ద్వాపరసంఖ్యానే తపో వైశ్యాన్ సమావిశత్,
త్రిభ్యో యుగేభ్యస్త్రీన్ వర్ణాన్ క్రమాద్వై తప ఆవిశత్.

ప్ర. అ. అస్మిన్ = ఈ, ద్వాపరసంఖ్యానే = ద్వాపర మను పేరు గల

యుగమునందు, తపః = తపస్సు, వైశ్యాన్ = వైశ్యులను, సమావిశత్ = ప్రవేశించెను, త్రిభ్యః = మూడు, యుగేభ్యః = యుగములవలన, తపః = తపస్సు, త్రీన్ = మూడు, వర్ణాన్ = వర్ణములను, క్రమాత్ = క్రమమువలన, ఆవిశత్ వై = ప్రవేశించినది.

తా. ఈ ద్వాపరయుగములో తపస్సు వైశ్యులకు కూడ సంక్రమించెను. ఈ విధముగ తపస్సు మూడు యుగములలో క్రమముగా మూడు వర్ణములలో ప్రవేశించెను. 25

మూ. త్రిభ్యో యుగేభ్యస్త్రీన్ వర్ణాన్ ధర్మశ్చ పరినిష్ఠితః,
న శూద్రో లభతే ధర్మం యుగతస్తు నరర్షభ. 26

ప్ర. అ. నరర్షభ = నరశ్రేష్ఠా! త్రిభ్యః = మూడు, యుగేభ్యః = యుగములవలన, ధర్మః = తపస్సు, త్రీన్ వర్ణాన్ = మూడు వర్ణములను, పరినిష్ఠితః = ఆశ్రయించి ఉన్నది. యుగతః = యుగానుసారముగా, శూద్రః = శూద్రుడు, ధర్మమ్ = ధర్మమును, న లభతే = పొందడు.

తా. రామా! మూడు యుగములందు తపస్సు మూడు వర్ణములవారితో ఉన్నది. యుగానుసారము శూద్రునకు ధర్మము (తపస్సు) లభ్యము కాదు. 26

మూ. హీనవర్ణో నృపశ్రేష్ఠ తప్యతే న హి వై తపః,
భావినీ శూద్రయోన్యాం తు తపశ్చర్యా కలౌ యుగే. 27

ప్ర. అ. నృపశ్రేష్ఠ = రాజులలో శ్రేష్ఠుడా! హీనవర్ణః = శూద్రుడు, తపః = తపస్సును, న హి వై తప్యతే = చేయడు. కలౌ యుగే = = కలియుగమునందు, శూద్రయోన్యామ్ = శూద్రయోనియందు, తపశ్చర్యా = తపశ్చర్య. భావినీ = కాగలదు.

తా. రాజులలో శ్రేష్ఠుడవైన రామా! శూద్రుడు తపస్సు చేయకూడదు. కాని కలియుగములో శూద్రునికి కూడ తపస్సు చేయుట ఉండగలదు. 27

మూ. అధర్మః పరమో రాజన్ ద్వాపరే శూద్రజన్మనః,
స వై విషయపర్యన్తే తవ రాజన్ మహాతపాః. 28
అద్య తప్యతి దుర్బుద్ధిస్తేన బాలవధో హ్యయమ్,

ప్ర. అ. రాజన్ = రాజా! ద్వాపరే = ద్వాపరమునందు కూడ, శూద్ర జన్మనః = శూద్రునకు, పరమః = గొప్ప, అధర్మః = అధర్మము. రాజన్ = రాజా! తవ = నీయొక్క, విషయపర్యన్తే = దేశ ప్రాంతమునందు, మహాతపాః గొప్ప తపస్సు గల, దుర్బుద్ధిః=దుర్బుద్ధి యైన, సః = ఆ శూద్రుడు, అద్య = ఇప్పుడు, తప్యతి = తపస్సు చేయుచున్నాడు. తేన = ఆ కారణముచేతనే, అయమ్ = ఈ, బాలవధః = బాలుని మృతి.

తా. రాజా! ద్వాపరయుగమునందు కూడ శూద్రుడు తపస్సు చేయుట గొప్ప అధర్మము. నీ దేశము ప్రాంతమునందు గొప్ప తపస్సు గల, దుర్బుద్ధి యైన శూద్రుడు తపస్సు చేయుచున్నాడు. అందువలననే ఈ బాలుడు మృతి చెందినాడు. 28

మూ. యో హ్యధర్మమకార్యం వా విషయే పార్థివస్య తు, 29
కరోతి చాశ్రీమూలం తత్పురే వా దుర్మతిర్నరః,
క్షిప్రం చ నరకం యాతి స చ రాజా న సంశయః. 30

ప్ర. అ. దుర్మతిః = దుష్టబుద్ధి గల, యః నరః = ఏ నరుడు, పార్థివస్య = రాజుయొక్క, విషయే = దేశమునందు గాని, పురే వా = పురమునందు గాని, అధర్మమ్ = అధర్మమును గాని, అకార్యం వా = అకార్యమును కాని, కరోతి = చేయునో, తత్ = అది, అశ్రీమూలమ్ = అలక్ష్మికి మూలము. సః రాజా చ = ఆ రాజు కూడ, క్షిప్రమ్ = శీఘ్రముగా, నరకమ్ = నరకమును గూర్చి, యాతి = వెళ్ళును. సంశయః = సంశయము, న = లేదు.

తా. దుర్మతియైన ఏ నరుడైనా రాజుయొక్క రాజ్యమునందు గాని, పురమునందు గాని, అధర్మమును గాని, చేయకూడని పని కాని చేసినచో అది అలక్ష్మిని కలిగించును. ఆ రాజు కూడ వెంటనే నరకములలో పడును. సంశయము లేదు. 30

మూ. అధీతస్య చ తప్తస్య కర్మణః సుకృతస్య చ,
షష్ఠం భజతి భాగం తు ప్రజా ధర్మేణ పాలయన్. 31

తా. రామా! ఎక్కడ పాపకార్యము జరుగుచున్నదో చూచుటకు ప్రయత్నము చేయుము. ఇట్లు చేసినచో ధర్మమునకు వృద్ధి, మానవులకు ఆయుర్వృద్ధి కలుగును. ఈ బాలుడు కూడ జీవించును. ౩౩

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బదినాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చసప్తతితమః సర్గః

[రాముడు పుష్పకము నెక్కి తన రాజ్యములో అంతటా తిరుగుచు పాపకర్మలు జరుగుచున్నవా అని అన్వేషించుట, అంతటా పుణ్యకర్మలే జరుగుచుండుట చూచుట, దక్షిణదిక్కున తపస్సు చేయుచున్న శూద్రుని వద్దకు వెళ్లుట].

మూ. నారదస్య తు తద్వాక్యం శ్రుత్వామృతమయం యథా,
ప్రహర్షమతులం లేభే లక్ష్మణం చేదమబ్రవీత్. 1

ప్ర. అ. నారదస్య = నారదుని యొక్క, అమృతమయం యథా = అమృతమయము వలె ఉన్న, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, అతులమ్ = సాటి లేని, ప్రహర్షమ్ = సంతోషమును, లేభే = పొందెను. లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. అమృతమయము వలె ఉన్న నారదుని మాటలు విని రాముడు సాటి లేని సంతోషమును పొందెను. లక్ష్మణునితో ఇట్లు పలికెను. 1

మూ. గచ్ఛ సౌమ్య ద్విజశ్రేష్ఠం సమాశ్వాసయ సువ్రతమ్,
బాలస్య చ శరీరం తత్తైలద్రోణ్యాం నిధాపయ. 2

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా, గచ్ఛ = వెళ్లుము, సువ్రతమ్ = మంచి నియమములు గల, ద్విజశ్రేష్ఠమ్ = బ్రాహ్మణశ్రేష్ఠుని, సమాశ్వాసయ = ఓదార్చుము. బాలస్య = బాలునియొక్క, తత్ = ఆ, శరీరమ్ = శరీరమును, తైలద్రోణ్యామ్ = తైలము తొట్టెలో, నిధాపయ = ఉంచునట్లు చేయుము.

తా. సౌమ్యా నీవు వెళ్ళి ఉత్తమవ్రతములు గల ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని ఓదార్చుము. ఆ బాలుని శరీరమును నూనె తొట్టెలో పెట్టించుము. 2

మూ. గన్ధైశ్చ పరమోదారైస్తైలైశ్చాపి సుగన్ధిభిః,
యథా న క్షీయతే బాలస్తథా సౌమ్య విధీయతామ్. 3

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! పరమోదారైః = చాల శ్రేష్ఠములైన, గన్ధైః చ = సుగంధ ద్రవ్యములచేతను, సుగన్ధిభిః = మంచి సువాసన గల, తైలైః చ అపి = తైలములచేతను, బాలః = బాలుడు, యథా = ఎట్లు, న క్షీయతే = క్షీణించడో, తథా = అట్లు, విధీయతామ్ = చేయబడుగాక.

తా. చాలా శ్రేష్ఠములైన సుగంధద్రవ్యములు, మంచి వాసనగల తైలములు ఉపయోగించి ఆ బాలుని శరీరము పాడవకుండునట్లు ఏర్పాటుచేయుము. 3

మూ. యథా శరీరో గుప్తః స్యాద్బాలస్యాక్లిష్టకర్మణః,
విపత్తిః పరిభేదో వా న భవేచ్చ తథా కురు. 4

ప్ర. అ. అక్లిష్టకర్మణః = పుణ్యకర్మగల, బాలస్య = బాలుని యొక్క, శరీరః = శరీరము, యథా = ఎట్లు, గుప్తః = రక్షింపబడినది, స్యాత్ = అగునో, విపత్తిః = ఆపద గాని, పరిభేదః వా = సంధులు విరుగుట కాని, యథా = ఎట్లు, న భవేత్ = కాదో, తథా = అట్లు, కురు = చేయుము.

తా. శుభకర్మ గల బాలుని శరీరము రక్షింపబడునట్లుగాను, దీనికి ఆపద గాని, సందులు విరుగుట కాని కలగనట్లు చేయుము. 4

మూ. ఏవం సందిశ్య కాకుత్స్థో లక్ష్మణం శుభలక్షణమ్,
మనసా పుష్పకం దధ్యావాగచ్ఛేతి మహాయశాః. 5

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, కాకుత్స్థః = రాముడు, శుభలక్షణమ్ = శుభలక్షణములు గల, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ఏవమ్ = ఇట్లు, సందిశ్య = ఆదేశించి, ఆగచ్ఛ ఇతి = రమ్ము అని, మనసా = మనస్సుచేత, పుష్పకమ్ = పుష్పకమును, దధ్యౌ = ధ్యానముచేసెను.

తా. గొప్పకీర్తి గల రాముడు శుభలక్షణములు గల లక్ష్మణునితో ఇట్లు చెప్పి "ఇక్కడికి రమ్ము" అని మనస్సులో పుష్పకమును గూర్చి ఆలోచించెను. 5

మూ. ఇఙ్గితం స తువిజ్ఞాయ పుష్పకో హేమభూషితః,
అజగామ ముహూర్తేన సమీపే రాఘవస్య వై. 6

ప్ర. అ. హేమభూషితః = బంగారముచేత అలంకరించబడిన, సః పుష్పకః = ఆ పుష్పకము, ఇఙ్గితమ్ = రాముని అభిప్రాయమును, విజ్ఞాయ = తెలిసికొని, ముహూర్తేన = ముహూర్తకాలముచేత, రాఘవస్య = రామునియొక్క, సమీపే = సమీపమునందు, అజగామ వై = వచ్చెను.

తా. బంగారముచేత అలంకరించబడిన ఆ పుష్పకము రాముని అభిప్రాయమును తెలిసికొని ముహూర్తకాలములో రామునివద్దకు వచ్చెను. 6

మూ. సోఽబ్రవీత్ప్రణతో భూత్వా అయమస్మి నరాధిప,
వశ్యస్తవ మహాబాహో కింకరః సముపస్థితః. 7

ప్ర. అ. సః = ఆ పుష్పకము, ప్రణతః భూత్వా = వంగి, అబ్రవీత్ = పలికెను. నరాధిప = రాజా! అయమ్ = ఇదిగో నేను, అస్మి = ఉన్నాను. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! తవ = నీకు, వశ్యః = వశ్యుడనైన, కింకరః = కింకరుడను, సముపస్థితః = వచ్చినాను.

తా. ఆ పుష్పకము వంగి నమస్కరించి-"రాజా! ఇదిగో ఇక్కడ ఉన్నాను; మహాబాహూ! నీ వశ్యుడైన కింకరుడనైన నేను వచ్చినాను."అని పలికెను. 7

మూ. భాషితం రుచిరం శ్రుత్వా పుష్పకస్య నరాధిపః,
అభివాద్య మహర్షీన్ స విమానం సోఽధ్యరోహత. 8

ప్ర. అ. సః = ఆ, నరాధిపః = రాజు, పుష్పకస్య = పుష్పకముయొక్క, రుచిరమ్ = అందమైన, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, మహర్షీన్ = మహర్షులను, అభివాద్య = నమస్కరించి, విమానమ్ = విమానమును, అధ్యరోహత = ఎక్కెను.

తా. ఆ రాజు పుష్పకము పలికిన మధురములైన మాటలు విని, మునులకు నమస్కరించి విమానమును ఎక్కెను. 8

మూ. ధనుర్గృహీత్వా తూణీం చ ఖడ్గం చ రుచిరప్రభమ్,
నిక్షిప్య నగరే చైతౌ సౌమిత్రిభరతావుభౌ, 9
ప్రాయాత్ప్రతీచీం హరితం విచిన్వంశ్చ తత స్తతః.

ప్ర. అ. ధనుః = ధనస్సును, తూణీం చ = అంబులపొదిని, రుచిర ప్రభమ్ = అందమైన కాంతి గల, ఖడ్గం చ = ఖడ్గమును, గృహీత్వా = గ్రహించి, నగరే = నగరమునందు, ఏతౌ = ఈ, ఉభౌ = ఇద్దరు, సౌమిత్రిభరతౌ = లక్ష్మణ భరతులను, నిక్షిప్య = ఉంచి, తత స్తతః = అన్ని వైపులా, విచిన్వన్ = వెదకుచు, ప్రతీచీం హరితమ్ = పశ్చిమదిక్కును గూర్చి, ప్రాయాత్ = వెళ్ళెను.

తా. ధనస్సును, అంబులపొదిని, అందమైన కాంతి గల ఖడ్గమును ధరించి, లక్ష్మణభరతుల నిద్దరినీ నగరములో ఉంచి అటు ఇటు వెదకుచు పశ్చిమదిక్కునకు వెళ్లెను. 9

మూ. ఉత్తరామగమచ్ఛ్రీమాన్ దిశం హిమవతావృతామ్, 10
అపశ్యమానస్తత్రాపి స్వల్పమప్యథ దుష్కృతమ్,
పూర్వామపి దిశం సర్వామథోఽపశ్యన్నరాధిపః, 11
ప్రవిశుద్ధసమాచారామాదర్శతలనిర్మలామ్.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, నరాధిపః = రాజు, హిమవతా = హిమవత్పర్వతముచేత, ఆవృతామ్ = కప్పబడిన, ఉత్తరాం దిశమ్ = ఉత్తరదిక్కును గూర్చి, శీఘ్రమ్ = శీఘ్రముగా, అగమత్ = వెళ్లెను. తత్రాపి = అక్కడ కూడ, స్వల్పమ్ = స్వల్పమైన, దుష్కృతమ్ అపి = పాపమును కూడ, అపశ్యమానః = చూడనివాడై, అథో = అటుపిమ్మట, పరిశుద్ధసమాచారామ్ = పరిశుద్ధమైన ఆచారము గల, ఆదర్శతలనిర్మలామ్ = అద్దము వలె నిర్మలమైన, పూర్వాం దిశమ్ అపి = తూర్పు దిక్కును కూడ, అపశ్యత్ = చూచెను.

తా. శ్రీమంతుడైన ఆ రాజు హిమవత్పర్వతముచేత ఆవరింపబడిన ఉత్తర దిక్కునకు శీఘ్రముగా వెళ్లి అక్కడ కూడ కొంచెము అధర్మమును కూడ చూడని వాడై పిమ్మట పరిశుద్ధమైన ఆచారము గల, అద్దము వలె నిర్మలముగా ఉన్న తూర్పు దిక్కును కూడ చూచెను. 10,11

మూ. పుష్పకస్థో మహాబాహు స్తదాపశ్యన్నరాధిపః, 12
దక్షిణాం దిశమాక్రామత్తతో రాజర్షినన్దనః,
శైవలస్యోత్తరే పార్శ్వే దదర్శ సుమహత్సరః. 13

ప్ర. అ. తదా=అప్పుడు, మహాబాహుః=గొప్ప బాహువులు గల, రాజర్షి నన్దనః=రాజర్షియైన దశరథుని కుమారుడైన, నరాధిపః=ఆ రాజు, పుష్పకస్థః= పుష్పకముమీద ఉన్నవాడై, దక్షిణామ్ = దక్షిణదిక్కును, ఆక్రామత్ = ఆక్రమించెను. తతః=అటుపిమ్మట, శైవలస్య=శైవలపర్వతముయొక్క, ఉత్తరే పార్శ్వే =ఉత్తర పార్శ్వమునందు, సుమహత్ = చాల గొప్పదైన, సరః = సరస్సును, దదర్శ=చూచెను.

తా. మహాబాహువు, రాజర్షి పుత్రుడూ అయిన ఆ మహారాజు పుష్పకముపై కూర్చొని దక్షిణదిక్కునకు వెళ్ళెను. పిమ్మట శైవలపర్వతమునకు ఉత్తరము ప్రక్క పెద్ద సరస్సును చూచెను. 12.13

మూ. తస్మిన్ సరసి తప్యన్తం తాపసం సుమహత్తపః.
దదర్శ రాఘవః శ్రీమాన్ లమ్బమానమధోముఖమ్. 14

ప్ర అ. రాఘవః = రాముడు, తస్మిన్ సరసి = ఆ సరస్సునందు, అధోముఖమ్ = క్రిందకి ముఖము కలుగునట్లుగా, లమ్బమానమ్ = వ్రేలాడుచున్న, సుమహత్ = చాల గొప్ప, తపః = తపస్సును, తప్యన్తమ్ = చేయుచున్న, తాపసమ్ = మునిని, దదర్శ = చూచెను.

తా. రాముడు, ఆ సరస్సులో క్రిందికి ముఖము ఉండునట్లుగా వ్రేలాడుచు గొప్ప తపస్సు చేయుచున్న ఒక మునిని చూచెను 14

మూ. రాఘవ స్తముపాగమ్య తప్యన్తం తప ఉత్తమమ్,
ఉవాచ చ నృపో వాక్యం ధన్య స్త్వమసి సువ్రత. 15

ప్ర. అ. నృపః = రాజైన, రాఘవః = రాముడు, ఉత్తమమ్ = ఉత్తమమైన, తపః = తపస్సును, తప్యన్తమ్ = చేయుచున్న, తమ్ = ఆతనిని, ఉపాగమ్య = సమీపించి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ = పలికెను. సువ్రత=మంచి వ్రతము కలవాడా! త్వమ్ = నీవు, ధన్యః = ధన్యుడవు, అసి = అయి ఉన్నావు.

తా. ఉత్తమమైన తపస్సు చేయుచున్న ఆతనిని సమీపించి, రాజైన రాముడు ఇట్లు పలికెను-"మంచి నియమము కలవాడా నీవు ధన్యుడవు". 15

మూ. కస్యాం యోన్యాం తపోవృద్ధ వర్తసే దృఢవిక్రమ,
కౌతూహలాత్త్వాం పృచ్ఛామి రామో దాశరథిర్హ్యహమ్.

ప్ర. అ. తపోవృద్ధ = తపస్సుచేత వృద్ధుడా! దృఢవిక్రమ = దృఢమైన పరాక్రమము కలవాడా! కస్యామ్ = ఏ, యోన్యామ్ = జాతియందు, వర్తసే = ఉంటున్నావు ? త్వామ్ = నిన్ను, కౌతూహలాత్ = వేడుకవలన, పృచ్ఛామి = అడుగుచున్నాను. అహమ్ = నేను, దాశరథిః=దశరథకుమారుడైన, రామః హి= రాముడను.

తా. తపస్సుచేత వృద్ధుడవైన, దృఢమైన మనఃస్థైర్యము గల ఓ! మునీంద్రా! నీవు ఏ జాతికి చెందినవాడవు? నేను తెలిసికొనవలె నను వేడుక చేత అడుగుచున్నాను, నేను దశరథ కుమారుడ నైన రాముడను. 16

మూ. కోఽర్థో మనీషితస్తుభ్యం స్వర్గలాభోపరోఽథవా,
వరాశ్రయో యదర్థం త్వం తపస్యన్యైః సుదుశ్చరమ్.

ప్ర. అ. తుభ్యమ్ = నీకు, కః = ఏ, వరాశ్రయః = వరమునకు సంబంధించిన, అర్థః = ప్రయోజనము, మనీషితః = కోరబడినది? స్వర్గలాభః = స్వర్గలాభమా ? అథవా = లేక, పరః = మరి యొకటా ? యదర్థమ్ = దేనికొరకై, త్వమ్=నీవు, అన్యైః=ఇతరులచేత, సుదుశ్చరమ్=ఏ మాత్రమూ చేయశక్యము కాని తపస్సును, తపసి = చేయుచున్నావో.

తా. నీవు ఎవరూ చేయజాలని తపస్సు చేయుచున్నావు; నీవు వరముగా పొందదలచిన ప్రయోజనము స్వర్గమా లేక మరొకటా? 17

మూ. యమాశ్రిత్య తపస్తప్తం శ్రోతుమిచ్ఛామి తాపస,
బ్రాహ్మణో వాసి భద్రం తే క్షత్రియో వాసి దుర్జయః, 18
వైశ్యస్తృతీయో వర్ణో వా శూద్రో వా సత్యవాగ్భవ.

ప్ర. అ. తాపస = మునీంద్రా! యమ్ = ఏ కోరికను, ఆశ్రిత్య = ఆశ్రి

యించి, తపః = తపస్సు, తప్తమ్ = చేయబడినదో, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. బ్రాహ్మణః వా అసి = బ్రాహ్మణుడవా, దుర్జయః జయింప శక్యము కాని, క్షత్రియః = క్షత్రియుడవు, అసి వా = అయి ఉన్నావా, తృతీయః వర్ణః = మూడవవర్ణమైన, వైశ్యః వా = వైశ్యుడవా, శూద్రో వా = శూద్రుడవా? తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక, సత్యవాక్ = సత్యమైన వాక్కు కలవాడవు, భవ = అగుము.

తా. మహామునీ! నీవు ఏ కోరికతో తపస్సు చేయుచున్నావో వినగోరు చున్నాను. నీవు బ్రాహ్మణుడవా, జయింప శక్యముకాని క్షత్రియుడవా? మూడవ వర్ణమువాడవైన వైశ్యుడవా? లేక శూద్రుడవా? నీకు భద్ర మగుగాక, సత్యము చెప్పుము. 18

మూ. ఇత్యేవముక్తః స నరాధిపేన
అవాక్శిరా దాశరథాయ తస్మై,
ఉవాచ జాతిం నృపపుంగవాయ
యత్కారణం చైవ తపః ప్రయత్నః. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చసప్తతితమః సర్గః.

ప్ర. అ. నరాధిపేన = రాజుచేత, ఇతి ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలక బడిన, సః = అతడు, అవాక్శిరాః = క్రిందికి శిరస్సు కలవాడై, నృపపుంగవాయ = రాజశ్రేష్ఠుడైన, తస్మై = ఆ, దాశరథాయ = రామునకు, జాతిమ్ = తన జాతిని, యత్కారణమ్ = దేని నిమిత్తము, తపఃప్రయత్నః = తపఃప్రయత్నమో దానినీ, ఉవాచ = చెప్పెను.

తా. శిరస్సు క్రిందికి వేలాడుచున్నట్లున్న ఆతడు రాముని మాటలు విని రాజశ్రేష్ఠుడైన ఆ రామునకు తన జాతినీ, తాను దేనినిమిత్తమై తపస్సు చేయు చున్నాడో దానినీ తెలిపెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బదిఅయిదవ సర్గ సమాప్తము.

# అథ షట్ సప్తతితమః సర్గః

*[రాముడు శంబూకుణ్ణి వధించుట; దేవతలు ప్రశంసించుట. అగస్త్యాశ్రమములో అగస్త్యుడు రాముణ్ణి సత్కరించి ఆతనికి అలంకారమును ఇచ్చుట].*

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రామస్యాక్లిష్టకర్మణః,
అవాక్శిరాస్తథాభూతో వాక్యమేతదువాచ హ. 1

ప్ర. అ. అక్లిష్టకర్మణః = శ్రమపడకుండగా పనులుచేయు, తస్య రామస్య = ఆ రామునియొక్క, తత్ = ఆ, వచనమ్ = ఆవచనమును, శ్రుత్వా = విని, అవాక్శిరాః = క్రిందికి శిరస్సు గల అతడు, తథాభూత్వా = అట్లే ఉండి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. శ్రమపడకుండా కార్యములు సాధించు రాముని మాటలు విని అతడు తలక్రిందుగానే ఉండి ఇట్లు పలికెను. 1

మూ. శూద్రయోన్యాం ప్రజాతోఽస్మి తప ఉగ్రం సమాస్థితః,
దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశః. 2

ప్ర. అ. మహాయశః = గొప్ప యశస్సు గలవాడా! రామ = రామా! శూద్రయోన్యామ్ = శూద్రజాతియందు, ప్రజాతః అస్మి = పుట్టినవాడను. ఉగ్రమ్ = ఉగ్రమైన, తపః = తపస్సును, సమాస్థితః = అవలంబించినాను, సశరీరః = శరీరముతో కూడినవాడనై, దేవత్వమ్ = దేవత్వమును, కామయే = కోరుచున్నాను.

తా. గొప్పకీర్తి గల రామా! నేను శూద్రజాతిలో పుట్టినాను. ఈ శరీరముతోనే దేవత్వమును పొందుటకై ఉగ్రమైన తపస్సు చేయుచున్నాను. 2

మూ. న మిథ్యాహం వదే రామ దేవలోకజిగీషయా,
శూద్రం మాం విద్ధి కాకుత్స్థ శమ్బూకో నామ నామతః. 3

ప్ర. అ. రామ = రామా! అహమ్ = నేను, మిథ్యా = అసత్యముగా, న వదే = పలుకుటలేదు. దేవలోకజిగీష షా = దేవలోకమును జయించవలె నను ఇచ్ఛచేత (తపస్సు చేయుచున్నాను). కాకుత్స్థ = రామా ! మామ్ = నన్ను, శూద్రమ్ = శూద్రుణ్ణిగా, విద్ధి = తెలిసికొనుము. నామతః = పేరువలన, శమ్బూకో నామ = శంబూకు డని ప్రసిద్ధుడను.

తా. రామా! నేను అసత్యము చెప్పుటలేదు. దేవలోకమును జయించవలె నను కోరికతో ఉన్నాను. కాకుత్స్థా! నేను శూద్రుడను. నా పేరు శంబూకుడు. 3

మూ. భాషత స్తస్య శూద్రస్య ఖడ్గం సురుచిరప్రభమ్,
నిష్కృష్య కోశాద్విమలం శిరశ్చిచ్ఛేద రాఘవః. 4

ప్ర. అ. తస్య శూద్రస్య = ఆ శూద్రుడు, భాషతః = మాటలాడుచుండగనే, రాఘవః = రాముడు, సురుచిరప్రభమ్ = చాల అందమైన కాంతి గల, విమలమ్ = నిర్మలమైన, ఖడ్గమ్ = ఖడ్గమును, కోశాత్ = ఒరనుండి, నిష్కృష్య = పైకి లాగి, శిరః = శిరస్సును, చిచ్ఛేద = ఛేదించెను.

తా. అతడు ఇట్లు చెప్పుచుండగానే రాముడు ధగధగలాడుచున్న నిర్మలమైన ఖడ్గమును ఒరనుండి తీసి అతని శిరస్సు ఖండించెను. 4

మూ. తస్మిన్ శూద్రే హతే దేవాః సేన్ద్రాః సాగ్నిపురోగమాః,
సాధు సాధ్వితి కాకుత్స్థం తే శశంసుర్ముహుర్ముహుః. 5

ప్ర. అ. తస్మిన్ = ఆ, శూద్రే = శూద్రుడు, హతే = చంపబడినవాడగుచుండగా, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, సాగ్నిపురోగమాః = అగ్ని పురఃసరుడుగా గల, తే = ఆ, దేవాః = దేవతలు, సాధు సాధు ఇతి = బాగు బాగు అని, కాకుత్స్థమ్ = రాముణ్ణి, ముహుఃముహుః = మాటిమాటికి, శశంసుః = పొగిడిరి.

తా. ఆ శూద్రుడు చంపబడిన పిమ్మట, ఇంద్రాగ్నులు మొదలైన దేవతలు "బాగు బాగు" అని రాముణ్ణి మాటి మాటికి ప్రశంసించిరి. 5

మూ. పుష్పవృష్టిర్మహత్యాసీద్దివ్యానాం సుసుగన్ధినామ్,
పుష్పాణాం వాయుముక్తానాం సర్వతః ప్రపపాత హ. 6

చారమువలన, అప్రాప్తకాలః = పొందబడని కాలము కలవాడైనను, కాలేన = కాలముచేత (మృత్యువుచేత), యమక్షయమ్ = యమలోకమును గూర్చి, నీతః = తీసికొనివెళ్ళబడినాడు.

తా. నా అపచారము వలన మృత్యువు ఆ బ్రాహ్మణుని ఏకైక పుత్రుడైన ఆ బాలుణ్ణి అకాలమునందే యమలోకమునకు తీసికొనిపోయెను. 11

మూ. తం జీవయథ భద్రం వో నానృతం కర్తుమర్హథ,
ద్విజస్య సంశ్రుతోఽర్థో మే జీవయిష్యామి తే సుతమ్. 12

ప్ర. అ. తమ్ = ఆ బాలుణ్ణి, జీవయథ = బ్రతికించండి. తే సుతమ్ = నీ పుత్రుణ్ణి, జీవయిష్యామి = జీవింపచేసెదను అని, మే = నాకు, (నాచేత), ద్విజస్య = బ్రాహ్మణునకు, అర్థః = విషయము, సంశ్రుతః = ప్రతిజ్ఞ చేయబడినది. అనృతమ్ = అసత్యమునుగా, కర్తుమ్ = చేయుటకు, న అర్హథ = తగరు, వః = మీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. ఆ బాలుణ్ణి బ్రతికించండి. "నీ కుమారుణ్ణి బ్రతికించెదను" అని నేను ఆ బ్రాహ్మణునికి ప్రతిజ్ఞ చేసి చెప్పితిని. దానిని అసత్యము చేయకుడు. మీకు మంగళ మగుగాక. 12

మూ. రాఘవస్య తు తద్వాక్యం శ్రుత్వా విబుధసత్తమాః,
ప్రత్యూచూ రాఘవం ప్రీతా దేవాః ప్రీతిసమన్వితమ్. 13

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, విబుధసత్తమాః = దేవతలలో శ్రేష్ఠులైన, దేవాః = దేవతలు, ప్రీతాః = సంతోషించినవారై, ప్రీతిసమన్వితమ్ = ప్రీతితో కూడినట్లుగా, ప్రత్యూచుః = తిరిగి పలికిరి.

తా. రాముని మాటలు విని దేవతలలో శ్రేష్ఠులైన ఆ ఇంద్రాది దేవతలు సంతోషించి, సంతోషపూర్వకముగా ఇట్లనిరి. 13

మూ. నిర్వృతో భవ కాకుత్స్థ సోఽస్మిన్నహని బాలకః,
జీవితం ప్రాప్తవాన్ భూయః సమేతశ్చాపి బన్ధుభిః. 14

ప్ర. అ. కాకుత్స్థ = రామా! నిర్వృతః = ఆనందము కలవాడవు, భవ = అగుము. అస్మిన్ = ఈ, అహని = దినమునందే, సః బాలకః = ఆ బాలుడు, భూయః = మరల, జీవితమ్ = జీవితమును, ప్రాప్తవాన్ = పొందినాడు. బన్ధుభిః = బంధువులతో, సమేతః చ అపి = కలిసినాడు కూడ.

తా. రామా! నిశ్చింతగా ఉండుము. ఈ దివసమునందే ఆ బాలుడు మరల ప్రాణాలు పొంది తన బంధువులవద్దకు వెళ్ళినాడు. 14

మూ. యస్మిన్ ముహూర్తే కాకుత్స్థ శూద్రోఽయం వినిపాతితః,
తస్మిన్ముహూర్తే బాలోఽసౌ జీవేన సమయుజ్యత. 15

ప్ర. అ. కాకుత్స్థ = రామా! అయం శూద్రః = ఈ శూద్రుడు, యస్మిన్ ముహూర్తే = ఏ ముహూర్తమునందు, వినిపాతితః = పడగొట్టబడినాడో, తస్మిన్ ముహూర్తే = ఆ ముహూర్తమునందే, అసౌ బాలః = ఆ బాలుడు, జీవేన = జీవునితో, సమయుజ్యత = కలిసెను.

తా. రామా! నీవు ఈ శూద్రుణ్ణి సంహరించిన ముహూర్తమునందే ఆ బాలుడు జీవించినాడు. 15

మూ. స్వస్తి ప్రాప్నుహి భద్రం తే సాధు యామ నరర్షభ,
అగస్త్యస్యాశ్రమపదం ద్రష్టుమిచ్ఛామ రాఘవ. 16

ప్ర. అ. నరర్షభ = పురుషశ్రేష్ఠా! రాఘవ = రామా! స్వస్తి = క్షేమమును, ప్రాప్నుహి = పొందుము. తే = నీకు, భద్రమ్ = క్షేమము, సాధు = మంచిది. యామ = వెళ్ళెదము, అగస్త్యస్య = అగస్త్యునియొక్క, ఆశ్రయపదమ్ = ఆశ్రమస్థానమును, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామ = కోరుచున్నాము.

తా. నరశ్రేష్ఠుడవైన రామా! క్షేమమును పొందుము. నీకు మంగళమగుగాక. మంచిది; మేము వెళ్ళెదము. అగస్త్యుని ఆశ్రమము చూడవలె నని కోరుచున్నాము.

మూ. తస్య దీక్షా సమాప్తా హి బ్రహ్మర్షేః సుమహాద్యుతేః,
ద్వాదశం హి గతం వర్షం జలశయ్యాం సమాసతః. 17

ప్ర. అ. సుమహాద్యుతేః = చాల గొప్ప కాంతి గల, బ్రహ్మర్షేః = బ్రహ్మర్షి

యైన, తస్య = అతనియొక్క, దీక్షా = దీక్ష, సమాప్తా = సమాప్తమైనది. జల శయ్యామ్ = జలశయ్యను, సమాసతః = అధిష్ఠించి ఉన్న ఆతనికి, ద్వాదశమ్ = పన్నెండవ, వర్షమ్ = సంవత్సరము, గతం హి = గడచినది కదా?

తా. గొప్ప కాంతి గల బ్రహ్మర్షియైన ఆ అగస్త్యుని దీక్ష సమాప్తమైనది. జలశయ్యయందు ఆయన శయనించి పన్నెండవ సంవత్సరము గడిచినది. 17

మూ. కాకుత్స్థ తద్గమిష్యామో మునిం సమభినన్దితుమ్,
త్వం చాపి గచ్ఛ భద్రం తే ద్రష్టుం తమృషిసత్తమమ్.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! తత్ = ఆ కారణమువలన, మునిమ్ = మునిని, సమభినన్దితుమ్ = అభినందించుటకు, గమిష్యామః = వెళ్ళెదము, తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక, త్వం చాపి = నీవు కూడ, తమ్ = ఆ, ఋషిసత్తమమ్ = ఋషిశ్రేష్ఠుని, ద్రష్టుమ్ = చూచుటకు, గచ్ఛ = వెళ్ళుము.

తా. రామా! అందువలన ఆ మునిని అభినందించుటకు మేము వెళ్ళెదము. నీకు మంగళ మగుగాక. నీవు కూడ ఉత్తముడైన ఆ ఋషీశ్వరుణ్ణి చూచుటకు వెళ్లుము. 18

మూ. స తథేతి ప్రతిజ్ఞాయ దేవానాం రఘునన్దనః,
ఆరురోహ విమానం తం పుష్పకం హేమభూషితమ్. 19

ప్ర. అ. సః రఘునన్దనః = ఆ రాముడు, దేవానామ్ = దేవతలకు, తథేతి = అట్లే అని, ప్రతిజ్ఞాయ = చెప్పి, హేమభూషితమ్ = బంగారముచేత అలంక రించబడిన, తం పుష్పకమ్ = ఆ పుష్పకమును, ఆరురోహ = ఎక్కెను.

తా. అట్లే చేసెదను అని రాముడు దేవతలకు చెప్పి బంగారముచేత అలంకరించ బడిన ఆ పుష్పకమును ఎక్కెను. 19

మూ. తతో దేవాః ప్రయాతాస్తే విమానైర్బహువిస్తరైః,
రామోఽప్యనుజగామాశు కుమ్భయోనేస్తపోవనమ్. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే దేవాః = ఆ దేవతలు, బహువిస్తరైః = అధికమైన విస్తరము గల, విమానైః = విమానములచేత, ప్రయాతాః = వెళ్ళిరి.

రామః అపి = రాముడు కూడ, ఆశు = శీఘ్రముగా, కుమ్భయోనేః = అగస్త్యుని యొక్క, తపోవనమ్ = తపోవనమును గూర్చి, ఆశు = శీఘ్రముగా, జగామ = వెళ్ళెను.

తా. పిమ్మట దేవతలు చాల విశాలములైన విమానాలపై ఎక్కి వెళ్ళిరి. రాముడు కూడ వారి వెంటనే అగస్త్యాశ్రమమునకు శీఘ్రముగా వెళ్లెను. 20

మూ. దృష్ట్వా తు దేవాన్ సంప్రాప్తానగస్త్యస్తపసాం నిధిః,
అర్చయామాస ధర్మాత్మా సర్వాంస్తానవిశేషతః. 21

ప్ర. అ. తపసామ్ = తపస్సులకు, నిధిః = నిధి, ధర్మాత్మా = ధర్మాత్ముడూ అయిన, అగస్త్యః = అగస్త్యుడు, సంప్రాప్తాన్ = వచ్చిన, దేవాన్ = దేవతలను, దృష్ట్వా = చూచి, తాన్ సర్వాన్ = వాళ్ళ నందరినీ, అవిశేషతః = భేదము లేకుండగా, అర్చయామాస = అర్చించెను.

తా. తపోనిధీ, ధర్మాత్ముడూ అయిన అగస్త్యుడు వచ్చిన దేవతలను చూచి వారినందరిని సమముగా గౌరవించెను. 21

మూ. ప్రతిగృహ్య తతః పూజాం సంపూజ్య చ మహామునిమ్,
జగ్ముస్తే త్రిదశా హృష్టా నాకపృష్ఠం సహానుగాః. 22

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తే = ఆ, త్రిదశాః = దేవతలు, పూజామ్ = పూజను, ప్రతిగృహ్య = స్వీకరించి, మహామునిమ్ = ఆ మహామునిని, సంపూజ్య చ = పూజించి, హృష్టాః = సంతోషించినవారై, సహానుగాః = అనుచరులతో కూడినవారై, నాకపృష్ఠమ్ = స్వర్గమును గూర్చి, జగ్ముః = వెళ్ళిరి.

తా. దేవతలు అగస్త్యుడు చేసిన పూజలు స్వీకరించి, ఆ మహామునిని కూడ పూజించి, అనుచరులతో కలిసి సంతోషముతో స్వర్గమునకు వెళ్ళిరి. 22

మూ. గతేషు తేషు కాకుత్స్థః పుష్పకాదవరుహ్య చ,
తతోఽభివాదయామాస అగస్త్యమృషిసత్తమమ్. 23

ప్ర. అ. తేషు = దేవతలు, గతేషు = వెళ్ళినవారగుచుండగా, కాకుత్స్థః = రాముడు, పుష్పకాత్ = పుష్పకమునుండి, అవరుహ్య = దిగి, తతః = అటు

పిమ్మట, ఋషిసత్తమమ్ = ఋషిశ్రేష్ఠుడైన, అగస్త్యమ్ = అగస్త్యుణ్ణి, అభివాదయామాస = నమస్కరించెను.

తా. ఆ దేవతలు వెళ్ళిన పిమ్మట రాముడు పుష్పకమునుండి దిగి ఋషిశ్రేష్ఠుడైన అగస్త్యునకు నమస్కరించెను.

మూ. సోఽభివాద్య మహాత్మానం జ్వలన్తమివ తేజసా,
అతిథ్యం పరమం ప్రాప్య నిషసాద నరాధిపః. 24

ప్ర. అ. సః నరాధిపః = ఆ రాజు, తేజసా = తేజస్సుచేత, జ్వలన్తమ్ ఇవ = మండుచున్న వాడు వలె ఉన్న, మహాత్మానమ్ = మహాత్ముణ్ణి, అభివాద్య = నమస్కరించి, పరమమ్ = గొప్ప, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, ప్రాప్య = పొంది, నిషసాద = కూర్చుండెను.

తా. రాముడు తేజస్సుతో ప్రజ్వలించుచున్నాడా అన్నట్లున్న మహాత్ముడైన అగస్త్యునకు నమస్కరించి గొప్పఆతిథ్యమును అందికొని కూర్చుండెను. 24

మూ. తమువాచ మహాతేజాః కుమ్భయోనిర్మహాతపాః,
స్వాగతం తే నరశ్రేష్ఠ దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ. 25

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, మహాతపాః = గొప్ప తపస్సు గల, కుమ్భయోనిః = అగస్త్యుడు. తమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడవైన, రాఘవ = రామా! దిష్ట్యా = భాగ్యవశముచేత, ప్రాప్తః అసి = వచ్చినావు, తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము.

తా. గొప్ప తేజస్సు, తపస్సూ గల అగస్త్యుడు రామునితో ఇట్లనెను. నరులలో శ్రేష్ఠుడవైన రామా! భాగ్యవశముచేత వచ్చినావు, నీకు స్వాగతము. 25

మూ. త్వం మే బహుమతో రామ గుణైర్బహుభిరుత్తమైః,
అతిథిః పూజనీయశ్చ మమ నిత్యం హృది స్థితః. 26

ప్ర. అ. రామ = రామా! త్వమ్ = నీవు, ఉత్తమైః = ఉత్తములైన, బహుభిః = అనేకములైన, గుణైః = గుణములచేత, మే = నాకు, బహుమతః = గౌరవింపబడినవాడవు, పూజనీయః = పూజించతగిన, అతిథిః = అతిథివి, నిత్యమ్

= నిత్యమూ, మమ = నాయొక్క, హృది = హృదయమునందు, స్థితః = ఉన్నావు.

తా. రామా! ఉత్తమములైన అనేక గుణములచేత నీవు నాకు బహుమాన పాత్రుడవు. పూజించదగిన అతిథివి. నిత్యమూ నా హృదయములో ఉందువు. 26

మూ. సురా హి కథయన్తి త్వామాగతం శూద్రఘాతినమ్,
బ్రాహ్మణస్య తు ధర్మేణ త్వయా జీవాపితః సుతః. 27

ప్ర. అ. సురాః = దేవతలు, త్వామ్ = నిన్ను, శూద్రఘాతినమ్ = శూద్ర సంహారకుడవుగా, ఆగతమ్ = వచ్చినవానినిగా, కథయన్తి = చెప్పుచున్నారు. త్వయా = నీచేత, ధర్మేణ = ధర్మముచేత, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునియొక్క సుతః = పుత్రుడు, జీవాపితః = జీవింపచేయబడినాడు.

తా. నీవు శూద్రుని సంహరించుటకై వచ్చినావని దేవతలు చెప్పిరి. నీవు ధర్మమును ఆచరించి బ్రాహ్మణపుత్రుణ్ణి బ్రతికించినావు. 27

మూ. ఉష్యతాం చేహ రజనీం సకాశే మమ రాఘవ,
త్వం హి నారాయణః శ్రీమాంస్త్వయి సర్వం ప్రతిష్ఠితమ్.

ప్ర. అ. రాఘవ = రామా! రజనీమ్ = రాత్రిని (రాత్రియందు), ఇహ = ఇక్కడ, మమ = నాయొక్క, సకాశే = సమీపమునందు, ఉష్యతామ్ = ఉందువు గాక, త్వమ్ = నీవు, శ్రీమాన్ = లక్ష్మీసమేతుడవైన, నారాయణః హి = నారాయణుడవు కదా? సర్వమ్ = సమస్తమూ, త్వయి = నీయందే, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠింపబడినది.

తా. రామా! ఈ రాత్రి ఇక్కడనే నాదగ్గర ఉండుము. నీవు లక్ష్మీసమేతుడవైన నారాయణుడవు. అంతయు నీయందే ప్రతిష్ఠితమై ఉన్నది. (నీవు అంతకూ ఆధారమైనవాడవు). 28

మూ. త్వం ప్రభుః సర్వదేవానాం పురుషస్త్వం సనాతనః,
ప్రభాతే పుష్పకేణ త్వం గన్తా స్వపురమేవ హి. 29

ప్ర. అ. త్వమ్ = నీవు, సర్వదేవానామ్ = సమస్తదేవతలకు, ప్రభుః =

ప్రభువు. త్వమ్ = నీవు, సనాతనః = ప్రాచీనుడవైన, పురుషః = పురుషుడవు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, పుష్పకేణ = పుష్పకముచేత, స్వపురమ్ ఏవ = నీ పురమును గూర్చి, గన్తా హి = వెళ్ళగలవాడవు కదా.

తా. నీవు సకలదేవతలకూ ప్రభువు. నీవు సనాతన పురుషుడవు. రేపు ప్రాతఃకాలమునందు పుష్పకముపై నీ పురమునకు వెళ్ళవచ్చును. 29

మూ. ఇదం చాభరణం సౌమ్య నిర్మితం విశ్వకర్మణా,
దివ్యం దివ్యేన వపుషా దీప్యమానం స్వతేజసా. 30

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! దివ్యేన = దివ్యమైన, వపుషా = ఆకారముతో, స్వతేజసా = తన తేజస్సుతో, దీప్యమానమ్ = ప్రకాశించుచున్న, ఇదమ్ = ఈ, దివ్యమ్ = దివ్యమైన, ఆభరణమ్ = ఆభరణము, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, నిర్మితమ్ = నిర్మించబడినది.

తా. రామా! దివ్యమైన ఆకారముతో, తన తేజస్సుతో ప్రకాశించుచున్న దివ్యమైన ఈ ఆభరణము విశ్వకర్మచేత నిర్మించబడినది. 30

మూ. ప్రతిగృహ్ణీష్వ కాకుత్స్థ మత్ప్రియం కురు రాఘవ,
దత్తస్య హి పునర్దానే సుమహత్ఫలముచ్యతే. 31

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశమునందు పుట్టినవాడా! రాఘవ = రామా? ప్రతిగృహ్ణీష్వ = తీసికొనుము. మత్ప్రియమ్ = నాకు ప్రియమును, కురు = చేయుము. దత్తస్య = ఒకరిచేత ఇవ్వబడినదానియొక్క, పునః = మరల, దానే = మరొకరికి ఇచ్చుటయందు, సుమహత్ = చాల గొప్ప, ఫలమ్ = ఫలము, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా. రామా! దీనిని స్వీకరించి నాకు ప్రియమును చేయుము. ఒకరు ఇచ్చినదానిని అనుభవించకుండగా మరల మరొకరికి ఇచ్చినచో గొప్ప ఫలము చెప్పబడినది. 31

మూ. భరణే హి భవాన్ శక్తః ఫలానాం మహతామపి,
త్వం హి శక్తస్తారయితుం సేన్ద్రానపి దివౌకసః. 32

ప్ర. అ. భవాన్ = నీవు, మహతామ్ = చాల గొప్పవైన, ఫలానామ్ = ఫలములయొక్క, భరణే = పోషణమునందు, శక్తః హి = సమర్థుడవు కదా. త్వమ్ = నీవు, సేన్ద్రాన్ = ఇంద్రునితో కూడిన, దివౌకసః అపి = దేవతలను కూడ, తారయితుమ్ = తరింపచేయుటకు, శక్తః హి = సమర్థుడవు కదా?

తా. నీవు చాల గొప్ప ఫలములను కూడ పోషించుటకు సమర్థుడవు కదా! నీవు ఇంద్రునితో సహా దేవతల నందరినీ తరింపచేయ సామర్థ్యము కలవాడవు కదా? 32

మూ. తస్మాత్ప్రదాస్యే విధివత్తత్ప్రతీచ్ఛ నరాధిప,
దివ్యమాభరణం చిత్రం ప్రదీప్తమివ భాస్కరమ్. 33

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, నరాధిప = రాజా! ప్రదీప్తమ్ = ప్రకాశించుచున్న, భాస్కరమ్ ఇవ = సూర్యుడు వలె ఉన్న, చిత్రమ్ = ఆశ్చర్యకరమైన, దివ్యమ్ = దివ్యమైన, ఆభరణమ్ = ఆభరణమును, ప్రదాస్యే = ఇచ్చెదను. విధివత్ = యథావిధిగా, ప్రతీచ్ఛ = స్వీకరింపుము.

తా. రాజా! అందువలన సూర్యుడు వలె ప్రకాశించుచున్న, విచిత్రమైన, దివ్యమైన ఈ ఆభరణమును ఇచ్చెదను; యథావిధిగా తీసికొనుము. 33

మూ. అథోవాచ మహాత్మానమిక్ష్వాకూణాం మహారథః,
రామో మతిమతాం శ్రేష్ఠః క్షత్రధర్మమనుస్మరన్. 34

("రామోమతిమతాం" మొదలు "రామస్తదాభరణముత్తమమ్" వరకూ ఉన్న 14 శ్లోకాలు చాల ప్రతులలో లేవు. వీటికి వ్యాఖ్యాతలు వ్యాఖ్యలు వ్రాయ లేదు.)

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశరాజులలో, మహారథః = మహారథుడైన, మతిమతామ్ = బుద్ధిమంతులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, క్షత్రధర్మమ్ = క్షత్రియధర్మమును, అనుస్మరన్ = స్మరించుచు, మహాత్మానమ్ = మహాత్ముడైన అగస్త్యుణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట ఇక్ష్వాకువంశీయులలో మహారథుడు, బుద్ధిమంతులలో

శ్రేష్ఠుడూ అయిన రాముడు క్షత్రియధర్మమును స్మరించుచు మహాత్ముడైన అగస్త్యునితో ఇట్లు పలికెను. 34

మూ. ప్రతిగ్రహోఽయం భగవన్ బ్రాహ్మణస్యావిగర్హితః,
క్షత్రియేణ కథం విప్ర ప్రతిగ్రాహ్యం భవేత్తతః. 35

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! విప్ర = బ్రాహ్మణుడా! అయం ప్రతిగ్రహః = ఈ దానముపట్టుట, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునకు, అనిన్దితః = నిందింపబడనిది. తతః = అందువలన, క్షత్రియేణ = క్షత్రియునిచేత, కథమ్ = ఎట్లు, ప్రతిగ్రాహ్యమ్ = గ్రహింపదగినది, భవేత్ = అగును ?

తా. పూజ్యుడవైన బ్రాహ్మణుడా! ప్రతిగ్రహము బ్రాహ్మణునకు విధింపబడినది గాన అతనికి నింద్యము కాదు. కాని క్షత్రియుడు ప్రతిగ్రహించుట ఎట్లు?

మూ. ప్రతిగ్రహో హి విప్రేన్ద్ర క్షత్రియాణాం సుగర్హితః,
బ్రాహ్మణేన విశేషేణ దత్తం తద్వక్తుమర్హసి. 36

ప్ర. అ. విప్రేన్ద్ర = బ్రాహ్మణోత్తమా! ప్రతిగ్రహః = ప్రతిగ్రహము, క్షత్రియాణామ్ = క్షత్రియులకు, సుగర్హితః హి = మిక్కిలి నింద్యము కదా! బ్రాహ్మణేన = బ్రాహ్మణునిచేత, దత్తమ్ = ఇవ్వబడినచో, విశేషేణ = విశేషముచేత, నింద్యము, తత్ = ఆ కారణమువలన, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగియున్నావు.

తా. బ్రాహ్మణోత్తమా! ప్రతిగ్రహము క్షత్రియులకు చాల నింద్యము కదా. విశేషించి బ్రాహ్మణులు ఇచ్చినదానిని ప్రతిగ్రహించుట ఇంకను నింద్యము. అందుచేత నీవే చెప్పుము. 36

మూ. ఏవముక్తస్తు రామేణ ప్రత్యువాచ మహాన్ ఋషిః,
ఆసన్ కృతయుగే రామ బ్రహ్మభూతే పురాయుగే, 37
అపార్థివాః ప్రజాః సర్వాః సురాణాం తు శతక్రతుః.

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, మహాన్ = గొప్పవాడైన, ఋషిః = ఋషి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. రామ =

రామా ! పురా = పూర్వము, బ్రహ్మభూతే = బ్రహ్మమయమైన, కృతయుగే = కృతయుగమునందు, సర్వాః = సమస్తమైన, ప్రజాః = ప్రజలు, అపార్థివాః = రాజులేనివారుగా, అసన్ = ఉండిరి. దేవానాం తు = దేవతలకైతే, శతక్రతుః = ఇంద్రుడు ఉండెను.

తా. రాముని మాటలు విని అగస్త్యమహర్షి ఇట్లు చెప్పెను– "రామా! పూర్వము, బ్రహ్మమయమైన కృతయుగమునందు ప్రజలకు రాజు లేకుండెను. దేవతలకు మాత్రము ఇంద్రుడుండెను." 37

మూ. తాః ప్రజా దేవదేవేశం రాజార్థం సముపాద్రవన్, 38
సురాణాం స్థాపితో రాజా త్వయా దేవ శతక్రతుః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రజాః = ప్రజలు, రాజార్థమ్ = రాజు కొరకు, దేవదేవేశమ్ = బ్రహ్మదేవుణ్ణి గూర్చి, సముపాద్రవన్ = శీఘ్రముగా వెళ్ళిరి. దేవ = దేవా ! త్వయా = నీచేత, శతక్రతుః = దేవేంద్రుడు, సురాణామ్ = దేవతలకు, రాజా = రాజుగా, స్థాపితః = స్థాపించబడినాడు.

తా. ఆప్రజలు రాజుకొరకై బ్రహ్మదేవునివద్దకు వెళ్ళి ఇట్లు ప్రార్థించిరి– "దేవా! నీవు దేవతలకు రాజుగా ఇంద్రుణ్ణి స్థాపించినావు." 38

మూ. ప్రయచ్ఛాస్మాసు లోకేశ పార్థివం నరపుఙ్గవమ్, 39
యస్మై పూజాం ప్రయుఞ్జానా ధూతపాపాశ్చరేమహి,
న వసామో వినా రాజ్ఞా ఏష నో నిశ్చయః పరః. 40

ప్ర. అ. లోకేశ = లోకాధిపతీ ! అస్మాసు = మాయందు, నరపుఙ్గవమ్ = నరశ్రేష్ఠుడైన, పార్థివమ్ = రాజును, ప్రయచ్ఛ = ఇమ్ము; యస్మై = ఎవనికి, పూజామ్ = పూజను, ప్రయుఞ్జానాః = చేయుచు, ధూతపాపాః = తొలగించబడిన పాపములు గలవారమై, చరేమహి = సంచరింతుమో, రాజ్ఞావినా = రాజు లేకుండా, న వసామః = నివసించము, ఏషః = ఇది, నః = మాయొక్క, పరః = గొప్ప, నిశ్చయః = నిశ్చయము.

తా. "లోకాధిపా ! మాకు ఒక నరశ్రేష్ఠుణ్ణి రాజుగా ఇమ్ము. ఆతనికి

పూజలు చేసుకొనుచు పాపములు తొలగించుకొని సంచరించెదము. రాజు లేకుండా మేము నివసించము. ఇది మా దృఢనిశ్చయము." 39, 40

మూ. తతో బ్రహ్మా సురశ్రేష్ఠో లోకపాలాన్ సవాసవాన్,
సమాహూయాబ్రవీత్సర్వాం స్తేజోభాగాన్ ప్రయచ్ఛత, 41
తతో దదుర్లోకపాలాః సర్వే భాగాన్ స్వతేజసః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, సురశ్రేష్ఠః=సురులలో శ్రేష్ఠుడైన, బ్రహ్మా = బ్రహ్మ, సవాసవాన్ = దేవేంద్రునితో కూడిన, లోకపాలాన్ = లోకపాలులను, సమాహూయ = పిలచి, సర్వాన్ = అందరినీ గూర్చి, అబ్రవీత్ = పలికెను. తేజోభాగాన్ = తేజస్సుయొక్క భాగములను, ప్రయచ్ఛత = ఇవ్వండి, తతః = అటుపిమ్మట, సర్వే = సమస్తమైన, లోకపాలాః = లోకపాలకులు, స్వతేజసః = తమ తేజస్సుయొక్క, భాగాన్ = భాగములను, దదుః = ఇచ్చిరి.

తా. పిమ్మట దేవతలలో శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు ఇంద్రాదిలోకపాలకులను పిలచి "మీరు మీ తేజస్సులో కొంత భాగము ఇవ్వండి" అని వారందరితో చెప్పగా వాళ్ళు తమ తేజస్సునుండి భాగములను ఇచ్చిరి. 41

మూ. అక్షుపచ్చ తతో బ్రహ్మా యతో జాతః క్షుపో నృపః, 42
తం బ్రహ్మా లోకపాలానాం సమాంశైః సమయోజయత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, బ్రహ్మా = బ్రహ్మ, అక్షుపత్=తుమ్మెను; యతః = దేనివలన, క్షుపః = క్షుపుడను, నృపః = రాజు, జాతః = పుట్టెనో, తమ్ =ఆతనిని, బ్రహ్మా=బ్రహ్మ, లోకపాలానామ్=లోకపాలులయొక్క, సమాంశైః = సమములైన అంశలతో, సమయోజయత్ = కూర్చెను.

తా. అప్పుడు బ్రహ్మదేవుడు తుమ్మెను. దానినుండి క్షుపు డను రాజు పుట్టెను. బ్రహ్మదేవుడు ఆతనిలో లోకపాలుల అంశములను సమముగా ఉంచెను.

మూ. తతో దదౌ నృపం తాసాం ప్రజానామీశ్వరం క్షుపమ్, 43
తత్రైన్ద్రేణ చ భాగేన మహీమాజ్ఞాపయన్నృపః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, నృపమ్ = రాజైన, క్షుపమ్ = క్షుపుణ్ణి,

తాసామ్ = ఆ, ప్రజానామ్ = ప్రజలకు, ఈశ్వరమ్ = ప్రభువునుగా, దదౌ = ఇచ్చెను. నృపః = రాజు, తత్ర = లోకపాలాంశలలో, ఐన్ద్రేణ = ఇంద్రునికి సంబంధించిన, భాగేన = భాగముచేత, మహీమ్ = భూమిని, ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

తా. పిమ్మట బ్రహ్మదేవుడు రాజైన ఆ క్షుపుణ్ణి ప్రజలకు ప్రభువునుగా ఇచ్చెను. లోకపాలుల భాగములలో ఇంద్రుని భాగముచేత రాజు భూమిని ఆజ్ఞాపించెను. 43

మూ. వారుణేన తు భాగేన వపుః పుష్యతి పార్థివః, 44
కౌబేరేణ తు భాగేన విత్తమాసాం దదౌ తదా,
యస్తు యామ్యోఽభవద్భాగస్తేన శాస్తి స్మ స ప్రజాః. 45

ప్ర. అ. పార్థివః = రాజు, వారుణేన = వరుణునికి సంబంధించిన, భాగేన తు = భాగముచేతనైతే, వపుః = శరీరమును, పుష్యతి = పోషించును. కౌబేరేణ = కుబేరునికి సంబంధించిన, భాగేన తు = భాగముచేతనైతే, తదా = అప్పుడు, ఆసామ్ = ప్రజలకు, విత్తమ్ = ధనమును, దదౌ = ఇచ్చెను. యామ్యః = యముని సంబంధమైన, యః భాగః = ఏ భాగము, అభవత్ = ఉండెనో, తేన = దానిచేత, ప్రజాః = ప్రజలను, శాస్తి స్మ = శిక్షించెను.

తా. రాజు వరుణుని అంశచేత శరీరమును పోషించెను. కుబేరుని అంశచేత వారికి ధనమును ఇచ్చెను. యముని అంశచేత ప్రజలను శాసించెను. 44, 45

మూ. తత్రైన్ద్రేణ నరశ్రేష్ఠ భాగేన రఘునన్దన,
ప్రతిగృహ్ణీష్వ భద్రం తే తారణార్థం మమ ప్రభో. 46

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! రఘునన్దన = రామా! ప్రభో = ప్రభూ! తత్ర = అందు, ఐన్ద్రేణ = ఇంద్రునికి సంబంధించిన, భాగేన = భాగముచేత, మమ = నాయొక్క, తారణార్థమ్ = తరింపచేయుటకొరకు, ప్రతిగృహ్ణీష్వ = తీసికొనుము. తే = నీకు, భద్రమ్ = మంగళమగుగాక.

తా. నరులలో శ్రేష్ఠా! ప్రభూ! రామా! ఇంద్రునికి సంబంధించిన భాగముచేత, నన్ను తరింపచేయుటకై దీనిని స్వీకరించుము. నీకు క్షేమ మగుగాక. 46

మూ. తద్రామః ప్రతిజగ్రాహ మునేస్తస్య మహాత్మనః,
దివ్యమాభరణం చిత్రం ప్రదీప్తమివ భాస్కరమ్. 47

ప్ర. అ. రామః = రాముడు, మహాత్మనః = మహాత్ముడైన, తస్య మునేః = ఆ మునియొక్క, ప్రదీప్తమ్ = ప్రకాశించుచున్న, భాస్కరమ్ ఇవ = సూర్యుడు వలె ఉన్న, చిత్రమ్ = విచిత్రమైన, దివ్యమ్ = దివ్యమైన, తత్ ఆభరణమ్ = ఆ ఆభరణమును, ప్రతిజగ్రాహ = తీసికొనెను.

తా. రాముడు మహాత్ముడైన ఆ ముని ఇచ్చిన, సూర్యుడు వలె ప్రకాశించుచున్న విచిత్రమైన, దివ్యమైన ఆ ఆభరణమును గ్రహించెను. 47

మూ. ప్రతిగృహ్య తతో రామస్తదాభరణముత్తమమ్,
ఆగమం తస్య దీప్తస్య ప్రష్టుమేవోపచక్రమే. 48

ప్ర. అ. రామః = రాముడు, ఉత్తమమ్ = ఉత్తమమైన, తత్ ఆభరణమ్ = ఆ ఆభరణమును, ప్రతిగృహ్య = గ్రహించి, తతః = అటుపిమ్మట, దీప్తస్య = ప్రకాశించుచున్న, తస్య = దానియొక్క, ఆగమమ్ = రాకను గూర్చి, ప్రష్టుమ్ ఏవ = అడుగుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. రాముడు ప్రకాశించుచున్న ఆ ఆభరణమును తీసికొని, పిమ్మట అది ఎట్లు వచ్చినదో తెలిసికొనుటకై ఇట్లు ప్రశ్నించెను. 48

మూ. అత్యద్భుతమిదం బ్రహ్మన్ వపుర్బిభ్రదనుత్తమమ్,
కథం వా భవతా ప్రాప్తం కుతో వా కేన వాహృతమ్. 49

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణుడా ! అత్యద్భుతమ్ = చాల ఆశ్చర్యకరము, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, వపుః = శరీరమును, బిభ్రత్ = ధరించుచున్నది అయిన, ఇదమ్ = ఇది, భవతా = నీచేత, కథమ్ = ఎట్లు, ప్రాప్తమ్ = పొందబడినది ? కుతః వా = ఎక్కడినుండి పొందబడినది ? కేన వా = ఎవనిచేత, ఆహృతమ్ = తీసికొనిరాబడినది ?

తా. మహామునీ ! అత్యుత్తమమైన ఆకారము గల చాల ఆశ్చర్యకరమైన ఈ ఆభరణము నీకు ఎక్కడ, ఎట్లు లభించినది ? ఎవరు తీసికొనివచ్చినారు? 49

మూ. కౌతూహలతయా బ్రహ్మన్ పృచ్ఛామి త్వాం మహాయశః,
ఆశ్చర్యాణాం బహూనాం హి నిధిః పరమకో భవాన్. 50

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణుడా ! మహాయశః = గొప్ప కీర్తి గలవాడా ! కౌతూహలతయా = వేడుకచేత, త్వామ్ = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను. భవాన్ = నీవు, బహూనామ్ = అనేకమైన, ఆశ్చర్యాణామ్ = ఆశ్చర్యములకు, పరమకః = గొప్ప, నిధిః హి = నిధివి కదా ?

తా. మునీంద్రా ! గొప్ప కీర్తి గలవాడా ! వేడుకతో నిన్ను అడుగుచున్నాను. నీవు అనేకమైన ఆశ్చర్యములకు గొప్ప నిధివి కదా ? 50

మూ. ఏవం బ్రువతి కాకుత్స్థే మునిర్వాక్యమథాబ్రవీత్,
శృణు రామ యథావృత్తం పురా త్రేతాయుగే యుగే. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షట్సప్తతితమః సర్గః

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, ఏవమ్ = ఇట్లు, బ్రువతి = పలుకుచుండగా, అథ = అటుపిమ్మట, మునిః = ముని, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను, రామ = రామా ! పురా = పూర్వము, త్రేతాయుగే = త్రేతాయుగమను, యుగే = యుగమునందు, యథా = ఎట్లు, వృత్తమ్ = జరిగినదో, శృణు = వినుము.

తా. రాముని మాటలు విని ముని ఇట్లు పలికెను. "రామా ! పూర్వము త్రేతాయుగములో జరిగిన విషయమును వినుము". 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బైఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తషష్టితమః సర్గః

*[అగస్త్యుడు రామునకు స్వర్గములో ఉండు ఒక పురుషుడు శవమును భక్షించిన కథ చెప్పుట.]*

మూ. పురా త్రేతాయుగే రామ బభూవ బహువిస్తరమ్,
సమన్తాద్యోజనశతం విమృగం పక్షివర్జితమ్. 1

ప్ర. అ. రామ = రామా! పురా = పూర్వము, త్రేతాయుగే = త్రేతాయుగమునందు, సమన్తాత్ = చుట్టూ, యోజనశతమ్ = నూరు యోజనములు, విమృగమ్ = మృగములు లేని, పక్షివర్జితమ్ = పక్షిశూన్యమైన, బహువిస్తృతమ్ = చాల విస్తృతమైన స్థానము, బభూవ = ఉండెను.

తా. రామా! పూర్వము త్రేతాయుగమునందు చుట్టూ నూరు యోజనముల పరిధిలో మృగాలుకాని, పక్షులు కాని లేని చాల విశాలమైన స్థానము ఉండెను. 1

మూ. తస్మిన్నిర్మానుషేఽరణ్యే కుర్వాణస్తప ఉత్తమమ్,
అహమాక్రామితుం సౌమ్య తదరణ్యముపాగమమ్. 2

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! తస్మిన్ = ఆ, నిర్మానుషే = మనుష్యులు లేని, అరణ్యే = అరణ్యమునందు, ఉత్తమమ్ = ఉత్తమమైన, తపః = తపస్సును, కుర్వాణః = చేయుచున్న. అహమ్ = నేను, తత్ = ఆ, అరణ్యమ్ = అరణ్యమును, ఆక్రామితుమ్ = సంచరించుటకు, ఉపాగమమ్ = వచ్చితిని.

తా. మనుష్యులు లేని ఆ అరణ్యములో ఒక మూల ఉత్తమమైన తపస్సు చేసికొనుచున్న నేను ఆ అరణ్య మంతా తిరిగి చూచుటకై అక్కడికి వచ్చితిని. 2

మూ. తస్య రూపమరణ్యస్య నిర్దేష్టుం న శశాక హ,
ఫలమూలైః సుఖాస్వాదైర్బహురూపైశ్చ కాననైః. 3

ప్ర. అ. సుఖాస్వాదైః = సుఖకరమైన రుచి గల, ఫలమూలైః = ఫల మూలములతోను, బహురూపైః = అనేకరూపములు గల, కాననైః చ = అడవుల తోను, తస్య = ఆ, అరణ్యస్య = అరణ్యముయొక్క, రూపమ్ = రూపమును, నిర్దేష్టుమ్ = వర్ణించుటకు, న శక్తః హ = నేను సమర్థుడను కాలేదు.

తా. మంచి రుచి గల ఫలములతోను, దుంపలతోను సమృద్ధమైన, అనేక రూపములు గల అడవులతో నిండిన ఆ అరణ్యముస్వరూపమును వర్ణించి చెప్పుట శక్యము కాదు. 3

మూ. తస్యారణ్యస్య మధ్యే తు సరో యోజనమాయతమ్,
హంసకారణ్డవాకీర్ణం చక్రవాకోపశోభితమ్. 4
పద్మోత్పలసమాకీర్ణం సమతిక్రాన్తశైవలమ్,

ప్ర. అ. తస్య = ఆ, అరణ్యస్య = అరణ్యముయొక్క, మధ్యే = మధ్య యందు, హంసకారణ్డవాకీర్ణమ్ = హంసలచేతను, నీటికాకులచేతనూ వ్యాప్తము, చక్రవాకోపశోభితమ్ = చక్రవాకపక్షులచేత ప్రకాశింపచేయబడినది, పద్మోత్పల సమాకీర్ణమ్ = పద్మములచేత నల్లకలవలచేత వ్యాప్తమూ, సమతిక్రాన్తశైవలమ్ = పోయిన నాచు గలది అయిన, యోజనమ్ = ఒక యోజనము, ఆయతమ్ = విశాల మైన, సరః = సరస్సు ఉన్నది.

తా. ఆ అరణ్యమునకు మధ్యయందు ఒక యోజనము వైశాల్యము గల సరస్సు ఉండెను. దానిలో హంసలు, కారండవములు చక్రవాకములు విహరించు చుండెను. అది నాచు లేక, పద్మములతోను, కలవలతోను ప్రకాశించుచుండెను. 4

మూ. తదాశ్చర్యమివాత్యర్థం సుఖాస్వాదమనుత్తమమ్, 5
అరజస్కం తథాక్షోభ్యం శ్రీమత్పక్షిగణాయుతమ్.

ప్ర. అ. అత్యర్థమ్ = మిక్కిలి, సుఖాస్వాదమ్ = సుఖమైన ఆస్వాదము గలది, అనుత్తమమ్ = చాలశ్రేష్ఠము, అరజస్కమ్ = రజస్సు లేనిది, తథా = మరియు, అక్షోభ్యమ్ = క్షోభింపచేయుటకు శక్యము కానిది, శ్రీమత్ = శోభా యుక్తము, పక్షిగణాయుతమ్ = పక్షుల సముదాయముతో కూడినది అయిన, తత్ = అది, ఆశ్చర్యమ్ ఇవ = ఆశ్చర్యము వలె ఉండెను.

తా. సుఖకరమైన రుచి గల జలముతో ఆ సరస్సుస్వచ్ఛముగా, శోభా యుక్తమై ఉండెను. పక్షిగణములతో నిండిన అత్యుత్తమమైన ఆ సరస్సు చాల లోతుగా ఉండుటచేత క్షోభింప శక్యము కానిదై ఆశ్చర్యకరముగా నుండెను. 5

మూ. తస్మిన్ సరఃసమీపే తు మహదద్భుతమాశ్రమమ్, 6
పురాణం పుణ్యమత్యర్థం తపస్విజనవర్జితమ్.

ప్ర. అ. తస్మిన్ = ఆ, సరఃసమీపే తు = సరస్సు సమీపమునందు, పురాణమ్ = ప్రాచీనము, అత్యర్థమ్ = మిక్కిలి, పుణ్యమ్ = పుణ్యము అయిన, తపస్విజనవర్జితమ్ = మునులతో శూన్యమైన. అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, మహత్ = గొప్ప, ఆశ్రమమ్ = ఆశ్రమము ఉన్నది.

తా. ఆ సరస్సు సమీపమున అతిప్రాచీనము చాల పవిత్రము, ఆశ్చర్య కరమూ అయిన గొప్ప ఆశ్రమము ఉండెను. కాని దానిలో మును లెవ్వరూ లేకుండిరి. 6

మూ. తత్రాహమవసం రాత్రిం నైదాఘీం పురుషర్షభ, 7
ప్రభాతే కల్యముత్థాయ సర స్తదుపచక్రమే.

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా ! అహమ్ = నేను, నైదాఘీమ్ = గ్రీష్మమునకు సంబంధించిన, రాత్రిమ్ = రాత్రిని, తత్ర = అక్కడ, అవసమ్ = నివసించితిని. ప్రభాతే = ప్రాతఃకాలమునందు, కల్యమ్ = తెల్లవారుజామున నే, ఉత్థాయ = లేచి, తత్ = ఆ, సరః = సరస్సును గూర్చి, ఉపచక్రమే = నడచితిని.

తా. రామా ! నేను ఆ గ్రీష్మరాత్రి అక్కడ నివసించితిని. ప్రాతఃకాలము వందు ప్రొద్దుటనే లేచి, ఆ సరస్సును గూర్చి వెళ్ళితిని. 7

మూ. అథాపశ్యం శవం తత్ర సుపుష్టమరజః క్వచిత్, 8
తిష్ఠన్తం పరయా లక్ష్మ్యా తస్మింస్తోయాశయే నృప.

ప్ర. అ. నృప = రాజా ! అథ = అటుపిమ్మట, తత్ర = అక్కడ, సుపుష్టమ్ = బాగా బలిసినది, క్వచిత్ = ఎక్కడా కూడ, అరజః = పరాగము లేనిది, తస్మిన్ = ఆ, తోయాశయే = సరస్సునందు, పరయా = గొప్ప, లక్ష్మ్యా = శోభతో, తిష్ఠన్తమ్ = ఉన్నదీ అయిన, శవమ్ = శవమును, అపశ్యమ్ = చూచితిని.

తా. రాజా! పిమ్మట అక్కడ సరస్సులో నేనొక చాలా బలిసిన శవమును చూచితిని. దానికి ఎక్కడా కూడ మాలిన్యము లేకుండెను. అది చాల శోభతో ఉండెను. 8

మూ. తమర్థం చిన్తయానోఽహం ముహూర్తం తత్ర రాఘవ, 9
విష్ఠితోఽస్మి సరస్తీరే కిం న్విదం స్యాదితి ప్రభో.

ప్ర. అ. రాఘవ = రామా! ప్రభో=ప్రభూ! అహమ్ = నేను, తమ్=ఆ, అర్థమ్ = విషయమును, చిన్తయానః = ఆలోచించుచు, ఇదమ్ = ఇది, కిం ను స్యాత్=ఏమి అగును, ఇతి = అని, తత్ర = ఆ, సరస్తీరే=సర స్తీరమునందు, ముహూర్తమ్ = ముహూర్త కాలమును, చిన్తయానః = ఆలోచించుచు, విష్ఠితః అస్మి = నిలచితిని.

తా. ప్రభూ! రామా! ఇది ఏమై ఉండునా అని ఆ విషయమునే ఆలోచించుచు నేను ముహూర్తకాలము ఆ సరస్తీరమునందే నిలచితిని. 9

మూ. అథాపశ్యం ముహూర్తాత్తు దివ్యమద్భుతదర్శనమ్, 10
విమానం పరమోదారం హంసయుక్తం మనోజవమ్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ముహూర్తాత్ తు = ముహూర్తకాలములో, దివ్యమ్ = దివ్యమూ, అద్భుతదర్శనమ్=అద్భుతమైన దర్శనము కలదీ, పరమోదారమ్ = మిక్కిలి ఉదారము, హంసయుక్తమ్ = హంసలతో కూడినదీ, మనోజవమ్ = మనోవేగము గలదీ అయిన, విమానమ్ = విమానమును, అపశ్యమ్ = చూచితిని.

తా. పిమ్మట ముహూర్తకాలములో చూచుటకు ఆశ్చర్యకరమైన చాల సుందరమైన, మనోవేగము గల దివ్యమైన విమానమును చూచితిని. దానికి హంసలు కట్టబడెను. 10

మూ. అత్యర్థం స్వర్గిణం తత్ర విమానే రఘునన్దన, 11
ఉపాస్తేఽప్సరసాం వీర సహస్రం దివ్యభూషణమ్.

ప్ర. అ. వీర=వీరుడా! రఘునన్దన=రామా! తత్ర విమానే=ఆ విమానము

నందు, స్వర్గిణమ్=స్వర్గమునందుండు పురుషుణ్ణి, దివ్యభూషణమ్ = దివ్యములైన భూషణములు గల, అప్సరసామ్=అప్సరఃస్త్రీలయొక్క, సహస్రమ్=సహస్రము, అత్యర్థమ్ = మిక్కిలి, ఉపాస్తే = ఉపాసించుచున్నది.

తా. వీరా! రామా! ఆ విమానములో ఉన్న స్వర్గనివాసియైన ఒక పురుషుణ్ణి దివ్యములైన అలంకారములు ధరించిన వేయిమంది అప్సరసలు అధికముగా సేవించుచుండిరి. 11

మూ. గాయన్తి కాశ్చిద్రమ్యాణి వాదయన్తి తథాపరాః, 12
మృదఙ్గవీణాపణవాన్ నృత్యన్తి చ తథాపరాః.

ప్ర. అ. కాశ్చిత్=కొందరుస్త్రీలు, రమ్యాణి = రమ్యములైన గీతములను, గాయన్తి = గానముచేయుచున్నారు. తథా = మరియు, అపరాః = మరికొందరు, మృదఙ్గవీణాపణవాన్ = మృదంగములను, వీణలను, పణవములను, వాదయన్తి= మ్రోగించుచున్నారు. తథా = మరియు, అపరాః = మరికొందరు, నృత్యన్తి చ= నాట్యము చేయుచున్నారు.

తా. కొందరు అప్సరసలు మధురములైన గీతములను పాడుచుండిరి. కొందరు మృదంగ-వీణా-పణవములను మ్రోగించుచుండిరి. మరికొందరు నృత్యము చేయుచుండిరి. 12

మూ. అపరాశ్చన్ద్రరశ్మ్యాభైర్హేమదణ్డైశ్చ చామరైః, 13
దోధూయుర్వదనం తస్య పుణ్డరీకనిభేక్షణమ్.

ప్ర. అ. అపరాః=మరికొందరుస్త్రీలు, చన్ద్రరశ్మ్యాభైః=చంద్రకిరణముల వంటి కాంతి గల. హేమదణ్డైః = బంగారు దండములు గల, చామరైః = చామరములచేత, తస్య = అతనియొక్క, పుణ్డరీక నిభేక్షణమ్ = పద్మముల వంటి నేత్రములు గల, వదనమ్ = ముఖమును, దోధూయుః = వీచిరి.

తా. కొందరు అప్సరసలు చంద్రకిరణముల వలె తెల్లగా నున్న బంగారు దండములు గల చామరములతో అతని పద్మములవంటి నేత్రములు గల ముఖమును వీచుచుండిరి. 13

మూ. తతః సింహాసనం హిత్వా మేరుకూటమివాంశుమాన్, 14
పశ్యతో మే తదా రామ విమానాదవరుహ్య చ,
తం శవం భక్షయామాస స స్వర్గీ రఘునన్దన. 15

ప్ర. అ. రఘునన్దన = రఘువంశమును ఆనందింప చేయువాడా! రామ = రామా! సః = ఆ, స్వర్గీ = స్వర్గనివాసి, అంశుమాన్ = సూర్యుడు, మేరుకూటమ్ ఇవ = మేరుపర్వతశిఖరమును వలె, సింహాసనమ్ = సింహాసనమును, హిత్వా = విడచి, తదా = అప్పుడు, మే = నేను, పశ్యతః = చూచుచుండగానే, విమానాత్ = విమానమునుండి, అవరుహ్య = దిగి, తం శవమ్ = ఆ శవమును, భక్షయామాస = భక్షించెను.

తా. రామా! పిమ్మట అతడు మేరుశిఖరమును సూర్యుడు వలె సింహాసనమును విడచి విమానమునుండి దిగి, నేను చూచుచుండగనే ఆ శవమును భక్షించెను.

మూ. తతో భుక్త్వా యథాకామం మాంసం బహు సు పీవరమ్,
అవతీర్య సరః స్వర్గీ సంస్ప్రష్టుముపచక్రమే. 16

ప్ర. అ. స్వర్గీ = ఆ స్వర్గనివాసి, తతః = అటుపిమ్మట, సు పీవరమ్ = బాగా బలసిన, మాంసమ్ = మాంసమును, బహు = అధికముగా, యథాకామమ్ = ఇష్టము వచ్చినట్లుగా. భుక్త్వా = భుజించి, సరః = సరస్సును, అవతీర్య = దిగి, సంస్ప్రష్టుమ్ = ఆచమనము చేయుటకు. ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. ఆ స్వర్గనివాసి పిమ్మట బాగా బలిసిన ఆ మాంసమును అధికముగా, కావలసినంత తిని, సరస్సులోనికి దిగి, ఆచమనము చేయుటకు ఉపక్రమించెను. 16

మూ. ఉపస్పృశ్య యథాన్యాయం స స్వర్గీ రఘునన్దన,
ఆరోఢుముపచక్రామ విమానవరముత్తమమ్. 17

ప్ర. అ. రఘునన్దన = రామా! సః స్వర్గీ = ఆ స్వర్గనివాసి, యథాన్యాయమ్ = యథావిధిగా, ఉపస్పృశ్య = ఆచమనము చేసి, ఉత్తమమ్ = ఉత్తమమైన, విమానవరమ్ = విమానశ్రేష్ఠమును, ఆరోఢుమ్ = ఎక్కుటకు, ఉపచక్రామ = ఉపక్రమించెను.

తా. రామా! ఆ స్వర్గనివాసి యథావిధిగా ఆచమనము చేసి శ్రేష్ఠమైన ఆ విమానమును ఎక్కబోవుచుండెను. 17

మూ. తమహం దేవసంకాశమారోహన్తముదీక్ష్య వై,
అథాహమబ్రవం వాక్యం తమేవ పురుషర్షభ. 18

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! అథ = అటుపిమ్మట, అహమ్ = నేను, ఆరోహన్తమ్ = విమానమునుఎక్కుచున్న, దేవసంకాశమ్ = దేవతాతుల్యుడైన, తమ్ = అతనిని, ఉదీక్ష్య వై = చూచి, తమేవ = అతనిని గూర్చియే, వాక్యమ్ = వాక్యమును, అబ్రవమ్ = పలికితిని.

తా. పురుషశ్రేష్ఠుడవైన రామా! విమానమును ఎక్కబోతున్న ఆ దేవతా తుల్యుడైన పురుషుణ్ణి చూచి నేను అతనితోనే ఇట్లు పలికితిని. 18

మూ. కో భవాన్ దేవసంకాశ ఆహారశ్చ విగర్హితః,
త్వయేదం భుజ్యతే సౌమ్య కిమర్థం వక్తుమర్హసి. 19

ప్ర. అ. దేవసంకాశ = దేవతాతుల్యుడా! సౌమ్య = సౌమ్యుడా! భవాన్ = నీవు, కః = ఎవడవు? త్వయా = నీచేత, విగర్హితః = నింద్యమైన, ఆహారశ్చ = ఆహారము, భుజ్యతే = తినబడుచున్నది. ఇదమ్ = ఇది, కిమర్థమ్ = ఎందువలన, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. దేవతాసమానుడవైన ఓ! సౌమ్యుడా! నీవు ఎవరవు? నీవు నింద్య మైన ఆహారమును తినుచున్నావు! ఇది ఎందువలన? చెప్పుము. 19

మూ. కస్య స్యాదీదృశో భావ ఆహారో దేవసంమత,
ఆశ్చర్యం వర్తతే సౌమ్య శ్రోతుమిచ్ఛామి తత్త్వతః, 20
నాహమౌపయికం మన్యే తవ భక్ష్యమిమం శవమ్.

ప్ర. అ. దేవసంమత = దేవతుల్యుడా! ఈదృశః = ఇట్టి, భావః = భావము (స్థితి), ఆహారః = ఆహరమూ, కస్య = ఎవనికి, స్యాత్ = ఉండును? సౌమ్య = సౌమ్యుడా! ఆశ్చర్యమ్ = ఆశ్చర్యముగా, వర్తతే = ఉన్నది. తత్త్వతః = యథార్థ ముగా, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తవ = నీకు, ఇమం శవమ్ = ఈ శవమును, ఔపయికమ్ = ఉపయోగ్యమైన, భక్ష్యమ్ = తినదగిన వస్తువునుగా, న మన్యే = తలవను.

దేవత వలె ఉన్నవాడా! దేవతాతుల్యమైన స్థితీ, ఇట్టి ఆహారమూ ఎవరికి ఉండును? చాల ఆశ్చర్యకరముగా ఉన్నది. దీనిలోని యథార్థమును విన గోరుచున్నాను. నీకు ఈ శవము తగిన భక్ష్య మని నేను భావించను. 20

మూ. ఇత్యేవముక్తః స నరేన్ద్ర నాకీ
కౌతూహలాత్ సూనృతయా గిరా చ,
శ్రుత్వా చ వాక్యం మమ సర్వమేత
త్సర్వం తథా చాకథయన్మమేతి. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తసప్తతితమః సర్గః

ప్ర. అ. నరేన్ద్ర=రాజా! కౌతూహలాత్ = వేడుకవలన, సూనృతయా= సత్యమైన, గిరా చ = వాక్కుతోను, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సః నాకీ=ఆ స్వర్గనివాసి, మమ=నాయొక్క, ఏతత్=ఈ, సర్వమ్=సమస్తమైన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా చ = విని, తథా = మరియు, మమ = నాకు, సర్వమ్ = సమస్తమును, అకథయత్ చ = చెప్పెను.

తా. రాజా! తెలిసికొనవలె నను వేడుకతో సత్యముగా నేను పలికిన మాటలు విని ఆ స్వర్గనివాసి ఆ విషయము నంతా నాకు ఇట్లు చెప్పెను. 21

"బాలనందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టసప్తతితమః సర్గః

*[శ్వేతుడు తనకు కుత్సితమైన ఆహారము తినవలసివచ్చినందుకు కారణమును అగస్త్యునకు చెప్పుట. బ్రహ్మతో తనకు జరిగిన సంభాషణమును తెలుపుట. అగస్త్యునకు దివ్యాలంకారమును దానము చేయుటచే అతడు ఆకలిదప్పులనుండి విముక్తుడగుట.]*

మూ. శ్రుత్వా తు భాషితం వాక్యం మమ రామ శుభాక్షరమ్,
ప్రాఞ్జలిః ప్రత్యువాచేదం స స్వర్గీ రఘునన్దన. 1

ప్ర. అ. రఘునన్దన = రఘువంశీయులకు ఆనందము కలిగించువాడా! రామ = రామా! భాషితమ్ = పలకబడిన, శుభాక్షరమ్ = శుభములైన అక్షరములు గల, మమ వాక్యమ్ = నా వాక్యమును, శ్రుత్వా = విని, సః స్వర్గీ = ఆ స్వర్గనివాసి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఇదమ్ = దీనిని, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. రఘునందనా! రామా! ఆ స్వర్గనివాసి, నేను పలికిన మధురాక్షరములు గల వాక్యమును విని అంజలి ఘటించి ఇట్లు పలికెను. 1

మూ. శృణు బ్రహ్మన్ పురావృత్తం మమైతత్సుఖదుఃఖయోః,
అనతిక్రమణీయం హి యథా పృచ్ఛసి మాం ద్విజ. 2

ప్ర. అ. బ్రహ్మన్ = ఋషీశ్వరా! ద్విజ = బ్రాహ్మణుడా! యథా = ఎట్లు, పృచ్ఛసి = అడుగుచున్నావో, మమ = నాయొక్క, సుఖదుఃఖయోః = సుఖదుఃఖములయొక్క, పురావృత్తమ్ = పూర్వము జరిగిన, అనతిక్రమణీయమ్ = అతిక్రమింప శక్యము కాని. ఏతత్ = ఈ కారణమును, శృణు = వినుము.

తా. బ్రహ్మర్షీ! నీవు అడిగిన విధముగ నా సుఖదుఃఖములకు కారణమైన అతిక్రమింప శక్యము కాని పూర్వము జరిగిన విషయమును వినుము. 2

మూ. పురా వైదర్భకో రాజా పితా మమ మహాయశాః,
సుదేవ ఇతి విఖ్యాతస్త్రిషు లోకేషు వీర్యవాన్. 3

ప్ర. అ. సుదేవః ఇతి = సుదేవుడు అని త్రిషు = మూడు. లోకేషు = లోకములయందు, విఖ్యాతః = ప్రసిద్ధుడు, మహాయశాః = గొప్ప కీర్తి గలవాడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు అయిన, పురా = పూర్వము వైదర్భకః రాజా = విదర్భదేశమునకు సంబంధించిన రాజా, మమ = నాయొక్క, పితా = తండ్రి.

తా. పూర్వము విదర్భదేశరాజైన, గొప్ప కీర్తి, పరాక్రమమూ గల, మూడు లోకాలలోను ప్రసిద్ధుడైన సుదేవుడు నా తండ్రి. 3

మూ. తస్య పుత్రద్వయం బ్రహ్మన్ ద్వాభ్యాం స్త్రీభ్యామజాయత,
అహం శ్వేత ఇతి ఖ్యాతో యవీయాన్ సురథోఽభవత్. 4

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణుడా ! తస్య = ఆతనికి, ద్వాభ్యాం స్త్రీభ్యామ్ = ఇద్దరు స్త్రీలచేత, పుత్రద్వయమ్ = పుత్రద్వయము, అజాయత = పుట్టెను, అహమ్ = నేను, శ్వేతః ఇతి = శ్వేతుడు అని, ఖ్యాతః = ప్రసిద్ధుడను, సురథః = సురథుడు, యవీయాన్ = చిన్నవాడుగా, అభవత్ = అయెను.

తా. ఆయనకు ఇద్దరు స్త్రీలయందు ఇద్దరు పుత్రులు పుట్టిరి. నా పేరు శ్వేతుడు, చిన్నవాని పేరు సురథుడు. 4

మూ. తతః పితరి స్వర్యాతే పౌరా మామభ్యషేచయన్,
తత్రాహం కృతవాన్ రాజ్యం ధర్మ్యం చ సుసమాహితః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పితరి = తండ్రి, స్వః యాతే = స్వర్గమునకు వెళ్ళినవాడగుచుండగా, పౌరాః = పౌరులు, మామ్ = నన్ను, అభ్యషేచయన్ = అభిషేకించిరి. తత్ర = అక్కడ, అహమ్ = నేను, సుసమాహితః = చాల సావధానచిత్తుడనై, ధర్మ్యమ్ = ధర్మసంమతమైన, రాజ్యమ్ = రాజ్యమును, కృతవాన్ = చేసినాను.

తా. మా తండ్రి స్వర్గస్థుడైన పిమ్మట ప్రజలు నన్ను రాజ్యాభిషిక్తుని చేసిరి. నేను సావధానచిత్తుడనై ధర్మసంమతముగా రాజ్యము చేసితిని. 5

మూ. ఏవం వర్షసహస్రాణి సమతీతాని సువ్రత,
రాజ్యం కారయతో బ్రహ్మన్ ప్రజా ధర్మేణ రక్షతః. 6

ప్ర. అ. సువ్రత = మంచి నియమములు కలవాడా ! బ్రహ్మన్ = బ్రాహ్మణుడా ! ఏవమ్ = ఇట్లు, రాజ్యమ్ = రాజ్యమును, కారయతః = చేయుచున్న, ధర్మేణ = ధర్మముచేత, రక్షతః చ = రక్షించుచున్న నాకు, వర్షసహస్రాణి = వేల కొలది వర్షములు, సమతీతాని = గడచినవి.

తా. ఉత్తమవ్రతము గల బ్రాహ్మణోత్తమా ! నేను ఈ విధముగా రాజ్యము చేయుచు ధర్మము చేత రక్షించుచుండగా వేలకొలది సంవత్సరములు గడచినవి. 6

మూ. సోఽహం నిమిత్తే కస్మింశ్చిద్విజ్ఞాతాయుర్ద్విజోత్తమ,
కాలధర్మం హృది న్యస్య తతో వనముపాగమమ్. 7

ప్ర. అ. ద్విజోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుడా ! సః అహమ్ = అట్టి నేను, కస్మిన్ చిత్ = ఒకానొక, నిమిత్తే = నిమిత్తమునందు (శకునమును పట్టి), విజ్ఞాతాయుః = తెలియబడిన ఆయుర్దాయము కలవాడనై, కాలధర్మమ్ = మరణమును, హృది = హృదయమునందు, న్యస్య = ఉంచి, తతః = అటుపిమ్మట, వనమ్ = వనమును గూర్చి, గతః = వెళ్ళినాను.

తా. బ్రాహ్మణోత్తమా ! ఏదో ఒక నిమిత్తముచేత (సాముద్రిక-శకునాదులచేత) నా ఆయుర్దాయమును గూర్చి తెలిసికొనుటచే నేను మరణమును గూర్చి ఆలోచించుచు అరణ్యము చేరితిని. 7

మూ. సోఽహం వనమిదం దుర్గం మృగపక్షివివర్జితమ్,
తపశ్చర్తుం ప్రవిష్టోఽస్మి సమీపే సరసః శుభే. 8

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, శుభే = సుందరమైన, సరసః = సరస్సు యొక్క, సమీపే = సమీపమునందు, తపః = తపస్సును, చర్తుమ్ = చేయుటకు, దుర్గమ్ = ప్రవేశింప శక్యము కాని, మృగపక్షివివర్జితమ్ = మృగపక్షులతో శూన్యమైన, ఇదం వనమ్ = ఈ వనమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడను, అస్మి = అయితిని.

తా. నేను సుందరమైన ఈ సరస్తీరమునందు తపస్సు చేసికొనుటకై,

మృగములు గాని, పక్షులు కాని లేని, ప్రవేశింప శక్యము కాని ఈ వనములో ప్రవేశించితిని. 8

మూ. భ్రాతరం సురథం రాజ్యే అభిషిచ్య మహీపతిమ్,
ఇదం సరః సమాసాద్య తపస్తప్తం మయా చిరమ్. 9

ప్ర. అ. భ్రాతరమ్ = సోదరుడైన, సురథమ్ = సురథుణ్ణి, మహీపతిమ్ = రాజునుగా, రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్య = అభిషేకించి, ఇదమ్ = ఈ, సరః = సరస్సును, సమాసాద్య = పొంది, మయా = నాచేత, చిరమ్ = చిరకాలము, తపః = తపస్సు, తప్తమ్ = చేయబడినది.

తా. సోదరుడైన సురథుణ్ణి రాజ్యమునందు రాజునుగా అభిషేకించి, ఈ సరస్సువద్ద నేను చాల కాలము తపస్సు చేసితిని. 9

మూ. సోఽహం వర్షసహస్రాణి తపస్త్రీణి మహావనే,
తప్త్వా సుదుష్కరం ప్రాప్తో బ్రహ్మలోకమనుత్తమమ్.

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, త్రీణి = మూడు, వర్షసహస్రాణి = వర్షముల సహస్రములను, మహావనే = ఈ మహారణ్యమునందు, సుదుష్కరమ్ = చేయ శక్యము కాని, తపః = తపస్సును, తప్త్వా = చేసి, అనుత్తమమ్ = చాల ఉత్తమమైన, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును, ప్రాప్తః = పొందినాను.

తా. నేను మూడు వేల సంవత్సరములు మహారణ్యములో కఠిన తపస్సు చేసి అత్యుత్తమలోకమైన బ్రహ్మలోకమునకు వెళ్ళితిని. 10

మూ. తస్యేమే స్వర్గభూతస్య క్షుత్పిపాసే ద్విజోత్తమ,
బాధేతే పరమోదార తతోఽహం వ్యథితేన్ద్రియః. 11

ప్ర. అ. పరమోదార = చాల ఉదారుడా! ద్విజోత్తమ = బ్రాహ్మణోత్తమా, స్వర్గభూతస్య = స్వర్గస్థుడనైన నాకు, ఇమే = ఈ, క్షుత్పిపాసే = ఆకలిదప్పికలు, బాధేతే = బాధించుచున్నవి. తతః = ఆ కారణమువలన, అహమ్ = నేను, వ్యథితేన్ద్రియః = వ్యథ చెందిన ఇంద్రియములు కలవాడను.

తా. చాల ఉదారుడవైన బ్రాహ్మణోత్తమా! బ్రహ్మలోకములో ఉన్నను

నన్ను ఆకలిదప్పికలు బాధించుచుండెను; అందుచేత నా మనస్సు చాలా బాధ చెందినది. 11

మూ. గత్వా౽ త్రిభువనశ్రేష్ఠం పితామహమువాచ హ,
భగవన్ బ్రహ్మలోకో౽యం క్షుత్పిపాసావివర్జితః. 12

ప్ర. అ. త్రిభువనశ్రేష్ఠమ్ = మూడు లోకములలో శ్రేష్ఠుడైన, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి గూర్చి, గత్వా = వెళ్ళి, ఉవాచ హ = పలికితిని. భగవన్ = భగవంతుడా! అయమ్ = ఈ, బ్రహ్మలోకః = బ్రహ్మలోకము, క్షుత్పిపాసావివర్జితః = ఆకలిదప్పికలు లేనిది.

తా. మూడు లోకములలో శ్రేష్ఠుడైన బ్రహ్మవద్దకు వెళ్ళి ఇట్లు అడిగితిని. "భగవంతుడా! ఈ బ్రహ్మలోకములో ఆకలిదప్పికలు ఉండవు కదా? 12

మూ. కస్యాయం కర్మణః పాకః క్షుత్పిపాసానుగో హ్యహమ్,
ఆహారః కశ్చ మే దేవ తన్మే బ్రూహి పితామహ. 13

ప్ర. అ. అహమ్ = నేను, క్షుత్పిపాసానుగః హి = ఆకలి దప్పికలు అనుసరించునవిగా కలవాడను. అయమ్ = ఇది, కస్య కర్మణః = ఏ కర్మయొక్క, పాకః = పాకము? దేవ = దేవా: పితామహ = బ్రహ్మదేవా! మే = నాకు, ఆహారః = ఆహారము, కః చ = ఏది? తత్ = దానిని, మే = నాకు, బ్రూహి = చెప్పుము.

తా. కాని నన్ను ఆకలి దప్పికలు వెన్నంటుచున్నవి? ఇది ఏ కర్మ ఫలము? పితామహా! నేను ఏమి ఆహారము భుజించవలెను? చెప్పుము. 13

మూ. పితామహస్తు మామాహ తవాహారః సుదేవజ,
స్వాదూని స్వాని మాంసాని తాని భక్షయ నిత్యశః. 14

ప్ర. అ. పితామహః తు = బ్రహ్మదేవుడైతే, మామ్ = నన్ను గూర్చి, ఆహ = పలికెను. సుదేవజ = సుదేవుని కుమారుడా! స్వాదూని = మధురమైన, స్వాని = నీ సంబంధమైన, మాంసాని = మాంసములే, తవ = నీయొక్క, ఆహారః = ఆహారము. నిత్యశః = నిత్యము, తాని = వాటిని, భక్షయ = భక్షించుము.

తా. పితామహుడు నాతో ఇట్లు చెప్పెను. సుదేవపుత్రా! నీకు మధురము లైన నీ మాంసాలే ఆహారము. నిత్యమూ వాటిని భక్షించుము. 14

మూ. స్వశరీరం త్వయా పుష్టం కుర్వతా తప ఉత్తమమ్,
అనుప్తం రోహతే శ్వేత న కదాచిన్మహామతే. 15

ప్ర. అ. ఉత్తమమ్ = ఉత్తమమైన, తపః = తపస్సును, కుర్వతా = చేయుచున్న నీచేత, స్వశరీరమ్ = నీశరీరము, పుష్టమ్ = పోషించబడినది. శ్వేత = శ్వేతుడా! మహామతే = గొప్ప బుద్ధి గలవాడా! అనుప్తమ్=నాటనిది, కదాచిత్ = ఎన్నడూ, న రోహతే = మొలవదు.

తా. ఉత్తమమైన తపస్సు చేయుచు నీవు నీ శరీరము బాగా బలియునట్లు చేసినావు. గొప్ప బుద్ధి గల శ్వేతా! విత్తనము నాటనిదే మొలవదు కదా? 15

మూ. దత్తం న తేఽస్తి సూక్ష్మోఽపి తప ఏవ నిషేవసే,
తేన స్వర్గగతో వత్స బాధ్యసే క్షుత్పిపాసయా. 16

ప్ర. అ తే = నీకు, సూక్ష్మః అపి = చాల అల్పమైనా, దత్తమ్ = ఇవ్వబడినది, నాస్తి = లేదు. తపః ఏవ = తపస్సునే, నిషేవసే = సేవించుచున్నావు. వత్స = వత్సా! తేన = ఆ కారణముచేత, స్వర్గగతః = స్వర్గమును పొందికూడ, క్షుత్పిపాసయా = ఆకలిదప్పికలచేత, బాధ్యసే = బాధించబడుచున్నావు.

తా. నీవు కొంచెము కూడ దానము చేయలేదు. కేవలము తపస్సుమాత్రమే చేసితివి. వత్సా! ఆ కారణముచేతనే నీవు ఆకలిదప్పికలతో బాధపడుచున్నావు.

మూ. స త్వం సుపుష్టమాహారైః స్వశరీరమనుత్తమమ్,
భక్షయిత్వామృతరసం తేన వృత్తిర్భవిష్యతి. 17

ప్ర. అ సః త్వమ్ = అట్టి నీవు, ఆహారైః = ఆహారములచేత, సుపుష్టమ్ = బాగా పోషింపబడిన, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, అమృతరసమ్ = అమృతము వంటి రుచి గల, స్వశరీరమ్ = నీ శరీరమును, భక్షయిత్వా = భక్షించి, తేన = దానిచేత, వృత్తిః = జీవనము, భవిష్యతి = కాగలదు.

తా. నీవు ఆహారములచే బాగా పోషింపబడిన, శ్రేష్ఠమైన, అమృతతుల్యమైన స్వదేహమును తినుము. దానితో నీకు జీవననిర్వాహము జరుగును. 17

మూ. యదా తు తద్వనం శ్వేత అగస్త్యః స మహానృషిః,
ఆగమిష్యతి దుర్ధర్షస్తదా కృచ్ఛ్రాద్విమోక్ష్యసే. 18

ప్ర. అ. శ్వేత = శ్వేతా ! యదా తు = ఎప్పుడైతే, సః = ఆ, మహాన్ ఋషిః = మహర్షియైన, అగస్త్యః = అగస్త్యుడు, తత్ వనమ్ = ఆ వనమును గూర్చి, ఆగమిష్యతి = రాగలడో, తదా = అప్పుడు, కృచ్ఛ్రాత్ = ఈ కష్టమునుండి, విమోక్ష్యసే = విముక్తుడవు కాగలవు.

తా. శ్వేతా ! అగస్త్యమహర్షి ఆ వనమునకు వచ్చినప్పుడు నీ కష్టము తొలగును. 18

మూ. స హి తారయితుం సౌమ్య శక్తః సురగణానపి,
కిం పునస్త్వాం మహాబాహో క్షుత్పిపాసావశం గతమ్. 19

ప్ర. అ. మహాబాహో = మహాబాహూ ! సౌమ్య = సౌమ్యుడా! సః = అతడు, సురగణానపి = దేవతాగణములను కూడ, తారయితుమ్ = తరింపచేయుటకు, శక్తః = సమర్థుడు. క్షుత్పిపాసావశం గతమ్ = ఆకలిదప్పికలకు వశుడవైన, త్వామ్ = నిన్ను, కిం పునః = చెప్పనేల?

తా. మహాబాహువైన సౌమ్యుడా! ఆ అగస్త్యుడు దేవతాగణములను కూడ తరింప చేయ సమర్థుడు. ఆకలిదప్పికలతో బాధపడుచున్న నీ మాట చెప్పవలెనా?

మూ. సోఽహం భగవతః శ్రుత్వా దేవదేవస్య నిశ్చయమ్,
ఆహారం గర్హితం కుర్మి స్వశరీరం ద్విజోత్తమ. 20

ప్ర. అ. ద్విజోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుడా! సః అహమ్ = అట్టి నేను, భగవతః = భగవంతుడైన, దేవదేవస్య = దేవతల దేవుడైన బ్రహ్మదేవునియొక్క, నిశ్చయమ్ = నిశ్చయమును, శ్రుత్వా = విని, స్వశరీరమ్ = నా శరీరమును, గర్హితమ్ = నింద్యమైన, ఆహారమ్ = ఆహారమునుగా, కుర్మి = చేయుచున్నాను.

తా. బ్రాహ్మణోత్తమా! భగవంతుడైన బ్రహ్మదేవుని మాట ప్రకారము నేను నా శరీరమునే కుత్సితమైన ఆహారమునుగా తినుచున్నాను. 20

మూ. బహూన్వర్షగణాన్ బ్రహ్మన్ భుజ్యమానమిదం మయా,
క్షయం నాభ్యేతి బ్రహ్మర్షే తృప్తిశ్చాపి మమోత్తమా. 21

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణుడా ! బ్రహ్మర్షే = బ్రహ్మర్షీ ! మయా = నాచేత, బహూన్ = అనేకమైన, వర్షగణాన్ = సంవత్సరసమూహములను, భుజ్యమానమ్ = తినబడుచున్న, ఇదమ్ = ఇది, క్షయమ్ = క్షయమును, నాభ్యేతి = పొందుటలేదు. మమ = నాయొక్క, తృప్తిః చ అపి = తృప్తి కూడ, ఉత్తమా = ఉత్తమమైనది.

తా. బ్రాహ్మణా ! బ్రహ్మర్షీ ! నేను అనేకసంవత్సరముల పాటు తిన్ననూ ఇది తరుగుటలేదు. నాకు చాల గొప్ప తృప్తి కూడ కలుగుచున్నది. 21

మూ. తస్య మే కృచ్ఛ్రభూతస్య కృచ్ఛ్రాదస్మాద్విమోక్షయ,
అన్యేషాం న గతిర్హ్యత్ర కుమ్భయోనిమృతే ద్విజమ్. 22

ప్ర. అ. కృచ్ఛ్రభూతస్య = క్లేశమయుడనైన, తస్య మే = అట్టి నాకు, అస్మాత్ = ఈ, కృచ్ఛ్రాత్ = కష్టమునుండి, విమోక్షయ = విడిపించుము. ద్విజమ్ = బ్రాహ్మణుడైన, కుమ్భయోనిమ్ ఋతే = అగస్త్యుణ్ణి మినహాయించి, అన్యేషామ్ = ఇతరులకు, అత్ర = ఈవిషయమునందు, గతిః = గతి, నాస్తి హి = లేదు కదా?

తా. చాల కష్టములో ఉన్న నన్ను ఈ కష్టమునుండి విడిపింపుము. అగస్త్యునకు (నీకు) తప్ప మరెవ్వరికి ఈ పని చేయుటకు సామర్థ్యము లేదుకదా?

మూ. ఇదమాభరణం సౌమ్య ధారణార్థం ద్విజోత్తమ,
ప్రతిగృహ్ణీష్వ భద్రం తే ప్రసాదం కర్తుమర్హసి. 23

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడవైన, ద్విజోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఇదమ్ = ఈ, ఆభరణమ్ = ఆభరణమును, ధారణార్థమ్ = ధరించుటకై, ప్రతిగృహ్ణీష్వ = తీసికొనుము. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. సౌమ్యుడవైన బ్రాహ్మణోత్తమా! ఈ ఆభరణమును ధరించుటకొరకై స్వీకరించుము, నీకు క్షేమ మగుగాక. అనుగ్రహించుము. 23

మూ. ఇదం తావత్సువర్ణం చ ధనం వాసాంసి చ ద్విజ,
భక్ష్యం భోజ్యం చ బ్రహ్మర్షే దదామ్యాభరణాని చ. 24

ప్ర అ. బ్రహ్మర్షే ! బ్రహ్మర్షీ! ద్విజ = బ్రాహ్మణుడా ! ఇదమ్ = ఈ, సువర్ణం చ = బంగారమును, ధనమ్ = ధనమును, వాసాంసి = వస్త్రములను, భక్ష్యమ్ = భక్ష్యమును, భోజ్యం చ = భోజ్యమును, ఆభరణాని చ = ఆభరణములను, దదామి తావత్ = ఇచ్చుచున్నాను.

తా. ఓ! బ్రహ్మర్షీ! ఈ బంగారమును, ధనమును, వస్త్రములను, భక్ష్య భోజ్యములను, ఆభరణములను ఇచ్చుచున్నాను. 24

మూ. సర్వాన్ కామాన్ ప్రయచ్ఛామి భోగాంశ్చ మునిపుంగవ,
తారణే భగవన్ మహ్యం ప్రసాదం కర్తుమర్హసి. 25

ప్ర. అ. మునిపుంగవ = మునిశ్రేష్ఠుడా ! సర్వాన్ = సమస్తమైన, కామాన్ = కామములను, భోగాన్ చ = భోగములను, ప్రయచ్ఛామి = ఇచ్చుచున్నాను. భగవన్ = పూజ్యుడా! తారణే = తరింపచేయుటయందు, మహ్యమ్ = నాకొరకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగిఉన్నావు.

తా. పూజ్యుడవైన మహామునీ! అన్ని కామములను, భోగములను ఇచ్చెదను. నన్ను తరింపచేయుటకు అనుగ్రహించుము. 25

మూ. తస్యాహం స్వర్గిణో వాక్యం శ్రుత్వా దుఃఖసమన్వితమ్,
తారణాయోపజగ్రాహ తదాభరణముత్తమమ్. 26

ప్ర. అ. అహమ్ = నేను, తస్య స్వర్గిణః = ఆ స్వర్గనివాసియొక్క, దుఃఖ సమన్వితమ్ = దుఃఖముతో కూడిన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ఉత్తమమ్ = ఉత్తమమైన, తత్ = ఆ, ఆభరణమ్ = ఆభరణమును, తారణాయ = తరింపచేయుటకు, ఉపజగ్రాహ = పరిగ్రహించితిని.

తా. నేను దుఃఖముతో నిండిన ఆ స్వర్గవాసి మాటలు విని ఆతనిని తరింపచేయుటకై ఉత్తమమైన ఆ ఆభరణమును తీసికొంటిని. 26

మూ. మయా ప్రతిగృహీతే తు తస్మిన్నాభరణే శుభే,
మానుషః పూర్వకో దేహో రాజర్షేర్వినసాశ హ. 27

ప్ర అ. మయా = నాచేత, శుభే = సుందరమైన, తస్మిన్ ఆభరణే = ఆ

ఆభరణము, ప్రతిగృహీతే = ప్రతిగ్రహించబడగా, రాజర్షేః = రాజర్షియొక్క, పూర్వః = వెనుకటి, మానుషః దేహః = మనుష్యదేహము, వినినాశ హ = నశించెను.

తా. నేను సుందరమైన ఆ ఆభరణమును ప్రతిగ్రహించగానే ఆ రాజర్షికి సంబంధించిన వెనుకటి మనుష్యదేహము నశించెను. 27

మూ. ప్రనష్టే తు శరీరేఽసౌ రాజర్షిః పరయా ముదా,
తృప్తః ప్రముదితో రాజా జగామ త్రిదివం సుఖమ్. 28

ప్ర. అ. శరీరే = శరీరము, ప్రనష్టే తు = నష్టము కాగా, అసౌ రాజర్షిః = ఆ రాజర్షి, పరయా = గొప్ప, ముదా = సంతోషముతో, తృప్తః = తృప్తి చెందినాడు. ప్రముదితః = సంతోషించిన, రాజా = రాజు, సుఖమ్ = సుఖముగా, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ఆ శరీరము అదృశ్యము కాగానే ఆ రాజర్షి చాల సంతోషించి సుఖముగా స్వర్గమునకు వెళ్లెను. 28

మూ. తేనేదం శక్రతుల్యేన దివ్యమాభరణం మమ,
తస్మిన్నిమిత్తే కాకుత్స్థ దత్తమద్భుతదర్శనమ్. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టసప్తతితమః సర్గః.

ప్ర. అ. కాకుత్స్థ = రామా! శక్రతుల్యేన = ఇంద్రునితో సమానుడైన, తేన = ఆ రాజర్షిచేత, తస్మిన్ = ఆ, నిమిత్తే = కారణమునందు, అద్భుత దర్శనమ్ = ఆశ్చర్యకరమైన దర్శనము గల, దివ్యమ్ = దివ్యమైన, ఆభరణమ్ = ఆభరణము, మమ = నాకు, దత్తమ్ = ఇవ్వబడినది.

తా. రామా! ఇంద్రునితో సమానుడైన ఆ రాజర్షి ఆ కారణమును పురస్కరించుకొని చూచుటకు చాల ఆశ్చర్యకరమైన ఈ దివ్యమైన ఆభరణమును నాకు ఇచ్చినాడు. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బదెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనాశీతితమః సర్గః

[ఇక్ష్వాకుపుత్రుడైన దండుని రాజ్యము.]

మూ. తదద్భుతతమం వాక్యం శ్రుత్వాగస్త్యస్య రాఘవః,
గౌరవాద్విస్మయాచ్చైవ భూయః ప్రష్టుం ప్రచక్రమే. 1

ప్ర. అ. రాఘవః = రాముడు, అగస్త్యస్య = అగస్త్యునియొక్క, అద్భుతతమమ్ = చాల అద్భుతమైన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, గౌరవాత్ = గౌరవమువలన, విస్మయాత్ చ ఏవ = ఆశ్చర్యమువలనా, భూయః = మరల, ప్రష్టుమ్ = అడుగుటకు, ప్రచక్రమే = ప్రారంభించెను.

తా. రాముడు అగస్త్యుడు చెప్పిన ఆశ్చర్యకరములైన ఆ మాటలు విని గౌరవమువలనా, ఆశ్చర్యమువలనా మరల ఇట్లు ప్రశ్నించెను. 1

మూ. భగవంస్తద్వనం ఘోరం తపస్తప్యతి యత్రః సః,
శ్వేతో వైదర్భకో రాజా కథం తదమృగద్విజమ్. 2

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా ! సః = ఆ, వైదర్భకః = విదర్భదేశమునకు సంబంధించిన, రాజా = రాజైన, శ్వేతః = శ్వేతుడు, యత్ర = ఎక్కడ, తపః = తపస్సును, తప్యతి = చేయుచున్నాడో, తత్ = ఆ, ఘోరం వనమ్ = ఘోరమైన వనము, కథమ్ = ఎట్లు, అమృగద్విజమ్ = మృగములూ పక్షులూ లేనిదిగా అయినది?

తా. పూజ్యుడా ! విదర్భరాజైన ఆ శ్వేతుడు తపస్సు చేసిన ఘోరమైన ఆ వనము ఎందుచేత మృగపక్షిశూన్య మైనది? 2

మూ. తద్వనం స కథం రాజా శూన్యం మనుజవర్జితమ్,
తపశ్చర్తుం ప్రవిష్టః స శ్రోతుమిచ్ఛామి తత్త్వతః. 3

ప్ర. అ. సః = ప్రసిద్ధుడైన, సః రాజా = ఆ రాజు, శూన్యమ్ = శూన్యము, మనుజవర్జితమ్=మనుష్యశూన్యమూ అయిన, తత్ వనమ్=ఆ వనమును, తపః= తపస్సును, చర్తుమ్ = చరించుటకు, కథమ్ = ఎట్లు, ప్రవిష్టః = ప్రవేశించినాడు ? తత్త్వతః = యథార్థముగా, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. ఆ రాజు జనులు లేని శూన్యమైన ఆ వనములో తపస్సు చేయుటకు ఎందుకు వెళ్ళినాడు? ఇందలి సత్యమును తెలుసుకొనగోరుచున్నాను. 3.

మూ. రామస్య వచనం శ్రుత్వా కౌతూహలసమన్వితమ్,
వాక్యం పరమతేజస్వీ వక్తుమేవోపచక్రమే. 4

ప్ర. అ. పరమతేజస్వీ = గొప్ప తేజస్సు గల అగస్త్యుడు, రామస్య = రామునియొక్క, కౌతూహలసమన్వితమ్ = వేడుకతో కూడిన, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, వాక్యమ్ = వాక్యమును, వక్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. గొప్ప తేజస్సు గల అగస్త్యుడు విన వేడుకతో కూడిన రాముని మాటలు విని ఇట్లు చెప్పెను. 4

మూ. పురా కృతయుగే రామ మనుర్దణ్డధరః ప్రభుః,
తస్య పుత్రో మహానాసీదిక్ష్వాకుః కులనన్దనః. 5

ప్ర అ రామ=రామా ! పురా = పూర్వము, కృతయుగే=కృతయుగమునందు, ప్రభుః = ప్రభువైన, మనుః = మనువు, దణ్డధరః = దండమును ధరించినవాడు (పాలకుడు). తస్య = అతనియొక్క, కులనన్దనః=కులమునకు ఆనందమును కలిగించు, మహాన్=గొప్పవాడైన, ఇక్ష్వాకుః=ఇక్ష్వాకువు అను, పుత్రః= పుత్రుడు, ఆసీత్ = ఉండెను.

తా. రామా! పూర్వము కృతయుగమునందు ప్రభువైన మనువు పాలకుడుగా ఉండెను. వంశమునకు ఆనందకరుడైన ఇక్ష్వాకువు అతని పుత్రుడు. 5

మూ. తం పుత్రం పూర్వకం రాజ్యే నిక్షిప్య భువి దుర్జయమ్,
పృథివ్యాం రాజవంశానాం భవ కర్తేత్యువాచ తమ్. 6

ప్ర. అ. భువి = భూమియందు, దుర్జయమ్ = జయింపశక్యముకాని, పూర్వకమ్ = పెద్దవాడైన, తం పుత్రమ్ = ఆ పుత్రుణ్ణి, రాజ్యే = రాజ్యమునందు, నిక్షిప్య = ఉంచి, పృథివ్యామ్ = భూమియందు, రాజవంశానామ్ = రాజవంశములకు, కర్తా = కర్త వు, భవ = అగుము, ఇతి = అని, తమ్ = వానిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. భూలోకములో ఎవరిచేతను జయింప శక్యము కాని జ్యేష్ఠకుమారుడైన ఆ ఇక్ష్వాకుపును రాజ్యాభిషిక్తుని చేసి మనువు "నీవు భూమియందు రాజవంశములను స్థాపించుము"అని ఆతనితో చెప్పెను. 6

మూ. తథైవ చ ప్రతిజ్ఞాతం పితుః పుత్రేణ రాఘవ,
తతః పరమసంతుష్టో మనుః పుత్రమువాచ హ. 7

ప్ర. అ. రాఘవ = రామా! పుత్రేణ = పుత్రునిచేత, పితుః = తండ్రికి, తథైవ = అట్లే, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినది. తతః = అటుపిమ్మట, పరమసంతుష్టః = మిక్కిలి సంతోషించిన, మనుః = మనువు, పుత్రమ్ = పుత్రుని గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. రామా! పుత్రుడు అట్లే అని తండ్రికి మాట ఇచ్చెను. పిమ్మట చాల సంతోషించిన మనువు పుత్రునితో ఇట్లు పలికెను. 7

మూ. ప్రీతోఽస్మి పరమోదార కర్తా చాసి న సంశయః,
దణ్డేన చ ప్రజా రక్ష మా చ దణ్డమకారణే. 8

ప్ర. అ. పరమోదార = మిక్కిలి ఔదార్యవంతుడా! ప్రీతః అస్మి = సంతోషించితిని. కర్తా చ = చేయువాడవు, అసి = అయిఉన్నావు, సంశయః = సంశయము, న = లేదు. దణ్డేన = దండము (శిక్షించుట) చేత, ప్రజాః = ప్రజలను, రక్ష = రక్షించుము. అకారణే = కారణము లేకుండగా, దణ్డమ్ = దండమును, మా చ = ఉపయోగించవద్దు.

తా. అత్యున్నతస్వభావము కలవాడా! సంతోషించినాను. నీవు తప్పక చేయగలవు. దండముచేత ప్రజలను రక్షించుము. కారణము లేకుండా దండ ప్రయోగము చేయకుము. 8

మూ. అపరాధిషు యో దణ్డః పాత్యతే మానవేషు వై,
స దణ్డో విధివన్ముక్తః స్వర్గం నయతి పార్థివమ్. 9

ప్ర. అ. యః = ఏ, దణ్డః = దండము, అపరాధిషు = అపరాధము గల, మానవేషు = మానవులయందు, పాత్యతే వై = పడవేయబడునో, విధివత్ = యథాశాస్త్రముగా, ముక్తః = విడువబడిన, సః దణ్డః = ఆదండము, పార్థివమ్ = రాజును, స్వర్గమ్ = స్వర్గమును, నయతి = పొందించును.

తా. అపరాధుల విషయమున యథాశాస్త్రముగా విధించిన దండము రాజును స్వర్గమునకు తీసికొని వెళ్లును. 9

మూ. తస్మాద్దణ్డే మహాబాహో యత్నవాన్ భవ పుత్రక,
ధర్మో హి పరమో లోకే కుర్వతస్తే భవిష్యతి. 10

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! పుత్రక = కుమారా! తస్మాత్ = ఆ కారణము వలన, దణ్డే = దండమునందు, యత్నవాన్ = ప్రయత్నము కలవాడవు, భవ = అగుము. కుర్వతః = ఇట్లు చేయుచున్న, తే = నీకు, లోకే = లోకమునందు, పరమః = గొప్ప, ధర్మః = ధర్మము, భవిష్యతి = కాగలదు.

తా. మహాబాహువైన పుత్రా! అందుచేత నీవు దండప్రయోగము విషయమున యత్నశీలుడవై ఉండవలెను. ఇట్లు చేయుచున్నచో నీకు ఈ లోకమునందు ధర్మవృద్ధి కలుగును. 10

మూ. ఇతి తం బహు సందిశ్య మనుః పుత్రం సమాధినా,
జగామ త్రిదివం హృష్టో బ్రహ్మలోకం సనాతనమ్. 11

ప్ర. అ. మనుః = మనువు, తం పుత్రమ్ = ఆ పుత్రుణ్ణి, ఇతి = ఇట్లు, బహు = ఎక్కువగా, సందిశ్య = ఉపదేశించి, హృష్టః = సంతోషించినవాడై, సమాధినా = యోగమార్గముచేత, సనాతనమ్ = నిత్యమైన, త్రిదివమ్ = స్వర్గమైన, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. మనువు కుమారునకు ఈ విధముగా చాలా ఉపదేశించి, యోగమార్గ

మును అవలంబించి నిత్యమైన స్వర్గలోకములో భాగమైన బ్రహ్మలోకమునకు వెళ్లెను. 11

మూ. ప్రయాతే త్రిదివం తస్మిన్నిక్ష్వాకురమితప్రభః,
జనయిష్యే కథం పుత్రానితి చిన్తాపరోఽభవత్. 12

ప్ర. అ. తస్మిన్ = మనువు, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, ప్రయాతే = వెళ్ళినవాడగుచుండగా, అమితప్రభః = గొప్ప కాంతి గల, ఇక్ష్వాకుః = ఇక్ష్వాకువు, పుత్రాన్ = పుత్రులను, కథమ్ = ఎట్లు, జనయిష్యే = పుట్టించెదను, ఇతి = అని, చిన్తాపరః = చింతలో నిమగ్నుడు, అభవత్ = ఆయెను.

తా. మనువు బ్రహ్మలోకమునకు వెళ్ళిపోయిన పిమ్మట ఇక్ష్వాకువు పుత్రులను ఎట్లు పుట్టించవలెనా అను ఆలోచనలో పడెను. 12

మూ. కర్మభిర్బహురూపైశ్చ తైస్తైర్మనుసుతస్తదా,
జనయామాస ధర్మాత్మా శతం దేవసుతోపమాన్. 13

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, మనుసుతః = ఇక్ష్వాకువు, తదా = అప్పుడు, తైః తైః = ఆ యా, కర్మభిః = కర్మలచేత, దేవసుతోపమాన్ = దేవసుతులతో సమానులైన, శతమ్ = నూరుగురిని, జనయామాస = పుట్టించెను.

తా. ధర్మాత్ముడైన ఇక్ష్వాకువు అనేక విధములైన ఆ యా కర్మలు చేసి దేవపుత్రులవంటి నూరుగురు పుత్రులను కనెను. 13

మూ. తేషామవరజస్తాత సర్వేషాం రఘునన్దన,
మూఢశ్చాకృతవిద్యశ్చ న శుశ్రూషతి పూర్వజాన్. 14

ప్ర. అ. తాత = తండ్రీ! రఘునన్దన = రామా! తేషామ్ = ఆ, సర్వేషామ్ = అందరిలో, అవరజః = చివర పుట్టినవాడు, మూఢః చ = మూడుడు, అకృతవిద్యః చ = విద్యాభ్యాసము చేయనివాడు, పూర్వజాన్ = అన్నలను, న చ శుశ్రూషతి = శుశ్రూష చేయడు.

తా. నాయనా రామా! వాళ్ళందరిలోనూ చిన్నవాడు. విద్యాభ్యాసము లేక మూఢుడై (అన్నలను లేదా పెద్దలను) గౌరవించేవాడు కాదు. 14

మూ. నామ తస్య చ దణ్డేతి పితా చక్రేఽల్పతేజసః,
అవశ్యం దణ్డపతనం శరీరేఽస్య భవిష్యతి. 15

ప్ర. అ. అస్య = వీనియొక్క, శరీరే = శరీరమునందు, అవశ్యమ్ = తప్పక, దణ్డపతనమ్ = దండముయొక్క పతనము (శిక్ష), భవిష్యతి = కాగలదు (అని తెలిసికొని), పితా = తండ్రి, అల్పతేజసః = అల్పమైన తేజస్సు గల, తస్య = వానికి, దణ్డేతి = దండుడు అని, నామ = పేరు, చక్రే = చేసెను.

తా. "వీని శరీరమునందు తప్పక దండము పడగలదు" అని తెలిసికొన్న తండ్రి అల్పమైన తేజస్సు గల ఆతనికి దండుడు అని పేరు పెట్టెను. 15

మూ. అపశ్యమానస్తం దేశం ఘోరం పుత్రస్య రాఘవ,
విన్ధ్యశైవలయోర్మధ్యే రాజ్యం ప్రాదాదరిందమః. 16

ప్ర. అ. అరిందమ = శత్రుసంహారకుడా! రామా = రామా, పుత్రస్య = పుత్రునకు, ఘోరమ్ = ఘోరమైన, తం దేశమ్ = అట్టి దేశమును, అపశ్యమానః = చూడనివాడై, విన్ధ్యశైవలయోః = వింధ్యశైవలపర్వతముల యొక్క, మధ్యే = మధ్యయందు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాదాత్ = ఇచ్చెను.

తా. శత్రుసంహారకుడవైన రామా! తండ్రి ఈ దండునకు తగిన భయంకరమైన దేశ మేదీ కనబడకపోవుటచేత అతవికి వింధ్యశైవలపర్వతముల మధ్యయందు రాజ్య మిచ్చెను. 16

మూ. స దణ్డస్తస్య రాజాభూద్రమ్యే పర్వతరోధసి,
పురం చాప్రతిమం రామ న్యవేశయదనుత్తమమ్. 17

ప్ర. అ. రామ = రామా! సః = ఆ, దణ్డః = దండుడు, రమ్యే = సుందరమైన, పర్వతరోధసి = పర్వతప్రాంతమునందు, తస్య = ఆ దేశమునకు, రాజా = రాజు, అభూత్ = ఆయెను. అప్రతిమమ్ = సాటిలేని, అనుత్తమమ్ = చాలా ఉత్తమమైన, పురం చ = పురమును కూడ, న్యవేశయత్ = నెలకొల్పెను.

తా. రామా! ఆ దండుడు పర్వతప్రాంతమునందున్న ఆ దేశమునకు రాజై అక్కడ సాటిలేని ఒక ఉత్తమమైన పురమును కూడ నెలకొల్పెను. 17

మూ. పురస్య చాకరోన్నామ మధుమన్తమితి ప్రభో,
పురోహితం తూశనసం వరయామాస సువ్రతమ్. 18

ప్ర. అ. ప్రభో = ప్రభూ! పురస్య = పురమునకు, మధుమన్తమ్ ఇతి = మధుమంతము అని, నామ = పేరు, చక్రే = చేసెను. సువ్రతమ్ = మంచి నియమములు గల, ఉశనసమ్ = శుక్రుణ్ణి, పురోహితమ్ = పురోహితునిగా, వరయామాస = వరించెను.

తా. ప్రభూ! ఆ పురమునకు మధుమంత మను పేరు పెట్టెను. మంచి నియమములు గల శుక్రాచార్యుణ్ణి పురోహితునిగా చేసికొనెను 18

మూ. ఏవం స రాజా తద్రాజ్యమకరోత్సపురోహితః,
ప్రహృష్టమనుజాకీర్ణం దేవరాజో యథా దివి. 19

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సపురోహితః = పురోహితునితో కూడిన, సః రాజా = ఆ రాజు, ప్రహృష్టమనుజాకీర్ణమ్ = సంతోషించిన మనుష్యులతో నిండిన, తత్ = ఆ, రాజ్యమ్ = రాజ్యమును, దివి = స్వర్గమునందు, దేవరాజః యథా = దేవేంద్రుడు వలె, అకరోత్ = చేసెను.

తా. ఈ విధముగ పురోహితునితో కూడి అతడు సంతోషించిన జనులతో నిండిన ఆ రాజ్యమును స్వర్గమునందు దేవేంద్రుడు వలె పాలించెను. 19

మూ. తతః స రాజా మనుజేన్ద్రపుత్రః
సార్ధం చ తేనోశనసా తదానీమ్,
చకార రాజ్యం సుమహన్మహాత్మా
శక్రో దివీవోశనసా సమేతః. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనాశీతితమః సర్గః.

ప్ర. అ. "శక్రోదివీవాఙ్గిరసా సమేతః" అను ప్రాచ్యపాఠము యుక్తము. తతః = అటుపిమ్మట, మనుజేన్ద్రపుత్రః = ఇక్ష్వాకుపుత్రుడైన, సః రాజా = ఆ రాజు, తదానీమ్ = అప్పుడు, తేన ఉశనసా సార్ధమ్ = ఆ శుక్రాచార్యునితో కూడ.

దివి = స్వర్గమునందు, అఙ్గిరసా = బృహస్పతితో, సమేతః = కూడిన, శక్రః ఇవ = ఇంద్రుడు వలె, సుమహత్ = చాలా గొప్పదైన, రాజ్యమ్ = రాజ్యమును, చకార = చేసెను.

తా. అప్పుడు శుక్రాచార్యునితో కూడిన మహాత్ముడైన, ఇక్ష్వాకుపుత్రుడైన ఆ రాజు స్వర్గమునందు బృహస్పతితో కూడిన ఇంద్రుడు వలె రాజ్యమును చేసెను. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో డెబ్బైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ అశీతితమః సర్గః

[దండుడు శుక్రాచార్యుని పుత్రిని బలాత్కరించుట].

మూ. ఏతదాఖ్యాయ రామాయ మహర్షిః కుమ్భసంభవః,
అస్యామేవాపరం వాక్యం కథాయాముపచక్రమే. 1

ప్ర. అ. మహర్షిః=మహర్షియైన, కుమ్భసంభవః=అగస్త్యుడు, రామాయ =రామునికొరకు, ఏతత్ =దీనిని, ఆఖ్యాయ=చెప్పి, అస్యామ్=ఈ, కథాయామ్ ఏవ=కథయందే, అపరమ్=మరియొక, వాక్యమ్=వాక్యమును, ఉపచక్రమే=ప్రారంభించెను.

తా. అగస్త్యమహర్షి రామున కిట్లు చెప్పి ఈ కథయందే మరొక వాక్యము చెప్పుటకు ప్రారంభించెను. 1

మూ. తతః స దణ్డః కాకుత్స్థ బహువర్షగణాయుతమ్,
అకరోత్తత్ర దాన్తాత్మా రాజ్యం నిహతకణ్టకమ్. 2

ప్ర. అ. కాకుత్స్థ=రామా! తతః=అటుపిమ్మట, సః దణ్డః=ఆదండుడు, దాన్తాత్మా=నిగ్రహించుకొనబడిన మనస్సు కలవాడై, తత్ర=అక్కడ, బహువర్షగణాయుతమ్=అనేక అయుతముల సంవత్సరముల సముదాయమును, నిహతకణ్టకమ్=నశింపచేయబడిన శత్రువులు గల, రాజ్యమ్=రాజ్యమును, అకరోత్=చేసెను.

తా. రామా! పిమ్మట ఆ దండుడు మనోనిగ్రహవంతుడై అనేక అయుతముల సంవత్సరములు శత్రుబాధ లేని రాజ్యమును పాలించెను. 2

మూ. అథ కాలే తు కస్మింశ్చిద్రాజా భార్గవమాశ్రమమ్,
రమణీయముపాక్రామచ్చైత్రే మాసి మనోరమే. 3

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రాజా = రాజు, కస్మింశ్చిత్ = ఒకానొక, కాలే = కాలమునందు, మనోరమే=మనోహరమైన, చైత్రే మాసి=చైత్రమాసమునందు, రమణీయమ్ = సుందరమైన, భార్గవమ్=శుక్రాచార్యునకు సంబంధించిన, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, ఉపాక్రామత్ = వెళ్ళెను.

తా. పిమ్మట కొంత కాలమునకు ఆ రాజు మనోహరమైన చైత్రమాసములో సుందరమైన శుక్రాచార్యుని ఆశ్రమమునకు వెళ్ళెను. 3

మూ. తత్ర భార్గవకన్యాం స రూపేణాప్రతిమాం భువి,
విచరన్తీం వనోద్దేశే దణ్డోఽపశ్యదనుత్తమామ్. 4

ప్ర. అ. తత్ర = అక్కడ, సః = ఆ, దణ్డః = దండుడు, వనోద్దేశే = వనప్రాంతమునందు, విచరన్తీమ్ = సంచరించుచున్న, అనుత్తమామ్ = చాల ఉత్తమురాలైన, రూపేణ = రూపముచేత, భువి = భూలోకమునందు, అప్రతిమామ్ = సాటి లేని, భార్గవకన్యామ్ = శుక్రుని కన్యను, అపశ్యత్ = చూచెను.

తా. అక్కడ ఆ దండుడు వనప్రాంతమునందు సంచరించుచున్న శుక్రాచార్యుని పుత్రికను చూచెను. అత్యుత్తమురాలైన ఆమె భూలోకములో సాటి లేని సౌందర్యముతో ప్రకాశించుచుండెను. 4

మూ. స దృష్ట్వా తాం సుదుర్మేధా అనఙ్గశరపీడితః,
అభిగమ్య సుసంవిగ్నాం కన్యాం వచనమబ్రవీత్. 5

ప్ర. అ. సుదుర్మేధాః = చాల చెడ్డ బుద్ధి గల, సః = అతడు, తామ్=ఆ, కన్యామ్ = కన్యను, దృష్ట్వా = చూచి, అనఙ్గశరపీడితః = మన్మథబాణములచేత పీడింపబడినవాడై, అభిగమ్య=సమీపించి, సుసంవిగ్నామ్=చాల దిగులు చెందిన, కన్యామ్ = ఆ కన్యను గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. దుర్బుద్ధి గల అతడు ఆమెను చూచి, మన్మథశరములచేత పీడితుడై, చాల భయపడిన ఆమెను సమీపించి ఇట్లు పలికెను. 5

మూ. కుతస్త్వమసి సుశ్రోణి కస్య వాసి సుతా శుభే,
పీడితోఽహమనఙ్గేన పృచ్ఛామి త్వాం శుభాననే. 6

ప్ర. అ. సుశ్రోణి = మంచి కటిప్రదేశము కలదానా! త్వమ్ = నీవు, కుతః = ఎచటినుండి, అసి = అయి ఉన్నావు? శుభే = మంగళప్రదురాలా! కస్య వా = ఎవనియొక్క, సుతా = కుమార్తెవు, అసి = అయిఉన్నావు? శుభాననే = శుభమైన ముఖము గలదానా! అహమ్ = నేను, అనఙ్గేన = మన్మథునిచేత, పీడితః = పీడించ బడినవాడనై, త్వామ్ = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను.

తా. అందమైన కటిప్రదేశము గల మంగళప్రదురాలా! నీవు ఎక్కడి నుండి వచ్చినావు? నీవు ఎవరి కుమార్తెవు? సుందరమైన ముఖము గలదానా! నేను మన్మథునిచే పీడింపబడి అడుగుచున్నాను. 6

మూ. తస్య త్వేవం బ్రువాణస్య మోహోన్మత్తస్య కామినః,
భార్గవీ ప్రత్యువాచేదం వచః సానునయం నృపమ్. 7

ప్ర. అ. మోహోన్మత్తస్య = మోహముచేత ఉన్మత్తుడైన, కామినః = కాముకుడైన, తస్య = అతడు, ఏవమ్ = ఇట్లు, బ్రువాణస్య = పలుకుచుండగా, భార్గవీ = శుక్రాచార్యుని కూతురు, సానునయమ్ = అనునయముతో కూడినట్లుగా, నృపమ్ = రాజును గూర్చి, ఇదం వచః = ఈ వచనమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మోహముచే మత్తుడైన అ కాముకుడు ఇట్లు మాటలాడుచుండగా శుక్రాచార్యుని కూతురు బ్రతిమాలుచు అతనితో ఇట్లు పలికెను. 7

మూ. భార్గవస్య సుతాం విద్ధి దేవస్యాక్లిష్టకర్మణః,
అరజాం నామ రాజేన్ద్ర జ్యేష్ఠామాశ్రమవాసినీమ్. 8

ప్ర. అ. రాజేన్ద్ర = రాజేంద్రా! ఆశ్రమవాసనీమ్ = ఆశ్రమములో నివసించుచున్న నన్ను, అక్లిష్టకర్మణః = క్లేశములేని కర్మలు గల, దేవస్య = ప్రకాశించుచున్న, భార్గవస్య = శుక్రాచార్యునియొక్క, అరజాం నామ = అరజ అను పేరు గల, జ్యేష్ఠాం సుతమ్ = పెద్ద కుమార్తెనుగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. మహారాజా! నేను పుణ్యకర్మలు ఆచరించు ప్రకాశవంతుడైన శుక్రాచార్యుని పెద్ద కుమార్తెను. నా పేరు అరజ. నేను ఆశ్రమములో నివసింతును. 8

మూ. మా మాం స్పృశ బలాద్రాజన్ కన్యా పితృవశా హ్యహమ్,
గురుః పితా మే రాజేన్ద్ర త్వం చ శిష్యో మహాత్మనః, 9
వ్యసనం సుమహత్ క్రుద్ధః స తే దద్యాన్మహాతపాః.

ప్ర. అ. రాజన్ = రాజా! మామ్ = నన్ను, బలాత్ = బలాత్కారముగ, మా స్పృశ = స్పృశించకుము. అహమ్ = నేను, పితృవశా హి = తండ్రికి వశురాలను గదా! మే పితా = నా తండ్రి, గురుః = నీ గురువు. రాజేన్ద్ర = మహారాజా! త్వం చ = నీవు, మహాత్మనః = ఆ మహాత్ముని యొక్క, శిష్యః = శిష్యుడవు. మహాతపాః = గొప్ప, తపస్సు గల, సః = అతడు, క్రుద్ధః = కోపించినవాడై, తే = నీకు, సుమహత్ = చాల గొప్ప, వ్యసనమ్ = దుఃఖమును, దద్యాత్ = ఇచ్చును.

తా. రాజా! నన్ను బలాత్కారముగా ముట్టుకొనకుము. నేను తండ్రివశములో ఉన్న కన్యను. మహారాజా! నా తండ్రి నీ గురువు. నీవు ఆ మహాత్ముని శిష్యుడవు. మహాతపఃశాలియైన ఆయన కోపించినచో నీకు గొప్ప ఆపద కలిగించును. 9

మూ. యది వాన్యన్మయా కార్యం ధర్మదృష్టేన సత్పథా, 10
వరయస్వ నరశ్రేష్ఠ పితరం మే మహాద్యుతిమ్.

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా! మయా = నాచేత, అన్యత్ = మరియొక్క, కార్యమ్ = కార్యము, యది వా = ఉన్నట్లయితే, ధర్మదృష్టేన = ధర్మముచేత చూడబడిన, సత్పథా = సన్మార్గముచేత, మే = నాయొక్క, మహాద్యుతిమ్ = గొప్ప కాంతి గల, పితరమ్ = తండ్రిని, వరయస్వ = కోరుము.

తా. నావలన నీకేమైన ప్రయోజనమున్నచో, ఓ నరశ్రేష్ఠా! ధర్మసంమతమైన మార్గమును అనుసరించి గొప్ప తేజస్సు గల మా తండ్రిని కోరుము. 10

మూ. అన్యథా తు ఫలం తుభ్యం భవేద్ఘోరాభిసంహితమ్, 11
క్రోధేన హి పితా మేఽసౌ త్రైలోక్యమపి నిర్దహేత్,
దాస్యతే చానవద్యాఙ్గ తవ మా యాచితః పితా. 12

ప్ర. అ. అన్యథా = అట్లు కానిచో, తుభ్యమ్ = నీకు, ఘోరాభిసంహితమ్

= భయంకరమైన స్వభావముగల, ఫలమ్ = ఫలము, భవేత్ = అగును. క్రోధేన = కోపముచేత, అసౌ = ఈ, మే పితా = నా తండ్రి, త్రైలోక్యమపి = మూడు లోకముల సముదాయమును కూడ, నిర్దహేత్ = కాల్చివేయును. అనవద్యాఙ్గ= దోషములు లేని అవయవములు గలవాడా! యాచితః = యాచింపబడినవాడై, పితా = తండ్రి, తవ = నీకు, మా = నన్ను, దాస్యతే = ఇవ్వగలడు.

తా. అట్లు కానిచో నీకు చాల భయంకరమైన ఫలము కలుగును. నా తండ్రి క్రోధము వచ్చినచో మూడు లోకాలనూ కూడ కాల్చివేయును కదా! నిర్దుష్టములైన అవయవములు గల ఓ! రాజా! నీవు యాచించినచో నా తండ్రి నన్ను నీ కివ్వగలడు. 11, 12

మూ. ఏవం బ్రువాణామరజాం దణ్డః కామవశం గతః,
ప్రత్యువాచ మదోన్మత్తః శిరస్యాధాయ చాఞ్జలిమ్. 13

ప్ర. అ. కామశం గతః = కామమునకు వశుడైన, దణ్డః = దండుడు, మదోన్మత్తః = మదముచేత మత్తుడై, శిరసి = శిరస్సునందు, అఞ్జలిమ్=దోసిలిని, ఆధాయ = ఉంచి, ఏవమ్ = ఇట్లు, బ్రువాణామ్ = పలుకుచున్న, అరజామ్ = అరజను గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. కామవశుడైన ఆ దండుడు మదముచేత ఉన్మత్తుడై, ఇట్లు పలుకుచున్న అరజతో, శిరస్సుపై అంజలి ఘటించి ఇట్లు పలికెను. 13

మూ. ప్రసాదం కురు సుశ్రోణి న కాలం క్షేప్తుమర్హసి,
త్వత్కృతే హి మమ ప్రాణా విదీర్యన్తే వరాననే. 14

ప్ర. అ. సుశ్రోణి = మంచి నితంబము కలదానా! ప్రసాదమ్ = అనుగ్రహమును, కురు = చేయుము. కాలమ్ = కాలమును, క్షేప్తుమ్ = గడపుటకు, న అర్హసి = తగవు. వరాననే = సుందరమైన ముఖము గలదానా! త్వత్కృతే = = నీ నిమిత్తమై, మమ = నాయొక్క, ప్రాణాః = ప్రాణములు, విదీర్యన్తే = చీల్చబడిపోవుచున్నది.

తా. అందమైన కటిప్రదేశము గలదానా! కాలము గడిపివేయకుము. ఓ సుందరముఖీ! నీ మూలమున నా ప్రాణములు పోవుచున్నవి. 14

మూ. త్వాం ప్రాప్య మే వధో వాపి పాపం వాపి సుదారుణమ్,
భక్తం భజస్వ మాం భీరు భజమానం సువిహ్వలమ్. 15

ప్ర. అ. త్వామ్ = నిన్ను, ప్రాప్య = పొంది, మే = నాకు, వధః వా అపి = చావు గాని, సుదారుణమ్ = చాల దారుణమైన, పాపం వా అపి = పాపము గాని, వచ్చుగాక. భీరు = భయస్వభావము కలదానా, సువిహ్వలమ్ = చాలా వ్యాకులుడైన, భజమానమ్ = సేవించుచున్న, భక్తమ్ = ఈ భక్తుణ్ణి, భజస్వ = పొందుము.

తా. నిన్ను పొందిన పిమ్మట నాకు మరణము కలిగినను, భయంకరమైన పాపము వచ్చినను విచారము లేదు. ఓ! భయస్వభావముగలదానా! చాలా వ్యాకులత చెంది నిన్ను సేవించుచున్న ఈ భక్తుణ్ణి పొందుము. 15

మూ. ఏవముక్త్వా తు తాం కన్యాం దోర్భ్యాం గృహ్య బలాద్బలీ,
విస్ఫురన్తీం యథాకామం మైథునాయోపచక్రమే. 16

ప్ర. అ. బలీ = బలవంతుడైన ఆ దండుడు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, విస్ఫురన్తీమ్ = పెనుగులాడుచున్న, తాం కన్యామ్ = ఆ కన్యను, దోర్భ్యామ్ = బాహువులచేత, బలాత్ = బలాత్కారముగ, గృహ్య = గ్రహించి, యథాకామమ్ = కామానుసారము, మైథునాయ = మైథునముకొరకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. బలవంతుడైన ఆ దండుడు ఇట్లు పలికి ఆ కన్యను బాహువులతో బలాత్కారముగ పట్టుకొని, ఆమె పెనగులాడుచుండగా, యథేష్టముగా మైథునమునకు ఉపక్రమించెను. 16

మూ. తమనర్థం మహాఘోరం దణ్డః కృత్వా సుదారుణమ్,
నగరం ప్రయయావాశు మధుమన్తమనుత్తమమ్. 17

ప్ర. అ. దణ్డః = దండుడు, మహాఘోరమ్ = చాలా ఘోరమైన, సుదారుణమ్ = చాల దారుణమైన, తమ్ = ఆ, అనర్థమ్ = అకృత్యమును, కృత్వా = చేసి, ఆశు = శీఘ్రముగా, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, మధుమన్తం నగరమ్ = మధుమంతనగరమును గూర్చి, ప్రయయౌ = వెళ్లెను.

తా. దండుడు చాల ఘోరము, దారుణము అయిన ఈ పాపకృత్యము చేసి వెంటనే తన నగరమైన మధుమంతమునకు వెళ్లెను. 17

మూ. అరజాపి రుదన్తీ సా ఆశ్రమస్యావిదూరతః,
ప్రతీక్షతే సుసన్త్రస్తా పితరం దేవసంనిభమ్. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అశీతితమః సర్గః

ప్ర. అ. సా అరజాపి = ఆ అరజ కూడ, రుదన్తీ = ఏడ్చుచున్నదై, సుసన్త్రస్తా = చాల భయపడినదై, ఆశ్రమస్య = ఆశ్రమమునకు, అవిదూరతః = సమీపమున, దేవసంనిభమ్ = దేవతాతుల్యుడైన, పితరమ్ = తండ్రిని, ప్రతీక్షతే = నిరీక్షించుచున్నది.

తా. అరజ చాలా భయపడి ఏడ్చుచు ఆశ్రమసమీపమునందు దేవతాతుల్యుడైన తండ్రికొరకై నిరీక్షించుచుండెను. 18

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఎనుబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకాశీతితమః సర్గః

[శుక్రాచార్యుని శాపముచేత దండుడు వాని రాజ్యము నశించుట].

మూ. స ముహూర్తాదుపశ్రుత్య దేవర్షిరమితప్రభః,
స్వమాశ్రమం శిష్యవృతః క్షుధార్తః సంన్యవర్తత. 1

ప్ర. అ. అమితప్రభః = అనంతమైన కాంతి గల, సః దేవర్షిః = ఆ దేవర్షి, ఉపశ్రుత్య = విని, శిష్యవృతః = శిష్యులతో కూడినవాడై, క్షుధార్తః = ఆకలిచేత పీడింపబడినవాడై, ముహూర్తాత్ = ముహూర్తకాలములో, స్వమ్ = తన సంబంధమైన, ఆశ్రమమ్ = ఆశ్రమమును గూర్చి, సంన్యవర్తత = మరలెను.

తా. అనంతమైన తేజస్సుగల శుక్రాచార్యుడు ఈ విషయమునువిని, శిష్యసమేతుడై, ఆకలితో బాధపడుచు ముహూర్తకాలములో తన ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. 1

మూ. సోఽపశ్యదరజాం దీనాం రజసా సమభిప్లుతామ్,
జ్యోత్స్నామివ గ్రహగ్రస్తాం ప్రత్యూషే నవిరాజతీమ్. 2

ప్ర. అ. సః = అతడు, దీనామ్ = దీనురాలు, రజసా = పరాగముచేత, సమభిప్లుతామ్ = కప్పబడినది, ప్రత్యూషే = ప్రాతఃకాలమునందు, గ్రహగ్రస్తామ్ = గ్రహముచేత మింగివేయబడిన, జ్యోత్స్నామివ = వెన్నెల వలె, న విరాజతీమ్ = ప్రకాశించని, అరజామ్ = అరజను, అపశ్యత్ = చూచెను.

తా. శుక్రాచారుర్యులు దీనురాలైన అరజను చూచెను. ఆమె శరీరము పరాగముచేత కప్పబడి ఉండెను. ప్రాతఃకాలమునందు గ్రహముచేత (రాహువుచేత లేదా సూర్యునిచేత) కప్పివేయబడిన వెన్నెల వలె కాంతి విహీనురాలై ఉండెను. 2

మూ. తస్య రోషః సమభవత్ క్షుధార్తస్య విశేషతః,
నిర్దహన్నివ లోకాంస్త్రీన్ శిష్యాంశ్చైతదువాచ హ. 3

ప్ర. అ. తస్య = అతనికి, విశేషతః = విశేషించి, క్షుధార్తస్య = ఆకలి చేత పీడితుడైన అతనికి, రోషః = కోపము, సమభవత్ = కలిగెను. త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, నిర్దహన్ ఇవ = కాల్చివేయుచున్నవాడు వలె, శిష్యాన్ = శిష్యులను గూర్చి, ఏతత్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ శుక్రాచార్యునకు, విశేషించి ఆకలిచేత బాధపడుచున్న వానికి, కోపము కలిగెను. అతడు మూడు లోకాలను కాల్చివేయుచున్నాడా అన్నట్లు శిష్యులతో ఇట్లనెను. 3

మూ. పశ్యధ్వం విపరీతస్య దణ్డస్యావిదితాత్మనః,
విపత్తిం ఘోరసంకాశాం క్రుద్ధాదగ్నిశిఖామివ. 4

ప్ర. అ. విపరీతస్య = విపరీతప్రవృత్తి గల, అవిదితాత్మనః = తెలియబడని తన శక్తి గల, లేదా మనోనిగ్రహములేని, దణ్డస్య = దండునియొక్క, ఘోరసంకాశమ్ = చాల ఘోరమైన, అగ్నిశిఖామివ = అగ్నిశిఖవంటి, విపత్తిమ్ = ఆపదను, క్రుద్ధాత్ = కోపించిన నానుండి, పశ్యధ్వమ్ = చూడండి.

తా. కోపించిన నావలన విపరీతప్రవృత్తి గల వినయవిహీనుడైన ఈ దండునకు అగ్నిశిఖవంటి ఘోరమైన ఎట్టి ఆపద రానున్నదో చూడండి. 4

మూ. క్షయోఽస్య దుర్మతేః ప్రాప్తః సానుగస్య దురాత్మనః,
యః ప్రదీప్తామివాగ్నేయీం శిఖాం సంస్పృష్టవానిమామ్.

ప్ర. అ. సానుగస్య = అనుచరులతో కూడిన, దుర్మతేః = చెడ్డ బుద్ధి గల, అస్య దుర్మతేః = ఈ దుర్మతికి, క్షయః = వినాశము, ప్రాప్తః = ప్రాప్తించినది. యః = ఎవడు, ప్రదీప్తామ్ = మండుచున్న, ఆగ్నేయీమ్ = అగ్ని సంబంధమైన, శిఖామ్ ఇవ = జ్వాలను వలె, ఇమామ్ = ఈమెను, సంస్పృష్టవాన్ = స్పృశించినాడో.

తా. ప్రజ్వరిల్లుచున్న అగ్నిజ్వాలను స్పృశించినట్లు ఈమెను స్పృశించిన దుర్బుద్ధియైన ఈ దురాత్మునకు పరివారసహితముగా వినాశము దాపురించినది. 5

మూ. యస్మాత్స కృతవాన్ పాపమీదృశం ఘోరసంహితమ్,
తస్మాత్ ప్రాప్స్యతి దుర్మేధాః ఫలం పాపస్య కర్మణః.

ప్ర. అ. సః = అతడు, యస్మాత్ = ఏ కారణమువలన, ఈదృశమ్ = ఇట్టి, ఘోరసంహితమ్ = ఘోరమైన, పాపమ్ = పాపమును. కృతవాన్ = చేసినాడో, తస్మాత్ = ఆ కారణమువలన, దుర్మేధాః = ఈ దుష్టబుద్ధి, పాపస్య = పాపమైన, కర్మణః = కర్మయొక్క, ఫలమ్ = ఫలమును, ప్రాప్స్యతి = పొందగలడు.

తా. ఇతడు ఇట్టి ఘోరమైన పాపము చేసినాడు గాన ఈ దుర్బుద్ధి పాపకర్మకు ఫలమును పొందగలడు. 6

మూ. సప్తరాత్రేణ రాజాసౌ సపుత్రబలవాహనః,
పాపకర్మసమాచారో వధం ప్రాప్స్యతి దుర్మతిః. 7

ప్ర. అ. దుర్మతిః = దుష్టబుద్ధి గల, పాపకర్మసమాచారః=పాపకర్మ, ఆచారము గల, అసౌ రాజా = ఈ రాజు, సపుత్రబలవాహనః = పుత్ర-సైన్య-వాహనసహితుడై, సప్తరాత్రేణ=ఏడు రోజులలో, వధమ్=వధను, ప్రాప్స్యతి = పొందగలడు.

తా. పాపకర్మ, పాపాచారము చేయు దుర్మతియైన ఈ రాజు పుత్రసైన్యవాహనములతో సహా ఏడు రోజులలో మరణించగలడు. 7

మూ. సమన్తాద్యోజనశతం విషయం చాస్య దుర్మతేః,
ధక్ష్యతే పాంసువర్షేణ మహతా పాకశాసనః. 8

ప్ర. అ. అస్య = ఈ, దుర్మతేః=దుర్మతియైన రాజుయొక్క, విషయమ్ = దేశమును, సమన్తాత్ = చుట్టూ, యోజనశతమ్ = నూరు యోజనములు, పాకశాసనః = ఇంద్రుడు, పాంసువర్షేణ = పరాగముయొక్క వర్షముచేత, ధక్ష్యతే= దహించివేయగలడు.

తా. దుర్మతియైన ఈతని దేశమును నూరు యోజనముల పరిధిలో ఇంద్రుడు గొప్ప పరాగమును కురిపించి కాల్చివేయగలడు. 8

మూ. సర్వసత్త్వాని యానీహ స్థావరాణి చరాణి చ,
మహతా పాంసువర్షేణ విలయం సర్వతోఽగమన్. 9

ప్ర. అ ఇహ = ఇక్కడ, యాని = ఏ, స్థావరాణి = స్థావరములు, చరాణి చ = జంగమములు అయినవి ఉన్నవో, సర్వసత్త్వాని = ఆ సమస్త ప్రాణులూ కూడ, సర్వతః = అంతటా, మహతా = గొప్ప, పాంసువర్షేణ = పరాగము వర్షముచేత, విలయమ్ = వినాశమునును, అగమన్ = పొందినవి (పొందును).

తా. ఇక్కడ ఉన్న జంగమస్థావరాత్మకములైన అన్ని ప్రాణులూ కూడ అంతటా కురియు గొప్ప ధూళివర్షముచేత నశింపగలవు. 9

మూ. దణ్డస్య విషయో యావత్తావత్సర్వం సముచ్ఛ్రయమ్,
పాంసువర్షమివాలక్ష్యం సప్తరాత్రం భవిష్యతి. 10

ప్ర. అ. దణ్డస్య = దండునియొక్క, విషయః = దేశము, యావత్ = ఎంతవరకు ఉన్నదో, తావత్ = అంతవరకు, సర్వమ్ = సమస్తమైన, సముచ్ఛ్రయమ్ = ఉన్నతమైన ప్రాణిసముదాయము, సప్తరాత్రమ్ = ఏడురోజులు, పాంసువర్షమ్ = పరాగము వర్షమును, (ప్రాప్య = పొంది) అలక్ష్యమ్ ఇవ = కనబడనిదిగా, భవిష్యతి = కాగలదు.

తా. దండుని దేశము (సరిహద్దు) ఎంతవరకూ ఉన్నదో అంతవరకు ఎత్తుగా ఉన్న (నిలచి ఉన్న) ప్రాణిసముదాయము ఏడు రాత్రులు ధూళివర్షమును పొంది కనబడకుండపోవును. 10

మూ. ఇత్యుక్త్వా క్రోధతామ్రాక్షస్తమాశ్రయనివాసినమ్,
జనం జనపదాన్తేషు స్థీయతామితి చాబ్రవీత్. 11

ప్ర. అ. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, క్రోధతామ్రాక్షః = క్రోధముచేత ఎఱ్ఱనైన కళ్ళు గల అతడు, ఆశ్రమనివాసినమ్ = ఆశ్రమములో నివసించుచున్న, తం జనమ్ = ఆ జనమును, జనపదాన్తేషు = దేశపు సరిహద్దులందు, స్థీయతామ్ = ఉందురు గాక, ఇతి = అని, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. క్రోధముచేత ఎఱ్ఱనైన కళ్ళు గల అతడు ఇట్లు పలికి "మీరందరు దేశము సరిహద్దులందు నివసించుడు" అని ఆశ్రమనివాసులకు చెప్పెను. 11

మూ. శ్రుత్వా తూశనసో వాక్యం సోఽశ్రమావసథో జనః,
నిష్క్రాన్తో విషయాత్తస్మాత్ స్థానం చక్రేఽథ బాహ్యతః.

ప్ర. అ. ఉశనసః = శుక్రునియొక్క, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, సః = ఆ, ఆశ్రమావసథః = ఆశ్రమము నివాసముగా గల, జనః = జనము, తస్మాత్ = ఆ, విషయాత్ = దేశమునుండి, నిష్క్రాన్తః = బైటకు వెళ్ళినదై, బాహ్యతః = వెలుపల, స్థానమ్ = స్థానమును, చక్రే = చేసికొనెను.

తా. శుక్రాచార్యుని మాటలు విని ఆశ్రమములో ఉన్న జనము ఆ దేశమును విడచి వెలుపల నివసించెను. 12

మూ. స తథోక్త్వా మునిజనమరజామిదమబ్రవీత్.
ఇహైవ వస దుర్మేధే ఆశ్రమే సుసమాహితా. 13

ప్ర. అ. సః = అతడు, మునిజనమ్ = మునిజనమును గూర్చి, తథా = అట్లు, ఉక్త్వా = పలికి, అరజామ్ = అరజను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. దుర్మేధే = దుర్బుద్ధి గలదానా, సుసమాహితా = బాగా సావధానచిత్తురాలవై (యోగభ్యాసము చేయుచున్న దానవై), ఇహ = ఈ, ఆశ్రమే ఏవ = ఈ ఆశ్రమమునందే, వస = నివసించుము. (ఆ రాజు బలాత్కారము చేసినప్పుడు పూర్తిగా ఎదిరించకపోవుటచే దుర్మేధ అన్నాడని వ్యాఖ్యాతలు).

తా. ఆ శుక్రాచార్యుడు మునులతో ఇట్లు పలికి అరజను ఇట్లు ఆదేశించెను. "ఓ! దుర్బుద్ధి గలదానా! నీవు ఈ ఆశ్రమనందే యోగాభ్యాసనక్తురాలవై నివసించుము. 13

మూ. ఇదం యోజనపర్యన్తం సరః సురుచిరప్రభమ్,
అరజే విజ్వరా భుజ్క్ష్వ కాలశ్చాత్ర ప్రతీక్ష్యతామ్. 14

ప్ర. అ. అరజే = అరజా! యోజనపర్యన్తమ్ = యోజనమువరకు, సురుచిరమ్ = చాలమనోహరమైన, ఇదం సరః = ఈ సరస్సును విజ్వరా = మనోవ్యథ లేనిదానవై, భుజ్క్ష్వ = అనుభవించుము. కాలః చ = కాలము కూడ, అత్ర = ఇక్కడ, ప్రతీక్ష్యతామ్ = నిరీక్షించబడుగాక.

తా. అరజా! యోజనము విశాలమైన చాలా మనోహరమైన ఈ సరస్సును మనోవ్యథ లేపీ లేనిదానవై అనుభవించుము. కాలమునకై వేచి ఉండుము. 14

మూ. త్వత్సమీపే చ యే సత్త్వా వాసమేష్యన్తి తాం నిశామ్,
అవధ్యాః పాంసువర్షేణ తే భవిష్యన్తి నిత్యదా. 15

ప్ర. అ. త్వత్సమీపే=సమీపమునందు, యే=ఏ, సత్త్వాః = మృగములు, తాం నిశామ్ = ఆ రాత్రిని, వాసమ్ = నివాసమును, ఏష్యన్తి = పొందగలవో, తే = అవి, నిత్యదా = నిత్యమూ, పాంసువర్షేణ=పరాగము వర్షముచేత, అవధ్యాః =చంపశక్యముకానివి, భవిష్యన్తి = కాగలవు.

తా. ఆ రాత్రి నీవద్ద ఏ ప్రాణులు నివసించునో అవి నిత్యమూ (ఏనాటికీ) ధూళివర్షముచేత చంపబడవు. 15

మూ. శ్రుత్వా నియోగం బ్రహర్షేః సారజా భార్గవీ తదా,
తథేతి పితరం ప్రాహ భార్గవం భృశదుఃఖితా. 16

ప్ర. అ. తదా = అప్పుడు, భార్గవీ = శుక్రుని కుమార్తె యైన, సా = ఆ, అరజా = అరజ, బ్రహ్మర్షేః=ఆ బ్రహ్మర్షియొక్క, నియోగమ్=ఆజ్ఞను, శ్రుత్వా =విని, భృశదుఃఖితా = చాలా దుఃఖించినదై, పితరమ్=తండ్రిని గూర్చి, తథేతి = అట్లే అని, ప్రాహ=పలికెను.

తా. అప్పుడు శుక్రాచార్యుని కుమార్తె యైన అరజ చాల దుఃఖించుచు బ్రహర్షియైన తన తండ్రి ఆజ్ఞను విని "అట్లే చేసెదను" అని అతనితో పలికెను.

మూ. ఇత్యుక్త్వా భార్గవో వాసమన్యత్ర సమకారయత్,
తచ్చ రాజ్యం నరేన్ద్రస్య సభృత్యబలవాహనమ్, 17
సప్తాహాద్భస్మసాద్భూతం యథోక్తం బ్రహ్మవాదినా.

ప్ర. అ. భార్గవః = శుక్రుడు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అన్యత్ర= మరియొక చోట, వాసమ్ = నివాసమును, సమకారయత్ =చేయించెను. నరేన్ద్రస్య = రాజుయొక్క, సభృత్యబలవాహనమ్ = భృత్యులతోను, సైన్యముతోను, వాహనములతోను కూడిన, తత్ = ఆ, రాజ్యం చ = రాజ్యము, బ్రహ్మవాదినా = బ్రహ్మవాదియైన శుక్రునిచేత, యథా = ఎట్లు, ఉక్తమ్ = చెప్పబడినదో అట్లు, సప్తాహాత్ = ఏడురోజులలో, భస్మసాత్ = భస్మముగా, భూతమ్ = అయినది.

తా. శుక్రాచార్యులు ఇట్లు పలికి మరొక చోట నివాస మేర్పరచుకొనెను. ఆ రాజు రాజ్యము కూడ అతని భృత్య-సైన్య-వాహనములతో సహా శుక్రాచార్యులు చెప్పిన విధమున ఏడు రోజులలో భస్మమైపోయెను. 17

మూ. తస్యాసౌ దణ్డవిషయో విన్ధ్యశైవలయోర్నృప, 18
శప్తో బ్రహ్మర్షిణా తేన వైధర్మ్యే సహితే కృతే.

ప్ర. అ. నృప = రాజా! విన్ధ్యశైవలయోః = వింధ్యశైవలపర్వతముల మధ్య, అసౌ = ఈ, తస్య దండవిషయః = వానిదండదేశము, సహితే = పూర్తిగా ధర్మ సౌఖ్యములతో కూడిన, కృతేకృతయుగమునందు, వైధర్మ్యే = అధర్మము జరిగినదగుచుండగా, తేన బ్రహ్మర్షిణా = ఆ బ్రహ్మర్షిచేత, శప్తః = శపించబడినది.

తా. రాజా! వింధ్యశైలపర్వతముల మధ్యనున్న అతని ఈ దండదేశమును ధర్మసౌఖ్యపరిపూర్ణమైన కృతయుగమునందు అధర్మము జరుగుటచే ఆ బ్రహ్మర్షి ఈ విధముగా శపించెను. 18

మూ. తతః ప్రభృతి కాకుత్స్థ దణ్డకారణ్యముచ్యతే, 19
తపస్వినః స్థితా హ్యత్ర జనస్థాన మతోఽభవత్,
ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం పృచ్ఛసి రాఘవ. 20

ప్ర. అ. తతః ప్రభృతి = అది మొదలు, కాకుత్స్థ = రామా! దణ్డకారణ్యమ్ = దండకారణ్యము అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. అత్ర = ఇక్కడ, తపస్వినః = మునులు. స్థితాః హి = ఉన్నారు కదా? అతః = ఆ కారణమువలన, జనస్థానమ్ = జనస్థానముగా, అభవత్ = అయెను. రాఘవ = రామా! యత్ = దేనిని గూర్చి, మామ్ = నన్ను, పృచ్ఛసి = అడుగుచున్నావో, ఏతత్ = ఇది, సర్వమ్ = అంతయూ, తే = నీకు, ఆఖ్యాతమ్ = చెప్పబడినది.

తా. కాకుత్స్థా! అది మొదలు దీనికి దండకారణ్య మని పేరు వచ్చినది. ఇక్కడ మునులు నివసించుటచే జనస్థాన మని కూడ పేరు. రామా! నీవు అడిగిన ఈ విషయమునంతనూ నీకు చెప్పినాను. 19, 20

మూ. సంధ్యాముపాసితుం వీర సమయో హ్యతివర్తతే,
ఏతే మహర్షయః సర్వే పూర్ణకుమ్భాః సమన్తతః, 21
కృతోదకా నరవ్యాఘ్ర ఆదిత్యం పర్యుపాసతే.

ప్ర. అ. వీర=వీరుడా! సంధ్యామ్ = సంధ్యను, ఉపాసితుమ్=ఉపాసించుటకు, సమయః = సమయము, అతివర్తతే హి = దాటిపోవుచున్నది కదా! నరవ్యాఘ్ర = నరశ్రేష్ఠుడా! ఏతే = ఈ, సర్వే=సమస్తమైన, మహర్షయః=మహర్షులు, సమన్తతః = అన్నివైపులా, పూర్ణకుమ్భాః = జలపూర్ణములైన కుంభములు గలవారై, కృతోదకాః = స్నానముచేసినవారై, ఆదిత్యమ్ = సూర్యుణ్ణి, పర్యుపాసతే = ఉపాసించుచున్నారు.

తా. వీరుడా! సంధ్యోపాసన చేయు సమయము దాటిపోవుచున్నది. నలుమూలలా ఈ మహర్షులు స్నానములు చేసి, జలపూర్ణకుంభములు దగ్గర ఉంచుకొని సూర్యుణ్ణి ఉపాసించుచున్నారు. 21

మూ. స తైర్బ్రాహ్మణమభ్యస్తం సహితైర్బ్రహ్మవిత్తమైః, 22
రవిరస్తంగతో రామ గచ్ఛోదకముపస్పృశ.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకాశీతితమః సర్గః.

ప్ర. అ. సహితైః = ఒక చోట కలిసిన, బ్రహ్మవిత్తమైః = బ్రహ్మవేత్తలలో గొప్పవారైన బ్రాహ్మణులచేత, బ్రాహ్మణమ్ = బ్రాహ్మణము, అభ్యస్తమ్ = చదవబడినది. సః=ఆ, రవిః = సూర్యుడు, అస్తం గతః = అస్తమించినాడు, రామ = రామా! గచ్ఛ = వెళ్లుము, ఉదకమ్ = ఉదకమును, ఉపస్పృశ = ఆచమనము చేయుము.

తా. ఒకచోట కలిసిన బ్రహ్మవేత్తలు బ్రాహ్మణమును పఠించుచున్నారు. సూర్యుడు అస్తమించినాడు. రామా! వెళ్ళి సంధ్యోపాసన చేయుము. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో ఎనభై ఒకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వ్యశీతితమః సర్గః

[రాముడు అగస్త్యాశ్రమమునుండి అయోధ్యకు బయలుదేరుట.]

మూ. ఋషేర్వచనమాజ్ఞాయ రామః సంధ్యాముపాసితుమ్,
అపాక్రమత్సరః పుణ్యమప్సరోగణసేవితమ్. 1

ప్ర. అ. రామః = రాముడు, ఋషేః = ఋషియొక్క, వచనమ్ = వచనమును, ఆజ్ఞాయ = తెలిసికొని, సంధ్యామ్ = సంధ్యను, ఉపాసితుమ్ = ఉపాసించుటకు, అప్సరోగణసేవితమ్ = అప్సరసల గణముచేత సేవించబడిన, పుణ్యమ్ = పుణ్యమైన, సరః = సరస్సును గూర్చి, అపాక్రమత్ = వెళ్లెను.

తా. రాముడు అగస్త్యుని మాటలు విని సంధ్యోపాసన చేయుటకు అప్సరస్త్రీ సముదాయములతో నిండిన పవిత్రమైన సరస్సుకు వెళ్లెను. 1

మూ. తత్రోదకముపస్పృశ్య సంధ్యామన్వాస్య పశ్చిమామ్,
ఆశ్రమం ప్రావిశద్రామః కుమ్భయోనేర్మహాత్మనః. 2

ప్ర. అ. రామః = రాముడు, తత్ర = అక్కడ, ఉదకమ్ ఉపస్పృశ్య = ఉదకమును స్పృశించి, పశ్చిమాం సంధ్యామ్ = పశ్చిమసంధ్యను, ఉపాస్య = ఉపాసించి, మహాత్మనః = మహాత్ముడైన, కుమ్భయోనేః = అగస్త్యునియొక్క, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. రాముడు అక్కడ ఆచమనము చేసి, సాయంకాలసంధ్యను ఉపాసించి, మహాత్ముడైన అగస్త్యుని ఆశ్రమములో ప్రవేశించెను. 2

మూ. తస్యాగస్త్యో బహుగుణం కన్దమూలం తథౌషధమ్,
శాల్యాదీని పవిత్రాణి భోజనార్థమకల్పయత్. 3

ప్ర. అ. అగస్త్యః = అగస్త్యుడు, తస్య = వానియొక్క, భోజనార్థమ్ =

భోజనముకొరకు, బహుగుణమ్ = చాల గుణములు గల, కన్దమూలమ్ = దుంపలను, తథా = మరియు, ఔషధమ్ = శాకాదులను, పవిత్రాణి = పవిత్రములైన, శాల్యాదీని = వరి మొదలైనవాటిని, అకల్పయత్ = ఏర్పాటుచేసెను.

తా. అగస్త్యుడు రాముని భోజనముకొరకై ఉత్తమగుణము లున్న దుంపలు, శాకములు, వరి మొదలైనవాటిని ఏర్పరచెను. 3

మూ. స భుక్తవాన్నరశ్రేష్ఠస్తదన్నమమృతోపమమ్,
ప్రీతశ్చ పరితుష్టశ్చ తాం రాత్రిం సముపావిశత్. 4

ప్ర. అ. నరశ్రేష్ఠః = నరులలో శ్రేష్ఠుడైన, సః = రాముడు, అమృతోపమమ్ = అమృతమువంటి, తత్ = ఆ, అన్నమ్ = అన్నమును, భుక్తవాన్ = భుజించినాడు. ప్రీతః చ = సంతోషించినవాడై, పరితుష్టః చ = తృప్తి చెందినవాడై, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని, సముపావిశత్ = శయనించెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన రాముడు అమృతముతో సమానమైన ఆ అన్నమును తిని తృప్తుడై సంతోషించి ఆ రాత్రి అక్కడనే శయనించెను. 4

మూ. ప్రభాతే కాల్యముత్థాయ కృత్వాహ్నికమరిందమః,
ఋషిం సముపచక్రామ గమనాయ రఘూత్తమః 5

ప్ర. అ. అరిందమః = శత్రుసంహారకుడైన, రఘూత్తమః = రాముడు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, కాల్యమ్ = తెల్లవారుజాముననే, ఉత్థాయ = లేచి, ఆహ్నికమ్ = ఆహ్నికకృత్యమును, కృత్వా = చేసికొని, గమనాయ = తిరిగి వెళ్లుటకై, ఋషిమ్ = ఋషిని, సముపచక్రామ = సమీపించెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు ప్రాతఃకాలమునందు తెల్లవారుజామునందే లేచి, ఆహ్నికకృత్యములు చేసికొని, తిరిగి వెళ్లుటకై అనుజ్ఞ పొందుటకు అగస్త్యుణ్ణి సమీపించెను. 5

మూ. అభివాద్యాబ్రవీద్రామో మహర్షిం కుమ్భసంభవమ్,
ఆపృచ్ఛే స్వాం పురీం గన్తుం మామనుజ్ఞాతుమర్హసి. 6

ప్ర. అ. రామః = రాముడు, మహర్షిమ్ = మహర్షియైన, కుమ్భసంభవమ్ =

అగస్త్యణ్ణి, అభివాద్య = నమస్కరించి, అబ్రవీత్ = పలికెను. ఆపృచ్ఛే = అనుమతి కోరుచున్నాను. స్వామ్ = నా సంబంధమైన, పురీమ్ = పట్టణమును గూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, అనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. రాముడు అగస్త్యమహర్షికి నమస్కరించి ఇట్లు పలికెను. "నేను నా నగరమునకు వెళ్లుటకు అనుమతి ఇమ్ము". 6

మూ. ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి దర్శనేన మహాత్మనః,
ద్రష్టుం చైవాగమిష్యామి పావనార్థం మహాత్మనః. 7

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడవైననీయొక్క, దర్శనేన = దర్శనముచేత, ధన్యః = ధన్యుడను, అస్మి = అయినాను. అనుగృహీతః = అనుగ్రహింపబడినవాడను, అస్మి = అయినాను, మహాత్మనః = మహాత్ములైన మిమ్ములను, ద్రష్టుమ్ = చూచుటకు, పావనార్థమ్ = పవిత్రము చేసికొనుటకు, ఆగమిష్యామి = రాగలను.

తా. మహాత్ముడవైన నీ దర్శనముచేత ధన్యుడనైతిని, అనుగ్రహింపబడితిని. మహాత్ములైన మిమ్ములను చూచుటకు, నన్ను నేను పవిత్రము చేసికొనుటకు రాగలను. 7

మూ. తథా వదతి కాకుత్స్థే వాక్యమద్భుతదర్శనమ్,
ఉవాచ పరమప్రీతో ధర్మనేత్రస్తపోధనః 8

ప్ర. అ. కాకుత్స్థే = రాముడు, తథా = అట్లు, అద్భుతదర్శనమ్ = అద్భుతమైన ఆలోచన గల, వాక్యమ్ = వాక్యమును, వదతి = పలుకుచుండగా, ధర్మనేత్రః = ధర్మము నేత్రముగా గల, తపోధనః = అగస్త్యుడు, పరమప్రీతః = చాల సంతోషించినవాడై, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఆ విధముగ అద్భుతమైన ఆలోచన గల వాక్యమును పలుకుచుండగా, ధర్మము నేత్రముగా గల ఆ మహాముని చాల సంతోషించి ఇట్లు పలికెను. 8

మూ. అత్యద్భుతమిదం వాక్యం తవ రామ శుభాక్షరమ్.
పావనః సర్వభూతానాం త్వమేవ రఘునన్దన. 9

ప్ర. అ. రామ = రామా! తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, శుభాక్షరమ్ = శుభములైన అక్షరములు గల, వాక్యమ్ = వాక్యము, అత్యద్భుతమ్ = చాల అద్భుతమైనది. రఘునన్దన = రామా! త్వమేవ = నీవే, సర్వభూతానామ్ = సమస్తప్రాణులకు, పావనః = పవిత్రము చేయువాడవు.

తా. రామా! శుభములైన అక్షరములు గల ఈ నీ వాక్యము చాల ఆశ్చర్యకరముగా ఉన్నది. రఘునందనా! నీవే సకలభూతములను పవిత్రముచేయువాడవు.

మూ. ముహూర్తమపి రామ త్వాం యే చ పశ్యన్తి కేచన,
పావితాః స్వర్గభూతాశ్చ పూజ్యాస్తే త్రిదశేశ్వరైః. 10

ప్ర. అ. రామ = రామా! యే కేచన = ఎవరైనను, త్వామ్ = నిన్ను, ముహూర్తమపి = ముహూర్తకాలమైనను, పశ్యన్తి = చూచెదరో, తే = వారు, పావితాః = పవిత్రముచేయబడినవారై, స్వర్గభూతాః = స్వర్గమును పొందినవారై, త్రిదివేశ్వరైః = దేవతలచేత, పూజ్యాః = పూజింపదగినవారు.

తా. రామా! నిన్ను ముహూర్తకాలమైనా ఎవరు చూతురో వారు పవిత్రులై స్వర్గమును పొంది దేవతలచేత పూజింపబడుదురు. 10

మూ. యే చ త్వాం ఘోరచక్షుర్భిః పశ్యన్తి ప్రాణినో భువి,
హతాస్తే యమదణ్డేన సద్యో నిరయగామినః. 11

ప్ర. అ. భువి = భూమియందు, యే చ = ఏ, ప్రాణినః = ప్రాణులు, త్వామ్ = నిన్ను, ఘోరచక్షుర్భిః = క్రూరములైన చూపులతో, పశ్యన్తి = చూతురో, తే = వారు, యమదణ్డేన = యమదండముచేత, హతాః = కొట్టబడినవారై, సద్యః = వెంటనే, నిరయగామినః = నరకమునకు వెళ్ళువారు.

ఈ భూలోకములోని ఏ ప్రాణులు నిన్ను క్రూరదృష్టులతో చూచెదరో వాళ్ళు యమదండముచేత కొట్టబడి వెంటనే నరకములో పడుదురు. 11

మూ. ఈదృశస్త్వం రఘుశ్రేష్ఠ పావనః సర్వదేహినామ్,
భువి త్వాం కథయన్తో హి సిద్ధిమేష్యన్తి రాఘవ. 12

ప్ర. అ. రఘుశ్రేష్ఠ = రఘువంశీయులలో శ్రేష్ఠుడా! రాఘవ = రామా!

త్వమ్ = నీవు, సర్వదేహినామ్ = సమస్త ప్రాణులకు, ఈదృశః = ఇట్టి, పావనః = పవిత్రముచేయువాడవు. భువి = భూలోకమునందు, త్వామ్ = నిన్ను గూర్చి, కథయన్తః = చెప్పుచున్నవాళ్ళు, సిద్ధిమ్ = సిద్ధిని, ఏష్యన్తి = పొందగలరు.

తా. రామా! నీవు సకలప్రాణులను ఈ విధముగ పవిత్రులను చేయగలవాడవు. రాఘవా! భూలోకములో నిన్ను గూర్చి చెప్పుకొనువారు సిద్ధిని పొందుదురు. 12

మూ. త్వం గచ్ఛారిష్టమవ్యగ్రః పన్థానమకుతోభయమ్,
ప్రశాధి రాజ్యం ధర్మేణ గతిర్హి జగతో భవాన్. 13

ప్ర. అ. త్వమ్ = నీవు, అవ్యగ్రః = క్లేశరహితుడవై, అరిష్టమ్ = శుభకరమైన, అకుతోభయమ్ = ఎక్కడినుండీ భయము లేని, పన్థానమ్ = మార్గమును గూర్చి, గచ్ఛ = వెళ్ళుము. రాజ్యమ్ = రాజ్యమును, ధర్మేణ = ధర్మముతో, ప్రశాధి = పాలించుము. భవాన్ = నీవు, జగతః = జగత్తుకు, గతిః హి = గతివి కదా ?

తా. నీవు ఎట్టి క్లేశములూ లేనివాడవై మంగళకరమైన, ఎక్కడినుండీ భయములేని మార్గమున వెళ్ళుము. రాజ్యమును ధర్మముచే పరిపాలించుము. నీవే ఈ జగత్తుకు గతివి కదా ? 13

మూ. ఏవముక్తస్తు మునినా ప్రాఞ్జలిప్రగ్రహో నృపః,
అభ్యవాదయత ప్రాజ్ఞస్తమృషిం పుణ్యశీలినమ్. 14

ప్ర. అ. మునినా = మునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, నృపః = రాజు, ప్రాఞ్జలిప్రగ్రహః = కట్టపడిన అంజలిగ్రహణము గలవాడై, ప్రాజ్ఞమ్ = బుద్ధిమంతుడైన, పుణ్యశీలినమ్ = పుణ్యస్వభావము గల, తమ్ ఋషిమ్ = ఆ ఋషిని, అభ్యవాదయత = నమస్కరించెను.

తా. రాముడు ఆ మునీశ్వరుని మాటలు విని పుణ్యశీలము గల అతనికి అంజలి ఘటించి నమస్కరించెను. 14

మూ. అభివాద్య ఋషిశ్రేష్ఠం తాంశ్చ సర్వాం స్తపోధనాన్,
అధ్యారోహత్తదవ్యగ్రః పుష్పకం హేమభూషితమ్. 15

ప్ర. అ. ఋషిశ్రేష్ఠమ్ = ఋషిశ్రేష్ఠుణ్ణి, సర్వాన్ = సమస్తమైన, తాన్ = ఆ, తపోధనాన్ = మునులను, అభివాద్య = నమస్కరించి, హేమభూషితమ్ = బంగారముచేత అలంకరించబడిన, తత్ = ఆ, పుష్పకమ్ = పుష్పకమును, అవ్యగ్రః = సావధానచిత్తుడై, అధ్యారోహత్ = ఎక్కెను.

తా. ఆ అగస్త్యమహామునికి, సమస్తమైన ఆ మునీశ్వరులకు నమస్కరించి, బంగారముచేత అలంకరించబడిన ఆ పుష్పకమును సావధానచిత్తుడై ఎక్కెను. 15

మూ. తం ప్రయాన్తం మునిగణా ఆశీర్వాదైః సమన్తతః,
అపూజయన్ మహేన్ద్రాభం సహస్రాక్షమివామరాః. 16

ప్ర. అ. మునిగణాః = మునిసముదాయములు, ప్రయాన్తమ్ = వెళ్ళుచున్న, మహేన్ద్రాభమ్ = మహేంద్రుని వంటి కాంతి గల, తమ్ = ఆ రాముణ్ణి, అమరాః = దేవతలు, సహస్రాక్షమివ = ఇంద్రుణ్ణి వలె, సమన్తతః = అన్ని వైపులా, ఆశీర్వాదైః = ఆశీర్వాదములతో, అపూజయన్ = పూజించినవి.

తా. మును లందరూ వెళ్ళుచున్న మహేంద్రుని వంటి ఆ రాముణ్ణి దేవతలు ఇంద్రుణ్ణి వలె, అన్ని వైపులనుండీ ఆశీర్వాదములతో పూజించినవి. 16

మూ. స్వస్థః స దదృశే రామః పుష్పకే హేమభూషితే,
శశీ మేఘసమీపస్థో యథా జలధరాగమే. 17

ప్ర. అ. హేమభూషితే = బంగారముచేత అలంకరించబడిన, పుష్పకే = పుష్పకమునందు, స్వస్థః = సుఖముగా కూర్చున్న, రామః = రాముడు, జలధరాగమే = వర్షకాలమునందు, మేఘసమీపస్థః = మేఘసమీపమునందున్న, శశీ యథా = చంద్రుడు వలె, దదృశే = చూడబడెను.

తా. బంగారముచేత అలంకరించబడిన పుష్పకములో సుఖముగా కూర్చున్న రాముడు వర్షకాలమునందు మేఘము దగ్గర నున్న చంద్రుడు వలె ప్రకాశించెను. 17

మూ. తతోఽర్ధదివసే ప్రాప్తే పూజ్యమానస్తతస్తతః,
అయోధ్యాం ప్రాప్య కాకుత్స్థో మధ్యకక్ష్యామవాతరత్. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అర్ధదివసే = మధ్యాహ్నసమయము, ప్రాప్తే = వచ్చినదగుచుండగా, కాకుత్స్థః = రాముడు, తతస్తతః = ఆ యా ప్రదేశములయందు, పూజ్యమానః = పూజింపబడుచు, అయోధ్యామ్ = అయోధ్యను, ప్రాప్య = పొంది, మధ్యకక్షామ్ = మధ్యవాకిలిని (యందు), అవాతరత్ = దిగెను.

తా. రాముడు మధ్యాహ్నమయే సరికి అయోధ్య చేరి అక్కడక్కడ పూజింపబడుచు, మధ్యవాకిలిలో దిగెను. 18

మూ. తతో విసృజ్య రుచిరం పుష్పకం కామగామినమ్,
విసర్జయిత్వా గచ్ఛేతి స్వస్తి తేఽస్త్వితి చ ప్రభుః 19
కక్షాన్తరస్థితం క్షిప్రం ద్వాఃస్థం రామోఽబ్రవీద్వచః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రభుః = ప్రభువైన, రామః = రాముడు, గచ్ఛ = వెళ్ళుము, తే = నీకు, స్వస్తి = క్షేమము, అస్తు = అగుగాక, ఇతి = అని, రుచిరమ్ = సుందరమైన, కామగామినమ్ = స్వేచ్ఛగా వెళ్ళు, పుష్పకమ్ = పుష్పకమును, విసర్జయిత్వా = విడచి, కక్షాన్తరస్థితమ్ = వాకిలి మధ్యయందున్న, ద్వాఃస్థమ్ = ద్వారపాలకుణ్ణి గూర్చి, క్షిప్రమ్ = శీఘ్రముగా, వచః = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట ప్రభువైన రాముడు "నీవు వెళ్ళుము; నీకు క్షేమ మగుగాక" అని వలుకుచు సుందరమైన, స్వేచ్ఛగా ప్రయాణము చేయు పుష్పకవిమానమును పంపివేసి, వాకలి మధ్యయందున్న ద్వారపాలకునితో తొందరగా ఇట్లు పలికెను. 19

మూ. లక్ష్మణం భరతం చైవ గత్వా తౌ లఘువిక్రమౌ, 20
మమాగమనమాఖ్యాయ శబ్దాపయ చ మా చిరమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వ్యశీతితమః సర్గః.

ప్ర. అ. లఘువిక్రమౌ = శీఘ్రమైన వరాక్రమము గల, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, భరతం చ ఏవ = భరతుణ్ణి గూర్చి, గత్వా = వెళ్ళి, మమ =

నాయొక్క, ఆగమనమ్ = రాకను గూర్చి, ఆఖ్యాయ = చెప్పి, శబ్దాపయ = పిలువుము. చిరమ్ = చిరకాలము, మా = చేయవద్దు.

తా. శీఘ్రమైన పరాక్రమము గల లక్ష్మణ భరతుల దగ్గరికి వెళ్ళి, నేను వచ్చినట్లు చెప్పి నావద్దకు పిలువుము. ఆలస్యము చేయవద్దు. 20

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఎనబైరెండవ సర్గ సమాప్తము.

# అథ త్ర్యశీతితమః సర్గః

*[భరతుడు సలహా చెప్పగా రాముడు రాజసూయయాగము చేయు ప్రయత్నమునుండి విరమించుట.]*

మూ. తచ్ఛ్రుత్వా భాషితం తస్య రామస్యాక్లిష్టకర్మణః,
ద్వాఃస్థః కుమారావాహూయ రాఘవాయ న్యవేదయత్ 1

ప్ర. అ. అక్లిష్టకర్మణః = క్లేశము లేని పనులు గల, రామస్య = రాముని యొక్క, తత్ = ఆ, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, ద్వాఃస్థః = ద్వార పాలకుడు, కుమారౌ = ఆ రాజకుమారులను, ఆహూయ = పిలుచుకొనివచ్చి, రాఘవాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. ద్వారపాలకుడు క్లేశము లేని పనులు గల రాముని మాటలు విని, లక్ష్మణభరతులను తీసికొనివచ్చి రామునకు తెలిపెను. 1

మూ. దృష్ట్వా తు రాఘవః ప్రాప్తావుభౌ భరతలక్ష్మణౌ,
పరిష్వజ్య తతో రామో వాక్యమేతదువాచ హ 2

ప్ర. అ. రాఘవః = రఘువంశసంజాతుడైన, రామః = రాముడు, భరత లక్ష్మణౌ = భరత లక్ష్మణులను, ఉభౌ = ఇద్దరినీ, ప్రాప్తౌ = వచ్చినవారినిగా, దృష్ట్వా = చూచి, పరిష్వజ్య = కౌగలించుకొని, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. రాముడు భరతశత్రుఘ్నులిద్దరూ వచ్చినట్లు చూచి, వాళ్ళను కౌగలించుకొని ఇట్లు పలికెను. 2

మూ. కృతం మయా యథాతథ్యం ద్విజకార్యమనుత్తమమ్,
ధర్మసేతుమథో భూయః కర్తుమిచ్ఛామి రాఘవౌ. 3

ప్ర. అ. రాఘవౌ = భరతలక్ష్మణులారా! మయా = నాచేత, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, ద్విజకార్యమ్ = బ్రాహ్మణుని కార్యము, యథా = ఎట్లు, తథ్యమ్ = యథార్థముగా, కృతమ్ = చేయబడినదో, అథో = ఇటుపిమ్మట, భూయః = మరల, ధర్మసేతుమ్ = ధర్మమునకు సేతువును, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. భరత శత్రుఘ్నులారా! అత్యుత్తమమైన బ్రాహ్మణకార్యమును చేసినట్లే ఇపుడు మరల ధర్మసేతువును, రాజ ధర్మమునకు సంబంధించిన అత్యుత్తమ మర్యాదను, చేయవలె నని కోరుచున్నాను. (రాజసూయము చేయు అర్హత రాజుకు మాత్రమే ఉన్నది గాన అది రాజధర్మానికి సంబంధించిన అత్యున్నతమైన పరిధి అని భావము.)

మూ. అక్షయ శ్చావ్యయ్యశ్చైవ ధర్మసేతుర్మతో మమ,
ధర్మప్రసాధకం హ్యేతత్సర్వపాపప్రణాశనమ్. 4

ప్ర. అ. ధర్మసేతుః = ధర్మసేతువు, అక్షయః చ ఏవ = క్షయము లేనిది అని, అవ్యయః చ ఏవ = వ్యయము లేనిది అని, మమ = నాకు, మతః = ఇష్టము. ఏతత్ = ఇది, ధర్మప్రసాధకమ్ = ధర్మమును సాధించునది. సర్వపాప ప్రణాశనమ్ = సమస్త పాపములను నశింపచేయునది.

తా. ఈ ధర్మసేతువు అక్షయము, వ్యయరహితము అని నా అభిప్రాయము. ఇది ధర్మమును పోషించును, సమస్తపాపములను నశింపచేయును. 4

మూ. యువాభ్యామాత్మభూతాభ్యాం రాజసూయమనుత్తమమ్,
సహితో యష్టుమిచ్ఛామి తత్ర ధర్మస్తు శాశ్వతః. 5

ప్ర. అ. ఆత్మభూతాభ్యామ్ = నా ఆత్మలైన, యువాభ్యామ్ = మీ ఇద్దరితో, సహితః = కూడినవాడనై, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, రాజసూయమ్ = రాజసూయమును, యష్టుమ్ = చేయుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. తత్ర = దానియందు, ధర్మః = ధర్మము, శాశ్వతః = శాశ్వతము.

తా. నాకు ఆత్మవంటివారైన మీ ఇద్దరితో కలిసి అత్యుత్తమమైన రాజసూయము చేయవలె నని కోరుచున్నాను. దానియందు ధర్మము శాశ్వతముగా నిలచి ఉండును. 5

మూ. ఇష్ట్వా తు రాజసూయేన మిత్రః శత్రునిబర్హణః,
సుహుతేన సుయజ్ఞేన వరుణత్వముపాగమత్. 6

ప్ర అ. శత్రునిబర్హణః = శత్రువినాశకుడైన, మిత్రః = మిత్రుడు, సుహుతేన = బాగా హోమము చేయబడిన, సుయజ్ఞేన = మంచి యజ్ఞమైన, రాజసూయేన = రాజసూయముచేత, ఇష్ట్వా = యాగముచేసి, వరుణత్వమ్ = వరుణత్వమును, ఉపాగమత్ = పొందెను.

తా. శత్రువినాశకుడైన మిత్రుడు బాగా నిర్వహింపబడిన ఉత్తమయజ్ఞమైన రాజసూయము చేసి వరుణత్వమును పొందెను. 6

మూ. సోమశ్చ రాజసూయేన ఇష్ట్వా ధర్మేణ ధర్మవిత్,
ప్రాప్తశ్చ సర్వలోకేషు కీర్తిం స్థానం చ శాశ్వతమ్. 7

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మవేత్త అయిన, సోమః చ = సోముడు కూడ, ధర్మేణ = ధర్మముచేత, రాజసూయేన ఇష్ట్వా = రాజసూయయాగము చేసి, సర్వలోకేషు = సమస్తలోకములయందు, కీర్తిం చ = కీర్తిని, శాశ్వతమ్ = శాశ్వతమైన, స్థానం చ = స్థానమును, ప్రాప్తః = పొందినాడు.

తా. ధర్మముల నెరిగిన సోముడు కూడ ధర్మానుసారముగా రాజసూయము చేసి సకలలోకములలో కీర్తిని, శాశ్వతమైన స్థానమును పొందెను. 7

మూ. అస్మిన్నహని యచ్ఛ్రేయశ్చిన్త్యతాం తన్మయా సహ,
హితం చాయతియుక్తం చ ప్రయతౌ వక్తుమర్హథః. 8

ప్ర. అ. అస్మిన్ = ఈ, అహని = దినమునందు, మయా సహ = నాతో కూడ, యత్ = ఏది, శ్రేయః = శ్రేయస్కరమో అది, చిన్త్యతామ్ = చింతింపబడుగాక. ప్రయతౌ = శ్రద్ధావంతులై (బాగా ఆలోచించినవారై), హితం చ = హితమూ, ఆయతియుక్తం చ = మంచి భవిష్యత్తు కలదీ అయినదానిని, వక్తుమ్ = చెప్పుటకు, అర్హథః = తగిఉన్నారు.

తా. మనకు ఏది శ్రేయస్కరమో మీరు నేడు నాతో ఆలోచించుడు. శ్రద్ధగా ఆలోచించి ఏది హితమో, ఏది మున్ముందు మంచి ఫలము నిచ్చునో అది చెప్పుడు. 8

మూ. శ్రుత్వా తు రాఘవస్యైతద్వాక్యం వాక్యవిశారదః,
భరతః ప్రాఞ్జలిర్భూత్వా వాక్యమేతదువాచ హ. 9

ప్ర. అ. వాక్యవిశారదః = వాక్యములయందు నేర్పు గల, భరతః = భరతుడు, రాఘవస్య = రామునియొక్క, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. వాక్యములలో నేర్పరియైన భరతుడు రాముడు పలికిన ఈ మాటలు విని అంజలి ఘటించి ఇట్లు పలికెను. 9

మూ. త్వయి ధర్మః పరః సాధో త్వయి సర్వా వసుంధరా,
ప్రతిష్ఠితా మహాబాహో యశశ్చామితవిక్రమ. 10

ప్ర. అ. సాధో = సత్పురుషుడా! మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! అమితవిక్రమ = అమితమైన పరాక్రమము కలవాడా! త్వయి = నీయందు, సర్వా = సమస్తమైన, వసుంధరా = భూమి, ప్రతిష్ఠితా = నిలబడినది. త్వయి = నీయందు, పరః = గొప్ప, ధర్మః = ధర్మము, యశః చ = కీర్తి (ప్రతిష్ఠితములైనవి).

తా. సత్పురుషుడా! మహాబాహూ! అమితమైన పరాక్రమము కలవాడా! నీ యందే ధర్మము ప్రతిష్ఠితమైనది. నీ యందే సమస్తమైన భూమి ప్రతిష్ఠితమైనది, నీ యందే కీర్తి ప్రతిష్ఠితమైనది. 10

మూ. మహీపాలాశ్చ సర్వే త్వాం ప్రజాపతిమివామరాః,
నిరీక్షన్తే మహాత్మానం లోకనాథం యథా వయమ్. 11

ప్ర. అ. సర్వే = సమస్తమైన, మహీపాలాః = రాజులు, అమరాః = దేవతలు, ప్రజాపతిమ్ ఇవ = బ్రహ్మదేవుణ్ణి వలె, మహాత్మానమ్ = మహాత్ముడవు, లోకనాథమ్ = లోకనాథుడవు, అయిన, త్వామ్ = నిన్ను, వయమ్ = మేము, యథా = ఎట్లో అట్లు, నిరీక్షన్తే = చూచుచున్నారు.

తా. రాజులందరూ మహాత్ముడవు, లోకములకు నాథుడవూ అయిన నిన్ను,

దేవతలు బ్రహ్మదేవునివలె చూచుచున్నారు; నిన్ను మేము ఎట్లు చూచుచున్నామో ఆట్లు చూచుచున్నారు. 11

మూ. పుత్రాశ్చ పితృవద్రాజన్ పశ్యన్తి త్వాం మహాబల,
పృథివ్యా గతిభూతోఽసి ప్రాణినామపి రాఘవ. 12

ప్ర. అ. రాజన్ = రాజా! రాఘవ = రామా! మహాబల = గొప్ప బలము గలవాడా! పుత్రాః = పుత్రులు, పితృవత్ = తండ్రిని వలె, త్వామ్ = నిన్ను, పశ్యన్తి = చూచుచున్నారు. పృథివ్యాః = భూమికీ, ప్రాణినామ్ అపి = సకలప్రాణులకు కూడ, గతిభూతః అసి = గతి అయి ఉన్నావు.

తా. గొప్ప బలము గల రాజా! రామా! రాజు లందరు నిన్ను పుత్రులు తండ్రిని చూచినట్లు చూచుచున్నారు. భూమికి, సకలప్రాణులకీ కూడ నీవే గతివి. 12

మూ. స త్వమేవంవిధం యజ్ఞమాహర్తాసి కథం నృప,
పృథివ్యా రాజవంశానాం వినాశో యత్ర దృశ్యతే. 13

ప్ర. అ. నృప = రాజా! సః త్వమ్ = అట్టి నీవు, యత్ర = దేనియందు, పృథివ్యాః = భూమియొక్క, రాజవంశానామ్ = రాజవంశములయొక్క, వినాశః = వినాశము, దృశ్యతే = చూడబడుచున్నదో, ఏవం విధమ్ = ఇట్టి, యజ్ఞమ్ = యజ్ఞమును, కథమ్ = ఎట్లు, ఆహర్తాసి = చేయగలవు.

తా. రాజా! ఏ యజ్ఞమువలన భూమిమీద ఉన్న రాజవంశము లన్నీ నశించుటకు అవకాశ మున్నదో అట్టి యజ్ఞమును, అంత గౌరవపాత్రుడవైన నీవెట్లు చేసెదవు? 13

మూ. పృథివ్యాం యే చ పురుషా రాజన్ పౌరుషమాగతాః,
సర్వేషాం భవితా తత్ర సంక్షయః సర్వకోపజః. 14

ప్ర. అ. రాజన్ = రాజా! పృథివ్యామ్ = భూమిమీద, పౌరుషమ్ = పౌరుషమును, ఆగతాః = పొందిన, యే చ = ఏ, పురుషాః = పురుషులు గలరో, సర్వేషామ్ = వాళ్ళ అందరియొక్క, సర్వకోపజః = అందరి కోపమువలన కలిగిన, సంక్షయః = క్షయము, భవితా = కాగలదు.

తా. భరతునితో శుభమైన వాక్యమును పలికెను. "దోషము లేనివాడా? ఇప్పుడు నీ మాటలచేత నాకు చాల ఆనందము కలిగినది". 17

మూ. ఇదం వచనమక్లీబం త్వయా ధర్మసమాగతమ్,
వ్యాహృతం పురుషవ్యాఘ్ర పృథివ్యాః పరిపాలనమ్. 18

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా! త్వయా = నీచేత, ధర్మసమాగతమ్ = ధర్మముతో కూడినది, పృథివ్యాః = భూమికి, పరిపాలనమ్ = పాలించునది అయిన, ఇదం వచనమ్ = ఈ ఈ వచనము, అక్లీబమ్ = ధైర్యముగా, వ్యాహృతమ్ = పలకబడినది.

తా. పురుషశ్రేష్ఠుడా! నీవు ధర్మసంమతము, భూమికి పాలనహేతువు అయిన ఈ వాక్యమును నిర్భయముగా చెప్పినావు. 18

మూ. ఏష తస్మాదభిప్రాయం రాజసూయాత్ క్రతూత్తమాత్,
నివర్తయామి ధర్మజ్ఞ తవ సువ్యాహృతేన చ. 19

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! ఏషః = ఈ నేను, తవ = నీ యొక్క, సువ్యాహృతేన = మంచి మాటచేత, తస్మాత్ = ఆ, క్రతూత్తమాత్ = క్రతువులతో శ్రేష్ఠమైన, రాజసూయాత్ = రాజసూయమునుండి, అభిప్రాయమ్ = అభిప్రాయమును, నివర్తయామి = మరలించుచున్నాను.

తా. ధర్మములు తెలిసిన భరతా! నీవు పలికిన మంచి మాటల ప్రకారము నేను క్రతువులలో శ్రేష్ఠమైన ఈ రాజసూయమునుండి నా అభిప్రాయమును నివర్తింపచేయుచున్నాను. 19

మూ. లోకపీడాకరం కర్మ న కర్తవ్యం విచక్షణైః,
బాలానాం తు శుభం వాక్యం గ్రాహ్యం లక్ష్మణపూర్వజ,
తస్మాచ్ఛృణోమి తే వాక్యం సాధు యుక్తం మహాబల 20.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్ర్యశీతితమః సర్గః

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గలవాడా! లక్ష్మణపూర్వజ =

భరతుడా! విచక్షణైః = బుద్ధిమంతులచేత, లోకపీడాకరమ్ = లోకపీడను చేయు, కార్యమ్ = కార్యము, న కర్తవ్యమ్ = చేయదగినది కాదు. బాలానామ్ = చిన్న వాళ్ళయొక్క, శుభం వాక్యం తు = మంచి వాక్యమైతే, గ్రాహ్యమ్ = గ్రహించ దగినది. తస్మాత్ = ఆ కారణమువలన, సాధు = మంచి దైన, యుక్తమ్ = తగిన తే వాక్యమ్ = నీ వాక్యమును, శృణోమి = వినుచున్నాను.

తా. బలశాలివైన భరతా! బుద్ధిమంతులు లోకపీడాహేతువైన పని చేయ గూడదు చిన్నవారి మంచి మాట గ్రహింపదగినది. అందువలన మంచిదీ, యుక్తి యుక్తమూ అయిన నీ మాట వినుచున్నాను.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఎనభైమూడవ సర్గ సమాప్తము.

# అథ చతురశీతితమః సర్గః.

[లక్ష్మణుడు అశ్వమేధయాగమును గూర్చి చెప్పుచు ఇంద్ర వృత్రుల కథను చెప్పుట. వృత్రుడు తపస్సు చేయుట. అతనిని చంపుమని ఇంద్రుడు విష్ణువును ప్రార్థించుట].

మూ. తథోక్తవతి రామే తు భరతే చ మహాత్మని,
లక్ష్మణోఽథ శుభం వాక్యమువాచ రఘునన్దనమ్. 1

ప్ర. అ. రామే = రాముడు, మహాత్మని = మహాత్ముడైన, భరతే చ = భరతుడూ, తథా = అట్లు, ఉక్తవతి = పలికినవాడగుచుండగా, అథ = అటుపిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, రఘునన్దనమ్ = రాముణ్ణి గూర్చి, శుభమ్ = శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముడు, భరతుడు పలికిన మాటలు విని లక్ష్మణుడు రామునితో శుభమైన వాక్యము పలికెను. 1

మూ. అశ్వమేధో మహాయజ్ఞః పావనః సర్వపాప్మనామ్,
పావనస్తవ దుర్ధర్షో రోచతాం రఘునన్దన. 2

ప్ర. అ. మహాయజ్ఞః = మహాయజ్ఞమైన, అశ్వమేధః = అశ్వమేధము, సర్వపాప్మనామ్ = సమస్తపాపములకు, పావనః = పవిత్రింపచేయునది. రఘునన్దన = రామా! దుర్ధర్షః = ఎదిరింప శక్యము కాని, పావనః = పవిత్రము చేయు ఆ యజ్ఞము, తవ = నీకు, రోచతామ్ = ఇష్ట మగుగాక.

తా. రామా! అశ్వమేధమహాయజ్ఞము సర్వపాపములను తొలగించును. ఎదిరింప శక్యముకాని పవిత్రత్వమును చేకూర్చు ఆ యజ్ఞము నీకు ఇష్టమగుగాక.

మూ. శ్రూయతే హి పురా వృత్తం వాసవే సుమహాత్మని,
బ్రహ్మహత్యావృతః శక్రో హయమేధేన పావితః. 3

ప్ర. అ. సుమహాత్మని = చాల గొప్పవాడైన, వాసవే = దేవేంద్రుని విషయమునందు, పురా = పూర్వము, వృత్తమ్ = జరిగినది, శ్రూయతే హి = విన బడుచున్నది కదా. బ్రహ్మహత్యావృతః = బ్రహ్మహత్యతో కూడిన, శక్రః = ఇంద్రుడు, హయమేధేన = అశ్వమేధముచేత, పావితః = పవిత్రము చేయబడినాడు.

తా. మహాత్ముడైన ఇంద్రుని విషయమున పూర్వము జరిగిన కథ ప్రసిద్ధమే కదా? బ్రహ్మహత్యాపాపము తగిలిన ఇంద్రుడు అశ్వమేధముచేత పవిత్రుడైనాడు. 3

మూ. పురా కిల మహాబాహో దేవాసురసమాగమే,
వృత్రో నామ మహానాసీద్దైతేయో లోకసంమతః. 4

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! పురా = పూర్వము, దేవాసురసమాగమే = దేవాసురుల స్నేహకాలమునందు, లోకసంమతః = లోకమునకు ఇష్టుడైన, వృత్రో నామ = వృత్రుడను, మహాన్ = గొప్ప, దైతేయః = అసురుడు, ఆసీత్ = ఉండెను.

తా. మహాబాహూ! దేవాసురులు స్నేహముగా ఉంటూన్న పూర్వకాలమునందు లోకములకు ఇష్టుడైన వృత్రుడనే గొప్ప దైత్యుడు ఉండెను. 4

మూ. విస్తీర్ణో యోజనశతముచ్ఛ్రితస్త్రిగుణం తతః
అనురాగేణ లోకాంస్త్రీన్ స్నేహాత్ పశ్యతి సర్వతః. 5

ప్ర. అ. యోజనశతమ్ = నూరు యోజనములు, విస్తీర్ణః = విస్తారము కలవాడు, తతః = అంతకంటె, త్రిగుణమ్ = మూడు రెట్లు, ఉచ్ఛ్రితః = ఎత్తైన వాడూ అయిన అతడు, త్రీన్ లోకాన్ = మూడు లోకములను, సర్వతః = అన్ని విధాల, అనురాగేణ = అనురాగముతోను, స్నేహాత్ = స్నేహమువలన, పశ్యతి = చూచును.

తా. వంద యోజనములు లావు, మూడు వందల యోజనముల ఎత్తూ ఉన్న అతడు మూడులోకాలనూ కూడ స్నేహానురాగాలతో చూచుచుండెడివాడు.

మూ. ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ బుద్ధ్యా చ పరినిష్ఠితః,
శశాస పృథివీం స్ఫీతాం ధర్మేణ సుసమాహితః. 6

ప్ర. అ. ధర్మజ్ఞః చ=ధర్మములు తెలిసినవాడు, కృతజ్ఞః చ=కృతజ్ఞుడు, బుద్ధ్యా=బుద్ధితో, పరినిష్ఠితః చ=కూడినవాడూ అయిన అతడు, సుసమాహితః= బాగుగా సావధానచిత్తుడై, స్ఫీతామ్=విశాలమైన, పృథివీమ్=భూమిని, ధర్మేణ= ధర్మముచేత, శశాస = పాలించెను.

తా. ధర్మములు తెలిసినవాడు, కృతజ్ఞుడు, బుద్ధిశాలీ అయిన అతడు సావధానచిత్తుడై విశాలమైన భూమిని ధర్మముచేత పాలించెను. 6

మూ. తస్మిన్ ప్రశాసతి తదా సర్వకామదుఘా మహీ,
రసవన్తి ప్రసూనాని మూలాని చ ఫలాని చ. 7

ప్ర. అ. తదా = అప్పుడు, తస్మిన్ = అతడు, మహీమ్ = భూమిని, ప్రశాసతి = శాసించుచుండగా, మహీ = భూమి, సర్వకామదుఘా = సకలకామములను ఇచ్చేదిగా ఉండెను. ప్రసూనాని=పుష్పములు, మూలాని చ=మూలములు, ఫలాని చ = ఫలములు, రసవన్తి = రసము గలవి.

తా. అప్పుడు అతడు శాసించుచున్న కాలమునందు భూమి సమస్తకామములను ఇచ్చెను. పుష్పములు మూలములు, ఫలములు రసభరితములై ఉండెను. 7

మూ. అకృష్టపచ్యా పృథివీ సుసంపన్నా మహాత్మనః,
స రాజ్యం తాదృశం భుఙ్క్తే స్ఫీతమద్భుతదర్శనమ్. 8

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన అతనియొక్క, పృథివీ = భూమి, అకృష్టపచ్యా = దున్నకుండగనే పండేదిగాను, సుసంపన్నా = సుసమృద్ధముగాను ఉండెను. సః = అతడు, స్ఫీతమ్ = విశాలమైన, అద్భుతదర్శనమ్ = అద్భుతమైన దర్శనము గల, తాదృశమ్=అట్టి, రాజ్యమ్=రాజ్యమును, భుఙ్క్తే = అనుభవించుచున్నాడు.

తా. మహాత్ముడైన అతని భూమి దున్నకనే పండుచు సుసమృద్ధమై ఉండెను. అతడు అతివిశాలమైన, ఆశ్చర్యకరమైన అట్టి రాజ్యమును అనుభవించెను. 8

మూ. తస్య బుద్ధిః సముత్పన్నా తపః కుర్యామనుత్తమమ్,
తపో హి పరమం శ్రేయః సంమోహమితరత్సుఖమ్. 9

ప్ర. అ. తస్య = అతనికి, బుద్ధిః = బుద్ధి, సముత్పన్నా = పుట్టినది. అనుత్తమమ్ = చాల ఉత్తమమైన, తపః = తపస్సును, కుర్యామ్ = చేయుదును గాక. తపః=తపస్సు, పరమమ్ = గొప్పదైన, శ్రేయః=శ్రేయస్సు, ఇతరత్ = ఇతరమైన, సుఖమ్ = సుఖము, సంమోహమ్ = మోహాత్మకమైనది.

తా. "నేను అత్యుత్తమమైన తపస్సు చేసెదను. తపస్సు చాల శ్రేయస్కరము. ఇతర సుఖము లన్నీ మోహజనకములు" అని ఆతనికి అభిప్రాయము కలిగెను. 9

మూ. స నిక్షిప్య సుతం జ్యేష్ఠం పౌరేషు మధురేశ్వరమ్,
తప ఉగ్రం సమాతిష్ఠత్తాపయన్ సర్వదేవతాః. 10

ప్ర. అ. సః = అతడు, జ్యేష్ఠం సుతమ్ = పెద్ద కుమారుడైన, మధురేశ్వరమ్ = మధురు డను ప్రభువును, పౌరేషు=పౌరులయందు, నిక్షిప్య = ఉంచి, సర్వదేవతాః = సకలదేవతలను, తాపయన్ = తపింపచేయుచు, ఉగ్రమ్ = ఉగ్రమైన, తపః = తపస్సును, సమాతిష్ఠత్ = చేసెను.

తా. అతడు తన జ్యేష్ఠకుమారుడైన మధురుడు అను ప్రభువును ప్రజలకు అధిపతినిగా చేసి సకలదేవతలకు భయము కలుగునట్లు ఉగ్రమైన తపస్సు చేసెను. 10

మూ. తపస్తప్యతి వృత్రే తు వాసవః పరమార్తవత్,
విష్ణుం సముపసంక్రమ్య వాక్యమేతదువాచ హ. 11

ప్ర. అ. వృత్రే = వృత్రాసురుడు, తపః = తపస్సును, తప్యతి = చేయుచుండగా, వాసవః = దేవేంద్రుడు, పరమార్తవత్ = చాల దుఃఖితుడై, విష్ణుమ్ = విష్ణువును, సముపసంక్రమ్య = చేరి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. వృత్రుడు తపస్సు చేయుట చూచి ఇంద్రుడు భయార్తుడై విష్ణువు దగ్గరకు వెళ్ళి ఇట్లు పలికెను. 11

మూ. తపస్యతా మహాబాహో లోకాః సర్వే వినిర్జితాః,
బలవాన్స హి ధర్మాత్మా నైనం శక్ష్యామి శాసితుమ్. 12

ప్ర. అ. మహాబాహో = మహాబాహూ! తపస్యతా = తపస్సుచేయుచున్న వానిచేత, సర్వే = సమస్తమైన, లోకాః = లోకములు, వినిర్జితాః = జయించ బడినవి. సః = ఆ, ధర్మాత్మా = ధర్మాత్ముడైన వృత్రుడు, బలవాన్ = బలవంతుడు. ఏనమ్ = వీనిని, శాసితుమ్ = శాసించుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాను.

తా. మహాబాహూ! తపస్సు చేయుచున్న ఆ వృత్రుడు అన్ని లోకాలను జయించినాడు. ధర్మాత్ముడైన అతడు చాలా బలవంతుడు. నేను అతనిని శాసించ జాలను. 12

మూ. యద్యసౌ తప ఆతిష్ఠేద్భూయ ఏవ సురేశ్వర,
యావల్లోకా ధరిష్యన్తి తావదస్య వశానుగాః. 13

ప్ర. అ. సురేశ్వర = దేవతల అధిపతీ! అసౌ = ఇతడు, భూయః ఏవ = ఇంకను, తపః = తపస్సును, ఆతిష్ఠేత్ యది = చేసినట్లయితే, లోకాః = లోక ములు, యావత్ = ఎంతవరకు, ధరిష్యన్తి = నిలచునో, తావత్ = అంతవరకు, అస్య = వీనికి, వశానుగాః = వశములై ఉండును.

తా. దేవతల ప్రభువైన ఓ! విష్ణూ! అతడు ఇంకా తపస్సు చేసినచో ఈ లోకము లున్నంతవరకు ఇతనికి వశములై ఉండును. 13

మూ. తం చైనం పరమోదారముపేక్షసి మహాబలమ్,
క్షణం హి న భవేద్వృత్రః క్రుద్ధే త్వయి సురేశ్వర. 14

ప్ర. అ. సురేశ్వర = దేవతల ఈశ్వరుడా! మహాబలమ్ = గొప్ప బలము గల, పరమోదారమ్ = చాల ఉదారుడైన, తమ్ ఏనమ్ = అట్టి వానిని, ఉపేక్షసి = ఉపేక్షించుచున్నావు. త్వయి = నీవు, క్రుద్ధే = కోపించినవాడవగుచుండగా, వృత్రః = వృత్రుడు, క్షణమ్ = క్షణమును కూడ, న భవేత్ = ఉండడు.

తా. సురాధీశా! చాల ఉదారస్వభావము గల, మహాబలశాలియైన ఇతనిని ఉపేక్షించుచున్నావు. నీవు కోపించినచో వృత్రుడు క్షణకాలము కూడ ఉండడు కదా. 14

మూ. యదా హి ప్రీతిసంయోగం త్వయా విష్ణో సమాగతః,
తదా ప్రభృతి లోకానాం నాథత్వముపలబ్ధవాన్. 15

ప్ర. అ. విష్ణో = విష్ణూ! యదా = ఎప్పుడు, త్వయా = నీతో, ప్రీతి సంయోగమ్ = స్నేహమును, సమాగతః = పొందినాడో, తదా ప్రభృతి = అది మొదలు, లోకానామ్ = లోకములకు, నాథత్వమ్ = ప్రభుత్వమును, ఉపలబ్ధవాన్ = పొందినాడు.

తా. విష్ణూ! ఇతనిపై నీకు స్నేహభావము కలిగినప్పటినుండీ కూడ ఇతడు లోకములకు ప్రభువైనాడు. 15

మూ. స త్వం ప్రసాదం లోకానాం కురుష్వ సుసమాహితః,
త్వత్కృతేన హి సర్వం స్యాత్ ప్రశాన్తమరుజం జగత్.

ప్ర. అ. సః త్వమ్ = అట్టి నీవు, సుసమాహితః = చాల సావధానచిత్తుడవై, లోకానామ్ = లోకములయొక్క, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురుష్వ = చేయుము. త్వత్కృతేన = నీచేత చేయబడిన రక్షణముచేత, జగత్ = జగత్తు, సర్వమ్ = సమస్తమూ, ప్రశాన్తమ్ = శాంతము, అరుజమ్ = బాధలు లేనిదీ, స్యాత్ హి = అగును.

తా. అట్టి నీవు సావధానచిత్తుడవై లోకములను అనుగ్రహించుము. నీవు చేసిన రక్షణముచేత జగత్తు అంతా ప్రశాంతముగా, బాధారహితమై ఉండునుకదా?

మూ. ఇమేహి సర్వే విష్ణో త్వాం నిరీక్షన్తే దివౌకసః,
వృత్రఘాతేన మహతా తేషాం సాహ్యం కురుష్వ హ. 17

ప్ర. అ. విష్ణో = విష్ణూ! సర్వే = సమస్తమైన, ఇమే = ఈ, దివౌకసః = దేవతలు, త్వామ్ = నిన్ను, నిరీక్షన్తే = ఎదురుచూచుచున్నారు. మహతా = గొప్పదైన, వృత్రఘాతేన = వృత్రాసురసంహారముచేత, తేషామ్ = వారికి, సాహ్యమ్ = సాహాయ్యమును, కురుష్వ హ = చేయుము.

తా. విష్ణూ! దేవత లందరూ నీకొరకు ఎదురుచూచుచున్నారు. గొప్ప వృత్రాసురసంహారము చేసి వారికి సాహాయ్యము చేయుము. 17

మూ. త్వయా హి నిత్యశః సాహ్యం కృతమేషాం మహాత్మనామ్,
అశక్యమిదమున్యేషామగతీనాం గతిర్భవాన్. 18

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే చతురశీతితమః సర్గః.

ప్ర. అ. ("అసహ్యామిదమన్యేషామ్" అను పాఠానికి బదులు "అశక్యమిద మన్యేషామ్"అను ప్రాచ్యపాఠము గ్రహించబడినది). త్వయా=నీచేత, నిత్యశః= ఎల్లప్పుడూ, మహాత్మనామ్=మహాత్ములైన, ఏషామ్=ఈ దేవతలకు, సాహ్యామ్= సాహాయ్యము, కృతమ్=చేయబడినది. అన్యేషామ్= ఇతరులకు, ఇదమ్=ఇది, అశక్యమ్=శక్యముకాదు. భవాన్ = నీవు, అగతీనామ్=గతి లేనివాళ్ళకు, గతిః = గతివి.

తా. మహాత్ములైన ఈ దేవతలకు నీవు నిత్యము సాహాయ్యము చేసినావు. ఇతరు లెవరూ ఈ పని చేయజాలరు. గతి లేనివాళ్ళకు నీవే గతివి. 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో ఎనభైనాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాశీతితమః సర్గః

*[ఇంద్రునిలోను వాని వజ్రాయుధములోను విష్ణుతేజస్సు ప్రవేశించుట. ఇంద్రుని వజ్రాయుధముచేత వృత్రాసురుని సంహారము. బ్రహ్మహత్యా ఆవహించిన ఇంద్రుడు తమోమయమైన ప్రదేశములోనికి వెళ్లిపోవుట.]*

మూ. లక్ష్మణస్య తు తద్వాక్యం శ్రుత్వా శత్రునిబర్హణః,
వృత్రఘాతమశేషేణ కథయేత్యాహ సువ్రత. 1

ప్ర. అ. శత్రునిబర్హణః = శత్రుసంహారకుడైన రాముడు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, సువ్రత = మంచి వ్రతము కలవాడా ! వృత్రఘాతమ్ = వృత్రసంహారమును, అశేషేణ = పూర్తిగా, కథయ = చెప్పుము, ఇతి = అని, ఆహ = పలికెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు లక్ష్మణుని మాటలు విని "మంచి వ్రతము కలవాడా! వృత్రసంహారమును పూర్తిగా చెప్పుము" అని పలికెను. 1

మూ. రాఘవేణైవముక్తస్తు సుమిత్రానన్దవర్ధనః,
భూయ ఏవ కథాం దివ్యాం కథయాస సువ్రతః. 2

ప్ర అ. రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, సువ్రతః = మంచి వ్రతములు గల, సుమిత్రానందవర్ధనః = లక్ష్మణుడు, భూయః ఏవ = మరల, దివ్యామ్ = దివ్యమైన, కథామ్ = కథను, కథయామాస = చెప్పెను.

తా. ఉత్తమమైన నియమము గల లక్ష్మణుడు రాముని మాటలు విని మరల దివ్యమైన ఆ కథను చెప్పెను. 2

మూ. సహస్రాక్షవచః శ్రుత్వా సర్వేషాం చ దివౌకసామ్,
విష్ణుర్దేవానువాచేదం సర్వానిన్ద్రపురోగమాన్. 3

ప్ర. అ. విష్ణుః = విష్ణువు, సహస్రాక్షవచః = ఇంద్రుని వచనమును, సర్వేషామ్ = సమస్తమైన, దివౌకసామ్ = దేవతల వచనమును, శ్రుత్వా = విని, ఇన్ద్రపురోగమాన్ = ఇంద్రుడు మొదలుగా గల, సర్వాన్ = అందరినీ గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. విష్ణువు ఇంద్రుని మాటలు, సకలదేవతల మాటలు విని ఇంద్రాది దేవత లందరితో ఇట్లు పలికెను. 3

మూ. పూర్వసౌహృదబద్ధోఽస్మి వృత్రస్య తు మహాత్మనః,
తేన యుష్మత్ప్రియార్థం హి నాహం హన్మి మహాసురమ్.

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, వృత్రస్య = వృత్రునకు, పూర్వసౌహృదబద్ధః = వెనుకటి స్నేహముచేత కట్టబడినవాడను, అస్మి = అయి ఉన్నాను. తేన = ఆ కారణముచేత, యుష్మత్ప్రియార్థమ్ = మీ ప్రియముకొరకు మహాసురమ్ = ఆ మహాసురుణ్ణి, అహమ్ = నేను, న హన్మి = చంపను.

తా. నేను మహాత్ముడైన వృత్రాసురునితో పూర్వపు స్నేహముచేత కట్టబడి ఉన్నాను. అందుచే మీకు ప్రియము చేకూర్చుటకై నేను ఆ మహాసురుణ్ణి చంపజాలను. 4

మూ. అవశ్యం కరణీయం చ భవతాం సుఖముత్తమమ్,
తస్మాదుపాయమాఖ్యాస్యే సహస్రాక్షో వధిష్యతి. 5

ప్ర. అ. భవతామ్ = మీయొక్క, ఉత్తమమ్ = ఉత్తమమైన, సుఖమ్ = సుఖము, అవశ్యమ్ = తప్పక, కరణీయం చ = చేయ దగినది. తస్మాత్ = ఆ కారణమువలన, ఉపాయమ్ = ఉపాయమును, ఆఖ్యాస్యే = చెప్పగలను; సహస్రాక్షః = ఇంద్రుడు, వధిష్యతి = చంపగలడు.

తా. మీకు ఉత్తమమైన సుఖమును తప్పక కల్పించవలెను. అందువలన ఇంద్రుడే అతనిని చంపు ఉపాయమును చెప్పెదను. 5

మూ. త్రేధాభూతం కరిష్యామి ఆత్మానం సురసత్తమాః,
తేన వృత్రం సహస్రాక్షో వధిష్యతి న సంశయః. 6

ప్ర. అ. సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులారా, ఆత్మానమ్ = నన్ను, త్రేధా = మూడు విధములుగా, కరిష్యామి = చేసెదను. తేన = దానిచేత, సహస్రాక్షః = ఇంద్రుడు, వృత్రమ్ = వృత్రుణ్ణి, వధిష్యతి = చంపగలడు, సంశయః = సంశయము, న = లేదు.

తా. దేవతోత్తములారా! నేను నా స్వరూపమును మూడుగా విభజించెదను. అట్లు చేయుటచే ఇంద్రుడు వృత్రుణ్ణి నిఃసంశయముగా చంపగలడు. 6

మూ. ఏకాంశో వాసవం యాతు ద్వితీయో వజ్రమేవ చ,
తృతీయో భూతలం యాతు తదా వృత్రం హనిష్యతి. 7

ప్ర. అ. ఏకాంశః = ఒక అంశ, వాసవమ్ = దేవేంద్రుణ్ణి, యాతు = పొందుగాక. ద్వితీయః = రెండవది, వజ్రమ్ ఏవ చ = వజ్రాయుధమును పొందుగాక. తృతీయః = మూడవది, భూతలమ్ = భూతలమును, యాతు = పొందుగాక. తదా = అప్పుడు, వృత్రమ్ = వృత్రుణ్ణి, హనిష్యతి = చంపగలడు.

తా. ఒక అంశ ఇంద్రుణ్ణి, రెండవది వజ్రాయుధమును, మూడవది భూమిని పొందును. అప్పుడు ఇంద్రుడు వృత్రుణ్ణి చంపగలడు. 7

మూ. తథా బ్రువతి దేవేశే దేవా వాక్యమథాబ్రువన్,
ఏవమేతన్న సందేహో యథా వదసి దైత్యహన్. 8

ప్ర. అ. దేవేశే = విష్ణువు, తథా = అట్లు, బ్రువతి = పలుకుచుండగా, అథ = అటుపిమ్మట, దేవాః = దేవతలు, వాక్యమ్ = వాక్యమును, అబ్రువన్ = పలికిరి. దైత్యహన్ = దైత్యులను సంహరించినవాడా! యథా = ఎట్లు, వదసి = వలుకుచున్నావో, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లే, సందేహః = సందేహము, న = లేదు.

తా. విష్ణువు మాటలు విని దేవతలు ఇట్లు పలికిరి- "దైత్యసంహారకా! నీవు ఎట్లు చెప్పుచున్నావో అట్లే; సందేహము లేదు." 8

మూ. భద్రం తేఽస్తు గమిష్యామో వృత్రాసురవధైషిణః,
భజస్వ పరమోదార వాసవం స్వేన తేజసా. 9

ప్ర. అ. తే = నీకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక. పరమోదార = చాల ఉదారుడా! వృత్రాసురవధైషిణః = వృత్రాసురుని వధను కోరుచున్న మేము, గమిష్యామః = వెళ్లెదము, స్వేన = నీసంబంధమైన, తేజసా = తేజస్సుతో, వాసవమ్ = ఇంద్రుణ్ణి, భజస్వ = పొందుము.

తా. చాల ఔదార్యము గలవాడా! నీకు క్షేమ మగుగాక. వృత్రాసురుని సంహారమును కోరుచున్న మేము వెళ్లెదము. నీవు నీ తేజస్సును ఇంద్రునిలో ప్రవేశ పెట్టుము. 9

మూ. తతః సర్వే మహాత్మానః సహస్రాక్షపురోగమాః,
తదరణ్యముపాక్రామన్ యత్ర వృత్రో మహాసురః. 10

ప్ర. అ. "తతః = అటుపిమ్మట, సహస్రాక్షపురోగమాః = ఇంద్రుడు మొదలైన, మహాత్మానః = మహాత్ములు, మహాసురః = మహాసురుడైన, వృత్రః = వృత్రుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో, తత్ = ఆ, అరణ్యమ్ = అరణ్యమును గూర్చి, ఉపాక్రామన్ = వెళ్ళిరి.

తా. పిమ్మట మహాత్ములైన ఇంద్రాదిదేవతలు వృత్రాసురు డున్న మహారణ్యమునకు వెళ్ళిరి.

మూ. తేఽపశ్యంస్తేజసా భూతం తపన్తమసురోత్తమమ్,
పిబన్తమివ లోకాంస్త్రీన్ నిర్దహన్తమివామ్బరమ్. 11

ప్ర అ. తే = ఆ దేవతలు, తేజసా = తేజస్సుతో, భూతమ్ = వ్యాపించబడినవాడు, తపన్తమ్ = తపస్సు చేయుచున్నవాడు, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, పిబన్తమ్ ఇవ = త్రాగుచున్నట్లు ఉన్నవాడు, అమ్బరమ్ = ఆకాశమును, నిర్దహన్తమ్ ఇవ = కాల్చుచున్నట్లు ఉన్నవాడు అయిన, అసురోత్తమమ్ = ఆ మహాసురుణ్ణి, అపశ్యన్ = చూచిరి.

తా. ఆ దేవతలు తపస్సు చేయుచున్న, తేజస్సుతో నిండిన ఆ మహా

సురుణ్ణి చూచిరి, అతడు మూడు లోకాలను త్రాగుచున్నాడా అన్నట్లు, ఆకాశ మును కాల్చివేయుచున్నాడా అన్నట్లు ఉండెను. 11

మూ. దృష్ట్వైవ చాసురశ్రేష్ఠం దేవాస్త్రాసముపాగమన్,
కథమేనం వధిష్యామః కథం న స్యాత్పరాజయః 12

ప్ర. అ. అసురశ్రేష్ఠమ్=అసురశ్రేష్ఠుని, దృష్ట్వైవ=చూడగానే, దేవాః= దేవతలు, త్రాసమ్ = భయమును, ఉపాగమన్ = పొందిరి. ఏనమ్ = వీనిని, కథమ్=ఎట్లు, వధిష్యామః=చంపెదము ? పరాజయః=పరాజయము, కథమ్= ఎట్లు, న స్యాత్ = రాకుండును ?

తా. ఆ వృత్రాసురుణ్ణి చూడగానే దేవతలు - "ఇతనిని ఎట్లు చంప గలము; మనకు పరాజయము రాకుండుటకు ఉపాయ మేమి?" అని ఆలో చించుచు భయపడిరి. 12

మూ తేషాం చిన్తయతాం తత్ర సహస్రాక్షః పురందరః,
వజ్రం ప్రగృహ్య పాణిభ్యాం ప్రాహిణోద్వృత్రమూర్ధని.

ప్ర. అ. తత్ర = అక్కడ, తేషామ్ = వాళ్లు, చిన్తయతామ్=ఆలోచించు చుండగా, సహస్రాక్షః = వేయి నేత్రములు గల, పురందరః = దేవేంద్రుడు, పాణిభ్యామ్=రెండు బాహువులచేత, వజ్రమ్=వజ్రమును, ప్రగృహ్య=గ్రహించి, వృత్రమూర్ధని = వృత్రాసురుని శిరస్సుమీద, ప్రాహిణోత్ = పంపెను.

తా. వాళ్లు అక్కడ ఆ విధముగా ఆలోచించుచుండగా దేవేంద్రుడు వజ్రాయుధమును రెండు చేతులతో పట్టుకొని వృత్రాసురుని శిరస్సుపై ప్రయో గించెను. 13

మూ. కాలాగ్నినేవ ఘోరేణ దీప్తేనేవ మహార్చిషా,
పతతా వృత్రశిరసా జగత్త్రాసముపాగమత్. 14

ప్ర. అ. ఘోరేణ = భయంకరమైన, కాలాగ్నినేవ = ప్రలయకాలాగ్ని చేత వలె, దీప్తేన = మండుచున్న, మహార్చిషా ఇవ = గొప్ప జ్వాలచేత వలె,

పతతా = పడుచున్న, వృత్రశిరసా = వృత్రాసురుని శిరస్సుచేత, జగత్ = జగత్తు, త్రాసమ్ = భయమును, ఉపాగమత్ = పొందెను.

తా. భయంకరమైన కాలాగ్ని వలె, మండుచున్న గొప్ప అగ్నిజ్వాల వలె వృత్రుని శిరస్సు క్రింద పడుచుండగా జగత్తు భయము చెందెను. 14

మూ. అసంభావ్యం వధం తస్య వృత్రస్య విబుధాధిపః,
చిన్తయానో జగామాశు లోకస్యాన్తం మహాయశాః. 15

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, విబుధాధిపః = ఇంద్రుడు, తస్య వృత్రస్య = ఆ వృత్రునియొక్క, వధమ్ = వధను, అసంభావ్యమ్ = ఊహింప శక్యము కానిదానినిగా, చిన్తయానః = ఆలోచించుచు, ఆశు = శీఘ్రముగా, లోకస్య = లోకముయొక్క, అన్తమ్ = చివరి ప్రదేశమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. గొప్ప కీర్తి గల దేవేంద్రుడు ఆ వృత్రాసురుడు చచ్చుట ఊహింప శక్యముకానిది అని తలచి వెంటనే లోకముల చివరి దేశమునకు వెళ్ళిపోయెను.

మూ. తమిన్ద్రం బ్రహ్మహత్యాశు గచ్ఛన్తమనుగచ్ఛతి,
అపతచ్చాస్య గాత్రేషు తమిన్ద్రం దుఃఖమావిశత్. 16

ప్ర. అ. గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న, తమ్ ఇన్ద్రమ్ = ఆ ఇంద్రుణ్ణి, ఆశు = శీఘ్రముగా, బ్రహ్మహత్యా = బ్రహ్మహత్య, అనుగచ్ఛతి = అనుసరించినది. అస్య = వీనియొక్క, గాత్రేషు = అవయవములమీద, అపతత్ చ = పడెను. తమ్ ఇన్ద్రమ్ = ఆ ఇంద్రుణ్ణి దుఃఖమ్ = దుఃఖము, ఆవిశత్ = ప్రవేశించెను.

తా. ఆతడు పారిపోవుచుండగా వెంటనే ఆతనిని బ్రహ్మహత్య వెంబడించి ఆతని అవయవములలో ప్రవేశించెను. అప్పుడు ఇంద్రుడు దుఃఖాక్రాంతు డయ్యెను.

మూ. హతారయః ప్రణష్టేన్ద్రా దేవాః సాగ్నిపురోగమాః,
విష్ణుం త్రిభువనేశానం ముహుర్ముహురపూజయన్. 17

ప్ర. అ. హతారయః = చంపబడిన శత్రువులు గల, ప్రణష్టేన్ద్రాః = కనబడకుండ పోయిన ఇంద్రుడు గల, సాగ్నిపురోగమాః = ముందు ఉన్న

అగ్నితో కూడిన, దేవాః = దేవతలు, త్రిభువనేశానమ్ = మూడు లోకములకు ప్రభువైన, విష్ణుమ్ = విష్ణువును, ముహుః ముహుః = మాటిమాటికి, అపూజయన్ = పూజించిరి.

తా. శత్రువును చంపి ఇంద్రుడు కనబడకుండ పోయిన పిమ్మట అగ్ని మొదలైన దేవతలు మూడు లోకములకు ప్రభువైన విష్ణువును మాటిమాటికి పూజించిరి. 17

మూ. త్వం గతిః పరమేశాన పూర్వజో జగతః పితా,
రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వముపజగ్మివాన్. 18

ప్ర. అ. ఈశాన = ప్రభూ! త్వమ్ = నీవు, పరమా = గొప్ప, గతిః = గతివి. పూర్వజః = పూర్వమునందు పుట్టిన, జగతః = జగత్తుయొక్క, పితా = తండ్రివి. సర్వభూతానామ్ = సమస్తప్రాణులయొక్క, రక్షార్థమ్ = రక్షకొరకు, విష్ణుత్వమ్ = విష్ణుత్వమును, ఉపజగ్మివాన్ = పొందినావు.

తా. ప్రభూ! నీవే ఉత్తమమైన గతివి. అన్నింటికంటెను పూర్వము ఉన్న జగత్పితవు. సకలభూతలరక్షణముకొరకై విష్ణువు అయినావు. 18

మూ. హతశ్చాయం త్వయా వృత్రో బ్రహ్మహత్యా చ వాసవమ్,
బాధతే సురశార్దూల మోక్షం తస్య వినిర్దిశ. 19

ప్ర. అ. సురశార్దూల = దేవశ్రేష్ఠా! త్వయా = నీచేత, అయం వృత్రః = ఈ వృత్రుడు, హతః చ = చంపబడినాడు. బ్రహ్మహత్యా చ = బ్రహ్మహత్య, వాసవమ్ = ఇంద్రుణ్ణి, బాధతే = బాధించుచున్నది. తస్య = వానికి, మోక్షమ్ = మోక్షమును, వినిర్దిశ = చూపుము.

తా. దేవతాశ్రేష్ఠుడా! నీవు వృత్రాసురుణ్ణి చంపినావు. బ్రహ్మహత్య ఇంద్రుణ్ణి బాధించుచున్నది. ఆతనికి దానినుండి విడుదలను ఇమ్ము. 19

మూ. తేషాం తద్వచనం శ్రుత్వా దేవానాం విష్ణురబ్రవీత్,
మామేవ యజతాం శక్రః పావయిష్యామి వజ్రిణమ్. 20

ప్ర. అ. తేషాం దేవానామ్ = ఆ దేవతలయొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, విష్ణుః = విష్ణువు, అబ్రవీత్ = పలికెను. శక్రః =

ఇంద్రుడు, మామ్ ఏవ = నన్నే, యజతామే = పూజించుగాక. వృజినమ్ = ఇంద్రుణ్ణి, పావయిష్యామి = పవిత్రింపచేసెదను.

తా. ఆ దేవతల మాటలు విని విష్ణువు ఇట్లు పలికెను. "ఇంద్రుడు నన్నే పూజించినచో నేను అతనిని పవిత్రుని చేసెదను". 20

మూ. పుణ్యేన హయమేధేన మామిష్ట్వా పాకశాసనః,
పునరేష్యతి దేవానామిన్ద్రత్వమకుతోభయః. 21

ప్ర అ. పాకశాసనః=ఇంద్రుడు, పుణ్యేన = పుణ్యమైన, హయమేధేన= అశ్వమేధముచేత, మామ్ = నన్ను, ఇష్ట్వా=పూజించి, అకుతోభయః = ఎక్కడి నుండీ భయము లేనివాడై, పునః=మరల, దేవానామ్=దేవతలకు, ఇన్ద్రత్వమ్= ప్రభుత్వమును, ఏష్యతి = పొందగలడు.

తా. ఇంద్రుడు పుణ్యమైన అశ్వమేధయాగముచేత నన్నే పూజించినచో ఎట్టి భయమూ లేనివాడై మరల దేవేంద్రత్వమును పొందగలడు. 21

మూ. ఏవం సందిశ్య తాం వాణీం దేవానాం చామృతోపమామ్,
జగామ విష్ణుర్దేవేశః స్తూయమానస్త్రివిష్టపమ్. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చాశీతితమః సర్గః.

ప్ర. అ. దేవేశః = దేవతలప్రభువైన, విష్ణుః = విష్ణువు, ఏవమ్ = ఇట్లు, అమృతోపమామ్ = అమృతముతో సమానమైన, తాం వాణీమ్ = ఆ వాక్కును, దేవానామ్ = దేవతలకు, సందిశ్య = ఇచ్చి, స్తూయమానః = స్తుతింపబడుచు, త్రివిష్టపమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. దేవతల ప్రభువైన విష్ణువు ఈ విధముగా అమృతము వంటి ఆ వాక్కును దేవతలకు వినిపించి, వాళ్లు స్తుతించుచుండగా స్వర్గమునకు వెళ్లెను. 22

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఎనభైఐదవ సర్గ సమాప్తము.

## అథ షడశీతితమః సర్గః.

[ఇంద్రుడు లేకపోవుటచే జగత్తులో అశాంతి పెరుగుట. ఇంద్రుడు అశ్వమేధము చేసి బ్రహ్మహత్యనుండి విముక్తుడగుట.]

మూ. తదా వృత్రవధం సర్వమఖిలేన స లక్ష్మణః,
కథయిత్వా నరశ్రేష్ఠః కథాశేషం ప్రచక్రమే. 1

ప్ర. అ. తదా = అప్పుడు, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, సర్వమ్ = సమస్తమైన, వృత్రవధమ్ = వృత్రాసురవధను, అఖిలేన = పూర్తిగా, కథయిత్వా = చెప్పి, నరశ్రేష్ఠః = ఆ నరశ్రేష్ఠుడు, కథాశేషమ్ = కథయొక్క శేషమును, ప్రచక్రమే = ప్రారంభించెను.

తా. నరులలో శ్రేష్ఠుడైన ఆ లక్ష్మణుడు అప్పుడు వృత్రాసురవధను పూర్తిగా చెప్పి మిగిలిన కథను ప్రారంభించెను. 1

మూ. తతో హతే మహావీర్యే వృత్రే దేవభయంకరే,
బ్రహ్మహత్యావృతః శక్రః సంజ్ఞాం లేభే న వృత్రహా. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహావీర్యే = గొప్ప పరాక్రమము గల, దేవభయంకరే = దేవతలకు భయమును కలిగించు, వృత్రే = వృత్రుడు, హతే = చంపబడిన వాడగుచుండగా, వృత్రహా = వృత్రుణ్ణి చంపిన, శక్రః = ఇంద్రుడు, బ్రహ్మహత్యాయుతః = బ్రహ్మహత్యతో కూడినవాడై, సంజ్ఞామ్ = సంజ్ఞను, న లేభే = పొందలేదు.

తా. గొప్ప పరాక్రమము గల వృత్రాసురుణ్ణి సంహరించిన పిదప ఇంద్రుడు బ్రహ్మహత్యాపాపముచేత స్పృహ కోల్పోయెను. 2

మూ. సోఽన్తమాశ్రిత్య లోకానాం నష్టసంజ్ఞో విచేతనః,
కాలం తత్రావసత్ కంచిద్వేష్టమాన ఇవోరగః. 3

ప్ర. అ. సః = అతడు, లోకానామ్ = లోకములయొక్క, అన్తమ్ = అంతమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, నష్టసంజ్ఞః = నష్టమైన సంజ్ఞ కలవాడై, విచేతనః = చైతన్యము లేనివాడై, ఉరగః ఇవ = సర్పము వలె, వేష్టమానః = దొర్లుచు, తత్ర = అక్కడ, కంచిత్ = కొంత, కాలమ్ = కాలమును, అవసత్ = నివసించెను.

తా. అతడు లోకముల చివరికి పోయి సంజ్ఞ కోల్పోయి, చైతన్యరహితుడై కొంత కాలము సర్పము వలె దొర్లుచుండెను. 3

మూ. అథ నష్టే సహస్రాక్షే ఉద్విగ్నమభవజ్జగత్,
భూమిశ్చ ధ్వస్తసంకాశా నిఃస్నేహా శుష్కకాననా. 4

ప్ర. అ అథ = అటు పిమ్మట, సహస్రాక్షే = ఇంద్రుడు, నష్టే = కనబడకుండ పోయినవాడగుచుండగా, జగత్ = జగత్తు, ఉద్విగ్నమ్ = ఉద్వేగము చెందినది, అభవత్ = ఆయెను, భూమిః చ = భూమి కూడ, నిఃస్నేహా = చమురు (తడి) లేనిదై, శుష్కకాననా = ఎండిన అడవులు కలదై, ధ్వస్తసంకాశా = నశించి పోయినట్లు అయిపోయెను.

తా. ఇంద్రుడు కనబడకుండ పోగానే జగత్తు దిగులుచెందెను. భూమి కూడ తడి లేక, అడవులు ఎండిపోయి, పాడుపడినట్లు ఉండెను. 4

మూ. నిఃస్రోతసస్తే సర్వే తు హ్రదాశ్చ సరితస్తథా,
సంక్షోభశ్చైవ సత్త్వానామనావృష్టికృతోఽభవత్. 5

ప్ర అ. సర్వే = సమస్తమైన, తే = ఆ, హ్రదాః = చెరువులు, తథా = మరియు, సరితః చ = నదులు, నిఃస్రోతసః = ప్రవాహము లేనివి అయినవి. సత్త్వానామ్ = ప్రాణులకు, అనావృష్టికృతః = అనావృష్టివలన గలుగు, సంక్షోభః చ ఏవ = సంక్షోభము, అభవత్ = ఆయెను.

తా. చెరువులలోను, నదులలోను నీరు ఎండిపోయెను. అనావృష్టివలన ప్రాణులకు గొప్ప సంక్షోభము ఏర్పడెను. 5

మూ. క్షీయమాణే తు లోకేఽస్మిన్ సంభ్రాన్తమనసః సురాః,
యదుక్తం విష్ణునా పూర్వం తం యజ్ఞం సముపానయన్.

ప్ర. అ. అస్మిన్ లోకే = ఈ లోకము, క్షీయమాణే = క్షీణించుచుండగా, సురాః = దేవతలు, సంభ్రాన్తమనసః = భ్రాంతి (భయము) చెందిన మనస్సు గల వారై, పూర్వమ్ = పూర్వము, యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడినదో, తం యజ్ఞమ్ = ఆ యజ్ఞమును, సముపానయన్ = సమకూర్చిరి.

తా. లోకము ఈ విధముగ క్షీణించుట చూచి దేవతలు దిగులుచెంది పూర్వము విష్ణువు చెప్పిన యజ్ఞమును సమకూర్చిరి. 6

మూ. తతః సర్వే సురగణాః సోపాధ్యాయాః సహర్షిభిః,
తం దేశం సముపాజగ్ముర్యత్రేన్ద్రో భయమోహితః.

ప్ర. తతః = అటుపిమ్మట, సర్వే = సమస్తమైన, సురగణాః = దేవతా గణములు, సోపాధ్యాయాః = ఉపాధ్యాయులతో కూడినవారై, సహర్షిభిః = ఋషులతో కూడ, భయమోహితః = భయముచేత మోహింపచేయబడిన, ఇన్ద్రః = ఇంద్రుడు, యత్ర = ఎక్కడ ఉన్నాడో, తం దేశమ్ = ఆ దేశమును గూర్చి, సముపాజగ్ముః = వచ్చిరి.

తా. పిమ్మట దేవత లందరు ఉపాధ్యాయులతోను, ఋషులతోను కలిసిన వారై, భయముచేత మోహితుడైన ఇంద్రు డున్న చోటికి వెళ్ళిరి. 7

మూ. తే తు దృష్ట్వా సహస్రాక్షమావృతం బ్రహ్మహత్యయా,
తం పురస్కృత్య దేవేశమశ్వమేధం ప్రచక్రిరే. 8

ప్ర. అ. తే = వారు, బ్రహ్మహత్యయా = బ్రహ్మహత్యచేత, ఆవృతమ్ = ఆవరించబడిన, సహస్రాక్షమ్ = ఇంద్రుణ్ణి, దృష్ట్వా = చూచి, దేవేశమ్ = దేవతా ప్రభువైన, తమ్ = ఆ ఇంద్రుణ్ణి, పురస్కృత్య = ముందు ఉంచికొని, అశ్వమేధమ్ = అశ్వమేధమును, ప్రచక్రిరే = చేసిరి.

తా. వారు బ్రహ్మహత్యచేత ఆవరింపబడిన ఇంద్రుణ్ణి చూచి, దేవతా ప్రభువైన అతనిని ముందు ఉంచుకొని అశ్వమేధయాగము చేసిరి. 8

మూ. తతోఽశ్వమేధః సుమహాన్ మహేన్ద్రస్య మహాత్మనః,
వవృతే బ్రహ్మహత్యాయాః పావనార్థం నరేశ్వర. 9

ప్ర. అ. నరేశ్వర = రాజా! తతః = ఆటుపిమ్మట, బ్రహ్మహత్యాయాః = బ్రహ్మహత్యనుండి, పావనార్థమ్ = పవిత్రముచేయుటకై, మహాత్మనః = మహాత్ముడైన, మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, సుమహాన్ = చాల గొప్పదైన, అశ్వమేధః = అశ్వమేధము, వవృతే = జరిగెను.

తా. రాజా! పిమ్మట బ్రహ్మహత్యా పాపమునుండి విముక్తికొరకై మహాత్ముడైన మహేంద్రుని గొప్ప అశ్వమేధము జరిగెను. 9

మూ. తతో యజ్ఞే సమాప్తే తు బ్రహ్మహత్యా మహాత్మనః,
అభిగమ్యాబ్రవీద్వాక్యం క్వ మే స్థానం విధాస్యథ. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యజ్ఞే = యజ్ఞము, సమాప్తే = సమాప్తమైన దగుచుండగా, మహాత్మనః = మహాత్మునియొక్క, బ్రహ్మహత్యా = బ్రహ్మహత్య, అభిగమ్య = వచ్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మే = నాకు, క్వ = ఎక్కడ; స్థానమ్ = స్థానమును; విధాస్యథ = చేసెదరు?

తా. యజ్ఞము సమాప్తమైన పిమ్మట మహాత్ముడైన ఇంద్రుని బ్రహ్మహత్య వారి వద్దకు వచ్చి "నాకు ఎక్కడ స్థానము కల్పించెదరు?"అని ప్రశ్నించెను. 10

మూ. తే తామూచుస్తతో దేవాస్తుష్టాః ప్రీతిసమన్వితాః,
చతుర్ధా విభజాత్మానమాత్మనైవ దురాసదే. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తే దేవాః = ఆ దేవతలు, తుష్టాః = సంతోషించినవారై, ప్రీతిసమన్వితాః = ఆనందముతో కూడినవారై, తామ్ = దానిని గూర్చి, ఊచుః = పలికిరి. దురాసదే = సమీపింప శక్యముకానిదానా! ఆత్మానమ్ = తనను, ఆత్మనైవ = తనచేతనే, చతుర్ధా = నాలుగు భాగములుగా, విభజ = విభజించుము.

తా. అప్పు డా దేవతలు సంతోషించి దానితో ఇట్లు పలికిరి-"సమీపింప శక్యము కాని ఓ! బ్రహ్మహత్యా! నిన్ను నీవే నాలుగు భాగాలుగా విభజించుకొనుము." 11

మూ. దేవానాం భాషితం శ్రుత్వా బ్రహ్మహత్యా మహాత్మనామ్,
సందధౌ స్థానమన్యత్ర వరయామాస దుర్వసా. 12

ప్ర. అ. బ్రహ్మహత్యా = బ్రహ్మహత్య, మహాత్మనామ్ = మహాత్ములైన, దేవానామ్ = దేవతలయొక్క, భాషితమ్=మాటను, శ్రుత్వా = విని, సందధౌ = (నాలుగు భాగములు) చేసెను. దుర్వసా = దుఃఖమును కలిగించు నివాసము గల ఆ బ్రహ్మహత్య, అన్యత్ర=మరి యొకచోట, స్థానమ్=స్థానమును, వరయామాస = వరించెను.

తా. దుఃఖమును కలిగించు నివాసము గల ఆ బ్రహ్మహత్య మహాత్ములైన దేవతల మాటలు విని, ఆ విధముగ నాలుగు భాగములుగా అయి, మరొక చోట నివాసమును కోరెను. 12

మూ. ఏకేనాంశేన వత్స్యామి పూర్ణోదాసు నదీషు వై,
చతురో వార్షికాన్ మాసాన్ దర్పఘ్నీ కామచారిణీ. 13

ప్ర. అ. ఏకేన = ఒక, అంశేన = అంశచేత, పూర్ణోదాసు = పూర్ణమైన ఉదకము గల, నదీషు = నదులయందు, చతురః=నాలుగు, వార్షికాన్ = వర్షకాల సంబంధమైన, మాసాన్ = మాసములను, ధర్పఘ్నీ (పాపాత్ముల) దర్పమును తొలగించుచు, కామచారిణీ = స్వేచ్ఛగా సంచరించుచు, వత్స్యామి = నివసించ గలను.

తా. నేను ఒక అంశతో నాలుగు వర్షకాలమాసములలో జలపూర్ణములైన నదులలో, పాపాత్ముల దర్పమును తొలగించుచు, స్వేచ్ఛగా సంచరించుచు, నివసించెదను. 13

మూ. భూమ్యామహం సర్వకాలమేకేనాంశేన సర్వదా,
వసిష్యామి న సన్దేహః సత్యేనైతద్ బ్రవీమి తే. 14

ప్ర. అ. అహమ్ = నేను, ఏకేన=ఒక, అంశేన = అంశచేత, సర్వదా= ఎల్లప్పుడు, సర్వకాలమ్=అన్ని కాలములయందు, భూమ్యామ్ = చవటనేలమీద, వసిష్యామి = నివసించెదను. ఏతత్ = దీనిని, సత్యేన = సత్యముచేత, తే = నీకు, బ్రవీమి = చెప్పుచున్నాను. సన్దేహః = సందేహము, న = లేదు.

తా. నేను ఒక అంశముచేత ఎల్లప్పుడూ, అన్ని కాలములయందూ కూడ చవటనేలలో నివసించెదను; సందేహము లేదు; సత్యముగా చెప్పుచున్నాను. 14

మూ. యోஉయమంశస్తృతీయో మే స్త్రీషు యౌవనశాలిషు,
త్రిరాత్రం దర్పపూర్ణాసు వసిష్యే దర్పఘాతినీ. 15

ప్ర. అ. మే=నాయొక్క, యః = ఏ, అయమ్=ఈ, తృతీయః అంశః= మూడవ అంశము ఉన్నదో దానిచేత, యౌవనశాలిషు= యౌవనముతో ప్రకాశించుచున్న, దర్పపూర్ణాసు = దర్పముతో కూడిన, స్త్రీషు = స్త్రీలయందు, దర్పఘాతినీ=దర్పమును తొలగించుదాననై, త్రిరాతమ్=మూడు రోజులు, వసిష్యే= నివసించెదను.

తా. నా మూడవ అంశముచేత యౌవనవతులైన, దర్పము గల స్త్రీలలో వాళ్ళ దర్పమును తొలగించుచు మూడు దివసములు ఉందును. 15

మూ. హన్తారో బ్రాహ్మణాన్యే తు మృషాపూర్వమదూషకాన్,
తాంశ్చతుర్థేన భాగేన సంశ్రయిష్యే సురర్షభాః. 16

ప్ర. అ. సురర్షభాః= దేవతాశ్రేష్ఠులారా! యే = ఎవరు, అదోషకాన్= దూషించని (అపరాధము లేని), బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, మృషాపూర్వమ్ =వంచనపూర్వకముగా, హన్తారః = చంపువారో, తాన్ = వాళ్ళను, చతుర్థేన భాగేన = నాల్గవ భాగముచేత, సంశ్రయిష్యే = ఆశ్రయించెదను.

తా. దేవతాశ్రేష్ఠులారా! నాల్గవ భాగముచేత అపరాధము లేని బ్రాహ్మణులను ఎవరు వంచన పూర్వకముగా చంపుదురో వాళ్లను ఆశ్రయించి ఉందును. 16

మూ. ప్రత్యూచుస్తాం తదా దేవా యథా వదసి దుర్వసే,
తథా భవతు తత్సర్వం సాధయస్వ యదీప్సితమ్. 17

ప్ర. అ. దేవాః = దేవతలు, తామ్ = దానిని గూర్చి, తదా = అప్పుడు, ప్రత్యూచుః = తిరిగి పలికిరి. దుర్వసే = దుఃఖమును కలిగించు నివాసము కల దానా? యథా = ఎట్లు, వదసి = పలుకుచున్నావో, తథా = అట్లు, భవతు = అగు గాక, యత్ = ఏది, ఈప్సితమ్ = ఇష్టమో, తత్ సర్వమ్ = దాని నంతనీ, సాధయస్వ = సాధించుము.

తా. అప్పుడు దేవతలు దానితో ఇట్లనిరి- "ఓ! దుర్వసా! నీవు చెప్పినట్లే అంతా అగుగాక. నీకు ఎట్లు ఇష్టమో అట్లు చేయుము". 17

మూ. తతః ప్రీత్యాన్వితా దేవాః సహస్రాక్షం వవన్దిరే,
విజ్వరః పూతపాప్మా చ వాసవః సమపద్యత. 18

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దేవాః = దేవతలు, ప్రీత్యా = సంతోషముతో, అన్వితాః = కూడినవారై. సహస్రాక్షమ్ = ఇంద్రుణ్ణి, వవన్దిరే = నమస్కరించిరి. వాసవః = ఇంద్రుడు, పూతపాప్మా = పవిత్రముచేయబడిన పాపము కలవాడై, విజ్వరః = బాధలేనివాడు, సమపద్యత = అయ్యెను.

తా. పిమ్మట దేవతలు సంతోషించుచు ఇంద్రునకు నమస్కరించిరి. అతడు కూడ పాపము తొలగి బాధ లేనివాడు అయ్యెను. 18

మూ. ప్రశాన్తం చ జగత్సర్వం సహస్రాక్షే ప్రతిష్ఠితే,
యజ్ఞం చాద్భుతసంకాశం తదా శక్రోఽభ్యపూజయత్.

ప్ర. అ. సహస్రాక్షే = ఇంద్రుడు, ప్రతిష్ఠితే = ప్రతిష్ఠింపబడినవాడగుచుండగా, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, ప్రశాన్తమ్ = శాంతించినది. తదా = అప్పుడు, శక్రః = దేవేంద్రుడు, అద్భుత సంకాశమ్ = ఆశ్చర్యకరమైన, యజ్ఞమ్ = యజ్ఞమును, అభ్యపూజయత్ = పూజించెను.

తా. ఇంద్రుడు ప్రతిష్ఠితుడు అయిన వెంటనే జగత్తు అంతా ప్రశాంతమయ్యెను. ఇంద్రుడు అద్భుతమైన ఆ అశ్వమేధయాగమును కొనియాడెను. 19

మూ. ఈదృశో హ్యశ్వమేధస్య ప్రసాదో రఘునన్దన,
యజస్వ సుమహాభాగ హయమేధేన పార్థివ. 20

ప్ర. అ. రఘునన్దన = రామా ! అశ్వమేధస్య = అశ్వమేధముయొక్క, ప్రసాదః = అనుగ్రహము, ఈదృశః = ఇట్టిది. సుమహాభాగ = చాల గొప్ప భాగ్యము గలవాడా ! పార్థివ = రాజా ! హయమేధేన = అశ్వమేధముచేత, యజస్వ = యాగముచేయుము.

తా. రామా ! అశ్వమేధము అనుగ్రహము ఇట్టిది. చాల గొప్ప భాగ్యము గల రాజా ! అశ్వమేధయాగము చేయుము. 20

మూ. ఇతి లక్ష్మణవాక్యముత్తమం
నృపతిరతీవ మనోహరం మహాత్మా,

పరితోషమవాప హృష్టచేతాః
స నిశమ్యేన్ద్రసమానవిక్రమౌజాః. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షడశీతితమః సర్గః.

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడు, ఇన్ద్రసమానవిక్రమౌజాః = ఇంద్రు నితో సమానమైన పరాక్రమము తేజస్సు గల, సః నృపతిః = ఆ రాజు, అతీవ = మిక్కిలి, మనోహరమ్ = మనోహరమైన, ఇతి = ఇట్లు, ఉత్తమమ్ = ఉత్తమమైన, లక్ష్మణవాక్యమ్ = లక్ష్మణుని వాక్యమును, నిశమ్య = విని, హృష్టచేతాః = సంతో షించిన చిత్తముకలవాడై, పరితోషమ్ = ఆనందమును, అవాప = పొందెను.

తా. మహాత్ముడు, ఇంద్రునితో సమానమైన పరాక్రమము, తేజస్సు గల ఆ రాజు చాల మనోహరము, ఉత్తమము అయిన లక్ష్మణుని మాట విని సంతో షించెను. 21

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఎనబైఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తాశీతితమః సర్గః

*[రాముడు లక్ష్మణునకు ఇలోపాఖ్యానము చెప్పుట, ఇలుడు ఒక మాసము పాటు స్త్రీగాను, ఒక మాసము పురుషుడుగాను ఉండుట.]*

మూ. తచ్ఛ్రుత్వా లక్ష్మణేనోక్తం వాక్యం వాక్యవిశారదః,
ప్రత్యువాచ మహాతేజాః ప్రహసన్ రాఘవో వచః. 1

ప్ర. అ. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, ఉక్తమ్ = చెప్పబడిన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, వాక్య విశారదః = మాటలలో నేర్పరి అయిన, రాఘవః = రాముడు, ప్రహసన్ = నవ్వుచు, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. లక్ష్మణుని మాటలు విని మాటలలో నేర్పరి, మహాతేజఃశాలీ అయిన రాముడు నవ్వుచు ఇట్లు పలికెను. 1

మూ. ఏవమేవ నరశ్రేష్ఠ యథా వదసి లక్ష్మణ,
వృత్రఘాతమశేషేణ వాజిమేధఫలం చ యత్. 2

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా, లక్ష్మణ = లక్ష్మణా ! వృత్రఘాతమ్ = వృత్రాసురవధను, యత్ = ఏ, వాజిమేధఫలం చ = అశ్వమేధఫలమును, అశేషేణ = పూర్తిగా, యథా = ఎట్లు, వదసి = చెప్పుచున్నావో అది, ఏవమ్ ఏవ = అట్లే.

తా. లక్ష్మణా ! నరశ్రేష్ఠా ! వృత్రసంహారమును గూర్చి అశ్వమేధ ఫలమును గూర్చి నీవు చెప్పిన దంతా యథార్థమే. 2

మూ. శ్రూయతే హి పురా సౌమ్య కర్దమస్య ప్రజాపతేః,
పుత్రో వాహ్లీశ్వరః శ్రీమానిలో నామ సుధార్మికః. 3

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! పురా = పూర్వము, కర్దమస్య ప్రజాపతేః = కర్దమప్రజాపతియొక్క, పుత్రః = పుత్రుడు, వాహ్లీశ్వరః = వాహ్లికదేశరాజు, సుధార్మికః = చాల ధార్మికుడు, శ్రీమాన్ = శ్రీమంతుడూ అయిన, ఇలో నామ = ఇలుడు అనే రాజు, శ్రూయతే హి = వినబడుచున్నాడు కదా ?

తా. సౌమ్యా ! పూర్వము కర్దమప్రజాపతి కుమారుడు, చాల ధార్మికుడు, శ్రీమంతుడు అయిన ఇలుడు అను వాహ్లిదేశరాజు ఉండెడివాడు. 3

మూ. స రాజా పృథివీం సర్వాం వశే కృత్వా మహాయశాః,
రాజ్యం చైవ నరవ్యాఘ్ర పుత్రవత్పర్యపాలయత్. 4

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరశ్రేష్ఠుడా ! మహాయశాః = గొప్ప కీర్తి గల, సః రాజా = ఆ రాజు, సర్వామ్ = సమస్తమైన, పృథివీమ్ = భూమిని, వశే కృత్వా = వశమునం దుంచుకొని, రాజ్యమ్ = రాజ్యమును, పుత్రవత్ = పుత్రుని వలె, పర్యపాలయత్ = పాలించెను.

తా. నరశ్రేష్ఠుడా ! గొప్ప కీర్తి గల ఆ రాజు భూమి నంతను తన వశములో ఉంచుకొని ప్రజలను పుత్రులను వలె పాలించెను. 4

మూ. సురైశ్చ పరమోదారైర్దైతేయైశ్చ మహాధనైః,
నాగరాక్షసగన్ధర్వైర్యక్షైశ్చ సుమహాత్మభిః. 5
పూజ్యతే నిత్యశః సౌమ్య భయార్తై రఘునన్దన,
అబిభ్యంశ్చ త్రయో లోకాః సరోషస్య మహాత్మనః. 6

ప్ర అ. సౌమ్య = సౌమ్యుడా ! రఘునన్దన = లక్ష్మణా ! పరమోదారైః = చాల ఉదారులైన, సురైః చ = దేవతలచేతను, మహాధనైః = గొప్ప ధనము గల, దైతేయైః చ = దైత్యులచేతను, భయార్తైః = భయపీడితులైన, నాగరాక్షసగన్ధర్వైః = నాగ-రాక్షస-గంధర్వులచేతను, సుమహాత్మభిః = మహాత్ములైన, యక్షైః చ = యక్షులచేతను, నిత్యశః = నిత్యమూ, పూజ్యతే = పూజింపబడుచున్నాడు. సరోషస్య = కోపముతో కూడిన, మహాత్మనః = ఆ మహాత్మునకు, త్రయః లోకాః = మూడు లోకములు, అబిభ్యన్ చ = భయపడినవి.

తా. సౌమ్యుడవైన లక్ష్మణా! దేవతలు, మహాధనవంతులైన దైత్యులు, మహాత్ములైన నాగ-రాక్షస-గంధర్వులు, యక్షులూ కూడ భయముతో నిత్యమూ ఇతనిని పూజించుచుండిరి. ఇతనికి రోషము వచ్చినపుడు మూడు లోకాలూ కూడ భయపడుచుండెడివి. 5,6

మూ. స రాజా తాదృశో హ్యాసీద్ధర్మే వీర్యే చ నిష్ఠితః,
బుద్ధ్యా చ పరమోదారో బాహ్లీకేశో మహాయశాః. 7

ప్ర. అ. బాహ్లీకేశః = బాహ్లీకదేశమునకు ప్రభువైన, మహాయశాః = గొప్ప కీర్తి గల, సః = ఆ, రాజా = రాజు, ధర్మే = ధర్మమునందు, వీర్యే చ = పరాక్రమమునందు, తాదృశః = అట్టి, నిష్ఠితః = స్థిరుడుగా, బుద్ధ్యా = బుద్ధిచేత, పరమోదారః = చాల ఉదారుడుగా, ఆసీత్ = ఉండెను.

తా. బాహ్లీకదేశప్రభువు, మహాకీర్తిశాలీ అయిన ఆ రాజు ఆ విధముగ ధర్మమునందు, పరాక్రమమునందు స్థిరుడై, చాల ఉదారమైన బుద్ధితో ప్రకాశించు చుండెను. 7

మూ. స ప్రచక్రే మహాబాహుర్మృగయాం రుచిరే వనే,
చైత్రే మనోరమే మాసే సభృత్యబలవాహనః. 8

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః = అతడు, సభృత్యబలవాహనః = భృత్య-సైన్య-వాహనములతో కూడినవాడై, మనోరమే = మనోహరమైన, చైత్రే మాసే = చైత్రమాసమునందు, రుచిరే = సుందరమైన, వనే = వనమునందు, మృగయామ్ = వేటను, ప్రచక్రే = చేసెను.

తా. మహాబాహువైన ఆ రాజు భృత్యులతోను, సైన్యముతోను, వాహనములతోను అందమైన అరణ్యమునకు వెళ్ళి, మనోహరమైన చైత్రమాసమునందు వేటాడెను. 8

మూ. ప్రజఘ్నే స నృపోఽరణ్యే మృగాన్ శతసహస్రశః,
హత్వైవ తృప్తిర్నాభూచ్చ రాజ్ఞస్తస్య మహాత్మనః. 9

ప్ర. అ. సః నృపః = ఆ రాజు, అరణ్యే = అరణ్యమునందు, శతసహస్రశః

=వందలకొలది, వేలకొలది, మృగాన్ = మృగములను, ప్రజఘ్నే = చంపెను. హత్వైవ = చంపి కూడ, మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాజ్ఞః = ఆ రాజునకు, తృప్తిః = తృప్తి, నాభూత్ చ = కలగలేదు.

తా. ఆ రాజు అరణ్యములో వందలకొలది వేలకొలది మృగములను చంపెను కాని మహాత్ముడైన అతనికి తృప్తి కలగలేదు. 9

మూ. నానామృగాణామయుతం వధ్యమానం మహాత్మనా,
యత్ర జాతో మహాసేనస్తం దేశముపచక్రమే. 10

ప్ర అ. మహాత్మనా = ఆ మహాత్మునిచేత, నానామృగాణామ్ = అనేక విధములైన మృగములయొక్క, అయుతమ్ = అయుతము, వధ్యమానమ్=చంపబడుచున్నది (అయెను). మహాసేనః = కుమారస్వామి, యత్ర = ఎక్కడ, జాతః = పుట్టినాడో, తం దేశమ్ = ఆ దేశమును గూర్చి, ఉపచక్రమే = వెళ్లెను.

తా. మహాత్ముడైన అతడు అనేకవిధములైన మృగముల అయుతము చంపెను. పిదప అతడు మహాసేనుడు జన్మించిన దేశమునకు వెళ్లెను. 10

మూ. తస్మిన్ ప్రదేశే దేవేశః శైలరాజసుతాం హరః,
రమయామాస దుర్ధర్షః సర్వైరనుచరైః సహ. 11

ప్ర. అ తస్మిన్ = ఆ, ప్రదేశే = ప్రదేశమునందు, దేవేశః = దేవతల ప్రభువు, దుర్ధర్షః = ఎదిరింప శక్యముకానివాడూ అయిన, హరః = ఈశ్వరుడు, సర్వైః = సమస్తమైన, అనుచరైః సహ = అనుచరులతో కూడ, శైలరాజసుతామ్ = పార్వతిని, రమయామాస = విహరింపచేసెను

తా. ఆ ప్రదేశమునందు దేవతల ప్రభువు, ఎదిరింప శక్యము కానివాడూ అయిన శివుడు అనుచరులతో కలిసి, పార్వతిని విహరింపచేయుచుండెను. 11

మూ. కృత్వా స్త్రీరూపమాత్మానముమేశో గోపతిధ్వజః,
దేవ్యాః ప్రియచికీర్షుః సంస్తస్మిన్ పర్వతనిర్ఝరే. 12

ప్ర. అ. గోపతిధ్వజః = వృషభము ధ్వజమునందు గల, ఉమేశః =

శివుడు, దేవ్యాః = దేవికి, ప్రియచికీర్షుః సన్ = ప్రియము చేయదలచినవాడై, ఆత్మానమ్ = తనను, స్త్రీరూపమ్=స్త్రీరూపము కలవానినిగా చేసికొని, తస్మిన్= ఆ, పర్వతనిర్ఝరే = పర్వతము సెలయేరునందు ఉండెను.

తా. వృషభధ్వజుడైన ఆ పరమేశ్వరుడు పార్వతికి ప్రియమును చేయ గోరి ఆ పర్వతముపై నున్న సెలయేటిలో స్త్రీరూపమును ధరించి ఉండెను. 12

మూ. యత్ర యత్ర వనోద్దేశే సత్త్వాః పురుషవాదినః,
వృక్షాః పురుషనామానస్తే సర్వే స్త్రీజనాభవన్. 13

ప్ర. అ. యత్ర యత్ర = ఏయే, వనోద్దేశే = వనప్రదేశమునందు, పురుషవాదినః = పురుష లని చెప్పే, సత్త్వాః = జంతువులు గలవో అవి, పురుషనామానః = పురుషుల పేర్లు గల, వృక్షాః = వృక్షము లున్నవో, తే = అవి, సర్వే = అన్నీ, స్త్రీజనాః = స్త్రీజనులుగా, అభవన్ = అయినవి.

తా. ఆ వనప్రాంతమునం దున్న మగ ప్రాణులు, పుంలింగములో ఉన్న చెట్లూ అన్నీ కూడ స్త్రీలుగా మారిపోయిరి. 13

మూ. యచ్చ కించన తత్సర్వం నారీసంజ్ఞం బభూవ హ,
ఏతస్మిన్నన్తరే రాజా స ఇలః కర్దమాత్మజః, 14
నిఘ్నన్ మృగసహస్రాణి తం దేశముపచక్రమే.

ప్ర. అ. యత్ చ కించన = ఏదైతే ఉన్నదో, తత్ = అది, సర్వమ్= సమస్తమూ, నారీసంజ్ఞమ్ = స్త్రీ సంజ్ఞ కలది, బభూవ హ = అయెను. ఏతస్మిన్ అన్తరే = ఈ మధ్యలో, కర్దమాత్మజః = కర్దముని కుమారుడైన, రాజా = రాజైన, సః ఇలః = ఆ ఇలుడు, మృగసహస్రాణి = మృగముల సహస్రములను, నిఘ్నన్ = కొట్టుచు, తమ్ = ఆ, దేశమ్ = దేశమును గూర్చి, ఉపచక్రమే = వచ్చెను.

తా. అక్కడ నున్న ప్రతి వస్తువూ స్త్రీసంజ్ఞతో మారిపోయెను, ఇంతలో కర్దమ ప్రజాపతి కుమారుడైన ఇలమహారాజు, వేలకొలది మృగములను చంపుచు ఆ ప్రదేశమునకు వచ్చెను. 14

మూ. స దృష్ట్వా స్త్రీకృతం సర్వం సవ్యాలమృగపక్షికమ్, 15
ఆత్మానం స్త్రీకృతం చైవ సానుగం రఘునన్దన,
తస్య దుఃఖం మహచ్చాసీద్దృష్ట్వాత్మానం తథాగతమ్.16

ప్ర. అ. రఘునన్దన = లక్ష్మణా! సః = అతడు, సవ్యాలమృగ పక్షికమ్ = పాతుక మృగములతోను, పక్షులతోను కూడిన, సర్వమ్ = సమస్తమును, స్త్రీ. కృతమ్ = స్త్రీగా చేయబడినదానినిగా, దృష్ట్వా = చూచి, సానుగమ్ = అనుచరులతో కూడిన, ఆత్మానం చ ఏవ = తనను కూడ, స్త్రీకృతమ్ = స్త్రీగా చేయబడినవానినిగా (కనుగొనెను). ఆత్మానమ్ = తనను, తథాగతమ్ = అట్లు అయినవానినిగా, దృష్ట్వా = చూచి, తస్య = వానికి, మహత్ = గొప్ప, దుఃఖమ్ = దుఃఖము, ఆసీత్ = ఆయెను.

తా. లక్ష్మణా! క్రూరమృగములతో, లేళ్ళతో పక్షులతో సహా సమస్తము స్త్రీల రూపములో మారిపోవుటను చూచి, ఇలుడు తాను, అనుచరులూ కూడ అట్లు మారిపోయినట్లు గుర్తించెను. తాను అట్లు అయినందుకు అతనికి చాల దుఃఖము కలిగెను. 15, 16

మూ. ఉమాపతేశ్చ తత్కర్మ జ్ఞాత్వా త్రాసముపాగమత్,
తతో దేవం మహాత్మానం శితికణ్ఠం కపర్దినమ్. 17
జగామ శరణం రాజా సభృత్యబలవాహనః.

ప్ర. అ. తత్ = దానిని, ఉమాపతేః = శివునియొక్క, కర్మ = కర్మనుగా, జ్ఞాత్వా = తెలిసికొని, త్రాసమ్ = భయమును, ఉపాగమత్ = పొందెను. తతః = అటుపిమ్మట, సభృత్యబలవాహనః = భృత్యులతోను, సైన్యముతోను వాహనములతోను కూడిన, రాజా = రాజు, దేవమ్ = దేవుడు, మహాత్మానమ్ = మహాత్ముడు, కపర్దినమ్ = కపర్ద మను జటాజూటము కలవాడు అయిన, శితికణ్ఠమ్ = శివుణ్ణి, శరణం జగామ = శరణు పొందెను. 17

తా. అది శివుడు చేసిన పని అని తెలుసుకొని, భయము చెంది, భృత్యులతోను, సైన్యములతోను, వాహనములతోను కూడిన ఆ రాజు జటాజూటధారియైన శివుణ్ణి శరణు పొందెను. 17

మూ. తతః ప్రహస్య వరదః సహ దేవ్యా మహేశ్వరః, 18
ప్రజాపతిసుతం వాక్యమువాచ వరదః స్వయమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వరదః = వరముల నిచ్చు, దేవ్యా సహ = దేవితో కలిసి ఉన్న, మహేశ్వరః = మహేశ్వరుడు, ప్రహస్య = నవ్వి, స్వయమ్ = స్వయముగా, వరదః = వరమును ఇచ్చువాడై, ప్రజాపతిసుతమ్ = ప్రజాపతి పుత్రుని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట దేవీసమేతుడైన మహేశ్వరుడు నవ్వెను. స్వయముగా వరమును ఇవ్వ నున్నవాడై ఇలునితో ఇట్లు పలికెను. 18

మూ. ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్షే కార్దమేయ మహాబల, 19
పురుషత్వమృతే సౌమ్య వరం వరయ సువ్రత.

ప్ర. అ. కార్దమేయ = కర్దముని పుత్రుడా! మహాబల = గొప్ప బలము గలవాడా! రాజర్షే = రాజర్షీ! ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము. సౌమ్య = సౌమ్యుడా! సువ్రత = మంచి వ్రతములు కలవాడా! పురుషత్వమ్ ఋతే = పురుషత్వము తప్ప, వరమ్ = వరమును, వరయ = కోరుము.

తా. కర్దమపుత్రుడవైన మహాబలశాలివైన రాజర్షీ లెమ్ము లెమ్ము. ఉత్తమ వ్రతములు గల సౌమ్యుడా! పురుషత్వము తప్ప ఏ వరమైనను కోరుకొనుము.

మూ. తతః స రాజా శోకార్తః ప్రత్యాఖ్యాతో మహాత్మనా, 20
స్త్రీభూతోఽసౌ న జగ్రాహ వరమన్యం సురోత్తమాత్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః రాజా = ఆ రాజు, మహాత్మనా = మహాత్ముడైన శివునిచేత, ప్రత్యాఖ్యాతః = ప్రత్యాఖ్యానము చేయబడినవాడై, శోకార్తః = శోకార్తు డయ్యెను. స్త్రీభూతః = స్త్రీ అయిన, అసౌ = ఇతడు, సురోత్తమాత్ = సురులలో ఉత్తముడైన ఆ శివునినుండి, అన్యం వరమ్ = మరియొక వరమును, న జగ్రాహ = గ్రహించలేదు.

తా. స్త్రీగా మారిన ఆ రాజు మహాత్ముడైన ఆ శివునిచేత ప్రత్యాఖ్యానింపబడినవాడై, ఆ దేవోత్తమునినుండి మరొక వరమును తీసికొనలేదు. 20

మూ. తతః శోకేన మహతా శైలరాజసుతాం నృపః, 21
ప్రణిపత్య ఉమాం దేవీం సర్వేణైవాన్తరాత్మనా.

ప్ర. అ. తతః = పిమ్మట, మహతా = గొప్పదైన, శోకేన = శోకముతో, నృపః = రాజు, శైలరాజసుతామ్ = హిమవంతుని పుత్రికయైన, ఉమాం దేవీమ్ = ఉమాదేవిని, సర్వేణైవ = సమస్తమైన, అన్తరాత్మనా = మనస్సుతో, ప్రణిపత్య = నమస్కరించి ప్రార్థించెను.

తా. అప్పుడా రాజు చాల శోకముతో శైలరాజు కుమార్తె యైన పార్వతీ దేవికి పరిపూర్ణ భక్తి భావముతో నమస్కరించి ఇట్లు ప్రార్థించెను. 21

మూ. ఈశే వరాణాం వరదే లోకానామసి భామిని, 22
అమోఘదర్శనే దేవి భజ సౌమ్యేన చక్షుషా.

ప్ర. అ. వరాణామ్ = వరములకు, ఈశే = సమర్థురాలా ! భామిని = ఓ ! దేవీ ! లోకానామ్ = లోకములకు, వరదే = వరముల నిచ్చుదానవు, అసి = అయి ఉన్నావు. అమోఘదర్శనే = వ్యర్థము కాని దర్శనముగల, దేవి = దేవీ ! సౌమ్యేన = సౌమ్యమైన, చక్షుషా = నేత్రముతో, భజ = నన్ను పొందుము (చూడుము)

తా. వరము లీయ సమర్థురాలవైన ఓ ! దేవీ ! నీవు లోకములకు వరములను ఇచ్చెదవు. వ్యర్థము కాని దర్శనము కలదానా ! నన్ను సౌమ్యమైన నేత్రముతో చూడుము. 22

మూ. హృద్గతం తస్య రాజర్షేర్విజ్ఞాయ హరసంనిధౌ, 23
ప్రత్యువాచ శుభం వాక్యం దేవీ రుద్రస్య సంమతా.

ప్ర. అ. రుద్రస్య = రుద్రునకు, సంమతా = ప్రియురాలైన, దేవీ = దేవి, హరసంనిధౌ = శివుని సంనిధియందు, తస్య రాజర్షేః = ఆ రాజర్షియొక్క, హృద్గతమ్ = హృదయములో నున్న దానిని, విజ్ఞాయ = తెలిసికొని, శుభమ్ = శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = బదులుగా పలికెను.

తా. రుద్రుని ప్రియురాలైన ఆ దేవి ఈశ్వరసంనిధిలో ఆ రాజర్షి మనస్సులో ఉన్న అభిప్రాయము తెలిసికొని ఇట్లు పలికెను. 23

మూ. అర్ధస్య దేవో వరదో వరార్ధస్య తవ హ్యాహమ్, 24
తస్మాదర్ధం గృహాణ త్వం స్త్రీపుంసోర్యావదిచ్ఛసి.

ప్ర. అ. దేవః = శివుడు, అర్ధస్య = సగమునకు, వరదః = వరము నిచ్చు వాడు. తవ = నీయొక్క, వరార్ధస్య = వరముయొక్క అర్ధమునకు ఇచ్చుదానను, అహమ్ = నేను. తస్మాత్ = ఆ కారణమువలన, స్త్రీపుంసోః = స్త్రీపురుషులలో, యావత్ = ఎంత (దేనిని), ఇచ్ఛసి = కోరుచున్నావో, అర్ధమ్ = సగమును, గృహాణ = గ్రహించుము.

తా. నీకు శివుడు సగము వరము నిచ్చును. నేను సగము వరము నిచ్చె దను. అందువలన స్త్రీత్వ పురుషత్వములలో ఏది కావలెనో దానిలోని సగము కోరుకొనుము. 24

మూ. తదద్భుతతరం శ్రుత్వా దేవ్యా వరమనుత్తమమ్, 25
సంప్రహృష్టమనా భూత్వా రాజా వాక్యమథాబ్రవీత్.

ప్ర. అ. దేవ్యాః = దేవియొక్క, అద్భుతతరమ్ = చాల ఆశ్చర్యకరమైన, అనుత్తమమ్ = శ్రేష్ఠమైన, తత్ వరమ్ = ఆ వరమును, శ్రుత్వా = విని, రాజా = రాజు, సంప్రహృష్టమనాః = సంతోషించిన మనస్సు గలవాడు, భూత్వా = అయి, అథ = పిమ్మట, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆశ్చర్యకరము, ఉత్తమమూ అయిన దేవి ఇచ్చిన వరమును విని రాజు మనస్సులో సంతోషించుచు ఇట్లు పలికెను. 25

మూ. యది దేవి ప్రసన్నా మే రూపేణాప్రతిమా భువి, 26
మాసం స్త్రీత్వముపాసిత్వా మాసం స్యాం పురుషః పునః.

ప్ర. అ. దేవి = దేవీ! రూపేణ = రూపముచేత, భువి = భూమియందు అప్రతిమా = సాటిలేని నీవు, మే = నాకు, ప్రసన్నా యది = ప్రసన్నురాల వైనచో, మాసమ్ = ఒక మాసమును, స్త్రీత్వమ్ = స్త్రీత్వమును, ఉపాసిత్వా = పొంది, పునః = మరల, మాసమ్ = ఒకమాసము, పురుషః = పురుషుడనుగా, స్యామ్ = అగుదునుగాక.

తా. దేవీ! సౌందర్యములో సాటి లేని నీవు నీ విషయమున ప్రసన్నురాల వైనచో ఒక మాసము స్త్రీత్వమును పొంది, మరల ఒక మాసము పురుషుడను అగుదునుగాక. 26

మూ. ఈప్సితం తస్య విజ్ఞాయ దేవీ సురుచిరాననా, 27
ప్రత్యువాచ శుభం వాక్యమేవమేవ భవిష్యతి.

ప్ర. అ. సురుచిరాననా = చాల సుందరమైన ముఖము గల, దేవీ = దేవి, తస్య = వానియొక్క, ఈప్సితమ్ = కోరికను, విజ్ఞాయ = తెలుసుకొని, శుభమ్ = శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను. ఏవమేవ = ఇట్లే, భవిష్యతి = కాగలదు.

తా. సుందరమైన ముఖము గల ఆ దేవి అతని అభిలాషను తెలుసుకొని శుభమైన వాక్యమును పలికెను- "ఇట్లే కాగలదు". 22

మూ. రాజన్ పురుషభూతస్త్వం స్త్రీభావం న స్మరిష్యసి. 28
స్త్రీభూతశ్చ పరం మాసం న స్మరిష్యసి పౌరుషమ్.

ప్ర. అ. రాజన్ = రాజా ! పురుషభూతః = పురుషుడవైన, త్వమ్ = నీవు, స్త్రీభావమ్ = స్త్రీత్వమును, న స్మరిష్యసి = స్మరించవు. పరం మాసమ్ = తరువాతి మాసమును, స్త్రీభూతః చ = స్త్రీవి అయి, పౌరుషమ్ = పురుషత్వమును, న స్మరిష్యసి = స్మరించవు.

తా. రాజా ! నీవు పురుషుడవుగా ఉన్నప్పుడు స్త్రీత్వమును స్మరించవు. తరువాతి మాసమునందు స్త్రీగా ఉన్నప్పుడు పురుషత్వమును స్మరించవు. 28

మూ. ఏవం స రాజా పురుషో మాసం భూత్వాథ కార్దమిః, 29
త్రైలోక్యసున్దరీ నారీ మాసమేకమిలాభవత్,

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తాశీతితమః సర్గః

ప్ర. అ. కార్దమిః = కర్దమప్రజాపతి పుత్రుడైన, సః రాజా = ఆ రాజు, ఏవమ్ = ఈ విధముగా, మాసమ్ = మాసమును, పురుషః = పురుషుడుగా, భూత్వా

= అయి, ఏకమాసమ్ = ఒక మాసమును, త్రైలోక్యసున్దరీ = మూడు లోకములం లోను సుందరియైన, ఇలా = ఇల అను, నారీ = స్త్రీగా, అభవత్ = అయెను.

తా. ఈ విధముగా ఆ ఇలమహారాజు ఒక మాసము పురుషుడుగా అయి మరొక మాసము మూడులోకములలోను సుందరియైన ఇల అను స్త్రీగా అగు చుండెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఎనభైఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాశీతితమః సర్గః

[ఇలాబుధుల పరస్పరదర్శనము. ఇలా సహచారిణులకు కింపురుషి అను పేరు పెట్టి బుధుడు వాళ్ళను పర్వతముమీద నివసింపు డని పంపుట].

మూ. తాం కథామైలసంబద్ధాం రామేణ సముదీరితామ్,
లక్ష్మణో భరతశ్చైవ శ్రుత్వా పరమవిస్మితౌ. 1

రామేణ = రామునిచేత, సముదీరితామ్ = పలకబడిన, ఐలసంబద్ధామ్ = ఇలునితో సంబంధించిన, తాం కథామ్ = ఆ కథను, శ్రుత్వా = విని, లక్ష్మణః = లక్ష్మణుడు, భరతః చ ఏవ = భరతుడు, పరమవిస్మితౌ = చాల ఆశ్చర్యపడిరి.

తా. రాముడు చెప్పిన ఇలునికి సంబంధించిన కథను విని లక్ష్మణ భరతులు చాల ఆశ్చర్యము చెందిరి. 1

మూ. తౌ రామం ప్రాఞ్జలీ భూత్వా తస్య రాజ్ఞో మహాత్మనః,
విస్తరం తస్య భావస్య తదా పప్రచ్ఛతుః పునః. 2

ప్ర. అ. తౌ = వారిద్దరూ, ప్రాఞ్జలీ = కట్టబడిన దోసిళ్లు కలవారు, భూత్వా = అయి, మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాజ్ఞః = ఆ రాజుయొక్క, తస్య = ఆ, భావస్య = స్త్రీత్వపుంస్త్వభావములయొక్క, విస్తరమ్ = విస్తరమును, పునః = మరల, రామమ్ = రాముణ్ణి, తదా = అప్పుడు, పప్రచ్ఛతుః = అడిగిరి.

తా. ఆ లక్ష్మణభరతులు మహాత్ముడైన ఆ రాజుకు కలిగిన స్త్రీత్వపుంస్త్వములను గూర్చిన విస్తరమును నమస్కారపూర్వకముగా రాముణ్ణి మరల అడిగిరి. 2

మూ. కథం స రాజా స్త్రీభూతో వర్తయామాస దుర్గతిః,
పురుషః స యదా భూతః కాం వృత్తిం వర్తయత్యసౌ. 3

ప్ర. అ. దుర్గతిః = దుర్గతియైన, స్త్రీభూతః = స్త్రీయైన, సః రాజా = ఆ రాజు, కథమ్ = ఎట్లు, వర్తయామాస = ప్రవర్తించెను ? యదా = ఎప్పుడు, పురుషః భూతః = పురుష డైనాడో అప్పుడు, అసౌ = ఇతడు, కాం వృత్తిమ్ = ఏ వృత్తిని, వర్తయతి = ప్రవర్తింపచేయుచున్నాడు (చేసెను)?

తా. దుర్గతిని చెందిన ఆ రాజు స్త్రీ అయినప్పుడు ఎట్లు ప్రవర్తించెను ? పురుషుడు అయినప్పుడు ఎట్లు ప్రవర్తించెను ? 3

మూ. తయోస్తద్భాషితం శ్రుత్వా కౌతూహలసమన్వితమ్,
కథయామాస కాకుత్స్థస్తస్య రాజ్ఞో యథాగతమ్. 4

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, తయోః = వారిద్దరియొక్క, కౌతూహల సమన్వితమ్ = వేడుకతో కూడిన, తత్ భాషితమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, తస్య రాజ్ఞః = ఆ రాజునకు, యథా గతమ్ = ఎట్లు జరిగినదో అట్లు, కథయామాస = చెప్పెను.

తా. కుతూహలముతో వారు అడిగిన ప్రశ్న విని రాముడు ఆ రాజుకు ఏమి జరిగెనో చెప్పెను. 4

మూ. తమేవ ప్రథమం మాసం స్త్రీభూత్వా లోకసున్దరీ,
తాభిః పరివృతా స్త్రీభిర్యేఽస్య పూర్వం పదానుగాః. 5

తత్కాననం విగాహ్యాశు విజహ్రే లోకసున్దరీ,
ద్రుమగుల్మలతాకీర్ణం పద్భ్యాం పద్మదలేక్షణా. 6

ప్ర. అ. తమ్ = ఆ, ప్రథమమ్ = మొదటి, మాసమ్ ఏవ = మాసమునే, లోకసున్దరీ = లోకసుందరియైన, స్త్రీ = స్త్రీగా, భూత్వా = అయి, యే = ఎవరు, పూర్వమ్ = పూర్వము. అస్య = ఈ రాజుయొక్క, పదానుగాః = పదమును అనుసరించినారో, తాభిః = వారితో, పరివృతా = కూడినది. పద్మదలేక్షణా = పద్మములవంటి నేత్రములు గల, లోకసున్దరీ = లోకసుందరి, ద్రుమగుల్మలతాకీర్ణమ్ = వృక్షములతోను, పొదలతోను, లతలతోను వ్యాకులమైన, తత్ = ఆ, కాననమ్ = అడవిని, పద్భ్యామ్ = పాదములచేత, ఆశు = శీఘ్రముగా, విజహ్రే = విహరించెను.

తా. లోకసుందరియైన స్త్రీగా అయి మొదటిమాసమునందు పూర్వము

ఆ రాజును (తనను) అనుసరించి వచ్చిన స్త్రీలుగా మారినవారితో కూడి ఉండెను. పద్మపత్రముల వంటి నేత్రములు గల ఆ లోకసుందరి వృక్షములతోను, పొదల తోను లతలతోను వ్యాకులమైన ఆ అరణ్యములో పాదాలతోనే విహరించెను. 5,6

మూ. వాహనాని చ సర్వాణి సంత్యక్త్వా వై సమన్తతః,
పర్వతాభోగవివరే తస్మిన్ రేమే ఇలా తదా. 7

ప్ర. అ. తదా = అప్పుడు, ఇలా = ఇల, సర్వాణి = సమస్తమైన, వాహనాని చ = వాహనములను, సంత్యక్త్వా = విడచి, తస్మిన్ = ఆ, పర్వతాభోగవివరే = పర్వతమునకు సంబంధించిన విశాలప్రదేశముయొక్క వివరమునందు, సమన్తతః = అంతటను, రేమే వై = రమించెను.

తా. అప్పుడు ఆ ఇల సమస్తములైన వాహనములను విడచి ఆ పర్వత వివరమునందు అంతటా క్రీడించెను. 7

మూ. అథ తస్మిన్ వనోద్దేశే పర్వతస్యావిదూరతః,
సరః సురుచిరప్రఖ్యం నానాపక్షిగణాయుతమ్. 8

దదర్శ సా ఇలా తస్మిన్ బుధం సోమసుతం తదా,
జ్వలన్తం స్వేన వపుషా పూర్ణం సోమమివోదితమ్. 9

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సా ఇలా = ఆ ఇల, తస్మిన్ = ఆ, వనోద్దేశే = వనప్రదేశమునందు, పర్వతస్య = పర్వతముయొక్క, అవిదూరతః = సమీపమునందు, సురుచిరప్రఖ్యమ్ = చాల అందమైన కాంతి గల, నానాపక్షిగణాయుతమ్ = అనేకవిధములైన పక్షిగణములతో కూడిన, సరః = సరస్సును, తస్మిన్ = దానియందు, స్వేన వపుషా = తన శరీరముతో, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, పూర్ణమ్ = పూర్ణమైన, ఉదితమ్ = ఉదయించిన, సోమమ్ ఇవ = చంద్రుడు వలె ఉన్న, సోమసుతమ్ = చంద్రుని పుత్రుడైన, బుధమ్ = బుధుణ్ణి, దదర్శ = చూచెను.

తా. పిమ్మట ఆ వనప్రదేశమునందు పర్వతమునకు సమీపమునందు అనేక విధములైన పక్షుల సముదాయములతో కూడిన చాల సుందరమైన కాంతి గల

సరస్సును; ఆ సరస్సులో చంద్రుని కుమారుడైన బుధుణ్ణి ఆ ఇల చూచెను. అతడు ఉదయించిన పూర్ణచంద్రుడు వలె తన శరీరముతో ప్రజ్వలించుచుండెను. 8,9

మూ. తపన్తం చ తపస్తీవ్రమమ్భోమధ్యే దురాసదమ్,
యశస్కరం కామకరం తారుణ్యే పర్యవస్థితమ్. 10

ప్ర అ. అమ్భోమధ్యే=జలమధ్యమునందు, తీవ్రమ్ = తీవ్రమైన, తపః= తపస్సును, తపన్తమ్ = చేయుచున్నవాడు, దురాసదమ్=సమీపించుటకు శక్యము కానివాడు, యశస్కరమ్ = కీర్తిని చేయువాడు, కామకరమ్ = కోరికలను ఇచ్చువాడు, తరుణ్యే = యౌవనమునందు; పర్యవస్థితమ్=ఉన్నవాడు అయిన, ఆతనిని చూచెను.

తా. బుధుడు జలమధ్యమునందు తీవ్రమైన తపస్సు చేయుచుండెను. ఎదిరింప శక్యము కాని, కీర్తిని ఇచ్చు అతడు మంచి యౌవనములో ఉండెను 10

మూ. సా తం జలాశయం సర్వం క్షోభయామాస విస్మితా,
సహ తైః పూర్వపురుషైః స్త్రీభూతై రఘునన్దన. 11

ప్ర. అ. రఘునన్దన=లక్ష్మణా! లేదా భరతా! స్త్రీభూతైః=స్త్రీలుగా మారిన, తైః పూర్వపురుషైః సహ=పూర్వపురుషులతో కూడ, సా=ఆమె, విస్మితా=ఆశ్చర్యము చెందినదై, సర్వమ్ = సమస్తమైన, తం జలాశయమ్ = ఆ సరస్సును, క్షోభయామాస = క్షోభింపచేసెను

తా. రఘునందనా! ఆమె ఆశ్చర్యము చెందినదై స్త్రీలుగా మారిన ఆ పూర్వ పురుషులతో కలిసి ఆ సమస్తమైన సరస్సును క్షోభింపచేసెను. 11

మూ. బుధస్తు తాం సమీక్ష్యైవ కామబాణవశం గతః,
నోపలేభే తదాత్మానం స చచాల తదామ్భసి. 12

ప్ర. అ. బుధః తు = బుధుడైతే, తామ్ = ఆమెను, సమీక్ష్యైవ = చూడగానే, కామబాణవశమ్ = మన్మథబాణముల వశమును, గతః = పొందినవాడై, తదా = అప్పుడు, ఆత్మానమ్=మనస్సును (మనఃస్థైర్యమును)న ఉపలేభే= పొందలేదు. సః = అతడు; తదా = అప్పుడు, అమ్భసి = నీటియందు, చచాల = చలించెను.

తా. బుధుడు ఆమెను చూడగానే మన్మథబాణములకు వశుడై అప్పుడు మనఃస్థైర్యమును పొందలేదు. అతడు అప్పుడు నీటిలో చలించిపోయెను. 12

మూ. ఇలాం నిరీక్షమాణస్తు త్రైలోక్యాదధికాం శుభామ్,
చిన్తయామాస కామార్తః కాన్వియం దేవతాధికా. 13

ప్ర. అ. త్రైలోక్యాత్ = మూడు లోకములకంటె, శుభామ్ = శుభమైన, ఇలామ్ = ఇలను, నిరీక్షమాణః తు = చూచుచు, కామార్తః = కామార్తుడై, చిన్తయామాస = చింతించెను. దేవతాధికా = దేవతకంటె అధికురాలైన, ఇయమ్ = ఈమె, కా ను = ఎవరు?

తా. ఆమూడు లోకములందలిస్త్రీలకంటె సుందరియైన ఇలను చూచుచు, కామార్తుడై అతడు చింతించెను-"దేవతకంటె అధికురాలైన ఈమె ఎవరో?" 13

మూ. న దేవీషు న నాగీషు నాసురీష్వప్సరఃసు చ,
దృష్టపూర్వా మయా కాచిద్రూపేణానేన శోభితా. 14

ప్ర. అ. అనేన = ఈ, రూపేణ = రూపముచేత, శోభితా = శోభింపచేయబడినది, దేవీషు = దేవతాస్త్రీలలో, మయా = నాచేత, న దృష్టపూర్వా = పూర్వము చూడబడలేదు; నాగీషు = నాగస్త్రీలలో, న = చూడబడలేదు. అసురీషు = అసురస్త్రీలలోను, అప్సఃరస్సుచ = అప్సరసలలోనూ కూడ, న = చూడబడలేదు.

తా. ఇట్టి రూపముతో శోభించు స్త్రీని దేవతాస్త్రీలలో గాని, నాగస్త్రీలలో గాని, అసురస్త్రీలలో గాని, అప్సరఃస్త్రీలలో గాని నేను చూడలేదు. 14

మూ. సదృశీయం మమ భవేద్యది నాన్యపరిగ్రహః,
ఇతి బుద్ధిం సమాస్థాయ జలాత్కూలముపాగమత్. 15

ప్ర. అ. ఇయమ్ = ఈమె, అన్యపరిగ్రహః = అన్యుని భార్య, న యది = కాకపోయినచో, మమ = నాకు, సదృశీ = తగినది, భవేత్ = అగును. ఇతి = ఇట్లు, బుద్ధిమ్ = బుద్ధిని, సమాస్థాయ = అవలంబించి, జలాత్ = జలమునుండి, కూలమ్ = తీరమును, ఉపాగమత్ = పొందెను.

తా. "ఈమె ఇతరుని భార్య కాకపోయినచో నాకు తగినది అగును." ఈ విధముగా ఆలోచించి అతడు నీటినుండి ఒడ్డుమీదికి వచ్చెను. 15

మూ. ఆశ్రమం తదుపాగమ్య తతస్తాః ప్రమదోత్తమాః,
శబ్దాపయత ధర్మాత్మా తాశ్చైనం చ వవన్దిరే. 16

ప్ర. అ. ధర్మాత్మా = ఆ ధర్మాత్ముడు, తతః = అటు పిమ్మట, తత్ = ఆ, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఉపాగమ్య = చేరి, తాః = ఆ, ప్రమదోత్తమాః = ఉత్తమస్త్రీలను, శబ్దాపయత = పిలచెను. తాః చ = వాళ్లు కూడ, ఏనమ్ = వీనిని, వవన్దిరే = నమస్కరించిరి.

తా. అతడు ఆ ఆశ్రమము చేరి ఆ ఉత్తమస్త్రీలను పిలచెను. వాళ్ళు కూడ ఇతనికి నమస్కరించిరి. 16

మూ. స తాః పప్రచ్ఛ ధర్మాత్మా కస్యైషా లోకసున్దరీ,
కిమర్థమాగతా చైవ సర్వమాఖ్యాత మా చిరమ్. 17

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = అతడు, తాః = వాళ్ళను, పప్రచ్ఛ = అడిగెను. ఏషా = ఈ, లోకసున్దరీ = త్రిలోకసుందరి, కస్య = ఎవరిది ? కిమర్థమ్ = ఎందుకు, ఆగతా చైవ = వచ్చినది. సర్వమ్ = అంతా, ఆఖ్యాత = చెప్పండి. చిరమ్ = చిరకాలము, మా = వద్దు.

తా. ధర్మాత్ముడైన అతడు వాళ్ళను ప్రశ్నించెను-"త్రిలోకసుందరియైన ఈమె ఎవరిని భార్య ? ఎందుకు వచ్చినది ? అంతా చెప్పండి, ఆలస్యము చేయ వద్దు." 17

మూ. శుభం తు తస్య తద్వాక్యం మధురం మధురాక్షరమ్,
శ్రుత్వా స్త్రియశ్చ తాః సర్వా ఊచుర్మధురయా గిరా. 18

ప్ర. అ. తస్య = ఆతనియొక్క, శుభమ్ = శుభమైన, మధురమ్ = మధురమైన, మధురాక్షరమ్ = మధురములైన అక్షరములు గల, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తాః = ఆ, సర్వాః = సమస్తమైన, స్త్రియః = స్త్రీలు, మధురయా = మధురమైన, గిరా = వాక్కుతో, ఊచుః = పలికిరి.

తా. మధురము, మధురములైన అక్షరములు గలదీ అయిన ఆతని ఆ మాటలు విని ఆ స్త్రీలు అందరూ మధురమైన వాక్కుతో ఇట్లు పలికిరి. 18

మూ. అస్మాకమేషా సుశ్రోణీ ప్రభుత్వే వర్తతే సదా,
అపతిః కాననాన్తేషు సహాస్మాభిశ్చరత్యసౌ. 19

ప్ర. అ. సుశ్రోణీ = అందమైన కటిప్రదేశముగల, ఏషా = ఈమె, సదా = ఎల్లప్పుడూ, అస్మాకమ్ = మాయొక్క, ప్రభుత్వే = ప్రభుత్వమునందు, వర్తతే = ఉంటున్నది. అపతిః = భర్తలేని, అసౌ = ఈమె, అస్మాభిః సహ = మాతో కూడ, కాననాన్తేషు = అరణ్యమధ్యములయందు, చరతి = సంచరించుచున్నది.

తా. అందమైన కటిప్రదేశము గల ఈమె ఎల్లప్పుడూ మాపై ఆధిపత్యము వహించి ఉన్నది. వివాహము కాని ఈమె మాతో కలిసి అరణ్యములలో తిరుగుచుండును. 19

మూ. తద్వాక్యమవ్యక్తపదం తాసాం స్త్రీణాం నిశమ్య చ,
విద్యామావర్తనీం పుణ్యామావర్తయతి స ద్విజః. 20

ప్ర. అ. ద్విజః = క్షత్రియుడైన, సః = ఆ బుధుడు, తాసాం స్త్రీణామ్ = ఆ స్త్రీలయొక్క, అవ్యక్తపదమ్ = అస్పష్టములైన పదములు గల తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, పుణ్యామ్ = పుణ్యమైన, ఆవర్తనీమ్ = ఆవర్తని అను, విద్యామ్ = విద్యను, ఆవర్తయతి = ఆవర్తించెను.

తా. అస్పష్టపదములు గల ఆ స్త్రీల వాక్యము విని క్షత్రియుడైన ఆ బుధుడు పవిత్రమైన ఆవర్తని అను విద్యను (తెలియని అర్థమును తెలుసుకొనే శక్తిని కలిగించు మంత్రమును) మనస్సులో జపించెను. 20

మూ. సోఽర్థం విదిత్వా సకలం తస్య రాజ్ఞో యథా తథా,
సర్వా ఏవ స్త్రియస్తాశ్చ బభాషే మునిపుంగవః. 21

ప్ర. అ. సః మునిపుంగవః = ఆ మునిశ్రేష్ఠుడు, తస్య రాజ్ఞః = ఆ రాజుయొక్క, సకలమ్ = సమస్తమైన, అర్థమ్ = విషయమును, యథా తథా = ఉన్నది ఉన్నట్లుగా, విదిత్వా = తెలుసుకొని, సర్వాః ఏవ = సమస్తమైన, వరస్త్రియః = శ్రేష్ఠులైన స్త్రీలను గూర్చి, బభాషే = పలికెను.

తా. ఆ ముని శ్రేష్ఠుడు ఆ రాజునకు సంబంధించిన వృత్తాంతమును అంతనూ యథాతథముగా తెలుసుకొని ఆ ఉత్తమస్త్రీలతో పలికెను. 21

మూ. అత్ర కింపురుషీర్భూత్వా శైలరోధసి వత్స్యథ,
ఆవాసస్తు గిరావస్మిన్ శీఘ్రమేవ విధీయతామ్. 22

ప్ర. అ. అత్ర = ఇక్కడ, శైలరోధసి = శైలము పైభాగమునందు, కింపురుషీఃభూత్వా = కింపురుషీలుగా అయి, వత్స్యథ = నివసించండి. అస్మిన్ = ఈ, గిరౌ = పర్వతముమీద, శీఘ్రమ్ఏవ = శీఘ్రముగా, ఆవాసః = నివాసము, విధీయతామ్ = చేయబడుగాక.

తా. మీరు ఈ పర్వతము పైభాగమునందు కింపురుషీలుగా అయి నివసించుడు ఈ పర్వతముమీద శీఘ్రముగా నివాసము చేయుడు. 22

మూ. మూలపత్రఫలైః సర్వా వర్తయిష్యథ నిత్యదా,
స్త్రియః కింపురుషాన్నామ భర్తౄన్ సముపలప్స్యథ. 23

ప్ర. అ. స్త్రియః = స్త్రీలలారా! సర్వాః = మీరందరూ నిత్యదా = ఎల్లప్పుడు, మూలపత్రఫలైః = మూలములతోను, ఆకులతోను, పండ్లతోను, వర్తయిష్యథ = జీవనము గడపెదరు. కింపురుషాన్ నామ = కింపురుష లను, భర్తౄన్ = భర్తలను, సముపలప్స్యథ = పొందెదరు.

తా. స్త్రీలలారా! మీరందరూ నిత్యము మూలములతోను, ఆకులతోను, పండ్లతోను జీవనమును గడపెదరు. కింపురుషులు అను భర్తలను పొందగలరు.

మూ. తాః శ్రుత్వా సోమపుత్రస్య స్త్రియః కింపురుషీకృతాః,
ఉపాసాంచక్రిరే శైలం వధ్వస్తా బహులాస్తదా. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టాశీతితమః సర్గః.

ప్ర. అ. తాః స్త్రియః = ఆ స్త్రీలు, సోమపుత్రస్య = బుధుని వాక్యమును, శ్రుత్వా = విని, కింపురుషీకృతాః = కింపురుషీలుగా చేయబడినారు. తదా = అప్పుడు,

బహులాః = అనేకలైన, తాఃవధ్వః = ఆ స్త్రీల. . _లమ్ = పర్వతమును, ఉపాసాం చక్రిరే = ఉపాసించిరి.

తా. ఆ స్త్రీలు బుధుని మాట వినగానే కింపురుషీలుగా అయిరి. ఆ స్త్రీలందరు అప్పుడు ఆ పర్వతముమీదికి వెళ్ళిరి. 24

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో ఎనభైఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోననవతితమః సర్గః

[ఇలాబుధులకు పురూరవుడు అను పుత్రుడు పుట్టుట.]

మూ. శ్రుత్వా కింపురుషోత్పత్తిం లక్ష్మణో భరతస్తథా,
ఆశ్చర్యమితి చ బ్రూతాముభౌ రామం జనేశ్వరమ్. 1

ప్ర. అ లక్ష్మణః = లక్ష్మణుడు, తథా = మరియు, భరతః = భరతుడు, ఉభౌ = ఇద్దరూ, కింపురుషోత్పత్తిమ్ = కింపురుషుల ఉత్పత్తిని, శ్రుత్వా = విని, జనేశ్వరమ్ = రాజైన, రామమ్ = రాముణ్ణి గూర్చి, ఆశ్చర్యమ్ ఇతి = చాల ఆశ్చర్యము అని, బ్రూతామ్ = పలికిరి.

తా. లక్ష్మణభరతు లిద్దరూ కింపురుషుల ఉత్పత్తిని గూర్చి విని రాజైన రామునితో "ఇది చాల ఆశ్చర్యకరము"అని పలికిరి. 1

మూ. అథ రామః కథామేతాం భూయ ఏవ మహాయశాః,
కథయామాస ధర్మాత్మా ప్రజాపతిసుతస్య వై. 2

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాయశాః=గొప్ప కీర్తి గల, ధర్మాత్మా = ధర్మాత్ముడైన, రామః = రాముడు, ప్రజాపతిసుతస్య=ఇలునియొక్క, ఏతాం కథామ్ = ఈ కథను, భూయః ఏవ = మరల, కథయామాస = చెప్పెను.

తా. ధర్మాత్ముడు, మహాకీర్తిమంతుడు అయిన రాముడు మరల ఇలుని కథను చెప్పెను. 2

మూ. సర్వాస్తా విద్రుతా దృష్ట్వా కింనరీర్ఋషిసత్తమః,
ఉవాచ రూపసంపన్నాం తాం స్త్రియం ప్రహసన్నివ. 3

ప్ర. అ. ఋషిసత్తమః = ఋషిశ్రేష్ఠుడైన బుధుడు, విద్రుతాః = విహరించు చున్న, సర్వాః = సమస్తమైన, తాః కింనరీః=ఆ కింనరస్త్రీలను, దృష్ట్వా = చూచి,

ప్రహసన్నివ=నవ్వుచు. రూపసంపన్నామ్=మంచి రూపము గల, తాం స్త్రియమ్=ఆ స్త్రీని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. బుధుడు ఆ కింనరస్త్రీ లందరు విహరించుట చూచి మంచి సౌందర్యము గల ఆ స్త్రీతో నవ్వుచు ఇట్లు పలికెను. 3

మూ. సోమస్యాహం సుదయితః సుతః సురుచిరాననే,
భజస్వ మాం వరారోహే భక్త్యా స్నిగ్ధేన చక్షుషా. 4

ప్ర. అ. సురుచిరాననే=చాల అందమైన నేత్రములు గలదానా! అహమ్=నేను, సోమస్య = చంద్రునియొక్క, దయితః=ఇష్టుడనైన, సుతః = పుత్రుడను. వరారోహే = శ్రేష్ఠమైన కటిప్రదేశము గలదానా, మామ్ = నన్ను, స్నిగ్ధేన = స్నేహముతో కూడిన, చక్షుషా = నేత్రముతో, భక్త్యా = భక్తితో, భజస్వ = చేరుము.

తా. ఓ! సుందరవదనా! నేను చంద్రుని ప్రియపుత్రుడను. ఓ! సుందరమైన కటిప్రదేశము కలదానా! నన్ను స్నేహపూర్ణమైన దృష్టితో చూచుచు, భక్తితో చేరుము. 4

మూ. తస్య తద్వచనం శ్రుత్వా శూన్యే స్వజనవర్జితే,
ఇలా సురుచిరప్రఖ్యం ప్రత్యువాచ మహాప్రభమ్. 5

ప్ర. అ. స్వజనవర్జితే = స్వజనముచేత విడువబడిన, శూన్యే = శూన్యప్రదేశమునందు, తస్య = అతనియొక్క, తత్ = ఆ, వచనమ్=వచనమును, శ్రుత్వా విని, ఇలా = ఇల, సురుచిరప్రఖ్యమ్=చాల అందమైన కాంతి గల, మహాప్రభమ్ = గొప్ప కాంతి గల అతనిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. స్వజనులు ఎవరూ లేని ఆ శూన్యప్రదేశమునందు అతని మాటలు విని చాల అందమైన గొప్ప కాంతి గల అతనితో ఇల ఇట్లనెను. 5

మూ. అహం కామచరీ సౌమ్య తవాస్మి వశవర్తినీ,
ప్రశాధి మాం సోమసుత యథేచ్ఛసి తథా కురు. 6

ప్ర. అ. సౌమ్య=సౌమ్యుడా! కామచరీ=స్వేచ్ఛగా సంచరించు, అహమ్

= నేను, తవ = నీయొక్క, వశవర్తినీ = వశమునందున్న దానను, అస్మి = అయి ఉన్నాను. సోమసుత = చంద్రుని పుత్రుడా! మామ్ = నన్ను, ప్రశాధి = ఆజ్ఞాపించుము. యథా = ఎట్లు, ఇచ్ఛసి = కోరుచున్నావో, తథా = అట్లు, కురు = చేయుము.

తా. సౌమ్యుడా! స్వేచ్ఛగా సంచరించు నేను నీకు వశురాల నైతిని. చంద్రపుత్రా! నన్ను ఆజ్ఞాపించుము. నీకు ఎట్లు ఇష్టమో అట్లు చేయుము. 6

మూ. తస్యాస్తదద్భుతప్రఖ్యం శ్రుత్వా హర్షముపాగతః,
స వై కామీ సహ తయా రేమే చన్ద్రమసః సుతః. 7

ప్ర. అ. కామీ = కాముకుడైన, సః = ఆ, చన్ద్రమసః సుతః = చంద్రుని కుమారుడు, తస్యాః = ఆమెయొక్క, అద్భుతప్రఖ్యమ్ = ఆశ్చర్యకరమైన, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, హర్షమ్ = సంతోషమును, ఉపాగతః = పొందినవాడై, తయా సహ = ఆమెతో కూడ, రేమే = రమించెను.

తా. కాముకుడైన ఆ బుధుడు ఆశ్చర్యకరమైన ఆమె మాట విని సంతోషించి ఆమెతో విహరించెను. 7

మూ. బుధస్య మాధవో మాసస్తామిలాం రుచిరాననామ్,
గతో రమయతోఽత్యర్థం క్షణవత్తస్య కామినః. 8

ప్ర. అ. రుచిరాననామ్ = సుందరమైన ముఖము గల, తామ్ = ఆ, ఇలామ్ = ఇలను, అత్యర్థమ్ = మిక్కిలి, రమయతః = క్రీడింపచేయుచున్న, తస్య = ఆ, కామినః = కాముకుడైన, బుధస్య = బుధునికి, మాధవః మాసః = వైశాఖమాసము, క్షణవత్ = క్షణము వలె, గతః = గడిచినది.

తా. సుందరమైన ముఖము గల ఆ ఇలను అధికముగా క్రీడింపచేయుచున్న కాముకుడైన ఆ బుధునకు వైశాఖమాసము ఒక క్షణము వలె గడచిపోయెను. 8

మూ. అథ మాసే తు సంపూర్ణే పూర్ణేన్దుసదృశాననః,
ప్రజాపతిసుతః శ్రీమాన్ శయనే ప్రత్యబుధ్యత. 9

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మాసే = మాసము, సంపూర్ణే = సంపూర్ణమైన దగుచుండగా, పూర్ణేన్దుసదృశాననః = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము గల, శ్రీమాన్ = శ్రీమంతుడైన, ప్రజాపతిసుతః = ఇలుడు, శయనే = శయనమునందు, ప్రత్యబుధ్యత = మేల్కొనెను.

తా. మాసము పూర్తిగానే పూర్ణచంద్రుని వంటి ముఖము గల శ్రీమంతుడైన ఇలుడు శయనముమీద మేల్కొనెను. 9

మూ. సోఽపశ్యత్ సోమజం తత్ర తపన్తం సలిలాశయే,
ఊర్ధ్వబాహుం నిరాలమ్బం తం రాజా ప్రత్యభాషత. 10

ప్ర. అ. సః = అతడు. తత్ర = అక్కడ, సలిలాశయే = సరస్సునందు, తపన్తమ్ = తపస్సు చేయుచున్న, ఊర్ధ్వబాహుమ్ = పైకి బాహువులు గల, నిరాలమ్బమ్ = ఆధారములేని, సోమజమ్ = బుధుణ్ణి, అపశ్యత్ = చూచెను. రాజా = రాజు, తం ప్రతి = అతనిని గూర్చి, అభాషత = పలికెను.

తా. ఆ రాజు అక్కడ సరస్సులో చేతులు పైకి ఎత్తి, ఆధార మేమీ లేకుండా నిలచి తపస్సు చేయుచున్న బుధుణ్ణి చూచి ఆతనితో ఇట్లనెను. 10

మూ. భగవన్ పర్వతం దుర్గం ప్రవిష్టోఽస్మి సహానుగః,
న చ పశ్యామి తత్సైన్యం క్వ ను తే మామకా గతాః.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! సహానుగః = అనుచరులతో కూడినవాడనై, దుర్గమ్ = ప్రవేశింపశక్యముకాని, పర్వతమ్ = పర్వతమును, ప్రవిష్టః = ప్రవేశించితిని. తత్ = ఆ, సైన్యమ్ = సైన్యమును, న పశ్యామి చ = చూడను. తే = ఆ, మామకాః = నావాళ్ళు, క్వ = ఎక్కడికి, గతాః ను = వెళ్ళినారో!

తా. పూజ్యుడా? అనుచరులతో కలిసి నేను ప్రవేశింపశక్యముకాని పర్వతము మీదికి వచ్చితిని కాని నా సైన్యము కనబడుటలేదు. నా వాళ్ళందరు ఎక్కడికి పోయినారో తెలియదు. 11

మూ. తచ్ఛ్రుత్వా తస్య రాజర్షేర్నష్టసంజ్ఞస్య భాషితమ్,
ప్రత్యువాచ శుభం వాక్యం సాన్త్వయన్ పరయా గిరా.

ప్ర. అ. నష్టసంజ్ఞస్య = నశించిన స్మృతి గల, తస్య రాజర్షేః = ఆ రాజర్షియొక్క, తత్ = ఆ, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, పరయా = గొప్పదైన, గిరా = వాక్కుతో, సాన్త్వయన్ = ఓదార్చుచు, శుభమ్ = శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = పలికెను.

తా. స్మృతిని కోల్పోయిన ఆ రాజర్షి మాటలు విని బుధుడు మంచి మాటలతో ఓదార్చుచు శుభమైన వాక్యమును పలికెను. 12

మూ. అశ్మవర్షేణ మహతా భృత్యాస్తే వినిపాతితాః,
త్వం చాశ్రమపదే సుప్తో వాతవర్షభయార్దితః. 13

ప్ర. అ. మహతా = గొప్పదైన, అశ్మవర్షేణ = రాళ్ళ వర్షముచేత, తే భృత్యాః = నీ భృత్యులు, వినిపాతితాః = పడగొట్టబడినారు, వాతవర్షభయార్దితః = గాలివానల భయముచేత పీడితుడవైన, త్వం చ = నీవు, ఆశ్రమపదే = ఆశ్రమమునందు, సుప్తః = నిద్రించినావు.

తా. పెద్ద రాళ్ళ వానకు నీ అనుచరు లందరూ మరణించినారు. నీవు గాలివానలకు భయపడి ఆశ్రమమునకు వచ్చి నిద్రించితివి. 13

మూ. సమాశ్వసి హి భద్రం తే నిర్భయో విగతజ్వరః,
ఫలమూలాశనో వీర నివసేహ యథాసుఖమ్. 14

ప్ర. అ వీర = వీరుడా! సమాశ్వసిహి = ఊరడిల్లుము, తే = నీకు, భద్రమ్ = క్షేమము. నిర్భయః = భయము లేనివాడవై, విగతజ్వరః = పోయిన దుఃఖము కలవాడవై, ఫలమూలాశనః = ఫలములను దుంపలను తినుచు, యథాసుఖమ్ = సుఖముగా, ఇహ = ఇక్కడ, నివస = నివసించుము.

తా. వీరుడా! ఊరడిల్లుము. నీకు క్షేమ మగుగాక. నీవు భయమును దుఃఖమును విడచి, ఫలమూలములను తినుచు సుఖముగా ఇక్కడ నివసించుము.

మూ. స రాజా తేన వాక్యేన ప్రత్యాశ్వస్తో మహామతిః,
ప్రత్యువాచ శుభం వాక్యం దీనో భృత్యజనక్షయాత్. 15

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల, సః రాజా = ఆ రాజు, తేన

వాక్యేన = ఆ వాక్యముచేత, ప్రత్యాశ్వస్తః = ఊరడిల్లినవాడై, భృత్యజనక్షయాత్ = భృత్యుల నాశమువలన, దీనః = దీనుడై, శుభమ్ = శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. గొప్ప బుద్ధిగల ఆ రాజు ఆ మాటలకు ఊరడిల్లి భృత్యులు నశించుటచే దీనుడై, శుభమైన వాక్యమును పలికెను. 15

మూ. త్యక్ష్యామ్యహం స్వకం రాజ్యం నాహం భృత్యైర్వినాకృతః,
వర్తయేయం క్షణం బ్రహ్మన్ సమనుజ్ఞాతుమర్హసి. 16

ప్ర. అ. భృత్యైః వినా = భృత్యులు లేనివాడనుగా, కృతః = చేయబడిన అహమ్ = నేను, స్వకమ్ = నా సంబంధమైన, రాజ్యమ్ = రాజ్యమును, త్యక్ష్యామి = విడచెదను, క్షణమ్ = క్షణకాలము కూడ, న వర్తయేయమ్ = ఇచట ఉండను. బ్రహ్మన్ = ఓ! మునీ! అనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. నా భృత్యులు లేని నా రాజ్యమును విడిచివేసెదను. బ్రాహ్మణోత్తమా! ఇక్కడ క్షణము ఉండను. నాకు వెళ్ళుటకు అనుజ్ఞ ఇమ్ము. 16

మూ. సుతో ధర్మపరో బ్రహ్మన్ జ్యేష్ఠో మమ మహాయశాః,
శశబిన్దురితి ఖ్యాతః స మే రాజ్యం ప్రపత్స్యతే. 17

ప్ర. అ. బ్రహ్మన్ = బ్రాహ్మణా! మమ = నాయొక్క, జ్యేష్ఠః = పెద్ద, సుతః = కుమారుడు, మహాయశాః = గొప్ప కీర్తి కలవాడు, శశబిన్దుః ఇతి = శశబిందువు అని, ఖ్యాతః = ప్రసిద్ధుడు ఉన్నాడు. సః = అతడు, మే రాజ్యమ్ = నా రాజ్యమును, ప్రపత్స్యతే = పొందగలడు.

తా. బ్రాహ్మణా! ధర్మపరుడు, గొప్ప కీర్తి గలవాడు, శశబిందు వను పేరు గలవాడూ అయిన నా జ్యేష్ఠపుత్రుడు రాజ్యమును పొందగలడు. 17

మూ. న హి శక్ష్యామ్యహం హిత్వా భృత్యాన్ దారాన్ సుఖాన్వితాన్,
ప్రతివక్తుం మహాతేజః కించిదప్యశుభం వచః. 18

ప్ర. అ. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా! అహమ్ = నేను, సుఖా

న్వితాన్ = సుఖములతో కూడిన, భృత్యాన్ = భృత్యులను, దారాన్ = భార్యలను, హిత్వా = విడచి, న హి శక్ష్యామి = ఉండ సమర్థుడను కాను కదా? కించిదపి = ఏమీ, అశుభం వచః = అశుభమైన వచనమును, ప్రతివక్తుమ్ = చెప్పుటకు, (నార్హసి = తగవు)

తా. గొప్ప తేజస్సు కలవాడా! నేను సుఖవంతులైన భృత్యులను, భార్యలను విడచి ఉండజాలను. 'ఇక్కడనే ఉండుము' వంటి అశుభవాక్యమును నీవు పలకవద్దు. 18

మూ. తథా బ్రువతి రాజేన్ద్రే బుధః పరమమద్భుతమ్,
సాన్త్వపూర్వమథోవాచ వాసస్త ఇహ రోచతామ్. 19

ప్ర. అ. రాజేన్ద్రే = ఆ రాజేంద్రుడు, తథా = అట్లు, బ్రువతి = పలుకుచుండగా, అథ = అటుపిమ్మట, బుధః = బుధుడు, సాన్త్వపూర్వమ్ = సాంత్వము పూర్వమునందు కలుగునట్లుగా, పరమమ్ = మిక్కిలి, అద్భుతమ్ = ఆశ్చర్య కరమైన వాక్యమును, ఉవాచ = పలికెను. తే = నీకు, ఇహ = ఇక్కడ, వాసః = నివాసము, రోచతామ్ = ఇష్టమగుగాక.

తా. ఆ రాజు అట్లు పలుకుచుండగా బుధుడు అతనిని ఓదార్చుచు చాల అద్భుతమైన వాక్యమును పలికెను. "నీకు ఇక్కడ నివాసము ఇష్ట మగుగాక".

మూ. న సంతాపస్త్వయా కార్యః కార్ధమేయ మహాబల,
సంవత్సరోషితస్యేహ కారయిష్యామి తే హితమ్. 20

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గలవాడా! కార్ధమేయ = కర్దమ ప్రజాపతి పుత్రుడా! త్వయా = నీచేత, సంతాపః = దుఃఖము, న కార్యః = చేయ దగినది కాదు, ఇహ = ఇక్కడ, సంవత్సరోషితస్య = సంవత్సరము ఉన్న, తే = నీకు, హితమ్ = హితమును, కారయిష్యామి = చేసెదను.

తా. మహాబలశాలివైన మహారాజా! నీవు దుఃఖము చెందకుము. ఇక్కడ నీవు ఒక సంవత్సరము ఉన్నచో నీకు హితము చేయించెదను. 20

మూ. తస్య తద్వచనం శ్రుత్వా బుధస్యాక్లిష్టకర్మణః,
వాసాయ విదధే బుద్ధిం యదుక్తం బ్రహ్మవాదినా. 21

ప్ర. అ. అక్లిష్టకర్మణః = క్లేశములేని పనులు గల, తస్య బుధస్య = ఆ బుధునియొక్క, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా=విని, బ్రహ్మవాదినా= వేదవక్తయైన అతనిచేత, యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడినదో ఆ విధముగా, వాసాయ = నివాసముకొరకు, బుద్ధిమ్=బుద్ధిని, విదధే = చేసెను.

తా. క్లేశము లేని పనులు చేయు ఆ బుధుడు చెప్పిన మాటలు విని అతడు చెప్పిన విధముగా నివసించుటకు నిశ్చయించుకొనెను. 21

మూ. మాసం స స్త్రీ తదా భూత్వా రమయత్యనిశం శుభా,
మాసం పురుషభావేన ధర్మబుద్ధిం చకార సః. 22

ప్ర. అ. సః = అతడు, మాసమ్ = ఒక మాసమును, శుభా = సుందరి యైన, స్త్రీ = స్త్రీగా, భూత్వా = అయి, తదా = అప్పుడు, అనిశమ్ = ఎల్లప్పుడూ, రమయతి = రమింపచేయుచున్నది. సః = అతడు, మాసమ్=మాసమును, పురుష భావేన = పురుషత్వముతో, ధర్మబుద్ధిమ్ = ధర్మబుద్ధిని, చకార = చేసెను.

తా. ఆ రాజు ఒక మాసము సుందరియైన స్త్రీగా అయి ఆ బుధుణ్ణి రమింప చేసెను. మరొక మాసము పురుషుడుగా అయి ధర్మబుద్ధితో ఉండెను. 22

మూ. తతః సా నవమే మాసి ఇలా సోమసుతాత్సుతమ్,
జనయామాస సుశ్రోణీ పురూరవసమూర్జితమ్. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుశ్రోణీ = అందమైన పిరుదులు గల, సా ఇలా = ఆ ఇల, నవమే = తొమ్మిదవ, మాసి=మాసమునందు, సోమసుతాత్ = బుధునివలన, ఊర్జితమ్ = బలవంతుడైన, పురూరవసమ్ = పురూరవుడను, సుతమ్ = కుమారుణ్ణి, జనయామాస = కనెను.

తా. పిమ్మట సుశ్రోణియైన ఆ ఇల తొమ్మిదవ మాసమునందు బుధుని వలన గొప్ప బలము గల పురూరవసుడు అను పుత్రుణ్ణి కనెను. 23

మూ. జాతమాత్రే తు సుశ్రోణీ పితుర్హస్తే న్యవేశయత్,
బుధస్య సమవర్ణం చ ఇలాపుత్రం మహాబలమ్. 24

ప్ర. అ. జాతమాత్రే తు = పుట్టగానే, బుధస్య = బుధునకు, సమవర్ణమ్ = సమానమైన వర్ణముగల, మహాబలమ్ = గొప్ప బలము గల, పుత్రమ్ =

పుత్రుణ్ణి, సుశ్రోణీ = అందమైన కటిప్రదేశము గల, ఇలా = ఇల, పితుః = తండ్రి యొక్క, హస్తే = హస్తమునందు, న్యవేశయత్ = ఉంచెను.

తా. అతడు పుట్టగానే సుశ్రోణియైన ఆ ఇల తండ్రితో సమానమైన వర్ణము, గొప్ప బలము గల ఆ పుత్రుణి తండ్రి చేతిలో ఉంచెను. 24

మూ. బుధస్తు పురుషీభూతం స వై సంవత్సరాన్తరమ్,
కథాభీ రమయామాస ధర్మయుక్తాభిరాత్మవాన్. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోననవతితమః సర్గః.

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, సః బుధస్తుః = ఆ బుధుడైతే, సంవత్సరాన్తరమ్ = సంవత్సరము తరువాత, పురుషీభూతమ్ = పురుషుడైన ఆ రాజును, ధర్మయుక్తాభిః = ధర్మముతో కూడిన, కథాభిః = కథలచేత, రమయామాస = సంతోషపెట్టెను.

తా. బుద్ధిమంతుడైన బుధుడు సంవత్సరానంతరము పురుషుడైన ఆ ఇలుణ్ణి ధర్మసంబద్ధములైన కథలతో ఆనందింపచేసెను. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో ఎనభైతొమ్మిదవసర్గ సమాప్తము.

# అథ నవతితమః సర్గః

[అశ్వమేధయాగము చేయుటచే ఇలకు పురుషత్వము లభించుట]

మూ. తథోక్తవతి రామే తు తస్య జన్మ తదద్భుతమ్,
ఉవాచ లక్ష్మణో భూయో భరతశ్చ మహాయశాః. 1

ప్ర. అ. అద్భుతమ్ = అద్భుతమైన, తత్ = ఆ, తస్య జన్మ = వాని జన్మను గూర్చి, రామే = రాముడు, తథా = అట్లు, ఉక్తవతి = పలికినవాడగు చుండగా, భూయః = మరల, లక్ష్మణః = లక్ష్మణుడు, ఉవాచ = పలికెను. మహాయశాః = గొప్పకీర్తిగల, భరతః చ = భరతుడుకూడ పలికెను.

తా. రాముడు చెప్పిన ఆ పురూరవుని అద్భుతమైన జన్మను గూర్చి విని లక్ష్మణ భరతులు మరల ఇట్లనిరి. 1

మూ. ఇలా సా సోమపుత్రస్య సంవత్సరమథోషితా,
అకరోత్కిం నరశ్రేష్ఠ తత్త్వం శంసితుమర్హసి. 2

ప్ర. అ. నరశ్రేష్ఠ = మనుష్యులలో శ్రేష్ఠుడా! సోమపుత్రస్య = బుధుని సమీపమునందు, ఉషితా = ఉన్న, సా ఇలా = ఆ ఇల, అథ = అటుపిమ్మట, కిమ్ = ఏమి, అకరోత్ = చేసెను? తత్ = దానిని, త్వమ్ = నీవు, శంసితుమ్ = చెప్పుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. నరులలో శ్రేష్ఠుడవైన రామా! బుధునివద్ద సంవత్సర కాలము ఉన్న ఇల పిమ్మట ఏమి చేసినదో చెప్పుము. 2

మూ. తయోస్తద్వాక్యమాధుర్యం నిశమ్య పరిపృచ్ఛతోః,
రామః పునరువాచేమాం ప్రజాపతిసుతే కథామ్. 3

ప్ర. అ. రామః = రాముడు, పరిపృచ్ఛతోః = అడుగుచున్న, తయోః = వారిద్దరియొక్క, వాక్యమాధుర్యమ్ = మాధుర్యముతో కూడిన వాక్యమును, నిశమ్య

= విని, పునః ఏవ = మరల, ప్రజాపతిసుతే = ఇలునియందు, ఇమామ్ = ఈ, కథామ్ = కథను, ఉవాచ = పలికెను.

తా. ఈ విధముగా ప్రకాశించుచున్న ఆ ఇద్దరి వాక్యములోనున్న మాధుర్యమును విని, (ఆస్వాదించి), రాముడు ఇలునికి సంబంధించిన కథను మరల ఇట్లు చెప్పెను. 3

మూ. పురుషత్వం గతే శూరే బుధః పరమబుద్ధిమాన్,
సంవర్తం పరమోదారమాజుహావ మహాయశాః. 4

ప్ర. అ. శూరే = శూరుడైన ఇలుడు, పురుషత్వమ్ = పురుషత్వమును, గతే = పొందినవాడగుచుండగా, పరమబుద్ధిమాన్ = గొప్ప బుద్ధిగల, మహాయశాః = గొప్ప కీర్తి గల, బుధః = బుధుడు, పరమోదారమ్ = చాల ఉదారుడైన, సంవర్తమ్ = సంవర్తుణ్ణి, ఆజుహావ = పిలచెను.

తా. ఇలుడు పురుషత్వమును పొందిన పిమ్మట గొప్ప బుద్ధి, కీర్తి గల బుధుడు చాల ఉదారస్వభావము గల సంవర్తుణ్ణి పిలిచెను. 4

మూ. చ్యవనం భృగుపుత్రం చ మునిం చారిష్టనేమినమ్,
ప్రమోదనం మోదకరం తతో దుర్వాససం మునిమ్. 5

ప్ర. అ. భృగుపుత్రమ్ = భృగుపుత్రుడైన, చ్యవనమ్ = చ్యవనుణ్ణి, అరిష్టనేమినమ్ = అరిష్టనేమి అను, మునిం చ = మునిని, మోదకరమ్ = ఆనందమును కలిగించు, ప్రమోదనమ్ = ప్రమోదనుణ్ణి, తతః = అటు పిమ్మట, దుర్వాససమ్ = దుర్వాసు డను, మునిమ్ = మునినీ, (పిలచెను).

తా. భృగుపుత్రుడైన చ్యవనుణ్ణి, అరిష్టనేమిమునిని, ఆనందకరుడైన ప్రమోదనుణ్ణి, దుర్వాసమునిని పిలచెను. 5

మూ. ఏతాన్ సర్వాన్ సమానీయ వాక్యజ్ఞః స్తత్త్వదర్శనః,
ఉవాచ సర్వాన్ సుహృదో ధైర్యేణ సుసమాహితాన్. 6

ప్ర. అ. వాక్యజ్ఞః = మాటలు ఎరిగిన, తత్త్వదర్శనః = యథార్థమును చూడగలిగిన బుధుడు, ఏతాన్ సర్వాన్ = వీరి నందరినీ, సమానీయ = రప్పించి,

ధైర్యేణ=ధైర్యముచేత, సుసమాహితాన్=బాగా సావధానచిత్తులైన, సుహృదః= మంచి హృదయము గల, సర్వాన్ = వారినందరినీ గూర్చి, ఉవాచ = పలికెను.

తా. మాటలలో నేర్పరి, తత్త్వమును ఎరిగినవాడు అయిన బుధుడు వీరి నందరినీ పిలిపించి, ధైర్యముచేత సావధానచిత్తులూ, మంచి మనస్సు గలవారూ అయిన వారందరితో ఇట్లనెను. 6

మూ. అయం రాజా మహాబాహుః కర్దమస్య ఇలః సుతః,
జానీతైనం యథాభూతం శ్రేయో హ్యస్య విధీయతామ్. 7

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, అయం రాజా = ఈ రాజు, కర్దమస్య = కర్దమునియొక్క, సుతః = కుమారుడైన, ఇలః = ఇలుడు. ఏనమ్ = వీనిని గూర్చి, యథాభూతమ్ = ఎట్లు జరిగినదో, జానీత = తెలుసు కొనండి. అస్య = వీనికి, శ్రేయః = శ్రేయస్సు, విధీయతామ్ = చేయబడుగాక.

తా. మహాబాహువైన ఈ రాజు కర్దమప్రజాపతిపుత్రుడైన ఇలుడు. ఇతని విషయమున ఏమి జరిగినదో తెలిసికొనుడు. ఇతనికి శ్రేయస్సు కలుగునట్లు చేయుడు. 7

మూ. తేషాం సంవదతామేవ ద్విజైః సహ మహాత్మభిః,
కర్దమస్తు మహాతేజాస్తదాశ్రమముపాగమత్. 8

ప్ర. అ. తేషామ్ = వారు సంవదతామ్ ఏవ=మాటలాడుకొనుచుండగనే, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, కర్దమః తు = కర్దముడు, మహాత్మభిః = మహాత్ములైన, ద్విజైః సహ = బ్రాహ్మణులతో కూడ, తదాశ్రమమ్ = ఆ ఆశ్రమ మును గూర్చి, ఉపాగమత్ = వచ్చెను

తా. వారిట్లు మాటలాడుకొనుచుండగనే గొప్ప తేజస్సు గల కర్దముడు మహాత్ములైన బ్రాహ్మణులతో కలిసి ఆ ఆశ్రమమునకు వచ్చెను. 8

మూ. పులస్త్యశ్చ క్రతుశ్చైవ వషట్కారస్తథైవ చ,
ఓంకారశ్చ మహాతేజాస్తమాశ్రమముపాగమన్. 9

ప్ర. అ. పులస్త్యః చ = పులస్త్యుడు, క్రతుః చ ఏవ = క్రతువు, తథైవ

చ=మరియు, వషట్కారః=వషట్కారుడు, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, ఓంకారః చ = ఓంకారుడు, తమ్ = ఆ, ఆశ్రమపదమ్=ఆశ్రమస్థానమును గూర్చి, ఉపాగమన్ = వచ్చిరి.

తా. పులస్త్యుడు, క్రతువు, వషట్కారుడు, గొప్ప తేజస్సు గల ఓంకారుడు ఆశ్రమమునకు వచ్చిరి. 9

మూ. తే సర్వే హృష్టమనసః పరస్పరసమాగమే,
హితైషిణో బల్హిపతేః పృథగ్వాక్యాన్యథాబ్రువన్. 10

ప్ర. అ. పరస్పరసమాగమే=పరస్పరము కలుసుకొనుటయందు (చేత), హృష్టమనసః=సంతోషించిన మనస్సులు గల, తే సర్వే=వారందరూ, బల్హిపతేః = బాహ్లీకదేశరాజైన ఆ ఇలునియొక్క, హితైషిణః = హితమును కోరుచున్న వారై, అథ = అటుపిమ్మట, పృథక్ = వేరువేరుగా, వాక్యాని = వాక్యములను, అబ్రువన్ = పలికిరి.

తా. పరస్పరము కలియుటచే సంతోషభరితములైన మనస్సులతో వారందరు ఇలుని హితము కోరుచు వేరువేరుగా ఇట్లు పలికిరి. 10

మూ. కర్దమస్త్వబ్రవీద్వాక్యం సుతార్థం పరమం హితమ్,
ద్విజాః శృణుత మద్వాక్యం యచ్ఛ్రేయః పార్థివస్య హి.

ప్ర. అ. కర్దమః తు = కర్దముడు, సుతార్థమ్ = కుమారుని నిమిత్తము, పరమమ్ = మిక్కిలి, హితమ్ = హితమైన, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. ద్విజాః = బ్రాహ్మణులారా! పార్థివస్య = ఈ రాజునకు, యత్ = ఏది, శ్రేయః = శ్రేయస్కరమో, మద్వాక్యమ్ = నా మాటను, శృణుత = వినండి.

తా. కర్దముడు పుత్రునకు చాల హితమైన వాక్యమును పలికెను- "బ్రాహ్మణులారా! ఈ రాజునకు ఏది హితమో నా మాటను వినుడు". 11

మూ. నాన్యం పశ్యామి భైషజ్యమన్తరా వృషభధ్వజమ్,
నాశ్వమేధాత్ పరో యజ్ఞః ప్రియశ్చైవ మహాత్మనః. 12

ప్ర. అ. వృషభధ్వజమ్ అన్తరా=శివుడు తప్ప, అన్యమ్ = మరియొక,

భైషజ్యమ్ = చికిత్సను, న పశ్యామి = చూడను. మహాత్మనః = మహాత్ముడైన శివునకు, అశ్వమేధాత్ = అశ్వమేధముకంటె, పరః = మరియొక, ప్రియః = ఇష్టమైన, యజ్ఞః = యజ్ఞము, న = లేదు.

తా. శివుడు తప్ప మరొక చికిత్స నాకు కనబడుటలేదు, మహాత్ముడైన ఆ శివునకు అశ్వమేధముకంటె ఎక్కువ ప్రియమైన యజ్ఞము లేదు. 12

మూ. తస్మాద్యజామహే సర్వే పార్థివార్థే దురాసదమ్,
కర్దమేనైవముక్తాస్తు సర్వ ఏవ ద్విజర్షభాః, 13
రోచయన్తి స్మ తం యజ్ఞం రుద్రస్యారాధనం ప్రతి.

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, సర్వే = మనమందరము, పార్థివార్థే = రాజుకొరకై, దురాసదమ్ = పొందశక్యము కాని ఆ యజ్ఞమును, యజామహే = చేసెదము. కర్దమేన = కర్దమునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తాః = పలకబడిన, సర్వేఏవ = సమస్తమైన, ద్విజర్షభాః = బ్రాహ్మణశ్రేష్ఠులు, రుద్రస్య = రుద్రునియొక్క, ఆరాధనం ప్రతి = ఆరాధనమును గూర్చి, తం యజ్ఞమ్ = ఆ యజ్ఞమును, రోచయన్తి = ఇష్టపడిరి.

తా. "అందువలన మన మందరము రాజుకొరకై చాల కష్టమైన ఈ యజ్ఞము చేసెదము". కర్దముని మాటలు విని ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు రుద్రుణ్ణి ఆరాధించుటకై ఆ యజ్ఞము చేయవలె నని అంగీకరించిరి. 13

మూ. సంవర్తస్య తు రాజర్షేః శిష్యః పరపురంజయః, 14
మరుత్త ఇతి విఖ్యాతస్తం యజ్ఞం సముపాహరత్.

ప్ర. అ. పరపురంజయః = శత్రుపురములను జయించినవాడు, మరుత్తః ఇతి = మరుత్తుడు అని, విఖ్యాతః = ప్రసిద్ధుడూ అయిన, రాజర్షేః = రాజర్షియైన, సంవర్తస్య = సంవర్తునియొక్క, శిష్యః = శిష్యుడు, తమ్ = ఆ, యజ్ఞమ్ = యజ్ఞమును, సముపాహరత్ = ఏర్పాటుచేసెను.

తా. రాజర్షియైన సంవర్తుని శిష్యుడు, శత్రుపురములను జయించినవాడూ అయిన మరుత్తుడు ఆ యజ్ఞము ఏర్పాట్లన్నీ చేసెను. 14

మూ. తతో యజ్ఞో మహానాసీద్బుధాశ్రమసమీపతః, 15
రుద్రశ్చ పరమం తోషమాజగామ మహాయశాః.

ప్ర. అ. తతః = అటుపిమట, బుధాశ్రమసమీపతః = బుధుని ఆశ్రమము వద్ద, మహాన్ = గొప్ప, యజ్ఞః = యజ్ఞము, ఆసీత్ = అయెను. మహాయశాః = గొప్ప కీర్తి గల, రుద్రః చ = రుద్రుడు కూడ, పరమమ్ = గొప్ప, తోషమ్ = సంతోషమును, ఆజగామ = పొందెను.

తా. అప్పుడు బుధుని ఆశ్రమము దగ్గర గొప్ప యజ్ఞము జరిగెను. గొప్ప కీర్తి గల రుద్రుడు చాల సంతోషించెను. 15

మూ. అథ యజ్ఞే సమాప్తే తు ప్రీతః పరమయా ముదా, 16
ఉమాపతిర్ద్విజాన్ సర్వానువాచ ఇలసంనిధౌ.

ప్ర. అ. అథ = పిమ్మట, యజ్ఞే = యజ్ఞము, సమాప్తే తు = సమాప్తమైనదగుచుండగా, ఉమాపతిః = శివుడు, ప్రీతః = సంతోషించినవాడై, ఇలసంనిధౌ = ఇలుని సంనిధియందు, సర్వాన్ = సమస్తమైన, ద్విజాన్ = బ్రాహ్మణులను గూర్చి, పరమయా = గొప్ప. ముదా = సంతోషముతో, ఉవాచ = పలికెను.

తా. యజ్ఞము సమాప్తమైన పిమ్మట శివుడు సంతోషించి ఇలుని సమక్షమున ఆ బ్రాహ్మణులందరితో చాల సంతోషముతో ఇట్లు పలికెను. 16

మూ. ప్రీతోఽస్మి హయమేధేన భక్త్యా చ ద్విజసత్తమాః, 17
అస్య బాహ్లిపతేశ్చైవ కిం కరోమి ప్రియం శుభమ్.

ప్ర. అ. ద్విజసత్తమాః = బ్రాహ్మణశ్రేష్ఠులారా! హయమేధేన = అశ్వమేధముచేతను, భక్త్యా చ = భక్తిచేతను, ప్రీతః అస్మి = సంతోషించినాను. అస్య = ఈ, బాహ్లిపతేః = బాహ్లికదేశరాజునకు, కిమ్ = ఏమి, ప్రియమ్ = ఇష్టమును, శుభమ్ = శుభమును, కరోమి = చేయుదును.

తా. బ్రాహ్మణోత్తములారా! ఈ అశ్వమేధముచేతను మీ భక్తికిని సంతోషించితిని. ఈ ఇలునికి ఏమి ప్రియము, శుభము చేయవలెను? 17

మూ. తథా వదతి దేవేశే ద్విజాస్తే సుసమాహితాః, 18
ప్రసాదయన్తి దేవేశం యథా స్యాత్ పురుషస్త్విలా.

ప్ర. అ. దేవేశే = దేవతాప్రభువైన శివుడు, తథా = అట్లు, వదతి = పలుకుచుండగా, తే ద్విజాః = ఆ బ్రాహ్మణులు, సుసమాహితాః = బాగా సావధానచిత్తులై, ఇలా = ఇల, యథా = ఎట్లు, పురుషః = పురుషుడు, స్యాత్ = అగునో అట్లు, దేవేశమ్ = శివుణ్ణి, ప్రసాదయన్తి = అనుగ్రహింపచేసికొనుచున్నారు.

తా. శివుడు ఇట్లు పలకగా ఆ బ్రాహ్మణులు సావధానచిత్తులై ఇల పురుషుడు అగునట్లు, ఆయనను అనుగ్రహింపచేసికొనిరి. 18

మూ. తతః ప్రీతో మహాదేవః పురుషత్వం దదౌ పునః. 19
ఇలాయై స మహాతేజా దత్త్వా చాన్తరధీయత.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ప్రీతః = సంతోషించిన, సుమహాతేజాః = చాల గొప్ప తేజస్సు గల, సః మహాదేవః = ఆ మహాదేవుడు, ఇలాయై = ఇలకు, పునః = మరల, పురుషత్వమ్ = పురుషత్వమును, దదౌ = ఇచ్చెను. దత్త్వా చ = ఇచ్చి, అన్తరధీయత = అంతర్ధానము చెందెను.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల ఆ మహాదేవుడు సంతోషించి ఇలకు మరల పురుషత్వమును ఇచ్చి అంతర్ధానము చెందెను. 19

మూ. నివృత్తే హయమేధే చ గతే చాదర్శనం హరే, 20
యథాగతం ద్విజాః సర్వే తేఽగచ్ఛన్ దీర్ఘదర్శినః.

ప్ర. అ. హయమేధే = అశ్వమేధము, నివృత్తే = పూర్తి అయిన దగుచుండగా, హరే = శివుడు, అదర్శనమ్ = కనబడకపోవుటను, గతే = పొందినవాడగుచుండగా, దీర్ఘదర్శినః = దీర్ఘదృష్టి గల, తే = ఆ, సర్వే = సమస్తమైన, ద్విజాః = బ్రాహ్మణులు, యథాగతమ్ = వచ్చినట్లుగానే, అగచ్ఛన్ = వెళ్ళిరి.

తా. హయమేధము పూర్తి అయి శివుడు అంతర్ధానము చెందిన పిమ్మట దీర్ఘదృష్టి గల ఆ బ్రాహ్మణు లందరూ వచ్చినట్లుగానే వెళ్ళిపోయిరి. 20

మూ. రాజా తు బాహ్లిముత్సృజ్య మధ్యదేశే హ్యనుత్తమమ్,
నివేశయామాస పురం ప్రతిష్ఠానం యశస్కరమ్.

ప్ర. అ. రాజా తు = రాజైతే, బాహ్లిమ్ = బాహ్లికదేశమును, ఉత్సృజ్య

= విడచి, మధ్యదేశే = మధ్యదేశమునందు, అనుత్తమమ్ = చాలా ఉత్తమమైన, యశస్కరమ్=కీర్తిని చేయు, ప్రతిష్ఠానం పురమ్=ప్రతిష్ఠానపురమును, నివేశయామాస=ఏర్పరచెను.

తా. ఇలుడైతే బాహ్లికదేశమును విడచి మధ్యదేశములో అత్యుత్తమమైన, కీర్తిని ఇచ్చు ప్రతిష్ఠానపురమును నెలకొల్పెను. 21

మూ. శశబిన్దుశ్చ రాజర్షిర్బాహ్లిం పరపురంజయః, 22
ప్రతిష్ఠానే ఇలో రాజా ప్రజాపతిసుతో బలీ.

ప్ర. అ. పరపురంజయః = శత్రుపురములను జయించిన, రాజర్షిః = రాజర్షియైన, శశబిన్దుః చ=శశబిందువు, బాహ్లిమ్=బాహ్లికదేశమును (పాలించెను). ప్రజాపతిసుతః = ప్రజాపతి పుత్రుడూ, బలీ = బలవంతుడూ అయిన, ఇలః= ఇలుడు, ప్రతిష్ఠానే = ప్రతిష్ఠాపురమునందు, రాజా = రాజు.

తా. శత్రుపురములను జయించు రాజర్షియైన శశబిందువు బాహ్లికదేశమును, కర్దమప్రజాపతి పుత్రుడు, బలశాలీ అయిన ఇలుడు ప్రతిష్ఠానమును పాలించెను. 22

మూ. స కాలే ప్రాప్తవాన్ లోకమితో బ్రాహ్మమనుత్తమమ్, 23
ఐలః పురూరవా రాజా ప్రతిష్ఠానమథాప్తవాన్.

ప్ర. అ. సః ఇలః = ఆ ఇలుడు, కాలే = కాలమునందు, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, బ్రాహ్మమ్ = బ్రహ్మకు సంబంధించిన, లోకమ్ = లోకమును. ప్రాప్తవాన్ = పొందినాడు. అథ = అటుపిమ్మట, ఐలః = ఇలుని కుమారుడైన, పురూరవాః = పురూరవుడు, ప్రతిష్ఠానమ్ = ప్రతిష్ఠానమును, రాజా = రాజుగా, అవాప్తవాన్ = పొందినాడు.

తా. కొంతకాలమునకు ఇలుడు అత్యుత్తమైన బ్రహ్మలోకమునకు వెళ్లెను. పిదప ఇలుని పుత్రుడైన పురూరవుడు ప్రతిష్ఠానమునందు రాజయ్యెను. 23

మూ. ఈదృశో హ్యశ్వమేధస్య ప్రభావః పురుషర్షభ, 24
స్త్రీభూతః పౌరుషం లేభే యచ్చాన్యదపి దుర్లభమ్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
నవతితమః సర్గః.

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! అశ్వమేధస్య = అశ్వమేధము యొక్క, ప్రభావః = ప్రభావము, ఈదృశః = ఇట్టిది. స్త్రీభూతః = స్త్రీ అయినవాడు, పౌరుషమ్ = పురుషత్వమును, యత్ = ఏది, దుర్లభమ్ = దుర్లభమో, అట్టి, అన్యదపి = మరొకదానినీ, (బ్రహ్మలోకమునూ), లేభే = పొందెను.

తా. పురుషశ్రేష్ఠుడా! అశ్వమేధము ప్రభావము ఇటువంటిది. స్త్రీ అయినవాడు పురుషుడు అయి, దుర్లభమైన బ్రహ్మలోకమును కూడ పొందెను. 24

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
తొంభైయవ సర్గ సమాప్తము.

# అథ ఏకనవతితమః సర్గః

*[రాముని ఆజ్ఞచేత అశ్వమేధయాగమునకు ఏర్పాటు జరుగుట].*

మూ. ఏతదాఖ్యాయ కాకుత్స్థో భ్రాతృభ్యామమితప్రభః,
లక్ష్మణం పునరేవాహ ధర్మయుక్తమిదం వచః. 1

ప్ర. అ. అమితప్రభః = గొప్ప కాంతి గల, కాకుత్స్థః = రాముడు, భ్రాతృభ్యామ్ = సోదరులకు, ఏతత్ = ఏది, ఆఖ్యాయ = చెప్పి, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, పునః ఏవ = మరల, ధర్మయుక్తమ్ = ధర్మముతో కూడిన ఇదం వచః = ఈ వచనమును, ఆహ = పలికెను.

తా. అపరిమితమైన కాంతిగల రాముడు సోదరు లిద్దరికీ ఈ వృత్తాంతము చెప్పి లక్ష్మణునితో మరల ధర్మసంమతమైన వాక్యము నిట్లు పలికెను. 1

మూ. వసిష్ఠం వామదేవం చ జాబాలిమథ కశ్యపమ్,
ద్విజాంశ్చ సర్వప్రవరానశ్వమేధపురస్కృతాన్. 2

ఏతాన్ సర్వాన్ సమానీయ మన్త్రయిత్వా చ లక్ష్మణ,
హయం లక్షణసంపన్నం విమోక్ష్యామి సమాధినా. 3

ప్ర. అ లక్ష్మణ = లక్ష్మణా! వసిష్ఠమ్ = వసిష్ఠుణ్ణి, వామదేవం చ = వామదేవుణ్ణి, జాబాలిమ్ = జాబాలిని, అథ = మరియు, కశ్యపమ్ = కశ్యపుణ్ణి, అశ్వమేధపురస్కృతాన్ = అశ్వమేధమునందు ముందుగా గౌరవింపబడిన, సర్వప్రవరాన్ = అందరికంటె శ్రేష్ఠులైన, ద్విజాన్ చ = బ్రాహ్మణులను, ఏతాన్ = వీరిని, సర్వాన్ = అందరినీ, సమానీయ = పిలిచి, మన్త్రయిత్వా = ఆలోచించి, లక్షణసంపన్నమ్ = మంచి లక్షణములతో కూడిన, హయమ్ = అశ్వమును, సమాధినా = ఏకాగ్రచిత్తముతో, మోక్ష్యామి = విడచెదను.

తా. లక్ష్మణా! వసిష్ఠునీ, కామదేవునీ, జాబాలినీ, కశ్యపునీ, అశ్వమేధ

యాగమునందు ముందు ఉండవలసిన, అందరికంటె ఉత్తములైన బ్రాహ్మణులను వీరి నందరిని పిలిచి, వీరితో ఆలోచించి మంచి లక్షణము లున్న అశ్వమును నియమపూర్వకముగా విడవదలచుచున్నాను. 2, 3

మూ. తద్వాక్యం రాఘవేణోక్తం శ్రుత్వా త్వరితవిక్రమః,
ద్విజాన్ సర్వాన్ సమాహూయ దర్శయామాస రాఘవమ్.

ప్ర. అ. రాఘవేణ = రామునిచేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, త్వరితవిక్రమః = శీఘ్రమైన గమనము కలవాడై, సర్వాన్ = సమస్తమైన, ద్విజాన్ = బ్రాహ్మణులను, సమాహూయ = పిలచి, రాఘవమ్ = రాముణ్ణి, దర్శయామాస = చూపెను.

తా. లక్ష్మణుడు రాముని మాట విని శీఘ్రముగా వెళ్ళి ఆ బ్రాహ్మణుల నందరినీ తీసికొనివచ్చి వారికి రాముణ్ణి చూపెను. 4

మూ. తే దృష్ట్వా దేవసంకాశం కృతపాదాభివన్దనమ్,
రాఘవమ్ సుదురాధర్షమాశీర్భిః సమపూజయన్. 5

ప్ర. అ. తే = వారు, దేవసంకాశమ్ = దేవతతో సమానుడు, కృతపాదాభివన్దనమ్ = చేయబడిన పాదాభివందనము కలవాడు అయిన, రాఘవమ్ = రాముణ్ణి, దృష్ట్వా = చూచి, సుదురాధర్షమ్ = మిక్కిలి ఎదిరింప శక్యము కాని అతనిని, ఆశీర్భిః = ఆశీస్సులతో, సమపూజయన్ = పూజించిరి.

తా. ఆ ద్విజులు దేవసమానుడు, ఎదిరింపశక్యము కానివాడు అయిన, పాదాభివందనము చేసిన ఆ రాముణ్ణి ఆశీర్వాదములచేత పూజించిరి. 5

మూ. ప్రాఞ్జలిః స తదా భూత్వా రాఘవో ద్విజసత్తమాన్,
ఉవాచ ధర్మసంయుక్తమశ్వమేధాశ్రితం వచః. 6

ప్ర. అ. తదా = అప్పుడు, సః రాఘవః = ఆ రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడు, భూత్వా = అయి, ద్విజసత్తమాన్ = ఆ ద్విజశ్రేష్ఠులను గూర్చి, ధర్మసంయుక్తమ్ = ధర్మముతో కూడిన, అశ్వమేధాశ్రితమ్ = అశ్వమేధమునకు సంబంధించిన, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. అప్పుడు రాముడు అంజలి ఘటించి నమస్కరించి ఆ ద్విజోత్తములతో అశ్వమేధమును గూర్చి ధర్మసంమతమైన వాక్యము పలికెను. 6

మూ. తేఽపి రామస్య తచ్ఛ్రుత్వా నమస్కృత్వా వృషధ్వజమ్,
అశ్వమేధం ద్విజాః సర్వే పూజయన్తి స్మ సర్వశః. 7

ప్ర. అ. సర్వే = సమస్తమైన, తే = ఆ, ద్విజాః అపి = ద్విజులు కూడ, రామస్య = రామునియొక్క, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, వృషధ్వజమ్ = మహేశ్వరుణ్ణి, నమస్కృత్వా = నమస్కరించి, సర్వశః = అన్ని విధముల, అశ్వమేధమ్ = అశ్వమేధమును, పూజయన్తి = పూజించుచున్నారు.

తా. ఆ బ్రాహ్మణులందరూ కూడ రాముని మాటలు విని, అశ్వమేధముచేత ఆరాధ్యుడైన మహేశ్వరునికి నమస్కరించుచు, అశ్వమేధమును ప్రశంసించిరి. 7

మూ. స తేషాం ద్విజముఖ్యానాం వాక్యమద్భుతదర్శనమ్,
అశ్వమేధాశ్రితం శ్రుత్వా భృశం ప్రీతోఽభవత్తదా. 8

ప్ర. అ. తదా = అప్పుడు, సః = రాముడు, తేషామ్ = ఆ, ద్విజముఖ్యానామ్ = బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క, అద్భుతదర్శనమ్ = అద్భుతమైన దృష్టి గల, అశ్వమేధాశ్రితమ్ = అశ్వమేధమునకు సంబంధించిన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, భృశమ్ = మిక్కిలి, ప్రీతః = సంతోషించినవాడు, అభవత్ = ఆయెను.

తా. అప్పుడు ఆ రాముడు ఆ బ్రాహ్మణోత్తములు పలికిన అశ్వమేధమునకు సంబంధించిన, ఆశ్చర్యకరమైన దృష్టితో కూడిన మాటలు విని సంతోషించెను. 8

మూ. విజ్ఞాయ కర్మ తత్తేషాం రామో లక్ష్మణమబ్రవీత్,
ప్రేషయస్వ మహాబాహో సుగ్రీవాయ మహాత్మనే. 9

ప్ర. అ. రామః = రాముడు, తేషామ్ = వారియొక్క, తత్ కర్మ = ఆ పనిని, విజ్ఞాయ = తెలుసుకొని, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. మహాబాహో = మహాబాహూ! మహాత్మనే = మహాత్ముడైన, సుగ్రీవాయ = సుగ్రీవునికొరకు, ప్రేషయస్వ = పంపుము.

తా. రాముడు ఆ బ్రాహ్మణులు చేయదలచిన కర్మను తెలిసికొని లక్ష్మణు

నితో ఇట్లు పలికెను-"మహాబాహూ! మహాత్ముడైన సుగ్రీవుని ఆహ్వానించుటకై దూతను పంపుము". 9

మూ. యథా మహద్భిర్హరిభిర్బహుభిశ్చ వనౌకసామ్,
సార్ధమాగచ్ఛ భద్రం తే అనుభోక్తుం మహోత్సవమ్. 10

ప్ర అ. యథా = ఎట్లనగా, మహద్భిః = గొప్పవారైన, హరిభిః = వానరులతోను, వనౌకసామ్ = వానరులయొక్క, బహుభిః చ సార్ధమ్ = చాలమందితోను, మహోత్సవమ్ = మహోత్సవమును, అనుభోక్తుమ్ = అనుభవించుటకు, ఆగచ్ఛ = రమ్ము, తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక.

తా. వానరనాయకులతోను వనములో నివసించు వానరాదులలో చాలమందితోను ఈ మహోత్సవమును అనుభవించుటకై రమ్ము అని ఆహ్వానము పంపుము

మూ. విభీషణశ్చ రక్షోభిః కామగైర్బహుభిర్వృతః,
అశ్వమేధం మహాయజ్ఞమాయాత్వతులవిక్రమః. 11

ప్ర. అ. అతులవిక్రమః = సాటి లేని పరాక్రమము గల, విభీషణః చ = విభీషణుడు కూడ, కామగైః = స్వేచ్ఛానుసారము వెళ్ల. బహుభిః = అనేకులైన, రక్షోభిః = రాక్షసులతో, వృతః = కూడినవాడై, మహాయజ్ఞమ్ = మహాయజ్ఞమైన, అశ్వమేధమ్ = అశ్వమేధమును గూర్చి, ఆయాతు = వచ్చుగాక.

తా. సాటి లేని పరాక్రమము గల విభీషణుడు కూడ సేచ్ఛగా సంచరించ గలిగిన శక్తి గల చాలమంది రాక్షసులతో కలిసి ఈ అశ్వమేధమహాయజ్ఞమునకు వచ్చుగాక. 11

మూ. రాజానశ్చ మహాభాగా యే మే ప్రియచికీర్షవః,
సానుగాః క్షిప్రమాయాన్తు యజ్ఞం ద్రష్టుమనుత్తమమ్. 12

ప్ర. అ. మే = నాకు, ప్రియచికీర్షవః = ప్రియము చేయదలచిన, యే = ఏ, మహాభాగాః = మహాభాగ్యవంతులైన, రాజానః = రాజులు గలరో వారు, సానుగాః = పరివారసమేతులై, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, యజ్ఞమ్ = యజ్ఞమును, ద్రష్టుమ్ = చూచుటకు, ఆయాన్తు = వచ్చెదరుగాక.

తా. నాకు ప్రియము చేయదలచిన మహాభాగ్యవంతులైన రాజులు కూడ పరివారసహితులై ఈ మహాయజ్ఞమును చూచుటకు వచ్చెదరుగాక. 12

మూ. దేశాన్తరగతా యే చ ద్విజా ధర్మసమాహితాః,
అమన్త్రయస్వ తాన్ సర్వానశ్వమేధాయ లక్ష్మణ. 13

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! దేశాన్తరగతాః = ఇతరదేశములలో ఉన్న, ధర్మసమాహితాః = ధర్మమునందు శ్రద్ధ గల, యే ద్విజాః = ఏ ద్విజులు గలరో, తాన్ సర్వాన్ = వారి నందరినీ, అశ్వమేధాయ = అశ్వమేధముకొరకు, అమన్త్రయస్వ = పిలువుము.

తా. లక్ష్మణా! ఇతరదేశాలలో ఉన్న ధర్మశ్రద్ధ గల ద్విజులందరినీ కూడ అశ్వమేధ యాగమునకు ఆహ్వానించుము. 13

మూ. ఋషయశ్చ మహాబాహో ఆహూయన్తాం తపోధనాః,
దేశాన్తరగతాః సర్వే సదారాశ్చ ద్విజాతయః. 14

ప్ర. అ. మహాబాహో = మహాబాహూ! తపోధనాః = తపస్సే ధనముగా గల, ఋషయః = ఋషులు, దేశాన్తరగతాః = కార్యాంతరముచేత దేశాంతరమునకు వెళ్ళిన, సదారాః = భార్యాసహితులైన, సర్వే = సమస్తమైన, ద్విజాతయః = బ్రాహ్మణులు, ఆహూయన్తామ్ = పిలవబడుదురుగాక.

తా. మహాబాహూ! తపస్సే ధనముగా గల ఋషులను, కార్యవశముచేత దేశాంతరములలో ఉన్న భార్యాసహితులైన ద్విజులను, అందరినీ ఆహ్వానించవలెను. 14

మూ. తథైవ తాలావచరాస్తథైవ నటనర్తకాః,
యజ్ఞవాటశ్చ సుమహాన్ గోమత్యా నైమిషే వనే. 15

ఆజ్ఞాప్యతాం మహాబాహో తద్ధి పుణ్యమనుత్తమమ్,
శాన్తయశ్చ మహాబాహో ప్రవర్తన్తాం సమన్తతః. 16

ప్ర. అ. తథైవ = మరియు, తాలావచరాః = తాలములు వాయించుచు సంచరించేవారు, తథైవ = మరియు, నటనర్తకాః = నటులు నర్తకులు, ఆహ్వానింప

బడుదురుగాక. నైమిషే వనే = నైమిషవనమునందు, గోమత్యా = గోమతీనదీతీర మున, సుమహాన్ = చాల గొప్పదైన, యజ్ఞవాటః చ = యజ్ఞవాటము, ఆజ్ఞాప్య తామ్ = ఆజ్ఞాపించబడుగాక. మహాబాహో = మహాబాహూ! తత్ = అది, అను త్తమమ్ = చాలఉత్తమమైన, పుణ్యం హి = పుణ్యక్షేత్రము కదా? మహాబాహో = మహాబాహూ! సమన్తతః = అంతటను, శాన్తయః = శాంతులు, ప్రవర్తన్తామ్ = ప్రవర్తించుగాక.

తా. తాలములు వాయించుచు దేశసంచారము చేసేవాళ్లను, నటులను, నర్త కులను కూడ ఆహ్వానించవలెను. నైమిశారణ్యమునందు గోమతీతీరమునందు చాల పెద్ద యజ్ఞవాటమును నిర్మించుటకు ఆజ్ఞాపించుము, అది చాల పవిత్రమైన ప్రదేశము కదా? మహాబాహూ! అంతటా కూడ శాంతులు ప్రవర్తించుగాక. 15,16

మూ. శతశశ్చాపి ధర్మజ్ఞాః క్రతుముఖ్యమనుత్తమమ్,
అనుభూయ మహాయజ్ఞం నైమిషే రఘునన్దన. 17

ప్ర. అ. రఘునన్దన = లక్ష్మణా! శతశః = వందలకొలది, ధర్మజ్ఞాః చ అపి = ధర్మములు ఎరిగినవారు కూడ, నైమిషే = నైమిషమునందు, అనుత్తమమ్ = చాల ఉత్తమమైన, మహాయజ్ఞమ్ = మహాయజ్ఞమును, అనుభూయ = అనుభవించి (ధన్యు లగుదురుగాక.)

తా. లక్ష్మణా! వందలకొలది ధర్మవేత్తలు నైమిషములో అత్యుత్తమమైన ఈ మహాయజ్ఞమును చూచి ధన్యులగుదురుగాక. 17

మూ. తుష్టః పుష్టశ్చ సర్వోఽసౌ మానితశ్చ యథావిధి,
ప్రతియాస్యతి ధర్మజ్ఞ శీఘ్రమామన్త్ర్యతాం జనః. 18

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! జనః = జనము, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆమన్త్ర్యతామ్ = పిలవబడుగాక. సర్వః = సమస్తమైన, అసౌ = ఆ జనము, తుష్టః = సంతోషించినదై, పుష్టః చ = పరిపుష్టమై, యథావిధి = యథా శాస్త్రముగా, మానితః చ = గౌరవించబడినదై, ప్రతియాస్యతి = తిరిగి వెళ్ళ గలదు.

తా. ధర్మములు తెలిసినవాడా! ఈ జనుల నందరినీ శీఘ్రముగా ఆహ్వా

నించుము. వీరందరూ యథావిధిగా సత్కరింపబడి సంతోషముతో పరిపుష్టులై తిరిగి వెళ్ళగలరు. 18

మూ. శతం వాహసహస్రాణాం తణ్డులానాం వపుష్మతామ్,
అయుతం తిలముద్గస్య ప్రయాత్వగ్రే మహాబల. 19
చణకానాం కులిత్థానాం మాషాణాం లవణస్య చ,
అతోఽనురూపం స్నేహం చ గన్ధం సంక్షిప్త మేవ చ. 20

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గలవాడా! వపుష్మతామ్ = మంచి ఆకారము గల (విరగని), తణ్డులానామ్ = బియ్యముయొక్క, వాహసహస్రాణామ్ = వాహనముల వేలయొక్క, శతమ్ = శతము, తిలముద్గస్య = తిలముయొక్క, పెసలయొక్క (వాహనముల), అయుతమ్ = అయుతము, చణకానామ్ = శనగల యొక్క, కులిత్థానామ్ = ఉలవలయొక్క, మాషాణామ్ = మినుములయొక్క, లవణస్య = లవణముయొక్క వాహనములు, అగ్రే = ముందు, ప్రయాతు = వెళ్లుగాక. అతః = అటుపిమ్మట, అనురూపమ్ = తగిన, స్నేహం చ = తైలాదికము, సంక్షిప్తమ్ ఏవ చ = దానికంటె తక్కువైన, గన్ధం చ = సుగంధ ద్రవ్యము వెళ్లుగాక.

తా. ముక్కలు కాని బియ్యమును మోయు వాహనములు ఒక లక్ష, తిలలు, పెసలు మోయు పదివేల వాహనములు ముందు వెళ్ళుగాక. శనగలు, ఉలవలు, మినుములు, లవణము వీటికి తగిన తైలాదికము, అంతకంటె తక్కువ ప్రమాణములలో గంధద్రవ్యములు కూడ వెళ్లుగాక. 19, 20

మూ. సువర్ణకోట్యో బహులా హిరణ్యస్య శతోత్తరాః,
అగ్రతో భరతః కృత్వా గచ్ఛత్వగ్రే సమాధినా. 21

ప్ర. అ. భరతః = భరతుడు, బహులాః = అనేకమైన, సువర్ణకోట్యః = = వెండియొక్క కోట్లను, హిరణ్యస్య = బంగారముయొక్క, శతోత్తరాః = నూరుకు మించిన కోట్లను, అగ్రతః కృత్వా = ముందు ఉంచుకొని, అగ్రే = ముందు, సమాధినా = ఏకాగ్రచిత్తముతో, గచ్ఛతు = వెళ్లుగాక.

తా. భరతుడు చాల కోట్ల వెండినాణెములు, నూరు కోట్లకు మించిన బంగారు నాణెములు తీసికొని, జాగరూకుడై ముందు వెళ్లుగాక. 21

మూ. అన్తరాపణవీథ్యశ్చ సర్వే చ నటనర్తకాః,
సూదా నార్యశ్చ బహవో నిత్యం యౌవనశాలినః. 22
భరతేన తు సార్ధం తే యాన్తు సైన్యాని చాగ్రతః.

ప్ర. అ. అన్తరాపణవీథ్యః చ=మార్గమధ్యమునందు దుకాణముల వీథులు, సర్వే = సమస్తమైన, నటనర్తకాః = నటులు నర్తకులు, సూదాః = వంటవాళ్ళు, నార్యః = స్త్రీలు, నిత్యమ్ = నిత్యమూ, యౌవనశాలినః = యౌవనముతో ప్రకాశించు, బహవః = చాలమంది, తే = పురుషులు, భరతేన సార్ధమ్ = భరతునితో కూడ, యాన్తు = వెళ్ళెదరుగాక. సైన్యాని చ = సైన్యములు కూడ, అగ్రతః = ఎదుట వెళ్ళుగాక.

తా. కావలసిన చోట్ల అంగళ్ళ వీథులు తెరచు వర్తకులు, నటులు, నర్తకులు, వంటవాళ్ళు, వంటలు చేసే స్త్రీలు, నిత్యము యౌవనముతో ఉండు (ద్రాఢకాయులైన) చాలమంది పురుషులు భరతునితో కలిసి వెళ్లవలెను. 22

మూ. నైగమాన్ బాలవృద్ధాంశ్చ ద్విజాంశ్చ సుసమాహితాన్,
కర్మాన్తికాన్ వర్ధకినః కోశాధ్యక్షాంశ్చ నైగమాన్,
మమ మాతౄస్తథా సర్వాః కుమారాన్తఃపురాణి చ, 24
కాఞ్చనీం మమ పత్నీం చ దీక్షాయాం జ్ఞాంశ్చ కర్మణి,
అగ్రతో భరతః కృత్వా గచ్ఛత్వగ్రే మహాయశాః 25

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, భరతః = భరతుడు, నైగమాన్ = ఆ యా సంఘముల ముఖ్యులను, బాలవృద్ధాన్ చ = బాలలను, వృద్ధులను, సుసమాహితాన్ = బాగా సావధానచిత్తులైన, ద్విజాన్ చ = బ్రాహ్మణులను, కర్మాన్తికాన్ = కర్మపర్యవేక్షకులను, వర్ధకినః = వడ్రంగులను, కోశాధ్యక్షాన్ = కోశాధ్యక్షులైన, నైగమాన్ = నైగములను, తథా = మరియు, సర్వాః = సమస్తమైన, మమః మాతౄః = నా తల్లులను, కుమారాన్తః పురాణి చ = కుమారుల (సోదరుల) అంతఃపురములను, దీక్షాయామ్ = యజ్ఞదీక్షయందు, కాఞ్చనీమ్ = బంగారము వికారమైన, మమ పత్నీమ్ = నా భార్యను, కర్మణి = పనియందు, జ్ఞాన్ చ = తెలివిగలవారిని, అగ్రతః = ముందు, కృత్వా = ఉంచుకొని, అగ్రే = ముందు, గచ్ఛతు = వెళ్లుగాక.

తా. గొప్ప కీర్తి గల భరతుడు ఆ యా సంఘముల ముఖ్యులను, బాలులను, వృద్ధులను, సావధానచిత్తులైన బ్రాహ్మణులను, కర్మపర్యవేక్షకులను, ధనాగారముల అధ్యక్షులను, ధనాగారములకు సంబంధించిన ఇతర ముఖ్యులను, మనతల్లులను అందరిని, సోదరుల అంతఃపురములను, దీక్షకు ఉపయోగించవలసిన నా భార్య బంగారు ప్రతిమను, ఆ యా కర్మలలో దక్షులైన వారిని ముందు ఉంచుకొని ముందుగా వెళ్ళుగాక. 23-25

మూ. ఉపకార్యా మహార్హాశ్చ పార్థివానాం మహౌజసామ్,
సానుగానాం నరశ్రేష్ఠో వ్యాదిదేశ మహాబలః. 26
అన్నపానాని వస్త్రాణి అనుగానాం మహాత్మనామ్.

ప్ర. అ. మహాబలః = గొప్ప బలము గల, నరశ్రేష్ఠః = నరులలో శ్రేష్ఠుడైన ఆ రాముడు, మహౌజసామ్ = గొప్ప తేజస్సు గల, సానుగానామ్ = అనుచరులతో కూడిన, పార్థివానామ్ = రాజులకు, మహార్హాః = చాల విలువ గల, ఉపకార్యాః = వస్త్రములతో నిర్మించిన గుడారములను, మహాత్మనామ్ = మహాత్ములైన, అనుగానామ్ = అనుచరులకు, అన్నపానాని = అన్నపానములను, వస్త్రాణి = వస్త్రములను, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను. (ఏర్పాటుచేయించెను).

తా. గొప్ప బలము గల ఆ నరశ్రేష్ఠుడు, గొప్ప తేజస్సు గల, పరివారసహితులైన రాజులకొరకు మంచి గుడారములను, మహాత్ములైన వారి అనుచరులకొరకు అన్నపానములను, వస్త్రములను ఏర్పాటు చేయించెను. 26

మూ. భరతః స తదా యాతః శత్రుఘ్నసహితస్తదా, 27
వానరాశ్చ మహాత్మానః సుగ్రీవసహితాస్తదా.

ప్ర. అ. తదా = అప్పుడు, శత్రుఘ్నసహితః = శత్రుఘ్నునితో కూడిన, భరతః = భరతుడు, యాతః = వెళ్లెను. తదా = అప్పుడు, సుగ్రీవసహితాః = సుగ్రీవునితో కూడిన, మహాత్మానః = మహాత్ములైన, వానరాః చ = వానరులు కూడ వెళ్ళిరి.

తా. అప్పుడు శత్రుఘ్నునితో కలిసి భరతుడు వెళ్లెను. అప్పుడు సుగ్రీవసహితులైన మహాత్ములైన వానరులు కూడ వెళ్ళిరి. 27

మూ. విప్రాణాం ప్రవరాః సర్వే చక్రుశ్చ పరివేషణమ్, 28
విభీషణశ్చ రక్షోభిః స్త్రీభిశ్చ బహుభిర్వృతః,
ఋషీణాముగ్రతపసాం పూజాం చక్రే మహాత్మనామ్. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకనవతితమః సర్గః.

ప్ర. అ. బహుభిః = చాలమంది, రక్షోభిః=రాక్షసులతోను, స్త్రీభిః చ = స్త్రీలతోను, వృతః = కూడిన, విభీషణః చ = విభీషణుడు, ఉగ్రతపసామ్ = ఉగ్రమైన తపస్సు గల, మహాత్మానామ్ = మహాత్ములైన, ఋషిణామ్ = ఋషుల యొక్క, పూజామ్ = పూజను. చక్రే = చేసెను. విప్రాణామ్ = బ్రాహ్మణులలో, ప్రవరాః = శ్రేష్ఠులైన, సర్వే = అందరూ, పరివేష ణమ్ = వడ్డనను, చక్రుః = చేసిరి.

తా. చాలామంది రాక్షసులతోను, స్త్రీలతోను కలిసి విభీషణుడు ఉగ్రమైన తపస్సు గల మహాత్ములైన ఋషులకు పూజచేసెను. బ్రాహ్మణోత్తములు వారికి వడ్డన చేసిరి.

వి. 26-29 శ్లోకాలు ప్రాచ్యప్రతిలో లేవు. అది యుక్తము. ముఖ్యముగా 28, 29 శ్లోకాలు ఇక్కడ కుదరవు. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభై ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వినవతితమః సర్గః.

[రాముని అశ్వమేధయాగములో దానగౌరవములు బాగా జరుగుట]

మూ. తత్సర్వమఖిలేనాశు ప్రస్థాప్య భరతాగ్రజః,
హయం లక్షణసంపన్నం కృష్ణసారం ముమోచ హ. 1

ప్ర. అ. భరతాగ్రజః=రాముడు, తత్ సర్వమ్=దాని నంతనూ, అఖిలేన = పూర్తిగా, ప్రస్థాప్య=పంపి, లక్షణసంపన్నమ్=మంచి లక్షణములతో కూడిన, కృష్ణసారమ్ = అధికముగా నల్లగా ఉన్న, హయమ్ = గుఱ్ఱమును, ముమోచ హ = విడచెను.

తా. రాముడు కావలసిన సామగ్రి అంతా పూర్తిగా పంపి మంచి లక్షణములు గల, ప్రధానముగా నల్లగా ఉన్న, అశ్వమును విడచెను. 1

మూ. ఋత్విగ్భిర్లక్ష్మణం సార్ధమశ్వే చ వినియుజ్య చ,
తతోఽభ్యగచ్ఛత్ కాకుత్స్థః సహ సైన్యేన నైమిషమ్. 2

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ఋత్విగ్భిః సార్ధమ్ = ఋత్విక్కులతో కూడ, అశ్వే = అశ్వమునందు, వినియుజ్య = నియమించి, తతః = అటుపిమ్మట, సహ సైన్యేన = సైన్యముతో కూడ, నైమిషమ్ = నైమిషమును గూర్చి, అభ్యగచ్ఛత్ = వెళ్లెను.

తా. రాముడు లక్ష్మణుణ్ణి ఋత్విక్కులతో కూడ గుఱ్ఱము వెనుక సంచరించుటకు ఆజ్ఞాపించి సైన్యముతో కూడ నైమిషమునకు వెళ్లెను. 2

మూ. యజ్ఞవాటం మహాబాహుర్దృష్ట్వా పరమమద్భుతమ్,
ప్రహర్షమతులం లేభే శ్రీమానితి చ సోఽబ్రవీత్. 3

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల రాముడు, పరమమ్=

మిక్కలి, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, యజ్ఞవాటమ్ = యజ్ఞవాటమును, దృష్ట్వా = చూచి, అతులమ్ = సాటిలేని, ప్రహర్షమ్ = ఆనందమును, లేభే = పొందెను. సః = అతడు, శ్రీమాన్ = శోభాయుక్తముగ ఉన్నది, ఇతి చ = అని కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. మహాబాహువైన రాముడు చాల అద్భుతమైన ఆ యజ్ఞవాటమును చూచి, చాల సంతోషించి "ఇది చాల బాగున్నది" అని అనెను. 3

మూ. నైమిషే వసత స్తస్య సర్వ ఏవ నరాధిపాః,
ఆనిన్యురుపహారాంశ్చ తాన్ రామః ప్రత్యపూజయత్. 4

ప్ర. అ. నైమిషే = నైమిషమునందు, వసతః = నివసించుచున్న, తస్య = ఆ రామునకు, సర్వే ఏవ = సమస్తమైన, నరాధిపాః = రాజులు, ఉపహారాన్ = కానుకలను, ఆనిన్యుః = తీసికొనివచ్చిరి. రామః = రాముడు, తాన్ = వాళ్లను, ప్రత్యపూజయత్ = తిరిగి సన్మానించెను.

తా. రాజు లందరూ నైమిషములో నివసించుచున్న రామునకు కానుకలు తీసికొనివచ్చిరి. రాముడు వారిని మరల సన్మానించెను. 4

మూ. అన్నపానాది వస్త్రాణి సర్వోపకరణాని చ,
భరతః సహశత్రుఘ్నో నియుక్తో రాజపూజనే. 5

ప్ర. అ. రాజపూజనే = రాజులను పూజించుటయందు, నియుక్తః = నియమించబడిన, సహశత్రుఘ్నః = శత్రుఘ్నునితో కూడిన, భరతః = భరతుడు, అన్నపానాది = అన్నపానాదికమును, వస్త్రాణి = వస్త్రములను, సర్వోపకరణాని చ = సమస్తములైన ఉపకరణములను, (సమకూర్చెను.)

తా. రాజులను పూజించుటయందు నియుక్తులైన భరతశత్రుఘ్నులు అన్నపానాదికమును, వస్త్రములను, ఇతరవస్తువులను ఏర్పాటుచేసిరి. 5

మూ. వానరాశ్చ మహాత్మానః సుగ్రీవసహితా స్తదా,
పరివేషణం చ విప్రాణాం ప్రయతాః సంప్రచక్రిరే. 6

ప్ర. అ. తదా = అప్పుడు, సుగ్రీవసహితాః = సుగ్రీవునితో కూడిన,

మహాత్మానః = మహాత్ములైన, వానరాః చ = వానరులు, ప్రయతాః = నియమ వంతులై, విప్రాణామ్ = బ్రాహ్మణులకు, పరివేషణమ్ = వడ్డనను, సంప్రచక్రిరే = చేసిరి.

తా. అప్పుడు సుగ్రీవుడు మొదలైన మహాత్ములైన వానరులు నియమ వంతులై బ్రాహ్మణులకు వడ్డన చేసిరి. 6

మూ. విభీషణశ్చ రక్షోభిర్బహుభిః సుసమాహితః,
ఋషీణాముగ్రతపసాం కింకరః సమపద్యత. 7

ప్ర. అ. బహుభిః = చాలమంది, రక్షోభిః = రాక్షసులతో, విభీషణః = విభీషణుడు, సుసమాహితః = బాగా సావధానచిత్తుడై, ఉగ్రతపసామ్ = ఉగ్రమైన తపస్సు గల, ఋషీణామ్ = ఋషులకు, కింకరః = కింకరుడుగా, సమపద్యత = ఆయెను.

తా. చాలమంది రాక్షసులతో కూడిన విభీషణుడు చాల సావధానచిత్తుడై ఉగ్రమైన తపస్సు గల ఋషులకు కింకరు డయ్యెను. 7

మూ. ఉపకార్యా మహార్హాశ్చ పార్థివానాం మహాత్మనామ్,
సానుగానాం నరశ్రేష్ఠో వ్యాదిదేశ మహాబలః. 8

ప్ర. అ. తా. 91వ సర్గలోని 26వ శ్లోకము చూడుడు. 8

మూ. ఏవం సువిహితో యజ్ఞో హ్యశ్వమేధో హ్యవర్తత,
లక్ష్మణేన సుగుప్తా సా హయచర్యా ప్రవర్తత. 9

ప్ర. అ. అశ్వమేధః యజ్ఞః = అశ్వమేధయజ్ఞము, ఏవమ్ = ఇట్లు, సువిహితః = బాగా ఏర్పాటుచేయబడినదిగా, అవర్తత = ఉండెను. లక్ష్మణేన = లక్ష్మణునిచేత, సుగుప్తా = బాగా రక్షించబడిన, సా = ఆ, హయచర్యా = అశ్వము యొక్క సంచారము, ప్రవర్తత = ప్రవర్తించెను.

తా. ఈ విధముగా ఆ అశ్వమేధయజ్ఞము బాగుగా ఏర్పరుపబడెను. అశ్వ సంచారము లక్ష్మణునిచేత రక్షింపబడినదై జరిగెను. 9

మూ. ఈదృశం రాజసింహస్య యజ్ఞప్రవరముత్తమమ్,
నాన్యః శబ్దోఽభవత్తత్ర హయమేధే మహాత్మనః, 10
ఛన్దతో దేహి దేహీతి యావత్తుష్యన్తి యాచకాః.

ప్ర. అ. రాజసింహస్య = ఆ మహారాజుయొక్క, యజ్ఞప్రవరమ్ = శ్రేష్ఠమైన యజ్ఞము, ఈదృశమ్ = ఈ విధముగా, ఉత్తమమ్ = ఉత్తమముగా ఉండెను. యావత్ = ఎంతవరకు, యాచకాః = యాచకులు, తుష్యన్తి = సంతోషింతురో అంతవరకు, ఛన్దతః = ఇష్టము వచ్చినట్లు, దేహి దేహి ఇతి = ఇమ్ము ఇమ్ము అను దానికంటె, అన్యః శబ్దః = వేరైన శబ్దము, మహాత్మనః = మహాత్మునియొక్క, తత్ర = ఆ, హయమేధే = అశ్వమేధమునందు, నాభవత్ = కాలేదు.

తా. మహాత్ముడైన ఆ రాముని అశ్వమేధయజ్ఞమునందు - "యాచకులు సంతృప్తి చెందే వరకు ఇమ్ము ఇమ్ము" అను మాటలు తప్ప మరి ఏ మాటలు వినబడలేదు. ఆ రాజశ్రేష్ఠుడైన రాముని ఉత్తమమైన యజ్ఞము ఈ విధముగా ఉండెను.

మూ. తావత్సర్వాణి దత్తాని క్రతుముఖ్యే మహాత్మనః, 11
వివిధాని చ గౌడాని ఖాణ్డవాని తథైవ చ.

ప్ర. అ. మహాత్మనః = ఆ మహాత్మునియొక్క, క్రతుముఖ్యే = ముఖ్యమైన యజ్ఞమునందు, వివిధాని = అనేకవిధములైన, గౌడాని = బెల్లముతో చేసిన భక్ష్యములు, తథైవ చ = మరియు, ఖాణ్డవాని = పటికబెల్లముతో చేసిన భక్ష్యములు, సర్వాణి = అన్నీ కూడ, తావత్ = యాచకులు తృప్తి చెందు నంతవరకు, దత్తాని = ఇవ్వబడినవి.

తా. మహాత్ముడైన రాముడు చేసిన ఆ మహాయజ్ఞమునందు యాచకులు తృప్తి చెందువరకు, అనేకవిధములైన బెల్లముతో చేసిన భక్ష్యములు, పటికబెల్లముతో చేసిన భక్ష్యములు అన్నీ ఇవ్వబడెను. 11

మూ. న నిఃసృతం భవత్యోష్ఠాద్వచనం యావదర్థినామ్, 12
తావద్వానరరక్షోభిర్దత్తమేవాభ్యదృశ్యత.

ప్ర. అ. అర్థినామ్ = యాచకులయొక్క, ఓష్ఠాత్ = పెదవినుండి, వచనమ్ = వచనము, యావత్ = ఎంతలో, నిఃసృతమ్ = బైటకు వచ్చినది, న భవతి =

కాదో, తావత్ = అంతలోనే, వానరరక్షోభిః = వానరులచేతను రాక్షసులచేతను, దత్తమ్ ఏవ = ఇవ్వబడినదిగానే, అదృశ్యత = చూడబడెను.

తా. యాచకుల పెదవులనుండి మాట బైటకు రాకమునుపే వానరులు రాక్షసులు వారికి కావలసినదానిని ఇచ్చుచుండిరి. 12

మూ. న కశ్చిన్మలినో వాపి దీనో వాప్యథవా కృశః, 13
తస్మిన్ యజ్ఞవరే రాజ్ఞో హృష్టపుష్టజనావృతే.

ప్ర. అ. రాజ్ఞః=రాజుయొక్క, హృష్టపుష్టజనావృతే=సంతోషించిన పరిపుష్టులైన జనులతో కూడిన, తస్మిన్ = ఆ, యజ్ఞవరే = శ్రేష్ఠమైన యజ్ఞమునందు, మలినః వాపి = మలినుడు గాని, దీనః వాపి = దీనుడు గాని, అథవా = లేక, కృశః = చిక్కినవాడు గాని, కశ్చిత్ = ఒక్కడూ కూడ, న = లేడు.

తా. సంతోషముతో పరిపుష్టి చెందిన జనులతో నిండిన ఆ యజ్ఞములో మలినముగా ఉన్నవాడు గాని, దీనుడు గాని, లేదా చిక్కినవాడు గాని లేడు. 13

మూ. యే చ తత్ర మహాత్మానో మునయశ్చిరజీవినః, 14
నాస్మరంస్తాదృశం యజ్ఞం దానౌఘసమలంకృతమ్.

ప్ర. అ. తత్ర = అక్కడ, మహాత్మానః = మహాత్ములైన, చిరజీవినః = చిరకాలము జీవించు, యే = ఏ, మునయః = మునులు గలరో వారు, దానౌఘసమలంకృతమ్ = దానముల సముదాయముచేత అలంకరించబడిన, తాదృశమ్ = అట్టి, యజ్ఞమ్ = యజ్ఞమును, న అస్మరన్ = స్మరించలేదు.

తా. అక్కడ ఉన్న చిరంజీవులైన మునులకు ఇన్ని దానములు చేసిన మరొక యజ్ఞము ఏదీ కూడ స్మృతికి రాలేదు. 14

మూ. యః కృత్యవాన్ సువర్ణేన సువర్ణం లభతే స్మ సః, 15
విత్తార్థీ లభతే విత్తం రత్నార్థీ రత్నమేవ చ.

ప్ర. అ. యః = ఎవడు, సువర్ణేన = బంగారముచేత, కృత్యవాన్ = పని కలవాడో, సః = అతడు, సువర్ణమ్ = బంగారమును, లభతే స్మ = పొందెను విత్తార్థీ=ధనమును కోరువాడు, విత్తమ్=ధనమును, లభతే=పొందెను రత్నార్థీ= రత్నములు కోరువాడు, రత్నమ్ ఏవ చ = రత్నమును పొందెను.

తా. బంగారము కావలసినవానికి బంగారము, ధనము కావలసినవానికి ధనము, రత్నములు కావలసినవానికి రత్నములు లభించెను. 15

మూ. హిరణ్యానాం సువర్ణానాం రత్నానామథ వాససామ్, 16
అనిశం దీయమానానాం రాశిః సముపదృశ్యతే.

ప్ర. అ. అనిశమ్ = ఎల్లప్పుడూ, దీయమానానామ్ = ఇవ్వబడుచున్న, హిరణ్యానామ్ = బంగారములయొక్క, సువర్ణానామ్ = వెండివస్తువులయొక్క, రత్నానామ్ = రత్నములయొక్క, అథ = మరియు, వాససామ్ = వస్త్రముల యొక్క, రాశిః = రాశి, సముపదృశ్యతే = చూడబడెను.

తా. నిరంతరము ఇచ్చివేయుచున్నను, బంగారము, వెండి, రత్నములు, వస్త్రములు రాసులుగా అక్కడ కనబడుచుండెను. 16

మూ. న శక్రస్య న సోమస్య యమస్య వరుణస్య వై, 17
ఈదృశో దృష్టపూర్వో న ఏవమూచు స్తపోధనాః.

ప్ర. అ. ఈదృశః = ఇట్టి యజ్ఞము, దృష్టపూర్వః = పూర్వము చూడబడిఉన్నది, న = కాదు. శక్రస్య = ఇంద్రునిది, న = కాదు, సోమస్య = చంద్రునిది, న = కాదు. యమస్య = యమునిది, వరుణస్యవై = వరుణునిది, న = కాదు. తపోధనాః = మునులు, ఏవమ్ = ఇట్లు, ఊచుః = పలికిరి.

తా. "ఇట్టి యజ్ఞమును మేము పూర్వ మెన్నడూ చూడలేదు. ఇంద్రుని యజ్ఞము గాని, సోముని యజ్ఞము గాని, యముని యజ్ఞము గాని, వరుణుని యజ్ఞము గాని ఇట్లు లేదు"అని మునులు పలికిరి. 17

మూ. సర్వత్ర వానరా స్తస్థుః సర్వత్రైవ చ రాక్షసాః, 18
వాసోధనాన్నమర్థిభ్యః పూర్ణహస్తా దదుర్భృశమ్.

ప్ర. అ. సర్వత్ర = అంతటా, వానరాః = వానరులు, తస్థుః = నిలిచి ఉండిరి. సర్వత్ర = అంతటా, రాక్షసాః చ ఏవ = రాక్షసులు, ఉండిరి. పూర్ణహస్తాః = నిండిన హస్తములు గలవారై, అర్థిభ్యః = యాచకులకొరకు, వాసోధనాన్నమ్ = వస్త్రములను, ధనమును, అన్నమును, దదుః = ఇచ్చిరి.

తా. ఎక్కడ చూచినా వానరులూ, రాక్షసులూ నిలిచి ఉండిరి. వారు నిండిన చేతులతో యాచకులకు వస్త్రములు, ధనము, అన్నము ఇచ్చుచుండిరి. 18

మూ. ఈదృశో రాజసింహస్య యజ్ఞః సర్వగుణాన్వితః, 19
సంవత్సరమయో సాగ్రం వర్తతే న చ హీయతే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వినవతితమః సర్గః.

ప్ర. అ. రాజసింహస్య = రాజులలో శ్రేష్ఠుడైన రామునియొక్క, సర్వగుణాన్వితః = సమస్తగుణములతో కూడిన, యజ్ఞః = యజ్ఞము, ఈదృశః = ఈవిధమైనదై, సాగ్రమ్ = కొంచెము అధికముగా, సంవత్సరమయః = సంవత్సరము వ్యాపించినదై, వర్తతే = ఉన్నది. న హీయతే చ = తగ్గలేదు.

తా. రాజశ్రేష్ఠుడైన రాముని యజ్ఞము ఏ మాత్రము దానాదులలో తగ్గుదల లేక ఇదే విధముగ కొంచెము ఎక్కువ సంవత్సరము నడచెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంబదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రినవతితమః సర్గః

[వాల్మీకి రాముని యజ్ఞమునకు వచ్చుట. రామాయణము గానము చేయుడని వాల్మీకి కుశలవులను ఆదేశించుట.]

మూ. వర్తమానే తథాభూతే యజ్ఞే చ పరమాద్భుతే,
సశిష్య ఆజగామాశు వాల్మీకిర్భగవానృషిః. 1

ప్ర. అ. తథాభూతే = అట్టి, పరమాద్భుతే = చాల ఆశ్చర్యకరమైన, యజ్ఞే = యజ్ఞము, వర్తమానే = జరుగుచుండగా, భగవాన్ = పూజ్యుడైన, వాల్మీకిః ఋషిః = వాల్మీకిమహర్షి, సశిష్యః = శిష్యులతో కూడినవాడై, ఆశు = శీఘ్రముగా, ఆజగామ = వచ్చెను.

తా. ఈ విధముగా చాల ఆశ్చర్యకరమైన ఆ యజ్ఞము జరుగుచుండగా, పూజ్యుడైన వాల్మీకిమహర్షి శిష్యులతో అక్కడికి శీఘ్రముగా వచ్చెను. 1

మూ. స దృష్ట్వా దివ్యసంకాశం యజ్ఞమద్భుతదర్శనమ్,
ఏకాన్తే ఋషివాటానాం చకార ఉటజాన్ శుభాన్. 2

ప్ర. అ. సః = ఆతడు, దివ్యసంకాశమ్ = దివ్యమైన, అద్భుతదర్శనమ్ = అద్భుతమైన దర్శనముగల, యజ్ఞమ్ = యజ్ఞమును, దృష్ట్వా = చూచి, ఋషివాటానామ్ = ఋషుల నివాసప్రదేశముల, ఏకాన్తే = సమీపమునందు, శుభాన్ = శుభములైన, ఉటజాన్ = పర్ణశాలలను, చకార = నిర్మించెను.

తా. వాల్మీకి దివ్యమైన, చూచుటకు ఆశ్చర్యకరమైన ఆ యజ్ఞమును చూచి ఋషుల నివాసప్రదేశముల దగ్గర పర్ణశాలను నిర్మించెను. 2

మూ. శకటాంశ్చ బహూన్ పూర్ణాన్ ఫలమూలాంశ్చ శోభనాన్,
వాల్మీకివాటే రుచిరేఽస్థాపయన్నవిదూరతః. 3

ప్ర. అ. బహూన్ = అనేకమైన, పూర్ణాన్ = నిండిన, శకటాన్ చ = బండ్లను, శోభనాన్ = మంచి, ఫలమూలాన్ చ = ఫలములను, మూలములను, రుచిరే = సుందరమైన, వాల్మీకి వాటే = వాల్మీకి నివాసప్రదేశమునందు, అవిదూరతః = దగ్గరగా, అస్థాపయాన్ = ఉంచిరి.

తా. వాల్మీకి నివసించుచున్న అందమైన ప్రదేశము దగ్గర అనేక వస్తువులతో నిండిన బండ్లను, మంచి ఫలమూలములను ఉంచిరి. 3

మూ. ఆసీత్సుపూజితో రాజ్ఞా మునిభిశ్చ మహాత్మభిః,
వాల్మీకిః సుమహాతేజా న్యవసత్పరమాత్మవాన్. 4

ప్ర. అ. సుమహాతేజాః = చాల గొప్ప తేజస్సు గల, పరమాత్మవాన్ = ఉత్తమమైన మనస్సు గల, వాల్మీకిః = వాల్మీకి, రాజ్ఞా = రాజుచేతను, మహాత్మభిః = మహాత్ములైన, మునిభిః చ = మునులచేతను, సుపూజితః = బాగా పూజింపబడినవాడు, ఆసీత్ = ఆయెను. న్యవసత్ = నివసించెను.

తా. గొప్ప తేజస్సు ఉత్తమమైన మనస్సుగల ఆ వాల్మీకిని రాజు, మహాత్ములైన మునులు పూజించిరి. అతడు అక్కడ నివసించెను. 4

మూ. స శిష్యావబ్రవీద్ధృష్టో యువాం గత్వా సమాహితౌ,
కృత్స్నం రామాయణం కావ్యం గాయతాం పరయా ముదా.

ప్ర. అ. సః = అతడు, హృష్టః = సంతోషించిన, శిష్యౌ = శిష్యులను గూర్చి, అబ్రవీత్ = పలికెను. యువామ్ = మీరిద్దరూ, సమాహితౌ = సావధానచిత్తులై, గత్వా = వెళ్ళి, పరయా = గొప్ప, ముదా = సంతోషముతో, కృత్స్నమ్ = సమస్తమైన, రామాయణం కావ్యమ్ = రామాయణకావ్యమును, గాయతామ్ = గానము చేయుడు.

తా. అతడు సంతోషించుచున్న శిష్యులిద్దరితో ఇట్లు పలికెను- "మీరిద్దరూ సావధానచిత్తులై సంతోషముతో రామాయణకావ్యము నంతనూ గానము చేయుడు". 5

మూ. ఋషివాటేషు పుణ్యేషు బ్రాహ్మణావసథేషు చ,
రథ్యాసు రాజమార్గేషు పార్థివానాం గృహేషు చ. 6.

ప్ర. అ. ఋషివాటేషు = ఋషుల నివాసస్థానములయందు, పుణ్యేషు = పవిత్రములైన, బ్రాహ్మణావసథేషు చ = బ్రాహ్మణుల గృహములయందు, రథ్యాసు = వీథులందు, రాజమార్గేషు = రాజమార్గములయందు, పార్థివానామ్ = రాజులయొక్క, గృహేషు చ = గృహములయందు, గానము చేయండి.

తా. ఋషులు నివసించు ప్రదేశములయందు, పవిత్రములైన బ్రాహ్మణ గృహములయందు, వీథులలోను, రాజమార్గములయందు, రాజుల ఇండ్లలోను గానము చేయుడు. 6

మూ. రామస్య భవనద్వారి యత్ర కర్మ చ కుర్వతే,
ఋత్విజామగ్రతశ్చైవ తత్ర గేయం విశేషతః. 7

ప్ర. అ. రామస్య = రామునియొక్క, భవనద్వారి = గృహద్వారమునందు, యత్ర = ఎక్కడ, కర్మ = అశ్వమేధయాగమును, కుర్వతే = చేయుచున్నారో, తత్ర = అక్కడ, ఋత్విజామ్ = ఋత్విక్కుల, అగ్రతః చ ఏవ = ఎదుటా, విశేషతః = విశేషించి, గేయమ్ = గానము చేయదగినది.

తా. రాముని గృహద్వారమునందు, అశ్వమేధముచేయుచున్న ప్రదేశము నందు, ఋత్విక్కుల ఎదుట విశేషించి గానము చేయవలెను. 7

మూ. ఇమాని చ ఫలాన్యత్ర స్వాదూని వివిధాని చ,
జాతాని పర్వతాగ్రేషు ఆస్వాద్యాస్వాద్య గమ్యతామ్. 8

ప్ర. అ. అత్ర = ఇక్కడ, పర్వతాగ్రేషు = పర్వతాగ్రములయందు, జాతాని = పుట్టిన, ఇమాని = ఈ, స్వాదూని = మధురమైన, వివిధాని = అనేక విధములైన, ఫలాని = ఫలములను, ఆస్వాద్య ఆస్వాద్య = తినీ తిని, గమ్యతామ్ = వెళ్లబడుగాక (వెళ్లెదరుగాక).

తా. ఇక్కడ పర్వతాగ్రములయందు, పుట్టిన మధురములైన, అనేక విధములైన ఫలములను తినీ తిని వెళ్లుడు. 8

మూ. న యాస్యథః శ్రమం వత్సౌ భక్షయిత్వా ఫలాని వై,
మూలాని చ సుమృష్టాని న రాగాత్పరిహాస్యథః. 9

ప్ర. అ. వత్సాః = వత్సలారా! ఫలాని = ఫలములను, సుమృష్టాని = పరిశుద్ధములైన, మూలాని చ = మూలములను, భక్షయిత్వా = భక్షించి, శ్రమమ్ = శ్రమను, న యాస్యథః = పొందరు. రాగాత్ = రాగమునుండి, న పరిహాస్యథః = దూరముకారు.

తా. వత్సలారా! ఫలములను, పరిశుద్ధములైన మూలములను భక్షించినచో మీకు శ్రమ కలగదు: రాగము (కంఠస్వరము) చెడదు. 9

మూ. యది శబ్దాపయేద్రామః శ్రవణాయ మహీపతిః,
ఋషీణాముపవిష్టానాం తతో గేయం ప్రవర్తతామ్. 10

ప్ర. అ. మహీపతిః = రాజైన, రామః = రాముడు, శ్రవణాయ = వినుటకు శబ్దాపయేద్యది = పిలిపించినట్లయితే, తతః = అప్పుడు, ఋషీణామ్ = ఋషులు, ఉపవిష్టానామ్ = కూర్చొనిఉండగా, గేయమ్ = గానము, ప్రవర్తతామ్ = ప్రవర్తించుగాక.

తా. రాజైన రాముడు వినుటకై మిమ్ములను పిలిపించినచో ఋషులందరూ కూడ అక్కడ కూర్చొని ఉండగా గానము జరుగుగాక. 10

మూ. దివసే వింశతిః సర్గా గేయా మధురయా గిరా,
ప్రమాణైర్బహుభిస్తత్ర యథోద్దిష్టం మయా పురా. 11

ప్ర. అ. పురా = పూర్వము, మయా = నాచేత, బహుభిః = అనేకములైన, ప్రమాణైః = ప్రమాణములచేత, తత్ర = ఆ రామాయణమునందు, యథా = ఎట్లు, ఉద్దిష్టమ్ = చెప్పబడినదో ఆ విధముగా, దివసే = ఒక దివసమునందు, వింశతిః = ఇరవై, సర్గాః = సర్గలు, మధురయా = మధురమైన, గిరా = వాక్కుతో, గేయాః = గానముచేయదగినవి.

తా. నేను పూర్వము శ్లోకసంఖ్య మొదలైన ప్రమాణములను పట్టి చెప్పినట్లు రోజుకు ఇరవై చొప్పున ఆ రామాయణములోని సర్గలు మధురమైన వాక్కుతో గానముచేయవలెను. 11

మూ. లోభశ్చాపి న కర్తవ్యః స్వల్పోఽపి ధనవాఞ్ఛయా,
కిం ధనేనాశ్రమస్థానాం ఫలమూలాశినాం సదా. 12

ప్ర. అ. ధనవాఞ్ఛయా = ధనమునందు కోరికతో, స్వల్పః అపి = స్వల్పమైనను, లోభః చ = లోభము కూడ, న కర్తవ్యః = చేయదగినది కాదు. సదా = ఎల్లప్పుడూ, ఆశ్రమస్థానామ్ = ఆశ్రమములో ఉన్న, ఫలమూలాశినామ్ = ఫలమూలములను తినువారికి, ధనేన = ధనముచేత, కిమ్ = ఏమి ప్రయోజనము?

తా. ధనమునందు కోరికతో కొంచెము కూడ లోభము చేయకూడదు. నిత్యమూ ఆశ్రమములో ఉండి ఫలమూలములను తినుచుండువారికి ధన మెందుకు?

మూ. యది పృచ్ఛేత్స కాకుత్స్థో యువాం కస్యేతి దారకౌ,
వాల్మీకేరస్య శిష్యౌ ద్వౌ బ్రూతమేవం నరాధిపమ్. 13

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, యువామ్ = మీరు, కస్య = ఎవనియొక్క, దారకౌ ఇతి = పిల్లలు అని, పృచ్ఛేత యది = అడిగినట్లయితే, ద్వౌ = మేమిద్దరము, అస్య = ఈ, వాల్మీకేః = వాల్మీకియొక్క, శిష్యౌ = శిష్యులము; ఏవమ్ = ఇట్లు, నరాధిపమ్ = రాజును గూర్చి, బ్రూతమ్ = చెప్పుడు.

తా. మీరు ఎవరి పుత్రులు అని రాముడు అడిగినట్లయితే "మేము ఈ వాల్మీకి శిష్యులము" అని ఆ రాజుతో చెప్పుడు. 13

మూ. ఇమాస్తన్త్రీః సుమధురాః స్థానం వాపూర్వదర్శనమ్,
మూర్ఛయిత్వా సుమధురం గాయతం విగతజ్వరౌ. 14

ప్ర. అ. సుమధురాః = చాల మధురములైన, ఇమాః = ఈ, తన్త్రీః = వీణ తీగలను కాని, స్థానం వా = తంత్రులు బిగించే స్థానమును కాని, మూర్ఛయిత్వా = నాదవ్యాప్తి కలవాటినిగా చేసి, అపూర్వదర్శనమ్ = అపూర్వమైన దర్శనము కలుగునట్లుగా, సుమధురమ్ = చాల మధురముగా, విగతజ్వరౌ = ఏ బాధలూ లేనివారై, గాయతమ్ = గానముచేయుడు.

తా. చాల మధురస్వరమును పుట్టించు ఈ వీణాతంత్రులను కాని, వేరు వేరు స్వరముల నిష్పత్తికి మూలములైన వీణాశిరస్సుమీద తీగలు బిగించిన స్థానముల మీద గాని నాదవ్యాప్తి కలుగునట్లు చేసి, నిర్భయముగా, మధురముగా గానము చేయుడు. 14

మూ. ఆదిప్రభృతి గేయం స్యాన్న చావజ్ఞాయ పార్థివమ్,
పితా హి సర్వభూతానాం రాజా భవతి ధర్మతః. 15

ప్ర. అ. ఆదిప్రభృతి = ప్రారంభముమొదలు, గేయమ్ = గానము చేయ వలసినది, స్యాత్ = అగును. పార్థివమ్ = రాజును, అవజ్ఞాయ = అనాదరము చేసి, న చ = గానము చేయదగదు. రాజా = రాజు, ధర్మతః = ధర్మమువలన, సర్వ భూతానామ్ = సకలభూతములకు, పితా = తండ్రి, భవతి హి = అగును కదా ?

తా. కావ్యమును మొదటినుండి గానము చేయవలెను. రాజు విషయమున అనాదరభావముతో గానము చేయకూడదు. ధర్మానుసారము రాజు సకలప్రాణు లకూ తండ్రి కదా ? 15

మూ. తద్యువాం హృష్టమనసౌ శ్వః ప్రభాతే సమాహితౌ,
గాయతం మధురం గేయం తన్త్రీలయసమన్వితమ్. 16

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, యువామ్ = మీరిద్దరూ, శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, హృష్టమానసౌ = సంతోషించిన మనస్సులు కల వారై, సమాహితౌ = సావధానచిత్తులై, తన్త్రీలయసమన్వితమ్ = వీణ తీగల లయకు అనుగుణముగా, మధురమ్ = మధురమైన, గేయమ్ = గేయమును, గాయతమ్ = గానముచేయండి.

తా. అందువలన మీరిద్దరూ రేపు ప్రాతఃకాలమునందు, ఉత్సాహముతో, సావధానచిత్తులై, వీణాతంత్రుల లయకు సరిపోవునట్లు మధురమైన గేయమును గానము చేయండి. 16

మూ. ఇతి సందిశ్య బహుశో మునిః ప్రాచేతసస్తదా,
వాల్మీకిః పరమోదారస్తూష్ణీమాసీన్మహాయశాః. 17

ప్ర. అ. ప్రాచేతసః మునిః = ప్రచేతసుని వంశమునకు చెందిన ముని యైన, మహాయశాః = గొప్ప కీర్తి గల, పరమోదారః = మిక్కిలి ఉదారుడైన, వాల్మీకిః = వాల్మీకి, ఇతి = ఇట్లు, బహుశః = అనేకవిధముల, సందిశ్య = ఉపదే శించి, తూష్ణీమ్ ఆసీత్ = ఊరుకొనెను.

తా. ప్రచేతసుని వంశమునకు చెందిన, మిక్కిలి ఉదారుడైన, గొప్ప కీర్తి గల వాల్మీకి ఇట్లు అనేకవిధముల ఉపదేశించి మౌనముగా ఉండెను. 17

మూ. సందిష్టౌ మునినా తేన తావుభౌ మైథిలీసుతౌ,
తథైవ కరవావేతి నిర్జగ్మతురరిందమౌ. 18

ప్ర. అ. తేన = ఆ, మునినా = మునిచేత, సందిష్టౌ = ఉపదేశింపబడిన, అరిందమౌ = శత్రుసంహారకులైన, తౌ = ఆ, ఉభౌ = ఇద్దరు, మైథిలీసుతౌ = సీతాపుత్రులు, తథైవ = అట్లే, కరవావ = చేసెదము, ఇతి = అని, నిర్జగ్మతుః = వెళ్ళిరి.

తా. ఆ ముని ఇట్లు ఉపదేశించగా శత్రుసంహారకులైన ఆ సీతాపుత్రులిద్దరూ "అట్లే చేసెదము" అని పలికి వెళ్ళిరి. 18

మూ. తామద్భుతాం తౌ హృదయే కుమారౌ
నివేశ్య వాణీమృషిభాషితాం తదా,
సముత్సుకౌ తాం సుఖమూషతుర్నిశాం
యథాశ్వినౌ భార్గవనీతిసంహితామ్. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్రినవతితమః సర్గః.

ప్ర అ. తౌ కుమారౌ = ఆ బాలులు, తదా = అప్పుడు, ఋషిభాషితామ్ = ఋషిచేత పలకబడిన, అద్భుతామ్ = అద్భుతమైన, తామ్ = ఆ, వాణీమ్ = వాక్కును, భార్గవనీతిసంహితామ్ = భార్గవుని నీతిసంహితను, అశ్వినౌ యథా = అశ్వినీదేవతలు వలె, హృదయే = హృదయమునందు, నివేశ్య = ఉంచి, సముత్సుకౌ = వేడుకగలవారై, తాం నిశామ్ = ఆ రాత్రిని, సుఖమ్ = సుఖముగా, ఊషతుః = ఉండిరి.

తా. ఆ బాలులు ఇద్దరూ ఋషి పలికిన అద్భుతములైన ఆ మాటలను, శుక్రుడు చెప్పిన నీతిశాస్త్రమును అశ్వినీదేవతలు వలె హృదయములో ఉంచుకొని, వేడుకతో, ఆ రాత్రిని సుఖముగా గడిపిరి. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభైమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుర్నవతితమః సర్గః

[కుశలవులు రామాయణము గానము చేయుట. రాముడు ఆ గానమును సభలో వినుట.]

మూ. తౌ రజన్యాం ప్రభాతాయాం స్నాతౌ హుతహుతాశనౌ,
యథోక్తమృషిణా పూర్వం సర్వం తత్రోపగాయతామ్. 1

ప్ర. అ. తౌ = వారిద్దరూ, రజన్యామ్ = రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారిన దగుచుండగా, స్నాతౌ = స్నానము చేసినవారై, హుతహుతాశనౌ = హోమము చేయబడిన అగ్ని కలవారై, పూర్వమ్ = పూర్వము, ఋషిణా = ఋషిచేత, యథా = ఎట్లు, ఉక్తమ్ = చెప్పబడినదో అట్లు, సర్వమ్ = సమస్తమును, తత్ర = అక్కడ, ఉపగాయతామ్ = గానముచేసిరి.

తా. రాత్రి తెల్లవారగానే వాళ్ళిద్దరూ స్నానము చేసి, అగ్నిలో హోమము చేసి పూర్వము ఋషి చెప్పిన విధముగ అక్కడ గానము చేసిరి. 1

మూ. తాం స శుశ్రావ కాకుత్స్థః పూర్వాచార్యవినిర్మితామ్,
అపూర్వాం పాఠ్యజాతిం చ గేయేన సమలంకృతామ్. 2

ప్ర. అ. సః = ఆ, కాకుత్స్థః = రాముడు, పూర్వాచార్యవినిర్మితామ్ = పూర్వాచార్యులచేత నిర్మింపబడిన, అపూర్వామ్ = క్రొత్తదైన, గేయేన = గానముతో, సమలంకృతామ్ = అలంకరించబడిన, పాఠ్యజాతిం చ = పాఠ్యములైన షడ్జాదుల జాతిని, శుశ్రావ = వినెను.

తా. రాముడు ప్రాచీనులైన సంగీతాచార్యులచేత నిర్మించబడిన, గానముచేత అలంకరింపబడిన, అపూర్వమైన అషడ్జాదిస్వరజాతిని (ఆ మునికుమారులు పాడుచుండగా) వినెను. 2

మూ. ప్రమాణై ర్బహుభిర్బద్ధాం తన్త్రీలయసమన్వితామ్,
బాలాభ్యాం రాఘవః శ్రుత్వా కౌతూహలపరోఽభవత్. 3

ప్ర. అ. బహుభిః = అనేకములైన, ప్రమాణైః = ద్రుత-మధ్య-విలంబితాది ధ్వనిప్రమాణముతో, బద్ధామ్ = కూర్చబడిన, తన్త్రీలయసమన్వితామ్ = తీగల లయతో కూడిన ఆ గీతిని, రాఘవః = రాముడు, బాలాభ్యామ్ = బాలుల నుండి, శ్రుత్వా = విని, కౌతూహలపరః = వేడుకగలవాడు, అభవత్ = ఆయెను.

తా. రాముడు, ద్రుత-మధ్య-విలంబితాది ప్రమాణములతో కూడిన, వీణా తంత్రీలయకు అనుగుణముగా ఉన్న ఆ గీతిని బాలులనుండి విని కుతూహలము చెందెను ? 3

మూ. అథ కర్మాన్తరే రాజా సమాహూయ మహామునీన్,
పార్థివాంశ్చ నరవ్యాఘ్రః పణ్డితాన్నైగమాంస్తదా. 4

పౌరాణికాన్ శబ్దవిదో యే వృద్ధాశ్చ ద్విజాతయః,
స్వరాణాం లక్షణజ్ఞాంశ్చ ఉత్సుకాన్ ద్విజసత్తమాన్. 5

లక్షణజ్ఞాంశ్చ గాన్ధర్వాన్నైగమాంశ్చ విశేషతః,
పాదాక్షరసమాసజ్ఞాంశ్ఛన్దస్సు పరినిష్ఠితాన్. 6

కలామాత్రావిశేషజ్ఞాన్ జ్యోతిషే చ పరం గతాన్,
క్రియాకల్పవిదశ్చైవ తథా కావ్యవిశారదాన్. 7

భాషాజ్ఞానిఙ్గితజ్ఞాంశ్చ నైగమాంశ్చాప్యశేషతః,
హేతూపచారకుశలాన్ హైతుకాంశ్చ బహుశ్రుతాన్. 8

ఛన్దోవిదః పురాణజ్ఞాన్ వైదికాన్ ద్విజసత్తమాన్,
చిత్రజ్ఞాన్ వృత్తసూత్రజ్ఞాన్ గీతనృత్యవిశారదాన్. 9

శాస్త్రజ్ఞాన్నీతినిపుణాన్వేదాన్తార్థప్రకాశకాన్,
ఏతాన్ సర్వాన్ సమానీయ గాతౄన్ సమవేశయత్. 10

ప్ర. అ. అథ = అటుపిమ్మట, నరవ్యాఘ్రః = నరశ్రేష్ఠుడైన, రాజా = రాజు,

కర్మాన్తరే = యాగకర్మమధ్యయందు, మహామునీన్ = మహామునులను, పార్థివాన్ చ = రాజులను, పణ్డితాన్ = పండితులను, తథా = మరియు, నైగమాన్ = శాస్త్రజ్ఞులను, పౌరాణికాన్ = పౌరాణికులను, శబ్దవిదః = శబ్దవేత్తలను, వృద్ధాః = వృద్ధులైన, యే = ఏ, ద్విజాతయః = బ్రాహ్మణులు గలరో వాళ్ళను, స్వరాణామ్ = స్వరములయొక్క, లక్షణజ్ఞాన్ = లక్షణములను ఎరిగినవాళ్ళను, ఉత్సుకాన్ = వేడుకగల, ద్విజసత్తమాన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, లక్షణజ్ఞాన్ చ = లక్షణములు ఎరిగినవాళ్ళను, విశేషతః = విశేషించి, గాన్ధర్వాన్ = గాంధర్వశాస్త్రవేత్తలను, నైగమాన్ = ఆ యా సంఘముల అధ్యక్షులను, పాదాక్షరసమాసజ్ఞాన్ = పాదములయొక్క అక్షరములయొక్క సంబంధమును ఎరిగినవాళ్ళను, ఛన్దఃసు = ఛందస్సులలో, పరినిష్ఠితాన్ = విశారదులను, కలామాత్రావిశేషజ్ఞాన్ = అచ్చుల, మాత్రల విశేషములను ఎరిగినవార్లను, జ్యోతిషే = జ్యోతిషమునందు, పరమ్ = ఉత్తమస్థానమును, గతాన్ = పొందినవారినీ, క్రియాకల్పవిదః చైవ = అలంకారశాస్త్రమును ఎరిగినవారిని, కావ్యవిశారదాన్ = కావ్యములందు నేర్పుగల వారిని, భాషాజ్ఞాన్ = సకలభాషలను ఎరిగినవారిని, అశేషతః = సమస్తమైన, నైగమాన్ = వర్తకులను, ఇఙ్గితజ్ఞాన్ = ఇతరుల మనోభావములను ఎరిగినవారిని, హేతూపచారకుశలాన్ = వ్యవహారకాలమునందు యుక్తులను ప్రయోగించుటలో నేర్పు గలవారిని, హైతుకాన్ చ = న్యాయశాస్త్రవేత్తలను, బహుశ్రుతాన్ = బాగా చదువుకున్నవారినీ, ఛన్దోవిదః = చందస్సులను ఎరిగినవారిని, పురాణజ్ఞాన్ = పురాణములు తెలిసినవారినీ, వైదికాన్ = వేదపండితులను, ద్విజసత్తమాన్ = ఉత్తములైన ద్విజులను, చిత్రజ్ఞాన్ = చిత్రకళ ఎరిగినవారిని, వృత్తసూత్రజ్ఞాన్ = వృత్తశాస్త్రములు ఎరిగినవారినీ, గీతనృత్యవిశారదాన్ = గీతమునందు, నృత్యమునందు విశారదులను, శాస్త్రజ్ఞాన్ = శాస్త్రములను ఎరిగినవారిని, నీతినిపుణాన్ = నీతియందు నేర్పు గలవారిని, వేదాన్తార్థప్రకాశకాన్ = వేదాంతవిషయములను బోధించేవారినీ, ఏతాన్ = వీరిని, సర్వాన్ = అందరినీ, సమాహూయ = పిలిచి, సమానీయ = రప్పించి, గాతారౌ = ఆ గాయకు లిద్దరినీ, సమవేశయత్ = సభకు రప్పించెను.

తా. పిమ్మట, నరులలో శ్రేష్ఠుడైన రాజు అశ్వమేధయాగము మధ్య మహామునులను, రాజులను, పండితులను, ఆ యా సంఘముల అధ్యక్షులను, పౌరాణికులను; శబ్దశాస్త్రవేత్తలైన వృద్ధులైన బ్రాహ్మణులను; స్వరలక్షణము తెలిసిన

వాళ్ళను, గానము వినుటయందు ఆసక్తి గల బ్రాహ్మణోత్తములను, లక్షణశాస్త్రము తెలిసినవాళ్ళను, విశేషించి గాంధర్వశాస్త్రనిపుణులను, పాదములయొక్క సంబంధము తెలిసినవాళ్ళను. ఛందస్సులలో మంచి జ్ఞానము కలవాళ్ళను, స్వరముల (అచ్చుల) మాత్రల విశేషములను ఎరిగినవాళ్ళను, జ్యోతిషమునందు పరినిష్ఠితులను, అలంకారశాస్త్రవేత్తలను, కావ్యములలో విశారదులను, అనేకభాషలు తెలిసినవారిని, పరుల మనస్సులోని భావమును గ్రహించే నేర్పు కలవారినీ, అనేకులు వర్తకులను, వ్యవహారములందు యుక్తియుక్తముగా మాటలాడగలవారిని, న్యాయశాస్త్రప్రవీణులను, అత్యధికశాస్త్రజ్ఞానవంతులను, ఛందస్సు తెలిసినవాళ్ళను, పురాణములు తెలిసినవాళ్ళను, వేదపండితులైన ద్విజశ్రేష్ఠులను, చిత్రకళ తెలిసినవారినీ, వృత్తశాస్త్రమునందు ప్రవేశ మున్నవాళ్ళను, గీత-నృత్యములయందు విశారదులను, శాస్త్రజ్ఞులను, నీతియందు నేర్పుగలవారిని, వేదాంతార్థమును విశదీకరించువారినీ, వీరి నందరినీ పిలిపించి, రప్పించి గాయకులైన ఆ బాలులను సభకు పిలిపించెను. 4-10

మూ. తేషాం సంవదతాం తత్ర శ్రోతౄణాం హర్షవర్ధనమ్,
గేయం ప్రచక్రతుస్తత్ర తావుభౌ మునిదారకౌ. 11

ప్ర. అ. తేషామ్ = ఆ, శ్రోతౄణామ్=శ్రోతలు, తత్ర = అక్కడ, సంవదతామ్ = మాటలాడుకొనుచుండగా, తత్ర = ఆ సమయమునందు, తౌ = ఆ, మునిదారకౌ = మునిబాలకులు, ఉభౌ=ఇద్దరూ, హర్షవర్ధనమ్ = హర్షమును వృద్ధి పొందించు, గేయమ్=గానమును, ప్రచక్రతుః=ప్రారంభించిరి.

తా. ఆ శ్రోత లందరూ మాటలాడుకొనుచుండగా ఆ మునికుమారు లిద్దరూ అక్కడ ఆనందమును వృద్ధి పొందించు గానమును ప్రారంభించిరి. 11

మూ. తతః పవృత్తం మధురం గాన్ధర్వమతిమానుషం,
న చ తృప్తిం యయుః సర్వే శ్రోతారో గేయసంపదా. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అతిమానుషమ్ = మనుష్యులను అతిక్రమించిన, మధురమ్=మధురమైన, గాన్ధర్వమ్=సంగీతము, ప్రవృత్తమ్=ప్రారంభమైనది. సర్వే = సమస్తమైన, శ్రోతారః = శ్రోతలు, గేయసంపదా = గానసంపద చేత, తృప్తిమ్ = తృప్తిని, న యయుః=పొందలేదు.

తా. పిమ్మట మనుష్యులలో దుర్లభమైన మధురమైన గానము ప్రారంభ మయ్యెను. ఆ గానసంపదను ఎంత విన్నను శ్రోతలకు తృప్తి కలగలేదు. 12

మూ. హృష్టా మునిగణాః సర్వే పార్థివాశ్చ మహౌజసః,
పిబన్త ఇవ చక్షుర్భిః పశ్యన్తి స్మ ముహుర్ముహుః 13

ప్ర. అ. హృష్టాః=సంతోషించిన, మునిగణాః=మునిగణములు, సర్వే= అన్నీ, మహౌజసః= గొప్ప తేజస్సు గల, పార్థివాః చ = రాజులూ, చక్షుర్భిః = నేత్రములచేత, పిబన్తః ఇవ = త్రాగుచున్నవారు వలె, ముహుః ముహుః = మాటి మాటికి, పశ్యన్తి స్మ = చూచుచుండిరి.

తా. సమస్తమైన మునులు, గొప్ప తేజస్సు గల రాజులు నేత్రాలతో త్రాగు చున్నారా అన్నట్లు మాటి మాటికి ఆ బాలులను చూచుచుండిరి. 13

మూ. ఊచుః పరస్పరం చేదం సర్వ ఏవ సమాహితాః,
ఉభౌ రామస్య సదృశౌ బిమ్బాద్బిమ్బమివోద్ధృతమ్. 14

ప్ర. అ సర్వే ఏవ=అందరూ, సమాహితాః=సావధానచిత్తులై, ఇదమ్= ఈ వాక్యమును, పరస్పరమ్= పరస్పరమును, ఊచుః= పలికిరి. బిమ్బాత్ = బింబమునుండి, ఉద్ధృతమ్= పైకి తీయబడిన, బిమ్బమ్ ఇవ = బింబమువలె, ఉభౌ = ఇద్దరూ కూడ, రామస్య = రామునకు, సదృశౌ = సమముగా ఉన్నారు.

తా. సావధానచిత్తులైన వారందరూ ఒకరితో ఒకరు ఇట్లు అనుకొను చుండిరి. "ఈ బాలు లిద్దరూ బింబమునుండి వెలికి తీసిన బింబము వలె రాముని పోలికతో ఉన్నారు. 14

మూ. జటిలౌ యది న స్యాతాం న వల్కలధరౌ యది,
విశేషం నాధిగచ్ఛామో గాయతో రాఘవస్య చ. 15

ప్ర. అ. జటిలౌ = జటాధారులు, న స్యాతాం యది = కాకపోయినచో, వల్కలధరౌ=నారబట్టలను ధరించినవారు, న యది=కాకపోయినచో, గాయతోః = గానముచేయుచున్నవారికీ, రాఘవస్య చ = రామునికీ, విశేషమ్ = భేదమును, నాధిగచ్ఛామః = చూడము.

తా. ఈ బాలులిద్దరూ జటలు, నారబట్టలు ధరించకపోయినచో గానము చేయుచున్న ఈ బాలులకూ రామునకూ భేద మేమీ కనబడదు. 15

మూ. ఏవం ప్రభాషమాణేషు పౌరజానపదేషు చ,
ప్రవృత్తమాదితః పూర్వసర్గం నారదదర్శితమ్. 16

ప్ర. అ. పౌరజానపదేషు = పౌరులూ జానపదులూ, ఏవమ్ = ఇట్లు, ప్రభాషమాణేషు=మాటలాడుచుండగా, ఆదితః=మొదటిదైన, నారదదర్శితమ్= నారదునిచేత చూపబడిన, పూర్వసర్గమ్= మొదటిదైన సర్గ, ప్రవృత్తమ్= జరిగినది.

తా. పౌరులు, జానపదులు ఇట్లు మాట్లాడుకొనుచుండగా నారదుడు రామ కథను వాల్మీకికి చెప్పిన మొదటి సర్గ పూర్తి అయినది. 16

మూ. తతః ప్రభృతిః సర్గాంశ్చ యావద్వింశత్యగాయతామ్,
తతోఽపరాహ్ణసమయే రాఘవః సమభాషత, 17
శ్రుత్వా వింశతిసర్గాంస్తాన్ భ్రాతరం భ్రాతృవత్సలః.

ప్ర. అ. తతః ప్రభృతి= అది మొదలు (అనగా రెండవ సర్గ మొదలు) యావద్వింశతి= ఇరవైయవ సర్గవరకు, అగాయతామ్= గానముచేసిరి. తతః ఆటుపిమ్మట, భ్రాతృవత్సలః=సోదరులయందు ప్రేమగల, రాఘవః=రాముడు, తాన్=ఆ, వింశతి సర్గాన్= ఇరవైసర్గలను, శ్రుత్వా=విని, భ్రాతరమ్=సోదరుని గూర్చి, అపరాహ్ణ సమయే=అపరాహ్ణసమయమునందు, పర్యభాషత=పలికెను.

తా. పిమ్మట రెండవ సర్గ మొదలు ఇరవై సర్గలు గానము చేసిరి. పిమ్మట ఆ ఇరవై సర్గలు విని, సోదరులయందు ప్రేమ గల రాముడు అపరాహ్ణసమయము నందు సోదరునితో ఇట్లనెను. 17

మూ. అష్టాదశసహస్రాణి సువర్ణస్య మహాత్మనోః, 18
ప్రయచ్ఛ శీఘ్రం కాకుత్స్థ యదన్యదభికాఙ్క్షితమ్,
దదౌ స శీఘ్రం కాకుత్స్థో బాలయోర్వై పృథక్ పృథక్.

ప్ర. అ. కాకుత్స్థ= లక్ష్మణా! మహాత్మనోః=మహాత్ములకు, సువర్ణస్య=

బంగారముయొక్క, అష్టాదశసహస్రాణి = పదునెనిమిది వేలను, అన్యత్ = ఇతర మైన, అభికాజ్క్షితమ్ = కోరబడినది, యత్ = ఏది ఉండునో దానినీ, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రయచ్ఛ = ఇమ్ము. సః = ఆ, కాకుత్స్థః = లక్ష్మణుడు, బాలయోః = బాలులకు, పృథక్ పృథక్ = వేరు వేరుగా, శీఘ్రమ్ = శీఘ్రముగా, దదౌ = ఇచ్చెను.

తా. "లక్ష్మణా! ఈ మహాత్ము లిద్దరికీ, శీఘ్రముగా, పద్దెనిమిది వేల బంగారు నాణెములు, వీరికి ఇంకను ఏమైన కావలసినచో దానిని ఇమ్ము". లక్ష్మణుడు వెంటనే ఆ బాలులకు వేరు వేరుగా ఇచ్చెను. 18,19

మూ. దీయమానం సువర్ణం తు నాగృహ్ణీతాం కుశీలవౌ,
ఊచతుశ్చ మహాత్మానౌ కిమనేనేతి విస్మితౌ. 20

ప్ర. అ. కుశీలవౌ = ఆ గాయకులు, దీయమానమ్ = ఇవ్వబడుచున్న, సువర్ణమ్ = బంగారమును. నాగృహ్ణీతామ్ = తీసికొనలేదు. అనేన = దీనిచేత, కిమ్ = ఏమి ప్రయోజనము, ఇతి = అని, విస్మితౌ = ఆశ్చర్యముచెందినవారై, మహాత్మానౌ = ఆమహాత్ములు, ఊచతుః చ = పలికిరి.

తా. ఆ గాయకులు లక్ష్మణు డిచ్చుచున్న ఆ బంగారు నాణెములను తీసికొనలేదు. ఆ మహాత్ములు ఈ బంగారము ఎందుకు అని ఆశ్చర్యపడుచు ఇట్లనిరి.

మూ. వన్యేన ఫలమూలేన నిరతౌ వనవాసినౌ,
సువర్ణేన హిరణ్యేన కిం కరిష్యామహే వనే. 21

ప్ర. అ. వన్యేన = వనమునకు సంబంధించిన, ఫలమూలేన = ఫలమూలము లతో, నిరతౌ = ఆసక్తులమైన, వనవాసినౌ = వనమునందు నివసించు మేము, సువర్ణేన = వెండిచేత, హిరణ్యేన = బంగారముచేత, వనే = వనమునందు, కిం కరిష్యావహే = ఏమి చేసెదము?

తా. వనములో లభించు ఫలమూలములతో జీవించు వనవాసులమైన మేము, వనములో వెండితోను, బంగారముతోను ఏమి చేసికొనెదము? 21

మూ. తథా తయోః ప్రబ్రువతోః కౌతూహలసమన్వితాః,
శ్రోతారశ్చైవ రామశ్చ సర్వ ఏవ తు విస్మితాః. 22

ప్ర. అ. తయోః = వారిద్దరూ, తథా = అట్లు, ప్రబ్రువతోః = పలుకుచుండగా, శ్రోతారః చ = శ్రోతలు, రామః చ = రాముడు, సర్వే ఏవ = అందరూ, కౌతూహలసమన్వితాః = వేడుకతో కూడినవారై, సువిస్మితాః = చాల ఆశ్చర్యపడిరి.

తా. వారిద్దరూ ఆ విధముగా పలుకుచుండగా శ్రోతలు, రాముడు, అందరూ కూడ వేడుకతో కూడినవారై ఆశ్చర్యపడిరి. 22

మూ. తస్య చైవాగమం రామః కావ్యస్య శ్రోతుముత్సుకః,
పప్రచ్ఛ తౌ మహాతేజాస్తావుభౌ మునిదారకౌ. 23

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, తస్య కావ్యస్య = ఆ కావ్యముయొక్క, అగమమ్ = రాకను, శ్రోతుమ్ = వినుటకు, ఉత్సుకః = వేడుక గలవాడై, తే = ఆ, మునిదారకౌ = మునికుమారులను, ఉభౌ = ఇద్దరిని, పప్రచ్ఛ = అడిగెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు ఆ కావ్యము ఎట్లు వచ్చినదో తెలిసికొనవలె నను కోరికతో ఆ మునికుమారుల నిద్దరినీ ప్రశ్నించెను. 23

మూ. కింప్రమాణమిదం కావ్యం కా ప్రతిష్ఠా మహాత్మనః,
కర్తా కావ్యస్య మహతః క్వ చాసౌ మునిపుఙ్గవః. 24

ప్ర. అ. ఇదమ్ = ఈ, కావ్యమ్ = కావ్యము, కింప్రమాణమ్ = ఏమి ప్రమాణము గలది? మహాత్మనః = ఆ మహాత్మునియొక్క, ప్రతిష్ఠా = ప్రతిష్ఠ, కా = ఏమి? మహతః = గొప్పదైన, కావ్యస్య = కావ్యముయొక్క, కర్తా = కర్తయైన, అసౌ = ఈ, మునిపుంగవః = మునిశ్రేష్ఠుడు, క్వ చ = ఎక్కడ ఉన్నాడు ?

తా. ఈ కావ్యము ప్రమాణ మెంత? మహాత్ముడైన రచయిత పేరేమిటి? ఈ గొప్ప కావ్యమును రచించిన మునిశ్రేష్ఠుడు ఎక్కడ ఉన్నాడు? 24

మూ. పృచ్ఛన్తం రాఘవం వాక్యమూచతుర్మునిదారకౌ,
వాల్మీకిర్భగవాన్ కర్తా సంప్రాప్తో యజ్ఞసంవిధమ్. 25

ప్ర. అ. పృచ్ఛన్తమ్ = అడుగుచున్న, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, మునిదారకౌ = మునికుమారులు, వాక్యమ్ = వాక్యమును, ఊచతుః = పలికిరి,

కర్తా = కర్తయైన, భగవాన్ = భగవంతుడైన, వాల్మీకిః = వాల్మీకి, యజ్ఞసంవిధమ్ = యజ్ఞసమీపమును గూర్చి, సంప్రాప్తః = వచ్చినాడు.

తా. ఇట్లు ప్రశ్నించుచున్న రామునితో ఆ మునికుమారులు ఇట్లు పలికిరి. "ఈ కావ్యమును రచించిన భగవంతుడైన వాల్మీకి యజ్ఞసమీపమునకు వచ్చి ఉన్నాడు. 25

మూ. యేనేదం చరితం తుభ్యమశేషం సంప్రదర్శితమ్,
సంనిబద్ధం హి శ్లోకానాం చతుర్వింశత్సహస్రకమ్. 26

ప్ర. అ. యేన = ఏకావ్యముచేత, తుభ్యమ్ = నీయొక్క, అశేషమ్ = సమస్తమైన, చరితమ్ = చరితము, సంప్రదర్శితమ్ = చూపబడినదో ఆ కావ్యము, శ్లోకానామ్ = శ్లోకములయొక్క, చతుర్వింశత్సహస్రకమ్ = ఇరవైనాలుగు వేలుగా, సంనిబద్ధం హి = రచింపబడినది.

తా. నీ చరిత్రమును పూర్తిగా వర్ణించిన ఈ కావ్యము ఇరవైనాలుగు వేల శ్లోకాలలో రచింపబడినది. 26

మూ. ఉపాఖ్యానశతం చైవ భార్గవేణ తపస్వినా,
ఆదిప్రభృతి వై రాజన్ పఞ్చసర్గశతాని చ, 27
కాణ్డాని షట్ కృతానీహ సోత్తరాణి మహాత్మనా.

ప్ర. అ. రాజన్ = రాజా! ఉపాఖ్యానశతంచైవ = వందఉపాఖ్యానములు, ఆదిప్రభృతి = మొదటిది మొదలు, పఞ్చ = ఐదు, సర్గశతాని = సర్గల శతములు, సోత్తరాణి = ఉత్తరకాండతో కూడిన, షట్ = ఆరు, కాణ్డాని = కాండములు, ఇహ = దీనియందు, మహాత్మనా = మహాత్ముడైన, తపస్వినా = తపస్సుగల, భార్గవేణ = వాల్మీకిచేత, కృతాని = చేయబడినవి.

తా. రాజా! మహాత్ముడైన, తపఃశాలియైన వాల్మీకిమహాముని నూరు ఉపాఖ్యానములను, మొదటి సర్గ మొదలు ఐదువందల సర్గలను, ఉత్తరకాండతోకూడిన ఆరు కాండలను ఈ కావ్యములో రచించెను. 27

మూ. కృతాని గురుణాస్మాకమృషిణా చరితం తవ, 28
ప్రతిష్ఠా జీవితం యావత్తావత్సర్వస్య వర్తతే.

ప్ర. అ. తవ = నీయొక్క, చరితమ్ = చరిత్రను గూర్చి, అస్మాకమ్ = మాయొక్క, ఋషిణా = ఋషిచేత, కృతాని = రచించబడినవి. జీవితమ్ = నాయకుని జీవితము, యావత్ = ఎంత వరకో, తావత్ = అంతవరకు, సర్వస్య = సమస్తమైన చరితముయొక్క, ప్రతిష్ఠా = ప్రతిష్ఠ (దీనిలో ఉన్నది).

తా. మా ఋషి నీ చరిత్రకు సంబంధించిన ఈ కాండాదులను రచించెను. కావ్యనాయకుని జీవితము ఎంతవరకు ఉండునో అంతవరకు ఉన్న కథ దీనిలో నిక్షిప్తమై ఉన్నది. 28

మూ. యది బుద్ధిః కృతా రాజన్ శ్రవణాయ మహారథ, 29
కర్మాన్తరే క్షణీభూతస్తచ్ఛృణుష్వ సహానుజః.

ప్ర. అ. మహారథ = మహారథుడవైన, రాజన్ = రాజా! శ్రవణాయ = వినుటకొరకు, బుద్ధిః = బుద్ధి, కృతా యది = చేయబడినట్లయితే, కర్మాన్తరే = యాగములో లభించు అవకాశమునందు, క్షణీభూతః = తీరికగలవాడవై, సహానుజః = తమ్ములతో కూడినవాడవై, తత్ = దానిని, శృణుష్వ = వినుము.

తా. మహారథుడవైన రాజా! నీకు వినవలె నను బుద్ధిఉన్నచో యజ్ఞ మధ్యమునందు తీరిక చేసికొని, తమ్ములతో కలిసి వినుము. 29

మూ. బాఢమిత్యబ్రవీద్రామస్తౌ చానుజ్ఞాప్య రాఘవమ్, 30
ప్రహృష్టౌ జగ్మతుః స్థానం యత్రాస్తే మునిపుంగవః.

ప్ర. అ. రామః = రాముడు, బాఢమ్ = తప్పక అట్లే, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను, తౌ చ = వారిద్దరూ, రాఘవమ్ = రాముణ్ణి, అనుజ్ఞాప్య = అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, ప్రహృష్టౌ = సంతోషించినవారై, మునిపుంగవః = ముని శ్రేష్ఠుడు, యత్ర = ఎక్కడ; ఆస్తే = ఉన్నాడో, స్థానమ్ = ఆ స్థానమును గూర్చి జగ్మతుః = వెళ్ళిరి.

తా. రాముడు "తప్పక అట్లే చేసెదము" అనెను. ఆ బాలు లిద్దరూ రాముని అనుమతి పొంది, వాల్మీకి ఉన్న స్థానమునకు వెళ్ళిరి. 30

మూ. రామోఽపి మునిభిః సార్ధం పార్థివైశ్చ మహాత్మభిః, 31
శ్రుత్వా తద్గీతమాధుర్యం కర్మశాలాముపాగమత్.

ప్ర. అ. రామోఽపి = రాముడు కూడ, మునిభిః సార్థమ్ = మునులతోను, మహాత్మభిః = మహాత్ములైన, పార్థివైః చ = రాజులతోను, తద్గీతమాధుర్యమ్ = ఆ గీతముయొక్క మాధుర్యమును, శ్రుత్వా = విని, కర్మశాలామ్ = యజ్ఞశాలను గూర్చి, ఉపాగమత్ = వచ్చెను.

తా. రాముడు కూడ మునులతోను మహాత్ములైన రాజులతోను కలిసి ఆ గీతమాధుర్యమును ఆస్వాదించి యజ్ఞశాలకు వెళ్ళెను. 31

మూ. శుశ్రావ తత్తాలలయోపపన్నం
సర్గాన్వితం సుస్వరశబ్దయుక్తమ్,
తన్త్రీలయవ్యఞ్జనయోగయుక్తం
కుశీలవాభ్యాం పరిగీయమానమ్. 32

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతుర్నవతితమః సర్గః

ప్ర. అ తాలలయోపపన్నమ్ = తాలలయలతో కూడిన, సర్గాన్వితమ్ = సర్గలతో కూడిన, సుస్వరశబ్దయుక్తమ్ = మంచి స్వరములు గల శబ్దములతో కూడిన, తన్త్రీలయవ్యఞ్జనయోగయుక్తమ్ = తంత్రుల లయముతోను, వ్యంజన యోగముతోను కూడిన, కుశీలవాభ్యామ్ = ఆ గాయకులచేత, పరిగీయమానమ్ = గానము చేయబడుచున్న, తత్ = ఆ కావ్యమును, శుశ్రావ = వినెను.

తా. ఆ గాయకులైన బాలులు గానము చేసిన కావ్యము తాలలయలకు సరిపడునట్లు ఉండెను. సర్గలలో విభక్తమైన ఆ కావ్యములోని శబ్దములు స్వరములకు అనుకూలముగా ఉండెను. వీణాతంత్రుల లయకు అనుగుణమై మధురమైన వ్యంజనముల (హల్లుల)తో కూడి యున్న ఆ కావ్యమును; రాముడు వినెను (ఈ శ్లోకము చాల ప్రతులలో లేదు.)

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంబదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చనవతితమః సర్గః.

*[సీత తన పరిశుద్ధత్వము విషయమున శపథము చేయవలె నని రాముడు అనుట.]*

మూ. రామో బహూన్యహాన్యేవం తద్ గీతం పరమం శుభమ్,
శుశ్రావ మునిభిః సార్ధం పార్థివైః సహ వానరైః. 1

ప్ర. అ. రామః=రాముడు; మునిభిః సార్ధమ్=మునులతోను, పార్థివైః=రాజులతోను, వానరైఃసహ=వానరులతోను, ఏవమ్=ఇట్లు, బహూని=అనేకములైన, అహాని=దివసములను, పరమమ్=మిక్కిలి, శుభమ్=శుభమైన, తత్ గీతమ్=ఆ గీతమును, శుశ్రావ=వినెను.

తా. రాము డీ విధముగ మునులతోను, రాజులతోను, వానరులతోను కలిసి శుభమైన ఆ గీతమును చాల రోజులు వినెను 1

మూ. తస్మిన్ గీతే తు విజ్ఞాయ సీతాపుత్రౌ కుశీలవౌ,
తస్యాః పరిషదో మధ్యే రామో వచనమబ్రవీత్, 2
దూతాన్ శుద్ధసమాచారానాహూయాత్మమనీషయా.

ప్ర. అ. తస్మిన్=ఆ, గీతే=గీతమునందు, కుశీలవౌ=ఆ గాయకులను, సీతాపుత్రౌ=సీతయొక్క పుత్రులనుగా, విజ్ఞాయ=తెలిసికొని, రామః=రాముడు, శుద్ధసమాచారాన్=పరిశుద్ధమైన ఆచారము గల, దూతాన్=దూతలను, ఆత్మమనీషయా=తన బుద్ధిచేత, ఆహూయ=పిలచి, తస్యాః పరిషదః=ఆ పరిషత్తుయొక్క, మధ్యే=మధ్యయందు, వచనమ్=వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ గీతమును పట్టి ఆ గాయకులు సీత పుత్రులే అని తెలిసికొని రాముడు తన ఆలోచనప్రకారమే పరిశుద్ధమైన నడవడిక గల దూతలను పిలచి ఆ పరిషత్తుమధ్యలో ఇట్లు పలికెను. 2

మూ. మద్వచో బ్రూత గచ్ఛధ్వమితో భగవతోఽన్తికే, 3
యది శుద్ధసమాచారా యది వా వీతకల్మషా,
కరోత్విహాత్మనః శుద్ధిమనుమాన్య మహామునిమ్. 4

ప్ర. అ. ఇతః = ఇక్కడినుండి, గచ్ఛధ్వమ్ = వెళ్లుడు. భగవతః = పూజ్యుడైన వాల్మీకియొక్క, అన్తికే = సమీపమునందు, మద్వచః = నా మాటను, బ్రూత = చెప్పుడు. శుద్ధసమాచారా యది = పరిశుద్ధమైన చరిత్ర కలదైనచో, వీత కల్మషా వా యది = పాపము లేనిదైతే (సీత), మహామునిమ్ = మహామునిని, అనుమాన్య = అంగీకరింపచేసి, ఇహ = ఇక్కడ, ఆత్మనః = తనయొక్క, శుద్ధిమ్ = పరిశుద్ధిని, కరోతు = చేయుగాక.

తా. మీరు ఇక్కడినుండి పూజ్యుడైన వాల్మీకి దగ్గరకు వెళ్ళి నా మాటగా చెప్పుడు. "సీత పరిశుద్ధమైన ప్రవర్తన కలదైనచో, పాపరహిత అయినచో మహా ముని అనుజ్ఞ పొంది ఇక్కడ తన శుద్ధిని నిరూపించుకొనుగాక" 3, 4

మూ. ఛన్దం మునేశ్చ విజ్ఞాయ సీతాయాశ్చ మనోగతమ్,
ప్రత్యయం దాతుకామాయాస్తతః శంసత మే లఘు. 5

ప్ర. అ మునేః = మునియొక్క, ఛన్దమ్ = ఇచ్ఛను, ప్రత్యయమ్ = నమ్మకమును, దాతుకామాయాః = ఇవ్వ దలచిన, సీతాయాః = సీతయొక్క, మనోగతమ్ = మనస్సులోని అభిప్రాయమును, విజ్ఞాయ = తెలిసికొని, తతః = అటుపిమ్మట, లఘు = శీఘ్రముగా, మే = నాకు, శంసత = చెప్పుడు.

తా. వాల్మీకి అభిప్రాయమును, నమ్మకము కలుగు ప్రమాణమును చూపు టకు అంగీకరించిన సీత అభిప్రాయమును తెలిసికొని శీఘ్రముగా వచ్చి నాకు తెలుపుడు 5

మూ. శ్వః ప్రభాతే తు శపథం మైథిలీ జనకాత్మజా,
కరోతు పరిషన్మధ్యే శోధనార్థం మమైవ చ. 6

ప్ర. అ. శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలమునందు, జనకాత్మజా = జనకుని కూతురైన, మైథిలీ = సీత, పరిషన్మధ్యే = ఈ పరిషత్తు మధ్యయందు,

మమైవ = నాయొక్క, శోధనార్థం చ = శోధనముకొరకు కూడ, శపథమ్ = శపథమును, కరోతు = చేయుగాక.

తా. జనకుని కుమార్తెయైన సీత రేపు ప్రాతఃకాలము పరిషత్తు మధ్యయందు, నన్ను నిర్దోషినిగా నిరూపించుటకు కూడ శపథము చేయుగాక. 6

మూ. శ్రుత్వా తు రాఘవస్యైతద్వచః పరమమద్భుతమ్,
దూతాః సంప్రయయుర్వాటం యత్ర వై మునిపుంగవః.

ప్ర. అ. రాఘవస్య=రామునియొక్క, పరమమ్ అద్భుతమ్=చాల ఆశ్చర్యకరమైన, ఏతత్ = ఈ, వచః=వచనమును, శ్రుత్వా = విని, దూతాః=దూతలు, మునిపుంగవః=ఆ మునిశ్రేష్ఠుడు, యత్ర వై = ఎక్కడ ఉన్నాడో అట్టి, వాటమ్ = (నివాస) ప్రదేశమును గూర్చి, సంప్రయయుః = వెళ్ళిరి.

తా. రాముడు పలికిన చాల ఆశ్చర్యకరమైన ఆ మాట విని దూతలు వాల్మీకి ఉన్న ప్రదేశమునకు వెళ్ళిరి. 7

మూ. తే ప్రణమ్య మహాత్మానం జ్వలన్తమమితప్రభమ్,
ఊచుస్తే రామవాక్యాని మృదూని మధురాణి చ. 8

ప్ర. అ. తే = వాళ్ళు, జ్వలన్తమ్ = ప్రకాశించుచున్న, అమితప్రభమ్ = అమితమైన కాంతి గల, మహాత్మానమ్ = ఆ మహాత్ముణ్ణి, ప్రణమ్య = నమస్కరించి, మృదూని = మృదువులు, మధురాణి చ = మధురములు అయిన, రామవాక్యాని = రాముని వాక్యములను, ఊచుః = పలికిరి.

తా. ఆ దూతలు అపరిమితమైన కాంతితో ప్రజ్వలించుచున్న ఆ మహాత్మునకు నమస్కరించి రాముడు చెప్పిన మృదుమధురములైన మాటలు తెలిపిరి. 8

మూ. తేషాం తద్భాషితం శ్రుత్వా రామస్య చ మనోగతమ్,
విజ్ఞాయ స మహాతేజా మునిర్వాక్యమథాబ్రవీత్. 9

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః మునిః = ఆ ముని, తేషామ్ = వాళ్ళయొక్క, తత్ = ఆ, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని,

రామస్య = రామునియొక్క, మనోగతమ్ = మనస్సులో ఉన్నదానిని, విజ్ఞాయ = తెలిసికొని, అథ = పిమ్మట, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. గొప్ప తేజస్సుగల ఆ ముని రాముని దూతల మాటలువిని, రాముని మనస్సులోని అభిప్రాయమును తెలిసికొని ఇట్లు పలికెను. 9

మూ. ఏవం భవతు భద్రం వో యథా వదతి రాఘవః,
తథా కరిష్యతే సీతా దైవతం హి పతిః స్త్రియః. 10

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, భవతు = అగుగాక. వః = మీకు, భద్రమ్ = క్షేమ మగుగాక. రాఘవః = రాముడు, యథా = ఎట్లు, వదతి = పలుకుచున్నాడో, తథా = అట్లు, సీతా = సీత, కరిష్యతే = చెయ్యగలదు. స్త్రియః = స్త్రీకి, పతిః = భర్త, దైవతం హి = దేవత కదా.

తా. ఇట్లే అగుగాక. మీకు క్షేమ మగుగాక. సీత రాముడు చెప్పినట్లు చేయగలదు. స్త్రీకి భర్త యే దేవత కదా? 10

మూ. తథోక్తా మునినా సర్వే రాజదూతా మహౌజసమ్,
ప్రత్యేత్య రాఘవం సర్వం మునివాక్యం బభాషిరే. 11

ప్ర. అ. మునినా = మునిచేత, తథా = అట్లు, ఉక్తాః = పలకబడిన, సర్వే = సమస్తమైన, రాజదూతాః = రాజదూతలు, మహౌజసమ్ = గొప్ప తేజస్సు గల, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ప్రత్యేత్య = తిరిగి వచ్చి, సర్వమ్ = సమస్తమైన, మునివాక్యమ్ = మునివాక్యమును, బభాషిరే = చెప్పిరి.

తా. రాజదూతలు మునీశ్వరుని మాటలు విని తిరిగి గొప్ప తేజస్సు గల రాముని వద్దకు వచ్చి, ముని పలికిన మాట లన్నీ చెప్పిరి. 11

మూ. తతః ప్రహృష్టః కాకుత్స్థః శ్రుత్వా వాక్యం మహాత్మనః,
ఋషీంస్తత్ర సమేతాంశ్చ రాజ్ఞశ్చైవాభ్యభాషత. 12.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాత్మనః = మహాత్ముడైన వాల్మీకి యొక్క, వాక్యమ్ = మాటను, శ్రుత్వా = విని, ప్రహృష్టః = సంతోషించిన, కాకుత్స్థః = రాముడు, తత్ర = అక్కడ, సమేతాన్ = వచ్చి ఉన్న, ఋషీన్ = ఋషులను గూర్చి, రాజ్ఞః చైవ = రాజులను గూర్చి, అభ్యభాషత = పలికెను.

తా. వాల్మీకి మాటలు విని సంతోషించిన రాముడు అక్కడ వచ్చిఉన్న ఋషులతోను, రాజులతోను, ఇట్లు పలికెను. 12

మూ. భగవన్తః సశిష్యా వై సానుగాశ్చ నరాధిపాః,
పశ్యన్తు సీతాశపథం యశ్చైవాన్యోఽపి కాఙ్క్షతే. 13

ప్ర. అ. సశిష్యాః = శిష్యులతో కూడిన, భగవన్తః = పూజ్యులైన మీరు, సానుగాః = అనుచరులతో కూడిన, నరాధిపాః = రాజులూ, యః = ఎవడు, కాఙ్క్షతే = కోరుచున్నాడో అట్టి, అన్యః అపి = ఇతరుడూ కూడ, సీతాశపథమ్ = సీతయొక్క శపథమును, పశ్యన్తు = చూచెదరుగాక.

తా. శిష్యులతో కూడిన పూజ్యులైన ఋషులు, అనుచరులతో కూడిన రాజులు, చూడదలచినవారు ఎవరైన ఇంకా ఉన్నచో వారూ సీత చేయనున్న శపథమును చూచెదరుగాక. 13

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః,
సర్వేషామృషిముఖ్యానాం సాధువాదో మహానభూత్. 14

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య రాఘవస్య = ఆ రాముని యొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, సర్వేషామ్ = సమస్తమైన, ఋషిముఖ్యానామ్ = ఋషిశ్రేష్ఠుల యొక్క, మహాన్ = గొప్ప, సాధువాదః = బాగు బాగు అను వాదము, అభూత్ = అయెను.

తా. మహాత్ముడైన రాముని మాటలు విన్న పిమ్మట ఋషిశ్రేష్ఠు లందరూ "బాగు బాగు" అని బిగ్గరగా అనిరి. 14

మూ. రాజానశ్చ మహాత్మానః ప్రశంసన్తి స్మ రాఘవమ్,
ఉపపన్నం నరశ్రేష్ఠ త్వయ్యేవ భువి నాన్యతః. 15

ప్ర. అ. మహాత్మానః = మహాత్ములైన, రాజానః చ = రాజులు కూడ, రాఘవమ్ = రాముణ్ణి, ప్రశంసన్తి స్మ = ప్రశంసించిరి. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడా ! త్వయ్యేవ = నీయందే, ఉపపన్నమ్ = తగియున్నది. అన్యతః = ఇతరునియందు, న = కాదు.

తా. రాముని మాటలు విని మహాత్ములైన రాజులు కూడ- "నరశ్రేష్ఠా! ఇది నీకే తగును; ఇతరు లెవ్వరూ ఇట్లు చేయజాలరు" అని పలుకుచు ప్రశంసించిరి. 15

మూ. ఏవం వినిశ్చయం కృత్వా శ్వోభూత ఇతి రాఘవః,
విసర్జయామాస తదా సర్వాంస్తాన్ శత్రుసూదనః, 16

ప్ర. అ. శత్రుసూదనః = శత్రువినాశకుడైన, రాఘవః = రాముడు, శ్వోభూతే ఇతి = మరునాడు అని, ఏవమ్ = ఇట్లు, వినిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, తదా = అప్పుడు, తాన్ = వారిని, సర్వాన్ = అందరినీ, విసర్జయామాస = పంపివేసెను.

తా. శత్రుసంహారకుడైన రాముడు "మరునాడు (రేపు) జరుగును" అని నిశ్చయము చేసి వారినందరినీ పంపివేసెను. 16

మూ. ఇతి సంప్రవిచార్య రాజసింహః
శ్వోభూతే శపథస్య నిశ్చయమ్,
విససర్జ మునీన్ నృపాంశ్చ సర్వాన్
స మహాత్మా మహతో మహానుభావః. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చనవతితమః సర్గః

ప్ర. అ. రాజసింహః = ఆ రాజశ్రేష్ఠుడు, ఇతి = ఇట్లు, శ్వోభూతే = మరునాడు, శపథస్య = శపథముయొక్క, నిశ్చయమ్ = నిశ్చయమును, సంప్రవిచార్య = ఆలోచించి, మహాత్మా = మహాత్ముడు, మహానుభావః = గొప్ప సామర్థ్యము కలవాడూ అయిన, సః = అతడు, సర్వాన్ = సమస్తమైన, మునీన్ = మునులను, నృపాన్ చ = రాజులను, విససర్జ = పంపివేసెను.

తా. మహాత్ముడు, మహానుభావుడు అయిన రాజశ్రేష్ఠుడైన ఆ రాముడు "శపదథము మరునాడు జరుగును" అని నిర్ణయము చేసి ఆ మునులను, రాజులను అందరినీ కూడ పంపివేసెను. 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభై అయిదవ సర్గ సమాప్తము.

## అథ షణ్ణవతితమః సర్గః

[సీత పరిశుద్ధురాలని వాల్మీకి ఘోషించుట]

మూ. తస్యాం రజన్యాం వ్యుష్టాయాం యజ్ఞవాటం గతో నృపః,
ఋషీన్ సర్వాన్ మహాతేజాః శబ్దాపయతి రాఘవః. 1

ప్ర. అ. తస్యామ్ = ఆ, రజన్యామ్ = రాత్రి, వ్యుష్టాయామ్ = తెల్లవారిన దగుచుండగా, నృపః = రాజూ, మహాతేజాః = గొప్ప తేజస్సు కలవాడూ అయిన, రాఘవః = రాముడు, యజ్ఞవాటమ్ = యజ్ఞప్రదేశమును, గతః = పొందినవాడై, సర్వాన్ = సమస్తమైన, ఋషీన్ = ఋషులను, శబ్దాపయతి = పిలిపించెను.

తా. రాత్రి తెల్లవారగానే మహాతేజఃశాలీ రాజూ అయిన రాముడు యజ్ఞ శాలకు వెళ్ళి ఋషు లందరినీ పిలిపించెను. 1

మూ. వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథ కాశ్యపః,
విశ్వామిత్రో దీర్ఘతమా దుర్వాసాశ్చ మహాతపాః. 2

పులస్త్యోఽపి తథా శక్తిర్భార్గవశ్చైవ వామనః,
మార్కణ్డేయశ్చ దీర్ఘాయుర్మౌద్గల్యశ్చ మహాయశాః. 3

గర్గశ్చ చ్యవనశ్చైవ శతానన్దశ్చ ధర్మవిత్,
భరద్వాజశ్చ తేజస్వీ అగ్నిపుత్రశ్చ సుప్రభః. 4

నారదః పర్వతశ్చైవ గౌతమశ్చ మహాయశాః,
కాత్యాయనః సుయజ్ఞశ్చాప్యగస్త్యస్తపసాం నిధిః. 5

ఏతే చాన్యే చ బహవో మునయః సంశితవ్రతాః,
కౌతుహలసమావిష్టాః సర్వ ఏవ సమాగతాః. 6

ప్ర. అ. వసిష్ఠః = వసిష్ఠుడు, వామదేవః చ = వామదేవుడు, జాబాలిః = జాబాలి, అథ = మరియు, కాశ్యపః = కాశ్యపుడు, దీర్ఘతపాః = దీర్ఘతపస్సుగల, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు, మహాతపాః = గొప్ప తపస్సు గల, దుర్వాసాః = దుర్వాసుడు, పులస్త్యః అపి = పులస్త్యుడు, తథా = మరియు, శక్తిః = శక్తి, భార్గవః చైవ = భార్గవుడు, వామనః = వామనుడు, దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయ వంతుడైన, మార్కండేయః చ = మార్కండేయుడు, మహాయశాః = గొప్ప కీర్తి గల, మౌద్గల్యః చ = మౌద్గల్యుడు, గర్గః చ = గర్గుడు, చ్యవనః చ = చ్యవనుడు, ధర్మవిత్ = ధర్మముల నెరిగిన, శతానన్దః చ = శతానందుడు, తేజస్వీ = తేజః శాలియైన, భరద్వాజః చ = భరద్వాజుడు, సుప్రభః = మంచి కాంతి గల, అగ్నిపుత్రః చ = అగ్నిపుత్రుడు, నారదః = నారదుడు, పర్వతః చైవ = పర్వతుడు. మహాయశాః = గొప్ప కీర్తి గల, గౌతమః చ = గౌతముడు, కాత్యాయనః = కాత్యాయనుడు, సుయజ్ఞః చ = సుయజ్ఞుడు, తపసామ్ = తపస్సులకు, నిధిః = నిధియైన, అగస్త్యః చ = అగస్త్యుడు, ఏతే = వీరు, సంశితవ్రతాః = గొప్ప నియమములు గల, బహవః = చాలామంది, అన్యే చ = ఇతరులు, సర్వే ఏవ = అందరూ, కౌతుహలసమావిష్టాః = కౌతుహలముతో కూడినవారై, సమాగతాః = వచ్చిరి.

తా. వసిష్ఠ-వామదేవ-జాబాలి-కాశ్యపులు, దీర్ఘమైన తపస్సు గల విశ్వామిత్రుడు, గొప్ప తపస్సు గల దుర్వాసుడు, పులస్త్య-శక్తి-భార్గవ-వామనులు, దీర్ఘాయువైన మార్కండేయుడు, గొప్ప కీర్తి గల మౌద్గల్యుడు, గర్గ-చ్యవనులు, ధర్మవేత్తయైన శతానందుడు, తేజఃశాలియైన భరద్వాజుడు, మంచి కాంతి గల అగ్నిపుత్రుడు, నారద-పర్వతులు, గొప్ప యశస్సు గల గౌతముడు, కాత్యాయనసుయజ్ఞులు, తపోనిధియైన అగస్త్యుడు, వీరే కాక గొప్ప నియమములు గల ఇతరమునులు, అందరూ కూడా వేడుకతో వచ్చిరి. 2-6

మూ. రాక్షసాశ్చ మహావీర్యా వానరాశ్చ మహాబలాః,
సర్వ ఏవ సమాజగ్ముర్మహాత్మానః కుతూహలాత్. 7

ప్ర. అ. మహావీర్యాః = గొప్ప పరాక్రమము గల, రాక్షసాః చ = రాక్షసులు, మహాబలాః = గొప్ప బలము గల, వానరాః చ = వానరులు, సర్వే = సమస్త

మైన, మహాత్మానః = మహాత్ములు, కుతూహలాత్ = వేడుకవలన, సమాజగ్ముః = వచ్చిరి.

తా. గొప్ప పరాక్రమము గల రాక్షసులు, గొప్ప బలము గల వానరులు, ఆ మహాత్ములందరూ వేడుకతో వచ్చిరి. 7

మూ. క్షత్రియా యే చ శూద్రాశ్చ వైశ్యాశ్చైవ సహస్రశః,
నానాదేశాగతాశ్చైవ బ్రాహ్మణాః సంశితవ్రతాః. 8

జ్ఞాననిష్ఠాః కర్మనిష్ఠా యోగనిష్ఠాస్తథాపరే,
సీతాశపథవీక్షార్థం సర్వ ఏవ సమాగతాః. 9

ప్ర. అ. యే = ఏ, క్షత్రియాః = క్షత్రియులు, శూద్రాః చ = శూద్రులు, వైశ్యాః చ = వైశ్యులూ ఉన్నారో వారు, సహస్రశః = వేలకొలది, నానాదేశాగతాః = అనేకదేశములనుండి వచ్చిన, సంశితవ్రతాః = తీవ్రమైన వ్రతముగల, జ్ఞాననిష్ఠాః = జ్ఞాననిష్ఠ కలవారు, కర్మనిష్ఠాః = కర్మలయందు నిష్ఠ కలవారు, తథా = మరియు, అపరే = ఇతరులైన, యోగనిష్ఠాః = యోగమునందు నిష్ఠ కలవారు అయిన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, సర్వే ఏవ = అందరూ కూడ, సీతాశపథవీక్షార్థమ్ = సీత శపథమును చూచుటకు, సమాగతాః = వచ్చిరి.

తా. వేలకొలది క్షత్రియులు, శూద్రులు, వైశ్యులు, అనేక దేశములనుండి వచ్చిన, తీవ్రములైన వ్రతము గల జ్ఞాననిష్ఠులూ, కర్మనిష్ఠులూ, యోగనిష్ఠులూ అయిన బ్రాహ్మణులూ, వీరందరూ కూడ సీత చేయనున్న శపథమును చూచుటకై వచ్చిరి 8, 9

మూ. తదా సమాగతం సర్వమశ్మభూతమివాచలమ్,
శ్రుత్వా మునివరస్తూర్ణం ససీతః సముపాగమత్. 10

ప్ర. అ. తదా = అప్పుడు, అశ్మభూతమ్ ఇవ = శిలలుగా మారినదా అన్నట్లు, అచలమ్ = నిశ్చలముగా ఉన్న, సర్వమ్ = సమస్తమైన జనసముదాయమును, సమాగతమ్ = వచ్చినట్లుగా, శ్రుత్వా = విని, మునివరః = మునిశ్రేష్ఠుడు, ససీతః = సీతతో కూడినవాడై, తూర్ణమ్ = శీఘ్రముగా, సముపాగమత్ = వచ్చెను.

తా. శిలాప్రతిమలుగా మారిపోయినారా అన్నట్లు నిశ్చలముగా ఉన్న ఆ జనులందరు వచ్చి నట్లు విని వాల్మీకి సీతతో శీఘ్రముగా అక్కడికి వచ్చెను. 10

మూ. తమృషిం పృష్ఠతః సీతా అన్వగచ్ఛదవాఙ్ముఖీ,
కృతాఞ్జలిర్బాష్పగలా కృత్వా రామం మనోగతమ్. 11

ప్ర. అ. అవాఙ్ముఖీ = క్రిందికి ముఖము గల, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి గల, బాష్పగలా = కన్నీరు కంఠమునందు గల, సీతా = సీత, రామమ్ = రాముణ్ణి, మనోగతమ్ = మనస్సులో ఉన్నవానినిగా, కృత్వా = చేసి, తమ్ ఋషిమ్ = ఆ ఋషిని, పృష్ఠతః = వెనుక, అన్వగచ్ఛత్ = అనుసరించి వెళ్ళెను.

తా. సీత మనస్సులో రాముణ్ణి స్మరించుచు, కన్నీరు కంఠమునందు నిలిపి అంజలి ఘటించి, తలవంచుకొని ఆ ముని వెనుకనే వచ్చెను. 11

మూ. దృష్ట్వా శ్రుతిమివాయాన్తీం బ్రహ్మాణమనుగామినీమ్,
వాల్మీకేః పృష్ఠతః సీతాం సాధువాదో మహానభూత్. 12

ప్ర. అ. బ్రహ్మాణమ్ = బ్రహ్మదేవుణ్ణి అనుగామినీమ్ = అనుసరించుచున్న, ఆయాన్తీమ్ = వచ్చుచున్న, శ్రుతిమివ = శ్రుతివలె ఉన్న, వాల్మీకేః పృష్ఠతః = వాల్మీకి వెనుక నున్న, సీతామ్ = సీతను, దృష్ట్వా = చూచి, మహాన్ = గొప్ప, సాధువాదః = బాగు బాగు అను వాదము. అభూత్ = ఆయెను.

తా. బ్రహ్మదేవుని వెనుక శ్రుతి వచ్చుచున్నట్లు వాల్మీకి వెనుక సీత వచ్చుచుండగా చూచి పెద్ద "బాగు బాగు" అను ధ్వని బయలుదేరెను. 12

మూ. తతో హలహలాశబ్దః సర్వేషామేవమాబభౌ,
దుఃఖజన్మవిశాలేన శోకేనాకులితాత్మనామ్. 13

ప్ర. త. తతః = అటుపిమ్మట, దుఃఖజన్మవిశాలేన = దుఃఖము కలుగుట చేత అధికమైన, శోకేన = శోకముచేత, ఆకులితాత్మనామ్ = వ్యాకులము చేయబడిన మనస్సులు గల, సర్వేషామ్ = అందరియొక్క, హలహలాశబ్దః = కోలాహలధ్వని, ఏవమ్ = ఇట్లు, ఆబభౌ = ప్రకాశించెను (బయలుదేరెను).

తా. అప్పుడు దుఃఖమువలన అత్యధికమైన శోకముతో నిండిన మనస్సులతో అక్కడివాళ్ళు అందరూ కోలాహలము చేసిరి. 13

మూ. సాధు రామేతి కేచిత్తు సాధు సీతేతి చాపరే,
ఉభావేవ చ తత్రాన్యే ప్రేక్షకాః సంప్రచుక్రుశః 14

ప్ర. అ. రామ = రామా! సాధు = బాగు బాగు, ఇతి = అని, కేచిత్ = కొందరు, ప్రేక్షకాః = ప్రేక్షకులు, సీతే = సీతా! సాధు = బాగు బాగు, ఇతి = అని, అపరే చ = ఇతరులైన ప్రేక్షకులు, ఉభౌ ఏవ = ఇద్దరిని గూర్చి, (సీతా రాములారా బాగు బాగు అని), అన్యే చ = మరికొందరు, సంప్రచుక్రుశుః = అరచిరి.

తా. ఆ ప్రేక్షకులలో కొందరు ''రామా బాగు బాగు" అనీ, కొందరు "సీతా బాగు బాగు" అనీ, మరి కొందరు "సీతారాములారా బాగుబాగు" అనీ అరచిరి. 14

మూ. తతో మధ్యే జనౌఘస్య ప్రవిశ్య మునిపుంగవః,
సీతాసహాయో వాల్మీకిరితి హోవాచ రాఘవమ్. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సీతాసహాయః = సీతకు సహాయుడైన, మునిపుంగవః = మునిశ్రేష్ఠుడైన, వాల్మీకిః = వాల్మీకి, జనౌఘస్య = జనసముదాయముయొక్క, మధ్యే = మధ్యయందు, ప్రవిశ్య = ప్రవేశించి, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, ఇతి = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. సీతకు సహాయుడుగా ఉన్న మునిశ్రేష్ఠుడైన వాల్మీకి అప్పుడు జన సముదాయము మధ్య నిలచి రామునితో ఇట్లనెను. 15

మూ. ఇయం దాశరథే సీతా సువ్రతా ధర్మచారిణీ,
అపవాదాత్పరిత్యక్తా మమాశ్రమసమీపతః. 16

ప్ర అ. దాశరథే = రామా! సువ్రతా = మంచి నియమము గల, ధర్మచారిణీ = ధర్మమును ఆచరించు, ఇయం సీతా = ఈ సీత, అపవాదాత్ = లోకాపవాదమువలన, మమ = నాయొక్క, ఆశ్రమసమీపతః = ఆశ్రమము దగ్గర, పరిత్యక్తా = విడవబడినది.

తా. రామా! ఉత్తమనియమవంతురాలూ, ధర్మమును ఆచరించేదీ అయిన ఈ సీతను నీవు లోకపవాదమువలన నా ఆశ్రమముదగ్గర విడచినావు. 16

మూ. లోకాపవాదభీతస్య తవ రామ మహావ్రత,
ప్రత్యయం దాస్యతే సీతా తామనుజ్ఞాతుమర్హసి. 17

ప్ర. అ. మహావ్రత=గొప్ప వ్రతము గలవాడా! రామ!=రామా! లోకాపవాదభీతస్య= లోకాపవాదము వలన భయపడిన, తవ = నీకు, సీతా = సీత, ప్రత్యయమ్ = విశ్వాసయోగ్యమైన ప్రమాణమును, దాస్యతే = ఇవ్వగలదు. తామ్ = ఆమెను, అనుజ్ఞాతుమ్ = అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. గొప్ప వ్రతము గల రామా! లోకాపవాదమువలన భయబడిన నీకు ఈ సీత విశ్వాసయోగ్యమైన ప్రమాణమును చూపగలదు. ఆమెకు అనుమతి ఇమ్ము.

మూ. ఇమౌ తు జానకీపుత్రావుభౌ చ యమజాతకౌ,
సుతౌ తవైవ దుర్ధర్షౌ సత్యమేతద్బ్రవీమి తే. 18

ప్ర. అ. యమజాతకౌ = కలవలుగా పుట్టిన, ఇమౌ = ఈ, ఉభౌ = ఇద్దరూ, జానకీపుత్రౌ = జానకి కుమారులు. దుర్ధర్షౌ = ఎదిరింప శక్యముకాని వీరిద్దరూ, తవ = నీయొక్క, సుతౌ ఏవ = కుమారులే. తే = నీకు, ఏతత్ = దీనిని, సత్యమ్ = సత్యముగా, బ్రవీమి = చెప్పుచున్నాను

తా. కవలలైన ఈ ఇద్దరూ సీత పుత్రులు. ఎదిరింప శక్యముకాని ఈ ఇద్దరూ నీ కుమారులే. నీకు నేను సత్యము చెప్పుచున్నాను. 18

మూ. ప్రచేతసోఽహం దశమః పుత్రో రాఘవనన్దన,
న స్మరామ్యనృతం వాక్యమిమౌ తు తవ పుత్రకౌ. 19

ప్ర. అ. రాఘవనన్దన = రామా! అహమ్=నేను, ప్రచేతసః=ప్రచేతస్సు యొక్క, దశమః = పదవ, పుత్రః = పుత్రుడను. అనృతమ్ = అసత్యమైన, వాక్యమ్ = వాక్యమును, న స్మరామి = స్మరించను. ఇమౌ = వీరిద్దరూ, తవ = నీయొక్క, పుత్రకౌ = పుత్రులు.

తా. రామా! నేను ప్రచేతసుని పదవ పుత్రుడను. (లేదా ప్రచేతసుని వంశములో పదవవాడను-పదవ తరమునకు చెందినవాడను, అని కొందరు వ్యాఖ్యాతలు). నేను ఎప్పుడూ అసత్యము పలికి ఎరుగను, వీరిద్దరూ నీ పుత్రులు.

మూ. బహువర్షసహస్రాణి తపశ్చర్యా మయా కృతా,
నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ.

ప్ర. అ. మయా = నాచేత, బహువర్షసహస్రాణి = అనేక సంవత్సరముల సహస్రములు, తపశ్చర్యా = తపశ్చర్య, కృతా = చేయబడినది. ఇయమ్ = ఈ, మైథిలీ = సీత, దుష్టా యది = దోషము కలది అయితే, తస్యాః = ఆ తపశ్చర్య యొక్క, ఫలమ్ = ఫలమును, న ఉపాశ్నీయామ్ = అనుభవించకుందును గాక.

తా. నేను కొన్ని వేల సంవత్సరములు తపస్సు చేసితిని. ఈ సీతలో దోష మున్నట్లయితే నాకు ఆ తపస్సు ఫలితము లభించకుండు గాక. 20

మూ. మనసా కర్మణా వాచా భూతపూర్వం న కిల్బిషమ్,
తస్యాహం ఫలమశ్నామి అపాపా మైథిలీ యది. 21

ప్ర. అ. మనసా = మనస్సుచేత, కర్మణా = కర్మచేత, వాచా = వాక్కుచేత, కిల్బిషమ్ = పాపము, న భూతపూర్వమ్ = పూర్వ మెన్నడూ జరుగలేదు. మైథిలీ = సీత, అకల్మషా యది = పాపములు లేనిదైనచో, తస్య = దానికి, ఫలమ్ = ఫలమును, అశ్నీయామ్ = అనుభవింతును.

తా. మనస్సుచేత గాని, కర్మచేత గాని, వాక్కుచేత గాని పూర్వము నేను పాపము చేయలేదు. సీత పాపములేనిది అయిననే నాకు దాని ఫలము లభించుగాక.

మూ. అహం పఞ్చసు భూతేషు మనఃషష్ఠేషు రాఘవ,
విచిన్త్య సీతా శుద్ధేతి జగ్రాహ వననిర్ఝరే. 22

ప్ర. అ. రాఘవ = రామా! అహమ్ = నేను, మనఃషష్ఠేషు = మనస్సు ఆరవదిగా గల, పఞ్చసు = ఐదు, భూతేషు = ఇంద్రియములయందు, సీతా = సీత, శుద్ధా ఇతి = పరిశుద్ధురాలు అని, వననిర్ఝరే = వనమునందలి సెలయేరు దగ్గర, జగ్రాహ = గ్రహించితిని.

తా. రామా! సీత ఐదుజ్ఞానేంద్రియములయందు, మనస్సునందూ కూడా పరిశుద్ధురా లని నేను వనమునందలి సెలయేరు దగ్గర గ్రహించితిని. తెలిసికొని ఆమెను కాపాడితిని అని భావము. 22

మూ. ఇయం శుద్ధసమాచారా అపాపా పతిదేవతా,
లోకాపవాదభీతస్య ప్రత్యయం తవ దాస్యతి. 23

ప్ర. అ. శుద్ధసమాచారా = పరిశుద్ధమైన నడవడిక గల, అపాపా = పాపములు లేని, పతిదేవతా = పతియే దేవతగా గల, ఇయమ్ = ఈమె, లోకాపవాదభీతస్య = లోకాపవాదమువలన భయపడిన, తవ = నీకు, ప్రత్యయమ్ = నమ్మదగిన ప్రమాణమును, దాస్యతి = ఇవ్వగలదు.

తా. పరిశుద్ధమైన సమాచారము గల, పతినే దేవతగా ఆరాధించు ఈమె లోకాపవాదమునకు భయపడిన నీకు ప్రత్యయమును ఇవ్వగలదు. 23

మూ. తస్మాదియం నరవారాత్మజ శుద్ధభావా
దివ్యేన దృష్టివిషయేణ మయా ప్రదిష్టా,
లోకాపవాదకలుషీకృతచేతసా యా
త్యక్తా త్వయా ప్రియతమా విదితాపి శుద్ధా. 24

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షణ్ణవతితమః సర్గః.

ప్ర. అ. నరవరాత్మజ = దశరథరాజకుమారా! తస్మాత్ = ఆ కారణమువలన, శుద్ధా = పరిశుద్ధురాలుగా, విదితాపి = తెలియబడినదైనను, ప్రియతమా = మిక్కిలి ప్రియురాలైన, యా = ఏ సీత, లోకాపవాదకలుషీకృతచేతసా = లోకాపవాదముచేత కలుషముగా చేయబడిన చిత్తము గల, త్వయా = నీచేత, త్యక్తా = విడవబడినదో, ఇయమ్ = అట్టి ఈ సీత, శుద్ధభావా = పరిశుద్ధమైన భావము కలదిగా, దివ్యేన = దివ్యమైన, దృష్టివిషయేణ = జ్ఞానముచేత, మయా = నాచేత, ప్రదిష్టా = నీకు తెలపబడినది.

తా. అందువలన, రామా! ప్రియతమురాలైన ఏ సీతను నీవు పరిశుద్ధురాలని తెలిసీ కూడ లోకాపవాదమునకు భయపడి విడిచివేసినావో అట్టి ఈ సీత పరిశుద్ధమైన భావము గలది అని నేను దివ్యజ్ఞానముచేత తెలిసికొని నీకు తెలుపుచున్నాను.

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభైఆరవ సర్గ సమాప్తము.

## అథ సప్తనవతితమః సర్గః

[సీత శపథము చేయుట. రసాతలములో ప్రవేశించుట.]

మూ. వాల్మీకినైవముక్తస్తు రాఘవః ప్రత్యభాషత
ప్రాఞ్జలిర్జగతో మధ్యే దృష్ట్వా తాం వరవర్ణినీమ్. 1

ప్ర. అ. వాల్మీకినా = వాల్మీకిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, రాఘవః = రాముడు, జగతః = జగత్తుయొక్క, మధ్యే = మధ్యయందు, తామ్ = ఆ, వరవర్ణినీమ్ = శ్రేష్ఠమైన శరీరవర్ణము గల సీతను, దృష్ట్వా = చూచి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలికలవాడై, ప్రత్యభాషత = తిరిగి పలికెను.

తా. వాల్మీకి మాటలు విని, రాముడు జనుల మధ్య నున్న సీతను చూచి వాల్మీకికి అంజలి ఘటించి నమస్కరించుచు ఇట్లనెను. 1

మూ. ఏవమేతన్మహాభాగ యథా వదసి ధర్మవిత్,
ప్రత్యయస్తు మమ బ్రహ్మంస్తవ వాక్యైరకల్మషైః. 2

ప్ర. అ. మహాభాగ = గొప్ప భాగ్యము కలవాడా! ధర్మవిత్ = ధర్మము తెలిసిన నీవు, యథా = ఎట్లు, వదసి = చెప్పుచున్నావో, ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లే. బ్రహ్మన్ = బ్రాహ్మణా! మమ తు = నాకైతే, అకల్మషైః = దోషము లేని, తవ వాక్యైః = నీ మాటలచేత, ప్రత్యయః = నమ్మకము ఉన్నది.

తా. ధర్మవేత్తవైన మహానుభావా! నీవు చెప్పినది యథార్థమే. నీవు చెప్పిన దోషరహితములైన మాటలపై నాకైతే పూర్తి నమ్మక మున్నది. 2

మూ. ప్రత్యయశ్చ పురావృత్తో వైదేహ్యాః సురసంనిధౌ,
శపథశ్చ కృతస్తత్ర తేన వేశ్మ ప్రవేశితా. 3

ప్ర. అ. పురా = పూర్వము, సురసంనిధౌ = దేవతలసంనిధియందు, వైదేహ్యాః = సీతయొక్క, ప్రత్యయః = నమ్మకము, వృత్తః = జరిగినది. తత్ర =

అక్కడ, శపథః చ = శపథము కూడ, కృతః = చేయబడినది. తేన = ఆ కారణము చేతనే, వేశ్మ = గృహమును, ప్రవేశితా = ప్రవేశ పెట్టబడినది.

తా. పూర్వము దేవతల సమక్షమున సీత విషయమున నమ్మకము ఏర్పడినది. అక్కడ శపథము కూడ చేయబడినది. అందుచేతనే ఇంటికి సీతకొని వచ్చినాను. 3

మూ. లోకాపవాదో బలవాన్యేన త్యక్తా హి మైథిలీ,
సేయం లోకభయాద్బ్రహ్మన్నపాపేత్యభిజానతా, 4
పరిత్యక్తా మయా సీతా తద్భవాన్ క్షన్తుమర్హతి.

ప్ర. అ. బ్రహ్మన్ = ఓ! బ్రాహ్మణా! లోకాపవాదః = లోకాపవాదము, బలవాన్ = బలము గలది. యేన = దేనిచేత, మైథిలీ = సీత. త్యక్తా హి = విడవబడినదో. సా ఇయమ్ = అట్టి ఈ, సీతా = సీత, అపాపా = పాపము లేనిది, ఇతి = అని, అభిజానతా = తెలిసినవాడనైనను, మయా = నాచేత, లోకభయాత్ = లోకభయమువలన, పరిత్యక్తా = విడవబడినది. తత్ = దానిని, భవాన్ = నీవు, క్షన్తుమ్ = క్షమించుటకు, అర్హతి = తగిఉన్నావు.

తా. మహామునీ! లోకాపవాదము బలవత్తరముగా ఉండుటచేత నేను సీతను విడిచితిని. ఈమెలో ఏ పాపమూ లేదని తెలిసి కూడ నేను లోకభయము చేత త్యజించితిని. అందుకు నన్ను క్షమించుము. 4

మూ. జానామి చేమౌ పుత్రౌ మే యమజాతౌ కుశీలవౌ, 5
శుద్ధాయాం జగతో మధ్యే మైథిల్యాం ప్రీతిరస్తు మే.

ప్ర. అ. ఇమౌ = ఈ, కుశీలవౌ = గాయకులను, మే = నాయొక్క, యమజాతౌ = కవలలుగా పుట్టిన, పుత్రౌ = పుత్రులనుగా, జానామి = ఎరుగుదును. జగతః = జగత్తుయొక్క, మధ్యే = మధ్యయందు, శుద్ధాయామ్ = పరిశుద్ధురాలైన, మైథిల్యామ్ = సీతయందు, మే = నాకు, ప్రీతిః = ప్రేమ, అస్తు = అగుగాక.

తా. ఈ గాయకులిద్దరూ నా కవలలుగా పుట్టిన పుత్రులని నేను ఎరుగుదును. జనుల మధ్య పరిశుద్ధురాలుగా నిర్ణయింపబడిన పిమ్మటనే నాకు సీతయందు ప్రేమ కలుగుగాక. 5

మూ. అభిప్రాయం తు విజ్ఞాయ రామస్య సురసత్తమాః, 6
సీతాయాః శపథే తస్మిన్ మహేన్ద్రాద్యా మహౌజసః,
పితామహం పురస్కృత్య సర్వ ఏవ సమాగతాః. 7

ప్ర. అ. రామస్య = రామునియొక్క, అభిప్రాయమ్ = అభిప్రాయమును, విజ్ఞాయ = తెలుసుకొని, తస్మిన్ = ఆ, సీతాయాః శపథే = సీతయొక్క శపథమునందు, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి, పురస్కృత్య = ముందు ఉంచుకొని, మహేన్ద్రాద్యాః = మహేంద్రుడు మొదలైన, మహౌజసః = గొప్ప తేజస్సు గల, సర్వే ఏవ = సమస్తమైన, సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులు, సమాగతాః = వచ్చిరి.

తా. రాముని అభిప్రాయము తెలిసికొని మహేంద్రుడు మొదలైన మహాతేజశాలులైన దేవత లందరు ఆ సీతాశపథసమయమునందు అక్కడికి వచ్చిరి.

మూ. ఆదిత్యా వసవో రుద్రా విశ్వేదేవా మరుద్గణాః,
సాధ్యాశ్చ దేవాః సర్వే తే సర్వే చ పరమర్షయః. 8

నాగాః సుపర్ణాః సిద్ధాశ్చ తే సర్వే హృష్టమానసాః,
సీతాశపథసంభ్రాన్తాః సర్వ ఏవ సమాగతాః. 9

ప్ర. అ. ఆదిత్యాః = ఆదిత్యులు, వసవః = వసువులు, రుద్రాః = రుద్రులు, విశ్వేదేవాః = విశ్వేదేవతలు, మరుద్గణాః = మరుద్గణములు, సాధ్యాః చ = సాధ్యులు, తే = ఆ, సర్వే = సమస్తమైన, దేవాః = దేవతలు, సర్వే = సమస్తమైన, పరమర్షయః చ = మహర్షులు, నాగాః = నాగులు, సుపర్ణాః = పక్షులు, సిద్ధాః చ = సిద్ధులూ, తే సర్వే = వారందరూ, హృష్టమానసాః = సంతోషించిన మనస్సు కలవారై, సీతాశపథసంభ్రాన్తాః = సీత శపథమునుగూర్చి తొందరపడుచున్నవారై, సర్వే ఏవ = అందరూ, సమాగతాః = వచ్చిరి.

తా. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుద్గణములు, ఈ సమస్తదేవతలు, సాధ్యులు, సమస్తపరమర్షులు, నాగులు, పక్షులు, సిద్ధులు-వీరందరూ కూడ సంతోషముతో కూడిన మనస్సులతో అక్కడికి వచ్చిరి. అందరూ కూడ సీతాశపథమును గూర్చి కంగారుపడుచు వచ్చిరి. 8, 9

మూ. దృష్ట్వా దేవానృషీంశ్చైవ రాఘవః పునరబ్రవీత్,
ప్రత్యయో మే సురశ్రేష్ఠా ఋషివాక్యైరకల్మషైః. 10
శుద్ధాయాం జగతో మధ్యే వైదేహ్యాం ప్రీతిరస్తు మే,

ప్ర. అ. దేవాన్ = దేవతలను, ఋషీన్ చ ఏవ = ఋషులను, దృష్ట్వా= చూచి, రాఘవః=రాముడు, పునః= మరల, అబ్రవీత్ = పలికెను. సురశ్రేష్ఠాః= దేవతాశ్రేష్ఠులారా! అకల్మషైః=దోషములు లేని, మునివాక్యైః=మునివాక్యముల చేత, మే= నాకు, ప్రత్యయః = నమ్మకము ఉన్నది. జగతః మధ్యే=జగత్తు యొక్క మధ్యయందు, శుద్ధాయామ్=పరిశుద్ధురాలైన, వైదేహ్యామ్ = సీతయందు, మే= నాకు, ప్రీతిః = ప్రేమ, అస్తు = అగుగాక.

తా. దేవతలను, ఋషులను చూచి రాముడు మరల పలికెను. దేవతా శ్రేష్ఠులారా! నాకు దోషరహితములైన వాల్మీకి మాటలయందు నమ్మక మున్నది. కాని జనులమధ్య పరిశుద్ధయైన సీతపై నాకు ప్రేమ కలుగుగాక. 10

మూ. తతో వాయుః శుభః పుణ్యో దివ్యగన్ధో మనోరమః, 11
తం జనౌఘం సురశ్రేష్ఠో హ్లాదయామాస సర్వతః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శుభః = శుభకరుడు, పుణ్యః = పుణ్యుమైనవాడు, దివ్యగన్ధః = దివ్యమైన సువాసన గలవాడు, మనోరమః = మనోహరుడూ, సురశ్రేష్ఠః = దేవతలలో శ్రేష్ఠుడూ అయిన, వాయుః = వాయుదేవుడు, తం జనౌఘమ్=ఆ జనసముదాయమును, సర్వతః = అంతటా, హ్లాదయామాస= సంతోషపెట్టెను.

తా. పిమ్మట అక్కడ ఉన్న జనసముదాయమునకు, శుభము, పుణ్యము, దివ్యగంధము గలది, మనోహరము అయిన వాయువు ఆనందమును కలిగించెను.

మూ. తదద్భుతమివాచిన్త్యం నిరైక్షన్త సమాహితాః, 12
మానవాః సర్వరాష్ట్రేభ్యః పూర్వం కృతయుగే యథా.

ప్ర. అ. సర్వరాష్ట్రేభ్యః=సమస్తరాష్ట్రములనుండి వచ్చిన, మానవాః= మానవులు, సమాహితాః = సావధానచిత్తులై, పూర్వమ్ = పూర్వము, కృత

యుగే యథా = కృతయుగమునందు వలె, అచిన్త్యమ్ = ఊహింప శక్యము కాని, అద్భుతమ్ ఇవ = ఆశ్చర్యమును వలె, తత్ = దానిని, నిరైక్షన్త = చూచిరి.

తా. సమస్త రాష్ట్రములనుండీ వచ్చిన మానవులు, పూర్వము కృత యుగమునందు వలె, ఊహింప శక్యము కాని ఆశ్చర్యమును చూచినట్లు దానిని సావధానచిత్తులై చూచిరి. 12

మూ. సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతా కాషాయవాసినీ, 13
అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యమధోదృష్టిరవాఙ్ముఖీ.

ప్ర. అ. సమాగతాన్ = వచ్చిన, సర్వాన్ = అందరినీ, దృష్ట్వా = చూచి, కాషాయవాసినీ = కాషాయవస్త్రము ధరించిన, సీతా = సీత, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలదై, అధోదృష్టిః = క్రిందికి దృష్టి గలదై, అవాఙ్ముఖీ = క్రిందికి ముఖము గలదై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. కాషాయవస్త్రము ధరించి ఉన్న సీత అక్కడికి వచ్చిన అందరినీ చూచి, అంజలి ఘటించి, తల వంచి, క్రిందికి చూచుచు ఇట్లు పలికెను. 13

మూ. యథాహం రాఘవాదన్యం మనసాపి న చిన్తయే, 14
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి.

ప్ర. అ. అహమ్ = నేను, రాఘవాత్ = రామునికంటె, అన్యమ్ = ఇతరుని, మనసాపి = మనస్సుచేత కూడ, యథా = ఎట్లు, న చిన్తయే = తలవనో, తథా = అట్లు, దేవీ = దేవియైన, మాధవీ = మాధవుని భార్యయైన భూమి, వివరమ్ = వివరమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హతి = తగియున్నది.

తా. నేను రాముణ్ణి తప్ప మరెవ్వనినీ మనసా కూడ స్మరించనిచో భూదేవి నాకు వివరమును ఇచ్చుగాక. 14

మూ. మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే, 15
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి.

ప్ర. అ. మనసా = మనస్సుచేత, కర్మణా = కర్మచేత, వాచా = వాక్కుచేత, యథా = ఎట్లు, రామమ్ = రాముణ్ణి, సమర్చయే = పూజించుచున్నానో,

తథా = అట్లు, మాధవీ దేవీ = భూదేవి, మే = నాకు, వివరమ్ = వివరమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హతి = తగిఉన్నది.

తా. నేను మనోవాక్కాయములచేత రాముణ్ణి మాత్రమే పూజించినట్లయితే నాకు భూదేవి వివరమును ఇచ్చుగాక. 15

మూ. యథైతత్సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ,
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి.

ప్ర. అ. ఏతత్ = ఈ, సత్యమ్ = సత్యము, యథా = ఎట్లు, మే = నాకు (నాచేత). ఉక్తమ్ = పలకబడినదో, రామాత్ = రామునికంటె, పరమ్ = ఇతరుణ్ణి, న వేద్మి చ = ఎరుగనో, తథా = అట్లు, మాధవీ దేవీ = భూదేవి, మే = నాకు, వివరమ్ = వివరమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హతి = తగిఉన్నది.

తా. నేను ఇప్పుడు చెప్పినది అంతా సత్యమైతే, నేను రాముడు తప్ప మరొకనిని ఎరుగకపోయినచో భూదేవి నాకు వివరము ఇచ్చుగాక. 16

మూ. తథా శపన్త్యాం వైదేహ్యాం ప్రాదురాసీత్తదద్భుతమ్, 17
భూతలాదుత్థితం దివ్యం సింహాసనమనుత్తమమ్,
ధ్రియామాణం శిరోభిస్తు నాగైరమితవిక్రమైః, 18
దివ్యం దివ్యేన వపుషా దివ్యరత్నవిభూషితైః.

ప్ర. అ. వైదేహ్యామ్ = సీత, తథా = అట్లు, శపన్త్యామ్ = ఒట్టు పెట్టుచుండగా, అద్భుతమ్ = ఆశ్చర్యకరము, భూతలాత్ = భూతలమునుండి, ఉత్థితమ్ = లేచినది, అనుత్తమమ్ = చాల ఉత్తమము, దివ్యేన = దివ్యమైన, వపుషా = ఆకారముతో, దివ్యమ్ = ప్రకాశించుచున్నది, దివ్యరత్న విభూషితైః = దివ్యములైన రత్నములచేత అలంకరింపబడిన, అమితవిక్రమైః = అపరిమితమైన పరాక్రమము గల, నాగైః = నాగములచేత, శిరోభిః = శిరస్సులచేత, ధ్రియమాణమ్ = మోయబడుచున్నది అయిన, తత్ = ఆ, దివ్యమ్ = దివ్యమైన, సింహాసనమ్ = సింహాసనము, ప్రాదురాసీత్ = ఆవిర్భవించెను.

తా. సీత ఆ విధముగా శపథము చేయుచుండగా అత్యుత్తమము, అద్భు

తమూ అయిన ఒక దివ్యమైన సింహాసనము భూతలమునుండి పైకి లేచెను. అద్భుతమైన ఆకారముతో ప్రకాశించుచున్న ఆ సింహాసనమును దివ్యములైన రత్నములచే అలంకరింపబడిన, అమితమైన బలము గల సర్పములు తమ శిరస్సులపై మోయుచుండెను. 17, 18

మూ. తస్మింస్తు ధరణీదేవీ బాహుభ్యాం గృహ్య మైథిలీమ్, 19
స్వాగతేనాభినన్ద్యైనామాసనే చోపవేశయత్.

ప్ర. అ. తస్మిన్ తు = ఆ సింహాసనమునందు ఉన్న, ధరణీదేవీ = భూదేవి, మైథిలీమ్ = సీతను, బాహుభ్యామ్ = బాహువులతో, గృహ్య = గ్రహించి, ఏనామ్ = ఈమెను, స్వాగతేన = స్వాగతముచేత, అభినన్ద్య = అభినందించి, ఆసనే = ఆ సింహాసనమునందు, ఉపవేశయత్ చ = కూర్చుండ బెట్టుకొనెను.

తా. ఆ సింహాసనమునందున్న భూదేవి సీతను బాహువులతో పట్టుకొని, "వత్సా! రమ్ము" అని స్వాగతముతో ఆమెను అభినందించి సింహాసనముమీద కూర్చుండబెట్టుకొనెను. 19

మూ. తామాసనగతాం దృష్ట్వా ప్రవిశన్తీం రసాతలమ్, 20
పుష్పవృష్టిరవిచ్ఛిన్నా దివ్యా సీతామవాకిరత్.

ప్ర. అ. ఆసనగతామ్ = సింహాసనమునందున్న, రసాతలమ్ = రసాతలమును, ప్రవిశన్తీమ్ = ప్రవేశించుచున్న, సీతామ్ = సీతను, దృష్ట్వా = చూచి, దివ్యా = దివ్యమైన, పుష్పవృష్టిః = పుష్పవృష్టి, అవిచ్ఛిన్నా = అవిచ్ఛిన్నమై, అవాకిరత్ = వర్షించెను.

తా. సింహాసనమునందు కూర్చుండి రసాతలములోనికి ప్రవేశించుచున్న సీతను చూడగానే దివ్యమైన పుష్పవృష్టి అవిచ్ఛిన్నముగా పడెను. 20

మూ. సాధుకారశ్చ సుమహాన్ దేవానాం సహసోత్థితః, 21
సాధు సాధ్వీతి తే సీతే యస్యాస్తే శీలమీదృశమ్.

ప్ర. అ. సీతే = సీతా! యస్యాః = ఏ, తే = నీయొక్క, శీలమ్ = శీలము ఈదృశమ్ = ఇట్టిదో, అట్టి, తే = నీవిషయమునందు, సాధు సాధు = బాగు బాగు,

ఇతి = అని, సుమహాన్ = చాల పెద్దదైన, దేవానామ్ = దేవతలయొక్క, సాధువాదః = బాగు బాగు అను శబ్దము, సహసా = వెంటనే, ఉత్థితః = బయలు దేరినది.

తా. "సీతా! నీ శీలము ఎంత గొప్పది! బాగు, బాగు" అని దేవతలు పలికిన సాధువాదము వెంటనే బిగ్గరగా వినవచ్చెను. 21

మూ. ఏవం బహువిధా వాచో హ్యన్తరిక్షగతాః సురాః, 22
వ్యాజహ్రుర్హృష్టమనసో దృష్ట్వా సీతాప్రవేశనమ్.

ప్ర. అ. అన్తరిక్షగతాః = ఆకాశమునందున్న, సురాః = దేవతలు, సీతాప్రవేశనమ్ = సీతయొక్క ప్రవేశమును, దృష్ట్వా = చూచి, హృష్టమనసః = సంతోషించిన మనస్సులు కలవారై, ఏవమ్ = ఇట్లు, బహువిధాః = అనేకవిధములైన, వాచః = వాక్కులను, వ్యాజహ్రుః = పలికిరి.

తా. ఆకాశమునందున్న దేవతలు సీత రసాతలప్రవేశమును చూచి, సంతోషించిన మనస్సులతో ఇట్లు అనేకవిధములైన మాటలు పలికిరి. 22

మూ. యజ్ఞవాటగతాశ్చాపి మునయః సర్వ ఏవ తే, 23
రాజానశ్చ నరవ్యాఘ్రా విస్మయాన్నోపరేమిరే.

ప్ర. అ. యజ్ఞవాటగతాః=యజ్ఞప్రదేశమునందున్న, సర్వే=సమస్తమైన, తే = ఆ, మునయః = మునులు, రాజానః చ = రాజులు, నరవ్యాఘ్రాః = నరశ్రేష్ఠులు, విస్మయాత్ = ఆశ్చర్యమునుండి, న ఉపరేమిరే = ఉపరమించలేదు.

తా. యజ్ఞప్రదేశమునందున్న అందరు మునులకు, రాజులకు, ఉత్తములైన ఇతరజనులకు కూడ ఆశ్చర్యము తగ్గలేదు. 23

మూ. అన్తరిక్షే చ భూమౌ చ సర్వే స్థావరజఙ్గమాః, 24
దానవాశ్చ మహాకాయాః పాతాలే పన్నగాధిపాః,
కేచిద్వినేదుః సంహృష్టాః కేచిద్ధ్యానపరాయణాః, 25
కేచిద్రామం నిరీక్షన్తే కేచిత్సీతామచేతసః.

ప్ర. అ. అన్తరిక్షే = ఆకాశమునందు ఉన్నవారు, భూమౌ చ = భూమి

యందున్న, స్థావరజఙ్గమాః = స్థావరములు, జంగమములు, మహాకాయాః = గొప్ప శరీరము గల, దానవాశ్చ = దానవులు, పాతాలే = పాతాలమునందున్న, పన్నగాధిపాః = సర్పనాయకులు, కేచిత్ = కొందరు, సంహృష్టాః = సంతోషించినవారై, వినేదుః = ధ్వనిచేసిరి. కేచిత్ = కొందరు, ధ్యానపరాయణాః = ధ్యానమునందు ఆసక్తులైరి. కేచిత్ = కొందరు, అచేతసః = చిత్తము లేనివారై (కలత చెందిన మనస్సులతో), రామమ్ = రాముణ్ణి, నిరీక్షన్తే = చూచుచుండిరి. కేచిత్ = కొందరు, సీతామ్ = సీతను చూచుచుండిరి.

తా. ఆకాశమునం దున్నవారిలోను, భూమిమీద ఉన్న స్థావరజంగమముల లోను, పెద్దశరీరములు గల దానవులలోను, పాతాలములో ఉన్న నాగనాయకుల లోను కొందరు సీత పాతివ్రత్యమునకు సంతోషించి బిగ్గరగా అరచిరి. కొందరు ఆలోచనలో పడిరి. కొందరు కలతచెందిన మనస్సులతో రాముణ్ణి, కొందరు సీతనూ చూచుచుండిరి. 24,25

మూ. సీతాప్రవేశనం దృష్ట్వా తేషామాసీత్సమాగమః, 26
తన్ముహూర్తమివాత్యర్థం సమం సంమోహితం జగత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తనవతితమః సర్గః.

("ముహూర్తమివ తత్సర్వం తూష్ణీంభూతమచేతనమ్,
సీతాప్రవేశనం దృష్ట్వా జగదాసీత్సమాకులమ్"

అను ప్రాచ్యపాఠము బాగున్నది.)

ప్ర. అ. సీతాప్రవేశనమ్ = సీతయొక్క ప్రవేశమును, దృష్ట్వా = చూచి, సమాకులమ్ = వ్యాకులమైన తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, ముహూర్తమివ = ముహూర్తకాలము, అచేతనమ్ = చైతన్యశూన్యమై, తూష్ణీంభూతమ్ = మౌనముగా ఉండిపోయెను.

తా. సీత రసాతలములో ప్రవేశించుట చూచి ఆ జగత్తు అంతా కలత చెందెను. ముహూర్తకాలముపాటు స్పృహ తప్పినట్లు అయి నిఃశబ్దముగా ఉండిపోయెను. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభై ఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టనవతితమః సర్గః

[సీతకై రాముని శోకము, బ్రహ్మదేవుడు ఓదార్చి ఉత్తరకాండ శేషమును వినుమని చెప్పుట.]

మూ. రసాతలం ప్రవిష్టాయాం వైదేహ్యాం సర్వవానరాః,
చుక్రుశుః సాధు సాధ్వీతి మునయో రామసంనిధౌ. 1

ప్ర. అ. వైదేహ్యామ్=సీత, రసాతలమ్ = రసాతలమును, ప్రవిష్టాయామ్ = ప్రవేశించినదగుచుండగా, సర్వవానరాః = సమస్తవానరులు, చుక్రుశుః = అరచిరి. రామసంనిధౌ = రాముని సమీపమునందున్న, మునయః = మునులు, సాధు సాధు ఇతి = "బాగు బాగు" అనిరి.

తా. సీత రసాతలములో ప్రవేశించుట చూచి వానరులు దుఃఖముతో అరచిరి. రాముని ప్రక్కనున్న మునులు ఆమెను కొనియాడుచు "బాగు బాగు" అనిరి. 1

మూ. దణ్డకాష్ఠమవష్టభ్య బాష్పవ్యాకులితేక్షణః,
అవాక్శిరా దీనమనా రామో హ్యాసీత్సుదుఃఖితః. 2

ప్ర అ. రామః=రాముడు, దణ్డకాష్ఠమ్ = కఱ్ఱను, అవష్టభ్య=ఆనుకొని, బాష్పవ్యాకులితేక్షణః=కన్నీళ్ళచేత వ్యాకులము చేయబడిన నేత్రములు కలవాడై, అవాక్శిరాః = క్రిందికి శిరస్సు కలవాడై, దీనమనాః = దీనమైన మనస్సు కలవాడై, సుదుఃఖితః = చాల దుఃఖితుడు, ఆసీత్ = ఆయెను.

తా. రాముడు యజ్ఞదీక్షలో ఉన్నవాళ్ళు చేతిలో ఉంచుకొనవలసిన పలాశ దండమును ఆనుకొని, కన్నీళ్ళచేత నేత్రములు వ్యాకులములు కాగా, తల క్రిందికి వంచి, దీనమైన మనస్సుతో చాల దుఃఖితు డయ్యెను. 2

మూ. స రుదిత్వా చిరం కాలం బహుశో బాష్పముత్సృజన్,
క్రోధశోకసమావిష్టో రామో వచనమబ్రవీత్. 3

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, చిరం కాలమ్ = చాల సేపు, రుదిత్వా = ఏడ్చి, బహుశః = అధికముగా, బాష్పమ్ = కన్నీటిని, ఉత్సృజన్ = విడచుచు, క్రోధశోకసమావిష్టః = క్రోధముతోను, శోకముతోను కూడినవాడై, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు చాల సేపు ఏడ్చి, అధికముగా కన్నీరు కార్చుచు, క్రోధ శోకములతో కూడినవాడై ఇట్లనెను. 3

మూ. అభూతపూర్వం శోకం మే మనః స్ప్రష్టుమివేచ్ఛతి,
పశ్యతో మే యథా నష్టా సీతా శ్రీరివ రూపిణీ. 4

ప్ర. అ. రూపిణీ = రూపము గల, శ్రీరివ = లక్ష్మివంటి, సీతా = సీత, మే = నేను, పశ్యతః = చూచుచుండగనే, యథా = ఎట్లు, నష్టా = నష్టమైనదో, అందుచేత, అభూతపూర్వమ్ = పూర్వమెన్నడూ లేని, శోకమ్ = శోకము, మనః = మనస్సును, స్ప్రష్టుమ్ = స్పృశించుటకు, ఇచ్ఛతీవ = కోరుచున్నట్లున్నది.

తా. (సీతా) రూపముదాల్చిన లక్ష్మి వంటి సీత నేను చూచుచుండగానే అదృశ్యురాలగుటచే పూర్వమెన్నడూ లేని శోకము నా మనస్సులో ప్రవేశింప దలచుచున్నట్లు ఉన్నది. 4

మూ. సాదర్శనం పురా సీతా లఙ్కాం పారే మహోదధేః,
తతశ్చాపి మయా నీతా కిం పునర్వసుధాతలాత్. 5

ప్ర. అ. ("సా మమాపశ్యతో సీతా లఙ్కాపారే (లఙ్కాం పారే) మహోదధేః, తతశ్చాపి మయా నీతా కిం పునర్వసుధాతలాత్". అను ప్రాచ్యపాఠము బాగున్నది.)

సా = ఆమె, మమ = నేను, అపశ్యతః = చూడకుండగా, మహోదధేః పారే = మహాసముద్రము అవతలి ఒడ్డున, లఙ్కామ్ = లంకను గూర్చి, సీతా = తీసికొని వెళ్ళబడినది. తతః చ అపి = అక్కడినుండి కూడ, మయా = నాచేత, ఆనీతా = తీసికొనిరాబడినది. వసుధాతలాత్ = భూమినుండి, కిం పునః = చెప్పనేల?

తా. నేను చూడనప్పుడు ఆమెను మహాసముద్రము అవతలి ఒడ్డున లంకకు అపహరించుకొనిపోయినారు. అక్కడినుండియే నేను తీసికొనివచ్చితిని, భూమినుండి వేరే చెప్పవలెనా? 5

మూ. వసుధే దేవి భవతి సీతా నిర్యాత్యతాం మమ,
దర్శయిష్యామి వా రోషం యథా మామవగచ్ఛసి. 6

ప్ర. అ. వసుధే దేవి = భూదేవీ! భవతి = పూజ్యురాలా! సీతా = సీత, మమ = నాకు, నిర్యాత్యతామ్ = తిరిగి ఇవ్వబడుగాక. వా = అట్లు కానిచో, మామ్ = నన్ను, యథా = ఎట్లు, అవగచ్ఛసి = తెలిసికొనెదవో అట్లు, రోషమ్ = రోషమును, దర్శయిష్యామి = చూపగలను.

తా. పూజ్యురాలవైన భూదేవీ! నాకు సీతను తిగిరి ఇచ్చివేయుము. అట్లు కానిచో నేను ఎట్టివాడనో నీకు తెలిసే విధముగా కోపము చూపెదను. 6

మూ. కామం శ్వశ్రూర్మమైవ త్వం త్వత్సకాశాద్ధి మైథిలీ,
కర్షతా పాలహస్తేన జనకేనోద్ధృతా పురా. 7

ప్ర. అ. త్వమ్ = నీవు, మమ = నాకు, శ్వశ్రూః ఏవ = అత్తగారివే, అసి. కామమ్ = అయి ఉన్నావు నిజమే. పాలహస్తేన = నాగలి హస్తమునందు గల, కర్షతా = దున్నుచున్న, జనకేన = జనకునిచేత, పురా = పూర్వము, మైథిలీ = సీత, త్వత్సకాశాత్ = నీ సమీపమునుండియే, ఉద్ధృతా హి = పైకి తీయబడినది కదా?

తా. నీవు నాకు తప్పక అత్తగారివే. ఎందుచేత ననగా పూర్వము నాగలి దున్నుచున్న జనకుడు నీనుండియే సీతను పైకి తీసినాడు. 7

మూ. తస్మాన్నిర్యాత్యతాం సీతా వివరం వా ప్రయచ్ఛ మే,
పాతాలే నాకపృష్ఠే వా వసేయం సహిత స్తయా. 8

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, సీతా = సీత, నిర్యాత్యతామ్ = తిరిగి ఇవ్వబడుగాక. వా = లేదా, మే = నాకు, వివరమ్ = వివరమును, ప్రయచ్ఛ = ఇమ్ము. పాతాలే = పాతాలములో నైనా, నాకపృష్ఠే వా = స్వర్గమునందైనా, తయా = ఆమెతో, సహితః = కూడినవాడనై, వసేయమ్ = నివసింతును.

తా. అందువలన సీతనైనా తిరిగి ఇమ్ము, లేదా నాకు కూడ వివరమును ఇమ్ము. పాతాలములో నైనా, స్వర్గములో నైనా నేను ఆమెతో కలిసియే నివసించెదను. 8

మూ. ఆనయ త్వం హి తాం సీతాం మత్తోఽహం మైథిలీకృతే,
న మే దాస్యసి చేత్సీతాం యథారూపాం మహీతలే, 9

సపర్వతవనాం కృత్స్నాం వ్యథయిష్యామి తే స్థితిమ్,
నాశయిష్యామ్యహం భూమిం సర్వమాపో భవన్త్విహ. 10

ప్ర. అ. త్వమ్ = నీవు, తాం సీతామ్ = ఆ సీతను, ఆనయ = తీసికొని రమ్ము. అహమ్ = నేను, మైథిలీకృతే = సీతకొరకై, మత్తః = మదించి ఉన్నాను. మహీతలే = భూమిలోపల నున్న, సీతామ్ = సీతను, యథా = ఏ రూపములో ఉండేదో ఆ రూపము గలదానినిగా, మే = నాకు, న దాస్యసి = ఇవ్వకపోయినచో, సపర్వతవనామ్ = పర్వతములతోను, వనములతోను కూడిన, కృత్స్నామ్ = సమస్తమైన, తే స్థితిమ్ = నీ స్థితిని, వ్యథయిష్యామి = తారుమారుచేసెదను. అహమ్ = నేను, భూమిమ్ = భూమిని, నాశయిష్యామి = నశింపచేసెదను. ఇహ = ఇక్కడ, సర్వమ్ = సమస్తమూ, ఆపః = ఉదకములుగా, భవన్తు = అగుగాక.

తా. ఆ సీతను నాకు తీసికొని రమ్ము. నేను ఆమెకోసము ఉన్మత్తుడనైతిని. భూమిలో ఉన్న సీతను ఆమె పూర్వమెట్లు ఉండెడిదో అట్లు ఇవ్వకపోయినచో పర్వతములతోను, అరణ్యములతోను కూడిన నీ స్థితిని తారు మారు చేసెదను. ఈ భూమిని నశింపచేసెదను. అంతా జలమయము అగుగాక. 10

మూ. ఏవం బ్రువాణే కాకుత్స్థే క్రోధశోకసమన్వితే,
బ్రహ్మా సురగణైః సార్ధమువాచ రఘునన్దనమ్. 11

ప్ర. అ. క్రోధశోకసమన్వితే = క్రోధముతోను శోకముతోను కూడిన, కాకుత్స్థే = రాముడు, ఏవమ్ = ఇట్లు, బ్రువాణే = పలుకుచుండగా, బ్రహ్మా = బ్రహ్మ, సురగణైః సార్ధమ్ = దేవతాగణములతో కూడ, రఘునన్దనమ్ = రాముణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను.

తా. క్రోధశోకములతో కూడిన రాము డీ విధముగా పలుకుచుండగా, దేవగణములతో కూడిన బ్రహ్మదేవుడు రామునితో ఇట్లనెను. 11

మూ. రామ రామ న సంతాపం కర్తుమర్హసి సువ్రత,
స్మర త్వం పూర్వకం భావం మన్త్రం చామిత్రకర్శన.

ప్ర. అ. సువ్రత=మంచి నియమములు కలవాడా! రామ రామ=రామా! రామా! సంతాపమ్=దుఃఖమును, కర్తుమ్=చేయుటకు, న అర్హసి=తగవు. అమిత్రకర్శన=శత్రువులను బాధించువాడా! త్వమ్=నీవు, పూర్వకమ్=పూర్వపు, భావమ్=స్థితిని, మన్త్రం చ=ఆలోచనను, స్మర=స్మరించుము.

తా. రామా! రామా! ఉత్తమములైన నియమములు కలవాడా! దుఃఖించకుము. నీ పూర్వపు స్వరూపమును, ఆలోచనను స్మరించుము. 12

మూ. న ఖలు త్వాం మహాబాహో స్మారయేయమనుత్తమ,
ఇమం ముహూర్తం దుర్ధర్ష స్మర త్వం జన్మ వైష్ణవమ్.

ప్ర. అ. మహాబాహో=గొప్ప బాహువులు గలవాడా! అనుత్తమ=చాల ఉత్తముడా! త్వామ్=నిన్ను, న ఖలు స్మారయే = స్మరింపచేయుటలేదు. దుర్ధర్ష=ఎదిరింప శక్యము కానివాడా! ఇమం ముహూర్తమ్=ఈ ముహూర్తమును (నందు), త్వమ్=నీవు, వైష్ణవమ్=విష్ణు సంబంధమైన, జన్మ=జన్మను, స్మర=స్మరించుము.

తా. గొప్ప బాహుబలము గలవాడా! అత్యుత్తమపురుషా! నేను నిన్ను స్మరింపచేయుటలేదు. ఎదిరింప శక్యము కానివాడా! ఈ క్షణమునందు నీవు వైష్ణవ జన్మను గూర్చి స్మరించుము. 13

మూ. సీతా హి విమలా సాధ్వీ తవ పూర్వపరాయణా,
నాగలోకం సుఖం ప్రాయాత్త్వదాశ్రయతపోబలాత్.

ప్ర. అ. విమలా=నిర్మలురాలు, సాధ్వీ=పతివ్రత, తవ=నీయొక్క, పూర్వపరాయణా=పూర్వ ప్రకృతియందు అనగా విష్ణుస్వరూపమునందు ఆసక్తి గలది అయిన, సీతా=సీత, త్వదాశ్రయతపోబలాత్=నీ ఆశ్రయమనే తపస్సు యొక్క బలమువలన, సుఖమ్=సుఖముగా, నాగలోకమ్=నాగలోకమును, ప్రాయాత్=వెళ్లెను.

తా. మాలిన్యము లేనిది, పతివ్రతా అయిన సీత నీ పూర్వరూపమును

కోరుచు, నీ ఆశ్రయ మనే తపస్సుయొక్క బలమువలన సుఖముగా నాగలోకము నకు వెళ్ళినది.

మూ. స్వర్గే తే సంగమో భూయో భవిష్యతి న సంశయః,
అస్యాస్తు పరిషన్మధ్యే యద్ బ్రవీమి నిబోధ తత్. 15

ప్ర. అ. తే=నీకు, భూయః=మరల, స్వర్గే=స్వర్గమునందు, సంగమః= సంగమము, భవిష్యతి = కాగలదు, సంశయః = సంశయము, న = లేదు. అస్యాః = ఈ, పరిషన్మధ్యే=పరిషత్తు మధ్యయందు, యత్=దేనిని, బ్రవీమి= చెప్పుచున్నానో, తత్ = దానిని, నిబోధ = తెలుసుకొనుము.

తా. నీకు మరల ఆమె సంగము స్వర్గములో కలుగును, సంశయము లేదు. ఈ పరిషత్తు మధ్యలో నేను చెప్పుచున్న మాట వినుము. 15

మూ. ఏతదేవ హి కావ్యం తే కావ్యానాముత్తమం శ్రుతమ్,
సర్వం విస్తరతో రామ వ్యాఖ్యాస్యతి న సంశయః. 16

ప్ర. అ. తే = నీకు, శ్రుతమ్ = వినబడిన, కావ్యానామ్ = కావ్యములలో, ఉత్తమమ్ = ఉత్తమమైన, ఏతత్ = ఈ, కావ్యమేవ = కావ్యమే, రామ=రామా! సర్వమ్ = సమస్తమును, విస్తరతః = విస్తరముతో, వ్యాఖ్యాస్యతి = వివరించి చెప్పగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. రామా! నీవు వినిన అన్ని కావ్యములలోను ఉత్తమమైన ఈ కావ్యమే నీకు విపులముగ స్పష్టముగ చెప్పగలదు, సంశయము లేదు. 16

మూ. జన్మప్రభృతి తే వీర సుఖదుఃఖోపసేవనమ్,
భవిష్యదుత్తరం చేహ సర్వం వాల్మీకినా కృతమ్. 17

ప్ర. అ. వీర = వీరుడా! జన్మప్రభృతి = జన్మ మొదలుకొని, తే = నీయొక్క, సుఖదుఃఖోపసేవనమ్ = సుఖదుఃఖముల అనుభవము, భవిష్యత్ = జరుగబోవు, ఉత్తరం చ = తరువాతి వృత్తము, సర్వమ్ = అంతా, ఇహ = దీనియందు, వాల్మీకినా = వాల్మీకిచేత, కృతమ్ = చేయబడినది.

తా. వీరుడా! నీ జన్మ మొదలు నీకు కలిగిన సుఖదుఃఖముల అనుభవ

మును, రాబోవు వృత్తాంతమునూ అంతనూ కూడ వాల్మీకి ఈ కావ్యములో నిబంధించినాడు. 17

మూ. ఆదికావ్యమిదం రామ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్,
న హ్యన్యోఽర్హతి కావ్యానాం యశోభాగ్రాఘవాదృతే.

ప్ర. అ. రామ = రామా! ఇదమ్ = ఈ, ఆదికావ్యమ్ = ఆదికావ్యము, సర్వమ్ = సమస్తమూ కూడ, త్వయి = నీయందు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితమై ఉన్నది. రాఘవాత్ ఋతే = రాముడు (నీవు) తప్ప, అన్యః = మరియొకడు. కావ్యానామ్ = కావ్యములయొక్క, యశోభాక్ = యశస్సును పొందేవాడుగా, నార్హతి హి = తగడు కదా?

తా. ఈ ఆదికావ్య మంతా నీకే సంబంధించి యున్నది. రాముడు తప్ప కావ్యయశస్సును పొందతగినవాడు మరొకడు లేడు కదా? 18

మూ. శ్రుతం తే సర్వమేతద్ధి మయా పర్వం సురైః సహ.
దివ్యమద్భుతరూపం చ సత్యవాక్యమనావృతమ్. 19

ప్ర. అ. దివ్యమ్ = దివ్యము, అద్భుతరూపం చ = అద్భుతమైన రూపము గలది, సత్యవాక్యమ్ = సత్యమైన వాక్యములు గలది, అనావృతమ్ = దాచబడనిది, ఏతత్ = ఇది, సర్వమ్ = సమస్తమూ, మయా = నాచేత, సురైః సహ = దేవతలతో కూడ, మయా = నాచేత, శ్రుతం హి = వినబడినది కదా?

తా. దివ్యమూ, ఆశ్చర్యకరమూ, సత్యమూ, అయిన, ఏ వృత్తాంతమూ దాచని ఈ కావ్యమును పూర్తిగా నేనూ దేవతలూ కలిసి విని ఉన్నాము. 19

మూ. స త్వం పురుషశార్దూల ధర్మేణ సుసమాహితః,
శేషం భవిష్యం కాకుత్స్థ కావ్యం రామాయణం శృణు.

ప్ర. అ. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడా! కాకుత్స్థ = రామా! సః త్వమ్ = అట్టి నీవు, ధర్మేణ = ధర్మముచేత, సుసమాహితః = బాగా సావధానచిత్తుడవై, శేషమ్ = మిగిలిన, భవిష్యత్ = జరుగబోవు, రామాయణం కావ్యమ్ = రామాయణ కావ్యమును, శృణు = వినుము.

తా. పురుషశ్రేష్ఠుడవైన రామా! నీవు ధర్మానుసారముగా, సావధాన చిత్తుడవై రామాయణములోని రాబోవు కథను చెప్పు మిగిలిన భాగమును వినుము. 20

మూ. ఉత్తరం నామ కావ్యస్య శేషమత్ర మహాయశః,
తచ్ఛృణుష్వ మహాతేజ ఋషిభిః సార్ధముత్తమమ్. 21

ప్ర. అ. మహాయశః = గొప్ప కీర్తి గలవాడా! అత్ర = ఇక్కడ, కావ్యస్య = కావ్యముయొక్క, శేషమ్ = మిగిలిన భాగము, ఉత్తరం నామ = ఉత్తర మను పేరు గలది. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా! ఋషిభిః సార్ధమ్ = ఋషులతో కూడ, ఉత్తమమ్ = ఉత్తమమైన, తత్ = దానిని, శృణుష్వ = వినుము.

తా. గొప్ప కీర్తి గలవాడా! ఈ కావ్యములోని మిగిలిన భాగమునకు ఉత్తరభాగము అని పేరు. గొప్ప తేజస్సు గల రామా! ఉత్తమమైన దానిని ఋషులతో కలిసి వినుము. 21

మూ. న ఖల్వన్యేన కాకుత్స్థ శ్రోతవ్యమిదముత్తమమ్,
పరమఋషిణా వీర త్వయైవ రఘునన్దన. 22

ప్ర. అ. కాకుత్స్థ = రామా! ఉత్తమమ్ = ఉత్తమమైన, ఇదమ్ = ఈ కావ్యభాగము, అన్యేన = ఇతరునిచేత, న శ్రోతవ్యమ్ = వినదగినది కాదు. వీర = వీరుడా, రఘునన్దన = రామా! పరమఋషిణా = గొప్పరాజర్షివైన, త్వయైవ = నీచేతనే వినదగినది.

తా. రామా! ఉత్తమమైన ఈ భాగము మరొకరు ఎవరూ వినగూడదు. వీరుడవైన రామా! గొప్ప రాజర్షివైన నీవే (ముందుగా) వినవలెను. 22

మూ. ఏతావదుక్త్వా వచనం బ్రహ్మా త్రిభువనేశ్వరః,
జగామ త్రిదివం దేవో దేవైః సహ సబాన్ధవైః. 23

ప్ర. అ. త్రిభువనేశ్వరః = ముల్లోకములకు ప్రభువైన, బ్రహ్మా = బ్రహ్మ దేవుడు, ఏతావత్ = ఇంతమాత్రము, వచనమ్ = వచనమును, ఉక్త్వా = పలికి,

దేవః = దేవుడైన అతడు. సబాన్ధవైః = బంధువులతో కూడిన, దేవైః సహ = దేవతలతో కూడ, త్రిదివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. ముల్లోకములకు ప్రభువైన బ్రహ్మదేవుడు ఇట్లు పలికి బంధువులతో కూడిన దేవతలతో కూడ కలిసి స్వర్గమునకు వెళ్ళిపోయెను. 23

మూ. యే చ తత్ర మహాత్మాన ఋషయో బ్రాహ్మలౌకికాః,
బ్రహ్మణా సమనుజ్ఞాతా న్యవర్తన్త మహౌజసః. 24

ప్ర. అ. బ్రాహ్మలౌకికాః = బ్రహ్మలోకమునకు సంబంధించిన, మహాత్మానః = మహాత్ములైన, యే = ఏ. ఋషయః = ఋషులు గలరో, మహౌజసః = గొప్ప తేజస్సు కల వారు, బ్రహ్మణా = బ్రహ్మచేత, సమనుజ్ఞాతాః = అనుజ్ఞ ఇవ్వబడినవారై, తత్ర = అచటికి, న్యవర్తన్త = మరలి వచ్చిరి.

తా. బ్రహ్మలోకమునకు సంబంధించిన మహాతేజశ్శాలులైన ఋషులందరూ బ్రహ్మ అనుజ్ఞ తీసికొని ఉత్తరకథ వినుటకై వెనుకకు తిరిగి వచ్చిరి.

మూ. ఉత్తరం శ్రోతుమనసో భవిష్యం యచ్చ రాఘవే,
తతో రామః శుభాం వాణీం దేవదేవస్య భాషితామ్, 25
శ్రుత్వా పరమతేజస్వీ వాల్మీకిమిదమబ్రవీత్.

ప్ర. అ. ఉత్తరమ్ = ఉత్తరభాగమును, రాఘవే = రాముని యందు, యత్ = ఏది, భవిష్యం చ = కానున్నదో దానిని, శ్రోతుమనసః = వినుటకు మనస్సు కలవారై (తిరిగి వచ్చిరి). పరమతేజస్వీ = మిక్కిలి తేజస్సు గల, రామః = రాముడు, దేవదేవస్య = బ్రహ్మదేవునియొక్క, భాషితామ్ = పలకబడిన, శుభాం వాణీమ్ = శుభమైన వాక్కును, శ్రుత్వా = విని, తతః = అటు పిమ్మట, వాల్మీకిమ్ = వాల్మీకిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రామాయణములోని ఉత్తర భాగమును, రామునికి భవిష్యత్తులో ఏమి జరుగ నున్నదో దానిని వినుటకై తిరిగి వచ్చిరి. గొప్ప తేజస్సు గల రాముడు బ్రహ్మదేవుడు పలికిన శుభమైన వాక్కును విని వాల్మీకితో ఇట్లనెను.

వి. ఈ ఘట్టంలో సీతాదేవి త్రిభువనవ్యాప్తమహాశక్తిస్వరూపిణి అని తెలిపే కొన్ని శ్లోకాలు ప్రాచ్యప్రతిలో ఉన్నవి :-

శ్లో॥ ఏతస్మిన్నన్తరే వాణీ నిఃసృతా ధరణీతలాత్,
జహి త్వం రామ సంతాపం కృతాన్తో హ్యత్ర కారణమ్.

తా. ఇంతలో భూమిలోపలినుండి ఒక వాణి వినబడెను "రామా! నీవు తాపము విడిచిపెట్టుము. ఇందుకు దైవమే కారణము.

శ్లో॥ కాఙ్క్షసే యచ్చ వైదేహీం తద్వృథా పరితప్యసే,
దుర్లభం దర్శనం తస్యాస్త్రైలోక్యే యా ప్రతిష్ఠితా.

తా. నీవు సీత కావాలని కోరుచున్నావు. ఇది వృథాపరితాపమే. ఆమె దర్శనము లభించదు. ఆమె మూడు లోకాలలోను వ్యాపించి ఉన్నది.

శ్లో॥ ఇహస్థా పూజ్యతే నాగైర్మర్త్యలోకే చ మానుషైః
పితౄణాం చ సుధా (స్వధా) స్వర్గే సా తృప్తిరమృతాశినామ్

తా. ఇక్కడ ఉన్న ఈమెను నాగులు పూజించుచుందురు. మానవలోకములో మానవులు పూజించుచుందురు. ఈమె పితృదేవతలకు తృప్తి నిచ్చు స్వధ. స్వర్గములో అమృతమును భుజించు దేవతల తృప్తి ఈమె స్వరూపమే.

శ్లో॥ శ్రీవత్సవక్షసో దేహే సైవ లక్ష్మీః ప్రతిష్ఠితా,
సిద్ధానాం స్వర్గసంస్థానాం సా చ సిద్ధిః ప్రతిష్ఠితా.

తా. మహావిష్ణువు దేహమునందు ఈమెయే లక్ష్మిగా ప్రతిష్ఠిత అయి ఉన్నది. స్వర్గములో ఉన్న సిద్ధపురుషుల సిద్ధిగా ప్రతిష్ఠిత అయి ఉన్నది.

శ్లో॥ నివర్తయ మతిం రామ వైదేహ్యా దర్శనం ప్రతి,
ద్రష్టవ్యా యది తే సీతా పుత్రౌ పశ్య కుశీలవౌ.

తా. రామా! సీతను చూడవలె ననే ప్రయత్నమును విరమించుకొనుము. సీతను చూడవలె నని ఉన్నచో పుత్రులైన కుశీలవులను (కుశలవులను) చూచుకొనుము. ఈ దృష్టితో చూస్తే సీతారాములు అప్పుడు ఉండేవారు, ఇప్పుడూ ఉన్నారు; ఎప్పుడూ ఉంటారు అంతటా ఉన్నారు, ఉంటారు.

మూ. భగవన్ శ్రోతుమనస ఋషయో బ్రాహ్మలౌకికాః, 26
భవిష్యదుత్తరం యన్మే శ్వోభూతే సంప్రవర్తతామ్.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! బ్రాహ్మలౌకికాః = బ్రహ్మలోకమునకు చెందిన, ఋషయః = ఋషులు, యత్ = ఏది, మే = నాకు, భవిష్యత్ = కానున్నదో, ఉత్తరమ్ = అట్టి ఉత్తరకథావస్తువును, శ్రోతుమనసః = వినవలె నను మనస్సు కలవారు. శ్వోభూతే = రేపు, సంప్రవర్తతామ్ = జరుగుగాక.

తా. పూజ్యుడా! బ్రహ్మలోకమునకు చెందిన ఈ ఋషులు నాకు జరగబోవు దానిని వినవలె నను కోరికతో ఉన్నారు. దాని గానము రేపు జరుగు గాక. 26

మూ. ఏవం వినిశ్చయం కృత్వా సంప్రగృహ్య కుశీలవౌ, 27
తం జనౌఘం విసృజ్యాథ పర్ణశాలాముపాగమత్,
తామేవ శోచతః సీతాం సా వ్యతీతా చ శర్వరీ. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టనవతితమః సర్గః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, వినిశ్చయమ్ = నిశ్చయమును, కృత్వా = చేసి, కుశీలవౌ = గాయకులైన బాలులను, సంప్రగృహ్య = తీసికొని, తం జనౌఘమ్ = ఆ జనసముదాయమును, విసృజ్య = పంపివేసి, అథ = పిమ్మట, పర్ణశాలామ్ = పర్ణశాలను, ఉపాగమత్ = పొందెను. తామ్ = ఆ, సీతామేవ = సీతనే గూర్చి, శోచతః = ఆలోచించుచుండగా, సా = ఆ, శర్వరీ = రాత్రి, వ్యతీతా = గడచి పోయినది.

తా. ఇట్లు నిశ్చయము చేసి, ఆ జనుల నందరినీ పంపివేసి కుశలవులను తీసికొని, పర్ణశాలలోనికి వెళ్లెను. ఆ సీతను గూర్చిన ఆలోచనతోనే ఆ రాత్రి గడచిపోయెను. 27,28

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో తొంభై ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనశతతమః సర్గః

[సీత రసాతలములో ప్రవేశించిన పిమ్మట రాముని జీవన విధానము. రామరాజ్యములోని పరిస్థితులు. రాముని తల్లులు స్వర్గస్థ లగుట.]

మూ. రజన్యాం తు ప్రభాతాయాం సమానీయ మహామునీన్,
గీయతామవిశఙ్కాభ్యాం రామః పుత్రావువాచ హ. 1

ప్ర. అ. రజన్యామ్ = రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారిన దగుచుండగా, రామః = రాముడు, మహామునీన్ = మహామునులను, సమానీయ = పిలిపించి, అవిశఙ్కాభ్యామ్ = శంక లేని మీచేత, గీయతామ్ = గానము చేయబడుగాక అని, పుత్రౌ = పుత్రులను గూర్చి, ఉవాచ హ = పలికెను.

తా. రాత్రి తెల్లవారిన పిమ్మట రాముడు మహామునులను పిలిపించి "మీరు ఏ మాత్రము సంకోచము చెందక గానము చేయండి"అని పుత్రులకు చెప్పెను. 1

మూ. తతః సముపవిష్టేషు మహర్షిషు మహాత్మసు,
భవిష్యదుత్తరం కావ్యం జగతుస్తౌ కుశీలవౌ. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాత్మసు = మహాత్ములైన, మహర్షిషు = మహర్షులు, సముపవిష్టేషు = కూర్చున్నవారగుచుండగా, కుశీలవౌ = ఆ గాయకులు, భవిష్యత్ = జరుగనున్న, ఉత్తరం కావ్యమ్ = ఉత్తరకావ్యమును, జగతుః = గానముచేసిరి.

తా. మహాత్ములైన మహర్షులు కూర్చున్న పిమ్మట ఆ కుశలవులు జరుగబోవు కథను చెప్పు ఉత్తరకావ్యమును గానము చేసిరి. 2

మూ. ప్రవిష్టాయాం తు సీతాయాం భూతలం సత్యసంపదా,
తస్యావసానే యజ్ఞస్య రామః పరమదుర్మనాః. 3

అపశ్యమానో వైదేహీం మేనే శూన్యమిదం జగత్,
శోకేన పరమాయస్తో న శాన్తిం మనసాగమత్. 4

ప్ర. అ. సీతాయామ్=సీత, సత్యసంపదా=సత్యముయొక్క సంపదచేత, భూతలమ్ = రసాతలమును, ప్రవిష్టాయామ్ = ప్రవేశించినది అగుచుండగా, తస్య యజ్ఞస్య = ఆ యజ్ఞముయొక్క, అవసానే = అంతమునందు, రామః = రాముడు, పరమదుర్మనాః = చాల దుఃఖముతో కూడినవాడై, వైదేహీమ్ = సీతను, అపశ్యమానః = చూడనివాడై, ఇదం జగత్ = ఈ జగత్తును, శూన్యమ్ = శూన్యమైనదానినిగా, మేనే = తలచెను. శోకేన = శోకముచేత, పరమాయస్తః = మిక్కిలి ఆయాసము చెందినవాడై, మనసా = మనస్సుచేత, శాన్తిమ్ = శాంతిని, న అగమత్ = పొందలేదు.

తా. సత్యప్రభావముచేత సీత రసాతలములో ప్రవేశించిన పిదప, యజ్ఞము పూర్తియైన తరువాత రాముడు చాల శోకాక్రాంతుడయ్యెను. సీత కనబడకపోవుటచే ఆతనికి ఈ జగత్తు శూన్యముగా కనబడెను. శోకముచేత తప్తుడై మనఃశాంతిని పొందజాలకపోయెను. 3, 4

మూ. విసృజ్య పార్థివాన్ సర్వానృక్షవానరరాక్షసాన్,
జనౌఘం విప్రముఖ్యానాం విత్తపూర్వం విసృజ్య చ. 5

ఏవం సమాప్య యజ్ఞం తు విధివత్స తు రాఘవః,
తతో విసృజ్య తాన్ సర్వాన్ రామో రాజీవలోచనః, 6
హృది కృత్వా స తాం సీతామయోధ్యాం ప్రవివేశ హ.

ప్ర. అ. రాఘవః = రఘువంశసంజాతుడు, రాజీవలోచనః = పద్మములవంటి నేత్రములు కలవాడు అయిన, సః = ఆ, రామః = రాముడు, యజ్ఞమ్ = యజ్ఞమును, విధివత్ = యథాశాస్త్రముగా, ఏవమ్ = ఇట్లు, సమాప్య = సమాప్తి పొందించి, సర్వాన్ = సమస్తమైన, పార్థివాన్ = రాజులను, ఋక్షవానరరాక్షసాన్ = భల్లూకములను వానరులను, రాక్షసులను, విసృజ్య = విడచి (పంపివేసి), విప్రముఖ్యానామ్ = బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క, జనౌఘమ్ = జనసముదాయమును, విత్తపూర్వమ్ = ధనపూర్వకముగా, విసృజ్య = విడచి, తాన్ సర్వాన్ = వాళ్ళ నందరినీ

కూడ, విసృజ్య = విడచి, తాం సీతామ్ = ఆ సీతను, హృది = హృదయమునందు, కృత్వా = చేసి (ఉంచుకొని), అయోధ్యామ్ = అయోధ్యను, ప్రవివేశ హ = ప్రవేశించెను.

తా. తామరపూలరేకుల వంటి కండ్లు గల ఆ రాముడు యథావిధిగా యజ్ఞము పూర్తిచేసికొని, ఋక్ష-వానర-రాక్షసుల నందరినీ పంపివేసి, బ్రాహ్మణ శ్రేష్ఠులకు ధనదానము చేసి వారిని కూడ పంపివేసి, ఇతరజనులను అందరినీ కూడ పంపివేసి మనస్సులో సీతను గూర్చియే తలచుచు అయోధ్యలో ప్రవేశించెను. 5,6

మూ. ఇష్టయజ్ఞో నరపతిః పుత్రద్వయసమన్వితః. 7
న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునన్దనః,
యజ్ఞే యజ్ఞే చ పత్న్యర్థం జానకీ కాఞ్చనీ భవత్. 8

ప్ర. అ. ఇష్టయజ్ఞః = చేయబడిన యజ్ఞము గల, నరపతిః = రాజు, పుత్రద్వయసమన్వితః = పుత్రద్వయముతో కూడినవాడై (అయోధ్యలో ప్రవేశించెను). సః రఘునన్దనః = ఆ రాముడు, సీతాయాః = సీతకంటె, పరామ్ = అన్యురాలైన, భార్యామ్ = భార్యను, న వవ్రే = వరించలేదు. యజ్ఞే యజ్ఞే చ = ప్రతి యజ్ఞమునందూ, పత్న్యర్థమ్ = భార్యా కృత్యముకొరకు, కాఞ్చనీ = బంగారము వికారమైన, జానకీ = సీత, భవత్ = అయెను.

తా. ఆ రాజు యజ్ఞము పూర్తి చేసికొని ఇద్దరు పుత్రులతో కలిసి అయోధ్యలో ప్రవేశించెను. ఆ రాముడు సీతను తప్ప మరెవ్వరినీ భార్యనుగా స్వీకరించలేదు. ప్రతియజ్ఞమునందూ కూడ పత్నీకార్యములు చేయుటకు బంగారు సీత ఉండెను. 7,8

మూ. దశవర్షసహస్రాణి వాజిమేధానథాకరోత్,
వాజపేయాన్ దశగుణాంస్తథా బహుసువర్ణకాన్. 9

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సరములు, వాజిమేధాన్ = అశ్వమేధములను, అకరోత్ = చేసెను. తథా = మరియు, బహుసువర్ణకాన్ = అధికమైన బంగారము గల, దశగుణాన్ = పది రెట్లు, వాజపేయాన్ = వాజపేయములను చేసెను.

తా. పది వేల సంవత్సరములు ఎన్నో అశ్వమేధయాగములను, వాటికి పదిరెట్లు, అత్యధికమైన బంగారము దక్షిణగా ఇచ్చిన వాజపేయయాగములను చేసెను. 9

మూ. అగ్నిష్టోమాతిరాత్రాభ్యాం గోసవైశ్చ మహాధనైః,
ఈజే క్రతుభిరన్యైశ్చ స శ్రీమానాప్తదక్షిణైః. 10

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, సః = రాముడు, అగ్నిష్టోమాతిరాత్రాభ్యామ్ = అగ్నిష్టోమ - అతిరాత్రములచేత, మహాధనైః = గొప్ప ధనము గల, గోసవైః చ = గోసవములచేత, ఆప్తదక్షిణైః = అధికమైన దక్షిణ గల, అన్యైః = ఇతరములైన, క్రతుశతైః చ = వందలకొలది క్రతువులచేతా, ఈజే = యాగము చేసెను.

తా. శ్రీమంతుడైన రాముడు అగ్నిష్టోమము, అతిరాత్రము, అధికమైన ధనము గల (ధనవ్యయము జరుగు) గోసవము లను యజ్ఞములు, పరిపూర్ణదక్షిణలిచ్చిన ఇతరయజ్ఞములు చేసెను. 10

మూ. ఏవం స కాలః సుమహాన్ రాజ్యస్థస్య మహాత్మనః,
ధర్మే ప్రయతమానస్య వ్యతీయాద్రాఘవస్య చ. 11

ప్ర. అ. రాజ్యస్థస్య = రాజ్యమునందున్న, ధర్మే = ధర్మమునందు, ప్రయతమానస్య = ప్రయత్నము చేయుచున్న, మహాత్మనః = మహాత్ముడైన, రాఘవస్య = రామునకు, ఏవమ్ = ఈవిధముగ, సుమహాన్ = చాల గొప్పదైన, సః కాలః = ఆ కాలము, వ్యతీయాత్ = గడచెను.

తా. మహాత్ముడైన రాముడు ఈ విధముగా రాజ్యపాలనము చేయుచు, ధర్మమును రక్షించుటకై ప్రయత్నించుచుండగా అతిదీర్ఘమైన కాలము గడచెను. 11

మూ. ఋక్షవానరరక్షాంసి స్థితా రామస్య శాసనే,
అనురజ్జన్తి రాజానో హ్యహన్యహని రాఘవమ్. 12

ప్ర. అ. ఋక్షవానరరక్షాంసి = భల్లూకములు, వానరములు, రాక్షసులూ, రామస్య = రామునియొక్క, శాసనే = శాసనమునందు, స్థితాః = ఉండిరి. అహని

అహని = ప్రతిదినమూ, రాజానః=రాజులు, రాఘవమ్ = రాముణ్ణి, అనురజ్జన్తి= రంజింపచేయుచున్నారు.

తా. భల్లూకములు, వానరులు, రాక్షసులూ కూడ రాముని శాసనములో ఉండిరి. సామంతరాజులు ప్రతిదినమూ కూడ రామునకు ఆనందము కలిగించు చుండిరి. 12

మూ. కాలే వర్షతి పర్జన్యః సుభిక్షం విమలా దిశః,
హృష్టపుష్టజనాకీర్ణం పురం జనపదా స్తథా. 13

ప్ర. అ. పర్జన్యః = మేఘము, సుభిక్షమ్ = సుభిక్షముగా ఉండునట్లు, కాలే=కాలమునందు, వర్షతి = వర్షించుచున్నాడు. దిశః = దిక్కులు, విమలాః= నిర్మలములైనవి. పురమ్ = పురము, హృష్టపుష్టజనాకీర్ణమ్ = సంతోషించిన, పరి పుష్టులైన జనులతో నిండినది. తథా = మరియు, జనపదాః = గ్రామములు (అట్టి జనులతో నిండినవి).

తా. సుభిక్షముగా ఉండు నట్లు మేఘము కాలమునందు వర్షించుచుండెను. దిక్కులు నిర్మలములుగా ఉండెను. నగరములు, గ్రామములూ కూడ ఆనంద ముతో పుష్టిగా ఉన్న జనులతో నిండి ఉండెను. 13

మూ. నాకాలే మ్రియతే కశ్చిన్న వ్యాధిః ప్రాణినాం తథా,
నానర్థో విద్యతే కశ్చిద్రామే రాజ్యం ప్రశాసతి. 14

ప్ర. అ. రామే = రాముడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రశాసతి = పరిపా లించుచుండగా, కశ్చిత్=ఎవ్వడూ కూడ, అకాలే=అకాలమునందు, న మ్రియతే= మరణించలేదు. తథా = మరియు ప్రాణినామ్ = ప్రాణులకు, వ్యాధిః = వ్యాధి, న = లేదు. కశ్చిత్ = ఏమీ, అనర్థః = అనర్థము, న విద్యతే = లేదు.

తా. రాముడు రాజ్యమును పాలించుచుండగా ఎవ్వనికీ అకాలమరణము రాలేదు. ప్రాణులకు వ్యాధులు లేవు. ఎట్టి అనర్థములూ కలుగలేదు. 14

మూ. అథ దీర్ఘస్య కాలస్య రామమాతా యశస్వినీ,
పుత్రపౌత్రైః పరివృతా కాలధర్మముపాగమత్. 15

ప్ర. అ. పుత్రపౌత్రైః = పుత్రపౌత్రులతో, పరివృతా = కూడిన, యశస్వినీ = కీర్తి గల, రామమాతా = రాముని తల్లి, అథ = అనంతరము, దీర్ఘస్య = దీర్ఘమైన, కాలస్య = కాలమునకు, కాలధర్మమ్ = మరణమును, ఉపాగమత్ = పొందెను

తా. పుత్రపౌత్రులతో ఆనందించుచున్న కీర్తిమంతురాలైన కౌసల్య చాల కాలమునకు మరణించెను. 15

మూ. అన్వియాయ సుమిత్రా చ కైకేయీ చ యశస్వినీ,
ధర్మం కృత్వా బహువిధం త్రిదివే పర్యవస్థితా. 16

ప్ర. అ. యశస్వినీ = కీర్తిమంతురాలైన, సుమిత్రా చ = సుమిత్రయు, కైకేయీ చ = కైకేయి, అన్వియాయ = ఆమెను అనుసరించి వెళ్ళిరి. బహువిధమ్ = అనేకవిధములైన, ధర్మమ్ = ధర్మమును, కృత్వా = చేసి, త్రిదివే = స్వర్గమునందు, పర్యవస్థితా = ఉన్నది.

తా. కీర్తి గల సుమిత్ర, కైకేయీ కూడ అనేకవిధములైన ధర్మములు చేసి కౌసల్యను అనుసరించి వెళ్ళి స్వర్గములో ఉండిరి. 16

మూ. సర్వాః ప్రముదితాః స్వర్గే రాజ్ఞా దశరథేన చ,
సమాగతా మహాభాగాః సర్వధర్మం చ లేభిరే. 17

ప్ర. అ. సర్వాః = సమస్తమైన, మహాభాగాః = మహాభాగ్యవతులైన వారు ముగ్గురూ, స్వర్గే = స్వర్గమునందు, రాజ్ఞా = రాజైన, దశరథేన = దశరథునితో, సమాగతాః = కలిసినవారై, ప్రముదితాః = సంతోషించినవారై, సర్వధర్మమ్ = సకలధర్మఫలమును, లేభిరే = పొందిరి.

తా. మహాభాగ్యవతులైన వారు ముగ్గురూ స్వర్గములో దశరథమహారాజుతో కలిసి సంతోషించుచు సకలధర్మములచేత లభించు సౌఖ్యమును అనుభవించిరి.

మూ. తాసాం రామో మహాదానం కాలే కాలే ప్రయచ్ఛతి,
మాతౄణామవిశేషేణ బ్రాహ్మణేషు తపస్విషు. 18

ప్ర. అ. రామః = రాముడు, కాలే కాలే=ఆ యా కాలములందు, తాసామ్ = ఆ, మాతౄణామ్ = తల్లుల తృప్తికొరకు, అవిశేషేణ = భేదభావము లేకుండగా, తపస్విషు = తపస్సు గల, బ్రాహ్మణేషు = బ్రాహ్మణులయందు, మహాదానమ్ = గొప్ప దానమును, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాడు.

తా. రాముడు ఆ యా సమయములయందు తల్లులందరికీ తృప్తి కలుగుటకై, భేదబుద్ధిలేకుండగా, తపస్సంపన్నులైన బ్రాహ్మణులకు మహాదానము లిచ్చుచుండెను. 18

మూ. పిత్ర్యాణి బ్రహ్మరత్నాని యజ్ఞాన్ పరమదుస్తరాన్,
చకార రామో ధర్మాత్మా పితౄన్ దేవాన్ వివర్ధయన్.

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, రామః=రాముడు, పితౄన్ దేవాన్= పితృదేవతలను, వివర్ధయన్ = సంతృప్తి పరచుచు, పిత్ర్యాణి = పితృదేవతలకు తృప్తి నిచ్చు, బ్రహ్మరత్నాని = బ్రాహ్మణులకు ఇవ్వవలసిన శ్రేష్ఠవస్తువులను (దానముచేసెను). పరమదుస్తరాన్=పూర్తిచేయుటకు చాల కష్టమైన, యజ్ఞాన్= యజ్ఞములను, చకార = చేసెను.

తా. ధర్మాత్ముడైన రాముడు పితృదేవతల సంతృప్తికొరకై బ్రాహ్మణులకు అనేకములైన మంచి వస్తువులను దానము చేసెను; పూర్తిచేయుటకు చాల కష్టమైన యజ్ఞములు చేసెను. 19

మూ. ఏవం వర్షసహస్రాణి బహూన్యథ యయుః సుఖమ్,
యజ్ఞైర్బహువిధం ధర్మం వర్ధయానస్య సర్వదా. 20

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోనశతతమః సర్గః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, యజ్ఞైః = యజ్ఞములచేత, బహువిధమ్ = అనేకవిధములైన, ధర్మమ్ = ధర్మమును, సర్వదా = ఎల్లప్పుడూ, వర్ధయానస్య = వృద్ధిపొందించుచున్న రామునకు, అథ=పిమ్మట, బహూని = అనేకములైన, వర్ష

సహస్రాణి = సంవత్సరముల సహస్రములు, సుఖమ్ = సుఖముగా, యయుః = వెళ్ళినవి.

తా. ఈ విధముగా రాముడు యజ్ఞములచేత అనేకవిధములైన ధర్మమును వృద్ధిపొందించుచుండగా, చాల వేల సంవత్సరములు సుఖముగా గడచినవి. 20

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో తొంభైతొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ శతతమః సర్గః

[కేకయదేశమునుండి కానుకలు తీసికొని గార్గ్యుడు వచ్చుట; ఆతడు తీసికొనివచ్చిన సందేశమును అనుసరించి భరతుడు రాముని ఆజ్ఞచేత, ఇద్దరు కుమారులతో కలిసి గంధర్వదేశమును ఆక్రమించుటకు వెళ్లుట.]

మూ. కస్య చిత్త్వథ కాలస్య యుధాజిత్ కేకయో నృపః,
స్వగురుం ప్రేషయామాస రాఘవాయ మహాత్మనే. 1
గార్గ్యమఙ్గిరసః పుత్రం బ్రహ్మర్షిమమితప్రభమ్,

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కస్యచిత్ = ఒకానొక, కాలస్య = కాలమునకు, కేకయః నృపః = కేకయదేశమునకు రాజైన, యుధాజిత్ = యుధాజిత్తు, మహాత్మనే = మహాత్ముడైన, రాఘవాయ = రామునకు, స్వగురుమ్ = తన గురువు, ఆఙ్గిరసః = అంగిరస్సుయొక్క, పుత్రమ్ = పుత్రుడు, అమితప్రభమ్ = గొప్ప కాంతి కలవాడు అయిన, బ్రహ్మర్షిమ్ = బ్రహ్మర్షిని, ప్రేషయామాస = పంపెను.

తా. తరువాత కొంత కాలానికి కేకయదేశరాజైన యుధాజిత్తు మహాత్ముడైన రామునివద్దకు తన గురువు, అంగిరసుని పుత్రుడు, గొప్ప తేజస్సు కలవాడు, బ్రహ్మర్షి అయిన, గార్గ్యుణ్ణి పంపెను.

మూ. దశ చాశ్వసహస్రాణి ప్రీతిదానమనుత్తమమ్, 2
కమ్బలాని చ రత్నాని చిత్రవస్త్రమథోత్తమమ్,
రామాయ ప్రదదౌ రాజా శుభాన్యాభరణాని చ. 3

ప్ర. అ. రాజా = రాజు, దశ = పది, అశ్వసహస్రాణి = అశ్వముల సహస్రములను, కమ్బలాని చ = కంబలములను, రత్నాని = రత్నములను, అథ = అటుపిమ్మట, ఉత్తమమ్ = ఉత్తమమైన, చిత్రవస్త్రమ్ = చిత్రవస్త్రమును, శుభాని =

సుందరములైన, ఆభరణాని చ = ఆభరణములను, రామాయ = రామునకు, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, ప్రీతిదానమ్ = ప్రేమతో ఇచ్చే దానమునుగా, ప్రదదౌ = ఇచ్చెను.

తా. ఆ రాజు రామునకు పది వేల అశ్వములను, కంబలములను, రత్నములను, ఉత్తమములైన రంగు రంగుల వస్త్రములను, అందమైన ఆభరణములను కానుకగా పంపెను. 2,3

మూ. శ్రుత్వా తు రాఘవో ధీమాన్ మహర్షిం గార్గ్యమాగతమ్.
మాతులస్యాశ్వపతినః ప్రహితం తన్మహాధనమ్, 4

ప్రత్యుద్గమ్య చ కాకుత్స్థః క్రోశమాత్రం సహానుజః,
గార్గ్యం సంపూజయామాస యథా శక్రో బృహస్పతిమ్.

ప్ర. అ. ధీమాన్ = బుద్ధిమంతుడైన, రాఘవః = రాముడు, మహర్షిమ్ = మహర్షియైన, గార్గ్యమ్ = గార్గ్యుణ్ణి, ఆగతమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, మాతులస్య = మేనమామయైన, అశ్వపతినః = అశ్వపతియొక్క, ప్రహితమ్ = పంపబడిన, తత్ = ఆ, మహాధనమ్ = మహాధనమును గూర్చి (విని), కాకుత్స్థః = కకుత్స్థవంశసంజాతుడైన ఆ రాముడు, సహానుజః = తమ్ములతో కూడినవాడై, క్రోశమాత్రమ్ = క్రోశు దూరము, ప్రత్యుద్గమ్య = ఎదురేగి, బృహస్పతిమ్ = బృహస్పతిని, శక్రః యథా = ఇంద్రుడు వలె, సంపూజయామాస = పూజించెను.

తా. బుద్ధిమంతుడైన కకుత్స్థవంశీయుడైన రాముడు మహర్షియైన గార్గ్యుడు వచ్చినట్లు విని, మేనమామయైన అశ్వపతి పంపిన ఆ మహాధనమును గూర్చి విని, తమ్ములతో కలిసి క్రోశుదూరము ఎదురు వెళ్ళి, ఇంద్రుడు బృహస్పతిని పూజించినట్లు పూజించెను. 4,5

మూ. తథా సంపూజ్య తమృషిం తద్ధనం ప్రతిగృహ్యా చ,
పృష్ట్వా ప్రతిపదం సర్వం కుశలం మాతులస్య చ, 6
ఉపవిష్టం మహాభాగం రామః ప్రష్టుం ప్రచక్రమే.

ప్ర. అ. రామః = రాముడు, తమ్ ఋషిమ్ = ఆ ఋషిని, తథా = అట్లు, సంపూజ్య = పూజించి, తత్ ధనమ్ = ఆ ధనమును, ప్రతిగృహ్యా చ = తీసికొని,

ప్రతిపదమ్ = అడుగడుగునా, మాతులస్య = మేన మామయొక్క, సర్వమ్ = సమస్తమైన. కుశలమ్ = కుశలమును, పృష్ట్వా = అడిగి, ఉపవిష్టమ్ = కూర్చొని ఉన్న, మహాభాగమ్ = మహాభాగ్యవంతుడైన ఆ ఋషిని, ప్రష్టుమ్ = అడుగుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. రాముడు ఆ ఋషిని ఆ విధముగా పూజించి, ఆ ధనము తీసికొని, మేనమామ కుశలమును గూర్చి మాటి మాటికి అడిగి, కూర్చున్న ఆతనిని ప్రశ్నించుటకు ఉపక్రమించెను. 4

మూ. కిమాహ మాతులో వాక్యం యదర్థం భగవానిహ, 7
ప్రాప్తో వాక్యవిదాం శ్రేష్ఠః సాక్షాదివ బృహస్పతిః.

ప్ర. అ. మాతులః = మేనమామ, కిం వాక్యమ్ = ఏమి వాక్యమును, ఆహ = పలికెను ? యదర్థమ్ = దేని నిమిత్తమై, వాక్యవిదామ్ = వాక్యవేత్తలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడవు, సాక్షాత్ = సాక్షాత్తు, బృహస్పతిః ఇవ = బృహస్పతి వంటి, భవాన్ = నీవు, ఇహ = ఇక్కడికి, ప్రాప్తః = వచ్చినావో.

తా. మా మేనమామ ఏమి చెప్పి పంపగా మాటలలో నేర్పు గలవారిలో శ్రేష్ఠుడవైన పూజ్యుడవైన నీవు, సాక్షాత్తు బృహస్పతి వలె ఇక్కడకు వచ్చినావు?

మూ. రామస్య భాషితం శ్రుత్వా మహర్షిః కార్యవిస్తరమ్ 8
వక్తుమద్భుతసంకాశం రాఘవాయోపచక్రమే.

ప్ర. అ. మహర్షిః = మహర్షి, రామస్య = రామునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, అద్భుతసంకాశమ్ = ఆశ్చర్యకరమైన, కార్యవిస్తరమ్ = కార్యవిస్తారమును, రాఘవాయ = రామునకు, వక్తుమ్ = చెప్పుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. మహర్షి రాముని మాటలు విని అద్భుతమైన పెద్ద కార్యమును గూర్చి చెప్పుటకు ఉపక్రమించెను. 8

మూ. మాతులస్తే మహాబాహో వాక్యమాహ నరర్షభ, 9
యుధాజిత్ ప్రీతిసంయుక్తం శ్రూయతాం యది రోచతే.

ప్ర. అ. నరర్షభ = నరులలో శ్రేష్ఠుడా! మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! తే మాతులః = నీ మేనమామయైన, యుధాజిత్ = యుధాజిత్తు, ప్రీతిసంయుక్తమ్ = ప్రేమతో కూడిన, వాక్యమ్ = మాటను, ఆహ = చెప్పినాడు. రోచతే యది = ఇష్టమైనచో, శ్రూయతామ్ = వినబడుగాక.

తా. గొప్ప బాహుబలము గల నరశ్రేష్ఠుడా! నీ మేనమామయైన యుధాజిత్తు ప్రేమపూర్వకముగా పలికిన మాటలను ఇష్టమైనచో వినుము. 9

మూ. అయం గన్ధర్వవిషయః ఫలమూలోపశోభితః, 10
సిన్ధోరుభయతః పార్శ్వే దేశః పరమశోభనః

ప్ర. అ. సిన్ధోః = సింధునదియొక్క, ఉభయతః పార్శ్వే = రెండు పార్శ్వములయందు, గన్ధర్వవిషయః = గంధర్వనివాసమైన, ఫలమూలోపశోభితః = ఫలములతోను మూలములతోను ప్రకాశింపచేయబడిన, దేశః = దేశము, పరమశోభనః = చాల అందమైనది.

తా. (మా దేశము దగ్గర) సింధునదికి రెండు ప్రక్కలా ఉన్న, గంధర్వ నివాసమైన, ఫలమూలములతో ప్రకాశించుచున్న ఈ దేశము చాల అందమైనది. 10

మూ. తం చ రక్షన్తి గన్ధర్వాః సాయుధా యుద్ధకోవిదాః, 11
శైలూషస్య సుతా వీర త్రిస్రః కోట్యో మహాబలాః.

ప్ర. అ. సాయుధాః = ఆయుధములతో కూడిన, యుద్ధకోవిదాః = యుద్ధమునందు నేర్పు గల, మహాబలాః = గొప్ప బలము గల, శైలూషస్య = శైలూషునియొక్క, సుతాః = కుమారులైన, త్రిస్రః కోట్యః = మూడు కోటులు, గన్ధర్వాః = గంధర్వులు, తమ్ = ఆ దేశమును, రక్షన్తి = రక్షించుచున్నారు.

తా. శైలూషు డనే గంధర్వుని వంశమునకు చెందిన, ఆయుధధారులు, యుద్ధవిశారదులు, గొప్ప బలము గలవారు అయిన, మూడు కోట్లమంది గంధర్వులు ఆ దేశమును రక్షించుచున్నారు. 11

మూ. తాన్ వినిర్జిత్య కాకుత్స్థ గన్ధర్వనగరం శుభమ్, 12
నివేశయ మహాబాహో స్వే పురే సుసమాహితే.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గలవాడా! కాకుత్స్థ = రామా! తాన్ = వారిని, శుభమ్ = సుందరమైన, గన్ధర్వనగరమ్ = గంధర్వ నగరమును, వినిర్జిత్య = జయించి, సుసమాహితే = బాగా ఏర్పరుపబడిన, స్వే = నీ సంబంధమైన, పురే = పురములను, నివేశయ = నిర్మించుము.

తా. గొప్ప బాహుబలము గల రామా! నీవు ఆ గంధర్వులను, గంధర్వ నగరమును జయించి ఆ స్థానమునందు నీకు సంబంధించిన రెండు నగరములను చక్కగా నిర్మించుము. 12

మూ. అన్యస్య న గతిస్తత్ర దేశః పరమశోభనః, 13
రోచతాం తే మహాబాహో నాహం త్వామహితం వదే.

ప్ర. అ. దేశః = ఆ దేశము, పరమ శోభనః = చాల సుందరమైనది. తత్ర = దానియందు, అన్యస్య = ఇతరునకు, గతిః = గమనము, నాస్తి = లేదు. మహాబాహో = మహాబాహూ! తే = నీకు, రోచతామ్ = ఇష్ట మగుగాక. అహమ్ = నేను, త్వామ్ = నిన్ను గూర్చి, అహితమ్ = అహితమును, న వదే = పలుకను.

తా. మహాబాహూ! చాల సుందరమైన ఆ దేశము నీకు ఇష్ట మగుగాక, మరొకరు ఎవరూ దానిని ఆక్రమింపజాలరు నేను నీకు అహితమును చెప్పను. 13

మూ. తచ్ఛ్రుత్వా రాఘవః ప్రీతో మహర్షేర్మాతులస్య చ 14
ఉవాచ బాఢమిత్యేవ భరతం చాన్వవైక్షత

ప్ర. అ. రాఘవః = రాముడు, మాతులస్య = మేనమామయొక్క, తత్ = ఆ వాక్యమును, మహర్షేః = మహర్షినుండి, శ్రుత్వా = విని, బాఢమ్ ఇత్యేవ = తప్పక అట్లే అని, ఉవాచ = పలికెను. భరతమ్ = భరతుణ్ణి, అన్వవైక్షత చ = చూచెను కూడ.

తా. రాముడు మేనమామ సందేశమును మహర్షి ద్వారా విని "తప్పక అట్లే చేసెదను" అని పలికి భరతుని వైపు చూచెను. 14

మూ. సోఽబ్రవీ ద్రాఘవః ప్రీతః సాఞ్జలిప్రగహో ద్విజమ్,
ఇమౌ కుమారౌ తం దేశం బ్రహ్మర్షే విచరిష్యతః.

భరతస్యాత్మజౌ వీరౌ తక్షః పుష్కల ఏవ చ,
మాతులేన సుగుప్తౌ తు ధర్మేణ సుసమాహితౌ. 16

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, ప్రీతః = సంతోషించినవాడై, సాఞ్జలిప్రగ్రహః = దోసిలి పట్టుటతో కూడినవాడై (దోసిలి పట్టి), ద్విజమ్ = ఆ బ్రాహ్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. బ్రహ్మర్షే=బ్రహ్మర్షీ! భరతస్య= భరతునియొక్క, ఆత్మజౌ = పుత్రులు, వీరౌ = వీరులు, తక్షః = తక్షుడు, పుష్కలః ఏవ చ = పుష్కలుడూ అను, ఇమౌ = ఈ, కుమారౌ = కుమారులు, మాతులేన = మా మేనమామచేత, సుగుప్తౌ = బాగుగా రక్షింపబడినవారై, ధర్మేణ=ధర్మముచేత, సుసమాహితౌ = మిక్కిలి సావధానచిత్తులై, తం దేశమ్= ఆ దేశమును, విచరిష్యతః=సంచరించగలరు.

తా. రాముడు సంతోషించి, అంజలి ఘటించి ఆ బ్రాహ్మణునితో ఇట్లనెను. బ్రహ్మర్షీ! తక్షుడు, పుష్కలుడు అను భరతపుత్రులైన, వీరులైన ఈ కుమారు లిద్దరూ మా మేనమామచే రక్షింపబడుచు, ధర్మమునందు సావధానచిత్తులై ఆ దేశములో సంచరించగలరు. 15, 16

మూ. భరతం చాగ్రతః కృత్వా కుమారౌ సబలానుగౌ,
నిహత్య గన్ధర్వసుతాన్ ద్వే పురే విభజిష్యతః. 17

ప్ర. అ. సబలానుగౌ=సైన్యముతోను అనుచరులతోను కూడిన, కుమారౌ= ఈ కుమారులు, భరతమ్ = భరతుణ్ణి, అగ్రతః కృత్వా = ముందు ఉంచుకొని, గన్ధర్వసుతాన్=గంధర్వకుమారులను, నిహత్య = చంపి, ద్వే = రెండు, పురే= పట్టణములను. విభజిష్యతః = పంచుకొనగలరు.

తా. ఈ కుమారు లిద్దరూ భరతుణ్ణి ముందు ఉంచుకొని సైన్యముతోను అనుచరులతోను కలిసి వెళ్ళి, గంధర్వులను సంహరించి రెండు పట్టణములను విభజించు కొనగలరు. 17

మూ. నివేశ్య తే పురవరే ఆత్మజౌ సంనివేశ్య చ,
ఆగమిష్యతి మే భూయః సకాశమతిధార్మికః. 18

ప్ర. అ. అతిధార్మికః = మిక్కిలి ధార్మికుడైన భరతుడు, తే పురవరే =

ఆ పురశ్రేష్ఠములను, నివేశ్య = నిలిపి, ఆత్మజౌ = పుత్రులను, నివేశ్య = నిలిపి, భూయః = మరల, మే సకాశమ్ = నా సమీపమును గూర్చి, ఆగమిష్యతి = రాగలడు.

తా. పరమధార్మికుడైన భరతుడు రెండు పురములను నిర్మించి, పుత్రులను అచట నిలిపి, మరల నావద్దకు రాగలడు. 18

మూ. మహర్షిమేవముక్త్వా తు భరతం సబలానుగమ్,
అజ్ఞాపయామాస తదా కుమారౌ చాభ్యషేచయత్. 19

ప్ర. అ. మహర్షిమ్ = మహర్షిని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి తదా = అప్పుడు, సబలానుగమ్ = సైన్యముతోను, అనుచరులతోను కూడిన, భరతమ్ = భరతుణ్ణి, ఆజ్ఞాపయామాస = ఆజ్ఞాపించెను. కుమారౌ = ఆ కుమారులిద్దరినీ, అభ్యషేచయత్ చ = అభిషేకించెను.

తా. రాముడు మహర్షితో ఇట్లు పలికి, సైన్యముతోను, అనుచరులతోను కూడిన భరతుణ్ణి ఆదేశించి అప్పుడు ఆ పురద్వయ రాజ్యమునందు ఆ కుమారులిద్దరికీ అభిషేకము చేసెను. 19

మూ. నక్షత్రేణ చ సౌమ్యేన పురస్కృత్యాఙ్గిరఃసుతమ్,
భరతః సహ సైన్యేన కుమారాభ్యాం వినిర్యయౌ. 20

ప్ర. అ. భరతః = భరతుడు, అఙ్గిరఃసుతమ్ = అంగిరసుని పుత్రుణ్ణి, పురస్కృత్వా = ముందు ఉంచుకొని, సైన్యేన = సైన్యముతో, కుమారాభ్యామ్ = కుమారులతో, సౌమ్యేన = సౌమ్యమైన, నక్షత్రేణ = నక్షత్రముచేత, వినిర్యయౌ = బయలుదేరెను.

తా. భరతుడు అంగిరసుని పుత్రుడైన ఆ గార్గ్యుణ్ణి ముందు ఉంచుకొని. శుభనక్షత్రమునందు సైన్యముతోను కుమారు లిద్దరితోను బయలుదేరెను. 20

మూ. సా సేనా శక్రయుక్తేవ నగరాన్నిర్యయావథ,
రాఘవానుగతా దూరం దురాధర్షా సురైరపి. 21

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దూరమ్ = కొంత దూరమును, రాఘవాను

గతా = రామునిచేత అనుసరించబడిన, సురైరపి = దేవతలచేత కూడ, దురాధర్షా = ఎదిరింప శక్యము కాని, సా సేనా = ఆ సేన, శక్రయుక్తేవ = ఇంద్రునితో కూడినది వలె, నగరాత్ = నగరమునుండి, నిర్యయౌ = బయల్వెడలెను.

తా. దేవతలు కూడ ఎదిరింపజాలని ఆ సైన్యమును కొంత దూరము వరకు రాముడు అనుసరించి వెళ్ళగా అది ఇంద్రునితో కూడిన సైన్యము వలె నగరమునుండి బయల్వెడలెను. 21

మూ. మాంసాశినశ్చ యే సత్త్వా రక్షాంసి సుమహాన్తి చ,
అనుజగ్ముర్హి భరతం రుధిరస్య పిపాసయా. 22

ప్ర. అ. మాంసాశినః = మాంసమును తిను, యే = ఏ, సత్త్వాః = మృగములు కలవో అవీ, సుమహాన్తి = చాల గొప్పవారైన, రక్షాంసి చ = రాక్షసులు, రుధిరస్య = రక్తముయొక్క, పిపాసయా = త్రాగవలె నను కోరికచేత, భరతమ్ = భరతుణ్ణి, అనుజగ్ముః హి = అనుసరించి వెళ్ళిరి.

తా. మాంసమును తినే జంతువులు, గొప్ప రాక్షసులు రక్తము త్రాగవలె నను ఇచ్ఛతో భరతుని వెంట వెళ్లెను. 22

మూ. భూతగ్రామాశ్చ బహవో మాంసభక్షాః సుదారుణాః,
గన్ధర్వపుత్రమాంసాని భోక్తుకామాః సహస్రశః. 23

ప్ర. అ. మాంసభక్షాః = మాంసమును భక్షించు, సుదారుణాః = చాల భయంకరములైన, బహవః = అనేకమైన, భూతగ్రామాః = భూతముల సముదాయములు, సహస్రశః = వేలకొలది, గన్ధర్వపుత్రమాంసాని = గంధర్వపుత్రుల మాంసములను, భోక్తుకామాః = భుజించుటకు కోరిక గలవై వెళ్ళినవి.

తా. మాంసమును భుజించు క్రూరములైన వేలకొలది భూతసముదాయములు కూడ గంధర్వపుత్రుల మాంసములను తినుటవై భరతుని వెంట వెళ్లెను.

మూ. సింహవ్యాఘ్రవరాహాణాం ఖేచరాణాం చ పక్షిణామ్,
బహూని వై సహస్రాణి సేనాయా యయురగ్రతః 24

ప్ర. అ. సింహవ్యాఘ్రవరాహాణామ్ = సింహములయొక్క పెద్దపులుల

యొక్క, పరాహములయొక్క, ఖేచరాణామ్ = ఆకాశమునందు సంచరించు, పక్షిణాం చ = పక్షులయొక్క, బహూని = అనేకమైన, సహస్రాణి = సహస్రములు, సేనాయాః = సేనయొక్క, అగ్రతః = ఎదుట, యయుః = వెళ్ళినవి.

తా. ఎన్నో వేల సింహములు, వ్యాఘ్రములు, అడవిపందులు, ఆకాశమునందు సంచరించు పక్షులూ సేనకు ముందు వెళ్ళినవి. 24

మూ. అధ్యర్ధమాసముషితా పథి సేనా నిరామయా,
హృష్టపుష్టజనాకీర్ణా కేకయం సముపాగమత్. 25

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
శతతమః సర్గః.

ప్ర. అ. పథి = మార్గమునందు, అధ్వర్ధమాసమ్ = మాసార్ధము ఎక్కువగా గల మాసమును, ఉషితా = ఉన్న, నిరామయా = రోగములు లేని, హృష్టపుష్టజనాకీర్ణా = సంతోషించిన పరిపుష్టి చెందిన జనులతో నిండిన, సేనా = సేన, కేకయమ్ = కేకయదేశమును, సమాపాగమత్ = చేరెను.

తా. మార్గములో ఒకటిన్నర మాసములు ప్రయాణము చేసి, ఉత్సాహవంతులైన, పుష్టిగా ఉన్న జనులతో నిండిన ఆ సేన, ఏ రోగబాధాదులు లేక కేకయదేశమును చేరెను. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో వందవ సర్గ సమాప్తము.

## అథ ఏకోత్తరశతతమః సర్గః

[భరతుడు గంధర్వులను సంహరించి, రెండు పురములను నెల కొల్పి, వాటిని పుత్రు లిద్దరికీ ఇచ్చి మరల అయోధ్యకు తిరిగి వచ్చుట]

మూ. శ్రుత్వా సేనాపతిం ప్రాప్తం భరతం కేకయాధిపః,
యుధాజిత్ గార్గ్యసహితం పరాం ప్రీతిముపాగమత్. 1

ప్ర. అ. కేకయాధిపః = కేకయదేశము రాజైన, యుధాజిత్ = యుధాజిత్తు, సేనాపతిమ్ = సేనాపతియైన, గార్గ్యసహితమ్ = గార్గ్యునితో కూడిన, భరతమ్ = భరతుణ్ణి, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, పరామ్ = గొప్ప, ప్రీతిమ్ = సంతోషమును, ఉపాగమత్ = పొందెను.

తా. కేకయదేశరాజైన యుధాజిత్తు గార్గ్యునితో కూడ సైన్యమునకు నాయకుడై భరతుడు వచ్చి నట్లు విని చాల సంతోషించెను. 1

మూ. స నిర్యయౌ జనౌఘేన మహతా కేకయాధిపః,
త్వరమాణోఽభిచక్రామ గన్ధర్వాన్ కామరూపిణః. 2

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సుగల, సః కేకయాధిపః = ఆ కేకయదేశరాజు, మహతా = గొప్ప, జనౌఘేన = జనసముదాయముతో, నిర్యయౌ = బయలువెడలెను. త్వరమాణః = తొందరపడుచు, కామరూపిణః = స్వేచ్ఛారూపముగల, గన్ధర్వాన్ = గంధర్వులను గూర్చి, అభిచక్రామ = వెళ్ళెను.

తా. యుధాజిత్తు గొప్ప జనసముదాయముతో కలిసి బయలుదేరి స్వేచ్ఛారూపధారులైన గంధర్వులమీదికి శీఘ్రముగా వెళ్లెను. 2

మూ. భరతశ్చ యుధాజిచ్చ సమేతౌ లఘువిక్రమైః,
గన్ధర్వనగరం ప్రాప్తౌ సబలౌ సపదానుగౌ. 3

ప్ర. అ. భరతశ్చ = భరతుడు, యుధాజిత్ చ = యుధాజిత్తు, సమేతౌ = కలిసినవారై, సబలౌ = సేనాసహితులై, సపదానుగౌ = నడిచి వచ్చు అనుచరులతో కూడినవారై, లఘువిక్రమైః = శీఘ్రమైన గమనములచేత, గన్ధర్వనగరమ్ = గంధర్వనగరమును, ప్రాప్తౌ = పొందిరి.

తా. భరతుడు యుధాజిత్తు కలిసి, సైన్యముతోను అనుచరులతో కూడ శీఘ్రముగా గంధర్వనగరము చేరిరి. 3

మూ. శ్రుత్వా తు భరతం ప్రాప్తం గన్ధర్వాస్తే సమాగతాః,
యోద్ధుకామా మహావీర్యా వ్యనదంస్తే సమన్తతః. 4

ప్ర. అ. మహావీర్యాః = గొప్ప పరాక్రమము గల, తే గన్ధర్వాః = ఆ గంధర్వులు, భరతమ్ = భరతుణ్ణి, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, సమాగతాః = కలిసినవారై, యోద్ధుకామాః = యుద్ధముచేయుటకు కోరిక గలవారై, సమన్తతః = అంతటా, వ్యనదన్ = ధ్వని చేసిరి.

తా. గొప్ప పరాక్రమము గల ఆ గంధర్వులు భరతుడు వచ్చినట్లు విని యుద్ధము చేయవలె నను కోరికతో ఒక చోట చేరి, అన్ని వైపులా బిగ్గరగా గర్జించిరి. 4

మూ. తతః సమభవద్యుద్ధం తుములం రోమహర్షణమ్,
సప్తరాత్రం మహాభీమం న చాన్యతరయోర్జయః. 5

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తుములమ్ = వ్యాకులము, రోమహర్షణమ్ = రోమాంచము కలిగించేదీ అయిన, మహాభీమమ్ = చాల భయంకరమైన, యుద్ధమ్ = యుద్ధము, సప్తరాత్రమ్ = ఏడురోజులు, సమభవత్ = ఆయెను. అన్యతరయోః = ఏ ఒక్కరికి, జయః = జయము, న చ = లభించలేదు.

తా. పిమ్మట వ్యాకులము, రోమాంచమును కలిగించేది, చాల భయంకరమూ అయిన యుద్ధము ఏడు రోజులు జరిగెను. కాని ఏ పక్షమూవారికీ జయము రాలేదు. 5

మూ. ఖడ్గశక్తిధనుర్గ్రాహా నద్యః శోణితసంస్రవాః,
నృకలేవరవాహిన్యః ప్రవృత్తాః సర్వతోదిశమ్. 6

ప్ర. అ. ఖడ్గశక్తిధనుర్గ్రాహాః=ఖడ్గములు, శక్తులు, ధనస్సులు, మొసళ్లుగా గల, శోణితసంస్రవాః=రక్తమును ప్రవహించు, నృకలేవరవాహిన్యః=మనుష్యుల శరీరములను మోసికొని (కొట్టుకొని) వచ్చుచున్న, నద్యః=నదులు. సర్వతోదిశమ్=అన్ని దిక్కులయందు, ప్రవృత్తాః=ప్రారంభమైనవి.

తా. ఖడ్గము, శక్తులు, ధనస్సులు అను మొసళ్ళతో, రక్తప్రవాహములతో నిండి మనుష్యుల మృతదేహములు కొట్టుకొని రాగా నదులు అన్ని దిక్కులందు ప్రారంభమైనవి. 6.

మూ. తతో రామానుజః క్రుద్ధః కాలస్యాస్త్రం సుదారుణమ్,
సంవర్తం నామ భరతో గన్ధర్వేష్వభ్యచోదయత్. 7

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామానుజః= రాముని తమ్ముడైన, భరతః=భరతుడు, క్రుద్ధః=కోపించినవాడై, సంవర్తంనామ=సంవర్తము అను, సుదారుణమ్=చాల భయంకరమైన, కాలస్య అస్త్రమ్=ప్రలయకాలాగ్న్యస్త్రమును, గన్ధర్వేషు=గంధర్వులయందు, అభ్యచోదయత్=ప్రయోగించెను.

తా. అప్పుడు రాముని తమ్ముడు, భరతుడు కోపించి ఆ గంధర్వులపై చాల భయంకరమైన, కాలాగ్న్యస్త్రమైన సంవర్త మను అస్త్రమును ప్రయోగించెను. 7

మూ. తే బద్ధాః కాలపాశేన సంవర్తేన విదారితాః,
క్షణేనాభిహతాస్తేన తిస్రః కోట్యో మహాత్మనా. 8

ప్ర. అ. తిస్రః= మూడు, కోట్యః= కోటులైన, తే= ఆ గంధర్వులు, మహాత్మనా= మహాత్ముడైన, తేన= ఆ భరతునిచేత, కాలపాశేన= కాలపాశముచేత, బద్ధాః=కట్టబడినవారై, సంవర్తేన= సంవర్తముచేత, విదారితాః= చీల్చబడినవారై, క్షణేన= క్షణముచేత, హతాః= చంపబడిరి.

తా. మహాత్ముడైన ఆ భరతుడు క్షణకాలములో మూడు కోట్ల గంధర్వులను కాలపాశముచేత పట్టి సంవర్తముచేత చీల్చి చంపివేసెను. 8.

మూ. తద్యుద్ధం తాదృశం ఘోరం న స్మరన్తి దివౌకసః,
నిమేషాన్తరమాత్రేణ తాదృశానాం మహాత్మనామ్. 9

ప్ర. అ. ("ఏవం ఘోరం హి సమరం న స్మరన్తి దివౌకసః,
నిమేషాన్తరమాత్రేణ యః కృతో భరతేన హ"
అను ప్రాచ్యపాఠము బాగున్నది.)

భరతేన = భరతునిచేత, నిమేషాన్తరమాత్రేణ = ఒక్క నిమిషముచేత, యః = ఏ యుద్ధము, కృతః = చేయబడినదో, ఏవమ్ = ఇట్లు, ఘోరమ్ = ఘోరమైన, సమరమ్ = యుద్ధమును, దివౌకసః = దేవతలు, న స్మరన్తి = స్మరించరు.

తా. భరతుడు ఒక్క నిమిషము కాలములో ఎట్టి యుద్ధమును చేసెనో అట్టి ఘోరమైన మరి యొక యుద్ధమును దేవతలు కూడ స్మరించలేదు. 9

మూ. హతేషు తేషు సర్వేషు భరతః కేకయీసుతః,
నివేశయామాస తదా సమృద్ధే ద్వే పురోత్తమే. 10

ప్ర. అ. తేషు సర్వేషు = వాళ్ళందరూ, హతేషు = చంపబడినవాళ్ళగుచుండగా, కేకయీసుతః = కైకేయి పుత్రుడైన, భరతః = భరతుడు, సమృద్ధే = సమృద్ధములైన, ద్వే = రెండు, పురోత్తమే = ఉత్తమములైన పురములను, నివేశయామాస = నిర్మింపచేసెను.

తా. వాళ్ళందరినీ సంహరించి కైకేయి పుత్రుడైన భరతుడు సుసమృద్ధములైన రెండు పురములను నిర్మింపచేసెను. 10

మూ. తక్షం తక్షశిలాయాం తు పుష్కలం పుష్కలావతే,
గన్ధర్వదేశే రుచిరే గాన్ధారవిషయే చ సః. 11

ప్ర. అ. గన్ధర్వదేశే = గంధర్వదేశమునందు, తక్షశిలాయామ్ = తక్షశిల యను పురమునందు, తక్షమ్ = తక్షుణ్ణి, గాన్ధారవిషయే = గాంధారదేశమునందు, పుష్కలావతే = పుష్కరావతపురమునందు, పుష్కలమ్ = పుష్కలుణ్ణి, సః = భరతుడు (రాజునుగా చేసెను).

తా. భరతుడు గంధర్వదేశములోని తక్షశిల అను పురములో తక్షుణ్ణి, గాంధారదేశమునందు పుష్కలావతపురమునందు పుష్కలుణ్ణి రాజునుగా చేసెను.

మూ. ధనరత్నౌఘసంకీర్ణే కాననై రుపశోభితే,
అన్యోన్యసంఘర్షకృతే స్పర్ధయా గుణవిస్తరైః. 12

ప్ర. అ. ధనరత్నౌఘసంకీర్ణే = ధనముతోను రత్నముల సముదాయముల తోను నిండినవి, కాననైః = అడవులతో, ఉపశోభితే = ప్రకాశింపచేయబడినవి, గుణవిస్తరైః = అనేకగుణములచేత, స్పర్ధయా = పోటీచేత, అన్యోన్యసంఘర్ష కృతే = పరస్పరము పోటీగా నిర్మింపబడినవి.

తా. ఆ పురములు రెండూ ధనములతోను, రత్నములతోను నిండి ఉన్నవి. గుణముల సముదాయములచేత ఒకదానిలో ఒకటి పోటీపడు నట్లు నిర్మించ బడినవి. 12

మూ. ఉభే సురుచిరప్రఖ్యే వ్యవహారై రకిల్బిషైః,
ఉద్యానయానసంపూర్ణే సువిభక్తాన్తరాపణే. 13

ప్ర. అ. ఉభే = రెండు పురములూ కూడ. అకిల్బిషైః = పాపములు లేని, వ్యవహారైః = వ్యవహారములచేత, సురుచిరప్రఖ్యే = చాల అందమైన కాంతి గలవి. ఉద్యానయానసంపూర్ణే = ఉద్యానములతోను, వాహనములతోను నిండినవి. సువిభక్తాన్తరాపణే = బాగా విభజించబడిన ఆపణముల (అంగళ్ళ) మధ్యభాగ ములు గలవి.

తా. ఆ రెండు నగరములూ కూడ పాపరహితములైన వ్యవహారములచే చాల సుందరములుగా ఉన్నవి. ఉద్యానములతోను, వాహనాలతోను నిండి యున్నవి. వేరు వేరుగా ఉన్న విశాలములైన విపణివీథులు కలవి. 13

మూ. ఉభే పురవరే రమ్యే విస్తరై రుపశోభితే,
గృహముఖ్యైః సురుచిరై ర్విమానై ర్బహుభిర్వృతే. 14

ప్ర. అ. రమ్యే = సుందరములైన, పురవరే = పురశ్రేష్ఠములు, ఉభే = రెండూ, విస్తరైః = వెనుక చెప్పిన వస్తువుల విస్తరములతో, ఉపశోభితే = శోభింప బడినవి. సురుచిరైః = చాల అందమైన, గృహముఖ్యైః = ముఖ్యములైన గృహ ములతోను, బహుభిః = అనేకములైన, విమానైః = విమానములతోను (ఏడు అంతస్తుల ప్రాసాదములతోను), వృతే = కూడినవి.

తా. శ్రేష్ఠములైన ఆ రెండు పురములూ కూడ అనేక వస్తుసంపదలతో ప్రకాశించుచున్నవి. ముఖ్యములైన గృహములతోను, అనేక విమానములతోను కూడినవి. 14

మూ. శోభితే శోభనీయైశ్చ దేవాయతనవిస్తరైః,
తాలైస్తమాలైస్తిలకైర్వకులైరుపశోభితే. 15

ప్ర. అ. శోభనీయైః = అందమైన, దేవాయతనవిస్తరైః = దేవాలయవిస్తారములచేత, శోభితే = ప్రకాశించుచున్నవి. తాలైః = తాలములచేత, తమాలైః = తమాలములచేత, తిలకైః = తిలకములచేత, వకులైః = వకులములచేత, ఉపశోభితే = ప్రకాశింపచేయబడినవి.

తా. అందమైన విశాలములైన దేవాలయములతోను, తాల-తమాల-తిలక వకులవృక్షములతోను ప్రకాశించుచున్నవి. 15

మూ. నివేశ్య పఞ్చభిర్వర్షైర్భరతో రాఘవానుజః,
పునరాయాన్మహాబాహురయోధ్యాం కేకయీసుతః. 16

ప్ర. అ. రాఘవానుజః=రాముని తమ్ముడు, మహాబాహుః=గొప్ప బాహువులు కలవాడు, కేకయీసుతః= కేకయి కుమారుడూ అయిన, భరతః=భరతుడు, పఞ్చభిః = ఐదు, వర్షైః = సంవత్సరములచేత, నివేశ్య = ఏర్పరచి, పునః = మరల, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ఆయాత్ = వచ్చెను.

తా. రాముని తమ్ముడు, మహాబాహువు, కైకేయి కుమారుడు అయిన భరతుడు ఐదు సంవత్సరములలో ఆ పురములను ఏర్పరచి తిరిగి అయోధ్యకు వచ్చెను. 16

మూ. సోఽభివాద్య మహాత్మానం సాక్షాద్ధర్మమివాపరమ్,
రాఘవం భరతః శ్రీమాన్ బ్రహ్మాణమివ వాసవః. 17

శశంస చ యథావృత్తం గన్ధర్వవధముత్తమమ్,
నివేశనం చ దేశస్య శ్రుత్వా ప్రీతోఽస్య రాఘవః. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడైన, భరతః = ఆ భరతుడు, వాసవః = ఇంద్రుడు, బ్రహ్మాణమ్ ఇవ = బ్రహ్మదేవుణ్ణి వలె, మహాత్మానమ్ = మహాత్ముడైన, సాక్షాత్ = సాక్షాత్తు, అపరమ్ = మరి యొక, ధర్మమ్ ఇవ = ధర్మమువలె ఉన్న, రాఘవమ్ = రాముణ్ణి, అభివాద్య = నమస్కరించి, యథావృత్తమ్ = జరిగిన విధముగా, ఉత్తమమ్ = ఉత్తమమైన, గన్ధర్వవధమ్ = గంధర్వవధను, దేశస్య = దేశముయొక్క, నివేశనమ్ = ఏర్పాటును, శశంస = చెప్పెను. రాఘవః = రాముడు, శ్రుత్వా = విని, అస్య = ఇతనికి, ప్రీతః = సంతోషించెను.

తా. శ్రీమంతుడైన ఆ భరతుడు సాక్షాత్తు మరొక ధర్మము వలె ఉన్న ఆ రామునకు, ఇంద్రుడు బ్రహ్మదేవునకు నమస్కరించినట్లు నమస్కరించి ఉత్తమమైన గంధర్వవధను, పురనిర్మాణమును గూర్చి, జరిగినది జరిగినట్లుగా, ఆతనికి తెలిపెను. రాముడు విని ఆతని విషయమున సంతోషించెను. 18.

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో నూట ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వ్యుత్తరశతతమః సర్గః

*[రాముని ఆజ్ఞను అనుసరించి భరతలక్ష్మణులు కారుపథ ప్రదేశమునందు వేరు వేరు రాజ్యములలో లక్ష్మణుని పుత్రులైన అంగద చంద్ర కేతువులను నియమించుట].*

మూ. తచ్ఛ్రుత్వా హర్షమాపేదే రాఘవో భ్రాతృభిః సహ,
వాక్యం చాద్భుతసంకాశం భ్రాతౄన్ ప్రోవాచ రాఘవః.

ప్ర. అ. రాఘవః = రాముడు, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, భ్రాతృభిః = సోదరులతో కూడ, హర్షమ్ = సంతోషమును, ఆపేదే = పొందెను. రాఘవః = రాముడు, అద్భుతసంకాశమ్ = అద్భుతమైన, వాక్యం చ = వాక్యమును కూడ, భ్రాతౄన్ = సోదరులను గూర్చి, ప్రోవాచ = పలికెను.

తా. భరతుని మాటలు విని సోదరులతో కూడిన రాముడు సంతోషించెను. రాముడు సోదరులతో ఆశ్చర్యకరమైన వాక్యము పలికెను. 1

మూ. ఇమౌ కుమారౌ సౌమిత్రే తవ ధర్మవిశారదౌ,
అఙ్గదశ్చన్ద్రకేతుశ్చ రాజ్యార్థే దృఢవిక్రమౌ. 2

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! తవ = నీయొక్క, కుమారౌ = కుమారులైన, ఇమౌ = ఈ, అఙ్గదః = అంగదుడు, చన్ద్రకేతుః = చంద్రకేతువూ, ధర్మవిశారదౌ = ధర్మమునందు నేర్పు గలవారు. రాజ్యార్థే = రాజ్యము నిమిత్తము, దృఢవిక్రమౌ = దృఢమైన పరాక్రమము గలవారు.

తా. లక్ష్మణా! నీ కుమారులైన ఈ అంగదుడూ, చంద్రకేతువూ కూడ ధర్మము తెలిసినవారు. రాజ్యమునకు తగిన దృఢపరాక్రమము కలవారు. 2

మూ. ఇమౌ రాజ్యేఽభిషేక్ష్యామి దేశః సాధు విధీయతామ్,
రమణీయో హ్యసంబాధో రమేతాం యత్ర ధన్వినౌ. 3

ప్ర. అ. ఇమౌ = వీరిద్దరినీ, రాజ్యే = రాజ్యమునందు, అభిషేక్ష్యామి = అభిషేకించెదను, యత్ర = ఎక్కడ, ధన్వినౌ = ధనుర్ధరులైన వీరు, రమేతామ్ = క్రీడింతురో అట్టి, రమణీయః = సుందరమైన, అసంబాధః = ఇరుకు కాని, దేశః = దేశము, సాధు = బాగుగా, విధీయతామ్ = నిర్ణయించబడుగాక.

తా. వీరిద్దరినీ రాజ్యాభిషిక్తులను చేసెదను, ధనుర్ధరులైన వీరిద్దరూ సుఖముగా ఉండుటకు తగిన, అందమైన, జనసంమర్దము లేని దేశమును బాగా ఆలోచించి నిర్ణయించుడు. 3

మూ. న రాజ్ఞాం యత్ర పీడా స్యా న్నాశ్రమాణాం వినాశనమ్,
స దేశో దృశ్యతాం సౌమ్య నాపరాధ్యామహే యథా. 4

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా! యత్ర = ఎక్కడ, రాజ్ఞామ్ = ఇతర రాజులకు, పీడా = పీడ, న స్యాత్ = కలగదో, ఆశ్రమాణామ్ = ఆశ్రమముల యొక్క, వినాశనమ్ = నాశనము, న = కలగదో, యథా = ఎట్లు, న అపరాధ్యామహే = అపరాధము చేయమో, సః దేశః = అట్టి దేశము, దృశ్యతామ్ = చూడబడుగాక.

తా. సౌమ్యుడా! ఏ దేశమునందు ఇతరరాజులకు బాధ కలుగదో, ఆశ్రమములు నశించవో, అట్టి దేశమును, మన అపరాధము ఏమీ ఉండని విధమున అన్వేషించుము. 4

మూ. తథోక్తవతి రామే తు భరతః ప్రత్యువాచ హ,
అయం కారుపథో దేశో రమణీయో నిరామయః 5

ప్ర. అ రామే = రాముడు, తథా = అట్లు, ఉక్తవతి = పలికినవాడగుచుండగా, భరతః = భరతుడు, ప్రత్యువాచా హ = పలికెను, అయమ్ = ఈ, కారుపథః దేశః = కారుపథదేశము, రమణీయః = సుందరమైనది, నిరామయః = రోగాదులు లేనిది.

తా. రాముని మాటలు విని భరతు డిట్లు పలికెను. "ఈ కారుపథదేశము సుందరమైనది, రోగములు లేనిది" 5

మూ. నివేశ్యతాం తత్ర పురమఙ్గదస్య మహాత్మనః,
చన్ద్రకేతోః సురుచిరం చన్ద్రకాన్తం నిరామయమ్. 6

ప్ర. అ. తత్ర = అక్కడ, మహాత్మనః = మహాత్ముడైన, అఙ్గదస్య = అంగదునియొక్క, పురమ్ = పురము, నివేశ్యతామ్ = ఏర్పరుపబడుగాక. చన్ద్రకేతోః = చంద్రకేతువుయొక్క, సురుచిరమ్ = చాల అందమైన, నిరామయమ్ = రోగములు లేని. చన్ద్రకాన్తమ్ = చంద్రకాంతపురము, ఏర్పరుపబడుగాక.

తా. అక్కడ మహాత్ముడైన అంగదునకు పురము నిర్మింపబడుగాక. చంద్రకేతువునకు చాల అందమైన, రోగాదులు లేని చంద్రకాంతపురము నిర్మింపబడుగాక. 6

మూ. తద్వాక్యం భరతేనోక్తం ప్రతిజగ్రాహ రాఘవః,
తం చ కృత్వా వశే దేశమఙ్గదస్య న్యవేశయత్. 7

ప్ర. అ. భరతేన = భరతునిచేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, రాఘవః = రాముడు, ప్రతిజగ్రాహ = అంగీకరించెను, తం దేశమ్ = ఆ దేశమును, వశీ కృత్వా = స్వాధీనము చేసికొని, అఙ్గదస్య = అంగదునియొక్క పురమును, న్యవేశయత్ = ఏర్పరచెను.

తా. రాముడు భరతుడు చెప్పినది అంగీకరించి ఆ దేశమును స్వాధీనము చేసికొని అంగదునికొరకు ఏర్పాటు చేసెను. 7

మూ. అఙ్గదీయా పురీ రమ్యాప్యఙ్గదస్య నివేశితా,
రమణీయా సుగుప్తా చ రామేణాక్లిష్టకర్మణా. 8

ప్ర. అ. అక్లిష్టకర్మణా = శ్రమ లేని పనులు గల, రామేణ = రాముని చేత, అంగదస్య = అంగదునియొక్క, రమణీయా = సుందరమైన, సుగుప్తా చ = బాగా రక్షింపబడిన, అఙ్గదీయా పురీ = అంగదీయ అను పురము, నివేశితా = ఏర్పరుపబడినది.

తా. శ్రమపడకుండా పనులు సాధించు రాముడు అంగదునికొరకై సుందరము, సురక్షితమూ అయిన అంగదీయపురమును నిర్మించెను. 8

మూ. చన్ద్రకేతోశ్చ మల్లస్య మల్లభూమ్యాం నివేశితా,
చన్ద్రకాన్తేతి విఖ్యాతా దివ్యా స్వర్గపురీ యథా. 9

ప్ర. అ మల్లస్య = మల్లుడైన, చన్ద్రకేతోః = చంద్రకేతువుయొక్క, స్వర్గపురీ యథా = అమరావతి వలె, దివ్యా=దివ్యమైన, చన్ద్రకాన్తా ఇతి=చంద్రకాంత అని, విఖ్యాతా = ప్రసిద్ధమైన పురము, మల్లభూమ్యామ్ = మల్లభూమి యందు, నివేశితా = ఏర్పరుపబడినది.

తా. మల్లుడైన చంద్రకేతువుకొరకై అమరావతి వలె దివ్యమైన, చంద్రకాంత అని ప్రసిద్ధి పొందిన నగరి మల్లభూమియందు స్థాపింపబడెను. 9

మూ. తతో రామః పరాం ప్రీతిం లక్ష్మణో భరత స్తథా,
యయుర్యుద్ధే దురాధర్షా అభిషేకం చ చక్రిరే. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, లక్ష్మణః = లక్ష్మణుడు, తథా = మరియు, భరతః = భరతుడు, పరామ్ = గొప్ప, ప్రీతిమ్ = సంతోషమును, యయుః=పొందిరి. యుద్ధే = యుద్ధమునందు, దురాధర్షాః = ఎదిరింప శక్యముకాని వారు, అభిషేకం చ = అభిషేకమునుకూడ, చక్రిరే = చేసిరి.

తా. అప్పుడు యుద్ధములో జయింప శక్యము కాని రామ లక్ష్మణ భరతులు చాల సంతోషించి వారిద్దరికి అభిషేకము చేసిరి. 10

మూ. అభిషిచ్య కుమారౌ స ప్రస్థాపయతి రాఘవః,
అఙ్గదం పశ్చిమాం భూమిం చన్ద్రకేతుముదఙ్ముఖమ్. 11

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, కుమారౌ = ఆ కుమారులను, అభిషిచ్య = అభిషేకముచేసి, అఙ్గదమ్ = అంగదుణ్ణి, పశ్చిమాం భూమిమ్ = పశ్చిమ భూమిని గూర్చి, చన్ద్రకేతుమ్ = చంద్రకేతువును, ఉదఙ్ముఖమ్ = ఉత్తరము ముఖము కలవానినిగాను, ప్రస్థాపయతి = పంపెను.

తా. రాముడు ఆ కుమారు లిద్దరికి అభిషేకము చేసి అంగదుని పశ్చిమ ప్రాంతమునకు, చంద్రకేతువును ఉత్తరప్రాంతమునకు పంపెను. 11

మూ. అఙ్గదం చాపి సౌమిత్రిర్లక్ష్మణోఽనుజగామ హ,
చన్ద్రకేతోస్తు భరతః పార్ష్ణిగ్రాహో బభూవ హ. 12

ప్ర. అ. సౌమిత్రిః = సుమిత్రా కుమారుడైన, లక్ష్మణః చ అపి = లక్ష్మణుడు కూడ, అఙ్గదమ్ = అంగదుణ్ణి, అనుజగామ హ = అనుసరించి వెళ్లెను. భరతః = భరతుడు, చన్ద్రకేతోః = చంద్రకేతువుయొక్క, పార్ష్ణిగ్రాహః = సైన్యము వెనుక భాగమును రక్షించువాడుగా, బభూవ హ = ఆయెను.

తా. లక్ష్మణుడు అంగదుని వెంట వెళ్లెను. చంద్రకేతువు వెంట భరతుడు వెళ్లెను. 12

మూ. లక్ష్మణస్త్వఙ్గదీయాయాం సంవత్సరమథోషితః,
పుత్రే స్థితే దురాధర్షే అయోధ్యాం పునరాగమత్. 13

ప్ర. అ. లక్ష్మణః తు = లక్ష్మణుడైతే, అఙ్గదీయాయామ్ = అంగదీయమందు, సంవత్సరమ్ = ఒక సంవత్సరమును, ఉషితః = ఉన్నవాడై, అథ = పిమ్మట, పుత్రే = పుత్రుడు, దురాధర్షే = ఎదిరింప శక్యము కానివాడుగా, స్థితే = ఉండగా, పునః = తిరిగి, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ఆగమత్ = వచ్చెను.

తా. లక్ష్మణుడు అంగదీయలో ఒక సంవత్సరము ఉండి పుత్రుడు ఎవరిచేతా ఎదిరింపశక్యము కానివాడుగా స్థిరపడిన తరవాత అయోధ్యకు తిరిగి వచ్చెను. 13

మూ. భరతోఽపి తథైవోష్య సంవత్సరమతోఽధికమ్,
అయోధ్యాం పునరాగమ్య రామపాదావుపాస్త సః. 14

ప్ర. అ. సః = ఆ, భరతః అపి = భరతుడు కూడ, తథైవ = అట్లే, సంవత్సరమ్ = సంవత్సరమును, అతః = అంతకంటె, అధికమ్ = అధికమును, ఉష్య = ఉండి, పునః = తిరిగి, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ఆగమ్య = వచ్చి, రామపాదౌ = రామపాదములను, ఉపాస్త = ఉపాసించెను.

తా. భరతుడు కూడ అట్లే సంవత్సరముకంటె కొంచెము అధికముగా చంద్రకేతువు దగ్గర ఉండి అయోధ్యకు తిరిగి వచ్చి రాముని పాదములను ఉపాసించెను. 14

మూ. ఉభౌ సౌమిత్రిభరతౌ రామపాదావనువ్రతౌ,
కాలం గతమపి స్నేహాన్న జజ్ఞాతేఽతిధార్మికౌ. 15

ప్ర. అ. రామపాదౌ = రాముని పాదములను, అనువ్రతౌ = అనుసరించిన వ్రతము గల, అతిధార్మికౌ = మిక్కిలి ధార్మికులైన, సౌమిత్రి భరతౌ = లక్ష్మణ భరతులు, ఉభౌ = ఇద్దరూ, గతమ్ = గడచిన, కాలమ్ అపి = కాలమును కూడ, న జజ్ఞాతే = తెలిసికొనలేదు.

తా. రామపాదసేవాతత్పరులైన, చాల ధార్మికులైన లక్ష్మణభరతు లిద్దరూ స్నేహము వలన ఎంత కాలము గడచినను గుర్తించలేదు. 15

మూ. ఏవం వర్షసహస్రాణి దశ తేషాం యయుస్తదా,
ధర్మే ప్రయతమానానాం పౌరకార్యేషు నిత్యదా. 16

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ధర్మే = ధర్మమునందు, ప్రయతమానానామ్ = ప్రయత్నించుచున్న, నిత్యదా = ఎల్లప్పుడూ, పౌరకార్యేషు = పౌరుల కార్యములయందు, ప్రయతమానానామ్ = ప్రయత్నించుచున్న, తేషామ్ = వారికి, తదా = అప్పుడు, ఏవమ్ = ఈ విధముగా, దశ = పది, వర్షసహస్రాణి = సంవత్సరముల సహస్రములు, యయుః = గడచినవి.

తా. ఈ విధముగా వారు ధర్మమార్గతత్పరులై, నిత్యమూ పౌరుల కార్యములు చూచుటకు ప్రయత్నించుచుండగా పది వేల సంవత్సరములు గడచినవి.

మూ. విహృత్య కాలం పరిపూర్ణమానసాః
శ్రియా వృతా ధర్మపురే చ సంస్థితాః,
త్రయః సమిద్ధా ఇవ దీప్తతేజసో
మహాధ్వరే సాధు హుతాస్త్రయోఽగ్నయః. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ద్వ్యుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. కాలమ్ = దీర్ఘకాలము, విహృత్య = విహరించి, పరిపూర్ణమానసాః = పరిపూర్ణమైన మనస్సులు గల, శ్రియా = శోభతో, ఆవృతాః = కప్పబడిన,

ధర్మపురే చ = ధర్మసాధనమైన అయోధ్యాపురమునందు, సంస్థితాః = ఉన్న, త్రయః = ఆ ముగ్గురూ, మహాధ్వరే = మహాయజ్ఞమునందు, సాధు = బాగుగా, హుతాః = హోమముచేయబడిన, సమిద్ధాః = ప్రజ్వలించుచున్న, త్రయః = మూడు, అగ్నయః ఇవ = అగ్నులు వలె, దీప్త తేజసః = ప్రకాశించుచున్న తేజస్సు కలవారు అయిరి.

తా. ధర్మసాధనమైన అయోధ్యాపురములో నివసించుచు, చాల కాలము గడిపి, పరిపూర్ణములైన మనస్సులతో కూడిన లక్ష్మీసంపన్నులైన ఆ రామలక్ష్మణభరతులు ముగ్గురూ మహాయజ్ఞములో చక్కగా హోమము చేయగా ప్రజ్వరిల్లుచున్న మూడు అగ్నులు వలె ప్రకాశించుచుండిరి. 17

"బాలానందిని". అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూటరెండవసర్గ సమాప్తము.

# అథ త్ర్యుత్తరశతతమః సర్గః

[రాముని వద్దకు కాలపురుషుడు వచ్చుట. ఒక సమయము (షరతు) పెట్టి ఆ కాలపురుషుడు రామునితో మాటలాడుటకు ఉద్యో మించుట.]

మూ. కస్య చిత్త్వథ కాలస్య రామే ధర్మపరే స్థితే,
కాలస్తాపసరూపేణ రాజద్వారముపాగమత్. 1

ప్ర. అ. రామే = రాముడు, ధర్మపరే = ధర్మపరుడై, స్థితే = ఉండగా, అథ = అటుపిమ్మట, కస్య చిత్ = ఒకానొక, కాలస్య = కాలమునకు, కాలః = కాల పురుషుడు, తాపసరూపేణ = మునిరూపముతో, రాజద్వారమ్ = రాజద్వార మును గూర్చి, ఉపాగమత్ = వచ్చెను.

తా. రాముడు ఈ విధముగ ధర్మపరుడై ఉంటుండగా, కొంత కాలము నకు కాలపురుషుడు మునిరూపములో రాజద్వారమునకు వచ్చెను.

మూ. సోఽబ్రవీల్లక్ష్మణం వాక్యం ధృతిమన్తం యశస్వినమ్,
మాం నివేదయ రామాయ సంప్రాప్తం కార్యగౌరవాత్. 2

ప్ర. అ. సః = అతడు, ధృతిమన్తమ్ = ధైర్యవంతుడు, యశస్వినమ్= కీర్తి గలవాడు అయిన, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మామ్ = నన్ను, కార్యగౌరవాత్ = కార్యముయొక్క- గౌరవమువలన, సంప్రాప్తమ్ = వచ్చినవానినిగా, రామాయ = రామునకు, నివే దయ = తెలుపుము.

తా. అతడు ధైర్యవంతుడు కీర్తి గలవాడూ అయిన లక్ష్మణునితో ఇట్లు పలికెను- "నేను ఎంతో ముఖ్యమైన పనిమీద వచ్చినా నని రామునకు చెప్పుము."2

మూ. దూతో హ్యతిబలస్యాహం మహర్షేరమితౌజసః,
రామం దిదృక్షురాయాతః కార్యేణ హి మహాబల. 3

ప్ర. అ. మహాబల = గొప్ప బలము గలవాడా! అహమ్ = నేను, అమితౌజసః = అమితమైన తేజస్సు గల, అతిబలస్య = అత్యధికమైన బలము గల, మహర్షేః = మహర్షియొక్క, బ్రహ్మదేవునియొక్క, దూతః హి = దూతను. కార్యేణ = ఒక పనిచేత, రామమ్ = రాముణ్ణి, దిదృక్షుః = చూడతలచినవాడనై, ఆయాతః = వచ్చినాను.

తా. గొప్ప బలము గలవాడా! నేను అమితమైన తేజస్సు గల, గొప్ప బలము గల మహర్షి (బ్రహ్మదేవుని) దూతను. ఒక పనిమీద రాముణ్ణి చూచుటకై వచ్చినాను. 3

మూ. తస్య తద్వచనం శ్రుత్వా సౌమిత్రిస్త్వరయాన్వితః,
న్యవేదయత రామాయ తాపసం తం సమాగతమ్. 4

ప్ర. అ. తస్య = ఆతనియొక్క, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, సౌమిత్రిః = లక్ష్మణుడు, త్వరయా = తొందరతో, అన్వితః = కూడినవాడై, తమ్ = ఆ, తాపసమ్ = మునిని, సమాగతమ్ = వచ్చినవానినిగా, రామాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. లక్ష్మణుడు ఆతని మాటలు విని తొందరపడుచు వెళ్ళి ఆ ముని వచ్చినట్లు రామునకు తెలిపెను. 4

మూ. జయస్వ రాజధర్మేణ ఉభౌ లోకౌ మహాద్యుతే,
దూతస్త్వాం ద్రష్టుమాయాతస్తపసా భాస్కరప్రభః. 5

ప్ర. అ. మహాద్యుతే = గొప్ప కాంతి గలవాడా! రాజధర్మేణ = రాజధర్మముచేత, ఉభౌ = రెండు, లోకౌ = లోకములను, జయస్వ = జయించుము. తపసా = తపస్సుచేత, భాస్కర ప్రభః = సూర్యునివంటి కాంతి గల, దూతః = దూత, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఆయాతః = వచ్చినాడు.

తా. గొప్ప కాంతి గలవాడా! రాజధర్మముచేత రెండు లోకములను

జయించుము. తపస్సుచేత సూర్యునివంటి కాంతి గల దూత నిన్ను చూచుటకు వచ్చినాడు. 5

మూ. తద్వాక్యం లక్ష్మణోక్తం వై శ్రుత్వా రామ ఉవాచ హ,
ప్రవేశ్యతాం మునిస్తాత సత్కృతః పూర్వమేవ హి. 6

ప్ర. అ. లక్ష్మణోక్తమ్ = లక్ష్మణునిచేత పలకబడిన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, రామః = రాముడు, ఉవాచ హ = పలికెను. తాత = నాయనా! పూర్వమ్ ఏవ హి = ముందుగానే, సత్కృతః = సత్కరించబడినవాడై, మునిః = ముని, ప్రవేశ్యతామ్ = ప్రవేశపెట్టబడుగాక.

తా. లక్ష్మణుని మాటలు విని రాముడు - "నాయనా! ముందుగానే సత్కరించి ఆ మునిని లోపలికి తీసికొనిరమ్ము" అని పలికెను. 6

మూ. సౌమిత్రిస్తు తథేత్యుక్త్వా ప్రావేశయత తం మునిమ్,
జ్వలన్తమివ తేజోభిః ప్రదహన్తమివాంశుభిః. 7

ప్ర. అ. సౌమిత్రిః తు = లక్ష్మణుడైతే, తథా ఇతి = అట్లే అని, ఉక్త్వా = పలికి, తేజోభిః = తేజస్సులతో, జ్వలన్తమ్ ఇవ = మండుచున్నాడా అన్నట్లున్న, అంశుభిః = కిరణములచేత, ప్రదహన్తమ్ ఇవ = దహించుచున్నాడా అన్నట్లున్న, తమ్ = ఆ మునిని, ప్రావేశయత = ప్రవేశపెట్టెను.

తా. లక్ష్మణుడు "అట్లే చేసెదను" అని పలికి తేజస్సుచేత మండుచున్నాడా అన్నట్లు, కిరణములచేత కాల్చుచున్నాడా అన్నట్లు ఉన్న ఆ మునిని లోపల ప్రవేశపెట్టెను. 7

మూ. సోఽభిగమ్య రఘుశ్రేష్ఠం దీప్యమానం స్వతేజసా,
ఋషిర్మధురయా వాచా వర్ధస్వేత్యాహ రాఘవమ్. 8

ప్ర. అ. సః ఋషిః = ఆ ఋషి. స్వతేజసా = తన తేజస్సుతో, దీప్యమానమ్ = ప్రకాశించుచున్న, రఘుశ్రేష్ఠమ్ = రాముణ్ణి, అభిగమ్య = సమీపించి, మధురయా = మధురమైన, వాచా = వాక్కుతో, రాఘవమ్ = ఆరాముణ్ణి గూర్చి, వర్ధస్వ = వృద్ధిపొందుము, ఇతి = అని, ఆహ = పలికెను.

తా. ఆ ఋషీశ్వరుడు తేజస్సుతో ప్రకాశించుచున్న ఆ రాముణ్ణి సమీపించి మధురమైన వాక్కుతో - "వృద్ధి పొందుము" అని పలికెను. 8

మూ. తస్మై రామో మహాతేజాః పూజామర్ఘ్యపురోగమామ్,
దదౌ కుశలమవ్యగ్రం ప్రష్టుం చైవోపచక్రమే. 9

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, తస్మై= ఆతనికి, అర్ఘ్యపురోగమామ్ = అర్ఘ్యము మొదలైన, పూజామ్=పూజను, దదౌ= ఇచ్చెను. అవ్యగ్రమ్ = వ్యగ్రత లేకుండగా, కుశలమ్=కుశలమును, ప్రష్టుమ్= అడుగుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు ఆ మునీశ్వరునకు అర్ఘ్యము మొదలైన పూజను సావధానచిత్తముతో ఇచ్చి కుశలప్రశ్న వేయుటకు ఆరంభించెను. 9

మూ. పృష్టశ్చ కుశలం తేన రామేణ వదతాం వరః,
ఆసనే కాఞ్చనే దివ్యే నిషసాద మహాయశాః. 10

ప్ర. అ. తేన రామేణ = ఆ రామునిచేత, కుశలమ్ = కుశలమును, పృష్టః = అడగబడిన, వదతాం వరః = మాటలాడువారిలో శ్రేష్ఠుడైన, మహాయశాః = గొప్ప కీర్తి గల అతడు, కాఞ్చనే= బంగారము వికారమైన, దివ్యే= దివ్యమైన, ఆసనే = ఆసనమునందు, నిషసాద = కూర్చుండెను.

తా. రాముడు కుశలప్రశ్న చేయగా మాటలాడువారిలో శ్రేష్ఠుడు, గొప్ప కీర్తి కలవాడూ అయిన ఆ ముని దివ్యమైన బంగారు ఆసనముమీద కూర్చుండెను.

మూ. తమువాచ తతో రామః స్వాగతం తే మహామునే,
ప్రాపయాస్య చ వాక్యాని యతో దూతస్త్వమాగతః. 11

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను, మహామునే = మహామునీ! తే = నీకు, స్వాగతమ్= స్వాగతము, త్వమ్ = నీవు, యతః = ఎవనినుండి, దూతః = దూతవుగా, ఆగతః = వచ్చినావో, అస్య = వీని యొక్క, వాక్యాని = మాటలను, ప్రాపయ= పొందించుము.

తా. పిమ్మట రాముడు ఆతనితో - "మహామునీ! నీకు స్వాగతము. నీవు ఎవరి దూతగా వచ్చినావో ఆతని మాటలు వినిపించుము (చెప్పుము అనెను). 11

మూ. చోదితో రాజసింహేన మునిర్వాక్యమభాషత,
ద్వన్ద్వే హ్యేత త్ప్రవక్తవ్యం హితం వై యద్యపేక్షసే.

ప్ర. అ. రాజసింహేన = రాజశ్రేష్ఠునిచేత, చోదితః = ప్రేరేపింపబడిన, మునిః = ముని, వాక్యమ్ = వాక్యమును, అభాషత = పలికెను. హితమ్ = హితమును, అపేక్షసే యది = (నీవు) అపేక్షించినట్లయితే, ఏతత్ = ఇది, ద్వన్ద్వే = ఇద్దరు మాత్రమే ఉన్నప్పుడు, ప్రవక్తవ్యమ్ = చెప్పదగినది.

తా. రామునిచేత ప్రేరేపింపబడిన ఆ ముని ఇట్లు పలికెను. "నీవు హితమును కోరినచో ఇది రహస్యమునందే చెప్పదగినది". 12

మూ. యః శృణోతి నిరీక్షేద్వా స వధ్యో భవితా తవ,
మహర్షేర్మునిముఖ్యస్య వచనం యద్యవేక్షసే. 13

ప్ర. అ. మునిముఖ్యస్య = మునులలో ముఖ్యుడైన, మహర్షేః = మహర్షి యొక్క, వచనమ్ = వచనమును, అవేక్షసే యది = నీవు మన్నించినచో, యః = ఎవడు, శృణోతి = వినునో, నిరీక్షేద్వా = లేదా చూచునో, సః = అతడు, తవ = నీకు, వధ్యః = చంపదగినవాడు, భవితా = కాగలడు.

తా. "మునులలో ముఖ్యుడైన మహర్షి వచనమును నీవు మన్నించినచో మన మాటలను ఎవడు వినునో, లేదా మాటలాడుకొనుచున్న మనలను చూచునో ఆతనిని నీవు చంపవలెను." 13

మూ. తథేతి చ ప్రతిజ్ఞాయ రామో లక్ష్మణమబ్రవీత్,
ద్వారి తిష్ఠ మహాబాహో ప్రతిహారం విసర్జయ. 14

ప్ర. అ. రామః = రాముడు, తథేతి = అట్లే అని, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞ చేసి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. మహాబాహో = ఓ! మహాబాహూ! ద్వారి = ద్వారమునందు, తిష్ఠ = ఉండుము, ప్రతీహారమ్ = ద్వార పాలకుణ్ణి, విసర్జయ = పంపివేయుము.

తా. రాముడు అట్లే అని ప్రతిజ్ఞ చేసి లక్ష్మణునితో ఇట్లు పలికెను. "మహా బాహూ! ద్వారపాలకుణ్ణి పంపివేసి ద్వారమునందు నిలచి ఉండుము." 14

మూ. స మే వధ్యః ఖలు భవేద్వాచం ద్వన్ద్వసమీరితామ్,
ఋషేర్మమ చ సౌమిత్రే పశ్యేద్వా శృణుయాచ్చ యః.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! ఋషేః = ఋషియొక్క, మమ చ = నాయొక్క, ద్వన్ద్వసమీరితామ్ = రహస్యమునందు పలకబడిన, వాచమ్ = వాక్కును, యః = ఎవడు, పశ్యేత్ = చూచునో, శృణుయాత్ చ = వినునో, సః = అతడు, మే = నాకు, వధ్యః = చంపదగినవాడు, భవేత్ = అగును.

తా. లక్ష్మణా! నేనూ ఈ ఋషి రహస్యమునందు మాటలాడుకొను చుండగా ఎవడు చూచునో లేదా వినునో ఆతనిని నేను చంపివేయవలసి ఉండును. 15

మూ. తతో నిక్షిప్య కాకుత్స్థో లక్ష్మణం ద్వారి సంగ్రహమ్,
తమువాచ మునే వాక్యం కథయస్వేతి రాఘవః. 16

ప్ర అ. తతః = అటుపిమ్మట, కాకుత్స్థః = కకుత్స్థవంశమునందు జనించిన, రాఘవః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, ద్వారి = ద్వారము నందు, సంగ్రహమ్ = అడ్డుకొనేవానినిగా, నిక్షిప్య = ఉంచి, మునే = మునీ! వాక్యమ్ = వాక్యమును, కథయస్వ = చెప్పుము, ఇతి = అని, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు లక్ష్మణుణ్ణి ద్వారమునందు రక్షకుణ్ణిగా ఉంచి ఆతనితో ఇట్లనెను — "మునీ! ఆ వాక్యమును చెప్పుము." 16

మూ. తత్తే మనీషితం వాక్యం యేన వాసి సమాగతః,
కథయస్వావిశఙ్కస్త్వం మమాపి హృది వర్తతే. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
త్ర్యుత్తర శతతమః సర్గః

ప్ర. అ. యేన వా = దేనిచేత, సమాగతః అసి = వచ్చినావో, తత్ = ఆ,

తే = నీకు, మనీషితమ్ = ఇష్టమైన, వాక్యమ్ = వాక్యమును, త్వమ్ = నీవు, అవిశఙ్కః = శంక లేనివాడవై, కథయస్వ = చెప్పుము. మమ = నాయొక్క, హృదయేపి = హృదయమునందు కూడ, వర్తతే = ఉన్నది.

తా. దేనిచేత ఇక్కడకు వచ్చినావో నీ కిష్టమైన ఆ వాక్యమును ఎట్టిశంకా లేకుండ చెప్పుము. నా మనస్సులో కూడ వినవలె నని ఉన్నది. (నేను కూడ ఆవిషయమే ఆలోచించుచున్నాను.) 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూటమూడవ సర్గ సమాప్తము.

# అథ చతురధికశతతమః సర్గః

[కాలపురుషుడు రామునకు బ్రహ్మదేవుని సందేశము చెప్పుట. రాముడు అంగీకరించుట.]

మూ. శృణు రాజన్ మహాసత్త్వ యదర్థమహమాగతః,
పితామహేన దేవేన ప్రేషితోఽస్మి మహాబల. 1

ప్ర. అ. మహాసత్త్వ = గొప్ప బుద్ధిబలము గలవాడా! రాజన్ = రాజా! యదర్థమ్ = ఎందు నిమిత్తము, అహమ్ = నేను, ఆగతః = వచ్చినానో, శృణు = వినుము. మహాబల = గొప్ప బలము గలవాడా! దేవేన = దేవుడైన, పితామహేన = బ్రహ్మచేత, ప్రేషితః అస్మి = పంపబడితిని.

తా. గొప్ప బుద్ధి బలము గల రాజా! నేను ఎందుకు వచ్చితినో వినుము. గొప్ప బలము గలవాడా! నన్ను బ్రహ్మదేవుడు పంపినాడు. 1

మూ. తవాహం పూర్వకే భావే పుత్రః పరపురంజయ,
మాయాసంభావితో వీర కాలః సర్వసమాహరః. 2

ప్ర. అ. పరపురంజయ = శత్రుపురములను జయించువాడా! వీర = వీరుడా! అహమ్ = నేను, పూర్వకే భావే = పూర్వావస్థయందు, అనగా హిరణ్యగర్భోత్పత్తి సమయమునందు, మాయాసంభావితః = మాయచేత, అనగా సంకల్పముచేత, పుట్టించబడిన, తవ పుత్రః = నీ పుత్రుడనైన, సర్వసమాహరః = సర్వసంహర్తయైన, కాలః = కాలమును.

తా. శత్రుపురములను జయించు వీరుడా! నేను పూర్వావస్థయందు నీవు సంకల్పముచే పుట్టించిన, సకలసంహారకర్తయైన, నీ పుత్రుడైన కాలమును. 2

మూ. పితామహశ్చ భగవానాహ లోకపతిః ప్రభుః,
సమయస్తే కృతః సౌమ్య లోకాన్ సంపరిరక్షితుమ్. 3

ప్ర. అ. లోకపతిః = లోకముల ప్రభువు, ప్రభుః = సమర్థుడూ, భగవాన్ = భగవంతుడూ అయిన, పితామహః చ = పితామహుడు, ఆహ = ఇట్లు చెప్పుచున్నాడు. సౌమ్య = సౌమ్యుడా! లోకాన్ = లోకములను, సంపరిరక్షితుమ్ = రక్షించుటకు, తే = నీకు (నీచేత), సమయః = ఒక అంగీకారము (ఒప్పందము), కృతః = చేయబడినది.

తా. లోకముల అధిపతి, సర్వసమర్థుడు, భగవంతుడు అయిన బ్రహ్మదేవుడు ఇట్లు అనుచున్నాడు-"సౌమ్యా! లోకములను రక్షించుటకై నీవు ఒక అంగీకారము చేసి ఉన్నావు." 3

మూ. సంక్షిప్య హి పురా లోకాన్ మాయయా స్వయమేవ హి,
మహార్ణవే శయానోఽప్సు మాం త్వం పూర్వమజీజనః. 4

ప్ర. అ. పురా = పూర్వము, మాయయా = మాయచేత, స్వయమ్ = ఏవ = స్వయముగానే, లోకాన్ = లోకములను, సంక్షిప్య = సంక్షేపించి, మహార్ణవే = మహాసముద్రమునందు, అప్సు = ఉదకమునందు, శయానః = శయనించుచున్న, త్వమ్ = నీవు, పూర్వమ్ = ముందుగా, మామ్ = నన్ను, అజీజనః = పుట్టించితివి.

తా. పూర్వము నీవు మాయాబలము చేత లోకములను అన్నింటిని స్వయముగానే అదృశ్యములను చేసి మహాసముద్రములో శయనించి ఉండి ముందుగా నన్ను సృష్టించినావు. 4

మూ. భోగవన్తం తతో నాగమనన్తముదకేశయమ్,
మాయయా జనయిత్వా త్వం ద్వౌ చ సత్త్వౌ మహాబలౌ,
మధుం చ కైటభం చైవ యయోరస్థిచయైర్వృతా,
ఇయం పర్వతసంబాధా మేదినీ చాభవత్తదా. 6

ప్ర. అ. తతః = అటుపిమ్మట, భోగవన్తమ్ = పడగలుగల, ఉదకేశయమ్ = ఉదకమునందు శయనించు, అనన్తం నాగమ్ = అనంత మనే నాగమును, త్వమ్ = నీవు, మాయయా = మాయచేత, జనయిత్వా = పుట్టించి, మధుం చ = మధువు, కైటభం చైవ = కైటభుడు అను, మహాబలౌ = గొప్ప బలము గల,

ద్వౌ = రెండు, సత్త్వౌ = ప్రాణులను సృష్టించితివి. తదా = అప్పుడు, యయోః = ఎవరియొక్క, అస్థిచయైః = ఎముకల సముదాయములతో. వృతా = కూడిన, ఇయం మేదినీ = ఈ భూమి, పర్వతసంబాధా = పర్వతములచేత ఇరుకైనదిగా, అభవత్ = ఆయెనో.

తా. పిమ్మట నీవు మాయాబలముచేత పెద్ద పడగలు గల, ఉదకనివాసియైన ఆదిశేషుణ్ణి సృష్టించి మహాబలవంతులైన మధుకైటభు లను రెండు గొప్ప ప్రాణులను సృష్టించితివి. వాళ్ళ ఎముకలతో వ్యాప్తమై ఈ భూమి పర్వతములతో నిండెను. 5,6

మూ. పద్మే దివ్యేఽర్కసంకాశే నాభ్యాముత్పాద్య మామపి,
ప్రాజాపత్యం త్వయా కర్మ మయి సర్వం నివేశితమ్. 7

ప్ర. అ. నాభ్యామ్ = నాభియందు, దివ్యే = దివ్యమైన, అర్కసంకాశే = సూర్యునితో సమానమైన, దివ్యే పద్మే = దివ్యమైన పద్మమునందు, మామ్ = నన్ను, ఉత్పాద్య = సృష్టించి, త్వయా = నీచేత, సర్వమ్ = సమస్తమైన, ప్రాజాపత్యమ్ = ప్రాజాపతికి సంబంధించిన, కర్మ = పని, నివేశితమ్ = ఉంచబడినది.

తా. నీ నాభియందు సూర్యునితో సమానమైన దివ్యమైన పద్మమునందు నన్ను సృష్టించి నీవు ప్రజాపతిత్వమును పూర్తిగా నాకు అప్పగించినావు. 7

మూ. సోఽహం సంన్యస్తభారో హి త్వాముపాస్య జగత్పతిమ్,
రక్షాం విధత్స్వ భూతేషు మమ తేజస్కరో భవాన్. 8

ప్ర. అ. సంన్యస్తభారః = ఉంచబడిన సృష్టిభారము గల, సః అహమ్ = అట్టి నేను, జగత్పతిమ్ = జగత్పతివైన, త్వామ్ = నిన్ను, ఉపాస్య = ఉపాసించి, సర్వభూతేషు = సకలభూతములయందు, రక్షామ్ = రక్షను, విధత్స్వ = చేయుము. భవాన్ = నీవే, మమ = నాకు, తేజస్కరః = తేజస్సును ఇచ్చినవాడవు (అని ప్రార్థించితిని).

తా. ప్రజాపతిత్వభారమును నీవు నాపై ఉంచగా నేను జగత్పతివైన నిన్ను ఉపాసించి, "నాకు తేజస్సును ఇచ్చినవాడవు నీవే; సమస్తభూతములను రక్షించుము"అని నిన్ను ప్రార్థించితిని. 8

మూ. తత స్త్వమసి దుర్ధర్షాత్తస్మాద్భావాత్సనాతనాత్,
రక్షాం విధాస్యన్ భూతానాం విష్ణుత్వముపజగ్మివాన్. 9

ప్ర. అ. తతః = అటుపిమ్మట, త్వమ్ = నీవు, దుర్ధర్షాత్ = ఎదిరింప శక్యము కాని, సనాతనాత్ = ప్రాచీనమైన, తస్మాత్ = ఆ, భావాత్ = హిరణ్యగర్భ స్థితినుండి, భూతానామ్ = భూతములయొక్క, రక్షామ్ = రక్షను, విధాస్యన్ = చేయనున్నవాడవై, విష్ణుత్వమ్ = విష్ణుత్వమును, ఉపజగ్మివాన్ = పొందితివి.

తా. అప్పుడు నీవు ప్రాణులను రక్షించుటకై సనాతనము, ఎదిరింప శక్యము కానిదీ అయిన ఆ హిరణ్యగర్భస్థితినుండి విష్ణుత్వమును పొందినావు. 9

మూ. అదిత్యాం వీర్యవాన్ పుత్రో భ్రాతౄణాం వీర్యవర్ధనః,
సముత్పన్నేషు కృత్యేషు తేషాం సాహ్యాయ కల్పసే. 10

ప్ర. అ. అదిత్యామ్ = అదితియందు, వీర్యవాన్ = పరాక్రమము గల, భ్రాతౄణామ్ = సోదరులయొక్క, వీర్యవర్ధనః = పరాక్రమమును వృద్ధిపొందించు, పుత్రః = పుత్రుడవుగా పుట్టి, కృత్యేషు = కృత్యములు, సముత్పన్నేషు = పుట్టిన వగుచుండగా, తేషామ్ = సోదరులయొక్క, సాహ్యాయ = సాహాయ్యముకొరకు, కల్పసే = అగుచున్నావు.

తా. అదితియందు మహాపరాక్రమశాలియైన పుత్రుడుగా (ఉపేంద్రుడుగా) పుట్టి సోదరులైన దేవతల పరాక్రమమును వృద్ధిపొందించుచు పనులు వచ్చినప్పుడు వాళ్ళకి సహాయము చేయుచుందువు. 10

మూ. స త్వముజ్జాస్యమానాసు ప్రజాసు జగతో వర,
రావణస్య వధాకాఙ్క్షీ మానుషేషు మనో౽దధాః. 11

ప్ర. అ. జగతః = జగత్తుయొక్క, వర = శ్రేష్ఠుడా! సః త్వమ్ = అట్టి నీవు, ప్రజాసు = ప్రజలు, ఉజ్జాస్యమానాసు = పీడించబడుచున్నవారగుచుండగా, రావణస్య = రావణునియొక్క, వధాకాఙ్క్షీ = వధను కోరుచున్నవాడవై, మానుషేషు = మనుష్యులలో, మనః = మనస్సును, అదధాః = ఉంచితివి.

తా. జగత్తులో శ్రేష్ఠుడా! అట్టి నీవు, ప్రజలు రావణునిచేత హింసింపబడు చుండగా, రావణుని సంహరించుటకై మనుష్యజన్మ ఎత్తుటకు సంకల్పించితివి.

మూ. దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ,
కృత్వా వాసస్య నియమం స్వయమేవాత్మనా పురా. 12

ప్ర. అ. పురా = పూర్వము, స్వయమేవ = స్వయముగానే, ఆత్మనా = తనచేత, దశవర్షసహస్రాణి = పది వేల సంవత్సరములు, దశవర్షశతాని చ = పది వందల సంవత్సరాలు, వాసస్య = నివాసమునకు, నియమమ్ = నియమమును, కృత్వా = చేసి (మానవుడుగా జన్మించితివి).

తా. పదకొండువేల సంవత్సరములు భూలోకములో ఉండెద నని స్వయముగానే నియమము ఏర్పరచుకొని మానవుడుగా జన్మించితివి. 12

మూ. స త్వం మనోమయః పుత్రః పూర్ణాయుర్మానుషేష్విహ,
కాలో నరవరశ్రేష్ఠ సమీపముపవర్తితుమ్. 13

ప్ర. అ. మనోమయః పుత్రః = నీ మనఃసకల్పమువలన దశరథపుత్రుడవైన, సః త్వమ్ = అట్టి నీవు, ఇహ = ఇక్కడ, మానుషేషు = మనుష్యులయందు, పూర్ణాయుః = పూర్ణాయుర్దాయము కలవాడవు. నరవరశ్రేష్ఠ = నరవరులలో శ్రేష్ఠుడా! సమీపమ్ = సమీపమును గూర్చి, ఉపవర్తితుమ్ = వచ్చుటకు, కాలః = కాలము.

తా. స్వసంకల్పముచేత (దశరథ) పుత్రుడుగా పుట్టిన నీకు మనుష్యులలో పూర్ణాయుర్దాయము పూర్తి అయినది. అందుచేత, నరవరులలో శ్రేష్ఠుడా! ఇక నీవు మా దగ్గరకు తిరిగి వచ్చుటకు కాలము వచ్చినది. 13

మూ. యది భూయో మహారాజ ప్రజా ఇచ్ఛస్యుపాసితుమ్,
వస వా వీర భద్రం తే ఏవమాహ పితామహః. 14

ప్ర. అ. మహారాజ = మహారాజా! వా = లేదా, భూయః = ఇంకనూ, ప్రజాః = ప్రజలను, ఉపాసితుమ్ = రక్షించుటకు, ఇచ్ఛసి యది = ఇచ్ఛయించినట్లయితే, వీర = వీరుడా! వస = ఇక్కడనే ఉండుము. తే = నీకు, భద్రమ్ = క్షేమమగుగాక. పితామహః = బ్రహ్మదేవుడు, ఏవమ్ = ఇట్లు, ఆహ = పలికెను.

తా. "మహారాజా! ఇంకను ప్రజలను రక్షించవలె నని నీకున్నచో ఇక్కడనే ఉండుము. నీకు క్షేమము అగుగాక" బ్రహ్మదేవుడు ఇట్లు చెప్పినాడు. 14

మూ. అథవా విజిగీషా తే సురలోకాయ రాఘవ,
సనాథా విష్ణునా దేవా భవన్తు విగతజ్వరాః. 15

ప్ర. అ. అథవా = లేదా, రాఘవ = రామా! తే = నీకు, దేవలోకాయ = దేవలోకముకొరకు, విజిగీషా = జయించవలెనను కోరిక ఉన్నచో, దేవాః = దేవతలు, విష్ణునా = విష్ణువుతో, సనాథాః = కూడినవారై, విగతజ్వరాః = పోయిన మనఃక్లేశము కలవారు, భవన్తు = అగుదురుగాక.

తా. రామా ! అట్లు కాక సురలోకమును పాలించు అభిలాష ఉన్నచో దేవతలు విష్ణువైన నీ సంరక్షణమును పొందినవారై నిర్భయులుగా ఉందురుగాక.

మూ. శ్రుత్వా పితామహేనోక్తం వాక్యం కాలసమీరితమ్,
రాఘవః ప్రహసన్ వాక్యం సర్వసంహారమబ్రవీత్. 16

ప్ర. అ. కాలసమీరితమ్=కాలపురుషునిచేత చెప్పబడిన, పితామహేన = బ్రహ్మదేవునిచేత, ఉక్తమ్ = పలకబడిన, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా = విని, రాఘవః = రాముడు, ప్రహసన్ = నవ్వుచు, సర్వసంహారమ్ = సర్వమునూ సంహరించు కాలుణ్ణి గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. కాలపురుషుని ద్వారా బ్రహ్మదేవుడు పలికిన మాటలు (పంపిన సందేశమును) విని రాముడు నవ్వుచు ఆ కాలపురుషునితో ఇట్లనెను. 16

మూ. శ్రుత్వా మే దేవదేవస్య వాక్యం పరమమద్భుతమ్,
ప్రీతిర్హి మహతీ జాతా తవాగమనసంభవా. 17

ప్ర. అ. పరమమ్=మిక్కిలి, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, దేవదేవస్య = బ్రహ్మదేవునియొక్క, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, మే = నాకు, తవ = నీయొక్క, ఆగమనసంభవా=ఆగమనమువలన పుట్టిన, మహతీ = గొప్ప, ప్రీతిః = సంతోషము, జాతా = పుట్టినది.

తా. చాల అద్భుతమైన బ్రహ్మదేవుని మాటలు విని నాకు నీ రాకవలన చాల సంతోషము కలిగినది. 17

మూ. త్రయాణామపి లోకానాం కార్యార్థం మమ సంభవః,
భద్రం తేఽస్తు గమిష్యామి యత ఏవాహమాగతః, 18

ప్ర. అ. త్రయాణామ్ = మూడు, లోకానామ్ = లోకములయొక్క, కార్యార్థమ్ = కార్యముకొరకే, మమ = నాయొక్క, సంభవః = పుట్టుక. తే = నీకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక. అహమ్ = నేను, యతః ఏవ = ఎక్కడి నుండి, ఆగతః = వచ్చినానో అక్కడికే, గమిష్యామి = వెళ్ళగలను.

తా. నేను పుట్టినది మూడు లోకముల కార్యమును సాధించుటకే. నీకు మంగళ మగుగాక; నేను ఎక్కకినుండి వచ్చినానో అక్కడికే వెళ్ళెదను. 18

మూ. హృద్గతో హ్యసి సంప్రాప్తో న మే తత్ర విచారణా,
మయా హి సర్వకృత్యేషు దేవానాం వశవర్తినా, 19
స్థాతవ్యం సర్వసంహార యథాహ్యాహ పితామహః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
చతురధికశతతమః సర్గః

ప్ర. అ. మే = నాకు, హృద్గతః = నా మనస్సులో ఉన్నవాడవే, సంప్రాప్తః అసి = వచ్చినావు; మే = నాకు అత్ర = ఈ విషయమునందు, విచారణా = ఆలోచన, న = లేదు. సర్వసంహార = కాలపురుషా! పితామహః = బ్రహ్మదేవుడు, యథా = ఎట్లు, ఆహ = పలికెనో అట్లు, మయా = నాచేత, సర్వకృత్యేషు = అన్నికృత్యముల యందు, దేవానామ్ = దేవతలకు, వశవర్తినా = వశుడుగా, స్థాతవ్యం హి = ఉండ దగినది కదా?

తా. కాలపురుషా! నేను నిన్ను గూర్చి ఆలోచించుచుండగానే నీవు వచ్చి నావు. ఈ విషయమున నాకు మరి యొక ఆలోచన లేదు. బ్రహ్మదేవుడు చెప్పి నట్లు నేను అన్ని పనులయందు దేవతల వశములో ఉండవలెను కదా?

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూటనాల్గవ సర్గ సమాప్తము.

# అథ పఞ్చాధికశతతమః సర్గః

[దుర్వాసుడు శపించు ననే భయముచేత లక్ష్మణుడు నియమభంగమైనను లెక్కచేయక రాముని దగ్గరకు వచ్చి అతని రాకను గూర్చి చెప్పుట. రాముడు దుర్వాసునకు భోజనము పెట్టుట. అతడు వెళ్లిపోయిన పిమ్మట రామునకు లక్ష్మణుని విషయమున చింత కలుగుట.]

మూ. తథా తయోః సంవదతోర్దుర్వాసా భగవాన్ ఋషిః,
రామస్య దర్శనాకాఙ్క్షీ రాజద్వారముపాగమత్. 1

ప్ర. అ. తయోః = వారిద్దరూ, తథా = అట్లు, సంవదతోః = సంభాషణ చేయుచుండగా, భగవాన్ = పూజ్యుడైన, దుర్వాసాః ఋషిః = దుర్వాసఋషి, రామస్య = రామునియొక్క, దర్శనాకాఙ్క్షీ = దర్శనమును కోరుచున్నవాడై, రాజద్వారమ్ = రాజద్వారమును, ఉపాగమత్ = పొందెను.

తా. ఆ రాముడు కాలపురుషుడు ఈ విధముగా సంభాషణ చేయుచుండగా పూజ్యుడైన దుర్వాసముని రాముని దర్శనమును కోరుచు రాజద్వారము వద్దకు వచ్చెను. 1

మూ. సోఽభిగమ్య తు సౌమిత్రిమువాచ ఋషిసత్తమః,
రామం దర్శయ మే శీఘ్రం పురా మేఽర్థోఽతివర్తతే. 2

ప్ర. అ. సః ఋషిసత్తమః = ఆ ముని శ్రేష్ఠుడు, సౌమిత్రిమ్ = లక్ష్మణుణ్ణి, అభిగమ్య = సమీపించి, ఉవాచ = పలికెను. శీఘ్రమ్ = శీఘ్రముగా, రామమ్ = రాముణ్ణి, దర్శయ = చూపుము; మే = నాయొక్క, అర్థః = పని, పురా అతివర్తతే = దాటిపోగలదు.

తా. ఆ మహాముని లక్ష్మణుని సమీపించి- "శీఘ్రముగా నాకు రాముణ్ణి చూపుము; కానిచో నా కార్యము మించిపోవును" అని పలికెను. 2

మూ. మునేస్తు భాషితం శ్రుత్వా లక్ష్మణః పరవీరహా,
అభివాద్య మహాత్మానం వాక్యమేతదువాచ హ. 3

ప్ర. అ. పరవీరహా = శత్రువీరసంహారకుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, మునేః = మునియొక్క, భాషితమ్ = మాటను, శ్రుత్వా = విని, మహాత్మానమ్ = ఆ మహాత్ముణ్ణి, అభివాద్య = నమస్కరించి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. శత్రువీరసంహరకుడైన లక్ష్మణుడు ఆ ముని మాటలు విని, మహాత్ముడైన ఆతనికి నమస్కరించి ఇట్లు పలికెను. 3

మూ. కిం కార్యం బ్రూహి భగవన్ కో హ్యర్థః కిం కరోమ్యహమ్,
వ్యగ్రో హి రాఘవో బ్రహ్మన్ ముహూర్తం ప్రతిపాల్యతామ్.

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! కార్యమ్ = కార్యము, కిమ్ = ఏమి? బ్రూహి = చెప్పుము. అర్థః = ప్రయోజనము, కః = ఏమి? అహమ్ = నేను, కిమ్ = ఏమి, కరోమి = చేయుదును? బ్రహ్మన్ = బ్రాహ్మణా! రాఘవః = రాముడు, వ్యగ్రః హి = పనితొందరలో ఉన్నాడు. ముహూర్తమ్ = ముహూర్తకాలము, ప్రతిపాల్యతామ్ = నిరీక్షింపబడుగాక.

తా. పూజ్యుడా! ఏమి పనో చెప్పుము. ఏ ప్రయోజనమునకై వచ్చినావు? నేను నీకు ఏమి చేయుదును? బ్రాహ్మణా! రాముడు పనితొందరలో ఉన్నాడు. ఒక్క ముహూర్తము నిరీక్షించుము. 4

మూ. తచ్ఛ్రుత్వా మునిశార్దూలః క్రోధేన కలుషీకృతః,
ఉవాచ లక్ష్మణం వాక్యం నిర్దహన్నివ చక్షుషా. 5

ప్ర. అ. మునిశార్దూలః = ముని శ్రేష్ఠుడు, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, క్రోధేన = కోపముచేత, కలుషీకృతః = కలుషముచేయబడినవాడై, చక్షుషా = నేత్రముచేత, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి నిర్దహన్ ఇవ = కాల్చివేయుచున్నవాడు వలె, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ మునిశ్రేష్ఠుడు ఆ మాట విని కోపావేశము పొంది లక్ష్మణుణ్ణి చూపుతో కాల్చివేయుచున్నాడా అన్నట్లు చూచుచు ఇట్లు పలికెను. 5

మూ. అస్మిన్ క్షణే మాం సౌమిత్రే రామాయ ప్రతివేదయ,
అస్మిన్ క్షణే మాం సౌమిత్రే న నివేదయసే యది. 6

విషయం త్వాం పురం చైవ శపిష్యే రాఘవం తథా,
భరతం చైవ సౌమిత్రే యుష్మాకం యా చ సంతతిః. 7
న హి శక్ష్యామ్యహం భూయో మన్యుం ధారయితుం హృది.

ప్ర. అ. సౌమిత్రే = లక్షణా ! అస్మిన్ క్షణే = ఈ క్షణమునందు, మామ్ = నన్ను, రామాయ = రామునకు, ప్రతివేదయ = తెలుపుము. సౌమిత్రే = లక్ష్మణా! అస్మిన్ క్షణే = ఈ క్షణమునందు, మామ్ = నన్ను, న నివేదయసే యది = తెలుపకపోయినట్లయితే, విషయమ్ = దేశమును, త్వామ్ = నిన్ను, పురం చైవ = పట్టణమును, తథా = మరియు, రాఘవమ్ = రాముణ్ణి, భరతం చ = భరతుణ్ణి, యుష్మాకమ్ = మీయొక్క, యా = ఏ, సంతతిః = సంతాన మున్నదో దానిని, శపిష్యే = శపించెదను, సౌమిత్రే = లక్ష్మణా ! అహమ్ = నేను, మన్యుమ్ = కోపమును, హృది = హృదయమునందు, ధారయితుమ్ = ధరించుటకు, భూయః = మరల, న శక్ష్యామి హి = సమర్థుడను కానుకదా ?

తా. లక్ష్మణా ! నన్ను గూర్చి రామునకు ఈ క్షణమునందే తెలుపుము. అట్లు చేయకపోయినచో ఈ దేశమును, నిన్ను, రాముణ్ణి, భరతుణ్ణి, మీ సంతానమును కూడ శపించెదను. నేను నా కోపమును మనస్సులో అణచుకొనజాలను. 6,7

మూ. తచ్ఛ్రుత్వా ఘోరసంకాశం వాక్యం తస్య మహాత్మనః,
చిన్తయామాస మనసా తస్య వాక్యస్య నిశ్చయమ్. 8

ప్ర. అ. మహాత్మనః = మహాత్ముడైన, తస్య = ఆ మునియొక్క, ఘోరసంకాశమ్ = భయంకరమైన, తత్ వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, తస్య వాక్యస్య = ఆ వాక్యముయొక్క, నిశ్చయమ్ = నిర్ణయమును గూర్చి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. మహాప్రభావవంతుడైన ఆ మునీశ్వరుని భయంకరమైన ఆ వాక్యమును విని లక్ష్మణుడు ఆ వాక్యము విషయమున చేయవలసిన నిర్ణయమును గూర్చి ఆలోచించెను. 8

మూ. ఏకస్య మరణం మేఽస్తు మా భూత్సర్వవినాశనమ్,
ఇతి బుద్ధ్యా వినిశ్చిత్య రాఘవాయ న్యవేదయత్. 9

ప్ర. అ. ఏకస్య = ఒక్క, మే = నా యొక్క, మరణమ్ = మరణము, అస్తు = అగుగాక. సర్వవినాశనమ్ = అందరియొక్క నాశనము, మా భూత్ = కలగకపోవుగాక. ఇతి = ఇట్లు, బుద్ధ్యా = బుద్ధి చేత, వినిశ్చిత్య = నిశ్చయించి, రాఘవాయ = రామునకు, న్యవేదయత్ = తెలిపెను.

తా. "నాకు ఒక్కనికే మరణము వచ్చుగాక, అందరికి వినాశము రాకుండుగాక" అని మనస్సులో నిశ్చయించుకొని లక్ష్మణుడు రామునకు అతనిని గూర్చి తెలిపెను. 9

మూ. లక్ష్మణస్య వచః శ్రుత్వా రామః కాలం విసృజ్య చ,
నిఃసృత్య త్వరితో రాజా అత్రేః పుత్రం దదర్శ హ. 10

ప్ర. అ. రాజా = రాజైన, రామః = రాముడు, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, కాలమ్ = కాలపురుషుణ్ణి, విసృజ్య చ = పంపివేసి, త్వరితః = తొందరపడుచున్నవాడై, నిఃసృత్య = బైటకు వచ్చి, అత్రేః = అత్రిమహర్షియొక్క, పుత్రమ్ = పుత్రుడైన దుర్వాసుణ్ణి, దదర్శ హ = చూచెను.

తా. రాజైన రాముడు లక్ష్మణుని మాటలు విని, కాలపురుషుణ్ణి పంపివేసి, తొందరపడుచు బైటకు వచ్చి దుర్వాసుణ్ణి చూచెను. 10

మూ. సోఽభివాద్య మహాత్మానం జ్వలన్తమివ తేజసా,
కిం కార్యమితి కాకుత్స్థః కృతాఞ్జలిరభాషత. 11

ప్ర. అ. సః కాకుత్స్థః = ఆ రాముడు, తేజసా = తేజస్సుతో, జ్వలన్తమ్ ఇవ = మండుచున్నాడా అన్నట్లు ఉన్న, మహాత్మానమ్ = ఆ మహాత్ముణ్ణి, అభివాద్య = నమస్కరించి, కృతాఞ్జలిః = చేయబడిన దోసిలి కలవాడై, కిమ్ = ఏమి, కార్యమ్ = చేయవలెను, ఇతి = అని, అభాషత = పలికెను.

తా. రాముడు తేజస్సుతో మండుచున్నాడా అన్నట్లున్న ఆ మునీశ్వరునికి నమస్కరించి అంజలి ఘటించి "ఏమి చేయవలెను ?" అని ప్రశ్నించెను. 11

మూ. తద్వాక్యం రాఘవేణోక్తం శ్రుత్వా మునివరః ప్రభుః, 12
ప్రత్యాహ రామం దుర్వాసాః శ్రూయతాం ధర్మవత్సల.

ప్ర. అ. ప్రభుః = సర్వసమర్థుడు, మునివరః = మునిశ్రేష్ఠుడు అయిన, దుర్వాసాః = దుర్వాసుడు, రాఘవేణ = రాముని చేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, రామమ్ = రాముణ్ణి గూర్చి, ప్రత్యాహ = తిరిగి పలికెను. ధర్మవత్సల = ధర్మమునందు ప్రేమ కలవాడా! శ్రూయతామ్ = వినబడుగాక.

తా. సమర్థుడు, మునిశ్రేష్ఠుడూ అయిన ఆ దుర్వాసుడు రాముని మాటలు విని రామునితో ఇట్లనెను– "ధర్మమునందు ఆసక్తి కలవాడా ! వినుము." 12

మూ. అద్య వర్షసహస్రస్య సమాప్తిర్మమ రాఘవ, 13
సోఽహం భోజనమిచ్ఛామి యథాసిద్ధం తవానఘ.

ప్ర. అ. రాఘవ = రామా! అద్య = నేడు, మమ = నాకు, వర్షసహస్రస్య = వెయ్యి సంవత్సరముల యొక్క, సమాప్తిః = సమాప్తి. అనఘ = దోషములు లేనివాడా ! సః అహమ్ = అట్టి నేను, తవ = నీయొక్క, యథాసిద్ధమ్ = ఎట్లు సిద్ధముగా ఉన్నదో అట్టి, భోజనమ్ = భోజనమును, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. రామా ! నేను అనశనవ్రతము ప్రారంభించి ఈ నాటికి వెయ్యి సంవత్సరములు పూర్తి అయినవి. అట్టి నేను నీ విచ్చిన భోజనమును, ఎట్లు సిద్ధముగా ఉన్నదో అట్లు, చేయ వలె నని కోరుచున్నాను. 13

మూ. తచ్ఛ్రుత్వా వచనం రాజా రాఘవః ప్రీతమానసః, 14
భోజనం మునిముఖ్యాయ యథాసిద్ధముపాహరత్.

ప్ర. అ. రాజా = రాజైన, రాఘవః = రాముడు, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, ప్రీతమానసః = సంతోషించిన మనస్సు కలవాడై, మునిముఖ్యాయ = మునులలో ముఖ్యుడైన దుర్వాసునకు, యథాసిద్ధమ్ = ఎట్లు సిద్ధముగా ఉన్నదో అట్లు, భోజనమ్ = భోజనమును, ఉపాహరత్ = సమర్పించెను.

తా. ఆ మాటలు విని రాజైన రాముడు సంతోషించి ఆ దుర్వాసునకు యథాసిద్ధముగా భోజనము పెట్టించెను. 14

మూ. స తు భుక్త్వా మునిశ్రేష్ఠస్తదన్నమమృతోపమమ్, 15
సాధు రామేతి సంభాష్య స్వమాశ్రమముపాగమత్.

ప్ర. అ. సః=ఆ, మునిశ్రేష్ఠః=మునిశ్రేష్ఠుడు, అమృతోపమమ్=అమృతముతో సమానమైన, తత్=ఆ, అన్నమ్=అన్నమును, భుక్త్వా=భుజించి, రామ=రామా! సాధు=బాగున్నది, ఇతి = అని, సంభాష్య = పలికి, స్వమ్ ఆశ్రమమ్=తన ఆశ్రమమును, ఉపాగమత్ = పొందెను.

తా. ఆ మునిశ్రేష్ఠుడు అమృతము వంటి ఆ అన్నమును తిని "రామా చాలా బాగున్నది" అని పలికి తన ఆశ్రమమునకు వెళ్ళిపోయెను. 15

మూ. తస్మిన్ గతే మునివరే స్వాశ్రమం లక్ష్మణాగ్రజః, 16
సంస్మృత్య కాలవాక్యాని తతో దుఃఖముపాగమత్

ప్ర. అ. తస్మిన్ = ఆ, మునివరే = మునిశ్రేష్ఠుడు, స్వాశ్రమమ్ = తన ఆశ్రమమును గూర్చి, గతే = వెళ్ళిన వాడగుచుండగా, లక్ష్మణాగ్రజః=రాముడు, కాలవాక్యాని = కాలపురుషుని వాక్యములను, సంస్మృత్య = స్మరించి, తతః= పిమ్మట, దుఃఖమ్ = దుఃఖమును, ఉపాగమత్ = పొందెను.

తా. దుర్వాసుడు ఆశ్రమమునకు వెళ్ళిన పిమ్మట రాముడు కాలపురుషుని మాటలు స్మరించి దుఃఖాక్రాంతు డయ్యెను. 16

మూ. దుఃఖేన చ సుసంతప్తః స్మృత్వా తద్ఘోరదర్శనమ్, 17
అవాఙ్ముఖో దీనమనా వ్యాహర్తుం న శశాక హ.

ప్ర. అ. ఘోరదర్శనమ్ = ఘోరమైన దర్శనము గల, తత్ = ఆ వాక్యమును, స్మృత్వా = స్మరించి. దుఃఖేన= దుఃఖముచేత, సుసంతప్తః = మిక్కిలి తపింపచేయబడినవాడై, అవాఙ్ముఖః = క్రిందికి ముఖము గలవాడై, దీనమనాః = దీనమైన మనస్సు గలవాడై, వ్యాహర్తుమ్ = మాటలాడుటకు, న శశాక = సమర్థుడు కాలేదు.

తా. భయంకరముగా కనబడుచున్న ఆ వాక్యమును స్మరించి దుఃఖసంతప్తుడై, దైన్యముతో తలవంచుకొని ఏమీ మాటలాడజాలక పోయెను. 17

మూ. తతో బుద్ధ్యా వినిశ్చిత్య కాలవాక్యాని రాఘవః, 18
నైతదస్తీతి నిశ్చిత్య తూష్ణీమాసీన్మహాయశాః.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
పఞ్చోత్తరశతతమః సర్గః

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తి గల, రాఘవః = రాముడు, తతః = అటు పిమ్మట, కాలవాక్యాని = కాలపురుషుని వాక్యములను, బుద్ధ్యా = బుద్ధిచేత, వినిశ్చిత్య = నిశ్చయించుకొని, ఏతత్ = ఇది, నాస్తి = లేదు, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించి, తూష్ణీమ్ ఆసీత్ = మౌనముగా ఉండెను.

తా. మహాకీర్తిమంతుడైన రాముడు పిమ్మట కాలపురుషుడు చెప్పిన మాటలు స్మరించి ఇంక ఏమైనా సోదరాది పరివార మంతా నశించవలసినదే అని నిర్ణయించుకొని మౌనముగా నుండెను.

"బాలనందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూట ఐదవ సర్గ సమాప్తము.

# అథ షడుత్తరశతతమః సర్గః

[*రామునిచే విడువబడిన లక్ష్మణుడు శరీరముతో స్వర్గమునకు వెళ్ళుట*].

మూ. అవాఙ్ముఖమథో దీనం దృష్ట్వా సోమమివాప్లుతమ్,
రాఘవం లక్ష్మణో వాక్యం హృష్టో మధురమబ్రవీత్. 1

ప్ర. అ. అథో = అటుపిమ్మట. అవాఙ్ముఖమ్ = క్రిందికి ముఖము కలవాడు, దీనమ్ = దీనుడు, ఆప్లుతమ్ = రాహుగ్రస్తుడైన, సోమమ్ ఇవ = చంద్రుడు వలె ఉన్న, రాఘవమ్ = రాముణ్ణి గూర్చి, లక్ష్మణః = లక్ష్మణుడు, హృష్టః = సంతోషించిన వాడై, మధురమ్ = మధురమైన వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. తల క్రిందికి వంచి దీనుడై రాహుగ్రస్తుడైన చంద్రుడు వలె ఉన్న రాముణ్ణి చూచి లక్ష్మణుడు సంతోషపూర్వకముగా మధురమైన వాక్యము పలికెను.

మూ. న సంతాపం మహాబాహో మదర్థం కర్తుమర్హసి,
పూర్వనిర్మాణబద్ధా హి కాలస్య గతిరీదృశీ. 2

ప్ర. అ. మహాబాహో = మహాబాహూ ! మదర్థమ్ = నా నిమిత్తము, సంతాపమ్ = తాపమును, కర్తుమ్ = చేయుటకు, న అర్హసి = తగవు. కాలస్య = కాలముయొక్క, పూర్వనిర్మాణ బద్ధా = ముందుగానే జరిగిన ఏర్పాటుచేత బద్ధమైన, గతిః = గతి, ఈదృశీ హి = ఇట్టిదే కదా ?

తా. మహాబాహూ ! నా నిమిత్తము దుఃఖము చెందకుము. పూర్వము చేయబడిన నిర్మాణముచేత కాలగతి ఈ విధముగానే ఉండును గదా ? 2

మూ. జహి మాం సౌమ్య విస్రబ్ధం ప్రతిజ్ఞాం పరిపాలయ,
హీనప్రతిజ్ఞాః కాకుత్స్థ ప్రయాన్తి నరకం నరాః. 3

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడా ! మామ్ = నన్ను, విస్రబ్ధమ్ = నిస్సంశ

యముగా, జహి=చంపుము. ప్రతిజ్ఞామ్=ప్రతిజ్ఞను, పరిపాలయ=పాలించుము. కాకుత్స్థ= రామా! హీనప్రతిజ్ఞాః= హీనమైన ప్రతిజ్ఞ కల, నరాః=మానవులు, నరకమ్ = నరకమును గూర్చి, ప్రయాన్తి= వెళ్ళుదురు.

తా. సౌమ్యా! నిఃసందేహముగా నన్ను చంపుము. ప్రతిజ్ఞను పరిపాలించుము. ప్రతిజ్ఞ నిలబెట్టుకొనని నరులు నరకమునకు పోవుదురు. 3

మూ. లక్ష్మణేన తథోక్తస్తు రామః ప్రచలితేన్ద్రియః,
మన్త్రిణః సముపానీయ తథైవ చ పురోధసః, 4

అబ్రవీచ్చ తదా వృత్తం తేషాం మధ్యే స రాఘవః,
దుర్వాసోఽభిగమం చైవ ప్రతిజ్ఞాం తాపసస్య చ. 5

ప్ర. అ. లక్ష్మణేన= లక్ష్మణునిచేత, తథా= అట్లు, ఉక్తః= పలకబడిన, రామః= రాముడు, ప్రచలితేన్ద్రియః=చలించిన మనస్సు గలవాడై, మన్త్రిణః= మంత్రులను, తథైవ= మరియు, పురోధసః= పురోహితులను, సముపానీయ= రప్పించి, తదా= అప్పుడు, సః రాఘవః=ఆ రాముడు, తేషామ్= వారియొక్క, మధ్యే=మధ్యయందు, దుర్వాసోభిగమం చైవ=దుర్వాసుని రాకను, తాపసస్య= మునియొక్క, ప్రతిజ్ఞాం చైవ= ప్రతిజ్ఞను, వృత్తమ్= జరిగినదానిని అంతనూ, అబ్రవీత్ చ = చెప్పెను.

తా. రాముడు లక్ష్మణుని మాటలు విని, చలించిన మనస్సుతో (మనస్సులో దుఃఖించుచు), మంత్రులను పురోహితులను పిలిపించి వారికి దుర్వాసుని రాక, ఆ తాపసుని ప్రతిజ్ఞ మొదలైన వృత్తాంతమును చెప్పెను. 4,5

మూ. తచ్ఛ్రుత్వా మన్త్రిణః సర్వే సోపాధ్యాయాః సమాసత,
వసిష్ఠస్తు మహాతేజా వాక్యమేతదువాచ హ. 6

ప్ర. అ. తత్ = దానిని, శ్రుత్వా= విని, సోపాధ్యాయాః= ఉపాధ్యాయులతోకూడిన, మన్త్రిణః= మంత్రులు, సర్వే=అందరూ, సమాసత = మౌనముగా కూర్చుండిరి. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, వసిష్ఠస్తు=వసిష్ఠుడైతే, ఏతత్= ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ఆ విషయము విన్న మంత్రులు, ఉపాధ్యాయులు అందరూ కూడ

మౌనముగా కూర్చుండిరి. గొప్ప తేజస్సు గల వసిష్ఠుడు మాత్రము ఇట్లు పలికెను. 6

మూ. దృష్టమేతన్మహాబాహో క్షయం తే రోమహర్షణమ్,
లక్ష్మణేన వియోగశ్చ తవ రామ మహాయశః. 7

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! మహాయశః = గొప్ప కీర్తి కలవాడా! రామ = రామా! తే = నీయొక్క, ఏతత్ = ఈ, రోమహర్షణమ్ = రోమాంచమును కలిగించు, క్షయమ్ = క్షయము, లక్ష్మణేన = లక్ష్మణునితో, తవ = నీయొక్క, వియోగః చ = వియోగము, దృష్టమ్ = చూడబడినది.

తా. గొప్ప తపస్సు, కీర్తి గల రామా! నీకు రాబోవు భయంకరమైన ఈ క్షయమును గూర్చి లక్ష్మణునితో నీకు వియోగమును గూర్చి నాకు ముందుగానే తెలియును. 7

మూ. త్యజైనం బలవాన్ కాలో మా ప్రతిజ్ఞాం వృథా కృథాః,
ప్రతిజ్ఞాయాం హి నష్టాయాం ధర్మో హి విలయం ప్రజేత్.

ప్ర. అ. ఏనమ్ = ఇతనిని, త్యజ = విడువుము. కాలః = కాలము, బలవాన్ = బలము కలది. ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, వృథా = వ్యర్థమునుగా, మా కృథాః = చేయకుము. ప్రతిజ్ఞాయామ్ = ప్రతిజ్ఞ, నష్టాయామ్ = నష్టమైన దగుచుండగా, ధర్మః = ధర్మము, విలయమ్ = వినాశమును, ప్రజేత్ హి = పొందును కదా.

తా. ఈ లక్ష్మణుణ్ణి విడిచివేయుము. కాలము బలవత్తరమైనది. ప్రతిజ్ఞను వ్యర్థము చేయకుము. ప్రతిజ్ఞ నష్టమైనచో ధర్మము నశించును కదా? 8

మూ. తతో ధర్మే వినష్టే తు త్రైలోక్యం సచరాచరమ్,
సదేవర్షిగణం సర్వం వినశ్యేత్తు న సంశయః. 9

ప్ర. అ. ధర్మే = ధర్మము, వినష్టే తు = నష్టమైనచో, తతః = అటు పిమ్మట, సచరాచరమ్ = చరాచరములతో కూడిన, సదేవర్షిగణమ్ = దేవర్షిగణములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, సర్వమ్ = సమస్తమూ, వినశ్యేత్ తు = నశించును. సంశయః = సంశయము, న = లేదు.

తా. ధర్మము నశించినచో స్థావరజంగమములతోను, దేవగణఋషిగణములతోను కూడిన మూడులోకములు నశించును, సంశయము లేదు. 9

మూ. స త్వం పురుషశార్దూల త్రైలోక్యస్యాభిపాలనాత్,
లక్ష్మణేన వినా చాద్య జగత్ స్వస్థం కురుష్వ హ. 10

ప్ర. అ. పురుషశార్దూల = పురుషశ్రేష్ఠుడా! సః త్వమ్ = అట్టి నీవు, అద్య = ఇప్పుడు, లక్ష్మణేన వినా = లక్ష్మణుడు లేకుండా ఉండుటచేత, త్రైలోక్యస్య = మూడులోకములయొక్క, అభిపాలనాత్ = పాలనమువలన, జగత్ = జగత్తును, స్వస్థమ్ = స్వస్థమైనదానినిగా, కురుష్వ హ = చేయుము.

తా. పురుషశ్రేష్ఠుడా! అట్టి నీవు ఇప్పుడు లక్ష్మణుణ్ణి విడచిపెట్టుట ద్వారా ముల్లోకములను రక్షించుటవలన జగత్తు స్వస్థముగా ఉండునట్లు చేయుము. 10

మూ. తేషాం తత్సమవేతానాం వాక్యం ధర్మార్థసంహితమ్,
శ్రుత్వా పరిషదో మధ్యే రామో లక్ష్మణమబ్రవీత్. 11

ప్ర. అ. సమవేతానామ్ = కలసిన, తేషామ్ = వాళ్లయొక్క, ధర్మార్థసంహితమ్ = ధర్మార్థములతో కూడిన, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, పరిషదః = పరిషత్తుయొక్క, మధ్యే = మధ్యయందు, రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను

తా. సభలో కలిసిన వారందరూ పలికిన ధర్మార్థములకు సంమతమైన ఆ వాక్యమును విని రాముడు పరిషత్తు మధ్యయందు లక్ష్మణునితో ఇట్లనెను. 11

మూ. విసర్జయే త్వాం సౌమిత్రే మా భూద్ధర్మవిపర్యయః,
త్యాగో వధో వా విహితః సాధూనాం హ్యుభయం సమమ్.

ప్ర. అ. సౌమిత్రే = లక్ష్మణా! త్వామ్ = నిన్ను, విసర్జయే = విడచివేయుచున్నాను. ధర్మవిపర్యయః = ధర్మమునకు వైపరీత్యము, మా భూత్ = కలుగకుండుగాక. సాధూనామ్ = సత్పురుషులకు, విహితః = విధించబడిన, త్యాగః = త్యాగమైనా, వధో వా = వధయైనా, ఉభయమ్ = ఉభయమూ కూడ, సమమ్ = సమానమే.

తా. లక్ష్మణా! ధర్మవైపరీత్యము కాకుండుటకై నిన్ను విడిచివేయు చున్నాను. సత్పురుషులకు త్యాగము విధించినా, వధను విధించినా రెండూ సమానములే. 12

మూ. రామేణ భాషితే వాక్యే బాష్పవ్యాకులితేన్ద్రియః,
లక్ష్మణ స్త్వరితః ప్రాయాత్స్వగృహం న వివేశ హ. 13

ప్ర. అ. రామేణ = రామునిచేత, వాక్యే = వాక్యము, భాషితే = పలకబడిన దగుచుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, బాష్పవ్యాకులితేన్ద్రియః = కన్నీళ్ళచేత వ్యాకులము చేయబడిన ఇంద్రియములు కలవాడై, త్వరితః = తొందరపడుచున్న వాడై, ప్రాయాత్ = వెళ్ళిపోయెను. స్వగృహమ్ = తన గృహమును, న వివేశ హ = ప్రవేశించలేదు.

తా. రాముడు ఇట్లు అనగానే లక్ష్మణుడు, కన్నీళ్ళతో ఇంద్రియములు వ్యాకులములు కాగా, తన ఇంటికి కూడ వెళ్ళకుండగా, తొందరగా, వెళ్ళి పోయెను. 13

మూ. స గత్వా సరయూతీరముపస్పృశ్య కృతాఞ్జలిః,
నిగృహ్య సర్వస్రోతాంసి నిఃశ్వాసం న ముమోచ హ.

ప్ర. అ. సః = లక్ష్మణుడు, సరయూతీరమ్ = సరయూనదీతీరమును గూర్చి, గత్వా = వెళ్ళి, ఉపస్పృశ్య = ఆచమనము చేసి, కృతాఞ్జలిః = చేయ బడిన దోసిలి కలవాడై, సర్వస్రోతాంసి = అన్ని రంధ్రములను, నిగృహ్య = నిగ్రహించుకొని, నిఃశ్వాసమ్ = శ్వాసను, న ముమోచ హ = విడవలేదు.

తా. ఆ లక్ష్మణుడు సరయూనదీతీరమునకు వెళ్ళి ఆచమనము చేసి, అంజలి ఘటించి నమస్కరించి, అన్ని శరీరద్వారములను నిగ్రహించి ఊపిరి బైటకు విడవకుండ కూర్చుండెను. 14

మూ. అనిఃశ్వసన్తం యుక్తం తం సశక్రాః సాప్సరోగణాః,
దేవాః సర్షిగణాః సర్వే పుష్పైరభ్యకిరంస్తదా. 15

ప్ర. అ. అనిఃశ్వసన్తమ్ = నిఃశ్వాసము చేయని, యుక్తమ్ = యోగ సమాధిలో ఉన్న, తమ్ = అతనిని, తదా = అప్పుడు, సశక్రాః = ఇంద్రునితో కూడిన, సాప్సరోగణాః = అప్సరఃస్త్రీసముదాయముతో కూడిన, సర్షిగణాః = ఋషి

గణములతో కూడిన, సర్వే = సమస్తమైన, దేవాః = దేవతలు, పుష్పైః = పుష్పములచేత, అభ్యకిరన్ = చల్లిరి

తా. ఉచ్ఛ్వాసనిఃశ్వాసలు లేక యోగసమాధిలో ఉన్న అతనిపై ఇంద్రుడు, అప్సరఃస్త్రీలు, ఋషులు, సకలదేవతలూ కూడ పుష్పములు చల్లిరి. 15

మూ. అదృశ్యం సర్వమనుజైః సశరీరం మహాబలమ్,
ప్రగృహ్య లక్ష్మణం శక్రస్త్రిదివం సంవివేశ హ. 16

ప్ర. అ. శక్రః = దేవేంద్రుడు, సర్వమనుజైః = సకలమనుజులచేతను, అదృశ్యమ్ = చూడబడని, మహాబలమ్ = గొప్ప బలము గల, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, సశరీరమ్ = శరీరసహితునిగా, ప్రగృహ్య = గ్రహించి, త్రిదివమ్ = స్వర్గమును, సంవివేశ హ = ప్రవేశించెను.

తా. ఇంద్రుడు మనుష్యుల కెవరికీ కనబడని మహాబలశాలియైన ఆ లక్ష్మణుణ్ణి సశరీరముగా తీసికొనివెళ్ళి స్వర్గములో ప్రవేశించెను. 16

మూ. తతో విష్ణోశ్చతుర్భాగమాగతం సురసత్తమాః,
దృష్ట్వా ప్రముదితాః సర్వే పూజయన్తి స్మ రాఘవమ్. 17

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
షడుత్తరశతతమః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సర్వే = సమస్తమైన, సురసత్తమాః = దేవతాశ్రేష్ఠులు, విష్ణోః = విష్ణువుయొక్క, చతుర్భాగమ్ = నాల్గవ భాగమును, ఆగతమ్ = వచ్చినదానినిగా, దృష్ట్వా = చూచి, ప్రముదితాః = సంతోషించినవారై, రాఘవమ్ = లక్ష్మణుణ్ణి, పూజయన్తి స్మ = పూజించిరి.

తా. అప్పుడు దేవతాముఖ్యు లందరూ విష్ణువు నాల్గవ భాగము వచ్చినట్లు చూచి చాల సంతోషించి లక్ష్మణుణ్ణి పూజించిరి. 17

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో నూటఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తోత్తరశతతమః సర్గః

[వసిష్ఠుని ఆజ్ఞ ప్రకారము పౌరు లందరినీ తనతో పరమధామమునకు తీసికొనివెళ్లవలె నని రాముడు ఆలోచించుట, కుశలవులను రాజ్యమునందు అభిషిక్తులను చేయుట.]

మూ. విసృజ్య లక్ష్మణం రామో దుఃఖశోకసమన్వితః,
పురోధసం మన్త్రిణశ్చ నైగమాంశ్చేదమబ్రవీత్. 1

ప్ర. అ. రామః = రాముడు, లక్ష్మణమ్ = లక్ష్మణుణ్ణి, విసృజ్య = విడచి, దుఃఖశోకసమన్వితః = దుఃఖశోకములతో కూడినవాడై, పురోధసమ్ = పురోహితుణ్ణి, మన్త్రిణః చ = మంత్రులను, నైగమాన్ చ = సంఘముఖ్యులను గూర్చి, ఇదమ్ = దీనిని, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు లక్ష్మణుణ్ణి విడిచివేసి, దుఃఖశోకములతో బాధపడుచు పురోహితునితోను, మంత్రులతోను, సంఘముఖ్యులతోను ఇట్లు పలికెను. 1

మూ. అద్య రాజ్యేఽభిషేక్ష్యామి భరతం ధర్మవత్సలమ్,
అయోధ్యాయాః పతిం వీరం తతో యాస్యామ్యహం వనమ్.

ప్ర. అ. ధర్మవత్సలమ్ = ధర్మమునందు ప్రేమ గల, వీరమ్ = వీరుడైన, భరతమ్ = భరతుణ్ణి. అద్య = నేడు, రాజ్యే = రాజ్యమునందు, అయోధ్యాయాః = అయోధ్యయొక్క, పతిమ్ = ప్రభువునుగా, అభిషేక్ష్యామి = అభిషేకించెదను. తతః = అటుపిమ్మట, అహమ్ = నేను, వనమ్ = వనమును గూర్చి, యాస్యామి = వెళ్లెదను.

తా. ధర్మమునందు ఆశక్తి గల వీరుడైన భరతుణ్ణి రాజ్యమునందు, అయోధ్యాధిపతినిగా నేడు అభిషేకించి నేను వనమునకు వెళ్ళెదను. 2

మూ. ప్రవేశయత సంభారాన్ మా భూత్కాలస్య పర్యయః,
అద్యైవాహం గమిష్యామి లక్ష్మణేన గతాం గతిమ్. 3

ప్ర. అ. సంభారాన్ = సంభారములను, ప్రవేశయత = ప్రవేశపెట్టండి. కాలస్య = కాలముయొక్క, పర్యయః = గడచిపోవుట, మా భూత్ = జరగకపోవుగాక. అహమ్ = నేను, అద్యైవ = ఇప్పుడే, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, గతామ్ = పొందబడిన, గతిమ్ = గతిని, గమిష్యామి = పొందగలను.

తా. కావలసిన సామగ్రి తీసికొనిరండి. ఆలస్యము కాకూడదు. నేడే నేను కూడ లక్ష్మణుడు పొందిన గతిని పొందెదను. 3

మూ. తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం సర్వాః ప్రకృతయో భృశమ్,
మూర్ధభిః ప్రణతా భూమౌ గతసత్త్వా ఇవాభవన్. 4

ప్ర. అ. రాఘవేణ = రామునిచేత, ఉక్తమ్ = పలకబడిన, తత్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = అమాత్యాదులు, మూర్ధభిః = శిరస్సులతో, భూమౌ = భూమియందు, ప్రణతాః = వంగినవారై, భృశమ్ = మిక్కిలి, గతసత్త్వాః ఇవ = పోయిన చైతన్యము కలవారు వలె, అభవన్ = అయిరి.

తా. రాముని మాటలు విని సమస్తమైన అమాత్యాది ప్రకృతులు మిక్కిలి చైతన్యవిహీనులు వలె అయి, తలలతో నేలమీద పడిరి. 4

మూ. భరతశ్చ విసంజ్ఞోఽభూచ్ఛ్రుత్వా రాఘవభాషితమ్,
రాజ్యం విగర్హయామాన వచనం చేదమబ్రవీత్. 5

ప్ర. అ. రాఘవభాషితమ్ = రాముని మాటలను, శ్రుత్వా = విని, భరతః చ = భరతుడు, విసంజ్ఞః = సంజ్ఞ లేనివాడు, అభూత్ = ఆయెను. రాజ్యమ్ = రాజ్యమును, విగర్హయామాస = నిందించెను ఇదమ్ = ఈ, వచనం చ = వచనమును కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. రాముని మాటలు విని భరతుడు నిశ్చేష్టుడయ్యెను. రాజ్యమును నిందించి ఇట్లు పలికెను. 5

మూ. సత్యేనాహం శపే రాజన్ స్వర్గభోగేన చైవ హి,
న కామయే యథా రాజ్యం త్వాం వినా రఘునన్దన. 6

ప్ర. అ. రాజన్ = రాజా! రఘునన్దన = రామా! త్వాం వినా = నీవు లేకుండగా, రాజ్యమ్ = రాజ్యమును, యథా = ఎట్లు, న కామయే = కోరనో, సత్యేన = సత్యముచేత, స్వర్గభోగేన చైవ హి = స్వర్గభోగముచేత, అహమ్ = నేను, శపే = ఒట్టుపెట్టుచున్నాను.

తా. రాజా! రామా! నీవు లేనిచో నేను రాజ్యమును కోరనని సత్యము మీద, స్వర్గసుఖాల మీదా ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 6

మూ. ఇమౌ కుశీలవౌ రాజన్నభిషిచ్య నరాధిప,
కోశలేషు కుశం వీరముత్తరేషు తథా లవమ్. 7

ప్ర. అ. నరాధిప = నరుల ప్రభువైన, రాజన్ = రాజా! వీరమ్ = వీరుడైన, కుశమ్ = కుశుణ్ణి, కోశలేషు = దక్షిణ కోశలదేశమునందు, తథా = మరియు, లవమ్ = లవుణ్ణి, ఉత్తరేషు = ఉత్తకోశలదేశమునందు, ఇమౌ = ఈ, కుశీలవౌ = కుశలవులను, అభిషిచ్య = అభిషేకించి (వెళ్ళెదము).

తా. రాజా! వీరుడైన కుశుణ్ణి దక్షిణకోశలదేశమునందు, లవుణ్ణి ఉత్తర కోశలదేశమునందూ, ఈ విధముగ కుశలవు లిద్దరినీ రాజ్యాభిషిక్తులను చేసి వెళ్లెదము. 7

మూ. శత్రుఘ్నస్య చ గచ్ఛన్తు దూతాస్త్వరితవిక్రమాః,
ఇదం గమనమస్మాకం శీఘ్రమాఖ్యాన్తు మా చిరమ్. 8

ప్ర. అ. శత్రుఘ్నస్య = శత్రుఘ్నునకు, త్వరితవిక్రమాః = శీఘ్రగమనము గల, దూతాః = దూతలు, గచ్ఛన్తు = వెళ్ళెదరు గాక. అస్మాకమ్ = మన యొక్క, ఇదమ్ = ఈ, గమనమ్ = గమనమును, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆఖ్యాన్తు = చెప్పెదరుగాక. చిరం మా = ఆలస్యము వద్దు.

తా. శీఘ్రముగా వెళ్ళగల దూతలు శత్రుఘ్నుని వద్దకు వెళ్ళి మన ఈ గమనముమ గూర్చి వెంటనే చెప్పెదరుగాక. ఆలస్యము వద్దు. 8

మూ. తచ్ఛ్రుత్వా భరతేనోక్తం దృష్ట్వా చాపి హ్యధోముఖాన్,
పౌరాన్ దుఃఖేన సంతప్తాన్ వసిష్ఠో వాక్యమబ్రవీత్. 9

ప్ర. అ. వసిష్ఠః = వసిష్ఠుడు, భరతేన = భరతునిచేత, ఉక్తమ్ = చెప్పబడిన ఆ వాక్యమును, శ్రుత్వా = విని, అధోముఖాన్ = క్రిందికి ముఖములు గల, దుఃఖేన = దుఃఖముచేత, సంతప్తాన్ = బాధపడుచున్న, పౌరాన్ = పౌరులను, దృష్ట్వా చాపి = చూచి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వసిష్ఠుడు భరతుని మాటలు విని, దుఃఖపీడితులై తలలు క్రిందికి వంచి ఉన్న పౌరులను చూచి ఇట్లు పలికెను. 9

మూ. వత్స రామ ఇమాః పశ్య ధరణీం ప్రకృతీర్గతాః,
జ్ఞాత్వైషామీప్సితం కార్యం మా చైషాం విప్రియం కృథాః.

ప్ర. అ. రామ=రామా ! వత్స=నాయనా, ధరణీమ్ = భూమిని, గతాః = పొందిన, ఇమాః ప్రకృతీః = ఈ ప్రజలను. పశ్య = చూడుము. ఏషామ్ = వీరియొక్క, ఈప్సితమ్ = ఇష్టమును, జ్ఞాత్వా = తెలిసికొని, కార్యమ్ = చేయదగినది. ఏషామ్=వీరికి, విప్రియమ్=అనిష్టమును, మా చ కృథాః=చేయకుము.

తా. నాయనా ! రామా ! నేలమీద పడి ఉన్న ఈ ప్రజలను చూడుము. వీరి ఇష్ట మేమో తెలిసికొని అది చేయుము. అనిష్టమైనదానిని చేయకుము. 10

మూ. వసిష్ఠస్య తు వాక్యేన ఉత్థాప్య ప్రకృతీజనమ్,
కిం కరోమీతి కాకుత్స్థః సర్వాన్ వచనమబ్రవీత్. 11

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క, వాక్యేన= మాటచేత, ప్రకృతీజనమ్ = ప్రకృతులను, ఉత్థాప్య = లేవదీసి, కిం కరోమి = ఏమి చేయుదును, ఇతి = అని, సర్వాన్ = అందరినీ గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు వసిష్ఠుని మాట ప్రకారము ప్రకృతులను లేవదీసి "నేను ఏమి చేయవలెను ?" అని వారి నందరినీ అడిగెను. 11

మూ. తతః సర్వాః ప్రకృతయో రామం వచనమబ్రువన్,
గచ్ఛన్తమనుగచ్ఛామో యత్ర రామ గమిష్యసి. 12

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = ప్రకృతులు, రామమ్ = రాముణ్ణి గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రువన్ = పలికిరి. రామ = రామా ! యత్ర = ఎచ్చటికి, గమిష్యసి = వెళ్ళగలవో, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్న నిన్ను, అనుగచ్ఛామః = అనుసరించి వెళ్ళెదము.

తా. అప్పుడు ఆ ప్రకృతు లందరూ రామునితో ఇట్లు పలికిరి. "రామా ! నీవు ఎక్కడికి వెళ్ళెదవో అక్కడికి మేము నీ వెనుకనే వచ్చెదము." 12

మూ. పౌరేషు యది తే ప్రీతిర్యది స్నేహో హ్యనుత్తమః,
సపుత్రదారాః కాకుత్స్థ సమం గచ్ఛామ సత్పథమ్. 13

ప్ర. అ. కాకుత్స్థ = రామా ! తే = నీకు, పౌరేషు = పౌరులయందు, ప్రీతిః యది = ప్రేమ ఉన్నచో, అనుత్తమః = అత్యుత్తమమైన, స్నేహః = స్నేహమున్నచో, సపుత్రదారాః = పుత్రులతోను, భార్యలతోను కూడిన మేము, సమమ్ = నీతో కూడ, సత్పథమ్ = సన్మార్గమును గూర్చి, గచ్ఛామ = వెళ్లెదము.

తా. రామా ! నీకు పౌరులమైన మాపై ప్రేమ, అత్యధికమైన స్నేహము ఉన్నచో మేము భార్యాపుత్రాదులతో కలిసి నీతో సన్మార్గమున వెళ్లెదము. 13

మూ. తపోవనం వా దుర్గం వా నదీమమ్భోనిధిం తథా,
వయం తే యది న త్యాజ్యాః సర్వాన్నో నయ ఈశ్వర.

ప్ర. అ. ఈశ్వర = ప్రభూ ! వయమ్ = మేము, తే = నీకు, న త్యాజ్యాః యది = విడువదగినవారము కానిచో, సర్వాన్ = సమస్తమైన, నః = మమ్ములను, తపోవనం వా = తపోవనమును గూర్చి గాని, దుర్గం వా = దుర్గమును గూర్చి గాని, నదీమ్ = నదిని గూర్చి గాని, తథా = మరియు, అమ్భోనిధిం వా = సముద్రమును గూర్చి గాని, నయ = తీసికొనివెళ్ళుము.

తా. ప్రభూ ! మేము విడిచివేయదగినవారము కాము అని నీకున్నచో, మమ్ములను అందరినీ తపోవనమునకైనా, దుర్గమునకైనా, నదిలోనికైనా, సముద్రములోనికైనా నీతో తీసికొనివెళ్ళుము. 14

మూ. ఏషా నః పరమా ప్రీతిరేష నః పరమో వరః,
హృద్గతా నః సదా ప్రీతిస్తవానుగమనే నృప. 15

ప్ర. అ. నృప = రాజా ! ఏషా = ఇదే, నః = మాయొక్క, పరమా = గొప్ప, ప్రీతిః = సంతోషము. ఏషః = ఇదే, నః = మాయొక్క, పరమః = గొప్ప, వరః = వరము, తవ = నీయొక్క, అనుగమనే = అనుసరించి వెళ్ళుటయందే, సదా = ఎల్లప్పుడూ, నః = మాయొక్క, హృద్గతా = హృదయములో ఉన్న, ప్రీతిః = ఆనందము.

తా. రాజా ! ఇదే మా గొప్ప సంతోషము. ఇదే మాకు గొప్ప వరము. నిన్ను అనుసరించి వెళ్ళుట మాకు పరమానందము. 15

మూ. పౌరాణాం దృఢభక్తిం చ బాఢమిత్యేవ సోఽబ్రవీత్,
స్వకృతాన్తం చాన్వవేక్ష్య తస్మిన్నహని రాఘవః. 16

ప్ర. అ. సః = ఆ, రాఘవః = రాముడు, తస్మిన్ = ఆ, అహని = దివసమునందు, పౌరాణామ్ = పౌరులయొక్క, దృఢభక్తిం చ = దృఢమైన భక్తినీ, స్వకృతాన్తం చ = తాను నిర్ణయించిన సిద్ధాంతమును, అన్వవేక్ష్య = చూచి, బాఢమ్ = తప్పక అట్లే, ఇత్యేవ = అని, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు ఆనాడు పౌరుల దృఢభక్తిని, తాను చేసికొన్న కార్య నిర్ణయమును దృష్టిలో పెట్టుకొని "తప్పక అట్లే" అనెను. 16

మూ. కోసలేషు కుశం వీరముత్తరేషు తథా లవమ్,
అభిషిచ్య మహాత్మానావుభౌ రామః కుశీలవౌ. 17

ప్ర. అ. రామః = రాముడు, వీరమ్ = వీరుడైన, కుశమ్ = కుశుణ్ణి, కోసలేషు = దక్షిణకోసలదేశమునందు, తథా = మరియు, లవమ్ = లవుణ్ణి, ఉత్తరేషు = ఉత్తరకోసల దేశమునందు, మహాత్మానౌ = మహాత్ములైన, కుశీలవౌ = కుశీలవులను, ఉభౌ = ఇద్దరినీ, అభిషిచ్య = అభిషేకించి, ప్రయాణము చేయించెను.

తా. రాముడు వీరుడైన కుశుణ్ణి దక్షిణకోసలదేశమునకు రాజు గాను, లవుణ్ణి ఉత్తరకోసలదేశ రాజుగాను అభిషేకించెను. మహాత్ములైన ఆ కుశలవులను ఇద్దరినీ ఇట్లు అభిషిక్తులను చేసి ప్రయాణము చేయించెను. 17.

మూ. అభిషిక్తౌ సుతావఙ్కే ప్రతిష్ఠాప్య పురే తతః,
పరిష్వజ్య మహాబాహుర్మూర్ధ్న్యుపాఘ్రాయ చాసకృత్.

రథానాం తు సహస్రాణి నాగానామయుతాని చ,
దశ చాశ్వసహస్రాణి ఏకైకస్య ధనం దదౌ. 19

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహాబాహుః = గొప్ప బాహువులు గల రాముడు, పురే = పురమునందు, అభిషిక్తౌ = అభిషేకింపబడిన, సుతౌ = పుత్రులను, అఙ్కే = ఒడిలో, ప్రతిష్ఠాప్య = కూర్చుండబెట్టుకొని, పరిష్వజ్య = కౌగలించుకొని, అసకృత్ = మాటిమాటికి, మూర్ధ్ని = శిరస్సుపై, ఉపాఘ్రాయ = వాసన చూచి, ఏకైకస్య = ఒక్కొక్కనికి, రథానామ్ = రథములయొక్క, సహస్రాణి = సహస్రములను, నాగానామ్ = ఏనుగులయొక్క, అయుతాని చ = అయుతములను, దశ = పది, అశ్వసహస్రాణి = అశ్వములయొక్క సహస్రములను, ధనమ్ = ధనముగా, దదౌ = ఇచ్చెను.

తా. పిమ్మట మహాబాహువైన రాముడు రాజ్యాభిషిక్తులైన పుత్రులను ఒడిలో కూర్చుండబెట్టుకొని కౌగలించుకొని, మాటిమాటికి శిరస్సుపై అఘ్రాణించి ముద్దుపెట్టుకొని, వేలకొలది రథములు, అయుతముల (10,000) కొలది ఏనుగులు, పది అశ్వసహస్రములు ధనముగా వారి కిచ్చెను. 18, 19

మూ. బహురత్నౌ బహుధనౌ హృష్టపుష్టజనార్చితౌ,
స్వే పురే ప్రేషయామాస భ్రాతరౌ తే కుశీలవౌ. 20

ప్ర. అ. బహురత్నౌ = చాల రత్నములు గలవారు, బహుధనౌ = అధికమైన ధనము గలవారు, హృష్టపుష్టజనావృతౌ = సంతోషించిన పరిపుష్టులైన జనులతో కూడినవారు అయిన, భ్రాతరౌ = సోదరులైన, తౌ = ఆ, కుశీలవౌ = కుశలవులను, స్వే = తమ, పురే = పురములను గూర్చి, ప్రేషయామాస = పంపెను.

తా. అనేకములైన రత్నములు, అధికమైన ధనమూ గల, ఉత్సాహవంతులు దృఢకాయులు అయిన జనులతో కూడిన, ఆ సోదరులైన కుశలవులను వారి పట్టణములకు పంపెను. 20

మూ. అభిషిచ్య తతో వీరౌ ప్రస్థాప్య స్వపురే తదా,
దూతాన్ సంప్రేషయామాస శత్రుఘ్నాయ మహాత్మనే.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
సప్తోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. వీరౌ = వీరులైన, సుతౌ = పుత్రులను, అభిషిచ్య = అభిషేకించి, తతః = అటుపిమ్మట, స్వపురే = తమ పురములను గూర్చి, ప్రస్థాప్య = ప్రయాణముచేయించి, తదా = అప్పుడు, మహాత్మనే = మహాత్ముడైన, శత్రుఘ్నాయ = శత్రుఘ్నునికొరకు, దూతాన్ = దూతలను, సంప్రేషయామాస = పంపెను.

తా. వీరులైన కుమారులను రాజ్యాభిషిక్తులను చేసి, వారిని తమ రాజధానులకు పంపి, మహాత్ముడైన శత్రుఘ్నునకు దూతలను పంపెను. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు,
ఉత్తరకాండలో నూటఏడవ సర్గ సమాప్తము.

# అథ అష్టోత్తరశతతమః సర్గః

[సోదరులతోను, వానరులతోను, భల్లూకములతోను కలిసి పరమ ధామమునకు వెళ్ళవలె నని రాముడు నిశ్చయించుకొనుట. మీరు భూలోకమునందే ఉండుడు అని విభీషణ-హనుమత్-జాంబవత్-మైంద-ద్వివిదులను ఆజ్ఞాపించుట.]

మూ. తే దూతా రామవాక్యేన చోదితా లఘువిక్రమాః,
ప్రజగ్ముర్మధురాం శీఘ్రం చక్రుర్వాసం న చాధ్వని. 1

ప్ర. అ రామవాక్యేన = రామునివాక్యముచేత, చోదితాః = ప్రేరేపించబడిన, లఘువిక్రమాః = శీఘ్రగమనము గల, తే దూతాః = ఆ దూతలు, శీఘ్రమ్ = శీఘ్రముగా, మధురామ్ = మధురను గూర్చి, ప్రజగ్ముః = వెళ్ళిరి. అధ్వని = మార్గమునందు, వాసమ్ = నివాసమును, న చ చక్రుః = చేయలేదు.

తా. రామునిచే ఆజ్ఞాపించబడిన శీఘ్రగమనము గల ఆ దూతలు శీఘ్రముగ, మార్గమధ్యమునందు ఆగకుండగా మధురకు వెళ్ళిరి. 1

మూ. తతస్త్రిభిరహోరాత్రైః సంప్రాప్య మధురామథ,
శత్రుఘ్నాయ యథాతత్త్వమాచఖ్యుః సర్వమేవ తత్. 2

ప్ర. అ. త్రిభిః = మూడు, అహోరాత్రైః = అహోరాత్రములచేత, మధురామ్ = మధురను, సంప్రాప్య = చేరి, అథ = పిమ్మట, తత్ = దానిని, సర్వమేవ = అంతనూ, యథాతత్త్వమ్ = యథార్థముగా, శత్రుఘ్నాయ = శత్రుఘ్నునకు, ఆచఖ్యుః = చెప్పిరి.

తా. వాళ్లు మూడు పగళ్ళు మూడు రాత్రుళ్ళు ప్రయాణము చేసి మధుర చేరి, జరిగిన విషయమును యథాతథముగా శత్రుఘ్నునకు తెలిపిరి. 2

మూ. లక్ష్మణస్య పరిత్యాగం ప్రతిజ్ఞాం రాఘవస్య చ,
పుత్రయోరభిషేకం చ పౌరానుగమనం తథా. 3

ప్ర. అ. లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, పరిత్యాగమ్ = పరిత్యాగమును, రాఘవస్య = రామునియొక్క, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, పుత్రయోః = పుత్రుల యొక్క, అభిషేకం చ = అభిషేకమును, తథా = మరియు, పౌరానుగమనమ్ = పౌరుల అనుగమనమును (తెలిపిరి).

తా. రాముని ప్రతిజ్ఞను, రాముఁడు లక్ష్మణుణ్ణి విడిచివేయుఁటను, కుశలవుల అభిషేకమును, పౌరులు రాముని వెంట వెళ్ళుటకు సంకల్పించుటను తెలిపిరి. 3

మూ. కుశస్య నగరీ రమ్యా విన్ధ్యపర్వతరోధసి,
కుశావతీతి నామ్నా సా కృతా రామేణ ధీమతా. 4

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతుఁడైన, రామేణ = రామునిచేత, విన్ధ్యపర్వత రోధసి = వింధ్యపర్వతప్రాంతమునందు, కుశావతీతి = కుశావతి అను, నామ్నా = పేరుతో, రమ్యా = సుందరమైన, కుశస్య = కుశునియొక్క, సా = ఆ, నగరీ = నగరము, కృతా = చేయబడినది.

తా. ధీమంతుఁడైన రాముడు కుశునికొరకు వింధ్యపర్వతసమీపమునందు కుశావతి అను నగరమును నిర్మించెను (అని చెప్పిరి). 4

మూ. శ్రావస్తీతి పురీ రమ్యా శ్రావితా చ లవస్య హ,
అయోధ్యాం విజనాం కృత్వా రాఘవో భరతస్తథా, 5
స్వర్గస్య గమనోద్యోగం కృతవన్తౌ మహారథౌ.

ప్ర. అ. లవస్య = లవునియొక్క, రమ్యా = సుందరమైన, శ్రావస్తీతి = శ్రావస్తి అను, పురీ = పట్టణము, శ్రావితా = ప్రసిద్ధము చేయబడినది. రాఘవః = రాముఁడు, తథా = మఱియు, భరతః = భరతుఁడు, అయోధ్యామ్ = అయోధ్యను, విజనామ్ = జనశూన్య మైనదానినిగా, కృత్వా = చేసి, మహారథౌ = మహారథులైన వారిద్దరూ కూడ, స్వర్గస్య = స్వర్గముయొక్క, గమనోద్యోగమ్ = గమనమునకు ప్రయత్నమును, కృతవన్తౌ = చేసినారు.

తా. లవునికొరకు రమ్యమైన పురము నిర్మించబడినది దానికి శ్రావస్తి అను పేరు ప్రసిద్ధము చేయబడినది. మహారథులైన రాముడు, భరతుడు అయోధ్యను జనశూన్యము చేసి స్వర్గమునకు వెళ్ళుటకు ప్రయత్నము చేయుచున్నారు. 5

మూ. ఏవం సర్వం నివేద్యాశు శత్రుఘ్నాయ మహాత్మనే, 6
విరేముస్తే తతో దూతాస్త్వర రాజేతి చాబ్రువన్.

ప్ర. అ. తే = ఆ, దూతాః = దూతలు, మహాత్మనే = మహాత్ముడైన, శత్రుఘ్నాయ = శత్రుఘ్ననకు, ఏవమ్ = ఇట్లు, సర్వమ్ = సమస్తమును, ఆశు = శీఘ్రముగా, నివేద్య = తెలిపి, విరేముః = విరమించిరి. రాజ = రాజా ! త్వర = తొందరపడుము, ఇతి చ = అని కూడ, అబ్రువన్ = పలికిరి.

తా. ఆ దూతలు మహాత్ముడైన శత్రుఘ్ననకు దానిని అంతా చెప్పి,"రాజా తొందరపడుము" అని కూడ పలికి విరమించిరి. 6

మూ. తచ్ఛ్రుత్వా ఘోరసంకాశం కులక్షయముపస్థితమ్, 7
ప్రకృతీస్తు సమానీయ కాఞ్చనం చ పురోధసమ్,
తేషాం సర్వం యథావృత్తమబ్రవీద్రఘునన్దనః, 8
ఆత్మనశ్చ విపర్యాసం భవిష్యం భ్రాతృభిః సహ.

ప్ర. అ. రఘునన్దనః = శత్రుఘ్నుడు, ఘోరసంకాశమ్ = చాల ఘోరమైన, ఉపస్థితమ్ = సమీపించిన, తత్ = ఆ, కులక్షయమ్ = కులక్షయమును, శ్రుత్వా = విని. ప్రకృతీః = ప్రకృతులను, పురోధసమ్ = పురోహితుడైన, కాఞ్చనం చ = కాంచనుణ్ణి, సమానీయ = రప్పించి, తేషామ్ = వారికి, భ్రాతృభిః సహ = తన సోదరులతో కూడ, భవిష్యమ్ = కానున్న, ఆత్మనః = తనయొక్క, విపర్యాసమ్ = ఆపదను, యథావృత్తమ్ = జరిగినది జరిగినట్లుగా, సర్వమ్ = అంతనూ, అబ్రవీత్ = చెప్పెను.

తా. శత్రుఘ్నుడు చాల భయంకరమైన, వచ్చి పడిన ఆ కులక్షయమును గూర్చి విని, ప్రకృతులను, పురోహితుడైన కాంచనుణ్ణి పిలిపించి, వారికి జరిగిన అంత విషయమునూ, సోదరుతో పాటు తనకు రానున్న శరీరత్యాగమును తెలిపెను. 7, 8

మూ. తతః పుత్రద్వయం వీరః సోఽభ్యషిఞ్చన్నరాధిపః, 9
సుబాహుర్మధురాం లేభే శత్రుఘాతీ చ వైదిశమ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వీరః = వీరుడైన, సః నరాధిపః = ఆ రాజు, పుత్రద్వయమ్ = పుత్రద్వయమును, అభ్యషిఞ్చత్ = అభిషేకించెను. సుబాహుః = సుబాహువు, మధురామ్ = మధురను, లేభే = పొందెను. శత్రుఘాతీ = శత్రుఘాతి, వైదిశమ్ = వైదిశమును పొందెను.

తా. పిమ్మట వీరుడైన ఆ రాజు పుత్రులను ఇద్దరినీ రాజ్యాభిషిక్తులను చేసెను. సుబాహువు మధురను, శత్రుఘాతి వైదిశనగరమును పొందెను. 9

మూ. ద్విధా కృత్వా తు తాం సేనాం మాధురీం పుత్రయోర్ద్వయోః,
ధనం చ యుక్తం కృత్వా వై స్థాపయామాస పార్థివః.

ప్ర. అ. పార్థివః = ఆ రాజు, మాధురీమ్ = మధురకు సంబంధించిన, తామ్ = ఆ, సేనామ్ = సేనను, ద్వయోః = ఇద్దరు, పుత్రయోః = పుత్రులమధ్య, ద్విధా = రెండు భాగములుగా, కృత్వా = చేసి, ధనం చ = ధనమును కూడ, యుక్తమ్ = తగు విధముగా, కృత్వా వై = (రెండు భాగాలుగా) చేసి, స్థాపయామాస = స్థాపించెను.

తా. శత్రుఘ్నుడు మధురలో ఉన్న సైన్యమును, ధనమును రెండు భాగాలుగా చేసి ఇద్దరు కుమారులకు ఇచ్చెను. 10

మూ. సుబాహుం మధురాయాం చ వైదిశే శత్రుఘాతినమ్, 11
యయౌ స్థాప్య తదాయోధ్యాం రథేనైకేన రాఘవః.

ప్ర. అ. సుబాహుమ్ = సుబాహువును, మధురాయాం చ = మధురయందు, శత్రుఘాతినమ్ = శత్రుఘాతిని, వైదిశే = వైదిశమునందు, స్థాప్య = స్థాపించి, రాఘవః = శత్రుఘ్నుడు, ఏకేన = ఒక్క, రథేన = రథము చేత, తదా = అప్పుడు, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. శత్రుఘ్నుడు సుబాహువును మధురయందు, శత్రుఘాతిని వైదిశమునందు స్థాపించి ఒక్క రథముతో అయోధ్యకు వెళ్లెను. 11

మూ. స దదర్శ మహాత్మానం జ్వలన్తమివ పావకమ్, 12
సూక్ష్మక్షౌమామ్బరధరం మునిభిః సార్ధమక్షయైః.

ప్ర. అ. సః = అతడు, జ్వలన్తమ్ = ప్రజ్వలించుచున్న, పావకమ్ ఇవ = అగ్ని వలె ఉన్న, సూక్ష్మక్షౌమామ్బరధరమ్ = సన్నని పట్టుబట్టలు ధరించిన, అక్షయైః = క్షయములేని, మునిభిః సార్ధమ్ = మునులతో కూడ కూర్చున్న, మహాత్మానమ్ = మహాత్ముడైన రాముణ్ణి, దదర్శ = చూచెను.

తా. ఆతడు ప్రజ్వలించుచున్న అగ్ని వలె ఉన్న మహాత్ముడైన రాముణ్ణి చూచెను. తెల్లని, సన్నని పట్టుబట్టలు ధరించి ఉన్న ఆ రాముని దగ్గర చాలమంది మునీశ్వరులు కూర్చుండిరి. 12

మూ. సోఽభివాద్య తతో రామం ప్రాఞ్జలిః ప్రయతేన్ద్రియః 13
ఉవాచ వాక్యం ధర్మజ్ఞం ధర్మమేవానుచిన్తయన్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = అతడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ప్రయతేన్ద్రియః = నిగ్రహించబడిన ఇంద్రియములు కలవాడై, రామమ్ = రాముణ్ణి, అభివాద్య = నమస్కరించి, ధర్మజ్ఞమ్ = ధర్మమును ఎరిగిన అతనిని గూర్చి, ధర్మమ్ ఏవ = ధర్మమునే, అనుచిన్తయన్ = ఆలోచించుచు, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట శత్రుఘ్నుడు ధర్మముల నెరిగిన ఆ రామునకు అభివాదనము చేసి, అంజలి ఘటించి, ఇంద్రియ నిగ్రహవంతుడై, ధర్మమును ఆలోచించుచు ఇట్లు పలికెను. 13

మూ. కృత్వాభిషేకం సుతయోర్ద్వయో రాఘవనన్దన, 14
తవానుగమనే రాజన్విద్ధి మాం కృతనిశ్చయమ్.

ప్ర. అ. రాఘవనన్దన = రామా! రాజన్ = రాజా! ద్వయోః = ఇద్దరు, సుతయోః = కుమారులకు, అభిషేకమ్ = అభిషేకముకు, కృత్వా = చేసి, మామ్ = నన్ను, తవ = నీయొక్క, అనుగమనే = అనుగమనమునందు, కృతనిశ్చయమ్ = చేయబడిన నిశ్చయము కలవానినిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. రాజా ! రామా ! నా కుమారు లిద్దరికి రాజ్యాభిషేకము చేసి వచ్చినాను. ఇప్పుడు నిన్ను అనుసరించి వచ్చుటకు నిశ్చయించుకొని ఉన్నాను. 14

మూ. న చాన్యదద్య వక్తవ్యమతో వీర న శాసనమ్, 15
విహన్యమానమిచ్ఛామి మద్విధేన విశేషతః.

ప్ర. అ. వీర = వీరుడా ! అద్య = ఇప్పుడు, అతః = దానికంటె, అన్యత్ = అన్యము ఏదీ, న వక్తవ్యమ్ = చెప్పదగినది కాదు. శాసనమ్ = నీ ఆజ్ఞను, విహన్యమానమ్ = విఘాతము కలిగించబడినదానినిగా, విశేషతః = విశేషించి, మద్విధేన = నావంటివానిచేత, న ఇచ్ఛామి = ఇచ్ఛయించను.

తా. వీరుడా ఇప్పుడు దీనికి భిన్నముగ ఏమీ చెప్పకుము: నీ ఆజ్ఞ తిరస్కరింపబడుటను. విశేషించి నావంటివానిచే తిరస్కరింపబడుటను, నేను ఇచ్ఛగింపను. 15

మూ. తస్య తాం బుద్ధిమక్లీబాం విజ్ఞాయ రఘునన్దనః, 16
బాఢమిత్యేవ శత్రుఘ్నం రామో వాక్యమువాచ హ.

ప్ర. అ. రఘునన్దనః = రఘువంశీయులకు ఆనందకరుడైన, రామః = రాముడు, తస్య = ఆతనియొక్క, అక్లీబామ్ = దుర్బలము కాని, తామ్ = ఆ, బుద్ధిమ్ = బుద్ధిని, విజ్ఞాయ = తెలిసికొని, శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుణ్ణి గూర్చి, బాఢత్ ఇత్యేవ = తప్పక అట్లే అని, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను..

తా. రాముడు శత్రుఘ్నుని ఆ దృఢనిశ్చయమును చూచి "తప్పక అట్లే" అని పలికెను.

మూ. తస్య వాక్యస్య చాథాన్తే వానరాః కామరూపిణః, 17
ఋక్షరాక్షససంఘాశ్చ సమాపేతురనేకశః.

ప్ర. అ. "(తస్య వాక్యస్య వాక్యాన్తే" అను పాఠమునకు బదులు పై ప్రాచ్యపాఠము తీసికొనబడినది). అథ = అటుపిమ్మట తస్య వాక్యస్య = ఆ వాక్యము యొక్క. అన్తే = అంతమునందు, కామరూపిణః = స్వేచ్ఛానుసారము రూపములు గల, వానరాః = వానరులు, ఋక్ష రాక్షససంఘాః చ = భల్లూక రాక్షససముదాయములు, అనేకశః = అనేకమార్గమునుండి, సమాపేతుః = వచ్చిదిగిరి.

తా. ఈ మాటలు జరుగుచుండగా స్వేచ్ఛారూపధారులైన వానరులు, భల్లూకములు, రాక్షసులు అనేకమార్గములనుండి గుంపు గుంపులుగా వచ్చిరి 17

మూ. సుగ్రీవం తే పురస్కృత్య సర్వ ఏవ సమాగతాః,
తం రామం ద్రష్టుమనసః స్వర్గాయాభిముఖం స్థితమ్. 18

ప్ర. అ. తే = ఆ, సర్వే ఏవ = అందరూ. స్వర్గాయ = స్వర్గముకొరకు, అభిముఖమ్ = అభిముఖుడుగా, స్థితమ్ = ఉన్న, తం రామమ్ = ఆ రాముణ్ణి, ద్రష్టుమనసః = చూడవలె నను మనస్సు కలవారై, సుగ్రీవమ్ = సుగ్రీవుణ్ణి, పురస్కృత్య = ముందు ఉంచుకొని, సమాగతాః = వచ్చినారు.

తా. ఆ వానరులందరు సుగ్రీవుణ్ణి ముందు ఉంచుకొని. స్వర్గగమనాభిముఖుడై ఉన్న రాముణ్ణి చూడవలె నను కోరికతో వచ్చిరి. 18

మూ. దేవపుత్రా ఋషిసుతా గన్ధర్వాణాం సుతా స్తథా, 19
రామక్షయం విదిత్వా తే సర్వ ఏవ సమాగతాః.

ప్ర. అ. రామక్షయమ్ = రాముని క్షయమును, విదిత్వా = తెలిసికొని, దేవపుత్రాః = దేవతల పుత్రులు. ఋషిసుతాః = ఋషుల పుత్రులు. తథా = మరియు, గన్ధర్వాణామ్ = గంధర్వులయొక్క, సుతాః = పుత్రులూ అయిన, తే సర్వే ఏవ = ఆ వానరులందరు, సమాగతాః = వచ్చినారు.

తా. రాముని క్షయమును గూర్చి తెలిసిన, దేవతల పుత్రులు, ఋషుల పుత్రులు, గంధర్వుల పుత్రులూ అయిన ఆ వానరు లందరూ వచ్చిరి 19

మూ. తే రామమభివాద్యోచుః సర్వే వానరరాక్షసాః, 20
తవానుగమనే రాజన్ సంప్రాప్తాః స్మ సమాగతాః.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, తే = ఆ, వానరరాక్షసాః = వానరులు రాక్షసులు, రామమ్ = రాముణ్ణి, అభివాద్య = నమస్కరించి, ఊచుః = వలికిరి. రాజన్ = రాజా! సమాగతాః = కలిసిన మేము, తవ = నీయొక్క, అనుగమనే = అనుగమనమునిమిత్తము, సంప్రాప్తాః స్మ = వచ్చినాము.

తా. ఆ వానర రాక్షసు లందరూ రామునకు నమస్కరించి ఇట్లు పలికిరి— "రాజా ! మేమందరమూ కలిసి నీ వెనుకనే వచ్చుటకు వచ్చినాము". 20

మూ. యది రామ వినాస్మాభిర్గచ్ఛేస్త్వం పురుషోత్తమ, 21
యమదణ్డమివోద్యమ్య త్వయా స్మ వినిపాతితాః.

ప్ర అ. పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుడా! రామ = రామా! అస్మాభిః = వినా = మేము లేకుండగా, గచ్ఛేః యది = నీవు వెళ్ళినట్లయితే, త్వయా = నీచేత, యమదణ్డమ్ = యమదండమును, ఉద్యమ్య = ఎత్తి, వినిపాతితాః ఇవ = పడగొట్టబడిన వారము వలె, స్మ = అగుదుము.

తా. పురుషోత్తమా! రామా! మేము నీవెంట రాకుండగా నీవు వెళ్ళినచో యమదండము ప్రయోగించి మమ్ములను చంపివేసి నట్లు అగును. 21

మూ. ఏతస్మిన్నన్తరే రామం సుగ్రీవోఽపి మహాబలః 22
ప్రణమ్య విధివద్వీరం విజ్ఞాపయితుముద్యతః.

ప్ర. అ. ఏతస్మిన్ అన్తరే = ఇంతలో, మహాబలః = గొప్ప బలము గల, సుగ్రీవః అపి = సుగ్రీవుడు కూడ, వీరమ్ = వీరుడైన, రామమ్ = రాముణ్ణి, విధివత్ = యథాశాస్త్రముగా, ప్రణమ్య = నమస్కరించి, విజ్ఞాపయితుమ్ = విజ్ఞాపన చేయుటకు, ఉద్యతః = ఉద్యుక్తుడయ్యెను.

తా. ఇంతలో మహాబలిశాలియైన సుగ్రీవుడు కూడ. రామునకు యథావిధిగా నమస్కరించి, ఆవీరునితో ఇట్లు విన్నవించుటకు ఉపక్రమించెను. 22

మూ. అభిషిచ్యాఙ్గదం వీరమాగతోఽస్మి నరేశ్వర 23
తవానుగమనే రాజన్విద్ధి మాం కృతనిశ్చయమ్.

ప్ర. అ. నరేశ్వర = రాజా! వీరమ్ = వీరుడైన, అఙ్గదమ్ = అంగదుణ్ణి, అభిషిచ్య = అభిషేకించి, ఆగతః అస్మి = వచ్చినాను. రాజన్ = రాజా! తవ = నీ యొక్క, అనుగమనే = అనుగమనమునందు, మామ్ = నన్ను, కృతనిశ్చయమ్ = చేయబడిన నిశ్చయము కలవానినిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. రాజా! నేను వీరుడైన అంగదునకు రాజ్యాభిషేకము చేసి వచ్చినాను. నిన్ను అనుసరించి వెళ్ళుటకై దృఢ నిశ్చయముతో ఉన్నాను. 23

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రామో రమయతాం వరః, 24
వానరేన్ద్రమథోవాచ మైత్రం తస్యానుచిన్తయన్.

ప్ర. అ. రమయతామ్ = ఆనందింపచేయువారిలో, వరః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, తస్య = అతనియొక్క, తత్ = ఆ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, తస్య = అతనియొక్క, మైత్రమ్ = మిత్రత్వమును, అనుచిన్తయన్ = ఆలోచించుచు, అథ = అటుపిమ్మట, వానరేన్ద్రమ్ = సుగ్రీవుణ్ణి గూర్చి, ఉవాచ = పలికెను..

తా. ఆనందింపచేయువారిలో శ్రేష్ఠుడైన రాముడు ఆ సుగ్రీవుని మాటలు విని, అతని మైత్రీ భావమును స్మరించుచు ఇట్లు పలికెను 24

మూ. సఖే శృణుష్వ సుగ్రీవ న త్వయాహం వినాకృతః, 25
గచ్ఛేయం దేవలోకం వా పరమం వా పదం మహత్.

ప్ర. అ. సఖే = మిత్రుడా! సుగ్రీవ = సుగ్రీవా! శృణుష్వ = వినుము. అహమ్ = నేను, త్వయా = నీతో, వినాకృతః = దూరముచేయ బడినవాడనై, దేవలోకం వా = దేవలోకమును గూర్చి గాని, మహత్ = గొప్పదైన, పరమం పదం వా = పరమపదమును గూర్చి గాని. న గచ్ఛేయమ్ = వెళ్లను.

తా. మిత్రుడా! సుగ్రీవా! వినుము, నీవు ప్రక్కన లేకుండా నేను స్వర్గలోకమునకు గాని పరమపదమునకు గాని వెళ్ళను. (ఈ శ్లోకము, పై శ్లోకము చాలా ప్రతులలో లేవు.) 25

మూ. తై రేవముక్తః కాకుత్స్థో బాఢమిత్యబ్రవీత్ స్మయన్, 26
విభీషణమథోవాచ రాక్షసేన్ద్రం మహాయశాః.

ప్ర. అ. తైః = వాళ్ళచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, కాకుత్స్థః = రాముడు, స్మయన్ = నవ్వుచు, బాఢమ్ ఇత్యేవ = తప్పక అట్లే అని, అబ్రవీత్ = పలికెను. మహాయశాః = గొప్ప కీర్తి గల అతడు, అథ = అటుపిమ్మట రాక్షసేన్ద్రమ్ = రాక్షసరాజైన, విభీషణమ్ = విభీషణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు వాళ్ళ మాటలు విని, నవ్వుచు, 'తప్పక అట్లే' అని అనెను. పిమ్మట గొప్ప కీర్తి గల ఆ రాముడు రాక్షసేంద్రుడైన విభీషణుతో ఇట్లు పలికెను. 26

మూ. యావత్ ప్రజా ధరిష్యన్తి తావత్త్వం వై విభీషణ, 27
రాక్షసేన్ద్ర మహావీర్య లఙ్కాస్థః స్వం ధరిష్యసి.

ప్ర. అ. రాక్షసేన్ద్ర = రాక్షసరాజా ! మహావీర్య = గొప్ప పరాక్రమము కలవాడా ! విభీషణ = విభీషణా ! ప్రజాః = ప్రజలు, యావత్ = ఎంతవరకు, ధరిష్యన్తి = జీవించగలరో, తావత్ = అంతవరకు, త్వమ్ = నీవు, లఙ్కాస్థః = లంకలో ఉన్నవాడవై, స్వమ్ = తనను, ధరిష్యసి = ప్రాణములతో ఉంచుకొనగలవు.

తా. రాక్షసరాజా ! మహాపరాక్రమవంతుడా ! విభీషణా ! ప్రజలు ఈ భూమిమీద జీవించి ఉన్నంతకాలము నీవు లంకలో జీవించి ఉండగలవు. 27

మూ. యావచ్చన్ద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ, 28
యావచ్చ మత్కథా లోకే తావద్రాజ్యం తవాస్త్విహ.

ప్ర. అ చన్ద్రః చ = చంద్రుడు, సూర్యః చ = సూర్యుడు, యావత్ = ఎంతవరకు ఉందురో, మేదినీ = భూమి, యావత్ = ఎంతవరకు, తిష్ఠతి = ఉండునో, మత్కథా = నా కథ, లోకే = లోకమునందు, యావచ్చ = ఎంతవరకు ఉండునో, తావత్ = అంతవరకు. ఇహ = ఈ లోకమునందు, తవ రాజ్యమ్ = నీ రాజ్యము, అస్తు = ఉండుగాక !

తా. సూర్యచంద్రులు ఎంతవరకు ఉందురో, భూమి ఎంతవరకు ఉండునో, నా కథ లోకములో ఎంత వరకు వ్యాప్తిలో ఉండునో అంతవరకు నీవు రాజ్యము చేయుదువుగాక. 28

మూ. శాసితశ్చ సఖిత్వేన కార్యం తే మమ శాసనమ్, 29
ప్రజాః సంరక్ష ధర్మేణ నోత్తరం వక్తుమర్హసి.

ప్ర. అ. సఖిత్వేన = స్నేహభావముచేత, శాసితః చ = శాసింపబడుచున్నావు. తే = నీకు, మమ = నాయొక్క, శాసనమ్ = శాసనము, కార్యమ్ = చేయదగినది. ప్రజాః = ప్రజలను, ధర్మేణ = ధర్మముచేత, సంరక్ష = రక్షించుము, ఉత్తరమ్ = ప్రత్యుత్తరమును, వక్తుమ్ = పలుకుటకు, న అర్హసి = తగవు.

తా. స్నేహభావమును పురస్కరించుకొని నిన్ను ఆజ్ఞాపించుచున్నాను. నా ఆజ్ఞ ప్రకారము చేయవలెను. ప్రజలను ధర్మానుసారము రక్షించుము. బదులు చెప్పవద్దు. 29

మూ. కించాన్యద్వక్తుమిచ్ఛామి రాక్షసేన్ద్ర మహాబల, 30
ఆరాధయ జగన్నాథమిక్ష్వాకుకులదైవతమ్,
ఆరాధనీయమనిశం దేవైరపి సవాసవైః. 31

ప్ర. అ. మహాబల = గొప్ప బలముగలవాడా! కించ = మరియు, అన్యత్ = మరియొకటి, వక్తుమ్ = చెప్పుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. ఇక్ష్వాకుకులదైవతమ్ = ఇక్ష్వాకుల కులదేవతయైన, సవాసవైః = ఇంద్రునితో కూడిన, దేవైరపి = దేవతలచేత కూడ, ఆరాధనీయమ్ = ఆరాధింపదగిన, జగన్నాథమ్ = జగన్నాథుని, అనిశమ్ = ఎల్లప్పుడు, ఆరాధయ = ఆరాధించుము.

తా. గొప్ప బలము గల విభీషణా! మరొకవిషయము చెప్ప గోరుచున్నాను. ఇక్ష్వాకుల కులదేవత, ఇంద్రాదిదేవతలచేత కూడ పూజింప బడువాడు అయిన జగన్నాథుణ్ణి ఆరాధించుము. 30, 31

మూ. తథేతి ప్రతిజగ్రాహ రామవాక్యం విభీషణః,
రాజా రాక్షసముఖ్యానాం రాఘవాజ్ఞామనుస్మరన్. 32

ప్ర. అ. రాక్షసముఖ్యానామ్ = రాక్షసనాయకులయొక్క, రాజా = రాజైన, విభీషణః = విభీషణుడు, రాఘవాజ్ఞామ్ = రాముని ఆజ్ఞను, అనుస్మరన్ = స్మరించుచు, రామవాక్యమ్ = రాముని వాక్యమును, తథా = అట్లే, ఇతి = అని, ప్రతిజగ్రాహ = స్వీకరించెను

తా. రాక్షసరాజైన విభీషణుడు రామాజ్ఞను స్మరించుచు రాముని మాటలను "అట్లే చేసెదను" అని స్వీకరించెను. 32

మూ. తమేవముక్త్వా కాకుత్స్థో హనుమన్తమథాబ్రవీత్,
జీవితే కృతబుద్ధిస్త్వం మా ప్రతిజ్ఞాం వృథా కృథాః. 33

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, తమ్ = విభీషణుని గూర్చి, ఏవమ్ =

ఇట్లు, ఉక్త్వా = పలికి, అథ = అటుపిమ్మట, హనుమన్తమ్ = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. జీవితే = దీర్ఘజీవితమునందు, కృతబుద్ధిః = చేయబడిన బుద్ధి గల, త్వమ్ = నీవు, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, వృథా = వ్యర్థమునుగా, మా కృథాః = చేయుము.

తా. రాముఁడు విభీషణునితో ఇట్లు పలికి పిదప హనుమంతునితో కూడ ఇట్లనెను. "జీవితమునందు నిశ్చయము చేసికొనిన నీవు నీ ప్రతిజ్ఞను వ్యర్థము చేయకుము." హనుమంతునకు బ్రహ్మదేవుడు దీర్ఘాయుర్దాయము నిచ్చెను. "రామాయణకథ లోకములో ప్రచారములో ఉన్నంతవరకు నేను దానిని వినుచుందును గాక" అని కోరగా రాముడు ఆ వరమును ఇచ్చెను. అందుచేత దానిని వ్యర్థము చేయక చిరకాలము జీవించు మని భావము. 33

మూ. మత్కథాః ప్రచరిష్యన్తి యావల్లోకే హరీశ్వర,
తావద్రమస్వ సుప్రీతో మద్వాక్యమనుపాలయన్. 34

ప్ర. అ హరీశ్వర = వానరనాయకా ! మత్కథాః = నా కథలు, యావత్ = ఎంతవరకు, లోకే = లోకమునందు, ప్రచరిష్యన్తి = ప్రచారములో ఉండునో, తావత్ = అంతవరకు, సుప్రీతః = చాల సంతోషము కలవాడవై, మద్వాక్యమ్ = నా వాక్యమును, అనుపాలయన్ = పాలించుచు, రమస్వ = సుఖముగా ఉండుము.

తా. హనుమంతుడా ! నా కథలు లోకములో ప్రచారములో ఉన్నంత వరకు నీవు సంతోషించుచు, నా మాటను మన్నించి సుఖముగా ఉండుము. 34

మూ. ఏవముక్తస్తు హనుమాన్ రాఘవేణ మహాత్మనా,
వాక్యం విజ్ఞాపయామాస పరం హర్షమవాప్య చ. 35

ప్ర. అ. మహాత్మనా = మహాత్ముడైన, రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = పలకబడిన, హనుమాన్ = హనుమంతుడు, పరమ్ = అధికమైన, హర్షమ్ = సంతోషమును, అవాప్య = పొంది, వాక్యమ్ = వాక్యమును, విజ్ఞాపయామాస చ = విజ్ఞాపన చేసెను.

తా మహాత్ముడైన రాముని మాటలు విని హనుమంతుడు చాల సంతోషించుచు ఇట్లు విజ్ఞాపనచేసెను. 35

మూ. యావత్తవ కథా లోకే విచరిష్యతి పావనీ,
తావత్ స్థాస్యామి మేదిన్యాం తవాజ్ఞామనుపాలయన్. 36

ప్ర. అ. పావనీ = పవిత్రమైన, తవ కథా = నీ కథ, యావత్ = ఎంత వరకు, లోకే = లోకమునందు, ప్రచరిష్యతి = ప్రచారములో ఉండునో, తావత్ = అంతవరకు, తవ = నీయొక్క, ఆజ్ఞామ్ = ఆజ్ఞను, అనుపాలయన్ = పాలించుచు, మెదిన్యామ్ = భూమిమీద, స్థాస్యామి = ఉండగలను.

తా. పవిత్రమైన నీ కథ లోకములో ప్రచారములో ఉన్నంతవరకు నీ ఆజ్ఞను పాలించుచు భూలోకములో ఉండెదను. 36

మూ. జామ్బవన్తం తథోక్త్వా తు వృద్ధం బ్రహ్మసుతం తథా,
మైన్దం చ ద్వివిదం చైవ పఞ్చ జామ్బవతా సహ, 37
యావత్కలిశ్చ సంప్రాప్తస్తావజ్జీవత సర్వదా.

ప్ర. అ. వృద్ధమ్ = వృద్ధుడు, బ్రహ్మసుతమ్ = బ్రహ్మపుత్రుడూ అయిన, జామ్బవన్తమ్ = జాంబవంతుని గూర్చి, తథా = అట్లే, ఉక్త్వా = పలికి, మైన్దం చ = మైందుణ్ణి, ద్వివిదం చైవ = ద్వివిదుణ్ణి గూర్చి కూడ, తథా = అట్లు పలికెను. కలిః = కలి, యావత్ = ఎంతవరకు, సంప్రాప్తః = వచ్చునో, తావత్ = అంత వరకు, సర్వదా = ఎల్లప్పుడు, జీవత = జీవించండి అని, జామ్బవతా సహ = జాంబవంతునితో కూడ, పఞ్చ = ఐదుగురిని గూర్చి పలికెను.

తా. వృద్ధుడు, బ్రహ్మపుత్రుడూ అయిన జాంబవంతునితో కూడ అట్లే చెప్పి. మైందద్వివిదులకు కూడ ఆ విధముగనే చెప్పెను. ఈ విధముగ "కలి యుగము వచ్చువరకు మీరు జీవించి ఉండుడు" అని జాంబవంతునితో సహా ఐదుగురిని ఆదేశించెను. 37

మూ. తథైవముక్త్వా కాకుత్స్థః సర్వాంస్తానృక్షవానరాన్,
ఉవాచ బాఢం గచ్ఛధ్వం మయా సార్ధం యథోదితమ్. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
అష్టోత్తరశతతమః సర్గః.

ప్ర. అ. కాకుత్థ్సః = రాముడు, తథా = ఆ ప్రకారము, ఉక్త్వా = పలికి, సర్వాన్ = సమస్తమైన, తాన్ = ఆ, ఋక్షవానరాన్ = భల్లూకములను వానరులను గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉవాచ = పలికెను. యథోదితమ్ = చెప్పినట్లుగా, మయా సార్థమ్ = నాతో కూడ, బాఢమ్ = నిశ్చయముగ, గచ్ఛధ్వమ్ = నడవండి.

తా. రాముడు వారితో (విభీషణాదులతో) ఆ విధముగా చెప్పి ఋక్షవానరు లందరితోను "నేను ముందుగానే చెప్పిన విధముగ తప్పక నాతో రండి" అని పలికెను. 38

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూట ఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ నవాధికశతతమః సర్గః

[పరమధామమును చేరుటకై బయలుదేరిన రామునితో అయోధ్యా వాసు లందరూ కూడ బయలుదేరుట.]

మూ. ప్రభాతాయాం తు శర్వర్యాం పృథువక్షా మహాయశాః,
రామః కమలపత్రాక్షః పురోధసమథాబ్రవీత్. 1

ప్ర. అ. అథ=పిమ్మట, శర్వర్యామ్= రాత్రి, ప్రభాతాయామ్= తెల్ల వారినదగుచుండగా, పృథువక్షాః=విశాలమైన వక్షఃస్థలము కలవాడు, మహాయశాః =గొప్ప కీర్తి కలవాడు, కమలపత్రాక్షః= కమలపత్రముల వంటి నేత్రములు కలవాడూ అయిన, రామః= రాముడు, పురోధసమ్ = పురోహితుణ్ణి గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట రాత్రి తెల్లవారగానే విశాలమైన వక్షఃస్థలము, గొప్ప కీర్తి, కమలపత్రముల వంటి నేత్రములూ గల రాముడు పురోహితునితో ఇట్లనెను. 1

మూ. అగ్నిహోత్రం వ్రజత్వగ్రే దీప్యమానం సహ ద్విజైః,
వాజపేయాతపత్రం చ శోభమానం మహాపథే. 2

ప్ర. అ. దీప్యమానమ్=మండుచున్న, అగ్నిహోత్రమ్=అగ్నిహోత్రము, ద్విజైః సహ = బ్రాహ్మణులతో కూడ, అగ్రే= ముందు, వ్రజతు = వెళ్లుగాక. శోభమానమ్ = శోభించుచున్న, వాజపేయాతపత్రం చ = వాజపేయాతపత్రము కూడ, మహాపథే= రాజమార్గమునందు వెళ్ళుగాక.

తా. ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రాగ్ని బ్రాహ్మణులతో కూడ ముందు వెళ్ళుగాక. శోభించుచున్న వాజపేయచ్ఛత్రము కూడ సాకేత రాజమార్గమునందు వెళ్ళుగాక. (వాజపేయ యాగము చేసినవారు మాత్రమే గౌరవసూచకంగా ధరించు ఛత్రము వాజపేయాతపత్రము). 2

మూ. తతో వసిష్ఠస్తేజస్వీ సర్వం నిరవశేషతః,
చకార విధివద్ధర్మ్యం మహాప్రాస్థానికం విధిమ్. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తేజస్వీ = తేజఃశాలియైన, వసిష్ఠః = వసిష్ఠుడు, ధర్మ్యమ్ = ధర్మమును, మహాప్రాస్థానికమ్ = మహాప్రస్థానమునకు సంబంధించిన, విధిమ్ = విధిని, సర్వమ్ = అంతనూ, విధివత్ = యథాశాస్త్రముగా, నిరవశేషతః = నిఃశేషముగా, చకార = చేసెను.

తా. పిమ్మట తేజఃశాలియైన వసిష్ఠుడు మహాప్రస్థానమునకు సంబంధించిన విధిని అంతనూ యథాశాస్త్రముగా, పూర్తిగా చేసెను. 3

మూ. తతః సూక్ష్మామ్బరధరో బ్రహ్మమావర్తయన్ పరమ్,
కుశాన్ గృహీత్వా పాణిభ్యాం సరయూం ప్రయయావథ.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సూక్ష్మామ్బరధరః = సన్నని వస్త్రము ధరించినవాడై, పరం బ్రహ్మమ్ = పరబ్రహ్మను, ఆవర్తయన్ = స్మరించుచు, పాణిభ్యామ్ = హస్తములచేత, కుశాన్ = కుశలను, గృహీత్వా = గ్రహించి, అథ = అటుపిమ్మట, సరయూమ్ = సయూనదిని గూర్చి, ప్రయయౌ = వెళ్లెను.

తా. పిమ్మట రాముడు సూక్ష్మవస్త్రములు ధరించి, పరబ్రహ్మను ధ్యానించుచు, చేతులలో దర్భలు గ్రహించి, సరయూనదికి వెళ్లెను. 4

మూ. అవ్యాహరన్ క్వచిత్ కించిన్నిశ్చేష్టో నిఃసుఖః పథి,
నిర్జగామ గృహాత్తస్మాద్దీప్యమానో యథాంశుమాన్. 5

ప్ర. అ. పథి = మార్గమునందు, క్వచిత్ = ఎక్కడా కూడ, కించిత్ = ఏమీ కూడ, అవ్యాహరన్ = మాటలాడనివాడై, నిశ్చేష్టః = చేష్టలులేనివాడై, నిఃసుఖః = సుఖము లేనివాడై, దీప్యమానః = ప్రకాశించుచున్న, అంశుమాన్ యథా = సూర్యుడు వలె, తస్మాత్ = ఆ, గృహాత్ = గృహమునుండి, నిర్జగామ = బయలుదేరెను.

తా. మార్గమునందు ఎక్కడా ఏమీ మాటలాడక, నడక తప్ప ఇతర చేష్టలేవీ లేనివాడై. సుఖదృష్టి లేనివాడై, ప్రకాశించుచున్న సూర్యుడు వలె, ఆ గృహమునుండి బయలుదేరెను. 5

మూ. రామస్య దక్షిణే పార్శ్వే పద్మా శ్రీః సముపస్థితా,
సవ్యేఽపి చ మహీ దేవీ వ్యవసాయస్తథాగ్రతః. 6

ప్ర. అ. రామస్య=రామునియొక్క, దక్షిణే పార్శ్వే=కుడిప్రక్క, పద్మా = పద్మము గల, శ్రీః = లక్ష్మి, సముపస్థితా = వచ్చినది. సవ్యేఽపి = ఎడమ పార్శ్వమునందు, మహీ దేవీ=భూదేవి, తథా=మరియు, వ్యవసాయః = వ్యవసాయ శక్తి (సంహారశక్తి), అగ్రతః=ఎదుట ఉండెను.

తా. అప్పుడు రాముని కుడి ప్రక్క పద్మహస్తయైన లక్ష్మి, ఎడమప్రక్క భూదేవి, ఎదుటి భాగమునందు వ్యవసాయశక్తి (సంహారశక్తి) నడచుచుండెను. 6

మూ. శరా నానావిధాశ్చాపి ధనురాయతముత్తమమ్,
తథాయుధాశ్చ తే సర్వే యయుః పురుషవిగ్రహాః. 7

ప్ర. అ. నానావిధాః = అనేకవిధములైన, శరాః = బాణములు, ఆయతమ్ = దీర్ఘమైన, ఉత్తమమ్ = ఉత్తమమైన, ధనుః = ధనస్సు, తథా=మరియు, సర్వే = సమస్తమైన, ఆయుధాః చ = ఆయుధములు, పురుషవిగ్రహాః = పురుషరూపములు గలవై, యయుః = వెళ్ళినవి.

తా. అనేకవిధములైన బాణములు, పొడవైన ఉత్తమమైన ధనస్సు, సమస్త ఆయుధములు అన్నీ కూడ పురుషరూపము ధరించి రాముని వెనుక వెళ్ళినవి. 7

మూ. వేదా బ్రాహ్మణరూపేణ గాయత్రీ సర్వరక్షిణీ,
ఓంకారోఽథ వషట్కారః సర్వే రామమనువ్రతాః. 8

ప్ర. అ. వేదాః=వేదములు, సర్వరక్షిణీ=సర్వమును రక్షించు, గాయత్రీ = గాయత్రి, ఓంకారః = ఓంకారము, అథ = మరియు, వషట్కారః = వషట్కారము, సర్వే = అందరూ కూడ, బ్రాహ్మణరూపేణ=బ్రాహ్మణరూపముతో, రామమ్ = రాముణ్ణి, అనువ్రతాః = అనుసరించి వెళ్ళిరి.

తా. వేదములు, సర్వరక్షకురాలైన గాయత్రి, ఓంకారము, వషట్కారము అందరూ కూడ బ్రాహ్మణరూపములలో రాముణ్ణి అనుసరించి వెళ్ళిరి. 8

మూ. ఋషయశ్చ మహాత్మానః సర్వే ఏవ మహీసురాః,
అన్వగచ్ఛన్మహాత్మానం స్వర్గద్వారమపావృతమ్. 9

ప్ర. అ. మహాత్మానః = మహత్ములైన, ఋషయః చ = ఋషులు, సర్వే = సమస్తమైన, మహీసురాః = బ్రాహ్మణులు, అపావృతమ్ = తెరవబడిన, స్వర్గ ద్వారమ్ = స్వర్గద్వారమును గూర్చి, మహాత్మానమ్ = మహాత్ముడైన రాముణ్ణి, అన్వగచ్ఛన్ = అనుసరించి వెళ్ళిరి.

తా. మహాత్ములైన ఋషులు, సమస్తమైన బ్రాహ్మణులు, తెరవబడిన స్వర్గ ద్వారమును గూర్చి, ఆ రాముణ్ణి అనుసరించి వెళ్ళిరి. 9

మూ. తం యాన్తమనుగచ్ఛన్తి హ్యన్తఃపురచరాః స్త్రియః,
సవృద్ధబాలదాసీకాః సవర్షవరకింకరాః. 10

ప్ర. అ. సవృద్ధబాలదాసీకాః = వృద్ధలైన దాసీలతోను, బాలలైన దాసీల తోను కూడిన, సవర్షవరకింకరాః = కంచుకులతోను కింకరులతోను కూడిన, అన్తః పురచరాః = అంతఃపురమునందు సంచరించు, స్త్రియః = స్త్రీలు, యాన్తమ్ = వెళ్లుచున్న, తమ్ = ఆ రాముణ్ణి, అనుయాన్తి = అనుసరించి వెళ్ళిరి.

తా. అంతఃపురస్త్రీలు, వృద్ధదాసీలు, బాలదాసీలు, కంచుకులు, కింకరులు రాముని వెనుక వెళ్ళిరి. 10

మూ. సాన్తఃపురశ్చ భరతః శత్రుఘ్నసహితో యయౌ,
రామం గతిముపాగమ్య సాగ్నిహోత్రమనువ్రతాః. 11

ప్ర. అ. సాన్తఃపురః = అంతఃపురముతో కూడిన, భరతః = భరతుడు, శత్రుఘ్నసహితః = శత్రుఘ్నునితో కూడినవాడై, యయౌ = వెళ్ళెను. సాగ్ని హోత్రమ్ = అగ్నిహోత్రముతో కూడిన, రామమ్ = రాముణ్ణి, గతిమ్ = గతినిగా, ఉపాగమ్య = పొంది, అనువ్రతాః = అనుసరించుచున్నవారై (వెళ్ళిరి).

తా. భరతుడు అంతపురముతోను, శత్రఘ్నునితోను కలిసి వెళ్లెను. వారందరూ అగ్నిహోత్రాగ్నితో కూడిన రాముణ్ణి గతిగా పొంది అతనిని అనుస రించిరి. 11

మూ. తే చ సర్వే మహాత్మానః సాగ్నిహోత్రాః సమాగతాః,
సపుత్రదారాః కాకుత్స్థమనుజగ్ముర్మహామతిమ్. 12

ప్ర. అ. సాగ్నిహోత్రాః = అగ్నిహోత్రాగ్నిసహితులై, సమాగతాః = వచ్చిన, సర్వే = సమస్తమైన, తే మహాత్మానః = ఆ మహాత్ములు, సపుత్రదారాః = భార్యాపుత్రులతో కూడినవారై, మహామతిమ్ = గొప్ప బుద్ధి గల ఆ రాముణ్ణి, అనుజగ్ముః = అనుసరించివెళ్ళిరి.

తా. తమ తమ అగ్నిహోత్రాగ్నులను తీసికొని వచ్చిన ఆ మహాత్ములందరూ, భార్యాపుత్రసహితులై రాముణ్ణి అనుసరించి వెళ్ళిరి. 12

మూ. మన్త్రిణో భృత్యవర్గాశ్చ సపుత్రపశుబాన్ధవాః,
సర్వే సహానుగా రామమన్వగచ్ఛన్ ప్రహృష్టవత్. 13

ప్ర. అ. మన్త్రిణః = మంత్రులు, సపుత్రపశుబాన్ధవాః = పుత్రపశుబంధువులతో కూడిన, భృత్యవర్గాః చ = భృత్యసముదాయములు, సర్వే = అందరూ, సహానుగాః = అనుచరులతో కూడినవారై, ప్రహృష్టవత్ = సంతోషించుచు, రామమ్ = రాముణ్ణి, అన్వగచ్ఛన్ = అనుసరించిరి.

తా. మంత్రులు, పుత్రపశుబంధుసహితులైన భృత్యులు అందరూ కూడ తమ అనుచరులతో కూడ సంతోషముతో రాముని వెనుక వెళ్ళిరి. 13

మూ. తతః సర్వాః ప్రకృతయో హృష్టపుష్టజనావృతాః,
గచ్ఛన్తమనుగచ్ఛన్తి రాఘవం గుణరఞ్జితాః. 14

ప్ర. అ తతః = అటుపిమ్మట, హృష్టపుష్టజనావృతాః = సంతోషించుచున్న, ఆరోగ్యవంతులైన జనులతో కూడిన, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = ప్రజలు, గుణరఞ్జితాః = రాముని సద్గుణములచేత రంజిపచేయబడినవారై, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్న ఆ రాముణ్ణి, అనుగచ్ఛన్తి = అనుసరించి వెళ్ళిరి.

తా. పిమ్మట సంతోషించుచున్న ఆరోగ్యవంతులైన జనులతో నిండిన ప్రజ లందరూ రాముని గుణములచేత రంజింపచేయబడినవారై వెళ్ళుచున్న ఆతనిని అనుసరించి వెళ్ళిరి. 14

మూ. తతః సస్త్రీపుమాంసస్తే సపక్షిపశుబాన్ధవాః,
రాఘవస్యానుగాః సర్వే హృష్టా విగతకల్మషాః. 15

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సస్త్రీపుమాంసః = స్త్రీపురుషులతో కూడిన, సపక్షిపశుబాన్ధవాః = పక్షులతోను, పశువులతోను. బంధువులతోను కూడిన, రాఘవస్య = రామునియొక్క, అనుగాః = అనుచరులైన. తే సర్వే = వారందరూ, హృష్టాః = సంతోషించినారు. విగతకల్మషాః = పోయిన పాపములుకలవారుగా ఉండిరి.

తా. రాముణ్ణి అనుసరించి వచ్చిన స్త్రీలు, పురుషులు, పక్షులు, పశువులు అందరూ కూడ పాపరహితులై ఉత్సాహసంపన్నులై ఉండిరి. 15

మూ. స్నాతాః ప్రముదితాః సర్వే హృష్టపుష్టాశ్చ వానరాః,
దృఢం కిలకిలాశబ్దైః సర్వం రామమనువ్రతమ్. 16

ప్ర. అ. హృష్టపుష్టాః చ = సంతోషముతో కూడినవారు పరిపుష్టితో ఉన్న వారు అయిన, సర్వే = సమస్తమైన, వానరాః = వానరులు, స్నాతాః = స్నానము చేసినవారై, ప్రముదితాః = ఆనందముతో ఉండిరి సర్వమ్ = ఆ వానరసమూహము అంతా, దృఢమ్ = దృఢముగా, కిలకిలాశబ్దైః = కిలకిలాశబ్దములతో, రామమ్ = రాముణ్ణి, అనువ్రతమ్ = అనుసరించి ఉన్నది.

తా. వానరులందరు హృష్టులై, పుష్టులై, స్నానముచేసి ఆనందముతో ఉండిరి. ఆ వానరసముదాయము అంతా కిలకిలాశబ్దము చేయుచు రాముణ్ణి అనుసరించుటకు స్థిరసంకల్పముతో ఉండెను. 16

మూ. న తత్ర కశ్చిద్దీనో వా వ్రీడితో వాపి దుఃఖితః,
హృష్టం ప్రముదితం సర్వం బభూవ పరమాద్భుతమ్. 17

ప్ర. అ. తత్ర = అక్కడ, దీనో వా = దీనుడు గాని, వ్రీడితో వాపి = సిగ్గుతో ఉన్నవాడు గాని, దుఃఖితో వాపి = దుఃఖించుచున్నవాడు గాని, కశ్చిత్ = ఎవ్వడూ కూడ. న = లేకుండెను. సర్వమ్ = సమస్తమూ కూడ, హృష్టమ్ = హర్షపూర్ణమై, ప్రముదితమ్ = ఆనందభరితమై, పరమాద్భుతమ్ = చాల ఆశ్చర్యకరముగ, బభూవ = ఉండెను.

తా. అక్కడ దీనుడు గాని సిగ్గుపడుచున్నవాడు గాని, దుఃఖితుడు గాని ఎవ్వడూ కూడ లేకుండెను. సమస్తమూ కూడ హర్షపూర్ణము, ఆనందభరితము అయి ఆశ్చర్యకరముగ ఉండెను. 17

మూ. ద్రష్టుకామోథ నిర్యాన్తం రామం జానపదో జనః,
యః ప్రాప్తః సోఽపి దృష్ట్వైవ స్వర్గాయానుగతో ముదా.

ప్ర. అ. అథ = పిమ్మట, నిర్యాన్తమ్ = వెళ్ళుచున్న, రామమ్ = రాముణ్ణి, ద్రష్టుకామః = చూచుటకు ఇచ్ఛ గల, యః = ఏ, జానపదః = పల్లెలకు సంబంధించిన, జనః = జనము, ప్రాప్తః = వచ్చినదో, సః అపి = ఆ జనము కూడ, దృష్ట్వైవ = చూడగానే, ముదా = సంతోషముతో, స్వర్గాయ = స్వర్గముకొరకు, అనుగతః = అనుసరించి వెళ్ళినది.

తా. రాముడు వెళ్ళిపోవుచున్నా డని చూచుటకై పల్లెలనుండి వచ్చినవాళ్లు కూడ ఆతనిని చూడగానే సంతోషముతో, స్వర్గముకొరకు, ఆతనిని అనుసరించి వెళ్ళిరి. 18

మూ. ఋక్షవానరరక్షాంసి జనాశ్చ పురవాసినః,
అగచ్ఛన్ పరయా భక్త్యా పృష్ఠతః సుసమాహితాః 19

ప్ర. అ. ఋక్షవానరరక్షాంసి = భల్లూకములు, వానరులు, రాక్షసులు, పురవాసినః = పురమునందు నివసించుచున్న, జనాః చ = జనులు, సుసమాహితాః = చాల సావధానచిత్తులై, పరయా = గొప్ప, భక్త్యా = భక్తితో, పృష్ఠతః = రాముని వెనుకనే, అగచ్ఛన్ = వచ్చిరి.

తా. భల్లూకములు, వానరులు, రాక్షసులు, నగరవాసులైన జనులు సావధానచిత్తులై, గొప్ప భక్తితో రాముని వెనుకనే వచ్చిరి. 19

మూ. యాని భూతాని నగరేఽప్యన్తర్ధానగతాని చ,
రాఘవం తాన్యనుయయుః స్వర్గాయ సముపస్థితమ్. 20

ప్ర. అ. నగరే = నగరమునందు, అన్తర్ధానగతాని = అంతర్ధానము చెందిన, యాని = ఏ, భూతాని = భూతములు కలవో, తాన్యపి = అవి కూడ, స్వర్గాయ

= స్వర్గముకొరకు, సముపస్థితమ్ = వచ్చిన, రామమ్ = రాముణ్ణి, అనుయయుః = అనుసరించి వెళ్ళినవి.

తా. నగరములో అదృశ్యములుగా ఉన్న భూతములు కూడ స్వర్గమునకు బయలుదేరిన రాముణ్ణి అనుసరించి వెళ్ళినవి. 20

మూ. యాని పశ్యన్తి కాకుత్థ్సం స్థావరాణి చరాణి చ,
సర్వాణి రామగమనే అనుజగ్ముర్హి తాన్యపి. 21

ప్ర అ. రామగమనే = రాముని గమనసమయమునందు, స్థావరాణి = స్థావరములు, చరాణి చ = చరములూ అయిన, యాని = ఏవి, కాంకుత్థ్సమ్ = రాముణ్ణి, పశ్యన్తి = చూచినవో, సర్వాణి = సమస్తమైన, తాన్యపి = అవి కూడ, అనుజగ్ముః = అనుసరించి వెళ్ళినవి.

తా. రాముడు వెళ్ళు చున్నప్పుడు అతనిని చూచిన జంగమములు, స్థావరములూ కూడ అతనిని అనుసరించి వెళ్ళినవి. (రాముని దృష్టి ప్రసరించగానే స్థావరములైన వృక్షాదులలో కూడ జ్ఞానము ఉద్భవించి అవి కూడ [ఆ జీవులు కూడ] రామునివెంట వెళ్ళినవి). 21

మూ. నోచ్ఛ్వసత్తదయోధ్యాయాం సుసూక్ష్మమపి దృశ్యతే,
తిర్యగ్యోనిగతాశ్చైవ సర్వే రామమనువ్రతాః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
నవాధికశతతమః సర్గః.

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యయందు, ఉచ్ఛ్వసత్ = శ్వాస పీల్చునది, తత్ = అట్టిది, సుసూక్ష్మమ్ అపి = చాల సూక్ష్మమైనది కూడ, న దృశ్యతే = కనబడలేదు. సర్వే=సమస్తమైన, తిర్యగ్యోనిగతాః చైవ=తిర్యగ్ జంతువులు కూడ, రామమ్ = రాముణ్ణి, అనువ్రతాః = అనుసరించినవి.

తా. అయోధ్యలో, ఊపిరి పీల్చే ఒక్క చాల చిన్న ప్రాణి కూడ మిగల లేదు. తిర్యగ్జంతువులు అన్నీ కూడ రాముణ్ణి అనుసరించి వెళ్ళినవి. 22

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
నూట తొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ దశాధికశతతమః సర్గః

[సోదరసహితుడైన రాముడు తన వైష్ణవతేజస్సులో ప్రవేశించుట, ఆ రామునితో వచ్చినవారి కందరికీ సంతానక మను లోకము లభించుట.]

మూ. అధ్యర్ధయోజనం గత్వా నదీం పశ్చాన్ముఖాశ్రితామ్,
సరయూం పుణ్యసలిలాం దదర్శ రఘునన్దనః. 1

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, అధ్యర్ధయోజనమ్ = యోజనముకంటె అర్ధము అధికము గల దూరము, గత్వా = వెళ్ళి, పుణ్యసలిలామ్ = పుణ్యమైన ఉదకము గల, పశ్చాన్ముఖాశ్రితామ్ = పశ్చిమాభిముఖుడుగా అన్న తనచేత ఆశ్రయించబడిన, సరయూం నదీమ్ = సరయూనదిని, దదర్శ = చూచెను.

తా. రాముడు ఒకటిన్నర యోజనముల దూరము వెళ్ళి పుణ్యమైన ఉదకము గల, పశ్చిమాభిముఖుడుగా ఉన్న తనచేత ఆశ్రయించబడిన సరయూనదిని చూచెను. 1

మూ. తాం నదీమాకులావర్తాం సర్వత్రానుసరన్నృపః,
ఆగతః సప్రజో రామ స్తం దేశం రఘునన్దనః. 2

ప్ర. అ. నృపః = రాజు, రఘునన్దనః = రఘువంశమునకు ఆనందము కలిగించువాడు అయిన, రామః = రాముడు, ఆకులావర్తామ్ = వ్యాకులములైన సుళ్ళు గల, తాం నదీమ్ = ఆ నదిని, సర్వత్ర = అంతట, అనుసరన్ = అనుసరించుచు, సప్రజః = ప్రజలతో కూడినవాడై, తం దేశమ్ = ఆ ప్రదేశమును గూర్చి, ఆగతః = వచ్చినాడు.

తా. రాజైన రాముడు సుళ్ళతో వ్యాకులమైన జలము గల ఆ నదిని అంతటా

పరిశీలించుచు తిరిగి, ప్రజలతో తాను ప్రవేశించుటకు తగిన (స్వర్గప్రాపకమైన) ప్రదేశమునకు వచ్చెను. 2

మూ. అథ తస్మిన్ ముహూర్తే తు బ్రహ్మా లోకపితామహః,
సర్వైః పరివృతో దేవైర్భూషితైశ్చ మహాత్మభిః. 3

ఆయయౌ యత్ర కాకుత్స్థః స్వర్గాయ సముపస్థితః,
విమానశతకోటీభిర్దివ్యాభిరభిసంవృతః. 4

ప్ర. అ. అథ = ఆటుపిమ్మట, తస్మిన్ ముహూర్తే = ఆ ముహూర్తమునందు, లోకపితామహః = లోకములకు పితామహుడైన, బ్రహ్మా = బ్రహ్మ, భూషితైః = అలంకరించబడిన, మహాత్మభిః = మహాత్ములైన, సర్వైః = సమస్తమైన, దేవైః = దేవతలతో, పరివృతః = కూడినవాడై, దివ్యాభిః = దివ్యములైన, విమానశతకోటిభిః = విమానముల శతకోటులతో, అభిసంవృతః = కూడినవాడై, కాకుత్స్థః = రాముడు, స్వర్గాయ = స్వర్గముకొరకు, యత్ర = ఎక్కడికి, సముపస్థితః = వచ్చిఉన్నాడో అక్కడికి, ఆయయౌ = వచ్చెను.

తా. అప్పుడు సమస్తలోకములకు పితామహుడైన బ్రహ్మదేవుడు బాగుగా అలంకరించుకొనిన మహాత్ములైన సకలదేవతలతో కలిసి, దివ్యములైన శతకోటి విమానములు వెంట రాగా, రాముడు స్వర్గమునకు వెళ్ళుటకై, వచ్చిన స్థానమునకు వచ్చెను. 3, 4

మూ. దివ్యతేజోన్నతం వ్యోమ జ్యోతిర్భూతమనుత్తమమ్.
స్వయంప్రభైః స్వతేజోభిః స్వర్గిభిః పుణ్యకర్మభిః, 5

ప్ర. అ. స్వయంప్రభైః = స్వయముగా కాంతి గల, స్వతేజోభిః = స్వీయమైన తేజస్సు గల, పుణ్యకర్మభిః = పుణ్యకర్మలు గల, స్వర్గిభిః = దేవతలచేత, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, వ్యోమ = ఆకాశము, దివ్యతేజోవృతమ్ = దివ్యమైన తేజస్సుతో కూడినదై, జ్యోతిర్భూతమ్ = తేజస్సుగా అయిపోయినది.

తా. సహజమైన కాంతి, తేజస్సు గల పుణ్యాత్ములైన దేవతలతో అత్యుత్తమమైన ఆకాశము దివ్యమైన తేజస్సుతో నిండినదై తేజోరూపమైపోయెను. 5

మూ. భ్రాతృభిః సహ దేవాభైః ప్రవిశస్వ స్వికాం తనుమ్,
యామిచ్ఛసి మహాబాహో తాం తనుం ప్రవిశ స్వికామ్.

ప్ర. అ. దేవాభైః = దేవతలవంటి కాంతి గల, భ్రాతృభిః సహ=సోదరులతో కూడ, స్వికామ్ = నీ సంబంధమైన, తనుమ్ = శరీరమును, ప్రవిశస్వ = ప్రవేశించుము. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! యామ్ = ఏ, స్వికామ్ = స్వీయమైన, తనుమ్ = శరీరమును, ఇచ్ఛసి = కోరుచున్నావో, తామ్ = దానిని, ప్రవిశ = ప్రవేశించుము.

తా. మహాబాహూ! దేవతల వంటి సోదరులతో కూడ నీ స్వీయదేహములో ప్రవేశించుము. నీ దేహములలో దేనిలో ప్రవేశించవలె నని కోరెదవో దానిలో ప్రవేశించుము. 9

మూ. వైష్ణవీం వా మహాతేజో యద్వాకాశం సనాతనమ్,
త్వం హి లోకగతిర్దేవ న త్వాం కేచిత్ప్రజానతే. 10

ఋతే మాయాంవిశాలాక్షీం తవ పూర్వపరిగ్రహామ్,
త్వామచిన్త్యం మహద్భూతమక్షయం చాజరం తథా,
యామిచ్ఛసి మహాతేజస్తాం తనుం ప్రవిశ స్వయమ్. 11

ప్ర. అ. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా! వైష్ణవీం వా = వైష్ణవమైన శరీరమును గాని, యద్వా = లేదా, సనాతనమ్ = నిత్యమైన, ఆకాశమ్ = శుద్ధబ్రహ్మస్వరూపమును గాని, ప్రవేశించుము. దేవ = దేవా, త్వమ్ = నీవు, లోకగతిః హి = లోకమునకు గతివి కదా? అచిన్త్యమ్ = ఊహించ శక్యము కాని, మహద్ భూతమ్ = గొప్ప భూతమైన, అక్షయమ్ = నాశము లేని, తథా = మరియు, అజరమ్ = జీర్ణత్వము లేని, త్వామ్ = నిన్ను, విశాలాక్షీమ్ = విశాలములైన నేత్రములు గల, తవ పూర్వపరిగ్రహామ్ = నీ అతి పురాతనసహజశక్తియైన, మాయాం ఋతే = మాయ తప్ప, కేచిత్ = ఎవ్వరూ కూడ, న ప్రజానతే = తెలిసికొనజాలరు. మహాతేజః = గొప్ప తేజస్సు కలవాడా! యామ్ = దేనిని, ఇచ్ఛసి = కోరుచున్నావో, తాం తనుమ్ = ఆ శరీరమును, స్వయమ్ = స్వయముగా, ప్రవిశ = ప్రవేశించుము.

తా. గొప్ప తేజస్సు కలవాడా ! ఆ వైష్ణవశరీరమును గాని, నిత్యమైన శుద్ధబ్రహ్మస్వరూపమును గాని ప్రవేశించుము. దేవా! నీవే లోకములకు గతివి. నీవు అనాదిసిద్ధముగా ఉన్న విశాలములైన నేత్రములు గల మాయ తప్ప మరె వ్వరిచేతా ఊహింప శక్యముకానివాడవు. గొప్ప భూతము, నాశరహితుడవు, జరా శూన్యుడవు అయిన నిన్ను తెలిసికొనజాలరు.

వి. పైన ఇచ్చిన "వైష్ణవీమ్...." "ఋతే మాయామ్..." ఇత్యాది శ్లోకా ర్ధాలకి బదులు ప్రాచ్యపాఠంలో "వైష్ణవం సుమహాతేజస్తవాకాశం సనాతనమ్"అని, "ఋతే మత్తో విశాలాక్ష భూతపూర్వపరిగ్రహమ్" అనీ పాఠాలు ఉన్నవి. "నిత్య మైన ఆకాశస్వరూపమైన నీ వైష్ణవరూపమును"అని, "ఓ విశాలాక్షా! అతిపురాతన కాలమునుండి నీచే స్వీకరించబడిన నేను తప్ప" అని వాటి అర్థాలు. 11

మూ. పితామహవచః శ్రుత్వా వినిశ్చిత్య మహామతిః,
వివేశ వైష్ణవం తేజః సశరీరః సహానుజః. 12

ప్ర. అ. మహామతిః = గొప్ప బుద్ధి గల రాముడు, పితామహవచః=బ్రహ్మ దేవుని వచనమును, శ్రుత్వా = విని, వినిశ్చిత్య=నిశ్చయముచేసికొని, సహానుజః = తమ్ములతో కూడినవాడై, సశరీరః = శరీరముతో కూడినవాడై, వైష్ణవం తేజః = విష్ణువునకు సంబంధించిన తేజస్సును, వివేశ = ప్రవేశించెను.

తా. గొప్ప బుద్ధి గల రాముడు బ్రహ్మదేవుని మాటలు విని, నిశ్చయించు కొని, తమ్ములతో కూడ, సశరీరముగా వైష్ణవతేజస్సులో ప్రవేశించెను. 12

మూ. తతో విష్ణుమయం దేవం పూజయన్తి స్మ దేవతాః,
సాధ్యా మరుద్గణాశ్చైవ సేన్ద్రాః సాగ్నిపురోగమాః. 13

యే చ దివ్యా ఋషిగణా గన్ధర్వాప్సరసశ్చ యాః,
సుపర్ణనాగయక్షాశ్చ దైత్యదానవరాక్షసాః. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, విష్ణుమయమ్ = విష్ణుస్వరూపుడైన, దేవమ్ = రాముణ్ణి, దేవతాః = దేవతలు, సాధ్యాః = సాధ్యులు, సేన్ద్రాః = ఇంద్రునితో కూడిన, సాగ్నిపురోగమాః = అగ్ని ముందునడచువాడుగా గల, మరుద్గణాః చ ఏవ = మరుద్గణములు, దివ్యాః = దివ్యములైన, యే = ఏ, ఋషిగణాః = ఋషి

గణము లున్నవో అవి, యాః = ఏ, గన్ధర్వాప్సరసః చ = గంధర్వులూ అప్సరసలూ గలరో వారు, సుపర్ణనాగయక్షాః చ = గరుత్మంతులు, నాగులు, యక్షులు, దైత్యదానవరాక్షసాః = దైత్యులు, దానవులు, రాక్షసులు, పూజయన్తి స్మ = పూజించిరి.

తా. పిమ్మట విష్ణురూపములో నిలీనుడై విష్ణువైపోయిన ఆ రాముణ్ణి దేవతలు, సాధ్యులు, మరుద్గణములు, ఇంద్రుడు, అగ్ని, దివ్యఋషులు, గంధర్వులు, అప్సరసలు, గరుత్మంతులు, నాగులు, యక్షులు, దైత్య - దానవ - రాక్షసులు పూజించిరి. 13, 14

మూ. సర్వం పుష్టం ప్రముదితం సుసంపూర్ణమనోరథమ్,
సాధు సాధ్వితి తైర్దేవైస్త్రిదివం గతకల్మషమ్. 15

ప్ర. అ. గతకల్మషమ్ = పోయిన కల్మషము గల, సర్వమ్ = సమస్తమైన, త్రిదివమ్ = స్వర్గము, పుష్టమ్ = పరిపుష్టమైనది. ప్రముదితమ్ = బాగా సంతోషించినది. సుసంపూర్ణమనోరథమ్ = బాగా సంపూర్ణమైన మనోరథము కలది, సాధు సాధు = బాగు, బాగు, ఇతి = అని, తైః = ఆ, దేవైః = దేవలచేత పలకబడెను.

తా. దేవత లందరు - "కల్మషరహితమైన ఈ స్వర్గము అంతా ఇప్పుడు పరిపుష్టమైనది, సంతోషముతో నిండినది. దీని మనోరథములు పూర్ణమైనవి. బాగు బాగు" అని పలికిరి. 15

మూ. అథ విష్ణుర్మహాతేజాః పితామహముువాచ హ,
ఏషాం లోకం జనౌఘానాం దాతుమర్హసి సువ్రత. 16

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, విష్ణుః = విష్ణువు, పితామహమ్ = బ్రహ్మదేవుణ్ణి గూర్చి, ఉవాచ హ = పలికెను. సువ్రత = మంచి నియమములు కలవాడా! ఏషామ్ = ఈ, జనౌఘానామ్ = జనసముదాయములకు, లోకమ్ = ఉత్తమలోకమును, దాతుమ్ = ఇచ్చుటకు, అర్హసి = తగి ఉన్నావు.

తా. పిమ్మట గొప్ప తేజస్సు గల విష్ణువు బ్రహ్మదేవునితో ఇట్లనెను- "ఓ! సువ్రతా! ఈ జను లందరికీ ఉత్తమలోకమును ఇమ్ము". 16

మూ. ఇమే హి సర్వే స్నేహాన్మామనుయాతా మనస్వినః,
భక్తా హి భజితవ్యాశ్చ త్యక్తాత్మానశ్చ మత్కృతే. 17

ప్ర. అ. ఇమే = ఈ, సర్వే = సమస్తమైన, మనస్వినః = ఉత్తమమైన మనస్సు గలవారు, స్నేహాత్ = స్నేహమువలన, మామ్ = నన్ను, అనుయాతాః = అనుసరించినారు. మత్కృతే = నా నిమిత్తమై, త్యక్తాత్మానః = విడవబడిన దేహములుఁగల, భక్తాః = భక్తులు, భజితవ్యాః హి = సేవింపదగినవారు కదా ?

తా. ఉత్తమమనస్సు గల వీరందరూ నాపై నున్న స్నేహముచేత నా వెనుక వచ్చినారు. నా నిమిత్తము దేహములు వదిలిన భక్తులు సేవించదగినవారు కదా ? 17

మూ. తచ్ఛ్రుత్వా విష్ణువచనం బ్రహ్మా లోకగురుః ప్రభుః,
లోకాన్ సంతానకాన్నామ యాస్యన్తీమే సమాగతాః. 18

ప్ర. అ. తత్ = ఆ, విష్ణువచనమ్ = విష్ణువచనమును, శ్రుత్వా = విని, లోకగురుః = లోకముల గురువు, ప్రభుః = ప్రభువూ అయిన, బ్రహ్మా = బ్రహ్మ, సమాగతాః = నీతో వచ్చిన, ఇమే = వీరు, సంతానకాన్ నామ = సంతానకములను, లోకాన్ = లోకములను గూర్చి, యాస్యన్తి = వెళ్ళగలరు.

తా. విష్ణువు పలికిన మాట విని లోకగురువు, సమర్థుడు అయిన బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను- "నీ వెనుకనే వచ్చిన వీరు సంతానక మను లోకమునకు వెళ్ళగలరు." 18

మూ. యచ్చ తిర్యగ్గతం కించిత్ త్వామేవమనుచిన్తయత్,
ప్రాణాంస్త్యక్ష్యతి భక్త్యా తత్సన్తానే వినివత్స్యతి, 19
సర్వైర్బ్రహ్మగుణైర్యుక్తే బ్రహ్మలోకాదనన్తరే.

ప్ర. అ. తిర్యగ్గతమ్ = తిర్యగ్యోనిని పొందిన, యచ్చ కించిత్ = ఏ ప్రాణియైనా, భక్త్యా = భక్తితో, త్వామేవ = నిన్నే, అనుచిన్తయత్ = స్మరించుచు, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యతి = విడువగలదో, తత్ = అది, సర్వైః = సమస్తమైన, బ్రహ్మగుణైః = బ్రహ్మగుణములతో, యుక్తే = కూడిన, బ్రహ్మలో

కాత్ = బ్రహ్మలోకముకంటె, అనన్తరే = అవ్యవహితమైన, సంతానే = సంతాన లోకమునందు, వినివత్స్యతి = నివసించగలదు.

తా. తిర్యగ్జంతువు కూడ భక్తితో నిన్నే స్మరించుచు ప్రాణాలను విడిచి పెట్టినచో అది అన్ని బ్రహ్మగుణములూ ఉన్న, బ్రహ్మలోకమునకు ప్రక్కనే ఉన్న సంతాన లోకములలో నివసించును. 19

మూ. వానరాశ్చ స్వికాం యోనిమృక్షాశ్చ ప్రతిపేదిరే, 20
యేభ్యో వినిఃసృతాః సర్వే సురేభ్యః సురసంభవాః.

ప్ర. అ. సురసంభవాః = దేవతలవలన పుట్టిన, వానరాః = వానరులు, ఋక్షాః చ = భల్లూకములు, సర్వే = అందరూ, యేభ్యః = ఎవరినుండి, వినిః సృతాః = ఆవిర్భవించిరో, స్వికామ్ = తమసంబంధమైన, యోనిమ్ = కారణమును, ప్రతిపేదిరే = పొందిరి.

తా. దేవతలవలన పుట్టిన వానరులు, భల్లూకములు, అందరూ కూడ తమ తమ ఉత్పత్తికి కారణభూతులైన దేవతలలో లీనమైపోయిరి (ఇతరులు సంతాన లోకమునకు వెళ్ళిరి). 20

మూ. తేషు ప్రవివిశే చైవ సుగ్రీవః సూర్యమణ్డలమ్, 21
పశ్యతాం సర్వదేవానాం స్వాన్ పితౄన్ ప్రతిపేదిరే.

ప్ర. అ. తేషు = అట్టివారిలో, సుగ్రీవః = సుగ్రీవుడు, సూర్యమణ్డలమ్ = సూర్యమండలమును, ప్రవివిశే చైవ = ప్రవేశించెను. (ఇతరులు), సర్వదేవానామ్ = సమస్తదేవతలు, పశ్యతామ్ = చూచుచుండగా, స్వాన్ = తమ సంబంధమైన, పితౄన్ = తండ్రులను, ప్రతిపేదిరే = పొందిరి.

తా. వారిలో సుగ్రీవుడు సూర్యమండలములో ప్రవేశించెను. ఇతరులు దేవత లందరూ చూచుచుండగా, తమ తండ్రులను పొందిరి. 21

మూ. తథా బ్రువతి దేవేశే గోప్రతారముపాగతాః, 22
భేజిరే సరయూం సర్వే హర్షపూర్ణాశ్రువిక్లవాః.

ప్ర. అ దేవేశే = బ్రహ్మదేవుడు, తథా = అట్లు, బ్రువతి = పలుకు

చుండగా, గోప్రతారమ్=గోప్రతారక్షేత్రమును, ఉపాగతాః=పొందిన, సర్వే= అందరూ, హర్షపూర్ణాశ్రువిక్లవాః=సంతోషముతో నిండినకన్నీళ్ళచేత వ్యాకులురై, సరయూమ్=సరయూనదిని, భేజిరే=పొందిరి.

తా. బ్రహ్మదేవుడు ఆ విధముగా పలుకుచుండగా సరయూనదియందలి గోప్రతారక్షేత్రమునకు వచ్చిన జనులు సంతోషముతో నిండిన కన్నీళ్ళతో వ్యాకులురై సరయూనదిలో ప్రవేశించిరి. 22

మూ. అవగాహ్యాప్సు యో యో వై ప్రాణాంస్త్యక్త్వా ప్రహృష్టవత్,
మానుషం దేహముత్సృజ్య విమానం సోఽధ్యరోహత.

ప్ర. అ. యః యః=ఎవడెవడు, అప్సు=నీటియందు, అవగాహ్య= ప్రవేశించి, ప్రాణాన్=ప్రాణములను, త్యక్త్వా=విడచి, ప్రహృష్టవత్=సంతోషించెనో, సః=అతడు, మానుషమ్=మనుష్యసంబంధమైన, దేహమ్=దేహమును, ఉత్సృజ్య=విడచి, విమానమ్=విమానమును, అధ్యరోహత=ఎక్కెను.

తా. జలములో దిగి సంతోషపూర్వకముగా ప్రాణాలను విడచిన ప్రతి ఒక్కడూ కూడ మనుష్యదేహమును విడచి విమానమును ఎక్కి వెళ్లెను. 23

మూ. తిర్యగ్యోనిగతానాం చ శతాని సరయూజలమ్, 24
సంప్రాప్య త్రిదివం జగ్ముః ప్రభాసురవపూంషి తు.

ప్ర. అ. తిర్యగ్యోనిగతానామ్ = తిర్యగ్జన్మను పొందినవాటియొక్క, శతాని=వందలు, సరయూజలమ్=సరయూజలమును, సంప్రాప్య=పొంది, ప్రభాసురవపూంషి=ప్రకాశించుచున్న శరీరములు కలవై, త్రిదివమ్=స్వర్గమును గూర్చి, జగ్ముః=వెళ్ళినవి.

తా. పశుపక్ష్యాదులు కూడ ఆ సరయూనదీజలములో ప్రవేశించి ప్రకాశించుచున్న దేహములతో స్వర్గమునకు వెళ్లెను. 24

మూ. దివ్యా దివ్యేన వపుషా దేవా దీప్తా ఇవాభవన్, 25
గత్వా తు సరయూతోయం స్థావరాణి చరాణి చ
ప్రాప్య తత్తోయవిక్లేదం దేవలోకముపాగమన్. 26

ప్ర. అ. దివ్యాః=దివ్యములై, దివ్యేన=దివ్యమైన, వపుషా = దేహముతో, దీప్తాః = ప్రకాశించుచున్న, దేవాః ఇవ = దేవతలువలె, అభవన్ = అయినవి. స్థావరాణి = స్థావరములు, చరాణి చ = జంగమములుకూడ, సరయూతోయమ్ = సరయూనదీజలమును, గత్వా = పొంది, తత్తోయవిక్లేదమ్ = ఆ జలముతో తడుపును, ప్రాప్య = పొంది, దేవలోకమ్ = దేవలోకమును, ఉపాగమన్ = పొందినవి.

తా. (ఆ తిర్యగ్జంతువులు) దివ్యములై, దివ్యమైన శరీరముతో ప్రకాశించుచున్న దేవతలవలె ఉండెను. సరయూనదీజలములో ప్రవేశించిన స్థావరములు, జంగమములూ కూడ ఆ నీటిలో తడియగానే దేవలోకమును చేరెను. 25, 26

మూ. తస్మిన్యేపి సమాపన్నా ఋక్షవానరరాక్షసాః,
తేఽపి స్వర్గం ప్రవివిశుర్దేహాన్నిక్షిప్య చామ్భసి. 27

ప్ర. అ. తస్మిన్ = ఆ సరయూనదీజలమునందు, యే = ఏ, ఋక్షవానరరాక్షసాః = భల్లూకములు, వానరులు, రాక్షసులు, సమాపన్నాః=మరణించినారో, తే అపి=వారు కూడ, అమ్భసి = జలమునందు, దేహాన్=దేహములను, నిక్షిప్య= ఉంచి, స్వర్గమ్ = సర్గమును, ప్రవివిశుః = ప్రవేశించిరి.

తా. ఆ జలములో ప్రాణాలు విడిచిన భల్లూక–వానర–రాక్షసులు తమ దేహములను ఆ జలమునందు విడచి స్వర్గము చేరిరి. 27

మూ. తతః సమాగతాన్ సర్వాన్ స్థాప్య లోకగురుర్దివి,
హృష్టైః ప్రముదితైర్దేవైర్జగామ త్రిదివం మహత్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
దశాధికశతతమః సర్గః

ప్ర. అ. తతః= అటుపిమ్మట, లోకగురుః = లోకమునకు గురువైన బ్రహ్మదేవుడు, సమాగతాన్=వచ్చిన, సర్వాన్=అందరినీ. దివి=స్వర్గమునందు, స్థాప్య= ఉంచి, హృష్టైః = హర్షించిన, ప్రముదితైః = ఆనందించిన, దేవైః=దేవ

తలతో. మహత్ = గొప్పదైన, త్రివివమ్ = స్వర్గమును గూర్చి, జగామ = వెళ్ళెను.

తా. బ్రహ్మదేవుడు వచ్చినవారినందరినీ స్వర్గలోకములో ఉంచి, సంతోషాతిశయముతో కూడిన దేవతలతో కలిసి బ్రహ్మలోకమునకు వెళ్ళెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
ఉత్తరకాండలో నూటపదవ సర్గ సమాప్తము.

# అథ ఏకాదశో త్తరశతతమః సర్గః

[శ్రీమద్రామాయణమాహాత్మ్యము]

మూ. ఏతావదేతదాఖ్యానం సోత్తరం బ్రహ్మపూజితమ్,
రామాయణమితి ఖ్యాతం ముఖ్యం వాల్మీకినా కృతమ్. 1

ప్ర. అ. సోత్తరమ్ = ఉత్తరభాగముతో కూడిన, ఏతావత్ = ఇంత ప్రమాణము గల, బ్రహ్మపూజితమ్ = బ్రహ్మచేత పూజించబడిన, ఏతత్ = ఈ, ఆఖ్యానమ్ = ఆఖ్యానము, ముఖ్యమ్ = ఉత్తమమైనది. రామాయణమ్ ఇతి = రామాయణము అని, ఖ్యాతమ్ = ప్రసిద్ధమైనది. వాల్మీకినా = వాల్మీకిచేత, కృతమ్ = చేయబడినది.

తా. ఉత్తరభాగసహితమైన ఇంత ప్రమాణము గల, ఈ ఆఖ్యానము బ్రహ్మదేవునిచేత పూజించ బడినది. రామాయణమను పేరుతో ప్రసిద్ధి పొందిన ఈ ముఖ్యమైన ఆఖ్యానమును వాల్మీకి రచించెను. 1

మూ. తతః ప్రతిష్ఠితో విష్ణుః స్వర్గలోకే యథా పురా,
యేన వ్యాప్తమిదం సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, యేన = ఏవిష్ణువుచేత, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తమైన, సచరాచరమ్ = చరాచరములతో కూడిన, త్రైలోక్యమ్ = మూడు లోకముల సముదాయము, వ్యాప్తమ్ = వ్యాపించబడినదో అట్టి, విష్ణుః = విష్ణువు, యథాపురా = పూర్వమునందు వలె, స్వర్గలోకే = స్వర్గలోకమునందు, ప్రతిష్ఠితః = ప్రతిష్ఠితుడైనాడు.

తా. చరాచరాత్మకములైన మూడు లోకములను వ్యాపించి ఉన్న శ్రీమహా విష్ణువు, పిమ్మట, పూర్వమునందు వలె, స్వర్గమునందు సంప్రతిష్ఠితు డయ్యెను.

మూ. తతో దేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
నిత్యం శృణ్వన్తి సంహృష్టాః కావ్యం రామాయణం దివి.

ప్ర. అ. తతః = అందువలన, సగన్ధర్వాః = గంధర్వులతో కూడిన, దేవాః = దేవతలు, సిద్ధాః చ = సిద్ధులు, పరమర్షయః = మహర్షులు, సంహృష్టాః = సంతోషించినవారై, దివి = స్వర్గమునందు, రామాయణం కావ్యమ్ = రామాయణ కావ్యమును, నిత్యమ్ = నిత్యము, శృణ్వన్తి = వినుచున్నారు

తా. ఇది శ్రీమహావిష్ణువు చరిత్ర అగుటవలన స్వర్గలోకములో దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, సంతోషించుచు నిత్యమూ ఈ రామాయణ మహాకావ్యమును వినుచుందురు. 3

మూ. ఇదమాఖ్యానమాయుష్యం సౌభాగ్యం పాపనాశనమ్,
రామాయణం వేదసమం శ్రాద్ధేషు శ్రావయేద్బుధః. 4

ప్ర. అ. ఆయుష్యమ్ = ఆయుర్వర్ధకము, సౌభాగ్యమ్ = మంచి భాగ్యమును ఇచ్చునది, పాపనాశనమ్ = పాపములను నశింపచేయునది, వేదసమమ్ = వేదముతో సమానమూ అయిన, ఇదమ్ = ఈ, రామాయణమ్ ఆఖ్యానమ్ = రామాయణ మను ఆఖ్యానమును, బుధః = పండితుడు, శ్రాద్ధేషు = శ్రాద్ధముల యందు, శ్రావయేత్ = వినిపించవలెను.

తా. ఈ రామాయణాఖ్యానము ఆయుస్సును వృద్ధి పొందించును. సౌభాగ్యమును ఇచ్చును. పాపములను తొలగించును. వేదముతో సమానము. అందుచేత పండితుడు శ్రాద్ధసమయములలో కూడ దీనిని వినిపించవలెను. 4

మూ. అపుత్రో లభతే పుత్రమధనో లభతే ధనమ్,
సర్వపాపైః ప్రముచ్యేత పాదమప్యస్య యః పఠేత్. 5

ప్ర. అ. అపుత్రః = పుత్రుడు లేనివాడు, పుత్రమ్ = పుత్రుణ్ణి, లభతే = పొందును. అధనః = ధనము లేనివాడు, ధనమ్ = ధనమును, లభతే = పొందును. యః = ఎవడు, అస్య = దీనియొక్క, పాదమపి = ఒక్క పాదమునైనా, పఠేత్ = చదువునో అతడు, సర్వపాపైః = సమస్తపాపములచేత, ప్రముచ్యేత = ముక్తుడగును.

తా. పుత్రుడు లేనివాడు పుత్రుణ్ణి పొందును. ధనము లేనివాడు ధనమును పొందును. రామాయణములోని ఒక్క శ్లోకపాదమును చదివినవాడు కూడ సకల పాపములనుండి విముక్తు డగును. 5

మూ. పాపాన్యపి చ యః కుర్యాదహన్యహని మానవః,
పఠత్యేకమపి శ్లోకం పాపాత్స పరిముచ్యతే. 6

ప్ర. అ. యః మానవః = ఏ మానవుడు, అహన్యహని = ప్రతి దినమునందు, పాపాని = పాపములను, కుర్యాదపి = చేసినను, ఏకమపి = ఒక్కటైనా, శ్లోకమ్ = శ్లోకమును, పఠతి = చదువునో, సః = అతడు, పాపాత్ = పాపమునుండి, పరిముచ్యతే = విడువబడును.

తా. ప్రతిదినము పాపములు చేయుచున్న మానవుడు కూడ ఒక్క శ్లోకమైనా పఠించినచో పాపమునుండి విముక్తు డగును. 6

మూ. వాచకాయ చ దాతవ్యం వస్త్రం ధేనుహిరణ్యకమ్,
వాచకే పరితుష్టే తు తుష్టాః స్యుః సర్వదేవతాః. 7

ప్ర అ వాచకాయ = చదువువానికి, వస్త్రమ్ = వస్త్రము, ధేనుహిరణ్యకమ్ = ధేనువు, బంగారము, దాతవ్యమ్ = ఇవ్వదగినది. వాచకే = చదువువాడు, పరితుష్టే తు = సంతోషించినవాడగు చుండగా, సర్వదేవతాః = సకలదేవతలు, తుష్టాః = సంతోషించినవారు, స్యుః = అగుదురు

తా. చదివినవానికి వస్త్రములు, ధేనువు, బంగారము ఇవ్వవలెను. చదువువాడు సంతోషించినచో సమస్తదేవతలు సంతోషింతురు. 7

మూ. ఏతదాఖ్యానమాయుష్యం పఠన్ రామాయణం నరః,
సపుత్రపౌత్రో లోకేఽస్మిన్ ప్రేత్య చేహ మహీయతే.

ప్ర. అ. ఆయుష్యమ్ = ఆయుర్దాయమును ఇచ్చు, ఏతత్ = ఈ, రామాయణమ్ ఆఖ్యానమ్ = రామాయణ మను ఆఖ్యానమును, పఠన్ = చదువు, నరః = నరుడు, సపుత్రపౌత్రః = పుత్రపౌత్రులతో కూడినవాడై, అస్మిన్ లోకే = ఈ లోకమునందు, మహీయతే = పూజించబడును. ప్రేత్య = మరణించి, ఇహ

చ = (పరలోకమునందు) ఇహలోకమునందూ కూడ, మహీయతే = పూజించ బడును.

తా. ఆయుర్వర్ధకమైన ఈ రామాయణ మను ఆఖ్యానమును పఠించు పురుషుడు పుత్రపౌత్రసహితుడై ఈ లోకములో పూజింపబడును. మరణానంత రము రెండు లోకములలోను పూజింపబడును. 8

మూ. రామాయణం గోవిసర్గే మధ్యాహ్నే వా సమాహితః,
సాయాహ్నే చాపరాహ్ణే చ వాచయన్నావసీదతి. 9

ప్ర. అ సమాహితః = సావధానచిత్తుడై, గోవిసర్గే=ప్రాతఃకాలమునందు గాని, మధ్యాహ్నే వా=మధ్యాహ్నమునందు గాని, సాయాహ్నే=సాయంకాలము నందు గాని, అపరాహ్ణే చ = అపరాహ్ణమునందు గాని, రామాయణమ్=రామాయ ణమును, వాచయన్ = పఠించువాడు. నావసీదతి = దుఃఖము పొందడు.

తా ప్రాతఃకాలమునందు గాని మధ్యాహ్నమునందు గాని, సాయం కాలమునందు గాని, అపరాహ్ణమునందు గాని సావధానచిత్తుడై రామాయణమును పఠించువాడు ఎన్నటికీ చెడడు. 9

మూ అయోధ్యాపి పురీ రమ్యా శూన్యా వర్షగణాన్ బహూన్,
ఋషభం ప్రాప్య రాజానం నివాసముపయాస్యతి. 10

ప్ర అ బహూన్ = అనేకములైన, వర్షగణాన్ = సంవత్సర సము దాయములను, శూన్యా = శూన్యముగా ఉన్న, రమ్యా = సుందరమైన, అయోధ్యా పురీ అపి = అయోధ్యానగరము కూడ, ఋషభమ్=ఋషభు డను, రాజానమ్= రాజును, ప్రాప్య=పొంది, నివాసమ్=నివాసమును, ఉపయాస్యతి=పొందగలదు.

తా. అనేక సంవత్సరములు శూన్యముగా ఉన్న రమ్యమైన అయోధ్య ఋషభు డను రాజు వచ్చిన తరువాత మరల నివాసస్థానము (జనులతో నిండి నది) అగును. 10

మూ. ఏతదాఖ్యానమాయుష్యం సభవిష్యం సహోత్తరమ్,
కృతవాన్ ప్రచేతసః పుత్రస్తద్బ్రహ్మాప్యన్వమన్యత. 11

ప్ర. అ. ఆయుష్యమ్ = ఆయుర్దాయవర్ధకము, సభవిష్యమ్ = జరుగ

బోవు కథతో కూడినది, సహోత్తరమ్ = ఉత్తరకథతో కూడినది అయిన, ఏతత్ = ఈ, అఖ్యానమ్ = అఖ్యానమును, ప్రచేతసః = ప్రచేతసునియొక్క, పుత్రః = పుత్రుడైన వాల్మీకి, కృతవాన్ = రచించినాడు. తత్ = దానిని, బ్రహ్మాపి = బ్రహ్మ కూడ, అన్వమన్యత = అంగీకరించెను.

తా. ఆయుర్వర్ధకమైనది, భవిష్యత్కథతోను ఉత్తరకథతోను కూడినది అయిన ఈ రామాయణమును ప్రచేతసుని పుత్రుడు వాల్మీకి రచించెను. దీనిని బ్రహ్మదేవుడు కూడ ఆమోదించెను. 11

(ఇటుపైన వచ్చు 15 శ్లోకాలు చాల ప్రతులలో లేవు. వీటికి వ్యాఖ్యాతలు వ్యాఖ్యానము చేయలేదు. ప్రక్షిప్తములై ఉండును).

మూ. అశ్వమేధసహస్రస్య వాజపేయాయుతస్య చ
లభతే శ్రవణాదేవ సర్గస్యైకస్య మానవః. 12.

ప్ర. అ. మానవః = మానవుడు, ఏకస్య = ఒక్క, సర్గస్య = సర్గ యొక్క, శ్రవణాదేవ = వినుటవలననే, అశ్వమేధసహస్రస్య = వేయి అశ్వమేధములయొక్క, వాజపేయాయుతస్య చ = వాజపేయయాగముల అయుతము యొక్క ఫలమును, లభతే = పొందును.

తా. మానవుడు ఒక్క సర్గను వినినా కూడ వెయ్యి అశ్వమేధములు, పది వేల వాజపేయములు చేసిన ఫలమును పొందును. 12

మూ. ప్రయాగాదీని తీర్థాని గఙ్గాద్యాః సరితస్తథా,
నైమిశాదీన్యరణ్యాని కురుక్షేత్రాదికాన్యపి 13
గతాని తేన లోకేఽస్మిన్ యేన రామాయణం శ్రుతమ్.

ప్ర. అ. యేన = ఎవనిచేత, రామాయణమ్ = రామాయణము, శ్రుతమ్ = వినబడినదో, తేన = వానిచేత, ప్రయాగాదీని = ప్రయాగ మొదలైన, తీర్థాని = తీర్థములు, తథా = మరియు, గఙ్గాద్యాః = గంగ మొదలైన, సరితః = నదులు, నైమిశాదీని = నైమిశము మొదలైన, అరణ్యాని = అరణ్యములు, కురుక్షేత్రాదికాన్యపి = కురుక్షేత్రము మొదలైనవి, గతాని = వెళ్ళబడినవి.

తా. ఈ లోకములో రామాయణము విన్నవాడు ప్రయాగాది తీర్థములకు గంగాదినదులకు, నైమిశాద్యరణ్యములకు, కురుక్షేత్రాదులకు యాత్ర చేసినట్లే.

మూ. హేమభారం కురుక్షేత్రే గ్రస్తే భానౌ ప్రయచ్ఛతి, 14
యశ్చ రామాయణం లోకే శృణోతి సదృశావుభౌ.

ప్ర. అ భానౌ = సూర్యుడు, గ్రస్తే = మింగబడిన వాడగుచుండగా, (ఎవడు), కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు, హేమభారమ్ = బంగారముయొక్క భారమును, ప్రయచ్ఛతి = ఇచ్చునో, యః చ = ఎవడు, రామాయణమ్ = రామాయణమును, శృణోతి = వినునో, ఉభౌ = ఇద్దరూ కూడ, లోకే = లోకమునందు, సదృశౌ = సమానులు.

తా. సూర్యగ్రహణ పుణ్యకాలమునందు కురుక్షేత్రములో పుట్టెడు బంగారము దానము చేసినవాడు, రామాయణము చదివినవాడు, ఇద్దరూ ఈ లోకములో సమానులు. 14

మూ. సమ్యక్ శ్రద్ధాసమాయుక్తః శృణుతే రాఘవీం కథామ్,
సర్వపాపాత్ ప్రముచ్యేత విష్ణులోకం స గచ్ఛతి. 15

ప్ర. అ. రాఘవీం = రామునకు సంబంధించిన, కథామ్ = కథను, సమ్యక్ = బాగుగా, శ్రద్ధాసమాయుక్తః = శ్రద్ధతో కూడినవాడై, శృణుతే = ఎవడు వినునో, సః = అతడు, సర్వపాపాత్ = సకలపాపమునుండి, ప్రముచ్యేత = విడువబడును. విష్ణులోకమ్ = విష్ణులోకమును, గచ్ఛతి = పొందును.

తా. మంచి శ్రద్ధతో రామకథను వినినవాడు సకలపాపములనుండి విముక్తుడై విష్ణులోకమునకు వెళ్లును. 15

మూ. ఆదికావ్యమిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్, 16
యః శృణోతి సదా భక్త్యా స గచ్ఛేద్వైష్ణవీం తనుమ్
పుత్రదారాశ్చ వర్ధన్తే సంపదః సన్తతిస్తథా. 17

ప్ర. అ. పురా = పూర్వము, వాల్మీకినా = వాల్మీకిచేత, కృతమ్ = రచించబడిన, ఆర్షమ్ = ఋషిప్రోక్తమైన, ఇదమ్ = ఈ, ఆదికావ్యమ్ = ఆదికావ్యమును,

యః = ఎవడు, సదా = ఎల్లప్పుడూ, భక్త్యా = భక్తితో, శృణోతి = వినునో, సః = అతడు, వైష్ణవీమ్ = విష్ణుసంబంధమైన, తనుమ్ = దేహమును, గచ్ఛేత్ = పొందును. పుత్రదారాః = పుత్రులు, భార్యలు, సంపదః = సంపదలు, తథా = మరియు, సన్తతిః = సంతానము, వర్ధన్తే = వృద్ధిపొందును.

తా. పూర్వము వాల్మీకి రచించిన, ఆర్షమైన ఈ ఆదికావ్యమును ఎల్లప్పుడు భక్తితో వినువాడు విష్ణుశరీరమును పొందును. అతని పుత్రులు, భార్యలు, సంపదలు, సంతానము వృద్ధిచెందును. 16, 17

మూ. సత్యమేతద్విదిత్వా తు శ్రోతవ్యం నియతాత్మభిః,
గాయత్ర్యాశ్చ స్వరూపం తద్రామాయణమనుత్తమమ్ 18

ప్ర. అ. అనుత్తమమ్ = చాల శ్రేష్ఠమైన, తత్ = ఆ, రామాయణమ్ = రామాయణము, గాయత్ర్యాః = గాయత్రియొక్క, స్వరూపమ్ = స్వరూపము ఏతత్ = ఈ, సత్యమ్ = సత్యమును, విదిత్వా = తెలిసికొని, నియతాత్మభిః = నిగ్రహించుకొనబడిన మనస్సుకలవారిచేత, శ్రోతవ్యమ్ = వినదగినది

తా. ఈ అత్యుత్తమమైన రామాయణము గాయత్రీస్వరూపము. ఈ సత్యమును తెలిసికొని దీనిని పరిశుద్ధమైన అంతఃకరణముతో పఠించవలెను. 18

మూ. అపుత్రో లభతే పుత్రమధనో లభతే ధనమ్,
సర్వపాపైః ప్రముచ్యేత పాదమప్యస్య యః పఠేత్. 19

ప్ర. అ. తా. పైన 5వ శ్లోకము చూడుడు.

మూ. యః పఠేచ్ఛృణుయాన్నిత్యం చరితం రాఘవస్య చ,
భక్త్యా నిష్కల్మషో భూత్వా దీర్ఘమాయురవాప్నుయాత్.

ప్ర. అ. యః = ఎవడు, నిత్యమ్ = నిత్యమూ, రాఘవస్య = రాముని యొక్క, చరితమ్ = చరిత్రను, భక్త్యా = భక్తితో, పఠేత్ = చదువునో, శృణుయాత్ = వినునో, అతడు, నిష్కల్మషః = పాపములు లేనివాడుగా, భూత్వా = అయి, దీర్ఘమ్ = దీర్ఘమైన, ఆయుః = ఆయుర్దాయమును, అవాప్నుయాత్ = పొందును.

తా. రాముని చరిత్రమును నిత్యము భక్తిపూర్వకముగా చదువువాడు వినువాడు కూడ పాపము లన్నీ తొలగి దీర్ఘాయుర్దాయవంతు డగును. 20

మూ. చిన్తయేద్రాఘవం నిత్యం శ్రేయః ప్రాప్తుం య ఇచ్ఛతి,
శ్రావయేదిదమాఖ్యానం బ్రాహ్మణేభ్యో దినే దినే. 21

ప్ర. అ. యః = ఎవడు, శ్రేయః = శ్రేయస్సును, ప్రాప్తుమ్ = పొందుటకు, ఇచ్ఛతి = కోరునో, అతడు, నిత్యమ్ = నిత్యము, రాఘవమ్ = రాముణ్ణి, చిన్తయేత్ = స్మరించవలెను. దినే దినే = ప్రతి దినమునందు, ఇదమ్ ఆఖ్యానమ్ = ఈ ఆఖ్యానమును, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకొరకు, శ్రావయేత్ = వినిపింపచేయవలెను.

తా. శ్రేయస్సు పొందగోరువాడు నిత్యము రాముణ్ణి స్మరించవలెను ప్రతిదినము ఈ రామాయణమును బ్రాహ్మణులకు వినిపింపచేయవలెను. 21

మూ. యస్త్విదం రఘునాథస్య చరితం సకలం పఠేత్,
సోఽసుక్షయే విష్ణులోకం గచ్ఛత్యేవ న సంశయః. 22

ప్ర అ. యః = ఎవడు, రఘునాథస్య = రామునియొక్క, సకలమ్ = సమస్తమైన, ఇదం చరితమ్ = ఈ చరితమును, పఠేత్ = చదువునో, సః = అతడు, అసుక్షయే = మరణానంతరము, విష్ణులోకమ్ = విష్ణులోకమును గూర్చి, గచ్ఛతి ఏవ = తప్పక వెళ్ళును. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఈ రామచరితమును అంతా చదువువాడు మరణానంతరము తప్పక విష్ణులోకమునకు వెళ్ళును, సంశయము లేదు. 22

మూ. పితా పితామహస్తస్య తథైవ ప్రపితామహః,
తత్పితా తత్పితాచైవ విష్ణుం యాన్తి న సంశయః. 23

ప్ర. అ. తస్య = రామాయణమును పూర్తిగా చదివినవానియొక్క, పితా = తండ్రి, పితామహః = తాత, తథైవ = మరియు, ప్రపితామహః = ముత్తాత, తత్పితా = అతని తండ్రి, తత్పితా చ ఏవ = అతని తండ్రి కూడ, విష్ణుమ్ = విష్ణువును, యాన్తి = పొందెదరు; సంశయః = సంశయము, న = లేదు.

తా. రామాయణమును పూర్తిగా చదివినవాని తండ్రి, తాత, ముత్తాత, ముత్తాత తండ్రి, ఆతని తండ్రీ కూడ విష్ణువును చేరుదురు. సంశయము లేదు. 23

మూ. చతుర్వర్గప్రదం నిత్యం చరితం రాఘవస్య తు,
తస్మాద్యత్నవతా నిత్యం శ్రోతవ్యం పరమం సదా. 24

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క. చరితమ్ = చరిత్ర, నిత్యమ్ = ఎల్లప్పుడూ, చతుర్వర్గప్రదమ్ = చతుర్వర్గమును ఇచ్చునది. తస్మాత్ = ఆ కారణమువలన, నిత్యమ్ = నిత్యము, యత్నవతా = ప్రయత్నముగలవానిచేత, పరమమ్ = శ్రేష్ఠమైన ఈ రామాయణము, సదా = ఎల్లప్పుడు, శ్రోతవ్యమ్ = వినదగినది.

తా. రాముని చరితము ధర్మార్థకామమోక్షము లను నాలుగుపురుషార్థములను ఇచ్చును. అందువలన మానవుడు నిత్యము ప్రయత్నశీలుడై శ్రేష్ఠమైన ఈ రామాయణమును ఎల్లప్పుడూ చదువుచుండవలెను. 24

మూ. శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 25

ప్ర. అ. యః = ఎవడు, రామాయణమ్ = రామాయణమును, పాదమ్ = పాదమును కాని, పదమ్ ఏవ వా = పదమును కాని, భక్త్యా = భక్తితో, శృణ్వన్ = వినుచు ఉండునో, సః = అతడు, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, స్థానమ్ = స్థానమును, యాతి = పొందును. సదా = ఎల్లప్పుడూ, బ్రహ్మణా = బ్రహ్మచేత, పూజ్యతే = పూజింపబడును.

తా. రామాయణములోని ఒక శ్లోకపాదమును గాని, ఒక్క పదమునైనా గాని భక్తితో వినువాడు బ్రహ్మలోకమునకు వెళ్ళును. నిత్యము బ్రహ్మచేత పూజింపబడును. 25

మూ. ఏవమేతత్పురావృత్తమాఖ్యానం భద్రమస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధమ్ బలం విష్ణోః ప్రవర్ధతామ్. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే ఉత్తరకాణ్డే
ఏకాదశాధికశతతమః సర్గః.

ఉత్తరకాణ్డం సంపూర్ణమ్.

శ్రీమద్వాల్మీకిరామాయణం సంపూర్ణమ్.

ప్ర. అ. ఏతత్ = ఇది, ఏవమ్ = ఇట్లు, పురా = పూర్వము, వృత్తమ్ = జరిగిన, ఆఖ్యానమ్ = ఆఖ్యానము. వః = మీకు, భద్రమ్ = మంగళము, అస్తు = అగుగాక. విష్ణోః = విష్ణువుయొక్క, బలమ్ = బలము, ప్రవర్ధతామ్ = వృద్ధి పొందు గాక అని, విస్రబ్ధమ్ = విశ్వాసపూర్వకముగా, ప్రవ్యాహరత = ఛాటి చెప్పండి.

తా. ఇది ఈ విధముగా పూర్వము జరిగిన ఆఖ్యానము. చదువువారికి, వినువారికి, స్మరించువారికీ కూడ మంగళము అగుగాక. "శ్రీమహావిష్ణువు బలము వృద్ధిపొందుగాక" అని దృఢవిశ్వాసముతో చాటి చెప్పండి. 26

"బాలానందిని"అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు ఉత్తరకాండలో
నూటపదకొండవ సర్గ సమాప్తము.

ఉత్తరకాండము సంపూర్ణము

శ్రీమద్రామాయణము సంపూర్ణము

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానము
"బాలానందిని" సమాప్తము.

శ్రీః శ్రీః శ్రీః

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

భావనామ సంవత్సర చైత్ర శుక్ల ద్వితీయ; బుధవారం

13.4.1994